# శ్రీ మహాభాగవతము – మొదటి సంపుటము

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు

అనువాదకులు: శ్రీ విశ్వనాథం సత్యనారాయణ మూర్తి డాక్టర్
దావులూరి కృష్ణకుమారి

రామకృష్ణ మఠం

దోమలగూడ, హైదరాబాద్ – 500 029

# ముందుమాట

సనాతన ధార్మిక స్పృహను ఈ జాతికి ఊపిరిగా అందించిన అద్భుత ప్రక్రియ 'పురాణం'. సనాతన ధర్మాన్ని సామాన్యులకు అందించే అసామాన్య గ్రంథం, మహాపురాణం 'శ్రీ మహాభాగవతం'. భగవంతుని ద్వారా చెప్పబడినది భగవద్గీత అయితే భగవంతుడి గురించి చెప్పబడింది భాగవతం. ఈ మహాగ్రంథాన్ని సమకాలీన సమాజానికి అన్వయిస్తే యుగధర్మం ఆవిష్కృతమవుతుంది. భాగవత దివ్యగ్రంథంలో అంతటా అంతర్యామిగా వెలుగుతున్నవాడు నారాయణుడైన శ్రీకృష్ణుడు. భాగవత మహాపురాణానికి అక్షర రూపాన్నీ, అక్షరమైన రూపాన్నీ అందించిన వాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవానుడు. భాగవత పురాణాన్ని తెలుగువారికి తేనెల విందుగా చేసినవాడు సహజకవి బమ్మెర పోతనామాత్యుడు. 'పలికెడిది భాగవతమట! పలికించెడి వాడు రామభద్రుండట!...' అనే భాగవతంలోని పద్య పాదం తెలుగువారి లోగిళ్ళలో వినసొంపుగా వినిపిస్తుంది. సాక్షాత్తూ శ్రీరామచంద్రుడే తెలుగులోకి అనువదించమని ఆనతిని ఇవ్వడం ద్వారా ఈ మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీ మహాభాగవతం ఈశ్వర ప్రేరితమై, తెలుగువారి అభిమాన కావ్యమై తరతరాలుగా తెలుగు హృదయాలను రంజింపచేస్తున్నది.

'జ్ఞానం అనే వెన్నతో కాచబడి భక్తి అనే మధురామృతంలో ముంచబడిందే భాగవతం' అంటారు భగవాన్ శ్రీరామకృష్ణులు. కలియుగ జీవులకు భాగవతం అ లౌకికమైన మార్గాన్ని చూపింది. భాగవత స్వరూపాన్ని 'సర్వ వేదాంతాలకు సారము, అద్వితీయ బ్రహ్మాత్మ లక్షణ ప్రతిపాదకము, కైవల్య ప్రయోజనము' అంటూ భాగవతమే తెలియజేసింది. "శ్రీ కైవల్యపదంబు జేరుటకునై" – కైవల్యపదాన్ని చేరడానికే అంటూ పోతనామాత్యుడు భాగవతాన్ని

ప్రారంభించాడు. శ్రావ్యమైన పదసొంపుతో, చక్కని రచనా నైపుణ్యంతో సాగిన ఈ పద్యరచన, చదివినవారి మనస్సులను రంజింపజేస్తుంది. ధృవుడు, ప్రహ్లాదుడు, వామనుడు, భీష్ముడు, గజేంద్రుడు మొదలైన పుణ్యపురుషుల కథలు చదువుతున్నప్పుడు భక్తిపారవశ్యం పొంగి పొరలుతుంది. మధ్య మధ్యలో జ్ఞానమిశ్రితమైన పద్యవాక్యాలు అద్వైత మకరందాన్ని అందిస్తాయి. భక్తి, జ్ఞానాల సమ్మిశ్రితమైన భాగవతంలో భక్తి ద్వారా బ్రహ్మజ్ఞానం ఎలా సంపన్నమవుతుందో వివరించబడింది. ఇటువంటి భాగవత నవనీతాన్ని 2007 వ సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో రెండు ధార్మిక సంస్థలు సంయుక్తంగా ముద్రించడం జరిగింది. అయితే పాఠకులు మరియు పండితుల అభ్యర్థన మేరకు రామకృష్ణ మఠం వారు కొంతమంది విద్వాంసులచే పోతన విరచిత భాగవతానికి తాత్పర్యాలను సరళభాషలో రాయించి సందర్భానుసారం కొద్దిపాటి వివరణను పొందుపరచడం జరిగింది. ఆ వివరణ ఏ పద్య తాత్పర్యానికి అవసరమో దాని క్రిందే పొందుపరచడం జరిగింది. సందర్భానుసారం పురాణ, వేదాంత సారాన్ని చక్కని గ్రామ్య భాషలో ప్రబోధించిన శ్రీరామకృష్ణుల అమృత వచనాలను ఉటంకించడం జరిగింది. దీన్ని పాఠకులు గమనించగలరు. ఈ బృహత్తర యజ్ఞంలో పాల్గొన్న అనువాదకులందరికీ మా ధన్యవాదాలు.

మొదటి భాగంలోని ప్రథమ, మూడవ స్కంధాలకు శ్రీ విశ్వనాథం సత్యనారాయణమూర్తి గారు, రెండవ స్కంధానికి డాక్టర్ దావులూరి కృష్ణకుమారి గారు అనువాదాలను అందించారు. వీరిరువురకు మా కృతజ్ఞతలు. మా విన్నపాన్ని మన్నించి అడిగిన వెంటనే ఈ మహాభాగవతానికి చక్కని పీఠికను వ్రాసి ఇచ్చిన డాక్టర్ గరికిపాటి నరసింహారావు గారికి మా ప్రత్యేక ధన్యవాదములు. అనువాదాలకు అవసరమైన సవరణలు చేసి భావానువాదానికి ప్రాముఖ్యతను ఇస్తూ పాఠకులకు అర్థమయ్యే రీతిలో పరిష్కరించిన సంపాదకవర్గం స్వామి రఘునాయకానంద, బ్రహ్మచారి శ్యామ్, డాక్టర్ అపర్ణాశ్రీనివాస్‌లకు మా అభినందనలు. ప్రతులను అంకితభావంతో దిద్దిన సర్వశ్రీ రామప్రసాద్, త్రివిక్రమరావు, వీరభద్రరావు, మురళి, శ్రీనివాస్ గార్లకు మా అభినందనలు. ముద్రణ ఏర్పాట్లను చూసి, సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది, సకాలంలో

గ్రంథాన్ని విడుదలకు సిద్ధం చేసిన బ్రహ్మాచారి దేవీచైతన్యకు, సహకరించిన ఏక్‌నాథ్‌కు మా శుభాశీస్సులు. అయిదు సంపుటాలకు సుందరమైన ముఖ చిత్రాలను అందించిన చిత్రకారుడు డాక్టర్ ఆర్యవర్ధన్‌రాజ్. వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు. అంకితభావంతో టైపింగ్ చేసి ప్రతులను సిద్ధం చేసిన మా డిటిపి ఆపరేటర్ జి. కృష్ణమోహన్‌కు, సర్వాంగసుందరంగా కవర్ డిజైన్లను రూపొందించిన అరుణ్‌వికాస్, సుజిత్ కుమార్‌లకు మా ధన్యవాదాలు. ఇక ఈ బృహత్ యజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ ఒక్కరికీ మా ధన్యవాదాలు.

పాఠకులు ఈ మహాభాగవత కథా సుధారసాన్ని గ్రోలి, భాగవత ధర్మాన్ని అనుష్ఠించి, అమృతత్త్వాన్ని చేరుకోవాలని మా ఆకాంక్ష, అభిలాష.

– ప్రకాశకులు

ముఖ చిత్ర వర్ణన:

వేతులార శివుని పూజించే పరమశివ భక్తుడు, జ్ఞాన సరస్వతీ అనుగ్రహంతో రామభద్రుని ఆనతి మేరకు శ్రీకృష్ణ గాథలతో కూడిన శ్రీ మహాభాగవతాన్ని వ్రాస్తున్న పోతనామాత్యుడు.

# పీఠిక

తెలుగు కవులలో బమ్మెర పోతన కవిత్వ పరంగానే కాదు – వ్యక్తిత్వ పరంగా కూడా విశిష్టత కలిగినవాడు. భాగవత రచన చేయడానికి తాను కర్తను కానని, రామభద్రుడే కర్త అని చెప్పడం, నేను నేర్చుకున్నంతలో (దెలియ వచ్చినంత దేట పరుతు) విషయాన్ని తేటతెల్లం చేస్తాననటం పోతన వ్యక్తిత్వ విశిష్టతకు మచ్చుతునకలు.

రాజులు గడ్డమంటినను రాడు సభాస్థలి చూడనైన, ఏ
మోజులు లేవు వానికి ప్రభుత్వపురస్కృతులందు, విష్ణువి
భ్రాజిత పాదపద్మములు భాగవతమ్ములు వాని పద్యముల్
సాజముగానె చిత్తీ కలశమ్మును చుట్టిన భక్తి సూత్రముల్

(సాగరఘోష 3–89)

ఆత్మగౌరవాన్ని కాపాడుకొంటూ ఆత్మజ్ఞాన సాధనలోనే జీవితం గడిపిన వాడు పోతన. అందుకే చక్రవర్తులు వచ్చి బ్రతిమాలినా సభామందిరాలు చూడటానికి కూడా వెళ్ళలేదు. ప్రభుత్వ పురస్కారాలకోసం ఆశపడలేదు. ఆ చిత్తశుద్ధి కారణంగానే భాగవతంలో పద్యాలన్నీ భక్తులు సేవించదగిన భగవత్పాద పద్మాలయ్యాయి. 'పుణ్యాహవాచనం' లో కలశానికి చుట్టూ ఉండే పవిత్ర సూత్రాల్లా మన మనస్సుని చుట్టేసిన భక్తి సూత్రాలయ్యాయి.

ఈ సృష్టి ఎలా మొదలయింది? అని చాలామంది అడుగుతూ ఉంటారు. దానికి సమాధానం భాగవతం మొదటి పద్యంలోనే ఉంది. "కేళిలోల విలసత్ దృగ్జాల సంభూత నానా కంజాత భవాండ కుంభకు.... శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్" అన్నాడు కవి. శ్రీమహావిష్ణువు సరదాగా విలాసంగా లక్ష్మీదేవికేసి చూడగానే ఆ చూపుల్లోంచే ఈ బ్రహ్మాండాలన్నీ ఏర్పడ్డాయి అని భావన. చూపుల్లోంచి పుట్టేవి కలలేగదా! అంటే ఈ సృష్టి అంతా భగవంతుడు కంటున్న ఒక మహా స్వప్నం అన్నట్లే గదా! 'కనడం' అనే మాట – దానికి ప్రసవించడం అనీ, చూడటం అనీ రెండర్థాలున్నాయి. పరమాత్మ ఈ సృష్టిని తనలోంచే సృష్టిస్తున్నాడు, తానే సాక్షిగా దాన్ని చూస్తున్నాడు కూడా. 'అవ్యయః పురుషః సాక్షీ' అని విష్ణు సహస్రంలో పేర్కొన్నదందుకే. అందుకే మనం ఈ విషయాన్ని అర్థం చేసుకొని సృష్టిని ఒక కలగా – మిథ్యగా భావించగలిగితే ఏ చింతా ఉండదు. మనం అందరం రాత్రి కలలో ఎన్నో రూపాలు చూస్తున్నాం. అందులో మనుషులూ, పశువులు, పక్షులు, చెట్లు, చెరువులు అన్నీ ఉన్నాయి. ఈ రూపాలన్నీ ఎవరు సృష్టించారు? ఆ పడుకొన్న జీవుడు ధరించినవే గదా అవన్నీ. ఒక సామాన్య జీవుడు తన ఇంట్లో

తాను పడుకొని ఒక సృష్టి తానే చేసుకొని చరాచర రూపాలన్నీ తానే ధరించి వినోదించడం నిజమైనప్పుడు – శ్రీమన్నారాయణుడు క్షీరసాగరంలో శయనించి ఈ సృష్టిని ఒక స్వప్నంగా తానే తన చూపుల్లోంచే పుట్టించి విశ్వంలో అన్ని పాత్రలూ తానే ధరించి క్రీడిస్తున్నాడంటే – అది మాత్రం నిజం కాకుండా ఉంటుందా? 'లోకవత్తు లీలాకైవల్యం' అనే బ్రహ్మసూత్ర వాక్యమూ, 'తచ్ఛృష్ట్వా తదేవానుప్రావిశత్' అనే వేద వాక్యమూ ఈ విషయాన్నే ప్రతిపాదిస్తున్నాయి. అందుకే ఆదిశంకరులు పేర్కొన్నట్లుగా 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అన్నదే భాగవతం బోధించే పరమార్థాలలో మొదటిది.

శ్రీ మహాభాగవతం ప్రారంభంలో చేసిన సరస్వతీ స్తుతిలోనే పోతన గారు భారతీయ విద్యావ్యవస్థలో ఉండే విశిష్టతని సూచించారు.

క్షోణితలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు, సైకత
శ్రోణికి, జంచరీకచయ సుందర వేణికి, రక్షితామర
శ్రేణికి, దోయజాత భవచిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తకరమ్య పాణికిన్

(భాగవతం 1-6 )

ఈ పద్యం చివరి పాదంలో సరస్వతీదేవి తన చేతుల్లో జపమాల, చిలుక, పద్మం, పుస్తకం ధరించి ఉంటుందని చెప్పారు. ఈ నాలుగూ మానవుడు తన జీవిత లక్ష్యాలుగా సాధించవలసిన ధర్మార్థ కామ మోక్షాలకు సంకేతాలు. పుస్తకం ధర్మానికీ, పద్మం అర్థానికి, మన్మథుని వాహనమైన చిలుక కామ పురుషార్థానికీ, జపమాల మోక్షపురుషార్థానికీ సంకేతాలవుతాయి. ఎన్ని విద్యలు నేర్చినా, ఎంత పండితుడైనా పురుషార్థాలు సాధించకపోతే జీవితం వృథా అయిపోయినట్లే. ఈ విషయం గ్రహించిన మన ప్రాచీన విద్యావేత్తలు ఒకటవ తరగతి తెలుగు వాచకంలో అ–ఆ–ఇ–ఈ లు నేర్పడానికి అమ్మ, ఆవు, ఇల్లు, ఈశ్వరుడు అనే నాలుగు మాటలు బొమ్మలతో సహా ఏర్పాటు చేశారు. మంచి చెడ్డలు తెలియజేసే అమ్మ ధర్మానికీ,

పాడిపంటలకాధారమైన గోవు అర్థపురుషార్థానికీ, సంసారానికి ఆశ్రయమైన ఇల్లు కామపురుషార్థానికీ, ఈశ్వరుడు మోక్షానికీ ప్రతీకలు. మానవుని అంతిమ జీవితాదర్శాన్ని విద్యాశిక్షణలో ఆదిలోనే తెలియజేసిన మన తెలుగు మాధ్యమం అంత గొప్పది. ప్రతి పాఠశాలలో భాగవతంలోని సరస్వతీ ప్రార్థన పద్యం ఉదయాన్నే చదివించి, అవగాహన చేయిస్తే రేపటి పౌరులు ఆదర్శప్రాయులవుతారు.

భగవద్గీత సారాంశాన్ని మొత్తం భీష్మస్తవంలో ఒక్క పద్యంలో ఒకే మాటలో సూచించారు పోతనగారు. 'హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై' ఉన్న శ్రీకృష్ణుని ముఖాన్ని భీష్ముడు అంతిమదశలో మనస్సులో దర్శిస్తూ ఆనందిస్తున్నాడట. అశ్వాలు పరుగుపెడుతుంటే దుమ్ము రేగడం సహజం. కాని ఆ దుమ్ము సారథ్యం చేస్తున్న కృష్ణుని ముఖం మీద పడితే అది అందంగా ఎలా ఉంటుంది? నుదుటి మీద చెమట బిందువులు, వాటిపై అద్దుకొన్న ముంగురులు అందంగా ఉండవచ్చు, కాని భగవంతుడు కదా అని ఎంత సరిపెట్టుకొన్నా దుమ్ము అందంగా ఉంటుందా?

ఇక్కడే గీతాసారం ప్రదర్శితమైంది. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' అని కదా పరమాత్మ చెప్పింది! మన కర్తవ్యం మనం చేసి ఫలితం ఏ రూపంలో ఉన్నా దాన్ని భగవదర్పితం చేస్తే ఆయన ఆనందంగా స్వీకరిస్తానని చెప్పాడు గదా! అశ్వాలు అదే పని చేశాయి. వాటి పని పరుగుపెట్టడమే. దాని ఫలితంగా రేగిందే ధూళి. అందుకే పరమాత్మ దాన్ని నుదుటిమీద అలంకారంగా ధరించాడు. భగవద్గీతను అర్జునుడొక్కడే కాదు అశ్వాలూ విన్నాయి. భగవద్భాష అన్ని జీవులకీ అర్థం అవుతుంది కదా!

ఇదే భీష్మస్తవంలో 'కుప్పించి ఎగసిన' అనే పద్యంలో 'ఉరికిన నోర్వక ఉదరంబులోనున్న జగముల వ్రేగున జగతి కదల' అంటాడు కవి. మొత్తం 14 లోకాలు ఆయన గర్భంలోనే ఉన్నాయని వేదశాస్త్రాలు ఘోషిస్తున్నాయి కదా! మరి లోపలి లోకాల బరువుకి బయటిలోకం తట్టుకోలేక పోవడం ఏమిటి? బయట ఒకటి, లోపల పదమూడు ఉంటే భగవంతుడు

పరిపూర్ణుడు కాడు. అన్నీ లోపలే ఉంటే 'తట్టుకోలేక చలించి పోవడానికి' బయటి లోకం ఎక్కడ ఉన్నట్లు? అంటే బయట ఒకలోకం ప్రత్యేకంగా ఉందనుకోవడం భ్రమ. అందుకే 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అన్నారు.

'కరికి లంఘించు సింగంబు కరణిమెరసి, నేడు భీష్ముని చంపుదు' అంటూ ఎంత కోపంతో వచ్చినా, భీష్ముడు శరణాగతుడై తలవంచి కూర్చున్నా చక్రహస్తుడై వచ్చి కూడా పరమాత్మ ఆయన్ని చంపలేదు. భీష్ముడు జన్మరాహిత్యాన్ని పొందాలని పరమాత్మ సంకల్పం. అంటే అద్వైత జ్ఞానం పరిపూర్ణంగా పొందాలి. 'నేను, తాను' అనే భేదబుద్ధి రవ్వంత కూడా ఉండకూడదు. యుద్ధసమయానికి తాతగారికి రవ్వంత భేదదృష్టి ఉంది. అందుకే 'మద్విశిఖవృష్టి తెరలి చనుదెంచు దేవుండు', 'నా శస్త్రాహతిన్ జాలనొచ్చియు పోరించు మహానుభావుడు' అనే మాటలు వచ్చాయి. తాను ప్రత్యేకంగా ఒక అస్తిత్వంతో ఉన్నాననీ, తానో గొప్ప వీరుణ్ణనీ, తన బాణాలు భగవంతుని కూడా బాధపెట్టగలిగాయనీ – ఇలాంటి భావాలు ఆయన మాటల్లో వ్యక్తమయ్యాయి. అందుకే చక్రధారి చక్రం వెనక్కు తీసుకోవలసివచ్చింది. అహం పోయేవరకు అంపశయ్య తప్పదు మరి. విష్ణు సహస్ర ధ్యానంతో అది పోయింది. అప్పుడే ఆయనకు ముక్తి కలిగింది. ఇదీ భాగవత రహస్యం.

తపస్సు చేయగలిగితే అసాధ్యం అంటూ ఏదీ ఉండదు. తపస్సులో మన జీవాత్మ విశ్వాత్మలో నిలిచి ఉంటుంది. అప్పుడు విశ్వం అంతటినీ అది (ఆ వ్యక్తి) శాసించగలుగుతుంది. ఆ తపోమయ స్థితినుండి బయటకు వస్తే విశ్వంలో ప్రతిదానికీ భయపడుతుంది. అందుకే ఏవేవో కోరికలతో తపస్సు చేసే వ్యక్తులకి దేవతలు తొందరగా ప్రత్యక్షమై ఆ కోరికలు తీర్చేసి బయటపడేస్తారు. లేకపోతే ఆ తపస్సు విశ్వప్రళయాన్ని సృష్టించే ప్రమాదం లేకపోలేదు. ప్రహ్లాద చరిత్రలో ఈ విషయం రెండు పద్యాల్లో నిరూపణ అయింది. హిరణ్యకశిపుని తపస్సు సందర్భంలో ఈ పద్యాలు కూర్చబడ్డాయి–

అదిరెన్ గుంభిని సాద్రియై, కల్గె నే దంభోనిధుల్, తారకల్

చెదరెన్ సగ్రహసంఘులై, దిశలు విచ్ఛిన్నాంతలై మండె, ఁబె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి, నుగ్రాచార దైత్యేంద్ర మూ
ర్ధ దిశోద్ధూత సధూమ హేతిపటలోదంచత్త పోవహ్నిచేన్

(భాగవతం 7–73)

ఆ రాక్షస రాజు తీవ్రంగా తపస్సులో మునిగి ఉండగా పర్వతాలతో సహా భూమి కంపించిపోయిందట. సముద్రాలు సంక్షోభించిపోయాయట. ఆకాశంలోని గ్రహాలు నక్షత్రాలు అన్నీ చెల్లాచెదరై పోయాయట. దిగంతాలు దగ్ధమై పోతున్నాయట. సకల జీవరాశికి ఊపిరి ఆగిపోయిందట. అంటే పంచభూతాలు అతనికి భయపడి వశమై పోయాయన్నమాట.

అంతటి శక్తిని మౌనంగా, ధ్యానంలో ఉండి సాధించ గలిగిన ఈ పెద్దమనిషి బ్రహ్మ ప్రత్యక్షం కాగానే కోరిన వరాలేమిటి?

గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమఃప్రభల, భూరిగ్రాహ రక్షో మృగ
వ్యాళాదిత్య నరాది జంతు కలహ వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశా! యిప్పింపవే

(భాగవతం 7–90)

ఏ పంచభూతాలు తాను తపస్సులో ఉండగా తనకు భయపడ్డాయో ఆ పంచభూతాలకే తాను భయపడి వాటి నుండి రక్షించుకోగలిగే వరం కోరుతున్నాడు. తపోమయ స్థితికి తపోరహిత స్థితికి తేడా ఇది. భయం కారణంగా ఇంకా అయోమయంలో పడ్డాడు. రాత్రిగానీ పగలుగానీ చావకూడదు అంటూనే చీకట్లో గానీ వెలుగులో గానీ చావకూడదు అంటున్నాడు. రాత్రింబవళ్ళు, చీకటి వెలుగులు ఒకటే కదా! ఆ తరువాత ప్రయోగించిన సమాసం మరింత అయోమయంగా సాగింది. మొసళ్ళవల్ల, రాక్షసులవల్ల, మృగాలవల్ల, పాములవల్ల,

సూర్యునివల్ల, మానవులవల్ల, జంతువులవల్ల, యుద్ధాలవల్ల, అనేకరకాల అస్త్రాలవల్ల, శస్త్రాలవల్ల కూడా చావు లేకుండా వరం కోరుతున్నాడు. మొసళ్ళ తరువాత రాక్షసులేమిటి! రాక్షసుల తర్వాత దేవతలు అనకుండా మృగాలు అనడమేమిటి? మృగాల తరువాత పాములా? పాముల తర్వాత సూర్యుడా? ఆ తరువాత చంద్రుడు అనకుండా మానవుడా? ఏమిటీ అయోమయ సమాసం? భయంలో పడిపోయిన హిరణ్యకశిపుని అయోమయ స్థితికి అద్దం పట్టినట్లుంది ఈ సమాసం. ఇదీ పోతనగారి రచనా కళ.

తపస్సులో ఉన్నప్పుడు విశ్వమంతా ఒకే ఒక స్వరూపంగా కనిపిస్తుంది. అందువల్ల భయం ఉండదు. తపస్సులోంచి బయటపడితే ప్రతిదీ విడివిడిగా కనబడి భయపెడుతుంది. అదీ తేడా. 'ద్వితీయాద్వైభయం భవతి' అంటోంది వేదం. 'సృష్టిలో భేదం లేదు నీ దృష్టిలో తప్ప' అంటారు ఆదిశంకరులు. విశ్వాన్ని విష్ణుమయంగా చూడటంవల్ల ప్రహ్లాదుడు నిర్భయంగా ఉండగలిగాడు. విశ్వాన్ని విశ్వంగా, అందులో ప్రతిదాన్నీ వేరువేరుగా చూడటం వల్ల హిరణ్యకశిపుడు భయానికి లోనై భయం చేతిలోనే మరణించాడు. ఇదీ భాగవత రహస్యం.

పరీక్షిన్మహారాజు తాను వారం రోజుల్లో చనిపోతానని తెలుసుకొని నిర్భయంగా మృత్యువుకి సిద్ధపడి ఆ ఏడు రోజుల్లోనే భాగవత శ్రవణం ద్వారా పొందవలసిన అద్వైత జ్ఞానం పొంది ముక్తి పొందాడు. కంసుడు అందుకు పూర్తి భిన్నంగా ఆలోచించాడు. కృష్ణుని చేతుల్లో మృత్యువు తప్పదని 16 ఏళ్ళముందే తెలిసింది కంసునికి. అయినా అంత సుదీర్ఘ కాలమూ చావుకి భయపడుతూ బాలకృష్ణుణ్ణి చంపడం కోసం పిచ్చి ప్రయత్నాలన్నీ చేస్తూ కూర్చున్నాడు. అయినా చెప్పిన సమయానికి చావు తప్పలేదు. మృత్యువును జయించడం అంటే చావు లేకుండా ఉండటం కాదు. చావుకి భయపడకుండా ఉండటం.

మత్తి యటన్న భీతికద మేదిని నెంతటి వానికిన్ బరీ
క్షిత్తునకట్టి సాధ్యసము శ్రీ శుక బోధల బోయె; కంసుడో!
మొత్తము జీవితమ్ము తెగమొత్తుకొనెన్ మరిచావు తప్పెనే?

మత్తు వదల్చు భాగవతమార్గము మృత్యుభయమ్ము, దుల్చెదన్

(సాగరఘోష 3–91)

మనలో చాలామంది పూజలు, నోములు, వ్రతాలు చేస్తూనే ఉంటారు. తీర్థాలు, యాత్రలు సాగిస్తారు. గుళ్ళు, గోపురాలు దర్శిస్తారు. పవిత్ర గ్రంథాలు నిత్యపారాయణ చేస్తారు. అయినా వారు ఆనందంగా ఉండగలుగుతున్నారా? ఆందోళన లేకుండా జీవితం గడపగలుగుతున్నారా? అన్నీ చేస్తున్నా ఎందుకు ఆనందం పొందలేకపోతున్నారో గజేంద్రమోక్షంలో చెప్పారు పోతనగారు.

మొసలితో సుదీర్ఘకాలం పోరాడిన గజేంద్రుడు అలసిపోయి చేసిన ప్రార్థనలో మొదటి పద్యంలో ఈ రహస్యం ఉంది.

నానానే కపయూథముల్ వనములోనన్ బెద్ద కాలంబు స
న్మా నింపన్ దశలక్ష కోటి కరిణీ నాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్ట చందన లతాంత చ్ఛాయలందుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి భయంబెట్లో కదే యీశ్వరా!

(భాగవతం 8–72)

ఈ పద్యంలో ఉన్న భావం గమనిస్తే జీవిని త్రిగుణాత్మక ప్రకృతి అహంకారం రూపంలో ఎలా క్రమ్మేస్తుందో అవగాహన అవుతుంది. ఎన్నో ఏనుగులు అడవిలో తన్ను సేవిస్తూ ఉండగా మహారాజులా ఉండేవాణ్ణి అని చెప్పుకోవడం రాజసాహంకారం. లక్షల కోట్ల ఆడ ఏనుగులకి భర్తని అనడం తామసాహంకారం. తన దానజలంతోనే అడవిలో మంచి గంధపు చెట్లన్నీ పెరిగాయి అనడం సాత్త్వికాహంకారం. ఈ మూడూ ఉండగా భగవద్రక్షణ ఎలా కలుగుతుంది! అందుకే కలగలేదు. అలా ప్రార్థించి ప్రార్థించి చివరకు నిరహంకారియై శరణాగతి చెందుతూ లావొక్కింతయు లేదు.... నీవే తప్ప నితఃపరంబెరుగ.... మన్నింపగదే దీనునిన్'.... అన్నాక గానీ

స్వామి వైకుంఠం నుండి కదలలేదు. అది అంతే. 'నేను' పోతేగానీ తాను రాడు.

'నేను, నాది' అనే అహంకారమమకారాలు రెండూ తొలగించుకొంటే తప్ప ఆయన చిక్కడు, దొరకడు. అందుకే వ్యాసుడు దశమస్కంధంలో రోటికి కట్టివేసే ఘట్టంలో ఎన్ని తాళ్ళతో బాలకృష్ణుని బంధించే ప్రయత్నం చేసినా ప్రతి త్రాడూ రెండంగుళాలు తక్కువయిందని చమత్కరించాడు.

యదాఽఽసీత్ తదపి న్యూనం తేనాన్యదపి సందధే ।
తదపి ద్వ్యంగులం న్యూనం యద్యదాదత్త బంధనం ॥

(వ్యాస భాగవతం 10–9–16)

అహంకారమమకారాలు తొలగిపోతే తప్ప భగవంతుణ్ణి హృదయంలో బంధించలేమని చెప్పడానికే వ్యాసమహర్షి రెండగుళాల శ్లోకం ప్రత్యేకంగా రచించారు.

భగవంతుని చిరునామా భాగవతంలో స్పష్టంగా ఒకచోట ఉంది. అదే వామన చరిత్ర. వామనుడు బలిని మూడడుగుల నేల దానం అడిగాడు. విశ్వాన్ని జయించాలి అనుకొంటే ఎన్నకోట్ల మైళ్ళయినా సంతృప్తి కలగదు. సాధ్యమూ కాదు. కానీ విశ్వతత్త్వాన్ని తెలుసుకోవాలంటే మూడే మూడు అడుగుల నేల చాలు. సరిగ్గా కూర్చొని స్థిరంగా ధ్యానం చెయ్యడానికి అంతమాత్రం చాలు. అలా నిశ్చలంగా ధ్యానం చేస్తే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. అప్పుడు అంతా మనం వశంలోనే ఉంటుంది.

ఒంటివాడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము, సొమ్ము మేర యొల్లఁ
గోర్కెదీర బ్రహ్మ కూకటి ముట్టెద
దానకుతుక సాంద్ర! దానవేంద్ర!

(భాగవతం 8–566)

అంటూ వామనుడు అడగడంలో తాత్త్విక రహస్యం ఇదే. 'బ్రహ్మకూకటి' అంటే సత్యలోకంలో ఉండే బ్రహ్మదేవుని శిఖ అనడం భౌతికార్థం. నారాయణ సూక్తంలో (మంత్రపుష్పంలో) 'తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ స శివః స హరిః సేంద్రః సో-క్షరః పరమః స్వరాట్ ॥' అని పేర్కొనబడిన పరమాత్మ అని తెలుసుకోవడం పరమార్థం. మన శరీరంలోనే హృదయంలో ఆత్మ ప్రకాశిస్తోంది. దాన్ని పట్టుకోవాలంటే నిశ్చలంగా తపస్సు చెయ్యాలి. దానికి మూడడుగుల నేల చాలు. ఎన్నో కోట్లు సంపాదించాల్సిన అవసరమూ లేదు. దానమో, ధర్మమో చేశామంటూ గొప్పలు చెప్పుకొనే పనీ లేదు. చెయ్యవలసింది ధ్యానం ఒక్కటే. పొందవలసింది జ్ఞానం ఒక్కటే. ఇదీ భాగవత కథల సారాంశం.

శ్రీరాముడు 'విగ్రహవాన్ ధర్మః', శ్రీకృష్ణుడు లీలామానుష వేషధారి. ఆనందం కోసం చేసేది కర్మ. ఆనందంగా ఉండి చేసేది లీల. కృష్ణ లీలలు లోతుగా పరిశీలిస్తేనే కాని అర్థం కావు.

ఆడంజని మీగడ పెరు
గోడక నీ సుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలి మూఁతిం జరిమిన
గోడలు ముచ్చగుచు నత్త కొట్టె లతాంగీ!

(భాగవతం దశమ–పూర్వ– 310)

మీగడ పెరుగంతా తానూ చెలికాళ్ళూ కలిసి త్రాగేసి పోతూపోతూ కోడలి మూతికి కొంత రాసి పోయాడట. దాంతో పెద్ద గొడవ అయిపోయింది. అత్తాకోడళ్ళ మధ్య కురుక్షేత్ర సంగ్రామానికి తెరలేచింది. ఇక్కడ దేవుడు చేసిన లీల తెలుసుకోలేక జీవులు తామే దానికి కర్తలమని వాదులాడుకొన్నారు. నిజంగానే కురుక్షేత్ర సంగ్రామాన్ని తామే తెచ్చిపెట్టుకొన్న కురుపాండవ వీరులనే జీవులు ఆ నేరాన్ని దేవుడి మీదకు నెట్టేశారు. గాంధారి ఆ భావంతోనే తీవ్రక్రోధంతో యదువంశం నాశనమై పోతుందని శపించింది. పరమాత్మ పరమశాంతంగా ఆ

శాపాన్ని దోసిలి పట్టి స్వీకరించి అనుభవించాడు. అహంకార మమకారాలు పట్టి ఉన్నంతకాలం ఏది దేవుడి లీలో ఏది జీవుడి కర్మో తెలుసుకోవడం కష్టమే.

బృందావనంలో చల్దులు తిన్న ఘట్టంలో మరో పరమార్థం పద్యరూపంలో వ్యక్తం చేశారు పోతనగారు.

కృష్ణుఁ జూడుమనుచుఁ గికురించి పరుమ్రోలి
మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు

(భాగవతం దశమ–పూర్వ– 494)

అందరూ రకరకాల మధురపదార్థాలు పంచుకొంటూ ఆనందిస్తూ ఉంటే ఒకడు ప్రక్కవాణ్ణి మాయ చేసేశాడట. "కృష్ణుణ్ణి చూడు. ఎంత అందంగా ఉన్నాడో! భోజనంలో ఏముంది? ఎప్పుడూ తినేదే!" అని మాటల్లో పడేసి వాడు బాలకృష్ణుణ్ణి చూస్తూ తన్మయుడై పోతూ ఉండగా వాడి విస్తట్లో పిండివంట వీడు తినేసి తాను వాణ్ణి మాయ చేయగలిగానని సంబరపడిపోతున్నాడట. నిజానికి మాయలో పడింది వీడే. వాడు పరమార్థాన్ని ఆస్వాదిస్తున్నాడు. వీడు పదార్థాలు రుచి చూస్తున్నాడు.

అంతిమంగా భాగవత పఠనం ద్వారా మనం తెలుసుకోవలసిందీ అదే. పదార్థాల మాయలో పడకూడదు. పరమార్థాన్ని అందుకోగలగాలి.

—మహాసహస్రవధాని డా ॥ గరికిపాటి నరసింహారావు



# శ్రీరామకృష్ణ కథామృతం - శ్రీ మహాభాగవతం

ఆధ్యాత్మిక గ్రంథాలు ఆచరణాత్మక గ్రంథాలు. సాధకుడు అనుసరించవలసిన అనుష్ఠానాలు, జీవితంలో రాణించడానికి తాను చేపట్టవలసిన సిద్ధాంతాలు, మనిషి తాను మనీషిగా రూపుదిద్దుకోవడానికి కావలసిన సమగ్రమైన సూచనలు కాలానికి తగ్గట్టు, యుగానికి తగ్గట్టు అవతారపురుషులు ఏతెంచి ఆయా కాలానికి సరిపడ సందేశాన్ని ఇవ్వడం అనవాయితీ.

ఆ సందేశాలు పురాణాల రూపంలోనూ, ఇతిహాసాల రూపంలోనూ, వేదాంత రూపంలోనూ వెలువడతాయి. ఆ రీతిలో వెలువడినవే రామాయణం, మహాభారతం, శ్రీ మహాభాగవతం, భగవద్గీత మొదలైనవి. అదే కోవలో వెలువడిందే శ్రీరామకృష్ణ కథామృతం. సంభాషణల రూపంలో, ఛలోక్తులతో సకల శాస్త్రసారాన్ని, ఆధ్యాత్మిక సూక్ష్మతర విషయాలను సరళమైన భాషలో శ్రీరామకృష్ణులు భక్తులకు తెలియజేసినప్పుడు ఒక భక్తుడు పుస్తకంలో వ్రాసుకొన్న అక్షరమాలే ఈ కథామృతం. ఒక అవతార పురుషుని ఆధ్యాత్మిక అనుభూతులు, ఆధ్యాత్మిక సత్యాలు, అనుభవాల మాలే ఈ గ్రంథం.

శ్రీరామకృష్ణ కథామృతం రచయిత మహేంద్రనాథ్ గుప్త మొదటిసారిగా శ్రీరామకృష్ణుల దర్శనార్థం దక్షిణేశ్వరంలోని భవతారిణి ఆలయ ప్రాంగణంలో ఉన్న వారి గదిలోకి ప్రవేశించాడు. గది నిండా భక్తులు నేలమీద కూర్చొని పరమహంస శ్రీరామకృష్ణుల వచనామృతాన్ని గ్రోలుతున్నారు. శ్రీరామకృష్ణులు పూర్వాభిముఖంగా మంచం మీద ఆసీనులై దరహాస వదనంతో భగవంతుడ్ని గురించి ప్రసంగిస్తున్నారు. గదిలో భక్తులంతా నేలపై కూర్చొని, మంత్రముగ్ధులై వారు వినిపించే కథామృతాన్ని పానం చేస్తున్నారు. మహేంద్రనాథ్ నిశ్చేష్టుడై నిలబడి ఆ దృశ్యాన్ని తిలకిస్తున్నాడు. ఆహా! సర్వతీర్థ సమ్మేళనం

ఇక్కడే జరుగుతున్నట్లు అనిపిస్తుంది. సాక్షాత్తు శుక మహర్షి భగవత్ప్రసంగం చేస్తున్నట్లుగా, శ్రీ చైతన్య మహాప్రభువు పూరీ జగన్నాథ క్షేత్రంలో రామానంద, స్వరూపానందాది భక్తులతో భగవంతుని నామగుణ సంకీర్తన చేస్తున్నట్లుగా అతడికి అనిపించింది.

శ్రీరామకృష్ణులు ఇలా చెబుతున్నారు: "ఒక్కసారి హరినామంగాని, రామనామంగాని ఉచ్చరించగానే రోమాంచితమై అశ్రువులు జాలువారితే, సంధ్యావందనాది కర్మలు ఆపైన నిర్వర్తించనక్కరలేదని స్పష్టంగా తెలుసుకోండి. అప్పుడు కర్మత్యాగం చేసే అధికారం అతడికి కలుగుతుంది. కర్మ దానంతట అదే వదలిపోతుంది. అటువంటి స్థితిలో రామనామం గాని, హరినామం గాని లేకపోతే కేవలం ఓంకారాన్ని గాని ఏదో ఒకటి జపిస్తే చాలు." మళ్ళీ ఇలా కొనసాగించారు: "సంధ్యావందనం గాయత్రిలో లయిస్తుంది. గాయత్రి ఓంకారంలో లయిస్తుంది."

మహేంద్రనాథ్ నిశ్చేష్టుడై తనలో ఇలా భావించుకోసాగాడు: 'ఆహా! ఎంత సుందరమైన స్థలం! ఆహా వీరిలో ఎంత ఆకర్షణ ఉంది! వీరెంతో ఆకట్టుకొనే స్వరూపులు! ఎంత సుమధురమైన పలుకులు! ఇక్కడ నుంచి వెళ్ళడానికి నా మనస్సు ఒప్పడం లేదు.'

ఇదే నాందిగా మహేంద్రనాథ్ గుప్త ఆధునిక భాగవతంగా పిలువబడుతున్న 'శ్రీరామకృష్ణ కథామృతం' వ్రాయడానికి పూనుకొన్నాడు. ఆ రోజు మహేంద్రనాథ్ బాధాతప్త హృదయంతో, సంసారం పట్ల విరక్తుడై దక్షిణేశ్వరం రావడం జరిగింది. శ్రీరామకృష్ణుల వచనధారలను వింటున్నప్పుడు, వారిని శుకబ్రహ్మగా దర్శించడంతో వారి పట్ల ఆకర్షితుడయ్యాడు. దాని ఫలితంగానే ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో కనీవినీ ఎరుగని 'శ్రీరామకృష్ణ కథామృతం' అనే గ్రంథం వెలువడింది.



సరిగ్గా ఈ విధమైన పరిస్థితుల మధ్యే యుగాల క్రితం భాగవతం బోధించబడింది. ఆ సందర్భంలోనూ శుకుడు భాగవతాన్ని పరీక్షిత్తుకు బోధిస్తున్నప్పుడు కూడా శౌనకాది ఋషులు, సాధకులు చుట్టూ ఆసీనులై ఉన్నారు. పరీక్షిత్తు తనకు కలిగిన విప్రశాపంతో విరక్తుడై సర్వాన్నీ పరిత్యజించి, దేహత్యాగం చేయ సంకల్పించి ఉపవాసవ్రతుడైనాడు. శాపం కారణంగా తాను ఏడు రోజులలో మరణించాల్సి ఉన్నప్పటికీ, పుణ్యం పండితేనే సుమా పుణ్యపురుషుల దర్శనం లభించేది అన్నట్లుగా శుక మహర్షి, పరీక్షిత్తు వద్దకు రావడం జరిగింది. శుక మహర్షి భాగవత బోధ ద్వారా దేహం పట్ల మమకారాన్ని విడిచి జీవితాన్ని సార్థకం చేసుకున్నాడు పరీక్షిత్తు. ఆ విధంగా ప్రపంచానికి భాగవతమనే గ్రంథం వెలువడింది. కొద్దిపాటి వివేకంతో ఆలోచిస్తే భాగవత సందేశాన్ని ఆధునిక ప్రపంచానికి 'శ్రీరామకృష్ణ కథామృత' రూపంలో ఇవ్వడం జరిగింది. అయితే రెండు గ్రంథాల సారం ఒక్కటే - భగవత్ సాక్షాత్కారం, భగవంతునితో సాయుజ్యాన్ని పొందడమే. దుర్లభమైన మానవజన్మను అనిత్యసుఖాలవైపు మళ్ళించకుండా, నిత్యమూ, శాశ్వతమూ అయిన పరమాత్మను తెలుసుకునేందుకు వినియోగించాలి. దీనినే 'భాగవతం' - 'కథామృతం' బోధిస్తున్నాయి.

# ప్రథమ స్కంధము

శ్రీకైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్, లోక ర
క్షైకారంభకు, భక్త పాలన కళా సంరంభకున్, దానవో
ద్రేక స్తంభకుఁ, గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నా కంజాత భవాండ కుంభకు, మహానందాంగనా డింభకున్.

1

తా॥ అఖిలలోక రక్షకుడిని, భక్తులను రక్షించడానికి వెనుకాడనివాడిని, రాక్షసుల పొగరును నిలువరించ గలవాడిని, క్రీగంటి చూపుతో బ్రహ్మాండాలు సృష్టించేవాడిని, మహాత్ములైన నందయశోదల నందనుడిని, మోక్షసంపదను ఆకాంక్షించి ఆ బాలగోపాలుణ్ణి సదా స్మరిస్తూ ఉంటాను.

## ఉపోద్ఘాతము

అవతారిక: శ్రీ బమ్మెర పోతనామాత్యుల వారు శ్రీమహాభాగవత పురాణాన్ని తెనిగించటానికి పూనుకొని శిష్టులు పాటించే ఆచారాన్ని బట్టి విఘ్నములు తొలగి పుష్టిని పొందే నిమిత్తం మొట్టమొదట మంగళాన్ని ఆచరించదలిచారు. అది ఆశీర్వాదమైనా, నమస్కారమైనా, వస్తు నిర్దేశమైనా కావచ్చునని శాస్త్రప్రమాణం కనుక ఈ పద్యంలో వస్తు నిర్దేశం చేశారు. గ్రంథ ప్రారంభంలో శ్రీకారం ఉండటం సర్వశుభప్రదము, కావ్యాదియందు మగణం శుభదాయకం. అందుకే శ్రీకారంతో కూడిన మగణంతో ప్రారంభించారు.

ఉ. వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజా ముఖపద్మ మయూఖ మాలికిన్
బాల శశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వ పర్వతో
న్మూలికి నారదాది ముని ముఖ్య మనస్సరసీరుహాలికిన్.

2

తా॥ అడ్డులేకుండా తాండవం సలిపే వానికి, దయతో కూడిన వానికి, శూలాన్ని ధరించిన వానికి, పార్వతీదేవి ముఖపద్మాన్ని వికసింప చేసే కిరణములు గల సూర్యునికి, శిరస్సునందు చంద్రరేఖను ధరించిన వానికి, కపాలాన్ని ధరించిన వానికి, మన్మథుని గర్వమును నాశనం చేసిన వానికి, నారదాది మునుల మనస్సులనే పద్మములకు తుమ్మెద వంటి వానికి, పరమేశ్వరునికి భక్తితో మ్రొక్కుతాను.

ఉ. ఆతత సేవఁ జేసెద సమస్త చరాచర భూత సృష్టి వి
జ్ఞాతకు భారతీ హృదయసౌఖ్య విధాతకు వేద రాశి ని
ర్ణేతకు దేవతా నికర నేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపస లోక శుభ ప్రదాతకున్.

3

తా॥ చరాచర ప్రపంచాన్నంతా సృష్టింప నేర్చిన వానిని భారతీదేవి యొక్క హృదయానికి సౌఖ్యమును చేకూర్చే వానిని, వేదరాశిని నిర్ణయించిన వానిని, దేవతా సమూహానికి నాయకుడైన వానిని, భక్తుల పాపాలను పోగొట్టే వానిని, తనకు నమస్కరించిన వారిని రక్షించేవానిని, తాపస లోకానికి శుభములను ఇచ్చేవానిని (బ్రహ్మదేవున్ని) నేను భక్తితో సేవిస్తాను.

వ. అని నిఖిల భువన ప్రధాన దేవతా వందనంబు సేసి.

4

తా॥ అని ఈ విధంగా సకలలోక పాలకులైన ప్రధాన దేవతలకు అందరకు నమస్కారం చేస్తున్నాను.

ఉ. ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జన నంద వేదికిన్
మోదకఖాదికిన్ సమద మూషక సాదికి సుప్రసాదికిన్.

5

తా॥ హిమవంతుని కూతురైన పార్వతీదేవి యొక్క హృదయానురాగమును పొందిన వానికి, సమస్త దోషములను పోగొట్టే వానికి, నిర్మలమైన వానికి, విఘ్నములను తొలగించే వానికి, అందంగా మాట్లాడే వానికి, అశేషమైన జనులకు ఆనందాన్నిచ్చే వానికి, కుడుములు ఉండ్రాళ్ళు తినే వానికి, మూషికాన్ని ఎక్కి విహరించేవానికి మ్రొక్కుతాను.

ఉ. క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్.

6

తా॥ నేలకు నుదురు తాకేటట్లు మ్రొక్కి సరస్వతీ దేవిని నుతిస్తున్నాను. ఆ వాణి—ఇసుక తిన్నెలవంటి పిరుదులు గలట్టిది. తుమ్మెదలగుంపు లాంటి అందమైన జడ ఉన్నట్టిది. శరణన్నవాళ్ళను రక్షించేది. పద్మం నుంచి పుట్టినట్టివాడైన బ్రహ్మయొక్క మనస్సును వశబరచుకొనే వాక్కు గలది. జపమాల, చిలుక, పద్మం, పుస్తకం — వీటిని తన రమ్యమైన చేతులందు దాల్చినట్టిది.

శా. పుట్టం, బుట్ట, శిరంబునన్ మొలవ, నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను, గాళిఁ గొల్వను, బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టే వెంటఁ జరింతు దత్సరణి నా కీవమ్మ! యో యమ్మ! మేల్
పట్టున్ నాకగుమమ్మ! నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ!

7

తా॥ అమ్మా! సరస్వతీ! దయకు సముద్రం వంటిదానా! నేను వాల్మీకి వలె పుట్టలో నుండి పెరిగిన వాడిని కాను. నీటియందు తిరిగే పడవలో పుట్టిన వ్యాసుడను కాదు. నేను కాళిని కొల్చిన కాళిదాసును కాను. జెల్లుయందు పుట్టిన కుమార స్వామిని కాను. ఈ భాగవత పురాణాన్ని వ్రాయడానికి సిద్ధపడ్డాను. ఏమి చేయాలో తెలియడం లేదు. నీవే దయతో అనుగ్రహించి నా చేయి పట్టుకుని నడపించు తల్లీ! నువ్వే నాకు ఆధారమమ్మా! నిన్నే నమ్ముకున్నాను తల్లీ!

ఉ. శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ!

8.

తా॥ శరత్కాల మేఘము, శరత్కాల చంద్రమండలము, తెల్లకర్పూరము, చల్లని చందనము, రాజహంసలు, మల్లెపూలు, తెల్లని మంచు, పరిశుభ్రమైన నురుగు, వెండికొండ, జెల్లుపూలు, ఫణిరాజు అయిన ఆదిశేషువు, మొల్లపూవులు, తెల్లమందారములు, క్షీరసాగరము, తెల్లని తామరపూలు, ప్రవహించే గంగానది.... ఇవన్నీ మంగళప్రదమైన నీ మహోజ్జ్వల రూపానికి తగిన పోలికలు. అట్టి నిన్ను నా మనస్సులో ఎప్పుడు దర్శిస్తానో కదా భారతీ!

ఉ. అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రి కా

డంబర చారుమూర్తి, ప్రకట స్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా
వాంబరవీథి విశ్రుత విహారిణి, నన్ గృపఁజూడు భారతీ!

9

తా॥ తల్లీ! భారతీ! ఉజ్జ్వలమైన పద్మంవంటి చేతితో లీలాకమలాన్ని ధరించి, శరత్కాల చంద్రికతో పోలిన మనోహర రూపంతో, నువ్వు ధరించిన భూషణముల రత్న దీపికల కాంతులు దిక్కులను చుంబించగా, శ్రుతులు నీ ప్రభావాన్ని కీర్తింపగా.... కవుల మనోవీథులలో విహరించే నువ్వు నన్ను కృపతో చూడు.

ఉ. అమ్మల గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె
ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చిన యమ్మ, దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా
యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.

10

తా॥ లోకంలో ఉండే అమ్మలందరినీ కన్న అమ్మ, ముల్లోకాలకు మూలమైన అమ్మ, అందరు తల్లులకన్నా అధికురాలైన అమ్మ, క్షుద్రులైన రక్కసి మూకలను మట్టుబెట్టిన అమ్మ, తనను నమ్ముకొన్న దేవతా స్త్రీల అంతరంగములలో ఉండే అమ్మ దుర్గాదేవి అయిన మా అమ్మ కృపతో మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను మాకిచ్చు గాక.

అమ్మా అనగానే మాతృత్వం. కారణం (జగత్ మూలం) వాత్సల్యం, రక్షణ, క్షమా, ప్రేమ అనే భావాల ఏకీకరణం. ఆ మాతృసాన్నిధ్య భావనను ప్రసాదించే అమ్మలగన్నయమ్మే విశ్వమంతా వ్యాపించి రక్షిస్తుంది.

మ. హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో, వర్థంపుఁ బెన్నిక్క, చం

దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్ తోనాడు పూఁబోఁడి, తా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.

11

తా॥ హరికి పట్టపుదేవి, పున్నెముల రాశి, సంపదలకు పెన్నిధి, చంద్రునకు గారాబు చెల్లెలు, భారతీదేవితోను ఉమాదేవితోను కలిసి ఆడుకునే పూబోణి, తామరలయందు ఉండే ముద్దరాలు, లోకములన్నీ పూజించే ఇల్లాలు, లేమి అనేది లేకుండ చేసే తల్లి..... అయిన ఆ లక్ష్మీదేవి నిత్యకళ్యాణాన్ని ఇచ్చుగాక!

వ. అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచి ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథా సుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి; మృదు మధుర వచన వర్గ పల్లవిత స్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి, మహా కావ్యకరణ కళా విలాసుం గాళిదాసుం గొనియాడి, కవి కమల రవిన్ భారవిన్ బొగడి విదళి తాఘు మాఘు వినుతించి, యాంధ్ర కవితాగౌరవ జనమనోహరి నన్నయ సూరిం గైవారంబు సేసి, హరిహర చరణారవింద వందనాభిలాషిం దిక్కమనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు పలికి, భావికవుల బహూకరించి, యుభయ కావ్య కరణ దక్షుండనై.

12

తా॥ దినకరుణ్ణి, కుమార స్వామిని తలుస్తున్నాను. కవితా విద్యకు ప్రథముడయిన వాల్మీకిని స్తుతిస్తున్నాను. హయగ్రీవుడనే దనుజుని వలన చిక్కుపడిన వేదసమూహాన్ని విభాగించిన వ్యాసభగవానునికి మ్రొక్కుతున్నాను. శ్రీ మహాభాగవత కథా సుధారసాన్ని

ప్రయోగించిన శ్రీ శుకయోగికి నమస్కరిస్తున్నాను. మృదుమధుర వచన రచనా కుతూహలుడైన బాణునకు ప్రణామాలు చేస్తున్నాను. కొద్ది శ్లోకాలతో సూర్యుణ్ణి మెప్పించిన మయూరుడిని అభినందిస్తున్నాను. మహా కావ్యాలను రచించిన కవితా విలాసుడైన కాళిదాసుని కొనియాడుతున్నాను. కవులనే కమలసమూహాలను వికసింప చేసిన భారవిని పొగడుతున్నాను. పాపములను పోగొట్టిన మాఘున్ని వినుతిస్తున్నాను. ఆంధ్రకవిత్వంలో జనుల యొక్క మనస్సులను దోచేసిన నన్నయ భట్టారకునికి కైవారములు చేస్తున్నాను. హరిహరుని చరణారవిందములకు నిత్యము వందనము చేయడంలో అభిలాష కలిగిన తిక్కన గారిని భూషిస్తున్నాను. తక్కిన ఇతర పూర్వ కవులందరినీ చక్కగా తలచుకొని వర్తమాన కవులందరికీ ప్రియాన్ని పలుకుతూ, భావి కవులకు శుభం పలుకుతున్నాను. ఉభయ భాషలలో గద్యపద్యాత్మకంగా కావ్యాలను రచించే నేర్పును పొంది ఉన్నాను.

## పోతనగారి నిర్ణయము

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి, కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

13

తా॥ విశ్వ శ్రేయస్సును చేకూర్చాలనే సంకల్పంతో విరచించిన ఈ భాగవతాన్ని అధములయిన మనుజేశ్వరులకు (రాజులకు) అంకితమిచ్చినవాడు దానికి ప్రతిఫలంగా అగ్రహారాలు, కొన్ని వాహనాలు, కొద్దిపాటి సొమ్ము పుచ్చుకొని ఆ పిమ్మట నీరసించిపోయి శరీరాన్ని విడిచిపెడతాడు. పిమ్మట యమధర్మరాజు చేతిలో సమ్మెట దెబ్బలు తింటాడు. ఆ దుస్థితి లేకుండ బమ్మెర పోతరాజు తన భాగవత మహాకావ్యాన్ని పూర్తి విశ్వాసంతో ఆ శ్రీహరికి అంకితం చేస్తున్నట్లు చెప్పాడు.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ, గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు.

14

తా॥ పుట్టిన ప్రతి ఒక్కడూ చేతులార శివుణ్ణి పూజించాలి. హరి యొక్క కీర్తిని హాయిగా నోరార గానం చేయాలి. దయ, సత్యము మొదలయిన గొప్పగుణాలు కలిగి ఉండాలి. ఈ గుణాలు లేనివాడు పుట్టడం దేనికి? తల్లుల కడుపు చేటు కాకపోతే!

జీవునికి ఉండాల్సిన లక్షణాలను ఇక్కడ తెలియజేస్తున్నారు. సర్వజీవుల ఎడల దయ, సత్యసంభాషణ వంటి గొప్ప గుణాలతో భగవంతుని స్మృతి, అర్చన, కీర్తనలు కూడా చేయాలి.

ఇటువంటి సద్గుణసంపదలేని జీవుడు జీవిత ఉద్దేశాన్ని మరచి జనన మరణ సంసారచక్రంలో పుడుతూ, చస్తూ ఉంటాడు.

వ. అని మఱియు మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీ మన్నారాయణకథా ప్రపంచ విరచనా కుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకఁ గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్న యెడ.

15

తా॥ నా వేలకొలది పూర్వ జన్మల్లో నేను చేసుకున్న తపఃఫలంగా శ్రీమన్నారాయణ కథలను రచించాలనే కుతూహలంతో ఒక పున్నమి నాటి రాత్రి చంద్రగ్రహణ కాలంలో పెద్దల అనుమతితో ఆకాశాన్ని అంటే కెరటాలతో ప్రవహించే గంగా (గోదావరి) నదివద్దకు వెళ్ళాను. అందులో స్నానం చేసి వచ్చి అందమైన ఇసుక తిన్నెమీద పరమేశ్వర ధ్యానంలో నేత్రములు సగం ముడుచుకొని కూర్చున్నాను.

సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలువిల్లు మూఁపునఁ బరగువాఁడు
నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి ఘన కిరీటము దలఁ గలుగువాఁడు

ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు, వెడఁద యురమువాఁడు, విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా, కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

16

తా॥ నా కన్నుల ముందు ఆ సమయంలో ఒక రాజశేఖరుడు దర్శనం ఇచ్చాడు. మెరపు

చెంగట ఉన్న మేఘంవలె ఒక స్త్రీ మూర్తి ఆయన ప్రక్కన ఉన్నది. చంద్ర మండలం నుండి జాలువారుతున్న అమృతం వలె ఆయన ముఖంలో చిరునవ్వు చిందులు వేస్తూ ఉన్నది. తమాలకా వృక్షాన్ని చుట్టుకొన్న తీగవలె ఆయన భుజంమీద పెద్ద విల్లు ఉన్నది. నీల నగాగ్రంలో భాసించే భాను బింబం వలె శిరస్సున కిరీటం మెరుపులీనుతున్నది. ఆయన తెల్లతామరల వంటి కనుదోయితో, విశాలమైన వక్షఃస్థలంతో సకల లోకాలకు శుభములను ఇచ్చే మంగళకరమైన రూపంతో నా కనులముందు సాక్షాత్కరించాడు.

వ. ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయు నెడ నతఁడు దా 'రామభద్రుండ మన్నామాంకితంబుగ శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగు' నని యాన తిచ్చి తిరోహితుండయిన సమున్మీలిత నయనుండనై వెఱఁగుపడి చిత్తంబున.

17

తా॥ నేను ఆ రాజశేఖరుని తేరిపార చూసి మాట్లాడే ప్రయత్నం చేయబోతున్నాను. వెంటనే అతడు, 'నేను రామభద్రుణ్ణి! నా పేరు మీదుగా శ్రీమహాభాగవతాన్ని తెలుగులో వ్రాయవలసింది. నీకు జన్మబంధం తెగిపోతుంది' అని ఆనతిచ్చి తిరోహితుడు అయ్యాడు. అంతలోనే నేను కన్నులు తెరచి చూసి ఆశ్చర్యంతో నా మనస్సులో ఇలా అనుకున్నాను:

క. పలికెడిది భాగవతమఁట!, పలికించెడి వాఁడు రామభద్రుండఁట! నేఁ
బలికిన భవహర మగునఁట!, పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా?

18

తా॥ 'నేను వ్రాయబోయేది భాగవతమట! నా చేత పలికించెడి వాడు రామభద్రుడట! నే పలికితే భవబంధములు పరిహారమవుతాయట! పలికితే భాగవతమే పలుకుతాను. వేరే ఇతర గాథలు ఎందుకు?'

ఏది భగవంతుని దరికి చేరుస్తుందో దాన్నే అనుసరించాలిగాని భగవంతుని నుండి దూరంచేసే దాన్ని ఎందుకు చేయాలి. భగవంతుని దగ్గరకు చేర్చేదే ధర్మం, తక్కినదంతా అధర్మం.

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు!, శూలికైనఁ దమ్మిచూలికైన!
విబుధజనుల వలన విన్నంత కన్నంత, దెలియ వచ్చినంత దేటపఱుతు.

19

తా॥ సాక్షాత్తు బ్రహ్మకైనా త్రిశూలధారి అయిన ఈశ్వరునికైనా సరే భాగవతం యొక్క అంతరార్థం తెలుసుకుని పలకడం చాలా కష్టం. పండితులయిన పెద్దలు చెప్పగా విన్నది నేను కన్నది నాకు తెలియవచ్చినది... ఏదైతే ఉన్నదో దానిని నేను తెలియబరుస్తాను.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండుం
గొందఱికి గుణములగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్

20

తా॥ ఇక రచన విషయం. కొందరు తెనుగు అంటే ఇష్టపడతారు. మరికొందరు సంస్కృతం అంటే ఇష్టపడతారు. సంస్కృత ఆంధ్రములు సమానంగా ఉంటే కొందరికి ఇష్టం. నేను నా కృతులతో అందరిని మెప్పిస్తాను.

మ. ఒవరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

21

తా॥ పరమ రమణీయంగా నన్నయ భట్టారక తిక్కనాది కవులు సంస్కృతం లోంచి తెనుగులోకి అనేక గ్రంథాలు అనువాదం చేసారు. నా పూర్వపుణ్యం ఎట్టిదో కాని ఈ మహాభాగవతం జోలికి ఎవరూ పోలేరు. నేను దీనిని ఆంధ్రీకరించి నా జన్మను పునర్జన్మ లేకుండ సఫలం చేసుకుంటాను.

మ. లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య తరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై.

22

తా॥ ఈ భాగవతమనే కల్పవృక్షం సద్విజులకు శ్రేయస్సును ఆపాదిస్తూ ఈ భూమిమీద ప్రకాశిస్తూనే ఉంటుంది. లలితమైన స్కంధములు కలది భాగవతం, అందమైన కొమ్మలు కలది కల్పవృక్షం. శ్రీకృష్ణ పరమాత్మ చరిత్ర మూలంగా కలది భాగవతం, నల్లని వ్రేళ్ళు కలది కల్పవృక్షం. శ్రీశుక మహర్షి చేత చెప్పబడింది భాగవతం, చిలుక పలుకులతో మనోజ్ఞమైనది కల్పవృక్షం. పరమ రమణీయమైనది భాగవతం, అందమైన లతల చేత శోభించేది కల్పవృక్షం. మంచి వర్ణము కలిగి మంచి మనస్సు కలవాళ్ళు తెలుసుకొన వలసినది భాగవతం, మంచి రంగుగల పువ్వులు కలది కల్పవృక్షం. సుందరము ఉజ్జ్వలము అయిన ఇతివృత్తం కలది భాగవతం, అందంగా గుండ్రని ఆకారం కలది కల్పవృక్షం. చదివినా విన్నా మహాఫలాన్ని ఇచ్చేది భాగవతం. చక్కని ఫలములను ఇచ్చేది కల్పవృక్షం. వ్యాసునికి ఆలవాలమైనది భాగవతం. స్వచ్ఛమైన వ్యాసంతో కూడిన పాదు కలది కల్పవృక్షం. ఉత్తములైన ద్విజులకు ఆశ్రయమైనది ఈ భాగవతం, పక్షులన్నిటికి ఆధారభూతమైనది ఈ కల్పవృక్షం. ఈ భాగవతం భూలోకంలో ఉంటుంది, కల్పవృక్షం స్వర్గలోకంలో ఉంటుంది.

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాత పాదపసమాశ్రయంబునను,

హరికరుణా శేషంబునను, గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినంబులకు నేక శిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధబంధు జనానుజ్ఞాతుండనై.

23

తా॥ 'ఈ విధంగా భాసిల్లుతూ ఉన్న శ్రీ మహాభాగవత పురాణమనే పారిజాత వృక్షాన్ని ఆశ్రయించిన కారణంగాను, హరి యొక్క కరుణా విశేషం చేతను కృతార్థుడనయ్యాను' అని బుద్ధిలో తోచి కొన్ని రోజులలో ఏకశిలా నగరానికి (ఓరుగల్లుకి) వచ్చి అక్కడ గురువులు వృద్ధులు పండితులు బంధువులు... వీరందరి యొక్క ఆజ్ఞను పొందాను.

## పోతనామాత్యుని వంశ వర్ణనము

సీ. కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తంబ సూత్రుండు పుణ్యుండు సుభగుఁడైన
భీమన మంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ, కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తు వరమునఁ గనియె సోమన మంత్రి వల్లభ మల్లమ, వారి తనయుఁ
డెల్లన, యతనికి నిల్లాలు మాచమ వారిపుత్త్రుఁడు వంశవర్ధనుండు

ఆ. లలిత మూర్తి బహుకళానిధి కేసన, దాన మాన నీతి ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ, మనియె శైవశాస్త్రమతముఁ గనియె.

24

తా॥ ఇక మా వంశాన్ని గురించి చెపుతున్నాను. మా గోత్రం కౌండిన్యస గోత్రం. ఆపస్తంబ సూత్రం. పుణ్యుడు, భాగ్యవంతుడు అయిన భీమన మంత్రికి ప్రియపుత్రుడు అన్నయ. ఆ అన్నయ మంత్రికి భార్య మధురంగా మాట్లాడే గౌరమాంబ. సూర్యవర ప్రసాదం వలన ఆ దంపతులకు సోమన జన్మించాడు. ఆ సోమన మంత్రి భార్య మల్లమ. వారి పుత్రుడు ఎల్లన. ఎల్లన భార్య మాచమ. వారి కొడుకు వంశవర్ధనుడైన కేసన. ఆయన చాలా గొప్పవాడు. ఆయన బహు లలితుడు, బహు కళానిధి, దానశీలి, మానధనుడు, నీతి పరుడు. తనకు లక్కమాంబను సహధర్మచారిణిగా వరించి శాస్త్రసమ్మతంగా శైవ మతాన్ని స్వీకరించాడు.

క. నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుష గుణముఁ దనపతి నుడువుం
గడవదు, వితరణ కరుణలు, విడువదు, లక్కాంబ విబుధ విసరము వొగడన్.

25

తా॥ ఆ లక్కమాంబ పండిత మండలి పొగిడేటట్లుగా ఇల్లుదాటి బయటకు వెళ్ళదు. పరపురుషుల గుణములను గురించి ఎప్పుడూ మాట్లాడదు. తన భర్త మాట ఎప్పుడూ జవ దాటదు. దానగుణం, దయాగుణం ఈ రెంటినీ ఎప్పుడూ విడిచిపెట్టదు.

ఉ. మానిను లీడు గారు, బహుమాన నివారిత దీనమానస
గ్లానికి, దాన ధర్మ మతి గౌరవ మంజులతా గభీరతా
స్థానికి, ముద్దుసానికి, సదాశివపాదయుగార్చనానుకం
పా నయవాగ్భవానికిని, బమ్మెర కేసయ లక్కసానికిన్.

26

తా॥ ఆమె ఇచ్చే బహుమానములచేత దీనుల యొక్క మనస్సులలో ఉండే బాధ తొలగిపోతుంది. దానము, ధర్మము, బుద్ధి చాతుర్యము, మనోజ్ఞము, గాంభీర్యము.... వీటికి ఆమె స్థానం. అన్నింటా అధికురాలు ఆమె. సదాశివుని యొక్క పాదములను అర్చించుటయందు సాక్షాత్తు పార్వతీ దేవిలా కనిపించే.... ఆ బమ్మెర కేసనామాత్యుని భార్య అయిన లక్కమ్మ గారికి లోకంలో ఏ స్త్రీలు సాటిరారు.

క. ఆ మానినికిం బుట్టితి, మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన పోతన, నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్.

27

తా॥ ఆ లక్కమ్మ గారికి ఇరువురు సంతానం. అందులో పెద్దవాడు తిప్పన. ఈశ్వరుణ్ణి సేవించుటయందు మనస్సు కలవాడు. రెండవ వాడిని నేనే. నా పేరు పోతన. మంచివారైన పెద్దల విషయంలో గౌరవం కలవాడిని.

వ. అయిన నేను నా చిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని,

28

తా॥ అట్టి నేను నా మనస్సులో శ్రీరామచంద్రుని సన్నిధానాన్ని కల్పించుకున్నాను.

# ఆరు అంత్యప్రార్థనలు

ఉ. హారికి, నందగోకులవిహారికిఁ, జక్రసమీర దైత్య సం
హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీ మనో
హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్

29

తా॥ హారములు ధరించిన వానికి, నంద గోకులంలో విహరించిన వానికి, తన చక్రం చేత తృణావర్తుడనే దైత్యుణ్ణి సంహరించిన వానికి, భక్తుల యొక్క దుఃఖములను పరిహరించే వానికి, గోపకాంతల యొక్క మనస్సులను హరించిన వానికి, దుష్టుల యొక్క సంపదలను హరించిన వానికి, వ్రేపల్లెలో గోపకాంతల కుటీరములలో పాలు, నెయ్యి అపహరించిన వానికి, పిల్లల పాలిటి పెనుభూతమైన దుష్టురాలైన వనిత అయిన పూతన అనే రక్కసిని సంహరించిన వానికి.....

ఉ. శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణ హస్త ని
ర్మూలికి, ఘోర నీరదవిముక్త శిలాహత గోపగోపికా
పాలికి, వర్ణ ధర్మపరిపాలికి, నర్జునభూజయుగ్మ సం
చాలికి, మాలికిన్, విపుల చక్ర నిరుద్ధ మరీచి మాలికిన్.

30

తా॥ శీలం కలవానికి, నీతిమంతునకు, శంకరుని వశం చేసుకొన్నవానికి, బాణుని హస్తములను నిర్మూలించిన వానికి, నీటిని ఇచ్చే మేఘముల నుండి ఘోరమైన రాళ్ళవాన కురిస్తే దానినుండి గోపగోపికా జనులను కాపాడిన వానికి, వర్ణాశ్రమ ధర్మాలను పరిపాలించే వానికి, రెండు మద్ది చెట్లను కూల్చిన వానికి, వనమాల ధరించిన వానికి, సైంధవ వధ సమయంలో తన

చేతి విపులమైన చక్రం చేత సూర్యమండలాన్ని కప్పివేసిన వానికి.....

ఉ. క్షంతకు గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు, నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోర వాహినీ
హంతకు, నింద్ర నందన నియంతకు, సర్వచరాచరావళీ
మంతకు, నిర్జితేంద్రియసమంచిత భక్త జనానుగంతకున్.

31

తా॥ క్షమాగుణం కలిగిన వానికి, కాళియుడు అనే పాము యొక్క విశాలమైన పడగలమీద నర్తనమాడిన వానికి, సంతోష పడుతున్న మగధరాజు అయిన జరాసంధుని యొక్క చతురంగ సైన్యాన్ని అంతం చేసిన వానికి, యుద్ధరంగంలో పార్థుని రథం నడిపిన వానికి, సమస్త ప్రపంచము నిత్యము స్మరించే వానికి, జితేంద్రియులైన భక్తులను అనుసరించే వానికి.....

ఉ. న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీ మన
స్థాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగ సం
ధాయికి, బీతవస్త్రపరిధాయికి, బద్మభవాండభాండ ని
ర్మాయికి, గోపికానివహ మందిరయాయికి, శేషశాయికిన్.

32

తా॥ ఎల్లప్పుడూ న్యాయమార్గంలో ఉండే వానికి, భూసురుని యొక్క మరణించిన బాలుణ్ణి తెచ్చి ఇచ్చిన వానికి, రుక్మిణీ దేవి యొక్క మనస్సులో ఎప్పుడూ ఉండేవానికి, సమస్త లోకాలకు సంతోషాన్ని చేకూర్చే వానికి, సాధుజనులకు కూర్మిని కూర్చే వానికి, పచ్చని పట్టు వస్త్రాన్ని ధరించిన వానికి, బ్రహ్మాండ భాండాలను నిర్మించు వానికి, గోపికా సమూహం యొక్క మందిరాలలో ఉండేవానికి, శేషునిపై శయనించు వానికి.....

వ. సమర్పితంబుఁగా నే నాంధ్రంబున రచియింపఁ బూనిన శ్రీమహాభాగవత

పురాణంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

33

తా॥ సమర్పించుకొంటూ నేను ఆంధ్ర భాషలో రచియించ తలపెట్టిన శ్రీమహా భాగవత పురాణానికి కథా ప్రారంభం ఎట్టిది అంటే....

## కథాప్రారంభం

సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వని వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రా జగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులు నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధిఁ దా నడరునట్లు

ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము భంగిఁ దోఁచు స్వప్రభానిర స్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద, ననఘు సత్యుఁ బరుని ననుదినంబు.

34

తా॥ ఈ విశ్వం యొక్క జన్మస్థితి విలయములు ఎవని వలన ఏర్పడుతూ ఉంటాయో, ముందుకు వెళ్ళడానికి వెనుకకు మరలడానికి సమస్త కార్యములయందు తెలివి కలిగి తాను సర్వసమర్థుడై మనస్సులో వేదములు బ్రహ్మకు విదితం చేశాడో, పండితులు ఎవనిని మోహిస్తారో, ఈ సృష్టి అంతా ఎండమావుల్లో, నీటిలో, గాజు వస్తువుల్లో వలె అసత్యమైనా సత్యంగా భాసిస్తూ ఎలా కనిపిస్తుందో, త్రిగుణ సృష్టి ఎందులో దీపించి సత్యముగా తోస్తూ ఉంటుందో, ఎవడు తన తేజస్సుచే మాయను తొలగిస్తాడో అట్టి అనఘుని, సత్యస్వరూపుణ్ణి ప్రతినిత్యము నేను సేవిస్తాను.

వ్యాసకృతమైన భాగవతము ఈ శ్లోకంతోనే (జన్మాదస్య....) ప్రారంభమవుతుంది. ఈ కార్య కారణాత్మక జగత్తు యొక్క సృష్టి స్థితి లయలు ఆ పరమాత్మతోనే ఏర్పడ్డాయి. మట్టి సత్తాతో కుండకు సత్తా ఉన్నట్లు, బంగారం యొక్క ఉనికితోనే ఆభరణానికి ఉనికి సిద్ధించినట్లు ఆయన సత్తాతోనే జగత్తు ప్రకాశిస్తుంది. అంటే పరమాత్మ యొక్క ఉనికితోనే సృష్టికి ఉనికి ఏర్పడింది. అందుచేత ఆ పరమ సత్యమైన పరమాత్మను నేను ధ్యానిస్తున్నాను.

వ. ఇట్లు “సత్యం పరం ధీమహి” యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీనామబ్రహ్మ

స్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందు జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు.

35

తా॥ "సత్యం పరం ధీమహి" అనే గాయత్రీ మహా మంత్రంతో ప్రారంభించడం వల్ల గాయత్రీ నామ బ్రహ్మ స్వరూపమైనది ఈ గ్రంథం. గాయత్రిని అతిశయింప చేస్తూ ధర్మాన్ని విరివిగానున్న, వృత్రాసుర సంహారాన్ని ఎందులో చెబుతామో ఆ గ్రంథాన్ని భాగవతం అంటారని మత్స్యపురాణం చెబుతుంది. కనుక ఈ పురాణం శ్రీ మహాభాగవతము అని పిలువబడుతోంది.

సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ వినఁ గోరువారల విమల చిత్తంబులఁ జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక; యితర శాస్త్రంబుల నీశుఁడు చిక్కునే మంచి వారలకు నిర్మత్సరులకుఁ గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ

తే. బరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు, నడచి పరమార్థభూతమై యధిక సుఖద మై సమస్తంబుఁ గాకయు నయ్యు నుండు, వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు.

36

తా॥ సకల సంపదలు కలిగి, మునిశ్రేష్ఠుడైన వేదవ్యాస మునీంద్రుని చేత చెప్పబడిన ఈ భాగవతాన్ని సద్భక్తితో వినాలనే కుతూహలం కలవారి మనస్సులలో ఈశ్వరుడు చిక్కుతాడు. అంతేకాని ఇతర శాస్త్రముల చేత ఈశ్వరుడు చిక్కుతాడా? మంచి వాళ్ళు, మాత్సర్యం లేనివాళ్ళు అయిన సజ్జనులు కపటాన్ని విడిచి ఎట్టి కోరిక లేకుండ భాగవత శ్రవణమందే బుద్ధి కలిగి ఉండటం మంచిది. అట్టివారు ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనే తాపత్రయము నశించి ఈ భాగవతంలో పరమార్థభూతము, అధిక సుఖదము, అయిన వస్తువును తెలుసుకుంటారు.

ఆ. వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన, పదవిఁ గనుఁడు రసిక భావవిదులు.

37

తా॥ వేదమనే కల్పవృక్షం నుండి పండి రాలి, శుకముఖ సుధాద్రవంతో నిండి ఉన్న ఈ భాగవత పురాణ ఫలమనే రసాన్ని ఆస్వాదించడానికి రసజ్ఞులైన భావవిదులు రండి!

క. పుణ్యంబై మునివల్లభ, గణ్యంబై కుసుమ ఫల నికాయోత్థిత సా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా, రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్.

38

తా॥ పుణ్యప్రదము, మునివల్లభుల చేత గణ్యము, పుష్ప ఫల సమూహముల చేత నిండిన తరువరేణ్యము అయిన నైమిశారణ్యం అరణ్యములన్నింటిలోను నుతింపతగినది.

వ. మఱియును మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథహితంబై, బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుం బోలె వహ్ని వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమావతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశుపత జటి పటల మండితంబై, బలభేదిభవనంబునుం బోలె నైరావతామృత రంభా గణికాభిరామంబై, మురాసురనిలయంబునుంబోలె నున్మత్తరాక్షస వంశసంకులంబై, ధన దాగారంబులునుం బోలె శంఖ పద్మకుంద ముకుంద సుందరంబై, రఘురాము యుద్ధంబునుం బోలె నిరంతర శరానలశిఖాబహుళంబై, పరశురాము భండనంబునుం బోలె నర్జునోద్భేదంబై, దానవ సంగ్రామంబునుంబోలె నరిష్ట జంభనికుంభ శక్తియుక్తంబై, కౌరవసంగరంబునుం బోలె ద్రోణార్జునకాంచస్యందనకదంబ సమేతంబై, కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్య సహకారంబై, సముద్రసేతు బంధనంబునుంబోలె నలనీల పనసాద్యద్రిప్రదీపితంబై, భర్గు భజనంబునుం బోలె నానాశోకలేఖా ఫలితంబై, మరుని కోదండంబునుం బోలె

బున్నాగశిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుం బోలె గేసరకరజ కాంతంబై, నాట్యరంగంబునుం బోలె నటనటీ సుషిరాన్వితంబై, శైలజా నిటలంబునుంబోలెఁ జందన కర్పూర తిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలె నింద్రబాణాసన మేఘ కరక కమనీయంబై, నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై, మహాకావ్యంబునుం బోలె సరల మృదులతా కలితంబై, వినతానిలయంబునుం బోలె సువర్ణ రుచిరంబై, యమరావతీ పురంబునుం బోలె సుమనోలలితంబై, కైటభోద్యోగంబునుం బోలె మధుమానితంబై, పురుషోత్తమసేవనంబునుం బోలె నమృతఫలదంబై, ధనంజయ సమీకరంబునంబోలె నభ్రంకష పరాగంబై, వైకుంఠపురంబునుం బోలె ఖడ్గ పుండరీక విలసితంబై, నందఘోషంబునుం బోలెఁ గృష్ణసార సుందరంబై లంకానగరంబునుంబోలె రామమహిషీవంచక సమంచితంబై, సుగ్రీవ సైన్యంబునుం బోలె గజ గవయ శరభ శోభితంబై, నారాయణస్థానంబునుం బోలె నీలకంఠ కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహాభారతంబునుం బోలె నేకచక్ర బకకంకధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్య రథంబునుం బోలె నురుతరప్రవాహంబై, జలదకాల సంధ్యాముహూర్తంబునుం బోలె బహువితత జాతిసౌమనస్యంబై, యొప్పు నైమిశారణ్యంబను శ్రీ విష్ణు క్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్లోకగీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగా గల సత్త్ర సంజ్ఞికంబైన యాగంబు సేయుచుండి రందొక్క నాఁడు వారలు రేపకడ నిత్య నైమిత్తికహోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి.

39

తా॥ ఆ నైమిశారణ్యం గురివింద చెట్లతో, వెలగ చెట్లతో; మాధవీ మన్మథ మహితమైన మహా విష్ణువు మందిరం వలె ఉన్నది. ఏడాకుల అరటి చెట్లతో; శారదాన్వితమైన బ్రహ్మదేవుని భవనం వలె ఉన్నది. చిత్రమూలం, ఉలిమిరి, మరువము, పెద్ద ఏలకి, రుద్రాక్ష, కరక, నంది, అడ్డసర, లొద్దుగ, మారేడు, శ్రీవల్లీ, జువ్వి చెట్లతో; వహ్నా, వరుణ, సమీరణ, చంద్ర, రుద్ర,

హైమవతీ, కుబేర, వృషభ, గాలవ, శాండిల్య, పాశుపత, జటిపటల మండితంబై నారింజ, ఉసిరి, అరటి, అడవి మొల్ల చెట్లతో; సాంబశివుని సభామంటపం వలె ఉన్నది. ఐరావత, అమృత, రంభా, గణికాభిరామమైన దేవేంద్రుని ప్రాసాదం వలె ఉన్నది. ఉమ్మెత్త, బలురక్కెస, వెదురు పొదలతో; ఉన్మత్త రాక్షస వంశ సంకులమైన మురాసురుని ఇల్లు వలె ఉంది. శంఖాలు, పద్మాలు, మొల్లలు, ఎఱ్ఱ తామరలతో; శంఖ, పద్మ, కుంద, ముకుంద సుందరమైన కుబేరుని సౌధం వలె ఉన్నది. దట్టమైన రెల్లు, శుక్రపుష్పి చిక్కటి పొదలతో; నిరంతర శరానల శిఖా బహుళమైన రఘురాముని రణరంగం వలె ఉన్నది. మద్ది అంకురాలు కలదై; అర్జునోద్భేదమైన పరశురాముని భండనం వలె ఉన్నది. వేప, నిమ్మ, దంతి చెట్లతో; అరిష్ట, జంభ, నికుంభ, శక్తియుక్తమైన రాక్షసయుద్ధం వలె ఉన్నది. తుమ్మ, మద్ది, సంపెంగ, కడిమి చెట్లతో; ద్రోణార్జున కాంచన స్యందన కదంబ సమేతమైన కురుపాండవ సంగ్రామం వలె ఉన్నది. ఎత్తైన మంగ, మామిడి చెట్లతో; మహోన్నత శల్య సహకారంతో కూడిన కర్ణుని కదనం వలె ఉన్నది. వట్టివేరు, నీలి, పనసాది చెట్లతో; నలనీల పనసాది అద్రిప్రదీపితమైన సముద్ర సేతు బంధనం వలె ఉన్నది. నానారకాల అశోకవృక్ష పంక్తులతో; నానా శోక లేఖా ఫలితమైన శివదేవునిసేవ వలె ఉన్నది. సురపొన్నలు, తుమ్మెదలతో; పున్నాగ శిలీముఖ భూషితమైన మన్మథుని విల్లువలె ఉంది. పొన్న, కానుగ చెట్లతో; కేసర కరజ కాంతమైన నృసింహుని రూపం వలె ఉన్నది. దుండిగ, దొండ, గువ్వగుతిక చెట్లతో; నట నటీ సుషిరాన్వితమైన నాట్యరంగం వలె ఉన్నది. చందన, కలిగొట్లు, బొట్టుగ చెట్లతో; చందన కర్పూర తిలకాంచితమైన పార్వతీఫాలభాగం వలె ఉన్నది. మరువం, నల్లగోరింట, వేగిస, తుంగముస్తెలు, దానిమ్మ చెట్లతో; ఇంద్రబాణాసన మేఘకరక కమనీయమైన వర్షాగమం వలె ఉంది. బారులు తీరిన చంద్ర చెట్లతో; గాయత్రీ విరాజితమైన వేదం వలె ఉన్నది. తెల్లతెగడ చెట్లతో, కోమలమైన తీగలతో; సరళ మృదులతా కలితమైన మహాకావ్యం వలె ఉన్నది. అందమైన ఆకులతో; సువర్ణ రుచిరమైన వినతా గృహం వలె ఉన్నది. అందమైన పూలతో; సుమనో లలితమైన అమరావతీ పట్టణం వలె ఉన్నది. పూదేనెతో; మధుమానితమైన కైటభుని అధికారం వలె ఉన్నది. తియ్యని పండ్లు కలదై; అమృత ఫలదమైన హరి సేవనం వలె ఉన్నది. ఆకాశమంతా క్రమ్ముకొన్న పుప్పొడి కలదై; అభ్రంకష పరాగమైన

ధనంజయుని యుద్ధం వలె ఉన్నది. సింహము, ఖడ్గమృగము, పెద్దపులులతో; ఖడ్గ పుండరీక విలసితమైన వైకుంఠపురం వలె ఉన్నది. అందమైన నల్ల జింకలతో; కృష్ణసార సుందరమైన నందఘోషం వలె ఉన్నది. దుప్పులు, దున్నపోతులు, నక్కలతో; రామ మహిషీ వంచక సమంచితమైన లంకా నగరంవలె ఉన్నది. ఏనుగులు, ఎలుగుబంట్లు, శరభమృగాలతో; గజగవయ శరభ శోభితమైన సుగ్రీవ సైన్యం వలె ఉంది. నెమళ్ళు, హంసలు, గుడ్లగూబలు, ఏట్రింతలు, తీతువు పక్షులతో; నీలకంఠ హంస కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురమైన నారాయణ స్థానం వలె ఉన్నది. చక్రవాకాలు, కొంగలు, హంసలు, రాబందులు, శకుని పక్షులు, ముంగీసలతో; ఏకచక్ర బకకంక ధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితమైన మహాభారతం వలె ఉంది. మంచి మంచి కాలువలతో; ఉరుతర ప్రవాహమైన సూర్య రథంవలె ఉన్నది. మిక్కిలి జాజిపూలతో; బహు వితత జాతి సౌమనస్యమైన జలదకాల సంధ్యాసమయం వలె ఉన్నది. ఈ విధంగా ఒప్పుతూన్న నైమిశారణ్యంలో శ్రీ విష్ణుక్షేత్రంలో స్వర్గలోకాన్ని చేరుకొని శ్రీహరిని సేవించడం కోసం శౌనకాది మహామునులు వేయి సంవత్సరాలు అనుష్ఠాన కాలంగా ఏర్పాటు చేసుకొని సత్రయాగాన్ని చేయటం మొదలు పెట్టారు. అందులో ఒకరోజున ఉదయమే వారంతా నిత్య నైమిత్తిక హోమాలను ఆచరించారు.

## శౌనకాది ఋషుల ప్రశ్న

క. ఆ తాపసు లిట్లనిరి వి నీతున్, విజ్ఞాన ఫణిత నిఖీల పురాణ

వ్రాతున్, నుత హరి గుణ సం, ఘాతున్, సూతున్, నితాంత కరుణోపేతున్.

40

తా॥ ఆ తాపసులు వినయవంతుడు, విజ్ఞానం చేత ఆకళింపు చేసుకొన్న నిఖీల పురాణాలను పండించుకున్నవాడు, హరి యొక్క గుణములను నుతించేవాడు, అంతం లేని కరుణచే నిండినవాడు అయిన సూతునితో ఇట్లా అన్నారు:

మ. సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులున్ ధర్మ శా

స్త్రములున్ నీవ యుపన్యసింపుదువు వేద వ్యాస ముఖ్యుల్ మునుల్

సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం; దత్ప్రసా

దమున్ జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా!

41

తా॥ "పండితులలో ఉత్తముడైన వాడా! నీవు పురాణాలు, ఇతిహాసాలు, ధర్మశాస్త్రములు చక్కగా ఉపన్యసించగలవు. వేద వ్యాసాది మునిముఖ్యులు ఎన్ని గ్రంథములు చూసారో అవి అన్నీ నీ మనస్సులో ఉన్నాయి. వారి అనుగ్రహం చేత సమస్తము నీకు తెలుసు.

క. గురువులు ప్రియశిష్యులకుం, బరమ రహస్యములు దెలియఁబలుకుదు రచల

స్థిర కల్యాణం బెయ్యది, పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్.

42

తా॥ గురువులు తమ ప్రియశిష్యులకు పరమ రహస్యములను ఎరుక పరుస్తారు. లోకంలో మానవులకు అచలము, స్థిరము, కళ్యాణకారకము అయినది ఏదైతే ఉన్నదో దానిని

మాకు బోధించవలసింది.

క. మన్నాఁడవు చిరకాలము, గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాఁడవు వినఁదగినవి, యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.

43

తా॥ నువ్వు మహానుభావుల సాన్నిధ్యంలో చిరకాలం ఉన్నావు. పెక్కు గ్రంథాలను చూసావు. అనేక విషయాలను విన్నావు. పెద్దల దగ్గర అనేక గోష్ఠీ కార్యక్రమాలలో పాల్గొన్నావు.

చ. అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయజాల రీ
కలియుగమందు మానవులు; గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు? నేమిటం బొడము నాత్మకు శాంతి? మునీంద్ర! చెప్పవే?

44

తా॥ ఈ కలియుగంలో మానవులందరు సోమరులు. మందబుద్ధి కలవారు. అల్పమైన ఆయువు కలవారు. భయంకరమైన రోగాలతో బాధపడే వారు, మందభాగ్యులూను. మంచి పనులు ఏమీ చెయ్యలేరు. ఇట్టి స్థితిలో ఈ కలియుగంలోని మానవులకు ఏమి చేస్తే బాగుంటుంది? ఆత్మశాంతి దేనివలన లభ్యమవుతుంది? మాకు చెప్పండి.

సీ. ఎవ్వని యవతార మెల్ల భూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁజేయు!
నెవ్వని శుభనామ మే ప్రొద్దు నుడువంగ సంసార బంధంబు సమసిపోవు!
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్పంగ భయమంది మృత్యువు పరువువెట్టు!
నెవ్వని పదనది నేపారు జలముల సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ!

తే. దపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి, తెరువుఁ గాంచిరి! వసుదేవదేవకులకు

నెవ్వఁడుదయించె దత్కథలెల్ల వినఁగ, నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత!

45

తా॥ దేవకీవసుదేవులకు పుట్టిన శ్రీకృష్ణుని కథలన్నీ వినాలని చాలా ఉత్సాహంగా ఉన్నాము. ఆ గాథలన్ని మాకు ఎరిగించండి. ఆయన అవతారం ఈ లోకంలో అన్ని ప్రాణులకు సుఖాన్ని వృద్ధిని కలుగ చేస్తుంది. ఆయన పవిత్రనామం ఎవరు విడువకుండ ఉచ్చరిస్తారో వారికి సంసార బంధాలు అన్నీ సమసిపోతాయి. ఆయన చరిత్రను హృదయంలో భావించినంత మాత్రం చేత మృత్యువు భయంతో పారిపోతుంది. ఆయన పాదములలో పుట్టిన నదీజలములను సేవిస్తే నిర్మలత్వం చేకూరుతుంది. తపోధనులు అందరూ ఆయన పాదములను సేవించి శాంతిని పొందుతారు.

క. భూషణములు వాణికి నఘ, పేషణములు మృత్యుచిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి, శేషణములు హరి గుణోపచిత భాషణముల్.

46

తా॥ శ్రీహరి యొక్క గుణములతో కూడిన భాషణములు సరస్వతీ దేవికి అలంకారములు. సకల పాపములను తొలగించేవి. మృత్యుదేవతకు భయాన్ని కలిగించేవి. హృదయములకు సంతోషాన్నిచ్చేవి, కళ్యాణమును చేకూర్చేవి.

క. కలిదోషనివారకమై, యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు, వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా!

47

తా॥ మహాత్మా! కలి దోషాలను నివారిస్తూ, గొప్ప కీర్తిని అందుకొన్న వారు పొగడే హరి యొక్క గుణకీర్తనాన్ని ఎవడు ఆసక్తితో వినకుండా ఉంటాడు?

ఆ. అనఘ! విను రసజ్ఞులై వినువారికి, మాటమాట కధికమధురమైన
యట్టి కృష్ణు కథన మాకర్ణనము సేయఁ, దలఁపు గలదు మాకుఁ దనివి లేదు.

48

తా॥ అనఘా! వినే వాళ్ళ మనస్సులకు మాట మాటకు మధురమైనట్టివి కృష్ణుని కథలు. అట్టి కృష్ణ చరిత్ర వినాలనే కుతూహలం మాకు మిక్కుటంగా ఉంది.

మ. వర గోవింద కథా సుధా రస మహావర్షోరు ధారా పరం
పరలం గాక బుధేంద్ర చంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలం బాఱునే?

49

తా॥ ఓ బుధేంద్రచంద్రా! సూతా! అత్యంత విస్తారమైనది, దాటశక్యం కానిది, అణచలేనిది, అంతము లేనిది, సహింపశక్యము కానిది, అనేక జన్మల నుండి సంప్రాప్తమైనది, గంభీరము, కఠోరమైన కల్మషమనే కార్చిచ్చు భయంకరమైనది. దీన్ని ఆర్పివేయాలంటే శ్రేష్ఠమైన గోవిందుని కథా సుధారసం అనే గొప్ప వర్షధారలు తప్ప వేరే ఉపాయం లేదు.

సీ. హరినామ కథన దావానలజ్వాలచేఁ గాలవే ఘోరాఘ కాననములు! వైకుంఠదర్శన వాయు సంఘంబుచేఁ దొలఁగవే భవదుఃఖ తోయదములు! కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ గూలవే సంతాప కుంజరములు! నారాయణస్మరణ ప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గ తిమిర తతులు!

ఆ. నలిన నయన భక్తినావచేఁ గాక సం, సారజలధి దాఁటి చనఁగ రాదు;
వేయు నేల! మాకు విష్ణు ప్రభావంబుఁ, దెలుపవయ్య సూత! ధీసమేత!.

50

తా॥ ధీమంతుడవైన ఓ సూత మహర్షీ! శ్రీహరి యొక్క సంకీర్తన, శ్రీహరి కథలను వినడమనే దావానలం చేత పాపం అనే అడవులు కాలిపోతాయి. వైకుంఠుని దర్శనమనే వాయువుల చేత దుఃఖమేఘములు తొలగిపోతాయి. కమలనాభుని ధ్యానం అనే సింహము చేత సంతాప కుంజరములు కూలిపోతాయి. నారాయణుని స్మరణం అనే సూర్యకాంతి చేత అరిషడ్వర్గ అంధకారములు నశిస్తాయి. విష్ణువుమీది భక్తి అనే నావ చేత కాక సంసారమనే జలధిని మరే దేనితోనూ దాటలేము. వెయ్యి మాటలెందుకు? మాకు శ్రీమహావిష్ణువు యొక్క మహాత్మ్యాన్ని తెలపండి.

ప్రశాంతమైన ఒక స్థలంలో కూర్చొని, మౌనంగా భగవన్నామాన్ని స్మరిస్తూ ఉండడమే జపం అనబడుతుంది. ఏకాగ్రచిత్తంతో భక్తితో ఎడతెగకుండా నామస్మరణ చేస్తూ ఉంటే చివరకు దివ్య దర్శనాలు కలుగుతాయి. ఈశ్వర సాక్షాత్కారం లభిస్తుంది. పెద్దదూలం ఒకటి గంగాజలంలో మునిగి ఉన్నదనుకుందాం. దాని చివర గొలుసు కట్టి ఆ గొలుసు రెండవ కొనను ఒడ్డున తగిలించారనుకుందాం. ఆ గొలుసు పట్టుకొని ఎక్కాలని ఆనుకుంటూ పోతే నువ్వు ఆ దూలాన్ని చేరగలుగుతావు కదా! అదే విధంగా నువ్వు భగవంతుని నామ స్మరణలో నిమగ్నుడవైతే చివరకు అతడి సాక్షాత్కారం లభిస్తుంది.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. మఱియు గపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులైన పరాక్రమంబులు సేసెనఁట! వాని వివరింపుము, కలియుగంబు రాఁ గలదని వైష్ణవ క్షేత్రంబున దీర్ఘసత్త్ర నిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి. దైవయోగంబున.



తా॥ మానవావతారంలో రహస్యంగా ఉంటూ మాధవుడు బలరామ సహితుడై

మానుషాతీతమైన పనులు చేశాడని విన్నాము. వాటిని వివరించండి. కలియుగం రాబోతున్నదని విని ఈ వైష్ణవక్షేత్రంలో హరికథలు వినవచ్చుకదా అనే నెపంతో సత్రయాగం దీర్ఘకాలం మొదలు పెట్టాం.

క. జలరాశి దాఁటఁ గోరెడి, కలము జనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిం
గలి దోష హరణ వాంఛా, కలితులమగు మేము నిన్నుఁ గంటిమి సూతా!

52

తా॥ పెద్ద జలరాశిని దాటగోరిన వానికి పడవవాడు కనుపించిన విధంగా కలి దోషములను పోగొట్టుకొనాలనే కోరికతో ఉన్న మేము నిన్ను చూసాము మహాత్మా.

క. చారుతర ధర్మరాశికి, భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్
భారకుఁడు లేక యెవ్వనిఁ, జేరును ధర్మంబు బలుపు సెడి మునినాథా!

53

తా॥ ధర్మరాశికి ఆధారంగా ఉండే శ్రీకృష్ణుడు పరమపదాన్ని చేరుకున్న పిదప రక్షకుడు లేక చిక్కి ఈ ధర్మం ఎవరిని చేరుతుందో వివరించండి!

## సూతమహాముని నారాయణకథను ప్రశంసించుట

వ. అని యిట్లు మహనీయ గుణగరిష్ఠులయిన శౌనకాది మునిశ్రేష్ఠు లడిగిన రోమహర్షణ పుత్త్రుండయి యుగ్రశ్రవసుం డనుపేర నొప్పి నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు.

54

తా॥ అని ఈ ప్రకారంగా గొప్పగుణములు కలిగిన శౌనకాది మునులు అడుగగా రోమహర్షణ పుత్రుడయి ఉగ్రశ్రవసుండనే పేరుతో ఒప్పుతూన్న సూతుడు ఇలా ఉపక్రమించాడు:

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో
వ మహాభీతి నొహో కుమార! యనుచున్ వ్యాసుండు సీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

55

తా॥ "సర్వభూతముల యందు సమాన భావంతో ఎవరు సంచరిస్తూ ఉంటాడో, ఎవడు కర్మలను వదిలేసి సన్న్యాసియై ఒక్కడూ వెళ్ళుతూంటే మహా ప్రీతితో "ఓ కుమార!" అంటూ వ్యాసుడు పిలిచినప్పుడు వృక్షములన్నీ తన్మయత్వంతో ప్రతిధ్వనించాయో అటువంటి భూతమయునికి, తపోధనులలో అగ్రేసరునికి, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన శుకమహర్షికి నమస్కరిస్తున్నాను.

సీ. కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మ తత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ దెలియఁజేయగఁ జాలు దీప మగుచు
సకల వేదములకు సారాంశమై యేకమై యసాధారణమగు ప్రభావ

రాజకంబైన పురాణ మర్మంబును గాఢ సంసారాంధకార పటలి

తే. దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప, నే తపోనిధి వివరించె నేర్పడంగ

నట్టి శుకనామధేయు మహాత్మగేయు, విమల విజ్ఞాన రమణీయు వేడ్కఁ గొలుతు.

56

తా॥ కార్యకారణములను కాదని చరించే ఆత్మ తత్త్వం 'అధ్యాత్మం' అనబడుతుంది. అటువంటి అధ్యాత్మమును తెలియచేసే దీపం వంటిది, సకల వేదరాశికి సారాంశమైనట్టిది, ఒక్కటే అయినట్టిది, అసాధారణమైన పురాణ మర్మమును తెలియచెప్పిన శుకునికి నమస్కరిస్తున్నాను. అంతేకాదు.... సంసారమనే అంధకారాన్ని దాటుదామనుకొనే వారికి దయతో వివరించి చెప్పిన విమల విజ్ఞాన రమణీయుడైన శ్రీ శుకమహర్షిని నేను కొలుస్తున్నాను.

క. నారాయణునకు నరునకు, భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ

స్కారము సేసి వచింతు ను, దార గ్రంథంబు దళిత తను బంధంబున్.

57

తా॥ నరనారాయణులకు నమస్కరించి, భారతీ దేవికి మ్రొక్కి, వ్యాస భగవానుని పాదములకు ప్రణామం చేసి చావు పుట్టుకలను తప్పించే ఉత్తమ గ్రంథాన్ని పలుకుతున్నాను."

వ. అని యిట్లు దేవతా గురు నమస్కారంబు సేసి యిట్లనియె 'మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిల లోక మంగళంబయిన ప్రయోజనం బడిగితిరి. ఏమిటం గృష్ణ సంప్రశ్నంబు సేయంబడు నెవ్విధంబున నాత్మ ప్రసన్నంబగు, నిర్విఘ్నయు నిర్హేతుకయునైన హరిభక్తి యేరూపంబునం గలుగు నది పురుషులకుఁ బరధర్మంబగు, వాసుదేవునియందుఁబ్రయోగింపఁబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు. నారాయణ కథవలన నెయ్యే ధర్మంబులు దగులు వడ వవి నిరర్థకంబులు. అపవర్గపర్యంతంబయిన పరధర్మంబునకు దృష్టశ్రుత ప్రపంచార్థంబు ఫలంబు గాదు.

ధర్మంబునం దవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు. విషయభోగంబైన కామంబున కింద్రియ ప్రీతి ఫలంబు గాదు. ఎంత తడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు, తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బదియు నర్థంబు గాదు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబే తత్త్వంబని పలుకుదురు; తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వంబని యెఱుంగుదురు. ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మ యనియు, సాత్త్వతుల చేత భగవంతుం డనియును బలుకంబడు. వేదాంత శ్రవణంబున గ్రహింపంబడి జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందు బరమాత్మం బొడగందురు. ధర్మంబునకు భక్తి ఫలంబు, పురుషులు వర్ణాశ్రమధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి. ఏక చిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపనుం వర్ణింపనుం దగు జక్రాయుధ ధ్యానం బను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు; భగవంతునియందలి శ్రద్ధయు నపవర్గదంబగు. తత్కథాశ్రవణాదులయం దత్యంతాసక్తియుఁ బుణ్య తీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు. కర్మనిర్మూలన హేతువులైన కమలలోచను కథలం దెవ్వండు రతిసేయు, విన నిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి పుట్టింపనేరవు. పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుండు దన కథలు వినువారి హృదయంబులందు నిలిచి శుభంబు లాచరించు; నశుభంబులు పరిహరించు; నశుభంబులు నష్టంబు లయిన, భాగవతశాస్త్రసేవావిశేషంబున నిశ్చల భక్తి యుదయించు; భక్తి గలుగ రజస్తమోగుణ ప్రభూతంబులైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; బ్రసన్న మనస్కుండైన ముక్త సంగుండగు; ముక్త సంగుండైన నీశ్వర తత్త్వజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడిన జిజ్జడ గ్రథన రూపంబైన యహంకారంబు భిన్నంబగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు; సంశయ విచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున.

తా॥ అని దేవతలకు గురువులకు నమస్కారం చేసి సూతుడు శౌనకాదులతో ఇట్లా అన్నాడు: “ఓ మునీంద్రులారా! నన్ను మీరు నిఖీల లోకాలకు మంగళకరమైన ప్రయోజనం గురించి అడిగారు. దేనిని గురించి కృష్ణుని విషయంలో ప్రశ్నలు అడగబడతాయో, దేనివలన ఆత్మ నిర్మలము ప్రసన్నము అవుతుందో, ఎడతెగని హరిభక్తి ఏ విధంగా కలుగుతుందో అదే పురుషులకు పరమార్థ ధర్మం అవుతుంది. వాసుదేవుని యందు భక్తి కుదిరితే అదే వైరాగ్యవిజ్ఞానములను పుట్టిస్తుంది. నారాయణుని కథలలో ఏ ధర్మాలు చెప్పబడవో ఆ ధర్మాలు నిరర్థకాలు. అపవర్గమే ప్రధానమైన పరధర్మానికి ఈ కంటికి కనిపించే ప్రాపంచిక సుఖం లక్ష్యం కాదు. ధర్మం కోసం అర్థాన్ని వినియోగిస్తే దానికి ఫలం కామం కాదు. కామానికి ఇంద్రియ ప్రీతి ఒక్కటే ఫలం కాదు. మనిషి ఎంత కాలం జీవిస్తాడో అంతవరకు కామానికి ఫలం. తత్త్వ జిజ్ఞాస కలవానికి కర్మల వలన లభించే స్వర్గాది ఫలం నిరర్థకం. తత్త్వ జిజ్ఞాస అంటే ధర్మ జిజ్ఞాస అయిన కారణంగా ధర్మమే తత్త్వము అని కొందరు అంటారు. తత్త్వవిదులు జ్ఞానం పేరుతో అద్వయ జ్ఞానమే తత్త్వము అని పిలుస్తారు. ఆ తత్త్వం ఉపనిషత్తులు చదువుకొన్న వారిచేత బ్రహ్మము అనియు, హిరణ్యగర్భవాదుల చేత పరమాత్మ అనియు, సాత్వతుల చేత భగవంతుడు అనియు పిలువబడుతూ ఉన్నది. వేదాంతమును బాగా శ్రవణం చేసి ఆపై జ్ఞానవైరాగ్యములచేత కూడిన భక్తిచేత జ్ఞానులైన పెద్దలు క్షేత్రజ్ఞుడైన ఆత్మయందు పరమాత్మనే చూస్తారు. ధర్మానికి ఫలం భక్తి. మానవుడు పాటించే వర్ణాశ్రమ ధర్మాలకు మాధవుడు సంతోషించుటే సిద్ధి. మరొక ఆలోచన లేకుండా ప్రతి నిత్యము గోవిందుని లీలలను ఆకర్ణించటం, అభివర్ణించటం భక్తునికి తగిన పని. హరిని ధ్యానించటం అనే ఖడ్గం చేత వివేకవంతులు అహంకారం చేత బంధింపబడిన కర్మను త్రుంచివేస్తారు. భగవంతుని మీది శ్రద్ధ, అపవర్గాన్ని ఇచ్చే తత్కథాశ్రవణాదుల యందు ఆసక్తి, పుణ్యతీర్థముల యందు స్నానం పుణ్యపురుషులను సేవించడం వలన సిద్ధిస్తుంది. కర్మను నిర్మూలనం చేసే హరియొక్క కథలను వినుటయందు ఎవడు ఆసక్తి చూపుతాడో వానికి ఇతరుల కథలు రుచించవు. పుణ్య శ్రవణ కీర్తనుడైన కృష్ణుడు

తన కథలు వినేవారి హృదయాల్లో నిలిచి శుభములను ఆచరిస్తాడు. అశుభములను పోగొడతాడు. అవి నష్టం అయితే భగవంతుని శాస్త్రసేవా విశేషముల యందు నిశ్చలమైన భక్తి పుడుతుంది. భక్తి పుట్టేసరికి రజస్తమో గుణముల నుండి పుట్టిన కామ లోభములకు వశంగాక చిత్తం సత్వగుణం చేత ప్రసన్నమవుతుంది. ప్రసన్న మనస్కుడయ్యేసరికి ముక్తికి చేరువ అవుతాడు. ముక్తికి చేరువ అయ్యే సరికి ఈశ్వర తత్త్వజ్ఞానం సిద్ధిస్తుంది. ఈశ్వర సాక్షాత్కారం అయ్యేసరికి అహంకారం పోతుంది. అది పోయేసరికి సమస్త సంశయాలు విచ్ఛిన్నమవుతాయి. సంశయ విచ్ఛేదమయ్యేసరికి సమస్త కర్మలు నిశ్శేషంగా నశిస్తాయి.

క. గురుమతులు తపసు లంతః, కరణంబుల శుద్ధి సేయ ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు, పరమానందమున భిన్నభవబంధనులై.

59

తా॥ బుద్ధిమంతులు, తాపసులు తమ అంతఃకరణాలను శ్రీహరి యందు భక్తితో శుద్ధిచేసుకొని ప్రాపంచిక సుఖాలను పూర్తిగా విడిచిపెట్టి తమను పూర్తిగా భగవంతునికే సమర్పించుకుంటారు.

తరలము.
పరమపూరుషు డొక్కడాఢ్యుఁడు పాలనోద్భవ నాశముల్
సొరిదిఁ జేయు ముకుంద పద్మజ శూలి సంజ్ఞల బ్రాకృత
స్ఫురిత సత్త్వ రజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వ నిరూఢుఁడై.

60

తా॥ ఈ విశ్వానికి పరమపురుషుడు ఒక్కడే! ఆయనే పుట్టించటం, పాలించటం, నాశనం చెయ్యటం అనే పనులు బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే పేర్లతో రజోగుణం సత్వగుణం

తమోగుణంతో చేస్తూ ఉంటాడు. ఆ ముగ్గురిలోను హరి అనంత సత్వగుణ సంపన్నుడై చరాచర కోటికి శుభాలను ఇస్తాడు.

వ. మఱియు నొక్క విశేషంబు గలదు; కాష్ఠంబు కంటె ధూమంబు, ధూమంబు కంటెఁ ద్రయీ మయంబయిన వహ్ని యెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబు కంటె బ్రహ్మప్రకాశంబగు సత్త్వగుణంబు విశిష్టంబగు; తొల్లి మునులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి; కొందఱు సంసారమందలి మేలు కొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయినవారలు ఘోరరూపులయిన భూతపతుల విడిచి దేవతాంతర నింద సేయక శాంతులయి నారాయణ కథల యందే ప్రవర్తింతురు; కొందఱు రాజస తామసులయి సిరియు నైశ్వర్యంబును బ్రజలనుం గోరి పితృభూతప్రజేశాదుల నారాధింతురు. మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపోగతి ధర్మంబులు వాసుదేవ పరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వరుడు గలుగుచు లేకుండుచుఁద్రిగుణంబులతోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజ మాయా విలసితంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞాన విజృంభితుండై వెలుంగు; నగ్ని యొక్కరుండయ్యు బెక్కుమ్రాఁకులందుఁ దేజరిల్లుచు బెక్కండ్రై తోఁచు తెఱంగున విశ్వాత్మకుండైన పురుషుం డొక్కండ తన వలనం గలిగిన నిఖిలభూతంబులందు నంతర్యామి రూపంబున దీపించు; మహాభూత సూక్ష్మేంద్రియంబులతోడంగూడి గుణమయంబు లయిన భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబులందు దగులు వడక తద్గుణంబు లనుభవంబు సేయుచు; లోకకర్తయైన యతండు దేవ తిర్యఙ్మనుష్యాది జాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు నని మఱియు సూతుం డిట్లనియె.



తా॥ ఒక విశేషం ఉంది. కర్రకంటే పొగ, పొగ కంటే అగ్ని ఎట్లా విశేషమో అలాగే

తమోగుణం కంటే రజోగుణము, రజోగుణము కంటే బ్రహ్మ స్వరూపమైన సత్వగుణం విశిష్టమవుతుంది. పూర్వం మునులు సత్వమయుడని, భగవంతుడని హరిని కొలిచారు. కొందరు సంసారంలో వచ్చే మేలు కోసం ఇతరులను సేవిస్తారు. మోక్షం కోరేవారు మాత్రం ఘోరరూపులయిన భూతపతులను విడిచి, ఇతర దేవతలను నిందించకుండా శాంతులై నారాయణ కథలయందు ప్రవర్తిస్తారు. కొందరు మాత్రం రాజస తామస గుణాలతో ఐశ్వర్యాన్ని, సంతానాన్ని కోరి పితృభూతములను ఆరాధిస్తారు. మోక్షకారకుడు కనుక నారాయణుడు ఒక్కడే సేవింప తగినవాడు. వేదములు, యాగములు, యోగములు, క్రియలు, జ్ఞానము, తపస్సు, ధర్మములు.... అన్నీ వాసుదేవ స్వరూపములే.

నిర్గుణుడు అయిన పరమేశ్వరుడు ఒకప్పుడు ఉన్నట్లు, ఒకప్పుడు లేనట్లు ఉంటూ త్రిగుణములతో కూడి తన మాయచేత ఇదంతా సృజించాడు. గుణములు కలిగినవానివలె తన మాయచేత సృజింపబడిన గుణములలో ప్రవేశించి విజ్ఞాన స్వరూపుడై వెలుగుతూ ఉంటాడు. అగ్ని ఒక్కడే అయినప్పటికి అనేకమైన ఎండిన మ్రాకులందు తేజరిల్లుతూ పెక్కురుగా కనుపించినట్లు ఈ విశ్వానికి ఆత్మ, పురుషుడు ఒక్కడే అయినప్పటికీ తన వలన కలిగిన అఖిల భూతముల యందు అంతర్యామి స్వరూపంగా వేరు వేరుగా కనిపిస్తాడు. సూక్ష్మములయిన ఇంద్రియములతోను, గుణమయంబులయిన భావములతోను తన చేత నిర్మితములయిన భూతముల యందు చిక్కుకొనకుండా ఆ గుణములను అనుభవిస్తూ ఉంటాడు. లోకకర్త అయిన అతడు దేవతలు, తిర్యక్కులు, మనుష్యులు మొదలైన జాతుల్లో పుట్టి లోకములను రక్షిస్తూ ఉంటాడు" అని చెప్పి సూతుడింకా ఇలా అన్నాడు:

సీ. మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారు షోడశ కళాసహితుఁ డగుచుఁ
బంచ మహాభూతభాసితుండై శుద్ధ సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ
జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసా శిరములు నానాసహస్రములు వెలుఁగ
నంబర కేయూర హార కుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ

తే. బురుష రూపంబు ధరియించి పరు డనంతుఁ, డఖిల భువనైక వర్తన యత్నమమర
మానితోదార జలరాశి మధ్యమునను, యోగనిద్రా విలాసియై యొప్పుచుండు.

62

తా॥ "మహదహంకారములతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో కూడి పదహారు కళలతో ప్రకాశిస్తూ ఉంటాడు. పంచమహాభూతములతో వెలుగుతూ శుద్ధ సత్వ స్వరూపుడై అందరికంటే అధికుడై ఉంటాడు. చరణములు, ఊరువులు, భుజములు, ముఖములు, శ్రవణములు, అక్షులు, ముక్కులు, శిరములు పెక్కువేలు వెలుగుతూ ఉంటాయి. మేలైన పట్టు వస్త్రాలు, భుజకీర్తులు, హారములు, కుండలములు, కిరీటములు.... పెక్కు వేలు అమరి ఉన్నాయి. వీటితో పురుష రూపాన్ని ధరించి పరుడు అనంతుడు అయిన ఆ హరి జలరాశి మధ్యలో యోగనిద్రా పరవశుడై ఉంటాడు.

## భగవంతుని ఇరువది ఒక్క అవతారముల వర్ణన

వ. అది సకలావతారంబులకు మొదలి గనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబయిన దివ్యరూపంబు; దానిం బరమ యోగీంద్రులు దర్శింతురు; అప్పరమేశ్వరు నాభికమలంబు వలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవ స్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల నద్దేవుండు కౌమారాఖ్యసర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె, రెండవ మాఱు జగజ్జననంబు కొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహదేహంబు దాల్చె; మూఁడవ తోయంబున నారదుండను దేవర్షియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సెప్పె; నాల్గవ పరి ధర్మభార్యా సర్గంబునందు నరనారాయణాభిధానుండై దుష్కరంబైన తపంబు సేసె; బంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండయి యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వగ్రామనిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె; నాఱవ శరీరంబున ననసూయాదేవియందు నత్రిమహామునికిం గుమారుండై యలర్కునికిఁ బ్రహ్లాదముఖ్యులకు నాత్మ విద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుండనఁ బ్రకాశమానుండై యమాది దేవతలం గూడి స్వాయంభువ మన్వంతరంబు రక్షించె; అష్టమ మూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్రముం డనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమ హంస మార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథు చక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె; చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావ నెక్కించి వైవస్వత మనువు నుద్ధరించె; సముద్ర మథన కాలంబునం బదునొకండవ మాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేరుపరియై నిలిపె; ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసుర మథ్యమాన క్షీరపాథోధిమధ్య భాగంబున నమృత కలశహస్తుండై వెడలె; బదుమూఁడవది యయిన మోహినీ వేషంబున నసురుల మోహితులంజేసి సురల నమృతాహారులం

గావించె; బదునాలుగవదియైన నరసింహరూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవదియైన కపట వామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడు లోకంబుల నాక్రమించెఁ; బదునాఱవదియైన భార్గవ రామాకృతినిఁ గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహులయిన రాజుల నిరువది యొక్క మాఱు వధియించి భూమి నిః క్షత్త్రంబుఁ గావించె; బదునేడవదియైన వ్యాసగాత్రంబున నల్పమతులయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱచెఁ; బదునెనిమిదవదైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్ర నిగ్రహాది పరాక్రమంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబులైన రామకృష్ణరూపంబులచే యదువంశంబునందు సంభవించి విశ్వంభరాభారంబు నివారించె; నేకవింశతి తమంబైన బుద్ధనామధేయంబునం గలియుగా ద్యవసరంబున రాక్షస సమ్మోహనంబు కొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి తేజరిల్లు; యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపఁగలండని యిట్లనియె.

63

తా॥ అది సకల అవతారాలకి మొదటిదైన శ్రీమన్నారాయణుని విరాజమానమైన దివ్యరూపం. దానిని పరమ యోగీంద్రులు దర్శిస్తూ ఉంటారు. ఆ మొదటి అవతారం యొక్క నాభికమలం నుండి సృష్టికర్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మ పుట్టాడు. ఆ శ్రీమన్నారాయణ దేవుని అవయవ స్థానాల నుండి అనేక లోకాలు కల్పింపబడ్డాయి. మొదట ఆ దేవుడు కౌమార సర్గాన్ని ఆశ్రయించి బ్రహ్మచర్యాన్ని ఆశ్రయించాడు. రెండవసారి విశ్వసృష్టి నిమిత్తం రసాతలమునకు పోయిన భూమండలాన్ని ఎత్తుతూ వరాహ దేహాన్ని ధరించాడు. మూడవసారి నారదుడనే దేవఋషియై కర్మల నుండి విడుదల అయ్యే వైష్ణవ తంత్రాన్ని చెప్పాడు. నాల్గవసారి నరనారాయణ స్వరూపంలో దుష్కరమైన తపస్సు చేశాడు. పంచమావతారంలో కపిలుడు అనే మహర్షిగా పుట్టి ఆసురి అనే బ్రాహ్మణునికి సాంఖ్యమును ఉపదేశించాడు. ఆరవ శరీరంలో అనసూయాదేవికి, అత్రిమహర్షికి కుమారుడై (దత్తాత్రేయుడు) పుట్టి అలర్కుడు ప్రహ్లాదాది

ముఖ్యులకు ఆత్మ విద్యను ఉపదేశించాడు. ఏడవ అవతారంలో యజ్ఞుడనే పేరుతో ఆకూతికి, రుచికి జన్మించి యమాది దేవతలతో కూడి స్వాయంభువ మన్వంతరాన్ని రక్షించాడు. అష్టమ అవతారంలో మేరుదేవికి, నాభికి జన్మించి ఉరుక్రముడు అనే పేరుతో విద్వాంసులకు పరమహంస మార్గాన్ని ఉపదేశించాడు. తొమ్మిదవ జన్మలో పృథుచక్రవర్తిగా జన్మించి భూమిని గోవుగా చేసి సమస్త వస్తువులను పితికాడు. పదవ అవతారమైన చాక్షుష మన్వంతరంలో మహా మీనావతారాన్ని దాల్చి నావను ఎక్కించి వైవస్వత మనువును ఉద్ధరించాడు. పదునొకండవ అవతారంలో సముద్ర మథన కాలంలో తాబేలుగా మందరాచలాన్ని మోసాడు. పండ్రెండవ అవతారంలో ధన్వంతరియై అమృత కలశాన్ని చేతిలో ధరించి దేవతలకు, రాక్షసులకు మధ్య నిలుచున్నాడు. పదమూడవ అవతారంలో మోహినీ వేషాన్ని ధరించి రాక్షసులను మోహితులను చేసి దేవతలకు అమృతాన్ని పంచి పెట్టాడు. పదునాలుగవది అయిన నరసింహ రూపంలో హిరణ్యకశిపుణ్ణి సంహరించాడు. పదిహేనవ అవతారంలో వామనావతారం ఎత్తి బలిని మూడు అడుగులు యాచించి మూడు లోకాలు ఆక్రమించాడు. పదహారవది అయిన పరశురామావతారంలో బ్రాహ్మణ ద్రోహులయిన రాజులను ఇరవైయొక్క సార్లు వధించి ఈ భూమిమీద క్షత్రియుడు అనేవాడు లేకుండా చేశాడు. పదిహేడవది అయిన వ్యాస అవతారంలో అల్పమతులైన పురుషుల కొరకు వేదవృక్షానికి శాఖలు ఏర్పాటుచేశాడు. పదునెనిమిదవది అయిన శ్రీరామావతారంలో దేవకార్యార్థమై రాజుగా జన్మించి సముద్రాన్ని నిగ్రహించటం ఇత్యాది కార్యాలను ఆచరించాడు. పంతొమ్మిదవది, ఇరవైది అయిన రామకృష్ణ అవతారాలలో యదువంశంలో జన్మించి భూభారాన్ని తొలగించాడు. ఇరవై ఒకటోసారి బుద్ధావతారంలో జన్మించి మధ్య గయా ప్రదేశంలో తేజరిల్లి రాక్షసులను సమ్మోహపరుస్తాడు. ఈ యుగ సంధిలో ఇరవైరెండవ అవతారంలో భూమిని ఏలే వాళ్ళు చోరులై సంచరిస్తూంటే విష్ణుయశుడనే బ్రాహ్మణునికి కల్కి అనే పేరుతో పుట్టి శిక్షిస్తాడు...." అని ఇంకా ఇలా అన్నాడు:

మ. సరసిం బాసిన వేయు కాలువల యోజన్ విష్ణునం దైన శ్రీ
కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్

సురలున్ బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే; దా విష్ణుఁడౌ నేర్పడన్.

64

తా॥ "సరస్సు నుండి అనేక కాలువలు ప్రవహించిన రీతిగా శ్రీమహావిష్ణువు నుండి విశ్వశ్రేయో దాయకమైన అవతారములు అసంఖ్యాకంగా పుట్టుకొస్తూనే ఉంటాయి. అనేక మంది రాజులు, దేవతలు, బ్రాహ్మణులు, మహర్షులు, మునులు... వీరంతా విష్ణువు యొక్క అంశతో జన్మించిన వారే. కృష్ణుడు ఆ హరియే. బలరాముడు కూడా హరి అవతారమే! వారిద్దరికీ భేదం లేదు.

క. భగవంతుం డగు విష్ణుఁడు, జగముల కెవ్వేళ రాక్షస వ్యథ గలుగుం
దగ నవ్వేళల దడయక, యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్.

65

తా॥ ఈ లోకాలకి ఎప్పుడు రాక్షస బాధ కలుగుతుందో ఆ యా వేళల్లో జన్మించి యుగయుగాల్లోను భగవంతుడైన హరి శిష్టులను రక్షిస్తూనే ఉంటాడు.

ఆ. అతిరహస్యమైన హరిజన్మకథనంబు, మనుజుఁ డెవ్వఁడేని మాపు రేపుఁ
జాల భక్తితోడఁ జదివిన సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు.

66

తా॥ అతి రహస్యమైన హరి యొక్క అవతార కథనాన్ని ఏ మానవుడు ఉదయ సాయంకాలాల్లో భక్తితో చదువుతాడో అతనికి సంసారంలో ఎట్టి దుఃఖములు ఉండవు.

వ. వినుం డరూపుండయి చిదాత్మకుండయి పరఁగు జీవునికిం బరమేశ్వరు మాయాగుణంబులైన మహదాదిరూపంబులచేత నాత్మస్థానంబుగా స్థూలశరీరంబు

విరచితంబైన, గగనంబునందుఁ బవనాశ్రిత మేఘ సమూహంబును, గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వంబు బుద్ధిమంతులు గాని వారిచేత నారోపింపంబడు. నీ స్థూల రూపంబు కంటె నదృష్ట గుణంబయి యశ్రుతంబైన వస్తువగుటంజేసి వ్యక్తంబు గాక సూక్ష్మంబై కరచరణాదులు లేక జీవునికి నొండొక రూపంబు విరచితంబై యుండు; సూక్ష్ముఁ డయిన జీవునివలన నుత్క్రాంతి గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీ స్థూల సూక్ష్మరూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపంబడు నపుడు నవిద్యం జేసి యాత్మను గల్పింపంబడు ననియుం దెలియు ననియు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారి యగు; దర్శనంబన జ్ఞానైక స్వరూపంబు విశారదుండైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధి యయిన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుండు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్ని చందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మ స్వరూపంబును బొంది పరమానందంబున విరాజమానుం డగు; నిట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు రని సూతుం డిట్లనియె.

67

తా॥ అసలు జీవునికి రూపం లేదు. అతనెప్పుడూ ఆత్మ స్వరూపుడే. అట్టి జీవునికి పరమేశ్వరుని యొక్క మాయాగుణములైన మహదాది రూపాల చేత ఆత్మస్థానమైన స్థూల శరీరం ఏర్పడింది. ఆకాశంలో గాలిని ఆశ్రయించిన మేఘసమూహము, గాలిలో భూమి యొక్క రజస్సు ఏ రీతియో, ఆ రీతిగానే ద్రష్ట అయిన ఆత్మయందు దృశ్యత్వాన్ని బుద్ధిమంతులు కానివారి చేత ఆరోపింపబడుతూన్నది. కంటికి కనుపించే ఈ స్థూలరూపం కంటే కనిపించనిది, వినిపించనిది, అవ్యక్తమైనది, సూక్ష్మమైనది, కరచరణాదులు లేనిది అయిన మరొక సూక్ష్మరూపం జీవునికి ఉన్నది. సూక్ష్ముడైన ఈ జీవుని గమనాగమనముల వలన పునర్జన్మ ఉన్నట్లు అనిపిస్తుంది. స్వస్వరూప జ్ఞానం వల్ల ఈ స్థూల సూక్ష్మ రూపాలు రెండూ తొలగిపోతాయని, మాయ వల్ల ఇవి ఆత్మకు కల్పింపబడతాయి అని గ్రహించినప్పుడు జీవుడు బ్రహ్మదర్శనానికి

అధికారి అవుతాడు. సమ్యక్ జ్ఞానమే దర్శనం. సర్వజ్ఞుడైన ఈశ్వరునికి లోబడి క్రీడిస్తూ అవిద్య అనబడే మాయ ఉపశమించి తాను విద్యగా పరిణమించినప్పుడు ఉపాధి అయిన స్థూల సూక్ష్మ రూపాలను దహించి జీవుడు కట్టెలు లేకుండా ప్రకాశించే అగ్ని విధంగా తాను బ్రహ్మస్వరూపాన్ని పొంది పరమానందంతో విరాజమానుడవుతాడు. ఈ విధంగా తత్వవేత్తలు చెబుతారు" అని సూతుడు ఇలా అన్నాడు:

చ. జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్తచిత్త వ
ర్తనుఁ డగు చక్రికిం గవు లుదార పదంబులు జన్మకర్ముల్
వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱి లేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మకర్ముల్.

68

తా॥ "భగవంతునికి పుట్టుకలేదు. ఏ కర్మలూ ఆయనను తగులుకోవు. సమస్తమైన జీవుల చిత్తములలోను ఆయన ఉంటాడు. కవులు ఉదారములైన పదములతో ఆయనకు జన్మకర్మలు ఉన్నట్లుగా వర్ణిస్తారు. వేదములలో ఎక్కడా జీవునికి వలె భగవంతునికి జన్మకర్మలు ఉన్నట్లు కనిపించదు.

మ. భువనశ్రేణి నమోఘలీలుఁ డగుచుం బుట్టించు రక్షించు నం
త విధిం జేయు, మునుంగఁ డందు; బహుభూత వ్రాతమం దాత్మ తం
త్రవిహారస్థితుడై షడింద్రియ సమస్త ప్రీతియున్ దవ్వులన్
దివి భంగిం గొనుఁజిక్కఁ; డింద్రియములం ద్రిప్పున్ నిబంధించుచున్.

69

తా॥ నారాయణుడు ఈ సమస్త భువనాలను అమోఘ లీలలతో పుట్టిస్తూ, రక్షిస్తూ అంతం చేస్తూ ఉంటాడు. కాని ఏమీ పట్టించుకోనట్లే ఉంటాడు. బహు భూతముల యందు ఆత్మ

స్వరూపుడై విహరిస్తూ ఉంటాడు. ఇంద్రియాలకు ప్రీతిని సమకూరుస్తూ తాను మాత్రం దేనికీ చిక్కకుండ ఇంద్రియాలను బంధించి తిప్పుతూ ఉంటాడు.

చ. జగదధినాథుఁడైన హరి సంతతలీలలు నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్
మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే ?
యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోఁపునే?

70

తా॥ తనకు మాటలలో ఎంత తార్కిక చాతుర్యం ఉన్నా లోకాధినాథుడైన హరి యొక్క లీలా విలాసములను, నామరూపములను తెలుసుకోవటం చాలా కష్టం. నర్తకి యొక్క అద్భుతమైన నర్తన క్రమాన్ని మూర్ఖుడు తెలుసుకొని కీర్తించలేడు కదా!

ఉ. ఇంచుక మాయ లేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్య పదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరి యుదార మహాద్భుత కర్మమార్గముల్.

71

తా॥ కపట స్వభావం లేకుండా మనస్సులో నిరంతర భక్తితో ఎవరైతే ఆ హరి యొక్క దివ్యమైన పాదాంబుజములను సేవిస్తాడో అతడు బ్రహ్మాదులకు సైతం తెలియని హరి యొక్క లీలావిశేషాలను తెలుసుకుంటాడు.

మ. హరిపాదద్వయభక్తి మీ వలన నిట్లారూఢమై యుండునే
తిరుగం బాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీ దేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్

హరిచింతన్ మిముఁ జెంద వెన్నఁడును జన్మాంత ర్వ్యథాయోగముల్.

72

తా॥ ఓ భూసురులారా! శ్రీహరి యొక్క పాదముల యందు మీకు భక్తి చాలా దృఢంగా ఉంది. ఆయనపై నాటుకున్న మీ హృదయాలు శాశ్వతంగా ఉంటాయి. మీరు మహాధన్యులు. మీకు సమస్తం తెలుసు. నిత్యము హరి యొక్క చింతనలో మీరున్నందువలన జననమరణ సంసార చక్రంలో పడరు.

సీ. పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితంబు బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోక భద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ
జదివించె నింతయు సకల వేదేతిహాసములలోపల నెల్ల సారమైన

ఆ. యీ పురాణమెల్ల నెలమి నా శుకయోగి, గంగ నడుమ నిల్చి ఘన విరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టు డగు పరీ, క్షిన్నరేంద్రుం డడుగఁ జెప్పె వినుండు.

73

తా॥ పుణ్యకీర్తనుడైన భువనేశ్వరుని చరిత్ర ఇది. పరబ్రహ్మతో సమానమైనది. సకల పురాణాలలోను శ్రేష్ఠమైనది. లోకములన్నీ భద్రంగా ఉండేటట్లు ధన్యమయ్యేటట్లు సంతోషంతో భగవంతుడైన వ్యాసభట్టారకుడు ఈ గ్రంథాన్ని చెప్పాడు. శుకుడనే తన కుమారుని చేత చదివించాడు. సకల వేదములలోను ఇతిహాసములలోను సారభూతమైనది ఈ పురాణం. శుకమహర్షి గంగ నడుమ నిల్చొని, పరీక్షిన్మహారాజు విరక్తితో మునులతో కూర్చుని ఉండగా చెప్పాడు.

వ. కృష్ణుఁడు ధర్మజ్ఞానాదులతోడం దన లోకంబునకుఁ జనిన పిమ్మటం గలికాలదోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పు డిప్పురాణంబు కమలబంధుని

భంగి నున్నది. నాఁ డందు భూరితేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలన నేఁ బఠించిన క్రమంబున నా మదికి గోచరించి నంతయు వినిపించెద ననిన సూతునకు మునివరుండయిన శౌనకుం డిట్లనియె.

74

తా॥ కృష్ణ నిర్యాణానంతరం ఆయన చెప్పిన ధర్మములు, జ్ఞానము అడుగంటింది. అటు పిమ్మట కలికాల దోషం వ్యాపించింది. ఆ అంధకారంలో మునిగి ఉన్న జనులకు ఈ పురాణం సూర్యుని వలె వెలుగులు చిమ్ముతూ ఉన్నది. నాడు మహాతేజస్సుతో వెలిగిపోతున్న శుక మహర్షి వలన నేను పఠించిన క్రమంలో నా బుద్ధికి తోచినదంతా మీకు వినిపిస్తాను" అని ఈ ప్రకారంగా సూతుడు అనేసరికి శౌనకుడు ఇట్లా అడిగాడు:

శా. సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠు నే
శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై, శోధించి లోకైక వి ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ? దత్పుత్త్రుఁ డే ప్రీతిన్ రాజున కీ పురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్.

75

తా॥ "ఓ సూత మహర్షీ! మునిశ్రేష్ఠుడైన వ్యాస భగవానుణ్ణి ఎప్పుడు ఎక్కడ ఏ శ్రోతలు కోరితే ఈ భాగవతాన్ని చెప్పాడు? లోకైక విఖ్యాతుడైన వ్యాసుడు ఈ భాగవతాన్ని రచించడంలో కల అంతరార్థం ఏమిటి? ఆయన కుమారుడైన శ్రీశుక మహర్షి ఎట్టి ఆనందంతో పరీక్షిత్తుకి ఈ పురాణ గాథను చెప్పాడు? మాకు అంతా చక్కగా చెప్పు.

వ. బుధేంద్రా! వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం డేకాంతమతి మాయాశయ నంబువలనం దెలిసిన వాఁడు గూఢుండు మూఢుని క్రియ నుండు నిరస్తభేదుం డదియునుం గాక.

తా॥ ఓ బుధేంద్రా! వ్యాస పుత్రుడైన శుకయోగీశ్వరుడు మహాయోగి అని, సమదర్శనుడని, ఏకాంతమును కోరుకునేవాడు అని, మాయాతీతుడని, సర్వజ్ఞుడని, మూఢునివలె కనుపించే గూఢుడు అని, ఎట్టి భేదాలు లేనివాడని విన్నాము.

తరల. శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి తోయములందు ల
జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవ క
న్యకలు హా శుక! యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ!

77

తా॥ చీరలు విడిచి దిగంబరంగా స్నానం చేస్తూన్న దేవతా స్త్రీలు గోచీ కూడపెట్టుకొనకుండ దిగంబరంగా నడచి వెడుతూన్న శుకమహర్షిని చూసి కూడ సిగ్గుపడలేదు. ఇంతలో హా! శుకా! అంటూ వెనకనే వస్తూన్న వ్యాసుల వారిని చూసి సిగ్గుపడి చీరలు కట్టుకున్నారు.

వ. మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవ రమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు నీ పుత్త్రుండు స్త్రీ పురుషులనెడు భేద దృష్టి లేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహాంతరంబు గలదని; రట్టి శుకుండు కురుజాంగలదేశంబులు సొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుండయ్యె? మఱియు నున్మత్తుని క్రియ, మూఁగ తెఱంగున, జడుని భంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజు తోడ సంవాదం బెట్లు సిద్ధించె? కథనీయం బయిన శ్రీభాగవత నిగమవ్యాఖ్యానం బేరీతి సాఁగె? నయ్యోగి ముఖ్యుండు గృహస్థుల

గృహంబుల గోవును బిదికినయంత దడవుగాని నిలువంబడం డతండు గోదోహన మాత్రకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగు నండ్రు; పెద్దకాలం బేక ప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముండైన జనపాలుని జన్మకర్మంబు లే ప్రకారంబులు? వివరింపుము.

78

తా॥ అప్పుడు దిగంబరుడు, వయస్సులో ఉన్నవాడు అయిన తన కొడుకుని చూసి సిగ్గుపడి చీరలు కట్టుకోవటం మానేసి.... వృద్ధుడు, వస్త్రధారియు అయిన తనను చూసి చీరలు కట్టుకున్న దేవకాంతలను ఆ విషయమే అడిగాడు వ్యాసుడు. అప్పుడు వాళ్ళు "నీ పుత్రునికి స్త్రీ పురుష భేదం తెలియదు. పైగా నిర్వికల్పుడు. నీకు అతనికి చాలా తేడా ఉంది" అని పలికారు. అట్టి శుకుడు కురుజాంగల దేశములలోకి ఎలా ప్రవేశించాడు? పౌరజనులు ఎలా తెలుసుకోగలిగారు? ఉన్మత్తునివలెను, మూగవానివలెను, జడునివలెను ఉండే మహాయోగికి రాజర్షి అయిన పరీక్షిన్మహారాజుతో పరిచయం ఎలా కలిగింది? చెప్పవలసిన శ్రీ భాగవత నిగమ వ్యాఖ్యానం ఏ ప్రకారం సాగింది? ఆ పరమ యోగీశ్వరుడు ఆవుపాలు పితికేటంత సేపు కూడా నిలబడడే! అంతసేపు నిలబడిన స్థలములు తీర్థములు అవుతాయి అంటారు పెద్దలు. అట్టిది అన్ని రోజులు ఆయన ఒకే ప్రదేశంలో ఎలా ఉన్నాడు? భాగవతోత్తముడైన పరీక్షిన్మహారాజు యొక్క జన్మ ఆయన యొక్క కర్మ ఎలా నడిచాయి. మాకు వివరించండి.

సీ. పాండవ వంశంబు బలము మానంబును వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ?
బరిపంథిరాజులు భర్మాది ధనములు నర్చింతు రెవ్వని యంఘ్రియుగముఁ?
గుంభజ కర్ణాది కురు భట వ్యూహంబు సొచ్చి చెండాడె నే శూరు తండ్రి?
గాంగేయ సైనికాక్రాంత గోవర్గంబు విడిపించి తెచ్చె నే వీరుతాత?

ఆ. యట్టి గాఢ కీర్తి యగు పరీక్షిన్మహారాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై యసువు లుండ, నేల యడఁగియుండె?

79

తా॥ పాండవుల యొక్క వంశము, బలము, మానము వర్ధిల్లేటట్లుగా ప్రవర్తించాడు పరీక్షిత్తు. శత్రురాజులు అందరూ కూడా బంగారాన్ని రాసులుగా తెచ్చి ఆయన పాదాలను పూజించారు. ద్రోణ కర్ణాది కౌరవ సైన్యాన్ని సొచ్చి చెండాడాడు ఆయన తండ్రి. భీష్ముని చేత రక్షింపబడుతూన్న సైన్యాన్ని చీల్చుకొని వెళ్ళి గోవులను విడిపించుకుని తెచ్చాడు ఆయన తాత. అట్టి కీర్తిమంతుడైన పరీక్షిన్మహారాజు ఎవరూ విడిచిపెట్టలేని రాజ్యలక్ష్మిని పరిహరించి గంగానదిలో ప్రాయోపవిష్టుడై ప్రాణాలతో ఎందుకు ఉండవలసి వచ్చింది?

ఉ. ఉత్తమ కీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం
జిత్తములందు గోరరు హసించియు, లోకుల కెల్ల నర్థ సం
పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు, రన్య రక్షణా
త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో?

80

తా॥ ఉత్తములయిన రాజులు ఎప్పుడూ కూడ లోకులకు అర్థ సంపద, ఐశ్వర్యము, సుఖము, భద్రము ఇవన్నీ కలగాలని కోరుతూ ఉంటారే కానీ వాళ్ళ సుఖాన్ని వాళ్ళు ఎప్పుడూ కోరరు. అట్టిది అన్యులను రక్షించుట యందు ఉత్తమమైన శరీరం విషయంలో పరీక్షిన్మహారాజు ఎందుకంత విరక్తిని పొందాడు?

క. సారముల నెల్ల నెఱుఁగుదు, పారగుఁడవు భాషలందు బహువిధ కథనో
దారుఁడవు మాకు సర్వముఁ, బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా!

81

తా॥ ఓ మహాత్మా! జీవిత సారాన్ని తెలుసుకున్న వాడివి. బహుభాషలలో పండితుడవు. పనికొచ్చే విషయాలను అనేక విధాలుగా కథలుగా చెప్పటంలో నిపుణుడవు. మాకు సర్వము ఆమూలాగ్రము చెప్పవలసింది.”

## వ్యాసుడు వ్యాకులచిత్తుడై చింతించుట

వ. అని యడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ దృతీయంబైన ద్వాపరయుగంబు దీఱు సమయంబున నుపరిచర వసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి విజ్ఞాని యయిన వేదవ్యాసుండు జన్మించి, యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీ జలంబుల స్నానాది కర్మంబులం దీర్చి శుచియై పరులు లేని చోట నొంటి గూర్చుండి సూర్యోదయ వేళ నతీతానాగత వర్తమానజ్ఞుండయిన యా ఋషి వ్యక్తంబు గాని వేగంబు గల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందు. యుగయుగంబుల భౌతిక శరీరంబులకు శక్తి సన్నం బగుఁ, బురుషులు నిస్సత్త్వులు ధైర్యశూన్యులు మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెద రని తన దివ్య దృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి నలువురు హోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులయిన వైదిక కర్మంబులగు యజ్ఞంబు లెడ తెగకుండు కొఱకు నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు నామంబుల విభాగించి యితిహాసపురాణంబు లన్నియుఁ బంచమ వేదంబని పల్కెనందు.

82

తా॥ అని అడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులతో సూతుడు ఇలా అంటున్నాడు: “మూడవ యుగమైన ద్వాపర యుగాంతంలో ఉపరిచర వసువు వీర్యానికి జన్మించిన వాసవి అనబడే సత్యవతి యందు పరాశరునికి నారాయణాంశతో విజ్ఞాని అయిన వేదవ్యాసుడు జన్మించాడు. ఒకనాడు సరస్వతీ నది యందు స్నానాది కర్మలను పూర్తి చేసుకొని బదరికాశ్రమంలో శుచియై ఏకాంత ప్రదేశంలో కూర్చున్నాడు. సూర్యోదయవేళ భూత భవిష్యవర్తమానాదులు తెలిసిన ఆ ఋషి అవ్యక్తమైన కాలవేగానికి యుగధర్మాలు భూమిమీద సాంకర్యం పొందుతాయి అని తెలుసుకున్నాడు. యుగయుగాలలోను భౌతిక శరీరాలకు శక్తి సన్నగిల్లి పురుషులు నిస్సత్త్వులు,

ధైర్యం లేనివారు, మందబుద్ధులు, అల్పాయుష్కులు, బలం లేనివారు గాను అవుతారని తన దివ్యదృష్టిచే తెలుసుకొన్నాడు. సర్వ వర్ణములకు సర్వ ఆశ్రమములకు మేలు చెయ్యాలని నలుగురు హోతల చేత అనుష్ఠించడానికి వీలైన యజ్ఞకర్మలను నాలుగు వేదాలుగా విభాగించి సిద్ధం చేశాడు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము – అని వేదములు నాలుగు. ఇతిహాస పురాణములన్నీ కూడా పంచమ వేదం.

సీ. పైలుండు ఋగ్వేదపఠనంబు దొరఁకొనె సామంబు జైమిని సదువుచుండె,
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ దుది నథర్వము సుమంతుఁడు పఠించె
నఖీల పురాణేతిహాసముల్ మా తండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ
దమతమ వేద మా తపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పిరంత

తే. శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల, కంత బహుమార్గములు చెప్పి యనుమతింపఁ
బెక్కు శాఖలు గలిగి యీ పృథివి లోన, నిగమ మొప్పారె భూసుర నివహమందు.



తా॥ ఋగ్వేదాన్ని పైలుడు, సామవేదాన్ని జైమిని, యజుర్వేదాన్ని వైశంపాయనుడు చిట్టచివరిదైన అధర్వవేదాన్ని సుమంతుడు పఠించారు. పురాణములు, ఇతిహాసములు మా తండ్రిగారైన రోమహర్షణుడు అధ్యయనం చేశాడు. తాము అధ్యయనం చేసిన వేదాన్ని తమ శిష్యులకు చెప్పారు. ఆ శిష్యులు వారి శిష్యులకు.... ఇలా చెప్పుకుంటూపోతే ఈ భూమి మీద వేదరాశి పెక్కు శాఖలతో భూసుర సమూహంలో భాసిల్లింది.

వ. ఇట్లు మేధావిహీనులయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపం బడుచున్నవి. మఱియు దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు గావు. గావున మూఢుల కెల్ల మేలగు నని భారతాఖ్యానంబు చేసియు నమ్ముని భూతహితంబునందు ఁదన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబున నొంటియుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె.

తా॥ ఈ విధంగా మేధావిహీనులైన పురుషుల చేత అట్టి వేదములు ధరింపబడుతూ ఉన్నాయి. మరియు దీనులయందు వాత్సల్య భావంగల వ్యాస భగవానుడు స్త్రీ శూద్రులకు వేదములు పఠించడానికి అర్హత లేదని మూఢులకందరకు మేలు జరుగుతుందనే సత్సంకల్పంతో భారతాన్ని వ్రాశాడు. అయినా ఆయన మనస్సు సంతుష్టి చెందలేదు. సరస్వతీనదీ తీరంలో ఒంటరిగా కూర్చుని తనలో తాను ఇట్లా అనుకున్నాడు:

సీ. వ్రతధారినై వేద వహ్నిగురుశ్రేణి మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడపుదు భారత మిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల
మునుకొని స్త్రీ శూద్రముఖ్యధర్మము లందుఁ దెలిపితి నేఁ జెల్ల దీనఁ జేసి
యాత్మ సంతస మంద దాత్మలో నీశుండు సంతసింపక యున్న జాడ దోఁచె

ఆ. హరికి యోగివరుల కభిలషితంబైన, భాగవత విధంబు బలుకనైతి
మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి, ననుచు వగచుచున్న యవసరమున.



తా॥ 'అనేక వ్రతాలు చేశాను. వేద విభాగం చేశాను. అగ్నులను అర్చించి గురువులను మన్నించాను. వేదవిహిత కర్మములు కొరతపడకుండ నడుపుతున్నాను. వేదార్థభావమంతా భారతంలో చెప్పాను. స్త్రీలకు శూద్రులకు ముఖ్య ధర్మములను అందులో తెలియచేశాను. అయినా నా ఆత్మ ఆనందాన్ని పొందటం లేదు. నా ఆత్మలో ఉన్న ఈశ్వరుడు సంతుష్టుడు కానట్లే తోస్తున్నది. హరికి యోగీశ్వరులకు ఇష్టమైన భాగవతాన్ని నేను వ్రాయలేదు. ఎంత తెలివి తక్కువ పని చేశాను. మరచిపోయాను' అని చాలా బాధ పడ్డాడు... వ్యాసుడు.

## వ్యాసుని వద్దకు నారదుడు వచ్చుట

సీ. తనచేతి వల్లకీతంత్రీ స్వనంబున సతత నారాయణ శబ్ద మొప్ప

నానన సంభూతహరిగీత రవ సుధా ధారల యోగీంద్ర తతులు సొక్కఁ

గపిల జటాభార కాంతిపుంజంబుల దిశలు ప్రభాత దీధితి వహింపఁ

దనులగ్నతులసికా దామగంధంబులు గగనాంతరాళంబుఁ గప్పికొనఁగ

ఆ. వచ్చె మింటనుండి వాసవీ నందను, కడకు మాటలాడఁ గడఁకతోడ

భద్రవిమలకీర్తి పారగుఁ డారూఢ, నయవిశారదుండు నారదుండు.

86

తా॥ ఆ సమయంలో స్వచ్ఛమైన కీర్తికలవాడు, నయ విశారదుడు అయిన నారదుడు ఆకాశ మార్గంలో వ్యాసుని దగ్గరకు వచ్చాడు. ఆయన చేతిలోని వీణ తంత్రీ స్వరంతో కలసి నారాయణ శబ్దం ధ్వనిస్తూ ఉన్నది. ఆయన నోటినుండి వెలువడే హరినామ సంకీర్తనమనే అమృత ధారలచే యోగీంద్రులు పరవశిస్తున్నారు. ఆయన బంగారు రంగు జటాజూట కాంతి పుంజములకు దిక్కులన్నీ ప్రభాత కాంతులతో ప్రకాశిస్తున్నాయి. ఆయన శరీరమంతా వేసుకున్న తులసి మాలల పరిమళం గగన భాగమంతా వ్యాపిస్తూన్నది.

క. కనియెన్ నారదుఁ డంతన్, వినయైక విలాసు; నిగమ విభజన విద్యా

జనితోల్లాసున్; భవదుః, ఖ నిరాసున్; గురుమనోవికాసున్; వ్యాసున్.

87

తా॥ నారద మహర్షి అంత.... వినయశీలుడు, వేదాలను విభాగం చేసినవాడు, దుఃఖాన్ని దూరం చేసినవాడు, మనోవికాసుడు అయిన వ్యాసున్ని చూసాడు.

వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు విధివత్ క్రమంబునం

బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబు తోడ విపంచికాతంత్రి వ్రేల మీటుచు నిట్లనియె.

88

తా॥ ఈ విధంగా తన ఆశ్రమానికి వచ్చిన నారదుణ్ణి చూసి లేచి వ్యాసమహర్షి యథావిధిగా పూజించాడు. అతడు లేతనవ్వు ముఖం మీద ప్రకాశింప తన చేతిలోని వీణను మీటుతూ ఇలా అన్నాడు:

ఉ. ధాతవు! భారతశ్రుతివిధాతవు! వేదపదార్థజాత వి
జ్ఞాతవు! కామముఖ్యరిపుషట్కవిజేతవు! బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు! యోగినేతవు! వినీతుఁడ వీవు చలించి చెల్లరే!
కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి? పరాశరాత్మజా!

89

తా॥ "ఓ పరాశరాత్మజా! నీవు సాక్షాత్తు ఆదిత్యుడవు. పంచమ వేదమైన భారతాన్ని రచించిన వాడివి! వేదార్థమంతా తెలిసిన వాడివి. అరిషడ్వర్గాలను జయించిన వాడివి. బ్రహ్మ తత్త్వాన్ని నిర్ణయించిన వాడివి. యోగ శ్రేష్ఠుడవు. అత్యంత వినయ సంపన్నుడవు! ఇట్టి నీవు ఒక అధీరునివలె బాధపడటానికి కారణం ఏమిటి?"

వ. అనినఁ బారాశర్యుం డిట్లనియె

90

తా॥ అప్పుడు వ్యాస మహర్షి నారదునితో ఇలా అన్నాడు:

క. పుట్టితి వజు తనువునఁ జే, పట్టితివి పురాణపురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది, ముట్టితివి మహాప్రబోధమున మునినాథా!

91

తా॥ “ఓ మునివర్యా! నువ్వు బ్రహ్మగారికి పుట్టావు. పురాణ పురుషుడు అయిన శ్రీమన్నారాయణుని యొక్క నామ సంకీర్తనాన్ని చేపట్టావు. అన్ని దిక్కులూ సంచరించావు. మహా ప్రబోధమే లక్ష్యంగా చేసుకొన్నావు.

వ. అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడు లోకంబులం జరింతువు; వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి.

92

తా॥ అంతే కాకుండా నువ్వు సూర్యునివలె మూడు లోకాల్లోనూ సంచరిస్తావు. వాయువు వలె జనులందరిలోను మెలగుతూ ఉంటావు. నువ్వు అన్ని విషయాలు తెలిసిన వాడివి.

క. నీ కెఱుఁగరాని ధర్మము, లోకములను లేదు బహువిలోకివి నీవున్
నాకొఱఁత యెట్టి దంతయు, నాకున్ వివరింపవయ్య నారద! కరుణన్.

93

తా॥ ఓ నారద మహర్షీ! నీకు తెలియని ధర్మము అంటూ ఏ లోకంలోను లేదు. నువ్వు అనేకం చూసావు. నా అశాంతికి కారణం నీకు తెలియనిది కాదు. ఓ మునివర్యా! కనుక నాకు వివరించండి.

వ. అనిన నారుదుం డిట్లనియె.

94

తా॥ అప్పుడు నారద మహర్షి ఇలా అన్నాడు:

ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి, వందులోన నిం

చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!

95

తా॥ "ఓ వ్యాసమునీంద్రా! లోకంలో పూజింపబడే ధర్మాలన్నిటిని చెప్పావు. అందులో విష్ణు కథలను కొంచెమే చెప్పావు. ధర్మాలు చెప్పితే సరిపోదు... గుణవిశేషాలు కూడా చెప్పాలి. శ్రీమహా విష్ణువును పొగడకపోవటమే నీ అశాంతికి కారణం.

మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ; దయోగ్య దుర్మద నదత్కాకోల గర్తాకృతిన్.

96

తా॥ వ్యాసమునిచంద్రా! శ్రీహరి యొక్క నామాన్ని స్తుతి చేస్తూ చెప్పిన కావ్యం బంగారు కమలాలతో, రమణీయమైన హంసలతో వెలుగొందే మానస సరోవరం వలె శోభిస్తుంది. హరి నామ స్తుతిలేని కావ్యం విచిత్రమైన అర్థాలతో కూడి శ్రీకరమై ఉండదు. అది కాకులు ముక్కుతో పొడిచే ఎంగిలాకుల బురద గుంటలాగ అసహ్యంగా ఉంటుంది.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వ పా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ! చింతింపుమా.

97

తా॥ ఓ తత్వజ్ఞా! వ్యాసా! అపశబ్దాలతో కూడుకొన్నా హరి యొక్క చరిత్రతో కూడిన గ్రంథాలు సర్వపాప పరిత్యాగాన్ని చేస్తాయి. కాబట్టి హరిని భావిస్తూ పాడుతూ జపాలు చేస్తూ వీనులతో వింటూ ఎప్పుడూ కీర్తిస్తూ ఉండే తాపసులు ధన్యులు కదా!

వ. మునీంద్రా! నిర్గతకర్మంబైన నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు, ఫలంబు గోరక కర్మంబీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు; గావున మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకల దిగంత ధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ వర్ణింపుము; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృత రూప నామంబులంజేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావ చందంబున నెలవు సేర నేరదు; కామ్యకర్మంబులందు రాగంబు గల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీవు వగచుట దగ; దది యెట్టు లనిన వార లదియె ధర్మం బని జుగుప్సితంబు లగు కామ్యకర్మంబులు సేయుచు దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున బుద్ధి మోహంబు జనియింపక తత్త్వజ్ఞుండవై వ్యథా వియోగంబు సేయుమని మఱియు నిట్లనియె.

98

తా॥ ఓ వ్యాస మునీంద్రా! కర్మ లేకుండ, ఉపాధి లేకుండ కేవల జ్ఞానం హరి భక్తి లేకపోతే శోభించదు. మనం ఏదైనా కర్మను ఆచరించినప్పుడు ఫలాన్ని కోరనప్పటికీ ఆ కర్మను ఈశ్వరునికి సమర్పణం చేయకపోతే అది ప్రశస్తం కాదు. భక్తి లేని జ్ఞానము, వాక్కు, కర్మ ఇవి నిరర్థకాలు. నువ్వు మహానుభావుడవు. యథార్థ దర్శనుడవు. దిగంతముల వరకు వ్యాపించిన కీర్తి కలవాడివి. సత్యం అంటే ఆసక్తి కలవాడివి. నియమ పరుడవు. నువ్వు అన్ని బంధములు తెగిపోవాలంటే వాసుదేవుని లీలా విశేషాలను భక్తితో వర్ణించు. హరిని వర్ణించక వేరే విధంగా

వేరే అర్థాలు వచ్చేటట్లు ఇతర వర్ణనలు చేసేవాని బుద్ధి పెనుగాలిలో చిక్కుకొని కొట్టుకు పోయే నావవలె రేవుకు చేరదు. కోరికలతో కర్మలను చేసే ప్రాకృత జనులకు ధర్మాలు చెప్పి శాసకుడవయిన నీవు బాధపడటం తగదు. ఎందుకంటే వాళ్ళు అదియే ధర్మం అని భావించి జుగుప్సితాలైన కామ్యకర్మాలు ఆచరిస్తూ తత్వజ్ఞానం మరచిపోతారు. కావున బుద్ధి తప్పుడు మార్గంలో వెళ్ళకుండా వారికి భగవత్తత్వాన్ని బోధించి వారి బాధలు తొలగించు..." అని చెప్పి నారదుడు ఇంకా ఇలా పలికాడు:

చ. ఎఱిఁగెడు వాఁడు కర్మచయ మెల్లను మాని హరి స్వరూపమున్
నెఱయ నెఱింగి యవ్వలన నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగఁ జెప్పవే.

99

తా॥ "ఓ వ్యాస మునీంద్రా! జ్ఞాని అయినవాడు కామ్య కర్మలను మానివేసి హరి యొక్క యథార్థ స్వరూపాన్ని తెలుసుకుని ఆయన గుణములయందు అనురక్తుడు అవుతాడు. అజ్ఞాని వివేకహీనుడై దేహాభిమానం, ధనాభిమానం కలవాడై సంచరిస్తూ ఉంటాడు. తెలియని వానికి తెలిసేటట్లుగా ఈశ్వరలీలల గురించి నువ్వు తెలియచెప్పాలి.

చ. తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
పనివడి సేవ సేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱు మేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా
సినఁ గుల ధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్ !

100

తా॥ ఎవడైనా తన కుల ధర్మాన్ని విడిచి హరి యొక్క పాదారవిందములను

శ్రద్ధాభక్తులతో సేవించి తన లక్ష్యాన్ని చేరుకోకుండా మృతి పొందితే అట్టివాడు ఆ మరుసటి జన్మలోనైనా సిద్ధిని పొందుతాడు. విష్ణుసేవను విడిచి పెట్టినవాడు తన కులధర్మాలను ఎంత గౌరవించినా ఎన్ని జన్మలు ఎత్తినా సిద్ధిపొందదు.

వ. అది గావున నెఱుక గలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖ దుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు; దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు గ్రింద స్థావర పర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు నెయ్యది పొందరా దట్టిమేలు సిద్ధించు కొఱకు హరిసేవ సేయవలయు హరిసేవకుం డగువాఁడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబునఁ జిక్కండు; క్రమ్మఱ హరిచరణస్మరణంబుఁ జేయుచు భక్తి రస వశీకృతుండయి విడువ నిచ్ఛగింపఁడు; మఱియును.

101

తా॥ ఓ వ్యాస మునీంద్రా! ఆ కారణంగా జ్ఞానులైనవారు హరి సేవకు ప్రయత్నం చెయ్యటం మంచిది. ఒకవేళ కాలక్రమంలో కష్టసుఖాలు ప్రాప్తమైనా హరిసేవ మాత్రం విడిచిపెట్టకూడదు. పైన బ్రహ్మలోకం నుండి క్రింద స్థావర లోక పర్యంతము తిరుగుతున్న జీవులకు వారు కనుక హరి సేవకులైతే జన్మ ఎత్తినా ఇతరుల వలె సంసారంలో చిక్కుకోరు. వారు హరి చరణములనే సేవిస్తూ ఎప్పుడూ భక్తి భావంలోనే ఉంటారు.

సీ. విష్ణుండు విశ్వంబు; విష్ణుని కంటెను వేఱేమియును లేదు; విశ్వమునకు భవవృద్ధి లయము లా పరమేశుచే నగు; నీ వెఱుంగుదు గాదె నీ ముఖమున నెఱిఁగింపఁ బడ్డది యేక దేశమున నీ భువన భద్రమునకై పుట్టినట్టి హరికళాజాతుండ వని విచారింపుము; రమణతో హరిపరాక్రమము లెల్ల

ఆ. వినుతిసేయు మీవు వినికియుఁ జదువును, దాన మతుల నయముఁ దపము ధృతియుఁ గలిమి కెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ, గమలనాభుఁ బొగడఁ గలిగెనేని.

తా॥ ఓ మునీంద్రా! ఈ విశ్వమంతా విష్ణు స్వరూపమే. విష్ణువు కంటే వేరే ఏమీ లేదు. ఈ విశ్వమునకు జననము స్థితి లయములు ఆ పరమేశ్వరుని చేతనే జరుగుతూ ఉంటాయి. నువ్వెరుగుదువు కదా! ఒక సందర్భంలో నువ్వే ఒక విషయాన్ని చెప్పావు. ఈ సమస్త లోకములను రక్షించటం కోసం హరి యొక్క కళతో పుట్టిన వాడవు అనే విషయాన్ని గుర్తుంచుకో. నువ్వు హరియొక్క పరాక్రమానికి సంబంధించిన గాథలన్నీ మరచి పోకుండా వినుతించు. మానవుని జ్ఞానానికి, చదువుకు, దానానికి, నయమునకు, తపస్సుకు, ధైర్యానికి, సంపదకు... ప్రయోజనం పుణ్యశ్లోకుడైన శ్రీహరిని స్తుతించటమే!

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము

వ. మహాత్మా! నేను బూర్వకల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం బుట్టి పిన్ననాఁడు వారలచేఁ బంపంబడి యొక్క వానకాలంబున జాతుర్మాస్యంబున నేక స్థలనివాసంబు సేయ నిశ్చయించు యోగిజనులకుం బరిచర్య సేయుచు.

103

తా॥ మహాత్మా! నేను పూర్వ కల్పంలో మొదటి జన్మలో వేదవాదుల ఇంట్లో ఆ ఇంటి దాసికి పుట్టాను. చిన్నప్పుడు వారలచే పంపబడి ఒక వానాకాలంలో చాతుర్మాస్య నిమిత్తం ఒక చోటనే నివాసం ఏర్పాటు చేసుకొన్న ఆ మహానుభావులకు పరిచర్యలు చేస్తూ ఉండేవాడిని.

క. ఓటమితో నెల్లప్పుడుఁ బాటవమునఁ, బనులు సేసి బాలురతో నే
యాటలకుఁ బోక యొక జం, జాటంబును లేక భక్తి సలుపుదు ననఘా!

104

తా॥ ఓ పాపరహితుడా! భయంతో, నేర్పుతో ఎల్లప్పుడూ పనులు చేస్తూ తోటి పిల్లలతో ఆట పాటలకు పోకుండా, ఏ జంజాటమును పెట్టుకోకుండా భక్తితో ఆ మహాత్ములను సేవించేవాడిని.

క. మంగళ మనుచుచు వారల, యెంగిలి భక్షింతు; వాన కెండకు నోడన్
ముంగల నిలుతును నియతిని, వెంగలి క్రియఁ జనుదు నురువివేకము తోడన్.

105

తా॥ శుభం కలుగుతుందని వాళ్ళ ఎంగిలి భక్షిస్తూ, వానకు ఎండకు భయపడకుండా వాళ్ళ ముందరే నిలుస్తూ వివేకంతో పైకి మాత్రం మూఢుని వలె ఉండేవాడిని.

వ. ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి; వారును నాయందుఁ గృపసేసి రంత.

106

తా॥ ఈ విధంగా నేను వారిని వర్షాకాల శరత్కాలాలు సేవించాను. వారు కూడా నామీద అమితమైన కృపను చూపించారు.

శా. వారల్ కృష్ణ చరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగా బాఁడఁగా
నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటం
బ్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభదూరుండనై.

107

తా॥ ఆ యోగిజనులు శ్రీకృష్ణుని యొక్క చరిత్రను చదువుతూ, వర్ణిస్తూ, పాడుతూ ఉండేవారు. ఆ గానం అమృత రస ప్రవాహమై ఎప్పుడూ నా వీనుల విందు చేసేది. నేను పరిపూర్ణంగా సంతోషించి ఇతర పనులు చెయ్యకుండా విష్ణుసేవ మాత్రమే చేస్తూ ఉండేవాడిని.

వ. ఇట్లు హరిసేవారతిం జేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనయిన నాయందు స్థూల సూక్ష్మంబయిన యీ శరీరంబు నిజ మాయాకల్పితంబని యమ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణపరిహారిణి యయిన భక్తి సంభవించె; నంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్ర సేయువారలై; రివ్విధంబున.

108

తా॥ ఈ విధంగా నాకు హరిసేవలో అత్యంత ఆసక్తి ఏర్పడ్డ కారణంగా ప్రపంచానికి అతీతుడను, బ్రహ్మ స్వరూపుడను అయిన నాయందు స్థూలము సూక్ష్మము అయిన ఈ శరీరం మాయాకల్పితమనే విషయం తెలిసింది. ఆ మహాత్ములయిన యోగిజనుల మూలంగా రజస్తమోగుణాలను హరించే భక్తి సంభవించింది. అంత చాతుర్మాస్య వ్రతం పూర్తయ్యేసరికి ఆ

యోగిజనులు యాత్ర చేద్దామని అనుకున్నారు.

మ. అపచారంబులు లేక నిత్యపరిచర్యాభక్తి యుక్తుండనై
చపలత్వంబును మాని గొలువఁగా సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్య సంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదార విజ్ఞానమున్.

109

తా॥ ఈ విధంగా అపచారములు లేకుండా చపలత్వం మాని నిత్యము వారికి పరిచర్య చేసి కొలిచిన కారణంగా వారెంతో సంప్రీతులు అయ్యారు. నిష్కపటంగా దీనులపట్ల ఎంతో వాత్సల్యంతో, కరుణతో ఈ రహస్యమైన ఈశ్వర విజ్ఞానాన్ని వారు ఉపదేశించారు.

వ. ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబుఁ దెలిసితి; నీశ్వరునియందు సమర్పితం బయిన కర్మంబు తాపత్రయంబు మానుప నౌషధంబగు; నే ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్యం బా రోగంబు మానుపనేరదు; ద్రవ్యాంతరంబులచేత నైన చికిత్స మానుప నోపు; ఇవ్విధంబునఁ గర్మంబులు సంసార హేతుకంబు లయ్యు నీశ్వరార్చితంబులై తాము తమ్ముఁ జెఱుపుకొన నోపియుండు; నీశ్వరునియందుఁ జేయంబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై నీశ్వర సంతోషణంబును భక్తి యోగంబునుం బుట్టించు; నీశ్వరశిక్షంజేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణ నామవర్ణన స్మరణంబులు సేయుదురు; ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్ష ణానిరుద్ధమూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబు సేసి మంత్రమూర్తియు మూర్తిశూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుం డగు.

110

తా॥ నేను కూడా వారి ఉపదేశం వల్ల వాసుదేవుని మాయా ప్రభావం తెలుసుకున్నాను.

మనం చేసే కర్మలను ఈశ్వరార్పణం చేస్తే తాపత్రయం నశిస్తుంది. ఏ ద్రవ్యం వలన ఏ రోగం వచ్చిందో అదే ద్రవ్యం ఆ రోగాన్ని మాన్పనేరదు. ఇతర ద్రవ్యముల చేత ఆ రోగం మానుతుంది. అలాగే కర్మలు సంసారానికి కారణమైనా ఆ కర్మలను ఈశ్వరార్పితంగా చేస్తే అప్పుడు అవి బంధించవు. ఈశ్వరార్పణంగా చేసే కర్మలు విజ్ఞానానికి కారణమై ఈశ్వరునికి సంతోష కారణమై చివరికి భక్తి యోగానికి కారణమవుతాయి. ఈశ్వర సంకల్పం వల్ల కర్మలను చేసేవారు కృష్ణుని యొక్క గుణములను, నామమును వర్ణిస్తూ స్మరిస్తూనే ఉంటారు. ఓంకారంతో వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణ అనిరుద్ధ అనే నాలుగు నామములను భక్తితో పలికి నమస్కారం చేసి కేవలం మంత్రమూర్తి అయి రూపం లేని యజ్ఞపురుషుణ్ణి పూజించే పురుషుడు సమ్యగ్దర్శనుడు అవుతాడు.

క. ఏ నివ్విధమునఁ జేయఁగ, దానవకుల వైరి నాకుఁ దనయందలి వి
జ్ఞానము నిచ్చెను మదను, ష్ఠానము నతఁ డెఱుఁగు, నీవు సలుపుము దీనిన్.

111

తా॥ నేను ఆ విధంగా చేసినందువలన శ్రీహరి నాకు విజ్ఞానాన్ని ఇచ్చాడు. నా అనుష్ఠానం అతనికి తెలుసు. నువ్వు కూడా దీనిని ఆచరించు.

క. మునికులములోన మిక్కిలి, వినుకులు గలవాఁడ వీవు; విభుకీర్తులు నీ
వనుదినముఁ బొగడ వినియెడి, జనములకున్ దుఃఖ మెల్ల శాంతిం బొందున్.

112

తా॥ మునులలోకెల్లా చాలా పేరెన్నిక కలవాడవు నీవు. నువ్వు శ్రీహరిని పొగడుతూ ఉంటే వినే జనాలకు దుఃఖం నశించి శాంతి కలుగుతుంది.

వ. ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె.

113

తా॥ ఇలా నారదుడు చెప్పిన అన్ని విషయాలను విని వ్యాసుడు తిరిగి ఇట్లా అన్నాడు:

మ. విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో
యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి సంచారముల్
సనె? నీ కిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ? ద
త్తనువుం బాసిన చంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోన్.

114

తా॥ "ఆ యోగిజనులు నీకు కరుణతో విజ్ఞానాన్ని ఉపదేశించి వెళ్ళిపోయారు కదా! అప్పటి నుండి వృద్ధుడవు అయ్యే పర్యంతము నీ సంచారం ఎలా సాగింది? నీకిప్పుడు పూర్వ కల్పంలో జరిగిన విషయం ఎలా గుర్తుకు వచ్చింది? దాసీ పుత్రుడవు అయిన నువ్వు ఆ శరీరాన్ని ఎట్లా విడిచిపెట్టావు?"

వ. అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె, దాసీ పుత్రుండ నయిన యేను భిక్షుల వలన హరి జ్ఞానంబు గలిగి యున్నంత.

115

తా॥ అని ఈ ప్రకారంగా వ్యాసుడు అడిగేసరికి నారదుడు ఇలా సమాధానం చెప్పాడు: "దాసీ పుత్రుడనయిన నేను భిక్షుల వలన హరి జ్ఞానాన్ని కలిగి ఉన్నానని చెప్పాను కదా!

సీ. మమ్ము నేలినవారి మందిరంబునఁ గల పనులెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి తన పరాధీనతఁ దలఁపదు; సొలసితి నలసితి నాఁకొంటి ననుచు వచ్చి మాపును రేపును మా తల్లి మోహంబు సొంపార ముద్దాడు చుంచు దువ్వు దేహంబు నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు నర్మిలి న న్నిట్టు లరసి మనుప

ఆ. నేను విడిచి పోక యింట నుండితి నయ్య, మోహిఁగాక, యెఱుక మోసపోక

మాఱు చింత లేక మౌనినై యేనేండ్ల, వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు.

116

తా॥ మా తల్లిది చాలా జాలిగుండె. మమ్ము ఏలిన వారి ఇండ్లలో ఉన్న పనులన్నీ భక్తితో చేసేది. ఎప్పుడూ తన పరాధీనతను గురించి ఆలోచించేది కాదు. 'అయ్యో! నా బిడ్డ అలసిపోయాడు! సొలసిపోయాడు! ఆకలితో బాధపడుతున్నాడు' అని అంటూ వచ్చి ఈ వేళ రేపు మా అమ్మ ముద్దాడుతూ జుట్టు దువ్వేది. దేహం అంతా నిమురుతూ సంతోషించేది. ఒక్కసారి కౌగిట్లోకి తీసుకొనేది. ఇంత ప్రేమతో చూసుకొనే మా అమ్మను విడిచిపెట్టి వెళ్ళలేక నేను ఇంట్లోనే ఉండిపోయాను. నేను మోహంలో పడలేదు, మోసపోలేదు, వేరే చింతలేదు. అలా మౌనంగా అయిదేండ్ల ప్రాయం వచ్చేవరకు మా అమ్మ దగ్గరే ఉండిపోయాను.

క. సదనము వెలువడి తెరువునఁ, జెదరక మా తల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుఁకఁగ నొకఫణి, పదభాగముఁ గఱచెఁద్రొక్కఁబడి మునినాథా!

117

తా॥ ఓ వ్యాస మునీంద్రా! ఒకరోజు ఏం జరిగిందంటే అమ్మ రాత్రి చీకటిలో ఇల్లు దాటి ఆవుపాలు పితకడం కోసం బయటికి వెళ్ళింది. చీకట్లో చూసుకోకుండా ఒక పామును త్రొక్కేసరికి అది కాటువేసింది.

క. నీలాయతభోగఫణా, వ్యాళానలవిష మహోగ్రవహ్నిజ్వాలా
మాలావినిపాతితయై, వ్రాలెన్ ననుఁ గన్నతల్లి వసుమతి మీఁదన్.

118

తా॥ భయంకరమైన ఆ త్రాచుపాము కోరలలోని మహా ఉగ్రమైన విషాగ్ని జ్వాలల వల్ల నన్ను కన్నతల్లి నేలమీద పడిపోయింది.

ఉ. తల్లి ధరిత్రిపై నొఱఁగి తల్లడపాటును జెంది చిత్తముం
బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగ కేను నా
యుల్లములోన మోహరుచి నొందక సంగము వాసె మేలు రా
జిల్లె నటంచు విష్ణుపదచింత యొనర్పఁగ బుద్ధిఁ జేర్చుచున్.

119

తా॥ మా అమ్మ నేలమీద పడి గిలగిల తన్నుకొని చిత్తం చలించగా ప్రాణాలు విడిచింది. ఆ దృశ్యాన్ని చూసి నేను ఏమాత్రం తొట్రుపాటు లేకుండా నా మనస్సులో ఏ మాత్రం మోహం లేకుండా నిలబడి 'బంధం తెగిపోయింది' అనుకున్నాను. ఇక నాకు ఆ హరి యొక్క చింతనే కర్తవ్యమని అనుకున్నాను.

వ. ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులుఁ బురంబులు బట్టణంబులు గ్రామంబులుఁ బల్లెలు మందలుఁ గిరాత పుళింద నివాసంబులు నుపవనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబు లయిన పర్వతంబులు సమద కరికర విదళిత శాఖలు గల శాఖలును నివారిత పథిక జనశ్రమాతిరేకంబులైన తటాకంబులు బహువిధ విహంగ నినద మనోహరంబులై వికచారవింద మధుపాన పరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాఁటి చనుచు క్షుత్పిపాసా సమేతుండనై యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి గతశ్రముండనై.

120

తా॥ అలా అనుకొని ఉత్తర దిక్కుగా బయలుదేరి జనపదాలు, పట్టణాలు, గ్రామాలు, పల్లెలు, మందలు, కిరాత పుళింద నివాసాలు, ఉపవనాలు, అనేక చిత్రమైన ధాతువులతో కూడిన పర్వతాలు, మదించిన ఏనుగులు తమ తుండములతో విరుగకొట్టిన కొమ్మలు కల మహా వృక్షాలు, బాటసారుల శ్రమను పోగొట్టే తటాకములు, అనేక రకాల పక్షుల కలకలా రావాలతో మనోహరంబులై వికసించిన తామరపూలలోని మధువును త్రాగి పరవశించి పరిభ్రమించే గండు

తుమ్మెదలు కల అందమైన సరోవరాలు దాటి ముందుకు సాగాను. అప్పుడు నాకు ఆకలి దప్పిక ఎక్కువ కాగా ఒక నదీహ్రదములో స్నానం చేసి శుచినై నీరు త్రాగి శ్రమనంతా పోగొట్టుకున్నాను.

క. సాలావృక కపిభల్లుక, కోలేభ లులాయ శల్య ఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ, వ్యాళాజగరాదిభయద వనమధ్యమునన్.

121

తా॥ తోడేళ్ళు, కోతులు, ఎలుగుబంట్లు, వనవరాహాలు, ఏనుగులు, మహిషాలు, ఏదుపందులు, గుడ్లగూబలు, శరభ మృగాలు, శార్దూలాలు, కుందేళ్ళు, మనుబోతులు, ఖడ్గమృగాలు, క్రూర సర్పాలు, కొండచిలువలు నిండిన భయంకర అరణ్యాల గుండా ప్రయాణించాను.

వ. దుస్తరంబు లైన నీలవేణు కీచక గుల్మ లతా గహ్వరంబుల పొంత నొక్క రావిమ్రాని డగ్గఱఁ గూర్చుండి యే విన్న చందంబున నా హృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి.

122

తా॥ దాటుటకు శక్యంకాని వెదురు, గాలి తాకున మ్రోగెడు వెదురు ఇత్యాది పొదరిండ్లకు దగ్గరగా ఒక రావి చెట్టు దగ్గర కూర్చుని నేను విన్న విధంగా నా హృదయంలో ఉన్న పరమాత్మ అయిన హరిని గురించి చింతించాను.

శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతోఁ దత్పద
ధ్యానారూఢుఁడ నైన నా తలఁపులో నద్దేవుఁడుం దోఁచె నే
నానందాబ్ధిగతుండనై యెఱుఁగ లేనైతిన్ నను న్నీశ్వరున్
నానాశోకహమైన యత్తనువు గానన్ లేక య ట్లంతటన్.

123

తా॥ ఆనందాశ్రువులు నా కన్నుల నుండి కారుతూ ఉండగా పులకించి పోయిన శరీరంతో ఆయన యొక్క పాదకమలములను ధ్యానిస్తున్న నా తలపులో ఆయన దర్శనమిచ్చాడు. నేను ఆనంద సాగరంలో మునిగి నన్ను నేను మరచిపోయాను. కన్నులు తెరచి చూసేసరికి పరమేశ్వర స్వరూపం అదృశ్యమైంది.

వ. లేచి నిలుచుండి క్రమ్మఱ నద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుంబోలెఁ జూచియుం గానలేక నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుండైన హరి గంభీర మధురంబులైన వచనంబుల శోకం బుపశమింపం జేయు చందంబున నిట్లనియె.

124

తా॥ లేచి నిల్చొని పరమేశ్వరుని దివ్య స్వరూపాన్ని చూడాలనే కాంక్షతో హృదయంలో నిలుపుకొని బాధపడుతూ వెతికాను, కాని కానరాలేదు. అంతలో నిర్మానుష్యమైన వనంలో తిరుగుతూన్న నన్ను ఉద్దేశించి వాక్కులకు అగోచరుడైన హరి గంభీరము, మధురము అయిన మాటలతో నా శోకాన్ని ఉపశమింప చేస్తూ ఇట్లా అన్నాడు:

ఉ. ఏల కుమార! శోషిలఁగ? నీజననంబున నన్నుఁ గానఁగా
జాలవు నీవు కామముఖషట్కము నిర్దళితంబు సేసి ని
ర్మూలితకర్ములైన మునిముఖ్యులు గాని కుయోగి గానఁగాఁ
జాలఁడు; నీదు కోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్.

125

తా॥ "కుమారా! నువ్వెందుకు వృథాగా శోషిల్లుతావు. ఈ జన్మలో నన్ను దర్శించలేవు. అరిషడ్వర్గాన్ని జయించి కర్మలను నిర్మూలనం చేసుకొన్న మునిముఖ్యులు తప్ప ఇతరులు నన్ను

చూడలేరు. అయినా నీ మనస్సులోని కోరికను కొనసాగించటం కోసం నా యథార్థ స్వరూపాన్ని చూపించాను.

క. నావలని కోర్కి యూరక, పోవదు; విడిపించు దోషపుంజములను మ
త్సేవం బుట్టును వైళమ, భావింపఁగ నాదు భక్తి బాలక! వింటే.

126

తా॥ ఓ బాలకా! నా మీద పుట్టిన నీ కోరిక వృథాగా పోదు. నాయందు భక్తి నీ దోష సమూహాల నుండి నిన్ను విడిపిస్తుంది.

క. నాయందుఁ గలుగ నీ మది, వాయదు జన్మాంతరముల బాలక! నీ వీ
కాయంబు విడిచి మీఁదట, మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భక్తుఁడవై.

127

తా॥ ఓ బాలకా! జన్మాంతరములలో కూడా నామీది భక్తి పోదు. ఈ జన్మలో ఈ శరీరాన్ని విడిచిపెట్టి నా ఆశీర్వచనంతో మరుసటి జన్మలో నా భక్తుడివై పుడతావు.

మ. విను మీ సృష్టి లయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా
మినియై పోయెడిఁ బోవఁగా గలుగుఁజూ మీఁదం బునః సృష్టి యం
దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు; నిర్దోషుండవై నా కృపన్
ఘనతం జెందెదు శుద్ధ సాత్త్వికులలో గణ్యుండవై యర్భకా!

128

తా॥ ఓ బాలకా! విను. ఈ సృష్టి లయాన్ని పొంది వేయి యుగాల కాలం చీకటి రాత్రిగా గడిచిపోతుంది. పిమ్మట తిరిగి సృష్టి ఏర్పడుతుంది. అప్పుడు నిర్దోషుడవై ప్రసిద్ధ స్మృతితోడ నీవు జన్మిస్తావు. నా కృపతో శుద్ధ సాత్వికులలో లెక్కింప తగిన వాడవుగా ఘనతను పొందుతావు.”

వ. అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి, సర్వనియామకంబైన మహాభూతంబు పలికి యూరకున్న నేను మస్తకంబు వంచి మ్రొక్కి, తత్కరుణకు సంతసించుచు మదంబు దిగనాటి, మచ్చరంబు విడిచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల వెడల నడిచి, సిగ్గు విడిచి, యనంతనామంబులు పఠించుచుఁ, బరమభద్రంబు లయిన తచ్చరిత్రంబులం జింతించుచు, నిరంతర సంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి, నిర్మలాంతఃకరణంబులతోడ విషయ విరక్తుండనై కాలంబున కెదురు సూచుచు భూమిం దిరుగుచు నుండునంతం గొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు దోఁచినం బంచభూతమయంబయి కర్మ స్వరూపంబైన పూర్వదేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధ సత్త్వమయంబైన భాగవతదేహంబు సొచ్చితి; నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాల పయోరాశిమధ్యంబున శయనించు నారాయణమూర్తి యందు నిదురవోవ నిచ్చగించు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతని లోపలం బ్రవేశించితి; నంత సహస్రయుగ పరిమితంబయిన కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మనిశ్వాసంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జన్మించితిమి; అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూఁడు లోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబు లేక యీశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులైన సప్త స్వరంబులు దమయంతన మ్రోయుచున్న యీ వీణాలాపన రతింజేసి నారాయణ కథాగానంబు సేయుచు జరియించుచుందు.

129

తా॥ అని ఆకాశం శరీరంగా ఋగ్వేదం మొదలైనవి నిశ్వాసంగా సర్వాన్ని నియమించే మహాభూతానికి, పలికి ఊరకున్న దానికి.... నేను తలవంచి మ్రొక్కాను. భగవంతుని కరుణకు సంతసించి, మదాన్ని దిగనాడి, మత్సరాన్ని విడిచి, కామాన్ని నిర్జించి, క్రోధాన్ని వర్జించి, లోభాన్ని మోహాన్ని విసర్జించి, సిగ్గును విడిచి ఆ హరి యొక్క అనంత నామాల్ని పఠిస్తూ కూర్చున్నాను. పరమ శుభకరములైన ఆయన చరిత్రనే చింతన చేస్తూ నిరంతరము సంతుష్టాంతరంగుడనై కృష్ణ

భగవానున్ని నా బుద్ధియందు నిలిపి నిర్మలమైన అంతఃకరణతో విషయాల పట్ల పూర్తి వైరాగ్యంతో కాలానికి ఎదురు చూస్తూ ఈ భూమి మీద తిరుగుతూనే ఉన్నాను. కొంతకాలానికి మెరుపు మెరిసినట్టు మృత్యువు వచ్చింది. ఈ పాంచ భౌతికము, కర్మ స్వరూపము అయిన పూర్వ దేహాన్ని విడిచి శ్రీహరి యొక్క కరుణచే శుద్ధ సత్వమయమైన భాగవత దేహంలో ప్రవేశించాను. అంత మూడు లోకాలను సంహరించి ప్రళయకాల జలరాశి మధ్య శయనిస్తూన్న శ్రీమన్నారాయణుని యందు నిద్ర పోవాలనే కోరికతో బ్రహ్మదేవుని నిశ్వాసంతో పాటు నేనూ అతని లోపల ప్రవేశించాను. అంత వెయ్యి యుగముల కాలం గడిచిన తర్వాత లేచి లోకాలు సృష్టించబోయే బ్రహ్మ నిశ్వాసం వలన మరీచి మొదలయిన మునులు, నేను జన్మించాము. అప్పటి నుండి నేను అఖండిత బ్రహ్మచర్యంలో ఉంటూ మహావిష్ణువు అనుగ్రహం చేత ఈశ్వరుని చేత ఇవ్వబడిన సప్తస్వరాలు తమంతతామే పలుకుతున్న ఈ వీణాలాపన రతిచేత మూడులోకాలలోను బహిరంతరాలలో కథాగానం చేస్తూ చరిస్తూ ఉంటాను.

ఆ. తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు, దన చరిత్ర నేను దవిలి పాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి, ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు.

130

తా॥ తీర్థపాదుడైన విష్ణువు ఆయన చరిత్రను నేను గానం చేస్తూంటే పేరుపెట్టి పిలిచినట్లుగా వచ్చి నా మనస్సులో కనిపించేవాడు.

క. విను మీ సంసారం బను, వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడు వానికి వి, ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా!

131

తా॥ ఓ వ్యాస మునీంద్రా! విను! ఈ సంసార సముద్రంలో మునిగి కర్మలలోపడి కొట్టుకుంటూ వేదన పొందే వానికి విష్ణుని గుణ వర్ణన తెప్పవంటిది.

చ. యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామ రో
షముల బ్రచోదితంబ యగు శాంతి వహింపదు విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతి గైకొనిన కైవడి నాదు శరీర జన్మ క
ర్మముల రహస్య మెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరినన్.

132

తా॥ యమ నియమాది యోగ మార్గముల చేత ఆత్మ నియంత్రితమైనా సరే కామ క్రోధాలచేత రెచ్చిపోతూనే ఉంటుంది కానీ శాంతిని పొందదు. వాసుదేవుని సేవచే క్రమంగా శాంతి లభిస్తుంది. ఓ మునికుల భూషణా! నా యొక్క జన్మ కర్మల రహస్యాలన్నీ నువ్వు కోరినట్లుగా చెప్పటం జరిగింది."

వ. అని యిట్లు భగవంతుం డగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని, వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనయె నని సూతుం డిట్లనియె.

133

తా॥ అని ఇట్లా భగవంతుడైన నారద మహర్షి వ్యాస మునీంద్రుణ్ణి వీడ్కొని వీణ వాయించుకుంటూ వెళ్ళిపోయాడు. పిమ్మట సూతుడు శౌనకాదులతో ఇలా అన్నాడు:

క. వాయించు వీణ నెప్పుడు, మ్రోయించు ముకుందగీతముల జగములకుం
జేయించుఁ జెవుల పండువు;, మాయించు నఘాళి నిట్టి మతి మఱి గలఁడే.

134

తా॥ "ఎప్పుడూ వీణను వాయించుకుంటూ ముకుందుని మీద గీతములు పాడుకుంటూ లోకాలకు చెవుల పండుగ చేస్తూ లోకుల పాప సమూహాలను పోగొట్టే నారద మహర్షి వంటి ఋషి ఎక్కడ దొరుకుతాడు."

వ. అని నారదుం గొనియాడిన సూతునిం జూచి నారదు మాటలు విన్న వెనుక భగవంతుండైన బాదరాయణుం డేమి సేసె నని శౌనకుం డడిగిన సూతుం డిట్టనియె; బ్రహ్మ దైవత్య యైన సరస్వతి పడమటి తీరంబున ఋషులకు సత్త్ర కర్మవర్ధనంబై బదరీ తరుషండమండితంబయి "శమ్యాప్రాసం" బనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు గలదు. అందు జలంబుల వార్చి కూర్చుండి వ్యాసుండు దన మది దిరంబు సేసికొని భక్తి యుక్తం బయిన చిత్తంబునం బరిపూర్ణుండయిన యీశ్వరుం గాంచి యీశ్వరాధీన మాయావృతంబైన జీవుని సంసారంబుఁ గని జీవుండు మాయచేత మోహితుండయి గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుండని యభిమానించుచుఁ ద్రిగుణత్వాభిమానంబునం గర్తయు భోక్తయు నను ననర్థంబు నొందు; ననియు నయ్యనర్థంబునకు నారాయణభక్తి యోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదనియు నిశ్చయించి.

135

తా॥ అలా నారదుణ్ణి నుతించిన సూతుణ్ణి చూసి "నారదుని మాటలు విన్న తరువాత భగవంతుడైన వ్యాసమునీంద్రుడు ఏం చేశాడు? చెప్పవలసింది" – అని శౌనకుడు కోరగా సూతుడు ఇట్లా అన్నాడు: "బ్రహ్మదైవత్యమైన సరస్వతీ నది పడమటి తీరంలో ఋషులకు సత్రయాగములు చేసుకోవడానికి వీలుగా బదరీ వృక్షములతో కూడి "శమ్యాప్రాసం" అనే పేరుతో ప్రసిద్ధమైన ఆశ్రమం ఒకటి ఉన్నది. అక్కడ కూర్చొని వ్యాసుడు జలములను వార్చి తన మనస్సును స్థిరం చేసుకుని భక్తితో పూర్ణుడైన ఈశ్వరుణ్ణి చూసాడు. ఈశ్వరుని అధీనంలో ఉంటూ మాయా ప్రభావం వల్ల తాను త్రిగుణాత్మకుడనని అభిమానిస్తూ కర్త అని, భోక్త అని అనేక అనర్థాలు పొందుతూ ఉంటాడు. ఆ అనర్థానికి నారాయణుని మీది భక్తి తప్ప వేరుగా ఉపశమనం లేదు అని నిశ్చయించాడు.

మ. అవనీచక్రములోన నే పురుషుఁ డే యామ్నాయమున్ విన్న మా ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁ జాలు భ క్తి విశేషంబు జనించు నట్టి భువనక్షేమంకరంబైన భా

గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్.

136

తా॥ ఈ భూమండలం మీద ఏ మహా గ్రంథాన్ని విన్న మాత్రం చేతనే లోకానికి ఆధారభూతుడైన మాధవునిపై భక్తి విశేషాలు పుడతాయో అటువంటి భాగవతమనే మహాగ్రంథాన్ని వ్యాస మహర్షి నేర్పుతో వ్రాశాడు.

వ. ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెనని చెప్పిన విని శౌనకుండు నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండును నైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె? ననవుడు సూతుం డిట్లనియె.

137

తా॥ ఈ విధంగా భాగవతాన్ని నిర్మించి మోక్షార్థి అయిన శుక మహర్షిచేత చదివించాడు." ఈ మాటలు విన్న శౌనకుడు, "మోక్షమునందు మాత్రమే ఆసక్తి కలిగి సర్వాన్ని ఉపేక్షించే శుకయోగి భాగవతాన్ని ఎందుకు అభ్యసించాడు?" అని అడిగేసరికి సూతుడు ఇలా అన్నాడు:

క. ధీరులు నిరపేక్షులు నా, త్మారాములునైన మునులు హరిభజనము ని
ష్కారణమ చేయుచుందురు, నారాయణుఁ డట్టి వాఁడ నవ్యచరిత్రా!

138

తా॥ "జితేంద్రియులు, ఏ అపేక్ష లేనివారు, ఆత్మారాములు అయిన మునులు శ్రీహరిని అత్యంత భక్తితో భజిస్తూ ఉంటారు. శ్రీమన్నారాయణుడు సైతం భక్తుల విషయంలో అలానే ఉంటాడు.

ఈ విధమైన స్థితికి చేరుకున్న భక్తులు భగవంతుణ్ణి ఇలా ప్రార్థిస్తారు: "పరమేశ్వరా!

నాకు ఐశ్వర్యం వద్దు, కీర్తి వద్దు, సౌఖ్యం వద్దు, మరేమీ వద్దు; నీ పాదారవిందాల్లో నాకు వినిర్మల భక్తిని అనుగ్రహించు! ఇదే నాకు కావలసింది.”

—శ్రీరామకృష్ణ పరమహంస

క. హరిగుణవర్ణన రతుఁడై, హరితత్పరుఁడైన బాదరాయణి శుభ త
త్పరతం బఠించెఁ ద్రిజగ, ద్వరమంగళమైన భాగవత నిగమంబున్.

139

తా॥ హరి యొక్క గుణములను వర్ణించుట యందు ఆసక్తి కలవాడు, హరియందు ఉత్తమమైన భక్తి కలవాడు అయిన శుకమహర్షి మూడు లోకాలకు మంగళకరమైన ఈ భాగవత సంహితను శుభాలను కోరి పఠించాడు.

క. నిగమములు వేయుఁ జదివిన, సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు, భాగవతమను, నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!

140

తా॥ వేదములు వేయిసార్లు చదివినా ముక్తి లభ్యం కాదు. ఈ భాగవతమనే నిగమాన్ని ఒక్కసారి పఠిస్తే ముక్తి లభిస్తుంది.

## అర్జునుడు పుత్రహంతకుడైన అశ్వత్థామను బంధించి తెచ్చుట

వ. అని పలికి రాజర్షియైన పరీక్షిన్మహారాజు జన్మ కర్మ ముక్తులును, బాండవుల మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెదం; గౌరవధృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గబునకుం జనిన వెనుక భీము గదాఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీ పుత్త్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె. అది క్రూరకర్మంబని లోకులు నిందింతురు.

141

తా॥ రాజర్షి అయిన పరీక్షిన్మహారాజు యొక్క జన్మను, ఆయన చేసిన కర్మలను, ఆయన పొందిన ముక్తిని, పాండవుల మహా ప్రస్థానాన్ని, కృష్ణుని యొక్క కథను నీకు వివరిస్తాను. కురుపాండవ సంగ్రామంలో వీరులైన వాళ్ళు స్వర్గానికి వెళ్ళారు. భీముని గదాఘాతానికి ధుర్యోధనుడు తొడలు విరిగి కూలిపోయాడు. అప్పుడు అశ్వత్థామ ధుర్యోధనునికి సంతోషాన్ని కలిగించటం కోసం నిదురపోతున్న ద్రౌపది యొక్క పుత్రుల శిరస్సులను ఖండించి తెచ్చి సమర్పించాడు. ఇది చాలా క్రూరమైన కర్మ అని లోకులు అతనిని నిందించారు.

ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి, యోరువం
జాలక బాష్పతోయ కణజాలము చెక్కుల రాల నేడ్చి, పాం
చాలతనూజ నేలఁబడి జాలిఁ బడం గని, యెత్తి మంజు వా
చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్.

142

తా॥ తాను కన్న కుమారులందరినీ అశ్వత్థామ చంపేశాడు అనే విషయం ద్రౌపది చెవిన పడింది. ఓర్వలేక కన్నుల నీరు చెక్కులమీద పడి కాలువలు కట్టగా ఏడ్చి నేలమీద పడి

దొర్లుతూంటే అర్జునుడు మృదువుగా ద్రౌపదిని ఓదారుస్తూ శిరోజాలు దువ్వుతూ ఇట్లా అన్నాడు:

మ. ధరణీశాత్మజ వీవు నీకు వగవన్ ధర్మంబె? యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల మద్గాండీవ నిర్ముక్త భీ
కర బాణంబుల నేఁడు వాని శిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడు మిచటన్ శీతాంశుబింబాననా!

143

తా॥ "ఓ ద్రౌపదీ! క్షత్రియ కులంలో పుట్టిన దానివి. నీకు శోకించటం తగదు. ఆ ద్రోణపుత్రుడైన అశ్వత్థామ కరుణ లేకుండా బాలురను చంపాడు. నా గాండీవం నుండి విడిచిపెట్టిన భయంకరమైన బాణాలచేత వాని శిరస్సును ఖండించి తీసుకువస్తాను. వాని శిరస్సును కాళ్ళతో త్రొక్కి ఇక్కడ నువ్వు జలకములాడు."

వ. అని యిట్లొడంబఱచి తనకు మిత్త్రుండును సారథియునైన హరి మేలనుచుండం గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని వెంట రథంబు దోలించిన.

144

తా॥ అని ద్రౌపదీ దేవిని ఓదార్చి తనకు మిత్రుడు, సారథి అయిన హరి 'మేలు మేలు' అంటూ ఉండగా కవచం తొడుక్కున్నాడు. గాండీవాన్ని ధరించి కపిధ్వజుడై అశ్వత్థామ వెనకాలే అతన్ని వెతుకుతూ రథాన్ని తోలించాడు.

శా. తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి తద్ద్రౌణి యా
పన్నుండై శిశుహంత గావున నిజ ప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా
సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్.

145

తా॥ తనను చంపుతానంటూ వస్తూన్న విజయుణ్ణి చూసి శిశుహంతకుడు అయిన అశ్వత్థామ విపత్తులో చిక్కుకొన్నవాడై ప్రాణాలు కాపాడుకోవటం కోసం వడివడిగా పరుగెత్తాడు. పూర్వం బ్రహ్మ తన కుమార్తెను మోహించి క్రీడిద్దామని అనుకొంటూ ఉండగానే అతణ్ణి చూసి లేడి రూపంలో పరుగెత్తినట్లుగా కాలికొద్ది పరుగెత్తాడు.

వ. ఇట్లోపినంత దూరంబు బరువిడి వెనుకఁ జూచి రథతురగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి, జలంబుల వార్చి, ద్రోణనందనుండు సమాహిత చిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణ సంరక్షణార్థంబు పార్థునిమీద బ్రహ్మ శిరో నామ కాస్త్రంబుం బ్రయోగించిన నది ప్రచండ తేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణి భయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె.

146

తా॥ ఇట్లా కాళ్ళల్లో సత్తువ ఉన్నంత దూరం పరుగెత్తి అశ్వత్థామ వెనుకకు తిరిగి చూసి పార్థుని రథతురగాలు అలసిపోయాయి అనే విషయం తెలుసుకొన్నాడు. ఇక తన ప్రాణాలను రక్షించుకోవడానికి వేరే ఉపాయం లేదని నిశ్చయించుకొని ఆచమనం చేసి సమాధిలో కూర్చుని ప్రయోగమే తప్ప ఉపసంహారం తెలియని బ్రహ్మశిరోనామక అస్త్రాన్ని కేవలం తన ప్రాణాలను రక్షించుకోవడానికి పార్థుని మీద ప్రయోగించాడు. అది ప్రచండ తేజంతో దిక్కులంతా నిండి సర్వప్రాణులకు భయంకరమైనదిగా చూసి అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లా అన్నాడు:

సీ. పద్మలోచన! కృష్ణ! భక్తాభయప్రద! వినుము సంసారాగ్ని వేఁగుచున్న జనుల సంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతికి నవ్వలి ప్రభుఁడ వాద్య పురుషుండవగు నీవు బోధముచే మాయ

నడతువు నిశ్శ్రేయసాత్మయందు

ఆ. మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప, సేసి ధర్మముఖ్యచిహ్నమయిన
శుభముసేయు దీవు సుజనుల నవనిలోఁ, గావఁ బుట్టుదువు జగన్నివాస!

147

తా॥ "ఓ పద్మలోచనా! కృష్ణా! భక్త అభయప్రద! విను. సంసారాగ్నిలో పడి వేగుతున్న జనుల సంసారాన్ని తొలగించాలంటే నీవు తప్ప అన్యులు లేరు. నీవు సాక్షాత్తు సర్వేశ్వరుడవు! ప్రకృతికి అవతలివాడవు. ప్రభుడవు, ఆద్యుడవు, పరమ పురుషుడవు. నీవు నీ బోధచేత మాయను తొలగిస్తావు. మాయలో మునిగిపోతున్న వారికి ధర్మసమ్మతమైన శుభములను అనుగ్రహిస్తావు. ఓ జగన్నివాస! శిష్టులను రక్షించడం కోసమే నువ్వు ఈ భూమిమీద పుడతావు.

క. ఇది యొక తేజము భూమియుఁ, జదలును దిక్కులును నిండి సర్వంకషమై
యెదురై వచ్చుచు నున్నది, విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా!

148

తా॥ దేవాదిదేవా! ఇది ఒక బ్రహ్మాండమైన తేజస్సు భూమి, ఆకాశము, దిక్కులు నిండి ఎదురుగా వస్తూన్నది. అదేమిటో నాకు తెలియచెప్ప వలసింది."

వ. అనిన హరి యిట్లనియె.

149

తా॥ అప్పుడు హరి ఇట్లా అన్నాడు:

శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై
బ్రహ్మాస్త్రం బదె యేసె; వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్స! నీ
బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు; సంహార మీ

బ్రహ్మాపత్య మెఱుంగఁ డేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై.

150

తా॥ "ఓ అర్జునా! దుశ్శీలుడైనట్టి అశ్వత్థామ ప్రాణాలు కాపాడుకోవటం కోసం ప్రయోగించిన బ్రహ్మాస్త్రం ఇది. మహా భయంకరంగా వస్తూన్నది దాని బాణాగ్ని. నీ బ్రహ్మాస్త్ర ప్రయోగం వల్లగాని దీనిని మరలించటం కుదరదు. దీని ఉపసంహారం అశ్వత్థామకు తెలియదు. నీ బ్రహ్మాస్త్రమును దీనిపై ప్రయోగించు."

వ. అనిన నర్జునుండు జలంబుల వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబు మీదఁ దన బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన.

151

తా॥ అని కృష్ణుడు అనేసరికి అర్జునుడు జలాలను ఆచమించి వార్చి హరికి ప్రదక్షిణం చేసి అశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రం మీద తన బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

మ. అవని వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్
రవి వహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబు గావింపఁగా
వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప నా వేళ మా
ధవు నాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్.

152

తా॥ భూమ్యాకాశాలు నిండి ఆ రెండు అస్త్రాలు ఇద్దరు సూర్యులవలె రెండు అగ్నిహోత్రాలు లాగ ఒకదానితో ఒకటి పోరాడుతున్నాయి. మూడు లోకాలకు భయాన్ని పుట్టించాయి. యుగానికి అంత్యకాలం వచ్చిందేమో అని వశం తప్పి ప్రజలు వీక్షిస్తున్నారు. అట్టి సమయంలో మాధవుని ఆజ్ఞను అనుసరించి అర్జునుడు ఆ రెండు అస్త్రములను ఉపసంహరించాడు.

వ. ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి, ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి తఱిమి పట్టుకొని, రోషారుణిత లోచనుండై యాజ్ఞికుండు రజ్జువునం బశువుఁ గట్టిన చందంబున బంధించి శిబిరంబు కడకుం గొని చని హింసింతునని తిగిచినం జూచి హరి యిట్లనియె.

153

తా॥ ఈ విధంగా రెండు అస్త్రాలను ఉపసంహారం చేసి ధనంజయుడు అశ్వత్థామను వెన్నాడి పట్టుకొన్నాడు. కోపంతో ఎర్రబారిన కన్నులు కలవాడై యజ్ఞం చేసే సోమయాజి త్రాడుతో పశువును కట్టిన విధంగా బంధించి తానుండే శిబిరం దగ్గరకు తీసుకొని వచ్చాడు. వీడిని చంపేస్తాను అని అంటూన్న అర్జునునితో కృష్ణుడు ఇలా అన్నాడు:

ఉ. మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్న పాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై,
పాఱుఁడు వీఁడు పాతకుఁడు, ప్రాణభయంబున వెచ్చ నూర్చుచుం
బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున! పాపవర్జనా!

154

తా॥ “అర్జునా! నిద్రిస్తూన్న అసమర్థులను అస్త్రవిద్యలో ఏమీ రాని వాళ్ళని పిన్న పాపలను నిశీధిలో పట్టుకుని క్రూరుడై వధించాడు. పాతకుడు వీడు. ప్రాణ భయం చేత ఆయాసపడుతూ పారిపోతున్నాడు. కనికరించు.

చ. వెఱచిన వాని, దైన్యమున వేఁదుఱు నొందినవాని, నిద్ర మై
మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావిన వాని, భగ్నుడై
పఱచిన వాని, సాధు జడభావము వానిని, గావు మంచు వా
చఱచిన వానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా!

155

తా॥ ఫల్గునా! భయపడిన వాడిని, దైన్యం చేత మతి భ్రమించిన వానిని, శరీర స్పృహ లేకుండా నిద్రపోతున్నవానిని, మద్యపానం చేసి మైమరచిన వానిని, పరాజితుడైన వానిని, సాధు భావంలో గాని జడభావంలో గాని ఉన్న వానిని, రక్షించమని ప్రార్థిస్తున్నవానిని, స్త్రీలను చంపటం ధర్మం కాదు.

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు సాలించి య
న్య ప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోక దుః
ఖప్రాప్తుండగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ
విప్రుం దండితుఁ జేయ నేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్.

156

తా॥ ఎవడు తన ప్రాణాలు రక్షించుకోవటం కోసం కరుణ లేకుండ ఇతరుల ప్రాణాలు తీస్తాడో వాడు అధోలోకములకు పోతాడు. అక్కడ దుఃఖాలను అనుభవిస్తాడు. అయితే అట్టి వానికి రాజదండం వల్ల పాపం నశించి కల్యాణం చేకూరుతుంది. కాని భయభ్రాంతుడైన ఈ అశ్వత్థామను కఠినంగా దండించకు."

వ. అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు కృతాపరాధుండయ్యు వధ్యుండు గాఁడను ధర్మంబు దలంచి చంపక ద్రుపదరాజుపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి, బద్ధుండైన గురు నందనుం దోడ్కొని, కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి.

157

తా॥ అని ఈ ప్రకారంగా కృష్ణుడు ఆనతిచ్చాడు. బ్రాహ్మణుడు అపరాధం చేసినా వాడిని చంపకూడదు అనే ధర్మాన్ని పాటించి అశ్వత్థామను చంపలేదు. ద్రౌపదికి తాను చేసిన ప్రతిజ్ఞను తలచి పట్టుబడిన గురునందనున్ని తీసుకొని కృష్ణుడు రథం నడపుతూంటే శిబిరం దగ్గరకు

వచ్చాడు అర్జునుడు.

క. సురరాజసుతుఁడు చూపెను, దురవధి సుతశోకయుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగ శ్రేణిం, బరుష మహాపాశ బద్ధపాణిన్ ద్రౌణిన్.

158

తా॥ దృఢంగా తాళ్ళతో కాళ్ళూ చేతులు బిగింపబడి అవయవములన్నీ వణుకుతూన్న అశ్వత్థామను విజయుడు పుత్రశోకంతో బాధపడుతూన్న ద్రౌపది ముందు తెచ్చి పడేశాడు.

## ద్రౌపది అశ్వత్థామపై జాలి చూపి విడిచిపెట్టుట

వ. ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధ జనితలజ్జా పరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె.

159

తా॥ ఇట్లు అర్జునుడు తెచ్చి చూపిన బాలురను చంపిన సిగ్గుచేత తలవంచుకున్న అశ్వత్థామను చూసి మ్రొక్కి బుద్ధిమంతురాలు అయిన ద్రౌపది ఇలా అన్నది:

మ. పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోప సం
హరణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్త్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపగాఁ బాడియే?

160

తా॥ "పూర్వం మా మగవాళ్ళు అందరు బాణములను ప్రయోగ ఉపసంహరణాది ఆయుధ విద్యలు అన్నింటిని ద్రోణాచార్యుల దగ్గర అభ్యసించారు. నువ్వు పుత్రాకృతిలో ఉన్న ద్రోణుడవు. నీ మనస్సులో లేశం కూడా కరుణ లేకుండా శిష్యసుతులను చంపేశావే! ఇదేం న్యాయమయ్యా!

క. భూసురుఁడవు, బుద్ధిదయా, భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా
గ్రేసరుఁడవు, శిశుమారణ, మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

161

తా॥ బ్రాహ్మణుడుగా జన్మించావే! బుద్ధి చేతను దయ చేతను ప్రకాశిస్తున్నావే! వీరాధివీరులలో అగ్రగణ్యుడవే! బాలుర ప్రాణాలు తియ్యటం అసుర కృత్యం కదా తండ్రీ! ఇది

నీకు ధర్మమా?

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై, యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ బిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా; నీ చేతు లెట్లాడెనో?

162

తా॥ నీ మీదికి వాళ్ళేమీ ఉద్రేకంతో రాలేదే. నీతో యుద్ధానికి రాలేదు. నీకు ఎంతమాత్రం ద్రోహం చెయ్యలేదే! కేవలం చీకట్లో భద్రంగా నిద్రపోతున్న వారిని, చిన్న పాపలను, యుద్ధ విద్యలోకి ఇంకా అడుగుపెట్టని వారిని, నిద్రాసక్తులను కేవలం బలం ఉందనే అతిశయంతో సంహరించడానికి నీకు చేతులు ఎట్లా వచ్చాయయ్యా!

ఉ. అక్కట! పుత్ర శోక జనితాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నే
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయ మాత, నేఁ
డెక్కడ నిట్టి శోకమున నే క్రియ నేడ్చుచుఁ బొక్కుచున్న దో?

163

తా॥ అయ్యో! పుత్ర శోకం చేత నేను విషాదం నిండుకున్న మనస్సుతో ఎలా బాధపడుతున్నానో అలాగే మీ అమ్మ నిన్నిక్కడికి కిరీటి ఈడ్చి తెచ్చాడనే విషయం విని శోకంతో ఎలా ఏడుస్తూన్నదో కదా!”

వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె.

164

తా॥ అని కృష్ణార్జునులతో ద్రౌపది ఇట్లా అన్నది:

ఉ. ద్రోణునితోఁ శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట న
క్షీణతనూజ శోకవివశీకృతనై విలపించుభంగి, నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో!
ప్రాణ వియుక్తుఁడైన నతి పాపము; బ్రాహ్మణహింస మానరే.

165

తా॥ "ద్రోణాచార్యుల వారితో అగ్నిలోపడి సహగమనం చెయ్యకుండా ఆయన ఇల్లాలు ఇంట్లోనే బ్రతికి ఉన్నది. పుత్రులను పోగొట్టుకుని నేను శోకంతో బాధపడుతున్నట్లే ఈ అశ్వత్థామను ఇక్కడకు తెచ్చారనే విషయం విని ఆవిడ ఎంత బాధపడుతూన్నదో. ఇతనికి ప్రాణంపోతే మహాపాపం. బ్రాహ్మణ హింసను మానెయ్యండి!

క. భూపాలకులకు విప్రులఁ, గోపింపం జేయఁదగదు; కోపించిన ద
త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్.

166

తా॥ భూమిని పాలించే రాజులు విప్రులకు ఆగ్రహాన్ని తెప్పించకూడదు. ఒకవేళ వాళ్ళకి కోపం వస్తే ఆ కోపాగ్నికి భూపతుల వంశాలు భూకంపం వచ్చినట్లు నాశనం అవుతాయి."

వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసమును శ్లాఘ్యంబును గాఁబలుకు ద్రౌపది పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి; సమ్మతింపక భీముం డిట్లనియె.

167

తా॥ ఈ విధంగా ద్రౌపది ధర్మసమ్మతంగా, కరుణ సమ్మతంగా, నిష్కపటంగా,

సమంజసంగా, శ్లాఘనీయంగా పలికిన పలుకులు విని ధర్మరాజు సంతోషించాడు. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు అంగీకరించారు. భీముడు మాత్రం సమ్మతించక ఇలా అన్నాడు:

చ. కొడుకులఁ బట్టి చంపె నని కోపము నొందదు భాలఘాతకున్
విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది; వీడు విప్రుఁడే?
విడువఁగ నేల? చంపుఁడిటు వీనిని మీరలు సంప రేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్.

168

తా॥ "కొడుకులను పట్టి చంపాడని కోపం రాకపోగా బాలఘాతకుణ్ణి విడిచిపెట్ట మంటుందేమిటి ఈ వెర్రి ద్రౌపది. వీడు బ్రాహ్మణుడా? వీడిని విడిచిపెట్టడం కుదరదు. చంపండి. మీరు కనుక చంపకపోతే నా పిడికిటి పోటుతో వీడి శిరస్సును మీరందరూ చూస్తూండగా భిన్నం చేస్తాను."

వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె; భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండయి రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు భీమున కిట్లనియె.

169

తా॥ అని అనేసరికి అశ్వత్థామకు ద్రౌపది అడ్డం వచ్చింది. భీముని వేగిరపాటు చూసి కృష్ణుడు చతుర్భుజుడై రెండు చేతులు సాచి భీముడిని వారించాడు. మిగతా రెండు చేతులతోను పాంచాలిని తొలగించి నవ్వుతూ భీమునితో ఇట్లా అన్నాడు:

ఉ. అవ్వడు గాఁడు వీఁడు శిశుహంత, దురాత్మకుఁ డాతతాయి హం
తవ్యుఁడు బ్రహ్మబంధుఁడగుఁ దప్పదు నిక్కము 'బ్రాహ్మణో న హ

న్తవ్య' యటంచు వేదవిదితం బగుఁ గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీని గాఁచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా!

170

తా॥ "ఈ అశ్వత్థామ.... వీడు శిశుహంతకుడు, దురాత్ముడు, ఆకతాయి, చంపతగిన వాడూను. కానీ 'బ్రాహ్మణుని చంపకూడదు' – అని వేదం అంటూన్నది. వేద ధర్మాన్ని దృష్టిలో ఉంచుకొని వీనిని రక్షించటం తక్షణ కర్తవ్యం. యథార్థాన్ని నువ్వే ఆలోచించు..." అన్నాడు.

వ. అని సరసాలాపంబు లాడి పవననందను నొడంబఱిచి యర్జునుంజూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపుసేయుమని, నారాయణుం డానతిచ్చిన నర్జుండును నారాయణానుమతంబున.

171

తా॥ ఈ విధంగా ధర్మాన్ని తెలియపరచి భీముణ్ణి ఒప్పుకునేటట్లుగా చేసి అర్జునునితో ఇట్లా అన్నాడు: "ద్రౌపదికి, నాకు, భీమసేనునికి ఇష్టమయ్యేటట్లుగా ఇంతకుముందు నువ్వు చేసిన ప్రతిజ్ఞ సిద్ధించేటట్లు నేను చెప్పినట్లు చేయుమ" ని నారాయణుడు ఆనతిచ్చాడు.

శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసి పోన్.

172

తా॥ లోకం చేత కొనియాడబడేవాడు, ఇంద్రుని కుమారుడు మహావీరుడు అయిన అర్జునుడు తన భయంకరమైన కత్తిచేత అశ్వత్థామ శిరోజములను ఖండించాడు. లోపల మెరుస్తూన్న మహారత్నాన్ని తనకీర్తి వెలుగునట్లుగా తీసుకొని కట్టిన త్రాళ్ళన్నీ విప్పి తన

శిబిరంలోంచి బయటకు పంపేశాడు.

క. నిబ్బరపు బాలహంతయు, గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై
ప్రబ్బిన వగచే విప్రుఁడు, సిబ్బితితో నొడలి గబ్బు సెడి వడిఁ జనియెన్.

173

తా॥ నిర్భయంగా బాలురను చంపిన ఆ హంతకుడైన అశ్వత్థామ తన మణిని, తన తేజస్సును కోల్పోయి పాండవులకు నమస్కరించి సంతాపంతో, సిగ్గుతో తన గర్వం అంతా నిర్మూలనం కాగా వెళ్ళిపోయాడు.

ఆ. ధనము గొనుట యొండె, దలఁ గొఱుగుట యొండె, నాలయంబు వెడల నడచుటొండె,
గాని చంపఁదగిన కర్మంబు సేసిన, జంపఁదగదు విప్రజాతిఁ బతికి.

174

తా॥ వాడి వద్ద ఉన్న ధనం అంతా తీసుకోవాలి లేదా తల గొరగాలి లేదా ఇంట్లోంచి వెళ్ళగొట్టాలి. అంతేకాని చంపతగిన తప్పు చేసినా విప్రుణ్ణి చంపటం రాజులకు తగని పని.

వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడిచి, పాండవులు పాంచాలీ సహితులై పుత్త్రులకు శోకించి మృతులైన బంధువుల కెల్ల దహనాదికృత్యంబులు సేసి యుదక ప్రదానంబు సేయు కొఱకు స్త్రీల ముందట నిడికొని గోవిందుండునుం దారునుం గంగకుం జని తిలోదకంబులు సేసి క్రమ్మఱ విలపించి హరిపాద పద్మజాత పవిత్రంబులయిన భాగీరథీజలంబుల స్నాతులయి యున్న యెడం బుత్త్ర శోకాతురు లయిన గాంధారీ ధృతరాష్ట్రులను, గుంతీ ద్రౌపదులను జూచి మాధవుండు మునీంద్రులుం దానును బంధుమరణశోకాతురు లయిన వారి వగపు మానిచి మన్నించె నివ్విధంబున.

175

తా॥ ఇట్లా అశ్వత్థామను ప్రాణాలతో వెళ్ళగొట్టారు. పాంచాలితో కలిసి పాండవులు అందరూ పుత్రులకై శోకించి మృతులైన బంధు వర్గానికి దహన కృత్యములు నిర్వర్తించారు. తిలోదకాలు వదలడం కోసం స్త్రీలతో కలసి గోవిందుడు, పాండవులు గంగకు వెళ్ళారు. అక్కడ తిలోదకాలిచ్చి హరిపాదముల నుండి పుట్టిన పవిత్రమైన గంగానదీ జలాల్లో స్నానం చేశారు. పిమ్మట పుత్రుల కోసం బాధపడుతూన్న గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతీదేవి, ద్రౌపదీ దేవులను చూసి మాధవుడు, మునీంద్రులతో కలసి బంధువుల మరణం కోసం బాధపడుతూన్న వారి శోకాన్ని కూడా మానిపించాడు.

శా. పాంచాలీ కబరీవికర్షణ మహాపాప క్షతాయుష్కులం
జంచద్గర్వుల ధార్త రాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ, గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్ర ప్రభావంబునన్.

176

తా॥ పాంచాలి యొక్క కొప్పు పట్టి లాగిన మహా పాపానికి క్షీణించిన ఆయువుగల గర్వాంధులైన ధార్తరాష్ట్రులనందరినీ యుద్ధరంగంలో చంపించి గోవిందుడు ధర్మరాజుకు రాజ్యం ఇప్పించాడు. గొప్ప కీర్తిప్రతిష్ఠలు కలిగేలా చేసి మహేంద్ర వైభవంతో మూడు అశ్వమేధములు చేయించాడు.

## శ్రీకృష్ణుడు ఉత్తర గర్భంలో ఉన్న శిశువును తన సుదర్శన చక్రముచే రక్షించుట

వ. అంత వాసుదేవుండు వ్యాస ప్రముఖభూసుర పూజితుండయి యుద్ధవ సాత్యకులు గొలువ ద్వారకాగమన ప్రయత్నంబునం బాండవుల వీడ్కొని రథారోహణంబు సేయు సమయంబునం దత్తఱపడుచు నుత్తర సనుదెంచి కల్యాణ గుణోత్తరుండైన హరి కిట్లనియె.

177

తా॥ అనంతరం వాసుదేవుడు వ్యాసాది మహర్షుల చేత పూజింపబడి ఉద్ధవ సాత్యకులు కొలుస్తూ ఉండగా ద్వారకకు బయలుదేరాడు. ఆ ప్రయత్నంలో పాండవులను వీడ్కొని రథాన్ని ఎక్కే సమయంలో తత్తరపడుతూ ఉత్తర వచ్చింది. వచ్చి హరితో ఇలా మొరపెట్టుకుంది:

మ. ఇదె కాలానల తుల్య మైన విశిఖం బేతెంచె దేవేశ !నేఁ
డుదరాంతర్గత గర్భ దాహమునకై యుగ్రప్రభన్ వచ్చుచు
న్నది దుర్లోక్యము మానుపన్ శరణ మన్యం బేమియున్ లేదు నీ
పద పద్మంబులె కాని యొండెఱుఁగ నీ బాణాగ్ని వారింపవే!

178

తా॥ “ఓ దేవేశ! ప్రళయాగ్నితుల్యమైన బాణం ఒకటి ఎక్కడినుంచో వచ్చి నా కడుపులో ఉన్న బిడ్డడిని కాల్చివేయాలని ఉగ్రంగా చూస్తూన్నది. ఆ భయంకరమైన బాణం నుండి రక్షణ పొందడానికి ఇతరమైన ఉపాయం ఏమీ లేదు. నీ పాదపద్మములను శరణు వేడుకొంటున్నాను ఇతరములేవి నాకు తెలియదు. ఈ బాణాగ్ని నుండి రక్షించు.

క. దుర్భర బాణానలమున, గర్భములో నున్న శిశువు ఘన సంతాపా
విర్భావంబును బొందెడి, నిర్భరకృపఁ గావుమయ్య నిఖిలస్తుత్యా!

179

తా॥ అందరి చేత పొగడబడేవాడా! భరించరాని బాణానలం చేత నా గర్భంలో ఉన్న శిశువు గొప్ప సంతాపాన్ని పొందుతున్నాడు. నీ కృపచేత రక్షించు తండ్రీ!

క. చెల్లెలి కోడల, నీ మే, నల్లుఁడు శత్రువులచేత హతుఁ డయ్యెను, సం
ఫుల్లారవిందలోచన!, భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే!

180

తా॥ నేను నీ చెల్లెలు అయిన సుభద్రకు కోడలిని. నీ మేనల్లుడు శత్రువుల చేతిలో హతుడయ్యాడు. ఈ బాణాగ్ని నుండి శిశువు ప్రాణాలను కాపాడు.

ఆ. గర్భమందుఁ గమల గర్భాండశతములు, నిముడుకొన వహించు నీశ్వరేశ!
నీకు నొక్క మానినీగర్భరక్షణ, మెంత బరువు నిర్వహింతు గాక!

181

తా॥ ఓ ఈశ్వరా! గర్భంలో వందల కొలది బ్రహ్మాండములను భద్రంగా ఇముడ్చుకొనే నీకు కేవలం ఒక్క మగువ గర్భం రక్షించటం పెద్ద బరువు కాదు. ఆదుకో స్వామీ!"

వ. అనిన నాశ్రితవత్సలుండగు నప్పరమేశ్వరుండు సుభద్ర కోడలి దీనాలాపంబు లాలించి, యిది ద్రోణనందనుండు లోక మంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రంబని యెఱింగె; నంతఁ బాండవుల కభిముఖంబయి ద్రోణనందన దివ్యాస్త్ర నిర్గత నిశిత మార్గణంబులు డగ్గఱిన బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబు లందికొని పెనంగు సమయంబున.

182

తా॥ అని వేడుకొనేసరికి తనను ఆశ్రయించిన వారిని రక్షించే ఆ పరమేశ్వరుడు సుభద్ర యొక్క కోడలు అయిన ఉత్తర దీనాలాపాలను ఆలకించాడు. ఇది ద్రోణాచార్యుని పుత్రుడైన అశ్వత్థామ 'ఈ లోకం అంతా పాండవులు లేనిదిగా అయ్యెడుగాక' అని శపించి వేసిన దివ్యాస్త్రం

అని తెలుసుకున్నాడు. అంత పాండవులకు అభిముఖంగా అశ్వత్థామ విడిచిపెట్టిన పదనైన శరముల దగ్గరికి వచ్చేసరికి వారు భయపడక ఎదురు నిలిచి అస్త్ర ప్రయోగం చేసి సమరం సాగించారు.

మ. తన సేవారతిచింత గాని పరచింతా లేశమున్ లేని స
జ్జనులం బాండుతనూజులన్ మనుచు వాత్సల్యంబుతో ద్రోణ నం
దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వారి సా
ధన నిర్వక్రము రక్షితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్.

183

తా॥ తనను సేవించాలనే చింత తప్ప అన్యచింత కొంతైనా కూడా లేని సజ్జనులైన పాండు కుమారులను కాపాడాలనే వాత్సల్యంతో అశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రాన్ని అడ్డుకోవడం కోసం సర్వమైన శత్రుసమూహాన్ని సాధించేది, దేవతలను కాపాడేది అయిన తన చక్రమును అడ్డువేశాడు కృష్ణుడు.

మ. సకల ప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు సూ
క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడన్ విరటజా గర్భంబుఁ దాఁ జక్రహ
స్తకుఁడై వైష్ణవమాయఁ గప్పి కురు సంతానార్థియై యడ్డమై
ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణతనయ బ్రహ్మాస్త్రమున్ లీలతోన్.

184

తా॥ సూక్ష్మరూపంతో సకల ప్రాణి హృదయాలలోను జ్యోతి స్వరూపంలో ఉండే కృష్ణుడు పాండవ వంశాంకురాన్ని రక్షించడం కోసం చక్రహస్తుడై వైష్ణవ మాయతో కప్పి అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని అణచి వేశాడు.

వ. ఇట్లు ద్రోణతనయుండేసిన ప్రతిక్రియారహితంబయిన బ్రహ్మశిరంబనియెడి దివ్యాస్త్రంబు

వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె; నిజమాయా విలసనమున సకలలోక సర్గస్థితి సంహారంబు లాచరించు నట్టి హరికి ధరణీసుర బాణ నివారణంబు విచిత్రంబు గాదు; తత్సమయంబున సంతసించి, పాండవ పాంచాలీ సహితయై గొంతి, గమనోన్ముఖుండయిన హరిం జేరవచ్చి యిట్లనియె.

185

తా॥ ఈ విధంగా అశ్వత్థామ వేసిన తిరుగులేని బ్రహ్మశిరం అనే దివ్యాస్త్రం వైష్ణవ తేజంచేత నిరర్థకం అయిపోయింది. తన మాయా ప్రభావంతో సకల లోక సృష్టి స్థితి సంహారములు ఒనరించు హరికి ఒక బ్రాహ్మణ యువకుని బాణాన్ని నివారించటం పెద్ద విచిత్రం కాదు. అప్పుడు కుంతీదేవి పాండవులతోను ద్రౌపదీదేవితోను కూడి, వెళ్ళడానికి సిద్ధంగా ఉన్న హరిని ఈ విధంగా స్తుతించింది:

# కుంతీదేవి శ్రీకృష్ణుణ్ణి స్తుతించుట

క. పురుషుం డాధ్యుఁడు ప్రకృతికిఁ, బరుఁడవ్యయుఁ డఖీలభూత బహిరంతర్భా
సురుఁడును లోక నియంతయుఁ, బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ!

186

తా॥ "కృష్ణా! నువ్వు సనాతన పురుషుడవు. ఆదిదేవుడవు. ప్రకృతికి పరుడవు. అవ్యయుడవు. అఖీల భూతములకు లోపల బయట వెలుగుతూ ఉండేవాడివి. సర్వలోకాలను నడిపేవాడివి, పరమేశ్వరుడవు అయిన నీకు నమస్కారములు.

వ. మఱియు జవనిక మఱువున నాట్యంబు సలువు నటుని చందంబున మాయా యవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచే బరమహంసలు నివృత్తరాగద్వేషులు నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛిన్నుండవు గాని నీవు మూఢదృక్కులుఁ గుటుంబవంతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు; శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశ చరణ! హృషీకేశ! భక్తి యోగంబునం జేసి నమస్కరించెద నవధరింపుము.

187

తా॥ తెరచాటున నాట్యం చేసే నటునివలె మాయ అనే తెరవెనకాల నర్తించే నీ మహిమ అగోచరమైనది. పరమహంసలు, రాగద్వేషములు లేనివారు, నిర్మలాత్ములు అయిన మునీశ్వరులకు సైతం కనిపించని నువ్వు మూఢులము, సంసారవంతులము అయిన మాకు ఎలా కనిపిస్తావు. శ్రీకృష్ణా! వాసుదేవ! దేవకీనందన! నందగోప కుమారా! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశచరణ! హృషీకేశ! భక్తితో నమస్కరిస్తున్నాను.

సీ. తనయుల తోడనే దహ్యమానం బగు జతుగృహంబందును జావకుండఁ గురురాజు వెట్టించు ఘోరవిషంబుల మారుతపుత్త్రుండు మడియకుండ ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ గాంగేయ కుంభజ కర్ణాదిఘనులచే నాబిడ్డ లని లోన నలఁగకుండ

తే. విరటు పుత్త్రిక కడుపులో వెలయు చూలుఁ, ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ మఱియు రక్షించితివి పెక్కుమార్గములను, నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష?

188

తా॥ నా కొడుకులతో నన్ను కాలిపోతూన్న లక్కయింట్లో మేము కాలకుండా కాపాడావు. కురురాజు అయిన ధుర్యోధనుడు పెట్టే ఘోర విషాలకు భీమసేనుడు చచ్చిపోకుండా కాపాడావు. దుశ్శాసనుడు సభలో చీరలు ఒలుస్తూన్న సమయంలో ద్రౌపదీ దేవి మానం కాపాడావు. భీష్మద్రోణకర్ణాది వీరులచే నా బిడ్డలు యుద్ధంలో శోకించకుండ కాపాడావు. విరాటరాజు పుత్రిక అయిన ఉత్తర యొక్క కడుపులో ఎదుగుతున్న చూలు అశ్వత్థామ యొక్క శరవహ్నికి నాశనం కాకుండా రక్షించావు. అనేక విధాలుగా మమ్ము రక్షించిన నిన్ను ఏమని వర్ణించను.

మ.కో.

బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ
తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండగఁ దావకీన గుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంత దాన జగత్పతీ!

189

తా॥ బలవంతుడైన కంసుని చేత బాధపడుతూన్న మీ తల్లి దేవకీ దేవిని రక్షించిన విధంగా ధార్తరాష్ట్రులు పెట్టిన కష్టాలకు చిక్కకుండా మమ్ములను కాపాడావు. నీ గుణములను స్తుతి చేసి చెప్పడానికి నేనెంతటిదానను.

క. జననము నైశ్వర్యంబును, ధనమును విద్యయును గల మదచ్ఛన్ను లకిం
చన గోచరుఁడగు నిన్నున్, వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా!

190

తా॥ పుట్టుక, ఐశ్వర్యము, ధనము, విద్య.... ఇవిగల స్వార్థపరులు; నిష్కాములైన వారికి మాత్రమే గోచరించే నిన్ను వినుతించలేరు.

తన సంపదను, అధికారాన్ని, పేరుప్రతిష్ఠలను, ఆధిక్యాన్ని చెప్పుకుని గర్వించేవారు కొందరుంటారు. నిజానికి ఇవన్నీ మూడునాళ్ళ ముచ్చటలే కదా! మరణానంతరం వీటిలో వెంట వచ్చేది ఏదీ లేదు.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, రాగాదిరహితుండును, గైవల్యదాన సమర్థుండును, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకల భూతనిగ్రహానుగ్రహకరుండును నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయవిలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు; జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవుల యందు వరాహాది రూపంబులను, మనుష్యులందు రామాది రూపంబులను, ఋషులయందు వామనాది రూపంబులను, జలచరంబులయందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోక విడంబనార్థంబు గాని, జన్మకర్మ సహితుండ వగుటం గాదు.

191

తా॥ నీవు భక్తుల పాలిటి బంగారానివి. ధర్మార్థ కామ విషయాల్లో వ్యామోహం తొలగించే వాడివి. రాగద్వేషాదులు లేనివాడివి. కైవల్య ప్రదాతవు. కాలస్వరూపుడివి. సృష్టి నియంతవు.

ఆద్యంత రహితుడివి. ఈశ్వరుడివి. సర్వసముడివి. నిగ్రహానుగ్రహ సమర్థుడవు. ఇట్టి నీకు నా నమస్కారములు. మనుష్యులను అనుకరించే నీ లీలలను నిర్ణయించడానికి ఎవడు సమర్థుడు. నీకు ప్రియము అప్రియము అంటూ ఏమీలేవు. జన్మలు కర్మలు లేని నీవు జీవులలో వరాహాది రూపాలను, మనుష్యులలో శ్రీరాముడు ఇత్యాది రూపాలను, ఋషులయందు వామనుడు ఇత్యాది రూపాలను, జలచరములయందు మత్స్యాది రూపములను.... అవతరించటం అనేది లోకం కోసమే కానీ నీకు జన్మకర్మలు లేవు.

ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపికఁ ద్రాటఁ గట్టిన వికుంచిత సాంజనబాష్పతోయ ధా
రా పరిపూర్ణ వక్త్రము గరంబులఁ బ్రాముచు వెచ్చ నూర్చుచుం
బాపఁడవై నటించుట కృపాపర! నామదిఁ జోద్య మయ్యెడిన్.

192

తా॥ ఓ దయామయా! చిన్నతనంలో నువ్వు కోపంతో పెరుగుకుండను బ్రద్దలు కొట్టినప్పుడు గోపిక త్రాడుతో కట్టగా ఏడుస్తూ కాటుక నిండిన కన్నుల నీరు నీ ముఖమంతా వ్యాపించ చేతులతో పాముకొంటూ పాపడవై నీవు నటించిన దృశ్యం నా మనస్సులో ఇప్పటికీ ఆశ్చర్యంగా హత్తుకుపోయింది.

క. మలయమునఁ జందనము క్రియ, వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు, కులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా!

193

తా॥ అనంతా! మలయ పర్వతం మీద చందన వృక్షంవలె ధర్మరాజు కీర్తిని వ్యాపింప చెయ్యటం కోసం ఆ హరి యదుకులంలో జన్మించాడని కొందరు విజ్ఞులు అంటారు.

క. వసుదేవ దేవకులు తా, పసగతి గత భవమునందుఁ బ్రార్థించిన సం

తసమునఁ బుత్రత నొందితి, వసురుల మృతి కంచు, గొంద ఱంద్రు మహాత్మా.

194

తా॥ కొందరు ఏమంటారంటే... పూర్వ జన్మలో వసుదేవ దేవకీ దేవులు తపస్సు చేసి ప్రార్థించిన కారణంగా సంతోషంతో రాక్షస సంహారం కోసం వారి బిడ్డడిగా అవతరించావని అంటారు.

క. జలరాశి నడుమ మునిగెఁడు, కలము క్రియన్ భూరిభారకర్శిత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ, గలిగితి వని కొంద ఱంద్రు గణనాతీతా!

195

తా॥ జలరాశి మధ్యలో మునిగిపోతూన్న నావ వలె గొప్పదైన భారం చేత క్రుంగిపోతూన్న భూమండలాన్ని రక్షించటం కోసం బ్రహ్మగారి కోరిక మేరకు అవతరించావని కొందరు అంటారు.

తే. మఱచి యజ్ఞాన కామ్యకర్మములఁ దిరుగు, వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ శ్రవణ
చింతన వందనార్చనము లిచ్చు, కొఱకు నుదయించి తంద్రు నిన్ గొంద ఱభవ!

196

తా॥ కర్తవ్యాన్ని మరచి అజ్ఞానంతో కామ్యకర్మలలో తిరుగుతూ కష్టాలలో పడి కొట్టుకొంటూ ఉండేవారికి దాని నుండి నివృత్తి చెయ్యటం కోసం శ్రవణము, చింతనము, వందనము, అర్చనము మొదలైన భక్తి మార్గములను నేర్పి వారిని రక్షించటం కొరకు నువ్వు ఉదయించావని కొందరు అంటారు.

మ. నినుఁ జింతించుచుఁ బాడుచుం బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్
వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే

ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా!

197

తా॥ నిన్నే చింతన చేస్తూ, నీ లీలలే గానం చేస్తూ, ప్రశంసిస్తూ, నీ దివ్యమైన చరిత్రనే వింటూ ఉండేవారు మాత్రమే నిన్ను దర్శిస్తారు. కాని ప్రాపంచికతలో మునిగిపోయినవారు నిన్ను మాత్రం దర్శించలేరు. అనేక దుష్టమైన జన్మల నుండి కాపాడేది, మహా యోగులు నిత్యము పొగిడేవి... అయిన నీ పాదాబ్జములను వాళ్ళే దర్శించగలుగుతారు.

సంసారంలో అనురాగం హెచ్చేకొద్దీ జ్ఞానలాభాన్ని పొందే అవకాశం సన్నగిల్లుతూంటుంది. సంసారంపై అనురాగం తగ్గేకొద్దీ జ్ఞానలబ్ధిని పొందే అవకాశం అధికమవుతూ ఉంటుంది.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. దేవా! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల? నీ కరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణ లక్షణ లక్షితంబు లయిన నీ యడుగులచేత నంకితంబైన యీ ధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు కుసుమఫల భరితంబులై యోషధి తరు లతా గుల్మ నద నదీ సమేతంబులై యుండు.

198

తా॥ దేవా! ఏ ఆశ్రయమూ లేక నీ చరణారవిందములనే ఆశ్రయించాము. నీ వాళ్ళం. అట్టి మమ్ము విడిచిపెట్టి వెళుతున్నావు. కరుణతో కూడిన నీ చూపులను నిత్యము

చూడకపోయినట్లయితే యాదవులతో కూడిన పాండవులు ఈ శరీరాన్ని విడిచిన ఇంద్రియాలవలె కీర్తిసంపదలు లేక తుచ్ఛత్వాన్ని పొందుతారు. సకల కల్యాణముల చేత కూడిన నీ పాదములకే అంకితమైన ఈ భూమండలం నువ్వు లేకపోతే శోభించదు. నీ కృపావీక్షణామృతం చేత ఇక్కడ ఉండే పల్లెలు, పట్టణాలు సమస్తమైన మనుష్యులు ఉండే నివాసములు అన్నీ కూడా పుష్పఫలాలతో కూడి, ఓషధుల చేతను చెట్లు లతలు నదులు నదములు నీటితోకూడి సమృద్ధంగా ఉంటాయి.

ఉ. యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహ వి
చ్ఛేదము సేయుమయ్య ఘన సింధువుఁ జేరెడి గంగ భంగి నీ
పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియు నట్లుఁగఁ జేయఁగదయ్య యీశ్వరా!

199

తా॥ ఈశ్వరా! యాదవులయందు, పాండురాజు కుమారుల యందు నన్ను మోహం పట్టుకుని పీడిస్తోంది. నాకు వారిపై మోహాన్ని విచ్ఛేదం చెయ్యి తండ్రీ! పవిత్రమైన గంగానది గొప్పదైన సముద్రాన్ని చేరినట్లు నీ పాదములకే అంకితమైన ఈ భూమండలం నువ్వు లేకపోతే శోభించదు. నీ కృపావీక్షణామృతం చేత ఇక్కడ ఉండే పల్లెలు, పట్టణాలు సమస్తమైన మనుష్యులు ఉండే నివాసములు అన్నీ కూడా పుష్పఫలాలతో కూడి, ఓషధుల చేతను చెట్లు లతలు నదులు నదములు వీటితో కూడి సమృద్ధంగా ఉంటాయి.

శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

200

తా॥ శ్రీకృష్ణా! యదువంశానికి అలంకార ప్రాయమైనవాడా! కిరీటికి అత్యంత ప్రియమైన వాడా! శృంగారానికి రత్నాకరం వంటివాడా! లోక ద్రోహులయిన రాజవంశములకు అగ్నివంటివాడా! లోకేశ్వరా! ఆపన్నులయిన దేవతలకు, బ్రాహ్మణులకు, గోగణానికి ఆర్తిని బాపే వాడా! మోక్షాన్నిచ్చే ప్రభూ! నిత్యము దయను కురిపించే స్వామీ! నీకు మ్రొక్కుతున్నాను! భవబంధాలను త్రుంచి వేయవయ్యా!"

వ. అని యిట్లు సకలభాషణంబుల నుతియించు గొంతిమాటకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి, కుంతీ సుభద్రాదుల వీడ్కొని, తన పురంబునకు విచ్చేయఁ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలువు మని ప్రార్థితుండై నిలిపి నంత బంధువధశోకాతురుం డయిన ధర్మజుండు నారాయణ వ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపఁబడియుఁ దెలియక మోహితుండై నిర్వివేకంబగు చిత్తంబున నిట్లనియె.

201

తా॥ అని ఈ ప్రకారంగా తనను కీర్తిస్తూన్న కుంతీదేవి మాటకు అంగీకరించి గోవిందుడు తన మందహాస విశేషంచేత మోహాన్ని కల్పించి రథం ఎక్కి హస్తినాపురానికి వచ్చాదు. కొంతకాలం ఉండి తిరిగి ప్రయాణం కావడానికి సిద్ధపడి కుంతీ సుభద్రల వద్ద సెలవు తీసుకొని ధర్మరాజు కొంతకాలం నిలువుమని ప్రార్థించగా సరే అన్నాడు. బంధువధచే శోకం చేత కుమిలిపోతూన్న ధర్మరాజు కృష్ణవ్యాస ధౌమ్యాదుల చేత అనేక విధాల తెలుపబడినా అతడు తేరుకోలేదు. మోహం చేత బాధపడుతూ ఇట్లా అన్నాడు:

మ. తన దేహంబునకై యనేకమృగ సంతానంబుఁ జంపించు దు
ర్జనుభంగిన్ గురుబాలకద్విజ తనూజ భ్రాతృ సంఘంబు ని
ట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హో
యన లక్షావధి నైన ఘోరనరక వ్యాసంగముల్ మానునే?

202

తా॥ "తన దేహాన్ని పోషించుకోవటం కోసం అనేక జంతువులను చంపించే దుర్జనుని వలె గురువులు, బాలకులు, బ్రాహ్మణులు, కొడుకులు, సోదరులు వీళ్ళని యుద్ధంలో చంపించిన పాపకర్ముడిని. ఇంత రాజ్యకాంక్ష ఉన్న నాకు నూరు వేల సంవత్సరాల తర్వాత అయినా నరక బాధ తప్పుతుందంటావా?

వ. మఱియుఁ బ్రజాపరిపాలనపరుం డయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినం బాపంబు లేదని శాస్త్ర వచనంబు గల, దయిన నది విజ్ఞానంబు కొఱకు సమర్థంబు గాదు; చతురంగంబుల ననేకాక్షౌహిణీ సంఖ్యాతంబులం జంపించితి; హతబంధులయిన సతుల కేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పులేదు; గృహస్థాశ్రమ ధర్మంబులైన తురంగ మేధాది యాగంబుల చేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబులవలన విడివడి నిర్మలుండగు నని నిగమంబులు నిగమించుఁ; బంకంబున బంకిలస్థలంబునకు, మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వక జీవహింసనంబు లయిన యాగంబులచేతం బురుషులకు బాపబాహుళ్యంబు కాని పాప నిర్ముక్తి గాదని శంకించెద.

203

తా॥ ప్రజాపరిపాలన కొరకు రాజు ధర్మ యుద్ధంలో శత్రువులను వధించినా పాపం లేదు అని శాస్త్రాలు అంటున్నాయి. అయినా ఆ మాట నాకు సమర్థనీయంగా కనిపించటం లేదు. చతురంగ బలాలతో అనేక అక్షౌహిణుల సైన్యాన్ని చంపించాను. చనిపోయిన వాళ్ళ భార్యలకు నేను మహా ద్రోహం చేశాను. గృహస్థాశ్రమ ధర్మాలైన అశ్వమేధాది యాగముల వల్ల పురుషుడు బ్రహ్మహత్యాది పాపాలనుండి పరిహారాన్ని పొందవచ్చు అని వేదాలు అంటున్నాయి. బురద వల్ల బురద నేలకు, మద్యం వల్ల మద్యం పోసిన భాండానికి శుద్ధి ఎలాగైతే లేదో అలాగే బుద్ధిపూర్వకంగా చేసిన జీవహింసతో కూడిన యాగముల వల్ల చేసిన వాళ్ళకి పాపం

పెరుగుతుంది కాని ఏమాత్రం తగ్గదని నా అభిప్రాయం."

క. అని యిట్లు ధర్మసూనుఁడు, మొనసి నిరాహారభావమున దేవనదీ
తనయుఁడు గూలిన చోటికిఁ, జనియెఁ బ్రజాద్రోహ పాప చలితాత్ముండై.

204

తా॥ అని ఈ విధంగా ధర్మరాజు ఆహారాన్ని తీసుకొనకుండా భీష్మాచార్యుడు పడి ఉన్నచోటికి తాను చేసిన ప్రజాద్రోహానికి చలించిపోతూ వెళ్ళాడు.

## ధర్మజుడు శ్రీకృష్ణునితో కలిసి భీష్ముని వద్దకు వచ్చుట

వ. అయ్యవసరంబునం దక్కిన పాండవులును ఫల్గునసహితుండైన పద్మలోచనుండును గాంచన సమంచితంబు లయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యకసహితుం డయిన కుబేరుని భంగి నొప్పె; నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబున కేఁగి దివంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామ రంగపతితుండైన గంగానందనునకు నమస్కరించి; రంత బృహదశ్వ భరద్వాజ పరశురామ పర్వత నారద బాదరాయణ కశ్యపాంగిరస కౌశిక ధౌమ్య సుదర్శన శుక వసిష్ఠాద్యనేక రాజర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశకాలవిభాగవేదియైన భీష్ముఁడు వారలకుం బూజనంబులు సేయించి.

205

తా॥ ఆ సమయంలో కృష్ణార్జునులు, తక్కిన పాండవులు బంగారు రథాలు ఎక్కి ధర్మరాజుతో కూడి వెళ్ళారు. అప్పుడు ధర్మరాజు గుహ్యకులతో కూడిన కుబేరుని వలె ఉన్నాడు. ఈ విధంగా పాండవులు సేవక సమూహం తమను కొలుస్తూ ఉండగా కృష్ణునితో కూడి కురుక్షేత్రానికి వెళ్ళారు. అక్కడ దివి నుండి నేలకు కూలిన దేవతవలె సంగ్రామ రంగంలో పడి ఉన్న భీష్మునకు నమస్కరించారు. అంత బృహదశ్వుడు, భరద్వాజుడు, పరశురాముడు, పర్వతుడు, నారదుడు, బాదరాయణుడు, కశ్యపుడు, అంగీరసుడు, కౌశికుడు, ధౌమ్యుడు, సుదర్శనుడు, శుకుడు, వసిష్ఠుడు... ఇత్యాది అనేక మంది రాజర్షులు, బ్రహ్మర్షులు శిష్య సమేతంగా వచ్చారు. వచ్చిన వారిని చూసి సంతోషించి దేశకాలములు తెలిసిన భీష్ముడు వాళ్ళందరకు తగురీతి పూజలు సేయించి మర్యాదలు చేయించాడు.

క. మాయాంగీకృత దేహుం, డై యఖిలేశ్వరుఁడు మనుజుఁ డైనాఁడని ప్ర
జ్ఞాయతచిత్తంబున గాం, గేయుఁడు పూజనము సేసె ఁగృష్ణున్ జిష్ణున్.

206

తా॥ మాయచేత మానవ దేహాన్ని ధరించి అఖిలేశ్వరుడు వచ్చాడని పవిత్ర భావంతో గాంగేయుడు శ్రీకృష్ణుణ్ణి పూజించాడు.

వ. మఱియు గంగానందనుండు వినయ ప్రేమ సుందరులయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగ జనిత బాష్ప సలిల సందోహ సమ్మిళిత లోచనుండై యిట్లనియె.

207

తా॥ పిమ్మట గంగానందనుడు వినయంతోను ప్రేమతోను ఉన్న పాండునందనులను ఆసీనులు కమ్మని అనుజ్ఞ ఇచ్చి అనురాగంతో కూడిన కన్నీరు వొలుక వారితో ఇట్లా అన్నాడు:

ఆ. ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కుగా, బ్రదుకఁదలఁచి మీరు బహువిధముల
నన్నలార! పడితి రాపత్పరంపర, లిట్టి చిత్రకర్మమెందు ఁగలదు?

208

తా॥ "బ్రాహ్మణులు, హరి, ధర్మము దిక్కుగా ఇప్పటి వరకు బ్రతికారు. ఎన్నో కష్టాలు పడ్డారు. ఇంతకంటే విచిత్రమైన విషయం ఎక్కడుంటుంది?

ఉ. సంతస మింత లేదు మృగశాప వశంబునఁ బాండు భూవిభుం
డంతము నొందియుండ మిము నర్భకులం గొనివచ్చి కాంక్షతో
నింతల వారిఁగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టు గాన దీ
గొంతి యనేక దుఃఖములఁ గుందుచు నుండును; భాగ్య మెట్టిదో!

209

తా॥ పాపం! మీ తల్లి కుంతీదేవి జీవితంలో సంతోషం అనేది రవ్వంత కూడా ఎరుగదు. మృగం యొక్క శాపవశం చేత పాండు భూపాలుడు మరణిస్తే అర్భకులైన మిమ్ములను

ఇంతవాళ్ళను చేసింది. ఎప్పుడూ కుంతి జీవితంలో సుఖపడలేదు. ఎప్పుడూ కష్టాలతోనే బాధపడింది. ఏం భాగ్యం చేసుకుందో ఏమో!

ఉ. వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం
బాయుచు నుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాల తంత్రమై
పాయుచుఁ గూడు చుండు నొకభంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచు నుండుఁ గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్.

210

తా॥ గాలికి ఎగురుతూన్న మేఘాలు ఆకాశం మీద కలుస్తూ విడిపోతూ ఉన్నట్లు ఈ ప్రపంచం అంతా కాలానికి అనుగుణంగా కలుస్తూ విడిపోతూ ఉంటుంది. ఒక పద్ధతి ఉన్నట్లు కనిపించదు. కాలమే అన్ని పనులు చేస్తున్నట్లు ఉంటుంది. కాలము చాలా విచిత్రము. దానిని అతిక్రమించటం చాలా కష్టం.

ఉ. రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండఁట ధన్వి, శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్ర సం
యోజకుఁ డైన చక్రి యఁట, యుగ్రగదాధరుఁడైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట, యాపద గల్గుటిదేమి చోద్యమో!

211

తా॥ ధర్మరాజు అంతవాడు రాజట! దేవతా సార్వభౌముడు అయిన ఇంద్రుని కుమారుడు అర్జునుడు ధన్వి! శత్రుభయంకరమైన గాండీవము విల్లట! సమస్త లోకాలకు భద్రాన్ని కలిగించే చక్రి సారధియట! భయంకరమైన గదను ధరించిన భీమసేనుడు తోడు నీడయట! ఇంతటి అదృష్టం పట్టిన పాండవులకు ఆపద కలిగిందంటే ఎంత విచిత్రము!

ఆ. ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ నెవ్వని, కేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు నతని

మాయలకు మహాత్ములు విద్వాంసు, లడఁగి మెలఁగుచుందు రంధు లగుచు.

212

తా॥ ఈశ్వరుడైన విష్ణువు ఎప్పుడు ఎవనికి ఏమి చేస్తాడో ఎవరికి ఏం తెలుసు? అతని మాయలకు మహాత్ములు, విద్వాంసులు అంధులవలె అణగిమణగి ఉంటారు.

వ. కావున దైవతంత్రంబైన దానికి వగవం బనిలేదు; రక్షకులు లేని ప్రజల నుపేక్షింపక రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు, తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై తన మాయచేత లోకంబుల మోహాతిరేకంబు నొందించు; నతని రహస్య ప్రకారంబులు భగవంతుం డైన పరమేశ్వరుం డెఱుంగు; దేవర్షియగు నారదుండును భగవంతుండగు కపిలమునియు నెఱుంగుదురు; మీరు కృష్ణుండు దేవకీ పుత్రుండగు మాతులేయుండని తలంచి దూత సచివ సారథి బంధు మిత్ర ప్రయోజనంబుల నియమింతు; రిన్నిటం గొఱంత లేదు; రాగాది శూన్యుండు నయిన యీశ్వరునకు నతోన్నత భావ మతివైషమ్యంబు లెక్కడివి? లేవు. అయిన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు.

213

తా॥ కనుక దైవ సంకల్పం వల్ల జరిగిన దానికి విచారించవలసిన అవసరం లేదు. రక్షణ లేని ప్రజలను ఉపేక్షించక రక్షించడం కోసం సాక్షాత్కరించిన పుండరీకాక్షుడే ఈ కృష్ణుడు. తన తేజస్సును కప్పిపెట్టి యాదవ కులంలో రహస్యంగా ఉంటూ తన మాయచేత లోకములను మోహంలో ముంచుతున్నాడు. అతని యొక్క ఆంతర్యం సాక్షాత్తు భగవంతుడైన పరమేశ్వరుడికే తెలుసు. దేవర్షి అయిన నారదుడు, భగవంతుడైన కపిల మహర్షికి తెలుసు. మీరు కృష్ణుడిని దేవకీ పుత్రుడుగా భావించి మా మేనమామ కుమారుడని దూతగా సచివుడుగా సారథిగా బంధువుగా మిత్రుడుగా... ఇంకా అనేక విధాలుగా నియమించుకొంటున్నారు. దీనివలన ఆయనకు ఏ కొరత లేదు. రాగద్వేషాలు లేని ఈశ్వరుడికి ఎక్కువ తక్కువలనే భ్రాంతి

ఎందుకుంటుంది? అయినా ఆయన భక్తవత్సలుడు కనుక భక్తులకు సులభుడై ఉంటాడు.

సీ. అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని నామ మూహించి పొగడి కాయంబు విడుచుచు ఁ గామ కర్మాదినిర్మూలనుండై యోగి ముక్తి నొందు నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తంసుఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు నందాఁక నిదె మహాహర్షుఁడై వికసిత వదనారవిందుఁడై వచ్చె నేఁడు

తే. నాల్గు భుజములుఁ గమలాభ నయనయుగము, నొప్పఁగన్నుల ముందట నున్నవాఁడు మానవేశ్వర, నా భాగ్యమహిమఁ జూడు, మేమి సేసితినో పుణ్య మితనిఁ గూర్చి.

214

తా॥ అత్యంత భక్తితో ఎవని మీద మనస్సును లగ్నంచేసి ఎవని నామాన్ని స్మరించి శరీరాన్ని విడుస్తూ కర్మలన్నిటిని నిర్మూలనం చేసుకుని యోగి ముక్తిని పొందుతాడో.... అట్టి సర్వేశ్వరుడు దేవతా సార్వభౌముడు నేను ప్రాణాలు విడిచిపెట్టే వేళకు నవ్వు ముఖంతో మహాహర్షుడై వచ్చాడు. నాల్గు భుజములు, కమల పత్రముల వంటి కన్నులతో ముందర సాక్షాత్కరించాడు. ఓ ధర్మరాజా! నా భాగ్యం పండింది. నా పుణ్యం పండింది."

వ. అని యిట్లు ధనంజయ సంప్రాపిత శరపంజరుం డయిన కురుకుంజరుని వచనంబు లాకర్ణించి మునులందఱు వినుచుండ ధర్మనందనుండు మందాకినీ నందను వలన నరజాతి సాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమ ధర్మంబులును, రాగవైరాగ్యోపాధులతోఁ ఁగూడిన ప్రవృత్తి ధర్మంబులును, దానధర్మంబులును, రాజ ధర్మంబులును, స్త్రీ ధర్మంబులును శమదమాదికంబులును, హరి తోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థ కామ మోక్షంబులును, నానావిధోపాఖ్యానేతిహాసంబులును, సంక్షేప విస్తారరూపంబుల నెఱింగె; నంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛంద మరణులైన యోగీశ్వరులచేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన నది దనకు మరణోచితకాలంబని నిశ్చయించి.

215

తా॥ అని ఈ ప్రకారంగా పార్థుడు కల్పించిన శరతల్పం మీద శయనించిన భీష్ముని వచనాలను ఆకర్ణించి మునులందరు వింటూ ఉండగా ధర్మనందనుడు, ఆయన వలన నరజాతి సాధారణ ధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, రాగవైరాగ్యాలతో కూడిన ప్రవృత్తి ధర్మాలు, దాన ధర్మాలు, రాజ ధర్మాలు, స్త్రీ ధర్మాలు, శమదమాది విషయాలు, హరికి సంతోషాన్ని కలిగించే ధర్మాలు, ధర్మార్థ కామ మోక్షములు, నానావిధములయిన ఉపాఖ్యానాలు ఇతిహాసాలు సంక్షేప రూపంలో కొన్ని, విస్తార రూపంలో కొన్ని విన్నారు. పిమ్మట వేలాది రథికులకు అధిపతి అయిన భీష్ముడు స్వచ్ఛందంగా మరణించేవారు కోరుకునే ఉత్తరాయణం వచ్చిందని తెలుసుకున్నాడు. అది తనకు ఉచితమైన మరణకాలమని నిశ్చయించుకున్నాడు.

శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూత శరవ్యథా నిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలం బొప్ప నుతించెఁ గల్మషగజ శ్రేణీహరిన్ శ్రీహరిన్.

216

తా॥ గాంగేయుడంత మౌనాన్ని పూని చిత్తమును ఏకాగ్రత లోనికి తెచ్చుకుని తన దృష్టిని హరి యొక్క ముఖారవిందంపై నిలిపాడు. ఆయన యొక్క కరుణామృత దృష్టిచేత శరీరం మీద శరసమూహం గ్రుచ్చుకొన్నందువల్ల కలిగిన బాధ అంతా ఉపశమించింది. అప్పుడు సంతోషంతో కల్మషములనే గజసమూహాన్ని హరించే శ్రీహరిని నుతించాడు.

వ. ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండునగు హరియందు నిష్కాముండై విశుద్ధంబగు ధ్యాన విశేషంబుచే నిరస్తదోషం డగుచు ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది ప్రకృతివలననైన సృష్టి

పరంపరలఁ బరిహరించు తలఁపున మందాకినీ నందనుం డిట్లనియె.

217

తా॥ ఈ విధంగా పీతాంబరమును ధరించినవాడు, నాలుగు బాహువులు కలవాడు, ఆది పురుషుడు, పరమేశ్వరుడు అయిన హరియందు; కోరికలు లేనివాడై పరిశుద్ధమైన ధ్యాన విశేషం చేత సమస్త దోషములను తొలగద్రోసి బుద్ధిని ఏకాగ్రతలోనికి తెచ్చుకుని పరమానందాన్ని పొందినవాడై సంసార బంధములను పరిహసించు తలంపుతో భీష్మాచార్యుడు ఇట్లా అన్నాడు:

## భీష్ముడు శ్రీకృష్ణుణ్ణి స్తుతించుట

మ. త్రిజగన్మోహన నీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్

218

తా॥ "మూడు లోకాలను మోహింప చేసే నీలకాంతులతో శరీరం వెలిగిపోగా, ఉదయ సూర్యుని కాంతులతో సమానమైన ప్రకాశము చేలముపైన రంజిల్లగా, నల్లని ముంగురులతో ముఖారవిందం సేవింప తగినదియై వికసించగా మా విజయుణ్ణి చేరుకునే వన్నెలాడు నా మదిలో ఎల్లప్పుడూ ఉండాలి.

మ. హయ రింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చు వేడ్క నని నా శస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.

219

తా॥ గుర్రముల గిట్టల నుండి రేగిన ధరాపరాగముచే నిండిన ముంగురులతోను, గమనవేగం వలన పుట్టిన చెమట బిందువులతోను కూడిన ముచ్చటైన మోముతో పార్థుని గెలిపించాలనే పట్టుదలతో నా శస్త్రములకు చాలా నొచ్చుకుని కూడా అతనిచే యుద్ధం చేయించే మహానుభావున్ని నా మనస్సులో ఎల్లప్పుడు ధ్యానిస్తున్నాను.

మ. నరు మాటల్ విని, నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ

బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు, నీ
పరమేశుండు వెలుంగు చుండెడును హృత్పద్మాసనాసీనుడై.

220

తా॥ విజయుని మాటలు నవ్వుతూ వింటూ ఉభయ సేనా మధ్యమందు అందరూ చూస్తుండగా రథాన్ని నిల్పి పర రాజులను చూపిస్తూ చూపులతో వాళ్ళ ఆయువును గ్రహించి వంచించు పరమేశ్వరుడు నా హృదయ పద్మంలో ఎప్పుడూ వెలుగుతూ ఉండాలి.

క. తనవారిఁ జంపఁజాలక, వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్ ఘనయోగవిద్యఁ
బాపిన మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

221

తా॥ యుద్ధ రంగంలో తన బంధుమిత్రులను చంపడానికి మనసొప్పక వెనుకకు వెళ్ళిపోదామని అనుకొంటూన్న విజయుని శంకలన్నిటికీ ఘనమైన గీతా యోగ విద్యను ఉపదేశించి సమాధానాలు చెప్పి యుద్ధానికి పురిగొల్పిన మునివంద్యుడైన కృష్ణుని పాదముల యందు భక్తి నాకు కలుగు గాక!

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ!
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ!
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బై నున్న పచ్చని పటము జాఱ!
నమ్మితి నాలావు నగుబాటు సేయక మన్నింపు మని క్రీడి మరల దిగువఁ!

తే. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడుపు మర్జున! యనుచు మద్విశిఖ వృష్టిఁ, దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

222

తా॥ కుప్పించి ఎగసినప్పుడు వ్యాపించిన కుండలాల కాంతి గగన భాగమంతా కప్పుకొంటూన్నది. రథం మీద నుండి ముందుకు దూకినప్పుడు ఉదరములో ఉన్న లోకముల బరువుకు భూమి కంపించింది. చక్రాన్ని చేత ధరించి వేగంగా వస్తూంటే భుజముపై వేసుకున్న పచ్చని ఉత్తరీయం జారిపోతూన్నది. 'నిన్ను నమ్ముకున్నాను, నా బలపరాక్రమాలను నగుబాటు చేయక మన్నించమ' ని అర్జునుడు బ్రతిమాలుతున్నాడు. 'నేడు భీష్మున్ని చంపి నిన్ను రక్షిస్తాను. నన్ను విడిచిపెట్టు....' అని అంటూ ఏనుగుపైకి లంఘించు సింహంవలె వస్తూన్న కృష్ణ పరమాత్మయే రక్ష నాకు.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁ బూని ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁ జేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్.

223

తా॥ నాకు వీడు భృత్యుడు. వీడిని రక్షించటం మహా ధర్మం.... అని అంటూ యుద్ధంలో అర్జున సారధ్యాన్ని వహించి రథం యొక్క పగ్గములను చేత చోద్యంగా పట్టుకుని రెండవ చేతితో మునికోలతో గుర్రాలను అదలిస్తూ చూసే వాళ్ళను మోహపరవశులను చేసే పరమ ఉత్సాహవంతుడు అయిన శ్రీకృష్ణుడిని ప్రశంసిస్తున్నాను.

క. పలుకుల నగవుల నడపుల, నలుకల నవలోకనముల నాభీరవధూ కులముల మనముల
తాలిమి, కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్.

224

తా॥ పలుకులతో, నవ్వులతో, నడకలతో, అలుకలతో, చూపులతో... గొల్లభామల మనోనిగ్రహాన్ని దోచుకునే ఘనుని నా మనస్సులో కొలుస్తున్నాను.

ఆ. మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా, మందిరమున యాగమంటపమునఁ
జిత్ర మహిమతోడఁ జెలువొందు జగదాది, దేవుఁ డమరు నాదు దృష్టియందు.

225

తా॥ మునులు, నృపులు చూస్తూ ఉండగా ధర్మరాజు యొక్క సభా మండపంలోని యాగమంటపంలో చిత్ర మహిమతో ప్రకాశించే ఆది దేవుడయిన కృష్ణుడు నా దృష్టిలో ఉన్నాడు.

మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

226

తా॥ సూర్యుడు ఒక్కడే అయినా సమస్త జీవులకు తాను ఒక్కొక్కడుగా కానవస్తాడు. ఆ విధంగానే పరమేశ్వరుడు ఎప్పుడూ మహాలీలతో జనుల హృదయకమలాలలో అనేక రూపాలలో ఒప్పుతూ ఉంటాడు. అట్టి హరిని నేను పరిశుద్ధమైన హృదయంతో ప్రార్థిస్తున్నాను."

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముండగు కృష్ణుని హృదయంబున నిలిపికొని, నిశ్శ్వాసంబులు మాని నిరుపాధికంబయిన వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరకయుండు తెఱంగున నుండిరి; దేవ మానవ వాదితంబులై దుందుభి నినాదంబులు మొరసె; మృతుండయిన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖీతుండయ్యె; నంత నచ్చటమునులు కృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగు లగుచుం దదీయ దివ్యావతారనామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుం జనిరి; పిదప నయ్యుధిష్ఠిరుండు కృష్ణసహితుండై గజపురంబునకుం జని గాంధారీ సమేతుండయిన,

ధృతరాష్ట్రు నొడంబఱచి, తత్సమ్మతంబున వాసుదేవానుమోదితుండై పితృపైతామహంబైన రాజ్యంబు గైకొని, ధర్మ మార్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండె నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె.

227

తా॥ అని ఈ ప్రకారంగా మనస్సు ద్వారా, వాక్కు ద్వారా, దర్శించటం ద్వారా పరమాత్ముడైన కృష్ణున్ని హృదయంలో నిలుపుకొని నిశ్వాసమును బంధించి శరీర రహితమైన వాసుదేవ బ్రహ్మమునందు ఐక్యమైపోయాడు భీష్ముడు. అప్పుడు అతడిని చూసిన సర్వజనులు సంధ్యా సమయంలో పక్షులవలె కేవలం మౌనంగా ఉండిపోయారు. దేవతలు, మానవులు దుందుభులు మ్రోగించారు. మృతుడైన భీష్మాచార్యుల వారికి ధర్మరాజు పరలోక క్రియలు చేయించి కొద్దిసేపు దుఃఖించాడు. అక్కడ సమావేశమైన మునిపుంగవులు కృష్ణుణ్ణి తమ హృదయాల్లో నిలుపుకొని అంతరంగంలో ఆనందాన్ని పొందారు. ఆయన దివ్యమైన అవతారాలను స్తుతిస్తూ ఆశ్రమానికి వెళ్ళిపోయారు. ఆ పిమ్మట యుధిష్ఠిరుడు కృష్ణునితో కలిసి హస్తినాపురానికి వెళ్ళి గాంధారీ ధృతరాష్ట్రుల అంగీకారంతో కృష్ణుని ఆమోదంతో తండ్రులు తాతలు పరిపాలించిన రాజ్యాన్ని ధర్మమార్గంలో ప్రజలను పాలించాడు అని చెప్పిన సూతునితో శౌనకుడు ఇట్లా అన్నాడు:

ఆ. ధనము లపహరించి తనతోడఁ జెనకెడు, నాతతాయి జనుల నని వధించి బంధు మరణ దుఃఖ భరమున ధర్మజుఁ, డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె.

228

తా॥ "తన ధనమును అపహరించి తనను ఎదిరించిన ఆతతాయి జనులను యుద్ధంలో వధించి... బంధుమిత్రులు అంతా చచ్చిపోయారనే దుఃఖంతో ధర్మరాజు తిరిగి ఎట్లా రాజ్యలక్ష్మిని చేపట్టడానికి ఇష్టపడ్డాడు?"

వ. అనిన సూతుం డిట్లనియె.

229

తా॥ అప్పుడు సూతుడు ఇలా అన్నాడు:

క. కురుసంతతికిఁ బరీక్షి, న్నరవరు నంకురము సేసి నారాయణు డీ
ధరణీ రాజ్యమునకు నీ, శ్వరుగా ధర్మజుని నిలిపి సంతోషించెన్.

230

తా॥ "కురు వంశానికి పరీక్షిత్తును అంకురంగా చేసి కృష్ణుడు ఈ ధరణీరాజ్యానికి ఈశ్వరునిగా ధర్మరాజును నిలిపి సంతోషించాడు.

వ. ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబుగాని స్వతంత్రంబు గా దనునది మొదలగు భీష్మని వచనంబులం, గృష్ణుని సంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమాన విజ్ఞానుండును నివర్తిత శంకాకళంకుండును నై నారాయణాశ్రయుండైన యింద్రుండునుంబోలె జతుస్సాగర వేలాలంకృతంబగు వసుంధరా మండలంబు సహోదర సహాయుండై యేలుచుండె.

231

తా॥ ఈ జగత్తు అంతా పరమేశ్వరుని అధీనమే కాని స్వతంత్రం కాదు అనే విషయాన్ని భీష్ముని ద్వారా, ఇంకా కొంత విజ్ఞానాన్ని కృష్ణునితో సంభాషించటం ద్వారా ధర్మనందనుడు తెలుసుకొన్నాడు. అతనిలో విజ్ఞానం పెరిగి శంకలన్నీ తీరాయి. నారాయణుని ఆశ్రమంలోని ఇంద్రునివలె నాలుగు సముద్రాల చేత ఆవరింపబడిన ఈ భూమండలాన్ని సోదరులతో కలిసి పాలించాడు.

సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు నిల యెల్ల కోర్కుల నీనుచుండు గోవులు

వర్షించు ఘోషభూములఁ బాలు ఫలవంతములు లతా పాదపములు పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల ధర్మ మెల్లెడలను దనరి యుండు దైవభూతాత్మతంత్రము లగు రోగాది భయములు సెందవు ప్రజల కెందుఁ

ఆ. గురుకులోత్తముండు గుంతీతనూజుండు, దానమాన ఘనుడు ధర్మజుండు
సత్యవాక్య ధనుడు సకల మహీరాజ్య, విభవభాజి యయిన వేళయందు.

232

తా॥ చక్కగా సంపూర్ణంగా మేఘుడు వర్షాలు చాలినంతగా కురిపిస్తూంటే భూమి మీద ప్రజలకు కోర్కెలన్నీ తీరుతున్నాయి. గోవులు అన్నీ గొల్లపల్లెల్లో పుష్కలంగా పాలు ఇచ్చాయి. లతలు, వృక్షములు అన్నీ ఫలవంతములు అయ్యాయి. ఆ యా ఋతువులలో పండే పంటలన్నీ చక్కగా పండాయి. ఎల్లెడలా ధర్మం అతిశయించింది. ప్రజలను ఏ రోగములూ బాధించలేదు. దానంలోను, ఔన్నత్యములోను గొప్పవాడు, ఎల్లప్పుడూ సత్యమును పలికేవాడు కురుకులానికి అలంకారప్రాయమైనవాడు కుంతీ తనూజుడు అయిన ధర్మరాజు రాజ్య పరిపాలన చేస్తూండగా ప్రజలంతా హాయిగా ఉన్నారు.

# శ్రీకృష్ణుడు ద్వారకా నగరానికి వెళ్ళుట

వ. అంత కృష్ణుఁడు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకును సుభద్రకుఁ బ్రియంబు సేయుటకును బ్రయాణంబు సేయం దలంచి ధర్మనందనునకుం గృతాభివందనుం డగుచు నతనిచే నాలింగితుండై యామంత్రణంబు వడసి కొందఱు దనకు నమస్కరించినం గౌఁగిలించికొని కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు రథారోహణంబు సేయు నవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుండును ధౌమ్యుండును సత్సంగంబు వలన ముక్తదుస్సంగుండగు బుధుండు సకృత్కాల సంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువనోపం డట్టి హరితోడి వియోగంబు సహింపక దర్శన స్పర్శనాలాపశయ నాసన భోజనంబుల వలన నిమిషమాత్రంబును హరికి నెడ లేని వారలైన పాండవులం గూడికొని హరి మరలవలయునని కోరుచు హరి చనిన మార్గంబు సూచుచు హరి విన్యస్త చిత్తులయి లోచనంబుల బాష్పంబు లొలుక నంత నిలువంబడి రయ్యవసరంబున.

233

తా॥ అంత కృష్ణుడు బంధువులకు శోకం లేకుండా చేయటం కోసం సోదరి అయిన సుభద్రకు సంతోషాన్ని కలిగించటం కొరకు హస్తినాపురంలో కొన్ని నెలలు ఉన్నాడు. పిమ్మట ద్వారకా నగరానికి ప్రయాణం తలపెట్టాడు. కొందరికి నమస్కరించాడు. కొందరిని కౌగిలించుకొన్నాడు. కొందరు తనకు నమస్కారం చేస్తే వారిని కౌగిలించుకొన్నాడు. ఇక గోవిందుదు రథాన్ని ఎక్కబోతున్న సమయంలో సుభద్ర, ద్రౌపది, కుంతి, ఉత్తర, గాంధారి, ధృతరాష్ట్రుడు, విదురుడు, ధర్మరాజు, యుయుత్సుడు, ధౌమ్యుడు మొదలయిన వారంతా సత్సంగం వలన దుస్సంగాన్ని విడిచిపెట్టిన బుద్ధిమంతుడు ఎవని యశస్సును విని తిరిగి విడిచిపెట్టడానికి ఇష్టపడడో అట్టి శ్రీకృష్ణుని వియోగాన్ని సహించలేకపోయారు. ప్రతి క్షణం

ఆయనను దర్శిస్తూ, ఆయనను స్పృశిస్తూ, ఆయనతో మాట్లాడుతూ, ఆయనతో శయనిస్తూ, ఆయనతో కలిసి కూర్చుంటూ, ఆయనతో కలిసి భోజనం చేస్తూ నిముషం కూడ హరిని విడిచి ఉండలేని పాండవులు శ్రీహరి తిరిగి రావాలని కోరుతూ ఆయన వెళ్ళిన మార్గాన్ని చూస్తూ కండ్లల్లో కన్నీరు ఒలుక నిలబడిపోయారు.

సీ. కనకసౌధములపైఁ గౌరవకాంతలు గుసుమవర్షంబులు గోరి కురియ మౌక్తికదామ సమంచిత ధవళాత పత్రంబు విజయుండు పట్టుచుండ నుద్ధవ సాత్యకు లుత్సాహవంతులై రత్న భూషితచామరములు వీవ గగనాంతరాళంబు గప్పి కాహళభేరి పటహ శంఖాది శబ్దములు మొరయ

ఆ. సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప, భద్రభాషణములు పలుకుచుండ భువన మోహనుండు పుండరీకాక్షుండు, పుణ్యరాశి హస్తిపురము వెడలె.

234

తా॥ సౌధములపై నుండి కౌరవ కాంతలు పుష్పవృష్టి కురిపిస్తున్నారు. ముత్యాల సరములతో ఒప్పే శ్వేతచ్ఛత్రాన్ని విజయుడు పట్టుకున్నాడు. ఉత్సాహంతో ఉద్ధవ సాత్యకులు రత్నములచే అలంకరింపబడిన చామరాలు వీస్తున్నారు. ఆకాశం బ్రద్దలయ్యేటట్లు కాహళము, భేరి, పటహము, శంఖము ఇత్యాది మ్రోగుతున్నాయి. వేదవేత్తలయిన విప్రులు అందరూకూడా సగుణ నిర్గుణ రూపంలో స్వస్తివాచకములు పలుకుతున్నారు. భువనమోహనుడు, పుండరీకాక్షుడు, పుణ్యరాశి అయిన కృష్ణుడు హస్తినాపురం నుండి బయలుదేరి వెడుతున్నాడు.

వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖర భాగంబుల నిలిచి గోపాలసుందరుని సందర్శించి, వర్గంబులై మార్గంబు రెండు దెసలం గరారవిందంబులు సాచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లి గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపని సమయంబున నొంటి దీపించు పురాణపురుషుం డితండనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లను వారును,

జీవోపాధి భూతంబు లయిన సత్త్వాదిశక్తుల లయంబు జీవుల లయంబను వారును, గ్రమ్మఱ సృష్టికర్తయైన యప్పరమేశ్వరుండు నిజవీర్య ప్రేరితయై నిజాంశ భూతంబులైన జీవులకు మోహిని యగుచు సృష్టి సేయ నిశ్చయించి నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు, వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును, నిర్మలభక్తి సముత్కంఠావిశేషంబుల, నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతు రనువారును, యోగమార్గమునంగాని దర్శింపరాదను వారునునై మఱియును.

235

తా॥ ఆ సమయంలో పురంధ్రీమణులు మేడల శిఖర భాగములమీద నిలిచి గోపాల మూర్తిని సందర్శిస్తూన్నారు. చేతులు సాచి ఒకళ్ళ కొకళ్ళు చూపించుకొంటూ తమలో తాము ఇట్లా మాట్లాడుకోసాగరు: ‘తొలి జీవులు పుట్టక ముందు ప్రపంచం పుట్టకముందు ఒంటిగా దీపించు పురాణపురుషుడు ఇతడే! జీవుడు బ్రహ్మమే అయితే ఇక లయం సిద్ధించటం ఎట్లా అని కొందరు అంటున్నారు. జీవునకు ఉపాధి భూతములు అయిన సత్వాది శక్తుల లయమే జీవుల లయం అనేవారు కొందరు. సృష్టికర్త అయిన పరమేశ్వరుడు తన స్వశక్తి చేత తననుండి పుట్టిన జీవులకు మోహిని అగుచు సృష్టి చెయ్యాలనే సంకల్పంతో జీవులకు నామరూపాదులు కల్పించటం కోసం ప్రవర్తించే స్వమాయను అంగీకరిస్తాడు అని కొందరు అంటున్నారు. నిర్మల భక్తి విశేషం చేత జితేంద్రియులయిన విద్వాంసులు ఈ మహానుభావుని నిజ రూపాన్ని దర్శిస్తారు అని కొందరు యోగమార్గంలో తప్ప ఈయనను దర్శింప లేరు అని కొందరు...’ ఇలా అందరూ తలకొక రకంగా అనుకొంటున్నారు.

మ. రమణీ! దూరము వోయెఁ గృష్ణురథమున్; రా దింక వీక్షింప నీ
కమలాక్షుం బొడగానలేని దినముల్ గల్పంబులై తోఁచు; గే
హములం దుండగ నేలపోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం

దము రమ్మా, యనె నొక్క చంద్రముఖీ కందర్పాశుగభ్రాంతయై.

236

తా॥ 'రమణీ! కృష్ణుని రథం దూరంగా వెళ్ళిపోయింది. కమలాక్షుణ్ణి దర్శించటం కుదరదు. ఆయన్ను దర్శించలేని రోజులు కల్పములై తోస్తాయి. ఈ ఇండ్లలో ఉండటం మానివేసి ఆయనకు సేవ చేసుకొందాము రండి!' అని ఒక చంద్రముఖీ మన్మథ బాణాలకు గురియై అన్నది.

మ. తరుణీ! యాదవరాజు గాఁడితఁడు; వేదవ్యక్తుఁడై యొక్కఁడై
వరుసన్ లోకభవస్థితి ప్రళయముల్ వర్తింపఁగాఁ జేయు దు
స్తర లీలారతుఁడైన యీశుఁ, డితనిన్ దర్శించితిం బుణ్య భా
సుర! నే నంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్.

237

తా॥ 'తరుణీ! కేవలం యాదవ చక్రవర్తి కాదమ్మా ఇతడు. వేదవేద్యుడు. లోకం యొక్క పుట్టుక స్థితి లయము వీటిని ప్రవర్తింప చేసే లీలను కల్పించే ఈశ్వరుడు. ఇతడిని దర్శించిన నేను ఎంత అదృష్టవంతురాలనో!' అంటూ పరిశుద్ధమైన అంతరంగంతో ఒకావిడ గంతులు వేసింది.

క. తామసగుణు లగు రాజులు, భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స
త్త్వామలతనుఁడై యీతఁడు, భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్.

238

తా॥ 'భామినీ! తామస గుణంతో రాజులు ఈ భూమిమీద పుట్టి ప్రజలను కష్టాలపాలు చేస్తూంటే సత్వ స్వరూపుడైన ఇతడు జన్మించి ప్రతి కల్పంలోనూ వారిని వధిస్తాడమ్మా!

వ. ఇదియునుం గాక.

239

తా॥ అంతేకాదు!

సీ. ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ, యాదవకుల మెల్ల ననఘ మయ్యెఁ;
నీ పుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండంగ, మథురాపురము దొడ్డ మహిమఁ గనియె
నీ పూరుష శ్రేష్ఠు నీక్షింప భక్తితో, ద్వారకావాసులు ధన్యులైరి
యీ మహాబలశాలి యెఱిఁగి శిక్షింపంగ, నిష్కంటకం బయ్యె నిఖిలభువన
తే. మీ జగన్మోహనాకృతి నిచ్చగించి, పంచశర భల్ల జాల విభజ్యమాన
వివశ మానసమై వల్లవీసమూహ, మితని యధరామృతము గ్రోలు నెల్లప్రొద్దు.

240

తా॥ ఈ ఉత్తమ శ్లోకుడు జన్మించిన కారణంగా యాదవ కులమంతా పాపరహితమైనది. ఈ పుణ్యవర్తనుడు ఎప్పుడూ ఉంటున్న కారణంగా మథురాపురం చాలా మహిమాన్వితమై అలరారుతోంది. ఈ పురుష శ్రేష్ఠున్ని భక్తితో నిత్యమూ చూస్తున్న కారణంగా ద్వారకానగర ప్రజలు ధన్యులయ్యారు. ఈ లోకోత్తర పురుషుడు సర్వము తెలుసుకొని దుష్టులను శిక్షించిన కారణంగా ఈ భూమి నిష్కంటకమైంది. ఈ జగన్మోహనుని మనోహరమైన రూపాన్ని దర్శించి పంచశరుని బాణసమూహం చేత వివశులై గోపికా సమూహం ఇతని అధరామృతాన్ని ఏ ప్రొద్దు గ్రోలుతూనే ఉంటుంది.

ఉ. ఈ కమలాక్షు నీ సుభగు నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుగాఁ
జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచు నుండెడు రుక్మిణీ ముఖా
నేక పతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా
స్తోక విశేషతీర్థములఁ దొల్లటి బాముల నేమి నోఁచిరో!

241

తా॥ ఈ కమలాక్షుణ్ణి, ఈ మనోహరుణ్ణి, ఈ దయామయుణ్ణి తమ ప్రాణనాథుడుగా చేసుకొని వేడుకగా కాపురం చేసుకొంటున్న రుక్మిణీ సత్యభామానేక పతివ్రతలు నిర్మలమైన మనస్సుతో క్రిందటి జన్మలలో ఏ విశేష తీర్థాలను సేవించారో!'

వ. అని యిట్లు నానా విధంబులుగాఁ బలుక పురసుందరుల వచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె; ధర్మజుండును హరికి రక్షణంబులై కొలిచి నడువం జతురంగ బలంబులం బంచిన దత్సేనాసమేతులై దనతోఁడి వియోగంబున కోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి కురుజాంగల పాంచాల దేశంబులు దాటి, శూరసేన యామున భూములం గడచి బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య, సారస్వత, మరుధన్వ, సౌవీరాభీరసైంధవ విషయంబు లతిక్రమించి, తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు నానర్త మండలంబు సొచ్చి పద్మబంధుండు పశ్చిమ సింధు నిమగ్నుండయిన సమయంబునఁ బరిశ్రాంతవాహుండై చనిచని.

242

తా॥ అని ఈ విధంగా పలుకుతున్న పురంధ్రీమణుల మాటలు విని వాళ్ళను కటాక్షించి నవ్వుతూ నగరాన్ని విడిచి బయటకు వచ్చాడు. హరికి రక్షణగా ధర్మరాజు పంపిన చతురంగ బలములను, తనతోటి ఎడబాటుకు ఓర్వక చాలాదూరం వచ్చిన పాండునందనులను వెనక్కి పంపించాడు. యమునా నదీ తీరంలోని కురుజాంగల పాంచాల శూరసేన దేశాలు దాటాడు. బ్రహ్మావర్తాన్ని, కురుక్షేత్రాన్ని, మత్స్య, సారస్వత, మరుధన్వ, సౌవీర, ఆభీర, సైంధవ దేశాలను అతిక్రమించాడు. ఆ దేశ పౌరులు ఇచ్చిన కానుకలను తీసుకొన్నాడు. ద్వారకలో అంతర్భాగమైన ఆవర్తమండలానికి చేరుకొని సూర్య భగవానుడు పశ్చిమ సముద్రంలో నిమగ్నమవుతూన్న సమయంలో ద్వారకా నగరాన్ని చూసాడు.

## శ్రీకృష్ణుడు ద్వారకా నగరంలోకి ప్రవేశించుట

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్ర శృంగారకన్
గలహంసావృత హేమపద్మపరిఖా కాసారకన్ దోరణా
వళి సంఛాదిత తారకన్ దరులతా వర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకుర కోరకన్ మణిమయ ప్రాకారకన్ ద్వారకన్.

243

తా॥ పద్మముల వంటి కన్నులు కల శ్రీకృష్ణుడు.... అలంకరింపబడిన ఎత్తైన మేడలు కలది, అందమైన హంసల చేత బంగారు పద్మముల చేత ఒప్పుతూన్న మడుగు చేత అలరారుతూ ఉన్న అగడ్త కలది, చుక్కలను కప్పేస్తున్న తోరణములు కలది, ఫలములతో పుష్పములతో మొగ్గలతో చివుళ్ళతో కూడిన తరువులు కలది, మణులతో అలంకరింపబడిన ప్రాకారము కలది... అయిన ద్వారకా నగరాన్ని చేరుకున్నాడు.

వ. ఇట్లు దన ప్రియపురంబు డగ్గఱి

244

తా॥ ఈ విధంగా తనకు ఇష్టమైన నగరానికి చేరుకున్నాడు.

మ.కో.

అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్
ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతు చై
తన్యమున్ భువనైక మాన్యము దారుణధ్వని భీత రా
జన్యమున్ బరిమూర్ఛితాఖిలశత్రు దానవసైన్యమున్.

245

తా॥ అన్యులుసైతం సన్నుతించే సాహసం కల మురారి ఉత్తములైన యదుపుంగవులు ధన్యులై వినేటట్లుగా "పాంచజన్య" మును పూరించాడు. ఆ శంఖం అఖిల జంతువుల చైతన్యాన్ని చీల్చేది, సమస్త భువనముల చేత మన్నింప తగినది, దారుణమైన ధ్వని చేత రాజులనందరినీ భయపెట్టేది, శత్రువులైన దానవ సైన్యాన్ని మూర్ఛలో మునుగ చేసేదీను.

శా. శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబర ద్రవ్యముల్
శంఖ్యాతీతము కొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన
ప్రేంఖద్భక్తులు వంశకాహళమహా భేరీగజాశ్వావళీ
రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై.

246

తా॥ పాంచజన్య శంఖారావం విన్న జనులు స్వర్ణము, విలువగల వస్త్రములు ఇంకా ఇతర ద్రవ్యములు అపారంగా తీసుకొని వచ్చారు. చూడాలని ఉవ్విళ్ళూరుతూన్న భక్తులు ఆసక్తితో వేణువులు బాకాలు ఊదుతూ, భేరీలు వాయిస్తూ, గజములు అశ్వములు గిట్టల చప్పుళ్ళు ప్రతిధ్వనించగా కృష్ణుణ్ణి చూడాలనే ఆసక్తితో వచ్చారు.

క. బంధులుఁ బౌరులుఁ దెచ్చిన, గంధేభ హయాదులైన కానుకలు దయా
సింధుఁడు గైకొనె నంబుజ, బంధుఁడు గొను దత్త దీప పంక్తులభంగిన్.

247

తా॥ బంధువులు పౌరులు తెచ్చిన ఏనుగులు, గుర్రములు మొదలైన కానుకలను దయాసింధువైన కృష్ణుడు భక్తులు అర్పించే దీప పంక్తులను సూర్య భగవానునివలె గైకొన్నాడు.

వ. ఇట్లాత్మారాముండును బూర్ణకాముండునైన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గద భాషణంబులతోడ దయ్యకుండ నడపునయ్యకు నెయ్యంపుఁ జూపుల నడ్డంబు లేని బిడ్డల చందంబున మ్రొక్కి యిట్లనిరి.

248

తా॥ ఈ విధంగా ఆత్మారాముడు, పూర్ణకాముడు అయిన ఆ పరమేశ్వరునికి కానుకలిస్తూ వికసించిన ముఖములు కలవారు, గద్గద భాషణములు కలవారు అయిన ద్వారకావాసులు స్నేహపూరిత దృక్కులతో చిన్న బిడ్డలవలె మ్రొక్కి ఇలా అన్నారు:

శా. నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసార సం
తాపధ్వంసినియౌఁ గదా, సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతుఁ గదా, ప్రపన్నులకుఁ గాలాధీశ కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్.

249

తా॥ "స్వామీ! పద్మముల వంటి నీ పాదములు బ్రహ్మకుసైతం పూజనీయం కదా! నీ సేవ సంసార దుఃఖాన్ని పోగొడుతుంది. భక్తిపరులు అయిన శరణాగతులకు సకలమైన భద్రములు ప్రీతితో ఆపాదిస్తావు గదా! నువ్వు కాలానికి అధీశ్వరుడవు. కాలంలో జీవరాశి పనులు చేస్తుందేగాని కాలము నిర్వ్యాపారం గదా! నిన్ను బ్రహ్మాదులు సైతం వర్ణింపలేరు.

క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీ ప్రతాప విక్రమకథలన్
మన్నారము ధనికులమై, కన్నారము తావకాంఘ్రి కమలములు హరీ!

250

తా॥ ఓ హరీ! మేము సుఖంగా ఉన్నాం. నీ విజయ గాథలను విన్నాం! సంపన్నులమై ఉన్నాము. నీ పాదకమలములను కన్నాం!

క. ఆరాటము మది నెఱుగము, పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ
జోరాటన మెగయదు నీ, దూరాటన మోర్వలేము తోయజనేత్రా!

251

తా॥ ఓ పద్మనేత్రా! మా మనస్సులలో ఏ విధమైన పరితాపము లేదు. మా గృహములలో ఏ విధమైన కలతలు లేవు. నగరంలో ఎక్కడా దొంగతనాలు లేవు. అయినా నీ వియోగాన్ని ఓర్వలేము.

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివిఁ దల్లివిం బతివి దైవమవున్ సఖీవిన్ గురుండ; వే
తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరి. వేల్పు లైన నో
తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మా విధంబునన్.

252

తా॥ ఓ దేవదేవ! నువ్వు తండ్రులకందరకు తండ్రి అయిన ధాతకు తండ్రివి! నీవు మా అందరికి తండ్రివి తల్లివి పతివి సఖుడవు గురుడవు దైవానివి. కన్న తండ్రులు సైతం నీవలె ప్రజలను ధన్యులుగా చెయ్యలేదు. దేవతలు సైతం మావలె నీ ముఖాంబుజమును వీక్షించి ధన్యులు కాలేరు.

క. చెచ్చెర ఁగరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ
వెచ్చోటికి విచ్చేయక, మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్.

253

తా॥ ప్రభూ! నువ్వు హస్తినాపురికి వెళ్ళిన ఒక్క నిముషమైనా మాకు వేయి ఏండ్లవుతుంది. నీవు ఎక్కడికీ వెళ్ళకుండా ఈ ద్వారకానగరంలోనే ఉండు తండ్రీ!

ఆ. అంధకారవైరి యపరాద్రి కవ్వలం, జనిన నంధమయిన జగముభంగి
నిన్నుఁ గానకున్న నీరజలోచన! యంధతమస మతుల మగుదు మయ్య.

తా॥ భానుడు పడమటి కొండకు అవతలికి వెళ్ళినప్పుడు ఈ జగత్తంతా అంధకారంలో మునిగి పోతుంది. నువ్వు కనిపించకపోతే మేము కటిక చీకటిలో పడి కొట్టుకుంటాము."

వ. అని యిట్లు ప్రజలాడెడి భక్తియుక్త మధుర మంజులాలాపంబులు గర్ణకలాపంబులుగా నవధరించి, కరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచుఁ దనరాక విని మహానురాగంబున సంరంభ వేగంబుల మజ్జనభోజనశయనాది కృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న సాంబ చారుదేష్ణ గద ప్రముఖ యదుకుంజరులు కుంజర తురగ రథారూఢులై దిక్కుంజరసన్నిభంబయిన యొక్క కుంజరంబు ముందట నిడుకొని, సూతమాగధ నట నర్తక వందిసందోహంబుల మంగళ భాషణంబులును, భూసురాశీర్వాద వేదఘోషణంబులును, వీణావేణు భేరీపటహశంఖ కాహళ ధ్వానంబులును, రథారూఢ విభూషణ భూషిత వార యువతీ గానంబులును, నసమానంబులై చెలంగ నెదురుకొని యథోచిత ప్రణామాభివాదన పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం దానును భుజగేంద్ర పాలితంబైన భోగవతీనగరంబు చందంబున స్వ సమాన బల యదు భోజ దాశార్హ కుకు రాంధక వృష్ణివీరపాలితంబును, సకల కాల సంపద్యమానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫలమంజరీపుంజ భార వినమిత లతా పాదపరాజ విరాజితోద్యానమహావనోపవనారామ భాసితంబును, వనాంతరాళ రసాల సాల శాఖాంకుర ఖాదనక్షుణ్ణకషాయ కంఠ కలకంఠ మిథునకోలాహల ఫల రసాస్వాద పరిపూర్ణ శారికా కీరకులకలకల కహ్లార పుష్పమకరంద పాన పరవశ భృంగభృంగీకదంబ ఝుంకారసరోవర కనకకమల మృదులకాండ ఖండస్వీకారమత్త వరాటాయత్త కలహంసనివహ క్రేంకారసహితంబును, మహోన్నతసౌధజాల రంధ్ర నిర్గతకర్పూర ధూపధూమపటల సందర్శన సంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముద్ధతపింఛ నర్తనప్రవర్తమాన

మత్తమయూరకేకారవ మహితంబును, నానారూపతోరణధ్వజ వైజయంతికా నికాయ నిరుద్ధతారకాగ్రహప్రకాశంబును, ముక్తాఫల విరచితరంగవల్లి కాలంకృత మందిరద్వార దేహళీవేదికా ప్రదేశంబును ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గేహగేహళీ నికర కనకగళంతికా వికీర్యమాణ సలిలధారా సంసిక్తవిపణి మార్గంబును బ్రతినివాస బహిరంగణ సమర్పిత రసాలదండ ఫలకుసుమ గంధాక్షత ధూపదీప రత్నాంబరాది వివిధోపహార వర్గంబును, బ్రవాళనీలమరకతవజ్ర వైదూర్య నిర్మిత గోపురాట్టాలకంబును, విభవనిర్జిత మహేంద్రనగరాలకంబును నైన పురవరంబుం బ్రవేశించి రాజమార్గంబున వచ్చు సమయంబున.

255

తా॥ అని ఇట్లా ప్రజల యొక్క భక్తితో కూడుకొన్న మధుర మంజులాలాపాలను వీనుల విందుగా విన్నాడు. కరుణారసంతో కూడిన క్రీగంటి చూపులను వర్షిస్తూ సంతోషిస్తూ తన రాకను విని వేగిర పాటుతో స్నానం, భోజనం, శయనము ఇత్యాది పనులన్నీ మానుకొని ఉగ్రసేనుడు, అక్రూరుడు, వసుదేవుడు, బలభద్రుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుదేష్ణుడు, గదుడు మొదలుగాగల ప్రముఖులైన యదుకుంజరులు ఏనుగులు గుర్రములు రథములు వీటిని అధిరోహించినవారై, ఐరావతం వంటి ఒక భద్రగజాన్ని ముందుంచుకొని సూతులు, మాగధులు, నటులు, నర్తకులు వందిమాగధులు వీరి మంగళ భాషణములతో, బ్రాహ్మణుల ఆశీర్వాద వేద ఘోషలతో, వీణ, వేణువు, భేరి, తప్పెట, శంఖము, కాహళము మొదలయిన వాద్య ధ్వనులతో భూషణములు ధరించి రథములను అధిరోహించి గానం చేస్తున్న వారవనితలతో ఎదురు వస్తున్నారు. వారందరినీ కృష్ణుడు యథోచితంగా ప్రణామములతో నమస్కారములతో కౌగిలింతలతో చేయి కలపటంతో పలకరింపులతో చిరునవ్వుతో చూపులతో బహుమానం చేశాడు. వారితో కూడి నాగరాజుచే పాలింపబడుతూన్న భోగవతీ నగరంవలె తనతో సమానమైన బలపరాక్రమాలు కల యదు భోజ దాశార్హ కుకుర అంధక వృష్ణి వీరులచే సంరక్షింపబడుతూన్న ద్వారకా నగరాన్ని ప్రవేశించాడు శ్రీకృష్ణుడు.

ఆ మహా నగరం సకల కాలముల యందు అంకురములతో, పల్లవములతో, మొగ్గలతో, అరవిరిసిన మొగ్గలతో, పూలతో, పండ్లగుత్తులతో వాటి భారంతో వంగిన లతలతో వృక్షములతో కూడిన ఉద్యాన వనములతోను మహావనములతోను ఉపవనములతోను రాజిల్లుతూన్నది. ఆ వనముల మధ్య మామిడి గున్నల చిగుళ్ళను కొరికి జీర వదిలించుకున్న కంఠంతో కుహూ నినాదాలతో కోయిలలు చెలరేగిపోతున్నాయి. ఫలరసాలను తృప్తిగా ఆస్వాదించి గోరువంకలు చిలుకలు కలకల ధ్వనులు చేస్తున్నాయి. వికసించిన కలువ పువ్వుల మకరందాన్ని పానం చేసి తుమ్మెద సమూహం పరవశించి ఝుంకారం చేస్తున్నాయి. సరోవరాలు బంగారు తామర తూండ్లను తిని మదించిన కలహంసలతో కూడి ఉన్నాయి. ఉన్నతములయిన మేడల గవాక్షముల నుండి బయటకు వస్తూన్న కర్పూర ధూపాలను చూసి జలధరములనే భ్రాంతిచే పింఛములు విప్పి నర్తనం చేస్తూన్న మదించిన నెమళ్ళ కేకలు చెవులకు ఇంపుగా ఉన్నాయి. అనేక రూపముల తోరణములతో ధ్వజములతో టెక్కెములతో... అవన్నీ కలసి తారకాగ్రహ ప్రకాశాన్ని అడ్డుకొంటున్నాయి. మంచి ముత్యములతో కూడిన ముగ్గుల చేత అలంకరింపబడిన మందిర ద్వారములు ఇండ్ల గడపలు వేదికలు వెలుగొందుతున్నాయి. కర్పూరము చందనము కస్తూరి వీటి సువాసనలు చిమ్మే వర్తకుల గృహముల ద్వారబంధాలు, బంగారు ధారాపాత్రలు చల్లుతున్న సలిల ధారలతో తడిసిన రాజమార్గములు, ప్రతి నివాస ప్రాంగణంలోను సమర్పించిన చెరకు గడలు, ఫలములు, పువ్వులు, గంధము, అక్షతలు, ధూపము, దీపము, రత్నాంబరములు మొదలయిన కానుకలు కనువిందు చేస్తున్నాయి. పగడాలతో, నీలములతో, మరకతములతో, వజ్రములతో, వైడూర్యములతో నిర్మితమైన గోపురములు బురుజులు అన్నీ ప్రకాశిస్తున్నాయి. ఆ నగరం వైభవంలో దేవేంద్రుని అలకాపట్టణాన్ని తిరస్కరిస్తూన్నట్లు ఉంది. శ్రీకృష్ణుడు ఆ రాజమార్గం నుండి వస్తున్నాడు.

మత్త. కన్నులారఁగ నిత్యమున్ హరిఁ గాంచుచున్ మనువారల
య్యు న్నవీన కుతూహలోత్సవయుక్తి నాగర కాంతల
త్యున్నతోన్నతహర్మ్య రేఖల నుండి చూచిరి నిక్కి చే

సన్నలం దమలోనఁ దద్విభు సౌకుమార్యము సూపుచున్.

256

తా॥ కన్నులార ప్రతి నిత్యము హరిని చూస్తూ ఉంటూన్న వాళ్ళే అయినప్పటికి క్రొత్త వాళ్ళను చూస్తూన్నట్లు ఆ నగరంలోని కాంతలు మిక్కిలి ఉన్నతమైన మేడల మీద నుండి తమ చేతి సంజ్ఞలతో కృష్ణుని సౌకుమార్యాన్ని ఒకరికొకరు చూపుకొంటూ దర్శించారు.

సీ. కలుముల నీనెడు కలకంఠి యెలనాఁగ వర్తించు నెవ్వాని వక్షమందు!
జనదృక్చకోరసంఘంబునకు సుధా పానీయపాత్రమే భవ్యముఖము!
సకలదిక్పాలకసమితికి నెవ్వాని బాహుదండంబులు పట్టుఁగొమ్మ!
లాశ్రితశ్రేణి కే యధిపుని పాదరాజీవ యుగ్మంబులు చేరుగడలు!

ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ, డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర
రాజమాన లగుచు రాజమార్గంబున, రాజముఖులు గుసుమరాజిఁ గురియ.

257

తా॥ కలిమిని కురిపించే కలకంఠి ఎవని వక్షఃస్థలమందు వర్తిస్తూ ఉంటుందో, జనుల యొక్క చూపులనే చకోర సంఘమునకు ఎవని యొక్క ముఖము అమృత పానీయ పాత్రయో, సకల దిక్పాలకులకు ఎవని బాహుదండములు పట్టుకొమ్మలో, ఆశ్రిత సమూహానికి ఏ మహానుభావుని పాదపద్మములు శరణ్యమో, ఎవడు భువన మోహనుడు పురాణపురుషుడో అట్టి శ్రీకృష్ణుడు మేడలమీద నుండి చంద్రవందనలు కుసుమ సమూహాన్ని కురిపిస్తూండగా రాజమార్గంలో నుండి వెళ్ళాడు.

మ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ జామరం
బులతోఁ బుష్ప పిశంగచేలములతో భూషామణీ స్ఫీతుఁడై
నలినీబాంధవుతో శశిధ్వజముతో నక్షత్ర సంఘంబుతో

బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్.

258

తా॥ ధవళచ్ఛత్రంతో చామరములతో పుష్పములతో పీతాంబరములతో మణిభూషణములతో వెలుగొందే పద్మనేత్రుడయిన శ్రీకృష్ణుడు పద్మబాంధవునితో చంద్ర ధ్వజముతో తారకా సమూహంతో ఇంద్రధనుస్సుతో మెరుపు తీగతో కూడిన మేఘం వలె ఉన్నాడు.

వ. ఇట్లరిగి తల్లిదండ్రుల నివాసంబు సొచ్చి దేవకీ ప్రముఖలయిన తల్లుల కేడ్వురకు మ్రొక్కిన.

259

తా॥ ఇట్లా తల్లిదండ్రుల నివాసములలోనికి వెళ్ళి దేవకి ప్రముఖులయిన ఏడుగురు తల్లులకు మ్రొక్కాడు.

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నుల తుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా!

260

తా॥ ఆ తల్లులకు బిడ్డడైన కృష్ణుడు మ్రొక్కగా తల్లులు ఆయనను తమ తొడలపై కూర్చుండపెట్టుకుని వక్షోజములలో పాలు పొంగి పొరలగా ప్రేమతో, ఆనందాశ్రువులతో అభిషేకించారు.

## శ్రీకృష్ణుడు అంతఃపురకాంతలను చూడబోవుట

వ. తదనంతరంబ యష్టోత్తరశతషోడశ సహస్ర సౌధకాంతంబయిన శుద్ధాంతభవనంబు సొచ్చి హరి దన మనంబున.

261

తా॥ అనంతరం హరి పదహారు వేల నూట ఎనిమిది సువర్ణ సౌధములతో కూడిన శుద్ధాంత భవనంలోనికి ప్రవేశిస్తూ తన మనస్సులో ఇలా అనుకున్నాడు:

మ. ఒక భామా భవనంబు మున్ను సొర వేఱొక్కర్తు లోఁగుందునో!
సుకరాలాపము లాడదో! సొలయునో! సుప్రీతి నీక్షింపదో!
వికలత్వంబున నుండునో! యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా!

262

తా॥ 'ఒక భామా భవనంలోకి ముందు వెడితే వేరొక్కతె లోపల బాధపడుతుంది. హాయిగా మాట్లాడదు. వైముఖ్యం చెందుతుంది. ప్రీతితో నా వైపు చూడదు. మనస్సు వికలత్వాన్ని పొందుతుంది.' అని ఈ విధంగా సందేహిస్తూ ఆశ్చర్యంగా అందరికి అన్ని రూపాలలోను వారి వారి గేహములలోనికి ఒక్కసారే ప్రవేశించాడు.

వ. ఆ సమయంబున

263

తా॥ ఆ సమయంలో హరిని చూసారు.

క. శిశువులఁ జంకల నిడి తను, కృశతలు విరహాగ్నిఁ దెలువ గృహగేహళులన్ రశనలు

జాఱఁగ సిగ్గున, శశిముఖు లెదురేఁగి రపుడు జలజాక్షునకున్.

264

తా॥ చూసి శిశువులను చంకన పెట్టుకుని విరహాగ్నిచే శరీరం కృశించిపోగా మొలనూలు జారిపోగా ఆ చంద్రవదనలు అందరూ కృష్ణునకు ఎదురు వెళ్ళారు.

మ. పతి నాయింటికి మున్ను వచ్చె, నిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహా
గతుఁడయ్యెన్ మును సేరెఁబో తొలుత మత్కాంతుండు నాశాలకే
నితరాలభ్య సుఖంబు గంటి నని తా రింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁ బదాఱు వేలు నెనమంద్రవ్వేళ నాత్మేశ్వరున్.

265

తా॥ 'నా ప్రాణేశ్వరుడు నా ఇంటికే ముందు వచ్చాడు. నా భర్త నా ఇంట్లోకే అడుగు పెట్టాడు. మొట్టమొదట నా గృహానికి చేరుకున్నాడు. నా కాంతుడు నా శాలకు వచ్చి ఇతరులకు అలభ్యమైన సుఖాన్ని ఇచ్చాడు' అని ఎవరికి వారే పదహారు వేల నూట ఎనిమిది మంది తమ ప్రాణనాథుడిని అర్చించారు.

వ. వారలం జూచి హరి యిట్లనియె.

266

తా॥ వాళ్ళని చూసి హరి ఇట్లా అన్నాడు:

మ. కొడుకుల్ భక్తి విధేయు లౌదురు గదా? కోడండ్రు మీ వాక్యముల్
గడవంజాలక యుందురా! విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థరస సందోహంబులుం జాలునా?
కడమల్ గావు గదా? భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే?

తా॥ "మీ కొడుకులు భక్తి విధేయతతో ఉంటున్నారు గదా? మీ కోడళ్ళు మీ వాక్యములను పాటిస్తున్నారు కదా? పండితులను సత్కరిస్తున్నారా? మీకు నగలు, వస్త్రములు, పదార్థములు, పానీయములు... ఇవన్నీ సరిపోతున్నాయి కదా? దేనికీ లోటులేదు కదా? మీ సౌధములన్నీ కల్యాణ పరంపరతో సుఖంగా ఉన్నాయి కదా?

సీ. తిలక మేటికి లేదు తిలకినీతిలకమ? పువ్వులు దుఱుమవా పువ్వుఁబోఁడి?
కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి? తొడవులు దొడువవా తొడవుతొడవ?
కలహంసఁ బెంపుదే కలహంసగామిని? కీరముఁ జదివింతె కీరవాణి?
లతలఁ బోషింతువా లతికా లలితదేహ? సరసి నోలాడుదే సరసిజాక్షి?

ఆ. మృగికి మేఁత లిడుదె మృగశాబలోచన? గురుల నాదరింతె గురువివేక? బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి? యనుచు సతుల నడిగె నచ్యుతుండు.

268

తా॥ తిలకానికి తిలకమైన దానా! నువ్వు తిలకం పెట్టుకోలేదేమి? ఓ పూబోణీ! నవ్వు పువ్వులు ఎందుకు పెట్టుకోలేదు. ఓ కస్తూరి గంధీ! నువ్వు కస్తూరి వ్రాసుకొనలేదేమి? అలంకారములకే అలంకారమైనదానా! నువ్వు నగలు ఎందుకు పెట్టుకోలేదు? రాజహంసలా నడిచే దానా! నువ్వు రాయంచలను పెంచుతున్నావా? ఓ చిలుక వంటి పలుకులు కలదానా! చిలుకలను బాగా చదివిస్తున్నావా? లతవంటి దేహం కలదానా! నువ్వు లతలను చక్కగా పోషిస్తున్నావా? పద్మముల వంటి కన్నులు కలదానా! సరస్సులో హాయిగా జలకాలాడుతున్నావా? లేడి కన్నుల వంటి కన్నులు కలదానా! లేళ్ళకి మేత పెడుతున్నావా? ఓ వివేకం కలదానా! గురువులను గౌరవిస్తున్నావు కదా? బంధుజనులకు చింతామణి వంటిదానా! బంధు జనులను ఆదరిస్తున్నావా?" అంటూ అందరు సతులను అడిగాడు శ్రీకృష్ణుడు.

వ. అని యడిగిన వారలు హరిం బాసిన దినంబులందు శరీరసంస్కార కేళీ విహార హాస
వన మందిర గమనమహోత్సవ దర్శనంబు లొల్లని యిల్లాండ్రు కావున.

269

తా॥ అని అడిగేసరికి హరి దూరంగా ఉన్న రోజుల్లో వారు శరీర సంస్కారములు, కేళీ విహారములు, పరిహాసములు, వనానికి వెళ్ళటం... ఇట్లాంటివి ఏమీ ఇష్టపడని ఇల్లాండ్రు వారు.... కావున—

మ. సిరి చాంచల్యముతోడిదయ్యుఁ దనకున్ జీవేశ్వరుం డంచుఁ నే
పురుష శ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ కల్యాణ బాష్పంబు లా
భరణ శ్రేణులుగాఁ బ్రతిక్షణ నవ ప్రాప్తానురాగంబులన్.

270

తా॥ లక్ష్మీదేవి తనకు జీవితేశ్వరుడని ఏ పురుష శ్రేష్ఠున్ని వరించిందో అటువంటి పరమేశ్వరుణ్ణి బుద్ధితో చూపులతో పిమ్మట రెండు చేతులతో కౌగిలించుకున్నారు సతులు. వారి కన్నులవెంట కారే కల్యాణ బాష్పములే ఆభరణాలుగా ప్రతిక్షణము వారికి ప్రాప్తించిన అనురాగంతో సంతోషంగా ఉన్నారు.

మత్త. పంచబాణుని నీఱు సేసిన భర్గునిం దనవిల్లు వ
ర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేష హాస విలోకనో
దంచిదాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవున్
సంచలింపఁగఁ జేయ నేమియుఁ జాలరైరి బుధోత్తమా!

271

తా॥ ఓ బుధోత్తమా! మన్మథుణ్ణి బూడిద చేసిన శివుణ్ణి తన విల్లు విడిచి మూర్ఛలో

మునిగేటట్లు చెయ్యగలిగిన వారు కాంతలే. అట్టి మగువలు విశేషమైన హాసము వాల్చూపులూ కలిగి సుందరమైన దేహములు కలవారయ్యు వారి శృంగార విలాసాల చేత మాధవుని మనస్సును చలింపచేయలేక పోయారు.

వ. ఇవ్విధంబున సంగరహితుండైన కంసారి సంసారి కైవడి విహరింప నజ్ఞాన విలోకులయిన లోకులు లోక సామాన్య మనుష్యుండని తలంతు, రాత్మాశ్రయయైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందకయుండుఁ, బరస్పరసంఘర్షణంబులచే వేణువుల వలన వహ్నిఁ బుట్టించి వనంబుల దహించు మహావాయువు చందంబున భూమికి భారహేతువులై యనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజుల కన్యోన్య వైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబు సేసి, శాంతుండై పిదపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుండునుం బోలెఁ సంచరించుచుండె నా సమయంబున.

272

తా॥ ఈ విధంగా దేనితోనూ సంబంధం లేకుండ కృష్ణ పరమాత్మ సంసారివలె విహరిస్తూంటే అజ్ఞానం చేత నిండిపోయిన లోకులు అతడిని సామాన్య మానవునిగానే తలుస్తారు. ఆత్మాశ్రయ అయిన బుద్ధి ఆత్మయందున్న ఆనందము ఇత్యాది వాటితో ఏ విధంగా కలియదో ఆ విధంగానే ఈశ్వరుడు ప్రకృతితో కలిసినా ఆ ప్రకృతి గుణములయిన సుఖ దుఃఖములను పొందడు. పరస్పర సంఘర్షణ వలన అడవిలో, వెదురు డొంకలలో అగ్ని పుట్టి ఆ అడవిని దహిస్తుంది. దానికి మహా వాయువు తోడవుతుంది. భూమికి భారంగా అనేక అక్షౌహిణుల సైన్యంతో అనేకమంది రాజులకు అన్యోన్యం శత్రుత్వం కల్పించి తాను మాత్రం నిరాయుధుడై అందరినీ సంహరించాడు. పిదప శాంతుడై శ్రీకృష్ణుడు కాంతాజన మధ్యంలో కేవలం సామాన్య మనుష్యునివలె సంచరిస్తున్నాడు.

క. యతు లీశ్వరుని మహత్త్వము, మిత మెఱుఁగని భంగి నప్రమేయుఁడగు హరి స్థితి
నెఱుఁగక కాముకుఁడని, రతములు సలుపుదురు తిగిచి రమణులు సుమతీ!

273

తా॥ ఓ సుమతీ! యతులు ఈశ్వరుని మహత్త్వం తెలుసుకోలేరు. ఆ విధంగానే అప్రమేయుడైన హరి యొక్క స్థితి తెలుసుకోకుండా కేవలం కాముకుడని రమణులు అతనితో క్రీడిస్తూ ఉంటారు.

క. ఎల్లప్పుడు మా యిండ్లను, వల్లభుఁడు వసించు, నేమ వల్లభలము శ్రీ
వల్లభున కనుచు గోపీ, వల్లభుచే సతులు మమత వలఁ బడి రనఘా!

274

తా॥ ఓ అనఘా! ఎల్లప్పుడూ మా ఇండ్లలోనే ఉంటాడు కృష్ణుడు. మేము అతనికి చాలా ఇష్టులం. శ్రీ వల్లభునకు మేము చాలా ప్రియమైనవారం అని కృష్ణునిచే అతని మాయలో చిక్కుకున్నారు... వారందరు."

వ. అని చెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె.

275

తా॥ ఇంత వరకు చెప్పిన సూతుని మాటలు విని శౌనకుడు ఇలా అన్నాడు:

## ఉత్తరకు పరీక్షిత్తు జన్మించుట

సీ. గురునందనుండు సక్రోధుఁడై యేసిన, బ్రహ్మశిరో నామబాణవహ్నిఁ
గంపించు నుత్తరగర్భంబుఁ గ్రమ్మఱఁ, బద్మలోచనుచేత బ్రదికె నండ్రు,
గర్భస్థుఁడగు బాలుఁ గంసారి యేరీతి, బ్రతికించె మృత్యువు భయము వాపి
జనియించి యతఁ డెన్ని సంవత్సరము లుండె?, నెబ్భంగి వర్తించె? నేమి సేసె?

ఆ. వినుము శుకుఁడు వచ్చి విజ్ఞాన పద్ధతి, నతని కెట్లు సూపె? నతఁడు పిదపఁ
దన శరీర మే విధంబున వర్జించె? విప్రముఖ్య! నాకు విస్తరింపు.

276

తా॥ “ఓ విప్రోత్తమా! అశ్వత్థామ క్రోధంతో ప్రయోగించిన బ్రహ్మశిరో నామ బాణాగ్నికి కంపించిపోతున్న ఉత్తర గర్భం తిరిగి కృష్ణుని దయవల్ల బ్రతికింది అని చెపుతారు కదా! గర్భంలో ఉన్న బాలుడిని వాసుదేవుడు మృత్యుకోరల నుండి ఎలా రక్షించాడు? అలా రక్షింపబడిన ఆ బాలుడు ఈ భూమిపై ఎన్ని సంవత్సరాలు జీవించాడు? అతడు ఎలాంటివాడు? ఏమి సాధించాడు? అనంతరం ఆయన తన తనువును ఎలా చాలించాడు? ఆ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పు.”

వ. అనిన సూతుం డిట్లనియె. దర్మనందనుండు చతుస్సముద్ర ముద్రితాఖిల జంబూ ద్వీపరాజ్యంబు నార్జించియు, మిన్ను ముట్టిన కీర్తి నుపార్జించియు, నంగనాతురంగమాతంగ సుభట కాంచనాది దివ్యసంపదలు సంపాదించియు, వీరసోదర విప్ర విద్వజ్జన వినోదంబులఁ బ్రమోదించియు, వైభవంబు లలవరించియుఁ గ్రతువు లాచరించియు, దుష్టశిక్షణ శిష్టరక్షణంబు లొనరించియు, ముకుంద చరణారవింద సేవారతుండై సమస్త సంఘంబులందు నఖిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి, రాజ్యంబు సేయుచు.

277

తా॥ అప్పుడు సూతుడు ఇలా అన్నాడు: "ధర్మరాజు నాలుగు సముద్రాల మధ్యగల జంబూద్వీపానికి సార్వభౌముడు అయ్యాడు. అంగనలు, గుర్రాలు, ఏనుగులు, భటులు, కాంచనము.... ఇత్యాది దివ్యసంపదలను సంపాదించాడు. వీరులైన సోదరులు విప్రులు విద్వజ్జనులు... వీరితో విద్యావినోదాలతో ప్రమోదాన్ని పొందాడు. వైభవాన్ని పొందాడు. అనేక క్రతువులను ఆచరించాడు. దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించాడు. ముకుందుని పాదపద్మాలను సేవించుటయందే ఆసక్తుడై మిగతా విషయములయందు అభిలాషను వర్జించాడు. కామక్రోధాది అరిషడ్వర్గములను జయించి రాజ్యపరిపాలన చేస్తున్నాడు.

తే. చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు, దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద, సేవనంబులఁ పరిపూర్తి సెందకుండె.

278

తా॥ చందనాదుల చర్చతో ఆకలితో బాధపడేవాడు సంతుష్టి పొందని విధంగా పెక్కు సంపదలు ఉన్నా విష్ణుపాద సేవారతుడయిన ధర్మరాజు పరిపూర్తి చెందలేదు.

వ. అంతం గొన్ని దినంబులకు నభిమన్యు కాంతాగర్భంబునందున్న డింభకుండు దశమమాసపరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు.

279

తా॥ అంత కొన్ని రోజులు గడిచేసరికి అభిమన్యుని భార్య గర్భంలో ఉన్న శిశువు పదినెలలు నిండేసరికి అశ్వత్థామ ప్రయోగించిన బాణాగ్నిచేత అంతులేని బాధపడుతూ తల్లడిల్లి పోతూ ఇలా ఆక్రోశించసాగాడు:

ఉ. కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్న వాఁడ ది
క్కెయ్యది? దానవాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నే

డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావ నే
యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా!

280

తా॥ "భగవంతుడా! ఏడవటానికి కూడా ఓపిక లేదు. తల్లి కడుపులో కదల లేకుండా పడి ఉన్నాను. తాను అనాథను అని ఎప్పుడూ తల్లి ఏడుస్తూ ఉంటే నేను వింటున్నాను. ఈ బాణాగ్ని నుండి తప్పించుకోవడానికి మార్గం ఏమిటి? నన్ను రక్షించే శక్తి ఏది? మాతృ గర్భంలో నేను పడుతూన్న బాధ ఎవరికి తెలుస్తుంది?

క. చిచ్చఱకోలవశంబునఁ, జచ్చి బహిర్గతుఁడఁ గాని సమయమునను దాఁ
నుచ్చలితగర్భవేదనఁ, జచ్చును మా తల్లి ఘోర సంతాపమునన్.

281

తా॥ ఈ బాణాగ్ని వలన నేను మరణించి బయటకురాని సమయంలో గర్భవేదనచే ఘోర సంతాపాన్ని పొందుతూ నా తల్లి ప్రాణాలు కోల్పోతుంది.

క. చెచ్చెర బాణజ్వాలలు, వచ్చిన విష్ణుండు గావవచ్చు ననుచుఁ దా
ముచ్చటలు సెప్పు సతులకు, నిచ్చలు మాయవ్వ నేఁడు నిజమయ్యెడినో!

282

తా॥ బాణజ్వాలలు నా ప్రాణం తియ్యడానికి వస్తే వెంటనే శ్రీమహావిష్ణువు రక్షించడానికి వస్తాడు అని మా అమ్మ ముచ్చటలు చెప్పే సతులకు చెప్పేది, ఆ మాట నేడు నిజమవుతుందా!

శా. రాఁడా? చూడ, సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా? పాఱుని చిచ్చఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా
కీఁడా? నేఁడభయప్రదాన! మతఁ డూహింపన్ నతత్రాత మున్

గాఁడా? యెందఱిఁ గావఁడీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో!

283

తా॥ నా కష్టాలు చూసి నన్ను రక్షించలేడా! సమస్త భూతముల యందు అంతర్యామి స్వరూపంగా ఉండేవాడు ఇక్కడ లేడా? బ్రాహ్మణుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రాన్ని తప్పించి నేడు నాకు అభయ ప్రదానాన్ని ఈయడా! అతడు ఎందరిని కాపాడలేదు. నా కర్మ ఎలా ఉందో!"

వ. అని గతా గతప్రాణుండై భ్రూణగతుండైన శిశువు చింతించు సమయంబున.

284

తా॥ అని వచ్చేపోయే ప్రాణాలతో ఉత్తర కడుపులో ఉన్న శిశువు చింతిస్తున్నాడు.

సీ. మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగు కైవడి మేని, పైనున్న పచ్చని పటమువాఁడు
గండభాగంబులఁ గాంచన మణి మయ, మకరకుండల కాంతి మలయువాఁడు
శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి, కన్నుల నునుఁగెంపు కలుగువాఁడు
బాలార్కమండల ప్రతిమాన రత్నహా, టక విరాజిత కిరీటంబు వాఁడు

తే. కంకణాంగద వనమాలికా విరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ డొక్క గదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె నవ్వేళయందు.

285

తా॥ మేఘం మీద మెఱుపు తీగ లాగా నల్లని శరీరం మీద పచ్చని చేలం ఒప్పుతూ ఉన్నది. చెక్కిళ్ళపైన బంగారము, రత్నకుండలములతో కూడిన మకర కుండలముల కాంతి ప్రసరిస్తూన్నది. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్ర సంరంభాన్ని అణగించటం కోసం కన్నులు కొంచెం ఎరుపెక్కాయి. ఉదయ సూర్యుని వంటి కాంతితో రత్నములతో మెరిసిపోయే బంగారు కిరీటం ప్రకాశిస్తూన్నది. కంకణములు, భుజకీర్తులు, వనమాలిక వీటితో విరాజమానుడై,

అసమానుడై అంగుష్ఠమాత్ర దేహంతో ఒక గద ధరించి కన్నుల పండువుగా విష్ణువు ఆ శిశువు ముందు ఆవిర్భవించాడు.

వ. ఇట్లు భక్త పరాధీనుండయిన పరమేశ్వరుం డావిర్భవించి మంచు విరియించు మార్తాండు చందంబున శిశువునకు దశదిశలం దనచేతి యఖండిత మహోల్కాసన్నిభంబైన గదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱం ద్రిప్పి విప్రుని చిచ్చఱమ్ము వేఁడిమి పోఁడిమిఁ జెఱచి, డింభకుని పరితాపవిజృంభణంబు నివారించి, గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబు గల్పించిన.

286

తా॥ ఈ విధంగా భక్త పరాధీనుడైన పరమేశ్వరుడు ఆవిర్భవించి మంచును చెదరగొట్టే సూర్యుని విధంగా శిశువుకు పరిదిక్కులనుండి అశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రము యొక్క వేడిమి తగులకుండా ఉల్కతో సమానమైన తన గదాదండాన్ని మండలాకారంగా గిరగిర త్రిప్పాడు – గర్భం కందకుండా శిశువుకు ఆనందాన్ని కల్పించాడు.

మ. గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులన్ దుర్భయ
ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ
సదయుం డెవ్వఁడొకో! యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా!

287

తా॥ "ఆ గదను చేతిలో పట్టుకొని గిరగిర తిరుగుతూ; భయాన్ని కలిగిస్తూ వచ్చే బాణాగ్నిని గదచేత ముక్కలు ముక్కలు అయ్యేటట్లు విరిచి రక్షించే ఈ దయామయుడు ఎవ్వరో?" – అని మనస్సులో చర్చించుకుంటూ శిశువు ఎదురు చూస్తూ ఉండగానే హరి అదృశ్యుడయ్యాడు.

వ. అంత ననుకూల శుభగ్రహోదయంబును, సర్వగుణోత్తర ఫలసూచకంబును నైన శుభలగ్నంబునం బాండవ వంశోద్ధారకుం డయిన కుమారుఁడు జన్మించిన, ధర్మనందనుండు ధౌమ్యాది భూసుర వర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి జాతకర్మంబు సేయించి, కుమారు జన్మ మహోత్సవ కాలంబున భూసురులకు విభవాభి రామంబు లయిన గో భూ హిరణ్య హయానేక గ్రామంబులును స్వాదు రుచి సంపన్నంబు లయిన యన్నంబు లిడిన వారలు తృప్తులై ధర్మపుత్త్రున కిట్లనిరి.

288

తా॥ అంత గ్రహములన్నీ శుభస్థితిలో ఉండగా మంచి శుభలగ్నంలో పాండవ వంశాన్ని ఉద్ధరించే కుమారుడు పుట్టాడు. ధర్మరాజు ధౌమ్యుడు మొదలైన భూసురులను రప్పించి పుణ్యాహవాచనం చేయించి పుత్రోదయ కార్యక్రమాన్ని వైభవంగా జరిపించాడు. బ్రాహ్మణోత్తములకు వైభవంగా గోవులు, భూమి, బంగారము, అశ్వములు, గ్రామములు ఇచ్చాడు. షడ్రసోపేతమైన భోజనం పెట్టిస్తే వారు తృప్తిగా భుజించి ధర్మరాజుతో ఇట్లా అన్నారు:

చ. ప్రకటిత దైవ యోగమునఁ బౌరవ సంతతి యంతరింపఁగా వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా బకు బ్రదికించెఁ గావున నృపాలక! శాబకుఁ డింక శాత్రవాం తకుఁ డగు, విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై.

289

తా॥ "మహారాజా! దైవయోగం చేత భారతవంశం అంతరించి పోకుండా విష్ణువు అనుగ్రహించి ఈ శిశువును బ్రతికించాడు. కనుక ఈ బాలుడు శత్రువులను అంతం చేస్తాడు. విష్ణువు చేత రక్షింపబడ్డాడు కనుక విష్ణురాతుడనే పేరుతో పూజ్యుడై ప్రసిద్ధికెక్కుతాడు.

వ. అనిన వినిన భూదేవోత్తములకు నరదేవోత్తముఁ డిట్లనియె.

290

తా॥ అని బ్రాహ్మణులు పలికిన మాటలు విని ధర్మరాజు వారితో ఇట్లా అన్నాడు:

శా. ఓ పుణ్యాత్మకులార! నా పలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్
మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు రాజర్షులై
యీ పిన్నాతఁడు వారిఁ బోలెడిఁగదా! యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదాంబుజ భక్తి యుక్తుఁ డగుచున్ జీవించునే? చూడరే!

291

తా॥ "ఓ పుణ్యాత్ములారా! నా పలుకులు మీరు వినండి! మీకు నమస్కారం! మా పెద్దలు కీర్తికాయులై దయ కలిగిన వారై రాజర్షులై బ్రతికారు. ఈ చిన్నవాడు వారిని పోలతాడా? ఎప్పుడూ మాధవుని పాదాంబుజముల యందు భక్తితో జీవిస్తాడా?

వ. అనిన విని నరేంద్రా! భవదీయపౌత్త్రుండు మనుపుత్త్రుండయిన యిక్ష్వాకుని చందంబునం బ్రజల రక్షించు; శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్య ప్రతిజ్ఞుండు నగు; డేగ వెంట నంటిన బిట్టు భీతంబై వెనుకకు వచ్చిన కపోతంబుఁ గాచిన శిబిచక్రవర్తి రీతి శరణ్యుండును వితరణ ఖనియు నగు; దుష్యంతసూనుండైన భరతు పగిది సోమాన్వయ జ్ఞాతివర్గంబులకు యజ్వలకు ననర్గళ కీర్తి విస్తరించు; ధనంజయ కార్తవీర్యుల కరణి ధనుర్ధరాగ్రేసరుండగుఁ; గీలి పోలిక దుర్ధర్షుం డగు; సముద్రుని తెఱంగున దుస్తరుండగు; మృగేంద్రంబు కైవడి విక్రమశాలి యగు; వసుమతి వోలె నక్షయ క్షాంతి యుక్తుండగు; భానుని లాగునఁ బ్రతాపవంతుండగు; వాసుదేవు వడువున సర్వభూతహితుం డగుఁ; దల్లిదండ్రుల మాడ్కి సహిష్ణుం డగు. మఱియును.

292

తా॥ ఆ మాటలు విన్న బ్రాహ్మణులు "నరేంద్రా! మీ మనుమడు మనువు యొక్క కుమారుడైన ఇక్ష్వాకుని వలె ప్రజలను రక్షిస్తాడు. శ్రీరామచంద్రుని వలె సత్యసంధుడు, చాలా

గొప్పవాడు అవుతాడు. డేగ వెంట తరుమగా భయపడిన పావురానికి అభయమిచ్చిన శిబిచక్రవర్తి వలె దాతయై శరణుపొందిన వారిని రక్షించును. దుష్యంతుని కుమారుడైన భరతునివలె చంద్రవంశానికి కీర్తిని తీసుకొని వస్తాడు. అర్జున, కార్తవీర్యార్జునుల వలె ధనుస్సు పట్టిన వారిలో అగ్రేసరుడు అవుతాడు. సముద్రునివలె అతని మాట ఎవరూ జవదాటలేరు. సింహంవలె విక్రమశాలి అవుతాడు. భూమివలె ఓర్పుకలవాడు అవుతాడు. సూర్యునివలె ప్రతాపవంతుడు అవుతాడు. వాసుదేవుని వలె సర్వభూతములకు హితుడు అవుతాడు. తల్లిదండ్రులవలె హితకరుడు అవుతాడు. అంతేకాదు.....

సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ, బరమప్రసన్నత భర్గుఁ డనఁగ
నెల్ల గుణంబుల నిందిరావిభుఁ డన, నధికధర్మమున యయాతి యనఁగ
ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన, నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ
రాజితోదారత రంతిదేవుం డన, నాశ్రిత మహిమ హేమాద్రి యనఁగ

తే. యశము నార్జించుఁ, బెద్దల నాదరించు, నశ్వమేధంబు లొనరించు, నాత్మసుతుల ఘనులఁబుట్టించు, దండించు ఖలులఁ బట్టి, మానధనుఁడు నీ మనుమఁడు మానవేంద్ర!

293

తా॥ ఇతడు అందరినీ సమంగా దర్శించటంలో విధాత. పరమ ప్రసన్నతలో సాక్షాత్తు శివుడు. అన్ని సుగుణములలోను ఇందిరా విభుడే! అధికమైన ధర్మాన్ని పాటించటంలో యయాతి. ధైర్యసంపదలో బలిచక్రవర్తి. విష్ణుభక్తి యందు ప్రహ్లాదుడు. ఉదారతలో రంతిదేవుడు. ఆశ్రయించిన వారిని ఆదుకోవడంలో సాక్షాత్తు హేమాద్రి. కీర్తిని ఆర్జిస్తాడు. పెద్దలను ఆదరిస్తాడు. అశ్వమేధాలు చేస్తాడు. గొప్పవారైన కొడుకులను పుట్టిస్తాడు. ఖలులను దండిస్తాడు. నీ మనుమడు మానధనుడు అవుతాడయ్యా.

భుజంగ ప్రయాతము.

హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్, భరించున్ ధరన్ రామభద్రుండుఁ బోలెన్

జరించున్ సదా వేద శాస్త్రానువృత్తిన్, వరించున్ విశేషించి వైకుంఠు భక్తిన్.

294

తా॥ కలి ప్రేరితమైన పాపములనన్నిటినీ పోగొడుతాడు. శ్రీరామచంద్రునివలె భూభారాన్ని వహిస్తాడు. వేదశాస్త్రాలలో చెప్పిన విధంగా నడచుకుంటాడు. విశేషించి విష్ణువు అంటే భక్తి ఎక్కువ.

వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి, భూసుర కుమార ప్రేరితం బయిన తక్షక సర్ప విషానలంబునం దనకు మరణంబని యెఱింగి, సంగ వర్జితుండయి ముకుంద పదారవింద భజనంబు సేయుచు, శుకయోగీంద్రుని వలన నాత్మ విజ్ఞాన సంపన్నుండై, గంగాతటంబున శరీరంబు విడిచి, నిర్గత భయశోకం బయిన లోకంబుఁ బ్రవేశించునని జాతకఫలంబు సెప్పి లబ్ధకాములయి భూసురులు సని రంత.

295

తా॥ ఈ విధంగా చాలా సంవత్సరాలు జీవిస్తాడు. బ్రాహ్మణ కుమారుని వలన ప్రేరేపింపబడి తక్షకుడు అనే సర్పం యొక్క విషాగ్ని వలన తనకు మరణం ఉందని తెలుసుకుంటాడు. ఇక దేనితోను కూడిక లేనివాడయి ముకుందుని పదారవిందములను సేవిస్తాడు. శుకయోగి వలన ఆత్మజ్ఞాన సంపన్నుడై గంగానదీ తీరంలో శరీరాన్ని విడిచిపెడతాడు. శోకభయాలు లేని లోకంలోకి ప్రవేశిస్తాడు" అని జాతక ఫలం చెప్పి సంతుష్ట చిత్తులయి భూసురులు వెళ్ళిపోయారు.

క. తన తల్లి కడుపులోపల, మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్న రేంద్రుఁ డంద్రు మునీంద్రా!

296

తా॥ ఓ మునీంద్రా! తన తల్లి గర్భములో తానున్నప్పుడు చూసిన విభుడు ఈ విశ్వమంతా

ఉన్నాడు కదా అని నిత్యము పరీక్షించినందువలన అతనిని "పరీక్షిత్తు" అన్నారు.

ఆ. కళలచేత రాజు క్రమమునఁ బరిపూర్ణుఁ, డయిన భంగిఁ దాత లనుదినంబుఁ
బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ, పటలపాలకుండు బాలకుండు.

297

తా॥ శుక్లపక్షంలో కొత్త కళలచేత చంద్రుడు క్రమంగా పరిపూర్ణుడైనట్లుగా ధర్మరాజాదులచే పెంచబడే ఆ బాలుడు అన్నిటా పూర్ణుడయ్యాడు.

వ. మఱియు ధర్మనందనుండు బంధు సంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయం దలంచి, ప్రజలవలనం గరదండంబుల నుపార్జితంబయిన విత్తంబు సాలక చిత్తంబునఁ జింతించునెడ నచ్యుత ప్రేరితులై భీమార్జునాదులు, దొల్లి మరుత్తుండను రాజు మఖంబు సేసి పరిత్యజించి నిక్షేపించిన సువర్ణ పాత్రాదికంబైన విత్తం బుత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన, నా రాజసత్తముండు సమాయత్త యజ్ఞోపకరణుండై సకల బంధు సమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి, పురుషోత్తము నుద్దేశించి మూఁడు జన్నంబులు గావించెఁ దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబు కొఱకుఁ గరినగరంబునఁ గొన్నినెల లుండి ధర్మ పుత్త్రాదులచే నామంత్రణంబు వడసి, యాదవ సమేతుండయి ధనంజయుఁడు దోడరా నిజనగరంబునకుం జనియె, నంతకు మున్ను విదురుండు తీర్థయాత్ర సని మైత్రేయు ముందటఁ గర్మయోగవ్రతాది విషయంబు లయిన ప్రశ్నంబులఁ గొన్నిటిం జేసి యతని వలన నాత్మ విజ్ఞానంబు దెలిసి, కృతార్థుండై హస్తినాపురంబునకు వచ్చిన.

298

తా॥ ఆపైన ధర్మనందనుడు యుద్ధంలో బంధువులను చంపిన దోషాన్ని పోగొట్టుకోవటం కోసం అశ్వమేధయాగం చెయ్యాలని అనుకొన్నాడు. ప్రజల వలన పన్నుల రూపంలోను, శిక్షల

రూపంలోను వచ్చిన ధనం చాలక మనస్సులో ఆలోచిస్తున్నాడు. శ్రీకృష్ణ ప్రేరితులై భీముడు అర్జునుడు ఇత్యాదులు పూర్వం మరుత్తుడను రాజు యజ్ఞం చేసి మిగిలిన ధనాన్ని సువర్ణ పాత్రలో వేసి ఉత్తర దిక్కున దాచిన సువర్ణాన్ని బలవంతులై తెచ్చారు. అంత ధర్మరాజు యజ్ఞానికి అన్నీ సమీకరించుకొని సకల బంధువులను, కృష్ణుణ్ణి ఆహ్వానించాడు. పురుషోత్తముడయిన శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి మూడు యజ్ఞాలు చేశాడు. పిమ్మట శ్రీకృష్ణుడు బంధువులకు సంతోషాన్ని కలుగచెయ్యటం కోసం కొన్ని నెలలు హస్తినలో ఉన్నాడు. ఆపైన ధర్మరాజాదుల దగ్గర సెలవు పుచ్చుకొని అర్జునుడు తోడురాగా యాదవులతో కలసి ద్వారకకు బయలుదేరాడు. కొంతకాలానికి తీర్థయాత్రలకు బయలుదేరిన విదురుడు, మైత్రేయ ముని సన్నిధి చేరుకొన్నాడు. పరమార్థ జ్ఞానానికి సంబంధించిన విషయాలు తెలుసుకుని కృతార్థుడై హస్తినకు వచ్చి చేరాడు.

క. బంధుఁడు వచ్చె నటంచును, గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం
బంధములు నెఱపి ప్రీతిన్, బంధురగతిఁజేసి రపుడు మన్నన లనఘా!

299

తా॥ బంధువు వచ్చాడనే సంతోషంతో ధృతరాష్ట్రుడు మొదలైన వారందరూ బాంధవ్యాన్ని పురస్కరించుకొని ఎంతో మన్నన చేశారు.

వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాది సత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవార లందఱు విన నిట్లనియె.

300

తా॥ పిమ్మట ధర్మరాజు విదురునికి స్నాన భోజనాది సత్కారములు చేయించి సుఖంగా కూర్చుని అందరూ వింటూండగా ఇలా అన్నాడు:

సీ. ఏ వర్తనంబున నింతకాలము మీరు, సంచరించితి రయ్య జగతిలోన నే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి?, భావింప మీవంటి భాగవతులు తీర్థసంఘంబుల ధిక్కరింతురు గదా,

మీయందు విష్ణుండు మెఱయు కతన మీరు తీర్థంబులు; మీ కంటె మిక్కిలి తీర్థంబు లున్నవె? తెలిసిచూడ

తే. వేఱు తీర్థంబు లవనిపై వెదక నేల, మిమ్ముఁ బొడగని భాషించు మేల చాలు
వార్త లేమండ్రు? లోకులు వసుధలోన, మీకు సర్వంబు నెఱిఁగెడి మేధ గలదు.

301

తా॥ "ఇంతకాలం మీరు ఎక్కడెక్కడ సంచరించారు? ఏ తీర్థములు చూసారు? ఎక్కడ ఉన్నారు? మీ వంటి పరమ భాగవతులు తీర్థాలకు వెళ్ళరు కదా! మీలో విష్ణువు ఉన్నాడు కనుక అన్ని తీర్థాలు మీరే! తెలిసిన వారికి మీకంటే తీర్థాలు లేవు. మీతో మాట్లాడటమే చాలు. లోకంలోని వార్తలు ఏమిటి? మీరు సర్వమూ తెలుసుకోగలరు.

మత్త. తండ్రి సచ్చినమీఁద మా పెదతండ్రిబిడ్డలు దొల్లి పె
క్కండ్రు సర్పవిషాగ్ని బాధల గాసిఁబెట్టఁగ మమ్ము ని
ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా
తండ్రి భంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే?

302

తా॥ మా నాయనగారు చనిపోయిన తరువాత మా పెదతండ్రి బిడ్డలు మమ్మల్ని చాలా బాధలు పెట్టారు. సర్పవిషాన్ని తినిపించారు. మా ఇంటికి నిప్పుపెట్టారు. మేము, మా తల్లి చచ్చిపోకుండా ఎంతో ప్రేమతో మా తండ్రివలె మమ్మల్ని ఉద్ధరించింది మీరే కదా! ఆ విషయం ఎప్పుడైనా తలచుకుంటారా?

క. పక్షులు తమఱెక్కలలోఁ, బక్షంబులు రాని పిల్లపదువుల మమతన్
రక్షించిన క్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే!

303

తా॥ పక్షులు తమ రెక్కలలో ఇంకా రెక్కలు రాని పిల్లలను రక్షించిన విధంగా మీరు మా పక్షం వహించి మమ్ములను బ్రతికించారు.

క. మన్నారా? ద్వారకలో, నున్నారా? యదువు లంబుజోదరు కరుణన్
గన్నారా? లోకులచే, విన్నారా? మీరు వారి విధ మెట్టిదియో.

304

తా॥ ద్వారకలో ఉన్న యదుపుంగవులందరూ సుఖంగా ఉన్నారా? మీరు కృష్ణున్ని దర్శించారా? పోనీ ఎవరి వల్లనైనా వారు ఎట్లా ఉన్నారో తెలుసుకొన్నారా?"

చ. అన విని ధర్మరాజునకు నా విదురుండు సమస్తలోక వ
ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు సె
ప్పిన నతఁ డుగ్రశోకమున బెగ్గిలు చుండెడి నంచు నేమియున్
విను మని చెప్పఁడయ్యె; యదువీరుల నాశము భార్గవోత్తమా!

305

తా॥ ఇలా ప్రశ్నించిన ధర్మరాజుతో విదురుడు లోకంలో ఉండే సమస్త విషయములు విశదంగా చెప్పాడు. యదుక్షయాన్ని చెపితే అతడు ఉగ్రమైన శోకభారం చేత కుమిలిపోతాడని చెప్పలేదు.

ఆ. మేలు సెప్పెనేని మే లండ్రు లోకులు, చెట్టయండ్రు కీడు చెప్పెనేని
నంతమీఁద శూద్రుఁడైన కతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁడయ్యె.

306

తా॥ లోకంలో మేలు చెపితే లోకులు మేలు మేలు అంటారు. కీడు వార్త చెపితే అసహ్యించుకొంటారు. ఆ కారణంగా సహృదయుడైన విదురుడు శిష్టులయిన వారి

మరణవార్తను చెప్పలేదు.

వ. అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబునం దొల్లి యముండు శూద్ర యోనియందు విదురుండై జన్మించియున్న నూఱు వత్సరంబు లర్యముండు యథాక్రమంబునం బాపకర్ముల దండించె; నిట యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని లోకపాలసంకాశు లయిన తమ్ములుం దానును గులదీపకుండైన మనుమని ముద్దుసేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండెనంత.

307

తా॥ పూర్వం మాండవ్య మహాముని శాపం చేత యమధర్మరాజు శూద్రకులంలో విదురుడయి జన్మించాడు. ఆ నూరు సంవత్సరాలు సూర్యభగవానుడు యథావిధిగా యమధర్మరాజు స్థానంలో ఉండి పాపం చేసిన వారిని దండించాడు. ఇక ఇక్కడ ధర్మరాజు రాజ్యభారాన్ని వహించి తన తమ్ములు, తాను కులదీపకుడు అయిన మనుమని ముద్దుచేస్తూ చాలా కాలం మహా వైభవంతో సుఖంగా రాజ్యాన్ని పరిపాలించాడు.

క. బాలాజన శాలా ధన, లీలావన ముఖ్య విభవలీన మనీషా లాలసు లగు మానవులను, గాలము వంచించు దురవగాహము సుమతీ!

308

తా॥ సుమతీ! ఓ శౌనకా! విన్నావు గదా! సంతానము, ఆనంద భవనములు, లీలా వనములు... మొదలయిన భౌతిక సుఖముల యందు లాలసులయిన మానవులను కాలం తెలియకుండానే వంచిస్తుంది. కాలం యొక్క గతి దురవగాహం సుమా!

## గాంధారీ ధృతరాష్ట్రులు దేహత్యాగము చేసుకొనుట

వ. అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

309

తా॥ అందువల్ల కాలం యొక్క పోకడ తెలిసిన విదురుడు ధృతరాష్ట్రునితో ఇట్లా అన్నాడు:

మ. కనకాగార కళత్ర మిత్ర సుత సంఘాతంబులన్ ముందటం
గని ప్రాణేచ్ఛల నుండు జంతువుల నే కాలంబు దుర్లంఘ్యమై
యనివార్యస్థితిఁ జంపునట్టి నిరుపాయంబైన కాలంబు వ
చ్చె నుపాంతంబున, మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా!

310

తా॥ "ఓ రాజా! లోకంలోని మానవులు బంగారము, ఇండ్లు, భార్యలు, మిత్రులు, బిడ్డలు వీళ్ళందరినీ కళ్ళముందు చూసుకొంటూ ప్రాణాలమీద ఆశను పెంచుకుంటూ ఉంటారు. కాలం మాత్రం ఎవరికీ లొంగనిది మరియు అనివార్యమైనది. నీకు మృత్యువు సమీపిస్తున్నది. అందువల్ల మనస్సులో దీనిని గురించి ఆలోచించు.

శా. పుట్టంధుండవు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ
పట్టెల్లం జెడిపోయె; దుస్సహ జరాభారంబు పైఁగప్పె, నీ
చుట్టా లెల్లను బోయి; రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయలపంచ నుండఁదగవే గౌరవ్యవంశాగ్రణీ!

311

తా॥ ఓ కురుకుల శిరోమణీ! నువ్వు పుట్టినప్పటి నుండి అంధుడవు. పెద్దవాడవు. రాజ భోగములా ఇక ఈపైన నీకేమీ లేవు. అధికారం అంతరించింది. భరింపరాని ముసలితనం మీద

పడింది. నీ బంధువులంతా నశించారు. నీ భార్య, నువ్వు శోకంలో మునిగి తేలుతున్నారు. ఇట్టి నువ్వు పొరుగు పంచలో ఎలా ఉంటావు?

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి దదీయభార్యఁ, బాడడవులకుం
గొట్టితిరి, వారు మనుపఁగ, నెట్టన భరింపవలెనె?యీ ప్రాణములన్.

312

తా॥ మీరు పాండవుల గృహానికి నిప్పుపెట్టారు. వాళ్ళ భార్యను బలాత్కారం చేశారు. వాళ్ళను అడవులకు పంపించారు. అట్టి పాండవులు మిమ్ములను పోషిస్తూంటే మీరు ప్రాణాలను నిలబెట్టుకుంటున్నారు.

క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం; డిదె పైఁ
బడ్డాఁడని భీముం డొఱ గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా!

313

తా॥ “ఆనాడు బిడ్డలకు బుద్ధి చెప్పలేని గ్రుడ్డివాడికి పిండం వండి పట్టుకెళ్ళి పారెయ్యండి. మా మీద పడ్డాడు” — అని భీముడు మీ మనస్సు నొప్పించే వంకర మాటలు అంటూ ఉంటే కూడు కుడుస్తూ ఎలా ఉంటున్నావు మహారాజా?

క. కనియెదవో బిడ్డల నిఁక, మనియెదవో, తొంటికంటె మనుమల మాటల్ వినియెదవో, యిచ్చెద ర, మ్మనియెదవో దానములకు నవనీసురులన్,

314

తా॥ ఇక తిరిగి కన్న కొడుకుల ముఖాలు చూడలేవు కదా! పూర్వం కంటే రాజసంగా బ్రతకలేవు గదా! నీ మనుమల మాటలు వినలేవు కదా! బ్రాహ్మణోత్తములను దానమిస్తాను అని పిలువలేవు కదా! ఎందుకయ్యా ఈ పనికిమాలిన బ్రతుకు.

క. దేహము నిత్యము గాదని, మోహముఁ దెగఁ గోసి సిద్ధ మునివర్తనుఁడై
గేహము వెలువడు నరుఁ డు, త్సాహముతోఁ జెందు ముక్తి సంపద ననఘా!

315

తా॥ అనఘా! దేహము నిత్యము కాదు అని ఎవడయితే మోహమును తెగకోసి ఒక మునివలె ఇంటినుండి ఉత్సాహంతో బయటకు వెళతాడో ఆ నరుడు తప్పక ముక్తి సంపద పొందుతాడు."

వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తి మార్గం బుపదేశించిన, నతండు ప్రజ్ఞాచక్షుండై, సంసారంబు దిగనాడి, మోహపాశంబు వలన నూడి, విజ్ఞానమార్గంబునం గూడి, దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన.

316

తా॥ ఈ విధంగా విదురుడు ధృతరాష్ట్రునకు విరక్తి మార్గాన్ని ఉపదేశించాడు. వెంటనే అతనిలో జ్ఞాననేత్రం వెలిగింది. ఇక సంసారం విడిచి మోహపాశాలను త్రెంచి జ్ఞాన మార్గంలో హిమవత్పర్వతం వైపుకి ప్రయాణం సాగించాడు.

శా. అంధుండైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి, నియమప్రఖ్యాతయై యున్న త
ద్గాంధారక్షితినాథు కూఁతురును యోగప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతివెంట నేఁగె, నుదయత్సాధ్వీగుణారూఢయై.

317

తా॥ అంధుడైన పతిని వరించి, అతను చూడలేని లోకాన్ని తను మాత్రం ఎందుకు చూడాలని కళ్ళకు గంతలు ధరించి, నియమాన్ని పాటించటంలో లోకంలో ఖ్యాతిని వహించి ఉన్న గాంధార రాజు కూతురైన గాంధారి తన భర్త వెంట యోగమునందు ప్రీతితో ఆ సాధ్వీమణీ

కూడా వెళ్ళింది.

చ. వెనుకకు రాక చొచ్చు రణవీరునికైవడి, రాజదండనం
బునకు భయంబు లేక వడిఁ బోయెడు ధీరుని భంగి, నప్పు డా
వనిత దురంతమైన హిమవంతము పొంత వనాంతభూమికిం
బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేఁగెఁ బ్రీతితోన్.

318

తా॥ వెనుకకు రాకుండ ముందుకు చొచ్చుకుపోయే రణవీరునివలె, రాజ దండనానికి భయపడకుండ వడిగా ముందుకు నడుచుకుంటూ పోయే ధీరునివలె అప్పుడా వనిత హిమవత్పర్వత ప్రాంత భూమికి భయం లేకుండా పెనిమిటితో బయలు దేరింది.

వ. ఇట్లు విదురసహితులై గాంధారధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు సేసి నిత్య హోమంబు గావించి బ్రాహ్మణోత్తములకు గో హిరణ్య తిల వస్త్రాది దానంబులు సేసి నమస్కరించి, గురువందనంబుకొఱకుఁ పూర్వప్రకారంబునం దండ్రి మందిరంబునకుఁ జని యందు విదుర సహితు లయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునఁ గూర్చున్న సంజయున కిట్లనియె.

319

తా॥ విదురునితో కలిసి గాంధారీధృతరాష్ట్రులు వనానికి వెళ్ళారు. ఆ మరునాడు ధర్మరాజు ఉదయమే లేచి సంధ్యావందనం చేసుకొని నిత్యమూ చేసుకొనే హోమం పూర్తి చేసుకొని బ్రాహ్మణులకు గోవులు, బంగారము, తిలలు, వస్త్రములు ఇత్యాది దానములు చేసి నమస్కరించాడు. గురువందనం కోసం రోజూలాగానే మందిరానికి వచ్చి అక్కడ విదురునితో కూడిన తల్లిదండ్రులను చూడలేక పోయాడు. సంజయుడు మాత్రం కనిపిస్తే అతనితో ఇలా

అన్నాడు:

సీ. మా తల్లిదండ్రు లీ మందిరంబున లేరు, సంజయ! వారెందుఁ జనిరి? నేఁడు
ముందఱ గానఁడు ముదుసలి మా తండ్రి పుత్త్ర శోకంబునఁ బొగులుఁ దల్లి
సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి మంద బుద్ధులమైన మమ్ము విడిచి
యెటఁబోయిరో మువ్వు రెఱిఁగింపు గంగలోఁ దన యపరాధంబుఁ దడవికొనుచు

ఆ. భార్యతోడఁ దండ్రి పరితాపమునఁ బడుఁ, గపట మింత లేదు కరుణ గలదు
పాండుభూవిభుండు పరలోకగతుఁడైన, మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు.

320

తా॥ "సంజయా! మా తల్లిదండ్రులు ఈ మందిరంలో కనిపించటం లేదు. వారు ఎక్కడికి వెళ్ళారు? తన ఎదురుగా ఏముందో కనిపించదు మా తండ్రికి. పుత్రశోకంతో బాధపడుతూ ఉంటుంది మా తల్లి. సౌజన్యమూర్తి, ప్రాణసఖుడు, మా పినతండ్రి అయిన విదురుడు. మందబుద్ధులమైన మమ్ము విడిచి ఆ ముగ్గురు ఎక్కడకు వెళ్ళారో మాకు తెలియచెయ్యి. తాము చేసిన తప్పులకు పరితాపంతో భార్యతో కలిసి మా తండ్రి అయిన ధృతరాష్ట్రుడు గంగానదిలో కలిసిపోయాడా? ఆయనకు కపటం తెలియదు. కరుణార్ద్ర హృదయుడు. మా తండ్రిగారు అయిన పాండురాజు పరలోకగతుడైన పిమ్మట చిన్నవాళ్ళమైన మమ్ములను అతనే కదా పెంచి పెద్ద చేశాడు."

వ. అనిన సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుం డగుచుఁ, దన ప్రభువు వోయిన తెఱం గెఱుంగక, కొంత దడ మారకుండి, తద్వియోగ దుఃఖంబునఁ గన్నీరు దుడిచికొనుచు, బుద్ధి బలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి, తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచు ధర్మజున కిట్లనియె.

321

తా॥ అని అడిగే సరికి సంజయుడు అత్యంత దయతోను, స్నేహంతోను కూడిన హృదయంతో తన ప్రభువు పోయిన మార్గం తెలియక కొంచెం సేపు ఊరకున్నాడు. అతని వియోగం వలన కలిగిన దుఃఖం చేత కన్నీరు తుడుచుకున్నాడు. తన బుద్ధిబలం చేత ధైర్యాన్ని తెచ్చుకుని తన ప్రభువు పాదములు మనస్సులో నిలుపుకొని ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

తే. అఖీల వార్తలు మున్ను నన్నడుగుచుండు, నడుగఁ డీ రేయి మీ తండ్రి యవనినాథ!
మందిరములోన విదురుతో మంతనంబు, నిన్న యాడుచు నుండెను నేఁడు లేఁడు.

322

తా॥ "ధర్మరాజా! మీ తండ్రిగారు అఖీల వార్తలు నన్నడిగేవారు. ఈ రాత్రి నన్నేమీ అడుగలేదు. మందిరంలో విదురునితో మంతనాలు ఆడుతూ నిన్న కనుపించాడు. నేడు లేడు.

వ. విదుర గాంధారీ ధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁబోయిరో వారల నిశ్చయంబులెట్టివో యెఱుంగనని సంజయుండు దుఃఖీంచు సమయంబునఁ దుంబురు సహితుండై నారదుండు వచ్చిన, లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి, కౌంతేయాగ్రజుం డిట్లనియె.

323

తా॥ విదురుడు, గాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచించి ఎక్కడకు పోయారో వాళ్ళ మనస్సులో ఉన్న సంకల్పం ఎట్టిదో నాకైతే ఏమీ తెలియదు" అని సంజయుడు దుఃఖీస్తూన్న సమయంలో తుంబురునితో కలిసి నారదుడు వచ్చాడు. లేచి నమస్కరించి సోదరులతో కలసి వారిని పూజించి ధర్మరాజు ఇట్లా అన్నాడు:

ఉ. అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ! వారు నేఁ
డెక్కడ వోయిరో యెఱుఁగ, నెప్పుడు బిడ్డల పేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచునుండుఁ దల్లి యెటు వోయెనొకో! విపదంబు రాశికిన్

నిక్కము కర్ణధారుఁడవు నీవు, జగజ్జన పారదర్శనా!



తా॥ "ఓ నారదా! తల్లిదండ్రులు ఇంట్లో లేరు. మహాత్మా! వారు ఎక్కడికి వెళ్ళారో తెలియదు. మా అమ్మ ఎప్పుడూ బిడ్డల గురించి పేరుపేరున తలుచుకొని బాధపడుతూ ఉండేది. ఎక్కడికి వెళ్ళిందో? ఈ విపత్తు అనే అంబురాశికి నిజంగా నువ్వు కర్ణధారుడవు."

వ. అనిన సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె; నీశ్వర వశంబు విశ్వంబు. ఈశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁజేర్చు, నెడఁబాపు. సూచీ భిన్ననాసిక లందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టఁబడిన బలీవర్దంబులంబోలెఁ గర్తవ్యాకర్తవ్యవిధాయక వేదలక్షణ యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులైన లోకపాల సహితంబులై లోకంబీశ్వరాదేశంబు వహించుఁ; గ్రీడాసాధనంబులగు నక్షకందు కాదుల కెట్లు సంయోగ వియోగంబు లట్లు క్రీడించు; నీశ్వరుని క్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగ వియోగంబు లగుచుండు. సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును దేహ రూపంబున నధ్రువంబునై యుండు; మఱియు నొక్క పక్షంబున ధ్రువంబు నధ్రువంబునుంగాక యుండు; శుద్ధబ్రహ్మస్వరూపంబున ననిర్వచనీయంబుగ రెండునై యుండు. అజగరంబుచేత మ్రింగం బడిన పురుషుం డన్యుల రక్షింప లేని తెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మ గుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు. కరంబులు గల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదంబు లాహారంబు లగుఁ; జరణంబులు గల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబు లగు; నధికజన్మంబు గల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులు గల మృగాదులు భోజ్యంబు లగు, సకల దేహి దేహంబులందు జీవుఁడు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు; అహస్త సహస్తాది రూపంబైన విశ్వమంతయు నీశ్వరుండుగాఁ దెలియుము. అతనికి వేఱు లేదు; నిజమాయా విశేషంబున

మాయావియై జాతిభేద రహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించు గాన యనాథులు దీనులు నగు నాదు తల్లిదండ్రులు ననుం బాసి యే మయ్యెదరో, యెట్లు వర్తింతురో, యని వగవం బని లేదు. అజ్ఞానమూలం బగు స్నేహంబున నైన మనో వ్యాకులత్వంబు పరిహరింపు మని మఱియు నిట్లనియె.

325

తా॥ అలా ధర్మరాజు అనేసరికి నారదుడిట్లా అన్నాడు: "ఈ విశ్వము అంతా ఈశ్వరాధీనం. ఈశ్వరుడు జీవులను ఒకదానితో ఒకటి కలుపుతూ ఉంటాడు. ఎడబాపుతూ ఉంటాడు. ముక్కులు పొడిచి త్రాళ్ళు కట్టి మెడకు పలుపులు బిగించిన ఎద్దులవలె ఈశ్వరుడు కర్తవ్యాకర్తవ్యములను బోధించి, వేదములనే తంత్రిని బిగించి వర్ణాశ్రమ లక్షణాలు కల పేర్లచే ఇంద్రాది దిక్పాలకులతో సహా లోకం అంతా ఈశ్వరుని యొక్క ఆదేశాన్ని వహిస్తుంది. క్రీడాకారుని ఇష్టానుసారం పాచికలూ, బంతులూ మొదలైన ఆటవస్తువులు కలుస్తూ విడిపోతూ ఉంటాయి. అదే విధంగా మానవులకు భగవంతుని ఇచ్ఛానుసారం సంయోగవియోగములు కలుగుతూ ఉంటాయి.

జీవుడు (చైతన్యరూపంలో) శాశ్వతుడుగానూ, (దేహరూపంలో) అనిత్యుడుగానూ ఉంటారు. మరో పక్షంలో రెండూ కాకుండ ఉంటుంది. శుద్ధ బ్రహ్మ స్వరూపంలో అనిర్వచనీయంగా ఉంటూ రెండుగానూ కూడా ఉంటుంది. ఏ విధంగా స్వీకరించినను నీవు వారిని గురించి శోకించకూడదు. కొండచిలువ చేత మ్రింగబడుతూన్న పురుషుడు ఇతరులను రక్షింపలేడు. ఆ విధంగానే పంచ భూతములకు, కాలమునకు ప్రారబ్ధకర్మకు, గుణములకు అధీనమైన దేహం ఇతరులను రక్షింప నేరదు. చేతులు కల జంతువులకు చేతులు లేని జంతువులు అనగా నాలుగు కాళ్ళున్న జంతువులు ఆహారంగా ఉంటాయి. కాళ్ళుగల ప్రాణులకు కాళ్ళులేని తృణాదులు ఆహారమవుతాయి. పెద్ద జంతువులైన పెద్దపులి ఇత్యాదులకు చిన్న

జంతువులైన లేళ్ళు ఇత్యాదులు ఆహారమవుతున్నాయి. అన్ని దేహముల యందు జీవుడు ఉన్నాడు కనుక జీవునికి జీవుడే జీవనాధారం అవుతున్నాడు. చేతులున్న జీవులు చేతులు లేని జీవులు... ఈ రెంటితోను కూడి ఉన్న ఈ విశ్వం అంతా ఈశ్వరుడే. అతనికంటే వేరుగా ఏమీ లేదు. తన మాయచేత జాతి భేదములు లేని ఈశ్వరుడు అనేక రకాలుగా భోగించేవాడు భోగింపబడేది అనే రూపాలుగా లోపల వెలుపల అంతటా తానే అయి దీపిస్తున్నాడు. అందువల్ల అనాథలు, దీనులు అయిన నీ తల్లిదండ్రులు నన్ను విడిచిపెట్టి ఏమయిపోయారో ఎట్లా వర్తిస్తున్నారో అని విచారించవలసిన అవసరం లేదు. అజ్ఞానం మూలంగా మమకారం పెంచుకొని మనోవ్యాకులత్వాన్ని పెంచుకోవద్దు" అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు:

ఆ. అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁడగు విష్ణుఁ, డసురనాశమునకు నవతరించి దేవకృత్య మెల్లఁ దీర్చి చిక్కిన పని, కెదురుసూచుచుండు నిప్పు డధిప!

326

తా॥ "కాల స్వరూపుడు, అఖిలాత్ముడు అయిన విష్ణువు దుష్టులను నాశనం చేయటం కోసం అవతరించాడు. దేవకార్యం తీర్చి మిగిలిన పనికోసం ఎదురు చూస్తున్నాడు.

మత్త. ఎంత కాలము కృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు, మీ
రంత కాలము నుండుఁ డందఱు నవ్వలం బనిలేదు, వి
భ్రాంతి మానుము; కాలముం గడవంగ నెవ్వరు నోప, రీ
చింత యేల నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్.

327

తా॥ అందువల్ల ఎంత కాలము ఈశ్వరుడైన కృష్ణుడు ఈ భూమిమీద నడయాడుతాడో మీరంత కాలం ఉండండి. ఆపైన మీ అవసరం లేదు. భ్రాంతి పడవలసిన అవసరం లేదు. కాలాన్ని దాటడం ఎవరికీ శక్యం కాదు. చింత అవసరం లేదు. నే చెప్పేది విను.

వ. ధృతరాష్ట్రుండు గాంధారీవిదుర సహితుండై హిమవత్పర్వతదక్షిణ భాగంబున నొక్క మునివనంబునకుం జని తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడు ప్రవాహంబులయి పాఱిన పుణ్యతీర్థంబునం గృతస్నానుండై యథావిధి హోమం బొనరించి, జలభక్షణంబు గావించి, సకల కర్మంబులు విసర్జించి, విఘ్నంబులం జెందక నిరాహారుండయి, యుపశాంతాత్ముండయి పుత్త్రార్థదారైషణంబులు వర్జించి, విన్యస్తాసనుండై ప్రాణంబుల నియమించి, మనస్సహితంబులైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి హరిభావనచే ధారణాయోగంబు వహించి, రజస్సత్త్వతమోరూపంబు లగు మలంబుల మూఁటిని హరించి మనంబు నహంకారాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి, బుద్ధియందు నేకీకరణంబు సేసి, యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞుని యందుఁ బొందించి, దృష్టంబైన యీశ్వరుని వలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి, నాధారభూతం బైన బ్రహ్మమందుఁ గలిపి, లోపలి గుణక్షోభంబును, వెలుపలి యింద్రియ విక్షేపంబును లేక నిర్మూలిత మాయాగుణవాసనుం డగుచు నిరుద్ధంబు లగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖీలాహారంబు లను వర్జించి, కొఱడు చందంబున.
328

తా॥ ధృతరాష్ట్రుడు గాంధారీ విదురులతో కూడి హిమవత్పర్వత దక్షిణ భాగంలో ఒక మునివనానికి వెళ్ళాడు. పూర్వం సప్త మహర్షులకు సంతోషం కలిగించడానికి ఆకాశగంగ ఏడు ప్రవాహాలుగా చీలిపోయింది. అక్కడే అట్టి పుణ్యతీర్థంలో స్నానం చేసి యథావిధిగా హోమం చేసి జలాన్ని ఆహారంగా తీసుకొని కర్మలన్నీ ఆచరించటం మానేశాడు. ఏ విఘ్నములు చెందకుండా నిరాహారుడయి శాంత చిత్తంతో పుత్రుల గురించి, భార్య గురించి చింతను విడిచి పెట్టేశాడు. ఆసనంలో కూర్చుని ప్రాణాలను నియమించి మనస్సుతో కలిపి ఇంద్రియాలను ఆరింటిని విషయముల వైపుకు ప్రవర్తించకుండా నియమించాడు. శ్రీమహావిష్ణువును ధారణాయోగంచే వహించాడు. సత్వ రజో తమో రూపమైన మూడు మలములను హరించాడు. మనస్సును,

అహంకార రూపమైన స్థూలదేహాన్ని విడిచి బుద్ధిలో జొనిపి అట్టి విజ్ఞానాత్మను జీవునితో కలిపి ఆపైన కనిపిస్తూన్న ఈశ్వరుని వలన జీవ భ్రాంతిని వదిలేశాడు. పిమ్మట మహాకాశంతో ఘటాకాశాన్ని కలిపినట్లు అన్నిటికి ఆధారభూతమైన బ్రహ్మమునందు కలిపాడు. లోపల సత్వరజఃతమో గుణముల క్షోభ లేదు, బయట పంచేంద్రియముల విక్షేపమూ లేదు. ఇక మాయ తొలగిపోయింది. మనస్సు, చక్షువులు మొదలుగా ఇంద్రియములను నిరోధించి ఆహారాన్ని వర్జించి స్థాణువువలె ఉండిపోయాడు.

మ. ఉటజాంతస్థ్సల వేదికిన్ నియతుఁడై యున్నాఁడు నేఁడాదిఁగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా నిజ్యాగ్ని యోగాగ్ని త
త్పటు దేహంబు దహింపఁ జూచి, నియమ ప్రఖ్యాత గాంధారి యి
ట్టటు వో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా!

329

తా॥ భూవరా! ధృతరాష్ట్రుడు పర్ణశాలలో లోపల ఉన్న వేదికపైన నేటికి అయిదవనాడు శరీరత్యాగం చెయ్యడానికి నియమంగా కూర్చొని ఉన్నాడు. ఆ విధంగా ఆయన యోగాగ్నిలో దగ్ధం కావటం చూసి పతివ్రత అయిన గాంధారి ఎక్కడకూ వెళ్ళడానికి ఇష్టపడక అగ్నిలో పడి భస్మమై పోతుంది.

క. అంతట వారల మరణము, వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా సంతాప
మొదవఁ బ్రీత, స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా!

330

తా॥ అంతట ఆ మహారాజు దంపతుల మరణాన్ని ఆశ్చర్యంగా చూసిన విదురుడు చింతా సంతాపములతో తీర్థయాత్రకు వెళ్ళిపోతాడు.”

వ. అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనుని కెఱింగించి తుంబురు

సహితుండయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక, ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె.

331

తా॥ ఈ ప్రకారంగా విదుర గాంధారీ ధృతరాష్ట్రుల వృత్తాంతాన్ని ధర్మరాజుకు చెప్పి తుంబురుడుతో కలిసి నారదుడు స్వర్గానికి వెళ్ళిపోయాడు. ఆ వెనుక ధర్మరాజు భీమునితో ఇట్లా అన్నాడు:

## ధర్మరాజు దుశ్శకునములను చూసి చింతించుట

సీ. ఒక కాలమునఁ బండు నోషధిచయము వే, ఱొక కాలమునఁ బండకుండు నండ్రు క్రోధంబు లోభంబు క్రూరత బొంకును, దీపింప నరులు వర్తింతు రండ్రు వ్యవహారములు మహావ్యాజ యుక్తము లండ్రు, సఖ్యంబు వంచనా సహిత మండ్రు మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు, సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు

తే. గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు, శాస్త్రమార్గము లెవ్వియు జరుగ వండ్రు న్యాయపద్ధతి బుధులైన నడవరండ్రు, కాలగతి వింతయై వచ్చెఁ గంటె నేఁడు.

332

తా॥ "ఒక కాలంలో పండే ఓషధులు వేరొక కాలానికి పండటం లేదు. క్రోధము, లోభము, క్రౌర్యము, కపటము, బొంకు ఇవి పెచ్చరిల్లుతూ ఉండగా నరులు ప్రవర్తిస్తున్నారు. వ్యవహారములు అన్నీ న్యాయాధీశుల అధీనంలో ఉంటున్నాయి. స్నేహం మోసంతో కూడి ఉంటూన్నది. భార్యలు భర్తలను ద్వేషిస్తున్నారు. కొడుకులు తండ్రులను చంపడానికి ప్రయత్నిస్తున్నారు. గురువులను శిష్యులు దూషిస్తున్నారు. శాస్త్ర మార్గములలో లోకం నడవటం లేదు. బుధులు సైతం న్యాయమార్గంలో నడవటంలేదు. చూశావా! కాలం పోకడ చాలా వింతగా ఉంది.

మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు నెల లేడయ్యెం గదా రారు కా<br>లరు లెవ్వారును; యాదవుల్ సమద లోల స్వాంతు లీ వేళ సు<br>స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?<br>యెరవై యున్నది చిత్త మీశ్వరకృతం బెట్లో కదే! మారుతీ!

333

తా॥ మారుతీ! శ్రీకృష్ణుణ్ణి చూడటానికి అర్జునుడు వెళ్ళి ఏడు నెలలు గడిచింది. ఇప్పటి

వరకు తిరిగి రాలేదు. ఎప్పుడూ మదంతో ఉండటానికే యాదవులు ఇష్టపడతారు. అలాంటిది ఈ వేళ స్థిరులై ఉంటారా! మురారి సుఖంగా క్షేమంగా ఉంటాడా. నా మనస్సు విచారంగా ఉంది. ఈశ్వర సంకల్పం ఎలా ఉందో?

క. మానసము గలఁగు చున్నది, మానవు బహుదుర్నిమిత్త మర్యాదలు, స న్మానవ దేహక్రీడలు, మాన విచారింప నోపు మాధవుఁ డనుజా!

334

తా॥ తమ్ముడూ! నా మనస్సు కలత పడుతోంది. దుర్నిమిత్తములు ఎక్కువగా తోస్తున్నాయి. మాధవుడు తాను ధరించిన మానవ దేహాన్ని ఉపసంహరించుకుందామని ఆలోచిస్తున్నాడేమో!

క. మనవులు సెప్పక ముందఱ, మన దార ప్రాణ రాజ్య మాన శ్రీలన్ మనుపుదు నని మాధవుఁడిట, మనమునఁ దలపోసి మనిచె మనలం గరుణన్.

335

తా॥ ఆ మాధవుడు మనం మనవి చెయ్యక ముందే మన భార్యను, ప్రాణములను, రాజ్యమును, మానమును, వైభవాన్ని – అన్నింటిని మనకు ఇచ్చాడు.

క. నారదుఁడాడిన కైవడిఁ, గ్రూరపుఁగాలంబు వచ్చెఁ గుంభిని మీఁదన్<br>ఘోరములగు నుత్పాతము, లారభటిం జూడఁబడియె ననిలజ! కంటే.

336

తా॥ ఓ భీమసేనా! నారద మహర్షి చెప్పిన విధంగా ఈ పైన కాలం చాలా క్రూరంగా ఉంటుందేమో! ఉత్పాతములు చాలా ఘోరంగా కనుపిస్తున్నాయి. చూస్తున్నావు కదా!

సీ. ఓడక ముందట నొక సారమేయంబు, మొఱుఁగుచు నున్నది మోర యెత్తి! యాదిత్యుఁ

డుదయింప నభిముఖంబై నక్క, వాపోయె మంటలు వాతఁ గలుగ! మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు, గర్దభాదులు దీర్చి క్రందుకొనియె! నుత్తమాశ్వంబుల కుదయించెఁ గన్నీరు, మత్తగజంబుల మదము లుడిగెఁ!

ఆ. గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము!, మండ దగ్ని హోమమందిరములఁ!
జుట్టుఁ బొగలు దిశలు సొరిది నాచ్ఛాదించెఁ!, దరణి మాసెఁ జూడు ధరణి గదలె.

337

తా॥ అదుగో చూడు! భయపడకుండా మన ముందట ఒక కుక్క మోర పైకెత్తి మొరుగుతోంది. ఉదయిస్తూన్న సూర్యుని ముందర నిల్చి మంటలు వచ్చేటట్లుగా నక్క వాపోతున్నది. గ్రద్దలు అతిశయంగా తిరుగుతున్నాయి. గాడిదలు విలపిస్తున్నాయి. ఉత్తమమైన అశ్వములు కన్నీరు కారుస్తూన్నాయి. మత్తగజములకు మదం ఉడిగిపోయింది. యమధర్మరాజు దూతల్లా దగ్గరకు వస్తున్నాయి పావురాలు. హోమ మందిరాల్లో అగ్నిహోత్రాలు మండటం లేదు. చుట్టూ పొగలు దిశలను ఆక్రమించాయి. సూర్యుడు తన ప్రకాశాన్ని కోల్పోయాడు. భూమండలం కంపిస్తూన్నది.

క. వాతములు విసరె, రేణు, వ్రాతము లాకసముఁ గప్పె, వడి సుడిగొని ని
ర్ఘాతములు వడియె, ఘన సం, ఘాతంబులు రక్తవర్షకలితము లయ్యెన్.

338

తా॥ గాలి విపరీతంగా వీస్తోంది. ధరాపరాగం ఆకాశాన్ని కప్పేసింది. పైనుండి పిడుగులు పడుతున్నాయి. మేఘాలు రక్తాన్ని వర్షిస్తున్నాయి.

క. గ్రహములు పోరాడెడి నా, గ్రహములు వినఁబడియె, భూత కలకలములు దు
స్సహము లగుచు శిఖీకీలా, వహములక్రియఁ దోఁచె గగన వసుధాంతరముల్.

339

తా॥ గ్రహాలు పోరాడుకుంటున్నాయి. భూతముల యొక్క కలకలములు సహించలేనంతగా ఉన్నాయి. భూమ్యాకాశముల మధ్య మంటలు కనిపిస్తున్నాయి.

క. దూడలు గుడువవు చన్నులు, దూడలకున్ గోవు లీవు దుగ్ధము లొడలం
బీడలు మానవు పశువులఁ, గూడవు వృషభములు తఱపి కుఱ్ఱల నెక్కున్.

340

తా॥ దూడలు పాలు త్రాగటం లేదు. ఆవులు దూడలకు పాలివ్వటం లేదు. శరీర రోగాలు తగ్గటం లేదు. వృషభాలు పశువులను కూడటం మానేసి ఆరు నెలల దూడలను కూడుతున్నాయి.

క. కదలెడు వేల్పుల రూపుల, వదలెడుఁ గన్నీరు వానివలనం జెమటల్
వొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని, మొదలెడి నొక్కొక్క గుడిని మేదినియందున్.

341

తా॥ దేవ మందిరాలలో దేవతా విగ్రహాలు కదులుతున్నాయి. అవి కన్నీరు కారుస్తున్నాయి. అవి చెమటలు కక్కుతున్నాయి. ఒక్కొక్క గుడిలోని విగ్రహాన్ని ఆవహించి ఉన్న దేవతలు బయటకు వెళ్ళిపోతున్నారు.

క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుంద్రలు గొలిపెన్
లోకంబులు విభ్రష్ట, శ్రీకంబులు గతి నశించి శిథిలము లయ్యెన్.

342

తా॥ కాకులు దుఃఖీస్తున్నాయి. గుడ్లగూబలు నగరంలో పట్టపగలే కూస్తున్నాయి. లోకాలన్నీ తమ శోభను కోల్పోయి కళతప్పాయి.

మ. యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రేఖాలంకృతంబైన మా
ధవు పాద ద్వయ మింక మెట్టెడు పవిత్రత్వంబు నేఁడాదిఁగా

నవనీకాంతకు లేదు పో మఱి మదీయాంగంబు వామాక్షి భా
హువు లాకంపము నొందుచుండు నిల కే యుగ్రస్థితుల్ వచ్చునో!

343

తా॥ భీమసేనా! పద్మ అంకుశ చాప చక్ర మీన ఇత్యాది రేఖలతో అలంకృతమైన మాధవుని యొక్క పాదద్వయాన్ని తాకే అదృష్టం నేటి నుండి అవనీ కాంతకు లేదు. నా ఎడమ కన్ను, ఎడమ బాహువు కంపాన్ని పొందుతున్నాయి. ఈ భూలోకవాసులకు ఏ దారుణమైన పరిస్థితులు రానున్నాయో?"

వ. మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టుచున్నయని; మురాంతకుని వృత్తాంతంబు వినరాదని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున.

344

తా॥ ఎన్నో ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి. శ్రీకృష్ణుని వృత్తాంతము మాత్రం తెలియ రావటం లేదు. అని ధర్మరాజు భీమునితో విచారిస్తున్నాడు.

## అర్జునుడు ద్వారక నుండి వచ్చి శ్రీకృష్ణ నిర్యాణమును తెలుపుట

క. ఖేదమున నింద్రసూనుఁడు, యాదవ పురినుండి వచ్చి యగ్రజుఁ గని త
త్పాదముల నయన సలిలో, త్పాదకుఁడై పడియె దీనుభంగి నరేంద్రా.

345

తా॥ ఆ సమయంలో పట్టరాని దుఃఖ భారంతో అర్జునుడు యాదవపురి నుండి వచ్చాడు. అన్నగారైన ధర్మరాజును చూసి ఆయన పాదముల మీద దీనునివలె కన్నుల వెంట కన్నీరు కారుతూ ఉండగా వాలిపోయాడు.

క. పల్లటిలిన యుల్లముతోఁ, దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని వె
ల్వెల్ల నగుమొగముతో జను, లెల్లను విన ధర్మపుత్రుఁ డిట్లని పలికెన్.

346

తా॥ చలించిన మనస్సుతో తల్లడిల్లిపోతున్న చిన్న తమ్ముడిని చూసిన ధర్మరాజు వెలవెల పోతూన్న ముఖంతో జనులంతా వింటూ ఉండగా ఇలా అన్నాడు:

సీ. మాతామహుండైన మన శూరుఁ డున్నాడె!, మంగళమే మన మాతులునకు ?
మోదమే నలుగురు ముగురు మేనత్తల?, కానందమే వారి యాత్మజులకు?
నక్రూర కృతవర్మ లాయుస్సమేతులే?, జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు?
కల్యాణయుక్తులే గద సారణాదులు?, మాధవు తమ్ములు మానధనులు?

తే. నందమే మన సత్యకనందనునకు? భద్రమే శంబరాసుర భంజనునకుఁ?
గుశలమే బాణదనుజేంద్రు కూఁతుపతికి? హర్షమే పార్థ! ముసలికి, హలికి, బలికి?

347

తా॥ "పార్థా! మాతామహుడైన మన శూరసేనుడు ఎలా ఉన్నాడు? మన మేనమామ

అయిన వసుదేవునికి మంగళమే కదా! మేనత్తలు ఏడుగురు సుఖంగా ఉన్నారు కదా! వారి కొడుకులు ఆనందంగా ఉన్నారా! అక్రూరుడు, కృతవర్మ వీరు ఆరోగ్యంగా ఉన్నారా! ఉగ్రసేన మహారాజు బాగా తిరుగుతున్నాడా! మానధనులు అయిన మాధవుని సోదరులు గదుడు సారణుడు మొదలయిన వారంతా సుఖంగా ఉన్నారు కదా! మన సాత్యకి సంతోషంగా ఉన్నాడు కదా! ప్రద్యుమ్నుడు భద్రంగా ఉన్నాడు కదా! అనిరుద్ధుడు కుశలంగా ఉన్నాడా! బలభద్రునికి హర్షమే కదా!

వ. మఱియు నంధక మధు యదు భోజ దాశార్హ వృష్ణి సాత్వతులు మొదలయిన యదువంశ వీరులును, హరికుమారులైన సాంబ సుషేణ ప్రముఖులును, నారాయణానుచరులైన యుద్ధవాదులును, గృష్ణ సహచరులైన సునంద నందాదులును సుఖానందులే? యని యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ నిట్లనియె.

348

తా॥ మరియు అంధకులు, మధువులు, భోజులు, దశార్హులు, వృష్ణులు, సాత్వతులు మొదలయిన యదువంశ వీరులు వీరంతా సుఖంగా ఉన్నారు కదా! హరి కుమారులయిన సాంబుడు సుషేణుడు మొదలయిన ప్రముఖులు.... వీరంతా సంతోషంతో ఉన్నారు కదా! యుద్ధవాదులయిన నారాయణ అనుచరులును కృష్ణ సహచరులయిన సునంద నందాదులును... వీళ్ళు అంతా ఆనందంగా ఉన్నారు కదా!" అని ఈ ప్రకారంగా ధర్మరాజు అందరిని అడిగి తిరిగి ఇట్లా అన్నాడు:

సీ. వైకుంఠవాసుల వడువున నెవ్వని, బలమున నానందభరితు లగుచు
వెఱవక యాదవ వీరులు వర్తింతు, రమరులు గొలువుండునట్టి కొలువు
చవికె నాకర్షించి చరణసేవకులైన, బంధుమిత్రాదుల పాదయుగము
నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠము మీఁద, వజ్రంబు జళిపించి వ్రాలువాని

తే. ప్రాణ వల్లభ కెంగేలఁ బాదు సేసి, యమృతజలములఁ బోషింప నలరు పారి జాత

మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ, కిచ్చె నట్టి మహాత్మున కిపుడు శుభమె?

349

తా॥ "తమ్ముడూ! ఏ మహానుభావుని బలంతో వైకుంఠవాసుల వలె భయపడకుండా ఆనందంతో యాదవ వీరులు వర్తిస్తున్నారో, ఏ మహానుభావుడు దేవతల కొలువులో తన బంధుమిత్రాదులను నిలిపాడో, ఏ మహానుభావుడు వజ్రాయుధాన్ని జళిపించే ఇంద్రుని ప్రాణేశ్వరి అయిన శచీదేవి తన చేతి అమృతాన్ని పోసి పెంచిన పారిజాత వృక్షాన్ని తెచ్చి సత్యభామకు ఇచ్చాడో – అట్టి మహానుభావుడు గోవిందునికి శుభమే కదా!

శా. అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁ డా
పన్నానీకశరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజ పత్ర నేత్రుఁడు సుధర్మామధ్య పీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁగూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్?

350

తా॥ నాయనా! ఫల్గునా! భక్తవత్సలుడు, బ్రహ్మణ్యుడు ఆపన్నానీక శరణ్యుడు, ఈశ్వరుడు, జగత్తుకు మేలు కలిగించేవాడు, క్రొత్తగా వికసిస్తూన్న పద్మపత్రముల వంటి కన్నులు కలవాడు అయిన గోవిందుడు సుధర్మా మధ్య పీఠంలో బలభద్రునితో కూడి సుఖంగా, ఉత్సాహంగా ద్వారకలో ఉన్నాడా!

క. ఆ రామ కేశవులకును, సారామలభక్తి నీవు సలుపుదువు గదా
గారాములు సేయుదురా, పోరాముల బంధు లెల్లప్రొద్దు జితారీ!

351

తా॥ ఫల్గునా! ఆ రామకృష్ణులను నిశ్చలమైన భక్తితో నువ్వు సేవించావు కదా! అక్కడ మన వాళ్ళంతా నిన్ను ఆప్యాయంగా ఆదరించారు కదా!

శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచో
సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ బ్రాభవ
స్కన్నుండై చను కౌరవేంద్రు పనికై గంధర్వులం ద్రోలుచోఁ
గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి! చెపుమా కల్యాణమే చక్రికిన్?

352

తా॥ తండ్రీ! మున్ను ఉగ్రమైన అడవిలో వరాహం కోసం ముక్కంటితో పోరేటప్పుడు కానీ, కాలకేయాది రాక్షసులను యుద్ధరంగంలో సంహరించేటప్పుడు కానీ, ప్రాభవాన్ని కోల్పోయి గంధర్వులకు చిక్కిన కౌరవేంద్రుణ్ణి విడిపించటం కోసం గంధర్వులతో యుద్ధం చేసేటప్పుడు కానీ నువ్వెప్పుడూ కన్నీరు పెట్టలేదు. అలాంటిది ఇప్పుడు కన్నీరు కారుస్తున్నావు. ముందీ మాట చెప్పు! మన కృష్ణునకు కల్యాణమే కదా!

వ. అదియునుంగాక

353

తా॥ అంతే కాకుండా....

క. ఓడితివో? శత్రువులకు, నాడితివో? సాధు దూషణాలాపములం
గూడితివో? పరసతులను, వీడితివో? మానధనము వీరుల నడుమన్!

354

తా॥ ఒకవేళ శత్రువుల చేతిలో ఓడిపోలేదు కదా! లేదా సజ్జనులను దూషించావా! పరసతులను కూడావా! సాటి వీరుల మధ్యలో నీ మానాన్ని పోగొట్టుకున్నావా!

క. తప్పితివో? యిచ్చెద నని; చెప్పితివో? కపటసాక్షి! చేసిన మేలుం
దెప్పితివో? శరణార్థుల, రొప్పితివో? ద్విజులఁ బసుల, రోగుల, సతులన్!

355

తా॥ ఒకవేళ ఇస్తానని ఇవ్వలేకపోయావా! కపట సాక్ష్యం చెప్పావా! ఇతరులకు చేసిన మేలు పరులకు చెప్పావా! శరణార్థులు, విప్రులు, పశువులు, రోగులు, స్త్రీల మీద పొరపాటున బాణాలు వెయ్యలేదు కదా!

క. అడిచితివో భూసురులను?, గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిఁగా?
విడిచితివో యాశ్రితులను?, ముడిచితివో పరుల విత్తములు లోభమునన్?

356

తా॥ భూసురుల మీద కోపడ్డావా. బాలురు, వృద్ధులు, గురువులు... వీళ్ళను బహిష్కరించి నువ్వేమైనా తిన్నావా. నిన్ను ఆశ్రయించిన వాళ్ళను కాదని విడిచిపెట్టేశావా! పరుల సంపదమీద లోభం చేత ఆశపడ్డావా?"

వ. అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు, గద్గదస్వరంబున మహానిధిం గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడించుచు, నర్జునుం డన్న కిట్లనియె.

357

తా॥ అని అడిగేసరికి కన్నీరు చేతితో తుడిచికొనుచు గద్గదస్వరంతో పెద్ద నిధిని పోగొట్టుకొన్న పేదవాడి విధంగా నిట్టూర్పులు విడుస్తూ అర్జునుడు తన అన్నగారైన ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

క. మన సారథి, మన సచివుఁడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్
మన విభుఁడు, గురుఁడు, దేవర, మనలను దిగనాడి చనియె, మనుజాధీశా!

358

తా॥ "ఓ మానవేశ్వరా! మన సారథి, మన సచివుడు, మన వియ్యము, మన సఖుడు,

మన బంధువు, మన ప్రభువు, మన గురువు, మన దైవము... మనలను విడిచిపెట్టి వెళ్ళిపోయాడయ్యా.

క. కంటకులు నృపులు సూడఁగ, వింటం గంపించు యంత్రమీనముఁ గోలన్
గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మతని కరుణన కాదే!

359

తా॥ శత్రువులయిన రాజులు అందరూ చూస్తూ ఉండగా పైన తిరిగే మత్స్యయంత్రాన్ని బాణంతో ఛేదించి మనం వాలుగంటి అయిన పాంచాలిని వివాహం చేసికొన్నది అతని దయవల్లనే కదా!

క. దండి ననేకులతో నా, ఖండలుఁ డెదు రయిన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన, గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా!

360

తా॥ యుద్ధంలో అనేకులతో కలిసి ఇంద్రుడెదురైనా గెల్చి ఖాండవ వనాన్ని అగ్నిదేవునికి అర్పిస్తే ఆయన గాండీవాన్ని ఇచ్చాడు కదా! అది కృష్ణుని దయ వల్లనే కదా!

క. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము
న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే!

361

తా॥ సమస్త దిక్కులలోని రాజసమూహాన్ని సమరంలో జయించి వాళ్ళ దగ్గర నుండి ధనాన్ని తీసికొన్నదీ, మయసభను అందుకొన్నదీ, రాజసూయ యాగాన్ని చేసిందీ... నిజానికి హరి మన ప్రక్కన ఉన్నందు వల్లనే కదా!

మ. ఇభజిద్వీర్య! మఖాభిషిక్త మగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్

సభలో శాత్రవు లీడ్చినన్ ముడువ కా చంద్రాస్య దుఃఖింపఁగా
నభయం బిచ్చి ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతా శిరో
జభరశ్రీల హరింపఁడే? విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్!

362

తా॥ సింహ పరాక్రమా! ధర్మరాజా! రాజసూయాధ్వరంలో అభిషిక్తమైన ఇల్లాలి కొప్పు పట్టుకొని సభలోకి ఈడిస్తే ముడువక ద్రౌపది దుఃఖించినప్పుడు అభయాన్ని ఇచ్చి ప్రతిజ్ఞచేసి నీ శత్రువుల భార్యల శిరోజముల సౌభాగ్యమును వాళ్ళంతా విధవలై ఏడుస్తూ ఉండగా హరించలేదా!

శా. వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నా వల్లభుల్
రా రీ వేళ, నుపేక్ష సేయఁదగవే? రావే! నివారింపవే!
లేరే? త్రాతలు! కృష్ణ! యంచు సభలో లీనాంగి యై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁ జేయఁడే ద్రౌపదిన్!

363

తా॥ శత్రువులు అయిన కౌరవులు పాంచాలి కట్టుకున్న చీరలు విప్పేటప్పుడు "నా భర్తలు రారీవేళ. ఉపేక్షసేయతగదు. వచ్చి రక్షించు. కృష్ణా!" — అంటూ సభలో ప్రార్థించినప్పుడు కరుణతో ద్రౌపదిని చీరలిచ్చి కాపాడెను కదా!

సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు వంపఁ, బదివేల శిష్యుల భక్తిఁ గొలువఁ
జనుదెంచి మనముఁ బాంచాలియుఁ గుడిచిన, వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు, ననుచుఁ దోయావగాహమున కేఁగఁ
గడవల నన్న శాకములు దీఱుటఁ జూచి, పాంచాల పుత్రిక పర్ణశాల

తే. లోనఁ దలఁచిన విచ్చేసి లోవిలోని, శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి, తపసి కోప

ముడిగించి, పరిపూర్ణకుక్షిఁ జేసె, నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు?

364

తా॥ దుర్వాసుడు ఒకనాడు దుర్యోధనుడు పంపిస్తే పదివేలమంది శిష్యులు భక్తితో కొలువ మన దగ్గరకు వచ్చాడు. అప్పటికే మనమూ పాంచాలి భుజించాము. అప్పుడా మునీంద్రుడు మనలను తనతో పాటు తన శిష్యులకు భోజనం పెట్టమన్నాడు. లేకపోతే శపిస్తానన్నాడు. అలా అని నదీ స్నానానికి వెళ్ళాడా ముని. అప్పుడు వంటశాలలోకి వెళ్ళి చూసేసరికి కడవలలో ఉన్న శాకములు అన్ని అయిపోవటం చూసిన పాంచాల రాజపుత్రి ఆ పర్ణశాలలో ఉండి మనస్సులో కృష్ణున్ని తలచుకుంది. వెంటనే ప్రత్యక్షమై ఆ పాత్రలలో కొద్దిగా మిగిలిన అన్నాన్ని నోట్లో వేసుకొన్నాడు కృష్ణుడు. అంతే! దుర్వాసుడు, అతని శిష్యుల కడుపులన్నీ నిండిపోయాయి. మూడు లోకాలకు సంతుష్టిని కలిగించే మహానుభావుడు మనకు ఎక్కడ దొరుకుతాడు.

సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని, బలమున నా కిచ్చెఁ బాశుపతము?
నెవ్వని లావున నిమ్మేన దేవేంద్రు, పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ?
గాలకేయ నివాతకవచాది దైత్యులఁ, జంపితి నెవ్వని సంస్మరించి?
గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ, గడచితి నెవ్వని కరుణఁ జేసి?

ఆ. కర్ణసింధు రాజ కౌరవేంద్రాదుల, తలల పాగ లెల్లఁ దడవి తెచ్చి,
యే మహాత్ము బలమి నిచ్చితి విరటుని, పుత్త్రి యడుగ బొమ్మపొత్తికలకు.

365

తా॥ ఫాలాక్షుడు పందికై పోరాడితే కృష్ణుని బలం వల్లనే కదా ఆయన నాకు పాశుపతాన్ని ఇచ్చాడు. గోపాలుని అనుగ్రహం వల్లనే కదా ఈ శరీరంతో దేవేంద్రుని యొక్క సగం పీఠంమీద ఆసీనుడనయ్యాను. కాలకేయ, నివాత, కవచాది దైత్యులను మాధవుణ్ణి సంస్మరించి కదా సంహరించాను. గోగ్రహణం నాడు కౌరవ సేనా సముద్రాన్ని కేశవుని కరుణచే గదా దాటాను.

కర్ణుడు, సైంధవుడు, కౌరవులు ఇత్యాది వీరుల తలపాగలన్నీ కోసి తెచ్చి ఆ పద్మనాభుని దయచేతనే విరటుని పుత్రిక అయిన ఉత్తరకు బొమ్మల పెండ్లిండ్లకు ఇచ్చాను.

మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశ చక్రంబులో
గురుశక్తిన్ రథయంత యై నొగలపైఁ గూర్చుండి యా మేటి నా
శరముల్ వాఱక మున్న వారల బలోత్సాహాయు రుద్యోగ త
త్పరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నా కిచ్చుచున్

366

తా॥ భీష్మద్రోణాదులు కూడి పన్నిన కురుక్షేత్ర సంగ్రామంలో నాకు సారథ్యం చేస్తూ రథం యొక్క నొగలపై కూర్చుని ఆ మేటి వీరుడు నా బాణ పరంపరలు వారిమీద వర్షింపక ముందే వారల బలాన్ని ఉత్సాహాన్ని ఆయువును ప్రయత్నాన్ని కేవలం చూపులతోనే వమ్ము చేశాడు. నాకు అమితమైన ఉత్సాహాన్ని ఇచ్చాడు.

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగె మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా!

367

తా॥ నరేంద్రోత్తమా! హిరణ్యకశిపుడు చేసిన క్రూరమైన కృత్యాలు ప్రహ్లాదుణ్ణి ప్రవేశించి గెలవడానికి సమర్థములు కాకపోయాయి. అలాగే కృపాచార్య, అశ్వత్థామ, భీష్మ, కర్ణ, ద్రోణ ఇత్యాది మహావీరుల ధనుస్సుల నుండి విడువబడిన దివ్యాస్త్రములు నా దెసకు రాక మాధవుని దయవల్ల ప్రక్కకు పోయాయి.

చ. వసుమతి దివ్యబాణములు వ్రక్కలు వాపి కొలంకు సేసి, నా

రసములు మాటుగాఁ బఱపి రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు, నా
కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె భూవరా!

368

తా॥ భూవరా! సైంధవ వధనాటి యుద్ధంలో భూమిమీద దివ్య బాణములు వేసి కొలంకు చేసి రిపులు అందరు చూస్తూండగా నా రథాశ్వాలకు దప్పిక తీర్చింది నాకు అసుర విరోధి అయిన కృష్ణుడు అండగా ఉండబట్టి కదా!

సీ. చెలికాఁడ! రమ్మని చీరు నన్నొకవేళ, మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనము లిచ్చు,
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు, బోధియై యొకవేళ బుద్ధిసెప్పు,
సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ, గ్రీడించు నొకవేళ, గేలిసేయు,

తే. నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న, తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు,
హస్తములు వట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ! మాధవు మఱవ రాదు.

369

తా॥ చెలికాడా! రమ్మని ఒకప్పుడు పిలిచేవాడు, నేను అతనికి మరదిని అవుతానని మన్నించేవాడు. ఒకప్పుడు బంధుభావాన్ని పాటించేవాడు. దాతయై ఒకప్పుడు ధనం ఇచ్చేవాడు. మంత్రిగా ఒకప్పుడు ఆలోచన చెప్పేవాడు. బోధియై ఒకప్పుడు బుద్ధిచెప్పేవాడు. చనువుతో ఒకవేళ సారథ్యం చేసేవాడు. ఒకప్పుడు క్రీడించేవాడు. మరొకప్పుడు వేళాకోళం చేసేవాడు. ఒక్కొక్కప్పుడు నేను కూర్చున్న శయ్యమీదే తనూ కూర్చునేవాడు. కన్నతండ్రి వలె చేసిన తప్పు కాచేవాడు. రెండు హస్తములు పట్టుకుని నా పొత్తున తనూ కూర్చుని ఆరగించేవాడు. అట్టి మాధవుణ్ణి మరచిపోవటం ఎలా?

క. విజయ! ధనంజయ! హనుమ! ధ్వజ ఫల్గున! పార్థ! పాండుతనయ! నర! మహేం ద్రజ!
మిత్రార్జున! యంచును, భుజములు దలకడవ రాకపోకలఁ జీరున్.

370

తా॥ విజయా! ధనంజయా! హనుమద్ధ్వజా! పార్థా! ఫల్గుణా! పాండు తనయా! నరా! కిరీటీ! సవ్యసాచీ! అర్జునా!.... అని భుజములు శిరస్సు తడుముతూ ఎంత ప్రేమ ఆదరములతో పిలిచేవాడో కదా!

క. వారిజగంధులు దమలో, వారింపఁగ రాని ప్రేమ వాదము సేయన్
వారిజనేత్రుఁడు నను దగ, వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా!

371

తా॥ అంతఃపుర కాంతలు వారిలో వారికి; శ్రీకృష్ణునితోను ఏదైనా ప్రణయ కలహం పుట్టినప్పుడు ఆ అలుకను నివారించటం కోసం వారిజ నేత్రుడు నన్ను వారింటికి పంపుతూ ఉండేవాడు.

క. నిచ్చలు లోపలి కాంతలు, మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడల మీఁద విచ్చేసి నృపా!

372

తా॥ ఎప్పుడూ అంతఃపుర కాంతలు మచ్చికతో తనతో ఆడే మాటలు నా ఒడిలో కూర్చొని నాతో ముచ్చటలు చెప్పుతూండేవాడు.

చ. అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేఁడు సూడుమా
యిటువలె గారవించు జగదీశుఁడు గృష్ణుఁడు లేని పిమ్మటం
బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁబోక నేఁ

గటగట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో?

373

తా॥ భూవర! ఇప్పటివరకు నేను చేసిన నా సేవలన్నీ వ్యర్థమై పోయాయి. నన్నిట్లా గారవించే జగదీశ్వరుడైన కృష్ణుడు లేకపోయినా దేహంమీద ఉండే భ్రాంతి చేత ప్రాణములు పోకుండా అంటిపెట్టుకుని ఉన్నాయి. పూర్వజన్మలో నేను చేసిన కర్మలు ఎట్టివో?

శా. కాంతారంబున నొంటి దోడుకొని రాఁగాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా
చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నా సీమంతినీ సంఘమున్
భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్ లేక; ధాత్రీశ్వరా!

374

తా॥ ఆ పురుషోత్తముడు శరీరాన్ని విడిచిన తర్వాత ఆయన శుద్ధాంత స్త్రీలను పదహారు వేలమందిని అరణ్యంలోంచి నేను ఒంటరిగా తీసుకొని వస్తూండగా మదము చేతను, కామము చేతను తాకి బోయలు చుట్టుమూగి పట్టుకొన్నారు. ఆ సీమంతినీ సంఘాన్ని విడిపించలేక ఆడదానిలా కళ్ళప్పచెప్పి చూస్తూ ఊరకుండిపోయాను.

శా. ఆ తే రా రథికుండు నా హయము లా యస్త్రాసనం బా శర
వ్రాతం బన్యులఁ దొల్లి జంపును దుదిన్ వ్యర్థంబులై పోయె మ
చ్చేతోఽధీశుఁడు చక్రి లేమి, భసిత క్షిప్తాజ్యమాయావి మా
యా తంత్రోషరభూమి బీజముల మర్యాదన్ నిమేషంబునన్.

375

తా॥ ఆ రథం ఆ రథికుడు ఆ గుర్రం ఆ అస్త్రాలు ఆ బాణాలు ఇవన్నీ ఇంతకు ముందు అన్యుల ప్రాణాలను హరించేవి. ఇప్పుడు చక్రిలేని కారణంగా వ్యర్థమైపోయాయి. అన్నీ బూడిదలో

పోసిన నెయ్యివలె, మాయావి యందు మాయ వలె, ఊషర క్షేత్రంలో చల్లిన బీజములవలె ప్రయోజనం లేకుండా పోయాయి.

మ. యదువీరుల్ మునినాథు, శాపమునఁ గాలాధీనులై, యందఱున్ మదిరాపాన వివర్ధమాన మదసమ్మర్ద్రోగ్ర రోషాంధులై కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి నీల్గెరి, న ష్టదశం జిక్కిరి నల్వురేవు రచటన్ సర్వంసహావల్లభా!

376

తా॥ ఓ ధరణీనాథా! ఆ యదువీరులందరూ కూడా మునినాథుని శాపవశం చేత కాలానికి లొంగిపోయారు. అందరూ మద్యపానం చేసిన మత్తుచేత కలిగిన మదము రోషము వీటిచేత అంధులై వాళ్ళలో వాళ్ళు పోరాడుకున్నారు. పిడి గ్రుద్దులు గ్రుద్దుకొని నలుగురు అయిదుగురు తప్పించి మిగతావారు ప్రాణాలు పోగొట్టుకున్నారు.

క. భూతముల వలన నెప్పుడు, భూతములకు జన్మ మరణ పోషణములు ని ర్ణీతములు సేయుచుండును, భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా!

377

తా॥ భూతశరణ్యా! భూతముల వలన ఎప్పుడు కూడా భూతములకు జన్మము, పోషణము, మరణము నిర్ణీతం అవుతూ ఉంటాయి. ఈశ్వరుడు అంతర్యామి స్వరూపంగా సర్వభూతముల యందు (ప్రాణులయందు) ఉన్నాడు.

క. బలములు గల మీనంబులు, బలవిరహిత మీనములను భక్షించు క్రియన్
బలవంతు లయిన యదువులు, బలరహితులఁ జంపి రహితభావముల నృపా!

378

తా॥ ఓ రాజా! బలమైన చేపలు బలహీనంగా ఉన్న చేపలను భక్షిస్తాయి. అలాగే

బలవంతులైన యాదవులు బలరహితులయిన యాదవులను చంపారు.

మ. బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం
బులు గల్పించి, వినాశమున్ నెఱపి, యీ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిం గృతకార్యుఁడై చనియె, నా సర్వేశ్వరుం డచ్యుతుం
డలఘుం డేమని చెప్పుదున్ భగవదాయత్తంబు పృథ్వీశ్వరా!

379

తా॥ పృథ్వీశ్వరా! బలహీనులకు బలవంతులకు శత్రుత్వాన్ని కల్పించి చివరకు వినాశంతో పూర్తి చేశాడు. ఈ భూభారాన్ని తగ్గించి నిశ్చలమైన బుద్ధితో తన పని పూర్తి చేసుకొని వెళ్ళాడు. ఆ సర్వేశ్వరుడు అచ్యుతుడు, అలఘుడు. ఆయన లీలలను ఏమని చెప్పేది.

వ. మఱియు దేశకాలార్థ యుక్తంబులు, నంతఃకరణ సంతాప శమనంబులు నయిన హరివచనంబులం దలంచి, చిత్తంబు పరాయత్తంబయి యున్నది. అని యన్నకుం జెప్పి, నిరుత్తరుండై, నిరంతర హరిచరణారవింద చింతామలబుద్ధియై శోకంబు వర్జించి, సదా ధ్యానభక్తి విశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయ సేనామధ్యంబున నచ్యుతుం డానతిచ్చిన గీతలు దలంచి, కాలకర్మ భోగాభినివేశంబులచేత నావృతంబయిన విజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి, హేతుమద్భావంబున శోకహేతు వహంకార మమకారాత్మకం బయిన ద్వైతభ్రమం బనియును, ద్వైత భ్రమంబునకుఁ గారణంబు దేహం బనియును, దేహంబునకు బీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబు లనియును, గుణంబులకు నిదానంబు ప్రకృతి యనియును, 'బ్రహ్మేహ' మనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండు ననియు, ప్రకృతి యడంగుటయ నైర్గుణ్యం బనియును, నైర్గుణ్యంబువలనఁ గార్య లింగనాశం బనియును, గార్యలింగనాశంబున నసంభవంబగు ప్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్భోగంబున నుండు ననియును నిశ్చయించి, యర్జునుండు విరక్తుండై యూరకుండె;

ధర్మజుండు భగవదీయమార్గంబుఁ దెలిసి, యాదవుల నాశంబు విని నారదు వచనంబులం దలంచి, నిశ్చల చిత్తుండై స్వర్గమార్గ గమనంబునకు యత్నంబు సేయుచుండె నా సమయంబున.

380

తా॥ మరియు దేశకాలాలకు సరిపోయేవి, సంతాపమును పోగొట్టేవి అయిన ఆ హరి యొక్క వచనములను తలచుకొంటూ నా మనస్సు పరమేశ్వరుని మీద ఉన్నది" అని అన్నగారికి చెప్పి ఊరకున్నాడు అర్జునుడు. ఇక ఏమీ సమాధానం చెప్పక నిరంతరము హరియొక్క చరణారవిందములయందు బుద్ధిని నిలిపి శోకమును విడిచిపెట్టేశాడు. ఎప్పుడూ ధ్యానము, భక్తి వీటిచేత కామక్రోధాదులను జయించాడు. యుద్ధ ప్రారంభంలో ఉభయ సేనామధ్యమందు అచ్యుతుడు ఆనతిచ్చిన గీతలను గుర్తుకు తెచ్చుకున్నాడు. కాలంచేత, కర్మచేత, భోగంచేత, పట్టుదలచేత ఆవరింపబడిన విజ్ఞానాన్ని తిరిగి పొందాడు.

ఈ శోకానికి అహంకారము మమకారము వీటితో కూడిన ద్వైత భ్రాంతియే కారణమని, ద్వైతానికి దేహం కారణమని, దేహానికి లింగం కారణమని, లింగానికి గుణం కారణమని, గుణములకు ప్రకృతి కారణమని గ్రహించాడు. "బ్రహ్మోహం" – అనే జ్ఞానం కలిగితే ప్రకృతి నశిస్తుంది అని, ప్రకృతి లేకుండ పోవటమే నైర్గుణ్యమని, నైర్గుణ్యం వలన కార్యము లింగము నాశనమై పోతాయని, కార్యము లింగము ఈ రెంటి నాశనం వలన ప్రకృతిని విడిచి తిరిగి స్థూల శరీరం రాకుండా పురుషుడు కేవలం సమ్యగ్భోగంలో ఉంటాడు అనే నిశ్చయంతో అర్జునుడు విరక్తుడై ఊరకున్నాడు. ధర్మరాజు భగవంతుడైన శ్రీకృష్ణుడు వెళ్ళిన మార్గాన్ని తెలుసుకొని యాదవులు నాశనమైన విషయాన్ని విని, నారదుని వచనాలను తలచుకొని నిశ్చలమైన చిత్తంతో లోకాన్ని విడిచిపెట్టడానికి సిద్ధపడ్డాడు.

క. యదువుల నాశము మాధవు, పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ

త్పదచింతాతత్పరయై, ముదమున సంసారమార్గమునకుం బాసెన్.

381

తా॥ యాదవుల నాశనము, మాధవుని స్వర్గారోహణము వినిన కుంతీదేవి విమలమైన భక్తితో భగవత్పద చింతా తత్పరియై ఈ లోకాన్ని పరిత్యజించింది.

వ. ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి కంటకంబులు రెంటిని పరిహరించు విన్నాణి తెఱంగున, యాదవరూప శరీరంబునంజేసి యీశ్వరుఁడు లోకకంటక శరీరంబులు సంహరించి నిజ శరీరంబు విడిచె; సంహారంబునకు నిజశరీర పరశరీరంబులు రెండు నీశ్వరునకు సమంబులు. నిజరూపంబున మెలంగుచు రూపాంతరంబులు ధరియించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందు నటుని కైవడి లీలాపరాయణుండైన నారాయణుండు మీన కూర్మాది రూపంబులు ధరియించుఁ బరిహరించునని చెప్పి మఱియు నిట్లనియె.

382

తా॥ ఈ విధంగా ముల్లును ముల్లుతో తీసి పిమ్మట రెండు ముల్లులను బయట పారవేసే తెలివైన వానివలె ఈశ్వరుడు యాదవ శరీరంలో శ్రీకృష్ణుడుగా జన్మించి లోకకంటకులైన వాళ్ళని అందరిని సంహారించి తానూ ఈ లోకం నుండి నిష్క్రమించాడు. సంహారానికి నిజ శరీరము పర శరీరము రెండూ ఒకటే. నటుడు ఒక్కడే అనేక వేషాలు వేసినట్లు ఆ నారాయణుడు మీన కూర్మాది రూపాలను ధరిస్తాడు, పరిహరిస్తాడు.

సమాజంలో చెడు పెరిగి, ధర్మం క్షీణిస్తున్నప్పుడు వాటి మధ్య సమతుల్యాన్ని సాధించడానికి భగవంతుడు అవతరిస్తూంటాడు. అద్వైత వేదాంతం ప్రకారం భగవదవతారమనేది లేదు. అయితే ద్వైత–విశిష్టాద్వైత–తత్త్వానుభవాలచే కానవచ్చే భగవదవతారాలు పురాణప్రసిద్ధమైన దశావతారాలు మాత్రమే కాక, అసంఖ్యాకాలనీ విజ్ఞులు చెబుతారు.

క. ఏ దినమున వైకుంఠుఁడు, మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచి నాఁ
డా దినమున నశుభ ప్రతి, పాదకమగు కలియుగంబు ప్రాప్తం బయ్యెన్.

383

తా॥ ఏ రోజున వైకుంఠుడు ఈ భూమిమీద తన శరీరాన్ని విడిచి పెట్టేశాడో ఆ రోజు నుండి అశుభ ప్రతిపాదకమైన కలియుగం ప్రారంభమైంది.

# పరీక్షిత్తు పట్టాభిషేకము, పాండవుల స్వర్గారోహణము

సీ. కలివర్తనంబునఁ గ్రౌర్యహింసాసత్య, దంభ కౌటిల్యాద్యధర్మచయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ, గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజవై మను మని దీవించి, సింధుతోయకణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధ నందనుండైన వజ్రునిఁ దెచ్చి, మధురఁ బట్టము గట్టి మమతఁ బాసి

ఆ. కరుల హరుల భటులఁ గంకణాదికముల, మంత్రిజనుల బుధుల మానవతుల నఖిల
మయిన ధనము నభిమన్యు సుతునకు, నప్పగించి బుద్ధి నాశ్రయించి.

384

తా॥ కలి యొక్క ప్రవేశం వల్ల క్రౌర్యము, హింస, అసత్యము, దంభము, కుటిలత్వము మొదలైన అధర్మములు నగరాలలోను గృహముల యందు భూములలోను తమలోను కలుగుతుందని తెలుసుకొన్నాడు ధర్మరాజు. హస్తినాపురంలో మనుమడైన పరీక్షిత్తును రాజుగా దీవించి సింధునదీ జలములతో అభిషిక్తుని చేశాడు. అనిరుద్ధుని కుమారుడైన వ్రజుని తెచ్చి మధురకు రాజుగా చేసి పట్టం కట్టాడు. ఏనుగులు, గుఱ్ఱములు, భటులు, కంకణములు, మంత్రులు, పండితులు, స్త్రీలు.... అఖిలమైన ధనాన్ని అభిమన్యుని కుమారుడయిన పరీక్షిత్తుకు అప్పగించి ధర్మరాజు వైరాగ్య మార్గాన్ని ఆశ్రయించాడు.

వ. విరక్తుడైన దర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిఁ గావించి యగ్నుల నాత్మారోపణంబు సేసి, నిరహంకారుండును, నిర్దళితాశేష బంధనుండునునై సకలేంద్రియంబుల మానసంబున నడంచి, ప్రాణాధీనవృత్తి యగు మానసంబును బ్రాణమందును, బ్రాణము నపానమందును, నుత్సర్గసహితం బయిన యపానము మృత్యువు నందును, మృత్యువును పంచభూతంబులకు నైక్యంబైన దేహంబు నందును, దేహమును గుణత్రయంబు నందును, గుణత్రయంబు నవిద్యయందును, సర్వారోపహేతు వగు నవిద్యను

జీవునియందును, జీవుం డయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మమందును లయింపఁజేసి బహిరంగ వ్యాపారంబులు విడిచి, నార చీరలు ధరియించి మౌనియు నిరాహారుండును ముక్తకేశుండునునై, యున్మత్త పిశాచ బధిర జడుల చందంబున నిరపేక్షకత్వంబున.

385

తా॥ విరక్తుడైన ధర్మనందనుడు ప్రాజాపత్యం అనే ఇష్టి చేశాడు. అగ్నులను తనయందు ఆరోపించుకొని నిరహంకారుడై అన్ని బంధాలను తెగతెంపులు చేసుకొన్నాడు. సకల ఇంద్రియాలను మనస్సులోను, మనస్సును ప్రాణంలోను, ప్రాణాన్ని అపానంలోను, అపానాన్ని మృత్యువునందు, మృత్యువును దేహంలోను, దేహాన్ని గుణత్రయంలోను, గుణత్రయాన్ని అవిద్యయందు, అవిద్యను జీవునియందు, జీవుడైన తనను అవ్యయమైన బ్రహ్మములోను లయింపచేశాడు. బహిరంగ వ్యాపారాలు అన్నీ మానేశాడు. నార చీరలు ధరించి మౌనియై, నిరాహారుడై, విడువబడిన కేశములు కలవాడై ఉన్మత్తునివలె, పిశాచం పట్టిన వానివలె, చెవిటివాని వలె, జడునివలె.... దేనియందు ఆసక్తిలేక కూర్చుండిపోయాడు.

క. చిత్తంబున బ్రహ్మము నా, వృత్తముఁ గావించికొనుచు విజ్ఞానధనా
యత్తులు దొల్లి వెలింగెడి, యుత్తరదిశ కేఁగె నిర్మలోద్యోగమునన్.

386

తా॥ తన చిత్తమునందు బ్రహ్మమును మననం చేసికొంటూ పూర్వం విజ్ఞానవంతులైన మహానుభావులు అనుసరించిన ఉత్తర దిక్కుగా నిర్మలమైన మనస్సుతో ప్రయాణం సాగించాడు.

సీ. అంత నాతని తమ్ము లనిలపుత్త్రాదులు, గలిరాకచేఁ బాపకర్ము లగుచుఁ
జరియించు ప్రజల సంచారంబు లీక్షించి, యఖిలధర్మంబుల నాచరించి
వైకుంఠ చరణాబ్జ వర్తితహృదయులై, తద్భక్తినిర్మలత్వమును జెంది
విషయయుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక, నిర్ధూతకల్మష నిపుణమతులు

తే. బహుళ విజ్ఞానదావాగ్ని భసితకర్ములైన, యేకాంతులకు లక్ష్యమై వెలుంగు ముఖ్యనారాయణ స్థానమునకుఁ జనిరి, విగతరజమైన యాత్మల విప్రముఖ్య.

387

తా॥ పిమ్మట ఆ ధర్మనందనుని తమ్ములైన అర్జున భీమ సేనాదులు కలి ప్రభావంతో పాపకర్ములయి చరిస్తూన్న ప్రజల నడవడికను వీక్షించారు. అఖీల ధర్మాలను ఆచరించి వైకుంఠుని యొక్క చరణాబ్జములను ధ్యానించారు. ఆ భక్తి వలన నిర్మలత్వాన్ని పొందారు. విషయాసక్తులకు ప్రవేశించడానికి వీలులేనిది, ఏ కల్మషము లేనివారు మాత్రమే ప్రవేశించుటకు వీలైనది, విజ్ఞానమనే దావాగ్ని చేత సమస్త కర్మలను భస్మం చేసిన వారు మాత్రమే చేరగలిగినది... అయిన నారాయణ స్థానానికి చేరుకున్నారు.

వ. అంత విదురుండు ప్రభాస తీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబు తోడ దండధరుం డగుటం జేసి నిజాధికార స్థానంబునకుం జనియె; ద్రుపదరాజపుత్రియుఁ బతులవలన నుపేక్షితయై జగత్పతియైన వాసుదేవునందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె నిట్లు.

388

తా॥ ఆ పిమ్మట విదురుడు ప్రభాస తీర్థంలో హరియందు మనస్సును లగ్నం చేసి శరీరాన్ని విడిచి పెట్టేశాడు. పితృదేవతలతో కలిసి దండధరుడైన (యమధర్మరాజు) కారణంగా తన అధికార స్థానానికి చేరుకొన్నాడు. ద్రౌపదీ దేవి కూడ తన పతుల వలన ఉపేక్షితయై సమస్త లోకాలను భరించువాడైన వాసుదేవుని యందు చిత్తాన్ని చేర్చి ఆ లోకాన్ని చేరుకొన్నది.

క. పాండవకృష్ణుల యానము, పాండురమతి నెవ్వఁడైనఁ బలికిన విన్నన్ ఖండితభవుఁడై హరిదా, సుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా.

389

తా॥ పాండవులు మరియు శ్రీకృష్ణుని యొక్క స్వర్గారోహణాన్ని స్వచ్ఛమైన హృదయంతో ఎవరైతే చదువుతారో ఎవరైతే వింటారో ఈ లోకంలోని సమస్త బంధాలు త్రెంచుకొని కేవలం హరిదాసుడై కైవల్య పదాన్ని చేరుకుంటాడు.... నరేంద్రా!

వ. అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన పెద్దలు సెప్పిన చందంబున భూసురో త్తమశిక్షావశంబున మహాభాగవత శేఖరుండై ధరణీపాలనంబు సేయుచు నుత్తరుని పుత్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియయి, జనమేజయ ప్రముఖులైన నలువురు గొడుకుల నుత్పాదించి, గంగా పులినతలంబునఁ గృపాచార్యుండు గురుత్వంబు సేయ యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు, భూరిదక్షిణంబులుఁగా మూఁడశ్వమేధంబు లాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్ను శూద్రుండును రాజచిహ్న ముద్రితుండును నగు కలిం బట్టి నిగ్రహించె నని చెప్పిన, శౌనకుండు పౌరాణికున కిట్లనియె.

390

తా॥ అంత అక్కడ కుమారుడైన పరీక్షిత్తు పెద్దలు చెప్పిన విధంగా బ్రాహ్మణోత్తముల వద్ద అన్ని విద్యలు అభ్యసించాడు. మహాభాగవత శేఖరుడై రాజ్యపాలన చేస్తున్నాడు. ఉత్తరుని పుత్రిక అయిన ఇరావతిని పెండ్లి చేసుకొని జనమేజయుడు మొదలుగా నలుగురు కొడుకులను కన్నాడు. కృపాచార్యుడు గురువుగా గంగానదీ సైకత స్థలంలో యాగ భాగాల కోసం వచ్చిన దేవతలను వీక్షించుచు మూడు అశ్వమేధములు చేశాడు. భూరి దక్షిణలు ఇచ్చాడు. దిగ్విజయం చేసే కాలంలో గోమిథునాన్ని తన్నుతూ రాజ చిహ్నముద్రితుడైన శూద్రుడుగా ఉన్న కలిని పట్టుకొని శిక్షించాడు. అప్పుడు శౌనకుడు సూతునితో ఇట్లా అన్నాడు:

## పరీక్షిన్మహారాజు భూదేవి, ధర్మదేవతల సంవాదం వినుట

క. భూవరరూపుఁడు శూద్రుఁడు, గోవుం దా నేల తన్నెఁ గోరి పరీక్షి
ద్భూవరుఁడు దిశల గెలుచుచు, నే విధిఁ గలి నిగ్రహించె నెఱిఁగింపఁగదే.

391

తా॥ "సూతమహర్షీ! రాజ వేషంలో ఉన్న శూద్రుడు గోవులను తాను ఎందుకు తన్నాడు? పరీక్షిన్మహారాజు అన్ని దిక్కులను జయిస్తూ ఏ విధంగా కలిని నిగ్రహించాడో తెలియ చెప్పండి.

మ. అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు
ర్నరవార్తాకథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండఁ జన దీ సంసార మోహంబునన్.

392

తా॥ శ్రీ మహావిష్ణువు యొక్క పాదారవిందముల యందు ఆసక్తులై ఉన్న సత్పురుషుల యొక్క చరిత్రలు వినకుండా దుర్బుద్ధితో దుర్జనుల యొక్క వార్తలను వింటూ సంసారబంధాలకు లోబడి, పరమార్థాన్ని విస్మరించి రోజులు వ్యర్థంగా గడపకూడదు.

ఇంద్రియ లోలత్వం ఎప్పుడు నశిస్తుంది? ఎవడు సమస్త ఆనందాలకూ, సుఖాలకూ నిలయమో, పరమావధో–అటువంటి పరమాత్మణ్ణి ప్రార్థించేటప్పుడు ఇంద్రియలోలత నశిస్తుంది. విషయ సుఖాల్లోని వ్యామోహం అంతరిస్తుంది. బ్రహ్మానందాన్ని అనుభవించే వారికి ఐహికసుఖాలు రసహీనంగా, తుచ్ఛంగా కనిపిస్తాయి. అవి వారిని ఆకర్షించలేవు.

–శ్రీరామకృష్ణ పరమహంస

సీ. మనుట నిత్యము గాదు మరణంబు నిజ మని, యెఱిఁగి మోక్షస్థితి నిచ్చగించు
నల్పాయువు లగు మా కన్యదుర్జన చరి, త్రము లోలిఁ గర్ణ రంధ్రములఁ బెట్టి
బంగారు వంటి యీ బ్రదికెడు కాలంబుఁ, బోనాడఁగా నేల పుణ్యచరిత
మాధవపదపద్మ మకరందపానంబు, సేయింపవే యేము సేయునట్టి

ఆ. సత్త్రయాగమునకు సన్మునీంద్రులు సీర, వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు చంపఁ
డొకనినైన జన్న మయ్యెడు దాఁక, వినుచునుండుఁ దగిలి విష్ణుకథలు

393

తా॥ ఓ పుణ్యచరిత్రా! బ్రతుకు శాశ్వతం కాదు. మరణం నిజం. ఈ విషయాన్ని తెలుసుకొని మోక్ష స్థితిని కోరే అల్పాయుష్కులమైన మేము దుర్జనులయిన అన్యుల చరిత్రమును కర్ణరంధ్రములలో పెట్టుకుని బంగారం వంటి ఈ బ్రతుకును ఎందుకు పాడు చేసుకోవాలి? మాధవుని యొక్క పాదపద్మములయందు ఉండే మకరందాన్ని మా చేత పానం చేయించు. మేము చేసే సత్రయాగానికి మునీంద్రులు పిలిస్తే యమధర్మరాజు వచ్చాడు చూడు! విష్ణు కథలమీద ఉండే ప్రీతి చేత ఈ యజ్ఞం పూర్తి అయ్యేవరకు ఒక్కడిని కూడ చంపడు. విష్ణు కథలు వింటూ కూర్చుంటాడు.

క. మందునకు మందబుద్ధికి, మందాయువునకు నిరర్థమార్గునకును గో
విందచరణారవింద మ, రందము గొనఁ దెఱపి లేదు రాత్రిందివముల్.

394

తా॥ మందబుద్ధులూ, సోమరిపోతులు, అల్ప ఆయుర్దాయం కలవారు, ప్రయోజనం లేని మార్గంలో పయనిస్తూ రాత్రింబవళ్ళు కాలం వెళ్ళబుచ్చుతారు. అటువంటివారికి గోవిందుని చరణారవింద మకరందాన్ని గ్రోలే అవకాశమే ఉండదు.”

వ. అని శౌనకుఁడు పలికిన సూతుం డిట్లనియెఁ బరీక్షిన్న రేంద్రుండు నిజవాహినీ సందోహ

సురక్షితంబగు కురుజాంగలదేశంబునం గలి ప్రవేశంబు నాకర్ణించి, యుద్ధకుతూహలత నంగీకరించి, యొక్క నాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని, నీల నీరద నిభతురంగ నివహ యోజితంబును, ఫలిత మనోరథంబును నైన రథంబు నారోహణంబు సేసి, మృగేంద్ర ధ్వజంబు వెలుంగ రథ కరి తురంగమ సుభట సంఘటితంబగు వాహినీచక్రంబు నిర్వక్రంబుగం గొలువ, దిగ్విజయార్థంబు వెడలి పూర్వదక్షిణ పశ్చిమోత్తర సముద్రలగ్నంబు లయిన, యిలావృత రమ్యక హిరణ్మయ హరివర్ష కింపురుష భద్రాశ్వ కేతుమాల భారత వర్షంబులు నుత్తర కురుదేశంబులను జయించి, పుష్కల ధనప్రదాన పూర్వికలగు సపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు మంగళ పాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజవృత్తాంతంబు లాకర్ణించుచుఁ బాఠకపఠితపద్యంబుల వలనం బాండవులకు భక్తవత్సలుండై పుండరీకాక్షుం డాచరించిన సారథ్య, సఖ్య, సాచివ్య, సభాపతిత్వ, వీరాసనత్వ, దూతభావాది కర్మంబులు నశ్వత్థామాస్త్ర తేజంబు వలనఁ దన్ను రక్షించుటయు, యాదవ పాండవులందలి స్నేహానుబంధంబును, వారలకుఁ గలిగిన భగవద్భక్తివిశేషంబును విని, విశ్వంభరుని భక్త వాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, వందిబృందంబులకున్ మహార్ఘంబులగు హారాంబరాభరణాది సందోహంబుల నొసంగుచుఁ, బద్మనాభ పాదపద్మ భజన పరతంత్ర పవిత్రమానసుండై యుండె; నయ్యెడ వృషభ రూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు దన సమీపంబున లేఁగ కుఱ్ఱి చందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె.

395

తా॥ అని శౌనకుడు పలికేసరికి సూతుడు ఇలా అన్నాడు: “పరీక్షిన్మహారాజు తన సైన్యం చేత రక్షింపబడుతూ ఉన్న కురుజాంగల దేశంలోకి కలి ప్రవేశించాడని విన్నాడు. యుద్ధం చెయ్యాలనే సంకల్పంతో ఒకరోజున బాణాసనాన్ని తీసుకొని నీలమేఘాల వంటి హయములను పూన్చిన రథాన్ని తన మనోరథాన్ని సఫలం చేసేదానిని అధిరోహించాడు. సింహధ్వజం

ప్రకాశిస్తూండగా రథములు ఏనుగులు హయములు భటులు... వీరితో కూడిన సేనావాహిని అడ్డులేని పరాక్రమంతో కొలువ దిగ్విజయం కోసం బయలుదేరాడు. తూర్పు పడమర ఉత్తరం దక్షిణం.... సాగర తీరంబులైన ఇలావృత్తం, రమ్యకం, హిరణ్మయం, హరి వర్షం, కింపురుషం, భద్రాశ్వం, కేతుమాలం, భారత వర్షములు, ఉత్తర కురుభూములను జయించాడు. ఆ దేశాల రాజులు ఇచ్చిన ధనరాసులను కానుకలుగా తీసుకొన్నాడు. మంగళ పాఠక సమూహం చేత జేగీయ మానంగా చెప్పిన పూర్వ రాజుల వృత్తాంతాన్ని ఆకర్ణించాడు. పాఠకులు చదివిన పద్యముల వలన పాండవులకు భక్తవత్సలుడై కృష్ణుడు సారథిగా, స్నేహితునిగా, సచివునిగా, సభాపతిగా, వీరునిగా, దూతగా ఇంకా ఇతర కర్మలలో చేసిన సహాయం గూర్చి విన్నాడు. అశ్వత్థామ అస్త్ర తేజం నుండి తనను రక్షించటం గూర్చి విన్నాడు. యాదవ పాండవుల మధ్య ఉన్న స్నేహానుబంధాన్ని, వారలకు కలిగిన భగవద్భక్తి విశేషాన్ని విన్నాడు. పాండవుల మీద కృష్ణునికి కల వాత్సల్యానికి ఆశ్చర్యాన్ని పొందాడు. వందిమాగధులకు అమూల్యమైన హారములు, అంబరములు, ఆభరణములు కానుకలుగా ఇచ్చాడు. శ్రీకృష్ణుని పాదపద్మములను సేవించుటయందు మనస్సు లగ్నమై ఉన్నాడు. అప్పుడు వృషభ రూపాన్ని ధరించి ఒంటికాలితో సంచరిస్తూన్న ధర్మదేవుడు; తన సమీపంలో ఉన్న దూడను వీడిన పాడి ఆవు మాదిరిగా వెలుగును కోల్పోయి కళ్ళలోంచి కన్నీరు కారుస్తూ గోరూపంలో ఉన్న భూదేవితో ఇలా అన్నాడు:

మ. నయనాంభఃకణజాల మేల విడువన్? నాతల్లి! నీ మేను సా
మయమై యున్నది; మోము వాడినది; నీ మన్నించు చుట్టాలకున్
భయదుఃఖంబుల నెందు నొందవు గదా? బంధించి శూద్రుల్ పద
త్రయహీనన్ ననుఁ బట్ట వత్తు రనియో, తాపంబు నీ కేటికిన్?



తా॥ "నీ కండ్ల నుండి కన్నీరు కారుతూన్నది ఏం తల్లీ! నీ శరీరం రోగగ్రస్తమై ఉన్నట్లు ఉన్నదేమమ్మా! నీ ముఖం అంతా వాడిపోయింది! నువ్వు ఎప్పుడూ మన్నించే నీ చుట్టాలకు భయ

దుఃఖములు ప్రాప్తింప లేదు కదా! మూడు పాదములు లేని నిన్ను బంధించి శూద్రులు పట్టుకోవడానికి వస్తారని బాధపడుతున్నావా అమ్మా!

సీ. మఖములు లేమి నమర్త్యుల కిటమీఁద, మఖభాగములు లేక మాను ననియొ? రమణులు రమణుల రక్షింప రనియొ పు, త్త్రులఁ దల్లిదండ్రులు ప్రోవ రనియొ? భారతి గుజనులఁ బ్రాపించు ననియొ స, ద్విప్రులు నృపుల సేవింతు రనియొ? కులిశ హస్తుఁడు వాన గురియింపకుండఁగఁ, బ్రజలు దుఃఖంబులఁ బడుదురనియొ?

ఆ. హీనవంశజాతు లేలెద రనియొ, రాజ్యములు పాడి గలిగి జరుగవనియొ? మనుజు లన్నపానమైథున శయనాస, నాది కర్మసక్తు లగుదు రనియొ?

397

తా॥ యజ్ఞాలు లేనందువల్ల దేవతలకు ఇకపైన హవిర్భాగాలు లేవని బాధపడుతున్నావా అమ్మా! భర్తలు భార్యలను రక్షింపరని, తమ పుత్రులను తండ్రులు ప్రోవరని విచారిస్తున్నావా! సరస్వతీ దేవి దుష్టులను ఆశ్రయిస్తుందని బ్రాహ్మణోత్తములు రాజులకు సేవ చేస్తారని అనుకుని దుఃఖీస్తున్నావా! ఇంద్రుడు వానను కురిపించకపోతే ప్రజలు దుఃఖీస్తారని చింతిస్తున్నావా! హీన వంశ జాతులు రాజ్యం చేస్తారని, ధర్మం నశిస్తుందని, కేవలం మనుష్యులు ఆహార పానీయ మైథున శయనాది కర్మల యందు ఆసక్తులవుతారని విచారిస్తున్నావా.

మ. జననీ! నీ భర మెల్ల డించుటకునై చక్రాయుధుం డిన్ని హా
యనముల్ దాను నరాకృతిన్ మెలఁగి నిత్యానందముం జేసి పో
యిన నే నింక ననాథ నైతిఁ; గుజనుం డెవ్వాఁడు శాసించునో
పెను దుఃఖంబులు నేమి పొందు ననియో భీతిల్లి చింతించుటల్.

398

తా॥ తల్లీ! నీ భారాన్ని తగ్గించటం కోసం హరి ఇన్ని సంవత్సరాలు తాను ఒక నరునిగా

జన్మించి నిత్యము ఆనందాన్ని కలిగించి ఆయన అవతారాన్ని చాలించాడే. నేనింక అనాథను అయ్యాను. ఏ దుర్మార్గుడు ఈ పైన శాసిస్తాడో, ఇక నేను ఏ దుఃఖములను అనుభవిస్తానో అని బాధపడుతున్నావా! తల్లీ!

క. దెప్పర మగు కాలముచే, నెప్పుడు దేవతలకెల్ల నిష్టం బగు నీ
యొప్పిదముఁ గృష్ణుఁ దరిగినఁ, దప్పెఁగదా! తల్లి! నీవు తల్లడపడఁగన్.

399

తా॥ దేవతలందరికీ పరమ ప్రీతికరమైన నీ సౌభాగ్యం కృష్ణ నిర్యాణంతో కూడా వెళ్ళిపోయిందా తల్లీ. ఇప్పుడు నీకు ఆపద వచ్చింది. అందుకని నువ్వు విచారిస్తున్నావా! అమ్మా!"

వ. అనిన భూదేవి యిట్లనియె.

400

తా॥ అని ధర్మదేవుడు పలికేసరికి భూదేవి ఇట్లా అన్నది:

క. ఈ లోకంబునఁ బూర్వము, నాలుగు పాదముల నీవు నడతువు నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమిని, గాలముచే నీకు నొంటి కాలయ్యెఁ గదే!

401

తా॥ "ఈ లోకంలో పూర్వం నాలుగు పాదాలతో నడిచేవాడివి. ఈనాడు శ్రీవల్లభుడు లేని కారణంగా నీవు ఒంటికాలి మీద నడుస్తున్నావు.

వ. మఱియు సత్య శౌచ దయా క్షాంతులును, ద్యాగసంతోషార్జవంబులును, శమ దమ తపంబులును, సమత్వంబును, పరాపరాధ సహనంబును, లాభంబు గలయెడ నుదాసీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, జ్ఞానవిరక్తులును, నైశ్వర్య శౌర్యప్రభా

దక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యంబును. గౌశలకాంతి ధైర్యమార్దవ ప్రతిభాతిశయ ప్రశ్రయశీలంబును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలంబులును, సౌభాగ్యగాంభీర్య స్థైర్యంబులును, శ్రద్ధాకీర్తి మాన గర్వాభావంబులును ననియెడి ముప్పది తొమ్మిది గుణంబులు; నవియునుంగాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహా గుణసమూహంబును శ్రీకృష్ణదేవుని యందు వర్తిల్లుంగావున.

402

తా॥ మరియు సత్యము, శౌచము, దయ, ఓర్పు, త్యాగము, సంతోషము, ఋజుభావము, అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, సమభావము, పరులు అపరాధం చేస్తే సహించుట, లాభం కలిగితే ఉదాసీనుడై ఉండటం, శాస్త్ర విచారము, జ్ఞానం, విరక్తి, ఐశ్వర్యము, శౌర్యము, తేజస్సు, దక్షత్వం, స్మృతి, స్వాతంత్ర్యంబును, కుశలత్వము, కాంతి, ధైర్యము, మృదుత్వము, ప్రతిభ, అతిశయము, అనునయము, శీలము, జ్ఞానేంద్రియ బలము, కర్మేంద్రియ బలము, మనో బలము, సౌభాగ్యము, గాంభీర్యము, స్థైర్యము, శ్రద్ధ, కీర్తి, మానము, గర్వం లేకపోవుట... అనే ముప్పది తొమ్మిది గుణములు శ్రీకృష్ణుని యందు ఉన్నాయి. ఇవి కాకుండా వేద విజ్ఞానం, శరణాగతులను రక్షించటం మొదలైన గొప్ప గుణాలు ఆయనలో ఉన్నాయి.

క. గణనాతీతము లగు స, ద్గుణములు గల చక్రి సనిన ఘోరకలి ప్రే
రణమునఁ బాప సమూహ, ప్రణయుతులగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ!

403

తా॥ తండ్రీ! గణించటానికి శక్యం కాని సద్గుణముల రాశి అయిన చక్రి, తన అవతారం చాలించగానే ఘోరం అయినటువంటి పాపసమూహం చేత నిండిన జనులను చూసి నేను దుఃఖిస్తున్నాను.

క. దేవతలకు ఋషులకుఁ బితృ, దేవతలకు నాకు నీకు ధీరులకును నా నా
వర్ణాశ్రమములకును, గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా!

404

తా॥ అనఘా! దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, నాకు, నీకు, ధీరులకు, నానా వర్ణాశ్రమముల వారికి, గోవులకు బాధలు కలుగుతూ ఉన్నందులకు నేను కుమిలి పోతున్నాను.

సీ. బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్ష వీ, క్షణము వాంఛింతురు సత్తపములఁ
గమలాలయము మాని కమల యెవ్వని పాద, కమలంబు సేవించుఁ గౌతుకమునఁ
బరమ యోగీంద్రులు భవ్య చిత్తములందు, నిలుపుదు రెవ్వని నియతితోడ
వేదంబు లెవ్వని విమలచారిత్రముల్, వినుతింపఁగా లేక వెగడు వడియె

ఆ. నట్టి వాసుదేవు నబ్జ వజ్రాంకుశ, చక్ర మీన శంఖ చాప కేతు చిహ్నితంబులైన
శ్రీచరణము లింక, సోఁక వనుచు వగపు సోఁకె నయ్య.

405

తా॥ బ్రహ్మాది దేవతలంతా ఆయన యొక్క భద్రమైన కటాక్ష వీక్షణాలను తపస్సు చేసి కోరతారు. తన నివాసమైన పద్మాన్ని మానుకొని కమల ఆయన యొక్క పాదకమలాలను కుతూహలంతో సేవిస్తూ ఉంటుంది. పరమ యోగులు వారి వారి మనస్సులలో ఆయననే నియమంగా నిలుపుకొంటారు. వేదరాశి ఆయన యొక్క విమలమైన చరిత్రను పొగడలేక తడబాటు పడింది. అటువంటి వాసుదేవుని అబ్జ వజ్ర అంకుశ చక్రమీన శంఖ చాప కేతు రేఖలతో అలంకృతమైన శ్రీ చరణములు ఇక నా మీద సోకవు గదా అని దుఃఖం వస్తూన్నదయ్యా!

క. హరిపాదంబులు సోఁకెడి, సిరి కతమున నఖిలభువనసేవ్యత్వముతో స్థిర నైతి నిన్ని
దినములు, హరి నా గర్వంబు మాన్చి యరిగె మహాత్మా!

406

తా॥ శ్రీహరి పాదములు నాకు సోకుతూ ఉన్న అదృష్టం చేత అఖిల భువనములు నన్ను సేవించాయి. ఇన్నాళ్ళు సంతోషంతో పొంగి పోయాను. అటువంటి హరి నా గర్వాన్ని తొలగించి వెళ్ళిపోయాడయ్యా! మహాత్మా!

క. లీలాకారము దాల్చెను, శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును, నాలుగు పాదముల నిన్ను నడిపించుటకున్.

407

తా॥ శ్రీహరి దుర్మార్గులను శిక్షించి శిష్యులను రక్షించటం కోసం, నాలుగు పాదములతో నిన్ను నడిపించటం కోసం లీలగా మానుష దేహాన్ని ధరించాడు.

ఉ. ఆ మధురోక్తు లా నయము లా దరహాసము లా దయారసం
బా మురిపంబు లా తగవు లా గమనక్రియ లా మనోహర
ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవుం
గామిను లేల? నిర్దళితకర్ములు యోగులుఁ బాయ నేర్తురే!

408

తా॥ ఆ తియ్యని మాటలు, ఆ మృదుత్వం, ఆ దరహాసం, ఆ మురిపెం, ఆ ప్రణయ కలహాలు, ఆ నడక తీరు, ప్రేమతో చూసే ఆ చూపులు... ఇక ఈ పైన ఎవరికీ దొరకవు కదా! అట్టి మాధవుని వియోగాన్ని కామినులే కాదు వారి కర్మలను వారు భేదించుకొన్న యోగులు సైతం సహించలేరు.

క. మెల్లన నాపై యాదవ, వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నే రం
జిల్లగ రోమాంచము క్రియ, మొల్లములై మొలచు సస్యములు మార్గములన్.

409

తా॥ ఆ యాదవ వల్లభుడు నాపై మెల్ల మెల్లగ అడుగులు వేస్తుంటే నేను మోహపరవశనైతే నా శరీరం మీద పుట్టిన రోమాంచము వలె సస్యములు మొలకెత్తేవి."

వ. అని యిట్లు పూర్వవాహిని యైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషధేనురూపంబుల భాషింప రాజర్షియైన పరీక్షిద్భూవరుండు డగ్గఱియె; నా సమయమున.

410

తా॥ అని ఈ ప్రకారంగా తూర్పు దిక్కుగా ప్రవహించే సరస్వతీ నదీ తీరంలో ధర్మదేవుడు, భూదేవి వృషభధేను రూపాలలో సంభాషించుకుంటూ ఉన్న తరుణంలో రాజర్షి అయిన పరీక్షిన్మహారాజు దగ్గరగా వెళ్ళాడు. అప్పుడు...

## కలిపురుషుడు ధర్మదేవతను తన్నుట

శా. కైలాసాచల సన్నిభంబగు మహాగంభీర గోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్య నిర్ముక్తుఁడై
నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్.

411

తా॥ కైలాస పర్వతంలా ఉన్న మహా గంభీరమైన ఆ వృషభాన్ని క్రోధోన్మత్తుడు, దండహస్తుడు రాజవేషంలో ఉన్న క్రూరుడు వడిగా నడిచే వాడూ అయిన శూద్రుడొకడు రాక్షసునివలె కరుణ లేకుండా నేలమీద పడిపోయేటట్లుగా తన్నాడు. ఆ వృషభం భయంకరమైన అతని పాదాహతికి మూత్రవిసర్జన చేస్తూ నేలమీద పడిపోయింది.

వ. మఱియును.

412

తా॥ మరియును–

శా. ఆలోలాంగక నశ్రు తోయ కణ జాలాక్షిన్ మహాంభారవన్
బాలారూఢ తృణావళీకబళలోభ వ్యాప్త జిహ్వాగ్ర నాం
దోళస్వాంత నజీవవత్స, నుదయద్దుఃఖాన్వితన్ ఘర్మ కీ
లాలాపూర్ణ శరీర, నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్.

413

తా॥ భయంచేత కదలుతున్న కన్నులలో అశ్రువులు కారుస్తూన్న దానిని, “అంబా” అని అరుస్తూన్న దానిని, లేతపచ్చిక పరకలను మేయాలనే లోభం చేత జిహ్వను చాచుతూ

ఆందోళనలో మనస్సు ఉన్న దానిని, తన చెంత లేగదూడ లేకుండా ఉన్న దానిని, దుఃఖంతో కూడుకొని ఉన్న దానిని, చెమటతో నిండిన శరీరం కలదానిని.... పరమ పవిత్రమైన గోవును బలంగా తన్నాడు.

వ. ఇ ట్లా ధేనువృషభంబులు రెంటిం గంటకుండై తన్నుచున్న రాజ లక్షణ ముద్రితుం డయిన శూద్రునిం జూచి సువర్ణ పరికర స్యందనారూఢుండగు నభిమన్యు నందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీర రవంబులగు వచనంబుల నిట్లనియె.

414

తా॥ ఈ విధంగా ధేనువును, వృషభాన్ని రెంటినీ కూడ దుర్మార్గంగా తన్నుతూన్న రాజలక్షణాలతో కూడిన శూద్ర పురుషుణ్ణి చూసాడు. చూసి కాంచన రథారూఢుడైన పరీక్షిత్తు కోదండాన్ని ఎక్కుపెట్టి మేఘ గంభీర వచనాలతో ఇట్లా అన్నాడు:

శా. నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో? కదిసెనో? నిర్భీతివై గోవులం
దన్నం గారణమేమి? మద్భుజసనాథక్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయ రా; దెఱుఁగవా? ధూర్తత్వమున్ భూమి భృ
త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు? నిన్ శాసించెదన్ దుర్మతీ!

415

తా॥ "ఎవడవురా నువ్వు? నిన్నేమైనా కొమ్ములతో చిమ్మిందా? నీ దగ్గరకు రాలేదే! భయం లేకుండా గోవులను తన్నడానికి గల కారణం ఏమిటి? నా భుజబలం చేత రక్షింపబడుతూన్న ఈ మహీమండలంలో ఎప్పుడూ ఎవరూ నేరములు చెయ్యకూడదనే విషయం తెలియదా నీకు. ధూర్తుడవై రాజసం ఒలకపోస్తున్న నిన్ను శిక్షిస్తాను.

క. గాండీవియుఁ జక్రియు భూ, మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడవై దండింపఁ దగని వారల, దండించెదు నీవ తగుదు దండనమునకున్.

416

తా॥ గాండీవధారి అర్జునుడు, చక్రధారి శ్రీకృష్ణుడు ఈ భూమండలాన్ని విడిచి వెళ్ళారనే కారణంగా మదంతో దండింప తగని వాళ్ళని దండిస్తున్నావు. నువ్వు దండనానికి తగుదువు.

వ. అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె.

417

తా॥ అని వృషభాన్ని ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

మ. కురుధాత్రీశ్వర బాహు వప్ర యుగళీ గుప్తక్షమా మండలిం
బరికింపన్ భవదీయనేత్ర జనితాంభశ్శ్రేణిఁ దక్కన్ జనుల్
దొరఁగం జేయ రధర్మసంజనిత జంతుశ్రేణి బాష్పంబులన్
గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తిదేవోత్తమా!

418

తా॥ వృషభరూపంలో ఉన్న ధర్మదేవతా! కురు ధాత్రీశ్వరుల బాహుదండములనే కోటగోడల నడుమ రక్షింపబడుతూన్న ఈ భూమండలములోని జనులు ఇప్పటివరకు అధర్మ బాధితులయిన జంతువుల కన్నీటిని చూడలేదు. కన్నుల నుండి నీరు కారుస్తూన్న నిన్ను మాత్రం చూసారు. నా బాహుబలం చేత ఇతనిని శిక్షిస్తాను చూడు" అంటూ విజృంభించాడు పరీక్షిత్తు.

క. జాలిఁ బడ నేల? నా శర, జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్
భూలోకంబున నిపుడే, నాలుగు పాదముల నిన్ను నడిపింతుఁ జుమీ.

419

తా॥ "ఓ ధర్మస్వరూపా! విచారించకు. నా బాణాగ్ని చేత వీడిని ఇప్పుడే చంపుతాను. ఈ భూలోకంలో నాలుగు పాదాలతో నిన్ను నడిపిస్తాను.

ఉ. వాచవియైన గడ్డిఁ దిని వాహినులందు జలంబు ద్రావఁగా
నీ చరణంబు లెవ్వఁడిటు నిర్దళితంబుగఁ జేసె; వాఁడు దా
ఖేచరుఁడైన, వాని మణి కీలిత భూషణ యుక్త బాహులన్
వే చని త్రుంచివైతు వినువీథికి నేఁగిన నేల డాఁగినన్.

420

తా॥ నీ నోటికి హితవైన పచ్చికను మేస్తూ, నదులలోని నీరు త్రాగుతూ స్వేచ్ఛగా సంచరించే నీ పాదాలను ఎవడు విరగ గొట్టాడో చెప్పు. వాడు ఆకాశంలో సంచరించే వాడైనా, భూమి మీద తిరిగే వాడైనా, వినువీథిలో దాక్కున్నా నేలలో దాక్కున్నా, మణులచేత అలంకరింపబడిన వాడి బాహువులను నరుకుతాను.

వ. అని మఱియు గోరూప యయిన భూదేవితో నిట్లనియె—

421

తా॥ అని పలికి, గోవు రూపంలో ఉన్న భూదేవితో పరీక్షిత్తు ఇలా అన్నాడు:

చ. అగణితవైభవుం డగు మురాంతకుఁ డక్కట పోయె నంచు నె
వ్వగలఁ గృశించి నేత్రముల వారికణంబులు దేకు మమ్మ; లో
బెగడకు మమ్మ మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు నా
మగఁటిమిఁ జూడవమ్మ వెఱ మానఁ గదమ్మ, శుభ ప్రదాయినీ!

422

తా॥ అమ్మా! శుభప్రదాయినీ! అంతులేని వైభవంతో అలరారుతూ ఉన్న శ్రీకృష్ణుడు ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయాడే అనే బాధతో కన్నీరు కార్చకు తల్లీ! లోపల దిగులు పడకు! నా బాణాగ్ని చేత ఆ పాపాత్ముని ఇప్పుడే వధిస్తాను. నా పరాక్రమాన్ని చూడు. నీవు భయపడకు.

క. సాధువులగు జంతువులకు, బాధలు గావించు ఖలుల భంజింపని రా జాధము
నాయుస్స్వర్గ, శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ!

423

తా॥ సాధువులగు జంతువులను బాధపెట్టే ఖలులను శిక్షించని రాజాధముని ఆయువు, స్వర్గము, శ్రీ, ధనములు... ఇవన్నీ నశిస్తాయి.

క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్ స్రష్ట విధించెఁ
బురాణ, ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ!

424

తా॥ సాధ్వీమణీ! దుర్మార్గులను శిక్షించటం శిష్టులను అనుగ్రహించటం... ఈ రెంటి కొరకే రాజులను విధాత సృష్టించాడు. అని పురాణ వేత్తలు చెపుతారు. కనుక ఇప్పుడు రాజునైన నాకు ఆర్తరక్షణం అన్నది పరమ ధర్మం.''

వ. అనిన ధర్మనందన పౌత్త్రునకు వృషభమూర్తినున్న ధర్మదేవుం డిట్లనియె.

425

తా॥ అని పలికిన ధర్మరాజు యొక్క మనుమడయిన పరీక్షిత్తుతో వృషభ రూపంలో ఉన్న ధర్మదేవుడు ఇలా అన్నాడు:

ఉ. క్రూరులఁ జంపి, సాధువులకున్ విజయం బొనరించునట్టి యా
పౌరవ వంశజాతుఁడవు భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ
వా రిటువంటి వా రగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్య సం
చారము సేసెఁ గాదె నృపసత్తమ! భక్తిలతానిబద్ధుఁడై.

426

తా॥ “ఓ నృపసత్తమ! క్రూరులను చంపి సాధు పురుషులయిన వారికి విజయాన్ని చేకూర్చే పురు వంశంలో పుట్టిన వాడివి. నువ్వు భాగ్యవంతుడవు. మీ వంశంలో పుట్టిన వారందరూ ధర్మమూర్తులు కనుకనే శ్రీకృష్ణుడు మెచ్చి దౌత్యాన్ని నడిపాడు.

వ. నరేంద్రా! యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము; మావలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేఁడు; వాదివాక్య భేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి, తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు; లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; ఇందెవ్వరికిని సుఖదుఃఖ ప్రదానంబు సేయ విభుత్వంబు లేదు; పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు సేసిరని విచారింప వలదు; తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందన పౌత్త్రుం డిట్లనియె.

427

తా॥ నరేంద్రా! మేము ప్రాణులకు దుఃఖ హేతువులం కాము. మా వల్ల దుఃఖాన్ని పొందిన పురుషుడు ఒక్కడూ లేడు. అనేక విధాలయిన వాదోపవాదాలకు మోహితులు అయిన యోగీశ్వరులు భేదాన్ని కల్పించి ఆత్మయే సుఖదుఃఖాలను ఇచ్చే ప్రభువు అని చెబుతారు. జ్యోతిష్యం చెప్పేవారు మానవులకు సుఖదుఃఖాలను కల్పించేవి గ్రహదేవతాదులే అంటారు. మీమాంసకులు ఏమంటారంటే మనం చేసుకున్న కర్మనుబట్టి మనకు సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి అంటారు. లోకాయతులు సుఖదుఃఖాలకు కారణం మన స్వభావమే అంటారు. నిజానికి వీరెవ్వరికి సుఖదుఃఖములను ఇచ్చే అధికారం లేదు. పరుల వలన దుఃఖం వచ్చిందని వాళ్ళు అధర్మపరులు అని మనం విచారించ కూడదు. బుద్ధికీ మనస్సుకీ అతీతుడైన పరమేశ్వరుని వల్లనే సర్వము జరుగుతూ ఉంటుంది” అని ధర్మదేవుడు చెప్పేసరికి వినిన

పరీక్షిత్తు అప్పుడు ఇట్లా అన్నాడు:

ఆ. ధర్మమూర్తి వయ్య ధర్మజ్ఞ వృషరూప, పరమధర్మ మీవు పలుకు త్రోవ
పాపకర్మ చేయు పాపంబు సూచింపఁ బాపకర్ముఁ డేఁగు పథము వచ్చు.

428

తా॥ “వృషభ రూపంలో ఉన్న ఓ ధర్మదేవా! నీవు సాక్షాత్తు ధర్మమూర్తివి. నువ్వు పలికిన పలుకులు పరమ ధర్మంగా ఉన్నాయి. పాపకర్ముడు చేసే పాపాలను ప్రకటించే పుణ్యమూర్తికి కూడా ఆ పాపఫలం వస్తుందంటారు.

వ. మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మానసంబులకు వధ్యఘాతుక లక్షణంబగు వృత్తి సులభంబునం దెలియరాదు; నీవు ధర్మదేవతవు; కృతయుగంబునం దప శ్శౌచ దయా సత్యంబులను నాలుగు నీకుం బాదంబు లని చెప్పుదురు; త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాద చతుష్కంబునం దపశ్శౌచదయా సత్యంబులం దొక్క పాదంబు క్షీణం బయ్యె; ద్వాపరంబునం బాదద్వయంబు నశించెం; గలియుగంబందు నివ్వడువున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె, నవశిష్టంబగు భవదీయ చతుర్థ పాదంబున ధర్మంబు గల్యంతంబున నిగ్రహింప గమకించుచున్నయది, విను మదియునుంగాక.

429

తా॥ మరియు దైవీమాయ వలన జీవుల వాక్కునకు మనస్సుకు వీడు చంప తగినవాడు, వీడు చంపేవాడు అనే విషయం సులభంగా అర్థం కాదు. నువ్వు ధర్మదేవతవు. కృతయుగంలో తపస్సు, శౌచము, దయ, సత్యము అనే నాలుగు పాదములతో ఉంటావని చెబుతారు. కృతయుగం చివరకు వచ్చేసరికి తపస్సు అంతమవుతుంది. అలాగే త్రేతాయుగం అంతానికి శౌచం పూర్తిగా నశిస్తుంది. అలాగే ద్వాపరయుగాంతానికి దయ పూర్తిగా నశిస్తుంది. కలియుగాంతానికి ఆ సత్యం కూడా పూర్తిగా నశిస్తుంది.

మ. భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా
స్థిరయై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందె భూదేవి; త
చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచున్ నిరం
తర శోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ! వీక్షించితే.

430

తా॥ శ్రీకృష్ణ భగవానుడు భూభారాన్ని బాపి కరుణతో నడయాడగా స్థిరంగా ఇంతకాలమూ వేడుకతో భూదేవి సుఖాన్ని అనుభవించింది. ఇప్పుడు ఆయన గతించిన కారణంగా హీనులైనవారు శాసిస్తారనే భయంతో నిరంతర శోకంతో కుమిలిపోతున్నది. ధర్మస్వరూపా! ఈమెను వీక్షించు."

## పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము చేయుట

వ. అని యటు ధరణీ ధర్మదేవతల బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్త్రుండు క్రొక్కారు మెఱుంగు చక్కదనంబు ధిక్కరించి దిక్కులకు వెక్కసంబయిన యడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతువయిన కలిని రూపుమాప నుద్యోగించిన, వాఁడు రాజరూపంబు విడనాడి, వాడిన మొగంబుతోడ భయవిహ్వాలుండై హస్తంబులు సాఁచి తత్పాదమూల విన్యస్త మస్తకుండై ప్రణామంబు సేసి.

431

తా॥ అని ఈ ప్రకారంగా భూదేవిని, ధర్మదేవతని బుజ్జగించి మహారథుడైన అర్జునుని పౌత్రుడైన పరీక్షిత్తు తొలకరి మెరుపుతీగలా తళ తళ మెరుస్తూ కళ్ళకు మిరుమిట్లు గొలిపే తన ఖడ్గాన్ని భయంకరంగా జడిపించి పాపహేతువు అయిన కలిని రూపుమాపాలని ప్రయత్నించాడు. అప్పుడు వాడు రాజవేషాన్ని విడిచి వాడిపోయిన ముఖంతో భయపడ్డాడు. హస్తములు సాచి ఆయన పాదముల మీద తలమోపి ప్రణామాలు చేసి ఇలా అన్నాడు:

క. కంపించె దేహమెల్లం, జంపకు మో రాజతిలక! శరణాగతు ర క్షింపు మని తనకు మ్రొక్కినఁ, జంపక కలిఁజూచి నగుచు జనపతి పలికెన్.

432

తా॥ “ఓ రాజకుల తిలక! దేహమంతా కంపించి పోతున్నది. నన్ను చంపకు! నిన్ను శరణు వేడుకొంటున్నాను. నన్ను రక్షించు” అంటూ తనకు మ్రొక్కిన కలిపురుషున్ని చంపటం మానేసి నవ్వుతూ పరీక్షిత్తు ఇలా మందలించాడు:

క. అర్జునకీ ర్తిసమేతుం, డర్జున పౌత్త్రుండు భయ రసావృత జనులన్ నిర్జితులఁ జంప నొల్లఁడు, దుర్జనభావంబు విడిచి తొలగు దురాత్మా!

433

తా॥ "అర్జునునితో సమానమైన కీర్తిగల ఆయన మనుమడు, భయంతో వణికిపోతున్న వారిని, ఓడిపోయిన వారిని వధించడు. దురాత్మా! నీ దుర్జన భావాన్ని విడిచిపెట్టి వెళ్ళు.

వ. నీవు పాపబంధుడవు మదీయబాహుపాలితం బయిన మహీమండలంబున నిలువ వలవదు; రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్యలోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయాకలహ కపట కలుషాలక్ష్మ్యాది ధర్మేతరసమూహంబు లాశ్రయించు; సత్యధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞ విస్తార నిపుణు లయిన వారు యజ్ఞేశ్వరుం డయిన హరింగూర్చి యాగంబు సేయుచున్న వారు; యజించు వారలకు సుఖప్రదాయనంబుసేయుచు, సకల భూతాంతర్యామియై భగవంతుం డయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగ బహిరంగముల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబు మనోరథంబు నిచ్చుం; గావున నీ విం దుండ వలవ దనుచు దండ హస్తుండయిన జముని కైవడి మండలాగ్రంబు సాఁచిన రాజవర్యునకుం గలి యిట్లనియె.

434

తా॥ నువ్వు పాపులకు బంధువుడవు. నేను పాలిస్తున్న భూమిమీద నువ్వు నిలవడానికి వీలులేదు. రాజవేషధారివి అయిన నిన్ను అసత్యము, లోభము, చౌర్యము, దౌర్జన్యము, దురాచారము, మాయ, కలహము, కపటము, కలుషము ఇత్యాది అధర్మమైన గుణాలు ఆశ్రయిస్తాయి. సత్యమునకు, ధర్మమునకు నివాసమైన బ్రహ్మావర్త దేశంలో యజ్ఞవేత్తలయిన పెద్దలు యజ్ఞేశ్వరుడైన ఆ హరిని గూర్చి యాగం చేస్తున్నారు. యజ్ఞాన్ని చేసేవారికి సుఖాన్ని కలిగిస్తూ, సకల భూతములయందు ఉంటూ భగవంతుడైన హరి కదిలేవి కదలనివి అన్ని జీవులకు లోపల బయట సంచరించే వాయువువలె సర్వాంతర్యామిగా ఉంటూ కోరికలను తీరుస్తూ ఉంటాడు. కనుక నువ్వు ఇక్కడ ఉండవద్దు" అనేసరికి ఆ రాజశ్రేష్ఠునితో కలి ఇట్లా అన్నాడు:

క. జగతీశ్వర! నీ యడిదము, ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్
బెగడెం జిత్తము గుండెలు, వగిలెడి నిఁక నెందుఁ జొత్తు భావింపఁ గదే

435

తా॥ "ఓ జగదీశ్వరా! నీ చేతిలోని కత్తి తళతళమంటూ మెరుస్తూ ఉంటే నా మనస్సులో భయం పుట్టి గుండెలు పగిలేటట్లుగా ఉంది. ఇక నేను ఎక్కడికి వెళ్ళాలో మీరే ఆలోచించండి.

వ. నరేంద్రా! నిన్ను, నారోపితశరశరాసను సర్వప్రదేశంబులందును విలోకించుచున్న వాఁడ; నే నెక్కడ నుండుదు నానతిమ్మనిన రాజన్య శేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనియెడు నాలుగు స్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్య మద కామ హింసా వైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితరస్థలంబుల స్పృశియింపకుండ నియమించె, నిట్లు కలినిగ్రహంబు సేసి హీనంబు లయిన తపశ్శౌచదయ లనియెడు మూఁడు పాదంబులు వృషభమూర్తి యయిన ధర్మదేవుని కిచ్చి, విశ్వంభరకు నిర్భరం బయిన సంతోషంబు సంపాదించి.

436

తా॥ నరేంద్రా! సర్వ ప్రదేశముల యందు ధనుర్ధారివయిన నీ రూపమే నాకు కనుపిస్తూన్నది. నేనెక్కడ ఉండాలో మీరే ఆనతి ఇవ్వండి" అని అడిగేసరికి ఆ రాజు ప్రాణివధ, స్త్రీ, జూదము, మద్యపానము అనే నాలుగు స్థానాలను ఇచ్చాడు. అవి నాకు చాలవు అనేసరికి సువర్ణం మూలంగా కలిగిన అసత్యము, మదము, కామము, హింస, వైరము అనే అయిదు ప్రదేశాలను ఇచ్చాడు. ఇక తక్కిన ప్రదేశములను స్పృశించకుండ నియమించాడు. ఈ విధంగా కలిని నిగ్రహించి పోగొట్టుకొనిన తపస్సు, శుచిత్వము, దయ అనే మూడు పాదములు వృషభమూర్తి అయిన ధర్మదేవునికి ఇచ్చాడు. అప్పుడు భూదేవి అపరిమితమైన ఆనందాన్ని పొందింది.

క. గజనామధేయపురమున, గజరిపుపీఠమున ఘనుఁడు గలిదమనుం డ
గ్గజవైరిపరాక్రముఁ డై, గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్.

437

తా॥ పిమ్మట హస్తినాపురంలో సింహపీఠంపై కలిదమనుడైన పరీక్షిత్తు సింహ పరాక్రమంతో కౌరవ సామ్రాజ్య లక్ష్మిని పాలించాడు.

వ. ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామబాణపావకంబు వలన బ్రదికి, వృషభమూర్తి యయిన ధర్మదేవతకు నభయం బిచ్చిన పరీక్షిన్న రేంద్రుడు బ్రాహ్మణ శాపప్రాప్తతక్ష కాహిభయంబు వలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి సర్వసంగంబులు వర్జించి, శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి, గంగాతరంగిణి తీరంబునం గళేబరంబు విడిచె, వినుఁడు.

438

తా॥ ఈ విధంగా కృష్ణుని అనుగ్రహం వల్ల అశ్వత్థామ బాణాగ్ని నుండి బ్రతికిన పరీక్షిత్తు వృషభ రూపంలో ఉన్న ధర్మదేవతకు అభయాన్ని ఇచ్చాడు. బ్రాహ్మణ శాపం వల్ల ప్రాప్తించిన తక్షకుని విషాగ్ని జ్వాలల వల్ల ప్రాణాలు పోతాయని తెలుసుకుని సర్వసంగ పరిత్యాగం చేశాడు. శుక మహర్షికి శిష్యుడై పరమార్థాన్ని గ్రహించి గంగా తీరంలో శరీరాన్ని విడిచిపెట్టాడు.

క. హరివార్త లెఱుఁగు వారికి, హరిపదములు దలఁచువారి కనవరతంబున్ హరికథలు వినెడివారికి, మరణాగత మోహసంభ్రమము లేదనఘా!

439

తా॥ అనఘా! హరి యొక్క వార్తలు తెలుసుకొనే వారికి, హరి పాదపద్మములను స్మరించుకొనే వారికి ఎప్పుడూ హరి యొక్క కథలు వినేవారికి మరణసమయంలో కూడా ఎటువంటి ఆవేదన, భయం ఉండదు.

క. శుభచరితుఁడు హరి యరిగినఁ, బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా
నభిమన్యుసుతుని వేళను, బ్రభవింపక యడఁగి యుండె భార్గవముఖ్యా!

440

తా॥ శుభ చరిత్రుడైన హరి నిర్యాణం చెందిన వెనుక ప్రభవించి భూలోకం అంతా వ్యాపించి కలి, పరీక్షిత్తు కాలంలో మాత్రం అణగి మణగి ఉన్నాడు.

వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్ర ముద్రితాఖీల మహీమండల ప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నా యభిమన్యు సంభవుండు.

441

తా॥ ఈ విధంగా నాలుగు సముద్రముల మధ్యగల భూమండలాన్ని చక్కగా పరిపాలన చేశాడు పరిక్షిత్తు.

ఉ. చేసినఁ గాని పాపములు సెందవు; చేయఁ దలంచి నంతటం
జేసెద నన్న మాత్రమునఁ జెందుఁ గదా కలివేళఁ బుణ్యముల్;
మోసము లే దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటి కై వడిన్.

442

తా॥ ఈ కలియుగంలో పాపకార్యాలు చేస్తేనే కాని పాప ఫలితం రాదు. పుణ్యకార్యాలు చేద్దామని అనుకొన్న మాత్రం చేత లేదా చేస్తాను అన్న మాత్రం చేత ఈ కలియుగంలో పుణ్యం వస్తుంది. తుమ్మెద మకరందాన్ని ఉల్లాసంగా త్రాగి పూలను విడిచిపెట్టినట్లుగా కలి ప్రభావం తన రాజ్యంలో లేకుండ అరికట్టి; కలిని మాత్రం ప్రాణాలతో విడిచి పెట్టాడు పరీక్షిత్తు.

వ. మఱియుం బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబున నొదిగి

కాచుకొని యుండి చేష్టించుంగాని ధీరులైన వారికిం గలివలని భయంబు లేదని
కలినంతంబు నొందింపఁ డయ్యె ననిన విని ఋషులు సూతున కిట్లనిరి.

443

తా॥ అదీగాక కడు జాగరూకులై ఉండే వారి మీదికి తోడేలు రాని విధంగా చంచల చిత్తులైన వారిని కలి బాధిస్తుంది. కానీ ధీరులైన వారికి భయం లేదు. అందువల్లనే పరీక్షిత్తు కలిని అంతం చెయ్యకుండా విడిచిపెట్టాడు. ఈ మాటలు విన్న శౌనకాది మహర్షులు సూతునితో ఇట్లా అన్నారు:

సీ. పౌరాణికోత్తమ! బ్రదుకుము పెక్కేండ్లు, తామరసాక్షుని ధవళయశము
మరణశీలురమైన మా కెఱింగించితి, కల్పితంబగు క్రతుకర్మమందుఁ
బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తులమైన, మము హరి పదపద్మ మధుర రసము
ద్రావించితివి నీవు, ధన్యుల మైతిమి, స్వర్గ మేనియు నపవర్గమేని

తే. భాగవత సంగ లవ భాగ్యఫలము కీడె?, ప్రకృతిగుణహీనుఁడగు చక్రి భద్రగుణము లీశ
కమలాసనాదులు నెఱుఁగ లేరు, వినికి వినఁజాల మనియెడి వెఱ్ఱి గలఁడె!

444

తా॥ "పౌరాణికోత్తమ! నువ్వు చాలా కాలం జీవించు! కృష్ణ భగవానుని కీర్తిప్రతిష్ఠల గురించి మరణశీలురమైన మాకు చెప్పావు. మేము ప్రారంభించిన క్రతు కర్మలలో పొగచూరి పోయిన మా హృదయాలకు హరి యొక్క పాదపద్మములలో ఉండే మకరందాన్ని నీవు మాచే త్రాగించావు. ధన్యులమయ్యాము. స్వర్గం కావచ్చు లేదా అపవర్గం కావచ్చు భగవద్భక్తుల సాంగత్యంతో అది సాటిరాదు. ప్రకృతి గుణాలు ఏమీ లేని శ్రీహరి యొక్క కల్యాణ గుణములను బ్రహ్మాదులు సైతం తెలుసుకోలేరు. ఆ కల్యాణ గాథలను వినడానికి ఇష్టపడని వెర్రివాడు ఉంటాడా?

క. శ్రీపంబులు ఖండిత సం, తాపంబులు గల్మషాంధతమస మహోద్య
ద్దీపంబులు పాషండ దు, రాపంబులు విష్ణువందనాలాపంబుల్.

445

తా॥ ఆ శ్రీమహావిష్ణువు యొక్క వందనాలాపాలు శ్రీలను కురిపించేవి, సంతాపాలను పోగొట్టేవి, కాంతులీనే వెలుగుతో కలుషాలనే కటిక చీకట్లను పోగొట్టేవీ, పాషండులు పొందకూడనివి.

క. పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవు పదసేవనముల్.

446

తా॥ ఆ వాసుదేవుని పాదసేవనం పావనత్వాన్ని ప్రసాదించేది, పాపములనే లతలను ఛేదించేది, దివ్య మంగళాన్ని ఇచ్చేది, శ్రీ మహాలక్ష్మిచేత ఎప్పుడూ సంభావింపబడేదీను.

ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు, శుకుని భాషణముల శుద్ధబుద్ధి
యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు, పాదమూల మెట్లు వడసె ననఘ!

447

తా॥ పరమ భాగవతుడు అయిన పరీక్షిత్తు శుకుని భాషణములను ఆలకించి పరిశుద్ధమయిన మనస్సుతో విష్ణువు యొక్క పాదాలను ఎలా ఆశ్రయించాడు?

వ. మహాత్మా! విచిత్రయోగనిష్ఠా కలితంబును, విష్ణుచరిత లలితంబును, బరమ పుణ్యంబును, సకలకల్యాణ గుణగణ్యంబును, భాగవత జనాపేక్షితంబును నైన పారీక్షిత భాగవతాఖ్యానంబు వినిపింపు మనిన సూతుం డిట్లనియె.

448

తా॥ మహాత్మా! యోగ నిష్ఠతో కూడినది, విష్ణు చరిత్రతో కూడినది, పరమ పుణ్యమైనది, సకల కల్యాణ గుణములతో కూడినది, భక్త జనులు కోరేది... అయి పరీక్షిత్తు శ్రద్ధాభక్తులతో వినిన భాగవతాన్ని మాకు వినిపించవలసింది" అని అడిగిన మహర్షులతో సూతుడు ఇట్లా అన్నాడు:

క. మిముబోఁటి పెద్దవారలు, కమలాక్షుని చరిత మడుగఁగాఁ జెప్పెడి భా
గ్యము గలిగె నేఁడు నా జ, న్మము సఫలం బయ్యె వృద్ధమాన్యుఁడ నగుటన్.

449

తా॥ "మీ బోటి పెద్దలు కమలాక్షుని చరిత్రను చెప్పమని కోరటం నేను చెప్పటం.... అనే భాగ్యం కలగటం వలన నా జన్మ సఫలం అయ్యింది. మీ బోటి వృద్ధుల చేత గౌరవింపబడ్డాను.

క. కులహీనుఁడు నారాయణ!, విలసత్కథనములు గడఁక వినిపించినఁ ద
త్కులహీనతఁ బాసి మహో, జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా!

450

తా॥ కులహీనుడు నారాయణుని కథలను వినిపిస్తే కులహీనత పోయి మహోజ్జ్వలమైన కుల గౌరవాన్ని పొందుతాడు.

సీ. ఎవ్వని గుణజాల మెన్న జిహ్వలు లేక, నలినగర్భాదు లనంతుఁ డండ్రు
కోరెదు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి, ప్రార్థించె నెవ్వని పాద రజము
బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన, జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు, నెవ్వఁడర్థాకృతి నేపు మిగులు

ఆ. నే మహాత్ము నాశ్రయించి శరీరాది, సంగకోటినెల్ల సంహరించి ప్రాభవమున మునులు
పారమహంస్యంబు, నొంది తిరిగి రాకయుందు రెలమి.

451

తా॥ ఆయన సుగుణములను ఎన్నలేక బ్రహ్మాదులు ఆయనను అనంతుడు అన్నారు. తనను కోరే విబుధేంద్రకోటిని ఒల్లక లక్ష్మీదేవి ఆయన పాద రజాన్ని కోరింది. బ్రహ్మగారు ఆయన పాదపద్మములను కడిగిన పవిత్ర గంగాజలాన్ని జనులకిచ్చి అనుగ్రహించాడు. భగవంతుడు అనే శ్రేష్ఠమైన శబ్దానికి అర్థంగా ఆయన విరాజిల్లుతున్నాడు. ఆ మహాత్ముణ్ణి ఆశ్రయించి నిస్సంగులై మునులు పరమహంసలై తిరిగిరాని స్థానాన్ని పొందారు. అటువంటి వాసుదేవుని దివ్యగాథలు సమగ్రంగా తెలుసుకోవడం ఎవరికి సాధ్యమౌతుంది?

చ. క్రమమున మింటికై యెగయుఁగాక విహంగము మింటిదైన పా
రముఁ గననేర్చునే? హరిపరాక్రమ మోపినయంతఁ గాక స
ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ మునులార! నాదు చి
త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్.

452

తా॥ ఎంతపైకి ఎగిరినా పక్షులు ఆకాశం యొక్క అంతును కనుక్కోలేవు. అలాగే హరి యొక్క పరాక్రమాన్ని చేతనయినంత వరకు తప్ప సర్వము వివరించడానికి ఎవడు సమర్థుడు? అందుకని ఓ మునులారా! నా బుద్ధికి తోచినంత తప్పకుండా మీకు చెపుతాను.

క. వేదండపురాధీశుఁడు, గోదండము సేతఁ బట్టికొని గహనములో
వేదండాదుల నొకనాఁ, డే దండలఁ బోవ నీక యెగచెన్ బలిమిన్.

453

తా॥ ఒకనాడు హస్తినాపురాధీశ్వరుడు అయిన పరీక్షిత్తు కోదండమును ధరించి అరణ్యములో ఏనుగులు మొదలైన జంతువులను ఎక్కడికీ కదలనీయకుండ వేటాడ సాగాడు.

క. ఒగ్గములు ద్రవ్వి పదు మని, యొగ్గెడు పెనుఁదెరల వలల నురలు మృగములన్ దగ్గఱి
చంపెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్.

454

తా॥ ఏనుగులను పట్టుకోవటం కోసం గోతులు త్రవ్వి పెద్ద పెద్ద వలలను పరచి ఉచ్చులు పన్ని మృగాలను చంపాలనే ఉత్సాహంతో అరణ్యమంతా తిరిగాడు.

క. కోలముల గవయ వృక శార్దూ, లములఁ దరక్షు ఖడ్గ రోహిత హరి శుం
డాలముల శరభ చమర, వ్యాలముల వధించె విభుఁడు వడి నోలములన్.

455

తా॥ అడవి పందులను, ఎద్దులను, తోడేళ్ళను, పెద్దపులులను, సివంగులను, ఖడ్గమృగాలను, అడవి గొర్రెలను, సింహాలను, ఏనుగులను, శరభ మృగాలను, జడల బర్రెలను, కొండచిలువలను... ఆ మహారాజు నైపుణ్యంతో వధించాడు.

## పరీక్షిత్తు శమీకునిపై మృతసర్పమును వేయుట

క. మృగయులు మెచ్చ నరేంద్రుఁడు, మృగరాజ పరాక్రమమున మెఱసి హరించెన్
మృగధర మండలమునఁ గల, మృగ మొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్.

456

తా॥ వేట గాండ్రు మెచ్చేటట్లుగా పరీక్షిత్తు సింహ పరాక్రమంతో చంద్రునిలో ఉన్న మృగాన్ని తప్ప మిగతా మృగాలన్నింటిని వేటాడాడు.

వ. ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంబడిం బడి యెగచుచుం జరించుటం జేసి బుభుక్షా పిపాసల వలన మిగులఁ బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లని నీటి కొలంకుం గానక కలంగెడు చిత్తంబుతోఁ జని యొక్క తపోవనంబు గని యందు.

457

తా॥ ఇలా వేటమీద ఉండే కుతూహలంతో మృగాల వెంటబడి తిరుగుతూ ఉన్న కారణంగా ఆకలి దప్పికలతో పరీక్షిత్తు బాగా అలసిపోయాడు. చల్లని నీటి కొలను కోసం వెతికి ఒక తపోవనాన్ని చూసాడు.

సీ. మెలఁగుట చాలించి మీలిత నేత్రుఁడై, శాంతుఁడై కూర్చుండి జడత లేక ప్రాణ మనోబుద్ధి పంచేంద్రియంబుల, బహిరంగవీథులఁ బాఱనీక జాగరణాదిక స్థానత్రయము దాఁటి, పరమమై యుండెడి పదముఁ దెలిసి బ్రహ్మభూతత్వ సంప్రాప్య విక్రియుఁ డయి, యతిదీర్ఘజటలుఁ ద న్నావరింప

తే. నలఘు రురు చర్మధారియై యలరుచున్న, తపసిఁ బొడగని శోషితతాలుఁ డగుచు నెండి తడిలేక కుత్తుక నెలుఁగు డింద, మందభాషల నిట్లను మనుజ విభుఁడు.

458

తా॥ అక్కడ కదలటం మానేసి కండ్లు మూసుకొని శాంతంగా కూర్చున్న శమీక మునీశ్వరుణ్ణి చూసాడు. ఆయన ప్రాణమును, మనస్సును, బుద్ధిని, పంచేంద్రియములను బహిరంగంగా వెళ్ళనీయకుండ జాగ్రత్ స్వప్న సుషుప్తులను దాటి తురీయావస్థలో బ్రహ్మమును పొంది అతి దీర్ఘజడలతో నల్ల చారల దుప్పి చర్మాన్ని ధరించి ఉన్నాడు. ఆ తాపసిని చూసి పరీక్షిత్తు నాలుక ఎండిపోగా తడిలేని కుత్తుకతో హీనస్వరంతో మెల్ల మెల్లగా ఇలా అన్నాడు:

క. తోయములు దెమ్ము మా కీ, తోయము వేఁటాడ వెరవు దొరకదు ఘన చే
తోయుత దప్పి జనించెను, తోయము వారలును లేరు దుస్సహ మనఘా!

459

తా॥ "దాహం విపరీతంగా ఉంది. మంచినీళ్ళు కావాలి. వేటాడటానికి సమయం దొరకక దాహంతో వచ్చాను. నా పరివారం అంతా దూరంగా ఉన్నారు" – అన్నాడు.

వ. అని భూవరుండు శమీకమహాముని సమాధి నిష్ఠానిమీలిత నేత్రుండును విస్మృత బాహ్యాంతరింద్రియ కృత సంచారుండును హరిచింతా పరుండునునై యుండుటం దెలియలేక.

460

తా॥ శమీక మహాముని పరమ నిష్ఠలో నిమీలిత నేత్రుడై బాహ్యేంద్రియ జ్ఞానం, అంతరింద్రియ జ్ఞానమూ లేక హరిచింతా పరతంత్రుడై ఉన్నాడనే విషయం తెలియక పరీక్షిత్తు కోపపరవశుడయినాడు.

ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్న వాఁడు, చే
సన్నల నైన రమ్మనఁడు, సారజలంబులు దెచ్చి పోయఁ డే

మన్ననలైనఁ జేయఁడు, సమగ్రఫలంబులు వెట్టఁడింత సం
పన్నత నొందెనే తన తపశ్చరణాప్రతిమ ప్రభావముల్.

461

తా॥ 'కన్నులు మూసుకొన్న బ్రాహ్మణుడు గర్వంతో ఉన్నాడు. పోనీ చేతితో సైగ చేసి రమ్మని పిలవ వచ్చుకదా! కాసిని మంచి నీళ్ళు ఇవ్వడు. ఏ మన్నన చెయ్యడు. ఒక పండు అయినా ఇవ్వడు. ఎంత తాపసులైతే మాత్రం ఇంత తల పొగరా?

ఆ. వారిఁ గోరుచున్న వారికి శీతల, వారి యిడుట యెట్టివారి కయిన
వారితంబుగాని వలసిన ధర్మంబు, వారి యిడఁడు దాహవారి గాఁడు.

462

తా॥ మంచి నీళ్ళు అడుగుతున్న వారికి చల్లని నీరు ఇవ్వటం అనేది ఎలాంటి వారికయినా పరమ ధర్మం. ఈ బ్రాహ్మణుడు మంచి నీరిచ్చి నా దాహాన్ని తీర్చడేమిటి?'

చ. అని మనుజేశ్వరుండు మృగయాపరిఖేద నితాంత దాహ సం
జనిత దురంత రోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి, పూ
జనములు సేయఁడంచు, మృతసర్పము నొక్కటి వింటికోపునం
బనివడి తెచ్చి వైచె, నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్.

463

తా॥ అని పరీక్షిత్తు వేట వలన కలిగిన దాహం చేత పుట్టిన రోషాగ్నితో ఋషి తనను తిరస్కరించాడు, పూజించలేదు అని కుమిలిపోయాడు. అక్కడ చచ్చిన పాము ఒకటి కనిపిస్తే దానిని తన వింటితో తెచ్చి మహర్షి భుజంమీద పడవేశాడు.

వ. ఇట్లతండు ప్రత్యాహృత బాహ్యాంతరింద్రియుం డగుట నిమీలితలోచనుండు గా నోపునో

యట్లుగాక గతాగతులగు క్షత్రబంధులచే నేమియని మృషాసమాధి నిష్ఠుండు గానోపునో, యని వితర్కించుచు వృథారోష దర్పంబున ముని మూఁపున గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు దనపురంబునకుం జనియె; నంత సమీపవర్తులైన మునికుమారు లంతయుం దెలియం జూచి శమీకనందనుండైన శృంగికడకుం జని.

464

తా॥ ఈ ముని బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహం వలన ఏకాగ్ర చిత్తంతో కండ్లు మూసుకున్నాడా లేక ఈ రాజులతో మనకేమిటి అని కపట సమాధిని నటిస్తూ కూర్చున్నాడా... అని వితర్కించాడు పరీక్షిత్తు. నిజం తెలుసుకోకుండా వృథారోషము, దర్పము తనలో రెచ్చిపోగా ముని మూపుమీద చచ్చిపోయిన సర్పమును వేశాడు. వేసి నరేశ్వరుడు తన పురమైన హస్తినాపురానికి వెళ్ళిపోయాడు. అంత ఆ చెంతనే తిరుగుతూన్న ముని కుమారులు ఇదంతా చూసి శమీక మహాముని పుత్రుడైన శృంగి వద్దకు వెళ్ళారు.

## శమీకపుత్రుడు శృంగి పరీక్షిత్తుని శపించుట

క. నరగంధగజస్యందన, తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై
పరఁగన్ నీ జనకుని మెడ, నురగముఁ దగిలించి పోయె నోడక తండ్రీ!

465

తా॥ "నరులు, ఏనుగులు, రథములు, గుఱ్ఱములు అనే చతురంగ బలాధీశుడు అయిన రాజు మంచినీళ్ళ కోసం వచ్చి నీ తండ్రి మెడలో పామునొక దానిని తగిలించి పోయాడయ్యా" అని చెప్పారు.

వ. అని పలికిన సమాన వయో రూప మునికుమార లీలాసంగి యయిన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరించినట్లు విజృంభించి రోషసంరంభంబున నదరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబు లగు నరిష్టంబులుం బోలె బలిసియు ద్వారంబులం గాచికొని యుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్త్రియాభాసు లెట్లు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితు లయిరి? అట్టివార లెట్లు తద్గృహంబుల భాండసంగతంబగు నన్నంబు భుజింప నర్హు లగుదురు? తత్కృతంబు లయిన ద్రోహంబు లెట్లు నిజ స్వామిం జెందు నని మఱియు నిట్లనియె.

466

తా॥ అలా చెప్పేసరికి ఆ ముని బాలకులతో సమానమైన వయస్సు, రూపము కల శృంగి కొమ్ములతో మూర్తి రూపాన్ని ధరించిన క్రోధరసం లాగా విజృంభించాడు. క్రోధ సంరంభంలో అదిరిపడి ఇలా అన్నాడు: "బలిగా వేసిన అన్నాన్ని భుజించి బలిసిన కాకుల లాగా, ద్వారాల దగ్గర కాచికొని ఉండే కుక్కల లాగా దాసులైన క్షత్రియుల వలె కనిపించే వీరు బ్రాహ్మణోత్తములచే గృహరక్షకులుగా ఎట్లా నిరూపింప బడ్డారు? అట్టివారు ఎట్లా లోపల ప్రవేశించి పాత్రములలో వండిన అన్నాన్ని భుజించటానికి ఎట్లా అర్హులవుతారు. వారు చేసే

ద్రోహాలు నిజస్వామికి ఎట్లా చెందుతాయి?" అని ఇంకా ఇలా అన్నాడు:

ఉ. ఆడఁడు తన్ను దూషణము, లాశ్రమవాసులఁ గాని వైరులం
గూడఁడు, కందమూలములు గూడుగఁ దించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోని చూడ్కులను, విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు మద్గురుండు; ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్?

467

తా॥ "మా తండ్రిగారు తనను ఏమీ దూషించలేదే! ఆశ్రమ వాసులనే తప్ప ఇతరులను ఎప్పుడూ కలియలేదే! కందమూలములను భుజిస్తూ సమాధిలో ఉంటూ అంతరంలోనే తన దృష్టిని ఉంచుకుంటాడే! నా గురువు విష్ణువును తప్ప ఇతర ప్రపంచమును చూడడే! ఆ రాచవాడు పామును చుట్టవలసిన అవసరం ఏమొచ్చింది?

ఉ. పోము హిరణ్య దానములఁ బుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము, సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే!
పామును వైవఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రుభుజార్గళంబునన్?

468

తా॥ మేము ఎప్పుడూ హిరణ్యదానాలు తీసుకోవడానికి ఎక్కడికీ వెళ్ళలేదే! వెళ్ళి ధనం ఏమీ తెచ్చుకోలేదే! ఆశీర్వచనాలు అంటూ వంచన చేస్తూ నాలుగు మంత్రాలు చదివి ధనాన్ని గుంజుకోమే! నగరాల్లోని గృహాల్లో కాకుండా అరణ్యాల్లోని ఆశ్రమాల్లో ఉండటానికి మేం తగమా! సాక్షాత్తు బ్రహ్మర్షి అయిన మా నాయన గారి మెడలో పామును వెయ్యడానికి అతనికి తగునా?

క. పుడమిఁగల జనులు వొగడఁగఁ, గుడుతురు గట్టుదురుగాక కువలయ పతులై యడవుల

నిడుమలఁ బడియెడి, బడుగుల మెడ నిడఁగఁ దగునె పన్నగ శవమున్?

469

తా॥ ఈ భూమిని పాలించే రాజులైతే ప్రజలంతా పొగడగా పంచభక్ష్య పరమాన్నాలు కుడవమనండి. మేలైన పట్టు వస్త్రాలు కట్టుకోమనండి! అంతేకాని అడవులలో ఉంటూ కష్టాలు పడుతూ ఉండే బడుగు వారైన మా వంటి వారి మెడలో చచ్చిన పామును వెయ్యటం తప్పు కాదా!

క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ
దగువారు లేమి దుర్జను, లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా!

470

తా॥ భగవంతుడైన గోవిందుడు ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిన తరువాత తగురీతిగా శాసించే వారు లేని కారణంగా దుర్జనులు విజృంభించి మహా సాధుజనులను బాధిస్తున్నారు.

క. బాలకులార! ధరిత్రీ, పాలకు శపియింతు ననుచు బలువడిని విలో లాలకుఁడగు మునికుంజర, బాలకుఁ డరిగెం త్రిలోకపాలకు లదరన్.

471

తా॥ ఓ బాలకులారా! నేను ఇప్పుడే ఆ రాజును శపిస్తున్నాను" అని అంటూ కోపం చేత కదిలిపోతూ ముని బాలకుడు దేవతలు అదిరిపోయేటట్లు గర్జించాడు.

వ. ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శంబు సేసి.

472

తా॥ ఇట్లు కోపంతో కౌశికీ నదికి వెళ్ళి నీటిని చేతిలోకి తీసుకున్నాడు.

ఉ. ఓడక వింటికోపున మృతోరగముంగొని వచ్చి మాఱు మా
టాడక యున్న మజ్జనకు నంస తలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించు రాజు హర కేశవు లడ్డినఁ నైనఁ జచ్చుఁ బో
యేడవనాఁడు తక్షక ఫణీంద్ర విషానల హేతి సంహతిన్.

473

తా॥ "సంకోచించకుండా చచ్చిన సర్పాన్ని వింటి కొప్పుతో తీసుకొని వచ్చి మౌనంగా తపస్సు చేసుకొంటున్న మా తండ్రిగారి భుజంపైన పెట్టిన దుర్మదాంధుడైన ఆ రాజు హరికేశవులు అడ్డమైనా సరే నేటికి ఏడవ రోజున తక్షక ఫణీంద్రుని యొక్క విషానలం చేత చస్తాడు."

వ. అని శమీకమహామునికుమారుం డయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి, నిజాశ్రమంబునకుం జనుదెంచి, కంఠలగ్న కాకోదర కళేబరుండైన తండ్రిం జూచి.

474

తా॥ ఈ విధంగా పరీక్షిత్తును శపించి శమీక మహాముని కుమారుడైన శృంగి తన ఆశ్రమానికి వచ్చాడు. ఇంకా కంఠంలో వ్రేలాడుతూన్న సర్పకళేబరం అలాగే ఉంది.

క. ఇయ్యెడ నీ కంఠమునను, నియ్యురగ కళేబరంబు నిటు వైచిన యా
యయ్య నిఁక నేమి సేయుదు, నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ.

475

తా॥ "తండ్రీ! నీ కంఠంలో ఈ ఉరగ కళేబరాన్ని ఇలా వేసిన వాడిని ఏం చెయ్యాలి? రాజులకు స్నేహములు అంటూ ఏమీ లేవు.

శా. ప్రారంభంబున వేఁట వచ్చి ధరణీపాలుండు, మా తండ్రిపై

నేరం బేమియు లేక సర్పశవమున్ నేఁ డుగ్రుఁ డై వైచి నాఁ
డీరీతిన్ ఫణి గ్రమ్మఱన్ బ్రదుకునో, హింసించునో కోఱలన్
రారే! తాపసులార! దీనిఁ దివరే! రక్షింపరే! మ్రొక్కెదన్.

476

తా॥ ఓ తాపసులారా! ఎవరో ధరణీపాలుడు వేటకోసం వచ్చి మా తండ్రిగారు నేరం ఏమీ చెయ్యకుండానే సర్పశవాన్ని నిర్దాక్షిణ్యంగా శరీరం మీద వేసి వెళ్ళాడు. ఈ త్రాచు మళ్ళీ బ్రతుకుతుందో ఏమో? క్రూరమైన కోరలతో హింసిస్తుందో ఏమో? దీన్ని తీసి మా తండ్రిని రక్షించండి! మీకు నేను మ్రొక్కుతాను."

వ. అని వెఱపున సర్పంబుఁ దిగుచు నేర్పు లేక యెలుంగెత్తి యేడ్చుచున్న కుమారకు రోదనధ్వని విని యాంగిరసుండయిన శమీకుండు సమాధి సాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి, తీసి పాఱవైచి, కుమారకుం జూచి.

477

తా॥ అంటూ భయంతో సర్పాన్ని తీసే నేర్పులేక పెద్దగా ఏడుస్తూన్న కుమారుని ఏడుపును విని తండ్రి అయిన శమీకుడు సమాధిని చాలించాడు. మెల్లగా కన్నులు తెరచి చూసి తన మూపున వ్రేలాడుతూన్న చనిపోయిన పామును చేతితో తీసి దూరంగా పారేసి కుమారుణ్ణి చూశాడు.

క. ఏ కీడు నాచరింపము, లోకులకున్ మనము సర్వలోక సములమున్ శోకింప నేల పుత్త్రక!, కాకోదర మేల వచ్చెఁ గంఠంబునకున్?

478

తా॥ "పుత్రా! మనం ఎవరికీ కీడు చెయ్యలేదే! మన దృష్టిలో మనకు లోకులందరు సమమేనే! నువ్వు ఎందుకని విచారిస్తున్నావు? నా కంఠానికి ఈ త్రాచు పాము ఎలా వచ్చింది?"

వ. అని యడిగినఁ దండ్రికిఁ గొడుకు, రాజు సర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించిన, నమ్ముని తన దివ్య జ్ఞానంబున నమ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుండని యెఱింగి కొడుకువలన సంతసింపక యిట్లనియె.

479

తా॥ అని అడిగిన తండ్రితో కొడుకు ఒక రాజు వచ్చి సర్పాన్ని వెయ్యటం తాను శపించటం చెప్పాడు. అప్పుడు ఆ ముని తన దివ్యజ్ఞానం చేత ఆ వచ్చిన రాజు పరీక్షిత్తు అని తెలుసుకొని కొడుకు చేసిన పనికి చాలా విచారించాడు.

క. బెట్టిద మగు శాపమునకు, దట్టపు ద్రోహంబు గాదు, ధరణీకాంతుం
గట్టా! యేల శపించితి? పట్టీ! తక్షక విషాగ్ని పాలగు మనుచున్?

480

తా॥ "బిడ్డా! అంత కఠినమైన శాపాన్ని ఇచ్చావు. అతను ద్రోహబుద్ధితో ఏమీ చెయ్యలేదే. 'తక్షక విషాగ్ని పాలవమని' ఆ రాజును ఎందుకు శపించావు.

ఆ. తల్లి కడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ, గమలనాభు కరుణఁ గలిగినాఁడు; బలిమి గలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడు, దిట్టవడుగ! రాజుఁ దిట్టఁ దగునె?

481

తా॥ కుమారా! పాపం పరీక్షిన్మహారాజు తల్లి కడుపులో ఉండగానే దగ్ధమై తిరిగి శ్రీకృష్ణుని దయవల్ల బ్రతికాడు. ప్రజారంజకంగా, పరాక్రమవంతుడై పరిపాలన చేస్తున్నాడు. అట్టి రాజును నువ్వు శపించవచ్చా!

ఉ. కాపరి లేని గొఱ్ఱియల కైవడిఁ గంటక చోర కోటిచే
నేపఱి యున్న దీభువన మీశుఁడు గృష్ణుఁడు లేమి, నిట్టిచో

భూ పరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే!
యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా?

482

తా॥ బాలకా! కృష్ణుడు లేకపోవటం మూలాన కాపరి లేని గొఱ్ఱెల మందవలె లోకమంతా దుండగులు దుర్మార్గులు దొంగలు వీరితో నిండిపోయింది. ఇట్టి పరిస్థితులలో ఇతడు సమబుద్ధితో భూమిని పాలిస్తున్నాడు. ఈ పాటి అపరాధానికి ఇంత దారుణమైన శాపం ఇవ్వటం తగునా?

సీ. పాపంబు నీచేతఁ బ్రాపించె మన; కింక, రాజు నశించిన రాజ్యమందు బలవంతుఁ డగువాఁడు బలహీను పశు దార, హయ సువర్ణాదుల నపహరించు జార చోరాదులు సంచరింతురు ప్రజ, కన్యోన్య కలహంబు లతిశయిల్లు వైదికంబై యున్న వర్ణాశ్రమాచార, ధర్మమించుక లేక తప్పిపోవు

ఆ. నంతమీద లోకు లర్థకామంబులఁ, దగిలి సంచరింప ధరణి నెల్ల వర్ణసంకరములు వచ్చును మర్కట, సారమేయ కులము మేరఁ బుత్ర!

483

తా॥ పుత్రా! నీ వలన పాపం ప్రాప్తించింది మనకి. రాజు మరణించిన రాజ్యంలో బలవంతుడు, బలహీనుడి పశువులు భార్య, గుఱ్ఱములు, బంగారము సమస్తము దోచుకుంటాడు. దొంగలు, వ్యభిచారులు బాహాటంగా సంచరిస్తారు. ప్రజల మధ్య కలహములు పెరుగుతాయి. వైదికమై ఉన్న వర్ణాశ్రమాచార ధర్మాలు తప్పుతాయి. ఇక ఈ పైన లోకులు అర్థకామాలకే ప్రాధాన్యత ఇస్తారు. రాజ్యమంతటా వర్ణసంకరం పెరిగి కోతులలో వలె కుక్కలలో వలె మనుష్యులు అంతా తయారవుతారు.

ఉ. భారతవంశజుం బరమభాగవతున్ హయమేధయాజి నా

చారుపరున్ మహానయవిశారదు రాజ కులైక భూషణున్
నీరము గోరి నేఁడు మన నేలకు వచ్చిన యర్థి భక్తి స
త్కారము సేసి పంపఁ జనుఁగాక, శపింపఁగ నీకు ధర్మమే?

484

తా॥ పవిత్రమైన భారత వంశంలో జన్మించి పరమ భాగవతుడై అశ్వమేధాన్ని చేసి ఆచారపరుడు, నయ విశారదుడు, రాజకుల భూషణుడు అయిన వాడు మంచి నీళ్ళు అడిగితే అతని కోరిక తీర్చి సత్కరించి పంపించాలి గాని శపించటం ధర్మమా?

క. భూపతికి నిరపరాధమ, శాపము దా నిచ్చె బుద్ధి చాపలమున మా
పాపఁడు, వీఁడొనరించిన, పాపము దొలఁగింపు కృష్ణ! పరమేశ! హరీ!

485

తా॥ ఓ కృష్ణా! పరమేశ్వర! హరీ! నిరపరాధుడయిన భూపాలునికి బుద్ధి చాపల్యం చేత నా పిల్లవాడు శాపాన్ని ఇచ్చి పాపం మూట కట్టుకున్నాడు. వీడు చేసిన పాపాన్ని తొలగించు తండ్రీ!

క. పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ, బడుచుందురు గాని పరమభాగవతులు దా
రొడఁబడరు మాఱు సేయఁగఁ, గొడుకా! విభుఁ డెగ్గుసేయఁ గోరఁడు నీకున్.

486

తా॥ కుమారా! పొడిచినా తిట్టినా కొట్టినా వాళ్ళు అనుభవిస్తారే కాని తిరిగి ఎదుటి వారికి అపకారం చెయ్యటానికి పరమ భాగవతులు ఒడంబడరు. అలాగే మన మహారాజు అయిన పరీక్షిత్తు నీకు తిరిగి ప్రతిశాపం ఇవ్వడు.

క. చెలఁగరు కలఁగరు సాధులు, మిళితములయి పరులవలన మేలుం గీడున్

నెలకొనిన నైన నాత్మకు, నొలయవు సుఖదుఃఖచయము లుగ్రము లగుచున్.

487

తా॥ సాధుపురుషులు పరుల వలన కలిగిన మేలు కీడులకు పొంగిపోరు, కృంగిపోరు. ఆత్మకు సుఖదుఃఖములు అంటుకోవు."

వ. అని యిట్లు శమీక మహామునీంద్రుండు గ్రమ్మఱింప శక్తి లేని కొడుకు సేసిన పాపంబునకు సంతాపంబు నొంది, తన శిష్యునొక మునికుమారునిం బిలిచి, యేతద్వృత్తాంతం బంతయు రాజున కెఱింగించి రమ్మని పంచె; నంత నా యభిమన్యుపుత్త్రుండు శమీకముని శిష్యునివలన శాపవృత్తాంతంబు విని, కామక్రోధాది విషయాసక్తుండగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తి బీజం బగు ననుచుఁ గరినగరంబునకుం జని యేకాంతంబున.

488

తా॥ అని ఈ విధంగా శమీక మహాముని తన కొడుకు ఇచ్చిన శాపాన్ని త్రిప్పలేక ఎంతో సంతాపాన్ని పొందాడు. ముని కుమారుడైన శిష్యుడొకనిని పిలిచి జరిగిన వృత్తాంతం అంతా రాజుకు తెలిపి రమ్మని పంపాడు. పిమ్మట ఆ అభిమన్యు పుత్రుడైన పరీక్షిత్తు శమీక మహాముని శిష్యుని వలన శాప వృత్తాంతం అంతా విన్నాడు. కామక్రోధాది విషయాలలో ఆసక్తుడైన తనకు తక్షకుని విషాగ్ని విరక్తికి బీజం అవుతుందని భావించి హస్తినాపురంలో ఏకాంతంలో ఇలా అనుకున్నాడు:

## పరీక్షిత్తు మునికుమారుని శాపం తెలుసుకొని ప్రాయోపవేశం చేయుట

ఉ. ఏటికి వేఁట వోయితి? మునీంద్రుఁడు గాఢసమాధి నుండఁగా
నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి? నేఁ
డేటికిఁ బాపసాహసము లీక్రియఁ జేసితి? దైవ యోగమున్
దాఁటఁగ రాదు వేగిరము తథ్యము గీడు జనించు ఘోరమై.

489

తా॥ 'వేటకోసమని అరణ్యానికి ఎందుకు వెళ్ళాను? అక్కడ మునీంద్రుడు గాఢమైన సమాధిలో ఉండగా ఎందుకు ఆయన భుజాగ్రం మీద సర్ప శవాన్ని తెచ్చివేశాను? నేనెందుకు ఈ పాపపు పనులను సాహసంతో చేశాను? దైవ యోగాన్ని దాటడం ఎవ్వరికీ సాధ్యం కాదు. చేసిన పాపానికి తగిన కీడు అనుభవింపక తప్పదు.

ఉ. పామువిషాగ్ని కీలలను బ్రాణము లేఁగిన నేఁగుఁగాక, యీ
భూమియు రాజ్యభోగములుఁ బోయిన నిప్పుడ పోవుఁ గాక, సౌ
దామనిఁ బోలు జీవనముఁ దథ్యముగాఁ దలపోసి యింక నే
నేమని మాఱు దిట్టుదు మునీంద్రకుమారకు దుర్నివారకున్.

490

తా॥ తక్షక విషాగ్నికి ప్రాణాలు పోతేపోనీ! ఈ భూమి ఈ రాజ్యభోగాలు ఇప్పుడే పోతే పోనీ! మెరుపులాంటి అశాశ్వతమైన జీవితాన్ని సత్యమని తలపోసి ఈ మునిబాలకుడిని తిరిగి నేను ఎందుకు శపించాలి?

ఆ. రాజు ననచుఁ బోయి రాజ్యగర్వంబున, వనము కొఱకు వారి వనము సొచ్చి
దందశూకశవముఁ దండ్రిపై వైచినఁ, బొలియఁ దిట్ట కేల పోవు సుతుఁడు?

491

తా॥ నేను దేశాన్ని పాలించే రాజును అనే గర్వంతో నీటి కోసం వారి ఆశ్రమంలోకి ప్రవేశించి చచ్చిన పామును తండ్రిపై వేస్తే సుతుడు చచ్చేటట్లు తిట్టక ఏం చేస్తాడు?

క. గోవులకును బ్రాహ్మణులకు, దేవతలకు, నెల్లప్రొద్దుఁ దెంపునఁ గీడుం గావించు పాపమానస, మే విధమునఁ బుట్టకుండ, నే వారింతున్.

492

తా॥ గోవులకు బ్రాహ్మణులకు దేవతలకు ఎప్పుడూ కీడు కావించాలనే ఊహ నాలో పుట్టకుండా నేను ఏం చెయ్యాలి?'

వ. అని వితర్కించె.

493

తా॥ అని తనలో తాను తర్కించుకున్నాడు.

క. దామోదర పదభక్తిం, గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్
భూమీశుఁ డలుగఁ డయ్యెను, సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్.

494

తా॥ దామోదరుని పాదముల మీద అపారమైన భక్తి ఉన్నా, కామక్రోధాదులను గెల్చినవాడు కావున కరుణచేత భూపాలుడు తనకు సామర్థ్యం ఉన్నా, శృంగి మీద అలుక పూనలేదు.

వ. అంత మునికుమారుఁడు శపించిన వృత్తాంతంబుఁ దక్షకుండు విని యెదరు వేచియుండె; నిటఁ దక్షకవ్యాళ విషానల జ్వాలాజాలంబునం దనకు సప్తమ దినంబున

మరణంబని యెఱింగినవాఁడు గావున, భూపాలుండు భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబులని తలంచి, రాజ్యంబు విసర్జించి, నిరశన దీక్షాకరణంబు సంకల్పించుకొని.

495

తా॥ అంత ముని కుమారుడయిన శృంగి శపించిన వృత్తాంతాన్ని తక్షకుడు విని సమయం కోసం చూస్తున్నాడు. ఇక ఇక్కడ తక్షకుని యొక్క విషాగ్ని కీలల వలన తనకు ఏడవ రోజున మరణం సంభవిస్తుందని తెలిసినవాడు కనుక పరీక్షిత్తు భూలోక, స్వర్గలోక భోగములు హేయములని నిశ్చయించి రాజ్యాన్ని విసర్జించి నిరాహార దీక్ష చెయ్యాలని సంకల్పించుకొన్నాడు.

మ. తులసీసంయుతదైత్యజిత్పదరజస్తోమంబుకంటెన్ మహో
జ్జ్వలమై దిక్పతిసంఘసంయుతజగత్సౌభాగ్యసంధాయియై
కలిదోషావలి నెల్లఁ బాపు దివిషద్గంగా ప్రవాహంబు లో
పలికిం బోయి మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్.

496

తా॥ తులసీ దళాలతో కూడిన శ్రీమహా విష్ణువు పాద రజస్సుకంటే మహోజ్జ్వలమై, దిక్పాలురతోపాటు జగత్సౌభాగ్య సంధాయియై, కలియుగ దోషాలను అన్నిటిని తొలగించే గంగానది లోపలికి పోయి ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చెయ్యాలని సంకల్పం చేశాడు.

క. చిత్తము గోవిందపదా, యత్తముఁ గావించి మౌనియై తనలో నే తత్తఱము లేక భూవర,
సత్తముఁడు వసించె ముక్త సంగత్వమునన్

497

తా॥ ఆ భూవర సత్తముడు తన చిత్తాన్ని గోవిందుని పాదములయందు నిలిపి మౌనాన్ని వహించి తనలో ఎలాంటి తత్తరపాటు లేకుండ ముక్తిని కోరి కూర్చున్నాడు.

వ. ఇట్లు పాండవపౌత్త్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయమాన మానసుండై విష్ణుపదీతీరంబునం బ్రాయోపవేశంబున నుండుట విని సకలలోక పావనమూర్తులు మహానుభావులు నగుచుఁ దీర్థంబులకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి విశ్వామిత్ర మైత్రేయ భృగు వసిష్ఠ పరాశర చ్యవన భరద్వాజ పరశురామ దేవల గౌతమ కశ్యప కణ్వ కలశసంభవ వ్యాస పర్వత నారదప్రముఖులైన బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి పుంగవులును కాండర్షులయిన యరుణాదులును, మఱియు నానాగోత్ర సంజాతులైన మునులును శిష్య ప్రశిష్యసమేతులై చనుదెంచిన వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి పూజించి దండప్రణామంబు లాచరించి, కూర్చుండ నియోగించి.

498

తా॥ ఈ విధంగా పాండవ పౌత్రుడైన పరీక్షిత్తు హరి చరణాలను స్మరించుకొంటూ గంగానదీ తీరంలో ప్రాయోపవేశంలో ప్రవేశించాడు. సకలలోక పావన మూర్తులు, మహానుభావులు తీర్థంబులకు పావనత్వాన్ని ఇవ్వకలిగిన అత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, వసిష్ఠ, పరాశర, చ్యవన, భరద్వాజ, పరశురామ, దేవల, గౌతమ, కశ్యప, కణ్వ, కలశసంభవ, వ్యాస, పర్వత, నారద ప్రముఖులైన బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి పుంగవులును, కాండర్షులయిన అరుణాదులును మరియు నానాగోత్రములలోను జన్మించిన మునులును శిష్య ప్రశిష్యులతో కూడి వచ్చారు. పరీక్షిన్నరేంద్రుడు వారలకు ఎదురువెళ్ళి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి దండప్రణామాలు చేసి ఆసీనులను కావించాడు.

క. క్రమ్మఱ నమ్ముని విభులకు, నమ్మనుజేంద్రుండు మ్రొక్కి హర్షాశ్రుతతుల్ గ్రమ్మఁగ ముకుళితకరుఁడై, సమ్మతముగఁ జెప్పె నాత్మ సంచారంబున్.

499

తా॥ ఆ మునిరాజులకు ఆ మహారాజు ఆనంద బాష్పాలు పొంగి పొరలగా చేతులతో నమస్కరించి ఇలా విన్నవించాడు:

ఉ. ఓపిక లేక, చచ్చిన మహోరగముం గొని వచ్చి, కోపినై
తాపసు మూఁపుపై నిడిన దారుణ చిత్తుఁడ; మత్తుఁడన్ మహా
పాపుఁడ మీరు పాపతృణపావకు లుత్తము లయ్యలార! నా
పాపము వాయు మార్గము గృపాపరులార! విధించి చెప్పరే.

500

తా॥ "ఓ కృపావిదులార! ఓపిక లేక చచ్చిన సర్పాన్ని తీసుకొని వచ్చి కోపంతో మునీశ్వరుని మూపుమీద వేసిన దారుణ చిత్తుణ్ణి. మత్తుణ్ణి. మహా పాపుణ్ణి. మీరు పాపం అనే తృణానికి అగ్నిహోత్రం వంటివారు, ఉత్తములు. పాపాన్ని పోగొట్టుకొనే మార్గం ఏదైనా ఉంటే నాకు చెప్పండి.

ఉ. భూసురపాద రేణువులు పుణ్యులఁ జేయు నరేంద్రులన్; ధరి
త్రీసురులార! మీ చరణ రేణు కణంబులు మేను సోఁక నా
చేసిన పాప మంతయు నశించెఁ; గృతార్థుఁడ నైతి; నెద్ది యేఁ
జేసిన ముక్తి పద్ధతికిఁ జెచ్చెరఁ బోవఁగఁ వచ్చుఁ జెప్పరే.

501

తా॥ ఓ బ్రాహ్మణోత్తములారా! భూసురుల పాద రేణువులు నరేంద్రులను పుణ్యులను చేస్తాయి. మీ పాదరేణువులు నా మేనుకు సోకగానే నేను చేసిన పాపం అంతా నశించింది. కృతార్థుడనయ్యాను. నేను ఏం చేస్తే ముక్తి నాకు లభ్యం అవుతుందో చెప్పండి.

క. భీకరతరసంసార, వ్యాకులతన్ విసిగి దేహవర్జనగతి నా
లోకించు నాకుఁ దక్షక, కాకోదరవిషము ముక్తి కారణమయ్యెన్.

502

తా॥ మహా భయంకరమైన సంసారం వలన కలతపడి విసిగి దేహాన్ని విడిచిపెడదామని

అనుకొంటున్న నాకు ఈ తక్షకుని విషం ముక్తికి కారణం అయింది.

క. ఏపారు నహంకార, వ్యాపారములందు మునిఁగి వర్తింపంగా
నా పాలిటి హరి భూసుర, శాపవ్యాజమున ముక్త సంగుం జేసెన్.

503

తా॥ అహంకార మమకారాలతో కూడిన ఈ సంసారంలో మునిగి తేలుతూన్న నాకు బ్రాహ్మణశాపం రూపంలో ముక్తి మార్గాన్ని ప్రసాదించాడు.

మ. ఉరగాధీశు విషానలంబునకు మే నొప్పింతు; శంకింప నీ
శ్వరసంకల్పము నేఁడు మానదు; భవిష్యజ్జన్మ జన్మంబులన్
హరిచింతారతియున్ హరిప్రణుతి భాషాకర్ణ నాసక్తియున్
హరిపాదాంబుజ సేవయుం గలుగ మీ రర్థిం బ్రసాదింపరే!

504

తా॥ ఓ మునీంద్రులారా! తక్షకుని విషాగ్ని జ్వాలలకు నా శరీరాన్ని అర్పిస్తాను. ఈశ్వర సంకల్పం తప్పదు. భవిష్యత్తులో జన్మ జన్మలలోను హరియందు చింతన, హరియందు నమ్రత, హరి యొక్క గాథలను వినుట యందు ఆసక్తి హరి యొక్క పాదాంబుజములను సేవించటం.... ఇవి కలిగేటట్లు మీరు అనుగ్రహించండి.

క. చూడుఁడు నా కల్యాణము, పాడుఁడు గోవిందు మీఁది పాటలు దయతో నాడుఁడు
హరిభక్తుల కథ, లే డహములలోన ముక్తి కేఁగఁగ నిచటన్.

505

తా॥ నా కల్యాణాన్ని కాంక్షించండి. గోవిందుడి మీది పాటలు పాడండి. హరి భక్తుల కథలను దయతో చెప్పండి. ఏడు రోజుల్లో నాకు ముక్తిని ప్రసాదించండి.

క. అమ్మా! నినుఁ జూచిన నరుఁ, బొమ్మాయని ముక్తి కడకుఁ బుత్తు వఁట కృపన్
లెమ్మా నీ రూపముతో, రమ్మా నా కెదుర గంగ! రమ్యతరంగా.

506

తా॥ అమ్మా! గంగమ్మ తల్లీ! నీ తరంగాలు ఎంత అందంగా ఉన్నాయమ్మా! నిన్ను చూసిన నరుణ్ణి మోక్షానికి పంపిస్తావని విన్నాను. నీ రూపంతో దర్శనం ఇయ్యవమ్మా!"

వ. అని తనకు మీఁద నయ్యెడి జన్మాంతరంబులందును హరిపాదభక్తి సౌజన్యంబులు సంధిల్లుంగాత మని గంగాతరంగిణి దక్షిణకూలంబునం బూర్వాగ్ర దర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి, జనమేజయు రప్పించి, రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసారబంధంబునకుం దప్పించి చిత్తంబు హరికి నొప్పించి పరమ భాగవతుండైన పాండవ పౌత్త్రుండు ప్రాయోప విష్టుండై యున్న సమయంబున.

507

తా॥ అని తనకు కలుగబోయే జన్మలలో కూడా హరిభక్తి కలగాలని ప్రార్థించాడు. గంగానది యొక్క దక్షిణ భాగంలో తూర్పుకు కొనలు ఉంటేటట్లు పరచిన ధర్భాసనం మీద ఉత్తర ముఖంగా కూర్చున్నాడు. సంసార బంధం నుంచి తన మనస్సును తప్పించాడు. తన చిత్తాన్ని హరి మీద పెట్టాడు. పరమ భాగవతుడైన పరీక్షిత్తు ఆ శుభ సమయంలో ప్రాయోపవిష్టుడయ్యాడు.

క. ఒత్తిలి పొగడుచు సురలు వి, యత్తలమున నుండి మెచ్చి యలరుల వానల్ మొత్తములై కురిసిరి నృప, సత్తముపై భూరి భేరి శబ్దంబులతోన్.

508

తా॥ దేవతలు ఆకాశం నుండి విరులవాన పరీక్షిత్తు మీద కురిపించి గొప్పదైన భేరి శబ్దాలను మ్రోగించారు.

వ. ఆ సమయంబున సభాసీను లయిన ఋషు లిట్లనిరి

509

తా॥ ఆ సమయంలో సభాసీనులు అయిన ఋషులు ఆ రాజర్షితో ఇట్లా అన్నారు:

మ. క్షితినాథోత్తమ! నీ చరిత్రము మహాచిత్రంబు మీ తాత లు
గ్ర తపోధన్యులు విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్య శో
భితకోటీరమణి ప్రభాన్వితమహాపీఠంబు వర్జించి రు
న్నతులై నీవు మహోన్నతుండవు గదా నారాయణధ్యాయివై.

510

తా॥ "ఓ మహారాజా! నీ చరిత్ర మహా చిత్రమైనది. మీ తాతలు ఉగ్రమైన తపస్సు చేశారు. విష్ణుదేవుని సన్నిధిని కోరి అనేక మంది రాజుల కిరీటాలలో ప్రకాశించే మణుల కాంతులచే విరాజిల్లుతూన్న మహా పీఠాన్ని వర్జించి ఉన్నతులు అయ్యారు. నువ్వు కూడా నారాయణ నామ పారాయణ చేసిన మహోన్నతుడవు.

మ. వసుధాధీశ్వర! నీవు మర్త్యతనువున్ వర్జించి నిశ్శోకమై
వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స
ర్వసమత్వంబునఁ జేరునంతకు భవద్వాక్యంబులన్ వించు నే
దెసకుం బోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్.

511

తా॥ ఓ ధాత్రీశ్వరా! నువ్వు ఈ మనుష్య దేహాన్ని వదలి ఏ శోకము లేని, ఏ వ్యసనము లేని, రజోగుణం ఏమాత్రమూ లేని లోకమునకు సర్వసమత్వముతో చేరేటంత వరకు నీ వాక్యములు వింటూ ఎక్కడకూ పోకుండా నీ దివ్య ప్రభావాన్ని చూస్తూ మేము ఇక్కడే ఉంటాము."

వ. అని యిట్లు పక్షపాతశూన్యంబులును మహనీయ మాధుర్య గాంభీర్య సౌజన్య ధుర్యంబులును నైన భాషణంబు లాడుచు మూఁడు లోకంబులకు నవ్వలిదైన సత్యలోకంబునందు మూర్తి మంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునం దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుఁడు నారాయణ కథాశ్రవణ కుతూహలుండయి నమస్కరించి యిట్లనియె.

512

తా॥ అని ఇట్లా పక్షపాతం లేకుండా మాధుర్యము, గాంభీర్యము, సౌజన్యము వీటితో కూడి చక్కగా మాట్లాడుతూ మూడు లోకాలకు అవతలిదయిన సత్యలోకంలో ప్రకాశించే వేదరాశివలె మూర్తిమంతంగా తేజరిల్లుతూ ఉన్న ఋషులను చూసాడు పరీక్షిత్తు. శ్రీహరి యొక్క కథలను వినాలనే కుతూహలంతో వారికి నమస్కరించి ఇలా అన్నాడు:

క. ఏడు దినంబుల ముక్తిం, గూడఁగ నే రీతి వచ్చు గురు సంసార
క్రీడన మే క్రియ నెడతెగుఁ, జూడుఁడు మా తండ్రులార! శ్రుతివచనములన్.

513

తా॥ “తండ్రులారా! ఏడు రోజులలో ఏ విధంగా ముక్తిని నేను పొందుతాను? ఈ సంసార బంధం ఏ విధంగా తెగిపోతుంది? మీరు వేద వాక్యానురీతిగా నాకు సెలవియ్యండి.

శా. ప్రాప్తానందులు బ్రహ్మబోధన కళాపారీణు లాత్మప్రభా
లుప్తాజ్ఞానులు మీర లార్యులు దయాళుత్వాభిరాముల్ మనో
గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా!
సప్తాహంబుల ముక్తి కేఁగెడు గతిం జర్చించి భాషింపరే!

514

తా॥ మీరు ఆనంద స్వరూపులు. బ్రహ్మజ్ఞానాన్ని పొందినవారు. ఆత్మతత్త్వాన్ని

తెలుసుకున్న జ్ఞానులు. ఆర్యులు. దయ కలవారు. మనస్సులలో గుప్తంగా ఉన్న అన్ని విషయాలు మీకు తెలుస్తాయి కదా! నేను ఏడు రోజులలో ముక్తి పథాన్ని ఎలా చేరుకుంటానో నాకు వివరించండి."

వ. అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు మును లందఱుఁ బ్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున.

515

తా॥ అని పరీక్షిత్తు ఆడిన మాటలకు మునులందరూ సమాలోచనలు చేస్తున్నారు. అదే సమయంలో...

## శుకమహర్షి పరీక్షిన్మహారాజు వద్దకు వచ్చుట

సీ. ప్రతినిమేషముఁ బరబ్రహ్మంబు నీక్షించి, మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు

కమలంబుమీఁది భృంగముల కైవడి మోము, పై నెఱపిన కేశపటలివాఁడు

గిఱి వ్రాసి మాయ నంగీకరించని భంగి, వసనంబుఁ గట్టక వచ్చువాఁడు

సంగిగాఁడని వెంటఁ జాటుభూతములు నా, బాలుర హాసశబ్దముల వాఁడు

తే. మహిత పద జాను జంఘోరు మధ్య హస్త, బాహు వక్షో గళానన ఫాల కర్ణ

నాసికా గండ మస్తక నయన యుగళుఁ, డైన యవధూతమూర్తి వాఁ డరుగుదెంచె.

516

తా॥ ఒక అవధూత మూర్తి అక్కడకు వచ్చాడు. ఎలా ఉన్నాడు ఆయన? ప్రతి నిముషము పరబ్రహ్మ సాక్షాత్కార పారవశ్యంలో ఉంటూ బయట ప్రపంచాన్ని మరచిపోతున్నాడు. కమలముల మీది భృంగముల వలె సుందరమైన ఆయన మోముపై కేశములు ప్రకాశిస్తున్నాయి. గిరి గీసి మాయను అంగీకరించని వానివలె శరీరానికి ఆచ్ఛాదన ఏమీ లేకుండా ఉన్నాడు. ఇతనికి దేనితోనూ కూడిక లేదు అని చెబుతూన్నట్లు అతని చుట్టూ పరిహాసం చేస్తూ బాలురు వస్తున్నారు. గొప్పవయిన పాదములు, మోకాళ్ళు, పిక్కలు, తొడలు, నడుము, హస్తములు, బాహువులు, వక్షోజము, కంఠము, ఫాలము, చెవులు, ముక్కు, చెక్కిళ్ళు, శిరస్సు నయనములు కలిగిన అవధూత మూర్తి వచ్చాడు.

ఉ. ఈరని లోకులం గినిసి, యెగ్గులు వల్కనివాఁడు గోరికల్

గోరని వాఁడు గూటువలఁ గూడని వాఁడు వృథా ప్రపంచముం

జేరని వాఁడు దైవగతిఁ జేరిన లాభముఁ సూచి తుష్టుఁడై

నేరని వాని చందమున నేర్పులు సూపెడు వాఁడు వెండియున్.

517

తా॥ తనకు ఎవరూ ఏమీ ఇవ్వలేదని లోకులను ఎప్పుడూ దూషించలేదు. ఎప్పుడూ ఎవరిని ఏమీ కోరలేదు. ఏ గుంపుతోను కలియలేదు. వృథా అయిన ప్రాపంచిక విషయాలలో మనస్సును పోనివ్వలేదు. దైవకృపతో తనకు లభ్యమైన దానితో సంతృప్తి చెందుతాడు. ఏమీ తెలియని వానిలా ఉంటూ అన్ని తెలిసినవాడు.

ఆ. అమ్మహాత్ము షోడశాబ్ద వయోరూప, గమన గుణ విలాస కౌశలములు
ముక్తికాంత సూచి మోహిత యగు నన, నితరకాంత లెల్ల నేమి సెప్ప!

518

తా॥ పదహారు ఏండ్ల వయసులో ఆ మహనీయుని వయస్సు, రూపము, గమనము, గుణము, నేర్పరితనము... వీటిని చూసి ముక్తికాంత తనంత తానుగా మోహిస్తుంది అంటే ఇక లోకంలో ఉండే అన్యకాంతల గురించి చెప్పేదేముంది?

ఆ. వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై, బ్రహ్మభావమునను బర్యటింప వెఱ్ఱి యంచు శుకుని
వెంట నేతెంతురు, వెలఁదు లర్భకులును వెఱ్ఱు లగుచు.

519

తా॥ వెర్రితనం మాని విజ్ఞాన మూర్తియై లోకం అంతా బ్రహ్మస్వరూపం అనే భావనలో పర్యటిస్తూంటే వెర్రివాడు అనే భావనలో శుకుని వెంట పిల్లలు వెలదులు వెర్రులయి వస్తారు.

వ. ఇట్లు వ్యాసనందనుండైన శుకుం దరుగుదెంచిన నందలి మునీంద్రు లమ్మహానుభావుని ప్రభావంబు లెఱుంగుదురు గావున నిజాసనంబులు డిగ్గి ప్రత్యుత్థానంబు సేసిరి; పాండవ పౌత్త్రుండు నా యోగిజన శిఖామణికి నతిథి సత్కారంబులు గావించి దండప్రణామంబు సేసి పూజించె; మఱియు గ్రహ నక్షత్ర తారకామధ్యంబునం దేజరిల్లు రాకాసుధాకరుండునుంబోలె బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబునం గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని.

520

తా॥ ఇట్లు వ్యాసుని కుమారుడైన శుక యోగీంద్రుడు వచ్చేసరికి అచ్చటి మునీంద్రులు ఆ మహానుభావుని ప్రభావం ఎరుగుదురు కనుక వారి ఆసనములు దిగి ఎదురు వచ్చి స్వాగతం చెప్పారు. పరీక్షిత్తు యోగిజన శిఖామణికి అతిథి సత్కారాలు చేసి దండప్రణామం చేసి పూజించాడు. గ్రహనక్షత్ర తారకా సమూహం మధ్య ప్రకాశిస్తూన్న పున్నమ చంద్రునిలా బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యలో కూర్చున్న శుకయోగీంద్రుడు తేజరిల్లాడు.

ఉ. ఫాలము నేల మోపి, భయభక్తులతోడ నమస్కరించి, భూ
పాల కులోత్తముండు గరపద్మములన్ ముకుళించి, నేఁడు నా
పాలిటిభాగ్య మెట్టిదియొ, పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవు వచ్చితి వివేకవిభూషణ! దివ్య భాషణా!

521

తా॥ నుదురు నేలకు సోకునట్లు మ్రొక్కి, భయభక్తులతో నమస్కరించి చేతులు జోడించి రాజకులోత్తముడైన పరీక్షిత్తు ఇలా విన్నవించాడు – “మహానుభావా! నేడు నేను చేసిన పుణ్యం ఎట్టిదో! పావన మూర్తివి! పుణ్యకీర్తివి! నువ్వు సమయానికి వచ్చావు.

మ. అవధూతోత్తమ! మంటి, నేఁడు నిను డాయం గంటి, నీవంటి వి
ప్ర వరుం బేర్కొను నంతటన్ భసితమౌఁ బాపంబు నా బోఁటికిన్
భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా
ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే?

522

తా॥ అవధూతోత్తమ! నిను దర్శించటం కోసమే ఇంత కాలం జీవించి ఉన్నాను. నువ్వు అత్యంత సన్నిహితంగా రావటం కేవలం నా అదృష్టం. నీవంటి బ్రాహ్మణోత్తముని పేరు

ఒక్కసారి ఉచ్చరిస్తే చాలు, నా పాపాలన్నీ భస్మీపటలమౌతాయి. నా బోటివానికి నిన్ను దర్శించటం నీతో మాట్లాడటం నిన్ను అర్చించటం నీ పాదములను కడగటం నిన్ను స్పృశించటం ఇత్యాది విధానముల వల్ల ముక్తి వస్తుందంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

క. హరి చేతను దనుజేంద్రులు, ధరఁ ద్రుంగెడు భంగి నీ పదస్పర్శముచే
గురుపాతక సంఘంబులు, పొరిమాలుఁ గదయ్య యోగభూషణ! వింటే.

523

తా॥ ఓ యోగ భూషణ! హరిచేత రాక్షసులు ఈ భూమి మీద నశించి పోయినట్లే నీ పాదస్పర్శ చేత మహా పాపములు నాశనం అవుతాయి.

మ. ఎలమిన్ మేనమఱందియై సచివుఁడై యేమేటి మా తాతలన్
బలిమిం గాచి సముద్ర ముద్రిత ధరం బట్టంబుఁ గట్టించె, న
య్యలఘుం డీశుఁడు చక్రి రక్షకుఁడు గా కన్యుల్ విపద్రక్షకుల్
గలరే? వేఁడెద భక్తి నా గుణనిధిం గారుణ్య వారాన్నిధిన్.

524

తా॥ ఏ మహానుభావుడు మేన మరిదియై సచివుడై మా తాతలైన పాండవులను రక్షించి నాలుగు సముద్రాలు మధ్యన కల భూభాగానికి పట్టం కట్టించాడో ఆ మహాత్ముడు, ఆ ఈశ్వరుడు, ఆ చక్రాయుధుడు అందరికీ రక్షకుడై ఉంటాడు. చక్రి రక్షకుడు కాకపోతే అన్యులు విపత్తు నుంచి రక్షిస్తారా? అట్టి గుణనిధిని కరుణాసముద్రుణ్ణి నేను వేడుకొంటున్నాను.

సీ. అవ్యక్తమార్గుండ వైన నీ దర్శన, మాఱడి పో నేర దభిమతార్థ
సిద్ధి గావించుట సిద్ధంబు నేఁ డెల్లి, దేహంబు వర్జించు దేహధారి
కేమి చింతించిన నేమి జపించిన, నేమి గావించిన, నేమి వినిన,
నేమి సేవించిన నెన్నఁడు సంసార, పద్ధతిఁ బాసిన పదవి గలుగు

తే. నుండు మనరాదు గురుఁడవు యోగివిభుఁడ, వావుఁ బిదికిన తడవెంత యంత సేపు
గాని యొక దెస నుండవు కరుణతోడఁ, జెప్పవే తండ్రి ముక్తికిఁ జేరు తెరువు!

525

తా॥ అవధూతలలో అగ్రగణ్యుడవు. ఎక్కడికి వెళతావో నీకే తెలియదు. నీ దర్శనం వ్యర్థం కాదు. నీ దర్శనం కోరిన కోరికలను సిద్ధింప చేస్తుంది. ఈ రోజో రేపో దేహాన్ని విడిచిపెట్టబోయే దేహధారికి ఏమి చింతిస్తే, ఏమి జపిస్తే, ఏమి వింటే, ఏమి చేస్తే, దేనిని సేవిస్తే ఈ సంసారాన్ని విడిచే స్థితి కలుగుతుంది? ఉండమని అనకూడదు నిన్ను. నువ్వు గురుడవు. యోగి విభుడవు. ఆవుపాలు పితికిన అంతసేపు కంటే ఎక్కువ సేపు ఒక చోట ఉండవు. ముక్తికి చేరు తెరువును గూర్చి దయతో చెప్పు తండ్రీ!"

వ. అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె నని చెప్పి.

526

తా॥ అని ఈ విధంగా పరీక్షిత్తు శుకయోగీంద్రుణ్ణి అడిగాడు.

క. రాజీవపత్త్రలోచన! రాజేంద్ర కిరీట ఘటిత రత్న మరీచి
భ్రాజితపాదాంభోరుహ! భూజన మందార! నిత్యపుణ్యవిచారా!

527

తా॥ తామర రేకుల వంటి కన్నులు కలవాడా! రాజాధి రాజుల కిరీటములలో కూర్చబడిన రత్న కాంతులచే ప్రకాశించు పాదపద్మములు కలవాడా! భక్తులకు పారిజాతము వంటివాడా! పుణ్యమూర్తీ!

మా. అనుపమగుణహారా! హన్యమానారివీరా!
జన వినుత విహారా! జానకీ చిత్తచోరా!

దనుజ ఘన సమీరా! దానవశ్రీ విదారా!
ఘన కలుష కఠోరా! కంధి గర్వాపహారా!

528

తా॥ ఉపమించటానికి వీలులేని గుణములు కలవాడా! పరాజిత వైరి వీరుడా! జనుల చేత నుతింపబడే వాడా! జానకి యొక్క మనస్సును హరించే వాడా! దానవులనే మేఘములకు వాయువు వంటివాడా! దానవుల యొక్క సంపదను చీల్చువాడా. గొప్పవైన కలుషములకు గొడ్డలి వంటి వాడా! సాగర గర్వాపహారుడవైన వాడా!

గద్యము

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు నైమిశారణ్య వర్ణనంబును శౌనకాదుల ప్రశ్నంబును సూతుండు నారాయణ కథాసూచనంబు సేయుటయు, వ్యాసచింతయు, నారదాగమనంబును, నారదుని పూర్వకల్ప వృత్తాంతంబును, బుత్త్రశోకాతురయైన ద్రుపదరాజ నందన కర్జునుం డశ్వత్థామం దెచ్చి యొప్పించి గర్వ పరిహారంబు సేయించి విడిపించుటయు, భీష్మ నిర్యాణంబును, ధర్మనందను రాజ్యాభిషేకంబును, గోవిందుని ద్వారకాగమనంబును, విరాట కన్యకా గర్భ విద్యమానుండైన యర్భకు నశ్వత్థామ బాణానలంబు వలనం బాపి విష్ణుండు రక్షించుటయుఁ, బరీక్షిజ్జన్మంబును గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిర్గమంబును, నారదుండు ధర్మరాజునకుఁ గాల సూచనంబు సేయుటయుఁ, గృష్ణనిర్యాణంబు విని, పాండవులు మహాపథంబునం జనుటయు నభిమన్యు పుత్త్రుండు దిగ్విజయంబు సేయుచు శూద్రరాజలక్షణ లక్షితుండగు కలిగర్వంబు సర్వంబు మాపి గోవృషాకారంబుల నున్న ధరణీ ధర్మదేవతల నుద్ధరించుటయు, శృంగి శాపభీతుండై యుత్తరానందనుండు గంగాతీరంబునం బ్రాయోపవేశంబున నుండి శుక సందర్శనంబు సేసి, మోక్షోపాయం

బడుగుటయు నను కథలు గల ప్రథమ స్కంధము.

529

తా॥ భాగవతమనే మహాపురాణాన్ని పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్రుడూ, కేసనామాత్యుని పుత్రుడూ, సహజపాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించాడు. ఈ మహాగ్రంథంలో నైమిశారణ్య వర్ణనమూ, శౌనకాది మహర్షుల సంప్రశ్నమూ, సూతులవారి నారాయణ కథా సూచనమూ, వ్యాసులవారి విచారమూ, నారదాగమనమూ, నారదులవారి పూర్వజన్మ వృత్తాంతమూ, ద్రౌపది పుత్రశోకంతో పరితపించటమూ, అర్జునుడు అశ్వత్థామను బంధించి తీసుకొనిరావటమూ అశ్వత్థామ గర్వ పరిహారమూ, భీష్ముని నిర్యాణమూ, ధర్మరాజు పట్టాభిషేకమూ, శ్రీకృష్ణుని ద్వారకాగమనమూ, ఉత్తరా గర్భస్థుడైన అర్భకుణ్ణి అశ్వత్థామ అస్త్ర జ్వాలల నుంచి శ్రీకృష్ణుడు రక్షించటమూ, పరీక్షిత్తు జననమూ, గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిష్క్రమణమూ, నారదుడు ధర్మజునకు చేసిన కాలసూచనమూ, శ్రీకృష్ణ నిర్యాణమూ, పాండవుల మహాప్రస్థానమూ, పరీక్షిత్తు దిగ్విజయమూ, కలిగర్వ భంజనమూ, ధరణీ ధర్మదేవుల సముద్ధరణమూ, పరీక్షిత్తుకు శృంగి శాపమూ, గంగాతీరంలో ప్రాయోపవేశమూ, శ్రీ శుక సందర్శనమూ, మోక్షమార్గాభ్యర్థనమూ అనే కథలతో కూడిన ప్రథమ స్కంధం సమాప్తం.

# ద్వితీయ స్కంధము

శ్రీమద్భక్త చకోరక
సోమ! వివేకాభిరామ! సురవినుత గుణ
స్తోమ! నిరలంకృతాసుర
రామా సీమంతసీమ! రాఘవరామా!

1

తా॥ రఘువంశంలో పుట్టిన ఓ రామా! వినవలసింది. నువ్వు భక్తులనే చకోరపక్షులకు చంద్రుని వంటివాడవు. ఉత్తమ వివేకం కలవాడవు. దేవతలంతా మెచ్చుకునే మంచి స్వభావం కలవాడవు. రాక్షస ముత్తైదువుల నుదుట కుంకుమను తుడిపి వేసిన ధర్మరక్షకుడవు.

వెన్నెల ఆహారంగా గల చకోరపక్షులు చంద్రుణ్ణి చూడగానే ఎంతో ఆనందించినట్లు, భక్తులు రామదర్శనంతో అంతకు మించి పులకిస్తారు. తండ్రి, గురువు, మిత్రుడు, పత్ని, తమ్ముడు, పగవాడు అనే సంబంధాల వల్ల దేహాత్మవిభేదజ్ఞానంతో వ్యవహరించే వివేకవంతులవుతారు. సన్నుతులకు పాత్రమైన స్వభావంతో సంచరించగలవారవుతారు. చెడును మాన్పి మంచిని పెంచగలవారవుతారు.

వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

2

తా॥ మంచికి మారుపేరైనవారు, గౌరవార్హులు శౌనకాదిమునులు. సూతుడు అష్టాదశ పురాణాల పారమార్థిక రహస్యాలను విప్పి చెప్పే పద్ధతులన్నీ ఆకళించుకున్నవాడు. ఆ శౌనకాది మునీశ్వరులకు సూతుడిలా చెప్పసాగాడు. ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజుతో శుకముని ఇలా అన్నాడు:

## శుకుడు పరీక్షిత్తుకు ముక్తి మార్గాన్ని తెలియజేయుట

సీ. క్షితిపతి! నీ ప్రశ్న సిద్ధంబు మంచిది యాత్మవేత్తలు మెత్తు రఖిలశుభద
మాకర్ణనీయంబు లయుతసంఖ్యలు గల వందు ముఖ్యం బిది యఖిలవరము
గృహములలోపల గృహమేధులగు నరు లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ
రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి పోవుఁ గుటుంబార్థబుద్ధి నహము

ఆ. పశు కళత్ర పుత్రబాంధవ దేహాది, సంఘ మెల్లఁ దమకు సత్య మనుచుఁ
గాఁపురములు సేసి కడపటఁ జత్తురు, కనియుఁ గాన రంత్యకాలసరణి.



తా॥ "కాలం చెల్లిపోతున్నవారు భగవత్ప్రాప్తిని పొందాలంటే ఉపాయం ఏమిటి? వారి కర్తవ్యాకర్తవ్యాలు ఏమిటి?" అని పరీక్షిత్తు ప్రశ్నించాడు. దానికి శుకమహర్షి సమాధానంతో ఈ ఘట్టం ప్రారంభమవుతుంది.

"ఓ పరీక్షిన్మహారాజా! నువ్వు అడిగిన ప్రశ్న మిగతా ప్రశ్నలన్నింటిలోనూ చాల బాగుంది. ఇది సఫలత్వాన్ని సమకూర్చేది. ముక్తపురుషులు ఆమోదించేది. వినేవారికి శుభప్రదమయినది. దీన్ని గూర్చి వినదగినవి వేలలో ఉన్నాయి. వాటిల్లో ముఖ్యమైనది, సర్వశ్రేష్ఠమైనది, విను!

గృహస్థులు తమ ఇళ్ళల్లో జీవిస్తూ బ్రహ్మవిద్యాతత్త్వాన్ని గూర్చి అణుమాత్రం అయినా తెలియకుండా ఉంటారు. వాళ్ళకు స్త్రీసంభోగంతో, నిద్రపోవాలనే కాంక్షతో రాత్రివేళలు జారిపోతుంటాయి. కుటుంబ పోషణం, ధన సంపాదనం మీది ఆలోచనలతోనే పగటివేళలు

దొర్లిపోతుంటాయి.

ఇల్లు, ఇల్లాలు, సంతానం, చుట్టాలు, శరీరం మొదలైనవన్నీ ఎప్పటికీ ఉండేవిగా అన్పింపచేస్తాయి. దానితో సంసారంలో తీరుబాటు లేనివారవుతారు. చివరకు ఏదీ తమది కానిది గానే వారి జీవితం గడచిపోతుంది.

దీన్నంతా కళ్ళారా గమనిస్తూ ఉన్నవారు కూడా చిట్టచివరి ఊపిరి దాకా దేహం, మనస్సు అంతం అయ్యే ఈ కాల స్వభావాన్ని కనిపెట్టలేకపోతున్నారు.

అసలు సిసలైన తత్త్వం ఆత్మతత్త్వం. సంసార బంధనాలన్నీ సహజమైనవి కావు. నా భార్య, నా బిడ్డలు, నా వాళ్ళు అనేవి శరీరానికే గాని, ఆత్మకు చెందినవి కావు. మనస్సుకు మాత్రమే చెందినవి. కాబట్టి వాళ్ళందరి ఎడబాటూ; వాళ్ళకి ఎప్పుడు ఏమవుతుందోననే భయమూ వాళ్ళను పీడిస్తూనే ఉంటుంది. ఈ సంసార జీవన సంబంధాలన్నీ తాను ఉన్నంతవరకే గాని తాను పోయిన తర్వాత మిగిలేవి కావు. ఇవన్నీ అశాశ్వతాలు.

క. కావున సర్వాత్మకుఁడు మ, హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను, భావింపను భావ్యుఁ డభవభాజికి నధిపా!

4

తా॥ ఓ రాజా! అందువల్ల ముక్తిని కోరుకునేవాడు విష్ణువుని గూర్చి ఆలకించాలి, ఆరాధించాలి, స్తుతించాలి, తలంచాలి. ఇందుకు అతడే సరిగ్గా సరిపోయేవాడు. అంతటా తానుగా ప్రకాశించేవాడూ అతడే. సృష్టిలోని సకల ఐశ్వర్యాలూ అతడివే. సర్వానికి అధిపతీ అతడే. సమస్తమూ వ్యాపించి ఉండేవాడూ అతడే.

సర్వకాల సర్వావస్థల్లోనూ ఏది విన్నా, ఏది పలికినా, దేనిని సేవించినా, దేనిని పొగిడినా, దేనిని ధ్యానించినా సర్వమూ ఈశ్వరమయంగా భావించినప్పుడే మోక్షం కలుగుతుందని

తెలుసుకోవాలి.

ఆ. జనుల కెల్ల శుభము సాంఖ్యయోగము దాని, వలన ధర్మనిష్ఠవలన నైన
నంత్యకాలమందు హరిచింత సేయుట, పుట్టువునకు ఫలము భూవరేంద్ర!

5

తా॥ సాంఖ్యయోగం జనులందరికీ శుభప్రదమైనది. ఈ యోగంవల్లా, ఎడతెరిపిలేని స్వధర్మాచరణం వలన జీవులందరూ తమ ఆయువు తీరేదాకా విష్ణువును ధ్యానించ గల్గుతారు. ఓ రాజా! ఈ పుట్టుకకు ఫలం ఇదే.

ఆత్మానాత్మవివేకం కలిగించేది సాంఖ్యం, ఇది వ్యక్తికి ఆచరణీయమైన జ్ఞానం. దీన్ని కర్మలతో అనుసంధానించ కలిగేది యోగం, అంటే భక్తి. పరస్పరాశ్రితాలైన ఈ రెండింటి కూడిక సమస్త జీవులకూ శుభదాయకం.

వర్ణాశ్రమాది కర్మల్లో నిర్ణీతమయి ఉండటం స్వధర్మనిష్ఠ. సాంఖ్యం, యోగం, స్వధర్మం – ఈ మూడింటిని నిత్యం నిష్ఠగా సాధన చేయడం వల్ల హరిచింతన జీవుడిలో కట్టకడపటి దాకా నిలకడగా ఉంటుంది.

తే. అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి, విధినిషేధ నివృత్తి సద్విమలమతులు
సేయుచుందురు హరి గుణచింతనములు, మానసంబుల నేప్రొద్దు మానవేంద్ర!

6

తా॥ పరిశుద్ధమైన, మంచి భావన గల మహాత్ములు ఇదంతా చాలా నిదానంగా యోచించి చూసి, నిర్గుణబ్రహ్మాన్ని ఆశ్రయిస్తారు. చేయదగినవాటికీ, చేయదగనివాటికీ అతీతంగా ఉంటారు. వీటిని గూర్చి ఎల్లప్పుడూ మనస్సులో ధ్యానిస్తూ విష్ణువు దివ్యగుణాల్ని సంస్మరించుకుంటూ కాలం గడుపుతుంటారు.

సత్త్వరజస్తమోగుణాలు త్రిగుణాలు. మన మానసిక ప్రవర్తన ఈ మూడు గుణాలను ఆశ్రయించి ఉంటుంది. వీటికి అతీతంగా ఉండేది నిర్గుణబ్రహ్మం. ఇది కన్పించిన ప్రతివాడిలోనూ విష్ణుగుణాల్ని భావించుకుంటూ ఉండటం వల్ల సిద్ధించే గుణం.

సీ. ద్వైపాయనుఁడు మా తండ్రి, ద్వాపరవేళ బ్రహ్మసమ్మితమైన భాగవతముఁ
పఠనంబు సేయించె: బ్రహ్మతత్పరుఁడనై, యుత్తమశ్లోకలీలోత్సవమున
నాకృష్ట చిత్తుండనై పఠించితి! నీవు, హరి పాద భక్తుఁడ వగుటఁజేసి
యెఱిఁగింతు వినవయ్య! యీ భాగవతమున, విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లు:

ఆ. మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు, భవభయంబు లెల్లఁ బాసిపోవు
యోగి సంఘమునకు నుత్తమ వ్రతములు, వాసుదేవ నామవర్ణనములు.

7

తా॥ నా తండ్రి వ్యాసభగవానుడు ద్వాపరయుగంలో భాగవతాన్ని అధ్యయనం చేయించాడు. భాగవతం మోక్షమార్గాన్ని ప్రతిపాదించే శాస్త్రం. నేను పరబ్రహ్మతత్త్వం మీద ఆసక్తి కలవాడను. అయినా భాగవతంలోని భగవంతుడి అవతార లీలలు అనే వేడుకలు నా మనస్సును ఆకట్టుకున్నాయి. ఆ ఆనందమే నన్ను చదివింప చేసింది. నువ్వు హరిపదభక్తుడవు కనుక ఆ భాగవతతత్త్వాన్ని తెలియపరుస్తాను. శ్రద్ధపెట్టి విను. ఈ భాగవతాన్ని వినడం వల్ల నీకూ ఆ భగవంతుని యెడ ప్రేమ ఏర్పడుతుంది. విష్ణువును సేవించాలనే బుద్ధి పెంపొందుతుంది.

మోక్షం కోరుకునేవారికి భాగవతం ముక్తిని ప్రసాదిస్తుంది. చావు పుట్టుకలనే భయాల్ని పోగొడుతుంది. యోగిమాన్యులకు వాసుదేవుడి నామసంకీర్తనాన్ని మించిన మహావ్రతం మరొకటి ఉండదు.

తరలము.

హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁ డై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవ నేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మా హరినామ సం
స్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా!

8

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! వెర్రివాడు విష్ణువుని తెలుసుకోలేడు. అలాంటివాడు ఏళ్ళ తరబడి ఇంటి మత్తులో పడి పరితపిస్తుంటాడు. ఎన్ని ఏళ్ళు గడచినా మోక్షాన్ని చేరుకోలేడు. సంసారలంపటం నుంచి ఎంత కాలానికైనా బయటపడలేడు.

రెప్పపాటు కాలం హరినామాన్ని స్మరించుకున్నా చాలు. అలాంటివాడికి ముక్తిసాధనం అవుతుంది. ఇది సత్యం.

ఇల్లు అనే శరీరపు మత్తులో పడి ఎక్కువకాలం బ్రతికి ఉండే కంటే ఇంద్రియాలన్నిట్లో ఉండే సర్వాంతర్యామిని క్షణకాలం పాటు ధ్యానించుకుంటే చాలు, ముక్తి కలుగుతుంది.

సీ. కౌరవేశ్వర! తొల్లి ఖట్వాంగుఁడను విభుం, డిల నేడుదీవుల నేలుచుండి
శక్రాది దివిజులు సంగ్రామభూముల, నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దో డడిగిన ధరనుండి దివికేగి, దానవవిభుల నందఱ వధింప
వరమిత్తు మనుచు దేవతలు సంభాషింప, "జీవితకాలంబు చెప్పుఁ డిదియ

ఆ. వరము నాకు నొండు వర మొల్ల" ననవుడు, "నాయు వొక ముహూర్త మంతతడవు,
గల" దటంచుఁ బలుక గగనయానమున న, మ్మానవేశ్వరుండు మహికి వచ్చి,

9

తా॥ పరీక్షిత్తు తన ఆయుఃకాలం ఇంకా ఏడు రోజులే ఉందని సంశయిస్తున్నాడు. ఆ

సమయంలో 'సరిగ్గా సాధన చేస్తే రెండు క్షణాలు చాలు ముక్తిని పొందడానికి' అని తెలిపే కథే ఖట్వాంగ మహారాజు వృత్తాంతం.

కౌరవ రాజా! మునుపు ఖట్వాంగుడనే పేరుగల రాజుండేవాడు. అతడు ఏడు దీవులకు ఏలిక. ఒకనాడు ఇంద్రుడు మొదలైన దేవతలు రాక్షసుల చేతిలో చిత్తుగా ఓడిపోయి, ఆ రాజు దగ్గరకు వచ్చారు. తమకు సాయం చేయవలసిందని అడిగారు.

వెంటనే ఆ రాజు భూలోకం నుంచి స్వర్గలోకానికి వాళ్ళతోపాటు వెళ్ళాడు. ఆ రాక్షసులనందరినీ అంతం చేశాడు. దేవతలు చాలా ఆనందించారు. అడిగిన వరం ఇస్తాం అన్నారు. ఆ రాజు, 'నేను వేరేమీ వరాన్ని ఇష్టపడను. నేను ఇంకెంత కాలం బతికి ఉంటానో చెప్పండి చాలు. ఇదే మీరు నాకిచ్చే వరం' అంటాడు. ఆ దేవతలు 'నీ ఆయువు ఇంకా ఒక ముహూర్తకాలమే (= 2 గడియలు) ఉంది' అన్నారు. అంతే, ఆ రాజు క్షణాలమీద ఆకాశయానంలో భూలోకానికి తిరిగివచ్చాడు.

క. గిరులం బోలెడి కరులను, హరులం దన ప్రాణదయితలై మనియెడి సుం
దరులను, హిత నరులను బుధ, వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్.

10

తా॥ ఆ ఖట్వాంగుడికి పర్వతాల్లాంటి ఏనుగులు ఉన్నాయి. గుర్రాలు ఉన్నాయి. తనకెంతో ప్రాణప్రియలైన అందగత్తెలున్నారు. తన క్షేమం కోరే ఆత్మీయులున్నారు, పండితోత్తములున్నారు. అయినా ఆ అన్నిటిని వదలుకున్నాడు. విరాగి అయ్యాడు.

క. గోవిందనామ కీర్తనఁ, గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు సూరగొనియెను, గైవల్యముఁ దొల్లి రెండు గడియలలోనన్.

11

తా॥ ఆ ఖట్వాంగ మహారాజు ముందుగా గోవింద నామాన్ని ధ్యానించాడు. భగవానుణ్ణి శరణు పొందాడు. భయం పోయినవాడయ్యాడు. స్థిరచిత్తంతో రెండు గడియల్లోనే ముక్తిని కొల్లగొన్నాడు.

ఇంద్రియాలు, బుద్ధి, శరీరం, అనేవాటిని పాలించేవారు దేవతలు. కామక్రోధాహంకారాదులు రాక్షసులు. 'జీవుడు తోడు' గా, వాటిని అణచి వేస్తారు. జీవుడు 'శరీరం నశించేది' అని గ్రహించుకుంటాడు. సర్వం వదిలివేసి, సర్వాంతర్యామిని భావించి, కీర్తిస్తాడు. ఇలాంటి మహాభావన కలగడానికి క్షణకాలం చాలు అని తెలిపే కథ ఇది.

వ. వినుము. నీకు నేడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు; తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమకల్యాణంబు సంపాదింపవచ్చు. అంత్యకాలంబు డగ్గఱినన్ బెగ్గడిలక దేహి దేహపుత్ర కళత్రాది సందోహజాలంబువలని మోహసాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలనంబు సేసి, గేహంబువెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంతశుచి ప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజినచేలంబుల తోడం గల్పితాసనుండై మానసంబున (నిఖీలజగత్పవిత్రీకరణ సమర్థంబై) అకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మబీజంబయిన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి విషయంబుల వెంట నంటిపాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై మనోనామకంబులైన పగ్గంబుల బిగ్గం బట్టి మ్రొగ్గఁదిగిచి, దట్టంబులైన కర్మఘట్టంబులు నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీబలంబున నిరోధించి భగవదాకారంబు తోడ బంధించి, నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబు సేయుచు, రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబును విమూఢంబునగు చిత్తంబునం దద్గుణంబులవలన నయ్యెడి మలంబులం ధారణావశంబునఁ బో నడిచి నిర్మలచిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను. ధారణానియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబె మోక్షంబు సిద్ధించు

ననిన యోగీంద్రునకు నరేంద్రుం డిట్లనియె.

12

తా॥ 'ఓ రాజా! ఆలకించు. ఏడు రోజులు దాటిన తర్వాత గాని నీకు ఆయువు తీరదు. అంత లోపల నీవు పారమార్థిక చింతనాపరుడవై జీవించినట్లయితే మోక్షపథమును పొందే వీలుంది.

చావు పొంచి ఉంది అనగానే దానికి నువ్వు బెదరకూడదు. శరీరధారి ఒళ్ళు, పిల్లలు, ఇల్లాలు అనే వలపుల మద్దిచెట్టును, నిష్కామం (కోరిక లేమి) అనే కత్తితో వేళ్ళతో సహా మొదలవెంట ఊడబెరకాలి. అందుకోసం తన ఒంటికి ఇన్నాళ్ళు నిలువ నీడనిచ్చిన ఇంటిని వీడిపోవాలి. పవిత్రమైన నదీజలాల్లో స్నానాలు చేయాలి. ఎవరికీ తెలియని మారుమూల ప్రదేశానికి చేరుకోవాలి. ఆ ప్రదేశాన్ని శుభ్రపరచుకొని, శాస్త్రోక్తంగా దర్భలతో గాని, జింకచర్మంతో గాని, వస్త్రంతో గాని సిద్ధపరచుకున్న ఆసనం మీద ఆసీనుడవ్వాలి. మనస్సులో ప్రణవమంత్రాన్ని ధ్యానించాలి. ఈ ఓంకార ఉచ్చారణం లోకాన్నంతా పావనం చేసే శక్తిగలది. ఈ ప్రణవం అకారాది (అ, ఉ, మ) మూడు అక్షరాలతో కూడి ఉంటుంది. ఇది వేదోత్పత్తికి విత్తు వంటిది. అలా అకార, ఉకార, మకారాత్మకమైన ఓంకారాన్ని స్మరిస్తూనే యోగనిష్ఠతో ప్రాణవాయువును స్వాధీనంలోకి తెచ్చుకోవాలి.

శబ్ద స్పర్శ రూప రస గంధాలనే విషయాల వెంట ఉరకలు వేసే ఇంద్రియాల్ని పట్టి నడిపించే రథసారథిగా బుద్ధిని మార్చుకోవాలి. మనస్సు అనే పగ్గాన్ని చేజారిపోనీయకుండా గట్టిగా పట్టి ఉంచాలి.

కర్మవిషయాల్లో బాగా చిక్కుకొని అటూ ఇటూ చెదరిపోయే మనస్సును సదసద్వివేకంతో, బుద్ధిబలంతో నియంత్రించుకోవాలి. ఇట్లా ఆపి ఉంచిన మనస్సుకు భగవద్రూపాన్ని తోడుచేయాలి. అప్పుడిక విషయాసక్తి ఉండదు. అందువల్ల మనస్సుకు ఏ విషయాలూ అంటవు.

నిర్విషయమైన మనస్సు భగవంతుని పాదాది అవయవాలను క్రమంగా ధ్యానించ పూనుకుంటుంది. రజోగుణ, తమోగుణాల చేత ఆకర్షితమై కామవాంఛలకు లోనైన మనస్సును నిరోధించి, ఆ రజస్తమోగుణాల వల్ల కలిగిన మలిన పదార్థాలను (పాపచింతనలను) ధారణాధీనత మూలాన పోగొట్టాలి. అలా మనస్సు పరిశుద్ధమవుతుంది. ఆ దేహి ఉన్నతమైన విష్ణుపదాన్ని చేరుకుంటాడు.

ధారణా నియమం సిద్ధించినవాడు సుఖమయమైన విషయాన్ని అనుభవించ గలుగుతాడు. అలాంటయోగిపుంగవుడు భక్తే లక్షణంగా గల యోగాన్ని ఆశ్రయించడం వల్ల అతడికి మోక్షం ఆ క్షణమే ప్రాప్తిస్తుంది."

అని చెప్పిన శుకమహర్షితో పరీక్షిత్తు మళ్ళీ ఇలా అడిగాడు:

క. ధారణ యే క్రియ నిలుచును? ధారణ కే రూప? మెద్ది ధారణ యనఁగా?
ధారణ పురుషు మనోమల, మే రీతి హరించు? నాకు నెఱిఁగింపఁ గదే.

13

తా॥ 'మునివర్యా! అసలు ధారణ అంటే ఏమిటి? ఎలాంటి సాధనతో అది నిలబడుతుంది? దాని స్వరూపం ఎలా ఉంటుంది? అది పురుషుల (జీవుల) మానసిక మాలిన్యాన్ని ఎలా రూపుమాపగల్గుతుంది? దయచేసి ఈ విషయాలన్నింటినీ నా కోసం విపులంగా చెప్పండి' అన్నాడు.

వ. అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె.

14

తా॥ సన్న్యాసుల్లో మేటి అయిన ఆ శుకముని ఈ ప్రశ్నలన్నింటినీ సావధానంగా విన్నాడు. రాజుతో ఇలా చెప్పసాగాడు.

ఆ. పవనములు జయించి పరిహృత సంగుఁడై, యింద్రియముల గర్వమెల్ల మాపి హరి విశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి, నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు.

15

తా॥ 'పండితుడైనవాడు ప్రాణవాయువుల్ని బిగబట్టి, శ్వాసజయాన్ని సాధించాలి. దానివల్ల సంసార సాంగత్యాన్ని విదిలించుకోగల్గుతాడు. కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాదుల వల్ల కలిగే అహాన్ని నివర్తింప చేసుకోవాలి. బుద్ధివిశేషం కనబరచి, సర్వకాలాల్లోనూ విష్ణువు విశాలస్వరూపం మీదనే మనస్సును లగ్నంచేసి ఉంచాలి.

ప్రాణవాయువులు అయిదు. అవి ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం. వీటినే పంచప్రాణాలనీ అంటారు. వీటిల్లో ప్రాణం, అపానం మానవ మనస్సును బట్టి కాక వాటంతటవే ప్రవర్తించే గుణం కలవి. వీటి మీద మనస్సుపెట్టి వాటి గమనాన్ని గమనించుకుంటూ కొంతవరకు అదుపులోకి తెచ్చుకోవచ్చు. దీనికిగాను ఒక పద్ధతిలో మెల్లగా మృదువుగా నియమవంతంగా ఊపిరిని పీలుస్తూ వదులుతూ అభ్యాసం చేయాలి. ఇదే ప్రాణాయామం.

'సంగము' అంటే చుట్టూ ఉన్న వ్యక్తుల మీద, ఇంటిమీద, కొన్ని వస్తువుల మీద, ఆదర్శాల మీద, జ్ఞానతృష్ణ మీద, ఆర్జన మీద సంబంధాలు విడదీయరానివిగా ఉండి, అవి సిద్ధించనప్పుడు కోపం, దుఃఖం ఏర్పడడం అని భావం.

మనస్సు, వాయువుల స్వాధీనం వల్ల సమన్వయమయ్యే కోరికను 'సంకల్పం' అంటారు. దీనిని కామ, క్రోధ వాసనలు తాకవు. విశాలభావం కలుగుతుంది. అదే భగవత్స్వరూపం. ఆ తత్త్వం మీదనే మనస్సును కేంద్రీకరించాలి.

వ. వినుము. భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబునందు భూతభవిష్యద్వర్తమానం బైన విశ్వంబు విలోక్యమానం బగు. ధరణీసలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు

ధారణాశ్రయం బయిన వైరాజపురుషుండు దేజరిల్లు. అమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్ర భాగంబులు రసాతలంబు, గుల్ఫంబు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలం, ఊరువులు వితలాతలంబులు, జఘనంబు మహీతలంబు, నాభీవివరంబు నభస్స్థలంబు, వక్షంబు గ్రహతారకాముఖ జ్యోతిస్సమూహ సమేతంబగు నక్షత్ర లోకంబు, గ్రీవంబు మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, కర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియంబు సూర్యుండు, రేయింబగళ్ళు ఱెప్పలు, భ్రూయుగ్మ విజృంభణంబు బ్రహ్మపదంబు, తాలువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, భాషణంబులు సకల వేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాది స్నేహ కళలు, నగవులు జనోన్మాద కరంబు లయిన మాయా విశేషంబులు, కటాక్షంబు లనంతసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబులు, వె న్నధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్యసంఘంబులు గిరులు, నాడీనివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు, ప్రాయంబు నిరవధికం బయిన కాలంబు, కర్మంబులు నానావిధజంతుసన్ని వహ సంవృత సంసరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టుపుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయంబైన మనంబు చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వం, బహంకారంబు రుద్రుండు, నఖంబు లశ్వాశ్వత ర్యుష్ట్రగజంబులు, కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన యాలాప నైపుణ్యంబులు పక్షులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదు లైన స్వరవిశేషంబులు గంధర్వ విద్యాధర చారణాప్సర స్సమూహంబులు, స్మృతి ప్రహ్లాదుండు, వీర్యంబు దైత్యదానవానీకంబై యుండు, మరియు న మ్మహావిభునకు ముఖంబు బ్రాహ్మణులును, భుజంబులు క్షత్త్రియులు, ఊరులు వైశ్యులును, చరణంబులు శూద్రులును, నామంబులు నానా విధంబులైన వసురుద్రాది

దేవతాభిధానంబులును, ద్రవ్యంబులు హవిర్భాగంబులు, కర్మంబులు యజ్ఞ ప్రయోగంబులు. ఇట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబు ముముక్షు వైనవాఁడు మనంబున ననుసంధానంబు సేయవలయునని వక్కాణించి వెండియు నిట్లనియె.

16

తా॥ రాజా! విను. పరమదైవమైన విరాట్పురుషుడిలో పద్నాలుగు లోకాల్లో జరిగిన, జరుగుతున్న, జరుగబోయేదంతా కన్పిస్తుంది. నేల, నీరు, అగ్ని, గాలి, ఆకాశం, అహంకారం, మహత్తు అనే తత్త్వాలు ఈ విగ్రహం యొక్క ఆవరణాలు. ఇవి బ్రహ్మాండకోశమైన విరాడ్రూపుడి చుట్టూ పొరలు పొరలుగా చుట్టి ఉంటాయి.

ఈ దేహంలో తేజరిల్లే ఆ విరాట్స్వరూపుడే చిత్తం ఏకాగ్రతకు చోటైనవాడు. ఆ మహాపురుషుడి రూపం ఇలా ప్రకాశిస్తుంది.

ఆ పరమోత్తముని పాదం మోపడానికి ఆధారమైన అరికాలు పాతాళం. ముంగాళ్ళు రసాతలం. చీలప్రదేశం మహాతలం. పిక్కలు తలాతలం. మోకాళ్ళు రెండూ సుతలం. తొడలు రెండూ వితలం, అతలం.

పిరుదు మహాతలం. బొడ్డు రంధ్రం ఆకాశస్థలం. రొమ్ము ప్రదేశం సువర్లోకం. ఈ లోకం గ్రహాల, నక్షత్రాల తేజస్సముదాయంతో కూడి ఉంటుంది. మెడ మహర్లోకం. ముఖం జనలోకం, నొసలు తపోలోకం. శిరస్సు సత్యలోకం (ఈ ఏడింటినే ఊర్ధ్వలోకాలంటారు).

బాహువులు ఇంద్రుడు మొదలైనవాళ్ళు. చెవులు దిక్కులు. శ్రోత్రేంద్రియం శబ్దం. ముక్కుపుటాలు అశ్వినీ దేవతలు. వాసనపట్టే ఇంద్రియం (ముక్కు) గంధం. నోరు అగ్నిహోత్రుడు. కళ్ళు అంతరిక్షం. చూసే ఇంద్రియం (కన్ను) సూర్యుడు. కనురెప్పలు రేయి పగళ్ళు. కనుబొమలు బ్రహ్మపదం. తాలువులు (అంగిట్లోని రెండు భాగాలు) జలాలకు అధిష్ఠాన దేవత అయిన వరుణుడు. నాలుక అనే ఇంద్రియం రసం (రుచి). మాటలు నాల్గు వేదాలు.

కోరలు యముడు. దంతాలు పుత్రాదుల మీద ఉండే ప్రేమ అంశాలు. నవ్వులు మాయలు. అంతూ పొంతూ లేని పుట్టుకల పరంపర కడగంటి చూపు. పైపెదవి సిగ్గు, క్రింది పెదవి ఆశ. రొమ్ములు ధర్మమార్గాలు. వీపు అధర్మం.

పురుషాంగం సృష్టికర్త. అండకోశాలు మిత్రావరుణులు. కడుపు సముద్రాలు, ఎముకలు కొండలు. నాడీమండలం నదులు. రోమాలు (ఒంటిమీది వెంట్రుకలు) చెట్లు. నిట్టూర్పులు వాయువులు. వయస్సు అంతూ ఆపూలేని కాలం. లీలా వినోదాలు (క్రీడలు) అనేక రకాలయిన ప్రాణికోటి యొక్క సంసారగతులు. తలవెండ్రుకలు మబ్బులు. కట్టుబట్టలు సంధ్యలు.

విజ్ఞానశక్తి గల హృదయం ప్రధానతత్త్వం. సర్వవికారాలకు ఆశ్రయమైన మనస్సు చంద్రుడు. అహంకారం రుద్రుడు. గోళ్ళు గుర్రాలు, గాడిదలు, ఒంటెలు, ఏనుగులు. నడుము ప్రదేశం పశువులు, మృగాదులు. మాటల నేర్పులు పక్షులు. బుద్ధి స్వాయంభువ మనువు. నివాసం పురుషుడు. షడ్జాదిస్వరాలు గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు. ప్రహ్లాదుడు స్మృతి. వీర్యం దైత్యులు, దానవుల సమూహం.

ఆ విరాట్పురుషుడి ముఖం బ్రాహ్మణులు. బాహువులు క్షత్రియులు, తొడలు వైశ్యులు, పాదాలు శూద్రులు. నామాలు వసువులు, రుద్రులు మొదలైన నానావిధాల దేవతల పేర్లు. ద్రవ్యాలు హవిర్భాగాలు. కర్మలు యజ్ఞప్రయోగాలు.

ఇలాంటి సర్వమయుడయిన విరాట్పురుషుడి విగ్రహంతో మోక్షగామి (ముముక్షువు) తన మనస్సును సంధానించాలి.

క. హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు, సంశయము పనిలేదా
హరిమయము గాని ద్రవ్యము, పరమాణువు లేదు వంశపావన! వింటే.

తా॥ పవిత్రమైన వంశక్రమం గల ఓ రాజా! సమస్తమూ విష్ణుమయమే! హరి సర్వం ఆవరించి ఉన్నాడనడంలో ఎలాంటి సంశయమూ లేదు. విష్ణుమయం కాని వస్తువు ఈ ప్రపంచం అంతటిలో ఒక్క సూక్ష్మకణం అంత కూడా ఉండదు.

'సర్వం విష్ణుమయం' అనే మహాభావనే ముక్తికి సోపానం.

సీ. కలలోన జీవుండు కౌతూహలంబునఁ, బెక్కు దేహంబులఁ బేరు వడసి
యింద్రియంబుల వెంట నెల్లవృత్తంబులు, నీక్షించి మఱి తన్ను నెఱుఁగు కరణి
నఖిలాంతరాత్మకుఁడగు పరమేశ్వరుఁ, డఖిల జంతుల హృదయముల నుండి
బుద్ధి వృత్తుల నెల్ల బోద్ధయై వీక్షించు, బద్ధుండు గాఁడు ప్రాభవమున

తే. సత్యుఁ డానందబహుళ విజ్ఞానమూర్తి, యతని సేవింప నగుఁ గాక, యన్యసేవఁ గలుగ
నేరవు కైవల్య గౌరవములు, పాయ దెన్నఁడు సంసారబంధ మధిప!

18

తా॥ ఓ రాజా! జీవుడు కలలో చాలా కుతూహలంగా ఎన్నో శరీరాలు దాలుస్తుంటాడు. పెట్టుడు పేర్లతో రకరకాలుగా పిలువబడుతుంటాడు. ఇంద్రియాల వెంబడి పోయి ఎన్నో విశేషాలను గూర్చి అనుభూతి చెందుతాడు. మెలకువ రాగానే తనను తాను తెలుసుకుంటాడు. అదే రకంగా అందరిలో అంతరాత్మ రూపంలో ఉండే ఆ విరాట్పురుషుడు సమస్త జీవుల హృదయాల్లో ఉంటాడు.

అతడి బుద్ధివ్యాపారాలన్నింటినీ బోధకుడిలా కనిపెడ్తూ ఉంటాడు. అయితే తానే అన్నిటికీ ప్రభువు కాబట్టి దేనికీ బంధితుడు కాడు. తాను సత్యస్వరూపుడు, ఆనందమయుడు, విజ్ఞానమూర్తి. భగవంతుణ్ణి సేవించడం భావ్యం. దేవుణ్ణి కాదని ఇతరుల్ని సేవిస్తే ముక్తి కలుగదు సరిగదా, గౌరవమూ దక్కదు. ఈ సంసారబంధం ఎన్నటికీ వదలదు.

మ. బహువర్షంబులు బ్రహ్మ తొల్లి జగ ముత్పాదింప విన్నాణి గా
క హరి ప్రార్థన ధారణా వశమునం గాదే! యమూఢోల్లస
న్మహనీ యోజ్జ్వల బుద్ధియై భువననిర్మాణ ప్రభావంబునన్
విహరించెన్ నరనాథ! జంతునివహావిర్భావ నిర్ణేతయై.

19

తా॥ ఓ రాజా! వెనుకటికి బ్రహ్మ ఎన్నో ఏళ్ళుగా ప్రయత్నించినా ఈ లోకాన్ని సృష్టించే విజ్ఞానవంతుడు కాలేదు. స్థిరమైన, ఏకాగ్రమైన మనస్సుతో అప్పుడు హరిని వేడుకున్నాడు. శ్రీహరి అనుగ్రహం వల్ల గొప్పది, మూఢత్వం కానిది, ఉల్లాసకరమయినది అయిన బుద్ధిని పొందగలిగాడు. పధ్నాలుగు లోకాల నిర్మాణశక్తిని పొందాడు. ముందుగా జంతుజీవ సముదాయాన్ని పుట్టించాలని నిర్ణయించుకున్నాడు.

తాను తలచే పదార్థస్వరూపాన్ని సాక్షాత్కరింపచేసుకుని తనను తాను విస్మరింపచేసేదే ధారణ. ఇది భగవంతుని యెడ సాగితే 'యోగసాధన' అవుతుంది. అన్యవిషయాల్లో జరిగితే 'సంసారబంధం' అవుతుంది.

వ. విను. మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫల బోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాది నానాలోక సుఖంబుల నిచ్ఛగించుచు మాయామయ మార్గంబున వాసనా మూలంబున నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు నిరవద్య సుఖలాభంబుం జెందఁడు; తన్నిమిత్తంబున విద్వాంసుండు నామమాత్ర సారంబులగు భోగ్యంబులలోన నెంతట దేహనిర్వహణంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖంబని నిశ్చయింపక యొందు మార్గంబున సిద్ధి గలదని చూచి పరిశ్రమంబు సేయుచుండు.

20

తా॥ మందబుద్ధులు ఎందుకూ కొరగాని స్వర్గాదిసుఖాలనే కోరుకుంటారు. శబ్దరూపమైన వేదం చూపిన బాట వీరికి ఆదర్శం. వీరికి ఆ వేదం ప్రవచించిన కర్మలూ, వాటి ఫలాలే ప్రమాణాలు.

పూర్వపు వాసనలతో నిద్రిస్తూనే కలలు కన్నట్లుగా మాయతో నిండిన మార్గంలో తిరుగుతూ ఉంటాడే కాని, అవ్యయమైన మోక్షాన్ని గూర్చి తెలుసుకోలేడు. ఆ కారణంగా తెలివైనవాడు శరీరం నిలుపుకోవడానికి సరిపడే మేరకే అనుభవించగలవాటిని స్వీకరిస్తుంటాడు. అంతేకాక ఆ భోగ్యవస్తువు పేరు చెప్పుకునేంత అతి తక్కువ సారం కలిగిన భోగాల కోసం వెంపరలాడడు.

జీవితం గడవటానికి అవసరమైన వస్తువులు ఏదో రకంగా సిద్ధిస్తూనే ఉంటాయి. వాటిని గూర్చి తపన చెందడం అనవసరం.

సీ. కమనీయ భూమిభాగములు లేకున్నవే!, పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే!, భోజనభాజనపుంజ మేల?
వల్కలాజిన కుశావళులు లేకున్నవే!, కట్ట దుకూల సంఘంబు లేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే!, ప్రాసాదసౌధాది పటల మేల?

తే. ఫలరసాదులు గురియవే? పాదపములు! స్వాదుజలముల నుండవే? సకలనదులు!
పొసఁగ భిక్షము వెట్టరే? పుణ్యసతులు! ధనమదాంధుల కొలువేల? తాపసులకు?



తా॥ పడుకోవడానికి కోరుకున్నంత చక్కని నేల ఉండగా దూది పరుపులు ఎందుకు? అన్నం తినడానికి ప్రకృతి సహజమైన దోసిలి ఉండగా అనేక రకాల పాత్రలెందుకు? కట్టుకోవడానికి నారచీరలు, మృగచర్మాలూ ఉండగా పట్టుబట్టల తెంపరం ఎందుకు? నివసించడానికి సహజమైన కొండగుహలుండగా మేడలూ మిద్దెలూ ఎందుకు?

ఇంకా, చెట్లు తియ్యటి పండ్లను ఇబ్బడిముబ్బడిగా కాస్తుంటాయి కదా! నదుల్లో నీళ్ళు తాగడానికి యోగ్యంగా రుచికరంగానే ఉంటాయి కదా! 'భిక్షాం దేహి' అంటే ముత్తైదువులు భిక్షను పెట్టకపోరు కదా! మరి తపోధనులు ధనాహంకారుల అడుగులకు మడుగులొత్తడం ఎందుకు?

క. రక్షకులు లేనివారల, రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్ రక్షింపు మనుచు నొక నరు, నక్షముఁ బ్రార్థింపనేల? యాత్మజ్ఞులకున్

22

తా॥ ఏ దిక్కూ మొక్కూ లేనివారిని కాపాడతానని మాట యిచ్చి, విష్ణువే సమస్తలోకాలకూ విభుడైనాడు. ఆయనుండగా అలాంటి ప్రభువును కాదని, ఎవరో అనామకుణ్ణి రక్షించమంటూ వేడుకోవడం ఆత్మతత్త్వవేత్తకు తగని పని.

వ. అని యిట్లు స్వతస్సిద్ధుండు, ఆత్మయుఁ, ఆత్మప్రియుండు, సత్యుండును, నిత్యుండును భగవంతుండును నైన వాసుదేవుని భజించి తదీయ సేవానుభవానందంబున, సంసార హేతువగు నవిద్యచే బుద్ధిమంతుండు విడువంబడుం గావున.

23

తా॥ ఈ తీరున భావించే బుద్ధిమంతుడు వాసుదేవుణ్ణి సేవిస్తాడు. ఆ పరమాత్మ స్వయంసిద్ధుడు. అతడు ఆత్మస్వరూపుడు. ఆతడు సత్యమైనవాడు. అతడు నిత్యమైనవాడు. దైవరూపుడు. ఆలాంటి భగవంతుణ్ణి సేవించాలి. అనుభూతి చెందాలి. ఆనందించాలి. ఈ సేవనం వల్ల సంసారతాపానికి మూలకారణం అయిన అవిద్య నశించిపోతుంది.

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయ చింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదా సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ ! దండభృన్నివసన ద్వారోపకంఠోగ్రవై

తరణీ వహ్ని శిఖాపరంపరలచే దగ్ధుండు గాకుండునే?

24

తా॥ ఓ రాజోత్తమా! విష్ణువుని గూర్చి స్మరించనివాడు మత్తులో ఉన్నవాడు. అతడు ఇంద్రియసుఖాపేక్షతోనే కాలం గడుపుతుంటాడు. అలాంటివాడు యమకింకరులు గుండెలవిసేలా బాదిన గదల దెబ్బలతో బాధపడిన వాడవుతాడు. అతడు యమలోకం సింహద్వారం దగ్గర ప్రవహించే వైతరణీనది నుంచి ఎగసిపడే భయంకరమైన మంటల్లో పడి మలమల మాడిపోకుండా ఉంటాడా?

క. మొత్తుదురు గదల, మంటల, కెత్తుదు రడ్డంబు దేహ మింతింతలు గా
నొత్తుదు, రసిపత్రికలను, హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్.

25

తా॥ ఆ పరమాత్మను సేవించని పాషండులను (వేదబాహ్యుల్ని) యమభటులు గదలతో చితకబాదుతారు. వాళ్ళను మంటల్లోకి ఎత్తి పడవేస్తారు. చురకత్తులతో శరీరాన్ని చిన్న చిన్న ముక్కలుగా కోస్తారు. సన్నని రేకుల వంటి కత్తులతో అదుముతారు.

వ. మఱియు హరి చరణ కమలగంధ రసాస్వాదనం బెఱుంగని వారలు నిజకర్మబంధంబున దండధర మందిర ద్వార దేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీ తరంగిణీ దహన దారుణ జ్వాలాజాల దందహ్యమాన దేహులం గూడి శిఖీ శిఖావగాహంబుల నొందుచుండుదురు; మఱియు విజ్ఞానసంపన్నులై మను ప్రసన్నులెంతయు మాయాపన్నులు గాక విన్నాణంబునం దమ తమ హృదయాంతరాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజ శుండాదండ సంకాశదీర్ఘ చతుర్బాహుండును, కందర్ప కోటి సమాన సుందరుండును, ధృతమందరుండును, రాకావిరాజమాన రాజమండలసన్నిభ వదనుండును,

సౌభాగ్యసదనుండును, ప్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతిమానవిరాజిత పద్మరాగరత్న రాజీవిరాజమాన కిరీటకుండలుండును, శ్రీవత్సలక్షణ లక్షిత వక్షోమండలుండును, రమణీయ కౌస్తుభరత్నఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళమిళిత వనమాలికా బంధురుండును, నానావిధ గంభీర హారకేయూర కటకకంకణ మేఖలాంగుళీయక విభూషణ వ్రాతసముజ్జ్వలుండును, నిటలతట విలంబమాన విమలస్నిగ్ధ నీలకుంచిత కుంతలుండును, తరుణచంద్ర చంద్రికాధవళ మందహాసుండును, బరిపూర్ణ కరుణావలోకన భ్రూభంగ సంసూచిత సుభగ సంతతానుగ్రహ లీలావిలాసుండును, మహాయోగిరాజ వికసిత హృదయకమల కర్ణికామధ్య సంస్థాపిత విలసిత చరణకిసలయుండును, సంతతానందమయుండును, సహస్రకోటి సూర్య సంఘాతసన్నిభుండును, విభుండును నైన పరమేశ్వరుని మనోధారణావశంబున నిలిపికొని, తదీయగుల్ఫచరణజాను జంఘాద్యవయవంబులం గ్రమంబున నొక్కొక్కటిని బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబునకుఁ బరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయచింతా తత్పరులై యుందురని మఱియు నిట్లనియె.

26

తా॥ మరియు, విష్ణుపాదపద్మాల పరిమళాలను ఆస్వాదించడం తెలియనివారు తాము చేసుకున్న కర్మల్లో చిక్కుకుంటారు. దానివల్ల యముడి మందిరం ముందటి పెద్దవాకిలికి దగ్గరగా ప్రవహించే వైతరణీ నదిలో మండే భయంకరమయిన నిప్పుల్లో పడి మాడిపోతున్న వారితో కలిసి రోదిస్తుంటారు. కాని, ఎలా మసలుకోవాలో తెలిసి శరణుకోరే భక్తులు ఆ మాయలో మునిగిపోక నేర్పుగా తమ తమ మనస్సుల్లో ఆ భగవంతుణ్ణి ధ్యానిస్తారు.

ఆ స్వామి అంగుష్ఠ మాత్రపు దివ్యశరీరం కలవాడు. ఐరావతం తొండాలతో సరిసాటి వచ్చే పొడవాటి నాలుగు భుజాలు కలవాడు. సమస్త భోగాలను, సర్వైశ్వర్యాలను ప్రసాదించేవాడు. నాలుగు చేతులలో పద్మ శంఖ చక్ర గదలను ధరించినవాడు. కోటి

మన్మథులతో తులతూగ గల చక్కటి అందగాడు. మందరపర్వతాన్ని నెత్తికెత్తుకున్నవాడు. పూర్ణిమ నాటి నిండు జాబిల్లి వంటి ముఖం కలవాడు. సౌభాగ్య సంపత్తికి నెలవైనవాడు. ఉదయకాలపు లేతసూర్యుడిలా ధగధగ ప్రకాశించే పద్మరాగమణులు పొదిగిన కిరీటం, కుండలాలు ధరించినవాడు.

రొమ్ముభాగంలో శ్రీవత్సచిహ్నం (పుట్టుమచ్చ) కలవాడు. మనోహరమయిన కౌస్తుభమణి తాపిన అలంకరణంతో విరాజిల్లుతున్న మెడ కలవాడు. ఎల్లప్పుడూ కమ్మని సువాసనలు గుబాళించే వనమాలికను ధరించినవాడు. మణులు పొదిగిన (కంఠాభరణ) హార కేయూర కంకణ మేఖలలు, అంగుళీయకం మొదలైన నానావిధాలైన పెద్దపెద్ద నగలతో ఒప్పేవాడు. నుదుటి మీదికి వ్రేలాడుతున్న నల్లటి నున్నటి ఉంగరాలు చుట్టుకున్న ముంగురులు కలవాడు.

లేతచంద్రుని వెన్నెల్లా స్వచ్ఛమైన తెల్లటి చిరునవ్వు కలవాడు. దయతో నిండిన చూపులు కలవాడు. బొమముడితో సూచించే కనుబొమల విలాసాలలో సౌభాగ్యాన్ని, అనుగ్రహాన్ని ప్రసరింప చేయగలవాడు. మేటి మునివరులందరూ తమ హృదయపద్మాలలో స్థిరంగా నిలుపుకుని ధ్యానించే చిగురుటాకుల వంటి పాదాలు కలవాడు, నిత్యం ఆనందంతో విలసిల్లేవాడు, వేయి కోట్ల సూర్యుల కాంతిపుంజాలతో సరిసమానమైనవాడు అయిన పరమేశ్వరుణ్ణి మనస్సులో ధారణతో నిలుపుకోవాలి. ఆయన మడమలు, పాదాలు, పిక్కలు, మోకాళ్ళు మొదలుగా ప్రతీ అవయవాన్ని ఒక్కటొకటిగా అనుక్షణమూ ధ్యానించాలి. పరిపూర్ణమైన నిశ్చలబుద్ధి కుదిరేదాకా ఆ భగవచ్చింతనాసక్తితోనే ఉండాలి' అని పలికి, శుకుడు మళ్ళీ ఇలా చెప్పడం ప్రారంభించాడు:

సీ. ఆసన్న మరణార్థియైన యతీశుండు, కాలదేశములను గాచికొనఁడు
తనువు విసర్జించు తలఁపు జనించిన, భద్రాసనస్థుఁడై ప్రాణపవను
మనసుచేత జయించి మానసవేగంబు, బుద్ధిచే భంగించి బుద్ధిఁ దెచ్చి
క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలో, పలఁ జేర్చి యాత్మను బ్రహ్మ మందుఁ

తే. గలిపి యొక్కటి గావించి గారవమున, శాంతితోడ నిరూఢుఁడై సకలకార్య
నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము; వలయునని చూచు నటమీఁద వసుమతీశ!

27

తా॥ 'ఓ మహారాజా! చావు దగ్గరపడ్తున్న యతీశ్వరుడు దేశకాలముల కొరకు ఎదురుచూడడు. శరీరాన్ని వదులుకోవాలనుకుంటున్నప్పుడు భద్రాసనంతో (పాదాలు తొడలపైకి ముడిచిన ఆసనం) సుఖంగా కూర్చోవాలి. ప్రాణవాయువును మనస్సుతో జయించాలి. బుద్ధితో తన మనోవేగాన్ని నిలువరించాలి. ఆ బుద్ధిని క్షేత్రజ్ఞుడితో జతపరచాలి. ఆ క్షేత్రజ్ఞుణ్ణి ఆత్మలోపలకు చేర్చాలి. ఆ శుద్ధాత్మను పరబ్రహ్మంలో కలిపి లయింపచేయాలి. మనస్సు ఉపశమించిన తర్వాత, శాంతి కలిగి కర్తవ్యకర్మలన్నింటిని వీడాలి. ఆ మీదట నిత్యమైన సుఖం కావాలని అభిలషించాలి.

వ. వినుము! పరమాత్మయైన బ్రహ్మంబునకుఁ దక్కకాల దేశ సత్త్వరజస్తమో గుణాహంకార మహత్త్వ ప్రధానంబులకుఁ బ్రభుత్వంబు లేదు. కావునం బరమాత్మ వ్యతిరిక్తంబు లేదు. దేహాదులయం దాత్మత్వంబు విసర్జించి, యన్య సౌహృదంబు మాని, పూజ్యంబయిన హరిపదంబును బ్రతిక్షణంబున హృదయంబున నాలింగనంబుసేసి, వైష్ణవంబయిన పరమపదంబు సర్వోత్తమంబని సత్పురుషులు దెలియుదురు. ఇవ్విధంబున విజ్ఞాన దృగ్వీర్య జ్వలనంబున నిర్దగ్ధ విషయవాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున.

28

తా॥ పరమాత్మ అయిన బ్రహ్మమునకు తప్పించి కాలానికి గాని, దేవతలకు గాని, త్రిగుణాలకు గాని, అహంకారానికి గాని, మహత్తత్వానికి గాని, ఆఖరికి ప్రధానమైన ప్రకృతికి గాని ఎలాంటి ఆధిపత్యం ఉండదు. కాబట్టి విష్ణువుకంటే వేరైనది మరొకటి ఏదీ ఉండదు. సజ్జనులు, శరీరాదుల విషయంలో 'తనది' అనే బుద్ధిని కలిగి ఉండరు. ఇతరమైన విషయాలపై వ్యామోహాన్ని విడిచిపెడతారు. పూజనీయ మాధవుని పాదారవిందాలను ప్రతీ క్షణం

హృదయంలో ఆలింగనం చేసుకొంటారు. విష్ణుసంబంధమయిన 'పరమపదమే' అన్నింటిలోకి ఉత్తమమైనదని తెలుసుకుంటారు. ఈ విధంగా శాస్త్రజ్ఞానాగ్నిలో విషయవాసనలను పూర్తిగా తగులబెట్టి దేనిమీదా అపేక్ష చూపించరు.

సీ. అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ, బీడించి, ప్రాణంబు బిగియఁ బట్టి నాభితలముఁజేర్చి నయముతో మెల్లన, హృత్సరోజము మీఁది కెగయఁ బట్టి యటమీఁద నురమందు హత్తించి, క్రమ్మఱఁ, దాలు మూలమునకుఁ దఱిమి నిలిపి మమతతో భ్రూయుగమధ్యంబు జేర్చి, దృ, క్కర్ణనాసాస్య మార్గములు మూసి,

ఆ. యిచ్చలేని యోగి యెలమి ముహూర్తార్ధ, మింద్రియానుషంగ మింతలేక ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రము చించి, బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర!

29

తా॥ ఓ పురువంశపు రాజా! యోగి అయినవాడు మడమతో మూలాధార చక్రనిలయాన్ని (గుదద్వారాన్ని) నొక్కిపట్టి ఉంచాలి. ప్రాణవాయువు గమనాన్ని బిగబట్టాలి. దాన్ని బొడ్డు ప్రదేశానికి చేరవేయాలి. నిత్యసాధనతో క్రమంగా హృదయకమలం పైకి ఎగయబట్టాలి. ఆ మీదట కాసేపు రొమ్ముప్రదేశంలో బిగబట్టి ఉంచాలి. తిరిగి మళ్ళీ మళ్ళీ తాలు (అంగిలి మొదలిభాగం) ప్రదేశానికి నెట్టుకుంటూ పోయి, అక్కడ నిలిపి ఉంచాలి. దాన్ని నెమ్మదిగా కనుబొమల మధ్యభాగానికి చేర్చాలి. అప్పుడు కళ్ళు, చెవులు, ముక్కు, నోరు అనే ఏడు మార్గాల్ని మూసివేయాలి. విషయవాంఛలు నశించిన తర్వాత నిస్సంకల్పుడై అర్ధముహూర్తకాలం పాటు కొంచెమైనా ఇంద్రియాల సాంగత్యం లేనివాడు కావాలి. అప్పుడే ప్రాణాల్ని లోబరచుకోగల నైపుణ్యం ఏర్పడుతుంది. అపుడు బ్రహ్మరంధ్రాన్ని చీల్చుకుని పరబ్రహ్మంలో లీనమవుతాడు.

పాయూపస్థలకు నడిమి ప్రదేశంలో ఉండేది మూలాధార చక్రం. సుషుమ్నకు అంతర్గతమై లింగమూల భాగంలోనిది స్వాధిష్ఠాన చక్రం, నాభిమధ్య ప్రదేశం లోనిది మణిపూరక చక్రం, హృదయం లోనిది అనాహత చక్రం, కంఠస్థానం లోనిది విశుద్ధ చక్రం,

కనుబొమల మధ్యది ఆజ్ఞాచక్రం.

గొంతునుంచి తలలోకి ఊర్ధ్వంగా ఉన్న శిరోరంధ్రాన్ని బ్రహ్మరంధ్రం అంటారు.

వ. మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగమంబు విడువని వాఁడు వానితోడన గుణసముదాయ రూపంబగు బ్రహ్మాండంబు నందు ఖేచరసిద్ధ విహారయోగ్యంబును నణిమాదిక సకలైశ్వర్య సమేతంబును నైన పరమేష్ఠి పదంబుఁ జేరు. విద్యాతపో యోగసమాధి భజనంబు సేయుచుఁ బవనాంతర్గత లింగశరీరులైన యోగీశ్వరులకు బ్రహ్మాండ బహిరంతరాళంబులు గతి యని చెప్పుదురు. ఏరికిం గర్మంబుల నట్టి గతిఁ బొంద శక్యంబు గాదు యోగి యగువాఁడు బ్రహ్మలోకంబునకు నాకాశపథంబునం బోవుచు సుషుమ్నానాడివెంట నగ్నియను దేవతం జేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై యెందునుందగులు వడక తారామండలంబుమీఁద సూర్యాది ధ్రువాంతపదంబులఁ గ్రమక్రమంబున నతిక్రమించి హరిసంబంధంబయిన శింశుమార చక్రంబుఁ జేరి యొంటరి యగుచుఁ బరమాణు భూతంబైన లింగ శరీరంబుతోడ బ్రహ్మవిదులకు నెలవైన మహర్లోకంబుఁ జొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుఁ; గల్పాంతంబున ననంతముఖానల జ్వాలాజాల దందహ్యమానంబగు లోకత్రయంబు నీక్షించుచుఁ, దన్నిమిత్త సంజాతానల దాహంబు సహింపంజాలక –

30

తా॥ ఇంకా, శరీరాన్ని విడిచిపెట్టే సమయంలో ఇంద్రియసాంగత్యాన్ని వదలిపెట్టాలి. అలా కానప్పుడు వాటితో పాటు, అంటే ఆ ఇంద్రియగుణాలతో నిండిన రూపంతోనే బ్రహ్మపదం చేరుకోవాలి.

ఆ బ్రహ్మపదం ఖేచరులు, సిద్ధులు క్రీడించే ప్రదేశం. అది అణిమాది అష్ట ఐశ్వర్యాలతో కూడి ఉంటుంది.

ఆ యోగీశ్వరుడు జ్ఞానం, తపస్సు, యోగం, సమాధుల్ని బ్రహ్మపదంలోనూ సేవిస్తూ ఉంటాడు. వాయువులో అంతర్లీనమై లింగశరీరం కలవాడవుతాడు. అందువల్ల బ్రహ్మాండం లోపలా బయటా స్వేచ్ఛగా విహరించగల్గుతారని అంటారు. కర్మల ద్వారా ఎవ్వరూ ఇలాంటి స్థానాన్ని పొందలేరు.

ఇలా బ్రహ్మలోకానికి వెళ్ళదలచుకున్న యోగి ఆకాశమార్గంలో పోతుంటాడు. సుషుమ్నా నాడి ద్వారా 'వైశ్వానరాగ్ని' దేవతను చేరుకుంటాడు. జ్యోతితో నిండుగా వెలుగొందుతాడు. నిష్కల్మషుడవుతాడు. ఏ విషయాలూ అంటని వాడవుతాడు. నక్షత్రమండలం దాటిపోతాడు. ఆ మీదట సూర్యమండలం మొదలు ధ్రువమండలం దాకా వరుసపెట్టి క్రమంగా దాటుకుంటూ పోతాడు. చివరకు విష్ణువు యొక్క స్థానమైన శింశుమారచక్రం చేరుకుంటాడు. ఒంటరిగానే సూక్ష్మాతిసూక్ష్మరూపం అయిన లింగశరీరంతో మహర్లోకం చేరుకుంటాడు. ఇదే బ్రహ్మవేత్తలు ఉండే లోకం. అక్కడే మహాకల్పం దాకా విహరిస్తాడు. కల్పాంతంలో ముల్లోకాలూ అనంతపురుషుడి (సంకర్షణుడి) నోటినుండి వెలువడే అగ్నితో కాలిపోవడం కళ్ళారా చూస్తాడు. ఆ వేడి కారణంగా ఆ మహర్లోకం నుంచి అగ్ని దాహాన్ని చూడలేక (బ్రహ్మలోకం చేరి ఉండిపోతాడు).

అణిమాదులు మొత్తం ఎనిమిది సిద్ధులు. అవి అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, వశిత్వం, ఈశిత్వం.

లింగశరీరం : లింగం అంటే చిహ్నం. ముందటి శరీరపు గుర్తులు, విద్యావైఖరులు, అభిరుచులు కర్మరూపంలో కాక ప్రజ్ఞగా నిలచి ఉండేది. ఇది పరమాణువు కన్న సూక్ష్మరూపంలో ఉంటుంది. దీనికి పూర్వాపరస్ఫురణ ఉండదు.

శింశుమారచక్రం : 12 ధ్రువతారలు కల మండలాలు అనేకంతో ఉండేది. 12 సౌరకుటుంబాలకు కేంద్రం ఒక్కొక్క ధ్రువతార. అలాంటి ధ్రువతారలు పన్నెండు ఒక మండలం.

భూలోకం, భువర్లోకం, సువర్లోకం అనే మూడు లోకాలూ దగ్ధమైనపుడు, ఆ వేడికి యోగులు 'సత్యలోక' మనే నీడల లోకానికి పోతుంతారట.

సీ. ఇల మీఁద మనువు లీ రేద్వురుఁ జనువేళ, దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు
మహనీయ సిద్ధవిమాన సంఘము లెందు, దినకరప్రభములై తేజరిల్లు
శోకజరామృత్యుశోషణ భయదుఃఖ, నివహంబు లెందు జనింపకుండు
విష్ణుపద ధ్యాన విజ్ఞాన రహితుల, శోకంబు లెందుండి చూడవచ్చు

ఆ. పరమసిద్ధయోగి భాషణామృత మెందు, శ్రవణ పర్వమగుచు జరుగుచుండు నట్టి బ్రహ్మలోకమందు వసించును, రాజవర్య! మరల రాఁడు వాఁడు.

31

తా॥ భూలోకంలో పద్నాలుగు మంది మనువులు పాలించిన కాలం మొత్తం కలిపితే బ్రహలోకంలో ఒక్క దినంగా లెక్క అవుతుంది. అక్కడ మహాత్ములైన సిద్ధుల విమానాల సమూహం సూర్యతేజంతో ప్రకాశిస్తుంటుంది. అక్కడ శోకం గాని, ముసలితనం గాని, చావు గాని, శుష్కించడం గాని, భయం గాని, ఆర్తి గాని పుట్టదు. విష్ణుపాదపద్మాలను ధ్యానించని అజ్ఞానుల శోకాన్ని చూపించగలది బ్రహ్మలోకం. గొప్పవారైన సిద్ధుల, యోగుల సంభాషణలతో చెవికింపుగా అమృతప్రాయంగా విన్పింప చేస్తుంటుంది. ఇలాంటి బ్రహ్మలోకంలో నివసించేవాడు మళ్ళీ తిరిగి వెనక్కి పోనేపోడు. శాశ్వతంగా అక్కడే వసిస్తాడని తాత్పర్యం.

విమానం : బ్రహ్మలోకంలో నివసించేవారి ప్రజ్ఞ ఎంతమేర వికసిస్తుంటుందో అంతమేర ప్రకాశిస్తుంటుంది. ఆ తేజస్సే ఆ యోగి శరీరంగా తిరుగుతుంటుంది. దీన్నే 'విమానం' అంటారు.

వ. మఱియు నొక్క విశేషంబు గలదు. పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైన వారు కల్పాంతరంబునం బుణ్యతారతమ్యంబుల నధికార విశేషంబు నొందువార లగుదురు.

బ్రహ్మాది దేవతాభజనంబునం జనువారు బ్రహ్మజీవిత కాలం బెల్ల బ్రహ్మ లోకంబున వసియించి ముక్తు లగుదురు. నారాయణ చరణకమల భక్తి పరాయణత్వంబునం జనినవారు నిజేచ్ఛావశంబున నిరర్గళ గమనులై బ్రహ్మాండంబు భేదించి మహోన్నత వైష్ణవపదారూఢులయి తేజరిల్లుదురు. ఈశ్వరాధిష్ఠితంబైన ప్రకృతియంశంబున మహత్తత్త్వంబగు. మహత్తత్త్వాంశంబున నహంకారంబగు. నహంకారాంశంబున శబ్దతన్మాత్రంబగు. శబ్దతన్మాత్రాంశంబున గగనంబగు. గగనాంశంబున స్పర్శతన్మాత్రంబగు. స్పర్శతన్మాత్రాంశంబున సమీరణంబగు. సమీరణాంశంబున రూపతన్మాత్రంబగు. రూపతన్మాత్రాంశంబువలనఁ దేజంబగు. తేజోంశంబున రసతన్మాత్రంబగు. రసతన్మాత్రాంశంబువలన జలంబగు. జలాంశంబున గంధతన్మాత్రం బగు. గంధతన్మాత్రాంశంబునఁ బృథివి యగు. వాని మేళనంబునం జతుర్దశ భువనాత్మకంబైన విరాడ్రూపంబగు; నా రూపంబునకుఁ గోటియోజన విశాలంబైన యండకటాహంబు ప్రథమావరణంబైన పృథ్వియగు. దీనిఁ బంచాశత్కోటివిశాలంబని కొందఱు పలుకుదురు. అయ్యావరణంబు మీఁద సలిల తేజస్సమీర గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి యావరణంబులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు. అట్టి యేడింటిమీఁదఁ బ్రకృత్యావరణంబు మహావ్యాపకం బగు; బ్రహ్మాండంబు భేదించి వైష్ణవపదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై, మెల్లన లింగ దేహంబునఁ బృథివ్యాత్మకత్వంబు నొంది, యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, తేజోరూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును, నతిక్రమించి భూతసూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణంబున సంప్రాప్తుండై, యందు మనోమయంబును, దేవమయంబునునైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి, గుణత్రయంబును లయించి, ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వంబున దేహంబును, నుపాధిపరంపరావస్థానంబునం బ్రకృతిం బాపి యానందమయుండై యానందంబునం

బరమాత్మరూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలియునని చెప్పి వెండియు నిట్లనియె.



తా॥ మరొక ప్రత్యేకమైన విషయం చెప్పవలసి ఉంది. ఎక్కువ పుణ్యంవల్ల బ్రహ్మలోకం పొందినవారు తాము చేసిన పుణ్యాల తేడాను బట్టి మరో కల్పంలో ప్రత్యేకమైన అధికారాల్ని పొందుతుంటారు.

బ్రహ్మాది దేవతలను ధ్యానిస్తూ పై లోకానికి వెళ్ళినవారు బ్రహ్మాయువు పర్యంతం ఆ బ్రహ్మలోకంలోనే ఉంటూ ఆ పైన ముక్తిని పొందుతుంటారు.

విష్ణుపాదపద్మాలను భక్తితో సేవించి ఆ లోకానికి వెళ్ళిపోయినవాళ్ళు ఎలాంటి ఆటంకం లేకుండా యథేచ్ఛగా సంచరిస్తుంటారు. బ్రహ్మాండాన్ని చీల్చుకుని అన్నిటికన్న మిన్న అయిన విష్ణుపదాన్ని పొంది ప్రకాశిస్తుంటారు.

ఈశ్వరుడి యందు అణగి అధిష్ఠించి ఉండే ప్రకృత్యంశంతో 'మహత్' తత్త్వం పుడుతుంది. దీని అంశంతో అహంకారం, దీని అంశంతో శబ్దతన్మాత్ర, దీని అంశంతో ఆకాశం, దీని అంశంతో స్పర్శతన్మాత్ర, దీని అంశంతో వాయువు, దీని అంశంతో రూపతన్మాత్ర, దీని అంశంతో తేజస్సు, దీని అంశంతో రసతన్మాత్ర, దీని అంశంతో జలం, దీని అంశంతో గంధతన్మాత్ర, దీని అంశంతో పృథివి కలుగుతాయి. ఈ అన్నిటి మేళవింపు వల్ల ఈ పదునాల్గు లోకాలకు ఆత్మవంటిదైన విరాడ్రూపం కల్గుతుంది.

ఈ రూపానికి కోటియోజనాలు వ్యాపించి ఉన్న బ్రహ్మండభాండం ఉంటుంది. మొదట ఆవరించి ఉండే భూమి పొర ఇదే. కొందరు 50 కోట్ల యోజనాల వైశాల్యం గల పొరగా దీన్ని చెప్తుంటారు.

ఈ ఆవరణం పైన నీరు, అగ్ని, గాలి, ఆకాశం, అహంకారం, మహత్తత్త్వం అనే మరో

ఆరు ఆవరణాలు అల్లుకుని ఉంటాయి. ఇవి నీటి ఆవరణతో మొదలుకొని క్రమంగా ఒకదానికంటే ఒకటి పదింతలుగా ఉంటాయి. ఈ ఏడింటి పైది ప్రకృతి ఆవరణం. ఇది ఎనిమిదవ ఆవరణం.

ఇంత విశాలమైన ఈ బ్రహ్మాండాన్ని పగులగొట్టుకుని విష్ణుపదం అధిరోహించినవాడు మరణానికి భీతిల్లడు. క్రమంగా లింగశరీరంతో పృథివీతత్త్వాన్ని ధరిస్తాడు.

అలాంటి పృథివీ తత్త్వంతో వాసన చూడగల ఘ్రాణేంద్రియంతో గంధాన్ని గ్రహిస్తాడు. జలస్వరూపంతో రుచిని పట్టే రసనేంద్రియంతో రసాన్ని గ్రహిస్తాడు. తేజోరూపంతో దర్శించగల నేత్రేంద్రియంతో రూపాన్ని గ్రహిస్తాడు. వాయురూపంతో శరీరంగల త్వగింద్రియంతో స్పర్శను గ్రహిస్తాడు. గగనరూపంతో వినగల శ్రోత్రేంద్రియంతో శబ్దాన్ని గ్రహిస్తాడు.

ఈ మొత్తం అన్నింటిని దాటిపోయిన యోగి ఆకాశాది పంచభూతాలనూ, సూక్ష్మేంద్రియాలనూ లయింప చేయగల అహంకార ఆవరణాన్ని చేరుకుంటాడు. అక్కడ మనోమయం, దేవమయం అనేటటువంటి సాత్త్వికాతిశయంతో మహత్తత్త్వంలోకి ప్రవేశిస్తాడు. అటు తర్వాత సత్త్వరజస్తమోగుణాలు లయించే ప్రకృతిలోకి ఒదిగిపోతాడు. ఆ ప్రకృతిరూపం తానే అనే భావనతో దేహాన్నీ, ఉపాధిపరంపరలన్నీ పూర్తి అయిన తర్వాత ప్రకృతినీ వీడి ఆనందమయుడవుతాడు.'

ఈ తీరున పరీక్షిన్మహారాజుతో చెప్పి, మళ్ళీ శుకయోగి ఇలా అంటున్నాడు:

ఆ. పరమభాగవతులు పాటించు పథ మిది, యీ పథమున యోగి యరిగె నేని మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు, కల్పశతము లైన గౌరవేంద్ర!



తా॥ 'ఓ కౌరవశ్రేష్ఠా! పరమ భాగవతోత్తములు వైష్ణవపదాన్ని పొందడానికి అవలంబించే

మార్గం ఇప్పటి దాకా చెప్పుకుంటూ వచ్చాను. ఈ మార్గంలో ప్రయాణం సాగించే యోగి ఒక వంద బ్రహ్మకల్పాలు గడచినా ఎప్పటికీ ఇక్కడకు తిరిగిరాడు. ఇందులో ఏమాత్రం సందేహం లేదు.

వ. వినుము. నీవడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు ననియెడు నీ రెండు మార్గంబులు వేదగీతలందు వివరింపంబడియె. వీనిం దొల్లి భగవంతుండైన వాసుదేవుండు బ్రహ్మచేత నారాధితుండై చెప్పె, సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదు లయిన మోక్షమార్గంబులు పెక్కు గలవు అందు భక్తిమార్గంబుకంటే సులభంబు లేదు.

34

తా॥ ఆలకించు. ఓ రాజా! నువ్వు ప్రశ్నించినట్లే ముక్తిని గురించి 'సద్యోముక్తి (వెంటనే కల్గేది), క్రమముక్తి (కాలక్రమంలో కలిగేది), అనే రెండు మార్గాలు శ్రుతిగీతల్లో వివరంగా చెప్పబడి ఉన్నాయి. వీటినిగూర్చి పూర్వకాలంలో బ్రహ్మ ఆ పరమదైవాన్ని ఆరాధించినప్పుడు ఆ వాసుదేవుడు బ్రహ్మతో చెప్పాడు. సంసారచక్రంలో పడిన మానవుడు మోక్షం పొందాలి. అందుకు యోగాది మోక్షమార్గాలు చాలానే ఉన్నాయి. వాటన్నింటిలో సులువయిన మార్గం భక్తిమార్గం ఒక్కటే.

వేదగీతలు = గానం చేయబడే వేదమంత్రభాగాలు.

## శుకుడు పరీక్షిత్తుకు భక్తిమార్గమే ముఖ్యమని తెలుపుట

మ. విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ముమ్మాఱు మ ర్మ నయజ్ఞత్వముతోడ నంతయుఁ బరామర్శించి మోక్షంబు ద క్కిన మార్గంబుల వెంట లేదనుచు భక్తిం జింత సేసెన్ జనా ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచున్ దన్మార్గ నిర్ణేతయై.

35

తా॥ ఇంకా ఉంది, విను. ఇంతకు మునుపు బ్రహ్మ వేదాన్ని ధర్మనీతిజ్ఞతతో మూడు పర్యాయాలు మనస్సులో అనుశీలించాడు. మోక్షం కావాలంటే భక్తిమార్గం తప్ప వేరు శరణ్యం లేదని నిశ్చయించుకున్నాడు. ఈ ముక్తిమార్గాన్నే అవలంబించాలని నిర్ణయానికి వచ్చాడు. ఆ భగవంతుడి ఆత్మరూపాన్ని, ఎలాంటి వికారానికి లోనుగాకుండా భక్తితో చింతించాడు.

సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుండు హరి యుండు నెల్ల ప్రొద్దు బుద్ధి విశేషణంబుల గానఁబడును మహత్సేవనీయుఁ డహర్నిశంబు వందనీయుఁడు భక్త వాత్సల్య సంతత నియతుఁడై సతతంబు నియతబుద్ధి నాత్మరూపకుఁడగు హరికథామృతమును గర్ణ పుటంబులఁ గాంక్షదీరఁ

తే. గ్రోలుచుండెడి ధన్యులు కుటిలబహుళ, విషయ మలినీకృతాంగముల్ వేగ విడిచి విష్ణుదేవుని చరణారవిందయుగము, కడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర!

36

తా॥ జగన్నాథుడైన హరి సర్వప్రాణుల్లో ఆత్మరూపంలో ఉంటాడు. బుద్ధి విశేషముల వలన సర్వదా కంటికి కానవస్తుంటాడు. అతడు రాత్రనక, పగలనక అన్ని వేళల్లో పెద్దలచే ఆరాధించదగినవాడు. నిత్యం నమస్కరించదగినవాడు. ఎల్లకాలం భక్తులపట్ల వాత్సల్యం కలవాడు. మంచి నియమవంతుడు. ఆత్మరూపి. ఇలాంటి శ్రీమహావిష్ణువు కథాసుధను చెవుల పండువుగా సంతృప్తిగా ఆస్వాదించే భక్తులు పుణ్యాత్ములు.

ఓ రాజా! ఇట్లాంటి వాళ్ళు కుటిలత్వాన్ని విడిచి విషయభోగాల వల్ల మలినం అయిన తమ శరీరాలను వదలిపెట్టి అచిరకాలంలో హరిపాదపద్మములను చేరుకుంటారు. ఇది సత్యం.

క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమానమరణులకు మహా
జ్ఞానులకుఁ జేయవలయు, విధానము నిగదింపఁబడియె ధరణీనాథా!

37

తా॥ రాజా! మానవపుట్టుక పుట్టాక చావుకి సిద్ధపడే వాళ్ళూ, విజ్ఞానవేత్తలూ ఆచరించాల్సిన శాస్త్రవిధానాల్ని ఇంతదాకా చెప్పకుంటూ వచ్చాను.

వ. వినుము. బ్రహ్మవర్చసకాముఁడైన వానికి వేదవిభుండగు బ్రహ్మణస్పతిం, నింద్రియ పాటవకామునకు నింద్రుండును, ప్రజాకామునకు దక్షాది ప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునకు నాదిత్యులును, రాజ్యకామునకు విశ్వదేవతలును, దేశప్రజా సాధనకామునకు సాధ్యులును, శ్రీకామునకు దుర్గయు, దేజస్కామునకు నగ్నియు, ధనకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నశ్వినీదేవతలును, పుష్టికామునకు భూమియు, ప్రతిష్ఠా కామునకు లోకమాతలైన గగనభూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును, కామినీకామునకు నప్సరసయైన యూర్వశియు, సర్వాధిపత్యకామునకు బ్రహ్మయు, కీర్తికామునకు యజ్ఞోపాధికుండగు విష్ణువును, విత్తసంచయకామునకుం బ్రచేతసుండును, విద్యాకామునకు నుమావల్లభుండును, దాంపత్య ప్రీతికామునకు నుమాదేవియు, ధర్మార్థకామునకు నుత్తమశ్లోకుండగు విష్ణువును, సంతానకామునకుఁ బితృదేవతలును, రక్షాకామునకు యక్షులును, బలకామునకు మరుద్గణంబులును, రాజత్వకామునకు మనురూప దేవతలును, శత్రుమరణ కామునకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగకామునకుఁ జంద్రుండును భజనీయు లగుదురు. మఱియు,

తా॥ వినుము. బ్రహ్మతేజం కావాలనుకుంటే వేదనాథుడైన చతుర్ముఖబ్రహ్మను (తంత్రోక్త ప్రకారం ఆయా ద్రవ్యాలతో) పూజించాలి. ఇంద్రియశక్తిని కోరుకుంటే ఇంద్రుణ్ణి కొలవాలి. సంతానవాంఛ కలిగి ఉంటే దక్షుడు మొదలైన ప్రజాపతుల్ని సేవించాలి. మంచి భోజనప్రీతి ఉంటే అదితిని పూజించాలి. స్వర్గకాంక్ష ఉంటే పన్నెండు మంది ఆదిత్యుల్ని ఆరాధించాలి. రాజభోగం కావాలని ఉంటే విశ్వేదేవతల్ని భజించాలి.

దేశాన్ని, ప్రజల్ని వశీకరించుకోవాలని ఉంటే సాధ్యుల్ని సేవించాలి. సిరిని వరించాలంటే దుర్గాశక్తిని ఆశ్రయించాలి. తేజోవృద్ధిని కోరుకుంటే అగ్నిని సేవించాలి. ఐశ్వర్యాభిలాష ఉంటే అష్టవసువుల్ని అర్చించాలి. వీర్యవృద్ధి కావాలనుకుంటే వీర్యప్రదులైన ఏకాదశరుద్రుల్ని ఆరాధించాలి. ఆయుష్షు వాంఛిస్తే అశ్వినీ దేవతల్ని కొలవాలి. చక్కటి పోషణలో పుష్టి కావాలనుకుంటే భూదేవిని, ప్రతిష్ఠ పొందాలనుకుంటే లోకమాతలైన ఆకాశ భూదేవతల్ని, అందాన్ని ఇష్టపడితే గంధర్వుల్ని, వనితాప్రాప్తిని ఆశిస్తే అప్సరస ఊర్వశినీ, సర్వజనాధిపత్యాన్ని కాంక్షిస్తే బ్రహ్మనూ ఆరాధించాలి.

కీర్తికి యజ్ఞపురుషుడు విష్ణువునూ, ధనార్జనకు వరుణదేవుణ్ణి, విద్యాపేక్షకు పార్వతీపతి శివుణ్ణి, దాంపత్యానురాగానికి ఉమాదేవిని, ధర్మార్థాలకు పుణ్యచరితుడైన విష్ణువును, సంతానవృద్ధికి పితృదేవతల్ని, బాధానివారణకు, రక్షణకు యక్షుణ్ణి, బలానికి వాయుదేవుణ్ణి, రాచరికానికి మన్వంతరాధిపతుల్ని, శత్రు వినాశనానికి విదిక్కును పరిపాలించే నిర్ఋతినీ, భోగానుభవానికి చంద్రుణ్ణీ కొలవాలి.

ఈ కామ్యకర్మ దేవతలందరిని నక్షత్రాధిపతులుగా పేర్కొంటారు. (నక్షత్రాలు ఇరవైఎనిమిది అనేవారి మతంలో అభిజిత్ నక్షత్రాన్ని కలపాలి)

క. కామింపకయును సర్వము, గామించియునైన ముక్తిఁ గామించి తగన్
లో మించి పరమపురుషుని, నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా!

తా॥ ఇంతెందుకు! ఈ అన్ని కోరికలున్నవాడైనా, ఏ కోరిక లేనివాడైనా తత్త్వజ్ఞుడైనవాడు మోక్షాన్నే కోరుకుంటాడు. అతడు అంతర్ముఖుడై ప్రగాఢమైన భక్తితో పరమాత్ముడైన విష్ణుదేవుణ్ణి భజిస్తాడు.

మ. అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁడా యబ్జాక్షు సేవింపఁగా
విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవున్ వేయేల? భూనాథ! త
త్కమలాధీశ కథాసుధారస నదీకల్లోలమాలావలీ పరి
భ్రమ మెవ్వారికినైనఁ గర్ణయుగళీ పర్వంబు గాకుండునే?

40

తా॥ ఇంద్రుడు మొదలైన వారిని కోరికల్ని బట్టి కొలచినట్లే పద్మాక్షుడైన విష్ణువుని కొలవాలి. దానివల్ల నిర్మలమైన జ్ఞానము, వైరాగ్యము, మోక్షము కలుగును.

ఓ రాజా! ఇన్నిమాట లెందుకు? ఆ లక్ష్మీనాయకుడి కథలు అమృతోపమానాలు. ఆ సుధారస ప్రవాహాల పరంపరలో మునకలు వేసేవారు ఎవరికైనా అవి చెవుల పండువు కలిగించక మానవు. హరికథలంతటి ఆనందదాయకాలని తాత్పర్యం.

వ. అని యిట్లు రాజునకు శుకుండు సెప్పె ననిన విని శౌనకుండు సూతున కిట్లనియె.

41

తా॥ అని ఈ రీతిగా పరీక్షిత్తుకి శుకయోగి ఉపదేశించాడు' అని సూతుడు చెప్పగా విని, శౌనకుడు ఇంకా సూతుణ్ణి ఇలా ప్రశ్నించాడు:

క. వర తాత్పర్యముతో నిటు, భరతాన్వయవిభుఁడు శుకుని పలుకులు విని స
త్వరతా యుతుఁడై శ్రేయ, స్కరతామతి నేమి యడిగె? గణుతింపఁగదే!

42

తా॥ ‘సూతా! ఇలా ఈ మాటలు ఎంతో శ్రద్ధ పెట్టి విన్న పరీక్షిత్తు శుభాన్ని కోరి ఆ వెంటనే మళ్ళీ ఏమని శుకయోగిని ప్రశ్నించాడో వివరించు’ అని అడిగాడు. సూతుడు మళ్ళీ ఇలా మొదలుపెట్టాడు.

క. ఒప్పెడి హరికథ లెయ్యవి చెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలు గొనుచున్నవి రుచు, లుప్పతిలన్ నీ మనోహరోక్తులు వినఁగన్

43

తా॥ ‘ఓ సూతా! కమ్మగా అన్పించే నీ నోటి మాటలు మా మనస్సుల్ని దోచుకుంటున్నాయి. చక్కటి విష్ణుకథలు ఇంకేమి చెప్తావో అనే కుతూహలం మా మనస్సులో కుప్పలు కుప్పలుగా పేరుకుపోతున్నది.’

వ. అనిన విని సూతుం డిట్లనియె.

44

తా॥ అని శౌనకుడు పలుకగానే సూతుడు మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు.

క. తూలెడి కూఁకటితోడను, బాలురతో నాడుచుండి బాల్యమున మహీ
పాలుఁడు హరిచరణార్చన, హేలాలసుఁ డగుచు నుండె నెంతయు నియతిన్.

45

తా॥ ‘ఆ పరీక్షిత్తు పసితనం నాటి నుంచి తన తోడి బాలురతో కలసి ఆటలు ఆడుకునే వయస్సులో కూడా కృష్ణపాదపూజాది రూపంగానే శ్రద్ధతో హరిని సేవిస్తూ ఉండేవాడు.

కృష్ణుని అర్చనలోనే తృప్తిని పొందుతూ ఉండేవాడని భావం.

వ. అట్టి పరమభాగవతుండైన పాండవేయునకు వాసుదేవ పరాయణుం డైన శుకుండిట్లనియె.

46

తా॥ అంతటి పరమ భాగవతుడైన 'పరీక్షిత్తు' తో శ్రీకృష్ణ భక్తి ప్రపత్తి గలవాడు, శుకుడు ఇలా అంటున్నాడు.

సీ. వాసుదేవ శ్లోకవార్త లాలించుచుఁ, గాల మే పుణ్యుండు గడుపుచుండు
నతని యాయువు దక్క నన్యనరాయువు, నుదయా స్తమయముల నుగ్రకరుఁడు
వంచించి కొనిపోవు వాఁ డది యెఱుఁగక, జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు,
నంగనా పుత్ర గేహారామ విత్తాది, సంసారహేతుక సంగ సుఖముఁ

తే. దగిలి వర్తింపఁ గాలము తఱి యెఱింగి, దండధర కింకరులు వచ్చి తాడనములు సేసి
కొనిపోవఁ బుణ్యంబు సేయ నైతిఁ, బాపరతి నైతి నని బిట్టుఁ బలవరించు.

47

తా॥ "ఓ పుణ్యాత్ముడా! విష్ణు గాథలు, కీర్తనలు, వింటూ కాలాన్ని వెళ్ళబుచ్చేవాడి ఆయువు గట్టిది. అతడి ఆయువు తప్ప మిగతా వారి ఆయువును సూర్యుడు ఉదయం పూట, సాయంత్రం పూట మోసపుచ్చి హరించుకు పోతుంటాడు. సంసారికి ఈ సంగతి అవగతం కాదు. నేను తప్పక చాలా ఏళ్ళు బతికి ఉంటానని మూఢంగా అనుకుంటుంటాడు. పెళ్ళాం, బిడ్డలు, ఇల్లు, తోట, దొడ్డి, ధనం మొదలైన సంసారపు తగులాటం వల్ల కలిగే సౌఖ్యంలో చిక్కుకుని కాలయాపన చేస్తుంటాడు.

అదును వచ్చేసరికి ఆయువు ప్రమాణం అంతమయిందని యమకింకరులు వచ్చి దండిస్తూ తీసుకుని పోతారు. అపుడు 'ఏ పుణ్యం చేయలేకపోతిని, ఎంత పాపం మూటగట్టుకున్నాను' అని మొత్తుకుంటాడు.

వ. అది గావున,

48

తా॥ అందువల్ల,

సీ. అలరు జొంపములతో నభ్రంకషంబులై, బ్రదుకవే? వనములఁ బాదపములు!
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు, జీవింపవే? గ్రామసీమలందు!
నియతిమై నుచ్ఛ్వాస నిశ్శ్వాస పవనముల్, ప్రాప్తింపవే? చర్మభస్త్రికలును!
గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ, దిరుగవే! దుర్యోగదీనవృత్తి!

తే. నుష్ట్ర ఖరములు మోయవే యురుభరములు, పుండరీకాక్షు నెఱుఁగని పురుష పశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ, విషయభరయుక్తితో నుంట విఫల మధిప!

49

తా॥ ఓ రాజా! అడవుల్లోని చెట్లు పూలగుత్తులతో ఆకాశం దాకా పెరిగి బతకడం లేదా? పల్లెసీమల్లో తిండితిప్పలు, మైథునాది కోరికలతో పశువులు మాత్రం జీవించడం లేదా? తోలుతిత్తులూ ఎగఊపిరి దిగఊపిరిగా నియతంగా పనిని సాగించడం లేదా? ఊరపందులు, కుక్కలు ఇంటింటికీ దిక్కుమాలినవై దీనంగా తిరుగాడడం లేదా?

ఒంటెలు గాడిదలు పెద్ద పెద్ద బరువులు మోస్తున్నాయి కదా! విష్ణువును తెలుసుకోలేని జీవులందరూ అడవుల్లోనో, ఇళ్ళల్లోనో, ఇంద్రియ సుఖాల్లోనో పనికిమాలిన బతుకు బతుకుతున్నారు. సునాయాసంగా బతుకును ఈడ్చవచ్చునుకోవటం ప్రతీ ప్రాణికీ స్వభావమే కదా!

విష్ణుకథలు తెలియని ఈ నరపశువు ఊరపందులు, కుక్కలు, గాడిదలు, పశువులు, చెట్లూ, మొదలైన వాటితో సమానంగా కాలగమనం చేస్తుంటాడు. హరిభజనం చేయక కేవలం

ఆహారనిద్రాదుల్లో గడిపే వారి జీవితం ఎందుకూ కొరగానిది.

సీ. విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు, కొండల బిలములు కువలయేశ!
చక్రిపద్యంబులు చదువని జిహ్వలు, కప్పల జిహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు, కేకిపింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షు పూజకుఁగాని హస్తంబులు, శవము హస్తంబులు సత్యవచన!

ఆ. హరిపద తులసీ దళామోద రతి లేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర!
గరుడగమను భజనగతి లేని పదములు, పాదపముల పాదపటల మనఘ!

50

తా॥ ఓ రాజా! హరినామ సంకీర్తనలు వినని చెవులు కొండల్లో గుహల వంటివి.

ఓ కురురాజా! విష్ణువుని గూర్చిన పద్యాలు చదువని నాలుకలు నాలుకలు కావు. అవి కప్పల నాలుకల వంటివి.

ఓ కీర్తిమంతుడా! లక్ష్మీ హృదయనాథుడైన విష్ణుమూర్తిని దర్శించని కన్నులు నెమలి పింఛంలోని కళ్ళవంటివి.

ఓ సత్యవచనా! పుండరీకాక్షుని పాదపూజ చేయని చేతులు చేతులు కాదు. నిర్జీవుని చేతుల వంటివి.

మునుల వలె విష్ణుకథలను మననం చేసుకొంటున్న ఓ పుణ్యచరిత్రుడా ! విష్ణుపాదాల మీది తులసీదళ పరిమళం పీల్చని ముక్కు, పందిముక్కు వంటిది.

ఓ పుణ్యవర్తనుడా! గరుడవాహనుడైన విష్ణుని భజనమందిరాన్ని దర్శించడానికి పోని పాదాలు చెట్ల మొదలు వంటివి.

విష్ణుకథా ప్రసంగాల సంకల్పం లేని అవయవాలు నిరర్థకమైనవి. విష్ణుధ్యాన సంకల్పం గల అవయవాలే సార్థకమైనవి. హరి సంకీర్తనం, శ్రవణం, దర్శనం, పాదపూజనం, ఆరాధనం చేయని ఆయా అవయవాలు నిర్జీవమైన వాటితో సమానమైనవని భావం.

సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ, గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ, మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న, కనక కిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి, వనదుర్గ చంద్రికావైభవంబు

ఆ. కైటభారిభజన గలిగి యుండని వాఁడు, గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదము గనని వాని బ్రతుకు, పసిరికాయలోని ప్రాణి బ్రతుకు.

51

తా॥ నారాయణుని పవిత్రమైన నామాక్షరాలకు కరుగని మనస్సులు, మనస్సులు కావు. అవి గట్టి బండరాళ్ళు. విష్ణుదేవుని కథలు విని ఆనందబాష్పాలతో పులకించని ఒళ్ళు ఒళ్ళు కాదు వట్టి మొద్దు.

పరమపురుషునికి తలవంచి మొక్కని అజ్ఞాని నెత్తిన పెట్టుకునే బంగారు కిరీటం కిరీటం కాదు. అది ఒక బరువైన కట్టెలమోపు వంటిది. విరాట్పురుషుడికి అర్పించని మానవ సంపద సంపత్తి కాదు. అది అడవి గాచిన వెన్నెల సంపద వంటిది. విష్ణువుని సేవించని ఊపిరి, కదిలే శవం వంటిది. అటువంటివాడు ఊపిరి ఉన్నా లేనివాడితో సమానం. హరిపాదాలను ఆశ్రయించని బతుకు పట్టుకాయలోని పురుగు బ్రతుకు వంటిది. విష్ణువును భజించలేనివాడు గాలికి నడుస్తున్న శవం వంటివాడు."

వ. అని యిట్లు వలికిన వైయాసి వచనంబుల నౌత్తరేయుండు కందళిత హృదయుండై నిర్మలమతి విశేషంబున.

52

తా॥ ఇలా పలికిన శుకుని మాటలకు ఉత్తర కుమారుడు పరీక్షిత్తు మనస్సు కొత్తకొత్తగా చిగురించింది. అతడి బుద్ధి తేటపడింది.

అ. సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి యి, ల్లాలి విడిచి, బహుబలాళి విడిచి,
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి, జడ్డుఁదనము విడిచి.

53

తా॥ ఆ రాజు, తన కన్న బిడ్డల్ని, తన మంచిని కోరేవాళ్ళను, చుట్టపక్కాల్ని, కట్టుకున్న భార్యను, అంతటి సైనికబలగాన్ని, సంపదను, వీటి మీద ఆసక్తిని, వదులుకున్నాడు. ఆ విష్ణువుపైనే మనస్సును నిలుపుకున్నాడు.

వ. ఇట్లు మృత్యుభయము నిరసించి ధర్మార్థకామంబులు సన్న్యసించి, పురుషోత్తమునందుఁ జిత్తంబు విన్యసించి హరిలీలాలక్షణంబు లుపన్యసింపు మను తలంపున నరేంద్రుం డిట్లనియె.

54

తా॥ ఈ విధంగా చనిపోవడం అనే భయం ఏమాత్రం లేకుండా ధర్మార్థకామాలు మూడింటినీ మానుకుని, ఆ పురుషోత్తముని మీదనే మనస్సును నిలుపుకొని, అంత్యకాలం గడపాలనే అభిప్రాయంతో పరీక్షిత్తు, శుకమునితో ఇలా అన్నాడు:

క. సర్వాత్ము వాసుదేవుని, సర్వజ్ఞుఁడ వైన నీవు సంస్తుతి సేయన్ సర్వభ్రాంతులు వదలె మ,
హోర్వీసురవర్య! మానసోత్సవ మగుచున్.

55

తా॥ “బ్రాహ్మణోత్తములలో ఉత్తముడా! నీవు అంతా చక్కగా ఎరిగి ఉన్నవాడవు.

వాసుదేవుడు సర్వులకూ ఆత్మరూపుడు. అతణ్ణి నువ్వు కీర్తిస్తుంటే నాలోని భ్రమలన్నీ పటాపంచలయ్యాయి. నా మనస్సు ఆనందంతో ఉప్పొంగిపోయింది.

సీ. ఈశుండు హరి విష్ణుఁ డీ విశ్వ మంతయు, బుట్టించుఁ రక్షించుఁ బొలియఁజూచు బహుశక్తియుతుఁడగు భగవంతుఁ డవ్యయుఁ, డాది నే శక్తుల నాశ్రయించి బ్రహ్మ శక్రాది రూపముల వినోదించెఁ, గ్రమముననో యేకకాలముననొ ప్రకృతి గుణంబులఁబట్టి గ్రహించుట, ఏకత్వమున నుండు నీశ్వరుండు

ఆ. భిన్నమూర్తి యగుచుఁ బెక్కువిధంబుల, నేల యుండు? నతని కేమి చిక్కె నుండకున్నఁ దాపసోత్తమ! తెలుపవే!, వేడ్కతోడ నాకు వేదవేద్య!

56

తా॥ ఓ వేదవేద్యా పరమేశ్వరుడైన విష్ణువు ఈ ప్రపంచాన్ని ఎలా పుట్టించాడు? ఎలా కాపు కాశాడు? ఎలా అంతం చేశాడు? మహాశక్తిమంతుడు, అవ్యయుడు అయిన ఆ భగవానుడు మొదట్లో ఏ శక్తిని ఆశ్రయం చేసికొని బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన రూపాల్లో ఆనందించ గలిగాడు?

ఈ సృష్టిని అతడు సహజ సిద్ధమైన ప్రకృతి స్వభావాన్ని బట్టి వరుసబెట్టి స్వీకరించాడా? ఏకంగా ఒకేసారి స్వీకరించాడా? ఈశ్వరుడు ఒక్కడే అయినా విభిన్న రూపాల్లో విభిన్న భావాల్లో ఎందుకు ఉన్నాడు? అలా ఉండకపోతే అతడికేమి నష్టం? ఈ సంగతులన్నింటినీ నాకు విడమరచి చెప్పవలసింది."

వ. అనిన నుత్తరానందను వచనంబులకు నిరుత్తరుండు గాక సదుత్తరప్రదాన కుతూహలుండై లోకోత్తర గుణోత్తరుండైన తాపసోత్తముండు దన మనమున

57

తా॥ ఆ ఉత్తర కుమారుడైన పరీక్షిత్తు మాటలకు శుకమహర్షి నివ్వెరపడకపోగా, మంచిగా తెలియచెప్పాలని ఉబలాటపడ్డాడు. అంతట, సర్వోత్తమగుణాలు కలిగిన వారిలో అగ్రేసరుడైన తపోధనుడు శుకుడు తన మనస్సులో—

మ. పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థాన సం
హరణ క్రీడనుఁడై, త్రిశక్తి యుతుఁడై యంతర్గతజ్యోతియై,
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకున్ భావింపరాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

58

తా॥ శ్రీహరి తత్త్వాన్ని అర్థించి, ఆయనకు నమస్కరించుకున్నాడు. ఆ శ్రీహరి పరమాత్ముడు. పరమేశ్వరుడు. అనంత మహిమాత్ముడు. సృష్టి స్థితి ప్రళయ కేళీతత్పరుడు. త్రిమూర్త్యాత్మకుడు. ఆత్మ ప్రకాశుడు. బ్రహ్మ మొదలైన సురపతులకు అందని, పొందని త్రోవలో వెలుగొందేవాడు.

లోకంలో గోచరించే సత్యస్థితిని భగవంతునిలో న్యాసం చేయాలి అని తాత్పర్యం.

వ. మఱియు సజ్జనదురిత సంహరణుండును, దుర్జననివారకుండును, నఖీల సత్వరూపకుండును, పరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయ కమల కర్ణికా మధ్య దీపకుండును, సాత్వత శ్రేష్ఠుండును, నిఖీల కల్యాణ గుణ గరిష్ఠుండును, పరమ భక్తియుక్త సులభుండును, భక్తిహీనజన దుర్లభుండును, నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూప బ్రహ్మవిహారుండును నైన యప్పరమేశ్వరునకు నమస్కరించెద.

59

తా॥ ఇంకా ఆ పరమపురుషుడు ఉత్తముల పాపాలను నివారించగలవాడు. అధర్ముల తప్పులను అడ్డుకోగలవాడు. సమస్తమూ తానుగా పూర్తి ఆకారం దాల్చినవాడు. పరమహంసల

ఆశ్రమంలో నివసించే మునుల హృదయకమలకర్ణికలో ఆత్మజ్ఞానంతో తేజరిల్లేవాడు. యాదవుల్లో ఉన్నతుడు. సమస్త కళ్యాణగుణాలతో శోభిల్లే మహిమాత్ముడు. ఉత్తమ భక్తిపరులకు ఎల్లప్పుడూ అందుబాటులో ఉండేవాడు. భక్తిభావం లేనివాళ్ళకు అర్థం కానివాడు; మించిపోని, తులలేని, ఎల్లలు లేని అనుష్ఠాత; తన స్వరూపమే అయిన బ్రహ్మమునందు విహరించేవాడు అయిన ఆ పరమేశ్వరుడికి నమస్కరిస్తాను.

ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునండ్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్

60

తా॥ ఏ పరమపురుషుణ్ణి గూర్చి చేసిన కైమోడ్పు, పూజ, చింతన, సంకీర్తన, అబ్బురపరిచే విలాసాలు వింటూన్న కొద్దీ చేసిన పాపాలన్నీ కడిగినట్లు పోతాయో, లోకం అంతా శుభమయంగా విరాజిల్లుతుందో, అలాంటి పాపహరుణ్ణి, మాధుర్యమయుణ్ణి, శ్రేయోదాయకుణ్ణి నేను శరణు వేడుకుంటాను.

ఉ. ఏ పరమేశు పాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధితో నుభయలోకములందుల జడ్డుఁబాసి, యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు: రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

61

తా॥ నేర్పులైనవారు ఏ పరమేశ్వరుని పాదయుగళాన్ని ఎల్లవేళలా కోరి పూజిస్తూ తమ అంతః కరణంలో ఇహపరలోకాల సంబంధాన్ని విడిచిపెట్టి, ఏ విధమైన కలత లేక స్థిరంగా

బ్రహ్మపదమును చేరుమార్గములో చరింతురో, అట్టి పరమేశ్వరుడును, పాపహరుడును, భక్తి కీర్తనుడు అయిన విష్ణుమూర్తికి మొక్కుకుంటాను.

చ. తపములు సేసియైన, మఱి దానము లెన్నియుఁ జేసియైన, నే
జపములు సేసియైన, ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంత విపదంచిత రీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

62

తా॥ తపస్సులు చేసి అయినా, దానధర్మాలు చేసి అయినా, జపాలు చేసి అయినా పొందిన పుణ్యఫలాన్ని ఆ పరమాత్ముడికే సమర్పించాలి. అలా సమర్పించుకోనివి తుచ్ఛమైనవి అవుతాయి. దరీదాపు లేని ఆపదల పాల పడేలా చేస్తాయి. దేశ, కాలములనే అవధులు లేని ఆ అనంతుణ్ణి, సర్వపాపాల నుంచీ విముక్తిని ప్రసాదించే దయామయుణ్ణి, ఆ మంగళయశస్కుణ్ణి ఎల్లవేళలా కొలుస్తాను.

మ. యవన వ్యాధ పుళింద హూణ శక కంకాభీర చండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులన్ గళ్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

63

తా॥ యవనులు, బోయలు, పుళిందులు, హూణులు, శకులు, కంకులు, ఆభీరులు, చండాలులు మొదలైన జాతుల వాళ్ళు, కర్మల వల్ల చెడు నడత కల మిగతా వాళ్ళు, ఆ శుభంకరాత్ముని కొలుస్తారు. వాళ్ళంతా భాగవతశ్రేష్ఠుల్ని సేవించి పవిత్ర దేహులై, శుభాకారులై ఉంటారు. అలాంటి వికారరహితుణ్ణి, సృష్టికర్తను అన్ని వేళల్లో నా మనస్సులో మొక్కుకుంటాను.

మ. తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌనని బ్రహ్మరుద్ర ముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుండౌఁగాక నా కెప్పుడున్.

64

తా॥ బ్రహ్మ, రుద్రుడు వంటి ముఖ్యులంతా ఆ సర్వాత్ముడు, ముక్తి ప్రదాత, ఆత్మస్వరూపదర్శనం చేత సులభుడైనవాడు అయిన అతడి పాదప్రాప్తి నాకు ఎలా కలుగుతుంది? అని పరితపిస్తుంటారు. అందుకోసం తపస్సు చేయాలా? మనస్సు నియంత్రించుకోవాలా? దానాలు చేయాలా? నోములు నోచాలా? జపాలు ఆచరించాలా? మంత్రాలు అనుష్ఠించాలా? వేదాలూ ధర్మశాస్త్రాలు వల్లించాలా? మంచి భక్తిని కలిగి ఉండాలా? అని తలపోస్తూ ఉంటారు.

క. శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర, జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్ భూపతియు
యాదవశ్రే, ణీపతియున్ గతియునైన నిపుణు భజింతున్.

65

తా॥ సిరికీ, సకల యజ్ఞాలకు, లోకసృష్టికీ, జ్ఞానానికీ, లోకానికీ, భూమికీ, బుద్ధికీ యదువంశానికీ పాలకుడు, రక్షకుడు. అలాంటి భక్తికుశలుణ్ణి సేవింపక మానను.

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వ మా
ర్గణులై యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులం దత్త్వ వీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్.

66

తా॥ ఆ పరమపురుషుడు అణుమాత్రుడా? మహామహితాత్ముడా? అఖండుడా?

అఖండుడు కానివాడా? గుణసహితుడా? గుణరహితుడా? అని పండితులు తంటాలు పడుతూ తప్పుదారి పట్టి, అసలు తత్త్వాన్ని తెలుసుకోలేక, దేవదేవుని పాదకమలాలను ఆశ్రయించి, భజనోత్కర్ష వల్ల యథార్థమైన ఆత్మతత్త్వాన్ని దర్శిస్తారు. నేను అటువంటి కైవల్య మూర్తిని, సర్వవ్యాపకునీ, సర్వాంతర స్వరూపునీ సేవించుకొంటాను.

మ. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య దా నవ్విభున్
మగనింగా వరియించి తద్భువన సామ్రాజ్యస్థితిన్ సృష్టి పా
రగుఁ జేసెన్ ముని బ్రహ్మ: నట్టి గుణి నారంభింతు సేవింపఁగన్.

67

తా॥ శ్రీమన్నారాయణుడు ఒకప్పుడు చతుర్ముఖుడికి లోకసృష్టి పట్ల తలంపు కలిగింప చేయాలని సంకల్పించాడు. అందుకు భగవానుడు సరస్వతిని నియోగించాడు. ఆ వాగ్దేవి తనకు తానుగా బ్రహ్మను హృదయనాథునిగా వరించింది. వేదరూపిణియై ఆయన ఆ ముఖమండలం నుంచి వెలువడి, ఆ బ్రహ్మను తిరుగులేని సృజనక్రియా పారంగతుణ్ణి చేసింది. అట్టి ఉత్తమ గుణవంతుడైన విష్ణువును నేను ఉపాసించటం మొదలు పెడతాను.

సీ. పూర్ణుఁ డయ్యును మహాభూత పంచక యోగ మున మేనులను పురములు సృజించి పురములలో నుండి పురుషభావంబున దీపించు నెవ్వడు ధీరవృత్తిఁ బంచభూతములను బదునొకం డింద్రియ ములఁ బ్రకాశింపించి భూరిమహిమ షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వ నృత్యవినోదంబు నెఱపుచుండు

తే. నట్టి భగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు, మానసోదిత వాక్పుష్పమాలికలను మంజు నవరస మకరంద మహిమ లుట్ట, శిష్టహృద్భావలీలలఁ జేయుఁగాత!

68

తా॥ తాను అంతటా నిండి ఉన్నవాడే అయినా పంచభూతాల పరస్పర సంయోగంతో శరీరములు అనే పురాల్ని పుట్టించాడు. అతడు వీటిల్లో పురుషభావంతో ఎలాంటి మార్పు అంటని చిత్తంతో ప్రకాశిస్తుంటాడు.

పంచభూతాల్లో పదకొండు ఇంద్రియాల తేజాన్ని ప్రసరింపచేసి, వాటి మాహాత్మ్యంతో పదహారు కళారూపాలతో వెలుగొందుతాడు. వీటితో జీవత్వమనే నర్తనక్రీడ జరిపి వినోదిస్తూ ఉంటాడు.

అటువంటి అవ్యయుడు, స్థిరుడు అయిన భగవంతుడు తన మనస్సున అంకురించిన పూలవంటి కోమలమైన మాటల మాలికలతో నవరసాల మకరంద మాధుర్యసంపద ఉట్టిపడే విధంగా సజ్జనుల యొక్క హృదయాలలో వారి మనోభావాలలో తన దివ్యదర్శనాన్ని అనుగ్రహిస్తాడు గాక! ఆ స్వామి నా వాక్కులో నిలచి ఉండుగాక!

పురుష భావంబు : పురాల్లో ఉండేవాణ్ణి పురుషుడంటారు. ఆ పురాలు సూర్య, గ్రహ, నక్షత్ర, తారకాదులు, పంచభూతాలు, జీవుల దేహాలు అనేవి.

షోడశాత్మకుఁడు : పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచభూతాలు, మనస్సు అనేవి ఆ పరమాత్ముని యొక్క పదహారు కళారూపాలు.

నవరసాలు : శృంగారం, హాస్యం, కరుణ, వీరం, రౌద్రం, భయానకం, బీభత్సం, అద్భుతం, శాంతం.

ఉ. మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
జ్ఞానమరందపానమున నాత్మభయంబులఁ బాపి ముక్తులై
లూనత నొంద రట్టి మునిలోక శిఖామణికిన్ విశంక టా
జ్ఞానతమో నభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్.

69

తా॥ మానధనులు, మహాపురుషులు, పరిపూర్ణ సమాధి నిష్ఠులు అయిన మునిజనులు ఏ మహర్షి ముఖం నుంచి జాలువారే జ్ఞానమకరందాన్ని తదేక ధ్యానంతో పానం చేస్తారో, లోలోపలి భీతిని లెక్క చేయక ఉత్తమలోకంలో ఉన్నతిని పొందుతుంటారో, అలాంటి ఋషిశ్రేష్ఠుడు, అమితమైన అజ్ఞానమనే చీకటికి సూర్యుడి వంటివాడు, సాధుసత్తముడు అయిన వ్యాసభగవానుడికి నా వందనాలు.

ధ్యానించే వస్తువులోని పేర్లలో గుణాల్లో తానూ లీనమై పరమాత్మ స్థితిని పొందడాన్ని 'సమాధి' అంటారు.

వ. అని యిట్లు హరిగురువందనంబు సేసి శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె.

70

తా॥ అంటూ ఇలా విష్ణువుకీ, తండ్రి వ్యాసుడికీ మ్రొక్కి శుకమునీంద్రుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

మ. అవిరోధంబున నీవు నన్నడుగు నీయర్థంబు మున్ బ్రహ్మ మా
ధవుచేతన్ విని నారదుం డడిగినన్ దథ్యంబుగాఁ జెప్పె మా
నవలోకేశ్వర! నారదుండు వెనుకన్ నాకుం బ్రసాదించె! సం
శ్రవణీయంబు మహాద్భుతంబు వినుమా సందేహవిచ్ఛేదివై.

71

తా॥ "రాజా! ఇప్పుడు నువ్వు నన్ను స్వేచ్ఛగా అడిగిందే, మునుపు బ్రహ్మ శ్రీమహావిష్ణువు చెప్పగా సమస్తం విని ఉన్నాడు. అతడు అది చెప్పమని అడిగిన నారదుడికి అతడు విన్నది విన్నట్లుగా ఉపదేశించాడు. ఆ తర్వాత దాన్ని నారదుడు నాకు (శుకుడు) అనుగ్రహించాడు. ఈ

అంశం పరమాద్భుతం గానూ, శ్రవణీయంగానూ ఉంటుంది. నీ సంశయం తీర్చుకోనూ వీలుంటుంది. వినుము.

గురు పరంపరాగతంగా ఉపదేశపూర్వకమైనది మన విద్యాసంప్రదాయం నేర్పుతుంది అని భావం.

## నారదుడు బ్రహ్మను జగత్ సృష్టి గురించి అడుగుట

వ. నారదుండు బ్రహ్మ కిట్లనియె.

72

తా॥ నారదుడు బ్రహ్మతో ఇలా చెప్పాడు:

మ. చతురాస్యుండవు! వేల్పుఁ బెద్దవు! జగత్సర్గానుసంధాయి వీ
శ్రుతిసంఘాతము నీ ముఖాంబుజములన్ శోభిల్లు శబ్దార్థ సం
యుతమై సర్వము నీ కరామలకమై యుండుం గదా! భారతీ
సతి యిల్లా లఁట నీకు నో జనక! నా సందేహమున్ బాపవే!

73

తా॥ "తండ్రీ! నువ్వు నాలుగు ముఖాలు కలవాడవు. దేవతలందరికీ పూజ్యుడవు. ప్రపంచసృష్టి కూర్పరివి. వేదాలు మొత్తం మొదలుగా నీ ముఖం నుంచే వెలువడ్డాయి. వాటి వాగర్థాల రూపంతో కూడిన సమస్తలోకతత్త్వం నీకు అరచేతిలోని ఉసిరిక వంటిది. అంతకు మించి, సాక్షాత్తూ ఆ సరస్వతి నీ ఇల్లాలు. నా సంశయాలను తీర్చుమా?

శా. ప్రారంభాది వివేక మెవ్వఁ డొసఁగున్? బ్రారంభసంపత్తి కా
ధారం బెయ్యది? యేమి హేతువు? యదర్థం బే స్వరూపంబు సం
సారానుక్రమ మూర్ణనాభిపగిదిన్ సాగించె నెల్లప్పుడున్
భారం బెన్నఁడు లేదు! నీ మనువు దుష్ప్రాప్యంబు వాణీశ్వరా!

74

తా॥ ఈ జగాన్ని ఇలా సృష్టించాలనే తెలివిని మొదట్లో నీకెవరు కలిగించారు? ఏ ఆధారంతో లోకసృష్టిని మొదలుపెట్టావు? అలా ఆరంభించడానికి కారణం ఏమిటి? దాని

అవసరం ఏమిటి? దాని అసలు స్వరూపం ఎలా ఉంటుంది? ఎడతెరపిలేని ఈ సాలెగూడు లాంటి సృష్టి క్రమాన్ని ఎలా అల్లుకుంటూ వస్తున్నావు? ఓ వాక్పతీ! ఈ సృష్టి కార్యాన్ని ఎప్పుడూ ఒక బరువుగానూ భావించవు. నిజంగా నీ మనుగడ అందరి వల్లా కానిపని.

శా. నాకుం జూడఁగ నీవు రాజ వనుచున్నాఁడన్ యథార్థస్థితిన్
నీకంటెన్ ఘనుఁ డొక్క రాజు గలఁడో నీ వింతకున్ రాజవో
నీ కే లాభము రాఁదలంచి జగముల్ నిర్మించె దీ చేతనా
నీకం బెందు జనించు నుండు నడఁగున్ నిక్కంబు భాషింపుమా.

75

తా॥ ఆలోచించి చూడగా, నా మట్టుకు నాకు ఈ సృష్టి అంతటికీ నువ్వే అధిపతివి అనిపిస్తుంది. నిజానికి నిన్ను మించిన మహానుభావుడు మరొకడు ఉన్నాడా? లేక నీవే సర్వాధికారివా!

నువ్వు ఏమి ఆశించి ఈ ప్రపంచాన్ని సృష్టిస్తుంటావు? ఈ జీవి చైతన్యం అంతా ఎక్కడ పుడుతుంది? ఎక్కడ నిలుస్తుంది? ఎక్కడ అంతం అవుతుంది? ఇందులో ఉన్న యథార్థ భావాన్ని చెప్పుమా?

మ. సదసత్సంగతి నామ రూప గుణ దృశ్యం బైన విశ్వంబు నీ
హృదధీనంబు గదా! ఘనుల్ సములు నీకెవ్వారలున్ లేరు నీ
పద మత్యున్నత మిట్టి నీవు తపముల్ బ్రావీణ్యయుక్తుండవై
మది నే యీశ్వరుఁ గోరి చేసితివి తన్మార్గంబు సూచింపవే

76

తా॥ 'ఉన్నది', 'లేనిది' (సత్ – అసత్) అనే వాటి సహవాసం వల్ల ఈ ప్రపంచం అంతా నామ, రూప, స్వభావాలతో కనిపిస్తుంది. అదీ నీ సంకల్పానికి లోబడి ఉంటుంది. నీకంటే

గొప్పవారు కానీ నీతో సాటి వచ్చేవారు కానీ మరెవ్వరూ ఉండరు. నీ స్థానం ఎంతో గొప్పది.

ఇలాంటి మహా ఘనుడవైన నువ్వు ఏ దేవదేవును గూర్చి నేర్పరితనంతో తపస్సు చేశావు? ఆ అన్వేషణనంతా వివరించి చెప్పుమా!

శా. అంభోజాసన! నీకు నీశుఁడు గలం డంటేనిఁద తృక్షమం దంభోజాతభవాండ మే విభుని లీలాపాంగ సంభ్రాంతిచే సంభూతం బగు వర్తమాన మగు సంఛన్నం బగుం దద్విభున్ సంభావింపఁగ వచ్చునేఁ దలఁప నే చందంబువాఁ డాకృతిన్?

77

తా॥ ఓ బ్రహ్మ! నీకూ పరమవిభుడు ఇంకొకడు ఉన్నాడా? ఉన్నట్లయితే అతడి కడగంటి విలాసమే ఈ బ్రహ్మాండం పుట్టుకకు కారణమా! ఆ విలాసం వల్లనే ఈ విశ్వం వర్ధిల్లుతూ లయిస్తూ ఉంటుందా! అట్టి వానిని మనస్సులో ఊహించుకోవచ్చునా? అసలు అతడి రూపు ఎలా ఉంటుందో.

క. తోయజసంభవ! నా కీ, తోయము వివరింపు, చాలఁ దోఁచిన నే నా తోయమువారికి నన్యుల, తోయములం జెందకుండ ధ్రువ మెఱిఁగింతున్.

78

తా॥ ఓ పద్మోద్భవా! నాకీ విషయమంతా విశదపరుచు. ఆ వృత్తాంతం బాగా సరైనదని నాకు తోస్తే నేను దాన్ని నా వాళ్ళకు చెప్పగల్గుతాను. అందువల్ల "వాళ్ళు వేరే మార్గాల వైపుకి పయనించరు" అని నొక్కి చెప్పగలను.

వ. దేవా ! భూత భవిష్యద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవ వల్లభుండవు. నీ వెఱుంగని యర్థం బించుకయు లేదు! విశ్వప్రకారంబు వినిపింపు మనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె.

79

తా॥ దేవా! గడచిన గడుస్తున్న గడవబోయే లోకధర్మాలన్నిటికీ నీవే పాలకుడవు. నీకు తెలియని సంగతి మరొకటి అంటూ ఏమీ ఉండదు. ఈ సృష్టి విధానం యావత్తూ నాకు వినిపించు" అని నారదుడు అడగగానే, విప్పారిన ముఖంతో బ్రహ్మ ఇలా చెప్పడం మొదలుపెట్టాడు:

క. రారా బుధులు! విరక్తులు, గారా! యీ రీతి నడుగఁగా నేరరు వి
స్మేరావహము భవన్మత, మౌరా! నా విభుని మర్మ మడిగితి వత్సా!

80

తా॥ "ఓ కుమారా! ఇంతకు మునుపు నా దగ్గరకు జ్ఞానవంతులు రాకుండా ఉన్నారా! వారందరూ విరాగులు కాకుండా ఉన్నారా! కాని, ఈ తీరున వారెవరూ అడగలేకపోయారు. నువ్వు ఆ దైవం మర్మాన్ని గూర్చి ప్రశ్నించావు.

'ఆది విభుని మర్మాన్ని' బోధించే మంత్రాన్ని 'గాయత్రీ' మంత్రం అంటారు. 'సో–హం' అనే గానం నుంచి పుట్టి పై శ్వాస, కింది శ్వాసలతో బోధించబడుతుంది కనుక దీనికి ఈ పేరు ఏర్పడింది. 'గానం చేస్తే రక్షించేది' అని దీని వ్యుత్పత్తి. 'సో–హం' అనే మంత్రం భగవంతుడి లీలావతారాల్లోని హంసావతారం. ఈ మంత్రవిద్య పలురీతుల్లో భగవంతుని వివరించింది. కనుక ఇది భాగవతానికి హృదయం వంటిది.

శా. నానా స్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి
న్నాణం బేమియులేక తొట్రుపడ నిచ్చన్ నాకు సర్వానుసం
ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము
న్నే నా యీశ్వరు నాజ్ఞఁగాక జగముల్ నిర్మింప శక్తుండనే?

81

తా॥ నానారకంగా ఉండే ఈ చరాచర జగత్తు అంతటినీ నాకు నేనుగా సృష్టించేంతటి తెలివి ఏ మాత్రమూ నాకు లేదు. అందువల్ల మొదట్లో చాలా తడబడ్డాను. ఈ సమస్తాన్ని సమన్వయపరుచుకొని, ఈ సృష్టికి యథేచ్ఛగా శ్రీకారం చుట్టగల అవగాహనను ఆ పరమాత్మ ఔదార్యంతో నాకు ప్రసాదించాడు. ముందుగా ఆ దైవం ఆనతి లేకపోతే దీన్ని సృష్టించగల శక్తిని పొందలిగే వాడినే కాను.

మ. అనఘా! విశ్వము నెల్ల దీప్తముగఁ జేయన్ నే సమర్థుండనే?
యినచంద్రానల తారకాగ్రహగణం బే రీతి నా రీతి నె
వ్వని దీప్తిం బ్రతిదీప్త మయ్యె భువనవ్రాతంబు దద్దీప్తిచే
ననుదీప్తం బగునట్టి యాశ్వరున కే నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

82

తా॥ పుణ్యవర్తనుడా! నేను ఈ లోకాన్నంతటినీ వెలిగింప చేసేంతటి శక్తిమంతుణ్ణి కాను. సూర్యుడూ, చంద్రుడూ, అగ్ని, నక్షత్రాలూ, గ్రహాలూ, చిన్న చుక్కలవలెనే ఈ లోకం అంతా పరమాత్మ కాంతిని అనుసరించి వెలుగొందుతుంటుంది. అలాంటి ఈశ్వరునికి ఎల్లవేళలా మొక్కుతూనే ఉంటాను.

ఈ సృష్టి అంతా భగవత్ సృష్టే. అది బ్రహ్మకూ అంతుబట్టనిదే అని భావం. మన ముందున్న పనిని ఎలా చేయాలి? అనే ఆలోచన కన్న, ఎలా నిర్వహించాలి? అనే ప్రసక్తి ముఖ్యం అనేది దీని సందేశం.

మ. వినుమా యాశ్వరు దృష్టిమార్గమున నావేశింప శంకించి సి
గ్గున సంకోచము నొందు మాయవలనం గుంఠీభవత్ప్రజ్ఞచే
నను లోకేశ్వరుఁడంచు మ్రొక్కు మతిహీనవ్రాతముం జూచి నే
ననిశంబున్ నగి ధిక్కరింతు హరిమాయాకృత్య మంచున్ సుతా!

తా॥ విను, ఈశ్వరుడి నుంచి పుట్టిన మాయ అతను బుద్ధియందు ప్రవేశించడానికి సందేహించింది. సిగ్గుతో ముడుచుకునిపోయింది. ఆ మాయకు లొంగి ప్రజ్ఞను కోల్పోయిన వారు నన్నే జగద్గురువు అనుకొని అదే పనిగా దండాలు పెడ్తుంటారు. నాయనా! ఈ బుద్ధిహీనులను చూసి ఇది నేను హరి మాయగా భావించి, నాలో నేనే నవ్వుకుంటాను. నేను ఆ మొక్కుల్ని, ఎన్నడూ స్వీకరించను.

ఎవరైనా తనలో లేని మాహాత్మ్యాన్ని తనదిగా ఆపాదించి ఆదరించేటప్పుడు భాగవతుడు దాన్ని దైవపరం చేయడం ముఖ్యం అని దీని సందేశం. జీవుడుగా పుట్టింది ఆ దైవం మాయవల్లనే కదా!

వ. మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైన కాలంబును, కాలపరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును. వాసుదేవుండ గా నెఱుంగుము. వాసుదేవ వ్యతిరిక్తంబు లేదు. సిద్ధంబు. నారాయణ నియమ్యంబులు లోకంబులు. దేవతలు నారాయణశరీర సంభూతులు. వేద యాగ తపో యోగ విజ్ఞానంబులు నారాయణ పరంబులు. జ్ఞానసాధ్యం బగు ఫలంబు నారాయణు నధీనంబు. కూటస్థుండును సర్వాత్మకుండును సర్వద్రష్టయు నయిన యీశ్వరుని కటాక్ష విశేషంబున సృజియింపంబడి, ప్రేరితుండనై, సృజ్యంబైన ప్రపంచంబు సృజించుచుండుదు. నిర్గుణుండైన యీశ్వరుని వలన రజస్సత్త్వతమోగుణంబులు ప్రభూతంబులై యుత్పత్తి స్థితి లయంబులకుఁ బాలుపడి, కార్యకారణ కర్తృత్వభావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులు, జ్ఞానమూర్తులయిన దేవతలు, గ్రియారూపంబులయిన యింద్రియంబులు, నాశ్రయంబులుగా నిత్యముక్తుండయ్యును మాయాసమన్వితుండైన జీవుని బంధించు. జీవులకు నావరణంబులై యుపాధి భూతంబులయిన మూఁడు లింగంబులంజేసి పరులకు లక్షితంబుగాక తనకు

లక్షితంబైన తత్త్వంబు గల యీశ్వరుం డివ్విధంబునం గ్రీడించుచుండు.

84

తా॥ దేహస్థితికి మంచి ఉపాదానాలు భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశం అనే మహాభూతాలు. వీటి పుట్టుకకు కారణాలై విధిగా చేయదగ్గ కర్మలూ, వాటిని గూర్చి కలవరం పుట్టించే కాలమూ, ఆ కాలంలోని మార్పుకు కారణమైన స్వభావమూ, ఆయా కర్మఫలాలను అనుభవించే జీవుడూ, వాసుదేవుడే అని తెలుసుకో.

ఆ వాసుదేవుడికి భిన్నమైనదేదీ ఉండదు. అది నిశ్చయం. పధ్నాలుగు లోకాలూ ఆ శ్రీహరిచే నియమితమైనవే. సురలంతా ఆ దివ్య స్వరూపుని శరీరం నుంచి పుట్టిన వారే.

వేదాలూ, యాగాలు, తపస్సులూ, యోగాలూ, విజ్ఞానం ఇవన్నీ నారాయణుడికి చెందినవే. తెలివివల్ల సిద్ధించేదంతా ఆ విష్ణువుకి లోబడి ఉండేదే.

సర్వాంతర్యామి, సర్వాత్ముడు, అన్నిటికి సాక్షీభూతుడూ ఆ పరమేశ్వరుడే. అతడి అనుగ్రహం వల్ల ప్రేరితుడనై అతడు దీపింపజేస్తున్న ప్రపంచాన్ని నేను సృష్టిస్తూ ఉంటాను.

శరీరధారియై ఉన్నా గుణరహితుడైన ఈశ్వరుడి నుంచి సత్వరజస్తమో గుణాలు కలుగుతుంటాయి. ఇవి వరుసగా పుట్టుకకు, మనుగడకు, మరణానికి కార్య – కారణ – కర్తృత్వ భావాల్లో సానుకూలం అవుతుంటాయి.

అసలు ద్రవ్యాలైన పంచ మహాభూతాలూ, జ్ఞానమూర్తులైన దేవతలూ, క్రియారూపాలైన ఇంద్రియాలు ఈ మూడింటినీ ఆశ్రయిస్తుంటాయి.

వీటిని హరి ఎప్పుడూ విడిచి ఉండేవాడే అయినా మాయాప్రభావం వల్ల ఈ మూడు గుణాలు జీవుణ్ణి కట్టి పడవేస్తాయి. జీవుడి చుట్టూ అల్లుకుని ఆవరించి ఉన్న ఈ మూడూ హేతువులవడం వల్ల అతడి స్వరూపాన్ని ఇతరులు గుర్తించలేరు.

తనకు మాత్రమే గోచరించే గుణం ఉండే పరమేశ్వరుడు ఇలా విహరిస్తుంటాడు.

క. ఆ యీశుఁ డనంతుఁడు హరి, నాయకుఁ డీ భువనములకు, నాకున్, నీకున్, మాయకుఁ బ్రాణివ్రాతము, కే యెడలన్ లేఁడు నీశ్వరేతరము సుతా!

85

తా॥ "నాయనా! ఆ పరమాత్ముడికి అంతం లేదు. ఈ సమస్త లోకాలకూ, నాకూ నీకూ, మాయకూ, సర్వజీవకోటికీ, శ్రీహరే నాయకుడు. ఇతడికంటే మరొకటి ఏదీ ఈ భూప్రపంచంలో ఉండనే ఉండదు.

వ. వినుము, మాయావిభుండైన యీశ్వరుండు దన మాయంజేసి దైవయోగంబునం బ్రాప్తంబులయిన కాలజీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి గైకొనియె. ఈశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబు వలనఁ నగు కాలంబున గుణవ్యతికరంబును స్వభావంబున బరిణామంబును జీవాదృష్టభూతంబయిన కర్మంబున జన్మంబును నయ్యె. రజస్సత్త్వంబులచే నుపబృంహితంబై వికారంబు నొందిన మహత్తత్త్వంబువలనం, దమఃప్రధానంబై దివ్యజ్ఞాన క్రియాత్మకంబగు సహంకారంబు గలిగె. నదియు రూపాంతరంబు నొందుచు ద్రవ్యశక్తియైన తామసంబును క్రియాశక్తియైన రాజసంబును, జ్ఞానశక్తియైన సాత్త్వికంబును నన మూఁడు విధంబులయ్యె. అందు భూతాదియైన తామసాహంకారంబు వలన నభంబు కలిగె. నభంబునకు సూక్ష్మరూపంబు ద్రష్టదృశ్యములకు బోధకంబైన శబ్దంబు గుణంబగు. నభంబువలన వాయువు గలిగె. వాయువునకుం బరాన్వయంబున శబ్దంబు స్పర్శంబు నను రెండు గుణంబులు గలిగియుండును. అది దేహంబునం దుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియ మనశ్శరీర పాటవంబులైన యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు. వాయువు వలన రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబులు మూఁటితోడఁ దేజంబు గలిగె. దేజంబువలన రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు నాలుగు గుణంబులతోడ జలంబు గలిగె. జలంబువలన గంధ

రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబు లయిదింటితోడం బృథివి గలిగె. వైకారికంబైన సాత్త్వికాహంకారంబు వలనఁ జంద్ర దైవతంబయిన మనంబు గలిగె. మఱియు దిక్కులు, వాయువు, అర్కుండు, ప్రచేతస్సు, అశ్వినులు, వహ్ని, ఇంద్రుండు, ఉపేంద్రుండు, మిత్రుండు ప్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగిరి. తైజసంబైన రాజసాహంకారంబు వలన దిగ్దైవతంబైన శ్రవణేంద్రియంబు, త్వగింద్రియంబును, సూర్యదైవతంబైన నయనేంద్రియంబు, ప్రచేతోదైవతంబైన రసనేంద్రియంబును, అశ్వినీదైవతంబైన ఘ్రాణేంద్రియంబును, వహ్నిదైవతంబైన వాగింద్రియంబు, ఇంద్రదైవతంబైన హస్తేంద్రియంబును, ఉపేంద్ర దైవతంబైన పాదేంద్రియంబును, మిత్ర దైవతంబైన గుదేంద్రియంబును, బ్రజాపతి దైవతంబైన గుహ్యేంద్రియంబును ననియెడి దశేంద్రియంబులును, బోధజనకాంతఃకరణైక భాగంబయిన బుద్ధియుఁ, క్రియాజనకాంతః కరణంబయిన ప్రాణంబునుం గలిగె. ఇట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వేర్వేఱుగఁ (బ్రహ్మాండ శరీర నిర్మాణంబునంద సమర్థంబు లగునపుడు గృహనిర్మాణంబునకుం బెక్కు పదార్థంబులు సంపాదించినంగాని చాలని చందంబున భూతేంద్రియ మనోగుణంబులవలన గృహంబుకైవడి భగవచ్ఛక్తి ప్రేరితంబు లగుచు నేకీభవించి సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి) చేతనాచేతనంబులం గల బ్రహ్మాండంబు కల్పితంబయ్యె. అట్టి యండంబు వర్షాయుత సహస్రాంతంబు దనుక జలంబునందుండె. (కాల కర్మ స్వభావంబులం దగులువడక సమస్తంబును జీవయుక్తంబుగఁ జేయు నీశ్వరుం డచేతనంబును సచేతనంబుగ నొనర్చె) అంత గాలకర్మస్వభావ ప్రేరకుండయిన పరమేశ్వరుండు జీవరూపంబున మహావరణ జలమధ్య స్థితంబయిన బ్రహ్మాండంబు లోను చొచ్చి సవిస్తరంబు గావించి (యట్టి యండంబు భేదించి నిర్గమించె నెట్లంటేని.)

86

తా॥ వినుము. ఆ పరమదైవం మాయకు పాలకుడు. తన మాయ వల్ల, దైవస్థానం వల్ల

లభించిన కాలం, జీవుడు, అదృష్టము (కర్మము), స్వభావం అనే మూడు అంశాలతో వివిధ రకాలుగా సృష్టింపచేయాలని గట్టిగా ఒక నిశ్చయానికి వచ్చి, ఆ పనికి పూనుకొన్నాడు.

ఈశ్వరుడు ఆశ్రయించిన తత్త్వం 'మహత్తు'. దాని వల్ల కాలాన్నీ, దాని నుంచి ఒకటొకటిగా గుణాల్నీ మేళవించాడు. స్వభావానికి రూపమిచ్చి, దానిని సృష్టిగా మలచాడు. జీవుడి పుణ్యపాపరూపమైన కర్మ (అదృష్టం) నుంచి 'జన్మ' ను కల్గించాడు.

ఆ మహత్తత్త్వం రజోగుణం, సత్త్వగుణాలతో విస్తరించి, వైకారికమైన రూపు పొందింది. అందువల్ల 'అహంకారం' ఏర్పడింది. ఇది తమోగుణం ప్రధానంగా గలది. ఇది పంచమహాభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలతో కూడినది. ఆ అహం కూడా ద్రవ్యశక్తి గల 'తామసం', క్రియాశక్తి గల 'రాజసం' అనీ, జ్ఞానశక్తి గల 'సాత్త్వికం' అనీ మూడు రూపాంతరాలు పొందింది.

వీటిలో (ఈ మూడిట్లో) పంచభూతాల సృష్టికి మూలం అయింది తామస అహం. దీని వికృతి 'ఆకాశం' గా ఏర్పడింది. దీని గుణం శబ్దం. ఈ శబ్దం చాలా సూక్ష్మరూపం కలిగి ఉంది. ఇది పరిశీలించి చూసి, తెలుసుకొనుము.

ఆకాశం నుంచి 'వాయువు' ఏర్పడుతుంది. దీనికి కారకమైన ఆకాశంతో పొందిక వల్ల 'శబ్దం, స్పర్శ' అనే రెండు గుణాలు కలిగి ఉంటుంది. ఇది శరీరంలో 'ప్రాణ' రూపంలో ఉంటుంది. ఈ వాయువు నందు ఇంద్రియాల ఆరోగ్యం, మానసికశక్తి, దేహపుష్టి ఉంటాయి. ఇవి ఓజస్సు, జీవశక్తి, బలం అనే వాటికి హేతువులై ప్రవర్తిల్లుతాయి. వాయువు నుంచి తేజస్సు ఏర్పడుతుంది. రూపం, స్పర్శం, శబ్దం అనేవి దాని గుణాలు.

తేజస్సు నుంచి జలం ఏర్పడుతుంది. రసం, రూపం, స్పర్శం శబ్దం అనేవి దీని గుణాలు. జలం నుంచి భూమి ఏర్పడుతుంది.

గంధం, రసం, రూపం, స్పర్శం, శబ్దం అనే అయిదూ దీని గుణాలు, ఈ అన్నింటికీ తామసాహంకారం మూలం.

సాత్త్వికాహంకారం వికారానికి లోనైనప్పుడు మనస్సు పుట్టింది. దీని దైవం చంద్రుడు.

ఇంకా ఈ అహం నుంచి దిక్కులూ, వాయువూ, సూర్యుడూ, వరుణుడూ, అశ్వినీ దేవతలూ, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మిత్రుడు, ప్రజాపతి అని పదిమంది దేవతలు పుట్టారు.

రాజసాహంకారం తేజస్సుకి సంబంధించింది. దీన్నుంచి పది ఇంద్రియాలు ఏర్పడ్డాయి. వీటికి మూలం సాత్త్వికాహంకార దేవతలు పదిమంది. త్వక్కుకు దిక్కు, నాలుకకు సూర్యుడు, ముక్కుకు అశ్వినీ దేవతలు, చేయికి అగ్ని, పాదానికి ఉపేంద్రుడు, గుదానికి మిత్రుడు, మర్మాంగానికి ప్రజాపతి దేవతలు.

ప్రజ్ఞను పుట్టించే లోపలి ఇంద్రియాల్లో ఒకటి బుద్ధి. క్రియను పుట్టించే లోపలి ఇంద్రియం ప్రాణం. ఇలాంటి శ్రోత్రం మొదలుగా గల పది జ్ఞానేంద్రియాలతో కూడిన పంచభూతాల, పంచేంద్రియాల, మనస్సుల గుణాలు అనే వస్తుసంచయం ఉన్న ఇవి వేటికి వాటిగా విడివిడిగా ఉండటం వల్ల బ్రహ్మాండపు శరీరాన్ని రూపొందించే సామర్థ్యం లేనివయ్యాయి.

గృహనిర్మాణానికి ఎన్నో వస్తువుల సంపాదనం అవసరమైనట్లు పంచభూతాల, పంచేంద్రియాల మనస్సుల గుణాలతో కట్టుకున్న ఇల్లు లాగా, ప్రాకృతిక శక్తి ప్రేరేపణలతో అన్నీ ఏకీకృతమైనాయి. వీటిని వీటి మొత్తంగానూ, విడిగానూ సమ్మతించి, చేతన అచేతన రూప బ్రహ్మాండాన్ని సృజించేవి అయ్యాయి. అలా ఏర్పడ్డ బ్రహ్మాండం కోట్ల కొద్దీ ఏళ్ళదాకా నీళ్ళలోనే ఉండిపోయింది. కాల కర్మ స్వభావాలలో చిక్కుకు పోకుండా అన్నింటినీ ప్రాణవంతం చేసే ఆ పరమాత్మ జీవం లేనిదాన్ని జీవవంతం చేశాడు. కాలకర్మలకు, ఆ మీదట గుణాలకు, ప్రేరకుడైన ఆ దివ్యాత్ముడు జీవరూపంలో చక్కగా చుట్టూ చుట్టుకుని ఉన్న నీళ్ళలో పడి ఉన్న బ్రహ్మాండంలోకి చొరబడి, వాటిని బాగా విస్తరింప చేశాడు. ఆ తర్వాత అండాన్ని బద్దలు చేసి

బయటపడ్డాడు. అది ఎలా జరిగిందంటే –

క. భువనాత్మకుఁ డాయీశుఁడు, భవనాకృతితోడ నుండు బ్రహ్మాండంబున్ వివరముతోఁ బదునాలుగు, వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్.

87

తా॥ ఆ ఈశుడు జగదాకారుడు. తన భవంతిలా ఉండే బ్రహ్మాండాన్ని విపులమైన పధ్నాలుగు లోకాలుగా రంధ్రాలు చేశాడు.

మ. బహుపాదోరుభుజాననేక్షణశిరఃఫాలశ్రవో యుక్తుఁడై విహరించున్ బహుదేహి దేహగతుఁడై, విద్వాంసు లూహించి త ద్బహు రూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు, రా మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యుండు మేధానిధీ!

88

తా॥ ఓ మేధావంతుడా! బహురూపాలు దాల్చిన ఆ పరమయోగి ఎన్నో పాదాలు, ఎన్నో తొడలు, ఎన్నో భుజాలు, ఎన్నో ముఖాలు, ఎన్నో నేత్రాలు, ఎన్నో శిరస్సులు, ఎన్నో నొసళ్ళు, ఎన్నో చెవులతో కూడి ఉంటాడు. ఎంతోమంది జీవుల శరీరాలలో ఇన్ని రూపాల్లో సంచరిస్తుంటాడు. ఇతడి శరీరావయవాల్లోని పధ్నాలుగు లోకాల ఐశ్వర్యాన్ని గూర్చి విద్యాంసులు భావించి, అనేక రీతుల్లో దృష్టిసారిస్తారు. ఆయన మహామహితాత్ముడు. అందువల్ల ఆ మునిపుంగవుల మనస్సుల్లో అర్చనీయుడు, ఆశ్చర్యరూపుడు అయ్యాడు.

వ. వినుము. చతుర్దశలోకంబులందు మీఁది యేడు లోకంబులు, శ్రీమహావిష్ణువునకుం గటిప్రదేశంబున నుండి యూర్ధ్వదేహ మనియును, క్రింది యేడు లోకంబులు జఘనంబునుండి యధోదేహ మనియునుం బలుకుదురు. ప్రపంచ శరీరుండగు భగవంతుని ముఖంబువలన బ్రహ్మకులంబును, బాహువులవలన క్షత్త్రియకులంబును, ఊరువులవలన వైశ్యకులంబును, పాదంబులవలన శూద్రకులంబును జనియించెనని

చెప్పుదురు; భూలోకంబు గటి ప్రదేశంబు, భువర్లోకంబు నాభి, సువర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జనలోకంబు గ్రీవంబు, తపోలోకంబు స్తనద్వయంబు, సనాతనంబును బ్రహ్మనివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, జఘన ప్రదేశం బతలంబు, తొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు తలాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, పాదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబు నని (లోకమయుంగా) భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబువలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబువలన స్వర్లోకంబును గలిగెనని లోకకల్పనంబు నెన్నుదురు. పురుషోత్తముని ముఖంబువలన సర్వజంతు వాచాజాలంబును, తదధిష్ఠాతయగు వహ్నియు నుదయించె! చర్మరక్తమాంస మేదశ్శల్య మజ్జాశుక్లంబులు సప్తధాతువు లందురు! పక్షాంతరంబున రోమ త్వఙ్మాంసాస్థి స్నాయుమజ్జా ప్రాణంబులును సప్తధాతువులని యందురు. అందు రోమంబు లుష్ణిక్ఛందంబనియుఁ. ద్వక్కు ధాత్రీఛందం బనియు, మాంసంబు త్రిష్టుప్ఛందం బనియు, స్నాయు వనుష్టుప్ఛందం బనియు, నస్థి జగతీఛందం బనియు, మజ్జ పంక్తిచ్ఛందం బనియుఁ, బ్రాణంబు బృహతీఛందం బనియు నాదేశింతురు. హవ్యకవ్యామృతాన్నంబులకు, మధురాది షడ్రసంబులకు రసనేంద్రియంబునకు, రసాధీశ్వరుండైన వరుణునికిని హరిరసనేంద్రియంబు జన్మస్థానంబు. సర్వప్రాణాదులకు వాయువునకు విష్ణునాసికా వివరంబు నివాసంబు. సమీప దూరవ్యాపి గంధంబులకు, నోషధులకు, నశ్వినీదేవతలకు భగవంతుని ఘ్రాణేంద్రియంబు నివాసంబు; దేవలోక సత్యలోకంబులకుఁ, దేజంబునకు, సూర్యునికి, సకలచక్షువులకు లోకలోచనుని చక్షురింద్రియంబు స్థానంబు; దిశలకు, నాకాశంబునకు, శ్రుతిభూతంబులైన యంశంబులకు, శబ్దంబునకు సర్వేశ్వరుని కర్ణేంద్రియంబు జన్మస్థానంబు. వస్తుసారంబులకు, వర్ణనీయ భాగ్యంబులకుఁ బరమ పురుషుని గాత్రంబు భాజనంబు. స్పర్శంబునకు, వాయువునకు, సకలస్నిగ్ధత్వంబులకు దివ్యదేహుని దేహేంద్రియంబులు గేహంబు! యూప ప్రముఖ యజ్ఞోపకరణసాధనంబులగు తరుగుల్మ లతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు. శిలాలోహంబులు సర్వమయుని నఖంబులు.

మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు. మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు. భూర్భు వస్సువ ర్లోక రక్షకులైన లోకపాలకుల పరాక్రమంబులకు భూరాదిలోకంబుల క్షేమంబునకు, శరణంబునకు నారాయణుని విక్రమంబులు నికేతనంబులు; సర్వకామంబులకు, నుత్తమంబులైన వరంబులకుఁ దీర్ఘపాదుని పాదారవిందంబు లాస్పదంబులు. జలంబులకు, శుక్లంబునకుఁ, బర్జన్యునకుఁ, బ్రజాపతిసర్గంబునకు సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవ నిలయంబు. సంతానంబునకుఁ, కామాది పురుషార్థంబులకుఁ జిత్తసౌఖ్యరూపంబులగు నానందంబులకు, శరీర సౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు. యమునికి, మిత్రునికి, మలవిసర్గంబునకు భగవంతుని పాయ్వింద్రియంబు భువనంబు. హింసకు, నిరృతికి, మృత్యువునకు, నిరయంబునకు నిఖిలరూపకుని గుదంబు నివాసంబు. పరాభవంబునకు, నధర్మంబునకు, నవిద్యకు, ననంతుని పృష్ఠభాగంబు సదనంబు. నదనదీ నివహంబునకు నీశ్వరునినాడీ సందోహంబు జన్మమందిరంబు. పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనకస్థలంబులు. ప్రధానంబునకు, నన్నరసంబునకు, సముద్రంబులకు, భూవలయంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు. మనోవ్యాపార రూపంబగు లింగశరీరంబునకు మహామహిముని హృదయంబు సత్వభూమి యగు, మఱియును.

89

తా॥ వినండి. ఈ పధ్నాలుగు భువనాల్లో మీద ఉన్న ఏడు లోకాలూ విష్ణువు నడుము నుంచి పైన ఉన్న శరీరభాగం. దిగువ నుంచి ఏడు భువనాలు విష్ణువుకి దిగువ ఉండే శరీరభాగం.

ప్రపంచమే ఈ పరమాత్ముడి దేహం. ఆ పురుషుడి నోటి నుంచి బ్రహ్మణకులం, చేతుల నుంచి క్షత్రియకులం, తొడల నుంచి వైశ్యకులమూ, పాదాల నుంచి శూద్రకులమూ పుట్టాయని చెప్తుంటారు.

ఈ మహాపురుషుడి మొల చుట్టూ ప్రదేశం భూలోకం. బొడ్డు భాగం భువర్లోకం.

హృదయం సువర్లోకం. ఎదురు రొమ్ము భాగం మహర్లోకం. మెడ మూలం (కంఠం) జనలోకం. రెండు స్తనాలు తపోలోకం. శిరోభాగం, బ్రహ్మ నివసించే సత్యలోకం. కటిభాగం అతలం. తొడలు వితలం. మోకాళ్ళు సుతలం, పిక్కలు తలాతలం. చీలమండలు మహాతలం. కాలి మునివేళ్ళు రసాతలం. అరికాళ్ళు పాతాళం.

ఈ విధంగా శ్రీమహావిష్ణువును ఊర్ధ్వలోకాలలో వ్యాపించి ఉన్నవానిగా భావిస్తారు.

ఈ లోకకల్పనం గూర్చి మరికొందరు అరికాళ్ళ నుంచి భూలోకం, బొడ్డు నుంచి భువర్లోకం, తలనుంచి స్వర్లోకం పుట్టాయని మూడు లోకాలుగా గణిస్తుంటారు. ఆ మహాపురుషుడి నోటి నుంచి సర్వజీవుల వాగింద్రియాలు, దానికి అధిష్ఠానమైన అగ్నీ పుట్టాయి. చర్మం, రక్తం, మాంసం, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లం అనే ఏడింటిని ఆ దైవానికి సప్త ధాతువులుగా చెప్తుంటారు.

మరొక పక్షంలో రోమాలు, చర్మం, మాంసం, ఎముకలు, సన్నటి నరాలు, మజ్జ, ప్రాణాలను సప్త ధాతువులుగా పేర్కొంటారు. ఈ ఏడింటి నుంచి, అంటే రోమాల నుంచి ఉష్ణిక్కు, చర్మం నుంచి 'ధాత్రి', మాంసం నుంచి 'త్రిష్టుప్పు', స్నాయువుల నుంచి 'అనుష్టుప్పు', ఎముకల నుంచి 'జగతి', మజ్జ నుంచి 'పంక్తి', ప్రాణం నుంచి 'బృహతి' అనే ఏడు ఛందస్సులు పుట్టాయని ఉపదేశిస్తారు.

ఆ విష్ణుమూర్తి నాలుక నుంచి యాగదేవతలకు అర్పించే అన్నం, అపూపాది రూప పురోడాశం (హవ్యం), పితృదేవతలకిచ్చే అన్నం (కవ్యం), అమృతాన్నం, తీపి గుణంగల ఆరురసాలూ, వీటిని చవిచూపగల నాలుక, రసాధిష్ఠాత వరుణుడూ పుట్టారు. సర్వప్రాణుల కదలికలకూ, వాయువుకూ ఆ మహావిష్ణువు ముక్కు పుటాలే స్థావరం.

సామాన్యం గాను, విశేషం గాను, దగ్గర గాను, దూరం గానూ వ్యాపించగల వాసనలకూ, ఓషధులకూ, అశ్వినీ దేవతలకూ నెలవు ఆ మహామూర్తి ఘ్రాణ (వాసనచూసే

శక్తిగల) ఇంద్రియం.

దేవలోకానికీ, సత్యలోకానికీ, తేజస్సుకూ, సూర్యుడికీ సకలజీవుల నేత్రాలకూ స్థానం ఆ లోకలోచనుడి నేత్రం. నాల్గు దిక్కులకూ, ఆకాశానికీ, వినదగిన వాటన్నిటికీ, శబ్దానికీ పుట్టుక ప్రదేశం ఆ సర్వేశ్వరుడి చెవి.

సర్వపదార్థాల సారాలకూ, సకల సౌభాగ్యానికీ పాత్రమైన చోటు ఆ పరమేశ్వరుడి దేహం. స్పర్శకూ, గాలికీ, సర్వ స్నిగ్ధత్వానికీ అంతటికీ ప్రదేశం దివ్యస్వరూపుని చర్మం.

యాగసాధనాలైన చెట్లు, పొదలూ, తీగలూ మొదలైనవాటికి మూలాలు ఆ పురుషోత్తముని రోమాలు. రాళ్ళూ, లోహాలు ఆ సర్వేశ్వరుడి గోళ్ళు. మబ్బుల గుంపులు ఆతని కొప్పు. మెరుపులు అతని మీసాలు.

భూలోక భువర్లోక సువర్లోకాల్ని రక్షించే లోకపాలకులకూ, వాళ్ళ క్షాత్రానికీ, భూలోకాదులయూ, క్షేమానికీ, ప్రపత్తికీ నివాసస్థానాలు ఆ దేవదేవుడి పరాక్రమాలు. అన్ని కాంక్షలకూ, మంచి వరాలకూ, క్షేమానికీ ఆస్పదాలు అతడి పాదాలు.

జలం(నీరు), శుక్లం(వీర్యం), వరుణుడికీ, ప్రజాపతికీ, సృష్టికీ వీటన్నిటికీ జన్మస్థలం ఆ నారాయణుడి పురుషాంగం.

వంశక్రమానికీ, కామం మొదలైన పురుషార్థాలకూ మానసిక సౌఖ్యం కల్గించే ఆనందానికీ, శారీరక సుఖానికీ స్థానం సర్వేశ్వరుడి గుహ్యేంద్రియం.

యముడికీ, మిత్రుడికీ, మల విసర్జనానికీ గేహం ఆ విశ్వమయుని గుదేంద్రియం.

హింసకూ, పెద్దమ్మకూ (జేష్ఠాదేవికీ), చావుకూ, నరకానికీ, ఉనికిపట్టు ఆ అచ్యుతుడి గుదం.

అవమానానికీ, అధర్మానికీ, అజ్ఞానానికీ, చీకటికీ సదనం ఆ అనంతుడి వీపు భాగం. నదీ సమూహాలకు ఆతడి నాడీమండలం పుట్టిల్లు. కొండలకు సన్నిధానాలు ఆతడి ఎముకలు. అవ్యక్తానికీ, అన్నరసానికీ, సముద్రాలకూ, ప్రాణుల ప్రళయానికీ ఉనికి పట్టు ఆతని కడుపు.

మానసిక వర్తనారూప లింగదేహానికి ఉనికి ఆ దేవదేవుడి హృదయం (అంతఃకరణం). మరి ఇంకా విను.

పురుష సూక్తం ప్రకారం బోధన, రక్షణ, పుష్టి, భారం అనే నాల్గు ధర్మాలకూ, రూపాలకూ స్థానాలు నోరు, బాహువులు, తొడలు, పాదాలు. నోటితో బోధించే లక్షణం కలవారు బ్రాహ్మణులు, బాహువులతో రక్షించే ధర్మం కలవారు క్షత్రియులు, తొడలతో పుష్టిని చేకూర్చే ధర్మం కలవారు వైశ్యులు, పాదాలతో భారం వహించే ధర్మం గలవారు శూద్రులు అని సారాంశం. ఈ ధర్మాలు కాలక్రమంలో వృత్తులను బట్టి వంశ క్రమంతో అన్వయించబడ్డాయని పెద్దల భావన.

ఆ. నీలకంధరునకు నీకు నాకు సనత్కు, మారముఖ్య సుతసమాజమునకు ధర్మసత్త్వబుద్ధి తత్త్వములకు నీశ్వ, రాత్మ వినుము పరమమైన నెలవు.

90

తా॥ అంతేకాదు. నీలగళుడైన శివునికి, నీకు, నాకు, సనత్కుమార సనక సనందన సనత్సుజాతులనే పేరుగల నలుగురు ముఖ్య మునికుమారులకు, ధర్మానికీ, సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలకు, బుద్ధీంద్రియాది సమస్తతత్త్వాలకు ఆ వాసుదేవుని విశ్వాత్మరూపమే ఉనికిపట్టు.

సీ. నర సురాసుర పితృ నాగ కుంజర మృగ, గంధర్వ యక్ష రాక్షస మహీజ సిద్ధ విద్యాధర జీమూత చారణ, గ్రహ తారకాప్సరోగణ విహంగ భూత తటిద్వసు పుంజంబులును నీవు, ముక్కంటియును మహామునులు నేను సలిలనభస్థ్సలచరములు మొదలైన, వివిధజీవులతోడి

విశ్వమెల్ల

ఆ. విష్ణుమయము పుత్ర! వేయేల బ్రహ్మాండ, మతని జేనలోన నణఁగి యుండు! బుద్ధి
నెఱుఁగరాదు భూతభవద్భవ్య, లోకమెల్ల విష్ణులోన నుండు.

91

తా॥ కుమారా! మనుష్యులు, అమరులు, అసురులు, పితరులు, పాములూ, ఏనుగులూ, లేళ్ళు, మృగాలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, వృక్షాలు, సిద్ధులు, విద్యాధరులు, మబ్బులు, చరాచరాలు, గ్రహాలు, తారకలూ, తోకచుక్కలు, అప్సరసలు, పిట్టలు, భూతగణాలు, మెరుపులు ఆయా వస్తుసంపదల సముదాయాలు, నీమా(నారదుడు), శివుడూ, మహాయోగులూ, నేనూ(బ్రహ్మ), నీళ్ళల్లో, నేలమీద, ఆకాశంలో తిరుగాడే ప్రాణులూ మొదలుగా గల రకరకాల ప్రాణులు గల ఈ లోకం అంతా విష్ణుమయమే. వేలమాట లెందుకు! బ్రహ్మాండం అంతా అతడి జేన (12 అంగుళాలు) ప్రమాణంలోనే పొందుపడి ఉంటుంది. అతణ్ణి బుద్ధితో తెలుసుకోలేం. జరిగిపోయిన, జరుగుతున్న, జరగబోయే లోకం అంతా విష్ణువులోనే లీనమై ఉంటుంది.

క. మండలములోన భాస్కరుఁ, డుండుచు జగంబులకు దీప్తి నొసఁగెడి క్రియ, బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ, డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్.

92

తా॥ సూర్యుడు తన పరివేషంలో ఉంటూనే లోకాలన్నింటికి వెలుగును నింపుతాడు. అట్లాగే అచ్యుతుడు, బ్రహ్మాండం లోపల ఉంటూనే లోపలా బయటా వెలుగులు నింపుతాడు.

ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందు నేఁ
బుట్టి యజింపఁగా మనసు పుట్టిన యజ్ఞపదార్థజాతముల్
నెట్టన కానరామికి వినిర్మల మైన తదీయ రూపమున్
గట్టిగ బుద్ధిలో నిలిపి కంటి నుపాయము నామనంబునన్.

తా॥ అలాంటి అంతులేని శక్తి సామర్థ్యం గల లోకాత్ముని బొడ్డు నుంచి ఒక తామరపూవు పుట్టింది. దాని నుంచి నేను(బ్రహ్మ) పుట్టాను. నాకు యాగం చేయాలనే బుద్ధి పుట్టింది. దానికి ఉపయోగించే కొద్దిపాటి యాగ సామగ్రి అయినా గోచరించలేదు. అప్పుడు ఆ పరిశుద్ధాత్మ రూపాన్ని బుద్ధినుంచి చెదిరిపోనీయకుండా ప్రతిష్ఠించుకున్నాను. నా మనస్సులోపల ఒక ఉపాయమూ తట్టింది.

సీ. పశుయజ్ఞవాట యూపస్తంభ పాత్ర మృద్ఘట శరావ వసంత కాలములును స్నేహౌషధీ బహుళోహచాతుర్హోత్ర, మత నామధేయ సన్మంత్రములును సంకల్ప ఋగ్యజు స్సామ నియుక్త వ, షట్కారమంత్రానుచరణములును దక్షిణల్ దేవతాద్య నుగత, తంత్రవ్రతోద్దేశ ధరణీసురోత్తమాదు

తే. లర్పణంబులు బోధాయనాదికర్మ సరణి మొదలగు యజ్ఞోపకరణ సమితి యంతయును న మ్మహాత్ముని యవయవములు, గాంచఁ గల్పించి విధివత్ప్రకారముననుం.

94

తా॥ యాగపశువులు, యాగవేదిక, యూపస్తంభం, యాగపాత్రలూ, మట్టికుండలు, మూకుళ్ళు, వసంతకాలం, నెయ్యి, ఓషధులు, ఎన్నో మహాపాత్రలు, నాలుగు వేళల్లో హోతృకర్మలు, వాటి మత సంప్రదాయాలు, జ్యోతిష్టోమాది నామాలు, సంకల్పాలు, ఋగ్యజుస్సామ వేదాలలోని వషట్కార స్వాహాకారాది మంత్రాలు, మంత్రోచ్చారణలు, కానుకలు, దేవతాధ్యానం, వీటి ననుసరించిన అనుష్ఠానాలు, వ్రతాలు, వాటి విధానాలు, బ్రాహ్మణులు, సమర్పణలు, బోధాయన మహర్షి కల్పసూత్రాల ధర్మవిధానం మొదలైన యాగసాధనాలన్నిటిని, ఆ పరమాత్ముడి అవయవాలుగా సృజించగలిగాను. తర్వాత శాస్త్రం చెప్పిన విధాన్ని అనుసరించి—

క. యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు, యజ్ఞేశుఁడు యజ్ఞకర్త యగు భగవంతున్ యజ్ఞపురుషుఁగా
మానస, యజ్ఞముఁ గావించితిం దదర్పణబుద్ధిన్.

95

తా॥ యజ్ఞదేహుడు, యాగఫలదాత, యాగాధీశ్వరుడు, యజ్ఞకర్త అయిన ఆ విశ్వాత్ముణ్ణే నా మానస యజ్ఞానికి యాగపురుషుడిగా కల్పించాను. ఆ యజ్ఞాన్ని అతడికే సమర్పించాను.

క. అప్పుడు బ్రాహ్మణులెల్లం, దప్పక ననుఁ జూచి సముచితక్రియు లగుచో నప్పరమేశున
కభిమత, మొప్పఁగఁ దగ సప్తతంతువును గావింపన్.

96

తా॥ ఆ యాగ సమయంలో బ్రహ్మలంతా(యాగం చేసేవారు) తమలో నన్ను(బ్రహ్మను) చూసుకుని తప్పక తలపెట్టాల్సిన చక్కటి యాగక్రియలు కలవారయ్యారు. ఆ విష్ణువుకు ప్రీతి కలిగించగల సప్తతంతువనే యాగ క్రియల్ని చేపట్టారు.

ఏడులోకాలూ ఆ పరాత్పరుడి నుంచి పుట్టించే ఒక యాగ ప్రక్రియను సప్తతంతువు అంటారు.

చ. మనువులు, దేవదానవులు, మానవనాథులు, మర్త్యకోటి, దా
రనయము వారివారికిఁ బ్రియంబగు దేవతలన్ భజించుచున్,
ఘనతరనిష్ఠ యజ్ఞములఁ గైకొని చేసిరి, తత్ఫలంబు ల
య్యనుపమమూర్తి యజ్ఞమయుఁడైన రమావరునందుఁ జెందఁగన్.

97

తా॥ ఈ సప్తతంతు యాగంలో మనువులూ, దేవతలూ, దానవులూ, రాజులూ, మానవులూ పుట్టి ఎవరికి ఇష్టమైన దేవతలను వాళ్ళు నిత్యం సేవించుకున్నారు. ఎంతో

నియమంగా యాగక్రియల్ని ఆచరించారు. ఆ యాగ ఫలాలను యజ్ఞమయుడు, అనుపమమూర్తి అయిన ఆ మహావిష్ణువుకే సమర్పించారు.

క. సువ్యక్త తంత్రరూపకుఁ, డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డచ్యుతుఁ డీశుం డవ్యయుఁ డగు హరి సురగణ, సేవ్యుఁడు క్రతుఫలదుఁ డగుటఁ జేసిరి మఖముల్.

98

తా॥ ఈ మనువు మొదలైన వాళ్ళంతా వరుసపెట్టి యాగాలకు ఉపక్రమించడానికి మూలం విష్ణుతత్త్వమే. ఆ విష్ణుమూర్తి యజ్ఞరూపంలోనే సువ్యక్తమయ్యాడు. ఆయన వ్యక్తరూపం ఇదీ అని సంపూర్ణంగా తెలుసుకోవడం అసాధ్యం కనుక ఆయనను అవ్యక్తుడన్నారు. తుది లేనివాడు, జన్మరహితుడు, నశించనివాడు, ఈశ్వరుడు, అవ్యయుడు, దేవతలందరిచేతా ఆరాధనీయుడు, యాగఫలాన్ని ప్రసాదించేవాడు ఆయనే.

క. అగుణుండగు పరమేశుఁడు, జగములఁ గల్పించుకొఱకుఁ జతురత మాయా సగుణుం డగుఁ గావున హరి, భగవంతుం డనఁగఁ బరఁగె భవ్యచరిత్రా!

99

తా॥ శుభచరిత్రా! గుణరహితుడైన ఆ పరమాత్మ ఈ లోకాన్ని నిర్మించడం కోసం ఎంతో చాకచక్యంగా 'మాయ' ను సృష్టించాడు. ఆ మాయవల్లనే అతడు గుణసహితుడై భగవంతుడయ్యాడు.

క. విశ్వాత్ముఁడు, విశ్వేశుఁడు, విశ్వమయుం, డఖిలనేత, విష్ణుఁ, డజుం డీ విశ్వములోఁ దా నుండును, విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు నుండన్.

100

తా॥ ఆ విష్ణువు జగత్తే ఆత్మగా కలవాడు. ప్రపంచానికి ఈశుడు, విశ్వమంతా

ఉండేవాడు, లోకమంతటికీ నాయకుడు, పుట్టుక లేనివాడు. అతడు ఈ విశ్వం అంతటా తానుగా ఉంటాడు. అతడిలో ఈ విశ్వం అంతా తేజరిల్లుతూ ఉంటుంది.

చ. అతని నియుక్తిఁ జెంది సచరాచరభూత సమేతసృష్టి నే
వితతముగా సృజింతుఁ, బ్రభవిష్ణుఁడు జిష్ణుఁడు ప్రోచుఁ, బార్వతీ
పతి లయ మొందఁజేయు, హరి పంకరుహోదరుఁ డాదిమూర్తి య
చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁ డగుచుండు నిటింతకుఁ దాన మూలమై.

101

తా॥ అతడు నియమించడాన్ని బట్టి నేను(బ్రహ్మ) స్థావర జంగమాత్మకమైన ప్రాణులతో ఈ సృష్టిక్రమాన్ని విస్తరింప చేస్తుంటాను. విష్ణువు, పుట్టినవాటిని పెంచే స్వభావంతో సుస్థితిని కలిగించి రక్షిస్తుంటాడు. పార్వతీపతి శివుడు గిట్టింప చేస్తుంటాడు. పద్మాన్ని తన నాభియందు ధరించిన మొదటి వేలుపు విష్ణువు. సృష్టి స్థితి లయాలనే మూడు శక్తులు కూడి ఉన్నవాడు. ఈ సమస్తానికీ తానే మూలభూతమైన వాడు.

శ్రీ మహావిష్ణువు అంతరంగాన్ని అనుసరించి ఈ ప్రపంచాన్ని, జీవులను సృష్టించటమే నా విధి. ఆ తండ్రే సమస్తజీవుల మనుగడకు, వాటి అభివృద్ధికి ఆధారం. ఇక గరళకంఠుడు జీవుల కర్మానుసారం వాటి మరణాన్ని శాసిస్తాడు. సృజన, జీవనం, మరణం ఈ మూడు గుణాలూ ఆ జగత్పతీ, సర్వమయుడు అయిన కమలనాభుని లోనివే! అతడే వీటికి మూలం, ఆధారం.

క. విను వత్స! నీవు నన్నడి, గిన ప్రశ్నకు నుత్తరంబు కేవల పరమం బను బ్రహ్మం బీ
యఖిలం, బున కగు నాధారహేతుభూతము సుమ్మీ!

102

తా॥ నాయనా! విను. నువ్వు నన్ను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్తాను. ఈ సమస్త ప్రపంచానికీ ఆధారభూతమైనది కేవలం పరమమైన బ్రహ్మమే సుమా!

క. హరి భగవంతుఁ డనంతుఁడు, కరణాంబుధి సృష్టికార్యకారణ హేతు స్ఫురణుం డవ్విభుకంటెం, బరుఁ డెవ్వఁడు లేఁడు తండ్రి! పరికింపంగన్

103

తా॥ శ్రీహరి ఐశ్వర్య వీర్య యశః శ్రీ జ్ఞాన వైరాగ్యాది సమస్తశక్తులూ కలవాడు, అంతులేనివాడు, కరుణాసముద్రుడు, సృష్టి కార్యకారణాలకు లక్షణభూతమైనవాడు. పరికించి చూస్తే, ఆ అధిపుని కంటే మరొకడు కనపడడు. మరొకటి అగుపడదు.

సీ. ఇది యంతయును నిక్క మే బొంక నుత్కంఠ, మతిఁ దద్గుణ ధ్యానమహిమఁ జేసి పరికింప నే నేమి పలికిన నది యెల్ల, సత్యంబ యగు బుధస్తుత్య! వినుము ధీయుక్త మామకేంద్రియములు మఱచియుఁ, బొరయ వసత్యవిస్ఫురణ మెందు! నదిగాక మత్తను వామ్నాయ తుల్యంబు, నమరేంద్రవందనీయంబు నయ్యెఁ,

తే. దవిలి య ద్దేవదేవుని భవమహాబ్ధి, తారణంబును మంగళకారణంబు నఖిలసంపత్కరంబునై యలరు పాద, వనజమున కే నొనర్చెద వందనములు.

104

తా॥ ఇంత దాకా చెప్పినదంతా నిజం. నేను అబద్ధం ఆడను. పండితుల ప్రశంసలనందుకునే ఓ నారదా! వినుము. చాలా ఉత్కంఠగా ఆ భగవంతుడి గుణాలను ధ్యానించాను. ఆ ప్రభావంతో నేను నా నోటితో పలికిన ప్రతి వాక్కు సత్యవాక్కు అవుతుంది.

ఓ బుద్ధిమంతుడా! పొరబడినప్పుడు కూడా నా ఇంద్రియాలు తప్పుదారి పట్టవు. నా శరీరం వేదమయం. ఇంద్రుడికి కూడా పూజనీయమైనది.

ఆ దేవదేవుడి పాదకమలం సంసారమనే మహాసముద్రాన్ని దాటిస్తుంది. శుభావహమైనది. సకల సంపత్తి దాయకమైనది. అలాంటి పాదాలకు నేను మొక్కుతున్నాను.

ఉ. ఆ నళినాక్షు నందనుఁడ నయ్యుఁ, బ్రజాపతి నయ్యు, యోగ వి
ద్యానిపుణుండ నయ్యును, బదంపడి మజ్జనన ప్రకారమే
యేను నెఱుంగ, నవ్విభుని యిద్ధమహత్త్వ మెఱుంగ నేర్తునే?
కానఁబడున్ రమేశపరికల్పిత విశ్వము గొంతకొంతయున్.

105

తా॥ నేను విష్ణుపుత్రుడినే, సృష్టికర్తనే, అష్టాంగ యోగ సాధనలో నిపుణుడనే. అయినా తరచి చూసుకుంటే నేనెలా పుట్టానో నాకు తెలియదు. ఆ పరాత్పరుడి ప్రభావ మహిమ తెలుసుకోవడం నా తరం కాలేదు. మహా విష్ణువు సృష్టించిన ఈ విశ్వాన్ని కొద్ది కొద్దిగానే కళ్ళచూస్తున్నాను.

దేవుడిలో తనను, తనలో దేవుడిని చూడటం, ఆ తత్త్వాన్ని నిత్యం స్మరించడాన్ని 'యోగం' అంటారు.

మ. విను వే యేటికిఁ దాపసప్రవర! య వ్విశ్వాత్ముఁ డీశుండు దాఁ దన మాయా మహిమాంతముం దెలియఁగాఁ దథ్యంబుదాఁ జాలఁ ద న్నను, నే నైనను మీరలైన సురలైనన్ వామదేవుండు నై నను నిక్కం బెఱుఁగంగఁ జాలుదుమె! జ్ఞాన విక్రియా యుక్తులన్.

106

తా॥ తాపసోత్తమా! వేలకొద్దీ మాటలెందుకు, ఆలకించు, ఆ ఈశ్వరుడు విశ్వాత్ముడు. ఉన్నది ఉన్నట్టుగా తన మాయా వైభవాన్ని, దాని అంతును తానే తెలుసుకోలేకపోతున్నాడు, అని చెప్పినా గాని, నేనైనా గాని, దేవతలైనా గాని, శివుడైనా గాని ఏ పద్ధతిలో గాని, ఏ తెలివితో గాని, ఏ యుక్తితో గాని, ఆయన సత్య స్వరూపాన్ని తెలుసుకోగలమా?

వ. అమ్మహాత్ముండైన పుండరీకాక్షుండు సర్వజ్ఞుం డంటేని.

తా॥ ఆ మహాత్ముడు పద్మాక్షుడు సర్వం ఎరిగిన వాడు అన్నట్లయితే.

క. గగనము దన కడవలఁ దాఁ, దగ నెఱుఁగని కరణి విభుఁడు దా నెఱుఁగఁ దనన్
గగనప్రసవము లే దన, నగునే సర్వజ్ఞతకును హాని దలంపన్.

108

తా॥ ఆకాశానికి తన అంతం (ఆవలి వైపు) తనకు చక్కగా తెలియనట్లు, ఆ విరాట్పురుషుడు తనను గూర్చి తాను తెలుసుకోలేడు. 'ఆకాశ కుసుమాన్ని చూడలేదు' అన్నంత మాత్రాన ఆయన సర్వజ్ఞత్వానికి ఏమీ చెఱుపు రాదు.

తన ఆద్యంతాలను గూర్చి తెలియకపోయినంత మాత్రాన ఆతడి సర్వజ్ఞత్వానికి ఏమీ లోటుండదని భావం.

చ. తలకొని యమ్మహాత్మకుఁడు దాల్చిన యయ్యవతారకర్మముల్
వెలయఁగ నస్మదాదులము వేయి విధంబుల సన్నుతింతు, మ
య్యలఘు ననంతునిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరుం
దెలియఁగ నేర్తుమే! తవిలి దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్.

109

తా॥ ఆ మహాపురుషుడు ప్రయత్నపూర్వకంగా ధరించిన ఆయా అవతారాల్లో నిర్వర్తించిన పనుల్ని గూర్చి మాబోటి వాళ్ళం ఎన్ని రీతులనో గానం చేస్తూ కీర్తిస్తుంటాం. మహత్స్వభావుడు, అంతం లేనివాడు, చేతనాచేతన స్వభావుడూ, ఆద్యుడు, తనకు పై అధికారి లేనివాడు, స్వయంపాలకుడు అయిన ఆ ఆదిదేవుని వాస్తవ తత్త్వాన్ని తెలుసుకోవడం మన వంటి వారికి వీలవుతుందా? ఆ దివ్యవర్తనుడికే నేను నిమగ్నతతో నమస్కరిస్తుంటాను.

మ. పరమాత్మం డజుఁ డీ జగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుఁ దాఁ
బరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్.

110

తా॥ విశ్వాత్మకుడు, జననరహితుడు, ప్రతి కల్పంలోను విశ్వాన్ని సృష్టించేవాడు, పోషించేవాడు నశింప చేసేవాడు, పుణ్యాత్ముడు, వేదమయుడు, నిత్యుడు, పూర్ణుడు, లోకమంతా తానే అయినవాడు, అద్వితీయుడు, పరిశుద్ధజ్ఞానస్వరూపుడు, ప్రతి ఒక్కరిలోను ప్రకాశించేవాడు, అన్నింటికి అధిపతి, తుది మొదలు లేనివాడు, నిర్గుణుడు, శాశ్వత సత్యరూపుడు అయిన విశ్వదేవుణ్ణి నేను ధ్యానిస్తుంటాను.

చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్న శరీరహృషీకమానస
స్ఫురణ గలప్పు డవ్విభుని భూరికళాకలిత స్వరూపముం
దర మిడి చూతు! రెప్పుడుఁ గుతర్క తమోహతిచేత నజ్ఞతన్
బొరసిన యప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొనలేరు నారదా!

111

తా॥ నారదా! ఆనందానుభూతి గల తాపసోత్తములు తమ శరీరాలు, ఇంద్రియాలు, మనస్సు ప్రశాంతంగా ఉంటేనే గొప్ప కళలతో విలసిల్లే ఆ పరమాత్ముని పోలిన విగ్రహాన్ని సాక్షాత్కరించుకోగలరు. చెడు వాదనలతో, అజ్ఞానంతో, తెలియనితనంతో మనస్సు ఆవర్తితమైనపుడు వారు భగవానుని ఆకారాన్ని దర్శించుకోలేరు. త్రికరణ శుద్ధి గల ప్రశాంతత, మానసిక నైర్మల్యం ఉంటేనే యోగులకైనా భగవద్దర్శనం ప్రాప్తిస్తుంది.

వ. అని వెండియు నిట్లను. అనఘా! యమ్మహనీయ తేజోనిధి మొదలి యవతారంబు

సహస్రశీర్షాది యుక్తంబయి ప్రకృతి ప్రవర్తకంబగు నాదిపురుష రూపంబగు. అందుఁ గాలస్వభావంబులను శక్తు లుదయించె; అందుఁ గార్యకారణరూపంబయిన ప్రకృతి జనించెఁ. బ్రకృతివలన మహత్తత్త్వంబును దానివలన నహంకార త్రయంబును బుట్టె. అందు రాజసాహంకారంబువలన నింద్రియంబులును, సాత్త్వికాహంకారంబువలన నింద్రియగుణ ప్రధానంబులైన యధిదేవతలును, తామసాహంకారంబు వలన భూతకారణంబు లయిన శబ్ద స్పర్శరూపరస గంధతన్మాత్రంబులునుం బొడమె. పంచతన్మాత్రంబులవలన గగనానిలవహ్ని సలిల ధరాదికంబైన భూతపంచకంబు గలిగె. అందు జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును, కర్మేంద్రియంబులైన వాక్పాణి పాద పాయూపస్థంబులును మనంబును జనియించె. అన్నింటి సంఘాతంబున విశ్వరూపుండైన విరాట్పురుషుండు పుట్టె. అతని వలన స్వయం ప్రకాశుండయిన స్వరాట్టు సంభవించె. అందుఁ జరాచరరూపంబుల స్థావరజంగమాత్మకంబయిన జగత్తు గలిగె. అందు సత్త్వరజస్తమో (గుణాత్మకుల మయిన విష్ణుండును హిరణ్యగర్భుండ నయిన యేనును రుద్రుండును గలిగితిమి) అందు సృష్టి జననకారణుండయిన చతుర్ముఖుండు పుట్టె. వానివలన దక్షాదులగు ప్రజాపతులు దొమ్మండ్రు గలిగిరి. అందు భవత్ప్రముఖులైన సనకసనందనాది యోగీంద్రులును, నాకలోకనివాసులయిన వాసవాదులును, ఖగలోకపాలకులగు గరుడాదులును, నృలోకపాలకులగు మనుమాంధాతృ ప్రభృతులును, రసాతలలోకపాలకులగు ననంత వాసుకి ప్రభృతులును, గంధర్వ సిద్ధ విద్యాధర చారణసాధ్యరక్షో యక్షోరగ నాగలోకపాలురును, మఱియు ఋషులును, పితృదేవతలును, దైత్యదానవ భూతప్రేతపిశాచ కూశ్మాండ పశుమృగాదులును ఉద్భవించిరి. ఇట్టి జగత్ప్రథమోద్భవంబు మహత్తత్త్వసృష్టి యనంబడు. ద్వితీయం బండసంస్థితం బనం దగుఁ. తృతీయంబు సర్వభూతస్థం బననొప్పు నం దైశ్వర్య తేజోబలసంపన్నులైన పురుషులు సర్వాత్ముండైన నారాయణుని యంశసంభవులుగా నెఱుంగుము. అప్పుండరీకాక్షుని లీలావతారంబు లనంతంబులు, దత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికిని నలవిగాదు, అయినను నాకుం దోఁచినంత నీ కెఱిఁగించెద. వినుము.

తా॥ ఆ తర్వాత బ్రహ్మ ఇలా చెప్పడం మొదలు పెట్టాడు. రాజా! వేయి తలలు మొదలైన అవయవాలతో సహజ స్వభావంతో ప్రవర్తించేది గొప్ప ప్రకాశమానుడైన ఆ ఆదిపురుషుడి తొలి అవతారం.

ఆ అవతారం నుంచే కాలం, కర్మం, స్వభావం అనే మూడు శక్తులు పుట్టాయి. వీటిల్లో నుంచి కార్యకారణాత్మకమైన ప్రకృతి (సృష్టి స్వభావం) ఏర్పడింది. దీని నుంచి 'మహత్తు' అనే తత్త్వం కలిగింది. దాని నుంచి మూడు అహంకారాలు పుట్టాయి. వాటిలో రాజసాహంకారం నుంచి ఇంద్రియాలు, సాత్త్వికాహంకారం నుంచి ఇంద్రియ గుణాలకు అధిష్ఠాన దేవతలు, తామసాహంకారం నుంచి పంచభూతాలకు కారణమైన శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే తన్మాత్రలు జనించాయి. ఈ పంచతన్మాత్రల నుంచి ఆకాశం, గాలి, నిప్పు, నీరు, నేల అనే పంచభూతాలు (భూతాలంటే ఆకారం పొందినవి) ఉత్పన్నమయ్యాయి. వీటినుంచి చర్మం, నేత్రం, చెవి, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియాలు (తెలుసుకొను ఉపయోగించే ఇంద్రియాలు); మాట, చెయ్యి, కాలు, మలావయవం, మూత్రావయవం, మనస్సు అనే కర్మేంద్రియాలూ (పనిచేయడానికి ఉపయోగించే ఉపకరణాలు) ఉదయించాయి. వీటన్నింటసమష్టిగా జగత్స్వరూపుడైన ఆ విరాట్పురుషుడు, అతడి నుంచి తనకుతానే ప్రకాశించే 'స్వరాట్టు' జన్మించారు. అతడి నుంచి కదలీ కదలని వేరువేరు రూపాలతో స్థావర జంగమాత్మకం అయిన ఈ లోకం పుట్టింది.

అందులో నుంచి సత్త్వరజస్తమోగుణాత్మక రూపాల్లో విష్ణువు, హిరణ్యగర్భుడనైన నేను(బ్రహ్మ), శివుడూ పుట్టాం. అందునుంచి సృష్టి, 'ప్రకృతి' ఏర్పడటానికి కారకుడైన నాలుగు ముఖాలు గల బ్రహ్మ ఉదయించాడు. (ఇతడు సృష్టి కారకుడు). ఇతడి వల్ల దక్షుడు మొదలైన ప్రజాపతులు తొమ్మిది మంది పుట్టారు. (ఉత్పత్తికారకులు). అందులో నుంచి నీలాంటి ప్రముఖులు, సనక సనందనులు మొదలైన యోగివర్యులూ, పుణ్యలోకంలో నివసించే

ఇంద్రాదులూ, పక్షిలోకాన్ని పరిపాలించే గరుడుడు మొదలైనవారూ, మనుజలోకాన్ని ఏలే మనువు, మాంధాత మొదలైనవారు, పాతాళ లోకాన్ని పాలించే అనంతుడు, వాసుకి ప్రభృతులూ, ఇంకా గంధర్వులూ, విద్యాధరులూ, చారణులూ, సాధ్యులూ, రాక్షసులూ, యక్షులూ, ఉరగులూ, నాగజాతుల ధర్మాల్ని పాలించేవాళ్ళూ, ఇంకా ఋషులు, పితృ దేవతలు, దైత్యులు, దానవులు, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, కూశ్మాండులు, పశుమృగాదులు ఆవిర్భవించడం జరిగింది.

ఇలాంటి విశ్వం మొదటి పుట్టుకను 'మహత్తత్త్వ సృష్టి' అంటారు. రెండోది అండంతో కలిగిన సృష్టి. మూడోది సమస్త ప్రాణులకు చెందిన సృష్టి. అందులో విభూతి, తేజస్సు, ఇంద్రియబలం పుష్కలంగా గల పురుషుల్ని సర్వము తానే అయిన నారాయణాంశ నుంచి పుట్టిన వాళ్ళుగా గ్రహించుకో.

ఆ పద్మాక్షుడి లీలావతారాలు అనంతం. అతడు ఆచరించే పనుల్ని లెక్కించి చెప్పడం ఎవరికీ కుదరని పని. అయినా నాకు తోచినంత మట్టుకు నీకు విన్పిస్తాను విను.

## శ్రీమన్నారాయణుని లీలావతారముల అభివర్ణన

ఉ. అన్యకథానులాపము లహర్నిశమున్ వినునట్టి సత్క్రియా శూన్యములైన కర్ణముల సూరిజనస్తుత! సర్వలోక స మ్మాన్యములై తనర్చు హరి మంగళ దివ్యకథామృతంబు సౌ జన్యతఁ గ్రోలుమయ్య బుధసత్తమ! యే వివరించి చెప్పెదన్!

113

తా॥ పండితుల స్తుతికి పాత్రుడవైన ఓ నారదా! ఇతరుల కథలను రాత్రింబవళ్ళూ మాటిమాటికి చెవికెక్కించుకొని సత్కర్మలను వినిపించుకోని చెవులు పనికిరానివి అవుతాయి.

ఓ పండితోత్తమా! ఆ విష్ణువు దివ్యకథలను సర్వులూ ఆదరిస్తారు. అవి శుభగుణాల్ని అందిస్తాయి. వినడానికి అమృతప్రాయంగా ఉంటాయి. ఆ కథలను మంచిగా (మంచిభావంతో) ఆస్వాదించవయ్యా! నేను విశదపరచి చెప్తాను."

విష్ణువు యొక్క దివ్యకథా వృత్తాంతాన్ని సద్భావనతో ఆదరించినప్పుడు సద్గుణాలు అబ్బుతాయి. పనికిమాలిన ఇతరుల కథలను వినాలనే అన్పించదని భావం.

వ. అని పలికి నారదుం జూచి మఱియు నిట్లనియె.

114

తా॥ అని చెప్పి నారదుడి వైపు చూసి, మళ్ళీ బ్రహ్మ ఇలా అన్నాడు:

మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ క్ష్మాచక్రముం జాపఁ జు
ట్టిన మాడ్కిం గొనిపోవ, యజ్ఞమయదంష్ట్రి స్వాకృతిందాల్చి య
ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యబ్ధినడుమన్ దంష్ట్రాహతిం ద్రుంప ధా
త్రిని గూలెం గులిశాహతిం బడు మహాద్రిం బోలి యత్యుగ్రతన్.

115

తా॥ "హిరణ్యాక్షుడనే దానవుడు తన బాహుబలాతిశయంతో చాపచుట్టిన విధంగా భూమినంతా చుట్టి తీసుకుని పోయాడు. విష్ణువు తన ఆకృతినుంచే యజ్ఞశరీరంతో కోరలు గల పందిగా రూపాంతరం కల్గించాడు. సముద్రం నడుమ దాగి ఉన్న ఆ రాక్షసుణ్ణి ఎదుర్కొన్నాడు. తన దంతాలతో పట్టి చంపాడు. వజ్రాయుధం దెబ్బకు కూలిపడిన పెద్ద పర్వతంలా ఒక్కపెట్టున ఆ రాక్షసుడు భయంకరంగా కూలిపోయాడు."

వ. మఱియు సుయజ్ఞావతారంబు విను మని యిట్లనియె.

116

తా॥ ఇంకా 'సుయజ్ఞావతారం' సంగతి విన్పిస్తాను, విను! అంటూ బ్రహ్మ ఇలా చెప్పసాగాడు:

సీ. ప్రకట రుచి ప్రజాపతికిని స్వాయంభువుని కూఁతు రాకూతి యను లతాంగి కర్థి జన్మించి సుయజ్ఞుండు నా నొప్పు నతఁడు దక్షిణ యను నతివయందు సుయమ నామామర స్తోమంబుఁ బుట్టించి యింద్రుఁడై వెలసి యుపేంద్రలీల నఖిలలోకంబుల యార్తి హరించిన నతని మాతామహుండైన మనువు

తే. తనమనంబునఁ దచ్చరిత్రమున కలరి, పరమ పుణ్యుండు హరి యని పలికెఁ గాన నంచిత జ్ఞాననిధియై సుయజ్ఞుఁ డెలమిఁ, దాపసోత్తమ! హరి యవతారమయ్యె.

117

తా॥ "స్వాయంభువ మనువు కూతురు ఆకూతికీ, రుచి ప్రజాపతికీ పుట్టినవాడు 'సుయజ్ఞుడు'. ఇతడు 'దక్షిణ' అనే కాంతవల్ల 'సుయములు' అనే దేవతలకు చాలమందికి జన్మనిచ్చాడు. ఆ సుయజ్ఞుడు ఇంద్రుడనే పేర వెలసి, విష్ణువు వలెనే కష్టాలన్నిటి నుంచి

ప్రపంచాన్ని గట్టెక్కించాడు. ఇలాంటి ఇతడి మంచి నడతను గమనించిన ఇతడి తాత (తల్లితండ్రి) మనువు, ఇతణ్ణి 'పరమ పుణ్యమూర్తియైన శ్రీహరి' అని పిలిచాడు. కనుకనే ఓ యోగీంద్రా! మంచి జ్ఞాననిధి అయిన ఆ సుయజ్ఞుడు సంతోషించి, శ్రీహరిగా అవతారం ఎత్తాడు.

వ. అని చెప్పి సాంఖ్యయోగ ప్రవర్తకాచార్యవర్యుం డగు కపిలుని యవతారంబు విను మని యిట్లనియె.

118

తా॥ అని శ్రీహరి అవతారాన్ని చెప్పి, 'సాంఖ్యయోగాన్ని ప్రవర్తింప చేసిన ఉపదేశకుడు కపిలుడి అవతారం గూర్చి విను!' అంటూ, బ్రహ్మ ఇలా అన్నాడు:

చ. ధృతమతి దేవహూతికిని దివ్యవిభుండగు కర్దమప్రజా
పతికిఁ బ్రమోద మొప్ప నవభామలతోఁ గపిలుండు పుట్టి యే
గతి హరిఁ బొందు నట్టి సుభగంబగు సాంఖ్యము దల్లి కిచ్చి దు
ష్కృతములు వాపి చూపె మునిసేవితమై తనరారు మోక్షమున్.

119

తా॥ "దివ్యులకు ప్రభువు కర్దమ ప్రజాపతి. అతడి భార్య దేవహూతి ధైర్యవతి. శ్రీహరి వారికి 'కపిలుడు' అనే పేరుతో అవతరించాడు. ఇతడితో తొమ్మిది మంది చెల్లెళ్ళూ పుట్టారు. కపిలుడు యోగసిద్ధుడై ఆ దంపతుల్ని సంతోషపెట్టాడు.

నారాయణునితో యోగాన్ని కలిగించడానికి అనువైనది సాంఖ్య విధానం. కపిలుడు ఆ సాంఖ్యయోగాన్ని తల్లికి తెలియచెప్పి, ఆమె చెడు కర్మలను తుడిపేశాడు. ఆమెకు మునులు ఉపాసించే ముక్తి మార్గాన్ని దర్శింపచేశాడు.

వ. మఱియు దత్తాత్రేయావతారంబు వినుము.

120

తా॥ ఇప్పుడు దత్తాత్రేయుని అవతారం గూర్చి వివరిస్తాను, ఆలకించు.

సీ. తాపసో త్తముఁ డత్రి తనయునిఁ గోరి ర, మేశు వేఁడిన హరి యేను నీకు ననఘ! "దత్తుఁడ నైతి" నని పల్కుకతమున, నతఁడు దత్తాత్రేయుఁడై జనించె న మ్మహాత్ముని చరణాబ్జ పరాగ సం, దోహంబుచేఁ బూతదేహు లగుచు హైహయ యదువంశు లైహికాముష్మిక, ఫలరూప మగు యోగబలము వడసి

తే. సంచిత జ్ఞాన ఫల సుఖైశ్వర్య శక్తి, శౌర్యములఁ బొంది తమ కీర్తి చదల వెలుఁగ నిందు నందును వాసికి నెక్కి రట్టి, దివ్యతర మూర్తి విష్ణు నుతింపఁ దరమె?

121

తా॥ మునివరుల్లో మేటి అత్రిముని. కొడుకును కనాలనే కాంక్షతో విష్ణువును వేడుకున్నాడు. ఆ హరి, 'ఓ పుణ్యాత్ముడా! నీకు నేను దత్తుణ్ణి అయ్యాను' అని పలికాడు. ఆ ప్రసన్నత కారణంగా శ్రీపతి దత్తాత్రేయుడుగా జన్మనెత్తాడు. ఆ మహాత్ముడి పాదపద్మాల పుప్పొడి వల్ల హైహయ, యాదవ వంశీకులు పునీతులయ్యారు. ఇహలోక పరలోకాల ఫలరూపం అయిన 'యోగశక్తిని' పొందారు. అట్లా చక్కటి జ్ఞానఫలాన్ని, సుఖాన్ని, సంపత్తినీ, ఈశ్వర శక్తిని, ప్రౌఢిమనూ పొందారు. మిన్నంట తమకీర్తిని ప్రకాశింప చేశారు. ఈ లోకంలోనూ పై లోకంలోనూ ప్రశస్తిని పొందారు. అలాంటి విశ్వరూపుడు విష్ణువును పొగడటం అయ్యే పనేనా?

వ. వెండియు సనకాద్యవతారంబు వినుము.

122

తా॥ ఆ తర్వాత సనకాదుల అవతారం సంగతి విను.

సీ. అనఘాత్మ! యేను గల్పాదిని విశ్వంబు, సృజియింపఁ దలఁచి యంచిత తపంబు నర్థిఁ

జేయుచు "సన" యని పల్కుటయు నది, కారణంబుగ సనాఖ్యలను గల "స నందన ", "సనక", "సనత్కుమార", "సనత్సు, జాతులు" నల్వురు సంభవించి మానసపుత్రులై మహి నుతికెక్కిరి, పోయిన కల్పాంతమున వశించి

తే. యిట్టి యాత్మీయ తత్త్వంబు పుట్టఁ జేసి, సంప్రదాయిక భంగిని జగతి నెల్లఁ గలుగఁజేసిరి య విష్ణుకళలఁ దనరి, నలువు రయ్యును నొక్కఁడె నయచరిత్ర!

123

తా॥ విశుద్ధ జ్ఞానస్వరూపా! నేను కల్పం మొదట్లో ఈ లోకాల్ని పుట్టించాలని తలపెట్టాను. దానికి తగ్గట్టుగా ఎంతో ఇష్టంగా తపస్సు చేస్తూ 'సన' అని నా నోట పలికాను. ఆ ఒక్క కారణంగా 'సన' అనే పేర్లు గల 'సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు' అని నలుగురు కొడుకులు పుట్టారు. వాళ్లు నా 'మానస పుత్రులు' గా భూ ప్రపంచంలో పొగడిక కన్నారు.

మునుపటి కల్పాంతంలో అంతరించిపోయిన భగవతత్త్వానికి ప్రాణం పోశారు. ఈ ప్రపంచం అంతటినీ సాంప్రదాయక పద్ధతిని కలిగింపచేశారు. నీతివర్తనుడా ! నారదా ! ఆ విష్ణుదేవుడి కళలతో ఒప్పారుతూ వాళ్ళు లెక్కకు నలుగురుగా ఉన్నా, నిజానికి ఒక్కరే.

వ. మఱియు నరనారాయణావతారంబు వినుము.

124

తా॥ ఆ మీదట, నరనారాయణుల అవతారాన్ని గూర్చి విను.

క. గణుతింపఁగ నరనారా, యణులన ధర్మునకు నుదయ మందిరి దాక్షా
యణి యైన "మూర్తి" వలనం, బ్రణుతగుణోత్తములు పరమపావనమూర్తుల్.

125

తా॥ దక్షుని కూతురు మూర్తీ, ధర్ముడూ దంపతులు. ఆమె వల్ల నరుడు, నారాయణుడు అనే ఇద్దరు మగబిడ్డలు, ఎంచి చూపించగలవారు, పుట్టారు. ఆ నరనారాయణులు అతి పవిత్ర మూర్తులు. పొగడిక గల మంచి గుణవంతులు.

క. అనఘులు బదరీవనమున, వినుతతపోవృత్తి నుండ, విబుధాధిపుఁడున్ మనమున నిజపదహానికి, ఘనముగఁ జింతించి దివిజకాంతామణులన్.

126

తా॥ ఆ పవిత్రులు బదరికా వనానికి వెళ్ళి ప్రస్తుతింపబడు తపస్సులో మునిగిపోయారు. ఆ సమయంలో ఇంద్రుడు తన పదవికి ఎక్కడ ముప్పు కల్గుతుందో అని లోలోపల శంకించాడు. అప్సరసలను—

క. రావించి "తపోవిఘ్నముఁ, గావింపుం "డనుచు బనుపఁ గడు వేడుకతో భావభవానీకిను లనఁ, గా వనితలు సనిరి బదరికా వనమునకున్.

127

తా॥ రప్పించి, 'తపస్సును పాడుచేయండి' అని నియమించాడు. ఆ వనానికి పంపాడు. మన్మథుడి సేనలా అప్సరసలూ ఎంతో ఉత్సాహపడ్తూ బదరికా వనం వైపుకి వెళ్ళారు.

వ. అందు.

128

తా॥ అక్కడ బదరికా వనంలో.

మ. నరనారాయణు లున్న చోటికి మరున్నారీసమూహంబు భా
స్వరలీలం జని రూపవిభ్రమ కళాచాతుర్య మేపారఁగాఁ
బరిహాసోక్తుల నాటపాటలఁ జరింపం జూచి నిశ్చింతతన్

భరితధ్యాన తపఃప్రభావనిరతిం బాటించి నిష్కాములై.

129

తా॥ నరనారాయణులు తపస్సు చేస్తున్న అడవిలోకి ఆ దేవతాకాంతలు విలాసంగా వెళ్ళారు. తమ అందం, విలాసం, లలితకళా విన్యాసాలనూ ప్రకటిస్తూ చిరునవ్వులొలికే పలుకులతో, ఆటపాటలతో క్రీడించారు. ఆ విలాస ప్రదర్శనలను నరనారాయణులు చూసినా వారిలో ఏ మాత్రం చలనం కలుగలేదు. కామమూ కలుగలేదు. అంతకు మించిన ధ్యానంతో నిరంతరం తపఃప్రభావ నియతిని పాటించారు.

క. క్రోధము దపములకెల్లను, బాధక మగు టెఱిఁగి దివిజభామలపై న మ్మేధానిధు లొక యింతయుఁ, క్రోధముఁ దేరైరి సత్త్వగుణయుతు లగుటన్.

130

తా॥ కోపం తమ తపస్సులకు భంగం అవుతుందని ఆ నరనారాయణులు భావించారు. వారు పరమ ప్రజ్ఞావంతంగా, సాత్త్వికంగా ఒకింత కూడా ఆ అప్సరకాంతల మీద కోపాన్ని తెచ్చుకోలేదు.

క. నారాయణుఁ డప్పుడు దన, యూరువు వెసఁ జీర, నందు నుదయించెను బెం పారంగ నూర్వశీ ముఖ, నారీజనకోటి దివిజనారులు మెచ్చన్.

131

తా॥ అదే సమయంలో నారాయణుడు తనతొడను చర్రున చీల్చాడు. అందులో నుంచి ఊర్వశి మొదలైన స్త్రీలు కొంతమంది పుట్టారు. తమను మించిన అందంతో పుట్టిన వీళ్ళను చూసి, ఆ అప్సరకాంతలు మెచ్చుకున్నారు.

క. ఊరువులందు జనించిన, కారణమున "నూర్వశి" యన ఘనతకు నెక్కెన్ వారల

రూపవిలాస వి, హారములకు నోడి రంత నమరీజనముల్.

132

తా॥ నారాయణుని ఊరువు(తొడ)లో నుంచి పుట్టినందు వల్ల ఆమె 'ఊర్వశి' అనే పేరు పొందింది. ఆమెతో పాటు పుట్టిన కాంతల సౌందర్యాన్ని, విలాసాలను, విహారాలను చూసి ఆ అప్సరకాంతలు వెనుకంజ వేశారు.

వ. అంతం దాము నరనారాయణుల తపోవిఘ్నంబు గావింపంబూని సేయు విలాసంబులు, (మానసిక సంకల్పమాత్రంబున సృష్టిస్థితి సంహారంబు లొనర్పంజాలు) నమ్మహాత్ముల దెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతులుంబోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు, నూర్వశిం దమకు ముఖ్యురాలింగాఁ గైకొని తమ వచ్చిన జాడన మరలి చని రంత.

133

తా॥ ఆ నరనారాయణులు మనస్సులో భావించినంత మాత్రాన సృష్టి, స్థితి, సంహారాలు చేయగల శక్తిమంతులు.

చేసిన మేలు మరిచేవాడికి చేసే ఉపకారాల్లా ఆ మహాత్ముల తపస్సును భంగం చేయడానికి చేసిన అప్సరసల హావభావ విలాసాలన్నీ ఏ ఫలమూ లేనివయ్యాయి. వాళ్ళంతా సిగ్గుతో ముడుచుకునిపోయారు. ఊర్వశిని తమకు నాయికగా స్వీకరించారు. వాళ్ళంతా వచ్చిన త్రోవనే మళ్ళీ వెళ్ళిపోయారు.

అన్ని అందాలకూ, ఆనందాలకూ ఆత్మే మూలం. అలాంటి ఆత్మతత్త్వజ్ఞులకు లోక సంగతులు అంటవని భావం.

క. కాముని దహించెఁ గ్రోధ మ, హామహిమను రుద్రుఁ, దట్టి యతికోపము నా ధీమతులు

గెలిచి రనినం, గామము గెల్చుటకు చెప్పఁగా నేమిటికిన్.

134

తా॥ మహాశివుడు శ్రుతి మించిన కోపంతో మన్మథుణ్ణి బుగ్గిపాలు చేశాడు. కాని అంతటి కోపాధిక్యాన్ని ఈ మేధావంతులు జయించారు. అంటే కామాన్ని జయించడం గూర్చి వేరే చెప్పుకోవాలా?

వ. అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె. వెండియు ధ్రువావతారంబు వివరించెద వినుము.

135

తా॥ అలాంటి నరనారాయణావతారం లోకాలన్నిటినీ పవిత్రం చేసేది అయింది. ఇంక ధ్రువావతారం గురించి వివరిస్తాను, ఆలకించు.

సీ. మానితచరితుఁ "దుత్తానపాదుం" డను భూవరేణ్యునకు సత్పుత్రుఁ డనఁగ నుదయించి మహిమఁ బెంపొంది బాల్యంబున జనకునికడ నుండి సవతితల్లి తను నాడు వాక్యాస్త్రతతిఁ గుంది మహిత తపంబు గావించి కాయంబుతోడఁ జని మింట ధ్రువపదస్థాయి యై యటమీఁద నర్థి వర్తించు భృగ్వాదిమునులుఁ

తే. చతురగతి గ్రింద వర్తించు సప్తఋషులుఁ,
బెంపు దీపింపఁ దన్ను నుతింపు చుండ,
"ధ్రువుఁడు" నా నొప్పి య వ్విష్ణుతుల్యుఁ డగుచు,
నున్న పుణ్యాత్ముఁ డిప్పుడు నున్నవాఁడు.

136

తా॥ ఉత్తానపాదుడు, సాటి రాజులలో మేటి అయినవాడు. ఆదరణీయమైన నడవడి

కలవాడు. ఇతడి కొడుకు ధ్రువుడు, మంచివాడు. తన గొప్పతనంతో వృద్ధిలోకి వచ్చినవాడు. పసితనంలో తండ్రి వద్ద ఉన్నప్పుడు మారుతల్లి మాట్లాడిన మాటల బాణాల పరంపరకు కుంగిపోయి పెద్ద తపస్సు చేశాడు. సశరీరుడిగా ఆకాశంలో స్థిరమైన పదవిని పొందాడు.

ఆ చోటుకి పైన ఉన్న భృగువు మొదలైన యోగులు, దిగువన ఉన్న సప్తర్షులూ, అతడి తపస్సును కుతూహలంగా, చాతుర్యంగా, అతిశయంగా స్తుతిస్తుంటారు. అతడు 'ధ్రువుడు' గా ఒప్పుతూ విష్ణువుతో సరిసాటిగా నేటికీ ధ్రువంగా ఉన్న పుణ్యాత్ముడు.

వ. మఱియుఁ పృథుని యవతారంబు వినుము.

137

తా॥ ఇక పృథుని అవతారం గూర్చి విను.

ఉ. వేనుఁడు విప్రభాషణ పవి ప్రహర చ్యుత భాగ్య పౌరుషుం డై నిరయంబునం బడిన నాత్మతనూభవుఁడై పృథుండు నాఁ బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును బాపి, మేదినిన్ ధేనువుఁజేసి వస్తు వితతిం బితికెన్ హరి సత్కళాంశుఁడై.

138

తా॥ వేనుడనే రాజు, బ్రాహ్మణుల శాపవాక్కులనే వజ్రాయుధం తాకిడికి గురియై తట్టుకోలేకపోయాడు. సర్వసంపదలనూ, పురుషాహంకారాన్నీ దూరం చేసుకున్నాడు. నరకలోకానికి చేరుకున్నాడు.

"వేనుడి కొడుకు పృథుడు. ఇతడు భగవంతుడి అంశతో పుట్టినవాడు. తన తండ్రిని పున్నామ నరకం నుంచి కాపాడినవాడు. భూమిని గోవుగా చేసి అన్ని ఓషధులనూ పిండినవాడు."

వ. అని మఱియు వృషభావతారంబు నెఱింగింతు, వినుము, ఆగ్నీధ్రుం డనువానికి "నాభి"

యనువాఁడుదయించె, అతనికి మేరుదేవి యను నామాంతరంబు గల “సుదేవి” యందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావంబైన యోగంబు దాల్చి ప్రశాంతా తఃకరణుండును, బరిముక్తసంగుండునునై పరమ హంసాభిగమ్యం బయిన పదం బిది యని మహర్షులు పలుకుచుండం జరించె. మఱియు హయగ్రీవావతారంబు సెప్పెద వినుము.

139

తా॥ అని చెప్పి బ్రహ్మ, నారదుడితో, ‘ఇపుడు ఋషభావతారం గూర్చి తెలియ పరుస్తాను, విను!’ అన్నాడు. ‘ఆగ్నీధ్రుడ’ నే వానికి ‘నాభి’ అనే కుమారుడు కలిగాడు. అతని సతి ‘సుదేవి’. ఈమె మారుపేరు ‘మేరుదేవి’. ఈమె కడుపున శ్రీమహావిష్ణువు ‘ఋషభుడనే’ పేరుతో అవతరించాడు.

ఋషభుడు జడుడుగా యోగసిద్ధి పొందాడు. ప్రశాంతమైన ఇంద్రియాలతో నిత్య సమాధిస్థితుడయ్యాడు. ‘ఇది పరమహంసలు చేరుకోదగిన పదం’ అంటూ మహామునుల ప్రశంసలు అందుకున్నాడు.

ఇక హయగ్రీవావతారం గూర్చి చెప్తాను, ఆలకించు.

చ. అనఘచరిత్ర! మన్మఖమునందు జనించె హయాన నాఖ్యతన్
వినుతసువర్ణ వర్ణుఁడును వేదమయుం డఖిలాంతరాత్మకుం
డనుపమ యజ్ఞపూరుషుఁడు నై భగవంతుఁడు, దత్సమస్త పా
వనమగు నాసికా శ్వసన వర్గములం దుదయించె వేదముల్.

140

తా॥ ఓ పుణ్యచరితుడా! నారదా! విను. నేను చేసిన యాగం నుంచి విష్ణువు హయముఖుడిగా ఉద్భవించాడు. అతడు చెప్పుకోదగ్గ పసిమి ఛాయ గల రూపం కలవాడు. వేదమూర్తి, సర్వుల్లో ఉండే ఆత్మస్వరూపుడు. సాటిలేని యాగపురుషుడు. సమస్తాన్ని పావనం

చేయగలవాడు. ఈ హయగ్రీవుడి ముక్కుపుటాల ఊపిరుల నుంచి వేదాలు పుట్టాయి.

వ. మఱియు మత్స్యావతారంబు వినుము.

141

తా॥ ఇక మత్స్యావతారం గూర్చి విను.

సీ. ఘనుఁడు వైవస్వత మనువుకు దృష్టమై, యరుదెంచినట్టి యుగాంతసమయ
మందు విచిత్రమత్స్యావతారము దాల్చి, యఖిలావనీమయం బగుచుఁ జాల
సర్వజీవులకు నాశ్రయభూతుఁ డగుచు నే, కార్ణవంబైన తోయముల నడుమ
మన్ముఖశ్లథవేదమార్గంబులను జిక్కు, వడకుండ శాఖ లేర్పడఁగఁ జేసి

తే. దివ్యు లర్థింప నాకర్థిఁ దెచ్చి యిచ్చి, మనువు నెక్కించి పెన్నావ వనధినడుమ
మునుఁగకుండఁగ నరసిన యనిమిషావ, తార మేరికి నుతియింపఁ దరమె? వత్స!

142

తా॥ విశిష్టుడైన వైవస్వత మనువుకి యుగం చివరన జరగబోయే వినాశం కళ్ళకు కట్టింది. ఆ యుగాంతంలో సమస్త ప్రపంచమూ నీళ్ళతో నిండిపోయింది. అప్పుడు దేవదేవుడు విచిత్రంగా చేపరూపంలో అవతరించాడు. సమస్తభూమినీ, ప్రాణికోటినీ ఆదుకున్నాడు. ఏక సముద్రంలా ఉన్న నీళ్ళలో నుంచి నా నోట జారిన వేదమార్గాలన్నీ చిక్కు పడకుండా విడివిడి శాఖలుగా ఏర్పాటు చేశాడు. దేవతల కోరిక మేరకు సంతోషంగా వాటిని నాకు తిరిగి అందించాడు. ఒక పెద్ద నావ మీదకు మనువును ఎక్కించి ఆ జల ప్రళయంలో ఆ నావ మునిగి పోకుండా చూశాడు. విచారించి చూస్తే, ఇట్లా రెప్పపాటు లేకుండా సమస్తాన్నీ రక్షించిన ఆ మత్స్యావతార మూర్తిని పొగడడం సాధ్యమవుతుందా !

వ. మఱియుఁ గూర్మావతారంబు వినుము.

143

తా॥ ఇంక కూర్మావతారం గూర్చి విను.

మ. అమృతోత్పాదనయత్నులై విబుధదైత్యానీకముల్, మందరా
గము గవ్వంబుగఁ జేసి యబ్ధి దఱువంగాఁ, గవ్వపుంగొండ వా
ర్ధి మునుంగన్ హరి కూర్మరూపమున నద్రిం దాల్చెఁ దత్పర్వత
భ్రమణవ్యాజత వీఁపుఁదీట శమియింపంజేయఁగా నారదా!

144

తా॥ ఓ నారదా! దేవతలూ రాక్షసగణాల వారందరూ అమృతాన్ని పొందాలని ప్రయత్నించారు. మందర పర్వతాన్ని కవ్వంగా ఉపయోగించి, పాల సముద్రాన్ని చిలికారు. ఆ కవ్వం కొండ సముద్రం నట్ట నడుమన మునిగిపోసాగింది. ఆ పర్వతం గిరగిరా తిరగడం అనే మిషపెట్టుకుని ఆ హరి తాబేలు రూపాన తన వీపు మీది దురద తీరడానికా అన్నట్లు, ఆ కొండను తన వీపు మీద మోశాడు.

వ. వెండియు నృసింహావతారంబు వినుము.

145

తా॥ ఇంక నృసింహావతారం గూర్చి చెబుతాను, విను.

మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ ఁ స్రుక్కించి యుద్యద్గదా
ధరుఁడై వచ్చు నిశాచరుం గని, కనద్దంష్ట్రాకరాళాస్య వి
స్ఫురితభ్రూకుటి శ్రీనృసింహగతి రక్షోరాజ వక్షంబు భీ
కరభాస్వన్నఖరాజిఁ ద్రుంచెఁ ద్రిజగత్కల్యాణసంధాయియై.

146

తా॥ రాక్షసుడు(హిరణ్యకశిపుడు) అమరలోకంలో కలవరం పుట్టించాడు. దేవతల్ని బలహీనపరిచాడు. ఎత్తిపట్టిన గదతో వస్తున్న అతణ్ణి శ్రీహరి చూశాడు.

ఆ శ్రీహరి ముల్లోకాలకు మేలు చేయాలనుకున్నాడు. అతడు ధగధగ ప్రకాశించే కోరలతో భయం పుట్టించే నోరూ, కనుబొమలు ముడిపడేంతటి కోపమూ గల రూపంతో నరసింహావతారాన్ని ధరించాడు. భయంకరంగా ప్రకాశించే గోళ్ళతో ఆ రాక్షసుడి రొమ్మును చీరి చంపాడు.

వ. ఇంక నాదిమూలావతారంబు సెప్పెద వినుము.

147

తా॥ ఇక మీదట 'ఆది మూలావతారాన్ని' వివరిస్తాను, విను.

మ. కరినాథుండు జలగ్రహ గ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయి వ
త్సరముల్ గుయ్యిడుచుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్
"హరి నీవే శరణంబు నా" క నినఁ కుయ్యాలించి వేవేగ వా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా!

148

తా॥ ఓ తపస్వీ! గజరాజు మొసలికి చిక్కి బాధపడ్డాడు. వెయ్యేళ్ళపాటు దేవతలకు మొర విన్నవించుకున్నాడు. దేవతలు సర్వాంతర్యామిత్వం లేనివారు కాబట్టి అతణ్ణి కాపాడుకోలేకపోయారు. ఆఖరికి, 'హరీ! నీవే నాకు రక్షణ' అన్న శరణును ఆలకించాడు హరి. ఆ మొర వినపడగానే ఎక్కడ లేని ఉత్సాహంతో అప్పటికప్పుడే ఆ జలజంతువును నరికి, ఆ గజేంద్రుణ్ణి కాపాడాడు.

వ. మఱియును వామనావతారంబు వినుము.

తా॥ వామనావతారం గురించి చెప్తాను విను.

సీ. యజ్ఞేశ్వరుండగు హరి విష్ణుఁ డదితిసం, తానంబునకు నెల్లఁ దమ్ముఁడయ్యుఁ బెంపారు గుణములఁబెద్ద యే, వామన, మూర్తితో బలిచక్రవర్తిఁ జేరి తద్భూమి మూఁడు పాదమ్ముల నడిగి ప, దత్రయంబునను జగత్త్రయంబు వంచించి కొనియెను వాసవునకు రాజ్య, మందింప నీశ్వరుం డయ్యు మొఱఁగి

తే. యర్థిరూపంబు గైకొని యడుగ వలసె, ధార్మికుల సొమ్ము వినయోచితమునఁ గాని వెఱఁగుఁతనమున నూరక విగ్రహించి, చలన మందింపరాదు నిశ్చయము పుత్ర!

150

తా॥ యజ్ఞపురుషుడైన అదితి బిడ్డలలో తాను ఆఖరివాడే అయినా, గుణాల్లో అందరికన్న ముందరివాడు అయ్యాడు విష్ణువు. ఆ విష్ణువు వామనాకారంతో బలిచక్రవర్తి దగ్గరకు వెళ్లాడు. ‘మూడడుగుల నేల కావాలన్నాడు. ఆ మూడడుగుల మిషతో మోసగించి ముల్లోకాలను ఆక్రమించుకున్నాడు. ఇంద్రుడికి రాజ్యం తిరిగి అప్పగించాడు. యాచకరూపంలో కన్నుగప్పి అర్థించవలసి వచ్చింది.

కుమారా! ధర్మనిష్ఠుల సొమ్మును వినయంగా, ఉచితానుచితాలు తెలిసి మరీ అర్థించాలి. తెలివి మాలినతనంతో లేనిపోనివి ఆశించి పొందకూడదనేది సత్యం.

చ. బలి నిజమౌళి న వ్వటుని పాదసరోరుహ భవ్యతీర్థ ము త్కలిక ధరించి, తన్నును జగత్త్రయమున్ హరి కిచ్చి, కీర్తులన్ నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోక విభుత్వ హానికిన్ దలఁకక శుక్రు మాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁడై.

151

తా॥ బలిచక్రవర్తి ఆ బ్రహ్మచారి పాదాలు కడిగిన పావనమైన జలాల్ని పవిత్రంగా భావించి, తలమీద చల్లుకున్నాడు. తనతోపాటు స్వర్గ, మర్త్య, పాతాళలోకాలు మూడిటినీ ఆ విష్ణువుకి అర్పించుకున్నాడు.

దానస్వభావం వల్ల స్వర్గలోకాధిపత్యం చేజారిపోతున్నా ఆ బలి ఏ మాత్రం తొణకలేదు. శుక్రాచార్యుడి పలుకులు విని వెనక్కి తగ్గనూ లేదు. లోకాలన్నిటా బలి తన కీర్తిని స్థిరపరుచుకున్నాడు.

వ. మఱియు న ప్పరమేశ్వరుండు నారదా! హంసావతారంబు నొంది యతిశయ భక్తియోగంబున సంతుష్టాంతరంగుం డగుచు నీకు నాత్మతత్త్వ ప్రదీపకంబగు భాగవత మహాపురాణం బుపదేశించె. మన్వవతారంబు నొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తనులైన రాజుల దండించుచు, శిష్టపరిపాలనంబు సేయుచు, నాత్మీయ కీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె. మఱియు ధన్వంతరి యన నవతరించి తన నామస్మరణంబున భూజనంబులకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబుఁ గల్పించె, నింకం బరశురామావతారంబు వినుము.



తా॥ నారదా! ఇంకా విను. ఆ పరమాత్మ ‘హంసావతారమూ’ ధరించాడు. అతిశయమైన నీ భక్తి సాధనకు సంతుష్టిని పొందాడు. నీలో ఆత్మతత్త్వాన్ని ఉత్తేజింపజేసే భాగవత పురాణాన్ని నీకు బోధించాడు.

ఆ తర్వాత మనువుగా ఎదురులేని తన తేజమూ, ప్రభావమూ గల చక్రాయుధాన్ని చేతబూనాడు. దుష్టులైన రాజులందరినీ దండించాడు. శిష్టుల్ని కాపాడాడు. తన (సద్గుణ) కీర్తిచంద్రికలను సత్యలోకంలోకి ప్రసరింపచేశాడు.

తరువాత ధన్వంతరిగా అవతరించి, తన పేరును తలచుకుంటేనే ప్రజలకు సమస్త రోగాలు తగ్గించే ఆయుర్వేద విద్యను కల్పించాడు.

ఇక పరశురామావతారం గూర్చి విను!

మ. ధరణిన్ కంటకులైన హైహయ నరేంద్ర వ్రాతమున్ భూరి వి స్ఫురితోదార కుతారధారఁ గలనన్ ముయ్యేడు మాఱుల్ పోరిం బోరి మర్దించి, సమస్త భూతలము విప్రుల్ వేఁడఁగా నిచ్చి తాఁ జిరకీర్తిన్ జమదగ్నిరాముఁడన మించెం దాపసేంద్రోత్తమా!

153

తా॥ తాపసుల్లో మేటివాడా! నారదా ! ఆ మహావిష్ణువు జమదగ్ని కొడుకు రాముడుగా స్థిరకీర్తితో ఒప్పారాడు. లోకపీడకులైన హైహయ వంశపు రాజులపైకి మాటిమాటికీ ఇరవై ఒక్క మార్లు దండెత్తాడు. పదనుతో నిగనిగ మెరిసే తన గండ్రగొడ్డలితో ఆ రాజలోకాన్ని తెగనరికాడు. సమస్త భూమండలాన్నీ, బ్రాహ్మణులకు దానం చేసి, ధర్మ రక్షకుడన్న కీర్తిని పొందాడు.

వ. మఱియు శ్రీ రామావతారంబు సెప్పెద వినుము.

154

తా॥ ఇక శ్రీరామావతారం గూర్చి చెప్తాను విను.

సీ. తోయజ హిత వంశ దుగ్ధ పారావార, రాకా విహార కైరవహితుండు
కమనీయ కోసలక్ష్మాభృత్సుతా గర్భ, శుక్తి సంపుట లసన్మౌ క్తికంబు
నిజపాదసేవక వ్రజ దుఃఖ నిబిడాంధ, కార విస్ఫురిత పంకరుహసఖుఁడు
దశరథేశ్వర కృతాధ్వర వాటికా ప్రాంగ, ణాకార దేవతానోకహంబు

తే. చటుల దానవ గహన వైశ్వానరుండు, రావణాటోప శైల పురందరుండు నగుచు లోకోపకారార్థ మవతరించె, రాముఁడై చక్రి లోకాభిరాముఁ డగుచు.

155

తా॥ ఆ మహావిష్ణువు లోకహితం కోరి రాముడుగా జన్మించాడు. అతడు లోకులందరికీ సుందరమైనవాడు. సూర్యవంశం అనే పాలసముద్రానికి పూర్ణిమ నాటి చంద్రుడి వంటివాడు. కోసల దేశపు రాచబిడ్డ కౌసల్య గర్భం అనే ముత్యం చిప్పలో ప్రకాశించిన ఆణిముత్యం వంటివాడు. తన పాదాలను ఆశ్రయించినవారి 'పరితాపం' అనే చిమ్మచీకటిని పారద్రోలే సూర్యుడి వంటివాడు. దశరథుడి యజ్ఞశాల ముంగిట మొలకెత్తిన కల్పవృక్షం వంటివాడు. రాక్షసులనే మహాటవిని దహించివేసిన దావాగ్ని వంటివాడు. రావణుని గర్వమనే కొండను పగులగొట్టిన ఇంద్రుడి వంటివాడు.

క. చిత్రముగ భరత లక్ష్మణ, శత్రుఘ్నుల కర్థి నగ్రజన్ముం డగుచున్
ధాత్రిన్ రాముఁడు వెలసెఁ బ, విత్రుఁడు దుష్కృత లతాలవిత్రుం డగుచున్.

156

తా॥ ఈ భూలోకంలో ఆ శ్రీరాముడు, భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుల కంటే ముందు పుట్టినవాడు. ఆ పవిత్రమూర్తి పాపాలనే తీగలను కోసిపడేసే కొడవలి వంటివాడుగా వెలుగొందాడు.

వ. అంత.

157

తా॥ అటుపిమ్మట.

సీ. కిసలయ ఖండేందు బిస కుంద పద్మాబ్జ, పద ఫాల భుజ రద పాణి నేత్రఁ
గాహళ కరభ చక్ర వియత్పులిన శంఖ, జంఘోరు కుచ మధ్య జఘన కంఠ
ముకుర చందన బింబ శుక గజ శ్రీకార, గండ గంధోష్ఠవాగ్గమన కర్ణఁ

జంప కేందు స్వర్ణ శఫర ధను ర్నీల, నాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ

తే. నళి సుధావర్త కుంతల హాస నాభి, కలిత జనకావనీపాలకన్యకా ల

లామఁ బరిణయమయ్యె లలాటనేత్ర, కార్ముక ధ్వంస ముంకువ గాఁగ నతఁడు.

158

తా॥ జనకుడి కూతురు సీత. ఆమె పాదాలు చిగురుటాకులు. నుదురు నెలపొడుపు. భుజాలు తామరతూండ్లు. పలువరుస మల్లెమొగ్గలు. అరచేతులు పద్మాలు. కళ్ళు కలువలు. పిక్కలు బాకాలు. తొడలు కరభాలు, వక్షోజాలు చక్రవాకాలు, నడుము ఆకాశం. పిరుదులు ఇసుక తిన్నెలు, కంఠం శంఖువు, చెక్కిళ్ళు అద్దాలు, తనువు మంచి గంధం చెట్టు. పెదవి దొండపండు. పలుకు చిలుకపలుకు. నడక ఏనుగు నడక. చెవులు శ్రీ అనే అక్షరం. ముక్కు సంపెంగ పువ్వు. ముఖం చంద్రబింబం. మేనిచ్ఛాయ బంగారం. చూపులు ఎగిసిపడే చేపలు. కనుబొమలు విల్లు. ముంగురులు తుమ్మెదలు. తలవెంట్రుకలు నీలాలు. నవ్వు అమృతప్రాయం. నాభి సుడి. ఇలాంటి లోకోత్తర సౌందర్యరాశి సీత. ఆమెను రాముడు సుంకంగా శివధనుస్సును విరిచి, పెళ్ళాడాడు.

వ. అంత.

159

తా॥ అంత.

క. రాముఁన్ మేచకజలద, శ్యాముఁన్ సుగుణాభిరాము సద్వైభవ సు త్రాముఁన్ దుష్టనిశాట విరాముం బొమ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్.

160

తా॥ నల్లటి మబ్బు వంటి ఛాయతో, చక్కటి గుణాలతో, ఇంద్రవైభవంతో విలసిల్లుతూ

దుష్ట రాక్షసుల దురాగతాలను అంతమొందించే శ్రీరాముణ్ణి దశరథుడు వనాలకు వెళ్ళమన్నాడు.

వ. ఇట్లు పంచిన.

161

తా॥ ఇలా పంపగా.

చ. అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేఁగుదే
నరిగి రఘూత్తముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షు సింహ సూ
కర కరి పుండరీక కపి ఖడ్గ కురంగ వృకాహి భల్లు కా
సర ముఖ వన్య సత్త్వ చయ చండతరాటవి దండకాటవిన్.

162

తా॥ లక్ష్మణుడు, సీత తనతో రాగా, ఆ రాముడు బయలుదేరి దండకారణ్యంలోకి ప్రవేశించాడు. ఆ అరణ్యమంతా సింహాలు, అడవి పందులు, ఏనుగులు, పులులు, కోతులు, ఖడ్గ మృగాలు, లేళ్ళు, తోడేళ్ళు, పాములు, భల్లూకాలు, అడవి దున్నలూ మొదలైన జంతువులతో భయంకరంగా ఉంది.

క. ఆ వనమున వసియించి నృ, పావననయశాలి యిచ్చె నభయములు జగ త్పావన మునిసంతతికిఁ గృ, పావననిధియైన రామభద్రుం డెలమిన్,

163

తా॥ ఆ ఘోరారణ్యంలో సైతం రాముడు ఆత్మారాముడై సంతోషంగా ఉంటూ లోకపావనులైన మునులందరికీ అభయం ఇచ్చాడు. ధర్మతత్పరులైన రాజుల రక్షణం, దయాళుత్వం, నీతిపాలన ఆయన స్వభావగుణాలు.

క. ఖరకర కుల జలనిధి హిమ, కరుఁడగు రఘురామవిభుఁడు గఱకఱితోడన్ ఖరుని

వధించెను ఘనభీ, కర శరముల నఖీలజనులుఁ గర మరుదనగాన్.

164

తా॥ రఘువంశదీపకుడైన ఆ రామప్రభువు సూర్యవంశమనే సముద్రానికి చంద్రుడు. అతడు భీతిగొల్పే బాణప్రయోగంతో ఖరుడనే రాక్షసుణ్ణి చంపాడు. అది చూసిన జనం అంతా ముక్కుమీద వేలు వేసుకున్నారు.

క. హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని, హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్, హరివరునకు హరి మధ్యను, హరి రాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై.

165

తా॥ (హరి) సింహం వంటి పరాక్రమం గల ఆ రాముడు (హరి) సూర్యుడి కొడుకును (సుగ్రీవుడి) అనుచరునిగా స్వీకరించాడు. (హరి) ఇంద్రుడి కొడుకు వాలిని చంపి, (హరి) యముడి పట్టణానికి పంపించాడు. (హరి) కోతులకు రాజైన సుగ్రీవుడికి కిష్కింధారాజ్యాన్ని కట్టబెట్టాడు. (హరి) సింహం వంటి నడుముగల స్త్రీని (రుమను) అతడికి తిరిగి అప్పగించాడు.

వ. అంత సీతానిమిత్తంబునం ద్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకునై కపిసేనా సమేతుండయి చని ముందట నతిదుర్గమం బయిన సముద్రంబు తెరువు సూపకున్న నలిగి.

166

తా॥ ఆపై సీతాపహరణం నిమిత్తంగా ముల్లోకాలను బాధించిన ఆ రావణుణ్ణి రాముడు చంపాలనుకున్నాడు. వానరసైన్యాన్ని కూడగట్టుకుని బయలుదేరాడు. వెళ్ళి సాగరం వద్దకు చేరుకున్నాడు. అది లంకారాజ్యానికి మార్గం చూపకపోవడంతో ఆ సముద్రం మీద కోపగించుకున్నాడు.

మ. వికట భ్రూకటి ఫాలభాగుఁ డగుచున్ వీరుండు క్రోధారుణాం బకుఁ డై చూచిన యంత మాత్రమున నప్పాథోధి సంతప్త తో య కణ గ్రాహ తిమింగిల ప్లవ ఢులీ వ్యాళ ప్రవాళోర్మికా బక కారండవ చక్ర ముఖ్య జలసత్త్వశ్రేణితో నింకినన్.

167

తా॥ శూరుడైన రాముడి నొసట కనుబొమలు ముడిపడ్డాయి. కళ్ళు ఎర్రబారాయి. రాముడి కోపపు చూపులకు సముద్రం అట్టుడికిపోయింది. అందులోని మొసళ్ళు, తిమింగలాలు (తిమి అనే చేపను మింగే నూరు యోజనాల పొడవుండే చేప), ఎగిసిపడే చేపలు, ఈదే ఆడు తాబేళ్ళు, పాములు, పగడపు పొదలు అలలు, కొంగలు, కారండవాలు, జక్కవ పక్షుల సమేతంగా సముద్రం మొత్తం నీరూ ఇంకిపోయింది.

వ. అయ్యవసరంబున సముద్రుండు కరుణాసముద్రుం డగు శ్రీరామభద్రుని శరణంబు సొచ్చినం గరుణించి యెప్పటి యట్లు నిలిపి, నలునిచే సేతువు బంధింపించి తన్మార్గంబునం జని.

168

తా॥ అదే సమయానికి సముద్రుడు శరణు కోరాడు. దయాసాగరుడైన రాముడు సముద్రుణ్ణి అనుగ్రహించాడు. ఎప్పటిలా మసలుకోమన్నాడు. నలుడనే మేటి వానరుడితో వారధి కట్టించాడు. ఆ త్రోవ వెంబడిని (లంకకు) వెళ్ళాడు.

మ. పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం కరు చందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధ గో పుర శాలాంగణ హర్మ్య రాజభవన ప్రోద్యత్ప్రతోళీ కవా ట రథాశ్వ ద్విప శస్త్రమందిర నిశాట శ్రేణితో వ్రేల్మిడిన్.

169

తా॥ శివుడు ఒకే ఒక బాణంతో ఒక్క పెట్టున మూడు పురాలనూ సమూలంగా నాశనం

చేశాడు. అదే విధంగా రాముడు లంకానగరం లోని ధగధగలాడే గోపురాలను, ఇళ్ళు ముంగిళ్ళను, మిద్దెలను, రాచభవంతుల్ని, పైకెత్తబడిన పుర ద్వారబంధాల్ని, రథాల్ని, అశ్వాల్ని, ఏనుగుల్ని, ఆయుధశాలల్ని రాక్షసుల గుంపునీ చిటికెలో నిర్మూలించాడు.

క. రావణు నఖిల జగద్వి, ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁగా రావణు ననుజన్మునినైరావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిన్.

170

తా॥ సకల భూప్రపంచాన్ని పరుగులు పెట్టించిన రావణుని రాముడు సంహరించాడు. అతడి తమ్ముడు విభీషణున్ని రాక్షసులకు ప్రభువుగా నిలబెట్టాడు. నలుదెసలా రాముడి కీర్తిచంద్రికల తెల్లటి వెలుగులు తేజరిల్లాయి.

సీ. ధర్మ సంరక్షకత్వ ప్రభావుం డయ్యు, ధర్మ విధ్వంసకత్వమునఁ బొదలి ఖర దండ నాభిముఖ్యముఁ బొంద కుండియు, ఖరదండ నాభిముఖ్యమున మెఱసి పుణ్యజనావన స్ఫూర్తిఁ బెంపొందియుఁ, పుణ్యజనాంతక స్ఫురణఁ దనరి సంతతాశ్రిత విభీషణుఁడు గాకుండియు, సంతతాశ్రిత విభీషణత నొప్పి

తే. మించి, దనకీర్తిచేత వాసించె దిశలు, దరమె నుతియింప జగతి నెవ్వరికినైనఁ జారుతరమూర్తి నవనీశ చక్రవర్తిఁ, బ్రకట గుణసాంద్రు దశరథ రామచంద్రు.

171

తా॥ రాముడు, ధర్మాన్ని రక్షించే మహిమ కలవాడని పేరు పొందీ ధర్మము (ధనుస్సు) యొక్క వినాశనానికీ ప్రవర్తిల్లాడు. తీవ్రంగా శిక్షించడంలో పెడమోమువాడే అయినా ఖరుడనే రాక్షసుణ్ణి దండించడంలో సుముఖంగా వెలుగొందాడు. (పుణ్యజనుల) సజ్జన సంరక్షణలోనూ, (పుణ్యజనుల) రక్కసుల అంతుచూసే భావనలోనూ పరిపూర్ణతతో ఒప్పాడు. శరణన్నవారి పట్ల ఏనాడూ భీకరుడు కాకపోయినా తనను ఎల్లవేళలా ఆశ్రయించిన విభీషణుడి వల్ల మరింత

అతిశయించాడు. ఇలాంటి తన (రాముడి) కీర్తిచేత దిగంతాలు పరిమళించాయి. సుందరాకారుడు, రాజులకే రాజు, సుగుణాభిరాముడు అయిన దశరథరాముణ్ణి పొగడడం ఈ లోకంలో ఎవరివల్లా కాని పని.

వ. అట్టి శ్రీరామావతారంబు జగత్పావనంబును నస్మత్ప్రసాద కారణంబునునై నుతికెక్కె. నింకఁ గృష్ణావతారంబు వివరించెద, వినుము.

172

తా॥ అలాంటి శ్రీరామవతారం లోకాన్ని పుణ్యవంతం చేసింది. మాబోటి వాళ్ళందరి ప్రసన్నతకు పాత్రమయింది.

తా॥ అలాంటి శ్రీరామవతారం లోకాన్ని పుణ్యవంతం చేసింది. మాబోటి వాళ్ళందరి ప్రసన్నతకు పాత్రమయింది.

ఇక కృష్ణావతారాన్ని వర్ణిస్తాను.

సీ. తాపసోత్తమ! విను దైత్యాంశములఁ బుట్టి, నరనాథు లతుల సేనాసమేతు లగుచు
ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబా, ధల నలంచుటఁ జేసి! ధరణి వగలఁ బొందుచు వాపోవ
భూభార ముడుపుట, కై హరి పరుఁడు నారాయణుండు చెచ్చెరఁ దన సితాసిత
కేశయుగమున, బలరామ కృష్ణ రూపములఁ దనరి

తే. యదుకులంబున లీలమై నుదయ మయ్యె, భవ్యయశుఁ డగు వసుదేవు భార్యలైన
రోహిణియు దేవకియు నను రూపవతుల, యందు నున్మత్తదైత్య సంహారి యగుచు.

173

తా॥ ఓ ఉత్తమ తపస్వీ! ఆలకించు. రాక్షసుల అంశతో పుట్టిన ఎంతోమంది రాజులు లెక్కలేనంత సైనికబలగాన్ని సంతరించుకుని న్యాయం తప్పి ప్రవర్తించేవారు. అమిత బాధలకు

భూమాతను గురి చేసేవారు. ఆ దుఃఖంతో భూదేవి నారాయణునితో వాపోయింది.

పరమాత్ముడయిన ఆ హరి, మత్తిల్లి ప్రవర్తించే ఆ క్రూరులను చంపి దుఃఖాత్మకమైన ఆ రాక్షసుల భారం నుంచి భూమిని విడిపించాలనుకున్నాడు. తన లీలాప్రకటనకు గాను యాదవవంశంలో బలరామ కృష్ణ రూపాల్లో అవతరించాడు. యాదవవంశానికి యోగ్యమైన కీర్తిగలవాడు వసుదేవుడు. రోహిణి, దేవకీదేవి అనుకూల గుణవతులైన అతడి సతులు. ఆ దంపతులకు నారాయణుడు తన తెల్లటి కేశం ద్వారా బలరాముని రూపంతోనూ, నల్లటి కేశం ద్వారా కృష్ణుడి రూపంతోను అవతారం ఎత్తాడు.

వ. ఇట్లు పుండరీకాక్షుండగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయం దన మేని కేశద్వయంబ చాలునని యాత్మ ప్రభావంబు దెలుపుకొఱకు నిజకళాసంభవులైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేతకృష్ణంబులని నిర్దేశించు కొఱకు సితాసిత కేశ ద్వయ వ్యాజంబున రామకృష్ణాఖ్యల నలరి యవతరించె. అందు భగవంతుడును సాక్షాద్విష్ణుండును నైన కృష్ణుండు జనమార్గవర్తి యయ్యును నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవల పరమేశ్వరుం డయ్యె. అమ్మహాత్ముం డాచరించు కార్యంబులు లెక్క వెట్ట నెవ్వరికి నలవి గాదు. అయినను నాకు గోచరించినయంత యెఱింగించెద, వినుము.

174

తా॥ ఈ ప్రకారంగా పద్మనేత్రుడైన ఆ నారాయణుడు భూమి బరువును తగ్గించడానికి తన శరీరంలోని రెండు వెంట్రుకలే చాలు అనుకున్నాడు. తన మాహాత్మ్యాన్ని వెల్లడించడం కోసం తన అంశతో పుట్టిన వాళ్ళిద్దరి మేని ఛాయలను తెలుపు, నలుపులుగా ప్రకటించాడు. తెల్లటి నల్లటి వెంట్రుకలు రెంటిని వంకగా పెట్టుకుని రాముడు, కృష్ణుడు అనే రెండు నామధేయాలతో అవతరించాడు. ఆ ఇద్దరిలో భగవానుడూ, ప్రత్యక్షస్వరూపుడూ అయిన విష్ణురూపంలోని కృష్ణుడు సామాన్య జనులందరివలె సంసారంలోనికి ప్రవేశించాడు. అయినా సామాన్య జనులకు

వశంకాని అలౌకికమైన పనులెన్నిటినో చక్కబెట్టి, పరమవిభుడు అయ్యాడు.

ఆ మహాత్ముడు చేసి చూపిన పనులన్నింటినీ లెక్కలు వేసి చెప్పడం ఎవరికీ అలవి కాదు. అయినా నాకు తోచినంతలో తెలియచెప్తాను, విను.

క. నూతన గరళ స్తని యగు, పూతనఁ బురుటింటిలోనఁ బొత్తుల శిశువై చేతనముల హరియించి పరేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్.

175

తా॥ కృష్ణుడు పురుటింట్లో పొత్తిళ్ళల్లో ఉన్న పసిగుడ్డు. అప్పుడే బాలింతరాలయిన స్త్రీ వలె పూతన తన చన్నులకు విషం పూసుకుని ఆ పురిటి బిడ్డకు పాలు ఇవ్వాలని యత్నించింది. బాలకృష్ణుడు ఆగ్రహంతో ఆ పూతన ఊపిరులను సైతం పీల్చివేసి, ఆమెను యమపురికి పంపాడు.

క. వికటముగ నిజపదాహతిఁ, బ్రకటముగా మూఁడు నెలల బాలకుఁడై యా శకట నిశాటుని నంతక, నికటస్థునిఁ జేసె భక్తనికరావనుఁడై.

176

తా॥ అప్పటికి కృష్ణుడు మూడు నెలల పసివాడు. అయినా పుణ్యాత్ముల్ని రక్షించాలనే సంకల్పం వెల్లడింపుగా శకటాసురుణ్ణి తన పాదాలతో విసురుగా తన్ని యముడి దగ్గరకు చేర్చాడు.

క. ముద్దుల కొమరుని వ్రేతల, రద్దులకై తల్లి ఱోల రజ్జునఁ గట్టం బద్ధులకు మిన్ను ముట్టిన, మద్దులు వడఁ గూల్చె జనసమాజము వొగడన్.

177

తా॥ గొల్లపడుచుల అల్లరి భరించలేక యశోద తన ముద్దుల కొడుకును త్రాళ్ళతో రోటికి

కట్టింది. ఆ బాలకృష్ణుడు బంధితుల (గంధర్వుల) కోసం ఆకాశాన్నంటే మద్ది చెట్లను ఫెళ్ళున నేలగూల్చాడు. అది చూసిన జనమంతా కృష్ణుణ్ణి పొగిడారు.

మ. మదిలో గృష్ణుడు యశోదబిడ్డఁడని నమ్మంజాల యోగీంద్ర! త ద్వదనాంభోజములోఁ జరాచరసమస్త ప్రాణిజాతాటవీ నది నద్యద్రి పయోధి యుక్తమగు నానాలోకజాలంబు భా స్వ దనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్.

178

తా॥ మునిసత్తమా! నారదా! ఇవన్నీ చూసి ఎందుకో నేను 'కృష్ణుడు యశోద కొడుకు' అని నమ్మలేక పోయేవాణ్ణి. తన నోరు తెరచి చరాచర జీవకోటిని, అడవుల్ని, నదీనదాల్ని, కొండల్ని, మునీశ్వరుల్ని, ఇంకా రకరకాల ప్రపంచాల్ని సాటిలేని తీరులో తల్లికి కనిపింపచేశాడు. అది చూసిన ఆ తల్లికి అంతులేని ఆశ్చర్యం కలిగింది.

చ. వరయమునా నదీజల నివాసకుఁడై నిజ వక్త్రనిర్గత స్ఫురిత విషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁజేయు భీ కర గరళ ద్విజిహ్వుఁడగు కాళియ పన్నగు నాహ్రదంబుఁ జె చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపకగోగణంబులన్.

179

తా॥ కాళియుడనే పాము, యమునానది కొలనులో ఉంటూ ఉండేవాడు. ఆతడి రెండు నాల్కలూ విషపూరితమైనవే. తన నోటి నుంచి భయంకరంగా విషాన్ని వెళ్ళగక్కేవాడు. ఆ కొలను నీటిని తాగిన జీవుల ప్రాణాలు పోయేలా చేసేవాడు. అలాంటి కాళియుణ్ణి యాదవ వంశోత్తముడు కృష్ణుడు ఆ కొలను నుంచి వెలుపలకు నెట్టి గోవులను, గోపీగోపగణాలను ఆదుకున్నాడు.

మ. తనయా! గోపకు లొక్కరేయి తఱి, నిద్రం జెందఁ గార్చిచ్చు వ చ్చినఁ "గృష్ణా! మము నగ్ని పీడితుల రక్షింపం దగు గావవే" యనినం "గన్నులు మీరు మోడ్వుఁ డిదె దావాగ్నిన్

వెసన్నార్తు నే" నన వా రట్ల యొనర్ప మ్రింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్.

180

తా॥ నాయనా! ఒక నాటి రాత్రి సమయంలో వ్రేపల్లె అంతా నిద్రలో మునిగిపోయి ఉంది. ఉన్నట్టుండి దావాగ్ని రగిలింది. 'ఓ కృష్ణా ! చిచ్చులో చిక్కుకున్న మమ్మల్ని కాపాడవలసింది' అని గోపాలకులు ఆర్తనాదాలు చేశారు. ఆ కృష్ణుడు 'నేను ఆ కార్చిచ్చును ఇప్పుడే ఆర్పివేస్తాను. మీరంతా కళ్ళు మూసుకుని ఉండండి' అని చెప్పాడు. వాళ్ళు కృష్ణుడు చెప్పినట్లు చేశారు. కృష్ణుడు అదొక ఆటగా ఆ అగ్నిని త్రుటిలో మ్రింగివేశాడు.

క. మందుని గతి యమునాంబువు, లందు నిసిం గ్రుంకి బద్ధుఁడై చిక్కిన యా నందుని, వరుణుని బంధన, మందు నివృత్తునిగఁ జేసె హరి సదయుండై.

181

తా॥ ఒక అర్ధరాత్రి సమయంలో నందుడు ముందు వెనుకలు చూడకుండా ఆ యమునా నదీజలాల్లో స్నానం చేస్తుండగా మునిగిపోయాడు. వరుణపాశంతో బంధితుడయ్యాడు. విష్ణువు దయచూపి ఆ వరుణుడి చెఱనుంచి నందుణ్ణి విడిపించాడు.

మ. మయసూనుండు నిజానువర్తుల మహామాయన్ మహీభృ ద్గుహా శ్రయులంగా నొనరించి తత్పథము నీరంధ్రంబు గావించినన్ రయ మొప్పన్ గుటిలాసురాధమునిఁ బోరన్ ద్రుంచి గోపావళిన్ దయతోఁ గాచిన కృష్ణు సన్మహిమ మేతన్మాత్రమే తాపసా!

182

తా॥ మయాసురుడి కొడుకు (వ్యోమాసురుడు అనేవాడు) కృష్ణుని సహచరులైన గొల్ల పిల్లలందరినీ తన మాయామహిమతో కొండబిలాన్ని ఆశ్రయించేలా చేశాడు. ఆ గుహ దారిని దూరసందు లేకుండా చేశాడు. ఆ మయాసురుడితో కృష్ణుడు వెంటనే కయ్యానికి దిగి, ఆ కపటబుద్ధి గల నీచుణ్ణి మట్టుపెట్టాడు. గోపాలకులందరనూ కరుణతో కాపుకాసిన ఆ కృష్ణుడి

మంచితనం గొప్ప ఇంత మాత్రమైనదేనా! కాదు. ఎంత చెప్పినా తరుగనిదే అది.

క. దివిజేంద్రప్రీతిగ వ, ల్లవజను లేఁటేఁటఁ జేయు లాలిత సవనో త్సవము హరి మాన్పిన గో, పవరులు గావింపకున్న బలరిపుఁ డలుకన్.

183

తా॥ ఇంద్రుడికి సంతోషకరంగా, లాలనగా ప్రతి ఏటా ఆ గోపకులు ఇంద్రయాగోత్సవం జరిపేవారు. ఆ ఏడాది ఆ యాగాన్ని శ్రీకృష్ణుడు మానేలా చేశాడు. ఆ గోపకులు యాగం చేయ తలపెట్టలేదు. ఆ ద్రోహానికి ఇంద్రుడు అలుక వహించాడు.

తే. మంద గొందలమంద నమందవృష్టిఁ, గ్రందుకొనుఁడంచు నింద్రుండు మందకంపె జండపవన సముద్ధూత చటుల విలయ, సమయ సంవర్త కాభీల జలధరములు.

184

తా॥ ఆ ఇంద్రుడు 'వ్రేపల్లె అంతా తల్లడిల్లిపోయేలా కుండపోతగా కురిసే మేఘాలతో కమ్ముకోండి' అంటూ మబ్బుల్ని హెచ్చరించాడు. పెద్ద గాలికి ప్రళయకాలంలో ఉవ్వెత్తున పైకి ఎగిసిపడే విధాన భయంకరంగా సుడులు తిరిగే మేఘాలన్నీ ఒక్కసారిగా గుమిగూడాయి.

శా. సప్తస్కంధ శిఖా కలాప రుచిమత్సౌదామనీవల్లికా దీప్తోదగ్రముహుర్ముహుస్తనితధాత్రీ భాగనీరంధ్రమై సప్తాశ్వస్ఫురదిందు మండలనభస్సంఛాదితాశాంతర వ్యాప్తాంభోద నిరర్గళ స్ఫుటశిరోవాః పూరధారాళమై.

185

తా॥ వాయుమండలం ఏడు కాండల అగ్రభాగంలో విప్పిన పింఛం మాదిరి కాంతులు వ్యాపింప చేసే తీగల్లాంటి మెరుపులతో ప్రకాశమానమై, మాటిమాటికి దట్టమైన, భయంకరమైన చీకట్లు కమ్ముకుంటున్న భూమి కలదై, ఏడు గుర్రాలతో ప్రకాశమానమైన సూర్య మండల చంద్ర

మండలాల చుట్టూ ఆకాశాన్ని ఆవరించి, దిక్కుల నడుమ మబ్బులు అలుముకున్నాయి. తలలు పగిలే శబ్దాలతో ఏకధారగా జారిపడి కాలువల్లా ప్రవహించే నీటితో–

వ. కురియు వానజల్లు పెల్లున రిమ్మలుగొని సొమ్మలు వోయి గోప గోకులం బాకులంబు నొంది "కృష్ణ! కృష్ణ! రక్షింపు" మని యార్తిం బొంది కుయ్యిడ నయ్యఖండ కరుణారస సముద్రుండును భక్తజన సురద్రుముండును నైన పుండరీకాక్షుండు.

186

తా॥ ధారాపాతంగా కురిసే వానజల్లులకు ఆ గొల్లపల్లెలోని వారందరూ గోగణసమేతంగా వివశమై, మూర్ఛిల్లి, చీకాకు పొందారు. ఓ కృష్ణా! ఓ కృష్ణా! కాపాడమంటూ దుఃఖంతో అరచి గీపెట్టారు. అంతులేనంత దయారసానికి నిధానమైనవాడూ, భక్తకోటికి కల్పవృక్షం వంటివాడూ అయిన ఆ తామరసనేత్రుడు –

శా. సప్తాబ్దంబుల బాలుఁడై నిజభుజా స్తంభంబునన్ లీలతో సప్తాహంబులు శైలరాజమచలచ్ఛత్రంబుగాఁ దాల్చి, సం గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలక వ్రాతమున్ సప్తాంభోధి పరీతభూధరున కాశ్చర్యంబె చింతింపఁగన్.

187

తా॥ ఏడేళ్ళ వయస్సు బిడ్డ, ఏడు రోజుల పాటు స్తంభాల్లాంటి తన భుజాలతో ఆ (గోవర్ధన) పర్వతాన్ని విలాసవంతంగా గొడుగులాగా ఒంటి చేత్తో ఎత్తి పట్టాడు. పశువుల, గొల్లల ప్రాణాల్ని భద్రంగా చక్కగా కాపాడాడు. ఎంచి చూస్తే, ఏడు సముద్రాల్ని చుట్టుకుని ఉన్న భూమిని పైకెత్తిన ఆ మాధవుడికి ఇది ఏమంత వింతైన పనికాదు కదా!

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా ధవళిత, విమల బృందావన వీథియందు రాసకేళీ మహోల్లాసుఁడై యుత్ఫుల్ల, జలజాక్షుఁ డొక నిశా సమయమునను దనరారు మంద్ర మధ్యమ తానముల నింపు, దళుకొత్త రాగభేదముల దనరి ధైవత ఋషభ గాంధార నిషాద

పం, చమ షడ్జ మధ్యమ స్వరము లోలిఁ

తే. గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు, నాళ వివరాంగుళీన్యాస లాలనమున
మహితగతిఁ బాడె నవ్యక్త మధురముగను, పంకజాక్షుండు దారువు లంకురింప.

188

తా॥ బృందావన వీథుల్లో పిండి ఆరబోసినట్లు తెల్లటి తెలుపుతో శరత్కాలపు వెన్నెల కాస్తుంది. అక్కడ విచ్చిన తామరపూల వంటి కళ్ళుగల కృష్ణుడు ఒక రాత్రివేళ రాసకేళీ ఉత్సవానికి ఉల్లాసుడయ్యాడు.

మంద్ర, మధ్యమ, తారస్థాయిల సరికొత్త రాగ భేదాలతో దైవతం, ఋషభం, గాంధారం, నిషాదం, పంచమం, షడ్జమం, మధ్యమం అనే సప్త స్వరాలూ; కళలూ, జాతులూ మూర్ఛనల వరుసలు వెలువడేలా ఆ వేణువును ఊదాడు. ఆ వేణువు కన్నాలను వేళ్లతో తాటిస్తూ లాలిత్యంతో ఇదీ అని వివరించ వీలులేని రీతిలో మధురాతిమధురంగా గానం చేశాడు. బ్రహ్మానందాన్ని వెల్లివిరియింపజేశాడు. ఆ గానమాధుర్యానికి మోడు బారిపోయిన చెట్లు మళ్ళీ చిగురించాయి.

మ. హరివేణూద్గత మంజుల స్వరనినాదాహూతలై గోప సుం దరు లేతేర ధనాధిపానుచర గంధర్వుండు గొంపోవఁ ద త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడుని భుజాదర్పంబు మాయించి తాఁ బరిరక్షించిన యట్టి కృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్?

189

తా॥ శ్రీకృష్ణుడి మధురమైన వేణునాదపు పిలుపును విని, గోపికలంతా మోహితలై అక్కడకు విచ్చేస్తున్నారు. అంతలో కుబేరుని అనుచరుడు శంఖచూడుడనే గంధర్వుడు ఆ గోపకాంతలను ఎత్తుకుపోయాడు. వాళ్ళంతా కృష్ణుడికి మొరపెట్టుకోగా, శంఖచూడుని బుజాల పొగరు అణచి వేసి, ఆ కాంతలను సంరక్షించాడు.

అటువంటివాణ్ణి కొనియాడటం సాధ్యమా?

చ. నరక ముర ప్రలంబ యవన ద్విప ముష్టిక మల్ల కంస శం బర శిశుపాల పంచజన
పౌండ్రక పల్వల దంతవక్త్ర వా నర ఖర సాల్వ వత్స బక నాగ విదూరక రుక్మి కేశి ద ర్దుర
వృష ధేనుక ప్రముఖదుష్టనిశాటులఁ ద్రుంచె వ్రేల్మిడిన్.

190

తా॥ ఆ పరంధాముడు నరక, ముర, ప్రలంబ, యవన, కరి(కంసుని రాజ్యంలోని కువలయమనే ఏనుగు), ముష్టిక, మల్ల, కంస, శంబర, శిశుపాల, పంచజన, పౌండ్రక వాసుదేవ, పల్వల, దంతవక్త్ర, వాన (ద్వివిదుడు), ఖర, సాల్వ, వత్స, బక, నా (కాళియసర్పం), విదూరక, రుక్మి, కేశి, దర్దుర, వృష, ధేనుకాది దుష్టులైన రాక్షసులను ఒక్కొక్కరిని వరుస పెట్టి ఘోరంగా మట్టుపెట్టాడు.

వ. మఱియును.

191

తా॥ ఇంకనూ.

మ. బలభీమార్జున ముఖ్య చాపధర రూపవ్యాజతం గ్రూరులన్
ఖలులన్ దుష్టధరాతలేశ్వరుల సంగ్రామైక పారీణ దో
ర్బల కేళిం దునుమాడి సర్వధరణీభారంబు మాయించి సా
ధుల రక్షించిన యట్టి కృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్.

192

తా॥ బలరాముడు, భీముడు, అర్జునుడు మొదలుగా గల వీరులను నిమిత్తంగా చేసుకొని దుర్మార్గులు, నీచులు, దుష్ప్రవర్తకులు అయిన రాక్షస రాజులను యుద్ధపారీణతతో అనేక

యుద్ధాలలో ఆరితేరిన తన భుజబలంతో శ్రీకృష్ణుడు చంపాడు. సమస్త భూభారాన్ని తొలగించాడు. సాధుజనాలను రక్షించాడు. అలాంటి అనంతుణ్ణి నేను నిరంతరం ఉపాసిస్తాను.

వ. అట్టి లోకోత్కృష్టుండైన కృష్ణుని యవతారమాహాత్మ్యం బెఱింగించితి నింక వ్యాసావతారంబు వినుము.

193

తా॥ అలాంటి లోకోత్తరుడైన శ్రీకృష్ణుడి అవతార మహిమను చెప్పాను. ఇక వ్యాసుడి అవతారం చెప్తా విను!

చ. ప్రత్యుగమందు సంకుచిత భావులు నల్పతరాయువుల్ సుదు ర్గతికులు నైన మర్త్యుల కగమ్యములున్ స్వకృతంబు నిత్యముల్ సత్యములు నైన వేదతరుశాఖలు దా విభజించినట్టి యా సాత్యవతేయ మూర్తియయి జాతము నొందె హరి ప్రసన్నుఁడై.

194

తా॥ ప్రతీ యుగంలోనూ మనుజుల్లో విశాల హృదయం లేనివారూ, తక్కువ ఆయుర్దాయం కలవారూ, దుర్గతులు పొందేవారూ ఉంటుంటారు. వాళ్ళకు అపౌరుషేయాలై పరమపురుష కృతాలూ, శాశ్వతాలూ అయిన వేదశాఖలు పొందలేనివి అవుతాయి. వారి మీది అపేక్షతో శ్రీహరి పరాశరమహర్షి ప్రియమైన కొడుకుగా జన్మమెత్తాడు.

వ. మఱియు బుద్ధావతారంబు వినుము.

195

తా॥ ఇక బుద్ధావతారం విను.

మ. అతిలోభాత్ములు సూనృతోక్తులును వేదాచార సంశీలు రు
ద్ధత పాషండమతోపధర్ములు జగత్సంహారు లైనట్టి యా

దితి సంజాతు లధర్మ వాసనల వర్తింపం, దదాచార సం
హతి మాయించి హరించె దానవులఁ బద్మాక్షుండు బుద్ధాకృతిన్.

196

తా॥ చపల చిత్తులూ, అసత్యభాషణులూ, వేదోక్తములైన ఆచారాలను వక్రంగా ఆచరించే స్వభావులూ, పేట్రేగిన పాషండ మతస్థులూ, దైవం, ధర్మాల పట్ల అవిశ్వాసంతో అనుచితమార్గాన్ని పాటించేవారూ, లోకుల ప్రాణాలు తీసేవారూ, దైత్యులూ అయిన దానవుల ప్రవర్తనవల్ల లోకమంతా అధర్మసంస్కారంగా ఉంటుంది. ఆయా దురాచారాలు అన్నింటినీ తుడిచిపెట్టి, బుద్ధావతారంలో విష్ణువు ఆ దానవులను తుదముట్టిస్తాడు.

వ. మఱియుం గల్క్యవతారంబు వినుము.

197

తా॥ ఇక కల్కి అవతారాన్ని గురించి విను.

మ. వనజాక్ష స్తవశూన్యులున్ మఱి వషడితి స్వాహా స్వధా వాక్య శో
భన రాహిత్యులు, సూనృతేతరులునుం, బాషండులు న్నైన వి
ప్రనికాయంబును శూద్రభూవిభులున్ బాటిల్లినన్ గల్కియై
జననం బంది యధర్మము న్నడఁచి సంస్థాపించు ధర్మం బిలన్.

198

తా॥ కలియుగంలో ఆ పరాత్పరుణ్ణి బ్రాహ్మణులు స్తుతించరు. వషట్, స్వాహా, స్వధా అనే యాగ సంబంధిత మహావాక్యాలు వల్లించరు. నోట నిజం పల్కరు. వారిలో దైవభావం, ధర్మచింతన సన్నగిల్లిపోతాయి. శూద్రులు పాలకులవుతారు. ఇవి కలికాలంలో నెలకొన్నప్పుడు మహావిష్ణువు కల్కిగా అవతరిస్తాడు. ఈ లోకంలో అధర్మాన్ని పారద్రోలతాడు. ధర్మాన్ని నిలబెట్టి లోకాలను కాపాడుతాడు.”

వ. అని మఱియుఁ బితామహుండు నారదున కిట్లనియె, మునీంద్రా, పుండరీకాక్షుం డంగీకరించిన లీలావతారకథావృత్తాంతంబు నేను నీకు నెఱింగించు నంతకు మున్న హరి వరాహాద్యవతారంబు లంగీకరించి తత్ప్రయోజనంబులఁ దీర్చె, మన్వంతరావతారంబు లంగీకరించి నవియు నంగీకరింపఁగలవియునై యున్నవి; వర్తమానంబున ధన్వంతరి పరశురామావతారంబులు దాల్చి యున్నవాఁడు. భావికాలంబున శ్రీరామాద్యవతారంబుల నంగీకరింపంగలవాఁడు. అమ్మహాత్ముండు సృష్ట్యాది కార్య భేదంబులకొఱకు మాయాగుణావతారంబునొందు. బహుశక్తి ధారణుండైన భగవంతుడు సర్గాదిని దపంబును, ఏనుగు, ఋషి గణంబులును నవప్రజాపతులునునై యవతరించి విశ్వోత్పాదనంబు గావించు. ధర్మంబును విష్ణుండును యజ్ఞంబులును మనువులును నింద్రాది దేవగణంబును ధాత్రీపతులును నయి యవతరించి జగంబుల రక్షించుచుండు. అధర్మంబును రుద్రుండును మహోరగంబులును రాక్షసానీకంబులును నై యవతరించి విలయంబు నొందించు చుండు, నిత్తెఱంగునం బరమేశ్వరుండును సర్వాత్మకుండును నైన హరి విశ్వోత్పత్తిస్థితి లయ హేతు భూతుండై విలసిల్లు. ధరణీరేణువుల నయిన గణుతింప నలవియగుం గాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్క వెట్ట నెవ్వరికి నశక్యంబై యుండు. నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి. సవిస్తారంబుగా నెఱింగింప నాకుం దరంబుగా దనిన నన్యులం జెప్పనేల? వినుము.

199

తా॥ అని చెప్పి, బ్రహ్మ నారదుడితో ఇంకా ఇలా అంటున్నాడు, ఓ నారద మునీ ! విష్ణువు రూపుదాల్చిన లీలావతార కథల సమాచారం యావత్తూ నేను నీకు తెలియ చెప్పడానికి ముందే హరి ఆ అవతారాలను ధరించాడు. వరాహావతారం మొదలైనవి వేర్వేరు మన్వంతరాలకు చెందిన అవతారాలలో నెరవేర్చినవీ ఉన్నాయి. నెరవేర్చబోయేవీ ఉన్నాయి.

ఇప్పుడు ఆ విష్ణువు ధన్వంతరి అవతారాన్ని, పరశురామావతారాన్ని పొంది ఉన్నాడు.

రాబోయే కాలంలో శ్రీరామాది అవతారాలు పొందగలవాడు. ఆ పరమాత్మ సర్గాది విభిన్నకార్యాల నిమిత్తం మాయాగుణ భూయిష్ఠమైన అవతారాలు ఎత్తుతుంటాడు. ఎన్నో శక్తుల్ని నిలకడగా నిలుపుకునే ఆ భగవంతుడు సృష్టి మొదట్లో తపస్సుగా, నేనుగా, ఋషులుగా, తొమ్మండుగురు ప్రజాపతులుగా అవతరించి లోకాల్ని పుట్టిస్తుంటాడు.

ధర్మం, విష్ణువు, యాగాలు, మనువులు, ఇంద్రుడు మొదలైన దేవతలు; రాజులు మొదలైనవారుగా అవతారం ఎత్తి ప్రపంచస్థితిని కల్పిస్తుంటాడు.

అధర్మంగా, రుద్రుడుగా, మహాసర్పాలుగా, రాక్షసులుగా రూపెత్తి ప్రళయం పొందిస్తూ ఉంటాడు.

ఈ విధంగా ఆ పరమాత్ముడూ సర్వాత్మకుడూ అయిన విష్ణువు ఈ ప్రపంచ సృష్టి, స్థితి, ప్రళయాలకు కారణభూతుడై వెలుగొందుతుంటాడు.

నేలమీది దుమ్ము కణాలనైనా లెక్కింప వచ్చునేమో గాని ఆ మహాత్ముడి లీలావతారాల అద్భుత కథలను ఎవరూ లెక్కించలేరు.

వీటిని గూర్చి ఇంతదాకా నేను నీకు చాలా క్లుప్తంగా చెప్పాను. విస్తరించి చెప్పడం నా వల్లే కానపుడు ఇతరులను గూర్చి ఇంకా ఏమని చెప్పగలం? విను.

> చ. అమరఁ ద్రివిక్రమస్ఫురణ నందిన యమ్మహితాత్ముపాద వే గమున హతంబు లైన త్రిజగంబుల కావల నొప్పు సత్య లో కము చలియించినం గరుణఁ గైకొని కాచి ధరించె పాద ప ద్మము తుది నున్న యప్రతిహతంబగు శక్తి గణింప శక్యమే!

200

తా॥ ఆ విష్ణువుకి పొందికగా త్రివిక్రమత్వం స్ఫురించింది. అంతలోనే ఆ పరాత్పరుడి కాలి తాకిడికి లోనైన స్వర్గ మర్త్య పాతాళ లోకాలూ, ఆపైన ప్రకాశించే సత్యలోకమూ వణకి

పోయాయి. ఆయన వాటిని చలింపకుండా తన పాదపద్మం కొట్టకొసన నిలిపి రక్షించాడు. ఆ దయామయుడి ఎదురులేని శక్తిని ఇంతింతని వర్ణించడం ఎవరికీ శక్యం కాదు.

మ. హరి మాయాబల మే నెఱుంగ నఁట శక్యంబే సనందాది స త్పురుష వ్రాతముకైన, బుద్ధి నితరంబున్ మాని సేవాధిక స్ఫురణం దచ్చరితానురాగ గుణవిస్ఫూర్తిన్ సహస్రాస్య సుం దరతన్ బొల్పగు శేషుఁడున్నెరుగ డన్నన్ జెప్పనే రొండొరున్.

201

తా॥ శ్రీమహావిష్ణువు మాయాసామర్థ్యం నాకూ తెలియదు. సనందనుడు మొదలైన మునీశ్వరులకైనా దాన్ని తెలుసుకోవడం సాధ్యపడదు.

ఆదిశేషుడు తన మనస్సులో వేరే ఇతర ఆలోచనలకు తావు ఇవ్వనివాడు. ఆ భగవత్సేవతోనే ప్రకాశిస్తుంటాడు. ఆ పరాత్పరుడి చరిత్రలో తనకు ఎంతో ఇష్టమైన గుణాల్ని ప్రకాశింప చేస్తుంటాడు. ఆ వేలవేల గుణాల వలె వేయినోళ్ళతో అందంగా ఉండే ఆ ఆదిశేషుడికే విష్ణుమాయ అర్థం కాలేదంటే, ఇక ఇతరుల గూర్చి చెప్పుకోవడానికి ఏమీ మిగులదు.

చ. ఇతరము మాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా శ్రితజనసేవితాంఘ్రి సరసీరుహుఁడైన సరోజనాభుఁ డం చితదయతోడ నిష్కపట చిత్తమునం గరుణించు, నట్టి వా రతుల దురంతమై తనరు నవ్విభు మాయఁ దరింతు రెప్పుడున్.

202

తా॥ ఆ పరమ ప్రభువు, ఆశ్రితులు పూజించే పాదపద్మాలు కలవాడు. తననే మనసారా నమ్మి ఇతరమైనవి ఏమీ పట్టించుకోకుండా సేవించేవాళ్ళను ఆ పద్మనాభుడు ఎప్పుడూ కరుణిస్తాడు. వాళ్ళపట్ల అమితమైన జాలిని కనబరచి, కపటం లేని మనస్సుతో ప్రసన్నుడవుతాడు. ఆయన దయకు నోచిన సేవకులు సాటిలేనిదీ అంతులేనిదీ అయిన ఆ పరమేశ్వరుడి మాయ నుంచి బయటపడగలుగుతారు.

వ. మఱియును సంసారమగ్నులయి దివసంబులు ద్రోఁచియు నంతంబున శునక సృగాలభక్షణంబులైన కాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబు సేసిన పుణ్యాత్ములుం గొందఱు గల రెఱింగింతు వినుము. నేను నీ బ్రహ్మత్వంబునం జెందు రాజసంబు విడిచి య మ్మహాత్ముని పాదారవిందంబుల భక్తి నిష్ఠుండ నయి శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు. రాజసగుణుండనై యున్నవేళం దెలియంజాల. కావున శాస్త్రంబులు ప్రపంచింపక కేవలభక్తిజ్ఞాన యోగంబున సేవింతు. మఱియు సనకాదులగు మీరును, భగవంతుండైన రుద్రుండును, దైత్యపతియైన ప్రహ్లాదుండును, స్వాయంభువ మనువును, నతని పత్నియగు శతరూపయుఁ, దత్పుత్రులగు ప్రియవ్రతోత్తానపాదులునుం, దత్పుత్రికలు, ప్రాచీన బర్హియు, ఋభువును, వేనజనకుండగు నంగుండును, ధ్రువుండును గడవం జాలుదురు వెండియు.



తా॥ ఇంకా సంసారంలో కొట్టుమిట్టుకలాడుతూ ఆఖరి గడియల్లో కూడా, కుక్కలూ, నక్కలూ పీక్కుతినగల ఈ శరీరంపై మమకారం చూపక, ఊరకనే కాలం దొర్లిపోతుంటుంది. అయినా కొందరు పుణ్యవంతులు తమ దేహాన్ని భగవంతుడికే సమర్పించుకుంటారు. అలాంటి కొందరి సంగతి తెలియచెప్తాను విను.

నేను 'బ్రహ్మత్వం' అనే భావాన్ని కలిగించే రాజసాన్ని వదులుకుని ఆ పరమపురుషుడి పాదపద్మాల్ని ఎంతో భక్తిగా నిష్ఠగా ప్రపత్తితో సేవించినప్పుడే ఆ తత్త్వాన్ని తెలుసుకోగలుగుతాను. రాజసగుణతత్త్వంతో ఉన్నప్పుడు నాకూ ఆ బ్రహ్మతత్త్వం అవగతం కాదు. అందువల్ల శాస్త్రాలతో విస్తృతంగా ప్రకటించకుండా కేవలం భక్తిజ్ఞానాల కలిమితోనే నేను అతణ్ణి సేవిస్తుంటాను.

ఇంకా సనకుడు మొదలైన మీరూ, పరమేశ్వరుడైన శివుడూ, రక్కసులను పాలించే ప్రహ్లాదుడూ, స్వాయంభువ మనుమా, అతడి సతి శతరూపా, వీళ్ళ కొడుకులు ప్రియవ్రత,

ఉత్తానపాదులూ, కుమార్తెలు (ఆకూతి, దేవహూతి, ప్రసూతి), ప్రాచీనబర్హీ, ఋభుమా, వేనుడి తండ్రి అంగుడూ, ధ్రువుడూ వీళ్ళంతా ఆ విష్ణుమాయను తెలుసుకుని దాట కలిగినవారే.

సీ. గాధి గయాదు లిక్ష్వాకు దిలీప మాం, ధాతలు భీష్మ యయాతి సగర రఘు ముచుకుం
దైళ రంతిదే వోద్ధవ, సారస్వతోదంక భూరిషేణ శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల, బలి
విభీషణ శిబి పార్థ విదురు లంబరీష పరాశ రాలర్క దేవల, సౌభరి మిథిలేశ్వరాభిమన్యు

తే. లార్ష్ణిషేణాదులైన మహాత్ము లెలిమిఁ, దవిలి యద్దేవు భక్తిఁ జిత్తముల నిల్పి
తత్పరాయణభక్తి దుర్దాంతమైన, విష్ణుమాయఁ దరింతురు విమలమతులు.

204

తా॥ గాధి, గయుడు, మొదలైనవారు, ఇక్ష్వాకుడు, దిలీపుడూ, మాంధాత, భీష్ముడు, యయాతి, సగరుడూ, రఘువు, ముచుకుందుడు, ఐలుడు (పురూరవుడు), రంతిదేవుడు, ఉద్ధవుడు, సారస్వతుడు (దధీచి), ఉదంకుడు, భూరిషేణుడు, శ్రుతదేవుడు, హనుమంతుడు, శతధన్వుడు, పిప్పలాదుడు, బలిచక్రవర్తి, విభీషణుడు, శిబిచక్రవర్తి, అర్జునుడు, విదురుడు, అంబరీషుడు, పరాశరుడు, అలర్కుడూ, దేవలుడు, సౌభరి, మిథిలదేశాధిపతి జనకుడు, అభిమన్యుడు, ఆర్ష్ణిషేణుడు మొదలుగా గల మహానుభావులు ఆ దేవదేవుడి ప్రేమలో చిక్కి, భక్తితో అతణ్ణి మనస్సులో నిల్పుకుంటారు. అతడియందే ఆసక్తి కలవారవుతారు. అందువల్లనే అణచి ఉంచలేని ఆ విష్ణుమాయను కల్మషం లేనివాళ్ళు సుఖంగా దాటగలుగుతున్నారు.

మ. అనఘా! వీరల నెన్న నేమిటికిఁ, దిర్యగ్జంతుసంతాన ప క్షినిశాటాటవికాఘజీవ నివహస్త్రీ
శూద్రహూణాదు లై నను నారాయణభక్తి యోగమహితానందాత్ము లై రేని వా రనయంబున్
దరియింతు రవ్విభుని మాయావైభవాంభోనిధిన్.

205

తా॥ పుణ్యచరిత్రా! వీళ్ళందరినీ ఎంచడం ఎందుకు? పశుపక్ష్యాదులూ, రాకాసులూ,

ఆటవికులూ, పాపులూ, స్త్రీలూ, శూద్రులూ, హూణులూ మొదలుగా ఏ జాతివారైనా గాని విష్ణుభక్తి సాంగత్యప్రభావులై ఉంటే బ్రహ్మానంద స్వరూపులవుతారు. అలాంటి పుణ్యాత్ములు విష్ణుమాయాభోగం అనే సముద్రాన్ని నిరంతరం దాటిపోతూనే ఉంటారు.

వ. కావున.

206

తా॥ కనుక.

క. శశ్వత్ప్రశాంతు నభయుని, విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్
శాశ్వతు సము సదసత్పరు, నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెపుడు మునీంద్రా!

207

తా॥ ఓ మునిరాజా! ఎల్లప్పుడూ ప్రశాంతుడైనవాడూ, అభయం ఇచ్చేవాడూ, విశ్వస్వరూపుడూ, జ్ఞానమాత్రుడూ, ఈశ్వరుడూ, విశుద్ధ స్వభావుడూ, నిత్యుడూ, సాటిలేనివాడూ, సత్, అసత్ రూపుడూ అయిన పరమేశ్వరుణ్ణి సదా నీ మనస్సులో నిలుపుకో.

వ. అట్లయిన నప్పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్య లజ్జాననత వదనయై పొందం జాలక వైముఖ్యంబున దవ్వు దవ్వులం దలంగి పోవు. మఱియును.

208

తా॥ అట్లా ధ్యానించినట్లైతే పుణ్యపురుషులు నిందపడని నడతగలవారు అవుతారు. అవిద్య ఆ పుణ్యాత్ముల దరిచేరలేక సిగ్గుపడుతుంది. తలవంచుకుని ప్రతికూలభావంతో దూరదూరంగా వెళ్ళిపోతుంది. ఇంకా –

చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు స్థిరత విశోక సౌఖ్యములఁ జెందిన ధీనిధు లన్యకృత్యముల్ మఱచియుఁ జేయ నొల్లరు, తలంచిన

నట్టిదయౌ, సురేంద్రుఁడుం బరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషితన్?

209

తా॥ పరమాత్ముడూ, అచ్యుతుడూ, అనంతుడూ అయిన ఆ హరిని బుద్ధిమంతులు నిలకడగా మనస్సులో భావిస్తారు. ఎప్పటికీ దుఃఖమే ఎరుగని ఆనందాల్ని అనుభవిస్తారు. అట్టి మహనీయులు భాగవత ధర్మాలను పాటిస్తారే తప్ప, పొరపాటున కూడా వేరేపని చేయరు. భావించి చూస్తే, అది అంతే అవుతుంది కదా! ఇంద్రుడు కూడా దాహం వేస్తే నీరు తాగాలనే అపేక్ష కొద్దీ నుయ్యి తవ్వుతూ, కూర్చుంటాడా?

(అమృతం తాగేవాడు, వర్షం కురిపించే వాడు నీళ్ళ కోసం తెంపరలాడడని భావం)

ఉ. సర్వఫల ప్రదాతయును, సర్వశరణ్యుఁడు, సర్వశక్తుఁడున్ సర్వజగత్ప్రసిద్ధుఁడును, సర్వగతుం డగు చక్రపాణి యీ సర్వశరీరులున్ విగమసంగతిఁ జెంది విశీర్యమాణులై పర్వినచో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్.

210

తా॥ ఆ సుదర్శన చక్రధారి, ఆ విష్ణువు అన్ని ప్రయోజనాలను చేకూర్చినవాడు. సమస్త ప్రాణికోటీ రక్షణ కోరదగినవాడు. సమస్త శక్తులు ఒనగూడినవాడు. విశ్వం మొత్తంలోనూ ప్రఖ్యాతి పొందినవాడు. అన్నిట్లోనూ నిండి ఉన్నవాడు. దేహధారులందరూ చావుపొందికతో నశించినవారై ప్రసిద్ధి పొందినవారవుతారు. అయితే తాను మాత్రం ఆకాశం లాగున ఎప్పుడూ నిర్వికారంగా మిగిలి ఉంటాడు.

ఉ. కారణకార్యహేతు వగు కంజదళాక్షునికంటె నన్యు లె వ్వారును లేరు, తండ్రి! భగవంతు ననంతుని విశ్వభావనో దారుని సద్గుణావళు లుదాత్తమతిం గొనియాడకుండినన్ జేరవు చిత్తముల్ ప్రకృతిఁ జెందని నిర్గుణమైన బ్రహ్మమున్.

211

తా॥ తండ్రీ! ఆ కమలాక్షుడి కన్న మించినవారు వేరెవ్వరూ ఉండరు. కారణానికి కారణమూ అతడే, కార్యానికి కారణమూ అతడే.

భగవంతుడు, అంతము లేనివాడూ, విస్తృతమైన భావనలో ఉదారుడూ అయిన అతడి మంచి స్వభావాల్ని గొప్ప మనస్సు చేసుకొని పొగడాలి. అలా కీర్తించక పోయినట్లయితే మనస్సులు ప్రకృతితో పొంతన లేని నిర్గుణమైన బ్రహ్మాన్ని అందుకోలేవు.

మ. నిగమార్థ ప్రతిపాదక ప్రకటమై, నిర్వాణ సంధాయిగా
భగవంతుండు రచింప భాగవత కల్పక్ష్మాజమై శాస్త్ర రా
జి గరిష్ఠంబగు నీ పురాణ కథ సంక్షేపంబుగాఁ జెప్పితిన్,
జగతిన్నీవు రచింపు దాన నతివిస్తారంబుగాఁ బుత్రకా!

212

తా॥ ఓ కుమారా! ఈ పురాణ గాథ వేదార్థాల ప్రతిపాదనంలో ప్రసిద్ధిని పొందింది. దీన్ని ముక్తిప్రదాయినిగా భగవంతుడు రచించాడు. ఈ భాగవతం ఆ పరమభక్తులకు కల్పవృక్షం లాంటిది. శాస్త్రాలన్నింటిలో ఉత్తమమైంది.

నీకు ఈ కథను సంక్షిప్తంగా చెప్పాను. నువ్వు దీన్ని లోకంలో మరింతగా విస్తరింప చేసి రచించు.

చ. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు, నందు భూ సురకులమందుఁ బుట్టు టతిచోద్యము, నిట్లగుటన్ మనుష్యు ల స్థిర మగు కార్యదుర్దశలచేత నశింపక విష్ణుసేవనా పరతఁ దనర్చి నిత్య మగు భవ్యపథంబును బొందు టొప్పదే?

213

తా॥ అన్ని జన్మల్లోకీ మానవజన్మ చాలా విశేషం అయింది. అందునా బ్రాహ్మణ

వంశంలో పుట్టడం మరింత గొప్ప వింత. ఇలా జరగడం వల్ల మానవులు అనిత్యమైన నిష్ప్రయోజన కార్యాలలో కొట్టుకుని పోకుండా విష్ణుసేవనం మీద కాంక్ష కలిగి ఉండాలి. శాశ్వతమైన భవ్యపదాన్ని పొందాలనుకోవడం సమంజసమే కదా!

మ. ఉపవాసవ్రత శ్రౌత శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా
జప దానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర, ద
చ్చపుభ క్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వలేకుండినన్.

214

తా॥ కమలనేత్రుడు, అందరిలోకి ఘనుడైనవాడు, లక్ష్మీవల్లభుడు, పాపాలు తుడిచిపెట్టేవాడు, పరబ్రహ్మ, అచ్యుతుడు అయిన విష్ణువును నిశ్చలమైన భక్తితో సంతోషంగా సేవించాలి. అలా కాకుండా ఉపవాసాలు, వ్రతాలు, శౌచాలు, శీలాలు, యాగాలు, సంధ్యావందనాదులు, అగ్నికార్యాలు, జపాలు, దానాలు, వేదపఠనం, మొదలైన పనుల వల్ల ముక్తిమార్గం ప్రాప్తించదు.

నిర్మలమైన మనస్సుతో భగవంతుని సేవించే భక్తిపరులకు మాత్రమే ముక్తి తథ్యం.

క. వనజాక్షు మహిమ నిత్యము, వినుతింపుచు, నొరులు వొగడ వినుచున్, మదిలో
ననుమోదింపుచు నుండెడి, జనములు దన్మోహవశతఁ జనరు మునీంద్రా!

215

తా॥ ఓ మునిరాజా! పద్మాక్షుడయిన విష్ణుమూర్తి మహిమను నిత్యమూ విశేషంగా కొనియాడుతుండాలి. ఇతరులు కీర్తిస్తూ ఉంటే ఆలకించాలి. మనస్సులో ఆ గుణగణాలను మననం చేస్తూ ఆనందించాలి.

ఇలా ఉండే లోకులు ఆ భగవానుని మాయకు వశులు కారు.

క. అని వాణీశుఁడు నారద, మునివరునకుఁ జెప్పినట్టి ముఖ్యకథా సూ చన మతిభక్తిఁ బరీక్షి, జ్జనపాలునితోడ యోగిచంద్రుఁడు నెప్పెన్.

216

తా॥ అని బ్రహ్మ నారదమునికి చెప్పిన ప్రధాన వృత్తాంతాన్ని ఎంతో భక్తిపూర్వకంగా పరీక్షిన్మహారాజుకు శ్రీశుకయోగీంద్రుడు వివరించి చెప్పాడు.

## పరీక్షిత్తు శుకుణ్ణి ప్రపంచోత్పత్తి క్రమాన్ని గూర్చి అడుగుట

సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను, మునినాథ! దేవదర్శనము గలుగ నారదమునికిఁ బంకేరుహభవుఁ డెఱిం, గించిన తెఱంగు సత్కృప దలిర్ప గణుతింప సత్త్వాదిగుణశూన్యుఁడగు హరి, కమలాక్షు లోకమంగళములైన కథలు నా కెఱిఁగింప కైకొని నిస్సంగ, మైన నా హృదయాబ్జమందుఁ గృష్ణు

తే. భవ్యచరితుని నాద్యంతభావశూన్యుఁ, జిన్మయాకారు ననఘు లక్ష్మీసమేతు నిలిపి, యస్థిరవిభవంబు నిఖిల హేయ, భాజనం బై న యీ కళేబరము విడుతు.

217

తా॥ అప్పుడు పరీక్షిత్తు, శుక మహామునితో ఇలా అన్నాడు, మునివర్యా! బ్రహ్మదేవుడు నారద మునికి దైవ సాక్షాత్కారం గురించి తెలిపిన విధానాన్ని నాకు వివరించండి. సత్వరజస్తమో గుణశూన్యుడు, పద్మనేత్రుడు అయిన శ్రీహరి గొప్ప గొప్ప కథలు నాకు తెలిసేలా చెప్పు. ఆ వృత్తాంతాలు లోకులకు మేలు కలిగిస్తాయి. విషయాసక్తి లేనివాడనై వాటిని గ్రహించుకుని, నా హృదయంలో ఆ కృష్ణుణ్ణి నిలుపుకుంటాను. ఆ కృష్ణుడు యోగ్యమైన చరిత్ర కలవాడు, మొదలు తుది లేనివాడు, చిన్మయాకారుడు, పుణ్యాత్ముడు, లక్ష్మీసహితుడు. అస్థిరమైనది సమస్త జుగుప్సలకు స్థానమైనదీ అయిన ఈ దేహాన్ని వదులుకుంటాను.

వ. అదియునుంగాక యెవ్వండేని శ్రద్ధా భక్తి యుక్తుండై కృష్ణగుణకీర్తనంబులు వినుచుం బలుకుచు నుండు నట్టివాని హృదయపద్మంబునందుఁ గర్ణ రంధ్రమార్గంబుం, బ్రవేశించిన కృష్ణుండు విశ్రమించి సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మగతంబైన మాలిన్యంబు నపకర్షించుఁ గావున.

218

తా॥ అంతే కాదు. ఎవరైనా శ్రద్ధతో, పూజాభావంతో శ్రీకృష్ణుని యశోగుణాల్ని వింటూ,

కీర్తిస్తూ ఉంటారో వారి హృదయపద్మంలోకి, వారి చెవిరంధ్రాల గుండా కృష్ణుడు స్వయంగానే ప్రవేశిస్తాడు. అక్కడ అలసట తీర్చుకుంటాడు. నీటిలోని మాలిన్యాన్ని శరదృతువు పోగొట్టినట్టు మనస్సు లోపలి కల్మషాన్ని తొలగిస్తాడు. అందువల్ల –

మ. భరితోదగ్రనిదాఘతప్తుఁడగు నప్పాంథుం డరణ్యాను సం చరణక్లేశసముద్భవం బగు పిపాసం జెంది యాత్మీయ మం దిరముం జేరి గతశ్రముం డగుచు నెందేనిం జనంబోని భం గి రమాధీశు పదారవింద యుగ సంగీభూతుఁడై మానునే!

219

తా॥ బాటసారికి మలమల మాడే ఎండల్లో వనాల్లో తిరిగి తిరిగి, అలసి సొలసి పోవడం వల్ల దప్పిక ఏర్పడుతుంది. తన గూటికి చేరుకుంటాడు. ఆ అలసటనంతా పోగొట్టుకుంటున్నప్పుడు మనస్సుకు శాంతి కలుగుతుంది. మళ్ళీ ఎక్కడికీ వెళ్ళాలనిపించదు. ఆ విధంగా ఆ లక్ష్మీపతి పాదపద్మములయందు భక్తి ద్వారా ఆనందాన్ని పొందేవాడు, ఇక దానిని విడచిపోవ తలంపడు.

వ. అదియునుంగాక సకలభూత సంసర్గశూన్యంబైన యాత్మకు భూతసంసర్గం బేప్రకారంబునం గలిగె? నది నిర్నిమిత్తంబునం జేసియో, కర్మంబునం జేసియో యా క్రమంబు నా కెఱింగింపుము.

220

తా॥ అంతే కాకుండా సమస్త ప్రాణికోటి తోడి పొందిక లేమి ఏ విధంగా ఏర్పడింది? దానికి కారణం ఏమీ లేదా? ఆ ఏర్పడటం ఆయన పూర్వం చేసిన కర్మల వల్లనా? ఆ విధం అంతా నాకు విడమరచి చెప్పు.

సీ. ఎవ్వని నాభియం దెల్ల లోకాంగ సం, స్థానకారణపంకజంబు వొడమె, నం దుదయించి సర్వావయవస్ఫూర్తిఁ, దనరారునట్టి పితామహుండు గణఁగి యెవ్వని యనుగ్రహమున

నిఖిల భూ, తముల సృజించె నుత్కంఠతోడ నట్టి విధాత యే యనువున సర్వేశు, రూపంబు గనుఁగొనె రుచిర భంగి

తే. నా పరంజ్యోతియైన పద్మాక్షునకును, నలినజునకును బ్రీతి విన్యాస భావ గతులవలనను భేదంబు గలదె చెపుమ? యతిదయాసాంద్ర! యోగికులాబ్ధిచంద్ర!

221

తా॥ సన్న్యాసులపై మిక్కుటమైన దయ కలవాడా! యోగుల సముదాయమనే సంద్రానికి చంద్రుడి వంటివాడా!

పరమాత్మ నాభి కేంద్రంగా, పద్నాలుగు భువనాలకు కారణమైన ఒక పద్మం పుట్టింది. ఆ పద్మం ప్రభవించగా ఆ అన్ని అవయవాల ప్రకాశంగా 'బ్రహ్మ' ఒప్పారాడు. ఆ బ్రహ్మ పూనుకుని ఆ పరమపురుషుడి ప్రసన్నత్వంతో జీవులన్నింటినీ మహోత్సాహంగా సృష్టించాడు.

అలాంటి బ్రహ్మ ఎవరి ఆనుకూల్యంతో ఒప్పిదంగా ఆ పరాత్పరుడి రూపాన్ని కళ్ళారా చూడగలిగాడు? పరంజ్యోతిఃస్వరూపుడైన ఆ పద్మాక్షుడికీ (విష్ణువుకూ) పద్మసంభవుడికీ (బ్రహ్మకూ) అవయవాల రూపులో గాని, వాటి కూర్పులో గాని, భావంలో గాని, జాడల్లో గాని ఏమైనా తేడా ఉందా? చెప్పండి.

వ. మఱియును భూతేశ్వరుం డయిన సర్వేశ్వరుం డుత్పత్తి స్థితిలయకారణంబైన తన మాయను విడిచి మాయానియామకుండై యేయే ప్రదేశంబుల శయనంబు సేసె? నదియునుంగాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులైన లోకంబు లెత్తెఱంగునం గల్పితంబు లయ్యె? నదియునుంగాక మహాకల్పంబులును, నవాంతర కల్పంబులును, భూతభవిష్యద్వర్తమాన కాలంబులును, స్థూల దేహాభిమానులై జనియించిన దేవ పితృ మనుష్యాదులకుం గలుగు నాయుః ప్రమాణంబులును, బృహత్సూక్ష్మకాలానువర్తనంబులును, ఏ యే కర్మంబులం జేసి జీవు లే యే లోకంబుల

నొందుదురు? మఱియు నేయే కర్మంబులం జేసి దేహాది శరీరంబులం బ్రాపింతు? రట్టి కర్మమార్గప్రకారంబును, సత్త్వాది గుణంబుల పరిణామంబులగు దేవాదిరూపంబులం గోరు జీవులకు నే యే కర్మసముదాయం బెట్టు సేయందగు? నెవ్వనికి నర్పింపందగు? నవి యెవ్వనిచేత గ్రహింపంబడు? భూ పాతాళ కకుబ్వ్యోమ గ్రహ నక్షత్ర పర్వతంబులును సరిత్సముద్రంబులును ద్వీపంబులును నే ప్రకారంబున సంభవించె? నా యా స్థానంబుల గలవారి సంభవంబు లేలాటివి? బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండ ప్రమాణం బెంత? మహాత్ముల చరిత్రంబు లెట్టివి? వర్ణాశ్రమ వినిశ్చయంబులును, ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరియవతార చరిత్రంబులును, యుగంబులును, యుగప్రమాణంబులును, యుగధర్మంబులును, బ్రతియుగంబునందును మనుష్యుల కేయే ధర్మంబు లాచరణీయంబు లట్టి సాధారణ ధర్మంబులును, విశేషధర్మంబులును, జాతి విశేష ధర్మంబులును, రాజర్షి ధర్మంబులును, నాపత్కాల జీవన సాధన భూతంబులగు ధర్మంబులును, మహదాదితత్త్వంబుల సంఖ్యయును, సంఖ్యాలక్షణంబును, నా తత్త్వంబులకు హేతుభూత లక్షణంబులును, భగవత్సమారాధన విధంబును, అష్టాంగయోగ క్రమంబును, యోగీశ్వరుల యణిమాద్యైశ్వర్య ప్రకారంబును, వారల యర్చిరాదిగతులును, లింగశరీర భంగంబులును, ఋగ్యజుస్సామాథర్వవేదంబులును, నుపవేదంబులైన యాయుర్వేదాదులును, ధర్మశాస్త్రంబులును, నితిహాస పురాణంబుల సంభవంబును, సర్వభూతంబుల యవాంతర ప్రళయంబును, స్థితి మహాప్రళయంబును, నిష్టాపూర్తంబులను, యాగాది వైదిక కర్మజాలంబును, వాపీకూపతటాక దేవాలయాది నిర్మాణంబులును, అన్నదానం బారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులును, కామ్యంబులైన యగ్నిహోత్రంబుల యనుష్ఠాన ప్రకారంబును, జీవసృష్టియు, ధర్మార్థకామంబు లనియెడు త్రివర్గంబుల యాచరణప్రకారంబును, మలినోపాధిక పాషండ సంభవంబును, జీవాత్మబంధ మోక్ష ప్రకారంబును, స్వరూపావస్థాన విధంబును, సర్వస్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వ కర్మసాక్షి యయ్యు నమ్మాయ నెడఁబాసి యుదాసీన గతిని విభుండై క్రీడించు తెఱంగును గ్రమంబునఁ బ్రపన్నుండనైన

నాకు నెఱింగింపుము.

బ్రాహ్మణ శాపంబునంజేసి శోకవ్యాకులిత చిత్తుండవై యనశన వ్రతుండవైన నీవు వినుట యెట్లని సందేహింపవలవదు. త్వదీయ ముఖారవింద వినిఃసృత నారాయణ కథామృత పానకుతూహలి నైన నాకు నింద్రియంబులు వశంబులై యుండు. అది గావున నేనడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు సవిస్తరంబులుగా నానతిచ్చి కృతార్థునిం జేయఁ బరమేష్ఠితుల్యుండవగు నీవపూర్వ సంప్రదాయానురోధంబున నర్హుండ వగుదు వని విష్ణురాతుం డయిన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండైన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మ నారదసంవాదంబును నేక సంప్రదాయాను గతంబును గతానుగతిక ప్రకారంబునునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మకుపదేశించిన బాగవతపురాణంబు వేదతుల్యంబు, నీ కెఱింగింతు విను మని చెప్పెనని సూతుండు శౌనకాది మహామునులకుం జెప్పి నట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

222

తా॥ ఇంతేకాదు. ఇంకా ఉంది. విను,

జీవులకు ప్రభువైన ఆ సర్వాత్ముడు పుట్టుకకు, స్థితికీ, విలీనత్వానికీ కారణమైన తన మాయను వీడి, ఆ మాయా నిర్దేశకుడై ఏ విధంగా, ఎక్కడ పవళించాడు?

అంతేకాకుండా మునుపటి కాలగతిలో ఆ మహాపురుషుడి అంగాల నుంచి లోకపాలకులతో సహా లోకాలు ఎలా కల్పించబడ్డాయి?

మహాకల్పాలూ, అవాంతర కల్పాలూ, భూతభవిష్యద్వర్తమానాది కాలాల స్వభావం ఎలా ఉంటుంది? దేహం మీది అభిమానంతో జన్మించిన దేవతల, పితృదేవతల, మానవమాత్రుల ఆయుఃపరిమితి ఎంత? కాలము యొక్క అత్యంతమైన, అతి స్వల్పమైన ప్రవృత్తి ఏమిటి? ప్రాణులు ఆచరించిన ఏయే కర్మల్ని బట్టి ఏయే లోకాలకు వాళ్ళు వెళ్తారు? ఇంకా ఎలాంటి

కర్మలు చేస్తే దేవతలుగా అవతరిస్తారు? అలాంటకర్మల నడతలు ఎలాంటివి? సత్త్వాది గుణాల పరిణామాలు ఏ తీరున ఉంటాయి? దేవుడు మొదలైన వివిధ జన్మల్ని కోరుకునేవాళ్ళు ఏయే కర్మల్ని ఎలా చేయాలి? వాటిని ఎవరికి సమర్పించుకోవాలి? వాటిని ఎవరు తీసుకుంటారు?

ఈ నేల, అట్టడుగున ఉండే పాతాళలోకం, దిక్కులు, నింగి, గ్రహాలు, చుక్కలూ, కొండలూ, నదులూ, సంద్రాలూ, దీవులూ ఏ విధంగా పుట్టాయి? వీటిలో ఆయా నెలవుల్లో ఉండే ప్రాణికోటి జననాలు ఎలా ఉంటాయి? ఆకాశానికి లోపలి, బ్రహ్మాండం వెలుపలి కొలమానం ఎంత? మహాపురుషుల నడవడికలు ఎలాంటివి? వర్ణాశ్రమ నియమాలు, వాటిని అనుసరించి ఏర్పడినవీ, అచ్చెరువు పుట్టించేవీ అయిన విష్ణువు అవతార చరితలూ, యుగాలూ, యుగాల కొలమానాలు, యుగధర్మాలు, ప్రతి ఒక్క యుగంలో మానవులు పాటించదగిన సామాన్య, విశేష ధర్మాలు; ఆయా జాతుల వారి ప్రత్యేక ధర్మాలు, రాజర్షి ధర్మాలు, ఆపద్ధర్మాలు, ముప్పుల్లో బతుకు తెరువుకు ఉపకరించే ధర్మాలూ ఎలా ఉంటాయి?

మహత్తు మొదలైన తత్త్వాల లెక్కలు, వాటి లక్షణాలు, ఆ ప్రకృతి తత్త్వానికి నిమిత్తాలైన నియమాలు ఏవి? దేవుణ్ణి పూజించే పద్ధతేమిటి? యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులనే ఎనిమిది యోగాలు ఎలా ఉంటాయి? అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వాలనే ఎనిమిది సిద్ధుల విధానం ఎలా ఉంటుంది? వాళ్ళ 'అర్చిరాది' మార్గాలు ఏవి? వాళ్ళ లింగ శరీర వినాశం ఎలా కలుగుతుంది? ఋగ్యజుస్సామాథర్వాది నాలుగు వేదాలూ, నాలుగు ఉపవేదాలూ (ధనుర్వేదం, ఆయుర్వేదం, గాంధర్వవేదం, అథర్వవేదం), పద్దెనిమిది స్మృతులూ, ఇతిహాసాలూ, పురాణాలూ పుట్టిన తీరుతెన్నులు ఎలాంటివి?

సర్వప్రాణులకు కల్పాల నడుమ సంభవించే ప్రళయం, దాని రూపు, కల్పాంతంలో ప్రాప్తించే పెద్దముప్పు, ఎలా ఉంటుంది? యాగాది సంబంధిత 'ఇష్టాపూర్తాలు' (ఇష్టాల్ని నిర్వర్తించేవి) వంటి కర్మలు; నూతులు, కొలనులు, చెరువులు, గుళ్ళు ఇత్యాదుల నిర్మాణం;

అన్నదానం, ఉపవనాల ఏర్పాటు మొదలుగా ధర్మశాస్త్రాలు వచించిన పనులు (స్మార్త కర్మలు) ఎలా చేయాలి?

కోరి చేసే హోమాదుల ఆచరణ పద్ధతులు, ప్రాణుల పుట్టుక, ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలను అమలుపరిచే తీరు, పాపదేహులైన పాషండుల (దైవాన్ని, వేదధర్మాలను విశ్వసించనివారి) జన్మలు, జీవాత్మణ్ణి కట్టి ఉంచే విధం, ముక్తిని సాధించే తీరు, తన రూపంలో తాను తానుగా ఉండే విధం, దేనికీ వశం కాక తన ఇచ్ఛానుసారం సంచరించే ఈశ్వరుడు, తన మాయతో అన్ని చేతలకు సాక్షిగా ఉంటూనే ఆ మాయను వీడిపోయి, ఏమీ పట్టించుకోని వానివలె సర్వాధిపతిగా భగవానుడు జీవులతో వినోదించే విధానం ఎలాంటివి? ఈ అంశాలన్నింటినీ విపత్తులో శరణుడనైన నాకు క్రమంలో విశదంగా చెప్పు.

"బ్రాహ్మణ శాప బాధకు నీ మనస్సు కలవరపడింది. దాంతో తిండీ తిప్పలు మానివేశావు. ఇంకా నువ్వు నేను చెప్పే సంగతులు ఎలా చెవికెక్కించుకోగలవు?" అని సంశయించవద్దు.

నీ ముఖపద్మం నుంచి జాలువారే శ్రీమన్నారాయణుని కథాసుధను పానం చేయాలనే ఉత్సాహం ఉన్నవాడను. అలాంటి నాకు ఇంద్రియాలు స్వాధీనమయ్యే ఉంటాయి. నువ్వు బ్రహ్మతో సరిసాటివాడవు. సనాతన సంప్రదాయాన్ని అనుసరించి నడుచుకుంటున్న నువ్వే దీనికి యోగ్యుడవు అవుతావు – అని విష్ణువు అనుగ్రహం పొందిన పరీక్షిత్తు బ్రహ్మదేవుని అనుగ్రహం గల శుకమునిని ప్రశ్నించాడు.

అందుకు ఆ శుకయోగి, 'అయితే భాగవత పురాణాన్ని తెలుపుతాను విను' అంటూ ప్రసంగించటం మొదలుపెట్టాడు.

ఆ పురాణం బ్రహ నారద సంవాద రూపం కలది. వేదంతో సమానమైనది. ఒకే సంప్రదాయాను సారంగా గ్రహింపచేసేది, గతానుగతికమైన పోలిక కలది.

ఈ పురాణాన్ని మునుపు ఆ సర్వేశ్వరుడు బ్రహ్మకల్పంలో బ్రహ్మకు బోధించాడు. దీన్ని సూతుడు శౌనకుడు మొదలైన మహాయోగులకు చెప్పినట్లుగా శుకమునిశ్రేష్ఠుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

సీ. భూపాలకోత్తమ! భూతహితుండు సు, జ్ఞానస్వరూపకుఁ డైన యట్టి ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న, మహి నొప్పు నీశ్వరమాయ లేక కలుగదు, నిద్రలోఁ గలలోనఁ దోఁచిన, దేహబంధంబుల తెఱఁగువలెను హరియోగ మాయామహత్త్వంబునం బాంచ, భౌతిక దేహసంబంధుఁ డగుచు

తే. నట్టి మాయాగుణంబుల నాత్మ యోలి, బాల్య కౌమార యౌవనభావములను నర సుపర్వాది మూర్తులఁ బొరసి "యేను", "నాయ దిది" యను సంసారమాయఁ దగిలి.

223

తా॥ "రాజవర్యా! ప్రాణుల మేలుకోరేవాడు, సుజ్ఞానమే తన రూపంగా కలవాడు అయిన జీవికి 'శరీరంతో సంబంధం కలిగే అవకాశం ఎలా ఏర్పడుతుంది?' అని అడిగావు. ఈ విశ్వమంతా పరివ్యాప్తమై ఉన్న పరమేశ్వరుడి మాయే లేకపోతే ఆ బంధం అలా ఏర్పడదు. కునుకు తీసినా, 'కల' కన్నా, ఆ శరీర సంబంధం దృగ్గోచరం అవుతుంది. ఆ విధంగానే జీవి ఆ విష్ణుమాయా మహిమ వల్ల పంచభూతాలతో కూడిన దేహసంబంధం కలవాడవుతాడు. ఆ బహురూప మాయాస్వభావాల వల్లే తాను బాల్యం, కౌమారం, యౌవనం అనే వయోవస్థలను పొందుతాడు.

మాయాప్రభావం వల్లే జీవి మానవులు, దేవతలు మొదలైనవారి ఆకారాలను పొందుతాడు. 'నేను', 'ఇది నాది' అనే భావనలతో సంసారమాయకు కట్టుపడినవాడవుతాడు.

కల కన్నప్పుడు – ఆ కలలో కనబడిన దేహాదులతో మనకు ఏ సంబంధమూ లేనట్లే, పరమాత్మస్వరూపుడైన శ్రీహరి యొక్క మాయ లేకుండా పాంచభౌతిక దేహాదులతో

జ్ఞానస్వరూపమైన ఆత్మకు ఎటువంటి సంబంధమూ ఉండదని భావం.

వ. వర్తింపుచు నిట్లున్న జీవునికి భగవద్భక్తి యోగంబున ముక్తి సంభవించుట యెట్లన్న, నెప్పుడేని జీవుండు ప్రకృతి పురుషాతీతంబయిన బ్రహ్మస్వరూపంబునందు మహితధ్యాన నిష్ఠుండగు నప్పుడు విగతమోహుండై యహంకార మమకారాత్మకంబయిన సంసరణంబు దొఱంగి ముక్తుండయి యుండు. మఱియు జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండు. అట్టి దేహధారియైన భగవంతునందలి భక్తిం జేసి జీవునకు ముక్తి యెత్తెఱంగునం గలుగునని యడిగితివి. జీవుం డవిద్యామహిమం జేసి కర్మానుగతంబయిన మిథ్యా రూపదేహసంబంధుండు. భగవంతుండు నిజయోగమాయా మహిమంబునం జేసి స్వేచ్ఛా పరికల్పిత చిద్ఘన లీలావిగ్రహుండు. కావున భగవంతుండైన యీశ్వరుండు స్వభజనంబు ముక్తి సాధనజ్ఞానార్థంబు కల్పితంబని చతుర్ముఖునకుఁ దదీయనిష్కపట తపశ్చర్యాది సేవితుండయి నిజజ్ఞానానందఘనంబయిన స్వరూపంబు సూపుచు నానతిచ్చె. అది గావున జీవునికి భగవద్భక్తి మోక్షప్రదాయకంబగు. నిందులకు నొక్క యితిహాసంబు గల దెఱింగింతు. ఆకర్ణింపుము. దాన భవదీయ సంశయనివృత్తి యయ్యెడు నని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె.

224

తా॥ ఇలా బంధితుడై వర్తిస్తున్న ప్రాణికి భగవంతుడి మీద భక్తి కలగటం వల్ల మోక్షం ఏ విధంగా కలుగుతుంది? అన్పించవచ్చు. ఎలా అంటే ఎప్పుడైనా జీవిలో ప్రకృతినీ పురుషుణ్ణీ అధిగమించే 'బ్రహ్మతత్త్వం' ఉంటుంది. ఆ బ్రహ్మధ్యానంలో ఆ జీవి శ్రద్ధ చూపినప్పుడు, మోహం వీడిపోతుంది. 'నేను', 'నాది' అనే స్వరూపకమైన సంసారబంధం వదలిపోతుంది. దాంతో మోక్షాన్ని పొందుతాడు.

మళ్ళీ, జీవుడికీ పరమాత్ముడికీ శారీరక సంబంధాలు కన్పిస్తుంటాయి. దీన్నిబట్టి, 'అలాంటి శరీరాన్ని ధరించిన భగవంతుడి పట్ల భక్తి కలిగి ఉండటం వల్ల జీవుడికి మోక్షం ఎలా

సిద్ధిస్తుంది?' అని అడిగావు.

జీవుడు అవిద్యాప్రభావం కలవాడు. దానివల్ల కర్మానుసారం శరీర సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం మిథ్యారూపమైనది. ఆ పరమేశ్వరుడు తన యోగమాయాప్రభావం వల్ల తన ఇష్టానుసారమైన చిద్రూపంలో విలాసవంతమైన శరీరాలతో ప్రకాశిస్తుంటాడు. కాగా, ఇదంతా భగవంతుడైన ఈశ్వరుడు తన పట్ల భక్తిని, మోక్షానికి ఉపకరణమైన జ్ఞానం కోసం కల్పించిందే అని బ్రహ్మకు సెలవిచ్చాడు. అది అంతే కాబట్టి బ్రహ్మ నిష్కపటమైన తపస్సు చేసి పరమేశ్వరుణ్ణి విశేషంగా ఆరాధించాడు. ఆ ఈశ్వరుడు తన జ్ఞానానందస్వరూపాన్ని బ్రహ్మకు చూపిస్తూ, పై సంగతంతా చెప్పాడు.

అందువల్ల జీవుడికి భగవద్భక్తి తప్పక మోక్షాన్ని ప్రసాదిస్తుంది. దీన్ని గూర్చి తెలిపే పురాణగాథ ఒకటి వివరంగా విన్పిస్తాను ఆలకించు. దీనివల్ల నీ సందేహం తీరిపోతుంది.

అని శుక యోగి పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు:

## నారాయణుడు బ్రహ్మ తపస్సుకు మెచ్చి వరాలిచ్చుట

సీ. హరిపాదభక్తి రహస్యోపదేష్టయు, నఖిల దేవతలకు నాదివిభుండు నైన విధాత గల్పాదియందును నిజా, శ్రయపద్మమున కధిష్ఠాన మరయ నర్థించి జలముల నన్వేషణము సేసి, నళినంబు మొదలు గానంగలేక విసివి క్రమ్మఱను దద్బిసరుహాసీనుఁడై, సృష్టి నిర్మాణేచ్ఛఁ జిత్తమందుఁ

తే. జాల నూహించి తత్పరిజ్ఞానమహిమ, సరణి మనమునఁ దోఁపక జడనుపడుచు లోకజాలంబుఁ బుట్టింపలేక మోహి, తాత్ముఁడై చింత నొందు నయ్యవసరమున.

225

తా॥ ఆ బ్రహ్మ విష్ణుపాదసేవనం లోని రహస్యాన్ని లోకానికి ప్రబోధించినవాడు. వేల్పులకు అధిపతి. అతడు కల్పం మొదట్లో తన పుట్టుకకు చోటయిన పద్మం మొదలు గూర్చి తెలుసుకోవాలనుకున్నాడు. కోరి, నీళ్ళల్లో వెతికాడు. పద్మంమూలం కనుక్కోలేక విసిగిపోయాడు. వెనక్కి వచ్చి, మళ్ళీ ఆ కమలంలోనే కూర్చున్న అతనికి లోకాన్ని సృష్టించాలనే వాంఛ కలిగింది. మనస్సులో ఎంతో సేపు ఆలోచించాడు. దానికి సంబంధించిన ప్రజ్ఞానపద్ధతి మనస్సుకు తోచలేదు. అతడి మనస్సు మోహంతో నిండిపోయి ఉంది. అలా ఆలోచిస్తున్న ఆ సమయంలో

వ. జలమధ్యంబుననుండి యక్షర సమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబు మఱియు నేకవింశాక్షరంబును నైన యియ్యక్షర ద్వయంబు వలన నగుచు, మహాముని జనధనం బయిన "తప" యను శబ్దం బినుమా ఉచ్చరింపంబడి వినంబడిన, నట్టి శబ్దంబు వలికిన యప్పురుషుని వీక్షింపంగోరి నలుదిక్కులకుం జని వెదకి, యెందునుం గానక మరలి వచ్చి నిజస్థానంబైన పద్మంబునం దాసీనుండై యొక్కింత చింతించి యట్టి శబ్దంబు దన్నుఁదపంబు సేయుమని నియమించుటగాఁ దలంచి, ప్రాణాయామ పరాయణుండై, జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల జయించి, యేకాగ్ర చిత్తుండై, సకలలోక సంతాపహేతువగు

తపంబు వేయి దివ్యవత్సరంబులు గావింప, నీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమలసంభవుండు తత్క్షణంబ రాజసతామసమిశ్రసత్త్వగుణాతీతంబును, శుద్ధ సత్త్వగుణావాసంబును, నకాల విక్రమంబును, సర్వలోకోన్నతంబును, సకల సురగణ స్తుత్యంబును, ననంత తేజోవిరాజితంబు, నైన వైకుంఠ పురంబుం బొడగని యందు.

226

తా॥ నీళ్ళ నడుమ నుంచి ఒక ధ్వని చెవిని తాకింది. ఆ చప్పుడు వర్ణమాలలోని 'క' నుంచి 'మ' వరకు ఉండే స్పర్శాక్షరాల్లో పదహారవది, ఇరవైఒకటవది అయిన రెండక్షరాల జంట వల్ల ఏర్పడ్డ 'త–ప' అనేది. ఇది మహామునులకు ధనం వంటిది. ఆ 'త' – 'ప' అనే అక్షరాల పదం రెండేసిమార్లు (తప, తప) పలుకబడింది. ఆ పలికిన అతణ్ణి చూడాలనుకుని బ్రహ్మ నాలుగు వైపులకు వెళ్ళి, వెతికి చూశాడు. ఎక్కడా కనబడలేదు. వెనక్కి తిరిగివచ్చాడు. తన అసలు నివాసస్థానం అయిన పద్మంలో కూర్చున్నాడు. కొంచెం సేపు ఆలోచించాడు. ఆ శబ్దం తనను తపస్సు చేయమని ఆదేశించినట్లుగా భావించాడు.

అప్పుడు బ్రహ్మ ప్రాణాయామం పట్ల ఆసక్తుడయ్యాడు. కర్మేంద్రియాలనూ, జ్ఞానేంద్రియాలనూ అదుపులో పెట్టుకున్నాడు. మనస్సును ఒకదాని మీదే నిలిపి ఉంచాడు. వేయి దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ భయంకరమైన తపస్సుకు లోకాలన్నీ తపించిపోయాయి.

అప్పుడు ఈశ్వరుడు ప్రసన్నుడు కాగా, బ్రహ్మ ఆ క్షణంలో పరమపదాన్ని ఎట్టయెదుటే తన కంటితో చూశాడు. ఆ 'వైకుంఠం' రాజస తామస గుణాల్ని, వాటితో కూడిన సత్త్వగుణాన్ని మించి పోయి ఉంది. అక్కడ కేవలం శుద్ధసత్త్వగుణానికే స్థానం ఉంది. అక్కడ కాలానికి విలువ ఉండదు. అది అన్ని లోకాలకన్న ఉత్కృష్టమైనది. దేవతలందరి చేత పొగడ తగింది. అక్కడ లోభం, మోహం, భయం అనేవి ఉండవు. ఆ లోకానికి పోయినవాళ్ళు మళ్ళీ సామాన్యంగా తిరిగి రారు. దాని తేజస్సుకి అంతం అనేది ఉండదు.

సీ. సూర్యచంద్రానల స్ఫురణలం జొరనీక, నిజదీధితి స్ఫూర్తి నివ్వటిల్ల దివ్య మణిప్రభా దీపిత సౌధ వి, మాన గోపుర హర్మ్య మండపములుఁ బ్రసవ గుచ్ఛ స్వచ్ఛ భరిత కామిత ఫల, సంతాన పాదప సముదయములుఁ గాంచన దండ సంగత మారుతోద్ధూత, తరళ విచిత్ర కేతనచయములు

తే. వికచకైరవ దరదరవింద గత మ, రంద రసపాన మోది తేందిందిర ప్ర భూత మంజుల నినదప్రబుద్ధ రాజ, హంసశోభిత వరకమలాకరములు,

227

తా॥ ఆ పురంలోని మేడలు, విమానాలు, గోపురాలు, మిద్దెలు, మండపాలు దేవమణుల కాంతులతో ప్రకాశమానమవుతున్నాయి. సూర్యచంద్రుల, అగ్నుల కాంతులను చొరనీయనంతగా అవి తమ కాంతులతో ప్రకాశిస్తున్నాయి. అక్కడ అప్పటికప్పుడు విచ్చిన పూలగుత్తులూ, కోరుకున్న పండ్లూ కలిగిన వృక్షాల గుంపులు ఉన్నాయి. ఆ పురంలో బంగారు గడకర్రలకు కూర్చిన విచిత్రమైన కేతనసముదాయం గాలికి రెపరెపలాడుతూ ఉంది. ఆ పురంలోని సరస్సులో విచ్చుకున్న కలువల రేకుల్లోని పూతేనెలను పానం చేసిన ఆనందంతో తుమ్మెదలు ఝుంకారాలు చేస్తున్నాయి. ఆ ఝుంకారాల సవ్వడులకు మేల్కాంచిన రాజహంసలతో ఆ సరస్సు శోభించుచుండెను.

సీ. వల నొప్పఁ గా 'న దైవం కేశవాత్పర', మ్మని పల్కు రాజకీరావళియును మహిమ 'జగద్విష్ణుమయ మఖీల' మ్మని, చదివెడు శారికాసముదయంబు నేపారఁగా 'జితం తే పుండరీకాక్ష', యని లీలఁ బాడు పికావళియును లలి మీఱఁగా 'మంగళం మధుసూదన', యనుచుఁ బల్కెడు మయూరావళియును

తే. దవిలి 'శ్రౌషడ్వషట్స్వధే' త్యాది శబ్ద, కలితముగ మ్రోయు మధుప నికాయములును గలిగి యఖీలైక దివ్య మంగళ విలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు.

228

తా॥ రాచిలుకలు 'కేశవుణ్ణి మించిన దైవం లేదు' అని నేర్పుగా పలుకుతున్నాయి. గోరువంకలు 'సర్వ విశ్వము విష్ణుమయం' అంటూ గొప్పగా వల్లిస్తున్నాయి. 'కమలాక్ష! నీకు జయం అగుగాక' అంటూ కోయిలలు రెట్టించి మధురరుతులతో కుహూ గానాలు చేస్తున్నాయి. 'మధుసూదనా! నీకు జయం అగుగాక' అంటూ నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి.

తుమ్మెదల గుంపులు ఎంతో ఆసక్తిగా 'శ్రౌషట్', 'వషట్', 'స్వధా' అనే వేదమంత్రాల ఘోషలతో శబ్దం చేస్తున్నాయి. ఇలా ఎంతోమందితో వైభవం వేలారుస్తున్న వైకుంఠ భవనం దివ్యమైన, శుభంకరమైన, విలాసమయమైన మహిమతో వెలిగిపోతూ ఉంది.

'ఆశ్రావాయ', 'అస్తు శ్రౌషట్', 'వషట్', 'స్వధా' అనేవి పితృదేవతలను ఆహ్వానించే వేదమంత్రాలు.

వ. మఱియుం బయోధరావళీ విభాసిత నభంబునుంబోలె వెలుంగుచున్న యద్దివ్యధామంబునందు.

229

తా॥ ఇంకా మబ్బుల గుంపులతో ఒప్పారే ఆకాశం వలె ఆ దివ్యమందిరం వెలుగులు విరజిమ్ముతున్నది.

సీ. సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వ, లాంగులు నవ్యపీతాంబరులును ధవళారవిందసుందర పత్రనేత్రులు, సుకుమారతనులు భాసుర వినూత్న రత్న విభూషణ గ్రైవేయ కంకణ, హార కేయూర మంజీర ధరులు నిత్యయౌవనులు వినిర్మలచరితులు, రోచిష్ణులును హరిరూపధరులు

తే. నగు సునందుండు నందుండు నర్హణుండు, బ్రబలుఁడును నాది యగు నిజపార్శ్వచరులు మఱియు వైదూర్య విద్రుమామల మృణాళ, తుల్యగాత్రులుదను భక్తితో భజింప.

తా॥ ఆ దివ్యధామంలో సునందుడు, నందుడు, అర్హణుడు, ప్రబలుడు మొదలుగా విష్ణుమూర్తికి సన్నిహితులంతా భక్తితో ఆ నారాయణుణ్ణి కొలుస్తుంటారు. వీళ్ళు విలాసవంతమైన నల్లకలువల్లాంటి చామన చాయ గల దేహం కలవారు. క్రొత్త క్రొత్త పచ్చటి పట్టుబట్టలు కట్టుకున్నవారు. తెల్లతామర రేకుల్లాంటి అందమైన కన్నులు కలవారు. సుకుమారమైన శరీరం కలవారు. మెరుగులు తరగని రత్నాల ఆభరణాలు, కంఠహారాలు, గాజులు, ముత్యాల దండలు, భుజకీర్తులు, కాలి అందెలు పెట్టుకున్నవారు. ఎప్పటికీ యువకులుగా ఉండేవారు. వీళ్ళు మిక్కిలి పవిత్రమైన స్వభావంతో ప్రకాశించేవారు. విష్ణురూపాన్ని ధరించేవారు. ఇంకా వైడూర్యాలతో, పగడాలతో, పంకిలం కాని తామరతూడులతో తుల్యమైన దేహాలు కలవారు.

సీ. క్షాళి తాఖీల కల్మషప్ర జామరనదీజనక కోమల పదాబ్జముల వాని నఖీల సంపత్కారణాపాంగ లక్ష్మీ విలాసిత వక్షఃస్థలంబు వానిఁ బద్మమిత్రామిత్ర భాసిత కరుణాతరంగిత చారునేత్రముల వాని భువననిర్మాణ నైపుణ భవ్య నిజ జన్మ కారణ నాభి పంకజము వాని

తే. నహి హితాహిత శయన వాహముల వాని, సేవి తామర తాపస శ్రేణివాని నఖీల లోకంబులకు గురుఁడైన వాని, గాంచెఁ బరమేష్ఠి గన్నుల కఱవు దీఱ.

231

తా॥ ఆ దేవదేవుడు సమస్త పాపాలను తుడిచిపెట్టే గంగానదికి జన్మస్థలమైన మృదువైన చరణారవిందాలు కలవాడు. సమస్త సంపదలకు కారకమైన లక్ష్మి కడగంటి చూపుతో ప్రకాశించే వక్షఃస్థలం కలవాడు.

సూర్యచంద్రుల ప్రకాశం, దయార్ద్రత గల మనోహరమైన నేత్రాలు కలవాడు. సమస్త భువనాలను నిర్మించే నేర్పుకు యోగ్యమైన, త (బ్రహ్మ) యొక్క జన్మకు నిదానమైనట్టి

నాభికమలం కలవాడు.

పాములకు హితుడైన ఆదిశేషుడు అతడి పాన్పు. పాములకు పగవాడైన గరుడుడు అతడి వాహనం. సకల దేవతలూ, సమస్త మునివర్యులూ అతడి పరిచారకులు. సమస్తలోకాలకూ తండ్రి అయిన ఆ పరంధాముణ్ణి ఆ బ్రహ్మ కన్నుల కరవు తీరేటట్లు దర్శించాడు.

క. కమనీయ రూపరేఖా, రమణీయతఁ జాల నొప్పు రమణీమణి య క్కమలాలయ దన మృదు కర, కమలంబుల విభుని పాదకమలము లొత్తన్

232

తా॥ చక్కటి రూపురేఖలతో అందంగా ఒప్పుతున్న కాంతారత్నం లక్ష్మీదేవి. ఆమె తన సుతిమెత్తని చేతులతో తన ప్రాణనాథుని పాదపద్మాలను ఒత్తుతున్నది.

వ. వెండియు.

233

తా॥ ఇంకా.

శా. శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజిప్రేంఖీతస్వర్ణ డో లాకేళిన్ విలసిల్లి తత్కచభరాలంకార స్రగ్గంధ లో భాకీర్ణ ప్రచరన్మధువ్రత మనోజ్ఞాలోల నాదంబు ల స్తోకానుస్వర లీల నొప్పఁగ నిజేశున్ వేడ్కతోఁ బాడఁగన్.

234

తా॥ వనితామణి అయిన ఆ శ్రీలక్ష్మి రత్నపు కాంతులతో వెలుగొందే బంగారపు ఊయలలో ఊగుతున్నది. ఆమె కొప్పు ముడిలో అలంకరించుకున్న పూలమాలలు పరిమళాలను విరజిమ్ముతున్నాయి. వాటి మీద ఆశపడి తుమ్మెదలు చుట్టూ మూగి చెల్లాచెదురుగా తిరుగాడుతున్నాయి. వాటి చంచలమైన, మనోజ్ఞమైన ఝుంకార స్వరానికి ఏ మాత్రం తగ్గకుండా,

వాటి రొదను అనుసరించిన గాత్రవిలాసంతో, ఆ లక్ష్మి తన పతిని గురించి ఉత్సాహంగా పాటలు పాడుతున్నది.

వ. అట్టి నిత్యవిభూతియందు.

235

తా॥ అలాంటి నిత్య ఐశ్వర్యంలో.

మ. సతతజ్ఞానరమా యశో బల మహైశ్వర్యాది యుక్తుం జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షుం శ్రియః
పతి నాద్యంత వికారదూరుఁ గరుణాపాథోనిధిన్ సాత్త్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్.

236

తా॥ ఎడతెరపి లేని జ్ఞానం, సంపత్తి, కీర్తి, శక్తీ, ఐశ్వర్యం మొదలైన విభూతులతో కూడినవాడూ, లోకాధిపతీ, యజ్ఞాధీశుడూ, తుదిలేనివాడూ, చ్యుతి లేనివాడూ విచ్చిన పద్మం వంటి కళ్ళు కలవాడూ, లక్ష్మీకాంతుడూ, తుదీ మొదలూ అనే భావనకే ఆస్కారం కలిగించనివాడూ, దయాసాగరుడూ, యాదవాధిపతీ, వృద్ధి పొందించే స్వభావం కలవాడూ, సహనశీలుడూ, సర్వవ్యాపి అయినవాడూ, సద్గుణాభిరాముడూ, వర్చస్వీ–

మ. దరహాసామృత పూరితాస్య నిజభక్తత్రాణ పారాయణు న్నరుణాంభోరుహ పత్రలోచనునిఁ బీతావాసుఁ ద్రైలోక్య సుం దరు మంజీర కిరీట కుండల ముఖోద్యద్భూషు యోగీశ్వరే శ్వరు లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రుం జతుర్బాహునిన్.

237

తా॥ చిరుమందహాసం అనే అమృతం నింపుకున్న ముఖం కలవాడు, తన భక్తుల్ని

రక్షించడంలో శ్రద్ధ కలవాడు, ఎఱ్ఱతామర రేకుల్లాంటి కళ్ళు కలవాడు, పచ్చటి పట్టుబట్టలు కట్టినవాడు, ముల్లోకాలకూ సొగసరి; అందెలు, కిరీటం, కుండలాలు మొదలైన నగలు పెట్టినవాడూ, యోగి ప్రముఖులకు ప్రభుమా, లక్ష్మిని నిలిపిన రొమ్ము కలవాడూ, జ్ఞానస్వరూపులకు కృపా గంభీరుడూ; నాలుగు చేతులు కలవాడూ—

> వ. మఱియు (ననర్ఘ రత్నమయ సింహాసనాసీనుండును సునంద నందకుముదాది సేవితుండును) బ్రకృతిపురుష మహదహంకారంబులను చతుశ్శక్తులును, కర్మేంద్రియ జ్ఞానేంద్రియమనో మహాభూతంబులను షోడశ శక్తులును, పంచతన్మాత్రలును బరివేష్టింపఁ గోట్యర్క ప్రభావిభాసితుండును, స్వేతరాలభ్య స్వాభావిక సమస్తైశ్వర్యాతిశయుండును, (స్వస్వరూపంబునం గ్రీడించు సర్వేశ్వరుండైన) పరమపురుషుం బుండరీకాక్షు నారాయణుం జూచి సాంద్రానంద కందళిత హృదయారవిందుండును, రోమాంచ కంచుకిత శరీరుండును, ఆనందబాష్పధారాసిక్త కపోలుండును నగుచు.
>
> 238

తా॥ వెలకట్టలేని రత్నమయ సింహాసనంలో కూర్చున్నవాడు, సునందుడు, నందుడు, కుముదుడు మొదలైన వారిచే సేవించబడేవాడూ; ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వం, అహంకారం అనే నాలుగు శక్తులూ, పంచకర్మేంద్రియాలూ, పంచజ్ఞానేంద్రియాలూ, మనస్సు, పంచమహాభూతాలూ అనే పదహారు శక్తులూ, పంచతన్మాత్రలూ, తన చుట్టూ చేరి సేవిస్తుండగా కోటి సూర్యుల కాంతితో విరాజిల్లేవాడూ; ఇతరులు పొందలేనివీ, తనకు మాత్రమే ప్రకృతిసహజమైనవీ అయిన అన్ని ఐశ్వర్యాలతో అతిశయించినవాడూ, నిజస్వరూపంతోనే విహరించేవాడూ, సర్వేశ్వరుడూ, పరమపురుషుడూ, శ్రేష్ఠుడూ, పద్మాక్షుడూ అయిన శ్రీమన్నారాయణున్ని బ్రహ్మ దర్శించాడు.

బ్రహ్మ హృదయపద్మం అమితానందంతో విప్పారింది. ఆయన శరీరం పులకించింది. ఆయన చెక్కిళ్ళు ఆనందబాష్పాలతో తడిసిపోయాయి.

క. వర పరమహంస గమ్య, స్ఫురణం దనరారు పరమపురుషుని పద పం కరుహములకు నజుఁడు చతు, శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్.

239

తా॥ ఉత్తములైన పరమహంసలు మాత్రమే పొందదగినదిగా ఒప్పే ఆ పరమపురుషుని పాదపద్మాలకు బ్రహ్మ నాలుగు తలలు తాకేలా వంగి నమస్కరించాడు. అప్పుడు ఆ నారాయణుడు

చ. ప్రియుఁడగు బొడ్డుతమ్మి తొలిబిడ్డని వేలుపుఁబెద్ద భూత సం చయములఁ బుట్టఁజేయు, నిజశాసనపాత్రునుపస్థితున్, మదిన్ దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమదస్మిత చారుముఖారవిందుఁడై నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతనిదేహ మంటుచున్.

240

తా॥ తన బొడ్డు తామరలో నుంచి పుట్టిన తొలిచూలి బిడ్డ, దేవతలందరిలోకీ పెద్దవాడు, ప్రాణి సముదాయాన్ని పుట్టించేవాడు, తన తీర్పులకు యోగ్యుడు అయిన బ్రహ్మ మొక్కగానే విష్ణుమూర్తిలో కరుణ ఒక్కసారిగా మెరుపులా మెరిసింది. సంతోషపూర్వకమైన చిరునవ్వుతో విష్ణువు ముఖం వికసించింది. ఆ బ్రహ్మ ఒంటిని మృదువుగా నిమురుతూ,

ఆ. కపటమతుల కెంత కాలమునకు నైన, సంతసింప నేను జలజగర్భ! చిరతపస్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁగాని.

241

తా॥ పద్మసంభవా! కపటమతులు వారెంత కాలము సేవించినను, నేను సంతసింపను. నీవు బహుకాలము తపస్సమాధిలో ఉండి త్యాగబుద్ధితో మెలగు నీయెడ సంతోషిస్తాను.

తే. భద్రమగుఁగాక! నీకు నో పద్మగర్భ వరము నిపుడిత్తు నెఱింగింపు వాంఛితంబు

దేవదేవుఁడ నగు నస్మదీయ పాద, దర్శనం బవధి విపత్తిదశల కనఘ!

242

తా॥ పద్మగర్భా! నీకు శుభం కలుగుగాక! ఇప్పుడే నీకు వరం ఇస్తాను! నీకు కావాల్సింది ఏమిటో తెలుపు. ఓ పుణ్యధనా! దేవుళ్ళకే దేవుణ్ణి నేను. నా పాదదర్శనం అన్ని ఆపదలనూ తొలగిస్తుంది.

చ. సరసిజగర్భ! నీయెడఁ బ్రసన్నత నొంది మదీయలోక మే నిరవుగఁ జూపుటెల్లను నహేతుక భూరి దయా కటాక్ష వి స్ఫురణను కాని, నీదగు తపోవిభవంబునఁ గాదు, నీ తప శ్చరణము నాదు వాక్యముల సంగతిఁగాదె! సరోజసంభవా!

243

తా॥ సరోజాసనా! నీ పట్ల ప్రసన్నుడనై, వైకుంఠాన్ని అంతా ఇంత నా కృపాకటాక్షం ప్రసరించడం వల్లనే చూపితిని. అంతేకానీ, నీ తపోభాగ్యం వల్ల కాదు. నువ్వు తపస్సు ఆచరించడం కూడా నా పలుకుల వ్యవహారాన్ని బట్టే కదా!

క. తప మనఁగ మత్స్వరూపము, తపమను తరువునకు ఫలవితానము నే నా తపముననే జనన స్థి, త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁ దనయా!

244

తా॥ కుమారా! తపస్సు అంటే నా స్వరూపమే. తపస్సు అనే చెట్టు ఫలాలన్నీ నేనే. ఆ తపస్సు వల్లే పుట్టుక, ఉనికి, వినాశం అనే కార్యాలను చేస్తుంటాను.

క. కావున మద్భక్తికిఁ దప, మేవిధమున మూలధనము నిది నీ మది రా జీవభవ! యెఱిఁగి తప మిటు, గావించుట విగతమోహకర్ముఁడ వింకన్.

245

తా॥ కనుక ఎట్లా చూసినా నాపై భక్తికి మూలనిధి వంటిది తపస్సే. 'ఓ పద్మభవా! అది నీ మనస్సుతో తెలుసుకుని నువ్వు ఇలాంటి తపస్సు కావించావు. కాబట్టి ఇకపై మోహకర్మలు ఎటువంటివైనా నిన్ను వీడిపోతాయి.'

క. అని యానతిచ్చి కమలజ!, యెనయఁగ భవదీయ మాన సేప్సిత మే మై నను నిత్తు, వేఁడు మనినను, వనరుహసంభవుఁడు వికచవదనుం డగుచున్.

246

తా॥ అని ఉపదేశించి పుండరీకాక్షుడు, 'ఓ బ్రహ్మదేవా! నీ మదిలోని ఇష్టసిద్ధికి సరిపోలేటట్లు ఏమైనా ఇస్తాను, అడుగు' అనగానే బ్రహ్మ విప్పారిన ముఖం కలవాడయ్యాడు.

చ. హరివచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁ డో పరమపదేశ! యోగిజన భావన! యీ నిఖిలోర్వియందు నీ వరయని యట్టి యర్థ మొకఁటైనను గల్గునె? యైన నా మదిన్ బెరసిన కోర్కి దేవ! వినిపింతు దయామతిఁ జిత్తగింపవే!

247

తా॥ విష్ణుమూర్తి ప్రవచనాలు బ్రహ్మ మనస్సుకు ప్రీతికరంగా అన్పించాయి. ఆ బ్రహ్మ విష్ణువుతో ఇలా అన్నాడు: ఓ వైకుంఠ దేవా! యోగిపుంగవుల ధ్యానస్వరూపా! ఈ విశ్వం అంతటిలో నువ్వు తెలుసుకోనటువంటి వస్తువు ఒక్కటైనా ఉంటుందా? అయినా నా మనస్సులో నెలకొన్న వాంఛను విన్నవిస్తాను. ఓ దేవా! కరుణతో యోచించు.

వ. దేవా! సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపు. అవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూలసూక్ష్మరూపంబులును, నానాశక్త్యుపబృంహితంబులైన బ్రహ్మాది రూపంబులును, నీయంత నీవే ధరించి జగదుత్పత్తి స్థితిలయంబులం దంతు కీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబు దెలియునట్టి

పరిజ్ఞానంబుఁ గృపసేయుము. భవదీయ శాసనంబున జగన్నిర్మాణంబు గావించునప్పుడు బ్రహ్మాభిమానంబునంజేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదిం బొడముం గావునఁదత్పరిహారార్థంబు వేఁడెద. నన్నుం గరుణార్ద్ర దృష్టి విలోకించి దయసేయు మని విన్నవించిన నాలించి పుండరీకాక్షుం డతని కిట్లనియె.

248

తా॥ ఓ ప్రభూ! నువ్వు సర్వప్రాణుల అంతరంలో సంచరించేవాడవు. భగవానుడవు. నీకు నమస్కరిస్తున్నాను. నా మనస్సులో కోరుకున్నది విన్నవిస్తాను. చిత్తగించు.

వెలుపలికి వ్యక్తం కాని ఆకారాలతో తేజరిల్లే నీ అతిపెద్ద, అతిచిన్న స్వరూపాలు వేర్వేరు శక్తులతో బాగా వృద్ధి పొందాయి. బ్రహ్మ మొదలైన రూపాలను నీ అంతట నువ్వే తాలుస్తున్నావు. సాలెపురుగు వలె నువ్వు ఈ భువనాల పుట్టుక, ఉనికి, ప్రళయాలను కావిస్తున్నావు. నీ మనోభావన అమోఘమైంది. ఈ రీతి విలాససంపత్తితో విహరించే నీ మహాత్మ్యాన్ని గ్రహించుకునే తెలివిని నాకు ప్రసాదించు.

నీ ఆనతికి లోబడి ఈ లోకం ఏర్పాటు చేస్తుంటాను. అలాంటప్పుడు 'నేను బ్రహ్మ' ను అనే స్వాభిమానం వల్ల అహంకారాలు నా తలపుల్లో తలెత్తుతాయి. కాబట్టి వాటి విడుపును అర్థిస్తున్నాను. నా మీద దయగల చూపుతో అనుగ్రహించు' అని విన్నవించుకోగా ఆ హరి విని, ఇలా అన్నాడు.

(సాలెపురుగు తననుంచి వ్యాపింపచేసిన దారాలలోనే తిరుగుతుంటుంది. తిరిగి వాటిని తనలోనే లీనం చేసుకుంటుంది)

క. వారిజభవ! శాస్త్రార్థ విచారజ్ఞానమును, భక్తి, సమధికసాక్షా త్కారము లను నీ మూఁడు నుదారత నీ మనమునందు ధరియింపనగున్.

249

తా॥ పద్మభవా! శాస్త్రాల అర్థాన్ని యోచించే తెలివీ, భక్తీ, సాక్షాత్కారం అనే మూడింటినీ నీ మనస్సులో గొప్పవిగా తాల్చవలసి ఉంది.

సీ. పరికింప మత్స్వరూప స్వభావములును, మహిమావతార కర్మములుఁ దెలియుఁ తత్త్వవిజ్ఞానంబు దలకొని మత్రసా, దమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ! సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండఁ, గలిగి యుండుదు వీతకర్మి నగుచు సమధికస్థూల సూక్ష్మ స్వరూపములుఁ ద, త్కారణ ప్రకృతియుఁ దగు మదంశ

ఆ. మందు లీనమైన నద్వితీయుండనై, యుండు నాకు నన్య మొకటి లేదు, సృష్టికాలమందు సృష్టినాశంబున, జగము మత్స్వరూప మగును వత్స!

250

తా॥ చతురాస్యా! ఆలోచించి చూడగా నా స్వరూపం, నా గుణం, నా ప్రభావం, నా అవతారాలు, పుణ్యకర్మలూ, తెలుసుకోగల యథార్థానుభవ వివేకం నీకు నా దయవల్లనే ప్రాప్తిస్తుంది. చింతించగా, ఈ లోకసృష్టికి ముందు నేను ఒంటరివాడనే. ఎలాంటి కర్మబంధాలూ అంటని వాడను. అత్యంతమైన స్థూల, సూక్ష్మరూపాలూ, వాటికి మూలాలైన ప్రకృతీ, నా అంశలోనే విలీనం అయి ఉండిపోయేవి. మరొకటేదీ లేకుండా నేనొక్కడినే ఉండేవాడను.

నాయనా! సృష్టిసమయంలో పుట్టించిన ప్రపంచం అంతా నా స్వరూపమే అవుతుంది. సృష్టినాశం జరిగినప్పుడు లయించేదీ నా స్వరూపమే.

క. అరయఁగఁ గల్పప్రళయాం, తరమున నాద్యంత విరహిత క్రియతోడం బరిపూర్ణ నిత్య మహిమం, బరమాత్ముఁడనై సరోజభవ! యే నుందున్.

251

తా॥ ఓ పద్మభవా! విచారించి చూస్తే కల్పానికీ, లయానికీ మధ్యకాలంలో మొదలూ

చివరా లేని విధంగా, నిండుగా ఎల్లప్పుడూ ఉండే గొప్పదనంతో పరమేశ్వరుడిగా నేను ఉంటాను.

వ. అదియునుంగాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణమాయా ప్రకారం బెఱింగింతు, లేని యర్థంబు శుక్తి రజతభ్రాంతియుంబోలె నేమిటి మహిమం దోఁచి క్రమ్మఱఁ దోఁపకమాను నిదియె మదీయ మాయావిశేషం బని యెఱుంగుము. ఇదియునుం గాక లేని యర్థంబు దృశ్యమానం బగుటకును, గల యర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును దమః ప్రభావంబును దృష్టాంతంబులుగాఁ దెలియుము. ఏ ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబులయిన ఘట పటాదులందుఁ బ్రవేశించియుండు, నా ప్రకారంబున నేను నీ భూత భౌతికంబు లయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు, భౌతికంబులు, భూతంబులయందుఁ గారణావస్థంబొందు చందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు; సర్వదేశంబులయందును, సర్వకాలంబులయందును, నేది బోధితంబై యుండు నట్టిదియ పరబ్రహ్మస్వరూపంబు, తత్త్వం బెఱుంగ నిచ్ఛయించిన మిముబోఁటి వారలకు నీ చెప్పిన మదీయ తత్త్వాత్మకంబైన యర్థంబ యర్థం బని యెఱుంగు. ఈ యర్థం బుత్కృష్టం బయినయది. యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాది కర్మంబులందు మోహంబు చెందకుండెడి నని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖున కానతిచ్చి నిజలోకంబుతో నంతర్ధానంబు నొందె నని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె.

252

తా॥ అంతేకాక, నువ్వు నన్ను ఈ లోకసృష్టి నిర్మాణంలోని మాయావిధానం గూర్చి అడిగావు. దాన్ని తెలియపరుస్తాను. 'ముత్యపు చిప్పలో వెండి ఉందన్న భ్రమను పొందుతాం. లేని పదార్థం నా ప్రభావంతో ఉన్నట్లుగా తలపిస్తుంది. తిరిగిచూస్తే లేనట్లుగా తోస్తుంది. అదే నాదైన

మాయా ప్రత్యేకత అని గ్రహించుకో. అంతేగాకుండా లేని వస్తువు కంట పడటానికీ, ఉన్న వస్తువు దృగ్గోచరం కాకుండడానికీ, చంద్రుడు ఒక్కటే అయినా ఇద్దరు చంద్రులు కన్పించడాన్నీ, చీకటి వెలుగులను ఉదాహరణలుగా తెలుసుకో.

పంచ మహాభూతాలు, భౌతిక వస్తువులైన (మట్టి) కుండ, వస్త్రం మొదలైన వాటిలో ఏ విధంగా ప్రవేశించి ఉంటానో ఆ విధంగానే నేను ఈ భూత భౌతికాలయిన సమస్త కార్యాల్లోనూ సత్త్వాది రూపాలలో చొచ్చి ఉంటాను.

భౌతిక వస్తువులు పంచభూతాల్లో హేతుస్థితిని పొందిన తీరుగా భూతభౌతికాలు కారణదశను పొంది నాలో వ్యక్తరూపాన్ని పొంది, స్ఫుటంగా ఉండవు. అన్ని ప్రదేశాల్లో అన్ని వేళలా ఏది ఆకళింపుకు వస్తుందో అదే పరబ్రహ్మ స్వరూపం. ఆ తత్త్వం తెలుసుకోవాలని కోరుకుంటున్న మీలాంటి వాళ్ళకు నేను చెప్పిన నా తత్త్వస్వరూపార్థకమైన అర్థమే పరబ్రహ్మస్వరూపమని గ్రహిస్తారు. ఈ అర్థం అన్నిటికీ మిన్న అయినది. ఏకాగ్రమైన మనస్సుతో విని, విన్నదానిని నీ మనస్సులో నిలుపుకున్నట్లయితే సృష్టికర్మ కొనసాగించేటప్పుడు ఎలాంటి మోహమూ దరిచేరదు' అని భగవానుడు బ్రహ్మకు బోధించాడు. తన వైకుంఠ లోకంతో పాటు కనుమరుగయ్యాడు.'

అని శుకుడు పరీక్షిత్తుతో చెప్పి, ఇంకా ఇలా చెప్పాడు.

సీ. అవనీశ! బ్రహ్మ యిట్లంతర్హితుండైనc, బుండరీకాక్షుని బుద్ధి నిలిపి యానందమునc బొంది యంజలి గావించి, తత్పరిగ్రహమునc దనదు బుద్ధిc గైకొని పూర్వప్రకారంబునను సమ, స్త ప్రపంచం బెల్లc దగ సృజించి మఱియొకనాcడు ధర్మప్రవర్తకుc డౌచు, నఖిల ప్రజాపతియైన కమల

తే. గర్భుc డాత్మహితార్థమై కాక సకల, భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి మానితంబైన యమనియమముల రెంటి, నాచరించెను సమ్ముదితాత్ముc డగుచు.

253

తా॥ ఓ రాజా! ఇలా కనుమరుగయిన ఆ విష్ణువును బ్రహ్మ తన మదిని నిలుపుకొన్నాడు. ఆనందానుభూతి చెందాడు. చేతులెత్తి నమస్కరించాడు. అంతా ఆ విష్ణువు దయవల్లనే అని తనదైన బుద్ధితో గ్రహింపుకు తెచ్చుకున్నాడు. పూర్వంవలెనే సమస్తలోకాల్ని ఒప్పేటట్లుగా సృష్టించాడు. మరొక దినాన ధర్మాన్ని నడిపేవాడు అవుతూ సృష్టికంతటికీ ప్రజాపతి అయ్యాడు. ఆ బ్రహ్మ తన మేలుకోరి కాకుండా సర్వలోకాలకు శుభం కలగాలనే బుద్ధితో ఘనంగా ప్రకాశించాడు. పట్టలేనంత ఆనందస్వరూపుడవుతూ యమ, నియమాలు రెంటినీ ఆచరించాడు.

వ. అయ్యవసరంబున

254

తా॥ అదే సమయంలో.

క. ఆ నళినాసన నందును, లైన సనందాది మునుల కగ్రేసరుఁడున్
మానుగఁ బ్రియతముఁడును నగు, నా నారదుఁ డేఁగుదెంచె నబ్జజు కడకున్.

255

తా॥ బ్రహ్మ కొడుకులైన సనందుడు మొదలైన మునులందరిలో మొదటివాడు, యోగ్యుడు, అత్యంత ప్రీతిపాత్రుడు అయిన నారద మహర్షి బ్రహ్మ దగ్గరకు వచ్చాడు.

క. చనుదెంచి తండ్రికిం బ్రియ, మొనరఁగ శుశ్రూషణంబు లొనరిఁచి యతఁడుం దనదెసఁ
బ్రసన్నుఁ డగుటయుఁ, గని భగవన్మాయఁ దెలియఁగా నుత్సుకుఁడై,

256

తా॥ వచ్చి, తండ్రికి ఇష్టమైనట్లుగా సేవలు చేశాడు. తండ్రి కూడా కుమారుడి పట్ల అనుగ్రహం కలవాడయ్యాడు. అది గ్రహించి నారదుడు, 'భగవన్మాయ' ను తెలుసుకోవాలని

ఆరాట పడ్డాడు.

సీ. అవనీశ! నీవు నన్నడిగిన పగిది నా, తఁడు దండ్రి నడుగఁ బితామహుండు భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి, గృపతోడఁ దన కెఱింగించినట్టి లోకమంగళచతుశ్శ్లోక రూపంబును, దశలక్షణంబులఁ దనరు భాగ వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు, చారు సరస్వతీ తీరమునను

తే. హరిపదధ్యాన పారీణుఁ డాత్మవేది, ప్రకటతేజస్వి యగు బాదరాయణునకుఁ గోరి యెఱిఁగించె న మ్మహోదారుఁ డెలిమి, నాకు నెఱిఁగించె, నెఱిఁగింతు నీకు నేను.

257

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! నువ్వు నన్ను అడిగినట్లే, నారద ముని తన తండ్రి బ్రహ్మను అడిగాడు. అప్పుడు ఆ బ్రహ్మ, భగవానుడూ, ఆశ్రయించినవారి పాలిటి కల్పవృక్షం వంటివాడూ అయిన శ్రీమహావిష్ణువు దయకొద్దీ తనకు తెలియ చెప్పిందీ; జగత్తులకు మేలు కల్గించేదీ, నాలుగు శ్లోకాల రూపంలో ఉన్నదీ, పది లక్షణాలతో ఒప్పి ఉన్నదీ అయిన భాగవతాన్ని నారదుడికి వృద్ధిపరచి, బోధించాడు. ఆ నారదుడు మనోహరమైన సరస్వతీ నది ఒడ్డున ఆ భాగవత తత్త్వాన్ని వ్యాసుడికి తానై, మక్కువ కొద్దీ ఉపదేశించాడు. ఆ వ్యాసుడు విష్ణుపాదాలను ఏకాగ్రచిత్తంతో సేవించడంలో నేర్పరి, ఆత్మజ్ఞానం కలవాడు, తేజోవంతుడూ కదా! ఆ ఔదార్యవంతుడు సంతోషంగా నాకు తెలియచెప్పాడు. నేను నీకు వినిపిస్తున్నాను.

వ. అదియునుం గాక యిపుడు విరాట్పురుషునివలన నీ జగంబు లే వడుపునఁ బొడమె నను నివి మొదలయిన ప్రశ్నంబులు గొన్ని నన్నడిగితివి. ఏను నన్నింటికి నుత్తరం బగునట్లుగా నిమ్మహాభాగతం బుపన్యసించెద నాకర్ణింపుము. అమ్మహాపురాణంబు చతుశ్శ్లోకరూపంబును దశలక్షణంబునునై సంకుచితమార్గంబున నొప్పు. నందు దశలక్షణంబు లెవ్వి యనిన – సర్గంబును, విసర్గంబును, స్థానంబును, పోషణంబును, ఊతులును, మన్వంతరంబులును, ఈశానుచరితంబును, నిరోధంబును, ముక్తియు,

నాశ్రయంబును ననం బది తెఱంగు లయ్యె, దశమాశ్రయవిశుద్ధ్యర్థంబు తక్కిన తొమ్మిది లక్షణంబులుఁ జెప్పంబడె నవి యెట్టివనిన.

258

తా॥ అంతే కాకుండా ఇప్పుడు, 'పరాత్పరుడి వల్ల ఈ లోకాలు ఎలా ఉద్భవించాయి?' అనేటటువంటకొన్ని ప్రశ్నలు అడిగావు. నేను ఆ ప్రశ్నలన్నిటికీ సమాధానంగా శ్రీమహాభాగవతాన్ని వివరిస్తాను. విను.

ఆ మహాపురాణం నాలుగు శ్లోకాలతోనూ, పదిలక్షణాలతోనూ సంక్షేప పద్ధతిలో ఉంది. ఆ పది లక్షణాలు ఏవి? 'సర్గం, విసర్గం, స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరాలు, ఈశానుచరితలు, నిరోధం, ముక్తి, ఆశ్రయం' అనే పది విధానాలు. వీటిల్లో పదవది అయిన ఆశ్రయం అనేది అన్నింటికంటే ముఖ్యమైన అంశం. నిజానికి దాని వివరణ కోసమే మిగతా తొమ్మిది లక్షణాలూ చెప్పబడ్డాయి. వాటి వివరాలేమిటంటే –

తే. మహదహంకార పంచతన్మాత్ర గగన, పవన శిఖీ తోయ భూ భూతపంచ కేంద్రి య ప్రపంచంబు భగవంతునందు గనుట, "సర్గ" మందురు దీనిని జనవరేణ్య!

259

తా॥ ఓ రాజా! మహత్తు, అహంకారం, ఐదు తన్మాత్రలు, ఆకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి, అనే పంచభూతాలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, ప్రపంచం అంతా భగవంతుడిలో ఉండడాన్ని 'సర్గం' అంటారు.

క. సరసిజగర్భుండు విరా, ట్పురుషుని వలనన్ జనించి, భూరితర చరా చర భూత సృష్టిఁ జేయుట, పరువడిని "విసర్గ" మండ్రు భరతకులేశా!

260

తా॥ భరత కులనాథా! ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మ విరాట్పురుషుడి నుంచి పుట్టి చ (కదలిక గల) అచ (కదలలేని) భూతసృష్టిని చేయడాన్ని 'విసర్గం' అంటారు.

క. లోకద్రోహి నరేంద్రా, నీకముఁ బరిమార్చి జగము నెఱి నిల్పిన యా వైకుంఠనాథు విజయం, బాకల్ప "స్థాన" మయ్యె నవనీనాథా!

261

తా॥ ఓ నృపా! లోకకంటకులైన నృపాలకులనందరను చంపి, లోకాన్ని చక్కగా రక్షించిన ఆ వైకుంఠ వాసుడి కల్పాంతపు విజయాన్ని 'స్థానం' అని అంటారు.

క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమ శుభమూర్తి సేయు నిజభక్తజనో ద్ధరణము "పోషణ" మవనీ, వర! "యూతు" లనంగఁ గర్మవాసన లరయన్.

262

తా॥ సర్వస్వామీ, తుదిలేనివాడూ, తులలేని భద్రస్వరూపుడూ అయిన విష్ణువు, తన భక్తజనులను ఆపదల నుంచి కాపాడటాన్ని 'పోషణం' అని అంటారు. పరంపరాగత కర్మవాసనలను 'ఊతులు' అంటారు.

తే. జలజనాభ దయాకటాక్ష ప్రసాద,  
లబ్ధి నఖిలైక లోకపాలక విభూతి  
మహిమఁ బొందినవారి ధర్మములు విస్త,  
రమునఁ బలుకుట "మన్వంతరములు" భూప!

263

తా॥ రాజా! ఆ పద్మనాభుని ఉపాసించి, ఆయన దయాపూరితమైన కడగంటి చూపుల అనుగ్రహం వల్ల అన్ని లోకాలనూ పాలించగల మహా ఐశ్వర్య ప్రభావాన్ని పొందినవాళ్ళ

ధర్మాలను విస్తృతం చేసి చెప్పడాన్ని ‘మన్వంతరాలు’ అంటారు.

క. వనజోదరు నవతార క, థనముఁ దదీయానువృత్తిఁ ద చ్చారిత్రం బును విస్తరించి పలుకం, జను నవి “యీశాను కథలు” సౌజన్యనిధీ!

264

తా॥ మంచి స్వభావానికి నిధివంటి ఓ రాజా! పద్మనాభుడి అవతారాలను వచించడం, అతణ్ణి అనుసరించి చరించే భక్త జనుల వృత్తాంతాన్ని, వాళ్ళ నడవడికను విస్తృతంగా చెప్పే వాటిని ‘ఈశాను చరితలు’ అంటారు.

సీ. వసుమతీనాథ! సర్వస్వామి యైన గో, విందుండు చిదచిదానందమూర్తి సలలిత స్వోపాధి శక్తిసమేతుఁడై, తనరారు నాత్మీయధామమందు ఫణిరాజ మృదుల తల్పంబుపై సుఖలీల, యోగనిద్రారతి నున్నవేళ నఖిలజీవులు నిజవ్యాపార శూన్యులై, యున్నత తేజంబు లురలుకొనఁగ

తే. జరుగు న య్యవస్థావిశేషంబు లెల్ల, విదిత మగునట్లు వలుకుట యది “నిరోధ” మన నిది యవాంతర ప్రళయం బనంగఁ, బరఁగు నిఁక “ముక్తి” గతి విను పార్థివేంద్ర!

265

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! ఆ గోవిందుడు సర్వానికీ ప్రభువు. చిత్తు, అచిత్తు, ఆనందం తానుగా మేళవించిన రూపవంతుడు. లాలిత్యం కలిగిన తన కారణశక్తులతో కలసిపోయినవాడై తన నివాస స్థానంలో(వైకుంఠం) ఒప్పారుతూ ఉంటాడు. మెత్తటి ఆదిశేషుడి పాన్పు మీద సుఖంగా యోగనిద్రలో మునిగి ఉంటాడు. అప్పుడు సమస్త ప్రజలూ ఏ క్రియ చేయనివారవుతారు. ఉన్నత ప్రకాశాన్ని కోల్పోతారు. అప్పుడు జరిగే ఆయా అవస్థా విశేషాలన్నీ స్పష్టపడేట్లు పల్కడాన్ని ‘నిరోధం’ అంటారు. ఇది ‘అవాంతర ప్రళయం’ అనీ ప్రసిద్ధి కెక్కింది.

ఓ రాజా! ఇక మోక్షమార్గం గూర్చి ఆలకించు.

సీ. జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి, దేహధర్మంబులై ధృతి ననేక జన్మానుచరితదృశ్యము లైన యజ్జరా, మరణంబు లాత్మధర్మంబు లయిన ఘన పుణ్య పాప నికాయ నిర్మోచన, స్థితి నొప్పి పూర్వసంచితములైన యపహత పాప్మవత్త్వాదృష్ట తద్గుణ, వంతుఁడై తగ భగవచ్ఛరీర

తే. భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి, దివ్య మాల్యానులేపన భవ్య గంధ కలిత మంగళ దివ్య విగ్రహ విశిష్టుఁ, డగుచు హరిరూప మొందుటే యనఘ! "ముక్తి."

266

తా॥ ఓ పుణ్యచరిత్రా! జీవుడు భగవంతుడి కరుణకు పాత్రుడై శరీరధర్మాల్ని ధరించి ఎన్నోసార్లు జన్మలెత్తుతుంటాడు. ఆయా జన్మల అనుగతంగా గోచరించే వార్ధక్యమూ, చామా స్వధర్మాలైన మహాపుణ్య పాపాల సముదాయం వల్ల అతడికి తొలగిపోతాయి. ముందటి జన్మల నుంచి కూడబెట్టుకున్న 'అపహత పాప్మవత్త్వం' (పోయిన పాపస్వభావం) మొదలైన ఎనిమిదీ, వాటి గుణాలూ ఉన్నవాడై, శుద్ధజీవ స్వరూపంతో భగవత్ పార్షద శరీరుడై పరతంత్రమైన తన బుద్ధితో ప్రకాశిస్తాడు. దివ్యపుష్పమాలికలతో దివ్యమైన అంగరాగాలతో యోగ్యమైన సువాసనలతో అలకరింపబడిన, శుభమైన దివ్య శరీరం కలిగి శ్రేష్ఠుడవుతాడు. ఈ విధంగా జీవి హరి రూపు పొందడాన్ని 'ముక్తి' అంటారు.

వ. మఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందగుచుఁ బ్రకాశింపఁ బడునది "యాశ్రయం" బనంబడు, నదియ పరమాత్మ. బ్రహ్మ శబ్దవాచ్యంబు నదియ. ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ యాధ్యాత్మికాది విభాగంబు సెప్పంబడియె. అది యెట్లనిన నాత్మ "యాధ్యాత్మి" "కాధిదైవి" "కాధి భౌతికంబు" లం ద్రివిధం బయ్యె. అందు నాధ్యాత్మికంబు చక్షురాది గోళకాంతర్వర్తియై యెఱుంగం బడు. చక్షురాది కరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికుం డనందగు. చక్షురాద్యధిష్ఠా నాభిమానదేవతయు సూర్యాది

తేజోవిగ్రహుండు నగుచు నెవ్వని యందు నీ యుభయ విభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుండును, విరాడ్విగ్రహుండును నగుం గావున, ద్రష్టయు దృక్కును దృశ్యంబు ననందగు నీ మూఁ టియందు నొకటి లేకున్న నొకటి గానరాదు, ఈ త్రితయంబు నెవ్వం డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు. నతండె పరమాత్మయును. ఆ మ్మహాత్ముండు లీలార్థంబైన జగత్సర్జనంబుసేయు తలంపున బ్రహ్మాండంబు నిర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబు లగు జలంబుల సృజియించె. స్వతఃపరిశుద్ధుండు గావున స్వసృష్టంబగు యేకార్ణవాకారం బైన జలరాశియందు శయనంబు సేయుటం జేసి "శ్లో ॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః । తా య దస్యాయనం పూర్వం తేన నారాయణఃస్మృతః ॥" అను ప్రమాణము చొప్పున నారాయణశబ్దవాచ్యుండు గావున నతనిప్రభావంబు వర్ణింప దుర్లభం. ఉపాదానభూతంబయిన ద్రవ్యంబును, ద్రివిధం బయిన కర్మంబును, గళాకాష్ఠాద్యుపాధి భిన్నంబయిన కాలంబును, జ్ఞానాధికంబగు జీవస్వభావంబును, భోక్త యగు జీవుండును, నెవ్వని యనుగ్రహంబునం జేసి వర్తించు చుండు, నెవ్వని యుపేక్షంజేసి వర్తింపకుండు, నట్టి ప్రభావంబు గల సర్వేశ్వరుండు దా నేకమయ్యు ననేకంబుగాఁ దలంచి యోగతల్పంబునం బ్రబుద్ధుండై యుండు. అఁట మీఁద స్వసంకల్పంబునం జేసి హిరణ్మయంబైన తన విగ్రహంబు నధిదైవతంబును, నధ్యాత్మికంబును, నధిభూతంబును నను సంజ్ఞాయుతంబై త్రివిధంబుగా సృజియించె.



తా॥ ఇంకా పుట్టడం, ఉండటం, పోవటం అనేవి ఎందులో జరుగుతూ ప్రకాశిస్తుందో దాన్ని 'ఆశ్రయం' అంటారు. అదే 'పరమాత్మ'. బ్రహ్మ శబ్దం చేత చెప్పబడేది అదే.

తనను తానుగా అనుభవించి తెలియచెప్పడానికి ఆ ఆత్మ, ఆధ్యాత్మికం మొదలైన విభజనంతో బోధించబడింది.

అదెలా అంటే 'ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం' అని ఆత్మ తత్త్వం మూడు విధాలు.

వీటిల్లో కన్ను మొదలైన గోళాల నడుమ ఉండటం ద్వారా తెలుసుకోగలిగేది 'ఆధ్యాత్మికం'. నేత్రం మొదలైన సాధనాల సంరక్షణంతో దర్శించేవాడైన జీవుణ్ణి 'ఆధిదైవికుడు' అంటారు. కన్ను మొదలైన ఆధారస్థానం పట్ల ఆత్మగౌరవం గల దేవతయై, సూర్యుడు మొదలైన తేజస్సు శరీరంగా గలవాడై, పై రెండు విభాగాలు (ఆధ్యాత్మికం, ఆధిదైవికాలు) ఎవరిలో ఉంటాయో అతడు 'ఆధిభౌతికుడూ', అతడే 'విరాట్స్వరూపుడూ' అవుతాడు.

కాబట్టి ద్రష్ట (చూడగలవాడు), దృక్కు = (చూపు), దృశ్యంబు = (చూడదగింది) అనదగిన ఈ మూడింటిలో ఏ ఒకటి లేకున్నా మరొకటి కానరాదు. ఈ మూడింటినీ ఎవడు తెలుసుకుంటాడో అతడు సర్వలోకాలకు ఆశ్రయుడవుతాడు. పరమాత్మ కూడా అతడే.

విలాసార్థం జగత్తును పుట్టించాలనే సంకల్పం ఆ మహాపురుషుడికి కలిగింది. ఆ ఆలోచనతో బ్రహ్మాండాన్ని చీల్చాడు. తనకు సుఖస్థానం కాంక్షించి, మొదటగా శుచిగా ఉండే నీళ్ళను పుట్టించాడు. స్వతహాగా పరిశుద్ధుడు కాబట్టి, తానే సృష్టించినట్టి ఏకసముద్రంగా అనిపించేటటువంటి జలరాశిలో పవళించాడు. అందువల్ల—

శ్లో ॥ ఆపో నారా ఇతి ప్రోక్తా, ఆపో వై నరసూనవః । తా య దస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః ॥

అనే ప్రామాణిక వాక్యాన్ని బట్టి 'నారాయణ' అనే పదంతోనే చెప్పబడుతుంటాడు. కాబట్టి, అతడి మహిమను వర్ణించడం సాధ్యంకాదు.

ఉపాదాన కారణం అయిన ద్రవ్యం; మూడు కర్మలూ; కళ, కాష్ఠ మొదలైన కారణాలచే వేరుపాటయిన కాలమూ; జ్ఞానం మొదలైన జీవుల స్వభావమూ; అనుభవించే జీవుడూ ఎవరి

ప్రసన్నత్వం వల్ల సంచరిస్తుంటారో, ఎవరి ఉదాసీనత వల్ల చరించకుండా ఉంటారో, అట్టి మహిమ గల సర్వస్వామి తాను ఒకడే అయినా అనేకంగా భావింపబడుతూ, యోగశయ్య మీద మేల్కొంచి ఉంటాడు. ఆపైన అతడు తన సంకల్పంతో బంగారుమయమైన తన శరీరాన్ని అధిదైవతం, అధ్యాత్మికం, అధిభూతం అనే సంజ్ఞలతో మూడు విధాలుగా పుట్టించాడు.

కర్మలు నిమిత్తం, శుభం, అశుభం అని మూడు రకాలు. జలరాశిని నారం అంటారు. ఆ నీరు స్థానంగా కలవాడు నారాయణుడు.

సీ. అట్టి విరాడ్విగ్రహాంత రాకాశంబు వలన నోజ స్సహోబలము లయ్యెఁ బ్రాణంబు సూక్ష్మరూప క్రియాశక్తిచే జనియించి ముఖ్యాసు వనఁగఁ బరఁగె వెలువడి చను జీవి వెనుకొని ప్రాణముల్ చనుచుండు నిజనాథు ననుసరించు భటుల చందంబునఁ, బాటిల్లు క్షుత్తును భూరితృష్ణయు మఱి ముఖము వలనఁ

తే. దాలుజిహ్వాదికంబు లుద్భవము నొందె, నందు నుదయించె నానావిధైక రసము, లెనయ నవి యెల్ల జిహ్వచే నెఱుఁగఁబడును, మొనసి పలుక నపేక్షించు ముఖమువలన.

268

తా॥ అలాంటి విరాట్పురుషుడి హృదయాకాశం నుంచి ఓజస్సు, సహస్సు, బలం అనే ధర్మాలు పుట్టాయి. సూక్ష్మమైన క్రియాశక్తి వల్ల ప్రాణం పుట్టింది. అదే ముఖ్య ప్రాణంగా (అసువుగా) ఒప్పింది. తమ స్వామిని అనుసరించే సేవకుల విధంగా జీవుని వెన్నంటి ఆ ప్రాణాలు బయటకు పోతుంటాయి. ఆకలిమంటలు, ఓర్చుకోలేని దాహం కలుగుతుంటాయి.

నోటి నుంచి దవడలు, నాలుక మొదలైనవి పుట్టాయి. వీటి నుంచే ఒకే విధమైన నానారకాల రుచులు జనించాయి. సరిపోలిక గలవన్నీ నాలుకతో తెలుసుకోబడుతాయి. ముఖం నుంచి శోభిల్లి 'పలుకు' తన రూపాన్ని కోరుకుంటుంది. మాట్లాడాలనే సంకల్పం కలుగుతుంది.

సహస్సు = సకార హకారాల కలయిక గల ఊర్పు. దీన్నే 'హంస' లేక 'సోహం' అంటారు. ఇదే ఇంద్రియశక్తి.

ఓజస్సు = ఓంకారోత్పత్తి కలది. బలము = ఆహారాదులచే పోషించేది. ఇదే దేహశక్తి.

వ. మఱియు వాగింద్రియంబు పుట్టె, దానికి దేవత యగ్ని. (యా రెంటివలన భాషణంబు వొడమె, నా యగ్నికి మహాజల వ్యాప్తం బగు జగంబున నిరోధంబు గలుగుటంజేసి యా జలంబె ప్రతిబంధకం బయ్యె) దోదూయమానంబైన మహావాయువు వలన ఘ్రాణంబు పుట్టెం గావున వాయుదేవతాకంబైన ఘ్రాణేంద్రియంబు గంధగ్రహణ సమర్థం బయ్యె. (నిరాలోకం బగు నాత్మ నాత్మయందుఁ జూడం గోరి) తేజంబువలన నాదిత్యదేవతాకంబై రూపగ్రాహకంబైన యక్షియుగళంబు పుట్టె, ఋషిగణంబులచేత బోధితుం డగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును శబ్దగ్రాహకంబును నైన శ్రోత్రేంద్రియంబు పుట్టించె, సర్జనంబు సేయు పురుషునివలన మృదుత్వకాఠిన్యంబులును, లఘుత్వ గురుత్వంబులును, నుష్ణత్వ శీతలత్వంబులును జేసెడు త్వగింద్రియాధిష్ఠానంబగు చర్మంబు పుట్టె. దానివలన రోమంబు లుదయించె. వానికి మహీరుహంబు లధిదేవత లయ్యె. నందు నధిగతస్పర్శ గుణుండును, నంతర్బహిః ప్రదేశంబుల నావృతుండును నగు వాయువువలన (బలవంతంబులును, నింద్రదేవతాకంబులును, నాదానసమర్థంబులును, నానాకర్మకరణ దక్షంబులును నగు హస్తంబు లుదయించె) స్వేచ్ఛా విషయగతి సమర్థుండగు నీశ్వరుని వలన విష్ణు దేవతాకంబులగు పాదంబు లుదయించెఁ. ప్రజానందామృతార్థియగు భగవంతునివలనఁ ప్రజాపతి దేవతాకంబై, స్త్రీ సంభోగాది కామ్యసుఖంబులు కార్యంబులుగాఁ గల శిశ్నోపస్థంబు లుదయించె, మిత్రుం డధిదైవతంబుగాఁ గలిగి భుక్తాన్నాద్యసారాంశ త్యాగోపయోగంబగు "పాయు" వనెడి గుదం బుద్భవించె. దాని కృత్యం బుభయ మలమోచనంబు, దేహంబున నుండి దేహాంతరంబుఁ జేరం గోరి పూర్వకాయంబు విడుచుటకు సాధనం బగు నాభిద్వారంబు సంభవించె. అట్టి నాభియే

ప్రాణాపానబంధ స్థానం బనంబడు. తద్బంధ విశ్లేషంబె మృత్యువగు. అదియు యూర్ధ్వాధోదేహ భేదకం బనియును జెప్పంబడు. అన్నపానాది ధారణార్థంబుగ నాంత్ర కుక్షి నాడీనిచయంబులు గల్పింపంబడియె. వానికి నదులును, సముద్రంబులును నధిదేవత లయ్యె. వానివలనఁ దుష్టి పుష్టులను నుదరభరణ రస పరిణామంబులు గలిగియుండు. ఆత్మీయ మాయాచింతనం బొనర్చునపుడు కామసంకల్పాదిస్థానం బగు హృదయంబు గలిగె, దానివలన మనంబును, చంద్రుండును, కాముండును, సంకల్పంబును నుదయించె. అంత మీఁద జగత్సర్జనంబు సేయు విరాడ్విగ్రహంబు వలన సప్తధాతువులును, బృథివ్యప్తేజోమయంబు లయిన సప్త ప్రాణంబులును, వ్యోమాంబు వాయువులచే నుత్పన్నంబులై గుణాత్మకంబులైన యింద్రియంబులును, నహంకార ప్రభవంబులైన గుణంబులును, సర్వవికార స్వరూపం బగు మనస్సును, విజ్ఞానరూపిణి యగు బుద్ధియును బుట్టు. వివిధంబగు నిది యంతయు సర్వేశ్వరుని స్థూల విగ్రహంబు, మఱియును.

269

తా॥ ఇంకా ఆ విరాట్పురుషిడి 'ముఖం' నుంచి 'వాక్కు' అనే ఇంద్రియం పుట్టింది. దీనికి దేవత 'అగ్ని'. ఈ రెండింటి (అగ్ని, మాట) కూడిక వల్లే 'సంభాషణం' వెలువడింది. ఆ అగ్నికి నీటిమయం అయిన జగత్తే అడ్డంకి కావడం వల్ల, ఆ నీరే దానికి ప్రతిరోధకం అయింది.

విసురుగా కదలే స్వభావం గల మహావాయువు వల్ల ముక్కు పుట్టింది. దీని దేవత వాయువు. ఈ ఇంద్రియం 'వాసన' పట్టే శక్తి కలది.

చూడలేని ఆత్మను తనయందు దర్శించాలనే కోరిక వల్ల తేజస్సు నుంచి కళ్ళు రెండూ పుట్టాయి. వీటి దేవత సూర్యుడు. ఇవి రూపాన్ని గ్రహింప చేస్తాయి.

మునుల వల్ల మేల్కొల్పబడినవాడై భగవంతుడు 'చెవి' అనే ఇంద్రియానికి కారకుడయ్యాడు. దీని దేవత దిక్కులు. ఇది ధ్వనిని పుట్టింప గలుగుతుంది.

పుట్టుకలను కల్పించే పురుషుడి వల్ల 'త్వక్' ఇంద్రియానికి ఆధారమైన 'చర్మం' ఏర్పడింది. ఆ తోలు మెత్తదనాన్ని గట్టితనాన్ని, తేలికను బరువులను, వెచ్చదనాన్ని చల్లదనాన్ని, కలిగింపచేస్తుంది. ఆ తోలు నుంచే 'రోమాలు' పుడతాయి. వీటి మూలదేవతలు చెట్లు.

వాయువు నుంచి 'చేతులు' పుట్టాయి. ఆ వాయువు చర్మాన్ని పొందిన స్పర్శగుణం కలవాడు. లోపల వెలుపల చుట్టుముట్టి ఉండేవాడు. ఇతడి నుంచి పుట్టిన చేతులు పుష్టి కలవి. వీటి దేవత ఇంద్రుడు. ఇవి తీసుకోగల, పట్టుకోగల సామర్థ్యం కలవి. వివిధమైన పనులు చేయగలవి.

యథేచ్ఛగా అంశానుగుణంగా నడక సాగించ సమర్థత గల ఈశ్వరుడి శరీరం నుంచి 'పాదాలు' పుట్టాయి. వీటి దేవత విష్ణువు.

సంతానం యొక్క సంతసమనే సుధను కోరుకునే భగవంతుడి వల్ల పురుషాంగం(శిశ్నం), ఉపస్థ (స్త్రీ అంగం) పుట్టాయి. స్త్రీ, పురుషుల కలయిక మొదలైన కామసంబంధ సుఖాలు వీటి కార్యాలు. వీటి దేవత ప్రజాపతి.

'పాయువు' అనే గుదానికి దేవత సూర్యుడు (మిత్రుడు). ఈ అవయవం తినే అన్నం మొదలైన వాటిల్లోని నిస్సారభాగాలను తోసివేసే ఉపకరణంగా ఉంటుంది. ఉభయ మలాలను విసర్జింప చేయడం దీని కృత్యం.

ఒక శరీరం నుంచి మరో శరీరాన్ని చేరుకోవాలనుకున్నప్పుడు తొలి శరీరాన్ని వదిలిపెట్టడానికి ఉపకరించేందుకు 'బొడ్డు' అనే ద్వారం పుట్టింది. ప్రాణ, అపాన వాయువులను బంధించడానికి స్థానమైంది ఆ బొడ్డే. ఆ బంధం తొలగింపే మరణం. పై శరీరాన్ని, కింది శరీరాన్ని వేరుపాటు చేసే స్థానమూ ఈ బొడ్డే.

అన్నపానాదులను ధరించడం కోసం పేగులు, పొట్ట, నాడీమండలం నిర్మితమయ్యాయి.

వాటి దేవతలు (నదులకు) నదులూ, (ప్రేగులకు) సముద్రాలూ. వాటివల్ల తుష్టి (కడుపు నిండినప్పటి సంతోషం), పుష్టి (రస పరిణామం వల్ల దేహదార్ఢ్యం) అనేవి కలుగుతాయి. వీటి ఉదరభరణ పరిణామాల వల్ల రుచి పరిణామాలు కలుగుతాయి.

తనదైన మాయను గూర్చి భావించేటప్పుడు హృదయం పుట్టింది. ఇది కామానికీ, సంకల్పానికీ నెలవైనది. దీన్నుంచి మనస్సూ, చంద్రుడూ, కాముడూ, సర్కల్పం పుట్టాయి.

ఆ మీదట లోకాన్ని పుట్టించే విరాట్పురుషుడి తనువు నుంచి ఏడు ధాతువులూ (త్వక్కు, చర్మం, మాంసం, రక్తం, మేధ, మజ్జ, ఎముకలు); భూమి, నీరు, తేజస్సుల రూపాలయిన ఏడు ప్రాణాలూ; మిన్ను, నీరు, గాలి నుంచి పుట్టిన గుణ స్వరూపం కల ఇంద్రియాలూ; అహం నుంచి పుట్టిన స్వభావాలూ; సమస్త వికార భావాల స్వరూపకమైన మనస్సు; వివేకస్వరూపిణి అయిన మతీ పుట్టాయి. ఇదంతా కూడా ఆ పరమేశ్వరుడి స్థూల శరీరం. ఇంకా –

క. వరుసఁ బృథివ్యా ద్యష్టా, వరణావృతమై సమగ్రవైభవములఁ బం కరుహభవాండాతీత, స్ఫురణం జెలువొందు నతివిభూతి దలిర్పన్.

270

తా॥ ఈ స్థూలశరీరం వరుసబెట్టి 'భూమి', 'నీరు' మొదలుగా (పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం అని) ఎనిమిది ఆవరణలచే చుట్టుకొనబడి ఉంటుంది. సంపూర్ణమైన వైభవంతో బ్రహ్మాండాన్ని మించి వెలుగొందుతుంటుంది.

క. పొలపగు సకల విలక్షణ, ములు గలి గాద్యంత శూన్యమును నిత్యమునై లలి సూక్ష్మమై మనో వా, క్కులకుం దలపోయఁగా నగోచర మగుచున్.

271

తా॥ ఆ విరాట్పురుషుడి ఈశ్వర రూపం అన్నిటికన్న విలక్షణంగా ఒప్పారుతూ, ఆ

రూపానికి తుదీ మొదలూ ఉండదు. ఎల్లప్పటికీ నిలిచిపోతుంది. ఆలోచించి చూస్తే, అది సూక్ష్మరూపి కావడం వల్ల, మనస్సుకు గాని మాటకు గాని గోచరం కాదు.

సీ. అలఘు తేజోమయం బైన రూపం బిది, క్షితినాథ! నాచేతఁ జెప్పఁబడియె, మానిత స్థూల సూక్ష్మ స్వరూపంబుల, వలన నొప్పెడు భగవత్స్వరూప మమ్మహాత్మకుని మాయాబలంబునఁ జేసి, దివ్యమునీంద్రులుఁ దెలియలేరు, వసుధేశ! వాచ్యమై వాచకంబై నామ, రూపముల్ క్రియలును రూఢిఁదాల్చి

ఆ. యుండు నట్టి యీశ్వరుండు నారాయణుం, డఖిలధృతి జగ న్నియంతయైన చిన్మయాత్మకుండు సృజియించు నీ ప్రజా, పతుల ఋషులఁ బితృతతుల నపుడు.

272

తా॥ ఓ రాజా! మహా తేజోవంతమైన భగవత్స్వరూపాన్ని నేను ఇప్పటి దాకా మీతో చెప్పాను. అది స్థూల, సూక్ష్మ రూపాల్లో ఉంది. అది ఆ మహాపురుషుడి మాయాశక్తిచే ఏర్పడింది. దివ్యులు, మహర్షులు కూడా ఈ మాయా ప్రభావాన్ని తెలుసుకోజాలరు.

ఓ రాజా! ఆ ఈశ్వరుడు చెప్పదగింది (వాచ్యం), చెప్పేది (వాచకం), అయిన నామరూపక్రియలను దృఢనిశ్చయంతో ధరించి ఉంటాడు. అలాంటి ఈశ్వరుడూ నారాయణుడూ, సమస్తమున్నూ ధరించి జగత్తును శాసించేవాడూ, జ్ఞానమయాత్ముడు, ఈ ప్రజాపతుల్నీ ఋషుల్నీ పితృదేవతల్నీ ప్రీతితో సృష్టిస్తుంటాడు.

విరాట్పురుషుడికి అవ్యక్తమైన, వర్ణాకృతులు – ఆదిమధ్యాంతాలు లేని సూక్ష్మరూపం ఉన్నది. అది వాక్కుకు, మనస్సుకు అందదు. ఆ నిష్క్రియుడు బ్రహ్మరూపాన్ని ధరించినప్పుడు క్రియావిశిష్టుడౌతాడు. వాచ్యరూపంతో దేవాదులైనవారి రూపాలను, వాచక రూపంతో దేవ–మనుష్య–జంతురూప నామాలను, వాటి క్రియలను (పనులను) ఆయనే సృష్టిస్తున్నాడని భావం.

వ. మఱియును.

273

తా॥ ఇంకా.

సీ. సుర సిద్ధ సాధ్య కిన్నర వర చారణ, గరుడ గంధర్వ రాక్షస పిశాచ
భూత భేతాళ కింపురుష కూశ్మాండ గు, హ్యక డాకినీ యక్ష యాతుధాన
విద్యాధ రాప్సరో విషధర గ్రహ మాతృ, గణ వృక హరి ఘృష్టి ఖగ మృగాళి
భల్లూక రోహిత పశు వృక్షయోనుల, వివిధకర్మంబులు వెలయఁబుట్టి

తే. జల నభో భూతలంబుల సంచరించు, జంతు చయముల సత్త్వరజ స్తమో గు ణములఁ
దిర్య క్సురాసుర నరధ రాది, భావముల భిన్ను లగుదురు పౌరవేంద్ర!

274

తా॥ రాజేంద్రా! తాము ఆచరించిన కర్మవిధానాలను బట్టి సురలు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, గరుడులు, గంధర్వులు, రాక్షసులు, పిశాచులు, భూతాలు, భేతాళులు, కింపురుషులు, కూశ్మాండులు, గుహ్యకులు, డాకినులు, యక్షులు, యాతుధానులు, విద్యాధరులు, అచ్చరలు, పాములు, గ్రహాలు, మాతృగణాలు, తోడేళ్ళు, సింహాలు, పందులు, పక్షులు, ఎలుగుబంట్లు, ఎఱ్ఱ చేపలు, పశువులు, చెట్లు మొదలైనవి జన్మస్థానాలవుతాయి. ఇవి నీటిలో ఆకాశంలో భూమి మీద తిరుగాడే జీవాలు. ఇవి సత్త్వరజస్తమోగుణాలచేతా, పశుపక్ష్యాదులు, దేవతలు, రక్కసులు, నదులు, గుట్టలు మొదలైనవి – వాటి వాటి స్వభావాల చేత వేరవుతుంటాయి.

మ. ఇరవొందన్ ద్రుహిణాత్మకుం డయి రమాధీశుండు విశ్వంబు సు స్థిరతం జేసి హరిస్వరూపుఁ డయి రక్షించున్ సమస్తప్రజో త్కర సంహారము సేయు నప్పుడు హరాంతర్యామియై యింతయున్ హరియించున్ బవనుండు మేఘముల మాయంజేయు

చందంబునన్.

275

తా॥ లక్ష్మీపతి బ్రహ్మరూపుడై నేర్పుగా జగత్సృష్టిని నియమించాడు. విష్ణురూపుడై కాపాడాడు. శివుడి లోపల సంచరించేవాడై సర్వ జీవజాలాన్నీ లయింప చేసేప్పుడు మబ్బులను గాలి అదృశ్యం చేసినట్లు సమస్త విశ్వాన్ని ఇతడు హరించివేస్తాడు.

క. ఈ పగిదిని విశ్వము సం, స్థాపించును మనుచు నడఁచు ధర్మాత్మకుఁడై దీపిత తిర్యఙ్నర సుర, రూపంబులు దాన తాల్చి రూఢి దలిర్పన్.

276

తా॥ ఈ తీరుగా ధర్మరూపుడై ప్రపంచాన్ని ఏర్పాటు చేశాడు. రక్షించాడు. అణచి వేశాడు. పశుపక్ష్యాదులు, నరులు, సురలు, మొదలైన రూపాలన్నిటిని తానే ధరించాడు.

భగవంతుడు విష్ణురూపంలో జగత్తును పాలించాడు. మత్స్య, కూర్మాదులైన తిర్యక్కుల రూపంలోనూ, రామకృష్ణాది నరుల రూపంలోనూ, వామనాదిదైవత రూపాలలోనూ అవతరించి, అధర్మాన్ని నాశనం చేసి, ధర్మాన్ని రక్షించాడు.

సీ. హరియందు నాకాశ మాకాశమున వాయు, వనిలంబు వలన హుతాశనుండు, హవ్యవాహనునందు నంబువు లుదకంబు, వలన వసుంధర గలిగె ధాత్రి వలన బహు ప్రజావళి యుద్భవం బయ్యె, నింతకు మూలమై యెసఁగునట్టి, నారాయణుఁడు, చిదానంద స్వరూపకుం, డవ్యయుం, డజరుఁ డనంతుఁ, డాఢ్యుఁ

తే. డాది మధ్యాంత శూన్యుం, డనాదినిధనుఁ, డతనివలనను సంభూత మైన యట్టి సృష్టి హేతుప్రకార మీక్షించి తెలియఁ, జాల రెంతటి మునులైన జనవరేణ్య!

277

తా॥ విష్ణుమూర్తి నుంచి ఆకాశం, ఆ నింగి నుంచి వాయువూ, ఆ గాలి నుంచి అగ్ని, అగ్ని నుంచి నీరు, ఆ జలాల నుంచి నేలా, ఆ భూమి నుంచి అనేక రకాల ప్రాణులూ పుట్టాయి. ఈ అన్నిటికీ మూలాధారమై ఒప్పేవాడు నారాయణుడు. అతడు చిదానందరూపుడు. అవ్యయుడు. జన్మరహితుడు. అంతం లేనివాడు. సంపన్నుడు. మొదలు, నడుమ, చివరలు లేనివాడు. ఆద్యంతాలు కానరానివాడు.

ఓ రాజా! ద్రష్టలైన ఎంతటి మునులైనా కూడా ఇలాంటి దైవం నిర్మించిన ఈ సృష్టికి హేతువునూ ఈ సృష్టి సరణినీ గ్రహించుకోలేకపోతున్నారు.

వ. అదియునుం గాక,

278

తా॥ అంతేగాకుండా –

మ. ధరణీశోత్తమ! భూతసృష్టి నిటు సంస్థాపించి రక్షించు నా హరికర్తృత్వము నొల్లఁ డాత్మగత మాయారోపితం జేసి, తా నిరవద్యుండు నిరంజనుండుఁ బరుఁడున్ నిష్కించనుం డాఢ్యుఁడున్ నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ నిత్యత్వముం బొందెడిన్.

279

తా॥ ఓ రాజోత్తమా! ఈ ప్రాణిసృష్టిని ఈ విధంగా సిద్ధం చేసి కాపాడిన ఆ ఆదివిష్ణువు దీనికంతటికీ తానే కర్త అనడాన్ని ఇష్టపడడు. అదంతా తనలోని మాయకే ఆరోపితమై ఉంది. అందువల్ల తాను నిరవద్యుడు, నిరంజనుడు, పరుడు, నిష్కించనుడు, ఆఢ్యుడు, నిరపేక్షుడు, నిష్కళంకుడు అయినవాడై నిత్యతను పొందుతున్నాడు.

వ. బ్రహ్మసంబంధి యగు నీ కల్పప్రకారం బవాంతర కల్పంబుతోడి సంకుచిత ప్రకారంబున నెఱింగించితి. ఇట్టి బ్రహ్మకల్పంబున నొప్పు ప్రాకృత వైకృత కల్పప్రకారంబులును,

దత్పరిమాణంబులును, కాలకల్ప లక్షణంబులును, నవాంతర కల్ప మన్వంతరాది భేద విభాగ స్వరూపంబును నతివిస్తారంబుగ నెఱిఁగింతు వినుము. అదియునుం బద్మ కల్పం బనం దగు. అని భగవంతుండైన శుకుండు బరీక్షిత్తునకుఁ జెప్పెనని సూతుండు మహర్షులకు నెఱింగించిన,

280

తా॥ 'బ్రహ్మకల్ప' విధానాన్నీ, మధ్యలో వచ్చే కల్పాలతో సహా సంగ్రహంగా చెప్పాను. ఇలాంటి బ్రహ్మకల్పంలో కలిగే ప్రకృతి (మహదాది సృష్టి), వికృతి (స్థావరాది సృష్టి) సంబంధిత సృష్టి విశేషాలు, వాటి కొలమానాలు, కాలం లక్షణం, కల్పం లక్షణం, కల్ప విభాగం, కల్పాల మధ్యలో సంభవించే ప్రళయాలూ, మన్వంతరాలూ, వాటి రకాలు, విభజనలూ – వీటిని గూర్చిన తీరును విశదంగా తెలియపరుస్తాను విను. ఇలాంటి దాన్ని కూడా 'పద్మకల్పం' అనవచ్చ" ని భగవత్స్వరూపుడైన శుకుడు పరీక్షిత్తుకు చెప్పినట్లు సూతుడు ఆ మహామునులకు తెలుపగా.

క. విని శౌనకుండు సూతుం, గనుఁగొని యిట్లనియె సూత! కరుణోపేతా! జననుత గుణ సంఘాతా! ఘనపుణ్యసమేత! విగత కలుష వ్రాతా!

281

తా॥ విన్న శౌనకుడు సూతుణ్ణి చూస్తూ ఇలా అన్నాడు: "సూతా! దయానిధీ! జనులు పొగిడే గుణౌన్నత్యం కలవాడా! ఘన పుణ్యయుక్తా! పాపరహితా!

వ. పరమ భాగవతోత్తముండైన విదురుండు బంధుమిత్ర జాతంబుల విడిచి సకల భువన పావనంబులును, కీర్తనీయంబులును నైన తీర్థంబులు, నగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులును దర్శించి, క్రమ్మఱ వచ్చి కౌషారవియగు మైత్రేయుం గని యతనివలన నధ్యాత్మ బోధంబు వడసె నని వినంబడు, నదియంతయు నెఱింగింపు మనిన నతండిట్లనియె.

282

తా॥ భాగవతుల్లో శ్రేష్ఠుడైన విదురుడు బంధుబలగాన్ని, స్నేహితులను కాదనుకున్నాడు. సమస్త లోకాల్ని పవిత్రీకరించేవి, కొనియాడదగినవి, అయిన పుణ్యతీర్థాలను, లెక్కపెట్టలేనన్ని పుణ్యక్షేత్రాల్ని దర్శించాడు. సేవించి వెనక్కి వచ్చి కుషారవుని తనయుడైన మైత్రేయ మహర్షిని దర్శించాడు. ఆ ముని వల్లనే ఆధ్యాత్మిక విద్యను పొందాడని విన్నాం. అదంతా మాకు తెలియ చెప్పు." అనగానే సూతుడిలా అందుకున్నాడు:

క. విను డిపుడు మీరు నన్నడి, గిన తెఱఁగున శుకు మునీంద్రగేయుఁ బరీక్షి జ్జనపతి యడిగిన నతఁడా, తని కెఱిఁగించిన విధంబుఁ దగ నెఱిఁగింతున్.

283

తా॥ "వినండి. ఇప్పుడు మీరు నన్నడిగిన తీరుననే శుకయోగిని పరీక్షిత్తు మహారాజు కూడా అడిగాడు. ఆ శుకుడు పరీక్షిత్తుకి తెలిపిన విధానాన్ని అనుసరించి మీకూ తెలుపుతాను."

వ. సావధానులై వినుండని.

284

తా॥ శ్రద్ధపెట్టి వినండి – అని పలికి.

ఉ. రామ! గుణాభిరామ! దినరాజ కులాంబుధి సోమ! తోయద శ్యామ! దశానన ప్రబల సైన్య విరామ! సురారి గోత్ర సు త్రామ! సుబాహు బాహుబల దర్ప తమః పటు తీవ్ర ధామ! ని ష్కామ! కుభృల్ల లామ! గరకంఠ సతీనుతనామ! రాఘవా!

285

తా॥ "శ్రీరామచంద్రప్రభూ! నువ్వు గుణసౌందర్యం కలవాడవు, సూర్యవంశమనే సముద్రానికి చంద్రుడి వంటివాడవు. మబ్బు వలె చామనచాయ గలవాడవు. రావణుని

బలిష్ఠమైన సైనికబలాన్ని అణచిన వాడవు. నువ్వు రాక్షసులనే కొండలకు అపర ఇంద్రుడివి. సుబాహుడనే రక్కసుడి భుజబలగర్వమనే అంధకారాన్ని పారద్రోలిన సూర్యుడివి. ఏ కోరికలూ లేనివాడవు. రాజశ్రేష్ఠుడవు. పార్వతీదేవి స్తుతికి పాత్రుడైనవాడవు. రఘువంశ దీపకుడవు.

క. అమరేంద్రసుత విదారణ! కమలాప్త తనూజ రాజ్యకారణ! భవ సం తమస దినేశ్వర! రాజో, త్తమ! దైవత సార్వభౌమ! దశరథరామా!

286

తా॥ దశరథ పుత్రుడవైన ఓ రామా! నువ్వు ఇంద్రుడి కొడుకైన వాలిని చెండాడినవాడవు. సూర్యుడి కొడుకు సుగ్రీవుడి రాజ్యాధిపత్యానికి కారకుడవు. సంసారమనే చీకటికి సూర్యుడివి. రాజులలో వరేణ్యుడవు. దేవతలకు చక్రవర్తివి.

మాలిని.

నిరుపమగుణజాలా! నిర్మలానందలోలా! దురిత ఘన సమీరా! దుష్టదైత్య ప్రహారా! శరధిమదవిశోషా! చారుసద్భక్తపోషా! సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్రపాత్రా!

287

తా॥ ఓ రామా! నువ్వు సాటిలేని గుణవంతుడవు, శుద్ధమైన ఆనందంలో మునిగి తేలుతుండేవాడవు. పాపాలనే మబ్బుల పాలిట పెద్దహోరుగాలి వంటివాడవు. నీచ రాక్షసుల్ని ప్రహరించినవాడవు. సముద్రుని గర్వాన్ని ఇగిరింప చేసినవాడవు. సద్భక్తులకు అండ చూపేవాడవు. పద్మాలవలె విప్పారిన నేత్రాలు కలవాడవు. సజ్జనుల కీర్తనలను అందుకోతగ్గవాడవు.”

గద్యము.

ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య,

పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణంబునందుఁ బరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు, భాగవతపురాణ వైభవంబును, "ఖట్వాంగు" మోక్షప్రకారంబును, ధారణాయోగవిషయం బయిన మహావిష్ణుని శ్రీపాదాద్య వయవంబుల సర్వలోకంబులు నున్న తెఱంగును, సత్పురుష వృత్తియు, మోక్షవ్యతిరిక్త సర్వకర్మ ఫలప్రద దేవతా భజన ప్రకారంబును, మోక్షప్రదుండు శ్రీహరి యనుటయు, హరి భజన విరహితులైన జనులకు హేయతాపాదనంబును, రాజప్రశ్నంబును, శుకయోగి శ్రీహరి స్తోత్రంబు సేయుటయు, వాసు దేవప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు, శ్రీహరివలన బ్రహ్మరుద్రాదిలోక ప్రపంచంబు పుట్టుటయు, శ్రీమన్నారాయణ దివ్య లీలావతార పరంపరా వైభవ వృత్తాంత సూచనంబును, భాగవతవైభవంబును, బరీక్షిత్తు శుకయోగి నడిగిన ప్రపంచాది ప్రశ్నంబులును, నందు శ్రీహరి ప్రధానకర్తయని తద్వృత్తాంతంబు సెప్పుటయు, భగవద్భక్తి వైభవంబును, బ్రహ్మతపశ్చరణంబునకుం బ్రసన్నుండై హరి వైకుంఠ నగరంబుతోడఁ బ్రసన్నుండయిన స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమంబు వినుటయు, వాసుదేవుం డానతిచ్చిన ప్రకారంబున బ్రహ్మ నారదునికి భాగవతపురాణ ప్రధాన దశ లక్షణంబు లుపన్యసించుటయు, నారాయణవైభవంబును, జీవాది తత్త్వ సృష్టియు, శ్రీహరి నిత్యవిభూత్యాది వర్ణనంబును, గల్ప ప్రకారాది సూచనంబును, శౌనకుండు విదురమైత్రేయ సంవాదంబు సెప్పుమని సూతు నడుగుటయు నను కథలు గల ద్వితీయ స్కంధము సంపూర్ణము.

288

తా॥ ఇది శ్రీమన్నారాయణుని దయవల్ల అబ్బిన కవిత్వంచే అబ్బురపరచినవాడు, కేసన మంత్రి కుమారుడు, సహజమైన పాండిత్యం కలవాడు అయిన పోతనామాత్యుడు కూర్చిన శ్రీమహాభాగవత పురాణంలో పరీక్షిత్తుతో శుకముని సంభాషణలు, భాగవతపురాణ మాహాత్మ్యం, ఖట్వాంగుడు ముక్తి పొందిన విధం, ధారణా యోగానికి చెందిన ఆ మహావిష్ణువు పవిత్రములైన పాదాలు మొదలైన అవయవాల్లో అన్ని లోకాలు ఉన్న తీరు, సజ్జనుల ప్రవృత్తి, ముక్తికన్న

ఇతరంగా కోరుకున్నవాటన్నిటిని సిద్ధింపచేసే దేవతలను సేవించే సరణి, ముక్తిప్రదాత ఒక్క శ్రీవిష్ణువే అని చెప్పడం, విష్ణుసేవనం లేని మానవులకు నీచత్వం ఆపాదించడం, రాజు ప్రశ్నించడం, శుకముని శ్రీహరిని స్తుతించడం, వాసుదేవుడి దయవల్ల బ్రహ్మ బ్రహ్మాధిపత్యం సంపాదించడం, శ్రీవిష్ణువు వల్ల బ్రహ్మారుద్రాదిలోక ప్రపంచం ఉద్భవించడం, శ్రీమన్నారాయణ దివ్యలీలలు గల జన్మల పరంపర, అవతార వైభవవిశేషాల్ని సూచించడం, భాగవత వైభవం, పరీక్షిత్తు శుకయోగిని ప్రశ్నించిన ప్రపంచాది ప్రశ్నలూ, వాటిల్లో శ్రీహరి కర్తృత్వ ప్రాధాన్యాంశాన్ని చెప్పడం, భగవత్సేవ ఔన్నత్యం, బ్రహ్మ చేసిన తపస్సుకు ఆ నారాయణుడు ప్రసన్నుడై వైకుంఠపదంతో సహా సాక్షాత్కరించడం, బ్రహ్మ అతణ్ణి పొగడి దైవానుగ్రహంతో అతడి ప్రభావాన్ని వినడం, ఆ విష్ణువు ఉపదేశం ప్రకారం బ్రహ్మ నారదుడికి భాగవత పురాణంలో ప్రధానమైన పది లక్షణాలూ వివరంగా చెప్పడం, నారాయణుని గొప్పతనం, జీవాదితత్త్వసృజన, శ్రీహరి నిత్యవిభూతి మొదలైనవాటిని వర్ణించడం, కల్పాదుల తీరుల సూచనలు, 'విదుర మైత్రేయ సంవాదం' విన్పించమని సూతుణ్ణి శౌనకుడు అడగడం – అనే వృత్తాంతాలు కల ద్వితీయ స్కంధం సమాప్తం.

# తృతీయ స్కంధము

శ్రీమహిత వినత దివిజ
స్తోమ ! యశస్సీమ ! రాజసోమ ! సుమేరు
స్థేమ ! వినిర్జిత భార్గవ
రామ ! దశానన విరామ ! రఘుకులరామా !

క.1

తా॥ రామచంద్రా! రఘుకులతిలకా! నువ్వు దేవతలచేత సైతం కీర్తింపబడే వాడవు! అవధులు లేని కీర్తివైభవం కలవాడవు! రాజులలో చంద్రుడవు! మేరు సమాన ధీరుడవు! పరశురాముణ్ణి సైతం జయించిన వీరుడవు! దశగ్రీవుణ్ణి సంహరించిన పరాక్రమోపేతుడవు! అవధరించు!

వ. మహనీయగుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె.

2

తా॥ ఉత్తమ గుణాలు కలవారిలో శ్రేష్ఠులైన ఆ మునీశ్వరులతో సమస్తమైన పురాణ వాఙ్మయాన్ని వ్యాఖ్యానం చేసి చెప్పగల సూతుడిలా అంటున్నాడు– “ఆ విధంగా మరణాన్ని కోరి సర్వకర్మపరిత్యాగ పూర్వకమైన ఉపవాస దీక్షలో ఉన్న పరీక్షిన్నరేంద్రునితో శుకయోగీంద్రుడిలా అంటున్నాడు–

# విదురుని తీర్థయాత్ర

ఉ పాండునృపాల నందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్ భండనభూమిలో గెలిచి పాండుర శారద చంద్ర చంద్రికా ఖండయశః ప్రసూన కలికావళిఁ గౌరవ రాజ్యలక్ష్మి నొం డొండ యలంకరింపుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్.

3

తా॥ ఓ! పరీక్షిన్నరేంద్రా! విను! పాండురాజు పుత్రులైన ధర్మరాజాదులు తమ బాహుబలంతో ధృతరాష్ట్రుని కొడుకులైన సుయోధనాదులను యుద్ధరంగంలో జయించారు. క్రమక్రమంగా మనోహరమైన శరత్కాలపు చంద్రుని పండు వెన్నెల వంటి కీర్తి అనే పూల మొగ్గలతో కౌరవ రాజ్యలక్ష్మిని అలంకరిస్తూ జయోల్లాసంతో రాజ్యపరిపాలన చేస్తున్నారు.

క. మనుజేంద్ర! విదురుఁ డంతకు, మును వనమున కేఁగి యచట మునిజన గేయున్ వినుత తపో ధౌరేయున్, ఘను ననుపమ గుణవిధేయుఁ గనె మైత్రేయున్.

4

తా॥ కురుపాండవ సంగ్రామానికి ముందే విదురుడు అడవులకు వెళ్ళి, అక్కడ మునులందరిచే కీర్తింపబడే వాడు, తపోనిష్ఠాగరిష్ఠుడు, చాలా గొప్పవాడు, పోలికల్లేని మంచి గుణములు కలవాడు అయిన మైత్రేయుణ్ణి దర్శించాడు.

క. కనుఁగొని తత్పాదంబులు, దన ఫాలము సోక మ్రొక్కి తగ నిట్లనియెన్ మునివర! సకల జగత్పా, వన చరితుఁడు గృష్ణుఁ డఖిల వంద్యుం డెలమిన్.

5

తా॥ అలా ఆ మైత్రేయుణ్ణి దర్శించి, సంతోషంతో ఆయన యొక్క పాదాలు తన నుదురుకు తగిలేటట్లుగా మ్రొక్కి ఇలా అన్నాడు: 'ఓ! మునిశ్రేష్ఠా! కేవలం తన పేరుచేతనే

లోకాలన్నింటినీ పావనం చెయ్యగల వాడు, అందరికీ వందనీయుడు అయిన శ్రీకృష్ణుడు—

క. మండిత తేజోనిధి యై, పాండవ హితమతిని దూతభావంబున వే దండపురి కేగి కురుకుల, మండనుఁ డగు ధార్తరాష్ట్ర మందిరమునకున్.

6

తా॥ దివ్యతేజంతో ప్రకాశించువాడై, పాండవులకు మేలు చెయ్యాలనే తలంపుతో దూతభావంతో హస్తినాపురికి వచ్చి కౌరవ వంశానికే అలంకార ప్రాయుడైన దుర్యోధనుని మందిరానికి—

తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త, వత్సలుం డగు కృష్ణుండు వచ్చు టేమి కతము? నాకది యెఱిఁగింపు కరుణతోడ, ననుచు విదురుండు మైత్రేయు నడిగె ననిన.

7

తా॥ వెళ్ళకుండా ఆ భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు నా ఇంటికి రావడానికి గల కారణం ఏమిటి? దయతో నాకు దానిని తెలుపవలసింద' ని విదురుడు మైత్రేయుణ్ణి కోరాడు.

క. విని వెఱఁగంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతి నిస్తంద్రున్<br>మునికుల జలనిధి చంద్రున్, సునిశిత హరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్.

8

తా॥ ఈ పలుకులకు పరీక్షిన్మహారాజు ఆశ్చర్యాన్ని పొంది శుద్ధమైన మనస్సు కలవాడు, మునికులమనే సముద్రానికి చంద్రునివంటివాడు, గుండెలనిండా హరిభక్తి నింపుకొన్నవాడు అయిన శుకయోగీంద్రుణ్ణి—

క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుం డగు విదురుఁడే రహస్యము లడిగెన్? ముని యేమి చెప్పె? నే పగి, దిని దీర్థము లాడె? నెచటఁ దిరుగుచు నుండెన్?

9

తా॥ చూసి ఈ విధంగా అడిగాడు: "పుణ్యాత్ముడైన విదురుడు మైత్రేయ మహర్షిని ఏ రహస్యాలు అడిగాడు? దానికి ఆ మహాముని ఏమి బదులిచ్చాడు? విదురుడు ఏ విధంగా ఏయే పుణ్యక్షేత్రాలు తిరిగాడు? ఏ తీర్థములందు స్నానమాచరించాడు?

తే. ఇన్ని దెలియంగ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపవే విమలాంతరంగ! ఘన దయాపాంగ! హరిపాద కమలభృంగ!, మహిత గుణసంగ! పాపతమఃపతంగ!

10

తా॥ ఓ మహర్షీ! నువ్వు పవిత్ర హృదయాంతరంగుడవు! నీ చూపులలో దయ ఎల్లప్పుడూ వర్షిస్తూ ఉంటుంది. విష్ణుపాదాలనే పద్మములకు తుమ్మెదలాంటి వాడవు. గొప్ప గుణాలు కలవాడవు. పాపమనే చీకటిని పారద్రోలే సూర్యభగవానుడవు. ఇవన్నీ నాకు తెలియచెప్పి నన్ను రక్షించు."

చ. అనవుఁడు బాదరాయణి ధరాధిపుతో ననుఁ బూరువంశ వ ర్ధన! విను కష్టుఁడైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో ధన ముఖ పుత్రులం గడు ముదంబునఁ బెంపుచుఁ బాండురాజు ద ప్పిన పిదపన్ దదాత్మజులు పెల్కుఱి తన్నని చేర వచ్చినన్.

11

తా॥ అని అడిగేసరికి వ్యాసపుత్రుడైన శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విధంగా అంటున్నాడు: "ఓ పురువంశవర్ధనా! విను, దుష్టుడైన ధృతరాష్ట్రుడు తన కుమారులైన దుర్యోధనాదులను ఎంతో గారాబంతో పెంచాడు. తండ్రి అయిన పాండురాజు మరణించిన పిదప ఆయన కుమారులైన పాండవులు భయంతో ఆయన అండ చేరగా వారిని కూడా చేరదీశాడు.

వ. ఇట్లు వచ్చిన పాండవుల యెడ నసూయా నిమగ్నులై సుయోధనాదులు.

12

తా॥ ఇలా వచ్చిన పాండవులను చూచి సుయోధనాదులు అసూయ చెందారు.

క. పెట్టిరి విషాన్న; మంటం, గట్టిరి ఘనపాశములను; గంగానదిలో
నెట్టిరి; రాజ్యము వెడలం, గొట్టిరి; ధర్మంబు విడిచి కుటిలాత్మకులై.

13

తా॥ ధర్మాన్ని విడిచి కుటిలమైన మనస్సుగలవారై వారికి విషాన్నం పెట్టారు. పెద్ద పెద్ద తాళ్ళతో కట్టారు. గంగా నదిలోకి త్రోసేశారు. రాజ్యం నుండి వెళ్ళగొట్టారు. ఇంకా–

క. క్రూరాత్ము లగుచు లాక్షా, గారంబున వారు నిద్రఁ గైకొని యుండన్ దారుణ శిఖీ దరికొలిపిరి, మారణ కర్మముల కప్రమత్తులు నగుచున్.

14

తా॥ లక్క ఇంట్లో ఒడలు తెలియని స్థితిలో గాఢనిద్రలో ఉండగా కొంతైనా దయలేకుండా క్రూరచిత్తులైన కౌరవులు ఆ ఇంటికి నిప్పు పెట్టారు. వారిని మట్టుపెట్టడానికి ఎన్నో పన్నాగాలు పన్నారు.

తే. సూరిజనగేయ మగు రాజసూయ యజ్ఞ, విలస దవభృథస్నాన పవిత్రమైన ద్రౌపదీ చారు వేణీభరంబు వట్టి, కొలువు లోపల నీడ్చిరి కుత్సితమున.

15

తా॥ ఇంకా... పండితులచే పొగడబడినటువంటి రాజసూయ యాగంలో పూజనీయమైన అవభృథస్నానంచే పవిత్రమైన ద్రౌపదీదేవి యొక్క అందమైన వేణీభరాన్ని పట్టి దుర్మార్గంగా సభలోనికి ఈడ్చి తెచ్చారు.

క. కావున వారల కపకృతిఁ, గావింపని దొక దినంబు గలుగదు, తమ జ న్మావధి నిజనందనులను, వావిరి న య్యంధ నృపతి వలదనఁ డయ్యెన్.

16

తా॥ ఈ విధంగా పాండవులకు అపకారం చెయ్యని రోజు ఒక్కటైనా లేదు. పైగా ఆ గ్రుడ్డిరాజు తన కొడుకులకు ఇది తగనిపని అని చెప్పి వారించలేక పోయాడు.

తే. మాయజూదంబు వన్ని దుర్మార్గవృత్తిఁ, బుడమిఁగొని యడవులకుఁ బోనడువ నచటఁ దిరిగి వారలు సమయంబు దీర్చి యేఁగు, దెంచి తమ యంశ మడిగినఁ బంచి యిడక.

17

తా॥ ఆపై మాయాజూదం పన్ని కౌరవులు దుర్మార్గంగా పాండవుల రాజ్యాన్ని లాక్కొని వారిని అడవులకు వెళ్ళగొట్టారు. వారక్కడ నియమం ప్రకారం పన్నెండు సంవత్సరములు వనవాసము, ఒక యేడాది అజ్ఞాతవాసము చేసి తిరిగి వచ్చి తమకు చెందిన రాజ్యభాగాన్ని అడిగితే ఇవ్వలేదు.

వ. ఉన్న యెడ.

18

చ. సకల నియంత యైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు సే వక నవకల్పకంబు భగవంతుఁ డనంతుఁ డనంతశక్తి నం దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై యకుటిల భక్తి యోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రుపాలికిన్.

19

తా॥ అప్పుడు... సకలమైన లోకాలోకాలకు నియంత అయినవాడు, అందరికీ ఆశ్రయభూతుడు, ఆశ్రయించిన జనులకు దేవ పారిజాతము వంటివాడు, ఆద్యంతాలు

లేనివాడు, అనంతమైన శక్తిగల నందకము అనే ఖడ్గాన్ని ధరించినవాడు, పద్మములవంటి కన్నులు గలవాడు అయిన శ్రీకృష్ణుడు భక్తియోగమునకు అంకితమైన హృదయముగలవాడై ధర్మరాజు కోరికమీరకు ధృతరాష్ట్రుని చెంతకు వెళ్ళాడు.

క. చని యచట భీష్మ గురు త, త్తనయ కృపాచార్య నిఖిల ధాత్రీపతులున్ విని యనుమోదింపఁగ ని, ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా!

20

తా॥ ఓ నరేంద్రా! వెళ్ళి ఆ సభలో ఉన్న భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, కృపాచార్య మరియు రాజులందరు విని సంతోషంతో సమ్మతించేటట్లు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు:

క. కౌరవ పాండవు లిరువురుఁ నారయ నీకొక్క రూప యవనీవర! నీ వే రీతి నైన బాండు కుమారుల పాలొసఁగి తేని మను నుభయంబున్.

21

తా॥ "ఓ మహారాజా! కౌరవ పాండవులిద్దరూ నీకు సమానమే. నువ్వు ఏ విధంగానైనా సరే పాండవులకు న్యాయంగా రావలసిన రాజ్యభాగం వారికిస్తే ఉభయులకు క్షేమదాయకం."

క. అని ధర్మబోధమునఁ బలి, కిన మాటలు చెవుల నిడమిఁ గృష్ణుడు విదురున్ ఘన నీతిమంతుఁ బిలువం, బనిచినఁ జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్.

22

తా॥ అని ధర్మబద్ధంగా చెప్పిన మాటలు కౌరవులు పెడచెవిన పెట్టారు. అప్పుడు శ్రీకృష్ణుడు నీతిశాస్త్ర విశారదుడైన విదురుని పిలువనంపగా ఆయన కురురాజ సభకు వచ్చాడు.

వ. చనుదెంచి యచటి జనంబులచేత నుపస్థితంబైన కార్యంబు దెలుపఁబడిన వాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె.

23

తా॥ అలా కౌరవసభకు వచ్చి, అక్కడి జనము చేత ఆ సభలో అప్పటి వరకు నడిచిన వ్యవహారమంతా తెలుసుకొన్నవాడై ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు:

మ. ధరణీనాయక! పాండు భూవిభుఁడు నీ తమ్ముండు; దత్పుత్త్రులన్ బరిరక్షించిన ధర్మముం దగవునుం బాటిల్లు; వంశంబు సు స్థిర సౌఖ్యోన్నతిఁ జెందు; శత్రుజయమున్ జేకూరు; గోపాల శే ఖరు చిత్తంబును వచ్చు నట్లగుట యోఁ గౌరవ్యవంశాగ్రణీ!

24

తా॥ "ఓ! మహారాజా! పాండురాజు నీ తమ్ముడే గదా! ఆయన కుమారులను రక్షించడం ధర్మము, న్యాయమూ అవుతుంది. అలా చేస్తే నీ వంశం సుస్థిరమైన సుఖసంపదలతో తులతూగుతుంది. శత్రుజయము చేకూరుతుంది. గోపాల కృష్ణుడు మనస్సులో కోరుకునేది కూడ ఇదే.

ఆ. వారి తండ్రి పాలు వారికి నొసఁగి నీ, పాలు సుతుల కెల్లఁ బంచి యిచ్చి చలము విడిచి ధర్మ మలవడ నీ బుద్ధిఁ, జొనుపవయ్య! కులము మనుపవయ్య!

25

తా॥ వారి తండ్రి అయిన పాండురాజు భాగం వారికివ్వు. నీ భాగం నీ కొడుకులకు పంచి ఇవ్వు. ఈర్ష్యను విడిచి ధర్మమార్గంలో నీ బుద్ధిని ప్రవేశపెట్టు. కులాన్ని నిలబెట్టు.

చ. వినుము నృపాల! నా పలుకు; వేయును నేల సమీరసూతి నీ తనయుల పేరు విన్నఁ బదతాడిత దుష్టభుజంగమంబు చా డ్పునఁ గనలొందు! నింతయును మున్నునుఁ జెప్పితిఁ గాదె వాని చే తన భవదీయపుత్త్రులకుఁ దప్పదు మృత్యు వదెన్ని భంగులన్.

26

తా॥ రాజా! నా మాట విను. నీ కొడుకుల పేరు చెవినిపడితే చాలు. ఆ భీమసేనుడు తోకత్రొక్కిన త్రాచులా మండి పడతాడు. ఇదంతా నీకు ముందే చెప్పాను కదా! ఆ భీముని చేతిలో నీ పుత్రులకు మృత్యువు తప్పదు.

వ. అదియునుం గాక,

27

క. నీపుత్రుల శౌర్యంబును, చాపాచా ర్యాపగాత్మజాత కృపభుజా టోపంబును గర్ణుదురా, లాపంబును నిజముగాఁ దలంతె మనమునన్.

28

తా॥ అంతేకాదు రాజా! నీ కన్న కొడుకుల వేగిరపాటుతనము, భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, కృపాచార్యాదుల శౌర్యమును; కర్ణుని యొక్క చెడుమాటలు... ఇవన్నీ నిజములే అని నీ మనస్సులో నమ్ముతున్నావా?

వ. అట్లేని వినుము.

29

ఉ. ఏ పరమేశుచే జగము లీ సచరాచరకోటితో సము ద్దీపిత మయ్యె; నే విభుని దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ రీపతి ముఖ్య దేవముని బృందము; లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం డా పురుషోత్తముండు కరుణాంబుధి గృష్ణుఁడు వో నరేశ్వరా!

30

తా॥ అయితే విను, ఓ రాజా! ఏ పరమేశ్వరుని అనుగ్రహంచేత ఈ చరాచర ప్రపంచం పుట్టిందో; బ్రహ్మదేవుడు, గౌరీపతి, దేవతలు, మునిగణము అంతా ఏ విభుని దివ్యకళాంశల నుండి జన్మించారో, ఎవ్వడు అనంతుడో, అచ్యుతుడెవ్వడో ఆ పురుషోత్తముడే ఈ అంతులేని దయాసముద్రుడు అయిన శ్రీకృష్ణుడు అని గ్రహించు.

ఉ. అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై యిట్టల మైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు వారలన్ జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చును? బార్థివోత్తమా!

31

తా॥ మహారాజా! (అలాంటి శ్రీకృష్ణుడు) అన్ని లోకాలలోను ఉన్నవాడు, మురుడు అనే రాక్షసుణ్ణి సంహరించిన వాడు, సకల ప్రాణులకు లోపల బయట ఉన్నవాడు, ఉత్తమోత్తముడు అయిన శ్రీకృష్ణుడు సఖుడై, వియ్యంకుడై, బాంధవుడై, అన్నిటా గురుడై, ప్రభువై అంతులేని ప్రేమతో పాండవులను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటాడు. అలాంటి వారిని వ్రేలెత్తి చూపడానికి ఎవరికి శక్యం?

ఉ. కావునఁ బాండునందనులఁ గాఱియ పెట్టక రాజ్యభాగమున్ వావిరి నిచ్చి రాజ్యమును వంశముఁ బుత్త్రుల బంధువర్గమున్ గావుము; కాక లోభియగు కష్ట సుయోధను మాట వింటివే భూవర! నీ యుపేక్ష నగుఁబో కులనాశము బంధునాశమున్.

32

తా॥ కనుక నా మాట విను. పాండవులను యాతన పెట్టకుండా వాళ్ళ రాజ్యభాగాన్ని వాళ్ళకిచ్చి దేశాన్ని, వంశాన్ని, పుత్రులను, బంధువర్గాన్ని రక్షించు. అలా కాకుండా లోభి, దుఃఖకారకుడు అయిన ఈ సుయోధనుని మాట వింటే నీకు కులనాశము, బంధునాశము తప్పకుండా జరిగి తీరుతుంది.

తే. ఒకనికై యిట్లు కుల మెల్ల నుక్కడంప, నెత్తుకొనఁ జూచె దిది నీతియే? నృపాల! వినుము నామాట; నీ సుయోధనుని విడిచి, కులము రాజ్యంబుఁ దేజంబు నిలుపవయ్య!

33

తా॥ కేవలం ఒక్కడి కొరకు నీ కులమంతా నాశనం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నావు.

ఇదెక్కడి రాజనీతి? నా మాట విను. ఈ సుయోధనుణ్ణి విడిచి నీ కులాన్ని, రాజ్యాన్ని, పరాక్రమాన్ని నిలబెట్టు."

క. అని యిట్లు దఱిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుండయి తా నినతనయ శకున దుశ్శా, సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్.

34

తా॥ అని ఈ విధంగా నొక్కి మరీ చెప్పాడు విదురుడు. ఆ మాటలు విన్న దుర్యోధనుడు కోపంతో కర్ణుడు, శకుని, దుశ్శాసనుల వైపు చూసి దుష్టత్వంతో ఇలా అన్నాడు:

క. దాసీపుత్త్రుని మీర లు, దాసీనుం జేయ కిటకుఁ దగునె పిలువఁగా?
నాసీనుండై ప్రేలెడు, గాసిలి చెడిపోవ వెడలఁగా నడువుఁ డీఁకన్.

35

తా॥ "దాసీపుత్రుణ్ణి మీరు పట్టించుకోకుండా ఉండాల్సింది. పైగా ఈ సభకు రమ్మని పిలిచారు. వాడిప్పుడు కుదురుగా కూర్చొని నోటికొచ్చినట్లు ప్రేలుతున్నాడు. ఇతన్ని ఇక ఈ సభనుండి గెంటెయ్యండి."

వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబుసేయం గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొండు పలుక నొల్లక శరశరాసనంబులు విడిచి క్రోధంబు నడఁచి వనంబునకు జని యందు,

36

తా॥ ఈ విధంగా దుర్యోధనుడు పలికిన చెడు మాటలకు విదురుని మనస్సు కుతకుతలాడి పోయింది. అయినా కర్తవ్యం గుర్తుకు తెచ్చుకుని, ధైర్యంతో మరొక్క మాటకూడ మాట్లాడకుండా, విల్లంబులు విడిచి, కోపాన్ని తగ్గించుకొని అడవికి వెళ్ళాడు. అక్కడ–

సీ. విష్ణుస్వయంవ్యక్త విమలభూములను బ, విత్రంబులగు హరిక్షేత్రములను నెలకొని దేవతానిర్మిత హరిదివ్య, భూముల గంగాది పుణ్యనదుల సిద్ధపురాణప్రసిద్ధ పుణ్యాశ్రమ, స్థలముల నుపవనస్థలములందు గంధమాదనముఖ క్ష్మాభృత్తటంబుల, మంజులగిరి కుంజ పుంజములను

తే. వికచకైరవ పద్మ హల్లక మరంద, పాన పరవశ మధుకర గాన బుద్ధ రాజహంస విలోల విరాజమాన, మగుచుఁ జెలువొందు పంకేరుహాకరముల.

37

తా॥ విష్ణువు తనంతతానుగా వెలసిన పవిత్ర భూములను, అలాగే పవిత్రమైన హరిక్షేత్రాలను, స్థిరంగా దేవతలచే నిర్మింపబడిన పవిత్ర భూములను, గంగ మొదలైన పుణ్య నదులను, పురాణ ప్రసిద్ధమైన సిద్ధపురుషుల యొక్క ఆశ్రమాలను, ఉపవనాలను, గంధమాదనం మొదలైన కొండచరియలను, అందమైన పొదరింటి సమూహాలను, వికసించిన కలువలలోను, పద్మాలలోను ఉన్న తేనెను కడుపునిండా త్రాగి ఒడలు మరచి కమ్మగా గానం చేస్తూన్న తుమ్మెదల గానానికి మేల్కొన్న రాజహంసల ప్రకాశంతో కన్నుల పండువైన అనేక సరోవరాలను దర్శించాడు.

క. మఱియును ఋష్యాశ్రమ వన, సరి దుపవన నద పుళింద జనపద గిరి గ హ్వర గోష్ఠ యజ్ఞశాలా, పుర దేవాయతన పుణ్యభూముల యందున్.

38

తా॥ ఇంకా... మునుల యొక్క ఆశ్రమాలలో, వనాల్లో, తోటల్లో, బోయ గూడెములలో, కొండగుహల్లో, గోశాలల్లో, యజ్ఞశాలల్లో, పట్టణాలలో ఉండే దేవాలయాలలో, ఇంకా అనేక పుణ్యభూములలో సంచరించాడు.

క. కూరలుఁ గాయలు నీ ళ్ళా, హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం స్కార

శరీరుం డగుచు ను, దారత నవధూతవేషధరుఁడై వరుసన్.

39

తా॥ కూరలు, కాయలు, నీళ్ళు మాత్రమే ఆహారంగా తీసుకొంటూ నియమంతో శరీరానికి ఏ సంస్కారము లేకుండా ఎంతో దయతో అవధూత వేషంతో సంచారం చేశాడు.

క.హర్షము గదురఁగ భారత, వర్షమునం గలుగు పుణ్య వరతీర్థము లు త్కర్షం జూచుచు విగతా, మర్షుండై సంచరించె మనుజవరేణ్యా!

40

వ. ఇట్లు సంచరించుచుఁ బ్రభాస తీర్థమ్మునకు వచ్చునపుడు,

41

తా॥ ఆ విధంగా విదురుడు భారత వర్షంలో ఉన్న పుణ్యతీర్థాలన్నింటిని ఎంతో సంతోషంతో వీక్షిస్తూ, రాగద్వేషమనోమాలిన్య రహితుడై సంచరిస్తూ క్రమంగా ప్రభాస తీర్థానికి చేరుకున్నాడు.

చ. అరుగుచు దైత్యభేదన దయాపరిలబ్ధ సమస్త మేదినీ భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ న త్తఱి విదురుండుఁ తత్సరి దుదంచిత సాల రసాల మాధవీ కురవక మాలతీ వకుళ కుంజ లసత్తట మందు నున్నెడన్.

42

తా॥ అదే సమయంలో శ్రీకృష్ణుని అనుగ్రహం చేత సమకూడిన హస్తినాపుర సామ్రాజ్యాన్ని పరిపాలన చేస్తున్నాడు ధర్మరాజు. అక్కడ మద్దిచెట్లు, మామిడిచెట్లు, మాలతి, పొగడ, గురివింద, ఎర్రగోరింట మొదలైన వృక్షములతోను లతలతోను మనోహరంగా ఉన్న నదీతీరంలో విదురుడు ఉన్న సందర్భంలో—

చ. నరవర! వేణుజానలవినష్ట మహాటవి మాడ్కిఁ బాండు భూ వర! ధృతరాష్ట్ర సూను లనివార్య నిరూఢ విరోధ మెత్తి యొం డొరుల జయింపఁ గోరి కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁడై.

43

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! కౌరవులు, పాండవులు ఎంతమంది చెప్పినా వినకుండా విరోధంతో భయంకరంగా 'మేం నెగ్గుతాం అంటే మేమే నెగ్గుతాం' అనే పట్టుదలతో పోరాడుకున్నారని; ఆ భయంకర పోరాటంలో వెదురు డొంకలలో పుట్టిన దావాగ్నికి నష్టమైన మహాటవి మాదిరిగా దుర్యోధన దుశ్శాసనాది కురుముఖ్యులందరు మరణించారని విని విదురుడు పట్టరాని దుఃఖంలో మునిగి పోయాడు.

ఉ. ఆ యెడఁ గాలు దన్నక రయంబున నేగి సరస్వతీనదీ తోయములందుఁ గ్రుంకి మునితుల్యుఁడు వే చనియెం దనూనపా త్తోయరుహాప్త భార్గవ పృథుత్రిత సోమ సుదాస శక్తి భృ ద్వాయు యమాభిధానయుత వాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్.

44

తా॥ ఇక అక్కడ ఉండటానికి ఆయనకు కాలు నిలువలేదు. ఆ కారణంగా వెంటనే వెళ్ళి సరస్వతీ నదీజలాల్లో మునిగాడు. తిరిగి అగ్ని, సూర్య, శుక్ర, పృథు, త్రిత, సోమ, సుదాస, కుమార, వాయు, యమ ఇత్యాది దేవతానామములతో ప్రశస్తమైన పుణ్యతీర్థాలను ఎంతో అనురక్తితో సేవించాడు.

ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ రమా మండనుఁ డుండు దివ్యరుచిమన్మణి చారుకవాట గేహళీ మండిత సౌధగోపుర విమానము లున్నత భక్తిఁ జూచుచున్ నిండిన వేడ్కఁ గృష్ణపద నీరజ చింతనుడై క్రమంబునన్.

45

తా॥ ఇంకను విదురుడు అనేక పుణ్యభూములను, ఎంతో పవిత్రమైన నదీతీర్థాలను సేవిస్తూ వెళ్ళి రమావల్లభుడైన శ్రీకృష్ణుడు ఉన్నటువంటి దివ్యమైన కాంతులు వెదజల్లే మణులు పొదిగిన తలుపులతో, అలంకరింపబడిన గడపలతో విరాజిల్లుతున్న మేడలను, గోపురాలను, విమానములను ఉన్నతమైన భక్తితో చూస్తూ కృష్ణ పరమాత్మ పాదారవిందాలను మనస్సులో చింతన చేస్తూ ఎంతో కుతూహలంతో ముందుకు కదిలి క్రమంగా....

## విదురుడు ఉద్ధవుణ్ణి చూసి కృష్ణాదుల వృత్తాంతం అడుగుట

చ. చని చని తొంటి మత్స్య కురుజాంగలభూము లతిక్రమించి చ య్యన యమునానదిం గదిసి యచ్చట భాగవతున్ సరోజ లో చన దృఢభక్తు సద్గుణవిశారదు శాంతుని దేవమంత్రి శి ష్యుని మహిత ప్రసిద్ధుఁ బరిశోషితదోషుఁ బ్రబుద్ధు నుద్ధవున్.

46

తా॥ వెళ్ళి వెళ్ళి మత్స్య, కురు, జాంగల భూములను దాటి యమునా నదిని సమీపించి అచ్చట భాగవతుడు, శ్రీకృష్ణ భక్తుడు, మంచి గుణములు కలవాడు, శాంతస్వరూపుడు, దేవతల మంత్రి అయిన బృహస్పతి శిష్యుడు, ప్రసిద్ధుడు, పాపరహితుడు, మూర్తీభవించిన చైతన్యం కలవాడు అయిన ఉద్ధవుణ్ణి చూసాడు.

క. కని యనురాగ వికాసము, దన మనమునఁ దొంగలింపఁ దగ గాఢాలిం గన మాచరించి నెయ్యం, బునఁ గుశల ప్రశ్న సేసి ముదమునఁ బలికెన్.

47

తా॥ మహనీయుడైన ఉద్ధవుణ్ణి చూడగానే విదురుని మనస్సులో ప్రేమ అతిశయించగా గాఢాలింగనం చేసుకొని స్నేహంతో కుశల ప్రశ్నలు వేసి సంతోషంతో ఇలా అన్నాడు:

క. హరిభక్తులు పుణ్యాత్ములు, దురితవిదూరులు విరోధిదుర్దమబలులున్ గురుకుల తిలకులు గుంతీ, వరసూనులు గుశలులే? యవారిత భక్తిన్.

48

తా॥ 'హరిభక్తులు, పుణ్యాత్ములు, పాపరహితులు, శత్రువులకు లొంగనివారు, కురువంశానికి అలంకార ప్రాయమైన వారు అయిన కుంతీపుత్రులు క్షేమంగా ఉన్నారా?

చ. హరి దన నాభిపంకరుహమందు జనించిన యట్టి భారతీ శ్వరుఁ డతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తులై పరఁగ జనించి భూభరముఁ బాపిన భవ్యులు రేవతీందిరా వరు లట శూరసేనుని నివాసమునన్ సుఖ మున్నవారలే?

49

తా॥ శ్రీమహావిష్ణువు తన నాభికమలము నుండి పుట్టినట్టి బ్రహ్మ ఎంతో భక్తితో ప్రార్థింపగా యదువంశంలో శ్రీకృష్ణబలరాములుగా ఉద్భవించి భూభారాన్ని తగ్గించిన మహానుభావులు, రుక్మిణీరేవతుల హృదయాధినాథులు తమ తాతగారైన శూరసేనుని నివాసంలో సుఖంగా ఉన్నారా?

చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడునై తనర్చి సో దర తరుణీజనంబులను దత్పతులం గడు గారవంబునన్ గరుణ దలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు స్థిరమతి నున్నవాఁడె? వసుదేవుఁడు వృష్ణికుల ప్రదీపకా!

50

తా॥ వృష్ణికుల ప్రదీపకా! కురువంశంలో పుట్టిన కౌరవులు, పాండవులు తన్నెంతో ఆదరింపగా చెలికాడై ఆప్తుడై ఎంతో అతిశయంతో సోదరులను, వారి స్త్రీ జనాన్ని, వాళ్ళ పిల్లల్ని ఆప్యాయంగా కన్నపిల్లల కంటే ఎక్కువగా చూసుకొనే వసుదేవుడు స్థిరంగా ఉన్నాడా?

శా. కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి భూదేవతా బృందంబున్ భజియించి తత్కరుణ దీపింపన్ ప్రభావంబు పెం పొందన్ రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్చమూ సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునన్ మించునే?

51

తా॥ మన్మథుని వంటి కుమారుణ్ణి పొందాలని రుక్మిణీదేవి భూసురులను పూజించింది. వారియొక్క కరుణచే ఆమెకు పుట్టిన కుమారుడు ప్రద్యుమ్నుడు సేనాసమూహం తనను

కొలువగా ఎంతో అతిశయంతో ఉన్నాడు గదా!

క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ సమస్త ధరణిపాలన మహిమం
బరమప్రీతి సుఖించునె? చిరవిభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్.

52

తా॥ శ్రీకృష్ణుని యొక్క దయచేత సమకూరిన సమస్తమైన రాజ్యాన్ని పాలిస్తూన్న గొప్పవాడైన ఉగ్రసేనుడు ఎంతో ప్రీతితో సుఖంగా ఉన్నాడు గదా?

చ. లలిత పతివ్రతామణి విలాసవతీ తిలకంబు పార్వతీ లలన గుమారుఁ గన్నటు సులక్షణ జాంబవతీ లలామ ని ర్మలగతిఁ గన్న పట్టి సుకుమారత నుండు విరోధిభంజనో త్కలిక సుఖించునే? గుణకదంబుఁడు సాంబుడు వృష్ణిపుంగవా!

53

తా॥ సుకుమారవతి, ఉత్తమ రమణీమణి, సమస్తమైన సద్గుణాలకు ఆటపట్టు అయిన జాంబవతీదేవి, పార్వతీదేవి కుమార స్వామిని కనినట్లు సాంబున్ని కన్నది. శత్రుసమూహాన్ని చీల్చిచెండాడే పరాక్రమోపేతుడు, వీరాధివీరుడు అయిన సాంబుడు సుఖంగా ఉన్నాడా?

క. హరిపదసేవకుఁ డరి భీ, కరుఁ డర్జును వలన మిగులఁ గార్ముక విద్యల్ దిరముగఁ గఱచిన సాత్యకి, వరసుఖ విభవముల నున్నవాఁడె ధరిత్రిన్?

54

తా॥ శ్రీకృష్ణుణ్ణి సేవించేవాడు, శత్రుభయంకరుడు, అర్జునుని వలన చక్కగా, స్థిరంగా ఉండి విలువిద్య నేర్చిన వాడు అయిన సాత్యకి సుఖముల యొక్క వైభవాలను పొందుతున్నాడా?

మ. జలజాతాంకుశ చక్ర చాప కులిశ చ్ఛత్రాది రేఖాంకితో జ్జ్వల గోవింద పదాబ్జ లక్షిత విరాజన్మార్గ ధూళిచ్ఛటా కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైక ధర్ముండు స

త్కులజాతుండన నొప్పునట్టి ఘనుఁ డక్రూరుండు భద్రాత్ముఁడే?

55

తా॥ గోవిందుని పాదాలు పద్మము, అంకుశము, చక్రము, ధనుస్సు, వజ్రము, ఛత్రము ఇత్యాది శుభరేఖలతో విరాజిల్లుతూ ఉంటాయి. అటువంటి శ్రీపాదముద్రలు ఒప్పే బాటలలోని దుమ్ముపడ్డ మేనుతో పుణ్యుడైన అక్రూరుడు ఆనందంగా ఉన్నాడా? ఏ కోరికలు లేనివాడు, ఏ కోరిక లేకుండ ధర్మాన్ని ఆచరించేవాడు, ఉత్తమకుల సంజాతుడు అయిన ఆ మహనీయునికి క్షేమమే కదా?

క. శ్రుతులును గ్రతుజాతము స, మ్మతిఁ దాల్చినయట్టి వేదమాత గతిన్ శ్రీ పతిఁ దన గర్భమ్మున ర, క్షితుఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే?

56

తా॥ వేదాలను, యజ్ఞయాగాది క్రతువులను తన ఇచ్ఛ చేతనే ధరించిన వేదమాతలా శ్రీమన్నారాయణుణ్ణి తన గర్భంలో ధరించి రక్షించిన ఇల్లాలు దేవకీదేవి సుఖంగా ఉందా?

వ. మఱియు మహాత్మా! మహితోపాసకు లగువారల కోర్కులు నిండింపంజాలిన భగవంతుండును. శబ్దశాస్త్రంబునకుం గారణంబని తన్ను నఖీలదేవతాజనంబు లగ్గింప గల మేటి యగుటంజేసి మనోమయుండును, సకలజీవ చతుర్విధాంతఃకరణంబు లయిన చిత్తాహంకారబుద్ధి మనంబులకుఁ గ్రమంబున వాసుదేవ– సంకర్షణ–ప్రద్యు–మ్నానిరుద్ధు లధిదైవతంబు లగుదు రట్టి చతుర్విధ తత్త్వంబులకుఁ దుర్యంబైన తత్త్వంబునునైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే? యని.

57

తా॥ మహాత్మా! గొప్ప ఉపాసకులైన వాళ్ళ కోరికలు భగవదనుగ్రహం చేత తీరుతూ ఉంటాయి. ఆ భగవంతుడు శబ్దశాస్త్రానికి కారణమని దేవతలందరు శుభం పలుకుతూ

ఉంటారు. ఆ కారణంగా మనోమయుడైన ఆ పరమాత్మ సకల జీవులలోను చతుర్విధ అంతఃకరణ రూపంలో ఉంటాడు. అవి ఏమిటంటే చిత్తము – అహంకారము – బుద్ధి – మనస్సు. ఈ నాలుగింటికి వాసుదేవ – సంకర్షణ – ప్రద్యుమ్న – అనిరుద్ధులు అధిష్ఠాన దైవతములు. అట్టి చతుర్విధ తత్త్వాలకు తురీయమైన (నాలుగింటికి పైది. అలాగని ఐదవది మాత్రం కాదు) అనిరుద్ధ కుమారుడు సంతోషంతో ఉన్నాడా?

మ. ఇతరారాధన మాని కృష్ణుఁ కమలాధీశుం బయోజాస నా ర్చితు, భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ సేవించు పుణ్యుల్ జగ న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము న్నతి సత్యాత్మజచారుధేష్ణగదు లానందాత్ములే? యుద్ధవా!

58

తా॥ ఓ ఉద్ధవా! ఇతర పూజలన్నీ విడిచిపెట్టి బ్రహ్మచే కూడా పూజింపబడేవాడు... అయిన శ్రీకృష్ణ భగవానుణ్ణి తమ రక్షకునిగా భావించి ఎల్లప్పుడు సేవించే పుణ్యులు, ఈ జగత్తులో అందరిచే స్తుతింపబడేవారు, ఆధ్యాత్మవిదులు, గొప్ప పరాక్రమం కలవారు, గౌరవింపతగిన వారు, ఎప్పుడూ ధర్మమార్గంలో సంచరించే వారు అయిన సత్యభామానందనులు చారుధేష్ణగదులు ఆనందంగా ఉన్నారు గదా?

తే. క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు, వొలుచు నెవ్వనిసభఁ జూచి కలుష మొదవి మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె, నట్టి ధర్మజుఁ డున్నాఁడె? యనఘచరిత!

59

తా॥ ఓ పుణ్యచరిత్రా! క్రోధ, మాత్సర్యాలే ధనంగా గల సుయోధనుడు ఎవనిసభ చూసి మనస్సులో అసూయతో మునిగి పోయాడో... ఆ అదృష్టవంతుడు ధర్మరాజు సుఖంగా ఉన్నాడా?

తే. ఘనగదాభ్యాస చిత్ర సంగతుల మెఱసి, కురుకుమారుల భూరి సంగరము లోన హతులఁ గావించి వెలసినయట్టి జెట్టి, వాయుతనయుండు గుశలియై వఱలునయ్య!

60

తా॥ చిత్ర, విచిత్ర, గతులలో నడిచిన గొప్పదైన గదాయుద్ధంలో కౌరవులను మట్టుపెట్టిన మల్లయోధుడైన వాయుతనయుడు... భీముడు కుశలంగా ఉన్నాడా?

చ. హరికరుణాతరంగిత కటాక్ష నిరీక్షణ లబ్ధ శౌర్య వి స్ఫురణఁ దనర్చి తన్ను నని బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్ బరవస మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁ గొన్న శత్రు భీ కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుండునే?

61

తా॥ హరియొక్క కరుణాతరంగాలు పొంగిపొరలే కడగంటి చూపులవలన తనకు సంప్రాప్తించిన శౌర్యాతిశయంతో... ఒక బోయవలె వచ్చి పార్వతీపతి అయిన శంకరుడు తనను ఎదుర్కొన్నప్పటికీ ధైర్యంగా నిలిచి గెలిచి ఆయనను మెప్పించి పాశుపతాస్త్రం పొందిన శత్రుభీకరుడైన అర్జునుడు సుఖసంతోషాలతో ఉన్నాడా?

మ. తెలఁగొప్పన్ జననీ వియోగమునఁ గుంతీ స్తన్యపానంబు సో దర సంరక్షయుఁ గల్గి దేవవిభు వక్త్రస్థామృతంబున్ ఖగే శ్వరుఁ దర్థిం గయికొన్న మాడ్కిఁ గురువంశ శ్రేణి నిర్జించి త ద్ధరణీరాజ్యముఁ గొన్న మాద్రికొడుకుల్ ధన్యాత్ములే? యుద్ధవా!

62

తా॥ తమకు తల్లిలేని కారణంగా కుంతి యొక్క చనుపాలు త్రాగుతూ, సోదర సంరక్షణ కలవారు, ఇంద్రుని యొక్క అధీనంలోగల అమృత కలశాన్ని తన పరాక్రమంతో పొందిన గరుత్మంతునిలా కౌరవులనందరిని జయించి వారి అధీనంలో గల రాజ్యాన్ని జయించిన వారు అయిన మాద్రి కొడుకులు నకులసహదేవులు ఆనందంగా ఉన్నారా?

తే. పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ, డైన శిశువులఁ బ్రోచుటకై నిజేశుఁ గూడి

చనకున్న యట్టి యా కుంతిభోజ, తనయ జీవించునే నేఁడు? మనుచరిత్ర!

63

తా॥ ఓ ఉద్ధవా! ఆనాడు పాండురాజు మరణాన్ని పొందియుండగా కేవలం శిశువులను సంరక్షించటం కొరకే తాను తన భర్తతో పాటు సహగమనం చెయ్యలేదు. అట్టి కుంతీదేవి ఇప్పుడు క్షేమంగా ఉంది గదా?

వ. అని వెండియు.

64

మ. అనుజాతుండగు పాండు భూవిభుఁడు నిర్యాణంబునుం బొంద నా తని పుత్రుల్ దనుఁజేర వచ్చినను మాధ్యస్థంబుఁ బోఁ దట్టి యె గ్గొనరించెన్ ధృతరాష్ట్ర భూమివిభుఁ డట్లూహింపఁగా నెగ్గు సే సిన వాఁడే యగుఁగాక మేలు గలదే? చింతింపఁగా నుద్ధవా!

65

తా॥ తన తమ్ముడైన పాండురాజు మరణాన్ని పొందగా ఆతని కుమారులు తనను చేరారు. అప్పుడు వారికి న్యాయం చెయ్యలేదు సరిగదా కీడే చేశాడు ధృతరాష్ట్రుడు. నిజానికి అపకారమే చేశాడు. ఆ వృద్ధుడు ఇప్పుడెలా ఉన్నాడు?

క. అనుజుఁడు వీఁ డనకయ తన, తనయులు నను వెడల నుడువదా నూరక యుం డిన ధృతరాష్ట్రుఁడు నరకం, బునఁ బడు నాదైన దుఃఖమున ననఘాత్మా!

66

తా॥ అనఘా! తన కొడుకులు నన్ను వెడలగొడితే తాను ఊరకే ఉండిపోయాడు గాని తనకు నేను తమ్ముణ్ణి గాదా! ఒక్క మాటైనా మాట్లాడలేదు. అప్పుడు నేననుభవించిన దుఃఖానికి ప్రతిఫలంగా తప్పక నరకయాతన అనుభవిస్తాడు.

వ. అదియునుం గాక పరమశాంతుండ వైన నీ మనంబున దుఃఖంబు గర్తవ్యంబు గాదంటేని.

67

తా॥ “నువ్వేమో పరమ శాంతుడవు. ఇలా దుఃఖ పడటం కర్తవ్యం కాదు.” అని అంటావేమో!

క. నరలోక విడంబనమున, హరి పరమపరుండు మానవాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా, స్ఫురణన్ మోహింపఁజేయు భూజనకోటిన్.

68

తా॥ పరాత్పరుడైన హరి కేవల మానవాకృతితో ఈ లోకంలో పుట్టి తన మాయాప్రభావంతో మానవులందరిని మోహపెడుతున్నాడు.

ఉ. కావున నమ్మహాత్ముని వికార విదూరుని సర్వమోహ మా యావిల మానసుండ నగు నప్పుడు సంసృతి దుఃఖీ నౌదు న ద్దేవుని సత్కృపామహిమఁ దేలిన వేళ సుఖీంతు నేన కా దా విధి శంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే?

69

తా॥ కావున మహానుభావుడు, మహాత్ముడు, ఎట్టి వికారములు లేనివాడు, అయిన ఆ శ్రీహరి యొక్క మాయావ్యామోహములకు నా మనస్సు లోనైనప్పుడు సంసారంలో చిక్కుకుని దుఃఖాలు పొందుతాను. అలాకాక ఆ పరమేశ్వరుని దయామహిమలో తేలిన వేళ సుఖంగా ఉంటాను. నేనేకాదు, ఆ బ్రహ్మరుద్రాదులు సైతం ఆ విభుని మాయ దాటగలరా!

వ. అయిన నమ్మహాత్ముని కరుణాతరంగి తాపాంగ పరిలబ్ధ విజ్ఞాన దీపాంకుర నిరస్త సమస్త దోషాంధకారుండ నగుటంజేసి మదీయచిత్తంబు హరిపదాయత్తంబయిన కారణంబునను

దత్త్వంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు; మఱియును.

70

తా॥ అయినా ఆ మహానుభావుని కరుణారసంతో కూడిన కడగంటి చూపుల వలన సమకూరిన జ్ఞానమనే దీపకళిక కారణంగా నా దోషాలనే చీకట్లన్ని తొలగి పోయాయి. నా మనస్సు హరియొక్క పాదాలను హత్తుకుని ఉన్న కారణంగా ఆ పరతత్త్వ దర్శనం కోసమే ఎల్లప్పుడూ ఎదురు చూస్తూ ఉంటాను.

సీ. అట్టి సరోజాక్షుఁ డాత్మీయ పదభక్తు, లడవుల నిడుమలఁ గుడుచుచుండ దౌత్యంబుసేయఁ గొందఱు విరోధులు పట్టి, బద్ధునిఁ జేయ సన్నద్ధులైన బలహీనుమాడ్కి మార్పడలేఁడ యసమర్థుఁ, డని తలంచెదవేని నచ్యుతుండు పరుల జయింప నోపక కాదు విద్యాభి, జాత్య ధనమత్తులై జగతిఁ బెక్కు

తే. బాధల నలంచు దుష్టభూపతుల నెల్ల, సైన్య యుక్తంబుగా నని సంహరించు కొఱకు సభలోన నప్పు డా కురుకుమారు, లాడు దుర్భాషణములకు నలుగఁడయ్యె.

71

తా॥ ఆ హరి తనకు ఇష్టులైన భక్తులు (పాండవులు) అడవులలో అనేక కష్టాలు పడుతూంటే వారి నిమిత్తం రాయబారిగా వెళ్ళగా కొందరు విరోధులు కట్టడానికి సన్నద్ధులయ్యారు. అప్పుడు అశక్తుని వలె వారిని వారించలేదు. అసమర్థుడని అనుకుంటే అచ్యుతుడు పరులను జయింపలేక కాదు. విద్య, వంశం, ధనం వీటివలన మత్తులై లోకులను పెక్కు బాధలకు గురిచేస్తున్న దుర్మార్గులైన రాజులనందరిని ససైన్యంగా యుద్ధంలో సంహరించటం కోసమే అప్పుడా కౌరవులాడు దుర్భాషణములకు ఆగ్రహం తెచ్చుకోలేదు.

మ. జననం బందుట లేని యీశ్వరుఁడు దా జన్మించు టెల్లన్ విరో ధి నిరాసార్థము; వీతకర్ముఁడగు న ద్దేవుండు గర్మప్రవ ర్తనుఁ డౌటెల్ల జరాచర ప్రకట భూత శ్రేణులన్ గర్మ వ

ర్తనులం జేయఁ దలంచికాక కలవే? దైత్యారికిం గర్మముల్.

72

తా॥ చావు పుట్టుకలు లేని ఈశ్వరుడు పుడుతున్నాడంటే కేవలం దుర్మార్గులను నాశనం చెయ్యడానికే! కర్మలు లేని దేవుడు కర్మలను చేస్తున్నాడంటే చరాచర జంతుకోటిని కర్మప్రవర్తనులను చెయ్యడానికే! అంతేకాని దైత్యారికి కర్మలున్నాయా?

క. హరి నరుల కెల్లఁ బూజ్యుఁడు, హరి లీలామనుజుఁడును గుణాతీతుఁడునై పరఁగిన భవ కర్మంబులఁ, బొరయం డఁట; హరికిఁ గర్మములు లీల లగున్.

73

తా॥ హరి నరులందరికి పూజనీయుడు. ఆయన లీలామానుష విగ్రహుడు, గుణాతీతుడూను. భవబంధాలు ఆయనకు లేవు. అవి కేవలం ఆయన యొక్క లీలలు మాత్రమే.

క. మదిఁ దన శాసన మిడి నజ, పదములు సేవించు లోకపాలాదుల పెం పొదవింప యదుకులంబున, నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్.

74

తా॥ ఈశ్వర ప్రతినిధులుగా ఉండి పాలన చేస్తూన్నటువంటి వారి అభ్యుదయం కొరకు భూలోకంలో యాదవ వంశంలో బలరామునికి తమ్ముడై శ్రీహరి అవతరించాడు.

తే. చలన మందక భూరి సంసరణ తరణ, మైన సత్కీర్తి దిక్కుల నతిశయిల్లి
వఱల సమమతియై యున్నవాఁడె కృష్ణుఁ, డనుచు నుద్ధవుని విదురుఁ డడుగుటయును.

75

తా॥ ‘ఈ సంసారాన్ని చక్కగా తరింపచేస్తూ, తన యొక్క సత్కీర్తి దిక్కుల వరకు వ్యాపించగా, అందరిని సమబుద్ధితో ఆదరించే ఆ కృష్ణుడు సుఖంగా ఉన్నాడా’ అని విదురుడు

ఉద్ధవుణ్ణి అడిగాడు.

వ. అట్టి యెడ న య్యుద్ధవుండు.

76

క. యదుకులనిధి యగు కృష్ణుని, పద జలజ వియోగ తాప భరమున మాటల్ ప్రిదులక హృదయం బెరియఁగఁ, బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుండెన్.

77

తా॥ వెంటనే... యాదవకులానికి పెన్నిధి అయిన కృష్ణుని పాద కమలాలకు శాశ్వతమైన ఎడబాటు వచ్చిన కారణంగా ఉద్ధవునికి దుఃఖం పొంగి పొర్లింది. నోటి మాట లేదు – పెదవులు తడుపుతూ శోకం వల్ల కాంతిహీనుడయ్యాడు.

క. అని చెప్పి బాదరాయణి, మనుజేంద్రుని వలను సూచి మఱి యిట్లనియెన్ విను మొకనాఁ డీ యుద్ధవుఁ, డనయము నైదేండ్ల బాలుఁడై యున్న తఱిన్.

78

వ. మున్ను కృష్ణునిం గూడి యాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునిఁగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీమతల్లి యగు తల్లి సనుదెంచి “యాఁకొంటి; విదియేల రావన్న” యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండతేజోనిధియైన పుండరీకాక్షు పాదారవింద మకరంద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణ వియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పఁజాలక యొప్పఱి యుండుట యేమి చిత్రంబని వెండియు నిట్లనియె; నంత నుద్ధవుండు సరోజాక్ష పాదారవింద మకరంద సుధాజలనిధి నిమగ్న మానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్తమాత్రంబునకు బాష్పజల పూరితలోచనుండై గద్గదకంఠుం డగుచు.

79

తా॥ ఇంతవరకు చెప్పి శ్రీశుక మహర్షి పరీక్షిత్తుని చూసి ఇలా అన్నాడు: “విను! ఈ ఉద్ధవుడు ఐదేండ్ల బాలుడుగా ఉండగా బాల్యంలో కృష్ణునితో కలిసి ఆడుకొంటూన్న బాలకులలో ఒక బాలుణ్ణి కృష్ణునిగా భావించి సేవలు చేస్తూ ఉండిపోయాడు. సుగుణవతియగు అతని తల్లి వచ్చి ‘భోజనం వేళ అయి చాలా సేపైంది. ఇక ఇంటికి రావయ్యా!’ – అని పిలిచిన ఆమె మాటలు వినిపించుకోక అంతులేని తేజస్సుతో వెలిగిపోతూన్న శ్రీహరి పాదపద్మాలనుండి స్రవిస్తూన్న మకరంద మాధుర్యంలో ఒళ్ళు తెలియని స్థితిలో అలాగే ఉండిపోయాడు. కృష్ణుని విషయంలో ఉద్ధవుని స్థితి అట్టిది. అట్టి ఉద్ధవుడు నేడు కృష్ణుని మరణవార్తను విదురునికి చెప్పలేక ఉపేక్ష వహించి ఉండటంలో ఆశ్చర్యం ఏముంది” – అని తిరిగి శుకుడు ఇలా అన్నాడు: “అప్పుడు ఉద్ధవుని యొక్క మనస్సు శ్రీకృష్ణ పాదారవింద మకరందామృత జలధిలో మునిగి పోయింది. ఒక్క క్షణంపాటు కన్నులు అశ్రువులతో నిండి కంఠం గాద్గదికమైంది.

క. ఘనముగ నెమ్మనమున మిం, చిన కృష్ణవియోగ జనిత శిఖీ దరికొనఁగాఁ గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ, బెనుపొందిన దురిత శిఖరిభిదురున్ విదురున్.

80

వ. కనుంగొని యిట్లనియె.

81

తా॥ శ్రీకృష్ణునితో శాశ్వత వియోగం వల్ల కలిగిన దుఃఖానికి బాధాతప్త హృదయుడైన ఉద్ధవుడు తన చేతులతో కన్నులు తుడుచుకొంటూ పాపాలనే కొండలకు వజ్రాయుధం వంటివాడైన విదురునితో ఇలా అన్నాడు:

క. యముఁడను ఘనకాలభుజం, గమ పుంగవుఁ డెగచి పట్టఁగా యదువంశో త్తము చారిత్రము దత్కుశ, లము లేమని చెప్పుదుం గలంగెడి మనమున్.

82

తా॥ “యమధర్మరాజు అనే గొప్ప కాలభుజంగం ఎగసి పట్టగా యాదవ రాజుల చరిత్ర, వారి యోగక్షేమముల గురించి ఏమని చెప్పేది. మనస్సు కకావికలమై పోయింది.

సీ. మునిజన ముఖపద్మములు ముకుళింపంగ, ఖలజన లోచనోత్పలము లలర జార చోరుల కోర్కి సఫలత నొందంగ, దానవదర్పాంధ తమస మడర వర యోగి జన చక్రవాకంబు లడలంగఁ, గలుషజనానురాగంబు పర్వ భూరి దోషానల స్ఫూర్తి వాటిల్లంగ, నుదిత ధర్మక్రియ లుడిగి యడఁగ

తే. మానుషాకార రుచికోటి మందపఱిచి, యనఘ! యే మన నేర్తుఁ గృష్ణాభిధాన లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి, మించు తేజంబుతో నస్తమించెనయ్య!

83

తా॥ పుణ్యమూర్తీ! విదురా! ఏం చెప్పమంటావు. లోకబాంధవుడూ, ఉత్తమ చరితుడూ, దివ్య తేజోమూర్తి అయిన శ్రీకృష్ణుడు అస్తమించాడయ్యా! అంతా చీకటి మిగిలింది. మునీంద్రుల ముఖపద్మములు ముకుళించాయి. నీచుల యొక్క కన్నులనే కలువలు వికసించాయి. వ్యభిచారులు, చోరుల యొక్క కోర్కెలు ఫలించాయి. దానవుల వంటి వారి గర్వాంధకారాలు లోకాలన్ని వ్యాపించాయి. శ్రేష్ఠమైన యోగులనే చక్రవాకములు విచారించాయి. దుర్మార్గుల యొక్క రాత్రి సంచారం పెరిగింది. గొప్పదైన దోషమనే అగ్ని చుట్టుముట్టింది. ధార్మిక కృత్యాలకు అంతరాయం ఏర్పడింది, మానవుల తేజస్సులు మందగించాయి.

వ. మఱియును.

84

క. హలకులిశ జలజరేఖా, లలిత శ్రీకృష్ణ పాదలక్షితయై ని ర్మలగతి నొప్పెడు ధరణీ, లలనామణి నేఁడభాగ్యలక్షణ యయ్యెన్.

85

తా॥ ఇంకా... నాగలి, వజ్రము, పద్మము మొదలైన రేఖలతో అతి సుకుమారమైన శ్రీకృష్ణ పాదముద్రలతో స్వచ్ఛంగా, మంగళకరంగా ప్రకాశించే భూదేవి తన భాగ్యాన్ని కోల్పోయింది.

క. యాదవుల వలన రాజ్య, శ్రీ దొలఁగెను; ధర్మగతి నశించెను; భువి మ
ర్యాదలు దప్పె నధర్మో, త్పాదనమున; దైత్యభేది దప్పిన పిదపన్.

86

తా॥ దానవాంతకుడైన శ్రీకృష్ణ భగవానుడు తప్పుకున్న వెంటనే యాదవ రాజ్యలక్ష్మి కనుమరుగయింది. ధర్మాచరణ నశించింది. మర్యాదలన్నీ మంటకలిసి పోయాయి. అధర్మం పెచ్చుపెరిగింది.

వ. మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణ కిరణ సుషమా విశేష విడంబిత విమల సలిలం బులందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండల రుచి నిరీక్షించి జలచర బుద్ధిం జేసి తజ్జల విలోలమీనంబు లనూన స్నేహంబునం దలంచు చందంబునఁ గృష్ణానుచరులైన యదు వృష్ణికుమారు లమ్మహనీయ మూర్తిం దమకు నగ్రేసరుం డని కాని లీలామానుష విగ్రహుండైన పరమాత్ముండని యెఱుంగక హరిమాయా జనితంబగు నసద్భావంబునం జేసి భోజన శయనాసనానుగమనంబులం జేరి సహోదరాది భావంబులం గూడి చరియింతు; రద్దేవుని మాయా పయోనిధి నిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైనం దీఱదు. సర్వగుణ గరిష్ఠులును, సత్పురుష శ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్పనేల? అదియునుంగాక యభిజన విద్యాధన బలగర్వ మదాంధీభూత చేతస్కులైన శిశుపాలాది భూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు నని వెండియు.

87

తా॥ అందంగా సానపట్టడం వలన స్ఫుటంగా వెలుగొందే మణుల యొక్క మనస్సును

ఆకర్షించే కాంతిరేఖలవలె; మిలమిల మెరిసే పరిశుభ్రమైన నీటిలో ప్రతిఫలించిన నిండు చందురుని చూసి ఏదో జలచరమనే భ్రాంతితో ఆ నీటిలో ఉండే చేపలు చెలిమితో దాని చుట్టూ తిరుగుతూ స్నేహాన్ని చూపుతాయి. అదే ప్రకారంగా కృష్ణుని యొక్క అనుచరులైన యదు, వృష్ణి వంశములలో జనించిన కుమారులు ఆ మహనీయ మూర్తిని తమకు అగ్రేసరుడని భావించేవారు. కాని కేవలం క్రీడగా మనుష్య రూపాన్ని ధరించిన పరమాత్ముడని ఎఱుగక హరిమాయలో పడి ఆయనతో కలిసి భోజనం చేస్తూ, కూర్చుంటూ, వెనకాలే తిరుగుతూ సామాన్యునిగానే తలపోశారు. ఆ మహానుభావుని మాయలో పడకుండ ఉండటం బ్రహ్మాదులకైన సాధ్యం కాదు. అన్ని మంచిగుణాలు కలవారు, పురుష శ్రేష్ఠులు అయిన పరమభాగవతుల విషయమే అలా ఉంటే తక్కిన వారిగురించి చెప్పేదేముంది? అంతేకాక, ఒక్క విషయం – కులం, విద్య, ధనం, బలం – వీటి గర్వంతో మత్తెక్కి కన్నుగానక సంచరించే శిశుపాలాది రాజులు ఆ మహాత్ముని పరతత్త్వమును తెలుసుకోలేక ఆయనను నిందిస్తూ, కఠినంగా మాట్లాడుతూంటారే... ఆ నిందావాక్యాలు తలచుకొంటే నా మనస్సు క్షోభిస్తోంది.

 మ. అవితృప్తేక్షణ ధీ సమాహిత తపోవ్యాసంగు లైనట్టి భా గవత శ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైక జ్యోతిమైఁ జూపి శో క విశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా నవ రూపంబగు దేహమున్ వదలి యంతర్ధానుఁ డయ్యెం జుమీ.

88

తా॥ రక్షించే వాడిని చూడాలనే బుద్ధితో ఎప్పుడూ తపస్సులో మునిగి ఉండే భాగవతులకు, అఖండ జ్యోతి స్వరూపంగా కనిపించి దుఃఖాన్ని దహించిన హరి మానవరూపాన్ని వదలి అంతర్ధానమయ్యాడు.

సీ. మానవైక వికాసమానమై తనకును, విస్మయజనకమై వెలయునట్టి యాత్మీయ యోగమాయాశక్తిఁ జేపట్టి, చూపుచు నత్యంత సుభగుఁ డమగుచు భూషణంబులకును భూషణంబై వివే, కముల కెల్లను బరాకాష్ఠ యగుచు సకల కల్యాణ సంస్థానమై సత్యమై,

తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి

తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరింప, యమతనూభవు రాజసూయాధ్వరంబు నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ, నిండు వేడుకఁజూచి వర్ణించి రెలమి.

89

తా॥ మానవుల యొక్క వికాసమునకు కారణమై, తనకే ఆశ్చర్యాన్ని కలిగించే తన యోగమాయాశక్తిని చూపిస్తూ, చాలా మనోహరమై, అలంకారములకే అలంకారమై, దేహము–ఆత్మ ఈ రెంటి యొక్క విభేద జ్ఞానం కలిగి, సకల శుభములకు స్థానమై, సత్యమై ప్రకాశించే ఆ దివ్య మంగళమూర్తి తన స్వరూపాన్ని తానే ధరించాడు. ధర్మరాజు యొక్క రాజసూయ యాగంలో కృష్ణభగవానుని దివ్యమంగళ విగ్రహాన్ని కన్నుల పండువుగా అందరూ చూసి ఎంతో సంతోషించారు.

క. ప్రకటముగఁ గమలభవ సృ, ష్టికిఁ గారణ మి మ్మహాత్ముఁడే యనుచును ను త్సుకులై తన్మూర్తినిఁ ద, ప్పక చూచిరి గాదె తత్సభా జను లెల్లన్

90

తా॥ “బ్రహ్మగారి సృష్టికి కారణం ఈ మహాత్ముడే” – అంటూ ఎంతో ఉత్సాహంతో ఆ మహానుభావుణ్ణి సభాసదులంతా రెప్పవేయకుండా చూసి, తరించారు కదా!

వ. మఱియు శాంతోగ్రరూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమాన మానసుండయ్యు ననుకంపాయత్త చిత్తుండై వర్తించు. పరాపరుండును, ప్రకృతికార్యం బైన మహత్తత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును దారువులవలన ననలంబు దోఁచు చందంబున జననంబు నందుచుండు నట్టి సరోజనాభుని హాసరాస లీలానురాగ విలోకన ప్రతిలబ్ధమానలైన గోప కామినులు తన్మూర్తి దర్శనానుషక్త మనీషలం గలిగి వర్తించి రదియునుంగాక.

91

తా॥ కృష్ణ పరమాత్మ కొందరికి శాంత రూపునిగాను, మరికొందరికి ఉగ్రరూపునిగాను వారివారి స్వభావాన్ని అనుసరించి కనిపిస్తాడు. సహజంగా శాంతస్వరూపుడాయన. ఇతరులు చేసిన అపరాధాలకు మనస్సు బాధపడ్డా ఆయన మాత్రం ఎంతో కనికరంతో ఉంటాడు. ప్రకృతికార్యమైన మహత్తత్త్వమే ఆయన స్వరూపం. పుట్టుకలేని వాడైనా కట్టెలనుండి నిప్పు పుట్టునట్లుగా పుడుతూ ఉంటాడు. అటువంటకృష్ణుని మందహాసములకు, రాసక్రీడలకు, అనురాగపూరిత చూడ్కులకు చొక్కిన గోపకాంతలందరు ఆయన లోకోత్తర సౌందర్యదిదృక్షాకాంక్షతో వర్తించారు.

చ. దివిజుల కోర్కెఁ దీర్ప వసుదేవుని యింట జనించి కంస దా నవుఁడు వధించునన్ భయమునం జని నందుని యింట నుంటకున్ యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడలేక సజ్జన స్తవ మథురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింతనొందుదున్.

92

తా॥ అంతేకాక, దేవతల కోరిక మేరకు వసుదేవుని ఇంట్లో పుట్టి, దుర్మార్గుడైన కంసుడు బాధిస్తాడేమో అనే భయంతో నందుని ఇంట్లో పెరగటం... కాలయవనుడు, జరాసంధాదులకు యుద్ధంలో ఎదురుగా వెళ్ళలేక ఎంతో అందమైన మథురా పట్టణాన్ని విడిచి తానెక్కడో రహస్యంగా దాక్కోవడము... ఈ విషయాలు గుర్తుకొచ్చినప్పుడల్లా నా మనస్సు చింతాగ్రస్తమవుతుంది.

వ. అదియునుంగాక.

93

సీ. కడఁగి పెక్కిడుమలఁ గుడుచుచుఁ జిత్తముల్, గలఁగఁగ బంధనాగారములను వనరిన దేవకీవసుదేవులను డాయఁ, జనుదెంచి భక్తి వందన మొనర్చి తలిదండ్రులార! యేఁ

గలుగంగ మీరలు, కంసుచే నలజడి గ్రాఁగుచుండఁ గడఁగి శత్రునిఁ జంపఁగా లేక చూచుచు, నున్న నా తప్పుఁ బ్రసన్ను లగుచుఁ

తే. గావుఁడని యానతిచ్చిన దేవదేవు, నద్భుతావహ మధుర వాక్యములఁ దలఁచి తలఁచి నా చిత్తమునఁ బెద్ద గలఁగుచుందుఁ, బృథులపాతక భూమిభృద్భిదుర! విదుర!

94

తా॥ అంతే కాదు! వజ్రాయుధం కొండలను పిండిచేసినట్లు గొప్ప పాపాలను నాశనం చేసే విదురా! విను! చిత్తమంతా కలచివేసేటట్లు కారాగారంలో బాధపడుతూన్న దేవకీ వసుదేవుల దగ్గరకు వెళ్ళి శ్రీకృష్ణుడు వారికి భక్తితో నమస్కారం చేసి “తల్లిదండ్రులారా! మీ కుమారుడనైన నేనుండగా మీరు కంసుని వలన బాధలు పడవలసి వచ్చింది. శత్రువుని చంపి మిమ్ములను రక్షించే ప్రయత్నం చెయ్యకుండ ఊరకే చూస్తూ ఉన్న నా తప్పు దయతో మన్నించండి” అని వేడుకొన్నాడు. ఆ దేవదేవుని కమ్మని మాటలు గుర్తుకొచ్చినప్పుడల్లా నా మనస్సు ఎంతో బాధపడుతూ ఉంటుందయ్యా!

క. విమలమతిఁ దలఁప నెవ్వని, బొమముడి మాత్రమున నిఖిల భూదేవీ భా రము వాయు నట్టి హరిపద, కమల మరందంబు గ్రోలు ఘనుఁడెవ్వాఁడో?

95

తా॥ నిజానికి ఎవని కనుబొమలు ఒకసారి ముడి పడినంత మాత్రమున మొత్తం భూమండలం మీదనున్న దుష్టులంతా నశిస్తారో... అట్టి శ్రీహరి పాదకమలముల యొక్క మకరందాన్ని అనుభవించే అదృష్టవంతుడు ఎవ్వడో కదా?

క. మందప్రజ్ఞుఁడనై గో, విందుని మురదైత్యహరునిఁ విష్ణునిఁ బరమా నందుని నందతనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్.

96

తా॥ ఆ గోవిందుణ్ణి, మురాసురుణ్ణి సంహరించి లోకాలకు మేలు చేసిన వాడిని, ఆ విష్ణుస్వరూపుణ్ణి, నిత్యము సంతోషంతో ఉండే వాడిని, నందకుమారుణ్ణి, మందర పర్వతాన్ని ఎత్తినవాణ్ణి నా మనస్సులో ఎప్పుడైనా మరచిపోయేటంత మూర్ఖుడినా నేను!

చ. అదియునుఁ గాక మీరు నృపులందఱుఁ జూడఁగ ధర్మసూతి పెం పొదవిన రాజసూయ సవనోత్సవ మందును జన్మమాదిగాఁ బదపడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద ట్టి దని యెఱుంగ నోపని కడింది పదంబున నొందెనే కదా!

97

తా॥ మరో విషయం – తాను పుట్టినప్పటి నుండి ఎన్నో అపకారాలు చేసినవాడు కదా శిశుపాలుడు. అట్టి శిశుపాలుడు, మీరు, సమస్తమైన రాజసమూహం అంతా చూస్తూ ఉండగా ధర్మరాజు ఎంతో గౌరవంతో, మహత్త్వంతో చేసిన రాజసూయాధ్వర మహోత్సవంలో, మహాయోగులు సైతం ఎరగనటువంటి అధికమైన పరమపదాన్ని పొందాడు కదా!

చ. కురునృప పాండు నందను లకుంఠితకేళిఁ జమూ సమేతులై యరిగి రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో త్కరములఁ గ్రోలి పార్థ విశిఖప్రకర క్షత పూతగాత్రులై గురుతర మోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో గదా!

98

తా॥ కౌరవులు, పాండవులు తిరుగులేని పరాక్రమంతో తమ తమ సైన్యాలతో కదన రంగానికి కదలి వెళ్ళారు. కృష్ణుని ముఖపద్మామృతాన్ని ఆత్మలో ఆస్వాదిస్తూ పార్థుని యొక్క శరపరంపరా ఘాతముల వల్ల ఏర్పడిన గాయాలతో పరమ పవిత్రులై కురువీరులు ఉన్నతమైన మోక్షసామ్రాజ్యాన్ని పొందారు గదా!

సీ. అట్టి సరోజాక్షుఁ డాద్యంత శూన్యుండు, సుభగుండు త్రైలోక్య సుందరుండు కమనీయ సాగర కన్యకా కుచకుంకు, మాంకిత విపుల బాహాంతరుండు సకల దిక్పాల

భాస్వత్కిరీటన్యస్త, పద్మరాగారుణ పాదపీఠుఁ డజుఁ డనంతుఁడు సమానాధిక విరహితుం డిద్ధమూర్తి త్రయాధీశ్వరుండు

తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య, రుచిర సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి భృత్యభావంబు నొంది సంప్రీతి నతని, పనుపు సేయుట కెపుడు నా మనము గుందు,

99

తా॥ అట్టి సరోజాక్షుడు, ఆది–అంతములు లేనివాడు, మనోహరుడు, మూడు లోకాలలోను సుందరుడు, అందములు చిందే లక్ష్మీదేవి చనుదోయి కుంకుమకు అంకితమైన విశాల వక్షఃస్థలం కలవాడు, దిక్పాలకుల కాంతులు వెదజల్లే కమనీయ కాంచన కిరీటాలలోని పద్మరాగముల వలన ఎరుపెక్కిన పాదములు కలవాడు, చావు పుట్టుకలు లేనివాడు, అసామాన్యుడు, త్రిమూర్తులకు ఆశ్రయ భూతుడు అయిన శ్రీకృష్ణ భగవానుడు కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుణ్ణి సింహాసనం మీద ఆసీనుణ్ణి చేసి తాను సేవకుడై అతడు చెప్పిన పని చేయటం తలచుకున్నప్పుడల్లా నా మనస్సు బాధపడుతూ ఉంటుంది.”

వ. అని వెండియు నిట్లనియె. అనఘా! పరాత్పరుండును యోగేశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమభాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబు కాదు; తన్ను హరియింపఁదలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని పదంబు గారుణ్యాయత్తచిత్తుండై యొసంగె ననిన నిజపద ధ్యానపరాయణు లగు వారల ననుసరించి సేవించుట సెప్పనేల? యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె; భక్తవత్సలుండును గారుణ్యజలనిధియునై భాగవత జనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాస లోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱం గెఱింగింపు మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె.

తా॥ అని ఇంకా ఇలా అన్నాడు: "ఓ పుణ్యమూర్తీ! శ్రేష్ఠులలో శ్రేష్ఠుడు, యోగులకు ప్రభువు అయిన శ్రీకృష్ణుడు; భక్తుడు, పరమ భాగవతుడు అయిన ఉగ్రసేనుణ్ణి సేవించటం ఆశ్చర్యం కాదు. చనుబాలు త్రావించి పెంచిన యశోదాదేవికి సైతం అందరాని స్థితిని; కరుణతో, తనను చంపటంకోసం స్తనములకు విషం పూసుకొని స్తన్యపానం చేయించిన పూతనకు కలిగించాడు. ఇక తన పాదపద్మాలను నిరంతరము సేవించు భక్తుల విషయం చెప్పేదేముంది?"

ఇంతవరకు చెప్పిన ఉద్ధవునితో విదురుడు ఇలా అన్నాడు: "భక్తవత్సలుడు, కరుణాసముద్రుడు, భాగవతులను రక్షించే వాడు అయిన పుండరీకాక్షుడు తనను నిత్యమూ సేవించే వారికిచ్చే పరమపదాన్ని ఉగ్రపాపములను చేసే రాక్షసులకు ఎలా ఇచ్చాడు? నాకు చెప్పండి" అప్పుడు విదురునితో ఉద్ధవుడిలా అన్నాడు:

మ. దనుజానీక మనేక వారములు దోర్దర్పంబు సంధిల్లఁగా వినతాసూను భుజావరోహుఁడగు నవ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా రనిలో మార్కొని పోకు పోకు హరి! దైత్యారాతి యంచుం దదా ననముం జూచుచుఁ గూలి మోక్షపదమున్ బ్రాపింతు రత్యున్నతిన్.

101

తా॥ "రాక్షసులు అనేక సార్లు భుజపరాక్రమంతో గరుడవాహనారూఢుడైన ఆ విష్ణువునే యుద్ధంలో ఎదుర్కొని "పోకు! పోకు! హరీ! నిలు! నిలు!" అంటూ ఆ హరి ముఖాన్నే చూస్తూ యుద్ధరంగంలో కూలి మోక్ష సామ్రాజ్యాన్ని పొందుతున్నారయ్యా!

క. ధీరజనోత్తమ! నవ సిత, సారసలోచనుఁడు కృష్ణు జననంబును ద చ్చారిత్రము నెఱిఁగింతు ను, దారత నీ విపుడు వినుము తద్విధ మెల్లన్.

102

తా॥ ధీరవరేణ్యా! అప్పుడే వికసించిన తెల్లని తామర రేకులవంటి కన్నులు గల కృష్ణుని

పుట్టుకతో సహా ఆయన జన్మవృత్తాంతాన్ని నీకు వెల్లడిస్తాను. సావధాన మనస్కుడవై విను.

చ. ధరణిభరంబుఁ బాపుటకుఁ దామరసాసను ప్రార్థనన్ రమా వరుఁ డల కంసబంధన నివాసమునన్ వసుదేవ దేవకీ వరులకు నుద్భవింప బలవంతుఁడు కంసుఁడు హింస సేయు న న్వెఱపున నర్ధరాత్రి సుతునిం గొని యవ్వసుదేవుఁ డిమ్ములన్.

103

తా॥ భూభారాన్ని తగ్గించడానికి బ్రహ్మగారి యొక్క ప్రార్థనను ఆ రమాకాంతుడాలకించి, కంసుని వలన బంధింపబడిన దేవకీవసుదేవులకు కారాగారంలో కుమారుడై జన్మించాడు. తన కొడుకును కంసుడు చంపివేస్తాడనే భయంతో పుట్టిన వెంటనే అర్ధరాత్రి కుమారుణ్ణి తీసుకుని వసుదేవుడు బయలుదేరాడు.

క. నందుని మందకుఁ జని త, త్సుందరి తల్పమునఁ బరులు సూడకయుండన్ నందనుని నునిచి యానక, దుందుభి మఱలంగ నేఁగెఁ దొల్లిటి పురికిన్.

104

తా॥ నందుని మందకు వెళ్ళి, ఆయన భార్య అయిన యశోద పక్కలో ఎవరూ చూడకుండా పడుకోపెట్టి తిరిగి మథురలో తన కారాగారానికి వచ్చి చేరాడు.

క. హరి యేకాదశ సంవ, త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె వ్వరు నెఱుఁగకుండ నా హల, ధరుతోఁ గ్రీడించుచుండెఁ దద్దయుఁ బ్రీతిన్.

105

తా॥ బాలగోపాలుడు అలా పదకొండు సంవత్సరాలు నందుని గోకులంలో తను హరి యొక్క అవతారమని ఎవరు ఎఱుగకుండ బలరామునితో ఎంతో ప్రీతితో గడిపాడు.

క. గోపాల వరుల కైనను, నాపోవఁగఁ దన సమంచితాకార మొగిం జూపని శ్రీపతి వేడుక,

గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్.

106

తా॥ ఉత్తములైన మహారాజులకు సైతం తనివితీరునట్లుగా తన దివ్య మంగళ విగ్రహాన్ని చూపని శ్రీపతి ఎంతో సంతోషంతో ఆవులను, దూడలను సంరక్షించాడు.

వ. అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు దోడి గోపాలబాలురకుం జూపం దలంచి.

107

తా॥ ఆ సమయంలో కృష్ణపరమాత్మ తన లీలలను, వినోదములను తోటి గోపాల బాలకులకు చూపాలని అనుకున్నాడు.

చ. వరయమునా నదీ సలిల వర్ధిత సౌరభయుక్తపుష్ప మే దుర మకరంద పాన పరితుష్ట మధువ్రత యూథ మాధవీ కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా పరభృత రాజకీరమృదుభాషలభంగిఁ జెలంగి పల్కుచున్.

108

తా॥ స్వచ్ఛమైన యమునానదీ జలాలతో చక్కగా ఎదిగినవి, సువాసనలు వెదజల్లుతున్న పుష్పములనిండుగా యున్న తేనెను గ్రోలి మత్తెక్కిన తుమ్మెదల ఝుంకారంతో కూడినవి అయిన మాధవీ – గోరింట – మొల్ల – మంచి గంధపు పొదలలో దూరి నెమలిలాగ కేకలువేస్తూ, గోరువంక వలె కూతలు కూస్తూ, కోకిలలవలె ధ్వనులు చేస్తూ, రామచిలుకలవలె మృదువుగా పలుకుతూ ఉండేవాడు.

ఉ. శ్రీరమణీ మనోవిభుఁడు సింహ కిశోరముఁ బోలి లీలఁ గౌ మారదశన్ రమా విమల మందిరముం బురుడించు గోతతిన్ వారక మేపు చుండెఁ దన వంశ రవస్ఫుట మాధురీ

సుధా సారముచేత గోపజన సంఘములన్ ముదమందఁ జేయుచున్.

109

తా॥ శ్రీ లక్ష్మీదేవి యొక్క మనోహరుడైన ఆ నందనందనుడు కౌమార దశలో సింహపుపిల్లలా ఉంటూ, అత్యంత మనోహరంగా వేణునాదాన్ని పలికిస్తూ తన తియ్యని అమృతగానంచేత గోవుల్ని, గోపబృందాన్ని సంతోషింపచేస్తూ ఉండేవాడు.

వ. మఱియును.

110

మ. చిరకేళీరతి బాలకుల్ తృణములన్ సింహాది రూపంబులన్ గరమొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునన్ గరుణాతీతులు కామరూపు లగు నక్కంసప్రయుక్తక్షపా చరులం గృష్ణుఁడు సంగరస్థలములన్ జక్కాడె లీలాగతిన్.

111

తా॥ చిన్నప్పుడు ఆడుకొనేటప్పుడు బాలకులు గడ్డితో సింహాలు మొదలైన రూపములతో బొమ్మలను తయారు చేసి ఆట అయిపోగానే వాటిని చించి తుంచి పారేస్తారు. అదే విధంగా కరుణలేనివారు, కామరూపధరులు అయిన కంసుని యొక్క రాక్షసవీరుల్ని సులువుగా మట్టుపెట్టాడు... కృష్ణుడు.

చ. వర యమునా నదీ జల నివాస మహోరగ విస్తృతాస్య వి స్ఫురిత విషానల ప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో త్కరముల నెల్ల గాచి భుజగప్రవరున్ వెడలంగఁ దోలి త త్సరి దమలాంబు పానమున సంతస మందఁగఁ జేసె గోతతిన్.

112

తా॥ తియ్యని యమునా నదీజలాల్లో నివాసమున్నటువంటి భయంకరమైన సర్పం

యొక్క ముఖం నుండి వచ్చేటటువంటి విషపుమంటలకు గోవులు, గోపాలకులు తాళలేక పోతూంటే; అది గమనించిన కృష్ణుడు ఆ మహాసర్పాన్ని శిక్షించి, నదిలోనుండి వెళ్ళగొట్టి మధుర జలాలను అందరకు త్రాగే అవకాశాన్ని కల్పించాడు. ఆ విధంగా అందరికీ ఆనందకారకుడయ్యాడు.

మ. దివిజాధీశు గుఱించి వానకొఱకై దీపింప నందాది వ ల్లవు లే టేఁట ననూన సంపదల నుల్లాసంబునం జేయు ను త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతినొందన్ శచీ ధవు గర్వం బడఁపంగ నవ్యయముగాఁ దాఁజేసె గోయాగమున్.

113

తా॥ ప్రతి సంవత్సరము వర్షాలు బాగా కురియటం కోసం నందాది యాదవులు ఇంద్రుణ్ణి ఉద్దేశించి ఎంతో వైభవంగా జరిపే ఉత్సవాన్ని కృష్ణుడు మాన్పించాడు. గోవులు, గోపాలకులు సంతోషించేటట్లు, ఇంద్రుని గర్వం అణగేటట్లు అంతకంటే తక్కువ వ్యయంతో గోపూజను ఎక్కువ వైభవంగా జరిపించాడు.

చ. హరిహయుఁ డంత రోషవివశావిల మానసుఁడై సరోరుహో దరు మహిమం బెఱుంగక మదం బడరంగ వలాహకాది భీ కరఘన పంక్తిఁ బంపిన నఖండ శిలామయభూరి వర్షముల్ గురిసె ననూన గర్జనల గోకుల మాకుల మౌచుఁ గుందఁగన్.

114

తా॥ ఇంద్రుడు సైతం వనజనాభుని మహత్త్వాన్ని తెలుసుకోలేక ఆగ్రహోదగ్రుడై, అహంకారంతో “వలాహకం” మొదలైన భీకరమైన మేఘాల్ని పంపితే పిడుగులతో ఆ కారుమబ్బులు గోకులమంతా ఆకులమౌనట్లుగా పెద్దపెద్ద ఉరుములతో ఆగకుండ రాళ్ళవర్షం పడలేదా!

ఉ. ఆతటి మంద కొండలము నందఁగ వల్లవులెల్లఁ గృష్ణ యీ చేతను లెల్ల నిట్టి జడిఁ

జిందఱ వందఱలై కలంగుచుం గాతరులైరి నీవు కృపఁ గావుము కావు మనాథనాథ! ని
ర్ధూతకళంక! భక్తపరితోషణ భూషణ! పాప శోషణా!

115

తా॥ ఆ తరుణంలో రేపల్లెలోని గోవులు, గోపాలురూ అందరూ కూడా ఆ వర్షానికి దిక్కుతోచక కలతపడి, చిందర వందరై ఒకచోట చేరి “కృష్ణా! అనాథ నాథా! ఏ తొట్రుపాటు లేనివాడా! పాపులను శిక్షించి, భక్తులను రక్షించేవాడా! దయతో రక్షించు!”

మ. అని యిబ్బంగి విపన్నులై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స జ్జన వర్ధిష్ణుఁడు గోప గో
నివహ రక్షా దక్షుఁడై దేవతా జను లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్రంబుగాఁ దాల్చె బో
రన గోవర్ధన శైలమున్ దటచరద్రమ్యామరీజాలమున్.

116

తా॥ అని ఈ ప్రకారంగా గోపాలకులందరు ఆపదలో చిక్కుకొని ప్రార్థింపగా వారి దీనాలాపములను ఆలకించి దేవతలందరు స్తుతించారు. అప్పుడు కృష్ణుడు చక్కని దేవతాస్త్రీలు విహరించే కొండచరియలుగల గోవర్ధన పర్వతాన్ని ఒక్క చేతితో ఎత్తి గోవులను, గోపాలకులను రక్షించడానికి నడుం కట్టాడు. ఆ దృశ్యాన్ని చూసి దేవతాజనులందరు ‘భళి! భళి!’ అని ప్రశంసించారు.

వ. వెండియు.

117

సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా, చంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు వెలయు
బృందాటవీ వీథియం దొకనాఁడు, రాసకేళీ మహోల్లాసుఁ డగుచు రుచిర సౌభాగ్యతారుణ్య
మనోరమ స్ఫూర్తిఁ, జెన్నొందిన మూర్తి దనర సలలిత ముఖచంద్ర చంద్రికల్ గోపికా,
నయనోత్పలముల కానంద మొసఁగ

తే. భవ్య చాతుర్య భంగిఁ ద్రిభంగి యగుచు, నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁబూరించు వర మురళీ నినాద, మర్థి వీతేర విని మోహితాత్మ లగుచు.

118

తా॥ పున్నమినాటి చందమామ వెన్నెల శరత్కాలంలో మరింత ప్రకాశవంతంగా ఉంది. కృష్ణునకు రాసకేళిపై మహోల్లాసం కలిగింది. మహోజ్జ్వలమైన రూపంతో, అప్పుడే వికసిస్తూన్న యౌవనంతో లోకాలను మోహింపచేసే అందమైన తన ముఖచంద్రకాంతులు గోపకాంతల కనుకలువలకు ఆనందాన్ని కలిగిస్తూండగా వారందరు మైమరచిపోగా 'త్రిభంగి' గా నిలబడి వీనులవిందుగా వేణునాదం కావించాడు.

చ. పతులు మఱందులున్ సుతులు బావలు నత్తలు మామలున్ సము న్నతి వలదన్న మానక
మనంబునఁ గృష్ణపదాబ్జ సేవనా న్వితరతి గోప కామినులు వే చనుదేర దయాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీ నవపుష్పచాపుఁడై.

119

తా॥ తమ భర్తలు, మఱుదులు, కొడుకులు, బావలు, అత్తలు, మామలు వెళ్ళవద్దని ఎంతగా బ్రతిమాలుకున్నా వినుపించుకోకుండా శ్రీకృష్ణుని చరణకమలాలను సేవించాలనే కోరికతో పరుగు పరుగున వచ్చిన గోపికలను దయాసముద్రుడైన ఆయన వారందరితో రాసకేళి సలిపి బ్రహ్మానందంలో ముంచెత్తాడు.

ఉ. రాముఁడు దానుగూడి మథురాపురికిం జని యందు వైభవో ద్దామనృపాసనంబున
ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లినిఁ
దండ్రి నంచిత శ్రీమహితాత్ములై తనరఁజేసె సరోరుహనాభుఁ దున్నతిన్.

120

తా॥ ఆపై... అన్నగారైన బలరామునితో కూడి మధురా పట్టణానికి వెళ్ళి అక్కడ ఎంతో

వైభవంతో మదంతో సింహాసనం మీద కూర్చున్న దురాత్ముడైన కంసుణ్ణి సంహరించి తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను అపార భోగభాగ్యాలతో సంతోషపెట్టాడు.

మ. నలువొప్పంగ షడంగయుక్త మహితామ్నాయంబు చౌషష్టి వి ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలువొందన్ విన్న మాత్రంబు లో పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు ల్గలరే లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్.

121

తా॥ షడంగాలతో కూడిన వేదాల్ని, అరవైనాలుగు కళలను తనగురువు అయిన 'సాందీపని' వద్ద ఒక్కసారి విన్నమాత్రంచేతనే అభ్యసించాడు. నిజానికి లోకాన్ని భ్రమింపచెయ్యటం కోసమేకాని ఆ మేటి పురుషునికి, ఆ పరాత్పరునికి పరులు గురువులా!

ఉ. మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొందిపోయి యా పంచజనోదరస్థుఁడగు బాలకు దేశికనందనుం బ్రభో దంచిత లీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తి యుక్తి న ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్.

122

తా॥ ఒకనాడు తన గురుపుత్రుణ్ణి పంచజనుడనే రాక్షసుడు పొట్టనపెట్టుకున్నాడు. అట్టి సమయంలో ఆ గురుబాలుణ్ణి బ్రతికించి తెచ్చి శ్రీకృష్ణుడు తన గురువుగారికి గురుదక్షిణగా ఇచ్చాడు.

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డనఁనొప్పు భీష్మకు, వరసుతామణి నవవారిజాక్షిఁ బద్మా సమాన రూపశ్రీ విభాసితఁ, గమనీయభూషణఁ గంబుకంఠిఁ జతురస్వయంవరోత్సవ సమాగత చైద్య, సాల్వ మాగధ ముఖ్య జనవరేణ్య నికర సమావృతఁ బ్రకట సచ్చారిత్ర, రుక్మిణి నసమాన రుక్మ కాంతి

తే. నమరగుప్తామృతంబు విహంగ విభుఁడు, గొనిన కైవడి మనుజేంద్ర కోటిఁ దోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ, దెచ్చి వరియించె నతని నుతింప వశమె !

123

తా॥ విదర్భదేశానికి రాజు భీష్మకుడు. ఆయన గారాపు కూతురు రుక్మిణి. తామరరేకుల వంటి కన్నులు, శంఖం వంటి కంఠం, కుందనపు మేని ఛాయ, సాక్షాత్తు మహాలక్ష్మి వంటి మంగళరూపిణి. ఆమెకు స్వయంవరాన్ని ప్రకటిస్తే ఆ మహోత్సవానికి శిశుపాలుడు, సాల్వుడు, జరాసంధుడు ఇత్యాది మహారాజులు వచ్చారు. దేవతల చేత రక్షింపబడుతూన్న అమృతభాండాన్ని ఖగరాజైన గరుత్మంతుడు పట్టుకుపోయిన విధంగా, అడ్డువచ్చిన వాళ్ళను పారద్రోలి తన భుజపరాక్రమాన్ని ప్రదర్శించి రుక్మిణీదేవిని వివాహం చేసుకున్నాడు కృష్ణుడు. ఆయన బాహుబలాన్ని ఏమని పొగడగలం!

చ. పరువడి బట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దద్బల స్ఫురణ సహింపఁజాలక
నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి ద్ధరణిపు నందనన్ వికచ తామరసాక్షిఁ బ్రమోదియై
స్వయం వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్.

124

తా॥ అంతేకాదు. ఏడు పొగరుబోతులైన ఆబోతుల ధాటికి నిలువలేక రాజులంతా పలాయనమంత్రం పఠిస్తుంటే శ్రీకృష్ణుడు మాత్రం ఎదురు నిలిచి తన శక్తితో వాటిని లొంగదీసుకున్నాడు. ఆపైన వికసించిన తామరరేకుల వంటి కన్నులుగల రాకుమారి నాగ్నజిత్తిని గుణవంతుడు, అపార శక్తిసంపన్నుడు అయిన నందనందనుడు స్వయంవరములో వివాహం చేసుకొన్నాడు.

మ. ప్రతివీర క్షయకారి నాఁబరఁగి సత్రాజిత్తనూజా హృ దీ ప్సితముం దీర్పఁ దలంచి
నాకమునకున్ బెంపారఁగా నేఁగి వ ర్ణిత శౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె

ను ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁడన నేతన్మాత్రుఁడే చూడఁగన్.

125

తా॥ శత్రురాజులకు సింహస్వప్నంగా పేరుగన్న కృష్ణుడు సత్యభామ హృదయంలోని కోర్కెను తీర్చడం కొరకు స్వర్గానికేగి దేవేంద్రుని జయించి దేవపారిజాతాన్ని ఈ భూమిమీదకు తెచ్చాడు.

సీ. మానితాఖిల జగన్మయ దేహమునఁ బొల్చు, ధరణిదేవికిఁ బ్రియతనయుఁడైన నరక దానవుని సునాభాఖ్యఁ జెన్నొందు, ఘన చక్రధారా విఖండితోత్త మాంగునిఁ జేయ నయ్యవనీ లలామంబు, వేఁడినఁ దత్పుత్ర విపుల రాజ్య పదమున నిల్పి లోపలి మందిరంబులఁ, జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి

తే. నట్టి కన్యలు నూఱుఁ బదాఱువేలు, నార్త బంధువుఁడైన పద్మాక్షుఁ జూచి హర్ష బాష్పంబు ధారాప్రవర్ష మొదవఁ, బంచశర బాణ నిర్భిన్న భావ లగుచు.

126

తా॥ ఈ జగత్తు అనే దేహాన్ని ధరించిన భూదేవికి ఇష్టుడైన కుమారుడు నరకాసురుడు. అయినా అతడు తన రాక్షసగుణములతో అనేక అకృత్యములు గావించాడు. కృష్ణుడు 'సునాభము' అనే పేరుగల చక్రము యొక్క అంచుతో అతని శిరస్సు ఖండించాడు. అవనీలలామ ప్రార్థించినప్పుడు నరకాసురుని కుమారుణ్ణి విశాల సామ్రాజ్యానికి అధిపతిగా నిలిపి; నరకుడు చెఱపట్టిన పదారువేల నూర్గురు కన్యలను విముక్తులను చేశాడు. వాళ్ళందరూ ఆర్తులకు బంధువుడైన కృష్ణుణ్ణి చూచి సంతోషంతో కన్నీరొదవ మన్మథబాణములచే పీడితలై ఆయనపట్ల ఆకర్షితులైనారు.

చ. లలిత తదీయ సుందర విలాస విమోహిత లైన వారి నిం పొలసిన కోర్కెఁ దీర్చుటకు నొక్క ముహూర్తమునన్ వరించి క న్యల లలితావరోధ భవనంబుల నందఱ కన్ని రూపులై

కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్.

127

తా॥ అమిత సౌందర్యోపేతుడైన ఆ కృష్ణభగవానుదు; ఆయన యొక్క అందచందాలకు ముగ్ధులైన వారి కోరిక తీర్చడంకోసం ఒక్క ముహూర్తంలోనే వారందరిని వివాహం చేసుకొని, తనయందు అధికమైన అనురాగము, భక్తికల వాళ్ళందరికి అన్నిరూపాలతోను వాళ్ళను సుఖస్థితిలో మునిగితేల్చాడు.

క. చతురతతో నం దొక్కొక, యతివకుఁ బదురేసి సుతులఁ నాత్మసముల ను న్నత భుజశక్తులఁ గాంచెను, వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్.

128

తా॥ ఎంతోనేర్పుతో ఆయన ఒక్కొక్క అతివకు పదిమంది కొడుకులను, తనతో సమానమైన వాళ్ళను, ఉన్నతమైన భుజశక్తులు గలవాళ్ళను ప్రసాదించి తన కీర్తిని వ్యాపింపచేశాడు.

సీ. మధురాపురముఁ జతుర్విధ బలౌఘములతో, నావరించిన కాలయవన సాల్వ మగధ భూపాలాది మనుజేంద్ర లోకంబు, సైన్యయుక్తము గాఁగ సంహరించి తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన, భీమ పార్థులకు నుద్దామ విజయ మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి, బాణ శంబర ముర పల్వలాది

తే. దనుజ నాయక సేనా వితానములను హలధరాది సమేతుఁడై హతులఁజేసె దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

129

తా॥ మధురాపురాన్ని చతురంగ బలాలతో ఎదురించిన కాలయవన, సాల్వ,

జరాసంధాది మనుజేంద్ర లోకాన్ని సైన్యంతో సహా సంహరించాడు. తన సాయంకోరి అర్థించిన భీమార్జునులకు విజయం చేకూర్చి వారి శత్రువులను నశింపచేసాడు. బలరామాది సమేతుడై బాణుడు, శంబరుడు, మురుడు, పల్వలుడు మొదలైన రాక్షస నాయకులను వారి యొక్క సేనతో సహా సంహరించి, తన్నెదుర్కొన్న దంతవక్త్రాది దానవుల్ని పరాక్రమంతో యుద్ధరంగంలో నేలకూల్చాడు.

వ. వెండియుం గృష్ణుండు కౌరవ పాండవ భండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్స ర్యోత్సాహసమేతులై సైనిక పాదఘట్టనంబుల ధరాచక్రంబు కంపింప ననన్య సామాన్యంబు లైన శంఖ భేరీ ప్రముఖ తూర్యఘోషంబుల నింగి మ్రింగఁ దురంగమ రింఖా సముద్ధూత ధూళి పటల పరిచ్ఛన్న భానుమండలంబుగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులం దునుమాడి, నిఖిలరాజ్యవైభవ మదోన్మత్తుం డయిన సుయోధనుండు గర్ణశకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబు గుంతీనందనుల కెగ్గు చేసిన దోషంబునం జేసి సంగరంబున భీము గదా ఘాతంబునం దొడలు విఱిగి పుడమింబడి గతాయు■్య విభవుండై యుండఁ జూచినంగదా పరితుష్ట చిత్తుండ నగుదు నని యపరిమిత బాహుబలోత్సాహులైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నిఖిలధరాపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి మఱియు స్వసమానబలులైన యదువీరుల జయింప నెంతవారల కైనం దీరదు; (కాన) మధుపాన మదవిఘూర్ణి తాతామ్ర విలోచనులై ప్రవర్తించు యాదవుల కన్యోన్య వైరంబులు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినంగాని భూభారం బుడుగదని చిత్తంబునం దలంచి, యంత ధర్మనందనుచే నిస్సపత్యంబగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు, మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు, బంధుమిత్రుల నెల్లఁ బరితోషంబు నొందించుచు, దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి యభిమన్యువలన నుత్తర యందు గర్భంబు నిలిపి, గురుతనయ ప్రయుక్తమహిత బ్రహ్మాస్త్రపాతంబున దగ్ధగర్భదళనంబు గాకుండ నర్భకుని రక్షించి, నిజపదారవింద సేవారతుండైన ధర్మసుతుచేఁ

గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు.



తా॥ అంతేకాదు – కురు, పాండవ యుద్ధంలో పాండవులకు సహాయుడుగా ఉంటూ రాజులందరు ఒకళ్ళమీద మరొకరు మాత్సర్యాన్ని కలిగి సైనికులయొక్క పాదఘట్టనలకు భూమండలమంతా వణకగా, శంఖ భేరీ మొదలైన వాటి యొక్క ధ్వనులు ఆకాసమంతా వ్యాపింపగా, గుర్రముల కాలిగిట్టలనుండి రేగిన ధూళివలన సూర్యమండలం కనుపింపక పోగా, కురుక్షేత్రములో ఎదుర్కొన్న ఉభయ పక్షాల సేనలను చంపించాడు. 'రాజ్యమత్తతలోనున్న రాజులందరు చూస్తూండగా కర్ణశకుని దుశ్శాసనాదుల తప్పుడు ఆలోచనలతో కుంతీపుత్రులకు ద్రోహం చేసిన దోషంకారణంగా, దుర్యోధనుడు భీముని యొక్క గదదెబ్బలకు తొడలు విరిగి భూమిపైపడి అంతవరకు తాననుభవించిన ఆయువు, సంపద, వైభవము తొలగిపోగా నేను చూడాలి... అప్పుడు నా మనస్సు శాంతించాలి...' అనుకొన్నాడు శ్రీకృష్ణుడు. ఈ ప్రకారంగా ఆలోచించి అంతులేని భుజబలంతో, ఉత్సాహంతో ఉన్న భీష్మ, ద్రోణ, భీమ, అర్జునులచేత రాజులందరిని, పదునెనిమిది అక్షౌహిణుల సేనను ఖండింపచేసాడు. ఇంకను తనతో సమాన బలులైన యదువీరులను జయింప ఎంతటి వారికి సాధ్యం కాదు. మధుపానం చేత మత్తెక్కి ఎరుపెక్కిన కళ్ళతో తిరుగుతూన్నటువంటి యాదవులకు అన్యోన్యము శత్రుత్వాన్ని, వాళ్ళలో వాళ్ళకు పోరాటాన్ని కల్పించి పరస్పరము చేతిదెబ్బలచే మరణించి తిరిగి తనను కలిస్తే కాని ఈ భూభారం తగ్గదని మనస్సులో ఆలోచించి అలాగే చేయించాడు. ధర్మరాజుచే రాజ్యాన్ని పూజ్యంగా పరిపాలన చేయిస్తూ, మనుష్యులకు ధర్మమార్గాన్ని చూపిస్తూ, బంధుమిత్రులను సంతోషింపచేసాడు. పాండవ వంశాన్ని ఉద్ధరింప దలచి అభిమన్యుని భార్య ఉత్తర గర్భాన్ని నిలిపి, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వలన గర్భస్థశిశువుకు ఎట్టి ఆపద రాకుండా కాపాడి, తన పాదకమలములను సేవించుట యందు ఆసక్తిగల ధర్మనందనునిచే కీర్తి, ప్రతాపాలు ప్రకటితమయ్యేటట్లు మూడు అశ్వమేధ క్రతువులు చేయించాడు.

సీ. వలనొప్ప లౌకిక వైదిక మార్గముల్, నడపుచు ద్వారకానగర మందు నవిదితాత్మీయ మాయా ప్రభావమున ని, స్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ జెంది కామంబులచేత విమోహితుం, డై సుఖీంచుచు ముదితాత్ముఁ డగుచు నంచిత స్నిగ్ధ స్మితావలోకముల సు, ధా పరిపూర్ణ సల్లాపములను

తే. శ్రీ నికేతన మైన శరీరముననుు, బాండునందన యదుకుల ప్రకరములను లీలఁ గారుణ్య మొలయఁ బాలించుచుండె, నార్త రక్షణ పరుఁడు నారాయణుండు.

131

తా॥ భక్తులను, ఆర్తులను రక్షించుటయందు దీక్షాపరాయణుడైన నారాయణుడు లౌకిక, వైదిక మార్గములు రెండూ నడిపిస్తూ, ద్వారకా నగరాన్ని వెల్లడికాని తన మాయా ప్రభావంచేత పాలించాడు. ఆంతర్యంలో నిస్సంగుడై బాహ్యానికి మాత్రం సంసారివలె ఉంటూ, కామసుఖములను అనుభవిస్తూ సంతోషాన్ని పొందుతూ, నవ్వుతూ పలుకరిస్తూ, చల్లని మాటలతో లక్ష్మికి స్థానమైన శరీరంతో పాండవ, యాదవ సమూహముల పట్ల ఎంతో దయతో ఉంటూ ప్రవర్తించాడు.

సీ. సంపూర్ణ పూర్ణిమా చంద్ర చంద్రిక నొప్పు, రమణీయశారద రాత్రు లందు సలలిత కాంచన స్తంభ సౌధోపరి, చంద్రకాంతోపల స్థలములందు మహిత కరేణుకా మధ్య దిగ్గజముల, గతిని సౌదామినీ లతల నడిమి నీల మేఘంబుల లీల, ముక్తా మధ్య, లాలిత శక్ర నీలముల భాతి

తే. సతత యౌవన సుందరీయుత విహారుఁ, డగుచు సతు లెంద ఱందఱ కన్ని రూప ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి, నందనందనుఁ డభినవానందలీల.

132

తా॥ సంపూర్ణ పూర్ణిమా చంద్రికలతో ప్రకాశించే అందమైన శారద రాత్రులలో, పరమ

రమణీయమైన బంగారు స్తంభములు గల మేడల చలువరాతి తిన్నెలపైనా; గొప్పవైన ఆడు యేనుగుల మధ్య దిగ్గజముల రీతి, మెరపు తీగల మధ్య నీలి మేఘాలవలె, ముత్యాల మధ్య ఇంద్రకాంత మణులవలె, సతులెందరో అందరికీ అన్ని రూపాలలోను యవ్వనవతులైన సుందరీమణుల మధ్య నందనందనుడు నూతన ఆనందంతో అనేక సంవత్సరాలు క్రీడించాడు.

వ. అంత నొక్కనాఁడు,

133

చ. మునివరు లేగుదేర యదు భోజవరేణ్యులు గూడి ముట్టఁ బ ల్కినఁ గనలొంది వారు దమకించి శపించినఁ గొన్ని మాసముల్ చనునెడ దైవయోగమున జాతరఁబో సమకట్టి వేడుకల్ మనములఁ దొంగలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్,

134

తా॥ అంత ఒక రోజున మహామునులు వస్తే యాదవులందరూ వారి చుట్టూ కూడి వాళ్ళని వేళాకోళం చేయగా వారు కోపంతో ఘోరంగా శపించారు. వాళ్ళు శపించి కొన్ని మాసములు గడిచింది. దైవయోగంచే యాదవులంతా జాతరసేయకట్టి వేడుకగా వారివారి వాహనాలెక్కి బయలుదేరారు.

ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో దారత నందు దేవమునితర్పణముల్ పితృ తర్పణంబులున్ వారని భక్తిఁ జేసి నవ వత్సలతోఁ బొలుపారు గోవులన్ భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్.

135

తా॥ అలా బయలుదేరిన యాదవులు ప్రభాస తీర్థానికి వెళ్ళి ఆ నదిలో స్నానాలు చేసి అక్కడ దేవతలకు, మునులకు, పితృదేవతలకు తర్పణములిచ్చి అపారమైన భక్తితో లేగదూడలతో ముచ్చటైన గోవులను సదక్షిణంగా బ్రాహ్మణులకు దానమిచ్చారు.

క. అజిన పట రత్నకంబళ, రజత మహారజత తిల ధరా వరకన్యా గజ తురగ రథములను
స, ద్విజ కోటికి నిచ్చి పెంపు దీపింపంగన్.

136

తా॥ ఆపై... జింక చర్మాలు, మంచి వస్త్రాలు, రత్నకంబళ్ళు, వెండి, బంగారము, నువ్వులు, భూములు, కన్నెపడుచులు, ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు మొదలైన వాటిని ఇచ్చి తమతమ గౌరవానికి తగినట్లు బ్రాహ్మణోత్తములను గౌరవించారు.

వ. ఇట్లు సఫలంబు లయిన భూదానంబు మొదలుగాఁ గల దానంబు లనూనంబులుగా
భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ.

137

తా॥ ఈ విధంగా పంటలతో నిండిన భూమి మొదలైన దానములను భగవంతునికే అర్పిస్తున్నామనే బుద్ధిచే ఇచ్చారు.

తే. ఎసఁగు మోదంబు సంధిల్ల నిష్టమైన, రసిక మృదులాన్న మర్థిఁ బారణలు సేసి
మంజులాసవ రసపాన మత్తు లగుచుఁ, గడఁగి యన్యోన్య హాస్య వాక్యముల గలఁగి.

138

తా॥ తదనంతరం సంతోషంతో ఇష్టమైన పిండివంటలతో కూడిన మృష్టాన్నాన్ని కడుపునిండా తిని, మనోజ్ఞమైన రసపాన (మద్యం) మత్తులో అన్యోన్యము పరిహాస వాక్యాలాడుకోసాగారు.

వ. ఇట్లు దమలోన మదిరాపాన మద విఘూర్ణిత తామ్రలోచనులై మత్సరంబుల
నొండొరులం బొడిచి సమస్త యాదవులును వేణు జాతానలంబునఁ దద్వంశపరంపరలు
దహనంబు నొందుచందంబునం బొలిసి; రది యంతయుం గనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు.

139

తా॥ ఆపై మధువు త్రాగినందు వలన మత్తెక్కి కళ్ళు ఎఱుపెక్కి మాత్సర్యంతో ఒకళ్ళ నొకళ్ళు పొడుచుకొని; వెదురు డొంకలలో పుట్టిన అగ్నికి ఆ వెదురు డొంకలే నాశనమయ్యేటట్లుగా సమస్త యాదవులు నాశనమయ్యారు. అది అంతా దగ్గర ఉండి చూసాడు శ్రీకృష్ణుడు.

క. చతురతతో నిజమాయా, గతిఁ జూచిఁ లసద్వీలోల కల్లోల సమం చిత విమల కమల సార, స్వత జలముల విహిత విధులు సలిపినవాఁడై.

140

తా॥ ఎంతో నేర్పుతో కూడిన తన నిజమాయా విలాసాన్ని చూసి, అనంతరం ఎగసిపడే కెరటాలతో స్వచ్ఛమైన కమలాలతో సరస్వతీ నదీ జలాలతో మరణించిన వారందరికీ యథావిధిగా ఉత్తర క్రియలు జరిపిన వాఁడై....

క. ఒక వృక్షమూల తలమున, నకలంక గుణాభిరాముఁ డాసీనుండై యకుటిలమతి బదరీ వన, ముకు ననుఁ బొమ్మనుచు మొఱఁగి పోయిన నేనున్

141

తా॥ కళంకం లేని గుణముల చేత విరాజిల్లే శ్రీకృష్ణుడు ఒక వృక్షం యొక్క నీడన కూర్చుని నన్ను పిలిచి “ఉద్ధవా! బదరీ వనానికి వెళ్ళిపో!” అని చెప్పి తానెక్కడికో లేచి వెళ్ళాడు.

క. క్రమమున నిజకుల సంహా, రము సేయఁ గడంగు టెఱిఁగి రమణీయ శ్రీ రమణు చరణాబ్జ యుగ విర, హమునకు మది నోర్వ లేక యనుగమనుఁడనై.

142

తా॥ నాకు మాత్రం స్వామి తన కులాన్ని సంహారం చేసుకోవడానికి నిర్ణయం

చేసుకున్నాడన్న సంగతి బోధపడి, అందమైన లక్ష్మీదేవి యొక్క భర్త అయినటువంటి శ్రీకృష్ణ పరమాత్మ చరణయుగళ విరహాన్ని మనస్సులో ఓర్చుకోలేక అనుగమించాను.

క. హరి నరయుచుఁ జనిచని యొక, తరుమూల తలంబు నందుఁ దన దేహరుచుల్ పరఁగఁగ నున్న మహాత్మునిఁ, బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్.

143

తా॥ ఓ విదురా! అలా హరిని వెతుకుతూ వెళ్ళి వెళ్ళి ఒక చెట్టు మొదట్లో తన దేహకాంతులు ప్రకాశిస్తూండగా ఉన్న మహాత్ముని, భగవంతుణ్ణి, తనను శరణుడొచ్చిన వారిని కాపాడే మహనీయుణ్ణి, భక్తులకు విధేయుణ్ణి చూసాను.

వ. మఱియును.

144

సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వ, గుణగరిష్ఠుని రజోగుణవిహీను సురుచిర ద్వారకాపుర సమాశ్రయు ననా, శ్రయు నీల నీరద శ్యామ వర్ణు దళ దరవింద సుందర పత్రనేత్రు ల, క్ష్మీయుతుఁ బీత కౌశేయ వాసు విలసిత వామాంక విన్యస్త దక్షిణ, చరణారవిందు శశ్వత్ప్రకాశు

తే. ఘన చతుర్బాహు సుందరాకారు ధీరుఁ, జెన్నుగల లేఁత రావిపై వెన్ను మోపి యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న, తండ్రి నానంద పరిపూర్ణు దనుజహరుని.

145

తా॥ నాకు అత్యంత ఇష్టుడు, అచ్యుతుడు, పరుడు, సత్త్వగుణ సంపన్నుడు, రజోగుణ రహితుడు, ద్వారకాపుర సుందర మందిరుడు, ఇతరుల నెప్పుడూ ఆశ్రయింపనివాడు, నీలమేఘ శరీరుడు, అరవింద పత్రనేత్రుడు, లక్ష్మీయుతుడు, పీతాంబరధారి, ఎడమతొడమీద కుడి పాదాన్ని పెట్టుకుని కూర్చుని ఉన్నవాడిని, ప్రకాశంతో వెలిగిపోతున్న వాడిని, చతుర్బాహువులు

కలవాణ్ణి, సుందరాకారుణ్ణి, ధీరుణ్ణి, లేతదైన రావి ఆకుకువెన్ను మోపి వీరాసనంలో కూర్చున్న ఆనంద పరిపూర్ణుణ్ణి, దనుజహరుని, నన్ను కన్నతండ్రిని.... కన్నులారా చూసాను.

మ.కో. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి నాశ్రిత రక్షకున్ గంటి యోగిజనంబు డెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము క్కంటికిం గనరాని యెక్కటిఁ గంటి దామరకంటిఁ జే కొంటి ముక్తినిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగన్.

146

తా॥ చూసాను! కన్నులారా చూసాను. చావుపుట్టుకల సాగరాన్ని దాటేశాను. ఆశ్రిత లోక రక్షకుణ్ణి దర్శించాను. యోగుల యొక్క హృదయాన్ని చూసాను. లోకబాంధవుణ్ణి చూసాను. మూడుకన్నుల వేలుపు కూడా చూడలేని మూలదైవాన్ని చూచాను. ముక్తి మార్గాన్ని కనుగొన్నాను. ఆనందంతో పరవశించి పోయాను.

వ. అయ్యవసరంబునం బరమ భాగవతోత్తముండును, మునిజన సత్తముండును, ద్వైపాయన సఖుండును, మహాయోగి ప్రముఖుండును, నఘశూన్యుండును, నఖిల జన మాన్యుండును, బుధజన విధేయుండును నగు మైత్రేయుండు తీర్థాచరణంబు సేయుచుం జని చని.

147

తా॥ ఆ సమయంలో గొప్ప భగవద్భక్తుడు, మునులలో ఉత్తముడు, వేదవ్యాసుని చెలికాడు, మహాయోగి పుంగవుడు, పాపరహితుడు, జనులందరిచేత పూజింపబడేవాడు, బుధజన విధేయుడు అయిన మైత్రేయుడు తీర్థయాత్రలు చేస్తూ అక్కడికి విచ్చేశాడు.

మ. కనియెం దాపస పుంగవుం డఖిల లోకఖ్యాత వర్ధిష్ణు శో భన భాస్వత్పరిపూర్ణ యౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్ర హృ ద్వన జాతైక చరిష్ణుఁ గౌస్తుభ ముఖోద్య ద్భూషణాలంకరి ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్.

148

తా॥ అలా వచ్చిన మైత్రేయుడు లోకమంతటా విస్తరిల్లిన శాశ్వతమైన కీర్తితోను, పరిపూర్ణమైన యౌవన కళతో విరాజిల్లువాడు, యోగుల మానస పద్మాలలో చరించువాడు, కౌస్తుభము మొదలైన భూషణములతో వెలుగొందువాడు, దనుజులను సంహరించేవాడు, అంతటా నిండియున్నవాడు, ఏ పనైనా చెయ్యగలవాడు, ప్రకాశరూపుడు అయిన శ్రీకృష్ణుణ్ణి చూసాడు.

క. తదనంతరంబ హరిఁ దన, హృదయాబ్జము నందు ముకుళితేక్షణముల స మ్మదమునఁ
జూచుచు నానత, వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా!

149

తా॥ ఆపై తన హృదయకమలంలో పదిలపరచుకొన్న హరిని కండ్లు మూసుకుని ఎంతో సంతోషంతో చూస్తూ తలవంచుకుని నిలబడ్డాడు.

వ. అంత డగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచునుండ దరహాస చంద్రికా సుందర వదనార విందుండును, నానంద సుధానిష్యంద కందళిత హృదయుండును, భక్తానురక్త దయాసక్త విలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చె; పూర్వభవంబున వసుబ్రహ్మలు సేయు సత్త్రయాగంబున వసువై, భవదీయ హృదయంబున నితర పదార్థంబులు గోరక మదీయ పాదారవింద సేవం గాంక్షించితివి. కావునం దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గను చుందుదు; నాత్మారాముండ నైన నన్ను నెవ్వరేని సదసద్వివేకులై యెఱుంగంజాలరు; వారలకు నేను నగోచరుండనై యుందు; మత్పరిగ్రహంబు గల నీక నీజన్మంబ కాని పునర్భవంబు నొంద కుండుటకు భవదీయపూర్వ జన్మకృత సుకృత విశేషంబు కతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవింద సందర్శనంబు గలిగె; నదియునుంగాక పద్మకల్పంబునందు మన్నాభి

పద్మ మధ్య నిషణ్ణుం డయిన పద్మసంభవునకు జన్మమరణాది సంసృతి నివర్తకంబును నవిరతానశ్వర సౌఖ్య ప్రవర్తకంబును నగు మన్మహత్త్వంబు దెలియం జేసి నట్టి దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు నని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమాన సరసాలాపంబులు కర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచ కంచుకిత శరీరుండను, నానంద బాష్పధారా సిక్త కపోలుండను, బరితోష సాగరాంతర్నిమగ్న మానసుండను నయి యంజలి పుటంబు నిటల తటంబున ఘటియించి యిట్లంటి.

150

తా॥ అంతలో దగ్గర నిల్చొనియున్న మైత్రేయుడు వింటూ ఉండగా... మందహాసం అనే వెన్నెలలు కురిపించే పరమసుందరమైన పద్మంవంటి ముఖం కలవాడు, ఆనందామృతంతో నిండిన చిత్తము కలవాడు, భక్తానుగ్రహ రూపమైన చూపులు కలవాడు... అయిన హరి నా వైపు చూసి ఇలా అన్నాడు: "ఉద్ధవా! పూర్వ జన్మలో వసుబ్రహ్మలు చేసే సత్రయాగంలో వసువై, నీ హృదయంలో నా పాద కమలముల సేవతప్ప మరేమీ కోరలేదు. ఆ కారణంగా నేను నీ హృదయంలోనే ఉంటూ అంతా చూస్తూ ఉంటాను. నాలో నేనే ఆనందిస్తూ ఉండే నన్ను ఎవరు ఎఱుగలేరు. వాళ్ళకు నేను అగోచరుడనై ఉంటాను. నా అనుగ్రహాన్ని పొందిన నీకు ఇదే ఆఖరు జన్మ. ఇక జన్మలేదు. నీ యొక్క పూర్వజన్మ విశేషం వల్ల నా పాదారవిందాలను సందర్శించే భాగ్యం కలిగింది. ఇంతేకాక పద్మకల్పంలో నా నాభికమలంలో ఆసీనుడై ఉన్న బ్రహ్మగారికి తెలియచెప్పిన దివ్యజ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తాను. ఆ జ్ఞానం వలన జననమరణాది సంసార బంధాన్ని తప్పించి నాశనంలేని సౌఖ్యాన్ని ఇచ్చే నా మహత్త్వం నీకు తెలుస్తుంది."

ఈ ప్రకారంగా గొప్పతేజస్సంపన్నుడైన కృష్ణుడు నన్ను ఆజ్ఞాపించే సరికి, అమృతోపమానమైన ఆయనయొక్క రసవంతమైన మాటలు నా చెవులకు భూషణములై నా మనస్సులో ఉండే దుఃఖాన్ని పోగొట్టి నా శరీరం పులకాంకితము కాగా, ఆనందబాష్పాలు చెక్కిళ్ళపై నుండి జారగా, సంతోష సాగరంలో మునిగిన మానసుడనై నా రెండు చేతులతో

శిరస్సున అంజలి ఘటించి ఇలా అన్నాను.

క. పురుషోత్తమ! నీ పద, సర, సిరుహ ధ్యానామృతాభిషేక స్ఫురణన్ గర మొప్పిన నా చిత్త మి, తరవస్తువులందు వాంఛ‌ం దగులునె యెందున్.

151

తా॥ "ఓ పురుషోత్తమ! నీ పాదకమల స్మరణమనే అమృతాభిషేకంతో నిండిన నా మనస్సు ఇతర వస్తువులను కోరుతుందా?

చ. జననము లేని నీవు భవసంగతి నొందుట కేమి కారణం బనియును, గాలసంహరుఁడవై జగముల్ విలయించు నీవు పా యని రిపుభీతికై సరిదుదంచిత దుర్గము నాశ్రయించు టె ట్లనియును దేవ! నామనమునందుఁ దలంతు సరోజలోచనా!

152

తా॥ హే పరమాత్మా! పుట్టుకలేని నీవు ఈ భూమిపై పుట్టడానికి కారణం ఏమిటో, కాలస్వరూపుడవై లోకాలను నాశనంచేసే నీవు కేవలం శత్రువులకు భయపడి కోటలను ఆశ్రయించటం ఏమిటో... నా మనస్సుకు తెలియటంలేదు.

వ. అదియునుం గాక.

153

క. శ్రీ రమణీశ్వర! నీ వా, త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీకోటిం గోరి రమించితి వనియును, వారక యేఁ దలఁతు భక్తవత్సల! కృష్ణా!

154

తా॥ అంతేగాకుండ... లక్ష్మీవల్లభా! నీవు ఆత్మయందే రమించువాడవైనప్పటికి; అనేకమంది స్త్రీ సమూహాల మధ్య వారిని కోరి రమించిన నీ క్రీడ నేనెప్పుడూ మననం చేస్తూనే

ఉంటాను.

క. పరతత్త్వజ్ఞులు కరుణా, కర! నిను సంసారి వనుచుఁ గడcకఁ దలంప న్నరసి ననుఁ గాచు టెల్లను, గర మరుదు తలంచి చూడఁ గమలాధీశా!

155

తా॥ కరుణాంతరంగా! ఎంతోమంది తత్త్వజ్ఞులు నువ్వు మామూలు సంసారివని అనుకుంటున్నారు. కాని నీవు నన్ను కాపాడిన తీరు చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది.

వ. దేవా! నీ వఖండిత విజ్ఞాన రూపాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తుని చందంబున విమోహికైవడిం బ్రవర్తించుచు నెందేని నొదిగి యుండుట దలంచి నా డెందంబు గుందుచుండు; నరవిందలోచన! సురవందిత! ముకుంద! ఇందిరా సుందరీ రమణ! సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము! భవదీయ శాసనంబు ధరియించి భూరిసంసార పారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుఁడును బ్రపన్నపారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వ నిర్ణయంబు నెఱింగించిన.

156

తా॥ దేవా! అఖండమైన జ్ఞానమే నీ అంతఃకరణ అయినప్పటికీ ఏమీ తెలియని వానిలా, మత్తునిలా, ఏదో వ్యామోహంలో ఉన్నవానిలా ఒదిగి ఒదిగి ఉండే నిన్నుచూచి ఎప్పుడూ నా మనస్సులో బాధపడుతూ ఉంటాను. ఓ అరవింద లోచన! దేవతా వందిత! ముకుంద! ఇందిరా రమణా! బ్రహ్మదేవునికి నీవందించిన జ్ఞానానికి నేను అర్హుణ్ణి అయితే నాకు కూడా కృపతో అనుగ్రహించు! నీ అనుగ్రహాన్ని పొంది సంసార సాగరాన్ని దాటేస్తాను.” అని విన్నవించి అనేక విధాల స్తుతిస్తే భగవంతుడు, భక్తులకు కల్పవృక్షము అయిన కృష్ణుడు నాకు పరతత్త్వ నిర్ణయాన్ని ప్రసాదించాడు.

క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ జ్ఞాన కలిత భావుఁడ నగుటన్ బరతత్త్వవేత్తనై త, చ్చరణ సరోజముల కెరఁగి సమ్మతితోడన్.

157

తా॥ సరసిజలోచనుని దయచేత పొందిన జ్ఞానం కలవాడినవటం వల్ల, పరతత్త్వవేత్తనై ఆయన చరణ సరోరుహములకు ప్రణామం చేశాను.

క. హరిపద జలరుహ విరహా, తురఘన్ దుర్దాంత దుఃఖ తోయధిఁ గడవన్ వెర వేది తిరుగ వలసెను, సరసిజభవకల్ప విలయ సమయము దాఁకన్.

158

తా॥ ఆ హరి యొక్క పాదకమలాలకు దూరమయ్యాననే ఆతురతతో అంతులేని దుఃఖ సముద్రాన్ని దాటడానికి ఉపాయం లేక ఈ కల్పాంతం వరకూ ఇలా తిరుగుతూ ఉండవలసిందే.

వ. ఇట్లు దిరుగుచు.

159

మ. నర నారాయణ తాపసాశ్రమ పదౌన్నత్యంబునం బొల్చు భా సుర మందార రసాల సాల వకు ళాశో కామ్ల పున్నాగ కే సర జంబీర కదంబ నింబ కుట జాశ్వత్థ స్ఫురన్మల్లికా కరవీర క్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్.

160

తా॥ నేనిలా తిరుగుతూ బదరికా వనంలో నరనారాయణులు తపస్సు చేసిన చోటు చూడాలనే ఆకాంక్షతో బయలుదేరాను. ఆ బదరీ వనం అందమైన మందారాలు, తియ్యని ఫలాలనిచ్చే మామిళ్ళు, పొగడలు, అశోకాలు, చింతలు, సురపొన్నలు, పొన్నలు, నిమ్మలు, కదంబాలు, వేములు, కొండమల్లెలు, రావిచెట్లు, మల్లెలు, గన్నేరులు మొదలైన తరువులతో నిండి

చాలా మనోహరంగా ఉంటుందట.

క. చనుచున్నవాఁడ నని ప, ల్కిన పలుకుల కులికి కళవళించు విదురుం డనుపమశోకార్ణవమున, మునిఁగియు నిజయోగ సత్త్వమునఁ దరియించెన్

161

తా॥ అక్కడికే నేను బయలుదేరాను" అని ఉద్ధవుడు పలికిన పలుకులకు ఉలిక్కిపడి కలవరపడుతూ విదురుడు అంతులేని దుఃఖార్ణవంలో మునిగి తిరిగి తను సాధించిన యోగసాధన తత్త్వంవలన నిజస్థితికి వచ్చాడు.

వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేకజలంబుల నార్చి యుద్ధవున కిట్లనియె.

162

మ. అనఘా! యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి చె ప్పిన యధ్యాత్మరహస్యతత్త్వ విమలాభిజ్ఞాన సారంబు బో రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్ విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బ్రోవరే వెండియున్.

163

తా॥ ఈ విధంగా విదురుడు శోకాగ్నిని వివేకమనే జలముల వలన చల్లార్చి ఉద్ధవునితో ఇలా అన్నాడు: "పాపరహితుడవైన ఓ ఉద్ధవా! నీకు కృష్ణుడు మన్ననతో చెప్పిన ఆధ్యాత్మతత్త్వ రహస్యజ్ఞానాన్ని నాకు కరుణతో చెప్పినట్లైతే నేను కృతార్థుడనవుతాను. లోకంలో పుణ్యాత్ములు తమ శిష్యులను ధన్యాత్ములను చేస్తున్నారు కదా!

క. భగవద్భక్తులు సుజనులు, దగ వెఱిఁగి పరోపకారతాత్పర్య వివే క గరిష్ఠులై చరింతురు, జగతిం బొగడొంది వృష్ణిసత్తమ! యెందున్.

164

తా॥ ఓ వృష్ణివంశపావనా! భగవద్భక్తులు, ఉత్తములు అయిన పురుషులు మంచి చెడ్డలు తెలుసుకొని ఎప్పుడూ ఇతరులకు ఉపకారం చెయ్యాలనే వివేకంతోనే ఉంటారు. అటువంటివారిని ప్రజలు స్తుతిస్తారు కూడా."

క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు, రున కిట్లను ననఘ! మునివరుఁడు సాక్షా ద్వి ష్ణు నిభుండగు మైత్రేయుఁడు, దన మనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్.

165

క. హరి మురభేదిఁ బరాపరుఁ, గరుణాకరుఁ దలఁచునట్టి ఘనుఁ డమ్ముని కుం జరు కడ కేఁగిన నాతఁడు, గర మర్థిం దెలుపు సాత్త్విక జ్ఞానంబున్.

166

తా॥ ఆ మాటలు విని ఉద్ధవుడు విదురునితో ఇలా అన్నాడు: "మునిశ్రేష్ఠుడు, సాక్షాత్తు విష్ణువుతో సమానుడైన మైత్రేయుడు తన మనస్సులో ఈ మానవ దేహాన్ని వదిలి పెట్టెయ్యాలని అనుకున్నాడు. అందువల్ల హరిని, పరాత్పరుని, కరుణాకరుని తలపోస్తూ ఉన్నటువంటి ఆ ఘనుడు ఆ మునీశ్వర సన్నిధికి వెడితే ఆయన సాత్విక జ్ఞానాన్ని నీకు బోధిస్తాడు."

వ. అని యుద్ధవుండు విదురుం గూడి చని చని.

167

ఉ. ముందటఁ గాంచె నంత బుధ ముఖ్యుఁడు హల్లక ఫుల్లపద్మ ని ష్యంద మరంద పాన విలసన్మదభృంగఁ, జలత్తరంగ, మా కంద లవంగ లుంగ లతికాచయ సంగ, సురాంగ నాశ్రితా నందిత పుణ్య సంగ, యమునన్, భవభంగ, శుభాంగ నర్మిలిన్.

168

తా॥ ఈ విధంగా చెప్పి ఉద్ధవుడు విదురునితో కలిసి కొంతదూరం వెళ్ళాడు. ఎదురుగా యమునానది. ఆ నదిలో కలువలూ, తామరలూ వికసించి ఉన్నాయి. ఆ పువ్వులలో ఉన్న తేనెను కమ్మగా త్రాగిన తుమ్మెదలు హాయిగా మత్తెక్కి విహరిస్తున్నాయి. తరంగాలు కదలుతున్నాయి. ఆ నదీ తీరంలో మామిడిచెట్లు, లవంగ లతలు, మాదీఫల వృక్షములూ దట్టంగా ఉన్నాయి. వాటి చాటున, పూపొదరిండ్ల మాటున సురాంగనలు క్రీడిస్తున్నారు. సంసార బంధాలను పోకార్చే సుగుణరాశి యమునను కన్నుల పండువగా చూచారు.

క. కని డాయ నేగి మోదం, బునఁ దత్సరిదమల పులిన భూములఁ దగ నా దిన శేషము నివసించెను, వనజోదర పాదపద్మ వశమానసుఁడై.

169

తా॥ ఆ విధంగా దర్శనమిచ్చిన యమునా నదీ తీరానికి వెళ్ళి ఎంతో సంతోషంతో స్వచ్ఛమైన ఇసుక తిన్నెల మీద కూర్చుండి కృష్ణుని పాదపద్మములను స్మరిస్తూ ఆ దినమంతా గడిపాడు... ఉద్ధవుడు.

క. మఱునాఁడు రేపకడ భా, సురపుణ్యుఁడు ఘనుఁడు మధు నిషూదన చరణ స్మరణ క్రీడా కలితుఁడు, దరియించెన్ గలుష గహనదమునన్ యమునన్.

170

తా॥ మరునాడు ఉదయాన్నే పరమ పుణ్యుడు, గొప్పవాడు, మధువనే రాక్షసుణ్ణి సంహరించిన కృష్ణ పరమాత్మ పాదకమలములను స్మరించేవాడు అయిన ఉద్ధవుడు పాపాలను దహించే యమునానదిని దాటాడు.

వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె ననిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె.

171

తా॥ ఈ విధంగా ఉద్ధవుడు యమునాదిని దాటి బదరికాశ్రమమునకు వెళ్ళాడు" అని చెప్పగా వినిన పరీక్షిన్నరేంద్రుడు శ్రీశుక మహర్షితో ఇట్లా అన్నాడు:

క. శౌరియు నతిరథ వరులు మ, హారథ సమరథులు యదు బలాధిపు లెల్లన్ పోరి మృతిఁ బొంద నుద్ధవుఁ, డేరీతిన్ బ్రదికె నాకు నెఱిఁగింపు తగన్.

172

తా॥ "శ్రీకృష్ణునితో సహా అతిరథులు, మహారథులు, సమరథులు మొత్తం యాదవ వీరులందరూ తమలో తాము పోరాడుకొని మృతి చెందగా ఉద్ధవుడొక్కడూ ఏ విధంగా బ్రతుకగలిగాడు? ఈ విషయాన్ని నాకు చెప్పండి."

సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ, డిట్లను మున్ను లోకేశుచేత సంప్రార్థితుండైన జలరుహనాభుండు, వసుమతిపై యదువంశమందు నుదయించి తనుఁ దాన మదిలోనఁ జింతించి, తెలివొంది యాత్మీయ కులవినాశ మొనరించి తాను బంచోపనిషణ్మయ, మగు దివ్యదేహంబునందుఁ జెందఁ

తే. దలఁచి విజ్ఞాన తత్త్వంబు ధరణిమీదఁ, దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగిన ధీరుఁ డుద్ధవుఁడు దక్క నితరులే నోప రితఁడు, నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు.

173

తా॥ అప్పుడు పరీక్షిత్తుతో శ్రీశుకయోగీంద్రుడు ఇలా అన్నాడు: "పూర్వం బ్రహ్మదేవుడు ప్రార్థింపగా శ్రీమహా విష్ణువు ఈ భూమిమీద యదువంశంలో అవతరించాడు. ఆ దేవదేవుడు తన మనస్సులో తానే అనుకొని తన కుల నాశనాన్ని తానే కావించుకొన్నాడు. ఐదు ఉపనిషత్తులతో కూడిన దివ్యదేహమును పొందదలచి, విజ్ఞాన తత్త్వాన్ని ఈ భూమి మీద దాల్చి జనులకు చెప్పడానికి తన తరువాత తగిన ధీరుడు ఉద్ధవుడు తప్ప ఇతరులు లేరని జితేంద్రియుడు, తనంతటివాడు అయిన అతనిని భావించాడు.

క. క్షితిపై నిలిపిన కతమున, నతనికి మృతి దొరక దయ్యె నవనీశ! రమా
పతి యభిమానము గలిగిన, యతి పుణ్యుఁడు చనియె బదరికాశ్రమమునకున్.

174

తా॥ ఈ భూమిపై నిలిపి అతడిని శాశ్వతుణ్ణి చేసిన కారణంగా అతడికి మరణం లేకుండా పోయింది. రాజా! రమాపతి అభిమానంతో గొప్పవాడైన ఆ ఉద్ధవుడు బదరికాశ్రమమునకు వెళ్ళాడు.

వ. అంత.

175

క. ఉద్ధవుఁ డరిగిన పిదప స, మిద్ధ పరిజ్ఞాను, సుజనహితు, మైత్రేయున్ వృద్ధజన సేవ్యుఁ,
దాపస, వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్.

176

తా॥ ఉద్ధవుడు వెళ్ళినంతనే, విదురుడు గొప్ప జ్ఞానం కలవాడు, మంచివారికి మిత్రుడు, వృద్ధులకు సైతం సేవింప తగినవాడు, తాపసులలో గొప్పవాడు అయిన మైత్రేయుణ్ణి దర్శించడానికి తన ప్రయాణం సాగించాడు.

వ. యమునానది దాఁటి కతిపయ ప్రయాణంబులఁ బుణ్యనదుల, హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరిత గమనంబున.

177

తా॥ యమునానదిని దాటి కొన్నిరోజులపాటు ప్రయాణం సాగించి పుణ్యనదులను, శ్రీహరి క్షేత్రములను సందర్శిస్తూ వేగంగా ముందుకు సాగాడు.

క. చని చని ముందటఁ గనుఁగొనె, ఘనపాప తమః పతంగఁ, గరుణాపాంగన్,

గనదుత్తుంగ తరంగన్, జనపరనుత బహుళపుణ్య సంగన్, గంగన్.

178

తా॥ అలా వెళ్ళి వెళ్ళి విదురుడు పాపములనే చీకట్లను సూర్యునివలె పారద్రోలేది, దయారసం ప్రసరించే చూపులు గలది, జనులందరిచేత పొగడబడేది, బహుపుణ్యములకు ఆలవాలమైనది, తరంగాలతో ఎగసిపడేది అయిన గంగానదిని చూచాడు.

క. అందు నరవింద సౌరభ, నందిత పవమాన ధూత నట దూర్మి పరి స్పందిత కందళశీకర, సందోహ లసత్ప్రవాహ జల మజ్జనుఁడై.

179

తా॥ ఆ గంగానదిలో వికసించిన కమలములనుండి వచ్చే సౌరభంతో కూడిన పిల్లగాలులు మెల్లగా వీస్తున్నాయి. ఆ గాలులకు నదీ తరంగాలు నాట్యం చేస్తున్నాయి. ఎగసిపడుతున్న తరంగాలు తుంపురులను చిమ్ముతున్నాయి. అటువంటి పరమపవిత్రమైన గంగానదిలో విదురుడు స్నానం చేశాడు.

సీ. ఘనసారరుచి వాలుకా సముదంచిత, సైకత వేదికా స్థలము నందు యమ నియ మాది యోగాంగ క్రియా నిష్ఠఁ, బూని పద్మాసనాసీనుఁ డగుచు హరిపాద సరసీరుహ న్యస్తచిత్తుఁడై, బాహ్యేంద్రియ వ్యాప్తిఁ బాఱఁదోలి సకల విద్వజ్జన స్తవనీయ సముచితా, చార వ్రతోపవాసములఁ గ్రుస్సి

తే. యున్న పుణ్యాత్ము, విగత వయో వికారు, వినుత సంచారు, భువన పావన విహారు యోగిజనగేయు, సత్తతి భాగధేయు, నాశ్రితవిధేయు, మైత్రేయు నచటఁ గాంచె.

180

తా॥ స్నానానంతరం అచట... కర్పూరం కుప్పపోసినట్లున్న ఒకానొక ఇసుకతిన్నెమీద

యమ నియమాలతో కూడిన అష్టాంగ యోగాన్ని నిష్ఠతో ఆచరిస్తూ పద్మాసనాసీనుడైనాడు. హరిపాద కమలములమీద ఉంచబడిన మనస్సు కలవాడై తన ఇంద్రియములు బాహ్యమునకు వెళ్ళకుండా కట్టడి చేసి సకల విద్వజ్జనులు మెచ్చుకునేటట్లుగా వ్రతముల వలన, ఉపవాసముల వలన సన్నబడి ఉన్న పుణ్యాత్ముడైన వానిని, వార్ధక్య లక్షణాలు లేనివానిని, యోగిజన స్తవనీయుడైన వానిని, సాధుజన భాగధేయుణ్ణి, శ్రితజన విధేయుణ్ణి, పుణ్యజీవనుడు భువన పావనుడు అయిన మైత్రేయుణ్ణి విదురుడు చూచాడు.

# విదుర మైత్రేయ సంవాదము

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తుండై యిట్లనియె. 'మునీంద్రా! లోకంబున సకల జనంబులు మనంబులు ఘనంబులగు సౌఖ్యంబు లందం దలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు; కర్మంబులు బంధకరంబులును దుఃఖహేతువులుం గాని సౌఖ్యదాయకంబులై పాప నివృత్తిఁ జేయనోప; అది యట్లుండె; భూరి దుఃఖానుసారంబైన సంసార చక్రంబు నందుఁ బరిభ్రమించుచుం గామవిమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుఁ బాపనివృత్తిఁ గానక మాతృయౌవన వన కుఠారులై జనియించి వర్తించు మూఢాత్ములం, బశుప్రాయుల రక్షించుకొఱకుఁగాదె నారాయణ పరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట; అదియునుం గాక.

181

తా॥ అలా చూచి విదురుడాయన పాదాలకు నమస్కారం చేసి చేతులు జోడించి ఇలా అన్నాడు: "మునీంద్రా! లోకంలో ఉన్న జనులంతా వారి మనస్సులలో గొప్పగొప్ప సుఖాలు పొందదలచి కర్మలను చేస్తూ ఉంటారు. అయితే దైవం అనుకూలించక ఆ కర్మల వలన ఫలితం రాదు. కర్మలెప్పుడూ దుఃఖహేతువులు, బంధములే కాని సుఖాన్నిచ్చి పాపములను పారద్రోలలేవు. అదలా ఉండగా దుఃఖభూయిష్ఠమైన సంసారచక్రంలో పడి కొట్టుమిట్టాడుచు కోరికలచేత పుడుతూ చస్తూ శరీరములను దాల్చుతూ ఎంతకాలమైనా పాపక్షయంకాక తల్లియొక్క యౌవనమనే వనాన్ని నరకడానికి గొడ్డలివలె పుట్టి నడిచే మూఢాత్ములు, పశుప్రాయులను రక్షించటం కోసం కదా శ్రీమన్నారాయణ పరాయణులైన మీవంటి వారలు లోకంలో సంచరిస్తూ ఉంటారు... ఓ మైత్రేయ మహామునీ!....

మ. అవివేకానుగత స్వకార్య జలవేలాకీర్ణమై మిత్ర బం ధు వధూ పుత్ర జలగ్రహోగ్రయుతమై

దుర్దాంత మైనట్టి దు ర్భవ పాథోధిఁ దరించు వారె? హరిసంబంధ క్రియాలోల భా గవతానుగ్రహ నావ లేని యధముల్ కారుణ్య సంధాయకా!

182

తా॥ ఓ కరుణామయా! ఎప్పుడూ పరమేశ్వరుని యందు ఆసక్తులైన దైవభక్తుల అనుగ్రహం అనే నావ సహాయం లేకుండ సంసార సాగరాన్ని దాటడానికి యత్నించటం మూర్ఖత్వం. దాటడానికి వీలులేని ఈ సంసారమనే సముద్రానికి బుద్ధిహీనతే జలం, స్వార్థమే చెలియలికట్ట, పుత్ర మిత్ర కళత్రాదులే జలచరాలు. దీనికి అంతం లేదు.

క. మునినాథచంద్ర! ననుఁ గై, కొని కాచు తలంపు బుద్ధిఁ గూడిన యేనిన్ వినుము మదీప్సిత మది నా, చనవునఁ గావింపవయ్య సజ్జన తిలకా!

183

తా॥ ఓ మునినాథచంద్రా! నన్ను రక్షించే ఉద్దేశం నీకున్నట్లైతే నా మనస్సులోని కోరిక తీర్చు."

వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా! త్రిగుణాత్మకమాయా నియంత యగు భగవంతుండు స్వతంత్రుండయ్యు నవతరించి యే యే యవతారంబులనే కర్మంబు లాచరించె? నదియు నిష్క్రియుండగు నీశుండు మొదలఁ బ్రపంచంబు నే విధంబునం గల్పించె? నే పగిదిం బాలించె? మఱియు నీ విశ్వంబు నాత్మీయ హృదయాకాశ గతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయయం దెట్లు వసియించె? బ్రహ్మాండంబునందు నే లీలవర్తించె? నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె? భూసుర గోసురాదులఁ బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యే యే ప్రయోజనంబులం దీర్చె? పయోరుహ గర్భాండ కటాహాంతర్గతంబులై లోకపాల సహితంబులైన లోకంబులను లోకాలోక పర్వతంబుల బహిర్భాగంబులును నేయే

తత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె? అందు బ్రతీతంబగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రతుకు? జనులకుం గర్మ నామ రూప భేదంబు లెట్లు నిర్దేశించె? నింతయు సవిస్తరంబుగా వివరింపు; ఉత్తమశ్లోకమౌళి మండనుండు యోగేశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్ర శ్రవణంబునం గాని జన్మమరణాది సకల దుఃఖాకరంబులు, దుష్కర్మప్రాప్తంబులు నగు భవబంధంబులు దెగవని వెండియు నిట్లనియె.

184

తా॥ అని మళ్ళీ విదురుడు మైత్రేయుణ్ణి చూసి ఇట్లా అన్నాడు: "మునీంద్రా! సత్త్వము—రజస్సు—తమస్సు అనే మూడు గుణాలతో కూడిన మాయకు నియంత అయిన భగవంతుడు తాను స్వతంత్రుడైనప్పటికి అవతారములెత్తి ఏఏ అవతారాలలో ఏఏ కర్మలను ఆచరించాడు? అసలాయన నిష్క్రియుడు గదా? ఈ ప్రపంచాన్ని ఏ విధంగా కల్పించాడు? ఏ ప్రకారం పాలిస్తున్నాడు? మళ్ళీ ఈ విశ్వాన్ని తన హృదయాకాశములో విలీనం చేసుకుని యోగమాయలో ఎలా ఉంటున్నాడు? ఈ బ్రహ్మాండంలో ఎలా ఉంటున్నాడు? ఇందులో త్రిమూర్తుల రూపాలను పొంది అనేక ప్రకారాలలో ఎలా క్రీడిస్తున్నాడు? బ్రాహ్మణులను, గోవులను రక్షించుట కొరకు మత్స్య, కూర్మ, వరాహాది అవతారాలను ఎత్తి ఏ ప్రయోజనాలను సాధించాడు? ఈ బ్రహ్మాండం లోపల అనేక లోకాలు, పర్వతాలు, మైదానాలు ఇవన్నీ తత్త్వభేదంచే ఎలా సృష్టించాడు? ఇందున్న జీవకోటి ఎవ్వని ఆరాధించి బ్రతుకుతున్నది? ఈ జనులందరకు కర్మ, నామ, రూప భేదాలు ఎట్లా వచ్చాయి? ఈ విషయములన్నీ నాకు సవిస్తరంగా వివరించవలసింది. యోగేశ్వరుడు అయిన పుండరీకాక్షుని చరిత్రను వింటేతప్ప జననమరణాది దుఃఖకారణమైన బంధాలు తెగిపోవు.

తరలము.

సతతమున్ సరసీరుహోదర సత్కథామృత పూరమున్ శ్రుతి పుటాంజలి చేత నిమ్ముల జుఱ్ఱియుం దనివోదు భా రత కథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స న్మతి

నుతించిన చోట సన్మునినాథ! నామది నుబ్బుదున్.

185

తా॥ ఎప్పుడూ శ్రీమన్నారాయణుని సత్కథలనే అమృతాన్ని చెవులనే దోసిళ్ళతో ఎంత జుర్రుకొన్నా నా మనస్సుకు తృప్తి కలుగదు సరిగదా శ్రీమహాభారతంలో సందర్భానుసారంగా వ్యాసమునీంద్రుడు కృష్ణచరిత్రను చెప్పినచోట నా మనస్సు గెంతులేస్తుందయ్యా!

క. ఇతర కథాకర్ణనముల, నతి హేయత నొందెఁ జిత్త మనఘాత్మ! రమా పతి చరితామృత రతి సం, సృతి వేదన లెల్లఁ బాయఁజేయు మునీంద్రా!

186

తా॥ ఓ మునీంద్రా! ఇతర కథలను విని విసుగెత్తి పోయాను. విష్ణువు యొక్క కథలనే అమృతాన్ని త్రాగితే సంసార బాధలు పోతాయి.

తే. భూరి విజ్ఞాన నిధులగు నారదాది, నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని హరికథామృత పానంబునందు విసివి, యొల్ల ననువాఁడెపో వెట్టిగొల్లఁ డనఘ!

187

తా॥ విజ్ఞాన ఘనులైన నారదాది మహర్షులకు సైతం వర్ణింపరాని హరియొక్క కథామృత పానం చేస్తూ “ఇక చాలు” అనేవాడు వెట్టి గొల్లవాడు.

వ. అదియునుం గాక.

188

సీ. అరవిందనాభుని యపరావతారమై, జనన మొందిన పరాశర సుతుండు చతురవర్ణాశ్రమాచార ధర్మంబులు, రవణింప లోకవిడంబనంబు లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు, హరికథావర్ణన మందులోన నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి,

నంచిత విజ్ఞాన మాత్మ నిలుప తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి విమల

తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి విమల సుజ్ఞాననిధి యన వినుతి కెక్కి, ధన్యుఁ డయ్యెను లోకైకమాన్యుఁ డగుచు.

189

తా॥ అదీ కాకుండా విష్ణువు యొక్క అపరావతారమై జన్మించిన వ్యాసుడు వర్ణాశ్రమాచార ధర్మాలు చెబుతూ కొన్ని పామరకథలను కూడా కల్పించి చెప్పవలసి వచ్చింది. ఆ కారణంగా విజ్ఞానం ఆత్మలో నిలువకపోతే చింతించవలసి వచ్చింది. చివరకు నారదమహర్షి ఉపదేశంతో నారాయణ కథామృతాన్ని తనివితీరా త్రాగి సకలలోక మాన్యుడైనాడు.

వ. కావున,

190

క. సరసిరుహోదరు మంగళ, చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితరకథా గరళము గ్రోలునె? హరి సం, స్మరణము జీవులకు నఖిల సౌఖ్యద మనఘా!

191

తా॥ కాబట్టి ఓ పుణ్యపురుషా! లోకకల్యాణకరుడైన విష్ణువు యొక్క మంగళకరమైన చరితామృతాన్ని హాయిగా ఆస్వాదించే జనులకు ఇతర కథలు విషంతో సమానం. శ్రీహరి యొక్క స్మరణ సకల జీవులకు సుఖాన్నిస్తుంది.

క. శ్రీవనితాధిప! నామ క, థా విముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం బోవుదురు నరకమునకున్, వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా!

192

తా॥ ఓ మునీంద్రా! శ్రీహరి యొక్క కథలంటే ముఖం ప్రక్కకు త్రిప్పుకునే వారు ఇహపరములకు దూరమై పిదప నరకానికి పోతారు. వాళ్ళని చూసి నేను చాలా బాధపడుతూ ఉంటాను.

క. ఏ నరుఁడే నొక నిమిషం, బైన వృథావాదగతిని హరిపదకమల ధ్యానానందుఁడు గాఁడే,
నా నరునకు నాయు వల్పమగు మునినాథా!

193

తా॥ ఓ మునిశ్రేష్ఠా! మానవుడెవడైనా సరే హరి యొక్క పాదకమల ధ్యానాన్ని మాని వృథావాదాలలో ప్రొద్దుపుచ్చుతూ ఉంటాడో, ఆ మానవునికి ఆయువు అల్పమై పోతుంది.

చ. మృదుగతిఁ బువ్వుఁదేనియ రమించుచుఁ బానము సేయఁ బాఱు ష ట్పదమునుబోలి యార్తజన బాంధవు విశ్వభవస్థితివ్యయా స్పద మహితావతారుఁడగు పంకరుహోదరు నిత్యమంగళ ప్రద గుణకీర్తనామృతముఁ బాయక గ్రోలెదఁ జెప్పవే దయన్.

194

తా॥ కష్టాలలో ఉన్నవారికి ఆప్తుడు, లోకాలన్నిటికి సృష్టి, స్థితి, లయములకు కారణమైనవాడు, మహితావతారుడు అయిన విష్ణువు యొక్క మంగళప్రదమైన గుణకీర్తనామృతాన్ని కడుపు నిండుగా త్రాగుతాను. దయతో చెప్పు స్వామి!"

క. అని విదురుఁడు మైత్రేయుం, దను మునినాయకుని నడిగె నని వేదవ్యా సుని తనయుం
డభిమన్యుని, తనయునకుం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్.

195

తా॥ అని విదురుడు మైత్రేయుణ్ణి అడిగాడని శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతిమృదుమధుర వచన రచనుండై యిట్లనియె: ననఘా! కృష్ణకథాశ్రవణ తత్పరుండవై నీవు నన్నడిగితివి గావున భద్రంబయ్యె. నీవు భగవద్భక్తుండవు గావున హరి కథాసక్తుండ వగుట విచిత్రంబు గాదు. అదియునుం గాక మాండవ్య శాపంబున సాత్యవతేయువలన భ్రాతృక్షేత్రంబున శూద్రయోనిం బుట్టినట్టి ప్రజాసంయమనుండ వగు యముండవు, పరమ జ్ఞానసంపన్నుండవు, నారాయణునకుం బ్రియతముండవు, కావునఁ గృష్ణుండు నిర్యాణకాలంబునం దన సన్నిధికిం జనిన నన్ను డాయం జీరి విజ్ఞానం బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యానతిచ్చుటంజేసి యవశ్యంబు నీకు నెఱింగింతు; దత్తావధానుండవై వినుము.

196

తా॥ మైత్రేయుడంటున్నాడు: "అనఘా! కృష్ణకథలు వినాలన్న కుతూహలంతో నువ్వు నన్నడిగావు కనుక నీకు శుభమగుగాక! నీవు భక్తుడవు కనుక హరికథలు వినాలన్న కోరిక నీకుండటం ఆశ్చర్యం కాదు. అంతేకాదు నీ పూర్వజన్మ వృత్తాంతాన్ని చెపుతాను విను! మాండవ్య మహాముని శాపం వలన వ్యాసునికి శూద్రస్త్రీయందు జన్మించిన యముడవు, పరమ జ్ఞానసంపన్నుడవు, నారాయణునకు చాలా ప్రియుడవు. అందుచేతనే శ్రీకృష్ణుడు అవతారపరిసమాప్తి సమయంలో నన్ను తన సన్నిధికి పిలిచి విజ్ఞానాన్ని బోధచేసి నాకు చెప్పిన విషయాలన్నీ నీకు బోధించవలసిందిగా నాకు ఆనతి ఇచ్చాడు. అందువల్ల నీకు తప్పకుండ చెపుతాను. విను!"

క. వనజాక్ష యోగమాయా, జనితం బగు విశ్వ జనన సంస్థాన వినా శనముల తెఱఁ గెఱిఁగింపుచు, ననఘా! విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్.

197

తా॥ విష్ణువు యొక్క యోగమాయవల్ల పుట్టిన ఈ విశ్వం యొక్క పుట్టుకను, అభివృద్ధిని,

నాశనాన్ని చెబుతూ... ఆయన మహత్త్వాన్ని కూడా చెబుతాను.

సీ. సకలజీవులకెల్లఁ బ్రకట దేహము నాత్మ, నాథుండుఁ పరుఁడు నానావిధైక మత్యుపలక్షణ మహితుండు నగు భగ, వంతుండు సృష్టిపూర్వంబునందు నాత్మీయ మాయా లయంబు నొందిన విశ్వ, గర్భుఁడై తాన యెక్కటి వెలుంగు పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు వ, స్త్వంతరపరిశూన్యుఁ డగుటఁజేసి

తే. ద్రష్ట గాకుండు మాయా ప్రధానశక్తి, నతుల చిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁ దన్ను లేని వానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి, ద్రష్ట యగుఁ దన భువన నిర్మాణ వాంఛ.

198

తా॥ ఈ విశ్వమంతా భగవంతుని స్వరూపమే. సమస్తము ఆయనే. ఆయనే సర్వానికి ప్రభువు. బుద్ధులన్నిటికి ఆయనే ఉపలక్షణం. సృష్టికి పూర్వం తనదైన మాయచేత తనలోనే లయం అయిన సృష్టికి తానే విశ్వగర్భుడై తానొక్కడే అయి వెలుగుతూ ఉంటాడు. ఆయనకు జనన మరణాలు లేవు. సృష్టిలో ఆయన తప్ప మరొక వస్తువు లేనప్పుడు ఆయన దేనికీ ద్రష్టకాడు. కాని మాయ ప్రధానంగా ఈ సృష్టిని చెయ్యాలనే కోరికతో 'చిత్' శక్తి కలిగి తనను లేనివానిగ భావించుకొని సృష్టికి ఉపక్రమించి ఆపై ద్రష్ట అవుతాడు.

తే. బుద్ధిఁ దోఁచిన న మ్మహాపురుషవరుఁడు, కార్య కారణ రూపమై ఘనత కెక్కి భూరి మాయాభిధాన విస్ఫురిత శక్తి, వినుత కెక్కినయట్టి యవిద్య యందు.

199

తా॥ ఈ ప్రకారంగా భగవంతునికి సృష్టి సంకల్పం కలిగేసరికి తానే కార్యము, కారణము అయి మాయాశక్తిగా పిలువబడుతూన్న అవిద్య అంకురించింది.

క. పురుషాకృతి నాత్మాంశ, స్ఫురణము గలశక్తి నిలిపి పురుషోత్తముఁ డీ శ్వరుఁ డభవుం

డజుఁడు, నిజో, దర సంస్థిత విశ్వ మపుడు దగఁ బుట్టించెన్.

200

తా॥ ఈ విధంగా పుట్టిన మాయను తన శక్తిగా ప్రతిష్ఠచేసి జనన మరణాలు లేని పరమాత్మ తన కడుపులో నుండి విశ్వాన్ని సృష్టించాడు.

సీ. ధృతిఁ బూని కాలచోదితము నవ్యక్తంబుఁ, బ్రకృతియు నను పేళ్లఁ బరఁగు మాయ వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మా, యాంశ కాలాది గుణాత్మకంబు నైన మహత్తత్త్వ మచ్యుత దృగ్గోచ, ర మగుచు విశ్వనిర్మాణ వాంఛ నందుటఁజేసి రూపాంతరంబునఁ బొంది, నట్టి మహత్తత్త్వమందు నోలిఁ

తే. గార్యకారణ కర్త్రాత్మకత్వమైన, మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ దగు నహంకారతత్త్వ ముత్పన్న మయ్యెఁ, గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు.

201

తా॥ తన మాయవల్ల మహత్తత్త్వాన్ని పుట్టించాడు. ఈ మహత్తత్త్వం భగవంతునికి మాత్రమే కనుపిస్తూ సృష్టి చెయ్యాలనే కోరికతో మరో రూపాన్ని పొందింది. దానిలోనుండి క్రమంగా కారణం–కార్యం–కర్త అనే పేర్లతో భేదాలు ఏర్పడి వరుసగా పంచభూతాలు, ఇంద్రియాలు, మనస్సు పుట్టాయి. ఆపై అహంకారం ఏర్పడింది. ఇది సత్త్వరజస్తమో గుణాలతో కూడి ఉంటుంది.

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనంబును, వైకారిక కార్యభూతంబులైన దేవతా గణంబులును సంభవించె. ఇంద్రియాధిష్ఠాతలైన వాని వలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటంజేసి జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, కర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థములును, తైజసాహంకారంబున నుత్పన్నంబు లయ్యెఁ:

తామసాహంకారంబువలన శబ్దస్పర్శరూప రసగంధంబు లుదయించె: అందు శబ్దంబు నిజగుణంబైన శబ్దంబు వలన నాకాశంబుఁ బుట్టించె. గగనంబు కాల మాయాంశ యోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబు వలన వాయువుం గలిగించె; పవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనంబైన తేజంబు నుత్పాదించెఁ. తేజంబు కాల మాయాంశ యోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తం బగుచు రసతన్మాత్రంబువలన నంబువులఁ బుట్టించె; సలిలంబు కాల మాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబుఁ గలిగి తేజోయుక్తంబైన గంధగుణంబు వలనఁ బృథివిఁ గలిగించె; అందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్దస్పర్శంబులును, దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును, సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును, బృథివికి శబ్దస్పర్శరూపరస గంధంబులును గుణంబులై యుండుఁ; గాల మాయాంశ లింగంబులు గలిగి మహదాద్యభిమానంబును నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుదురు. అట్టి మహదాదితత్త్వంబు లైక్యంబు సాలమిం బ్రపంచంబులు కల్పింప సమర్థంబులు గాక కృతాంజలులై యోగేశ్వరేశ్వరుండైన నారాయణు నిట్లని స్తుతియించె.

202

తా॥ మార్పు ప్రధాన లక్షణంగా గల సృష్టిలో సాత్త్వికాహంకారం నుండి మనస్సు, ఇంద్రియాలకు అధిదేవతలైన దేవతా గణములు పుట్టాయి. రాజసాహంకారం వల్ల జ్ఞానేంద్రియాలైన చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు మరియు కర్మేంద్రియాలైన వాక్కు, హస్తాలు, పాదాలు, పాయువు, ఉపస్థ పుట్టాయి. తామసాహంకారం వలన శబ్దం, స్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రలు ఆవిర్భవించాయి. శబ్దం వల్ల ఆకాశం పుట్టింది. ఆకాశం స్పర్శ తన్మాత్రల వల్ల వాయువును, వాయువు ఆకాశంతో కలిసి రూపతన్మాత్రవలన లోకలోచనమైన తేజస్సును పుట్టించింది. తేజస్సు వాయువుతో కలసి రసతన్మాత్ర వలన జలాన్ని కలిగించింది. జలం తేజస్సుతో కలసి గంధతన్మాత్రవల్ల పృథ్విని పుట్టించింది.

ఆకాశానికి గుణం శబ్దం. వాయువుకు శబ్ద స్పర్శాలు గుణాలు. తేజస్సుకు శబ్దం స్పర్శ రూపములు గుణాలు. జలానికి శబ్దస్పర్శరూప రసములు గుణాలు. పృథివికి శబ్దస్పర్శరూపరసగంధములు గుణములు. అయినా మహదాది తత్త్వాలు, పంచ భూతాలు, పంచేంద్రియాలు, పంచతన్మాత్రలు వేరువేరుగా ఉండి అవన్ని సమైక్యం కాకపోవడంతో సృష్టి సామర్థ్యం వానికి చాలలేదు. అందువల్ల దేవతలందరు చేతులు జోడించి యోగీశ్వరేశ్వరుండైన నారాయణుని ఇట్లా స్తుతించారు:

దండకము.

శ్రీనాథనాథా! జగన్నాథ! నమ్రైకరక్షా! విపక్షక్షమాభృత్సహస్రాక్ష! నీరేజపత్రేక్షణా! దేవదేవా! భవ ద్దాసవర్గోపతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబు నాఁబొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసార తాపంబులం బోవఁ గా మీటి వర్తింతురో తండ్రి! యీశా! సమస్తాఘ నిర్ణాశ! యీ విశ్వమందెల్ల జీవుల్ భవోదగ్ర దుర్వార తాపత్రయాభీల దావాగ్నిచేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యే కర్మమున్ ధర్మముం బొందఁగా లేక సంసారచక్రంబునందున్ బరిభ్రామ్యమాణాత్ములై యుందు; ర మ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల? యో దేవ! విజ్ఞాన దీపాంకురంబైన నీ పాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు; మబ్జాక్ష! సన్మౌనిసంఘంబు లైకాంతిక స్వాంతతం బేర్చి దుర్దాంత పాపౌఘ నిర్ణాశకాంబు ప్రవాహాభ్ర గంగా నివాసంబు గా నొప్పు నీ పాదయుగ్మంబు, యుష్మన్ముఖాంభోజ నీడోద్గతం బైన వేదాండజ శ్రేణి చేతన్ గవేషించి సంప్రాప్తులై యుందు రో నాథ! వైరాగ్యశక్తిస్ఫుట జ్ఞాన బోధాత్ములై నట్టి ధీరోత్తముల్ నిత్య నైర్మల్య భవ్యాంతరంగంబులం దే పరంజ్యోతి పాదాబ్జ పీఠంబు గీలించి కైవల్య సంప్రాప్తులై రట్టి నిర్వాణ మూర్తిం బ్రశంసింతు; మింద్రాది వంద్యా! ముకుందా! సమస్తంబుఁ గల్పింపఁ బాలింపఁ దూలింపఁగా బెక్కు దివ్యావతారంబులం బొందు నీ పాద పంకేరుహ ధ్యానపారీణ సుస్వాంతులై యొప్పు భక్తాళికిన్ మోక్షదం బైన మీ పాద కంజాతముల్ గొల్తు మీశా! రమాధీశ! పుత్త్రాంగనా మిత్ర సంబంధ బంధంబులం జెంది

నిత్యంబు దుష్ట క్రియా లోలురై దేహగేహంబుం దోలి వర్తించు దుర్మానవ శ్రేణులం దంతరాత్ముండవై యుండియున్ దూరమై తోఁచు నీ పాదపద్మంబు లర్చింతు; మో దేవ! బాహ్యేంద్రియ వ్యాప్తి నుద్వృత్తులైనట్టి మూఢాత్ము లధ్యాత్మ తత్త్వ ప్రభావాఢ్యులై నీ పదాబ్జాతవిన్యాస లక్ష్మీ కళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁ జాల; రప్పుణ్యులా దుష్టులం జూడఁగా నొల్ల రంభోధిరాట్కన్యకాకాంత! వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు నీ సత్కథాపార చంచత్సుధా సారపూరంబులం గ్రోలి, సౌఖ్యోన్నతిన్ సోలి, ధీయుక్తులై వ్రాలి, తాపంబులం దోలి, మోదంబులం దేలి, సంపన్నులై మన్న నిత్యప్రసన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠ ధామంబు నల్పక్రియాలోలురై కాంతు; రద్దివ్యవాసైక సంప్రాప్తికిం గోరుచున్నార; మోదేవ! వైరాగ్య విజ్ఞాన బోధాత్మ యోగక్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబు గావించి హృత్పద్మవాసుండవై చిన్మయాకారమై యున్న నీ యున్న తానంత తేజో విలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానంద లోలాత్మతం బొల్చు యోగీశ్వర శ్రేణికిం దావకీనానుకం పానులబ్ధిస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద; రో దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ! జగద్గీతకీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసులైనట్టి మమ్మున్ జగత్కల్పనాసక్త చిత్తుండవై నీవు త్రైగుణ్యవిస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీ భవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ నే మెంతవారౌదు? మీ శక్తి యుక్తిన్ భవత్పూజ గావింతు; మట్లుండె నీ సత్కళాజాతులై నట్టి మమ్మేన్నఁగా నేల? యధ్యాత్మతత్త్వంబ వన్నం బరంజ్యోతి వన్నం బ్రపంచంబ వన్న న్నధిష్ఠాతవన్నన్ సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవే కదా పద్మపత్రాక్ష! సత్త్వాదిత్రైగుణ్య మూలంబు నా నొప్పు మాయా గుణంబందు నుద్యన్మహా తత్త్వ మైనట్టి నీ వీర్యముం బెట్టుటం జేసి నీ వింతకుం గారణం బౌదు! వాయాయి కాలంబుల న్నీకు సౌఖ్యంబు లేమెట్లు గావింతు? మే రీతి నన్నంబు భక్షింతు? మెబ్భంగి వర్తింతు? మే నిల్కడన్నుందు? మీ జీవలోకంబె యాధారమై యుండి భోగంబులం బొందుచు న్నున్న యిక్కార్య సంధానులై నట్టి మాకుం జగత్కల్పనా సక్తికిన్ దేవ! నీ శక్తిఁ దోడ్పాటు గావించి, విజ్ఞానముం జూపి, కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనః పల్వలక్రోడ!

యోగీంద్ర చేతస్సరోహంస! దేవాదిదేవా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః.

203

తా॥ "హే లక్ష్మీవల్లభా! ఆశ్రయించిన వారిని రక్షించే వాడా! ఒక్కసారి తలవంచి నమస్కరిస్తే నువ్వు రక్షిస్తావు! శత్రువులనే కొండలను పిండిచేసే ఇంద్రుడవు! దేవతలకు దేవుడవు! నీ దాసులను బాధలనుండి రక్షించే చల్లని తెల్లని గొడుగులు నీ అడుగులు. నీ చరణ కమలాలను సేవించే యోగులు భరింపరాని సంసార బాధలన్నిటికి దూరంగా ఉంటూ ఆనందంగా ఉంటారు. మహాపాపములను సంహరించే ఓ తండ్రీ! నీవు జగదీశ్వరుడవు! ఈ భూమి మీది ప్రాణులందరూ దుఃఖకరమైన బంధాలలో తగుల్కొని తాపత్రయ రూపమైన భయంకరమైన అగ్నిలో దహింపబడుతూ వ్యథా సముద్రంలో మునిగి తేలుతున్నారు. ఒక మంచిపని గాని, ఒక పుణ్యకార్యం గాని లేకుండ సంసార చక్రంలో తిరుగుతున్నారు. అట్టి బుద్ధిహీనుల గురించి చెప్పేదేముంది? ఓ దేవదేవా! జ్ఞానజ్యోతిని వెలిగించి అజ్ఞానమనే అంధకారాన్ని త్రోసిపుచ్చే నీ పాదపద్మాలను ఆశ్రయిస్తాము. మునిపుంగవులు ఏకాగ్రచిత్తంతో గూటిలో ఉన్న పక్షులవలె నీనుండి వచ్చిన వేదవాక్కులాధారంగా అన్వేషించి నీ పాద కమలాలను ఆశ్రయిస్తారు. నీ పాదసరోరుహద్వయం అంతంలేని పాపసమూహాన్ని క్షాళనం చేసే గంగానదికి ఆశ్రయం.

ఓ ప్రభూ! నీవు అందరికంటే ఉన్నతుడవు! విషయములయందు ఆసక్తిలేక నిశ్చలమైన జ్ఞానంతో మేల్కొన్న ధీరులు తమ హృదయంలో ఏ జ్యోతి స్వరూపాన్ని ఆరాధించి కైవల్యాన్ని పొందారో ఆ కైవల్య స్వరూపుడవైన నిన్ను ఆరాధిస్తున్నాము. నిత్యము దేవేంద్రాది దేవతలచేత ఆరాధింపబడే వాడా! ఈ సృష్టికోసం అనేక అవతారాలెత్తావు. నీ భక్తులకు ముక్తినిచ్చే ఓ ప్రభూ! మేము నీ పాద భక్తులం. దుష్టుల హృదయాలలోసైతం ఉండే సర్వాంతర్యామీ! కాని నీ చరణాలు వారికి దూరంగానే ఉంటాయి. అటువంటనీ పాదకమలాలను నిత్యమూ పూజిస్తాము.

దేవా! ఎప్పుడూ దుష్టకార్యములను చేస్తూ ఉండే నీచులు, నీ పాదకమలములను సేవించే

యోగ్యులను చూడాలని మనస్సులో కోరుకోరు. ఆ సత్పురుషులు కూడ ఆ దుర్జనుల ముఖం చూడటానికి ఇష్టపడరు. లక్ష్మీవల్లభా! జ్ఞానులైనవారు ఆనందపారవశ్యంలో మునిగి తేలుతూ నీ లోకానికి చేరుకుంటారు. మేమూ అట్టి స్థానాన్నే కోరుకొంటున్నాము. ఓ దేవదేవా! ఆత్మయోగంలో సిద్ధిపొందిన యోగీశ్వరులు నీ దివ్యమూర్తిని ఎప్పుడూ మనస్సులో ధ్యానిస్తూ నిత్య సంతోషులై ఉంటారు. నీ అనుగ్రహం వలన వారికి శ్రమ అనేది అసలుండదు.

ఓ ఆనందస్వరూపా! నువ్వులేని చోటులేదు. అందరియందు నువ్వు ఉన్నావు. సృష్టిని చెయ్యాలనే సంకల్పంతో సత్త్వరజస్తమో గుణాలను స్ఫురింపజేసి నీ దాసులైన మమ్మొలను సృష్టించావు. మేమెందులోను గొప్పవాళ్ళం కాదు స్వామీ! నువ్విచ్చిన శక్తియుక్తులతో నిన్ను పూజిస్తాము. ఓ త్రిగుణాతీతా! అన్నీ నీవే! నీ మాయాగుణంలో మహత్తత్త్వమనే తేజస్సును ప్రవేశపెట్టి సృష్టికార్యానికి కారణమైనావు. నీకెలా సంతోషాన్ని సమకూర్చుతాము? దయతో నీ శక్తిని మాకిచ్చి ఈ జగత్తును సృష్టించే శక్తిని మాకియ్యి! ఓ దేవా! నీకు నమస్కారం."

సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల, కన్యోన్యమిత్రత్వ మందకున్న కతమున నిఖిలజగత్కల్పనాశక్తి, వొడమ కుండుట దన బుద్ధి నెఱిఁగి కైకొని కాలవేగమున నుద్రేకంబు, నొందిన ప్రకృతితోఁ బొంది నిజ బ లము నిల్పి తా నురుక్రముఁడన సప్తవిం, శతి తత్త్వములయందు సమత నొక్క

తే. పరి ప్రవేశించి యా తత్త్వభవ్యగుణము, నందు జ్యేష్ఠానురూపంబు లలరఁజెంది యొకటి నొక-టిని గలయక యుండి విశ్వ, రచన మెఱుఁగని యాతత్త్వ నిచయమునకు.



తా॥ ఇలా స్తోత్రంచేయగా విని విష్ణువు ఆనందంతో మహత్తు మొదలైన తత్త్వాలకు అన్యోన్యం మిత్రత్వం కుదరక పోవటం వలన ఈ జగత్తు సృష్టించే శక్తి రాకపోవడాన్ని గమనించాడు. అప్పుడు కాలవేగ పరిణామంతో సిద్ధంగా ఉన్న ప్రకృతిలో తన శక్తిని ప్రవేశపెట్టి ఇరవైయేడు తత్త్వాలలో జపంచభూతములు: పృథ్వి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము;

పంచతన్మాత్రలు: శబ్దము, స్పర్శ, రూపము, రుచి, వాసన; పంచకర్మేంద్రియములు: నోరు, కాళ్ళు, చేతులు, మల అవయవము, మూత్ర అవయవము; పంచ జ్ఞానేంద్రియములు: కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, చర్మము; చతురాంతః కరణములు: మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము; పురుషుడు, ప్రకృతి, మహత్తు, తాను ప్రవేశించి వాటికి ఏకత్వాన్ని కలిగించాడు.

వ. ఇట్లు విశ్వనిర్మాణ నిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి తన యనుగ్రహంబునం బ్రేరితంబై కానంబడి క్రియాసామర్థ్యంబునం జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితం బయి స్వకీయంబు లగు నంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందు; నే తత్త్వంబునఁ జరాచరలోక పుంజంబులు నిండియుండు నా హిరణ్మయంబైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వజీవ సమేతుండై యుండె నంత.

205

తా॥ ఈ విధంగా జగత్తును నిర్మించటంలో శ్రీహరి ఇందులో పాల్గొన్న అన్నిటికి పరస్పరం అన్యోన్యతను కల్పించగా తత్త్వ సమూహం అంతా ఆయన యొక్క విరాట్‌స్వరూపంగా గోచరించింది. ఆయనలేని చోటులేదు... అంతటా ఆయన ఉన్నాడు.

క. జలముల లోపల నిమ్ముల, జలరుహజాతాండమందు సాహస్రాబ్దం బులు నిలిచెఁ గార్యరూపా, కలితంబగు నవ్విరాట్పుగర్భము వరుసన్.

206

తా॥ ఈ విరాట్ పురుషుడు బ్రహ్మాండం అనే గర్భరూపంలో వేల సంవత్సరాలు ఉన్నాడు. దానినుండే సృష్టి అంతా వచ్చింది.

తే. దైవకర్మాత్మ శక్తి వితానములను, దగిలి తనచేతఁ దనుఁ దాన దైవశక్తి యగుచు

వెలుఁగొందుచుం బ్రకారాంతరమునఁ, దనువు వితతంబు గాని చైతన్య మొంది.

207

తా॥ భగవంతుడు తాను అనేక రూపాలలో కేవలం సంకల్పరూపంలో ఉంటాడు. అందువల్ల సృష్టి అంతా చైతన్యరూపంలో ఉంటుంది గాని ఇంకా శరీరాలు ఏర్పడవు.

తే. రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ, శక్తియును వృత్తిభేద సంసక్తి దశ వి ధములు గలిగిన
ప్రాణరూపమున నాత్మ, శక్తి బోధత్వ మగుచున్న శక్తి కలిగి.

208

తా॥ క్రమంగా ఆ చైతన్య శక్తికి రూపాలుగా ఏర్పడే స్థితి ఏర్పడుతుంది. అదే కర్మశక్తి. ఈ శక్తివలన అనేక ప్రవృత్తి భేదాలు, దానియందు ప్రాణాలు వస్తాయి. ఇన్ని శక్తులు అంతర్గతంగా ఉన్నందు వలన తనెవరో తెలుసుకొనే శక్తికూడ ఏర్పడుతుంది.

క. త్రివిధం బగుచును నాధ్యా, త్మ్య విభేదంబులను బాపి మఱి యధిభూతా త్మ విరాడ్రూప
మ్మగు నిది, వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్.

209

తా॥ ఆధ్యాత్మ, ఆధిభూత, ఆధిదైవము అనే ఈ మూడు కలిసిన విరాట్ స్వరూపం జీవులకు ఆత్మగా పిలవబడుతుంది.

క. జీవంబై పరమాత్మకుఁ, దావలమై యాదిమావతారంబగు న
ద్దేవుని గర్భంబున భూ, తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్.

210

తా॥ ఆ విరాట్ పురుషుని గర్భం నుండి పంచభూతాత్మకమైన ఈ ప్రపంచం పుట్టింది.

వ. ఇట్లు దోఁచిన విరాట్పురుషుం డాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులను భేదంబులచేఁ బూర్వోక్త క్రమంబున వెలుఁగొందు ననుచు విదురునకు మైత్రేయుం డెఱింగించె నని చెప్పి వెండియు నిట్లనియె.

211

తా॥ ఈ విధంగా ప్రకటితమైన విరాట్ పురుషుడు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనే భేదాలతో ఉంటాడు... అని విదురునకు మైత్రేయుడు చెప్పాడని చెప్పి శ్రీశుక మహర్షి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు:

చ. హరి పరమాత్ము డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా గర తనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా కరుఁడు కృపాపయోనిధి యకల్మష చిత్తుఁడు సర్వశక్తి తా మరస విలోచనుండు బుధమాన్య చరిత్ర పవిత్రుఁ డిమ్ములన్.

212

తా॥ ఆ శ్రీహరి సర్వేశ్వరుడు, పరమాత్ముడు, పుట్టుకలేనివాడు, సంపన్నుడు, అంతం లేనివాడు, లక్ష్మీదేవికి భర్త, ఏ వికారములు లేనివాడు, నిత్యమంగళుడు, దయాసముద్రుడు, ఏ విధమైన మాలిన్యములేని మనస్సు కలవాడు, సర్వశక్తిమంతుడు, పద్మపత్ర నేత్రుడు, విద్వాంసులచేత పొగడబడే వాడు, పరమ పవిత్రుడు.

వ. ఇత్తెఱంగున నీశుండగు నధోక్షజుండు మహదాది తత్త్వంబుల మనంబుల ఘనంబులగు తలంపులు దానెఱింగి యట్టి తత్త్వంబుల వివిధవృత్తి లాభమునకై స్వకీయ చిచ్ఛక్తిచే నిట్టు లొనర్తునని చింతించి నిజకళాకలితంబగు విరాడ్విగ్రహంబునందు నగ్ని ప్రముఖంబగు దేవతావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజపురుషుని యాస్యాద్యవయవంబుల వినిపింతు; దత్తావధానుండవై వినుము.

213

తా॥ ఈశ్వరుడైన ఆ శ్రీహరి మహదాది తత్త్వముల నిజస్వరూపాన్ని తెలుసుకొని వాటి సంకల్పం సఫలం కావడానికి తన చైతన్యం వాటికి తోడుకావాలని తలపోసి అగ్ని మొదలైన దేవతలందరికి స్థానాన్ని కల్పించాడు. ఆ విరాట్ పురుషుని ముఖం మొదలైన అవయవాలను వినిపిస్తాను. ఏకాగ్ర చిత్తంతో ఆలకించు.

సీ. నరనుత! యా దివ్యపురుషోత్తముని పృథ, గ్భావంబు నొంది ముఖంబు వలన
భువనపాలకుఁడైన పవమాన సఖుఁ డంత, రాత్ముఁ డీశ్వరు నంశ మైన వాణి కనయంబు
ననుకూల మగుచు నిజస్థాన, మునఁ బ్రవేశించిన ముఖమునందుఁ బరఁగు జీవుండు
శబ్దము నుచ్చరించుఁ బృ, థగ్భావములను నేత్రముల నినుఁడు

తే. చక్షురింద్రియ యుక్తుఁడై సరవిఁ జెంద, రూపవిజ్ఞాన మహిమ నిరూఢి నొందు
మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ, రాంశమై తత్త్వగింద్రియమందుఁ గూడి.

214

తా॥ ఓ విదురా! ఆ విరాట్ పురుషునిలో కొంతభాగం ముఖం కాగా శ్రీహరి అంశతో వాయువు మిత్రుడైన అగ్నిదేవుడు ముఖాన్ని స్థానంగా చేసుకొన్నాడు. ఆ కారణంగా జీవుడు శబ్దాన్ని పలుక గలుగుతున్నాడు. కొంతభాగం వేరై కన్నులుగా అయ్యాయి. సూర్యభగవానుడు కన్నులకు అధికారియై జీవులకు అన్నిటి యొక్క రూపవిజ్ఞానాన్ని ఇస్తున్నాడు. విరాట్పురుషునిలో కొంతభాగం చర్మమై వాయువు అందులో నిలిచాడు.

వ. నిజనివాసంబు నాశ్రయించిన జీవుండు స్పర్శేంద్రియ గతుండగు. పృథగ్భావంబైన శ్రోత్రంబుల దిక్కు లచ్యుత కళాంశంబులగు, శ్రవణేంద్రియ యుక్తంబులై నిజస్థానంబునం బొందిన జీవుండు శబ్దజ్ఞాన గతుండగు; వెండియుఁ దాలువు నిర్భిన్నం బయిన లోకపాలుండగు వరుణుం దందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులన్ గ్రహించెఁ; బరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినే యాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొంది జంతువు గంధగ్రహణ సమర్థంబయ్యె; వెండియు

భిన్నంబయిన చర్మంబును నోషధులును బరమపురుషాంశంబు లయిన కేశంబులంగూడి నిజనివాసంబు నొందిన జీవుండు కండూయ మానుండగు; భిన్న భూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందిన జీవుం డానందంబునం బొరయు; భిన్నభావంబైన గుదంబున మిత్రుం దచ్యుతాంశంబును బొంది పాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందిన జీవుండు విసర్గంబుఁ జెందు; వేఱు వేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్రయాది శక్తియుక్తుఁ డగుచు నిజస్థానంబు నొందిన జీవుండు వానిచేత జీవికం బొందు; మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు లయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమ నార్హుండయ్యె; వెండియు భిన్నభావంబయిన హృదయంబు మనంబుతోడం గలసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించిన జీవుండు శరీరసంకల్పాది రూపంబగు వికారంబునుం బొందు; భిన్నభావంబైన యహంకారంబున నహంకృతి యుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు; ఆ యహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడపు; బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబు తోడం గలసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు; భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు; నట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, చరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె; సత్త్వాదిగుణ పరిణామంబుల నమరులైరి; ఊర్జిత సత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబునుం బొందిరి; రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి; తామసంబున భూతాదులైన రుద్రపారిషదులు ద్యావాపృథి వ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి; ముఖంబువలన నామ్నాయంబు ఉత్పన్నంబులయ్యె. వెండియు.

215

తా॥ అలాగే విరాట్పురుషునిలో కొంతభాగం వేరై చెవులుగా ఏర్పడింది. ఈశ్వరాంశ అయిన దిక్కులు జీవుని శ్రవణేంద్రియాన్ని కూడి జీవునకు శబ్ద జ్ఞానాన్ని కలిగిస్తున్నాయి. అలాగే

ఈశ్వరాంశ అయిన వరుణుడు జీవుని రసనేంద్రియంగా కనిపిస్తూ రుచులను తెలుసుకొంటున్నాడు. అలాగే పరమేశ్వరుని నుండి ముక్కు అనేది వేరై ఆయన అంశగల అశ్వనీదేవతలకు అధిష్ఠానమై జీవునకు వాసన చూసే శక్తి కలిగింది. పరమపురుషుని నుండి వేరైన చర్మం ఆయన అంశములైన కేశములను కూడటంచేత ప్రాణికి దురదకు గోకుకొనుట అనేది పుట్టింది. ఈశ్వరాంశ అయిన ప్రజాపతి శుక్రంతో సంయోగం పొందటం వల్ల జీవుడు అపరిమితమైన ఆనందాన్ని పొందుతున్నాడు. అలాగే గుదస్థానంలో అచ్యుతాంశ అయిన మిత్రుడు వాయువుతో కూడి ఉండటంవల్ల జీవునకు మలమూత్ర విసర్జన శక్తి కలుగుతున్నది.

అలాగే విరాట్పురుషుని నుండి వేరైనా; ఈశ్వరాంశయైన ఇంద్రుడు ఉన్నందువల్ల చేతులతో ఇచ్చి పుచ్చుకొను శక్తిగలవాడై జీవుడు జీవనోపాధిని పొందుతున్నాడు. పాదాలను విష్ణువు అధిష్ఠించి నడిచే శక్తిని కలిగించటం వల్ల జీవుడు నడిచే శక్తిగల వాడవుతున్నాడు. చంద్రుడు మనస్సులో ప్రవేశించడం చేత జీవుడు సంకల్ప, వికల్పాలను పొందుతున్నాడు. అలాగే అహంకారంలో రుద్రుడు ప్రవేశించినప్పుడు జీవుడు కర్తవ్యాన్ని తెలుసుకొని నిర్వర్తిస్తాడు. బుద్ధి వాగీశ్వరుని నివాసమై జ్ఞానాంశతో కూడినప్పుడు జీవునకు విషయాన్ని గ్రహించే నేర్పు కలుగుతుంది. బ్రహ్మకు నివాసమై చైతన్యాన్ని పొందినప్పుడు జీవుడు విజ్ఞాని అవుతాడు.

అటువంటి విరాట్ పురుషుని శిరస్సునుండి స్వర్గము, పాదాల నుండి భూమి, నాభినుండి ఆకాశము ఏర్పడ్డాయి. సత్త్వగుణము వలన ఆ దేవతలు స్వర్గాన్ని పొందారు. రజోగుణం వలన మనుజులు, గోవులును భూలోకాన్ని పొందారు. తామసగుణం వలన భూతాదులైన రుద్రపార్షదులు మిన్నుకు మన్నుకుగల మధ్య భాగాన్ని పొందారు. విరాట్పురుషుని ముఖం నుండి వేదాలు పుట్టాయి.

క. ధరణీదివిజులు శ్రుతులును, నరవర! యమ్మేటి ముఖమునం బొడముట భూ సురుఁ
డఖిల వర్ణములకున్, గురుఁడున్ ముఖ్యుండు నయ్యె గుణరత్న నిధీ!

తా॥ బ్రాహ్మణులు, వేదాలు ఆ విరాట్‌పురుషుని ముఖంనుండి పుట్టిన కారణముగా బ్రాహ్మణుడు అన్ని వర్ణములకు ముఖ్యుడు, గురువు అయ్యాడు.

క. ధర బ్రాహ్మణాదికము ద, స్కర బాధలఁ బొందకుండఁ గైకొని కావన్ బురుషోత్తము బాహువులన్, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ!

217

తా॥ ఓ నీతి విశారదుడవైన విదురా! బ్రాహ్మణుడు మొదలైన వర్ణాలవారు, దొంగలు, దుర్మార్గులు మొదలైన వారి బాధపడకుండా కాపాడటం కొరకు పురుషోత్తముడి భుజాలనుండి క్షత్రియజాతి ఉద్భవించింది.

క. గణుతింపఁగఁ గృషిగో ర, క్షణవాణిజ్యాది కర్మకలితంబుగ నా గుణనిధి యూరువులందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్.

218

తా॥ వ్యవసాయం, గోపరిరక్షణం, వ్యాపారం మొదలైన కార్యాలను చక్కపెట్టడంకోసం సర్వేశ్వరుని తొడలనుండి వైశ్యజాతి పుట్టింది.

తే. తివిరి సేవక ధర్ములై దేవదేవు, పదములను శూద్రసంతతు లుదయమైరి వీర లందఱుఁ దమతమ విహితకర్మ, మలరఁ జేయుచు జనకుండు నాత్మగురుఁడు.

219

క. అగు సర్వేశు పరాత్పరు, జగదేకప్రభుని పాదజలజాతంబుల్ దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకులై.

220

తా॥ ఆ దేవదేవుని చరణముల నుండి సేవకావృత్తియే ధర్మంగాగల శూద్రసంతతి

పుట్టారు. వీళ్ళంతా వారివారి పనులు చేస్తూ... ఈ లోక జనకుడు, ఆత్మగురుడు అయిన సర్వేశ్వరుని యొక్క పాదపద్మాలను వేదములలో చెప్పబడిన రీతిగా, భక్తియోగంతో నిత్యము సేవిస్తూ ఉంటారు.

తే. మహిమ దీపింపఁ గాలకర్మ స్వభావ, శక్తి సంయుక్తుఁ డగు పరమేశ్వరుని భూరి యోగమాయా విజృంభణోద్యోగ మెవ్వఁ, డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత!

221

తా॥ ఓ మహనీయ చరిత్రా! కాలము, కర్మ, స్వభావము... ఈ శక్తులచే కూడియున్న సర్వేశ్వరుని గొప్ప యోగమాయా శక్తుల విజృంభణమును తెలుసుకొని స్తుతించడానికి ఎవరికి సాధ్యమవుతుంది?

ఉ. అన్యకథానులాపము లహర్నిశమున్ బఠియించి చాల మా లిన్యము నాత్మశోభన విలీనత నొందు మదీయ జిహ్వ సౌ జన్యము నొందె నేఁడు హరిసద్గుణ దివ్య కథామృతంబు స న్మాన్యచరిత్రమై నెగడు మద్గురు వాక్యపదంబుఁ జెందఁగన్.

222

తా॥ ఓ విదురా! నా నాలుక ఇతరుల కథాగానాలను చదివి, విని చాలా మలినమై పోయింది. ఇప్పుడు సన్మాన్యుడైన నా గురుదేవులు చెప్పిన మార్గంలో వెళ్ళి ఆ హరి యొక్క మంచి గుణములతో కూడిన దివ్య కథామృతమును పానం చేస్తాను.

మ. హరినామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁ డైనట్టి స త్పురుష శ్రేష్ఠుఁ డసత్కథాలవణవాః పూరంబుఁ దాఁ గ్రోలునే? వరమందార మరంద పానకుతుకస్వాంత ద్విరేఫంబు స త్వరమై పోవునె చేఁదు వేములకుఁ దద్గంధానుమోదాత్మమై.

223

తా॥ హరినామములకు అంకితమైనట్టి ఉత్తమ కథలనే అమృతాన్ని గ్రోలేటటువంటి సత్పురుష శ్రేష్ఠుడు అసత్కథలనే ఉప్పునీటిని త్రాగుతాడా? శ్రేష్ఠమైనటువంటి మందార మకరందాన్ని త్రాగి మైమరచే తుమ్మెద చేదైన వేపపూతకోసం ఆ చెట్లదగ్గరకు వెడుతుందా?

క. హరి మహిమముఁ దన్నాభీ, సరసిజ సంజాతుఁడైన చతురాననుఁడున్ బరికించి యెఱుఁగఁ డన్న నితర మనుజులఁ జెప్పనేల తత్త్వజ్ఞనిధీ!

224

తా॥ తత్త్వవేత్తవైన విదురా! హరి మహిమను ఆయన నాభికమలం నుండి పుట్టిన చతుర్ముఖ బ్రహ్మ కూడా ఎరుగడంటే ఇతర మనుష్యుల మాట చెప్పేదేముంది?

తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ, రీకలోచను నుత్తమ శ్లోకచరితు నమర గణ వంద్యమాన పాదాబ్జ యుగళు, వెదకి కనుఁగొనలే వంద్రు విమల మతులు.

225

తా॥ వేదాలు సైతం తమలో వివరించిచూడగ... ఉత్తమ శ్లోకచరితుడు, పద్మదళముల వంటి కన్నులు కలవాడు, దేవతాగణం నమస్కరించే దివ్యపాదాలు కలవాడైన విష్ణువును వెదకినప్పటికీ చూడలేక పోయాయని విజ్ఞులంటారు.

క. హరియున్ దన మాయాగతిఁ, బరికించియుఁ గానఁడయ్యెఁ బరిమితి లేమిన్ మఱి మాయావిని మోహిని, చరితముఁ గనుఁ గొందు రెట్లు చతురాస్యాదుల్?

226

తా॥ విదురా! ఆ హరిసైతం పరిమితి లేని తన మాయాగతిని చూడలేక పోయాడంటే ఇక బ్రహ్మాదులు ఏమి చూడగలరు?

క. ఆ దివిజాధీశుఁడు, మహ, దా దులు, దిక్పతులుఁ, బంకజాసనుఁడున్, గౌ రీ

దయితుఁడు గనఁజాలని, శ్రీ దేవుని పదయుగంబుఁ జింతింతు మదిన్.

227

తా॥ దేవతలకు ప్రభువైన ఇంద్రుడు, మహదాది తత్త్వాలు, అష్టదిక్పాలకులు, బ్రహ్మ, గౌరీపతి ఇత్యాదులు చూడలేని శ్రీదేవదేవుని పాదపద్మాలను నా మనస్సులో ధ్యానిస్తాను.

క. అని మైత్రేయుం డవ్విదు, రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న ర్జున పౌత్త్రునకుఁ బరాశర, ముని మనుమం డెఱుఁగఁ జెప్పి ముదము దలిర్పన్.

228

వ. వెండియు నిట్లనియె.

229

తా॥ ఈ విధంగా మైత్రేయ మహర్షి విదురునికి ఎరిగించిన విషయాలన్నిటిని మనోహరంగా అర్జున పౌత్రుడైన పరీక్షిత్తునకు శ్రీశుక మహర్షి తెలిసేటట్లుగా చెప్పి సంతోషంతో ఇలా అన్నాడు:

క. భూమీశ్వర! మైత్రేయ మ, హాముని విదురునకు నట్లు హరి శుభగుణ లీ లా మాహాత్మ్యముఁ జెప్పిన, నా మైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్.

230

తా॥ ఓ మహారాజా! మైత్రేయ మహర్షి విదురునితో ఈ విధంగా శ్రీహరి యొక్క శుభగుణాలను గురించి చెప్పగా మైత్రేయునితో విదురుడిలా అన్నాడు:

క. అగుణుండగు నీశ్వరునకు, జగదవనోద్భవ వినాశ సత్కర్మములుం దగులీల లెట్టు లాతఁడు, సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ!

231

తా॥ ఓ సౌజన్య మూర్తీ! మైత్రేయా! భగవంతుడు నిర్గుణుడు గదా! నిర్గుణునకు ఈ లీలావిశేషాలు ఎలా పొసగుతాయి? ఆయనే సగుణుడు – ఆయనే నిర్గుణుడూనా? ఇది పరస్పర విరుద్ధంగా ఉంది!

భగవత్సాక్షాత్కారం పొందితే గాని ఇదంతా బోధపడదు. భక్తుల నిమిత్తం భగవంతుడు వివిధ రూపాలను దాలుస్తాడు.

రంగుల అద్దకంలో చిత్రమైన పద్ధతిని అవలంబించేవాడు ఒకడుండేవాడు. అద్దకం కోసం తనవద్దకు వచ్చేవారితో అతగాడు "మీ వస్త్రాలకు ఏ రంగు అద్దాలి?" అని అడిగేవాడు. ఎరుపురంగు కావాలంటే, తన తొట్టెలో అతడు వస్త్రాన్ని ముంచి, "ఇదిగో, మీ వస్త్రానికి ఎరుపురంగు వేసాను" అని బయటికి తీసి చూపేవాడు. మరొకడు పచ్చరంగు వేయమంటే, అతడు అదే తొట్టెలో వస్త్రాన్ని ముంచి పైకి తీసేసరికి అది పచ్చగా ఉండేది. అదేవిధంగా నీలి, నారింజ, ఊదా, ఆకుపచ్చ మొదలైన ఏ రంగువేయవలసినా అతడు అదే తొట్టెను అదే ప్రకారం వినియోగించేవాడు. ఇదంతా గమనిస్తున్న ఒకడు ఆ రంజకుడి వద్దకు వచ్చి ఇలా అన్నాడు: "మిత్రుడా! నాకు ఏ రంగులోను ప్రీతి లేదు. నీ అభిరుచిని తెలుసుకొని నా వస్త్రానికి నీకు ఇష్టం వచ్చిన రంగును వేయించుకోవడమే నా కోరిక." భక్తుడి అభీష్టంమేరకు సాకారుడుగా గాని, నిరాకారుడుగా గాని భగవంతుడు అతడికి సాక్షాత్కరిస్తాడు. దివ్యదర్శనాలు సాపేక్షాలు, అంటే వివిధ పరిస్థితుల్లో ఉన్న వివిధ వ్యక్తుల మనోభావాన్ని అనుసరించి అవి యథార్థాలై ఒప్పుతాయి. తన రంగు ఏదో ఆ దివ్యరంజకుడికి ఒక్కడికే తెలుసు. అతడి దివ్య రూపాలకు ఎవరూ పరిమితిని కల్పించలేరు. 'భగవంతుడు ఈ రూపంలో ప్రత్యక్షమౌతాడు, ఆ రూపంలో కాబోడు' అని ఎవరూ నిర్ణయించలేరు.

–శ్రీరామకృష్ణ పరమహంస

సీ. అని యర్భకునిగతి యనుకొని మైత్రేయ, మునిఁ జూచి విదురుఁ డిట్లనియె మరల

బాలుఁడు క్రీడావిలోలమానసమున, దీపించు లీలానురూపుఁ డగుచుఁ గానిచోఁ గామానుగతుఁడై రమించును, నర్భకుఁ డర్థి వస్త్వంతరమున నర్భకాంతరమున నైనను బాలకే, ళీసంగుఁ డగుచు నోలినిఁ జరించు

తే. హరియు నెపుడు నివృత్తుఁడత్యంత తృప్తుఁ, డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు? మఱియుఁద్రిగుణాత్మకంబైన మాయఁ గూడి, యఖిల జగములఁ గల్పించె ననుట యెట్లు?

232

తా॥ అని విదురుడు "భగవంతుడు బాలునివలె క్రీడిస్తున్నాడా?" – అనుకొని మైత్రేయునితో మళ్ళీ ఇలా అన్నాడు: "బాలుడు ఆడుకోవాలి అనిపించినప్పుడు ఆడుకుంటాడు. కొన్ని ఆటవస్తువులు, కొంతమంది బాలకులు ఉంటే ఆట బాగా సాగుతుంది. కాని భగవంతుడు నిర్గుణుడు కదా! త్రిగుణాత్మకమైన మాయవల్ల అంతులేని ఈ సృష్టి అంతా ఎలా చేశాడో ఆశ్చర్యంగా ఉంది.

సీ. అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి, పాలించి పొలియించి పరమపురుషుఁ డనఘాత్మ! దేశకాలావస్థలందును, నితరులయందు నహీనమైన జ్ఞానస్వభావంబుఁ బూని యా ప్రకృతితో, నెబ్భంగిఁ గలసె? దా నేకమయ్యుఁ గోరి సమస్తశరీరంబులందును, జీవరూపమున వసించి యున్న

తే. జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి, కర్మమున సంభవించెను? గడఁగి నాదు చిత్త మజ్ఞాన దుర్గమస్థితిఁ గలంగి, యధికఖేదంబు నొందెడు ననఘచరిత!

233

తా॥ ఓ పాపరహితుడా! తన మాయచేత అనంతమైన సృష్టిని చేసి దేశము, కాలము మొదలైన అనేక అవస్థలను కల్పిస్తున్నాడు. కొందరిని సృష్టించి వారియందు పరిపూర్ణమైన జ్ఞానంతో ఉంటున్నాడు. ప్రకృతిలో ఎలా కలసి ఉంటున్నాడు? తానొక్కడే అయివుండి

కోటానుకోట్ల జీవుల శరీరాలలో ఎలా ఉంటున్నాడు? ఆయనకు ఏ కర్మఫలితం ఇదంతా? నా మనస్సు అజ్ఞానంలోపడి అధిక దుఃఖాన్ని పొందుతున్నదయ్యా.

వ. అది గావున సూరిజనోత్తముండవైన నీవు మదీయ మానసిక సంశయంబులం దొలఁగింప నర్హుండవని విదురుండు మైత్రేయ మహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూభవుఁ డభిమన్యు నందనున కిట్లనియె.

234

తా॥ ఈ సందేహాలన్నిటినీ తీర్చడానికి సూరిజనోత్తముడవైన నువ్వు సమర్థుడవు" అని విదురుడు మైత్రేయుణ్ణి అడిగాడు అని చెప్పి శ్రీశుక మహర్షి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు:

క. సరసిరుహోదర మంగళ, చరితామృతపాన కుతుక సంగంబున ని ర్భరుఁడగు విదురునకు మునీ, శ్వరుఁడగు మైత్రేయుఁ డనియె సజ్జనతిలకా!

235

తా॥ "ఓ సజ్జన తిలకా! విష్ణువు యొక్క చరితామృతమును పానం చేయాలనే కుతూహలంతో ఉవ్విళ్ళూరే విదురునితో మైత్రేయుడిలా అంటున్నాడు:

చ. వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్ల సరోజపత్ర నే త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁ బరేశు నిత్య శో భనయుతు బంధనాదిక విపద్దశలుం గృపణత్వ మెప్పుడే ననయముఁ బొందలేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్.

236

తా॥ "విదురా! విను! కమలనేత్రుడైన విష్ణువు యొక్క మాయ అమేయమైనది. అది తర్కానికి అందదు. ఆయన ఆద్యుడు, అనంతుడు, నిత్యుడు. ఆ కారణంగా ఈ బంధాలు, విపత్తులు ఆయనను అంటవు. ఆయన అన్నిటికీ అతీతుడు.

వ. మఱియును.

237

చ. పురుషుడు నిద్రవోఁ గలలఁ బొందు సమస్త సుఖంబు లాత్మ సం హరణ శిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం దరయఁగఁ దోఁచుచున్న గతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం బొరయక తక్కు టెట్లనుచు బుద్ధిని సంశయ మందె దేనియున్.

238

తా॥ పురుషుడు నిద్రపోయే సమయంలో ఏవేవో కలలు కంటాడు. ఆ కలల్లో తానెన్నో సుఖాలు పొందుతూన్నట్లు, ఎన్నో కష్టాలు అనుభవిస్తూన్నట్లు కలలు కంటాడుగాని తిరిగి తెలివి రాగానే అవన్నీ కేవలం కలలని తెలుసుకుంటాడు. ఆ ప్రకారంగానే భగవంతుడు జీవుడుగా నటిస్తూన్నప్పుడు సుఖదుఃఖములేవీ ఆయనకు అంటవు. అయితే మనం కలలు కంటూన్నప్పుడు అనుభవించే దుఃఖమైనా ఆయనకు ఉండదా?" అనే శంక కలిగితే విను.

వ. అవ్విధం బతనికిం గలుగ నేర దది యెట్లంటేని.

239

చ. లలిత విలోల నిర్మల జలప్రతిబింబిత పూర్ణచంద్ర మం డలము దదంబుచాలనవిడంబన హేతువు నొందియున్ వియ త్తలమునఁ గంప మొందని విధంబున సర్వశరీరధర్మముల్ గలిగి రమించు నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్.

240

తా॥ ఈశ్వరునకు కర్మబంధనాలు లేవు. ఎలాగంటే నిర్మలజలాల్లో ప్రతిబింబించిన చంద్రుడు నీటి కదలిక వల్ల తానూ కదలుతున్నట్లు కనుపిస్తాడు కాని; ప్రతిబింబం కదలినా ఆకాశంలో ప్రకాశించే అసలు చంద్రబింబం కదలని విధంగా అనేక శరీరాల్లో ఉంటూ రమించే ఈశ్వరుడికి కర్మబంధనాలు లేవు.

వ. కావున జీవునకు నవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగుంగాని సర్వభూతాంతర్యామి యైన యీశ్వరునకుం బ్రాప్తంబు గానేరదని వెండియు.

241

తా॥ కావున జీవునకు మాత్రం అవిద్యవలన కర్మబంధనాలు కలుగుతున్నాయి కాని సమస్తమైన జీవులయందు అంతర్యామి స్వరూపంగా ఉండే ఈశ్వరునకు మాత్రం ఏ విధమైన బంధనాలు లేవు.

చ. నరునకు నాత్మ దేహజగుణంబులఁ బాపఁగ నోపుఁ బంకజో దర చరణారవింద మహితస్ఫుట భక్తియ; యింద్రియంబు లీ శ్వర విషయంబులైన మది సంచితనిశ్చలతత్త్వ మైనచో సరసిజనేత్రు కీర్తనమె చాలు విపద్దశలన్ జయింపఁగన్.

242

తా॥ నరుడికి తన దేహంనుండి పుట్టిన గుణాలను బాపుకోవడానికి శ్రీహరి పాదపంకజముల మీద దృఢమైన భక్తిచాలు; అలాగే తనకు కలిగిన కష్టాలను అధిగమించడానికి నిశ్చలమైన తత్త్వంతో, ఏకాగ్రభావంతో ఆయన యొక్క సంకీర్తనం చాలు.

చ. హరిచరణారవింద యుగళార్చన సన్నుతి భక్తి యోగముల్ నిరతముఁ గల్గువారు భవ నీరజగర్భుల కందరాని భా సురపదమందుఁ జేరుదురు; సూరిజనస్తవనీయ! యట్టి స త్పురుషుల పూర్వజన్మఫలమున్ గణుతింపఁ దరంబె? యేరికిన్.

243

తా॥ పండితుల చేత పొగడబడే వాడా! విదురా! శ్రీహరి యొక్క చరణారవిందములను నిత్యము భక్తితో సేవిస్తూ ఉండేవారు, ఈశ్వరునకు, బ్రహ్మకు అందని గొప్పస్థానాన్ని చేరుకుంటారు. అటువంటి సత్పురుషుల పూర్వజన్మ ఫలాన్ని పొగడటం ఎవరితరం.

వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళిత హస్తుండును వినమిత మస్తకుండును నగుచుఁ దన మనంబున శ్రీహరిం దలంచుచు వినయ వచనరచనుండై యిట్లనియె. మునీంద్రా! భవదీయ వాక్యంబులచేత నా మనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు, శరీరధారియైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యె; నెట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు; నారాయణభక్తిప్రభావంబు ప్రాణిగోచరంబైన యవిద్యకు నాశన కారణం బనం దనరుచుండు; నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుండై విశ్వంబుం బొదివి యందుఁ దా నుండు తెఱంగెట్లు? శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముండై సంసారప్రవర్తకుం డగు? నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముండైన పుండరీకాక్షునిం జెందు? వీర లిద్దఱును సంశయ క్లేశంబులు లేమింజేసి సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధి నొందువార లగుదు; రెవ్వండు సుఖదుః ఖానుసంధానంబుచే లోకానుగతుం డగుచుం బ్రమోద వేదనంబుల నొందు; నతండు దుః ఖాశ్రయుండగు; నారాయణ భజనంబున సమస్త దుఃఖనివారణం బగునని భవదీయచరణ సేవానిమిత్తంబునం గంటిఁ: బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగి యున్న దయిన నందులకుఁ గారణంబు లేకుండుటంజేసి తెలియనివాఁడనై వర్తింతునని వెండియు.

244

తా॥ అని మైత్రేయుడు చెప్పగా వింటూన్న విదురుడు చేతులు జోడించి తలవంచి నమస్కరించి తన మనస్సులో శ్రీహరిని తలుస్తూ వినయంగా ఇలా అన్నాడు: "ఓ మహామునీ! నువ్విప్పటి వరకు చెప్పిన విషయముల వలన నా మనస్సులో నారాయణుడు లోకైకనాథుడు ఎలా అయ్యాడు, ఈ జీవునికి కర్మబంధాలు ఎలా కలిగాయి అనే సందేహాలు తొలగిపోయాయి. శ్రీహరి సర్వస్వతంత్రుడు, జీవుడు పరతంత్రుడు అని ఇప్పుడు నిర్ధారణ అయ్యింది. నారాయణుని మీద భక్తి ఒక్కటే ప్రాణులయొక్క అవిద్యను నశింపచెయ్యడానికి కారణమవుతుంది. శరీరంమీద

అభిమానంతో మూఢుడై సంసారప్రవర్తకుడు అయ్యేవాడు – భక్తిమార్గంలో భగవంతుణ్ణి నమ్మినవాడు వీళ్ళిద్దరూ సంశయం లేనికారణంగా సుఖానంద పరిపూర్ణులై అభివృద్ధిలో ఉంటారు. ఎవడు సుఖదుఃఖాలను అనుభవిస్తూ సుఖంవలన ఆనందాన్ని, దుఃఖం వలన వేదనను పొందుతూ ఉంటాడో వాడు జీవితంలో చిక్కులపాలవుతాడు. ఈ సుఖదుఃఖ కారణభూతమైన ప్రపంచం కచ్చితంగా ఉన్నట్లు తోస్తోంది. అట్టి ప్రతీతి కలిగి ఉండటానికి కారణం మాత్రం నాకు తెలియటం లేదు.

క. లలి నా మదిఁ దలఁపుదు సుమ, తులు గొనియాడంగఁ దగిన తోయజనాభుం దలవడఁ డల్పతపోనిర, తుల తలపోఁతలకు మిగుల దుర్లభుఁ డనియున్.

245

తా॥ అల్పమైన తపస్సు చేసేవారికి శ్రీహరి అందరానివాడు అని నా మనస్సులో అనుకుంటూ ఉంటాను.

సీ. ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహ, దాదుల నితరేతరానుషంగ ముగఁ జేసి వానియం దొగి విరాడ్దేహంబు, పుట్టించి యందుఁ జేపట్టి తాను వసియించు నాతఁడు వరుస సహస్ర సం, ఖ్యాకంబులగు మస్తకాంఘ్రిబాహు కలిత సత్పురుషునిగాఁ బ్రహ్మవాదులు, పలుకుదు రా విరాట్ప్రభువునందు

తే. భువనజాలంబు లలజడిఁ బొరయకుండుఁ, బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి యాధిదైవతములుఁ గూడ ననఘ! త్రివిధ, మగుచు విప్రాది వర్ణము లయ్యె నందు.

246

తా॥ పరమేశ్వరుడు ఇంద్రియాదులతో కూడిన మహదాదులకు ఒకదానికి మరొకటి దగ్గరయ్యేటట్లు చేసి విరాట్ దేహాన్ని పుట్టించి అందు ఉంటున్నాడు గదా! బ్రహ్మవాదులు ఆ పరమేశ్వరుణ్ణి సహస్ర శీర్షునిగా, సహస్ర పాదునిగా, సహస్ర బాహునిగా స్తుతిస్తున్నారు.

ఆయనలో అన్ని లోకాలు అలజడి లేకుండా ఉన్నాయి. ఆ విరాట్ స్వరూపం నుండి పదిప్రాణాలు, అంతులేని ఈ ప్రపంచం, అనేకమంది దేవతలు, బ్రాహ్మణాది వర్ణాలు... ఇంకా అనేకం పుట్టాయి.

క. ఇలఁ బుత్త్రపౌత్త్రసంపద, గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా లలిఁ బ్రజ లే గతిఁ గలిగిరి?, కలిగిన యాప్రజలచే జగము లెట్లుండెన్?

247

తా॥ అందుండి కొడుకులు, మనుమలు ఈ ప్రజలంతా ఎలా ఉద్భవించారు! ఆ ప్రజలతో ఈ లోకాలు ఎట్లా ఉన్నాయి?

క. చతురత దీపింపఁ బ్రజా, పతులకుఁ బతి యనఁగ వెలయు పద్మావతి యే గతిఁ బుట్టించెను స్రష్టృ, ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్.

248

తా॥ ప్రజాపతులకు పతి అయిన లక్ష్మీపతి ఎంతో చతురతతో ఈ ప్రపంచాన్ని ఎలా సృష్టించాడు?

తే. వానిభేదంబులును మనువంశములును, మనుకులాధీశ్వరులును దన్మనుకులాను చరితములు నే విభూతి నే జాడ దీని, నింతయును బుట్టఁజేసె? నా కెఱుఁగఁ బలుకు.

249

తా॥ మనువంశాలను, మనుకులానికి అధిపతులను, వాళ్ళ చరిత్రలను, ఈ సృష్టిలోని భేదాలను ఏ విధంగా పుట్టించాడో నాకు తెలియచెప్పండి.

క. సరవిం గ్రిందన్ మీఁదం, ధరణికిఁ గల లోకములను దత్తత్స్థితులన్ వరుసం బరిణామంబుల, నెఱిఁగింపఁగదయ్య నాకు నిద్ధచరిత్రా!

250

తా॥ స్వామీ! ఈ భూమికి క్రింద, మీద ఉన్న లోకాలను, వాటి స్థితిగతులను, వాటిలో వచ్చిన పరిణామాలను నాకు చెప్పండి.

క. సురతిర్యఙ్నరరాక్షస, గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ శ్చరముఖ భవములు మునికుం, జర! గర్భస్వేదజాండజముల తెఱంగున్.

251

తా॥ ఓ మునికుల తిలకా! దేవతలు, జంతువులు, నరులు, రాక్షసులు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, ఖేచరులు మొదలైన వారంతా ఎలా పుట్టారు? గర్భజములు, స్వేదజములు, అండజములు ఇవన్నీ ఎలా పుట్టాయో కూడా నాకు చెప్పండి.

క. త్రిగుణప్రధానకంబుగ, నగు నవతారములఁ బూర్ణమై వెలసిన యా జగదుత్పత్తి స్థితిలయ, నిగమముల విధంబు వాని నిలుకడలు దగన్.

252

తా ॥ సత్వరజస్తమోగుణాలు ప్రధానంగాగల అవతారాలను, ఈ జగత్తు యొక్క పుట్టుక, స్థితి, నాశనములను, వేదాలను వాటి శాశ్వతత్వాన్ని గురించి నాకు తెలియ చెప్పండి.

క. చక్రాయుధుసౌందర్య ప, రాక్రమముఖ గుణములును, ధరామరముఖ వ ర్ణ క్రమములు, నాశ్రమ ధ, ర్మక్రియలును, శీలవృత్తమతభావములున్.

253

తా॥ చక్రాయుధుడైన హరియొక్క సౌందర్య, పరాక్రమాల గురించి; బ్రాహ్మణాది వర్ణముల గురించి, ఆశ్రమధర్మాల గురించి, వారి శీలము నడవడి, మత భావముల గురించి నాకు చెప్పండి.

తే. యోగవిస్తార మహిమలు యాగములును, జ్ఞానమార్గములును బరిజ్ఞాన సాధ నములునై యొప్పు సాంఖ్యయోగములు వికచ, జలజనయన స్మృతంబులౌ శాస్త్రములును.

254

తా॥ యోగుల యొక్క మహిమలు, యాగములు, జ్ఞానమార్గములు, సాంఖ్య యోగములు, శ్రీహరిని గూర్చి చెప్పే శాస్త్రముల గురించి నాకు చెప్పు.

సీ. పాషండ మార్గంబుఁ బ్రతిలోమకుల విభా, గములు జీవులు గుణకర్మములును బలుకులు గతులును గలిగెడి ధర్మ మో, క్షముల యందలి పరస్పరవిరోధ ములు లేని సాధనములు భూమిపాలక, నీతి వార్తలు దండనీతి జాడ యును బృథగ్భావంబులును విధానములును, బితృమేధములును దత్పితృవిసర్గ

తే. గతులుఁ దారాగ్రహంబులుఁ గాల చక్ర, మున వసించిన నిలుకడలును దపములు దానములుఁ దత్ఫలంబులుఁ దనరు ప్రబల, ధర్మములు బ్రజ లొనరించు కర్మములును.

255

తా॥ నాస్తికుల యొక్క నడవడిక ఎలా ఉంటుంది? అశాస్త్రీయంగా పుట్టిన వారి విభాగములు ఎట్టివి? లోకంలో జీవుల గుణములు, కర్మములు, పలుకులు, నడవడి ఎట్టివి? ధర్మమోక్షములలో పరస్పరం విరోధం లేని సాధనములు ఎట్టివి? రాజనీతి, దండనీతి, వేర్పాటు పద్ధతులు, పితృయజ్ఞాలు, తారలు, గ్రహాలు, వాటి స్థానాలు, తపస్సులు, దానాలు, వాటి ఫలితాలు, ఇతర ధర్మములు, ప్రజలు చేసే కర్మలు, వాటి ఫలితాల గురించి నాకు దయతో చెప్పండి.

చ. వదలక భూజనావళికి వచ్చు విపద్దశ ధర్మముల్, సరో జదళనిభాక్షుఁ డేగతిని సంతస మందెడు? నెట్టివారి మేల్ వదలక కానవచ్చు, గురులం బ్రియశిష్యులు గొల్వ వారు స మ్మదమునఁ గోరు నర్థములు మానుగ నెట్లెఱిఁగింతు రిమ్ములన్.

256

తా॥ ఈ జనులకు వచ్చే ఆపద్ధర్మాలు ఎట్టివి? ఆ హరి ఎలా సంతోషిస్తాడు? ఎవరు చేసిన ఉపకారం ఎప్పుడూ కనిపిస్తూ ఉంటుంది? ప్రియశిష్యులు కొలిచినప్పుడు గురువులు కోరే పరమార్థం ఏమిటి? నాకు చెప్పండి.

క. విలయాది భేదముల న, య్యలఘునిఁ బరమేశు నెవ్వ రంచితభక్తిం గొలుతు రదెవ్వరిలో
ను, త్కలికన్ సుఖీయించు జీవ తత్త్వము? మఱియున్.

257

తా॥ లోకాలకు నాశనం ఎన్ని విధాలుగా ఉంటుంది? పరమేశ్వరుణ్ణి ఎవరు భక్తితో కొలుస్తారు? ఎవరిలో సుఖించే తత్త్వం ఎక్కువగా ఉంటుంది?

క. గోవిందుని రూపంబును, జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెటులౌ? భావన నుపనిషదర్థం,
బై వెలసెడి జ్ఞాన మెట్టి దార్యస్తుత్యా!

258

తా॥ ఓ మైత్రేయా! పరమేశ్వరుడి స్వరూపం ఎలా ఉంటుంది? జీవబ్రహ్మలకు అభేదం ఎలా కుదురుతుంది? ఉపనిషత్తులను ఎలా అర్థం చేసుకోవాలి?

తే. ఉచిత మగునట్టి శిష్యప్రయోజనములు, సజ్జనులచేత విజ్ఞానసాధనములు
నేమి పలుకంగఁబడు, వాని నెల్ల మఱియుఁ, బొలుచు వైరాగ్యమునఁ దగు పురుషభక్తి.

259

తా॥ శిష్యుడు ఉత్తముడైతే గురువుకు కలిగే ప్రయోజనం ఏమిటి? ఉత్తముడైన గురువువద్ద శిష్యునకు బోధించే విజ్ఞాన సాధనాలు ఎలా ఉంటాయి? తీవ్రమైన వైరాగ్యం వల్ల కలిగే భగవద్భక్తి ఎటువంటిది?

తే. ఇన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు; యజ్ఞ దానాది పుణ్య ఫలము, వేదంబు సదివిన ఫలము, నార్త, జనులఁ గాచిన ఫలముతో సమము గావు.

260

తా॥ నేను అడిగినవన్నీ తెలిసేటట్లుగా చెప్పి నన్ను రక్షించు. యజ్ఞాలు చేసిన ఫలం, దానాలు చేసినఫలం, వేదాలు చదివిన ఫలం ఇవన్నీ కలిపిన ఫలం ఆర్తులైన జనులను కాచిన ఫలముతో సమంకావు."

క. అని విదురుఁడు మైత్రేయుని, వినయంబునఁ దెలియ నడుగు విధమెల్లను వ్యా సుని సుతుఁ డభిమన్యుని నం, దనున కెఱింగించి మఱియుఁ దగ నిట్లనియెన్.

261

తా॥ అని విదురుడు మైత్రేయుణ్ణి వినయంగా అడిగిన విధమంతా శ్రీశుక మహర్షి పరీక్షిన్మహారాజుతో చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

చ. ఇలఁ గల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై వెలసిన పూరువంశము పవిత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా కలిత యశఃప్రసూన లతికాతతికిం బ్రతివాసరంబుఁ బెం పలరఁగఁ బ్రోది వెట్టుదు గదయ్య! ముకుందకథామృతంబునన్.

262

తా॥ "ఈ భూమిమీది మానవావళి అందరు నుతించడానికి యోగ్యమై వెలసిన పూరువంశాన్ని మరింత పవిత్రం చెయ్యడానికి పుట్టినవాడవు. మంచి గుణాలనే కీర్తిపుష్పాలను ధరించే లతాసమూహాలు వర్ధిల్లగా ప్రతిరోజు ముకుంద కథామృతంతో ప్రోదిచేస్తావు గదయ్య!

తే. అల్పతరమైన సుఖముల నందుచున్న, జనుల దుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి పుండరీకాక్ష గుణకథా ప్రోతమైన, వితత నిగమార్థ మగు భాగవతము నీకు.

263

వ. ఎఱింగింతు విను మని యిట్లనియె.

264

తా॥ అల్పమైన సుఖముల ననుభవిస్తూన్న జనుల దుఃఖాన్ని పోగొట్టే పుండరీకాక్షుని యొక్క గుణములతో కూడిన భాగవతాన్ని నీకెరిగిస్తాను.

సీ. అమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు, గైకొని పాతాళలోకమందు నప్రతిహతబుద్ధియై వాసుదేవాఖ్యఁ, బొలుచు సంకర్షణమూర్తి దివ్య పురుషుండు దనుఁదాన బుద్ధిలోఁ జూచుచు, సలలితధ్యాన ముకుళితనేత్రుఁ డై సనందాభ్యుదయార్థంబు గను విచ్చి, చూచిన వారు సంస్తుతు లొనర్ప

తే. నమర గంగావగాహనులై యహీంద్ర, కన్య లార్ద్రజటా బంధకలిత లగుచు భర్తృ వాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ, గదియ నేతెంచి తత్పాదకమలయుగము.

265

తా॥ వాసుదేవుడు అనే పేరుగల సంకర్షణమూర్తి, దివ్యపురుషుడు ఈ భాగవతామ్నాయాన్ని ఒకనాడు గైకొని పాతాళలోకంలోనికి తీసుకెళ్ళి తన్నుతానే బుద్ధిలో చూసుకుంటూ తదేకధ్యానంలో ముకుళిత నేత్రుడై సనందనాదుల అభ్యుదయార్థమై కన్నులువిప్పి చూసాడు. వారు సంస్తుతులు చేశారు. ఇంతలో అమరగంగలో స్నానాలు చేసిన నాగకన్యలు తడిసిన జడచుట్టలతో అక్కడకు వచ్చి, ఆ పరమపురుషుడే తమకు భర్తగా కావాలని వాంఛించి ఆయన పాదపద్మాలను సేవించారు.

క. సేవించి భక్తితో నా, నావిధ పూజోపహార నతి నుతులను నా దేవుని హృదయము వడసిరి, యావేళ సనందనాదు లమ్మహితాత్మున్.

266

తా॥ అలా సేవించి భక్తితో అనేక విధాల పూజించి సనందనాదులు పరమ పురుషుణ్ణి స్తుతింపసాగారు.

మ. ఘనసాహస్ర కిరీటరత్న విలసత్కాంత ప్రసిద్ధప్రభా జనితోదగ్రరుచి ప్రకాశితఫణా సాహస్రుఁడౌ దేవతా వనదీక్షాచణు రూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా రనురాగ స్ఖలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుఁడున్.

267

తా॥ వేలకొలది శిరస్సులుగల ఆ దేవదేవుని కిరీటాలలోని రత్నాలు కాంతులు వెదజల్లుతూ ఉంటే ఆ కాంతుల వెనుక ఆదిశేషువు వేయి పడగలతో ప్రకాశిస్తున్నాడు. అటువంటి స్వామిని, దేవతా రక్షణ సార్వభౌముని సనందనాదులు ఎంతో కోరికతో ప్రశంసిస్తూ ఆయన అవతారాలను ప్రశంసించారు. అనురాగం వల్ల వారి మాటలు తడబడ్డాయి కాని ఆ దేవదేవుడు హర్షించాడు.

తే. భూరి నిగమార్థసార విచార మగుచుఁ, దనరు నీ భాగవతము సాదరతఁ బలికె నలినభవసూతి యైన సనత్కుమార, కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు.

268

తా॥ సమస్త వేదసారమైన ఈ భాగవతాన్ని భగవంతుడు బ్రహ్మకుమారుడైన సనత్కుమారునికి ఆయన సాంఖ్యాయనునకు ఉపదేశించాడు.

క. పరఁగ నతం డంతఁ బరా, శరునకు నుపదేశ మిచ్చె సమ్మతి; నతఁడున్ సురగురున కొసఁగె; నాతఁడు, గర మరుదుగ నాకుఁ జెప్పెఁ; గైకొని యేనున్.

269

తా॥ ఆపై ఆ సాంఖ్యాయనుడు పరాశరునకు ఆయన బృహస్పతికి ఆయన ఏకాంతంగా

నాకు చెప్పాడు.

క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుం డగు సు శ్లోకుని చరితామృత పరి, షేకుఁడవై ముదము గదురఁ జెలఁగుము విదురా!

270

తా॥ ఓ విదురా! నీకిప్పుడు ఆ భాగవతాన్ని వివరంగా చెబుతాను, ఉత్తమ శ్లోకుని చరిత్ర అనే అమృతంలో తడిసినవాడవై సంతోషంతో విను.

వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును, ఋషి సంప్రదాయానుగతంబును, పురుషోత్తమ స్తోత్రంబును, పరమ పవిత్రంబును, భవలతా లవిత్రంబును నయిన భాగవత కథా ప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసించెద, వినుము.

271

తా॥ ఈ విధంగా భగవంతునిచే చెప్పబడినది, ఋషి సంప్రదాయానికి చెందినది, పురుషోత్తముని సేవించేది, పరమ పవిత్రమైనది, భవబంధాలను నరికివేసేది అయిన భాగవతకథా ప్రపంచాన్ని భక్తుడువైన నీకు ఉపన్యసిస్తాను... వినుము.

## పంకజభవుని జన్మవృత్తాంతము

సీ. అనఘ! యేకోదకమై యున్న వేళ నం, తర్నిరుద్ధానల దారు వితతి భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపట ని, ద్రాలోలుఁ డగుచు నిమీలితాక్షుఁ డైన నారాయణుం డంబు మధ్యమున భా, సుర సుధా ఫేన పాండుర శరీర రుచులు సహస్ర శిరో రత్న రుచులతోఁ, జెలిమి సేయఁగ నొప్పు శేష భోగ

తే. తల్పమునఁ బవ్వళించి యనల్పతత్త్వ, దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁ డగుచు నభిరతుండయ్యుఁ గోర్కులయందుఁ బాసి, ప్రవిమలాకృతి నానంద భరితుఁ డగుచు.

272

తా॥ పూర్వం ప్రళయ సమయంలో అనంతమైన దివ్యజలములు తప్ప వేరేమీ లేదు. అప్పుడు శ్రీమన్నారాయణుడు ఆదిశేషువును పాన్పుగా చేసుకుని ఆ దివ్య జలములపైన పవ్వళించాడు. ఆ ఆదిశేషువు యొక్క అమృతం వంటి స్వచ్ఛమైన శరీరకాంతులు వేయితలలపై వెలుగొందే రత్నాల కాంతులతో చెలిమి చేస్తున్నట్లు ప్రకాశించాయి. ఎండు కట్టెలో అగ్ని ఉన్నట్లు నారాయణుడు లోపల చైతన్య స్వరూపుడై నిద్రిస్తున్నట్లు కన్నులు మూసుకొని అద్వితీయ, ఆనందమయుడై విరాజిల్లాడు.

తే. యోగమాయా విదూరుఁడై యుగసహస్ర, కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి పేర్చి మఱికాల శక్త్యుపబృంహితమున, సమత సృష్టి క్రియా కలాపములఁ దగిలి.

273

తా॥ ఈ ప్రకారం యోగమాయకు కూడ దూరంగా వేల యుగాల కాలపర్యంతం లోకాలన్నిటిని కడుపులో దాచుకొని ఆపైన కాలము, శక్తి చక్కగా అభివ్యక్తం కాగా సృష్టికార్యానికి పూనుకున్నాడు.

క. తన జఠరము లోపలఁ దాఁ, చిన లోక నికాయముల సృజించుటకును సా ధనమగు సూక్ష్మార్థమున మన, సున గని కాలానుగత రజోగుణ మంతన్.

274

తా॥ తన గర్భంలో ఉంచుకొన్న అనేక బ్రహ్మాండాలను తిరిగి సృజించుటకు సాధనమైన సూక్ష్మపదార్థమును చిత్తములో భావించి కాలానుగుణమైన రజోగుణాన్ని సృష్టించాడు.

సీ. పుట్టించెఁ దద్గుణంబునఁ బరమేశ్వరు, నాభిదేశమునందు నలిననాళ ముదయించె మఱి యప్పయోరుహ ముకుళంబు, గర్మబోధితమైన కాలమందుఁ దన తేజమునఁ బ్రవృద్ధంబైన జలముచే, జలజాప్త గతిఁ బ్రకాశంబు నొందఁ జేసి లోకాశ్రయస్థితి సర్వగుణ విభా, సితగతి నొప్పు రాజీవమందు

తే. నిజకళా కలితాంశంబు నిలిపె దాని, వలన నామ్నాయ మయుఁడును వరగుణుండు నాత్మయోనియు నైన తోయజభవుండు, సరవిఁ జతురాననుండు నా జనన మయ్యె.

275

తా॥ ఆ గుణంవల్ల పరమేశ్వరుని నాభిదేశంలో తామరతూడు పుట్టింది. ఆపై కర్మబోధితమైన కాలంలో తన తేజస్సుచే ఆ మొగ్గను సూర్యునిలా వికసింపజేసి సర్వలోకాలకు ఆశ్రయం ఇచ్చే స్థితిని, సర్వగుణాలతో ఒప్పేగతిని కలిగియున్న ఆ పద్మంలో పరమేశ్వరుడు తన కళను కలిపాడు. దానివలన వేదమయుడు, శ్రేష్ఠమైన గుణములు కలవాడు, ఆత్మయోని అయిన చతుర్ముఖ బ్రహ్మ పుట్టాడు.

తే. అతఁడు తత్పద్మ కర్ణికయందు నిలిచి, వికచలోచనుఁడై లోకవితతి దిశలు నంబరంబును నిజచతురాననములఁ, గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు.

276

తా॥ ఆ చతుర్ముఖ బ్రహ్మ పద్మం యొక్క మధ్యభాగంలో ఉండే కర్ణికమీద నిలిచి కన్నులు తెరచి లోకాలను, దిక్కులను, ఆకాశాన్ని తనయొక్క నాలుగు ముఖాలతోను చూడసాగాడు.

చ. అలఘుయుగాంత కాలపవనాహత సంచలదూర్మిజాల సం కలిత జలప్రభూత మగు కంజముఁ దద్వనజాత కర్ణికా తలమున నున్న తన్ను విశదక్రియఁ గల్గిన లోకతత్త్వమున్ నలిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచార మొందుచున్.

277

వ. ఇట్లని వితర్కించె.

278

తా॥ కడు దీర్ఘమైన యుగాంత వేళ మహాభయంకరమైన గాలులచేత కొట్టబడిన ఎగసిపడే కెరటాలు... ఆ నీటిమధ్య ఒక పద్మం! పద్మంమధ్య కర్ణికాతలమున ఉన్న తాను! చుట్టూ స్పష్టంగా కనుపిస్తూన్న లోకాలు! ఇవన్నీ ఏమిటో తెలియక మనస్సులో చాలా విచారపడుతూ... తనలో తానిలా తర్కించుకున్నాడు.

ఉ. ఈ జలమందు నీ కమల మే గతి నుద్భవ మయ్యె? నొంటి యే నీ జలజాత పీఠమున నే గతి నుంటి? మదాఖ్య యెద్ది? నా కీ జననంబు నొందుటకు నెయ్యది హేతువు? బుద్ధిఁ జూడ నే యోజ నెఱుంగ లేనని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁడై.

279

తా॥ 'ఈ జలంలో ఈ కమలం ఎలా పుట్టింది? నేనొక్కడిని ఈ పద్మపీఠం పైన ఎలా కూర్చున్నాను? నా పేరు ఏమిటి? నా జన్మకు కారణం ఏమిటి? బుద్ధిలో నాకేమీ తోచటం లేద' ని పద్మసంభవుడైన బ్రహ్మ ఆశ్చర్యపోయాడు.

క. ఆ వనజనాళ మూలం, బా వనములలోన నర్థి నరయుట కొఱకై యా వనజాత ప్రభవుం,

డా వనరుహనాళ వివరమం దభిముఖుఁడై.

280

తా॥ ఆ నీళ్ళలో ఆ పద్మం యొక్క మూలం ఎక్కడుందో తెలుసుకొందామని బ్రహ్మ ఆ తామరతూడు యొక్క లోపలిభాగం నుండి ప్రవేశించాడు.

మ. అతిగంభీర విశాల వారినిధితోయాంతర్నిమగ్నాంగుఁడై చతురాస్యుం డొగి దివ్యవత్సరసహస్రం బబ్జమూలంబు స న్మతి నీక్షించియుఁ గానలేక భగవన్మాయా మహత్త్వంబు వి స్మృతిఁ గావింప విభీతుఁడై మరలఁ జేరెం దత్సరోజాతమున్.

281

తా॥ అతి గంభీరము, అతి విశాలము అయిన ఆ జలముల మధ్య మునిగి నాలుగు ముఖాలుగల బ్రహ్మ వేలకొలది దివ్యసంవత్సరాలు ఆ తామరతూడు యొక్క మూలమును కనిపెట్ట లేక; భగవంతుని యొక్క మాయా ప్రభావానికి భయపడి తిరిగి తాను బయలుదేరిన చోటికే వచ్చి చేరాడు.

తే. అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జపీఠ, మందు నష్టాంగ యోగక్రియానురక్తిఁ బవను బంధించి మహిత తపస్సమాధి, నుండి శతవర్షములు సనుచుండ నంత.

282

తా॥ అలా చేరి బ్రహ్మ పద్మపీఠంపై కూర్చొని అష్టాంగ యోగంచే గాలిని బంధించి గొప్పదైన తపస్సమాధిలో నూరు దివ్యసంవత్సరాలు గడిపాడు.

ఆ. అట్టి యోగజనితమైన విజ్ఞానంబు, గలిగియుండి దానఁ గమలనయనుఁ గానలేక హృదయకమల కర్ణిక యందు, నున్నవానిఁ దన్నుఁ గన్నవాని.

283

తా॥ అట్టి యోగజనితమైన విజ్ఞానం వల్లకూడా శ్రీహరిని చూడలేక తన ధ్యానాన్ని హృదయంలో నిలిపి తన హృదయ కర్ణికయందు తనను కన్న శ్రీహరిని చూసాడు.

మ. కనియెన్ నిశ్చలభక్తి యోగమహిమం గంజాతగర్భుండు శో భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా శనముఖ్య స్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మ నే త్రు నవీనోజ్జ్వల నీలమేఘ నిభగాత్రుం బక్షిరాట్పత్త్రునిన్.

284

తా॥ ఈ విధంగా బ్రహ్మ నిశ్చలమైన భక్తితో, యోగమహిమతో శుభచరిత్రుడు, పవిత్రుడు, లక్ష్మీకళత్రుడు, దేవతల స్తుతిపాత్రుడు, రాక్షససేనను జయించినవాడు, పద్మములవంటి కన్నులు కలవాడు, నీలమేఘంవంటి శరీరకాంతి ఉన్న శ్రీమహావిష్ణువును చూసాడు.

వ. మఱియును.

285

చ. అలఘుఫణాతపత్ర నిచయాగ్ర సమంచిత నూత్న రత్న ని ర్మల రుచిచే యుగాంత తిమిరంబు నడంచి యకల్మషోలస జ్జలములఁ జేసి యందు నవసారస నాళ సితైక భోగముం గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్.

286

తా॥ అంతేకాదు... గొప్పవైన పడగలనే గొడుగుల చివర వ్రేలాడే నూతన రత్నముల యొక్క కాంతులచే ప్రళయ కాలంలోని చీకట్లను పారద్రోలి; తెల్లతామర వంటి దేహసంపదతో ప్రకాశిస్తున్న ఆదిశేషువును తల్పంగా చేసుకొని శయనిస్తున్న మహాత్ముడైన శ్రీహరిని చూసాడు.

సీ. వరపీత కౌశేయ పరిధానకాంతి సం, ధ్యాంబుద రుచి నిచయంబు గాఁగఁ గమనీయ

నవహేమకలిత కిరీటంబు, రమణఁ గాంచన శిఖరంబు గాఁగఁ మానితమౌక్తిక మాలికారుచి సాను, పతితనిర్ఝర పరంపరలు గాఁగఁ జెలువొందు నవతులసీ దామకములు లా, లితతటజౌషధీ లతలు గాఁగఁ

తే. వరభుజంబులు నికటస్థ వంశములుగఁ, బదము లంగణపాదప ప్రచయములుగ లలితగతి నొప్పు మరకతాచల విడంబి, తాత్మ దేహంబు గలుగు మహాత్ము హరిని.

287

తా॥ ధరించిన మేలైన పచ్చని పట్టువస్త్రాల కాంతులు సంధ్యాకాల మేఘ కాంతులు కాగా, అందమైన బంగారు కిరీటం కాంచన శిఖరం వలె వెలుగొందగా, అలంకరించుకున్న మౌక్తిక కాంతులు కొండచరియలపై నుండి జాలువారుతున్న సెలయేళ్ళు కాగా, అలంకరించుకొన్న తులసిమాలలు ఓషధీలతలు కాగా, శ్రేష్ఠమైన భుజములు వెదురుమొదళ్ళుకాగా, పాదములు తరుగుల్మములు కాగా... పచ్చగా పర్వతంలా ప్రకాశిస్తూన్న శ్రీహరిని చూసాడు.

వ. మఱియు నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోక సంగ్రహంబును నతివిస్తార వర్తులాయామంబునునై వివిధ విచిత్ర దివ్యమణి విభూషణంబుల నాత్మీయనిర్మల ద్యుతిచేతం బ్రకాశంబు నొందంజేయు దివ్య దేహంబు దనర వివిధంబులగు కామంబు లభిలషించి విశుద్ధంబైన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకు గామధేను వనం దగిన పాదపద్మ యుగంబును, నలిక ఫలక లలితరుచి నిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పు పదనఖంబులును, కమలాభూకాంతలకు నుపధానరూపంబు లనందగి నీలకదళికాస్తంభంబుల డంబు విడంబించు నూరు యుగళంబును, కనకమణిమయ మేఖలాకలాపాభిరామంబును, గదంబ కింజల్క శోభిత పీతాంబరాలంకృతంబునునై విలసిల్లు కటిమండలంబును, శృంగారవాహినీ జలావర్తంబునాఁ బొలుపొందు నాభివివరంబును, జఠరస్థనిఖిల బ్రహ్మాండ ముహుర్ముహు రుద్భవకృశీభూతం బనం దగు

మధ్యభాగంబును, మహిత ముక్తాఫల మాలికా విరచితరంగవల్లీ విరాజితంబు, నవతులసీదామ కిసలయతల్పంబుఁ, గుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందనవిలిప్తంబుఁ, గౌస్తుభరత్న దీప్తప్రదీప్తంబు, శ్రీవత్సలక్షణలక్షితంబు నై యిందిరారమణికి గేళీమందిరం బనం బొల్చు వక్షస్థ్సలంబును, సుఖకేళీ సమారంభ పరిరంభణాం భోధిరాట్కన్యకా కరాంభోజ కీలిత కనక మణికంకణ నికషంబులనం బొలుపారు రేఖాత్రయ విరాజమానంబైన కంబుకంధరంబును, సుమహితానర్ఘ దివ్యమణి ప్రభావిభాసిత కేయూర కంకణ ముద్రికాలంకృతంబు లయిన బాహువులును, సకలలోకార్తి నివారక దరహాసచంద్రికా ధవళితంబులై కర్ణకుండల మండన మణిమరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబులగు చెక్కుటద్దంబులును, బరిపక్వ బింబఫల ప్రవాళపల్లవారుణాధరంబును, నఖిలభువన పరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించు నయనయుగళంబునకు సీమాస్తంభంబును, చంపక ప్రసూనరుచి విభాసంబును నగు నాసాదండంబును, గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృత తరంగి తాపాంగంబులై కర్ణాంత విశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులును, సలలితశ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకంబయ్యె ననందగు కర్ణంబులును, నిక్షుచాప చాప ద్వయంబునాఁ జూపట్టు భ్రూయుగళంబును, నపరపక్షాష్టమీ శశాంకశంకాస్పద ఫాలఫలకంబును, నీలగిరీంద్ర శృంగసంగత బాలమార్తాండ మండల విడంబిత పద్మరాగ మణిఖచిత కాంచన కిరీటంబునం బొలుపారి సూర్యేందు పవనానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక త్రిలోక వ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబులఁ జెలువొంది సంగర రంగంబుల దానవానీకంబుల హరింపంజాలు సుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదం బగు దివ్యరూపంబునుం గలిగి మఱియును.

288

తా॥ ఆ శ్రీహరి యొక్క దివ్యమంగళ స్వరూపం అపరిచ్ఛిన్నంబును, దానితో పోల్చడానికి ఇంకొక వస్తువు లేకుండగాను ఉంది. అన్ని లోకాలు అందులోనే ఉన్నాయి. అత్యంత

విశాలంగాను, గుండ్రనై ఉంది. అనేక విచిత్రమైన ఆభరణాలు ధరించి తన కాంతులచే వాటిని ప్రకాశింప చేస్తూన్నది. వేదమార్గం చేత పూజించు పురుష శ్రేష్ఠులకు కామధేనువు వంటి పాదములు కలిగి ఉంది. ఆయన యొక్క నుదుటి అందాలకు ఓడిపోయిన చంద్రుడు ఆయన పాదాలను బహురూపాల్లో ఆశ్రయించాడా అన్నట్లున్నాయి ఆయన కాలిగోళ్ళు. శ్రీదేవికి, భూదేవికి తలగడలా అన్నట్లున్నాయి ఆయన తొడలు. ఆయన నడుముకు ధరించిన వడ్డాణం అనేక మణులతో కూడివుంది. ఆయన కటిమండలం కడిమి పువ్వుల శోభను మించే పట్టుపీతాంబరంతో అలంకృతమై ఉంది. ఆయన నాభి శృంగార వాహిని సుడివలె ఉంది. అనేక బ్రహ్మాండములు మాటిమాటికి పుడుతూన్నందువల్ల కృశించి సన్నబడిందా అన్నట్లు ఉంది ఆయన మధ్యభాగం.

ఆయన యొక్క వక్షస్థలం... ముత్యాలు కూర్చిన ముగ్గులతో ఉంది. తులసి దండలతో కూడిన పానుపు పూలదండలతో అలంకృతమై పచ్చకర్పూరం కస్తూరి మంచి గంధం ఇత్యాది పరిమళ ద్రవ్యాలతో వాసనలు చిమ్ముతూ ఉంది. లక్ష్మీదేవి విహరించే శృంగార మందిరమా అన్నట్లుంది. శృంగార క్రీడలో లక్ష్మీదేవి చేతులకు ధరించిన మణులచే అలంకరింపబడిన బంగారు గాజులు ఒత్తుకున్నట్లున్న కంఠాన మూడు రేఖలు మనోహరంగా ఉన్నాయి. ఆయన చేతులు దివ్యమణుల యొక్క కాంతులతో అలంకృతమై ఉన్నాయి. ఆయన చెక్కుటద్దాలు సకల లోకాలలోను ఉన్న ఆయన భక్తుల కష్టములను నివారించగల కర్ణకుండలాల కాంతులతో మెరుస్తున్నాయి.

ఆయన క్రిందిపెదవి దొండపండువలె, పగడంవలె, చిగురుటాకువలె... ఎర్రగా మనోహరంగా ఉన్నది. ఆయన ముక్కు సంపెంగ పువ్వులా ఉండి అఖీల భువనాలను పరిపాలించడానికి నేనంటే నేనని దెబ్బలాడుకొనే కన్నులకు సరిహద్దు స్తంభంలా ఉంది. చెలువైన ఆయన నేత్రాలు కమలాలకు కలువలకు పెంపును సంపాదిస్తూ దయను వర్షిస్తూ చెవుల వరకు విస్తరించి ఉన్నాయి. లలితమైన శ్రీకారానికి సమమైనవి ఆయన చెవులు. కందర్పుని

ధనువులా ఉన్నాయి ఆయన కనుబొమలు.

ఆయన తలమీద పద్మరాగాలు పొదిగిన కాంచన కిరీటం నీలపర్వతం మీద ప్రకాశించే ఉదయ సూర్యుణ్ణి త్రోసిపుచ్చుతున్నది. సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని... వీటి కాంతి వ్యాపించడానికి అవకాశం ఇవ్వకుండా త్రిలోకాలలోను తేజోవిశేషాలతో చెలువొందుతూ ఉన్న ఆ పరమేశ్వరుడు యుద్ధరంగంలో అసురులను నిర్జించటం కొరకు సుదర్శనం మొదలైన దివ్యసాధనములను కలిగి ఉన్నాడు. ఎవరూ పొందలేని దివ్య రూపంతో విరాజిల్లుతున్నాడు.

ఉ. హారకలాప పుష్పనిచయంబులఁ జంచదనర్ఘ రత్న కే యూర కరాంగుళీయక మహోజ్జ్వల బాహుసహస్రశాఖ లొ ప్పారఁగఁ జూడ నొప్పి భువనాత్మకలీల నదృష్ట మూల వి స్ఫారిత భోగివేష్టిత విభాసిత చందన భూరుహాకృతిన్.

289

తా॥ ఆ మహనీయుడు... హారములు ఇత్యాది భూషణములు పుష్పసమూహాలుగా, గొప్ప రత్నములు చెక్కిన బాహుపురులతో, అంగుళీయకములతో, మహోజ్జ్వలమైన వేలకొలది బాహువులు ప్రకాశిస్తూండగా, భువనాలకు ఆత్మయై పుట్టుక ఎవరికీ తెలియకుండ పడగవిప్పిన మహాసర్పం చుట్టుకున్న మంచిగంధపు చెట్టులా ఉన్నాడు.

మ. విలసత్కుండలి రాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్ సము జ్జ్వలితోదార శిరోవిభూషణ సహస్రస్వర్ణ కూటంబులన్ సలిలావాసతఁ జారుకౌస్తుభ విరాజద్రత్న గర్భంబునన్ నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్.

290

తా॥ ఆదిశేషువుతో కలసి ఉన్నందువల్ల భూభారాన్ని వహిస్తూ ఉండటంవల్ల, శిరస్సున ధరించే అలంకారాలుగా వెలుగొందే సహస్ర కిరీటాలవంటి కాంచన శిఖరాలవల్లా, సాగర మధ్యంలో ఉండటంవల్ల, అందమైన కౌస్తుభము మొదలైన అనర్ఘ రత్నరాశి కలిగి ఉండటం వల్ల

శ్రీమహావిష్ణువు మైనాక పర్వతంలా చూడటానికి అందంగా ఉన్నాడు.

క. వితతార్థజ్ఞాన జప, స్తుతి మకరంద ప్రహృష్ట శ్రుతిజాత మధు వ్రత గణ పరివృత శోభా, గత కీర్తి ప్రసవమాలికలు గలవానిన్.

291

వ. కనుంగొని చతురాననుండు.

292

తా॥ జ్ఞానం, జపం, స్తోత్రం అనే మకరందాన్ని ఆస్వాదించటం వలన ఆనందించే తుమ్మెదలు అనే వేదసమూహంతో కూడి కీర్తి అనే పూలదండలు గలవానిని ఆ విష్ణుదేవుని బ్రహ్మ చూసాడు.

సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంత శూన్యుని, ధన్యుని జగదేక మాన్య చరితుఁ దన్నాభిసరసిజోద్భవ సరోజంబును, నప్పుల ననిలుని నంబరమును మానితభువననిర్మాణ దృష్టిని బొడఁ, గనెఁ; గాని యితరముఁ గానలేక యాత్మీయకర్మ బీజాంకురంబును రజో, గుణయుక్తుఁ డగుచు నకుంఠిత ప్ర

తే. జాభిసర్గాభిముఖత నవ్యక్త మార్గుఁ, డైన హరియందుఁ దనహృదయంబుఁ జేర్చి య మ్మహాత్మునిఁ బరము ననంతు నభవు, నజు నమేయుని నిట్లని యభినుతించె.

293

తా॥ పాపరహితుణ్ణి, లోకాలన్నిటికి ఈశ్వరుడైన వానిని, జనన మరణాలు లేనివానిని, ధన్యుణ్ణి, జగదేక మాన్యుణ్ణి, ఆయన నాభినుండి పుట్టిన కమలాన్ని, జలాన్ని, అగ్నిని, ఆకాశాన్ని, ఈ భువన నిర్మాణం చెయ్యాలనే దృష్టిని చూచాడు. ఆయనకు ఇంకేమీ కనుపించలేదు. తాను నెరవేర్చబోయే కర్మకు అనగా సృష్టికార్యానికి కారణభూతమైన రజోగుణం అనే బీజం తనలో ప్రభవించగా అంతంలేని ప్రజాసృష్టికి కారణభూతుడై నిలిచాడు. అవ్యక్తుడైన ఆ శ్రీహరియందు

తన అంతరంగాన్ని నిలిపి మహాత్ముడు, పరుడు, అనంతుడు, అభవుడు, అజుడు, అమేయుడు అయిన ఆ తత్త్వాన్ని బ్రహ్మ ఇలా స్తుతించాడు:

# బ్రహ్మకృత నారాయణ ప్రార్థన

సీ. నలినాక్ష! మాయాగుణ వ్యతికరమునఁ, జేసి కార్యంబైన సృష్టిరూప మునఁ బ్రకాశించు నీఘనరూపవిభవంబు, రూపింప దేహధారులకు దుర్వి భావ్యంబు దలపోయ భగవంతుఁడవునైన, పద్మాక్ష! నీ స్వరూపంబుకంటె నన్య మొక్కటి సత్యమై బోధకంబైన, యది లేదు గాన నీ యతుల దివ్య

తే. మైన రూపంబు నాకుఁ బ్రత్యక్షమయ్యె, నదియుఁగాక వివేకోదయమునఁ జేసి వరద! నీ రూప మజ్ఞానగురుతమో ని, వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప!

294

తా॥ ఓ తామరసాక్షా! మాయాగుణం యొక్క కార్యమైన సృష్టిరూపంలో కనుపించే దిటవుగల నీ రూపాన్ని నిరూపించడానికి నావంటి దేహధారులకు సాధ్యంకాదు. నీకంటే మరొకటి సత్యమైనది లేదు. నీ దివ్యమైన రూపం నాకు ప్రత్యక్షమైంది. నాలో కలిగిన వివేకోదయం వలన నీ రూపం చూడగానే అజ్ఞానం అనే తమస్సు నాశనమైంది.

క. ఘన సత్పురుషానుగ్రహమునకై యమితావతారమూలం బగుచుం దనరెడి నీరూపము శోభనమగు భవదీయనాభిపద్మమువలనన్.

295

క. జననం బందిన నాచే, ననయము మొదలనె గృహీత మయ్యె; జగత్పా వన! నీదు సుస్వరూపము, ఘనరుచిరంబై స్వయంప్రకాశక మగుటన్.

296

తా॥ సత్పురుషులను అనుగ్రహించటం కోసం నువ్వెత్తిన ఎన్నో అవతారాలకు మూలమైన నీ రూపం శుభాన్ని కలిగిస్తుంది. నీ నాభికమలం నుండి పుట్టిన నేను నీ స్వరూపాన్ని బాగా అర్థం

చేసుకున్నాను. నీ స్వరూపం స్వయంప్రకాశమానమైనది కదా!

వ. మఱియు జ్ఞానానందపరిపూర్ణ మాత్రంబును, ననావృతప్రకాశంబును, భేదరహితంబును, బ్రపంచ జనకంబును, బ్రపంచ విలక్షణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబును, నైన రూపంబు నొందియు నెందును బొడఁగాన నట్టి నిన్ను నాశ్రయించెద; నదియునుంగాక జగన్మంగళ స్వరూపధరుండవై నీ యుపాసకులమైన మా మంగళంబుల కొఱకు నిరంతర ధ్యానంబుచేత నీ దివ్యరూపంబునం గానంబడితి, విట్టి నీవు నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచే నాదృతుండవు గావు; మఱియుఁ గొందఱు కృతార్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవిందకోశ గంధంబు వేదమారుతానీతం బగుటంజేసి తమతమ కర్ణకుహరంబుల చేత గ్రహించుదురు; వారల హృదయకమలంబులయందు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదారవిందంబులు గలిగి ప్రకాశింతు; వదియునుంగాక ప్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బయిన భయంబును దన్నాశనిమిత్తం బయిన శోకంబును, ద్రవ్యాది స్పృహయును దననిమిత్తం బయిన పరిభవంబును, మఱియు నందుఁ దృష్ణయు నది ప్రయాసంబున లబ్ధంబైన నార్తియు, తదీయంబైన వృథాగ్రహంబును నీ శ్రీపాదారవిందంబు లందు వైముఖ్యం బెంతకాలంబు గలుగు నంతకాలంబును బ్రాప్తంబు లగుంగాని మానవాత్మనాయకుండవగు నిన్ను నాశ్రయించిన భయనివృత్తి హేతువైన మోక్షంబు గలుగు; మఱియునుం గొందఱు సకలపాప నివర్తకంబయిన త్వదీయనామస్మరణ కీర్తనంబులందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రియ పరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు సేయుచుందురు; దానంజేసి వాతాదిత్రిధాతు మూలంబైన క్షుత్తృడాదులచేతను, శీతోష్ణవర్ష వాతాది దుఃఖంబులచేతను, నతిదీర్ఘంబైన కామాగ్నిచేతను, నవిచ్ఛిన్నంబగు క్రోధంబుచేతనుం దప్యమాను లగుదురు; వారలం గనిన నా చిత్తంబు గలంకం బొందు; జీవుండు భవదీయమాయా పరిభ్రామ్యమాణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియు, నంతకాలంబు

నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబు తరియింపంజాలకుండు; సన్మునీంద్రులైనను భవదీయ నామస్మరణంబు మఱచి యితరవిషయాసక్తులైరేని వారలు దివంబులందు వృథాప్రయత్నులై సంచరించుచు, రాత్రులయందు నిద్రాసక్తులై స్వప్నగోచరంబు లయిన బహువిధసంపదకు నానందించుచు, శరీరపరిణామాది పీడలకు దుఃఖీంచుచుం బ్రతిహతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులౌ వర్తింతురు; నిష్కామధర్ములై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరిశోధితంబైన హృత్సరోజ కర్ణికాపీఠంబున వసియింతు వదియునుంగాక.

297

తా॥ నీ రూపం జ్ఞాన స్వరూపము, ఆనంద స్వరూపమూను. కాంతి స్వరూపుడవు నువ్వు! భేదభావం లేనివాడవు. ప్రపంచం పుట్టడానికి కారణభూతుడవు! అయినా ప్రపంచంకంటే భిన్నంగా ఉంటావు. పంచ భూతములకు, పంచేంద్రియములకు ఆత్మరూపుడవు! సృష్టి అంతటా వ్యాపించి ఉన్నావు! అయినా ఎక్కడా కనుపించవు. నిరంతర ధ్యానంచేత నీ ఉపాసకులమైన మా శ్రేయస్సు కోసం నీవు ఈ దివ్యరూపంలో కనపడ్డావు.

కుతర్కములచే ప్రసంగిస్తూ నిరీశ్వర వాదం చేసే భాగ్యహీనులు నిన్ను గుర్తింపలేరు. కొందరు మహాత్ములు మీ యొక్క పాదగంధాన్ని వేదం అనే మలయమారుతం తెచ్చిన దానిని తమ చెవులచేత గ్రహిస్తారు. వాళ్ళ హృదయ కమలాలలో నీ పాదారవిందాలు ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉంటాయి.

ఇంతే కాకుండా ధనం, గృహం, స్నేహితులు ఇవి పోవడం వల్ల కలిగే దుఃఖం, వాటిమీది ఆశ వాటి సంపాదనలో ఎదురయ్యే అవమానం... వీటి అన్నిటికి మూలకారణం తృష్ణ. ఇవన్నీ శుభావహమైన నీ పాదాలు తలుచుకోకుండా ఎంతకాలం ఉంటారో అంతకాలము ఉంటాయి. నిన్ను ఆశ్రయిస్తే భయం లేని మోక్షం కలుగుతుంది. పాపములనుండి ముక్తులను చేసే నీ నామ స్మరణ సంకీర్తనములందు విముఖులైన కొందరు కోరికలలో కూరుకుపోయి ఇంద్రియాలకు

లొంగి చెడ్డపనులు చేస్తూ ఉంటారు. దానివల్ల; వాతపిత్తశ్లేష్మాలకు కారణమైన ఆకలిదప్పికల వల్లా, శీతోష్ణాదుల వల్ల కలిగే దుఃఖంచేత, కామక్రోధాదుల వల్ల బాధపడతారు. వారలను చూసి నా మనస్సు కలత చెందుతూ ఉంటుంది.

జీవుడు నీ మాయలో పడి కొట్టుకుంటూ దేహం వేరు, ఆత్మ వేరు అని తెలుసుకొనే పర్యంతం ఈ నిరర్థకమైన సంసార సాగరాన్ని దాటలేడు. మునీంద్రులు సైతం నీ నామజపం మరచి ఇతర విషయాలోలురై పగలు వృథాగా లోకంలో తిరుగుతూ, రాత్రుళ్ళు నిద్రపోయేటప్పుడు కలిగే స్వప్నములలో సుఖదుఃఖములను అనుభవిస్తూ ఈ శరీరానికి వచ్చే రోగాలకు విచారిస్తూ సంసార బంధంలో పడి చస్తూ పుడుతూ ఉంటారు. నిష్కామంగా నిన్ను సేవించే సత్పురుషుల శ్రవణేంద్రియం ద్వారా ప్రవేశించి, నీ మీద భక్తియోగం ద్వారా పరిశుద్ధమైన హృదయ సరోజ పీఠంపై నీవు అధివసిస్తావు.

మ. వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనో హరరూపంబుఁ దలంచి యే గుణగణధ్యానంబు గావింతు, ర ప్పురుషశ్రేష్ఠ పరిగ్రహంబునకునై పొల్పారఁ దద్ధ్యాన గో చరమూర్తిన్ ధరియింతు గాదె పరమోత్సాహుండవై మాధవా!

298

తా॥ ఓ మాధవా! శ్రేష్ఠమైన యోగీంద్రులు యోగమార్గం వల్ల మనస్సులో నీ రూపాన్ని భావించి నీ గుణగణాలను ధ్యానిస్తారో ఆ పురుషశ్రేష్ఠులను చేపట్టి రక్షించటం కోసం ఆ గుణగణాలతోనే ఉత్సాహంగా వారిని ఆదుకుంటావు.

తే. అరయ నిష్కామధర్ములై నట్టి భక్తు, లందు నీవు ప్రసన్నుండ వైనరీతి హృదయముల బద్ధకాములై యెనయు దేవ, గణములందుఁ బ్రసన్నత గలుగ వీవు.

299

తా॥ కోరికలు లేకుండా ధర్మబద్ధంగా నడుచుకొంటున్న భక్తుల విషయంలో నువ్వు

ప్రసన్నుడవైన రీతిలో; హృదయంలో కోరికలున్న దేవగణాలను కూడా నువ్వు అనుగ్రహించవు.

చ. అరయ సమస్తభూత హృదయంబులయందు వసించి యేకమై పరఁగి సుహృత్క్రియానుగుణ భాసితధర్ముఁడవుం బరాపరే శ్వరుఁడవునై తనర్చుచు నసజ్జనదుర్లభ మైన యట్టి సు స్థిరమగు సర్వభూతదయచేఁ బొడఁగానఁగ వత్తు వచ్యుతా!

300

తా॥ అచ్యుతా! సమస్త భూతముల హృదయముల యందు ఏకరూపంలో ఉంటూ మంచికి అనుగుణంగా భాసించే ధర్మ స్వరూపుడవు. ఇహపరాలు సమస్తమునకు నువ్వే అధీశ్వరుడవు. సన్మార్గులకు సులభమూ, దుర్మార్గులకు దుర్లభమైనటువంటి స్థిరమైన నీ కారుణ్యం చేతనే నిన్ను దర్శింపగలం.

మ. క్రతుదానోగ్ర తపస్సమాధి జపసత్కర్మాగ్నిహోత్రాఖిల వ్రతచర్యాదుల నాదరింప; వఖిలవ్యాపారపారాయణ స్థితి నొప్పారెడి నీ పదాబ్జయుగళీ సేవాభిపూజాసమ ర్పితధర్ముం డగువాని భంగి నసురారీ! దేవచూడామణీ!

301

తా॥ ఓ అసురారీ! తనుచేసే అన్ని పనులు నీకే సమర్పిస్తూ నీ పాదబ్జములనే సేవిస్తూ ఉండే భక్తుణ్ణి ఆదరించినట్లుగా... యజ్ఞాలు, దానాలు, తీవ్రమైన తపస్సమాధి, జపములు, అగ్నిహోత్రములు, వ్రతాలు ఇత్యాది సత్కర్మలు ఆచరించే వారిని కూడా నువ్వు ఆదరించవు.

తే. తవిలి శశ్వత్స్వరూప చైతన్యభూరి, మహిమచేత నపాస్త సమస్తభేద మోహుఁడ వఖిల విజ్ఞానమునకు నాశ్ర, యుండవగు నీకు మ్రొక్కెద నో రమేశ!

302

తా॥ ఓ లక్ష్మీవల్లభా! చైతన్య స్వరూపం వల్ల సమస్త భేదభావాలను, మోహాలను దూరం

చేసే అఖిల విజ్ఞానానికి ఆశ్రయమైన నీకు మ్రొక్కుతున్నాను.

క. జనన స్థితి విలయంబుల, కనయంబును హేతు భూతమగు మాయా లీ లను జెంది నటన సలిపెడు, ననఘాత్మక! నీ కొనర్తు నభివందనముల్.

303

తా॥ పుట్టుట, బ్రతుకుట, చనిపోవుట అనే మూడింటికి ఎప్పుడూ కారణభూతమైన నీ మాయా నటనలతో, లీలావిలాసాలతో అనవరతము క్రీడించే ఓ పుణ్యస్వరూపా! నీకివే నా నమస్సులు.

సీ. అనఘాత్మ! మఱి భవదవతార గుణకర్మ, ఘనవిడంబనహేతుకంబు లయిన రమణీయమగు దాశరథి వసుదేవ కు, మారాది దివ్యనామంబు లోలి వెలయంగ మనుజుల వివశాత్ములై యవ, సానకాలంబున సంస్మరించి జన్మ జన్మాంతర సంచిత దురితంబుఁ, బాసి కైవల్యసంప్రాప్తు లగుదు

తే. రట్టి దివ్యావతారంబు లవధరించు, నజుఁడవగు నీకు మ్రొక్కెద ననఘచరిత! చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార! భక్తమందార! దుర్భవ భయవిదూర!

304

తా॥ ఓ! భక్తమందార! అనఘ చరిత! చిరశుభాకార! నిత్య లక్ష్మీవిహార! ఘోర సంసార భయవిదూర! నీ అవతారాలకు, గుణకర్మలకు కారణమైన, సుందరమైన దాశరథి, వాసుదేవాది దివ్యనామాలను మానవులు తమ అవసాన కాలంలో సంస్మరించి జన్మాంతరాలలో కూడబెట్టుకున్న పాపాలను పోగొట్టుకుని కైవల్యాన్ని పొందుతారు. జన్మలేని వాడవైనా ఎన్నో అవతారాలెత్తిన నీకు మ్రొక్కుతున్నాను.

తరలము.

జనన వృద్ధి వినాశ హేతుక సంగతిం గల యేను నీ వును హరుండుఁ ద్రిశాఖలై, మనువుల్ మరీచి ముఖామరుల్ దనర నందుపశాఖలై, భవదాత్మ దీనికి మూలమై యనయమున్ భువన ద్రుమాకృతివైన నీ కిదె మ్రొక్కెదన్.

305

తా॥ పుట్టుట, పెరుగుట, నశించుట అనే మూడు స్థితులు కలిగిన నేను, నువ్వు, ఈశ్వరుడు మన ముగ్గురమూ విశ్వమనే మహావృక్షానికి మూడు శాఖలం. మనువులు, మరీచి మొదలైనవారు, దేవతలు దానికి ఉపశాఖలు. దీనికి మూలం నీవే! విశాలమైన దాని ఆకారం కూడా నీదే! అటువంటి నీకు కైమోడ్పులు.

మ. పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీ పూజాదికర్మక్రియా పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయున్ మనుష్యాధమున్ జరయున్ నాశము నొందఁజేయు నతిదక్షంబైన కాలంబు; త ద్గురు కాలాత్ముఁడవైన నీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్.

306

తా॥ పురుషోత్తమా! నీ పాదాలకు నమస్కరించి ఎప్పుడూ పూజింపని మూర్ఖుణ్ణి, పశుప్రాయుణ్ణి, మనుష్యాధముణ్ణి అన్నిటికి సమర్థమైన కాలం ముసలితనాన్ని కలిగించి వాడిని నాశనం చేస్తుంది. అట్టికాల స్వరూపుడవైన నీకు మనస్సులో సంతోషంతో మ్రొక్కుతున్నాను.

సీ. సర్వేశ! కల్పాంతసంస్థిత మగు జల, జాతమం దేను సంజనన మంది భవదీయ సుస్వరూపముఁజూడ నర్థించి, బహువత్సరములు దపంబు సేసి క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ, బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక, కరుణచే నఖిలలోకైకవంద్య

తే. మాన సతత ప్రసన్న కోమల ముఖాబ్జ, కలిత భవదీయ దివ్యమంగళ విలాస మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తిహరణ, కరణ! తుభ్యం నమో విశ్వభరణ! దేవ!

307

తా॥ ఓ సర్వేశ్వరా! విశ్వమును భరించు దేవాదిదేవా! కల్పాంత సమయంలో పద్మమందు నేను పుట్టి నీ సుస్వరూపాన్ని చూడాలన్న కాంక్షతో బహు సంవత్సరములు తపస్సు చేసి అనేక క్రతువులుచేసికూడా నిన్ను చూడలేక ఎంతో బెదిరిపోయాను. అట్టి నాకు ఇప్పుడు నిర్హేతుకమైన కరుణతో సాక్షాత్కరించావు. అఖిలలోకాలు నమస్కరింప తగినవాడా! ప్రసన్నము, కోమలము అయిన ముఖం కలవాడా!

సీ. అమర తిర్యఙ్మనుష్యాది చేతనయోను, లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి కమనీయ శుభమూర్తి గలవాఁడవై ధర్మ, సేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది విషయ సుఖంబుల విడిచి సంతత నిజా, నందానుభవ సమున్నతిఁ దనర్తు; వది గాన పురుషోత్తమాఖ్యఁ జెన్నొందుదు, వట్టి ని న్నెప్పుడు నభినుతింతు;

తే. నర్థి భవదీయపాదంబు లాశ్రయింతు; మహిత భక్తిని నీకు నమస్కరింతు; భక్త జన పోష పరితోష! పరమ పురుష! ప్రవిమలాకార! సంసార భయవిదూర!

308

తా॥ నీ కోరిక ననుసరించి దేవతలు, జంతువులు, మనుష్యులు మొదలైన చేతన రూపాలు ధరించి అవతరిస్తావు; ఎప్పుడూ మంగళ స్వరూపాన్ని ధరించి ధర్మానికి సేతువుగా నిలిచి ప్రఖ్యాతిని పొందుతావు. విషయ సుఖములు విడిచి నిత్యమూ ఆనందాన్ని పొందుతూ పురుషోత్తముడనే పేరుపొందావు. అట్టి నిన్నెప్పుడూ స్తుతిస్తాను. నీ పాదములనే ఆశ్రయిస్తాను. అంతులేని భక్తితో నమస్కరిస్తాను.

సీ. తలకొని పంచభూతప్రవర్తక మైన, భూరిమాయాగుణస్ఫురణఁ జిక్కు వడక, లోకంబులు భవదీయ జఠరంబు, లో నిల్పి ఘనసమాలోలచటుల సర్వంకషోర్మిభీషణవార్ధి నడుమను, ఫణిరాజభోగతల్పంబునందు యోగనిద్రారతి నుండంగ నొకకొంత, కాలంబు సనఁగ

మేల్కనిన వేళ

తే. నలఘుభవదీయ నాభితోయజమువలన, గడఁగి ముల్లోకములు సోపకరణములుగఁ బుట్టఁజేసితి వతులవిభూతి మెఱసి, పుండరీకాక్ష! సంతత భువనరక్ష!

309

తా॥ ఓ పుండరీకాక్షా! పంచభూతాలు సైతం మహామాయా బంధాలలో చిక్కుకున్నాయి. నువ్వు మాత్రం దేనికీ చిక్కకుండా పంచభూతాలను నీ కడుపులో నిల్పుకొంటావు. ఎగసిపడే తరంగాలతో భయంకరంగానున్న సముద్ర మధ్యమందు ఆదిశేషువు పానుపుగా యోగనిద్రలో శయనించి ఉంటావు. కొంతకాలం గడిచిన తరువాత మేల్కొని, అప్పుడు నీ నాభినుండి పుట్టిన పద్మం వలన మూడు లోకాలను పుట్టిస్తావు.

క. నిగమస్తుత! లక్ష్మీపతి!, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం దగు భవదైశ్వర్యంబున, నగణిత సౌఖ్యానుభవము నందింతుఁ గదే!

310

తా॥ హే నిగమవినుత! హే లక్ష్మీమనోవల్లభా! నీవన్ని లోకాలలోను, అందరియందు అంతర్యామిగా ఉంటూ ఈ విశ్వానికంతటికి నీ ఐశ్వర్యంచేత అంతులేని సుఖాన్నిస్తున్నావు గదా!

సీ. జలజాక్ష! యెట్టి విజ్ఞానబలంబునఁ, గల్పింతు వఖిలలోకంబు లోలి నతజన ప్రియుడఁవు నాకట్టి సుజ్ఞాన, మర్థిమైఁ గృపసేయుమయ్య వరద! సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నా చిత్తంబు, దత్కర్మకౌశలిఁ దగిలియుండి యును గర్మవైషమ్యమును బొందు కతమున, దురితంబుఁ బొరయక తొలఁగునట్టి

తే. వెరవు నా కెట్లు గలుగు న వ్విధముఁ దలఁచి, కర్మవర్తను నను భవత్కరుణ మెఱసి తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత! సత్కృపామూర్తి! యో దేవచక్రవర్తి!

311

తా॥ ఓ దేవతా చక్రవర్తి! దయామూర్తి! వేదాలచే స్తుతించబడు దేవా! నువ్వు ఎటువంటి విజ్ఞానం చేత ఈ అఖీలలోకాలను కల్పిస్తున్నావో నాకుకూడా అట్టి సుజ్ఞానాన్ని దయతో ప్రసాదించు. సృష్టినిర్మాణం చెయ్యాలనే కోరిక నాలో ప్రబలంగా ఉంది. అది చేసే కుశలత్వం నాకిచ్చి ఆ కర్మవల్ల పాపం లేకుండా తొలగించుకొనే ఉపాయం నాకెట్లా కలుగుతుందో చెప్పి కృతార్థుణ్ణి చెయ్యి.

చ. భవదుదర ప్రభూతమగు పద్మమునందు వసించి యున్న నే నవిరళతావకీన కలితాంశమునం దనరార విశ్వముం దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలముల్ శివతరమై ఫలింపఁ గృపసేయుము భక్తఫలప్రదాయకా!

312

తా॥ స్వామీ! నీ ఉదరమునుండి వెలువడిన పద్మములో వసించి ఉన్న నేను అంతులేని నీ అంశతో ప్రకాశించే ఈ జగత్తును సృష్టించడానికి సిద్ధమయ్యాను. నేను బహువిధాలుగా పల్కెడి వేదరాశి ఫలించేటట్లు శుభకరములయ్యేటట్లు కృప చెయ్యవలసింది."

చ. అని యనుకంప దోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారు లో చన సరసీరుహుం డగుచు సర్వజగత్పరికల్పనారతిం దనరిన నన్నుఁ బ్రోచుటకుఁ దా నిటు సన్నిధియైన యీశ్వరుం డనయము నాదు దుఃఖము దయామతిఁ బాపెడు మంచు నమ్రుఁడై.

313

తా॥ అని ఎంతో కారుణ్యంతో బ్రహ్మ వినయంతో సాష్టాంగ నమస్కారం చేసి "ఈ సర్వజగత్తును సృష్టించడానికి సిద్ధంగా ఉన్న నన్ను కాపాడటానికై దర్శనమొసగిన పరాత్పరుడు దయతో నా దుఃఖాన్ని దూరంచేయు గాక" – అని ప్రార్థించాడు.

క. వనరుహసంజాతుఁడు నె, మ్మనమున హర్షించె ననుచు మైత్రేయ మహా ముని ఘనుఁడగు విదురునకున్, వినయంబున నెఱిఁగ జెప్పి వెండియుఁ బలికెన్.

314

తా॥ అలా ప్రార్థించి, బ్రహ్మ తన మనస్సులో ఎంతో సంతోషించాడు అని మైత్రేయ మహాముని విదురునితో వినయంగా పలికి ఇట్లా అన్నాడు:

మ. వనజాతప్రభవుండు కేవలతపో వ్యాసంగుఁడై పద్మ లో చను గోవిందు ననంతు నాధ్యుఁ దన వాక్ఛక్తిన్ నుతింపన్ సుధా శనవంద్యుండు ప్రసన్నుఁడై నిఖిలవిశ్వస్థాపనాలోకనం బునఁ జూచెన్ విలయప్రభూత బహువాఃపూరంబులన్ వ్రేల్మిడిన్.

315

తా॥ కమలసంభవుడైన బ్రహ్మ కేవలం తపస్సు చెయ్యాలనే తీవ్రమైన కోరికతో; గోవిందుడు, అనంతుడు అయిన సర్వేశ్వరుణ్ణి తన వాక్కులచే నుతించాడు. దేవతలచే నుతింపబడే ఆ స్వామి ప్రసన్నుడై ఈ సృష్టి చెయ్యాలనే సంకల్పంతో ప్రళయకాలంలో పుట్టిన అనంతమైన జలరాశిని ఒక్కసారి అవలోకించాడు.

తే. అట్లు వొడగని యార్తుఁడై నట్టి పద్మ, భవునివాంఛిత మాత్మఁ దీర్పంగఁ దలఁచి యతని మోహనివారక మైనయట్టి, యమృతరస తుల్యమధుర వాక్యముల ననియె.

316

తా॥ అట్లాచూచి ఆర్తుడైనట్టి బ్రహ్మదేవుని మనస్సులోని కోరిక తీర్చాలనే సంకల్పంతో తన మోహనివారకమైనట్టి అమృతము వంటి మధుర వాక్యములతో ఇట్లా అన్నాడు:

## బ్రహ్మకు శ్రీమన్నారాయణుని కర్తవ్యోపదేశము

చ తలకొని నీ యొనర్చు పని తప్పి మదిం దలపోయు దుఃఖముం దలఁగుము; నాదులీలకుఁ బ్రధానగుణంబగు సృష్టికల్పనం బలవడఁజేయు బుద్ధి హృదయంబునఁ జొన్పి తపస్సమాధి ని ష్ఠల నతిభక్తులన్ ననుఁ బ్రసన్నునిఁ జేయుము చెందుఁ గోరికల్.

317

తా॥ "నువ్వు చేద్దామనుకొన్న పని మానకు. దుఃఖాన్ని మాను. నా లీలకు ప్రధానమైనది సృష్టి కల్పనమే! ఈ విషయాన్ని నీ హృదయంలో పెట్టుకుని సమాధినిష్ఠుడవై తీవ్రమైన తపస్సుచేసి నన్ను సంతుష్టుణ్ణి చేసినట్లైతే నీ కోరికలు నెరవేరుతాయి.

క. నీ వొనరించు తపో వి, ద్యావిభవ విలోకనీయమగు నీ సృష్టిం గావింపుము లోకంబుల, లోవెలిఁగెడి నన్నుఁ గందు లోకస్తుత్యా!

318

తా॥ అన్ని లోకములచేత పొగడబడే వాడా! నీ తపస్సుకు తగినట్లు చూడతగిన ఈ సృష్టిని ప్రారంభం చెయ్యి. అప్పుడు అన్ని లోకములలోను లోపల వెలిగెడి నన్ను చూడగలుగుతావు.

క. నాలోని జీవకోటులు, వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు, నీ వాలోకింపుము దారు వి, లోలహుతాశనుని కరణి లోకస్తుత్యా!

319

తా॥ లోకములచేత స్తుతింపబడే వాడా! ఎండుకట్టె లోపల దాగివున్న అగ్నివలె నాలో ఉన్న అనేకానేక జీవకోటులన్ని నీకిప్పుడు కనిపిస్తాయి చూడు.

సీ. నలు వొంద నఖీల జీవులయందుఁ గల నన్నుఁ, దెలిసి సేవింపుము నలినగర్భ! భవదీయదోషముల్ వాయును భూతేంద్రి, యాశ్రయరహితమై విశుద్ధ మైన జీవుని విమలాంతరాత్ముఁడైన, నను నేకముగఁ జూచు నరుఁడు మోక్ష పరమార్గవర్తియై భాసిల్లు, బ్రహ్మాండ, మందు వివిధకర్మానురూప

తే. పద్ధతులఁజేసి పెక్కు రూపముల నొందు, జీవతతి రచియించ నీచిత్త మెపుడు మత్పదాంబుజ యుగళంబు మరగియున్న, కతన రాజసగుణమునఁ గలుగ దఘము.

320

తా॥ ఓ కమల సంభవా! అన్ని జీవులయందు గల నన్ను తెలుసుకొని సేవించు. అన్ని దోషాలు నశిస్తాయి. పంచభూతములకు, పది ఇంద్రియములకు సంబంధం లేకుండా ఉన్నవాడే జీవుడు. స్వచ్ఛమైన అంతరంగ స్వరూపంలో ఉన్నదే ఆత్మ. ఈ రెంటిని ఒకే తీరులో భేదం లేకుండా ఒకటిగా చూసే నరుడు తప్పక మోక్షమార్గంలో ప్రకాశిస్తాడు. ఈ బ్రహ్మాండంలో వివిధ కర్మలను చెయ్యడానికి తగిన రూపములను నీవు సృష్టించుతున్నప్పటికి నీ చిత్తం ఎప్పుడూ నా పాదాంబుజములనే ఆశ్రయించి ఉన్నందువల్ల నీకు పాపం లేదు.

క. విను మదియుఁగాక ప్రాణుల, కనయము నెఱుఁగంగరాని యనఘుఁడఁ దేజో ధనుఁడఁ బరేశుఁడ నీ చే, తను గానంబడితి నిదె పితామహ! కంటే.

321

తా॥ ఓ పితామహా! బ్రహ్మ ఈ ప్రాణులు నన్నెప్పుడు తెలుసుకోలేని తేజోనిధిని, పరమేశ్వరుణ్ణి! అట్టి నేను నీ చేత చూడబడ్డాను!

వ. మఱియు భూతేంద్రియ గుణాత్మకం డనియు జగన్మయుండ ననియు నన్ను నీ చిత్తంబునందుఁ దలంపుము; తామరసనాళ వివరపథంబు వెంటం జని జలంబులలోనం జూడం గోరినట్టి మదీయస్వరూపంబు.

322

క. నీ కిప్పుడు గానంబడె, నాకులకును నురగపతి పినాకులకైనన్ వాకొనఁగం దలపోయను, రాకుండు మదీయరూప రమ్యత్వంబుల్.

323

తా॥ ఆనాడు తామరతూడులో నుండి నీటిలో నువ్వు చూడాలనుకున్న నా స్వరూపం... ఇప్పుడు నువ్వు చూస్తున్న స్వరూపము రెండూ ఒకటే! ఓ పితామహా! పంచ మహాభూతాలకు, పది ఇంద్రియాలకు, త్రిగుణాలకు ఆత్మననియు, ఈ సృష్టి అంతటా వ్యాపించి ఉన్నవాడననియు నీ మనస్సులో ధ్యానించు. దేవతలు, ఆదిశేషువు, ఆఖరుకు ఈశ్వరుడుకూడా నా రూపాన్ని, రమ్యత్వాన్ని మాటలలో వర్ణింపలేరు... మనస్సులో ఊహింపలేరు.

క. కావున మచ్చారిత్ర క, థా విలసితమైన సుమహితస్తవము జగ త్పావనము విగతసంశయ, భావుఁడవై బుద్ధి నిలుపు పంకజజన్మా!

324

తా॥ ఓ పద్మసంభవా! నా చరిత్రతోకూడి వెలుగొందే మహిమోపేతమైన ఈ స్తోత్రం సమస్తమైన జగత్తును పావనం చేసేటటువంటిది. ఆ కారణంగా నీ మనస్సులో ఎలాంటి సంశయాలు పెట్టుకోకుండా నిశ్చలమైన బుద్ధిలో నెలకొని ఉండు.

క. అగుణుఁడ నై లీలార్థము, జగములఁ గల్పింపఁ దలఁచు చతురుని నన్నున్ సగుణునిఁగా నుతియించితి, దగ సంతసమయ్యె నాకుఁ దామరసభవా!

325

తా॥ ఓ పద్మసంభవా! నిర్గుణ పరబ్రహ్మ స్వరూపుడనైన నేను లీలగా ఈ జగత్తును కల్పించాలనుకొన్నాను. అట్టి నన్ను సగుణునిగా స్తుతించావు. నాకు సంతోషంగా ఉంది.

క. ఈ మంజుస్తవరాజము, నీ మనమునఁ జింతఁ దక్కి నిలుపుము భక్తిన్ ధీమహిత! నీ మనంబునఁ, గామించిన కోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ.

326

తా॥ ఓ బుద్ధిమంతుడా! మనోహరమైన ఈ స్తోత్రరాజాన్ని నీ మనస్సులో ఎలాంటి చింతలు పెట్టుకోకుండా భక్తితో నిలుపుకో! నీ కోరికలన్ని తప్పక నెరవేరుతాయి.

క. అనుదినమును ద్రిజగత్పా, వన మగు నీ మంగళ స్తవంబుఁ బఠింపన్ వినినను జనులకు నేఁ బొడ, గనఁబడుదు నవాప్తసకల కాముఁడ నగుచున్.

327

తా॥ మూడు లోకాలను పావనంచేసే ఈ మంగళకరమైన స్తోత్రాన్ని ప్రతినిత్యము పఠించినా, విన్నా అట్టి భక్తులకు కోర్కెలు తీర్చి నేను దర్శనమిస్తాను.

తే. వన తటాకోపనయన వివాహ దేవ, భవన నిర్మాణ భూమ్యాది వివిధ దాన జప తపో వ్రత యోగ యజ్ఞముల ఫలము, మామక స్తవఫలము సమంబు గాదు.

328

తా॥ తోటలు వెయ్యటం, చెరువులు త్రవ్వించటం, ఉపనయన వేదికలు, వివాహ మండపములు, దేవాలయ ప్రతిష్ఠ చెయ్యటం, భూదానం మొదలైన దానాలు చెయ్యటం, జపాలు, తపాలు, వ్రతాలు, యోగాలు, యజ్ఞాలు వీటివల్ల వచ్చేఫలం... నన్ను స్తోత్రం చెయ్యటం వలన వచ్చే ఫలానికి ఏమాత్రమూ సమానం కావు. అందుకే ఈ స్తవరాజము మహామహిమాన్వితమైనదని తెలుసుకో.

క. జీవావలిఁ గల్పించుచు, జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియ వ స్త్వావలిలోపలఁ బ్రియ వ, స్త్వావలినై యుండు నన్ను ననిశముఁ బ్రీతిన్.

329

క. తలఁపుము మత్ప్రీతికినై, కలిగించితి నిన్ను భువనకారణ! నా లో పల నడఁగి యేకమై ని,
శ్చలగతి వసియించి యున్న జగముల నెల్లన్.

330

తా॥ జీవులను సృష్టిస్తూ, ఆ జీవ సమూహంలో ఉంటూ, ఇష్టమైన వస్తువుల్లో ఇష్టమైన వస్తువుగా ఉంటూన్న నన్ను ఎప్పుడూ తలచుకో! నా ప్రీతి కోసమే నిన్ను సృష్టించాను. నాలో అణగి కదలకుండ ఏకరూపంలో ఉన్న లోకాలన్నిటిని...

తే. తగ నహంకార మూలతత్త్వంబు నొంది, నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు వినఁగ
నానతి యిచ్చి య వ్విష్ణుఁ డభవుఁ, డంత నంతర్హితుం డయ్యె ననఘచరిత!

331

తా॥ అహంకారమే మూలతత్త్వంగా నువ్వు పుట్టించు" అని బ్రహ్మకి ఆజ్ఞాపించి శ్రీమహావిష్ణువు కనుమరుగయ్యాడు."

క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు వలికెఁ గడు ముద మొప్పన్
జననుత; నలినదళాక్షుఁడు, సనినం బద్మజుఁడు దేహసంబంధమునన్.

332

క. మానస సంబంధంబును, బూనిన యీసర్గ మెట్లు పుట్టించె? దయాం
భోనిధివై నా కింతయు, మానుగ నెఱిఁగింపవయ్య మహితవిచారా!

333

తా॥ అని ఇట్లా పలికిన మైత్రేయుణ్ణి చూచి విదురుడు సంతోషంతో ఇలా అన్నాడు: "ఓ మైత్రేయా! శ్రీమహావిష్ణువు కనుమరుగైన పిమ్మట బ్రహ్మ దేహంతో పాటు మనస్సు కూడగల ఈ

సృష్టిని ఎలా చేశాడో నాకు తెలిసేటట్లు చెప్పవలసింది."

## కమలసంభవుని మానస సర్గము

వ. అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షవరదాన ప్రభావంబునం బంకజాసనుండు శతదివ్య వత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబు గావించి తత్కాలవాయువుచేఁ గంపితంబగు నిజనివాసంబయిన పద్మంబును వాయువును జలంబులను గనుంగొని యాత్మీయ తపశ్శక్తిచేత నభివృద్ధిం బొందిన విద్యాబలంబున వాయువు బంధించి, తోయంబులతోడ నొక్క తోయంబ సమస్తంబునుం గ్రోలి, యంత గగనవ్యాపి యగు జలంబును గనుంగొని.

334

తా॥ అప్పుడు మునిశ్రేష్ఠుడైన మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు: “విష్ణువు యొక్క వరప్రభావం చేత బ్రహ్మ నూరు దివ్యవత్సరాలు భగవంతుణ్ణి గూర్చి తపస్సు చేశాడు. అప్పుడు వీచిన కాల వాయువుకు తన నివాసమైన పద్మం కదిలింది. నీరు చలించింది. దానిని చూసిన బ్రహ్మ తన తపశ్శక్తిచేత అభివృద్ధి పొందిన విద్యాబలం చేత వాయువును బంధించి కనుపిస్తూన్న మహాజలాన్నంతటిని ఒక్క గుక్కతో త్రాగి గగనవ్యాపి అయిన జలాన్నిచూసాడు.

ఉ. వారిజ సంభవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై త్యారిఁ బయోవిహారి సముదంచితహారి నతాఖిలామృతా హారి రమాసతీహృదయహారి నుదారి విదూరభూరి సం సారి భవప్రహారి విలసన్నుత సూరి నఘారి నయ్యెడన్.

335

తా॥ బుధులచేత వందనీయుడైన బ్రహ్మ తన మనస్సులో దైత్యులకు శత్రువైనవాడు, నీటియందు విహరించువాడు, ఒప్పైన హారములను ధరించినవాడు, దేవతలచేత వందనములు గైకొనే వాడు, రమాదేవి హృదయాన్ని దొంగిలించినవాడు, ఉదారుడైనవాడు, సంసారంలోని దుఃఖాలను తొలగించేవాడు, పుట్టుక లేకుండ చేసేవాడు, పండితులచేత పొగడబడేవాడు అయిన

భగవంతుణ్ణి ధ్యానించాడు.

తే. అట్లు దలంచి సరోజజుం డంబుజమును, గగనతలమునఁ జూచి యా కమలకోశ
లీనమై యున్న లోకవితానములను, నొయ్యఁ బొడఁగని హరిచే నియుక్తుఁడైన.

336

తే. వానిఁ గాఁ దన్నుఁ దలఁచి య వ్వనరుహంబు, లోపలికిఁ బోయి మున్నందులోన నున్న
ముజ్జగంబులఁ జూచి యిమ్ముల సృజించె, మఱి చతుర్దశభువనముల్ మహిమఁ జేసి.

337

తా॥ ఇలా ధ్యానించగా... బ్రహ్మకి గగనతలంలో ఒక పద్మము, ఆ పద్మపత్రాలలో దాగి ఉన్న లోక సమూహము కనిపించాయి. వెంటనే విరించి తాను విష్ణువుచే నియుక్తుడైన వానిగా తలచి ఆ పద్మం లోపలికి పోయి అందులో ఉన్న మూడు లోకాలను చూసి తర్వాత తన మహిమతో చతుర్దశ భువనాలను అతి సుందరంగా సృష్టించాడు.

క. పరఁగ సుధాశన తిర్య, జ్నర వివిధస్థావరాది నానా సృష్టి స్ఫురణ నజుం డొనరించెం, బరువడి నిష్కామధర్మ ఫలరూపమునన్.

338

తా॥ తన ధర్మానికి ఫలస్వరూపంగా దేవతలు, పశుపక్ష్యాదులు, నరులు, వివిధములైన స్థావరములతో కూడిన ఈ సృష్టిని బ్రహ్మ నిర్మించాడు.

వ. ఇట్లు భువనంబులం బద్మజుండు గల్పించెనని మైత్రేయుండు విదురున కెఱింగించిన.

339

తా॥ ఈ ప్రకారం భువనాలను బ్రహ్మ సృష్టించాడని మైత్రేయుడు విదురునితో చెప్పాడు.

క. విదురుఁడు దురితావనిభృ, ద్భిదురుఁడు మునివరునిఁ జూచి ప్రియము మనమునం
గదురఁగ నిట్లని పలికె న, తి దురంతం బయిన విష్ణుదేవుని మహిమన్.

340

తే. అమరె భువనంబు లతని కాలాఖ్యతయును, గణుతిసేయు తదీయలక్షణము లర్థి నాకు
నెఱిఁగింపుమయ్య వివేక చరిత!, యనిన మైత్రేయుఁ డవ్విదురునకు ననియె.

341

తా॥ అప్పుడు విదురుడు ఆనందంతో మైత్రేయుణ్ణి చూసి "విష్ణువు యొక్క మహిమ వల్లనే కదా ఈ భువనాలన్ని ప్రకాశిస్తున్నాయి. అటువంటి పరమేశ్వరుని కాలస్వరూపాన్ని, దాన్ని లెక్కించే విధానాన్ని, దాని లక్షణాలను వివేకవంతుడవైన నువ్వు నాకు చెప్పవలసింద" ని అడిగాడు.

సీ. ఆద్యంతశూన్యంబు నవ్యయంబై తగు, తత్త్వ మింతకు నుపాదాన మగుట
గుణవిషయములు గైకొని కాలమును మహ, దాది భూతములు ద న్నాశ్రయింప
గాలానురూపంబుఁ గైకొని యీశుండు, దన లీలకై తనుఁ దా సృజించెఁ గరమొప్ప
నఖిలలోకములందుఁ దా నుండుఁ దనలోన నఖిలంబుఁ దనరుచుండుఁ

తే. గాన విశ్వమ్మునకుఁ గార్యకారణములు, దాన; య మ్మహాపురుషుని తనువు వలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్రభాస మొందె, మానితాచార! యీ వర్తమాన సృష్టి.

342

తా॥ సదాచార సంపన్నుడవైన ఓ విదురా! విను. ఆది అంతము లేనిది, అవ్యయమైనది అయిన తత్త్వమే ఈ సృష్టికి ఆది కారణం. ఈశ్వరుడు కాలానికి తగిన రూపం ధరించి, గుణములు, ఇంద్రియార్థాలు, మహత్తు, పంచమహాభూతాలు తనను ఆశ్రయింపగా కాలానికి తగిన రూపాన్ని గైకొని కేవలం వినోదానికై తనను తాను సృష్టించుకున్నాడు. ఆ ఈశ్వరుని

యందు లోకాలన్నీ ఉంటాయి. అన్ని లోకాలలోను ఈశ్వరుడుంటాడు. కనుక ఈ అనంత విశ్వమునకు కార్యము, కారణము రెండూ తానే. ఆ మహాపురుషుని నుండి వెలువడి ఈ విశ్వము ప్రకాశిస్తోంది.

క. తెఱఁగొప్ప నఖిలవిశ్వముఁ, బురుషోత్తము మాయచేతఁ బుట్టుం బెరుఁగున్ విరతిం బొందుచు నుండుం, గర మర్థిన్ భూత భావి కాలములందున్.

343

తా॥ శ్రీమహావిష్ణువు యొక్క మాయవల్ల ఈ విశ్వమంతా ఒక పద్ధతిలో పుట్టి పెరిగి నాశనమవుతూ ఉంటుంది. భూతకాలంలో ఇలాగే జరిగింది. భవిష్యత్తులో కూడ ఇలాగే జరుగుతుంది.

# బ్రహ్మనిర్ణితమైన దశవిధ సర్గంబులు

వ. అట్టి సర్గంబు నవవిధం; బందుఁ బ్రాకృతవైకృతంబులు గాల ద్రవ్య గుణంబులను త్రివిధంబగు భేదంబుచేఁ బ్రతిసంక్రమంబు లగుచు నుండు నందు మహత్తత్త్వంబు ప్రథమసర్గం; బది నారాయణసకాశంబున గుణవైషమ్యంబునం బొందు. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబైన యహంకార తత్త్వంబు ద్వితీయసర్గంబు; శబ్దస్పర్శరూప రసగంధంబు లను పంచతన్మాత్ర ద్రవ్య శక్తియుక్తంబైన పృథివ్యాది భూతసర్గంబు మూఁడవదియై యుండు; జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులుఁ గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలు నను దశవిధేంద్రియ జననంబు చతుర్థ సర్గంబు; సాత్త్వికాహంకార జనితంబైన సుమనోగణసర్గం బైదవసర్గంబై యొప్పు; నది మనోమయంబై యుండు; జీవలోకంబునకు నబుద్ధికృతంబులైన యావరణ విక్షేపంబులం జేయు తామససర్గం బాఱవదై యుండు; నియ్యాఱు నీశ్వరునకు లీలార్థంబు లయిన ప్రాకృతసర్గంబు లయ్యె; నింక వైకృతసర్గంబు నేడవది మొదలుగాఁ గలుగునవి వినిపింతు, వినుము; పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదులైన వనస్పతులును, బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహి యవ ముద్గా ద్యోషధులును, నారోహణానపేక్షంబులైన మాలతీమల్లికాది లతలును, ద్వక్సారంబులైన వేణ్వాదులును; గఠినీభూతమూలంబులును, శిఖావిస్తృతంబులు నగు లతా విశేషరూపంబులైన వీరుధంబులును; బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబులగు చూతాది ద్రుమంబులును నవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులుఁ దమఃప్రాయంబులునై స్థావరంబు లయిన యీ యాఱు నేడవ సర్గంబయ్యె; నెనిమిదవ సర్గంబు తిర్యక్సర్గంబు. ఇది యిరువది యెనిమిది భేదంబులు గలిగి శ్వస్తనాది జ్ఞానశూన్యంబులయి యాహారాది జ్ఞానమాత్ర నిష్ఠంబులయి, ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూక రోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేక శఫంబు గల

ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, బంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు నయ్యె, నర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుష సర్గంబు రజోగుణప్రేరితంబై కర్మకరణదక్షంబై దుఃఖంబందును సుఖంబు గోరు; నిది తొమ్మిదవ సర్గం బనందగు; నీ త్రివిధసర్గంబులు వైకృతసర్గంబు లనంబడు; నింక దేవసర్గంబు విను మదియు నెనిమిది తెఱంగులు గలిగి యుండు; నందు విబుధ పితృసురాదులు మూఁడును, గంధర్వాప్సరసలొకటియు, యక్షరక్షస్సు లేకంబును, భూతప్రేతపిశాచంబు లొకటియు, సిద్ధచారణ విద్యాధరు లేకంబును, గిన్నర కింపురుషు లొకటియునుంగా దేవసర్గం బయ్యె; నిట్టి బ్రహ్మ నిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి; నింక మనువులం దదంతరంబుల నెఱింగించెదఁ; గల్పాదులయందు నీ ప్రకారంబున స్వయంభూతుండును, నమోఘ సంకల్పుండును నగు నప్పుండరీకాక్షుండు రజోగుణ యుక్తుండై స్రష్ట యగుచు స్వస్వరూపంబయిన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె; నయ్యీశ్వరుని మాయావ్యాపారంబులచే నీ సృష్టియందు నద్యావర్తంబులంబడి భ్రమించుచున్న మహీరుహంబులంబోలె బూర్వాపరభావంబు లెఱుంగంబడకుండు; నీ కల్పంబునం దుండు దేవాసురాదులు ప్రతి మన్వంతరంబు నందును నిట్ల నామ రూపంబులచే నిర్దేశింపంబడుదురు; మఱియు నిం దొక్కవిశేషం బెఱింగించెదఁ. గౌమారసర్గం బనునది దేవ సర్గాంతర్భూతం బయ్యును బ్రాకృత వైకృతోభయాత్మకంబై దేవత్వ మనుష్యత్వ రూపంబైన సనత్కుమారాది సర్గం బనంబడె; నమోఘసంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁదాన యిట్లు విశ్వభేదంబును గల్పించెనని మైత్రేయుండు విదురునకుం జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁ డై యిట్లనియె.

344

తా॥ అటువంటి సృష్టి తొమ్మిది విధాలు. వానిలో ప్రాకృతాలు, వైకృతాలు అనేవి కాల,

ద్రవ్య, గుణములు అనే మూడు విధాలైన భేదాలచే పరస్పరం సంకరమవుతూ ఉంటాయి. అందులో మహత్తత్త్వం మొదటి సృష్టి. అది నారాయణుని సమీపంలో గుణభేదాన్ని పొందుతుంది. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమైన అహంకార తత్త్వం రెండవ సృష్టి. శబ్దస్పర్శరూపరసగంధాలు అనే పంచతన్మాత్రల ద్రవ్యశక్తితో కూడిన పృథ్వి మొదలైన పంచభూతముల సృష్టి మూడవది. జ్ఞానేంద్రియాలైన చర్మము, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు; కర్మేంద్రియాలైన వాక్కు, చేతులు, కాళ్ళు, పాయువు, ఉపస్థ అను పది ఇంద్రియాల పుట్టుక నాలుగవ సృష్టి. సాత్త్వికాహంకారం వల్ల పుట్టిన దేవతాగణాల సృష్టి ఐదవ సృష్టి. అది కేవలం మనోమయమై ఉంటుంది. ప్రాణిసమూహానికి అజ్ఞానకృతాలైన ఆవరణ విక్షేపాలు కలిగించే తామస సృష్టి ఆరవది. ఈ ఆరున్ను భగవంతుని లీలావిలాసాలైన ప్రాకృత సృష్టులు.

ఇక ఏడవది మొదలుగా వైకృత సృష్టులను వినిపిస్తాను. విను, పూలు పూయకుండానే ఫలించే రావి, మేడి, పనస, మఱ్ఱి మొదలైన వనస్పతులూ, పూచి ఫలించిన వెంటనే నశించి పోయే వడ్లు, యవలు, పెసలు మొదలైన ఓషధులును, పైకి ఎగప్రాకడానికి అవకాశం లేని మాలతి, మల్లె మొదలైన తీగలు, గట్టి బెరడు కలిగిన వెదుళ్ళు మొదలైనవి, నేలలో దృఢమైన వేళ్ళు కలిగి నేలపై బాగా విస్తరించే లతా విశేషాలైన దుబ్బులు, పొదలు, పుష్పించి ఫలాలనిచ్చే మామిడి మొదలైన వృక్షాలును, అవ్యక్తమైన చైతన్యంతో పైకి పెల్లుబుకుతూ తమోమయములై లోపల మాత్రమే స్పర్శజ్ఞానం కలవై కదలిపోలేని ఈ ఆరూ ఏడవ సృష్టి.

ఇక ఎనిమిదవ సృష్టిలో ఇరవై ఎనిమిది భేదాలు ఉన్నాయి. రేపు అనే జ్ఞానం లేనివై, ఆహారం మొదలైన వాటియందు మాత్రమే ఆసక్తికలవై, వాసన చూచి తెలుసుకోదగిన వాటిని తెలుసుకొంటూ, మనస్సులో పెద్దగా ఆలోచన చేయలేనివై, చీలిన గిట్టలు కలవైన ఎద్దు, ఎనుము, మేక, జింక, పంది, ఒంటె, గుఱ్ఱపోతు, నల్లచారల దుప్పి, పొట్టేలు ఈ తొమ్మిదిన్ని, చీలని గిట్టలు కలవైన గాడిద, గుఱ్ఱము, కంచర గాడిద, గౌరమృగం, శరభమృగం, చమరీమృగం ఈ ఆరున్ను, ఐదు గోళ్ళు కలవైన కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ఏదుపంది, సింహం,

కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము ఈ పండ్రెండున్ను (ఇవన్నీ భూచరాలు) మొసలి మొదలైన జలచరాలున్ను, రాబందు, గ్రద్ద, కొంగ, డేగ, తెల్ల పిట్ట, గబ్బిలం, నెమలి, హంస, బెగ్గురు పక్షి, జక్కవపిట్ట, కాకి, గుడ్లగూబ మొదలైన ఆకాశాన సంచరించే తిర్యక్కుల సృష్టి ఎనిమిదవ సృష్టి.

ఇక తొమ్మిదవది మానవసృష్టి. ఇది రజోగుణంతో పురికొల్పబడి కర్మలు చేయటంలో నేర్పుకలిగి, దుఃఖంలో కూడా సుఖాన్ని కోరేది. ఈ మూడు విధాలైన సృష్టులు వైకృత సృష్టులు.

ఇక దేవసర్గాన్ని గూర్చి విను. అదికూడ ఎనిమిది విధాలు. అందులో విబుధులు, పితృదేవతలు, సురాదులు మూడు భేదాలు. గంధర్వులు, అప్సరసలు ఒకటి; యక్షులు, రాక్షసులు ఒకటి; భూత ప్రేత పిశాచాలు ఒకటి; సిద్ధ చారణ విద్యాధరులు ఒకటి, కిన్నర కింపురుషులు ఒకటి. ఈ ఎనిమిది కలిసి దేవసర్గం అయింది. ఈ విధంగా బ్రహ్మదేవుడు నిర్మించిన పది విధాలైన సృష్టులను నీకు తెలిపాను.

ఇక మనువులను, మన్వంతరాలనూ తెల్పుతాను. కల్పారంభాలలో ఇదేవిధంగా తనను తాను సృజించుకునే వాడున్ను, మొక్కవోని తలంపు కలవాడున్ను, అయిన మహావిష్ణువు రజోగుణంతో కూడినవాడై సృష్టికర్తయై తన స్వరూపమే అయిన విశ్వాన్ని సామర్థ్యంవల్ల కల్పించాడు. ఆ ఈశ్వరుని మాయావిశేషం వల్ల ఈ సృష్టిలోని నదులలోని నీటి సుడులలోపడి తిరిగే చెట్లలాగే ముందు వెనుకలు తెలియకుండా ఉంటాయి. ఈ కల్పంలో ఉన్న దేవతలు, రాక్షసులు మొదలైన వారు ఇలాగే ప్రతిమన్వంతరంలోను ఆయా నామరూపాలతో వ్యవహరింపబడతారు.

మళ్ళీ ఇందులో ఒక విశేషముంది. అదేమంటే, కౌమారసర్గం అనేది దేవసర్గంలో ఒకభాగమే అయినా ప్రాకృత వైకృతముల రెంటి స్వభావము కలది. అందులో దైవత్వము మనుష్యత్వము కలసి ఉంటాయి. ఇదే సనత్కుమారాది సర్గం. సఫల సంకల్పుడైన పురుషోత్తముడు తనకు తానే ఈ విధంగా వివిధ భేదాలతో కూడిన విశ్వాన్ని కల్పించాడు.”

అని మైత్రేయుడు విదురునితో పలికి కాలస్వభావం వివరించాలనుకున్నవాడై ఈ విధంగా అన్నాడు:

# కాల లక్షణ నిరూపణము

సీ భువిఁ దనకార్యాంశమునకు నంతము నన్య, వస్తుయోగంబు నేవలన లేక ఘటపటాదిక జగత్కార్యంబునకు నిజ, సమవాయకారణత్వమునఁ బరఁగి జాలసూర్య మరీచి సంగతగగనస్థ, మగు త్రసరేణు షడంశమరయఁ బరమాణు వయ్యెఁ; దత్పరమాణువం దర్క, గతి యెంత తడవు దత్కాల మగును

తే. సూక్ష్మకాలంబు; విను మది సూర్యమండ, లంబు ద్వాదశరాశ్యాత్మకం బనంగఁ గలుగు జగమున నొక యేఁడు గడచి చనినఁ, గాల మెంతగు నది మహత్కాల మనఘ!

345

తా॥ "పరమేశ్వరుని సృష్టికి అంతము, అన్యవస్తు సంయోగము ఈ రెండూ అవసరం లేదు. (కేవల తర్కం వల్ల భగవంతుణ్ణి సాధించలేము.) ఈ భూమి మీద కుండలు, బట్టలు తయారయ్యే తీరు వేరు – ఈ యావత్ప్రపంచము యొక్క పుట్టుక వేరు. ఎలాగంటే... కుండ తయారవ్వాలంటే (1) మట్టి (ఉపాదాన కారణం), (2) మట్టిని కుండగా రూపొందించటం (సమవాయ కారణం), (3) కుండను చేసేవాడు (నిమిత్త కారణం) కావాలి. అలాగే బట్ట (వస్త్రం) తయారవటం కూడా.

(సృష్టిలో విడదియ్యలేని అత్యంత సూక్ష్మాంశానికే 'పరమాణువు' అని పేరు). కిటికీలోనుంచి ప్రసరించే సూర్యకాంతిలో మనకు కనిపించే చిన్న రేణువులో ఆరవభాగానికి 'పరమాణువు' అని పేరు. సూర్యకాంతి ఈ 'పరమాణువు' ద్వారా ప్రసరించేటప్పుడు పట్టే కాలానికి 'సూక్ష్మకాలం' అని పేరు. (దీనిని మనం ఊహించుకొన వలసిందే.) సూర్యుడు మేషాది పన్నెండు రాసులలోను తిరిగే కాలానికి 'మహత్కాలం' అని పేరు. దీనికే సంవత్సరము అని కూడా పేరు.

వ. అందుఁ బరమాణు ద్వయంబొక్క "యణు" వగు; నణుత్రితయం బొక్క "త్రసరేణు"

వగు; నవి మూఁడు గూడ నొక్క "త్రుటి" యగు; నాత్రుటిశతం బొక్క "వేధ" యనంబరఁగు; నట్టి వేధలు మూఁడు గూడ నొక్క "లవం" బనదగు; నవి మూఁడైన నొక్క "నిమేషం" బనంజను; నిమేషత్రయం బొక్క "క్షణం" బగు; తత్క్షణ పంచకం బొక్క "కాష్ఠ" యనం దగు; నవి పదియై నొక్క "లఘు" వన నొప్పు; నట్టి లఘుపంచ దశకంబొక్క "నాడి" యనంబరఁగు; నట్టి నాడికాద్వయం బొక్క "ముహూర్తం" బయ్యె; నట్టి నాడిక లాఱైన–నేడైన–మనుష్యులకు నొక "ప్రహరం" బగు; నదియ "యామం" బనంజను; దివసపరిమాణ విజ్ఞేయంబు నాడికోన్మాన లక్షణం బెఱింగింతు వినుము; షట్ఫల తామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాష సువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణంబు నొందునంత కాలం బొక్క "నాడిక" యగు; యామంబులు నాలుగు సన నొక్క "పగ" లగు; రాత్రియు నిప్పగిది జరగు; నట్టి యహర్నిశంబులు గూడ మర్త్యుల కొక దివసం" బగు; నవి పదునేనైన నొక్క "పక్షం" బగు; శుక్ల కృష్ణ నామంబులం బరఁగిన య ప్పక్షంబులు రెండుగూడ నొక్క 'మాసం' బగు; నది పితృదేవతలకు నొక్క "దివసం" బగు; నట్టి మాసంబులు రెండైన నొక్క "ఋతు" వగు; షణ్మాసంబు లరిగిన నొక్క 'యయనం' బగు; దక్షిణోత్తర నామంబులం బరఁగినట్టి యయనంబులు రెండుగూడి ద్వాదశ మాసంబులైన నొక్క "సంవత్సరం" బగు; నట్టి సంవత్సరశతంబు నరులకుం బరమాయు వైయుండుఁ; గాలాత్మండును నీశ్వరుండునునైన సూర్యుండు గ్రహ నక్షత్ర తారా చక్రస్థుండై పరమాణ్వాది సంవత్సరాంతంబైన కాలంబునం జేసి ద్వాదశరా శ్యాత్మకంబైన జగంబున సౌర బార్హస్పత్య సావన చాంద్ర నాక్షత్ర మాన భేదంబులం గానంబడు చున్నవాఁడై సంవత్సర పరివత్స రేడావత్స రానువత్సర వత్సర నామంబుల సృజ్యంబైన బీజాంకురంబుల శక్తిం గాలరూపంబైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుఁ బురుషులకు నాయురాది వ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గల వారికి యజ్ఞ ముఖంబులం జేసి గుణమయంబులైన స్వర్గాది ఫలంబుల విస్తరింపఁజేయుచు, గగనంబునఁ బరువువెట్టు. వత్సరపంచక

ప్రవర్తకుండగు మార్తాండునకుం బూజ గావింపు మని మైత్రేయుండు పలికిన విదురుం డిట్లనియె.

346

తా॥ రెండు పరమాణువులు ఒక 'అణువు', మూడు అణువులు ఒక 'త్రసరేణువు'. మూడు త్రసరేణువులు ఒక 'త్రుటి'. నూరు త్రుటులు ఒక 'వేధ'. మూడు వేధలు ఒక 'లవం'. మూడు లవములు ఒక 'నిమేషం'. మూడు నిమేషాలు ఒక 'క్షణం'. అయిదు క్షణాలు ఒక 'కాష్ఠ'. పది కాష్ఠలు ఒక 'లఘువు'. పదిహేను లఘువులు ఒక 'నాడి'. రెండు నాడులు ఒక 'ముహూర్తం'. అట్టి నాడులు ఆరు కానీ ఏడు కానీ అయితే ఒక 'ప్రహరం'. దానినే 'యామం' అని లేక 'జాము' అని అంటారు.

దిన పరిమాణాన్ని తెలిపే నాడిని కొలిచే విధానాన్ని చెబుతాను విను. ఆరు ఫలాల రాగితో పాత్రను సిద్ధంచేసి, నాలుగు మినప గింజల బరువుగల బంగారముతో నాల్గు అంగుళాల పొడవుగల కమ్మీ తయారుచేసి దానితో ఆ పాత్ర క్రింద రంధ్రం చేసి ఆ రంధ్రంగుండా తూమెడు నీరు పూర్తిగా క్రిందకు కారడానికి ఎంతకాలం పడుతుందో అంత కాలాన్ని ఒక 'నాడి' అంటారు.

నాలుగు జాములు ఒక 'పగ' లవుతుంది. అలాగే నాలుగు జాములు ఒక 'రాత్రి' అవుతుంది. పగలు రాత్రి కలిస్తే మానవులకు ఒక 'దినం'. పదిహేను దినాలు (రోజులు) ఒక 'పక్షం'. శుక్ల పక్షం, కృష్ణ పక్షం అని పక్షములు రెండు. రెండు పక్షాలు కలిస్తే ఒక 'నెల'. అది పితృదేవతలకు ఒక 'దినం'. రెండు నెలలు ఒక 'ఋతువు'. ఆరు నెలలు ఒక 'అయనం'. అయనాలు రెండు. అవి దక్షిణాయనం, ఉత్తరాయనం. ఈ రెండూ కలిస్తే ఒక 'సంవత్సరం'. నూరు సంవత్సరాలు మానవులకు పరమాయువు. (మానవుల సంవత్సరం దేవతలకు ఒక్క 'దినం' అవుతుంది.)

కాలమే ఆత్మగాగల ఈశ్వరుడైన సూర్యుడు గ్రహ, నక్షత్రాలతో కూడి తారాచక్రంలో

ఉండి పరమాణువు మొదలు సంవత్సరం వరకు ఉన్న కాలంలో పం[డెండు రాసులను చుట్టి వస్తాడు. ఈ సూర్య గమనమే సంవత్సరం, పలీవత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, వత్సరం అనే భేదాలు కలిగి ఉంటుంది. సూర్య గమనం వల్ల సౌరమానం, చాం[ద్రమానం, నక్ష[త్రమానం, బార్హస్పత్యమానం అనే భేదాలతో సంవత్సర కాలం ఏర్పడుతుంది. కాలాన్ని [పవర్తింప చేసే సూర్యుడు; విత్తనాల నుండి అంకురాలు మొలకెత్తినట్లు కాలరూపమైన తన శక్తితో అనుకూలంగా మలుచుకొంటూ, జీవుల ఆయువు మొదలైన వానిని తగ్గిస్తూ, ఆయువు తగ్గుతూంటే [కమంగా విషయములపట్ల కోరికలు తగ్గుతూ, కోరికలతో యజ్ఞాలు చేసే వారికి గుణములతో కూడిన స్వర్గాది లోకాలను సమకూరుస్తూ ఆకాశంలో సంచరిస్తూ ఉంటాడు. ఈ విధంగా అయిదు విధాలైన సంవత్సరాలను [పవర్తింపచేసే సూర్య భగవానుణ్ణి ఆరాధించమ" ని మై[త్రేయుడు చెప్పగా విదురుడు ఇలా అన్నాడు:

క. నర పితృసుర పరమాయుః, పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి, మునీ శ్వర! యెఱింగింపు [తిలోకో, పరిలోక విలోక నైకపరులగు వారిన్.

347

తా॥ "ఓ మునీశ్వర! నరులు, పితృదేవతలు, దేవతలు – వీళ్ళ యొక్క పరమాయువును గూర్చి నాకు చెప్పావు. మూడు లోకాలు, ఆపై లోకాలు చూడాలనే కాంక్షతో తిరిగే వారి గురించి నాకు వివరించు.

ఉ. పూనిన యోగసిద్ధి దగఁ బొందిన నే[త్రయుగంబునన్ బహిర్ జ్ఞానము గల్గి యుండి భువనంబులఁ జూచుచు నుండువారికి న్మానుగఁ గల్గు కాలగతి నా కెఱిఁగింపు మునీం[ద! నావుడు న్నానయశాలి యవ్విదురు నాదర మొప్పఁగ జూచి యిట్లనున్.

348

తా॥ యోగసిద్ధి పొందిన నే[త్రయుగ్మం చేత బాహ్యజ్ఞానం కలిగియుండి ఈ

భువనములను చూచే వారికి కలిగే కాలగతి నాకు చెప్పవలసింది” అని అడిగిన విదురునితో మైత్రేయుడు ఇలా అన్నాడు:

సీ. జననుత! కృతయుగసంఖ్య నాలుగువేల, దివ్యవర్షములు; దదీయ సంధ్య లెనిమిది నూఱేండ్లు; విను త్రేత వత్సర, త్రిసహస్రము లగుఁ దదీయ సంధ్య లాఱునూఱేఁడులు నగు; ద్వాపరము రెండు, వేల వత్సరముల వెలయు సంధ్య లోలి నన్నూఱేఁడు; లొగిఁ గలియుగము స, హస్ర వర్షములు సంధ్యాంశ మరయ

తే. రెండు నూఱేఁడులును నిల్చి యుండుఁ జువ్వె?, యనఘ! సంధ్యాంశ మధ్యంబునందు ధర్మ మతిశయించును; సంధ్యాంశమందు ధర్మ, మల్పమై కానఁబడుచుండు ననఘ చరిత!

349

తా॥ “ఓ విదురా! విను! కృతయుగ సంఖ్య నాలుగువేల దివ్యసంవత్సరాలు. దాని సంధ్యాకాలం ఎనిమిది వందల ఏండ్లు. గతించిన యుగానికి రాబోయే యుగానికి మధ్యకాలాన్ని “సంధ్య” అంటారు. త్రేతాయుగ ప్రమాణం మూడువేల దివ్య సంవత్సరాలు. సంధ్యాకాలం ఆరువందల ఏండ్లు. ద్వాపర యుగ ప్రమాణం రెండు వేల దివ్య సంవత్సరాలు. సంధ్యాకాలం నాలుగు వందల సంవత్సరాలు. కలియుగ ప్రమాణం వెయ్యి దివ్య సంవత్సరాలు. సంధ్యాకాలం రెండు వందల సంవత్సరాలు. ఈ సంధ్యాంశముల మధ్య కాలంలో ధర్మం అతిశయిస్తుంది. సంధ్యాంశలో ధర్మం అల్పమై ఉంటుంది.

వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగు పాదంబులును, ద్రేతయందు మూఁడుపాదంబులును, ద్వాపరంబునం బాదద్వయంబును, గలియుగంబున నేకపాదంబును, గలిగి సంచరించు నట్టగుటం జేసి.

350

తా॥ ధర్మదేవత కృతయుగంలో నాలుగు పాదాలు, త్రేతలో మూడు పాదాలు,

ద్వాపరంలో రెండు పాదాలు, కలియుగంలో ఒక్క పాదంలోను సంచరిస్తుంది.

క. పాదవిభేదంబున మ, ర్యాదలును దఱుఁగు, నధర్మ మాకొలఁదినె యు త్పాదిల్లి వృద్ధిఁబొందు ధ, రాదివిజులు పాపబుద్ధిరతు లగుదు రిలన్.

351

తా॥ ఈ పాదాల భేదంవల్ల ప్రజలలో మర్యాదలు తగ్గుతాయి. అధర్మం పుట్టి వృద్ధిపొందుతుంది. బ్రాహ్మణులు పాపబుద్ధియందు ఆసక్తి కలవారై ఉంటారు.

సీ. భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడువునఁ, గడు నొప్పు సత్యలోకంబునందు నుండు బ్రహ్మకుఁ జతుర్యుగ సహస్రము లేఁగ, దివ మొక్కటి యగు రాత్రియును నిట్ల చన ధాత నిద్రవో జగము లడంగు, మే, ల్కని చూడ మరల లోకములు పుట్టుఁ; దద్దినమ్మునఁ జతుర్దశమను లగుదు; రం, దొక్కొక్క మనువున కొనర దివ్య

తే. యుగము లోలిని డెబ్బదియొక్క మాఱు, సనిన, మనుకాల మయ్యె; న మ్మను కులంబు సురలు మునులును సప్తర్షు లరయ భగవదంశమునఁ బుట్టి పాలింతు రఖిలజగము.

352

తా॥ భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం... వీటికంటే పైన సత్యలోకం ఉంటుంది. అక్కడ ఉండే బ్రహ్మకు చతుర్యుగాలు వేయి అయితే ఒక పగలు అవుతుంది. అలాగే రాత్రికూడా. బ్రహ్మ రాత్రి నిద్రపోతే లోకాలన్నిటికి ప్రళయం వస్తుంది. మేల్కొని చూస్తే తిరిగి లోకాలు పుడతాయి. ఆ బ్రహ్మ ఒక దినంలో పద్నాలుగు మన్వంతరాల కాలం గడుస్తుంది. వాళ్ళల్లో ఒక్కొక్క మనువుకాలం డెబ్బది యొక్క దివ్య యుగాలు. దీనికే 'మన్వంతరం' అని పేరు. దేవతలు, మునులు, సప్త ఋషులు వీళ్ళంతా భగవదంశతో పుట్టి ఈ మన్వంతరాలలో ఈ లోకాలను పాలిస్తారు.

క. హరి పితృ సుపర్వ తిర్యఙ్న, ర రూపములన్ జనించి నయమున మన్వం తరముల నిజసత్త్వంబునఁ, బరిపాలించును జగంబుఁ బౌరుష మొప్పన్.

353

తా॥ శ్రీహరి పితృ, దేవ, పశు, పక్షి, మానవ రూపాలలో జన్మించి ఈ మన్వంతరాలలో తనయొక్క సత్త్వగుణం చేత, పురుష భావం చేత ఈ విశ్వాన్ని పాలిస్తాడు.

క. క్రమమునఁ ద్రైవర్గిక స, ర్గము సెప్పంబడె, సరోజగర్భుఁడు దివసాం తమునఁ దమఃపిహిత పరా, క్రముఁడై శయనించు నిద్రఁ గైకొని యంతన్.

354

తా॥ క్రమంగా నీకు సృష్టి విశేషాలను చెప్పాను. పగలు పూర్తి కాగానే బ్రహ్మ శయనిస్తాడు. ఆయన నిద్రలో ఆయన శక్తిసామర్థ్యములు, పరాక్రమము అంధకారంతో ఆవరింపబడతాయి.

సీ. ఆ రాత్రి భువనత్రయము దమఃపిహితమై, భానుచంద్రులతో విలీనమైన సర్వాత్ముఁడగు హరి శక్తి రూపంబయి, కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని భువనత్రయంబును దవిలి దహింప న, య్యనలకీలలఁ బొడమిన మహోష్మ మలమినఁ గమలి మహర్లోకవాసులు, జనలోకమునకును జనుదు రపుడు

తే. విలయ సమయ సముత్కట విపుల చండ, వాత ధూతోర్మిజాల దుర్వార వార్ధి భువనములు ముంచు నమ్మూఁడు భువనములను, దత్పయోరాశి మీదఁ బద్మావిభుండు.

355

తా॥ బ్రహ్మ నిద్రించేసరికి భువనత్రయం కూడా కటిక చీకటిలో సూర్య చంద్రులతో పాటు లీనమై పోతుంది. సర్వాత్ముడైన శ్రీహరి యొక్క శక్తి రూపమైన సంకర్షణాగ్ని ముల్లోకాలను

దహిస్తుంది. ఆ అగ్నికీలలకు వ్యాపించిన వేడిమికి తట్టుకొనలేక కమిలిపోయి మహర్లోక వాసులు జనలోకానికి పరుగెడతారు. అప్పుడు ఆ విలయ సమయములో వీచే భీకరమైన వాయువులకు ఎగసిపడే మహా భయంకరమైన సముద్రజలాలు మూడు లోకాలను కప్పేస్తాయి. ఆ మహార్ణవ మధ్యలో శయనించి ఉంటాడు శ్రీమన్నారాయణుడు.

ఉ. చారు పటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా పూర మృణాళ హార పరిపూర్ణ సుధాకర కాశ మల్లికా సార నిభాంగ శోభిత భుజంగమ తల్పమునందు యోగ ని ద్రారతిఁ జెంది యుండు జఠర స్థితభూర్భువరాదిలోకుఁడై.

356

తా॥ అందమైన చందనము వలె, వజ్రం వలె, కర్పూరమువలె, మంచువలె, రాజహంసలా, శరత్కాల చంద్రికలా, తెల్ల తామరలా, మంచి ముత్యాల దండవలె, నిండు చందురుని వలె, రెల్లుపూవులాగ, మల్లికా కుసుమమువలె శ్వేతరుచులు విరజిమ్ముతూ ఆదిశేషువు శయ్యగా, కడుపులో అన్ని లోకాలను పెట్టుకుని యోగనిద్రలో ఉంటాడు.

క. జనలోక నివాసకు ల, ర్థిని వినుతింపంగ నతుల దివ్యప్రభచేఁ దనరుచు మీలిత నిజ లో, చనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్.

357

తా॥ జనలోక నివాసులు అర్థులై నమస్కరించి ప్రార్థిస్తూండగా, సాటిలేని గొప్పకాంతులచే వెలుగొందుతూ శయ్యపై కన్నులు మూసుకొని శయనిస్తూ ఉంటాడు.

వ. ఇవ్విధంబున.

358

సీ. కైకొని బహువిధ కాలగ త్యుపలక్షి, తములై యహోరాత్ర తతులు జరుగ

శతవత్సరంబులు జనులకుఁ బరమాయు, వైనరీతిని బంకజాసనునకుఁ బరమాయు వగు శతాబ్దంబు; లందుల సగ, మరిగిన నదియుఁ బరార్ధ మండ్రు; గాన పూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వి, తీయ పరార్ధంబు దీని పేరు; తే. గడఁగి పూర్వపరార్ధాదికాలమందు, బ్రహ్మకల్పాఖ్య నెంతయు బరగుఁ; నందు బ్రహ్మ యుదయించుటంజేసి బ్రహ్మకల్ప, మనియు శబ్దాత్మక బ్రహ్మ మనియు నెగడు.

359

తా॥ ఈ ప్రకారంగా కాలంలో అనేక రాత్రుళ్ళు, పగళ్ళు గడుస్తుంది. మనుష్యులకు నూరు సంవత్సరాలు పరమాయువైన విధంగానే బ్రహ్మదేవునికి కూడ ఆయుర్దాయం నూరు సంవత్సరాలే. ఆ వంద సంవత్సరాలలో మొదటి యాభైని "పూర్వ పరార్ధం" అని రెండవ యాభైని "ద్వితీయ పరార్ధ" మని అంటారు. ఈ మొత్తం కాలాన్ని "బ్రహ్మకల్పం" అంటారు. ఈ కల్పం యొక్క ప్రారంభంలో బ్రహ్మదేవుడు ఉదయించిన కారణంగా "బ్రహ్మకల్పం" అని పిలుస్తారు. దీనికే "శబ్దబ్రహ్మం" అని మరొక పేరు.

క. విను మెన్నఁడు పంకజనా, భుని నాభీసరసియందు భువనాశ్రయమై తనరిన పద్మము వొడమును, ననఘా! యది "పద్మకల్ప" మన విలసిల్లున్.

360

తా॥ ఓ విదురా! విను! ఎప్పుడు పంకజనాభుని నాభి అనే సరస్సులో సమస్తమైన భువనాలకు ఆశ్రయభూతమై పద్మం అనేది ప్రకాశిస్తుందో అది "పద్మకల్పం" అనే పేరుతో ఒప్పుతుంది.

వ. పూర్వపరార్ధాదినిం గలిగిన బ్రహ్మకల్పంబుఁ జెప్పితి; నింక ద్వితీయ పరార్ధంబు మొదలు నెన్నఁడేని హరి సూకరాకారంబు దాల్చు నది వరాహకల్పం బనందగు, నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది; వెండియు.

361

తా॥ బ్రహ్మదేవుని ఆయుర్దాయంలో మొదటి సగం అంటే "పూర్వ పరార్ధం" గతించి పోయింది. ఇక రెండవది అయిన "ద్వితీయ పరార్ధం" ప్రారంభం ఎప్పుడంటే విష్ణువు సూకరాకారాన్ని ఎప్పుడు ధరిస్తాడో అప్పుడు ప్రారంభమవుతుంది. దానిని "వరాహకల్పం" అంటారు. ఇప్పుడు నడుస్తూన్న కల్పం వరాహకల్పమే!

సీ. దీపింపఁ గాలస్వరూపుఁడై నట్టి ప, ద్మాక్షుఁ డనంతుఁ డనాదిపురుషుఁ డఖిలవిశ్వాత్మకుఁ డగు నీశునకుఁ బర, మాణ్వాది యుగ పరార్ధాంత మగుచు జరుగు నీకాలంబు చర్చింప నొక్కని, మేషకాలం బయి మెలఁగుచుండుఁ గాని యీశ్వరునకుఁ గర్తగాఁ జాల; ది, క్కాలంబు విను మదిగాక దేహ

తే. మందిరార్థాది కర్మాభిమాన శీలు, రైనవారికి నాశ్రయం బగుటఁ జేసి యరయ హరి తద్గుణవ్యతికరుఁడు, గానఁ గాల మమ్మేటి కెన్నఁడు గర్త గాదు.

362

తా॥ కాల స్వరూపుడైనట్టి పద్మాక్షుడు... అనంతుడు, అనాది పురుషుడున్ను. అఖీల విశ్వానికి ఆత్మ అయిన ఈశ్వరునకు పరమాణువు మొదలు పరార్ధం వరకుగల కాలం ఒక్క నిముషం. ఈశ్వరుడే కాలానికి కర్తగాని... కాలం ఈశ్వరునికి కర్త గాదు. ఈ తనువులు, ఇండ్లు, ధనము వీటిని సంపాదించు కోవాలనే కోరికతో ఉండే వారికి ఆశ్రయమైనది కాలం. శ్రీమహావిష్ణువు వాటికతీతుడు. కావున ఆ మహాపురుషునికి కాలం ఎన్నటికీ కర్తగాదు.

వ. మఱియు షోడశ వికారయుక్తంబై, పృథివ్యాది పంచభూత పరివృతంబయి, దశావరణంబులు గలిగి పంచాశత్కోటి విస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబు దనరుచుండు.

363

తా॥ ఈ బ్రహ్మాండం పదహారు వికారాలతో కూడి, పంచభూతములు, పది విధాలైన ఆవరణాలు కలిగి, యాభైకోట్ల యోజనాల విస్తీర్ణంలో ఉంటుంది.

చ. హరి పరమాణురూపమున నందు వసించి విరాజమానుఁడై సరి వెలుఁగొందు, నిమ్ముల నసంఖ్యములైన మహాండకోశముల్ నెఱిఁ దనయందు డింద, నవనీరజనేత్రుఁ డనంతుఁ డాద్యుఁ డ క్షరుఁడు పరాపరుం డఖిలకారణకారణుఁ డప్రమేయుఁడై.

364

తా॥ పద్మనేత్రుడు, అనంతుడు, ఆద్యుడు, నాశనము లేనివాడు, పరాపరుడు, అన్ని కారణాలకు కారణమైనవాడు, మితిలేనివాడు అయిన ఆ భగవంతుడు పరమాణు రూపంలో బ్రహ్మాండంలో ప్రకాశిస్తూ ఉంటాడు. అసంఖ్యాకములైన మహాండ సమూహాలు ఆయనలో అణగి ఉంటాయి.

క. నిరతిశయోజ్జ్వల తేజః, స్ఫురణం దనరారు పరమపురుషుని విష్ణుం బురుషోత్తము వర్ణింపను, సరసిజభవ భవులకైన శక్యమె చెపుమా!

365

తా॥ అధికమైన తేజస్సుతో ప్రకాశించే ఆ పరమ పురుషుణ్ణి, ఆ విష్ణువును, ఆ పురుషోత్తముణ్ణి వర్ణించడానికి బ్రహ్మ, రుద్రాదులకు కూడా సాధ్యం కాదు."

క. అని మైత్రేయుఁడు విదురుం, గనుఁగొని వెండియును బలికెఁ; గాలాహ్వయుఁడై తనరిన హరి మహిమల నే, వినిపించితి సృష్టిమహిమ విను మెఱిఁగింతున్.

366

తా॥ ఈ ప్రకారంగా మైత్రేయుడు విదురునితో పలికి ఇంకా ఇలా అన్నాడు: "కాలస్వరూపుడైన శ్రీహరి మహిమలను నేను నీకు వినిపించాను. ఈపైన ఆయన సృష్టి

విశేషాలను వినిపిస్తాను, విను.

# మైత్రేయుడు విదురునికి సృష్టిమహిమ వివరించుట

వ. పరమేష్ఠి యీ సృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, నంగనాసంగమ స్రక్చందనాది గ్రామ్య భోగేచ్ఛలు గల మహామోహంబును, దత్ప్రతిఘాతజాతంబైన క్రోధంబునందుఁ గలుగు తామిస్రంబును, దన్నాశంబునం “దహ మేవ మృతో-స్మి” యను నంధతామిస్రంబును, జిత్తవిభ్రమంబును నను నవిద్యా పంచక మిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయ చిత్తంబునం బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత పూతమానసుండై యూర్ధ్వరేతస్కులును, బరమ పవిత్రులునునైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను మునుల నతిసత్త్వగరిష్ఠుల ధీరజనోత్తముల నార్యుల హరిప్రపన్నులనుంగా దివ్యదృష్టిం గల్పించి వారలం జూచి మీ మీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన; వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుం గని మోక్షధర్ములును నారాయణ పరాయణులునై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన నుదయించిన క్రోధంబు బుద్ధిచే నిగ్రహింపఁబడినను నరవింద సంభవుని భ్రూమధ్యంబువలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుండై యుదయించుచు నాక్రందనం బొనరించె నంత.

367

తా॥ బ్రహ్మ సృష్టించడానికి పూనుకోగానే “నేను” అనే దేహాభిమానం గల మోహం పుట్టింది. దేహాభిమానం వల్ల అంగనా సంగమం, మంచి గంధం, పువ్వులు మొదలైన భోగాలమీద కోరిక “మహామోహం” పుట్టింది. ఈ కోరికలకు (మహా మోహానికి) ఆటంకం ఏర్పడే సరికి గ్రుడ్డితనం వచ్చింది. అదే “అంధతామిస్రం”. శరీరంమీద పుట్టిన మోహం వల్ల ఈ శరీరం నశించి పోతుందనే భయం అంటే మృత్యుభయం పుట్టింది. ఇది తామిస్రం. పై వాటివల్ల మనస్సు కకావికలై పోయింది. ఇది “చిత్త విభ్రమం”. ఈ అయిదింటికి “అవిద్యాపంచకం” అని పేరు. ఈ అవిద్యాపంచక మిశ్రమంగా సర్వ భూతములను పుట్టించడమే తాను చేసిన

“మహాపాపం” అని పశ్చాత్తాపం పొందాడు బ్రహ్మ.

ఆ పశ్చాత్తాపంతో అస్ఖలిత బ్రహ్మచారులు, పరమపవిత్రులు అయిన సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనే మునులను సృష్టించాడు. సృష్టించి హరియందు భక్తులైన వారితో మీ అంశలతో ప్రజలను పుట్టించి ప్రపంచాన్ని వృద్ధి చేయండి అని ఆజ్ఞాపించాడు. ఆ వచనాలను అపహాస్యం చేస్తూ బ్రహ్మని చూచి మోక్షాసక్తులు, నారాయణ నామ పరాయణులునై ప్రపంచ నిర్మాణానికి వ్యతిరేక వాక్యాలు పలికారు. వెంటనే బ్రహ్మకి పట్టరాని ఆగ్రహం వచ్చింది. తన బుద్ధిచే ఎంత అణచిపెట్టుకోవాలనుకున్నా బ్రహ్మగారి కనుబొమ్మల మధ్యనుండి కోపరూపుడై, పుడుతూనే బిగ్గరగా ఏడుస్తూ, దేవతలందరకు అగ్రేసరుడై నీలలోహితుడు పుట్టాడు.

మ. జననం బందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి ట్లను “నో దేవ! మదాఖ్య లెట్టివి? మదీయావాసముల్ వీఁక నా కనయంబు న్నెఱిఁగింపవే” యనుడు నయ్యంభోజగర్భుండు లా లనముం దోఁపఁ గుమార! నీజననవేళన్ రోదనం బిచ్చుటన్.

368

తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ, జంద్రసూర్యానలానిల సలిల గగన పృథివి ప్రాణ తపో హృదింద్రియము లనఁగఁ, గలుగు నేకాదశస్థానములు వసింప.

369

తా॥ నీలం, ఎరుపు రంగుతో అలా పుట్టిన నీలలోహితుడు కమలాసనుణ్ణి చూచి “ఓ దేవా! నా పేరేమిటి? నా నివాసం ఎక్కడ?” అంటూ ప్రశ్నించాడు. అప్పుడు బ్రహ్మ లాలిస్తూ “ఓ కుమారా! నువ్వు పుడుతూనే రోదించావు కనుక నీకు రుద్రుడు అనే పేరు రూఢమైంది. చంద్రుడు, సూర్యుడు, అగ్ని, వాయువు, జలం, ఆకాశం, భూమి, ప్రాణం, తపస్సు, హృదయం, ఇంద్రియాలు… ఈ పదకొండు నీ నివాసస్థానాలు.

వ. అని వెండియు మన్యు మను మహాకాల మహ చ్ఛివ ఋతధ్వజోరురేతో భవ కాల వామదేవ ధృతవ్రతులను నేకాదశనామంబులు గలిగి ధీవృత్త్యుశనోమా నియు త్సర్పి రిలాంబి కేలావతీ సుధా దీక్షా నామ పత్నీసమేతుండవై పూర్వ నియుక్తంబు లయిన నామంబులం దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపుమని నిర్దేశించిన భగవంతుఁడగు నీలలోహితుండు విశ్వగురుండైన పితామహునిచే నియుక్తుండై సత్త్వాకృతి స్వభావంబుల నాత్మసములైన ప్రజలం గల్పించె.

370

తా॥ మన్యువు, మనువు, మహాకాలుడు, మహత్, శివుడు, ఋతధ్వజుడు, ఉరురేతస్కుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు అని నీకు పదకొండు నామాలుంటాయి. ధీ, వృత్తి, ఉశన, ఉమ, నియుత్, సర్పిః, ఇల, అంబిక, ఇరావది, సుధ, దీక్ష అను పదకొండు మంది స్త్రీలు నీకు భార్యలు. పూర్వం చెప్పిన పేర్లతో ఆయా చోట్ల ఉంటూ ప్రజల్ని సృష్టించు. బ్రహ్మ ఆదేశం మేరకు రుద్రుడు బలంలోను, రూపంలోను, స్వభావంలోను అన్నింటా తనతో సమానమైన ప్రజలను కల్పించాడు.

ఉ. రుద్రునిచేత నీ గతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డ యా రుద్రగణంబు లోలి నవరుద్ధత విశ్వము మ్రింగె; నమ్మహో పద్రవ శాంతికై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార! మీ రౌద్ర విలోకనానల భరంబునఁ గ్రాఁగె సమస్తలోకముల్.

371

తా॥ రుద్రునిచే కల్పించబడిన ఆ రుద్రగణం ఈ విశ్వాన్నంతటిని అనాయాసంగా మ్రింగివేసింది. ఆ ఉపద్రవ శాంతికై రుద్రగణాలను చేరబిలిచి బ్రహ్మ “కుమారులారా! మీరు కోపంతో చూసిన కంటి మంటలచే లోకాలన్ని తపించి పోయాయి.

క. మీ సృష్టి చాలు; నింకన్, ధీసత్తములార! వినుఁడు ధృతి మీరు తపో వ్యాసంగచిత్తులై

చనుఁ, డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్.

372

తా॥ మీ సృష్టి ఇక చాలు. మీరు బుద్ధిమంతులు, ధైర్యంకలవారు. నామాట వినండి. తపస్సు చేసుకోవాలనే సంకల్పంతో హాయిగా అరణ్యాలకు పోయి తపస్సు చేసుకోండి. మీకన్నీ మంగళములే కలుగుతాయి.

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్ సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వ భూ త గుహావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైక పారీణు నా జగదాత్ముం గనుచుందు రార్యులు దపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై.

373

తా॥ భగవంతుడు, పురుషోత్తముడు, హరి, కృపాసముద్రుడు, లక్ష్మీవల్లభుడు, సుగుణ సంపన్నుడు, అచ్యుతుడు, పరుడు, పరంజ్యోతి, ప్రభువు, అంతర్యామి, అధోక్షజుడు, ఆర్తులను రక్షించేవాడు అయిన శ్రీమన్నారాయణుడిని ఉత్తములు తమ తపశ్శక్తిచే దర్శింప కలుగుతారు.

వ. అనిన విని.

374

ఉ. కైకొని యిట్లు పంకరుహగర్భ నియంత్రితులైన రుద్రు లు ద్రేకము దక్కి కానలకు ధీయుతులై తపమాచరింప న స్తోకచరిత్రు లేఁగిరి; చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా లోకనుఁడై సృజించె జనలోకశరణ్యుల ధీవరేణ్యులన్.

375

తా॥ బ్రహ్మమాటలు విన్న రుద్రులు ఉద్రేకాన్ని తగ్గించుకొని అరణ్యాలకు తపస్సు చేసుకోవడానికి వెళ్ళారు. అంత బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించాలనే ఉద్దేశ్యంతో జనులందరికి

శరణ్యులు, బుద్ధిమంతులలో శ్రేష్ఠులు అయిన వారిని సృష్టించాడు.

తే వినుము! భగవద్బలాన్విత వినుతగుణులు, భువనసంతాన హేతు విస్ఫురణకరులు పద్మసంభవ తుల్య ప్రభావయుతులు, పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు.

376

తా॥ భగవంతునితో సమానమైన బలము, మంచిగుణములు కలవారు, లోకంలో సంతానం కలగడానికి కారణమైన వారు, బ్రహ్మగారితో సమానమైన ప్రభావం కలవారు, అపారమైన కీర్తిగలవారు అయిన పదిమంది కొడుకులు పుట్టారు.

సీ. అరవిందసంభవు నంగుష్ఠమున దక్షుఁ, దూరువువలనను నారదుండు నాభిఁ బులహుఁడు గర్ణములఁ బులస్త్యుండు, త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణ, మున వసిష్ఠుఁడు మనమున మరీచి గన్నుల నత్రియుఁగాఁ బుత్త్రదశకంబు, గలిగిరి; వెండియు నలినగర్భు

తే. దక్షిణ స్తనమువలన ధర్మమొదవె, వెన్నువలనను నుదయించె విశ్వభయద మైన మృత్యు వధర్మంబు నంద కలిగె, నాత్మఁ గాముండు జననము నందె; మఱియు.

377

తా॥ ఆ పది మంది ఎవరనగా... బ్రహ్మ బొటన వ్రేలినుండి దక్షుడు, తొడనుండి నారదుడు, నాభినుండి పులహుడు, చెవులనుండి పులస్త్యుడు, చర్మంనుండి భృగువు, చేతినుండి క్రతువు, ముఖం నుండి అంగిరసుడు, ప్రాణం నుండి వసిష్ఠుడు, మనస్సునుండి మరీచి, కన్నులనుండి అత్రి ఆవిర్భవించారు. ఈ విధంగా పుత్రులు పదిమంది కలిగారు. ఇంకా కుడివైపు స్తనంనుండి ధర్మము, వెన్నునుండి విశ్వభయంకరమైన మృత్యువు, అధర్మము, ఆత్మనుండి కాముడు జన్మించారు.

సీ. భ్రూయుగళంబునఁ గ్రోధంబు, నధరంబు, నందు లోభంబు, నాస్యమున వాణి యును, మేఢ్రమందుఁ బయోధు, లపానంబు, నందు నఘాశ్రయుఁడైన నిర్పృతి, లాలితచ్ఛాయవలన దేవహూతి వి, భుండు గర్దముఁడును, బుట్టి రంత నబ్జజుఁడాత్మ దేహమున జనించిన, భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి

తే. పంచశర బాణ నిర్భిన్న భావుఁ డగుచుఁ, గూఁతు రని పాపమునకు సంకోచపడక కవయఁగోరిన జనకునిఁ గని మరీచి, మొదలుగాఁ గల య మ్మునిముఖ్యు లెఱిఁగి.

378

వ. ఇట్లనిరి.

379

తా॥ బ్రహ్మదేవుని కనుబొమ్మల నుండి క్రోధము, పెదవుల నుండి లోభము, ముఖం నుండి వాణి, పురుషాంగం నుండి సముద్రాలు, అపానం నుండి పాపాలకు స్థానమైన నిరృతి, నీడ నుండి దేవహూతి, ఆమె భర్త అయిన కర్దముడు పుట్టారు. అంత తన దేహం నుండి పుట్టిన భారతిని చూసి ఆమె అందానికి మోహావేశుడయ్యాడు. పంచశరుని బాణాలకు తట్టుకోలేక కన్నకూతురనే పాపానికి సంకోచపడక కలియాలనే తీవ్రమైన కోరికతో వెంటపడ్డ తండ్రిని చూసి మరీచి మొదలైన మునిముఖ్యులు ఇలా అన్నారు:

ఉ. చాలుఁ! బురే! సరోజభవ! సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని ట్లాలరి వై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే? బేలరి వైతి, నీ తగవుఁ, బెద్దతనంబును, నేలపాలుగా శీలము వోవఁదట్టి యిటు సేసినవారలు మున్ను గల్గిరే?

380

తా॥ “ఓ బ్రహ్మదేవా! చాలు! చాలు! సత్పురుషులు నడిచే మార్గాన్ని విడిచి నువ్వు కన్నకూతురుని రమించాలని హృదయంలో కోరుట ధర్మమేనా? నువ్వు వంచకుడవయ్యావు. నీ

న్యాయం, పెద్దతనం, శీలం నేలపాలు చేశావు. నీవలె చేసిన వాళ్ళు నీకంటే ముందెవరైనా ఉన్నారా?

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ; విట్టిచోట "రా జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁడయ్యెఁ; నీ భావభవ ప్రసూనశర బాధితుఁడై తన కూఁతుఁ బొందెఁ బో వావి దలంప లే" కనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే!

381

తా॥ నువ్వు మహానుభావుడవే! నిందలేని చరిత్ర కలవాడవే! ఈ విషయం తెలిస్తే లోకులేమంటారు? బ్రహ్మదేవుడు చెయ్యవలసిన పని చెయ్యకూడని పని ఈ రెంటికి తేడా తెలియకుండా నడచుకున్నాడు అనుకోరూ? మన్మథ బాణాలకు లొంగిపోయి, వావి వరుసలు వదిలేసి కన్నకూతురునే కామించాడు అని నిందించరా?

క. పాపము దలఁపక, నిమిషము, లోపలఁ జెడు సౌఖ్యమునకు లోనైతివె? యిం తే పో ధారుణిఁ 'గామా, న్ధో–పి న పశ్యతి' యనంగఁ దొల్లియు వినమే.

382

తా॥ పాపకృత్యమని కూడా అనుకోకుండా ఒక్క నిమిషము లోపల చెడిపోయే సుఖానికి ఆశించావు. ఇంతేలే, "కామాంధుడికి కళ్ళు కన్పించవు" అనే మాట లోకంలో పూర్వం నుండి ఉంది."

మ. అని యిబ్భంగి మునీంద్రు లాడిన కఠోరాలాపముల్ వీనుల న్విని లజ్జావనతాననుం డగుచు నా నీరేజగర్భుండు స య్యన దేహంబు విసర్జనీయముగ జేయన్ దిక్కు లేతెంచి త త్తనువుం గైకొనఁ బుట్టె దిక్కలితమై తామిస్ర నీహారముల్.

383

తా॥ అని ఈ ప్రకారంగా మునీంద్రులు ఆడిన కఠినమైన మాటలు విని బ్రహ్మ సిగ్గుతో శిరస్సు వంచుకొని వెంటనే తన దేహాన్ని విడిచి పెట్టేశాడు. తక్షణం దిక్కులు వచ్చి ఆ శరీరాన్ని గ్రహించే సరికి ఆ దిక్కులతో పాటు చీకటి, మంచు కూడా పుట్టాయి.

వ. అంత.

384

చ. ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహముఁ దాల్చి ధైర్యమున్ విడువక సృష్టిపూర్వ సమవేతముగన్ సృజియించు నేర్పు దాఁ బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులన్ వెడలె ననూనరూపముల వేదము లంచిత ధర్మ యుక్తితోన్.

385

తా॥ ఆపై... బ్రహ్మ ధైర్యాన్ని కోల్పోకుండా ఇంకొక దేహాన్ని ధరించాడు. కాని సృష్టికి పూర్వం తన దగ్గర ఉన్న సృజన శక్తి, ఆ నేర్పు ఇప్పుడు లేక పోవడంతో ఆత్మలో విచారిస్తూ ఉండిపోయాడు. అలా ఉండగానే ఆయన నాలుగు ముఖాలనుండి ధర్మస్వరూపమైన వేదాలు పుట్టాయి.

తే. మఱియు మఖములు, మహితకర్మములుఁ దంత్ర, ములును, నడవళ్ళు, నాశ్రమములుఁ, దదీయ ముఖచతుష్కమునందునఁ బొడమె ననిన, విని మునీంద్రునిఁజూచి య వ్విదురుఁ డనియె.

386

తా॥ యజ్ఞాలు, పుణ్యకర్మలు, తంత్రములు, ప్రవర్తన, ఆశ్రమాలు మొదలైనవన్నీ ఆయన యొక్క నాలుగు ముఖాలనుండి పుట్టాయి" అని చెప్పగా విని మైత్రేయుణ్ణి చూసి విదురుడు ఇలా అంటున్నాడు:

క. తోయజ సంభవుఁ డత్తఱి, నే యే ముఖమండలమున నే యే సృష్టిన్ ధీయుతుఁడై సృజియించెను, బాయక యత్తెఱఁగుఁ దెలియఁ బలుకుము నాకున్.

387

తా॥ "ఓ మైత్రేయా! బ్రహ్మదేవుడు ఆ సందర్భంగా ఏ ముఖంలోంచి ఏ సృష్టిని తన బుద్ధి చాతుర్యంతో చేశాడో నాకు తెలియచెప్పు."

వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో నిట్లనియె; ఋగ్యజుస్సామాథర్వంబులను వేదంబులును, హోతృకర్మంబు లయిన యప్రగీతమంత్రస్తోత్రంబులగు శస్త్రంబులును, నధ్వర్యు కర్మం బైన యిజ్యయు, సంప్రగీత స్తోత్రంబయిన స్తుతియును, నుద్గాతృప్రయోజ్యంబైన ఋక్సముదాయ రూపం బగు స్తోమంబును, బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబును, నాయుర్వేద ధనుర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదంబులును, విశ్వకర్మ శాస్త్రం బగు స్థాపత్యంబును, బ్రాగాది ముఖంబుల నుత్పన్నంబు లయ్యె.

పంచమ వేదంబగు నితిహాస పురాణంబులు సర్వముఖంబులం గలిగె. మఱియుఁ గర్మ తంత్రంబు లయిన షోడశ్యుక్థములును; జయనాగ్నిష్టోమంబులును, నాప్తోర్యామాతిరాత్రంబులును, వాజపేయగోసవంబులును, ధర్మపాదంబులైన విద్యాదాన తపస్సత్యంబులును, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమంబులును గలిగె. వీనికి నొక్కొక్కటికిఁ జతుర్విధంబులైన వృత్తులును గలిగియుండు, నందు సావిత్రంబను బ్రహ్మచర్యంబును, ఉపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్త్రి జపించుటయును ప్రాజాపత్యంబును, వేదవ్రత చతుష్టయంబందు బ్రతివ్రతంబును, వ్రతులు సంవత్సర పర్యంతంబుగా నాచరింపనగు బ్రాహ్మంబును, వేదగ్రహణాంతంబు నాచరింపం దగు నైష్ఠికంబును నను బ్రహ్మచారి వృత్తిచతుష్టయంబును; ననిషిద్ధకృష్యాది వృత్తియగు వార్తయు, యజనాది కర్మోపయుక్తంబైన యాచ్ఞాది రూపధన సంచయంబును, బరుల

యాచింపకుండు నయాచితంబను శాలీనంబును, క్షేత్రపతిత కణిశ కణ సంగ్రహణ రూపంబగు శిలోంఛంబును, నను గృహస్థవృత్తులు నాలుగును; నకృష్ట పచ్యాహారులగు వైఖానసులును, నూతనఫలంబు లబ్ధంబైనఁ బూర్వసంచిత పదార్థత్యాగంబు గల వాలఖిల్యులును, బ్రాతఃకాలంబున నే దిక్కు విలోకింతు రద్దిక్కునకు జని యచ్చట లభించు పదార్థంబుల భుజించి జీవించు నౌదుంబరులును, దమంత ఫలించి తరు పతితంబు లగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులును నను చతుర్విధ వృత్తులు గల వానప్రస్థులును; స్వాశ్రమ విహితకర్మంబులం బ్రధానుం డగు కుటీచకుండును, గర్మం బుపసర్జనంబు సేసి జ్ఞాన ప్రధానుం డయిన బహూదుండును, గేవలజ్ఞానాభ్యాసనిష్ఠుం డగు హంసుండును, బ్రాప్తంబైన పరబ్రహ్మ తత్త్వంబుగ నిష్క్రియుండును నను సన్న్యాసిచతుర్విధవృత్తులును, మోక్షఫలప్రదంబై యాత్మానాత్మ వివేక విద్యారూపంబగు నాన్వీక్షికియు, స్వర్గాది ఫలప్రదంబై కర్మవిద్యారూప మగు త్రయియు, జీవనఫలప్రధానంబై కృష్యాదిరూపంబగు వార్తయు, నర్థసంపాదనైక ప్రయోజనంబగు దండనీతియు నను మోక్షధర్మ కామార్థంబులైన న్యాయవిద్యా చతుష్టయంబును, "భూర్భువస్సువః" యను వ్యాహృతులును, బూర్వాది ముఖంబులవలన నుదయించె;

మఱియు నతని హృదయాకాశంబువలనం బ్రణవంబును, రోమంబులవలన నుష్ణిక్ఛందంబును, త్వగింద్రియము వలన గాయత్త్రీ ఛందంబును, మాంసంబువలనం ద్రిష్టుప్ఛందంబును, స్నాయువువలన ననుష్టుప్ఛందంబును, నస్థివలన జగతీఛందంబును, మజ్జవలన పంక్తిచ్ఛందంబును, బ్రాణంబువలన బృహతీ ఛందంబును, కకారాది పంచవర్గాత్మకంబు లయిన స్పర్శంబుల వలన జీవుండును, అకారాది స్వరాత్మకంబైన దేహంబును, నూష్మంబులను శషసహవర్ణ చతుష్టయ రూపంబులగు నింద్రియంబులును, నంతస్థ్సంబులగు యరలవ లను వర్ణంబులును, షడ్జాదిసప్త స్వరూపంబు నాత్మబలంబయిన శబ్దబ్రహ్మంబును, చతుర్ముఖుని లీలా విశేషంబున నుత్పన్నంబయ్యె;

వ్యక్తావ్యక్తంబై వైఖరీ ప్రణవాత్మకంబైన శబ్దబ్రహ్మంబువలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం

డగుటంజేసి పరిపూర్ణుండును, వ్యక్తాత్మకుం డగుటంజేసి యింద్రాది శక్త్యుపబృంహితుండునునై కానంబడుఁ; బదంపడి యజుండు భూరివీర్యవంతు లయిన ఋషిగణంబుల సంతతి యవిస్తృతంబని తలంచి పూర్వతను పరిగ్రహంబు సాలించి యనిషిద్ధ కామాసక్తంబైన దేహాంతర పరిగ్రహంబు సేసి నిత్యంబుఁ బ్రజాసృష్టియందు వ్యాసక్తుండనైనను బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమి కారణం బగునని యచ్చెరువొంది తద్వృద్ధి యగు విధం బాలోచించుచు దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని నెదురు చూచుచు యథోచితకృత్య కరణదక్షుం డగుచుండ చతుర్ముఖుని దేహంబు ద్వివిధం బయిన నట్టి రూపద్వయవిభాగంబు స్వరాట్టగు "స్వాయంభువ" మనువును, దన్మహిషి యగు "శతరూప" యను కన్యకయుంగా మిథునంబయి జనియించె, నమ్మిథునంబు వలనం బ్రియవ్రతోత్తానపాదులను పుత్రద్వయంబు, నాకూతి దేవహూతి ప్రసూతులను కన్యకాత్రయంబును గలిగి; రందు నాకూతిని రుచికునకును, దేవహూతిం గర్దమునకును, బ్రసూతిని దక్షునకును నిచ్చె; వీరలవలనఁ గలుగు ప్రజాసంతతులచేత జగంబులు పరిపూర్ణంబు లయ్యె.

388

తా॥ అప్పుడు మైత్రేయుడిలా చెప్పడం మొదలు పెట్టాడు: "బ్రహ్మ తూర్పు ముఖం నుండి ఋగ్వేదం, దక్షిణముఖం నుండి యజుర్వేదం, పశ్చిమ ముఖం నుండి సామవేదం, ఉత్తరముఖం నుండి అధర్వ వేదం ఉత్పన్నమయ్యాయి.

యజ్ఞానికి "హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ" – అని నలుగురు ఋత్విక్కులు ఉంటారు. హోత అనే ఋత్విక్కుకు సంబంధించినవి, గానం చేయబడినవి, అయిన ప్రశంసాత్మక మంత్ర స్తోత్రాలు తూర్పుముఖం నుండి వెలువడ్డాయి.

అధ్వర్యునికి సంబంధించిన విధిరూపమైన ఇజ్య, గానయోగ్యమైన మంత్రస్తోత్రాలు దక్షిణముఖం నుండి పుట్టాయి.

ఉద్గాత ప్రయోగించే స్తోమాలు అనే ఋగ్వేద మంత్రాలు పశ్చిమ ముఖం నుండి ఉద్భవించాయి.

బ్రహ్మ అనబడే నాల్గవ ఋత్విక్కు ఆచరించే ప్రాయశ్చిత్తకాండ ఉత్తరముఖం నుండి ఉద్భవించింది.

ఉపవేదాలలో ఆయుర్వేదం ప్రాఙ్ముఖం నుండి ధనుర్వేదం దక్షిణ ముఖం నుండి, గాంధర్వ వేదం పశ్చిమముఖం నుండి, విశ్వకర్మకు సంబంధించిన స్థాపత్యమనే శిల్పవేదం ఉత్తరముఖం నుండి ఉత్పన్నమైనాయి.

పంచమవేదమైన ఇతిహాస పురాణ సముచ్చయం బ్రహ్మదేవుని అన్ని ముఖాలనుండి ఆవిర్భవించింది. ఇవిగాక కర్మతంత్రాలైన షోడశి—ఉక్థ్యము, చయనం—అగ్నిష్టోమం, ఆప్తోర్యామం—అతిరాత్రం, వాజపేయం—గోసవం అనే నాలుగు జంటలు, ధర్మపాదాలైన విద్య—ధనం—దానం—తపస్సు అనేవి క్రమంగా విధాత నాలుగు ముఖాలనుండి పుట్టాయి.

బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే ఆశ్రమ చతుష్టయం కూడ చతుర్ముఖుని నాలుగు ముఖాల నుండి క్రమంగా జనించాయి. పై నాలుగు ఆశ్రమాలలో ఒక్కొక్కటి నాలుగు విధాలైన విధానాలతో అలరారుతూ ఉంటుంది.

బ్రహ్మచర్యానికి "సావిత్రం" అని కూడా పేరు. సవిత అంటే సూర్యుడు. ఆయన్ని ఆరాధించే గాయత్రి ఇందు ప్రధానం కనుక దీనికి ఈ పేరు వచ్చింది. ఉపనయనం మొదలుకొని మూడు దినాల పర్యంతం గాయత్రీ మంత్రం జపించటం "ప్రాజాపత్యం" అంటారు. వేదవ్రతాలు నాల్గింటిలో ఒక్కొక్కటి ఒక్కొక్క సంవత్సర పర్యంతం ఆచరించేది "బ్రాహ్మం". వేదం పూర్తిగా నేర్చుకున్న అనంతరం ఆచరించేది "నైష్ఠిక వ్రతం". ఇవి నాలుగూ బ్రహ్మచారి వృత్తులు.

గృహస్థ వృత్తులు నాలుగు. పొలం దున్ని పండించుకోవటమే జీవనోపాధిగా

పెట్టుకోవటం "వార్త" అంటారు. యజ్ఞయాగాది కర్మలకు ఉపయోగించే సాధనాలను కూడబెట్టుకోవడం "సంచయం" అంటారు. పరులను యాచింపకుండా ఉండటం "శాలీనం". పొలాల్లో రాలిన ధాన్యం కంకులు ఏరుకొని వానిని శిలలపై నూర్చుకొని జీవించటం "శిలోంఛం".

వానప్రస్థ వృత్తులు నాలుగు. దుంపలు త్రవ్వుకొని భుజించేవారు "వైఖానసులు". క్రొత్త పంట లభించగానే పూర్వం దాచిపెట్టిన పదార్థాలను మిగలకుండా ఇతరులకు పంచిపెట్టేవారు "వాలఖిల్యులు". ప్రొద్దుట లేవగానే ఏ దిక్కు కన్పిస్తుందో ఆ దిక్కుకు పోయి అక్కడ అయాచితంగా లభించిన పదార్థాలను భుజించేవారు "ఔదుంబరులు". చెట్టున పండి రాలిన ఫలాలను, పత్రాలను తిని జీవించే వారు "ఫేనపులు".

సన్న్యాసులలో కూడా నాలుగు విధాలున్నారు. సొంత కుటీరం ఉండి చేయతగిన కర్మలు చేసేవాడు "కుటీచకుడు". కుటీరం లేకుండా కర్మలు అప్రధానంగా జ్ఞానియై సంచరిస్తూ ఉండేవాడు "బహూదకుడు". కేవలం జ్ఞానాభ్యాసం మాత్రం చేసేవాడు "హంసుడు". జ్ఞానాభ్యాసం లేకుండా పరబ్రహ్మతత్త్వం అలవడిన వాడు "నిష్క్రియుడు".

ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అనే నాలుగు న్యాయవిద్యలు బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుండి వరుసగా పుట్టాయి. "ఆన్వీక్షకి" అంటే ఆత్మానాత్మ వివేకం కలిగి మోక్షాన్ని ప్రసాదించే విద్య. "త్రయి" అంటే స్వర్గాది ఫలాలను అందించే వేదకర్మానుష్ఠానం. "వార్త" అంటే జీవనోపాధికోసం చేసే కృషి మొదలైన విద్య. "దండనీతి" అంటే అర్థసంపాదనమే ప్రయోజనంగా గల విద్య. ఈ నాలుగు విద్యలలో ఆన్వీక్షకి మోక్షానికి, త్రయి కామానికి, వార్త ధర్మానికి, దండనీతి అర్థానికి సాధనాలు. "భూః, భువః, సువః" అనే వ్యాహృతులు బ్రహ్మదేవుని ముఖాలనుండి క్రమంగా ఉదయించాయి. అతని హృదయంలోని ఆకాశం నుండి ఓంకారం పుట్టింది. రోమముల నుండి ఉష్ణిక్ ఛందస్సు, చర్మం నుండి గాయత్రి ఛందస్సు, మాంసం నుండి త్రిష్టుప్ ఛందస్సు, స్నాయువు వలన అనుష్టుప్ ఛందస్సు, ఎముక నుండి జగతీ ఛందస్సు,

మజ్జవల్ల పంక్తి ఛందస్సు, ప్రాణంవల్ల బృహతీ ఛందస్సు పుట్టాయి.

హల్లులో క వర్గం మొదలు ప వర్గం వరకు అయిదు వర్గాలతో స్పర్శాత్మకుడైన జీవుడు, అకారాది అచ్చులతో స్వరాత్మకమైన దేహము, శ, ష, స, హ లతో ఊష్మవర్ణాత్మకాలైన ఇంద్రియాలు ఏర్పడ్డాయి. య, ర, ల, వ అనే అంతస్థాలు; షడ్జం, ఋషభం, గాంధారం, మధ్యమం, పంచమం, ధైవతం, నిషాదం అనే సప్తస్వరాలు, ఆత్మబలమైన శబ్దబ్రహ్మము ఇవన్నీ చతుర్ముఖుని లీలా విశేషాల వల్ల పుట్టాయి.

పరమేశ్వరునికి వ్యక్తము–అవ్యక్తము అని రెండు రూపాలు. వ్యక్తరూపం "వైఖరీ వాక్కు". "పర", "పశ్యంతి", "మధ్యమ" అనే వాక్కులు అవ్యక్తరూపం. ఈ వ్యక్తావ్యక్త రూపాలు రెండింటికి ప్రణవమే ఆత్మ. భగవంతుడు అవ్యక్తాత్ముడు కావటం వల్ల పరిపూర్ణుడు. వ్యక్తాత్ముడు కావడంచేత ఇంద్రాది శక్తి సంయుక్తుడై కనిపిస్తాడు.

అనంతరం అనంత వీర్యవంతులైన ఋషుల సంతానం సవిస్తారమై వృద్ధి కాలేదని తలచాడు బ్రహ్మ. ఆయన తన మొదటి శరీరాన్ని వదలుకున్నాడు. నిషిద్ధం కాని కామంపై ఆసక్తిగల మరొక దేహాన్ని ధరించాడు. నిత్యం ప్రజాసృష్టి యందు ఆసక్తుడైనాడు. అయినా ప్రజాభివృద్ధి జరుగలేదు. కారణం తెలియక ఆశ్చర్యపడ్డాడు. అది వృద్ధి అయ్యే విధానాన్ని గూర్చి ఆలోచించాడు. దైవం ఇచట ప్రతికూలం కాబట్టి దైవానుకూల్యం అవసరం అనుకొంటూ దైవాన్ని ధ్యానించాడు. సందర్భోచిత కర్తవ్యాలు నిర్వర్తింప సాగాడు.

వెంటనే బ్రహ్మదేవుని దేహం రెండు భాగాలైంది. అందొకటి "స్వరాట్టు" అయిన "స్వాయంభువ" మనువుగా, మరొకటి అతని భార్య "శతరూప" అనే అంగనగా రూపొందాయి. ఆది మిథునమైన ఆ దంపతులకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు పుత్రులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు పుత్రికలు కలిగారు. వారిలో ఆకూతిని రుచి ప్రజాపతికి, దేవహూతిని కర్దమ ప్రజాపతికి, ప్రసూతిని దక్షప్రజాపతికి ఇచ్చి వివాహం చేశారు. ఈ

దంపతులవల్ల కలిగిన అనంత ప్రజాసంతతుల వల్ల జగత్తంతా నిండి నిబిడీకృతమైంది.”

## స్వాయంభువ మనువు ప్రజావృద్ధి చేయుట

క. అని మైత్రేయుఁడు పలికిన, విని మనమున హర్ష మొదవ విదురుఁడు మునినా థునిఁజూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదర పాదభక్తి వశమానసుఁడై.

389

తా॥ అని ఈ విధంగా మైత్రేయుడు చెప్పగా విన్న విదురుడు మిక్కిలి సంతోషించాడు. శ్రీహరి యొక్క పాదముల యందు భక్తికలవాడై ఆ మునివర్యునితో ఇలా అంటున్నాడు:

క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ, తనయుఁడు స్వాయంభువుండు దైతేయవిభే దన సేవా చతురుండును, జనవినుతుం డాదిరాజసత్తముఁడౌటన్.

390

తా॥ "గొప్పవాడైన బ్రహ్మకి కుమారుడైనటువంటి స్వాయంభువుడు శ్రీహరి యొక్క సేవాపరాయణుడు, ప్రజలచేత పొగడబడే వాడు, ఈ సృష్టికి మొట్టమొదటి చక్రవర్తి.

క. అతని చరిత్రం బవ్యా, హతసుఖదము, నిఖిలమంగళావహము, సమం చితముం గావున బుధసే, విత! నాకెఱుఁగంగఁ బలుకవే మునితిలకా!

391

తా॥ అతని చరిత్ర ఎడతెగని సుఖాన్నిచ్చేది. మంగళాలను చేకూర్చేది, మిక్కిలి ఒప్పైనది. ఆ కారణంగా నాకు వివరంగా చెప్పు.

క. అదియును గాక ముకుందుని, పదకమల మరందపాన పరవశులై పెం పొదవిన వారిచరిత్రము, సదమలమతి వినిన భవము సఫలము గాదే?

392

తా॥ ముకుందుని పాదకమలాల మకరందాన్ని పానంచేసి పరవశులైన మహానుభావుల చరిత్రను నిర్మల హృదయంతో విన్నవారి జన్మ తప్పక సఫలం అవుతుంది."

చ. అని విదురుండు వల్కిన దయాన్వితుఁడై మునినాథచంద్రుఁ డి ట్లను శ్రుతిశాస్త్రపాఠ కలితాత్మకుడైన నరుండు పద్మ లో చన చరణారవింద యుగసంగము గల్గిన సజ్జనుండు వొం దిన ఫల మొందు భాగవత దివ్యకథా శ్రవణానురక్తిచేన్.

393

తా॥ అని విదురుడు పలికే సరికి దయతో మైత్రేయుడు ఇలా అంటున్నాడు: "నాయనా! వేద శాస్త్రాలను బాగా చదివినవాడు, పద్మలోచనుని చరణారవిందముల మీద భక్తిగలవాడు పొందిన ఫలాన్ని భాగవత దివ్యకథలను వినాలనే అనురక్తిగల భక్తుడు పొందుతాడు."

క. అని చెప్పి మునికులాగ్రణి, దనుజారికథా సుధాప్లుత స్వాంతుండై తనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్.

394

తా॥ మైత్రేయుని హృదయం హరి కథామృతంలో ఓలలాడింది. ఆయన నయనాలు ఆనంద భాష్పాలతో ఆర్ద్రం కాగా, తనువున పులకాంకురాలు పొడసూపాయి.

సీ. వినిపింపఁ దొడఁగె నా ఘనుఁడు స్వాయంభువుఁ, డంగనాయుక్తుడై యబ్జగర్భు నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుఁడై, హస్తముల్ మొగిచి యిట్లనియెఁ బ్రీతి జీవరాసులకు రాజీవసంభవ! నీవ, జననరక్షణ వినాశముల కరయ హేతుభూతుఁడవు; మా కెద్ది యాచరణీయ, మైన కర్మము దాని నానతిమ్ము!

తే. ఎట్టి కర్మంబు సేసిన? నెసఁగు నీకు, నవహితంబైన సంతోష మాత్మజుండు జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి, నంది నుతి కెక్కి వర్తించు నందు నిందు.

395

తా॥ మైత్రేయుడిలా అంటున్నాడు: "స్వాయంభువుడు తన భార్యతో కూడి బ్రహ్మకి మ్రొక్కి వినయంతో శిరస్సు వంచి చేతులు జోడించి నమస్కరించి ప్రీతితో ఇలా అన్నాడు: 'ఓ పద్మసంభవ! సమస్తమైన జీవరాశుల చావు పుట్టుకలకు రక్షణకు నువ్వే హేతుభూతుడవు. మా కర్తవ్యాన్ని మాకు బోధ చెయ్యండి. ఏ కర్మలను మేం ఆచరిస్తే నీకు సంతోషం కలుగుతుంది. జనకునకు భక్తితో పరిచర్యలు చేసిన కుమారుడు ఇహలోకంలోను పరలోకంలోను కీర్తిని పొందుతాడు కదా!'

వ. కాన యెఱింగింపు మట్టి సత్కర్మంబు.

396

తా॥ కాబట్టి నేను చెయ్యవలసిన సత్కర్మకు నాకు ఆజ్ఞ ఇవ్వండి.

క. అని పలికిన స్వాయంభువ, మను మృదుభాషలకు నలరి మనమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరి, గొనఁ బ్రియతముఁడైన సుతునకును నిట్లనియెన్.

397

తా॥ అని పలికిన స్వాయంభువ మనువు యొక్క తియ్యని మాటలకు బ్రహ్మ మనస్సులో చాలా సంతోషించి ఎంతో అనురాగంతో కొడుకుతో ఇలా అన్నాడు:

చ. మనుకొని తండ్రియాజ్ఞఁ దలమోచి నిజోచిత కృత్యమేమి వం చినఁ దనశక్తి యుక్తి నెడసేయక చేయుట పుండరీక లో చన పదసేవ సేయుట ప్రజాపరిపాలనశాలి యౌటయున్ జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా!

398

తా॥ 'కుమారా! తండ్రి ఆజ్ఞ తలమీద పెట్టుకొని తనకు ఉచితమైన పనిని ఏం చెపితే

దానిని తన శక్తితో యుక్తితో చెయ్యటం శ్రీమహావిష్ణువు పాదసేవ చెయ్యటమే అవుతుంది. ప్రజలను చక్కగా పరిపాలించటం కూడా కొడుకు తండ్రిని సేవించటమే అవుతుంది.

వ. కావున

399

మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ విష్ణున్ హృషీకేశుఁ గే శవుఁ బద్మాక్షు గుఱించి జన్నములు శశ్వద్భక్తిఁ గావింప మా ధవుఁ డాత్మం బరితోషమొందు; నతఁ డుద్యత్ప్రీతిఁ గైకొన్న లో క వితానంబులు తుష్టి నొందు ననఘా; కావింపుమా యజ్ఞముల్.

400

తా॥ ఆ కారణంగా... తెలుసుకొంటే హరి, యజ్ఞమే స్వరూపంగాగలవాడు. పరుడు, విష్ణువు, హృషీకేశుడు, కేశవుడు, పద్మాక్షుడూ అయిన హరిని గూర్చి ఎవరైతే భక్తితో యజ్ఞాలు చేస్తారో మాధవుడు ఆత్మలో ఆనందాన్ని పొందుతాడు. ఆయన ప్రీతి చెందితే లోకాలన్నీ కూడా తుష్టిని పొందుతాయి. అందువల్ల నువ్వు యజ్ఞాలు చెయ్యి.

చ. అకుటిలభక్తిఁ గేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వొన ర్పక విపరీతులై యుముకరాసులు దంచి ఫలంబు నందఁ గా నక చెడురీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్ష దా యక మగుచున్న తత్ఫలము నందరు విష్ణుపరాఙ్ముఖ క్రియుల్.

401

తా॥ దోషంలేని భక్తితో ఈశ్వరార్పణ బుద్ధితో యజ్ఞానికి సంబంధించిన అన్ని పనులు చెయ్యాలి. విష్ణుపరాఙ్ముఖులు ఆ మోక్ష ఫలాన్ని అందుకోలేరు. పైగా ఊకను దంచి బియ్యం రాలేదని బాధపడే వారితో సమానమే వారు. వాళ్ళకు ధనవ్యయమే తప్ప ప్రయోజనం ఏమీ ఉండదు.

ఉ. కావున యజ్ఞముల్ హరి వికారవిదూరు గుఱించి చేయు నీ భావము సూనృతవ్రత! శుభస్థితిఁ జెందెడు, నీకుమారులున్ నీవును నీధరాభరము నెమ్మి వహింపుము; సజ్జనావలిం బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్త్రక! దోషలతాలవిత్రకా!

402

తా॥ దోషములనే తీగలకు కొడవలి వంటి వాడా! కుమారా! కాబట్టి నువ్వు ఏ వికారాలులేని హరిని గూర్చి యజ్ఞములు చేస్తే నీ మనస్సు శుభస్థితిని పొందుతుంది. నువ్వు నీ పుత్రులు ఈ ధరాభారాన్ని వహించి ధర్మమార్గంలో పరిపాలన చేస్తూ సత్పురుషులను రక్షించు.

క. అనవుడు నతనికి నతఁ డి, ట్లనియెన్ భవదీయమైన యానతి యె ట్ల ట్లొనరించెద నాకును నా, తనయులకు వసించి యుండఁ దగు నెల వెందున్.

403

తా॥ ఆ పలుకులు విన్న స్వాయంభువ మనువు బ్రహ్మగారితో ఇలా అన్నాడు: 'నీ ఆనతి ప్రకారమే నడచుకొంటాను. కాని నాకు, నా కొడుకులకు నివసించడానికి తగిన చోటు చూపించండి.

తే. అరయ లేదు విధాత! యీయఖిల జంతు, జాతములకెల్ల నాధారభూతమైన ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న, మైన కతమునఁ జోటు లేదంటిఁ దండ్రి!

404

క. కావున భూమ్యుద్ధరణము, గావించు నుపాయ మిపుడు గైకొని నాకున్ దేవా! నీ వెఱిఁగింపుము, నావుడుఁ బద్మజుఁడు దన మనంబునఁ దలఁచెన్.

405

తా॥ తండ్రీ! ఈ సృష్టియందలి సమస్త జంతుజాలానికీ ఆధారభూతమైన భూమి

సముద్రంలో మునిగిపోయి ఉంది. మాకు నివసించడానికి స్థలం కనిపించటం లేదు. కనుక ఓ దేవా! మునిగి పోయిన భూమిని పైకెత్తే ఉపాయం ఆలోచించి నాకు చెప్పు అనగానే బ్రహ్మ తన మనస్సులో ఇలా తలపోశాడు:

## శ్రీ యజ్ఞవరాహావతార అభివర్ణన

మ. జలమధ్యంబున లీనమైన ధరణీచక్రంబునే నేర్పునన్ నిలుపన్ వచ్చును! బూర్వమందు జగముల్ నిర్మించు నాఁ డాది న ప్పులఁ బుట్టించిన మీఁద నవ్వసుమతిం బుట్టించితి న్నట్టి య ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునం బొందెం గదా పృథ్వియున్.

406

తా॥ అనంతమైన జలరాశి మధ్య లీనమై ఉన్న భూమండలాన్ని పైకి తీసుకొచ్చే ఉపాయం ఏది? పూర్వకాలంలో... ఈ లోకాలను సృష్టించేటప్పుడు ప్రారంభంలో జలాలను పుట్టించిన మీద ఈ భూమిని సృష్టించాను. అట్టి నీళ్ళలో మునిగి ఈ భూమి పాతాళానికి చేరుతుంది గదా!

సీ. అఖీలజగత్కల్ప నాటోపమునకుఁ బా, ల్పడిన నాచేత నెబ్భంగి నిపుడు దగిలి విశ్వంభరోద్ధరణంబు గావింప, నగు నని సర్వభూతాంతరాత్ముఁ బురుషోత్తముని నవపుండరీకాక్షు ల, క్ష్మీపతిఁ దన మనస్థ్సితునిఁ జేసి తలపోయుచున్నఁ బద్మజు నాసికా వివ, రమ్మున యజ్ఞవరాహమూర్తి

తే. యర్థి నంగుష్ఠమాత్రదేహంబుతోడ, జననమంది వియత్తలస్థాయి యగుచు క్షణములోపల భూరి గజ ప్రమాణ, మయ్యె నచ్చటి జనముల కద్భుతముగ.

407

తా॥ అఖీలమైన జగత్తును కల్పించాలనే వేగిరపాటుతనానికి పాల్పడిన నా చేత నీళ్ళలో మునిగిన ఈ విశ్వం ఎలా రక్షింపబడుతుంది? అని సర్వభూతములలోను అంతర్యామి స్వరూపంగా ఉన్న పురుషోత్తముని, పుండరీకలోచనుని, లక్ష్మీపతిని తన మనస్సులో తీవ్రంగా భావించాడు. అట్లా తలపోస్తూ ఉన్న బ్రహ్మ ముక్కు రంధ్రముల నుండి యజ్ఞవరాహమూర్తి బొటన వ్రేలంత దేహంతో జన్మించి గగనానికి ఎగిరి క్షణంలో అచ్చటి జనులకు అద్భుతంగా గొప్పదైన ఏనుగంత అయ్యాడు.

సీ. అంతఁ బ్రజాసర్గమందు నియక్తులై, నట్టి మరీచ్యాదులైన మునులు మనుకుమారకులు న మ్మనుసహితంబుగ, యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి "యిట్టి యాశ్చర్య మెట్లెందేనిఁ గలదె నా, సారంధ్ర నిర్గత స్తబ్ధరోమ తోకంబు మనము విలోకింప నంగుష్ఠ, మాత్రమై యీక్షణమాత్రలోన

తే. మహిమ దీపింప దంతి ప్రమాణమును మ, హోన్నంతబైన గండశైలోపమంబు నయ్యె" ననుచు వితర్కించి; రబ్జభవుఁడు, హర్ష మిగురొత్త నిట్లని యపుడు దలఁచె.

408

తా॥ అప్పుడు ప్రజానీకాన్ని సృష్టించడానికి నియుక్తులైనట్టి మరీచి మొదలైన మునులు, మనువు, మనువు యొక్క కుమారులు ఆ యజ్ఞవరాహాన్ని చూసారు. చూసి... "ఇటువంటి ఆశ్చర్యం లోకంలో ఎక్కడైనా ఉంటుందా? నాసికారంధ్రం నుండి వచ్చిన బాల వరాహం మనం చూస్తూండగానే బొటన వ్రేలంతయై క్షణంలో తన మహిమ ప్రకాశింపగా పెద్ద ఏనుగంతయై ఆపై పెద్దపర్వతం అంత అయ్యింది" — అంటూ తర్కించుకొన్నారు. బ్రహ్మదేవుడు సంతోషం చిగురొత్తగా ఇలా అనుకొన్నాడు—

క. నా మనమునఁ గల దుఃఖ వి, రామముఁ గావించుకొఱకు రాజీవాక్షుం డీ మేర "యజ్ఞపోత్రి, శ్రీమూర్తి" వహించె నిది విచిత్రము దలఁపన్.

409

తా॥ నా మనస్సులో దుఃఖం లేకుండా చేయడానికై ఎర్ర కలువల వంటి కన్నులుకల శ్రీహరి ఈ యజ్ఞవరాహ రూపాన్ని ధరించాడు. ఇది చాలా విచిత్రం.

వ. అని వితర్కించు సమయంబున సూకరాకారుం డయిన భగవంతుడు.

410

తే. ప్రళయజీమూత సంఘాతభయదభూరి, గర్జనాటోప భిన్నదిగ్ఘన గభీర రావ మడరింప

నపుడు రాజీవభవుఁడు, మునులు నానందమును బొంది రనఘచరిత!

411

తా॥ అని ఊహించుకొంటున్న సమయంలో సూకరాకారుడైన భగవంతుడు ప్రళయకాలంలో మేఘాలు ఒకదాన్నొకటి ఒరుసుకొని మహాభయంకరంగా గర్జించినట్లు దిక్కులు అదిరేటట్లు గంభీరంగా గర్జించాడు. ఆ రావానికి బ్రహ్మ, మునిపుంగవులు మిక్కిలి సంతోషాన్ని పొందారు.

వ. అంత మాయామయవరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండకోటర పరిస్ఫోటనంబుఁ గావింప విని జనస్తపస్సత్య లోక నివాసులయిన మునులు ఋగ్యజుస్సామ మంత్రంబుల వినుతించిరి; యజ్ఞవరాహరూప ధరుం డయిన సర్వేశ్వరుండు సత్పురుష పాలన దయాపరుండు గావున దిగ్గజేంద్రలీలావిలోలుండై.

412

తా॥ అంత ఆ మాయామయ వరాహమూర్తి చేసిన ఘుర్ఘురారావానికి బ్రహ్మాండమనే తొఱ్ఱ ఛేదింపబడింది. జనలోకంలో, తపోలోకంలో, సత్యలోకంలో ఉండే మునులు ఆ శబ్దాన్ని విని ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రములచే వినుతించారు. యజ్ఞవరాహ రూపాన్ని ధరించిన సర్వేశ్వరుడు సత్పురుషులను పాలించే దయాపరుడు కనుక ఒక మహాదిగ్గజం వలె క్రీడించాలని అనుకొన్నాడు.

సీ. కఠిన సటా చ్ఛటోత్కట జాత వాత ని, ర్ధూత జీమూత సంఘాత మగుచు క్షురనిభ సునిశిత ఖుర పుటాహత చల, త్ఫణిరాజ దిగ్గజ ప్రచయ మగుచుఁ జండ దంష్ట్రోద్ధ వైశ్వాన రార్చిస్స్రవ, ద్రజత హేమాద్రి విస్రంభ మగుచు ఘోర గంభీర ఘుర్ఘుర భూరి నిస్వన, పంకిలాఖీల వార్ధి సంకులముగఁ

తే. బొరలుఁ గెరలు నటించు నంబరము దెరల, రొప్పు నుప్పర మెగయును గొప్పరించు

ముట్టె బిగియించు ముసముస మూరుకొనుచు, నడరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి.

413

తా॥ పృథ్వీ మండలాన్ని రక్షించడానికి ఆ యజ్ఞవరాహం కఠినమైన తన మెడమీద జూలు విదిల్చేసరికి దానివల్ల పుట్టిన మహా ప్రభంజనానికి మేఘరాశి అంతా అల్లకల్లోలమై పోయింది. కత్తివలె నిశితంగా ఉన్నటువంటి కాలిగిట్టల తాకిడులకు ఫణిరాజైన ఆదిశేషువు, దిక్కులను మోసే దిగ్గజాలు చలించి పోయారు. యజ్ఞవరాహం యొక్క కఠినమైన కోరల ఘర్షణవల్ల పుట్టిన ఉగ్రమైన వైశ్వానర జ్వాలలకు రజతాద్రి కైలాసము, హేమాద్రి మేరువు కరిగి ప్రవహిస్తాయేమో అని అనిపించింది. అతి ఘోరము, గంభీరము అయిన ఘుర్ఘురారావం వల్ల సముద్రాలన్నీ సంకులమయ్యాయి. ఇలా ఆ వరాహ రూపంలో ఉన్న విష్ణువు పొర్లుతూ, చెలరేగుతూ, అతిశయిస్తూ, ఆగ్రహిస్తూ, నటిస్తూ, ఆనందంతో అడుగులు వేస్తూ, రొప్పుతూ, ఎగసిపడుతూ, పెద్దతనాన్ని ప్రదర్శిస్తూ, ముట్టె బిగిస్తూ, నేలను వాసన చూస్తూ; ఇలా అనేక రకాలుగా చెలరేగి పోయాడు.

వ. మఱియు నయ్యజ్ఞవరాహంబు.

414

సీ. తివిరి చతుర్దశ భువనంబులను దొంతు, లొరగఁ గొమ్ముlఁ జిమ్ము నొక్కమాటు
పుత్తడికొండ మూఁపురమను నొరగంట, నొరకు రా రాపాడు నొక్కమాటు ఖురముల
సప్తసాగరముల రొంపిగా, నుక్కించి మట్టాడు నొక్కమాటు నాభీలవాల వాతాహతిచే
మింటి, నొరసి బ్రద్దలు సేయు నొక్కమాటు

తే. కన్నుఁగొనలను విస్ఫులింగములు సెదర, నురుభయంకరగతిఁ దోఁచు నొక్కమాటు
పరమ యోగీంద్రజన సేవ్య భవ్య విభవ, యోగ్యమై కానఁగా నగు నొక్కమాటు.

415

తా॥ ఇంకా ఆ యజ్ఞవరాహం చతుర్దశ భువనాలను దొంతులుగా ఒరిగిపోయేటట్లు కొమ్ములతో చిమ్ముతుంది. ఇంకోసారి బంగారుకొండ అయిన మేరుపర్వతాన్ని తన మూపురమనే ఒరగల్లుతో రాపాడుతుంది. మరోసారి తన గోళ్ళతో సప్తసాగర జలాలు రొంపి అయిపోయేటట్లు ఎగురుతూ తిరుగుతుంది. వేరొక్కసారి చాలా భయంకరంగా తోకను త్రిప్పడంవల్ల పుట్టిన భీకర వాయువులకు మిన్ను బ్రద్దలు అయ్యేటట్లు చేస్తుంది. కళ్ళలోంచి నిప్పు కణికలు రాలగా చాలా భయంకరంగా తోస్తుంది ఒకసారి. ఇంకొక్కసారి పరమ యోగీంద్రులు సేవించుటకు యోగ్యమై శుభాలనిచ్చే దివ్య వైభవంతో అలరారుతూ ఉంటుంది.

వ. ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందినతృతీయ సవనరూపుం డయిన యజ్ఞవరాహమూర్తి యగు సర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగ నిద్రావశుండై యుండు నవసరంబున నుదకస్థంబైన భూమి రసాతల గతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁ దఱియం జొచ్చు వేగంబు సైరింపఁజాలక సముద్రుం డూర్ములను భుజంబు లెత్తి విశీర్ణ హృదయుండై యార్తుని పగిది "యజ్ఞవరాహ! నన్ను రక్షింపు, రక్షింపు" మని యాక్రోశింప నిశిత కరాళక్షుర తీక్ష్ణంబులైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారం బయిన రసాతలంబుం బ్రవేశించి భూమిం బొడగను నవసరంబున.

416

తా॥ ఇట్లా చెలరేగుతూ ఉదయ, మధ్యాహ్న, సాయంకాలములందు యజ్ఞరూపంలో యజ్ఞవరాహావతారాన్ని పూనిన సర్వేశ్వరుడు మహాప్రళయ కాలంలో తాను యోగనిద్రలో ఉన్నప్పుడు నీటిలో ఉన్న భూమి రసాతలంలోకి వెళ్ళిపోయింది. దానిని పెల్లగించడానికై సముద్ర జలాల్లోకి ప్రవేశించాడు. ఆ వేగానికి సహించలేని సముద్రుడు అలలు అనే భుజములెత్తి భిన్నాభిన్నమైన మనస్సుతో, ఎంతో ఆర్తితో "యజ్ఞవరాహా! నన్ను రక్షించు, రక్షించు" అని ప్రాధేయపడ్డాడు. ఆ వరాహ మూర్తి తన పదునైన గిట్టల కొనలతో ఆ సాగర జలాలను చెల్లాచెదరు చేసి రసాతలంలోకి ప్రవేశించి అక్కడ భూమిని చూసాడు.

క. శరనిధి లోని మహోగ్రా, మరకంటకుఁ డెదురఁ గాంచె మఖమయగాత్రిన్
ఖురవిదళితకులగోత్రిన్, ధరణి కళత్రిన్ గవేష ధాత్రిన్ బోత్రిన్.

417

తా॥ ఆ వేళ ఆ పారావారంలో దాగి ఉన్న ఉగ్రరూపి అయిన ఘోర రాక్షసుడు ఎదురయ్యాడు. ఎదురై ఆ దైత్యుడు యజ్ఞమే శరీరంగా కలది, గిట్టలతో ఛేదించిన కుల పర్వతాలు గలది, ఈ ధరణిని భార్యగా గ్రహించినది, ధాత్రీ మండలాన్ని వెదుకుతూ ఉన్నది... అయిన యజ్ఞవరాహాన్ని ఎట్టఎదురుగా చూసాడు.

వ. ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుండై.

418

తా॥ ఇట్లు చూచిన దైత్యుడు రోషం చేత భీషణమైన ఆకారం కలవాడై...

మ. గద సారించి యసహ్యవిక్రమ సమగ్రస్ఫూర్తితో వ్రేయఁగా
నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁ బెం
పొదవం గ్రోధమదాతిరేక బలశౌర్యోదార విస్తార సం
పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జలమొప్పం ద్రుంచు చందంబునన్.

419

తా॥ సహించడానికి వీలుకాని పరాక్రమంతో గదను సాచి వరాహమూర్తి మీదకు వేశాడు. దానిని తప్పించుకొన్న యజ్ఞవరాహం; మహారోషంతోను బలశౌర్యములతోను విజృంభించిన సింహం మదించిన ఏనుగును చంపినట్లు... ఉగ్రమైన తన కోరలచేత ఆ రాక్షసుని సంహరించాడు.

మ. దితిజాధీశుని నీ గతిం దునిమి యుద్వృత్తిం దదీయాంగ శో ణిత పంకాంకిత

గండభాగుఁ డగుచు న్విష్ణుండు దా నొప్పె వి స్తృత సంధ్యాంబుద ధాతు చిత్రిత సముద్దీప్త క్షమాభృద్గతిన్ క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసి యేతేరఁగన్.

420

తా॥ ఆ దైత్య రాజును ఆ ప్రకారంగా చంపి వాడి వేడి నెత్తురు అనే బురదతో నిండిన చెక్కిళ్ళు కలవాడై విష్ణువు; సంధ్యాకాలంలో ఎరుపెక్కిన మేఘాలతో గైరికాది శిలాధాతువులతో వెలిగిపోతూన్న మహాశైలంవలె ప్రకాశిస్తూ, ఈ భూమండలాన్ని తన కోర చివర ధరించి, ఆ జలరాశిని విడిచి బయటికి వచ్చాడు.

తే. బాల శీతాంశు రేఖా విభాసమాన, ధవళ దంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె హరికి నిత్యానపాయిని యైన లక్ష్మి, నెరయఁ బూసిన కస్తూరి నికర మనఁగ.

421

తా॥ విదియనాటి చంద్రునిలా వెలుగొందుతూన్న తెల్లని కోరచివర ఉన్న ఆ ధరణీ మండలం... హరిని ఎప్పుడూ విడిచి ఉండని శ్రీ మహాలక్ష్మి పూసుకున్న కస్తూరివలె తోచింది.

## శ్రీ యజ్ఞవరాహమూర్తిని బ్రహ్మ మొదలగువారు స్తుతించుట

వ. అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసన ప్రముఖు లిట్లని స్తుతియించిరి.

422

తా॥ అట్టి యజ్ఞవరాహమూర్తిని చూచి బ్రహ్మాదులిలా స్తుతించారు:

సీ. "దేవ! జితం జితం తే పరమేశ్వర!, జితయజ్ఞభావన! శ్రుతిశరీర!"
యనుచుఁ గారణసూకరాకారుఁ డగు నీకు, నతిభక్తి మ్రొక్కెదమయ్య వరద! భవదీయ రోమకూపములందు లీనంబు, లై యుండు నంబుధు లట్టి యధ్వ రాత్మకమై తనరారు నీ రూపంబు, గానంగరాదు దుష్కర్మపరుల

తే. కట్టి నీకుఁ బ్రణామంబు లాచరింతు, మఖిలజగదేకకీర్తి! దయానువర్తి! భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!, చిరశుభాకార! యిందిరాచిత్తచోర!

423

తా॥ ఓ దేవా! నీకు జయం! జయం! ఓ పరమేశ్వర! నువ్వు యజ్ఞాధిపతివి! వేదం నీ శరీరం! సూకరాకార కారణుడవైన నీకు అతి భక్తితో మ్రొక్కుతున్నాము. నువ్వు వరదుడవు. ఈ మహా సముద్రాలన్నీ నీ రోమకూపాలలో లీనమై ఉన్నాయి. అట్టి నీ స్వరూపాన్ని దుష్కర్మలు చేసేవారు దర్శించలేరు. జగదేక కీర్తిమంతుడివి! పరమ దయాపరుడివి! పవిత్ర చరిత్రుడవు! పద్మదళాయత నేత్రుడవు! శుభాకారుడవు! ఇందిరా రమణుడవు!

వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి.

424

తా॥ ఇంకా ఇలా స్తుతించారు:

సీ. త్వక్కున నఖిల వేదములు, రోమంబుల, యందును బర్హిస్సు, లక్షులందు

నాజ్యంబు, పాదంబులందుఁ జాతుర్హోత్ర, కలితంబులగు యజ్ఞకర్మములును, స్రుక్కు

తుండంబున, స్రువము నాసికను, ని, డాపాత్ర ముదరకోటరమునందు,

శ్రవణాస్యబిలములఁ జమసప్రాశిత్రముల్, గళమున నిష్టిత్రికంబు, జిహ్వఁ

తే. దగుఁ బ్రవర్గ్యము, నగ్నిహోత్రమును నీదు, చర్వణంబును, సభ్యావసథ్య లుత్త మాంగ

మసువులు చయనము లగుఁ గిటీశ! యనుచు నుతియించి రత్తఱి యజ్ఞవిభుని.

425

తా॥ "ఓ స్వామీ! నీ చర్మం నుండి అఖిల వేదరాశి, రోమముల నుండి అగ్నులు, నేత్రముల నుండి ఆజ్యము, పాదముల నుండి నాలుగు హోత్రాలతో కూడిన యజ్ఞకర్మలు, నోటి నుండి స్రుక్కు, ముక్కు నుండి స్రువము, ఉదరము అనే మహాబిలం నుండి ఇడాపాత్రం, చెవుల నుండి చమసం, నోటి నుండి ప్రాశిత్రం అనే యజ్ఞపాత్రలు, కంఠం నుండి ఇష్టులు అనే మూడు యజ్ఞాలు ఇటుకలు పేర్చు యజ్ఞాలు, నాలుక నుండి ప్రవర్గ్యము అనే యజ్ఞము పుట్టాయి. అగ్నిహోత్రమే నీ చర్వణం. సభ్యం అంటే హోమరహితాగ్ని, అవసథ్యం అంటే ఔపాసనాగ్ని నీ శిరస్సు నుండి జనించాయి. ఇవన్నీ నీ ప్రాణస్వరూపాలు. నువ్వు యజ్ఞ విభుడవు!

వ. వెండియు ముహుర్ముహు ర్భగవదావిర్భావంబు దీక్షణీయేష్టి యగు. నీదు దంష్ట్రలు ప్రాయణీయంబను దీక్షా నంతరేష్టియు, నుదయనీయం బను సమాప్తేష్టియు, యుష్మద్రేతంబు సోమంబును, ద్వదీయావస్థానంబు ప్రాత స్సవనాదులు, నీదు త్వఙ్మాంసాది సప్తధాతువు లగ్నిష్టోమోక్థ్యషోడశీ వాజపే యాతిరాత్రాప్తోర్యామంబు లను సంస్థా భేదంబులును ద్వాదశాహాదిరూపంబులైన బహు యాగ సంఘాతరూపంబులు నగు; సర్వ సత్త్రంబులు భవదీయశరీర సంధులు; ససోమాసోమంబులగు యజ్ఞక్రతు వులు నీవ; మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుందు వదియునుం గాక.

426

తా॥ అంతేకాక భగవంతుడవైన నీవు మాటిమాటికి ఆవిర్భవించటం "దీక్షణీయ" మనే యజ్ఞము. "ప్రాయణీయ" మనే దీక్షానంతరం జరిపే ఇష్టి, "ఉదయనీయము" అనే సమావేష్టి నీ కోరలు. సోమరసం నీ రేతస్సు. నీ ఉనికియే ప్రాతఃకాలం, మధ్యాహ్నం, సాయం సమయం అనే మూడు యజ్ఞాంశాలు. నీ చర్మం, మాంసం మొదలైన సప్తధాతువులు అగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం, ద్వాదశాహం మొదలైన కూడినవి, కూడనివి అయిన క్రతువులన్ని నీవే. నీవే యజ్ఞబంధాలతో అలరారుతూ ఉంటావు.

క. హవరూపివి! హవనేతవు!, హవభోక్తవు! నిఖిలహవ ఫలాధారుఁడవున్! హవరక్షకుఁడవు నగు నీ, కవితథముగ నుతు లొనర్తుమయ్య ముకుందా!

427

తా॥ నీవు యజ్ఞస్వరూపుడవు. యజ్ఞకర్తవు. యజ్ఞభోక్తవు. యజ్ఞఫలదాతవు. యజ్ఞరక్షకుడవు. సమస్త యజ్ఞాలకు ఫలదాతవు! ఓ ముకుందా! నీకు మా హృదయ పూర్వక అభివందనాలు.

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు, భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును హృదయపద్మంబునం దోలి నెఱుఁగఁబడిన, యట్టి నీకు నమస్కారమయ్య వరద!

428

తా॥ సత్త్వగుణం వల్ల భక్తి ప్రాప్తిస్తుంది. భక్తితో కూడిన చిత్తము పవిత్రం అవుతుంది. హృదయం చేత తెలుసుకోబడే నీకు నమస్కారం!

మ. అరవిందోదర! తావకీన సిత దంష్ట్రా గ్రావలగ్న క్షమా ధర నద్యబ్ధి నదాటవీ యుత సమిద్ధక్ష్మాతలం బొప్పె భా సుర కాసార జలావతీర్ణ మదవచ్ఛుండాలరాడ్దంత శే ఖర సంసక్త సపత్ర పంకజము రేఖం బొల్పు దీపింపఁగన్.

429

తా॥ కమలనాభా! నీ యొక్క తెల్లని కోరచివర వెలుగొందుతూ ఉన్న మహాపర్వతాలతో, నదీనదాలతో, అబ్ధితటాకాలతో నిండియున్న ఈ భూమండలం ఎలా ఉంది అంటావా... అందమైన కాసారంలో జలకాలాడటం కొరకు దిగిన మదమాతంగం యొక్క దంతం చివర తగుల్కొన్న ఆకుతో ఉన్న పద్మంలాగ పరమ రమణీయంగా ఉంది.

మ. మఱియును.

430

మ. చతురామ్నాయ వపుర్విశేష ధర! చంచత్సూకరాకార! నీ సితదంష్ట్రాగ్ర విలగ్నమైన ధర రాజిల్లెం గులాద్రీంద్ర రా జిత శృంగోపరి లగ్నమేఘము గతిం జెల్వారి, విద్వజ్జనాం చిత హృత్పల్వలకోల! భూరమణ! లక్ష్మీనాథ! దేవోత్తమా!

431

తా॥ అంతేకాదు... ఓ వేదస్వరూపా! వరాహరూపా! విద్వజ్జనుల యొక్క హృదయములనే నీటి మడుగులలో విహరించే సూకరరూపా! భూరమణా! లక్ష్మీనాథ! దేవోత్తమా! నీ తెల్లనైన పంటికోర మీద తగులుకొన్న ధరామండలం హిమవత్పర్వత శిఖరం మీద వెలుగొందుతూ ఉండే నీలమేఘంలా అందాలు చిమ్ముతూ ఉంది.

సీ. సమధిక స్థావరజంగమాత్మకమైన, వసుమతీచక్ర మవక్రలీల నుద్ధరింపుము; కరుణోపేత చిత్తుండ, వగుచు నస్మన్మాత యయ్యె ధరణి; మాత యౌ టెట్లని మదిఁ దలంచెదవేనిఁ, జర్చింప మాకు విశ్వమున కీవు జనకుండ వగుట యుష్మత్పత్ని భూదేవి, యగుట మాకును దల్లి యయ్యె; నిపుడు

తే. ధరకు నీతోడఁగూడ వందన మొనర్తు, మరణియందును యాజ్ఞికుఁ దగ్ని నిలుపు కరణి మీ తేజ మీ ధరాకాంతయందు, నిలుప ధరణి పవిత్రయై నెగడుఁ గాన.

432

తా॥ దయా హృదయంతో... స్థావర జంగమాత్మకమైన జీవులుగల ఈ వసుమతీ చక్రాన్ని సాగర జలాల్లో మునిగి నశించకుండా రక్షించు. ఈ ధరణీదేవి మాకు జనని. మాకు, విశ్వానికి నువ్వు జనకుడవు. నువ్వు భరిస్తున్నావు కనుక ఈమె నీకు భార్య అయింది... మాకు తల్లి అయింది. ఇప్పుడు ధరాదేవికి నీతోకూడ కలిపి నమస్కారం. అరణియందు యాజ్ఞికుడు అగ్నిని నిలిపిన ప్రకారం మీ తేజస్సును ఈ ధరాకాంతయందు నిలుపడంవల్ల ధరణీదేవి పవిత్రమై వర్ధిల్లుతుంది.

చ. తలఁప రసాతలాంతర గతక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ కలితన మెన్న విస్మయము గాదు; సమస్తజగత్తు లోలిమైఁ గలుఁగఁగ జేయు టద్భుతము గాక, మహోన్నతి నీ వొనర్చు పెం పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే రమేశ్వరా?

433

తా॥ రసాతలంలో ఉన్న భూమిని తీసుకొచ్చి తిరిగి యథాస్థానంలో నిలపెట్టడం పెద్దగా ఆశ్చర్యాన్ని కలిగించదు. ఈ అంతంలేని సమస్తమైన సృష్టిని కలగచెయ్యటమే మహాద్భుతం. నువ్వు చేసిన పనులు నీకు తప్ప ఇతరులకు అసాధ్యాలు.

చ. సకల జగన్నియానుక విచక్షణలీలఁ దనర్చునట్టి నం దకధర! తావక స్ఫురదుదారత మంత్రసమర్థు డైన యా జ్ఞికుఁ డరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మౌ టకుఁ దలపోసి యీ క్షితి దృఢంబుగ నిల్పితివయ్య యీశ్వరా!

434

తా॥ నందకధర! సకల జగత్తును నియమించేవాడా! మంత్రార్థం తెలిసిన యాజ్ఞికుడు అరణిలో అగ్నిని నిల్పి ఉంచినట్లు మా అందరికీ శాశ్వతమైన నివాసాన్ని కల్పించగోరి ఈ క్షితిని నువ్వు నిలపెట్టావు.

చ. సలలిత వేదశాస్త్రమయ సౌకరమూర్తి దనర్చుచున్ రసా తలముననుండి వెల్వడు

సుదారత మేను విదుర్పఁ దత్సటో చ్చలితములైన బిందువుల సాధు తపో జన సత్యలోక వా సులమగు మేము దోఁగి పరిశుద్ధి వహించితిమయ్య మాధవా!

435

తా॥ ఓ మాధవా! వేదశాస్త్ర స్వరూపా! నువ్వు రసాతలం నుండి వచ్చేటప్పుడు ఎంతో ఉదారంతో నీ మేనును ఒక్కసారి జలదరింపచేస్తే ఆ సమయంలో కొన్ని జలబిందువులు నాలుగు వైపుల ఎగిరిపడ్డాయి. ఆ జలాలలో తడిసి తపోలోకంలో, జన లోకంలో, సత్యలోకంలో ఉండే మేమంతా పరిశుద్ధులమయ్యాము.

ఉ. విశ్వభవస్థితి ప్రళయవేళలయందు వికారసత్త్వమున్ విశ్వము నీవ యీ నిఖిలవిశ్వము లోలి సృజింతు విందిరా ధీశ్వర! యీశ! కేశవ! త్రయీమయ! దివ్యశరీర! దేవ! నీ శాశ్వతలీల లిట్టి వని సన్నుతి సేయఁగ మాకు శక్యమే?

436

తా॥ ఓ లక్ష్మీవల్లభ! అనంతమైన ఈ సృష్టికి సృష్టి, స్థితి లయ కారకుడవు నీవే! ఓ ఇందిరాధీశ్వర! నిఖిల విశ్వాన్ని మళ్ళీ సృష్టిస్తున్నావు. ఈశ్వరా! కేశవ! వేద స్వరూపా! నీ శాశ్వతత్త్వం ఇట్టిదని సన్నుతిచెయ్యటం మావల్ల అవుతుందా స్వామీ!

సీ. పంకజోదర నీ వపార కర్ముండవు, భవదీయ కర్మాబ్ధిపార మేద నెఱిఁగెద నని మది నిచ్చగించిన వాఁడు, పరికింపఁగా మతిభ్రష్టు గాక విజ్ఞానియే? చూడ విశ్వంబు నీ యోగ, మాయాపయోనిధి మగ్న మౌటఁ దెలిసియుఁ దమబుద్ధిఁ దెలియని మూఢుల, నే మన నఖిలలోకేశ్వరేశ!

తే. దాసజనకోటి కతి సౌఖ్యదాయకములు, వితతకరుణా సుధా తరంగితములైన నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ, జూచి సుఖులను జేయవే సుభగ చరిత!

437

తా॥ ఓ పంకజోదర! నీవు అనంత కర్ముడవు. ఆ కర్మలనే సముద్రం యొక్క అంతు నేను తెలుసుకుంటాను అని మనస్సులో అనుకొన్నవాడు మతిభ్రష్టుడే కాని విజ్ఞాని అవుతాడా! ఈ అనంత విశ్వము నీ యోగమాయా పయోనిధిలో మునిగి ఉందన్న విషయం తెలిసికూడా తమబుద్ధి చేత అనుభవంలోకి తెచ్చుకోలేని మూఢులను ఏమనాలి? నీ దాసులకు అతి సౌఖ్యదాయకములు, కరుణ అనే అమృత తరంగతములు అయిన క్రీగంటి చూపులచే మమ్ములను అనుగ్రహించు.

క. అని బ్రహ్మవాదు లగు స, న్ముని వర్యులు భక్తియోగమున వినమితులై మనమున మోదము ముప్పిరి, గొనఁ బొగడిరి ఖుర విదళిత గోత్రిం బోత్రిన్.

438

తా॥ అని బ్రహ్మవాదులైన సన్మునీశ్వరులు భక్తియోగం చేత శిరస్సులు వంచి మనస్సులో సంతోషము ఉరకలు వేయగా కాలిగిట్టలచే పర్వతాలను పిండిచేయగల వరాహ స్వామిని పొగిడారు.

ఉ. అంతట లీలఁబోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య త్యంత గభీర భీషణ మహార్ణవ తోయసమూహమున్ ఖురా క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతల మంబులమీఁద నిల్పి వి శ్రాంతి వహింపఁజేసి గుణశాలి తిరోహితుఁడయ్యె నయ్యెడన్.

439

తా॥ అనంతరం ఆ యజ్ఞవరాహమూర్తి అత్యంత గంభీరము, భీషణము అయిన మహా సముద్ర జలాలను తన కాలిగిట్టలతో ఆక్రమించి తిరిగి ధరాతలాన్ని విశ్రాంతిగా నీళ్ళమీద నిలిపి... ఆపైన ఆ గుణశాలి తిరోహితుడయ్యాడు.

ఉ. మంగళమైన యీ కథ సమంచితభక్తిఁ బఠింప విన్న వా రిం గరుణార్ద్ర దృష్టిఁ గని శ్రీహరి సొలఁ బ్రసన్నుఁ డౌను, స త్సంగతుఁడైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్

మంగళముల్ లభించు; ననుమానములే దదిగాక వెండియున్.

440

తా॥ ఈ కథ సమస్త మంగళాలను చేకూరుస్తుంది. దీనిని భక్తితో పఠించిన వారిని విన్న వారిని శ్రీహరి కరుణార్ద్ర దృష్టితో చూచి చాలా ప్రసన్నుడవుతాడు. విష్ణుడు ప్రసన్నుడైన వారికి శుభాలు కలుగుతాయి. ఇందులో అనుమానం లేదు.

చ. హరి నిజదాసకోటికి గుహాశయుఁడై రమియించు; నట్టి స త్పురుషుల కిష్టవస్తు పరిపూర్ణ మనోరథసిద్ధి గల్గు; సు స్థిర మగుచున్న మోక్ష మరచేతిదియై చెలువారు నన్న న స్థిరతరతుచ్ఛ సౌఖ్యములు సేకుఱుటల్ మఱి చెప్ప నేటికిన్.

441

తా॥ తన భక్తుల హృదయ గుహలలో ఆ హరి నిత్యము రమిస్తూ ఉంటాడు. అట్టి సత్పురుషులు కోరుకున్నవన్నీ పరిపూర్ణంగా సిద్ధిస్తాయి. సుస్థిరమైన మోక్షం అరచేతి లోనిదై ఉంటుంది అంటే... ఈ అస్థిరమైన తుచ్ఛ సౌఖ్యములు కలుగుతాయి అని వేరే చెప్పాలా?

ఉ. కాన సరోజలోచను జగత్ స్తవనీయ కథాసుధారసం బానిన యట్టి జిహ్వ యసదన్య కథాలవణోదకంబులం బానము సేయఁ జూచునె; సుపర్వమహీజ మరందపాన లా భానుభవంబు నొందు మధుపప్రభు వేఁగునె వేఁపచెట్లకున్?

442

తా॥ అందువల్ల అఖీల లోకాలు పొగిడేటటువంటి ఆ శ్రీహరి యొక్క కథలనే అమృతాన్ని ఆస్వాదించిన జిహ్వ... ఇతర కథలనే ఉప్పు నీళ్ళను త్రాగుతుందా? దేవతావనంలోని మందార మకరందాన్ని త్రాగడానికి అలవాటు పడ్డ గొప్పదైన తుమ్మెద వేప చెట్లవైపు వెళ్ళాలనుకుంటుందా?"

క. అని మైత్రేయ మునీంద్రుం, డనఘుఁడు విదురునకుఁ జెప్పినట్టి తెఱంగ గర్జున పౌత్రునకున్ వ్యాసుని, తనయుఁడు వినిపించి మఱియుఁ దగ నిట్లనియెన్.

443

తా॥ ఈ ప్రకారంగా మైత్రేయ మహర్షి అనఘుడైనట్టి విదురునకు చెప్పినట్టి విధంగా పరీక్షిన్మహారాజుకు వ్యాస పుత్రుడైన శుక మహర్షి వినిపించి ఇంకా ఇలా అన్నాడు:

క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు పల్కు ఘనతరమగు నా దనుజకులాంతకు చరితము, విని తనియదు నా మనంబు విమలచరిత్రా!

444

తా॥ అలా చెప్పిన మైత్రేయుణ్ణి చూసి విదురుడు ఇలా అన్నాడు: “ఆ హరి యొక్క చరిత్ర ఎంత విన్నా నా మనస్సుకు తృప్తి కలగటం లేదు.

చ. సవనవరాహమూర్తి కథ సర్వము నీ దయ వింటి; వెండియున్ వివరముగా వినం బలుకవే గుణసాంద్ర! మునీంద్ర చంద్ర! మా ధవ గుణకీర్తనామృత వితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం జవిఁగొన కేల మాను జనసంతతికిన్ భవతాపవేదనల్.

445

తా॥ మునీంద్ర చంద్ర! యజ్ఞవరాహ మూర్తి కథ సర్వము నీ దయచేత విన్నాను. ఇంకా వివరంగా విస్తరించి చెప్పు. మాధవుని యొక్క మంచి గుణములు కీర్తించటం అనే అమృతాన్ని చెవులనే దోసిళ్ళతో త్రాగకపోతే ఈ జనసంతతికి సంసార బాధలు ఎలా తీరుతాయి?

వ. కావున

446

సీ. శ్రీహరి యజ్ఞవరాహ రూపముఁ దాల్చి, మించి హిరణ్యాక్షుఁ ద్రుంచె ననుచు నప్పుడు

మునినాథ! చెప్పితి నా తోడ, నవ్వరాహంబు దంష్ట్రాగ్రమునను ధరణి నెబ్బంగిని ధరియించె? హరికి హి, రణ్యాక్షుతోడ వైరమున కేమి కారణ? మసుర నే గతి సంహరించె దా?, నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత!

తే. యనిన మైత్రేయముని విదురునకు ననియె, హరికథాకర్ణనమునఁ బెంపారు నీకు జన్మఫల సిద్ధి యగుటకు సందియంబు, వలదు; హరిమాయ విధికైన వశమె తెలియ?

447

తా॥ అందుకని అడుగుతున్నాను. శ్రీహరి యజ్ఞవరాహ రూపాన్ని ధరించి ఉగ్రుడై హిరణ్యాక్షున్ని త్రుంచాడని నాతో చెప్పావు. ఆ వరాహం తన కోరచివర ఈ భూమండలాన్ని ఎలా ధరించింది? హరికి హిరణ్యాక్షునితో గల వైరానికి కారణం ఏమిటి? ఆ రాక్షసుణ్ణి ఎలా సంహరించాడు? ఇదంతా నాకు చెప్పండి!" అప్పుడు మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు: "శ్రీహరి కథలు వినాలి అనే తీవ్రమైన కోరికగల నీదు జన్మ చరితార్థం అయ్యింది. సందేహం లేదు. హరి మాయ, బ్రహ్మకు కూడా తెలియదు.

క. అనఘాత్మ! నన్ను నీ వడి, గిన యీ కథ ధ్రువుఁడు విష్ణుకీర్తన పరతం దనరిన నారదు నడుగ న, తని కతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్.

448

తా॥ అనఘా! నన్ను నీవు అడిగిన ఈ కథను ధ్రువుడు నిరంతరము శ్రీహరి గుణకీర్తన చేసే నారదుణ్ణి అడిగి తెలుసుకున్నాడు. హరికథా శ్రవణంవల్ల అతడెంతో అద్భుత చరితుడయ్యాడు.

తే. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు, నిందు నందును వాసికి నెక్కి; నట్టి విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱుతు.

449

వ. ఆకర్ణింపుము.

450

తా॥ అట్టి ధ్రువుడు ఎడమ కాలితో యముణ్ణి తన్ని ఈ లోకంలోను పైలోకంలోను కూడ వాసికెక్కాడు. అట్టి విష్ణు సంకీర్తనాన్ని బ్రహ్మ దేవతలకు చెప్పాడు. ఆ విషయాలన్ని నీకు వివరంగా చెపుతాను విను.

# మైత్రేయ మహాముని విదురునికి హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతం తెలుపుట

సీ. బలిసి దక్షప్రజాపతి తనూభవ దితి, సంతానరుచి మానసమునఁ బొడమ నొకనాఁడు పుష్పసాయక శర నిర్భిన్న, భావయై విరహతాపమున వచ్చి పతి సమాగమవాంఛ ప్రభవింప నిజనాథు, సన్నిధి నిలిచి యస్ఖలిత నియతి నగ్నిజిహ్వుండును యజురధీశుండును, నగు విష్ణుఁ దన చిత్తమందు నిలిపి

తే. తగఁ బయస్సున నగ్నిహోత్రంబు సేసి, కమలహితుఁ డస్తశైల సంగతుఁడు గాఁగ హోమశాలాంగణమునఁ గూర్చున్న విభునిఁ, గశ్యపునిఁ గాంచి వినయవాక్యముల ననియె.

451

తా॥ “దక్షప్రజాపతి కూతురైన దితి మనస్సులో సంతానకాంక్ష చెలరేగింది. ఒక రోజున మదనుని పూవుటమ్ములకు తట్టుకోలేక విరహతాపంతో బాధపడుతూ తన భర్త అయిన కశ్యప ప్రజాపతిని సమీపించింది. ఆయన అప్పుడు నియమంగా వేదరూపుడు, జ్యోతి స్వరూపుడూ అయిన విష్ణువును తన మనస్సులో నిలిపి అగ్నిహోత్రం చేసి సూర్యస్తమయవేళ హోమశాల ప్రాంగణంలో కూర్చుని ఉన్నాడు. ఆయనను సమీపించి వినయంతో ఇలా అంది:

చ. గజవిభుఁ డుద్ధతి న్ననఁటికంబములన్ విదళించు లీలఁ జి త్తజుఁడు ప్రసూనసాయక వితానముచేత మదీయచిత్తమున్ గజిబిజిసేసి పెన్వగలఁ గాఱియ వెట్టఁగ నాథ! నీ పదాం బుజములఁ గాన వచ్చితిఁ, బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁ గావవే!

452

తా॥ ‘నాథా! గజేంద్రుడు మిక్కిలి ఉద్ధతితో అరటి తోటలోనికి ప్రవేశించి తోటనంతా చీల్చివేసినట్లు... మదనుడు తన పువ్వుటమ్ముల చేత నా మనస్సును అల్లకల్లోలం చేస్తున్నాడు. ఆ దుఃఖాన్ని తట్టుకోలేక మీ సన్నిధికి చేరాను. మీ ఆధిక్యాన్ని ప్రదర్శించి నన్ను రక్షించండి.

వ. అదియునుం గాక నాతోడి సవతు లెల్లను భవత్కృపా విశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్త నై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు; నీవు విద్వాంసుఁడవు; నీ యెఱుంగని యర్థంబు గలదే? నీ వంటి మహానుభావు లయిన సత్పురుషు లార్తులైన వారి కోర్కులు వ్యర్థంబులు గాకుండఁ దీర్చుట ధర్మం బని వెండియు నిట్లనియె.

453

తా॥ ఒక్క విషయం – నా సవతులందరు నీ కృపావిశేషం వల్ల గర్భాలను ధరించి ఎంతో ఆనందంతో ఉన్నారు. నేను మాత్రం దుఃఖంతో అలమటిస్తున్నాను. నన్ను రక్షించటం మీకు ఉత్తమ ధర్మం. మీరు మహా పండితులు. మీరు ఎరుగని విషయాలేముంటాయి? మీ వంటి మహానుభావులైన సత్పురుషులు దుఃఖీతులైన వారి కోరికలు వ్యర్థం కాకుండ తీర్చటం ధర్మం' అని ఇంకా ఇలా అంది:

క. పతి సమ్మానము వడసిన, సతులకు నభిమత పదార్థ సంసిద్ధియు నూ ర్జిత యశముఁ గలిగి లోక, స్తుతమై చెలువారుచుండుఁ జువ్వె మహాత్మా!

454

తా॥ 'మహాత్మా! భర్త యొక్క ఆదరాన్ని పొందిన భార్యలకు వారి సంకల్పములన్నీ నెరవేరతాయి. లోకంలో దృఢమైన యశస్సు కలిగి లోకులచేత ఎప్పుడూ స్తుతింపబడుతూ ఉంటారు.

క. తన ధర్మపత్ని వలనను, మునుకొని తాఁ బుత్త్ర రూపమున నుదయించున్ విను దీపమందు ముట్టిం, చిన దీపము రెండు గావె? శిఖీ యొక టయ్యున్.

455

తా॥ దీపం నుండి దీపం పుట్టి రెండు దీపాలు అయినట్లుగా; పతి అయిన పురుషుడు తన

ధర్మపత్ని వలన తిరిగి పుత్రరూపంలో పుడతాడు.

క. కావున నీ యర్థమ "యా, త్మా వై పుత్ర" యని వేదతతులం దోలిన్ వావిరిఁ బలుకఁగ వినవే, ధీవర! నను గావు మధికదీనం గరుణన్.

456

తా॥ ఈ అర్థాన్నే "ఆత్మస్వరూపుడైన తానే కుమారుడై జన్మిస్తాడు" – అని శ్రుతులంటూన్న విషయం మీరు విన్నదే గదా! ధీవర! దీనురాలైన నన్ను దయతో కాపాడండి.

చ. వరకరుణామతిన్ దుహితృవత్సలతం దనరారు నట్టి మ ద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దన కూఁతుల నందఱఁ బిల్చి మీ మనో హరు నెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార! య టన్న నందులోఁ బురుషవరేణ్య! యేము పదుమువ్వుర మర్మిలి నిన్ వరింపమే!

457

తా॥ మా నాన్నగారైన దక్షప్రజాపతికి కూతుళ్ళు అంటే చాలా ఇష్టం. అట్టి మా తండ్రిగారు ఒకనాడు తన కుమార్తెలనందరిని పిల్చి మీ మనస్సులను ఆకర్షించినటువంటి పురుషుని పేరు చెప్పండి! అలా చెపితే మిమ్ములను ఆయనకిచ్చి వివాహం జరిపిస్తాను... అన్నప్పుడు మేము పదమూడుమందిమీ నిన్నే వరించాము కదా!'

క. దితి యీ గతిఁ గామవిమో, హితమతి బహువచనముల హృదీశునిఁ బలుకన్ ధృతిఁ గృపణఁ బతివ్రత నిజ, సతిఁ గని కశ్యపుఁడు పలికె సల్లాపమునన్.

458

తా॥ అని ఈ విధంగా కామపరతంత్రురాలైన దితి తన నాథున్ని ఉద్దేశించి అనేకసార్లు దీనంగా బ్రతిమాలే సరికి... ధైర్యవంతుడైన కశ్యపుడు పతివ్రత అయిన తన సతితో ఈ విధంగా పలికాడు:

వ. నీవు సెప్పినయట్ల పురుషులకు నంగనల వలన ధర్మార్థ కామంబులు సిద్ధించుఁ; గర్ణధారుండు నావచేతం బయోధిఁ గడచు చందంబున గృహమేధి సర్వాశ్రమవాసుల నరసి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబు దరియించు; భార్య పురుషునందు నర్ధంబు; భార్యయందు సకల గృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖీయించుచుండు; మఱియు నితరాశ్రమ దుర్జయంబులైన యింద్రియశత్రు వర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రు సంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబునం జయించు; నిట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకల గుణాభిరాములగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులకు నైన సమర్థులు గారనిన మముబోఁటివారలు సేయనోపుదురే? అయిన నీ మనంబునం గల దుఃఖంబు దక్కు మని యిట్లనియె.

459

తా॥ 'ఓ దేవీ! నువ్వన్నట్లే పురుషులకు అంగనల వలన ధర్మార్థకామ మోక్షములు సిద్ధిస్తాయి. నావికుడు తన నావతో తను దాటడమే కాకుండ ఇతరులను కూడా దాటించునట్లు గృహస్థు సర్వాశ్రమవాసులను రక్షిస్తూ తాను కూడా తరిస్తాడు. భార్య పురుషునిలో సగం. అటువంటి భార్యయందు గృహకార్యభారం అంతా ఆమె మీదపెట్టి పురుషుడు నిశ్చింతుడై సుఖీస్తాడు.

ఇంతే కాకుండా... ఇతర ఆశ్రమ వాసులు జయింపలేని ఇంద్రియాలకు శత్రువులను; భార్యాసమేతుడైన గృహస్థు దుర్గాధిపతి అయిన రాజు శత్రువులను జయించే విధంగా లీలామాత్రంగా జయిస్తాడు. ఇటువంటి మహోపకారిణి అయిన భార్యాఋణాన్ని సకలగుణాభిరాములైన సత్పురుషులు ఈ జన్మలోగాని వచ్చేజన్మలో గాని తీర్చుకోవడానికి సమర్థులు గారు. ఇక మాలాంటి వారిగురించి చెప్పేదేముంది? నీ మనస్సులోని దుఃఖాన్ని విడిచిపెట్టు...' అని ఇంకా ఇట్లా అన్నాడు.

తే. తరళలోచన! నీవు సంతానవాంఛఁ, జేసి వచ్చితి, వౌఁ గులశీలవర్త నములు గల భార్య మనమున నమరు కోర్కిఁ, దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ.

460

తా॥ 'ఓ హరిణలోచన! నువ్వు బిడ్డలు కావాలనే కోరికతో నా సన్నిధికి వచ్చావు. ఉత్తమ కులంలో జన్మించి మంచి శీలం గల భార్యయొక్క మనసులోని కోర్కెను తీర్చటం భర్తకు తప్పనిసరిగా చెయ్యవలసిన పని.

మ. తరుణీ! యొక్కముహూర్తముండు; మిది సంధ్యాకాల మిక్కాలమం దరయన్ భూతగణావృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే శ్వరయానంబున సంచరించుట; నభావ్యంబయ్యెఁ; నీ యుగ్ర వే ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు; నేలా ధర్మమున్ వీడఁగన్.

461

తా॥ తరుణీ! ఒక్క ముహూర్తకాలం ఆగు. ఇది సంధ్యాకాలం. ఈ కాలంలో కామునికి శత్రువైన శంకరుడు తన వాహనమైన వృషభాన్నెక్కి భూత పిశాచాలతో సంచరిస్తూ ఉంటాడు. ఇది అనుకూలమైన కాలంగాదు. ఈ ఉగ్రవేళ రమించటం చెయ్యకూడని పని. తెలిసి తెలిసి ధర్మాన్ని ఎందుకు విడిచిపెట్టాలి?

మ. అరవిందానన! వీఁడె నీ మఱఁది; లీలాటోప రుద్రక్షమా చర ఝుంఝూనిల ధూతపాంసు పటలచ్ఛన్నుండు, ధూమ్రైక దు ర్భర విద్యోతిత కీర్ణ భీషణ జటా బద్ధుండు, భస్మావ లి ప్త రుచిస్ఫారసువర్ణ వర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై.

462

తా॥ ఓ అరవిందాననా! ఆ కనుపిస్తున్న వాడె నీ మరిది రుద్రుడు. ప్రేత భూమి నుండి వీచే భయంకరమైన వాయువుల వల్ల రేగిన దుమ్ముతో కూడిన శరీరం కలవాడై కావిరంగుతో కనుపిస్తూ భీషణ జటాబద్ధుడై శరీరమంతా తెల్లని భస్మంతో సువర్ణవర్ణంతో భాసిల్లుతున్నాడు.

క. అనల సుధాకర రవి లో, చనముల వికసింపఁజేసి సమధికరోషం బునఁ జూచుచున్న వాఁడదె, వనితా! బంధుత్వ మరయ వలవదు సుమ్మీ!

463

తా॥ సూర్య, చంద్ర, అగ్నులు ఆ శివుని నేత్రాలు. ఆ మూడు కళ్ళను వికసింపచేసి పట్టరాని కోపంతో మనవైపే చూస్తున్నాడు. ఆయన మనకు బంధువే కదా అని అనుకోకు!

క. అతనికిఁ దలపోయ హితా, హితులును సన్మాన్యులును విహీనులు నతి గ ర్హితులును లే; రీశుఁడు సమ, మతియును నిఖిలైక భూతమయుఁడై యుండన్.

464

తా॥ ఆయనకు హితులు—అహితులు, మాన్యులు—సామాన్యులు; నిందింపతగినవారని భేదభావం లేదు. అతడు సమబుద్ధి కలవాడు, సర్వభూతమయుడు.

క. కావున మద్భ్రాత భవ, ద్దేవరుఁడని తరుణి! నీ మదిం జూడకు; మా దేవాదిదేవుఁ ద్రిజగ, త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్.

465

తా॥ తరుణీ! కనుక నా సోదరుడైన ఆ రుద్రుణ్ణి నీకు మరిది గదా అని నీ హృదయంలో ఎప్పుడూ అనుకోవద్దు. ఆయన దేవాదిదేవుడు, త్రిజగత్పావనుడు, సమస్త లోకాలకు ప్రభువు, భగవంతుడు, హరుడు.

వ. ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై దూరతోన్యస్తంబైన పుష్పమాలికయుంబోలె నమ్మహాత్ముని చరణారవింద వందనాభిలాషిణియైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతుము. అదియునుంగాక.

466

తా॥ మేముగాని, పూజ్యులైన విజ్ఞానవంతులుగాని, ఎవరైనా సరే... ఆ మహానుభావుని మాయకు లోనై సంచరిస్తూ ఉంటాము. ఆ మాయకూడా అనుభవించిన తర్వాత దూరంగా విసిరేసిన పూలదండవలె దూరంగా ఉండికూడా ఈశ్వరుని చరణారవిందములకు ఎప్పుడూ నమస్కరించాలనే కోరిక కలిగి ఉంటుంది. మాయను అనుసరించే మేమూ... ఉంటాము.

సీ. ఎవ్వని కరుణ బ్రహ్మేంద్రాది దిక్పాల, వరు లాత్మపద వైభవములఁ దనరి రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును, విశ్వనేత్రి యగు నవిద్య యెపుడు నెవ్వని మహిమంబు లిట్టి వట్టివి యని, తర్కింపలేవు వేదంబు లయిన నెవ్వని సేవింతు రెల్లవారును సమా, నాధికరహితుఁడై యలరు నెవ్వఁ

తే. డట్టి దేవునిఁ ద్రిపురసంహారకరుని, నస్థిమాలాధరుండు భిక్షాశనుండు భూతిలిప్తాంగుఁ డుగ్రపరేతభూమి, వాసుఁడని హాస్య మొనరించువారు మఱియు.

467

తా॥ ఎవని కరుణతో బ్రహ్మ మరియు మహేంద్రాది శ్రేష్ఠులైన దిక్పాలకులు తమ అధికారాలలో మహావైభవంతో ఉండగలుగుతున్నారో; ఎవని ఆనతిని వహించి విశ్వనేత్రి అయిన అవిద్య ఎప్పుడూ వర్తిస్తూ ఉంటుందో; ఎవని మహిమలు "ఇలాటివి అలాటివి" అని వేదాలు సైతం తర్కింపలేవో; లోకులందరు ఎవనిని పూజిస్తారో; ఎవని కంటే మేటి వారు సాటివారు లేరో... అట్టి ఈశ్వరుని, త్రిపురాసుర సంహారకరుని, హరుడు ఎముకలు మాలగా ధరిస్తాడని, బిచ్చమెత్తుకు తిరిగే వాడని, శరీరమంతా బూడిద రాసుకుంటాడని, ఎప్పుడు శ్మశానంలోనే ఉంటాడని నిందించే వారు నిర్భాగ్యులు.

క. ధర శునకభోగ్యమును నిహ, పర దూరము నైన తనువు పాథేయముగా నెఱి నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించు పామరజనులున్.

468

క. ఘననిర్భాగ్యులుగా మదిఁ, గను మని యీ రీతిఁబ్రియకుఁ గశ్యపుఁ డెఱిఁగిం చిన దితి గ్రమ్మఱఁ బలికెను, మనసిజసాయక విభిన్న మానస యగుచున్.

469

తా॥ ప్రాణాలు పోయాక శరీరం కుక్కలకు, నక్కలకు ఆహారం అవుతుంది; ఆపై ఇహపరాలకు దూరమవుతుంది. అటువంటి ఈ శరీరాన్ని నమ్మి వస్త్రాలతోను, పూలదండలతోను, ఆభరణాలతోను అలంకరించుకునే పామర జనులను నిర్భాగ్యులుగా తెలుసుకో...'' అని ఈ విధంగా తన ప్రియురాలితో పలికాడు కశ్యప ప్రజాపతి. కాని దితి మన్మథ బాణాలచే మనస్సు చెదిరిపోయి తన భర్తతో ఏమేమో అంది.

క. మునుకొని లజ్జావనత వ, దనయై ప్రాణేశు కొంగుఁ దాలిమి దూలం బెనఁగొనియె వారకామిని, యనువున వినిషిద్ధకర్మమం దభిముఖియై.

470

తా॥ అలా అంటూ... ఇది ఇప్పుడు చెయ్యకూడని పని అని భర్త చెపుతున్నా వినకుండ సిగ్గుతో తలవంచుకుని వారకాంతలాగ కామంతో ప్రాణేశ్వరుని వస్త్రాన్ని పట్టుకొని లాగింది.

వ. ఇట్లు చేసిన భార్యానిర్బంధంబునకుం దొలంగ నేరక యీశ్వరునకు నమస్కారం బొనరించి యేకాంతంబున నిజకాంతా సంగమంబును జేసి విరజంబును సనాతనంబునునైన బ్రహ్మగాయత్త్రి జపియించె నంత.

471

తా॥ భార్య చేసిన బలవంతపు పనికి కాదనలేక ఈశ్వరునకు ఒక్క నమస్కారం చేసి ఏకాంతంలో తన భార్య కోరిక తీర్చాడు. తీర్చి సనాతనమైన బ్రహ్మగాయత్రిని జపించాడు.

క. దితియును నిషిద్ధకర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా నతవదన యగుచు నా పశు,

పతివలన భయంబు గల్గి పరమప్రీతిన్.

472

వ. కశ్యపుం గనుగొని యిట్లనియె; సమస్త భూతపతియైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భపరిపాలనంబు సేయుంగాక! రుద్రుండును మహాత్ముండును స్వయం ప్రకాశుండును నలంఘ్యుండును సకామజన ఫల ప్రాపకుండును నిష్కామజన మోక్షప్రదుండును న్యస్తదండుండును ధృతదండుండును దుష్ట శిక్షకుండును బరమాత్ముండును జగదంతర్యామియు నిర్గుణుండును నిష్కాముండును భక్తసులభుండును భగవంతుడును నగు నప్పరమేశ్వరునకు నమస్కరించెద. మఱియు షడ్గుణైశ్వర్య సంపన్నుండును జగద్భర్తయు మహానుగ్రహశీలుండును నిర్దయ పరిపాల్య వధూరక్షకుండును సతీదేవీపతియు నైన యా సర్వేశ్వరుండు నన్ను రక్షించుంగాత మని సన్నుతించి.

473

తా॥ దితీదేవి కూడా చెయ్యకూడని పని చేసినందుకు మనస్సులో సిగ్గుపడుతూ తలవొంచుకుని ఈశ్వరుని వలన భయంతో కశ్యపునితో పరమ ప్రీతితో ఇట్లా అంది: “సమస్త లోకాలలోని జీవరాశికి పతి అయిన పరమేశ్వరుడు నా తప్పును మన్నించి నా గర్భాన్ని రక్షించుగాక. రుద్రుడు మహాత్ముడు స్వయం ప్రకాశుడూను. ఆయన ఆజ్ఞను ఎవరూ అతిక్రమించలేరు. అందరి కోరికలు తీర్చేవాడు, కోరికలు లేనివారికి మోక్షం ఇచ్చేవాడూను. ధర్మదండాన్ని ధరించి దుర్మార్గులను శిక్షిస్తాడు. పరమాత్ముడు, ఈ జగత్తుకు అంతర్యామి స్వరూపంగా ఉండేవాడు ఆయనే. ఆయనకు గుణాలు లేవు, కోరికలూ లేవు, భక్తులకు సులభంగా లభిస్తాడు. అట్టి పరమేశ్వరునకు నా నమస్కారాలు.

అంతేకాదు షడ్గుణైశ్వర్య సంపన్నుడు, ఈ జగత్తును భరించేవాడు, అనుగ్రహించడమే శీలంగా గలవాడు, ఆపన్నులైన కాంతలకు రక్షకుడును, సతీదేవి పతియు అయిన ఆ

సర్వేశ్వరుడు నన్ను రక్షించు గాక!"

క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజనాథువలనఁ గమలాసన కా విర్భూతమైనఁ గర్మ వి, నిర్భరపరితోష మాత్మ నెలకొని యుండెన్

474

తా॥ పిల్లలు లేని దితి నాథుని వల్ల తనకు గర్భం నిలిచినందుకు పట్టరాని సంతోషంతో ఉంది.

వ. అంతఁ గశ్యపుండు దత్కాలసముచిత సంధ్యావందనంబులు దీర్చి.

475

క. ఆ చెలికి గర్భచిహ్నము, లేచినఁ బరితోష మాత్మ నేపారక మా రీచుండు నిజతలోదరిఁ, జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్.

476

తా॥ అప్పుడు కశ్యపుడు సంధ్యావందనాదులు పూర్తి చేసుకున్నాడు. చేసుకుని తన పత్నికి గర్భం వచ్చినందుకు సంతోషింప లేదు. ఎంతో బాధపడుతూ, తప్పుడు పని చేసినందుకు కుమిలిపోతూ తన భార్యతో ఇలా అన్నాడు:

మ. సతి! నీ వే గతి నింద కోడక మనోజాతేక్షుకోదండ ని ర్గత నారాచ పరంపరాహత విశీర్ణ స్వాంతవై పాప సం గతి లజ్జాభయ ధర్మముల్ విడిచి దుష్కాలంబునందే రమిం చితి బల్మిన్ వెలయాలి కైవడిని దుశ్శీల క్రియాలోలతన్.

477

తా॥ 'ఓ సతీ! లోక నిందకు భయపడక; మదనుని ఇక్షు కోదండం నుంచి వచ్చే బాణాల తాకిడికి మనస్సులో తట్టుకోలేక లజ్జను, భయాన్ని, ధర్మాన్ని విడిచి బలవంతంగా వెలయాలివలె

దుశ్శీలవై సంచరించావు.

వ. అట్లగుటం జేసి.

478

క. సతి! విను భూతగణ ప్రే, రితులై రుద్రానుచరుల పృథుశక్తి సమ న్వితు లుగ్రకర్మ లతిశౌ, ర్యతములు భద్రానుభద్రు లన నామములన్.

479

క. పఱఁగిన దర్పోద్ధతు లి, ద్దఱు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వ్రేఁగై నిరతము బుధజనపీడా, పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్.

480

తా॥ అందువల్ల సతీ! విను, రుద్రుని యొక్క అనుచరులు, అపారమైన శక్తిసామర్థ్యాలు కలవారు, భయంకరమైన పనులు చేసేవారు, చాలా పరాక్రమవంతులు భూతగణములచే ప్రేరేపింపబడినవారై భద్రుడు, అనుభద్రుడు అనే పేర్లతో నీకు కొడుకులై పుడతారు. వాళ్ళిద్దరూ మిక్కిలి దర్పంకలవారై, సజ్జనులను పీడిస్తూ బలగర్వంచేత భూమికి భారమవుతారు.

తే. అట్టి దుష్కర్ములకును మహాత్ము లలిగి, విశ్వవిదుఁడైన హరికిని విన్నవింప నతఁడు కోపించి హరి కులిశాయుధమున, గిరుల నఱకిన గతి వారి ధరణిఁ గూల్చు.

481

తా॥ అలాంటి దుష్టుల దురాగతాలను సహించలేక మహాత్ములు శ్రీహరికి విన్నవించుకుంటారు. ఇంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను నరికినట్లు ఆ శ్రీహరి దుష్కర్ములను సంహరిస్తాడు.'

క. అని కశ్యపుఁ డెఱిఁగించిన, విని దితి భయమంది చాల విహ్వలమతియై తన హృదయేశు

ముఖాబ్జముఁ, గనుఁగొని యిట్లనియె విగతకౌతుక యగుచున్.

482

తా॥ ఈ విధంగా కశ్యప ప్రజాపతి చెప్పగా విన్న దితి చాలా భయపడి ఎంతో ఆందోళన చెందింది. కాంతి విహీనమైన ముఖంతో తన నాథుని కళ్ళల్లోకి చూస్తూ ఇలా అంది:

చ. ధర సుజనా రాధులగు తామసచిత్తుల కెందు నాయువున్ సిరియు నశించిపోవు; మృతి సేకుఱు శత్రులచేత; నింతయౌ నరయఁగ నిక్కువంబు భవదాత్మజు లార్యుల కెగ్గుసేయ భూసురుల క్రుధాగ్నిపాల్పడక శోభనమౌ హరిచేతి పంచతన్.

483

తా॥ 'స్వామీ! సజ్జనులకు అపరాధం చేసే దుర్మార్గులకు ఎప్పుడూ ఆయువు, ధనము నశించి పోతాయి. వాళ్ళ వైరులచేత వాళ్ళు హతులవక తప్పదు. ఇది నిజం! మన పుత్రులు పూజ్యులకు తప్పు చేసిందువల్ల వాళ్ళ ఆగ్రహానికి బలికాకుండ శ్రీహరి చేతులలో ప్రాణాలు కోల్పోవటం శుభమే కదా!'

## కశ్యపుడు భార్య సంతాపము తీర్చుట

చ. అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను నింతి! నీవు చే సిన విపరీత కర్మమునఁ జేకుఱె నిట్టి యవస్థ; దీనికిన్ మనమునఁ దాప మొందకుము! మాధవు పాదసరోజయుగ్మ చిం తనమునఁ జేసియున్ నను ముదంబునఁ గొల్పుటఁ జేసియుండగన్.

484

తా॥ ఆ మాటలు విన్న కశ్యపుడు కమలము వంటి ముఖము కలిగిన దితీ దేవితో ఇట్లా అన్నాడు: ‘ఇంతీ! నువ్వు చేసిన తప్పుడు పనివల్ల ఇట్టి అవస్థ చేకూరింది. దీనికై మనస్సులో బాధపడకు. మాధవుని పాదపద్మాలను ఎల్లప్పుడూ ఆరాధించు. నన్ను ఆనందంతో సేవించు.

తే. రమణి! నీ సుతులందు హిరణ్యకశిపు, వలన నుదయించు వారిలోపల ముకుంద పదసరోజాత విన్యస్తభావుఁడైన, తనయుఁ డుదయింపఁ గలఁ డతిధార్మికుండు.

485

తా॥ రమణీ! విను! నీ సుతులలో హిరణ్యకశిపుని వలన జన్మించబోయే సంతానంలో ముకుందుని యొక్క పాదపద్మాలను సేవించేవాడు, ధార్మికుడు అయిన కుమారుడు ఉదయిస్తాడు.

వ. మఱియును

486

క. ఘనపుణ్యుం డన్వయ పా, వనుఁడగు నప్పుణ్యతముని వరకీర్తి లతల్ వనజభవాండోదర మె, ల్లను నిండఁగఁ బర్వు బుధలలాముం డగుటన్.

487

తా॥ అంతేకాదు. గొప్పవైన పుణ్యకార్యాలను చేసినవాడు, వంశానికే కీర్తిలతలు

చేకూర్చేవాడు, మహా విద్వాంసుడు అయిన అతని కీర్తిప్రతిష్ఠలు ఈ జగత్తంతా వ్యాపిస్తాయి.

తే. వామలోచన! వినుము దుర్వర్ణ హేమ, మగ్ని పుటమునఁ బరిశుద్ధ మై వెలుంగు నట్లు,
దుష్టాత్మ సంభవుఁడయ్యు వంశ, పావనుం డగు హరిపాదభక్తుఁ డగుట.

488

తా॥ తండ్రి దుర్మార్గుడైనా అతను మాత్రం హరిభక్తుడు అవటంవలన; చెడ్డ బంగారం అగ్నిలో పరిశుద్ధమైనట్లు వంశపావనుడవుతాడు.

తే. అంచితాష్టాంగయోగ క్రియాకలాపు, లైన యోగీశ్వరులు నమ్మహానుభావు నతులశీల
స్వభావ విజ్ఞాన సరణిఁ, దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెపుడు.

489

తా॥ అష్టాంగ యోగులైన మహాయోగీశ్వరులు కూడా... ఆ మహానుభావుని శీలానికి, స్వభావానికి, జ్ఞానానికి మురిసిపోయి తాము కూడా ఆ మార్గంలోనే నడవాలనుకొంటారు.

ఉ. ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు, ల క్ష్మీ మహిళాధినాథుఁ
దులసీ దళదాముఁ బరేశు నాత్మ హృ త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్య
వస్తువుం దా మదిలో హసించు హరిదాస్య విహార వినిశ్చి తాత్ముఁడై.

490

తా॥ భగవద్భక్తులలో ఉత్తముడు, సుగుణములకు సముద్రునివంటివాడు, సహృదయుడు అయిన ఆ మహానుభావుడు తన మనస్సులో లక్ష్మీనాథుని, తులసీమాలాధరుని, ఆ ఈశ్వరుని ఆనందంతో ఎప్పుడూ నిలుపుకొని మిగిలిన వస్తువులను తన మనస్సులో ఇష్టపడడు.

వ. అట్టి నీ పౌత్రుండు.

491

సీ. మహిత దేహాద్యభిమానంబు దిగనాడి, చిరతరాలంపట శీలుఁ డగుచుఁ బరసమృద్ధికి నాత్మఁ బరితోష మందుచుఁ, బరదుఃఖమునుఁ దాపమును బొందు నీ విశ్వమంతయు నే విభుమయ మని, యెవ్వని కరుణచే నెఱుఁగనయ్యె నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోద, మడరంగఁ జూచు ననన్యదృష్టి

తే. నతినిదాఘోగ్ర సమయంబునందు నిఖిల, జంతు సంతాప మడఁగించు చంద్రుమాడ్కి నఖిలజగముల దుఃఖంబు లపనయించు, రూఢి నాతఁ డజాతవిరోధి యగుచు.

492

తా॥ అలాంటి నీ మనుమడు దేహాదులపై మమకారం లేనివాడై వైరాగ్యంతో ఉంటాడు. ఇతరులు ఆనందంగా ఉంటే తాను సంతోషపడుతూ పరుల దుఃఖానికి తానెంతో బాధపడుతూ ఉంటాడు. ఈ జగత్తంతా ఈశ్వర వైభవమే అని భావిస్తాడు. తనకు అట్టి భావనకలగడానికి పరమేశ్వరానుగ్రహమే కారణమని తలపోస్తాడు. అట్టి ఈశ్వరుణ్ణి ఎంతో మోదంతో, ఆత్మసాక్షిగా ఏకాగ్ర దృష్టితో వీక్షిస్తాడు. మండు వేసవిలో సమస్తమైన జంతువులకు సంతాపాన్ని పోగొట్టే చంద్రునిలా అఖిల లోకాలకు దుఃఖాన్ని పోగొడతాడు. అతడు అజాతవిరోధి.

వ. మఱియు హరిధ్యాన నిష్ఠాగరిష్ఠుం డగు నమ్మహాభాగవతాగ్రగణ్యుండు.

493

క. విమలాంతరంగ బహిరం, గములను స్వేచ్ఛానురూప కలితుండగు నా కమలాధీశ్వరు కుండల, రమణీయ ముఖంబుఁ జూచుఁ బ్రమదం బెసఁగన్.

494

తా॥ ఆ మహా భాగవత శ్రేష్ఠుడు నిరంతరము శ్రీహరి ధ్యానంలోనే ఉంటాడు. స్వచ్ఛమైన అంతరంగంలోగాని, బహిరంగంలోగాని లేక ఈ సృష్టి అంతటా స్వేచ్ఛగా సంచరించే ఆ కమలాధీశ్వరుడైన హరి యొక్క సౌందర్యోపేతమైన ముఖమండలాన్ని పరమానందంతో

చూస్తూంటాడు.

తే. మఱియు నీ విశ్వ మా హరిమయము గాఁగ, మనము లోపలఁ దలఁచు నమ్మనునిభుండు మను మహాత్ములలోన నీ మనుమఁడధికుఁ, డనఁగ నుతికెక్కు నంచుఁ గశ్యపుఁడు పలుక.

495

తా॥ మనువుతో సమానమైన ఆ విభుడు ఈ అనంతమైన విశ్వమంతా హరిమయమే అని తలుస్తాడు. మహాత్ములందరిలోను నీ మనుమడు అధికుడనే కీర్తిని పొందుతాడు...' అని కశ్యపుడు అన్నాడు.

క. విని తన తనయులు మధుసూ, దనుచే హతు లగుదు రనుచుఁ దన మనుమఁడు స జ్జననుత భాగవతుం డగు, ననుచు మదిం జాల దుఃఖహర్షము లొందవన్.

496

తా॥ అతని పలుకులు విన్న దితి తన తనయులు మధుసూదను చేత హతులవుతారన్న మాటకు ఎంతో దుఃఖించింది. తన మనుమడు సజ్జనుల చేత పొగడబడే పరమ భాగవతుడు అవుతాడని పరమానందాన్ని పొందింది.

వ. ఉండునంత నా దితియుఁ గశ్యపవీర్య సంభృతంబైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును నన్య తేజో విరామంబును దినదినప్రవర్ధమానంబును నై నివ్వటిల్ల నిజోదరస్థితులైన కుమారు లమరదమనులై వర్తింపఁగల రని చింతించుచు గర్భంబు శత వర్షంబులు ధరియించి యున్న యనంతరంబ.

497

తా॥ రోజులు గడుస్తున్నాయి. కశ్యప వీర్యంతో కూడిన దితీ దేవి యొక్క గర్భం దుర్భర

తేజోవిరాజమానంగా అన్య తేజస్సులను అతిశయిస్తూ దినదిన ప్రవర్ధమానమవుతూన్నది. తనకు కలగబోయే కుమారులు అమరులను అణగద్రొక్కుతారని చింతిస్తూ నూరు సంవత్సరాలు గర్భాన్ని ధరించింది.

ఉ. ఆ దితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ మన్య తే జో దమలీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం ఛాదిత పద్మబాంధవ నిశాకర దీప్తులు గల్గి సూచికా భేద మహోగ్ర సంతమస భీషణమైన భయాకులాత్ములై,

498

తా॥ ఆ దితీదేవి గర్భం నుండి పరమ రమణీయాకృతితో ఒక తేజస్సు వెలువడింది. అది అన్య తేజస్సులను అణచివేస్తూ భూమ్యాకాశాలను సైతం కప్పేసింది. సూర్యచంద్రులు కనిపించకుండా పోయారు. అందరూ భయకంపితులయ్యారు.

చ. అమరగణంబు లెల్లఁ గమలాసనుపాలికి నేఁగి తత్పదా బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియుంగఁ జేర్చి చి త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించిరో యమరకులాగ్రగణ్య! దురితార్ణవతారణ! సృష్టికారణా!

499

తా॥ అప్పుడు దేవతలందరు బ్రహ్మ దగ్గరికి వెళ్ళి ఆయన పాదకమలాలకు నమస్కరించి అంజలి బంధాన్ని నుదుటికి చేర్చి, చిత్తంలో భయము, వేగిరపాటుతనము అతిశయింపగా ఈ విధంగా ప్రార్థించారు: “అమరులందరకు అగ్రగణ్యుడైన వాడా! నువ్వు పాపమనే సముద్రాన్ని దాటడానికి వంతెనలాంటి వాడవు! ఈ సృష్టికి కారణభూతుడవు.

ఉ. నీవు చరాచర ప్రచయ నేతవు ధాతవు సర్వలోక పా లావళి మౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ! వా ణీవర! యీ యజాండమున నీవు నెఱుంగని యర్థ మున్నదే భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్.

తా॥ నువ్వు చరాచర ప్రపంచానికి అధినేతవు! రక్షించు వాడవు నువ్వే! లోకపాలకులందరిలోకి మొట్టమొదటి వాడివి! ఓ దేవదేవ! సరస్వతీనాథా! ఈ బ్రహ్మాండంలో నీకు తెలియని విషయం అంటూ ఉందా? నీ మనస్సులో ఒకసారి మా గురించి ఆలోచించు! ఈ విపత్తునుండి రక్షించు.

వ. దేవా! కార్యరూపంబగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండవైన నీచేత సమస్త భువనంబులును సృజియింపఁబడియె, నీవు సర్వ భూతాత్మభావవిదుండవు, లోకనాథశిఖామణి భూతుండవు, విజ్ఞానవీర్యుండ, వవిద్యంజేసి యిట్టి స్రష్టృ రూపంబు నొందితి, గృహీతరజోగుణుండవు, నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండు, సుపక్వయోగంబు నొంది నిష్కాములై ధ్యానంబున నిన్నరయుచు నిర్జితశ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసిన వారలకుం బరాభవంబు లెక్కడివి? ఎవ్వని వాగ్జాలంబులచేఁ బాశబద్ధంబులైన పశువుల చందంబున నిఖిల జీవులు వర్తింతు రట్టి నీకు నమస్కరించెద మహోరాత్ర విభాగాభావంబున లుప్తకర్మంబులగు లోకంబులకు సేమంబు గావింపుము, శరణాగతులమైన మమ్ము నతిశయకరుణారస పరిపూర్ణంబులగు కటాక్షంబుల వీక్షించి రక్షింపుము. కశ్యపు వీర్యంబు దితి గర్భంబుననుండి సకల దిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్ని చందంబున లీనంబై ప్రవృద్ధం బగుచున్న" దని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె.

501

తా॥ ఓ దేవాదిదేవా! కదిలేవి–కదలనివి అనే వాటితో కార్యరూపంలో ఉన్న ఈ సమస్తమైన సృష్టికి కారణమైన వాడవు నువ్వే! నీ చేతనే భువనాలన్నీ సృజియింప బడ్డాయి. నువ్వు సర్వజీవుల ఆత్మభావము తెలిసిన వాడివి! లోకనాథులలో శిఖామణివి! విజ్ఞానమే నీ స్వరూపం! మాయారూపంతో ఈ సృష్టి చేస్తున్నావు. రజోగుణాన్ని స్వీకరించి ఈ సృష్టినంతా

లీనం చేసుకున్నావు. యోగంలో పండిపోయి నిష్కాములైన యోగులు నిరంతరము నిన్ను ధ్యానిస్తారు. శ్వాసను వారించి, ఇంద్రియములను జయించిన ఆత్మలతో ప్రకాశించుచు, నీ అనుగ్రహం పొందినవారికి పరాభవం కలుగనే కలుగదు. త్రాడుచే కట్టబడిన పశువులవలె ఎవని మాటకు బద్ధులై లోకంలోని జీవులందరు నడచుకుంటారో అట్టి నీకు నమస్కారం.

లోకంలో పగలు–రాత్రి భేదం లేకుండా పోయింది. కర్మలు లోపించాయి. ఈ లోకాలకు క్షేమాన్ని కలుగచెయ్యి. నీ రక్షణకోరి వచ్చిన మమ్ము నీ పరిపూర్ణ కరుణా కటాక్ష వీక్షణాలు ప్రసరింపచేసి కాపాడు. కశ్యపుని వీర్యం దితి గర్భంలో ఉండి అన్ని దిక్కులను ఆక్రమించి దారువులో అగ్ని విధంగా వృద్ధి చెందుతున్నది". అలా విన్నవించిన దేవతా సమూహానికి ఆనందం కలిగేటట్లు బ్రహ్మ ఇలా అన్నాడు:

## సనక సనందనాదులు వైకుంఠమునకు పోవుట

క. గీర్వాణులార! యుష్మ, త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర న్నిర్వాణులు సనకాదులు, సర్వంకష శేముషీ విచక్షణు లెందున్.

502

తా॥ "ఓ గీర్వాణులారా! సనక సనందనాదులు మీకంటే ముందు జన్మించిన వారు. వారు నాకు మానస పుత్రులు, పుణ్యులు, నడచి వస్తూన్న నిర్వాణం వంటివారు, అన్నిటిలోను బుద్ధివైభవం కలవారు.

క. వారలు నిస్స్పృహు లగుచు న, వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్ ధీరు లొకనాఁడు భక్తిన్, శ్రీరమణీశ్వర పదాబ్జసేవా నిరతిన్.

503

తా॥ అట్టి ధీరులగువారు, మనస్సులో ఎలాంటి కోరికలు లేనివారై, అడ్డులేకుండా భువనాలన్ని తిరుగుతూ శ్రీహరిని కొలవాలనే ఉద్దేశ్యంతో బయలు దేరారు.

చ. చని చని కాంచి రంత బుధసత్తము లంచిత నిత్య దివ్య శో భన విభవాభి రామముఁ బ్రపన్నజన స్తవనీయ నామమున్ జననవిరామమున్ సుజన సన్నుత భూమము భక్తలోక పా లన గుణధామముం బురలలామముఁ జారువికుంఠ ధామమున్.

504

తా॥ ఆ బుధ సత్తములు వెళ్ళి వెళ్ళి అందాలు కురుస్తూన్న వైకుంఠాన్ని చూసారు. ఆ నగరం దివ్యమైన శోభతో, వైభవంతో వెలిగిపోతూన్నది. శరణాగతి చేసిన వారికి పొగడతగి ఉంది. అక్కడ సేవించిన వారికి తిరిగి పుట్టుక లేదు. ఆ నగరం సుజనులు సన్నుతించేటట్లుగాను, భక్తజనులను పాలించేటట్లుగాను ఒప్పుతూన్నది.

ఉ. ఆ మహనీయ పట్టణమునందు వసించెడివార లాత్మ ని ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై శ్రీమహిళాధిపాంఘ్రి సరసీరుహపూజ లొనర్చుచున్ మహో ద్దామ తదీయరూపములఁ దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్.

505

తా॥ ఆ మహనీయమైన పట్టణంలో వసిస్తూన్న వాళ్ళందరు ముముక్షత్వాన్ని కోరి ఏ పని చేసినా నిష్కామంగానే చేస్తారు. ఎప్పుడూ... శ్రీ మహావిష్ణువు పాదపద్మాలనే సేవిస్తూ నారాయణస్వరూపులై అందరు నిత్య సంతోషులై ఉంటారు.

చ. విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధ స త్త్వ గుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతుఁ డనంతశక్తియున్ నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చల నిర్మల ధర్మమూర్తియు న్నగు హరిపేరఁ బెంపెసఁగు నన్నగరోపవనమ్ము లిమ్ములన్.

506

తా॥ ఆ శ్రీహరి త్రిగుణాతీతుడు. గొప్ప కీర్తికలవాడు. పరిశుద్ధమైన సత్త్వగుణం కలవాడు. పుట్టుకలేనివాడు, అనాది, భగవంతుడు, అనంతుడు, అనంత శక్తిసంపన్నుడు, వేదములచేత మాత్రమే తెలుసుకొన తగినవాడు, నిశ్చలుడు, నిర్మలుడు, ధర్మం రూపుదాల్చిన వాడూను. ఆ నగరంలోని ఉపవనములన్నీ అటువంటి మహానుభావుని పేర వెలుగొందుతూ ఉంటాయి.

వ. మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు "నైశ్రేయస" నామంబున నభిరామంబై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ నీరిక లెత్తిన కోరికలు సారికలు గొన నొసంగుచు నితర తరురహితంబులును గామదోహన సహితంబులును బుష్పఫల భరితంబులునునై తనర్చు సంతానవన సంతానంబులును, సమంచిత వసంత సమయ సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికాకుసుమ విసర పరిమళ మిళిత గళిత మకరంద లలితామోద ముదిత

హృదయులై, యఖండతేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గడింపలేక ఖండితజ్ఞాను లయ్యును నిరతిశయ విషయసుఖానుభవ కారణం బగుట నిందిరాసుందరీరమణ చరణ సేవా విరమణ కారియై యున్నదని తలంచి తద్గంధ ప్రాపక గంధవహునిం దిరస్కరించి నారాయణ భజనపరాయణులై చరియించు సుందరీ యుక్తులైన వైమానికులును, వైమానిక మానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగ కోలాహల విరామంబుగా నరవిందనయన కథాగానంబు లనూనంబులుగా మొరయ మదవ దిందిందిర సందోహకలిత పుష్పవల్లీ మతల్లికలును, నకుంఠిత చరిత్రుండైన వికుంఠ నిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీదామంబుం గనుంగొని యీ తులసీదామంబు హరి మంగళ గళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు వడయుట కేమి తపంబు గావించెనోయని బహూకరించు చందంబున నొప్పు చందన మందార కుందారవింద పున్నాగ నాగ వకుళాశోక కురవకోత్పల పారిజాతాది ప్రసూనమంజరులును, మంజరీ పుంజ రంజిత నికుంజంబులయందు నుత్తుంగ పీన కుచ భారాకంపిత మధ్యంబులుఁ గటితట ఘటిత కనక మేఖలా కలాప నినదోపలాలిత నీల దుకూల శోభిత పృథు నితంబ భరాలసయాన హసిత కలహంస మయూర గమనంబులు, నసమశర కుసుమశర విలసితంబు నపహసించు నయన కమలంబులుం గలిగిన సుందరీ సందోహంబులం దగిలి కందర్ప కేళీ విహారంబుల నానందంబు నొందక ముకుంద చరణారవింద సేవాపరిలబ్ధ మరకత వైదూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్యప్రదేశంబులును, నిందిరాసుందరి త్రైలోక్య సౌందర్యఖని యైన మనోహరమూర్తి ధరియించి రమణీయ రణిత మణి నూపుర చరణారవిందయై నిజహృదయేశ్వరుండైన సర్వేశ్వరుని మందిరంబునం జాంచల్య దోష రాహిత్యంబుగ వర్తింపం గరకమల భ్రమణీకృత లీలాంబుజాతయై తన నీడ కాంచన స్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతన సమ్మార్జన కైంకర్యంబు పరమధర్మం బని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరు సౌరభాభిరామంబు లగు తులసీదళ దామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్చించుచు నొసలి

మృగమదపు టసలున మసలుకొని తుంపెసలాడు కురులును, లలిత తిలప్రసూన రుచిరాభ నాసం దనరు మోముఁదామర విమల సలిలంబులఁ బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం జుంబితం బగుటగాఁ దలంచి లజ్జావనతవదన యై యుండంజేయు ప్రవాళ లతికాకులంబులైన కూలంబులు గల నడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును, ధర్మంబునకు నిర్మల స్థానంబును, సుకృతమూలంబునకు నాలవాలంబును నయి పొలుపొందుచుండు.

507

తా॥ ఆ ఉద్యానవనం కైవల్యమే మూర్తీభవించిందా అన్నట్లుంటుంది. ఆ వనం “నైశ్రేయసం” అనే పేరుతో ఎప్పుడూ మనోజ్ఞంగా ఉంటుంది. ఆ వనం నిండా ఎన్నెన్నో కల్పవృక్షాలు పెరిగి పూలతో, పండ్లతో నిండి ఉంటాయి. అవి అన్ని వేళలందు అన్ని ఋతువుల వైభవంతో శోభిల్లుతూ, అర్థిజనుల మనస్సులలో అంకురించిన కోరికలను కొరత లేకుండా తీరుస్తుంటాయి. వసంత ఋతువులో కోకొల్లలుగా విరబూచిన మల్లెపూవుల సుగంధంతో కూడిన మకరంద బిందువులను అందలి మందమారుతాలు నలుమూలలా వెదజల్లుతూ ఉంటాయి. తమ తమ రమణీమణులతో కలసి విమానాలలో విహరించే గంధర్వులు అటువంటి కమ్మని పూలతేనెల సొనలకు సంతోషిత స్వాంతులై మైమరచి మహానుభావుడైన విష్ణుదేవుని కథలు చెప్పుకోవటం మరచిపోతూ ఉంటారు. అంతలో వారు ఆ అజ్ఞానం నుండి తేరుకొని విచ్చలవిడిగా విషయ వాసనలను రెచ్చగొట్టే ఈ సువాసనలు రమారమణుని చరణ కమలారాధనకు బాధకాలని భావించి ఆ కమ్మ తెమ్మెరలను త్రోసిరాజని శ్రీమన్నారాయణ సేవాపరాయణులై సంచరిస్తూ ఉంటారు.

ఆ వైమానికుల అంతరంగాలలో ఆనందం పొంగి పొరలేటట్లు ధ్వనులు చేస్తున్న పావురాళ్ళూ, హంసలు, బెగ్గురులు, చిలుకలు, కోకిలలు, వానకోయిలలు, తీతువు పిట్టలు, నెమళ్ళు, చక్రవాకాలు మొదలైన పక్షుల కోలాహలాన్ని మించి కమలాక్షుని కథాగానాలు

అఖండంగా జరుపుతున్నట్లున్న గండు తుమ్మెద గుంపులతో నిండిన మేలిజాతి పుష్పలతలు కనువిందు చేస్తుంటాయి.

వందనీయ చరిత్రుడైన వైకుంఠథాముని కంఠంలో వనమాలికగా వెలసి విలసిల్లడానికి ఈ తులసి ఎంతటి తపస్సు చేసిందో అని ఆనందంతో అభినందిస్తున్నట్లు మంచిగంధపు చెట్లు, మందారాలు, మల్లెలు, కమలాలు, సురపొన్నలు, పొన్నలు, పొగడలు, అశోకాలు, గోరంటలు, కలువలు, పారిజాతాలు గుత్తులు గుత్తులుగా పూచి తులసీ వనాలపై సుగంధాలు విరజిమ్ముతుంటాయి.

ఒత్తుగా పూచిన పూలగుత్తుల నెత్తావులు గుమాయించే పొదరిండ్లున్నాయి. ఆ పొదరిండ్లలో ఎత్తైన స్తనకుంభాల భారానికి నకనకలాడు సన్నని నెన్నడుములు గల కొందరు సుందరీమణులు విహరిస్తుంటారు. ఆ లతాంగులు నీలిరంగు పట్టుచీరలు కట్టుకొని బంగారు గజ్జెల ఒడ్డాణాలు సింగారించుకొని ఉంటారు. ఆ మందయానల ఒయ్యారపు నడకల సొగసులు హంసలను, మయూరాలను ఎగతాళి చేస్తున్నట్లుంటాయి. ఆ అన్నుల మిన్నల వాల్గన్నులు అసమ శరుని కుసుమ శరాలను పరిహసిస్తుంటాయి. అటువంటి అందాలరాసుల సౌందర్యానికి లోనుగాక వారితో శృంగారక్రీడా విలాసాలను ఆశించక హరిభక్తులు గోవింద చరణారవింద సంసేవనం వల్ల సంప్రాప్తించిన నవరత్నాలు చెక్కిన చక్కని బంగారు విమానాలు ఎక్కి ఆయా పుణ్య ప్రదేశాలలో తిరుగుతుంటారు.

అందాలదీవి అయిన లక్ష్మీదేవి ముల్లోకాల సౌందర్యం మూర్తీభవించినట్లు మణులు చెక్కిన కాలి అందెలు ఘల్లుఘల్లున మ్రోగుతుండగా తన హృదయ నాథుడైన వైకుంఠనాథుని మందిరంలో చంచలత్వం మాని సంచరిస్తుంటుంది. ఆ ఇందిరాసుందరి తన కరకమలంలోని లీలాకమలాన్ని త్రిప్పుతుండగా ఆమె నీడ ఆ మేడలోని బంగారు పాలరాతి గోడలపై ప్రతిఫలిస్తుంది. అప్పుడు అది ముకుంద మందిర సమ్మార్జనమే పరమ ధర్మమని ప్రకటిస్తున్నట్లుంటుంది. లక్ష్మీదేవి తన వనంలోని పరిమళాలు వెదజల్లే తులసీ దళాలను

దండలుకట్టి తన హృదయేశ్వరుని పదకమలాలపై అర్పించుతూ ఉంటుంది. ఆ సమయంలో శ్రమబిందువుల వల్ల నుదుటనున్న కస్తూరీ తిలకం కరిగి అంటుకుని కదులుతున్న ముంగురులతో, నువ్వు పువ్వు చక్కదనాల ముక్కుతో ముద్దులు మూటగట్టే ఆమె ముఖపద్మం అచ్చటి కోనేటినీటిలో ప్రతిబింబిస్తుంది. అప్పుడు ఆమె నీలమేఘశ్యాముడైన పరంధాముడు తన ముఖాన్ని ముద్దాడుతున్నట్లు భ్రమించి, సిగ్గుతో తలవంచుకొంటుంది. అటువంటి దిగుడు బావుల చుట్టూ గట్టులపైన పగడాల తీవలు అల్లుకొని ఉంటాయి. ఈ విధంగా హృద్యాతిహృద్యమైన ఆ ఉద్యానవనం పుణ్యానికి ఆస్థానమై, ధర్మానికి సంస్థానమై, సుకృతాలకు మూలస్థానమై వెలుగొందుతూ ఉంటుంది.

చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృత చిత్తులుఁ బాపవర్తులున్ నిరయనిపాత హేతువును నింద్య చరిత్రము నైన దుష్కథా నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరా మనో హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్.

508

తా॥ శ్రీమహావిష్ణువంటే గిట్టనివారు, అన్యవిషయములంటే ఆసక్తికలవారు, ఎప్పుడూ చెడ్డపనులు చేసేవారు, దుర్గతికి పోయే అతినింద్యమైన కథలందు మిక్కిలి ఇష్టంతో అలా నడచుకొనే వారు... ఇందిరా మనోహర చరణారవింద భజనాత్మకులుండే ఆ దివ్య ప్రదేశాన్ని ప్రవేశించలేరు.

వ. వెండియు.

509

చ. హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వ ధీ పరిణతిసాధనం బగు స్వభావముఁ దాల్చినయట్టి మర్త్యు లా సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి పం క రుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్.

510

తా॥ కేశవుడు, అనంతుడు, పరమేశ్వరుడు అయిన ఆ శ్రీహరిని భజించడానికి ప్రధాన సాధనం నిశ్చలమైన భక్తి ఒక్కటే! అసలు ధర్మతత్త్వం ఏమిటో తెలుసుకుందాం అనే బుద్ధి చాతుర్యంగల మానవులు ఆయన యొక్క మాయలో పడి మరింత మోహితులై ఆయన పాదపంకేరుహములను కొలిచేపద్ధతి తెలుసుకోలేక ఆ వైకుంఠ ధామాన్ని చేరుకోలేక పోతున్నారు.

చ. మఱియు సరోరుహోదరుని మంగళ దివ్యకథానులాప ని ర్భర పరితోష బాష్ప కణ బంధుర చారు కపోల గద్గద స్వర పులకీకృతాంగు లగువారలు నిస్పృహచిత్తు లత్యహం కరణవిదూరు లుందురు సుకర్మల యుండెడి పుణ్యభూములన్.

511

తా॥ ఆ శ్రీహరి యొక్క మంగళకరమైన దివ్యకథలను అనేకసార్లు కీర్తించడం వల్ల కలిగిన సంతోషంతో కంటనీరు చెక్కిళ్ళపై నుండి జారగా గద్గద స్వరంతో శరీరం పులకరించినవారు; వైరాగ్యంతో ఉన్నవారు, అహంకరణ లేనివారు... పుణ్యాత్ములకు స్థానమైన ఆ పుణ్యభూములలో ఉంటారు.

వ. అందు.

512

మ. వరవైకుంఠము సారసాకరము, దివ్యస్వర్ణశాలాంక గో పుర హర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు, దన్మందిరాం తర విభ్రాజిత భోగి కర్ణిక, తదుద్యద్భోగ పర్యంకమం దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్.

513

తా॥ శ్రేష్ఠమైన ఆ వైకుంఠమే ఒక జలజాకరం. దివ్యమైన బంగారు మంటపాలతో, గోపురాలతో, సౌధములతో నిండిన ఆ భవనమే ఒక దివ్యమైన పద్మం. ఆ మందిరాంతరంలో

ప్రకాశించే ఆదిశేషుడే తామరదుద్దు. శేషుడే తల్పంగా శయనిస్తూన్న మాధవుడే తుమ్మెద.

వ. అంత.

514

మ. హరిచేఁ బాలితమైన కాంచనవిమానారూఢ మైనట్టి స త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణ ప్రభావోన్నతిం గర మొప్పారు తదీయ ధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతులై చెచ్చెరన్.

515

వ. డాయంజని.

516

తా॥ ఈ విధంగా శ్రీహరిచే పాలింపబడినది, కాంచన విమానాన్నెక్కి సంచరించే సత్పురుషులచే నిండినది, వైభవంతో కూడిన ప్రభావంతో ఒప్పారేది అయిన ఆ వైకుంఠ ధామాన్ని; జగత్తుకు కళ్యాణ స్వరూపులైన సనక సనందనాదులు సంతోష స్వాంతులై యోగశక్తితో వేగంగా సమీపించారు.

చ. మరకతరత్న తోరణ సమంచిత కుడ్య కవాట దేహళీ విరచిత షట్సుకక్ష్య లరవిందదళాక్ష విలోకనోత్సవా దరమతి నన్యముం గనక దాఁటి యనంతరకక్ష్య యందు ని ద్దఱను దదీయపాలుర నుదార సమాన వయో విశేషులన్.

517

తా॥ అరవిందదళాక్షుని చూడాలనే ఉత్సుకతతో ఇతరములైన వాటిని వేటిని చూడకుండ... మరకతరత్న తోరణాలతో కూడిన గోడలతో తలుపులతో, గడపలతో కూడిన ఆరు మహాద్వారాలను దాటి ఏడవ ద్వారం దగ్గరకు వచ్చారు. అలా వచ్చి సమాన వయస్సుగల ఇద్దరు ద్వారపాలకులను చూచారు.

సీ. కాంచన నవరత్న కటకాంగుళీయక, హార కేయూర మంజీర ధరులఁ గమనీయ సౌరభాగత మత్త మధుకర, కలిత సద్వనమాలికా విరాజి తోరస్థ్సలుల గదాయుతులను ఘనచతు, ర్బాహుల నున్నతోత్సాహమతుల నారూఢ రోషానలారుణితాక్షుల, భ్రూలతా కౌటిల్య ఫాలతలుల

తే. వేత్రదండాభిరాముల వెలయు నమ్ము, కుంద శుద్ధాంత మందిరాళింద భూమి నున్న యిద్దఱ సనకాది యోగివరులు, సూచుచును వృద్ధులయ్యు నా సుభగమతులు.

518

క. ధీరతఁ బంచాబ్దముల కు, మారకులై కానఁబడుచు మనమున శంకం గూరక చతురాత్మకు లని, వారిత గమనమున డాయ వచ్చిన నెదురన్.

519

తా॥ వారిద్దరు నవరత్నాలు పొదిగిన హేమ కంకణాలు, ఉంగరాలు, హారములు, భుజకీర్తులు, కాలి అందెలతో ఒప్పుతూ ఉన్నారు. మేలైన సువాసనలకు వచ్చిన గండు తుమ్మెదలతో కూడిన విరిదండలను ధరించి ఉన్నారు. గదలను ధరించి, ఘనమైన నాలుగు చేతులతో ఉత్సాహంతో ఉన్నారు. వాళ్ళ కన్నులు కోపాగ్నిచే ఎర్రబడి ఉన్నాయి. ఫాలభాగాలు ముడివడిన కనుబొమ్మలతో వంకరలు తిరిగి ఉన్నాయి. చేతులలో పేము బెత్తాలు ధరించి గోవిందుని ఏకాంత మందిరం ముందు నిలబడి ఉన్నారు. మనోహరులైన సనక సనందనాదులు వృద్ధులైనా అయిదు సంవత్సరాల వయస్సుగల బాలురవలె కనబడుతూ మనస్సులో ఏ విధమైన శంక లేకుండ ఎవరూ అడ్డుపెట్టడానికి వీలులేకుండా ఆ ద్వారపాలకుల సామీప్యానికి వచ్చారు.

క. శ్రీలలనేశ్వర దర్శన, లాలసులై యేఁగు బుధలలాముల నతి దు శ్శీలతఁ దద్వచనప్రతి, కూలమతిం బోవకుండఁ గుటిలాత్మకులై.

520

తా॥ శ్రీమహావిష్ణువును దర్శించాలనే కుతూహలంతో లోపలికి వెళుతూన్న విద్వాంసులైన సనకసనందనాదులను, దుష్టస్వభావులైన ఆ ద్వారపాలకులిద్దరు కుటిల స్వభావంతో అడ్డుకున్నారు.

క. వారించిన వారలు బృం, దారకు లీక్షించుచుండ దారుణపటు రో షారుణితాంబకులై రొద, వారించుచు వారు నచటివారును వినఁగన్.

521

వ. ఇట్లనిరి.

522

తా॥ అడ్డుకునేటప్పటికి దారుణమైన కోపంతో వారి కన్నులు ఎర్రబడ్డాయి. బృందారకులందరు చూస్తూ ఉండగా ఆ రొదను వారిస్తూ అక్కడి వారందరూ వింటూండగా సనకాదులిలా అన్నారు:

## జయవిజయులకు సనక సనందనాదులు శాపమిచ్చుట

చ. పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిం దరుదేర నిచ్చలున్ భరిత ముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయ త త్పరమతి మాకు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే?

523

తా॥ 'పరుడు, అనంతుడు, భక్తజన పరిపాలుడు, సుహృత్తముడు, ఇష్టుడు, సర్వేశ్వరుడు అయిన లక్ష్మీనాథుని సందర్శించటం కోసం మేం ఎప్పుడూ ఇక్కడకు వస్తూనే ఉంటాము. ఆనందదాయక అంతరంగాలతో కొలుస్తూనే ఉంటాము. అట్టి మమ్ము అడ్డుకున్న ఈ దురాత్ములను మీరందరూ చూసారు గదా!'

వ. అని మఱియు సనకసనందనాదు లిట్లనిరి, మీ మనంబుల స్వామిహితార్థంబై నిష్కపటవర్తనుల మైన మాబోఁటులఁ గుహక వృత్తిగల యితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ, గొందఱ వారించుటయు దౌవారికస్వభావంబని వారింప దలంచితిరేనిఁ బ్రశాంత దివ్యమంగళ విగ్రహుండును, గతవిగ్రహుండును, భగవంతుండును, విశ్వగర్భుండును నైన యీశ్వరుండు ప్రాప్యంబును, ప్రాపకంబును, బ్రాప్తియు నను భేదశూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేక యేకంబై తోఁచు చందంబున విద్వాంసులగు వా రమ్మహాత్ముని సకలాత్మభేదరహితునింగాఁ బొడగందుఁ రదియునుంగాక లోకంబు నందు రాజులు సాపరాధులైన కింకర జనంబుల నాజ్ఞాపించుచందంబున నీశ్వరుండు దండించునో యను భయంబునంజేసి వారించితి మని తలంచితిరేని భూసుర వేషధారులమైన మాకును వైకుంఠనాయకుఁడైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంక సేయం బనిలేదు. ఇట్లగుట యెఱింగి మందబుద్ధులరై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపార్హు లగుదురు గావున

భూలోకంబునం గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం బుట్టుండని పలికిన.

524

తా॥ అని ఇంకా సనకసనందనాదులు ఇట్లా అన్నారు: "మోసం చెయ్యటమే వృత్తిగాగల ఇతర జనాలు భగవంతుని మందిరంలోకి ప్రవేశిస్తారేమో అనే అనుమానంతో కొందరిని ప్రవేశపెడతాం, కొందరిని అడ్డుకుంటాం... అని అంటారేమో మీరు. కపటంలేని స్వభావం గల మమ్ములను అడ్డుకోవటం మీకు తగని పని. ఈశ్వరుడు దివ్యమంగళ విగ్రహుడు. విద్వాంసులు ఆ మహాత్ముణ్ణి సకల జీవులయందు కల ఆత్మస్వరూపునిగా భావిస్తారు. ఈ చరాచర ప్రపంచమంతా ఆయన గర్భంలోనే ఉంది. ఆయనకు అనుభవించినది, అనుభవిస్తూన్నది, అనుభవింపబోవునది అనే భేదం లేదు. ఘటాకాశం, పటాకాశం ఈ రెండూ మహాకాశం లోనివే. అందువల్ల తెలిసిన వారు పరమాత్మ ఆత్మరూపుడై అందరిలోను ఉంటున్నాడు అని అంటారు. కనుక మీరు చేసిన పని మర్చిది కాదు.

లోకంలో ప్రభువులు అపరాధం చేసిన జనాలను శిక్షించే విధంగా ఈశ్వరుడు శిక్షిస్తాడనే భయంతో వారించామని మీరు అనేటట్లైతే అదీ దోషమే! భూసురులమైన మాకు, వైకుంఠ నాయకుడైన సర్వేశ్వరునికి భేదం లేదు. ఈ విషయాలు తెలిసి కూడా మందబుద్ధులైన కారణంగా మమ్ములను అడ్డగించారు. అనుచితమైన పని చేసిన మీరు శాపార్హులే! కనుక కామక్రోధ లోభములనే శత్రువులు బాధిస్తుంటే భూలోకంలో జన్మించండి.

క. వారలు విని తమ మనముల, భూరిస్ఫుట చండకాండపూగంబులచే వారింపరాని భూసుర, దారుణవాక్యముల కులికి తల్లడపడుచున్.

525

తా॥ వాళ్ళీ మాటలు విని తమ మనస్సుల్లో నిశితమైన శరపరంపరల చేతకూడా అడ్డుకోలేని ఆ బ్రాహ్మణుల దారుణ శాపవాక్యాలకు తల్లడిల్లిపోయారు.

క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనుని భటులు సనకాది మునీ శ్వరుల పదాంబుజములకుం, గర మర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలులై.

526

వ. ఇట్టనిరి.

527

తా॥ తల్లడిల్లి, మనస్సులో ఎంతో కుమిలిపోతూ ఆ శ్రీహరి యొక్క భక్తులు; సనకాది మునీశ్వరుల పాదసరోజాలకు ఎంతో భక్తితో మ్రొక్కి ఫాలభాగాన చేతులు జోడించి వారితో ఇట్లా మనవి చేసుకున్నారు:

మ. వరయోగీశ్వరులార! మమ్ము మది నొవ్వన్ మీరలిట్లన్న ని ష్ఠుర వాక్యంబుల కింక మా మనములన్ శోకింపఁగా రాదు, స త్పురుషశ్రేణిఁ బరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా దురితం బింతకుఁ దెచ్చె, మీఁద శుభముం దూకొందు మేమారయన్.

528

తా॥ "శ్రేష్ఠమైన యోగిపుంగవులారా! మమ్ములను మనస్సులో చాలా బాధ పడేటట్లు దారుణమైన శాపమిచ్చారు... మీరు. దానికి మేము చింతించటం లేదు. మీలాంటి సత్పురుషులను పరాభవించిన మా జన్మలు వృథా! మేం చేసుకున్న పాపమే మాకీ చేటు తెచ్చింది. కనీసం ఈ పైన అన్ని శుభాలను పొందుతాము.

వ. అది యెట్లంటిరేని.

529

ఉ. మీ కరుణావలోకన సమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్ దూఁకొనెనేని మా చనవుఁ ద్రోయక యీఁదగు లోభమోహముల్ గైకొని పుట్టు చోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం బై కొనకుండ దానవె శుభంబగు మీఁది మదీయజన్మముల్

తా॥ అది ఏ విధంగా అంటారా? మీ దయామృత వీక్షణాలతో మమ్ములను అనుగ్రహించండి! మా ప్రార్థనను త్రోసిపుచ్చక మా కోరిక తీర్చండి! మేము లోభమోహములు చేకొని పుట్టిన చోట శ్రీహరి నామం మరచిపోకుండ ఉండేటట్లు అనుగ్రహిస్తే... దానివల్ల ఉత్తర జన్మల్లో అన్నీ శుభాలు కలుగుతాయి.”

వ. అను సమయంబున.

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి పద్మాలయా సరసాలాపవినోద సౌఖ్యరచనల్ సాలించి శుద్ధాంత మం దిరమాణిక్య సుదేహళుల్ గడచి యేతెంచెం బ్రపన్నార్తి సం హరుఁడై నిత్యవిభూతి శోభనకరుండై మానితాకారుఁడై.

532

తా॥ జయవిజయులు ఇట్లా అంటున్న వేళ సర్వేశుడు, అనంతుడు అయిన హరి లోపలనుంచి ఆ కలకలం విన్నాడు. వెంటనే ఇందిరాదేవితోడి సరససల్లాపాలు, నవ్వుపుట్టించే మాటలు, ఏకాంత కలాపాలు చాలించి అంతఃపుర మందిర మాణిక్యద్వారాలు దాటి ఇవతలికి వచ్చాడు. ప్రపన్నుల యొక్క ఆర్తిని పోగొట్టేవాడు, శాశ్వతమైన ఐశ్వర్యమునిచ్చే మంగళకరుడు అయిన హరి అందరూ జయ జయ ధ్వానాలు చేస్తూండగా దర్శనమిచ్చాడు.

వ. మఱియును.

533

చ. శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడ రా మనో హరనిజలీలమైఁ బరమహంస మునీశ్వరవంద్య పాద పం క రుహములన్ వినూత్న మణికాంచన నూపుర మంజుఘోషముల్ వరుసఁ జెలంగ నార్యజన వంద్యుఁడు యోగిజనైక సేవ్యుఁడై,

534

తా॥ అంతే కాకుండా శ్రీమహాలక్ష్మి కూడా ఎంతో సంభ్రమంతో ఆయన వెనుకనే వచ్చింది. పరమహంసలు, మునీశ్వరులు సైతం నిత్యము నమస్కరించే పాదపంకేరుహములకు అలంకారంగా ధరించిన రత్నఖచితములైన బంగారపు అందెలు పరమ రమణీయమైన చిన్న శబ్దం చేస్తూండగా; పూజనీయులు నమస్కరిస్తుండగా, యోగిజనులు సేవిస్తుండగా పరమేశ్వరుడైన ఆ హరి దర్శనమిచ్చాడు.

చ. కర మణి హేమ కంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న చ్చర లిడు హంసపక్ష సిత చామర గంధవహోచ్చలత్సుధా కర రుచిరాతపత్ర సుభగప్రవిలంబిత హారవల్లరీ సరస గళత్తుషార కణజాల విరాజిత మంగళాంగుఁడై.

535

తా॥ ఇంకా ఎలా ఉన్నాడు... చేతులకు అలంకరించుకున్న కాంచన కంకణాలు గల్లుగల్లున ధ్వనిస్తూండగా, అచ్చరలు అంచ రెక్కలవంటి తెల్లని వింజామరలతో విసురుతున్నారు. ఆ చామరముల గాలికి పూర్ణచంద్రునిలా అందాలు చిమ్మే శ్వేతఛత్రపు అంచుల చుట్టూ వ్రేలాడుతున్న మంచి ముత్యాల జాలర్లు కదలుతున్నాయి. ఆ ముత్యాల హారాల మీద నుంచి మెల్లగా జారిపడుతున్న తుషార కణజాలం ఆ శ్రీమహావిష్ణువు విగ్రహం మీద నయనానందకరంగా ఉన్నాయి.

వ. మఱియును.

536

సీ. నిఖిల మునీంద్ర వర్ణిత సస్మితప్ర స, న్నాననాంబుజముచే నలరువాఁడు విశ్రుత స్నేహార్ద్ర వీక్షణ నిజ భక్త, జన గుహాశయుఁ డనఁ దనరువాఁడు మానిత శ్యామాయమాన వక్షమున నం, చిత వైజయంతి రాజిల్లువాఁడు నతజనావన కృపామృత తరంగితములై, భాసిల్లు లోచనాబ్జములవాఁడు

తే. నఖీల యోగీంద్ర జన సేవ్యు డైనవాఁడు, సాధుజనముల రక్షింపఁజాలువాఁడు భువనచూడా విభూషణ భూరిమహిమ, మించు వైకుంఠపురము భూషించువాఁడు.

537

తా॥ ఆయన మునీశ్వరులందరు వర్ణించే ప్రసన్నమైన నవ్వుముఖంతో అలరారేవాడు. స్నేహంచేత ఆర్ద్రమైన చూపులతో తన భక్తుల హృదయ కుహరాలలో ఉండేవాడు. అందరు మన్నింప తగిన నల్లని వక్షస్థలం మీద ఒప్పైన వైజయంతితో విరాజిల్లేవాడు. తనకు మ్రొక్కిన జనులను పాలించుటలో కృపామృత తరంగాలు ప్రకాశించే పద్మములవంటి కన్నులు గలవాడు. అఖీల యోగీంద్రులు సేవింప తగినవాడు, సాధువులను రక్షించే వాడు, సమస్తమైన భువనాలకు అలంకారమైన వైకుంఠపురానికి అలంకారమైన వాడున్ను.

సీ. కటివిరాజిత పీతకౌశేయ శాటితో, వితత కాంచీ గుణద్యుతి నటింప నాలంబికంఠహారావళి ప్రభలతోఁ, గౌస్తుభరోచులు గ్రందుకొనఁగ నిజకాంతి జిత తటిద్ద్విజ కర్ణ కుండల, రుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ మహనీయ నవరత్నమయ కిరీట ప్రభా, నిచయంబు దిక్కుల నిండఁ బర్వ

తే. వైనతేయాంస విన్యస్త వామహస్త, కలిత కేయూర వలయ కంకణము లొప్ప నన్య కరతల భ్రమణీకృతానుమోద, సుందరాకార లీలారవింద మమర.

538

తా॥ ఆయన నడుముకు చుట్టుకున్న పట్టు పీతాంబరంపై బంగారు మొలనూలు కాంతులు చిమ్ముతున్నది. వ్రేలాడుతున్న రత్నహారాల కాంతులు కంఠమునందున్న కౌస్తుభ మణికాంతులతో కలసి సందడి చేస్తున్నాయి. మెరుపు తీగల కాంతులను జయించిన కర్ణకుండలాల రుచులు చెక్కిళ్ళపై పడి అచ్చటి నిగనిగలను పోషిస్తున్నాయి. తులలేని నవరత్నముల చేత పొదగబడిన కిరీట కాంతులు దిక్కులను ప్రకాశమానం చేస్తున్నాయి.

వినతాసుతుడైన గరుత్మంతుని మూపుపై తన ఎడమచేతిని ఉంచాడు. భూషణములుగా చేతికి అలంకరించుకొన్న భుజకీర్తి, కడియములు, కంకణములు ఒప్పుతున్నాయి. తన కుడిచేతిలో మనోహరమైన పద్మాన్ని ధరించి దానిని లీలగా త్రిప్పుతున్నాడు.

వ. మఱియుఁ జరణారవింద మంజు కింజల్క పుంజ ప్రభారంజిత తులసీ మరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాద కలిత సేవా తత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు, బహిఃకరణాంతఃకరణ పరితోష ప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును, బ్రభాపూర్తి యుక్తంబును నగు మూర్తితోడ నిజ సౌందర్య వర కళా వినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ బాదచారియై యఖిల విశ్వగురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు.

539

తా॥ ఆ శ్రీహరి యొక్క పాదపద్మాలలోని కేసరముల వలె కాంతులతో ప్రకాశిస్తున్నవి తులసీదళాలు. ఆ తులసీ దళాలతో కలసి ఉన్న పూగుత్తుల మకరంద, సువాసనలతో వీచే మందవాయువులను అనుభవిస్తూ సేవాతత్పరులై యోగీంద్రులు ఆయన వెంట నడుస్తున్నారు. ఆ యోగీంద్రుల అంతః కరణాలకు ఆ పద్మనాభుని దివ్యస్వరూపం ఎంతో ప్రమోదాన్నిస్తూ బాహ్య ముఖంగా ఉన్న ఇంద్రియాలకు, అంతఃకరణకు కలిగించే హర్షం వల్ల రోమాంచం కలుగుతోంది. శ్రీ రమణీమణితో కూడి పరిపూర్ణ దీప్తులతో నారాయణుడు నడచి వచ్చాడు. ఆయన తన సౌందర్యం చేత ఇందిరాదేవి యొక్క సౌందర్యాన్ని జయించి విశ్వగురువైన సర్వేశ్వరుడు పాదచారియై అక్కడకు వచ్చాడు.

చ. స్థిరశుభలీల నట్లరుగుదెంచిన యవ్విభు విద్రుమారుణా ధర నవపల్లవ స్ఫురదుదంచిత కుంద రుచిస్మితైక సుం దర వదనారవిందము ముదంబునఁ దప్పక చూచియున్ మునీ శ్వరులు నిజాత్మలం దనివి సాలక వెండియుఁ జూచి రిమ్ములన్.

540

తా॥ శాశ్వతమైన మంగళ వైభవంతో అలా వచ్చిన ఆ హరి యొక్క పగడముల వంటి పెదవి క్రొత్తగా వేసిన చిగురాకువలె ఉంది. ఆయన మందస్మితం చిగురాకు చివర ఒప్పుతున్న మల్లెమొగ్గల వలె అందంగా ఉంది. అట్టి సుందర వదనారవిందాన్ని ఎంతో సంతోషంతో చూసి మునీశ్వరులు తనివి తీరక మరల మరల చూసారు.

చ. సునిశితభక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం గనుఁగొని రెట్టకేలకు నకల్మషభక్త విధూత భేదముల్ మునిజన చిత్త మోదములు ముక్తి నివాస కవాట భేదముల్ వినుత వినూత్న నూపురిత వేదము లమ్మహనీయు పాదముల్.

541

తా॥ ఆ మునీంద్రులు నిశితమైన భక్తిచేత ఆయన ముఖాన్ని చూసి చూసి తమ చూపులను మరల్చుకోలేక చివరకు పాదారవిందములమీద నిలిపారు. ఆయన యొక్క చరణాలు కల్మషం లేని భక్తుల హృదయాలలో ఉండే దుఃఖాలను పోగొట్టేవి... మునిజనుల మనస్సుకు సంతోషాన్నిచ్చేవి... ముక్తిక్షేత్ర తలుపులు ఛేదించేవి... వేదాలను అందెలుగా అలంకరించుకొనేవి.

చ. కని నఖపద్మరాగమణి కాంతి విభాసిత పాదపద్మముల్ మనముల యందుఁ గీల్కొలిపి లబ్ధ మనోరథ యుక్తులై పునః పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగ మా ర్గ నిరత చిత్తులున్ వెదకి కానఁగ లేని మహానుభావునిన్.

542

తా॥ మనస్సులో కోరిక నెరవేరిన మహర్షులు, యోగమార్గంలో మహాయోగులు సైతం వెదకి వెదకి చూడలేని శ్రీహరిని కనులార వీక్షించారు. పద్మరాగమణి కాంతులతో ప్రకాశించే నఖములుగల చరణ సరోజములను తమ మనస్సులలో నిలుపుకొని పునః పునః అభివందనం చేశారు.

క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁ డైన వానిఁ దత్త్వజ్ఞులకుం గాన నగువాని భక్తజ,

నానందకరైకమూర్తి నలరిన వానిన్.

543

తా॥ ధ్యానించే వారికి మాత్రం కనిపించేవాడు, తత్త్వవేత్తలకు దర్శనమిచ్చేవాడు, భక్తజనులకు ఆనందాన్నిచ్చే వాడు అయిన పరమేశ్వరుణ్ణి తమ మనస్సులలో నిలుపుకున్నారు.

వ. మఱియుం జక్షురింద్రియ గ్రాహ్యంబగు దివ్య మంగళ విగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్త తేజోనిధిం జూచి సనకాదు లిట్లని స్తుతియించిరి:

544

తా॥ దివ్య మంగళ స్వరూపంతో కన్నుల పండువుగా కన్పించిన ఆ పురుషోత్తముణ్ణి, ఆ ఉదాత్త తేజోనిధిని చూసి సనకాదులు ఇట్లా స్తుతించారు:

## సనకాదులు శ్రీమన్నారాయణుణ్ణి స్తుతించుట

చ. వనజదళాక్ష! భక్తజనవత్సల! దేవ! భవత్సుతుండు మ జ్జనకుఁడు నైన పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె ప్పిన భవదీయ మంగళ గభీర పరిగ్రహ విగ్రహంబు మే మనయముఁ జూడఁ గంటిమి కృతార్థులమై తగ మంటి మీశ్వరా!

545

తా॥ ఓ పద్మదళాక్ష! భక్తజనవత్సల! దేవ! నీ కుమారుడు, మాకు తండ్రి అయిన విధాత నిన్ను చూడగలిగే రహస్యాన్ని మాకు ఉపదేశించాడు. అట్టి నీ మంగళకరమైన రుపాన్ని మేం చూడగలిగాము! ఈశ్వరా! కృతార్థులమైనాము.

సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయసం, గతుఁడవై యుండియుఁ గానఁబడవు కడఁగి నీ దివ్యమంగళ విగ్రహంబునఁ, జేసి సమంచితాశ్రితుల నెల్లఁ జేకొని, సంప్రీత చిత్తులఁ గాఁ జేయు, దతిశయ కారుణ్యమతిఁ దనర్చి కమలాక్ష! సర్వలోకైక నాయక! భవ, త్సందర్శనాభిలాషానులాప

తే. విదితదృఢ భక్తియోగ ప్రవీణు లగుచు, నర్థిమై వీతరాగులైనట్టి యోగి జనమనః పంకజాత నిషణ్ణమూర్తి, వని యెఱుంగుదురయ్య, నిన్నాత్మవిదులు.

546

తా॥ దేవా! నువ్వు దుర్జనుల హృదయాలలో ఉండికూడా కనిపించవు. కళ్యాణకారకమైన నీ రూపాన్ని తీవ్రంగా కోరుకునే వారిని చేరదీసుకొని వాళ్ళకి సంతోషాన్ని కలిగిస్తావు. కమలాక్ష! సర్వలోకైక నాయక! నిన్ను చూడాలనే అభిలాష వల్ల, ప్రతి నిత్యము నిన్నుగూర్చి చెప్పుకోవటంవల్ల భక్తియోగంలో ప్రవీణులవుతారు. రాగద్వేషములను జయించినట్టి యోగి జనుల మనః పద్మాలలో నువ్వు ఉంటావని ఆత్మవిదులైన వారంటారు.

క. యుక్తిం దలఁప భవద్వ్యతి, రిక్తములై నట్టి యితర దృఢ కర్మంబుల్ ముక్తిదము లయిన నీ పద, భక్తులు దత్కర్మములను బాటింప రిలన్.

547

తా॥ నీ పదభక్తులు నీ భక్తికి వ్యతిరేకాలైన ఇతరములైన పనులను ముక్తినిచ్చేవైనను – వాటిని పాటించరు.

ఉ. కావునఁ గీర్తనీయ గతకల్మష మంగళ తీర్థ కీర్తి సు శ్రీ విభవ ప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే వా విమలాంతరంగ బుధవర్గ మనర్గళభంగి నన్యమున్ భావమునం దలంచునె కృపాగుణభూషణ! పాపశోషణా!

548

తా॥ దేవా! కృపాగుణమే భూషణంగా గలవాడవు! భక్తుల పాపాలను పోగొట్టేవాడవు! ఏ విధమైన దోషములు లేని మంగళకరమైన కీర్తనీయమైన సుచరిత్రుడవు! నీ పాదకమలముల సేవకే అంకితమైనట్టి బుధవర్గం ఇతర విషయములు ఏవీ మనస్సులోనికి రానివ్వరు.

చ. పరమ తపోవిధూత భవపాపులమై చరియించు మాకు నేఁ డరయ భవత్పదాశ్రితుల కల్గి శపించిన భూరిదుష్కృత స్ఫురణ నసత్పథైక పరిభూతులమై నిజధర్మహానిగా నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే!

549

తా॥ తీవ్రమైన తపస్సు చేసి పాప రహితులమై సంచరించే మేము నేడు మీ పాదాశ్రితులపై అలిగి శపించాము. దుష్టుల మార్గంలో అడుగుపెట్టి ధర్మహాని చేశాము. నేరంగా చూడక మమ్ములను రక్షించు!

చ. కర మనురక్తిషట్పదము క్రమ సుగంధ మరంద వాంఛచేఁ దరమిడి శాత కంటక

వృతస్ఫుట నవ్యతర ప్రసూన మం జరులను డాయుపోల్కిని భృశంబగు విఘ్నములన్ జయించి నీ చరణ సరోజముల్ గొలువ సమ్మతి వచ్చితిమయ్య, కేశవా!

550

తా॥ ఓ కేశవా! ఎంతో అనురక్తితో భ్రమరం ఇంపైన సుగంధానికి లోనై మకరందం కోసం బలమైన ముళ్ళతో కూడిన క్రొత్తగా వికసించిన పూలగుత్తులను చేరిన విధంగా; అనేక విఘ్నాలను జయించి నీ చరణసరోజాలను సేవించడానికి వచ్చాము.

చ. అలరు భవత్పదాంబుజ యుగార్పితమై పొలుపొందునట్టి యా తులసి పవిత్రమైన గతిఁ దోయజనాభ! భగవత్కథాసుధా కలితములైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్ విలసిత లీలమై భువిఁ బవిత్రములై విలసిల్లు మాధవా!

551

తా॥ మాధవా! నీ చరణకమలాలకు అర్పితమై ఎంతో పొలుపుగా ఉన్న ఈ తులసి పవిత్రమైనట్లు, భగవంతుని యొక్క కథలనే అమృతంతో కూడిన మాటలను అకల్మషంగా విన్న కర్ణద్వంద్వం అత్యంత పవిత్రములై విలసిల్లుగాక!

చ. మహితయశోవిలాస గుణమండన! సర్వశరణ్య! యింద్రియ స్పృహులకుఁ గానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ సహజ శరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ దృక్కు లిం దహహా! కృతార్థతం బొరసె; నచ్యుత! మ్రొక్కెద మాదరింపవే!”

552

తా॥ గొప్పదైన కీర్తి విలాసంచే ప్రకటమైన గుణములు కలవాడా! సర్వశరణ్య! ఇంద్రియాలకు లొంగిపోయిన వారికి కానరాని నల్లని అవిసె పూవువంటి వెలుగుతో ప్రకాశిస్తున్న నీ యథార్థ స్వరూపాన్ని మేమిప్పుడు తనివితీరా చూడగలిగాం. నీకు మ్రొక్కుతున్నాం! తండ్రీ! మమ్ములను ఆదరించు!

క. అని సనకాదులు దత్పద, వనజములకు మ్రొక్కి భక్తి వశమానసులై వినుతించిన గోవిందుఁడు, మునివరులం జూచి పలికె ముదితాత్ముండై.

553

తా॥ ఈ విధంగా సనక సనందనాదులు శ్రీహరి యొక్క పాదకమలాలకు మ్రొక్కి, భక్తికి లొంగిపోయిన మనస్సు కలవారై నుతించారు. అప్పుడు గోవిందుడు సంతోషంతో మునిశ్రేష్ఠులతో ఇట్లా అన్నాడు:

# మునివరులకు గోవిందుని ఉద్బోధ

వ. ఈ యిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు, వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి అది నాకు నభిమతం బయ్యె, నదియునుం గాక భృత్యవర్గంబు సేయు నపరాధంబు స్వామిదియ; కాన యీ తప్పునకు మాననీయుండనైన నన్ను మన్నించి ప్రసన్ను లగుదురుగాక యని వెండియు నిట్లనియె.

554

తా॥ 'ఆ ఇద్దరు జయుడు, విజయుడు అనే పేర్లుగల నా ద్వారపాలకులు. వీరు మిమ్ములను లెక్కసేయక నా ఆజ్ఞను అతిక్రమించి చేసిన అపరాధానికి తగిన దండన విధించారు. మీరు చేసిన పని నాకు ఇష్టమే. అదీకాక భృత్యులు చేసే అపరాధం స్వామిదే. కావున వాళ్ళు చేసిన ఈ తప్పుకు నాయందుండే గౌరవం చేత నన్ను మన్నించి ప్రసన్నులుకండి' అని ఇంకా ఇలా అన్నాడు:

చ. తనువునఁ బుట్టినట్టి బెడిదంబగు కుష్ఠమహాగదంబుచే వనరి తదీయచర్మము వివర్ణత నొందినరీతి భృత్యు లొ ప్పని పని సేసినన్ విభులు బంధురచారుయశంబుఁ బేరుఁ బెం పును జెడిపోయి దుర్యశముఁ బొందుచు నుందురు విష్టపంబులన్.

555

తా॥ 'ఈ శరీరంలో పుట్టిన భయంకరమైన కుష్ఠు రోగంచే చర్మం రంగుమారినట్లుగా, భృత్యులు తగనిపని చేస్తే యజమానుల కీర్తి, పేరు, ప్రతిష్ఠలు చెడిపోయి లోకంలో అపకీర్తి పొందుతారు.

చ. అలవడ నాకు మీవలన నబ్బిన తీర్థ సుకీర్తనీయ స ల్లలిత వినిర్మలామృత విలాస యశో

విభవాభిరామమై వెలయు వికుంఠ నామ మపవిత్రమనశ్వప చాధమాది లో కుల చెవి సోఁకఁ దత్క్షణమ కోరి పునీతులఁ జేయు వారలన్.

556

తా॥ నాకు మీవల్ల ప్రాప్తించిన వైకుంఠమనే పుణ్యతీర్థం ఎంతో పొగడతగినది, లలితమైనది, నిర్మలమైనది, అమృతమయమైనది. కీర్తిప్రతిష్ఠల చేత ప్రకాశించే నా వైకుంఠం అనే పేరు చెవి సోకగానే కుక్కమాంసం తినే అథములనైనా సరే వాళ్ళని పునీతులుగా చేస్తుంది.

తే. అట్టి నేను దలంప మీ యట్టిసాధు, జనుల కపకార మర్థిఁజేసిన మదీయ బాహుసములైనఁ ద్రుంతు నుత్సాహలీల, నన్న నితరుల మీ మ్రోల నెన్ననేల?

557

తా॥ అట్టి నేను మీలాంటి సత్పురుషులకు అపకారం చేసిన వారిని నా బాహువులతో సమానమైన వారైనా సరే వాళ్ళని నరకడానికి వెనుతీయను. అలాంటప్పుడు మీవద్ద ఇతరుల గురించి చెప్పేదేముంది?

క. ధరణిసురోత్తమ సేవా, పరిలబ్ధం బయిన యట్టి పాతక నాశం కర నిఖిల భువన పూత, స్ఫురి తాంఘ్రి సరోజ తోయములు గల నన్నున్.

558

క. అలఘుమతి విరక్తునిఁగాఁ, దలఁపక నిజ శుభ కటాక్ష దామక కలితా ఖీలసంపద్విభవ శ్రీ, లలనా రత్నం బురస్థ్సలంబును జెందెన్.

559

తా॥ ధరణీసురుల పాదసేవనం వల్ల సమకూరినట్టిది, సమస్త పాతకములను నాశనం చేసేది, అఖీల భువనములను పవిత్రం చెయ్యకలిగినది అయిన గంగానది నా చరణములనుండి

ఉద్భవించింది. అట్టి నన్ను వైరాగ్యంలో ఉన్న వానిగా భావించక, మంగళకరమైన వాలుచూపులనే పూదండలతో అఖిలమైన వైభవాన్ని తనదిగా చేసుకున్న శ్రీ లక్ష్మీదేవి నా రొమ్మును అలంకరించింది.

చ. క్రతువులు సేయుచో శిఖీముఖంబున వేలుచునట్టి తద్ఘృత ప్లుత చరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహధర్మమార్గ సం గతుఁడగు భూసురోత్తము ముఖంబున వేడ్క భుజించు నయ్యవి స్తృతకబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్.

560

తా॥ ధర్మంగా నడుచుకొంటున్న బ్రాహ్మణోత్తముడు, దైవం మేలుచేస్తాడనే పరిపూర్ణ విశ్వాసంతో భుజించే ఒక అన్నంముద్దవల్ల నేను పొందిన తృప్తి; క్రతువుల్లో నేతిలో ముంచి అగ్నిముఖంగా వ్రేల్చే హవిస్సును ఆరగించేటప్పుడు కూడా నా మనస్సు అట్టి ముదాన్ని పొందదు.

సీ. సతతంబు నప్రతిహత యోగమాయా వి, భూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందు నేను నే మహీసురుల సమిద్ధ నిర్మల పాద, నలిన రజోవితానములు భక్తి హాటక నవరత్న కోటీరమునఁ దాల్తు, నట్టి నా చరణాంబుజాంబువులను దవిలి ధరించి సద్యః పునీతాత్ములై, రర్థిఁ జంద్రావతంసాది దేవ

తే. చయము; లెవ్వాఁడు బ్రాహ్మణ జనులు దమకు, నపకృతుల్ సేసిరేని మా ఱలుగఁ డతఁడు విప్రులను నన్నుఁగాఁగ భావించు నతఁడు, ధర్మ పద్ధతి నా ప్రియతముఁడు వాఁడు.

561

తా॥ అడ్డులేని యోగమాయా విభూతిచే నిరంతరము ప్రఖ్యాతిని పొందిన నేను భూసురుల పాదరజస్సును భక్తితో నవరత్నములతో కూడిన బంగారు కిరీటంలో ధరిస్తాను. అట్టి నా చరణపద్మాలలో పుట్టిన గంగాజలాన్ని శిరస్సున ధరించి పరమ శివుడు మొదలైన దేవతలు పునీతులవుతున్నారు. ఎవడు విప్రులు తమకు అపకృతులు చేసినా తిరిగి అలుగడో, ఎవడు

బ్రాహ్మణులను నన్నుగా భావిస్తాడో అతడు ధర్మానుసారంగా నాకు అత్యంత ఆప్తుడు.

ఉ. గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్ వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద, నందు నా శీవిషరోషవిస్ఫురణఁ జెంది కృతాంతభటుల్ మహోగ్ర గృధ్రావలివోలెఁ జంచువుల నంగము లుద్ధతిఁ జింతు రెప్పుడున్.

562

తా॥ ఎవరైతే గోసమూహన్ని, విప్రులను, నన్ను, దీనజనులను భేదబుద్ధితో చూస్తారో వారు అతినీచమైన స్థితిని పొందుతారు. విషంతో కూడిన త్రాచుపాములలాగ యమభటులు ఉగ్రమైన గ్రద్దలవలె ముక్కులతో వాళ్ళ అవయవాలను చీలుస్తూంటారు.

చ. ధరణి సురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్ దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలుఁ బూజ సేయుచున్ సరస వచో విలాసముల సన్నుతి సేయుచుఁ దండ్రి నాత్మజుల్ గర మనుర క్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నా సముల్.

563

తా॥ ఉత్తములైన బ్రాహ్మణులు అనేక విధాలుగా తమను పరాభవించినా చిరునవ్వుతో సహించి, సంతోషంతో ఎప్పుడూ పూజ చేస్తూ, మంచి మాటలతో వారిని గౌరవిస్తూ తండ్రిదగ్గర చిన్నకొడుకులు ప్రవర్తించినట్లు ఎంతో ప్రేమతో మసలుకొనే వారు దేవునితో సమానం.

క. వినుఁ డయ్యనఘచరిత్రుల, కనయముఁ బ్రియతముఁడ నగుచుఁ నమ్ముడువోదున్ మును నన్ను భృగువు దన్నినఁ, గనలక పరితోషవృత్తిఁ గైకొంటిఁ గదే.

564

తా॥ అటువంటి పాపరహితులకు నేనెప్పుడూ ప్రియతముడనై అమ్ముడుపోతూ ఉంటాను. పూర్వకాలంలో నన్ను భృగుమహర్షి తన్నగా కోపపడకుండా సంతోషంతో ఆయనను

స్వీకరించాను కదా!

సీ. పొలుచు నా మానసాంభోజాత భావంబుఁ దెలియంగ లేక యుద్వృత్తు లగుచుఁ గడఁగి
మీ యానతిఁ గడచినఁ దద్దోష ఫలము వీరలకు సంప్రాప్తమయ్యె, మునులార! నా చిత్తమున
నున్న రీతియు నిట్టిద, భూమిపైఁ బుట్టి వీర లచిరకాలమున నా యంతికంబున కోలి
నరుదెంచు నట్లుగా ననుమతింప

తే. వలయునని య మ్ముకుందుండు వలుకుటయును, విని మనంబున సనకాదిముని
వరేణ్యు లమ్మహాత్ముని మృదుల భాషామృతంబుఁ, దవిలి క్రోలియు రోష సందష్టు లగుచు.

565

తా॥ నా మనస్సులోని భావాన్ని తెలుసుకోలేక గర్విష్ఠులై మీ ఆనతి మీరి ప్రవర్తించినందులకు ఆ దోషఫలం వీళ్ళకు సంప్రాప్తమైంది. సనకసనందనాది మునులారా! నా మనస్సులో ఉన్నది కూడ ఇదే! వీళ్ళు భూమిపై పుట్టి కొంతకాలం ఉండి అచిరకాలంలోనే నా దగ్గరకు తిరిగి వచ్చునట్లుగా మీరు అనుమతించండి.” ఈ ప్రకారం ముకుందుడు పలికిన మాటలు విని మనస్సులో సనకాది మునివరేణ్యులు ఆ మహాత్ముని మధుర వాక్కులను విని కూడా కోపావేశులయ్యారు.

సీ. మునివరుల్ తమ చిత్తములఁ దృప్తిఁ బొందక, పంకజాతాక్షుఁడు పలికి నట్టి పరిమిత
గంభీర బహుళార్థ దురవగా, హములును విస్ఫుర దమృత తుల్య మాధుర్య సుగుణ
సమన్వితమ్ములు విని, ర్గత శబ్దదోష నికాయములును నైన వాక్యములకు నాత్మలఁ బరితోష,
మంది యిట్లనిరి నెయ్యమున మనల

తే. నొడయఁ డిప్పుడు నందించియో, తలంప, నర్థి నిందించియో, మత్కృతైక దండ మునకు
సంకోచ మందియో, యనుచు సంశ, యాత్ము లగుచు వివేకించి యంతలోన.

566

తా॥ మునివరులు తమ చిత్తములో తృప్తి చెందలేదు. పరిమితములు, గంభీరములు, అనేకార్థములు, అవగాహనకు వీలుకానివి, అమృత తుల్యములు, సుగుణములతో కూడి మాధుర్యంగా ఉన్నవి, శబ్దదోషములు లేనివి అయిన శ్రీహరి వాక్యములకు ఆత్మానందాన్ని పొంది కూడా సందేహించి ఇలా అనుకున్నారు. మన ప్రభువు మనలను స్నేహంతో అభినందిస్తున్నాడా? లేక నిందిస్తున్నాడా? కాక మనము వేసిన శిక్షకు సంకోచిస్తున్నాడా? ఈ విధంగా సంశయాత్ములై వివేకించి అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చారు.

క. నళినాక్షుఁడు దమదెసఁ గృప, గలిగిన భావంబుఁ దెలిసి కౌతుక మొలయం
బులకీకృతాంగులై యు, త్కలికన్ హర్షించి నిటల ఘటితాంజలులై

567

తా॥ నళినాక్షుడు తమపట్ల కృపతో ఉన్నాడనే భావాన్ని తెలుసుకుని ఎంతో కుతూహలంతో శరీరం పులకాంకితం కాగా హర్షించి నుదుట అంజలి బంధంతో నమస్కరించారు.

క. భరిత నిజ యోగమాయా, స్ఫురణం దనరారు నతి విభూతియు బలముం
బరమోత్కర్షముఁ గల యీ, శ్వరునకు నిట్లనిరి మునులు సద్వినయమునన్.

568

తా॥ యోగమాయా ప్రభావం కారణంగా ఎంతో ఐశ్వర్యంతో, అంతులేని పరాక్రమంతో, సర్వశ్రేష్ఠుడై ఒప్పుతున్న హరితో వినయంగా మునులు ఇట్లా అన్నారు:

## భగవంతునికి మునివరుల వినతి

తే. పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ, కుఁడవు, భగవంతుఁడవు, ననఘుఁడవు, నీవు మత్కృతం బిప్డు నీ కభిమత మటంటి, వీశ! భవదీయచారిత్ర మెఱుఁగఁ దరమె?

569

తా॥ ఈశ్వరా! దివ్యతేజంతో ప్రకాశించే నాయకుడవు! నువ్వు భగవంతుడవు! పాపరహితుడవు! మేము చేసిన పని నీ అభిమతమే అన్నావు! సంతోషమే! నీ చరిత్ర తెలుసుకోవటం ఎవరి తరం?

ఉ. దేవగణాళి కెల్లఁ బరదేవతలై తనరారునట్టి వి ప్రావళి కాత్మనాయకుఁడవై పెనుపొందిన నీకు నీ ధరా దేవత లెల్ల నెన్న నధిదేవతలై రఁట, యెట్టి చోద్యమో దేవ! సమస్త పావన! సుధీజనతావన! విశ్వభావనా!

570

తా॥ దేవా! పరమ పావనా! సజ్జన రక్షకా! విశ్వభావనా! దేవతలందరికి పరదేవతలైన విప్రులకు ఆత్మనాయకుడవు! ఈ బ్రాహ్మణులు నీకు అధిదేవతలైరట! ఎంత వింత!

చ. కమలదళాక్ష! నీవలనఁ గల్గిన ధర్మము తావకావతా రముల సురక్షితం బగుఁ, దిరంబగు, నీశ్వర నిర్వికార త త్త్వమునఁ దనర్చు నిన్నరయఁ దత్ఫల రూపముఁ దద్ప్రధాన గో ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన! పాపమోచనా!

571

తా॥ కమలదళాక్షా! చూపులలో దయను కురిపించే వాడా! పాపం నుండి విముక్తిని ప్రసాదించేవాడా! నీ వల్ల పుట్టిన ధర్మం నీ అవతారాలవల్ల సురక్షితమవుతున్నది. ఈశ్వరా! ఏ వికారము పొందని తత్త్వంలో వెలుగొందే నిన్ను తెలుసుకొంటే నీవే ఆ ప్రధాన రహస్యమని,

తెలుసుకోవలసిన వాడవు నువ్వే అని నిన్ను తెలిసినపెద్దలు పలుకుతూ ఉంటారు.

చ. మహిఁ దలపోయ నెవ్వని సమగ్రపరిగ్రహమున్ లభింప ని స్స్పృహమతులై, మనీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు, రట్టి స న్మహిత వివేకశాలి! గుణమండన! నీ కిల నన్యసత్పరి గ్రహ మది, యెట్టి చోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా!

572

తా॥ ఓ వివేకశాలి! సుగుణభూషణా! జగత్పరిపాలకా! నిత్యఖేలనా! ఆలోచించగా ఎవని యొక్క సంపూర్ణమైన అనుగ్రహం లభిస్తే మునీశ్వరులు సైతం మృత్యుభయాన్ని దాటుతున్నారో అట్టి నీకు ఈ లోకంలో అన్యుల యొక్క అనుగ్రహం అనేది ఎంతో చోద్యంగా ఉంది.

సీ. సతతంబు నర్థార్థిజనశిరో-లంకార, పదరేణువులు గల పద్మ నేఁడు జలజ కింజల్క నిష్యంద మరంద లో, భాగత భ్రమర నాయకుని పగిది ధన్యజనార్పితోదంచిత తులసికా, దామంబునకు నిజధామ మగుచు భాసిల్లు భవదీయ పాదారవిందముల్, విలసిత భక్తి సేవింపుచుండి

తే. కమల నయన! కృపావలోకనము లొలయ, నర్థిఁ జూడవు భాగవతానుర క్తిఁ జేసి భవదీయ మహిమంబు చిత్ర మరయఁ, జిరశుభాకార! యిందిరా చిత్తచోర!

573

తా॥ లక్ష్మీదేవి ఎల్లప్పుడూ ధనాన్నికోరే జనుల శిరస్సులకు అలంకారమైన పదరేణువులు కలిగినట్టిది. అట్టి ఆమె... కమల కేసరాల నుండి స్రవించే మకరందం మీది ఆశతో వచ్చినటువంటి భ్రమర నాయకునివలె; నిన్ను సేవిస్తూ ఉంటుంది. ఆ సమయంలో ధన్యులైన జనులు తులసి మాలలను అర్పించి నీ పాదారవిందాలను భక్తితో సేవిస్తూ ఉంటారు. అట్టి సందర్భాలలో భక్తుల మీది అనురక్తితో లక్ష్మీదేవిని కృపతో క్రీగంటనైనా చూడవు. కమల లోచనా! మంగళస్వరూపా! ఇందిరానాథా! నీ మహిమలు చాలా చిత్రంగా ఉంటాయి.

మ. చిరభాగ్యోదయ! దేవ దేవ! లలిత శ్రీవత్సలక్ష్మాంగ! యీ వర విప్రానుపదైక పుణ్యరజ మే వర్ణింప నీ మేని కా భరణం బంటివి, సర్వలోకులకు విప్రశ్రేణి మాహాత్మ్య మీ వెఱుఁగం జెప్పుటకై ధరించితి గదా యెన్నం బునితాకృతిన్.

574

తా॥ శాశ్వతమైన ఐశ్వర్యమును ఇచ్చేవాడా! దేవదేవ! శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అలరారేవాడా! "ఈ శ్రేష్ఠులైన విప్రుల యొక్క పాదములందలి పుణ్య పరాగమే నా శరీరానికి అలంకారం" – అన్నావు. సర్వ లోకులకు విప్రుల యొక్క మహాత్మ్యాన్ని చెప్పటం కోసమే పవిత్రమైన ఆ పాద రజస్సును నీవు ధరించావు.

వ. అదియునుంగాక.

575

సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు, ప్రోవంగఁ దగువారిఁ బ్రోవవేని నవిరళవేదోక్తమగు ధర్మమార్గ మ, సన్మార్గ మగుఁ, గాన, సత్త్వగుణ వి శిష్టుండ వగుచు నీ జీవసంఘము సేమ, మరసి రక్షింతు నీ దైన శక్తి చేతను ధర్మవిఘాతుల దండించు, నీకు నంచిత మైన నిగమధర్మ

తే. మార్గ నాశక విధములు మదికి నింపు, గావు, విప్రులయందు సత్కరుణ మెఱసి ఘనతఁ బలికిన వినయవాక్యములు నీకు, యుక్త మగుచుండు సతతంబు భక్తవరద!

576

తా॥ అంతేగాక నీవు ధర్మమూర్తివి! జగత్కర్తవు! అట్టి నువ్వు కాపాడవలసిన వాళ్ళను కాపాడకపోతే ఎడతెగని వేదోక్తమగు ధర్మమార్గం అధర్మం అవుతుంది. కావున సత్త్వగుణ ప్రధానుడవై ఈ జీవకోటుల క్షేమాన్ని తెలుసుకొని రక్షిస్తూ ఉంటావు. ధర్మమార్గానికి అడ్డం వచ్చే వాళ్ళని దండించు. వేద ధర్మానికి విరుద్ధమార్గాలు నీ మదికి ఇంపుగావు. విప్రులయందు

కరుణతో పల్కిన వినయ వాక్యములు భక్తవరదుడవైన నీకు యుక్తమై ఉన్నాయి.

వ. అట్లయినం బరులయెడ వినయంబులు వలికినఁ బ్రాభవహాని యగు నని తలంచితివేని.

577

తా॥ అలా అయితే పరులయెడ వినయపు మాటలు మాట్లాడితే మర్యాదకు భంగం కలుగుతుంది అంటావేమో అలాకాదు.

తే. విశ్వమునకెల్లఁ గర్తవు విశ్వనిధివి, విశ్వసంరక్షకుండవై వెలయు నీకుఁ గడఁగి
ప్రాభవహాని యెక్కడిది? దలఁప, వినయములు నీకు లీలలై వెలయుఁగాన.

578

తా॥ ఈ అనంతమైన విశ్వానికి కర్తవు, విశ్వనిధివి, విశ్వసంరక్షకుడవు అయి వెలుగొందే విభుడవు నీవు! అట్టి నీ ప్రాభవానికి హాని ఎక్కడుంది? వినయంగా ఉండటం అనేది నీకు లీల... అంతే!

తే. మునులమగు మమ్ము నతిమోదమునను నీవు, సత్కరించుట లెల్ల సజ్జనపరిగ్ర హార్థమై
యుండుఁగాదె, మహాత్మ! యొకటి, విన్నవించెద మీ జయవిజయులకును.

579

తే. అలిగి మేము శపించితి మంతకంటె బెడిద మగు నాజ్ఞ సేయ నభీష్టమేనిఁ జేయు;
మదిగాక సమధికశ్రీ దనర్పఁ, జేసి రక్షించెదేని రక్షింపు మీశ!

580

తా॥ ఈశ్వరా! మునీశ్వరులమైన మమ్ము అతి మోదముతో సత్కరించటం అనేది సజ్జనులను పరిగ్రహించటం తప్ప వేరు కాదు. మహాత్మా! ఒక విన్నపం! ఈ జయవిజయులపై కోపించి... మేము శపించాము. అంతకంటే అధికంగా ఆజ్ఞాపించ తలుచుకున్నట్లైతే అలాగే

చెయ్యి. అలా కాకుండ ఎక్కువ సిరిసంపదలిచ్చి రక్షింప తలిచావా? ప్రభూ అలాగే రక్షించు.

వ. అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతి నిర్మలాంతఃకరణులునైన వీరలకు ననృతంబులు వలికితి మేని మమ్మయినం జిత్తంబు కొలంది నాజ్ఞాపింపుమని కరకమలంబులు మొగిచి కృతాంజలులై యున్న మునులం గరుణార్ద్ర దృష్టిం గనుంగొని.

581

క. అనఘుఁడు భగవంతుం డి, ట్లనియెన్ మునులార! వీర లలరన్ భువికిం జని యచట నసురయోనిన్, జనియింతురు లోభమోహసంగతు లగుచున్.

582

తా॥ నీవు ఎలా చేసినా మాకు ఇష్టమే! అపరాధం చెయ్యని వారు, అతి నిర్మలమైన అంతఃకరణం కలవారు అయిన వీళ్ళ విషయంలో మేమేదైనా తప్పుచేసి ఉన్నట్లైతే నీ మనస్సుకు నచ్చినట్లు ఆజ్ఞాపించు... అని చేతులు జోడించి నమస్కరించిన మునులను కృపాదృష్టితో చూసి మాధవుడిలా అన్నాడు: ‘ఓ మునులారా! ఈ జయ విజయులిద్దరూ సంతోషంతో భూలోకానికి వెళ్ళి లోభమోహాలు కల రాక్షసులై జన్మిస్తారు.

క. దేవజనావళి కుపహతిఁ, గావించుచు నిఖిల భువన కంటక వృత్తిన్ జీవించుచు నా యెడ సం, భావిత వైరానుబంధ భావులు నగుచున్.

583

తా॥ దేవతలకు, మానవులకు ఉపద్రవాలు సృష్టిస్తూ, నిఖీల భువనాలను ముల్లులా బాధిస్తూ, నా పట్ల వైరంతో జీవితాన్ని సాగిస్తారు.

క. ఆహవముఖమున నను నతి, సాహసమున నెదిరి పోరి చక్ర నిశిత ధా, రాహతిఁ దెగి వచ్చెద రు, త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్.

584

తా॥ యుద్ధరంగంలో అతి సాహసంతో పోరాడి, నా వాడియైన చక్రధారలకు తెగిపడి తిరిగి ఉత్సాహంతో నా చెంతకు చేరతారు.

వ. అదియునుం గాక.

585

క. నను వైరంబున నైనను, మనమునఁ దలఁచుటను నా సమక్షమున మదా నన మీక్షించుచు నీల్గుట, ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్.

586

తా॥ అంతే కాకుండా... పగచేతనైనా మనస్సులో నన్ను తలచుకోవటం వల్లను, నా సమక్షంలో నా ముఖం చూస్తూ చనిపోయినందు వల్లను పాపరహితులై తిరిగి యథాస్థానాన్ని చేరుకుంటారు.

క. వినుఁ డిలమీఁద నిఁ కెన్నఁటి, కిని బుట్టువు లేదు వీరికిని, మీరలు వ ల్కిన యట్ల నాదు చిత్తము, నను దలఁతుం గాన మీ మనంబుల నింకన్.

587

ఉ. దీనికిఁ జింతఁ దక్కుఁడు, సుధీజనపుంగవు" లన్నఁ బ్రీతులై యా నలినాసనాత్మజు లనంతుని భావము దా మెఱింగి పెం పూనిన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తములన్ నుతించి రం భోనిధిశాయి నార్తజన పోషణ భూషణుఁ బాపశోషణున్.

588

తా॥ మునులారా! మూడు జన్మల అనంతరం ఈ భూమి మీద ఇక ఎప్పటికీ వీరికి పుట్టుక లేదు. మీరు పలికిన విధంగానే నేను కూడా నా మనస్సులో అనుకున్నాను; కనుక మీ

మనస్సుల్లో దీనికోసం చింతించకండి! మీరు బుద్ధిమంతులు...” అని శ్రీహరి పలుకగా సంతోషించినవారైన బ్రహ్మమానస పుత్రులు నారాయణుని భావం తెలుసుకుని అతిశయించిన ఆనందంలో మునిగిపోయారు. వారు నిర్మలమైన చిత్తముతో క్షీరసాగర శయనుడు, ఆర్తజన పోషణుడు, పాపములను హరింప చేసేవాడు అయిన శ్రీమహా విష్ణువును స్తుతించారు.

వ. మఱియును.

589

ఉ. ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ ననలొత్త బాష్ప ధా రా సుభగాక్షులై మునిశరణ్యవరేణ్యు నగణ్యు దేవతా గ్రేసరు దివ్యమంగళ శరీరముఁ జారుతదీయ ధామమున్ భాసురలీలఁ జూచి నవపద్మ దళాక్షునకున్ వినమ్రులై.

590

తా॥ అంతట ఆ సనకాదులు శరీరములు రోమాంకితం కాగా, కన్నులవెంట సంతోషంతో బాష్పధారలు కురియగా మునిశరణ్యుడు, అగణ్యుడు, దేవతాగ్రేసరుడు అయిన నారాయణుని దివ్యమంగళ శరీరాన్ని, వైకుంఠ ధామాన్ని దర్శించి పద్మదళాక్షునకు శిరస్సువంచి అంజలి ఘటించారు.

క. తమ పలికిన భాషణములు, గమలోదరు భాషణములుగాఁ దలఁచుచు నె య్యమునన్ వైష్ణవలక్ష్మిం, బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్.

591

క. ఆ మంత్రితులై తగ నిజ, ధామములకుఁ జనిరి వారు, దడయక లక్ష్మీ కాముఁడు జయవిజయుల నభి, రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్.

592

తా॥ సనకాదులు తాము పలికిన పలుకులు వాసుదేవుని పలుకులుగా తలుస్తూ

స్నేహభావంతో లక్ష్మీదేవిని కూడా సంతోషంతో స్తుతించారు. అనంతరం లక్ష్మీనాథుని అనుజ్ఞతో తమ నివాసాలకు వెళ్ళారు. లక్ష్మీనాథుడు జయవిజయులను మనోజ్ఞంగా చూసి ఇట్లా అన్నాడు:

# లక్ష్మీకాంతుడు జయవిజయులను ఊరడించుట

క. మీ రసురయోనియం దని, వారితులై జనన మందవలసెను, నే దు ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్రవచనము లెందున్.

593

తా॥ మీరు విధిగా అసుర జాతిలో జననమందవలసిన స్థితి వచ్చింది. నేను ఎవరూ వారించడానికి వీలులేని శక్తిసామర్థ్యాలు కలవాడినైనా విప్రశాపాన్ని అడ్డుకోలేను.

క. అది గాన దనుజయోనిం, బదపడి జనియించి మద్విపక్షులరై మీ మది నెపుడు నన్నె తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్.

594

ఉ. పొండని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహ పత్రనేత్రుఁ డా ఖండల ముఖ్య దిగ్వర నికాయ కిరీట లసన్మణి ప్రభా మండితపాదపీఠుఁడు రమారమణీమణి దోడ నేఁగుదే నిండిన వేడ్క నేఁగె నిజ నిర్మల పుణ్యనివాసభూమికిన్.

595

తా॥ అందువల్ల మీరు దనుజులై జన్మించి నా విపక్షులై మీ మనస్సులో ఎప్పుడూ నన్నే తలచుకొంటూ నా చేతిలో మరణించి తిరిగి వైకుంఠానికి వస్తారు. ఇక మీరు వెళ్ళవచ్చు – అని అనుజ్ఞ ఇచ్చాడు. పిమ్మట వికసించిన సరోరుహ పత్రముల వంటి నేత్రములు కలవాడు, పురందరాది దిక్పాలుర మకుటాలలోని మణికాంతుల వల్ల ప్రకాశించే పాదపీఠం కలవాడు అయిన హరి నారీశిరోమణి అయిన రమాదేవి తోడురాగా నిండు వేడుకతో తన నివాసమందిరానికి చేరుకున్నాడు.

వ. అంత.

596

క. నిజతేజోహానిగ జయ, విజయులు ధరఁ గూలి రపుడు విహ్వలు లగుచుం ద్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలఁగన్.

597

తా॥ అప్పుడు వెంటనే తమ తేజస్సును కోల్పోయి జయవిజయులు నిశ్చేష్టులై నేలమీద పడ్డారు. అప్పుడు దేవతా సమూహం విమానముల నుండి చేసిన హాహాకారములు మూడు లోకాలలోను వినిపించాయి.

క. వారలె యా దితిగర్భా, గారంబున నున్నవారు; గడఁగి తదీయో దార ఘన తేజ మిపు డని, వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్.

598

తా॥ వాళ్ళే ఇప్పుడు దితీదేవి గర్భంలో ఉన్నారు. వాళ్ళ గొప్ప తేజస్సే నివారించడానికి వీలులేకుండ మీ తేజస్సులన్నిటిని వ్యర్థం చేసింది.

ఉ. ఇంతకు మూల మాహరి; రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్ వింతలె! సర్వభూత భవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా ద్యంతవికార శూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయు నీ చింతఁ దొఱంగి వే చనుఁడు; చేకుఱు మీకు మనోరథార్థముల్.

599

తా॥ ఇంతకూ మూలకారణం ఆ శ్రీహరి. ఆ రమానాథుడు చేసే పనులు చాలా ఆశ్చర్యంగా ఉంటాయి. ఆయన సమస్త భూతజాలం యొక్క పుట్టుకకు, అభివృద్ధికి, నాశనానికి కారణమైనవాడు. ఆయనకు మాత్రం ఆద్యంతములు లేవు. ఆయన అపార దయాసముద్రుడు. మీకు తప్పక శుభాలు కలుగుతాయి. మీరు శోకాన్ని విడిచిపెట్టి వెళ్ళండి. మీ మనస్సులోని

కోరికలు మీకు తప్పక సిద్ధిస్తాయి."

క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం బున కేఁగిరి, దితి నిజ నా, థుని మాటలు దలఁచి యపరితోషము తోడన్.

600

తా॥ ఈ ప్రకారంగా విధాత చెప్పేసరికి జరుగబోయే వృత్తాంతాన్ని విని దేవతలు వాళ్ళ నివాసమైన స్వర్గానికి చేరుకున్నారు. దితీదేవి మాత్రం తన భర్త మాటలు విని మిక్కిలి దుఃఖపడింది.

## జయవిజయులు దితిగర్భమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టుట

తే. ఇంతి దనసుతుల్ సురలఁ గారింతు రనుచుఁ, దలఁచుచుండంగ నంత వత్సరశతంబు సనఁగ నఁటమీఁదఁ గనియెఁ గశ్యపునిదేవి, యఖీల లోకైక కంటకు లైన సుతుల.

601

తా॥ తన సుతులు సురలను బాధిస్తారని దితీదేవి తలచుకొంటూ ఉండగా నూరు సంవత్సరాల కాలం గడిచింది. అప్పుడు కశ్యపుని భార్య లోకకంటకులైన ఇద్దరు కొడుకులను కన్నది.

వ. అయ్యవసరంబున.

602

తే. ధరణి గంపించెఁ; గులపర్వతములు వడఁకె; జలధులు గలంగెఁ; దారకావళులు డుల్లె; గగన మగలెను, మ్రొగ్గె దిక్కరులు, దిశల, మిడుఁగుఱు లెగసెఁ, బిడుగులు పుడమిఁ బడియె.

603

తా॥ అప్పుడు ధరణీ మండలమంతా వణికిపోయింది. కుల పర్వతాలు కంపించాయి. సముద్రాలు సంక్షోభించాయి. నక్షత్రాలు నేలరాలాయి. ఆకాశం చీలిపోయింది. దిగ్గజాలు వెల్లకిల వంగాయి. దిక్కుల నిండా అగ్నికణాలు ఎగసి పడ్డాయి. భూమిమీద పిడుగులు పడ్డాయి.

సీ. హోమానలంబుల ధూమంబు లడరెను, బ్రతికూల వాయువుల్ బలసి వీచెఁ దరువు లెల్లెడ విటతాటంబులై కూలె, గ్రహ తారకావళి కాంతి మాసె, బెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను; మెఱుఁగులు దెసల మిర్మిట్లుగొలిపె స్వర్భానుఁడొగి నపర్వమున భానునిఁ, బట్టెఁ గైకొని చిమ్మచీఁకట్లు పర్వె.

తే. మొనసి కుక్కలు మొఱిఁగెను మోర లెత్తి, పగలు నక్కలు వాపోయె, ఖగము లార్త రవము లిచ్చెను, దేవతాప్రతిమ లొరఁగెఁ, గన్నులను నశ్రుకణములు గ్రందు కొనఁగ.

604

తా॥ హోమ గుండాలలో అగ్ని జ్వలించటం మానేసి వట్టి పొగలు మాత్రమే వచ్చాయి. ఎదురుగాలులు బలంగా వీచాయి. గ్రహ నక్షత్రాలు తమ కాంతిని కోల్పోయాయి. క్రూరంగా మేఘాలు నెత్తురును వర్షించాయి. దిక్కుల నిండా మెరుపులు మెరిసాయి. గ్రహణకాలం కాకపోయినా రాహువు సూర్యుణ్ణి పట్టేసరికి చిమ్మచీకట్లు క్రమ్ముకున్నాయి. మోరలెత్తి కుక్కలు మొరిగాయి. నక్కలు పగలే కూశాయి. పక్షులు దీనంగా ఆర్తనాదాలు చేసాయి. దేవతా విగ్రహాల కన్నులలో అశ్రుకణాలు జారగా నేలకొరిగాయి.

క. మొదవులు నెత్తురుఁజీమును, బిదికెన్, గార్దభరవంబు భీషణ మయ్యెన్ మద ముడిగెఁ గరుల కటములఁ, బొదివెఁ దురంగముల వాలముల నిప్పు లొగిన్.

605

తా॥ గోవులు చీము, నెత్తురు పిదికాయి. గాడిదలు చాలా భయంకరంగా ఓండ్రపెట్టాయి. మాతంగ గండస్థలాల మీద మదజలం రావటం మానేసింది. గుఱ్రాల తోకల నుండి నిప్పులు రాలాయి.

క. గుహలు రొదలిచ్చెఁ, బాప, గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య గ్రహములు వర్తించెను, దు, స్సహ తేజో దితి తనూజ సంభవ వేళన్.

606

తా॥ పర్వత గుహల నుండి భయంకర శబ్దాలు వచ్చాయి. పాపగ్రహాల మిత్రత్త్వంతో సౌమ్య గ్రహాలు వక్రమార్గంలో సంచరించాయి. సహించుటకు శక్యంగాని తేజస్సుతో దితి కుమారులు జన్మించిన వేళ ఈ విధమైన మహోత్పాతాలు కలిగాయి.

మ. భయదప్రక్రియ నట్లు దోఁచిన మహోత్పాతమ్ము లీక్షించి సం క్షయకాలం బని కాని, సాధుహననోగ్రక్రూర దేవాహితో దయ సంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిసంఘాతముల్, భయ మందెన్ సనకాది యోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్తమా!

607

తా॥ బుధులలో ఉత్తముడవైన ఓ విదురా! భయాన్ని కలిగించే అపశకునాలు అలా తోచటం చూచి సమస్తమైన ప్రాణికోటి ఇదేదో ప్రళయకాలం అనుకున్నారే కాని సాధువులను చంపే క్రూరమైన రాక్షసుల జనన సమయంలో పుట్టిన సంక్షోభం అని తెలుసుకోలేక పోయారు. సనక సనందనాది యోగిజనులు మాత్రం ఆందోళన చెందలేదు.

వ. అట్లావిర్భవించిన యనంతరంబ.

608

తా॥ ఈ విధంగా పుట్టిన అనంతరం...

మ. కులశైలాభ శరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్ర దోర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుండల కాంచీ కటకాంగుళీయక కిరీట స్వర్ణమంజీర నిర్మల కాంతుల్ దులకింప నాత్మరుచిచే మందీకృతార్కాంశులై.

609

వ. ఉన్న సమయంబునం గశ్యపుండు నిజతమాభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుఁ జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి.

610

తా॥ ఆ రాక్షస వీరులు కులశైలములవంటి శరీరాలతో, ఉగ్రమైనటువంటి భుజబలంతో ఒప్పుతున్నారు. వారి పదఘట్టనలకు భూమి కంపించి పోతున్నది. మణులు చెక్కిన స్వర్ణకేయూరాలు, కుండలములు, కటిసూత్రములు, కంకణములు, ఉంగరాలు, కిరీటాలు, బంగారు అందెలు నిర్మలమైన కాంతులు వెదజల్లగా వారు తమ శరీర కాంతులచే సూర్యకాంతులను తక్కువ చేస్తున్నారు.

ఇలాంటి సమయంలో కశ్యపప్రజాపతి కన్నకుమారులను చూడాలని అనుకొని దితి మందిరానికి వచ్చి కుమారులను చూసి వారికి పేర్లు పెట్టాలనుకున్నాడు.

మ. దితి జఠరంబునందుఁ దన తేజము మున్నిడినట్టి పుత్త్రు న ద్భుత చరితున్ "హిరణ్యకశిపుం" డనుపేరఁ, బ్రసూతి వేళనా దితి మును గన్న పట్టి రవితేజునిఁ "గాంచనలోచనుండు" నా హితమతిఁ బేరు వెట్టి చనియెన్ నిజ నిర్మల పుణ్యభూమికిన్.

611

తా॥ దితీదేవి గర్భంలో తాను సంతానాన్నికోరి మొదట ఉంచిన తన తేజస్సువల్ల కలిగిన పుత్రునికి "హిరణ్యకశిపుడు" అని; జనన సమయంలో దితి మొదట కన్నటువంటి కుమారుడు, సూర్యునితో సమానమైన తేజస్సు కలవానికి "హిరణ్యాక్షుడు" అని మంచి మనస్సుతో పేరుపెట్టాడు. పిమ్మట ఆయన ప్రశాంతము, పవిత్రము, పుణ్యప్రదము అయిన తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

వ. అయ్యవసరంబున నతుల తేజో విరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భ వరదాన గర్వంబునను, దుర్వార పరిపంథి గర్వ నిర్వాపణాఖర్వ భుజావిజృంభణంబునను నిఖీలలోక పాలాదుల జయించి స్వవశం బొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండె, తత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతిదివసంబుఁ జండ వేదండ శుండాదండ మండిత భుజాదండంబున గదాదండంబు

ధరియించి తన్ను నెదిరి కదనంబు సేయంజాలిన యరివీరునిం గానక భూలోకం బెల్లం గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖులైన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసన వరప్రదానంబు జింతించి హితులు సెలంగ నహితులు గలంగ మహిత వైజయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొరయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచువానిం గని భీతచిత్తులయి దేవతా గణంబులు గరుడునిం గని పఱచు నురగంబులుంబోలె నిజనివాసంబు లర్కనివాసంబులుం గాంచనావాసంబులుంగా నొనర్చి యెక్కడికేనిం జనిన.

612

తా॥ అప్పుడు సాటిలేని తేజస్సుతో ప్రకాశిస్తున్న హిరణ్యకశిపుడు బ్రహ్మ వల్ల తాను పొందిన వరాల గర్వం చేతను, వారించుటకు శక్యంకాని శత్రువీరుల గర్వాన్ని అణచివేయటంలో సాటిలేని పరాక్రమంతోను, అన్ని లోకాలను పాలించే వారిని జయించి తన వశంలో ఉంచుకున్నాడు. ఎక్కడా మృత్యుభయం లేక నిర్భయంగా ఉన్నాడు.

అతని సోదరుడైన హిరణ్యాక్షుడు ప్రతిరోజు మదగజం తొండంవంటి తన భుజంమీద గదాదండాన్ని ధరించి తన్ను ఎదిరించి యుద్ధం చెయ్యగలిగిన వైరివీరుణ్ణి కానక భూలోకం అంతా గాలించి చివరకు స్వర్గలోకం మీదకు దాడి చేశాడు. అక్కడ యుద్ధం అంటే విముఖత్వం చూపే దేవతలను చూశాడు. చూచి తనకు వనజాసనుడు ఇచ్చిన వరంవల్ల హితులు పొంగిపోయేటట్లు, శత్రువులు క్రుంగిపోయేటట్లు గొప్పదైన వైజయంతీమాల ధరించి, కాళ్ళకు గండపెండారములు నినదిస్తూ ఉండగా దేహకాంతులు దిక్కులను వెలిగిస్తూండగా వస్తూన్న వాడిని చూచారు దేవతలు. అలా వస్తూన్న హిరణ్యాక్షుణ్ణి చూసి సురగణం భయంతో వణకిపోతూ గరుత్మంతుణ్ణి చూసి వేగంగా పారిపోయే నాగులవలె పలాయనమయ్యారు. తాము నివసించే ఇళ్ళూ, వాకిళ్ళూ జిల్లేళ్ళకు ఉమ్మెత్తలకు అప్పచెప్పి తోచిన చోటికి పోయి తలదాచుకున్నారు.

ఉ. శౌర్యము వోవఁదట్టి, నిజసాధనముల్ దిగనాడి, విక్ర మౌ దార్యపరాక్రమక్రమము దప్పఁగ భీతిలి పాఱి రక్కటా, కార్యముఁ దప్పి నాకు లని గైకొని యార్చి సుమేరుపర్వత స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పిత భూరి భుజా విజృంభియై.

613

తా॥ "శౌర్యం నశించి, యుద్ధసాధనాలు వదలి, ఉదారత్వము, పరాక్రమాలు నిప్పులపాలు కాగా, చెయ్యవలసిన పని మాని భయంతో పారిపోయిన భీరులు" – అని దేవతలను నిందించి మేరుపర్వత ధీరుడైన హిరణ్యాక్షుడు గొప్పదైన భుజా విజృంభంతో సముద్రంలో ప్రవేశించాడు.

వ. ఇట్లు సొచ్చిన.

614

క. వరుణుని బలములు దనుజే, శ్వరుతేజముఁ దేఱిచూడఁజాలక శౌర్య స్ఫురణము సెడి యెందేనియుఁ, బఱచెం దజ్జలధి మధ్యభాగము నందున్.

615

తా॥ అలా ప్రవేశించగానే అక్కడున్న వరుణుని బలములు రాక్షసనాథుని తేజస్సును తేరిచూడలేక శౌర్యాన్ని కోల్పోయి ఆ జలధి మధ్యభాగంలో ఎక్కడో దాక్కున్నారు.

క. అమరారి విపుల నిశ్వా, సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో లములను విపుల గదా దం, డమునం బోనడఁచె నతిదృఢం బగు శక్తిన్.

616

తా॥ ఆ అసుర రాజు తన దీర్ఘమైన నిట్టూర్పులవల్ల పుట్టినటువంటి సముద్రంలోని కల్లోలాన్ని తన దృఢమైన శక్తిచేత గదాదండం ద్వారా పుట్టకుండా చేశాడు.

చ. మఱియును నమ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు వ త్సరములు గ్రీడ సల్పి రిపుసైన్య విదారణ శౌర్య ఖేలనా పరతఁ జరించి యవ్వరుణ పాలితమైన లసద్విభావరీ పురమున కేఁగి యందుఁ బరిపూర్ణత నున్న పయోధినాథునిన్.

617

తా॥ హిరణ్యాక్షుడు ఆ సముద్ర మధ్యంలో చాలా వత్సరాలు శత్రుసైన్యాన్ని చంపే క్రీడలో ఆడుకున్నాడు. ఆపై వరుణుడు పాలించే విభావరీ పురానికి వెళ్ళి అక్కడ నిండుకొలువులో మహావైభవంతో ఉన్న వరుణుడిని చూసాడు.

వ. మఱియును.

618

సీ. యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళ భు, వన పరిపాలుఁడై తనరుచున్న వరుణునిఁ గనుఁగొని పరిహసితోక్తుల, నిట్లను, విశ్వమం దెన్నఁగలుగు సకలలోకైక పాలకులలో నతి బలా, ధికుఁడని జగము నుతింపఁ దగిన శూరుండ విపుడు నీ పౌరుష మొప్పంగఁ, గదనరంగమున న న్నెదిరి చూడు,

తే. నీ భుజావిక్రమంబును బ్రాభవంబు, నడఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు పగతు జయమును వృద్ధియు బలము నాత్మ, బలముఁ దలపోసి దనుజుతో బవరమునకు.

619

తా॥ సముద్రంలో ఉన్న ప్రాణులన్నింటికి రాజై పాతాళ భువనాన్ని పరిపాలిస్తూన్న ఆ వరుణుని చూచి పరిహసిస్తూ ఇలా అన్నాడు: “ఈ విశ్వంలో ఉన్న రాజులందరిలో అత్యంత బలాధికుడవని ఈ జగత్తు పొగడతగిన శూరుడవైతే యుద్ధరంగంలో నన్నెదుర్కొని చూడు. నీ పేరుప్రతిష్ఠలను, భుజపరాక్రమాన్ని నశింప చేస్తాను.” ఆ రాక్షస రాజు మాటలకు వరుణుడు శత్రువు యొక్క జయమును, అభివృద్ధిని, బలాన్ని తన బలాన్ని పోల్చి చూసుకున్నాడు.

క. సమయము గాదని తన చి, త్తమునం గల రోషవహ్నిఁ దాలిమి యను తో యములం దగ నార్చుచు నుప, శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్.

620

తా॥ వానితో యుద్ధానికి తగిన సమయం కాదని చిత్తంలోని కోపాగ్నిని సహనం అనే నీటితో ఆర్పి ఆ దానవేంద్రుణ్ణి ఇలా ఉపశమించాడు:

చ. మనమున శాంతిఁ బూని, నియమంబున సంగర ముజ్జగించి యే ననయము నున్నవాఁడ, నిపు డాహవకేళిఁ జరింపరాదు, నీ ఘన భుజ విక్రమస్ఫురిత గాఢ విజృంభణమున్ జయింపఁ జా లిన ప్రతివీరు లెవ్వరును లేరు, ముకుందుఁడు దక్క నెక్కడన్

.

621

తా॥ "మనస్సులో శాంతిని కోరి యుద్ధాన్ని విడిచిపెట్టాలనే నియమంతో ఉన్న నేను నీతో రణరంగంలో పాల్గొనటం తగనిపని. నీ గొప్పదైన భుజ పరాక్రమ విజృంభణాన్ని అడ్డుకోగల ప్రతివీరుడు ఎవ్వరూలేరు... ఒక్క ముకుందుడు తప్ప.

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా నని మొనఁ బెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తి పెం పున సడిసన్న వీరుఁడని భూజనకోటి నుతించు, నందు వే చను, మతఁ డిచ్చు నీకు నని, సర్వముఁ దీఱెడు నంతమీఁదటన్.

622

తా॥ ఆ మహాత్ముడు ఇప్పుడు వైకుంఠంలో ఉన్నాడు. యుద్ధరంగంలో అనేకసార్లు తన భుజపరాక్రమంతో శత్రువులను జయించిన సాటిలేని వీరుడని జన సమూహం అతన్ని పొగడుతూ ఉంటుంది. నువ్వు అక్కడకు వెడితే నీ కోరిక నెరవేరుతుంది.

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక వీఁగి పాఱు నీ పందల వెంటఁబడ్డ మగపంతమె? సర్వశరణ్యుఁడైన గో విందుఁడు దీర్చు నీ పని వివేకవిహీన! చనంగ నోపుదే నందుల కేఁగు, మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్.

623

తా॥ నిందలకు ఓర్చుకొని యుద్ధరంగంలో నిలిచే ఓపిక లేక విడిచిపెట్టి పారిపోయే పిరికి పందల వెనకాల పడితే ఏం లాభం? అదీ ఒక మగతనమా? అందరికీ శరణిచ్చే గోవిందుడు నీ పని చక్కపెడతాడు! ఓ బుద్ధి హీనుడా! నువ్వు వెళ్ళ గలిగితే అక్కడికి వెళ్ళు. అతడు అమరులకు శత్రువులైన వారితో పోరాడి వాళ్ళని జయిస్తూనే ఉంటాడు.

వ. అదియునుం గాక.

624

క. పురుషాకృతిఁ బ్రతియుగమునః, బురుషోత్తముఁ డవతరించి భూరి భుజా వి స్ఫురణన్ దుష్ట నిశాటుల, హరియించుచు నుండు మునిగణార్చితపదుఁడై.

625

తా॥ అంతే కాకుండా పురుషాకృతిలో ప్రతి యుగంలోను ఆ పురుషోత్తముడు అవతరించి గొప్పదైన భుజపరాక్రమంతో దుష్టులైన అసురులను హరిస్తూ మునులను రక్షిస్తూనే ఉంటాడు.

ఉ. కావున నా విభుం దొడరి కయ్యము దయ్య మెఱుంగఁజేసి ర క్షోవర! నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సారమే యావళి కాశ్రయం బగుదు, వచ్చటి కిప్పుడ యేగుదేని నీ చేవయు లావు నేర్పడును, జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్.

626

తా॥ కనుక ఓ రాక్షస ప్రభువా! కయ్యం సంగతి దెయ్యానికి తెలుసు కాని నువ్వు ఆ

శ్రీహరిని ఎదురించు. నీ భుజబలం అంతా నశించి నేలకూలి కుక్కలకు ఆశ్రయమవుతావు. అచ్చటికిప్పుడు వెడితే నీ శౌర్యపరాక్రమాలు తెలుస్తాయి. తర్వాత జరగబోయేది చెప్పనక్కరలేదు.”

చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం డనయము మానసంబున భయం బొకయింతయు లేక, సంగరా వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనున్ జనా ర్దను ననుచున్ వికుంఠ నగరస్ఫుట సంచితమార్గవర్తి యై.

627

తా॥ అని వరుణుడు పలికే సరికి దురాగ్రహంతో హిరణ్యాక్షుడు మనస్సులో కించిత్తుకూడ భయం లేకుండ నేనిప్పుడే ఆ అమరులకు మిత్రుడు, అసురులకు శత్రువు అయిన జనార్దనుని ఎదిరిస్తాను అంటూ వైకుంఠం మీద దండయాత్రకు బయల్దేరాడు...

క. చను నవసరమున నారద, మునివరుఁ డెదు రేగుదెంచి ముదము దలిర్పన్ దనుజేంద్ర, యెందుఁ బోయెద, వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్.

628

తా॥ అలా వెడుతూన్న సమయంలో నారద మునీంద్రుడు ఎదురొచ్చి సంతోషంతో ‘ఎక్కడకు వెడుతున్నావు ఓ రాక్షసరాజా’ అని అడిగేసరికి అతనిలా అన్నాడు:

చ. సరసిరుహోదరుం దొడరి సంగర మే నొనరించి యిందిరా వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోద వి స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపురానువర్తినై యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవనేత కిట్లనున్.

629

తా॥ ‘నాభి స్థానంలో పద్మం ఉన్న ఆ ఇందిరానాథుణ్ణి, ఆ అంతంలేని వానిని

అంతమొందించి, అసురకులానికెల్లా సంతోషాన్ని కలగచెయ్యాలనే పట్టుదలతో వైకుంఠపురం వైపు వెడుతున్నాను' అనేసరికి ఆ మాటలు విన్న నారద మునీంద్రుడు ఆ దానవరాజుతో ఇలా అన్నాడు:

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు, భూ భరము వహింప నాదికిటి భావముఁ దాల్చి రసాతలంబునం దిరవుగ నున్నవాఁ, డచటి కేగఁగ నోపుదువేని నేగు మం దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్.

630

తా॥ 'అద్భుత పరాక్రమశాలి అయిన ఆ మహాత్ముడు వైకుంఠంలో నేడు లేడు. భూభారాన్ని భరించటం కోసం ఆది వరాహావతారాన్ని ఎత్తి రసాతలంలో స్థిరంగా ఉన్నాడు. అచటికి వెళ్ళగలిగితే వెళ్ళు. మీ రాక్షసకులాన్ని అంతం చెయ్యడానికి అవతారం ఎత్తిన ఆ విష్ణువుతో యుద్ధం తప్పక జరుగుతుంది.

## హిరణ్యాక్షుడు యజ్ఞవరాహమగు శ్రీహరితో యుద్ధం చేయుట

చ. అనవుడు దానవేంద్రుఁడు హుతాశను కైవడి మండి పద్మ లో చను నెదిరించు వేడుకలు సందడిఁగొల్ప ననల్పతేజుఁడై ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం జనియె రసాతలంబునకుఁ జండ భుజాబలదర్ప మేర్పడన్.

631

తా॥ అది విన్న దానవరాజు వీతిహోత్రునిలా మండిపడి ఆ శ్రీహరిని ఎదిరించాలనే అభిలాష అధికం కాగా మహాపరాక్రమంతో గొప్పదైన గదాదండం చేతిలో ధరించి మూడు లోకాలకు భయం కలిగే రూపంతో ప్రచండ భుజపరాక్రమాన్ని ప్రకటిస్తూ త్రుటిలో పాతాళానికి వెళ్ళాడు.

వ. చని జలమధ్యంబున.

632

క. దివిజారి యెదురఁ దగఁ గనె, నవిరళదంష్ట్రాభిరాము నమరలలామున్ గువలయ భరణోద్దామున్, సవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్.

633

తా॥ అలా వెళ్ళి జలమధ్యంలో దేవతలకు శత్రువైన హిరణ్యాక్షుడు తన యెట్టఎదుట వరాహరూపంలో ఉన్న విష్ణువును చూసాడు. ఆ ఆదివరాహం భయంకరమైన కోరలు కలిగి ఉంది. ఈ భూమండలాన్ని భరించడానికి సిద్ధమై ఉంది. యజ్ఞములతో కూడి ఉంది. నీటితో నిండిన మేఘంలా నల్లగా ఉంది.

ప. అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు.

634

క. వనజ రుచి సన్నిభము లగు, తన లోచనయుగళ దీప్తిఁ దనరఁ దదాలో కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁజేసెఁ దత్ క్షణమాత్రన్.

635

తా॥ ఆ సమయంలో వరాహరూపంలో ఉన్న శ్రీహరి పద్మములవంటి కన్నులుగల తన నేత్రకాంతిని వ్యాపింప చేస్తూ కేవలం తన చూపుల చేతనే ఆ హిరణ్యాక్షుని శరీర కాంతిని క్షణంలో హరించాడు.

ప. మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱులేని విహారంబునం జరియించునట్టి యెడ.

636

సీ. తుద మొదళ్లకుఁ జిక్కి తునిసి పాఱఁగ మోరఁ, గులశైలములఁ జిమ్ముఁ గొంత తడవు, బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ, గొమ్ములఁ దాటించుఁ గొంత తడవు, జలధు లేడును బంకసంకులంబై యింక, ఖురముల మట్టాడుఁ గొంత తడవు, ఉడురాజు సూర్యుండు నొక్క మూలకుఁ బోవఁ, గుఱుచ వాలము ద్రిప్పుఁ గొంత తడవు,

తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు, నెగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపు రేఁగి దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ, బంది మెల్లన రణపరిస్పంది యగుచు.

637

తా॥ ఆ ఆదివరాహం ఎవరూ అడ్డగించటానికి వీలులేని పరాక్రమంతో అడ్డులేకుండ విహరిస్తూ తుది మొదలు ఒక్కటై ఖండ ఖండాలుగా అయ్యేటట్లు తన మోరతో కుల పర్వతాలను చిమ్ముతూ కొంతసేపు బ్రహ్మాండ భాండం పగిలి చిల్లులు పడేటట్లు కొమ్ములతో కోరాడుతూ కొంతసేపు, సప్త సముద్రాలు రొచ్చుగుంటలై ఇంకిపోయేటట్లు కాలి గిట్టలతో మట్టిలో ఆడుకుంటూ కొంతసేపు, సూర్యచంద్రులిద్దరు ఒక మూలకు పోయేటట్లుగా తన పొట్టి తోకను

త్రిప్పుతూ కొంతసేపు కులుకుతూ, దూకుతూ, దాటుతూ, విజృంభిస్తూ, అతిశయిస్తూ, ఎగురుతూ నేలను త్రవ్వుతూ పెద్దపెద్ద కన్నాలు పెడుతూ, తన ఆధిక్యాన్ని ప్రదర్శిస్తూ ఇలా చెలరేగి పోయింది. దానిని చూసిన దానవరాజు గుండె తల్లడిల్లి పోయింది.

వ. మఱియును,

638

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశిత దంష్ట్రాగ్ర యుత వసుంధరుఁ డగుచుం దన కెదురేతేఁ గని య, వ్వనచర మే రీతి నిపుడు వనచర మయ్యెన్.

639

క. అని యాశ్చర్యభయంబులు, దన మనమునఁ దొంగలింప దనుజాధిపుఁ డి ట్లనియెన్ భీకరసూకర, తనువొంది చరించు దనుజ దర్పాపహుతోన్.

640

తా॥ కళ్ళల్లోంచి నిప్పులు రాలుతూ ఉండగా పదనైన కోరల చివర ఈ వసుంధరను మోస్తూ తనకు ఎదురుగా వస్తూన్న వరాహాన్ని చూసి; అడవులలో సంచరించే ఈ జంతువు జలాల్లో స్వేచ్ఛగా ఎలా తిరుగుతూ ఉన్నదో అని హిరణ్యాక్షుని మనస్సులో ఆశ్చర్య భయాలు వర్ధిల్లాయి. అంత ఆ దనుజ నాథుడు భయంకర సూకర రూపాన్ని ధరించి చరిస్తూన్న ఆ విష్ణువుతో ఇలా అన్నాడు:

క. ఘన సూకర! మూఢాత్మక!, వనరుహసంభూత దత్త వరదానమునం గనిన రసాతల గత భువి, యనయంబును నాయధీనమై వర్తించున్.

641

తా॥ 'తెలివిలేని ఓ సూకరమా! విధాత ఇచ్చిన శ్రేష్ఠమైన వరాలను అనుసరించి ఈ రసాతల గతమైన ఈ భూమండలం అంతా కూడా ఎప్పుడూ నా స్వాధీనంలో ఉంటుంది.

క. గొనకొని నీ వీ ధరణిం, గొని పోకుము, విడుము, కాక కొని యేగెద వేఁ గొనియెద నీ ప్రాణముఁ, గై, కొను నా వచనములు, చలము గొన నేమిటికిన్?

642

తా॥ నువ్వు ఈ ధరణీ మండలాన్ని తీసుకొని పోయే ప్రయత్నం చెయ్యకు! విడిచిపెట్టు! కాక తీసుకొని వెడతానంటావా నేను నీ ప్రాణాలు తీస్తాను. నా మాటలు పట్టించుకోకుండా ఎందుకు ప్రాణాలు పోగొట్టుకుంటావు?

క. మాయావి వగుచు నిప్పుడు, పాయక యీ పుడమిఁ జోరభావంబున నీ వీ యెడఁ గొనిపోఁ జూతునె, యాయత భుజబలముచేత నడఁపక యనుచున్.

643

తా॥ మాయావివై ఈ భూమండలాన్ని చోరునివలె నువ్వు దొంగిలించుకొని పోతూ ఉంటే నా భుజబలంతో నిన్ను అణచివెయ్యక చూస్తూ ఊరకుంటానా?

సీ. అవిరళ యోగ మాయాబలంబునఁ జేసి, యల్ప పౌరుషమున నలరు నిన్ను నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య, కులుల కెల్లను మోద మొలయఁ జేయుఁ జెలువేది మద్గదాశీర్ణుఁడ వగు నిన్నుఁ, గనుఁగొని దేవతాగణము లెల్ల నిర్మూలులై చాల నెఱి నశించెద రన్న, విని యజ్ఞపోత్రియై వెలయుచున్న

తే. హరి సరోజాతభవ ముఖామరుల కెల్ల, వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది నిశిత దంష్ట్రాగ్ర లసితయై నెగడు ధరణి, దేవితో నొప్పె నా దేవదేవుఁ డంత.

644

తా॥ యోగమాయాబలం వల్ల కొద్దిపాటి పౌరుషంతో సంతోషించే నిన్ను, ఇప్పుడు ఇక్కడే పాతిపెట్టి నా సహృదయులైన స్నేహితులకు, భృత్యులకు మోదాన్ని కలిగిస్తాను. నా

గదాఘాతంతో తల బ్రద్దలైన నిన్ను చూచి సురగణం అంతా మొదలు నరికిన చెట్లవలె నశిస్తారు. ఈ విధంగా హిరణ్యాక్షుడు పలికేసరికి విని యజ్ఞవరాహ రూపంలో ఉన్న శ్రీహరి బ్రహ్మేంద్రాది అమరులకందరికీ రాబోయే దురవస్థకు ఆత్మలో చింతించాడు. తక్షణం నిశితమైన తన కోరచివర వర్ధిల్ల ధరణీదేవితో ఆ దేవాది దేవుడు ప్రకాశించాడు.

క. సురరిపు వాక్యాంకుశముల, గురుకుపిత స్వాంతుఁ డగుచుఁ గొమరారె వసుం ధరతోడ భీతి నొందిన, కరిణిం గల కరికులేంద్రుకరణిం బెలుచన్.

645

తా॥ హిరణ్యాక్షుని మాటలనే అంకుశాల పోట్లకు మిక్కిలి కోపంతో ధరణీదేవితో కూడి బయటకి వచ్చిన ఆదివరాహం; భయపడిన ఆడ ఏనుగుతో కూడిన మదగజేంద్రుని వలె భాసించింది.

తే. నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంకరాకారలీల నరుగు భీషణ మఖవరాహావతార, మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక.

646

క. కరివెనుకఁ దగులు నక్రము, కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్ దురిత పయోనిధి తరికిం, గిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్.

647

తా॥ పదనైన తెల్లని దంతముల కాంతులు గగన మండలమంతా వ్యాపింపగా అబ్ధిజలాలనుండి బయటకు వచ్చాడు. భయంకరమైన యజ్ఞవరాహావతారాన్ని ధరించిన శ్రీమహా విష్ణువును మత్తమాతంగాన్ని వెంబడించే మొసలిలాగ హిరణ్యాక్షుడు వెంబడించాడు. అలా వచ్చిన హిరణ్యాక్షుడు దురితమనే పయోనిధిని దాటించినవాడు, వరాహ రూపాన్ని తాల్చిన వాడు, తన గిట్టలతో మేరువునుసైతం విదళించ కలిగిన వాడు అయిన శ్రీహరితో ఇలా అన్నాడు:

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం బొందెద నని తలఁచుచు నిటు, పందగతిం బాఱ బంటు పంతమె? నీకున్.

648

తా॥ 'ఎంత నిందించినా రోత పుట్టడం లేదు నీకు. లజ్జ అనేది లేదు. మోసం చేసి రణంలో గెలుద్దామని తలపోశావు. ఇప్పుడు పిరికివాడవై పారిపోవటం మగతనమా నీకు?'

వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపిత మానసుండై.

649

తా॥ అలా హిరణ్యాక్షుడు ఆక్షేపించేసరికి శ్రీహరి హృదయం కోపంతో నిండిపోయింది.

క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ దోయజనాభుఁడు దన బల, మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్.

650

తా॥ అప్పుడు అనాయాసంగా జలముల మీద భూమిని హరి తన బల ప్రభావాలతో నిలిపాడు. అది చూసి సురలు హర్షించారు.

తే. కుసుమముల వృష్టి బోరనఁ గురిసె; నంత, విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ, గడఁక వీతెంచె గంధర్వ గానరవము; నందితము లయ్యె నప్సరోనర్తనములు.

651

తా॥ గగనం నుండి కుసుమవృష్టి కురిసింది. ఎంతో విభవంతో దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులు గానం చెయ్యగా అప్సరసలు నృత్యం చేసారు.

వ. అయ్యవసరంబున నయ్యజ్ఞ వరాహమూర్తి ధరుండైన కమలలోచనుండు గనక కుండల

కేయూర గ్రైవేయ కటకాంగుళీయక భూషణ రోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుండై.

652

తా॥ ఆ వేళ యజ్ఞవరాహమూర్తి అయిన ఆ శ్రీహరి కనక కుండలాలు, కంఠహారములు, భుజకీర్తులు, కడియాలు, ఉంగరాలు ఇత్యాది అలంకారముల వెలుగులు గగనమండలమంతా ప్రసరింపగా సమర సన్నద్ధుడై నిలిచాడు.

చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచన నవ్య విచిత్ర వర్మ మిం పొనరఁగఁ దాల్చి దానవ నియుక్తదురుక్త నిశాత బాణముల్ దన ఘన మర్మముల్ గలఁప దానవహంత నితాంతశౌర్యుఁడై కనలుచు వచ్చు నద్దనుజుఁ గన్గొని రోష విభీషణాకృతిన్.

653

వ. ఒప్పియు నగుచు నిట్లనియె:

654

తా॥ గొప్పదైన గదను చేత ధరించి, నవ్యము విచిత్రము అయిన మణులతో కూడిన బంగారపు కవచాన్ని ఎంతో ఇంపుగా దాల్చిన శ్రీమన్నారాయణుడు; ఆ దానవుడు పలికిన చెడ్డమాటలనే క్రూర బాణములు తన హృదయాన్ని తాకగా అంతులేని పరాక్రమంతో కోపంచేత తేరిచూడటానికి వీలుకాని రూపంతో అతణ్ణి చూసి నవ్వుతూ ఇలా అన్నాడు:

మ. వినరా యోరి యమంగళాచరణ! యుద్వృత్తిన్ ననున్ నీమది న్ననయంబున్ వనగోచరంబగు మృగంబంచుం దలం తౌర, నే నెనయన్ వన్యమృగంబ నౌదు, బలిమి న్నేతెంచు నీబోటి యీ శునకశ్రేణి వధింతు నేఁడనిమొనన్ సోఁకోర్చి వర్తించినన్.

655

తా॥ 'ఓరీ! అశుభ కార్యాలు ఆచరించే నీచుడా! విను! గర్వంతో నన్ను నువ్వు అడవిలో

తిరిగే జంతువుగా తలుస్తున్నావు! నేను అడవి మృగాన్నే! కొవ్వెక్కి వచ్చే నీవంటి శునకాలను యుద్ధమ్యాహంలో వధిస్తాను.

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము; నీ కో ర్కులు నేఁడు దీర్తు; నూరక, తలపోయ వికత్థనంబు దగదు దురాత్మా!

656

తా॥ ఓ దురాత్మా! నీకు బలం ఉంటే నాతో యుద్ధంలో ఎదిరించడానికి సిద్ధపడు! నీ కోరికలు అన్నీ నేటితో తీరతాయి. ఊరకే స్తోత్రాలు చేసుకోవటం తగదు.

చ. విను, మది గాక సంగర వివేక విశారదులైన యట్టి స జ్జనములు మృత్యుపాశములఁ జాల నిబద్ధులు నయ్యు నీవలెన్ గొనకొని యాత్మసంస్తుతులకున్ ముద మందిరె? యేల యీ విక త్థనములు బంటుపంతములె దైత్యకులాధమ! యెన్ని చూడఁగన్.

657

తా॥ ఓ దైత్యకులాధమా! విను! యుద్ధంలో వివేకంగల సత్పురుషులు మరణపాశముల చేత బంధితులై ఉండికూడా నీవలె ఆత్మస్తుతి చేసుకొంటూ సంతోషించరు. ఎందుకు ఊరకే ఈ స్తోత్రపాఠాలు? ఇవి వీరుని లక్షణాలు కావు.

మ. ధృతిఁ బాతాళమునందు నీవనెడి సందీప్తోగ్ర నిక్షేప మే నతి దర్పంబునఁ గొందుఁ; జూడు మిదె, దేవారాతి! నన్నెన్నె దౌ గతలజ్జుండన దాఁగి యుండి రణముం గావింతు, యుష్మద్గదా వితతద్రావితుఁడన్న నన్నెదురుమా, వే తీర్తు నీ కోరికల్.

658

తా॥ పాతాళంలో నువ్వంటూన్న నిక్షేపాన్ని నేనతి గర్వంతో తీసుకుంటాను! ఓరీ! అసురా! నన్ను లజ్జావిహీనుడుగా భావించావు. నేను దాక్కొని నీతో యుద్ధం చేస్తానని, నువ్వు

గదత్రిప్పితే నేను భయపడి పారిపోతానని అనుకున్నావా! నీ కోరికలన్ని తీరుస్తాను! రా!

ఉ. ఎన్నఁ బదాతి యూథముల కెల్ల విభుండవు, పోటుబంటవై నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయబలంబు నాయువున్ మిన్నక కొందుఁ జూడు, మిది మేరగ మేదిని వీతదైత్యమై వన్నెకు నెక్కఁజేసెద నవార్యపరాక్రమ విక్రమంబునన్.

659

తా॥ నువ్వు కాలిబంటులకెల్ల నాయకుడవు. నువ్వు శూరుడవై నన్ను ఈ యుద్ధరంగంలో ఎదుర్కొంటే నీ బలాన్ని, ఆయువును నువ్వు చూస్తూండగానే తీసుకుంటాను. ఇది మొదలు నా పరాక్రమం చేత ఈ భూమండలాన్ని దైత్యులు లేని దానినిగా చేస్తాను.

చ. నను నెదురంగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం బును గలవేని నిల్వు రణభూమిని, నీ హితులైన వారికిం గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ య్యనఁ జనుపొమ్ము దానవకులాధమ! యూరక రజ్జు లేటికిన్?

660

తా॥ నన్ను ఎదుర్కొన గలిగిన గొప్ప శౌర్యధైర్యాలు, బలము ఉన్నట్లైతే రణరంగంలో నిలు! లేదా నీ హితులైన వారికి కన్నులలో దుఃఖాశ్రువులు రాకుండా ఉండాలనుకొంటే ఇక్కడనుండి త్వరగా వెళ్ళు. దానవకులాధమ! వ్యర్థభాషణం వలన ప్రయోజనం ఏముంటుంది.

క. నను నిట సంస్థాపించెద, నని పలికితి, వంతవాఁడ వౌదువు, నీకున్ నెనరైన చుట్టములఁ బొడ, గని రా యిదె యముని పురికిఁ గాఁపుర మరుగన్.

661

తా॥ నన్ను ఇక్కడే కప్పెడతానన్నావు. నువ్వంత వాడవే! నీకు అత్యంత ప్రేమికులైన చుట్టాలెవరైనా ఉంటే ఒకసారి చూసి రా! ఆ తరువాత వెంటనే యమపురికి కాపురం

వెదుదువుగాని!'

మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప ల్కిన హాసోక్తుల కుల్కి రోషమద సంగీభూత చేతస్కుఁడై కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁక ద్రొ క్కిన కృష్ణోరగ రాజు మాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్.

662

తా॥ అని ఈ ప్రకారం శ్రీహరి హిరణ్యాక్షున్ని అనుకరించి పలికిన హాస్యోక్తులకు హిరణ్యాక్షుడు ఉలికి పడ్డాడు. రోషము, గర్వము ఈ రెండు అతని మనస్సును ఆక్రమించగా కనుగ్రుడ్లు ముందుకురకగా కోపంతో తోక త్రొక్కిన త్రాచులా అయి మదిలో అశుభాన్ని శంకించాడు.

క. చలితేంద్రియుఁడై నిట్టూ, ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా కులమానసుఁడై గదఁగొని, జలజాక్షున కెదురు నడచె సాహస మొప్పన్.

663

తా॥ అతని ఇంద్రియాలన్నీ చలించాయి. నిట్టూర్పులు అధికమయ్యాయి. కోపంచేత కనుబొమలు ముడిపడగా, సాహసంతో జలజాక్షునకు ఎదురుగా వెళ్ళాడు.

వ. అత్తఱి హిరణ్యాక్షుం డతిభయంకరాకారుండై.

664

తా॥ ఆ సమయంలో హిరణ్యాక్షుడు అతి భయంకరంగా ఉన్నాడు.

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై మాధవున్ గుదియన్ వేసిన వ్రేటు గై కొనక రక్షోహంత శౌర్యోన్నతిన్ గదఁ గేలన్ ధరియించి దానిఁ దునుకల్ గావించినన్ దైత్యుఁ డు న్మదుఁడై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్.

665

తా॥ మదించిన ఆ రాక్షసరాజు గదను చాచి సమగ్రమైన క్రోధంతో మాధవుని కొట్టాడు. ఆ దెబ్బ తప్పించుకొని మాధవుడు శౌర్యంతో గదను చేతితో ఛిన్నాభిన్నం చేశాడు. తిరిగి దైత్యుడు రమావిభుని వధించే ఉద్దేశ్యంతో మరొక గదను తీసుకొని భయంకరంగా దెబ్బవేశాడు.

చ. అది దనుఁ దాఁకకుండ దనుజారి గదారణకోవిదక్రియా స్పదకరలాఘవ క్రమముఁ బైకొని చూపి విరోధి పేరురం బదరఁగ వేయ వాఁడు వివశాకుల భావము నొంది యంతలో మదిఁ దెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నా జనార్దనున్.

666

తా॥ ఆ గద తనను తాకకుండ గదాయుద్ధంలో విద్వాంసుడైన ఆ హరి కరలాఘవంతో దానిని పట్టుకొని తన శత్రువు అయిన ఆ దైత్యుని గొప్పదైన రొమ్ము అదిరేటట్లు కొట్టాడు. ఆ దెబ్బకు వాడు వివశుడై అంతలోనె తెలివితెచ్చుకొని తన ప్రత్యర్థి అయిన మాధవుని తిరిగి దెబ్బకొట్టాడు.

వ. ఇట్లు దలపడి యన్యోన్యజయకాంక్షల నితరేతరతుంగ తరంగ తాడితంబులగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ బరస్పర శుండాదండ ఘట్టితమదాంధ గంధ సింధుర యుగంబు చందంబున రోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున, నతిదర్పాతిరేకంబున నెదిర్చి ఱంకెలు వైచు మదవృషభంబుల రభసంబున, నసహ్య సింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణ మండల భ్రమణంబునం దిరిగి విపక్షు వక్షం బశనిసంకాశంబగు గదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి దనుజపరిసంధి ఫాలంబు నొప్పించె, నప్పుడమ్మేటి వీరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులఁ బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల

రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్రసిద్ధసాధ్య దేవగణంబుల తోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తం బసుర వరునితోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె.

667

తా॥ ఇలా హరి, హిరణ్యాక్షులు ఇద్దరూ ఎవరికి వాళ్ళే నెగ్గాలనే కాంక్షతో ఉత్తర దక్షిణ సముద్రాలు రెండూ తరంగముల చేత కొట్టుకుంటూన్నట్లు, మదపుటేనుగులు తొండములు సాచి దెబ్బలాడుకుంటున్నట్లు, రౌద్రంతో భయానకంగా తలపడే పెద్దపులులవలె, మితిమీరిన గర్వంతో రంకెలువేస్తూ ఎదుర్కొనే మదించిన ఆబోతులవలె, సహించడానికి వీలుకాని పరాక్రమంతో సింహాలవలె వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటున్నారు. హిరణ్యాక్షుడు ఎడమవైపు గిర్రున తిరిగే సరికి యజ్ఞవరాహం దక్షిణంవైపుకు తిరిగి శత్రువు యొక్క వక్షాన్ని పిడుగువంటి గదతో చీల్చాడు. ఆ గదాఘాతానికి వాడు మూర్ఛిల్లి, తిరిగి తెలివి తెచ్చుకొని లేచి రాక్షస శత్రువైన వరాహం యొక్క ఫాలభాగంమీద కొట్టి నొప్పించాడు. అప్పుడా గొప్ప వీరులు శరీరమంతా రక్తపుధారలు కారుతూ ఉండగా పుష్పించిన అశోక వృక్షాలను పోలి ఉన్నారు. ఈ ప్రకారంగా వారు దూరంగా తొలగిపోతూ, దగ్గరకు వస్తూ, పరస్పరం తిరస్కరిస్తూ, రక్తాన్ని వాసన చూస్తూ, ఒకరినొకరు పరిహాసమాడుకొంటూ ఇద్దరూ గదాయుద్ధం చేస్తున్నారు. ఆ సమయంలో ఆ బలశాలుల యుద్ధాన్ని చూడాలనే కోరికతో విరించి మునీంద్ర సిద్ధసాధ్యదేవతా గణాలందరితో కూడి అక్కడకు వచ్చాడు. వచ్చి ధరామండలం నిమిత్తం రాక్షస శ్రేష్ఠునితో పోరుతున్న యజ్ఞవరాహంతో ఇలా అన్నాడు:

ఉ. అంచిత దివ్యమూర్తి! పరమాత్మక! యీ కలుషాత్ముఁడైన న క్తంచరుఁ దస్మదీయ వరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా రించు మదించి యిట్టి విపరీత చరిత్రునిఁ ద్రుంప కిట్లుపే క్షించుట గాదు, వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్.

668

తా॥ ‘ఓ పరమేశ్వరా! హే దివ్యస్వరూపా! ఈ పాపాత్ముడైన అసురుడు నా యొక్క వరగర్వంచేత మదించి ఈ భువనాలన్నింటిని బాధిస్తున్నాడు. ఇట్టి విపరీత చర్యలు చేసేవానిని చంపకుండా ఉపేక్షించటం మంచిది కాదు. వీనిని వెంటనే బలి ఇచ్చి ఈ వసుంధరకు శుభాన్ని చేకూర్చు.

క. బాలుఁడు గరమున నుగ్ర, వ్యాళము ధరియించి యాడువడువున రక్షః పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతియే శుభప్రద! యింకన్.

669

తా॥ శుభాలను ఇచ్చేవాడా! పసిపిల్లవాడు తన చేతిలో భయంకరమైన పామును పట్టుకొని దానితో ఆడుకొనే విధంగా ఈ అసురుణ్ణి త్రుంచకుండా ఉపేక్షిస్తూ ఉండటం లోకాలకు శుభం కాదు.

అదియునుం గాక.

670

మ. అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే ననయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మే తెంచినన్ ఘనమాయా బలశాలియైన దనుజున్ ఖండింపఁగా రాదు గా వున నీవేళన త్రుంపు సజ్జనహిత ప్రోద్యోగ రక్తుండవై.

671

తా॥ అనఘా! ఈ పట్టపగలు అభిజిన్ముహూర్తంలో ఈ రాక్షసుని సంహరించకపోతే; సంధ్యాకాలం వస్తుంది. అది వస్తే గొప్పదైన మాయాబలంతో కూడిన దనుజుని ఖండించటం కుదరదు. కనుక సజ్జనులకు హితాన్ని చేకూర్చటంలో అనురాగంగల నువ్వు ఇప్పుడే వాడిని

సంహరించు.

క. అని సరసిజగర్భుఁడు వ, ల్కిన వచనము లర్థి విని, నిలింపులు గుంపుల్ గొని చూడ సస్మితానన, వనజము సెలువొంద నసురవరు కభిముఖుఁడై.

672

తే. పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష, నిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు ఘనగదాదండ మెత్తి రాక్షసుని హనువు, నుగ్రగతి మొత్తె వాఁడును నోసరించె.

673

తా॥ అని బ్రహ్మ పలికిన మాటలను విన్న దేవతలు గుంపులుగా నిలబడి చూస్తూ ఉండగా పుండరీకాక్షుడు నవ్వుముఖంతో ఆ దనుజేంద్రునికి అభిముఖుడయ్యాడు. తెల్లతామర రేకుల వంటి నారాయణుని కన్నులు గొప్పదైన కోపంచేత ఎర్ర తామరలుకాగా తన ఘనమైన గదను ఎత్తి ఆ రాక్షసుని పెళ్ళున కొట్టాడు. వాడు ఆ దెబ్బ తెలివిగా తప్పించుకున్నాడు.

క. పరువడి దితిసుతుఁ డతి భీ, కరగదఁ జేఁబూని చిత్రగతులను బద్మో
దరు డాసి చేతిగద సా, గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్.

674

తా॥ క్రమంగా దితి కుమారుడైన హిరణ్యాక్షుడు అతి భయంకరమైన గదను చేతబట్టి వివిధ రీతులలో విష్ణువును సమీపించి ఆయన చేతిలోని గదను సాగరమధ్యంలో పడేటట్లుగా దెబ్బకొట్టాడు.

వ. అంత.

675

తే. హరి నిరాయుధుఁడైన, సురారి సమర, ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబు దక్కి నిలిచి

చూచుచు నుండెను, నింగి యమర, వరుల హాహారవంబుల భరిత మయ్యె.

676

తా॥ అప్పుడు శ్రీహరి నిరాయుధుడయ్యేసరికి సురారి యుద్ధధర్మాన్ని మనస్సులో తలచి యుద్ధం మానేసి చూస్తూ నిలుచుండి పోయాడు. నింగి అంతా దేవతల హాహాకారాలతో నిండిపోయింది.

క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరు సంగర ధర్మమునకు సమధిక శౌర్య స్ఫురణకుఁ దన చిత్తంబునఁ, గర మాశ్చర్యంబు నొంది కడఁక దలిర్పన్.

677

తా॥ శ్రీహరి దనుజేశ్వరుని యుద్ధ ధర్మానికి, అధికమైన శౌర్యానికి తన మనస్సులో అత్యంత ఆశ్చర్యాన్ని పొంది, యత్నాన్ని మాత్రం మానలేదు.

మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా దితి సంతాన కులాటవీ మహిత సందీప్త ప్రభాశుక్రమున్, సతతోద్యజ్జయశబ్ద సన్ముఖర భాస్వచ్చక్రమున్, సంతతా శ్రిత నిర్వక్రముఁ, బాలితప్రకట ధాత్రీచక్రముం జక్రమున్.

678

తా॥ ఈ ధరణీ చక్రాన్ని రక్షించి దానవ రాజైన హిరణ్యాక్షున్ని వధించటం కోసం తన ఆయుధమైన సుదర్శన చక్రాన్ని స్మరించాడు. ఆ చక్రం... దైత్యవంశమనే వనాన్ని తగలపెట్టేది. సతతము జయ జయ శబ్దాలతో మ్రోగేది. ఆశ్రయించిన వారికి అడ్డులేకుండ చేసేది. ధాత్రీ చక్రాన్ని పాలించేది.

వ. అదియునుం బ్రచండ మార్తాండ మండల ప్రభాపటల చటుల విద్యోతమానంబును, బటునట జ్వాలి కాపాస్త సమస్త కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహాగర్వాంధకారంబును,

నసహ్యకహ కహ నిన దాధరీకృత సాగర ఘోషంబును, సకల దేవతాగణ జేగీయ మానంబును, ననంత తేజో విరాజితంబును, నిజప్రభాపటల పూరిత బ్రహ్మాండ కటాహంబుననై రయంబునం జనుదెంచి, దనుజారి దక్షిణకర సరోజంబు నలంకరించిన నా శుభాంగుండు రథాంగపాణియై దివంబున నమరగణంబులు జయజయ శబ్దంబులు వలుక నసురవిభున కెదురు నడచిన,

679

తా॥ ఆ సుదర్శనం ప్రచండ సూర్యమండల కాంతులతో ప్రకాశించేది. కోపిష్ఠులైన శత్రువుల బాహువుల యొక్క గర్వమనే అంధకారాన్ని అణచివేసేది. భరింపశక్యంకాని "కహకహ" ధ్వనులతో సాగర ఘోషను సైతం జయించేది. అట్టి చక్రం దేవతా గణాల యొక్క జయజయ శబ్దాలతో శోభిల్లుతూ, అంతులేని తేజస్సుతో ప్రకాశిస్తూ, తన కాంతులతో బ్రహ్మాండాన్ని పూరిస్తూ అత్యంత వేగంగా వచ్చి అసురారికుడి చేతిని అలంకరించింది. అంత శుభలక్షణాలుగల శ్రీహరి రథచక్రం వంటి సుదర్శన చక్రాన్ని ధరించి స్వర్గంలో అమరులు జయజయ ధ్వానాలు పలుకుతూ ఉండగా హిరణ్యాక్షునికి ఎదురుగా వచ్చాడు.

క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁ బొలివోని బంటుతనమున బీరం బుడుగక భీషణగదఁ గొని, యడిచెన్ మఖమయవరాహు నమితోత్సాహున్.

680

తా॥ అలా చక్రహస్తుడై వస్తున్న యజ్ఞవరాహమూర్తిని చూసిన అసురుడు పెదవులు తడుపుకుంటూ వ్యర్థంకాని బంటుతనంతో, పరాక్రమంతో భయంకరమైన గదను పైకెత్తి ఉత్సాహంతో ఎదురు వచ్చే యజ్ఞవరాహాన్ని కొట్టాడు.

క. త్రిదశారి దన్ను వ్రేసిన, గదఁ బదమునఁ బోవఁ దన్ని కమలాక్షుఁడు పెం పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదనకమలముఁ బొదువన్.

681

తా॥ రాక్షస రాజు తనను కొట్టిన దెబ్బకు మాధవుడు ఆనందంగా లేతనవ్వు వదన కమలం మీద వ్యాపింపగా తన కాలితో రాక్షసుడు విసిరిన గదను ఎక్కడకో పోయి పడేటట్లు ఒక్క తన్ను తన్నాడు.

వ. ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె:

682

తా॥ ఈ విధంగా గదను దూరంగా తన్ని అసుర రాజుతో ఇలా అన్నాడు:

చ. ఘనగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు రార! యనివారణ దైత్యకులేశ్వరాధమా!
యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె, వ్రేసినం
దనుజవిభేది వట్టికొనెఁ దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్.

683

తా॥ 'గొప్పదైన గదాదండాన్ని చేతపట్టి భుజగర్వంతో నన్ను యుద్ధంలో ఎదుర్కొందామని వచ్చావుగా! రారా! దైత్యకులంలో పుట్టిన అధముడవు నీవు!' అని అనేసరికి ఆ అసురుడు మరొక గదతో శ్రీహరిని ఒక దెబ్బవేశాడు. ఆయన ఆ గదాదండాన్ని; గరుత్మంతుడు ఒక త్రాచు పామును పట్టుకున్నట్లుగా నేర్పుగా పట్టుకున్నాడు.

క. దితిజుఁడు దనబల మప్రతి, హతతేజుం డగు సరోరుహాక్షుని శౌర్యో న్నతిమీఁదఁ బెట్టకుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము పేర్మిన్.

684

తా॥ ఎదుర్కోవడానికి వీలుకాని శ్రీమహా విష్ణువు శౌర్యం ముందు తన బలం ఎందుకు

కొరగానిదన్న విషయం తన మనస్సులో ఎరిగి కూడా ఆ అసురుడు గర్వంతో తలపడ్డాడు.

వ. అంత.

685

సీ. కాలానలజ్వల జ్జ్వాలా విలోల క, రాళమై పెంపొందు శూల మంది సురవైరి యజ్ఞసూకర రూపధరుఁడైన, వనజనాభుని మీఁదవైవ నదియు సద్ద్విజోత్తము మీఁద జపలతఁ గావించు, నభిచార కర్మంబునట్ల బెండు పడి పఱతేఁ గని పద్మోదరుఁడు దానిఁ, జక్ర ధారాహతిఁ జండ విక్ర

తే. మమున నడుమన వడిఁ ద్రుంచె, నమరభర్త, మహిత దంభోళిచే గరుత్మంతు పక్ష మతిరయంబునఁ ద్రుంచిన గతిఁ జెలంగి, సురలు మోదింప నసురులు సొంపు డింప.

686

తా॥ తలపడి... కాలానల జ్వాలలవలె వెరపు పుట్టించే భయంకరమైన శూలాన్ని ఆదివరాహరూప ధరుడైన హరిమీద వేశాడు. కాని అది బ్రాహ్మణుని మీద చపలతతో ప్రయోగించిన హింసార్థమైన హోమకర్మంవలె నిస్సారమై పోయింది. ఇంద్రుడు గొప్పదైన తన వజ్రాయుధంచే గరుడుని రెక్కలోని ఈకను అత్యంత వేగంగా త్రుంచినట్లు తన చక్రాయుధంతో ఆ శూలాన్ని వడివడిగా ఖండించాడు. దానికి దేవతలు ఆనందించారు. అసురులు దుఃఖించారు.

వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని.

687

తా॥ అప్పుడు ఆ రాక్షసుడు తన ఆయుధమైన శూలం హరియొక్క ఆయుధమైన చక్రంచేత పనికిరాకుండ పోవడాన్ని చూసాడు.

క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతినిష్ఠుర ముష్టిఁ బొడిచె హరి, నా లోకో న్నతుఁ డొప్పెఁ

గుసుమమాలా, హతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁడై.

688

తా॥ ఆ దైత్యుడు మిక్కిలి కోపంతో అతి కఠినమైన తన పిడికిలితో శ్రీహరిని బలంగా పొడిచాడు. కుసుమమాల తాకిన గజరాజువలె అతి దర్పంతో విరాజిల్లాడు శ్రీమన్నారాయణుడు.

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్ ధరణీ చక్రము భూరిపాంసు పటల ధ్వాంతంబునం గప్పె, భీ కర పాషాణ పురీష మూత్ర ఘనదుర్గంధాస్థి రక్తావళుల్ గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాక్షోభ క్రియాలోలమై.

689

తా॥ పుండరీకాక్షుని మీద రాక్షసుడు మాయా సమూహాన్ని పుట్టించాడు. ఈ ధరణీ మండలమంతా ఎక్కువ దుమ్ముతోను, చిమ్మచీకటితోను నిండిపోయింది. భీకరమైన పెద్దపెద్ద రాళ్ళు, కుప్పలుగా మలమూత్రాలు, దుర్గంధంతో ఎముకలు, అంతులేని రక్త ప్రవాహాలు కురుస్తూ మేఘాలు గగనమంతా వ్యాపించి మహాక్షోభను పుట్టించాయి.

వ. మఱియును.

690

చ. తవిలి విముక్త కేశపరిధానము లుగ్రకరాళదంత తా లువులును రక్తలోచనములుం గల భూత పిశాచడాకినీ నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా రవముగ యక్షదైత్య చతురంగ బలంబులఁ గూడి తోఁచినన్.

691

తా॥ అంతే కాకుండా భూతాలు, పిశాచములు, డాకినులు జుట్టు ముడివేసుకోకుండ, ఒంటి మీద గుడ్డపోచ లేకుండ, భయం కలిగించే దంతాలతోను దౌడలతోను, ఎర్రని

నేత్రాలతోను గుంపులుగా అంతరిక్షంలో నిలిచి ఆయుధాలు ధరించి గొడవ చేస్తూ యక్ష దైత్య చతురంగ బలాలతో కూడి కనిపించాయి.

వ. అంత.

692

క. త్రిసవన పాదుండగు నా, బిసరుహనేత్రుండు లోకభీకరమగు నా యసురాధిపు మాయావి ని, రసనకరంబైన శస్త్రరాజముఁ బనిచెన్.

693

తా॥ అప్పుడు ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం ఈ మూడు కాలాల్లోను యజ్ఞమూర్తి అయిన ఆదివరాహం లోక భయంకరమైన ఆ అసురాధిపు మాయాజాలాన్ని పటాపంచలు చేసే శస్త్రరాజమైన చక్రాన్ని ప్రయోగించాడు.

క. ఆ చక్రభానుదీప్తి ధ, రా చక్రమునందు నిండి రయమున నమ్మా యాచక్రము నడఁగించెను, నీచక్రముఁడైన యామినీచరు నెదురన్.

694

తా॥ సూర్యుని వంటి సుదర్శన చక్రం యొక్క దీప్తులు భూతలం అంతటా నిండి వెంటనే ఆ అసురుని మాయా ఆవరణాన్ని అణచివేసింది.

వ. అంత నిక్కడ.

695

క. దితి తన విభు వాక్యంబుల, గతి దప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో ణితధార లొలికె రక్షః, పతి యగు కనకాక్షు పతన భావము దోఁపన్.

696

తా॥ అంత నిక్కడ ఆ సమయంలో దితీదేవి తన భర్త అయిన కశ్యప ప్రజాపతి వాక్యములు తప్పవా అని తలపోస్తూన్న ఆమె స్తనములనుండి రక్తధారలు ఒలికాయి. ఆ దృశ్యం హిరణ్యాక్షుని పతనాన్ని స్ఫురింప చేసింది.

వ. అయ్యవసరంబున నసురవిభుండు దన చేసిన మాయాశతంబులు గృతఘ్నునకుం గావించిన యుపకారంబులుంబోలె హరిమీఁదఁ బనిసేయక విఫలంబు లయినం బొలివోవని బంటు తనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరి వక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగు ముష్టిం బొడిచిన నసురాంతకుండు మిసిమింతుండు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రివజ్ర సన్నిభంబగు నఱచేతం గఱకు టసుర కటితటంబుఁ జటులగతి వ్రేసిన నా హిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి యుదస్త లోచనుండై సోలి యెట్టకేలకు నెదుర నిలువం బడె, నంత.

697

తా॥ అప్పుడు ఆ రాక్షసరాజు తను చేసిన వందల కొలది మాయలు 'కృతఘ్నునకు కావించిన ఉపకారముల' వలె శ్రీహరి మీద ఏమీ పనిచేయక అన్నీ విఫలం అయ్యాయి. భంగపాటు లేని బంటుతనంతో పుండరీకాక్షుని దగ్గరకు వచ్చి బాహువులు సాచి వరాహమూర్తి వక్షస్థలాన్ని పొడిచి పీడించాడు. అంత మాధవుడు ప్రక్కకు తప్పుకున్నాడు. తిరిగి దైత్యుడు కఠినమైన పిడికిలితో గోవిందుణ్ణి ఒక్క పోటు పొడిచేసరికి హరి అలసిపోక, కోపమే రూపుదాల్చిన విధంగా, దేవేంద్రుడు వృత్రాసురుని సంహరించినట్టు వజ్రాయుధం వంటి తన అరచేతితో 'చెళ్ళు' మనేటట్లు చెంపమీద చరిచాడు. ఆ దెబ్బకు హిరణ్యాక్షుడు గిరగిర తిరిగి సోలి కళ్ళు కనుపించక అతి కష్టంమీద తట్టుకుని ఎదురుగా నిలబడ్డాడు.

క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్, దంష్ట్రావిభిన్న శత్రుమహోర స్తటికిన్, ఖర ఖురపుటికిం, గటితటహత కమలజాండ ఘటికిం, గిటికిన్.

698

తా॥ ధైర్యం చెడి లొంగిపోయిన దైత్యునికి మెడమీద వ్రేలాడే జూలుతో, శత్రువుల గుండెలు చీల్చే కోరలతో, పదునైన గిట్టలతో, తన కటి ప్రదేశంతో బ్రహ్మాండాన్ని పెటపెట లాడిస్తూ ఆ వరాహం అతి భయంకరంగా కన్పించింది.

వ. ఇట్లు లోఁబడిన.

699

మ. దివి నింద్రాదులు సంతసింప హరిమొత్తెం గర్ణమూలంబునం బవి సంకాశ కఠోరహస్తమున శుంభల్లీలమై దాన దా నవలోకేశుఁ డుదస్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లఁగా భువిమీఁదన్ వడిఁగూలె మారుతహతోన్మూలావనీజాకృతిన్.

700

తా॥ అలా లోబడిన దానవరాజు గూబమీద, ఇంద్రాది దేవతలంతా సంతోషించేటట్లు వజ్ర సమానమైన తన కఠోర హస్తంచేత దెబ్బ కొట్టాడు. శ్రీహరి కొట్టిన దెబ్బకు కళ్ళు తేలేసి దైన్యంగా గాలిదెబ్బకు నేలకూలే వటవృక్షంలా నేలకూలాడు.

క. బుడ బుడ నెత్తురు గ్రక్కుచు, వెడ రూపము దాల్చి గ్రుడ్లు వెలికుఱుక, నిలం బడి పండ్లు గీటు కొనుచును, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్.

701

తా॥ ఆ దైత్య వీరుడు నెత్తురు కక్కుతూ వికృతమైన ఆకారంతో, గ్రుడ్లు వెలుపలికి రాగా, నేలపై పడి పండ్లు గీటుకొంటూ ప్రాణాలు వదిలాడు.

తే. పడిన దనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ, వాది దివిజులు వెఱఁగంది; రాత్మలందు నితఁడు వొందుట యెట్లొకో యీ యవస్థ, నని తలంచుచు మఱియు నిట్లనిరి వరుస.

తా॥ అలా పడిన దనుజేశ్వరుని చూచి పద్మసంభవాది దేవతలు అతని స్థితికి చాలా ఆశ్చర్యాన్ని పొంది ఇలా అనుకున్నారు:

మ. వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు స్థిరతన్ లింగశరీర భంగమునకై చింతింతు, రా పంకజో దరు పాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్ దర్శించుచుం జచ్చె దు ర్భరితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో.

703

తా॥ 'శ్రేష్ఠమైన యోగిపుంగవులు యోగమార్గంచేత ఏ మహానుభావుణ్ణి తమ మనస్సులో సుస్థిరం చేసుకుని ఈ లింగశరీరం భంగం కావడానికి ప్రార్థిస్తూ ఉంటారో; ఆ శ్రీహరి ముఖారవిందాన్ని దర్శిస్తూ చనిపోయిన ఈ దానవ రాజు చేసిన పుణ్యం ఎంత గొప్పదో?

చ. సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్, మునీంద్ర శా పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే సమయుట జేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్.

704

తా॥ శ్రీ మహావిష్ణువు ద్వారపాలకులు వీరు. మునీంద్రుల శాపంచేత నికృష్టమైన రాక్షస జన్మ ఎత్తారు. విష్ణువు చేతిలో హతులై తదుపరి జన్మలో హరియొక్క శాశ్వత నివాసమైన వైకుంఠంలో నిత్యనివాసం చేస్తారు. వీరికెప్పటికీ జనన మరణాలు లేవు.'

క. అని వెఱఁగు నొంది పావన, తను వొందిన యట్టి వికచతామరసాక్షు న్ననిమిష ముని యోగిజనా, వనదక్షున్ దనుజకరటి వరహర్యక్షున్.

705

వ. కనుంగొని.

706

తా॥ బ్రహ్మాది దేవతలు ఈ ప్రకారం అనుకొని ఆశ్చర్యంతో పావనమైన శరీరాన్ని పొందిన వాడు, పద్మముల వంటి కన్నులు గలవాడు, అనిమిషులు, మునులు, యోగులను రక్షించుటలో దక్షుడైనవాడు, దనుజులనే ఏనుగులను శిక్షించుటలో సింహం వంటివాడు అయిన స్వామిని దర్శించారు.

చ. వనజదళాక్ష! యీ జగతివారల మర్మము లీ వెఱింగి యీ సునఁ బగఁబట్టు నీ దివిజసూదనుఁ జంపితి గాన యింక శో భన మగునంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్ వినమితులై నుతించిరి వివేక విశాలునిఁ బుణ్యశీలునిన్.

707

తా॥ అలా దర్శించిన దేవతలు "ఓ కమలదళాక్షా! ఈ సృష్టిలోని ప్రాణుల మర్మములన్నీ నీకు తెలుసు. ఈర్ష్యచే పగబట్టిన ఈ రాక్షసుణ్ణి సంహరించావు. కనుక ఇక అందరికీ అన్నీ శుభాలే కలుగుతాయి" — అని హస్తములు నుదుటకు చేర్చి నమ్రంగా వివేకశాలి, పుణ్యాత్ముడు అయిన శ్రీహరికి అందరు వినమ్రులై నమస్కరించారు.

వ. అంత.

708

చ. సవన వరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచినమీఁద భారతీ ధవముఖ దేవతాముని కదంబము దన్ను నుతించునట్టి సం స్తవమున కాత్మలోనఁ బ్రమదంబును బొంది సమగ్ర మంగళో త్సవము దలిర్ప నందఱుఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్.

709

తా॥ ఈ విధంగా యజ్ఞవరాహమూర్తి దేవతావిరోధియైన రాక్షస రాజును చంపినందుకు బ్రహ్మాది దేవతలు మునీశ్వరులు ఆయనను స్తుతించారు. ఆ స్తుతులకు ఆయన మనస్సులో ఎంతో ఆనందాన్ని పొంది సంపూర్ణ మంగళ మహోత్సవంలో అనుగ్రహ దృష్టులతో చూసాడు.

చ. అరిగె వికుంఠ ధామమున క మ్మహితోత్సవ సూచకంబుఁగా మొరసె సుపర్వదుందుభు లమోఘములై, ధరణీతలంబునం గురిసెఁ బ్రసూనవృష్టి, శిఖీకుండము లెల్లెడఁ దేజరిల్లె, భా స్కరశశి మండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్.

710

తా॥ ఆ వైకుంఠంలో ఉత్సవ ప్రారంభ సూచకంగా దేవదుంధుభులు ఘనంగా మ్రోగాయి. భూమిమీద పుష్పవర్షం కురిసింది. హోమగుండాలు అగ్నితో తేజరిల్లాయి. సూర్యచంద్ర మండలాలు నిజకాంతులతో ప్రకాశించాయి."

క. అని యీ పుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు ద్రిదివవాసులకుం జె ప్పిన యది మైత్రేయుఁడు విదు, రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్.

711

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁజెప్పె నని సూతుఁడు శౌ నక ముఖ్యులైన మునివరు, లకుఁ దెలియఁగఁ జెప్పె మఱియు లాలన మొప్పన్.

712

తా॥ బ్రహ్మ దేవతలకు చెప్పిన ఈ పుణ్య చరిత్రను మైత్రేయుడు విదురునకు వినిపించాడు. దానిని శుక యోగీంద్రుడు పరీక్షిన్మహరాజుకు మంచి మనస్సుతో వినిపించాడు అని సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు.

వ. ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె నని.

713

తా॥ అని ఇలా మైత్రేయుడు చెప్పగా విని విదురుడు సంతోషించాడు.

క. అనఘంబగు నీ చరితము, వినినఁ బఠించిన లభించు విశ్రుత కీర్తుల్
వనజోదరు పదభ క్తియుఁ, మునుకొని యిహపర సుసౌఖ్యములు జనములకున్.

714

తా॥ 'పాప చింతన లేని ఈ చరిత్రను విన్నా, పఠించినా లోకులకు కీర్తి, హరిభక్తి, ఈ లోకంలోను పరలోకంలోను సుఖాలు లభిస్తాయి.'

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె. నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని "మునీంద్రా, హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందిన విధంబును, స్వాయంభువ మనువుం బుట్టించిన యనంతరంబున విరించి దిర్యగ్జాతిజంతు సృష్టినిమిత్తంబులైన మార్గంబు లెన్ని సృజించె, మహాభాగవతోత్తముం డయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనులగు ధృతరాష్ట్ర పుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముం డగుచుఁ దనమనోవాక్కాయ కర్మంబులు గృష్ణునంద చేర్చి భాగవత జనోపాసకుండై పుణ్యతీర్థ సేవా సమాలబ్ధయశో విగత కల్మషుం డగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నంబు లడిగె? నవి యెల్లం దెలియ నానతి" మ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

715

తా॥ అని చెప్పి తిరిగి సూతుడు మహర్షులతో ఇట్లా అన్నాడు: 'ఆ విధంగా పరీక్షిన్నరేంద్రుడు శుక మహర్షిని చూసి "మునీంద్రా! హిరణ్యాక్షుడు సంహరింపబడిన తరువాత భూమి చక్కని సమస్థితిని పొందిన విధానాన్ని గురించి చెప్పు! స్వాయంభువ మనువును పుట్టించిన తరువాత విరించి పశుపక్ష్యాదులను సృష్టించడానికి ఎన్ని పద్ధతులను కల్పించాడో

మాకు చెప్పు. మహాభాగవతోత్తముడైన విదురుడు కృష్ణునకు అపకారం చేయ తలచిన పాపవర్తనులైన ధృతరాష్ట్ర పుత్రులను విడిచి వెళ్ళినట్లు చెప్పావు గదా! ఆయన తన జనకుడైన వేదవ్యాసునితో సముడగుచు తన మనోవాక్కాయ కర్మలను కృష్ణుని యందు చేర్చి భక్తులను ఆరాధిస్తూ పుణ్యతీర్థాలు సేవిస్తూ పాపాలను పోగొట్టుకుని మైత్రేయ మహామునిని ఇంకా ఏమని ప్రశ్నించాడు? ఆ విషయాలన్ని నాకు తెలిసేటట్లుగా చెప్పండి' అని అడిగాడు.

సీ. విమలాత్ముఁడైన యవ్విదురుండు మైత్రేయ, మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ జతురాత్మ! సకల ప్రజాపతి యైనట్టి, జలజగర్భుఁడు ప్రజాసర్గమందు మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ, జిత్తమం దేమి సృజింపఁ దలంచె? మును సృజించిన యట్టి మును లమ్మరీచ్యాదు, లబ్జజు నాదేశ మాత్మ నిలిపి

తే. యర్థి నెట్లు సృజించిరి యఖిల జగము?, మెఱసి మఱి వారు భార్యాసమేతు లగుచు నేమి సృజియించి? రదిగాక కామినులను, బాసి యేమి సృజించి రా భద్రయశులు?

716

తా॥ పవిత్ర హృదయుడైన విదురుడు మైత్రేయుణ్ణి చూసి ప్రీతితో ఇట్లా అన్నాడు: "ఓ మహాత్మా! సకల ప్రజాపతి అయిన బ్రహ్మ ప్రజలను సృష్టించటం కొరకు ముందు ప్రజాపతులను పుట్టించాడు కదా! తరువాత ఏమి సృజించాలని అనుకున్నాడు. ముందు సృజించిన మరీచ్యాది మునులు బ్రహ్మదేవుని ఆదేశానుసారం అఖిల జగత్తును ఎట్లా సృష్టించారు. ఆ ప్రజాపతులు భార్యాసమేతులై ఏం సృష్టించారు. ఆపై స్త్రీలు లేకుండా ఏం సృష్టించారు?

క. అందఱుఁ దమలో నైక్యముఁ, జెందినచో నేమి దగ సృజించిరి? కరుణా కందళిత హృదయ! యిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపు మయ్య బుధనుత! నాకున్.

717

తా॥ ఓ దయార్ద్ర హృదయా! సజ్జనులచే కీర్తించబడే మహర్షీ! మైత్రేయా! వారందరూ

ఐక్యమై ఏం సృష్టించారు? అవన్నీ వివరంగా నాకు తెలియచెప్పండి.”

## చతుర్ముఖబ్రహ్మ కావించు యక్షాది దేవతాగణ సృష్టిని తెలుపుట

సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్ట, పరుఁడు మాయాయుక్త పురుషవరుఁడుఁ గాలాత్మకుఁడు నను కారణంబున నిర్వి, కారుఁ డైనట్టి జగన్నివాసుఁ డాది జాతక్షోభుఁ డయ్యె, నమ్మేటి వ, లనను గుణత్రయంబును జనించె; నా గుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ, మది రజోగుణ హేతువైన దాని

తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ, బొడమె, మఱి దానివలనఁ బ్రభూత మయ్యెఁ బంచతన్మాత్ర, లందు సంభవము నొందె, భూత పంచక మీ సృష్టి హేతు వగుచు.

718

తా॥ అప్పుడు విదురునితో మైత్రేయుడు ఇలా అన్నాడు: "సృష్టికర్త జీవులకు అగోచరుడు. ఆ పురుషోత్తముడు మాయతో కూడి ఉంటాడు. కాల స్వరూపుడు. అందువల్ల అతడు నిర్వికారుడు. అట్టి జగన్నివాసుడు ఆదిలో సృష్టి ఎట్లా చేసేది? అని తీవ్రంగా ఆలోచించాడు. అప్పుడాయన నుండి సత్త్వము, రజస్సు, తమము అనే మూడు గుణాలు పుట్టాయి. ఆ గుణత్రయంలో రజోగుణం నుండి మహత్తత్త్వం పుట్టింది. ఆ మహత్తత్త్వం నుండి మూడు గుణాల అంశలతో అహంకారం పుట్టింది. అహంకారం నుండి పంచతన్మాత్రలు, దానినుండి పంచభూతములు పుట్టాయి. ఈ పంచభూతాలే సృష్టికి హేతువు.

వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువన నిర్మాణ కర్మంబునకు సమర్థంబులు గాక యన్నింటసంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించె, నదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండె నంత.

719

తా॥ సృష్టి నిర్మాణానికి హేతువులే, కాని ప్రత్యేకంగా భువన నిర్మాణ కర్మకు పంచభూతాలలో ఏ ఒక్క దానికి సామర్థ్యం లేదు. అవన్నీ కలిసి పాంచభౌతికమైన బంగారు

గ్రుడ్డును సృజించాయి. ఆ గ్రుడ్డు మహాజలాలలో వృద్ధి పొందుతూ ఉన్నది.

సీ. నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు, సాహస్రదివ్య వర్షంబు లోలి వసియించి యుండె, నా వాసుదేవుని నాభి, యందు సహస్రసూర్యప్రదీప్తిఁ దనరుచు సకల జీవ నికాయయుత మగు, పంకజాతంబు సంభవము నొందె, బరఁగంగ నందులో భగవదధిష్ఠితుం, డై స్వరాట్టగు చతురాననుండు

తే. జనన మందెను తత్పద్మసంభవుండు, నామరూప గుణాది సంజ్ఞాసమేతుఁ డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు.

720

తా॥ ఆ హిరణ్మయ అండాన్ని "నారాయణుడు" అనే పేరుతో పరబ్రహ్మం వెయ్యి దివ్య వత్సరాలు అధిష్ఠించి ఉన్నాడు. ఆ నారాయణుని నాభినుండి వేయి సూర్యుల కాంతితో సకల జీవులకు ఆశ్రయభూతమైన ఒక పద్మం పుట్టింది. దానిని ఆశ్రయించుకొని స్వరాట్టగు చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు. స్వయం ప్రకాశరూపుడగు ఆ పద్మసంభవుడు నామములు, రూపములు, గుణములు అనే సంజ్ఞలతో కూడి అఖిల జగత్తును సృష్టించాడు.

సీ. తామిస్రమును నంధతామిస్రమును దమ, మును మోహనము మహామోహనంబు నను పంచమోహ రూపాత్మకమైన య, విద్యఁ బుట్టించి యవ్వేళఁ దనకు నది తమోమయదేహ మని ధాత రోసి త, త్తనువు విసర్జించె, ధాతృముక్త దేహంబు సతతం క్షుత్తృష్ణల కావాస, మును రాత్రిమయము నయ్యెను దలంప,

తే. నందులో యక్షరక్షస్సు లన జనింప, వారి కప్పుడు క్షుత్తృషల్ వఱలఁ గొంద ఱా చతుర్ముఖు భక్షింత మనిరి, కొందఱతని రక్షింత మని తగ నాడి రంత.

721

తా॥ తామిస్రము, అంధతామిస్రము, తమము, మోహము, మహామోహం అనే

పంచమోహములతో కూడిన అవిద్యను పుట్టించాడు. ఆ వేళ విధాత తన తమోమయ దేహాన్ని చూసి తనే రోసి ఆ తనువును విసర్జించాడు. విధాత వదలిపెట్టిన దేహం ఆకలిదప్పికలకు నివాసమై రాత్రిమయం అయింది. అందులోంచి యక్ష రాక్షసులు అనే ప్రాణులు పుట్టాయి. వెంటనే వారికి ఆకలిదప్పికలు వేశాయి. వారిలో కొందరు బ్రహ్మదేవుని “భక్షిద్దాం” అన్నారు. మరి కొందరు “రక్షిద్దాం” అన్నారు.

వ. ఇట్లు వలుకుచు భక్షించువారలయి ధాత సన్నిధికిం జనిన నతండు భయవిహ్వాలుండై యేను మీ జనకుండను, మీరలు మత్పుత్త్రులరు, నన్ను హింసింపకుండనుచు “మా మా జక్షత”, “రక్షత” యను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబు లయ్యె, వెండియుం బ్రభావిభాసితంబైన యొక్క కాయంబు ధరించి సత్త్వగుణ గరిష్ఠులుం బ్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులంగా సృజియించి తత్ప్రభామయగాత్ర విసర్జనంబు సేసిన యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె, మఱియు జఘనంబు వలన నతిలోలుపులైన యసురులం బుట్టింప వార లతికాముకు లగుటంజేసి యయ్యజునిం జీరి మిథున కర్మం బపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జులయిన యసురులు దనవెంటం దగులం బఱచి ప్రసన్నార్తిహరుండును, భక్త జనానురూప సందర్శనుండును నైన నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె.

722

తా॥ ఇలా పలుకుతూ భక్షించే ఉద్దేశంతో విధాత దగ్గరకు వచ్చిన వారిని చూచి అతడు భయంతో ‘నేను మీ తండ్రిని. మీరు నా కుమారులు. నన్ను హింసించకండి.’ అంటూ “మామా జక్షత”, “రక్షత” – అనే శబ్దాలు పలికాడు. ఆ నిమిత్తంగానే వాళ్ళకు క్రమంగా యక్షులు, రక్షసులు అనే పేర్లు వచ్చాయి.

అటు పిమ్మట విధాత తేజస్సుతో వెలుగొందే ఒక శరీరాన్ని ధరించి సత్త్వగుణంలో

గొప్పవారు, వెలుగుతో ప్రకాశించువారు అయిన దేవతలను ప్రముఖులుగా సృష్టించి పిమ్మట ఆ తేజోమయ శరీరాన్ని విడిచిపెట్టగా అది పగలుగా రూపొంది దేవతలకు ఆశ్రయమైంది. ఆ తరువాత తన కటి ప్రదేశం నుండి మిక్కిలి ఇచ్చగల అసురులను పుట్టించే సరికి వాళ్ళు అత్యంత కాముకులగుట వల్ల బ్రహ్మను చేరి రతిక్రియను అపేక్షించారు. అంత ఆయన నవ్వుతూ పరుగెత్తి; శరణాగతుల కష్టాలను హరించే వాడు, భక్తులు కోరుకున్న రూపంలో దర్శనం ఇచ్చేవాడు అయిన శ్రీమన్నారాయణుని చేరి ఆయన పాదకమలాలకు నమస్కారం చేసి ఇలా అన్నాడు:

క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక వినుత నిఖిల బృందారక, వి శ్వక్షేమంకర! విను మిటు, దక్షత నీ యాజ్ఞ నేను దల నిడి వరుసన్.

723

తా॥ “దేవతలందరి చేత పొగడబడే వాడా! ఈ విశ్వానికి క్షేమాన్ని చేకూర్చేవాడా! క్షణం ఉపేక్షించక నన్ను రక్షించు. నా మాట విను! నేను ఎప్పుడూ నీ ఆజ్ఞను తలదాల్చేవాడినే!

తే. ఈ ప్రజాసృష్టి కల్పనం బే నొనర్ప, నందుఁ బాపాత్ములైన యీ యసురు లిపుడు నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి, ననుఁ గావు మిద్ధచరిత!

724

తా॥ నీ ఆజ్ఞను అనుసరించి ఈ ప్రజలను సృష్టించే సరికి అందులో పాపాత్ములైన రాక్షసులు నన్ను రమించాలనే సంకల్పంతో నామీదికి వస్తున్నారు. క్షోభతో నీ దగ్గరకు వచ్చిన నన్ను రక్షించు.

వ. అదియునుంగాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపను, గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యితరులు గలరే? యని స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుం డగుచుఁ గమల సంభవ! భవద్ఘోరతను త్యాగంబు సేయు మని యానతిచ్చిన నతండు నట్ల చేసెనంత నదియును.

తా॥ లోకంలో ఉండేవారికి కష్టాలను కలిగించాలన్నా, కష్టాలను అనుభవిస్తున్న వారి దుఃఖాన్ని పోగొట్టాలని అనుకున్నా నీవు తప్ప ఇతరులు ఎవరున్నారు స్వామీ!" అని స్తుతించే సరికి విధాత దైన్యాన్ని తెలుసుకుని, అందరి ఆంతర్యాలను దర్శింపగల శ్రీహరి "ఓ కమల సంభవ! నీ యొక్క ఘోరమైన శరీరాన్ని త్యాగం చెయ్య" మని ఆనతియ్యగా అతడు తక్షణం శరీరాన్ని త్యాగం చేశాడు.

సీ. నవ్య కాంచనరణ న్మణి నూపురారావ, విలసిత పాదారవింద యుగళ కాంచీ కలాప సంకలిత దుకూల వ, స్త్రస్ఫార పులిన నితంబబింబ రాజితాన్యోన్య కర్కశ పీన కరికుంభ, పృథు కుచభార కంపిత వలగ్న మదిరా రసాస్వాద మద విఘూర్ణిత చారు, సిత నవ వికచ రాజీవ నయవ

తే. యపర పక్షాష్టమీ శశాంకాభ నిటల, మదవ దలికుల రుచిరోపమాన చికుర
లలిత చంపక కుసుమ విలాసనాస, హాసలీలావలోకన యబ్జపాణి.

726

క. అనఁ దగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిం
గనుఁగొని దానవు లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్.

727

తా॥ అపుడా త్యాగమయ శరీరం నుండి "సంధ్యాసుందరి" అనే లలనారత్నం పుట్టింది. రత్నములు తాపిన నూతనమైన బంగారపు అందెలు మ్రోగే పాదారవిందములతోను, బంగారపు మొలనూలుతో కూడిన పట్టుచీర ధరించిన ఇసుక తిన్నెలవంటి కటిప్రదేశంతోను, అన్యోన్యము ఒరసికొంటున్న ఏనుగు కుంభస్థలాల వంటి కుచ భారానికి జవజవలాడే నడుముతోను, మదిరా రసాన్ని ఆస్వాదించి నందువల్ల కలిగిన మదంలో చలిస్తూ వికసిస్తున్న పద్మాలవంటి

కనుదోయితోను, కృష్ణపక్షంలో అష్టమినాటి శశాంకుని పోలిన ఫాలభాగంతోను, తుమ్మెదలకు సాటివచ్చే ముంగురులతోను, లలితమైన సంపంగి పువ్వువంటి నాసికతోను, నవ్వుతూ లీలగా చూచే చూపులతోను, పద్మములవంటి చేతులతోను సాక్షాత్కరించింది.

అలా సాక్షాత్కరించిన సంధ్యాదేవిని చూచి ఆగలేక దానవులు కౌగిలించుకొని అందరూ తమలో ఇట్లా మాట్లాడుకున్నారు:

క. ఈ సౌకుమార్య, మీ వయ, సీ సౌందర్యక్రమంబు, నీ ధైర్యంబు, న్నీ సౌభాగ్య విశేషము, నే సతులకుఁ గలదు చూడ నిది చిత్ర మగున్.

728

తా॥ "ఆహా! ఈ సౌకుమార్యం, ఈ వయసు, ఈ సౌందర్యం, ఈ ధైర్యం, ఈ సౌభాగ్యం, ఈ సృష్టిలో ఏ సతీమణికి లేదు. ఇది చాలా చిత్రంగా ఉంది.

చ. అని వెఱఁగంది యద్దనుజు లందఱు నిట్లని రీ తలోదరిం గని మన మంతనుండియును గాముక వృత్తిఁ జరించుచుండఁగా మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో? యని బహుభంగులం బలికి యా ప్రమదాకృతి యైన సంధ్యతోన్.

729

వ. ఇట్లనిరి:

730

తా॥ అని ఆశ్చర్యపోయి ఆ దనుజులందరు ఇలా అనుకున్నారు: "ఈమెను చూచినప్పటినుండి మనమంతా కాముక వృత్తిలో ఉంటూంటే మనమీద దీని మనస్సులో మక్కువ లేక పోవడానికి కారణం ఏమిటి?" అని అనేక విధాల పలికి ప్రమదాకృతిలో ఉన్న ఆ సంధ్యాదేవితో ఇలా అన్నారు:

క. ఓ కదళీస్తంభోరువ!, యే కుల? మే జాడదాన? వెవ్వరిసుత? వి ట్లేకాంతంబున నిచ్చట, నే కారణమునఁ జరించె? దెఱిఁగింపు తగన్.

731

తా॥ "అరటిచెట్ల వంటి తొడలు కలదానా! ఓ సుందరీ! ఏ కులం నీది? నీది ఏ ఊరు? నీవు ఎవ్వరి కూతురువు? ఏకాంతంలో ఇక్కడ సంచరించడానికి కారణం ఏమిటి? మాకు తెలియ చెప్పు.

క. భవదీయ చారు రూప, ద్రవిణ లసత్పుణ్య భూమిఁ దగు మోహమునం దవిలిన దుర్భరులను మముఁ, గవయవు పుష్పాస్త్రబాధ ఘనమయ్యెఁ గదే.

732

తా॥ అందమైన నీ రూపంతో ఈ ధరామండలం ఏం పుణ్యం చేసుకుందో? నీమీద మోహంతో నీవెంట పడ్డ సమ్మోహితులమైన మమ్ము ఎందుకు చేరదియ్యవు? మన్మథుని బాధ చాలా ఎక్కువగా ఉంది."

వ. మఱియుఁ దదీయ సౌందర్యం బుగ్గడింప నలవిగాక చింతించుచు.

733

తా॥ అని అంటూ ఆమె సౌందర్యాన్ని వర్ణించడానికి మాటలు రాక అలా ఉండి పోయారు.

సీ. గురు కుచభార సంకుచితావలగ్నంబు దనరారు నాకాశతలము గాఁగ లలిత పల్లవ పాణి తలమునఁ జెన్నొందు చెండు పతత్పతంగుండు గాఁగ సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల బంధంబు ఘనతమఃపటలి గాఁగఁ బ్రవిమలతర కాంత భావ విలోకన జాలంబు దారకాసమితి గాఁగఁ

తే. గడcగి మైపూcత సాంధ్యరాగంబు గాcగ, నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిc గదిసి మనముల మోహంబు గడలుకొనcగ, నసురు లందఱుc గూడి యిట్టనిరి మఱియు.

734

తా॥ గొప్పదైన కుచభారముల చేత సన్నపడ్డ నడుము ఆకాశం కాగా, సుకుమారమైన చిగురుటాకు వంటి చేతిలో ప్రకాశించే పుష్పగుచ్ఛం అస్తమించే భానుబింబం కాగా, విప్పారిన నల్లని కొప్పుముడి వ్యాపిస్తున్న చీకట్లు కాగా, స్వచ్ఛమైన భావాలను తెలియచేసే ఆమె చూపులు నక్షత్ర సమూహంకాగా, ఆమె అలంకరించుకున్న మైపూత సంధ్యారాగం కాగా అంగనాకృతిలో ఒప్పుతున్న సంధ్యావధూటిని చూసి మనస్సులో మోహం పెచ్చరిల్లగా అసురులందరు ఇట్లా అన్నారు:

క. వెలయcగc బద్మం బేక, స్థలముననే యొప్పుc గాని త్వత్పదపద్మం బిల బహుగతుల ననేక, స్థలములc దనరారుcగాదె తరుణాబ్జముఖీ!

735

తా॥ "క్రొత్తగా వికసించిన పద్మం వంటి ముఖంగల ఓ చిన్నదానా! పద్మం ఒకే స్థలంలో ఉంటుంది కాని నీ పాదపద్మములు ఈ ఇలలో బహు గతులతో అనేక చోట్ల ప్రకాశిస్తున్నాయి ఏమిటి?"

క. అని దనుజులు దమ మనములc, ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం ధ్యను బట్టికొనిరి, వనజా, సనుc డప్పుడు హృదయమందు సంతస మందెన్.

736

తా॥ అంటూ దనుజులు తమ మనస్సుల్లో ప్రేమ అధికం కాగా వారంతా ఆ సంధ్యను పట్టుకొన్నారు. దానిని చూసిన బ్రహ్మ తన మనస్సులో ఉప్పొంగి పోయాడు.

క. సరసిజభవుఁ డయ్యెడఁ దన, కర మాఘ్రాణింప నపుడు గంధర్వులు న ప్సరసలుఁ బుట్టిరి, ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁబాసిన నదియున్.

737

తా॥ అప్పుడు ఆయన తన చేతిని ఆఘ్రాణించగా అప్సరసలు, గంధర్వులు పుట్టారు. విధాత తన శరీరాన్ని వెంటనే విడిచి పెట్టేశాడు.

వ. చంద్రికారూపంబైనఁ దద్గాత్రంబు విశ్వావసు పురోగములగు గంధర్వాప్సరోగణంబులు గైకొనిరి. వెండియుం గమల గర్భుండు తంద్రోన్మాద జృంభికా నిద్రా రూపంబైన శరీరంబు దాల్చి పిశాచ గుహ్యక సిద్ధ భూత గణంబులం బుట్టించిన వారలు దిగంబరులు, ముక్తకేశులు నయినం జూచి ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి. వెండియు నజుండు దన్ను నన్నవంతునింగాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుం బితృ సాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించిన యదృశ్య శరీరంబునకుం గార్యంబగు దేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు. మఱియును.

738

తా॥ చంద్రికా రూపాన్ని పొందిన ఆ దేహాన్ని విశ్వావసువు మొదలైన గంధర్వులు, అప్సరసలు తీసుకున్నారు. తిరిగి మళ్ళీ బ్రహ్మ కునుకుపాటు ఉన్మాదం, ఆవులింత, నిద్ర... ఈ రూపంతో శరీరాన్ని ధరించి పిశాచాలను, గుహ్యకులను, సిద్ధులను, భూతాలను పుట్టించాడు. వాళ్ళు దిగంబరులై జుట్టు విరబోసుకుని ఉండగా చూచి ధాత కళ్ళు మూసుకుని తన శరీరాన్ని విసర్జిస్తే దానిని వాళ్ళు తీసుకున్నారు. పిమ్మట అజుడు తనను అన్నవంతునిగా భావించి అదృశ్యదేహుడై పితృదేవతలను, సాధ్యులను పుట్టించాడు. వారు తమ్ము పుట్టించిన అదృశ్యశరీరానికి కార్యమైన దేవభాగాన్ని తీసుకొన్న కారణంగానే శ్రాద్ధములలో పితృ సాధ్యగణాలను ఉద్దేశించి హవ్యకవ్యాలను ఇస్తారు.

సీ. సజ్జనస్తుత!, విను చతురతఁ బంకజా, సనుఁడు దిరోధాన శక్తి వలన నర సిద్ధ విబుధ కిన్నరులను బుట్టించి, తవిలి వారికిఁ దిరోధాన నామ ధేయ మైనట్టి యా దేహంబు నిచ్చెను, వెండియు భారతీవిభుఁడు దనకుఁ బ్రతిబింబ మగు శరీరమునఁ గిన్నరులఁ గిం, పురుషులఁ బుట్టింపఁ బూని వారు

తే. ధాతృప్రతిబింబ దేహముల్ దాల్చి వరుస, నిద్ద ఱిద్దఱు గవగూడి యింపులొదవ బ్రహ్మపరమైన గీతముల్ పాడుచుండి, రంతఁ బంకజ సంభవుఁ డాత్మలోన.

739

తా॥ సజ్జనులు స్తుతించే ఓ పరీక్షిన్మహారాజా! విను. పంకజాసనుడు తిరోధాన శక్తి వలన సిద్ధులను, విద్యాధరులను పుట్టించి వారికి తిరోధానము అనే పేరుగల ఆ దేహాన్ని ఇచ్చాడు. తరువాత బ్రహ్మ తనకు ప్రతిబింబంగా ఉన్న శరీరంనుండి కిన్నరులను, కింపురుషులను పుట్టించాడు. వారు విధాతకు ప్రతిబింబాలైన శరీరాలతో ఇద్దరిద్దరు జతకూడి ఇంపుగా బ్రహ్మకు సంబంధించిన గీతాలను గానం చేయసాగారు.

క. తన సృష్టి వృద్ధి లేమికిఁ, గనలుచు శయనించి చింతఁ గరచరణాదుల్ గొనకొని కదలింపఁగ రా, లిన రోమము లుగ్ర కుండలి వ్రజ మయ్యెన్.

740

తా॥ పిమ్మట తాను చేసిన సృష్టి వృద్ధి చెందక పోవడానికి కోపించి ధాతగారు చింతిస్తూ శయనించి కాళ్ళను, చేతులను కదలింపగా రాలిన రోమములన్నీ పాములయ్యాయి.

క. వనజజుఁడు దన్నుఁ గృత కృ, త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టి వహింపన్ మనమున నిఖిలజగత్పా, వను లగు మనులం ద్రిలోకవరుల సృజించెన్.

741

తా॥ విధాత తాను తలపెట్టిన కార్యం నెరవేరినదని భావించి తన అంతరాత్మ సంతోషించునట్లు మూడు లోకాలలోను శ్రేష్ఠులైన వారు, జగత్పావనులు అయిన మనువులను సృష్టించాడు.

సీ. పుట్టించి వారికిఁ బురుషరూపంబైన, తన దేహ మిచ్చినఁ దగిలి వారు గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా, వనజసంభవున కిట్టనిరి, దేవ! యఖిల జగత్స్రష్టవైన నీచేతఁ గా, వింపంగఁబడిన యీ వితతసుకృత మాశ్చర్యకరము, యజ్ఞాదిక్రియాకాండ, మీ మనుసర్గమం దీద్య మయ్యెఁ

తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ, లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల, వినుతి సేసిరి భారతీవిభుని మఱియు.

742

తా॥ అలా పుట్టించి వారికి పురుష రూపమైన తన దేహాన్ని ఇచ్చాడు. ఆ మనువులు తమకంటే ముందు పుట్టిన వారితో కూడి బ్రహ్మదేవునితో ఇట్లా అన్నారు: "దేవా! ఈ జగత్తు సర్వము నీచేత సృష్టింపబడినది. నువ్వు చేసిన ఈ సృష్టి సుకృతవంతము, ఆశ్చర్యకరము. యజ్ఞాది క్రియాకాండ ఈ మనువులను సృష్టించడం వల్ల పొగడతగినదిగా అయింది. ఆ యజ్ఞాలలోని హవిర్భాగాలను మా నాలుకలతో ఆస్వాదించే అదృష్టం మాకు లభించింది!" అంటూ మనస్సులో హర్షం అతిశయిల్లగా భారతీనాథుని పొగిడారు.

వ. వరతపోయోగ విద్యా సమాధి యుక్తం బగుచు ఋషివేష ధరుండును, హృషీకాత్ముండునునై ఋషిగణంబులం బుట్టించి సమాధి యోగైశ్వర్య తపో విద్యా విరక్తి యుక్తంబగు నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునుం బొంది గోవిందు చరణారవిందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె.

743

తా॥ తిరిగి బ్రహ్మ శ్రేష్ఠమైన తపస్సు, యోగము, విద్య, సమాధి వీటితో కూడి ఋషివేషాన్ని ధరించి ఇంద్రియాలతో కూడిన ఆత్మ స్వరూపుడై ఋషిగణాలను పుట్టించాడు. పుట్టించి వారికి తన శరీరాంశములైన సమాధి, యోగం, ఐశ్వర్యం, తపస్సు, విద్య, వైరాగ్యం... వీటిని క్రమంగా ఒక్కొక్కరికే ఇచ్చాడు." ఈ ప్రకారంగా మైత్రేయుడు చెప్పగా విని విదురుడు పరమానందంతో గోవిందుని చరణారవిందాలను మనస్సులో తలచి ఇలా అన్నాడు:

సీ. వరగుణస్వాయంభువ మను వంశం బిలఁ, బరమసమ్మతము, దప్పదు, తలంపఁ గొనకొని తద్వంశమున మిథునక్రియఁ, జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు, అదియునుగాక స్వాయంభువ మనువుకుఁ, బూని ప్రియవ్రతోత్తానపాదు లను నందనులు గల రంటివి, వారు స, ప్తద్వీపవతియైన ధాత్రి నెల్ల

తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ, ననఘులై యెట్లు పాలించిరయ్య? వారి చరిత యెల్లను సత్కృపానిరత బుద్ధి, నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర!

744

తా॥ "ఓ మునీశ్వరా! మైత్రేయా! శ్రేష్ఠమైన గుణములతో స్వాయంభువ మనువు వంశం ధర్మసమ్మతమైనదని, ఆ వంశంలో స్త్రీ పురుష సంయోగం వల్ల ప్రజలు పుట్టి వృద్ధి చెందారని నువ్వు చెప్పావు. అంతే కాకుండా ఆ స్వాయంభువ మనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే పేర్లుగల ఇద్దరు కొడుకులు ఉన్నారన్నావు! వారు సప్తద్వీపాలతో కూడిన ఈ ధాత్రీమండలాన్ని ధర్మం తప్పకుండా పుణ్యమార్గంలో ఎట్లా పాలించారు? వారి చరిత్ర అంతా కృపతో నాకు వినిపించవలసింది.

వ. అదియునుంగాక తన్మనుపుత్రియు యోగలక్షణ సమేతయు నగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు కర్దమునకు నే విధంబునం బెండ్లి చేసె? నా దేవహూతి యందు మహాయోగి యయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె? నదియునుం గాక కర్దముండు రుచి యను కన్యను దక్షప్రజాపతి కిచ్చె నని చెప్పితివి, ఆ

రుచియందు నమ్మహాత్ముం డీ సృష్టి యేలాగునం బుట్టించె? నవి యన్నియుం దెలియ నానతీయ వలయునని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె.

745

తా॥ అంతేకాక... స్వాయంభువ మనువు మంచి యోగాలతో కూడిన దేవహూతి అనే కన్యారత్నాన్ని కర్దమ ప్రజాపతికి ఇచ్చి పెండ్లి చేసిన విధానాన్ని చెప్పవలసింది. ఆ దేవహూతి యందు మహాయోగి అయిన కర్దముడు ప్రజలను ఎలా పుట్టించాడు? అంతే కాకుండా కర్దముడు 'రుచి' అను కన్యను దక్ష ప్రజాపతికి ఇచ్చాడని చెప్పావు. ఆ రుచి యందు దక్షుడు ప్రజలను ఎట్లా సృష్టించాడు? ఇవన్నీ నాకు తెలిసేటట్లుగా చెప్పవలసింది'' అని అడిగిన విదురునితో మైత్రేయుడు ఇలా అన్నాడు:

## దేవహూతిని పెండ్లాడమని కర్దమునికి భగవంతుని ఆజ్ఞ

క. విను మనఘ!, కృతయుగంబున, మునినాథుం డయిన కర్దముఁడు ప్రజల సృజిం పను వనజసంభవునిచే, త నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్.

746

తా॥ “ఓ పాపరహితుడా! విను! కృతయుగంలో బ్రహ్మదేవునిచే ప్రజలను సృష్టించడానికి కర్దమ ప్రజాపతి నియమింపబడి మనస్సులో చాలా సంతోషించాడు.

తే. ధీరగుణుఁడు సరస్వతీ తీరమందుఁ, దవిలి పదివేల దివ్యవత్సరము లోలిఁ దపము సేయుచు నొకనాఁడు జపసమాధి, నుండి యేకాగ్రచిత్తుఁడై నిండు వేడ్క.

747

క. వరదుఁ బ్రసన్న మనోరథ, వరదానసుశీలు నమరవంద్యు రమేశున్ దురిత విదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై.

748

వ. అంతరిక్షంబునం బ్రత్యక్షంబైన.

749

తా॥ సంతోషించి ధీరుడైన ఆయన సరస్వతీ నదీతీరంలో పదివేల దివ్య వత్సరాలు ఏకాగ్రతతో తపస్సు చేశాడు. ఆ తపస్సులో వరదుడు, మనోరథములను తీర్చేవాడు, కోరికలను తీర్చేవాడు, దేవతల చేత పూజింపబడువాడు అయిన లక్ష్మీనాథుని పూజించే సరికి ఆయన అంతరిక్షంలో ప్రత్యక్షమైనాడు.

సీ. తరణి సుధాకర కిరణ సమంచిత, సరసీరుహోత్పల స్రగ్విలాసుఁ గంకణ నూపుర గ్రైవేయ ముద్రికా, హార కుండల కిరీటాభిరాముఁ గమనీయ సాగర కన్యకా కౌస్తుభ, మణి

భూషణోద్భాసమాన వక్షు సలలిత దరహాస చంద్రికా ధవళిత, చారు దర్పణ విరాజత్కపోలు

తే. శంఖ చక్ర గదా పద్మ చారు హస్తు, నలికులాలక రుచి భాస్వదలిక ఫలకుఁ బీత కౌశేయవాసుఁ గృపాతరంగి, త స్మితేక్షణుఁ బంకజోదరుని హరిని.

750

వ. మఱియు శబ్దబ్రహ్మ శరీరవంతుండును, సదాత్మకుండును, జ్ఞానైక వేద్యుండును, వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిందునిఁ గనుంగొని సంజాత హర్ష లహరీ పరవశుండును, లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి తదనంతరంబ.

751

తా॥ భానుమండల దీప్తులకు వికసించిన పద్మములతోను, చంద్ర కిరణములు సోకి వికసించిన కలువలతోను అలంకరింపబడి ఉన్నాడు. చేతులకు కంకణాలను, పాదాలకు నూపురాలను, కంఠాభరణాలను, అంగుళీయకాలను, రత్నహారాలను, మకర కుండలాలను, కిరీటాన్ని ధరించి మనోహరంగా మెరిసిపోతున్నాడు. కమనీయ సాగర కన్యకా మణితో కూడి కౌస్తుభమణితో కాంతులు వెదజల్లే వక్షస్థలాన్ని కలిగి ఉన్నాడు. సుకుమారమైన దరహాస చంద్రికలతో ముద్దులు కురిసిపోతున్న చెక్కుటద్దములతో విరాజిల్లుతూ ఉన్నాడు. శంఖం, చక్రం, గద, పద్మం హస్తములలో ధరించి ఉన్నాడు. తుమ్మెదలవంటి ముంగురులు కలిగి చక్కని నుదురు కలవాడై ఉన్నాడు. ఇంకా పంకజోదరుడైన హరి పసుపు పచ్చని పట్టువస్త్రాన్ని ధరించి కృపాతరంగాలు చిలికే చిరునవ్వుతో అలరారుతూ ఉన్నాడు.

శబ్దబ్రహ్మమే శరీరంగాను, ఆత్మస్వరూపుడుగాను ఉంటూ కేవల జ్ఞానంచేత మాత్రమే తెలుసుకో తగినవాడై వైనతేయుని మూపుమీద చరణపద్మాలు మోపి ఉన్న గోవిందుని చూచి హర్షపారవశ్యంతో లబ్ధమనోరథుడై కర్దముడు సాష్టాంగదండ ప్రణామాలు ఆచరించాడు.

క. ముకుళిత కరకమలుం డయి, యకుటిల సద్భక్తి పరవశాత్మకుఁ డగుచున్ వికచాంభోరుహలోచను, నకు నిట్లనియెం దదాననముఁ గనుఁగొనుచున్.

752

తా॥ చేతులు మోడ్చి భక్తితో మేను మరచి పద్మాలవంటి కన్నులుగల ఆయన ముఖాన్ని చూస్తూ ఇలా అన్నాడు:

సీ. అబ్జాక్ష! సకల భూతాంతరాత్ముఁడ వనఁ, దనరుచుండెడి నీదు దర్శనంబుఁ దలకొని సుకృత సత్ఫల భరితంబు, లైనట్టి యనేక జన్మానుసరణి ప్రకట యోగక్రియాభ్యాస నిరూఢు, లైనట్టి యోగీశ్వరు లాత్మఁ గోరి యెంతురు యోగీశ్వరేశ్వర! యే భవ, త్పాదారవింద సందర్శనంబుఁ

తే. గంటి, భవవార్ధిఁ గడవంగఁ గంటి మంటిఁ, గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు దవిలి సఫలత నొందె మాధవ! ముకుంద! చిరదయాకార! నిత్యలక్ష్మీ విహార!

753

తా॥ "తామరపువ్వు వంటి నేత్రములు గలవాడా! సకల భూతముల యందు అంతరాత్మవై ప్రకాశించే నీ దర్శనం కోసం, వాళ్ళ పుణ్య ఫలితంగా అనేక జన్మల నుండి యోగక్రియలలో అభ్యాసం చేస్తూన్న మహా యోగీశ్వరులు కోరుకుంటారు. యోగీశ్వరేశ్వరా! నేను నీ పాదారవిందాలను దర్శించగలిగాను. ఈ పుట్టుక, సంసారం అనే సముద్రాన్ని దాటగలిగాను. కళ్ళు ఉన్నందుకు నిన్ను చూడగలిగాను. మాధవా! ముకుంద! ఎప్పుడూ దయను వర్షించే వాడా! లక్ష్మీనాథా! నేను ధన్యుడిని.

వ. అదియునుం గాక దేవా! భవదీయ మాయావిమోహితులై హతమేధస్కులై సంసార పారావారోత్తారకంబులైన భవదీయ పాదారవిందంబులు దుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామ యోగ్యంబు లగు మనోరథంబుల నిత్తు, వట్టి సకాము

లైనవారి నిందించు నేనును గృహమేధధేనువు నశేష మూలమును ద్రివర్గకారణమును సమాన శీలయు నయిన భార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల సదృశంబులైన భవదీయ పాదారవిందంబులు సేవించితి, నయిన నొక్క విశేషంబు గలదు, విన్నవించెద నవధరింపుము, బ్రహ్మాత్మకుండ వయిన నీదు వచస్తంతు నిబద్ధులై లోకులు కామహతులైరఁట, యేనును వారల ననుసరించినవాఁడ. కాలాత్మకుండవైన నీకు నభిమతం బగునట్లుగాఁ గర్మ మయంబైన భవదాజ్ఞా చక్రంబు ననుసరించుటకుఁగాని మదీయ కామంబు కొఱకుఁగాదు. భవదీయ మాయావినిర్మితంబును, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును, నక్షరంబును నైన బ్రహ్మంబునందు భ్రమణశీలంబును, నధిమాససమేత త్రయోదశ మాసారంబును, షష్ట్యుత్తర శతత్రయాహోరాత్రమయ పర్వంబును, ఋతుషట్క సమాకలిత నేమియుం, జాతుర్మాస్యత్రయ విరాజిత నాభియు, నపరిమిత క్షణలవాది పరికల్పిత పత్రశోభితంబునుం, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకల జీవనికరాయుగ్రసనతత్పరం బగుం గాని కామాభిభూత జనానుగత పశుప్రాయులగు లోకుల విడిచి భవపరితాప నివారణ కారణం బయిన భవదీయ చరణాతపత్రచ్ఛాయా సమాశ్రయులై, తావకీన గుణకథన సుధాస్వాదన రుచిరలహరీ నిరసిత సకల దేహధర్ములైన భగవద్భక్త జనాయుర్హరణసమర్థంబు గాకుండు నని వెండియు.

754

తా॥ దేవా! నీ మాయలోపడి బుద్ధిని కోల్పోయిన కొందరు సంసారసముద్రాన్ని దాటించే నీ పాదపద్మాలను తుచ్ఛమైన కోరికలకై సేవిస్తూ ఉంటారు. దుర్గతికి పోయే అట్టి వారికి వాళ్ళ కోరికలను తగినట్లుగానే తీరుస్తూ ఉంటావు. వాళ్ళను నిందించే నేను కూడా వివాహం చేసుకోవాలనే కోరికతో ఉన్నాను. గృహయజ్ఞానికి గోవు వంటిది, మూలమైనది, ధర్మార్థకామాలకు కారణమైనది, మంచి నడవడిక గలది అయిన స్త్రీని భార్యగా అపేక్షించి కల్పవృక్షం వంటి నీ పాదాలను ఆశ్రయించాను.

అయినా ఒక్క విశేషాన్ని విన్నవించుకుంటాను. పరబ్రహ్మవైన నీ వచనములనే తంతువులచే కట్టబడినవారై లోకులు కామంతో కూరుకుపోయి ఉన్నారు. నేను పెండ్లి చేసుకోవటం నా కామాన్ని తీర్చుకోవటం కోసం కాదు. నీ ఆజ్ఞను అనుసరించి సృష్టిని వృద్ధి చెయ్యటం కొరకే! నీ మాయ చేత నిర్మింపబడిన ఈ సృష్టి కాలం అనే ఆత్మ కలది. గొప్పదైన వేగంతో తిరుగుతూ ఉంటుంది. నాశనం లేని బ్రహ్మమును అనుసరించి భ్రమణశీలం కలది. ఈ కాలచక్రం అధిక మాసంతో కూడి పదమూడు నెలలు అనే ఆకులు కలిగి, మూడు వందల అరవై అహోరాత్రాలు అనే కణుపులు కలిగి, ఆరు ఋతువులనే పట్టా కలిగి, మూడు చాతుర్మాస్యాలు అనే బొడ్డు కలిగి లెక్కలేనన్ని క్షణములు, లవములు అనే ఆకులు కలిగి కాలం అనే ఆత్మతో మహావేగంతో తిరుగుతూ ఉంటుంది.

ఈ కాలచక్రం కోరికలతో కొట్టుకుపోయే పశుప్రాయులైన వారందరి జీవాలను గ్రహిస్తుంది. అంతేకాని సంసారమనే దుఃఖాన్ని నివారించే నీ చరణములనే గొడుగు నీడను ఆశ్రయించిన వారిని, నీ గుణకథలనే అమృతాన్ని త్రాగి దేహధర్మాలను పట్టించుకోకుండా ఉండేవారిని ఏమీ చెయ్యనేరదు. అట్టివారి ఆయువును హరించడానికి దానికి సామర్థ్యం లేదు.

మ.అనఘా! యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాత సత్త్వాది శ క్తి నికాయస్థితి నీ జగజ్జనన వృద్ధి క్షోభ హేతు ప్రభా వ నిరూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ ఘన లీలా మహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్?

755

తా॥ అనఘా! నువ్వు ఒక్కడివే అయినప్పటికి ఆత్మస్వరూపుడవైన నీనుండి పుట్టిన మాయ వల్ల త్రిగుణాలైన సత్త్వాది శక్తులు పుడుతున్నాయి. సాలెపురుగు ఒక పెద్ద గూడును సృష్టించి తిరిగి తనలో లీనం చేసుకున్నట్లు నువ్వు ఈ జగత్తు యొక్క జననానికి, వృద్ధికి, కలతకు హేతువైన ప్రభావంతో ఉంటావు. అట్టి నీ లీల అయిన మాయాసముద్రాన్ని అధిగమించటం ఎవరికీ శక్యం కాదు.

వ. దేవా! శబ్దాది విషయ సుఖకరం బగు రూపంబు విస్తరింపఁ జేయుటెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీ కొఱకుం గా, దాత్మీయ మాయా పరివర్తితలోక తంత్రంబు గలిగి మదీయ మనోరథ సుధాప్రవర్షివైన నీకు నమస్కరించెద.

756

తా॥ దేవా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే ఇంద్రియ వ్యాపారంచే ఈ ఇంద్రియాలకు సుఖాన్ని కలిగించే విశ్వాన్ని విస్తరింప చెయ్యటం మామీద ఉండే అనుగ్రహం వల్లనే కాని నీకోసం కానేకాదు. నీ మాయ వల్ల ఈ లోకతంత్రాన్ని నడుపుతూ మా మనోరథం అనే అమృతాన్ని వర్షించే నీకు నమస్కారం."

మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్ వినతానందన కంధరోపరిచర ద్విభ్రాజమానాంగుఁడై యనురాగస్మిత చంద్రికా కలిత శోభాలోకుఁడై య మ్మునీం ద్రునిఁ గారుణ్య మెలర్పఁ జూచి పలికెన్ రోచిష్ణుఁడై ప్రేల్మిడిన్.

757

తా॥ అని ఈ విధంగా కర్దమ ప్రజాపతి పొగడగా విని హరి సంతోషంతో గరుత్మంతుని మూపుపై కూర్చుని అనురాగమనే చిరునవ్వు వెన్నెలలు చిలికే చూపులతో ఆ మునీంద్రుణ్ణి కారుణ్యంతో చూచి ఇట్లా అన్నాడు:

క. మునివర! యే కోరిక నీ, మనమునఁ గామించినను సమంచిత భక్తిన్ నెనరునఁ బూజించితి? నీ, కనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ.

758

తా॥ "ఓ మునీంద్రా! ఏ కోరికను నీ మనస్సులో పెట్టుకుని నన్ను భక్తితో పూజించావో నీకు తప్పకుండా ఆ కోరిక సఫలమవుతుంది."

వ. అని యానతిచ్చి ప్రజాపతి పుత్త్రుండును, సమ్రాట్టును నైన స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలామండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ, డమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూపయను భార్యా సమేతుండై భర్తృకామ యగు కూతుం దోడ్కొని భవదీయ సన్నిధికిం జనుదెంచి నీకు ననురూప వయశ్శీల సంకల్ప గుణాకరయైన తన పుత్రిం బరిణయంబు గావించు, భవదీయ మనోరథంబు సిద్ధించు, ననుం జిత్తంబున సంస్మరించుచుండు, నమ్మనుకన్యక నిను వరించి భవద్వీర్యంబు వలన నతి సౌందర్యవతు లయిన కన్యలం దొమ్మండ్రం గను, నా కన్యకా నవకంబునందు మునీంద్రులు పుత్త్రోత్పాదనంబులు సేయం గలరు, నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండ వగుచు నైకాంతిక స్వాంతంబున భూతాభయ దాన దయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గల వనియు, నీ యందు నేఁ గల ననియు నెఱింగి సేవింపుము, చరమకాలంబున ననుం బొందఁగలవు, భవదీయ వీర్యంబువలన నేను నీ భార్యా గర్భంబునఁ బ్రవేశించి మత్కళాంశంబునఁ బుత్త్రుండనై సంభవించి నీకుం దత్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు కర్దమున కెఱింగించి యతండు గనుం గొనుచుండ నంతర్హితుండై.

759

తా॥ అని పలికి ఇంకా ఇలా అన్నాడు: “ధాత కుమారుడు, సమ్రాట్టు అయిన స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశం రాజధానిగా సప్త సముద్రముల మధ్యనున్న భూమండలమంతా పాలిస్తున్నాడు. ఆ మహాత్ముడు శతరూప అనే భార్యతో కూడి, వివాహం కావలసిన కూతురును వెనకాల పెట్టుకుని రేపు నీ సన్నిధికి వస్తాడు. వచ్చి; రూపంలో వయస్సులో, శీలంలో, గుణాలలో నీకు అనుకూలవతి అయిన తన పుత్రికను ఇచ్చి పెండ్లి చేస్తాడు. నీ మనోరథం సిద్ధిస్తుంది. నన్ను నీ చిత్తంలో ఎప్పుడూ స్మరిస్తూ ఉండు.

ఆ మనువు యొక్క కన్యక నిన్ను ప్రేమించి నీ వీర్యం వలన అత్యంత సౌందర్యవతులైన

తొమ్మండుగురు కన్యలను కంటుంది. ఆ తొమ్మిదిమంది కన్యలయందు మునీంద్రులు కొడుకులను కంటారు. నువ్వు నా ఆజ్ఞప్రకారం చేసే సమస్త కార్యాలు నాకర్పిస్తూ ఏకాగ్రమైన మనస్సుతో సకల భూతములకు అభయాన్నిస్తూ, దానాలు చేస్తూ, దయకలిగి ఉంటూ, జ్ఞానివై ప్రవర్తించు. ఈ విశ్వమంతా నాలో ఉందని, నీయందు నేను ఉన్నానని తెలుసుకొని నన్ను సేవిస్తూ ఉండు. చివరిదశలో నన్ను పొందగలవు. నీ వీర్యం వలన నేను నీ భార్యాగర్భంలో ప్రవేశించి నా కళతో పుత్రుడనై పుట్టి నీకు తత్త్వాన్ని బోధిస్తాను. అని జనార్దనుడు కర్దమునికి చెప్పి అతడు చూస్తూండగానే అంతర్హితుడయ్యాడు.

చ. అతుల సరస్వతీ సరిదుదంచిత బాలరసాల సాల శో భిత తట తుంగరంగమగు బిందుసరంబు వినిర్గమించి యం చిత గరుడాధిరోహణము సేసి తదీయ గరుత్ప్రభూత రు క్పతతి విలక్షణ క్రమ విరాజిత సామము వించు మోదియై.

760

చ. అరిగె వికుంఠ ధామమున కంత సకామనుఁడైన కర్దముం దరయ విమోహియై మనమునందును ముందట వచ్చు కోరికల్ పిరిగొనుచుండఁ దత్‌క్షణమ బిందుసరంబున కేఁగి యిందిరా వరుఁ దల పోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంత చిత్తుఁడై.

761

తా॥ సరిలేని సరస్వతీ నదీ జలాలతో పెరిగిన గున్నమామిడి గుబురులతో కన్నుల పండువు చేసే తీరం కలిగిన బిందు సరోవరాన్ని దాటి గరుదుని ఎక్కి అతని రెక్కల చప్పుళ్ళకు అనుగుణమైన సామగానాన్ని వింటూ సంతోషంతో విష్ణువు వైకుంఠానికి వచ్చాడు.

పిమ్మట కోరికలు మనస్సులో గుబులు కొనగా కర్దముడు బిందు సరోవరానికి వెళ్ళి అక్కడ మనస్సులో భక్తిని నింపుకొని ఇందిరానాథుని తలపోస్తూ కూర్చున్నాడు.

## దేవహూతికై వరాన్వేషణ ప్రయాణము

వ. అంత స్వాయంభువుండు గనకరథారూఢుం డగుచు నిజభార్యా సమేతుండై భర్తృవాంఛాపరయైన పుత్త్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగిన వరు నన్వేషించుచు భువనంబులు గలయం గ్రుమ్మరి యెందునుం గానక వచ్చి వచ్చి.

762

తా॥ ఇంతలో స్వాయంభువ మనువు భార్యతో కూడి కనక రథాన్ని అధిరోహించి పెండ్లికెదిగిన కూతురుతో ఆమెకు తగిన భర్తను అన్వేషిస్తూ భువనాలన్నీ తిరిగి ఎక్కడా తగిన వరుణ్ణి కానక అక్కడకు వచ్చాడు.

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్ దయా నంద మెలర్పఁజూడ నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్ బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్ బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్.

763

తా॥ విష్ణువు కర్దముని దయతోను, ఆనందంతోను చూచినప్పుడు ఆయన నేత్రముల నుండి నేలకు రాలిన బాష్పములు సరస్వతీ నదిని చుట్టి పారుతూ “బిందు సరోవరం” అనే పేరుతో పుణ్యతీర్థమై ప్రసిద్ధికెక్కింది. ఆ తీర్థాన్ని స్వాయంభువుడు సందర్శించాడు.

ఉ. అందుఁ దమాల సాల వకుళార్జుననింబ కదంబ పాటలీ చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా కంద కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా కుంద మధూక మంజుల నికుంజములం దనరారి వెండియున్.

764

తా॥ ఆ తీర్థం చెంతనే కర్దమ ముని తపోవనం ఉంది. ఆ ఆశ్రమ వాటికలో కానుగ చెట్లు,

మద్దిచెట్లు, పొగడ చెట్లు, ఏరుమద్ది చెట్లు, వేప చెట్లు ఉన్నాయి. కొంచెం ముందుకు పోగా కడిమి చెట్లు, కలిగొట్టు చెట్లు, చందన వృక్షాలు, కొబ్బరి చెట్లు, కర్పూర వృక్షాలు, దిరిసెన చెట్లు కన్పించాయి. లవంగ లతలు, మాదీ ఫలాలు, మామిడి చెట్లు, ఎర్రచందనం చెట్లు, పోక చెట్లు, సంపెంగ పొదలు, మారేడు చెట్లు, వెలగ చెట్లు, ఇప్ప చెట్లు కనుపించాయి. ఆ ప్రక్కనే మల్లెలు, మొల్లలు అల్లుకొన్న చక్కని పొదరిండ్లు ఉన్నాయి.

క. పరిపక్వ ఫలభరానత, తరుశాఖానికర నివసిత స్ఫుటవిహగో త్కర బహు కోలాహల రవ, భరిత దిగంతములు గలిగి భవ్యం బగుచున్.

765

తా॥ పరిపక్వమైన పండ్ల బరువుతో తరు శాఖలు క్రిందకు వంగి ఉన్నాయి. దానిమీద ఉన్న పక్షి మూకల కోలాహలంతో దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి.

క. అతి నిశిత చంచు దళన, క్షత నిర్గత పక్వఫల రసాస్వాదన మో దిత రాజశుక వచో–ర్థ, శ్రుతిఘోషము సెలఁగె శ్రవణ సుఖదం బగుచున్.

766

తా॥ పక్వానికి వచ్చిన ఫలాలను అతి నిశితమైన తన ముక్కుతో పొడిచి స్రవిస్తూన్న రసాన్ని ఆస్వాదించి రామచిలుకలు మోదంతో చేస్తున్న అర్థవంతములైన వేదగానములు శ్రవణ సుఖంగా వినిపిస్తున్నాయి.

క. లలిత సహకార పల్లవ, కలితాస్వాదన కషాయ కంఠ విరాజ త్కలకంఠ పంచమ స్వర, కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యములై.

767

తా॥ లేత మామిడి చిగుళ్ళను మెక్కి ఎంతో రమ్యంగా కోయిలలు పంచమ స్వరంతో

మధురమైన కంఠనాదంతో రమ్యంగా కూస్తూ ఉన్నాయి.

క. అతుల తమాల మహీజ, ప్రతతి క్షణజాత జలద పరిశంకాంగీ కృత తాండవ ఖేలన విల, సిత పింఛవిభాసమాన శిఖీసేవ్యంబై.

768

తా॥ అచటి తమాల వృక్షాలను చూచి మేఘములనే భ్రాంతితో నెమళ్ళు పింఛములు విప్పుకొని తాండవం ఆడుతున్నాయి.

క. కారండవ జలకుక్కుట, సారస బక చక్రవాక షట్పద హంసాం భోరుహకైరవ నవ క, ల్హార విరాజిత సరోరుహాకరయుతమై.

769

తా॥ కన్నె లేళ్ళతో, నీటి కోళ్ళతో, బెగ్గురు పక్షులతో, కొంగ గుంపులతో, చక్రవాకాలతో, గండు తుమ్మెదలతో, కలహంసలతో, కమలాలతో, తెల్లకలువలతో, ఎఱ్రకలువలతో విరాజిల్లే సరోవరాలు గల ఆ ఆశ్రమ వాటిక అత్యంత రమ్యంగా ఉంది.

క. కరి పుండరీక వృక కా, సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ కర ఖడ్గ గవయ వలిముఖ, శరభ ప్రముఖోగ్ర వన్య సత్త్వాశ్రయమై.

770

తా॥ దాని పరిసరాలలో ఏనుగులు, పెద్దపులులు, తోడేళ్ళు, అడవి దున్నలు, కుందేళ్ళు, ఎలుగుబంట్లు, లేళ్ళు, చమరీ మృగాలు, సింహాలు, వరాహాలు, ఖడ్గ మృగాలు, గురుపోతులు, కోతులు, శరభాలు మొదలైన అడవిమృగాలు సంచరిస్తున్నాయి.

వ. ఒప్పు నప్పరమ తాపసోత్తముని యాశ్రమంబుం గనుంగొని మితపరిజనంబుల తోడం జొచ్చి యందు.

771

తా॥ అలా ఒప్పుతూన్న కర్దమ మునీంద్రుని ఆశ్రమాన్ని చూసి మితమైన పరివారంతో లోపలికి ప్రవేశించాడు.

సీ. అంచిత బ్రహ్మచర్యవ్రత యోగ్యమై, విలసిల్లు ఘనతపోవృత్తిచేత దేహంబు రుచిర సందీప్తమై చెలువొందఁ, గడుఁ గృశీభూతాత్మకాయుఁడయ్యు నలినోదరాలాప నవ సుధాపూరంబు, శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న కతనఁ గృశీభూతకాయుండు గాక జ, టావల్క లాజినశ్రీ వెలుంగఁ

తే. గమలపత్ర విశాల నేత్రములు దనర, నలి నసంస్కార సంచితానర్ఘ్య నూత్న రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి, భక్తి మ్రొక్కెను మనువు తత్పాదములకు.

772

తా॥ పూజింప తగిన బ్రహ్మచర్య వ్రతానికి యోగ్యమైన తపోవృత్తి చేత ఆ ప్రజాపతి దేహం అందంగా ప్రకాశిస్తోంది. ఆయన శరీరం మిక్కిలి చిక్కిపోయినా కూడా విష్ణు సంకీర్తనం అనే నామామృతాన్ని చెవులనే దోసిళ్ళతో త్రాగి సొక్కియున్న కారణాన కృశించినట్లు కనిపించటం లేదు. జడలు, నారచీరలు, జింకచర్మము కనువిందు చేస్తూ ఉండగా కమల పత్రముల వంటి విశాల నేత్రాలతో సానపట్టని అనర్ఘ రత్నంవలె ప్రకాశిస్తూన్న కర్దముణ్ణి చూసి ఆయన పాదాలకు స్వాయంభువుడు భక్తితో మ్రొక్కాడు.

వ. ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన య మ్మనువు నాదరించి యర్ఘ్య పాద్యాది విధులం బరితుష్టునిం గావించి పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె.

773

తా॥ ఇలా మ్రొక్కిన మనువును తన ఇంటికి పండగ వచ్చినట్లు భావించి ఆదరించి అర్ఘ్యపాద్యాదులతో సంతోషింప చేశాడు కర్దముడు. పిమ్మట శ్రీహరి ఇచ్చిన ఆదేశాన్ని స్మరించి మనువుతో ఇలా అన్నాడు:

సీ. వరగుణాకర! భగవద్భక్తియుక్తుండ, వైన త్వదీయ పర్యటన మెల్ల శిష్టపరిగ్రహదుష్ట నిగ్రహముల, కొఱకుఁ గదా పుణ్యపురుష! మఱియు వనజహితాహిత వహ్ని సమీర వై, వస్వత వార్ధిప వాసవాత్మ కుఁడవు హరి స్వరూపుఁడ వైన నీకును, మానిత భక్తి నమస్కరింతు

తే. ననఘ! నీ విప్పుడే నేమి యఖిలలోక, జైత్రమగు హేమ మణిమయ స్యందనంబు నెక్కి కోదండపాణివై యిద్ధసైన్య, పద విఘట్టనచే భూమిభాగ మగల.

774

తా॥ "శ్రేష్ఠమైన గుణాలకు స్థానమైన వాడా! భగవంతుని యందు భక్తితో కూడిన నీ పర్యటనమంతా శిష్టపరిగ్రహం, దుష్టనిగ్రహం కొరకే గదా! ఓ పుణ్యపురుష! సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, యముడు, వరుణుడు, ఇంద్రుడు... వీళ్ళ అంశలతో హరి స్వరూపుడవైన నీకు మన్ననతో కూడిన భక్తితో నమస్కరిస్తున్నాను. నీవెప్పుడూ అఖిల లోకాలను జయించే మణులతో కూడిన బంగారపు రథమెక్కి కోదండ పాణివై పరాక్రమవంతులైన సైన్యం పాదఘట్టనల చేత భూభాగం అదరగా జైత్రయాత్ర నడుపుతూ ఉంటావు.

మ. తరణింబోలి చరింపకున్న ఘననిద్రం బొంది యెందేని భూ వర! పద్మోదర కల్పితంబులగు నీ వర్ణాశ్రమోదార వి స్తర పాథోనిధి సేతుభూత మహిమాచార క్రియల్ దప్పి సం కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుం జుమీ!

775

తా॥ లోకంలో భానునివలె నువ్వు తిరగకపోతే ఇవన్నీ గొప్ప నిద్రలో మునిగిపోతాయి.

బ్రహ్మదేవునిచే ఏర్పాటు కాబడిన వర్ణాశ్రమ ధర్మాలన్నీ నశించి విస్తరించిన సముద్రానికి చెలియలికట్టవంటి ఆచారక్రియలన్నీ గతులు తప్పుతాయి. జాతులు సంకరమై చోరభయంవల్ల లోకాలన్నీ నశిస్తాయి."

వ. అని పలికి భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది? యనవుడు సమాహిత నిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె.

776

తా॥ అని పలికి 'ప్రజాపతి! మీ ఆగమనానికి కారణం ఏమిటి?' అని అడిగాడు. అప్పుడు నిత్యకర్మానుష్ఠానం ముగించుకొన్న ఆయనతో స్వాయంభువుడు ఇలా అన్నాడు:

క. సరసిజ గర్భుఁడు దనచే, విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్ ధర వెలయించుటకై బుధ, వర! మిమ్ముం దన ముఖంబువలన సృజించెన్.

777

తా॥ "బ్రహ్మ తనచే చెప్పబడిన వేద సమూహాన్ని ఈ లోకంలో వ్యాపింపచెయ్యడానికై ఓ పండిత శ్రేష్ఠా మిమ్ములను తన ముఖం నుండి సృష్టించాడు.

క. దురిత స్వరూప పాట, చ్చర పీడం బొందకుండ సకల క్షోణిం బరిపాలించుటకై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్.

778

తా॥ దుర్మార్గులైన దొంగల బారిన పడకుండ ఈ క్షోణీ మండలాన్ని పరిపాలించడానికి మమ్ములను ఆయన తన భుజాలనుండి పుట్టించాడు.

క. నెఱి నట్టి జలజభవునకుఁ, గర మంతఃకరణ గాత్రకములై వరుసం బఱఁగిన బ్రహ్మక్షత్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్.

779

తా॥ అంతఃకరణంగా బ్రాహ్మణులు, శరీరంగా క్షత్రియులు ఈ ఇద్దరు లక్ష్మీనాథునకు అవశ్యము కాపాడవలసినవారు.

వ. కావున హరిస్వరూపుండవై దుర్జనదుర్దర్శనుండ వయిన నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె, భవత్పాదకంజ కింజల్కపుంజ రంజితంబైన మదీయ మస్తకంబును దావక వచనసుధా పూరితంబులైన శ్రవణంబులును మంగళకరత్వంబున సాఫల్యంబునం బొందె, నేను గృతార్థుండ నయితి దుహితృ స్నేహజదుఃఖ పరిక్లిన్నాంతః కరణుండనై సకల దేశ పరిభ్రమణ ఖిన్నుండ నయిన నా విన్నపం బవధరింపు మని యిట్లనియె.

780

తా॥ అందువల్ల హరి స్వరూపుడవు, దుష్టులకు తేరిచూడ వీలుకానివాడవు అయిన నిన్ను చూడటం అనేది కేవలం నా అదృష్టం వల్ల సిద్ధించింది. నీ పాదపద్మాలలోని కేసర సమూహం వల్ల రంజితమైన నా మస్తకం, నీ మాటలనే అమృతాన్ని గ్రోలిన నా చెవులు, సమస్త మంగళములకు స్థానమై సఫలత్వాన్ని పొందాయి. నేను కృతార్థుడనయ్యాను. కుమార్తెపై ఉన్న స్నేహం వల్ల అంతఃకరణంలో ఆందోళన పడుతూ దేశాలన్నీ తిరిగి శోకంతో ఉన్న నా విన్నపాన్ని అవధరింప వలసింది" అని ఇలా అన్నాడు:

మ. వరయోగీశ్వర! దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్త్రి, దా వరలావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర, కా తురయై నారదుపంపునన్ మిము వరింతు న్నంచు నేతెంచె, నీ తరుణీభిక్షc బరిగ్రహింపుము శుభోదాత్త క్రియాలోలతన్.

781

తా॥ "ఓ యోగీశ్వరా! దేవహూతి అనే ఈమె నా కూతురు. తాను సౌందర్యవంతులైన మిక్కిలి గుణాఢ్యులను గురించి విని కూడా ఎవరినీ మనస్సులో ఇష్టపడటం లేదు. నారద

మహర్షివల్ల నీ రూపురేఖా గుణములు విని నిన్నే పెండ్లి చేసుకోవాలనే సంకల్పంతో ఇక్కడకు వచ్చింది. ఈ తరుణీ భిక్షను స్వీకరించి శుభకార్యానికి అంగీకరించు.

క. అమలిన గృహమేధిక క, ర్మములకు ననురూపగుణ విరాజిత శీల క్రమములఁ దనరిన తరుణిం, బ్రమదమున వరింపుమయ్య భవ్యచరిత్రా!

782

తా॥ నీ గృహస్థాశ్రమ ధర్మాలను నెరవేర్చటం కోసం తగిన రూపము గుణము శీలము కలిగిన ఈ తరుణీమణిని సంతోషంతో స్వీకరించు.

క. అనఘ! విరక్తులకైనం, దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం జనదఁట, కాముకులకు న, బ్బిన మానుదురే లభించు ప్రియసౌఖ్యంబుల్.

783

తా॥ అనఘ! విరక్తులకైనా తమంత తాముగా లభించు సుఖాలను విడిచిపెట్టకూడదని అంటారే పెద్దలు, అలాంటప్పుడు అప్రయత్నంగా లభించిన ప్రియసౌఖ్యాన్ని మానుకుంటారా?

క. వినుము, ఫలారంభుఁడు గృప, ణుని నడిగినఁ దనయశంబునుం దగు మానం బును జెడుఁ గావునఁ దగ నీ, వెనయ వివాహేచ్ఛఁ దగులు టెఱిఁగి యిచటికిన్.

784

తా॥ విను. ఫలాన్ని కోరి పని చెయ్యడానికి ఆరంభించినవాడు లోభిని అడిగితే వాడిచ్చే సలహావల్ల ఆ పని చెడటమే కాక తన గౌరవప్రతిష్ఠలు కూడ చెడతాయి. నువ్వు పెళ్ళి చేసుకోవాలనే కోరికతో ఉన్నావని తెలిసి ఇక్కడకు వచ్చాము.

క. చనుదెంచితి, నస్మత్ప్రా, ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం డని ముని స్వాయంభువునిం, గనుఁగొని మరలంగఁ బలికెఁ గడుమోదమునన్.

785

తా॥ నా ప్రార్థనను మన్నించి నా కుమార్తెను నీవు పెండ్లి చేసుకొనవలసిందని చెప్పగా విని కర్దముడు స్వాయంభువ మనువును చూచి కడుమోదంతో ఇలా అన్నాడు:

సీ. అనఘ! నీ చేత ననన్యదత్తముగఁ బ్ర, తిష్ఠితంబైన యీ తీవఁబోఁడి కమనీయ రూప రేఖా విలాసంబుల, మానితలక్ష్మీ సమాన యగుచు నొకనాఁటి రాత్రియం దుడురాజ చంద్రికా, ధవళితనిజసౌధ తలమునందు మహిత హిరణ్మయ మంజీర శోభిత, చరణయై నిజసఖీ సహిత యగుచుఁ

తే. గందుకక్రీడఁ జరియింపఁ గగనమందు, వర విమానస్థుఁ డగుచు విశ్వావసుండు నాఁగఁ దనరిన గంధర్వ నాయకుండు, తరుణిఁ జూచి విమోహియై ధరణిఁ బడియె.

786

తా॥ "అనఘ! నీ చేత అన్యులకు ఇవ్వకుండ నాకిద్దామనే ఉద్దేశంతో తీసుకువచ్చిన ఈ లతాంగి కమనీయ రూపురేఖా విలాసాదులలో మహాలక్ష్మితో సమానం. ఈమె ఒక పున్నమినాటి రాత్రి పండువెన్నెలలో వెలిగి పోతున్న తన మేడమీద బంగారు పాదమంజీరాల శోభతో సఖీజనంతో కలిసి కందుక క్రీడ ఆడుతున్నది. ఆ సమయంలో ఆకాశంలో విమానారూఢుడైన విశ్వావసుడనే గంధర్వరాజు ఈ తరుణిని చూసి మోహించి తూలి ధరపై పడ్డాడు.

తే. పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు, లీ తలోదరిఁ బొడగాన రేమి సెప్ప? నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన, వచ్చి కామింప నొల్లని వాఁడు గలఁడె?

787

తా॥ దామోదరుని స్మరణం ఎరుగని పురుష పశువు ఈ తలోదరిని దర్శింపలేరు. అటువంటి జవ్వని తన భాగ్యవశాన తనంత తానుగా ప్రేమించి వస్తే కాదనే వాడు ఉంటాడా?

క. ఈ కన్యారత్నమునకు, నాకును గుణరూప వర్తనంబుల యెడ నా లోకింప సమమ కావునఁ, గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్.

788

తా॥ ఈ కన్యారత్నమునకు, నాకు గుణము, రూపము, నడవడి సమంగా ఉన్నాయి. కనుక కల్మషం లేని హృదయంతో ఈమెను వరిస్తాను.

క. విమలాత్మ! దీని కొక సమ, యము గల దెఱిఁగింతు విను గుణాకర యగు నీ రమణికి నపత్యపర్యం, తము వర్తింపుదు గృహస్థధర్మ క్రియలన్.

789

తా॥ విమలాత్మ! దీనికొక నియమం ఉంది, చెబుతాను విను. సద్గుణములకు స్థానమైన ఈమెకు సంతానం కలిగే వరకు మాత్రమే నేను గృహస్థధర్మ క్రియలను నడుపుతాను.

ఆ. అంతమీఁద విష్ణు నాజ్ఞ యౌఁదలఁ దాల్చి, శమదమాది యోగసరణిఁ బొంది సన్న్యసించు వాఁడ జలజనేత్రుని వాక్య, కారణమునఁ జేసి ధీరచరిత!

790

తా॥ ఆపైన విష్ణువుయొక్క ఆజ్ఞను శిరస్సున ధరించి శమదమాది యోగమార్గంలో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరిస్తాను.

క. శ్రీవిభుని వలన నీ లో, కావళి యుదయించుఁ బెరుఁగు నడఁగును విను రా జీవభవాదుల కతఁడే, భూవర! నిర్మాణ హేతు భూతుం డరయన్.

791

తా॥ శ్రీహరి వల్లనే ఈ లోకాలన్నీ పుడుతున్నాయి, పెరుగుతున్నాయి, నశిస్తున్నాయి. బ్రహ్మాదుల అభ్యుదయానికి కూడా ఆయనే కారణం.

వ. అది గావున న మ్మహాత్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరాదని కర్దముండు వలికిన విని స్వాయంభువుండు నిజభార్యయైన శతరూప తలంపును బుత్త్రియైన దేవహూతి చిత్తంబును నెఱింగినవాఁడై ముని సమయంబున కియ్యకొని ప్రహృష్ట హృదయుం డగుచు సమంచిత గుణగణాఢ్యుం డయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్తప్రకారంబున వివాహంబు సేయించెఁ, దదనంతరంబ శతరూపయును బారిబర్హ సంజ్ఞికంబులైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతి కర్దముల కొసంగె, నవ్విధంబున నిజకులాచార సరణిం బరిణయంబు గావించి విగత చింతాభరుండై స్వాయంభువుండు దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండై కూఁతుం గౌఁగిలించుకొని, చుబుకంబుఁ బుడుకుచుఁ, జెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్త మస్తకం జేసి తల్లీ! పోయి వచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రితుండై నిజభార్యా సమేతంబుగ రథం బెక్కి సపరివారుండై.

792

తా॥ అందుచేత ఆ మహాత్ముని ఆజ్ఞ ఉల్లంఘించడానికి వీలుకానిది" అని కర్దముడు పలుకగా విన్న స్వాయంభువుడు తన భార్య అయిన శతరూపతోను, కుమార్తె అయిన దేవహూతితోను మాట్లాడి వాళ్ళ మనస్సులలోని ఆలోచనను తెలుసుకున్నాడు. తెలుసుకొని కర్దమ ప్రజాపతికి దేవహూతినిచ్చి శాస్త్రప్రకారం వివాహం చేయించాడు.

అనంతరం శతరూప "పారిబర్హము" అనే పేర్లు గల వివాహమునకు ఉచితమైన దివ్య వస్త్రములను, దివ్య అలంకారాలను దేవహూతి, కర్దములకు బహూకరించింది. ఆ విధంగా కులాచారాన్ని అనుసరించి వివాహంచేసిన స్వాయంభువునికి మనస్సు చాలా తేలిక అయ్యింది. కాని కుమార్తె దూరమై పోతున్నదనే బాధతో కూతురును కౌగిలించుకొని చుబుకం ముద్దాడి, చెక్కిలి నొక్కి, శిరస్సును ఆఘ్రాణించి ప్రేమాతిరేకం చేత పెల్లుబికిన కన్నీటి ధారలచే ఆమె శిరస్సును తడిపేశాడు. ఆపై తనను తాను నిగ్రహించుకుని "తల్లీ! వెళ్ళి వస్తాను!" – అని చెప్పి

కర్దముని వీడ్కోలుతో తన భార్యతో కూడి రథమెక్కి సపరివారంగా తిరిగి బయలు దేరాడు.

చ. తరళ తరంగ వీచి సముదంచిత బిందుసరస్సరస్వతీ సరిదరవింద తుందిల లసత్తరు తీర నివాస సన్మునీ శ్వర నికరాశ్రమాకలిత సంపదలం గనుఁగొంచు వేడ్క ము ప్పిరిఁగొన నేఁగె నాత్మ పుటభేదన విస్ఫుటమార్గవర్తియై.

793

తా॥ చలిస్తూన్న తరంగాలు గల బిందు సరోవరం దాటి, సరస్వతీ నదిని అతిక్రమించి దాని ఒడ్డున అరవిందములతోను అందమైన చెట్లతోను అలరారుతున్న మహర్షుల ఆశ్రమాలను, దాని శోభను వేడుకతో చూస్తూ మనువు తన పట్టణం వైపుకు కదలి వెళ్ళాడు.

వ. ఇట్లు సని చని, బ్రహ్మావర్తదేశంబునందు.

794

సీ. ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూ, కరమూర్తిఁ గైకొని సరభసముగ నొడలు జాడించినఁ బుడమిపై రాలిన, రోమజాలంబులు రుచిర హరిత వర్ణమై పొలుపార వర కుశ కాశ మ, యంబును యజ్ఞక్రియా కలాప యోగ్యంబునై చాల నొప్పారి బర్హిస్సు, సంభవించిన దాన సకల ఋషులుఁ

తే. గ్రతువు లొనరించి తద్విఘ్నకారులైన, యసురులను ద్రుంచి రట్ల స్వాయంభువుండు విష్ణుపరముగ మఖము గావించి రుచిర, మేధ సెలువొంది నట్టి యాత్మీయపురము.

795

తా॥ ఇలా వెళ్ళి బ్రహ్మావర్త దేశం చేరుకున్నాడు. పూర్వం నారాయణుడు యజ్ఞసూకర రూపం ధరించి ఒడలు జాడిస్తే భూమిపై ఆ ప్రదేశంలో కొంత రోమజాలం రాలింది. ఆ రోమజాలం అందమైన పసుపు పచ్చని వర్ణంతో ప్రకాశించింది. అక్కడ పచ్చని దర్భలు, రెల్లుగడ్డి, యజ్ఞక్రియా కలాపానికి అవసరమైన అగ్ని పుట్టాయి. దానితో ఋషులందరు క్రతువులు చేసి

దానికి ఆటంకాలు కల్పించే అసురులను నాశనం చేశారు. అట్టి బ్రహ్మావర్త దేశంలో స్వాయంభువుడు విష్ణుపరంగా క్రతువు చేసి అద్భుతమైన మేధస్సుతో ప్రకాశిస్తూ; తన పట్టణానికి చేరుకున్నాడు.

క. డాయంజనఁ బురజనము లు, పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నతుల్ సేయఁగ మంగళతూర్యము, లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్.

796

తా॥ సమీపించే సరికి పట్టణ ప్రజలు అనేక బహుమతులు తెచ్చి ఇచ్చి నమస్కారాలు చేసి మ్రొక్కారు. శోభస్కరమైన మంగళ వాద్యాలు మ్రోగుతూ ఉండగా ఆయన అంతఃపురంలోకి అడుగుపెట్టాడు.

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్త్రమిత్ర సుహృద్బాంధవ సహితుండై పరమానందంబున.

797

తా॥ అట్లా ప్రవేశించి తాపత్రయాన్ని నాశనం చేసే భక్తి మార్గంలో వృద్ధి పొందుతూ పుత్ర, మిత్ర, కళత్ర, బాంధవ సహితుడై ఆనందంతో ఉన్నాడు.

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరి వ్యాసంగుఁడై మాధవాం కిత గంధర్వ విపంచికాకలిత సంగీత ప్రబంధాను మో దితుఁడై యిష్టవిభూతులందు ననురక్తిం బొంద కేప్రొద్దు న చ్యుత సేవైక పరాయణుం డగుచు నస్తోక ప్రభావోన్నతిన్.

798

తా॥ మిక్కిలి భక్తితో ప్రతి నిత్యము హరి మీది ఆసక్తితో ఆయనకే అంకితంగా గంధర్వ వీణను మేళవించి సంగీత ప్రబంధాలను గానం చేస్తూ ఎడతెగని ఆనందాన్ని పొందుతూ

భోగభాగ్యాల మీద అనురక్తిని పొందక విష్ణు సేవా పరాయణుడై ప్రతిభాన్వితుడయ్యాడు.

మ. హరిపాదాంబురుహద్వ యార్పితతులస్యామోదముం గొంచుఁ ద చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచున్ వించుఁ ద త్పరిచర్యావ్యతిరిక్త సంసరణ సద్ధర్మార్థ కామంబులం బరిభూతంబులు సేసి మోక్షపదసంప్రాప్తి క్రియారంభుఁడై.

799

తా॥ హరియొక్క పాదకమలాలపై అర్పింపబడిన తులసీ దళాల సువాసనను ఆఘ్రాణిస్తూ, ఆయన చరిత్రనే తలపోస్తూ, పొగుడుతూ, చర్చిస్తూ, వింటూ మోక్షాన్ని చేకూర్చే క్రియల యందే ఆసక్తి కలిగిన వాడైనాడు. భగవంతుని సేవలకు వ్యతిరిక్తమై సంసార బంధములైన ధర్మార్థ కామములను విడిచిపెట్టాడు.

క. నిగమార్థగోచరుం డనఁ, దగు హరిచరిత ప్రసంగ తత్పర చిత్తుం డగు నతనికి స్వాంతరగము, లగు యామము లొగిన? యాతయామము లయ్యెన్.

800

తా॥ నిగమముల యొక్క అర్థం తెలిసిన వారికి మాత్రమే గోచరమయ్యే ఆ హరి యొక్క చరితలను ప్రసంగించుట యందే ఆసక్తమైన మనస్సుగల మానవునకు కాలం ఎంత గడిచినా గడవనట్లే ఉంటుంది.

సీ. వెండియు నమ్మేటి విష్ణుమంగళ కథా, కర్ణన ధ్యానానుగాన నుతులు సలుపుచు స్వస్వప్న జాగ్రత్సుషుప్తులఁ, దలఁగించి యీ పుణ్యతముఁడు దాను జక్రిదాసుఁడు గాన శారీర మానస, దివ్యమానుష భౌతిక వ్యథలను దగులక సన్మునీంద్రశ్రేణికిం దగఁ, దనరు వర్ణాశ్రమ ధర్మగతులు

తే. దప్పకుండగ నడుపుచుఁ దగిలి సర్వ, భూతహిత వృత్తి నతుల విఖ్యాతలీల నేక సప్తతి

యుగము లస్తోక చరితుఁ, డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల.

801

తా॥ విష్ణువు యొక్క మంగళాన్ని కలిగించే కథలను వింటూ, ఆయన చరిత్రను గానం చేస్తూ, ఆయన చెప్పిన ప్రకారమే నడుచుకొంటూ, ఆయననే ధ్యానిస్తూ జాగ్రత్, స్వప్న, సుషుప్తి ఈ మూడు అవస్థలకు భిన్నంగా వర్తించాడు. ఆ పుణ్యాత్ముడు తాను విష్ణుదాసుడు కావున శారీరక, మానసిక, దివ్యమానసిక, భౌతిక బాధలలో తగులుకోలేదు. సన్మునీంద్రులకు సంతోషం కలిగేటట్లుగా వర్ణాశ్రమ ధర్మాలను నడుపుతూ, సర్వ భూతములకు హితాన్ని కలిగిస్తూ డెబ్బైయొక్క మహాయుగాలు సాటిలేని మేటి యశస్సుతో ఘన చరిత్రుడై పరిపాలించాడు."

క. అని యమ్మను చరితము విదు, రున కమ్మైత్రేయమునివరుఁడు దయతోడన్ వినిపించి కర్దముని కథ, దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్.

802

తా॥ అని స్వాయంభువ మనువు చరిత్రను మైత్రేయుడు విదురునికి దయతో వినిపించి, ఆ తర్వాత "కర్దమ మునీంద్రుని కథ వివరిస్తాను" వినుమని సంతోషంతో పలికాడు:

# కర్దమ ప్రజాపతి యోగప్రభావముతో విమానమును కల్పించి భార్యతో విహరించుట

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబుసేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియ తనకు నేడుగడయుంగా నెఱింగి య మ్మునీంద్రుని చిత్తవృత్తికొలఁది దినదినంబునకు భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపం బ్రియ శుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామ క్రోధ దంభ లోభాది గుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతుర సౌహార్ద స్నేహంబులు గలిగి పతియ దైవంబుగా భావించి మృదు మధుర వచన రచనయై పతిభక్తి యేమఱక వర్తింప దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుండైన కర్దముండు నిజసేవాయాస కృశీభూతదేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె.

803

తా॥ "ఈ విధంగా స్వాయంభువుడు తన కుమార్తె అయిన దేవహూతిని కర్దమునికి ఇచ్చి వివాహం చేసి తిరిగి వెళ్ళిపోయాడు. ఆపై దేవహూతి పతిభక్తితో పార్వతీదేవి శివునికి పరిచర్య చేసినట్లు తనకు సమస్తము భర్తయే అని నమ్మి ఆయనకు సేవ చేయసాగింది. ఆయన మనస్సుకు నచ్చినట్లు ప్రతిరోజు భక్తి, స్నేహాలతో ఆయన చెప్పినట్లు చేస్తూ అధికమైన తేజస్సుతో వెలిగిపోతూ కామం, క్రోధం, దంభం, లోభం ఇత్యాది చెడుగుణములకు దూరంగా ఉంటున్నది. మంచి మనస్సుతో, చాతుర్యంతో, స్నేహంతో పతిని దైవంగా భావించి, మృదువుగా మధురంగా మాట్లాడుతూ పతి భక్తిని మాత్రం నిర్లక్ష్యం చెయ్యకుండా వర్తిస్తూన్నది. దైవయోగాన్ని సైతం తప్పింప సామర్థ్యంగల కర్దముడు తనకు సేవ చెయ్యటం వలన అలసిన శరీరంతో చిక్కియున్న తన భార్యను చూచి కరుణారసం పొంగిపొర్లే కడగంటి చూపులతో మధురంగా ఇలా అన్నాడు:

ఉ. మానిత ధర్మమార్గ మహిమస్ఫుట భూరి తపస్సమాధి వి ద్యా నిభృతాత్మ యోగ

సముపార్జిత విష్ణుకటాక్ష లబ్ధ శో భానఘు దివ్యభోగ బహుభద్ర వితానము లస్మదీయ సే వా
నిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్.

804

తా॥ "దేవీ! గొప్పదైన ధర్మమార్గాచరణ వల్ల మహిమ, ఆ మహిమవల్ల గొప్ప తపస్సు, దానివల్ల ఏకాగ్రత, దానివల్ల ఆత్మజ్ఞానం, దానివల్ల భగవత్కటాక్షము లభిస్తాయి. ఆ విష్ణుకటాక్షం వల్ల దివ్యమైన భోగాలు, అంతులేని శుభాలు కలుగుతాయి. నాకున్న భోగాలన్నీ కూడా నన్ను సేవిస్తున్న కారణంగా నీకూ సంప్రాప్తిస్తాయి. అంతేకాదు, నీకు దివ్యదృష్టిని కూడా ఇస్తున్నాను.

తే. నెలఁత! తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ, గానవచ్చు, విలోకింపు, కమలపత్ర నయను
బొమముడి మాత్రాన నాశమందు, నితరమగు తుచ్ఛభోగంబు లేమి సెప్ప.

805

తా॥ ఓ వనితా! ఆ దివ్యదృష్టి వలన సర్వమూ నీకు కనిపిస్తుంది. చూడు! ఆ మాధవుడు బొమముడి పెట్టిన మాత్రాన నాశనమైపోయే ఇతరమైన తుచ్ఛభోగాల గురించి చెప్పేదేముంది?

సీ. అనుపమ రాజ్య దర్పాంధ చేతస్కులై, పాపవర్తనులైన పార్థివులకు ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు, నీదు పాతివ్రత్యనిష్ఠఁ జేసి సంప్రాప్తములు నయ్యె, సమత భోగింపుము, కార్యసిద్ధియు నగుఁగాక నీకు ననుటయు నతివయు ననుపమయోగ మా, యా విచక్షణ శాలియైన కర్ద

తే. మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ, కలితలజ్జానతాస్య పంకజయు నగుచు
వినయ సౌహార్దములఁ జేసి విహ్వలంబు, లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి.

806

తా॥ అంతులేని రాజ భోగాలలో దర్పితులై కనులు కనుపించక తప్పుడు మార్గంలో సంచరించే రాజులకు పొందరాని ఈ దివ్యభోగాలు నీ పాతివ్రత్య నిష్ఠచేత నీకు లభించాయి. సమాన బుద్ధితో ఈ భోగాలు అనుభవించు. నీ మనస్సులోని కోరిక నెరవేరుతుంది. అంత దేవహూతి అంతులేని యోగమాయా విచక్షణశాలి అయిన కర్దముని చూచి సిగ్గుచేత శిరస్సు వంచుకుని వినయ సౌహర్దముల చేత ఆమె పలుకులు స్వాధీనం తప్పగా ప్రీతితో ఇట్లా అంది:

వ. అనఘా!, యమోఘ యోగమాయా విభుండవు, సమర్థుండవు నయిన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కం బని యెఱుంగుదు, భవత్సంగతి నన్నియు నాకుం గలుగు, నయినను దేవా! నీ వానతిచ్చిన సంతాన పర్యంతంబైన శరీర సంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవదంగ సంగమంబుఁ గృపసేసి మన్నింపుము, భవదీయ సంయోగవాంఛా పరతం గృశీభూతం బయిన యీ దేహం బే విధంబున మజ్జన భోజన పాన సుఖంబులం బరితుష్టిం బొందు నట్టి మన్మనోరథంబుఁ దీర్ప రతి రహస్య ప్రకాశకంబగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబు లయిన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన న మ్మహాత్ముండు నిజయోగమాయా బలంబునం దత్క్షణంబ.

807

తా॥ "అనఘా! అనుపమ యోగమాయా విభుడవు, సమర్థుడవు అయిన నీయందు అద్భుత శక్తులు ఉన్నాయనే విషయం నాకు తెలుసు. నీ సాంగత్యం వల్ల ఆ శక్తులన్నీ నాకూ వస్తాయి. అయినప్పటికి ఓ దేవా! సంతానం కలిగేటంత వరకు శరీర సంగమం కలిగి ఉంటామని నీవు అన్న నియమాన్ని మనస్సులో తలచుకొని నీ అంగ సంగమాన్ని కృపతో నాకు అనుగ్రహించు. నీ సంయోగ వాంఛతో కృశించి పోతూన్న నా శరీరం స్నాన భోజన పానాదుల వల్ల ఎలా పరితుష్టిని పొందుతుంది? కనుక నా మనస్సులోని కోరిక తీర్చడానికి రతి రహస్యాన్ని చెప్పే కామశాస్త్రాన్ని నాకు నేర్పు. దానికి ఉచితమైన వివిధ వస్త్రములు, అలంకారాలు,

మాల్యములు, లేపనములు, మందిరములు, ఆరామములు సమకూర్చి నన్ను కరుణించ వలసింద" ని ఆమె కోరగా తక్షణం తన యోగమాయాబలం చేత ఆ క్షణంలోనే ఒక దివ్య విమానాన్ని సృష్టించాడు.

సీ. దివ్యమణి స్తంభదీప్తిఁ జెన్నొందుచు, మరకతస్థలముల మహిమ దనర వరవజ్ర కుడ్య కవాట శోభితములై, విద్రుమ దేహళీ వీథు లమరఁ గొమరొప్ప నవశాత కుంభ కుంభములపై, హరినీల శకల విస్ఫురణ మెఱయఁ దగఁ బద్మరాగంపు మొగడలఁ జెలువొందు, వైదూర్య వలభులు వన్నెఁజూపఁ

తే. దరళతర ధూతకేతు పతాక లొలయ, మంజు శింజత్సమంచిత మధుప కలిత సురుచిరాలంబమాన ప్రసూన రాజి, మాలికల నొప్పు వివిధ గృహాళి దనరి.

808

తా॥ ఆ విమానంలో గృహాలన్నీ... దివ్యమైన మణి స్తంభాల దీప్తులతో చెన్నొందుతూ ఉన్నాయి. మరకతాలు పరచిన నడవలతో మహిమతో ఒప్పుతున్నాయి. వజ్రాల తలుపులుగల గోడలతో శోభిస్తున్నాయి. పగడాలతో అలంకరింపబడిన గడపలతో ప్రకాశిస్తున్నాయి. తళతళలాడే నూతనమైన బంగారపు కలశాల అంచులలో హరినీలముల యొక్క ప్రకాశంతో అందంగా ఉన్నాయి. పద్మరాగపు మొగ్గలతో చెలువొందే వైదూర్యపు చంద్రశాలలు వన్నె చూపుతున్నాయి. గాలికి కదలుతూన్న జెండాలు ఒప్పుతున్నాయి. మంజులంగా ఝుంకారం చేసే తుమ్మెదగుంపులతో కూడి వ్రేలాడుతున్న కుసుమ మాలికల తోరణాలతో అలరారుతు ఉన్నాయి.

క. మఱియును దుకూల చీనాం, బర కౌశేయాది వివిధపట పరివృత మం దిర సుభగాకారంబై, యరుదార విచిత్రపట్టికాలంకృతమై.

809

తా॥ గృహాలలోని గదులలో తెల్లని సన్నని వస్త్రములు, చీనాంబరాలు, పట్టుచీరలు ఇంకా

అనేక విధాలైన వలువలతో శోభిల్లుతూ, చాలా చిత్రమైన పట్టెమంచాలు అలంకృతమై ఉన్నాయి.

మ. లలితోద్యాన వనాంత సంచరణ లీలాలోల హంసాళి కో కిల పారావత చక్రవాక శుక కేకి వ్యాహ మంచత్సము త్కలికం గృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుతూ హలియై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణ వ్యాప్తులన్.

810

తా॥ అక్కడి లలితమైన ఉద్యానవనాలలో సంచరిస్తూన్న రాజహంసలు, కోకిలలు, పావురాలు, చక్రవాకాలు, చిలుకలు, నెమళ్ళు మొదలైన పక్షుల యొక్క గుంపులు; గోడలమీద చెక్కబడిన కృత్రిమ పక్షులను చూచి అవన్నీ నిజమైన పక్షులుగానే భావించి ఎంతో కుతూహలంతో వాటిని పలుకరిస్తూ చెట్లకొమ్మలపై ఆడుకుంటూ ఉంటాయి.

వ. వెండియు.

811

క. ఘన సౌంధాంతరశయ్యా, సన కేళీగేహకృతకజగతీధరశో భన చంద్రకాంతచారుభ, వన ఫలభరితావనీజవంతము నగుచున్.

812

తా॥ ఇంకా... గొప్పదైన అచ్చటి మేడలు శయ్యలతో, ఆసనములతో, కేళీ గృహాలతో, కల్పింపబడిన క్రీడా పర్వతాలతో, శోభనమైన చలువరాతి భవనాలతో, ఫలభరిత వృక్షములతో కూడిన వనాలతో నిండి ఉంది.

క. సకలర్తు శోభితంబును, సకల శుభావహము సకలసంపత్కరమున్ సకలోపభోగ యోగ్యము, సకలేప్సిత కామదంబు సదలంకృతమున్.

813

తా॥ సకల ఋతు శోభతో, సకల శుభాలతో, సకల సంపత్తులతో ఒప్పుతూ సకల భోగాలకు యోగ్యమై, కోరుకున్నదల్లా ఇచ్చేదిగా అన్ని విధాల అలంకారాలతోను ఉంది.

వ. అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయ సుషమా విశేషచిత్రంబులు నిర్మించిన తానునుం దెలియం జాలని యద్భుత కర్మంబయిన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముద్దియ సంతసింపకుండుట యెఱింగి సర్వభూతాంతరాశయాభిజ్ఞుండును, సంతుష్టాంత రంగుండును నైన కర్దముం డిట్లనియె.

814

తా॥ అట్లాంటి దివ్య విమానాన్ని కల్పించి అందలి విచిత్రాలను, తాను కూడా తెలుసుకోలేనంతటి దానిలోని పనితనాన్ని దేవహూతికి చూపించాడు. కాని ఆ ముద్దరాలు సంతోషపడలేదు. సర్వభూతముల ఆశయాలను తెలుసుకోగలిగినవాడు, ఎల్లప్పుడూ తృప్తి చెందిన అంతరంగం గలవాడు అయిన కర్దముడు ఆ విషయాన్ని తెలుసుకొని భార్యతో ఇలా అన్నాడు:

తే. అతివ, భగవత్కృతంబును నఖిల మంగ, ళాకరంబును నగు నీ జలాశయమునఁ దవిలి గ్రుంకిన జంతు వితానములకుఁ, గామ్యఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు.

815

తా॥ "అతివా! భగవంతునిచే నిర్మింపబడినది, అఖిల మంగళములకు స్థానమైనది అయిన ఈ సరోవరంలో స్నానం చేసిన వారికి కోరిన కోరికలన్నీ నెరవేరతాయి.

క. ఇజ్జలముల నతిభక్తి నిమజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్ లజ్జావతి! యెక్కవె యని, బుజ్జవ మొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్.

816

తా॥ చెలీ! ఈ సరోవర జలాలలో అతిభక్తితో స్నానం చేసి ఈ విమానాన్ని తిరిగి ఎక్కవలసింది” అని బుజ్జగిస్తూ కర్దముడు పలికాడు.

వ. విని యా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు, వేణీ భూతశిరోజయు, ధూళి ధూసరితాతి కృశీభూతాంగియు, శబల స్తనయునై భర్తృ నియోగంబున సరస్వతీ సలిల సంభూత జలచరాశ్రయం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూర మధ్యంబున రుచిర సూక్ష్మాంశుక ధారిణులుఁ, గిశోరవయః పరిపాకశోభితలు, నుత్పల గంధులు నగు కన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి.

817

తా॥ భర్త పలికిన పలుకులు దేవహూతి విన్నది. పతిసేవలో ఉన్న ఆమె బాగా అలసిపోయి ఉంది. కట్టుకున్న చీర బాగా మాసిపోయింది. శిరోజాలు జడలు కట్టి ఉన్నాయి. ధూళి ధూసరితమై శరీరం బాగా కృశించిపోయి ఉంది. వక్షస్థలమంతా వివర్ణమై ఉన్నది.

భర్త ఆజ్ఞానుసారం సరస్వతీనదీ జలాలనుండి పుట్టిన, అనేక జలచరములకు ఆశ్రయమైన బిందు సరోవరంలో స్నానానికై దిగింది. అలా ఆ జలాలలో మునిగి స్నానం చేసేటప్పుడు ఆ నీటి మధ్య నుండి... ఒప్పిదమైన సన్నని చీర ధరించినవారు, మంచి వయస్సులో శోభిస్తూన్నవారు, కలువ పూలవంటమంచి సువాసన గలవారు అయిన వేలకొలది కన్యకామణులు ఆమెను చూసి ఇలా అన్నారు:

క. తరుణీ! సంచితధర్మా, చరణల మగు మేము నీకు సదమలభక్తిం బరిచర్య సేయనేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్.

818

తా॥ “తరుణీ! ధర్మాన్ని ఆచరించే మేము నీకు భక్తితో సేవలు చెయ్యగలం. కరుణతో

మమ్ములను చూడు."

సీ. అని పల్కి డాసి యయ్యతివకు నభ్యంజ, నోద్వర్తనములు పెంపొనరఁ జేసి మలయజ కర్పూర మహితవాసిత హేమ, కలశోదకంబుల జలకమార్చి ధవళ వస్త్రంబులఁ దడియొత్తి సర్వాంగ, ధూపంబు లొసఁగి కస్తూరి యలఁది మంజుశింజన్మణి మంజీర కింకిణీ, కలరావ కలిత మేఖలలు రత్న

తే. ఖచిత తాటంక ముద్రికా కంకణాది, సముచితానర్ఘ హేమభూషణము లొసఁగి భవ్యమాల్యాను లేపనాంబరము లిచ్చి, షడ్రసోపేత వివిధాన్న సమితిఁ దనిపి.

819

తా॥ అని పలికి ఆమె చెంతకు చేరి దేవహూతికి నలుగుపెట్టి, తలంటి మంచి గంధం కర్పూరం వీటి సువాసనలు వెదజల్లే హేమ కలశాలతో జలక మాడించారు. ధవళ వస్త్రాలతో తడి యొత్తి సర్వాంగాలకి అగరు ధూపాలు వేసి కస్తూరి పూసారు. మంజులంగా ధ్వనించే మణిమంజీరాలు పాదాలకు తొడిగి, చిరు మువ్వలతో సవ్వడి చేసే రత్నాల ఒడ్డాణం నడుముకు అలంకరించారు. రత్నములు చెక్కిన తాటంకాలు, అంగుళీయకాలు, సన్నని కుణుకుణు ధ్వనులతో ఒప్పేమేఖలలు, కంకణాలు మొదలైన అనర్ఘహేమ భూషణాలతో సంతోషింప చేశారు. శుభకరమైన పుష్పమాలికలు, సుగంధలేపనాలు, పట్టు వస్త్రాలు ఇచ్చి ఆరు రుచులతోను, పిండివంటలతోను భోజనం పెట్టి తృప్తి పరచారు.

వ. మఱియుం గనక పాత్రరచితంబు లయిన కర్పూర నీరాజనంబుల నివాళించి రుచిరాసనంబునఁ గూర్చుండఁబెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలిత నిజదేహంబుఁ గనుంగొని కర్దముని మనంబునం దలంచిన నతండునుం గన్యకాసహస్రంబును దత్ క్షణంబునఁ దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృ యోగ మాయా ప్రభావంబునకు నద్భుతంబు నొందె, నంతఁ గర్దముండు గృతస్నానయైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నేచందంబునఁ దనరుచుండె నా చందంబునఁ జెన్నొందు

చుండుటకు నానంద భరితుండై భార్యా సహితంబుగఁ దత్కన్యకా సహస్రంబు గొలువ నిజ విమానారూఢుండై తారాగణ పరివృత రోహిణీయుక్తుం డగు సుధాకరుండునుంబోలె నొప్పుచుం దదనంతరంబ.

820

తా॥ ఆపైన బంగారు పాత్రలలో కర్పూర హారతులిచ్చి, అందమైన ఆసనం మీద కూర్చోపెట్టి అద్దం చేతికిస్తే ఆ అద్దంలో ప్రతిఫలించిన తన దేహాన్ని చూసి తన పతి అయిన కర్దముణ్ణి మనస్సులో తలచుకొంది. వెంటనే అతడు వేలకొలది కన్యకల సన్నిధిలో ఉండటాన్ని చూచి, తన భర్త యొక్క యోగమాయా ప్రభావానికి ఆశ్చర్యాన్ని పొందింది. అంత కర్దముడు స్నానం చేసి కూర్చున్న దేవహూతిని చూసాడు. వివాహానికి ముందు ఎలా ఉందో ఇప్పుడూ అలాగేవుంది. దానికి ఎంతో ఆనందంతో భార్యతో కూడి వేలాది కన్యలు తనను కొలువ రోహిణితో కలిసిన చంద్రునిలా ప్రకాశించాడు.

చ. చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశ విహార యోగ్యమున్, సురుచిర మంద గంధవహ శోభితమున్, నికటప్రధాతు నిర్ఝర సరిదంబుశీతల తుషారమునై తనరారు మేరు కం దరమున కేగి దేవవనితాయుతుఁడైన కుబేరు చాడ్పునన్.

821

తా॥ శుభమూర్తి అయిన ఆ ముని విమానం ఎక్కి దిక్పాలురందరికీ విహారానికి యోగ్యమై శోభించేది, మందంగా వీచే మలయమారుతంతో కూడినది, దగ్గరగా ప్రవహించే సెలయేటి జలముల శీతలత్వం కలది అయిన మేరు పర్వత గుహ దగ్గరకు చేరి దేవవనితాయుతుడైన కుబేరునిలా విహరించాడు.

వ. మఱియును.

822

మ. అమరోద్యానవన ప్రదేశములు, నవ్యారామభూముల్, దళ త్కుముదాంభోజవిభాసి మానససరః కూలంబులున్, మంజు కుం జములుం, జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబునం జూచె నె య్యమునం గర్దమయోగి కామగ విమానారూఢుఁడై చెచ్చెరన్.

823

తా॥ ఇంకా కామగమనంగల విమానారూఢుడై భార్యతో కలిసి కర్దముడు దేవతలు తిరిగే ఉద్యానవన భూములను, నవ్యమైన ఆరామాలను, వికసించిన కుముదములతోను, కలువలతోను ఒప్పుతూన్న మానస సరోవర తీరాలను, మంజులమైన పొదరిండ్లను ఇంకా ఎన్నో రమణీయ ప్రదేశాలను, కుబేరుని చైత్రరథాన్ని ఎంతో స్నేహంతో చూసాడు.

వ. ఇవ్విధంబున సమస్త భూభాగంబును వాయు వేగంబునం గలయం గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె, మోక్షదాయకుండుఁ, దీర్ఘపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవే? యిట్లు కర్దముఁడు దేవహూతికి నిఖిల ధరాచక్రం బంతయుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి, కామకేళీ వినోదాత్మికయై యున్న భార్య నుపలక్షించి రతిప్రసంగ వ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్కముహూర్తంబుగా జరుపుచు నన్యోన్యసర సావలోకనంబుల సముచితాలింగన సంభాషణంబులం గాలనిరూపణంబు సేయనేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ.

824

తా॥ ఈ విధంగా భూమండలమంతా వాయువేగంతో చుట్టి, విమానాలపై వెళ్ళే వారిని అందరిని అతిశయించి అన్ని లోకాలలో సంచరించాడు. మోక్షాన్ని ఇచ్చేవాడు, పరమ పూజ్యుడు అయిన పుండరీకాక్షుణ్ణి సేవించే పుణ్యాత్ములు పొందలేని పదార్థాలంటూ ఉంటాయా? ఈ విధంగా కర్దముడు దేవహూతికి ధరామండలం అంతా చూపించి తిరిగి వాళ్ళుండే చోటికి

తీసుకొని వచ్చాడు. పిమ్మట కామకేళీ వినోదాలయందు మిక్కిలి ఇష్టాన్ని చూపుతున్న భార్య మనస్సును అర్థం చేసుకొని శృంగారక్రీడా ప్రసంగ వ్యాసంగ పరాయణుడైనాడు. ఆ జంట బహు విధాలైన సుఖభోగాలను పొందుతూ అనేక వత్సరాలు ఒక ముహూర్తంగా నడిపారు. ఒకరినొకరు ఇష్టంగా చూసుకోవటం, పరస్పరం కౌగిలించుకోవటం, ఏవేవో కబుర్లు చెప్పుకోవటం ఇట్లాంటి శృంగారక్రియా కలాపములయందు కాల గమనం తెలియకుండ నూరు సంవత్సరాలు గడిపారు.

క. మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ, దన నిజదేహంబు నవవిధంబులు గావిం చి నయంబునఁ దద్వీర్యము, దన సతిగర్భమునఁ నవవిధంబుల నిలిపెన్.

825

తా॥ ఆ మునిశ్రేష్ఠుడు ఒకనాడు తొమ్మిది విధాలైన దేహాలు ధరించి మృదువుగా తన వీర్యాన్ని తన భార్య గర్భంలో తొమ్మిది విధాలుగా నిలిపాడు.

క. అది కారణంబుగాఁ బెం, పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతు డుదయించిరి తొమ్మండ్ర, మ్ముదితయు మది సంతసించె, మునివరుఁ డంతన్..

826

తా॥ ఆ కారణంగా అతిశయించిన మునివలన దేవహూతి తొమ్మిది మంది కూతుళ్ళను కని తన మనస్సులో ఎంతో సంతోషించింది.

తే. సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి, యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయి సేర్చి, పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి.

827

తా॥ అనంతరం మునీంద్రుడు సన్న్యసింప తలిచాడు. ఆ విషయం ఆమె తెలుసుకొని

మనస్సులో సంతాపం అధికం కాగా చింతతో చెక్కిలి చేయి చేర్చి కాలితో నేలను వ్రాస్తూ భర్తతో ఇట్లా అంది:

సీ. అనఘ సంతాన పర్యంతంబు ననుఁ గూడి, వర్తింతు ననుచుఁ బూర్వమున బలికి కూఁతుల నిచ్చితి కొమరార, నిప్పు డీ, తరుణులు పతులను దమకుఁ దార యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ, గావున నీపుత్త్రికలకుఁ దగిన వరుల సంపాదించి, పరిణయంబులు సేసి, తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

తే. సుతునిఁ గృపసేసి ననుఁ గావు సుజనవినుత! యర్థి సంసారదుఃఖంబు నపనయింప నర్హుఁడవు నీవ, కామమోహమున నింత, కాల మూరక పోయె నే గతియు లేక.

828

తా॥ “అనఘా! సంతానం కలిగే దాకా నాతో కలిసి ఉంటానని పూర్వం నువ్వు పలికి ఆ ప్రకారం కుమార్తెలను అనుగ్రహించావు. ఇప్పుడీ తరుణులు తగిన భర్తలను తామే ఎట్లా వెతుక్కోగలరు? అనే భీతి కలుగుతోంది. కనుక ఈ కుమార్తెలకు తగిన వరులను వెతకి వివాహాలు చేసి ఆపైన తత్త్వసంహిత నాకు ఉపదేశించే కుమారుని ప్రసాదించి నన్ను కటాక్షించు. ఈ సంసార దుఃఖాన్ని తొలగించే అర్హుడవు! ఇంతకాలం ఊరకే కామమోహంలో గడచి పోయింది.

చ. ఉపరతి వుట్టె నైహిక సుఖోపగతానుభవంబులందు, నేఁ జపలతఁ గామభోగరతి సంగముఁగోరి మహాత్మ! నిన్ను న చ్చపుఁ దలఁ పొప్పఁ గాఁ దెలియఁజాలక యే వరియించుటన్ భవ త్కృప ఫలియించె, ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁగల్గదే?

829

తా॥ నాకు ఐహికమైన సుఖాలు, భోగాలు అనుభవించాలనే కోరిక నశించింది. ఇప్పటివరకు నేను చపలత్వంతో కామభోగాలపై ఆసక్తి చేత స్వచ్ఛమైన నీ మనస్సు తెలుసుకోలేక

ఏవేవో అర్థించాను. నాయందు నీ కృప ఫలించింది. కేవలం నిన్ను భక్తితో భజిస్తే ముక్తిరాదా?

వ. అదియునుం గాక.

830

చ. సమమతి నొప్పు సత్పురుషసఖ్యము సద్గతికారణంబు, నీ చమతి విలోల దుష్పురుషసఖ్యము దుర్గతిహేతు వంచుఁ జి త్తమునఁ దలంచి యోగిజనతానుత! మిమ్ము భజింతుఁ, బ్రాణి సం గమమునఁ బుణ్య పాపములు గైకొని పొందవె యెట్టి వారలన్?

831

తా॥ అంతే కాకుండా... అందరినీ సమంగా చూసే సత్పురుషుల యొక్క మైత్రి సద్గతిని కలిగిస్తుంది. నీచమైన బుద్ధితో దుష్పురుషుల తోడి స్నేహం దుర్గతిని కలిగిస్తుంది. ప్రాణి సంగమం చేతనే ఎలాంటి వారికైనా పుణ్యపాపాలు సంక్రమిస్తాయి. ఈ విషయాన్ని చిత్తములో స్మరిస్తూ యోగిజన సన్నుతుడవైన నిన్ను భజిస్తాను."

క. అని యిట్లు వేదనాభర, మున మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్త్రిం గనుఁగొని సరసిజనయను వ, చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్.

832

తా॥ అని ఈ ప్రకారంగా వేదనతో, సంతాపంతో పలికిన దేవహూతి పలుకులు విని కర్దముడు ఆమెను చూచి శ్రీహరి యొక్క వచనాలను స్మరించి ఆమెతో ఇట్లా అన్నాడు:

క. మనుసుత! నీ మది దుఃఖం, బును బొందకు, మచిరకాలమున భగవంతుం డనఘుం డక్షరుఁడు జనా, ర్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్.

833

తా॥ "ఓ మనుపుత్రీ! నువ్వు మనస్సులో దుఃఖాన్ని పొందవద్దు. త్వరలోనే భగవంతుడు,

అనఘుడు, అక్షరుడు అయిన శ్రీహరి నీ గర్భంలో వసిస్తాడు.

క. వర నియమ వ్రత నిష్ఠా, చరణ నియుక్తాంతరంగ సమధికవై సం భరిత తపోధన దాన, స్ఫురిత శ్రద్ధానుభక్తి పూర్వము గాఁగన్.

834

తా॥ అంతరంగ నియమంతో మనస్సును నిగ్రహించుకొని తపస్సు, శ్రద్ధాభక్తులతో కూడి దానధర్మాలు చేస్తూ ఉత్తమ వ్రతాలను నిష్ఠతో ఆచరించు.

మ. మరి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజించు, త త్పురుష శ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజా సుసంప్రీతుఁడై కర మర్థిం దరుణీశిరోమణి! భవద్గర్భస్థుఁడై యుండి తాఁ గరుణం జేయు భవన్మనోజనిత శంకాగ్రంథి విచ్ఛేదమున్.

835

తా॥ మాధవుని యొక్క పాదపద్మాలను భక్తితో పూజిస్తే ఆ పురుషశ్రేష్ఠుడు సంతృప్తి చెంది నీ గర్భంలో ఉండి నీ మనస్సులో పుట్టిన శంకలను నివారిస్తాడు.”

## దేవహూతి గర్భమున విష్ణువు కపిలాచార్యుడుగా జన్మించుట

చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతసమంది యమ్మునీం ద్రుని వచన క్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ బద్మలో చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్ని యబ్దముల్ సనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమమైన తేజమున్

836

క. ధరియించి యమ్మునీంద్రుని, తరుణీ గర్భంబువలన దనుజారి శమీ తరు కోటరమున వైశ్వా, నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్.

837

తా॥ అప్పుడు దేవహూతి హృదయంలో సంతోషపడి మునీంద్రుడు చెప్పిన విధంగా భగవంతుడు, అనంతుడు, పద్మలోచనుడు, హరి అయిన విష్ణువును పూజిస్తూ ఉండగా కొన్ని సంవత్సరాలు గడిచాయి. అప్పుడు ఆ హరి కర్దముని తేజస్సును ధరించి జమ్మిచెట్టు తొర్రలోంచి అగ్ని ఉదయించిన విధంగా ఆ తరుణీ గర్భంలోంచి జన్మించాడు.

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ, తూర్య ఘోషంబులు తుముల మయ్యె, నందిత దేవతాబృందంబు లందంద, కురిసిరి మందారకుసుమవృష్టి, గంధర్వకిన్నరగానంబు వీతెంచె, నప్సరోగణముల యాట లొప్పె, వావిరి దిక్కులఁ గావిరి విరిసెను, దవిలి వార్ధుల కలంకువలు మానె,

తే. సాధుజనముల మనములు సంతసిల్లె, హోమవహ్నులు ప్రభలఁ జెన్నొంది వెలిఁగెఁ గుసుమఫలభారముల నొప్పెఁ గుజములెల్ల, సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన.

838

తా॥ ఆ సమయంలో ఆకాశంలో దేవతల యొక్క వాద్య ఘోష అధికమైంది. ఆనందంతో

దేవతా బృందం మందార కుసుమాలను వర్షంగా కురిపించింది. గంధర్వ, కిన్నరులు పాటలు పాడారు. అప్సరసలు ఆడారు. దిక్కుల్లో క్రమ్మిన పొగమంచు మాయమైంది. సముద్రాలు కలతలు తగ్గి శాంతించాయి. సాధువుల మనస్సులు సంతసించాయి. హోమాగ్నులు మిక్కిలి తేజస్సుతో వెలిగాయి. చెట్లన్నీ కుసుమములతోను, ఫలములతోను బరువుగా వంగాయి. సర్వసస్యములు ఫలించాయి.

వ. ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించుకొఱకుఁ దదీయగర్భంబున నుదయించిన పరబ్రహ్మ స్వరూపుండైన నారాయణుని దర్శించుకొఱకు మరీచి ప్రముఖ మునిగణ సమేతుండై చతుర్ముఖుండు సనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమదేవహూతులం గనుంగొని యిట్లనియె.

839

తా॥ అట్టి ఉత్సవ సమయంలో దేవహూతికి తత్త్వ జ్ఞానాన్ని బోధించటం కోసం; ఆమె గర్భంలో పుట్టిన పరబ్రహ్మ స్వరూపుడైన నారాయణుని దర్శించటం కొరకు మరీచి ప్రముఖులైన మునిగణంతో కూడి చతుర్ముఖుడు వచ్చాడు. ఆయన ఆ మహాత్ముణ్ణి దర్శించి పిమ్మట కర్దమ దేవహూతులతో ఇలా అన్నాడు:

క. నుతచరితులార! మీరలు, కృతకృత్యులు, విష్ణుపూజఁ గేవలభక్తిన్ మతి నిష్కపటులరై చే, సితిరి తదర్చన ఫలంబు సేకుఱె మీకున్.

840

తా॥ "పొగడ తగిన చరిత్రగల ఓ దంపతులారా! మీరు కృతకృత్యులు, భక్తితో మాధవుణ్ణి పూజించారు. నిష్కపటమైన మనస్సుతో మీకు అర్చించిన ఫలం చేకూరింది.

క. శ్రిత భయహరణుఁడు, మునిజన, నుత చరితుఁడు, పరుఁడు, మీ మనోరథసిద్ధిన్ వితతంబుగఁ గావించుటఁ, జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్.

841

తా॥ ఆశ్రయించిన వారి భయాన్ని హరించేవాడు, మునిజనం పొగడ తగిన చరిత్రకలవాడు, పరమాత్ముడు అయిన విష్ణువు మీ మనోరథాన్ని నెరవేర్చాడు. మీ జన్మ సాఫల్యం పొందింది.

క. వినుఁడు సకాములునై హరి, ననుపమభక్తిన్ భజించునదె ముక్తికిఁ జా లును, మీ పుణ్యం బే మని, కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా!

842

తా॥ ఓ నీతి కోవిదులారా! వినండి! శ్రీహరిని అనన్యమైన భక్తితో భజిస్తే చాలు. అదే ముక్తిని ప్రసాదిస్తుంది. ఆయననే కుమారునిగా పొందిన మీ పుణ్యాన్ని ఏమని పొగడగలం."

వ. అని వెండియుం గర్దమునిం గనుంగొని యిట్లను, "భవదీయ తనూభవలం బ్రకటశీలవ్రతాచార సంపన్నులైన ముని వరేణ్యులకుం బెండ్లిసేయు, మట్లయిన వారివలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు" నని చెప్పి మఱియు నిట్లనియె.

843

తా॥ అని కర్దమ మునిని చూసి ఇంకా ఇలా అన్నాడు: "నీ కుమార్తెలను శీలము, వ్రతము, ఆచారము వీటి యందు శ్రేష్ఠులైన మునివరేణ్యులకిచ్చి పెండ్లి చెయ్యి. అలా చేస్తే వారి వలన అనేక విధాలుగా ప్రజాసృష్టి జరుగుతుంది..." అని చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు:

చ. అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యిమ్మహా త్మునిఁ బరమేశు నీశు నజితున్ నలినాక్షు నమేయు నచ్యుతున్ ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగా ఁదలంపు, మీ ఘనుఁడు సమస్త చేతన నికాయహృదీప్సితదాయి గావునన్.

844

తా॥ “అనఘా! నీ కుమారుడు ప్రాణులందరి హృదయాలలోని కోరికలను తీర్చేవాడు. కనుక ఈతనిని పరమేశ్వరుడు, అజితుడు, నలినాక్షుడు, అమేయుడు, అచ్యుతుడు, ఘనుడు, అనంతుడు, ఆద్యుడు, అవికారుడు, అక్షరుడు అయిన శ్రీమన్నారాయణునిగా భావించు.

సీ. మానిత జ్ఞాన విజ్ఞాన యోగంబులు, నను నుపాయంబుల నొనరఁ జేసి యలవుమైఁ గర్మజీవుల నుద్ధరించుట, కొఱకు నమ్మహితాత్మకుఁడు సమగ్ర హాటకరుచి జటాజూటుండు నుత్ఫుల్ల, పంకజనేత్రుండు పద్మపత్ర హల కులిశాంకుశ లలిత రేఖాంకిత, చరణతలుండును సత్త్వగుణుఁడు

తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి, నీదు, గర్భమం దుదయించెను ఘనుఁడు, నీకుఁ దత్త్వబోధంబుఁ గావించుఁ, దావకీన, హృదయ సంగత సంశయ మెల్లఁ బాపు.

845

తా॥ జ్ఞానము, విజ్ఞానము, యోగములనే ఉపాయాలచేత కర్మబద్ధులైన జీవులను ఉద్ధరించడానికి సాక్షాత్తు శ్రీహరి నీ గర్భాన జన్మించాడు. ఆ మహానుభావుడు బంగారు వర్ణం కలిగిన జటాజూటం కలవాడు, వికసించిన పద్మముల వంటి నేత్రములు గలవాడు. పద్మపత్రం, హలం, వజ్రం, అంకుశం... ఈ రేఖలకు అంకితమైన చరణతలం కలవాడూను. సత్త్వగుణుడు అయిన ఆయన ఇప్పుడు నీ కడుపున పుట్టాడు. ఈ మహానుభావుడు నీ హృదయంలోని శంకలన్నీ తీరిపోయేటట్లు తత్త్వబోధ చేస్తాడు.

వ. మఱియును.

846

క. నుతికెక్కి సిద్ధగణ సే, వితుఁడై ఘనసాంఖ్యయోగ విలసిత తత్త్వ స్థితి నిరతుఁ డగుచుఁ గపిలా, ఖ్యతఁ దనరి చరించు నీ జగత్త్రయ మెల్లన్.

847

తా॥ ఇంకో విషయం. ఆపై మీ కుమారుడు ప్రసిద్ధికెక్కి సిద్ధగణంచే సేవింపబడుతూ గొప్పదైన సాంఖ్య యోగతత్త్వమునందు నిష్ణాతుడై కపిలుడనే పేరుతో విరాజిల్లుతూ ఈ మూడు లోకాల్లోను సంచరిస్తూ ఉంటాడు.”

క. అని పలికి యమ్మరీచిం, గని యుద్వాహార్థ మునిచి కమలజుఁ డంతం దన నందను లగు నారద, సనకాదులఁ గూడి యాత్మ సదనము కరిగెన్.

848

తా॥ ఇట్లా పలికి, విధాత పెండ్లికొరకు మరీచి మహర్షిని అక్కడే ఉంచి, తన కుమారులైన నారద, సనకాదులతో కూడి తన నిజ నివాసానికి వెళ్ళాడు.

వ. అంత నా కర్దముండు గమలసంభవచోదితుం డగుచుఁ యథోచితంబుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయందలంచి మరీచికిం గళయను కన్యకను, నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతినిఁ, గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నధర్వునకు శాంతినింగా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన వారును గృతదారపరిగ్రహులును, గర్దమ కృతసంభావనా సంభావితులును నగుచు నతనిచేత ననుజ్ఞాతులై జాయాసహితు లగుచు నిజాశ్రమ భూములకుం జనిరి. అనంతరంబు కర్దముండు దేవోత్తముండగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించియుంటం దన చిత్తంబున నెఱింగి వివిక్త స్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యిట్లనియె.

849

తా॥ ఆపై ధాత ఆజ్ఞానుసారం కర్దముడు తన కుమార్తెలకు వివాహం చెయ్యాలనే నిర్ణయంతో కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగిరసునకు, హవిర్భువును పులస్త్యునకు, గతిని పులహువునకు, క్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగువునకు, అరుంధతిని

వసిష్ఠునకు, శాంతిని అధర్వునకు ఇచ్చి తన కులాచారం ప్రకారం పెండ్లి చేశాడు. ఆ తొమ్మిదిమంది మునులు ఆ కన్యలను భార్యలుగా పరిగ్రహించి, కర్దమముని సంభావనలు అందుకొని ఆయన చేత ఆజ్ఞాపింప బడినవారై భార్యలతో కలిసి వారివారి ఆశ్రమ భూములకు తరలివెళ్ళారు.

ఆపై కర్దముడు భగవంతుడైన శ్రీహరి తన గృహంలో అవతరించాడనే విషయం గుర్తుకు తెచ్చుకుని ఏకాంత స్థలంలో కపిల మహర్షికి వందనం చేసి ఇలా అన్నాడు:

సీ. చతురాత్మ! విను మాత్మకృతము లైనట్టి య, మంగళ భూత కర్మంబు లనెడి దావాగ్ని శిఖలచే దందహ్యమానులై, నట్టి జీవులు దుదముట్ట లేక పాయక సంసారబద్ధులై యుందురు, తద్భవ హేతుభూతంబు లయిన సకల దేవతలు బ్రసన్నులు నగుదురు, బహుజన్మ పరిచిత ప్రాప్తయోగ

తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త, దేశముల యోగిజనములు ధృతుల నే మ హానుభావు విలోకింతు రట్టి దివ్య, పురుషరత్నంబ నా యింటఁ బుట్టి తీవు.

850

తా॥ "ఓ మహాత్మా! ఎవరికి వారే వారు చేసుకున్న తప్పుడు పనులనే దావాగ్ని శిఖలచే కాలిపోతూ అందులోంచి బయట పడలేక పుట్టుకకు కారణభూతమైన సంసారంలోనే బద్ధులై ఉంటారు. అనేక జన్మలనుండి పరిచయమైన యోగం వలన లభించే సమాధి అనే తపోనిష్ఠచేత దేవతలందరు ప్రసన్నులవుతారు. అట్టి యోగిశ్రేష్ఠులు ఏ మహానుభావుణ్ణి దర్శిస్తారో అట్టి దివ్య పురుషుడవు నా ఇంట్లో పుట్టావు.

వ. మఱియు సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయిన మా వర్తనంబులను గణింపక మదీయ గృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబు లయిన భవదీయ వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు నిట్లనియె.

851

తా॥ సంసారచక్రంలో తిరుగుతూ గ్రామ్యులమైన మా నడవడికను గణింపక మా ఇంట్లో పూర్వం నాకిచ్చిన మాటప్రకారం నన్ను అనుగ్రహించడానికి జన్మించావు” అని ఇంకా ఇలా అన్నాడు:

క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్త చతుర్భుజాది భవదవతారం బులు నీ కనురూపములై, పొలుపొందుం గాదె పరమపురుష! మహాత్మా!

852

తా॥ “ఓ పరమ పురుషా! మహాత్మా! ప్రకృతికి భిన్నంగా వాటికి అతీతమైన బలంతో కూడిన నాలుగు చేతులతో వెలుగొందే నీ అవతారాలు నీకు అన్ని విధాలా అనుగుణంగా ఉన్నాయి.

వ. అదియునుం గాక.

853

క. అనయము భవదీయాశ్రిత, జన సంరక్షణము కొఱకు సమ్మతితోఁ దా ల్చిన మానవ రూపంబులు, ననురూపము లగును గాదె హరి! నీ కెపుడున్.

854

తా॥ అంతే కాక, ఓ హరీ! ఎప్పుడూ నిన్ను ఆశ్రయించిన నీ భక్తులను రక్షించటం కొరకు నువ్వు దాల్చిన మానవ అవతారాలు నీకు అనుగుణంగానే ఎప్పుడూ ఉంటాయి.

క. సుమహిత తత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా రము లోలిఁ జేయు పదపీ, ఠము గల నినుఁ బొగడ వశమె! ఠవణిల్లంగన్.

855

తా॥ గొప్పదైన తత్త్వజ్ఞానం కోసం విద్వజ్జన సమూహం నమస్కారం చేసే పాదపీఠంగల నిన్ను పొగడటానికి ఎవరికి సాధ్యం.

సీ. సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు, పరమేశ్వరుండవు, ప్రకృతి పురుష మహదహంకార తన్మాత్ర తత్క్షోభక, హేతు కాలాత్మ విఖ్యాత ధృతివి, జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ, జఠర నిక్షిప్త విశ్వప్రపంచ మును గల సర్వజ్ఞ మూర్తివి, స్వచ్ఛంద, శక్తియుక్తుండవు, సర్వసాక్షి

తే. వగుచుఁ గపిలాఖ్యఁ దనరారు నట్టి నీకు, ననఘ! మ్రొక్కెదఁ, బుత్త్రుండ వగుచు నీవు నాకుఁ బుట్టిన కతన ఋణత్రయంబు, వలనఁ బాసితి, నిఁక భక్తవరద! నేను.

856

తా॥ ఓ భక్తవరదా! షడ్గుణైశ్వర్యాలకు నువ్వే కారణం. పరమేశ్వరుడవు! ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారం, తన్మాత్రలు అన్నీ నీవే! అవి క్షోభించుటకు కారణమైన కాలం కూడా నీ స్వరూపమే! నీవు స్థిరుడవు! జగదంతర్యామివి! చిత్‌శక్తివి! ఈ విశ్వాన్ని కడుపులో నిక్షిప్తం చేసుకున్నావు. స్వతంత్రమైన శక్తియుక్తులుగల వాడివి. సర్వసాక్షివి! అట్టి నీవు “కపిలుడు” అనే పేరుతో ఒప్పుతూ ఉంటావు. ఓ అనఘ! నీకు మ్రొక్కుతున్నాను. నువ్వు నాకు పుత్రుడవై పుట్టిన కారణంగా నేను దేవ, ఋషి, పితృ ఋణాల నుండి విముక్తి పొందాను.

తే. మానితవ్రత యోగసమాధి నియతిఁ, జెంది భవదీయ పాదారవింద యుగము డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి, సంచరించెద నంచితస్థలము లందు.

857

తా॥ వ్రతములు, యోగసమాధి యందు నియమములు కలిగి, నీ పాదారవిందములను నా మనస్సులో నిక్షిప్తం చేసుకొని, శోకాలకు దూరమై, పూజింపబడే స్థలాలలో సంచరిస్తాను.”

క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్ విని భగవంతుం డగు న, య్యనఘుఁడు గపిలుండు వలికె నర్మిలి దోఁపన్.

858

తా॥ అని ఇలా విన్నవించిన కర్దమముని పల్కులు విని భగవంతుడైన కపిలుడు ప్రేమతో ఇలా అన్నాడు:

సీ. నా చేతఁ బూర్వంబునం బ్రతిశ్రుతమైన, వచనముల్ దప్పక వరమునీంద్ర! నీ యింటఁ బుట్టితి, నిర్హేతుకస్థితి, భూరిదయా గుణంబున నవాప్త సకలకాముఁడ, నేను సన్మునివేషంబు, ధరియించుటెల్ల నా కొఱకుఁ గాదు, విను మహాత్మకులైన మునులకుఁ బరమాత్మ, గురు సద్వివేకంబు నరసి చూపు

తే. తత్త్వబోధంబు కొఱకును దాల్పఁబడిన, యంచిత వ్యక్తమార్గ మైనట్టి దేహ మని తలంపుము, మత్పదధ్యాన భక్తి, ధీపరాయణ మహిమంబు దేజరిల్ల.

859

తా॥ “ఓ మునీశ్వరా! పూర్వం నే చెప్పిన మేరకు గొప్పదైన దయాగుణం చేత ఏమీ ఆశించకుండా కేవలం అనుగ్రహంతో నీ ఇంట్లో పుట్టాను. ఏ కోరిక లేని నేను ఈ ముని వేషం ధరించటం నాకోసం కాదు. మహాత్ములైన మునులకు భగవత్సంబంధమైన దేహాత్మాది విభేద జ్ఞానంతో కూడిన తత్త్వ జ్ఞానాన్ని బోధించటం కొరకు మాత్రమే ఈ దేహాన్ని ధరించాను. నీ బుద్ధి వైభవం తేజరిల్లునట్లుగా భక్తితో నా పాదాలను ధ్యానించు.

క. సమధిక నిష్ఠం గృతయో, గమునన్ సన్న్యస్త సకల కర్ముఁడవై మో హముఁ బాసి భక్తిచే మో, క్షముకై భజియింపు నను వికారరహితుఁడై.

860

తా॥ నీవు అధిక నిష్ఠతో సకల కర్మలను సన్న్యసించి, మోహాన్ని విడిచి, భక్తిచే మోక్షం కోసం యోగమార్గాన్ని అనుసరించు.

క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ తనికాయ గుహాశయు నా, ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్.

861

క. తిరముగ భవదీయాంతః, కరణ సరోజాత కర్ణికాతలమున సు స్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనో–ంబకమున నెఱిఁ గను మనఘా!

862

తా॥ పరమేశ్వరుడను, పరంజ్యోతిని, అనఘుడను, అనంతుడను, దేవదేవుడను, సకల భూత సమూహం యొక్క హృదయ గుహలలో ఉండేవాడిని, ఆద్యుడను, అజుడను, ఆద్యంతశూన్యుడను, దురితదూరుడను... అయిన నన్ను స్థిరంగా నీ యొక్క అంతఃకరణమనే పద్మం యొక్క కర్ణికాతలం మీద నిలిపి ఇంద్రియాలను నిరసించి మనోనేత్రంతో నన్ను దర్శించు.

వ. అట్లేని.

863

క. తనరిన మోక్షము నొందెద, వని పలికినఁ గర్దముండు నమ్ముని కుల చం ద్రుని వలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుక మలరన్.

864

తా॥ అలా చేసినట్లైతే నువ్వు మోక్షాన్ని పొందుతావు అని పలుకగా, కర్దముడు ఆ మునికుల శ్రేష్ఠునకు ప్రదక్షిణం చేసి కుతూహలంగా అతి భక్తితో అనేక వందనములు చేశాడు.

క. మునిగణ సేవిత మగు వన, మునకుం జని యందు మౌనమున నిస్సంగుం డును

వహ్నిరహితుఁ డనికే, తనుఁడై యాత్మైక శరణ తత్పరుఁ డగుచున్.

865

వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకల భూతంబులందు సమత్వంబు భజియించి శాంత శేముషీగరిష్ఠుం డగుచు నిస్తరంగంబగు వార్ధి చందంబున ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబు గాఁ దలంచుచు భక్తి యోగంబున భాగవతగతిం బొందె నని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుం డయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గాగ్రదర్శకుం డయిన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె.

866

తా॥ చేసి ముని సమూహం సేవించుకొంటూన్న అరణ్యానికి వెళ్ళి అక్కడ లోకసంబంధాలను త్యజించి, అగ్నిహోత్రాన్ని విడిచి, స్థిరనివాసం లేకుండా తిరుగుతూ తన ఆత్మయందు పరమాత్మను ఆశ్రయించి శరణు పొందాడు.

పరబ్రహ్మను చిత్తంలోనే నిలుపుకొని, అహంకార మమకారాలను విడిచి, దయతో సకల ప్రాణులను సమానంగా ప్రేమిస్తూ, శాంత స్వభావంతో తరంగాలు లేని సముద్రంలాగ, ధీరత్వంతో నిఖిల ప్రపంచాన్ని వాసుదేవ స్వరూపంగా చూస్తూ భక్తియోగంలో భాగవతులు పొందే స్థానాన్ని పొందాడు. మైత్రేయ మహాముని ఇంతవరకు చెప్పి విదురునితో ఇంకా ఇలా అన్నాడు:

"కర్దమ మహర్షి అరణ్యాలకు వెళ్ళిన అనంతరం దేవహూతి బిందు సరోవరం చెంతనే ఉన్న కపిల మహర్షిని చూచింది. మాతృవత్సలుడు, తత్త్వమార్గాన్ని దర్శించిన వాడూ అయిన కుమారుణ్ణి చూచి బ్రహ్మ మాటలు మనస్సులో తలచుకొంటూ ఇలా అంది:

## దేవహూతి పుత్రుడైన కపిలాచార్యునిచే తత్త్వజ్ఞానము పొందుట

క. అసదింద్రియ ఘర్షణమున, వసుమతి నిర్విణ్ణ నగుచు వనరెడి నా కీ యసదృశ మోహ తమో విని, రసనం బనఘాత్మ! యే వెరవున ఘటించున్?

867

తా॥ "ఓ పాపరహితుడా! నిరంతరము ఇంద్రియ ఘర్షణవల్ల బాధపడుతూన్న నాకు మోహాంధకారంలో నుంచి బయటపడే ఉపాయం దేనివల్ల లభిస్తుంది?

క. పటు ఘన నీరంధ్ర తమః, పటల పరీవృత జగత్ప్రపంచమునకు నె క్కటి లోచనమై మహితో, త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా!

868

తా॥ అనఘా! క్రమ్ముకుని వస్తూన్న నల్లని మేఘాల కారుచీకట్లతో కూరుకుపోయిన ఈ ప్రపంచానికి నువ్వొక్కడివే నేత్రమై మహాకాంతితో సూర్యునివలె ప్రకాశిస్తూ ఉంటావు.

ఉ. భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థులన్యు లె వ్వారలు నీవ కాక? నిరవద్య! నిరంజన! నిర్వికార! సం సారలతా లవిత్ర! బుధ సత్తమ! సర్వశరణ్య! ధర్మ వి స్తారక! సర్వలోక శుభదాయక! నిత్యవిభూతి నాయకా!

869

తా॥ ఓ నిరవద్య! నిరంజన! నిర్వికార! బుధ సత్తమ! సర్వశరణ్య! ధర్మవిస్తారక! సర్వలోక శుభదాయక! నిత్య విభూతి నాయకా! సంసార బంధాలనే లతలను కోసే కొడవలివి నీవు. నన్ను చుట్టి ముట్టిన మోహం నుండి నన్ను రక్షించడానికి నువ్వు కాక అన్యులెవరు ఉన్నారయ్యా!

చ. నిను శరణంబు సొచ్చెద ననింద్యతపోనిధి! నన్నుఁ గావవే యని తను దేవహూతి వినయంబున సన్నుతిసేసి వేఁడఁగా ననుపమ సత్కృపాకలితుఁడై కపిలుం డనురాగ మొప్ప స జ్జన నిచయాపవర్గ ఫలసాధనమై తగు తల్లి వాక్యముల్.

870

తా॥ ఓ తపోనిధీ! నీకు శరణు! నన్ను కరుణించు" అని దేవహూతి వినయంగా ప్రార్థించింది. సాటిలేని కృపతో కపిలుడు అనురాగంతో సజ్జనులకు స్వర్గ సాధనమైన తల్లి వాక్యములను విన్నాడు.

క. విని మందస్మిత లలితా, నన కమలుం డగుచు నెమ్మనమునఁ బ్రమోదం బనయంబుఁ గడలుకొన నిజ, జననికి నిట్లనియెఁ బరమశాంతుం డగుచున్.

871

తా॥ విని చిరునవ్వులు చిందు సుందర ముఖారవిందుడై మనస్సులో సంతోషంతో పరమ శాంతుడై తల్లితో ఇట్లా అన్నాడు:

క. విను జీవుని చిత్తము దా, ఘన భవబంధాపవర్గ కారణ, మది యే చినఁ ద్రిగుణాసక్తం బయి, నను సంసృతి బంధకారణం బగు, మఱియున్.

872

తే. అదియు నారాయణాసక్త మయ్యె నేని, మోక్షకారణ మగు నని మునికులాబ్ధి చంద్రుఁ డన నొప్పు కపిలుండు జననితోడ, నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి.

873

తా॥ "అమ్మా! విను! ఘనమైన భవబంధానికి, అపవర్గానికి జీవుని చిత్తమే కారణం. అది సత్త్వము, రజస్సు, తమో గుణాలతో కలిసినప్పుడు సంసార బంధానికి కారణమవుతుంది. ఆ

చిత్తమే శ్రీహరి మీద లగ్నమైతే మోక్షకారణమవుతుంది. ఈ ప్రకారంగా మునికులానికి చంద్రునివంటి కపిలుడు తల్లితో చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

వ. మఱియుఁ జిత్తం బహంకార మమకార రూపాభిమాన జాతంబులగు కామలోభాది కలుషవ్రాతంబుల చేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధం బగు నప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతికంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేద్యుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును నితర వస్త్వంత రాపరిచ్ఛిన్నుండును నుదాసీనుండును నైన పరమాత్మునిం దన్మయంబును హతౌజస్కంబునునైన ప్రపంచంబును జ్ఞాన వైరాగ్య భక్తి యుక్తంబగు మనంబుచేఁ బొడగాంచి యోగిజనులు పరతత్త్వ సిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు సంయుజ్య మానంబయిన భక్తిభావంబు వలన నుదయించిన మార్గంబునకు నితర మార్గంబులు సరి గావండ్రు; విద్వాంసులు సంగం బింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపంబడి జీవునకు నశిథిలంబగు బంధంబునకుఁ గారణం బగుననియు, నదియె సద్విషయంబైన నంతఃకరణ సంయమన హేతుభూతం బగుచు సాధుజనులకు ననర్గళ మోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు; సహనశీలురును, సమస్త శరీరధారులకు సుహృత్తులును, బరమశాంతులను, గారుణికులునునై మదర్థంబుగాఁ బరిత్యక్త కర్మఫల స్వభావులును విసృష్టస్వజన బంధు జనులును నై మత్పదాశ్రయులును మద్గుణధ్యానపారీణులును మత్కథా ప్రసంగ సంభరిత శ్రవణానందులును నగుచు మదీయ కథల నొడువుచు వినుచు నుండు పరమభాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింపఁజేయంజాల, దట్టి సర్వసంగ వివర్జితులగు పరమభాగవత జనుల సంగం బపేక్షణీయం, బది సకల దోషనివారకం బగు, నట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణ రసాయనంబులగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు, మద్గుణాకర్ణనంబునంజేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్య మార్గదంబులగు శ్రద్ధాభక్తులు దయించు; నదియునుం గాక యే పురుషుండైన నేమి, మద్విరచిత జగత్కల్పనాది విహార చింతచే నుదయించిన భక్తింజేసి యింద్రియ సుఖంబుల వలనను

దృష్టశ్రుతంబులైన యైహికాముష్మికంబుల వలనను విముక్తుం డగుచుఁ జిత్త గ్రహణార్థంబు ఋజువులైన యోగమార్గంబులచే సంయుక్తుం డగునట్టి యోగి ప్రకృతి గుణసేవనంబుచేత వైరాగ్య గుణవిజృంభితంబైన జ్ఞానయోగంబుచేతను మదర్పిత భక్తియోగంబు చేతను బ్రత్యగాత్మకుండనైన నన్ను నంతఃకరణ నియుక్తునిం గావించు నని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె.

874

తా॥ “ ‘నేను’ అనే అహంకారం ‘నాది’ అనే మమకారం – వీటివల్ల కామ, క్రోధ, లోభాది కలుషములు పుడతాయి. మన మనస్సు వీటి నుండి విడివడినప్పుడు ప్రశాంతమవుతుంది. ఏకరూపంలో మన మనస్సున్నప్పుడు సుఖదుఃఖములనే ద్వంద్వములు ఉండవు. పరమాత్మ ప్రకృతికంటే పరుడు, నిర్భేద్యుడు, స్వయంజ్యోతి, సూక్ష్మ స్వరూపుడు, అపరిచ్ఛిన్నుడు, ఉదాసీనుడు. యోగులు జ్ఞాన, వైరాగ్య, భక్తి యుక్తమైన మనస్సుచే దర్శించిన వారై నారాయణుని యందు గల భక్తికి ఇతర మార్గాలు సాటిరావని చెప్పారు.

ఇంద్రియాల యొక్క కలయిక అసద్విషయమైతే దృఢమైన బంధానికి కారణమవుతుంది. ఆ కూడిక సద్విషయమైతే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతఃకరణ సంయమనానికి హేతువై సాధుజనులకు తెరచిన మోక్షద్వారం అవుతుంది... అనేది పండితుల అభిప్రాయం. సహనాన్ని కలిగి, సమస్త శరీరధారుల పట్ల సహృదయులై శాంతమూర్తులుగాను దయాపరులుగాను ఉంటూ కర్మఫలాలను విడిచి, వారు నా వారు నా బంధువులు అనే ప్రత్యేకాభిమానం లేకుండ నా పాదాలను ఆశ్రయించుకొని, నా గుణాలనే ధ్యానంచేస్తూ నా కథలనే ప్రసంగిస్తూ వాటిని వినటం వల్లనే ఆనందాన్ని పొందుతూ ఉండేవారు పరమ భాగవతోత్తములు. ఆధ్యాత్మికాది తాపత్రయాలు వాళ్ళని ఏమీ చేయలేవు. అట్టి సర్వసంగపరిత్యాగులైన భాగవతోత్తముల సాంగత్యమే కోరతగినది. అది దోషాలన్నింటిని పోగొడుతుంది.

అట్టి సత్పురుష సాంగత్యం వల్ల కర్ణరసాయనంగా ఉండే నా కథా ప్రసంగాలు లభిస్తాయి. నా కథలను వినటంవల్ల క్రమంగా మోక్షాన్ని ప్రసాదించే శ్రద్ధాభక్తులు శీఘ్రంగా లభిస్తాయి. ఏ పురుషుడైనా సరే నేను చేసిన ఈ జగత్తు యొక్క సృష్టిని నా లీలా విహారాలను చింతన చేస్తూ దానివల్ల పుట్టిన భక్తిచేత మనస్సు యొక్క ఏకాగ్రతకోసం యోగ మార్గంలో సిద్ధిని పొందుతాడో అతడు "యోగి" అవుతాడు. అతడు శ్రవణేంద్రియ నయనేంద్రియాలకు సంతోషాన్నిచ్చే ఐహిక ఆముష్మిక సుఖాలకు లొంగడు. అట్టి యోగి ప్రకృతిగుణాలను సేవించటం వల్లను, వైరాగ్యం వల్ల పుట్టిన జ్ఞాన యోగంచేతను, సమస్తాన్ని నాకు అర్పణ చేసినందువల్ల కుదిరిన భక్తి యోగం చేతను ఆత్మస్వరూపుడైన నన్ను తన చిత్తంలో నిలుపుకొంటాడు" అని చెప్పగా విన్న దేవహూతి కపిలునితో ఇట్లా అంది:

క. ఏ భక్తి భవద్గుణపర, మై భవపాపప్రణాశమై ముక్తి శ్రీ లాభము రయమునఁ జేయునొ,
యా భక్తి విధంబుఁ దెలియ నానతి యీవే!

875

తా॥ "ఏ భక్తి నీ గుణములంటే ఇష్టాన్ని చూపుతుందో, ఏ భక్తి పుట్టుక, సంసారము యొక్క తాపాలను, పాపాలను పోగొడుతుందో, ఏభక్తి ముక్తిని వెంటనే చేకూరుస్తుందో అట్టి భక్తిని గురించి నాకు విపులంగా తెలియ చెప్పవలసింది.

వ. అదియునుం గాక భవదుదితంబయిన యోగంబును, దదంగంబులును దద్గత తత్త్వావబోధంబును సాకల్యంబుగ మందబుద్ధినైన నాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె:

876

తా॥ అంతేకాకుండ నీ చేత చెప్పబడిన యోగాన్ని గురించి, దాని అంగముల గురించి, దాని తత్త్వాన్ని గూర్చి పూర్తిగా మందబుద్ధినైన నాకు తెలిసేటట్లుగా చెప్పవలసింది..." అన్న

తల్లితో కపిలుడు ఇట్లా అన్నాడు:

సీ. జనయిత్రి! విను, మఱి సకల పదార్థ ప, రిజ్ఞాన తత్త్వపారీణ మగుచు నామ్నాయ విహిత కర్మాచారములు గల్గి, తివుటమై వర్తించు దేవగణము పూని నైసర్గికంబైన నిర్హేతుక, మగు భగవత్సేవ మిగుల ముక్తి కంటెఁ గరిష్ఠంబు, గావున నదియు భు, క్తాన్నంబు జీర్ణంబు నందఁజేయు

తే. దీప్తజఠరాగ్ని గతి లింగదేహ నాశ, కంబు గావించు, నదియును గాక విష్ణు భక్తి వైభవములఁ దేటపఱుతు, వినుము, సద్గుణవ్రాత! యోగలక్షణ సమేత!

877

తా॥ "అమ్మా! యోగలక్షణాలతో కూడుకుని యున్నదానా! విను. ఈ జగత్తులోని పదార్థం యొక్క తత్త్వాన్ని తెలియజేసే వేదాలు, దానికి అనుగుణమైన కర్మాచారములకు తృప్తులవుతారు దేవతలు. స్వభావసిద్ధమైన, ఏ ఫలాన్ని కోరకుండా చేసే భగవత్సేవ ముక్తికంటే గొప్పది. కావున భగవత్సేవానురూపమైన భక్తి; తిన్న అన్నాన్ని జీర్ణంచేసే జఠరాగ్నివలె ఈ లింగదేహాన్ని నాశనం గావిస్తుంది. నీకు విష్ణుభక్తి యొక్క వైభవాన్ని తెలియజేస్తాను విను!

చ. అమలిన భక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణార విందయు గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరానులా పముల మదీయదివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై.

878

తా॥ మాలిన్యం లేని భక్తితో కొందరు మహాత్ములు నా చరణారవిందములను వాళ్ళ మనస్సులలో నిలుపుకొని ఇతరులతో సల్లాపం చేసేటప్పుడు నా దివ్యత్వాన్ని, నా పౌరుషాన్ని కీర్తిస్తూ సర్వకర్మలను నాకు అర్పణ చేస్తూ ఉంటారే గాని మోక్షాన్ని కోరుకొనరు.

సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్, ఘనత కెక్కిన పురాతనములైన చారు ప్రసన్న వక్త్రారుణ లోచన, ములు గల్గి వరదాన కలితములుగఁ దనరు మద్దివ్యావతార వైభవములు, మది నొప్పఁ దమయోగమహిమఁ జేసి యనుభవించుచుఁ దదీయాలాపములు సన్ను, తించుచుఁ దివుటఁ దద్దివ్యవిలస

తే. దవయవోదార సుందర నవ విలాస, మందహాస మనోహర మధుర వచన రచనచే నపహృత మనః ప్రాణు లగుచు, నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛ లేక.

879

తా॥ కొందరు భాగవతోత్తములు గొప్పవైన నా పురాణాలను ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉంటారు. ప్రసన్నమైన అందమైన ముఖము, అరుణ కాంతులు చిమ్మే కండ్లు, భక్తులకు అనేక వరాలను ఇచ్చే నా అవతార వైభవాలను వారి యోగ వైభవం చేత అనుభవిస్తూ ఉంటారు. నా నిండైన మాటలను స్మరిస్తూ, అవయవ సౌభాగ్యాన్ని, సుందరమైన మందహాసాన్ని, మనోహరము మధురము అయిన వాక్కులను మననం చేసుకొంటూ మనఃప్రాణాలు పరవశింపగా మోక్షాపేక్ష లేకుండా ఉంటారు.

మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి తా మణిమాద్యష్ట విభూతి సేవితము నిత్యానంద సంధాయియున్ గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వ ల క్షణ సంయుక్త వికుంఠలోక పదవిం గైకొందు రత్యున్నతిన్.

880

తా॥ అలా మోక్షాపేక్ష లేని వారై ఉండి కూడా తాము అణిమాది అష్ట విభూతులతో కూడినది, ఎప్పుడూ ఆనందాన్ని ఇచ్చేది, గణించుటకు శక్యము కానిది, లెక్కించుటకు వీలుకానిది, సంపత్తును ఇచ్చేది, సకల శుభలక్షణములతో కూడినది అయిన వైకుంఠ లోకాన్ని అందుకొంటారు.

వ. ఇట్లు వొంది.

881

క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి! మదీయ కాలచక్ర గ్రసనం బును నొందక నిత్యం బగు, ననుపమ సుఖవృత్తి నుందు, రది యెట్లన్నన్.

882

తా॥ తల్లీ! అట్లా పొంది ఆ పుణ్యాత్ములు నా కాలచక్రానికి లొంగక శాశ్వతమైన సుఖాలను పొందుతూ ఉంటారు.

మ. సమతన్ స్నేహముచే సుతత్వమును, విశ్వాసంబుచేతన్ సఖీ త్వముఁ, జాలన్ హితవృత్తి చేతను సుహృత్త్వంబున్, సుమంత్రోపదే శముచేతన్ నిజదేశికుం దనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్ట దై వమునై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్.

883

తా॥ స్నేహంచేత పుత్రుని వలెను, నమ్మకం వల్ల స్నేహితుని వలెను, ఎదుటి వారికి ఎల్లప్పుడూ హితాన్ని చెయ్యటం వల్ల ఆత్మీయుని వలెను, మంత్రోపదేశం వలన గురువు వలెను ఉంటూ... నిత్యము ప్రార్థింపతగిన ఇష్టదైవాన్నై నా కాలచక్ర భయం లేకుండ నేను రక్షిస్తూ ఉంటాను.''

వ. అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె:

884

తా॥ అని ఇంకా ఇలా అన్నాడు:

చ. విను మది గాక యీ భువి దివిం బలమాఱుఁ జరించు నాత్మ దా ధన పశు పుత్త్ర మిత్ర వనితాతతి పైఁ దగులంబు మాని న న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని

వా నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్.

885

తా॥ “తల్లీ! విను. ఈ ఆత్మ ఉన్నదే... అది భూమికి–స్వర్గానికి మధ్య అనేక సార్లు తిరుగుతూ ఉంటుంది. ఎవడైతే తాను ధనము, పశువులు, పుత్రులు, మిత్రులు, స్త్రీలు ఇంకా ఇతరమైన వాటిపై ఆసక్తి లేకుండా ఈ విశ్వమంతా వ్యాపించిన వాడిని, అనఘుడనైన నన్ను ఏకాగ్రతతో ధ్యానం చేస్తాడో అట్టి వానిని మృత్యురూప సంసార సముద్రం నుండి నేను తరింప చేస్తాను.

సీ. రూఢిఁ బ్రధాన పూరుష నాయకుండను, భగవంతుఁడను, జగత్ప్రభుఁడ నైన, నా కంటె నన్యులఁ గైకొని తగిలిన, యాత్మలు భవభయం బందు నెపుడుఁ గావున నా యాజ్ఞఁ గడవంగ నోడుటఁ, జేసి వాయువు వీచు, శిఖీ వెలుంగు, నినుఁడు దపించుఁ, దా నింద్రుండు వర్షించు, భయమంది మృత్యువు పరువువెట్టుఁ,

తే. గాన విజ్ఞాన వైరాగ్య కలిత మైన, భక్తియోగంబునం జేసి పరమపదము కొఱకు నయ్యోగి వరులు మచ్చరణభజను, లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు.

886

తా॥ నేను ప్రధాన పురుషునికి అధినాయకుడను, భగవంతుడను, జగత్ప్రభుడను. నాకంటే అన్యులను చేపట్టిన వారు చావు, పుట్టుకల సంసార చక్రంలో పడతారు. నా ఆజ్ఞను దాటలేక వాయువు వీస్తుంది, అగ్ని ప్రజ్వరిల్లుతుంది, సూర్యుడు ప్రకాశిస్తాడు, పాకశాసనుడు వర్షిస్తాడు, మృత్యువు భయంతో పరుగు పెడుతుంది. అందువల్ల విజ్ఞానము, వైరాగ్యము... ఈ రెంటితో కూడిన భక్తియోగం చేత లభించే పరమపదం కోసం ఆ యోగిశ్రేష్ఠులు నిర్భయాత్ములై నా పాదపద్మాలను సేవిస్తూ ఉంటారు.

క. గురుభక్తిం జిత్తము మ, త్పరమై విలసిల్లు నంత పర్యంతము స త్పురుషుల

కిహలోకంబునఁ, జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్.

887

తా॥ అంతులేని భక్తితో ఎంతవరకు సత్పురుషులు వారి మనస్సును నాయందే నిలుపుతారో అంత పర్యంతం వారికి ఈ లోకంలోనే మోక్షం కలుగుతుంది.”

క. అని యిట్లు నమ్మునీంద్రుఁడు, జననికి హరిభక్తి యోగ సంగతి నెల్లన్ వినిపించి వెండియును ని, ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్.

888

తా॥ ఈ ప్రకారంగా ఆ మునీంద్రుడు తన తల్లికి హరిభక్తికి సంబంధించిన యోగ విషయాలన్నీ వినిపించి ఎంతో హర్షంతో తిరిగి ఇలా అన్నాడు:

వ. అవ్వా! యివ్విధంబున భక్తియోగ ప్రకారంబు సెప్పితి, నింకఁ దత్త్వలక్షణంబు వేఱు వేఱ యెఱింగింతు. ఏ తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబుల వలన విముక్తు లగుదురు, హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శన రూపంబు నగు నా జ్ఞానం బాత్మనిశ్శ్రేయస కారణంబు; గావున దాని నెఱింగింతు, నందు నాత్మస్వరూపం బెట్టి దనిన ననాదియుఁ బురుషుండును సత్త్వాదిగుణ శూన్యుండును బ్రకృతి గుణవిలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వండు? మఱియు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితం బగు నతండు గుణత్రయాత్మకత్వంబు నవ్యక్తంబును భగవత్సంబంధియు నగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణత్రయ మయంబై సరూపం బయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని యప్పుడు మోహితుండయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకం బయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసారబద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండుఁ,

గర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షి యగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులనియు, సుఖ దుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతి విలక్షణుం డయిన పురుషుని వనియు నెఱుంగుదు, రని చెప్పిన విని దేవహూతి గపిలున కిట్లనియెఁ, బురుషోత్తమా! ప్రకృతి పురుషులు సదసదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్మనిన భగవంతుం డైన కపిలుం డిట్లనియె.

889

తా॥ "ఇప్పటి వరకు నీకు భక్తి యోగాన్ని గూర్చి చెప్పాను. ఇక తత్త్వలక్షణాలను వేరు వేరుగా చెపుతాను. ఈ తత్త్వగుణాలను ఎరిగిన మానవులు ప్రకృతి బంధముల నుండి విముక్తులవుతారు. హృదయగ్రంథి వీడి, ఆత్మను దర్శించడానికి అవసరమైన ఆ జ్ఞానం కైవల్యప్రాప్తికి కారణమవుతుంది. కనుక దానిని నీకు చెబుతాను.

ముందు ఆత్మ స్వరూపాన్ని విను. పరమాత్మ అనాది. పురుష శబ్దవాచ్యుడు. త్రిగుణములు అనగా సత్వరజస్తమోగుణాలు లేనివాడు. ప్రకృతి గుణములకంటే వేరైనవాడు. ప్రత్యక్ష స్వరూపుడు. స్వయం ప్రకాశుడు. ఆ పరమాత్మ గుణత్రయాత్మకము, వ్యక్తంకానిది, భగవంతునితో సంబంధం కలది... అయిన ప్రకృతిలో లీలగా ప్రవేశించాడు. అప్పుడు ఆ ప్రకృతి త్రిగుణాత్మికయై, సాకారమైన ప్రజాసర్గాన్ని సృష్టించటం మొదలుపెట్టింది. దానికి పురుషుడు మోహాన్ని పొందాడు. విజ్ఞానం మరుగునపడి గుణత్రయాత్మకమైన ప్రకృతిని ఆశ్రయించాడు పురుషుడు. ఆ విధంగా ప్రకృతి పురుషులు అన్యోన్యము మేళనం పొందారు. అంత పురుషుడు ప్రకృతి గుణములను తనయందు ఆరోపించుకొని జరుగుతున్న పనులన్నింటికి తానే కర్తగా భావించుకొంటూ సంసారబద్ధుడై స్వాతంత్ర్యాన్ని కోల్పోయాడు.

ఈశ్వరునికి కర్తృత్వంతో సంబంధం లేదు. ఆయన కేవలం సాక్షి మాత్రమే. అందువల్ల ఆత్మకు కార్యకారణ కర్తృత్వాలు లేవని అవి ప్రకృతికి అధీనమైనవని తెలుసుకోవాలి.

సుఖదుఃఖాలు అనుభవించడం ప్రకృతికంటే భిన్నుడైన పురుషునివి." అని చెప్పగా విన్న దేవహూతి కపిలునితో 'ఓ పురుషోత్తమా! ప్రకృతి పురుషులు, అస్తిత్వం కలదీ, అస్తిత్వం లేనిదీ ఈ ప్రపంచానికి కారణమైన వారు. కనుక వారి లక్షణాలను సదసద్వివేకపూర్వకంగా నాకు చెప్పు' అని పలికింది.

క. క్రమమునఁద్రిగుణము నవ్య, క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా నము
ననఁగాఁ బ్రకృతి విశే, షము లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్.

890

తా॥ త్రిగుణాత్మకము, అవ్యక్తము, నిత్యము, సదసదాత్మకము, ప్రధానము అనేవి ప్రకృతి విశేషాలు. ఈ విశేషాలతో కూడి ఉన్నది కాబట్టి ప్రకృతిని విశిష్టమని ప్రాజ్ఞులు పేర్కొన్నారు.

వ. అందుఁ బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకంబై యుండు, నది యెట్లనినం బంచమహాభూతంబులును, బంచతన్మాత్రలును, జ్ఞానకర్మాత్మకంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, వాక్పాణి పాద పాయూపస్థంబులు నను దశేంద్రియంబులును, మనోబుద్ధి చిత్తాహంకారంబులను నంతఃకరణ చతుష్టయంబును నను చతుర్వింశతి తత్త్వాత్మకంబైన సగుణ బ్రహ్మసంస్థానంబు సెప్పితి, నిటమీఁదఁ గాలం బను పంచవింశక తత్త్వంబు సెప్పెద, నది గొందఱు పురుషశబ్ద వాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు గాల శబ్దంబునఁ జెప్పంబడునందు, రందు నహంకార మోహితుండై ప్రకృతి నొందు జీవుండు భయంబుఁ జెందుఁ, బ్రకృతి గుణసామ్యంబునం జేసి వర్తించు నిర్విశేషుం డగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నం బగు నదియ కాలం బని చెప్పంబడు నదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి పురుషుండనియు, వాని బహిర్భాగవ్యాప్తిం జేసి కాలం బనియుఁ జెప్పంబడు, నాత్మ మాయం జేసి తత్త్వాంతర్గతుం డయిన జీవుని వలన క్షుభితంబయి జగత్కారణం బగు ప్రకృతియందుఁ బరమపురుషుండు దన వీర్యంబు వెట్టిన నా ప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబు పుట్టించె, నంత సకల ప్రపంచ

బీజభూతుండును, లయవిక్షేప శూన్యుండును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబునందు నాత్మగతంబైన మహదాది ప్రపంచంబుల వెలిఁగించుచు స్వతేజోవిపత్తింజేసి యాత్మప్రస్వాపనంబు సేయునట్టి తమంబును గ్రసించెనని చెప్పి వెండియు నిట్లనియె.

891

తా॥ తల్లీ! ప్రకృతి ఇరవై నాలుగు తత్త్వాలతో కూడి ఉంటుంది. ఎలాగంటే నేల, నీరు, నిప్పు, గాలి, నింగి ఈ అయిదు పంచ మహాభూతాలు. గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం ఈ అయిదు వాటి గుణాలు అంటే పంచతన్మాత్రలు. చర్మం, నాలుక, కన్ను, ముక్కు, చెవి ఈ అయిదు పంచ జ్ఞానేంద్రియాలు. వాక్కు, చేతులు, కాళ్ళు, మలావయవం, మూత్రావయవం ఈ అయిదు పంచ కర్మేంద్రియాలు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారం ఈ నాలుగు అంతఃకరణ చతుష్టయం. ఇవన్నీ కలిసి ఇరవైనాలుగు తత్త్వాలతో కూడిన "సగుణ బ్రహ్మ సంస్థానం" అనే పేరుతో ఒప్పుతూ ఉంటుంది.

ఈ పైన కాలము అనే ఇరవై అయిదవ తత్త్వాన్ని గురించి చెబుతాను. పురుషుడు అనే శబ్దంతో ఎవరిని ఉద్దేశించి మాట్లాడుతున్నామో దానినే "ఈశ్వరుడని", "కాలము" అని అంటారు. "నేను" అనే అహంకారంలో పడి ప్రకృతితో సంబంధం పెట్టుకున్న జీవుడు భయాదులను అనుభవిస్తాడు. ప్రకృతి గుణాలన్నింటిలోను నిర్విశేషుడై ఉన్న భగవంతుని చేష్టావిశేషాలు దేనివల్ల ఉత్పన్నమవుతాయో అదే "కాలం" అనబడుతోంది. అది జీవరాశులలో అంతర్గతంగా ఉన్నప్పుడు పురుషుడు అని బహిర్గతంగా ఉంటే కాలము అని అంటాం. ఆత్మమాయ కారణంగా ప్రకృతి తత్త్వాలలో లీనమైన జీవునివల్ల క్షుభితమైన ఈ జగత్తుకు కారణమైన ప్రకృతియందు పరమాత్మ తన వీర్యాన్ని ప్రవేశపెట్టగా ఆ ప్రకృతి హిరణ్మయమైన మహత్తత్త్వాన్ని పుట్టించింది. ఆపైన సకల ప్రపంచానికి బీజమైనవాడు, లయవిక్షేప శూన్యుడు అయిన ఈశ్వరుడు తన సూక్ష్మరూపంలో ఆత్మగతమైన మహదాది ప్రపంచాన్ని వెలిగిస్తూ తన

తేజస్సు చేత తనను నిద్రింపజేసే తమస్సును హరించాడు.” కపిల మహర్షి తిరిగి ఇట్లా అన్నాడు:

క. దివ్యమగు వాసుదేవా, ది వ్యూహ చతుష్టయంబు త్రిజగములందున్ సేవ్యం బని చెప్పంబడు; భవ్యగుణా! దాని నెఱుఁగఁ బలికెద నీకున్

892

తా॥ “దివ్యమైన వాసుదేవము, సంకర్షణము, ప్రద్యుమ్నము, అనిరుద్ధము అనే ఈ నాలుగు వ్యూహాలు మూడు లోకాల్లోను సేవింప తగినవి. అమ్మా! నీకు తెలిసేటట్లు చెపుతాను.

సీ. సత్త్వ ప్రధానమై స్వచ్ఛమై శాంతమై, యూర్మిషట్కంబుల నోసరించి సురుచిర షాడ్గుణ్య పరిపూర్ణమై నిత్య, మై భక్తజన సేవ్యమై తనర్చి వలనొప్పుచుండు న వ్వాసుదేవ వ్యూహ, మంత మహత్తత్త్వమందు నోలి రూఢిఁ గ్రియాశక్తి రూపంబు గల్గు న, హంకార ముత్పన్నమయ్యె, నదియు

తే. సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ, సంబు నా మూఁడు దెఱఁగుల జరుగు, నందుఁ దనరు వైకారికము మనస్సునకు నింద్రి, యములకును గగనముఖ భూతముల కరయ.

893

వ. అది దేవతారూపంబున నుండుఁ, దైజసాహంకారంబు బుద్ధి ప్రాణంబులుం గలిగి యుండుఁ, దామసాహంకారం బింద్రియ మేళనంబున నర్థమాత్రంబై యుండు మఱియును.

894

తా॥ ఈ వాసుదేవ వ్యూహం అనేది ఆకలిదప్పికలు, శోకమోహములు, జరామరణాలు అనే ఆరు ఊర్మల నుండి విడివడి; ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనే ఆరు గుణాలతో పరిపూర్ణమై; సత్త్వప్రధానమై, స్వచ్ఛమై, శాంతమై, నిత్యమై, భక్తజన సేవ్యమై ఒప్పుతూ ఉంటుంది. మహత్తత్త్వం నుండి క్రియాశక్తి రూపమైన అహంకారం పుట్టింది.

అది మూడు విధాలుగా ఉంటుంది. 1) వైకారికం, 2) తైజసం, 3) తామసం. ఇందులో వైకారికాహంకారం అనేది మనస్సుకు, అయిదు ఇంద్రియాలకు, ఆకాశాది పంచభూతాల పుట్టుకకు స్థానమై దేవతారూపంలో ఉంటుంది. తైజసాహంకారం బుద్ధిరూపంలోను, ప్రాణరూపంలోను ఉంటుంది. తామసాహంకారం ఇంద్రియాలతో కలిసి ప్రయోజన మాత్రమై ఉంటుంది.

సీ. అట్టి యహంకారమం దధిష్ఠించి సా, హస్ర ఫణామండలాభిరాముఁ డై తనరారు ననంతుఁడు సంకర్ష, ణుం డనఁ దగు పురుషుండు ఘనుఁడు, మహిత భూతేంద్రియ మానస మయుఁడు నై, కర్తృత్వ కార్యత్వ కారణత్వ ప్రకట శాంతత్వ ఘోరత్వ మూఢత్వాది, లక్షణ లక్షితోల్లాసి యగుచు

తే. నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ, ఘన వికారంబుఁ బొందు వైకారికంబు వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె, మఱియు వైకారికంబును మాత! వినుము.

895

తా॥ వైకారికమైన సాత్త్వికాహంకారాన్ని అధిష్ఠించి సంకర్షణ వ్యూహం ఉంటుంది. వేయి పడగలతో ప్రకాశించే అనంతుడైన సంకర్షణ పురుషుడు... ఘనుడు, మహానుభావుడూను. ఆయన పంచభూతాలతో, పంచేంద్రియాలతో, మనస్సుతో నిండి ఉంటాడు. కర్తృత్వము, కార్యత్వము, కారణత్వము... అనే రూపభేదాలు కలిగి; శాంతత్వము, ఘోరత్వము, మూఢత్వము ఇత్యాది లక్షణాలతో ఉల్లాసంగా ఉంటాడు. ఈ మేటి వ్యూహమే రెండవదైన సంకర్షణ వ్యూహం. దీనినుంచే మనస్తత్వం పుట్టింది.

వ. అది యెట్టు లంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననం దగు సంకల్ప వికల్పంబులం జేసి కామసంభవం బనంబడు నెద్ది యనిరుద్ధాఖ్యం బయిన వ్యూహం, బదియ హృషీకంబులకు నధీశ్వరంబయి సకల యోగీంద్ర సేవ్యం బగుచు శరదిందీవరశ్యామం బయి యుండు, వెండియుం దైజసంబువలన బుద్ధి తత్త్వంబు పుట్టె,

దాని లక్షణంబులు ద్రవ్య ప్రకాశకంబైన జ్ఞానంబును, నింద్రియానుగ్రహంబును, సంశయంబును, మిథ్యాజ్ఞానంబును, నింద్రియ నిశ్చయంబును, స్మృతియు ననం దగియుండు, మఱియుఁ దైజసాహంకారంబు వలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును గ్రియాజ్ఞాన సాధనంబులును గలిగియుండుఁ, బ్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటం చేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు, భగవద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబు వలన శబ్దతన్మాత్రంబు పుట్టె, దానవలన నాకాశంబును, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె, శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె, శబ్దం బర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞానజనకం బయ్యె, మఱియు శబ్దతన్మాత్రంబు వలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు, నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండుఁ, గాలగతిచే వికారంబు నొందు, శబ్ద తన్మాత్ర లక్షణంబగు నభంబువలన స్పర్శంబును స్పర్శంబువలన వాయువును వాయువుచే స్పర్శ గ్రాహియైన త్వగింద్రియంబును బుట్టె, మృదుత్వంబును గఠినత్వంబును శైత్యంబును నుష్ణత్వంబును నునివి స్పర్శంబునకు స్పర్శత్వం బని చెప్పంబడు, మఱియు వాయువునకుఁ జాలనంబును పరస్పర విభాగకరణంబును దన్మేళనంబును ద్రవ్యశబ్ద నేతృత్వంబును నగు, నందు గంధవంతంబగు ద్రవ్యంబును ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు, దూరస్థం బగు శబ్దంబును శ్రోత్రేంద్రియ గ్రాహ్యమగు నట్లొనరించుట శబ్ద నేతృత్వంబు, సర్వేంద్రియాత్మకత్వంబు నునివి లక్షణంబులై యుండు, దైవ ప్రేరితంబై స్పర్శతన్మాత్ర గుణకంబగు వాయువు వలన రూపంబును దాని వలనఁ దేజంబును బుట్టె, రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం బయ్యె, నేత్రగతంబయిన రూపంబునకు నుపలంభకత్వంబును ద్రవ్యాకార సమత్వంబును ద్రవ్యంబునకు నుపసర్జనం బగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడు, దైజసంబునకు సాధారణంబులగు ధర్మంబులు. ద్యోతం బనం బ్రకాశంబు, పచనంబనఁ దండులాదుల పాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షున్నిమిత్తంబైన యోదనంబు, హిమమర్దనంబగు శోషణంబు నను నివి వృత్తులై యుండు,

రూపతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబు నొందు, తేజస్సు వలన రసతాన్మత్రంబు పుట్టె, రసతన్మాత్రంబు వలన జలంబు పుట్టె, జిహ్వ యను రసనేంద్రియంబు రసగ్రాహకం బయ్యె, నా రసం బేకంబై యుండియు భూతవికారంబునంజేసి కషాయ తిక్త కట్వామ్ల మధురాది భేదంబుల ననేక విధంబయ్యె. వెండియు సాంసర్గిక ద్రవ్య వికారంబునం జేసి యార్ద్రం బగుటయు, ముద్దగట్టుటయుఁ, దృప్తి దాతృత్వంబును, జీవనంబును, దద్వైక్లబ్యనివర్తనంబును, మృదూకరణంబును, దాపనివారణంబును, గూపగతంబైన జలంబు దివియ మఱియు నుద్గమించుటయు నను నివి జలవృత్తు లనంబడు, రసతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబు వలన గంధతన్మాత్రంబు పుట్టె, దాని వలనం బృథ్వియుఁ గలిగె, ఘ్రాణంబు గంధ గ్రాహకం బయ్యె, నందు గంధం బేకంబయ్యు వ్యంజనాది గతంబయి హింగ్వాది నిమిత్తంబయిన మిశ్ర గంధంబును, కరంభంబును, గృంజనాది గతంబైన పూతిగంధంబును, ఘనసారాది నిమిత్తంబైన సుగంధంబును, శతపత్రాది గతంబగు శాంత గంధంబును, లశునాది గతంబైన యుగ్రగంధంబును, బర్యుషితచిత్రాన్నాదిగతం బయిన యామ్లగంధంబును, ద్రవ్యావయ వైషమ్యంబునం జేసి యనేక విధంబై యుండు; నదియునుంగాక ప్రతిమాది రూపంబులంజేసి సాకారతాపాదనం బగు భావంబును, జలాదివిలక్షణ త్రయాంతర నిరపేక్షంబైన స్థితియు, జలాద్యాధారత యను ధారణంబును, నాకాశా ద్యవచ్ఛేదకత్వంబును, సకల ప్రాణి పుంస్త్వాభి వ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు నని చెప్పి వెండియు నిట్లనియె; నభో–సాధారణ శబ్ద విశేష గ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వసాధారణ గుణ విశేష గ్రాహకంబు స్పర్శంబును, దేజో–సాధారణ గుణ విశేష గ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభో–సాధారణ గుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్యసాధారణ గుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును, నాకాశాది గుణంబు లగుచు శబ్దాది కార్యంబు లగు, వాయ్వాదులందుఁ గారణాన్వయంబున నన్నిటికిం బృథ్వీ సంబంధంబు గలుగుటం జేసి భూమియందు శబ్ద స్పర్శరూప రసగంధంబులు గలుగుట. మహదాది పృథివ్యతంబులగు నీ యేడు తత్త్వంబులు

పరస్పర మిళితంబులై భోగాయతనంబగు పురుషునిం గల్పింప నసమర్థంబులై యున్నం జూచి కాలాదృష్ట సత్త్వాదులం గూడి జగత్కారణుండును, త్రైగుణ్య విశిష్టుండును, నశేష నియామకుండును, నిరంజనాకారుండును నగు సర్వేశ్వరుం డందుఁ బ్రవేశించు నంత నన్యోన్యక్షుభితంబులై మిళితంబులైన మహదాదుల వలన నధిష్ఠాతృ చేతనరహితం బగు నొక యండంబు వుట్టె నందు.

896

తా॥ ఈ మనస్తత్త్వానికి చింతన సహజం. సామాన్య చింతనం, విశేష చింతనం అని ఈ చింతన రెండు విధాలు. వీటికే సంకల్పం, వికల్పం అని పేర్లు. ఈ రెండూ కామ సంభవాలే! ఇదే ప్రద్యుమ్న వ్యూహం అని చెప్పబడుతుంది.

ఇక అనిరుద్ధ వ్యూహం గురించి చెబుతా విను. ఇది ఇంద్రియాలకు అధీశ్వరమై, యోగీంద్రులకు సేవ్యమై శరత్కాలమందలి నల్లకలువవలె వెలుగొందుతూ ఉంటుంది.

తైజసాహంకారం వల్ల బుద్ధితత్త్వం పుట్టింది. ద్రవ్యాన్ని ప్రకాశింప చేసే జ్ఞానం, ఇంద్రియానుగ్రహం, సంశయం, మిథ్యాజ్ఞానం, ఇంద్రియ నిశ్చయం, స్మృతి ఇవి బుద్ధి తత్త్వలక్షణాలు. ఈ తైజసాహంకారం వల్లనే ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, క్రియాజ్ఞాన సాధనాలు ఏర్పడ్డాయి. ఈ అహంకారం వల్లనే ప్రాణానికి క్రియాశక్తి, బుద్ధికి జ్ఞానశక్తి కలిగి ఈ రెండు శక్తులు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలను పనిచేయిస్తాయి.

భగవద్భక్తి ప్రేరితంబైన తామసాహంకారం నుండి శబ్దతన్మాత్రం పుట్టింది. దీనినుండి ఆకాశం ఏర్పడింది. ఆకాశంవల్ల శ్రోత్రేంద్రియం పుట్టింది. శ్రోత్రం శబ్దాన్ని గ్రహిస్తుంది. అదే శబ్దం అర్థానికి ఆశ్రయమై ఆ శబ్దాన్ని వినేవానికి జ్ఞానం కలగడానికి కారణభూతమవుతోంది. ఈ శబ్దతన్మాత్రం వలన ఆకాశం ఏర్పడి, ఆ ఆకాశం సకల జీవులకు లోపల వెలుపల అవకాశం ఇవ్వటమే కాకుండ ఈ ఆత్మ ప్రాణానికి, ఇంద్రియాలకు ఆశ్రయమై ఉంటున్నది. కాలగతిచే

వికారాన్ని పొందే శబ్దతన్మాత్ర లక్షణమైన ఆకాశంవల్ల స్పర్శను, స్పర్శవల్ల వాయువు ఆ వాయువు వల్ల స్పర్శను గ్రహింపగల చర్మము పుట్టి స్పర్శజ్ఞానాన్ని కలిగించింది. మృదువుగా ఉండటం, కఠినంగా ఉండటం, చల్లగా ఉండటం, వెచ్చగా ఉండటం ఇత్యాదిగా ఇవన్నీ స్పర్శ జ్ఞానానికి లక్షణాలు.

వాయువుకు కదలుట, కదలించుట, వేరుచేయుట, కలుపుట, ద్రవ్య నేతృత్వం, శబ్దనేతృత్వం లక్షణాలు. ద్రవ్యాలను ఆఘ్రాణింప చేయటం ద్రవ్య నేతృత్వం. శబ్దాన్ని వినిపింప చెయ్యటం శబ్దనేతృత్వం. భగవత్ప్రేరణతో వాయువు వలన రూపంబును దాని వలన తేజస్సు పుట్టాయి. నేత్రేంద్రియం వల్ల గ్రహింపతగినది రూపం. కంటితో చూసిన రూపానికి వృత్తులు అయిదు. 1) ఉపలంభకత్వం (అనుభవం కలుగుట), 2) ద్రవ్యాకార సమత్వం (ద్రవ్యము యొక్క ఆకారాన్ని ఉన్నదున్నట్లుగా చూపుట) 3) ద్రవ్యోపసర్జనం (ద్రవ్యము అప్రధానమగుట) 4) ద్రవ్యపరిణామ ప్రతీతి (ద్రవ్యం యొక్క మార్పు) తెలియుట. ఇక తేజస్సుకు సాధారణ ధర్మాలు ద్యోతం, పచనం, పిపాస, ఆకలి, చలి. ద్యోతానికి ప్రకాశము, పచనానికి బియ్యము, పిపాసకు పానం, ఆకలికి ఆహారం, చలికి శోషణం వృత్తులు.

దైవప్రేరితమై మార్పు చెందిన తేజస్సు వల్ల రసతన్మాత్రం పుట్టింది. రసతన్మాత్ర వల్ల జలం పుట్టింది. జిహ్వ అను రసనేంద్రియం రసగ్రాహకం అయింది. ఆ రసం ఒకటే అయినా భూతవికారంవల్ల వగరు, చేదు, కారం, పులుపు, తీపి, ఉప్పు అనే రుచులుగా మారి ఇంకా అనేక విధాలుగా అయింది.

ఇక జలవృత్తులు – ఇవి తనలో చేరిన ద్రవ్యాల మార్పులను బట్టి ఆర్ద్రంకావటం, ముద్దకట్టడం, తృప్తినివ్వటం, జీవనం, అందులోని మాలిన్యాన్ని నివారించటం, మృదువుగా ఉంచటం, తాపాన్ని నివారించటం, నూతిలో నీరు పైకి ఎగయటం... ఇంకా అనేక రకాలుగా ఉంటుంది. ఈ రసతన్మాత్ర వలస దైవప్రేరణతో మార్పు చెందిన జలం నుండి గంధతన్మాత్రం పుట్టింది. దాని వలన భూమి పుట్టింది. ముక్కు వాసనను గ్రహించేది అయింది. ఈ గంధం

(వాసన) ఒకటే అయినా అనేక వ్యంజనములతో కలసిన కారణంగా... ఇంగువతో కలసి 'మిశ్రమ గంధం' అని, నిల్వ ఉన్న పెరుగు, జంతు మాంసం మొదలైన వాటితో కలిసి 'దుర్గంధం' అని, కర్పూరంతో కలిసి సుగంధం అని, తామర పువ్వులు మొదలైన వాటితో కలిసి 'శాంతగంధం' అని, వెల్లుల్లి ఇత్యాది వాటితో కలిసినప్పుడు 'ఉగ్రగంధం' అని పాసిపోయిన చిత్రాన్నం వంటి వాటితో కలిసినప్పుడు 'ఆమ్లగంధం' అని అందులో కలిసిన పదార్థాల స్థితిగతులను బట్టి ఎన్నో విధాలుగా ఉంటుంది.

ఇక భూమికి సంబంధించిన సాధారణ ధర్మాలు ఏమిటంటే ప్రతిమల రూపాన్ని వాటి ఆకారాలను నిలుపుకోవటం, జలం మొదలైన వాటితో అవసరం లేకుండ స్వతంత్రంగా నిలబడగలగటం, జలాదులకు తాను ఆధారమై ఉండటం, ఆకాశం, వాయువు, తేజస్సు, జలం వీటిని విభజించటం, సకల ప్రాణులకు స్త్రీ పురుష భేదాలతో దేహంగా ఉండటం అనేవి పృథ్వీవృత్తుల" ని చెప్పి ఇంకా ఇలా అన్నాడు—

"అమ్మా! పంచ మహాభూతాలకు సాధారణ ధర్మాలు విన్నావు. ఇక అసాధారణ ధర్మాలు విను. ఆకాశానికి అసాధారణ గుణం శబ్దం. దీనిని చెవి గ్రహిస్తుంది. వాయువుకు అసాధారణ గుణం స్పర్శం. దీనిని చర్మం గ్రహిస్తుంది. తేజస్సుకు అసాధారణ గుణం రూపం. దీనిని కన్ను గ్రహిస్తుంది. జలానికి అసాధారణ గుణం రసం. దీనిని నాలుక గ్రహిస్తుంది. పృథ్వికి అసాధారణ గుణం గంధం. దీనిని ముక్కు గ్రహిస్తుంది. ఆకాశం మొదలైన వాటన్నిటితో సంబంధం ఉన్నందువల్ల భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అసాధారణ గుణాలు అయ్యాయి.

మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు — ఈ ఏడు తత్త్వాలు పరస్పరం కలుసుకొని కూడా భోగానుభవానికి పాత్రుడైన పురుషుణ్ణి కల్పించడానికి అసమర్థమయ్యాయి. ఆ సమయంలో కాలస్వరూపుడు, అంతంలేని అస్తిత్వం కలవాడు, జగత్తుకు కారణభూతమైన వాడు, సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడు, అన్నిటినీ నియమించేవాడు, నిరంజనుడు అగు సర్వేశ్వరుడు అందులో ప్రవేశించాడు. అప్పుడు ఒకదానితో ఒకటి కలిసిన మహదాదుల వలన చైతన్యం లేని

ఒక అండం పుట్టింది.

సీ. గురుశక్తితో విరాట్పురుషుండు సంభవం, బయ్యె, నయ్యండంబు నర్థిఁ బొదివి యంబు ముఖావరణంబు లొక్కొకటికి, దశగుణితంబులై తవిలి యావ రణములై యుండును, గ్రమమున లోకంబు, లకు "మేలుకట్ల" పోలికఁ దనర్చి పంకజోదరుని రూపము విలసించును, లోలత జలములోఁ దేలుచున్న

తే. హేమ మయమైన యండంబులో మహాను, భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖీల జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు, విష్ణుపద భేదనంబు గావించి యందు.

897

తా॥ అందులోంచి అంతులేని శక్తితో 'విరాట్ పురుషుడు' పుట్టాడు. ఆ అండాన్ని పొదువుకొని పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తు అనే ఆవరణాలు ఒకదానికంటే మరొకటి పదిరెట్లు ప్రమాణం కలిగి ఉన్నాయి. లోకాలకు మేలుకట్లు పోలికతో ఉన్న ఆ పొరలలో శ్రీమహావిష్ణు స్వరూపం వెలుగొందుతూ ఉంటుంది. ఆ జలాలలో తేలుతూ ఉన్న కాంచనమయమైన అండంలో మహానుభావుడు, పుట్టుక లేనివాడు, హరి, దేవదేవుడు, విశ్వవిజేత అయిన నారాయణుడు ప్రవేశించి ఆకాశాన్ని భేదిస్తాడు.

సీ. కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు, నా విరాట్పురుషుని యాననంబు వలనను వాణియు, వాణితో వహ్నియు, నాసంబు వలనఁ బ్రాణములఁగూడి ఘ్రాణేంద్రియం బయ్యె, ఘ్రాణంబు వలనను, వాయువులను బ్రాణవాయువులును నందు నక్షులు చక్షువందు సూర్యుండును, నం దభిధ్యానంబు నర్థిఁ జేయఁ

తే. గర్ణములు జాత మయ్యెఁ, దత్కర్ణసమితి, వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ, ద్వక్కుచే శ్మశ్రురోమ వితానకములు, నోషధి వ్రాతమును భవ మొందె మఱియు.

898

తా॥ ఆ అండంలో విరాట్ పురుషుడు ప్రకాశమానమై ఉంటాడు. ఆయన ముఖం నుండి వాణి, దానితో పాటు అగ్ని పుట్టాయి. ముక్కునుండి ప్రాణాలు, ఘ్రాణేంద్రియం పుట్టాయి. ఘ్రాణేంద్రియం నుండి వాయువులు, ప్రాణవాయువులు ఆవిర్భవించాయి. ప్రాణవాయువుల నుండి కన్నులు, దాని నుండి సూర్యుడు పుట్టారు. దాని యందు ధ్యానమేర్పడగా చెవులు పుట్టాయి. దానివల్ల శ్రోత్రేంద్రియమూ, దిక్కులూ పుట్టాయి. చర్మం వలన గడ్డం, మీసాలు మొదలైన రోమ సమూహము, ఓషధులు పుట్టాయి.

తే. దాని వలనను మేఢ్రంబు గానఁ బడియెఁ, బరఁగ రేతంబు వలన నాపంబు వుట్టె గుదము వలన నపానంబు నుదయమయ్యె, దాని వలనను మృత్యువు దగ జనించె.

899

తా॥ ఆపైన మూత్రావయవం పుట్టింది. దాని వలన రేతస్సు, దాని వలన జలం పుట్టింది. ఆపై గుదము, దానివలన అపానము జనించాయి. దాని వలన మృత్యువు పుట్టింది.

క. కరముల వలనను బలమును, నిరవుగ నా రెంటివలన నింద్రుఁడుఁ, బాదాం బురుహంబుల వలన గతియు, నరుదుగ నా రెంటి వలన హరియునుఁ గలిగెన్.

900

తా॥ విరాట్పురుషుని చేతుల వల్ల బలం, ఆ రెంటి వలన ఇంద్రుడు, పాదాల వలన గమనం, ఆ రెండింటి వలన ఉపేంద్రుడు జన్మించారు.

క. ఘననాడీపుంజము వల, నను రక్తము, దాని వలననదులును జఠరం బున నాఁకలియును దప్పియు, ననయము నా రెంటివలన నబ్ధులు వుట్టెన్.

901

తా॥ ఆ విరాట్పురుషుని నాడుల వలన రక్తము, దాని వలన నదులు, జఠరం వల్ల

ఆకలిదప్పికలు, ఈ రెంటి వల్ల సముద్రాలు పుట్టాయి.

క. విను హృదయము వలనను మన, మును, మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ జిత్తం
బును బ్రహ్మయు క్షేత్రజ్ఞుం, డును గలిగిరి యవ్విరాజుఁడుం బూరుషతన్.

902

తా॥ విరాట్పురుషుని హృదయం వల్ల మనస్సు, మనస్సు వల్ల చంద్రుడు, బుద్ధి పుట్టారు. చిత్తం వల్ల బ్రహ్మ, క్షేత్రజ్ఞుడు కలిగారు. ఇలా ఆ అండం నుండి సృష్టికి కారణభూతుడైన పురుషుడు పుట్టాడు.

వ. మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టిరూపంబులగు నాకాశాది భూతంబులును శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియ జాతంబును దదధిదేవతలును దమంతన సమష్టి రూపుండగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తి ప్రవర్తకుంజేయ నసమర్థంబు లయ్యె, నెట్టనిన దేవాధిష్ఠితంబులగు నింద్రియంబులు దాము వేర్వేఱ యయ్యీశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయనోపక క్రమంబునం దత్తదధిష్ఠానాదుల నొందె, నందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యంబగు వ్యష్టి శరీరజాతం బనుత్పన్నంబయ్యె, నంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిద యయ్యె, నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రంబుల నొందిన వృథాభూతంబయ్యె, దిగ్దేవతాకంబగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యంబయ్యె, నోషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ జెంద విఫలం బయ్యె, నద్దైవంబగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్య కరణాదక్షంబయ్యెఁ, బదంపడి గుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబు నొందె, విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యెఁ, బాణీంద్రియంబు లింద్రదైవతంబు లగుచు బలంబు నొందిన శక్తి హీనంబు లయ్యె, మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు వొందిన నిరర్థకంబు లయ్యె, నుదరంబు సింధువులతోడం జేసి క్షుత్పిపాసలం

బొందిన వ్యర్థంబయ్యె, హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన నూరకయుండె, బుద్ధి బ్రహ్మాధిదైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యెఁ, జిత్తం బభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతం బనుద్భూతం బయ్యె, నంతఁ జైత్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిల కార్యభూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖ క్షముండయ్యె, సుప్తుండగు పురుషునిఁ బ్రాణాదులు దమబలంబుచే భగవదప్రేరితంబు లగుచు నుత్థాపనాసమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబులగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె నని మఱియు నవ్విరాట్పురుషుని ననవరతభక్తింజేసి విరక్తులై యాత్మలయందు వివేకంబు గల మహాత్ములు చింతింపుదు రనియుఁ బ్రకృతి పురుష వివేకంబున మోక్షంబును, బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగు ననియుఁ జెప్పి మఱియు నిట్టనియె.

903

తా॥ ఆ తరువాత విరాట్ పురుషునిలో ఉదయించిన ఆకాశం మొదలైన పంచ మహాభూతములు, శబ్దం స్పర్శ ఇత్యాది భూతతన్మాత్రలు, వాక్కు మొదలైన ఇంద్రియాలు, వాటి అధిదేవతలు వేరువేరుగా ఉండిపోయాయి. అవి తమలో తాము కలయిక పొందనందువల్ల సమష్టిరూపుడైన క్షేత్రజ్ఞుని (జీవుని) ప్రవర్తింపచెయ్యలేక క్రమంగా ఆయా స్థానాలలో ఉండిపోయాయి. అగ్ని వాక్కు అనే ఇంద్రియంతో ముఖాన్ని పొంది ప్రవర్తించినప్పటికి... విరాట్ పురుషుని కార్యమైన శరీరాలు పుట్టడం అనే కార్యం నెరవేరలేదు. అలాగే నాసికలో వాయువు ఘ్రాణేంద్రియంతో కూడి వర్తించినా జీవోత్పత్తి జరగలేదు. ఆదిత్యుడు చక్షురింద్రియంతో కూడి నేత్రాలలో వర్తించినా వృథా అయ్యింది. అలాగే చెవులలో దిక్కులు శ్రోత్రేంద్రియంతో కూడినాకూడ విరాట్ పురుషుని కార్యాన్ని సాధించలేక పోయాయి. త్వగింద్రియంతో రోమాలలో ఓషధులు వర్తించి విఫలమయ్యాయి.

పురుషాంగం రేతస్సును పొంది కూడ సృష్టి కార్యాన్ని నిర్వర్తించలేక పోయింది. గుదం మృత్యువుతోకూడి అపానేంద్రియాన్ని చేరి నిరర్థకమైంది. విష్ణుదేవతాకములైన పాదములు గతితో కూడి బలహీనములయ్యాయి. ఇంద్ర దైవతములైన చేతులు బలాన్నిపొంది కూడ శక్తిహీనములయ్యాయి. నదీ దేవతాకములైన నాడులు రక్తంతో కూడినా నిరర్థకమయ్యాయి. కడుపు సముద్రాలతో కూడి ఆకలిదప్పికలను పొందినా వ్యర్థమైంది. హృదయం మనస్సుతో చంద్రుని పొందికూడ ఊరకనే ఉంది. బుద్ధి బ్రహ్మాధిదైవతమై హృదయాన్ని పొందినా అలాగే చిత్తం అభిమానంతో రుద్రుని చెందినా ప్రయోజనం కనుపించలేదు.

ఆ సమయంలో చైతన్యవంతుడైన క్షేత్రజ్ఞుడు హృదయాన్ని అధిష్ఠానంగా చేసుకొని చిత్తంలో ప్రవేశించాడు. అప్పుడు విరాట్ పురుషుడు నీటిపై తేలుతూన్న బ్రహ్మాండాన్ని పొంది సృష్టికార్యోన్ముఖుడయ్యాడు. నిద్రిస్తూన్న పురుషుని ప్రాణాలు తమ బలంచే కదలలేని రీతిగా అగ్న్యాదులు తమకు అధిష్ఠానభూతములైన ఇంద్రియాలతో దేవాది శరీరాలు పొందినా కూడా శక్తిహీనములయ్యాయి. క్షేత్రజ్ఞుడు ప్రవేశించేసరికి ఒక్కసారి మెలకువ వచ్చినట్లు కదలటం ప్రారంభించాయి. అటువంటి విరాట్పురుషుణ్ణి అనవరత భక్తితో విరక్తులై, ఆత్మలయందు వివేకంగల మహాత్ములు ఎప్పుడూ చింతన చేస్తూ ఉంటారు. ప్రకృతి–పురుష వివేకంచేత మోక్షము, ప్రకృతి సంబంధంచేత సంసారము కలుగుతుంద" ని చెప్పి కపిల మహర్షి దేవహూతితో ఇంకా ఇట్లా అన్నాడు:

సీ. జననుత! సత్త్వరజ స్తమో గుణమయ మైన ప్రకృతికార్య మగు శరీర గతుఁడయ్యుఁ బురుషుండు గడఁగి ప్రాకృతములు నగు సుఖదుఃఖ మోహముల వలనఁ గర మనురక్తుండు గాఁడు, వికార వి హీనుఁడు ద్రిగుణ రహితుఁడు నగుచు బలసి నిర్మల జల ప్రతిబింబితుండైన దినకరుభంగి వర్తించునట్టి

తే. యాత్మ ప్రకృతి గుణంబులయందుఁ దగులు, వడి యహంకార మూఢుఁడై తొడరి యేను గడఁగి నిఖిలంబునకు నెల్ల గర్త నని ప్ర, సంగవశతను బ్రకృతి దోషములఁ బొంది.

904

తా॥ “అమ్మా! విను! సత్త్వరజస్తమో గుణాలతో నిండి ప్రకృతివల్ల ఏర్పడినటువంటి శరీరాన్ని పొందినప్పటికి పురుషుడు ప్రాకృతములైన సుఖదుఃఖ మోహములకు అనురక్తుడు కాకుండా వికార విహీనుడై త్రిగుణాలకు అతీతుడై ఉంటాడు. అప్పుడు నిర్మలమైన జలాల్లో ప్రతిబింబించిన దినకరుణ్ణి ఆ జలం అంటని విధంగా త్రిగుణాలు పురుషుణ్ణి అంటుకోవు. అలా కాకుండా జీవుడు ప్రాకృతిక గుణాలలో తగుల్కొని అహంకారం వల్ల మూఢుడై అన్నిటికీ నేనే కర్తనని ప్రవర్తిస్తే ప్రకృతి దోషాలు పొందుతాడు.

క. సురతిర్యఙ్మనుజ స్థా, వరరూపము లగుచుఁ గర్మవాసన చేతం బరపైన మిశ్ర యోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్.

905

తా॥ ఆ విధంగా దోషములు పొంది సుర, నర, పశు, పక్షి, వృక్షాది నానావిధ రూపాలను పొందుతూ కర్మ వాసనలచేత సంసార బంధంలో చిక్కుకుంటాడు.

క. పూని చరించుచు విషయ, ధ్యానంబునఁ జేసి స్వాప్ని కార్థాగమ సం ధానము రీతి నసత్పథ, మానసుఁ డగుచున్ భ్రమించు మతిలోలుండై.

906

తా॥ అలా చిక్కుపడి సంచరిస్తూ, విషయ సుఖాలను స్మరిస్తూ, స్వప్నంలో ఐశ్వర్యం కలిగినట్లు అందులో మునిగి తేలుతూ చంచలమైన బుద్ధితో భ్రమిస్తూ ఉంటాడు.

వ. అట్లు గావున.

907

తే. పూని మోక్షార్థి యగు వాఁడు దీనిఁ దీవ్ర, భక్తియోగంబుచేత విరక్తిఁ బొంది మనము

వశముగఁ జేసి యమ నియమాది, యోగమార్గక్రియాభ్యాసయుక్తిఁ జేసి

908

తా॥ కనుక మోక్షార్థి అయిన వాడు తీవ్రమైన భక్తియోగం చేత విరక్తిని పొంది యమ నియమాది యోగ క్రియలను అభ్యసించి మనస్సును వశం చేసుకోవాలి.

సీ. శ్రద్ధాగరిష్ఠుఁడై సత్యమైనట్టి మ, ద్భావంబు మత్పాదసేవనంబు వర్ణిత మత్కథాకర్ణనంబును సర్వ, భూత సమత్వ మజాత వైర మును బ్రహ్మచర్యంబు ఘనమౌన మాదిగాఁ, గల నిజధర్మ సంగతులఁ జేసి సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు, మననశీలుఁడు వీతమత్సరుండు

తే. నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ, కలిత విజ్ఞానియై బంధకంబు లైన ఘన శరీర పరిగ్రహోత్కంఠ యందు, నాగ్రహము సేసి వర్తింప నగును మఱియు.

909

తా॥ మోక్షార్థి అయినవాడు శ్రద్ధాగరిష్ఠుడై నిజమైన నా స్వరూప స్వభావాలను తెలుసుకొని నా పాదములను సేవించాలి. వర్ణింపబడిన నా కథలను వింటూ భూతములన్నిటియందు సమత్వాన్ని పాటిస్తూ వైరం లేకుండా ఉండాలి. బ్రహ్మచర్యం, మౌనం మొదలైన ధర్మాలను పాటిస్తూ సంతుష్టుడుగా ఉండాలి. మితంగా భుజిస్తూ, ఏకాంతంగా ఉండాలి. మనన శీలుడుగా ఉంటూ మాత్సర్యాన్ని విడిచిపెట్టాలి. మైత్రి, కరుణ – వీటిని పూర్తిగా వశం చేసుకొని ఆత్మజ్ఞాని కావాలి. శరీరం మీద, బంధువులమీద మమకారాన్ని తగ్గించుకోవాలి.

వ. జీవేశ్వర తత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తంబయిన బుద్ధి దదవసానంబునుం గలిగి దూరీభూతేతర దర్శనుండై జీవాత్మ జ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున; నాత్మనాయకుం డయిన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానం బగుచుఁ

బ్రధానకారణంబునకు, నధిష్ఠానంబును, గార్యంబునకుఁ జక్షువుంబోలెఁ బ్రకాశంబును, సమస్త కార్యకారణానుస్యూతంబును, బరిపూర్ణంబును, సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబుఁ బొందునని చెప్పి వెండియు నిట్లనియె.

910

తా॥ జీవుడు—ఈశ్వరుడు ఈ ఇద్దరి నిజ స్వరూపాన్ని తెలుసుకోవటం వల్ల బుద్ధి అంతర్ముఖమై సంకల్ప వికల్పాల క్రమం తెలిసి ఇక ఇతర పదార్థాలేవీ కన్పించవు. అప్పుడు కంటితో సూర్యుణ్ణి దర్శించిన విధంగా ఆత్మనాయకుడైన శ్రీమన్నారాయణుని దర్శనం లభించడంతో అహంకారం మిథ్యాభూతమై నశిస్తుంది. సత్యం ప్రకాశమానమై దానివల్ల మూల ప్రకృతికి అధిష్ఠానము, కన్నువలె ప్రకాశింప చేసేది, సమస్త కార్యకారణాలకు మూలమైనది, పరిపూర్ణము, సర్వాంతర్యామీ అయిన బ్రహ్మమును దర్శించ గలుగుతాడు.” ఇంత వరకూ చెప్పి కపిలుడు తిరిగి ఇట్లా అన్నాడు:

సీ. విను మాత్మ వేత్తకు విష్ణుస్వరూపంబు, నెఱుఁగంగఁబడు, నది యెట్లటన్న గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ, జలముల గృహకుడ్య జాలకముల వలనఁ దోఁచిన ప్రతిఫలితంబు చేత నూ, హింపంగఁ బడిన య య్యినుని పగిది నర్థి మనోబుద్ధ్యహంకరణత్రయ, నాడీ ప్రకాశమునను నెఱుంగ

తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతి గాఁగఁ, జిత్తమునఁ దోఁచు నంచితశ్రీ దనర్చి య మ్మహామూర్తి సర్వభూతాంత రాత్ముఁ, డగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును మఱియు.

911

తా॥ “తల్లీ! విను! ఆత్మవేత్త అయిన వానికి పరమాత్మ అయిన విష్ణుస్వరూపం తెలుస్తుంది. అది ఎట్లా అంటే ఆకాశంలో ఉండే దినకరుని కిరణాలు నీటియందు, ఇంటి కిటికీలలోను ప్రతిఫలించిన కారణంగా మనం సూర్యుణ్ణి ఊహిస్తాము. అలాగే మనస్సు, బుద్ధి, అహంకారము ఈ మూడింటిలోను వెలుగొందే ప్రకాశం ద్వారా పరమాత్మ స్వరూపాన్ని

ఊహింపవచ్చు. ఆ మహామూర్తి సర్వభూతములయందు అంతరాత్మ స్వరూపంగా ఉన్నాడనే విషయం ఆత్మజ్ఞులైన వారికి తెలుస్తుంది.

వ. జీవుండు సుషుప్త్యాద్యవస్థలయందుఁ బరమాత్మానుషక్తుండైన భూతాది తత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకారణంబులై యున్న సుషుప్తి సమయంబునం దాను నిస్తంద్రుం డగుచు నితరంబుచేతఁ గప్పం బడని వాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె.

912

తా॥ జీవుడు సుషుప్తిలో పరమాత్మతో సంబంధాన్ని పొంది ఉంటాడు. ఆ సమయంలో వానిలోని పంచ భూతాలు ఇత్యాది తత్త్వాలు ప్రకృతిలో లీనమై, వాసనా మాత్రంగా ఉంటూ ఏ పనీ చెయ్యలేని స్థితిలో ఉంటాయి. అట్టి గాఢమైన సుషుప్తి సమయంలో ఆత్మజ్ఞుడైన వాడు ఎటువంటి అవరోధము లేకుండా పరమాత్మానుభవాన్ని పొందుతూ ఉంటాడు" అని చెప్పగా విని దేవహూతి ఇట్లా అన్నది:

సీ. విమలాత్మ! యీ పృథివికిని గంధమునకు, సలిలంబునకును రసంబునకును నన్యోన్య మగు నవినాభావ సంబంధ, మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును సతతంబు నన్యోన్యసంబంధమై యుండు, ప్రకృతి దా నయ్యాత్మఁ బాయు టెట్లు? దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత, భవభయంబుల నెల్లఁ బాయు టెట్లు?

తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది?, యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ గరుణ రక్షింపవే! దేవగణ సుసేవ్య!, భక్తలోకానుగంతవ్య! పరమపురుష!

913

తా॥ "విమలాత్మా! పంచభూతాలలోను పృథివికి—గంధానికి; జలానికి—రసానికి ఇలా అవినాభావ సంబంధం ఎట్లా ఉందో అలాగే ప్రకృతికి—ఆత్మకు ఎప్పుడూ అన్యోన్య సంబంధం

ఉంటుంది కదా! అలాంటప్పుడు ప్రకృతి తాను ఆ ఆత్మను ఎలా విడిచిపెడుతుంది? ఆలోచిస్తే ఒక్కసారి తత్త్వబోధ చేసినంత మాత్రాన ఈ సంసార భయాలు ఎలా తొలగిపోతాయి? మరణించిన వాడు తిరిగి జన్మించకుండా ఉండే ఉపాయం ఏది? ఈ విషయాలన్ని నాకు తెలిసేటట్లు చెప్పు! ఓ దేవదేవా! భక్తజన శరణ్యా! పరమ పురుషా! ఈ జ్ఞానాన్ని నాకు ప్రసాదించి నన్ను రక్షించు.''

వ. అనిన భగవంతుం డిట్లనియె. అనిమిత్తం బయిన స్వధర్మంబునను నిర్మలాంతఃకరణంబునను సునిశ్చితంబైన మద్భక్తి యోగంబునను సత్కథా శ్రవణ సంపాదితంబైన వైరాగ్యంబునను దృష్టప్రకృతి పురుషయాథాత్మ్యంబగు జ్ఞానంబునను బలిష్ఠంబయి కామానభిష్వంగంబగు విరక్తివలనఁ దపోయుక్తంబయిన యోగంబునను సుతీవ్రంబయిన చిత్తైకాగ్రతం జేసి పురుషుని దగుప్రకృతి దందహ్యమానంబై తిరోధానంబును బొందు, నదియునుంగాక యరణిగతంబైన వహ్నిచే నరణి దహింపఁబడు చందంబున, జ్ఞానంబునం దత్త్వ దర్శనంబునంజేసి నిరంతరంబు బలవంతంబును దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడువంబడు నని చెప్పి.

914

తా॥ అప్పుడు భగవంతుడైన కపిలుడు ఇట్లా అన్నాడు: “సాధనలో ఉన్న పురుషుడు నిమిత్తం లేకుండ స్వధర్మాన్ని అనుష్ఠించాలి. నిర్మలమైన అంతఃకరణ కలిగి ఉండాలి. నాయందు తిరుగులేని భక్తి కలిగి ఉండాలి. మంచి పుణ్యకథలను వినటం వలన తీవ్రమైన వైరాగ్యాన్ని పొంది ఉండాలి. ప్రకృతి—పురుషుడు... ఈ ఇద్దరికి సంబంధించిన యథార్థ జ్ఞానాన్ని అవగతం చేసుకోవాలి. కామాన్ని ఎట్టి పరిస్థితులలోను దగ్గరికి రానివ్వకూడదు. తపస్సుతో కూడి యోగాభ్యాసం చెయ్యాలి. తీవ్రమైన ఏకాగ్రతను చిత్తంలో కలిగి ఉండాలి. అప్పుడు ప్రకృతి దందహ్యమానమై నశిస్తుంది. అరణి నుండి పుట్టిన అగ్ని అరణిని దహించినట్లు జ్ఞానంవల్ల కలిగిన తత్త్వదర్శనం చేత బలిష్ఠము, దోషయుతము అయిన ప్రకృతిని జీవుడు విడిచి పెట్టేస్తాడు.

క. విను ప్రకృతి నైజమహిమం, బునఁ దనలో నున్నయట్టి పురుషునకు మహే శునకు నశుభ విస్ఫురణం, బనయముఁ గావింపఁజాల, దది యెట్లనినన్:

915

తా॥ ప్రకృతి సహజంగానే తనలో ఉన్న పురుషునికి అశుభాన్ని కలగచెయ్యనేరదు.

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థకముల్ ప్రబోధమం దరయఁగ మిథ్యలై పురుషునందు ఘటింపని కైవడిం, బరే శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం బరువడిఁ బొందవెన్నఁటికిఁ బ్రాకృతదోషము లంగనామణీ!

916

తా॥ పురుషుడు నిద్రపోయినప్పుడు వచ్చే కలలలో పొందిన ఎన్నో అనర్థాలు మళ్ళీ తెలివి రాగానే మిథ్యలై పోతాయి. అదే విధంగా ఆత్మనాథుడు, సర్వశరీరి, కర్మసాక్షి అయిన పరమేశ్వరునకు ప్రకృతి దోషాలు ఎప్పటికీ అంటవమ్మా!"

వ. అని వెండియు నిట్లనియె:

917

సీ. అధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జ, న్మంబులఁ బెక్కు కాలంబులందు బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టు, సర్వార్థ వైరాగ్యశాలి యగుచుఁ బూని నా భక్తులచే నుపదేశింపఁ, బడిన విజ్ఞానసంపత్తి చేతఁ బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి, మత్ప్రసాదప్రాప్తిమతిఁ దనర్చు

తే. నిజ పరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల సంశ, యుండు, నిర్ముక్తలింగదేహుండు నగుచు ననఘ! యోగీంద్రహృద్గేయ మగు మదీయ, దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు.

918

తా॥ కపిల మహర్షి తిరిగి ఇట్లా అన్నాడు: "పుణ్యాత్మురాలా! అధ్యాత్మ తత్పరుడైనవాడు బ్రహ్మపదం ప్రాప్తించే వరకు వైరాగ్యశాలియై ఎన్ని జన్మలైనా పుడుతూనే ఉంటాడు. నా భక్తులచే ఉపదేశింపబడిన విజ్ఞాన సంపత్తి చేత ప్రబుద్ధుడై తన సందేహాలన్నింటినీ నివృత్తి చేసుకుంటాడు. ఈ లింగ దేహాన్ని విడిచిపెట్టి యోగీంద్రులు తమ హృదయాలలో సంభావించే నా దివ్యధామాన్ని చేరుకుంటాడు.

వ. మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు, కావున వాని యందు విగత సంగుండును మదీయచరణ సరోజస్థిత లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవత నపహసించి మోక్షంబు నొందు నని చెప్పి వెండియు యోగలక్షణ ప్రకారంబు వినిపింతు విను మని భగవంతుం డైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె.

919

తా॥ మరొక్క విషయం! అణిమాది అష్టైశ్వర్యాలు మోక్షానికి అంతరాయాలు. కావున, వాటిమీద ఆసక్తిని విడిచి నా చరణసరోజాలను అంతరంగంలో దృఢంగా నిలుపుకున్నవాడు మృత్యువును తిరస్కరించి మోక్షాన్ని పొందుతాడు. ఇంకా నీకు యోగలక్షణాలను వినిపిస్తాను వినమ" ని కపిలమహర్షి తన తల్లితో ఇట్లా అన్నాడు:

క. ధీనిధులై యే యోగ వి, ధానంబునఁ జేసి మనము దగ విమలంబై మానిత మగు మత్పదముం, బూనుదు, రా యోగ ధర్మముల నెఱిఁగింతున్.

920

తా॥ "అపారమైన బుద్ధిమంతులై ఏ యోగవిధానం చేత తమ మనస్సును స్వచ్ఛం చేసుకొని మాననీయమైన నా లోకాన్ని చేరుకుంటారో ఆ యోగధర్మాలను నీకు ఎరిగిస్తాను విను.

వ. అది యెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబును, శాస్త్రవినిషిద్ధధర్మ కర్మంబులు మానుటయు, దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయు, మహాభాగవత

శ్రీపాదార్చనంబును, గ్రామ్యధర్మ నివృత్తియు, మోక్షధర్మంబులయందు రతియు, మితంబై శుద్ధంబయిన యాహారసేవయు, విజనంబయి నిర్బాధకం బయిన స్థానంబున నుండుటయు, హింసారాహిత్యంబును, సత్యంబును, నస్తేయంబును దన కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు, బ్రహ్మచర్యంబును, దపశ్శౌచంబులును, స్వాధ్యాయపఠనంబును, పరమపురుషుండైన సర్వేశ్వరుని యర్చనంబును, మౌనంబును, ఆసనజయంబును, దానంజేసి స్థైర్యంబును, ప్రాణవాయు స్వవశీకరణంబును, ఇంద్రియ నిగ్రహరూపం బైన ప్రత్యాహారంబును, మనంబుచే నింద్రియంబుల విషయంబుల వలన మరలించి హృదయమందు నిలుపుటయు, దేహగతంబైన మూలాధారాది స్థానంబులలో నొక్క స్థానంబునందు హృదయగతంబయిన మనస్సుతోడంగూడఁ బ్రాణధారణంబును, వైకుంఠుం డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలా చరిత్ర ధ్యానంబును, మానసైకాగ్రీకరణంబును, బరమాత్మ యగు పద్మనాభుని సమానాకారతయును నివియునుం గాక తక్కిన వ్రతదానాదులం జేసి, మనోదుష్టం బయిన యసన్మార్గంబును బరిహరించి, జితప్రాణుండై మెల్లన యోజించి, శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై, యభ్యస్తకుశాజిన చేలోత్తరాసనంబైన యాసనంబు సేసి, ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు సేసి, కుంభక పూరకంబులచేతం బ్రతికూలంబు గావించి, చంచలం బయిన చిత్తంబు సుస్థిరంబు గావించి, తీవ్రంబయిన యమంబునం బ్రతప్తంబయి విగత సమస్త దోషం బగు చామీకరంబు కరణి విరజంబు సేసి జితమారుతుం డగు యోగి క్రమ్మఱం బ్రాణాయామం బను పావకునిచేత వాతపిత్తశ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబు సేసి ధారణంబుచేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను దహనంబుసేసి, ధ్యానంబుచేత రాగంబుల సత్త్వాది గుణంబులను నివారించి, స్వనాసాగ్రావలోకనంబు సేయుచు.

921

తా॥ అది ఎలాగంటే... స్వధర్మాన్ని ఆచరించటం, శాస్త్రాలలో నిషేధింపబడిన కర్మలు

మానివేయటం, దైవికంగా వచ్చిన ధనంతో సంతోషించటం, మహాభాగవతుల పాదాలను అర్చించటం, చెయ్యకూడని పనులు చెయ్యక పోవటం, మోక్షధర్మముల మీద ఆసక్తి కలిగి ఉండటం, పరిశుభ్రమైన ఆహారాన్ని మితంగా తీసుకోవటం, ఏ బాధలేని ఏకాంత స్థానంలో ఉండటం, హింస లేకుండ ఉండటం, ఎప్పుడూ సత్యాన్నే పలకటం, ఇతరుల వస్తువులు దొంగిలించకుండా ఉండటం, అవసరమైన మేరకు ధనాన్ని తీసుకోవటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, తపశ్శౌచాలు కలిగి ఉండటం, సద్గ్రంథములు చదవటం, ఈశ్వరుణ్ణి అర్చించటం, మౌనంగా ఉండటం, ఎక్కువసేపు ఈశ్వరుణ్ణి ధ్యానిస్తూ కూర్చోవటం, స్థిరత్వాన్ని కలిగి ఉండటం, ప్రాణవాయువును వశీకరించుకోవటం, ఇంద్రియ నిగ్రహాన్ని కలిగి ఉండటం, ఇంద్రియాలను విషయాల మీదకు వెళ్ళనీయకుండా ఏకాగ్రతను సాధించటం, మూలాధారాది షట్చక్రాలలోను ఏదో ఒక స్థానంలో మనస్సును నిలిపి ప్రాణధారణ చెయ్యటం, వైకుంఠంలో ఉండే సర్వేశ్వరుని దివ్యలీలలను ధ్యానించటం, ఏకాగ్రతను సాధించడం, పరమాత్మ అయిన పద్మనాభుడు సర్వాంతర్యామి అనే నమ్మకాన్ని అత్యంత దృఢంగా కలిగి ఉండటం... ఇత్యాదులు యోగధర్మాలు.

ఇంతేకాకుండా వ్రత దానాదులు చెయ్యాలి. చెడు మార్గాలను విడిచి పెట్టాలి. దర్భాసనం మీద ఒక జింక చర్మాన్ని దానిమీద వస్త్రాన్ని పరిచి దానిని ఆసనంగా చేసుకొని ఋజువుగా శరీరాన్ని నిలిపి, కుంభక రేచక పూరకముల చేత కోశాలను శుద్ధి చేసుకోవాలి. పిమ్మట చంచలమైన చిత్తాన్ని సుస్థిరం చేసుకొని తీవ్రమైన సాధనతో అగ్నిసంస్కారం చేత సమస్త దోషాలు పోయిన బంగారంలాగా మనస్సును మాలిన్యరహితంగా చేసుకోవాలి. ఇట్టి యోగికి ప్రాణాయామం అనే అగ్నిచేత వాతపిత్త శ్లేష్మాలనే దోషాలు భస్మమై పోతాయి. ఏకాగ్రత వల్ల పాపాలు, విషయముల వైపు వెళ్ళకుండా ఇంద్రియములను మరలించుకోవటం వల్ల చెడు సంసర్గాలు దహింపబడతాయి. అట్టి యోగి ధ్యానం చేత రాగద్వేషాలకు, త్రిగుణాలకు అతీతుడై తన ముక్కు చివర దృష్టిని ఏకాగ్రతతో నిలపాలి.

సీ. దళదరవింద సుందర పత్ర రుచిరాక్షు, సలలిత శ్రీవత్స కలిత వక్షు నీలనీరదనీల నీలోత్పల శ్యాము, నలికులాకులమాలికాభిరాముఁ గౌస్తుభరుచిర ముక్తాహార యుతకంఠు, యోగిమానస పంకజోపకంఠు సతత ప్రసన్న సస్మిత వదనాంభోజు, దినకర కోటిసందీప్త తేజు

తే. సలలితానర్ఘ రత్నకుండల కిరీట, హార కంకణ కటక కేయూర ముద్రి కా తులాకోటిభూషు, భక్తప్రపోషుఁ, గింకిణీయుత మేఖలాకీర్ణజఘను.

922

తా॥ అలా నిలిపి... వికసిస్తూన్న అరవిందముల వంటి సుందరమైన నేత్రయుగ్మము కలవాడు, లలితమైన శ్రీవత్సమనే పుట్టుమచ్చగల వక్షస్థలం కలవాడు, నల్లని మేఘంలా నల్లకలువలా శ్యామల వర్ణం కలవాడు, భ్రమరాలకు విందుచేసే మాలికతో ముచ్చటైన వాడు, కౌస్తుభ మణితో కూడిన ముత్యాల హారాన్ని కంఠమందు ధరించినవాడు, యోగుల మానస కమలాలకు చేరువైనవాడు, ఎల్లప్పుడూ చిరునవ్వులు చిందించే ప్రసన్నమైన ముఖం కలవాడు, కోటిమంది దినకరుల కాంతితో వెలుగొందేవాడు, అనర్ఘ రత్నకుండలాలు, కిరీటము, హారములు, కంకణములు, కటకములు, కేయూరములు, ఉంగరములు, అందెలు మొదలైన భూషణములతో విరాజిల్లేవాడు, చిన్ని మువ్వలతో కూడిన మొలనూలు కలవాడు, భక్తులను చల్లగా చూసేవాడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి మనస్సులో ధ్యానించాలి.

వ. మఱియు.

923

సీ. కంజాత కింజల్క పుంజ రంజిత పీత, కౌశేయవాసు, జగన్నివాసు శత్రుభీకర చక్ర శంఖ గదాపద్మ, విహిత చతుర్బాహు విగతమోహు నుత భక్త లోక మనోనేత్ర వర్ధిష్ణు, లాలిత సద్గుణాలంకరిష్ణు వరకుమారక వయః పరిపాకు, సుశ్లోకు, సుందరాకారు, యశోవిహారు

తే. సకలలోక నమస్కృత చరణ కమలు, భక్తలోక పరిగ్రహ ప్రకట శీలు దర్శనీయ మనోరథ

దాయిఁ, గీర్త, నీయ తీర్థయశో మహనీయమూర్తి.

924

తా॥ పద్మకేసర వర్ణంతో మెరిసే పసుపు వచ్చని పట్టువస్త్రంతో వెలుగొందేవాడు, ఈ జగత్తు నివాసంగా కలవాడు, శత్రువులకు భయం కలిగించే నాలుగు చేతులలోను శంఖచక్రగదాపద్మాలను ధరించిన వాడు, మోహాన్ని పోగొట్టేవాడు, తనను నుతించే భక్తులకు మనోనేత్రాన్ని అనుగ్రహించేవాడు, సద్గుణాలనే అలంకారములను గ్రహించేవాడు, ఎప్పుడూ కౌమార స్థితిలో ఉండేవాడు, సుశ్లోకుడు, సుందరాకారుడు, యశస్సు చేత విహరించేవాడు, సకల లోకాలు నమస్కరించే చరణ కమలాలు కలవాడు, భక్తులను పరిగ్రహించే స్వభావం కలవాడు, అందరి మనస్సులలోను ఉండే కోర్కెలను తీర్చేవాడు, పొగడ తగిన యశస్సుతో విరాజిల్లేవాడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి ధ్యానించాలి.

వ. వెండియు.

925

క. అనుపమ గుణ సంపూర్ణుని, ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా నుని భర్తహృద్గుహాశయ, నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్.

926

తా॥ ఇంకా ఆ భగవంతుడిని సంపూర్ణమైన మేటి గుణములు కలవానినిగా, పాప రహితునిగా, స్థిరునిగా, అంతటా ఉన్న వానిలా, కూర్చున్న వానిలా, సుఖంగా పడుకున్న వానిలా, అందరి హృదయ గుహలలోను ఉన్నవానిగా, సర్వేశ్వరునిగా, అనంతునిగా, పొగడ తగిన సచ్చరిత్ర కలవానిగా భావించాలి.

మ.విమలం బై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వ ప్రబో ధ మతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబు గావించి చి త్తము సర్వాంగ విమర్శన క్రియలకుం దార్కొల్పి ప్రత్యంగమున్

సుమహాధ్యానము సేయఁగా వలయుఁబో శుద్ధాంతరంగంబునన్.

927

తా॥ ఈ విధంగా స్వచ్ఛమై, పరిశుద్ధమైన మనస్సుతో, తత్త్వప్రబోధాన్ని బుద్ధియందు నిలిపి, ఆ దివ్యమంగళ మూర్తి యొక్క వైభవాన్ని ధ్యానించి, మనస్సు చేత అన్ని అంగాలను చక్కగా విమర్శన పూర్వకంగా చూస్తూ, భగవంతుని ప్రతి అంగాన్ని పరిశుద్ధమైన అంతరంగంలో మహాధ్యానం చేయాలి.

వ. అది యెట్టి దనిన.

928

సీ. హల కులి శాంకుశ జలజ ధ్వజ చ్ఛత్ర, లాలిత లక్షణ లక్షితములు సలలిత నఖ చంద్ర చంద్రికా నిర్ధూత, భక్త మానస తమః పటలములును సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగా తీర్థ, మండిత హర జటా మండలములు సంచిత ధ్యాన పారాయణ జన భూరి, కలుష పర్వత దీప్త కులిశములును తే. దాసలోక మనోరథ దాయకములుఁ, జారు యోగి మనః పద్మ షట్పదములు ననఁగఁ దనరిన హరిచరణాబ్జములను, నిరుపమ ధ్యానమున మది నిలుపవలయు.

929

తా॥ అది ఎలా అంటే హలం, వజ్రం, అంకుశం, పద్మం, ధ్వజం, ఛత్రం ఇత్యాది లక్షణముల చేత ఒప్పేవి, మనోహరమైన నఖచంద్ర చంద్రికల చేత భక్తుల మనస్సులలోని చీకట్లను చీల్చేవి, అందమైన కాలి బొటన వ్రేలి నుండి బయల్వెడలిన గంగా నదీ జలాలచే ఈశ్వరుని జటా మండలాన్ని అలంకరించేవి, ధ్యాన పారాయణం చేసే జనుల యొక్క పాపాలనే పర్వతాలను వజ్రాయుధంలా పెల్లగించేవి, దాసుల యొక్క మనోరథాలను తీర్చేవి, యోగుల మనః పద్మాలలో విహరించే భ్రమరముల వంటివి అయిన హరి పాదకమలాలను ఎల్లప్పుడూ హృదయంలో నిలుపుకోవాలి.

చ. కమలజు మాతయై సురనికాయ సమంచిత సేవ్యమానయై కమలదళాభ నేత్రములు గల్గి హృదీశ్వరభక్తి నొప్పు న క్కమల నిజాంక పీఠమునఁ గై కొని యొత్తు పరేశు జాను యుగ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁ దగున్.

930

తా॥ బ్రహ్మదేవునికి తల్లియై, అమరులందరికీ ఆరాధ్యురాలై, పద్మ పత్రముల వంటి నేత్రములు కలిగి ఉన్న లక్ష్మీదేవి తన హృదయేశ్వరుడైన నారాయణుని పాదకమలాలను తన అంకపీఠం మీదకు చేర్చుకుని ఎంతో భక్తితో ఒత్తుతూ ఉన్న మనోహర దృశ్యాన్ని మనస్సులో మననం చేసుకొని ఆరాధించాలి.

ఉ. చారు విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమాన సు శ్రీ రుచి నుల్లసిల్లి యతసీ కుసుమద్యుతిఁ జాల నొప్పు పం కేరుహనాభు నూరువు లకిల్బిషభక్తి భజించి మానసాం భోరుహమందు నిల్పఁ దగుఁ బో మునికోటికి నంగనామణీ!

931

తా॥ అమ్మా! అందమైన విహంగ వల్లభుడైన గరుత్మంతుని భుజములమీద విరాజిల్లుతూన్న కాంతి సంపదలతో ఉల్లసిల్లుతూ, వికసించిన దిరిశెన పువ్వు వంటి కాంతితో ప్రకాశించే శ్రీహరి యొక్క మనోహరమైన ఊరువులను గొప్ప భక్తితో భావన చేస్తూ ముని సమూహం తమ మనస్సులలో నిలుపుకోవాలి.

క. పరిలంబితమృదుపీతాం, బర కాంచీగుణనినాదభరితం బగు న ప్పురుషోత్తముని నితంబముఁ, దరుణీ! భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్.

932

తా॥ ఒయ్యారంగా మృదువైన పీతాంబరాన్ని ధరించి, మొలనూలు మువ్వల సవ్వడితో అతిశయించే కమలాక్షుని కటి ప్రదేశాన్ని ప్రీతితో భజించాలి.

క. విను భువనాధారత్వం, బునఁ దగి, విధి జనన హేతుభూతంబగు న వ్వనజాతముచేఁ గడు మిం, చిన హరినాభీ సరస్సుఁ జింతింపఁ దగున్.

933

తా॥ సమస్త భువనములకు ఆధారమై విధి పుట్టుకకు కారణభూతమైన పద్మంతో విరాజిల్లే సరస్సు వంటి శ్రీహరి నాభీమండలాన్ని స్మరించాలి.

తే. దివ్య మరకతరత్న సందీప్త లలిత, కుచములను మౌక్తికావళి రుచులఁ దనరి యిందిరాదేవి సదనమై యెసకమెసఁగు, వక్ష మాత్మను దలపోయ వలయుఁజుమ్ము,

934

తా॥ దివ్యమైన మరకత రత్నకాంతులతో వెలిగిపోతూ లలితమైన కుచముల మీద ముత్యాల కాంతులు విరాజిల్లుతూ ఉండగా ఇందిరాదేవి నివాస స్థానమైన శ్రీహరి యొక్క వక్షస్థలాన్ని ఆత్మలో భావించాలి.

మ. నిరతంబున్ భజియించు సజ్జన మనో నేత్రాభిరామైక సు స్థిర దివ్యప్రభ గల్గు కౌస్తుభ రుచిశ్లిష్టంబునై యొప్పు నా వర యోగీశ్వర వంద్య మానుఁడగు సర్వస్వామి లక్ష్మీశు కం ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబు సేయం దగున్.

935

తా॥ ఎల్లప్పుడూ భజియిస్తూ ఉండే సజ్జనుల మనోనేత్రాలకు మనోజ్ఞము, సుస్థిరము, దివ్యము అయిన కాంతులు కలిగిన కౌస్తుభ రుచులతో ఒప్పు యోగీంద్ర వంద్యమానుడు, లక్ష్మీనాథుడు, సర్వాంతర్యామి అయిన ఆ స్వామి కంఠాన్ని మనస్సులో చింతిస్తూ గుణగణాలను ధ్యానం చెయ్యాలి.

క. ఘన మందర గిరి పరివ, ర్తన నికషోజ్జ్వలిత కనక రత్నాంగదముల్ దనరార

లోకపాలకు, లను గలిగిన బాహు శాఖలను దలఁపఁదగున్.

936

తా॥ పాల సముద్రాన్ని మథించేటప్పుడు తిరుగుతూన్న మందర పర్వతం రాపిడికి మెరిసే రత్నములతో కూడిన బంగారు భుజకీర్తులతో లోకపాలకులను కలిగిన విష్ణువు యొక్క బాహువులను స్మరించాలి.

వ. మఱియు విమత జనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును, సరసిజోదర కరసరోరుహంబందు రాజహంస రుచిరంబయిన పాంచజన్యంబును, నరాతిభట శోణిత కర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణి యగు కౌమోదకియును, బంధురసుగంధ గంధానుబంధ మంథర గంధవహాహూయమాన పుష్పంధయ ఝంకారనాద విరాజితంబైన వైజయంతీ వనమాలికయును, జీవ తత్త్వంబైన కౌస్తుభ మణియును, బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు, వెండియు భక్త సంరక్షణార్థం బంగీకరించు దివ్య మంగళ విగ్రహంబున కనురూపంబును మకరకుండల మణి నిచయమండిత ముకురోపమాన నిర్మల గండ మండలంబును, సంతత శ్రీనివాసంబు లయిన లోచన పంకజంబులును గలిగి లాలితభ్రూలతాజుష్టంబును, మధుకర సమాన రుచి చికుర విరాజితంబును నైన ముఖకమలంబును ధ్యానంబు గావింపవలయు, మఱియు శరణాగతుల కభయ ప్రదంబు లగుచు నెగడు పాణిపంకేరుహంబుల మనంబునఁ దలఁప వలయు.

937

తా॥ శత్రుజనానికి సహింపరాని వేయి అంచుల సుదర్శనాన్ని, జనార్దనుని కరపద్మమునందు రాజహంసలా వెలుగొందే పాంచజన్యాన్ని, శత్రువుల రక్తపు మరకలతో కూడి హరికి ప్రీతికారిణి యగు కౌమోదకిని, ఒప్పిదమైన సుగంధంతో కూడిన మంద వాయువు పిలుపు అందుకొని ఝంకారం చేసే భ్రమరాలతో కూడిన వైజయంతీ వనమాలికను,

జీవతత్త్వమైన కౌస్తుభమణిని ప్రత్యేకంగా ధ్యానించాలి.

భక్తులను రక్షించే వైకుంఠుని దివ్యమంగళ విగ్రహానికి అనురూపమై మకర కుండలాల మణికాంతులు వెలుగొందే అందమైన చెక్కుటద్దములతో, ఎల్లప్పుడు లక్ష్మీనివాస స్థానమైన పద్మనేత్రములతో, లలితమైన కనుబొమ్మలతో, తుమ్మెదలను పోలిన నల్లని ముంగురులతో కూడిన శ్రీహరి ముఖకమలాన్ని ధ్యానం చెయ్యాలి. శరణాగతులైన వారికి అభయాన్నిచ్చే కమలాక్షుని కరకమలాలను మనస్సులో భావన చెయ్యాలి.

క. గురుఘోరరూపకం బై, పరఁగెడు తాపత్రయం బుపశమింపఁగ శ్రీ హరిచేత నిసృష్టము లగు, కరుణాలోకములఁ దలఁపఁగాఁ దగు బుద్ధిన్.

938

తా॥ మహా భయంకరమైన ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆదిభౌతికమనబడు తాపముల మూడింటిని శాంతింపచేయడానికి కమలాక్షుని కరుణావీక్షణాలను ఎల్లప్పుడూ మనస్సునందు స్మరించాలి.

క. ఘనరుచి గల మందస్మిత, మున కనుగుణ మగు ప్రసాదమును జిత్తమున న్ననిచియు ధ్యానము సేయం, జను యోగిజనాళి కెపుడు సౌజన్యనిధీ!

939

తా॥ సౌజన్యనిధీ! జననీ! మిక్కిలి ప్రకాశవంతమైన మాధవుని చిరునవ్వుకు అనుగుణమైన ప్రసన్నతను చిత్తములో ఉంచుకొని యోగులు ఎప్పుడూ ధ్యానం చెయ్యాలి.

తే. పూని నతశిరు లైనట్టి భూజనముల, శోక బాష్పాంబుజలధి సంశోషకంబు నత్యుదారతమము హరి హాస మెపుడుఁ, దలఁపఁగావలె నాత్మలోఁ దవిలి వినుము.

940

తా ॥ తలలు వంచి నమస్కరించే భక్తజనముల యొక్క దుఃఖభాష్పసాగరాన్ని ఎండింపజేసి, వారి కోరికలను తీర్చే దామోదరుని చిరునవ్వును మదిలో ఎప్పుడూ తలచుకోవాలి.

సీ. మునులకు మకరకేతనునకు మోహనం, బైన స్వకీయమాయా విలాస మున రచితంబైన భ్రూమండలంబును, ముని మనఃకుహర సమ్మోద మానుఁ డగు నీశ్వరుని మందహాసంబు నవపల్ల, వాధరకాంతిచే నరుణమైన మొల్లమొగ్గల కాంతి నుల్లసం బాడెడు, దంత పంక్తిని మదిఁ దలఁపవలయు

తే. వెలయ నీ రీతి నన్నియు వేఱు వేఱ, సంచితధ్యాన నిర్మల స్థానములుగ మనములోఁ గనుమని చెప్పి మఱియుఁ బలికె, దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ.

941

తా॥ మహామునులకేకాక మన్మథునికి కూడ మోహనమైన హరి యొక్క మాయా విలాసం చేత విరచితమైన భూమండలాన్ని, మునుల అంతరంగాలకు ముదము కలిగించే ఈశ్వరుని మందహాసాన్ని, క్రొత్త చిగురు వంటి ఎర్రని పెదవులను, మొల్ల మొగ్గల కాంతిని వేళాకోళం చేసే దంతపంక్తిని తలపోయాలి. ఈ విధంగా అన్ని అవయవాలను వేరు వేరుగా నిర్మల స్థానాలుగా మనస్సులో కనవలసిందని దేవహూతికి కపిలుడు చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

సీ. ఈ ప్రకారమున సర్వేశ్వరునందును, బ్రతిలబ్ధ భావసంపన్నుఁ డగుచుఁ జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన, యతి మోదమునఁ బులకితశరీరుఁ డగుచు మహోత్కంఠ, నానంద బాష్పముల్, జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి భగవత్స్వరూపమై భవగుణగ్రాహక, మగుచు మత్సంబంధ మనుకరించి

తే. సుమహిత ధ్యానమునఁ బరంజ్యోతి యందు, మనముఁ జాల నియోగించి మహిమఁ దనరు మోక్షపద మాత్మలోన నపేక్షసేయు, ననఘవర్తనుఁడైన మహాత్ముఁడెపుడు.

942

తా॥ 'పాపరహితుడైన మహాత్ముడు ఈ ప్రకారంగా ఈశ్వరునియందు మనస్సును నిలిపి అనన్య భక్తితో మిక్కిలి సంతోషంతో పులకిత శరీరుడై ఎంతో ఉత్సుకతతో ఆనంద భాష్పాలు పొంగి పొరలగా సంతోషసాగరంలో మునిగి తేలుతూ ఉంటాడు. లౌకిక విషయాలనుండి దూరమై నాతో సంబంధాన్ని పెంచుకుని గొప్ప ధ్యానంతో పరంజ్యోతియందు మనస్సును నిలిపి మోక్షాన్ని ఆత్మలో అపేక్షిస్తాడు.

వ. అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముఁడగు వాని చిత్తంబు విముక్తంబైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతరశూన్యంబై విరక్తిం బొందుటంజేసి పురుషుండు శరీర భావంబుల ననన్యభావంబగు నిర్వాణపదంబు సూక్ష్మంబగు తేజంబు దనకంటె నధికంబగు తేజంబుతోడి సమానాకారంబగు చందంబున నిచ్చగించు వెండియు. 943

తా॥ కనుక ముక్తిని కోరుకునే మహాత్ముడైన వాని చిత్తము బంధముల నుండి విముక్తమవుతుంది. ఆ స్థితిలో భగవద్వ్యతిరిక్తమైన దానికి అవకాశం లేదు, అన్యమూ లేదు. ఈ విధమైన విరక్తిని పొందిన కారణంగా పురుషునకు అనన్యస్థితి అనే నిర్వాణ పదం లభిస్తుంది. సూక్ష్మమైన తేజస్సు తనకంటే అధికమైన తేజస్సుతో కలిసి సమానాకారాన్ని పొందిన విధంగా ఉంటుంది ఆ అనన్యస్థితి అనే నిర్వాణపదం.

సీ. పురుషుండు చరమమై భువి నన్యవిషయ ని, వృత్తమై తగ నివర్తించు చిత్త వృత్త్యాదులను గల్గి వెలయంగ నాత్మీయ, మగు మహిమ సునిష్ఠుండై లభించు సుఖదుఃఖముల మనస్సునఁ దలంపక యహం, కార ధర్మంబులుగాఁ దలంచి యనయంబు సాక్షాత్కృతాత్మ తత్త్వము గల్గు, నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు

తే. లతఁడు నే చందమున నుండు ననిన వినుము, తన శరీరంబు నిలుచుటయును జరించు టయును గూర్చుండుటయు నిఁకేమియు నెఱుంగ, కర్థి వర్తించు విను తల్లి, యతఁడు, మఱియు.

944

తా॥ తల్లీ! విను! ఏ పురుషుడు చరమ స్థితిని భావిస్తూ ఇతర విషయాలనుండి మరలింపబడిన చిత్తంతో ఆత్మీయమైన మహిమ చేత సుఖదుఃఖాలను మనస్సులో తలవక వాటిని అహంకార ధర్మాలని తలుస్తాడో ఆ పురుషునికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. ధీరులు అట్టి వానిని "జీవన్ముక్తుడు" అంటారు. అట్టివాడు తన శరీరం నిలుచుండటం, కూర్చుండటం, తిరగటం... ఏమీ తెలియకుండా ఉంటాడు.

వ. మదిరాపానంబునం జేసి మత్తుం డగువాఁడు దనకుఁ బరిధానంబగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ దన శరీరంబు దైవాధీనంబని, నశ్వరంబని, తలంచి యాత్మతత్త్వ నిష్ఠుండై యుపేక్షించు, నదియునుంగాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మ తత్త్వంబు గలవాఁడయి స్వాప్నిక శరీరంబు చందంబున యావత్కర్మ ఫలానుభవ పర్యంతంబు పుత్రదార సమేతం బగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాది సంబంధంబు వలనం బాసి వర్తించు.

945

తా॥ మద్యపానం చేత మత్తుడైన వాడు శరీరం పైన వేసుకొన్న బట్టను మరచి వర్తించిన విధంగా జీవన్ముక్తుడైన వాడు తన శరీరం దైవాధీనమని, శాశ్వతం కానిదని ఎరిగి ఆత్మ తత్త్వాన్ని తెలుసుకున్నవాడై ఉపేక్ష చేస్తాడు. అంతేకాకుండా సమాధి యోగం చేత ఆత్మ తత్త్వాన్ని సాక్షాత్కరింప చేసుకొని కర్మఫలాన్ని అనుభవింప వలసినంత పర్యంతం భార్యాపుత్రాదులతో కూడిన ఈ ప్రపంచాన్ని స్వప్నంలోలాగ అనుభవిస్తాడు. ఆపైన స్వప్నం నుండి జాగరూకుడైన వానివలె అన్ని సంబంధాలు వదులుకుంటాడు.

సీ. సుతదార మిత్రానుజుల కంటె మర్త్యుండు, భిన్నుఁడై వర్తించుచున్నరీతి విస్ఫులింగోల్మక విపుల ధూమములచే, హవ్యవాహనుఁడు వేఱయిన రీతి వలనొప్ప దేహంబువలన నీ

జీవాత్మ, పరికింప భిన్నరూపమున నుండుఁ దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల, భాసిల్లుచున్న యా ప్రకృతిరూప

తే. బ్రహ్మమున కాత్మ దాఁ బృథగ్భావ మగుచు, ద్రష్టయయి బ్రహ్మసంజ్ఞచేఁ దనరు చుండు నఖిల భూరి ప్రపంచంబులందుఁ దన్నుఁ, దవిలి తనయందు నఖిల భూతములఁ గనుచు.

946

తా॥ భార్యా పుత్ర మిత్ర అనుజులకంటే మానవుడు తాను భిన్నుడైనట్లు, కణకణ మెరిసే నిప్పు కణికల కంటే, కొరవుల కంటే, ధూమంకంటే మండే అగ్నిజ్వాల వేరైనట్లు దేహం కంటే జీవాత్మ భిన్నంగా ఉంటుంది. పంచ భూతములు, పంచేంద్రియాలు, అంతఃకరణము – వీటితో భాసించే ప్రకృతి కంటే బ్రహ్మము వేరుగా ఉంటుంది. ఆ బ్రహ్మమే ద్రష్టయై అనంత విశ్వంలో తననూ, తనలో అఖీల భూతాలను చూస్తుంది.

వ. వెండియు.

947

సీ. వరుస ననన్యభావంబులఁ జేసి భూ, తావళియందుఁ దదాత్మకత్వ మునఁ జూచు నాత్మీయఘనతరోపాదాన, ములయందుఁ దవిలి యిమ్ముల వెలుంగు నిట్టి దివ్యజ్యోతి యేక మయ్యును బహు, భావంబులను దోఁచు ప్రకృతి గతుఁడు నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తి, ర్మఙ్మనుష్య స్థావరాది వివిధ

తే. యోనులను భిన్నభావంబు నొందుటయును, జాలఁ గల్గు నిజగుణ వైషమ్యమునను భిన్నుఁడై వెల్గుఁ గావునఁ బేర్చి యదియు, దేహసంబంధి యగుచు వర్తించుచుండు.

948

తా॥ సర్వభూతములందు అనన్య భావంతో ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ దివ్యజ్యోతి అంతటా వ్యాపించినదే అయినప్పటికి బహుభావాలలో పెక్కింటి వలె కనుపిస్తుంది. దేవతలు,

మనుష్యులు, పశుపక్ష్యాదులు, పర్వతాదులు ఆదిగా వివిధ యోనులలో భిన్న భావాన్ని పొందుతూ భిన్న గుణాలతో ఆ ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది. దేహములు వేరైనా దివ్యజ్యోతి స్వరూపం ఒకటే.

క. భావింప సదసదాత్మక, మై వెలయుచు దుర్విభావ్య మగుచు స్వకీయం బై వర్తించుచుఁ బ్రకృతిని, భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్.

949

తా॥ సత్తుగాను, అసత్తుగాను కనుపించేదంతా ఆత్మస్వరూపమే. ఈ ఆత్మ భావించడానికి వీలుకానిదై, అంతా తనదిగానే వర్తిస్తూ ప్రకృతిని తిరస్కరించి లోబరుచుకుంటుంది.

వ. ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించునని కపిలుం డెఱింగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె, మహాత్మా! మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితి, వింక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపంబడినట్టి ప్రకారంబును, భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు భక్తి యోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగునట్టి యోగంబును, బ్రాణిలోకంబునకు సంసారం బనేక విధంబయి యుండుఁ గావునఁ బరాపరుండవై కాల స్వరూపివైన నీ స్వరూపంబును, ఏ నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుందుదురు, మిథ్యాభూతం బైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తంబైన బుద్ధింజేసి విభ్రాంతుండై సంసార స్వరూపంబగు మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుండైన జనునిఁ బ్రబోధించు కొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతీయ వలయు ననిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె.

950

తా॥ ఈ ఆత్మ నిజరూపంలో ప్రవర్తిస్తూ ఉంటుంది." అని కపిల మహర్షి చెప్పగా విన్న దేవహూతి ఇలా అడిగింది: "మహాత్మా! మహదాది భూతాలకు ప్రకృతి పురుషులకుకల పరస్పర లక్షణాలను, వాటి స్వరూపాలను చెప్పావు. ఆ విధంగానే సాంఖ్య యోగాన్ని బట్టి భక్తియోగ మహత్త్వాన్ని చెప్పు. పురుషుడు భక్తియోగంచే లోకవైరాగ్యాన్ని పొందే విధానాన్ని వివరించు. ప్రాణులకు అనేక రూపాలుగా ఉండే సంసారానికి లోపల, బయట ఉండేవాడవు, కాలస్వరూపుడుగా ఉన్న నీ యథార్థ స్వరూపాన్ని నాకు తెలియచెప్పు. కాలరూపుడవైన నీ భయం వల్ల జనులు ఏ పుణ్యకార్యాలు చేస్తారో నాకు విపులంగా చెప్పు. విమలాత్మా! అశాశ్వతమైన శరీరం మీద ఆత్మాభిమానంతో మూఢుడై, కర్మలమీద కోరికతో, సంసారమనే అంధకారంలో చాలాకాలంగా నిద్రపోతూన్న మానవునికి ప్రబోధించటం కోసం యోగభాస్కరుడవై ఆవిర్భవించిన పుణ్యపురుషుడవు నీవు! కాబట్టి నీవే నాకు భక్తియోగం గురించి సమస్తమూ విశదమగునట్లు వివరించు" అని అడిగిన దేవహూతితో కపిల మహర్షి ఇలా అన్నాడు:

## కపిలుడు దేవహూతికి భక్తియోగమును తెలియజేయుట

క. నలినాయతాక్షి! విను జన, ముల ఫల సంకల్ప భేదమునఁ జేసి మదిం గల భక్తియోగ మహిమం, బలవడఁగ ననేకవిధము లనఁదగు నవియున్.

951

తా ॥ "కమలదళముల వంటి కన్నులతో శోభిల్లే నా తల్లీ! విను! ప్రజల ఫలభేదం, సంకల్ప భేదం వల్ల భక్తియోగం సిద్ధిస్తుంది. అది కూడా అనేక విధాలుగా ఉంటుంది.

వ. వివరించెదఁ. దామస రాజస సాత్త్విక భేదంబులం ద్రివిధంబై యుండు, నందు దామస భక్తి ప్రకారం బెట్టిదనిన.

952

తా॥ వివరిస్తాను. తామసం, రాజసం, సాత్త్వికం అని భక్తి మూడు విధాలు. అందులో తామస భక్తి ప్రకారం ఎలాంటిదో చెబుతాను.

తే. సతత హింసాతి దంభ మాత్సర్య రోష, తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ బరఁగ నాయందుఁ గావించు భక్తి దలఁపఁ, దామసం బనఁదగు, వాఁడు తామసుండు,

953

తా॥ తోటి వారిని హింసిస్తూ, ఆడంబరము, ద్వేషము, రోషము, అజ్ఞానము ఇట్లాంటివి ప్రదర్శిస్తూ భేదబుద్ధితో నాయందు భక్తిని ప్రదర్శించే వాడు తామసుడు. వానిది తామస భక్తి.

క. ఘన విషయ ప్రావీణ్యము, లను సుమహైశ్వర్యయశములను బూజాద్య ర్థుని నను నర్థి భజించుట, చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ!

954

తా॥ సౌజన్యనిధీ! అనేక ఇంద్రియ విషయముల నైపుణ్యములను, సిరిసంపదలను, కీర్తిప్రతిష్ఠలను కోరి పూజా ద్రవ్యములతో పూజార్హుడనైన నన్ను భజించటం రాజసభక్తి అవుతుంది.

చ. అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుఁడైన శో భన చరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్ జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్.

955

తా॥ గతంలో చేసిన పాపాలను పరిహరించేది 'భగవద్భక్తి' ఒక్కటే అనే పరిపూర్ణ నమ్మకంతో, మంగళకరమైన చరిత్ర కలవాడు భగవంతుడే అని భావంలో తలపోసి, భక్తిచేత తాను చేస్తూన్న సమస్తమైన పనులు భగవదర్పణ బుద్ధితో చేస్తూ, జనులకు హితమైన కార్యాలు చెయ్యటం సాత్త్విక భక్తి.

ఒకవ్యక్తి అడవుల గుండా ప్రయాణం చేస్తూన్నాడు. దారిలో ముగ్గురు దొంగలు అతణ్ణి చుట్టుముట్టి, అతడివద్ద ఉన్న సొమ్మునంతా దోచుకొన్నారు. ఆ దొంగల్లో ఒకడు, "వీణ్ణి ప్రాణాలతో విడిచిపెడితే ప్రయోజనం ఏమిటి?" అంటూ అతణ్ణి నరకటానికై కత్తి ఎత్తాడు. ఇంతలో రెండవ దొంగ అతణ్ణి ఆపి, "నా మాట విను, ఈ నిర్భాగ్యుణ్ణి చంపితే ఏం ప్రయోజనం? కాళ్ళు చేతులు కట్టేసి ఇక్కడ పడవేసిపోదాం" అన్నాడు. అలాగే వాళ్ళతని కాళ్ళుచేతులు కట్టేసి, అక్కడే పడవేసిపోయారు. వాళ్ళు కొంతదూరం వెళ్ళాక మూడవదొంగ తిరిగివచ్చి, "అయ్యో! పాపం! నువ్వెంత బాధపడ్డావో కదా! క్షణంలో నిన్ను విడిపిస్తాను" అంటూ కట్లు విప్పేసి, "నాతోరా, నీకు దారి చూపిస్తాను" అన్నాడు. వారిద్దరు చాలదూరం నడిచాక రాజబాట కనిపించింది. అప్పుడు ఆ దొంగ, "అదుగో, నీ ఇల్లు. ఈ దారిన వెళితే, ఇల్లు చేరుకొంటావు" అన్నాడు. ఆ వ్యక్తి తన కృతజ్ఞతను వ్యక్తపరచే ధోరణిలో ఇలా అన్నాడు: "అయ్యా! నువ్వు నాకు మహోపకారం చేశావు. నేను నీ మేలు మరువను. నాతోకూడ మా ఇంటికి రాకూడదా?"

అందుకు ఆ దొంగ ఇలా అన్నాడు: "వీలుపడదు, నే నక్కడకు రాలేను. వస్తే రక్షకభటులు నన్ను పట్టుకొంటారు!"

ఈ సంసారమే అరణ్యం. ప్రకృతి గుణాలైన సత్త్వరజస్తమోగుణాలే ఆ ముగ్గురు దొంగలు. జీవుడే యాత్రికుడు. ఆత్మజ్ఞానమే అతడి సొత్తు. తమోగుణం అతణ్ణి సంసారమనే సంకెళ్ళతో బద్ధుణ్ణి చేస్తోంది. కాని సత్త్వగుణం అతణ్ణి రజస్తమస్సుల బారి నుంచి రక్షిస్తుంది. సత్త్వగుణాన్ని ఆశ్రయించి జీవుడు రజస్తమోగుణ సంజనితాలైన కామక్రోధాదుల నుంచి విడివడతాడు; సత్త్వగుణం ఇలా జీవుణ్ణి సంసారబంధవిముక్తుణ్ణి చేస్తుంది. కాని సత్త్వగుణం సైతం దొంగే. ఐనా అది జీవుడికి పరమాత్మను చేరే మార్గం చూపి, 'అదుగో, నీ ఇల్లు' అని తెలుపుతుంది. తదుపరి అదీ అదృశ్యమౌతుంది. ఈ సత్త్వగుణం సైతం పరమాత్మ సామ్రాజ్యంలోకి పోలేదు.

—శ్రీరామకృష్ణ పరమహంస

చ. మనుసుత! మద్గుణ శ్రవణమాత్ర లభించినయట్టి భక్తిచే ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడం బరమేశ్వరుండనై తనరిన నన్నుఁ జెందిన యుదాత్తమనోగతు లవ్యయంబులై వననిధిగామి యైన సురవాహినిఁ బోలె ఫలించు నిమ్ములన్.

956

తా॥ మనువుకు పుత్రికవైన అమ్మా! నా గుణాలను విన్నంతమాత్రాన లభించిన భక్తిచేత పాపరహితుడను. శోభనమైన గుణములకు ఆశ్రయుడైన వాడను సాక్షాత్తు పరమేశ్వరుడను అయిన నన్ను ఉత్తమ పురుషులైన వారు ఆశ్రయిస్తారు. సురవాహిని అయిన గంగానది సముద్రాన్ని చేరుకునే క్రమంలో తాను ప్రవహించే భూమినంతా సస్యశ్యామలం చేసినట్లు వారి కోరికలు అలాగే ఫలిస్తాయి.

క. హేయ గుణ రహితుఁ డనఁగల, నాయందుల భక్తి లక్షణముఁ దెలిపితి, నన్ బాయక నిర్హేతుకముగఁ, జేయు మదీయవ్రతైక చిరతర భక్తిన్.

957

తా॥ నింద్యమైన గుణములు లేని నాయందు నిలుప వలసిన భక్తి లక్షణాలను వివరించాను. నన్ను విడిచి పెట్టకుండా నిర్హేతుకంగా నా కొరకు చేసే వ్రతమే గొప్ప భక్తి అని భావించు.

వ. నిష్కాములయిన మదీయ భక్తులను నట్టి భక్తి యోగంబు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు, కావున మహాత్ములగు వారు నిజమనోరథ ఫలదాయకంబు లయినను మదీయ సేవావిరహితంబు లయిన యితర కర్మంబు లాచరింప నొల్లరు, దీని నాత్యంతిక భక్తి యోగంబని చెప్పుదురు, సత్త్వరజస్తమో గుణహీనుం డయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని చెప్పి మఱియు నిట్లనియె.

958

తా॥ నిష్కామంగా నన్ను ఆరాధించే నా భక్తులకు అట్టి భక్తియోగం వల్ల సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములనే ముక్తులు ప్రాప్తిస్తాయి. కనుక మహాత్ములైన వారు తమ మనస్సులోని కోర్కెలు ఫలింప చేసేవే అయినా నా సేవ తప్ప ఇతర కర్మలు ఆచరించడానికి ఇష్టపడరు. దీనినే 'ఆత్యంతిక భక్తియోగం' అని పిలుస్తారు. త్రిగుణహీనుడు అనగా సత్త్వరజస్తమోగుణాలను జయించిన మానవుడు నాతో సమానమైన స్థితిని పొందుతాడు" అని చెప్పి కపిల మహర్షి తల్లితో ఇంకా ఇలా అన్నాడు:

సీ. నిత్యనైమిత్తిక నిజధర్మమున గురు, శ్రద్ధా గరిష్ఠతఁ జతుర పాంచ రాత్రోక్త హరి సమారాధన క్రియలను, నిష్కామనంబున నెఱి మదీయ విగ్రహ దర్శన వినుతి పూజా వంద, న ధ్యాన సంశ్రవణములఁ గర్మ సంగి గాకుండుట, సజ్జన ప్రకరాభి, మానంబు నొందుట, హీనులందుఁ

తే. జాల ననుకంప జేయుట, సములయందు, మైత్రి నెఱపుట యమనియమ క్రియాది యైన

యోగంబుచేత నాధ్యాత్మికాధి, భౌతికాదులఁ దెలియుట పలుకుటయును.

959

తా॥ "నా భక్తుడైన వాడు తాను నిత్యమూ చేసుకొనే జపతప అనుష్ఠానాదుల యందు, లోక కళ్యాణం కోసం చేసే యజ్ఞయాగాది నైమిత్తిక కర్మలయందు శ్రద్ధాభక్తులు కలిగి ఉండాలి. గురువులను, పెద్దలను గౌరవించాలి. పాంచరాత్రాగమంలో చెప్పబడిన రీతిగా విష్ణువు యొక్క సమారాధన క్రియలను నిష్కామ బుద్ధితో ఆరాధించాలి. నా విగ్రహాన్ని దర్శించటం, వినుతించటం, పూజించటం, వందనం చెయ్యటం, ధ్యానం చెయ్యటం, నా చరిత్రను వినటం, కర్మలయందు సంగము లేకుండ ఉండటం, సజ్జనుల యందు అభిమానాన్ని ప్రకటించటం, తనకంటే తక్కువ వారియందు దయాదాక్షిణ్యాలు కలిగి ఉండటం, తనతో సమానులైన వారితో మైత్రీభావాన్ని కలిగి ఉండటం, యమ నియమాలను ఆచరిస్తూ యోగంచేత ఆధ్యాత్మిక ఆధిదైవిక, ఆధిభౌతికాలను తాను తెలుసుకొని ఇతరులకు బోధిస్తూ ఉండాలి.

వ. మఱియును.

960

క. హరి మంగళ గుణకీర్తన, పరుఁడై తగ నార్జవమున భగవత్పరులం గర మనురక్తి భజించుట, నిరహంకారముగ నుంట నిశ్చలుఁ డగుటన్.

961

తా॥ ఇంతే కాకుండా మంగళకరమైన హరి గుణకీర్తనం చెయ్యాలి. ఋజు భావంతో భక్తులను సేవిస్తూ ఉండాలి. అహంకార రహితుడై ఎల్లప్పుడూ నిశ్చలుడై ఉండాలి.

క. ఇవి మొదలు గాఁగ గలుగు భ, గవదుద్దేశ స్వధర్మ కలితుండై వీ ని వలనఁ బరిశుద్ధగతిం, దవిలిన మది గలుగు పుణ్యతముఁ డెయ్యెడలన్.

962

తా॥ ఈ విధంగా భగవంతుని ఉద్దేశించిన ధర్మాలతో కూడిన పుణ్యాత్ముడు పరిశుద్ధమైన మార్గంలో ఆసక్తమైన చిత్తం కలవాడవుతాడు.

తే. గురుతరానేక కల్యాణ గుణ విశిష్టుఁ, డనఁగ నొప్పిన ననుఁ బొందు నండ గొనక పవన వశమునఁ బువ్వుల పరిమళంబు, ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి.

963

తా॥ అటువంటి భక్తులు అనేక కళ్యాణ గుణ విశిష్టుడనైన నన్ను; పువ్వుల పరిమళం గాలి కారణంగా ఘ్రాణేంద్రియాన్ని ఆవరించిన విధంగా సులువుగా చేరుకుంటారు.

చ. అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు నీ శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడం బనమున మూఢుఁడై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని న మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్.

964

తా॥ తల్లీ! ఎల్లప్పుడు సర్వభూతముల హృదయ కమలాలలోను వర్తిస్తూన్న ఈశ్వరుడనైన నన్ను నిర్లక్ష్యం చేసి మనుజుడు నా ప్రతిమలను మాత్రం ఆడంబరంగా అర్చించే వాడు మూర్ఖుడు. ఉచితమైన భక్తితో నన్ను ఆరాధించని మనుజుడు చేసిన పూజలు బూడిదలో పోసిన పన్నీరు వలె వ్యర్థం.

సీ. అబ్జాక్షి! నిఖీల భూతాంత రాత్ముఁడ నైన, నాయందు భూతగణంబునందు నతిభేదదృష్టి మాయావులై సతతంబుఁ, బాయక వైరానుబంధ నిరతు లగు వారి మనములఁ దగులదు శాంతి యె, న్నటి కైన నేను నా కుటిల జనుల మానక యెపుడు సామాన్యాధిక ద్రవ్య, సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థి నా చిత్తమున ముదం బందకుందు, ననుచు నెఱిఁగించి మఱియు నిట్లనియెఁ

గరుణఁ గలిత సద్గుణ జటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ, దల్లితోడ గుణవతీమతల్లితోడ.

965

తా॥ తల్లీ! నేను నిఖిల భూతములలోను ఆత్మస్వరూపుడనై ఉన్నాను. అట్టి నాయందు తక్కిన భూతగణమునందు భేదదృష్టితో మాయావులై వైరంతో ప్రవర్తించే వారికి శాంతి దొరుకదు. అటువంటి వంకర బుద్ధి కలవారు అధిక ద్రవ్యాన్ని వెచ్చించి నాకు పాదపూజలు చేసినా సంతోషం కలగదు." ఈ ప్రకారం చెప్పి కపిల మహర్షి తన తల్లి అయిన దేవహూతితో ఇలా అన్నాడు:

సీ. తరళాక్షి! విను మచేతన దేహములకంటెఁ, జేతన దేహముల్ శ్రేష్ఠ, మందుఁ బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు, గలుగు చైతన్యవృక్షములకంటె ఘనరసజ్ఞాన సంకలిత చేతను లుత్త, ములు, రసజ్ఞానంబు గలుగువాని కంటె గంధజ్ఞాన కలిత బృందంబులు, గడు శ్రేష్ఠములు, వానికంటె శబ్ద

తే. వేదు లగుదురు శ్రేష్ఠులై, వెలయు శబ్ద, విదుల కంటెను సద్రూప వేదులైన వాయసాదులు శ్రేష్ఠముల్, వానికంటె, వరుస బహుపాదు లుత్తముల్, వానికంటె.

966

తా॥ "తల్లీ! విను. చైతన్యం లేని పర్వతాల కంటే చైతన్యం గల వృక్షములు శ్రేష్ఠం. స్పర్శజ్ఞానం గల వృక్షముల కంటే రసజ్ఞానం అంటే రుచి చూసే శక్తిగల క్రిమి కీటకాలు ఉత్తమం. వీటికంటే గంధజ్ఞానం అంటే వాసన చూసేవి ఇంకా శ్రేష్ఠం. వాటికంటే శబ్దజ్ఞానం అంటే వినేశక్తి కలవి మరీ శ్రేష్ఠం. ఇట్టి శబ్దం జ్ఞానం కలవాటి కంటే రూపజ్ఞానం అంటే చూసే శక్తిగల కాకులు శ్రేష్ఠం. వానికంటే బహుపాదాలు కల జీవులు శ్రేష్ఠం.

క. తలఁపఁ జతుష్పదు లధికులు, బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం గల మనుజు లలఘుతము, లి, మ్ముల వారలయందు వర్ణములు నాల్గరయన్.

967

తా॥ బహు పాదాలు కల వాటికంటే నాలుగు పాదాలు కలవి, వీటి కంటే రెండు పాదాలు గల మానవులు గొప్ప. వీరిలో నాలుగు వర్ణములు వారు ఉన్నారు.

వ. అందు.

968

సీ. తలఁప బ్రాహ్మణ లుత్తములు, వారికంటెను, వేదవేత్తలు, వేదవిదులకంటె విలసిత వేదార్థ విదులు, వారలకంటె, సమధిక శాస్త్ర సంశయము మాన్పు మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె, నిజధర్మ విజ్ఞాననిపుణు, లరయ వారికంటెను సంగవర్జిత చిత్తులు, దగ వారికంటె సద్ధర్మపరులు,

తే. ధార్మికుల కంటె నుత్తమోత్తముఁడు వినుము, మత్సమర్పిత సకల ధర్మ స్వభావ మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి, సమత వర్తించు నపుణ్యతముఁడు ఘనుఁడు.

969

తా॥ అందులో బ్రాహ్మణులు ఉత్తములు. వారికంటే వేదవేత్తలు, వేదవేత్తలకంటే వేదార్థం తెలిసిన వారు యోగ్యులు. వారికంటే శాస్త్ర సంశయాలను తీర్చగల మీమాంసకులు, వీరికంటే స్వధర్మ పరాయణులు ఉత్తములు. వీరికంటే దేనిపైనా ఆసక్తిలేని సంగ వర్జితులు ఉత్తములు. వీరికంటే సద్ధర్మపరులు గొప్పవారు. ఇక సర్వధర్మాలను, తనకున్న సర్వ సంపదలను, సమస్త బాధ్యతలను నాకే అప్పగించి సమత్వంతో జీవితాన్ని నడుపుకొనే పుణ్యతముడు అందరికంటే ఘనుడు.

వ. అట్టివాని.

970

క. కని సకలభూత గణములు, మనమున నానంద జలధి మగ్నము లగుచున్ ఘన బహుమాన పురస్సర, మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్.

971

తా॥ అట్టి వానిని చూసి సకల ప్రాణికోటి మనస్సులో ఆనంద సాగరంలో తేలియాడుతూ, బహుమాన పురస్సరంగా నమస్కరిస్తూ ఉంటుంది.

వ. అంత నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు, నట్టి భగవంతుం జూచి భక్తి యోగంబున నేని, యోగంబున నేనిఁ బురుషుండు పరమాత్మం బొందుఁ, బ్రకృతి పురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబునై కర్మవిచేష్టితం బగుచు నుండు, నదియ భగవద్రూపం, బిట్టి భగవద్రూపంబు భేదాస్పదం బగుచు నద్భుత ప్రభావంబు గల కాలం బనియుఁ చెప్పంబడు, నట్టి కాలంబు మహదాది తత్త్వంబులకును మహత్తత్త్వాభి మానులగు జీవులకును భయావహం బగుటంజేసి సకల భూతంబులకు నాశ్రయం బగుచు నంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రసించుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృత భూతుండై ప్రభుత్వంబుల భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు, నతనికి మిత్రుండును శత్రుండును బంధుండును లేఁ, డట్టి విష్ణుండు సకల జనంబులయం దావేశించి యప్రమత్తుండై ప్రమత్తులయిన జనంబులకు సంహారకుండై యుండు, నతనివలన భయంబునంజేసి వాయువు వీచు, సూర్యుండు దపియించు, నింద్రుండు వర్షించు, నక్షత్రగణంబు వెలుంగుఁ, జంద్రుండు ప్రకాశించుఁ, దత్తత్కాలంబుల వృక్షలతాదు లోషధులతోడం గూడి పుష్పఫల భరితంబు లగు, సరిత్తులు ప్రవహించు, సముద్రంబులు మేరలు దప్పకయుండు, నగ్ని ప్రజ్వలించు, భూమి గిరులతోఁగూడ బరువునఁ గ్రుంగ వెఱచు, నాకాశంబు సకలజనంబులకు నవకాశం బిచ్చు, మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర స్వరూపంబు గావున సప్తావరణావృతం బగు లోకం బను స్వదేహంబు విస్తరింపంజేయు గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు

నియోగింపంబడి ప్రతిదినంబు నయ్యయి సర్గంబు సేయ నప్రమత్తులై యుండుదురు. పిత్రాదులు పుత్రోత్పత్తిఁ జేయుదురు, కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండు, చరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనంబై యుండునని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె.

972

తా॥ ఈశ్వరుడు జీవస్వరూపాన్ని పొంది అందులో ప్రవేశిస్తాడు. అట్టి ఈశ్వరుణ్ణి యోగమార్గంతోగాని, భక్తిమార్గంతో గాని పురుషుడు పొందుతాడు. ఆ ఈశ్వరుడు ప్రకృతి పురుషులతో కూడి కర్మలను చేస్తూ ఉంటాడు. ఆ ఈశ్వరుడే ప్రకృతి నుండి వేరై కర్మలను చేయనివాడుగా కూడా ఉంటాడు. అదే భగవంతుని రూపం. ఇది జీవులలో పరస్పర భేదాలకు కారణభూతమై అద్భుత ప్రభావంగల కాలంగా పిలవబడుతుంది. అట్టి కాలం మహదాది తత్త్వాలకు, మహత్తత్త్వాభిమానులకు భయాన్ని కలిగిస్తుంది. అన్ని భూతములకు ఆశ్రయమై, ఆ జీవుల అంతరంగాలలో ఉంటూ ఒక ప్రాణిచేత మరొక ప్రాణిని తినేటట్లుగా చేస్తుంది.

భగవంతుడైన విష్ణువు యజ్ఞఫలాన్నిచ్చేవాడు కనుక సమస్త ప్రాణులను తన అధీనంలో ఉంచుకొని పరిపాలిస్తూ ఉంటాడు. అతనికి మిత్ర, శత్రు, బంధుత్వాలు లేవు. అట్టి జనార్దనుడు అన్ని ప్రాణికోట్లను ఆవేశించి అప్రమత్తుడై ఉంటూ మిక్కిలి మత్తులో ఉన్న వారికి సంహారకుడై ఉంటాడు. ఈశ్వరాజ్ఞకు లోబడే వాయువు వీస్తుంది. భానుడు తపింపచేస్తాడు. ఇంద్రుడు వర్షం కురిపిస్తాడు. నక్షత్ర సమూహం ఆకాశంలో వెలుగుతూ ఉంటాయి. పున్నమి చంద్రుడు ప్రకాశిస్తాడు. అనుకూలమైన కాలంలో వృక్షములు, లతలు ఇవన్నీ ఓషధులతో కూడి పుష్పములతో, ఫలాలతో నిండి ఉంటాయి. నదులు తియ్యటి జలాలతో ప్రవహిస్తాయి. మహాసముద్రాలు మేర తప్పకుండా ఉంటాయి. అగ్ని జ్వలిస్తుంది. భూమి పర్వత భారానికి క్రుంగకుండ ఉంటుంది. గగనం అందరికీ అవకాశం ఇస్తుంది.

మహత్తత్త్వమే ఈ జగత్తుకు అంకుర స్వరూపం కనుక, ఏడు ఆవరణలు గల లోకం అనే

తన దేహాన్ని విస్తరించుకుంటుంది. త్రిగుణాభిమానులైన బ్రహ్మాదులు ఈశ్వరునిచే సృష్టినిమిత్తం నియోగింపబడిన వారు కనుక ప్రతి రోజు సృష్టికార్యంలో అప్రమత్తులై ఉంటారు. పిత్రాదులు పుత్రోత్పత్తి చేస్తే వారికి కాలం వచ్చినప్పుడు కాల పురుషుడు మృత్యువు యొక్క సాయంతో ప్రాణులను చంపుతూ ఉంటాడు. చర–అచర అనే భేదంతో ఉన్న ఈ సకల ప్రపంచము భగవంతుని అధీనంలో ఉంది...” అని చెప్పి కపిలుడు కన్న తల్లితో ఇంకా ఇట్లా అన్నాడు:

క. నెఱి నిట్టి నిఖిలలోకే, శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె వ్వరికిని గలుగదు! మేఘము, గరువలి విక్రమముఁ దెలియఁగా లేని గతిన్.

973

తా॥ “గాలిలో ఎగిరే మేఘానికి వాయువు యొక్క శక్తిని తెలుసుకొనే శక్తి ఉండనట్లుగా; అఖిల లోకేశ్వరుడైన భగవంతుణ్ణి గుర్తించే శక్తి ఎవ్వరికీ ఉండదు.

క. మగువా! విను సుఖహేతుక, మగు నర్థము దొరకమికి మహాదుఃఖమునం దగులుదు, రిది యంతయు నా, భగవంతుని యాజ్ఞఁజేసి, ప్రాణులు మఱియున్.

974

తా॥ తల్లీ! సుఖానికి కారణమైన ధనం దొరకక పోవటం వల్ల కొందరు జనులు మహా దుఃఖంలో మునిగి పోతున్నారు. ఇదంతా ఆ భగవంతుని ఆజ్ఞను అనుసరించి జరుగుతుంది.

సీ. పూని యనిత్యంబులైన గృహక్షేత్ర, పశుధనసుత వధూబాంధవాది వివిధ వస్తువులను ధ్రువముగా మది నమ్మి, వఱలు దుర్మతి యగువాఁడు జంతు సంఘాత మగు దేహసంబంధమున నిల్చి, యర్థి నయ్యై యోనులందుఁ జొరఁగ ననుగమించును వానియందు విరక్తుండు, గాక యుండును నరకస్థుఁడైన

తే. దేహి యాత్మీయదేహంబు దివిరి వదల, లేక తన కది పరమసౌఖ్యాకరంబు గాఁగ

వర్తించు నదియునుగాక యతఁడు, దేవమాయా విమోహిత భావుఁ డగుచు.

975

తా॥ దుర్బుద్ధికల మానవుడు అనిత్యాలైన ఇల్లు, పొలం, పశువులు, ధనం, పిల్లలు, భార్య, బంధువులు ఇత్యాది వస్తువులే శాశ్వతం అని మనస్సులో గట్టిగా నమ్ముతాడు. అట్లా నమ్మి వివిధ జంతువుల దేహాలను పొందుతూ అనేక యోనుల్లో పుడుతూ ఉంటాడు. అయినా వాటిపట్ల విరక్తి కలుగదు. నరకస్థుడై కూడా దేహి తన శరీరాన్ని వదలలేక భగవంతుని మాయకు లొంగినవాడై తనకాశరీరమే పరమ సౌఖ్యకరంగా భావిస్తూ ఉంటాడు.

క. ఘనమగు తనయ వధూ పశు, ధన గృహ రక్షణమునందుఁ దత్తత్క్రియలన్ మనమునఁ దలపోయుచు దిన, దినమున్ దందహ్యమాన దేహుం డగుచున్.

976

తా॥ అలా లొంగిపోయి తన సంతానం, భార్య, పశువులు, ధనము, గృహము వీటిని రక్షించుకొనే పనుల్లో రాత్రింబవళ్ళు వేగిపోతూ, ఆ ఆలోచనలతోటే రోజురోజుకు దహించిపోయిన శరీరంతో కృంగి కృశిస్తాడు.

క. అతిమూఢ హృదయుఁ డగుచు దు, రిత కర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ కృత గోప్యభాషణములను, సుతలాలన భాషణములఁ జొక్కుచు మఱియున్.

977

తా॥ అతడు అత్యంత మూర్ఖుడై చెడ్డపనులు చేస్తూ భార్యతో రహస్య సంభాషణలతోను, పిల్లలను లాలిస్తూను కాలం గడిపేస్తాడు.

క. విను మింద్రియ పరవశుఁడై, మునుకొని తత్కూట ధర్మములఁ గల దుఃఖం బనయము సుఖరూపంబుగ, మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్.

తా॥ వాడు ఇంద్రియాలకు పరవశుడై, కుటిల ధర్మాలు గల దుఃఖాన్నే సుఖంగా భావిస్తూ దానిమీదే అభిమానాన్ని పెంచుకుంటాడు.

క. సతతముఁ దమతమ సంపా, దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు త్సితమతి హింసలు సేయుచు, నతిమూఢమనస్కు లగుచు నాత్మజనములన్.

979

తా॥ తాను సంపాదించిన ధనరాసులను చూసి గర్వపడుతూ, కుత్సిత బుద్ధితో ఇతరులకు హింసలు చేస్తూ మూర్ఖుడై ప్రవర్తిస్తూ ఉంటాడు.

తే. పూని రక్షించుచును వారి భుక్త శేష, మనుభవించుచు నంత జీవనము వోక గడఁగి మఱిమఱి యపరార్థకాముఁ డగుచు, సత్త్వ మెడలి కుటుంబ పోషణమునందు.

980

తా॥ తన సంసారాన్ని రక్షించుకొంటూ, వారి భుక్తశేషం తానసుభవిస్తూ, అయినా జీవనం గడవక, బ్రతుకును ఈడ్వలేక, ఎదుటివారి ధనం మీద ఆశను చంపుకోలేక, కుటుంబ పోషణలో జవసత్త్వాలు కోల్పోతాడు.

సీ. బలిమి సాలక మందభాగ్యుఁడై కుమతియై, పూని యప్పుడు క్రియాహీనుఁ డగుచుఁ దవిలి వృథాప్రయత్నంబులు సేయుచు, మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు నట్టి యకించనుఁ డగువానిఁ జూచి త, ద్దారసుతాదు లాత్మలను వీఁడు గడు నశక్తుఁడు, ప్రోవఁగాఁ జాలఁ, డితఁ డని, సెగ్గింతు రర్థిఁ, గృషీవలుండు తే. బడుగు ముసలెద్దు రోసిన పగిది, నంత, నతఁడు నే వెంటలను సుఖం బందలేక తాను బోషించు జనులు దన్ దనరఁ బ్రోవ, బ్రదుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప.

981

తా॥ మందభాగ్యుడై, బలంలేక, అదృష్టం చాలక, చెడ్డబుద్ధితో, ఏ పనులు చెయ్యలేక, సోమరిపోతై వృథాప్రయత్నాలు చేస్తూ మూర్ఖుడై దీనంగా తిరుగుతూ ఉంటాడు. రైతు చిక్కిన ముసలెద్దును చూచి రోసినట్టు అతని భార్యాపుత్రాదులు ఇతడు అశక్తుడు మనలను పోషించలేడు అని అసహ్యించుకుంటారు. ఈ విధంగా అతడు ఎక్కడా సుఖం అనేది లేక తాను పోషించిన జనులు తిరిగి తనను పోషిస్తూంటే వృద్ధాప్యంలో మిక్కిలి బాధపడుతూ బ్రతుకుతాడు.

క. వెడరూపుఁ దాల్చి బాంధవు, లడలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి ల్లెడలఁగఁ జాలక శునకము, వడువునఁ గుడుచుచును మేను వడవడ వడఁకన్.

982

తా॥ వికృతమైన రూపం, దానిని చూసి బంధువుల ఏడ్పులు. ఇక మరణానికి సిద్ధంగా ఉంటాడు. వీధి గుమ్మం దాటలేడు. ఏదో కొద్దిగా తింటూ శరీరం గడగడ వణుకుతూ ఉండగా కుక్కలా ఇంట్లోనే పడి ఉంటాడు.

సీ. అతిరోగపీడితుండై మంద మగు జఠ, రాగ్నిచే మిగుల నల్పాశి యగుచు, మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన, కన్నులు, కఫమునఁ గప్పఁబడిన నాళంబులను గంఠనాళంబునను ఘుర, ఘుర మను శబ్దంబు దొరయ బంధు జనులమధ్యంబున శయనించి బహువిధ, ములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక,

తే. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ, డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు చింత వికలములైన హృషీకములను, గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁ డగుచు.

983

తా॥ రోగాలెక్కువగా పీడిస్తూంటాయి. ఆకలి చచ్చిపోయి అన్నం సహించదు. ఆయాసం

ఎక్కువై కనుగ్రుడ్లు పైకి పోతాయి. శ్లేష్మం చేత నాడులన్నీ మూసుకుపోయి గొంతులో ఘుర ఘుర శబ్దం పుడుతుంది. బంధుజనుల మధ్య శయనించి ఉన్నా వారు పిలుస్తుంటే తాను పలుకలేడు. కఠోరమైన కాలపాశం తన శరీరాన్ని చుట్టుకొని ఉండగా ఈ బిడ్డలను, భార్యను ఎవరు పోషిస్తారా అనే దిగులుతో పనిచెయ్యని ఇంద్రియాలతో విజ్ఞానాన్ని కోల్పోయి చాలా కష్టపడతాడు.

వ. అంత మరణావస్థం బొందు సమయంబున నతి భయంకరాకారులు సరభసేక్షణులు నగు యమదూత లిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు, యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనాశరీరంబు నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమం బగు మార్గంబును బొంది రాజభటులచే నీయమానుం డగుచు దండనంబున కభిముఖుండై చను నపరాధి చందంబునఁ జనుచుండి.

984

తా॥ అంతలో మరణం ఆసన్నమవుతుంది. భయంకరమైన ఆకారం కలవారు, వేగమైన చూపులు కలవారు అయిన ఇద్దరు యమదూతలు తన ముందు నిలబడతారు. వాళ్ళను చూసినంత మాత్రాన భయపడి మలమూత్రాలను విడుస్తాడు. యమపాశాలు గళానికి చుట్టుకుంటాయి. అంతటితో ప్రాణాలు పోతాయి. ఈ శరీరాన్ని విడిచి యాతనాశరీరాన్ని పొందుతాడు. ఆ మార్గం అంతా కడు దీర్ఘంగా దుర్గమంగా ఉంటుంది. ఆ మార్గంలో యమభటులు బలాత్కారంగా లాక్కొని పోతూంటే శిక్ష అనుభవించడానికి సిద్ధంగా రాజభటులు ఈడ్చుకుపోతూన్న అపరాధిలాగా అలమటిస్తాడు.

చ. అనయము మూర్ఛనొందు శునకావలిచేతను భక్ష్యమాణుఁడై యనుపమ కాలకింకర భయంకర తర్జన గర్జనంబులన్ మనము గలంగ, దేహము సమస్తము గంపము వొందఁ గాఁ, బురా తన భవ పాపకర్మ సముదాయముఁ జిత్తములోఁ దలంచుచున్.

తా॥ విడిచిపెట్టకుండా భయంకరమైన కుక్కలు మీదపడి లాక్కొని తింటూంటే మూర్ఛపోతాడు. కాలకింకరులు భయంకరంగా చేసే అదలింపులకు, కోపంతో వేసే కేకలకు మనస్సు కలత పడగా, దేహమంతా గడగడ వణకగా పూర్వం చేసిన పాపకర్మలన్నీ చిత్తములో తలచుకొని ఏడుస్తాడు.

సీ. అనుపమక్షుత్తృష్ణ లంతర్వ్యథలఁ జేయ, ఝంఝానిలజ్వలజ్జ్వలన చండ భానుప్రదీప్తితప్తంబైన వాలుకా, మార్గానుగత తప్యమానగాత్రుఁ డై వీఁపుఁ గశలచే నడువంగ వికలాంగుఁ, డగుచు మార్గమునందు నచట నచటఁ జాల మూర్ఛిల్లు చాశ్రయశూన్యమగు నీళ్ల, మనుఁగుచు లేచుచు మొనసి పాప

తే. రూప మయిన తమముచే నిరూఢుఁ డగుచు, వెలయఁ దొంబది తొమ్మిదివేల యోజ నముల దూరంబు గల యమనగరమునకుఁ, బూని యమభటుల్ గొంపోవఁ బోవునంత.

986

తా॥ దారుణమైన ఆకలిదప్పికలతో లోపల బాధపడుతూ, భయంకరమైన సుడిగాలుల మధ్య జ్వలిస్తూన్న భానుని కిరణాల వేడికి ఉడికిపోతూన్న ఇసుక ఎడారుల్లో శరీరమంతా తపించిపోతూండగా నడుస్తూ ఉంటాడు. వీపుపై కొరడా దెబ్బలచే బాధపడుతూ అవయవాలు స్వాధీనం తప్పి బాటలో మూర్ఛపోతూ ఉంటాడు. మురికి నీళ్ళలో మునుగుతూ లేస్తూ ఉంటాడు. పాపాలన్నీ చీకట్లలా కమ్ముకొనగా తొంబది తొమ్మిది వేల యోజనాల దూరంలో ఉన్న యమ ధర్మరాజు పట్టణానికి యమభటులు వాడిని లాక్కుని పోతారు.

వ. ఇట్లు మహాపాపాత్ముం డైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను సామాన్య దోషి యగువాఁడు ముహూర్తద్వయంబునను నేఁగి యాతనం బొందు నందు.

987

తా॥ ఈ ప్రకారం మహా పాపాత్ముడైతే మూడు ముహూర్తాల కాలం, సామాన్య దోషి అయితే రెండు ముహూర్తాల కాలం ఆ యమలోకంలో క్రూరమైన బాధలు అనుభవిస్తారు.

క. పట్టుదురు కొఱవులను వడిఁ, బెట్టుదు రసిపుత్రికలను బెనుమంటలయం దొట్టుదురు నొడలు నలియఁగ, మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్.

988

తా॥ ఆ పాపాలు చేసిన వాణ్ణి యమభటులు మండే కొరవులతో శరీరం కాలుస్తారు. కత్తులతో నరికి మంటలలోకి తోసేస్తారు. మత్తుడైన ఆ దుర్మార్గుణ్ణి క్రూరంగా హింసిస్తారు.

ఉ. ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్ర గదాసిధారలన్ ద్రెంతురు పొట్టప్రేవులు, వధింతురు, మీఁద నిభేంద్రపంక్తి ఁౙ ప్పింతురు, ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత, బిట్టు ద్రొ బ్బింతురు మీఁద గుండ్లు, తినిపింతురు దేహము గోసి కండలన్.

989

తా॥ మరిగిపోతూన్న నీళ్ళల్లో వాడిని ముంచుతారు. ఉగ్రమైన గదలతోను కత్తులతోను మొత్తుతారు. పొట్టలో ప్రేవులను కోసేస్తారు. నరికేస్తారు. మదించిన ఏనుగుల చేత త్రొక్కిస్తారు. భయంకరమైన పాములచేత మహా ఘోరంగా కరిపిస్తారు. పెద్దపెద్ద రాళ్ళు మీదికి విసురుతారు. వాడి శరీరాన్ని కోసి ఆ మాంస ఖండాలను వాడి చేతనే తినిపిస్తారు.

వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునం బొంది, నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునఁ బరస్పర సంబంధంబునఁ గల్పింపంబడిన తామిస్రాంధతామిస్ర రౌరవాదు లగు నరకంబులం బడి, తీవ్రంబులైన బహుయాతనల ననుభవించి, క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందు నని చెప్పి వెండియు నిట్లనియె.

990

తా॥ కుటుంబాన్ని పోషించటం కోసం ఏదో విధంగా పొట్ట నింపుకొంటూ, అధర్మపరుడై భూతద్రోహం చేస్తూ మహాపాపాన్ని మూటకట్టుకోవటం వలన యమలోకానికి పోతాడు. అక్కడ తను సంపాదించిన ద్రవ్యాన్నంతా కోల్పోయి మొరపెట్టుకుంటూన్న ఆపన్నుని లాగ దుఃఖ పడతాడు. పరస్పర సంబంధంతో కల్పింపబడిన తామిస్రము, అంధతామిస్రము, రౌరవము ఇత్యాది నరకాలలో తీవ్రమైన యాతనలను అనుభవిస్తాడు. పాపాలన్నిటినీ అనుభవించిన తరువాత తిరిగి నరుడిగా మళ్ళీ పుడతాడు" అని చెప్పి కపిలుడు ఇంకా ఇలా అన్నాడు:

# కపిలుడు దేవహూతికి పిండోత్పత్తి క్రమము వివరించుట

సీ. కైకొని మఱి పూర్వకర్మానుగుణమున, శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు, దేహసంబంధంబుఁ దివిరి తాల్ప దొరకొని పురుష రేతోబిందు సంబంధి, యై వధూగర్భంబునందుఁ జొచ్చి కైకొని యొక రాత్రిఁ గలిలంబు పంచరా, త్రముల బుద్బుదమును దశమదివస

తే. మందుఁ గర్కంధు వంతయౌ నంతమీఁదఁ, బేశియగు నంతమీఁదటఁ బేర్చి యుండ కల్పమగు నొక్క నెల మస్తకమును మాస, యమళ మైనను గరచరణములుఁ బొడము.

991

తా॥ "జీవునికి పూర్వ జన్మలో చేసుకున్న కర్మలననుసరించి తిరిగి జన్మనిచ్చే ఘటికుడు ఈశ్వరుడే! కనుక జీవుడు దేహ సంబంధాన్ని తిరిగి పొందే క్రమంలో పురుషుని వీర్యంగా మారి వధువు యొక్క గర్భంలో ప్రవేశిస్తాడు. ఒక్క రాత్రికి కలిలమై (శుక్ర—శోణిత సంయోగం), అయిదు రాత్రులకు బుద్బుదమై (బుడగయై), పదవ దినానికి రేగుపండంతయై, ఆపైన మాంస పిండమై ఆపై గ్రుడ్డు ఆకారాన్ని పొందుతాడు. ఆ మీద నెలకు శిరస్సు, రెండు నెలలకు కాళ్ళు చేతులు పుడతాయి.

వ. మఱియు మాసత్రయంబున నఖ రోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి నాల్గవమాసంబున సప్త ధాతువులును బంచమ మాసంబున క్షుత్తృష్ణలును గలిగి, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షిని దక్షిణ భాగంబునం దిరుగుచు, మాతృభుక్తాన్న పానంబులవలనఁ దృప్తిం బొందుచు నేధమాన ధాతువులు గల్గి జంతుసంకీర్ణంబగు విణ్మూత్ర గర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లా ద్యుల్బణంబులైన రసంబులచేతఁ బరితప్తాంగుం డగుచు జరాయువునఁ గప్పంబడి బహిః ప్రదేశంబునందు నాంత్రంబులచేత

బద్ధుండై కుక్షియందు శిరంబు మోపికొని భుగ్నంబైన పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుం డగుచుఁ బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వ జన్మ దుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించుచు, నంత నేడవనెల యందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమిసోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబుల చేత నతివేపితుం డగుచు యాచమానుండును దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండు నగుచు బంధన భూతంబగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలిపుటుండు దీనవదనుండునై జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు.

992

తా॥ మూడు నెలలకు గోళ్ళు, రోమములు, ఎముకలు, చర్మం, నవరంధ్రములు కలుగుతాయి. నాల్గవ నెలకు రసము, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ అనే సప్త ధాతువులు ఏర్పడుతాయి. అయిదవ నెలకు ఆకలిదప్పికలు ఏర్పడతాయి. ఆరవనెలలో మావిచేత కప్పబడి తల్లి కడుపులో కుడి భాగాన తిరుగుతూ, తల్లి తినిన అన్న పానాదుల వలన తృప్తిని పొందుతాడు. ధాతువులు (వాత, పిత్త, శ్లేష్మాలు) కలిగి, సూక్ష్మజీవులతో నిండిన మల మూత్రాదుల గోతులలో తిరుగుతూ, క్రిములు ప్రాకి బాధపెడుతుంటే మూర్ఛలో మునిగి పోతాడు. తల్లి భక్షించిన కారం, చేదు, ఉప్పు, పులుపు మొదలైన తీవ్రమైన రసములచేత బాధపడుతూన్న శరీరావయములు కలవాడై మావిచే కప్పబడి బయటకు ప్రేగులచే కట్టబడి మాతృగర్భంలో శిరస్సు వంచుకొని వంగి పడుకొని ఉంటాడు. తన అవయవాలు కదల్పలేక పంజరంలో చిక్కుకొన్న పక్షివలె ఉంటాడు. భగవంతుడిచ్చిన జ్ఞానంతో పూర్వ జన్మలలో చేసిన పాపాలను తలచుకొని దీర్ఘమైన నిట్టూర్పులు విడుస్తూ లేశంకూడ సుఖం లేకుండా ఉంటాడు.

ఏడవ నెలలో జ్ఞానం కలిగి, కదలికలు ప్రారంభమై మలంలోని క్రిములతో కలసి ఒక్క

దిక్కున ఉండక గర్భంలో సంచరిస్తూ, ప్రసూతి వాయువులకు కంపించిపోతూ ఉంటాడు. అప్పుడు దేహాత్మదర్శనం కలిగి తిరిగి గర్భవాస దుఃఖానికి చింతిస్తూ, బంధన రూపములైన సప్తధాతువులచే బద్ధుడై రెండు చేతులు జోడించి దీనవదనుడై జీవుడు తాను ఎవ్వనిచే గర్భవాస క్లేశాన్ని అనుభవించడానికి నియమింప బడ్డాడో ఆ సర్వేశ్వరుణ్ణి ఇట్లా స్తుతిస్తాడు:

## గర్భంలో ఉన్న జీవుడు భగవంతుణ్ణి స్తుతించుట

క. అనయమును భువనరక్షణ, మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి ష్ణుని భయవిరహిత మగు పద, వనజయుగం బర్థిఁ గొల్చు వారని భక్తిన్.

993

తా॥ “ఎల్లప్పుడు ఈ భువనాలను రక్షించుట కొరకు తన ఇష్టానుసారంగా అవతరిస్తూ ఉండే విష్ణువు యొక్క పాదపద్మాలను అడ్డులేని భక్తితో కొలుస్తాను. ఆ చరణాలు నన్ను భయరహితుణ్ణి చేస్తాయి.

వ. అదియునుంగాక పంచభూత విరహితుం డయ్యుం బంచభూత విరచితంబైన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియ గుణార్థ చిదాభాస జ్ఞానుండనైన నేను.

994

తా॥ అదీగాకుండా నాకు పంచభూతాలు లేకపోయినప్పటికి పంచభూతములతో ఏర్పడిన శరీరంచేత కప్పబడి ఉన్నాను. ఇంద్రియాలు, ఇంద్రియ గుణాలు, ఇంద్రియార్థాలు – వీటి అస్తిత్వం తెలిసీ తెలియని సందిగ్ధ జ్ఞానం కలిగి ఉన్నాను.

సీ. ఎవ్వఁడు నిఖీల భూతేంద్రియ మయ మగు, మాయావలంబన మహిత కర్మ బద్ధుఁడై వర్తించు పగిది దందహ్యామా, నంబగు జీవచిత్తంబునందు నవికారమై శుద్ధమై యఖండ జ్ఞాన, మున నుండు వానికి ముఖ్యచరితు నకు నకుంఠిత శౌర్యునకుఁ బరంజ్యోతికి, సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ

తే. గడఁగియుఁ బ్రకృతి పురుషులకంటెఁ బరముఁ, డైనవానికి మ్రొక్కెద నస్మదీయ దుర్భరోదగ్ర భీకర గర్భనరక, వేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు.

995

తా॥ ఏ పరమేశ్వరుడు అనేక జీవరాసులలో పంచేంద్రియాలతో పంచభూతాలతో కూడిన మాయను అంగీకరించి కర్మబద్ధుడై ఉన్నట్లు వర్తిస్తాడో, దహ్యమానమైన జీవుని చిత్తంలో అవికారుడై, శుద్ధుడై, అఖండ జ్ఞాన స్వరూపుడై ఉంటాడో అట్టి వానికి నమస్కారం. ఆ ముఖ్య చరితునికి, అకుంఠిత శౌర్యరాశికి, ఆ పరంజ్యోతికి, ఆ సర్వజ్ఞునకు, ఆ కృపారాశికి, ఆ శాంతునకు, ప్రకృతి పురుషుల కంటే పైనున్న వానికి ఆ సర్వేశ్వరునికి ఈ దుర్భరము, ఉదగ్రము, మహాభయంకరము అయిన నరక బాధలనుండి నన్ను రక్షించి శాంతిని కలిగించమని మ్రొక్కుతున్నాను."

సీ. అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ, మహితాత్మ! యెవ్వని మాయచేత ఘనమోహులై గుణకర్మ నిమిత్త సాం, సారిక మార్గ సంచారములను ధృతి సెడి యలసి యే దిక్కు నెఱుంగక, హరి పదధ్యానంబు నాత్మ మఱచి యుండు వారలకు నే యుక్తియు నమ్మహా, పురుషు ననుగ్రహ బుద్ధి లేక

తే. తద్గుణ ధ్యాన తన్మూర్తి దర్శనములు, గోచరించుట యెట్లు? నాకును బ్రబోధ కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలు డనియె, నంబతోడను సుగణకదంబతోడ.

996

తా॥ అప్పుడు కొడుకుతో తల్లి ఇట్లా అంది. "ఓ! మహితాత్మ! ఎవని మాయచేత గొప్పదైన మోహంలో కూరుకు పోయి గుణములు, కర్మలు నిమిత్తంగా ఏర్పడిన ఈ సంసార మార్గంలో సంచరిస్తూ ధైర్యం చాలక అలసిపోయి దిక్కు తోచక ఉంటారో వారిని గురించి చెప్పు. ఆ హరి యొక్క పాదపద్మాలను ధ్యానించాలనే విషయాన్ని ఆత్మలో మరచిపోతారో అట్టి మానవులకు ఆయన గుణాలను ధ్యానించాలని ఆయన మూర్తి స్వరూపాన్ని దర్శించాలని కోరిక ఎలా పుడుతుంది? ఈ విషయాన్ని నాకు బోధించవలసింద" ని కోరిన తల్లితో కొడుకు ఇట్లా అన్నాడు:

వ. అట్టి యీశ్వరుండు గాలత్రయంబునందును జంగమస్థావరాంతర్యామి యగుటం జేసి జీవ కర్మమార్గంబులం బ్రవర్తించు వారు తాపత్రయ నివారణంబు కొఱకు భజియింతురని

చెప్పి మఱియు నిట్లనియె.

997

తా॥ “అమ్మా! ఈశ్వరుడు భూతభవిష్యత్ వర్తమాన కాలాలు మూడింటియందును స్థావర జంగమములయందు అంతర్యామి స్వరూపంలో ఉంటాడు. ఆ కారణంగా ఏదో ఒక పని చేసుకొని బ్రతికే వాళ్ళు తాపత్రయ నివారణ కోసం ఆ ఈశ్వరుణ్ణి వేడుకొంటారు.

క. జనయిత్రి! గర్భమందును, ఘన క్రిమివిణ్మూత్ర రక్త గర్తములోనన్ మునుఁగుచు జఠరాగ్నిని దిన, దినమును దంతప్యమానదేహుం డగుచున్.

998

తా॥ తల్లి గర్భంలో క్రిములతో కూడిన మలమూత్రాల రక్తపు గుంటలో మునుగుతూ, జఠరాగ్ని చేత ప్రతిరోజు బాధపడే శరీరం కలవాడవుతాడు.

ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు, వలన నిర్గమింపఁ దలఁచి చనిన నెలల నెన్నుకొనుచు నెలకొని గర్భంబు, వలన వెడలఁ ద్రోయువారు గలరె?

999

తా॥ జాలి గొలిపే ముఖంతో దేహి తల్లి గర్భం నుండి వెలుపలికి రావాలని భావిస్తూ గతించిన నెలలు లెక్కపెట్టుకుంటూ ఈ గర్భం నుండి నన్ను బయటకు తీసుకొచ్చే వాళ్ళు ఎవరైనా ఉన్నారా? అని.

వ. అని తలంచుచు దీనరక్షకుండయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునిం జేయ నమ్మహాత్మునికి బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయందగు, నట్టి జీవుండ నైన శమదమాది యుక్తంబైన శరీరంబునందు విజ్ఞాన దీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతునని మఱియు నిట్లనియె.

1000

తా॥ దీనులను రక్షించే విష్ణువు ఒక్కడే తనను ఈ గర్భనరకం నుండి రక్షింపగలడు. అయితే ఆ మహాత్మునికి చేతులు జోడించి నమస్కారం చెయ్యగలను. ఇక ఏమీ ప్రత్యుపకారం చెయ్యలేను. జీవ స్వరూపంలో ఉన్న నేను శమదమాది గుణాలతో కూడిన శరీరంతో కలగబోయే జన్మలో విజ్ఞాన దీపాంకురం సహాయంతో ఆ పురాణ పురుషుణ్ణి చూస్తాను.

సీ. నెలకొని బహు దుఃఖములకు నాలయమైన, యీ గర్భనరకము నేను వెడలఁ జాల బహిః ప్రదేశమునకు వచ్చిన, ననుపమ దేవమాయా విమోహి తాత్ముండనై ఘోరమైనట్టి సంసార, చక్రమందును బరిశ్రమణ శీలి నై యుండ వలయుఁ దా, నది గాక గర్భంబు, నందుండు శోకంబు నపనయించి

తే. యాత్మ కనయంబు సారథియైన యట్టి, రుచిర విజ్ఞానమునఁ దమోరూపమైన భూరి సంసార సాగరోత్తారణంబు, సేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు.

1001

తా॥ అనేక దుఃఖాలకు ఆలయమైన ఈ గర్భనరకం నుండి నేను బయటకు రాలేను. బహిః ప్రదేశానికి వచ్చినా పోలికల్లేని దేవ మాయలకు లోనై ఘోరమైనట్టి సంసార చక్రంలో చిక్కుకొని తిరుగుతూ ఉండవలసిందే. అందువల్ల గర్భశోకాన్ని తొలగించి ఆత్మకు సారథియైనట్టి విజ్ఞానంచేత తమోరూపమైన సంసార సముద్రాన్ని దాటి ఈ ఆత్మను రక్షించుకుంటాను.

వ. మఱియును.

1002

చ. పరఁగుచు నున్న దుర్వ్యసనభాజనమై ఘనదుఃఖమూలమై యరయఁగఁ బెక్కు తూంట్లు గలదై క్రిమిసంభవ మైనయట్టి దు స్తర బహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్ సరసిజనాభ భూరి భవ సాగర తారక పాదపద్మముల్.

తా॥ అంతేకాక ఈ గర్భవాస నరకం చెడు అలవాట్లకు పాత్రమైనది, అనేక దుఃఖాలకు మూలమైనది, అనేక రంధ్రములు కలది, అనేక క్రిములకు పుట్టుక స్థానమైనదీను. ఇటువంటి దాటడానికి వీలులేని గర్భవాసాలు ఇంకా ఎన్ని భరించవలసి ఉందో! సంసారమనే సముద్రాన్ని దాటడానికి సరసిజనాభుని పాదకమలాలను భజిస్తాను.

క. అని కృతనిశ్చయుఁ డయి యే, చిన విమలజ్ఞాని యగుచు, జీవుఁడు గర్భం బున వెడల నొల్లకుండం, జనియెడు నవమాసములును జననీ! యంతన్.

1004

తా॥ ఈ విధంగా ఆలోచించి కృతనిశ్చయుడై అతిశయించిన స్వచ్ఛమైన జ్ఞానం కలవాడై జీవుడు గర్భం నుండి బయటకు రాకుండా తొమ్మిది మాసములు గడుపుతాడు.

వ. దశమ మాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాస నిశ్శ్వాసంబులు లేక ఘనదుఃఖ భాజనుండు విగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండునై విష్ఠాస్థ క్రిమియుంబోలె నేలంబడి యేడ్చుచు జ్ఞానహీనుండై జడుఁడునుం బోలె నుండి యంత నిజభావనానభిజ్ఞులగు నితరులవలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం జెప్ప నేరక యనేక కీటసంకులం బయిన పర్యంకంబునందు శయానుండై యవయవంబులు గండూయమానంబు లైన గోఁకనేరక యాసనోత్థాన గమనంబుల నశక్తుండై తన శరీరచర్మంబు మశక మత్కుణ మక్షికాదులు వొడువఁ గ్రిములచే వ్యథంబడు క్రిమియుంబోలె దోదూయమానుండై రోదనంబు సేయుచు విగతజ్ఞానుండై మెలంగుచు శైశవంబునం దత్తత్క్రియానుభవంబు గావించి పౌగండవయస్సునఁ దదనురూపంబులగు నధ్యయనాది దుఃఖంబు లనుభవించి తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన నభిమతార్థ ఫలప్రాప్తికి సాహసపూర్వంబు లగు వృథాగ్రహంబులు సేయుచు పంచమహాభూతార్థంబగు

దేహంబందుఁ బెక్కుమాఱు లహంకార మమకారంబులం జేయుచుఁ దదర్థంబులైన కర్మంబు లాచరించుచు సంసారబద్ధుం డగుచు దుష్పురుష సంగమంబున శిశ్నోదర పరాయణుండై వర్తించుచు నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాణరోషుఁ డగుచుఁ దత్ఫలంబులగు దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తించుచుండు మఱియును.

1005

తా॥ ఆపై పదవ మాసం రాగానే జీవుడు అధోముకుడై ఉచ్ఛ్వాస నిశ్వాసాలు లేక దుఃఖంతో బాధపడుతూ జ్ఞానాన్ని కోల్పోయి రక్తసిక్తమైన శరీరంతో క్రిమివలె నేలపైపడి ఏడుస్తూ జ్ఞాన విహీనుడై జడునివలె పడి ఉంటాడు. తన భావాన్ని అర్థం చేసుకోలేని ఇతరుల వలన పెంచబడుతూ తన కోరికలను చెప్పలేక అనేక పురుగులతో కూడిన ప్రక్కమీద పడుకుంటాడు. అవయవాలలో ఎక్కడ దురదవేసినా గోక్కోలేక, కూర్చోవడానికి, లేవడానికి, నడవడానికి ఓపిక చాలక, తన శరీరం అంతా దోమలు, నల్లులు, ఈగలు పాకుతూ కుడుతూ ఉంటే క్రిములచే బాధపడే క్రిమిలాగ ఏడుస్తూ జ్ఞానాన్ని కోల్పోయి ప్రవర్తిస్తూ ఉంటాడు.

ఈ ప్రకారంగా శైశవంలో ఆ అనుభవాలను పొందుతూ, క్రమంగా విద్యాభ్యాసం మొదలైన దుఃఖాలను అనుభవించి, ఆపైన వచ్చే యౌవనంలో తన కోర్కెల ఫలప్రాప్తికి తెగువతో కూడిన వృథా కోపాన్ని ప్రకటిస్తూ, పాంచభౌతికమైన శరీరం మీద అనేక సార్లు అహంకార మమకారాలు పెంచుకుంటూ దానికి తగ్గట్లు పనులు చేస్తూ ఉంటాడు. సంసారబద్ధుడై చెడు కూడికల వలన కడుపు నింపుకోవటం, కామం తీర్చుకోవటంతోనే వర్తిస్తూ, తెలియనితనంతో ప్రతిదానికి కోపాన్ని పెంచుకుంటూ దానికి ప్రతిఫలంగా బాధను అనుభవిస్తూ కేవల కాముకుడై తను పాడవటానికి హేతువులైన దుర్మార్గపు పనులే చేస్తూంటాడు.

సీ. జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును, ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు క్షమయును యశమును శమదమ భగములు, మొదలుగాఁగల గుణంబులు నశించు

జనుల కసత్సంగమున నని యెఱిఁగించి, వెండియు నిట్లను వినుము మూఢ హృదయులు శాంతివిహీనులు దేహాత్మ, బుద్ధులు నంగనామోహ పాశ

తే. బద్ధ కేళీమృగంబుల పగిదిఁ గలిగి, పరవశస్వాంతమున శోచ్యభావులైన వారి సంగతి విడువంగవలయు, నందు, నంగనా సంగమము దోష మంద్రుగాన.

1006

తా॥ తల్లీ! చెడ్డవారి సాంగత్యం వల్ల సత్యం, శుచిత్వం, దయ, ధైర్యం, మౌనం, బుద్ధి, లజ్జ, ఓర్పు, యశస్సు, శమం, దమం, జ్ఞానం మొదలైన సుగుణాలన్నీ నశిస్తాయి. మూఢులు, అశాంతి పరులు, దేహమే ఆత్మ అని అనుకునే వాళ్ళు, బంధింప బడిన ఆటమృగాలవలె అంగనా వ్యామోహంలో చిక్కుకున్న వాళ్ళు – వీళ్ళంతా శోచనీయులు. వారితో సాంగత్యాన్ని విడిచిపెట్టాలి. అన్నిటిలోను అంగనా సంగమం చాలా చెడ్డది అని పండితులంటారు.

వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దన కూఁతురయిన భారతి మృగీరూప ధారిణియై యుండం జూచి తదీయరూపరేఖా విలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుండును, విగతత్రపుండునునై తానును మృగరూపంబు నొంది తదనుధావనంబు హేయంబని తలంపక ప్రవర్తించె. కావున నంగనా సంగమంబు వలవ దస్మదీయ నాభీ కమల సంజాత చతుర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాది కల్పిత దేవమనుష్యాదులందు మాయాబలంబునం గామినీజన మధ్యంబున విఖండిత మనస్కుండు గాకుండఁ బుండరీకాక్షుం డైన నారాయణఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదని వెండియు నిట్లనియె.

1007

తా॥ దీనికి ప్రాచీనమైన ఇతిహాసం ఒకటుంది. పూర్వం ఒకప్పుడు బ్రహ్మదేవుడు తన కుమార్తె అయిన సరస్వతీదేవి ఆడులేడి రూపాన్ని ధరించి ఉండగా చూసాడు. చూసిన వెంటనే దాని రూపురేఖా విలాసాలకు ఆకర్షితుడై పరవశించిన అంతరంగంతో సిగ్గువిడిచి తనుకూడ

మగలేడి రూపాన్ని ధరించి దాని వెనకాల పరుగులెత్తటం నీచమని అనుకోకుండా ప్రవర్తించాడు. కనుక నా నాభికమలం నుండి పుట్టిన చతుర్ముఖ బ్రహ్మ, ఆయనచే సృష్టింపబడిన మరీచ్యాదులు, వారికి ఉద్భవించిన కశ్యపాదులు వారిచే కల్పింపబడిన దేవతలు మనుష్యులలో కామినీ జనం మధ్య చలించని మనస్సుతో ఉండటం అనేది పుండరీకాక్షుడైన నారాయణునికి తప్ప అన్యులెవ్వరికి సాధ్యం కాదు." అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

తే. రూఢి నా మాయ కామినీ రూపమునను, బురుషులకు నెల్ల మోహంబుఁ బొందఁ జేయుఁ గాన పురుషులు సతులు సంగంబు మాని, యోగవృత్తిఁ జరించుచు నుండవలయు.

1008

తా॥ "నా మాయయే కామినీ రూపంలో పురుషులందరికీ మోహాన్ని కలిగిస్తుంది. కనుక పురుషులు స్త్రీ సంగమాన్ని మాని యోగవృత్తిలో సంచరించాలి.

క. ధీరతతో మత్పదసర, సీరుహ సేవానురక్తిఁ జెందిన వారల్ నారీసంగము నిరయ, ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెందున్.

1009

తా॥ ధీరత్వంతో నా పాదపద్మములను సేవించటంలో అనురక్తి కలిగిన వారు స్త్రీ సాంగత్యాన్ని నరకద్వారంగా మనస్సులలో అనుకుంటారు.

క. హరిమాయా విరచితమై, తరుణీ రూపంబుఁ దాల్చి ధరఁ బర్విన బం ధురతృణ పరివృతకూపము, కరణి నదియు మృత్యురూపకం బగు మఱియున్.

1010

తా॥ దట్టమైన గడ్డిచేత కప్పబడిన పాడు నుయ్యి శ్రీహరి యొక్క మాయ వలన స్త్రీ రూపాన్ని దాల్చి మృత్యు రూపంలో ఉంటుంది.

చ. ధన పశు పుత్ర మిత్ర వనితా గృహ కారణభూతమైన యీ తనువున నున్న జీవుఁడు పదంపడి యట్టి శరీర మెత్తి న న్ననుగతమైన కర్మఫల మందక పోవఁగరాదు, మింటఁ బో యిన భువిఁ దూఱినన్ దిశల కేఁగిన నెచ్చటనైన దాఁగినన్.

1011

తా॥ ధనము, పశువులు, పుత్రులు, మిత్రులు, స్త్రీలు, ఇండ్లు మొదలైన వాటికి కారణం ఈ తనువే! ఈ తనువును ఆశ్రయించి ఉన్న జీవుడు మళ్ళీ ఇంకొక శరీరమెత్తి కర్మఫలాన్ని అనుభవిస్తాడు. గగనానికి ఎగిరినా, నేలకు దూరినా, దిక్కులకు పోయినా, ఎక్కడ దాక్కున్నా కర్మఫలం మాత్రం అందుకోక తప్పదు.

వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీ సంగంబుచే విత్తాపత్య గృహాది ప్రదంబగు స్త్రీత్వంబు నొందు, నీక్రమంబున నంగనారూపుండగు జీవుండు మన్మాయచేఁ బురుష రూపంబు నొంది ధనాది ప్రదుండగు భర్తను నాత్మబంధ కారణంబగు మృత్యువునుగ నెఱుంగవలయు, మఱియు జీవోపాధి భూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబున నుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవించుచు మరలఁ గర్మాదులం దాసక్తుం డగుచు మృగయుండు గాననంబున ననుకూల సుఖ ప్రదుండైనను మృగంబునకు మృత్యువగు చందంబున జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగి యుండు, నట్టి దేహనిరోధంబె మరణంబు, ఆవిర్భావంబె జన్మంబు, కాన సకల వస్తు విషయజ్ఞానంబు కలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబ. ద్రష్టృ దర్శనీయ యోగ్యతా ప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు గావున భయ కార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుం డగుచు యోగ్యవైరాగ్య యుక్తంబైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయు నని చెప్పి వెండియు నిట్లనియె.

తా॥ పురుష రూపాన్ని పొందిన జీవుడు నిరంతరము స్త్రీ సాంగత్యంవల్ల ధనము, సంతానము, గృహము మొదలైన వాటికి కారణభూతమైన స్త్రీగానే జన్మిస్తాడు. ఈ క్రమంలో అంగనా రూపాన్ని పొందిన జీవుడు నా మాయవల్ల పురుష రూపాన్ని పొందుతాడు. ధనాదులను సంపాదించి ఇచ్చే భర్తను ఆత్మను బంధించే మృత్యు రూపంలో తెలుసుకోవాలి. జీవునకు ఉపాధి అయిన లింగదేహంతో తనకు ఆవాసమైన ఈ లోకం నుంచి వేరు లోకాలను పొందుతూ చేసుకున్న కర్మల ఫలితాన్ని అనుభవిస్తూ తిరిగి కర్మలు చెయ్యాలని ఉద్యుక్తుడవుతూ ఉంటాడు. అరణ్యంలో వేటగాడు చేసే ఏర్పాట్లన్నీ మృగాలకు అనుకూలంగానే ఉంటాయి. కాని అవే మృత్యు ద్వారాలు. దేహాన్ని నిరోధించడమే మరణం. దేహ ఆవిర్భావమే జననం.

సృష్టిలోగల సకల వస్తువుల జ్ఞానానికి సాధనం కన్ను. చూడవలసిన దానిని చూడటం అనే యోగ్యత పొందినప్పుడు జీవునకు జననము–మరణము అనేవి లేవు. కనుక మానవుడు భయాన్ని, దైన్యభావాన్ని విడిచి వేగిరపాటు లేనివాడై జ్ఞానం ద్వారా జీవస్వరూపాన్ని తెలుసుకొని ధీరత్వంతో ఏవిధమైన బంధనాలు లేకుండా ఉచితమైన వైరాగ్యంతో కూడిన జ్ఞానాన్ని ఆర్జించాలి. మాయచేత నిండిన ఈ లోకంలో శరీరము మొదలైన వాటిపై అపేక్ష లేకుండా నడచుకోవాలి” అని చెప్పి కపిలుడు ఇంకా ఇలా అన్నాడు.

సీ. గృహమందు వర్తించు గృహమేధు లగువారు, మహిత ధర్మార్థ కామముల కొఱకు సంప్రీతు లగుచుఁ దత్సాధనానుష్ఠాన, నిరతులై వేదనిర్ణీత భూరి భగవత్సుధర్మ తద్భక్తి పరాఙ్ముఖు, లై దేవగణముల ననుదినంబు భజియించుచును భక్తిఁ బైతృక కర్మముల్, సేయుచు నెప్పుడు శిష్టచరితు

తే. లగుచుఁ దగ దేవపితృసువ్రతాఢ్యు లయిన, కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర లోకమును జెంది పుణ్యంబు లుప్త మయిన, మరలి వత్తురు భువికి జన్మంబు నొంద.

తా॥ “గృహస్థులైన వారు ధర్మార్థకామాలను సాధించటంలోనే సంతుష్టులై దానితోనే తృప్తిపడి ఆ మార్గంలోనే ఉంటారు. వేదములలో నిర్ణయింపబడిన గొప్పవైన భాగవత ధర్మాలకు, నారాయణుని యందు భక్తికి పరాఙ్ముఖులై ఉంటారు. దేవగణాలను అనుదినము భజిస్తూ భక్తితో పితృకార్యాలను చేస్తూ ఆచార సంపన్నులై ఉంటారు. దేవతలను, పితృదేవతలను ఆరాధించే కామ్యచిత్తులు ధూమ్రాది గతులలో చంద్ర లోకాన్ని చేరుకొని కొంతకాలం సుఖాలనుభవించి ఆ పుణ్యం అయిపోగానే తిరిగి భూలోకానికి వచ్చి మళ్ళీ జన్మ ఎత్తుతారు.

వ. అదియునుం గాక.

1014

తే. ప్రవిమలానంత భోగితల్పంబునందు, యోగనిద్రాళువై హరి యున్నవేళ నఖిల లోకంబులును విలయంబు నొందు, నట్టి సర్వేశ్వరునిఁ గూర్చి యలఘుమతులు.

1015

తా॥ అంతేగాకుండ విమలము అనంతము అయిన ఆదిశేషువు పానుపు మీద శ్రీహరి యోగనిద్రలో ఉన్నవేళ అఖిల లోకాలు ప్రళయాన్ని పొందుతాయి. అట్టి సర్వేశ్వరుణ్ణి బుద్ధిమంతులు ధ్యానిస్తారు.

మ. పరికింపన్ నిజభక్తియుక్తి గరిమం బాటిల్లు పంకేరుహో దర విన్యస్త సమస్త ధర్మముల శాంత స్వాంతులై సంగముం బరివర్జించి విశుద్ధచిత్తు లగుచుం బంకేజపత్రేక్షణే తర ధర్మైక నివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్.

1016

తా॥ స్థిరమైన భక్తియుక్తులతో సమస్త ధర్మాలను శ్రీహరికే సమర్పించి, శాంతమైన మనస్సుతో, అన్నిటితోను సంసర్గాన్ని విడిచిపెట్టి పరిశుద్ధమైన అంతరంగంతో శ్రీమన్నారాయణుని ఆరాధించటం తప్ప ఇతర ధర్మాలకు దూరంగా ఉంటూ ఎప్పుడూ విష్ణువునే

చింతన చేస్తూ ఉంటారు.

సీ. మఱియు నహంకార మమకార శూన్యులై, యర్థి వర్తించుచు నర్చిరాది మార్గ గతుండును మహనీయ చరితుండు, విశ్వతోముఖుఁడును విమలయశుఁడు జగదుద్భవస్థానసంహార కారణుం, దవ్యయుం డజుఁడుఁ బరాపరుండుఁ బురుషోత్తముఁడు నవ పుండరీకాక్షుండు, నైన సర్వేశ్వరునందుఁ బొంది

తే. మానితాపునరావృత్తిమార్గ మయిన, ప్రవిమలానంద తేజోవిరాజమాన దివ్యపదమున సుఖీయించు ధీరమతులు, మరలిరా రెన్నటికిని జన్మముల నొంద.

1017

తా॥ అహంకార మమకార శూన్యులై ఉంటారు. ప్రకాశవంతమైన మార్గంలో వెళ్ళే వారికి అందేవాడు, గొప్ప చరిత్ర కలవాడు, విశ్వమంతట నిండి ఉన్నవాడు, స్వచ్ఛమైన కీర్తిగలవాడు, సృష్టి యొక్క జన్మ స్థితి లయములకు కారణభూతుడైన వాడు, నాశనం లేనివాడు, పుట్టుక లేనివాడు, సర్వశ్రేష్ఠుడు, పురుషోత్తముడు, తామరపువ్వుల వంటి కన్నులు కలవాడు అయిన సర్వేశ్వరుని మీద దృష్టి నిలిపి ఉంచాలి. తిరిగి పుట్టుక లేని విమలము ఆనంద తేజో విరాజమానము అయిన దివ్యమైన స్థానంలో శాశ్వతులై సుఖించే ధీరులు మళ్ళీ జన్మ ఎత్తటం కోసం ఈ భూమి మీదికి రారు.

వ. మఱియుఁ బరమేశ్వర దృష్టిచే హిరణ్యగర్భు నుపాసించు వారు సత్యలోకంబున ద్విపరార్ధావసానంబగు ప్రళయంబుఁ దనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మ రూపంబున ధ్యానంబు సేయుచు నుండి పృథివ్యప్తేజో వాయ్వాకాశమాన సేంద్రియ శబ్దాది భూతాదులతోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకల సంహర్తయగు సమయంబున గతాభిమానంబులు గలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానంద రూపుండును సర్వోత్కృష్టుండు నగు పురాణపురుషుం బొందుదురు, కావున నీవు సర్వభూతహృదయ పద్మనివాసుండును శ్రుతానుభావుండును

నిష్కళంకుండును నిరంజనుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు నొందు మని చెప్పి మఱియును నిట్లనియె.

1018

తా॥ కొందరు హిరణ్యగర్భుడే పరమేశ్వరుడనే దృష్టిచే ఉపాసన చేస్తారు. వారు సత్యలోకంలో రెండు పరార్థాల కాలం పూర్తికాగానే వచ్చే ప్రళయం వరకు ఉండి చతురాననుడైన బ్రహ్మదేవుణ్ణి పరమాత్మగా ధ్యానం చేస్తూ ఉంటారు. బ్రహ్మ ఆయుర్దాయం పూర్తవుతుంది. నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే పంచభూతాలు, మనస్సు, పంచేంద్రియాలు, పంచతన్మాత్రలు, సమస్త ప్రకృతి, లోకాలు సకల సంహర్త అయిన పరమేశ్వరునిలో లీనమవుతాయి. అప్పుడు బ్రహ్మలోక వాసులైన ఆత్మలు బ్రహ్మతో కూడి పరమానంద స్వరూపుడు సర్వోన్నతమైన వాడు అయిన పురాణ పురుషునిలో కలిసి పోతారు. కనుక నువ్వు సకల భూతముల హృదయ పద్మములయందు నివాసముండే వాడు, కళంక రహితుడు, నిరంజనుడు, సమాన రహితుడు అయిన పురుషుణ్ణి భావంలో శరణు పొందు" మని చెప్పి తల్లితో కపిల మహర్షి ఇంకా ఇలా అన్నాడు:

మ. సకలస్థావర జంగమ ప్రతతికిం జర్చింపఁ దా నాద్యుఁడై యకలంక శ్రుతి గర్భుఁడుం బరముఁడు న్నైనట్టి యీశుండు సే వక యోగీంద్ర కుమార సిద్ధముని దేవశ్రేణి యోగ ప్రవ ర్తకమై తన్ను భజింపఁజూపు సగుణ బ్రహ్మంబు లీలాగతిన్.

1019

తా॥ "స్థావర జంగమాత్మక మైన ఈ సృష్టిలో అన్నిటికీ మొదటివాడు, అకళంకమైన వేదాల పుట్టుకకు కారణమైన వాడు, ఆద్యుడు అయినవాడు ఈశ్వరుడు. యోగీశ్వరేశ్వరులు, సనక సనందనాదులు, సిద్ధులు, మునులు దేవతలు అందరూ యోగ మార్గంలో తనను కొలువగా సగుణ రూపంలో సాక్షాత్కరిస్తాడు.

తనను ప్రేమించే పవిత్రాత్ములకోసం భగవంతుడు మానవరూపంలో (సగుణరూపంలో) అవతరిస్తాడు.

—శ్రీరామకృష్ణ పరమహంస

సీ. అట్టి సర్వేశ్వరుం డయ్యయికాలంబు, లందును దద్గుణవ్యతికరమున జనియించుచుండు, నీ చాడ్పున ఋషి దేవ, గణములు దమ తమ కర్మ నిర్మి తైశ్వర్య పారమేష్ఠ్యములందుఁ బురుషత్వ, మునఁ బొంది యధికారములు వహించి వర్తించి క్రమ్మఱ వత్తురు, మరి కొంద, ఱారూఢ కర్మానుసారమైన

తే. మనములను జాలఁ గలిగి ధర్మములయందు, శ్రద్ధతోఁ గూడి యప్రతిషిద్ధమైన నిత్యనైమిత్తికాచార నిపుణు లగుచుఁ, దగి రజోగుణ కలిత చిత్తములు గలిగి.

1020

వ. సకాములై యింద్రియ జయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజించుచు గృహంబులయందు వర్తించి హరి పరాఙ్ముఖు లగువారు త్రైవర్గిక పురుషులని చెప్పంబడుదురు.

1021

తా॥ అట్టి సర్వేశ్వరుడు కాలం అనుకూలమైనప్పుడు ఆయా గుణముల పరస్పర సమ్మేళనం చేత అనేక రూపాలలో జన్మిస్తూ ఉంటాడు. అతని అంశలతో జన్మించిన ఋషి, దేవగణాలు తమ కర్మననుసరించి పౌరుషం, ఐశ్వర్యం, పారమేష్ఠ్యం మొదలైన అధికారాలు వహించి ప్రవర్తించి తిరిగి వస్తారు. మరికొందరు కర్మానుసారమైన బుద్ధికలిగి ధార్మికమైన బుద్ధితో నిషేధింపబడని నిత్యనైమిత్తిక ఆచారాలలో నిపుణులవుతారు. నిపుణులై రజోగుణంతో కూడిన చిత్తంతో, కోరికలతో ఇంద్రియాలను జయింపలేక పితృదేవతలను పూజిస్తూ గృహస్థులై శ్రీహరిపట్ల విముఖత చూపుతూ “త్రైవర్గిక పురుషులు” అని చెప్పబడతారు.

చ. వినుత గుణోత్తరుండు నురువిక్రముఁడైన హరిన్ భజించి త న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్ విని ముద మందుచుందురు, వివేకవిహీనత నూరఁబంది యా త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషముకేగు చాడ్పునన్.

1022

తా॥ ప్రసిద్ధికెక్కిన గుణములు కలవాడు, గొప్పదైన పరాక్రమం కలవాడు అయిన శ్రీహరిని సేవిస్తూ, ఆయననే మననం చేస్తూ ఆయన కథామృతాన్ని గ్రోలటం ఉత్తమపురుషుని లక్షణము. కొందరు అలా చేయటం మాని చెడ్డ కథలను విని ఆనందపడుతూ ఉంటారు. ఇది ఎలాంటిదంటే వివేకంలేని ఊరపంది మధురమైన నేతి పిండి వంటలను తినటం మానేసి మలభక్షణం చెయ్యటం లాటిదే!

చ. అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం బొలసినవారు దొంటి తమ పుత్త్రులకుం దగఁ దాము పుట్టి వి హ్వల మతి గర్భగోళ పతనాది పరేత ధరాగతాంతమై వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ!

1023

తా॥ ధూమ మార్గం ద్వారా వెళ్ళి పితృలోకాన్ని పొంది తమపుణ్యం అయిపోగానే ఈ భూమిమీద తమ పుత్రులకే శిశువులై జన్మిస్తారు. జన్మించి భయాదుల చేత బాధపడుతూ తల్లి కడుపులోంచి బయటపడింది మొదలు శ్మశానానికి వెళ్ళే వరకు కర్మఫలాలను ఇక్కడే పొందుతారు.

క. విను సర్వభావములఁ బర, ముని ననఘు ననంతు నీశుఁ బురుషోత్తము స న్మనమున భజియింపుము ముద, మునఁ, బునరావృత్తి లేని ముక్తి లభించున్.

1024

తా॥ కనుక అమ్మా! సర్వభావాలలోను పరుడు, అనఘుడు, అనంతుడూ, ఈశ్వరుడు,

పురుషోత్తముడు అయిన సర్వేశ్వరుణ్ణి ఆనందంగా మంచి మనస్సుతో భజించు. తిరిగి పుట్టుకలేని ముక్తి లభిస్తుంది."

వ. అని చెప్పి వెండియు నిట్లనియె: భగవంతుండగు వాసుదేవునియందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబు లగు వైరాగ్యజ్ఞానంబులం జేయు, నట్టి భగవద్భక్తి యుక్తంబైన చిత్తం బింద్రియ వృత్తులచే సమంబులగు నర్థంబులందు వైషమ్యంబును బ్రియా ప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయ విరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మచేఁ జూచుచుండు, జ్ఞానరూపుండును బరబ్రహ్మంబును బరమాత్ముండును నీశ్వరుండును నగు పరమపురుషుం డేకరూపంబు గలిగి యుండియు దృశ్యద్రష్టృకరణంబులచేతం బృథగ్భావంబును బొందుచుండు, నిదియ యోగికి సమగ్రంబగు యోగంబునం జేసి ప్రాప్యంబగు ఫలంబు, కావున విషయవిముఖంబు లగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబును హేయగుణ రహితంబును నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతిం జేసి శబ్దాది ధర్మంబగు నర్థరూపంబునం దోఁచు, అది యెట్టు లర్థాకారంబునం దోఁచు నని యడిగితివేని నహంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును, భూతరూపంబునం బంచ విధంబును, నింద్రియరూపంబున నేకాదశ విధంబునై యుండు, జీవరూపుం డగు విరాట్పురుషుండు జీవవిగ్రహంబైన యండంబగు జగంబునం దోఁచుచుండు, దీని శ్రద్ధాయుక్తం బయిన భక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహిత మనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండైన వాఁడు వొడగనుచుండు, నది యంతయు బుధజన పూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి, సర్వయోగ సంప్రాప్యుండును నిర్గుణుండును భగవంతుండని చెప్పిన జ్ఞానయోగంబును, మదీయ భక్తి యోగంబును నను రెండు నొక్కటియ, యింద్రియంబులు భిన్నరూపంబులు గావున నేకరూపంబయిన యర్థం బనేక విధంబు లగున ట్లేకం బగు బ్రహ్మం బనేక విధంబులుగఁ దోఁచు, మఱియును.

తా॥ అని చెప్పి కపిల మహర్షి ఇంకా ఇలా అన్నాడు: "భగవంతుడైన వాసుదేవునియందు చూపించిన భక్తియోగం, బ్రహ్మ సాక్షాత్కారానికి కారణభూతమైన జ్ఞానవైరాగ్యాలను కలిగిస్తుంది. అట్టి భగవద్భక్తితో కూడిన మనస్సు కలవానికి ఇంద్రియ వ్యాపారాదులయందు ఎక్కువ తక్కువలు ఉండవు. ఇష్టము—అయిష్టము అంటూ ఉండదు. దేనితోను చేరిక ఉండదు. అన్నిటియందు సమభావం ఉంటుంది. స్వీకరింపతగినది—త్రోసిపుచ్చతగినది అంటూ ఉండవు. అప్పుడు ఆత్మ స్వరూపాన్ని చూస్తాడు. జ్ఞాన స్వరూపుడు, పరబ్రహ్మ, పరమాత్మ, ఈశ్వరుడు అయిన ఆ పరమపురుషుడు సర్వత్ర ఏకరూపియై ఉండి కూడా గోచరించే ఆకారాన్నిబట్టి, చూచే వారి తీరునుబట్టి, చూచే సాధనాలనుబట్టి అనేక రూపాలలో కనబడతాడు. ఇదే యోగికి సమగ్రమైన యోగంవల్ల లభించే ఫలం. విషయాల నుండి విముఖములైన ఇంద్రియాలచేత కేవల జ్ఞాన రూపము, హేయగుణ రహితము అయిన బ్రహ్మదర్శనం కలుగుతుంది. ఆ బ్రహ్మమే మనస్సు యొక్క భ్రాంతి వలన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది అర్థరూపంలో తోస్తున్నది.

ఆ బ్రహ్మమే అర్థ స్వరూపంలో ఎలా కనిపిస్తోంది? అని నువ్వు అడుగుతావేమో! విను. అహంకారం ఒక్కటే! అయినా గుణరూపాన్ని పొందినప్పుడు సత్వరజః తమములుగాను, భూత రూపాన్ని ధరించినప్పుడు నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అని అయిదు విధాలుగాను, ఇంద్రియ రూపాన్ని పొంది పదకొండు విధాలుగాను ఉంటుంది. జీవ రూపుడైన విరాట్పురుషుడు జీవ విగ్రహమైన ఈ జగత్తు అనే గ్రుడ్డులో నిండి ఉంటాడు. ఈ రహస్యాన్ని శ్రద్ధతో కూడిన భక్తితోను, యోగంచేతనూ, చక్కగా ఉంచబడిన మనస్సుగలవాడై, ఎవరితోను దేనితోను కూడిక లేకుండా ఉన్నవాడు తెలుసుకుంటాడు. తల్లీ! పండిత జనులు పూజించే చరిత్ర గలదానవు కనుక ఈ పరమ రహస్యాన్ని నీకు చెప్పాను. పరమాత్మ నిర్గుణుడని చెప్పే జ్ఞానయోగము, సగుణుడనిచెప్పే భక్తియోగమూ వాస్తవంలో రెండూ ఒక్కటే. ఇంద్రియాలు భిన్న రూపాలలో ఉంటాయి. కావున ఒకే రూపంలో ఉండే వస్తువు అనేక విధాలుగా తోచినట్లు బ్రహ్మమొక్కటే అయినా అనేక విధాలుగా కనబడుతున్నాడు.

సీ. అంబ! నారాయణుం డఖిల శాస్త్రములను, సమధికానుష్ఠిత సవనతీర్థ దర్శన జపతపోఽధ్యయన యోగక్రియా, దాన కర్మంబులఁ గానఁబడఁడ యేచిన మనము బాహ్యేంద్రియంబుల గెల్చి, సకల కర్మత్యాగ సరణి నొప్పి తలకొని యాత్మ తత్త్వజ్ఞానమున మించి, యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి

తే. మహిత ఫల సంగరహిత ధర్మమునఁ దనరు, నట్టి పురుషుండు దలపోయ, నఖిల హేయ గుణములను బాసి కల్యాణ గుణవిశిష్టుఁ, డైన హరి నొందుఁ బరమాత్ము ననఘుఁ డగుచు.

1026

తా॥ అమ్మా! అఖిల శాస్త్రాలను చదివినందువల్ల గాని, యజ్ఞాలు, తీర్థయాత్రలు, జపతపాలు, వేదాధ్యయనం వీటివల్ల గాని; యోగాభ్యాసం వల్లగాని, దానాలు మొదలైన కర్మల వల్లగాని శ్రీమన్నారాయణుడు కనిపించడు. అతిశయించిన మనస్సును లోగొని, బాహ్యేంద్రియాలను గెల్చి, సకల కర్మలను త్యాగం చేసి, ఆత్మతత్త్వ జ్ఞానియై, వైరాగ్యంతో ఫలాన్ని కోరకుండా ధర్మమార్గంలో ఉండే పురుషుడు మాత్రమే హేయమైన గుణాలను విడిచిపెట్టి కళ్యాణగుణాలతో ఒప్పారే ఆ శ్రీహరిని ఆ పరమాత్మను పొందుతాడు.

వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగ ప్రకారంబుఁ దేటపడ నెఱింగించితి, నదియునుం గాక కామరూప యగు మదీయ గతి జంతువులయందు నుత్పత్తి వినాశరూపంబుల నుండు, నవిద్యా కర్మ నిర్మితంబులైన జీవుని గతు లనేక ప్రకారంబులై యుండు, నదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతి యిట్టిదని యెఱుంగక యుండు, నని చెప్పి మఱియు నిట్లనియె. ఇట్టి యతి రహస్యంబగు సాంఖ్యయోగ ప్రకారంబు ఖలునకు, నవినీతునకు, జడునకు, దురాచారునకు, డాంబికునకు, నింద్రియలోలునకుఁ, బుత్త్ర దారాగారాద్యత్యంతాసక్త చిత్తునకు, భగవద్భక్తిహీనునకు, విష్ణు దాసులయందు ద్వేషపడువానికి నుపదేశింపవలవదు, శ్రద్ధా సంపన్నుండును, భక్తుండును, వినీతుండును,

నసూయారహితుండును, సర్వభూతమిత్రుండును, శుశ్రూషాభిరతుండును, బాహ్యార్థజాత విరక్తుండును, శాంత చిత్తుండును, నిర్మత్సరుండును, శుద్ధాత్ముండును, భక్తులయందుఁ బ్రేమ గల వాఁడును, నన్యకాంతా విముఖుండును, నిష్కాముండును నగు నధికారికి నుపదేశింప నర్హం బగు. ఈ యుపాఖ్యానం బే పురుషుండేనిఁ బతివ్రత యగు నుత్తమాంగన యేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పిత చిత్తంబున న్వినుఁ బఠియించు నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుం బ్రాపింతు రని చెప్పెనని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్టనియె. ఈ ప్రకారంబునం గర్దమదయితయైన దేవహూతి గపిలుని వచనంబుల విని నిర్ముక్త మోహపటల యగుచు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి తత్త్వ విషయాంకిత సాంఖ్యజ్ఞాన ప్రవర్తకం బగు స్తోత్రంబు సేయ నుపక్రమించి కపిలున కిట్లనియె.

1027

తా॥ అమ్మా! ఆర్తులకూ, జిజ్ఞాసువులకూ, అర్థార్థులకూ, జ్ఞానులకూ సంబంధించిన చతుర్విధ భక్తియోగ మార్గాలను నీకు వివరంగా చెప్పాను. కామరూపమగు నా గతి జంతువులలో జనన మరణ రూపాలలో ఉంటుంది. అజ్ఞానంచేత చేసే కర్మల వల్ల జీవుని ప్రవర్తన అనేక రకాలుగా ఉంటుంది. జీవాత్మ వాటిల్లో ప్రవర్తిస్తూ ఆత్మస్వరూపం ఇట్టిది అని తెలియని స్థితిలో ఉంటాడు. ఇంతవరకు చెప్పి కపిల మహర్షి తిరిగి ఇట్లా అన్నాడు:

"ఇటువంటి అత్యంత రహస్యమైన సాంఖ్యయోగ విధానాన్ని నీచునకు, నీతి హీనునకు, మూర్ఖునకు, దురాచారునకు, డంబాలు పలికే వానికి, ఇంద్రియాలకు వశమైన వానికి, పుత్రులు, భార్య, గృహము మొదలైన వాటియందు మిక్కుటమైన మనస్సుగలవానికి, భగవంతుని మీద భక్తిలేనివానికి, విష్ణుదాసులను ద్వేషించే వారికి ఉపదేశింపకూడదు. శ్రద్ధ కలవాడు, భక్తుడు, వినయ సంపన్నుడు, అసూయ లేనివాడు, సకల ప్రాణులకు మిత్రుడు, మంచి విషయాలను వినాలనే ఇచ్ఛకలవాడు, లోక విషయాలయందు విరక్తుడు, శాంతమైన మనస్సు కలవాడు, మాత్సర్యం లేనివాడు, పరిశుద్ధాత్ముడు, భక్తులయందు ప్రేమ గలవాడు, అన్యకాంతల పట్ల

విముఖత్వాన్ని చూపించేవాడు, నిష్కాముడు అయిన వానికి ఉపదేశింపవచ్చు.

ఈ ఉపాఖ్యానాన్ని పురుషుడు ఎవ్వరైనా, పతివ్రత అయిన ఏ ఉత్తమ స్త్రీ అయినా శ్రద్ధా భక్తులతో నాకు అర్పింపబడిన మనస్సుతో వినినా, చదివినా అటువంటి పుణ్యాత్ములు నా దివ్యస్వరూపాన్ని పొందుతారు." ఇంతవరకు చెప్పి మైత్రేయుడు విదురునితో ఇట్లా అన్నాడు: "ఈ విధంగా కర్దమ ప్రజాపతి భార్య అయిన దేవహూతి కపిల మహర్షి మాటలు విని మోహం తొలగి పోగా సాష్టాంగ దండప్రణామాలు చేసి తాత్త్విక విషయాలతో కూడిన సాంఖ్య జ్ఞానంతో స్తోత్రం చెయ్యడానికి ఉపక్రమించింది.

సీ. అనయంబు విను మింద్రియార్థ మనోమయం, బును భూతచయమయంబును నశేష భూరి జగద్బీజ భూతంబును గుణప్ర, వాహ కారణమును వలను మెఱయు నారాయణాభిఖ్య నాఁ గల భవదీయ, దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు చారు భవద్గర్భ సంజాతుఁ డగునట్టి, కమల గర్భుండు సాక్షాత్కరింప

తే. లేక మనమునఁ గనియె ననేకశక్తి, వర్గములు గల్గి సుగుణప్రవాహరూప మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి, కలితుఁడై సర్వకార్యముల్ గలుగఁజేయు.

1028

తా॥ "ఇంద్రియాలు, ఇంద్రియార్థాలు, మనస్సు, పంచభూతాలు వీటితో నిండి అశేషమైన ఈ జగత్తుకు బీజ భూతమై సత్త్వరజస్తమోగుణ ప్రవాహానికి కారణమై నారాయణ నామంతో నీ దివ్య మంగళ మూర్తి ప్రకాశిస్తూ ఉంటుంది. అట్టి నిన్ను నీ గర్భసంజాతుడైన బ్రహ్మదేవుడు సైతం దర్శింపలేక నిన్ను ప్రార్థించి మనస్సులో చూడగలిగాడు. అలా చూసి అనేక శక్తి వర్గములు కలిగి, సుగుణముల యొక్క ప్రవాహ రూపాన్ని పొంది ఈ విశ్వాన్ని సృష్టించగలిగాడు. సర్వ కార్యములు అనంతమైన శక్తితో నిర్వహిస్తున్నాడు.

వ. అంత.

1029

తే. అతుల భూరి యుగాంతంబునందుఁ గపట, శిశువవై యొంటి కుక్షి నిక్షిప్త నిఖిల భువన నివహుండవై మహాంభోధి నడుమఁ, జారు వటపత్ర తల్పసంస్థాయి వగుచు.

1030

తా॥ యుగాంతంలో నిఖీల భువనాలను నీ కుక్షిలో దాచుకుని జలరాశి మధ్య మర్రి ఆకును తల్పంగా చేసుకొని మాయా శిశువుగా ఒంటరిగా నిద్రిస్తూ ఉంటావు.

తే. లీల నాత్మీయ పాదాంగుళీ వినిర్గ, తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు గడఁగి నా పూర్వభాగ్యంబు కతన నిపుడు, పూని నాగర్భమున నేఁడు పుట్టితయ్య!

1031

తా॥ లీలగా నీ కాలి బొటన వ్రేలిని నోట్లో పెట్టుకొని దానినుండి వచ్చే అమృతాన్ని గ్రోలుతూ ఉంటావు. నా పూర్వపుణ్య భాగ్యవిశేషం వల్ల నా గర్భాన జన్మించావు.

వ. అట్టి పరమాత్ముండ వయిన నీవు.

1032

సీ. వరుస విగ్రహ పారవశ్యంబునను జేసి, రఘురామ కృష్ణ వరాహ నార సింహాది మూర్తు లంచితలీల ధరియించి, దుష్టనిగ్రహమును శిష్టపాల నమును గావించుచు నయమున సద్ధర్మ, నిరత చిత్తులకు వర్ణింపఁ దగిన చతురాత్మతత్త్వ విజ్ఞాన ప్రదుండవై, వర్తింతు వనఘ! భవన్మహత్త్వ

తే. మఱున కయినను వాక్రువ్వ నలవి గాదు, నిగమ జాతంబు లయిన వర్ణింపలేవ యెఱిఁగి సంస్తుతి సేయ నే నెంత దాన?, వినుత గుణశీల! మాటలు వేయు నేల?

1033

తా॥ పరమాత్ముడవైన నీవు అవతారాల మీద పారవశ్యంతో, రామచంద్రునిగా, శ్రీకృష్ణునిగా, వరాహ మూర్తిగా, నారసింహ మూర్తిగా ఇంకా అనేక అవతారాలు ధరించి దుష్టనిగ్రహం, శిష్టపాలనం చేస్తావు. సద్ధర్మనిరతులైన వారికొరకు వాసుదేవ, సంకర్షణ, అనిరుద్ధ, ప్రద్యుమ్న వ్యూహాలలో విజ్ఞాన ప్రదుడవై ప్రవర్తిస్తావు. నీ మహత్త్వాన్ని వర్ణించటం బ్రహ్మదేవునికి, వేదాలకు కూడా చేతకాలేదంటే నేనెంత దాన్ని. వేయి మాటలేల? నిన్ను తెలుసుకోవటం అసాధ్యమైన పని!

వ. అదియునుం గాక.

1034

క. ధీమహిత! భవన్మంగళ, నామస్మరణానుకీర్తనము గల హీనుల్ శ్రీమంతు లగుదు, రగ్ని, ష్టోమాదికృదాళికంటె శుద్ధులు దలఁపన్.

1035

తా॥ అంతే కాదు! నీ యొక్క మంగళకరమైన నామాన్ని స్మరించటం గాని, కీర్తించటంగాని చేసిన హీనులు సైతం శ్రీమంతులవుతారు. అంతే కాదు అగ్నిష్టోమ, జ్యోతిష్టోమాది క్రతువులు చేసిన వారికంటే శుద్ధులు అవుతారు.

వ. అదియునుం గాక.

1036

క. నీ నామస్తుతి శ్వపచుం, డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్ వానికి సరి భూసురుఁడుం, గానేరఁడు చిత్ర మిది జగంబుల నరయన్.

1037

తా ॥ అంతే గాకుండా... నీ నామాన్ని చండాలుడైనా సరే నాలుక చివర జపించినట్లైతే బ్రాహ్మణుడైనా సరే వానికి సరికాలేదు. లోకంలో ఈ విషయం చాలా చిత్రమైనది.

ఉ. ఈవిధ మాత్మలం దెలిసి, యెప్పుడు సజ్జనసంఘముల్ జగ త్పావనమైన నీ గుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వ తీ ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల మందుదు రంచు సమస్త వేదముల్ వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్య లుత్తముల్.

1038

తా॥ ఈ విషయాన్ని ఆత్మలో తెలుసుకున్న సహృదయులు జగత్తునంతటిని పావనం చేసే నీ గుణ కథామృతాన్ని తృప్తిగా గ్రోలుతారు. అట్టివారికి సర్వ తీర్థాలలో స్నానం చేసిన ఫలం వస్తుంది అని సమస్త వేదరాశి గొప్పగా చాటుతోంది. కావున వాళ్ళే ధన్యులు, మాన్యులు, ఉత్తములు.

వ. అది గావునఁ బరబ్రహ్మంబవును, బరమ పురుషుండవును, బ్రత్యఙ్మనో భావ్యుండవును, సమస్త జన పాపనివారక స్వయం ప్రకాశుండవును, వేదగర్భుండవును, శ్రీ మహావిష్ణుండవును నగు నీకు వందనంబు లాచరించెద నని స్తుతియించినం బరమ పురుషుండును. మాతృవత్సలుండును నగు కపిలుండు గరుణారసార్ద్ర హృదయ కమలుండై జనని కిట్లనియె.

1039

తా॥ కనుక పరబ్రహ్మవు, పరమ పురుషుడవు, ఆంతర్యంలోను బాహ్యంలోను సమ్మానించతగిన వాడవు, సమస్త జనుల పాపాలను నివారించే వాడవు, స్వయం ప్రకాశుడవు, వేదగర్భుడవు, శ్రీ మహావిష్ణు స్వరూపుడవు అగు నీకు ప్రణామం." ఈ ప్రకారంగా దేవహూతి స్తుతించగా పరమ పురుషుడు, మాతృవత్సలుడు అయిన కపిల మహర్షి కరుణారసార్ద్ర హృదయుడై తల్లితో ఇట్లా అన్నాడు:

తే. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు, నైన యీ యోగమార్గ మే నంబ! నీకు నెఱుఁగ వివరించి చెప్పితి, నిది దృఢంబు, గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన!

1040

తా॥ "అమ్మా! బ్రతికి ఉన్నంత కాలము సుఖాన్ని, మరణానంతరము మోక్షాన్ని ఇచ్చే ఈ యోగమార్గాన్ని నీకు తెలిసేటట్లుగా వివరించి చెప్పాను. నేను చెప్పిన దాని మీద నమ్మకంతో దృఢంగా అనుష్ఠించు.

క. జీవన్ముక్తి లభించుం, గావున నేమఱక తలఁపు కైకొని దీనిన్ వావిరి నొల్లని వారికిఁ, దావల మగు మృత్యుభయము, దవ్వగు సుఖమున్.

1041

తా॥ ఏమరుపాటు లేకుండా ఏకాగ్రచిత్తంతో అనుష్ఠించిన వారికి తప్పక జీవన్ముక్తి కలుగుతుంది. దీనియందు అనాదరం చూపిన వారికి మృత్యుభయం కలిగి సుఖం దూరమవుతుంది."

క. అని యిట్లు దేవహూతికి, మన మలరఁగఁ గపిలుఁ డాత్మ మార్గం బెల్లన్ వినిపించి చనియె నని విదు, రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్.

1042

తా॥ ఈ ప్రకారంగా కపిల మహర్షి దేవహూతికి మనస్సు సంతోషించేటట్లు ఆత్మతత్త్వాన్ని ఉపదేశించి వెళ్ళాడు" అని విదురునితో మైత్రేయ మహర్షి అన్నాడు.

వ. అట్లు కపిలుం డేగిన పిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటియైన కర్దమునిం దనయుండైన కపిలునిం బాసి నష్టవత్సయగు గోవు చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమ తపస్సామర్థ్యంబున నైనయట్టి.

1043

తా॥ ఆ విధంగా కపిల మహర్షి వెళ్ళిపోయిన అనంతరం, దేవహూతి పుత్రుడు చెప్పిన యోగమార్గంలో విజ్ఞానాన్ని పొంది కూడా బాధపడక తప్పలేదు. తన భర్త అయిన కర్దమ ప్రజాపతి, తనయుడైన కపిలుడు తనను విడిచి వెళ్ళిపోయినందువల్ల దూడను పోగొట్టుకొన్న ఆవు మాదిరిగా బాధపడుతూ కపిలుణ్ణి తలచుకోసాగింది.

ఉ. మానిత సౌరభప్రసవ మంజుల పక్వ ఫలప్రవాళ భా రానత చూత పోత విటపాగ్ర నికేతన రాజకీర స మ్మాని సుఖానులాప పరిమండిత కర్దమతాపసాశ్రమో ద్యాన వన ప్రదేశ కమలాకర తీర నికుంజ పుంజముల్.

1044

తా॥ దేవహూతి ఈ విధంగా బాధపడుతూ కర్దముడు సృష్టించిన తాపసాశ్రమం వైపు చూచింది. నాలుగు దిక్కులా సౌరభాన్ని విరజిమ్మే పూగుత్తులతో, ఫలాలతో, చిగుళ్ళతో, వంగిన కొమ్మలతో మామిడి గున్నలు నేత్రానందకరంగా ఉన్నాయి. వాటి చిగురు కొమ్మల మీదున్న రాచిలుకలు సుఖంగా కూస్తున్నాయి. కొంచెం ముందుకు వెడితే కమలములతో నిండిన కొలనులు, దాని తీరంలో పూపొదరిండ్లు కనుపించాయి.

వ. వెండియు.

1045

సీ. అంచిత స్ఫటిక మయ స్తంభ దీప్తిచేఁ, గొమరారు మరకత కుడ్యములను సజ్జాతి వజ్రాల సజ్జాలరుచులచే, భాసిల్లు నీల సోపానములను దీపించు చంద్రకాంతోపలవేదుల, విద్రుమ దేహళీ విలసితముల హాటక రత్న కవాట శోభితముల, నలరిన సౌధశాలాంగణముల

తే. వర పయః ఫేన పటల పాండు రకరీంద్ర, దంత నిర్మిత ఖట్వాతి ధవళ పట్ట రచిత శయ్యాళులను జతురంతయాన, కనక పీఠాది వస్తు సంఘముల నెల్ల.

1046

తా॥ ఇంకా... అక్కడొక భవనం ఉంది. అది స్ఫటిక స్తంభాలతో, గరుడ పచ్చలు చెక్కిన గోడలతో, జాతి వజ్రాల గవాక్షములతో, నీలములు స్థాపితం చేయబడిన సోపానములతో, చలువరాతి అరుగులతో, పగడాలు పొదిగిన గడపలతో, రత్న కవాటాలతో అలరారుతూ ఉంది. ఆ సౌధశాలల్లో పాలనురుగు వంటి ఏనుగుదంతాలతో చేయబడ్డ పందిరి మంచం మీద తెల్లని పట్టు పరుపులు పరచి ఉన్నాయి. ఒకప్రక్క మంచి ముత్యాలచే అలంకరింపబడిన పల్లకులు, మరొక ప్రక్క బంగారు పీటలు మొదలైన వస్తువులు అలంకరింపబడి ఉన్నాయి.

వ. మఱియు వికచకమల కుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధి గంధవహ శోభితంబును నరవింద నిష్యంద కందళిత మరంద రసపాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబునునై చెలువారు బావులు గలిగి, పురందర సుందరీ నందితంబైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీ బిందు సరోవరంబులం ద్రిషవణ స్నానంబు గావించుచు నుగ్రతపోభారంబునం గృశీభూత శరీరయై నిజకుమారుండును బ్రసన్న వదనుండును గపిల నామధేయుండును నగు నారాయణుని సమస్త న్యస్త చింతనలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపం బైన భక్తి యోగంబునను నధికవైరాగ్యంబునను యుక్తానుష్ఠాన జాతంబై బ్రహ్మాత్వాపాదకంబగు జ్ఞానంబును విశుద్ధ మనంబును గలిగి.

1047

తా॥ వికసించిన పద్మాలు, కలువలు, సౌగంధిక పుష్పాలు మంచి వాసనలను విరజిమ్ముతున్నాయి. దిగుడు బావులలో వికసించిన అరవిందాలలో మధుర మకరందాన్ని పానంచేసి తుమ్మెద గుంపులు ఝుంకారాలు చేస్తున్నాయి. దేవకాంతలకు సైతం ప్రమోదాన్ని చేకూర్చే కర్దమాశ్రమాన్ని విడిచిపెట్టి దేవహూతి తపస్సుకు ఉపక్రమించింది. ఆమె కుటిల కుంతలాలు జడలు కట్టాయి. సరస్వతీ నదిలోని బిందు సరోవరంలో ఉదయ మధ్యాహ్న సాయంకాలములందు మంత్రపూతంగా స్నానం చెయ్యసాగింది. ఉగ్రతపోభారంచేత ఆమె

శరీరం బాగా చిక్కిపోయింది. ఆమె తన కుమారుడు, ప్రసన్నవదనుడు కపిల నామధేయుడుగా అవతరించిన శ్రీహరిని ఎన్నో విధాల ధ్యానం చెయ్యసాగింది. ప్రవాహరూపమైన భక్తియోగం చేతను, అధిక వైరాగ్యం వల్లను, అనుష్ఠానం వల్లను మనస్సు పరిశుద్ధమై చివరకు బ్రహ్మజ్ఞానం ప్రాప్తించింది.

సీ. అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతో, ముఖుఁ డనంతుఁడుఁ బరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర, మహిమ నిరస్త సమస్త భూరి మాయాంధకారుఁ
డమేయుఁ డీశ్వరుఁ డగు, నా పరబ్రహ్మంబునం దవిరత బద్ధతత్త్వ జ్ఞాన పరతచే నిర్ముక్త,
జీవ భావమున విశిష్టయోగ

తే. భవ్యసంప్రాప్త నిర్మల బ్రహ్మభావ, ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు
నపునరావృత్త మగు త్రిగుణప్రధాన, తత్త్వముల నొప్పి సంతతోదారనియతి.

1048

తా॥ దేవహూతి ప్రతిక్షణము ఆత్మనాయకుడు, విశ్వతోముఖుడు, అనంతుడు, అద్వితీయుడు, అజుడు, చతురుడు, జ్ఞానమనే దీపకాంతుల ప్రభావంచేత మాయ అనే అంధకారాన్ని దూరం చేసేవాడు, అమేయుడు, ఈశ్వరుడు అయిన పరబ్రహ్మమునందు చిత్తాన్ని నిలిపింది. ఆమెకు జీవభావం తొలగిపోయింది. తత్త్వజ్ఞానం అలవడింది. బ్రహ్మసమాధి సిద్ధించి పునరావృత్తి రహితమైన ప్రవృత్తి ఏర్పడింది.

తే. కలలఁ దోఁచిన వస్తుసంఘముల, మేలు, కొని కనుంగొనఁగా లేని మనుజు పోల్కిఁ
బొలఁతి తన యాత్మ మఱచి యిమ్ముల సధూమ, మైన పావకుగతి నుండె నంతలోన.

1049

తా॥ స్వప్నంలో తోచిన వస్తు సమూహాలను మేల్కొన్న తర్వాత చూడలేని విధంగా దేవహూతి అస్తిత్వాన్ని మరచి పొగలేని అగ్నివలె వెలుగొందింది.

క. గురుయోగ శక్తి చే నం, బర తలమున కెగసి సత్కృపామయుఁడగు నా పరవాసుదేవు చరణాం, బురుహ యుగన్యస్త చిత్తము గలది యగుచున్.

1050

తా॥ గొప్పదైన యోగశక్తిచే అంబరాని కెగసి కృపామయుడైన పరవాసుదేవుని చరణపద్మాల మీద వ్రాలిన చిత్తము కలది అయింది.

వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె, నయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు "సిద్ధిపదం" బనుపేరం బరఁగి ప్రసిద్ధి వహించె, అంత నక్కడఁ గపిలుండు తల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధ చారణ గంధర్వాప్సరోముని నివహ సంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణ పూజా నికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగు యోగంబు నవలంబించి లోకత్రయ శాంతి కొఱకు సమాహితుండై స్వపిత్రాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయ మహాముని విదురున కిట్లనియెఁ, దండ్రీ! యీ యుపాఖ్యానంబును నాకు గోచరించిన రీతి నీకుం జెప్పితి, నిది కపిల "దేవహూతి సంవాదం" బత్యంత పావనంబు, గపిల ప్రణీతంబు నయిన యోగంబు, దీనిం బరమభక్తి యుక్తుండై యెవ్వండు పఠించు, నెవ్వండు విను, నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడ ధ్వజుండయిన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదురని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుక యోగీంద్రుండు పరీక్షన్నరేంద్రునకుం జెప్పెనని సుతుండు శౌనకాది మహామునులకు నీ కథా వృత్తాంతంబు సెప్పిన విని ప్రహృష్ట హృదయులై మునికులోత్తమా! భవద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మనంబులం దనివోవ, దింకను దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు.

1051

తా॥ ఈ విధంగా కపిల మహర్షి చెప్పిన మార్గంలో దేవహూతి శ్రీహరిలో లీనమైంది.

ఆమె మోక్షాన్ని పొందిన క్షేత్రం "సిద్ధిపదం" అనే పేరుతో ప్రసిద్ధి వహించింది. ఇక కపిలుడు తల్లి దగ్గర అనుజ్ఞను పొంది సిద్ధులు, చారణులు, గంధర్వులు, అప్సరసలు, మునులు... ఈ సమూహం చేసే స్తుతులు అందుకొంటూ సాగర తీరానికి చేరి అక్కడ సముద్రుడు అర్పించిన పూజలు గైకొని కానుకలు గ్రహించాడు. సాంఖ్యాచార్యులచే పొగడతగిన యోగ మార్గాన్ని అవలంబించి లోకత్రయానికి శాంతిని కోరి తండ్రిగారి ఆశ్రమాన్ని విడిచి స్థిరసంకల్పంతో ఉత్తర దిక్కుగా వెళ్ళాడు."

అని మైత్రేయ మహాముని విదురునితో ఇట్లా అన్నాడు: "నాయనా! ఈ ఉపాఖ్యానాన్ని నాకు తెలిసిన రీతిలో నీకు చెప్పాను. ఈ "కపిల దేవహూతి సంవాదం" మిక్కిలి పావనమైనది. దీనినే కపిల ప్రోక్తమైన యోగశాస్త్రం అంటారు. దీనిని పరమ భక్తితో ఎవ్వడు చదువుతాడో, లేక వింటాడో అట్టి పుణ్యాత్ములు పాపరహితులై గరుడ కేతనుడైన పుండరీకాక్షుని శ్రీచరణారవిందాలను చేరుకుంటారు. ఈ విధంగా మైత్రేయుడు విదురునకు చెప్పిన ప్రకారంగా శుకయోగి పరీక్షిన్నరేంద్రునికి చెప్పాడని సూతుండు శౌనకాది మహామునులకు ఈ కథావృత్తాంతం చెప్పాడు. దీనిని వినిన మునులు సంతోష హృదయులై 'ఓ! మునికులోత్తమా! ప్రవాహ రూపమైన శ్రీహరి యొక్క కథామృతాన్ని ఎంతత్రాగినా మా మనస్సులకు తృప్తి కలగటం లేదు. ఇంకా ఆ తరువాత వృత్తాంతాన్ని మాకు వివరంగా చెప్పడానికి నువ్వే తగినవాడవు అని అడిగారు.

చ. జనకసుతా మనో విమల సారస కోమల చంచరీక! చం దన శరదిందు కుంద హర తార మరాళ పటీర చంద్రికా వినుత యశోవిశాల! రఘువీర! దరస్మిత పద్మపత్ర లో చన! నిటలాంబక ప్రకట చాపవిఖండన! వంశమండనా!

1052

తా॥ ఓ రఘుకుల చంద్రా! రామచంద్రా! జనకనందిని అయిన సీతాదేవి స్వచ్ఛమైన హృదయ సరోజంలో విహరించే తుమ్మెదవు. మంచి గంధంవలె, శరత్కాలంలోని చంద్రునివలె,

మొల్ల పువ్వువలె, ముక్కంటివలె, నక్షత్రమువలె, రాయంచవలె, చందనంవలె, వెన్నెలవలె ప్రసిద్ధికెక్కిన కీర్తి గలవాడవు. మందహాసం చిందించే పద్మపత్రాల వంటి కన్నులు గలవాడవు. ముక్కంటి విల్లును విరిచిన వాడవు. సూర్య వంశానికి భూషణమైన వాడవు.

తరలము :

పరమపావన! విశ్వభావన! బాంధవ ప్రకరావనా! శరధిశోషణ! సత్యభాషణ! సత్కృపామయ భూషణా! దురిత తారణ! సృష్టికారణ! దుష్టలోక విదారణా! ధరణిపాలన! ధర్మశీలన! దైత్యమర్దన ఖేలనా!

1053

తా॥ దేవా! నువ్వు పరమ పావనుడవు! విశ్వభావనుడవు! బంధుజనావనుడవు! సముద్రజల శోషణుడవు! సత్యభాషణుడవు! సత్కృపామయ భూషణుడవు! దురితముల నుండి తరింపచేసే వాడివి! సృష్టికారణుడవు! దుష్ట సమూహాలను శిక్షించే వాడివి! ఈ భూమిని పాలించే వాడివి! ధర్మమే శీలంగా గలవాడివి! దైత్యులను మర్దించే వాడివి!

మాలిని :

దివిజగణశరణ్యా! దీపితానంతపుణ్యా! ప్రవిమల గుణజాలా! భక్తలోకానుపాలా! భవ తిమిర దినేశా! భానుకోటి ప్రకాశా! కువలయ హితకారీ! ఘోరదైత్య ప్రహారీ!

1054

తా॥ నువ్వు దివిజ గణములకు శరణ్యుడవు! అనంత పుణ్యుడవు! స్వచ్ఛమైన గుణాలు కలవాడవు! భక్తులను పాలించేవాడవు! సంసారమనే తిమిరానికి సూర్యుడిలాంటి వాడివి! కోటి మంది సూర్యుల ప్రకాశం కలవాడివి! లోకాలకు హితం చేసేవాడివి! క్రూరులైన దైత్యులను శిక్షించే వాడివి!

గద్యము :

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు విదురనీతియు, విదురుని తీర్థాగమనంబును, నుద్ధవ సందర్శనంబును, గౌరవయాదవ కృష్ణాది నిర్యాణంబును, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదురమైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, మహదాదుల సంభవ ప్రకారంబును, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరాడ్విగ్రహ ప్రకారంబును, శ్రీ మహాభాగవత భక్తి కారణంబగు పద్మ సంభవు జన్మప్రకారంబును, బ్రహ్మతపంబును, బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు బ్రత్యక్షం బగుటయు, బ్రహ్మకృతం బయిన విష్ణు స్తోత్రంబును, గమలసంభవుని మానససర్గంబును, బరమాణువుల పుట్టువును, భూర్భువస్సువరాది లోకవిస్తారంబును, గాల దివస మాస వత్సరాది నిర్ణయంబును, నాయుః పరిమాణంబును, జతుర్యుగ పరిమాణంబును, బద్మసంభవు సృష్టిభేదనంబును, సనకాదుల జన్మంబును, స్వాయంభువ మనువు జన్మంబును, శ్రీహరి వరాహావతారంబును, భూమ్యుద్ధరణంబును, సూకరాకారుండైన హరిని విధాత స్తుతియించుటయు, దితి కశ్యప సంవాదంబును, గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయు, గశ్యపువలన దితి గర్భంబు ధరియించుటయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబున కరుగుటయు, నందు జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు, శ్రీహరి దర్శనంబును, బ్రాహ్మణ ప్రశంసయు, సనకాదులు హరిని నుతించుటయు, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మప్రకారంబును, హిరణ్యాక్షుని దిగ్విజయంబును, సవన వరాహ హిరణ్యాక్షుల యుద్ధంబును, బ్రహ్మస్తవంబును, హిరణ్యాక్ష వధయు, నమర గణంబులు శ్రీహరి నభినందించుటయు, హరి వరాహావతార విసర్జనంబు సేయుటయును, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవంబును, గర్దమ మహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ, గర్దముండు స్వాయంభువ మనుపుత్త్రియైన దేవహూతిం బరిణయం బగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగ కల్పితంబగు

విమానంబునందు నిలిచి సహస్రదాసీ పరివృతయైన దేవహూతింగూడి భారతాది వర్షంబులు గలయం గ్రుమ్మరుటయు, దేవహూతి కర్దముని వలన గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ, దత్కన్యకా వివాహంబులును, కర్దముని తపోయాత్రయుఁ గపిల దేవహూతి సంవాదంబును, శబ్దాది పంచతన్మాత్రల జన్మప్రకారంబును, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును, బ్రకృతి పురుష వివేకంబును, నారాయణుని సర్వాంగ స్తోత్రంబును, సాంఖ్యయోగంబును, భక్తియోగంబును, జీవునకైన గర్భసంభవ ప్రకారంబును, జంద్రసూర్య మార్గంబును, బితృమార్గంబును, దేవహూతి నిర్యాణంబును, గపిల మహాముని దపంబునకుం జనుటయు నను కథలు గల తృతీయస్కంధము.

1055

తా॥ శ్రీమద్ భాగవతమనే ఈ మహా పురాణాన్ని పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుడు, కేసన మంత్రిగారి పుత్రుడు, సహజ పాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించాడు.

ఈ మహాగ్రంథంలో విదురనీతి, విదురుని తీర్థయాత్ర, ఉద్ధవ సందర్శనం, కౌరవ యాదవ నిర్యాణం, శ్రీకృష్ణ నిర్వాణం, విదురుడు మైత్రేయ మహామునిని దర్శించడం, విదుర మైత్రేయ సంవాదం, జగదుత్పత్తి లక్షణం, మహదాదుల సంభవ ప్రకారం, మహదాదులు నారాయణుని అభినందించడం, విరాడ్విగ్రహ ప్రకారం, బ్రహ్మదేవుని జన్మప్రకారం, బ్రహ్మదేవుని తపస్సు, బ్రహ్మకు విష్ణుదేవుడు ప్రత్యక్షం కావడం, బ్రహ్మదేవుడు విష్ణుదేవుని స్తుతించడం, చతుర్ముఖుని మానస సృష్టి, పరమాణువుల జన్మం, భూలోకం, భువర్లోకం, సువర్లోకం మొదలైనవాని విస్తారం; దిన మాస సంవత్సరాది కాలనిర్ణయం, ఆయుః పరిమాణం, చతుర్యుగాల పరిమాణం, బ్రహ్మదేవుని సృష్టి భేదనం, సనక సనందనాదుల జననం, స్వాయంభువ మనువు జననం, శ్రీహరి వరాహావతార ధారణం, భూమిని ఉద్ధరించడం,

యజ్ఞవరాహ మూర్తియైన హరిని బ్రహ్మదేవుడు స్తుతించడం, దితి కశ్యపుల సంవాదం, కశ్యపుడు రుద్రుణ్ణి ప్రశంసించడం, దితి గర్భధారణం, దేవతలు భయపడి బ్రహ్మదేవునితో విన్నవించుకోవటం, సనక సనందనాదుల వైకుంఠాగమనం, జయ విజయులు నిరోధించడం, శాపప్రాప్తి, శ్రీహరి సందర్శనం, బ్రాహ్మణ ప్రశంస, సనకాదులు శ్రీహరిని సంస్తుతించడం, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జననం, హిరణ్యాక్షుని దిగ్విజయం, యజ్ఞవరాహ హిరణ్యాక్షుల యుద్ధం, బ్రహ్మస్తవం, హిరణ్యాక్ష సంహారం, దేవతలు శ్రీహరిని అభినందించడం, వరాహావతార విసర్జనం, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవం, కర్దమ మహాముని తపస్సు, శ్రీహరి సాక్షాత్కారం, కర్దముడు దేవహూతిని వివాహమాడటం, కర్దముడు దేవహూతితో కలిసి తన తపః ప్రభావం చేత నిర్మితమైన విమానం మీద విహరించడం, దేవహూతికి తొమ్మిది మంది కన్యకలు కపిలుడనే కుమారుడు జన్మించడం, కన్యకల వివాహం, కర్దముని తపోయాత్ర, కపిలదేవహూతి సంవాదం, పంచతన్మాత్రల జన్మప్రకారం, బ్రహ్మోండోత్పత్తి, విరాట్పురుషుని స్వరూపం, కర్మేంద్రియ పరమాత్మల స్వరూపం, ప్రకృతి పురుష వివేకం, శ్రీహరి సర్వాంగ స్తోత్రం, సాంఖ్యయోగం, భక్తియోగం, జీవుని గర్భసంభవ ప్రకారం, చంద్ర సూర్య మార్గం, పితృ మార్గం, దేవహూతి పరమపద ప్రాప్తి, కపిలుని తపోవన గమనం అనే కథలుగల తృతీయ స్కంధము.

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీ మహాభాగవతము – రెండవ సంపుటము

చతుర్థ, పంచమ, షష్ఠమ స్కంధములు


అనువాదకులు:

డాక్టర్ బి.వెంకటేశ్వర్లు

డాక్టర్ టి.రాజగోపబాలం

శ్రీ విశ్వనాథం సత్యనారాయణమూర్తి



రామకృష్ణ మఠం

దోమలగూడ హైదరాబాదు – 500 029

# ముందుమాట

సనాతన ధార్మిక స్పృహను ఈ జాతికి ఊపిరిగా అందించిన అద్భుత ప్రక్రియ 'పురాణం'. సనాతన ధర్మాన్ని సామాన్యులకు అందించే అసామాన్య గ్రంథం, మహాపురాణం 'శ్రీ మహాభాగవతం'. భగవంతుని ద్వారా చెప్పబడినది భగవద్గీత అయితే భగవంతుడి గురించి చెప్పబడింది భాగవతం. ఈ మహాగ్రంథాన్ని సమకాలీన సమాజానికి అన్వయిస్తే యుగధర్మం ఆవిష్కృతమవుతుంది. భాగవత దివ్యగ్రంథంలో అంతటా అంతర్యామిగా వెలుగుతున్నవాడు నారాయణుడైన శ్రీకృష్ణుడు. భాగవత మహాపురాణానికి అక్షర రూపాన్నీ, అక్షరమైన రూపాన్నీ అందించిన వాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవానుడు. భాగవత పురాణాన్ని తెలుగువారికి తేనెల విందుగా చేసినవాడు సహజకవి బమ్మెర పోతనామాత్యుడు. 'పలికెడిది భాగవతమట! పలికించెడి వాడు రామభద్రుండట!...' అనే భాగవతంలోని పద్య పాదం తెలుగువారి లోగిళ్ళలో వినసొంపుగా వినిపిస్తుంది. సాక్షాత్తూ శ్రీరామచంద్రుడే తెలుగులోకి అనువదించమని ఆనతిని ఇవ్వడం ద్వారా ఈ మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీ మహాభాగవతం ఈశ్వర ప్రేరితమై, తెలుగువారి అభిమాన కావ్యమై తరతరాలుగా తెలుగు హృదయాలను రంజింపచేస్తున్నది.

'జ్ఞానం అనే వెన్నతో కాచబడి భక్తి అనే మధురామృతంలో ముంచబడిందే భాగవతం' అంటారు భగవాన్ శ్రీరామకృష్ణులు. భక్తి, జ్ఞానాల సమ్మిశ్రితమైన భాగవతంలో భక్తి ద్వారా బ్రహ్మజ్ఞానం ఎలా సంపన్నమవుతుందో వివరించబడింది. కలియుగ జీవులకు భాగవతం అలౌకికమైన మార్గాన్ని చూపింది. ఇటువంటి భాగవత నవనీతాన్ని 2007 వ సంవత్సరంలో రామకృష్ణ మఠం, తిరుమల తిరుపతి దేవస్థానం సంయుక్తంగా ముద్రించడం జరిగింది. అయితే

పాఠకులు మరియు పండితుల అభ్యర్థన మేరకు రామకృష్ణ మఠం వారు కొంతమంది విద్వాంసులచే పోతన విరచిత భాగవతానికి తాత్పర్యాలను సరళభాషలో రాయించి సందర్భానుసారం వివరణను పొందుపరచడం జరిగింది. ఆ వివరణ ఏ పద్య తాత్పర్యానికి అవసరమో దాని క్రిందే పొందుపరచడం జరిగింది. పాఠకులు గమనించగలరు. ఈ మహాభాగవత యజ్ఞంలో పాల్గొన్న అనువాదకులందరికీ మా ధన్యవాదాలు.

శ్రీ మహాభాగవతం రెండవ భాగంలోని చతుర్థ స్కంధాన్ని డాక్టర్ బి.వెంకటేశ్వర్లు గారు అనువదించగా పంచమ స్కంధానికి డాక్టర్ టి.రాజగోపబాలం గారు, షష్ఠమ స్కంధానికి శ్రీ విశ్వనాథం సత్యనారాయణమూర్తి గారు అనువాదాలను అందించారు. వీరందరికీ మా కృతజ్ఞతలు. ఇక ఈ బృహత్ యజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ ఒక్కరికీ మా ధన్యవాదాలు.

పాఠకులు ఈ మహాభాగవత కథా సుధారసాన్ని గ్రోలి, భాగవత ధర్మాన్ని అనుష్ఠించి, అమృతత్త్వాన్ని చేరుకోవాలని మా ఆకాంక్ష, అభిలాష.

— ప్రకాశకులు

శ్రీ విలసితధరణీతన
యావదనసరోజ వాసరాధిప!
సిత రాజీవదళనయన! నిఖిల ధరావరనుత!
సుగుణధామ! రాఘవరామా!

1

తా ॥ అలౌకికమైన దివ్యశోభతో విలసిల్లే సీతమ్మ ముఖపద్మానికి సూర్యునివంటివాడా! తెల్లనిపద్మదళాలవంటి కళ్ళుగలవాడా! సమస్త పురుష శ్రేష్ఠులచేత నుతింపదగిన సుగుణాలు కలవాడా! రఘువంశరామా! అవధరించు.

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె: నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

2

తా ॥ గొప్పగుణాలతో గొప్పవారైన ఆ మునిశ్రేష్ఠులతో, సమస్త పురాణాలను వ్యాఖ్యానించి వివరించే నేర్పుగల సూతమహర్షి ఇలా చెప్పాడు:

"ఆ విధంగా ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడిలా అన్నాడు:

## 1. మైత్రేయుడు విదురునకు స్వాయంభువ మనుపుత్రికల వంశక్రమమును తెలుపుట

సీ. జననాథ! విను విదురునకును మైత్రేయ మునినాథచంద్రుఁ డిట్లనియె మరల
స్వాయంభువున కర్థి శతరూపవలనను గూఁతులు మువ్వు రాకూతి దేవ
హూతి ప్రసూతులు నొనరఁ బ్రియవ్రతోత్తానపాదులు నను తనయయుగము

జనియించి రం దగ్రసంభవయైన యాకూతిని సుమహిత భ్రాతృమతిని

తే. దనకు సంతానవిస్తరార్థంబుగాఁగఁ, బుత్రికాధర్మ మూఁది యా పువ్వుఁబోఁడిఁ
బ్రకటమూర్తి రుచిప్రజాపతికి నిచ్చె, మనువు ముద మొంది శతరూప యనుమతింప.

3

తా ॥ "ఓ పరీక్షిన్మహారాజా! విను. విదురునితో మైత్రేయుడిలా చెప్పాడు: "స్వాయంభువ మనువుకు, 'శతరూప' అనే భార్యవలన ముగ్గురు కూతుళ్ళు కలిగారు. వారిపేర్లు ఆకూతి, దేవహూతి, ప్రసూతి. వీళ్ళు కాక 'ప్రియవ్రతుడు', 'ఉత్తానపాదుడు' —అనే ఇద్దరు కొడుకులు కలిగారు. వీళ్ళలో తొలుత జన్మించిన ఆకూతిని స్వాయంభువుడు ఆమె అన్నదమ్ముల అనుమతితో తన సంతానం విస్తరిల్లటం కోసం, పుత్రికాధర్మాన్ని పాటించి, 'రుచి' అనే ప్రజాపతికి ఇచ్చి వివాహం చేశాడు. అందుకు మనువు భార్య 'శతరూప' ఆనందంతో అనుమతించింది.

'ఆకూతి', 'రుచి', 'శతరూప' — ఈ మూడుపదాలు సంకేతార్థాన్ని బోధిస్తున్నాయి. 'ఆకూతి' —అంటే కుతూహలం. 'రుచి' —అంటే కాంతి. 'మనువు' — అంటే మానవ జాతికేకాక మనస్సుకు కూడ 'అధిపతి' అని అర్థం. 'శతరూప' అంటే వందలాది రూపాలని అర్థం. శతరూపాదేవి అనుమతించటమంటే వందలాది రూపాల పుట్టుకకు అనుమతి లభించిందని అర్థం.

వ. అట్లు వివాహంబైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణ గుణుండును గావునఁ జిత్తైకాగ్రతం జేసి యాకూతి యందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుం డగు పురుషుండుగను జగదీశ్వరి యగు నాదిలక్ష్మి యమ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబున దక్షిణ యను కన్యకా రత్నంబుగను మిథునంబు సంభవించె; నందు స్వాయంభువుడు సంతుష్టాంతరంగుం డగుచుఁ బుత్రికాపుత్రుండును, వితతతేజోధనుండును, శ్రీ విష్ణుమూర్తి రూపుండును నగు యజ్ఞునిఁ దన గృహంబునకుఁ దెచ్చియునిచె; రుచియుఁ గామగమన

యైన దక్షిణ యను కన్యకాలలామంబును దన యొద్దన నిలిపె; నంత సకల మంత్రాధి దేవత యగు శ్రీయజ్ఞుండు దనుఁ బతిగం గోరెడు దక్షిణయను కన్యకం బరిణయంబయ్యె; వార లాదిమిథునంబు గావున నది నిషిద్ధంబు గాకుండె నని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె.

4

తా ॥ అలా వివాహమైన 'రుచి', ప్రజాపతి బ్రహ్మవర్చస్వి, పరిపూర్ణగుణుడు కాబట్టి ఆతని ఏకాగ్రచిత్తానికి మెచ్చి, శ్రీమహావిష్ణువు యజ్ఞస్వరూపుడైన పురుషునిగా ఆకూతికి జన్మించాడు. జగదీశ్వరియైన ఆదిలక్ష్మి, శ్రీమహావిష్ణువును ఎప్పుడూ వీడి ఉండనిది కాబట్టి ఆమె అంశతో 'దక్షిణాదేవి' అనే కన్యకగా అవతరించింది. యజ్ఞపురుషుడు, దక్షిణాదేవి ఇద్దరూ జంటగానే జన్మించారు. వీళ్లను చూచి సంతుష్ట హృదయంతో, తన దౌహిత్రుడూ, అత్యంత తేజోవంతుడూ, శ్రీమహావిష్ణు స్వరూపుడూ అయిన యజ్ఞుని తన ఇంటికి తెచ్చుకున్నాడు స్వాయంభువ మనువు. ప్రజాపతియైన రుచి, కామగమన అయిన దక్షిణను తన దగ్గరే నిలుపుకున్నాడు. ఆ పిమ్మట, తనను భర్తగా కోరుకున్న దక్షిణను యజ్ఞుడు వివాహమాడాడు. వాళ్ళిద్దరూ ఆదిదంపతులు కాబట్టి ఆ వివాహం లోకరీతికి విరుద్ధం కాలేదు" అని చెప్పి, మైత్రేయుడు ఇంకా ఇలా అన్నాడు:

'మిథునము' – ప్రకృతిపురుషుల సంయోగాన్ని, దేహాత్మకలయికను సూచిస్తుంది. ప్రకృతిపురుషులే లక్ష్మీనారాయణులు. విష్ణువు 'యజ్ఞస్వరూపుని' గా, లక్ష్మి 'దక్షిణాదేవి' గా అవతరించటం కూడా సంకేతార్థమే. 'యజ్ఞము' –కాలస్వరూపునికి సంకేతం కాలస్వరూపునికి జ్యోతిశ్చక్రంలోని పన్నెండురాశులు అంగాలే. ఆ కాలమే యజ్ఞస్వరూపుడు. స్వాయంభువ మనువు యజ్ఞపురుషుణ్ణి తీసుకెళ్లి పెంచుకోవటమంటే, ప్రాణికోటి మనస్సు, అంతర్యామిని తమలో పెంచుకోవటమని. వాసుదేవాత్మయే స్త్రీ–పుంస యోగోద్భవంగా, మిథునంగా జన్మించింది. పంచభూతాల వివృత స్వరూపం ప్రకృతి కాబట్టి, దక్షిణాదేవి తల్లిదండ్రుల చెంతనే పెరిగినట్లు చెప్పటం.

యజ్ఞసందర్భంలో 'దక్షిణ' ఇవ్వటం ఆచారం. 'దక్షిణ' లేనియజ్ఞం, దక్షిణకోరి చేసేయజ్ఞం వ్యర్థం. అందుకే 'యజ్ఞానికి', 'దక్షిణ' కు అవినాభావ సంబంధమని పెద్దలు చెపుతారు.

క. ధీమహిత! యంతవారల, యామాఖ్యలు గలుగు దేవతావళి గడఁకన్
వేమఱు నభినందించుచు. నా మిథునమువలనఁ బుట్టె నతిబలయుతమై.

5

తా ॥ "బుద్ధిమంతుడైన ఓ విదురా! ఆ తరువాత, ఆ యజ్ఞమూర్తికి, దక్షిణాదేవికి 'యామము' అనే పేరుగల దేవతలు జన్మించారు. వాళ్ళు అతిబలవంతులు.

'యామము' –అంటే 'జాము' అనే అర్థమున్న కాల విభాగం. కాలస్వరూపుడైన యజ్ఞునికి 'యామములు' –అనబడే దేవతలు జన్మించారంటే అర్థం, మనువు సృష్టించిన కాలంనుండి భూభ్రమణం జరగటం, సూర్యుని చుట్టు తిరగటం, ఋతువులేర్పడటం, సంవత్సరమాసాది కాలవిభాగాలు ఏర్పడటం, జీవరాశుల సృష్టి ప్రారంభం కావటం వంటి విషయాలు తెలుస్తున్నాయి.

వ. వారు తోషుండును బ్రతోషుండును సంతోషుండును భద్రుండును శాంతియు నిడస్పతియు నిధ్మండును గవియు విభుండును వహ్నియు సుదేవుండును రోచనుండును ననం బన్నిద్దఱు సంభవించిరి; వారలు స్వాయంభువాంతరంబునం "దుషితు" లను దేవగణంబులై వెలసిరి; మఱియు మరీచి ప్రముఖులైన మునీశ్వరులును యజ్ఞుండును దేవేంద్రుండును మహాతేజస్సంపన్ను లయిన ప్రియవ్రతోత్తానపాదులుం గలిగి పుత్రపౌత్ర నప్తృవంశంబులచే వ్యాప్తంబయి యా మన్వంతరంబు పాలితం బగుచు వర్తిల్లె; మనువు ద్వితీయ పుత్రియైన దేవహూతిం గర్దమున కిచ్చి తద్వంశ విస్తారంబు గావించెనని మున్న యెఱింగించితి; వెండియు నమ్మనువు మూఁడవచూలైన ప్రసూతి యను కన్యకను

బ్రహ్మపుత్రుండగు దక్షప్రజాపతికి నిచ్చె; నా దక్షునకుఁ బ్రసూతివలన నుదయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబు లయ్యె; మఱియుఁ గర్దమపుత్రికా సముదయంబు బ్రహ్మర్షి భార్య లగుటం జేసి వారి వలనం గలిగిన సంతాన పరంపరల వివరించెద.

6

తా ॥ యజ్ఞుడు–దక్షిణ కన్న సంతానం పన్నెండు మంది. వాళ్ళ పేర్లు– తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇడస్పతి, ఇధ్ముడు, కవి, విభుడు, వహ్ని, సుదేవుడు, రోచనుడు. వీళ్ళు 'తుషితు' లనే పేరుతో స్వాయంభువ మన్వంతరంలో దేవగణాలై వెలిశారు. 'మరీచి' మొదలైన ఋషీశ్వరులు, యజ్ఞుడు, దేవేంద్రుడు, మహాతేజస్సుతో కూడిన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు ప్రభవించారు. తన పుత్రపౌత్రాభివృద్ధితో, కూతుళ్ళ వంశాలతో వృద్ధిచెందిన తరాలతో, వాళ్ళ సంతానంతో ఆ మన్వంతరమంతా నిండిపోయింది.

స్వాయంభువ మనువు తన రెండవ కూతురు దేవహూతిని కర్దమ ప్రజాపతికి ఇచ్చాడు. ఆ దేవహూతీ కర్దముల వంశం విస్తరించిన విధం ఇంతకు పూర్వమే చెప్పాను. అలాగే తన మూడవ కూతురయిన 'ప్రసూతి' ని, బ్రహ్మపుత్రుడైన దక్షప్రజాపతికి ఇచ్చాడు. ప్రసూతి, దక్షప్రజాపతి – వీరి సంతానంతో మూడు లోకాలు నిండిపోయాయి. కర్దముని పుత్రికలందరూ, బ్రహ్మర్షుల భార్యలు. వారి సంతానాన్ని గురించి వివరిస్తాను.

## 2. కర్దమప్రజాపతి సంతతి

సీ. ఘనుఁడౌ మరీచికిఁ గర్దమాత్మజయగు కళ యను నంగనవలనఁ గశ్య
పుం డను కొడుకును బూర్ణిమ యను నాఁడుబిడ్డయుఁ బుట్టిరి; పేర్చి వారి
వలనఁ బుట్టిన ప్రజావళిపరంపరలచే భువనంబు లెల్ల నాపూర్ణ మగుచు
జరగెను; బూర్ణిమ జన్మాంతరంబున హరిపద ప్రక్షాళితాంబువులను

తే. గంగ యనుపేరఁ బుట్టి యక్కన్య "దేవ, కుల్య" యనుదాని నొక్కతెఁ గూఁతు నఖిల
విష్టపవ్యాపకుం డగు "విరజుఁ" డనెడి, తనయు నొక్కనిఁ గాంచె మోదంబు తోడ.

7

తా ॥ మరీచి మహామునికి, కర్దముని కూతురైన 'కళ' అనే భార్య వలన 'కశ్యపుడనే' కొడుకు, 'పూర్ణిమ' అనే కూతురు పుట్టారు. వాళ్ళవలన పుట్టిన సంతానంతో భువనాలన్నీ నిండిపోయాయి. పూర్ణిమ జన్మాంతరంలో హరిపాదప్రక్షాళన జలాలుగా దిగివచ్చి, 'గంగ' అనే పేరుతో ప్రసిద్ధిచెందింది. ఆమె 'దేవకుల్య' అనే కూతుర్ని, 'విరజు' డనే కొడుకుని కన్నది.

క. అనఘుం డత్రిమహాముని, యనసూయా దేవివలన నజ హరి పుర సూ
దనుల కళాంశంబుల నం, దనులను ముువ్వరను గాంచెఁ దద్దయుఁ బ్రీతిన్.

8

తా ॥ పుణ్యాత్ముడైన అత్రి మహామునికి, సతి అనసూయాదేవి వలన బ్రహ్మవిష్ణుమహేశ్వరుల అంశలతో ముగ్గురు కొడుకులు పుట్టారు."

క. అనవుడు విదురుఁడు మైత్రే, యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ! జగతిన్
జననస్థితిలయకారణు, లన వెలసిన పద్మగర్భహరిహరు లెలమిన్.

9

తా ॥ ఇలా చెబుతుండగా వింటున్న విదురుడు మైత్రేయుణ్ణి చూసి ఇలా అన్నాడు: 'మునిజనోత్తమా! బ్రహ్మవిష్ణు మహేశ్వరులు సృష్టిస్థితిలయ కారకులు కదా! వాళ్ళు –

క. ఏమి నిమిత్తం బత్రి మ, హాముని మందిరమునందు ననసూయకు ను ద్దామగుణు
లుదయమై రన, నా మైత్రేయుండు పలికె నవ్విదురునితోన్.

10

తా ॥ త్రిగుణాతీతులైన ఆ మహాత్ములు ఏ కారణాన అత్రి మహాముని ఇంట, అనసూయకు జన్మించారు?' అని ప్రశ్నించగా మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పాడు:

సీ. సుచరిత్ర! విను విధిచోదితుండై యత్రి దప మాచరింపఁ గాంతాసమేతుఁ
డయి ఋక్షనామ కులాద్రి తటంబున ఘుమఘుమారావ సంకులవిలోల
కల్లోల జాల సంకలిత నిర్వింధ్యా నదీ జల పరిపుష్ట రాజిత ప్ర
సూన గుచ్ఛ స్వచ్ఛ మానితాశోక పలాశ కాంతారస్థలమున కెలమి

తే. నరిగి యచ్చట నిర్ద్వంద్వుఁ డగుచుఁ బ్రాణ, నియమము నేక పదమున నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁ, డగుచుఁ దపము గావించె దివ్యవత్సరశతంబు.

11

తా ॥ "మంచి నడవడిగల రాజా! విను. విధి ప్రేరణతో అత్రి మహాముని తపస్సు చేయ సంకల్పించి, భార్యతో సహా తపోవనానికి వెళ్ళాడు. ఆ తపోవనం 'ఋక్షము' అనే కులపర్వతానికి సమీపంలో, నిర్వింధ్యానది ఒడ్డున ఉంది. నిర్వింధ్యానది మేఘపంక్తులవంటి ఉత్తుంగ తరంగాలతో ప్రవహిస్తు, తన జలంతో వనంలోని అశోకవృక్షాలకు మోదుగ వృక్షాలకు దోహదం చేస్తున్నది. ఏపుగా పెరిగిన పూలగుత్తులతో ఆ వనంలోని చెట్లు కన్నుల పండువుగా ఉన్నాయి. అటువంటి అడవిలో ద్వంద్వాలను జయించి, ఒంటికాలిపై నిలిచి, నూరు దివ్య సంవత్సరాల కాలం అత్రి మహాముని తపస్సు చేశాడు.

వ. ఇట్లుతి ఘోరంబైన తపంబు సేయుచుఁ దన చిత్తంబున.

12

తా ॥ ఈ విధంగా ఘోరమైన తపస్సును చేస్తూ తన మనస్సులో

క. ఏ విభుఁడు జగదధీశ్వరుఁ, డా విభు శరణంబుఁజొత్తు నతఁడాత్మ సమం
బై వెలసిన సంతతిని ద, యావరమతి నిచ్చుఁగాక యని తలఁచు నెడన్.

13

తా ॥ "ఏ ప్రభువు జగత్తుకు అధీశ్వరుడో, ఆ ప్రభువును శరణు కోరుతున్నాను. ఆ ప్రభువు తనతో సమానమైన సంతతిని దయామతితో ఇచ్చుగాక!" – అని తలచినంతనే.

జగత్తునకు అధిపతియైనవాణ్ణి శరణు వేడుకోవడమంటే అఖండ చైతన్యాన్ని వేడుకోవటమే. ఇది ఉపనిషత్సంప్రదాయం. ఆత్మసమానుడైన పుత్రుణ్ణి కోరుకోవడమంటే ఆత్మగతమైన అంతర్యామినే జీవుల అంతరాత్మగా దిగిరమ్మని వేడుకోవటం.

చ. మునుకొని యత్తపోధనుని మూర్ధజమైన తపఃకృశానుచే తను ద్రిజగంబులుం గరఁగి తప్తములై నను జూచి బంకజా సన మురశాసన త్రిపురశాసను లచ్చటి కేగి రప్సరో జనసురసిద్ధ సాధ్యమునిసన్నుత భూరియశోభిరాములై.

14

తా ॥ తపోధనుడైన ఆ అత్రి మహాముని శిరస్సు నుండి పుట్టిన తపోగ్ని చేత ముల్లోకాలూ వేడెక్కి కరిగి పోసాగాయి. అది చూచి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అక్కడికి వచ్చారు. అప్సరసలు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మునులు ఆ త్రిమూర్తుల కీర్తిని సన్నుతిస్తూ వారివెంట తరలి వచ్చారు.

వ. అట్లు మునీంద్రు నాశ్రమంబు డాయం జను నవసరంబున.

15

తా ॥ ఆ విధంగా అత్రి మహాముని ఆశ్రమాన్ని సమీపించే సమయంలో.

చ. అనఘతపోభిరాముఁడగు నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దప్త కాం
చన ఘన చంద్రికా రుచిర చారుశరీరుల హంస నాగ సూ
దన వృషభేంద్రవాహుల నుదారకమండలు చక్ర శూల సా
ధనుల విరించి విష్ణు పురదాహుల వాక్కమలాంబికేశులన్.

16

తా ॥ అప్పుడు పవిత్రమైన తపస్సుచే ప్రకాశించే అత్రి మహాముని, సరస్వతీ, లక్ష్మీ, పార్వతీకాంతల భర్తలైన త్రిమూర్తుల్ని తన ఎదుట చూసాడు. వారిలో బ్రహ్మ కరిగించిన బంగారు రంగులో, విష్ణువు మేఘపు వర్ణంలో, శివుడు వెన్నెల కాంతితో ఉన్న శరీరాలతో తేజరిల్లుతున్నారు. హంసవాహనుడై బ్రహ్మ, గరుడవాహనుడై విష్ణువు, వృషభవాహనుడై శివుడు వచ్చారు. బ్రహ్మ చేతిలో కమండలువు, విష్ణువు చేతిలో చక్రము, శివుని చేతిలో త్రిశూలము ఉన్నాయి.

వ. మఱియుఁ గృపావలోకన మందహాస సుందర వదనార విందంబులు గల మహాత్ముల సందర్శించి యమందానంద కందళిత హృదయారవిందుండై సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి పుష్పాంజలి గావించి నిటలతటఘటితకరపుటుండై దుర్నిరీక్ష్యం బైన తత్తేజోవిశేషంబుఁ దేఱి చూడంజాలక ముకుళిత నేత్రుండై తత్పదాయత్త చిత్తుం డగుచు సర్వలోక ప్రశంస్యంబు లైన మృదుమధుర గంభీర భాషణంబుల నిట్లని స్తుతియించె.

17

తా ॥ ఆ మహాత్ములు (త్రిమూర్తులు) కరుణాకటాక్ష వీక్షణాలతో, అందమైన పద్మం వంటి ముఖంతో, ప్రకాశిస్తున్నారు. అత్రి మహాముని వారిని దర్శించి, మహానందాన్ని పొంది,

హృదయారవిందం వికసింపగా, సాష్టాంగదండ ప్రణామాన్ని చేశాడు. దోసిళ్ళతో పుష్పాంజలి ఘటించాడు. నుదుట చేతులు మోడ్చి, తేరిపార చూడరాని ఆ తేజోవిశేషాన్ని చూడలేక కళ్ళుమూసుకున్నాడు. ఆ త్రిమూర్తులపైనే మనస్సు నిలిపి, సర్వలోకాలకూ మెచ్చుగొలిపే మృదుమధుర గంభీర వాక్కులతో ఇలా స్తుతించాడు:

సీ. ప్రతి కల్పమందు సర్వప్రపంచోద్భవ స్థితి వినాశంబులఁ జేయునట్టి
మహిత మాయాగుణమయ దేహములఁ బొల్చు నజ వాసుదేవ శివాభిధాన
ములు గల్గు మీ పాదజలజాతములకు నే నతిభక్తి వందనం బాచరింతు;
నఖిల చేతన మానసాగమ్య మన నొప్పు మూర్తులు గల్గు మీ ముప్వురందుఁ

తే. బరఁగ నాచేతఁ బిలువంగఁ బడిన ధీరుఁ, డెవ్వఁడే నొక్కరునిఁ బిల్వ నిపుడు మీరు
ముప్వు రేతెంచుటకు నాదు బుద్ధి విస్మ, యంబు గదిరెడిఁ జెప్పరే యనఘులార!

18

తా ॥ “ప్రతీ కల్పంలోను, సర్వప్రపంచ సృష్టి–స్థితి–లయాలను చేసే మహనీయులు మీరు. మాయాగుణాలతో కూడిన దేహాలను ధరించి బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులనే పేర్లతో ప్రకాశిస్తున్నారు. మీ పాదపద్మాలకు భక్తితో నమస్కరిస్తాను. సమస్త చేతనాల మనస్సులకు అగమ్యమైన రూపాలు మీవి. మీ ముప్వురిలో నేను పిలిచిందెవ్వరిని? నేను ఒక్కరినే పిలిచాను. మీరు ముగ్గురూ విచ్చేశారు. నా మనస్సుకు ఆశ్చర్యంగా ఉంది. ఓ పుణ్యాత్ములారా! ఈ రహస్యాన్ని నాకు తెలియజెప్పండి.

ధ్యానము యొక్క లక్ష్యాన్ని ఇందులో గమనించవచ్చు. ఉపనిషత్సంప్రదాయంలోని ‘ఏకేశ్వరోపాసన’ మిది. ‘సర్వాంతర్యామి’ ఒక్కడే. ఆ అవ్యక్తతేజస్సు, త్రిధాభిన్నమైన రూపాలతో త్రిమూర్తులుగా వ్యక్తమవుతున్నది. ఈ వ్యక్తమైన రూపాలలోని అవ్యక్త రూపాన్ని ఉపాసించడమే ఉపనిషత్ ప్రతిపాదితమైన ధ్యాన సంప్రదాయం.

వ. అదియునుం గాక సంతానార్థంబు నానావిధ పూజలు గావించి నాచిత్తంబున ధరియించిన మహాత్ముం డొక్కరుండ యనిన నమ్మువ్వురు విబుధశ్రేష్ఠులు నతనిం గనుంగొని సుధామధురంబు లయిన వాక్యంబుల నిట్లనిరి.

19

తా ॥ అంతేకాక, సంతానం కోసం నానావిధాల పూజలుచేసి, నా మదిలో నిలుపుకున్న మహాత్ముడొక్కడే" అని అత్రిమహాముని పలుకగా, త్రిమూర్తులు అమృతోపమానమైన మాటలతో ఇలా అన్నారు:

క. విను మేము ముగుర మయ్యును, ననుపమమతిఁ దలఁప నేకమై యుందుము; నీ
మనమందు నేమి గోరితి, వనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమీ!

20

తా ॥ "ఓ అత్రి మహామునీ! విను! మేము ముగ్గురమే అయినప్పటికీ, ఏకమయ్యే ఉంటాము. సాటిలేని, ఏకాగ్రమైన మనస్సుతో మమ్మల్ని స్మరిస్తే తెలిసే విషయమిది. నీ మదిలో కోరుకున్న కోరిక సఫలమవుతుంది సుమా!

క. మా మువ్వుర యంశంబుల, ధీమంతులు సుతులు పుట్టి త్రిభువనములలో
నీ మంగళగుణకీర్తిన్, శ్రీమహితము సేయఁగలరు సిద్ధము సుమీ!

21

తా ॥ మా ముగ్గురి అంశలతో, ధీమంతులైన కొడుకులు పుట్టి, మంగళకరమైన గుణాలతో సంప్రాప్తమైన నీ కీర్తి సంపదను వృద్ధి పొందిస్తారు. నీకీర్తిని, సంపదను మూడు లోకాలలో మరింత ఇనుమడింపజేస్తారు."

క. అని మునిచంద్రుఁడు మన, మునఁ గామించిన వరంబు బుధవరులు ముదం

బున నొసఁగి యతనిచేఁ బూ, జనములఁ బరితృప్తు లగుచుఁ జనిరి యథేచ్ఛన్.

22

తా ॥ అని, మునులలో చంద్రుని వంటివాడైన అత్రి మహాముని, తన మనస్సులో కోరుకున్న వరాన్ని ప్రసాదించి, ఆతని సత్పూజలకు పరితృప్తులై, యథేచ్ఛగా వెళ్ళిపోయారు.

ఉ. ఆ సుచరిత్రదంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న

బ్జాసను నంశమందు నమృతాంశుఁడు, విష్ణుకళన్ సుయోగ వి

ద్యాసుభగుండు దత్తుఁడు, బురాంతకు భూరికళాంశమందు దు

ర్వాసుఁడునై జనించి రనవద్యపవిత్ర చరిత్రు లిమ్ములన్.

23

తా ॥ సదాచార సంపన్నులైన ఆ దంపతులకు, బ్రహ్మ అంశతో చంద్రుడు, విష్ణుమూర్తి కళతో దత్తాత్రేయుడు, ఈశ్వరుని కళాంశతో దుర్వాసుడు జన్మించాడు. దత్తాత్రేయుడు యోగవిద్యా వైభవంతో వాసికెక్కాడు. వీరందరూ నిష్కళంక పవిత్ర చరిత్రులు.

చంద్రుడు ఆధ్యాత్మిక బ్రహ్మవిద్యకు, దత్తాత్రేయుడు యోగవిద్యకు, దుర్వాసుడు యమనియమాది విధులకు సంకేతం.

క. అంగిరసుఁ డనెడు మునికిఁ గు, లాంగన యగు శ్రద్ధయందు నంచిత సౌంద

ర్యాంగులు గూఁతులు నలువురు, మంగళవతు లుదయమైరి మాన్యచరిత్రా!

24

తా ॥ అంగిరసుడనే మునికి, తన భార్యయైన శ్రద్ధ యందు, మంగళకరమైన శుభవర్తన గల నలుగురు కుమార్తెలు జన్మించారు.

క. వారు సినీవాలి యనఁ గు, హూ రాకానుమతు లనఁగ నొప్పిరి; మఱియు

గోర సుతయుగము గలిగెను, స్వారోచిషమనువువేళ శస్తఖ్యాతిన్.

25

తా ॥ ఆ కుమార్తెలు 'సినీవాలి', 'కుహువు', 'రాక', 'సుమతి' అనే పేర్లతో ప్రసిద్ధమయ్యారు. ఇంకా సంతానం కావాలని కోరుకోగా వారికి స్వారోచిష మనువు కాలంలో ఇద్దరు కొడుకులు ఉదయించారు.

వ. వార లెవ్వ రనిన భగవంతుం డగు నుచథ్యుండును బ్రహ్మనిష్ఠుండగు బృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి; పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బుట్టించె; నా యగస్త్యుండు జన్మాంతరంబు జఠరాగ్ని రూపంబై ప్రవర్తించె; వెండియు నా పులస్త్యుండు విశ్రవసునిం గలిగించె; నావిశ్రవసునకు "నిలబిల" యను భార్యవలనం గుబేరుండును, "గైకసి" యను దానివలన రావణ కుంభకర్ణ విభీషణులునుం బుట్టిరి; పులహునకు గతియను భార్యవలనఁ గర్మశ్రేష్ఠుండును వరీయాంసుండును సహిష్ణుండును నను ముప్వురు గొడుకులు జనియించిరి. మఱియుఁ గ్రతువునకుఁ "గ్రియ" యను భార్యయందు బ్రహ్మతేజంబున జ్వలించుచున్న షష్టిసహస్ర సంఖ్యలు గల వాలఖిల్యులను మహర్షులు గలిగిరి; వసిష్ఠుం డూర్జయను భార్యయందు జిత్రకేతుండును సురోచియు విరజుండును మిత్రుండును నుల్బణుండును వసుభృద్యానుండును ద్యుమంతుండును నను సప్తఋషులను, భార్యాంతరంబున శక్తి ప్రముఖపుత్రులనుం బుట్టించె; నథర్వుం డనువానికిఁ "జిత్తి" యను భార్యయందు ధృతవ్రతుండు నశ్వశిరస్కుండు నయిన దధ్యంచుండు పుట్టె; మహాత్ముండగు భృగువు "ఖ్యాతి" యను పత్నియందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును భగవత్పరాయణయగు "శ్రీ" యను కన్యకం బుట్టించె; నా ధాతృవిధాతృలు మేరు వనువాని కూఁతు లయిన "యాయతి" "నియతు" లను భార్యలవలన మృకండప్రాణు లను కొడుకులం బుట్టించి; రందు మృకండునకు మార్కండేయుండును, బ్రాణునకు వేదశిరుం డను మునియు బుట్టిరి; భార్గవునకు నుశన

యను కన్యయందుఁ గవి యనువాఁడు పుట్టె; నిట్లు కర్దమ దుహిత లయిన కన్యకా నవకంబువలనం గలిగిన సంతానపరంపరలచే సమస్తలోకంబులును బరిపూర్ణంబు లయ్యె; నట్టి సద్యః పాపహరంబును శ్రేష్ఠతమంబును నైన కర్దమదౌహిత్రసంతాన ప్రకారంబు శ్రద్ధాగరిష్ఠ చిత్తుండవగు నీకుం జెప్పితి; నింక దక్షప్రజాపతివంశం బెఱింగింతు, వినుము.
26

తా ॥ వారి పేర్లు ఉచథ్యుడు, బృహస్పతి. ఉచథ్యుడు సర్వశక్తులుగల, భగవత్స్వరూపుడు. బృహస్పతి బ్రహ్మనిష్ఠుడు. పులస్త్య ప్రజాపతి తన భార్యయైన 'హవిర్భుక్క' నే కర్దమ ప్రజాపతి కూతురి వలన అగస్త్యుణ్ణి కన్నాడు. ఆ అగస్త్యుడే జన్మాంతరంలో 'జఠరాగ్ని' (ఆకలి అనే అగ్నిగా) రూపమై ప్రవర్తించాడు. పులస్త్యుడికే 'విశ్రవసుడనే' మరొక కొడుకు కలిగాడు. విశ్రవసునకు, ఇలబిల యందు జన్మించిన సంతానమే కుబేరుడు. విశ్రవసునకు 'కైకసి' యందు జన్మించిన సంతానం రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు.

కర్దమ ప్రజాపతి కుమార్తె 'గతి' కి, పులహునికి జన్మించిన కొడుకులే 'ధర్మశ్రేష్ఠుడు', 'వరీయాంశుడు', 'సహిష్ణుడు' అనే ముగ్గురు. కర్దముని మరొక కుమార్తె 'క్రియ' కు వాలఖిల్యులనే పేరుగల మహర్షులు అరవైవేలమంది పుత్రులుగా జన్మించారు.

వశిష్ఠునికి తన భార్యయైన "ఊర్జ" యందు చిత్రకేతుడు, సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుహృద్యానుడు, ద్యుమంతుడు అనే సప్తర్షులు జన్మించారు. మరొక భార్యయందు వశిష్ఠునకు శక్తి మొదలైన సంతానం కలిగారు.

అధర్వుడనే ఋషికి, 'చిత్తి' – అనే భార్యవలన నియమవ్రతుడు, అశ్వశిరము గలవాడు అయిన 'దధ్యంచుడు' – పుట్టాడు.

మహాత్ముడైన భృగుమహర్షికి 'ఖ్యాతి' అనే భార్యయందు 'ధాత', 'విధాత' అనే ఇద్దరు పుత్రులు భగవత్పరాయణమైన 'శ్రీ' అనే కన్యక జన్మించారు.

ధాతవిధాతలు, మేరువు కుమార్తలైన 'ఆయతి' 'నియతు' లను వివాహమాడారు. ధాతకు 'ఆయతి' వలన 'మృకండుడు', విధాతకు 'నియతి' వలన 'ప్రాణుడు' జన్మించారు. మృకండునకు 'మార్కండేయుడు', ప్రాణునకు 'వేదశిరుడు' అనే కుమారులు జన్మించారు.

భృగువునకు 'ఉశన' యందు 'కవి' జన్మించాడు. ఇలా కర్దముని తొమ్మిది మంది పుత్రికల వలన కలిగిన సంతాన పరంపరల చేత అన్ని లోకాలు నిండిపోయాయి. సద్యః పాపహరమూ, శ్రేష్ఠతమమూ అయిన కర్దమ ప్రజాపతి సంతానం గురించి శ్రద్ధాభక్తులతో వింటున్న నీకు వినిపించాను.

ఇక దక్ష ప్రజాపతి వంశక్రమాన్ని వివరిస్తాను, విను.

ఇందులో కనిపించే వ్యక్తుల నామాలన్నీ సంకేతార్థ బోధకాలే. 'హవిర్భుక్కు' పులస్త్యుని భార్య. 'హవిర్భుక్కు' అంటే 'హవిస్సుల్ని ఆరగించేది' అని అర్థం. 'విశ్రవసుడు' అంటే చెవులు గలవాడు. శ్రవణాధిష్ఠాన దైవమని అర్థం. ఇలబిలమంటే నాసారంధ్రాలు. 'కీకస' శబ్దం నుండే 'కైకసి' శబ్దం వచ్చింది. కీకసమంటే కంఠంలోని పీకె. ఆమె సంతానం రావణుడంటే కంఠానికి అధిదైవం. విభీషణుడంటే భీతి లేనివాడు. ఇలా ప్రతిపదాన్ని సంకేతికమైన అర్థాన్ని ప్రత్యేకంగా భావన చేయడానికి వీలున్నది.

## 3. దక్షప్రజాపతి సంతతి

క. వనజజునివలన భవ మం, దిన యా దక్షప్రజాపతికి మను నిజనం
దన యగు "ప్రసూతి" సతియం, దనఘా! పదియార్వు రుదయ మందిరి కన్యల్.

27

తా ॥ బ్రహ్మవలన జన్మించిన దక్షప్రజాపతికి, స్వాయంభువ మనువు కూతురైన 'ప్రసూతి' వలన పదహారు మంది కన్యకలు జన్మించారు.

వ. ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియుఁ దుష్టియుఁ బుష్టియుఁ బ్రియయు నున్నతియు బుద్ధియు మేధయుఁ దితిక్షయు హ్రీయు మూర్తియు నను నామంబులు గల పదుమువ్వరను ధర్మరాజున కిచ్చె, నొక్కకన్యక నగ్నిదేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె జన్మమరణాది నివర్తకుండగు నభవునకుం బెండ్లి సేసె; నంత నాధర్మపత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబును, మైత్రివలనఁ బ్రసాదంబును, దయవలన నభయంబును, శాంతివలన సుఖంబును, దుష్టి వలన ముదంబును, బుష్టివలన స్మయంబును, గ్రియవలన యోగంబును, నున్నతివలన దర్పంబును, బుద్ధివలన నర్థంబును, మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబును, హ్రీవలనఁ బ్రశ్రయంబును, మూర్తివలన సకలకల్యాణ గుణోత్పత్తి స్థానభూతులగు నరనారాయణ లను ఋషు లిద్దఱును సంభవించిరి; వారల జన్మకాలంబున.

28

తా ॥ ఈ విధంగా జన్మించిన వారిలో శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, హ్రీ, మూర్తి అనే పేర్లు గల పదమూడు మంది కన్యలను ధర్ముడనే రాజునకిచ్చి దక్షుడు వివాహం చేశాడు. అలాగే అగ్ని దేవునకొక కుమార్తెను, పితృదేవతలకొక కుమార్తెను, జనన మరణ నివర్తకుడైన ఈశ్వరునకొక కుమార్తెను ఇచ్చి వివాహం చేశాడు.

ధర్ముని భార్యలలో శ్రద్ధ వలన 'శ్రుతము', మైత్రి వలన 'ప్రసాదము', దయ వలన 'అభయము', శాంతి వలన 'సుఖము', తుష్టి వలన 'ముదము', పుష్టి వలన 'స్మయము', క్రియ వలన 'యోగము', ఉన్నతి వలన 'దర్పము', బుద్ధి వలన అర్థము, మేధ వలన 'స్మృతి', తితిక్ష వలన 'క్షేమము', హ్రీ వలన 'ప్రశ్రయము', 'మూర్తి' వలన సకల కళ్యాణ గుణాలకు కారకులైన 'నరనారయణు' లనే ఋషులిద్దరూ జన్మించారు. వారు జన్మించిన శుభ సమయంలో –

సీ. గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై వీచె; నల్దిక్కులు విశద మయ్యెఁ;
నఖిలలోకంబులు నానందమును బొందెఁ; దుములమై దేవదుందుభులు మ్రోసెఁ;
గర మొప్ప జలధుల కలఁక లడంగెను; మించినగతిఁ బ్రవహించె నదులు,
గంధర్వ కిన్నర గానముల్ వీతెంచె; నప్సరోజనము లాస్యములు సెలఁగె;

తే. సురలు గురియించి రందంద విరులవాన, మునిజనంబులు సంతోషమునఁ జెలంగి
వినుతు లొనరించి; ర వ్వేళ విశ్వమెల్లఁ, బరమమంగళమై యొప్పె భవ్యచరిత!

29

తా ॥ గాలి అనుకూలంగా మెల్లగా వీచింది. నాలుగు దిక్కులూ స్పష్టంగా తేట పడ్డాయి. లోకాలన్నీ ఆనందాన్ని పొందాయి. దేవదుందుభులు సందడి చేస్తూ మ్రోగాయి. సముద్రాలు కలకువ (కలత) లేకుండా నిశ్చలంగా ఉన్నాయి. నదులన్నీ తమకుమించిన వేగంతో ప్రవహించాయి. గంధర్వులు, కిన్నరులు గానాలు వినిపించారు. అప్సర కాంతలు నాట్యాలు చేశారు. సురలు అక్కడక్కడ పూలవాన కురిపించారు. మునిజనులు సంతోషంతో స్తుతించారు. ఆ సమయంలో విశ్వమంతా ప్రకాశించింది.

వ. ఆ సమయంబున బ్రహ్మాది దేవత లమ్మహాత్ముల కడకుం జనుదెంచి యిట్లని స్తుతియించిరి.

30

తా ॥ అప్పుడు బ్రహ్మాది దేవతలందరూ, మహాత్ములైన ఆ నరనారాయణుల చెంతకు వచ్చి, ఈ విధంగా స్తుతించారు:

సీ. గగనస్థలిం దోఁచు గంధర్వనగరాది రూప భేదము లట్టు రూఢి మెఱసి
యే యాత్మయందేని నేపారు మాయచే నీ విశ్వమిటు రచియింపబడియె
నట్టియాత్మప్రకాశార్థమై మునిరూపముల ధర్మగృహమునఁ బుట్టినట్టి
పరమపురుష! నీకుఁ బ్రణమిల్లెద; మదియుఁ గాక యీ సృష్టి దుష్కర్మవృత్తి

తే. జరగనీకుండు కొఱకునై సత్త్వగుణము, చే సృజించిన మ మ్మిట్లు శ్రీనివాస
మైన సరసీరుహప్రభ నపహసించు, నీ కృపాలోకనంబుల నెమ్మిఁజూడు.

31

తా ॥ "ఆకాశంలో కనిపించే గంధర్వనగరం పొందే పెక్కురూపాలలాగా, నీ మాయవల్ల ఈ జగత్తు రూపభేదాలతో గోచరిస్తుంది. ఈ విశ్వం మొత్తం ఏ ఆత్మలో ప్రకాశిస్తుందో, ఆ పరమాత్మ ఉనికిని లోకాలకు తెలియజేయడం కోసం 'ధర్ముని' ఇంట్లో మీరు ముని రూపధారులై, నరనారాయణులుగా జన్మించారు. ఓ పరమపురుషా! నీకు ప్రణామాలు. సృష్టిలో దుష్కర్మ ప్రవర్తన జరగకుండా ఉండటానికి సత్త్వగుణంతో మమ్మల్ని నీవే సృష్టించావు. లక్ష్మికి నివాసమైన పద్మము యొక్క శోభను పరిహసించే నీ కృపావీక్షణంతో మమ్ములను చూడు."

'సత్త్వగుణం' అంటే కేవలం సాత్త్విక లక్షణ సంబంధమే కాదు. అన్యాయాన్ని, అధర్మాన్ని తిరస్కరించే శక్తి అని కూడ అర్థం. లక్ష్మికి నివాసం 'పద్మం'. ఆ పద్మ శోభను తిరస్కరించే కృపాదృష్టి అంటే కేవల లౌకిక సంపదలను కాకుండా మోక్ష సంపదను అనుగ్రహించే దృష్టితో చూడమని అర్థం

క. అని యిట్లు దేవగణములు, వినుతింపఁ గృపాకటాక్ష వీక్షణములచేఁ
గని వారు గంధమాదన, మున కేగిరి తండ్రిముదము ముప్పిరిగొనఁగన్.

32

తా ॥ అని ఈ విధంగా దేవతలు ప్రార్థించగా, నరనారాయణులు తమ కరుణా కటాక్ష వీక్షణాలను వారిపై ప్రసరింపజేసి, గంధమాదన పర్వతానికి వెళ్ళిపోయారు. తండ్రియైన ధర్మునికి ఆనందం మూడురెట్లుగా అతిశయించింది.

క. ధరణీభర ముడుపుట కా, నరనారాయణులు భువి జనన మనయము నొం
దిరి యర్జున కృష్ణాఖ్యులఁ, గురుయదువంశముల సత్త్వగుణయుతు లగుచున్.

33

తా ॥ భూమాత భారాన్ని తొలగించటం కోసం, నరనారాయణులే 'అర్జునుడు', 'కృష్ణుడు' అనే పేర్లతో పుడమిపై కురు, యదువంశాలలో జన్మించారు. సత్త్వగుణ సంపన్నులై ప్రకాశించారు.

వ. మఱియు నగ్నిదేవునకు దక్షపుత్రియైన "స్వాహాదేవి" యను భార్యయందు హుతభోజను లగు పావకుండును, బవమానుండును, శుచియు నను మువ్వురు కొడుకులు గలిగిరి: వారివలనం బంచచత్వారింశత్సంఖ్యలం గల యగ్ను లుత్పన్నంబు లయ్యె; నిట్లు పితృపితామహ యుక్తంబుగా నేకోనపంచాశత్సంఖ్యలు గల యగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబులైన యిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడుచుండు; నా యగ్ను లెవ్వ రనిన నగ్నిష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులుఁ బితలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేడు దెఱంగులై యుందురు. దాక్షాయణి యగు స్వధ యను ధర్మపత్నియందు వారల వలన "వయున" యు, "ధారిణి" యు నను నిద్దఱు కన్య లుదయించి జ్ఞానవిజ్ఞానపారగ లగుచు బ్రహ్మనిష్ఠ లయి పరఁగిరి; వెండియు.

34

తా ॥ అగ్నిదేవునికి దక్షుని కుమార్తెయైన 'స్వాహాదేవి' వలన హోమంలో ఆహుతి

ఇవ్వబడిన ద్రవ్యాలను ఆహారంగా స్వీకరించే 'పావకుడు', 'పరమానుడు', 'శుచి' – అనే ముగ్గురు సంతానం కలిగారు. వాళ్ళవలన నలభై అయిదుగురు అగ్నులు జన్మించారు. తాతదండ్రులతో కలసి మొత్తం నలభైతొమ్మిది మంది అగ్నులయ్యారు. అగ్నిదేవుణ్ణి ఉద్దేశించిన యజ్ఞకర్మలను నిర్వహించే 'ఇష్టులు' ఆ యా పేర్లతో ఆ యజ్ఞకర్మలు నిర్వహిస్తారు. వాటిపేర్లు 1. 'అగ్నిష్వాత్తులు' 2. బర్హిషదులు 3. సౌమ్యులు 4. పితలు 5. ఆజ్యపులు 6. సాగ్నులు 7. నిరగ్నులు. దక్షుని కుమార్తెయైన 'స్వధ' అనే ధర్మ పత్నివలన 'వయున', 'ధారిణి' అనే ఇద్దరు కూతుళ్ళు పుట్టారు. వాళ్ళు జ్ఞానవిజ్ఞాన పారంగతులు. బ్రహ్మనిష్ఠాపరులు.

## 4. ఈశ్వరునకు, దక్షప్రజాపతికి విరోధము సంభవించుట

సీ. దక్షప్రజాపతి తనయ యా భవుని భార్యయు ననఁదగు 'సతి' యను లతాంగి
సతతంబుఁ బతిభక్తి సలుపుచుండియుఁ దనూజాతలాభము నందఁ జాలదయ్యె;
భర్గుని దెసఁ జాలఁ బ్రతికూలుఁ డైనట్టి తమ తండ్రిమీఁది రోషమునఁ జేసి
వలనేది తా ముగ్ధవలె నిజయోగ మార్గంబున నాత్మదేహంబు విడిచె;

తే. నని మునీంద్రుండు వినిపింప న మ్మహాత్ముఁ, డైన విదురుండు మనమున నద్భుతంబు
గదురఁ దత్కథ విన వేడ్క గడలుకొనఁగ, మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు.

35

తా ॥ దక్షప్రజాపతి పుత్రిక, ఈశ్వరుని భార్యయైన సతీదేవి పతిభక్తితో భర్తను ఎల్లవేళలా సేవించింది. అయినప్పటికీ సంతానం కలుగలేదు. ఈశ్వరుని పట్ల చాలా వ్యతిరేకత కలిగిన తండ్రిపై రోషంతో, యోగమార్గంలో దేహాన్ని వీడింది"

అని మైత్రేయ మహాముని చెప్పగా విని విదురుడు మనస్సులో ఆశ్చర్యపడి, ఆ కథ వినాలన్న కుతూహలం కలుగగా, మైత్రేయుని ఇలా అడిగాడు:

సీ. చతురాత్మ! దుహితృవత్సలుఁడైన దక్షుండు దన కూఁతు సతి ననాదరము సేసి
యనయంబు నఖిలచరాచర గురుఁడు ని ర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను జర్చింప దేవుండు నంచితాత్మారాముఁ డలఘుమూర్తి
శీలవంతులలోన శ్రేష్ఠుండ నగు నట్టి భవునందు విద్వేషపడుట కేమి

తే. కారణము? సతి దా నేమి కారణమున, విడువరానట్టి ప్రాణముల్ విడిచె? మఱియు
శ్వశుర జామాతృ విద్వేష సరణి నాకుఁ, దెలియ నానతి యిమ్ము సుధీవిధేయ!

36

తా ॥ "మహాత్మా! కుమార్తెలపట్ల వాత్సల్యం గల దక్షుడు, తన కూతురైన సతీదేవిని అనాదరించడానికి కారణం ఏమిటి? సమస్త చరాచర కోటికి చైతన్య ప్రదాత, ఎవరితోను విరోధించనివాడు, శాంతస్వరూపి, గొప్పవాడు, అన్ని లోకాలకు దివ్యమైనవాడు, ఆత్మస్వరూపుడై తనయందు తానే నివసించి యుండేవాడు, విశ్వేశ్వరుడు, శీలవంతులలో శ్రేష్ఠుడు అయిన ఈశ్వరునితో దక్షునికి విరోధం ఎందుకు వచ్చింది? ఏ కారణం చేత సతీదేవి ప్రాణత్యాగం చేసింది? ఆ మామా అల్లుళ్ళ మధ్య విరోధం ఎందుకు సంభవించింది? సుధీజన విధేయా! నాకు ఆ వైనాన్ని తెలియజెప్పవలసింది."

క. అని యడిగిన నవ్విదురునిఁ, గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుక మొప్పన్
విను మనఘ! తొల్లి బ్రహ్మలు, జననుతముగఁ జేయునట్టి సత్త్రముఁ జూడన్.

37

తా ॥ ఈ విధంగా ప్రశ్నించిన విదురుణ్ణి చూచి, మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు:

'ఓ పుణ్యాత్మా! విను. పూర్వం బ్రహ్మజ్ఞాన సంపన్నులైన బ్రహ్మలు చేసే సత్రయాగాన్ని చూడటానికి

'సత్రము' – "సత్ త్రాయతే ఇతి సత్త్రః" – మంచిని రక్షించేదని అర్థం. సజ్జనులు చేరే సందర్భమని మరొక అర్థం. అరణ్యాలలో ఋష్యాదులు పరస్పరం కలసి వేదశాస్త్ర రహస్యాలను, ఆధ్యాత్మిక విద్యా విషయాలను చర్చించుకోవడానికి వీలుగా అన్ని వసతులతో నిర్మించిన ఆశ్రమాలుండేవి. వీటినే సత్త్రాలని అనేవాళ్ళు. కాలక్రమంలో ధర్మసత్రాలన్న పదం ఇలా వచ్చిందే. విద్యా సంప్రదాయ పరిరక్షణకు ఇవి దోహదపడేవి. పెద్దలెవరైనా, ఏ ప్రాంతం వాళ్ళయినా వచ్చి శాస్త్రబోధన చేస్తే మిగిలినవాళ్ళు వినటం ఇందులోని పద్ధతి. ఈ సత్రాలు కేవలం ఒక వ్యక్తి మాత్రమే కాకుండా ఋషుల సంఘాల చేతకూడ నెలకొల్పబడి నిర్వహించబడేవి. యజ్ఞమంటే కేవలం ద్రవ్య యజ్ఞమే కాదు. జ్ఞానయజ్ఞము కూడా యజ్ఞమే.

చ. సరసిజగర్భ యోగిజన సర్వ సుపర్వమునీంద్ర హవ్య భు
క్పరమఋషి ప్రజాపతులు భక్తి మెయిం జనుదెంచియుండ న
త్తరణిసమానతేజుఁడగు దక్షుఁడు వచ్చినఁ దత్సదస్యు లా
దరమున లేచి; రప్పుడు పితామహభర్గులు దక్క నందఱున్.

38

తా ॥ బ్రహ్మ, యోగులు, సర్వ దేవతలు, మునీంద్రులు, అగ్నిహోత్రుడు, ఋషులు, ప్రజాపతులు భక్తితో వచ్చారు. అప్పుడు సూర్యసమాన తేజస్సుగల దక్షుడు కూడా అక్కడికి వచ్చాడు. దక్షుని రాకను గమనించిన సభాసదులందరూ వెంటనే లేచి నిలుచున్నారు. బ్రహ్మ, మహేశ్వరులు మాత్రం లేచి నిలబడలేదు.

బ్రహ్మ దక్షునికి తండ్రి కాబట్టి లేచి నిలబడలేదు. ఈశ్వరుడు జగత్ప్రభువు కాబట్టి నిలబడలేదు. పైగా లోకనియమాలకు పరమేశ్వరుడు అతీతుడుకదా!

క. చనుదెంచిన యా దక్షుఁడు, వనజజునకు మ్రొక్కి భక్తివశులై సభ్యుల్
దన కిచ్చిన పూజలు గై, కొని యర్హాసనమునందుఁ గూర్చుండి తగన్.

39

తా ॥ వచ్చిన ఆ దక్షుడు, బ్రహ్మకు నమస్కరించాడు. భక్తిపారవశ్యంతో సభ్యులు తనకు చేసిన పూజల్ని స్వీకరించాడు. తనకు ఉచితమైన ఆసనంపై కూర్చున్నాడు.

తే. తన్నుఁ బొడగని సభ్యు లందఱును లేవ, నాసనము దిగనట్టి పురారివలను
గన్ను గొనలను విస్ఫులింగములు సెదరఁ, జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ.

40

తా ॥ తనను చూచి సభ్యులంతా లేచారు. ఆసనం నుండి దిగని శివుని వైపు కళ్ళ వెంట

నిప్పులు రాలేట్లు చూస్తూ ఇలా అన్నాడు:

తే. వినుఁడు మీరలు రొదమాని విబుధ ముని హు, తాశనాది సురోత్తములార! మోహ
మత్సరోక్తులు గావు! నా మాట లనుచు, వారి కందఱ కా పురవైరిఁ జూపి,

41

తా ॥ "ఓ దేవతలారా! మునీశ్వరులారా! అగ్ని మొదలైన దేవతా శ్రేష్ఠులారా! మీరంతా సద్దు చేయటం మాని, వినండి. నేను అనే మాటలు మాత్సర్యంతో పలికేవి కావు. అంటూ ఈశ్వరుణ్ణి చూపి....

సీ. పరికింప నితఁడు దిక్పాలయశోహాని కరుఁ డీ క్రియాశూన్యపరుని చేతఁ
గరమొప్ప సజ్జనాచరితమార్గము దూషితం బయ్యెఁ; నెన్న గతత్రపుండు
మహితసావిత్రీ సమానను సాధ్వి నస్మత్తనూజను మృగశాబనేత్ర
సకల భూమీసుర జనసమక్షమున మర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ

తే. జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మ, దలఁచి ప్రత్యుద్గమాభివందనము లెలమి
నడపకుండిన మాననీ; నన్నుఁ గన్న, గోరిమాటకుఁ దన కేమి గోరుపోయె.

42

తా ॥ పరిశీలిస్తే, ఈ శివుడు దిక్పాలకుల కీర్తికి హాని కలిగించేవాడు. క్రియాశూన్యపరుడైన ఈతని వలన సజ్జనులు నడిచే మార్గం చెడిపోయింది. సిగ్గులేని ఈ శివుడు, సావిత్రీదేవితో సమానమైన నా కుమార్తెను, సాధ్విని, లేడికన్నుల వంటి కన్నులు గలదానిని, కోరి, అగ్నిసాక్షిగా, బ్రాహ్మణ బంధుజన సమక్షంలో వివాహం చేసుకున్నాడు. అందువల్ల కోతికళ్ళ వంటి కళ్ళుగల ఈ శివుడు గొప్పవాడయ్యాడు. అది మదిలో తలచి, నాకు ఎదురుగావచ్చి, నమస్కరించి గౌరవించవద్దా? పోనీ, అదలా ఉంచండి. నన్నుచూచి, నోటితో పలుకరిస్తే ఆయనకేం గౌరవలోపం వచ్చింది?

సీ. అనయంబు లుప్తక్రియా కలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారఁ దున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూతప్రేత పరివృతుండు
దామసప్రమథ భూతములకు నాథుండు భూతిలిప్తుం దస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్టహృదయుఁ దుగ్రుఁడును బరేతభూ ని

తే. కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి, యయిన యితనికి శివనాముఁ డను ప్రవాద
మెటులు గలిగె? నశివుఁడగు నితని నెఱిఁగి, యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు.

43

తా ॥ ఇంకా ఈ శివుడు వేదోక్త సత్కర్మలను చేయనివాడు. అభిమానహీనుడు. మర్యాద లేనివాడు. మత్తెక్కి తిరుగుతాడు. పిచ్చివాళ్ళకు ఇష్టమైనవాడు. దిగంబరుడు. భూతప్రేతగణాలతో కూడి ఉంటాడు. తామస గుణం ప్రధానమైన ప్రమథ గణాలకు, భూతగణాలకు అధిపతి. బూడిద పూసుకుంటాడు. ఎముకలు భూషణాలుగా ధరిస్తాడు. శుచి లేనివాడు. మతిలేని పిచ్చివాళ్ళకు ప్రభువు. దుష్ట హృదయుడు. శ్మశానంలో కాపురముంటాడు. జుట్టు విరబోసికొని అపవిత్రంగా తిరిగే ఇతనికి, శుభాలను కలిగించేవాడనే అర్థంగల శివుడనే పేరు ఎలా వచ్చింది? శూద్రునికి వేదాన్ని ఇచ్చినట్లు. తెలిసితెలిసి అశివుడైన ఈ శివునికి

వ. ఇతనికి నస్మత్తనూజను విధిప్రేరితండనై యిచ్చితి.

44

తా ॥ విధిప్రేరితుడనై నా కుమార్తెనిచ్చి పెళ్ళి చేశాను"

క. అని యిట్టుల ప్రతికూల వ, చనములు దక్షుండు వలికి 'శపియింతును శ
ర్వుని' నని జలములు గొని కర, మున, నిలిచిట్లనియె, రోషమున నఘాత్మా!

45

తా ॥ అని ఈ విధంగా శివునికి వ్యతిరేకంగా మాట్లాడుతూ, శివుణ్ణి శపిస్తానని, జలాన్ని స్వీకరించి, రోషంతో దక్షుడిలా అన్నాడు:

క. ఇతఁ డింద్రోపేంద్రపరీ, వృతుఁడై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహిత ని, యతిఁ బొందక యుండుఁగాక యని శపియించెన్.

46

తా ॥ "ఈ శివుడు ఇంద్రుడు, విష్ణువు మొదలగు దేవతలతో పాటు యజ్ఞ సమయంలో హవిర్భాగాన్ని పొందకుండు గాక" అని శపించాడు.

వ. ఇట్లు దక్షుండు పల్కిన గర్హితవాక్యంబులు వినిందితంబులుగ నుండియును నర్థాంతరంబున వాస్తవంబు లగుచు భగవంతుండగు రుద్రునందు ననిందితంబులై స్తుతి రూపంబుల నొప్పెఁ; దదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చిన కారణంబున దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యం బని నిషేధింప బడి ప్రవృద్ధంబయిన క్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియె; నంత గిరిశానుచరాగ్రేసరుం డగు నందికేశ్వరుండు దక్షుండు నిటలాక్షుని శపియించిన శాపంబు; నతనిఁ బల్కిన యనర్థ వాక్యంబులును విని కోపారుణిత లోచనుండై యిట్లను; నీ దక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబు గాఁదలంచి యప్రతిద్రోహియైన భగవంతునందు భేదదర్శియై యపరాధంబు గావించె; నిట్టి మూఢాత్ముండు దత్త్వవిముఖుండగు; మఱియుం గూట ధర్మంబు లయిన నివాసంబుల గ్రామ్యసుఖ కాంక్షలం జేసి సక్తుండై యర్థవాదంబు లయిన వేదంబులచే నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు సేయు; వెండియు దేహాదికంబు లుపాదేయంబులుగాఁ దలంచుచు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముకుండు నగు నిదియునుంగాక దక్షుం డచిరకాలంబున మేషముఖుండగు నని మఱియు.

47

తా ॥ ఈ విధంగా దక్షుడు పలికిన నిందావాక్యాలు పైకి తిట్లుగా ఉన్నప్పటికీ, మరో అర్థంలో భగవంతుడైన ఈశ్వరుని పట్ల వాస్తవాలుగా, స్తుతిగా పరిణమించాయి. రుద్రునికి శాపమిచ్చినందుకు సభలోనివాళ్ళు దక్షుణ్ణి, 'కూడని పనిచేశా' వంటూ అడ్డుకున్నారు. కోపం పెరిగి దక్షుడు తన నివాసానికి వెళ్ళిపోయాడు. అంతట పరమేశ్వరుని అనుచరులలో మొట్టమొదటి వాడయిన నందికేశ్వరుడు, పరమేశ్వరుణ్ణి దక్షుడు శపించడాన్ని, అనవసరపు మాటలు మాట్లాడటాన్ని విని, కోపంతో ఎర్రబడ్డ కళ్ళు కలవాడై ఇలా అన్నాడు:

దక్షుడు తన మానవశరీరం గొప్పదిగా భావించి, ఎవరికీ ద్రోహం చేయని భగవంతుణ్ణి వేరేవిధంగా చూసి తప్పు చేశాడు. ఇటువంటి మూర్ఖుడు భగవంతుని నిజస్వరూపం గ్రహించడానికి కూడా సుముఖుడు కాడు. అంతేకాక కుటిల ధర్మాలను ఆశ్రయించి అల్ప సుఖాపేక్షల పట్ల ఆసక్తి పెంచుకొన్నాడు. అర్థవంతమైన వేదవాక్యాలను స్వార్థాన్ని సమర్థించే వాక్యాలుగా భావిస్తున్నాడు. బుద్ధిని కోల్పోయి, కర్మలలో చిక్కుకొని బంధింపబడుతున్నాడు. దేహాన్నే తన అస్తిత్వానికి ఆధారంగా భ్రాంతిపడి, అంతర్యామియైన ఆత్మను మరచి పశువులా ప్రవర్తిస్తూ, స్త్రీలపై కోరిక పెంచుకొని పతనమవుతాడు. అంతేకాకుండా త్వరలోనే ఈ దక్షుడు "గొఱ్ఱె తలవాడు" అవుతాడు.

మ.అనయంబుం దనమానసంబున నవిద్యల్ ముఖ్యతత్త్వంబుగాఁ
గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్ము నీ దక్షుని
న్ననువర్తించినవారు సంసరణకర్మారంభులై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్.

48

తా ॥ తన మనస్సులోని అజ్ఞానాన్నే జ్ఞానంగా భ్రమించి, పరమేశ్వరుణ్ణి తిరస్కరించిన దుష్టుడు ఈ దక్షుడు. ఈతణ్ణి అనుసరించినవారు సంసార కర్మలో చిక్కి జనన మరణ చక్రంలో పడిపోతారు.

వ. అదియునుంగాక యీ హరద్వేషులైన ద్విజు లర్థవాదబహుళంబులైన వేదవాక్యంబుల వలన మధుగంధ సమంబైన చిత్తక్షోభంబుచేత విమోహిత మనస్కులయి కర్మాసక్తు లగుదురు; మఱియును భక్ష్యాభక్ష్య విచారశూన్యులై దేహాదిపోషణంబుకొఱకు ధరియింపఁ బడిన విద్యాతపోవ్రతంబులు గల వారలై ధనదేహేంద్రియంబుల యందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతు రని నందికేశ్వరుండు బ్రాహ్మణ జనంబుల శపియించిన వచనంబులు విని భృగుమహాముని మరల శపియింపం బూని యిట్లనియె.

49

తా ॥ అంతేకాకుండా హరద్వేషియైన దక్షుని మార్గాన్ని అనుసరించే బ్రాహ్మణులు అర్థవాదాలతో నిండిన వేదవాక్యాల వలన, మద్యపు వాసనవంటి మనస్సుతో క్షోభపడి, అసత్కర్మలపై ఆసక్తి గలవారవుతారు. ఏవి తినదగినవో, ఏవి తినదగనివో తెలియని అవివేకంతో జీవిస్తారు. విద్య, తపస్సు, వ్రతము – అన్నింటినీ దేహపోషణ సుఖాలకే వినియోగిస్తారు. ధనము మీద, దేహము మీద, ఇంద్రియాలమీద ఆదరాభిమానాలు కలవారై, యాచకులై విహరిస్తారు అని అక్కడి బ్రాహ్మణులను శపించాడు." ఆ శాపవాక్కులను విన్న భృగు మహాముని మళ్ళీ ఇలా శపించాడు:

తే. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు, వారి కనుకూలు రగుదు రెవ్వారు వారు
నట్టి సచ్ఛాస్త్ర పరిపంథు లైనవారు, నవనిఁ "బాషండు" లయ్యెద రని శపించె.

50

తా ॥ "ఎవరయితే శివదీక్ష వహించి శివదీక్షా పరాయణులవుతారో, వాళ్ళను ఎవరైతే అనుసరిస్తారో వాళ్ళు వేదశాస్త్ర విరోధులై పాషండులయి పోదురుగాక! అది ఏ విధంగానంటే,

సీ. సకల వర్ణాశ్రమాచార హేతువు లోకమునకు మాంగళమార్గమును, సనాత
నముఁ, బూర్వఋషి సమ్మతము, జనార్దనమూలమును, నిత్యమును, శుద్ధమును, శివంబు,

నార్యపథానుగం బగు వేదమును విప్రగణము నిందించిన కారణమున
నే శివదీక్ష యందేని మధ్యమ పూజ్యుఁ డై భూతపతి దైవ మగుచు నుండు

తే. నందు మీరలు భస్మజటాస్థిధార, ణములఁ దగి మూఢబుద్ధులు నష్టశౌచు
లై నశింతురు పాషండు లగుచు ననుచు, శాప మొనరించె నా ద్విజసత్తముండు.

51

తా ॥ సకల వర్ణాశ్రమ ధర్మాలకు, ఆచార ధర్మాలకు కారణమైంది వేదం. అది లోకానికి శుభ కారకమైంది. సనాతనమైంది. పూర్వ ఋషుల చేత సమ్మతించబడింది. విష్ణువు నుండి ప్రభవించింది. నిత్యము, పరిశుద్ధమూ అయినది. ఆర్యులయిన పెద్దలు అనుసరించదగిన మార్గాన్ని చెప్పే వేదాన్ని, విప్రగణాన్ని నిందించిన కారణాన, శివదీక్షాపరులచే ఆరాధించబడే భూతనాథుడు, శివదీక్షలో సైతం 'మధ్యమ పూజ్యస్థానం' వహిస్తాడు. ఆయన భక్తులైన మీరు బూడిదను, జడలను, ఎముకలను ధరింతురు గాక! మూర్ఖులై, శౌచం లేనివారై, పాషండులై నశింతురుగాక!" అని భృగు మహర్షి శపించాడు.

వ. ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గలవార లగుటం జేసి నాశంబు నొందరై; రట్టియెడ విమనస్కుం డగుచు ననుచరసమేతుండై భవుండు సనియె నంత.

52

తా ॥ ఈ విధంగా భృగుమహర్షి, నందీశ్వరుడు పరస్పరం శపించుకున్నారు. అయినప్పటికీ భగవదనుగ్రహంచేత నాశనం పొందలేదు. ఆ సమయంలో శివుడు విమనస్కుడై (దేనియందు మనస్సు పెట్టనివాడై) అనుచరులతో కలిసి వెళ్ళిపోయాడు.

దక్షుడు శివుణ్ణి శపించాడు. ఆ దక్షుణ్ణి, ఆ దక్షుని పక్షంవారిని నందీశ్వరుడు శపించాడు. భృగువు శివునితో పాటు శివగణాన్ని కూడా శపించాడు. ఇలా వీళ్ళంతా శపించుకోవటం

గమనించి కూడా ఈశ్వరుడు పట్టించుకోలేదు. పైగా వాళ్ళ శాపాలు ఫలించకుండినందువల్ల వాళ్ళెవరూ నశించలేదు. అంటే, వాళ్ళ శాపాలు ధర్మబద్ధాలు కావని, శాపఫలం కూడా పరమేశ్వరుని ఆధీనమేనన్న విషయం ఇక్కడ విదితమవుతుంది. పరమేశ్వరుడు ప్రాణికోటిపై ఎంతటి అనురాగాన్ని చూపుతాడో చెప్పడానికి ఇదే ప్రత్యక్ష సాక్ష్యం.

సీ. అనఘాత్మ! యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుఁడగు హరి సంపూజ్యుఁడై వెలుంగు
నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్రవత్సరములు నజుఁ డొనర్చెఁ
గరమొప్ప నమర గంగాయమునా సంగమావనిఁ గలుగు ప్రయాగయందు
నవభృథస్నానంబు లతిభక్తిఁ గావించి గతకల్మషాత్ములై ఘనత కెక్కి

తే. తగ నిజాశ్రమభూములఁ దలఁచి వార, లందఱును వేడ్కతోఁ జని రనుచు విదురునకును
మైత్రేయుఁడను మునినాయకుండు, నెఱుఁగ వినిపించి వెండియు నిట్టు లనియె.

53

తా ॥ ఏ యజ్ఞంలో సర్వశ్రేష్ఠుడైన హరి పూజింపబడతాడో, ఆ యజ్ఞాన్ని వేదశాస్త్రోక్త సమ్యగ్విధానంతో వేయి సంవత్సరాలు బ్రహ్మ చేశాడు. గంగ, యమున నదులు కలిసిన ప్రయాగలో ఋషులందరూ దీక్షాస్నానాలు చేసి, పాపరహితులై తమతమ ఆశ్రమాలకు వెళ్ళారు" అని మైత్రేయమహర్షి విదురునితో మళ్ళీ ఇలా చెప్పాడు:

"మానవులకు వేయి సంవత్సరాలు–బ్రహ్మకు ఒక పగలు' అని గీతలో కృష్ణుడు చెప్పడాన్ని బట్టి, బ్రహ్మ వేయి సంవత్సరాలు యజ్ఞం చేశాడంటే 'ఒక పగలు' యజ్ఞం చేశాడని అర్థం. బ్రహ్మ చేసిన యజ్ఞం సృష్టియే. ఆ సృష్టియజ్ఞంలో పాల్గొన్న ఋషులంతా జీవుల కర్మఫలితాలు. తమకు అంటకుండటం కోసమే దీక్షాస్నానాలు చేసి వెళ్ళారని చెప్పాడు. ఇక యజ్ఞాధిపతి విష్ణువుగా బ్రహ్మ యజ్ఞం చేయటమంటే, సమస్తమూ వ్యాపించిన విష్ణువే యజ్ఞస్వరూపుడని తాత్పర్యం."

వ. అంత శ్వశురుండగు దక్షునకు జామాతయైన భర్గునకు నన్యోన్య విరోధంబు వెరుఁగుచుండ నతిచిరంబగు కాలం బరిగెనంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వవిరోధంబునను బరమేష్ఠి కృతంబైన సకల ప్రజాపతి విభుత్వగర్వంబుననుం జేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయ సవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవన నామకంబైన మఖంబు సేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున.

54

తా ॥ అలా మాయమైన దక్షునకు, అల్లుడైన ఈశ్వరునకు పరస్పర విరోధం పెరుగుతుండగా చాలాకాలం గడిచింది. రుద్రుడు లేనిదే యాగం లేదని తెలిసికూడా, పరమేశ్వరునితో ఉన్న పూర్వవైరం వల్ల ప్రజాపతులందరిపై అధినాయకత్వాన్ని వహించాడు. ఆ అధికార గర్వంచేత, ఈశ్వరాదుల్ని ధిక్కరించి, రుద్రహీనమైన 'వాజపేయము' అనే యజ్ఞాన్ని చేశాడు. ఆ తరువాత 'బృహస్పతి సవన' మనే పేరుగల యజ్ఞం చేయడానికి ఉపక్రమించాడు. అక్కడికి వరుసగా

చ. కర మనురక్తి న మ్మఖము గన్గొను వేడుక తొంగలింపఁగా
బరమముని ప్రజాపతి సుపర్వ మహర్షి వరుల్ సభార్యులై
పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁ బొరి నచ్చటన్ విహిత పూజల నొందిరి సమ్మదంబునన్.

55

తా ॥ ఆ యజ్ఞాన్ని చూడాలన్న వేడుకతో పరమమునులు, ప్రజాపతులు, దేవతలు, మహర్షులు భార్యలతో సహా విచ్చేశారు. వచ్చిన వారందరూ దీవెనలు ఇచ్చి, దక్షుడు చేసిన పూజలనందుకున్నారు.

# 5. దక్షప్రజాపతి యజ్ఞము చేయునప్పుడు దాక్షాయణి అచ్చటికి వెళ్ళుట

తే. దక్షతనయ సతీదేవి దవిలి యాత్మ, సదనము నుండి జనకుని సవనమహిమ
గగన చరులు నుతింప నా కలకలంబు, విని కుతూహలిని యయి విన్వీథిఁ జూడ.

56

తా ॥ ఆకాశంలో వెళుతూ తన తండ్రి దక్షుని యాగాన్ని గురించి కీర్తించే దేవతల కలకలాన్ని విని, సతీదేవి తన ఇంటి నుండి, వినువీథి వైపు చూసింది.

వ. అయ్యవసరంబునఁ దదుత్సవ దర్శన కుతూహలులై సర్వ దిక్కులవారును జనుచుండి; రా సమయంబున.

57

తా ॥ ఆ సమయంలో దక్షుని యాగాన్ని చూడాలన్న కుతూహలంతో అన్ని దిక్కుల వాళ్ళూ వెళుతున్నారు.

సీ. తనరారు నవరత్న తాటంక రోచులు చెక్కుటద్దములతోఁ జెలిమిసేయ
మహనీయ తపనీయమయ పదకద్యుతు లంసభాగంబుల నావరింప
నంచిత చీని చీనాంబర ప్రభలతో మేఖలాకాంతులు మేలమాడఁ
జంచల సారంగ చారు విలోచన ప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ

తే. మించు వేడుక భర్తృసమేత లగుచు, మానితంబుగ దివ్యవిమానయాన
లగుచు నాకాశపథము నరుగుచున్న, ఖచర గంధర్వ కిన్న రాంగనలఁ జూచి.

58

తా ॥ దేవతలు, ఖేచరులు, గంధర్వులు, కిన్నరులు ఎంతో వేడుకతో భర్తలతో కలిసి

దివ్యవిమానాలనెక్కి పోతున్నారు. ఆ స్త్రీలు ధరించిన నవరత్నాలు పొదిగిన కర్ణభూషణాల కాంతులు, అద్దాలవంటి వారి చెక్కిళ్ళపై ప్రకాశిస్తున్నాయి. మేలిమి బంగారంతో చేసిన పతకాల కాంతులు మూపులపై వ్యాపిస్తున్నాయి. చీని చీనాంబరాల కాంతులు, ఒడ్డాణముల కాంతులతో కలసి మేలమాడుతున్నాయి. లేడికళ్ళవంటి అందమైన వారి కన్నుల కాంతులు నలుదిక్కులా ప్రసరిస్తున్నాయి. ఇలా దంపతులు దంపతులుగా విమానయానంతో ఆకాశ మార్గంలో వెళ్ళడాన్ని సతీదేవి చూచింది.

క. సతి దనపతి యగు నా పశు, పతిఁ జూచి సముత్సుకతను భాషించె; ప్రజా
పతి మీ మామ మఖము సు, వ్రతమతి నొనరించుచున్న వాఁడఁట వింటే;

59

తా ॥ సతీదేవి, పాశములచే సమస్త ప్రజ్ఞలను బంధించిన తన పతియైన పశుపతిని చూసి, ఉత్సాహంతో ఇలా అన్నది: “మీ మామగారైన దక్ష ప్రజాపతి దీక్షాపరుడై యజ్ఞం చేస్తున్నాడట! విన్నారా?

క. కావున నయ్యజ్ఞమునకు, నీ విబుధగణంబు లర్థి నేగెద; రదిగో;
దేవ! మన మిప్పు డచటికిఁ, బోవలె నేను వేడ్క నాకుఁ బుట్టెడు నభవా!

60

తా ॥ అదిగో! ఆ యజ్ఞానికి ఈ దేవతాగణాలు వెళుతున్నాయి. ప్రభూ! మనం కూడా అక్కడికి వెళదామన్న కోరిక నాకు కలుగుతోంది.

క. ఆ యజ్ఞముఁ గనుఁగొనఁగా, నా యనుజలు భక్తిఁ బ్రాణనాథుల తోడం
బాయక వత్తురు; మనముం, బోయిన నే వారి నచటఁ బొడగనఁ గల్గున్.

61

తా ॥ ఆ యజ్ఞాన్ని చూడటానికి నా తోబుట్టువులంతా తమతమ భర్తలతో వస్తారు. మనం కూడా వెళ్ళినట్లయితే వాళ్ళందరినీ అక్కడ చూడవచ్చు.

క. జనకుని మఖమున కర్థిం, జని నీతోఁ బారిబర్హ సంజ్ఞికతఁ గడుం
దనరిన భూషణములఁ గై, కొన వేడ్క జనించె నీశ! కుజనవినాశా?

62

తా ॥ ఈశ్వరా! దుష్టజన నాశంకరా! మా నాన్న చేసే యజ్ఞానికి వెళ్ళి అక్కడ కూతురికి, అల్లుడికి ఆయనిచ్చే కానుకల్ని, నగల్ని స్వీకరించాలని నాకు కోరికగా ఉంది.

క. నాతోడను స్నేహము గల, మాతను దత్సోదరీ సమాజము ఋషి సం
ఘాతకృత మఖసమంచిత, కేతువుఁ గన వేడ్క గగనకేశ! జనించెన్.

63

తా ॥ సూర్యకిరణాలే కేశాలుగా గల ఓ అంబరకేశా! నాపై ఎంతో ప్రేమగల మా అమ్మను, ఆమె తోబుట్టువుల్ని, ఋషి సమూహం చేత స్థాపించబడిన యజ్ఞధ్వజాన్నీ చూడాలన్న కోరిక కలిగింది.

వ. అదియునుంగాక! దేవా! మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచము భవదీయ మాయా వినిర్మితం బగుటం చేసి నీకు నాశ్చర్యకరంబుగా; దయినను భవదీయ తత్త్వం బెఱుంగఁ జాలక కామినీస్వభావంబు గలిగి కృపణురాలనై మదీయ జన్మభూమిఁ గనుంగొన నిచ్చగించితి నని వెండియు నిట్లనియె;

64

తా ॥ అంతే కాకుండా, ఓ స్వామీ! సత్త్వరజస్తమో గుణాలనే మూడింటితో, పంచభూతాలతో నిర్మించబడే ఈ జగత్తు నీ మాయావిలాసమే కాబట్టి నీకు ఆశ్చర్యాన్ని

కలిగించదు. నీ నిజ స్వరూపాన్ని తెలుసుకోలేక, స్త్రీ స్వభావంతో దీనురాలనై మా పుట్టిల్లు చూడాలని కోరుకుంటున్నాను!” అని మళ్ళీ ఇలా అంది:

చ. ముదమునఁ దన్మఖోద్భవ విభూతిఁ గనుంగొన నన్యకామినుల్
పదువులు గట్టి భూషణవిభాసితలై నిజనాథయు క్తలై
మదకలహంస పాండుర సమంచిత దివ్యవిమానయానలై
యదె చనుచున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా!

65

తా ॥ ‘ఈశ్వరా! దక్షయజ్ఞ వైభవాన్ని చూడాలని ఇతర స్త్రీలు గుంపులుగుంపులుగా, నగలను అలంకరించుకొని, పతులతో కలసి, తెల్లని హంసలవంటి కాంతిగల విమానాలలో ప్రయాణిస్తూ వెళుతున్నారు. అదిగో ఆకాశ మార్గంలో గమనించండి.

క. అనఘా! విను లోకంబుల, జనకుని గేహమునఁ గలుగు సకల సుఖంబుల్
తనయలు సని సంప్రీతి, గనుఁగొన కే రీతి నిలుచుఁ గాయము లభవా!

66

తా ॥ ఓ పుణ్యాత్మా! లోకంలో కూతుళ్ళకు తమ తండ్రి ఇంట్లోని శుభకార్యాలను చూడటానికి వెళ్ళకుండా, సుఖాలను అనుభవించకుండా ప్రాణాలు ఎలా నిలుస్తాయి?

క. అనయముఁ బిలువక యుండం, జన ననుచిత మంటివేని జనక గురు సుహృ
జ్జననాయక గేహములకుఁ, జనుచుందురు పిలువకున్న సజ్జను లభవా!

67

తా ॥ ఓ పుణ్యాత్మా! పిలవకుండానే వెళ్ళటం తగదని అంటారేమో? తండ్రి, గురువు, స్నేహితుడు, ప్రభువు అయినవారి గృహాలకు పిలువకుండానే సజ్జనులు వెళ్ళడం సదాచారం

కదా!'

వ. అని మఱియు నిట్లనియె; దేవా! నాయందుఁ బ్రసన్నుండవై మదీయ మనోరథంబుం దీర్ప నర్హుండవు; సమధిక జ్ఞానంబు గల నీచేత నేను భవదీయ దేహంబునం దర్ధంబున ధరియింపబడితి; నట్టి నన్ను ననుగ్రహింపవలయునని ప్రార్థించిన మందస్మిత వదనారవిందుం డగుచు జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు తన్నాడిన మర్మభేదంబులైన కూహక వాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె.

68

తా ॥ అని, ఇంకా ఇలా అన్నది: 'దేవా! నాపట్ల ప్రసన్నుడవై నా కోరికను తీర్చడానికి తగినవాడవు నీవే. సర్వజ్ఞుడవైన నీ దేహంలో నేను సగభాగంగా ధరించబడ్డాను. అటువంటి నన్ను అనుగ్రహించాలి.' అని ప్రార్థించగా, చిరునవ్వులు చిందిస్తూ, జగత్ సృష్టికర్తలయిన ప్రజాపతుల సమక్షంలో దక్షుడు తనను గురించి పలికిన మనస్సును ఛేదించే ములుకుల వంటి వాక్కుల్ని స్మరిస్తూ పరమేశ్వరుడు ఇలా అన్నాడు:

సీ. కల్యాణి! నీ మాట గడునొప్పు; బంధువుల్ పిలువకుండినను సంప్రీతిఁ జనుదు
రంటి; విదియు లెస్సయైనను దేహాభిమాన మదమున నమర్షముననుు
గడఁగి యారోపిత ఘనకోప దృష్టులు గారేనిఁ బోఁదగుఁగాని వినుము
వినుత విద్యా తపో విత్త వయో రూప కులములు సుజనులకును గుణంబు;

తే. లివియు కుజనులయెడ దోషహేతుకంబు, లై వివేకంబు సెఱుచు; మహాత్ములైన
వారి మాహాత్మ్యమాత్మ గర్వమునఁ జేసి, జడులు పొడగానఁ జాలరు జలజనేత్ర!

69

తా ॥ 'ఓ సతీదేవీ! నీ మాట ఎంతో యుక్తంగా ఉంది. బంధువులు పిలవక పోయినా ప్రీతితో వెళతారని నీవన్నది సమంజసమే. అయినప్పటికీ, దేహాభిమాన మదంతో కలిగిన

రోషంతో వాళ్ళు ఆగ్రహావేశాల్ని చూపనట్లయితే వెళ్ళవచ్చు. కానీ, విను! విద్య, తపస్సు, ధనం, వయస్సు, రూపం, కులం – ఇవి సుజనులకు సుగుణాలు. ఇవే దుర్జనులకు దోషకారకాలై వివేకాన్ని చెడగొడతాయి. మహాత్ముల గొప్పదనాన్ని అవివేకులు గర్వంవల్ల గ్రహించలేరు.

క. విను; మట్టి కుటిలు లగు దు, ర్జనుల గృహంబులకు బంధుసరణిని బోవం
జనదు! వినీతుల కది గడు, ననుచిత మైనట్ల యుండు; నది యెట్లనినన్.

70

తా ॥ అటువంటి కుటిలులైన దుర్జనులున్న ఇంటికి బంధుత్వాన్ని పాటించి వెళ్ళటం తగని పని. వినయసంపన్నులకు అది అత్యంత అనుచితమైనది. ఏమంటే

ఆ. కుటిలబుద్ధు లయిన కుజనుల యిండ్లకు, నార్యు లేగ, వా రనాదరమున
బొమలు ముడివడంగ భూరి రోషాక్షులై, చూతు రదియుఁగాక సుదతి! వినుము.

71

తా ॥ కుటిలబుద్ధి గల దుర్జనుల ఇండ్లకు సజ్జనులు వెళ్ళరు. ఆ దుష్టులు కనుబొమలు చిట్లించి వారిని రోషంతో చూస్తారు. అంతేకాదు.

చ. సమదరిపుప్రయుక్తపటుసాయకజర్జరితాంగుఁ డయ్యు దుః
ఖమును దొఱంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు; నో
యుమ! విను మిష్ట బాంధవదురుక్తులు మర్మము లంట నాటఁ జి
త్తమున నహర్నిశంబుఁ బరితాపము నొంది కృశించు నెప్పుడున్.

72

తా ॥ బలవంతుడైన శత్రువు ప్రయోగించిన బలవంతమైన బాణాలు తాకి శరీరం గాయాలుపడి శిథిలమైనా, మానవుడు ఆ దుఃఖాన్ని దిగమ్రింగి ఎలాగో తప్పుకొని పోయి,

నిద్రపోతాడేకాని, కృశించిపోడు. ఓ ఉమాదేవీ! ఇష్టమైన బంధువులు మనస్సుకు తగిలేటట్లు దుర్భాషలాడితే అవి మనస్సుకు బాధ కలిగిస్తూ అహర్నిశలూ కృశింపజేస్తాయి.

క. విను లోకోత్కృష్టుఁడు ద, క్షునికిఁ దనూభవలలోనఁ గూరిమిసుత వై
నను నా సంబంధంబున, జనకునిచేఁ బూజఁ బడయఁజాలవు తరుణీ!

73

తా ॥ తరుణీ! లోకంలో గొప్పవాడైన దక్షునికి తన కుమార్తెలందరిలో ప్రియమైన పుత్రికవు నీవే అయినప్పటికీ, నన్ను పరిణయమాడిన కారణాన నీ తండ్రి గౌరవాన్ని పొందలేవు.

వ. అదియె ట్లతనిచేత భవత్సంబంధంబునం జేసి పూజఁ బడయమికి నతనికి నీకు విరోధంబునకు హేతు వెట్టిదని యంటివేని.

74

తా ॥ అదేమిటి? మీ సంబంధం వలన నాకు గౌరవం లభించదని అంటున్నారు, నా తండ్రికీ మీకూ విరోధం కలగటానికి కారణమేమిటి? అని ప్రశ్నిస్తే

మ. నిరహంకారనిరస్తపాప సుజనానింద్యోల్లసత్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్య మానేంద్రియా
తురులై యూరక మచ్చరింతురు; మహాత్ముం డీశ్వరుండైన యా
హరితో బద్ధ విరోధముం దొడరు దైత్యశ్రేణిచందంబునన్.

75

తా ॥ నిరహంకారులు, పాపరహితులు, సజ్జనులు, నిందలు లేనివారు పొందే కీర్తిని చూచి కొందరు తమకు కూడా అటువంటి కీర్తి కలగాలని కోరుకుంటారు. కాని అశక్తులై, అది సాధ్యంకాక, మనస్సులో రగిలిపోతూ, ఇంద్రియాలకు లొంగి, మాత్సర్యం వహిస్తారు.

మహాత్ముడైన శ్రీమహావిష్ణువుతో దైత్యులు బద్ధ విరోధత్వం వహించిన విధంగానే సజ్జనులపై వీళ్ళు నిష్కారణంగానే ఈర్ష్య పెంచుకుంటారు.

వ. అదియునుం గాక నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు గావింపకుండుటం చేసి యతండు తిరస్కృతుండయ్యె నంటివేని లోకంబున జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభి వందనంబులు గావింతు, రదియు బ్రాజ్ఞు లయినవారు సర్వభూతాంతర్యామియైన పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయిక వ్యాపారం బయుక్తంబని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికంబులు గావింతురుగాని దేహాభిమానంబులు గలుగు పురుషులందుఁ గావింపరు, గాన యేనును వాసుదేవశబ్దవాచ్యుండు, శుద్ధసత్త్వమయుండు, నంతః కరణంబునందు నావరణ విరహితుండును నయి ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నెల్లప్పుడు నమస్కరించుచుండుదు; నిట్లనపరాధినైన నన్నుఁ బూర్వంబున బ్రహ్మలు సేయు సత్త్రంబు నందు దురుక్తులంజేసి పరాభవించి మద్ద్వేషియై దక్షుండు భవజ్జనకుండైన నతఁడును దదనువర్తులయిన వారలును జూడఁదగరు; కావున మద్వచనాతిక్రమంబునం జేసి యరిగితివేని నచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తం బగు; లోకంబున బంధుజనంబులవలనఁ బూజ వడయక తిరస్కారంబు వొందుట చచ్చుటయ కాదే; యని పలికి మఱియు నభవుండు, పొమ్మని యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం చేసి యశుభంబగు ననియు, నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు ననియు మనంబునం దలపోయుచు నూరకుండె; నంత.



తా ॥ అంతే కాకుండా అతనికి ఎదురుగా వెళ్ళి నమస్కరించనందునే అతడు నన్ను తిరస్కరించాడని నీవనుకోవచ్చు. అలా అయితే లోకంలో జనులు పరస్పరం ఎదురుగా వెళ్ళి నమస్కరించుకుంటారు. ప్రాణికోటికి అంతర్యామియైన పరమాత్మ నిత్య పరిపూర్ణుడు కాబట్టి,

భౌతిక దేహాలకు నమస్కరించటం తగదని ప్రాజ్ఞులైనవారు మనస్సులోనే నమస్కారం చేస్తారు. అంతేకాని, దేహాభిమానముగల వారికి చేతులెత్తి నమస్కరించరు. నేను కూడా వాసనామాత్రుడై సర్వభూత హృదయాలలో నివసించే వాసుదేవుడు, శుద్ధ సాత్త్వికుడు, అంతఃకరణములందు ఏ ఆవరణమూ లేని ఆ పరమాత్మకు హృదయంలో ఎప్పుడూ నమస్కరిస్తుంటాను.

'దక్షుడు ఏ అపరాధమూలేని నన్ను పూర్వం బ్రహ్మలు చేసే సత్త్రయాగ సందర్భంలో చెడ్డమాటలతో నిందించాడు. పరాభవించాడు. నన్ను ద్వేషించడం మొదలుపెట్టాడు. నీ తండ్రి అయినప్పటికీ, ఆ దక్షుడూ, ఆతని అనుయాయులు చూడతగరు. కాబట్టి నా మాటలను అతిక్రమించి నీవు అక్కడికి వెళ్ళినప్పటికీ నీకు అక్కడ పరాభవమే జరుగుతుంది. లోకంలో బంధుజనుల వలన గౌరవించబడక, అవమానించబడటం– చనిపోవడం లాంటిదే' అని పలికాడు. అభవుడైన ఈశ్వరుడు 'పోవడానికి ఆజ్ఞ ఇస్తే అక్కడ అవమానింపబడి అశుభాన్ని కొని తెచ్చుకుంటుంది. వద్దని వారిస్తే మనోవేదనతో క్రుగ్గిపోతుంది' – అని మనస్సులో తలపోస్తూ మౌనంగా ఉండిపోయాడు.

సీ. సతి సుహృద్దర్శనేచ్ఛాప్రతికూల దుఃఖస్వాంత యగుచు నంగములు వడఁక
నందంద తొరఁగెడు నశ్రుపూరంబులు గండభాగంబులఁ గడలుకొనఁగ
నున్నత స్తనమండలోపరిహారముల్ వేఁడి నిట్టూర్పుల వెచ్చఁ గంద
నతిశోకరోషాకులాత్యంత దోదూయమానమై హృదయంబు మలఁగుచుండ

తే. మఱియుఁ గుపితాత్మయై స్వసమానరహితు, నాత్మ దేహంబు సగ మిచ్చినట్టి భవుని
విడిచి మూఢాత్మ యగుచు నవ్వేలఁది సనియె, జనకుఁ జూచెదు వేడుక సందడింప.



తా ॥ తన వాళ్ళను చూడాలనే కోరికకు వ్యతిరేకత కలగడం వల్ల సతీదేవి మనస్సు దుఃఖంతో నిండిపోయింది. అవయవాలు వణికిపోతున్నాయి. కన్నీళ్ళు చారికలుగట్టి, చెక్కిళ్ళపై జాలువారాయి. వక్షఃస్థలం మీది హారాలు వేడినిట్టూర్పులకు కందిపోయాయి. శోకంతో,

రోషంతో సతీదేవి హృదయం కమిలిపోయింది. కోపంతో, అనుపమానుడైన స్వామిని, శరీరంలో సగభాగమిచ్చిన స్వామిని, విడిచి తండ్రిని చూడాలన్న కోరికతో మూఢురాలై సతీదేవి పుట్టింటికి వెళ్ళింది.

వ. ఇట్లతిశీఘ్రగమనంబున.

78

తా ॥ ఇలా అతివేగంగా.

సీ. మానిని చనుచుండ మణిమన్మదాది సహస్ర సంఖ్యాత రుద్రానుచరులు
యక్షులు నిర్భయులు వృషభేంద్రుని మున్నిడి కొనుచు నమ్ముదిత దాల్చు
కందుకాంబుజశారికా తాళవృంత దర్పణ ధవళాతపత్ర ప్రసూన
మాలికా సౌవర్ణమణివిభూషణ ఘనసార కస్తూరికా చందనాది

తే. వస్తువులు గొంచు నేగి శర్వాణిఁ గదిసి, శంఖదుందుభి వేణు నిస్వనము లొప్ప
మానితంబైన వృషభేంద్రయానఁ జేసి, యజ్ఞభూమార్గులై యర్థి నరిగి యరిగి.

79

తా ॥ సతీదేవి వెనుకనే మణిమంతుడు, మదుడు మొదలైన వేలాదిమంది రుద్రుని అనుచరగణం, యక్షులూ బయలుదేరారు. నందీశ్వరుడు ముందు నడుస్తున్నాడు. ఆమె వినియోగించే ఆటబంతులు, పద్మాలు, పెంపుడు చిలుకలు, విసనకర్రలు, అద్దాలు, తెల్లని గొడుగులు, సువర్ణభూషణాలు, కర్పూరం, కస్తూరి, చందనం మొదలయిన సుగంధ పరిమళ ద్రవ్యాలతో ఆమెతో పాటు అనుచరగణం నడిచింది. శంఖాలు, దుందుభులు, వేణువులు మ్రోగుతుండగా, సతీదేవిని వృషభవాహనంపై కూర్చుండబెట్టి, యజ్ఞం జరిగే ప్రదేశం వైపు ప్రయాణించారు.

వ. ముందట.

80

చ. మనమున మోదమందుచు నుమాతరుణీమణి గాంచె దారు మృ
త్కనక కుశాజినాయస నికాయ వినిర్మిత పాత్ర సీమము
న్ననుపమ వేషఘోష సుమహత్పశు బంధన కర్మభూమమున్
మునివిబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామమున్.

81

తా ॥ సతీదేవి ఇలా ప్రయాణించి, యజ్ఞశాలను సమీపించింది. ఆ యజ్ఞశాలలో కొయ్యతో, మట్టితో, బంగారంతో, ఇనుముతో చేసిన పావులూ, దర్భలు, జింకచర్మాలతో చేసిన వస్తువులూ కనిపించాయి. వేద ఘోషలు వినిపించాయి. పశుబంధనం చేసే ప్రదేశం కనిపించింది. హోమాగ్నులు చక్కగా వెలుగుతూ, మునులు, దేవతలు చేరి, అభిరామంగా ప్రకాశించే ఆ యజ్ఞప్రదేశానికి సతీదేవి చేరుకున్నది.

వ. ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన.

82

తా ॥ ఇలా, యజ్ఞశాలను చూస్తూ సతీదేవి లోనికి ప్రవేశించింది.

క. చనుదెంచిన య మ్మగువను, జననియు సోదరులుఁ దక్క సభఁ గల జను లె
ల్లను దక్షువలని భయమున, ననయము నపు డాదరింపరైరి మహాత్మా!

83

తా ॥ అలా ప్రవేశించిన సతీదేవిని, తల్లి, తోబుట్టువులు తప్ప, మిగిలిన వారెవ్వరు పలుకరించలేదు. దక్షుని వలన భయంతో ఆమెను ఎవరూ ఆదరించలేదు.

క. నెఱిఁ దల్లియుఁ బినతల్లులుఁ, బరిరంభణ మాచరింపఁ బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గుత్తికతో, సరసిజముఖీ సేమ మరయ సతి దా నంతన్.

84

తా ॥ నిండు మనస్సుతో తల్లి, పినతల్లి సతీదేవిని కౌగిలించుకున్నారు. ఆనంద బాష్పాలు రాలుస్తూ, గొంతు బొంగురుపోతుండగా ఆమె క్షేమాన్ని విచారించారు. అప్పుడు సతీదేవి–

క. జనకుం డవమానించుట, యును సోదరు లర్థిఁ దనకు నుచిత క్రియఁ జే
సిన పూజల నందక శో, భన మరసిన మాఱుమాట పలుకక యుండెన్.

85

తా ॥ తండ్రి పలుకరించకుండా అవమానించటంచేత, తోబుట్టువులు తగిన రీతిగా ఆదరించి గౌరవించినప్పటికీ వాటిని స్వీకరించలేదు. అందుచేత క్షేమసమాచారాన్ని బదులు అడిగినా చెప్పకుండా నిలబడే ఉండిపోయింది.

వ. ఇట్లు తండ్రిచే నాదరింపబడనిదై విభుండైన యీశ్వరునందు నాహ్వాన క్రియాశూన్యత్వ రూపంబైన తిరస్కారంబును, నరుద్ర భాగంబైన యజ్ఞంబునుం గనుంగొని నిజరోషానలంబున లోకంబులు భస్మంబు సేయంబూనిన తెఱంగున నుద్రేకించి రుద్రవిద్వేషియుఁ గ్రతుకర్మాభ్యాస గర్విష్ఠుండునగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి రోషావ్యక్త భాషణంబుల నిట్లనియె; లోకంబున శరీరధారులైన జీవులకు బ్రియాత్మకుండైన యీశ్వరునకుఁ బ్రియాప్రియులును నధికులును లే; రట్టి సకలకారణుండును నిర్మత్సరుండును నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండుప్రతికూలం బాచరించు? నదియునుంగాక మిముబోఁటి వారలు పరులవలని గుణంబులందు దుర్గుణంబులన యాపాదింతురు; మఱియుం గొందఱు మధ్యస్థులైన వారలు పరుల దుర్గుణంబులయందు దోషంబుల నాపాదింపరు; గొందఱు సాదువర్తనంబు గలవారలు

పరుల దోషంబులనైన గుణంబులుగా ననుగ్రహింతురు. మఱియుం గొంద ఱుత్తమోత్తములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ గై కొందు, రట్టి మహాత్మునందు నీవు పాపబుద్ధి గల్పించితివి అని వెండియు నిట్లను; మహాత్ములగు వారల పాదధూళిచే నిరస్తప్రభావులై జడస్వభావంబు గల దేహంబు నాత్మ యని పల్కు కుజనులగు వారు మహాత్ముల నిందించు టాశ్చర్యంబుగా; దదియు వారి కనుచితంబగు నని వెండియు నిట్లనియె.

86

తా ॥ ఈ విధంగా తండ్రిచే అనాదరించబడి, తన భర్త ఈశ్వరుణ్ణి ఆహ్వానించకుండా తిరస్కరించడాన్నీ, రుద్రునికి యజ్ఞంలో భాగం కల్పించకుండా యజ్ఞాన్ని జరిపించడాన్నీ చూసి, సతీదేవితో పాటు భూతగణాలు కూడా కోపాగ్నితో లోకాలను బూడిద చేయబోతున్నట్లు ఆవేశపడ్డాయి. రుద్రవిద్వేషియై, యజ్ఞవిద్యాభ్యాస గర్వంతో కళ్ళు మూసుకుపోయిన దక్షుణ్ణి హతమారుస్తామంటూ లేచిన భూతగణాలను సతీదేవి వారించింది. తన రోషాన్ని వ్యక్తం చేస్తూ ఇలా మాట్లాడింది:

“లోకంలో దేహధారులైన జీవులకు ప్రియాత్మకుడైన ఈశ్వరునికి ప్రియములు – అప్రియములు, అధికులు – అల్పులనే భేదం లేదు. సకల కారణుడూ ఆయనే. ఎవరిపట్ల ఏ విధమైన విద్వేషమూలేని రుద్రుణ్ణి నీవు తప్ప వేరెవరూ వ్యతిరేకించరు. అంతే కాకుండా మీలాంటివాళ్ళు ఇతరుల సద్గుణాలకు దుర్గుణాలను ఆపాదిస్తారు. కొందరు మధ్యస్థులు ఇతరుల దుర్గుణాలలో దోషాలనెంచరు. మరికొందరు సజ్జనులు పరుల దోషాలను కూడా గుణాలుగానే భావిస్తారు. ఇంకా కొందరు ఉత్తమోత్తములు పరులయందు దోషాల్ని ఆపాదించకుండ, వారియందు నీచ గుణాలున్నప్పటికీ సద్గుణాలుగానే స్వీకరిస్తారు. అటువంటి మహాత్ముడైన ఈశ్వరునిపట్ల నీవు పాపబుద్ధితో దోషాన్ని ఆపాదించావు. మహాత్ముల పాదధూళిచేత తమ ప్రభావాన్ని కోల్పోయి జడత్వం గల దేహమే ఆత్మగా పలికే దుష్టులు, మహాత్ముల్ని నిందించటం

ఆశ్చర్యం కాదు. అది వారికి తగని పని.

సీ. అనయంబు "శివ" యను నక్షరద్వయ మర్థి వాక్కునఁ బలుక భావమునఁ దలఁప
సర్వజీవులు పాపసంఘముల్ సెడు; నట్టి మహితాత్మునందు నమంగళుండ
వగు నీవు విద్వేషి వగుట కాశ్చర్యంబు నందెద, వినుము నీ వదియుఁ గాక
చర్చింప నెవ్వని చరణపద్మంబుల నరసి బ్రహ్మానంద మను మరంద

తే. మతుల భక్తిని దమ హృదయంబు లనెడి, తుమ్మెదలచేతఁ గ్రోలి సంతుష్టచిత్తు
లగుదు రత్యంత విజ్ఞాను; లట్టి దేవు, నందు ద్రోహంబు సేసి; తే మందు నిన్ను?

87

తా ॥ నిరంతరం 'శివ', 'శివ' అనే రెండక్షరాలను భక్తి భావంతో తలుస్తూ, వాక్కుతో ఉచ్చరిస్తే సర్వజీవుల పాపకోటీ హరించబడుతుంది. అటువంటి గొప్ప వ్యక్తిని అమంగళకరమైన మనస్సు గల నీవు ద్వేషించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. అంతేగాక గొప్ప విజ్ఞానులైనవాళ్ళు ఏ వ్యక్తి పాదపద్మాలను ధ్యానించి బ్రహ్మానందమనే మకరందాన్ని తమ మనస్సులనే తుమ్మెదల ద్వారా గ్రోలి సంతుష్టచిత్తులు అవుతారో, అటువంటి దేవుని పట్ల నీవు ద్రోహం చేశావు. నిన్ను ఏమనాలి?

క. మఱియును న మ్మహితాత్ముని, చరణసరోజాతయుగము సకలజగంబుల్
నెఱిఁ గొలువఁ, గోరు కోర్కులు, దరమిడి వర్షించ నతనిఁ దగునే తెగడన్?

88

తా ॥ ఆ మహాత్ముని పాదపద్మాలను సమస్త ప్రపంచమూ ఆరాధిస్తుంది. కొలిచే వారి కోర్కెలను తీర్చి కరుణించేవి ఆ పాదపద్మాలు. అటువంటి ఈశ్వరుణ్ణి నిందించవచ్చునా?

చ. పరఁగఁ జితాస్థిభస్మ నృకపాలజటాధరుఁడుం బరేత భూ

చరుఁడు పిశాచయుక్తుఁడని శర్వు నమంగళుగాఁ దలంప రె
వ్వరు; నొకఁ డీవు దక్క, మఱి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్ము స
చ్చరణ సరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్.

89

తా ॥ ఎముకలు, భస్మము, కపాలము, జటలను ధరించి శ్మశానంలో పిశాచ గణాలతో కలిసి తిరిగే అమంగళ స్వరూపుడని ఈశ్వరుణ్ణి నీవు తప్ప మరెవ్వరూ భావించరు. బ్రహ్మాది దేవతలు, ఆ మహాత్ముని పాదపద్మాలను ఆశ్రయించిన పరాగరేణువుల్ని శిరస్సున ధరిస్తారు.

చ. నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుఁ దిరస్కరించు న
క్కలుషుని జిహ్వఁ గోయఁ దగుఁ గా; కటు సేయఁగ నోపఁడేని దాఁ
బొలియుట యొప్పు; రెంటికి, బ్రభుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలుపుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్.

90

తా ॥ పరిపూర్ణంగా ధర్మాన్ని పాలించే నిర్మలుడైన పరమేశ్వరుణ్ణి తిరస్కరించే పాపాత్ముని నాలుకను కోయాలి. అలా చేయడానికి శక్తి లేకపోతే శివనిందను విన్నందుకు చనిపోవడం మంచిది. రెండింటికీ చేత కాకపోతే వ్రేళ్ళతో చెవుల రంధ్రాలను మూసుకొని వెళ్ళిపోవడం ధర్మమని ధర్మవర్తనులైన పెద్దలు చెబుతారు.

వ. అది గావున.

91

తా ॥ అందువల్ల

మ. జనుఁ దజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన యన్నంబు స

య్యన వెళ్ళించి పవిత్రుఁడైన గతి దుష్టాత్ముండవై యీశ్వరున్
ఘను నిందించిన నీ తనూభవ ననం గా నోర్వ, నీ హేయ భా
జన మైనట్టి శరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధిఁ బొటిల్లెదన్.

92

తా ॥ తెలియక తిన్న అపరిశుభ్రమైన ఆహారాన్ని, కక్కి పరిశుభ్రుడైనట్లే, దుష్టబుద్ధితో ఈశ్వరుణ్ణి నిందించిన నీ కూతురినని అనిపించుకోవడాన్ని సహించలేను. నీ వల్ల సంప్రాప్తించిన హేయభాజనమైన ఈ శరీరాన్ని విడిచి పరిశుద్ధురాలినవుతాను.

వ. అదియునుం గాక దేవతల కాకాశగమనంబును, మనుష్యులకు భూతలగమనంబును, స్వాభావికంబు లయినట్లు ప్రవృత్తినివృత్తి లక్షణకర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులై కర్మతంత్రులయిన సంసారులకు వైరాగ్యయుక్తులయి యాత్మారాము లయిన యోగిజనులకు విధి నిషేధరూపంబు లయిన వైదిక కర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబు లగుటంజేసి స్వధర్మ నిష్ఠుం డగువాని నిందింప జన; దా యుభయకర్మ శూన్యుండు బ్రహ్మభూతుండు నయిన సదాశివునిఁ గ్రియాశూన్యుండని నిందించుట పాపం బగు, తండ్రీ! సంకల్పమాత్ర ప్రభవంబు లగుటం జేసి మహాయోగి జనసేవ్యంబు లయిన యస్మదీయంబు లగు నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు; భవదీయంబులగు నైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తులై యాగాన్న భోక్తలైన వారిచేత యజ్ఞశాలయందె చాల నుతియింపంబడి యుండుఁగాన నీ మనంబున నే నధిక సంపన్నుండ ననియుఁ, జితాభస్మాస్థిధారణుండైన రుద్రుండు దరిద్రుం డనియును గర్వింపం జన దని వెండియు నిట్లనియె.

93

తా ॥ దేవతలకు ఆకాశ గమనం, మానవులకు భూతలగమనం స్వాభావికాలు. అదే

విధంగా, వేదోక్త కర్మలు కోరికలుగా కలిగి నిర్వహించేవారికి ప్రవృత్తి రూపంలోనూ, వైరాగ్య భావంతో చేసే వారికి నివృత్తి రూపంలోనూ కనిపిస్తాయి. ఇది వేదవిధి. రాగద్వేషాలతో కూడుకున్న సంసారులకు వైదిక కర్మాచరణంతో విధినిషేధ రూపమైన మార్గముంది. ఆత్మారామ సంపన్నులైన వైరాగ్య జీవనులకు అదిలేదు. ఇది సహజం. స్వధర్మనిష్ట కలవారిని నిందించటం తగదు. 'విధినిషేధరూపమైన కర్మలు', 'వాటికి భిన్నమైన కర్మలు' – అనబడే ఈ ఉభయకర్మలు చేయవలసిన అవసరంలేని బ్రహ్మపదార్థమైన సదాశివుణ్ణి, పనిలేని వాడని నిందించటం పాపం! కేవలం సంకల్పం మాత్రం చేతనే ప్రాప్తించే అణిమాదులైన అష్టసిద్ధులు మాకున్నాయి. మహాయోగులచేత సేవించబడే ఆ అణిమాది సిద్ధులు నీకు సిద్ధించవు. నీ ఐశ్వర్యం ధూమమార్గాన ప్రవర్తిస్తూ యాగాన్న భోజనం చేసేవారి చేత యజ్ఞశాలలో మాత్రమే కీర్తించబడుతుంది. కాబట్టి నేను గొప్ప సంపన్నుడినని మనస్సులో భావించి, చితాభస్మాన్నీ ఎముకలనూ ధరించిన ఈశ్వరుణ్ణి దరిద్రుడని తక్కువగా భావించి గర్వించటం నీకు తగదు.

ఉ. నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా!
చాలుఁ గుమర్త్య! నీదు తనుజాత ననన్ మది సిగ్గు పుట్టెడి
న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్
గాలుపనే? తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడఁగన్!



తా ॥ దుష్టుడా! శంకరుని పట్ల అపరాధం చేసిన నీకు పుత్రికను కావడం కంటే దురదృష్టం ఏముంది? చాలు. నీ కూతురినని చెప్పుకోవడానికి సిగ్గుపడుతున్నాను. మహాత్ములకు కీడు తలపెట్టేవారి జన్మలు ఎందుకు? తగలబెట్టడానికా?

చ. వరవృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా
దర పరిహాస వాక్యముల "దక్షతనూభవ!" యంచుఁ బిల్వ నేఁ
బురపురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచస్స్మితంబులం

దొఱుఁగుదు? నీ తనూజ నను దుఃఖముకంటెను జచ్చు టొప్పగున్.

95

తా ॥ వృషభధ్వజుడైన ఈశ్వరుదు, ఆదరంతోగాని, పరిహాసంతోగాని నన్ను 'దక్షపుత్రిక' అని పిలిస్తే దుఃఖంతో తల్లడిల్లిపోతాను. సంతోషించలేక, చమత్కార వాక్యాలతో చిరునవ్వులు చిందించలేక కుమిలిపోతాను. నీ కూతురినన్న మాటపడి దుఃఖీంచటంకంటే, చనిపోవటం మేలు."

వ. అని యిట్లు యజ్ఞ సభామధ్యంబునం బ్రతికూలుండగు దక్షు నుద్దేశించి పలికి కామక్రోధాది శత్రువిఘాతిని యగు సతీదేవి యుదఙ్ముఖియయి జలంబుల నాచమనంబు సేసి శుచియై మౌనంబు ధరియించి జితాసనయై భూమియం దాసీన యగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగంబు సేయం దలచి.

96

తా ॥ అని ఈ విధంగా యజ్ఞసభా మధ్యంలో నిలబడి, తనకు ప్రతికూలుడైన దక్షునితో పలికి, కామక్రోధాది శత్రువులను అణగార్చే సతీదేవి ఉత్తర దిక్కుగా నిలచి, జలంతో ఆచమించి, శుచియై, మౌనంగా నేలపై కూర్చుండి, యోగమార్గం ద్వారా శరీరత్యాగం చెయ్యాలని భావించి

'జితాసన' అంటే, ఆసనాన్ని జయించిందని అర్థం. అంటే తనకు నివాసమైన దేహాన్ని త్యజించిందని అర్థం. బుద్ధిపూర్వకంగా యోగం ద్వారా శరీరాన్ని విడిచి పెట్టాలనుకోవడం యోగుల పద్ధతి.

సీ. వరుసఁ బ్రాణాపాన వాయునిరోధంబు గావించి వాని నేకముగ నాభి
తలమునఁ గూర్చి యంతట నుదానముదాక నెగయించి బుద్ధితో హృదయపద్మ
మున నిల్పి వాని మెల్లన కంఠమార్గము నను మఱి భ్రూమధ్యమున వసింపఁ
జేసి శివాంఘ్రి రాజీవ చింతనముచే నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ

తే. కమ్మహాత్ముని యంక పీఠమ్మునందు, నాదరంబున నుండు దేహంబు దక్షు
వలని దోషంబునను విడువంగఁ దలఁచి, తాల్చెఁ దనువున ననిలాగ్ని ధారణములు.

97

తా ॥ సతీదేవి ప్రాణాపాన వాయుమార్గాలను నిరోధించి, వాటిని ఒకటిగా చేసి నాభియందు నిలిపింది. ఆపైన ఉదానము దాకా పైకిలాగి, బుద్ధితో కలిపింది. హృదయ పద్మంలో స్థాపించి, కంఠము వరకు తీసికొని వచ్చి భ్రూమధ్యంలో నిలిపి, ఏకాగ్ర చిత్తంతో పరమేశ్వరుని పాదపద్మాలను ధ్యానించింది. పరమశివుణ్ణి తప్ప వేరెవ్వరినీ చూడని స్థితిని కల్పించుకున్నది. శివుని అంక పీఠంలో ఆదరించబడిన తన దేహం దక్షుని సంబంధంవల్ల దూషితమైందని భావించి, దేహాన్ని విడిచి పెట్టాలని తనలో యోగాగ్నిని రగుల్కొల్పింది.

వ. ఇట్లు ధరియించి గత కల్మషంబైన దేహంబు గల సతీదేవి నిజయోగ సమాధి జనితం బయిన వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధ యయ్యె నంత.

98

తా ॥ ఈ విధంగా యోగాగ్నిని ధరించి, పాపరహితమైన దేహం గల సతీదేవి, యోగసమాధిలో జన్మించిన అగ్నిలో ఆ క్షణమే దగ్ధమైపోయింది.

క. అది గనుఁగొన హాహాధ్వని, వొదలఁగ నిట్లనిరి మానవులుఁ ద్రిదశులు నీ
మదిరాక్షి యకట! దేహము, వదలెఁ గదా! దక్షుతోడి వైరము కతనన్.

99

తా ॥ ఆ సన్నివేశాన్ని చూసిన మానవులూ, దేవతలూ హాహాకారాలు చేస్తూ 'ఈ సతీదేవి దక్షుని మీది విరోధంచేత దేహాన్ని వదిలింది' కదా! అని బాధపడ్డారు.

వ. మఱియు నిట్లనిరి.

100

తా ॥ ఇంకా ఈ విధంగా అన్నారు:

సీ. సకల చరాచర జనకుఁడై నట్టి యీ దక్షుండు దనకూర్మి తనయ మాన
వతి పూజనీయ యీసతి దనచే నవమానంబు నొంది సమక్షమందుఁ
గాయంబు దొఱఁగంగఁ గనుఁగొను చున్నవాఁడిట్టి దురాత్ముఁ డెందేనిఁ గలఁడె?
యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొంది, రదియునుఁగాక యిట్లనిరి యిట్టి

తే. దుష్టచిత్తుఁడు బ్రహ్మబంధుడు నయిన, యీతఁ డనయంబుఁ దా నపఖ్యాతిఁ బొందు
నిందఁబడి మీఁద దుర్గతిఁ జెందుగాక, యనుచు జనములు పలుకు న య్యవసరమున.

101

తా ॥ "సకల చరాచరాలకూ జనకుడైన ఈ దక్షుడు, తన గారాబాలపట్టి, మానవతి, పూజనీయురాలైన ఈ సతీదేవిని అవమానించాడు. తన సమక్షంలోనే ఆ సతీదేవి దేహాన్ని త్యజిస్తుంటే చూస్తూ ఊరకున్న దుష్టుడు వీడు. ఇటువంటి దురాత్ముడు ఎక్కడైనా ఉన్నాడా?" అంటూ మనస్సులో ఆశ్చర్యపడ్డారు. 'దుష్టచిత్తుడు, బ్రహ్మబంధుడు అయిన దక్షుడు అపఖ్యాతిపాలై, నిందలపాలై దుర్గతిని పొందుతాడ' ని జనమంతా అన్నారు.

క. దేహము విడిచిన సతిఁ గని, బాహాబల మొప్ప రుద్ర పార్షదులును ద
ద్ద్రోహిం ద్రుంచుటకై యు, త్సాహంబున లేచి రసిగదాపాణులునై.

102

తా ॥ దేహాన్ని విడిచిన సతీదేవిని చూసి, రుద్రుని అనుచరులు కత్తులు, గదలూ ధరించి శివద్రోహియైన దక్షుణ్ణి చంపడానికి ఉద్రేకంతో లేచారు.

క. ఆ రవ మపు డీక్షించి మ, హారోషముతోడ భృగుమహాముని క్రతు సం

హారక మారక మగు నభి, చారకహోమం బొనర్చె సరభసవృత్తిన్.

103

తా ॥ ఆ కలకలాన్ని చూచిన భృగుమహర్షి, మహారోషంతో యజ్ఞనాశకులను నశింపచేసే అభిచారహోమాన్ని ప్రారంభించాడు.

వ. ఇట్లు దక్షిణాగ్ని యందు వ్రేల్చిన నందుఁ దపం బొనర్చి సోమలోకంబున నుండు సహస్ర సంఖ్యలు గల “ఋభు” నామధేయులైన దేవత లుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదులయిన ప్రమథ గుహ్యక గణంబులఁ బాఱందోలిన వారును బరాజితులైరి, తదనంతరంబ నారదువలన నభవుండు దండ్రిచే నసత్కృతురాలగుటం జేసి భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరాజితు లగుటయు విని.

104

తా ॥ ఈ విధంగా భృగుమహర్షి సమంత్రకంగా దక్షిణాగ్నిలో వేల్చి హోమం చేశాడు. ఆ హోమం నుంచి తపస్సు చేసి, సోమలోకవాసులైన ‘ఋభు’ లనే పేరుగల దేవతలు వేలాది మంది ప్రభవించారు. బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతూ, దివ్యవిమానాలనెక్కి, మండే కొరువుల్ని ఆయుధాలుగా ధరించి వాళ్ళు రుద్రుని అనుచరులైన ప్రమథ గణాలను, గుహ్యక గణాలను పారద్రోలారు. ప్రమథాదులు ఓడిపోయారు.

అప్పుడు నారదమహర్షి శివుని వద్దకు వెళ్ళి, సతీదేవి పొందిన అవమానాన్ని, దేహత్యాగ కథను, ఋభువులనే పేరుగల దేవతల చేతిలో ప్రమథులు ఓడిపోవడాన్ని వివరించి చెప్పాడు.

## 6. శివుడు వీరభద్రునిచే దక్షయజ్ఞాన్ని ధ్వంసము చేయించుట

శా. ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁడై
మాద్యద్భూరి మృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్.

105

తా ॥ ఆదిదేవుడు, మహోగ్ర స్వభావం గలవాడు, నీలకంఠుడు, గజాసుర సంహారి అయిన ఈశ్వరుడు సతీదేవి వృత్తాంతాన్ని విన్న క్షణమే పట్టరాని కోపంతో పెదవులను బిగించి వికటాట్టహాసం చేశాడు. మదించిన సింహంలాగా గర్జించాడు. భయంకరంగా నవ్వాడు. మెరుపు తీగలాగా, అగ్నిజ్వాలామాలికలవలె పైకిలేచిన జటాజూటం నుంచి ఒక జడను పెరికి, భూచక్రపు నడిమితలాన విసిరికొట్టాడు.

వ. ఇట్లు పెఱికివైచిన రుద్రుని జటయందు.

106

తా ॥ ఇలా పెరికి వేసిన ఈశ్వరుని జడ నుండి.

సీ. అభ్రంలిహాదభ్ర విభ్ర మాభ్ర భ్రమ కృష్ణనీలదీర్ఘ శరీర మమరఁ
బ్రజ్వలజ్జ్వలన దీప్త జ్వాలికా జాల జాజ్వల్యమాన కేశములు మెఱయఁ
జండ దిగ్వేదండ శుండాభ దోర్దండ సాహస్రధృత హేతిసంఘ మొప్ప
వీక్షణత్రయ లోకవీక్షణద్యుతి లోక వీక్షణతతి దుర్నిరీక్షముగను

తే. గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుంగ, ఘన కపాలాస్థి వనమాలికలును దనర
నఖిలలోక భయంకరుఁ డగుచు "వీర, భద్రుఁ" డుదయించె మాఱట రుద్రుఁ డగుచు.

తా ॥ ఈశ్వరుడు పీకి విసరిన జడనుండి ఆకాశాన్ని తాకే ఒక నీలదేహం ఆవిర్భవించింది. ఆ మహాశరీరపు చివర భగభగమండుతున్న మంటలు నలుదిక్కులకు రేగి, విరబోసుకున్న వెంట్రుకలయ్యాయి. దిగ్గజాల తొండాలవంటి చేతులు వేనవేలు ఉద్భవించి, ఆయుధాలతో వెలిగిపోతున్నాయి. మూడు కళ్ళతో ఆ మూర్తి లోకాలను చూసే కాంతులు, లోకుల కళ్ళకు చూడరానివిగా ఉన్నాయి. రంపాల వంటి కఠినమైన కోరలతో, పుఱ్ఱెల దండలు, ఎముకల దండలు, వనమాలికలు కలిసి కంఠసీమలో అలరారుతుండగా లోకభయంకరుడైన వీరభద్రుడు రుద్రుని ప్రతిబింబంలాగా ఉద్భవించాడు.

తే. వీరభద్రుండు విహత విద్వేషి భద్రుఁ, డగుచుఁ దన వేయి చేతుల మొగిచి వినయ
మెసఁగ నే నేమి సేయుదు? నెఱుఁగ నాకు, ఆనతిమ్మన్న నతని క య్యభవుఁ డనియె.

108

తా ॥ శత్రుసంహార స్వరూపుడైన వీరభద్రుడు, తన వేయి చేతులను మోడ్చి, వినయ వినమ్రుడై, 'స్వామీ! నేనేం చేయాలి?' ఆజ్ఞాపించమని అడుగగా, శివుడిలా అన్నాడు:

చ. గురుభుజశౌర్య! భూరిరణకోవిద! మద్భటకోటి కెల్ల నీ
వరయ వరూధినీవరుఁడవై చని యజ్ఞము గూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపు; మీ వచట బ్రాహ్మణతేజ మజేయ మంటి వే
నరిది మదంశసంభవుఁడవై తగు నీకు నసాధ్య మెయ్యెడన్?

109

తా ॥ "గొప్ప బాహుబలం గల రణకోవిదా! నా భటులైన ప్రమథగణాలకన్నింటికీ నీవే సేనా నాయకుడవై వెళ్ళు. వెళ్ళి, దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసి దక్షుణ్ణి సంహరించు. బ్రాహ్మణ తేజం జయించరానిదని సందేహించవద్దు. నా అంశతో పుట్టిన నీకు అసాధ్యమనేది లేదు."

వ. అని కుపితచిత్తుండై యాజ్ఞాపించిన నట్లకాక యని.

110

తా ॥ అని కోపోద్రిక్తమైన చిత్తంతో వీరభద్రుణ్ణి ఈశ్వరుడు ఆజ్ఞాపించాడు. పుణ్యాత్ముడైన వీరభద్రుడు అలాగేనని–

చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారగఁ బ్రదక్షిణ మాచరించి వీ
డ్కొని యనివార్య వేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ
ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణ ప్రభల్
దనరఁ గృతాంతకాంతక శితస్ఫుట శూలముఁ బూని చెచ్చెరన్.

111

తా ॥ రుద్రుణ్ణి సమీపించి, సంతోషంతో ప్రదక్షిణం చేసి, సెలవు తీసుకున్నాడు. యముణ్ణి సైతం అంతం చేయగల వాడిశూలాన్ని చేబూనాడు. పాదాలకు ధరించిన మణులు పొదిగిన అందెలు ఘల్లు ఘల్లుమని శబ్దం చేస్తుండగా, ఆ అనివార్యమైన వేగానికి ధరిత్రి దద్దరిల్లగా నడిచాడు.

చ. సరభసవృత్తి నట్లరుగు సైన్యపదాహత ధూత ధూళి ధూ
సరిత కుబేరదిక్తటము సభ్యులు దక్షుఁడుఁ జూచి "యెట్టి భీ
కరతమ?" మంచనం, 'దమము గాదు, రజఃపటలం' బటంచు ని
వ్వెఱపడి పల్కి రాత్మల వివేకవిహీనతఁ బొంది వెండియున్.

112

తా ॥ ఆటోపంతో కూడిన ప్రవర్తనతో వచ్చే వీరభద్రుని సైన్యపు పాదాలచేత రేగిన దుమ్ము ఉత్తరదిక్కంతా కమ్మింది. సభలోని వాళ్ళు, దక్షుడు చూసి, 'ఎంత భయంకరమైన కారుచీకటి' అని అనుకున్నారు. 'చీకటికాదు దుమ్ము' అని ఆశ్చర్యపడ్డారు. మనస్సులో వివేచించి చూసుకొనే

తెలివిని కోల్పోయారు.

సీ. ఈ ధూళి పుట్టుట కెయ్యది హేతువో? విలయ సమీరమా? పొలయ దిపుడు;
ప్రాచీనబర్హి ధరాపతి మహితోగ్రశాసనుఁ డిపుడు రాజ్యంబు సేయఁ
జోర సంఘములకో రారాదు; మఱి గోగణాళి రాకకు సమయంబు గాదు;
కావున నిప్పుడు కల్పావసానంబు గాఁబోలు; గా కటు గాక యున్న

తే. నిట్టి యౌత్పాతికరజ మెందేనిఁ గలదె?, యనుచు మనముల భయమంది రచటి జనులు
సురులు దక్షుఁడు; నంతఁ బ్రసూతి ముఖ్య, లయిన భూసురకాంత లిట్లనిరి మఱియు.

113

తా ॥ ఈ ధూళి పుట్టడానికి కారణం ఏమిటి? ప్రళయ కాలంలో వీచే ప్రభంజనమా? కాని గాలి అలా వీచటం లేదే? ఉగ్రశాసనుడైన ప్రాచీన బర్హి మహారాజు ఇప్పుడు రాజ్యాన్ని పాలిస్తున్నాడు. కాబట్టి దొంగల గుంపులకు రావడానికి వీలుకాదు. గోగణం వచ్చే సమయమూ ఇదికాదు. కాబట్టి ఇది కల్పాంత సమయం కాబోలు! కాకపోతే ఇటువంటి ఉత్పాతలక్షణం గల ధూళి ఎక్కడి నుండి వస్తుంది? అంటూ అక్కడున్న జనమంతా భయపడ్డారు. జనంతోపాటు దేవతలు, దక్షుడూ భయపడ్డారు. ప్రసూతి మొదలైన బ్రాహ్మణ స్త్రీలు ఇలా అన్నారు:

ఉత్పాత మంటే అపశకునం. అంటే, అందరికీ తెలిసిన వస్తురూపానికంటె భిన్నమైన వస్తురూపం.

క. తన కూఁతులు సూడఁగ జని, తనయను సతి ననపరాధఁ దగవఱి యి ట్లె
గ్గొనరించిన యీ దక్షుని, ఘనపాప విపాక మిదియుఁ గాఁదగు ననుచున్.

114

తా ॥ "దక్షుడు తన ఇతర కుమార్తెలందరూ చూస్తుండగా, ఏ తప్పు తెలియని సతీదేవికి

ఈ విధంగా కీడు చేశాడు. దక్షుని పాపకృత్యపు ఫలమే ఈ చీకటి" అని మిగిలిన స్త్రీలు, ప్రసూతి అనుకున్నారు.

వ. వెండియు నిట్లనిరి: కుపితాత్ముండైన దక్షుండు దనకూఁతుతో విరోధంబు సాలక జగత్సంహార కారణుండయిన రుద్రునిం గ్రోధింపఁజేసె; నమ్మహాత్ముండెంతటివాఁ డన్నం బ్రళయకాలంబున.

115

తా ॥ మళ్ళీ ఇలా అన్నారు: "కోపించిన దక్షుడు, తన కూతురితో పెట్టుకున్న విరోధం చాలక, లోకసంహార కారకుడైన రుద్రునికి క్రోధాన్ని కలిగించాడు. ఆ మహాత్ముడు ఎంతటి వాడంటే ప్రళయకాలంలో

సీ. సుమహిత నిశిత త్రిశూలాగ్ర సంప్రోత నిఖిల దిక్కరి రాజనివహుఁ డగుచుఁ
జటులోగ్రనిష్ఠుర స్తనిత గంభీరాట్టహాస నిర్భిన్నాఖిలాశుఁ డగుచు
భూరి కరాళవిస్ఫార దంష్ట్రాహతి పతిత తారాగణ ప్రచయుఁ
డగుచు వివిధహేతి వ్రాత విపుల ప్రభాపుంజ మండిత చండదోర్దండుఁ డగుచు

తే. వికట రోష భయంకర భ్రుకుటి దుర్ని, రీక్ష్య దుస్సహ తేజోమహిమఁ దనర్చి
ఘనవికీర్ణజటాబంధ కలితుఁ డగుచు, నఖిల సంహారకారణుండయి నటించు.

116

తా ॥ రుద్రుడు తన త్రిశూలపుకొనకు, అన్నిదిక్కులలో నున్న దిగ్గజాలను గుదిగుచ్చుతాడు. దిక్కులు దద్దరిల్లి పగిలిపోయేటట్లు, భయంకరమైన ఉఱుములాంటి శబ్దంతో పగలబడి నవ్వుతాడు. బాగా వంపులు తిరిగి, విప్పారిన కోరలతో నక్షత్ర మండలాన్ని నేల రాలుస్తాడు. నానావిధాలైన ఆయుధాలను, తన భయంకర హస్తాలలో ధరిస్తాడు. తీవ్రకోపంతో భయంకరంగా కనుబొమలు ముడిచి, తేరిచూడటానికి వీలులేని తేజస్సుతో ప్రకాశిస్తాడు. విశాల

జటాజూటాన్ని విరబోసుకొని ప్రళయతాండవంచేస్తూ సమస్తాన్నీ లయింపజేస్తాడు.

తే. అట్టి దేవునిఁ ద్రిపుర సంహార కరునిఁ, జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభవు
మనము రోషింపఁ జేసిన మంగళములఁ, బొంద వచ్చునె పద్మగర్భునకునైన?

117

తా ॥ అటువంటి మహాదేవునికి, త్రిపురాసుర సంహారం చేసిన వానికి, చంద్రశేఖరునికి, సద్గుణాలతో ఘనత కెక్కినవానికి, అభవునికి కోపాన్ని తెప్పిస్తే బ్రహ్మదేవునకైన శుభాలను పొందటం సాధ్యమవుతుందా?”

వ. అని యివ్విధంబున భయవిహ్వాలలోచనలై పలుకుచున్న సమయంబున మహాత్ముండైన దక్షునకు భయావహంబులై సహస్ర సంఖ్యాతంబులైన మహోత్పాతంబులు భూనభోంతరంబులఁ గానంబడు చుండె; నా సమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరియించి కపిల పీత వర్ణంబులు గలిగి వామనాకారులు, మకరోదరాననులునై యజ్ఞశాలా ప్రదేశంబునం బరువులు వెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షాధ్వర వాటంబులు విటతాటంబులు సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబు, గొందఱు పత్నీశాలయుఁ, గొందఱు సదస్యశాలయుఁ, గొంద ఱాగ్నీధ్రశాలయుఁ, గొందఱు యజమానశాలయుఁ, మహానస గృహంబును విధ్వంసంబులు గావించిరి; మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్నులం జెఱచిరి; వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి; పదంపడి కొందఱు హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి; కొంద ఱుత్తరవేదిక మేఖలలు ద్రెంచిరి; కొందఱు మునుల బాధించిరి; కొందఱు తత్పత్నుల వెఱపించిరి; మరికొందఱు దేవతా నిరోధంబు గావించిరి; అంత మణిమంతుండు భృగువును, వీరభద్రుండు దక్షునిఁ, జండీశుండు పూషుని, భృగుని నందీశ్వరుండును బట్టిరి. ఇవ్విధంబున సదస్యదేవఋత్విజ్నికాయంబుల శిలల ఱువ్వియు, జానువులఁ బొడిచియు, నఱచేతుల నడిచియు, కూర్పరంబులఁ బొడిచియు, వివిధబాధలం బఱచిన వారు

కాందిశీకులై యెక్కడెక్క డేనిం జనిరి. మఱియును—

118

తా ॥ అని ఈ విధంగా భయంతో చలించే కన్నులు కలవారై దక్షపుత్రికలు అంటుండగానే, మహాత్ముడైన దక్షునికి భయాన్ని కలిగిస్తూ వేలాది ఉత్పాతాలు భూమ్యాకాశాలలో కనిపిస్తున్నాయి. ఆ సమయంలో రుద్రుని అనుచరగణం నానావిధాలైన ఆయుధాలను ధరించి, గోరోజన వర్ణంలోను, పసుపుపచ్చని రంగుతోనూ ఉన్న పొట్టివాళ్ళు, మొసలి పొట్టవంటి ముఖం గలవాళ్ళు, యజ్ఞశాలా ప్రదేశంలో పరుగులు పెడుతూ కలయ తిరుగుతున్నారు. దక్షుని యజ్ఞవాటికను తారుమారు చేశారు. కొందరేమో యజ్ఞాశాలపై కప్పుననున్న వెన్నుదూలాన్ని, మరికొందరేమో పత్నీశాలను, ఇంకొందరేమో సదస్యశాలను, మరికొందరేమో అగ్నిని ధరించే ఋత్విక్కుల కోసం ఏర్పరచిన 'ఆగ్నీధ్రశాల' ను, కొందరు యజమానశాలను, కొందరు పాకశాలను ధ్వంసం చేశారు. ఇంకా కొందరు యజ్ఞపాత్రలలోని అగ్నిహోత్రాన్ని ఆర్పివేశారు. కొందరు హోమాగ్నులను ఆర్పారు. మరికొందరు హోమకుండాలలో మూత్రాన్ని విసర్జించారు. కొందరు ఉత్తర వేదికలకు కట్టిన తోరణాలను తెంపారు. కొందరు మునులను బాధించారు. కొందరు మునుల భార్యలను భయపెట్టారు. కొందరు దేవతలను కాలుకదలనీయకుండా దారికడ్డుపడ్డారు. తర్వాత మణిమంతుడు భృగువును, వీరభద్రుడు దక్షుణ్ణి, చండీశుడు పూషుణ్ణి, నందీశ్వరుడు భగుని, పట్టుకున్నారు. ఈ విధంగా యజ్ఞసదస్సులోని దేవతలను, ఋత్విక్కులను పట్టుకొని వాళ్ళపై రాళ్ళురువ్వి, మోకాళ్ళతో మోకాళ్ళు పొడిచి, అరచేతులతో అరచేతులను అణచి, మోచేతులతో పొడిచి వివిధ రకాలుగా బాధలు పెట్టగా వాళ్ళు కాందిశీకులై ఎక్కడెక్కడికో దిక్కుతెలియక వెళ్ళిపోయారు.

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గను గీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం
చెను నందీశ్వరుఁ డచ్చటి, జనముల హాహారవంబు సందడి గొలుపన్.

119

తా ॥ పూర్వం యజ్ఞశాలలో దక్షుడు, శివుణ్ణి నిందించే సందర్భంలో భగుడు కన్ను గీటాడు. ఆ భగుణ్ణి పట్టుకొని నందీశ్వరుడు కళ్ళు పీకేశాడు. అక్కడి జనమంతా హాహాకారాలు చేశారు.

తే. కుపితుఁడై నాఁడు భవుని దక్షుఁడు శపింపఁ, బరిహసించిన పూషుని పండ్లు డుల్లఁ
గొట్టె బలభద్రుఁ డాకళింగుని రదంబు, లెలమి డులిచిన పగిదిఁ జండీశ్వరుండు.

120

తా ॥ ఆనాడు దక్షుడు ఈశ్వరుణ్ణి శపించే సందర్భంలో 'పూషుడు' నవ్వాడు. చండీశ్వరుడు, ఆ పూషుణ్ణి పట్టుకొని పండ్లు రాలగొట్టాడు. ఆ రాలగొట్టటం కళింగుని పండ్లను బలరాముడు ఊడగొట్టినట్లున్నది.

క. తగవేది దక్షుఁ డా సభ, నగచాపుఁ దిరస్కరించునాఁ డట శ్మశ్రుల్
నగుచుం జూపుట నా భృగు, పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికిన్.

121

తా ॥ యజ్ఞశాలలో దక్షుడు నీతి తప్పి పరమేశ్వరుణ్ణి తిడుతుంటే, భృగువు నవ్వుతూ మీసాల్ని మెలేశాడు. దానిని గమనించిన వీరభద్రుడు, భృగువు మీసాల్ని పట్టుకొని పీకి పారవేశాడు.

సీ. అతుల దర్పోద్ధతుండై వీరభద్రుండు గైకొన దక్షువక్షంబుఁ ద్రొక్కి
ఘనశితధారాసిఁ గొని మేను వొడిచియు మంత్రసమన్విత మహిత శస్త్ర
జాలావినిర్భిన్న చర్మంబు గల దక్షుఁ జంపఁగా లేక విస్మయము నొంది తద్వధోపాయంబు
దన చిత్తమునఁ జూచి కంఠనిష్పీడనగతిఁ దలంచి

క. మస్తకము ద్రుంచి యంచితామర్షణమున, దక్షిణానలమున వేల్చెఁ దదనుచరులు

హర్షమును

బొంద, నచటి బ్రాహ్మణజనంబు, లాత్మలను జాల దుఃఖంబు లందుచుండ.

122

తా ॥ వీరభద్రుడు, సాటిలేని మహాదర్పంతో చెలరేగి, దక్షుణ్ణి పడద్రోసి, వక్షఃస్థలాన్ని తొక్కి, వాడియైన పెద్ద ఖడ్గంతీసి ఎన్నో పోట్లు పొడిచాడు. కానీ మంత్రపూతమైన అనేక శస్త్రాలతో గట్టిపడిన చర్మం కాబట్టి, దక్షుడు చావలేదు. వీరభద్రుడు ఆశ్చర్యపడ్డాడు. ఇతడిని ఎలా చంపాలా? అని తన మనస్సులో ఆలోచించి ఆ దక్షుడి కంఠాన్ని నులిమి, శిరస్సును త్రుంచి మహాకోపంతో దక్షిణాగ్నిలో వ్రేల్చి హోమం చేశాడు. అక్కడున్న వీరభద్రుని అనుచరగణం ఆనందించారు. బ్రాహ్మణులు మాత్రం మిక్కిలి దుఃఖించారు.

వ. ఇట్లు వీరభద్రుండు దక్షునియాగంబు విధ్వంసంబు గావించి నిజవాసంబైన కైలాసంబునకుఁ జనియె న య్యవసరంబున.

123

తా ॥ ఈ విధంగా వీరభద్రుడు దక్షుని యాగాన్ని ధ్వంసం చేసి, తన నివాసమైన కైలాసానికి వెళ్ళిపోయాడు.

## 7. దేవతలు వీరభద్రాదులచే పరాజితులై బ్రహ్మకు విన్నవించుట

చ. హరభటకోటిచేత నిశి తాసి గదా కరవాల శూల ము
ద్గర ముసలాది సాధన విదారిత జర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ము లగుచున్ సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణ సరోరుహంబులకు సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై.

124

తా ॥ శివభటుల చేతులలోని వాడికత్తులు, గదలు, శూలాలు, ఇనుపగుదియలు, రోకళ్ళు మొదలైన ఆయుధాల చేత దెబ్బలు తిని, శిథిలమైన అవయవాలతో, భయంతో కలత చెందిన మనస్సుతో, దేవతలు బ్రహ్మ చెంతకు చేరి, ఆయన పాదపద్మాలపైబడి నమస్కరించి, వినయంతో.....

క. తము ధూర్జటి సైనికు లగు, ప్రమథులు దయమాలి పెలుచ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే, య మునీంద్రుండు విదురుతోడ ననియెన్; మఱియున్.

125

తా ॥ పరమేశ్వరుని సైనికులైన ప్రమథులు, ఏమాత్రం దయలేకుండా బాధించిన సంగతంతా వివరించి చెప్పారు" అని మైత్రేయుడు విదురునితో చెప్పాడు.

తే. ఇంతయును మున్ను మనమున నెఱిఁగి యున్న, కతన విశ్వాత్మకుండును గమలలోచ
నుండు నన నొప్పు నారాయణుండు నజుఁడుఁ, జూడ రారైరి తాము దక్షుని మఖంబు.

126

తా ॥ ఇలా జరుగుతుందని ముందే తెలిసి, విశ్వాత్ముడు, పద్మలోచనుడు అయిన నారాయణుడు, బ్రహ్మదేవుడు దక్షయాగాన్ని చూడటానికి రాలేదు.

వ. అని చెప్పి సుర లిట్లు విన్న వించినఁ జతుర్ముఖుండు వారల కిట్లనియె.

127

తా ॥ దేవతలు ఇలా నివేదించగా చతుర్ముఖుడైన బ్రహ్మ, వాళ్ళతో ఇలా అన్నాడు:

క. ఘనతేజోనిధి పురుషుం, డనయంబుఁ గృతాపరాధుఁ డయినను దా మ
ల్లన ప్రతికారముఁ గావిం, చిన జనులకు లోకమందు సేమము గలదే?

128

తా ॥ "గొప్ప తేజస్సంపన్నుడైనవాడు తప్పు చేసినప్పటికీ, వెంటనే ప్రతీకారం తలపెట్టిన జనులు లోకంలో క్షేమంగా జీవించలేరు."

వ. అని మఱియు నిట్లనియె.

129

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు:

క. క్రతుభాగార్హుం డగు పశు, పతి నీశ్వరు నభవు శర్వు భర్గుని దూరీ
కృత యజ్ఞభాగుఁ జేసిన, యతి దోషులు దుష్టమతులు నగు మీరింకన్.

130

తా ॥ "యజ్ఞంలో హవిర్భాగాన్ని పొందడానికి అర్హతగల పశుపతిని, ఈశ్వరుణ్ణి యజ్ఞభాగానికి దూరం చేసిన దుష్టులు, దుర్మార్గులు, ధూర్తులు మీరు.

సీ. పూని యే దేవుని బొమముడి మాత్రాన లోకపాలకులును లోకములును
నాశ మొందుదురు; రట్టి యీశుండు ఘన దురుక్త్యస్త్ర నికాయ విద్ధాంతరంగుఁ
డును బ్రియా విరహితుండును నైనవాఁ డమ్మహాత్మునిఁ ద్రిపుర సంహారకరుని

మఖపునస్సంధానమతి నపేక్షించు మీరలు సేరి శుద్ధాంతరంగు లగుచు

తే. భక్తి నిష్ఠలఁ దత్పాద పద్మ యుగళ, ఘన పరిగ్రహ పూర్వంబు గాఁగ నతని
శరణ మొందుఁ డతండు ప్రసన్నుఁ డయినఁ దివిరి మీ కోర్కి సిద్ధించు దివిజులార!

131

తా ॥ ఏ మహాదేవుడు కనుబొమలు ముడిస్తే లోకాలు, లోకపాలకులు నశిస్తారో, అటువంటి ఈశ్వరుని యొక్క మనస్సును దూషణవాక్యాలనే అస్త్రాలు బాధపెట్టాయి. సతీవియోగాన్నీ కలిగించాయి. మళ్ళీ యజ్ఞాన్ని నిర్వహించాలన్న తలంపు గల మీరు, త్రిపురాసుర సంహారం చేసిన ఆ మహాత్ముని పాదపద్మాల్ని నిర్మలమైన బుద్ధితో, భక్తినిష్ఠలతో ఆశ్రయించండి. ఆ స్వామి ప్రసన్నుడైతే, మీ కోర్కె సిద్ధించి, లోకాలకు మేలు కలుగుతుంది.

వ. అని మఱియు నిట్లనియె; న ద్దేవుని డాయం జన వెఱతు మని తలంపకుం; డతనిఁ జేరు నుపాయం బెఱింగింపు మంటిరేని నేను నింద్రుండును మునులును మీరలును మఱియు దేహధారు లెవ్వరేని న మ్మహాత్ముని రూపంబు నతని బలపరాక్రమంబుల కొలదిఁయు నెఱుంగ జాల; మతండు స్వతంత్రుండు గావునఁ దదుపాయం బెఱింగింప నెవ్వఁడు సమర్థుండగు? నయిన నిపుడు భక్తపరాధీనుండును శరణాగత రక్షకుండును నగు నీశునిఁ జేరంబోవుద మని పలికి పద్మసంభవుండు దేవపితృగణ ప్రజాపతులంగూడి కైలాసాభిముఖుండై చని చని.

132

తా ॥ ఆ మహాదేవుణ్ణి సమీపించడానికి భయపడుతున్నామని భావించకండి. ఆ మహేశ్వరుణ్ణి చేరే ఉపాయాన్ని చెప్పమంటే, చెప్పడానికి సాధ్యం కాదు. నేను, దేవేంద్రుడు, మునులు, మీరు, దేహధారులు ఎవరూ ఆ మహాత్ముని రూపాన్ని, బలపరాక్రమాల్ని తెలియలేరు. ఆయన స్వతంత్రుడు కాబట్టి, ఆయనను సమీపించే ఉపాయం చెప్పడానికి ఎవరు సమర్థులు? అయినప్పటికీ ఆయన భక్తపరాధీనుడు, శరణాగత రక్షకుడు కాబట్టి, ఆ ఈశ్వరుని సన్నిధికి

వెళదామని చెప్పి, బ్రహ్మాదిదేవతలు, పితృదేవతలు, ప్రజాపతులు కలసి కైలాసపర్వతాన్ని సమీపించారు.

ఉ. భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో
ల్లాసముఁ గిన్నరీజన విలాసము నిత్యవిభూత మంగళా
వాసము సిద్ధ గుహ్యక నివాసము రాజత భూవికాసి కై
లాసముఁ గాంతినిర్జిత కులక్షితిభృత్సుమహద్విభాసమున్.

133

తా ॥ అలా వెళ్ళిన బ్రహ్మాది దేవతాగణం, భక్తజనుల మనస్సుకు ఉల్లాసాన్ని కలిగించేదీ, కిన్నరస్త్రీలు విలాసంగా విహరించేదీ, శాశ్వత వైభవాలకు నిలయమైన నిత్యవిభూతితో ప్రకాశిస్తూ సర్వశుభాలకూ స్థానమైనదీ, సిద్ధులు, యక్షులు నివసించేదీ, వెండి వెలుగులతో కులపర్వతాలను జయించి ప్రకాశించేదీ అయిన కైలాసాన్ని దర్శించారు.

సీ. ధాతు విచిత్రితోదాత్త రత్న ప్రభా సంగతోజ్జ్వల తుంగ శృంగములను
గిన్నర గంధర్వ కింపురుషాప్సరో జన నికరాకీర్ణ సానువులును
మానిత నిఖిల వైమానిక మిథున స ద్విహరణైక శుభ ప్రదేశములును
గమనీయ నవమల్లికా సుమనోవల్లికా మతల్లీ లసత్కందరములు

తే. నమర సిద్ధాంగనా శోభితాశ్రమములు, విబుధజనయోగ్య సంపన్నివేశములును
గలిగి బహువిధ పుణ్యభోగముల నొప్పు వినుత సుకృతములకు దండ వెండికొండ.

134

తా ॥ వివిధ ధాతువుల రంగులతో కూడిన రత్నకాంతులతో ప్రకాశించే ఎత్తైన శిఖరాలతో, కిన్నరులు, గంధర్వులు, కింపురుషులు, అప్సర జనులతో నిండిన కొండచరియలతో, దేవతలజంటలు విమాన విహారాలు చేసే శుభప్రదేశాలతో, కమనీయంగా

అల్లుకొన్న మల్లెల తీగలతో, దేవతాస్త్రీలు, సిద్ధాంగనలతో శోభించే ఆశ్రమాలతో, తగిన సంపదలతో నిర్మించబడిన దేవతా గృహాలతో, బహువిధమైన పుణ్యభోగాలతో ప్రకాశిస్తూ, పుణ్యాల పూలదండలా ఆ వెండి కొండ శోభిస్తోంది.

వ. అది మఱియును మందార పారిజాత సరళ తమాల సాల తాల తక్కోల కోవిదార శిరీషార్జున చూత కదంబ నీప నాగ పున్నాగ చంపక పాటలాశోక వకుళ కుంద కురవక కనకామ్ర శతపత్ర కింశు కైలా లవంగ మాలతీ మధూక మల్లికా పనస మాధవీ కుటజోదుంబరాశ్వత్థ ప్లక్ష వట హింగుళ భూర్జ పూగ రాజపూగ జంబూ ఖర్జూ రామ్రాత ప్రియాళు నారికేళేంగుద వేణు కీచక ముఖర తరుశోభితంబును, గలకంఠ కాలకంఠ కలవింక రాజకీర మత్తమధుకర నానా విహంగ కోలాహల నినదబధిరీభూత రోదోంతరాళంబును, సింహ తరక్షు శల్య గవయ శరభ శాఖామృగ వరాహ వ్యాఘ్రకుర్కుర రురు మహిష వృక సారంగ ప్రముఖ వన్యసత్త్వ సమాశ్రయ విరాజితంబును, గదళీషండ మండిత కమల కహ్లార కైరవ కలిత పులినతల లలిత కమలాకర విహరమాణ కలహంస కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాది జలవిహంగకుల కూజిత సంకులంబును, సలిల కేళీవిహరమాణ సతీరమణీ రమణీయ కుచమండల విలిప్తమృగమద మిళిత హరిచందన గంధ సుగంధి జలపూరిత గంగా తరంగిణీ సమావృతంబును నైన కైలాస పర్వతంబు వొడగని యరవింద సంభవ పురందరాది దేవగణంబు లత్యద్భుతానందంబులం బొంది ముందటఁ దారహీర హేమమయ విమాన సంకులంబును; బుణ్యజనమానినీశోభితంబును నైన యలకాపురంబుఁ గడచి తత్పుర బాహ్య ప్రదేశంబునం దీర్ఘపాదుండైన పుండరీక్షాక్షు పాదారవింద రజః పావనంబును, రతికేళీ వ్యాసంగ పరిశ్రమ నివారక సలిల కేళీవిలోల దేవ కామినీ పీనవక్షోజ విలిప్తకుంకుమ పంక సంగత పిశంగవర్ణ వారిపూర విలసితంబునునై, నందాలక నందాభిధానంబులు గల నదీద్వితయంబు దాఁటి తత్పురోభాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత మలయపవ నాస్వాదన ముహుర్ముహు రున్మదిత మానస పుణ్యజనకామినీ కదంబంబును, వైడూర్యసోపాన సమంచిత కనకోత్పల వాపీ

విభాసితంబును, గింపురుష సంచార యోగ్యంబును నగు సౌగంధికవన సమీపంబు నందు.
135

తా ॥ ఆ కైలాసపర్వతం మందారం, పారిజాతం, కానుగు, మద్ది, తాటి, తక్కోలం, ఎఱ్ఱకాంచనం, దిరిసెన, ఏరుమద్ది, మామిడి, కడిమి, ఈప, సర్పగంధి, నాగకేసరం, సురపొన్న, సంపెంగ, పాటలీ, అశోకం, పొగడ, మొల్ల, గురువింద, కనకామ్రము, తామర, మోదుగ, ఏలకి, లవంగం, మాలతీ, ఇప్ప, మల్లె, పనస, మాధవి, కొండమల్లె, అత్తి, రావి, జువ్వి, మఱ్ఱి, ఇంగువ, బుజపత్తిరి, పోక, రాజపూగ, నేరేడు, ఖర్జూరం, ఆమ్రాతకం, మోరటి, కొబ్బరి, అందుగ, వెదురు, బోలువెదురు వంటి వివిధ రకాల చెట్లతో విరాజిల్లుతోంది.

కోకిలలు, నెమళ్ళు, పావురాలు, రాచిలుకలు, గండుతుమ్మెదలు, మొదలైన పలురకాల పక్షుల కలకలధ్వనులు భూమ్యాకాశాలు చిల్లులు పడేలా ప్రతిధ్వనిస్తున్నాయి.

సింహాలు, దుప్పులు, ముళ్ళపందులు, అడవిదున్నలు, ఒంటెలు, కోతులు, అడవిపందులు, పులులు, కుక్కలు, నల్లజింకలు, దున్నలు, తోడేళ్ళు, లేళ్ళు మొదలైన అడవి జంతువులతో కూడి వెలుగొందుతోంది.

అరటిచెట్లతో, తామరపూలతో, పద్మాలతో, తెల్లకలువలతో, వింతరంగులకలువలతో ప్రకాశిస్తూ, సన్నని ఇసుకతో కూడిన ప్రదేశాలలోని సరోవరాలలో విహరించే కలహంసలు, కొక్కెరలు, బెగ్గురుపక్షులు, చక్రవాకపక్షులు, కొంగలు, నీటికోళ్ళు చేసే ఇంపైన కూతలతో ప్రకాశిస్తోంది.

జలక్రీడలాడుతూ విహరించే స్త్రీలు తమ చనుదోయికి పూసుకున్న కస్తూరి, తెల్లచందనం వంటి పరిమళద్రవ్యాల వాసనతో కలసి ప్రవహించే గంగానదీ తరంగాలతో సమావృతమైన కైలాస పర్వతాన్ని గుర్తుపట్టి, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతాసమూహం అత్యద్భుతమైన ఆనందాన్ని పొందారు.

వాళ్ళముందు 'అలకాపురి' కనిపించింది. ఆ పట్టణం చుక్కలతో ప్రకాశిస్తూ, మంచుతోకూడి బంగారుమయమైన విమానాలతో నిండి ఒప్పారుతోంది. యక్షులతో, పతివ్రతామతల్లులతో ప్రకాశించే ఆ అలకాపురిని దాటారు. ఆ పట్టణానికి వెలుపల నంద— అలకనంద అనే నదులు ప్రకాశిస్తున్నాయి. అవి శ్రీమన్నారాయణుని పవిత్ర పాదపద్మాల ధూళితో పావనమై, రతికేళిచేత కలిగిన శ్రమను పోగొట్టు కోవడానికి స్నానంచేసే దేవతా స్త్రీల స్తనాలపైనున్న కుంకుమ ద్రవంతో కలసి గోరోజన వర్ణంతో ప్రకాశించే జలాలతో ఒప్పుతున్నాయి.

ఆ నదులను దాటివెళ్ళే దేవతాసమూహానికి సౌగంధికవనం కనిపించింది. ఆ వనంలో అడవియేనుగుల రాపిడివల్ల మంచి గంధం చెట్లనుండి సువాసనలు వెలువడుతున్నాయి. ఆ వాయువును అనుభవిస్తూ అక్కడి పుణ్య స్త్రీలు సంతోషిస్తున్నారు. ఆ వనంలో వైడూర్యాలు పొదిగిన మెట్లతో కూడి, బంగారు కలువలతో ఒప్పారే దిగుడుబావులున్నాయి. కింపురుషులు సంచరించడానికి యోగ్యమైన ఆ సౌగంధిక వన సమీపంలో

## 8. బహ్మాదులు దక్షిణామూర్తి రూపుడగు ఈశ్వరుణ్ణి స్తుతించుట

సీ. ఉజ్జ్వలంబయి శతయోజనంబుల పొడ వొగిc బంచసప్తతి యోజనముల
పఱపును గల్గి యేపట్టునc దఱుcగని నీడ శోభిల్ల నిర్ణీత మగుచుc
బర్ణ శాఖాసమాకీర్ణమై మాణిక్యములc బోలcగల ఫలములc దనర్చి
కమనీయ సిద్ధయోగ క్రియామయ మయి యనఘ ముముక్షు జనాశ్రయంబు

తే. భూరిసంసార తాప నివారకంబు, నగుచుc దరురాజ మనcగ బెం పగ్గలించి
భక్తజనులకు నిచ్చలుc బ్రమద మెసcగ, వలయు సంపద లందు నావటము వటము.

136

తా ॥ బ్రహ్మాది దేవతలు ఒక వటవృక్షాన్ని చూశారు. అది శతయోజనాల పొడవు, డెబ్బైఅయిదు యోజనాల వెడల్పుతో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. సూర్యుడు ఏవైపు ప్రకాశించినా తిరుగని నీడతో శోభిస్తోంది. ఆకులతో, కొమ్మలతోనిండి మాణిక్యాలవంటి పళ్ళతో అలరారుతోంది. సిద్ధుల యోగక్రియా కలాపాలకు, ముముక్షుజనులకు ఆశ్రయ భూతమైంది. సంసారతాప నివారకమై, 'తరురాజ' మనేఖ్యాతికి తగినట్లు భక్తులకు నిత్యవిభూతితో ప్రమోదాన్ని కలిగిస్తూ, ఆ వటవృక్షమే వృక్షమన్నట్లుగా విరాజిల్లుతోంది.

వ. ఆ వృక్షమూల తలంబున.

137

తా ॥ ఆ వృక్షమూలంలో

సీ. ఇద్ధ సనందాది సిద్ధ సంసేవితు శాంతివిగ్రహుని వాత్సల్యగుణునిc
గమనీయ లోక మంగళదాయకుని శివు విశ్వబంధుని జగద్వినుత యశుని
గుహ్యక సాధ్య యక్షో రక్ష నాథ కుబేర సేవితుని దుర్వారబలుని

నుదిత విద్యా తపోయోగ యుక్తుని బాల చంద్రభూషణుని మునీంద్రనుతునిఁ

తే. దాపసాభీష్టకరు భస్మదండలింగ, ఘనజటాజినధరుని భక్తప్రసన్ను
వితత సంధ్యాభ్రరుచి విడంబిత వినూత్న, రక్తవర్ణు సనాతన బ్రహ్మమయుని.

138

తా ॥ పవిత్రులైన సనందాది సిద్ధమునులతో సేవించబడుతున్నవాడు, మూర్తీభవించిన శాంత స్వరూపుడు, వాత్సల్యాది గుణాలతో కూడుకున్నవాడు, లోకమంగళ దాయకుడు, విశ్వబంధువు, శివంకరుడు, జగత్తుచే కీర్తింపబడే యశస్సుగలవాడు; గుహ్యకులు, సాధ్యులు, యక్షులు, రాక్షసులు, కుబేరుడు మొదలైనవారిచే సేవించబడేవాడు, తిరుగులేని విద్యాతపోయోగబలాలతో కూడినవాడు, బాలచంద్రుణ్ణి భూషణంగా గలవాడు, మునీంద్రులచే స్తుతించబడేవాడు, తాపసుల అభీష్టాన్ని నెరవేర్చేవాడు, భక్తులయెడ ప్రసన్నుడైనవాడు, సంధ్యాకాలపు మేఘంలాగ ఎర్రని కాంతులతో ప్రకాశిస్తున్నవాడు, భస్మము, యోగదండము, జటాజూటము, లేడిచర్మము ధరించినవాడు, సనాతనుడు, బ్రహ్మమయుడు అయిన ఈశ్వరుణ్ణి చూశారు.

వ. మఱియును.

139

సీ. అంచిత వామపాదాంభోరుహము దక్షిణోరుతలంబున నొయ్య నునిచి
సవ్యజానువుమీఁద సవ్యబాహువు సాఁచి వలపలి ముంజేత సలలితాక్ష
మాలిక ధరియించి మహనీయ తర్క ముద్రాయుక్తుఁ డగుచుఁ జిత్తంబులోన
నవ్యయం బయిన బ్రహ్మానంద కలిత సమాధి నిష్ఠుఁడు వీత మత్సరుండు

తే. యోగపట్టాభిరాముఁడై యుచిత వృత్తి, రోషసంగతిఁబాసి కూర్చున్న జముని
యనువునను దర్భరచిత బ్రుస్యాసనమున, నున్న మునిముఖ్యు నంచిత యోగనిరతు,

140

తా ॥ ఆ ఈశ్వరుడు ఎడమపాదాన్ని కుడితొడపై నుంచి, ఎడమ మోకాలిపై ఎడమచేతిని చాచి, కుడిముంజేత జపమాలను ధరించి ఉపదేశముద్రతో కూడినవాడై, మదిలో అవ్యయమైన బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ సమాధినిష్ఠుడై ఉన్నాడు. మాత్సర్యరహితుడై, యోగపట్టాభిరాముడై, రోషాన్ని వీడిన యమునిలాగా, తగిన విధంగా మునివృత్తితో యోగనిరతుడై దర్భాసనంపై కూర్చున్నాడు.

క. అలఘుని నభవుని యోగీం, ద్రులు వినుచుండంగ నారదునితోఁ బ్రియ భా
షలు జరుపుచున్న రుద్రుని, సలలిత పన్నగ విభూషు సజ్జనపోషున్.

141

తా ॥ అటువంటి మహాత్ముణ్ణి, పన్నగభూషణుణ్ణి, సజ్జనుల్ని ఆదరించి పోషించేవాణ్ణి, యోగీంద్రులు వింటుండగా నారదునితో ప్రియసంభాషణ చేస్తున్నవాణ్ణి బ్రహ్మాది దేవతాగణం చూశారు.

క. కని లోకపాలురును ముని, జనులును సద్భక్తి నతని చరణంబులకున్
వినతు లయి, రప్పు డబ్జాసనుఁ, గని యయ్యభవుఁ డధిక సంభ్రమ మొప్పన్.

142

తా ॥ ఆ పరమశివుణ్ణి లోకపాలురు, మునిజనులు చూసి సద్భక్తితో పాదాలపై పడి నమస్కరించారు. ఈశ్వరుడు, బ్రహ్మను చూచి తొట్రుపాటు పడుతూ,

క. అనఘ! మహాత్ముం డగు వా, మనుఁ డా కశ్యపున కొఁగి నమస్కారము సే
సిన గతి నజునకు నభివం, దన మొగిఁ గావించె హరుఁడు దద్దయుఁ బ్రీతిన్.

143

తా ॥ మహాత్ముడైన వామనుడు, కశ్యప ప్రజాపతికి నమస్కరించినట్లు ప్రీతిగా శివుడు

బ్రహ్మదేవునకు నమస్కరించాడు.

ఈశ్వరుడు దక్షుడికి నమస్కరించలేదు. బ్రహ్మకు నమస్కరించాడు. సృష్టికర్త బ్రహ్మ కాబట్టి, నమస్కరించాడు. పైగా సతీదేవితో చేసిన సంభాషణలో 'సర్వభూతనివాసుడైన వాసుదేవునకు త్రికరణశుద్ధిగా నమస్కరించే వారికే ఈశత్వం చెల్లుతుందని' పేర్కొన్నాడు. అహంకార గర్వితులకు మానసిక నమస్కారం, వినయ సంపన్నులకు భౌతిక నమస్కారం చేయ్యాలని ఈశ్వరుని ఉపదేశంగా భావించాలి.

తే. అంత రుద్రానువర్తులైన సిద్ధ, గణ మహర్షి జనంబులు గని పయోజ
గర్భునకు మ్రొక్కి, రంతన కమలభవుఁడు, శర్వుఁ గని పల్కె మందహాసంబుతోడ.

144

తా ॥ ఆపైన రుద్రుని అనుచరులైన సిద్ధగణాలు, మహర్షులు బ్రహ్మదేవునకు సాష్టాంగపడ్డారు. అప్పుడు బ్రహ్మదేవుడు, ఈశ్వరుణ్ణి చూసి చిరునవ్వుతో ఇలా అన్నాడు:

తే. జగములకు నెల్ల యోనిబీజంబులైన, శక్తి శివకారణుండవై జగతి నిర్వికార బ్రహ్మంబ
వగు నిన్నుఁ గడఁగి "విశ్వ, నాథుఁ" గా నెఱిఁగెద నామనమున నభవ!

145

తా ॥ "పుట్టుకలేని ఓ స్వామీ! ఈ సృష్టికి కారణమైన శక్తితత్త్వం నీవే. అయినప్పటికీ ఏ వికారమూ పొందని పరబ్రహ్మవు. విశ్వనాథునిగా నిన్ను నా మదిలో దర్శిస్తున్నాను.

తే. సమత నది గాక తావకాంశంబులైన, శక్తిశివ రూపములఁ గ్రీడసలుపు దూర్ణ
నాభి గతి విశ్వ జనన వినాశ వృద్ధి, హేతుభూతుండ వగుచుందు వీశ! రుద్ర!

146

తా ॥ ఓ ఈశ్వరా! రుద్రా! నీ అంశలైన శివ, శక్తి రూపాలతో సమానంగా క్రీడిస్తావు.

సాలెపురుగులాగ ఈ విశ్వం యొక్క పుట్టుకకు, వృద్ధికి, వినాశనానికి నీవే కారణభూతుడవుతున్నావు.

సీ. అనఘ! లోకంబులయందు వర్ణాశ్రమ సేతువు లనఁగఁ బ్రఖ్యాతి నొంది
బలిసి మహాజన పరిగృహీతంబులై యఖిల ధర్మార్థదాయకములై
వేదంబులును మఱి వృద్ధి నొందించుట కొఱకునై నీవు దక్షుని నిమిత్త
మాత్రునిఁ జేసి య మ్మఖముఁ గావించితి; వటుగాన శుభమూర్తివైన నీవు

తే. గడఁగి జనముల మంగళకర్మ లయిన, వారి ముక్తి, నమంగళాచారు లయిన
వారి నరకంబు, నొందింతు భూరిమహిమ, భక్తజనపోష! రాజిత ఫణి విభూష!

147

తా ॥ భక్తజనపోషా! పన్నగభూషా! లోకంలో చతుర్విధ వర్ణాశ్రమాలకు సేతువని చెప్పగలిగేలా ఖ్యాతినొంది, మహానుభావులచే అంగీకరించబడి, సమస్త ధర్మాలను ప్రసాదించే వేదాలను వ్యాప్తి చేయటం కోసం, దక్షుణ్ణి నిమిత్తమాత్రునిగా చేసి, ఆ యజ్ఞాన్ని చేయించావు. శుభాకారుడవైన నీవు, శుభ కర్మలాచరించే వారికి ముక్తిని, అశుభకర్మలు ఆచరించే వారికి నరకాన్ని కలిగిస్తున్నావు.

వ. అట్లగుటం దత్కరంబు లొకానొకనికి విపర్యాసంబ నొందుటకుఁ గారణం బెయ్యేదియో? భవదీయ రోషంబు హేతువని తలంచితినేనిఁ ద్వదీయపాదారవింద నిహిత చిత్తులై సమస్త భూతంబులయందు నినుం గనుంగొనుచు భూతంబుల నాత్మయందు వేఱుఁగా జూడక వర్తించు మహాత్ములయందు నజ్ఞులైన వారి యందుంబోలె రోషంబు దఱుచు వొరయు దఁట! నీకుఁ గ్రోధంబు గలదే? యని.

148

తా ॥ అందుచేత ఆ వేదవిహిత కర్మలు ఒకనికి తలక్రిందులుగా ఫలించడానికి కారణం

ఏమిటి? నీ కోపమే కారణమని భావిస్తే నీ పాదపద్మాలపై మనస్సునుంచి, సమస్త భూతకోటిలో నిన్ను చూస్తూ, మనస్సులో తనను, ఇతర ప్రాణికోటిని వేరుగా చూడకుండా మహాత్ములు ప్రవర్తిస్తారు. అటువంటి మహాత్ములకు మూర్ఖులకు కలిగినట్లు కోపం కలుగదు కదా! కాబట్టి నీకు కోపమెక్కడిది?

సీ. మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనముల మదయుతు లయి దుష్టహృదయు లగుచుఁ
బరవిభవాసహ్యభవ మనోవ్యాధులఁ దగిలి మర్మాత్మభేదకము లయిన
బహుదురుక్తుల చేతఁ బరుల బీడించుచు నుండు మూఢులను దైవోపహతులుఁ
గాఁ దలపోసి య క్కపటచిత్తులకు నీ వంటి సత్పురుషుఁ డేవలననైన

తే. హింసఁ గావింపకుండు సమిద్ధచరిత!, నీలలోహిత! మహితగుణాలవాల!
లోకపాలన! కలిత గంగాకలాప!, హర! జగన్నుతచారిత్ర! యదియుఁ గాక.

149

తా ॥ చక్కని నడవడిక కలవాడా! నీలలోహితా! గొప్పగుణాలకు నిలయమైనవాడా! లోకపాలనా! గంగనే తలకుచ్చుగా గలవాడా! జగన్నుత చరితా! హరా! కర్మాచరణలో జీవులపట్ల భేదబుద్ధి కలిగి, మదంతో దుష్టహృదయులై, పరుల సంపదను చూసి సహించలేక ఈర్ష్యాది భావాలతో మనోవ్యాధికి గురవుతున్నారు. ఇతరుల మనస్సుల్ని మర్మచ్ఛేదం చేయగల పరుషోక్తులతో పీడిస్తున్నారు. అటువంటి మూర్ఖుల్ని దైవోపహతులుగా భావించి, హింసించకుండ దయచూపటం నీవంటి సత్పురుషుల పని.

సీ. అమర సమస్తదేశములందు నఖిల కాలములందుఁ దలఁప దుర్లంఘ్య మహిముఁ
డగు పద్మనాభు మాయా మోహితాత్మకు లై భేదదర్శనులైన వారి
వలనను ద్రోహంబు గలిగిన నైనను నది దైవకృత మని యన్యదుఃఖ
ముల కోర్వలేక సత్పురుషుండు దయసేయు గాని హింసింపఁడు గాన నీవు

తే. నచ్యుతుని మాయ మోహము నందకుంటఁ, జేసి సర్వజ్ఞుఁడవు; మాయచేత మోహి
తాత్ములై కర్మవర్తను లయినవారి, వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ.

150

తా ॥ అన్ని దేశాలలో, అన్ని కాలాలలో దాటడానికి వీలుకానిది విష్ణువు మహిమ. ఆ పద్మనాభుని మాయచేత మోహితులైన వాళ్ళు 'నేను నాద' నే భేదదృష్టితో పాటు ఇతరులను వేరుగా చూస్తారు. అటువంటి భేదదృష్టి కలవారి వలన ఏదైనా ద్రోహం జరిగినా సజ్జనులు దానిని దైవకృతంగానే భావిస్తారు. సజ్జనులు ఇతరుల దుఃఖాన్ని సహించలేక, వాళ్ళను దయతో చూస్తారే గాని హింసించరు. అచ్యుతుని మాయచేత మోహింపబడని వాడవైనందున నీవు సర్వజ్ఞుడవు. అందుచేత ఆ శ్రీహరి, మాయామోహితులైన వారివలన ద్రోహం జరిగితే క్షమించి రక్షించాలి.

'ఆత్మౌపమ్య' స్థితితో సమస్త సృష్టిని గమనించే యోగులకు సమస్తమూ బ్రహ్మమయమే. అటువంటయోగినే ఉత్తమయోగిగా గీతాది $(6 - 32)$ ఆధ్యాత్మిక గ్రంథాలు పేర్కొంటున్నాయి. ఈశ్వరుడు అటువంటి యోగి. అటువంటి యోగులను ఏమాయా అంటదు. అందుకే ఈశ్వరుణ్ణి సర్వజ్ఞుడని పేర్కొని, భేదభావనలో జీవించే దక్షుని వంటివారిని రక్షించాలని వేడుకోవటం.

వ. అది గావున యజ్ఞభాగార్హుండ వయిన నీకు సవనభాగంబు సమర్పింపని కతన నీచేత విధ్వస్తంబయి పరిసమాప్తి నొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షునిఁ బునర్జీవితుం జేయుము; భగుని నేత్రంబులును, భృగుముని శ్మశ్రువులును, బూషుని దంతంబులును గృపసేయుము. భగ్నాంగు లయిన దేవఋత్విఙ్ని కాయంబులకు నారోగ్యంబు గావింపుము; ఈ మఖావశిష్టంబు యజ్ఞ పరిపూర్తి హేతుభూతం బయిన భవదీయభాగం బగుంగాక.

151

తా ॥ యజ్ఞభాగాన్ని పొందే అర్హతగల నీకు యజ్ఞభాగాన్ని సమర్పించనందున నీ చేత

ధ్వంసం చేయబడి, అసంపూర్ణంగా మిగిలిపోయిన ఈ దక్షుని యాగాన్ని మళ్ళీ ఉద్ధరించి, దక్షుణ్ణి పునఃజీవితుణ్ణి చేయవలసింది. భగునికి నేత్రాలను, భృగునికి మీసాలను, పూషునికి దంతాలను మళ్ళీ ప్రసాదించు. విరిగిపోయిన శరీరావయవాలతో తల్లడిల్లే ఋత్విక్కులకు, దేవతలకు ఆరోగ్యాన్ని అనుగ్రహించు. మిగిలిన యజ్ఞ కార్యక్రమాన్నంతా పరిపూర్తిచేసి ఈ యాగాన్ని నీ యజ్ఞ భాగంగా స్వీకరించు.

## 9. ఈశ్వరుడు దక్షుడిని అనుగ్రహించుట

చ. అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టిఁ బొంది దరహాసమునన్ గృప దొంగలింప ని
ట్లను హరిమాయచేత ననయంబును బామరు లైనవారు సే
సిన యపరాధదోషములు చిత్తములో గణియింప నెన్నఁడున్.

152

తా ॥ అని చతుర్ముఖుడైన బ్రహ్మ వినయంతో వేడుకోగా, చంద్రశేఖరుడైన ఈశ్వరుడు సంతోషించి, కృప తొంగిచూసేలాగ చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు: 'హరి మాయ చేత పామరులైన వాళ్ళు చేసిన అపరాధాలను నేనెప్పుడూ మనస్సులో పెట్టుకోను.'

వ. అట్లయ్యును.

153

తా ॥ అయినప్పటికీ,

క. బలియుర దండించుట దు, ర్బలజన రక్షణము ధర్మపద్ధతి యగుటం
గలుషాత్ముల నపరాధము, కొలఁదిని దండించుచుందుఁ గొనకొని యేనున్.

154

తా ॥ బలవంతులైన దుష్టుల్ని దండించటం, దుర్బలుల్ని రక్షించటం ధర్మమార్గం. కాబట్టి పాపాత్ముల్ని, వాళ్ళు చేసిన అపరాధాల స్థాయిని బట్టి తగిన రీతిగా శిక్షిస్తాను.

వ. అని దగ్ధశీర్షుండయిన దక్షుం డజముఖుం డగు! భగుండు బర్హిస్సంబంధ భాగంబులు గలిగి మిత్ర నామధేయచక్షుస్సునం బొడగాంచుఁ; బూషుండు పిష్టభుక్కగుచు యజమాన

దంతంబులచే భక్షించు; దేవతలు యజ్ఞావశిష్టంబు నా కొసంగుటంజేసి సర్వావయవ పూర్ణులై వర్తింతురు. ఖండితాంగులైన ఋత్విగాది జనంబు లశ్వినీదేవతల బాహువులచేతను బూషుని హస్తంబుల చేతను లబ్ధబాహుహస్తులై జీవింతురు; భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించు నని శివుం డానతిచ్చిన సమస్త భూతంబులును సంతుష్టాంతరంగంబులై "తండ్రీ! లెస్సయ్యె" యని సాధువాదంబుల నభినందించిరి. అంత నా శంభుని యామంత్రణంబు వడసి సునాసీర ప్రముఖులగు దేవతలు ఋషుల తోడంగూడి రా నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జనియె నంత.

155

తా ॥ 'దహించబడ్డ శిరస్సుగల దక్షుడు గొఱ్ఱె తలవాడవుతాడు. భగుడు దర్భలతో సంబంధంగల యజ్ఞభాగాలను పొంది మిత్రుడనే పేరుతో కళ్ళను పొందుతాడు. పూషుడు దంతాలు లేనివాడు కాబట్టి పిండిని ఆహారంగా యజమాని దంతాలతో తింటాడు. దేవతలంతా మిగిలిన యజ్ఞాన్ని నాకు సమర్పించారు కాబట్టి వాళ్ళు సమస్త అవయవాలతో సంపూర్ణమై సంచరిస్తారు. అవయవాలు ఖండించబడిన ఋత్విక్కులు మొదలైన వాళ్ళు అశ్వినీ దేవతల బాహువుల్ని, పూషుని హస్తాల్ని ఉపయోగించుకొంటారు. ఈ విధంగా బాహువులు, హస్తాల్ని పొంది ఋత్విక్కులు జీవిస్తారు. భృగువు మేకపోతు మీసాలు గడ్డాలు పొందుతాడు' అని శివుడు అనుజ్ఞ ఇచ్చాడు.

అప్పుడు ప్రాణికోటి సంతృప్తి చెందిన హృదయాలతో 'తండ్రీ! మేలు జరిగింది' అని, బాగుబాగని ప్రశంసించారు. ఆ తరువాత శివుని అనుమతితో ఇంద్రాది దేవతలు, ఋషులతో కలసి వెంటరాగా, బ్రహ్మదేవుడు రుద్రుణ్ణి ముందుంచుకొని దక్షయజ్ఞ వాటికకు వచ్చాడు.

క. శర్వుని యోగ క్రమమున, సర్వావయవములుఁ గలిగి సన్నుని ఋత్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి, పూర్వతను శ్రీల నార్యభూషణ! యంతన్.

156

తా ॥ శంభుని యోగ మార్గంలో మునులు, ఋత్విక్కులు, దేవతాముఖ్యులు అన్ని అవయవాలతో మళ్ళీ పూర్వశరీర శోభలతో ప్రకాశించారు.

క. విను దక్షు నంత మేషము, ఖునిఁ జేసిన నిద్ర మేలుకొని లేచిన పో
ల్కిన నిలిచె దక్షుఁ, డభవుడు, గనుఁగొనుచుండంగ నాత్మఁ గౌతుక మొప్పన్.

157

తా ॥ ఈ విధంగా దక్షుణ్ణి గొఱ్ఱెతల గలవానిగా చేయగా అతడు నిద్రనుండి లేచిన వానివలె ఈశ్వరుడు చూస్తుండగా సంతోషిస్తూ లేచాడు.

వ. ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్న శివునిం గనుంగొనిన మాత్రాన శరత్కాలంబున నకల్మషం బైన సరస్సునుంబోలెఁ బూర్వరుద్రవిద్వేష జనితంబులైన కల్మషంబులం బాసి నిర్మలుండై యభవుని నుతియింపం దొడంగ మృతిఁ బొందిన సతీతనయం దలంచి యనురాగోత్కంఠ బాష్పపూరిత లోచనుండును, గద్గదకంఠుండునునై పలుకంజాలక యెట్టకేలకు దుఃఖంబు సంస్తంభించికొని ప్రేమాతిరేక విహ్వలుం డగుచు సర్వేశ్వరుండగు హరున కిట్లనియె.

158

తా ॥ ఈ విధంగా లేచి, ఎదుటనున్న శివుణ్ణి చూసినంతనే, శరత్కాలంలో బురద తేరుకొన్న తేటనీటితో కూడిన కొలనులాగా, రుద్రుణ్ణి ద్వేషించటం వలన కలిగిన పాపాల నుండి దక్షుడు విముక్తి పొందాడు. ఈశ్వరుణ్ణి స్తుతించాలని అనుకొని, మరణించిన తన కుమార్తె సతీదేవిని గుర్తుతెచ్చుకొని, ప్రేమ, దుఃఖము గొంతులోని కెగయగా కళ్ళవెంట కన్నీరు కారుస్తూ, ఏ మాట పలుకలేకపోయాడు. చివరికి దుఃఖాన్ని ఆపుకొని ప్రేమాతిరేకంతో సర్వేశ్వరుడైన హరునితో ఇలా అన్నాడు:

క. విను! నీ కపరాధుఁడ నగు, నను దండించు టది దండనము గాదు మది

న్నను రక్షించుటగా మన, మున దలఁతును దేవ! యభవ! పురహర! రుద్రా!

159

తా ॥ "ఓ దేవా! అభవా! త్రిపురాలను హరించినవాడా! రుద్రా! నీపట్ల అపరాధం చేసిన నన్ను శిక్షించటం, 'శిక్ష' కానే కాదు. నన్ను రక్షించటంగానే దీనిని మదిలో భావిస్తాను.

సీ. అనఘాత్మ! తగ నీవు నబ్జనాభుండును బరికింపఁ బ్రాహ్మణాభాసు లయిన
వారల యెడల నె వ్వలన నుపేక్షింప రఁట! దృఢవ్రత చర్యులైనవారి
యెడ నీ కుపేక్ష యెక్కడిది? సర్గాదిని నామ్నాయ సంప్రదాయ ప్రవర్త
నము నెఱింగించుట కమర విద్యాతపో వ్రత పరాయణులైన బ్రాహ్మణులను

తే. వరుసఁ బుట్టించితివి; కాక వారి నెపుడు, గేల దండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు, నరసి రక్షించుచుందు గదయ్య రుద్ర!

160

తా ॥ ఓ పుణ్యాత్మా! నీవు, శ్రీమహావిష్ణువు కపట బ్రాహ్మణులను ఎప్పుడూ ఉపేక్షింపరు. దృఢవ్రతులైన వారిపట్ల నిర్లక్ష్యమూ వహించరు. సృష్టి ప్రారంభంలో వేద సంప్రదాయాన్ని తెలియజేయటం కోసం విద్య, తపస్సు, వ్రతపరాయణత్వం గల బ్రాహ్మణులను సృష్టించావు. కాబట్టి వాళ్ళను గోపాలకుడు కఱ్ఱపట్టుకొని గోవుల్ని కాచినట్లు నీవు రక్షిస్తుంటావు.

సీ. తలపోయ నవిదిత తత్త్వవిజ్ఞానుండ నైన నాచేత సభాంతరమున
నతిదురుక్త్యంబక్షతుఁడ వయ్యును మత్కృతాపరాధము హృదయంబునందు
దలఁపక త్ర్యక్ష! నిందాదోషమున నధోగతిఁ బొందుచున్న దుష్కర్ము నన్నుఁ
గరుణఁ గాచిన నీకుఁ గడఁగి ప్రత్యుపకార మెఱిఁగి కావింప నే నెంతవాఁడ?

తే. నుత చరిత్ర! భవత్పరానుగ్రహాను, రూప కార్యంబుచేత నిరూఢమైన
తుష్టి నీ చిత్తమందు నొందుదువుగాక, క్షుద్రసంహార! కరుణాసముద్ర! రుద్ర!

తా ॥ క్షుద్రసంహారా! కరుణాసముద్రా! రుద్రా! తత్త్వజ్ఞానం తెలియని నేను నిండుసభలో, దురుక్తులనే బాణాలచేత నిన్ను గాయపరచాను. నా అపరాధాన్ని మనస్సులో పెట్టుకోకుండా, సజ్జనులను నిందించిన పాపంతో అధోగతి పాలవుతున్న నన్ను దయతో కటాక్షించావు. తిరిగి దీనికి ప్రత్యుపకారం చేయటానికి నేనెంతటివాడను? ఓ పుణ్యచరిత్రా! పరానందనాథుడవైన నీ అనుగ్రహానికి తగిన పనులతోనే మేము నిన్ను సంతోష పెట్టెదముగాక! ఆలా పరులను అనుగ్రహించే కార్యాల వలన కలిగే తృప్తి మదిలో పొందెదవుగాక!

దైవం సంతోషించే సత్కర్మలు ఏవతే ఉన్నాయో వాటినే దైవం ప్రత్యుపకారంగా స్వీకరిస్తుంది. సర్వభూత హృదయవాసుడు, అంతర్యామియైన పరమాత్మ, పరోపకారాది సత్కర్మల చేత అనుకూలుడవుతాడని ఇందులోని అంతరార్థం. పరమాత్మ చేత ఉద్ధరించబడే జీవుడు పరమాత్మకు ఏమి ప్రత్యుపకారం చేయగలడు? సత్కర్మాచరణతో పరమాత్మ హృదయాన్ని సంతోషపెట్టడమే. దానినే ఇక్కడ ప్రస్తావించటం గమనించవచ్చు.

వ. అని యిట్లు రుద్ర క్షమాపణంబు గావించి పద్మసంభవుచేత ననుజ్ఞాతుండై దక్షుం డుపాధ్యాయ ఋత్విగ్గణ సమేతుం డగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున బ్రాహ్మణజనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబులై సాగుటకుఁ బ్రమథాది వీర సంసర్గకృత దోష నివృత్త్యర్థంబుగా విష్ణుదేవతాకంబును త్రికపాల పురోడాశ ద్రవ్యకంబును నైన కర్మంబుఁ గావింప నధ్వర్యుకృత్య ప్రవిష్టుండగు భృగువుతోడం గూడి నిర్మలాంతః కరణుం డగుచు దక్షుఁడు ద్రవ్యత్యాగంబుఁ గావింపఁ బ్రసన్నుండై సర్వేశ్వరుండు.

162

తా ॥ అని ఈవిధంగా రుద్రుణ్ణి క్షమించమని దక్షుడు వేడుకున్నాడు. ఆపైన బ్రహ్మదేవుని అనుజ్ఞ పొంది, ఉపాధ్యాయులతో, ఋత్విక్కులతో కలసి, యజ్ఞకార్యాన్ని నిర్వహించ

పూనుకున్నాడు. అలా యజ్ఞాన్ని నిర్వహించే సమయంలో బ్రాహ్మణులు, నిర్విఘ్నంగా యజ్ఞం కొనసాగడానికి, ప్రమథగణాలు మొదలైన వీరుల సంబంధంతో కలిగిన దోషాన్ని నివారించగలిగేలా విష్ణుదేవతా పరమైనది, త్రికపాలములతో కూడిన పురోడాశ ద్రవ్యముగల యజ్ఞకార్యాన్ని నిర్వహించారు. అధ్వర్యుడైన భృగువుతో కూడి నిర్మలమైన మనస్సుతో దక్షుడు 'ద్రవ్య త్యాగం' అంటే సేకరించిన యజ్ఞద్రవ్యాలను సంకల్పపూర్వకంగా త్యాగం చేశాడు. అప్పుడు సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ప్రసన్నుడయ్యాడు.

సీ. మానిత శ్యామాయమాన శరీర దీధితులు నల్దిక్కుల దీటుకొనఁగఁ
గాంచన మేఖలా కాంతులతోడఁ గౌశేయ చేలద్యుతుల్ చెలిమి సేయ
లక్ష్మీసమాయుక్త లలిత వక్షంబున వైజయంతీప్రభల్ వన్నె సూప
హాటకరత్న కిరీట కోటి ప్రభల్ బాలార్క రుచులతో మేలమాడ

తే. లలితనీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ, బ్రవిమలాత్మీయ దేహజప్రభ సరోజ
భవ భవామర ముఖ్యుల ప్రభలు మాప, నఖిలలోకైక గురుఁడు నారాయణుండు.



తా ॥ గొప్ప శ్యామలవర్ణంతో ప్రకాశించే శరీరకాంతులు నలుదిక్కులా వ్యాపించాయి. బంగారు ఒడ్డాణపు కాంతులతో పట్టువస్త్రపు కాంతులు చెలిమి చేస్తున్నాయి. లక్ష్మీదేవితో కూడిన వక్షఃస్థలంలో వైజయంతీ మాలికాకాంతులు వన్నెలీనుతున్నాయి. బంగారు రత్నాలు పొదిగిన కిరీటపు అంచుల కాంతులు, బాలసూర్యుని కాంతులతో తళుకులీనుతున్నాయి. నీలిమేఘాలలాగ ముంగురులు కదులుతున్నాయి. స్వచ్ఛమైన తన దేహకాంతులు బ్రహ్మ, శివుడు మొదలైన వారి కాంతుల్ని తిరస్కరించగా, సకల లోకాలకు గురుడైన నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు.

చ. సలలిత శంఖచక్ర జలజాత గదా శరచాప ఖడ్గ ని
ర్మల రుచులున్ సువర్ణ రుచిమన్మణి కంకణ ముద్రికా ప్రభా
వళులును దేజరిల్లు భుజవర్గ మనర్గళ కాంతియుక్తమై

విలసిత కర్ణికార పృథివీరుహముం బురుడింపఁ బిట్టుగన్.

164

తా ॥ శంఖము, చక్రము, పద్మము, గద, శరచాపాలు, ఖడ్గము – వీటికాంతులు, బంగారు కాంతులతో కలిసిన మణిమయ కంకణాల కాంతులు, ఉంగరాల కాంతులు, బారులు తీర్చినట్లు ప్రకాశిస్తున్నాయి. అటువంటి భుజాల కాంతులతో శ్రీమహావిష్ణువు ఎలా ఉన్నాడంటే, పుష్పాలతో ప్రకాశించే కొండగోగు వృక్షంలా ఉన్నాడు.

క. సరసోదార సమంచిత, దరహాస విలోకనములఁ దగ లోకములం
బరితోషము నొందించుచుఁ, బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్.

165

తా ॥ రసవంతము, ఔదార్యపూరితమైన చిరునవ్వులతో కూడిన చూపులతో లోకాలను సంతోషపరుస్తూ, విశ్వబంధువై, పరమోత్సవంగా కనిపించాడు.

చ. మఱియును రాజహంస రుచిమద్భ్రమణీకృత తాలవృంత చా
మరములు వీవఁగా దివిజమానిను లచ్ఛసుధామరీచి వి
స్ఫురణ సితాతపత్ర రుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్ల ఁ గాఁ గరివరదుండు వచ్చె సుభగస్తుతివర్ణ సువర్ణయానుఁడై.

166

తా ॥ దేవతాస్త్రీలు, రాజహంసలవంటి తెల్లని తాటాకు విసనకర్రలు, చామరాలు వీస్తుండగా, తెల్లగొడుగుల కాంతులు చంద్రకిరణాల వెలుగువలె దిక్కులకు వ్యాపించగా, ఇంపైన స్తుతులలోని అక్షరాలే దేహంగా చేసుకున్న గరుడుణ్ణి వాహనంగా చేసికొని వచ్చాడు.

చ. ఘనరుచి నట్లు వచ్చిన వికారవిదూర ముకుందుఁ జూచి బో

రన నరవిందనందన పురందర చంద్రకళాధరామృతా
శనముఖు లర్థి లేచి యతిసంభ్రమ మొప్ప "నమో నమో దయా
వన నిధయే" యటంచు ననివారణ మ్రొక్కిరి భక్తియుక్తులై.

167

తా ॥ ఆ విధంగా నీలమేఘ కాంతితో వచ్చిన వికారవిదూరుడైన విష్ణుమూర్తిని చూసి బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు, దేవతలు అత్యంత సంభ్రమంతో లేచి 'నమో నమో దయావన నిధయే' (దయా సముద్రునికి నమస్కారం) అంటూ భక్తితో నమస్కరించారు.

వ. అట్లు కృత ప్రణాములైన యనంతరంబ.

168

తా ॥ ఆ విధంగా నమస్కరించిన తరువాత,

ఉ. ఆ నలినాయతాక్షుని యనంతపరాక్రమదుర్నిరీక్ష్య తే
జో నిహతస్వదీప్తులగుచు న్నుతిసేయ నశక్తులై భయ
గ్లాని వహించి బాష్పములు గ్రమ్మగ గద్గదకంఠులై తనుల్
మ్రానుపడంగ న వ్విభుని మన్ననఁ గై కొని యెట్టకేలకున్.

169

తా ॥ పద్మాలవంటి విశాలమైన నేత్రాలు కలిగి, తేరిపార చూడటానికి వీలుకాని తేజస్సుతో ప్రకాశించే ఆ శ్రీమన్నారాయణుని ముందు తమ తేజస్సు నిలువలేకపోగా, స్తుతించడానికి అశక్తులై భయపడి, బాష్పాలు కారుస్తూ, గద్గదకంఠులై నిశ్చేష్టులయ్యారు. ఆ స్వామి మన్ననతో ఎట్టకేలకు.

## 10. దక్షాదులు విష్ణువును స్తుతించుట

వ. నిటలతట ఘటిత కరపుటులై య మ్మహాత్ముని యపారమహిమం బెఱింగి నుతియింప శక్తులు గాక యుండియుఁ, గృతానుగ్రహనిగ్రహుం డగుటం జేసి తమ తమ మతులకు గోచరించిన కొలంది నుతియింపఁ దొడంగి, రందు గృహీతంబు లగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాదులకు జనకుండును, సునందనందాది పరమభాగవతజన సేవితుండును, యజ్ఞేశ్వరుండును నగు భగవంతుని శరణ్యునింగాఁ దలంచి దక్షుం డిట్లనియె. దేవా! నీవు స్వస్వరూపంబునం దున్న యప్పు డుపరతంబులు గాని రాగాద్యఖిల బుద్ధ్యవస్థలచే విముక్తుండవును, నద్వితీయుండవును, జిద్రూపకుండవును, భయరహితుండవును నై మాయం దిరస్కరించి మఱియు నా మాయ ననుసరించుచు లీలామానుష రూపంబుల నంగీకరించి స్వతంత్రుండ వయ్యును మాయా పరతంత్రుండవై రాగాది యుక్తుండునుంబోలె రామకృష్ణా ద్యవతారంబులఁ గానంబడుచుందువు; గావున నీ లోకంబులకు నీవ యీశ్వరుండ వనియు నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయా విభూతు లగుటం జేసి లోకంబులకు నీశ్వరులు గారనియును భేద దృష్టి గల నన్ను రక్షింపు; మీ విశ్వకారణులైన ఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలురును సకల చరాచర జంతువులును నీవ; భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదని విన్నవించిన దదనంతరంబ బుత్విగ్జనంబు లిట్లనిరి.

170

తా ॥ నుదుట కరాంజలులు ఘటించి, ఆ మహాత్ముని అంతులేని గొప్పదనాన్ని తెలిసికొని, నుతించడానికి శక్తి చాలకపోయినప్పటికీ, ఆ ధర్మమూర్తిని తమతమ మతులకు తోచినట్లు కీర్తించడానికి పూనుకున్నారు. బ్రహ్మాదులకు తండ్రి, సునందుడు నందుడు మొదలైన భాగవత జనుల చేత పూజించబడేవాడు, యజ్ఞేశ్వరుడు అయిన భగవంతుని శరణుజొచ్చి, భగవంతుడు గ్రహించగల పూజాది ఉపచారాలతో వచ్చిన దక్షుడు ఇలా కీర్తించాడు:

"దేవా! నీవు నీ నిజరూపంతో ఉన్నప్పుడు రాగద్వేషాది భావాలకు అతీతుడవు. అద్వితీయుడవు, భయరహితుడవు. మాయను తిరస్కరిస్తావు. మళ్ళీ ఆ మాయనే అనుసరించి లీలామానుష రూపాన్ని ధరిస్తావు. స్వతంత్రుడవై కూడా మాయకు లొంగి రాగద్వేషాదులు కలవానివలె రామకృష్ణాది అవతారాలను ధరిస్తావు. కాబట్టి ఈ లోకాలకు నీవే ఈశ్వరుడవని, మిగిలిన బ్రహ్మరుద్రాదులు నీ మాయా వైభవ మూర్తులని, లోకాలకు ప్రభువులు కారని భేదదృష్టితో భావించే నన్ను నీవు రక్షించు. ఈ విశ్వానికి కారణమైన శివుడు, బ్రహ్మ, దిక్పాలకులు, సకల చరాచర జంతువులు నీవే. నీకు వ్యతిరేకమైనది లోకంలో లేద" ని విన్నవించగా తదనంతరం ఋత్విక్కులు ఈ విధంగా స్తుతించారు:

సీ. వామదేవుని శాపవశమునఁ జేసి కర్మానువర్తులము మేమైన కతన
బలసి వేద ప్రతిపాద్య ధర్మోపలక్ష్యంబైన యట్టి మఖంబునందు
దీపింప నింద్రాది దేవతా కలిత రూపవ్యాజమునఁ బొంది పరఁగు నిన్ను
యజ్ఞస్వరూపుండ వని కాని కేవల నిష్కించనుండవు నిర్మలుఁడవు

తే. నరయ ననవద్య మూర్తివి యైన నీదు, లలితతత్త్వ స్వరూపంబుఁ దెలియఁజాల
మయ్య! మాధవ! గోవింద! హరి! ముకుంద, చిన్మయాకార! నిత్యలక్ష్మీవిహార!

171

తా ॥ "ఓ మాధవ! గోవిందా! హరి! ముకుంద! చిన్మయాకార! నిత్యలక్ష్మీ విహార! వామదేవుని శాప వశాన మేము కర్మలననుసరించి జీవించే వాళ్ళమైనాము. వేదం ప్రతిపాదించే ధర్మానికి ఉపలక్ష్యమైన యజ్ఞంలో ఇంద్రాదిదేవతల రూపంలో ప్రకాశించే నీవు యజ్ఞస్వరూపునిగా, కేవలస్థితి గలవానిగా (ఏమీ లేనివానిగ), నిర్మలునిగా, అనవద్యమూర్తిగా ఉన్నావు. అటువంటి నీ తత్త్వస్వరూపాన్ని మేము గ్రహించలేము."

వ. సదస్యు లిట్లనిరి.

172

తా ॥ సదస్యులు ఇలా అన్నారు:

సీ. శోకదావాగ్ని శిఖాకులితంబు పృథు క్లేశఘన దుర్గ దుర్గమంబు
దండధర క్రూర కుండలిశ్లిష్టంబు, పాపకర్మ వ్యాఘ్ర పరివృతంబు
గురు సుఖదుఃఖ కాకోల పూరిత గర్త మగుచు ననాశ్రయ మైనయట్టి
సంసార మార్గ సంచారులై మృగతృష్టికలఁ బోలు విషయ సంఘము నహ మ్మ

తే. మేతి హేతుక దేహ నికేతనములు, నయి మహాభారవహు లైనయట్టి మూఢ
జనము లేనాఁట మీ పదాబ్జములు గానఁ, జాలు వారలు? భక్తప్రసన్న! దేవ!

173

తా ॥ "ఓ దేవా! భక్తప్రసన్న! దుఃఖమనే దావాగ్ని శిఖలతో కూడి, దాటడానికి వీలుకాని అనేక కష్టాలనే దుర్గాలతో కూడి, యముడనే క్రూర సర్పాలతో చుట్టబడి, పాపపు పనులనే పెద్ద పందికొక్కులతో నిండిన కన్నాలతో కూడి, ఏ ఆధారమూ లేని సంసారమార్గంలో ప్రయాణిస్తూ, ఎండమావులవంటి ఇంద్రియాలతో, "నేను, నాది" అనే భావనకు మూలమైన దేహాలనే ఇళ్ళు కలిగి, ఇటువంటి భారాన్ని మోస్తున్న మూఢజనులు నీ పాదపద్మాలను ఎప్పటికి చూడగలరో కదా!"

లోక జీవనాన్ని శాశ్వతమని నమ్ముకోవటంలోని దుఃఖాన్ని ఇందులో పేర్కొని, అటువంటివారు హరిపదాన్ని చేరుకోవడానికి ఎన్ని జన్మలు ఎత్తాలో తెలియదని స్వామికి నివేదించుకుంటూ లోకానికి తెలియజేస్తున్నారు.

వ. రుద్రుం డిట్లనియె.

174

తా ॥ రుద్రుడు ఇలా స్తుతించాడు:

చ. వరద! నిరీహ యోగిజనవర్గసుపూజిత! నీ పదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పి సమగ్ర భవత్పరిగ్రహ
స్ఫురణ దనర్చు నన్ను నతిమూఢులు సంతతము న్నమంగళా
చరణుఁ డటంచుఁ బల్క నది సమ్మతి నే గణియింప నచ్యుతా!

175

తా ॥ “ఓ వరదా! ఏ కోరికా లేని యోగిజనులచేత పూజించబడేవాడా! నీ పాదపద్మాలను నిరంతరం ఇలాగే నా అంతరంగంలో నిలిపి, నీ అనుగ్రహస్ఫూర్తితో ప్రకాశించే నన్ను, అశుభవర్తినని మూర్ఖులు అంటుంటారు. దానిని నీ మనస్సునందున్న నేను లక్ష్యపెట్టను.

లయకారుడైన ఈశ్వరుణ్ణి అశుభవర్తి అని అనటం లోకంలో ఉన్నదే. అది అజ్ఞాన చిహ్నం. సమస్త జగత్తు లయమందిన తరువాత మిగిలేది పంచభూతాలే. పంచభూతాలతో కూడిన దేహాయి నామరూపాదుల్ని కూడా కోల్పోతే మిగిలేది భస్మమేకదా! ఈ భస్మము భావనాగోచరమైన మహాతత్త్వం. తంత్ర గ్రంథాలు ‘భస్మకూటనివాసినీ’ – అని గౌరీమాతను పేర్కొంటున్నాయి. ఈ భస్మపు అంతస్తత్వమే పునఃసృష్టికి మూలమైన మహాశక్తి. అదే శివుని మైపూత. శివునియందు లయమైన సకలప్రపంచం అన్నివిధాలా చేతనాశూన్యమైనది. చైతన్యవిహీనమైనది. అదొక శ్మశానం వంటిది. అందులో నివసించేవాడు శివుడు. ఆ శ్మశాన పరిసరాలలో నివసించే భూతప్రేత పిశాచాలు, నక్కలు శివుని సహచరాలు అనడం కూడా ఈ అంశాన్ని అనుసరించి చెప్పే భావనలే. అమంగళకరమైన పుర్రెల మాల ధరించే శివుని భార్య ‘సర్వమంగళ’. ఆయన తాండవం సకలభువనాల ఆంగికచలనమే. సత్యశివసుందరమైన సకలవాఙ్మయమూ ఆ దేవుని వాచికాభినయమే. చంద్రతారాదులు అతని ఆహార్యం. అటువంటి సత్త్వమూర్తిని, విష్ణుహృదయవర్తిని అశుభవర్తనుడనటం అజ్ఞాన లక్షణమే. ఇది దక్షుణ్ణి ఉద్దేశించి ఈశ్వరుడన్న మాటగా భావించాలి.

వ. భృగుం డిట్లనియె.

176

తా ॥ భృగువు ఇలా అన్నాడు:

మ. అరవిందోదర! తావకీన ఘనమాయామోహిత స్వాంతులై
పరమంబైన భవన్మహామహిమముం బాటించి కానంగ నో
పరు బ్రహ్మాది శరీరు లజ్ఞు లయి; యో పద్మాక్ష! భక్తార్తి సం
హరణాలోకన! నన్నుఁ గావఁదగు నిత్యానందసంధాయివై.

177

తా ॥ "ఓ పద్మనాభా! భక్తుల ఆర్తిని పోగొట్టే చూపులుగలవాడా! బ్రహ్మ మొదలైన శరీరధారలు కూడ అజ్ఞులయి, నీదైన మహామాయతో మోహింపబడిన మనస్సుగలవారై, నీ మహామహిమను తెలుసుకోలేకపోతున్నారు. నిత్యానంద సంధాయివై నన్ను కటాక్షించాలి."

వ. బ్రహ్మ యిట్లనియె.

178

తా ॥ బ్రహ్మ ఇలా అన్నాడు:

సీ. తవిలి పదార్థభేద గ్రాహకములైన చక్షురింద్రియముల సరవిఁ జూడఁ
గలుగు నీ రూపంబు గడఁగి మాయామయం బగు; నసద్వ్యతిరిక్త మగుచు మఱియు
జ్ఞానార్థ కారణ సత్త్వాది గుణముల కాశ్రయభూతమై యలరుచున్న
నిరుపమాకారంబు నీకు విలక్షణ మైయుండు ననుచు నే నాత్మఁ దలఁతు

తే. నిర్వికార! నిరంజన! నిష్కళంక!, నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంబోధ్య! నిరవద్య! వేదవేద్య!, ప్రవిమలానంద! సంసారభయవిదూర!

179

తా ॥ "ఓ నిర్వికారా! నిరంజనా! నిరతిశయా! నిష్క్రియారంభ! విశ్వసంబోధ్య! నిరవద్య! ప్రవిమలానంద! సంసారభయవిదూర!

కేవలం నామరూపాలను మాత్రమే చూసే నేత్రాది ఇంద్రియములతో పురుషుడు నీ మాయామయ రూపాన్ని మాత్రమే చూడగలడు. జ్ఞానము, అర్థము, సత్త్వము మొదలైన గుణాలకు ఆశ్రయభూతమై, ఉపమానాదులకు అందని, అసత్తులకంటే వేరై, సాటిలేనిదై, విలక్షణమైన నీ రూపాన్ని జీవులు చూడలేరు."

ఒక్కసూర్యుణ్ణి చూడటానికే చాలని మన కళ్ళు, కోటి సూర్యసమాన తేజుడైన భగవంతుణ్ణి చూడటానికి ఎలా సరిపోతాయి? తన రూపాన్ని చూడటానికి అవసరమైన నేత్రాలను కూడా ఆ పరమాత్మే ప్రసాదించాలి. భారతంలో ధృతరాష్ట్రునికి, అర్జునునికి, భీష్మునికి అందరికీ ఆ పరమాత్మ ప్రసాదించిన దివ్యచక్షువుల వలననే ఆ రూపాన్ని చూడవీలయింది. అందుకే నిరుపమానమైనది ఆ రూపం. సమస్త చైతన్యానికి కేంద్రమైన ఆ అంతర్యామి లక్షణాన్నే బ్రహ్మ ఇక్కడ పేర్కొన్నాడు.

వ. ఇంద్రుం డిట్లనియె.

180

తా ॥ ఇంద్రుడు ఇలా స్తుతించాడు:

మ. దితి సంతాన వినాశ సాధన సముద్దీప్తాష్ట బాహా సమ
న్వితమై యోగిమనోనురాగ కరమై వెల్గొందు నీ దేహ మా
యత మైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముం గామి శా
శ్వతముం గా మదిలోఁ దలంతు హరి! దేవా! దైవచూడామణీ!

181

తా ॥ "ఓ దైవచూడామణీ! దేవా! హరీ! దితి సంతానమైన దైత్యుల్ని (రాక్షసుల్ని) నశింపచేసే సాధనమై వెలుగొందే అష్టబాహువులతో కూడి, యోగుల మనస్సుకు అనురాగాన్ని కలిగించేలా ప్రకాశించే నీ దేహం, పంచభూతాత్మకమైన ఈ ప్రపంచంలా మిథ్యకాదని, శాశ్వతమని భావిస్తాను."

పరమాత్మ శాశ్వతత్త్వాన్ని ఇంద్రుడు కీర్తించాడు. భగవంతుని అపరా ప్రకృతిని ఇందులో ప్రస్తావించడాన్ని గమనించాలి. పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారము – అనే ఎనిమిది విధాలుగల ఆ పరాప్రకృతినే అష్ట బాహువులుగా సంకేతార్థంలో పేర్కొన్నాడు. ఈ ఎనిమిది విధాలయిన ప్రకృతులను ఆకర్షించే ఆత్మయే పరమాత్మ.

వ. ఋత్విక్పత్ను లిట్లనిరి.

182

తా ॥ ఋత్విక్కుల పత్నులిలా కీర్తించారు:

చ. కడఁగి భవత్పదార్చనకుఁ గా నిటు దక్షునిచే రచింపఁగాఁ
బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమియై
చెడి కడు శాంతమేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడు మే
ర్పడ జలజాభ నేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా!

183

తా ॥ "ఓ అచ్యుతా! నీ పాదాల్ని అర్చించటం కోసం, దక్షునిచే ఈ విధంగా రూపకల్పన చేయబడి, ఈశ్వరుని కోపంతో బూడిదయి, శ్మశాన భూమిగా మారి, ధ్వంసమై పోయి, ఏ సందడీ లేక ప్రకాశించని ఈ యజ్ఞం నీ నేత్రపద్మాలతో చూసినంతనే పావనమై విలసిల్లుతున్నది."

విష్ణుపాదపూజకై ఏర్పాటు చేసిన యజ్ఞం శివాపరాధంవల్ల ధ్వంసమై పోయింది. అంటే శివకేశవ హృదయాలను ప్రసన్నం చేసుకోవలసిన తీరును ఇక్కడ చెప్పటం కనిపిస్తుంది. ఎవరిని ఉద్దేశించి అర్చన చేసినప్పటికీ వారి హృదయాలలో భావన ఒకేలా ఉండాలి. అది శివహృదయం విష్ణువేనని చెప్పటమే దీని తాత్పర్యం.

వ. ఋషు లిట్లనిరి.

184

తా ॥ ఋషులు ఇలా కీర్తించారు:

మ. అనఘా! మాధవ! నీవు మావలెనె కర్మారంభివై యుండియున్
విను తత్కర్మ ఫలంబు వొంద; వితరుల్ విశ్వంబునన్ భూతికై
యనయంబున్ భజియించు నిందిర గరం బర్థిన్ నినుం జేరఁ గై
కొన; వే మందుము నీ చరిత్రమునకున్ గోవింద; పద్మోదరా!

185

తా ॥ "ఓ గోవిందా! పద్మనాభా! పుణ్యాత్మా! మాధవా! నీవు మాలాగే కర్మలను చేస్తావు. కాని ఆ కర్మఫలం నీవు పొందవు. ఇతరులు సంపదల కోసం నిరంతరం సేవించే లక్ష్మీదేవి నిన్ను చేరినప్పటికీ పట్టించుకోవు. నీ నడవడిని గూర్చి మేము ఏమంటాము?"

అష్టవిధ ఐశ్వర్యాలను ప్రసాదించే లక్ష్మీదేవికే ఆశ్రయభూతుడు శ్రీమహావిష్ణువు. చతుర్విధ పురుషార్థ ప్రదాయకుడైన పరమాత్మ కేవలం అర్థాన్ని ఆశ్రయించుకొని ప్రవర్తించే వాళ్ళను పట్టించుకోవలసిన పనేముంది? తామరాకు మీది నీటి బొట్టువంటి బుద్ధితో చేసే కర్మాచరణను అంటే నిష్కామకర్మ గురించి ఇక్కడ ప్రస్తావించటం గమనించాలి.

వ. సిద్ధు లిట్లనిరి.

186

తా ॥ సిద్ధులు ఇలా అన్నారు:

చ. హరి! భవ దుఃఖ భీషణ దవానల దగ్ధతృషార్త మన్మనో
ద్విరదము శోభనంబును బవిత్రము నైన భవత్కథా సుధా
సరి దవగాహనంబునను సంసృతి తాపము బాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనిన ధీరుని భంగిఁ బయోరుహోదరా!

187

తా ॥ "హరీ! పద్మనాభా! సంసార దుఃఖమనే భీషణ దావాగ్నిలో చిక్కి కాలిపోయి, దాహంతో తల్లడిల్లే మా మనస్సనే మదగజం, పవిత్రమైన నీ కథామృతమనే నదిలో మునిగి తేలి సంసార దుఃఖాన్ని పోగొట్టుకొన్నది. పరబ్రహ్మతో ఐక్యాన్ని పొందిన ధీరునిలా మళ్ళీ సంసారసుఖాలవైపు చూడదు."

వ. యజమాని యగు ప్రసూతి యిట్లనియె.

188

తా ॥ యజ్ఞం చేసిన దక్షుని భార్యయైన ప్రసూతి ఇలా అన్నది:

చ. కర చరణాదికాంగముల గల్గియు మస్తము లేని మొండెముం
బరువడి నొప్ప కున్న గతిఁ బంకజలోచన! నీవు లేని య
ధ్వరము ప్రయాజలం గలిగి తద్దయు నొప్పక యున్న దీ యెడన్
హరి! యిటు నీదు రాక శుభ మయ్యె రమాధిప! మమ్ముఁ గావవే!

189

తా ॥ "ఓ పద్మాక్షా! లక్ష్మీనాథా! కాళ్ళూ చేతులు మొదలైన అంగాలు కలిగి కూడ,

తలలేని మొండెంతో దేహం ప్రకాశించదు. అలాగే యాజులు, ప్రయాజులు కలిగికూడా నీవులేని యజ్ఞం ప్రకాశించటంలేదు. నీ రాకవలన మాకు శుభం కలిగింది. మమ్మల్ని రక్షించు."

యజ్ఞసంభారాలెన్ని ఉన్నా ఆత్మస్థానీయుడైన పరమాత్మ లేకుండా యజ్ఞం ఎలా ప్రకాశిస్తుంది? అసలు 'యజ్ఞ' మన్న పదానికి అర్థం కూడా అదే. యః = ఎవడు; జ్ఞ = తెలియదగినవాడో; వానిని తెలుసుకోవడమే జ్ఞానయజ్ఞం. దక్షుడు ఆ పని చేయక ధ్వంసమయ్యాడు.

వ. లోకపాలకు లిట్లనిరి.

190

తా ॥ లోకపాలకులు ఇలా నుతించారు:

సీ. దేవాదిదేవ! యీ దృశ్యరూపంబు సుమహిత విశ్వంబుఁ జూచు ప్రత్య
గాత్మభూతుండ వైనట్టి నీవు నసత్ప్రకాశ రూపంబులై గలుగు మామ
కేంద్రియంబులచేత నీశ్వర! నీ మాయ వొందించి పంచభూతోపలక్షి
తంబగు దేహివిధంబునఁ గానంగఁ బడుదువు గాని యేర్పడిన శుద్ధ

తే. సత్త్వగుణ యుక్తమైన భాస్వత్స్వరూప, ధరుఁడవై కానఁబడవుగా? పరమపురుష!
యవ్యయానంద! గోవింద! యట్లు గాక, యెనయ మా జీవనము లింక నేమి కలవు?

191

తా ॥ "దేవాదిదేవా! అవ్యయానంద! గోవిందా! పరమపురుష! ఈ కనిపించే మహావిశ్వమును ప్రత్యగాత్ముడవై చూస్తావు. అసత్ ప్రకాశరూపాలై కనిపించే మా ఇంద్రియాలకు నీ మాయ కల్పించి, పంచభూతాల సమన్వితరూపమైన ప్రాణిలా కనిపిస్తావు. శుద్ధసాత్త్విక గుణంతో కూడిన నీ రూపాన్ని మాకు చూపించవు. ఏమి బ్రతుకులయ్యా మావి?"

వ. యోగీశ్వరు లిట్లనిరి.

192

తా ॥ యోగీశ్వరులు ఇలా అన్నారు:

సీ. విశ్వాత్మ! నీయందు వేఱుగా జీవులఁ గనఁ డెవ్వఁ; డటు వానికంటెఁ బ్రియుఁడు
నీకు లేఁ; డయినను నిఖిల విశ్వోద్భవ స్థితి విలయంబుల కతన దైవ
సంగతి నిర్భిన్న సత్త్వాది గుణవిశిష్టాత్మీయ మాయచే నజ భవాది
వివిధ భేదము లొందుదువు స్వస్వరూపంబు నందుండుదువు; వినిహత విమోహి

తే. వగుచు నుందువు గద! నిన్ననన్యభక్తి, భృత్యభావంబు దాల్చి సంప్రీతిఁ గొల్చు
మమ్ము రక్షింపవే? కృపామయ! రమేశ! పుండరీకాక్ష! సంతత భువన రక్ష!

193

తా ॥ “ఓ విశ్వాత్మా! పుండరీకాక్ష! నిరంతరం భువనాలను రక్షించేవాడా! రమేశ! కృపామయా! నీ నుండి జీవుల్ని వేరుగా చూడలేము. అలా వేరుగా చూడని వాడే నీకు ప్రియుడు. అయినప్పటికీ ఈ సమస్త జగత్తు సృష్టిస్థితిలయాల కోసం సత్త్వాది గుణ విశిష్టమైన నీమాయచేత బ్రహ్మ, శివాది వివిధ భేదాలను పొందుతున్నావు. నీవు నీవుగానే ఏ మోహమూ లేకుండా ఉంటావు. అనన్య భక్తితో, దాసభావంతో, సంప్రీతితో కొలిచే మమ్మల్ని రక్షించు.”

వ. శబ్ద బ్రహ్మ యిట్లనియె.

194

తా ॥ శబ్దబ్రహ్మ ఇలా కీర్తించాడు:

చ. హరి భవదీయ తత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా
సరసిజ సంభవాదులును జాలము, సత్త్వగుణాశ్రయుండవున్

బరుఁడవు నిర్గుణుండవును బ్రహ్మమునై తగు నీకు నెప్డు నిం
దఱముఁ జతుర్విధార్థ ఫలదాయక! మ్రొక్కెద మాదరింపవే!

195

తా ॥ "ఓ హరీ! ధర్మార్థకామమోక్షాది చతుర్విధార్థ ఫలదాయక! నీ తత్త్వాన్ని నేనేకాదు, బ్రహ్మాదులు సైతం తెలియలేరు. సత్త్వగుణాశ్రయుడవు. పరాత్పరుడవు. నిర్గుణుడవు. పరబ్రహ్మవు. ఇక్కడున్న మేమంతా ఇప్పుడు నీకు మ్రొక్కుతున్నాము. ఆదరించండి."

వ. అగ్నిదేవుం డిట్లనియె.

196

తా ॥ అగ్నిదేవుడు ఇలా అన్నాడు:

మ. హవరక్షాచరణుండ వై నెగడు దీ; వయ్యగ్నిహోత్రాది పం
చవిధంబున్ మఱి మంత్రపంచక సుసృష్టంబై తగం బొల్చు నా
హవ రూపంబు నీకు మ్రొక్కెదను; నీ యాజ్ఞన్ భువిన్ హవ్యముల్
సవన వ్రాతములన్ వహింతు హరి యుష్మత్తేజముం బూనుచున్.

197

తా ॥ "ఓ హరీ! యజ్ఞరక్షణ చేస్తూ, అగ్నిహోత్రాది పంచరూపాలతో, అయిదు మంత్రాలతో సృష్టించబడిన యజ్ఞరూపాన్ని ధరించిన నీకు మ్రొక్కుతున్నాను. స్వామీ! నీ ఆజ్ఞతో యజ్ఞయాగాది క్రతువులలో నీ తేజస్సును పూని హవిస్సుల్ని స్వీకరిస్తున్నాను."

వ. దేవత లిట్లనిరి.

198

తా ॥ దేవతలు ఇలా స్తుతించారు:

మ. ముని కల్పాంతమునందుఁ గుక్షి నఖిలంబున్ దాఁచి యేకాకివై
జనలోకోపరిలోకవాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయఁ బయోధియందు నహిరాట్తల్పంబునం బవ్వళిం
చిన నీ రూపము నేఁడు సూపితివి లక్ష్మీ నాథ! దేవోత్తమా!

199

తా ॥ "పూర్వం కల్పాంత సమయంలో సమస్తాన్ని కుక్షిలో దాచి, ఒంటరిగా శేషతల్పశాయివై ఉన్న నీ రూపాన్ని జనలోకానికి పైనున్న సత్యలోక, తపోలోకాల యందున్న వారు మనస్సులో మననం చేస్తారు. అటువంటి రూపాన్ని మళ్ళీ మాకు చూపించావు."

వ. గంధర్వు లిట్లనిరి.

200

తా ॥ గంధర్వులు ఇలా అన్నారు:

మ. హరపంకేజభవామరాదులు మరీచ్యాది ప్రజానాథు లో
యరవిందాక్ష! రమాహృదీశ! భవదీయాంశాంశ సంభూతులై
పరఁగం దావకలీలయై నెగడు నీ బ్రహ్మాండమున్, దేవ! యీ
శ్వర! నీ కే మతి భక్తి మ్రొక్కెదము దేవాధీశ! రక్షింపుమా!

201

తా ॥ "ఓ పద్మాక్షా! లక్ష్మీ హృదయనాథా! హరుడు, బ్రహ్మ, దేవతలు, మరీచి మొదలైన ప్రజాపతులు నీ అంశమే. ఈ బ్రహ్మాండమంతా నీ లీలయే. ఓ దేవచూడామణీ! ఈశ్వరా! నీకు మేము అతిభక్తితో ప్రణమిల్లుతున్నాము."

వ. విద్యాధరు లిట్లనిరి.

తా ॥ విద్యాధరులు ఇలా అన్నారు:

సీ. నలినాక్ష! విను భవన్మాయా వశంబున దేహంబు దాల్చి తద్దేహమందు
నాత్మ "నహ మ్మ" మేత్యభిమానమును బొంది పుత్ర జాయాగృహక్షేత్ర బంధు
ధన పశు ముఖ వస్తుతతుల సంయోగ వియోగ దుఃఖముల నొందుచుండు
ధృతి విహీనుఁడు నసద్విషయాతిలాలసుఁ డతి దుష్టమతియు నైనట్టివాఁడు

తే. దవిలి భవదీయ గుణ సత్కథా విలోలుఁ, డయ్యె నేనియు నాత్తమోహంబు వలనఁ
బాసి వర్తించు విజ్ఞానపరత గలిగి, చిరదయాకార! యిందిరా చిత్తచోర!

203

తా ॥ "ఓ పద్మనేత్రా! దయామూర్తీ! ఇందిరాదేవి హృదయాన్ని దొంగిలించినవాడా! నీ మాయకు వశుడై దేహాన్ని ధరించి, మానవుడు "నేను, నాదనే" అభిమానాన్ని పొంది, భార్యాబిడ్డలు, ఇల్లు, పొలము, బంధువర్గము, ధనము, పశువులు మొదలైన వస్తుసమూహపు సంయోగవియోగాదుల చేత దుఃఖాన్ని అనుభవిస్తున్నారు. ధైర్యవిహీనుడు, ఇంద్రియ విషయాలపట్ల అతిలాలసుడైనవాడు, అతిదుష్టమతి అయినవాడు కూడా నీ గుణాలను చేప్పే సత్కథలను వింటే చాలు! మోహాన్ని వీడి, విజ్ఞానియై జీవిస్తాడు."

వ. బ్రాహ్మణ జనంబు లిట్లనిరి.
దేవా! యీ క్రతువును, హవ్యంబును, నగ్నియు, మంత్రంబులును, సమిద్దర్భపాత్రంబులును, సదస్యులును, ఋత్విక్కులును, దంపతులును, దేవతలును, నగ్నిహోత్రంబులును, స్వధయు, సోమంబును, నాజ్యంబును, బశువును నీవ; నీవు దొల్లి వేదమయ సూకరాకారంబు ధరియించి దంష్ట్రాదండంబున వారణేంద్రంబు నళినంబు ధరియించు చందంబున రసాతల గతయైన భూమి నెత్తితి; వట్టి యోగిజన స్తుత్యుండవును, యజ్ఞక్రతురూపకుండవును నైన

నీవు పరిభ్రష్టకర్ములమై యాకాంక్షించు మాకుం బ్రసన్నుండ వగుము; భవదీయ నామకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబు నొందు; నట్టి నీకు నమస్కరింతుము.

204

తా ॥ బ్రాహ్మణులు ఇలా అన్నారు: "ఓ దేవా! ఈ యజ్ఞం, యజ్ఞం చేసే వస్తువులు, అగ్ని, మంత్రాలు, సమిధలు, దర్భలు, పాత్రలు, సదస్యులు, ఋత్విక్కులు, దంపతులు, దేవతలు, అగ్నిహోత్రము, పితృదేవతల ఆహారము (స్వధా), సోమరసము, నేయి, యజ్ఞంలో కట్టబడే పశువు నీవే. పూర్వం నీవు వేదమయమైన వరాహావతారాన్ని ధరించి, కర్రవంటి కోరతో, ఏనుగు పద్మాన్ని ధరించినట్లు పాతాళానికి పోయిన భూమిని పైకెత్తావు. యోగిజనులచేత స్తుతింపబడినవాడవు. యజ్ఞ స్వరూపుడవువైన నీవు, కర్మభ్రష్టులమైన మాపట్ల ప్రసన్నుడవు కావలసింది. నీ నామకీర్తనము చేత సకల విఘ్నాలు నశిస్తాయి. అటువంటి నీకు నమస్కరిస్తున్నాము."

క. అని తన్ను సకల జనములు, వినుతించిన హరి భవుండు విఘ్నము గావిం
చిన యా దక్షుని యజ్ఞము, ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత గాకుండంగన్.

205

తా ॥ అని సమస్త జనులు హరిని కీర్తించగా, రుద్రుడు ఆటంకపరచిన ఆ దక్షుని యజ్ఞాన్ని శ్రీహరి ఏ కొరతా లేకుండ పూర్తిచేశాడు.

క. సకలాత్ముఁడు దా నగుటను, సకల హవిర్భోక్త యయ్యు జలజాక్షుండుం
బ్రకట స్వభావమున న, య్యకలంకుఁడు దృప్తిఁ బొంది యనె దక్షునితోన్.

206

తా ॥ సకలాత్ముడు, సమస్త యజ్ఞ ద్రవ్యాలను భుజించేవాడు, ఏ కళంకమూ లేని వాడైన హరి తృప్తిపొంది దక్షునితో ఇలా అన్నాడు:

వ. అనఘా! యేనును బ్రహ్మయు శివుండును నీజగంబులకుఁ గారణభూతుల; మందు నే నీశ్వరుండను నుపద్రష్టను స్వయంప్రకాశకుండను నై గుణమయం బయిన యాత్మీయమాయం బ్రవేశించి జనన వృద్ధి విలయంబులకు హేతు భూతంబు లగు తత్తత్క్రియోచితంబులైన బ్రహ్మరుద్రాది నామధేయంబుల నొందు చుండుదు; నట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండ నైన నా యందు నజ భవాదులను భూతగణంబులను మూఢుం డగువాఁడు వేఱుగాఁ జూచు; మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుం డగువాఁడు నా యందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపఁడు. గావున మా మువ్వుర నెవ్వండు వేఱు సేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన దక్షుండును.

207

తా ॥ "ఓ పుణ్యాత్మా! నేను, బ్రహ్మయు, శివుడు ఈ జగత్తుకు కారణభూతులము. అందులో నేను ఈశ్వరునిగా, పైనుండి గ్రహించేవానిగా, స్వయంగా ప్రకాశించే వానిగా ఉన్నాను. త్రిగుణాత్మకమైన నా మాయలో ప్రవేశించి, సృష్టి, స్థితి, లయాలకు కారణభూతమైన ఆ యా పనులకు తగిన బ్రహ్మరుద్రాది పేర్లను పొందుతుంటాను. అటువంటి అద్వితీయ పరబ్రహ్మ రూపధారినైన నాయందు బ్రహ్మను, శివుని భూతగణాలను మూర్ఖుడు వేరుగా చూస్తాడు. మనిషి శరీరంనుండి కాళ్ళు, చేతుల్ని వేరుగా చూడనట్లే, నా భక్తుడు ప్రాణికోటిని నానుండి వేరుగా చూడడు. కాబట్టి త్రిమూర్తులమైన మా ముగ్గురినీ ఎవరయితే వేరువేరుగా చూడడో వాడే కృతార్థుడ" ని అనే సరికి దక్షుడు

క. విని విష్ణు దేవతాకం, బనఁగాఁ ద్రికపాలకలిత మగు నా యాగం
బునఁ దగ న వ్విష్ణునిపద, వనజంబులు పూజసేసి వారని భక్తిన్.

208

తా ॥ విష్ణువుని ప్రధాన దైవంగా స్వీకరించి త్రికపాలేష్టిని (మూడు కపాలాలతో కూడిన

ఆ యాగాన్ని) సంస్కరించబడిన పురోడాశమును సమర్పించి శ్రీహరిని పూజించాడు.

వ. మఱియును.

209

తా ॥ అంతే కాకుండా,

సీ. అంగప్రధానక యాగంబులను జేసి యమరుల రుద్రుని నర్థిఁ బూజ
సేసి విశిష్టేష్ట శిష్టభాగమున నుదవసాన కర్మంబు దవిలి తీర్చి
తాను ఋత్విక్కులుఁ దగ సోమపులఁ గూడి యవభృథ స్నానంబు లాచరించి
కడఁక నవాప్త సకల ఫలకాముఁడై తనరు దక్షునిఁ జూచి ధర్మబుద్ధి

తే. గలిగి సుఖవృత్తి జీవింతుఁగాక యనుచుఁ, బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల; కా జలజనయన, భవులు వేంచేసి రాత్మీయ భవనములకు.

210

తా ॥ యజ్ఞానికి అంగభూతమైన మరికొన్ని యాగాలను చేశాడు. వీటినే 'అంగప్రధానక' యాగాలని అంటారు. వీటిలో దక్షుడు దేవతలను, రుద్రుణ్ణి పూజించాడు. ఇష్టభాగాలలో ఒకదానినుండి మరొక విశిష్ట భాగాలను కల్పించి, 'ఉదవసానము' అనబడే యజ్ఞకర్మతో పరిసమాప్తి చేశాడు. ఆపైన తాను, ఋత్విక్కులు, సోమపానం చేసిన వారితో కలిసి అవభృథ స్నానాలను ఆచరించి, సకల ఫలాలను పొందినవాడై దక్షుడు ప్రకాశించాడు. దక్షుణ్ణి చూసి "ధర్మము నందు మాత్రమే బుద్ధి నిలిచి జీవింతువు గాక" అని దేవతలు, మునులు, బ్రాహ్మణులు తమతమ మందిరాలకు వెళ్ళారు. శ్రీమహావిష్ణువు, శివుడు తమతమ నివాసాలకు వెళ్ళారు.

వ. అంత దాక్షాయణి యయిన సతీదేవి పూర్వకళేబరంబు విడిచి హిమవంతునకు మేనకయందు జనియించి విలయకాలంబున బ్రసుప్తంబయిన శక్తి సృష్టికాలంబున

నీశ్వరునిఁ బొందు చందంబునఁ బూర్వదయితుండగు రుద్రుని వరియించె నని దక్షాధ్వర ధ్వంసకుం డగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుఁడయిన యుద్ధవునకు నెఱింగించె; నతండు నాకుం జెప్పె; నేను నీకుం జెప్పితి నని మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె.

211

తా ॥ ఆపైన దక్షుని కుమార్తెయైన సతీదేవి పూర్వదేహాన్ని వీడి, హిమవంతునికి పుత్రికగా మేనకకు జన్మించి, 'ప్రళయకాలంలో నిదురించిన 'శక్తి' సృష్టి సమయంలో ఈశ్వరుణ్ణి చేరినట్లు', తన భర్త ఈశ్వరుణ్ణి వరించింది. ఇది దక్షుని యాగాన్ని ధ్వంసం చేసిన రుద్రుని చరిత్ర. దీనిని బృహస్పతి తన శిష్యుడైన ఉద్ధవునికి చెప్పాడు. ఆతడు నాకు చెప్పాడు" నేను నీకు చెప్పాను. అని మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు:

క. ఈ యాఖ్యానముఁ జదివిన, ధీ యుతులకు వినినయట్టి ధీరుల కైశ్వ
ర్యాయుః కీర్తులు గలుగును; బాయును దురితములు; దొలఁగు భవబంధంబుల్.

212

తా ॥ "శ్రీహరి, దక్షునికి బోధించిన పరమార్థ తత్త్వాన్ని గ్రహించి, ఆచరణాత్మంగా జీవించేవారు. ఈ ఆఖ్యాన కథను చదివినా, విన్నా; అట్టి ధైర్యవంతులకు ఆయువు, కీర్తి సమకూరుతాయి. పాపాలు తొలగి జన్మదుఃఖాలు నశిస్తాయి."

వ. అని వెండియు నిట్లనియె.

213

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు:

క. విను సనకాదులు నారదుఁ, డును హంసుఁడు నరుణియు ఋభుఁడు యతియుఁ

గమలాసనజులు నైష్ఠికు లనికే, తను లగుటన్ సాగవయ్యెఁ దద్వంశంబుల్.

214

తా ॥ "సనకసనందనాదులు, నారదుడు, హంసుడు, అరుణి, ఋభువు, యతి, అనే వీరు బ్రహ్మమానస పుత్రులు, నిష్ఠాపరాయణులు. ఆధ్యాత్మికార్థంలో దేహధారణ చేయని ప్రాణశక్తులని అర్థం. దేహధారణ లేనందున వారి వంశవృక్షాలు కొనసాగలేదు.

వ. మఱియు నధర్మునకు "మృష" యను భార్యయందు దంభుండును, "మాయ" యను నంగనయుం బుట్టిరి; అధర్మసంతానం బగుట వారిరువురును మిథునం బైరి; వారిని సంతానహీనుండగు నిరృతి గైకొనియె; వారలకు లోభుండును నికృతియను సతియునుం గలిగి మిథునం బయిరి; ఆ మిథునంబునకు గ్రోధుండు హింస యను నంగనయుం బుట్టి మిథునం బయిరి; ఆ మిథునంబునకుఁ గలియు దురుక్తియను నతివయు జన్మించి దాంపత్యంబు గైకొనిరి; ఆ దంపతులకు భయమృత్యువు లను మిథునంబు గలిగె; దాని వలన యాతనము నిరయంబునుం బుట్టిరి; వీరలు సంసార హేతువగు నధర్మతరుశాఖ లయి నెగడిరి; వీని శ్రేయస్కాముండగు జనుం డీషన్మాత్రంబు ననువర్తింపం జనదు; ఇవ్విధంబునం బ్రతి సర్గంబును సంగ్రహంబున వినిపించితి; ఇప్పుణ్య కథ ఎవ్వండేని ముమ్మాఱు వినిన నతండు నిష్పాపుం డగునని చెప్పి మఱియు నిట్లనియె.

215

తా ॥ అధర్మునికి మృ (అసత్యం) అనే భార్యవలన 'దంభుడు' – అనే పుత్రుడు, 'మాయ' అనే పుత్రిక జన్మించారు. అధర్మ సంతానమైన వారిద్దరూ దంపతులయ్యారు. సంతానములేని 'నిరృతి' వీళ్ళను దత్తత తీసికొన్నాడు. వాళ్ళకు లోభుడు, నికృతి అనే సంతానం జన్మించి దంపతులయ్యారు. ఆ జంటకు 'కలి', 'దురుక్తి' అనే వాళ్ళు జన్మించి వాళ్ళు కూడ దంపతులయ్యారు. ఆ దంపతులకు 'భయ' 'మృత్యు' వులనే జంట కలిగారు. వారికి 'యాతన' (దుష్కర్మఫలము), 'నిరయము' (నరకము) జన్మించారు. వీరు సంసార కారకమైన

అధర్మవృక్షానికి కొమ్మలై ప్రకాశించారు. శ్రేయస్సుకోరే ఏ నరుడైనా వీళ్ళను కొంచెం కూడా అనుసరించ తగదు.

ఈ విధంగా సృష్టిని ప్రతిఘటించే ప్రతిసర్గాన్ని గురించి సంగ్రహంగా చెప్పాను. ఈ పుణ్యకథను ఎవ్వడైనా మూడుసార్లు వింటే, వాడు 'పాపరహితుడవుతాడ' ని చెప్పాడు. అంటే అధర్మ ప్రవర్తనను అనుసరించకుండా ఉండేవాడే 'పాపరహితుడవుతాడ' ని అర్థం.

# 11. ధ్రువోపాఖ్యానము

క. విను మఖీల భువన పరిపా, లనమునకై చక్రధరకళా కలితుండై
వనజజునకు స్వాయంభువ, మను వపు దుదయించెఁ గీర్తిమంతుం డగుచున్.

216

తా ॥ ఓ విదురుడా! శ్రద్ధగా ఆలకించు! సమస్త భువనాలను పరిపాలించే నిమిత్తం, చంద్రకళాధరుడైన ఈశ్వరుని అంశతో, బ్రహ్మదేవునకు స్వాయంభువమనువు జన్మించాడు. ఆతడు సద్గుణాలతో మంచి కీర్తిమంతుడయ్యాడు.

తే. రూఢి న మ్మనువుకు శతరూపవలన, భూనుతులగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్రులై రందులోన, భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును.

217

తా ॥ స్వాయంభువ మనువుకు శతరూపవలన "ప్రియవ్రతుడు", "ఉత్తానపాదుడు" అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. వాళ్ళలో ఉత్తానపాదునకు:

'ప్రియవ్రతుడు" అంటే ప్రియంగా వ్యవహరించటమే వ్రతంగా గలవాడని అర్థం. ఉత్తానపాదుడంటే 'ఉన్నతమైన పాదం కలవాడు' లేక 'ఉన్నతంగా పాదాన్ని ఉంచినవాడు' అని అర్థం. అంటే ఉన్నతమైన దైవీగుణాల పట్ల మనస్సును ఉంచినవాడని తాత్పర్యం.

మనువు మానవజాతికి ప్రతినిధి. ఆ మనువు సంతానం 'ప్రియవ్రతుడు', 'ఉత్తానపాదు' డంటే అర్థం ఆ గుణాలను మానవుడైనవాడు అలవాటు చేసుకోవలసిన అవసరాన్ని చెప్పడమే.

క. వినుము సునీతియు సురుచియు, నను భార్యలు గలరు; వారియందును ధ్రువునిం
గనిన సునీతియు నప్రియయును, సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టి యెడన్.

218

తా ॥ ఉత్తానపాదునికి 'సునీతి', 'సురుచి' అనే ఇద్దరు భార్యలున్నారు. వాళ్ళలో ధ్రువుని గన్న 'సునీతి' పట్ల రాజయిన ఉత్తానపాదునికి ప్రేమలేదు. 'సురుచి' అంటే చెప్పలేని ప్రేమ. అటువంటి సమయంలో,

సీ. ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు నెఱిఁ బ్రియురాలైన సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడికొని యుపలాలనము సేయుచున్న వేళ
నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన ధ్రువునిఁ గనుంగొని తివక యాద
రింప కుండుటకు గర్వించి యా సురుచియు సవతి బిడ్డండైన ధ్రువునిఁ జూచి

తే. తండ్రి తొడ నెక్కు వేడుక దగిలెనేనిఁ, బూని నాగర్భమున నాఁడు పుట్ట కన్య గర్భమునఁ
బుట్ట గోరినఁ గలదె నేఁడు, జనకు తొడ యెక్కు భాగ్యంబు సవతి కొడుక!

219

తా ॥ ఒకరోజు 'సురుచి' కన్న సంతానమైన 'ఉత్తముణ్ణి' తొడలపై కూర్చుండ పెట్టుకొని ముద్దాడి లాలిస్తున్న సమయంలో సునీతి సంతానమైన ధ్రువుడు చూశాడు. ధ్రువుడు కూడ తండ్రితొడలపై కూర్చోవాలని ఆశతో చెంతకు వచ్చినా తండ్రి పట్టించుకోలేదు. అది గమనించిన 'సురుచి' గర్వంతో, సవతి సంతానమైన ధ్రువుణ్ణి చూసి ఇలా అన్నది: "ఓ సవతి కొడుకా! తండ్రి తొడలెక్కే భాగ్యం కావాలంటే నీవు నా గర్భవాసాన జన్మించవలసింది. ఇతరుల గర్భాన జన్మించిన నీకు ఈ భాగ్యమెలా లభిస్తుంది?

క. అది గాన నీ వధోక్షజు, పదపద్మము లాశ్రయింపు; పాయక హరి నా
యుదరమునఁ బుట్టజేయును, వదలక యట్లయిన ముదము వడసెద వనఘా!

220

తా ॥ ఆ భాగ్యం పొందాలంటే నీవు విష్ణుమూర్తి పాదాల్ని ఆశ్రయించు. అప్పుడు పరమాత్ముడైన శ్రీహరి నిన్ను నా కడుపున జన్మను ఇస్తాడు. అప్పుడు నీ కోరిక తీరి సంతోషం కలుగుతుంది."

క. అని యీ రీతి నసహ్య వ, చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ
దను నాడిన దుర్భాషా, ఘనశరములు మనము నాఁటి కాఁటియవెట్టన్.

221

తా ॥ అని ఈ విధంగా పినతల్లి 'సురుచి' పలికిన మాటలు ధ్రువునికి భరింపరానివయ్యాయి. తండ్రి వినేలాగ ఆమె పలికిన దుర్భాషలు వాడిబాణాల్లాగా మనస్సును గాయపరిచి బాధించాయి.

క. తను నట్లుపేక్ష సేసిన, జనకునికడఁ బాసి దుఃఖ జలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత, ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్.

222

తా ॥ తనను ఆ విధంగా ఉపేక్షించిన తండ్రి సామీప్యాన్ని విడిచి, దుఃఖసాగరంలో మునుగుతూ, కఱ్ఱదెబ్బ తగిలిన పాములాగ రోషపడుతూ

క. ఘనరోదనంబు సేయుచుఁ, గనుఁగవలను శోకబాష్ప కణములు దొరఁగన్
జనని కడ కేఁగుటయు నిజ, తనయునిఁ గని యా సునీతి దద్దయుఁ బ్రేమన్.

223

తా ॥ పెద్దగా ఏడుస్తు, కళ్ళవెంట నీళ్ళు కారుతుండగా తల్లి సునీతి వద్దకు ధ్రువుడు వెళ్ళాడు. తల్లి తన తనయుడైన ధ్రువుణ్ణి చూసి మిక్కిలి ప్రేమతో

వ. తొడలపై నిడికొని.

224

తా ॥ తొడలపై కూర్చుండ బెట్టుకొంది.

క. కర మనురక్తిని మోము ని, విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని, పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకులయై.

225

తా ॥ ధ్రువుని ముఖాన్ని ప్రేమగా నిమిరింది. జరిగిన వృత్తాంతాన్నంతా అంతఃపుర స్త్రీలు చెప్పగా విని, నిట్టూర్పులతో, కన్నీరు మున్నీరయింది.

తే. సవతి యాడిన మాటలు సారెఁ దలఁచి, కొనుచుఁ బేర్చిన దుఃఖాగ్నిఁ గుములుచుండె
దావ పావక శిఖలచేఁ దగిలి కాంతి, వితతిఁ గందిన మాధవీలతికవోలె.

226

తా ॥ తన సవతి 'సురుచి' అన్నమాటలు మాటిమాటికి తలచుకొని, 'సునీతి' దుఃఖాగ్నిలో పడి తల్లడిల్లింది. దావాగ్ని వేడిసెగలకు కందిపోయిన మాధవీలతలాగ బాధపడింది.

వ. అంత నా సునీతి బాలకునిం జూచి తండ్రీ! దుఃఖింపకుమని యిట్లనియె.

227

తా ॥ ఆ పిదప ధ్రువుణ్ణి చూచి, "తండ్రీ! దుఃఖించకు!" అని ఇలా అన్నది:

క. అనఘా! యీ దుఃఖమునకుఁ, బనిలేదన్యులకు సొలయ బలవంతంబై
తన పూర్వజన్మ దుష్కృత, ఘనకర్మము వెంట నంటఁగా నెవ్వలనన్.

228

తా ॥ "ఓ పుణ్యాత్మా! దీనికి దుఃఖించవలసిన పనిలేదు. గత జన్మలో ఇతరులను

బాధించిన దుష్కృతాల 'కర్మఫలం' వెంటాడుతోంది! అది చాలా బలీయమైంది.

వ. కావున.

229

తా ॥ కాబట్టి,

క. పెనిమిటి చేతను బెండ్లా, మని కాదు నికృష్ణదాసి యనియును బిలువం
గను జాలని దుర్భగురా, లనఁగల నా కుక్షి నుదయ మందినకతనన్.

230

తా ॥ భర్తచేత 'భార్య' అనికాదు! 'నికృష్టదాసిని' అని కూడ పిలుపించుకో నోచని నిర్భాగ్యురాలను. అటువంటి నా కడుపున పుట్టినందున నీకు ఈ దుఃఖం కలిగింది.

క. నిను నాడిన యా సురుచి వ, చనములు సత్యంబు లగును; సర్వశరణ్యుం
డనఁగల హరిచరణంబులు, గను జనకుని యంక మెక్కఁగాఁ దలఁ తేనిన్.

231

తా ॥ ఆ సురుచి నిన్ను అన్న మాటలు నిజమే. నీ తండ్రి 'అంకసీమ' ను ఎక్కాలన్న కోరికే ఉంటే అందరికీ శరణ్యుడైన ఆ శ్రీహరి పాదపద్మాలనే ఆశ్రయించు.

వ. కావునం బినతల్లియైన యా సురుచి యాదేశంబున నధోక్షజు నాశ్రయింపు మని వెండియు నిట్లనియె.

232

తా ॥ కాబట్టి పినతల్లియైన ఆ సురుచి ఆదేశంతో శ్రీమహావిష్ణువుని ఆశ్రయించు" అని మళ్ళీ ఇలా అన్నది:

సీ. పరికింప నీ విశ్వపరిపాలనమునకై యర్థి గుణవ్యక్తుఁ డైనయట్టి
నారాయణుని పాదనలినముల్ సేవించి తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె;
ఘనుఁడు మీ తాత యా మనువు సర్వాంతర యామిత్వ మగు నేకమైన దృష్టిఁ
జేసి యాగముల యజించి తా భౌమ సుఖములను దివ్యసుఖముల మోక్ష

తే. సుఖములను బొందె నట్టి యచ్యుతుని బరుని, వితత యోగీంద్ర నికర గవేష్యమాణ
చరణ సరసిజ యుగళు శశ్వత్ప్రకాశు, భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని.

233

తా ॥ "ఆలోచిస్తే ఈ విశ్వాన్ని పాలించడానికై సగుణుడై కనిపించే ఆ శ్రీమన్నారాయణుని పాదపద్మాలను సేవించే బ్రహ్మ, బ్రహ్మపదాన్ని పొందాడు. మీ తాతగారైన 'స్వాయంభువ మనువు' కూడ విష్ణుమూర్తి సర్వాంతర్యామిత్వాన్ని గుర్తించే ఏకాగ్ర దృష్టితో, శ్రీహరిని ఉద్దేశించి యజ్ఞాలను చేసి, భూలోక సంబంధ సుఖాలను, పరలోక సంబంధమైన దివ్యసుఖాలను, మోక్షసుఖాన్ని పొందాడు.

అటువంటి అచ్యుతుణ్ణి (నాశనం లేనివాణ్ణి), పరాత్పరుణ్ణి, యోగీంద్రులు అన్వేషించి, ఆరాధించే పాదపద్మాలుగల దేవుణ్ణి, శాశ్వతమైన అనంత కాంతిస్వరూపుణ్ణి, భక్తవత్సలుణ్ణి, విశ్వసంసేవ్యుణ్ణి, హరిని ఆశ్రయించు!"

'యద్దుష్కరంయద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరమ్
తత్సర్వం తపసాసాధ్యం తపోహిదురతిక్రమమ్'

– అని మనువు చెప్పిన విషయాన్నే తల్లి చెపుతూ తపోమహిమను వివరించింది. 'వేటిని తరించడానికి, పొందడానికి, ప్రవేశించడానికి, నిర్వహించడానికి అసాధ్యమో అవన్నీ తపస్సుతోనే సాధ్యమవుతున్నాయి. తపస్సును మించింది లేదు.'

వ. మఱియును.

234

క. కరతల గృహీత లీలాం, బురుహ యగుచుఁ బద్మగర్భముఖ గీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీ, తరుణీమణిచేత వెదకఁదగు పరమేశున్.

235

తా ॥ 'కమలం లాంటి తన హస్తంతో లీలాకమలాన్ని ధరించిన ఆ లక్ష్మీదేవి, బ్రహ్మాది దేవతలు తనను వెదకుతుంటే, తాను మాత్రం ఆ పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు కోసం వెదకుతూ ఉంటుంది.'

## 12. ధ్రువుడు నారదుని ఉపదేశాన్ని గైకొని తపస్సు చేయుట

వ. నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపు; మమ్మహాత్ముని కంటె నీ దుఃఖం బపనయించువాఁడన్యుండొక్కరుండు గలండే? యని పలికినఁ బరమార్థ ప్రాప్తి హేతుకంబులైన తల్లి వాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబువెడలి చను నవసరంబున నారదుండు దద్వృత్తాంతం బెఱింగి యచ్చటికిం జనుదెంచి యతని చికీర్షితంబుఁ దెలిసి పాపనాశకరంబైన తన కరతలంబున ధ్రువుని శిరం బంటి మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబు గదా? బాలకుండయ్యుఁ బినతల్లి యాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁడని మనంబున నాశ్చర్యంబు నొంది "యోబాలక! సకల సంపత్సమృద్ధంబగు మందిరంబు దెగడి యొంటి నెందు కేగెదవు? స్వజనకృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద" ననిన ధ్రువుం డిట్లనియె; సపత్నీ మాతృ వాగిషు క్షతంబగు వ్రణంబు భగవద్ధ్యానయోగ రసాయనంబున మాపికొందు ననిన ధ్రువునికి నారదుం డిట్లనియె.

236

తా ॥ 'కాబట్టి స్వీయధర్మంతో శోభించే ఏకాగ్రచిత్తంతో భగవంతుడైన శ్రీహరిని సేవించు. ఆ మహాత్మునికంటే ఈ దుఃఖాన్ని పోగొట్టేవారు ఎవరూలేరు'. అని బోధించిన తల్లి మాటలు పరమార్థాన్ని పొందడానికి కారణమైనవిగా ధ్రువుడు భావించాడు. తనను తాను నియమించుకొని, పట్టణాన్ని వదలి, బయలుదేరాడు.

ఆ వృత్తాంతమంతా తన దివ్యదృష్టితో తెలిసిన నారదుడు అక్కడికి కదలి వచ్చాడు. ధ్రువుడు చేయాలనుకునే పని తెలుసుకొని పాపాలను పోగొట్టే తన హస్తంతో ధ్రువుని శిరస్సును తాకాడు. 'అవమానాన్ని సహించని క్షత్రియ స్వభావం ఎంత అద్భుతమైనది? బాలుడైనప్పటికీ పినతల్లి పలికిన చెడుమాటలు మదిలో పెట్టుకొని పోతున్నాడు' అని మనస్సులో ఆశ్చర్యపడి ధ్రువునితో నారదుడు ఇలా అన్నాడు: "ఓ బాలకా! సకల సంపదలతో తులతూగే

రాజమందిరాన్ని తిరస్కరించి, ఒంటరిగా ఎక్కడికి పోతున్నావు? నీ వాళ్ళ వలన జరిగిన అవమానంతోనే బాధపడుతున్నావని తలుస్తాను" అని నారదుడు అనినంతనే ధ్రువుడు ఇలా అన్నాడు:

"స్వామీ! సవతితల్లి వాగ్బాణాలతో గాయమైన నా హృదయాన్ని, భగవంతుని ధ్యానయోగమనే రసాయనంతో మాపుకుంటాను". ఆ మాటలు విన్న నారదుడు ధ్రువునితో ఇలా అన్నాడు:

క. విను పుత్రక! బాలుఁడవై, యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం, బున నీ కవమాన మానములు లే వెందున్.

237

తా ॥ "ఓ పసివాడా! చిన్నవాడవైన నీవు క్రీడలపట్ల ఆసక్తితో తిరుగవలసిన కాలం ఇది. అటువంటనీకు మానావమానాలు ఎక్కడివి?

తే. కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ, గలిగెనేనియు సంతోషకలితు లయిన
పురుషు లాత్మీయకర్మ విస్ఫురణఁ జేసి, వితత సుఖదుఃఖము లనుభవింతు రెపుడు.

238

తా ॥ కాబట్టి నీకొక వేళ మానావమానాల వివేచనాశక్తి కలిగినట్లయితే ఈ విషయాన్ని తెలుసుకో. సంతోషంగా జీవించే వాళ్ళంతా తమ కర్మఫలమే సుఖమైనా, దుఃఖమైనా అని భావించి అనుభవిస్తారు.

వ. కావున వివేకంబు గల పురుషుండు దనకుం బ్రాప్తంబులగు సుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుండగు; నీవును దల్లి చెప్పిన యోగమార్గ ప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెద నంటివేని.

తా ॥ కాబట్టి వివేకవంతుడు తనకు సంప్రాప్తమైన సుఖదుఃఖాలు దైవవశమైనవని తలుస్తాడు. ఆ విధంగానే సంతృప్తి చెందుతాడు. నీవు కూడా మీ అమ్మ చెప్పిన యోగమార్గంతో సర్వేశ్వరుని అనుగ్రహాన్ని పొందాలని అనుకుంటే,

సీ. అనఘాత్మ! యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు జన్మంబులందు నిస్సంగమైన
మతిని బ్రయోగ సమాధినిష్ఠలఁ జేసి యైనను దెలియ లే రతని మార్గ;
మది గాన యతఁడు దురారాధ్యుఁ డగు నీకు; నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయస కాముండ వగుదేనిఁ దండ్రి వర్తించు తత్కాలమందుఁ

తే. బూని సుఖదుఃఖముల రెంటిలోన నెద్ది, దైవ వశమునఁ జేకుఱు దానఁజేసి డెందమునఁ
జాల సంతుష్టి నొందువాఁడు, విమల విజ్ఞాని యన భువి వెలయుచుండు.

240

తా ॥ నిస్సంగమతులై, యోగసమాధి నిష్ఠులై ఎన్ని జన్మలెత్తినప్పటికీ యోగీంద్రులు శ్రీమహావిష్ణువును చూడలేకున్నారు. అతన్ని చేరే మార్గాన్ని తెలుసుకోలేక పోతున్నారు. ఆరాధించడానికి దుర్లభుడైనవాడు, కాబట్టి నీవు ఈ వ్యర్థ ప్రయత్నాన్ని విరమించుకో! మోక్షం మీద కోరిక ఉంటే నేను చెప్పేది విను. ఆ సమయంలో తండ్రి ప్రవర్తించిన తీరు నీకు సంతాప కారకమైంది. కాని, సుఖదుఃఖాలు రెండింటిలో ఏది దైవవశాన సమకూరుతుందో దానితో సంతుష్టి పడేవాడు నిర్మల జ్ఞానం గలవాడు అవుతున్నాడు.

వ. మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగు వానిం జూచి కరుణించుచు సమానునియెడ మైత్రి సలుపుచు వర్తించుచున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగునని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె; ననఘా; యీ శమంబు సుఖ దుఃఖ హతాత్ము లగు పురుషులకు దుర్గమం బని కృపాయత్తుండ వైన నీచేత వినంబడె;

నట్లయినం బరభయంకరంబగు క్షాత్త్రధర్మంబు నొందిన యవినీతుండ నగు నేను సురుచి దురుక్తిబాణ వినిర్భిన్న హృదయుండ నగుట మదీయ చిత్తంబున శాంతి నిలువదు; కావునం ద్రిభువనోత్కృష్టంబు ననన్యాధిష్ఠితంబు నగు పదంబును బొంద నిశ్చయించిన నాకు సాధుమార్గంబు నెఱింగింపుము; నీవు భగవంతుండగు నజుని యూరుపు వలన జనించి వీణావాదన కుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుంబోలె వర్తింతు వనిన విని.

241

తా ॥ "సద్గుణాలచే గొప్పవాడైన వాణ్ణి చూసి సంతోషించాలి. సుగుణాలుగల సజ్జనునిలా నటించే వాణ్ణిచూసి జాలిపడాలి. సమానుడైన వాడితో మైత్రిని చేయాలి. అలా ప్రవర్తించేవాడు అధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికమనబడే మూడు తాపాలనుండి కలిగే మనస్తాపాన్ని తొలగించుకుంటాడు" అని నారదుడు చెప్పగా విని ధ్రువుడిలా అన్నాడు:

"ఓ పుణ్యాత్మా! నీవు చెప్పే ఈ శాంతగుణం, సుఖదుఃఖాలనే అనుభవాల దెబ్బలు తినే మానవులు పొందడానికి అసాధ్యమైంది. కాని దయామయుడవైన నీ వలన తెలుసుకున్నాను. శత్రుభయంకరమైన క్షత్రియస్వభావాన్ని అలవర్చుకొన్న నీతి లేని నాకు, చెడ్డమాటలనే బాణాలతో గాయపర్చబడిన నా హృదయానికి శాంతి తెలియదు. కాబట్టి మూడు లోకాలకంటే గొప్పది, ఇతరులు పొందలేనిది, పొందాలని కోరుకునే నాకు నీవే సజ్జనమార్గాన్ని తెలియజెప్పాలి. భగవంతుడైన చతుర్ముఖుని తొడలతో జన్మించి, వీణావాదన కుశలుడవైన నీవే సజ్జన మార్గాన్ని తెలియజెప్పాలి. బ్రహ్మదేవుని హృదయస్పందనలో జన్మించిన నీవు లోకకల్యాణము నిమిత్తం సూర్యునివలె సంచరించు మహనీయుడవు!" అని అనగా విని.

క. నారదుఁ డిట్లను ననఘ! కు, మారక! విను నిన్ను మోక్షమార్గంబునకున్
ప్రేరేచినవాఁ డిప్పుడు, ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్.

242

తా ॥ నారదుడిలా అన్నాడు: "ఓ పుణ్యాత్మకా! కుమారా! నిన్ను మోక్షమార్గానికి ప్రేరేపించినవాడు, ధీరజనోత్తముడైన వాసుదేవుడే! కాబట్టి,

వ. నీవు నమ్మహాత్ముని నజస్రధ్యాన ప్రవణ చిత్తుండవై భజియింపుము.

243

తా ॥ ఆ మహాత్ముని ధ్యానం వైపు మొగ్గిన మనస్సుతో సేవించు.

క. పురుషుఁడు దవిలి చతుర్విధ, పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు, హరిపదయుగళంబు దక్క నన్యము గలదే?

244

తా ॥ ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల వలన కలిగే శ్రేయస్సును పొందాలన్న తపన ఉన్న పురుషునికి హరిచరణాలు తప్ప వేరేవీ ఆ శ్రేయస్సును కలిగించే కారణాలు కావు.

వ. కావున.

245

తా ॥ కాబట్టి,

క. వర యమునానదితటమున, హరి సాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యమునై
పరఁగిన మధువనమునకును, సరసగుణా! చనుము మేలు సమకుఱు నచటన్.

246

తా ॥ యమునానది ఒడ్డున, హరి సాన్నిధ్యంతో పవిత్రమైన, పుణ్యమైన మధువనానికి వెళ్ళు. నీకు అక్కడ శుభం జరుగుతుంది.

ఈశ్వరానుగ్రహం అనే వాయువు సర్వదా వీస్తూనే ఉన్నది. సోమరులై సంసార సాగరంలో పడి ఉండేవారు దాని లాభాన్ని పొందరు. కాని కార్యదక్షులు, బలాఢ్యులు అయినవారు తమ మనస్సనే తెరచాపను ఆసాంతం విప్పుకొని, ఆ అనుకూల వాయువును గ్రహించి శీఘ్రంగా పరమావధిని పొందుతారు.

—శ్రీరామకృష్ణ పరమహంస

క. ఆ యమునాతటినీ శుభ, తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా
రాయణునకును నమస్కృతు, లాయతమతిఁ జేసి చేయు యమనియమములన్.

247

తా ॥ ఆ యమునానది పుణ్యజలాలలో స్నానంచేసి, నిష్ఠతో నారాయణునికి నమస్కరించి, యమనియమాదులను పాటిస్తూ, ఆత్మ వికాసం కోసం సాధన చెయ్యి. యమనియమాదులు ఎనిమిది. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనే ఎనిమిది ఆ నియమాలు. ఈ ఎనిమిది అంశాలుగల యోగంతో యోగులు పరమాత్మానుభవాన్ని పొందుతారు.

వ. మఱియు బాలుండ వగుటంజేసి వేదాధ్యయనాద్యుచిత కర్మానర్హుండ వయ్యు నుచితంబులగు కుశాజినంబులంజేసి స్వస్తికప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియ మనోమలంబు లను చాంచల్య దోషంబుల హరించి స్థిరం బయిన చిత్తంబున.

248

తా ॥ బాలుడవు కాబట్టి, వేదాధ్యయనం వంటి కర్మలకు అనర్హుడవు. అయినప్పటికీ నీకు తగినట్లు దర్భాసనాన్నో, లేడి చర్మాన్నో పరచుకొని, స్వస్తికాసనము వంటి యోగాసనాలను సమకూర్చుకొని, మూడు ఆవృతాలుగా చేసిన ప్రాణాయామంతో ప్రాణాలలో, ఇంద్రియాలలో, మనస్సులోని మాలిన్యాలను, చాంచల్య దోషాన్ని హరించి, చిత్తాన్ని శ్రీహరిపై నిలిపిన

స్థిరబుద్ధితో...

సీ. ఆశ్రిత సత్ప్రసాదాభి ముఖుండును నిద్ధప్రసన్నాననేక్షణుండు
సురుచిర నాసుండు సుభ్రూయుగుండును సుకపోలతలుఁడును సుందరుండు
హరినీల సంశోభితాంగుండుఁ దరుణుండు నరుణావలోక నోష్ఠాధరుండు
గరుణాసముద్రుండుఁ బురుషార్థ నిధియును బ్రణతాశ్రయుండు శోభనకరుండు

తే. లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు, సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి
పురుష లక్షణయుక్తుండుఁ బుణ్యశాలి, యసిత మేఘనిభశ్యాముఁ డవ్యయుండు.

249

తా ॥ ఆశ్రితుల్ని ఆదరించడానికే సుముఖుడైనవాడు, స్నిగ్ధమైన ముఖము, ప్రసన్నమైన చూపులు కలవాడు, చక్కని ముక్కు కలవాడు, అందమైన కనుబొమలుకలవాడు, చక్కని చెక్కిళ్ళవాడు, సుందరుడు, ఇంద్రనీలమణుల వలె వెలుగొందే అవయవాలు కలవాడు, యౌవనంలోనున్న పడుచువాడు, ఎరుపు రంగుతోనున్న ఎఱ్ఱవైన చూపులు, పెదవులు కలవాడు, కరుణాసముద్రుడు, పురుషార్థనిధి, నమస్కరించేవారికి ఆశ్రయమైనవాడు, శుభాలను కలిగించేవాడు, వక్షమున 'శ్రీవత్స' మనే పుట్టుమచ్చకలవాడు, సర్వలోక శరణ్యుడు, సర్వసాక్షి, సత్పురుష లక్షణయుతుడైన పురుషోత్తముడు, పుణ్యశాలి, నీలమేఘశ్యాముడు, అవ్యయుడు...

వ. మఱియును.

250

తా ॥ ఇంకా,

సీ. హార కిరీట కేయూర కంకణ ఘన భూషణుం డాశ్రిత పోషణుండు
లాలిత కాంచీకలాప శోభిత కటి మండలుం డంచిత కుండలుండు

మహనీయ కౌస్తుభమణి ఘృణిచారు గ్రైవేయకుం డానంద దాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ హస్తుండు భువన ప్రశస్తుఁ డజుఁడు

తే. గమ్ర సౌరభ వనమాలికా ధరుండు, హతవిమోహుండు నవ్యపీతాంబరుండు
లలిత కాంచన నూపురాలంకృతుండు, నిరతిశయసద్గుణుఁడు దర్శనీయతముఁడు.

251

తా ॥ హారాలు, కిరీటం, కేయూరాలు(భుజకీర్తులు), కంకణాలు భూషణాలుగా కలిగి ఆశ్రితుల్ని పోషించే మహానుభావుడు. కటిభాగంలో మొలనూలు, చెవులకు కుండలాలు ప్రకాశిస్తుంటాయి. వక్షస్థలంలో కౌస్తుభమణి, మెడలో హారాలు ధరించినవాడు. ఆనందదాయకుడు. శంఖుచక్రగదా పద్మహస్తుడు, భువనప్రశస్తుడైనవాడు, జన్మరహితుడు. పరిమళాలు విరజిమ్మే వైజయంతీమాలను ధరించినవాడు, ఏ మోహమూ లేనివాడు, కొత్త పీతాంబరాన్ని ధరించినవాడు, బంగారు అందెలు ధరించినవాడు, గొప్ప సద్గుణాలు గలవాడు, దర్శించదగిన వారిలో ప్రథముడు ఆ శ్రీమన్నారాయణుడు.

క. సరసమనోలోచన ము, త్కరుఁడును హృత్పద్మకర్ణికా నివసిత వి
స్ఫుర దురునఖ మణిశోభిత, చరణ సరోజాతుఁ డతుల శాంతుఁడు ఘనుఁడున్.

252

తా ॥ మనోనేత్రాలకు ఆనందాన్ని కలిగించేవాడు, భక్తుల హృదయ పద్మంలో నివసించి రత్నాలవలె ప్రకాశించే పాదనఖకాంతులు గలవాడు, సాటిలేని శాంతస్వభావుడు, గొప్పవాడు ఆ దేవదేవుడు.

వ. అయిన పురుషోత్తముం బూజించుచు హృదయగతుండును, సానురాగ విలోకనుండును, వరదశ్రేష్ఠుం డును నగు నారాయణు నేకాగ్రచిత్తంబున ధ్యానంబు సేయుచుఁ బరమ నివృత్తి మార్గంబున ధ్యాతుండైన పురుషోత్తముని దివ్య మంగళ

స్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేర దదియునుంగాక యేమంత్రంబేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు; నట్టి ప్రణవయుక్తంబగు ద్వాదశాక్షర కలితంబును దేశకాల విభాగ వేది బుధానుష్ఠితంబును నయిన వాసుదేవ మంత్రంబునం జేసి.

253

తా ॥ అటువంటి ఆ పురుషోత్తముణ్ణి పూజించాలి. హృదయంలో ఉన్నవాడు, అనురాగంతో చూసేవాడు, వరాలీయటంలో శ్రేష్ఠుడు అయిన నారాయణుణ్ణి ఏకాగ్ర చిత్తంతో ధ్యానం చేయాలి. సమస్తము శ్రీమన్నారాయణునకు అర్పించే నివృత్తిమార్గంలో ధ్యానిస్తే, ఆ పురుషోత్తముని దివ్యమంగళ స్వరూపం మనస్సులో కుదురుకుంటుంది. మళ్ళీ చెదరిపోదు. అంతేకాదు, ఏ మంత్రాన్నయినా ఏడురోజులు జపిస్తే, ఆకాశమార్గాన సంచరించే సిద్ధపురుశులను చూడగలుగును. అటువంటి శక్తి కలిగి ప్రణవమంత్రంతో కూడి, ద్వాదశ అక్షరాలతో శోభించే వాసుదేవ మంత్రాన్ని ఏ దేశములో ఏ కాలములో ఎట్టి ద్రవ్యములతో శ్రీహరిని పూజించాలి అనే విభాగమును తెలుసుకుని అట్టి ద్రవ్యములలో పూజిస్తూ జపించాలని బుధులు అనుష్ఠిస్తారు.

సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము జలజంబులను జారుజలజనయనుఁ
దులసీ దళంబులఁ దులసికా దాముని మాల్యంబులను వినిర్మల చరిత్రుఁ
బత్త్రంబులను బక్షిపత్త్రునిఁ గడు వన్య మూలంబులను నాది మూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివిధాంబరంబులను బీతాంబరధరుఁ

తే. దనరు భక్తిని మృచ్ఛిలాదారు రచిత, రూపములయందుఁ గాని నిరూఢమైన
సలిలములయందుఁ గాని సుస్థలములందుఁ, గాని పూజింప వలయు న క్కమలనాభు.

254

తా ॥ లేత పచ్చికలాగా శ్యామల వర్ణంతో శోభించే ఆ వాసుదేవుణ్ణి గరికపోచలతోనే

పూజించాలి. పద్మనయనుడైన ఆ స్వామిని పద్మాలతోనే అర్చించాలి. తులసీమాలాధరుడైన ఆ పరాత్పరుణ్ణి తులసీ దళాలతోనే సేవించాలి. నిర్మలమైన నడవడిగల ఆ పురుషోత్తముణ్ణి పూలమాలికలతో అర్చించాలి. గరుడవాహనుడైన ఆ నారాయణుణ్ణి పత్రాలతో ఆరాధించాలి. సృష్టికి మూలమైన ఆ మహానుభావుణ్ణి వన్యమూలాలతో (కందమూలాలతో) అర్చించాలి. పీతాంబరుడైన ఆ మాధవుణ్ణి భూర్జపత్రవు చెట్టుపట్టలతో తయారుచేసిన వివిధ వస్త్రాలతో ఆరాధించాలి.

మట్టితోగాని, శిలతోగాని, కొయ్యతోగాని, నిర్మించిన కమలనాభుని రూపాన్ని నిశ్చలమైన నీటిలోగాని, మంచిస్థలంలోగాని ఉంచి పూజించాలి.

సృష్టిమొత్తం భగవంతుని చైతన్యస్వరూపమే. ఆ చైతన్యాంశల నుండి అఖండ చైతన్యాన్ని భావనచేయటం ఇందులోని ప్రధానాంశం. లేతపచ్చికలో ఆ భగవంతుని శ్యామల వర్ణాన్ని, పద్మాలలో పద్మనయనాలను, తులసీదళాలలో తులసీమాలికను, పుష్పాలలో ఆ దేవదేవుని నిర్మల చారిత్రాన్ని, పత్రాలలో గరుడవాహనుణ్ణి, కందమూలాలలో, సృష్టికిమూలకందమైన ఆ స్వామిని, చెట్టుపట్టలతో నేసే నారవస్త్రాలలో స్వామిధరించే పీతాంబరాన్ని ఇలా సృష్టిమొత్తంలో సృష్టికర్తను భావన చేయటం గొప్ప మానసికపూజ.

ధ్రువునికి నారదుడు మొదట స్వామి రూపాన్ని మానసవీథిలో ప్రతిష్ఠించి, ఆపైన 'సర్వం ఖల్విదంబ్రహ్మ' – అనే స్థితిని సాధించడానికి అనువైన సాధనా క్రమాన్ని చెబుతున్నాడు. మృణ్మయశిలాదారువులలో వీలయిన దానితో మూర్తిని భావన చేసి పూజించడం అంటే ఉన్నత స్థితిని అందుకోవడానికి తొలుత ఆధారంగా స్వీకరించమని చెప్పటం. "పూజాదిష్వనురాగః – పారాశర్యః" అన్న నారదభక్తి సూత్రాన్నే మళ్ళీ చెప్పడం ఇక్కడ చూడాలి. ఇలా నారదుడు సాధనారహస్యాన్ని బోధిస్తున్నాడు.

కథాదిష్వితి గర్గః ॥

భగవంతుని కథా శ్రవణాదులలో అనురక్తి (దృఢనిశ్చయత) అని గర్గ మహర్షి అంటారు.

భగవంతుని కథాశ్రవణమందు ఉన్న అనురాగమే దృఢభక్తికి బాహ్య లక్షణమని గర్గ మహర్షి అభిప్రాయం.

కథ అనే శబ్దానికి ఇక్కడ భగవంతుని లీలలు, మహిమలు, గుణాలకు సంబంధించిన కథలు, విషయాలు, జపం, సంకీర్తనం, భజనలు, శ్రవణం చేయుట, ఉపన్యాసాలు ప్రవచనాలు చేయుట, భగవత్ సంబంధ గ్రంథాలను, స్తోత్రములను రచించుట మొదలైన అనేక అర్థాలను చెప్పవచ్చు. ఈ విధమైన అనేక రూపాలలో భక్తుడు రసాస్వాదన చేస్తాడు. (నారద భక్తిసూత్రాలు 17)

శ్లో ॥ "ఉపాసకానాంకార్యార్థం, బ్రహ్మణోరూపకల్పనా
ఆత్మతత్త్వానుసంధానం, భక్తిరిత్యభిధీయతే
సకామసగుణోపాస్తిః నృణాం భోగాయకల్ప్యతే
నిష్కామాచిత్తశుద్ధ్యర్థే, ఇతిశాస్త్రస్య నిశ్చయః" –

ఉపాసకుల సౌకర్యం కోసమే బ్రహ్మపదార్థానికి రూపకల్పన చేయటం జరిగింది. ఆత్మతత్త్వాన్ని అన్వేషించటమే 'భక్తి' అని చెప్పబడుతోంది. జనమంతా కోర్కెలు గలవారే. వాళ్ళ భోగార్థమే 'సగుణోపాసన' కల్పించబడింది. మరి నిష్కాములకు ఈ సగుణోపాసన దేనికోసమంటే చిత్తశుద్ధి కోసమని శాస్త్రం ప్రమాణీకరిస్తోంది.

జ్ఞానవాశిష్ఠం కూడ ఇదే భావాన్ని చెపుతోంది.

"అక్షరావగమలబ్ధయే యథా, స్థూలవర్తులదృషత్పరిగ్రహః
శుద్ధబుద్ధ పరిలబ్ధయే, తథా దారుమృణ్మయశిలామయార్చనమ్"

అక్షరజ్ఞానం కలిగించడానికి పసిపిల్లలకు చిన్నవీ, పెద్దవీ, గుండ్రనివీ రాళ్ళను చెక్కి

చూపించినట్లే, నిత్యము, శుద్ధము, బుద్ధమూ అయిన పరమాత్మ జ్ఞానాన్ని కలిగించటం కోసం కొయ్య, మట్టి, రాయి మొదలైన వాటితో విగ్రహాలను చేసి అర్చిస్తున్నాము.

భక్తిమార్గంలో సాధకుడు ఒకానొక దశలో భగవంతుణ్ణి సాకారుణ్ణిగా భావించి సంతృప్తుడవుతాడు. అతడే మరోదశలో భగవంతుణ్ణి నిరాకారుణ్ణిగా భావించడంలో సంతృప్తుడవుతాడు. భగవంతుడు భక్తుడికి వివిధ రూపాలలో సాక్షాత్కరిస్తాడు. కానీ సమాధి స్థితిలో అత్యుత్తమ జ్ఞానాన్ని పొందిన వ్యక్తికి మళ్ళీ ఆ భగవంతుడే అఖండ నిరాకార బ్రహ్మమై గోచరిస్తాడు. ఇక్కడ భక్తిజ్ఞానాలకు సామరస్యం అమరుతుంది.

—శ్రీరామకృష్ణ పరమహంస

క. ధృత చిత్తుఁడు శాంతుండు ని, యత పరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణిత హరిమంగళ గుణుఁడును, మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్.

255

తా ॥ ధ్యానధారణాది యోగాభ్యాసంతో సమకూరిన చిత్తంతో శాంతుడై, నియమబద్ధమైన పరిమిత భాషణంతో, సదాచారంతో సంచరిస్తూ మంగళకరమైన హరిగుణాలను వర్ణిస్తూ, అడవిలో లభించే ఆకులు, పండ్లు, దుంపల్ని మితంగా సేవిస్తూ మెలగాలి.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥

పరిమితమైన ఆహారవిహారాలు కలిగి, జపతపాది కర్మలందు పరిమితమైన ప్రయత్నం కలిగి, నియమితమైన (నిర్దిష్టమైన కాల పరిణామాలు కలిగిన) నిద్రాజాగరణాలు కలిగి ఉండేవానికి సంసారదుః ఖాన్ని పోగొట్టే ధ్యానం కుదురుతుంది. (గీత 6–17)

వ. ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతార చరితంబులచేత

నచింత్యంబుగా నెద్ది సేయు నద్ది హృదయగతంబుగా ధ్యానంబు సేయందగు. మఱియుఁ గార్య బుద్ధింజేసి చేయంబడు పూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప వలయు; నిట్లు మనోవాక్కాయ కర్మంబులచేత మనోగతం బగునట్లుగా భక్తి యుక్తంబు లయిన పూజలచేతఁ బూజింపంబడి, సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది పురుషార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు; విరక్తుం డగువాఁడు నిరంతరభావం బయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజియించు నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి మహర్షిజన సేవ్యంబై సకాల సిద్ధుల నొసంగుచు భగవత్పాద సరోజాలంకృతంబైన మధువనంబునకుం జనియె నంత.

256

తా ॥ "ఉత్తములచే కీర్తించబడే ఆ పుండరీకాక్షుడు తన మాయచేత, తన ఇష్టం వచ్చిన రూపాలతో అవతరించి, స్వేచ్ఛగా నిర్వహించిన లీలా విశేషాల్ని హృదయంలో ధ్యానించాలి. ప్రయత్న పూర్వకంగా చేసే పూజలను వాసుదేవ మంత్రపూర్వకంగా ఆ సర్వేశ్వరునకు సమర్పించాలి. మనోవాక్కాయ కర్మలలో పవిత్రులై, మనఃపూర్వకంగా, భక్తియుక్తులై చేసే పూజలకు భగవంతుడు సంతోషిస్తాడు. అటువంటి పూజలందుకున్న సర్వేశ్వరుడు, మాయలో చిక్కుకోకుండా తనను సేవించే మానవులకు ధర్మార్థ కామమోక్షాది పురుషార్థాలతో కోరిన కోర్కెలను ప్రసాదిస్తాడు. వైరాగ్య భావాన్ని పొందిన బంధరహితుడు, నిరంతర భక్తిభావంతో మోక్షంకోసం ఆరాధిస్తాడు" అని నారదుడు చెప్పగా విని, ధ్రువుడు నారదునకు ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించాడు. మహర్షులకు నివాస స్థానమైనది, సకలసిద్ధి ప్రదాయకమైనది, భగవంతుని పాదపద్మాలతో అలంకరింపబడినది అయిన మధువనానికి వెళ్ళాడు.

క. పద్మభవ సూనుఁ డుత్తానపాదుకడుకు, నరిగి యా రాజుచే వివిధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్నతాసనమున, నెలమిఁ గూర్చుండి యాతని వలను చూచి.

257

వ. ఇట్లనియె.

258

తా ॥ బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు, ఉత్తానపాదుని కడకు వెళ్ళి, ఆ రాజు చేసిన వివిధ పూజలను స్వీకరించి ప్రీతిచెంది, ఉచితాసనంపై కూర్చుండి ఆ రాజువైపు చూచి ఇలా అన్నాడు:

క. భూనాయక! నీ విపు డా, మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలో జింతం
బూనుట కేమి కతం? బన, నా నారదుతోడ నాతఁ డనియెన్ మరలన్.

259

తా ॥ "ఓ రాజా! నీవు వాడిపోయిన ముఖంతో, మదిలో తీవ్రంగా చింతిస్తున్నావు. దీనికి కారణమేమిటని" నారదుడు ప్రశ్నించగా ఉత్తానపాదుడు ఇలా సమాధానం చెప్పాడు:

క. మునివర! వివేకశాలియు, ననఘుఁడు నైదేండ్ల బాలుఁ డస్మత్ప్రియ నం
దనుఁ డదయుఁడ నగు నాచే, తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్.

260

తా ॥ "ఓ మునివర్యా! వివేకవంతుడు, పుణ్యాత్ముడు, అయిన అయిదేండ్ల నా ముద్దుల కుమారుణ్ణి, దయావిహీనుణ్ణయి పరాభవించాను. ఆ పరాభవానికి నొచ్చుకొని తల్లితోపాటు అరణ్యాలకు పోయాడు.

మ. చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బథిశ్రాంతుండు క్షుత్పీడితుం
డును సంమ్లానముఖాంబుజుండు ననఘుండున్ బాలకుండైన మ
త్తనయున్ ఘోరవృకాహిభల్ల ముఖసత్త్వశ్రేణి భక్షించెనో

యని దుఃఖించెద నాదు చిత్తమున నార్యస్తుత్య! యిట్లొటకున్.

261

తా ॥ అలా అడవికి పోయిన నా కుమారుడు, అక్కడ అలసటతో, ఆకలి బాధతో పీడించబడి, వాడిపోయిన ముఖంతో తిరిగే ఆ పసివాణ్ణి ఏ తోడేళ్ళు, సర్పాలు, ఎలుగుబంట్లు వంటి క్రూరజంతువులు పొట్టన పెట్టుకున్నాయోనని నా మదిలో దుఃఖిస్తున్నాను.

తే. అట్టి యుత్తమబాలు నా యంకపీఠ, మందుఁ గూర్చుండనీక నిరాకరించి
యంగనాసక్త చిత్తుండ నైన యట్టి, నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర!

262

తా ॥ అటువంటి ఉత్తముడైన పసివాణ్ణి, నా 'అంకపీఠం' మీద కూర్చుండనీయక నిరాకరించాను. స్త్రీ మీద ఉన్న వలపుతో దుర్బలుడనై ఇలా తప్పు చేశాను. దురాత్ముణ్ణి!"

ఉ. నా విని నారదుండు నరనాథున కిట్లను నీ కుమారుఁ డా
దేవకిరీట రత్నరుచిదీపిత పాదసరోజుఁడైన రా
జీవదళాక్ష రక్షితుఁ డశేష జగత్పరికీర్తనీయ కీ
ర్తీ విభవ ప్రశస్త సుచరిత్రుఁడు; వానికి దుఃఖ మేటికిన్?

263

తా ॥ అని ఇలా బాధపడుతున్న ఉత్తానపాదుణ్ణి చూచి, నారదుడిలా అన్నాడు. "నీ కుమారుడు ఏ మహాత్ముని పాదసరోజాలపై దేవతల రత్నకిరీట కాంతులు ప్రకాశిస్తాయో ఆ పద్మాక్షునిచే రక్షించబడుతున్నాడు. సమస్త లోకాలచే కీర్తింపదగిన ప్రశస్తమైన నడవడిక గల నీ కుమారుడికి దుఃఖమెక్కడిది?

ఉ. కావున న మ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్తలోకపా

లావళి కందరాని సముదంచిత నిత్యపదంబునం బ్రభు
శ్రీవిల్లసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి; యా జగ
త్పావనుఁడైన నీ సుతు ప్రభావ మెఱుంగవు నీవు భూవరా!

264

తా ॥ కాబట్టి, ఆ మహాత్ముడు తన సత్కర్మ చేత, శ్రీహరిని భజించి లోకపాలకులెవ్వరికీ పొంద సాధ్యంకాని 'శాశ్వతపదాన్ని' పొంది అధీశ్వరుడవుతాడు. జగత్పావనుడైన నీ సుతుని ప్రభావాన్ని తెలుసుకోలేకపోతున్నావు!

వ. అదియునుం గాక.

265

క. నీ కీర్తియు జగముల యం, దాకల్పము నొందఁజేయు నంచితగుణ ర
త్నాకరుఁ డిట కేతెంచును, శోకింపకు మతనిఁగూర్చి సుభగచరిత్రా!

266

తా ॥ ఓ సౌభాగ్యచరితా! నీ కీర్తిని ఆకల్పాంతం లోకాలలో స్థిరపరిచే గుణరత్నాకరుడు ధ్రువుడు. ఆ ధ్రువకుమారుడు మళ్ళీ ఇక్కడికి వస్తాడు. అతని కోసం శోకించవద్దు."

క. అని నారదుండు పలికిన, విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియ నం
దనుఁ జింతించుచు నాదర, మునఁ జూడం డయ్యె రాజ్యమును బూజ్యముగన్.

267

తా ॥ అని నారదుడు చెప్పగా విని, మదిలో విశ్వసించాడు. ప్రియనందనుడైన ధ్రువకుమారుణ్ణి గురించి చింతిస్తూ రాజ్యాన్ని పూజ్య భావంతో నిర్వహించలేకపోయాడు.

వ. అంత నక్కడ నా ధ్రువుండు.

268

తా ॥ ఆ మధువనం చేరుకొన్న ధ్రువ కుమారుడు,

క. చని ముందటఁ గనుఁగొనె మధు, వనమును ముని దేవ యోగి వర్ణిత గుణ పా
వనమును దుర్భవ జలద ప, వనమును నిఖిలైక పుణ్యవరభవనంబున్.

269

తా ॥ మునులచే, దేవతలచే, యోగులచే స్తుతించబడే పవిత్రత గలది, సంసారబంధాలనే మేఘాల్ని చెదరగొట్టే గాలుల్ని వీచేది, అఖండపుణ్యాలకు ఆవాసమైనదైన ఆ మధువనాన్ని–

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును, సమాహిత చిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం ద్రిరాత్రంబుల కొక్కమాఱు కృత కపిత్థ బదరీ ఫలసారణుం డగుచు దేహస్థితి ననుసరించి యొక్క మాసంబు హరిం బూజించి, యంత నుండి యాఱేసి దినంబుల కొక్కపరి కృత జీర్ణతృణ వర్ణాహారుం డగుచు, రెండవ మాసంబున విష్ణుసమారాధనంబు సేసి, యంతనుండి నవరాత్రంబుల కొకమా ఱుదక భక్షణంబు సేయుచు, మూఁడవ మాసంబున మాధవు నర్చించి. యంతనుండి ద్వాదశదినంబుల కొకమాఱు వాయుభక్షణుం డగుచు; జితశ్వాసుండై నాలవ మాసంబునం, బుండరీకాక్షుని భజియించి యంత నుండి, మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై యేక పదంబున నిలిచి, పరమాత్మం జింతించుచు, నచేతనంబైన స్థాణువుంబోలె నైదవ మాసంబును జరపె నంత.

270

తా ॥ సమీపించి యమునానదిలో స్నానం చేశాదు. నియమవ్రతుడై, చిత్తాన్ని కూడ దీసుకొని సర్వేశ్వరుణ్ణి గురించి ధ్యానం చేస్తున్నాడు. తన శరీర స్థితినిబట్టి మూడు రోజుల కొకసారి వెలగపండుగుజ్జు, రేగుపండుగుజ్జు ఆహారంగా తీసుకొంటూ ఒక నెలరోజులపాటు

శ్రీహరిని పూజించాడు.

రెండవ నెలలో ఆరురోజుల కొకసారి ఎండిన గడ్డిపరకలనే ఆహారంగా చేసికొని విష్ణువును పూజించాడు. మూడవ నెలలో తొమ్మిదిరోజుల కొకసారి నీటిని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ మాధవుణ్ణి అర్చించాడు. నాల్గవ నెలలో పన్నెండు రోజుల కొకసారి వాయువును మాత్రమే భక్షిస్తూ, శ్వాసను జయించి పుండరీకాక్షుణ్ణి భజించాడు. ఆపైన అయిదవ నెలలో మనస్సుకు అలసట లేకుండా ఉచ్ఛ్వాసాన్ని మానివేసి, ఒంటిపాదాన నిలబడి పరమాత్మను చింతిస్తూ, అచేతనమైన స్థాణువులాగ గడిపాడు.

మొదటి నెలలో సర్వేశ్వరుడైన శ్రీహరిని, రెండవ నెలలో విష్ణువును, మూడవనెలలో మాధవుణ్ణి, నాల్గవనెలలో పుండరీకాక్షుణ్ణి, అయిదవ నెలలో పరమాత్మను ధ్యానం చేశాడని చెప్పటంలోని ఔచిత్యాన్ని భావన చేయాలి. అంచెలంచెలుగా మూర్తిని సాక్షాత్కరించుకొనే దశనుండి, పరమాత్మను గురించి చింతించే దశను చేరుకోవడాన్ని గమనించాలి. సాధకుడైన ధ్రువుడు సర్వేశ్వరుడైన విష్ణుతత్త్వోపాసననుండి అరూపానికి, బహుత్వంనుండి ఏకత్వానికి చేసే ప్రయాణమే ఈ ధ్యానమంతా.

సీ. సకల భూతేంద్రియాశయ మగు హృదయంబు నందు విషయములఁ జెందనీక
మహదాది తత్త్వ సమాజమ్ములకును నాధార భూతమును బ్రధాన పూరు
షేశ్వరుఁ డైనట్టి శాశ్వత బ్రహ్మంబుఁ దనదైన హృదయ పద్మమున
నిలిపి హరిరూపమున కంటె నన్యంబు నెఱుఁ గక చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న

తే. కతన ముల్లోకములు సాలఁ గంప మొందె;, వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
నొక్కపాదంబు చేర్చి నిల్చున్న వేళఁ, బేర్చి యబ్బాలు నంగుష్ఠపీడఁ జేసి.



తే వసుమతీతల మర్ధము వంగఁజొచ్చె, భూరిమద దుర్నివారణ వారణేంద్ర మెడమఁ

గుడి నౌరగఁగ నడుగడుగునకును, జలన మొందుచు నడఁగెడు కలముఁ బోలె.

272

తా ॥ సకలభూతాలకు – ఇంద్రియప్రవృత్తులకు ఆవాసమైన హృదయంలో ఇంద్రియాలకు సంబంధించిన బాహ్యవిషయాలను చొరనీయలేదు. మహత్తు మొదలుగల ఇరవైనాలుగు తత్త్వాలకు ఆధారభూతుడు, ప్రధానమైన మూల ప్రకృతికి పురుషునికి అధిపతియైన శాశ్వత పరబ్రహ్మము ఎవడో ఆ పరబ్రహ్మాన్ని తన హృదయపద్మంలో నిలుపుకున్నాడు. ఆ శ్రీహరి రూపాన్ని తప్ప మరిదేనినీ మనస్సులో స్మరించకుండా తన చిత్తాన్ని సమాయత్తం చేశాడు. ఆ స్థితికి మూడులోకాలు కంపించాయి. అర్భకుడైన ఆ పసివాడు భూమిమీద ఒక్కపాదాన్నే మోపి నిలబడటంచేత, అతని కాలి బొటనవ్రేలి పీడనం చేత భూమి సగభాగం వంగిపోయింది. మదపుటేనుగు కుడిఎడమలకు ఒరిగినప్పుడు, అడుగడుగునా కంపించే పడవలాగా భూమి కంపించింది.

చ. అతఁడు ననన్యదృష్టిని జరాచర దేహిశరీర ధారణా
స్థితి గల యీశునందుఁ దన జీవితమున్ ఘటియింప జేసి యే
కతఁ గనఁ దన్నిరోధంబునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం;
డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె భూవరా!

273

తా ॥ ధ్రువుడు అనన్య దృష్టితో, చరాచర ప్రాణికోటి యొక్క దేహాలనే తన శరీరంగా చేసుకున్న పరమాత్మను ధ్యానించాడు. ఏకాగ్ర చిత్తంతో ప్రాణవాయువును నిరోధించి, హృదయస్థుడైన పరమాత్మతో అనుసంధానం చేశాడు. ప్రాణవాయువును నిరోధించటం వల్ల శ్రీహరి కంపించాడు. ఆ పరమేశ్వరుడు కంపించగానే లోకాలన్నీ కంపించాయి.

పరమేశ్వరుడే ఈ జగత్తు కాబట్టి, పరమేశ్వరుడు కంపిస్తే లోకాలు కంపించకుండా ఎలా

ఉంటాయి?

క. ఆలోకభయంకరమగు, నా లోకమహావిపద్దశాలోకనులై
యా లోకపాలు రందఱు, నా లోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్,.

274

తా ॥ చూడటానికే భయంకరమై, లోకాలకు కలిగిన విపద్దశను చూసి, లోకపాలకులంతా లోకశరణ్యుడైన శ్రీమన్నారాయణుని చెంతకు భయంతో వెళ్ళారు.

వ. అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యిట్లనిరి.

275

తా ॥ ఆ విధంగా వెళ్ళి నమస్కరించి, చేతులు మోడ్చి శ్రీమన్నారాయణునికి ఇలా నివేదించారు:

చ. హరి! పరమాత్మ! కేశవ! చరాచర భూతశరీర ధారివై
పరఁగుదు వీవు, నిట్టులుగఁ బ్రాణనిరోధ మెఱుంగ మెందు ముం
దిరవుగ దేవదేవ, జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం
బురుహము లర్థిమై శరణుఁ బొందెద మార్తి హరించి కావవే!

276

తా ॥ 'ఓ హరీ! పరమాత్మా! కేశవా! చరాచర ప్రాణికోటి శరీరాలనే అంతర్యామిగా ఉన్న వాడివి నీవు. ఈ విధమైన ప్రాణనిరోధాన్ని ఇంతకు పూర్వం ఎప్పుడూ మేమెరుగము. ఓ దేవదేవ! జగదీశ్వర! సర్వలోక శరణ్యా! నీ పాదపద్మాలనే కోరి శరణు పొందుతున్నాము. మా ఆర్తిని హరించి కాపాడు!'

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె; నుత్తానపాదుం డనువాని

తనయుండు విశ్వరూపుండ నయిన నాయందుఁ దన చిత్తం బైక్యంబు సేసి తపంబు గావించుచుండ దానం జేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యె! నట్టి దురత్యయంబైన తపంబు నివర్తింపఁ జేసెద; వెఱవక మీ మీ నివాసంబులకుం జనుండని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి; తదనంతరంబ.

277

తా ॥ అని ఈ విధంగా దేవతలు విన్నవించగా ఈశ్వరుడు వారితో ఇలా అన్నాడు: 'ఉత్తానపాదుడనే పేరుగలవాని కుమారుడైన ధ్రువుడు, 'విశ్వరూపధారి' నయిన నాయందు తన చిత్తాన్ని ఐక్యంచేసి తపస్సు చేస్తున్నాడు. దానివలన మీకు 'ప్రాణ నిరోధం' జరిగింది. దాటడానికి వీలు కానట్టి ఆ తపస్సును మాన్పిస్తాను. భయపడక మీమీ నివాసాలకు వెళ్ళండి' అని ఆజ్ఞాపించగా, ఆ దేవతలు నిర్భయులై, ఈశ్వరునికి ప్రణామాలర్పించి స్వర్గానికి వెళ్ళారు. తరువాత,

సీ. హరి యీశ్వరుండు విహంగ కులేశ్వర యానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ
గనుఁగొను వేడుక జనియింప నా మధువనమున కప్పుడు సని ధ్రువుండు
పరువడి యోగవిపాక తీవ్రంబైన బుద్ధిచే నిజమనోంబురుహ ముకుళ
మందుఁ దటిత్ప్రభాయత మూర్తి యటఁ దిరోధానంబునను నొంది తత్క్షణంబ

తే. తన పురో భాగమందు నిల్చినను బూర్వ, సమధిక జ్ఞాన నయన గోచర సమగ్ర మూర్తిఁ
గనుఁగొని సంభ్రమముననుు సమ్మ, దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు.

278

తా ॥ హరియైన ఈశ్వరుడు, గరుడ వాహనారూఢుడై, తన సేవకుడైన ధ్రువుణ్ణి చూసే వేడుకతో మధువనానికి వెళ్ళాడు. తీవ్రమైన యోగసమాధిలో ఉన్న ధ్రువుడు తన హృదయపద్మంలో తటిత్తులా (మెరుపులా) ప్రకాశించే పరమాత్మరూపాన్ని ధ్యానిస్తున్నాడు.

కావున బయట ఉన్న ఈశ్వరుడిని గాంచలేదు. కాని ఈ రూపం హఠాత్తుగా మాయమై తన ఎదుట బయట నిలిచింది. వెంటనే ధ్రువుడు, జ్ఞాననేత్రాలకు పొడగట్టిన సంపూర్ణ రూపాన్ని సంభ్రమంతో చూసి ఆనంద బాష్పాలతో పులకిత శరీరుడై నిలిచాడు.

## 13. సాక్షాత్కరించిన భగవంతుణ్ణి ధ్రువుడు స్తుతించుట

తే. నయనముల విభు మూర్తిఁ బానంబుసేయు, పగిదిఁ దన ముఖమునను జుంబనము సేయు లీలఁ దగ భుజములను నాలింగనంబు, సేయుగతి దండవన్నమస్కృతు లొనర్చె.

279

తా ॥ తన నేత్రాలతో స్వామి రూపాన్ని త్రాగుతున్నట్లు, తన ముఖంతో స్వామిని ముద్దు పెట్టుకుంటున్నట్లు, తన భుజాలతో ఆ స్వామిని కౌగలించుకొంటున్నట్లు అనుభూతి పొందుతూ సాష్టాంగ నమస్కారాలర్పించాడు.

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించియు స్తుతిక్రియా సమర్థుండు గాక యున్న ధ్రువునకును సమస్త భూతంబులు నంతర్యామి యైన యీశ్వరుం డాతని తలంపెఱింగి వేదమయంబయిన తన శంఖంబు చేత నబ్బాలుని కపోలతలం బంటిన జీవేశ్వర నిర్ణయజ్ఞుండును, భక్తిభావ నిష్ఠుండును నగు ధ్రువుండు నిఖిలలోక విఖ్యాత కీర్తి గల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబు లగుచు వేదాత్మకంబులైన తన వాక్కుల నిట్లని స్తుతియించె; దేవా! నిఖిలశక్తి ధరుండవు, నంతఃప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబుల బ్రాణేంద్రియంబులం గరచరణ శ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసిన భగవంతుడవును, బరమపురుషుం డవును నైన నీకు నమస్కరింతు; నీ వొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీ యశేష విశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయశక్తిచేతం గల్పించి యందుంబ్రవేశించి యింద్రియంబులందు వసించుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానాప్రకారంబుల దారువులం దున్న వహ్ని చందంబునం బ్రకాశింతు వదియునుం గాక.

280

తా ॥ ఈ విధంగా దండ ప్రణామాలు చేసి, దోసిలి యొగ్గి, స్తుతించాలని

నిశ్చయించుకున్నాడు. కాని స్తోత్రం చేయడానికి సమర్థత చాలలేదు. సమస్త ప్రాణికోటికి అంతర్యామియైన ఈశ్వరుడు, ధ్రువుని మదిలోని తలపు తెలుసుకున్నాడు. వేదమయమైన తన పాంచజన్యంతో ధ్రువుని చెక్కిలిపై స్పృశించాడు. ఆ స్పర్శతో ధ్రువునికి జీవుడు—ఈశ్వరుడు ఎవరెవరో నిర్ణయించే జ్ఞానం లభించింది. భక్తి భావనిష్ఠుడైన ధ్రువుడు లోకమంతా వ్యాపించిన పరమాత్మ కీర్తిని తెలిసికొని, భగవంతుణ్ణి ప్రతిపాదించే వేదమయమైన వాక్కులతో ఈ విధంగా స్తుతించాడు:

"దేవా! నీవు నిఖిల శక్తిని ధరించినవాడవు, అంతర్యామివి. నీలో లీనమైపోయిన నా వాక్కులను, ప్రాణేంద్రియాలను, కాళ్ళు, చేతులు, చెవులు, చర్మం మొదలైన వాటికి చైతన్యశక్తిని దయచేసి, జీవింపచేసిన భగవంతునివి. పరమ పురుషుడవైన నీకు సమస్కరిస్తాను. నీవొక్కడివే అయినప్పటికీ, ఈ అశేష విశ్వాన్ని నీ మాయాశక్తితో సృష్టించి, అందులోనికి ప్రవేశించి, ఇంద్రియాలలో నివసిస్తున్నావు. అగ్ని ఒక్కటే అయినప్పటికీ వివిధ రకాలయిన కట్టెలలో ప్రకాశిస్తున్నట్లుగా ఆ యా దేవతారూపాలలో నీవు ప్రకాశిస్తున్నావు.

'యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్, నబిభేతి కుతశ్చన' (తైత్తిరీయం 2–4)

ఏ పరబ్రహ్మాన్ని చేరజాలక మనస్సుతోసహా వాక్కు మరలిపోతుందో అది తత్త్వమస్యాది వాక్యాలకు లక్ష్యభూతం. అదే ఆనందరూపం. జ్ఞానరూపం. ధ్రువుని పరిస్థితి అదే. దర్శించింది ఆనందమయుణ్ణి. వాక్కులు అవాక్కయ్యాయి. మనస్సు మూగవోయింది. మళ్ళీ స్వామి అనుగ్రహంతోనే మనస్సు, వాక్కు సిద్ధించాయి.

చ. వరమతి నార్తబాంధవ! భవద్ఘన బోధసమేతుఁడై భవ
చ్చరణముఁ బొంది నట్టి విధి సర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గనునట్టి ముముక్షు శరణ్యమైన నీ

చరణములం గృతజ్ఞుఁడగు, సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్.

281

తా ॥ ఓ ఆర్తబాంధవా! నిద్రపోయి మేల్కొన్నవాడు లోకాన్ని చూసినట్లు, నీచే బోధించబడి, నీ పాదపద్మాలను ఆశ్రయించిన సజ్జనుడు యథార్థజ్ఞానాన్ని పొందుతాడు. ముముక్షువులకు శరణ్యమైన నీ పాదాలను కృతజ్ఞుడైన సజ్జనుడు ఏ విధంగా స్మరించకుండా ఉంటాడు?

సీ. మహితాత్మ! మఱి జన్మమరణ ప్రణాశన హేతు భూతుండవు నిద్దకల్ప
తరువవు నగు నిన్నుఁ దగ నెవ్వరే నేమి పూని నీ మాయా విమోహితాత్ము
లగుచు ధర్మార్థ కామాదుల కొఱకుఁ దా మర్చించుచును ద్రిగుణాభమైన
దేహోపభోగ్యమై దీపించు సుఖముల నెనయంగ మదిలోన నెంతు; రట్టి

తే. విషయ సంబంధ జన్యమై వెలయు సుఖము, వారికి నిరయమందును వఱలు దేవ!
భూరి సంసార తాప నివార గుణ క, థామృతాపూర్ణ! యీశ! మాధవ! ముకుంద!

282

తా ॥ సంసారతాపాలను నివారించే గుణాలతో కూడిన కథామృతపూర్ణా! ఈశ్వరా! మాధవా! ముకుందా! జననమరణాలను నశింపచేసే కారణమైన వాడివి నీవు. ప్రసిద్ధ కల్పవృక్షమైన నిన్ను, నీ మాయతో మోసగించబడిన చిత్తములు కలవారై ఇతర ప్రయోజనముల కొరకు నిన్ను పూజించుచున్నారు. వారు దేహంతో అనుభవించే సుఖాలనే పొందాలని మదిలో కోరుకుంటారు. అటువంటి ఇంద్రియ సంబంధ సుఖాలు నరకంలో కూడా లభిస్తుంది.

మ. అరవిందోదర! తావకీన చరణ ధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాత భూరిసుఖముల్ స్వానందకబ్రహ్మ మం
దరయన్ లే వఁట! దండ భృద్ధత విమానాకీర్ణులై కూలు నా

సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైక చింతామణీ!

283

తా ॥ ఓ పద్మనాభా! సజ్జనచింతామణీ! నీ పాదపద్మాలను ధ్యానించడంలోను, అనురాగంతో వెలుగొందే నీ కథలను వినడంలోను కలిగే మహాసుఖాన్ని, స్వాత్మానందభూతమైన మోక్షంలో కూడా పొందలేరు. స్వర్గములో విమానంలో సంచరించే పుణ్యాత్ములు పుణ్యకాలం కాస్త తీరిపోగా, అక్కడనుండి వారు భూలోకానికి పడిపోతారు. అట్టివారికి ఈ ఆనందం కలుగదని వేరుగా చెప్పడం దేనికి.

చ. హరి! భజనీయ మార్గనియతాత్మకులై భవదీయ మూర్తిపై
వఱలిన భక్తియుక్తు లగువారల సంగతి! గల్గఁజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసనదుస్తరసాగర మప్రయత్నతన్
సరస భవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదన్?

284

తా ॥ ఓ హరీ నిన్ను భజించేమార్గంలో నియమం గలవారై, నీ మూర్తిపై భక్తియుక్తులైన వారి సాంగత్యం నాకు ప్రసాదించు. ఆ సత్పురుషుల సాంగత్యం దుస్తరమైన సంసారబాధల్ని అప్రయత్నంగా పోగొడుతుంది. రసవత్తరమైన నీ కథామృత రసాన్ని గ్రోలి మత్తుడనై తరిస్తాను.

సజ్జనసాంగత్య విశేషాన్ని ఈ పద్యంలో కోరుకోవడాన్ని గమనించాలి. సత్పదార్థ సాంగత్యాన్ని పెంచుకోవటం వల్లనే మాయాప్రపంచం తోటి సంగం వదులుతుంది. సత్పదార్థంతో సాంగత్యం సామాన్యులకు సరాసరి సాధ్యంకాదు. అందుచేత నిత్యమైన సత్పదార్థతత్త్వం తెలిసిన సత్పురుషులతో సాంగత్యం, ప్రపంచంతో మనకున్న మమకారాన్ని నశింపచేస్తుంది. ఆ నిస్సంగత్వమే, నిర్మోహత్వాన్ని, నిశ్చలతత్త్వాన్ని, జీవన్ముక్తిని కలిగిస్తుందని ఆదిశంకరులవారు పేర్కొన్నారు.

చ. నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జ సుగంధలబ్ధి యె
వ్వరి మది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియ మర్త్యదేహము
న్నరయఁ దదీయదార తనయాది సుహృద్గృహబంధు వర్గమున్
మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా!

285

తా ॥ విశ్వతోముఖా! రమా హృదయేశ్వరా! ముకుందా! మాధవా! నీ పాదపద్మాల సుగంధాన్ని అనుభవించినవారు మరణించే తత్త్వంగల శరీరాన్ని మరచిపోతారు. భార్య, బిడ్డలు, స్నేహితులు, బంధువులనే విషయాలను కూడా మర్చిపోతారు.

సీ. పరమాత్మ! మర్త్య సుపర్వ తిర్యఙ్మృగ దితిజ సరీసృప ద్విజగణాది
సంవ్యాప్తమును సదసద్విశేషంబును గైకొని మహదాది కారణంబు
నైన విరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ గాని తక్కిన సుమంగళము
నైన సంతత సుమహితైశ్వర్య రూపంబును భూరిశబ్దాది వ్యాపార శూన్య

తే. మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ, బ్రవిమలాకార! సంసార భయవిదూర!
పరమ మునిగేయ! సంతత భాగధేయ!, నలిన నేత్ర! రమాలలనా కళత్ర!

286

తా ॥ ఓ పరమాత్మా! మానవులు, దేవతలు, పశుపక్ష్యాదులు, రాక్షసులు, పాములు, పక్షులు మొదలైన వానితో వ్యాపించి, సత్(మంచి), అసత్(చెడు), విశేషాలతో(విశిష్టమైనవి) కూడి, మహదాది తత్త్వాలకు మూలకారణమైన నీ విరాట్స్వరూపాన్ని నేను ఎరుగుదును. కాని దీనికి అతీతమైన మంగళకరము, మహితైశ్వర్య సంపన్నము అయి, శబ్దవ్యాపారానికి గోచరం కాని పరబ్రహ్మ స్వరూపాన్ని నేను ఎరుగను. నిర్మలాకారా! సంసార భయవిదూర! పరమ మునులచే కీర్తించబడేవాడా! ఎడతెగని కర్మఫలరూపా! పద్మనేత్రా? రమాకళత్రా! నీకు నమస్కారం.

సీ. సర్వేశ! కల్పాంత సమయంబు నందు నీ యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండవై శేష పర్యంక తలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధుజస్వర్ణలోకకంజాత గర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు రుచి నొప్పు బ్రహ్మస్వరూపివైన

తే. నీకు మ్రొక్కెద నత్యంత నియమ మొప్ప, భవ్యచారిత్ర! పంకజ పత్త్రనేత్ర!
చిరశుభాకార! నిత్యలక్ష్మీ విహార!, యవ్యయానంద! గోవింద! హరి ముకుంద!

287

తా ॥ ఓ సర్వేశ్వరా! కల్పాంతమై ప్రళయం వచ్చినప్పుడు, ఈ అఖిల ప్రపంచాన్ని పూర్తిగా మాయంచేసి, శేషుని సహాయంగా చేసికొని, ఆదిశేష తల్పంపై శయనించి, యోగనిద్రాసక్తుడవవుతావు. ఆపైన, నీ నాభి అనే సముద్రంనుండి పుట్టిన స్వర్ణమయమైన తామర పువ్వులోనుండి చతుర్ముఖుడైన బ్రహ్మను పుట్టిస్తావు. అటువంటి తేజోమయమై ప్రకాశించే బ్రహ్మస్వరూపివైన నీకు అత్యంత నియమంతో నమస్కరిస్తాను. భవ్యచారిత్రా! పద్మదళనేత్రా! చిరకాలం శుభాలను కలిగించే ఆకారం కలవాడా! నిత్య లక్ష్మీవిహారా! తరుగని ఆనందానికి నిలయమైనవాడా! గోవిందా! హరి! ముకుందా! నీకు ప్రణుతి!

వ. అట్లు యోగనిద్రా పరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండవై యుండుదు; వది యెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం బయిన స్వశక్తిం జేసి చూచు లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును, బరిశుద్ధుండవును, సర్వజ్ఞుండవును, నాత్మవును, గూటస్థుండవును, నాది పురుషుండవు, భగవంతుండవు, గుణత్రయాధీశ్వరుండవునునై వర్తింతువు; భాగ్యహీనుండైన జీవునియందు నీ గుణంబులు గలుగ; వే సర్వేశ్వరునం దేమి విరుద్ధగతులై వివిధశక్తి యుక్తంబులైన యవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబు లగు చుండు నట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మంబునకు

నమస్కరించెద; మఱియు దేవా! నీవ సర్వవిధఫలం బని చింతించు నిష్కాము లయిన వారికి రాజ్యాది కామితం బులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండవైన భవదీయ పాదపద్మ సేవనంబ; యిట్లు నిశ్చితంబ యైనను సకాములైన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు సేయించుచు వృకాది భయంబు వలన రక్షించు చందంబునం గామప్రదుండవై సంసార భయంబువలన బాపుదు వని యిట్లు సత్యసంకల్పుండును, సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుండైన భగవంతుడు సంతుష్టాంతరంగుండై యిట్లనియె.

288

తా ॥ ఆ విధంగా యోగనిద్రలో పరవశుడవైనప్పటికీ జీవులకంటే అత్యంత విలక్షణమైనవాడివి. బుద్ధి, మనస్సు, ఊహ మొదలైన వానిచే విభజించబడని అఖండశక్తి నీది. ఆ అఖండమైన స్వశక్తిచేత లోకపాలన నిమిత్తం యజ్ఞాధిపత్యాన్ని వహిస్తావు. కాబట్టి నీవు నిత్యముక్తుడవు. పరిశుద్ధుడవు. సర్వజ్ఞుడవు ఆత్మవు. దేహివైన కూటస్థుడవు. ఆదిపురుషుడవు. భగవంతుడవు. త్రిగుణాలకు అధినాయకునివై వర్తించువాడవు. భాగ్యవిహీనుడైన జీవునియందు ఈ దివ్యగుణాలు లేవు. ఏ సర్వేశ్వరునియందు విరుద్ధగతితో వివిధ శక్తులతో కలసిన అవిద్యాదులు ఒకదాని వెంట మరొకటి విలీనమవుతుంటాయో, అటువంటి విశ్వకారణమూ, ఏకమూ, అనంతమూ, ఆద్యమూ, ఆనందమాత్రమూ, అవికారము అయిన పరబ్రహ్మమునకు నమస్కరిస్తాను.

ఓ దేవా! నిష్కాములైనవారు నిన్నే సర్వతోముఖ ఫలంగా భావిస్తారు. రాజ్యసుఖాదులలోని పరమార్థ ఫలం ఏమంటే సర్వార్థ స్వరూపుడవైన నీ పాదపద్మాలను సేవించడమే. ఈ విధంగా నిశ్చయమైనప్పటికీ కోరికలు గల దీనులకు కోరికలు తీర్చి సంసారభయాలను పోగొడతావు. అది గోవు తన దూడకు పాలిస్తూ తోడేళ్ళు మొదలైన క్రూరజంతువుల భయంనుండి రక్షించటం లాంటిది” అని ఈ విధంగా సత్యసంకల్పుడు,

సుజ్ఞానియైన ధ్రువునిచేత నారాయణుడు కీర్తించబడ్డాడు. భృత్యులపట్ల అనురక్తిగల భగవానుడు మనస్సులో సంతోషించి ఇలా అన్నాడు:

క. ధీరవ్రత! రాజన్యకు, మారక! నీ హృదయమందు మసలిన కార్యం
బారూఢిగా నెఱుంగుదు, నారయ నది వొందరాని దైనను నిత్తున్.

289

తా ॥ "ఓ ధీరవ్రతా! రాజకుమారా! నీ హృదయంలో మెదిలే కోరికను ఆరూఢిగా నేను ఎరుగుదును. అది పొందవీలుకానిది అనప్పటికీ నీకు ప్రసాదిస్తున్నాను.

వ. అది యెట్టి దనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రంబునుంబోలె గ్రహనక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబు లయిన ధర్మాగ్ని కశ్యప శక్రులును, సప్తర్షులును, దారకా సమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు; రట్టి దురాపంబును ననన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయకాలంబు నందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నరువది యాఱువేలేండ్లు సనం బ్రాపింతువు; తత్పదప్రాప్తి పర్యంతంబు భవదీయజనకుండు వనవాసగతుండైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు; భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగుఁ; దదన్వేషణార్థంబు తదాహిత చిత్తయై తన్మాతయు వనంబునకుం జని యందు దావ దహన నిమగ్నయగు; వెండియు,

290

తా ॥ గానుగ యంత్రానికున్న ఇరుసుకు కట్టిన ఎద్దు, చక్రాకారంగా పరిభ్రమించినట్లు, గ్రహాలు, నక్షత్రాలు, తారాగణాలు, జ్యోతిశ్చక్రము (వెలుగుతో పరిభ్రమించే చక్రం), నక్షత్రరూపాలయిన ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, శుక్రుడు, సప్తర్షులు, తారకలతోకూడి నీ చుట్టూ

ప్రదక్షిణం చేసినట్లు తిరుగుతారు. ఇతరులు చేరడానికి వీలు కానిది, అధిష్ఠించటానికి సాధ్యం కానిది, మూడులోకాలు ప్రళయంలో నశించినా కూడా నశించకుండా ప్రకాశించే 'ధ్రువక్షితి' ని (ధ్రువపదం) ఇరవై ఆరువేల సంవత్సరాల తరువాత పొందుతావు. అప్పటిదాకా నీవు నీ తండ్రి రాజ్యాన్ని పాలించు. నీ తండ్రి వనవాసానికి వెళ్ళాక, ఆ రాజ్యాన్ని ధర్మమార్గంలో, జితేంద్రియుడవై, పూజ్యంగా పరిపాలించు. నీ సోదరుడైన ఉత్తముడు వేటనిమిత్తంగా అడవికి వెళ్ళి చనిపోతాడు. అతనిని వెతుక్కుంటూ, మనస్సును తనపైనే నిలిపిన ఆతని తల్లి సురుచి అడవికిపోయి, దావాగ్నిలో చిక్కుకుని చనిపోతుంది.

సీ. అనఘాత్మ! మఱినీవు యజ్ఞరూపుం డనఁ దగు నన్ను సంపూర్ణ దక్షిణంబు
లగు మఖంబులచేత నర్చించి సత్యంబు లగు నిహసౌఖ్యంబు లనుభవించు
యంత్యకాలమున నన్నాత్మఁ దలంచుచు మఱి సర్వలోక నమస్కృతమును
మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి మండలోన్నత మగు మామకీన

తే. పదము దగఁ బొందఁగల వని పరమపురుషుఁ, డతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ నాత్మపురికి, గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున.

291

తా ॥ ఓ పుణ్యాత్మా! యజ్ఞస్వరూపుడనైన నన్ను, సంపూర్ణ దక్షిణలతో కూడిన యజ్ఞాలతో అర్చించి, నిజమైన ఇహలోక సౌఖ్యాలను అనుభవిస్తావు. మరణకాలంలో నన్ను మనస్సులో స్మరిస్తూ, అన్ని లోకాలచేత నమస్కరింపదగినది, పునర్జన్మ లేనిది, సప్తర్షిమండలంకన్న పైనున్న నా పదాన్ని పొందుతావు" అని పరమాత్మ ధ్రువుడు కోరిన వరాలను ప్రసాదించి, అతడు చూస్తుండగనే తన పట్టణమైన వైకుంఠానికి వెళ్ళాడు.

తే. అంత ధ్రువుఁడునుఁ బంకేరుహాక్ష పాద, కమల సేవోపపాదిత ఘన మనో ర
థములఁ దనరియుఁ దనదు చిత్తంబులోనఁ, దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత!

292

తా ॥ అప్పుడు ధ్రువుడు పద్మాక్షుడైన శ్రీమహావిష్ణువు పాదపద్మాల సేవవల్ల తన మదిలోని గొప్ప కోరికలు తీరినప్పటికీ, మనస్సుకు తృప్తిలేకుండానే వెళ్ళాడు.”

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ, ట్లనయము హరిచేఁ గృతార్థుఁ డైన విధం బె
ల్లను వినిపించిన విదురుఁడు, విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్.

293

తా ॥ అని మైత్రేయుడు, శ్రీహరిచే కృతార్థుడైన ధ్రువుని వ్యవహారమంతా విదురునికి వినిపించాడు. విన్న విదురుడు, మైత్రేయ మహర్షితో ఇలా అన్నాడు:

క. ముని నాయక! విను కాముక, జనదుష్ప్రాపంబు విష్ణు చరణాంబురుహా
ర్చన మునిజన సంప్రాప్యము, ననఁగల పంకేరుహాక్షు నవ్యయ పదమున్.

294

తా ॥ “ముని నాయకా! విను. కోరికలు గల కాముకులకు పొందరానిది విష్ణుపదార్చన. మునిజనులకు మాత్రమే లభ్యమయ్యేది పద్మనయనుడైన ఆ శ్రీమహావిష్ణువు పదం.

వ. పెక్కు జన్మంబులం గాని పొందరాని పదంబు దా నొక్కజన్మంబుననే పొందియుం దన మనంబునం దప్రాప్త మనోరథుండ నని పురుషార్థవేది యైన ధ్రువుం డెట్లు దలంచె ననిన మైత్రేయుం డిట్లనియె.

295

తా ॥ ‘పెక్కుజన్మలెత్తిగాని పొందరాని స్థానాన్ని ధ్రువుడు ఒక్క జన్మలోనే పొందాడు. అయినప్పటికీ కోరిక తీరలేదని ధ్రువుడు ఎందుకు భావించాడు?’ అని ప్రశ్నించగా మైత్రేయుడు ఇలా చెప్పాడు:

తే. అనఘ! పినతల్లి దన్నుఁ బల్కిన దురుక్తి, బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు

చిత్తమందుఁ దలంచుట జేసి ముక్తిఁ, గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె.

296

తా ॥ "అనఘా! పినతల్లియైన సురుచి తనను ఉద్దేశించి పలికిన కఠినమైన మాటలు బాణాల్లా హృదయాన్ని గాయపరిచాయి. ఆ సంభాషణను మదిలో మాటిమాటికీ స్మరిస్తున్నాడు. ఆ కారణం చేత భగవద్దర్శనమైనప్పుడు ముక్తిని కోరలేకపోయాడు. అందుకే మనస్సులో పరితపిస్తున్నాడు.

ధ్రువపదాన్ని కూడా తుచ్ఛంగా భావించటంలో ధ్రువుని ఔన్నత్యం గోచరిస్తుంది. 'త్రిలోకాలలో అది గొప్పదే కావచ్చు. కాని అది నశ్వరమైందేకదా?' అని ధ్రువుని దుఃఖం. మదిలో కోరికలు పెట్టుకొని భగవంతుని ఉపాసన చేసినప్పుడు భగవద్దర్శనమైతే, ముందు అతని కోరికలు నెరవేరి తరువాత ముక్తి ప్రాప్తిస్తుంది. కామ్యంగా ప్రారంభమైన భక్తి భగవద్దర్శనంతో నిష్కామ్యంగా పరిణమిస్తుంది. ధ్రువుని విషయంలో అదే జరిగింది. భగవద్దర్శన ఫలం ఏమంటే ముక్తియే.

వ. అంత నా ధ్రువుండు.

297

చ. అనఘ! జితేంద్రియుల్ సుమహితాత్ములు నైన సనందనాదు లెం
దనయ మనేక జన్మ సముపార్జిత యోగ సమాధిఁ జేసి యె
వ్వని చరణారవిందములు వారని భక్తి నెఱుంగుచుందు, రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయు నాద్యునిన్.

298

తా ॥ ఆపైన ధ్రువుడు ఇలా విచారించాడు. "ఇంద్రియాలను జయించినవారు, మహానుభావులు అయిన సనకసనందనాదులు అనేక జన్మలలో సముపార్జించుకున్న

యోగసమాధి శక్తిచేత ఎవ్వని పాద పద్మాన్ని చెదరని భక్తితో దర్శించ గలుగుతున్నారో, ఆ మహాత్ముణ్ణి, పరమేశ్వరుణ్ణి, ఈశ్వరుణ్ణి, అవికారుణ్ణి, అమేయుణ్ణి (ఏ విధమైన పరిమితులకు లొంగనివాడు), అజేయుణ్ణి, సృష్టికాద్యుడైన ఆ పరమేశ్వరుణ్ణి (తరువాతి వచనంలో అన్వయం)

వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాద పద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండ నైతి; నక్కటా! యిట్టి భాగ్యహీనుండనైన యేను భవనాశకుండైన యతనిం బొడఁగనియు నశ్వరంబులైన కామ్యంబు లడిగితి; నిట్టి దౌరాత్మ్యం బెందేనిం గలదే? తమ పదంబులకంటె నున్నత పదంబు నొందుదునో యని సహింపజాలని యీ దేవతలచేత మదీయ మతి గలుషితం బయ్యెంగాక! నాఁడు నారదుం డాడిన మాట తథ్యం బయ్యె; నతని వాక్యంబు లంగీకరింపక యే నసత్తముండనై స్వప్నావస్థలం బొందిన వాఁడు దైవికంబైన మాయం జెంది భిన్నదర్శనుండగు చందంబున నే నద్వితీయుండ నైనను భ్రాతయను శత్రువుచేఁ బ్రాప్తంబైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును, సుప్రసాదుండును, భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుండైన రోగికిం బ్రయోగించు నౌషధంబు బోలె నిరర్థకంబులైన, నశ్వరంబులైన యీ కామితంబులు గోరితి నని వెండియు.

299

తా ॥ ఆరు మాసాలపాటు భజించి, ఆ పరమాత్మ పాదపద్మాల ఛాయలో రక్షణ పొంది కూడా, భేదబుద్ధిని వదలిపెట్టలేక పొయ్యాను. అయ్యో! ఇటువంటి భాగ్యవిహీనుడనైన నేను జననమరణనాశకుడైన పరమేశ్వరుణ్ణి దర్శించి కూడ నశ్వరమైన కోరికలనే కోరుకున్నాను. ఇటువంటి దౌర్భాగ్యుడు ఎక్కడైనా ఉంటాడా? తమస్థానం కంటే ఉన్నతస్థానాన్ని పొందుతానేమోనని సహించలేని దేవతల వలన నా మనస్సు కలుషితమై ఉంటుంది. లేకుంటే ఇలా మోక్షాన్ని కోరకుండా ఉన్నత స్థితిని కోరుకుంటానా? ఆనాడు నారదుడన్న మాటలే నిజమయ్యాయి. ఆతని మాట వినకుండా అల్పుడనయ్యాను. స్వప్నావస్థలో ఉన్నవాడు

దైవమాయచేత భిన్న దర్శనుడౌతాడు. ఇతరులను నాకన్నా వేరుగా చూసే ఇటువంటి భిన్నదర్శనంతో నారాయణునిలో తాదాత్మ్యమై అభేదభావాన్ని పొందలేక పోయాను.

అద్వితీయుణ్ణి అయినప్పటికీ సోదరుడినే శత్రువుగా కల్పించుకొని దుఃఖాన్ని పొంది, జగతికి ఆత్మయైనవాణ్ణి, సానుకూలంగా వరాలిచ్చేవాణ్ణి, సంసారబంధ నాశకుణ్ణి, ఈ నశ్వరమైన వరాన్ని కోరుకున్నాను. ఈ కోరుకోవటం కాలం తీరినవాడికి పోసే ఔషధంలాంటిది.

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించిన రీతి ముక్తి ఫలదుం డైనట్టి పంకేజ లో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్?

300

తా ॥ మోక్షాన్ని ప్రసాదించే పరాత్పరుడు ప్రత్యక్షమయి, ప్రసన్నతతో వరాన్ని కోరుకొమ్మంటే ధనహీనుడు, రాజదర్శనం చేసి వరిపొట్టును ఇప్పించమని కోరినట్లు నేనీ సంసారబంధాన్ని కోరుకున్నాను. నాలాంటి మూఢులు ఈ భూమిమీద ఎవరుంటారు?'

నిష్కామంగా ఆచరిస్తే కర్మ మోక్షసాధనం; మన పరమావధి భగవంతుడు, ఆయన సాక్షాత్కారమే మానవ జీవితానికి పరమప్రయోజనం. సాధననే సాధ్యంగా భ్రమించవద్దని – మార్గంలో ప్రారంభదశని పరమావధిగా భావించవద్దని పదే పదే చెబుతున్నాను. కర్మే జీవిత పరమావధి అని, పరమ పురుషార్థమని ఎన్నడూ భావించకు. భగవత్‌భక్తికోసం ప్రార్థించండి. భగవంతుణ్ణి దర్శించే మహాభాగ్యం మీకు కలుగుతుందని అనుకోండి; అప్పుడు ఆయనను మీరు దేనికోసం ప్రార్థిస్తారు? వైద్యశాలలు, చెరువులు, నూతులు, బాటలు, ధర్మశాలలు మొదలైన వాటికోసం మీరు అతణ్ణి అర్థిస్తారా? నా మాట వినండి! ఇవన్నీ మనం భగవంతుణ్ణి దర్శించనంతవరకే మనకు వాస్తవాలు కాని మనకు ఒక్కసారి

భగవద్దర్శన భాగ్యం లభించిన పక్షంలో వీటన్నింటినీ యథార్థ స్థితిలో క్షణికంగా, స్వప్నతుల్యంగా గాంచుతాం.

అప్పుడు మనం వికాసనిమిత్తం, నిజమైన జ్ఞానం నిమిత్తం, ఉత్తమ భక్తి నిమిత్తం – ఏది నరుడికి నారాయణుణ్ణి పొందిస్తుందో, ఏ నారాయణుడు సచ్చిదానందమయుడని చెప్పవచ్చో, ఏది అలాంటి నారాయణుడికి మనం నిజమైన పుత్రులమని గ్రహింపచేస్తుందో అటువంటి భక్తి నిమిత్తమై ప్రార్థిద్దాం.

—శ్రీరామకృష్ణ పరమహంస

## 14. ధ్రువుడు మరల తన పురమునకు వచ్చుట

సీ. అని యిట్లు చింతించె ననుచు న మ్మైత్రేయ ముని విదురునకు నిట్లనియెఁ దండ్రి!
కమనీయ హరిపాద కమల రజోభిసంస్కృతశరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్తమగు దాన సంతుష్టచిత్తులై వఱలుచు నుండు మీ వంటి వారు
దగ భగవత్పాద దాస్యంబు దక్కంగ నితర పదార్థంబు లెడఁదలందు

తే. మఱచియును గోర నొల్లరు మనుచరిత్ర!, తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచు నున్న కుమారు వార్తఁ, జారుచే విని యుత్తానచరణుఁ డపుడు.

301

వ. మనమున నిట్లని తలంచె.

302

తా ॥ అని ఈ విధంగా ధ్రువుడు చింతించాడని మైత్రేయ మహాముని విదురునికి చెబుతూ "కమనీయమైన శ్రీహరి పాదరేణువులతో అలంకరింపబడిన శరీరం కలవారు యాదృచ్ఛికంగా లభించేదానికి తృప్తిపడుతూ ఆనందిస్తారు. మీవంటివారు భగవత్పాద దాస్యం తప్ప, ఇతరాన్ని పొరపాటున కూడా కోరుకోరు." శ్రీహరి అనుగ్రహాన్ని పొందిన ధ్రువకుమారుడు వస్తున్నాడన్న వార్త చారుల ద్వారా విని 'ఉత్తానపాదుడు' మదిలో ఈ విధంగా తలచాడు.

క. చచ్చిన వారలు గ్రమ్మఱ, వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే?
నిచ్చలు నమంగళుఁడ నగు, నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్.

303

తా ॥ "చనిపోయినవాళ్ళు మళ్ళీ తిరిగిరావటమా? ఇటువంటి వార్త లెక్కడయినా ఉన్నాయా? నిర్భాగ్యుడనైన నాకు శుభాలు ఎలా సిద్ధిస్తాయి?"

క. అని విశ్వసింపకుండియు, మనమున నా నారదుఁడు "గుమారుఁడు వేగం
బునఁ రాఁగలఁ" డనుచును బలి, కిన పలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై.

304

తా ॥ అని ముందు నమ్మలేదు. కాని నారదుడు "నీ కొడుకు తొందరలోనే తిరిగివస్తాడు" అని చెప్పిన మాటల్ని మదిలో తలచి, కృతకృత్యుడైనట్లు భావించాడు.

క. తన సుతుని రాక సెప్పిన, ఘనునకు ధనములును మౌక్తికపు హారములున్
మన మలర నిచ్చి తనయునిఁ గనుఁగొను సంతోష మాత్మఁ గడలుకొనంగన్.

305

తా ॥ తన పుత్రుడు వస్తున్నాడని చెప్పిన చారునికి ధనాన్ని, ముత్యాల హారాన్ని మనఃపూర్తిగా ఇచ్చాడు. కొడుకుని చూడాలనే సంతోషంతో కూడిన ఉత్సాహం మదిలో పొంగింది.

సీ. వలను మీఱిన సైంధవంబులఁ బూన్చిన కనక రథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణ కుల వృద్ధ బంధు జనామాత్య పరివృతుం డగుచు విస్ఫురణ మెరసి
బ్రహ్మనిర్ఘోష తూర్య స్వన శంఖ కాహళ వేణు రవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషితలై సునీతి సురుచు, లుత్తముండు నారూఢి నడవఁ

తే. గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప, నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవన సమీపంబునందు, వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత.

306

తా ॥ అలవిమాలిన జాతిగుఱ్ఱాల్ని పూన్చిన బంగారు రథాన్ని ఎక్కి, బ్రాహ్మణులు, కులపెద్దలు, బంధుజనులు, అమాత్యులు చుట్టిరాగా, వేదాధ్యయనఘోషలు, బాకాలశబ్దాలు,

శంఖనాదాలు, కాహళవాద్యాల విశేషరవాలు, వేణునాదాలు వ్యాపించగా, అలంకరించుకున్న సురుచి, సునీతులు పల్లకీలనెక్కిరాగ, సురుచి సంతానమైన ఉత్తముడు ముందు నడువగా, మహావైభంతో వడివడిగా నడుస్తు తన నగరాన్నుండి బయటికి వచ్చి, ధ్రువుని కోసం వెళుతున్న ఉత్తానపాదునికి ఆ నగరపు సమీపంలోని ఉపవనం చెంతకు వస్తున్న ధ్రువకుమారుడు కనిపించాడు.

చ. అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవిందయుగళార్చన నిర్దళితాఖిలాఘు నీ
శ్వర కరుణావలోకన సుజాత సమగ్ర మనోరథున్ సుతుం
గర మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁడై

307

తా ॥ ఉత్తానపాదుడు, కొడుకును చూచినంతనే ప్రేమ తొణికిసలాడగా తొట్రుపాటుతో రథాన్ని దిగాడు. రమామనోహరుని చరణకమలాలను సేవించి పాపాల్ని పోగొట్టుకున్నవాడు, ఈశ్వరుని కరుణాకటాక్షాలతో కోరికలన్నీ తీరినవాడూ అయిన ధ్రువుని చెంతకు వెళ్ళి ప్రేమతో పులకించిన సంతోషంతో,

తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి, శిరము మూర్కొని చుబుకంబు చేతఁబుణికి
యావ్యయానంద బాష్ప ధారాభిషిక్తుఁ, జేసి యాశీర్వదింప నా చిరయశుండు.

308

తా ॥ కొడుకును బిగికౌగిలిలో బంధించాడు. ముఖాన్ని నిమిరాడు. శిరస్సును ముద్దాడాడు. గడ్డాన్ని పుణికాడు. ఆనందబాష్పాలతో అభిషేకించి ఆశీర్వదించాడు.

క. జనకుని యాశీర్వచనము, లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
దన ఫాలతలము సోఁకఁగ, వినతులు గావించి భక్తి విహ్వలుఁ డగుచున్.

309

తా ॥ జనకుని ఆశీర్వచనాన్ని పొంది, సంతోషంతో తన నుదురు సోకేటట్లు తండ్రిపాదాలపై పడి భక్తితో మ్రొక్కాడు.

తే. అంత నా సజ్జనాగ్రణి యైన ధ్రువుఁడు, దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి
సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి, నగు మొగంబున నాలింగనంబు సేసి.

310

తా ॥ ఆ తరువాత సజ్జనులలో శ్రేష్ఠుడైన ధ్రువుడు భక్తితో తల్లులకు నమస్కరించాడు. సురుచి తనకు నమస్కరించ వచ్చిన ధ్రువుణ్ణి లేవనెత్తి, నవ్వుముఖంతో ఎత్తుకుని కౌగిట చేర్చుకుంది.

సీ. కరమొప్పు నానంద గద్గద స్వరమున జీవింపు మనుచు నాశీర్వదించె;
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు
నతనికిఁ దమయంత ననుకూలమై యుండు సర్వభూతంబులు సమతఁ బేర్చి;
మహిఁ దలపోయ నిమ్న ప్రదేశమునకు ననయంబుఁ జేరు తోయముల పగిదిఁ

తే. గాన ఘను న మ్మహాత్ముని గారవించె, సురుచి పూర్వంబు దలఁపక సుజన చరిత!
విష్ణు భక్తులు ధరను బవిత్రు లగుట, వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు.

311

తా ॥ ఆనందంతో పొంగిపోతున్న గద్గద కంఠంతో “చిరాయువు” గా జీవించమని ఆశీర్వదించింది. భగవంతుని కృపకు పాత్రుడైనవాని చెంతకు అందరూ తాముగా, ‘పల్లపు ప్రదేశానికే నీరు చేరునట్లు’ చేరిపోతారు. అందుకే సురుచి గతాన్ని స్మరించక ధ్రువుణ్ణి గౌరవించింది. విష్ణుభక్తులు పవిత్రులు. వారిపట్ల ఎవరూ కోపించరు.

భక్తుని లక్షణం ఇక్కడ సూచించబడింది. 'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ' – వంటి లక్షణాలుగల భక్తుడంటే నాకు ప్రియుడని శ్రీకృష్ణుడు గీతలో వివరించాడు:

"ఏ ప్రాణిపైనా ద్వేషం లేనివాడూ, మిత్ర భావసంపన్నుడూ, దయాళుమా, మమత్వబుద్ధి శూన్యుడూ, క్షమాశీలుడూ, సర్వదా సంతోషం కలిగి ఉండే వాడూ, సమాహిత చిత్తుడూ, సంయతస్వభావుడూ, తత్త్వవిషయాలలో ధృఢ నిశ్చయం గలవాడూ, మనోబుద్ధులను నాకు అర్పించినవాడూ అయిన భక్తుడు నాకు ప్రియతముడు." (గీత 12.13–14)

వ. కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వాలు లగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పముల నొప్పి; రంత సునీతియుం దన ప్రాణంబుల కంటెఁ బ్రియుండైన సుతు నుపగూహనంబు సేసి తదవయవ స్పర్శనంబు చేత నానందంబు నొంది విగతశోక యయ్యెఁ; నప్పుడు సంతోష బాష్ప ధారాసిక్తంబులై చనుఁ బాలునుం గురిసె నంత.

312

తా ॥ ఉత్తముడూ, ధ్రువుడూ ప్రేమతో పొంగిపోయి పరస్పరం కౌగిలించుకున్నారు. శరీరాలు పులకించిపోగా ఆనంద బాష్పాలతో తడిసిపోయారు. అప్పుడు సునీతి తన ప్రాణాలకంటే ప్రియమైన కొడుకుని కౌగిలించుకొని, అతని శరీర స్పర్శతో ఆనందాన్ని పొంది శోకాన్ని మరిచి పోయింది. ఆనంద బాష్పాలు ధారలై కురవగా, చనుబాలు కూడా వర్షించాయి. అప్పుడు,

సీ. ఉన్నత సంతోష ముప్పతిల్లఁగఁ బౌర జనము లా ధ్రువుతల్లి నెనయఁ జూచి
తొడరిన భవదీయదుఃఖనాశకుఁ డైన యిట్టి తనూజుఁ డెందేని పెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టం డైన వాఁడిప్డు నీ భాగ్యవశము చేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను; నితఁడు భూమండల మెల్లను రక్షించు నిద్ధమహిమఁ;

తే. గమల లోచనుఁ జింతించు ఘనులు లోక, దుర్జయం బైన యట్టి మృత్యువును గెల్తు;
రట్టి ప్రణతార్తి హరుఁడైన యబ్జనాభుఁ, డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము.

313

తా ॥ సంతోషాతిశయంతో పురజనులు ఆ ధ్రువుని తల్లి సునీతిని చూసి ఇలా ప్రశంసించారు: "నీ దుఃఖాన్ని పోగొట్టిన ఈ కుమారుణ్ణి చాలాకాలం క్రిందట నష్టపోయావు. మళ్ళీ నీ భాగ్య విశేషంతో లభించాడు. ఇతడు భూమండలం మొత్తాన్ని పాలించగల మహిమ గలవాడు. పద్మనయనుడైన ఆ శ్రీ మహావిష్ణువుని చింతించేవారు, జయించ వీలుకాని మృత్యువును కూడా జయిస్తారు. ప్రణుతించేవారి ఆర్తిని పోగొట్టే ఆ పద్మనాభుడు, నీ చేత పూజించబడటం నిజం."

వ. అని ప్రశంసించి, రట్లు పౌరజనంబులచేత నుపలాల్యమానుండగు ధ్రువుని నుత్తాన పాదుం డుత్తమ సమేతంబుగా గజారూఢునింజేసి సంస్తూయమానుండును, ప్రహృష్టాంతరంగుండును నగుచుఁ బురాభిముఖుండై చనుదెంచి.

314

తా ॥ అని తనను ప్రశంసిస్తూ పౌరజనులు అనునయిస్తుంటే, ధ్రువుణ్ణి ఉత్తమునితో కూడ కలిపి ఏనుగునెక్కించి, పురజనుల సంస్తుతులను అందుకొంటూ, అంతరంగంలో పొంగిపొరలే సంతోషంతో ఉత్తానపాదుడు పురము వైపుకు బయలుదేరాడు.

సీ. స్వర్ణ పరిచ్ఛద స్వచ్ఛ కుడ్య ద్వార లాలిత గోపురాట్టాలకంబు
ఫల పుష్ప మంజరీ కలిత రంభా స్తంభ పూగ పోతాది విభూషితంబు
ఘనసార కస్తూరికా గంధ జలబంధు రాసిక్తవిపణి మార్గాంచితంబు
మానిత నవరత్న మయ రంగ వల్లీ విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబు

తే. శుభ నదీజల కుంభ సంశోభితంబు, తండుల స్వర్ణ లాజాక్షత ప్రసూన

ఫల బలివ్రాత కలిత విభ్రాజితంబు, నగుచు సర్వతో-లంకృత మైన పురము.

315

వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచు నప్పుడు.

316

తా ॥ ఆ పట్టణం అన్ని వైపులా అలంకరించబడింది. బంగారుమయమైన ఇండ్ల పైకప్పులు, స్వచ్ఛంగా ప్రకాశించే గోడలు, ప్రాకార ద్వారాలతో కూడిన గోపురాలు పూగుత్తులతో, పండ్లతో కూడిన అరటి స్తంభాలతో, పోకచెట్ల బోదెలు మొదలైన వాటితో అలంకరించబడ్డాయి. విపణి వీథులలో కస్తూరి, చందనం, కర్పూరం కలిపిన నీళ్ళు చల్లారు. ప్రతీ గృహప్రాంగణంలో నవరత్నాలతో తీర్చిన రంగవల్లికలు తళుకు లీనుతున్నాయి. పుణ్యనదీ జలంతో సువర్ణకుంభాలు శోభిస్తున్నాయి. బియ్యం, బంగారు పేలాలు, అక్షతలు, పూలు, బలిసామగ్రిగా చల్లబడ్డాయి. అటువంటి పురంలోనికి ప్రవేశించి రాజమార్గంగుండా ఊరేగింపు సాగిపోతున్నప్పుడు–

మ. హరిమధ్యల్ పురకామినీ తతులు సౌధాగ్రంబులందుండి భా
స్వర సిద్ధార్థఫలాక్షత ప్రసవ దూర్వా వ్రాత దధ్యంబువుల్
గరవల్లీ మణిహేమ కంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యా భాగవతోత్తమోత్తమునిపై లీలానుమేయంబుగన్.

317

తా ॥ సన్నని నడుముగల పురస్త్రీలు, వయ్యారంగా మేడలపై నుండి, పూలతీగలవంటి హస్తాలతో ఆవాలు, పూలు, పండ్లు, పుష్పాక్షతలు, గరికపోచలు, మజ్జిగ నీళ్ళు ఆ భాగవతోత్తమునిపై చల్లుతుంటే వారి చేతులకున్న మణికంకణాలు ఘల్లుఘల్లుమని శబ్దం చేస్తున్నాయి.

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణపాత్రరచితమణి దీప

నీరాజనంబుల నివాళింపం బౌరజానపద మిత్రామాత్య బంధుజన పరివృతుండై చనుదెంచి.
318

తా ॥ ఇలా రాజవీథిలోని సౌధాల పైనుండి వాత్సల్యంతో ముత్తైదువులు పుష్పాక్షతాదుల్ని చల్లుతూ, సత్యవాక్యాలతో ఆశీర్వదిస్తూ, బంగారుపాత్రలలో మణిదీపాలను ఉంచి హారతులిచ్చారు. ఇలా ధ్రువుడు పౌరులతో, జానపదులతో మిత్రులతో, అమాత్యులతో, బంధుజనులతో కలసి పురంలోనికి ప్రవేశించాడు.

సీ. కాంచన మయ మరకత కుడ్య మణిజాల సంచయరాజిత సౌధములను
వరసుధా ఫేన పాండుర రుక్మపరికరోదాత్త పరిచ్ఛదతల్పములను
సురతరు శోభిత శుక పిక మిథునాళి గాన విభాసితోద్యానములను
సుమహిత వైదూర్య సోపాన విమల శోభిత జలపూర్ణ వాపీచయముల
తే. వికచ కహ్లార దర దరవింద కైర, వ ప్రదీపిత బక చక్రవాక రాజ
హంస సారస కారండ వాది జల వి, హంగ నినదాభిరామ పద్మాకరముల
319

తా ॥ ఆ నగరంలోని రాజసౌధాలు పచ్చలు తాపిన బంగారు గోడలతో, రత్నమణి ఖచితమైన వాతాయనాలతో (గవాక్షాలతో) ప్రకాశిస్తున్నాయి. ఆ సౌధాలలోని పాలనురుగుల వంటి తెల్లనైన బంగారు జరీ అంచుల దుప్పట్లు పరచిన శయ్యలు, కల్పవృక్షాలతో శోభిస్తూ, చిలుకలు, కోయిలల జంటల ఆలాపాలతో, తుమ్మెదల గానంతో ప్రతిధ్వనించే ఉద్యానవనాలు, వైడూర్యాలు తాపిన మెట్లతో నిర్మించబడి, స్వచ్ఛమైన నిర్మల జలాలతో శోభించే దిగుడు బావులు, కలువలు, తమ్మిపూలు విరాజిల్లుతుండగా, కొక్కెరలు, చక్రవాకాలు, రాజహంసలు, బెగ్గురు పక్షులు, కణుచు పిట్టలు మొదలైన నీటిపక్షుల శబ్దాలతో, మనోహరమవుతున్న కోనేళ్ళతో ఆ రాచనగరు అలరారుతున్నది.

వ. మఱియును.

320

తా ॥ ఇంకా

తే. చారు బహువిధ వస్తువిస్తార మొప్ప, నంగనాయుక్త మగుచుఁ బెంపగ్గలించి
యర్థిఁ దనరారు జనకు గృహంబు సొచ్చె, నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రు పగిది

321

తా ॥ ఎన్నో అందమైన వస్తువులతో, అంగనామణులతో కూడి అతిశయంతో ప్రకాశించే తన తండ్రియైన ఉత్తానపాదుని ప్రాసాదంలోనికి ధ్రువుడు "స్వర్గ ప్రవేశం చేసిన దేవేంద్రుని" లా ప్రవేశించాడు.

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షియైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరంబైన ప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును బ్రజాసమ్మతుండును నవయౌవన పరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుంజేసి వృద్ధవయస్కుండైన తన్నుం దాన యెఱింగి యాత్మగతిఁ బొంద నిచ్చయించి విరక్తుండై వనంబునకుం జనియె; నంత నా ధ్రువుండు శింశుమార ప్రజాపతికూఁతురైన భ్రమి యనుదాని వివాహంబై దాని వలనఁ గల్ప వత్సరు లను నిద్దఱు గొడుకులం బడసి వెండియు వాయు పుత్రియైన యిల యను భార్య యందు నుత్కలనామకుండైన కొడుకు నతి మనోహర యైన కన్యారత్నంబును గనియె; నంతఁ దద్భ్రాతయైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షుని చేత హతుం డయ్యె; నతలి తల్లియుఁ దద్దుఃఖంబున వనంబున కేఁగి యందు గహన దహనంబున మృతిం బొందె; ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్ష శోకవ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుండై చన హిమవద్ద్రోణియందు భూతగణసేవితంబును గుహ్యక

సంకులంబును నైన యలకాపురంబు వొడగని య మ్మహాబాహుండు.

322

తా ॥ కొన్నాళ్ళకు రాజర్షియైన ఉత్తానపాదుడు ఆశ్చర్యకరమైన తన కొడుకు ప్రభావాన్ని విని, చూసి, మదిలో ఆశ్చర్యపడ్డాడు. ప్రజానురక్తుడేగాక ప్రజల సమ్మతిని పొందినవాడని గమనించాడు. నవ యౌవనంతో నిండిన ధ్రువుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు. తన ముసలితనాన్ని గమనించి, తనను తాను ఆత్మ దర్శన సాధన కోసం వైరాగ్యభావంతో అడవికి వెళ్ళాడు.

ఆపైన ధ్రువుడు 'శింశుమారుడ' నే ప్రజాపతి కుమార్తెయైన 'భ్రమి' అనే కన్యను వివాహమాడాడు. ఆమెవలన 'కల్పుడు', 'వత్సరుడు' అనే ఇద్దరు కొడుకుల్ని పొందాడు. ఆ తరువాత వాయుదేవుని పుత్రికయైన 'ఇల' అనే కన్యకను పెళ్ళిచేసుకొని 'ఉత్కలు' డనే పేరుగల కొడుకును, అత్యంత మనోహరమైన కుమార్తెను కన్నాడు.

ధ్రువుని సోదరుడైన 'ఉత్తముడు' పెళ్ళి చేసుకోలేదు. వేటకోసం అడవికిపోయి, హిమవత్పర్వత ప్రాంతంలో యక్షుని చేతిలో హతుడయ్యాడు. అతని తల్లి ఆ దుఃఖంతోనే అడవికి వెళ్ళి దావాగ్నిలో పడి మరణించింది. ధ్రువుడు తన సోదరుని మరణవార్త విని, కోపము, రోషము, శోకము కలిగిన చిత్తంతో, జయశీలంగల రథానెక్కి ఉత్తరాభిముఖుడై వెళ్ళాడు. అలా వెళ్ళి హిమాలయ పర్వతాల నడుమ భూతగణాలతో సేవించబడుతూ, యక్షులతో నిండిన అలకాపురాన్ని చూశాడు.

## 15. ధ్రువుడు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము చేయుట

మ. ఘనశౌర్యోన్నతి తోడ సర్వ కకుభాకాశంబులందుం బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయాన్వీతాత్మలై; రుగ్ర సా
ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్.

323

వ. ఇట్లు వెడలి యా ధ్రువునిం దాఁకిన.

324

తా ॥ ధ్రువుడు శౌర్యాతిశయంతో, అన్నిదిక్కులు, ఆకాశం ప్రతిధ్వనించేటట్లు శంఖాన్ని పూరించాడు. ఆ శంఖనాదాన్ని విన్న యక్షకాంతలు భయాన్వితులై కంపించారు. యోధులైన యక్షులు భయంకరములైన యుద్ధసాధనాన్ని గ్రహించి, యుద్ధోత్సాహంతో అలకాపురినుండి బయటికొచ్చారు. అలావచ్చి ధ్రువుణ్ణి ఎదురొడ్డి నిలిచారు.

చ. కరము మహారథుండు భుజగర్వ పరాక్రమశాలియున్ ధను
ర్ధరుఁడును శూరుఁడౌ ధ్రువుఁడు దన్ను నెదిర్చిన యక్షకోటిఁ జె
చ్చెరఁ బదుమూఁడువేల నొకచీరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడు మూఁడు శితకాండములం దగ గ్రువ్వనేసినన్.

325

తా ॥ మహారథుడు, భుజ బలపరాక్రమశాలి, ధనుర్ధరుడైన ధ్రువుడు, తనను ఎదిరించి పోరాడుతున్న పదమూడు వేలమంది యక్షుల గుంపును లెక్కచెయ్యకుండ మూడేసి వాడిబాణాలను ఒక్కసారే వేస్తూ యుద్ధం చేశాడు.

ఉ. వారు లలాటముల్ వగిలి వారక సోలియుఁ దేఱి యమ్మహో
దారు పరాక్రమ ప్రకట ధైర్యముఁ దత్కర లాఘవంబుఁ బ
ల్మాఱు నుతించుచుం గుపితమానసులై పదతాడితప్రదు
ష్టోరగకోటి వోలెఁ జటులోగ్ర భయంకర రోషమూర్తులై.

326

తా ॥ ధ్రువుని బాణాల దెబ్బకు నొసళ్ళు పగిలి, అలసటతో సోలిపోయి, తెలివితప్పి మళ్ళీ తేరుకొని, ఆ ధ్రువుని మహిమను, చూపించే ధైర్యాన్ని, చేతి ఒడుపును పలుమార్లు కీర్తిస్తూనే కోపగించుకున్నారు యక్షులు. కాళ్ళతో తొక్కబడ్డ కాలసర్పాలవలె దుస్సహమైన రోషంతో భయంకరంగా విజృంభించారు.

ఉ. ఆ రథికోత్తముం దొడరి యందఱు నొక్కటఁ జుట్టు ముట్టి యా
ఱాఱు శిలీముఖంబులఁ దదంగములన్ బగిలించి వెండి వి
స్ఫారగదా శర క్షురిక పట్టిస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁడైన రథిసత్తముపైఁ గురిపించి రేపునన్.

327

తా ॥ రథికోత్తముడైన ధ్రువుణ్ణి, యక్షులంతా కలసి ఒక్కుమ్మడిగా చుట్టుముట్టారు. ఆరేసి బాణాలను ధ్రువుని అవయవాలు పగిలేలా ప్రయోగించారు. ఇంకా వలయంగా త్రిప్పి, గదలు, ఖడ్గాలు, ఈటెలు, బరువైన లోహాయుధాలు, శూలాలు ధ్రువుని పైనా, సారథి పైనా ప్రయోగించారు.

వ. అట్లు గురియించిన నతండు.

328

తా ॥ ఆ విధంగా ఆయుధాలను వర్షంలా కురిపించగా, ధ్రువుడు.

క. పెంపఱి యుండెను ధారా, సంపాతచ్ఛన్నమైన శైలము భంగిన్
గుంపులు గొని యాకసమునఁ, గంపించుచు నపుడు సిద్ధగణములు వరుసన్.

329

తా ॥ 'ఎడతెరపిలేని వర్షధారలతో కప్పబడిన పర్వతంలాగ' కాసేపు విజృంభించటం మాని నిలిచాడు. ఆకాశంలో సిద్ధగణాలు గుంపులు గుంపులుగా చేరి ధ్రువుని పరిస్థితిని చూచి కంపించిపోయారు.

క. హాహాకారము లెసఁగఁగ, నోహో యీ రీతి ధ్రువపయోరుహహితుఁ డు
త్సాహము సెడి యిటు దైత్యస, మూహార్ణవమందు నేఁడు మునిఁగెనె యకటా!

330

వ. అని చింతించు సమయంబున.

331

తా ॥ భయంతో కంపించే సిద్ధుల హాహాకారాలు అతిశయించాయి. "ఓహో!ఈ ధ్రువుడనే సూర్యుడు ఉత్సాహాన్ని కోల్పోయి ఈ విధంగా రాక్షస సమూహమనే సముద్రంలో మునిగిపోయాడే" అని చింతించే సమయంలో–

క. తా మాతని గెలిచితి మని, యా మనుజాశనులు పలుక నట నీహార
స్తోమము సమయించు మహో, ద్దాముండగు సూర్యుఁబోలి తద్దయుఁ దోఁచెన్.

332

తా ॥ యక్షులు ఆ విధంగా ధ్రువుణ్ణి గెలిచామని సంతోషించే సమయంలో మంచు తెరలను మాయంచేసి ప్రకాశించే సూర్యునిలాగ ధ్రువుడు కనిపించాడు.

వ. అట్లు దోఁచిన.

333

తా ॥ ఆ విధంగా కనిపించి.

మ. అరి దుఃఖావహమైన కార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కర బాణావళిఁ బింజపింజ గరవంగా నేసి ఝంఝానిలుం
డురు మేఘావళిఁ బాఱఁ దోలుగతి నత్యుగ్రాహిత క్రూర బం
ధుర సశస్త్రావళి రూపుమాపె విలసద్దోర్లీల సంధిల్లఁగన్.

334

తా ॥ శత్రువులకు దుఃఖాన్ని కలిగించే ధనుస్సును శౌర్యస్ఫూర్తితో ధరించి, భీకరమైన బాణాలను పరంపరగా ప్రయోగించాడు. ఝంఝామారుతానికి మేఘాలు చెదరినట్లు, మిక్కిలి భయంకరంగా సమీపించే శస్త్రావళినన్నిటినీ తన బాహుబలక్రీడతో రూపుమాపాడు.

చ. మఱి యపు డమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబాణముల్
గఱకరిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధి వర్మముల్
పఱియలు సేసి యంగములు భంగము నొందఁగఁ జేసి
వ్రేల్మిడిన్ గిఱికొని పర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్.

335

తా ॥ అసమాన బలుడైన ధ్రువుడు, మహోగ్రమైన బాణాలను శత్రువుల మర్మస్థానాలలో బలంగా నాటుకునే విధంగా వేశాడు. చిటికెలో అంగాలను ఖండించాడు. ఇదెలా ఉందంటే పర్వతాల రెక్కలను ఇంద్రుడు తెగగొట్టిన రీతిగా ఉంది.

వ. అయ్యవసరంబున.

336

తా ॥ ఆ సమయంలో,

చ. అలఘు చరిత్రుఁ డమ్మనుకులాగ్రణిచే వికలాంగులైన వా
రల సకిరీట కుండల విరాజిత మస్తక కోటిచే సము
జ్జ్వల మణికంకణాంగద లసద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్యమై తనరె సంచిత వీరమనోహరాకృతిన్.

337

తా ॥ గొప్ప నడవడికతో ప్రసిద్ధుడైన, మనువంశ శ్రేష్ఠుడైన ఆ ధ్రువుని చేతిలో వికలాంగులైన శత్రుభటుల శిరస్సులు తెగిపడి కిరీటాలతో, కుండలాలతో ప్రకాశిస్తున్నాయి. అలాగే తెగిపడిన బాహువులు మణికంకణాలతో, భుజకీర్తులతో ప్రకాశిస్తున్నాయి. యుద్ధ భూమి మొత్తం ఇటువంటి శిరస్సులతో, భుజాలతో నిండి వీరమనోహరమైన ఆకృతితో అతిరమ్యంగా కనిపించింది.

వ. అంత హతశేషులు.

338

తా ॥ అప్పుడు చావగా మిగిలిన వారు

క. వరబలుఁడగు మను మనుమని, శరభిన్నాంగు లగుచు సమరవిముఖులై
హరిరాజముఁ గని పఱచెడు, కరిబృందముఁ బోలెఁ జనిరి కళవళపడుచున్.

339

తా ॥ స్వాయంభువ మనువు యొక్క మనుమడైన ధ్రువునిచే ప్రయోగించబడిన బాణాలతో చీల్చబడిన అవయవాలు కలవారై, యుద్ధానికి విముఖులై "సింహాన్ని చూచి పరుగెత్తే కరిబృందంలాగా" తొక్కిసలాడుతూ పారిపోయారు.

క. అప్పుడు రాక్షసమాయలు, గప్పిన ధ్రువుఁ డసురవరుల కార్యం బెఱుఁగం
జొప్పడక వారిఁ బొడగన, దెప్పర మగుటయును సారథిం గని యంతన్.

340

తా ॥ అప్పుడు రాక్షసులు 'రాక్షసమాయను' ప్రయోగించగా, ధ్రువుడు ఆ రాక్షసమాయను తెలుసుకోలేక, వారిజాడను తెలియలేక సారథితో ఇలా అన్నాడు:

క. తల పోయఁగ భువి మాయా, వుల కృత్యం బెఱుఁగ నెవరు వోలుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ, దలఁపఁగ నదిగాన రాక తద్దయు మానెన్.

341

తా ॥ 'ఆలోచిస్తే ఈ భూమి మీద మాయావుల చేష్టలను తెలుసుకోవటం ఎవరికి వీలవుతుంది?' అని అంటూ ఆ అలకాపురిలోనికి ప్రవేశించాలని అనుకున్నాడు. కాని ఆ పట్టణమే కనిపించక పోయేసరికి ఆ ప్రయత్నాన్ని మానుకున్నాడు.

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుండైన యాధ్రువుండు సప్రయత్నుఁ డయ్యును బర ప్రతియోగ శంకితుండై యుండె నయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె; నంత సకలదిక్తటంబుల వాయుజనితం బయిన రజఃపటలంబు దోఁచె; దత్ క్షణంబ యాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభాకలితగర్జారవయుక్తమేఘంబులమోఘంబులై భయంకరాకారంబులై తోఁచెనంత.

342

తా ॥ ఆ విధంగా శత్రువుల పట్టణంలోనికి వెళ్ళటం మాని, చిత్రమైన రథాన్నెక్కిన ధ్రువుడు శత్రుప్రయోగముపట్ల శంక కలిగి చూస్తున్నాడు. ఆ సమయంలో మహాసముద్రపు ఘోషలాగ ఒకశబ్దం వినిపించింది. ఆ పైన అన్నిదిక్కులలోను గాలులతో కూడిన దుమ్ము తెరలు తెరలుగా కప్పివేసింది. ఆ క్షణంలోనే ఆకాశంలో మెరుపులతో ప్రకాశిస్తు మేఘాలు గర్జిస్తూ

భయంకరాకారాలై తోచాయి. అవి వ్యర్థమైన మేఘాలు కాలేదు.

మ. అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాల మట్లేఁచి బో
రన మస్తిష్కపురీష మూత్ర పల దుర్గంధాస్థి మేదశ్శరా
సన నిస్త్రింశ శరాసి తోమర గదా చక్ర త్రిశూలాది సా
ధన భూభృ ద్భుజగావళిం గురిసె నుద్దండ క్రియాలోలతన్.

343

తా ॥ రాక్షసమాయ వల్ల ఎడతెగకుండ ధ్రువునిపై పుర్రెలు, మలము, మూత్రము, మాంసము కుళ్లిపోయిన ఎముకలు, మెదడులోని క్రొవ్వు వర్షించాయి. విండ్లు, ఖడ్గాలు, అమ్ములు, కత్తులు, ఈటెలు, గదలు, చక్రాలు, త్రిశూలాలు మొదలైన ఆయుధాలను కురిపించాయి. కొండలు, పాములు భయపెట్టే విధంగా వచ్చి పైనపడుతున్నాయి.

వ. మఱియు మత్తగజ సింహవ్యాఘ్ర సమూహంబులును నూర్మిభయంకరంబై సర్వతఃప్లవనం బయిన సముద్రంబును గానంబడియె; వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైన మహాహ్రదంబునుం దోఁచె; న వ్విధంబున నానా విధంబులు ననేకంబులు నవిరళభయంకరంబులు నయిన యసురమాయలు గ్రూర ప్రవర్తనులగు యక్షులచేత సృజ్యమానంబులై యడరు; నా సమయంబున.

344

తా ॥ ఇంకా మదపుటేనుగులు, సింహాలు, పెద్దపులుల సమూహాలు వచ్చి చుట్టుముట్టాయి. అలలతో భయాన్ని కొలుపుతూ సముద్రం అన్ని వైపులా ప్రవహించే విధంగా కనిపించింది. కల్పాంతకాలంలో లాగా భయంకరమైన మహాహ్రదం (పెద్దమడుగు) కనిపించింది. ఆ విధంగా, నానారకాలుగా భయంకరమైన రాక్షసమాయలు క్రూర ప్రవర్తనులైన యక్షులచేత అవిరళంగా కల్పించబడినాయి. ఆ సమయంలో–

క. అనయంబును నయ్యక్షుల, ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్
మనుమనుమని మను మను మని, మనమునఁ దలఁచుచును దత్సమక్షంబునకున్

345

తా ॥ ఆ యక్షుల మాయలు తెలిసికొని, మునిసమూహం "మనువు యొక్క మనుమనివైన నీవు 'మను–మను' (జీవించు! జీవించు!)" అని మదిలో ఆశీర్వదిస్తూ ధ్రువుని సమక్షానికి వచ్చారు.

వ. చనుదెంచి యాధ్రువుం గని యిట్లనిరి.

346

తా ॥ ధ్రువుణ్ణి చూచి ఇలా అన్నారు:

సీ. అనఘాత్మ! లోకు లెవ్వని దివ్య నామంబు సమత నాకర్ణించి సంస్మరించి
దుస్తరంబైన మృత్యువునైన సుఖవృత్తిఁ దరియింతు; రట్టి యీశ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గ పాణియు భక్తజనార్తిహరుండును నైన విభుఁడు కని
భవదీయ విమతులఁ బరిమార్చుఁగా కని పలికిన మునుల సంభాషణములు

తే. విని కృతాచమనుఁడు రమావిభుని పాద, కమలముఁ దలంచి రిపుభయంకరమహోగ్ర
కలిత నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ, బూనఁ దడవఁ దదీయ సంధానమునను.

347

తా ॥ "ఓ పుణ్యాత్మా! ఎవరి దివ్యనామాన్ని సమదృష్టితో ఆకర్ణించి, సంస్మరించి దాటరాని మృత్యువును కూడా లోకులు దాటగలుగుతున్నారో, అటువంటి ఈశ్వరుడు, పరాత్పరుడు, భగవంతుడు, శార్ఙ్గమనే ధనుస్సును ధరించినవాడు, భక్తుల ఆర్తిని హరించేవాడు అయిన ప్రభువు నీ శత్రువుల్ని పరిమార్చుగాక!" అని పలికే మునుల సంభాషణను విని ధ్రువుడు

ఆచమించి, లక్ష్మీనాథుని పాదపద్మాలను స్మరించి, శత్రుభయంకరమైన నారాయణాస్త్రాన్ని వింటికి అనుసంధించాడు.

తే. కడcగి గుహ్యక మాయాంధకార మపుడు, వెరవు సెడి దవ్వదవ్వుల విరిసిపోయె
విమలమైన వివేకోదయమునc జేసి, సమయు రాగాదికంబుల సరణి నంత.

348

తా ॥ నారాయణాస్త్రాన్ని ధ్రువుడు సంధించినంతనే గుహ్యకుల మాయ చెడిపోయి దూరదూరంగా చెదరిపోయింది. ఆ చెదరిపోవటం ఎలా ఉందంటే స్వచ్ఛమైన వివేకం ఉదయించగానే రాగద్వేషాదులు సమసిపోయినట్లుగా ఉంది.

మ. వరనారాయణ దైవతాస్త్ర భవదుర్వార ప్రభాహేమ పుం
ఖ రుచిస్ఫార మరాళ రాజసిత పక్ష క్రూరధారావత
చ్ఛర సాహస్రము లోలి భీషణ విపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునc గానc జొచ్చు శిఖీసంఘాతంబు చందంబునన్.

349

తా ॥ నారాయణాస్త్రం నుండి పుట్టిన వేలాదిబాణాలు వారింప వీలుకాని కాంతితో బంగారు పిడులు కలిగి ఉన్నాయి. అవి రాజహంసరెక్కల ఈకలు కట్టబడి నట్లున్నాయి. దట్టమైన అడవిలోని అగ్నిలాగా భయంకరమైన శబ్దంతో శత్రుసమాహంపై వేలాదిగా ఆ బాణాలు వచ్చి పడుతున్నాయి.

వ. అట్లేసిన.

350

చ. ఖర నిశిత ప్రదీప్తఘన కాండపరంపర వృష్టిచేc బొరి

బొరి వికలాంగులై యదరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై
గరుడునిఁ జూచి భూరిభుజగ ప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచు చందమునఁ జిత్రరథున్ బలుపూని తాఁకినన్.

351

తా ॥ ఆ విధంగా ప్రయోగించిన, కఠినత్వం వాడితనం కలిగి ప్రకాశించే బాణాల పరంపరకు రాక్షసులు వికలాంగులయ్యారు. యక్షులు మళ్ళీ పెద్దపెద్ద కత్తుల్ని చేత ధరించి, 'గరుత్మంతుణ్ణి సర్పాల సమూహాలు ఎదరించినట్లు' చిత్రరథుడైన ధ్రువుణ్ణి ఎదిరించారు.

ఉ. వారలఁ జండతీవ్ర శరవర్గము చేత నికృత్తపాద జం
ఘోరు శిరోధరాంబక కరోదర కర్ణులఁ జేసి యోగి పం
కేరుహమిత్ర మండల సకృద్భిద నెట్టి పదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై.

352

తా ॥ ఎదిరించిన యక్షుల్ని, ధ్రువుడు తన వాడియైన, భయంకరమైన బాణాలతో వారిపాదాలను, పిక్కలను, తొడలను, మెడలను, చేతుల్ని, ఖండించాడు. కళ్ళను పీకి, పొట్టను చీల్చి లోకాంతరానికి పంపాడు. ఒక్కసారిగా సూర్యమండలాన్ని భేదించుకొని యోగులు పొందే పదాన్ని, తన బాహుబలంతో యక్షులకు కల్పిస్తున్నాడు.

వ. ఇవ్విధంబున నా చిత్రరథుండగు ధ్రువునిచేత నిహన్యమానులును నిరపరాధులును నయిన గుహ్యకులం జూచి యతని పితామహుండైన స్వాయంభువుండు ఋషిగణ పరివృతుండై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె; వత్సా! నిరపరాధులైన యీ పుణ్యజనుల నెట్టి రోషంబున వధియించితి, వట్టి నిరయహేతువైన రోషంబుసాలు; భ్రాతృవత్సల! భ్రాతృవధాభితప్తుండవై కావించు నీ యత్నం బుడుగుము.

353

తా ॥ ఈ విధంగా చిత్రరథుడైన ధ్రువునిచేత చంపబడ్డ నిరపరాధులైన యక్షులను చూసి, అతని తాతగారైన స్వాయంభువ మనువు, ఋషిగణంతో పరివేష్టించి వచ్చి ధ్రువుణ్ణి చూసి ఇలా అన్నాడు: “వత్సా! నిరపరాధులైన ఈ పుణ్య జనుల్ని ఎంత రోషంతో చంపావు? నరక ప్రాప్తికి హేతువైన కోపం ఇక చాలు! సోదరుని పట్ల ప్రేమగలిగిన ధ్రువా! సోదరుని మరణానికి బాధపడిచేస్తున్న ఈ ప్రయత్నాన్ని విరమించుకో!

క. అనఘాఁ మనుకులమున కిది, యనుచిత కర్మంబ! యొకనికై పెక్కం డ్రి
ట్టని మొనఁ ద్రుంగిరి; యిది నీ, కనయంబును వలవ; దుడుగు మయ్య కుమారా!

354

తా ॥ ఓ పుణ్యాత్మా! మను కులంలో పుట్టిన నీకిది తగని పని. ఒక్కని కోసం ఇంతమందిని చంపావు! కుమారా! నీకిది అసలు తగదు. మానుకో!

వ. అదియునుం గాక దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట హృషీకేశానువర్తనులైన సాధులకుం దగదు; నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలంచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైన విష్ణుని పదంబులఁ బూజించి తత్పరమపదంబును బొందితి; వట్టి భగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు; భాగవతుల చిత్తంబులకును సమ్మతుండవు, మఱియు సాధువర్తనుండ వన నొప్పు నీ వీ పాపకర్మం బెట్లు సేయ సమకట్టితి? వే పురుషుం డైన నేమి మహాత్ములయందుఁ దితిక్షయు, సములయందు మైత్రియు, హీనులయందుఁ గృపయు నితరంబులగు సమస్త జంతువులయందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుండైన భగవంతుండు ప్రసనున్నం దగు; నతండు ప్రసన్నుం డయిన వాఁడు ప్రకృతి గుణంబుల బాసి లింగశరీరభంగంబు గావించి బ్రహ్మానందంబునుం బొందు; నదియునుంగాక

కార్యకారణ సంఘాతరూపంబైన విశ్వం బీశ్వరునందు నయస్కాంత సన్నిధానంబు గలిగిన లోహంబు చందంబున వర్తించు; నందు సర్వేశ్వరుండు నిమిత్తమాత్రంబుగాఁ బరిభ్రమించు; నట్టి యీశ్వరుని మాయాగుణ వ్యతికరంబున నారబ్ధంబులైన పంచభూతంబుల చేత యోషిత్పురుషవ్యవాయంబువలన యోషిత్పురుషాదిరూప సంభూతి యగు నవ్విధంబునఁ దత్సర్గంబు దత్సంస్థానంబుఁ, దల్లయంబు నగుచు నుండు; నిట్లు దుర్విభావ్యం బైన కాలశక్తింజేసి గుణక్షోభంబున విభజ్యమానవీర్యుండు ననంతుండు ననాదియు నైన జనంబులచేత జనంబులం బుట్టించుచుండుటం జేసి యాదికరుండును, మృత్యుహేతువున జనంబుల లయంబు నొందించుటం జేసి యంతకరుండును, ననాది యగుటం జేసి యవ్యయుండును నైన భగవంతుండు జగత్కారణుండగుం; గావున నీ సృష్టిపాలన విలయంబులకుం గర్త గానివాని వడువున దానిఁ జేయుచుండు, నిట్లు మృత్యురూపుండును బరుండును సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్ష పరపక్షంబులు లేవు; కర్మాధీనంబులైన భూతసంఘంబులు రజంబు మహావాయువు ననుసరించు చాడ్పున నస్వతంత్రంబు లగుచు నతని ననువర్తించు; నీశ్వరుండును జంతుచయాయు రుపచయాపచయ కరణంబులం దస్పష్టుండును నగు జీవుండు గర్మబద్ధుం డగుటం జేసి కర్మంబు వానికి నాయు రుపచయాపచయంబులం జేయుచుండు; మఱియు సర్వజగత్కర్మసాక్షి యగు సర్వేశ్వరుని.

355

తా ॥ దేహాభిమానంతో, పశువులవంటివారై ప్రాణికోటిని హింసించటం శ్రీ మహావిష్ణు మార్గ ప్రవర్తకులకు తగని పని. సర్వప్రాణికోటిని నీలాగే భావించి, సర్వభూత నివాసుడైన శ్రీ మహావిష్ణుపాదాలను పూజించి, కష్టసాధ్యమైనప్పటికీ ఆ విష్ణుపదాన్ని పొందావు. అటువంటి భగవంతుని హృదయంలో భావించి చూడబడిన వాడివి. పరమభక్తులైన భాగవతుల చిత్తాలకు సమ్మతమైన వాడివి. సాధువర్తనుడవు. అటువంటి నీవు పాపకార్యాన్ని చేయడానికి ఎలా పూనుకున్నావు? ఏ మానవుడైనా సరే! మహాత్ములైన గొప్పవారిపట్ల సహనాన్ని, తనతో

సమానమైన వారిపట్ల స్నేహాన్ని, తనకంటే తక్కువ వారిపట్ల కృపను, మిగిలిన సమస్త ప్రాణికోటిపట్ల సమభావాన్ని కలిగి ప్రవర్తించాలి. అటువంటివారిపట్ల సర్వాత్ముడైన భగవంతుడు ప్రసన్నుడవుతాడు. అలా భగవంతుని అనుగ్రహాన్ని పొందినవాడు ప్రకృతి సంబంధ గుణాలనుండి విమోచనం పొందుతాడు. ప్రాకృత శరీర భావాన్ని వీడి బ్రహ్మానందాన్ని పొందుతాడు. అంతేకాకుండా కార్యకారణ సంవిధానంతో ప్రవర్తించే ఈ విశ్వం మొత్తం, ఇనుము అయస్కాంతపు సన్నిధిలో ఆకర్షించబడి ప్రవర్తించినట్లు ఆ శ్రీమన్నారాయణుని సన్నిధిలో ప్రవర్తిస్తుంటుంది.

సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు నిమిత్తమాత్రుడై వర్తిస్తాడు. అటువంటి ఈశ్వరుని మాయాగుణ సంబంధంతో, పంచభూతాలచే సంఘటించబడిన దేహాలను పొందిన స్త్రీ, పురుషులు, తమ పరస్పర సంబంధంతో మళ్ళీ స్త్రీపురుషుల్ని కంటున్నారు. ఈ విధంగా సృష్టి, స్థితి, లయాలు జరుగుతున్నాయి. ఇలా భావించడానికే అసాధ్యమైన కాలమహిమవలన, తొక్కిడి పడుతున్న గుణాలను విభజించే శక్తిమంతుడు, 'అనంతుడూ' 'అనాదీ' అయిన ఆ భగవంతుడే, జనులనుండి జనులను సృష్టించటంచేత ఆద్యుడని, మృత్యువు కారణంగా లయింపచేయటంచేత అంతకుడని, అనాది కావటంచేత అవ్యయుడని, ఆయననే పిలుస్తారు. జగత్తుకు కారణభూతుడైన భగవంతుడాయనే. ఈ సృష్టి, స్థితి, లయాలకన్నిటికీ తానేమీ కర్తను కానన్నట్లే ఉండి, ఆ కార్యాలను నెరవేరుస్తుంటాడు. ఈ విధంగా మృత్యురూపుడు, పరుడు(అతీతుడు), సమవర్తి అయిన ఈశ్వరునికి 'స్వపక్షం–పరపక్షం' అనే భేదాలులేవు. కర్మకు ఆధీనమైన జీవరాశులు, పెనుగాలిని అనుసరించే ధూళిలాగ అస్వతంత్రులై పరమాత్మను అనుసరించి ప్రవర్తిస్తారు. పరమేశ్వరుడు జీవరాశులకు ఆయుర్దాయాన్ని సమకూర్చటం, హరించటం అనే పనిని చేయడాన్ని గుర్తించలేకున్నాము. జీవులు కర్మబద్ధులు కాబట్టి, వారి కర్మననుసరించే పరమాత్మ వారికి ఆయువును సమకూర్చటం, హరించటం చేస్తారు. సర్వజగత్తుకు 'కర్మసాక్షి' – ఆ సర్వేశ్వరుడే. ఆయనను–

క. కొందఱు స్వభావ మందురు, కొందఱు కర్మం బటంౘ్రు, కొందఱు కాలం
బందురు, కొందఱు దైవం, బందురు, కొంద ఱొగిఁ గామ మంౘ్రు మహాత్మా!

356

తా ॥ కొందరు 'స్వభావ' మని, మరికొందరు 'కర్మ' మని, ఇంకొందరు 'కాల' మని, కొందరు 'దైవ' మని, కొందరు 'కామ' మని అంటారు.

ఎవరెన్ని విధాలుగా తలచినా స్వరూప చింతనమే. అయితే ఎవరు ఏ విధంగా భావన చేసినప్పటికీ 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' – అన్నదే ప్రామాణికం. సాంఖ్యమతమైనా, యోగమతమైనా, నైయాయిక మతమైనా, జలానికి జలధి గమ్యమైనట్లు ఈశ్వరుడే గమ్యం. గీతలో కూడ "యేయథామాంప్రపద్యన్తే" అనే శ్లోకంలో నన్ను ఏ విధంగా భావించినప్పటికీ చివరకు తననే ఆశ్రయిస్తున్నారని చెపుతాడు.

వ. ఇట్టి లవ్యక్తరూపుండును, నప్రమేయుండును, నానాశక్త్యుదయ హేతుభూతుండును నైన భగవంతుండు సేయు కార్యంబుల బ్రహ్మరుద్రాదు లెఱుంగరన నతని తత్త్వంబు నెవ్వరెఱుంగ నోపుదురు? కావునం బుత్రా! యిట్లుత్పత్తి నాశంబులకు దైవంబ కారణం బై యుండుఁ గాన నిద్ధనదానుచరులు భవదీయ భ్రాతృహంత లగుదురే? భూతాత్మకుండు భూతేశుండు భూతభావనుండు సర్వేశ్వరుండు పరాపరుండు నగు నీశుండ మాయాయుక్తుండై స్వశక్తిచే సృష్టిస్థితి లయంబులం జేయు. ఐన ననహంకారంబునంజేసి గుణకర్మంబులచే నస్పృశ్యుం డగుచు వర్తించు. అదియునుం గాక యీ ప్రజాపతులు విశ్వసృణ్ణామంబుల నియంత్రితులై ముకుఁద్రాళ్ళు వెట్టిన పశువులం బోలి యెవ్వని యాజ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టి దుష్టజన మృత్యువు, సుజనామృత స్వరూపుండు, సర్వాత్మకుండు, జగత్పరాయణుండు నైన యీశ్వరుని సర్వ ప్రకారంబుల శరణంబుఁ బొందుము. అదియునుం గాక.

357

తా ॥ ఈ విధంగా అవ్యక్తరూపుడై, ఏ కొలతలకూ లొంగని అప్రమేయుడై, వివిధశక్తుల ఆవిర్భావ కారకుడైన భగవంతుడు చేసే కార్యాలను బ్రహ్మరుద్రాదులే తెలియలేరు. ఇక అతని తత్త్వాన్ని ఇతరులేమి తెలుసుకోగలరు? కాబట్టి కుమారా! పుట్టుకకు—చావుకు దైవమే కారణం. ఈ కుబేరుని అనుచరులు నీ సోదరుని చంపిన హంతకులు కారు! జీవులలో నున్న భూతాత్మకుడు, జీవకోటికి ప్రభువైన భూతేశ్వరుడు, జీవులను కల్పించే భూతభావనుడు, సర్వేశ్వరుడు, పరాపరుడు, మాయతో కూడిన వాడైన ఈశ్వరుడు సృష్టిస్థితిలయాలను స్వశక్తిచే చేస్తున్నాడు. అయినా అహంకారరాహిత్యం వల్ల గుణకర్మలు అతనిని అంటుకోవు. ఈ ప్రజాపతులు విశ్వసృష్టికి నియంత్రితులై "ముక్కుతాళ్ళతో కట్టబడిన పశువుల్లాగా" భగవంతుని ఆజ్ఞకు బద్ధులై ప్రవర్తిస్తారు. దుష్టజనులకు మృత్యుస్వరూపుడు, సుజనులకు అమృతస్వరూపుడు, సర్వాత్మకుడు, జగత్పరాయణుడు అయిన ఈశ్వరుణ్ణి అన్ని విధాలా శరణు వేడుకో!" అంతే కాకుండా,

సీ. అనఘాత్మ! నీవు పంచాబ్ద వయస్కుండ వై పినతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్నమర్ముండ వగుచును జనయిత్రి దిగనాడి వనము కేగి
తప మాచరించి యచ్చపు భక్తి నీశ్వరుఁ బూజించి మహితవిభూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్తరంబైన పదమును బొందితి, వది గాన భూరిభేద

తే. రూప మైన ప్రపంచంబు రూఢి నే మ, హాత్మునందుఁ బ్రతీతమై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు, నైన యీశ్వరుఁ బరమాత్ము ననుదినంబు.

358

తా ॥ "ఓ పుణ్యాత్మా! నీవు అయిదు సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు, మర్మచ్ఛేదకంగా పినతల్లి అన్నమాటలకు నొచ్చుకొని, కన్నతల్లిని సైతం వీడి అడవులకు వెళ్ళావు. అక్కడ తపస్సుచేసి, నిక్కమైన భక్తితో ఈశ్వరుణ్ణి పూజించి, మహావైభవంతో త్రిలోకోత్తరమైన ధ్రువపదాన్ని పొందావు. అనేక రూపభేదాలతో కూడిన ఈ ప్రపంచం, ఏ మహాత్మునిలో ప్రతీతమై

ప్రకాశించునో, అటువంటి గుణరహితుణ్ణి, అద్వితీయుణ్ణి, అక్షరుణ్ణి, ఈశ్వరుణ్ణి, పరమాత్ముణ్ణి అనుదినమూ అన్వేషించాలి.

సీ. కైకొని శుద్ధంబు గతమత్సరంబును నమలంబు నగు హృదయంబునందు
సొలయ కన్వేషించుచును బ్రత్యగాత్ముండు భగవంతుఁడును బర బ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు నవ్యయుఁ డుపపన్న సకల శక్తియుతుండు సగుణుఁ డజుఁడు
నయిన సర్వేశ్వరునం దుత్తమంబైన సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి

తే. రూఢి సోఽహమ్మ మేతి ప్రరూఢ మగుచు, ఘనత కెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు
ద్రెంచి వైచితి; కావున ధీవరేణ్య; సర్వశుభహాని యైన రోషంబు వలదు.

359

తా ॥ ఆ పరమాత్ముని అన్వేషించడానికి హృదయాన్ని పరిశుద్ధం చేసికొని, మాత్సర్యాన్ని వీడి, నిర్మలత్వంతో అలసి పోకుండా నిరంతరం ప్రయత్నించాలి. ఎదుటనే కనిపించే ప్రత్యగాత్ముడు, భగవంతుడు, పరబ్రహ్మమయుడు, ఆనంద స్వరూపుడు, అవ్యయుడు, సకలశక్తి సంపన్నుడు, గుణాలను స్వీకరించేవాడు, పుట్టుక లేనివాడు అయిన సర్వేశ్వరునియందు సద్భక్తి కలిగి, సర్వభూతకోటి పట్ల సమదృష్టిని అభ్యసించావు. "నేను–నాది" అనే అవిద్యా రూపమైన పీటముడిని త్రెంచివేశావు. కాబట్టి ఓ ధీవరేణ్యా! సర్వశుభాలకు హాని కలిగించే రోషాన్ని విడిచిపెట్టు.

క. విను రోషహృదయుచేతను, ననయము లోకము నశించు; నౌషధములచే
ఘన రోగములు నశించిన యనువున; నది గాన రోష మడఁపు మహాత్మా!

360

తా ॥ ఔషధ సేవనం వల్ల రోగాలు ఎలా నశిస్తాయో అలాగే రోష హృదయం గలవాని వలన లోకం నశిస్తుంది. కాబట్టి రోషాన్ని అణచివెయ్యి.

తే. అనఘ! నీదు సహోదరహంత లనుచుఁ, బెనచి యీ పుణ్యజనులఁ జంపితి కడంగి
పరఁగ నిదియె సదాశివభ్రాత యైన, యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన.

361

తా ॥ నీ సహోదరుణ్ణి చంపారని భావించి, ఈ యక్షుల్ని ఇంతమందిని చంపావు. సదాశివునికి సోదరుడైన కుబేరుని పట్ల నీవు అపరాధం చేశావు.

క. నతి నుతులచేత నీ విపుడతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువునిచే స, త్కృతుఁడై నయ మొప్పఁ జనియె ఋషి యుక్తుండై.

362

తా ॥ కాబట్టి కుబేరుణ్ణి, నతులచేత, నుతులచేత (నమస్కారాలతో, స్తోత్రాలతో) ప్రసన్నుణ్ణి చేసుకో!" అని స్వాయంభువ మనువు కరుణా హృదయంతో చెప్పి, ధ్రువుని పూజలందుకొని, ఋషులతో కలిసి వెళ్ళిపోయాడు.

వ. అంత.

363

తే. యక్షచారణసిద్ధ విద్యాధరాది, జనగణస్తూయమానుఁడై ధనదుఁ డంతఁ
బుణ్యజన వైశస నివృత్తు భూరిరోష, రహితుఁ డైనట్టి ధ్రువునిఁ జేరంగ వచ్చె.

364

తా ॥ అప్పుడు ధ్రువుడు రాక్షసుల్ని చంపటం మానివేశాడని, మహారోషాన్ని విడిచాడని భావించి, యక్షులు, చారణులు, విద్యాధరులు మొదలైనవారిచే స్తుతింపబడుతూ కుబేరుడు, ధ్రువుని చెంతకువచ్చాడు.

సీ. చనుదెంచి వెసఁ గృతాంజలియైన ధ్రువుఁ జూచి తివుట నిట్లనియె క్షత్త్రియ కుమార!

తగ భవదీయ పితామహాదేశంబునను దుస్త్యజంబైన ఘనవిరోధ
ముడిగితి; వటు గాన నొనరంగ నిపుడు నీ యందుఁ బ్రసన్నుండనైతి,
భూత జనన లయంబుల కనయంబుఁ గాలంబు కర్తయై వర్తించుఁగాన యుష్మ

తే. దనుజుఁ జంపినవార లీ యక్షవరులు, గారు; తలపోయ నీ యక్షగణము నిట్లు
నెఱి వధించిన వాఁడవు నీవు గావు, వినుతగుణశీల! మాటలు వేయునేల?

365

తా ॥ వచ్చిన కుబేరుణ్ణి చూసి ధ్రువుడు అంజలి ఘటించాడు. అంజలి పట్టిన ధ్రువుణ్ణి చూసి మన్ననతో కుబేరుడిలా అన్నాడు. "క్షత్రియకుమారా! నీ పితామహుడైన మనువు ఆదేశంతో, విడిచిపెట్టడానికి కష్టమైన విరోధాన్ని విడిచిపెట్టావు. నేను నీ పట్ల ప్రసన్నుడనయ్యాను. ప్రాణికోటి చావుపుట్టుకలకు కాలమే కర్త. నీ సోదరుణ్ణి చంపినవారు యక్షులు కారు. ఆలోచిస్తే ఈ యక్షగణాన్ని చంపినదీ నీవు కాదు. వేయిమాటలు ఎందుకు?

వ. అదియునుంగాక యే బుద్ధిజేసి కర్మ సంబంధ దుఃఖాదికంబులు దేహాత్మతను సంధానంబునం జేసి సంభవించు, నట్టి యహం త్వమ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమందుంబోలెఁ బురుషునకుం దోఁచు నది గావున సర్వభూతాత్మ విగ్రహుండును, నధోక్షజుండును, భవచ్ఛేదకుండును, భజనీయ పాదారవిందుండును, ననంతామేయ శక్తి యుక్తుండును గుణమయియగు నాత్మమాయచే విరహితుండును నైన యీశ్వరుని సేవింపుము; నీకు భద్రం బయ్యెడు; భవదీయ మనోగతం బైన వరంబుఁ గోరుము; నీ వంబుజనాభ పాదారవింద సేవనంబుఁ దిరంబుగఁ జేయుదు వని యెఱుంగుదు నని రాజరాజుచేత నట్లు మహామతియు, భాగవతోత్తముండునైన ధ్రువుండు ప్రేరేపింపంబడి యే హరిస్మరణంబు చేత నప్రయత్నంబున దురత్యయంబైన యజ్ఞానంబుం దరియింతు రట్టి హరిస్మరణం బచలితం బగున ట్లొసంగుమని యడిగిన నట్లకాక యని యంగీకరించి యంతం గుబేరుండును సంప్రీతచిత్తుండయి, ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ట యనుగ్రహించి

యంతర్ధానంబు నొందె; నంత ధ్రువుండు యక్ష కిన్నర కింపురుష గణ సంస్తూయమాన వైభవుం డగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి.

366

తా ॥ పురుషునకు దేహాభిమాన కారణంగా, స్వప్నంలో లాగా "నేను, నీవు" అనే భేదబుద్ధి అజ్ఞానం వలన కలుగుతుంది. ఆ భేదబుద్ధి వలన బంధము, దుఃఖము పురుషునికి కలుగుతాయి. కాబట్టి సర్వప్రాణికోటి హృదయాలలో విరాజిల్లుతున్న అధోక్షజుడు, సంసార బంధనాశకుడు, భజించదగ్గ పాదారవిందములు గలవాడు, అనంతము అమేయమూనైన శక్తిగలవాడు, త్రిగుణాత్మకమైన మాయకు అతీతుడు అయిన పరమాత్మను సేవించు. నీకు శుభం కలుగుతుంది. నీ మనస్సులోని కోరికను కోరుకో! నీవు పద్మనాభుని పాదారవిందాలను స్థిరంగా సేవిస్తావని నాకు తెలుసు!" అని పలికిన కుబేరుని ఉత్సాహభరిత వాక్యాలకు భాగవతోత్తముడు, బుద్ధిమంతుడు అయిన ధ్రువుడు ప్రేరేపించబడ్డాడు. ఏ హరి స్మరణం చేత, దాటడానికి వీలుకాని అజ్ఞానాన్ని అప్రయత్నంగా దాటుతారో, అటువంటి బుద్ధిని సుస్థిరంగా ఇమ్మని అర్థించాడు. కుబేరుడు సంప్రీత చిత్తుడై 'అలాగే అగుగాక!' అని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. ఆపైన ధ్రువుడు యక్షకిన్నర కింపురుషాది గణాలచేత కీర్తించబడుతూ మహావైభవంతో తన పట్టణానికి తిరిగివచ్చాడు.

సీ. గణుతింప భూరిదక్షిణలచేఁగడునొప్పు యజ్ఞముల్ సేయ న య్యజ్ఞ విభుఁడు
ద్రవ్యక్రియా దేవతాఫల రూప సత్కర్మఫల ప్రదాత యయి యొప్పు
పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు స ర్వోపాధివర్జితుం డుత్తముండు
సర్వాత్మకుఁడు నగు జలజాక్షునందుఁ దీవ్రంబై ప్రవాహరూపంబు నైన

తే. భక్తి సలుపుచు నఖిల ప్రపంచమందు, నలరఁ దనయందు నున్న మహాత్ము హరిని
జిదచిదానందమయుని లక్ష్మీవరుఁ బరము, నీశ్వరేశ్వరుఁ బొడఁ గనె నిద్ధచరిత!

367

తా ॥ ధ్రువుడు లెక్కపెట్ట దగిన గొప్ప దక్షిణలతోపాటు గొప్ప గొప్ప యజ్ఞాలను చేశాడు. యజ్ఞానికి అధిపతిగా ద్రవ్యము, క్రియ, దేవత, ఫలితము అనే రూపాలలో సత్కర్మలకు ఫలప్రదాత అయివర్తించే పురుషోత్తముణ్ణి కోరి పూజించి, దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి మొదలుగా గల ఉపాధిభేదాన్ని ధ్రువుడు వదలివేశాడు. ఉత్తముడు, సర్వాత్మకుడు అయిన పద్మాక్షునిపట్ల తీవ్రమైన భక్తిని నిలిపాడు. సమస్త ప్రపంచంలోను, తనయందు ఉన్న మహాత్ముడైన హరిని, చేతనాచేతనాలలో నిండి ఉన్న ఆనందమయుని, లక్ష్మీనాథుని, ప్రభువులకు ప్రభువైన ఈశ్వరేశ్వరుణ్ణి, దర్శిస్తూ జీవితాన్ని గడిపాడు.

# 16. ధ్రువుడు అంతరిక్షంలో నిలుచుట

వ. ఇట్లు సుశీలసంపన్నుండును, బ్రహ్మణ్యుండును, ధర్మసేతురక్షకుండును, దీనవత్సలుండు నయి యవనిఁబాలించు ధ్రువుండు దన్నుఁ బ్రజలు దండ్రి యని తలంప నిరువది యాఱువేలేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును, నభోగంబులైన యాగాదులచే నశుభక్షయంబునుం జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గ సాధనంబుగ రాజ్యంబుసేసి కొడుకునకుం బట్టంబుగట్టి యచలితేంద్రియుడై యవిద్యారచిత స్వప్నగంధర్వ నగరోపమం బయిన దేహాదికంబగు విశ్వంబు భగవన్మాయారచితంబని యాత్మం దలంచుచు వెండియు. 368

తా ॥ ఈ విధంగా సత్‌శీల సంపన్నుడు, పరబ్రహ్మవేత్త, ధర్మమనే సేతువును రక్షించేవాడు, దీనులపట్ల వాత్సల్యం కలవాడు అయి ధ్రువుడు రాజ్యాన్ని పాలించాడు. ప్రజలు తనను కన్న తండ్రియని భావిస్తుంటే 26, 000 సంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు. తాను అనుభవించక ప్రజలు అనుభవించే సుఖాలకోసం తాను సంపాదించిన పుణ్యాన్ని వ్యయించాడు. నిష్కామంతో చేసిన యాగాది క్రతువులవల్ల కలిగిన పుణ్యాన్ని అశుభ క్షయం కోసం వినియోగించాడు. ఇలా బహుకాలం ధర్మార్థకామాలనే త్రివర్గ సాధకంగా రాజ్యాన్ని పాలించాడు. తరువాత కొడుకుకు రాజ్యపట్టం కట్టాడు. ఈ ప్రపంచం భగవంతుని మాయా రచితమైనదని భావించి, అవిద్యచే కల్పించబడిన స్వప్నంలోని గంధర్వనగరంతో తుల్యమైనదనీ భావించాడు.

చ. మనునిభుఁ డంత భృత్యజనమంత్రి పురోహితబంధుమిత్ర నం
దన పశువిత్త రత్న వనితాగృహ రమ్యవిహారశైల వా
రినిధి పరీత భూతల హరిద్విపముఖ్య పదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁడై

369

తా ॥ మనువుతో సమానుడైన ధ్రువుడు, సేవకజనం మంత్రులూ, పురోహితులు బంధువులు, మిత్రులు, సంతానము, పశువులు, ధనము, రత్నాలు, స్త్రీలు, గృహాలు, మనోహరమైన క్రీడాపర్వతాలు, సముద్ర పర్యంతమూ విస్తరించిన రాజ్యము, గుర్రాలు, ఏనుగులు మొదలైన సమస్త పదార్థాలు అనిత్యాలే అని తలపోసి వైరాగ్య చిత్తంతో–

సీ. పురము వెల్వడి చని పుణ్యభూ బదరికా ఘన విశాలానదీకలిత మంగ
ళాంబుపూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి కమనీయ పరిశుద్ధ కరణుఁ డగుచు
బద్మాసనస్థుఁడై పవనుని బంధించి నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు
హరిరూపవైభవ ధ్యానంబు సేయుచు భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

తే. నందు సతతంబు నిశ్చల మైనయట్టి, భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడుఁ, బులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చి.

370

తా ॥ పట్టణాన్ని వదలి, పుణ్యాలకు పుట్టినిల్లయిన బదరికాశ్రమాన్ని చేరుకున్నాడు. మంగళకరమైన విశాలా నదీజలాలలో స్నానం చేశాడు. పరిశుద్ధమైన మనస్సుతో పద్మాసనం వేసికొని, నేత్రాలు ముకుళించుకొని, శ్వాసను బంధించి, శ్రీహరి యొక్క రూపవైభవాన్ని ధ్యానం చేశాడు. భగవంతుడు, అచ్యుతుడు, పద్మనేత్రుడు అయిన ఆ పరమాత్మయందు నిశ్చలమైన భక్తితో ధ్రువుడు ఆరాధించాడు. నిశ్చలమైన భక్తిగల ధ్రువుడు ఆనంద బాష్పధారలతో అభిషిక్తుడయ్యాడు. శరీరంలో పులకాంకురాలు కలిగాయి.

"శ్రీహరి నామాన్ని విన్నంతనే ఎవరికి అశ్రువులు, శరీరానికి గగుర్పాటు కలుగుతాయో, అంటే భగవన్నామ శ్రవణమాత్రాన ఎవరి కళ్ళనుంచి బాష్పాలు స్రవిస్తాయో, ఎవరికి రోమాంచితమౌతుందో అతడే జ్ఞానలాభాన్ని పొందినవాడు."

–శ్రీరామకృష్ణ పరమహంస

వ. మఱియు విగతక్లేశుండును, ముక్తలింగుండునునై, ధ్రువుండు తన్నుఁదా మఱచియుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశా నాయకుండునుంబోలె వెలిఁగించుచు నాకాశంబున నుండి యొక్క విమానంబు సనుదేర నందు దేవశ్రేష్ఠులును, జతుర్భుజులును, రక్తాంబుజేక్షణులును, శ్యామలవర్ణులును, గదాధరులును, సువాసస్సులును, గిరీటహారాంగదకుండల ధరులును, గౌమార వయస్కులును, నుత్తమశ్లోక కింకరులు నయినవారల నిద్దఱం గని సంభ్రమంబున లేచి మధుసూదన నామంబులు సంస్మరించుచు వారల భగవత్కింకరులుంగాఁ దలంచి దండ ప్రణామంబు లాచరించినం గృష్ణపాదారవింద విన్యస్తచిత్తుండుం, గృతాంజలియు, వినమితకంధరుండు నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తులైన సునందనందులు ప్రీతియుక్తులై మందస్మితు లగుచు నిట్లనిరి.

371

తా ॥ సాధనలో క్లేశాలనన్నీ అధిగమించి, లింగశరీర భావనను తొలగించుకొని తనను తాను మరచియున్న సమయంలో, ఉదయించే పున్నమి చంద్రునిలా దశదిశలనూ వెలిగిస్తూ ఆకాశం నుండి ఒక దివ్యవిమానం వచ్చింది. అందులో ఇద్దరు దేవతాశ్రేష్ఠులు చతుర్భుజులై, ఎఱ్ఱని నేత్రాలతో, శ్యామలవర్ణంతో, గదాధరులై, మంచివస్త్రాలు ధరించి, కిరీటాలు, హారాలు, భుజకీర్తులు, కుండలాలు ధరించి, కోడెవయస్సు గలవారై కనిపించారు. వాళ్ళు విష్ణుకింకరులు. వాళ్ళను చూడగనే తొట్రుపాటుతో లేచి మధుసూదనుని నామాలను స్మరిస్తూ, వాళ్ళను భగవంతుని సేవకులుగా భావించి, సాష్టాంగ దండ ప్రణామాలు చేశాడు. శ్రీకృష్ణుని పాదపద్మాలయందే చిత్తాన్ని నిలిపి, శిరస్సు వంచి, దోసిలి ఒగ్గి నిలిచిన ధ్రువుణ్ణి చూచి, పద్మనాభుని భక్తులైన నందుడు, సునందుడు ప్రేమతో చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నారు:

'లింగశరీర భావన' – వాసనలతో కూడిన పార్థివశరీరం. తనను గురించి, తాను చూసిన లోకాన్ని గురించి పరిచితమైన వాసనల సమాహార స్వరూపమే లింగశరీర భావన. యోగసాధనలో కలిగే చిక్కులనే 'క్లేశా' లని అంటారు.

ఉ. ఓ నృప! నీకు భద్ర మగు నొప్పుగుచున్న మదీయ వాక్యముల్
వీనులయందుఁ జొన్పుము; వివేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధివై యొనర్చిన యుదాత్త తపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలి యైన మధుసూదనుఁ దృప్తి వహింపఁజేయవే!

372

తా ॥ "ఓ రాజా! నీకు శుభమగు గాక! నిజమైన మా మాటల్ని చెవినపెట్టు. అయిదేళ్ళ వయస్సులోనే మేధానిధివై నీవు చేసిన మహాతపస్సు తేజోమూర్తి, ధర్మమూర్తి అయిన మధుసూదనుణ్ణి సంతృప్తిపరిచింది.

ఆ. అట్టి శార్ఙ్గపాణి యఖిల జగత్కర్త, దేవదేవుఁ డతుల దివ్యమూర్తి
మమ్ముఁ బనుప మేము మాధవ పదమున, కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును.

373

తా ॥ అటువంటి సర్వ జగత్కర్త, దేవదేవుడు, శార్ఙ్గపాణి, దివ్యమూర్తియైన విష్ణుమూర్తి పంపగా మేము వచ్చాము. నిన్ను విష్ణుమూర్తి నివాసమైన పరమపదానికి తీసికొనిపోవ వచ్చాము.

వ. వచ్చితిమి; యే పదంబునేని సూరిజనంబులు సర్వోత్తమంబని పొందుదురు; దేనిఁ జంద్రదివాకర గ్రహనక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండు; మఱియు నీదు పితరులచేతను నన్యులచేతను ననధిష్ఠితంబును, జగద్వంద్యంబును, నభక్త జనాతిదుర్జయంబును నయిన నట్టి విష్ణుపదంబుం బొందుదువు; రమ్మిదె విమానశ్రేష్ఠం; బుత్తమశ్లోక జనమౌళియైన శ్రీహరి పుత్తెంచె; దీని నెక్క నర్హుండ వనిన నురుక్రమప్రియుం డయిన ధ్రువుండు తన్మధుర వాక్యంబులు విని కృతాభిషిక్తుం డయి యచ్చటి మునులకుం బ్రణమిల్లి తదాశీర్వాదంబులు గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరి

పార్షదులైన సునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్త చక్షురంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయ రూపంబు ధరియించె నప్పుడు.

374

తా ॥ ఏ పదాన్ని పండితులు సర్వోత్తమమని పొందాలని భావిస్తారో; సూర్యచంద్రులు, గ్రహాలు, నక్షత్రాలు, తారాగణాలు ఏ పరమపదానికి ప్రదక్షిణం చేస్తాయో; నీ తాత తండ్రులు, ఇతరులు మరెవ్వరూ అధిష్ఠించలేనిది; జగత్తుకు నమస్కరింపదగినది, భక్తులు కాని వారికి పొందడానికి మిక్కిలి కష్టసాధ్యమైనది అయిన విష్ణుపదాన్ని నీవు పొందుతున్నావు. ఇదిగో విమానం. లేచిరా! ఆ శ్రీమహావిష్ణువే దీనిని పంపాడు. దీనిని ఎక్కడానికి అర్హత గలవాడవు నీవ" ని విష్ణుదూతలు పలుకగా, విష్ణువుకు ప్రియమైన ధ్రువుడు ఆ మధురమైన వాక్యాలను విని, స్నానం చేసివచ్చి, అక్కడున్న మునులకు ప్రణమిల్లి, వాళ్ళ ఆశీర్వాదాలను పొంది, విమానానికి ప్రదక్షిణం చేసి అర్చించాడు. హరి సేవకులైన సునందునికి, నందునికి నమస్కరించి, భగవంతునియందే తన చూపును, మనస్సును లగ్నంచేసి, విమానాన్ని ఎక్కడానికై హిరణ్మయమైన తేజోరూపాన్ని ధరించాడు.

క. సురదుందుభి పణ వానక, మురజాదులు మొరసె విరుల ముసురు గురిసెఁ గి
న్నర గంధర్వుల పాటలు, భరితములై చెలఁగె నపుడు భవ్యచరిత్రా!

375

తా ॥ దేవతలు, దుందుభులు, భేరి, డోలు, మృదంగము మొదలైన వాద్యాలను మ్రోగించారు. విరివానలు కురిశాయి. కిన్నరులు, గంధర్వులు పాడే పాటలతో ఆకాశం నిండి పోయింది.

వ. అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమంబగు త్రివిష్టపంబునకు నేగువాఁ డగుచు దీన

యగు జననిం దిగనాడి యెట్లు వోవుదు? నని చింతించువానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢయై యేగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు.

376

తా ॥ అటువంటి సమయంలో ధ్రువుడు, దీనురాలైన తన తల్లిని విడిచి, స్వర్గానికి ఏ విధంగా వెళ్ళాలి? అని భావించి విచారించసాగాడు. అది గమనించిన విష్ణుకింకరులు, తమ విమానానికి ముందు పోతున్న విమానాన్ని, అందులో ఉన్న ధ్రువుని తల్లిని చూపారు. తల్లిని చూసిన ధ్రువుడు సంతృప్తిపడి, ఆనందించాడు.

క. జనని సునీతిని మును గనుఁ, గొని యవల విమాన మెక్కి గొనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షము, లనయముఁ గురియింప ధ్రువుఁడు హర్షముతోడన్.

377

క. చని చని వెస గ్రహమండల, మునుఁ ద్రైలోక్యంబు సమస్తమునిమండలమున్
ఘనుఁ డుత్తరించి యవ్వలఁ, దనరెడు హరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్.

378

తా ॥ తన తల్లియైన సునీతిని చూసిన తరువాతనే ధ్రువుడు విమానాన్నెక్కి బయలుదేరాడు. దేవతలు ఎడతెరపి లేకుండా పూలవానను కురిపిస్తుంటే సంతోషంతో ప్రయాణించి గ్రహమండలాన్నీ, మూడులోకాలను, సప్తర్షిమండలాన్నీ దాటి, ఆపైన విష్ణుపదాన్ని చేరుకున్నాడు.

వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబుల బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుత భక్త బాంధవులు నయిన భద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీర వేగంబు

ననిమిషంబు నగు జోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధియందుంబోలె నెందుఁ బరిభ్రమించుచుండు, నట్టి యచ్యుత పదంబునుం బొంది విష్ణుపరాయణుండైన భగవంతుడైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్త్రంబునందు వీణవాయించుచు.

379

తా ॥ ధ్రువుడు చేరుకున్న విష్ణుపదం, తన కాంతితో మూడు లోకాలనూ ప్రకాశింప చేస్తుంది. దయలేనివారు చొరటానికి వీలుకాదు. శాంతచిత్తులు, సమదర్శనులు, పరిశుద్ధమైన ప్రవర్తన గలవారు, సర్వజీవకోటినీ సంతోష పెట్టేవారు, అచ్యుతుని భక్తులకు బంధువులై మెలిగే శుభవర్తనులకు మాత్రమే పొందవీలయినది ఆ విష్ణుపదం. అంతు తెలియని వేగంతో, రెప్పపాటు కాలంకూడా ఆగకుండ, గానుగ ఇరుసుకు కట్టిన ఎద్దుల గుంపులాగ జ్యోతిశ్చక్రమంతా ఆ విష్ణుపదం చుట్టూ తిరుగుతుంటుంది. అటువంటవిష్ణుపదాన్ని పొందిన ధ్రువుని మహిమను చూసి నారదుడు సంతోషంతో ప్రచేతసులనే దేవర్షులు చేసే సత్త్రయాగంలో వీణతో ఇలా గానం చేశాడు.

సీ. పతియె దైవంబుగా భావంబులోపలఁ దలఁచు సునీతినందను తపః ప్ర
భావము క్రియ ధర్మభవ్య నిష్ఠలఁ బొందఁ జాలరు బ్రహ్మర్షి జనము లనిన
క్షత్త్రియకులు నెన్నఁగా నేల? యెవ్వఁడు పంచసంవత్సర ప్రాయమునను
సురుచి దురుక్త్యుగ్ర శరభిన్న హృదయుఁడై మద్వాక్యహిత బోధమతిఁ దనర్చి

తే. వనమునకు నేగి హరిభక్తివశత నొంది, యజితుఁ డగు హరిఁ వశుఁడై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబును జెందె, నట్టి హరిపదంబును బొంద నె వ్వరికిఁ దరము?

380

తా ॥ “పతినే దైవంగా భావించే సునీతి సంతానమైన ధ్రువుని తపఃసాధనా ఫలాన్ని బ్రహ్మర్షులే పొందలేకపోయారు. ఇక క్షత్రియుల సంగతి వేరుగా చెప్పేదేముంది? అయిదు

సంవత్సరాల వయస్సులోనే 'సురుచి' చెడు మాటలనే భయంకర బాణాల వలన హృదయాన గాయపడి, నా హితబోధను చెవికెక్కించుకొని, అడవులకు వెళ్ళి, హరిభక్తికి వశుడై ఏ పసివాడు విష్ణువుని మెప్పించాడో, ఆ పసివాడు చివరికి ఏ విష్ణుపదాన్ని పొందాడో, ఆ విష్ణుపదాన్ని పొందటం ఎవరికి సాధ్యమవుతుంది?''

క. అని పాడె ననుచు విదురున, కనఘుఁడు మైత్రేయుఁ డనియె నంచిత భక్తిన్
వినుతోద్దామయశస్కుం, డనఁగల యా ధ్రువుని చరిత మార్యస్తుత్యా!

381

తా ॥ స్తుతించదగిన గొప్ప యశస్సుగల ధ్రువుని చరిత్రను నారదుడు గానం చేశాడని మైత్రేయ మహర్షి విదురునితో చెప్పాడు.

సీ. మహితసత్పురుష సమ్మతమును ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు
నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును మంగళకర మఘమర్షణంబు
సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాప హరమును ధ్రువపదప్రాపకంబు
నై యొప్పు నీ యుపాఖ్యానంబుఁ దగ నీకు నెఱిఁగించితినిఁ దీని నెవ్వఁడేని

తే. తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద, చరణ సరసీరుహద్వయాశ్రయుఁడు నైన
భవ్యచరితు దినాంత ప్రభాతవేళ, లను సినీవాలి పూర్ణిమ లందు మఱియు

382

తే. ద్వాదశిని పద్మ బాంధవ వాసరమున, శ్రవణ నక్షత్రమున దినక్షయమునందుఁ
బరఁగ సంక్రమణ వ్యతీపాతలందు, సభల భక్తిని వినునట్టి సజ్జనులకు.

383

వ. క్లేశనాశంబును మహాప్రకాశంబును నైన భగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు; మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును, మనఃకామునకు మనంబును, నిష్కామునకుఁ

దత్త్వవిజ్ఞానంబును గలుగు, దీని వినిపించు వారికి దేవతానుగ్రహంబు గలుఁగు; నిట్టి యుపాఖ్యానంబు నీ కెఱింగించితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించిన తెఱంగున సూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె; నట్లు సెప్పిన మైత్రేయునిం గని విదురుం డిట్లనియె.

384

తా ॥ ఈ ధ్రువోపాఖ్యానం సత్పురుషులందకీ సమ్మతమైంది. జీవితానికి ధన్యతను చేకూరుస్తుంది. స్వర్గప్రదాయకమైనది. కీర్తికరమైనది. ఆయుష్షను కలుగచేస్తుంది. పుణ్య ప్రదాయకమైనది. శుభకరమైనది. మంచి మనస్సు నిస్తుంది. ప్రశంసా యోగ్యమైనది. పాపాన్ని హరిస్తుంది. ధ్రువుని స్థానాన్ని పొందజేస్తుంది. అటువంటి ఈ ధ్రువుని చరిత్రను నీకు తెలియజేశాను.

దీనిని ఎవడైనా శ్రద్ధతో ఉదయసాయంకాలాలలోగాని, అమావాస్యా పూర్ణిమలందుగాని, ద్వాదశి రోజుగాని, ఆదివారంనాడుగాని, శ్రవణా నక్షత్రం నాడుగాని, శూన్యతిథియందుగాని, సంక్రమణం జరిగేనాడు గాని, వ్యతీపాత యోగమందుగాని, సభలలోగాని చెప్పినా, విన్నా క్లేశాలు నశిస్తాయి. దీనిని వినిపించిన వారికి దేవతానుగ్రహం కలుగుతుంది. గొప్ప తేజస్సుతో పాటు భగవద్భక్తి, శీలాది సద్గుణాలు కలుగుతాయి. తేజస్సును కోరుకునే వారికి తేజస్సు, ఏ కోరికాలేని నిష్కాములు తత్త్వవిజ్ఞానము పొంది పరమాత్మను దర్శిస్తాడు."

అటువంటి ఉపాఖ్యానాన్ని నీకు తెలియజేశానని మైత్రేయుడు విదురునితో చెప్పినట్లు శుకయోగి పరీక్షిత్తుకు చెప్పాడు. శుకయోగి పరీక్షిత్తుకు చెప్పిన విధాన్ని సూత మహాముని శౌనకాది మునులకు వినిపించాడు.

ఆ విధంగా చెప్పిన మైత్రేయ మహామునిని చూసి విదురుడిలా అన్నాడు:

సీ. అనఘాత్మ! నారద మునిపతి ధ్రువ చరిత్రము ప్రచేతసుల సత్త్రంబునందు

నర్థిమైఁ గీర్తించె నంటి; ప్రచేతసు లన నెవ్వ రెవ్వరి తనయు? లెట్టి
వంశజుల్? సత్త్ర మెవ్వలనను జేసి? రధ్వరమందు నిజకులధర్మశీలు
రగు ప్రచేతసులచే యజియింపఁగాఁబడె యజ్ఞపురుషుఁ డెట్టు లచ్యుతాంఘ్రి

తే. భక్తియుక్తుఁడు విదిత సద్భాగవతుఁడు, దివిరి హరిపాదసేవా విధి ప్రయుక్త
దేవదర్శనుఁ డగు నట్టి దివ్యయోగి, నారదుం డెట్లు గొనియాడె శౌరికథలు?

385

తా ॥ "ఓ పుణ్యాత్మా! ధ్రువుని చరిత్రను, ప్రచేతసులు నిర్వహించే సత్త్రయాగంలో నారదమహర్షి కోరిమరీ కీర్తించాడని చెప్పావు కదా! ప్రచేతసులెవరు? వారు ఎవరి పుత్రులు? ఏ వంశం వారు? వారు సత్త్రయాగాన్ని ఎక్కడ చేశారు? తమ నిజధర్మమందు ఆదరం కలిగిన ఆ ప్రచేతసులు, యజ్ఞపురుషుణ్ణి ఏ విధంగా అర్చించారు? అచ్యుతుని పాదపద్మాలపై నిరంతర భక్తి కలవాడు, భాగవతోత్తముడు, శ్రీహరిని సేవించే విధానం తెలిసినవాడు, దివ్యయోగియైన నారదమహర్షి విష్ణుకథలను ఏ విధంగా కీర్తించాడు?

క. నాకిపు డెఱిఁగింపుము సుశ్లోకుని చరితామృతంబు శ్రోత్రాంజలులం
బైకొని జుఱ్ఱియుఁ దనివిం, గైకొనకున్నది మనంబు గరుణోపేతా!

386

తా ॥ సుశ్లోకుడైన ఆ శ్రీమన్నారాయణుని చరితామృతాన్ని చెవులనే దోసిళ్ళతో ఎంతగా జుఱ్ఱుకున్నప్పటికీ, మనస్సుకు తనివి తీరటంలేదు. ఓ దయామయా! ఇంకా ఆ కథలను నాకిప్పుడు వినిపించవలసిందిగా ప్రార్థిస్తున్నాను."

క. అని యడిగిన విదురునిఁ గనుఁ, గొని మైత్రేయుండు పలికె గొనకొని ధ్రువుఁడున్
వనమునకుఁ జనిన నాతని, తనయుం డగు నుత్కలుండు దళితాఘుండై.

387

సీ. చతురుఁ డాజన్మ ప్రశాంతుండు నిస్సంగుఁడును సమదర్శనుండును ఘనుండు
నై యాత్మయందు లోకావళి, లోకంబు లందు నాత్మను జూచు ననఘమైన
యనుపమయోగక్రియా పావకాదగ్ధ కర్మ మలాశయ కలనఁ బేర్చి
జడుని కైవడి జీఁకుచందంబునను మూకు పగిది నున్మత్తుని భంగిఁ జెవిటి

తే. వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁడై ప్ర, శాంతకీల హుతాశను సరణిఁ బొల్చి
సతత శాంతంబు నంచిత జ్ఞానమయము, నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలఁచి

388

క. తనకంటె నితర మొక టెఱుఁ, గని కతమున సార్వభౌమకశ్రీఁ బొందన్
మనమునఁ గోరక యుండుటఁ, గని కులవృద్ధులును మంత్రిగణములు నంతన్.

389

తా ॥ అని అడిగిన విదురుణ్ణి చూచి, మైత్రేయ మహాముని ఇలా అన్నాడు. ధ్రువుడు తపస్సుకై అరణ్యాలకు వెళ్ళాడు. ధ్రువుని కుమారుడైన ఉత్కళుడు పాపరహితుడు, చాతుర్యశీలి. పుట్టుకతోనే ప్రశాంత చిత్తుడు. నిస్సంగుడు. సమదర్శనం కలవాడు, గొప్పవాడు. తనలో లోకాలను, లోకాలలో తనను చూసే తత్త్వం కలవాడు. పుణ్యప్రదమైన యోగాగ్నిలో కర్మలు ఆచరించటంవల్ల కలిగే మలినాలను దగ్ధం చేశాడు. సమస్తమూ తెలిసికూడా మూఢునిలాగ, గ్రుడ్డివాడిలాగ, పిచ్చివాడిలాగ, మూగవాడిలాగ, చెవిటివాడిలాగ ప్రవర్తించేవాడు. మండటం ఆగిపోయాక గూఢంగా ఉన్న అగ్నిలా (నివురుకప్పిన నిప్పులాగ) కనిపించేవాడు. నిరంతర శాంతమూ, దివ్యజ్ఞానమయమూనైన పరబ్రహ్మస్వరూపాన్నే మనస్సులో తలచేవాడు. తనకంటే ఇతరమైనదాన్ని ఒక్కటి కూడ తెలియక పోవటం, రాజ్యసార్వభౌమాధికారం పొందాలని మదిలోనైనా భావించకపోవటం గమనించిన మంత్రులు, కులపెద్దలు—

వ. అతని నున్మత్తునిం గాఁ దెలిసి తదనుజుండైన వత్సరునికిఁ బట్టంబు గట్టి; రా వత్సరునికి సర్వర్ధి యను భార్యయందుఁ బుష్పార్ణుండును జంద్రకేతుండును నిషుండును నూర్జుడును

వసువును జయుండును నన నార్వురు తనయులు గలిగి; రందుఁ బుష్పార్ణుండను వానికిఁ బ్రభయు దోషయు ననునిద్దఱు భార్యలై; రందుఁ బ్రభ యనుదానికిం బ్రాతర్మధ్యందిన సాయంబు లను సుతత్రయంబును దోషయను దానకిఁ బ్రదోషనిశీథ వ్యుష్ట లనువారు ముగ్గురును బుట్టి; రందు వ్యుష్టుం డను వానికిఁ బుష్కరిణి యను పత్నియందు సర్వతేజుండను సుతుండు వుట్టె; వానికి నాకూతి యను మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుండయిన మనువు జనియించె; వానికి నడ్వల యను భార్యయందుఁ బురువును, గుత్సుండును, త్రితుండును, ద్యుమ్నుండును, సత్యవంతుండును, ఋతుండును, వ్రతుండును, నగ్నిష్టోముండును, నతిరాత్రుండును, సుద్యుమ్నుండును, శిబియును, నుల్ముకుండును నను పన్నిద్దఱు తనయులు గలిగి, రందు నుల్ముకునికిఁ బుష్కరిణియను దానివలన నంగుండును, సుమనసుండును, ఖ్యాతియుఁ, గ్రతువును, నంగిరసుండును, గయుండును నను నార్వురు కొడుకులు పుట్టి; రందు నంగునికి సునీథ యనుధర్మపత్నివలన వేనుం డను పుత్రుం డుదయించిన.

390

తా ॥ ఉత్కళుణ్ణి పిచ్చివానిగా భావించారు. అతని సోదరుడైన వత్సరునికి పట్టం కట్టారు. ఆ వత్సరునికి 'సర్వర్ధి' అనే భార్యయందు పుష్పార్ణుడు, చంద్రకేతుడు, ఇషుడు, ఊర్జుడు, వసువు, జయుడు అనే ఆరుగురు తనయులు కలిగారు. అందులో పుష్పార్ణుడనే వానికి ప్రభ, దోష అనే ఇద్దరు భార్యలు. అందులో ప్రభకు ప్రాతర్మధ్యందిన సాయములు అనే ముగ్గురు కొడుకులు కలిగారు. 'దోష' కు ప్రదోషుడు, నిశీథుడు, వ్యుష్టుడు అను ముగ్గురు కొడుకులు జన్మించారు. వారిలో వ్యుష్టుడనే వానికి పుష్కరిణి అనే భార్యవలన 'సర్వతేజు' డనే కొడుకు పుట్టాడు. ఆ సర్వతేజునికి 'ఆకూతి' అనే భార్యవలన 'చక్షుస్సు' అనే పేరుగల మనువు జన్మించాడు. 'చక్షుస్సు' కు 'నడ్వల' అనే భార్యయందు 'పురువు', కుత్సుడు, త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అనే పన్నెండు మంది కొడుకులు కలిగారు. వారిలో ఉల్ముకునికి, పుష్కరిణి అనే భార్యయందు 'అంగుడు',

'సుమసుడు', ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు అనే ఆరుగురు కొడుకులు జన్మించారు. వారిలో అంగునికి, సునీథ అనే ధర్మపత్నివలన వేనుడనే పుత్రుడు జన్మించాడు.

మ. క్షితినాథోత్తముఁ డాత్మనందనుని దుశ్శీలంబు వీక్షించి దుః
ఖీతుఁడై యొంటిగఁ దత్పురిన్ వెడలి యేగెన్ వేగ నెందేని త
ద్గతి వీక్షించి మునీశ్వరుల్ గుపితులై దంభోళిసంకాశ వా
క్యతతిం జావ శపింప వాఁ డపుడు వీఁకం గూలె, న మ్మేదినిన్.

391

తా ॥ రాజైన అంగుడు, తన కొడుకైన వేనుని దుశ్శీలాన్ని చూసి, దుఃఖంతో పట్టణాన్ని విడిచి, ఒంటరిగా ఎక్కడికో వెళ్ళిపోయాడు. అది గమనించిన మునీశ్వరులు కోపించి, వజ్రాయుధంలాటి వాక్కులతో చావమని వేనుణ్ణి శపించారు. వేనుడు నేలకొరిగాడు.

సీ. కైకొని యపుడు లోకం బరాజకమైఁ బ్రజలు దస్కరపీడఁ బల్లటిల్లఁ
గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁడై పడిన వేనుని వలపలి భుజంబు
నర్థి మథింప నారాయణాంశంబున నాదిరాజన నొప్పునట్టి పృథుఁడు
జనియించె ననవుడు విని విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నో యనఘచరిత!

తే. సాధువు సుశీలనిధియును సజ్జనుండు, నలఘు బ్రహ్మణ్యుఁడును నైనయట్టి యంగ
ధరణివిభునకు దుష్టసంతాన మెట్లు, గలిగె? న య్యంగపతి యేమి కారణమున.

392

తా ॥ అప్పుడు లోకం రాజు లేనిది అయింది. దొంగల పీడతో ప్రజలు తల్లడిల్లారు. మునులు దుఃఖించారు. ప్రాణాలు కోల్పోయిన వేనుని కుడిభుజాన్ని పట్టి మునులు మథించగా నారాయణాంశతో 'తొలిచక్రవర్తిగా చెప్పదగిన పృథుడు' జన్మించాడు." అని మైత్రేయ మహాముని చెప్పగా విన్న విదురుడు ఇలా ప్రశ్నించాడు: "ఓ పుణ్యాత్మా! సజ్జనుడు, సుశీలుడు,

గొప్పబ్రహ్మవేత్త అయిన అంగరాజునకు దుష్టసంతానం ఎందుకు కలిగింది?

వ. విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె? ధర్మకోవిదులైన మునులు దండవ్రతధరుండును, రాజును నగు వేనునియందు నే పాపంబు నిరూపించి బ్రహ్మదండం బొనర్చి రదియునుంగాక లోకంబున రాజులు లోకపాల తేజోధరులుఁ, బ్రజాపాలనాసక్తులుఁ గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేత నవజ్ఞార్హులై యుందురు గావున నా వేనుని చరిత్రంబు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం బరాపరవిదగ్రేసరుండ వయిన నీ వెఱింగింప నర్హుండ వనిన మైత్రేయుం డతని కిట్లనియె.

393

తా ॥ ఆ అంగపతి ఏ కారణంతో మనస్సు విరిగి పట్టణాన్ని విడిచి వెళ్ళాడు? ధర్మకోవిదులైన మునులు, దండనవ్రతాన్ని ధరించిన వేనుణ్ణి ఏ పాపం చూపించి బ్రహ్మదండాన్ని ప్రయోగించారు. అంతేకాదు. లోకంలో రాజులు లోకపాలకుల తేజస్సును ధరించి జన్మించినవారు. ప్రజాపాలనలో ఆసక్తి గలవారు. అటువంటివారిలో పాపాలుంటే ప్రజలే తిరస్కరిస్తారు. కాబట్టి ఆ వేనుని చరిత్ర శ్రద్ధాభక్తులు గల నాకు తెలియజెప్పండి. ఇహపరాలు ఎరిగిన వారిలో అగ్రేసరుడవు కాబట్టి చెప్పడానికి మీరే తగినవారు" అని అన్న విదురునితో మైత్రేయ మహర్షి ఇలా చెప్పాడు:

# 17. అంగపుత్రుడు వేనుని చరిత్ర

సీ. అనఘాత్మ! రాజర్షి యైనట్టి య య్యంగ మేదినీ విభుఁ డశ్వమేధమఖము
గావింప ఋత్విజ్నికాయంబు చేత నాహూత మయ్యును సురవ్రాత మందు
నాత్మ హవిర్భాగ మంద రాకుండిన నప్పుడు ఋత్విక్కు లద్భుతంబు
నందుచు యజమానుఁడైన య య్యంగ మహీవరుఁ జూచి రాజేంద్ర; యిట్లు

తే. త్రిదశు లిదె పిల్వఁబడియును దివిరి యాత్మ, భాగములఁ బొంద రారైరి భవ్యచరిత్ర!
యేమిహేతువొ యిది మాకు నెఱుఁగబడదు; కనఁగ హోమంబు దుష్టంబు గాదు మఱియు.

394

తా ॥ "ఓ పుణ్యాత్మా! రాజర్షియైన అంగరాజు అశ్వమేధ యాగాన్ని చేస్తున్నాడు. ఋత్విక్కుల చేత ఆహ్వానించబడి కూడా, దేవతలు హవిర్భాగాలను అందుకోవడానికి రాలేదు. ఋత్విక్కులు అప్పుడు ఆశ్చర్యపడుతూ, యజ్ఞం చేసే ఆ అంగరాజును చూసి ఇలా అన్నారు. "ఓ రాజేంద్రా! శుభచరితా! మూడు దశలలో, మూడు లోకాలలోను వర్తించే దేవతలు పిలువబడి కూడా తమ హవిర్భాగాల్ని పొందటానికి రావటం లేదు. కారణం ఏమిటో మాకు తెలియటంలేదు. పరిశీలించి చూస్తే హోమప్రక్రియలో ఏ దోషమూ లేదు.

వ. శ్రద్ధాయుక్తులై ధృత వ్రతులైన యీ బ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబులైన యీ ఛందస్సులు వీర్యవంతంబు లయియున్నవి; యిందు దేవతాపరాధం బణుమాత్రం బైన నెఱుంగ; మిట్టిచోటం గర్మసాక్షు లయిన దేవతలు స్వకీయ భాగంబు లంగీకరింపకుండుటకుఁ గతం బెయ్యదియో యనిన నయ్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యుల నడుగం దలంచి వారల యనుమతిం బడసి మౌనంబు మాని యిట్లనియె.

395

తా ॥ బ్రహ్మవేత్తలైన ఈ ఋత్విక్కులు, శ్రద్ధాయుక్తులై దీక్షావ్రతులై ప్రయోగించే ఈ వేదమంత్రాలు (ఛందస్సులు) ఎంతో శక్తిమంతమైనవి. ఇందులో దేవతలకు జరిగిన అపరాధం ఏమిటో అణుమాత్రం కూడా తెలియటం లేదు. ఇటువంటి చోట కర్మసాక్షులైన దేవతలు తమతమ యజ్ఞభాగాలను స్వీకరించడానికి అంగీకరించక పోవడానికి కారణమేమిటో తెలియరావటంలేదు" అని అనగా అంగమహారాజు, దుఃఖంతో నిండిన మనస్సుతో, దీనికి కారణం ఏమైయుంటుందో సదస్యుల్ని అడిగి తెలుసుకోవాలని భావించి, మౌనాన్ని వీడి, ఋత్విక్కుల అనుమతితో ఇలా అన్నాడు:

ఆ. అనఘ చరితులార! యాహూతు లయ్యు సు, పర్వగణము లాత్మభాగములను
స్వీకరింప; రేను జేసిన యపరాధ, మెట్టి దనిన వార లిట్టు లనిరి.

396

తా ॥ 'ఓ పుణ్యచరితులారా! ఆహ్వానించినప్పటికీ దేవతలు వచ్చి తమతమ హవిర్భాగాలను స్వీకరించటం లేదు. నేను చేసిన అపరాధమేమిటి?' అనగా ఆ సదస్యులు అంగరాజుతో ఇలా అన్నారు:

క. నరనాథ! యిదియు నిప్పుడు, వొరసిన దుష్కృతము గాదు పూర్వభవమునం
బరఁగిన దురితం బిది యా, దరమున నెఱిఁగింతు మింత ధన్యచరిత్రా!

397

తా ॥ "ఓ అంగరాజా! ఇది ఇప్పుడు చేసిన పాపం కాదు. పూర్వజన్మలో చేసిన పాపమది. దానిని తెలియజేస్తాము విను.

క. నీ వింతవాఁడ వయ్యును, భూవర! సంతానలాభమును బొందమి నా
దేవతలు యాగభాగము లీ వేళ భుజింప రైరి యిందుకు నీవున్.

398

తా ॥ నీవు ఇంతగొప్పవాడవైనప్పటికీ సంతానం లేనందున, దేవతలు వచ్చి యజ్ఞభాగాలను భుజించటంలేదు. అందుచేత నీవు–

తే. పుత్రకామేష్టిఁ గావించి పుత్రుఁ బడయు, మట్లొనర్చిన దేవత లాత్మభాగ
మర్థి నంగీకరింతు; ర య్యజ్ఞ పురుషు, హరి భజించిన సకలకార్యములుఁ గలుగు.

399

తా ॥ 'పుత్రకామేష్టి' అనే యాగాన్ని చేసి, పుత్రుణ్ణి పొందు. అలా చేస్తే దేవతలు వచ్చి తమతమ హవిర్భాగాల్ని స్వీకరిస్తారు. యజ్ఞపురుషుడైన హరిని భజిస్తే సకలకార్యాలు సిద్ధిస్తాయి."

వ. అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్ట దేవతాకం బయిన పురోడాశంబుచే హోమంబు గావించినం దదీయ హోమకుండంబు నందు హేమమాల్యాంబరాభరణుం డయిన పురుషుండు హిరణ్మయ పాత్రంబున సిద్ధపాయసంబు గొనుచు నుదయించిన నప్పుడు విప్రానుమతంబున నా రాజు దత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుం డగుచు భార్య కొసంగె నంత.

400

తా ॥ అని చెప్పగా అంగరాజు సంతానార్థియై శిపివిష్టుడనే దేవతను ఆహ్వానించి పురోడాశంతో హోమం చేశాడు. ఆ యజ్ఞకుండంలో బంగారుహారాలు, వస్త్రాలు, ఆభరణాలుగా ధరించిన పురుషుడు, సిద్ధపాయసంతో నిండిన బంగారు పాత్రతో ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు అంగమహారాజు, విప్రుల అనుమతితో ఆ పాయసపాత్రను దోసిలితో స్వీకరించి సంతోషంతో భార్యకు ఇచ్చాడు.

చ. కమలదళాక్షి పాయసము గౌతుక మొప్ప భుజించి భర్తృ సం
గమమునఁజేసి తత్క్షణము గర్భముఁ దాల్చి కుమారుఁ గాంచె న

క్కొమరుఁడు నంత మాతృజనకుం డగు మృత్యువుఁ బోలి తా నధ
ర్మమునఁ జరించుచుండె గుణమండన! వేనుఁ డనంగ నిచ్చలున్.

401

తా ॥ పద్మదళనేత్రియైన అంగమహారాజు భార్య సునీథ ఎంతో కుతూహలంతో పాయసాన్ని భుజించి, భర్తతో సంగమించింది. వెంటనే ఆమె గర్భవతియై కుమారుణ్ణి కన్నది. ఆ కుమారుడు తన మాతృజనకుడైన, మృత్యుదేవతలాగా అధర్మమార్గంలో సంచరిస్తున్నాడు. అతని పేరే 'వేనుడు'.

చ. ఎనయఁగ బాల్యమందుఁ దన యీడు కుమారులఁ గ్రీడఁబోలె నె
మ్మనమున భీతి లేక కృపమాలి పశుప్రకరంబు నొంచు పో
ల్కిని నరికట్టి చంపుచును గిల్బిషలుబ్ధక వృత్తిమై శరా
సన శరముల్ ధరించి మృగజాతి నసాధు గతిన్ వధించుచున్.

402

తా ॥ వేనుడు బాల్యంలో తన మనస్సులో ఏమాత్రం భయం లేకుండా తన ఈడుపిల్లల్ని పశువుల్ని బాధించినట్లు బాధించి, జాలి లేకుండా చంపేవాడు. ఇది అతనికొక ఆట. పాపాత్ముడైన బోయవానిలా విల్లంబుల్ని ధరించి సాధుమృగాల్ని అసాధుమార్గంలో వధించేవాడు.

వ. ఇట్లు మాతామహ దోషంబునం బాపవర్తనుండై జరియించు కొడుకుం జూచి యంగుండు వివిధ శాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబులు మానుపం జాలక దుఃఖీతాత్ముండై మనంబున.

403

తా ॥ ఈ విధంగా తాతగారు చేసిన దోషానికి వేనుడు పాపమార్గంతో ప్రవర్తిస్తూ తండ్రికి

బాధాకారకుడయ్యాడు. వేనుణ్ణి, అంగరాజు అనేక విధాలుగా శాసించి, దండించి, మార్చాలని ప్రయత్నించాడు. అయినప్పటికీ అతని చెడు చేతల్ని మార్చలేక మదిలో దుఃఖించాడు.

క. అనయము నిట్టి కుపుత్రునిఁ, గని పరితాపంబుఁ బొందుకంటెను ధరలో
ననపత్యుం డగు టొప్పను, వనజాక్షు భజించునట్టి వాఁ డగువాఁడున్.

404

తా ॥ "ఇటువంటి కుపుత్రుణ్ణి కని పరితపించడంకంటే, సంతానహీనుడనై బ్రతకటం మంచిది. కనీసం దైవాన్ని భజించడానికైనా వీలవుతుంది" అని మనస్సులో అనుకొని.

వ. అని వెండియు నిట్లనియె.

405

తా ॥ మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. జనులకు దుష్పుత్రకునిచేత నపకీర్తియు నధర్మమును సర్వజనవిరోధ
మును మనోవ్యథయును ననయంబుఁ బ్రాప్తించు నట్టి కుపుత్రమోహంబు విడువఁ
జాలక బహుమాన సంగతిఁ గను నెవ్వఁ డతని గేహంబు దుఃఖాలయంబు
నగునని మఱియు నిట్లను మనుజుండు శోక స్థాన మగు పుత్రుకతనఁ జేసి

తే. యనుపమక్లేశ భాజనం బయిన గృహము, విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ డగు కుపుత్రు
సుపుత్రుఁగా నాత్మఁ దలఁతు, ననుచు నా రాజు బహుదుఃఖితాత్ముఁ డగుచు.

406

తా ॥ "చెడ్డవాడయిన కొడుకు వల్ల అపకీర్తి, అధర్మం, సర్వజనవిరోధం, మనోవ్యథ ప్రాప్తిస్తాయి. ఎవరయితే అటువంటి చెడ్డకుమారుని పట్ల మోహాన్ని విడువలేరో వాని ఇల్లు

దుఃఖానికి నెలవవుతుంది. దుఃఖానికి కారణమైన పుత్రుని వల్ల సాటిలేని కష్టాలకు కారణమైన ఇంటిని మానవుడు విడిచిపెడతాడు. కాబట్టి ఇటువంటి వివేకహీనుడైన, దుర్మార్గుడైన పుత్రుణ్ణే సుపుత్రునిగా భావిస్తున్నా" నని, బహువిధాలుగా మనస్సులో దుఃఖీస్తూ...

క. తగు సుమహైశ్వర్యోదయ, మగు గృహమును బ్రజల నిద్ర నందిన భార్యన్
దిగవిడిచి యొక్క డేనియు, జగతీశుఁడు సనె నిశీథ సమయమునందున్.

407

తా ॥ గొప్ప ఐశ్వర్యంతో ప్రభవిస్తూ విరాజిల్లే రాజగృహాన్ని, ప్రజలను, నిద్రపోతున్న భార్యను విడిచి, రాత్రి సమయంలో అంగరాజు ఒక్కడే వెళ్ళిపోయాడు.

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవ పురోహితామాత్య ప్రభృతు లయిన ప్రజ లెఱింగి దుఃఖీంచుచున్న సమయంబున భూమియం దెల్లయెడలఁ దదన్వేషణం బాచరించి గూఢుం డయిన పరమ పురుషునిం గానలేని కుయోగి చందంబున నా రాజుం బొడగానలేక విఫలోద్యోగులయి మగిడి పురంబునకు వచ్చిరి! తదనంతరంబ.

408

తా ॥ ఆ తరువాత, అంగరాజు గృహాన్ని విడిచి వెళ్ళిపోయిన వార్తను తెలుసుకున్న స్నేహితులు, బంధువులు, పురోహితులు, మంత్రులు, ప్రజలు దుఃఖీంచారు. భూమండలంలో అన్ని దిక్కులా అంగరాజు కోసం వెదికారు. నిగూఢంగా దాగియున్న పరమ పురుషుడైన భగవంతుణ్ణి కనుగొనలేని కుయోగులవలె ఆ అంగరాజును కనుగొనలేక, తమ ప్రయత్నాలు వ్యర్థం కాగా తిరిగి తమ పట్టానికి వచ్చారు. తరువాత,

'గూఢుం డైన పరమపురుషునింగానలేని కుహనా యోగిచందంబున' — అనడంలో పరమాత్మ ఉనికిని, యోగవిద్యను ప్రస్తావించటం జరిగింది.

సకల జీవరాశులలో అంతర్యామిగా ఉన్న భగవంతుణ్ణి తెలుసుకోవాలంటే పుస్తక పాండిత్యం ఒక్కటే చాలదు. శాస్త్రాలలోని తత్త్వం ఆచరణలోకి రావాలి. తత్త్వాచరణ లేనివారు కుహనాయోగులే. సత్యాన్వేషణమే యోగికి కర్తవ్యం.

సీ. సమధిక బ్రహ్మనిష్ఠాతిగరిష్ఠులౌ భృగ్వాది మౌనీంద్ర బృంద మపుడు
లోకావనైకావలోకనోత్సుక మౌట జనులు స్వరక్షక జనవిభుండు
లేమిఁ బశుప్రాయులై మెలంగుటఁగని యంత వేనుని మాత యగు సునీథ
యనుమతి నఖిల ప్రజావళి కప్రియుండైన న వ్వేనుఁ బట్టాభిషిక్తుఁ

తే. జేసి; రంతట మహితోగ్రశాసనుఁ డగు, వేనుఁ బట్టంబు గట్టుట విని సమస్త
తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూష, కముల కైవడి నడఁగిరి గహనములను.

409

తా ॥ తమను రక్షించే ప్రభువు లేకపోవటంచేత పశుప్రాయులై ప్రజలు ప్రవర్తించడాన్ని, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన భృగువు మొదలుగా గల మునీంద్ర బృందం చూసి, లోకాన్ని రక్షించే బుద్ధితో ఏకాగ్రచిత్తంతో ఆలోచించారు. వేనుని తల్లియైన 'సునీథ' అనుమతితో, సమస్త ప్రజానీకానికి ఇష్టంలేని

వేనునికి పట్టాభిషేకం చేశారు. చండశాసనుడైన వేనునికి పట్టం కట్టడాన్ని విన్న దొంగలు, సర్పభయానికి పారిపోయే ఎలుకల్లాగా అడవుల్లో దాక్కున్నారు.

వ. అంత నతండు.

410

తా ॥ ఆ తరువాత వేనుడు

చ. పరుపడి నష్ట లోకపరిపాలక ముఖ్య విభూతియుక్తుఁడై

పరఁగి నృపాసనంబున విభాసితుఁడౌట స్వభావసిద్ధమై
వఱలు మహావలేపమున వారక సంతత మాననీయు స
త్పురుషుల నెల్ల నెందుఁ బరిభూతులఁ జేయుచునుండె నిచ్చలున్.

411

తా ॥ పరుగెత్తిపోయి లోకపాలకుల ఐశ్వర్యాన్ని పొంది, సింహాసనాన్ని అధిష్ఠించి, ప్రకాశిస్తూ, స్వభావ సిద్ధమైన మహాగర్వంతో, నిరంతరం గౌరవింపదగిన సత్పురుషులందరినీ నిత్యం అగౌరపరుస్తున్నాడు.

చ. మఱియు నతండు భూగగనమార్గములం దొకవేళ నొక్కఁ డే
యరదము నెక్కి క్రుమ్మరు నిరంకుశవృత్తిఁ జరించు మత్త సిం
ధురవిభు పోల్కి సత్పురుషదూషిత వర్తన నొప్పుచున్ నిరం
తర సుజనాపరాధకృతి తత్పరమానసుఁడై క్రమంబునన్.

412

తా ॥ భూమార్గంలోను, ఆకాశమార్గంలోను ఒక్కడే రథాన్నెక్కి, మదించిన గజరాజువలె నిరంకుశంగా హద్దుమీరి సంచరించేవాడు. సత్పురుషులచేత దూషించబడే ప్రవర్తనతో, నిరంతరం సజ్జనులకు అపకారం చేయాలన్న మనస్సుతోనే వ్యవహరించేవాడు.

క. దివ్యులు వెఱఁగందఁగఁ బృ, థ్వీవ్యోమముల గల భేరి వ్రేయించె "న య
ష్టవ్య మదాతవ్య మహో, తవ్యం విప్రాయ" యనుచు నుదాత్త ధ్వనులన్.

413

తా ॥ దేవతలు భయపడేలాగా, భూమ్యాకాశాలు బ్రద్దలయ్యేలాగా భేరిమ్రోగించి, "ఓ బ్రాహ్మణులారా! మీరు యజ్ఞాలు చేయరాదు. దానాలు చేయరాదు. హోమంలో హోత్రాగ్నుల్ని వేల్చరాదు" అని చాటింపు వేయించాడు.

క. అని యిట్టుల భేరీరవ, మునఁ జేసి సమస్త ధర్మములు వారింపన్
మును లవినీతుండగు వేనుని దుశ్చరితంబు జనమనోభయ మగుటన్.

414

తా ॥ ఈ విధంగా భేరీశబ్దంతో చాటింపు వేయించి, సమస్త ధర్మాలను అడ్డగిస్తున్న వేనుని దుశ్చరిత, జనుల మనస్సులకు భయం కలిగించడాన్ని మునీశ్వరులు చూశారు.

తే. కని కృపాయత్తు లగుచు నిట్లనిరి యిట్టి రాజచోర భయంబు లీ భూజనులను బలిసి
యిరువంకలను బాధపఱుపఁ జొచ్చె, దారువందుల వహ్ని చందనమునఁ బెలుచ.

415

తా ॥ వేనుని రాజ్యాన్ని గమనించిన మునీశ్వరులు దయామయులై ఇలా అనుకున్నారు. 'ఇటువంటరాజ భయమూ – చోర భయమూ ప్రజల్ని కట్టెకు రెండువైపులా నిప్పంటుకున్నట్లు బాధిస్తోందే' నని మథన పడ్డారు.

చ. అరయ నరాజకంబు మహాభయముం దొలఁగింపఁగోరి యి
ట్లెఱుఁగక యీ యనర్థుని మహీపతిఁ జేసినయట్టి దోషముం
బరువడిఁ జెందె దుగ్ధరస పానమునం బరివృద్ధి నొందు న
య్యురగ భయంబు పోషకుని నొందినరీతి ననర్థహేతువై.

416

తా ॥ రాజు లేనందున కలిగే మహాభయంకర పరిస్థితిని తొలగించాలనుకొని, అనర్థుడైన ఈ వేనుణ్ణి రాజును చేసిన దోషం మనకే అంటుకుంది. పాలుపోసి పెంచిన పాములవల్ల భయం పెంచిన వానికే కలిగినట్లు, వీడు మనకు అనర్థకారకుడయ్యాడు.

వ. అదియునుం గాక

417

తా ॥ అంతేకాకుండా.

క. మునుకొని సునీథ గర్భం, బున జనియించియు స్వభావమున దుర్జనుఁడై
యెనయఁ బ్రజాపాలనమున, కును బాల్పడి ప్రజల మన్ని గొనఁ జొచ్చెఁగదే.

418

తా ॥ 'సునీథ' గర్భవాసాన జన్మించి కూడ దుష్టస్వభావుడై దుర్జనుడయ్యాడు. ప్రజలను పాలించడానికి రాజై కూడ, ఆ ప్రజలనే బలిగోరుతున్నాడు.

వ. అదిగాక యీ వేనుండు పూర్వంబును జ్ఞాన సంపన్నులఁచేత రాజుగాఁ జేయంబడియెఁ, గావున నిట్టివాని మన మందఱమును గూడి బ్రార్థింతము; లోకరక్షణార్థం బగుటఁ దద్దోషంబు మనల స్పృశింపదు; సమీచీనోక్తులంజేసి వీని ననునయింప వాని గ్రహింపకుండెనేని మున్న లోకధిక్కారాగ్నిసందగ్ధుండగు వీని మన తేజోమహాగ్ని చేత భస్మీభూతుం జేయుద మని యాలోచించి గూఢమన్యు లగుచు వేనునిం గదియం జని యతని కిట్లనిరి.

419

తా ॥ పైగా ఈ వేనుడు జ్ఞానసంపన్నులమైన మన చేత రాజుగా చేయబడ్డాడు. కాబట్టి మనమంతా వెళ్ళి రాజును ప్రార్థిద్దాం. లోకరక్షణ కోసం ప్రార్థిస్తున్నాం కాబట్టి, ఆ అల్పుణ్ణి ప్రార్థించిన దోషం మనకంటదు. సమాధానపరిచే సంభాషణలతో అతనిని అనునయిద్దాం. వాడు మన ప్రియోక్తుల స్వారస్యాన్ని గ్రహించకపోతే, లోకధిక్కారమనే అగ్నిలో కాలిపోయిన వాణ్ణి, మనతేజోగ్ని జ్వాలలతో భస్మం చేద్దాం అని ఆలోచించుకొని, రోషాన్ని గుప్తంగా దాచుకొని వేనుని చెంతకు వెళ్ళి ఇలా అన్నారు:

క. నరపాలక! నీ కాయువు, సిరియును బలమును యశంబుఁ జేకుఱు, వృద్ధిం
బొరయుదుగా కనుచు మనో, హరముగ నాశీర్వదించి యతివినయమునన్.

420

తా ॥ 'ఓ రాజా! నీకు ఆయుష్షు, సంపద, బలము, కీర్తి సమకూరుగాక! నీవు వర్థిల్లుదువుగాక!' అని మనోహరంగా ఆశీర్వదించారు. ఆపైన ఎంతో వినయంతో—

వ. ఇట్లనిరి! నరేంద్రా! యే మొక్కటి విన్నవించెద! మవధరింపుము; పురుషులకు వాఙ్మనః కాయవృత్తుల వలన నాచరించు ధర్మంబు సమస్త లోకంబులను విశోకంబులం జేయు; నసంగు లయినవారికి మోక్షంబు నిచ్చు, నట్టి ధర్మంబు ప్రజలకు క్షేమకారణంబు గావున నీయందుఁ జెడకుండుంగాక యని పలికి మఱియు ధర్మంబు నాశంబు నొందిన నైశ్వర్యంబుచే రాజు విడువంబడు నని చెప్పి వెండియు నిట్లనిరి; దుష్టచిత్తులగు నమాత్యుల వలనను దస్కరుల వలనను బ్రజలు నాశంబు నొందకుండ రక్షించుచు యథాన్యాయంబుగ వారలఁ చే గరంబు గొనుచునుండు మహీపతి యిహపర సౌఖ్యంబుల నందు; నదియునుం గాక యెవ్వని రాష్ట్రంబున నే పురంబున యజ్ఞేశ్వరుండయిన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితం బయిన ధర్మంబు గలవారిచేత యజింపబడు, నట్టి నిజవాసనవర్తియగు రాజువలన సర్వభూతభావనుండును, మహాభాగుండును, భగవంతుడును నగు సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులుఁ బ్రాపించుఁ; లోకపాలకు లగువారు సర్వేశ్వరుని కొఱకు బలిప్రదానంబులు సేయుదురు; సమస్తలోకదేవతాయజ్ఞాది సంగ్రహుండును, వేదమయుండును ద్రవ్యమయుండును, దపోమయుండును నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబు సేసిన నీకు నభయంబగు; మోక్షంబునుం గలుగుం; గావున నీ దేశంబున జేయంబడిన యజ్ఞంబులచేత హరికళాయుక్తంబులగు దేవగణంబులు స్విష్టంబులై, తుష్టంబు లగుచు భవదీయవాంఛితార్థంబుల నిత్తురు; కావున దేవతాతిరస్కారంబు నీకు యుక్తంబు గాదు;

వేదచోదితంబులగు ధర్మంబులందాసక్తుండవు గమ్మనిన వేనుం డిట్లనియె.

421

తా ॥ ఇలా అన్నారు: "ఓ వేన మహారాజా! మాదొక విన్నపం, శ్రద్ధగా విను. మానవులకు త్రికరణాలైన 'వాక్కు', 'మనస్సు', 'శరీరము' అనబడే వాటి ద్వారా ఆచరించే కర్మలు ధర్మయుక్తమైనవయితే సమస్తలోకాలలో దుఃఖాన్ని తొలగిస్తాయి. నిష్కామంగా ఆచరించేవారికి ఈ ధర్మాలే మోక్షాన్ని ఇస్తాయి. అటువంటి ధర్మమే ప్రజలకు క్షేమకారణమవుతుంది. కాబట్టి నీయందు ఇటువంటి ధర్మం చెడిపోకుండు గాక!

ధర్మం నశిస్తే ఐశ్వర్యం రాజును విడిచిపెడుతుంది. దుష్టచిత్తులైన మంత్రులవలన గాని, దొంగల వలన గాని ప్రజలు నాశనాన్ని పొందకుండా రక్షిస్తూ, తగిన రీతిలో న్యాయబద్ధంగా ప్రజలనుండి పన్నులను స్వీకరిస్తూ పరిపాలించే రాజు ఇహపరసౌఖ్యాలను పొందుతాడు. అంతేకాకుండా, ఏ రాజ్యంలో, ఏ పట్టణంలో యజ్ఞేశ్వరుడైన విష్ణువు తమతమ వర్ణాశ్రమాలకు తగిన ధర్మాన్ని ఆచరించే వారిచేత పూజించబడతాడో, అటువంటి శాసనబద్ధుడైన రాజువలన సర్వభూతభావనుడు, మహాభాగ్యం గలవాడు, భగవంతుడు అయిన సర్వేశ్వరుడు సంతుష్టి చెందుతాడు. సర్వేశ్వరుడైన భగవంతుడు సంతోషిస్తే రాజ్యాధిపతియైన రాజుకు సర్వసౌఖ్యాలు ప్రాప్తిస్తాయి. లోకపాలకులైనవారు సర్వేశ్వరుని కోసం యజ్ఞభాగాలు సమర్పిస్తారు. సమస్త లోకాధీశుడు వేదమూర్తి, సర్వవ్యాపి, తపోమయుడు అయిన నారాయణుణ్ణి వివిధ యజ్ఞాలచేత ఆరాధిస్తే నీకు భయరాహిత్యం, మోక్షం కలుగుతాయి. కాబట్టి నీ రాజ్యంలో చేయబడ్డ యజ్ఞాల వలన విష్ణ్వంశగల దేవతాగణం, ఇష్టపూర్వకంగా సంతుష్టులై నీ కోరికలను తీరుస్తారు. అందుచేత దేవతా తిరస్కారం నీకు తగదు. వేదాలచే ప్రేరేపించబడ్డ ధర్మాలపట్ల ఆసక్తుడవుక" మ్మని చెప్పగా విన్న వేనుడు ఇలా అన్నాడు:

భారతీయ జీవన విధానమంతా యాజ్ఞికమే. మనిషి ఏ కర్తవ్యాన్ని ఆచరించినా యజ్ఞభావనతోనే చేయాలి. జ్ఞానకర్మలను సమన్వయం చేస్తూ శ్రీకృష్ణుడు భగవద్గీతలో (4 వ

అధ్యాయంలో) పన్నెండు యజ్ఞాల గురించి వివరిస్తాడు. దానిలో ప్రధానమైనది ఇంద్రియ సంయమయజ్ఞం. అది వేనునిలో లేకపోవడం వల్లే రాజ్యమంతా దుఃఖించింది.

క. మునులారా! మీర లిప్పుడు, నను నీగతిఁ బడుచుఁదనమునం బలికితి; రై
నను నది యధర్మ; మందుల నెనయఁగ ధర్మమునఁ గలదె? యెచ్చట నైనన్.

422

తా ॥ "ఓ మునులారా! మీరు నన్ను ఈ విధంగా పరిపాకంలేని పడుచువానిగా భావించి ఏమేమో అన్నారు. అయినప్పటికీ మీరన్నవన్నీ అధర్మపూరితమైన మాటలు. అందులో ధర్మమనేది ఎక్కడైనా ఉన్నదా?

వ. అదియునుంగాక.

423

తా ॥ అంతేకాకుండ.

చ. ఎనయఁగ జారకామిని నిజేశుని ముచ్చిలి జారపూరుషుం
దనపతిఁ గాఁ దలంచు గతిఁ దద్దయు మూఢమనస్కులై తన
ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ క
న్యుని భజియింప మీ రిహపరోన్నత సౌఖ్యము లంద రెన్నఁడున్.

424

తా ॥ వ్యభిచారిణి, భర్తను మోసగించి, వ్యభిచారం చేసే పురుషుణ్ణే తన భర్తగా భావిస్తుంది. అదే విధంగా మీరు కూడా మూఢచిత్తులై, రాజరూపంలో ఉన్న నన్ను ఈశ్వరునిగా తెలుసుకోలేక ఇతరులను భజిస్తున్నారు. మీరిక ఇహపరలోకసుఖాలను పొందలేరు."

వ. అని మఱియు నిట్లనియె; యజ్ఞపురుషుం దన నెవ్వం; డెవ్వనియందు మీకు భక్తి

స్నేహంబు లుదయించె? భర్తృస్నేహవిదూరంబులై కుయోషిద్గణంబులు జారునందుం జేయు భక్తిచందంబున బలికెద; రదియునుంగాక.

425

తా ॥ ఇంకా ఇలా అన్నాడు: "యజ్ఞపురుషుడంటే ఎవరు? ఎవరిపట్ల మీకు భక్తిస్నేహాలు కలిగాయి? భర్త స్నేహానికి దూరమైన దుష్టస్త్రీలు వ్యభిచరించే వాడిపట్ల భక్తి ప్రదర్శించినట్లు మీరు మాట్లాడుతున్నారు. అంతే గాక,

క. హరిహర హిరణ్యగర్భ, స్వరధీశ్వర వహ్ని శమన జలధిపతి మరు
న్నర వాహన శశి భూ రవి, సురముఖ్యులు నృపశరీర సూచకు లగుటన్.

426

తా ॥ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, వాయువు, కుబేరుడు, చంద్రుడు, సూర్యుడు, భూమి మొదలైన దేవతలు రాజు శరీరంలో నివసిస్తారు.

క. పరికించి నను భజింపుఁడు, ధరణీశుఁడు సర్వదేవతామయుఁ డగు, మ
త్సర ముడుగుఁడు నాకంటెను, బురుషుఁడు మఱి యెవ్వఁ డగ్రపూజార్హుఁ డిలన్?

427

తా ॥ కాబట్టి బాగా పరిశీలించి నన్ను పూజించండి. రాజు సర్వదేవతామయుడవుతాడు. సహించలేని మీ మత్సరాన్ని వదిలిపెట్టండి. నాకంటే అగ్రపూజకు అర్హమైనవాడు ఎవడున్నాడు?"

వ. అది గాక మీరు నాయందు బలివిధానంబులు సేయుండని పాపకర్ముండు నసత్ప్రవర్తకుండు నష్ట మంగళుండు విపరీతజ్ఞానుండు నగు వేనుండు పండితమాని యగుచుం బలికి మునుల వచనంబులు నిరాకరించి యూరకున్న న మ్మునులు భగ్నమనోరథులై తమలో నిట్లని; రీ దారుణకర్ముం డయిన పాతకుండు హతుం డగుంగాక!

వీఁడు జీవించెనేని వీని చేత నీ జగంబులు భస్మంబులు గాఁగల; విది నిశ్చయంబు; దుర్వృత్తుండగు వీఁడు మహారాజ సింహాసనంబున కర్హుండు గాఁడు; వీఁడు మున్నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతి యుక్తుం డయ్యె నట్టి యజ్ఞపతియైన శ్రీకృష్ణుని నిందించుచున్నవాడు; గావున నిర్లజ్జుండైన హరిదూషకుని హననంబు సేయవలయునని మునులుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునంజేసి హుంకారమాత్రంబున నా యీశ్వర నిందాహతుం డగు వేనునిం బొలియఁ జేసి రంత.

428

తా ॥ అదీ గాక "మీరు యజ్ఞంలో సమర్పించే ఆహుతుల్ని నాకే సమర్పించండని" చెప్పి, పాపకర్ముడు, దుష్టవర్తనుడు, శుభాల్ని కోల్పోయినవాడు, విపరీతబుద్ధి అయిన వేనుడు తానే అన్నీ తెలిసిన పండితుడనన్న అహంకారంతో మునుల మాటల్ని తిరస్కరించాడు. ఆ మునులు, తమ కోరిక నెరవేరక పోవడంతో తమలో తాము ఇలా అనుకున్నారు: "క్రూరకర్మలు చేసే ఈ పాతకుడు, మరణించుగాక! వీడు జీవించి ఉంటే, వీడి వల్ల ఈ ప్రపంచమే బూడిదయిపోతుంది. ఇది నిజం. దుష్టవర్తనుడైన వీడు మహారాజ సింహాసనానికి అర్హుడు కాడు. ఏ సర్వేశ్వరుని అనుగ్రహంతో వీడికి వైభవం సిద్ధించిందో, అటువంటి యజ్ఞపతియైన శ్రీకృష్ణుణ్ణీ నిందిస్తున్నాడు. కాబట్టి సిగ్గులేని ఈ హరినిందాపరుణ్ణి హతమార్చాలి" అని మునులు తమలో రగిలిన కోపంతో హుంకరించి, ఈశ్వరుణ్ణి నిందించటంతోనే హతమైన ఆ వేనుణ్ణి సంహరించారు.

"అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయంధీరాః పండితం మన్యమానాః
దంద్రమ్యమాణాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాఽంధాః"

– కఠోపనిషత్తు

మూఢులు అవిద్యారూపమైన సంసారంలో కొట్టుమిట్టాడుతూ ఉన్నప్పటికీ తామే

ధీరులమని, పండితులమనీ భావిస్తూ జననమరణరూపమైన ఈ సుడిగుండంలోనే పడి పరిభ్రమిస్తుంటారు. గ్రుడ్డివాళ్ళకు దారిచూపే గ్రుడ్డివాళ్ళ వంటి వాళ్ళే వీళ్ళు. ఇక్కడ వేనుని మూర్ఖత్వంకూడా అలాంటిదే. మునుల హితోపదేశం చెవికెక్కలేదు.

"సయథాకామోభవతి తత్క్రతుర్భవతి
యత్క్రతుర్భవతి తత్కర్మకురుతే
యత్కర్మకురుతే తదభిసంపద్యతే"

— బృహదారణ్యకం

కోరికల్ని బట్టే జీవుని ప్రయత్నాలుంటాయి. ఆ ప్రయత్నాలను బట్టే కర్మలు సాగుతాయి. జీవుని కర్మలను బట్టే ఫలితాలు ఉంటాయి. వేనుని కర్మోచితమైన ఫలమే, అతణ్ణి మునుల క్రోధరూపంలో సంహరింపచేసింది.

క. అరసి సునీథయు శోకా, తురయై తన సుతుఁడు దనువుఁ దొఱఁగిన దదనం
తరమునను యోగశక్తిం బరువడి నిజ తనయు తనువుఁ బరిపాలించెన్.

429

తా ॥ తన కొడుకు మరణవార్త తెలిసి, వేనుని తల్లి సునీథ శోకంతో తల్లడిల్లింది. తన తనయునిపై గల ప్రేమ వీడలేక ఆతని మృతదేహాన్ని తన యోగశక్తితో చెడకుండా కాపాడింది.

వ. అంత నొక్కనాఁడు.

430

తా ॥ ఆ తరువాత, ఒకరోజు—

సీ. మునివరేణ్యులు భక్తి దనర సరస్వతీ సలిలంబులను గృతస్నాను లగుచు
మునుకొని తత్తీరమున నగ్నిహోత్రముల్ విలసిల్ల నియతిఁ గావించి యచటఁ

దవిలి సత్పురుషకథా వినోదంబులు సలుపుచు నుండంగ సకలలోక
భయదంబు లగు మహోత్పాతముల్ దోఁచిన మసలి లోకంబు లమంగళములు

తే. వొరయకుండెడుఁగా కని బుద్ధిలోనఁ, దలఁచుచుండగఁ బెలుచ నుదగ్ర మగుచు
సర్వదిశలను బాంసువర్షంబు గురిసె; దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి.

431

తా ॥ మునీంద్రులంతా భక్తితో సరస్వతీనదీ జలాలలో స్నానాలు నిర్వర్తించి, ఆ నదీ తీరంలోనే నియమబద్ధంగా అగ్నిహోత్రాన్ని వేల్చి, అక్కడే సత్పురుషుల కథల్ని చెప్పుకొని, వినోదిస్తూ కాలక్షేపం చేస్తున్నారు. ఆ సమయంలో సకలలోకాలకూ భయం గొలిపే మహోత్పాతాలు కనిపించాయి. 'లోకాలకు అమంగళం కలుగకుండుగాక!' అని అనుకున్నారు. ఇంతలోనే భయంకరమైన సుడిగాలి రేగి, అన్ని దిక్కులా ధూళి వర్షంగా పడింది. అదే అదనుగా దొంగలు సమస్త ప్రజల ధనాలను దొంగిలించారు.

వ. ఇట్టి లోకోపద్రవం బెఱింగి జననాథుం డుపరతుం డగుటం జేసి జనపదంబు లరాజకంబులై యన్యోన్య హింసల నొందుచుం దస్కర బాధితంబు లగుచు నుండుట యెఱింగియుఁ దన్నివారణం బునకు సమర్థు లయ్యును జోరాదిబాధలం గనుంగొనుచు మునులు వారింపక యుండిరి; మఱియు సమదర్శనుండును శాంతుండును మననశీలుండును నగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన నతని తపంబు భిన్నభాండగతం బయిన క్షీరంబు చందంబున స్రవించుం గావున నంగ వసుధాధీశ వంశోద్భవులు హరిపదాశ్రయు లగుటం జేసియు వీరుల వంశంబు విచ్ఛిత్తి నొందింప ననర్హంబు గాన స్థాపనీయం బని నిశ్చయించి మృతుండైన వేనుని కళేబరంబు డగ్గఱ వచ్చి తదూరుమథనంబు గావింప నందు.

432

తా ॥ ఇటువంటి లోకోపద్రవాన్ని తెలిసికొన్న మునులు 'రాజు లేకపోవడం చేత

పరస్పరం ప్రజలు హింసించుకుంటూ, దొంగల బారినపడి బాధింపబడుతున్నారు' అని తెలుసుకున్నారు. ఇదంతా తెలిసి వీటిని ఆపడానికి సమర్థులై యుండి కూడా మునులు చూస్తూనే ఉన్నారుగాని నివారించలేదు. సమదర్శనుడు, శాంతుడు, పరిస్థితులను అవగాహన చేసుకోగల లోకజ్ఞత గలవాడు అయిన బ్రాహ్మణుడు బాధలలో ఉన్న దీనుణ్ణి ఉపేక్షిస్తే, ఆతని తపస్సు పగిలిన కుండలోని పాలలాగా తరిగి పోతుంది. కాబట్టి అంగరాజు వంశంలో జన్మించినవారంతా హరిభక్తులూ, మహావీరులూ ఇటువంటి వంశాన్ని చెదరగొట్టడం తగదు. విచ్ఛిత్తిని ఆపి వంశాన్ని పునరుద్ధరించాలి' అని నిశ్చయించుకొని చనిపోయిన వేనుని కళేబరం వద్దకు వచ్చి, ఆతని ఊరువుల్ని మథించారు. అలా మథించగా అందులోనుంచి.

సమదర్శనుడు, శాంతుడు, లోకజ్ఞుడైనవాడు దీనులపట్ల ఉపేక్షించటం తగదని చెప్పటం ధర్మసారాన్ని చెప్పటమే. భారతంలో శ్రీకృష్ణరాయబార సందర్భంలో—

ఉ. "సారపుధర్మమున్ విమలసత్యము పాపము చేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడ బారిన దైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష జేసి రది వారల చే టగుఁ గాని, ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యునుదైవముండెడిన్."

సీ. ఘన కాక కృష్ణ సంకాశ వర్ణుండును హ్రస్వావయవుఁడు మహాహనుండు
హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును నిమ్న నాసాగ్రుండు నెఱియు రక్త
నయనుండుఁ దామ్రవర్ణశ్మశ్రు కేశుండు నతి దీన వదనుండు నైన యట్టి
యొక్క నిషాదకుం డుదయించి యేమి సే యుదు నని పలుకుచు నున్నఁ జూచి

తే. వరమునులు నిషీద యనుచుఁ బలుకుటయును, దాన వాఁడు నిషాదాభిధానుఁ డయ్యె,
నతని వంశ్యులు గిరికాననాళి వేను, కల్మషముఁ దెల్పుచుండిరి కడఁక మఱియు.

తా ॥ అని పరమాత్మ అన్న మాటలుకూడ ఇవే. దీనుల, హీనుల, పాపుల, పతితులపై జాలి, కరుణ, అనుకంప కలిగియున్నవాడే దైవీయమైన లక్షణాలను సంతరించుకున్నవాడు. అలా కానప్పుడు చేసిన తపము, యోగము అపరిపూర్ణమే.

మబ్బులాగ, కాకిలాగ నల్లని రంగుకలవాడు, పొట్టి అవయవాలు గలవాడు, వెడల్పయిన ముట్టె గలవాడు, పొట్టి చేతులు, పొట్టికాళ్ళు గలవాడు, సొట్టముక్కు గలవాడు, ఎఱ్ఱనికళ్ళు, రాగిరంగు మీసాలు, వెంట్రుకలు గలిగిన, అతిదీనమైన మొహం గల ఒక నిషాదుడు జన్మించాడు. అలా జన్మించిన ఆ బోయవాడు. "నేను చేయవలసిన పని ఏమిటి?" అని ప్రశ్నించగా వాణ్ణి చూసిన మునులు 'నిషీద' (కూర్చో!) అని అన్నారు. మునులు ఆ విధంగా అనడంచేత అప్పటినుండి వాడికి 'నిషాదు' డనే పేరు కలిగింది. అతని వంశంలో జన్మించిన వాళ్ళంతా నిషాదులై అడవులలో, కొండలలో తిరుగుతూ వేనరాజు దుష్కీర్తిని సూచించే ప్రతీకలయ్యారు.

## 18. అర్చి పృథుల జననము

క. కని వా రనపత్యం డగు, మనుజేంద్రుని బాహు లంత మథియించిన నం
దనఘంబగు నొక మిథునము, జనియించెను సకలజనులు సమ్మదమందన్.

434

తా ॥ అప్పుడు మునులు సంతానహీనుడైన వేనుని బాహువుల్ని మథించగా, ఆ బాహువుల నుండి పవిత్రులైన స్త్రీ పురుషుల జంట జన్మించింది. ఆ జంటను చూచి సకల జనులు ఆనందించారు.

వ. అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక పురుషుండును, హరికి నిత్యానపాయిని యగు లక్ష్మీకళా కలితయు గుణంబులకు భూషణంబులకు నలంకార ప్రదాత్రియు నగు కామినియు జనియించె, నందుఁ బృథుశ్రవుండును పృథుయశుండు నగుట పృథు చక్రవర్తియను పేరం బ్రసిద్ధుం డయ్యె! న య్యంగనయు నర్చి యను నామంబునం దనరుచు నతని వరియించె, నా సమయంబున.

435

తా ॥ ఆ వేనుని బాహువులను మథించగా నారాయణాంశతో ఒక పురుషుడు జన్మించాడు. శ్రీహరిని ఎప్పుడూ వీడియుండని లక్ష్మీదేవి అంశతో, గుణాలకే భూషణమైనది భూషణాలకే అలంకారమైన ఒక దేవతా స్త్రీ జన్మించింది. ఆ పుట్టిన పురుషుడు, పెద్ద చెవులు, గొప్ప యశస్సు కలిగిన వాడు కావడం చేత 'పృథు చక్రవర్తి' అనే పేరుతో సుప్రసిద్ధుడయ్యాడు. ఆ స్త్రీ కూడ 'అర్చి' అనే పేరుతో ప్రసిద్ధమై ఆ పృథు చక్రవర్తినే వరించింది. ఆ సమయంలో—

సీ. అందంద కురియించి రమరులు మునినాథ వితతి మోదం బంద విరులవానఁ;
బరమానురక్తి శుంభల్లీలఁ జూపట్టె సురపతివీట నచ్చరలయాట;

కర్ణరసాయన క్రమమున వీతెంచెఁ బఱపైన తేటకిన్నరులపాట;
యనిమిషకరహతం బై చాలఁ జెలఁగెను విభవోత్సవంబు దుందుభిరవంబు;

తే. మునినుతి సెలంగె శిఖీ గుండముల వెలింగె, నంత నచటికి సరసీరుహాసనుండు
గరుడ గంధర్వ కిన్నర గణముతోఁడ, నర్థిఁ జనుదెంచి సమ్మోద మతిశయిల్ల.

436

తా ॥ మునీంద్ర బృందం సంతోషించే లాగా దేవతలు అక్కడ కూడా పూలవాన కురిపించారు. ఇంద్రుని పట్టణమైన అమరావతిలో అప్సరకాంతల ఆటపాటలు మిక్కిలి శ్రద్ధతో సాగాయి. వీనులవిందుగా కిన్నరుల పాటలను గాలి మోసుకొచ్చింది. ఉత్సాహంతో దేవతలు మ్రోగించిన నగారాల మ్రోతలు ఉత్సవ వైభవాన్ని పెంచాయి. మునులు నుతించారు. అగ్నిహోత్రాలు యజ్ఞకుండంలో ప్రకాశవంతమై వెలిగాయి. ఆ సమయంలో గరుడ గంధర్వకిన్నర గణాలతో కలసి కమలగర్భుడైన బ్రహ్మ సంతోషంగా అక్కడికి విచ్చేశాడు.

వ. అంత.

437

కవిరాజ విరాజితము.
అరయఁగ వైన్యుని దక్షిణహస్తము నందు రమారమణీసుమనో
హరు లలితాయుధ చిహ్నము లంఘ్రులయందు సమగ్రహలాంకుశ భా
స్వర కులిశధ్వజ చాప సరోరుహశంఖ విరాజిత రేఖలు వి
స్ఫురగతి నొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులైరి తగన్.

438

తా ॥ వచ్చిన బ్రహ్మదేవుడు, మిగిలిన దేవతలతో కలసి, పృథుచక్రవర్తి కుడిచేతిలో అందంగా విష్ణుమూర్తి యొక్క ఆయుధాల గుర్తులు అమరి ఉండటాన్ని, పాదాలలో హలరేఖ,

అంకుశం, వజ్రం, ధ్వజం, ధనుస్సు, పద్మం, శంఖం వంటి ప్రకాశవంతమైన రేఖలుండటాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపడ్డారు.

వ. ఇతండు నారాయణాంశ సంభూతుండు నితని యంగన రమాంశ సంభూతయుం గానోపుదు రని తలచి యయ్యవసరంబున బ్రహ్మవాదులగు బ్రాహ్మణోత్తము లతనికి విధ్యుక్త ప్రకారంబున రాజ్యాభిషేకంబు గావించిరి; తదనంతరంబ.

439

తా ॥ ఈ పృథుచక్రవర్తి నారాయణాంశ సంభూతుడు. ఇతని భార్య లోకమాతయైన లక్ష్మీదేవి అంశతో జన్మించినదని భావించిన బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణోత్తములు, అతనికి శాస్త్రబద్ధంగా రాజ్యాభిషేకం చేశారు. తరువాత,

క. సరిదంభోనిధి ఖగమృగ, ధరణీ సురవర్త్మ పర్వత ప్రముఖములై
పరఁగిన భూతశ్రేణులు, నరవరునకుఁ దగు నుపాయనము లిచ్చె నొగిన్.

440

తా ॥ నదులు, సముద్రాలు, పక్షులు, జంతువులు, బ్రాహ్మణులు, పర్వతాలు మొదలైన రూపాలలో ప్రసిద్ధమైన జీవకోట్లు పృథు చక్రవర్తికి కానుకలిచ్చాయి.

ఒక చక్రవర్తికి మానవేతర ప్రకృతి కానుకలీయటమేమిటి? సర్వభూతహితం కోరే వారి పట్ల, సర్వ ప్రకృతి సానుకూలమే. జీవజలాలతో నదులు ప్రవహించటం, సకాలంలో వర్షాలు కురవడానికి జలధులు దోహదం చేయటం ఇలా సృష్టి అంతా పరచుకున్న పరమాత్మ చైతన్యం ఒక సత్పురుషునిపట్ల ప్రాణాస్పదంగా స్పందిస్తుందనడానికి నిదర్శనాలివి. నాయకుడు సత్పురుషుడైతే, నాయకుడిని అనుసరించి ప్రజలు సద్గుణ సంపదను అలవరచుకొంటారు. అలా సద్గుణసంపదతో అలరారే జనంతో నిండిన రాజ్యం ఎల్లప్పుడూ సుభిక్షంగా ఉంటుంది.

తే. సమధికఖ్యాతి నా పృథు చక్రవర్తి, దేవి యగు నర్చితోఁ గూడ దివ్యవస్త్ర గంధ మాల్య
విభూషణ కలితుఁ డగుచుఁ, బావకుఁడుఁ బోలె సత్ప్రభాభాసి యయ్యె.

441

తా ॥ మిక్కిలి ఖ్యాతికెక్కిన ఆ పృథు చక్రవర్తి, తన భార్యయైన 'అర్చి' తో కూడ కలిసి, దివ్యవస్త్రాలను, గంధాన్ని, మాలికల్ని, ఆభరణాన్ని ధరించి మంచి వెలుగుతో ప్రకాశించే అగ్నిహోత్రునిలాగా ప్రకాశించాడు.

సీ. రాజరాజాపృథురాజుకు హేమమయంబైన వీరవరాసనంబు
జలపతి జలకణ స్రావకం బగు పూర్ణచంద్ర సన్నిభ సితచ్ఛత్త్రకమును
బవమానుఁ డతులశోభన మగు వాలవ్యజనసమంచిత సితచామరములు
ధర్ముండు నిర్మలోద్యత్కీర్తిమయమగు మహనీయ నవ పుష్పమాలికయును
తే. జంభవైరి కిరీటంబు శమనుఁ డఖిల, జన నియామక దండంబు జలజభవుఁడు
నిగమమయ కవచంబు వాణీలలామ, స్వచ్ఛ మగు నవ్యహార మొసఁగిరి మఱియు.

442

తా ॥ ఆ పృథుచక్రవర్తికి కుబేరుడు బంగారుమయమైన వీరోచిత సింహాసనాన్ని కానుకగా ఇచ్చాడు. వరుణుడు, నీటిబిందువులతో కదలాడే నిండుచంద్రునివంటి తెల్లని గొడుగును కానుక పెట్టాడు. వాయుదేవుడు, మిక్కిలి ప్రకాశించే చమరీమృగాల తోకకుచ్చులతో అలంకరించబడిన తెల్లని వింజామరలను, ధర్ముడు, నిర్మలమైన కీర్తితో నిండిన మహిమాన్వితమైన పుష్పమాలికను, ఇంద్రుడు కిరీటాన్ని, యముడు సమస్తజనాన్ని హద్దులో ఉంచే రాజదండాన్ని, బ్రహ్మదేవుడు వేదమయమైన కవచాన్ని, సరస్వతీదేవి స్వచ్ఛమైన క్రొత్త ముత్యాల హారాన్ని కానుకలుగా ఇచ్చారు.

సీ. దామోదరుండు సుదర్శన చక్రంబు నవ్యాహతైశ్వర్య మబ్జపాణి

చంద్రార్ధధరుఁ డర్ధచంద్ర రేఖాంకిత కమనీయ కోశసంకలిత ఖడ్గ
మంబిక శతచంద్ర మను ఫలకముఁ జంద్రుఁ డమృతమయ శ్వేతహయచయంబుఁ
ద్వష్ట రూపాశ్రయోదాత్త రథంబును భానుండు ఘృణిమయ బాణములును

తే. శిఖియు నజగోవిషాణసంచిత మహోజ, గవ మనందగు చాపంబు నవనిదేవి
యోగమయమైన పాదుకాయుగము గగన, చరులు గీతంబు లిచ్చిరి సంతసమున.

443

తా ॥ విష్ణుమూర్తి సుదర్శనచక్రాన్ని, పద్మపాణియైన లక్ష్మీదేవి తరిగిపోని ఐశ్వర్యాన్ని, ఈశ్వరుడు అర్ధచంద్ర రేఖ గుర్తుగల ఖడ్గాన్ని, ఒరతోసహా ప్రసాదించారు. అంబికా మాత 'శతచంద్ర' మనే పేరుగల డాలును ఇచ్చింది. 'చంద్రుడు' అమృతమయమైన తెల్లని గుఱ్ఱాలనిస్తే, 'త్వష్ట' అందమైన వెండి రథాన్ని, సూర్యుడు కిరణాలతో నిండిన బాణాలను ప్రసాదిస్తే, అగ్ని గొఱ్ఱెకొమ్ము–ఎద్దుకొమ్ము కలిపి చేయించిన 'అజగవ' మనే పేరుగల ధనుస్సును ఇచ్చాడు. భూదేవి యోగమయమైన పాదుకల్ని, దేవతలు యశోగీతాలను సంతోషంగా కానుక పెట్టారు.

వ. వెండియుం బ్రతిదివసంబు నాకాశంబు పుష్పంబులు గురియింప, మహర్షులు సత్యంబులైన యాశీర్వచనంబులు సలుప, సముద్రుండు శంఖంబును, నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబు నొసంగెఁ; దదనంతరంబ సూత మాగధ వందిజనంబులు దన్ను నుతియించినం బ్రతాపశాలి యగు నవ్వైన్యుండు మందస్మిత సుందర వదనారవిందుండై చతురవచన రచనుండగుచు మేఘగంభీర భాషణంబుల వారల కిట్లనియె.

444

తా ॥ ఇంకా ప్రతిరోజు ఆకాశం పుష్పవృష్టిని కురిపించగా, మహర్షులు సత్యవాక్కులతో ఆశీర్వదించారు. సముద్రుడు శంఖాన్ని, పశ్చిమం వైపు ప్రవహించే నదీ, నదులు, పర్వతాలు, ఆతని రథానికి దారిని ఇచ్చాయి. తరువాత సూతుడు, వందిమాగధులు తనను కీర్తించగా, విన్న

పృథు చక్రవర్తి చిరునవ్వులు చిందిస్తూ, సుందరంగా ముఖపద్మంలోకి వికాసం తెచ్చుకొని, మేఘగంభీరమైన కంఠస్వరంతో చతురవచనాలతో ఇలా అన్నాడు:

సీ. వందిమాగధ సూతవరులార! నా యందుఁ గమనీయగుణములు గలిగెనేని
యర్థంబు నుతిసేయ; నవి లేవు నాయందు; నది గాన మీ నుతి వ్యర్థ మయ్యె;
నిటమీఁద గుణముల నేపారి యుండిన నపుడు నుతించెద రగుట మీఁద
సభ్యనియుక్తులై చతురత నుత్తమ శ్లోకుని గుణము లస్తోకభూ ప్ర

తే. సిద్ధములు గాన సన్నుతి సేయుఁ డజుని, నతని బహువిధ భావంబు లభినుతింప
నలవిగాకయె యుండుదు; రదియుఁగాక చతురమతులార మాగధ జనములార!

445

తా ॥ “ఓ వందిమాగధ సూతులారా! నా యందు కోరదగిన గుణాలు ఉంటే స్తుతించటం తగుతుంది. కాని అటువంటి సుగుణాలు నాలో లేవు. కాబట్టి మీ స్తుతి వ్యర్థం. ఇక మీదట ఆ సద్గుణాల్ని నేను పొందినప్పుడు కీర్తించవచ్చు. విష్ణుమూర్తి యొక్క దివ్యగుణాలు సమస్తలోకాలలో ప్రసిద్ధాలు కాబట్టి, సభాసదులైన సభ్యుల అనుమతిని పొంది, అతని గుణాలను కీర్తించండి. ఓ చతురమతులారా! వందిమాగధ జనులారా! ఆ శ్రీమహావిష్ణువుని అనంత కల్యాణ గుణగణాలను పొగడటం అలవికాని విషయం.

వ. మఱియు మహాత్ముల గుణంబుల దనయందు సంభావితంబులు సేయ సామర్థ్యంబు గలిగిన నందు మహాత్ముల గుణంబులు ప్రసిద్ధంబులు గావునం దత్సమంబుగా నెట్లు నుతింపవచ్చు? నెవ్వండే నొకండు శస్త్రాభ్యాసంబునం దనకు విద్యా తపోయోగ గుణంబులు గలుగు నని పలికిన వానిం జూచి సభ్యులు పరిహసింతు; రది కుమతి యగువాఁ డెఱుంగం; డదియునుంగాక.

446

తా ॥ మహాత్ముల గుణాలను ఆరోపించి పొగిడే శక్తి స్తుతిపాఠకులకున్నప్పటికీ, ఆ మహాత్ముల గుణాలు జగత్ప్రసిద్ధాలు కాబట్టి వారితో సమానంగా ఎలా కీర్తించగలరు? ఎవరైనా శాస్త్రాభ్యాసంవల్ల తనకు విద్యా తపోయోగ లక్షణాలు కలిగాయని చెబితే వాణ్ణి చూసి సభ్యులైన పెద్దలు పరిహసిస్తారు. అది దుర్బుద్ధిగల దుష్టులకు తెలియదు.

క. అతివిశ్రుతులు సులజ్జా, న్వితులు మహోదారు లధిక నిర్మలు లాత్మ
స్తుతిపరనిందలు దోషము, లతి హేయము లని తలంతు రాత్మల నెపుడున్.

447

తా ॥ విస్తృతమైన పాండిత్యం, వినయంతో కూడిన సిగ్గుపడే లక్షణం, నిర్మలమైన మనస్సు కలిగిన ఉదాత్త చరితులు ఆత్మస్తుతి, పరనిందలను అసహ్యకరమైనవిగా మదిలో భావిస్తారు.

క. వంది జనంబులు లోకము, లందు నవిదిత వరకర్ములగు భూపతులన్
నందించు టవశ్యంబై, నం దగదు నుతింప శిశుజనంబుల పగిదిన్.

448

తా ॥ లోకంలో ఏవి మంచి పనులో తెలియని రాజుల్ని, స్తోత్రపాఠాలు చేసే స్తుతి పాఠకులు పొగడటం తప్పనిసరైనప్పటికీ, పసిపిల్లలవలె పొగడటం తగని పని."

క. అన సూత వంది మాగధ. జను లా నరనాయకుని వచనములు వినియున్
మునిచోదితులై క్రమ్మఱ, ననురాగము లుప్పతిల్ల నమ్మనుజేంద్రున్.

449

తా ॥ అని పలికిన ఆ పృథు చక్రవర్తి మాటలు విన్న సూత వందిమాగధులు, మునులచే ప్రేరేపించబడి, ప్రేమ చిందేలాగ,

వ. అమృతోపమానంబు లయిన మధుర వాక్యంబుల నిట్లనిరి.

450

తా ॥ అమృతంతో సమానమైన తీయని మాటలతో ఇలా అన్నారు:

క. వేనాంగ సంభవుండవు, శ్రీనాథ కళాంశజుఁడవు చిరతరగుణ స
మ్మానార్హుండ వతర్కిత, మైన భవన్మహిమఁ బొగడ నలవియె మాకున్.

451

తా ॥ "ఓ రాజా! నీవు వేనుని శరీరాంగం నుండి పుట్టావు. లక్ష్మీనాథుని అంశతో ప్రభవించావు. అనంతగుణములతో ప్రకాశించే నీవు సన్మానింపదగినవాడవు. ఊహకందని నీ మహిమను పొగడ మాకు తరమా!

క. అని వెండియు నిట్ల ని; రై, నను నొకమార్గంబు గలదు నందింప భవ
ద్ఘనచరితామృతపానం, బునఁ జేసియు మునులవచనములఁ జేసి తగన్.

452

వ. శ్లాఘ్యంబులైన భవదీయచరిత్రంబుల స్తుతియించెద మని యిట్లనిరి.

453

తా ॥ అయినప్పటికీ నిన్ను కీర్తించడానికి ఒక మార్గముంది, నీ ప్రవర్తన అనే అమృతపానంతోను, మునీశ్వరుల ఆశీర్వచనాలతోను కలిగిన శక్తితో శ్లాఘనీయమైన నీ చరిత్రను స్తుతిస్తామ" ని అన్నారు.

సీ. ఈ వైన్యుఁ డఖిలలోకావళి ధర్మానువర్తనముల నెప్డు వఱలఁ జేసి
ఘనధర్మమార్గ వర్తనులలో ధన్యుఁడై ధర్మ సేతువుఁ బ్రీతిఁ దగిలి ప్రోచు;
ధరను శాత్రవులను దండించు నష్టదిక్పాలకమూర్తి సంకలితుఁ డగుచు;

నయ్యయి కాలంబులందు పోషణదానములఁ బ్రజారంజనములఁ దనర్చు;

తే. సవన సద్వృష్టి కరణాదిసక్తుఁ డగుట,

నుభయలోకంబులకుఁ బ్రీతి నొదవఁ జేయు;

న్యాయమార్గంబునను భూజనాళిధనముఁ,

బుచ్చుకొను నిచ్చు సూర్యుండుఁ బోలె నితఁడు.

454

తా ॥ "వేనుని కొడుకైన ఈ పృథుచక్రవర్తి సమస్తలోకాలను ధర్మమార్గంలో ప్రవర్తింప చేస్తాడు. ధర్మమార్గంలో సంచరించే వారిలో గొప్పవాడై, ధర్మానికి సేతువుగా నిలచి కాపాడతాడు. ధర్మానికి శత్రువులైన వారిని, అష్టదిక్పాలకుల స్వరూపంతో దండిస్తాడు. ఆ యా కాలాలలో, ప్రియమైన భాషణంతో, దానాలతో ప్రజలను రంజింపజేస్తాడు. యజ్ఞసంబంధమైన కార్యాలతో దేవతలను సంతృప్తి పరచి వర్షాలు కురిపిస్తాడు. ఇహపర లోకాలకూ ప్రీతిని కలిగిస్తాడు. న్యాయమార్గంలో, సూర్యునిలాగ ప్రజలనుండి పన్నుల రూపంలో ధనాన్ని పుచ్చుకొని, మళ్ళీ తిరిగి ఇస్తుంటాడు.

మంచి చక్రవర్తి ప్రజలకు చేసే పనులు ఎలా ఉండాలో ఇక్కడ సూచించటం గమనించాలి. సూర్యుడు సముద్రం నుండి జలాన్ని స్వీకరించి, ఆ జలాన్నే వర్షరూపంలో ప్రపంచానికి ప్రసాదిస్తాడు. సముద్రజలం ఉప్పుతోకూడి యుంటే, వర్షజలం ఎంతో తీయగా ఉంటాయి. ఉప్పును తీపిగా మార్చటం లాంటిదే, ప్రజల ధనాన్ని మరింత ప్రజోపయోగంగా ఖర్చు పెట్టడం. ఇది ప్రతీ పాలకుడు అలవర్చుకోవలసిన సద్గుణం.

వ. మఱియును.

455

సీ. సర్వభూతములకు సముఁడును బర్యతిక్రమమున లోకాపరాధములను

నతిశాంతి సంయుక్తుఁడై సహించుచు నార్తు లగువారి యెడఁ గృపాయత్తుఁ డగుచు
నరరూపధారియౌ హరిమూర్తి గావున నింద్రుండు వర్షించి యెల్ల ప్రజల
రక్షించుగతిఁ దాను రక్షించు; నమృతాంశు సన్నిభ వదనాబ్జ సస్మితాను

తే. రాగ మిళితావలోకన రాజిఁజేసి, సకల జనులకు సంప్రీతి సంభవింపఁ
జేయు సంతతమును గూఢచిత్తుఁ డగుచు, శత్రువరుల కగమ్యుఁడై సంచరించు.

456

తా ॥ సర్వప్రాణికోటిని సమంగా చూస్తాడు. ధర్మవ్యతిరేకులై లోకానికి అపకారం చేసిన వారిని కూడా క్షమించి శాంతంతో సహిస్తాడు. ఆర్తులైన వారిపట్ల అపారమైన దయను ప్రదర్శిస్తాడు. నరుని రూపాన్ని ధరించిన విష్ణుమూర్తి కాబట్టి, ఇంద్రుడు సకాలంలో వర్షించి ప్రజల్ని రక్షించినట్లే తానుకూడా ప్రజలను రక్షించేవాడు. అమృతంచిందే చందమామవంటి ముఖపద్మంతో చిరునవ్వులు చిందిస్తూ, అనురాగపూరితమైన చూపులతో, సకల జనులకు సంప్రీతిని కలిగిస్తాడు. నిగూఢ చిత్తుడై శత్రువులకు అగమ్యగోచరుడై సంచరిస్తాడు.

లోకాపకారం చేసిన వాళ్ళను క్షమించి సహించటమంటే క్షాత్రంలేని చర్యకాదు. దండించగల శక్తి కలిగి కూడ దండించకుండా సహించటమే క్షమాగుణ లక్షణం. పిరికివాడు, బలహీనుడు, దండించే శక్తిలేక ఉపేక్షించడం 'క్షమ' కానే కాదు. తప్పుచేసిన వాడి తప్పు తెలిసినప్పటికీ, వీరశూరత్వాలతో ప్రకాశించే రాజు క్షమించాడంటే, అది నిందితునిలో మానసిక పరివర్తన తేవడం కోసం చేసిన చర్యయే. ఇది పృథుచక్రవర్తి యొక్క మానసిక ఔన్నత్యాన్ని తెలియజేస్తుంది.

వ. అని వెండియుఁ బ్రవేశ నిర్గమ శూన్యమార్గ నిరూఢ కార్యుండును, నపరిమిత మహత్త్వాది గుణగణైక ధాముండును, సముద్రునిభంగి గంభీరచిత్తుండును, సుగుప్తవిత్తుండును, వరుణుండునుంబోలె సంవృతాత్ముండును శాత్రవాసహ్య ప్రతాపయుక్తుండును, దురాసదుండును, సమీపవర్తియయ్యును దూరస్థునిభంగి వర్తించుచు

వేనారణిజనిత హుతాశనుండు గావున హుతాశను చందంబున ననన్యదుస్స్పర్శనుండునై, చారుల వలన సకలప్రాణి బాహ్యాభ్యంతరకర్మంబులం దెలియుచు; దేహధారులకు నాత్మభూతుండై సూత్రాత్మకుండైన వాయువు భంగి వర్తించుచు, నాత్మస్తుతి నిందలవలన నుదాసీనుం డగుచు, ధర్మపథంబున వర్తించుచు, నాత్మీయ సుహృద్బంధువుల వలనం దప్పు గలిగినను దండించుచు, నాత్మ శత్రువులనైన నదండ్యుల దండింపక ధర్మమార్గ గతుం డగుచుం, దన యాజ్ఞాచక్రం బప్రతిహతం బగుచు మానసాచలపర్యంతంబు వర్తింప సూర్యుండు నిజకిరణంబులచేత నెంత పర్యంతంబు భూమిం బ్రకాశింపజేయునంత పర్యంతంబు నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లంజేయు; నదియునుం గాక ప్రకృతి రంజకంబులైన గుణంబుల చేత దృఢవ్రతుండును, సత్యసంధుండును, బ్రహ్మణ్యుండును, సర్వభూతశరణ్యుండును, వృద్ధసేవకుండును, మానప్రదుండును, దీనవత్సలుండును, బరవనితా మాతృభావనుండును, దనపత్ని నర్ధశరీరంబుగాఁ దలచువాఁడును నగుచుం బ్రజల యెడఁ దండ్రివలెఁ బ్రీతి సేయుచు రక్షించుచుండు మఱియును.

457

తా ॥ తాను వచ్చేది, పోయేదీ ఏమార్గమో ఎవరికీ తెలియనిరీతితో కార్యాన్ని సాధించే స్థిరమైన వ్యవహారదక్షత గలవాడు పృథుచక్రవర్తి. ఏ పరిమితులూ లేని మహత్తువంటి గొప్పగుణాలకు నిలయమైనవాడు, సముద్రునివలె గంభీర హృదయుడు సంపదలను గుప్తంగా వృద్ధి చేస్తాడు. వరుణునివలె ఆత్మశక్తి గలవాడు, శత్రువులకు సహింపరాని ప్రతాపముతో కూడినవాడు. తేరిపార చూడటానికి అలవికానివాడు, దగ్గరగా ఉంటూనే దూరంగా ఉన్నవానివలె ప్రవర్తించేవాడు, వేనరాజనే ఆరణిలో జన్మించిన అగ్నిహోత్రుడు కాబట్టి, అగ్నిహోత్రునిలాగే పృథుచక్రవర్తి, ఇతరులు, దరిజేరడానికి వీలుకాని తేజస్సుతో ప్రకాశించేవాడు. గూఢచారుల ద్వారా సకల ప్రాణికోటీ లోపలాబయటా చేసే పనుల్నీ, వాళ్ళ ఊహల్నీ తెలుసుకొనేవాడు. ప్రాణికోటికి ఆత్మీయుడై, సూత్రాత్మయైన వాయుదేవునిలా వర్తించేవాడు. నిందాస్తుతులయందు ఉదాసీనుడై వ్యవహరించేవాడు. ఆత్మీయులు, స్నేహితులు, బంధువులు

అయినప్పటికీ తప్పుచేస్తే దండించేవాడు. శత్రువులైనప్పటికీ దండింప తగనివారయితే, దండింపక ధర్మమార్గంలో సంచరించేవాడు.

పృథు చక్రవర్తి ఆజ్ఞ ఎదురులేనిదై సోత్తర పర్వతం (లోకాలోక పర్వతం) వరకు విస్తరించింది. సూర్యుడు, తన కిరణాలతో ఎంతమేరకు భూమిని ప్రకాశింప చేస్తాడో, అంతమేరకు తన గుణాల చేత లోకాలను రంజింపచేశాడు.

అంతేగాక ప్రకృతిని రంజింపచేసే గుణాలు కలిగి దృఢవ్రతుడు, సత్యసంధుడు, బ్రహ్మణ్యుడు, వేదసమ్మతుడు, సర్వప్రాణికోటికీ అభయ ప్రదాతయై, వృద్ధుల్ని సేవిస్తూ, ప్రజల స్వాభిమానాన్ని పెంపొందిస్తూ, దీనులపట్ల వాత్సల్యంతో, పరస్త్రీలపట్ల మాతృత్వ భావనను కలిగి, తన భార్యను తన దేహంలో సగంగా భావిస్తూ ప్రజల్ని కన్నతండ్రిలాగా ప్రేమిస్తూ రాజ్యాన్ని పాలిస్తున్నాడు.

సీ. తలపోయ బ్రహ్మవిద్యానిష్ఠ జనముల కనయంబుఁ గింకరుం డైనవాడు
నఖిలశరీరగుఁ డా ప్తసుహృజ్జన తానంద కరుఁడన నలరువాఁడు
సంసారఘనకర్మ సంగహీనులయందు సంగసంప్రీతుఁడై జరుగువాఁడు
దుర్మార్గమనుజ సందోహంబునకు నుగ్ర దండధరుం డనఁ దనరువాఁడు

తే. బ్రకృతి పురుషావేశుఁడై పరఁగువాఁడు, భగవదవతార యుక్తుఁడై నెగడువాఁడు
నగుచు వర్తించు సమ్మోద మతిశయిల్లఁ జారుతర మూర్తి యీ రాజచక్రవర్తి.

458

తా ॥ బ్రహ్మవిద్యానిష్ఠులైన వారికి దాసుడై సేవ చేసేవాడు. అందరి శరీరాలలో ఉన్న పరమాత్మ చైతన్యంలాగా తనవారికి, హితులకు, స్నేహితులకు, ఇతర జనులకు ఆనందాన్ని కలిగించేవాడు. సంసార బంధకారకమైన కర్మలు చేయడంలో ఆసక్తి లేని మహాత్ములతో సాంగత్యాన్ని చేసేవాడు. దుర్మార్గులైన మనుజకోటికి యమునిలా భయంకరుడై ప్రవర్తించేవాడు,

ప్రకృతి పురుషులయందు ఉత్సాహావేశాలను కలిగించి ప్రకాశించేవాడు. భగవంతుని అవతారంగా పరిగణింపబడుతూ, అందరికీ సంతోషాన్ని కలిగిస్తూ, సౌందర్యమూర్తియైన ఆ పృథు చక్రవర్తి పరిపాలన కొనసాగిస్తున్నాడు.

వ. మఱియుం ద్ర్యధీశుండు గూటస్థుడుఁ బరమాత్మయు బ్రహ్మకళారూపుండు నగువాఁడునునై యుదయించెం గావున నితనియందు నవిద్యారచితంబైన భేదంబు నిరర్థకం బగు నని పెద్ద లగువారలు చూతురు, మఱియును.

459

తా ॥ పృథు చక్రవర్తిని త్రిగుణాలకు అతీతుడని, అంతర్యామిగా ప్రాణికోటి హృదయాలలో వర్తించేవాడు, పరమాత్మయని, పరబ్రహ్మయొక్క అంశమని భావించారు. కాబట్టి ఈ చక్రవర్తిలో అజ్ఞానంతో కూడిన భేదదృష్టి లేదని, అలా చూడటం నిరర్థకమని పెద్దలు తలచారు.

సీ. ఉదయాద్రి పర్యంత మర్వీతలం బేక వీరుఁడై రక్షించి వెలయు నీతఁ
డొకనాఁడు విజయ యాత్రోత్సవం బేపార సన్నద్ధుఁడై మణిస్యందనంబు
నెక్కి చాపముఁ బూని దిక్కుల సూర్యుని పగిదిని శత్రుభూపాలతమము
విరియింతు నని చాల వెలుఁ గొందుచును ధరా చక్ర ప్రదక్షిణశాలి యగుచుఁ

తే. దిరుగునెడ సర్వ దిక్పాలవర సమేత, పార్థివోత్తమ నికర ముపాయనంబు
లిచ్చి తనుఁ జక్రపాణిని నెనయు నాది, ధరణివిభుఁ డని నుతియించి తలఁతు రెదల.

460

తా ॥ ఈ పృథు చక్రవర్తి ఉదయపర్వతం వరకు ఉన్న భూతలాన్ని తానొక్కడే వీరుడై రక్షిస్తాడు. ఒకరోజు విల్లంబుల్ని ధరించి, మణులు పొదిగిన రథాన్నెక్కి జైత్రయాత్రకు బయలుదేరి, సూర్యునిలాగా శత్రురాజులనే కారుచీకట్లను ఛేదించి, భూప్రదక్షిణం చేస్తాడు. ఇలా

విజయయాత్ర చేస్తున్న సమయంలో సర్వదిక్పాలకులతో సహా రాజులంతా కానుకలిచ్చి, చక్రపాణియైన శ్రీమహావిష్ణువుకు సాటియైన మొదటి చక్రవర్తి అని కీర్తిస్తారు.

క. ఈ నృపతి ధరాచక్రము, ధేనువుగాఁ జేసి పిదుకు ధృతి నఖిల పదా
ర్థానీకము విబుధులు స, న్మానింపఁగఁ బ్రజకు జీవనప్రదుఁ డగుచున్.

461

తా ॥ ప్రజలకు జీవన ప్రదుడవుతూ, విద్వాంసుల మన్ననలు పొందుతాడు. ఇలలో ఈ రాజు, భూమాతను గోమాతగా చేసి సమస్త పదార్థ సమూహాన్నీ ధైర్యంగా పితికి ఇస్తాడు.

చ. అమరవరేణ్యుఁ బోలి యనయంబు నితండును గోత్రభేదన
త్వమునఁ జెలంగుఁ దా నజగవప్రదరాసన శింజినీ నినా
దమును విరోధిభూపతులు దల్లడమంద నసహ్యసింహ వి
క్రమమున సంచరించు నని కౌతుక మొప్పఁగఁ బల్కి వెండియున్.

462

తా ॥ ఇంద్రునిలాగా ఈ చక్రవర్తి శత్రురాజుల గోత్రాలను ధ్వంసం చేస్తాడు. 'అజగవ' మనే పేరుగల ధనుస్సును ధరించి, నారిని మ్రోగించి, సింహ పరాక్రమంతో శత్రువుల్ని గొప్ప పరాక్రమంతో సంహరిస్తాడు."

వ. ఇట్లనిరి.

463

తా ॥ ఇంకా ఆ వందిమాగధులిలా అన్నారు:

చ. సకలజగన్నుతుం డితఁడు చారుయశోనిధి యశ్వమేధముల్
ప్రకటముగా శతంబు దగఁ బావనమైన సరస్వతీతటీ

నికటధరిత్రిఁ జేయుతఱి నేర్పున నంతిమ యాగమందుఁ గొం
జక మఖసాధనాశ్వమును జంభవిరోధి హరించు నుద్ధతిన్.

464

తా ॥ "అన్ని లోకాలచే నుతింపబడినవాడు, చక్కని కీర్తికి నివాసమైనవాడూ అయిన ఈ పృథు చక్రవర్తి నూరు అశ్వమేధ యాగాలు సరస్వతీ నదీ తీరంలో చేస్తాడు. నూరవదైన చివరి అశ్వమేధ యాగాన్ని చేసే సందర్భంలో, ఏమాత్రమూ జంకు లేక ఇంద్రుడు, గర్వంతో యాగాశ్వాన్ని అపహరిస్తాడు.

సీ. ఒకనాఁడు నిజమందిరోపాంత వనముకుఁ జని యందు సద్గుణశాలి యైన
ఘనుని సనత్కుమారునిఁ గాంచి య మ్మునివరు బ్రహ్మ తనయుఁగా నెఱిఁగి భక్తిఁ
బూజించి విజ్ఞానమును బొందు నచ్చట బ్రహ్మవేత్తలు మునిప్రవరు వలన
మానిత లబ్ధవిజ్ఞానులై వర్తింతు, రి మ్మహారాజు మహీతలంబు

తే. నందు విశ్రుతవిక్రముఁ డగుచు మిగులఁ దన కథావళి భూ ప్రజాతతి నుతింప
నక్కడక్కడ వినుచు శౌర్యమున నఖిల, దిక్కులను గెల్చి వర్తించు ధీరయశుఁడు.

465

తా ॥ ఒకనాడు, తన రాజమందిరానికి సమీపంలోని ఉద్యానవనానికి వెళ్ళి, అక్కడ సద్గుణశాలీ, మహనీయుడూ అయిన సనత్కుమారుణ్ణి చూస్తాడు. ఆ మునిశ్రేష్ఠుణ్ణి బ్రహ్మ మానసపుత్రునిగా తెలుసుకొని భక్తితో పూజిస్తాడు. ఆ మహర్షివద్ద బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు. అక్కడున్న బ్రహ్మవేత్తలంతా, సనత్కుమారుని ఉపదేశాన్ని పొంది గొప్ప తత్త్వవిజ్ఞానులవుతారు. ఈ పృథు చక్రవర్తి పరాక్రమం లోకప్రసిద్ధికెక్కగా, భూ ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటారు. అది వింటూ శౌర్యంతో సర్వ దిక్కుల్ని జయించి, కీర్తికెక్కి ధీరుడై వెలుగొందుతాడు.

వ. ఇట్లు విపాటిత విరోధి శల్యుండు, సురాసుర జేగీయమాన నిజవైభవుండునై

ధరాచక్రంబున కితండు రాజయ్యెడి నని యివ్విధంబున స్తోత్రంబు సేసిన వందిమాగధ సూతజనంబులం బృథుచక్రవర్తి పూజించి మఱియుం బ్రాహ్మణ భృత్యామాత్య పురోహిత పౌరజానపద తైలిక తాంబూలిక ప్రముఖాశేష జనంబులం దత్తదుచిత క్రియలం బూజించె నని మైత్రేయుండు సెప్పిన విని విదురుం డిట్లనియె.

466

తా ॥ "విరోధుల మనస్సులో ముల్లులా నాటుకొని, దేవదానవుల చేత కీర్తింపబడే వైభవం గలవాడై, సమస్త భూచక్రానికి ఈ పృథువు రాజవుతాడు" అని కీర్తించిన వందిమాగధసూత జనాన్ని, పృథు చక్రవర్తి సత్కరించాడు. బ్రాహ్మణుల్ని, భృత్యుల్ని, అమాత్యుల్ని, పురోహితుల్ని, పౌరుల్ని, జానపదుల్ని, తైలసేవకుల్ని, తాంబూలాలు చుట్టి ఇచ్చే వాళ్ళను, ఇంకా అక్కడి సమస్త పరివార జనాన్ని తగిన రీతిగా సత్కరించాడు" అని మైత్రేయుడు చెప్పగా విన్న విదురుడిలా అన్నాడు:

# 19. పృథు చక్రవర్తి గోరూపిణి యగు భూమి నుండి ఓషధులను పిదుకుట

సీ. ఏమి నిమిత్తమై భూమి గోరూపిణి యయ్యె? దానికి వత్స మయ్యె నెద్ది?
గొనకొని దోహనమునకు నర్హంబైన పాత్ర మెయ్యది? దలఁపంగ దోగ్ధ
యైన యా పృథు వే పదార్థముల్ పిదికెను? బరికింప నవని స్వభావమునను
విషయమై యుండియు వెలయంగ నేరీతి సమగతిఁ జెందెను జంభవైరి?

తే. క్రతుహయంబును గొనిపోవఁ గార్య మెద్ది?, ధీరనిధి యాతఁడు సనత్కుమారు వలనఁ
గలిత విజ్ఞానుఁ డగుచు నే గతిని బొందె?, ననఘచారిత్ర! మైత్రేయ! యదియుఁగాక.

467

తా ॥ “ఓ మైత్రేయ మహర్షీ! భూమాత ఏ కారణంచేత గోమాత రూపాన్ని ధరించింది? గోమాతగా మారిన భూమాతకు ‘దూడ’ ఎవరు? పిదకడానికి తగిన పాత్ర ఎక్కడిది? పిదికేవాడైన పృథుచక్రవర్తి ఏయే పదార్థాల్ని పిదికాడు? ఎగుడుదిగుడుగా ఉండే భూమి ఏ విధంగా సమరూపాన్ని పొందింది? ఇంద్రుడు యాగాశ్వాన్ని దొంగిలించడానికి గల కారణమేమిటి? దానివలన ప్రయోజనం ఏమిటి? నిశ్చల స్వభావుడైన సనత్కుమారుని వలన జ్ఞానోపదేశం పొందిన పృథు చక్రవర్తి పొందిన ఉత్తమగతులేమిటి?

వ. మఱియుఁ బరబ్రహ్మంబును భగవంతుండును బుణ్యశ్రవణకీర్తనుండును సర్వనియామకుండును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయం బగు దివ్యకథలను భగవంతుండైన పుండరీకాక్షుండు పృథ్వ్యవతారంబు ధరియించి గోరూపిణి యగు పృథివిం బిదికినది మొదలగు కథలన్నియు నీకు నధోక్షజునకు దాసుండ నయిన నాకు నెఱింగింపు మనిన వాసుదేవ కథాసంప్రీత చేతస్కుండగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డ్లినియె, నట్లు బ్రాహ్మణ జనంబులచే రాజ్యంబునం దభిషిక్తుండై పృథువు రాజ్యంబు సేయుచుండు

నంత నీరస యగు ధరిత్రియం దన్న రహితు లగుచుం బ్రజలు క్షుత్పీడా క్షీణదేహులై వైన్యునిం జూచి యిట్లనిరి.

468

తా ॥ ఓ పుణ్యచరితుడా! పరబ్రహ్మస్వరూపుడూ, భగవంతుడు, పుణ్యజనుల చేత శ్రవణం చేయబడేవాడూ కీర్తించబడేవాడు, సమస్త విశ్వాన్నీ నియమించేవాడూ అయిన శ్రీకృష్ణుని ఇతర అవతారాలను ఆశ్రయించియున్న దివ్య కథలను, భగవంతుడైన పుండరీకాక్షుడు, పృథు చక్రవర్తి రూపాన్ని ధరించి, గోరూప ధారిణియైన భూమాతను పితికిన కథను నాకు తెలియజెప్పు. నీకూ భగవంతుడైన శ్రీమన్నారాయణునికీ నేను దాసుణ్ణి. కాబట్టి నాకు వివరించు."

అని విదురుడు పలుకగా విన్న మైత్రేయుడు వాసుదేవుని కథల పట్ల సంప్రీతమైన బుద్ధిగల విదురుణ్ణి ప్రశంసించి, ఇలా అన్నాడు:

"ఆ విధంగా బ్రాహ్మణులచే రాజ్యాభిషిక్తుడైన పృథు చక్రవర్తి రాజ్యాన్ని పాలిస్తుండగా, ప్రజలు సారం లేని భూమిలో అన్నం లభించక, ఆకలి బాధతో చిక్కిన దేహంతో, పృథు చక్రవర్తి వద్దకు వెళ్ళి ఇలా నివేదించుకున్నారు:

ఇక్కడ ప్రస్తావించబడిన కృష్ణుడు కృష్ణావతారంలోని పరమాత్మ కాదు. పృథు చక్రవర్తి తరువాతనే కదా కృష్ణావతారం! ఇక్కడ కృష్ణుడంటే నీలమేఘచ్ఛాయవాడనే చెప్పుకోవాలి. శ్రీమహావిష్ణువుకు పర్యాయపదంగానే భావించాలి.

క. అరయఁగ నేము బుభుక్షా, పరిపీడం బడితి మయ్య! పైకొని తరు కో
టర జనిత వహ్నిచేతను, దరికొను వృక్షములఁ బోలె ధరణీనాథా!

469

తా ॥ "ఓ రాజా! చెట్టు తొఱ్ఱలో పుట్టిన అగ్ని ఆ చెట్టునే దహించినట్లు మేము

ఆకలిబాధతో పీడింపబడుతున్నాము.

క. శరణ శరణ్యుఁడ వగు నిను, శరణము వేఁడెదము మాకు సత్కృప నన్నం
బరసి కృపసేసి ప్రోవుము, నరనాయక! యనుచుఁ బ్రజలు నతులై పలుకన్.

470

తా ॥ శరణాగతుల్ని రక్షించడానికి దిక్కయిన నిన్ను శరణు వేడుకుంటున్నాము. ఓ రాజా! దయతో మాకు అన్నం పెట్టి రక్షించు" అంటూ వంగి నమస్కరించారు.

క. విని దానికి సదుపాయము, జననాయకుఁ డాత్మఁ దలఁచి సక్రోధుండై
ధనువున బాణముఁ దొడిగెను. ఘనరౌద్రుండైన త్రిపుర ఘస్మరు పగిదిన్.

471

తా ॥ ఆ మాటల్ని విన్న రాజు ప్రజల బాధను పరిష్కరించడానికి తగిన మంచి ఉపాయాన్ని ఆలోచించి, త్రిపుర దహనం చేసిన శివునిలా, రౌద్రమూర్తియై ధనుస్సున బాణాన్ని ఎక్కుపెట్టాడు.

వ. ఇట్లు దొడిగిన.

472

తా ॥ ఆవిధంగా ఎక్కు పెట్టగానే,

క. మహిపతి నప్పుడు గనుఁగొని, మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచుం
గుహకుం డగు లుబ్ధకుఁ గని, గహనంబునఁ బాఱు హరిణికైవడిఁ బాఱెన్.

473

తా ॥ పృథు చక్రవర్తిని చూసిన భూమాత, గోరూపాన్ని ధరించి, వణుకుతూ వంచకుడైన

వేటగాణ్ణి చూసి, అరణ్యంలో పరుగెత్తే లేడిలాగా పరుగెత్తింది.

వ. ఇట్లు ధరణి వాఱిన నతండు కుపితారుణేక్షణుండై వెంటఁ దగిలి దిక్కులను విదిక్కులను భూభాగ నభోభాగంబుల నెక్కడం జనియె, నక్కడికి వెనుదగిలి యుద్యతాయుంధుండై చనుచుండ, నవ్వైన్యునిం గని మృత్యు గ్రస్తులగు ప్రజల చందంబున ననన్య శరణ్యయై యతిభయంబునం బరితప్యమాన హృదయ యగుచు వైన్యా! ధర్మవత్సలుండవును, నాపన్న రక్షకుండవును, మహాత్ముండవును, సకల ప్రాణి పరిపాలనావస్థితుం డవును నయిన నీ వీ దీనయుం బాపరహితయుం గామినియు నగు నన్ను వధియింపం బూని యేల వెనుదగులుచున్న వాఁడవు? ధర్మతత్త్వం బెఱుంగువారు సతీజనంబులు గృతాపరాధలైనం దీనవత్సలతం జేసి వధింప రని పలికి మఱియు నా ధరణీదేవి పృథు చక్రవర్తి కిట్లనియె.

474

తా ॥ ఈ విధంగా భూదేవి పరుగెత్తటం గమనించిన పృథు చక్రవర్తికి కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. గోరూపంలో ఉన్న భూమి వెంటబడి, దిక్కులలో, దిక్కులసందులలో భూమ్యాకాశాలలో ఎక్కడికిపోతే అక్కడికి బాణాన్ని ఎక్కుపెట్టి తరిమాడు. ఆ విధంగా వెంటబడి తరిమే పృథు చక్రవర్తిని చూచి, మృత్యుదేవతకు చిక్కిన ప్రజలలాగా ఏ దిక్కూలేక, భయపడుతూ, పరితపించే హృదయంతో భూమాత ఇలా అన్నది. "వేనుని సంతానమైన ఓ పృథు చక్రవర్తీ! ధర్మవత్సలుడివి, ఆపదలో ఉన్న వారిని రక్షించేవాడివి, మహాత్ముడివి, సమస్త ప్రాణకోటినీ పరిపాలించటంలో నిశ్చలబుద్ధి గలవాడివీ అయిన నీవు నావంటి దీనురాలిని, పాపరహితను, కోరికలిచ్చేదాననూ చంపాలని ఎందుకు వెంటాడుతున్నావు? ధర్మతత్త్వం తెలిసినవాళ్ళు, దీనవత్సలులై తప్పు చేసినప్పటికీ స్త్రీలను వధింపరు." అని మళ్ళీ పృథు చక్రవర్తితో ఇలా అన్నది:

క. జననాథచంద్ర! యీ భూ, జనకోటికి యాన పాత్ర సదృశస్థితితో
ఘనదృఢశరీర యగు నే, ననయము నాధారభూత నగుచుఁ జరింతున్.

475

తా ॥ "ఓ రాజచంద్రా! పుట్టే ఈ జీవకోటికి నౌకలాగా ఆధారభూతమై సంచరించడానికి తగిన దృఢ శరీరం నాది.

తే. ఇట్టి నన్నుఁ గృపామతి యెడలి యిటు వి, పాటనము సేసి త్రుంచెదు? ప్రజలు నీట మునుఁగకుండంగ నే రీతి ననఘ చరిత!, యరసి రక్షింతు వన నతం డవని కనియె.

476

తా ॥ అటువంటి నన్ను కృపావిహీనమతివై, చీల్చి చంపుతానంటున్నావు. మరి భూమి మీదనున్న ఈ ప్రజలందరినీ నీటిలో మునిగిపోకుండా ఏ విధంగా రక్షిస్తావు?" అని అనగా భూమాతతో పృథు చక్రవర్తి ఇలా అన్నాడు:

వ. ధరిత్రీ! మదీయాజ్ఞోల్లంఘనంబు సేయు చున్నదాన! వదియునుంగాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవించుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణ భక్షణంబు సేయుచుఁ బాలం బిదుకక నీయంద యడంచికొంటివి; నీ యందున్న యోషధీ బీజంబులు బ్రహ్మచేతం బూర్వంబునందె కల్పింపంబడినయవి, వానిని నీ దేహంబునంద యడంచికొని యిప్పుడీయక మూఢ హృదయవు, మందమతివియునై యపరాధంబు చేసిన దురాత్మురాలవగు నిను నా బాణంబులచే జర్జరీభూత శరీరం జేసి వధియించి నీ మేని మాంసంబునం జేసి క్షుద్బాధితులు దీనులు నగు నీ ప్రజల యార్తి నివారించెద, నీవు కామిని నంటివి, స్త్రీ పురుష నపుంసకులలో నెవ్వరేని భూతదయ లేక స్వమాత్ర పోషకులగుచు నిరనుక్రోశంబుగ భూతద్రోహులై వర్తింతురు, వారిని రాజులు వధించినన్ వధంబు గాదు, గాన దానఁ బాపంబు వొరయదు, నీవు కామిని వైనను దుర్మదవు స్తబ్ధవు నగుచు మాయాగోరూపంబునం బాఱి పోవుచున్న నిన్నుఁ దిలలంతలు ఖండంబులు సేసి నా యోగ మహిమం బ్రాణికోటి నుద్ధరించెద నని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరుని వడువున వర్తించు పృథునింజూచి వడంకుచు మేదిని ప్రాంజలియై యిట్లని

నుతింపందొడంగె.

477

తా ॥ "ఓ భూదేవీ! నీవు నా ఆజ్ఞను ఉల్లంఘిస్తున్నావు. అంతేకాక నీవు యజ్ఞాలలో హవిర్భాగాలను స్వీకరిస్తూ, ధాన్యం మొదలైన వాటిని వృద్ధి చేయకుండా గోరూపాన్ని ధరించి గడ్డిమేస్తూ, పాలను పితుకకుండా నీలోనే దాచుకున్నావు. నీలోనున్న ఓషధీబీజాలు, బ్రహ్మచేత పూర్వమే సృష్టించబడ్డాయి. వాటిని నీ దేహంలోనే దాచుకొని, లోకానికి బహిర్గతం చెయ్యని మూర్ఖురాలివి, మందమతివి. దురాత్మురాలివై ఇటువంటి తప్పు చేసిన నిన్ను నా బాణాలతో తూట్లు పడేలా చేసి సంహరిస్తాను. నీ శరీరంలోని మాంసంతో, అల్లాడిపోతున్న దీనజనుల ఆకలిబాధను తీరుస్తాను. నీవు నాపట్ల ప్రేమగల దానవంటివి. స్త్రీలలోగాని, పురుషులలోగాని, నపుంసకులలోగాని ఎవరైనా భూతదయ లేకుండా, తమను మాత్రమే పోషించుకొంటూ, దయావిహీనులై ప్రాణికోటికి ద్రోహంచేస్తే, అటువంటి వాళ్ళను రాజు చంపడం పాపంకాదు. కాబట్టి స్త్రీవి అయినప్పటికీ దుర్మదవు. స్తబ్ధురాలవై, కొయ్యబారి పోయావు. మాయావేషధారిణివై, గోరూపంతో పారిపోతున్న నిన్ను నువ్వుగింజలంత పరిమాణంతో ముక్కలు ముక్కలుగా ఖండించి వధిస్తాను. నా యోగశక్తి మహిమతో ప్రాణికోటిని ఉద్ధరిస్తాను."

అని పలికి కోపంతో, యమధర్మరాజులా భయంకరాకారాన్ని ధరించిన ఆ పృథు చక్రవర్తిని చూచి వణుకుతూ భూదేవి దోసిలొగ్గి ఇలా కీర్తించ సాగింది:

క. ఓ నాథ! పరమపురుషుఁడ, వై నిజ మాయాగుణంబు లందినకతనన్
నానావిధ దేహములం, బూనుదు సగుణుండ వగుచు బుధనుత చరితా!

478

తా ॥ "జ్ఞానులచే నుతింపదగిన చరిత్ర కలవాడా! ఓ నాథా! పరమపురుషుడవై, నీదైన మాయాగుణంతో అనేక రకాలైన దేహాలను సగుణమూర్తిలా ధరిస్తావు.

వ. అట్టి నీవు.

479

తా ॥ అటువంటి నీవు,

క. నను సకల జీవతతికిని, ముని నీ వాధార భూతముగ నిర్మింపన్,
విను నాయందుఁ జతుర్విధ, ఘన భూతవిసర్గ మర్థిఁ గైకొన వలసెన్.

480

తా ॥ నన్ను సమస్త జీవకోటికీ ఆధారభూతంగా సృష్టించావు. అందుచేతనే నాయందు నాలుగు విధాలైన ప్రాణికోటి సృష్టిని స్వీకరించి భరించవలసి వచ్చింది.

వ. అట్లయి యుండ.

481

తా ॥ అలా అయినప్పటికీ,

క. నను నుద్యతాయుధుఁడవై, మనుజేంద్ర! వధింపఁబూని మసలెదు, నీకం
టెను నన్యుని నెవ్వని నే, ఘనముగ శరణంబు సొత్తుఁ గరుణాభరణా!

482

తా ॥ ఓ రాజా! ఆయుధాన్నెత్తి నన్ను వధించడానికి పూనుకున్నావు. ఓ కరుణాభరణా! నీకంటే వేరెవ్వరిని శరణు వేడుకుంటాను?

వ. అదియునుం గాక.

483

తా ॥ అంతేకాకుండా.

సీ. అనఘ! స్వకీయంబునై యతర్కితమునై మహిమ నొప్పిన భవన్మాయచేత
సకల చరాచర సర్గంబు నిర్మించి ధర్మపరుండవై తనరు దీశ!
నీ విక్రమము నవనీరజలోచన! సకల లోకులకు దుర్జయము; దలఁపఁ
దగు నట్టి నీవు స్వతంత్రుఁడ వగుటను బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మచేత

తే. సకల జగములఁ జేయింతు సమతఁ బేర్చి, యేక మయ్యు మహాత్మ! యనేక విధము లగుచు
వెలుఁగొందు చుందు వీ యఖిల మందుఁ, జారుతరమూర్తి! యో పృథుచక్రవర్తి!

484

తా ॥ ఓ పృథు చక్రవర్తీ! హేతువుకు అందని నీ మాయామహిమతో ఈ చరాచర సృష్టిని నిర్మించావు. ఓ ఈశ్వరా! ధర్మపరుడవై ప్రకాశిస్తావు. ఓ పద్మాక్షా! నీ పరాక్రమం సమస్త జనులకు జయింప వీలుకానిది. ధ్యానింప తగినవాడవు, స్వతంత్రుడవు. కాబట్టే బ్రహ్మను సృష్టించి, ఆ బ్రహ్మచేతనే సమస్త లోకాలను సృజింప చేస్తావు. సృష్టి సమత్వాన్ని కాపాడతావు. ఈ సమస్తసృష్టిలో నీవొక్కడివే అయినప్పటికీ అనేక రకాలుగా వెలుగొందుతున్నావు.

వ. మఱియు మహాభూతేంద్రియకారక చేతనాహంకారంబులను శక్తులం జేసి యీ జగంబుల కుత్పత్తి స్థితిలయంబులం గావించుచు సముత్కట విరుద్ధ శక్తులు గల పురుషునకు నమస్కరించెద, నట్టి పరమపురుషుండ వయిన నీవు నిజనిర్మితంబును భూతేంద్రియాంతః కరణాత్మకంబును నైన యీ విశ్వంబు సంస్థాపింపం బూని.

485

తా ॥ పంచ మహాభూతాలకు, ఇంద్రియాలకు కారకమైన చైతన్యము, అహంకారము అనే శక్తుల్ని కల్పించి, ఈ లోకాల సృష్టి, స్థితి, లయాలను కల్పిస్తున్నావు. పరస్పర విరుద్ధ శక్తులు అవ్యధికంగా గల ఓ పరమపురుషా! నీకు నమస్కరిస్తున్నాను. అటువంటి పరమాత్ముడవైన నీచే

నిర్మించబడ్డ భూతాలు, ఇంద్రియాలు, మనస్సు కలిసి ఏర్పడిన ఈ విశ్వాన్ని కుదురుగా నిలబెట్టాలని పూనుకొని—

సీ. ఆది వరాహంబ వగుచు రసాతల గతనైన నన్ను నక్కటికతోడ
నుద్ధరించితి, వట్టి యుదకాగ్ర భాగంబు నం దర్థి నున్న నే ననెడి నావ
యందున్న నిఖిల ప్రజావళి రక్షింపఁ గోరి యీ పృథురూపధారి వైతి,
వట్టి భూభరణుండ వైన నీ విపుడు పయో నిమిత్తంబుగా నుగ్రచరుఁడ

తే. వగుచు నన్ను వధించెద ననుచు బుద్ధిఁ, దలఁచుచున్నాఁడ, విది విచిత్రంబుగాదె!
విశ్వసంపాద్య! నిరవద్య! వేదవేద్య!, భవ్య గుణసాంద్ర! వైన్య భూపాలచంద్ర!

486

తా ॥ ఆదివరాహమూర్తివై, పాతాళంలో ఉన్న నన్ను దయతో ఉద్ధరించావు. అలా నీవు పైకెత్తగా నీటిపై నావలా తేలుతున్న నాపైనున్న ఈ ప్రజాకోటిని రక్షించాలనుకొని ఈ పృథు చక్రవర్తి రూపాన్ని ధరించావు. అలా భూభారాన్ని వహించే నీవు కేవలం పాలకోసం నన్ను వధించాలని తలుస్తున్నావు. ఇది విచిత్రం కదా! సృష్టిని సంపాదించినవాడా! ఏ లోపం లేనివాడా! వేదవేద్యా! భవ్యగుణసాంద్రా! వేనుని పుత్రుడివైన రాజచంద్రమా! నీకు నమస్సులు.

వ. కావున నీశ్వరగుణ సర్గరూపంబైన మాయచే మోహితాంతః కరణులమైన మా వంటి వారలచేత హరిభక్తుల చేష్టితం బెఱుంగఁ బడదన్న హరిచేష్టితం బెట్టెఱుంగంబడు? నట్టి జితేంద్రియ యశస్కరు లయిన వారలకు నమస్కరింతు ననుచు నవ్విధంబునం గోపప్రస్ఫురితాధరుండైన పృథుని నభినుతించి ధైర్యం బవలంబించి వెండియు నిట్లనియె.

487

తా ॥ ఈశ్వరుని గుణమైన సృష్టిరూపమైన మాయచేత మోహింపబడ్డ మనస్సుగల మావంటివారికి హరిభక్తుల చేష్టలే అంతుపట్టవు. అటువంటప్పుడు శ్రీహరి చేష్టలను ఎలా

తెలుసుకోగలం? అటువంటి యశస్కరులైన జితేంద్రియులకు నమస్కరిస్తాను."

అని కోపంతో, అదురుతున్న పెదాలతో ఉన్న పృథు చక్రవర్తిని అభినుతించి, ధైర్యం తెచ్చుకొని మళ్ళీ భూదేవి ఇలా అన్నది:

క. విమలాత్మ! నాకు నభయము, సమకూరెదు నట్లుగాఁగ సన్మతి నీ క్రో
ధము నుపశమించి కరుణిం, పుము, నా విన్నపము వినుము పురుషనిధానా!

488

తా ॥ "ఓ పురుషనిధానమా! నిర్మలాత్మా! నాకు అభయం ప్రసాదించు. మంచి బుద్ధితో నీ కోపాన్ని ఉపశమించి, కరుణించి, నా విన్నపాన్ని విను.

క. ధర విరులు గందకుండఁగ, సరసగతిం బూవుఁదేనెఁ జవిగొను నిందిం
దిరవిభు కైవడి బుధుఁడగు, పురుషుఁడు సారాంశ మాత్మఁబూని గ్రహించున్.

489

తా ॥ పువ్వులు కందిపోకుండా, పువ్వుల తేనెను గ్రోలే తుమ్మెదలా పండితుడైనవాడు సారాంశాన్ని మాత్రమే మనస్సులో గ్రహిస్తాడు.

సీ. వినవయ్య! తత్త్వదర్శనులైన యట్టి స న్మునులచే నైహికాముష్మికంబు
లైన ఫలప్రాప్తి కర్థిఁ గృష్యాద్యగ్ని హోత్రాద్యుపాయంబు లుర్విమీఁద
దృష్టంబులును నాచరితములు నగుచుఁ దా నెనయంగఁ దదుపాయ మెవ్వఁ డాచ
రించును వాఁడు ప్రాపించుఁ దత్ఫలమును విద్వాంసుఁడైనను వెలయ దీని

తే. నాదరింపక తనయంత నాచరించె, నేని నాయాసమే యగుఁ గాని తత్ఫ
లమును బొందఁడు బహుళ కాలమునకైన, వినుత గుణశీల! మాటలు వేయునేల?

490

తా ॥ తత్త్వదర్శనులైన మునులు, ఇహపరలోకాలకు చెందిన ఫలితాలను పొందేందుకు వ్యవసాయం, అగ్నిహోత్రం వంటి ఉపాయాలను నేర్చి ఆచరించారు. ఆయా ఉపాయాలను ఎవడైతే ఆచరిస్తాడో వాడికే ఫలం ప్రాప్తిస్తుంది. ఎంత విద్వాంసుడైనప్పటికీ ఈ ఉపాయాలను ఆశ్రయించి శ్రమించకపోతే ఆయాసమే మిగులుతుంది కాని ఫలం లభించదు. వేయిమాటలు దేనికి? ఇలా ఉపాయవిహీనులై కర్తవ్యపరాయణులు కాకుండా ఎంతకాలం గడిపినా పొందేది ఏమీ ఉండదు."

కర్మ ప్రాధాన్యాన్ని గురించి చెప్పడాన్ని ఇక్కడ గమనించాలి

"ఉద్యమేన హి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః
న హి సుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖే మృగాః"

ప్రయత్నం చేసినప్పుడే కార్యసిద్ధి కలుగుతుంది గాని, కేవలం మనోరథం కలిగి ఉండటంవల్ల పనులు నెరవేరవు. సింహమైనా నోరు తెరచి పడుకొని ఉంటే తమంత తాముగా జంతువులు వచ్చి దాని నోట్లో పడవు కదా! ఉద్యమం, సాహసం, ధైర్యం, బుద్ధి, శక్తి, పరాక్రమం వంటివి ఉన్నప్పుడే దైవం అనుకూలిస్తుంది.

బ్రతుకులో కర్తవ్యనిష్ఠ అపారమైంది. కర్తవ్యనిష్ఠ ప్రధానమైనచోట వ్యష్టినుండి అనంతం వరకు పరచుకున్న వ్యవస్థలో సామరస్యానికి తప్ప, సంఘర్షణకు తావుండదు. తనను తాను విస్తరించుకుంటూ సమష్టిలో లీనమయ్యే క్రమంలో సాగించే కర్మ ఎప్పుడూ పుణ్యప్రదమే, సత్ ఫలదాయకమే.

వ. అని మఱియు మహి యిట్లనియె.



తా ॥ అని భూమాత ఇంకా ఇలా అన్నది.

చ జలరుహగర్భుచేత మును చాల సృజింపఁ బడ్డ యోషధుల్
కలుషమతిన్ ధృతవ్రతులు గాని యసజ్జనభుజ్యమానమై
వెలయుటఁ జూచి యే నృపతివీరులు మాన్పమిఁ జోరబాధలం
బలుమఱుఁ బొంది యే నపరిపాలితనై కృశియించి వెండియున్.

492

తా ॥ "బ్రహ్మచేత పూర్వం సృష్టించబడిన ఓషధులను పాపబుద్ధులైన దుష్టులు, వ్రతనియమ భ్రష్టులు తినటం చూసి, వీరులైన ఏ రాజూ అడ్డుకోలేదు. ఎన్నోసార్లు దొంగల బారినపడి బాధించబడ్డాను. రక్షణ లేక కృశించిపోయాను.

క. అనుపమ మఖ కర్మ క్రియ, లనయము లేకుంట నే ననాదృత నగుచున్
జననాయక! యీ లోకము, ఘనచోరీభూత మగుటఁ గనుఁగొని యంతన్.

493

తా ॥ ఓ ప్రభూ! యజ్ఞానికి సంబంధించిన కర్మకాండలు, కార్యకలాపాలు బొత్తిగా లేనందున నేను అనాదరించ బడ్డదాన్నయ్యాను. లోకంలోని మానవులంతా పెద్ద దొంగల వలె తయారవటం నేను గమనించాను.

క. సవనాది సిద్ధి కొఱకై, తవిలి తదీయౌషధీ వితతులను ధరణీ
ధవ! యే నపుడు గ్రసించితి, నవియును నా యందు జీర్ణమయ్యెఁ గడంకన్.

494

తా ॥ ఓ భూనాథా! యజ్ఞము మొదలైన పుణ్యకార్యాల సిద్ధికోసం, కావాలనే పట్టుబట్టి ఆ ఓషధీ సమూహాన్ని మ్రింగాను. అవి నాలో జీర్ణమై పోయాయి.

క. విను వాని నొక యుపాయం, బునఁ గ్రమ్మఱఁ బడయవచ్చు భూవర చంద్రా!

విను మది యెఱిఁగించెద నీ, కనువత్సలురాల నగుట గురుతర చరితా!

495

తా ॥ ఓ రాజచంద్రమా! వాటిని పొందే ఉపాయం ఒకటుంది. నీపట్లగల ప్రేమచేత ఆ ఉపాయాన్ని నీకు తెలియజేస్తాను విను.

క. అనయము నా కొక వత్సము, ననురూప సుదోహనమ్ము ననురూపక దో
గ్ధను గల్పింపుమ యట్లయి, నను నీ భూతముల కవనినాయక! దానన్.

496

క. పరఁగ నభీప్సితములు బల, కరములు నగు, నన్నదుగ్ధకలితము లగు భా
సురకామంబులఁ బిదికెద, నరనాయక చంద్ర! వినుము నా వచనంబుల్.

497

తా ॥ ఓ రాజా! నాకొక దూడను, అనువైన పాత్రను, తగినరీతిగా పితికే సామర్థ్యమున్నవాడిని (దోగ్ధ) సన్నద్ధం చెయ్యి. ఆ విధంగా చేసినట్లయితే నీ ప్రజలకు అభీష్టమైనవీ, బలాన్ని కలిగించేవీ, దుగ్ధాన్నాలతో కూడిన కోరికలను అనుగ్రహిస్తాను. నామాట నమ్ము.

చ. మనుజవరేణ్య! యేను విషమస్థలినై యిపు డున్నదాన, నొ
య్యన జలదాగమోదిత పయః ప్రకరంబు తదాగమంబు వో
యినను దదంబువుల్ పుడమి నింకక యంతట నిల్చునట్లుగా
మనునిభ! నన్ను నిప్పుడు సమస్థలినై పెనుపొందఁ జేయవే.

498

తా ॥ మనువుతో సమానమైన ఓ నరనాథా! నేను ఇప్పుడు మిట్టపల్లాలతో

ఎగుడుదిగుడుగా విషమంగా ఉన్నాను. తొలకరి మేఘాలు వర్షించే కాలంలో మాత్రమే నీరు లభించే విధంగా కాకుండ, వానకాలం పోయాక కూడ భూమి నీరు ఇంకిపోకుండా అంతటా నిలచి ఉండేలా నన్ను సమతలంగా చదును చెయ్యి.”

క. అని యి వ్విధమున నా భూ, వనితామణి వలుకు మధుర వచనంబులు దా
విని యనురాగము దన మన, మునఁ గడలుకొనంగ రాజముఖ్యుం డంతన్.

499

తా ॥ అని ఈ విధంగా భూదేవి పలికే మధురమైన వాక్కులను విన్న పృథుచక్రవర్తి హృదయం అనురాగంతో నిండిపోయింది.

చ. మనువును దూడఁ జేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో
హనముగఁ జేసి యందు సకలౌషధులం బిదికెం గ్రమంబునం
దనరఁగఁ దద్విధంబునను దత్పృథు వత్సల యైన భూమియం
దనయము వారువారును బ్రియంబగు కోర్కులు వొంది రున్నతిన్.

500

తా ॥ స్వాయంభువ మనువును దూడగా చేసి, తన చేతిని పాత్రగా అమర్చి, తానే దోగ్ధగా సకల ఔషధాలను భూమినుండి పిదికాడు. ఆ విధంగా చక్రవర్తి వాత్సల్యాన్ని పొందిన భూమాతనుండి అందరూ తమ తమ ప్రియమైన కోర్కెలను గొప్పగా పొందారు.

సీ. బలసి ఋషుల్ బృహస్పతి వత్సకంబుగా నర్థించి తమయింద్రియంబులందు
నంచిత చ్ఛందోమయ క్షీరమున దేవతలు సురరాజు వత్సంబు గాఁగఁ
గనక పాత్రమునందుఁ దనరు నోజోబల వీర్యామృతంబునై వెలయుఁ బయసు
దైత్య దానవులు దైత్య శ్రేష్ఠుఁడగు గుణశాలిఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి

తే. ఘన సురాసవరూప దుగ్ధంబు వరుస, నప్సరోజన గంధర్వు లలరి యపుడు
దనర విశ్వావసును వత్సమునుగఁ జేసి, పద్మమయ నిర్మితంబైన పాత్రమందు.

501

తా ॥ ఋషులంతా ఒకచోట చేరి, బృహస్పతిని దూడగా ఉండమని కోరి తమ ఇంద్రియాలనే పాత్రలో ఛందోమయమైన క్షీరాన్ని పిండుకున్నారు. దేవతలు ఇంద్రుణ్ణి గోవత్సంగా చేసికొని, బంగారుపాత్రలో ఓజస్సు, బలము, వీర్యము అనే రూపాలుగల అమృతమయమైన క్షీరాన్ని పొందారు. దైత్యులు, దానవులు, దైత్యులలో శ్రేష్ఠుడైన ప్రహ్లాదుణ్ణి దూడగా చేసికొని ఇనుప పాత్రలో బాగా పులిసిన కల్లు రూపంలో పాలను పితికి పొందారు. అప్సరసలు, గంధర్వులు కలసి విశ్వావసువును దూడగా చేసికొని, పద్మమయమైన పాత్రలో మాధుర్య సౌందర్యాలతో కూడిన గాంధర్వమనే క్షీరాన్ని పిండుకున్నారు.

వ. మాధుర్య సౌందర్య సహిత గాంధర్వక్షీరంబును బితృదేవతలు సూర్యవత్సకంబుగా నామ పాత్రంబునందుఁ గవ్యంబును దుగ్ధంబును, సిద్ధులు గపిల వత్సకంబుగా నాకాశ పాత్రమందు సంకల్పనారూపాణిమాది సిద్ధియను క్షీరంబును, విద్యాధరాదులు తద్వత్సకంబును తత్పాత్రకంబునుగా ఖేచరత్వాదివిద్యావ్యాపారరూపక్షీరంబును, గింపురుషాదులు మయవత్సకంబును నాత్మ పాత్రంబునుంగా సంకల్పమాత్ర ప్రభవంబును నంతర్ధానాద్భుతాత్మ సంబంధియు నగు మాయ యను క్షీరంబును, యక్షరక్షోభూత పిశాచంబులు భూతేశ వత్సకంబుగాఁ గపాల పాత్రకంబునుగా రుధిరాసవంబను క్షీరంబును, నహిదందశూక సర్పనాగంబులు దక్షకవత్సంబును బిలపాత్రంబునుంగా విషరూపక్షీరంబును, బశువులు గోవృషవత్సకంబు నరణ్య పాత్రంబునుంగాఁ గ్రవ్యంబను దుగ్ధంబును, విహంగంబులు సుపర్ణవత్సకంబు నిజకాయ పాత్రంబునుంగాఁ గీటకఫలాదికంబను దుగ్ధంబును, వనస్పతులు వటవత్సకంబుగా భిన్నరోహరూప పయస్సును, గిరులు హిమవద్వత్సకంబును నిజసాను పాత్రకంబునుంగా నానాధాతువులను

దుగ్ధంబునుంగా నవ్విధంబున సమస్తచరాచర వర్గంబు స్వముఖ్యవత్సకంబును స్వస్వపాత్రకంబునుంగా భిన్నరూపంబులైన క్షీరంబులం బిదికె నని చెప్పి మఱియును.

502

తా ॥ పితృదేవతలు, సూర్యుణ్ణి దూడగా చేసికొని, కాల్చని పచ్చికుండను పాత్రగా చేసికొని గోక్షీరాన్ని పిండుకున్నారు. కపిలుణ్ణి దూడగా చేసికొని సిద్ధులు ఆకాశ పాత్రలో సంకల్పనమనే రూపాన్ని పొందిన 'అణిమాది సిద్ధి' అనే క్షీరాన్ని పొందగా విద్యాధరులు మొదలైన వాళ్ళు కూడ కపిలుణ్ణే దూడగా చేసికొని ఆ ఆకాశ పాత్రలోనే ఖేచరత్వం మొదలైన (ఆకాశ సంచార మొదలైన విద్యలతో కూడిన) విద్యామయమైన క్షీరాన్ని పిండుకున్నారు. కింపురుషాదులు, మయుణ్ణి దూడగా చేసికొని ఆత్మపాత్రలో సంకల్పమాత్రంతోనే పుట్టేది, సంకల్పించినంతనే మాయమయ్యేది, అద్భుతాత్మకమైనదీ అయిన 'మాయ' ను క్షీరంగా పిండుకుని పొందారు. యక్షరక్షోపిశాచులు, ఈశ్వరుణ్ణి దూడగా చేసికొని కపాలపాత్రలో రక్తమనే కల్లును పాలుగా పొందారు. అహి, దందశూకము, సర్పము, నాగము అనే సర్పజాతులు, తక్షకుణ్ణి దూడగాచేసుకొని బిలపాత్రలో విషరూపమైన క్షీరాన్ని పొందారు. పశువులు, కోడెగిత్తను దూడగా, అరణ్యాన్ని పాత్రగా చేసుకొని తృణములనే క్షీరాన్ని, మాంసాన్ని ఆహారంగా స్వీకరించే క్రూరమృగాలు సింహాన్ని దూడగా చేసుకొని తమ దేహాలనే పాత్రలో 'మాంసం' అనే క్షీరాన్ని పిండుకున్నాయి.

పక్షులు, గరుత్మంతుణ్ణి దూడగా చేసుకొని, తమదేహమనే పాత్రలో కీటక ఫలాదులనే క్షీరాన్ని, వనస్పతులు, వటవృక్షాన్ని దూడగా చేసుకొని, భూమిని చీల్చుకొని మొలచి మహారూపాన్ని పొందే క్షీరాన్ని పొందాయి. పర్వతాలు హిమవంతుణ్ణి దూడగా తమ 'చరియల' నే పాత్రగా చేసుకొని నానారకాలైన ధాతువుల్ని పొందగా, సమస్త చరాచర ప్రకృతి, తమలోనున్న ముఖ్యుల్ని దూడగా చేసికొని, తమకు తగిన పాత్రలలో వివిధ రకాలుగా క్షీరాన్ని పితుక్కున్నారు.

క. క్రమమున నిటు పృథ్వ్యాదులు, దమతమ కామితము లనఁగఁ దగు భిన్న క్షీ

రము దోహన వత్సక భే, దమునం దగఁ బిదికి, రంత ధరణీధవుఁడున్.

503

తా ॥ ఈ క్రమంగా పృథు చక్రవర్తి మొదలైన వారు తమతమ కోర్కెలకు తగిన క్షీరాన్ని వేరువేరు దూడలతో, భిన్న భిన్న పాత్రలలో పిండుకున్నారు.

తే. సముచితానందమును బొంది సర్వకామ, దుఘ యనం దగు భూమిని దుహిత గాఁగఁ
గోరి కైకొని నిజధనుఃకోటిచేత, భూరిగిరి కూటములఁ జూర్ణములుగఁ జేసి.

504

తా ॥ అప్పుడు పృథు చక్రవర్తి సముచితమైన సంతోషాన్ని పొంది, అన్ని కోర్కెలను ప్రసాదించే భూమాతను తన కుమార్తెగా కోరి స్వీకరించాడు. పృథు చక్రవర్తి తన ధనువు యొక్క అగ్రాలతో, పెద్ద పెద్ద పర్వతాలను చూర్ణం చేశాడు.

తే. చండ దోర్దండలీల భూమండలంబు, సమతలంబుగఁ జేసి శశ్వత్ప్రసిద్ధి
నొంది య వ్విభుఁడీ లోకమందు నెల్ల, బ్రజకుఁ దండ్రియు జీవనప్రదుఁడు నగుచు.

505

తా ॥ తన బాహుబలంతో భూమండలాన్నంతా చదును చేసి శాశ్వతకీర్తిని పొందాడు. లోకంలోని ప్రజలందరికీ తండ్రిగా, జీవనప్రదాతగా ఆ ప్రభువు వాసికెక్కాడు.

తే. అక్కడక్కడఁ బూర్వంబునందు లేని, గ్రామ పట్టణ దుర్గ ఖర్వట పుళింద
ఖేట శబరాలయ వ్రజవాట ఘోష, వివిధ నిలయము లర్థిఁ గావించె నంత.

506

తా ॥ అక్కడక్కడా భూమండలంలో పూర్వం లేని పల్లెలు, పట్టణాలు, దుర్గాలు, కొండప్రక్కన నిర్మించే పల్లెలు, చెంచుపల్లెలు, కోయవాళ్ళ ఆవాసాలు, వ్రజవాటికలు

(గొల్లపల్లెలు), పశువుల కొట్టాలు – ఇలా పెక్కు విధాలైన నివాస స్థానాలను కల్పించాడు."

క. వారును భయవిరహితులై, బోరనఁ దత్తన్నివాసముల యందు సుఖ
శ్రీరుచి నొప్పుచు నుండిరి, వారక యా పృథుని బొగడ వశమె ధరిత్రిన్?

507

సీ. అని చెప్పి మునినాథుఁడైన మైత్రేయుఁ డవ్విదురున కిట్లను వేడ్కతోడ
ననఘాత్మ! రాజర్షి యైన వైన్యుం డశ్వమేధ శతంబు సన్మేధతోడఁ
గావింతు నని దీక్ష గైకొని వ్రతనిష్ఠఁ దివిరి బ్రహ్మావర్త దేశమందు
నలరు మనుక్షేత్ర మందు సరస్వతీ నది పొంతఁ దా మహోన్నతి నొనర్చు

తే. సవన కర్మ క్రియకు నతిశయ విశేష ఫలము గలిగెడి నని బుద్ధిఁ దలఁచి యచట, వరుసఁ
గావించు నతిశయాధ్వర మహోత్స, వము సహింపక యుండె న య్యమర విభుఁడు.

508

తా ॥ అని, మునినాథుడైన మైత్రేయుడు విదురునితో ఇంకా ఇలా అన్నాడు: "రాజర్షియైన పృథు చక్రవర్తి, బ్రహ్మావర్త దేశంలో, మనువు యొక్క భూమిలో, సరస్వతీ నదీతీరంలో చేసే యజ్ఞయాగాది క్రతువులకు విశేష ఫలం లభిస్తుందని భావించి అశ్వమేధ యాగాలు నూరింటిని చేయాలని దీక్షాకంకణుడైనాడు. వ్రతనిష్ఠతో ఆ పృథువు వరుసగా చేస్తున్న యాగాల వైభవాన్ని చూసిన మహేంద్రుడు సహించలేక పోయాడు.

## 20. పృథు చక్రవర్తి అశ్వమేధం చేస్తుండగా ఇంద్రుడు అశ్వమును అపహరించుట

సీ. అట్టి యధ్వర కర్మమందు సాక్షాద్భగవంతుఁడు హరి రమేశ్వరుఁడు లోక
గురుఁడును సర్వాత్మకుండును విభుఁడును నీరజభవ భవాన్వితుఁడు లోక
పాలక నిఖిల సుపర్వానుగుండును యజ్ఞాంగుఁ డఖిలాధ్వరాది విభుఁడు
గంధర్వ ముని సిద్ధగణ సాధ్య విద్యాధరాప్సరో దైత్య గుహ్యాళి దాన

తే. వాది జేగీయమానుఁ డత్యలఘుయశుఁడు, ప్రకట నందసునందాది పార్షదుండు
కపిల నారద సనకాదిక ప్రముఖ్య, మహిత యోగీంద్ర సంస్తూయమానుఁ డజుఁడు.

509

తా ॥ ఇటువంటి యజ్ఞకర్మలో సాక్షాత్తు భగవంతుడైన శ్రీహరి, లక్ష్మీవల్లభుడు, లోకగురుడు, సర్వాత్మకుడు, జగద్విభుడు, బ్రహ్మశివాదులతో కూడినవాడు, లోకపాలకులు, సమస్తదేవతలను అనుసరించి సృష్టిని పాలించేవాడు, యజ్ఞమే దేహంగా గలవాడు, సర్వయజ్ఞాలకు ప్రభువైనవాడు, గంధర్వులు, మునులు, సిద్ధగణాలు, సాధ్యులు, విద్యాధరులు, అప్సరసలు, దైత్యులు, గుహ్యకులు (యక్షులు), దానవులు, మొదలైన వారితో కీర్తింపబడుతున్న గొప్ప కీర్తిమంతుడు, కపిలుడు, నారదుడు, సనకాది మహాయోగీంద్రుల చేత సంస్తుతించబడేవాడు, నందసునందాదులు వెంటనంటి యుండేవాడూ పరమ భాగవతుల సేవలందుకొనేవాడు అయిన నారాయణుడు విచ్చేశాడు.

వ. మఱియుం బరమ భాగవత సేవితుండును నారాయణాంశ ప్రభవుండును నైన పృథు చక్రవర్తికి భూమి హవిరాదిదోగ్ధ్రియయ్యును సర్వకామదుఘయై సమస్త పదార్థంబులం బిదుకుచుండె, మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి మకరందస్రావు లగుచు నిక్షుద్రాక్షాది రసంబులును దధిక్షీరాజ్య తక్ర పానకాదికంబులును వర్షింప నవి యెల్ల నదులు

వహించె, సముద్రంబులు హీరాది రత్న విశేషంబుల నీనుచుండెఁ, బర్వతంబులు భక్ష్యభోజ్యలేహ్య చోష్యంబు లను చతుర్విధాన్నంబులం గురియుచుండె, లోకపాల సమేతులైన సకలజనంబులు నుపాయనంబులు దెచ్చి యిచ్చుచుండి, రట్టి పరిపూర్ణ విభవాభిరాముండై యధోక్షజ సేవాపరాయణుండగు పృథు చక్రవర్తి యేకోన శతాశ్వమేధంబులు సన్మేధంబునం గావించి నూఱవయాగంబు నందు యజ్ఞపతి యైన పుండరీకాక్షుని యజించుచుండం దదీయ పరమోత్సవంబు సహింపం జాలక.

510

తా ॥ పరమాత్మయైన శ్రీమహావిష్ణ్వంశతో జన్మించిన పృథు చక్రవర్తికి, భూమాత హవిస్సులు మొదలైన వాటిని పిండి ఇవ్వటమే కాకుండ కోరికలనన్నిటినీ తీర్చి, కావాలన్న అన్ని పదార్థాలను సమకూర్చి ఇచ్చింది. ఇంకా వృక్షాలు ఘనరూపాలను పొంది పెరిగి, తేనెలూరాయి. చెఱకు, ద్రాక్ష మొదలైన వృక్షజాతులు తీయని రసాలను, పాలు, పెరుగు, నేయి, మజ్జిగ, మొదలైన పానకాలను గోవులు స్రవించగా అవి నదులై పారాయి. సముద్రాలు వజ్రాలు మొదలయిన జాతిరత్నాలను ప్రసాదించాయి. పర్వతాలు భక్ష్యాలు, భోజ్యాలు, లేహ్యాలు (నాకేవి) చోష్యాలు (జుఱ్ఱుకొనేవి) అనే నాలుగు విధాలైన ఆహారాలను వర్షించాయి. లోకపాలకులతో కలసి సమస్త జనులు కానుకలు తెచ్చి ఇచ్చారు. శ్రీమన్నారాయణుని సేవాపరాయణుడైన పృథుచక్రవర్తి, అటువంటి పరిపూర్ణ వైభవంతో తొంభైతొమ్మిది యాగాలను మంచి బుద్ధిబలంతో నిర్వహించాడు. నూరవ యజ్ఞంలో యజ్ఞపతియైన పుండరీకాక్షుణ్ణి పూజిస్తుండగా, ఆ పరమోత్సవాన్ని చూసి సహించలేక, అసూయతో—

క. అమరేంద్రుఁడు ఘనరోషో, ద్గముఁడై పాషండ వేషకలిత తిరో భా
వమునం దన్మఖపశువుం, గ్రమ మేది హరించి చనియె గగనంబునకున్.

511

తా ॥ అమరేంద్రుడు రోషాన్ని క్రక్కుతూ, పద్ధతిని తప్పి పాషండుని వేషంతో,

యజ్ఞపశువును అపహరించి, గగన మార్గంలో మాయమయ్యాడు.

వ. అట్లు సనునప్పుడు.

512

తా ॥ అలా వెళ్ళేటప్పుడు,

క. అనఘుండగు నత్రి మహా, మునిచోదితుఁ డగుచుఁ బృథుని పుత్రుఁడు బాణా
సనతూణీర ధరుండై, యనిమిషపతి వెనుకఁ జనియె నతిదర్పమునన్.

513

తా ॥ అత్రి మహాముని చూసి (అత్రి మహాముని, యాగాశ్వాన్ని ఇంద్రుడు అపహరించుకు పోవటం గమనించి చెప్పటంచేత) పృథు చక్రవర్తి తనయుడికి చెప్పాడు. అతడు అంబులపొదిని, వింటిని ధరించి దర్పంతో దేవేంద్రుని వెంటపడ్డాడు.

వ. అట్లు సని చని ముందట.

514

తా ॥ అలా పోయి పోయి –

సీ. యజ్ఞ సాధన పశుహరణుని వధియించు ధర్మంబునందు నధర్మమనెడి
బుద్ధిఁ బుట్టఁగఁ జేయ భూరి మాయావేషధారియై యరుగు సుత్రాముఁ గదిసి
నిలు నిలు మని యార్చి నిజగుణధ్వని సేసి ఘన జటాభస్మాస్థి కలిత మయిన
మూర్తిఁ గనుంగొని మూర్తీభవించిన ధర్మంబ కా బుద్ధిఁ దలఁచి యమర

తే. నాయకుని మీఁద సాయక మేయఁ జాల, కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు
వైన్యజున కనె వాసవు వలను సూపి, మనములోపల రోషంబు మల్లడింప.

515

తా ॥ యజ్ఞసాధనమైన పశువుని హరించినవాణ్ణి చంపటం ధర్మమనే సందర్భంలో, అధర్మబుద్ధి కలిగేలా మాయావేషం వేసుకొని అశ్వాన్ని అపహరించుకొని వెళుతున్న ఇంద్రుణ్ణి సమీపించి 'నిలు, నిలు' మంటూ పృథు కుమారుడు అరచి, వింటినారిని మ్రోగించాడు. పెద్ద జడలతో, అస్థి మాలికలను ధరించి బూడిద బుంగగాయున్న ఇంద్రుని రూపాన్ని చూచి మూర్తీభవించిన ధర్మమూర్తి అయి ఉంటాడన్న భావంతో ఆ ఇంద్రునిపైకి బాణాన్ని ప్రయోగించలేదు. ఇది చూసిన అత్రి మహాముని, రోషం అతిశయించగా ఇంద్రునివైపుచూసి పృథు కుమారునితో ఇలా అన్నాడు:

క. విను మితఁడు యజ్ఞహంతయు, ననిమిషనికరాధముండు నగు నింద్రుఁడు గా
వున నితని జయింపుము నీ, వని ముమ్మా ఱుచ్చరింప న వైన్యజుఁడున్.

516

తా ॥ "ఓ పృథు కుమారా! విను. వీడే, యజ్ఞ విధ్వంసకుడు, దేవతలందరిలో అధముడూ అయిన ఇంద్రుడు. కాబట్టి వీణ్ణి జయించు" అని మూడుసార్లు చెప్పాడు.

మ. విను వీథిం జను దేవవల్లభునిపై వీరుండు గ్రోధాంతరం
గ నిరూఢిన్ మృగరాట్కిశోరము మహాగంధద్విపేంద్రంబు మీఁ
దను లంఘించు విధంబునం బడిన నాతం డశ్వచౌర్యైక సా
ధన రూపంబుఁ దదశ్వమున్ విడిచి యంతర్ధానముం బొందినన్.

517

తా ॥ అప్పుడా పృథు తనయుడు, సింహకిశోరం మదపుటేనుగుపై దూకినట్లు అమరేంద్రునిపై కోపంతో దూకాడు. ఇంద్రుడు మాయావేషాన్నీ, గుఱ్ఱాన్నీ విడిచి అంతర్ధానమయ్యాడు.

క. వీరుఁడు పృథు భూపాల కు, మారుఁడు నిజ యజ్ఞపశువు మరలం గొని దు
ర్వారబలుఁ డగుచు జనకుని, భూరి సవనరాజపుణ్యభూమికి వచ్చెన్.

518

తా ॥ వీరుడైన పృథు చక్రవర్తి కుమారుడు, వారింపరాని బలంతో యజ్ఞపశువును మరలించుకొని, తన తండ్రి యజ్ఞంచేసే పుణ్యభూమికి వచ్చాడు.

వ. అయ్యవసరంబున నచ్చట నున్న పరమర్షిపుంగవు లతని యద్భుత కర్మంబు గనుంగొని యాశ్చర్యంబు నొంది యతనికి జితాశ్వుండను నన్వర్థనామంబు వెట్టియున్న సమయంబున.
519

తా ॥ ఆ సమయంలో అక్కడున్న మహర్షి పుంగవులు అతని అద్భుత కృత్యాన్ని చూసి, ఆశ్చర్యపడి, ఆతనికి 'జితాశ్వుడ' నే సార్థకమైన పేరును పెట్టారు.

చ. మఱియును దేవతాపతి తమః పటలంబు జనింపఁజేసి యె
వ్వరుఁ దనుఁ గానకుండ ననివారణఁ గాంచనపాశ బద్ధ మై
సురుచిరయూపదారు పరిశోభితమైన హయంబుఁ గొంచుఁ జె
చ్చెర వినువీథి నేగఁగ ఋషి ప్రవరుం డగు నత్రి సెప్పినన్.

520

తా ॥ మళ్ళీ దేవేంద్రుడు చీకట్ల సమూహాన్ని సృష్టించి, ఎవ్వరికీ తాను కనిపించకుండా, బంగారు త్రాళ్ళతో యూపస్తంభానికి కట్టి ఉన్న గుర్రాన్ని హరించి, వినువీథిలో వెళ్ళాడు. ఋషిశ్రేష్ఠుడైన అత్రిమహాముని చెప్పగా.

క. విని పృథుభూవర తనయుఁడు, ఘన బలమునఁ జని కపాలఖట్వాంగము లో
లిని ధరియించి రయంబునఁ, జను నింద్రునిఁ గాంచి నొంపఁజాలక యంతన్.

521

తా ॥ విని, పృథు కుమారుడు మహాబలంతో ఇంద్రుని వెంట పడ్డాడు. వెంటపడిన జితాశ్వుడు ఇంద్రుడు ధరించిన పుఱ్ఱెను, ఖట్వాంగాన్ని (మంచం కోడువంటి ఆయుధం) చూసి, ఆయుధంతో నొప్పించడానికి ఇష్టం లేక తటపటాయించాడు.

ఉ. క్రమ్మఱ నత్రిచేఁ దెలుపఁగాఁబడి వైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోఁకఁ ద్రొక్కిన భుజంగమపుంగవుఁ బోలి యుగ్రుఁడై
య మ్మరిఁబోసినం గని సురాధిపుఁ డెప్పటి యట్లఁ బాఱె న
శ్వమ్మును రూపమున్ విడిచి చాలఁ దిరోహితుఁడై రయంబునన్.

522

తా ॥ మళ్ళీ అత్రి మహాముని చేత వివరాలు తెలిసికొని, కోపంతో తోకత్రొక్కిన కోడెత్రాచులాగ ఉగ్రుడై పృథు కుమారుడు బాణాన్ని ఎక్కుపెట్టగా పూర్వంలాగే ఇంద్రుడు, మాయావేషాన్ని అశ్వాన్నీ విడిచి పారిపోయాడు.

వ. అట్లు సనినం బశువుం గొని మరలి యవ్వీరో త్తముండు పితృ యజ్ఞశాలకుం జనుదెంచె నంత.

523

తా ॥ అలా ఇంద్రుడు పారిపోగా, ఆ వీరోత్తముడు యాగాశ్వాన్ని తీసికొని తండ్రి యజ్ఞశాలకు వచ్చాడు.

సీ. హరిహయుం డధ్వర హయ హరణార్థమై మించి కైకొని విసర్జించి నట్టి
భూరి యమంగళ భూత మాయారూపములను ధరించిరి మూఢజనులు,
పాషండ చిహ్నముల్ పరఁగుట వారలు జగతిపై నగ్న వేషములు గలుగు

జైనులు భూరి కాషాయ వస్త్రంబులు ధరియించు బౌద్ధులుఁ దగ జటాస్థి

తే. భస్మధారులు నయిన కాపాలికాదు, లనఁగ వెలసిరి లోకంబులందుఁ జాలఁ

దలఁప ధర్మోపమం బనఁదగు నధర్మ, మందు నభిరతి వొడమిన యజ్ఞజనులు.

524

తా ॥ ఇంద్రుడు యాగాశ్వాన్ని హరించటం కోసం ధరించి విడిచి పెట్టిన ఆ అమంగళకరమైన మాయా రూపాన్నే మూఢజనులు మోహించి ధరించారు. పాషండ చిహ్నాలైన ఆ రూపాన్ని ధరించినవారిలో కొందరు దిగంబరులు కాగా, మరికొందరు ఎర్రని వస్త్రాలు ధరిస్తారు. ఇంకొందరు కాపాలికులు. వీరు ధర్మంలాగా కనిపించే అధర్మం పట్ల అత్యంత ఆసక్తి గల అజ్ఞానులు.

వ. తదీయ చిహ్నంబులు పారంపర్యంబుగా ధరియింపం దొడంగిరి, తద్వృత్తాంతంబు భగవంతుం డయిన పృథు చక్రవర్తి యెఱింగి కుపితుండై యుద్యతకార్ముకుం డగుచు నింద్రునిమీఁద బాణంబు నేయ నుద్యమించిన ఋత్విక్కులు శక్రవధోద్యుక్తుండు నసహ్యరంహుండు నయిన పృథుచక్రవర్తిం గనుంగొని యిట్లనిరి.

525

తా ॥ ఆ పాషండ చిహ్నాలను పారంపర్యంగా ధరించటం ప్రారంభించారు. ఈ వృత్తాంతమంతా తెలిసికొన్న పృథు చక్రవర్తి కోపించి, వింటిని ఎక్కుపెట్టి ఇంద్రునిపై బాణాన్ని వేయాలని పూనుకున్నాడు. తిరుగులేని వేగంతో బాణాన్ని ఎక్కుపెట్టి, ఇంద్రుణ్ణి చంపాలని పూనుకున్న పృథు చక్రవర్తిని చూసిన ఋత్విక్కులు ఇలా అన్నారు:

క. జననాయక! యజ్ఞములం, దనుపమ విధిచోదితంబు లనఁదగు పశు బం

ధన హింసల కా కితరుల, ఘనదీక్షితునకు వధింపఁ గాదండ్రు బుధుల్.

526

తా ॥ “ఓ రాజా! యజ్ఞదీక్ష వహించిన వానికి, వేదం చెప్పిన పశుబంధనం, పశుహింసల వంటి కార్యములు తప్ప, ఇతరులను చంపటం తగదని పండితులైనవారు చెబుతారు.

వ. కావున నీ విపుడింద్రవధోద్యోగం బుపసంహరింపుము, భవదీయ ధర్మవిరోధి యైన యింద్రుని.

527

తా ॥ కాబట్టి నీవు ఇప్పుడు ఇంద్రుణ్ణి చంపాలనే ప్రయత్నాన్ని మానుకో! నీ ధర్మానికి విరోధియైన ఇంద్రుణ్ణి—

క. జనపాల! వీర్యవంతము, లనఁదగు మంత్రములచే నాహ్వానము సే
సిన నతఁ డిచటికి వచ్చును, జనుదెంచిన యమరవిభుని సరభసతఁ దగన్.

528

తా ॥ శక్తిమంతమైన మంత్రాలతో ఆహ్వానిస్తే, తప్పకుండా ఇక్కడికి వస్తాడు. అలా వచ్చిన వెంటనే వేగంగా—

క. ధృతి సెదరఁ బట్టి శిఖీ కా, హుతిఁ గా వేల్చెదము, దాన నుర్వీవర! నీ
వితత మహోహత వీర్యో, న్నతుఁడై చెడిపోవు నమరనాథుం డంతన్.

529

తా ॥ అతని ధైర్యం చెదరిపోయేలాగ పట్టుకొని, అగ్నికాహుతిగా వేసి హోమం చేద్దాం. విస్తృతమైన నీ తేజానికి, తన శక్తిని కోల్పోయి ఇంద్రుడు చెడిపోతాడు.”

వ. అని పృథుని వారించి ఋత్విగ్జనంబులు గుపితస్వాంతులై హస్తంబుల స్రుక్స్రువంబులు ధరియించి వేల్చు సమయంబునం జతుర్ముఖుండు సనుదెంచి ఋత్విజులం గనుంగొని యిట్లనియె: యజ్ఞంబులందు యజింపంబడు దేవత లెవ్వని యంశంబు, లెవ్వండు

యజ్ఞనామకంబగు భగవదంశంబగు, నట్టి యింద్రుండు మీచేత వధార్హుండుగాఁ డితండు భగవదంశసంభవుం డగుట నీ యజ్ఞకర్మ విధ్వంసనేచ్ఛుం డయి కావించు ధర్మ వ్యతికరంబులు సూచుచుండ వలయుంగాని ప్రతికారంబులు గర్తవ్యంబులు గా, వీ పృథుకీర్తియగు పృథునకు నేకోనశతంబగు నధ్వర ప్రయోగ ఫలంబు సిద్ధించుఁ గాక యని పృథుచక్రవర్తి కిట్లనియె.

530

తా ॥ అని ఋత్విక్కులు పృథు చక్రవర్తిని వారించారు. చేతుల్లో స్రుక్కుల్ని, స్రువాలను ధరించి కోపంతో హోమం చేయటం ప్రారంభించారు. ఆ సమయంలో చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు విచ్చేసి ఋత్విక్కులను చూసి ఇలా అన్నాడు: "యజ్ఞాలలో ఆరాధించబడే దేవతలు ఎవని అంశ? 'యజ్ఞుడు' అనే పేరుతో భగవంతుని అంశ చేత జన్మించటం చేత, యజ్ఞకర్మను విధ్వంసం చేయగోరి చేసే ధర్మవ్యతిరేకమైన పనులను చూస్తూండవలసిందే గాని ప్రతీకారాన్ని గురించి ఆలోచించరాదు. గొప్పకీర్తిని గడించుకున్న ఈ పృథు చక్రవర్తికి 'తొంభైతొమ్మిది యజ్ఞాలు చేసిన ఫలం సిద్ధించుగాక!" అని పృథు చక్రవర్తితో ఇలా అన్నాడు:

సీ. మనుజేంద్ర! మోక్షధర్మము నెఱింగిన నీకు సవనముల్ సేయుట సాలు మఱియు
నే విధంబున నైన దేవేంద్రు మనమునఁ గై కొని రోషంబు గదురకుండ
వర్తింప వలయును, వాసవుండును నీవుఁ బూని సుశ్లోకులు గాన మీకు
మంగళం బగుఁగాక! మానవనాథ! నీ చిత్తంబులోపలఁ జింతఁ దొఱంగి

తే. మించి మద్వాక్యముల నాదరించి వినుము, దైవ హతమగు యజ్ఞంబుఁ దగిలి చేయు
కొఱకు భవదీయ చిత్తంబు గుంది రోష, కలుషితంబైన నజ్ఞానకలిత మగును.

531

తా ॥ "ఓ రాజా! మోక్షధర్మం తెలిసిన నీవు యజ్ఞాలు చేయటం ఇక చాలించు. ఏ విధంగానైనా సరే! దేవేంద్రుని మదిలో రోషం కలిగించకుండా నీవు ప్రవర్తించాలి. ఇంద్రుడు,

నీమా కీర్తించదగిన

వారు కాబట్టి మీకు శుభం కలుగుగాక! నీ మదిలో చింతను వీడి నామాట విను. చింతతో దైవోపహతమైన యజ్ఞాన్ని చేయడానికి నీవు పూనుకున్నావు, దానికై నీ మనస్సును రోషంతో కలుషితం చేస్తే అది అజ్ఞానమే అవుతుంది.

వ. భవదీయ యజ్ఞహననార్థం బశ్వహరణుండైన యింద్రుండు దేవతలలోనన్ దురాగ్రహుం డగుటం జేసి యతనిచేత నిర్మింపంబడి చిత్తాకర్షకంబులైన యీ పాషండ ధర్మంబులచేత ధర్మ వ్యతికరంబు కలుగుం గాన యీ యజ్ఞంబు సాలింపుమని మఱియు నిట్టనియె.

532

తా ॥ నీ యజ్ఞాన్ని విధ్వంసం చేయటం కోసం, అశ్వాన్ని హరించిన ఇంద్రుడు దేవతలలోనే, చాలా పట్టుదల గలవాడు. అతని చేత నిర్మింపబడిన మనస్సుల్ని ఆకర్షించే ఈ పాషండ ధర్మాలచేత ధర్మానికి నష్టం కలుగుతుంది కాబట్టి ఈ యజ్ఞాన్ని చాలించు" అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు.

సీ. అది గాక వినుము వేనాపచారంబునఁ బూని విలుప్తంబు లైన యట్టి
యలఘు నానా సమయానుధర్మంబులఁ బరిపాలనము సేయఁ బరఁగి వేను
దేహంబు వలనను దివిరి జనించి యున్నాఁడవు, నారాయణాంశజుఁడవు,
గావున నీ నరకలితలోకంబునఁ బుట్టిన తెఱఁగు నీ బుద్ధిఁ దలఁచి

తె. యెవరిచే నేమిటికి సృజియింపఁబడితి, వట్టి యా బ్రహ్మసంకల్ప మవనినాథ!
తప్పకుండంగఁ బాలింపు ధర్మగతిని, జారు శుభమూర్తి! యో పృథు చక్రవర్తి!

533

తా ॥ "ఓ పుణ్యమూర్తీ! పృథు చక్రవర్తీ! నీ తండ్రి వేనుడు చేసిన అపచారం వలన, పలు

ఆచారాలు ధర్మాలు లోపించాయి. వాటిని మళ్ళీ రక్షించటం కోసమే, వేనుని శరీరంనుండి నీవు నారాయణాంశతో జన్మించావు. ఈ మానవ లోకంలో నీవు జన్మించిన విధానం నీ బుద్ధితో విచారించు. ఎవరి వలన ఎందుకు సృష్టించబడ్డావో, ఆ పరబ్రహ్మ సంకల్పాన్ని తప్పకుండా పాటించి, ధర్మాన్ని పాలించు."

వ. అని మఱియు నిట్లనియె; నుపధర్మ మాతయుంబ్రచండ పాషండ మార్గంబు నైన యీ యింద్రకృతం బగు మాయను జయింపు మని వనజసంభవుం డానతిచ్చినం బృథు చక్రవర్తియు దదాజ్ఞాపితుండై దేవేంద్రునితోడ బద్ధసఖ్యుండయ్యె; నంత నవభృథానంతరంబున.

534

తా ॥ అప్రధానమైన ధర్మాలకు కారణమైనది, ఇంద్రునిచే కల్పింపబడిన ఈ ప్రచండ పాషండ మార్గమైన మాయను జయించమని బ్రహ్మ ఆజ్ఞాపించాడు. పృథు చక్రవర్తి కూడా ఆ ఆజ్ఞను పాటించి దేవేంద్రునితో సఖ్యత పెంచుకున్నాడు. యజ్ఞదీక్షను విరమిస్తూ అవభృథ స్నానం చేశాడు.

చ. సురుచిర లబ్ధ దక్షిణల సొంపునఁ బొంపిరి వోయి భూసురుల్
వరుసను బెక్కు దీవన లవారణ నిచ్చిరి, సర్వదేవతల్
భరిత ముదంతరంగములఁ బాయని వేడ్క వరంబు లిచ్చి రా
నరవరుఁ డైన వైన్యునకు నందిత కీర్తికిఁ బుణ్యమూర్తికిన్.

535

తా ॥ యజ్ఞసందర్భంగా లభించిన విస్తారమైన దక్షిణలతో సంతృప్తి చెందిన బ్రాహ్మణులు, పృథు చక్రవర్తిని మెండుగా దీవించారు. సర్వదేవతలు సంతోషంతో నిండిన అంతరంగంతో ప్రీతి చెంది వరాలిచ్చారు. ఆ పృథు చక్రవర్తి ప్రశంసింపబడిన కీర్తిగల

పుణ్యమూర్తి.

వ. అంత నచటి జనంబు లిట్లనిరి.

536

తా ॥ అప్పుడు అక్కడున్న ప్రజలు ఇలా అన్నారు:

తే. అనఘ! నీ చేత నాదృతులైరి సర్వ, జనులు మఱి దానమానోపచారములను
బితృ సుదేవర్షి మానవ వితతి పూజ, నొంది యంచితమోదంబు నొందె నయ్య!

537

తా ॥ "ఓ పుణ్యమూర్తీ! సర్వజనులూ నీ చేత ఆదరించబడ్డారు. పితృదేవతలు, దేవతలు, ఋషులు, మానవులు, దానవులు – అనేక దానాలు, ఉపచారాలతో పూజింపబడ్డారు. సంతోషాన్ని పొందారు."

## 21. నారాయణుడు ప్రసన్నుడై పృథు చక్రవర్తిని అనుగ్రహించుట

వ. అని పలుకు సమయంబున యజ్ఞభోక్తయు యజ్ఞవిభుండును భగవంతుండునైన సర్వేశ్వరుం
డింద్రసమేతుండై యచ్చటికిం జనుదెంచి యా పృథున కిట్లనియె.

538

తా ॥ అని ప్రజలు పలికే సమయంలో, యజ్ఞభోక్త, యజ్ఞభర్త, భగవంతుడూనైన సర్వేశ్వరుడు ఇంద్రునితో కూడి, వచ్చి పృథు చక్రవర్తితో ఇలా అన్నాడు:

క. జనవర! భవదీయంబై, జననుతమగు నశ్వమేధ శతమున కిపు డీ
యనిమిషపతి భంగము సే, సిన కతన క్షమాపణంబు సేసెడిఁగంటే!

539

తా ॥ "ఓ రాజా! నీ నూరవ అశ్వమేధయాగానికి భంగం కలిగించిన ఇంద్రుడు నిన్ను క్షమాపణ వేడుకోవడానికి వచ్చాడు. చూసావా!

వ. కావున నితని క్షమింపుము, సత్పురుషు లగువారు దేహాభిమానులు గాకుండుటం జేసి భూతంబులయెడ ద్రోహం బాచరింప, రట్లగుటం జేసి నీవంటి మహాత్ములు దేవమాయా మోహితులై పరోపతాపంబులు సేసిరేని దీర్ఘతరంబైన వృద్ధజనసేవ వ్యర్థంబు గాదె!

యదియునుం గాక యీ శరీరం బవిద్యాకామకర్మంబుల చేత నారబ్ధం బని తెలిసిన భూతద్రోహి గాని పరమజ్ఞాని యీ దేహంబునందు ననుషక్తుండు గాకుండుట సహజం బన, దేహోత్పాదితంబులైన గృహదారాదులయందు మమత్వంబు లేకుండుటం జెప్పనేల? యిట్టి దేహంబునందున్న యాత్మ యేకంబును, శుద్ధ స్వరూపంబును, స్వయంజ్యోతియు నిర్గుణంబును, గుణాశ్రయంబును, వ్యాప్యవ్యాపకంబును, నసంవృతంబును,

సాక్షిభూతంబును, నిరాత్మంబును నగు, దీని దేహంబుకంటె వేఱుగా నెవ్వండు దెలియు వాఁడు మత్పరుం డగుటం జేసి దేహధారియై యుండియుఁ దద్గుణంబులం బొరయక వర్తించు. మఱియు నెవ్వండేని స్వధర్మాచార పరుండును, నిష్కాముండును, శ్రద్ధాయుక్తుండునై నన్నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు క్రమంబునఁ బ్రసన్నంబగు, నట్లు ప్రసన్న మనస్కుండును, ద్రిగుణాతీతుండును సమ్యగ్దర్శనుండును నైన యతండు మదీయ సమవస్థాన రూపశాంతి నొందు, నదియు కైవల్యపదం బనంబడుఁ, గూటస్థంబైన యీ యాత్మ యుదాసీనభూతం బైనను దీని ద్రవ్యజ్ఞాన క్రియామనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియు, వాఁడు భవంబు నొందకుండు, నీ సంసారంబు ద్రవ్య క్రియా కారక చేతనాత్మకం బగుటం జేసి ప్రభిన్న దేహోపాధికంబు గావునఁ బ్రాప్తంబు లైన యావత్సంపదలయందు మత్పరులైన మహాత్ములు వికారంబు నొందరు, గావున నీవు సుఖ దుఃఖంబుల యందు సమచిత్తుండవును, సమానోత్తమ మధ్యమాధముండవును, జితేంద్రియాశయుండవునై వినిష్పాదితాఖీ లామాత్యాది సంయుతుండవై, యఖిలలోక రక్షణంబు సేయు మని వెండియు నిట్లనియె.

540

తా ॥ కాబట్టి ఇతణ్ణి క్షమించు. సజ్జనులైనవారు దేహాభిమానంలేని వాళ్ళు కాబట్టి ప్రాణికోటిపట్ల ద్రోహం చేయరు. అందుచేత నీ వంటి మహాత్ములు దేవమాయకు వశులై ఇతరులకు బాధ కలిగిస్తే, ఎంతోకాలంగా చేసిన వృద్ధపుణ్య జనసేవ వ్యర్థమైనట్లే కదా! ఈ 'శరీరం అజ్ఞానం వల్ల పుట్టింది' అని తెలిసిన పరమజ్ఞాని దేహం పట్ల ఆసక్తిని పెంచుకోడు. అటువంటప్పుడు ఇంటిమీద, భార్యపుత్రులపై మమకారం లేకుండటాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

ఇటువంటి దేహంలో సంచరించే ఆత్మ ఒక్కటే. అది శుద్ధమైనది. స్వయంగా ప్రకాశించేది. నిర్గుణమైనప్పటికీ గుణాలను ఆశ్రయించే ఉంటుంది. ఆధారాధేయాలు తానే అయి

వ్యాపించేది, అన్నిటికీ సాక్షీభూతంగా ఉంటుంది. దేహగుణాలు పొందనిదైన ఈ ఆత్మను దేహంకంటే వేరైనదని ఎవడు తెలుసుకొంటాడో వాడు నాయందు భక్తి కలవాడు. అటువంటివాడు దేహధారియైనప్పటికీ దేహసంబంధంగా అంటే గుణాలను అంటించుకోడు. ఎవడైతే స్వధర్మాచరణయందు ఆసక్తి కలిగి, ఏ కోరికా లేకుండా, శ్రద్ధాయుక్తుడై నన్ను భజిస్తాడో అటువంటివాని మనస్సు క్రమంగా నిర్మలమవుతుంది. అటువంటి ప్రసన్నమైన మనస్సు కలవాడు త్రిగుణాలకు అతీతుడవుతాడు. భగవత్తత్త్వాన్ని చక్కగా దర్శించిన వాడవుతాడు. అటువంటి వ్యక్తి నేనున్న స్థితిలో ఉంటాడు కాబట్టి శాంతిని పొందుతాడు. అదే కైవల్యమంటే. దేహమనే గూటిలో ఈ ఆత్మ నిర్లిప్తంగా ఉన్నప్పటికీ దేహం యొక్క ద్రవ్యానికి, క్రియకు, జ్ఞానానికి, మనస్సుకు అధిపతిగా ఆత్మను ఎవడైతే తెలుసుకుంటాడో వాడు మళ్ళీ భవబంధాల్లో చిక్కుకోడు.

ఈ ప్రపంచం ద్రవ్యము, క్రియ, ఆకారము, మెలకువ కలది కాబట్టి, వేర్వేరు దేహాలను ఉపాధులుగా కలిగియుంటుంది. అందుచేత లభించిన సంపదల పట్ల, నాయందు భక్తి గల మహాత్ములు మార్పు చెందరు. కాబట్టి నీవు సుఖదుఃఖాల పట్ల సమానమైన చిత్తం గలవాడివిగా ఉండాలి. నీతో సమానమైన వారిపట్ల, నీకంటే ఉత్తములయిన వారిపట్ల, మధ్యములైన వారిపట్ల సమంగా ప్రవర్తించు. ఇంద్రియాలను జయించాలనే ఆశయం కలవాడవై, విశిష్టులైన మంత్రులతో, ఇతరులతో కలసి, ఈ సమస్త లోకాన్నీ రక్షించవలసిన బాధ్యత నీదే." అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట పరమ ధర్మం బగు నరవరేణ్య!
ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ బూని లోకులు సేయు పుణ్యమందు
షష్ఠాంశ మర్థిని సంప్రాప్త మగు నట్లు ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృత సత్పుణ్యుఁడై వారు గావించు ఘనపాప ఫలముఁ దా ననుభవించుఁ

తే. గాన నీవును విప్రవరానుమతము, సంప్రదాయక విధమునై జరుగు ధర్మ

మహిమఁ జేపట్టి యర్థకామములయందు, సమత న మ్మూఁటియందు నా సక్తిలేక.

541

తా ॥ "ఓ రాజా! రాజులకు ప్రజల్ని రక్షించటం పరమ ధర్మం. ప్రజలు చేసే పుణ్యంలో, ప్రజల్ని పాలించే పాలకులకు ఆరోవంతు లభిస్తుంది. ప్రజల్ని రక్షించని రాజు పుణ్యాన్ని ప్రజలే అపహరిస్తారు. పైగా ఆ ప్రజల పాపఫలాన్ని రాజే అనుభవిస్తాడు. కాబట్టి నీవు విప్రుల అనుమతితో, సంప్రదాయ సిద్ధమైన ధార్మిక మార్గాన్ని స్వీకరించి, అర్థకామాల పట్ల ఆసక్తి లేకుండా ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాలపట్ల సమాన దృష్టిని కలిగి యుండు.

ప్రజలకు రాజుకు మధ్య ఉండే సంబంధాన్ని ఆధ్యాత్మికంగా స్వామి వ్యాఖ్యానించి చెప్పడాన్ని ఇక్కడ గమనించాలి. 'ధర్మోరక్షతి రక్షితః' అంటే ఇటువంటి సందర్భాన్ని సమన్వయించుకోవడంలోనే తెలుస్తుంది. రాజు ప్రజల్ని ధర్మబద్ధంగా పాలించి, వాళ్ళు ధర్మవర్తనులై జీవించేలా చేసినప్పుడు ఆ ధర్మవర్తన ఫలంలో భాగం రాజును చేరుతుంది. పాలకుడైన ప్రభువు ప్రజల పాపానికి ప్రజల్ని వదలివేస్తే, తన పుణ్యశేషాన్ని ప్రజలు హరిస్తారని చెప్పడంలో పాలకుల జాగరూకతను గుర్తుచేయటం స్పష్టంగా కనిపిస్తుంది.

వ. ఇవ్విధంబున.

542

తా ॥ ఈ విధంగా—

క. జనులకు ననురక్తుఁడవై, జననాయక! నీవు ధరణి సమచిత్తుఁడవై
యనయముఁ బరిపాలించిన, సనకాదులఁ గాంతు వాత్మసదనమునందున్.

543

తా ॥ ప్రజానురక్తుడవై, సమచిత్తంతో రాజ్యాన్ని పరిపాలించు. అప్పుడు నీకు మీ ఇంట్లోనే

సనకాది మునుల దర్శనం లభిస్తుంది.

సీ. భూవర! యోగ తపో మఖంబుల చేతఁ, గై కొని సులభుండఁ గాని యేను
సమచిత్తులైన సజ్జనుల చిత్తంబుల, వర్తించుచుండెడివాఁడ నగుటఁ
జేసి తావక శమ శీల విమత్సర, కీర్తనముల వశీకృతుఁడ నైతి;
నే నీకు నొక వరం బిచ్చెద వేఁడుము, నావుడు విన మేదినీ వరుండు

తే. లోకగురుఁడైన యప్పుండరీక నయనుఁ, డానతిచ్చిన మృదులలితామృతోప
మాన వాక్యము లాత్మీయ మస్తకమునఁ, దాల్చి సమ్మోదితాత్ముఁడై ధరణి విభుఁడు,

544

తా ॥ "ఓ భూవర! యోగం చేత, తపస్సు చేత, యజ్ఞాల చేత పొందడానికి సులభంగా వీలుగాని నేను, సమచిత్తంతో ప్రవర్తించే సజ్జనుల హృదయాలలో నిలచి ఉంటాను. అందుచేత శమశీలుడవై, మాత్సర్యంలేని భక్తితో స్తుతించే నీ కీర్తనలకు వశుడనయ్యాను. నీ కొక వరాన్నిస్తాను వేడుకో" అని పలికిన ఆ పుండరీకాక్షుని మృదుసుకుమారమైన అమృతంతో సమానమైన వాక్కుల్ని శిరస్సున ధరించి, మదిలో పరమానందాన్ని పొందాడు.

క. తన పాదములకు భక్తిన్, వినతుండై యాత్మకర్మ వితతికి లజ్జం
దనరుచు నున్న సురేంద్రుని, గనుఁగొని సప్రేమ మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్.

545

తా ॥ తాను చేసిన పనికి సిగ్గుపడుతూ, తన పాదాలపైపడి భక్తితో నమస్కరించిన దేవేంద్రుణ్ణి చూసి, పృథు చక్రవర్తి ప్రేమతో కౌగిలించుకున్నాడు.

వ. ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుండై యున్న యనంతరంబ.

546

తా ॥ ఈ విధంగా ద్వేషం లేకుండా కౌగిలించుకున్నాక,

మ. భగవంతుండును విశ్వరూపకుఁడునై భాసిల్లు నవ్విష్ణుఁ డా
జగతీనాథకృతార్చనా నతులచే సంప్రీత చేతస్కుఁడున్
నిగృహీతాంఘ్రి సరోరుహద్వయుఁడునై నిల్చెం బ్రయాణాభి ము
ఖ్యగరిష్ఠాత్మకుఁ డయ్యు నా పృథునిపైఁ గారుణ్య మేపారఁగన్.

547

తా ॥ భగవంతుడు, విశ్వరూపకుడూనై ప్రకాశించే ఆ విష్ణుమూర్తి, పృథుచక్రవర్తి చేసిన అర్చనకు, నమస్కారాలకు సంప్రీతి చెందాడు. తన పాదపద్మాలను పృథువు పట్టుకోగా, ఆతనిపై గల కారుణ్యంతో, బయలుదేరి వెళ్ళాలన్న తొందరలో ఉన్నప్పటికీ అలాగే నిలచిపోయాడు.

వ. ఇట్లు దనమీఁది యనుగ్రహంబునం జేసి విలంబితుం డగుటయు న య్యాది రాజన్యుండైన పృథుచక్రవర్తి య మ్ముకుంద సందర్శనానంద బాష్పజలబిందు సందోహ కందళిత నయనార విందుండై యవ్విభుమూర్తిం గనుంగొని కనుంగొన లేక గద్గద కంఠుండై పలుకలేక యుండియు నెట్టకేలకుఁ దన హృదయంబున నద్దేవుని నుపగూహనంబు గావించి తన్మూర్తి ధరియించి కన్నులం దొరఁగు నానంద బాష్పంబులు దుడిచికొని విలోకనంబు సేయుచు, నతృప్తదృగ్గోచరుండును, గరుడస్కంధ విన్యస్తహస్తుండును, వసుధాతలస్థిత పాదకమలుండును నై యొప్పు నద్దివ్య పురుషున కిట్లనియె.

548

తా ॥ ఈ విధంగా తన మీది అనుగ్రహం చేత, వెళ్ళడానికి ఆలస్యం చేస్తున్న శ్రీమహావిష్ణువుని చూసిన ఆనందంతో కళ్ళనిండా బాష్పాలు కమ్మాయి. కళ్ళలో నిండిన ఆ ఆనంద బాష్పాలవల్ల శ్రీమహావిష్ణురూపాన్ని చూసికూడా సరిగా చూడలేకపోయాడు. గద్గద

కంఠంతో పలుకలేక పోయాడు. చివరికి తనహృదయంలోనే ఆ దేవదేవుణ్ణి కౌగిలించుకొని, ఆ మూర్తిని ధరించాడు. కళ్ళ వెంట కలిగే ఆనందబాష్పాల్ని తుడుచుకుని చూస్తున్నాడు. ఎంత చూసినా తనివి తీరని వాడు, గరుడుని మూపుపై చేతినుంచి పాదాలను నేలపై మోపి నిలిపిన ఆ శ్రీమన్నారాయణునితో ఇలా అన్నాడు:

భక్తుణ్ణి అనుగ్రహించి ప్రత్యక్షమైన భగవంతుడు, వెళ్ళడానికి ఆలస్యం చేస్తున్నాడంటే ఆ భక్తునిపై ఎంత ప్రేమ ఉందో కదా! ఇంటికి వచ్చిన అతిథి, వెళ్ళడానికి ఇష్టంలేకపోతే చేసే ఆలస్యంలాగ శ్రీమన్నారాయణుడు ఆలస్యం చేస్తున్నాడట. భగవంతుణ్ణి చూడాలన్నప్పుడు, ఆ దివ్యనేత్రాలను మళ్ళీ భగవంతుడివ్వవలసిందే. అర్జునునకైనా, ధృతరాష్ట్రునకైనా స్వామి అనుగ్రహించిన దివ్యచక్షువులవల్లనే ఆ పరమాత్మ దర్శనం సాధ్యమైంది. అలాగే పృథు చక్రవర్తికి కూడా.

భక్తుని పారవశ్యస్థితి లక్షణాలను నారదభక్తి సూత్రాలు ఇలా చెబుతున్నాయి: కంఠావరోధ – రోమాంచాశ్రుభిః పరస్పరం లసమానా పావయంతి కులానీ పృథివీంచ – అనన్య భక్తులు భగవంతుని విషయాలను చర్చిస్తున్నప్పుడు వారి కంఠం గద్గదమవుట, రోమాంచనం మరియు అశ్రుపూరితనయనాలు కలవారై తమ వంశమునే గాక పృథ్వినంతటిని పావనం చేయుదురు.

పరమాత్మను ఎంత చూసినా తృప్తి కలుగదనేది ప్రత్యేకంగా చెప్పేదేముంది! ఏ సౌందర్యమయితే చూసేకొద్దీ ఇనుమడిస్తుందో అదే సౌందర్యం. ఏదయితే చూసేకొద్దీ నవ్యతతో చవులూరింపచేస్తుందో అదే రమణీయత్వం. ఆ సౌందర్యము, ఆ రమణీయత్వమూ శ్రీమన్నారాయణుని ఆశ్రయించుకునే కదా ప్రవర్తించేది! ప్రవర్ధమానమయ్యేది! అందుకే పృథువుకు తనివితీర లేదని చెప్పటం.

క. వరదా! యీశ్వర నిను స, త్పురుషుఁడు దేహాభిమాన భోగములకు నీ

వరమెట్లు గోరు నిహసుఖ, వరములు నారకులకైన వఱలవె చెపుమా.

549

తా ॥ "వరదా! ఈశ్వరా! సజ్జనుడైనవాడు నిన్ను దేహంపట్ల అభిమానంతో, దైహిక భోగాలను ఆశించి వరమెలా కోరుకుంటాడు? అవి నరకలోకంలో ఉన్నవాళ్ళకు సైతం లభిస్తున్నాయి కదా!

కర్మఫలాన్ని బట్టి, మనోదేహేంద్రియాలు ఉన్నంతవరకు దైహిక సుఖాలు లభిస్తూనే ఉంటాయి. అవి కేవలం ప్రయత్న సిద్ధాలనుకోవటం పొరపాటు. ఇటువంటి సుఖాలపట్ల గల కోరికలే జీవుని ముక్తికి ప్రతిబంధకాలు. అది తెలిసినవాడు కాబట్టి, పృథువు ఆ దైహిక సుఖాలు నరకవాసులకు కూడ లభిస్తుంటే, మళ్ళీ వాటిని నేనెందుకు కోరుకోవాలంటూ తన విజ్ఞతను ప్రదర్శించాడు. పైగా విషయతృష్ణలకు అంతం ఎక్కడుంది? పరోక్షంగా అవే మళ్ళీ నరకహేతువులవుతున్నాయి.

చ. ఘన మగు దేవ! యీ వరమె కాదు మహాత్మక! వాగ్వినిర్గతం
బనఁదగు తావకీన చరణాంబుజ చారు మరందరూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగ లేని మోక్ష మై
నను మదిఁ గోర నొల్ల నఘనాశ! రమేశ, సరోజలోచనా!

550

తా ॥ మహానుభావా! పాపనాశా! లక్ష్మీశా! పద్మలోచనా! ఈ వరాన్నేకాదు. నీ పాదపద్మాల మకరంద రూపమై, మహనీయుల వాక్కుల నుండి వెలువడే నీ కీర్తిని విని, సంతోషించలేని స్థితిలో మోక్షాన్నయినా నేను కోరుకోను.

భగవంతుని కథా శ్రవణాదులలో అనురక్తి (కథాదిష్వితి గర్గః) దృఢభక్తికి బాహ్యలక్షణం. శ్రీకృష్ణుడు భగవద్గీతలో (10:9) లో ఇలా చెబుతాడు: 'భక్తులు నాయందే స్థిరచిత్తం గలవారై,

నాయందే ప్రాణం లగ్నమొనర్చినవారు, నన్ను గూర్చి తెలుసుకొనేవారు, సదా నా కథలను వింటూ సంతృప్తి చెందుతూ, ఆనందిస్తున్నారు.'

క. అది గాన పద్మలోచన!, సదమల భవదీయ ఘనయశము వినుటకునై
పదివేల చెవులు కృప ని, మ్మిదియే నా యభిమతంబు నిపుడు ముకుందా!

551

తా ॥ అందుచేత ఓ పద్మలోచనా! ముకుందా! సత్యమై, నిర్మలమై ప్రకాశించే నీ కీర్తిని వినటం కోసం పదివేల చెవుల్ని నాకు ప్రసాదించు. ఇదే నా అభిమతం.

చ. అనఘ! మహాత్మ! వాగ్గళితమైన భవత్పద పంకజాత సం
జనిత సుధాకణానిల వశంబునవిస్మృత తత్త్వమార్గ వ
ర్తనులగు దుష్టయోగులకుఁ గ్రమ్మఱఁ ద త్త్వముఁ జూపఁజాలు ని
ట్లొనరుట దక్క నన్యవర మొల్లఁ బయోరుహపత్త్రలోచనా!

552

తా ॥ ఓ పుణ్యాత్మా! పద్మలోచనా! మహాత్ముల వాక్కుల నుండి జాలువారే నీ పాదపద్మాల నుండి స్రవించే అమృత కణాలను మోసుకొని వచ్చే వీచికల ద్వారా తత్త్వ జ్ఞానాన్ని మరచిపోయిన అజ్ఞానులకు, వెంటనే తత్త్వమార్గాన్ని చూపగలిగే వరాన్ని అనుగ్రహించు. ఇంతకు మించి వేరే వరాన్ని నేను కోరుకోను.

సీ. వినుత మంగళ యశోవిభవ! సర్వేశ్వర! యిందిర గుణసంగ్రహేచ్ఛఁజేసి
యే నీదుశివతరం బైన సత్కీర్తిని నర్థియై వరియించె నట్టి కీర్తి
చతుర సత్పురుష సంగతము గల్గుచు నుండ ధృతి నెవ్వఁడేని యాదృచ్ఛికతను
జేసియు నొకమాటు చెవులార విన్నవాఁ డనయంబును గుణజ్ఞుఁ డయ్యెనేని

తే. విరతి నేరీతిఁ బొందును ధరణిఁ బశువుఁ, దక్కఁ దక్కిన తద్జ్ఞుండు దనుజ భేది
గాన యుత్సుక మతి నైన యేను లక్ష్మి, కరణి నిన్ను భజింతు నో పరమపురుష!

553

తా ॥ కీర్తింపదగిన, మంగళకరమైన కీర్తిసంపద గలవాడా! సర్వేశ్వరా! గుణాలను సంగ్రహించాలన్న కోరికతో లక్ష్మీదేవి, మంగళకరమైన నీ సత్కీర్తినే కోరి వరించింది. అటువంటి కీర్తి సత్పురుష సాంగత్యంతో కలుగుతుంటే యాదృచ్ఛికంగా ఒకసారి చెవులతో విన్న గుణజ్ఞుడు వదలిపెట్టలేడు పశువైతే తప్ప. నీ గుణగానం పట్ల ఉత్సాహమతినైన నేను లక్ష్మీదేవిలాగ నిన్ను భజిస్తాను.

వ. ఇట్లు భవదీయ సేవాతత్పరులమైన యిందిరయు నేను నేక పదార్థాభిలాషం జేసి స్పర్ధమానుల మగుచున్న మా యిద్దఱకును బర్యాయ సేవంజేసి కలహంబు లేకుండ నిమ్మట్లు గాక భవదీయ చరణసరోరుహ సేవాసక్త మనోవిస్తారుల మగుటం జేసి యేన యేన మున్ను భజియింతు నను తలంపులం గలహం బయిననుం గానిమ్ము, దేవా యని వెండియు నిట్లయె.

554

తా ॥ ఈ విధంగా నీ సేవాతత్పరులమైన లక్ష్మీదేవి, నేను ఒకే వస్తువును అభిలషించడంచేత స్పర్ధ కలుగుతుంది. అందుచేత ఒకరి తరువాత మరొకరము సేవించుకొనేలాగ చేసి, మా మధ్య కలహం లేకుండా చూడు. అలా కాని పక్షంలో, నీ పాదపద్మాలను సేవించాలనే ఆసక్తి గల మనస్సుగల వాళ్ళమైన మేము "నేను ముందంటే నేను ముందు" అని తగాదా పడినా పడనీ!" అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. జగదీశ! దేవ! యుష్మత్పద కైంకర్య పరతఁ దనర్చు సాగరతనూజ
కృత్యంబునందు నకిల్బిష బుద్ధినేఁ బ్రీతిఁ గోరుట జగన్మాత యైన

యా రమాసతితోడి వైర మవశ్యంబుఁ గల్గు నైనను దయాకరా! నీవు
దీనవత్సలుఁడవు గాన స్వల్పం బైన నధికంబు సేయుదు, వట్లుగాన

తే. భవ్యచరిత! నిజస్వరూపంబునందు, నభిరతుఁడ వైన నీవు నన్నాదరించు
పగిది నిందిర నాదరింపవు మహాత్మ!, భక్తజనలోక మందార! భవవిదూర!

555

తా ॥ "భక్తజనలోక మందార! భవవిదూర! జగదీశ! దేవా! నీ పాదపద్మాలను సేవించాలనే దీక్షతో లక్ష్మీదేవి తపన పడుతున్నది. పుణ్యబుద్ధితో నేను కూడా అదే పనిని కోరుకుంటున్నాను. అందుచేత జగన్మాతయైన లక్ష్మీదేవికి తప్పకుండా వైరం కలుగుతుంది. అయినప్పటికీ ఓ దయామయా! నీవు దీనవత్సలుడవు కాబట్టి, కొంచెమైనా గొప్పగా చూస్తావు. అందుచేత నిజస్వరూపానుగ్రహాన్ని కలిగించే నీవు, నన్ను ఆదరించినట్లుగా, ఆ లక్ష్మీదేవిని ఆదరించవు.

వ. ఇట్లగుటం జేసి సత్పురుషు లైనవారలు నిరస్తమాయాగుణసముదయంబు గల నిన్ను భజియింతురు. వారలు భవత్పాదానుస్మరణరూపంబయిన ప్రయోజనంబు దక్క నితర ప్రయోజనంబుల నెఱుంగరు, దేవా! సేవకజనంబులను వరంబులు వేఁడుమని జగద్విమోహనంబు లైన వాక్యంబులు వలుకుదు, వట్టి భవదీయ వాక్య తంత్రీ నిబద్ధులు లోకులు గాకుండిరేని ఫలకాములై కర్మంబుల నెట్టులాచరింతు? రీశా! భవదీయ మాయావిమోహితులై జను లేమి కారణంబున నీకంటె నితరంబులఁ గోరుచుందు? రిట్లగుటం జేసి తండ్రి దనంతన బాలహితం బాచరించు నట్లు మాకు నీవ హితాచరణం బాచరింప నర్హుండ వని పలికిన నాదిరాజర్షియైన పృథుచక్రవర్తి యర్థవంతంబులయిన వచనంబులు విని విశ్వద్రష్ట యగు నారాయణుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె? "మహారాజా! దైవ ప్రేరితుండవై నాయెడ నిట్టి బుద్ధి గలుగుటం జేసి యచలాచలంబగు భక్తి వొడము, దానిచే దుస్తరంబగు మదీయమాయం దరింతువు, నీవు నాచే నాదిష్టంబగు కృత్యం

బప్రమత్తుండ వగుచు నాచరించిన సకలశుభంబులం బొందుదువు, మదీయ భక్తజనంబులు స్వర్గాపవర్గ నరకంబులం దుల్యంబులుగా నవలోకింతురు, గావున నీ యధ్యవసాయంబు నట్టిదియ, మఱియు మదీయాదేశంబున దుస్త్యజం బగు రోషంబును దృజించి నా యెడ భక్తి సలిపితివి గాన నిదియె నాకుఁ బరమహర్షదం బగు, నని యభినందించి యనుగ్రహించి యతండు గావించు పూజలు గయికొని గమనోన్ముఖుం డయ్యె, న య్యవసరంబున.

556

తా ॥ అందుచేత సజ్జనులైనవారు, మాయాతీతుడవైన నిన్ను భజిస్తారు. నీ పాదాలను స్మరించటం తప్ప మరే ఇతరమైనదాన్ని కోరుకోరు. నీ సేవకులైనవాళ్ళను 'వరాలు కోరుకొమ్మని' లోకాన్ని మోహింపచేసే మాటలలో వ్యామోహపెడతావు. అటువంటి నీ మాటలనే తీగలచే బంధింపబడకపోతే వాళ్ళు, ఫలాపేక్ష కలవారై, మాయావిమోహితులై, కర్మాసక్తులు ఎలా అవుతారు? ఈశ్వరా! నీ మాయచే మోహించబడ్డ జనులు, ఏ కారణం చేత నీకంటే ఇతరమైన వాటిని కోరుతున్నారు? ఇందుచేత తండ్రి తనంతటతానే పిల్లలకు హితాన్ని కలిగించే పని చేసినట్లు, మాకు నీవే మేలు చేయతగినవాడవు. అని అర్థవంతమైన మాటలు రాజర్షియైన ఆ పృథు చక్రవర్తి పలుకగా, విశ్వద్రష్టయైన ఆ నారాయణుడు విని, సంతృప్తి చెందిన మనస్సుతో ఇలా అన్నాడు:

'ఓ రాజా! దైవప్రేరణతో నీకు నా పట్ల ఇటువంటి సద్బుద్ధి కలిగింది. అందువలన పర్వతంలా చలించని భక్తి నీకు కలుగుతుంది. ఆ భక్తితో, దాటవీలుకాని నా మాయను అవలీలగా దాటుతావు. నాచేత ఆదేశింపబడే ఈ పనిని, అప్రమత్తుడవై ఆచరిస్తే నీకు సకల శుభాలు కలుగుతాయి. నా భక్తులు స్వర్గాన్ని, మోక్షాన్ని, నరకాన్ని సమానంగానే చూస్తారు. నీ నిశ్చయంకూడా అటువంటిదే. నా ఆదేశాన్ని పాటించి, విడువరాని రోషాన్ని త్యజించావు. నాపట్ల భక్తి భావంతో అర్చించావు. ఇదే నాకు పరమ సంతోషకారకం.' అని అభినందించి,

వరాలిచ్చి, పృథు చక్రవర్తి చేసిన పూజలు స్వీకరించి ప్రయాణోన్ముఖుడయ్యాడు. ఆ సమయంలో—

సీ. నర సిద్ధ చారణ సుర ముని గంధర్వ కిన్నర పితృ సాధ్య పన్నగులును
నఖిల జనంబులు హరి పార్శ్వవర్తులు నానంద మగ్నాంగు లగుచు వేడ్క
యజ్ఞేశచింతనుం డైన యా పృథువుచే సత్కారమునుఁ బొంది సమ్మదమునఁ
జనిరి నిజాధివాసములకు, భగవంతుఁ డైన నారాయణుం డచ్యుతుండు

తే. దగ నుపాధ్యాయ సహితుఁడై తనరు పృథుని, విమలమతు లయి చూచుచు నమరవరులు
దన్ను జయజయ కలిత శబ్దములఁ బొగడఁ, జనియె నప్పుడు వైకుంఠ సదనమునకు.

557

తా ॥ నరులు, సిద్ధులు, చారణులు, దేవతలు, మునులు, గంధర్వులు, కిన్నరులు, పితృదేవతలు, సాధ్యులు, నాగలోకనివాసులు, విష్ణుకింకరులు, సమస్తజనులు ఆనందంలో మునిగి తేలుతూ, విష్ణుచింతనా పరుడైన పృథు చక్రవర్తి చేసిన సత్కారాలను స్వీకరించి సంతోషంతో తమతమ నివాసాలకు వెళ్ళారు. ఋత్విక్కులతో కూడిన పృథు చక్రవర్తిని నిర్మలమైన మనస్సుతో చూస్తూ దేవతలు తనను జయజయ శబ్దాలతో కీర్తిస్తుండగా శ్రీహరి వైకుంఠ సదనానికి చేరుకున్నాడు.

వ. అంతఁ బృథుచక్రవర్తియు నింద్రియాగోచరుం డయ్యును దర్శితాత్ముండును దేవదేవుండును నయిన వాసు దేవునకు నమస్కరించి నిజపురంబునకుం జనుదెంచు సమయంబున మౌక్తిక కుసుమ మాలికా దుకూల స్వర్ణతోరణాలంకృతంబును, లలిత సుగంధ ధూపవిలసితంబును, రత్నమయ రంగవల్లికా విరాజితంబును, ఫలపుష్ప లాజాక్షత దీపమాలికా స్తంభ పూగపోతాభిరామ ప్రతిగృహ ప్రాంగణంబును, మృగమద ఘనసార చందనాగరు వాఃపూర సంసిక్త రథ్యావళీ విభాసితంబును, దరుపల్లవాభి శోభితంబును నైన

పురంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం జనుదేర మండిత రత్నకుండలమణి మరీచులు గండ ఫలకంబులం దాండవంబులు సలుపం బరకామినులు గనక పాత్ర విరచితంబు లయిన యశేష మంగళ నీరాజనంబుల నివాళింప, శంకదుందుభి ప్రముఖ తూర్యఘోషంబులును, ఋత్విఙ్నికాయాశీర్వచనంబులును జెలంగ వందిమాగధ జనసంస్తూయమానుం డగుచు విగత గర్వుండై యంతఃపురంబుం బ్రవేశించి యనంతరంబ.

558

తా ॥ ఆ తరువాత పృథు చక్రవర్తి నేత్రేంద్రియాలకు కనిపించక పోయినా, ఆత్మలో దర్శించబడుతున్న దేవదేవుడైన వాసుదేవునకు నమస్కరించి తన పట్టణానికి మరలివస్తున్నాడు. ఆ సమయంలో పట్టణమంతా ముత్యాల దండలు, పూలమాలికలు, జిలుగువస్త్రాలు, బంగారు తోరణాలు అలంకరించబడ్డాయి. సుగంధధూపాలు విలసిల్లుతున్నాయి. రత్నాలముగ్గులతో వెలుగొందుతున్నది. ప్రతిముంగిట్లో పండ్లు, పూలు, పేలాలు, అక్షతలు, దీపమాలలతో కూడిన స్తంభాలు, పోకచెట్టు బోదెలు, ప్రకాశిస్తున్నాయి. బాటల్లో కస్తూరి, పచ్చకర్పూరం, చందనం, అగరు కలిపి చల్లిన కళ్ళాపితో అలరారుతున్నది. చిగురాకు గుత్తులు తోరణాలుగా వెలిశాయి. అటువంటి వైభవంతో శోభించే పురంలో ప్రవేశించిన పృథు చక్రవర్తికి, రత్నకుండలమణికాంతులు చెక్కిళ్ళపై తాండవిస్తుంటే, పట్టణంలోని ముత్తయిదువులు బంగారుపాత్రలలో తీర్చబడిన మంగళ హారతులను ఇచ్చారు. శంఖము, దుందుభి మొదలైన వాద్యధ్వనులు, ఋత్విక్కుల ఆశీర్వచనపు ధ్వనులు, వందిమాగధుల కైవారాలు, వెంటరాగా గర్వరహితుడై అంతఃపురంలోనికి ప్రవేశించాడు.

సీ. సమధికమతిఁ బౌరజన జానపదులచేఁ దనరారు వివిధ పూజనము లొంది
రాజు సంతుష్టాంతరంగుండుఁ బ్రియవర ప్రదుఁడునై వారల బహువిధములఁ
బూజించె, నవ్విధంబున మహత్తరములై నట్టి కర్మంబుల

నాచరించు చును నిరవద్య చేష్టుండై మహత్తముఁ డన నొప్పు నా పృథు మనుజ విభుఁడు

తే. మించి భూమండలంబుఁ బాలించి విశద, యశము సర్వధరాచక్రమందు నిలిపి
చారు శుభమూర్తి రాజన్యచక్రవర్తి, పరమమోదమునఁ బరమపదము నొందె.

559

తా ॥ నిండైన మనస్సుతో పౌరజనులు, జానపదులు చేసిన పూజలు పొంది రాజు సంతోషించాడు. వాళ్ళు కోరుకున్న వరాలనిచ్చి అనేక విధాలుగా ప్రజలను అర్చించాడు. ఈ విధంగా మహత్తరమైన సత్కర్మలను ఆచరించాడు. ప్రశస్తమైన ప్రవర్తనతో గొప్పవారిలో గొప్పవాడై ఆ పృథు చక్రవర్తి ప్రకాశించాడు. ఆ విధంగా భూమండలాన్ని పరిపాలించి, స్వచ్ఛమైన తన కీర్తిని భూమండలమంతా పాదుకొల్పి, పుణ్యమూర్తియైన ఆ పృథు చక్రవర్తి పరమానందంతో పరమ పదాన్ని చేరుకున్నాడు.”

క. అని మైత్రేయ మహాముని, యనఘుఁడు విదురునకుఁ జెప్పె నని శుకుఁ డభి మ
న్యుని సుతునకుఁ జెప్పిన తెఱఁ, గని సూతుఁడు సెప్పె శౌనకాదుల తోడన్.

560

తా ॥ అని మైత్రేయ మహాముని పుణ్యాత్ముడైన విదురునికి చెప్పాడని, శుకుడు పరీక్షిత్తుకు చెప్పిన వృత్తాంతాన్ని శౌనకాది మునులకు సూతమహాముని చెప్పాడు.

## 22. పృథు చక్రవర్తి సభాసదులకు సద్ధర్మములను ఉపదేశించుట

వ. అట్లెఱింగించి వెండియు నిట్లనియె, ని వ్విధంబున నశేష గుణ విజృంభితంబును, నిర్దోషంబును, సత్పురుష సత్కృతంబును నగు పృథుచక్రవర్తి యశంబును బ్రకటంబుగాఁ జేయంజాలు మైత్రేయునిం జూచి మహాభాగవంతుడైన విదురుం డిట్లనియె.

561

తా ॥ ఆ విధంగా చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు: "సమస్త గుణాలతో వ్యాపించినదీ, నిర్దోషము, సజ్జనుల మన్ననలను పొందినదీ అయిన పృథు చక్రవర్తి కీర్తిని తేటతెల్లం చేయగలిగిన మైత్రేయుణ్ణి చూసి మహాభాగవతుడైన విదురుడు ఇలా అన్నాడు:

సీ. మునినాథ! విను పృథు జనపాల చంద్రుండు సొబగొప్ప మేదినీసురులచేత
రాజ్యాభిషేక సంపూజ్యుఁడై దేవతా గణముచే లబ్ధార్హ గుణుఁడు నగుచు
వైష్ణవతేజంబు వలనొప్ప ధరియించి యర్థి నే యే కర్మ మాచరించె
నది నాకు నెఱిఁగింపు మనఘాత్మ! భూమి యే రూఢి గవాకృతి రూఢ యెవని

తే. విక్రమోద్దీప్తమై యొప్పి వెలయునట్టి, కర్మమున నిప్డు రాజన్య గణము బ్రదుకు
నట్టి పృథుకీ ర్తి ధరలోన నతి వివేకి, దవిలి యెవ్వఁడు వినకుండు ధన్యచరిత!

562

తా ॥ "ఓ మునినాథా! విను. రాజచంద్రుడైన పృథు చక్రవర్తి, భూసురుల చేత రాజ్యాభిషిక్తుడై, దేవతల చేత యోగ్యమైన సద్గుణాలను పొంది, వైష్ణవతేజాన్ని ధరించి, ఏయే పనులు చేశాడు? ఓ పుణ్యాత్మా! అవన్నీ నాకు తెలియజెప్పు. గోరూపధారిణియైన భూమాత, ఆతని పరాక్రమం చేతనే ప్రకాశిస్తోంది. ఆ పృథు చక్రవర్తి చేతల వలననే ఇప్పుడు రాజులు బ్రతుకుతున్నారు. అటువంటి గొప్పకీర్తిగల పృథు చక్రవర్తి చరిత్రను వివేకి అయినవాడు వినకుండా ఉండలేడు కదా!"

క. నావుడు విని మైత్రేయుం, డా విదురునిఁ జూచి పలికె నతి వినయమునం బావన
చరితుఁడు పృథుఁడు ధ, రావర నుతుఁ డలఘు యశుఁడు ప్రమదం బలరన్.

563

తా ॥ అలా పలుకగా విన్న మైత్రేయుడు, విదురుణ్ణి చూసి ఇలా అన్నాడు: “పావనచరితుడూ, ప్రభువుల ప్రశంసలు పొందినవాడూ, సాటిలేని కీర్తిని గడించినవాడూ అయిన పృథు చక్రవర్తి సంతోషంతో...

సీ. రంగ దుత్తుంగతరంగ గంగా యమునా మధ్యమందు నున్నతి వసించి
క్రైకొని ప్రారబ్ధ కర్మ క్షయార్థమై యఖిల పుణ్యంబుల ననుభవించు
చును సర్వదేశంబులను దనయాజ్ఞ యప్రతిహత సత్ప్రతాపమునఁ జెల్లఁ
బూని సప్తద్వీపములకుఁ దానొక్కండ వైష్ణవ భూసురావళికిఁ దక్కఁ

తే. దక్కుఁ గల్గిన ప్రజకెల్ల దండధరునిఁ, బోలి వర్తించుచును గొంతకాల మరుగఁ
దవిలి యొకనాఁడు దీర్ఘ సత్త్రంబు సేయ, నర్థిఁ గైకొని దీక్షితుం డయ్యె, నందు.

564

తా ॥ ఉత్తుంగ తరంగాలు పొరలే గంగాయమునల నడుమనున్న మధ్యప్రదేశంలో మహోన్నతంగా విరాజిల్లాడు. ప్రారబ్ధకర్మ క్షయమై పోయేటట్లు, అఖిలపుణ్యాలను అనుభవిస్తూ, అప్రతిహతమైన ప్రభావంతో, సమస్త దేశాలలో తన ఆజ్ఞను చెల్లించుకుంటూ, సత్ప్రవర్తన కలిగి సజ్జనులు, భక్తులకు తప్ప మిగిలిన వారికి యమునిలా, సప్తద్వీపపర్యంతమైన భూమండలానికి తానొక్కడే రాజై వర్తించాడు. కొంతకాలానికి దీర్ఘసత్త్రయాగం చేయాలన్న సంకల్పం కలిగింది. ఒకరోజు యాగదీక్ష వహించాడు.

భూసురులకు, వైష్ణవులకు తప్ప మిగిలినవారికి దండధరునిలా కనిపించటమేమిటి? అంటే విష్ణుభక్తులు, భూసురులు సాధారణంగా తప్పుచేయని సత్యకాలమది. మిగిలిన ప్రజలకు

రాజు యమునిలా కనిపించటమంటే ధర్మపరిరక్షణలో, నియమపాలనలో, కర్తవ్య దీక్షలో అంత కఠినుడని చెప్పటం. భయంతో జనాన్ని ధర్మపరాయణుల్ని చేస్తాడని చెప్పటమే ఇక్కడి ఉద్దిష్టార్థం.

తే. రాజఋషి దేవఋషి పితృ బ్రహ్మ ఋషులు, జనవరునిచేత విహిత పూజనము లొంది
సమధికైశ్వర్యగతి నున్న సమయమునను, జిరశుభాకారుఁ డారాజశేఖరుండు.

565

తా ॥ పృథు చక్రవర్తి చేసే ఆ దీర్ఘసత్రయాగంలో రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు, పితృదేవతలు రాజుచేత శాస్త్రోక్త విధానంలో పూజలు పొందారు. శాశ్వత శుభాలకు ఆకారమైన ఆ రాజశేఖరుడు ఆ సమయంలో మహావైభవంతో ప్రకాశించాడు.

సీ. ఉన్నతోన్నతుఁడు సముత్తుంగ భుజుఁడు సన్మహనీయతర శోభమాన ముఖుఁడుఁ
జారుసంపుల్ల కంజారుణేక్షణుఁడు సునాసాపుటుండు మందస్మితుండు
వక్రసూక్ష్మ స్నిగ్ధ వరనీలకేశుండుఁగమనీయరుచి కంబుకంధరుండు
సుభగ విశాలవక్షుండును ద్రివళిశోభిత మధ్యభాగుండుఁ బృథునితంబ

తే. మండలుండు నావర్త సమాననాభి, వివరుఁడును గాంచనస్తంభ విలసదూరు
రాజితుండును నరుణచరణుఁడును ధృత, నవ దుకూలోత్తరీయుఁ డున్నతయశుండు.

566

తా ॥ పృథు చక్రవర్తి మిక్కిలి పొడగరి. ఎగుభుజాలవాడు. మహత్తరమైన శోభతో ప్రకాశించే ముఖం కలవాడు. విచ్చిన పద్మదళాలవంటి కళ్ళలో ఎర్రజీరలు కలవాడు, చక్కని ముక్కుపుటాలతో, మందస్మితుడైనవాడు, వంపులు తీరిన పలుచని నిగనిగలాడే నల్లని కేశాలు కలవాడు, శంఖంలాగ అందమైన మెడ కలవాడు, విశాలమైన వక్షస్థలము కలవాడు, పొట్టపై మూడుముడతలతో ప్రకాశించే సన్నని నడుము కలవాడు, స్థూలమైన గుండ్రని పిరుదులు

కలవాడు, సుడితిరిగిన బొడ్డు కలవాడు, క్రొత్త పట్టువస్త్రాన్ని ఉత్తరీయంగా ధరించినవాడు, గొప్ప యశస్సు కలవాడు.

వ. మఱియు నియమ నిమిత్తంబునం బరిత్యక్త భూషణుం డగుటం జేసి వ్యక్తాశేష గాత్రశ్రీకుండును, గృష్ణాజినధరుండును, శ్రీమంతుండును, గుశహస్తుండును, గృతోచితుండును, శిశిరస్నిగ్ధ తారాక్షుండును నైన పృథుచక్రవర్తి సభామధ్యంబునం దారాగణ మధ్య విభాసితుండును, సకల జనాహ్లాదకరుండును నగు సుధాకరుండునుంబోలె వెలుంగుచు లేచి నిలుచుండి సదస్య సంతోషదాయకంబులును, జిత్రపదవిరాజితంబులును, బ్రసన్నంబులును, పరిశుద్ధంబులును, గంభీరార్థంబులును, నవ్యాకులంబులును నైన భాషణంబుల నిట్లనియె.

567

తా ॥ పృథు చక్రవర్తి యాగ దీక్షను వహించటంచేత, భూషణాలను వదిలేసి, శరీరసౌందర్యం కనిపించేలాగ కృష్ణాజినాన్ని ధరించినప్పటికీ శ్రీమంతుడై వెలుగుచుండెను. దర్భలు చేత పట్టుకుని చల్లని చూపులతో తారల మధ్య విలసిల్లే చంద్రునిలా సభామధ్యంలో సకలజనాహ్లాదకరుడై లేచి నిలబడ్డాడు. సదస్సులోని జనానికి సంతోషాన్ని కలిగించేవీ, చమత్కారభరితమైన చిత్రపదాలతో ప్రసన్నము, పరిశుద్ధములైనవీ, గంభీరార్థాన్ని పొదవుకొన్నవీ, తడబాటులేనివీ అయిన పదాలతో ఇలా భాషించాడు:

క. వినుఁడీ సభ్యులు ధర్మము, ననయము నెఱుఁగంగఁ గోరునట్టి జనుఁడు దాఁ
దన తలఁపునఁగల యర్థముఁ, జను నెఱిఁగింపంగ ధీరసత్పురుషులకున్.

568

తా ॥ "సభ్యులారా! వినండి. ధర్మాన్ని తెలియగోరే వాడు, తన మదిలోని భావాన్ని ధీరులైన సత్పురుషులకు తెలియజేయటం తగిన పని.

సీ. ఏను నీ లోకవితానంబు నెల్లను శాసించి భూప్రజా సంతతులను
దత్త ద్విహిత వృత్తి దానంబులను జేసి రక్షింప వివిధ మర్యాదఁ దప్పి
పోకుండ నిలుపుటకై కమలజుచే నియోగింపఁ బడితి, ని ట్లొనరియుండ
నట్టి ప్రజాపాలనా ద్యనుష్ఠాన వశంబునఁ బ్రాక్కర్మ సాక్షి యీశుఁ

తే. డెట్టివానికి సంతుష్టి నెసఁగుచుండు, నట్టివానికి నే లోకమంద్రు బుధులు
కామదుఘములు నైన లోకములు నాకు, సరవిఁ గలుగు ననుష్ఠానపరుఁడ నగుట.

569

తా ॥ నేను ఈ లోకాలనన్నిటినీ శాసించి, భూమండలంలోని ప్రజలకు తగిన వృత్తుల్ని కల్పించి రక్షిస్తున్నాను. ప్రజలు హద్దుదాటి పోకుండా, ధర్మాన్ని కాపాడటం కోసం బ్రహ్మదేవుని చేత నేను నియమించబడ్డాను. ఈ విధిని పరమావధిగా చేసుకొని ప్రజల్ని పాలించటమే నా కర్మానుష్ఠానం. ధర్మబద్ధంగా పరిపాలించువానికి కర్మసాక్షి అయిన భగవంతుడు సంతోషము కలుగచేస్తాడు. అట్టివానికి ఏ లోకాన్ని అనుగ్రహిస్తాదని ఋషులు చెబుతారో అటువంటి లోకాలను, అనుష్ఠానపరుడైన నాకు లభిస్తాయి గాక!

వ. ఇట్లు ప్రజలను ధర్మంబులయందు ననుశాసింపక యర్థ కాముండై వారివలన నప్పనంబులు గొనెనేని వారల పాపంబు దనకుఁ బ్రాపింపం దేజోహీనుండై భూవిభుండు సెడుం, గావునం బ్రజలు భూపతిహితార్థంబునకు స్వార్థంబునకు నసూయా రహితులై వాసుదేవార్పణ బుద్ధిం జేసి ధర్మంబు నెప్పుడు నాచరింపవలయు, నిదియ నన్ను ననుగ్రహించుట, యదియునుం గాక పితృదేవర్షి తుల్యులగు మీర లనుమోదించి కర్తయు ననుశాసకుండు ననుజ్ఞాతయు నయిన నాకుఁ బరలోకంబున నే ఫలంబు గలుగు నట్టి ఫలంబునకు సదృశంబైన కర్మం బాచరింపవలయు, నట్లయిన సంతోషంబు నొందుదు ననిన వార లా రాజేంద్రున కిట్లనిరి.

570

తా ॥ ప్రజలను ధర్మమార్గాన పరిపాలించక, కేవలం ప్రయోజనాపేక్షతో పన్నుల్ని వసూలు చేసినట్లయితే, ఆ ప్రజల పాపం రాజుకు సంప్రాప్తించి, తేజోవిహీనుడై రాజు భ్రష్టుడవుతాడు. కాబట్టి ప్రజలు, రాజు హితాన్ని కోరి, తమ ప్రయోజనం కోసం అసూయారహితులై వాసుదేవునికి సర్వం సమర్పిస్తున్నామన్న బుద్ధితో ధర్మాన్ని సదా ఆచరించాలి. ఇలా ధర్మాన్ని ఆచరించటమే మీరు నన్ను అనుగ్రహించటంగా భావిస్తాను. అంతేకాకుండా, పితృసమానులు, దేవర్షితుల్యులూనైన మీరు ఆమోదించి, కర్తను, శాసించువాడను, పాలించువాడను ఐన నాకు పరలోకంలో ఏ ఫలాలు కలుగుతాయో, ఆ ఫలాలకు తగిన సత్కర్మను ఆచరించండి. అలా మీరు చేసినట్లయితే నేను సంతోషిస్తాను" అని రాజు పలుకగా సంతోషంతో ఆ సభ్యులు రాజేంద్రుడైన పృథు చక్రవర్తితో ఇలా అన్నారు:

క. జననాయక! ప్రజ లిర వొం, దిన ధర్మము లెల్ల వాసుదేవార్పణ బు
ద్ధిని జేయవలయు నంటివె, యనయంబును వాసుదేవుఁడనఁ గలఁడె మహిన్?

571

తా ॥ "ఓ మహారాజా! ప్రజలు ఆచరించవలసిన ధర్మాలనన్నింటినీ వాసుదేవార్పణ బుద్ధితో చెయ్యాలని చెప్పావు. అసలు ఈ భూమిమీద వాసుదేవుడనే వాడున్నాడా?"

సీ. అన విని వారికి మనుజేశుఁ డను నర్హ, తములార! వినుఁడయ్య తవిలి మీరు
యజ్ఞాధిపతియైన యఖిలేశ్వరుఁడు గొన్ని, మతములఁ గలఁడు ధీమంతులార!
యట్లైన మీరలు నందుకు విప్రతి, పత్తి గల్గుట నుపపన్న మరయఁ
గా దంటిరేని యా ఘనునిచే రచితమై, కాంతిమంత మగు జగంబు గానఁ

తే. బడుచు నున్నది! యిట్టి ప్రపంచ రచిత, కర్మ వైచిత్ర్య మ మ్మేటి గలుగకున్న
నమర నది తదుక్తు లుపపన్నములు గావు!, కాన న వ్వాసుదేవుండు గలఁడు మఱియు.

572

తా ॥ ఆ ప్రశ్నకు పృథు చక్రవర్తి ఇలా సమాధానం చెప్పాడు: "పరమయోగ్యులైన సభాసదులారా! యజ్ఞాధిపతియైన సర్వేశ్వరుడు కలడు. అందుకు అంగీకరించకపోతే, ఆ మహాత్మునిచే సృష్టించబడిన లోకం మన కళ్ళముందే కాంతిమంతంగా కనిపిస్తోంది కదా! ఆ వాసుదేవుడే లేకుంటే, ఈ ప్రపంచం చేత సృష్టించబడిన కర్మవైచిత్రి ఎలా సాధ్యమవుతుంది? కాబట్టి వాసుదేవుడైన ఆ పరమాత్మ ఉన్నాడు.

వ. అదియునుం గాక జగద్వైచిత్ర్యంబు కర్తయైన యీశ్వరుండు లేకున్నం గర్మవశంబునం జేసి యుపపన్నంబగు నంటి రేని.

573

తా ॥ ఈ సృష్టివైచిత్రికి కర్తయైన ఈశ్వరుడు లేడని అనుకొన్నప్పటికీ, కర్మాధీనతతో ఈ జగత్తు ప్రభవిస్తోందని మీరు భావిస్తే—

సీ. పూని ప్రియవ్రతోత్తానపాద ధ్రువ మనుల కస్మత్పితామహుఁ డనంగఁ
దగు నంగ మేదినీధవునకు మఱియును వినుతి కెక్కిన పృథివీపతులకుఁ
బద్మసంభవ భవ ప్రహ్లాద బలిచక్రవర్తి ప్రముఖ భాగవతుల కర్థి
వర్గసుస్వర్గాపవర్గంబులకు ననుగతకారణుం డన ఘనత కెక్కి

తే. హీను లగు మృత్యుదౌహిత్రుఁడైన వేన, ముఖ దురాత్ములు ధర్మవిమోహితులును
దక్కఁ దక్కిన వారికిఁ దాఁ బ్రసన్న, వరదుఁడై యిచ్చు నభిమతావళుల నతఁడు.

574

తా ॥ ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, ధ్రువుడు, మనువు, మా తాతగారైన అంగభూపతీ మొదలైన వాళ్ళకు, ఇంకా ప్రసిద్ధి చెందిన రాజులకు, బ్రహ్మ, శివుడు, ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి మొదలైన భాగవతులకు, ప్రసన్నుడై వారు కోరిన వరములను అనుగ్రహించాడు. స్వర్గం, మోక్షములను అనుగ్రహించేవాడుగా ప్రసిద్ధికెక్కాడు. మృత్యుదేవతకు మనుమడైన వేనుని వంటి

దుర్మార్గులూ, ధర్మహీనులైన వారి సంగతి మినహాయించి, తక్కిన వారికి కోరిన కోర్కెలిచ్చే ప్రసన్నవరదుడు ఆ పరమాత్మ.

వ. ఇట్టి విద్వ దనుభవంబున భువనహితుండగు వాసుదేవుండు లేఁ డనుట యుపపన్నంబుగా, దదియునుంగాక.

575

తా ॥ ఇటువంటి విద్వాంసులకు కలిగిన అనుభవాన్ని బట్టి, లోకాలకు హితాన్ని కూర్చే పరమాత్మే లేడనటం సరికాదు.

ఉ. భూరి తపోభిరామ ముని పూజన మెవ్వని పాదపద్మ సే
వారతి వృద్ధిఁ బొంది యనివారణఁ బూర్వభవానుసార సం
సార మహోగ్రతాపము భృశంబుగఁ బాపఁగ నోపుఁ
దత్పదాం భోరుహజాత దేవనదిఁ బోలి యశేష మనోఘ హారియై.

576

తా ॥ ఎవరి పాదపద్మాలను సేవించడం వల్ల గొప్ప తపస్సంపన్నులైన మునుల పూజలు వృద్ధి చెంది, పూర్వ జన్మలను అనుసరించి మానవకోటికి సంప్రాప్తించే అనివార్యమైన సంసారమనే మహోగ్రతాపాన్ని పోగొట్టుతున్నాయో, అలాగే ఆ పాదపద్మాలనుండి పుట్టిన గంగానదిలా మదిలోని పాపాల్ని కూడ పోగొడుతున్నాయి.

వ. మఱియు.

577

తా ॥ ఇంకా,

చ. అనుపమ భక్తి నెవ్వని పదాంబుజమూలము మందిరంబుగా

ననయముఁ బొందు వాఁడు నిహతాఖిల భూరి మనోమలుండు స
ద్వినుత విరక్తి బోధ ధృతి వీర్య విశేష సమన్వితుండు దా
ననఁ దగి భూరి సంసృతి మహత్తర దుఃఖము నందఁ డెన్నఁడున్.

578

తా ॥ ఎవరయితే సాటిలేని భక్తితో, శ్రీమన్నారాయణుని పాదపద్మాల్ని మందిరంగా చేసుకొని ఆరాధిస్తారో, వారి మనోమాలిన్యాలు తొలగిపోయి, సజ్జనులచే కీర్తించదగిన వైరాగ్యం, జ్ఞానం, ధైర్యం, శక్తిసామర్థ్యాలు కలవారయి సంసార దుఃఖాన్ని ఎప్పుడూ పొందరు.

క. నారాయణుండు జగదా, ధారుండగు నీశ్వరుండు, దలఁప నతనికిన్
లే రెందు సములు నధికులు, ధీరోత్తముఁ డతఁడు నద్వితీయుం డగుటన్.

579

తా ॥ ఈ జగత్తుకు ఆధారమైన ఈశ్వరుడు, నారాయణుడే. ఆలోచిస్తే ఆ దైవంతో సమానమైనవాళ్ళు గానీ, అధికులైనవాళ్ళు గానీ ఎక్కడా లేరు. ఆ శ్రీమన్నారాయణుడే ధీరులలోకెల్ల ఉత్తముడు. తనకన్నా అన్యమైనదేదీ లేని అద్వితీయుడు.

వ. అదియునుంగాక.

580

తా ॥ అంతేకాకుండా,

ఉ. కర్మవశంబునన్ జగము గల్గను హెచ్చు నడంగు నన్నచోఁ
గర్మము బుద్ధిఁ జూడ జడకార్యము! గాని ప్రపంచ కల్పనా
కర్మమునందుఁ గర్త యనఁగా విలసిల్లఁగఁ జాల, దీ జగ
త్కర్మక కార్య కారణము గావున నీశుఁడు విష్ణుఁ డారయన్.

581

తా ॥ కర్మవశం చేతనే ఈ జగత్తు పుట్టి, వృద్ధి చెంది, నశిస్తుందని భావిస్తే, కర్మ జడపదార్థం. సృష్టి నిర్మాణ కార్యంలో కర్తృత్వాన్ని అది వహించలేదు. జగత్కర్మకు కార్యకారణాలూ రెండూ ఈశ్వరుడైన విష్ణువే.

వ. కావున మీర ల వ్యాసుదేవుని నధికారానుసారంబున నిశ్చితార్థ ఫలసిద్ధి గలవారలై మనో వాక్కాయ కర్మంబుల నిష్కపట వృత్తిం దగిలి వినుతి నతిపరిచర్యా పూర్వకంబుగాఁ గామ దుఘంబు లయిన యతని పాదపంకజంబులు భజియింపుం; డదియునుంగాక.

582

తా ॥ కాబట్టి మీరు, ఆ వాసుదేవుణ్ణి మీ శక్తికి తగినట్లు కావలసిన ఫలసిద్ధిని నిశ్చయించుకొని సేవించండి. మనోవాక్కాయ కర్మలలో నిష్కపటమైన ప్రవర్తనను కలిగి, స్తుతించటం, నమస్కరించటం, పరిచర్య చేయటం వంటి సేవల ద్వారా, కోర్కెలనిచ్చే ఆతని పాదపద్మాల్ని సేవించండి. అంతేకాకుండా,

సీ. రూఢి నీశ్వరుఁడు స్వరూపంబునం జేసి పూని విశుద్ధ విజ్ఞానఘనుఁడు
నగుణుండు నయినఁ దా నరయని కర్మ మార్గమునందు ధ్రీహ్యాది ద్రవ్యములను
శుక్లాదిగుణము విస్ఫుర దవఘాతాది సత్క్రియలును మంత్రసంచయంబు
సంకల్పమును యాగసాధ్యమైనట్టి యఖండోపకారంబు ఘనపదార్థ

తే. శక్తియు మఱి జ్యోతిష్టోమ సవనముఖ్య, నామత బహు విశేష గుణతను మెఱయు
నట్టి యధ్వరరూపమై యఖీల జగము, నందు ననిశంబుఁ బ్రఖ్యాతి నొందుచుండు.

583

తా ॥ స్వరూపాన్ని బట్టి ఈశ్వరుడు స్వచ్ఛమైన విజ్ఞాన స్వరూపుడు. నిర్గుణుడు

అయినప్పటికీ తాను కర్మమార్గంలో, ధాన్యాదులలోని తెలుపు మొదలైన గుణాలు దంచటం వలన బయటపడినట్లు, మంత్రాల కూర్పులోని సంకల్పశక్తి, యజ్ఞం చేత సాధించదగింది. అటువంటి నిరంతర సాధన గొప్ప పదార్థశక్తి, జ్యోతిష్టోమము మొదలైన పేర్లతో పిలువబడుతూ, విశేషమైన గుణాలతో ప్రకాశించే యజ్ఞం దైవ స్వరూపంగా జగమంతా ప్రఖ్యాతిగాంచింది.

వ. అదియునుం గాక దారుస్థితంబైన యనలంబు తద్దారు గుణంబు లయిన దైర్ఘ్య వక్రత్వాదికంబుల ననుసరించు చందంబున నవ్యక్తంబు తత్క్షోభకం బయిన కాలంబును వాసనయు నదృష్టంబు నను కారణంబులచేతం బుట్టిన శరీరంబునందు విషయాకారం బయిన బుద్ధి నొంది తద్విషయాభివ్యంగ్యంబైన యానందస్వరూపుం డగుచుఁ గ్రియాఫలంబునం బ్రసిద్ధి నొందునని చెప్పి వెండియు నిట్లను: మదీయజనంబు లి మ్మేదినీ తలంబున దృఢవ్రతులై యజ్ఞభుగీశ్వరుండును గురుండును నయిన సర్వేశ్వరుని, హరిని నిరంతరంబును స్వధర్మయోగంబునం బూజించుచున్నవారలు, వారు నన్నాశ్చర్యకరంబుగా ననుగ్రహించువారని హరిభక్తిరతులైన య మ్మహాత్ముల నుతియించి వెండియు నిట్లనియె.
584

తా ॥ కొయ్యలోనున్న అగ్ని, ఆ కొయ్యయొక్క గుణాలయిన పొడవు, వంకరలను అనుసరిస్తుంది. అలాగే దేహం పుట్టుకకు కారణమైన అవ్యక్తము, కాలము, సంస్కారము, అదృష్టము అనే గుణాలు దేహానికే కాకుండా జీవికీ సంక్రమిస్తాయి. అందుచేత అంతర్యామి దేహధర్మాలను అనుసరించే వ్యక్తమవుతాడు. దేహంలో ఉన్న అంతర్యామి ఆనందమయుడు, యజ్ఞేశ్వరుడు, యోగఫలం" అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు:

"ఈ భూమిపైనున్న నా ప్రజలు, దృఢవ్రతులై యజ్ఞభుక్కు అయిన ఈశ్వరుడు, సర్వేశ్వరుడైన, శ్రీహరిని స్వధర్మానుసారం నిరంతరం పూజిస్తున్నారు. వారు నన్ను మిక్కిలి అనుగ్రహించువార" ని హరి భక్తులైన ఆ మహాత్ములను నుతించి మళ్ళీ పృథువు ఇలా అన్నాడు:

మ. వరసంపద్విభవ ప్రతాప సుమహైశ్వర్యంబులం బొల్చు నీ
ధరణీనాథులతేజ మంచిత తపోదాంతి క్షమావిద్యలం
గర మొప్పారు ధరాసుపర్వహరిభక్త శ్రేణులం దెప్పుడున్,
ధరలోనం బ్రభవింప కుండునని యద్ధాత్రీవిభుం డిట్లనున్.

585

తా ॥ "గొప్ప సంపదతో, వైభవంతో, ప్రతాపంతో, మహదైశ్వర్యంతో ప్రకాశించే రాజుల తేజస్సు, భూమిమీద తపస్సు, ఇంద్రియనిగ్రహం, క్షమాగుణం వంటి సద్గుణాలతో శోభించే బ్రాహ్మణులపైనా, హరిభక్తులపైనా తన ప్రభావాన్ని చూపదు.

చ. అరయఁగ నే ధరామర పదాంబుజరేణువు లర్థిఁ దాల్చి య
ప్పరమ పురాణ పూరుషుఁడు బ్రాహ్మణదేవుఁడు నైనయట్టి యీ
శ్వరుఁడు సదానపాయినిని సాగరకన్యను సర్వలోక వి
స్ఫురిత పవిత్రకీర్తియును బొంది విభూతిఁ దనర్చెఁ గావునన్.

586

తా ॥ పురాణపురుషుడైన శ్రీమన్నారాయణుడు బ్రాహ్మణుల పాదపద్మాలకు అంటిన ధూళికణాన్ని ధరించి, బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులనే దైవంగా భావిస్తాడు. అటువంటి శ్రీహరి సదా అనుసరించి ఉండే లక్ష్మిని పరిగ్రహించి సర్వలోకాలలో ప్రకాశించే పవిత్రకీర్తిని పొంది వైభవంతో వెలుగొందుతున్నాడు.

సీ. ఏ వసుధామర సేవను జేసి యశేషగుణాన్విత స్థితిఁ దనర్చు
సర్వేశ్వరుఁడు మఱి సంతుష్టుఁడగు నట్టి ధరణిదివిజులఁ దద్ధర్మపరులు
నలఘు వినీతులునై యవశ్యంబును సేవింపరే? ధరాదేవ నిత్య సేవచేఁ
బురుషుఁడు చిరతర జ్ఞానవిద్యాభ్యాసి గాకున్న నైన నతఁడు

తే. వేగమున నంతరంగంబు విశద మగుటఁ, జేసి కైవల్య పదమును జెందు, నట్లు
గాన లోకులు భూదేవతానికరముఁ, దగిలి భజియింప వలయు నుదాత్త మతిని.

587

తా ॥ ఏ బ్రాహ్మణుల సేవతో సమస్త సద్గుణాలు అలవడుతాయో, సర్వేశ్వరుడు సంతుష్టి పొందుతాడో, అటువంటి భూసురులను, ధర్మపరులై, వినయంతో సేవించండి. భూసురులను నిత్యం సేవించటంవలన గొప్పజ్ఞానీ, పండితుడూ కాకపోయినప్పటికీ హృదయం నిర్మలమై తేటపడుతుంది. అందువల్ల కైవల్యపదాన్నీ పొందుతాడు. అందుచేత బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులను గొప్ప మనస్సుతో ప్రజలు పూజించాలి.

వ. మఱియు.

588

తా ॥ ఇంకా,

సీ. విజ్ఞానఘనుఁడన వెలయు నీశ్వరుఁడు తత్త్వజ్ఞాన యుతులైన వారిచేత
దీపింప నింద్రాది దేవతోద్దేశంబు నను భూమిసుర ముఖంబున హుతంబు
లగు హవిస్సులఁ దృప్తి నందిన గతి నచేతనమైన యా హుతాశన ముఖంబు
వలన వేల్చిన హవిస్సుల చేతఁ దృప్తుండు గాకుండు గావున లోకమందు

తే. నగ్ని ముఖమునకంటె ధరామరేంద్ర, ముఖము పరిశుద్ధ మత్యంతముఖ్య మనఁగఁ
దనరునది గాన భూసురార్చనము సకల, జనులుఁ గావింపఁ దగు నార్యజనములార!

589

తా ॥ ఆర్యులారా! తత్త్వజ్ఞాన సంపన్నులైనవారు, ఇంద్రాదిదేవతలను ఉద్దేశించి, భూసురప్రవరముఖంగా అర్పించే హవిస్సుల వలన తృప్తి చెందినట్లుగా, అచేతనమైన అగ్నిలో

వ్రేల్చిన హవిస్సుల వలన, విజ్ఞాన ఘనుడై ప్రకాశించే ఈశ్వరుడు తృప్తి చెందదు. కాబట్టి, అగ్నిముఖం కంటే బ్రాహ్మణ ముఖం అత్యంత పరిశుద్ధమైనదిగా, ముఖ్యమైనదిగా అలరారుతున్నది. అందుచేత సకలజనులూ భూసురులను అర్చించాలి.

వ. అదియునుం గాక.

590

తా ॥ అంతేకాకుండా,

సీ. ఏ వేదమందేని నీ విశ్వ మెల్లను దర్పణ ప్రతిబింబిత ప్రభూష
నివహంబు కైవడిఁ దివిరి ప్రకాశించు నట్టి విరజమును నవ్యయంబు
నగుచు సనాతనం బగు వేద మే ధరా దేవతాజన మనుదినముఁ దగిలి
మహిత శ్రద్ధాతపో మంగళ మౌన సంయమ సమాధులఁ బొలుపారుచుండి
తే. యర్థి సదసద్విచారులై యధికరింతు, రట్టివారల పదరజం బర్థిఁ దాల్చు
నలఘులకు సర్వపాపక్షయంబు నఖిల, సద్గుణావాప్తియును నగుఁ జతురు లార!

591

తా ॥ ఈ విశ్వమంతా దర్పణంలో ప్రతిబింబించే భూషణ సముదాయంలాగా వేదంలో ప్రతిబింబిస్తోంది. సనాతనము, నాశనం లేనిది అయిన వేదాన్ని, ఏ విప్రులు ప్రతీరోజూ తపోమానములతో, సంయమ సమాధులతో సదసత్ విచారులై అధ్యయనం చేస్తారో, అటువంటి విప్రుల పాదధూళిని ధరించే గొప్పవారికి, సర్వపాపక్షయం జరిగి సకల సద్గుణాలు లభిస్తాయి.

వ. కావున నట్టి విప్రపాద సరోజరేణువు లేనును గిరీటంబున ధరియింతు, నిట్లు బ్రాహ్మణ భజనంబునం జేసి యవాప్తసకలగుణుండును శీలధనుండును గృతజ్ఞుండును శ్రద్ధాయుక్తుండును నైన మహాత్ము నఖిల సంపదలుఁ బ్రాపించుం గావున గోబ్రాహ్మణ

కులంబును ననుచర సమేతుం డయిన జనార్దనుండును నా యెడం బ్రసన్ను లయ్యెదరు గాక యని పలుకుచున్న పృథు చక్రవర్తిం గనుంగొని పితృదేవద్విజ సత్పురుషులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల నభినందించి యిట్లనిరి.

592

తా ॥ కాబట్టి అటువంటి విప్రజనుల పాదసరోజాలకు అంటిన ధూళిని నేను కూడా కిరీటంలో ధరిస్తాను. బ్రాహ్మణులను సేవించటం వలన సమస్త సద్గుణాలు లభిస్తాయి. శీలధనుడు, కృతజ్ఞుడు, శ్రద్ధాళుమా అయిన అతణ్ణి సకల సంపదలు వరిస్తాయి. కాబట్టి గోబ్రాహ్మణ పరివారంతో, అనుచరులతో కూడిన జనార్ధనుడు నాపట్ల ప్రసన్నుడగు గాక!"

అని పలికే పృథు చక్రవర్తిని చూసి పితృదేవతలు, దేవతలు, బ్రాహ్మణులు, సత్పురుషులు సంతృప్తి చెందిన వారై "బాగుబాగు" అంటూ సాధువాదాలతో అభినందించి ఇలా అన్నారు:

క. మనుజేంద్ర! నీ కతంబున, ననుపమ ఘన బ్రహ్మదండహతుఁ డత్యఘ వ
ర్తనుఁడు నగునట్టి వేనుం, డనయము నరకంబు వలన నర్థిఁ దరించెన్.

593

తా ॥ "ఓ రాజా! మహాపాప వర్తనుడై, బ్రహ్మదండనచే హతుడైన నీ తండ్రి వేనుడు నిన్ను పుత్రునిగా పొందటం చేత నరకం నుండి ఉద్ధరించబడ్డాడు.

వ. కావునం 'బుత్రేణ లోకాన్ జయతి' యను వేదవచనంబు నిశ్చయం, బదియునుం గాక

594

తా ॥ కాబట్టి "పుత్రుని మూలాన జనకుడు లోకాలను జయిస్తాడ" నే వేదవాక్కు నిజమైంది.

చ. పురుషవరేణ్య! హేమకశిపుండు రమా లలనేశు నిందచే

నరకమునొందఁ గోరియు గుణజ్ఞుఁడు భాగవతుండునైన యా
వర తనయ ప్రభావమున వాసికి నెక్కి విధూత పాపుఁడై
నిరయముఁ బొందఁడయ్యె, నతి నిర్మల కీర్తిఁ దనర్చెఁ గావునన్.

595

తా ॥ ఓ పురుషోత్తమా! శ్రీమన్నారాయణుని నిందించిన హిరణ్యకశిపుడు, నరకాన్ని పొందవలసి ఉంది. అయినప్పటికీ గుణజ్ఞుడు, శ్రేష్ఠుడూనైన పుత్రుని ప్రభావంతో, పాపాలన్నీ తొలగిపోగా నరకాన్ని పొందకుండా అతినిర్మలమైన కీర్తితో ప్రకాశించాడు."

క. అని పలికి వీరవర్యుం, డనఁదగు పృథుచక్రవర్తి నయుతాబ్దంబుల్
దనరఁగ జీవింతువు గా, కని తగ నాశీర్వదించి యభిమత మొప్పన్.

596

తా ॥ అని పలికి, వీరవర్యుడైన ఆ పృథు చక్రవర్తిని "శాశ్వతకాలం జీవింతువుగాక!" అని ఆశీర్వదించారు.

వ. వెండియు నిట్లనిరి, దేవా! నీకు సకల లోక భర్తయగు నారాయణునందు నిట్టి భక్తి వొడముటం జేసియు బ్రహ్మణ్య దేవుండు నుత్తమ శ్లోకుండునైన సర్వేశ్వరుని సత్కథాజాలంబు వ్యక్తంబు సేయుచున్న నీవు మాకు నాథుండ వగుటం జేసియు నేము ముకుంద దాసులమైతిమి, భవదీయ ప్రజానుశాసనంబు ప్రజానురాగంబు కారుణ్యమూర్తులైన మహాత్ములకు స్వభావంబులు, గావున నాశ్చర్యంబు గాదు, దైవసంజ్ఞితంబులయిన కర్మంబులచేత వినష్టజ్ఞానులమై పరిభ్రమించు మాదగు తమఃపారంబుఁ గంటి, మే సర్వేశ్వరుండు బ్రాహ్మణజాతి నధిష్ఠించి క్షత్త్రియులను, క్షత్త్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణులను నీ యుభయంబు నధిష్ఠించి విశ్వంబును భరియించు, నట్టి వివృద్ధ సత్త్వుండు సర్వరూపుండు మహాపురుషుండునైన పృథునకు నీశ్వర బుద్ధింజేసి

యేము నమస్కరింతు మను సమయంబున.

597

తా ॥ మళ్ళీ ఇలా అన్నారు: "సకలలోకనాథుడైన నారాయణునిపట్ల నీకు ఇటువంటి భక్తి కలగటం చేతనే ఉత్తములచే స్తుతింపబడినవాడివై, సర్వేశ్వరుని పుణ్యకథలను తెలియచేస్తున్నావు. నీవు మాకు రాజువు అయినందుననే మేము మోక్షప్రదాతయైన ముకుందునికి దాసులమైనాము. ప్రజల పట్ల నీ అనుశాసనం, నీవు చూపే అనురాగం కరుణామూర్తులైన మహాత్ములకు స్వభావ సిద్ధమే కాబట్టి ఆశ్చర్యం కాదు. దైవసంజ్ఞితాలైన ప్రారబ్ధ కర్మల చేత జ్ఞానాన్ని కోల్పోయి, చీకటిలో తిరుగాడే మా అజ్ఞానాంధకారాన్ని తొలగించావు.

ఏ సర్వేశ్వరుడు బ్రాహ్మణధర్మాన్ని ఆశ్రయించి క్షత్రియుల్ని, క్షత్రియ ధర్మాన్ని ఆశ్రయించి బ్రాహ్మణుల్ని, వీళ్ళిద్దరినీ ఆశ్రయించి విశ్వాన్నీ భరించే, విశేషంగా వృద్ధి చెందుతున్న సత్త్వగుణ సంపన్నుడూ, సర్వస్వరూపుడూ, మహాపురుషుడూనైన ఆ ఈశ్వరుని అంశ కలిగిన వాడన్న భావనతో పృథు చక్రవర్తికి మేము నమస్కరిస్తున్నాము"

## 23. పృథు చక్రవర్తి వద్దకు సనకాదులు వచ్చుట

క. వినువీథినుండి మెల్లన, చనుదెంచిరి బాలసూర్య సంకాశ తనుల్
జనవినుత! సిద్ధ వర్యులు, సనకాదులు శేముషీ విచక్షణు లంతన్.

598

తా ॥ ఆకాశం నుండి బాలసూర్యునితో సమానమైన తేజస్సుతో కూడిన తనువులతో ప్రకాశిస్తూ, ప్రజ్ఞావిచక్షుణులు, సిద్ధేశ్వరులైన సనకాదులు మెల్లగా అక్కడికి వచ్చారు.

వ. ఇట్లు సనుదెంచి

599

తా ॥ అలా వచ్చి,

క. అనఘాత్ము లతిథి రూపం, బున రా గృహమేధి ప్రాణములు నుద్గతి చేఁ
దనరిన ఁబ్రత్యుద్గతి వం, దనముల మరలం బ్రతిష్ఠితము లగు ననుచున్.

600

తా ॥ పుణ్యాత్ములు అతిథి రూపంలో వచ్చినప్పుడు, గృహస్థుని ప్రాణాలు పైకి తేలిపోతాయి. లేచి ఎదురేగి నమస్కరించినప్పుడు యథాస్థానంలో పునః ప్రతిష్ఠితమవుతాయి."

ఎవరు పెద్దలను, వయోవృద్ధులను గౌరవించరో వారి కర్మశక్తి లోపిస్తుంది. పెద్దవారిని చూచి లేచి నిలువలేకపోతే సోమరితనం! వారికి నమస్కరించకపోతే అహంకారం! సోమరితనం, అహంకారం ఈ రెండూ ఉన్నవాడికి క్రియాసక్తి ఎక్కడనుండి వస్తుంది? అతని ప్రాణశక్తి దానంతట అదే లుప్తమయిపోతుంది.

క. వినఁబడు వచన న్యాయం, బున నుద్గతములగు ప్రాణముల ఁగ్రమ్మఱఁ బొం

దను గోరువాఁడునుం బలె, ననుచర ఋత్విక్సదస్యుఁడై పృథుఁ డంతన్.

601

తా ॥ అంటూ చెప్పుకొనే మాటల్ని బట్టి, పైకి లేచిన ప్రాణాల్ని మళ్ళీ పొందాలని కోరుకున్న వానిలాగా పృథు చక్రవర్తి ఋత్విక్కులతోను, అనుచరులతోను, సదస్యులతోను కలసి సనకాదులకు ఎదురువెళ్ళాడు.

తే. ఇంద్రియేశుఁడు గంధాదికేష్ట గుణము, గూర్చి యుద్గమన క్రియఁ గోరి చేయు
పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ, మహితభక్తిని బ్రత్యుద్గమంబు సేసె.

602

తా ॥ ఇంద్రియాధిపతి అయిన జీవుడు, సుగంధము వంటి గుణాలకు ఇష్టపడి, దేహం నుండి లేచి వెళ్ళినట్లు, పృథు చక్రవర్తి తొట్రుపాటుతో, అత్యంత భక్తితో ఎదురువెళ్ళాడు.

క. ఘనగౌరవమున న మ్మని, జనచిత్త వశీకృతుండు సభ్యుఁడుఁ బ్రియుఁడున్
వినయానతకంధరుఁడై, జనవరుఁ డా పరమయోగిచంద్రుల నెలమిన్.

603

తా ॥ సనకాదిమునుల చిత్తాలను వశం చేసుకున్న పృథువు, అమిత గౌరవంతో, సభ్యతతో, ప్రియంగా, వినయంతో మెడను వంచి నమస్కరించి, పరమ యోగీంద్రులను స్వాగతించాడు.

సీ. పూని యర్ఘ్యాసనాసీనులఁ గావించి కర మర్థి విధివత్ప్రకారమునను
బూజించు తత్పదాంభోరుహక్షాళన సలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి
హాటక కలిత సింహాసనాసీనులై విహితాగ్నులను బోలి వెలుఁగుచున్న
శర్వాగ్రజన్ముల సనకాదులను జూచి యతుల శ్రద్ధాసంయమాన్వితుండుఁ

తే. బరమ సంప్రీత మతియునై పలికె రాజు, గోరి 'యో మంగళాయనులార! పూర్వ
భవమునం దెద్ది మంగళప్రద సుకర్మ, మేను జేసితి? మిముఁ జూడ నిపుడు గలిగె'.

604

తా ॥ పరమహంసలైన ఆ సనకాది మునుల్ని ఉచితాసనంపై కూర్చుండబెట్టి, శాస్త్రవిధి ప్రకారం పూజించాడు. ఆ మునీంద్రుల పాదపద్మాల్ని కడిగిన జలాన్ని శిరస్సున చల్లుకొన్నాడు. బంగారు సింహాసనం మీద కూర్చుని, యజ్ఞంలో తేజరిల్లే అగ్నుల్లా ప్రకాశిస్తున్న (శివునికంటే ముందు జన్మించిన) ఆ సనకాది మునుల్ని చూసి, పృథువు శ్రద్ధాభక్తులతో, పరమ సంతోషంతో నిండిన మనస్సుతో ఇలా అన్నారు: "ఓ మంగళాయనులారా! (శుభ సంచారులారా!) మీరు అడుగు పెట్టిన చోట శుభాలు వర్షిస్తాయి. పూర్వజన్మలో నేను ఏ పుణ్యకార్యం చేశానో, మిమ్మల్ని చూడగలిగాను."

వ. అని వెండియు.

605

తా ॥ అని మళ్ళీ,

క. భువి నెవ్వని యెడ విప్రులు, భవుఁడును విష్ణుఁడు దదీయభక్తులును బ్రస
న్న వదను లగుదురు వానికి, భువి దివిని నసాధ్యకర్మములు లే వరయన్.

606

తా ॥ "భూమి మీద ఎవరి పట్ల విప్రులు, శివుడు, విష్ణువు, విష్ణుభక్తులు ప్రసన్నులవుతారో వారికి భువిలో, దివిలో అసాధ్యమైన కార్యాలుండవు.

వ. అని మఱియు ననఘాత్ములారా! లోకంబుల నీక్షించుచుం బర్యటనంబు సేయు మిమ్ము సర్వదర్శనుం డయిన యాత్మనుం గనుంగొనఁజాలని సర్వదృశ్యంబు చందంబున నీ

లోకంబు గనుంగొన! జాలకుండు నట్టి మహాత్ముల రయిన మీ దర్శనంబునం జేసి యేను ధన్యుండనైతి, నదియునుంగాక.

607

తా ॥ ఓ పుణ్యాత్ములారా! సకల లోకాలను చూస్తూ పర్యటించే మిమ్మల్ని, సమస్తాన్ని దర్శించే ఆత్మను చూడలేని సృష్టిలాగ, ఈ లోకం చూడలేదు. అటువంటి మహాత్ములైన మీ దర్శనం చేత నేను ధన్యుడనయ్యాను.

చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహార్హజనోపయోగ్య వి
స్ఫురిత తృణాంబు భృత్య గృహభూముల సారెఁదనర్చు నట్టి మం
దిరపతి పేద యైన జగతిం గడు ధన్యుఁ డటంద్రు గాన సు
స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్.

608

తా ॥ ఎవని ఇంట్లో తృణము, జలము, సేవకులు, ఇంటి ప్రాంగణము, పూజనీయులైన మహాత్ముల సేవకు వినియోగింపబడుతాయో, ఆ గృహస్థు పేదవాడైనప్పటికీ మిక్కిలి ధన్యుడని పెద్దలు చెబుతారు. కాబట్టి నిశ్చలబుద్ధితో మీరు రావడం చేత అశేష శుభాల్ని నేను పొందుతాను.

వ. అదియునుం గాక.

609

తా ॥ అంతేకాకుండా,

చ. వరమతులార! యెవ్వని నివాసముఁ దీర్థపదాంతరంగులై
పరఁగినయట్టి భాగవత పాదజలంబులు సోఁక వేని త

త్పురుషుఁడు భూరి సంపదలఁ బొంపిరిపోయిననైన వాని మం
దిర మురగ ప్రకీర్ణ జగతీజముఁ బోలు నటంద్రు కోవిదుల్.

610

తా ॥ ఓ పుణ్యాత్ములారా! ఎవరి మనస్సులు, పాదాలు తీర్థంలాగ పవిత్రమో అటువంటి మహా భాగవతుల పాద జలాలు సోకని వాని గృహం ఎంత గొప్ప సంపదలతో విలసిల్లినా అది సర్పాలు చుట్టుకొన్న చెట్టులాంటిదేనని విజ్ఞులు చెబుతారు."

వ. అని పలికి వెండియు నిట్లనియె.

611

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. పరమ పావనులార! బాల్యంబునందుండి, మానిత శ్రద్ధా సమన్వితులును
గుణనిధుల్ ధైర్యయుక్తులు ముముక్షువులునై, యధిక వ్రతంబుల నాచరింతు
రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వా, గతమయ్య! సత్కృపాకలితులార!
యనివారిత వ్యసనార్ణవం బయినట్టి, భూరి దుర్లంఘ్య సంసారమందు

తే. మతి విహీన స్వకీయ కర్మములఁ జేసి, యడరి మగ్నులమై యింద్రియార్థములనె
తివిరి పురుషార్థములు గాఁగఁ దెలియు మాకుఁ, గుశల మున్నదె లోకైక కుశలులార!

612

తా ॥ "పరమపావనులారా! లోకక్షేమంకరులారా! బాల్యం నుండే గొప్ప శ్రద్ధతో, సద్గుణ సంపన్నులై ధైర్యయుక్తులై, ముముక్షువులూనై గొప్పవ్రతాలు చేస్తున్న పుణ్యాత్ములు మీరు. ఓ దయామయులారా! మీకిదే స్వాగతం. మీ రాక మాకు శుభం. దుఃఖములకు నిలయమైన సంసారంలో బద్ధులమై, ఇంద్రియములకు విషయములగు శబ్దస్పర్శరూపరసగంధాదులను

పురుషార్థములుగా భావించే మాకు కుశలమెక్కడున్నది?"

వ. మీర లాత్మారాము లగుటం జేసి మీయందు గుశలాకుశల రూపంబులయిన మతివృత్తులు సంభవింపవు గావునం గుశల ప్రశ్నం బుపపన్నంబు గాదు, కాన నేను గృతవిశ్వాసుండనై సంతప్తులయిన వారలకు సుహృత్తులైన మిమ్ము నాకు నీ సంసారంబునందు నేమిట వేగంబ క్షేమంబు గలుగు నని యడిగెద! నాత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండు నయిన యీశ్వరుండు భక్తానుగ్రహంబు కొఱకు నీ లోకంబుల మీ వంటి సిద్ధరూపంబున వర్తించుచుండు నని పలికిన యతని గంభీరార్థ గౌరవంబులును, శుభకరంబులును, న్యాయ సహితంబులును, మితాక్షరంబులును, శ్రోత్ర ప్రియంబులును నయిన వచనంబులు విని సంప్రీత చేతస్కుండును, మందస్మితుండునై సనత్కుమారుం డిట్లనియె.

613

తా ॥ "మీరు ఆత్మయందు రమించే ఆత్మారాములు. అటువంటి మీకు "కుశలము, అకుశలము" వంటి మనోభావాలుండవు. అందుచేత మిమ్మల్ని కుశల ప్రశ్నలు వేయటం తగదు. బాధలతో క్రుంగిపోయేవారికి మిత్రులైన మీ పట్ల గల విశ్వాసంతో అడుగుతున్నాను. ఈ సంసారంలో పడి జీవించే నాకు దేనివలన త్వరితంగా క్షేమం కలుగుతుంది? ఆత్మజ్ఞానులకు ఆత్మయైన వాడు, స్వస్వరూపంచే ప్రకాశించేవాడూ అయిన పరమాత్మ భక్తుల్ని అనుగ్రహించటం కోసం, ఈ లోకంలో మీవంటి సిద్ధ పురుషుల రూపంలో సంచరిస్తుంటారు" అని పృథు చక్రవర్తి అన్నాడు. పృథువు మాటలలోని లోతైన అర్థాన్ని, శుభకరము, న్యాయసమ్మతము, అల్పాక్షరాలతో కూడి, శ్రోతలకు ప్రియాన్ని కలిగించే లక్షణాలకు సంప్రీతి చెందిన మనస్సుతో, చిరునవ్వులు చిందిస్తూ సనత్కుమారుడిలా అన్నాడు:

మ. ధరణీశోత్తమ! సర్వభూతహిత చేతస్కుండవై ధర్మ సు
స్థిర భాగ్యోదయశాలివై యెసఁగు నీచే సాధులోకోత్తరో

త్తర సంప్రశ్నము సేయఁగాఁబడె మహాత్మా! సాధులోకైక స
చ్చరితంబున్ దలపోయ నిట్టిద కదా! చర్చింప లోకత్రయిన్.

614

తా ॥ "ఓ రాజేంద్రా! సర్వప్రాణికోటికీ మేలుకోరే మనస్సు కలవాడవు, ధర్మమార్గంలో సుస్థిరమైన భాగ్యాన్ని, అభివృద్ధిని పొందినవాడవై ప్రకాశించే నీవు సాధుజన సమ్మతమైన ప్రశ్నాపరంపర సంధించావు. మహాత్మా! ఆలోచిస్తే సాధుజనులకే పరిమితమైన సత్ ప్రవర్తన మూడులోకాలలో ఇలాగే ఉంటుంది కదా!

తే. ధరణి సజ్జన సంగంబు దలఁప నుభయ, సమ్మతంబగు వారలు సలుపు నట్టి
సరస సంభాషణ ప్రశ్న సరణి నిఖిల, జనములకు సుఖకర మగు జనవరేణ్య!

615

తా ॥ ఓ రాజశ్రేష్ఠా! సజ్జన సాంగత్యం ఎప్పుడూ ఉభయులకూ ఆమోదకరంగానే ఉంటుంది. వాళ్ళు చేసే సరస సంభాషణలు, ప్రశ్నించే తీరు, సమస్త జనులకు మేలునే కలిగిస్తాయి."

వ. అని యభినందించి మోక్షసాధనోపదేశకాముండైన పృథుచక్రవర్తికి వెండియు నిట్లనియె.

616

తా ॥ అని సనత్కుమారుడు అభినందించి మోక్షసాధనమైన ఉపదేశాన్ని కోరుకుంటున్న పృథు చక్రవర్తితో ఇలా అన్నాడు:

సీ. ధరణీశ! మధునిషూదనుఁ డైనయట్టి నారాయణు లలిత పాదారవింద
వరగుణధ్యాన ధీపరిణతత్వంబున సకలాత్మ మల విమోచనములైన
రతియును నిత్యవైరాగ్యంబు మొదలుగా లోకోత్తరుఁడవైన నీకుఁ గలవు;

సమ్యగ్విచార శాస్త్రములందు జనులకు సేమంబునకును నిశ్చితము లయిన

తే. యాత్మవ్యతిరిక్త వస్తువులందు వీత, రాగతఁ దలంప నిర్గుణ బ్రహ్మ మయిన
యాత్మయందుల రతియును నన౹గ నివియ, హేతువులు బుద్ధిఁ జింతింప నిద్ధచరిత!.

617

తా ॥ "ఓ రాజా! మధుసూదనుడైన నారాయణుని సుకుమార పాదపద్మాలను ధ్యానించటంలో పరిణతి చెందిన బుద్ధి కలవాడవు. మనస్సులోని సకల మాలిన్యాలను తొలగించుకోవాలనే ప్రయత్నం పట్ల ఆసక్తి, నిత్యవైరాగ్యము, నీకు ఉన్నాయి. నీ చరిత్ర లోకోత్తరమైనది. శాస్త్రాలపట్ల చక్కని విచారణ, ప్రజాక్షేమం పట్ల నిశ్చయమైన బుద్ధి, ఆత్మ జ్ఞానానికి వ్యతిరిక్తమైన వానిపట్ల విరక్తి, నిర్గుణబ్రహ్మమైన ఆత్మ పట్ల అనురక్తినీ కలిగి ఉండటం, ఇవే మోక్షానికి హేతువులు.

వ. కావున శ్రద్ధయు భగవద్ధర్మచర్యయుఁ దద్విశేషజిజ్ఞాసయు నాధ్యాత్మికయోగనిష్ఠయు యోగేశ్వరోపాస్తియుఁ బుణ్యోపాశ్రయుందును, బుణ్యశ్రవణుందునునైన నారాయణ కథాలాపంబులు నర్థేంద్రియారాములైన వారలతోడి సంగతియందు విరక్తియు వారల కభిమతంబులైన యర్థకామంబులందు ననాకాంక్షయు, సర్వేశ్వరుని గుణకీర్త నామృతపానంబు దక్క నితర పదార్థంబులందు వైరాగ్యంబు నొంది యాత్మారామత గలిగి విజనస్థలంబులందుల రుచి గలుగుటయు, నహింసయు, శమాది ప్రధాన వృత్తియు నాత్మ హితానుసంధానంబును భగవత్కథానుస్మరణంబును నకామ్యంబు లయిన యమనియమంబులును, నితర భక్తిమార్గాగర్హణంబును, యోగక్షేమార్థ క్రియారాహిత్యంబును, శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుతయు, భాగవతకర్ణాలంకారభూతంబులగు భగవద్గుణాభిధానంబులు నను వీనిచేత విజృంభమాణంబయిన భక్తి యోగంబునం జేసి యనాత్మయందు నసంగంబును, గార్యకారణరూపంబుగ నిర్గుణ బ్రహ్మము నందు రతియును, నెప్పుడు గలుగు నప్పుడ

సదాచార్యానుగ్రహవంతుండయిన పురుషుండు బ్రహ్మనిష్ఠులతోడఁ జెలిమిసేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక జ్ఞానవైరాగ్య వేగంబునం జేసి.

618

తా ॥ కాబట్టి శ్రద్ధ, భాగవత ధర్మాన్ని ఆచరించటం, ఆ ధర్మం పట్ల విశేష జిజ్ఞాస, ఆధ్యాత్మిక యోగనిష్ఠ, యోగీశ్వరుల్ని ఉపాసించటం, పుణ్యకర్మలకు ఆధారం కావటం, నారాయణుని పుణ్యకథలను గురించి వినటం, సంభాషించటం, అర్థలోభులూ, ఇంద్రియ లోలురూ అయిన వారికి దూరంగా ఉండటం, వాళ్ళకు ఇష్టమైన అర్థకామాల పట్ల కాంక్ష లేకుండటం, సర్వేశ్వరుని గుణసంకీర్తనమనే అమృతపానం తప్ప మిగిలిన పదార్థాలపట్ల ఆసక్తి లేకుండటం, ఆత్మనిష్ఠ, ఏకాంత వాసమందు అభిరుచి కలగటం, అహింస, శమదమాది గుణాలు ప్రధానంగా జీవించటం, ఆత్మకు హితమైన దానిని అనుసరించటం, భగవత్కథలను స్మరించటం, ఏ కోరికా లేకుండా యమనియమాదుల్ని పాటించటం, ఇతర భక్తి మార్గాలను గర్హించకుండటం, తన యోగక్షేమాల కోసం ఏ పనీ చేయకుండటం, శీతోష్ణాది ద్వంద్వాలను సహించటం, భాగవతుల చెవులకు అలంకారంగా భాసించే భగవద్గుణాలను వివరించి చెప్పటం, వీనివల్ల భక్తియోగం వృద్ధి అవుతుంది. ఇటువంటి భక్తియోగంతో అనాత్మ వస్తువుల పట్ల విరక్తి, కార్యకారణ రూపమైన నిర్గుణ బ్రహ్మయందు ఆసక్తి కలిగియుండటం ఎప్పుడయితే సంభవిస్తుందో అప్పుడే నిజమైన గురువుల అనుగ్రహాన్ని పొందుతాడు. అటువంటి మానవుడు బ్రహ్మనిష్ఠులైన వారితో స్నేహం చేసి దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయాలను వదలి వేస్తాడు. అప్పుడు జ్ఞానవైరాగ్యాలు తీవ్రత అధికమవుతుంది.

సీ. అనఘ! సాక్షాత్కార మగు భక్తి యోగాగ్నిఁ గడఁగి జీవాధారకమును బంచ
భూతాత్మకంబునై పొలుచు హృద్గ్రంథిని బూని స్వకారణభూత మయిన
యరణి దహించు హుతాశను కైవడి నిర్దహించిన నిట్లు నెఱపి దగ్ధ
చిత్తుఁడై ముక్తనిశ్శేషాత్మ గుణుఁడు సద్ధర్ముఁడు నైన యతండు మిగుల

తే. నర్థి బాహ్యంబు లయిన ఘటాదికములు, నాంతరములైన సౌఖ్యదుఃఖాదికములు
నను విభేదము లాత్మ భేదనము లగుట, న య్యుపాధి వినాశంబు నందఁ గలఁడు

619

తా ॥ ఆ విధంగా సాక్షాత్కరించే భక్తి యోగాగ్నితో, జీవాత్మకు ఆధారమై, పంచ భూతాత్మకమై ప్రకాశించే హృదయగ్రంథిని, తన పుట్టుకకు కారణమైన ఆరణి దహించే అగ్నిలా దహిస్తాడు. ఈ విధంగా హృదయగ్రంథి దహించడం వల్ల ఉపాధి గుణాలైన కర్తృత్వ భోక్తృత్వముల నుండి విముక్తుడై తనకంటే భిన్నముగా బయట ప్రపంచాన్ని దర్శించడు. సుఖదుఃఖాలకు అతీతుడవుతాడు.

వ. అది యెట్లనిన.

620

తా ॥ అది ఎలాగంటే,

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందిన యాత్మ సుఖైక హేతువై
పరఁగిన రాజభృత్యజన భావగుణంబులు సంప్రబోధమం
దరయఁగ మిథ్య యైనగతి నాంతర బాహ్యగుణ ప్రభేదముల్
పరువడిఁ గానకుండు జనపాలన శీలన! నిత్యఖేలనా!

621

తా ॥ మానవుడు నిద్రించేటప్పుడు అనేకమైన కలలు కంటాడు. తన సుఖానికి ఏకైక కారణంగా భాసించే రాజుగా, సేవకునిగా కనిపిస్తాడు. మెలకువ రాగానే అవన్నీ అసత్యాలని తెలుసుకుంటాడు. బయట, లోపల అనే భేదాలతో కనిపించే గుణాలు, కలలోని భావాల వంటివే. అవి అనుభూతిలోకి రావు.

వ. మఱియును ద్రష్టమైన యాత్మయు దృశ్యంబయిన యింద్రియార్థంబు నను వీనికి నహంకారంబు సంబంధ హేతు వగుటం జేసి యది యంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబులయం దీ భేదంబు గనుంగొను చుండు, నిట్టి యంతఃకరణంబు లేనిది యగు సుషుప్తికాలంబునం బురుషుండు జలదర్పణాది నిమిత్తాభావం బగునప్పుడు బింబప్రతిబింబ భేదంబు గనుంగొనని చందంబున దృశ్యభేదంబు గనుంగొనకుండుఁ, గావున నంతఃకరణ విలయంబు నొందిన బాహ్యాంతర భేదంబు కనకుండుట నిశ్చయం బని వెండియు నిట్ల.

622

తా ॥ అంతఃకరణ రూపమగు ఉపాధి ఉండునంత వరకు చూసే వ్యక్తికి ద్రష్టనగు తాను, చూడబడే ఇంద్రియ లక్ష్యాలకు అహంకారం సంబంధ హేతువవుతున్నది. మెలకువలో, కలలో, నిద్రలో, ద్రష్టకు, దృశ్యానికి గల భేదాలు జీవి అనుభవిస్తుంటాడు. సుషుప్తి అవస్థలో అంతఃకరణం ఉండదు. అంతఃకరణం అభావమవుతుంది. ఆ సమయంలో మానవుడు, జల దర్పణాది నిమిత్తాలు లేకపోతే, బింబ ప్రతిబింబ భేదాన్ని చూడలేనట్లే, ద్రష్టకు, దృశ్యానికి ఉన్న భేదాలను కూడా చూడలేడు. కాబట్టి అంతఃకరణం ఆత్మలో విలీనమైనప్పుడు బాహ్యాంతర భేదాలు కనిపించవు. అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. భువి విషయాకృష్ట భూతంబు లయిన యింద్రియముల చేతను దివిరి మనము
దగ విషయాస క్తిఁ దగిలి యాంతరమైన మహిత విచార సామర్థ్యమెల్ల
శరకుశాది స్తంబజాలంబు హ్రదతోయములు గ్రోలుగతిఁ గ్రమంబున హరించు
నీ రీతి నంతర్విచార సామర్థ్యంబు నపహృతం బయినఁ బూర్వాపరాను

తే. మేయ సంధానురూప సంస్మృతి నశించు, నది నశించిన విజ్ఞాన మంతఁ దొలఁగు,
నట్టి విజ్ఞాన నాశంబు నార్యజనులు, స్వాత్మ కది సకలాపహ్నవం బటంద్రు,

623

తా ॥ విషయాలపట్ల ఆకర్షితమైన ఇంద్రియాల వల్ల మనస్సు విషయచింతనలోనే నిమగ్నమై ఉంటుంది. ఈ విధంగా నిమగ్నం కావటం వలన మనస్సు లోపలి విచక్షణాశక్తి క్రమంగా హరించబడుతుంది. అది ఎలాగంటే మడుగు యొక్క ఒడ్డున మొలచు గడ్డి, దర్భ మొదలైనవి తమ వ్రేళ్ళతో మడుగులోని నీటిని పీల్చడం లాంటిది. అలాగే ఎప్పుడయితే విచారణశక్తి నశిస్తుందో, అప్పుడు పూర్వపరాలను కలిపే స్మృతి నశిస్తుంది. అది నశిస్తే జ్ఞానం నశిస్తుంది. జ్ఞానం నశించడమంటే తన స్వస్వరూప జ్ఞానాన్ని కోల్పోవడమే. అంటే ఆత్మజ్ఞానానికి దూరమగుటేయని పెద్దలు చెబుతారు.

వ. అదియునుం గాక "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" యను వేదవచనంబునం జేసి విషయంబులకుం బ్రియతమత్వంబై యాత్మోపాధికంబు నొంది యాత్మాపహ్నవంబునం బాటిల్లు స్వార్థనాశం బెద్ది గలుగు దాని కంటె లోకంబున నధికంబైన స్వార్థనాశంబు లే, దది యెట్లనిన సర్వార్థ నాశంబునకు స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభిధ్యానంబునం దద్ధేతుకంబైన స్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూపజ్ఞానంబు నశించుం గావున నాత్మాపహ్నవంబునకంటె నధికతరంబైన సర్వార్థ నాశంబు లేదని వెండియు నిట్లనియె.

624

తా ॥ అంతేకాకుండా, ఆత్మసంబంధమును బట్టి ఇతర సమస్త పదార్థములందు ప్రీతి జనిస్తుంది. విషయవాంఛలపై ప్రీతి ఆత్మజ్ఞానాన్ని మరుగునపరుస్తుంది. ఆత్మజ్ఞానం అవహ్నవమైనందు వల్లే కలిగే హాని కంటే దానిని మించిన హాని ప్రపంచమున జీవునకు మరేదీ ఉండదు. మనుజుడు ధనం, ఇంద్రియవిషయాల చింతన చేయుటవలన భ్రష్టుడవుతున్నాడు.

సీ. అనఘ! యీ సంసార మతిశయంబునఁ దరియింపంగ మది నిశ్చయించువాఁడు
గై కొని ధర్మార్థకామమోక్షములకు నతి విఘాతుక మెద్ది యట్టి దాని
వలన సంగము సేయ వలవ; దా ధర్మాదులందుఁ ద్రివర్గంబు నంతకోగ్ర

భయయుతం బగుటను బరమమోక్షంబె ముఖ్యార్థమై విలసిల్లునండ్రు బుధులు,

తే. భువి గుణవ్యతికరమునఁ బుట్టి నట్టి, యబ్జజాతాదులకు నస్మదాదులకును
గాల విధ్వంసితాఖిల క్రమము గల్గఁ, గలుగ దెన్నఁడు సేమంబు గాన వినుము.

625

తా ॥ ఓ పుణ్యాత్మా! ఈ సంసారాన్ని దాటాలని నిశ్చయించుకున్నవాడు, ధర్మార్థ కామమోక్షాలకు విఘాతం కలిగించే దేనినీ అంటించుకోరాదు. ఆ ధర్మార్థకామాలనే త్రివర్గాలలో మృత్యుభయమున్నది. కారణం ఇవి అనిత్యాలు. అందుచేత మోక్షమే, ముఖ్యమై వెలసిల్లే పురుషార్థమని విబుధులు చెపుతారు. త్రిగుణాల సంబంధంతో పుట్టిన బ్రహ్మాదులకు, మాకు కూడా, కాల ప్రభావంతో విధ్వంసమే కానీ క్షేమమెప్పటికీ లేదు.

వ. మోక్షంబె పరమపురుషార్థం బని చెప్పి వెండియు నిట్లనియె. నరేంద్రా! దేహేంద్రియ ప్రాణ బుద్ధ్యహంకార పరివృతంబు లయిన యీ స్థావరజంగమంబుల హృదయంబులందు వ్యాపకుండుఁ బ్రత్యక్షభూతుండుఁ బ్రత్యగ్రూపుండు భగవంతుండు నయిన యీశ్వరుం డంతర్యామిరూపంబునం బ్రకాశించుచుండు, నిది నారాయణుని సద్రూపంబుగాఁ దెలియు మని వెండియు నిట్లనియె.

626

తా ॥ మోక్షమే పరమపురుషార్థమని చెప్పి సనత్కుమారుడు మళ్ళీ ఇలా అన్నాడు: "ఓ రాజా! దేహము, ఇంద్రియాలు, ప్రాణము, బుద్ధి, అహంకారము అనే వాటి చేత ఆవరింపబడియున్న ఈ స్థావర (కదలనివి) జంగమాల (కదిలేవి) హృదయాలలో వ్యాపించియున్నవాడు, కంటికి ఎదురుగా కనిపించేవాడు, తనకు ఎదురుగా తానే నిలచినవాడు, భగవంతుడు అయిన ఈశ్వరుడు అంతర్యామి రూపంలో ప్రకాశిస్తుంటాడు. ఇది నారాయణుని సత్యస్వరూపంగా తెలుసుకో!

ఉ. భూవర! యే మహాపురుష భూషణునందుల నీ సమస్త వి
శ్వావళి లీనమై సదసదాత్మక భావము నొంది భూరి మా
యా విభవంబులం దగి సమగ్ర వివేక విరోధి స్రగ్ఘనా
శీవిషబుద్ధి దోఁచుచు విశేషగతిన్ వెలుఁగొందు నెప్పుడున్.

627

తా ॥ ఈ సమస్త విశ్వమూ, మహాపురుషులకు భూషణమైన ఏ మహాత్ముని యందు లీనమై, వాస్తవముగా లేకున్నను, ఉన్నట్లు భాసింస్తుంది. పుష్పమాల విషసర్పమనే భ్రాంతికి గురి చేసినట్లు, తన మాయా ప్రభావంతో వివేకాన్ని అడ్డగించి విశేషంగా వెలుగొందుతున్నది.

చ. సుమహిత నిత్యముక్త పరిశుద్ధ విబుద్ధ సుతత్త్వుఁడై యురు
క్రముఁ డభిభూత సత్ప్రకృతి కర్మకళంకుఁడు నైనయట్టి యు
త్తమచరితుం గృపాకరు నుదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునఁ దలంపుమయ్య! జనతా పరిరక్షణ! దుష్ట శిక్షణా!

628

తా ॥ దుష్టశిక్షణ చేసి ప్రజలను పరిరక్షించే ఓ రాజా! నిత్యముక్తుడు, పరిశుద్ధుడు, తనలో తాను జాగృతమైన సత్య స్వరూపుడు, ఉరుక్రముడు, ప్రాకృత కర్మ కళంకాన్ని తొలగించే వాడు, ఉత్తమ చరితుడు, కృపాకరుడు, ఉదాత్త గుణోన్నతుడు, ఈశ్వరేశ్వరుడు అయిన పరమాత్మను మదిలో తలచుకో!

సీ. వసుమతీనాథ! యెవ్వని పాదపద్మ పలాశ విలాస సల్లలిత
భక్తి సంస్మరణంబుచే సజ్జన ప్రకరంబు ఘనకర్మ సంచయ గ్రథితమగు న
హంకార మను హృదయగ్రంథిఁ జెఱుతురు; వివరింప నిట్లు నిర్విషయమతులు మహి
నిరుద్ధేంద్రియ

మార్గులు నైనట్టి యతులకుఁ జేరంగ నలవి గాని

తే. యట్టి పరమేశుఁ గేశవు నాదిపురుషు, వాసుదేవుని భువనపావన చరిత్రు

నర్థి శరణంబుగాఁ దత్పదాంబుజములు, భక్తి సేవింపు గుణసాంద్ర! పార్థివేంద్ర!

629

తా ॥ ఓ భూనాథా! దేవదేవునిపై భక్తితో సేవతో సజ్జనులు కర్మ సమూహంతో ముడిపడ్డ అహంకారమనే హృదయగ్రంథిని నిర్మూలిస్తారు. విషయాసక్తులు కానివారు, ఇంద్రియాలు నిరోధించినవారు అయిన యతులకు సైతం ఇటువంటి కార్యం సాధ్యం కాదు. సద్గుణసాంద్ర! ఆ పరమేశ్వరుడు, కేశవుడు, ఆదిపురుషుడు, వాసుదేవుడు, భువనాలను పావనం చేసే సచ్చరిత్రుడైన ఆ దేవదేవుణ్ణి శరణువేడి, ఆయన పాదపద్మాలను భక్తితో సేవించు.

మ. అరిషడ్వర్గ మహోర్మినక్ర నికర వ్యాకీర్ణ సంసార సా

గర మబ్జోదర కీర్తనా తరణి సాంగత్యంబునం బాసి తా

మరుదారంగ నఘాపహప్రకట యోగాది క్రియాయు క్తిచేఁ

దరియింపన్ మదిఁ గోరువారలకు దుర్దాంతం బగుం గావునన్.

630

తా ॥ కామ, క్రోధ, లోభ, మద, మోహ, మాత్సర్యాలనే అరిషడ్వార్గాల మహోగ్ర తరంగాలతో, మొసళ్ళ గుంపులతో కల్లోలితమైన సంసారసాగరాన్ని, పద్మనాభుని సంకీర్తనమనే నౌక సహాయంతో మాత్రమే అధిగమించవచ్చు. అత్యంత కష్టసాధ్యమై పాపాలను పోగొట్టే యోగాభ్యాసాది క్రియలచేత దాటాలని భావించే వారికి అది సాధ్యం కానిపని.

మ. ధరణీశోత్తమ! నీవు కేవలసముద్యద్భక్తి ధీయుక్తిమై

వరగోవింద పదారవింద యుగభాస్వన్నావ సంధించి దు

స్తర భూరివ్యసనాకరోల్లసిత దుర్దాంతోగ్ర గంభీర సం

సరణాంభోధిఁ దరింపవయ్య పరమోత్సాహంబు దీపింపఁగన్.

631

తా ॥ ఓ రాజోత్తమా! నీవు కేవల భక్తితో, బుద్ధియోగంతో, గోవిందుని పాదపద్మాలనే నావను ఆశ్రయించు. దాని సహాయంతో దాట వీలు కాకుండా బాధలకు నిలయమై ప్రకాశించే ఈ భయంకరమైన గంభీరమైన సంసారసముద్రాన్ని పరమోత్సాహంతో దాటవయ్యా!"

క. అని యీ గతిఁ బంకరుహా, సనసుతుఁడును బ్రహ్మబోధశాలియు నగు నా
ఘన యోగివల్లభునిచే, తను దెలియఁగఁ బడిన బ్రహ్మతత్త్వం దగుచున్.

632

తా ॥ అని ఈ విధంగా బ్రహ్మ మానసపుత్రుడూ, బ్రహ్మవిదుడు, పరమ యోగీంద్రుడు అయిన సనత్కుమారుడు పృథు చక్రవర్తికి ఆత్మతత్త్వాన్ని వివరించి చెప్పాడు.

క. జనపతి మునిఁ బొగడి ముదం, బున నిట్లనుఁ బూర్వజన్మమున నే దీనా
వనుండైన యీశ్వరుని చే, తను నిక్క మనుగ్రహింపఁ దగితి మునీంద్రా!

633

తా ॥ పృథువు సంతోషంతో సనత్కుమారుణ్ణి కీర్తించి ఇలా అన్నాడు. "పూర్వ జన్మలో నేను దీనులను రక్షించే ఈశ్వరుని అనుగ్రహాన్ని బాగా పొందివున్నాను.

క. వినుఁ డట్టి యనుగ్రహ సా, ధనమునకై మీర లిపుడు దగ నిచ్చటికిం
జనుదెంచితిరి దయాళురు, ననఘులు భాగవతవరులు నగు నుత్తములున్.

634

తా ॥ దయాళురు, పుణ్యాత్ములు, పరమభాగవతోత్తములూనైన మీరు, అటువంటి అనుగ్రహ విశేషాన్ని నా పట్ల సార్థకం చేయటం కోసం ఇక్కడికి విచ్చేశారు.

సీ. నిరతంబు నాయందు నిష్పాదితములగు దేహసమేత మదీయరాజ్య
సర్వసంపదలును సద్ద్విజ దత్తముల్ గావునఁ బ్రాణకాంతా విభూతి
మందిర సుత రాజ్య మహి బల కోశ పరిచ్ఛదంబుల నెల్ల ధృతిఁ దలంప
రాజుకు భృత్యుండు రాజకీయములగు తాంబూలముఖ పదార్థములఁ జేసి

తే. రమణ సంతర్పణోపచారములు నడపు, గతిని వారల కవి నివేదితము లయ్యెఁ!
గాన మీ కుపచార మేగతి నొనర్తు, నతులగుణసాంద్ర! యోగికులాబ్ధి చంద్ర!

635

తా ॥ యోగికులాబ్ధి చంద్రా! సద్గుణసాంద్రా! నిరంతరం నాచే పొందబడిన సర్వ సంపదలు, రాజ్యము, దేహంతో సహా సద్బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాను. కాబట్టి ప్రాణము, భార్య, వైభవము, రాజగృహము, సుతులు, రాజ్యాలు, భూములు, సైనికబలం, ధనాగారము, పరివారము వీటినన్నింటినీ కూడా, సేవకుడు రాజుకు రాజమర్యాదలైన తాంబూలాదుల్ని సమర్పించి, సేవించినట్లు బ్రాహ్మణులకు సమర్పించాను. కాబట్టి మీకు ఏ విధంగా నేను ఉపచారాలు చేయగలను.

వ. అది యెట్లు బ్రాహ్మణాధీనం బంటిరేని సేనాధిపత్య రాజ్యదండనేతృత్వ సర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేది యైన బ్రాహ్మణునక కాని యితరులకు యోగ్యంబులు గావు! కావున బ్రాహ్మణులకు భోజన వసనదానంబులు స్వకీయంబులై యుండు, క్షత్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్న మాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదు, గావున మీకు గురుదక్షిణ యేమి సమర్పించు వాఁడ? నదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మ విచారులు వేదాంతవేదులు నై భగవద్భక్తి నుపదేశించెడు, మీ వంటి పుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కఁ దక్కినవా డెవ్వం డంజలి మాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు సేయం దలంచు? నది గావున దయాళువులైన మీరలు స్వకృతోపచారంబులం జేసి సంతుష్టాంతరంగు లగుదురు గా కని

పలుకుచున్న యాదిరా జయిన పృథుచక్రవర్తి చేతం బూజితులై యాత్మ యోగనిష్ఠులైన సనకాదు లతని స్వభావంబుం బ్రశంసించుచు సమస్త జనంబులుఁ జూచుచుండ నాకాశ గమనంబునం జని రయ్యవసరంబున.

636

తా ॥ రాజ్యము, సకలసంపదలు బ్రాహ్మణాధీనం కావటం ఏ విధంగానంటే, సేనాధిపత్యం, రాజ్యాధికారం, దండనాయకత్వం, సర్వలోకాధిపత్యం, వేదశాస్త్రజ్ఞుడైన బ్రాహ్మణునికి తప్ప ఇతరులకు సాధ్యం కాదు. కాబట్టి బ్రాహ్మణులకు అన్నదానం, వస్త్రదానం స్వకీయమైన విషయాలు. క్షత్రియాదులకు బ్రాహ్మణుల అనుగ్రహంతో పొందిన అన్నంమీద తప్ప మిగిలిన వస్తుసమితి మీద హక్కు లేదు. కాబట్టి మీకు గురుదక్షిణగా నేనేమి సమర్పించగలను. అదీ కాకుండా స్వాతంత్ర్యం గల మీవంటి ఆధ్యాత్మ తత్త్వవిదులు, వేదాంతవేత్తలు భగవద్భక్తిని ఉపదేశిస్తారు. మీవంటి పుణ్యాత్ములకు భక్తితో నమస్కరించటం తప్ప ప్రత్యుపకారం ఏమి చేయగలను? అలా ప్రత్యుపకారాన్ని చేయపూనుకోవడంవల్ల అవహేళనకు గురి కావడమే జరుగుతుంది. దయామయులైన మీరు నేను చేసిన సేవలను స్వీకరించి, సంతుష్టాంతరంగులగుదురుగాక!" అని పలికే ఆ తొలి చక్రవర్తియైన పృథు చక్రవర్తి చేత పూజించబడి, ఆత్మలో యోగస్థితిని నిలుపుకున్న ఆ సనకాది మహామునులు పృథువు స్వభావాన్ని ప్రశంసిస్తూ, ప్రజలందరూ చూస్తుండగానే ఆకాశ గమనాన వెళ్ళిపోయారు. ఆ సమయంలో—

## 24. పృథు చక్రవర్తి జ్ఞాన వైరాగ్యవంతుడై ముక్తినొందుట

ఆ. విను మహాత్మ, ముఖ్యుఁడన నొప్పు వైన్యుఁ డే, కాగ్రచిత్తుఁ డగుచు నాత్మనిష్ఠ
డైనయట్టి తను నవాప్త కామునిఁ గాఁగ, బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు.

637

తా ॥ మహాత్ములలో ముఖ్యునిగా ఖ్యాతిగాంచిన పృథుచక్రవర్తి ఏకాగ్రచిత్తుడై తన స్వరూపమునందు నిశ్చలమగు మనస్సుతో నిలిచి ఉన్నాడు. తన కోరికలన్నీ నెరవేరినట్లుగా మనస్సులో అనుకున్నాడు.

వ. అంత.

638

తా ॥ తరువాత,

సీ. కర్మంబులను యథాకాల దేశోచిత బలవిత్తములు గాఁగఁ బరఁగు ధర్మ
ములను బ్రహ్మార్పణ బుద్ధిని జేసి కర్మాసక్తుఁ డగుచు సమాహితుండు
ప్రకృతికంటెను దన్నుఁ బరమైన యాత్మను గర్మసంచయ సాక్షిగాఁగ బుద్ధి
నర్థిఁ దలంచుచు నాచరించుచు నట్ల మెఱసి సామ్రాజ్యలక్ష్మీ సమేత

తే. మందిరోద్యాన వనభూములందు రాజ్య, గరిమ వర్తింపఁగానహంకార రహితుఁ
డగుచుఁ దనచిత్తమున నింద్రియార్థములను, దగులకయ యుండె నమ్మహోదారుడంత.

639

తా ॥ బ్రహ్మార్పణ బుద్ధితో తగిన ప్రదేశాలలో, కాలోచితంగా తన బలానికి, ధనానికి తగినట్లుగా కర్మలను, ధర్మాలను ఆచరించాడు. సామ్రాజ్యలక్ష్మీ సమేతుడై, వైభవంతో రాజమందిరాలలో, ఉద్యానవనాలలో సంచరిస్తున్నప్పటికీ, అహంకారరహితుడై, తన మనస్సును

విషయ వాంఛలకు చిక్కనీయకుండా సత్యస్వరూపుడై మహాతేజస్సుతో ప్రకాశించాడు.

వ. ఇట్లధ్యాత్మయోగనిష్ఠుండై కర్మంబుల నాచరించుచు నర్చి యను భార్యయందు విజితాశ్వుండు, ధూమ్రకేశుండు, హర్యశ్వుండు, ద్రవిణుండు, వృకుండు నను నాత్మసములైన పుత్రుల నేవురం గనియె నంత.

640

తా ॥ ఈ విధంగా ఆధ్యాత్మయోగ నిష్ఠతో, కర్మలను ఆచరిస్తూ ధర్మపత్నియైన "అర్చి" యందు, తనతో సమానులైన విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, వృకుడు అనే పేర్లుగల అయిదుగురు పుత్రుల్ని కన్నాడు.

క. జనవినుత! భూమివలనను, ధనముల మర్యాదఁ గొనుచు దాననిమిత్తం
బునఁ గ్రమ్మఱఁ దా నిచ్చుచు, దిననాయకుఁ బోలి వసుమతీపతి యొప్పెన్.

641

తా ॥ సూర్యుడు భూమినుండి నీటిని ఆవిరి రూపంలో గ్రహించి, అవసరమైనప్పుడు వర్షించు విధంగా పృథు చక్రవర్తి ప్రజల నుండి పన్నులు వసూలు చేసి మళ్ళీ వాటిని ప్రజా ప్రయోజనార్థంగానూ, దానరూపంలోను ఇచ్చేవాడు.

వ. అతండు మఱియు నగ్నిచందంబునం దేజోదుర్ధర్షుండును, మహేంద్రుని పగిది దుర్జయుండును, ధరణి కరణి సతతక్షమా యుక్తుండును, స్వర్గంబునుం బోలె నభీష్టదుండును, బర్జన్యుని భాతిఁ గామిత ప్రవర్షణుండును, సముద్రు రీతి గాంభీర్య యుక్తుండును, మేరువు పోలికి సత్త్వవంతుండును, ధర్మరాజు కైవడి ననుశాసకుండును, మహేంద్రుని విధంబున నైశ్వర్య వంతుండును, గుబేరుని మాడ్కి ధనవంతుండును, వరుణుని సరణి గుప్తార్థుండును, సర్వాత్మకుండగు వాయువు చెలువున బలౌజస్తేజోయుక్తుండును, రుద్రుని పగిది నసహ్యాతేజుండును, గందర్పుని యనువున

సౌందర్యవంతుండును, మృగరాజు నోజ నధిక శౌర్యోపేతుండును, మనువు ననువున వాత్సల్య యుక్తుండును, నజుని చందంబునం బ్రభుత్వ సమేతుండును, బృహస్పతి గరిమ బ్రహ్మవాదియు, సర్వేశ్వరుని జాడ జితేంద్రియుండునునై విష్వక్సేనానువర్తనులైన గో గురు విప్రజనంబులందు భక్తి గలిగి లజ్జా వినయశీలంబులందును, బరోపకారంబు నందును నిరుపముండై యివ్విధంబున సర్వలోక పాలక పృథగ్విధ గుణంబుల నన్నింటినిం దానొక్కరుండు ధరియించి.

642

తా ॥ ఆ పృథు చక్రవర్తి అగ్నిహోత్రం లాగా చెనక వీలుకాని తేజస్సును ధరించి, ఇంద్రునిలాగ జయించడానికి వీలుకాకుండ, భూమాతలాగా నిరంతర క్షమతో, స్వర్గంలాగా కోరిన కోర్కెలను ప్రజలకు ప్రసాదిస్తూ, మేఘునిలాగా కోర్కెలను వర్షిస్తూ, సముద్రునిలాగ గాంభీర్యాన్ని వహించి, మేరుపర్వతంలా బలం కలిగి, యమధర్మరాజులాగా శాసిస్తూ, మహేంద్రునిలాగ ఐశ్వర్యాన్ని కలిగి, కుబేరునిలా ధనవంతుడై, వరుణునిలాగ సంపదలను కూడబెడుతూ, సర్వాత్మగా సంచరించే వాయువులా బలము, ఓజస్సు, తేజస్సు కలవాడై, రుద్రునిలాగ సహింపరాని తేజస్సు కలిగి, మన్మథునిలాగ సౌందర్యవంతుడై, సింహమువలె మహా శౌర్యము గలవాడై, మనువులాగ వాత్సల్యాన్ని కలిగి, బ్రహ్మదేవునిలాగ పెత్తనం చేస్తూ, బృహస్పతిలాగ బ్రహ్మవాదియై, సర్వేశ్వరుడైన శ్రీహరి వలె జితేంద్రియుడై, విష్ణుభక్తులై జీవించే గోవులను, గురువులను, విప్రులను భక్తితో పూజిస్తూ, లజ్జావినయ శీలాదులలోను, పరోపకార బుద్ధిలోను వేరెవరు సాటిలేని విధంగా ప్రవర్తిస్తూ లోకపాలకులకు ఉన్న ఆయాగుణాలనన్నీ తానొక్కడే ధరించి, పాలిస్తున్నాడు.

క. అనఘాత్మక! లోకత్రయ, మున సజ్జన కర్ణరంధ్రముల వినఁబడు నా
వినుత యశోమహనీయుఁడు, జనవినుతుం డైన రామచంద్రుని మాడ్కిన్.

643

తా ॥ ముల్లోకాల్లో నున్న సజ్జనుల చెవులలో మార్మోగే కీర్తి కలవాడై, ప్రజలచే స్తుతింపబడే రామచంద్రునిలా వాసికెక్కాడు.

చ. సరస వచో-ర్థ సత్పురుష సంఘ సమంచిత గీయమాన సు
స్థిర వరకీర్తి పూరము సుధీజన కర్ణములందు నించి తా
నిరుపమ సౌమ్య భాషణ మనీషల చేతఁ బ్రజానురక్తుఁడై
ధరణిని రాజనామమునఁ దాఁదగు రెండవ చంద్రుఁడో యనన్.

644

తా ॥ రసవంతమైన వాక్కులతో, అర్థాలతో, సత్పురుషులు, పృథు చక్రవర్తి కీర్తిని గానం చేస్తుంటే, ఆ కీర్తిగాన ప్రవాహం సజ్జనులకు శ్రవణానందాన్ని కలిగించింది. ఆ రాజు సౌమ్యమైన సంభాషణలతో, బుద్ధి వైభవంతో, ప్రజానురక్తుడై పాలించటం చేత 'రాజ' శబ్దాన్ని సార్థకం చేస్తూ 'రెండవ చంద్రుడేమో' అన్నట్లు ప్రకాశించాడు.

వ. మఱియు న మ్మహాత్ముండు విజ్ఞానియు, వర్ధితాశేష స్వానుసర్గుండును, ప్రజాపాలకుండును. స్థావరజంగమవృత్తిదాయకుండును, సత్పురుషధర్మవర్తనుండును, నిష్పాది తేశ్వరాదేశుండును నైన పృథుం డొక్కనాఁడు దన వార్ధకంబు వీక్షించి నిజాత్మజ నాత్మజుల యందు నిలిపి ప్రజలు చింతాతురచిత్తు లగుచుండ నిజ భార్యాసమేతుండై యప్రతిహత నియమంబున వైఖానస సమ్మతంబైన యుగ్రతపంబు నందుఁ బూర్వంబున దిగ్విజయ ప్రవృత్తుండగు చందంబునం బ్రవృత్తుండై తపోవనంబునకుం జని యందు.

645

తా ॥ మహాత్ముడు, విజ్ఞానియైన పృథువు, సమస్త సంపదల్ని వృద్ధిచేసి, ప్రజలను పాలించాడు. స్థావర జంగమాలకు జీవనోపాధిని ఏర్పరిచాడు. సత్పురుషులు చెప్పిన ధర్మాన్ని అనుసరించి ప్రవర్తించేవాడు. ఈశ్వరాజ్ఞను నిర్వర్తించేవాడు. ఒకరోజు తన వార్ధక్యాన్ని

గమనించి, తన కన్నకూతురులాంటి భూమాతను కొడుకులకు అప్పగించి, ప్రజలు దుఃఖీత మనస్కులై విచారిస్తుంటే ధర్మపత్నితో కలసి, తిరుగులేని నియమదీక్షతో, తపోధనులకు సమ్మతమైన ఉగ్రతపస్సుకు పూనుకున్నాడు. పృథువు తపస్సుకు పూనుకోవటం ఎలాగుందంటే పూర్వం యవ్వనంలో దిగ్విజయ యాత్రకు బయలుదేరేటప్పటి ఉత్సాహాన్ని స్ఫురింప జేసింది.

పరమచైతన్యాన్ని, అఖండ చైతన్యాన్ని తనలో అనుభూతి చెందడం ఆత్మప్రజ్ఞను అలవర్చుకోవటం. అ సాధనకు పృథువు పూనుకుంటున్నాడు. ఆ పూనుకోవటం ఎలా ఉందంటే దిగ్విజయయాత్రకు పూనుకొన్నప్పటి ఉత్సాహంలాగా ఉందట. తీవ్ర తపస్సుతో అఖండ చైతన్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడానికి అంతటి శ్రద్ధతో, వ్యాకులతతో, తీవ్ర వైరాగ్యసంపన్నుడై బయలుదేరాడని అర్థం.

మ.కో.కందమూల ఫలాశియై బహుకాల ముగ్ర తపః పరి
స్పందుఁడై యటమీఁదటం దృణపర్ణ భక్షణసేసి యా
చంద మేది జలాశి యై నృపసత్తముం డది మాని తా
మంద గంధవహాశి యయ్యెఁ గ్రమంబునన్ దృఢచిత్తుఁడై

646

తా ॥ అడవిలో దొరికే కందమూలాలను, ఫలాలను తింటూ, తీవ్రమైన తపస్సును చాలాకాలం చేశాడు. ఆపైన తృణాలను, ఆకుల్ని ఆహారంగా తిని తపస్సు చేశాడు. ఆ తరువాత వాటిని విడిచి నీళ్ళను మాత్రమే స్వీకరించాడు. కొన్నాళ్ళకు అవికూడా మాని, కేవలం గాలిని మాత్రమే భక్షిస్తూ క్రమంగా దృఢచిత్తంతో నిలిచాడు.

వ. ఇట్లు వర్తించుచు.

647

తా ॥ ఇలా తపస్సు చేస్తూ,

సీ. మెండుగా మిటమిట మండు వేసవి యందుఁ, దప్త పంచాగ్ని మధ్యమున నిలిచి
మానక జడిగొన్న వానకాలంబునఁ, బైఁగోక వేయక బయట నిలిచి
జనులు హూహూ యను చలివేళఁ గుత్తుక, బంటి తోయముల లోపల వసించి
శిశిరంబు చాల నల్దిశలఁ బర్విన వేళ, వెలయ భూశయనుఁడై విశ్రమించి

తే. మహిత నియతిఁ దితిక్షాసమన్వితుండు, నియత పరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ
డిద్ధమతి యీశ్వరార్పిత బుద్ధి యనఘుఁ, డూర్ధ్వరేతస్కుండునునై క్రమోచితముగ.

648

తా ॥ మిటమిటమని మండే వేసవిలో, మండుతున్న పంచాగ్నులమధ్య నిలబడి తపస్సు చేశాడు. జడివానలు కురిసే వర్షాకాలంలో పైన వస్త్రాన్ని ధరించకుండానే ఆరుబయట నిలిచి తపస్సును కొనసాగించాడు. ప్రజలు హూహూ అని చలికి వణికిపోతున్న కాలంలో కుత్తుకలోతు నీళ్ళలో నివసించి ధ్యానం చేశాడు. ఆకులురాలే శిశిర ఋతువులో భూమిమీద పరుండి తపస్సు చేశాడు. తీవ్రమైన నియమంతో, ఓర్పుతో, మితంగా, నియమబద్ధంగా మాట్లాడుతూ, ప్రాణాయామాది ప్రక్రియలతో శ్వాసగతుల్ని అధిగమించి, ఇంద్రియనిగ్రహంతో, ప్రశస్తమైన మనస్సుతో, ఈశ్వరార్పిత బుద్ధితో, ఊర్ధ్వరేతస్కుడై, పుణ్యాత్ముడైన ఆ పృథు చక్రవర్తి క్రమబద్ధంగా అతి ఘోరమైన తపస్సును చేశాడు.

వ. అతిఘోరం బయిన తపం బాచరించె, నివ్విధంబునం గ్రమానుసిద్ధం బయిన తపంబున విధ్వస్తాశేష కర్మమలాశయుండును బ్రాణాయామంబులచే జితారిషడ్వర్గుండును ఛిన్నబంధనుండునునై పురుషశ్రేష్ఠుండైన పృథుచక్రవర్తి భగవంతుండైన సనత్కుమారుం డెఱింగించిన యోగ మార్గంబున సర్వేశ్వర భజనంబు గావించె, నిట్లు భగవద్ధర్మపరుండును సాధువర్తనుండును శ్రద్ధాసమన్వితుండును నైన పృథునకు నారాయణునందు భక్తి, యనన్యవిషయంబై ప్రవృద్ధం బయ్యె, న వ్విధంబున.

649

తా ॥ ఈ విధంగా క్రమంగా సిద్ధించిన తపశ్శక్తి వల్ల, అశేషమైన కర్మమాలిన్యాన్ని తొలగించుకున్నాడు. ప్రాణాయామంతో అరిషడ్వర్గాలను జయించాడు. దేహబంధాలను విడనాడి, పురుషులలో శ్రేష్టుడైన పృథుచక్రవర్తి భగవంతుడైన సనత్కుమారుడు తెలిపిన యోగమార్గంలో సర్వేశ్వరుణ్ణి భజించాడు. ఈ విధంగా భగవంతుడైన నారాయణుని పట్ల భక్తి కలిగి, సాధువర్తనుడై, శ్రద్ధాసమన్వితుడై ప్రకాశించే పృథుచక్రవర్తికి భక్తిసాధనలో అనన్యస్థితి లభించింది.

క. నరలోకోత్తర భగవ, త్పరిచర్యారాధనమునఁ బరిశుద్ధాంతః
కరణుండగు నా పృథునకు, సరసిరుహోదరు కథానుసంస్మరణమునన్.

650

క. పరిపూర్ణంబగు భక్తిని, గర మనిశము సంశయాత్మకంబై చాలన్
వఱలిన హృదయగ్రంథిని, నిరసించు విరక్తి యుత మనీష జనించెన్.

651

తా ॥ భగవంతునికి పరిచర్య చేస్తూ ఆరాధించడం చేత పృథుచక్రవర్తికి హృదయం పరిశుద్ధమైంది. హరికథా స్మరణంతో పరిపూర్ణమైన భక్తియోగం లభించింది. సంశయాలకు నిలయమైన హృదయ గ్రంథి విచ్ఛిన్నమై వైరాగ్యంతో కూడిన విజ్ఞానం జనించింది.

వ. దానంజేసి యతండు సంఛిన్న దేహాత్మజ్ఞానుండు నధిగతాత్మ స్వరూపుండునై గదాగ్రజుం డయిన శ్రీకృష్ణుని కథాసక్తి నొంది సమస్త యోగ సిద్ధులందు నిస్పృహుం డగుటను హృదయ గ్రంథి విచ్ఛేదకం బయిన జ్ఞానయోగంబును విడిచి యాత్మయందు నాత్మయోగంబుఁ గావించి బ్రహ్మభూతుండయి నిజకళేబరంబు విడువ నిశ్చయించి.

652

తా ॥ వైరాగ్యంతో కూడిన విజ్ఞానం లభించడం చేత ఆ పృథు చక్రవర్తికి "దేహమే తాను"

అన్న భావం తొలగిపోయింది. ఆత్మస్వరూపం అవగతమైంది. శ్రీకృష్ణుని కథలపట్ల ఆసక్తి కలిగి, సమస్తయోగ సిద్ధులపట్ల అనాసక్తిని చూపాడు. హృదయగ్రంథి విచ్ఛేదకమై పొందిన జ్ఞానం ద్వారా సర్వసంశయాలు తొలగిపోయాయి. తన బుద్ధిని, ఆత్మతో అనుసంధానం చేసి, సమయం వచ్చినప్పుడు బ్రహ్మభూతుడయ్యాడు. తన దేహాన్ని వదలాలని నిశ్చయించుకొన్నాడు.

సీ. కోరి మడమలచే గుదపీడనము సేసి పూని ముక్తాసనాసీనుఁ డగుచుఁ
దనరు మూలాధారమున నుండి వాయువు నొయ్యన నెగయించి యొనర నాభి
కలితంబు గావించి క్రమమున హృద్వత్స కంఠ శిరః కోష్ఠకములఁ జేర్చి
కైకొని మూర్ధభాగములకు నెగయించి ప్రాణముల్ విడిచి యా పవనుఁ బవనుఁ

తే. నందు నాకాశ మాకాశమందుఁ దేజ, మందుఁ దేజంబు నుదకంబునందు నుదక
మర్థిఁ గాయంబు మేదినియందుఁ గలిపెఁ, బూని వాని యథోచితస్థానములుగ.

653

తా ॥ ఆ పృథు చక్రవర్తి కోరి మడమలతో గుదస్థానాన్ని (మలద్వారాన్ని నొక్కి ముక్తాసనంలో) కూర్చొన్నాడు. మూలాధార చక్రంలో నుండి ప్రాణవాయువును పైకినెట్టి, నాభియందు వర్తింపజేసి మణిపూర చక్రంలో నిలిపాడు. అక్కడి నుండి క్రమంగా హృదయంలోని అనాహత చక్రంలోనికి, కంఠానికి దిగువునున్న విశుద్ధ చక్రంలోనికి, అక్కడినుండి ఆజ్ఞా చక్రంలోనికి (భ్రూ మధ్యం), ఆపైన మూర్ధభాగంలోని బ్రహ్మరంధ్రం లోనికి చేర్చి క్రమంగా కపాలభేదనం చేసి అనంతంలో ప్రాణాలను కలిపేశాడు. దేహంలోని గాలి గాలిలో, నీరు నీటిలో, వెలుగు అగ్నిలో, ఘటాకాశం మఠాకాశంలో, ఆకాశం ఆకాశంలో కలిసి పోయాయి. దేహంలోని పంచభూతాలు తమతమ స్థానాలకు చేరుకున్నాయి.

వ. మఱియు భూమి నుదకంబునందును, నుదకంబును దేజమందు, దేజంబును వాయువున, వాయువు నాకాశంబునందు, నాకాశంబును మనంబున, మనంబు నింద్రియంబుల, నింద్రియంబులఁదన్మాత్రలఁ, దన్మాత్రల భూతాదియైన

యహంకారంబునందు, నహంకారంబు మహత్తత్త్వంబునందును గూర్చి జీవోపాధి భూతంబయిన ప్రకృతియందుఁ గలిపి జీవభూతుం డయిన పృథుండు జ్ఞానవైరాగ్యంబుల చేత బ్రహ్మనిష్ఠుండై మాయోపాధిం బాసి ముక్తుం డయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె.

654

తా ॥ ఆ పృథు చక్రవర్తి ఇంకా తన దేహంలోని పృథ్వీతత్త్వాన్ని నీటిలో, నీటిని తేజస్సులో (అగ్ని), అగ్నిని వాయువులో, వాయువును ఆకాశంలో, ఆకాశాన్ని మనస్సులో, మనస్సును ఇంద్రియాలలో, ఇంద్రియాలను, పంచభూతాలకు ముందున్న అహంకారమందు, అహంకారాన్ని మహత్తత్త్వంలోను, సమస్త సృష్టికి హేతుభూతమైన మహత్తత్త్వాన్ని ప్రకృతిలోను కలిపేశాడు. జీవిగా అవతరించిన పృథు చక్రవర్తి జ్ఞానవైరాగ్యాలచేత బ్రహ్మనిష్ఠుడై, మాయానిర్మితమైన దేహబంధాలను వీడి మోక్షాన్ని పొందాడు.

సీ. అంత నా పృథుని భార్యామణి యగు నర్చి పుడమిపై వడి నడుగిడినఁ గందు
సుకుమారపాదాబ్జ సుందరీరత్నంబు నతుల పతివ్రత యగుటఁజేసి
యాత్మేశకృత సువ్రతాచరణంబును సుమహిత భక్తి శుశ్రూషణమును
నార్షేయ మగు దేహయాత్రయు నను వీని చేత మిక్కిలి కృశీభూత దేహ

తే. యయ్యుఁ బ్రియనాథ కృత కరుణావలోక, కరతల స్పర్శనాది సత్కారములను నబల
సుఖవృత్తిఁ జెంది య య్యడవులందుఁ, గృశత మదిఁ దోఁపకుండఁ జరించు నపుడు.

655

తా ॥ ఆ తరువాత ఆ పృథు చక్రవర్తి భార్యామణియైన 'అర్చి' ని గురించి తెలుసుకుందాం. భూమిమీద అడుగుపెడితే కందిపోయే సుకుమార పాదారవిందాలు ఆమెవి. సుందరీ రత్నం, సాటిలేని పతివ్రత. తన పతివ్రతా నియమాలకు అనుగుణంగా తనను తాను మలచుకొని గొప్పభక్తితో పతికి శుశ్రూషలు చేసింది. ఋషుల ఒరవడితో తనభర్త దేహయాత్ర సాగించటం చూసి, అదే రీతిలో తను కూడా జీవించడంతో దేహం కృశించి పోయింది.

అయినప్పటికీ ప్రియమైన తన నాథుని కరుణావీక్షణాలు, కరస్పర్శ, చూపించే గౌరవాదరాలు వీటితో కలిగిన సంతోషంతో అలసట, కష్టం తెలియకుండా అడవులలో భర్తతో సుఖంగానే గడిపింది.

క. తన మనమున నే దుఃఖము, ననయంబు నెఱుంగనట్టి యర్చి నిజాధీ
శుని ప్రాణరహిత దేహము, గనుఁగొని విలపించి విగతకౌతుక యగుచున్.

656

తా ॥ తన మదిలో ఏ దుఃఖాన్ని ఎరుగని 'అర్చి' ప్రాణాలులేని తన ప్రాణనాథుని శరీరాన్ని చూసి తీవ్రంగా విలపించింది. జీవితంపై కోర్కెను వీడింది.

సీ. మానిత మందర సానుప్రదేశంబు నందుఁ జితారోప మర్థిఁజేసి
లలిత మహానదీ సలిల సుస్నాతయై కలిత మహోదార కర్ముఁడయిన
నాథున కుదకదాన క్రియల్ గావించి యతిభక్తి సురలకు నతు
లొనర్చి వహ్నికి ముమ్మాటు వలగొని పతిపాద కమల యుగంబుఁ జిత్తమున నిలిపి
తే. వీరవరుఁడైన పృథు పృథివీతలేశు, నందు ననుగమనము సేయునట్టి సాధ్వి
నర్చిఁ గనుఁగొని దేవాంగనా సహస్ర, మాత్మనాథులఁ గూడి నెయ్యంబుతోడ.

657

తా ॥ పరమ పతివ్రతయైన 'అర్చి' మహాదేవి మంధరపర్వతపు చరియలలో భర్తతోపాటు సహగమనం చేయటం కోసం చితిని పేర్చుకుంది. మహానదిలో స్నానం చేసి సత్కార్యాలు అనేకం చేసిన భర్తకు ఉత్తరగతులకోసం ఉదకతర్పణాలు వదిలింది. మిక్కిలి భక్తితో దేవతలకు నమస్కరించి అగ్నికి ముమ్మారు ప్రదక్షిణం చేసింది. భర్త పాదపద్మాల్ని మదిలో నిలుపుకొని, సహగమనం చేసింది. వీరవరుడైన పృథు చక్రవర్తితో సహగమనం చేస్తున్న అర్చి మహాదేవిని చూసి, దేవతాస్త్రీలు తమ భర్తలతో కూడి తిలకించి పులకించారు.

క. పరమోత్కంఠను న మ్మం, దరగిరి సాను ప్రదేశతలమున వరుసం
గురియించిరి నవ సురభిత, వర మందార ప్రసూన వర్షము లంతన్.

658

తా ॥ పరమోత్కంఠతో ఆ మందర పర్వతపు చరియల ప్రాంతంలో నవపరిమళాలు విరజిమ్మే కల్పవృక్ష కుసుమాల్ని ఎడతెరపి లేకుండా వర్షించారు.

క. తరమిడి యచ్చర లాడిరి, మొరయించిరి శంఖతూర్యములు దివిజులు పా
డిరి కిన్నరజనులు పర, స్పరనుతు లొనరించి రా సుపర్వాంగనలున్.

659

తా ॥ వెంటవెంటనే అప్సరకాంతలు నృత్యం చేశారు. దేవతలు శంఖాలు పూరించి బాకాలు ఊదారు. కిన్నెరలు పాడారు. దేవకాంతలు అర్చి మహాదేవి పాతివ్రత్య మహిమను గురించి పరస్పరం చెప్పుకొని కీర్తించారు.

వ. మఱియు నిట్లనిరి.

660

తా ॥ ఇంకా ఆ దేవతా స్త్రీలు ఇలా చర్చించుకున్నారు:

సీ. చర్చింప నిట్టి యాశ్చర్య మెందేనియుఁ, గనుఁగొంటిరే యర్చి యను లతాంగి
ధన్యాత్మురాలు గదా తన విభుఁ గూడి, యిందిరా రమణి యజ్ఞేశుఁ గూడి
వెనుచను కైవడి ననుగమనము సేసె, ని య్యమ నిజహృదయేశుఁ డయిన
ఘను వైన్యు నూర్ధ్వలోకమ్మును బొందును, నేఁ డింతవట్టును నిశ్చితంబు

తే. పరమ యోగీంద్రులకు దుర్విభావ్యమైన, దృఢ సుకర్మమువలన నతిక్రమించి వైన్య
భూమీశు వెనుచని వరుస నూర్ధ్వ, గామినియు నయ్యె నీ యింతి ఘనత నొంది.

661

తా ॥ “ఇటువంటి ఆశ్చర్యాన్ని ఎక్కడైనా కనుగొన్నామా? అర్చి మహాదేవి ధన్యురాలు. ఇందిరాదేవి యజ్ఞేశ్వరుడైన మహావిష్ణువును వెన్నంటి వెళ్ళినట్లు అర్చి తన భర్తతో సహగమనం చేసింది. ఈమె కూడ తన హృదయేశ్వరుడైన పృథు చక్రవర్తి పొందిన ఊర్ధ్వలోకాన్ని పొందుతుంది. ఇది నిశ్చయం. పరమయోగీంద్రులకు సైతం ఊహించరాని, దృఢదీక్షా సత్కర్మలతో అన్ని అడ్డంకుల్ని అధిగమించి, పృథు చక్రవర్తిని వెన్నంటి ఊర్ధ్వలోకాలకు పోతున్నది.

వ. కాన పతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదే యని మఱియును.

662

తా ॥ కాబట్టి పతివ్రతలకు అసాధ్యమైనది ఎక్కడా లేదు. ఇంకా,

క. పరికింపఁగ నే మనుజుఁడు, హరి పదమును బొందఁ జేయు నట్టి వివేక
స్ఫురణం దనర్చు వానికిఁ, బరువడి నిలఁ బొందరాని పదముం గలదే!

663

తా ॥ ఆలోచించి చూస్తే వివేకజ్ఞానం ఉదయించి, హరిపద స్థానాన్ని పొందిన మహాత్ములకు, ఇక ఆ మానవునికి పొందరాని ఉన్నత పదం లేదు.

తే. అట్టి యపవర్గ సాధన మైన మనుజ, భావ మొందియు విషయ సంబద్ధు డగుచు వసుధ
నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి, ననయము నిజాత్మ వంచకుఁ డనఁగఁ బరఁగు.

664

తా ॥ అటువంటి మోక్షసాధనమైన మనుష్య జన్మ కలిగి కూడా, ఇంద్రియలోలురై ఎవరు ప్రవర్తిస్తారో వారు ఆత్మ వంచకులవుతారు.”

క. అని వారలు ద న్నర్థిని, వినుతింపఁగ నర్చి యాత్మవిభుఁడగు పృథుఁ డొం
దిన యచ్యుతలోకంబున, ననుపమ విభవమును బొందె నని విదురునకున్.

665

తా ॥ అని ఆ దేవతా స్త్రీలు తనను కీర్తిస్తుండగా అర్చి, తన హృదయేశ్వరుడైన పృథువు పొందిన విష్ణులోకాన్ని సాటిలేని వైభవంతో పొందింది.”

క. మునివరుఁడగు మైత్రేయుఁడు, వినయంబున నెఱుఁగఁ జెప్పి వెండియుఁ దగ ని
ట్లను న మ్మహాను భావుం, డనఘుండు భగవత్తముండు నగుం బృథుఁ డనఘా!

666

తా ॥ అని మునివర్యుడైన మైత్రేయుడు విదురునికి ఎంతో వినయంతో వివరించి చెప్పాడు. మళ్ళీ పృథుని గురించి చెపూ్త, “ఆ పృథువు పుణ్యాత్ముడు, మహానుభావుడు, పూజించదగిన వారిలో ప్రథముడు.

క. ఏ నీ కిప్పుడు సెప్పితి, మానుగ నీ పుణ్యకథను మహితశ్రద్ధా
ధీనుండై విస్ఫుర దవ, ధానుండై యెవ్వఁడేని తనరిన భక్తిన్.

667

తా ॥ నేను నీకిప్పుడు చెప్పిన ఈ పుణ్యకథను శ్రద్ధతో, ఆదరంతో, ధారణతో,

క. వినినఁ బఠించిన వ్రాసిన, వినిపించిన వాఁడు పృథుఁడు విమల గతిం బొం
దిన క్రియ హరిపద మొందెడు, ననయము నిర్ధూతపాపుఁ డగుచు మహాత్మా!

668

తా ॥ ఎవరైనా విన్నా, చదివినా, వ్రాసినా, వినిపించినా వాడి పాపాలు నశించి, పృథు చక్రవర్తి పొందిన విష్ణుపదాన్ని పొందుతాడు. అంటే పృథు చక్రవర్తికి ఉన్న సద్గుణాలను శ్రద్ధతో

ఆచరణలో కనబరిచిన ఎడల విష్ణుపదానికి అర్హతను పొందమా మరి!

సీ. బ్రాహ్మణుం డంచిత భక్తిఁ బఠించిన బ్రహ్మవర్చసము సంప్రాప్త మగును,
క్షత్త్రియుం డర్థిమైఁ జదివిన విన్నను జగతీ విభుత్వంబు సంభవించు,
వైశ్యుండు విని ధనవంతుఁడై యొప్పను శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును
మఱియును భక్తి ముమ్మాఱు పఠించిన విత్తవిహీనుండు విత్తపతియు

తే. నప్రసిద్ధుఁడు ప్రఖ్యాత యశుఁడు ప్రజలు లేని యధముఁడు వితత సంతానయుతుఁడు
మూర్ఖచిత్తుండు విజ్ఞాన బోధమతియు, నగుచు నుతి కెక్కుదురు మహితాత్మ! మఱియు.

669

తా ॥ ఈ కథను బ్రాహ్మణుడు భక్తితో పఠిస్తే బ్రహ్మవర్చస్సును పొందుతాడు. క్షత్రియుడు శ్రద్ధతో చదివినా, విన్నా రాజ్యాధిపతి అవుతాడు. వైశ్యుడు భక్తితో చదివితే ధనవంతుడవుతాడు. ధనము లేనివారు ధనవంతులలో అగ్రేసరులుగాను, పేరుప్రఖ్యాతులు లేనివాడు కీర్తిమంతుడవుతాడు. సంతానంలేని సంతానహీనులు మంచి సంతానం గలవారిలో శ్రేష్ఠులుగను, మూర్ఖుడు విజ్ఞానవేత్తయై ప్రశంసార్హుడవుతాడు.

వ. ఈ లోకంబునం బురుషులకు స్వస్త్యయనంబును నమంగళ నివారణంబును ధనప్రదంబును యశస్కరంబును నాయుష్కరంబును స్వర్గదాయకంబును గలిమలాపహంబును నైన యీ పుణ్యచరిత్రంబు చతుర్విధ పురుషార్థ కాములైన వారికిఁ జతుర్విధ పురుషార్థ కారణం బగుం గావున వినం దగు, సంగ్రామాభిముఖుండైన రా జీ చరిత్రంబు ననుసంధించి విరోధి నెదిర్చిన న వ్విరోధి పృథునకుం బోలెఁ గప్పంబు లిచ్చు, ముక్తాన్యసంగుండును భగవద్భక్తుండును నైన వాఁడు పుణ్యంబును వైన్యమాహాత్మ్య సూచకంబును నైన యీ చరిత్రంబు వినుచుం బఠియించుచుం గృతమతియై దినదినంబును నాదరంబునం బ్రకటంబు సేయువాఁడు భవసింధుపోత పాదుండైన సర్వేశ్వరుని యందు నచలం బయిన భక్తి గలిగి పృథుచక్రవర్తి వొందిన విష్ణుపదంబుం బొందునని యిప్పుణ్య

చరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి వెండియు నిట్లనియె.

670

తా ॥ ఈ పుణ్యకథ మానవకోటికి శుభాలను కలిగించే మార్గం. అశుభాలను తొలగించే సాధనం. ధనాన్ని, కీర్తిని, ఆయువును ప్రసాదిస్తుంది. స్వర్గాన్ని అందిస్తుంది. కలిదోషాన్ని నివారిస్తుంది. చతుర్విధ పురుషార్థాల పట్ల కోరికున్న వారికి ఆ చతుర్విధ పురుషార్థాలను అనుగ్రహిస్తుంది. కాబట్టి ఈ కథ వినదగినది. యుద్ధానికి వెళ్ళే రాజు ఈ కథను చదివి శత్రువును ఎదిరించినట్లయితే, ఆ విరోధి, పృథువుకు శత్రువులు కప్పం చెల్లించినట్లు కప్పాన్ని చెల్లిస్తాడు. ఇతర సాంగత్యాల్ని వదలి భగవద్భక్తుడై, పుణ్యప్రదమైన పృథు చక్రవర్తి మహిమను సూచించే ఈ కథను వింటూ, చదువుతూ, నిశ్చలబుద్ధితో ప్రతిరోజూ ఆదరంగా ఇతరులకు చెప్పేవాడు, సంసార సాగరాన్ని దాటించే నావలాంటి శ్రీహరి పాదపద్మాలపట్ల నిశ్చల భక్తి కలిగి పృథు చక్రవర్తి పొందిన విష్ణుపదాన్ని పొందుతాడు" అని ఈ పుణ్యకథను మైత్రేయుడు విదురునికి చెప్పాడు. మళ్ళీ ఇలా అన్నాడు:

క. పృథునకు నర్చికిఁ బుట్టిన, పృథు కీర్తిధనుండు ఘనుండు పృథుతుల్యుండై
పృథుశౌర్య ధైర్య ధుర్యుఁడు, పృథివిన్ విజితాశ్వుఁ డొప్పెఁ బృథివీపతియై

671

తా ॥ "పృథు మహారాజుకు, అర్చి మహాదేవికి జన్మించిన 'విజితాశ్వుడు', పృథువు తరువాత రాజయ్యాడు. 'విజితాశ్వుడు' గొప్ప కీర్తినే సంపదగా కలిగి, (పృథు చక్రవర్తి కీర్తినే సంపదగా కలిగి) పృథువుతో సమానుడై, శౌర్యధైర్యాది గుణాలచే నాయకుడై ప్రకాశించాడు.

క. విను మంతర్ధానగతిం, దనరు సునాసీరు వలనఁ దగ విజితాశ్వుం
డును మఱి యంతర్ధానుం, డనుపేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతి చతురుండై.

672

తా ॥ పృథు చక్రవర్తి అశ్వమేధయాగం చేస్తున్నప్పుడు ఇంద్రుడు అశ్వాన్ని అపహరించుకొని అంతర్ధానమయ్యాడు. అప్పుడు 'విజితాశ్వుడు' కూడ అంతర్ధాన విద్యతోనే ఇంద్రుని వెంటబడి, యాగాశ్వాన్ని వెనుకకు తెచ్చాడు. అందుచేత 'అంతర్ధానుడ' నే బిరుద నామం కలిగింది. అశ్వాన్ని జయించి తెచ్చాడు కాబట్టి 'విజితాశ్వుడ' నే పేరు కలిగింది.

సీ. స్థిరమతి రాజ్యాభిషిక్తుండై య మ్మేటి సమమతి న య్యనుజన్ములైన
హర్యశ్వునకు సమాదరమునఁ దూర్పు, దక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును,
బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు ద్రవిణున కర్థి నుత్తరపు దిశను,
గొమ రొప్ప నలువురకును బంచి యిచ్చి స్వకాంత యైనట్టి శిఖండినికిని

తే. మనుజ యోనిని జనియింపుఁ డనుచు మున్ను, పలికినట్టి వసిష్ఠు శాపమునఁ జేసి
పూని త్రేతాగ్ను లతనికిఁ బుత్త్రు లగుచు, జనన మొందిరి సజ్జనస్తవ్య చరిత!

673

తా ॥ రాజ్యపట్టాభిషిక్తుడైన విజితాశ్వుడు స్థిరబుద్ధితోపాటు సమచిత్తమూ కలవాడు, తన సోదరులైన హర్యశ్వునికి తూర్పుదిక్కును, ధూమ్రకేశునికి దక్షిణదిక్కును, వృకునికి పడమటిదిక్కును, ద్రవిణునకు ఉత్తరదిక్కును పంచి ఇచ్చాడు. పూర్వం వశిష్ఠ మహాముని 'మానవులుగా జన్మించండి' అని త్రేతాగ్నులకు ఇచ్చిన శాపం వలన విజితాశ్వుని భార్యయైన 'శిఖండిని' ద్వారా త్రేతాగ్నులు జన్మించారు.

'హర్యశ్వుడు' అంటే ఆకుపచ్చని గుఱ్ఱం కలవాడని అర్థం. సూర్యునికి ఉన్న పేర్లలో 'హర్యశ్వ' శబ్దమొకటి. 'పచ్చని ప్రకృతికాత్మ' అని దీని ప్రతీకార్థం. ధూమ్రకేశుడంటే పొగచూరిన కేశాలు గలవాడని అర్థం. 'దక్షిణదిక్కునకు అధిపతి' గాగల ధూమ్రాకేశుడు 'యముడే'. నియతికి, కాలగతికి ప్రతీక. పశ్చిమ దిక్కుకు అధిపతి 'వృకుడు'. వృకమంటే తోడేలు. జరాధిపతియైన వరుణుడే 'వృకుడు'. ఉత్తరదిక్కునకు అధిపతి 'ద్రవిణుడు'. ద్రవిణుడంటే సంపదలకు అధిపతి 'కుబేరుడు'. ఇలా నలుగురూ నాలుగు దిక్పతులు.

వ. వారలు పావకుండుఁ బవమానుండు శుచియు నను నామంబుల మనుష్య యోనిం బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులయి చనిరి తదనంతరంబ.

674

తా ॥ వాళ్ళు 'పావకుడు', 'పవమానుడు', 'శుచి' అనే పేర్లతో మానవులై పుట్టినప్పటికీ, స్వీయ ప్రభావంతో మళ్ళీ అగ్నులుగా రూపొంది యథాస్థానాలకు తరలి వెళ్ళారు. ఆ తరువాత

క. అతఁడు నభస్వతి యనియెడి, ద్వితీయ పత్ని వలనను హవిర్ధానుఁడు నా
సుతుఁగని విజితాశ్వుం డా, నతవిమతుఁడు రాజ్యవర్తనము దలపోయన్.

675

తా ॥ విజితాశ్వునికి 'నభస్వతి' అనే రెండవ భార్యవలన 'హవిర్ధానుడు' అనే సుతుడు జన్మించాడు. అతడు శత్రువుల్ని జయించి, రాజ్యాన్ని చక్కగా పాలించాడు.

క. విమలాత్మ! కరాదానము, దమశుల్కాదికము గరము దారుణ మని ధై
ర్యమునన్ దీర్ఘమఖ వ్యా, జమునం దద్వర్తనంబు సమమతి విడిచెన్.

676

తా ॥ ఓ విమలాత్మా! పన్నులు వసూలు చేయటం, ఆంక్షలు విధించి సుంకాలు స్వీకరించటం, దారుణమైన కృత్యంగా భావించి విజితాశ్వుడు వదలివేశాడు. సమబుద్ధితో, దీర్ఘసత్త్రయాగపు మిషతో, ప్రజలకు సంపదను అధీనం చేశాడు.

వ. ఇట్లు విడిచి.

677

తా ॥ అలా విడిచి—

క. అతఁ డాత్మదర్శనుం డయి, చతురతఁ బరమాత్ము హంసు సర్వేశ్వరుఁ ద
త్క్రతువున యజించి కుశలా, ద్భుత యోగసమాధి ముక్తిఁ బొందె మహాత్మా!

678

తా ॥ ఆత్మజ్ఞుడై, సర్వేశ్వరుడు, హంస స్వరూపుడు అయిన పరమాత్మను ఆ యజ్ఞంలో అర్చించి, అత్యద్భుతమైన యోగ సమాధిచేత ముక్తిని పొందాడు.

వ. అంత విజితాశ్వుండు పరలోకగతుం డయిన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్యవలన బర్హిష్మదుండు గయుండు శుక్లుండుఁ గృష్ణుండు సత్యుండు జితవ్రతుండు నను పుత్రుల నార్వురం గాంచె, నందు బర్హిష్మదుండు.

679

తా ॥ విజితాశ్వుడు పరలోకగతుడైన తరువాత, విజితాశ్వుని కొడుకైన హవిర్ధానుడు, తన భార్యయైన 'హవిర్ధాని' వలన బర్హిష్మదుడు, గయుడు, శుక్రుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు, అనే ఆరుగురు పుత్రుల్ని పొందాడు.

సీ. సంతత సవన దీక్షాశాలి యగుచు ధరాతలం బెల్లను గ్రతువులకును
విలసిల్లు యజనశాలలు వేఱువేఱ కల్పించి యజ్ఞములు గావించుచుండి
చిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే క్షితితలం బెల్ల నాస్తృతము సేయ
వసుధ యెల్లను యజ్ఞవాటమై విలసిల్ల సత్క్రియాకాండ నిష్ణాఁతు డగుచు

తే. సుభగయోగ సమాధి నిష్ఠుఁడు ప్రజాప, తి యగునని తన్ను జనము నుతింప వెలయు
నట్టి ఘనుఁడు హవిర్ధాని యఖిల జగతిఁ, బఱపి కుశలను బ్రాచీనబర్హి యయ్యె.

680

తా ॥ హవిర్ధానుని సంతానమైన బర్హిష్మదుడు, నిరంతరం యజ్ఞదీక్షాశాలియై,

భూతలమంతా యజ్ఞయాగాది క్రతువులు విలసిల్లేలాగ, యజ్ఞశాలల్ని ప్రత్యేకంగా నిర్మింపచేశాడు. తూర్పుదెసగా సాగిన కొసలు గల దర్భల్ని భూమండలమంతా పరచాడు. ధరాచక్రమంతా 'యజ్ఞవాటి' యై విలసిల్లింది. సత్కర్మలను ఆచరించడంలో దీక్ష వహించి, సౌభాగ్యదాయకమైన యోగవిద్య ద్వారా పొందిన సమాధి నిష్ఠతో నిశ్చలుడై, ప్రజలచేత 'యోగసమాధి నిష్ఠ' డని, 'ప్రజాపతి' యని కీర్తించబడ్డాడు. ఇలా దర్భల్ని భూమండలమంతా పరచిన బర్హిష్మదుడు, 'ప్రాచీనబర్హి' గా పేరుకెక్కాడు.

వ. మఱియు నతండు.

681

తా ॥ ఇంకా అతడు—

చ. అలవడ నే సతీమణి సమంచితలీల వివాహవేళ ను
త్కలికc బ్రదక్షిణంబు లిడcగాc గని హవ్యవహుండు దొల్లి యి
మ్ముల శుకిcజూచి మోహమును బొందినరీతి విమోహి యయ్యె నా
లలిత వినూత్న భూషణ యలంకృత చారు శుభాంగి వెండియున్.

682

తా ॥ పూర్వం అగ్నిహోత్రుడు, వివాహ సమయంలో తనకు ప్రదక్షిణం చేస్తున్న 'శుకి' అనే కన్యను చూసి మోహపడ్డాడు. అలాగే ప్రాచీనబర్హి కూడ సముద్రుని కూతురైన 'శతధృతి' అనే కన్యను చూసి, మోహించాడు. లలితము వినూత్నమూనైన ఆభరణాల్ని అలంకరించుకొని ప్రకాశించే ఆ శుభాంగిని వివాహమాడాడు.

చ. సురుచిర భంగి నా సతి కిశోర వయఃపరిపాకయై రణ
ద్వరమణి హేమనూపుర రవంబు సెలంగcగ నాడుచున్ దివా
కరరుచి రేఖ నొప్పెసcగc గాంచి వినిర్జితులైరి దేవ కి

న్నర నర సిద్ధ సాధ్య ముని నాగ నభశ్చరముఖ్యు లందఱున్.

683

తా ॥ నవయౌవనవతియైన 'శతధృతి', సూర్యకాంతిలా ప్రకాశిస్తోంది. ధరించిన మణులు, బంగారుటందెలు శబ్దం చేస్తుండగా, ఆమె ఆడుతూ ఉంటే చూసిన దేవతలు, కిన్నరులు, నరులు, సిద్ధులు, సాధ్యులు, మునులు, నాగలోకవాసులు, ఆకాశంలో సంచరించేవారు, అంతా, ఆమె సౌందర్య విలాసం చేత జయించబడ్డారు.

వ. అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియు నయిన శతధృతి యను కన్యం బ్రహ్మోదేశంబునం బాణిగ్రహణంబు సేసె, నా శతధృతి వలనం బ్రాచీనబర్హికిఁ బదుగురు కొడుకులు జనియించిరి, వారలు తుల్యనామ వ్రతులును ధర్మపారగులును నయిన ప్రచేతసులు, వారు ప్రజాసర్గంబునందుఁ దండ్రిచేత నాజ్ఞాపితులయి తపంబు గావింప వనంబునకుం జను సమయంబునం దన్మార్గంబునఁ బ్రసన్నుం డగుచు దృశ్యమానుండైన రుద్రునిచేత నేది యుపదేశింపంబడె దాని జపధ్యాన పూజా నియమంబుల సేవించుచుఁ దపఃపతి యైన నారాయణుం బదివేల దివ్య వత్సరంబులు పూజించి రని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె.

684

తా ॥ అటువంటి సౌందర్యఖని, సముద్రుని పుత్రికయైన 'శతధృతి' వివాహం బ్రహ్మ ఆదేశానుసారం 'ప్రాచీనబర్హి' తో జరిగింది. ఆ 'శతధృతి' వలన ప్రాచీనబర్హికి పదిమంది కొడుకులు కలిగారు. వాళ్ళే ప్రచేతసులు. ఒకే వ్రతము ఒకే పేరు గలిగి ధర్మం యొక్క పారాన్ని చూసినవాళ్ళు ఆ ప్రచేతసులు. తండ్రి చేత ఆజ్ఞాపించబడి, తపస్సు చేసి, ప్రజాసృష్టిని కొనసాగించడానికి అడవికి బయలుదేరారు. అలా బయలుదేరి వెళ్ళే సమయంలో, మార్గంలో రుద్రుడు ప్రసన్నుడై, ప్రచేతసులకు సాక్షాత్కరించాడు. రుద్రుని ఉపదేశానుసారం, ప్రచేతసులు, తపఃపతియైన నారాయణుణ్ణి, జపధ్యాన పూజానియమాలతో, పదివేల దివ్య సంవత్సరాలు

పూజించారు" అని చెప్పగా విని మైత్రేయునితో విదురుడు ఇలా అన్నాడు:

సీ. తాపసోత్తమ! ప్రచేతసులకు నా వన మార్గంబునందు నా భర్గుతోడ
సంగ మెట్లయ్యెఁ? బ్రసన్నుఁడై హరుఁ డెద్ది తివుట వారల కుపదేశ మిచ్చె?
జీవరాసులకు నా శివుతోడి సంగంబు గడు దుర్లభం, బీ జగంబునందుఁ
జర్చింప న మ్మేటి సన్మునీంద్రులకును సంచిత ధ్యానగోచరుఁడు గాని

తే. పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁ బడఁడు, మఱియు, నంచితాత్మ సదారాముఁ డఖిల లోక
రక్షణార్థంబుగా విరూపాక్షుఁ డాత్మ, శక్తితోఁ గూడి జగతిపై సంచరించు.

685

తా ॥ "తాపసోత్తమా! ఆ వనమార్గంలో ప్రచేతసులకు, ఈశ్వరుణ్ణి కలవటం ఎలా సాధ్యమైంది? ప్రసన్నుడైన హరుడు, వాళ్ళకు చేసిన ఉపదేశమేమిటి? జీవరాశులకు ఈ జగత్తులో శివుణ్ణి కలవటం దుర్లభమైన విషయం కదా! సన్మునీంద్రులకైనా, ధ్యానంలోనే గోచరిస్తాడు గానీ ప్రత్యక్షంగా కనబడడు. ఆత్మారాముడై, అఖిలలోక సంరక్షణార్థమై, ఆత్మశక్తితో కూడి సర్వత్రా సంచరిస్తుంటాడు.

## 25. రుద్రుడు ప్రచేతసులకు యోగాదేశమనే స్తోత్రమును తెలుపుట

క. కావున భగవంతుండును, దేవాధీశుండు నయిన దేవుని సంగం
బే వెరవున ఘటియించెనో, యా విధ మంతయును దెలియ నానతి యీవే.

686

తా ॥ కాబట్టి భగవంతుడు, దేవతలకు అధిపతీ అయిన మహాదేవుని సాంగత్యం, ప్రచేతసులకు ఏ విధంగా సాధ్యపడిందో, ఆ వివరమంతా నాకు తెలియజెప్పు."

క. అనవుడు విదురున కమ్ముని, జననాయకుఁ డనియె నట్టి సాధుమనీషం
దనరు ప్రచేతసులును నిజ, జనకుని సద్భాషణములు సమ్మతి తోడన్.

687

క. శిరమున వహించి పడమటి, కరిగెడి సమయమున నెదుర నంబుధికంటెం
బఱ పగు నొక సరసి మనో, హర నిర్మల సలిల పూర్ణమై యది మఱియున్.

688

తా ॥ అలా ప్రశ్నించిన విదురునితో, మైత్రేయ మహాముని ఇలా చెప్పాడు: జ్ఞాన సంపన్నులయిన ప్రచేతసులు తమ తండ్రిమాటలు శిరసా వహించి, పడమటి దిక్కుగా వెళుతున్న సమయంలో, సముద్రం కంటే విస్తారమైన ఒక సరస్సును చూశారు. ఆ సరస్సు మనోహరంగా, నిర్మలమైన జలంతో నిండి ప్రకాశిస్తోంది.

సీ. రక్తోత్ప లేందీవరప్రఫుల్లాంభోజ కమనీయ కహ్లార కలిత మగుచుఁ
గంజాత కింజల్క పుంజ విక్షేపక మందగంధానిలానంద మగుచు
రమణీయ హంస సారస చక్రవాక కారండవ నినదాభిరామ మగుచు
వర మత్త మధుప సుస్వర మోద పల్లవాంకురిత లతా తరు భరిత మగుచు

తే. సిద్ధచారణ గంధర్వ సేవ్య మగుచుఁ, బుణ్యముల కాలయం బయి పొలుపు మిగిలి
లలితమై చూడ నొప్పగు లక్షణములఁ, బరఁగి శుచి లఘు మధురాంబు భవ్య మగుచు.

689

తా ॥ ఆ సరోవరంలో ఎఱ్ఱ కలువలు, తెల్ల కలువలు, బాగా విచ్చుకున్న పద్మాలు, తమ్మిపూలు అలరారుతున్నాయి. పద్మాల కేసరాల గుత్తుల నుండి వెలువడే సుగంధాల్ని పిల్లవాయువులు మోసుకొని తెస్తూ, ఆనందాన్ని కలిగిస్తున్నాయి. అందమైన హంసలు, బెగ్గురు పక్షులు, చక్రవాకాలు, అడవి పావురాలు, మధురంగా కూస్తున్నాయి. మదించిన తుమ్మెదల మధుర ధ్వనులకు సంతోషించి, పులకించినట్లుగా ఒడ్డుననున్న తీగెలు, చెట్లు చిగుళ్ళు తొడిగాయి. సిద్ధులు, చారణులు, గంధర్వులచే సేవించబడుతూ, పుణ్యాలకు నిలయమై, నిర్మలమైన తీయని నీటితో తొణికిసలాడుతూ, శుభావహంగా ఆ సరస్సు అలరారుతోంది.

తే. సజ్జనుని హృదయముఁ బోలి స్వచ్ఛ మగుచు, హరిపదాకృతి దివిజవిహార మగుచు
ఘనుని సిరి భంగి నర్థజీవనము నగుచు, మానవతి వృత్తి గతిని నిమ్నంబు నగుచు.

690

తా ॥ ఆ సరోవరం, సజ్జనుని హృదయంలాగ స్వచ్ఛంగా, హరిపదమైన వైకుంఠంలాగా దేవతా విహారస్థలంగా, గొప్పవాని సంపదలాగా (మేఘుని సంపదలాగ) అర్థులకు ఉపయోగపడుతూ (తగినంత నీటిని కలిగి) అభిమానవతియైన స్త్రీ ప్రవర్తనలాగా లోతుగా గంభీరంగా ఉంది.

తే. శశికరంబులుఁ బోలి విశదము లగుచు, హరికథలఁ బోలి కల్మషహరము లగుచు
వహ్నులనుబోలి భువన పావనము లగుచుఁ, బొగడఁదగు నీరములచేఁ బ్రపూర్ణ మగుచు.

691

తా ॥ ఆ సరోవరంలోని నీళ్ళు శశికిరణాల్లాగా స్వచ్ఛమైనవి. హరికథల్లాగా కల్మషాన్ని

హరించేవి. అగ్నిహోత్రాల్లాగా లోకాల్ని పావనం చేసేవి. అలా ప్రశంసింపదగిన నీటితో నిండి

వ. ఒప్పునట్టి సరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్య పురుషునిం గని రతండును వారు.

692

తా ॥ ప్రకాశించే సరోవరాన్ని ప్రచేతసులు గమనించారు. ఆ సరస్సులో ఒక దివ్య పురుషుణ్ణి చూశారు.

మ. సమదశ్రీక మృదంగ వేణుముఖ భాస్వన్నాదమై దివ్య మా
ర్గ మనోరజంకమై తనర్చు విలసద్గాంధర్వగానంబు నె
య్యము సంధిల్లఁగ వించుఁ దన్మహిమ కత్యాశ్చర్యముం బొంది వే
గమునం దత్కమలాకరంబు వెడలెం గౌతూహలోల్లాసియై.

693

తా ॥ పరవశింపచేసే వేణు, మృదంగ నాదాలతో కూడిన, మనోరంజకమైన గంధర్వగానాన్ని విని, ఆ గాన మహిమకు అమితాశ్చర్యాన్ని పొందియుండగా అప్పుడే ఆ సరస్సు నుండి వేగంగా, సంతోషంతో వెలుపలికి వచ్చాడు ఆ దివ్య పురుషుడు.

వ. ఇట్లు వెడలివచ్చిన.

694

తా ॥ అలారాగా,

మ. కని రా తాపసపుంగవుల్ దివిజలోక శ్రేష్ఠునిం దప్తకాం
చన వర్ణున్ సనకాది యోగిజన భాస్వద్గీయమానుం ద్రిలో
చను భక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యం బ్రసాదాభిశో

భనవక్త్రున్ నిహతాఘకర్తృజన సంపద్భద్రునిన్ రుద్రునిన్.

695

తా ॥ ఆ దివ్య పురుషుడైన రుద్రుణ్ణి, తాపసులలో శ్రేష్ఠులైన ప్రచేతసులు చూచారు. దేవతాలోకంలో శ్రేష్ఠుడైనవాడు, కరిగించిన బంగారు వన్నెగలవాడు, సనకాది యోగిజనులచే కీర్తించబడేవాడు, త్రిలోచనుడు, భక్తులగుణాలను అనుసరించి దగ్గరయ్యేవాడు, మహదైశ్వర్య సంపన్నుడు, ప్రసాద గుణంతో శోభించే ప్రసన్నవదనం గలవాడు, పాపాల్ని పోగొట్టి సంపదలకు భద్రతను కలిగించేవాడు అయిన ఆ పరమశివుణ్ణి ప్రచేతసులు చూశారు.

క. కని వారలు దమ మనముల, ననురాగము నద్భుతంబు ననయము బొడమన్
వినయము దోఁపఁగఁ దత్పద, వనజములకు మ్రొక్కి భక్తి వశగతు లగుచున్.

696

తా ॥ చూసి, తమ మనస్సులలో అనురాగం, అద్భుతం పొటమరించగా మిక్కిలి భక్తిపరవశులై, వినయంతో పరమేశ్వరుని పాదపద్మాలకు ప్రణమిల్లారు.

వ. భగవంతుండును నఖిల ధర్మజ్ఞుండును గృపాళుండును భక్తవత్సలుండును దర్శనంబున నఖిల పాపహరుండును నయిన హరుండు ప్రీతుం డగుచుఁ బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీల సంపన్నులు సంప్రీతులు నయిన వారల కిట్లనియె.

697

తా ॥ భగవంతుడూ, సర్వధర్మాలు తెలిసినవాడు, దయామయుడు, భక్తవత్సలుడు, దర్శనమాత్రంతోనే సమస్త పాపాలూ హరించేవాడు, అయిన ఆ హరుడు ప్రీతి చెంది, ప్రసన్న హృదయంగల ధర్మజ్ఞులు, శీలసంపన్నులయిన ప్రచేతసులతో ఇలా అన్నాడు:

# 26. రుద్రగీత – రుద్రుడు శ్రీహరిని స్తుతించుట

సీ. వినుఁడు నృపాల నందనులార! మీ మదిఁ గల తలం పెల్లను గానవచ్చె,
మీకు భద్రం బగు, మీ యెడ నే ననుగ్రహబుద్ధిచే నిటు గానఁబడితిఁ,
గైకొని యిపుడు సూక్ష్మముఁ ద్రిగుణాత్మకము నగు నా ప్రకృతి కంటెను ధరణిని
బరఁగు జీవుని కంటెఁ బరుఁడైన వాసుదేవుని చరణాబ్జముల్ దనరు భక్తి

తే. నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు, నాకుఁ బ్రియతముల్, వారికి నయచరిత్రు లార!
యేను బ్రియుండనై భూరి మహిమ, వెలయు చుండుదు, నది గాక వినుఁడ మీరు.

698

తా ॥ "ఓ రాకుమారులారా! వినండి. మీ మనస్సులో ఉన్న సంకల్పం నాకు తెలుసు. మీకు క్షేమం కలుగు గాక! మిమ్మల్ని అనుగ్రహించాలన్న బుద్ధితో దర్శనమిచ్చాను. సూక్ష్మము, త్రిగుణాత్మకములైన ప్రకృతికంటే, భూమిమీద జన్మించిన జీవునికంటే అన్యమైన వాసుదేవుని పాదపద్మాల్ని భక్తితో ఎవరు సేవిస్తారో, వాళ్ళు నాకు మిక్కిలి ఇష్టమైనవాళ్ళు. వాళ్ళకు నేను ఇష్టుడనై సంచరిస్తాను. అంతేకాకుండా,

వ. స్వధర్మ నిరతుండైన పురుషుం డనేక జన్మాంతరసుకృత విశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది, తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికారాంతంబున నేనును దేవతాగణంబులును నవ్యాకృతంబైన యే హరిపదంబును బొందుదు, మట్టి పదంబు భగవంతుడు దనంతనె పొందుం, గావున మీరు భాగవతత్వంబు నొందుటం జేసి నాకు బ్రియంబు ఘటియింపుఁడు, భాగవత జనంబులకు నా కంటె నధిక ప్రియుండు లేఁడు, గాన వివిక్తంబును జప్యంబును బవిత్రంబును మంగళంబును నిశ్శ్రేయస కరంబును నైన వచనంబు నాకర్ణింపుఁడు, సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరి స్తోత్రంబు మీకు నెఱింగింతు, విను, డది యెట్టిదనిన.

699

తా ॥ స్వధర్మనిరతుడైన మానవుడు, అనేక జన్మలలో చేసిన పుణ్యవిశేషాల్నిబట్టి బ్రహ్మత్వాన్ని పొందుతాడు. ఆ తరువాత అంతకంటే ఎక్కువ పుణ్యాన్ని చేసినవాడు నన్ను పొందుతాడు. అధికారాంతంలో నేను, బ్రహ్మాది దేవతలు పొందే హరిపదాన్ని, భాగవతుడైన విష్ణుభక్తుడు తనంతటతానే పొందుతున్నాడు. కాబట్టి మీరు భాగవతులైనందున నాకు సంతోషాన్ని కలిగించండి. భాగవతజనులకు నాకంటే ఇష్టమైనవాడు మరొకడులేడు. కాబట్టి రహస్యము, పవిత్రము, మంగళకరము, మోక్షప్రదము, జపింపదగినది అయిన నా ఉపదేశాన్ని వినండి. సృష్టి ఆరంభంలో బ్రహ్మదేవుడు, తన కుమారులకు చెప్పిన శ్రీహరి స్తోత్రాన్ని మీకు తెలియజేస్తాను వినండి.

క. వనజాసనుఁ డాత్మజు లగు, సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడన్
వినుఁడు కుమారకులారా!, వనజోదరు మంగళ స్తవం బెఱిఁగింతున్.

700

తా ॥ పద్మాసనుడైన బ్రహ్మ, తన మానసపుత్రులైన సనకాదుల్ని చూసి సమ్మతితో ఇలా అన్నాడు: ‘పుత్రులారా! శ్రీమన్నారాయణుని, మంగళకరమైన స్తోత్రాన్ని చెపుతాను వినండి’.

వ. అని హరి నుద్దేశించి వారలు విన నిట్లనియె, ‘నో యీశా! యాత్మవేదులైన వారలకు భవదీ యోత్కర్షంబు స్వానందలాభకరంబు గావున నట్టి స్వానందలాభంబు మాకుం గలుగ వలయు, నీవు పరిపూర్ణానంద స్వరూపుండ, విట్టి సర్వాత్మకుండవైన నీకు నమస్కరింతు నని వెండియు నిట్లనియె.

701

తా ॥ అని సనకాది కుమారులు వినేలా శ్రీహరిని ఉద్దేశించి బ్రహ్మ ఇలా అన్నాడు: “ఓ ఈశ్వరా! ఆత్మజ్ఞానులైనవారికి నీ గొప్పదనం ప్రకటిత లక్షణం, ఆనందాన్ని కలిగిస్తుంది. కాబట్టి

అటువంటి ఆనందం మాకు కలుగుగాక! నీవు పరిపూర్ణానంద స్వరూపుడవు. సర్వాత్మకుడవైన నీకు నమస్సులు." అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. పంకజనాభాయ సంకర్షణాయ శాం, తాయ విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదే, వాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మనిస్తారకాయ త్రయీ, పాలాయ త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వ, యం జ్యోతిషే దురంతాయ కర్మ

తే. సాధనాయ పురాపురుషాయ యజ్ఞ, రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేఽన్తకాయ విశ్వ యోనయే విష్ణవే జిష్ణవే నమోఽస్తు.

702

తా ॥ "ఓ పద్మనాభా! నీకు నమస్కారం. అహంకారానికి అధిష్ఠాతవయిన సంకర్షణుడవైన నీకు నమస్కారం. శాంతుడవు, విశ్వప్రబోధకుడవు, పంచభూతాలు ఇంద్రియాలు మొదలైన వాటియందు సూక్ష్మమైన అంతర్యామిగానున్న నీకు నమస్కారం. సూక్ష్మమూర్తివైన నీకు నమస్కారం. చిత్తానికి అధిష్ఠాతయైన వాసుదేవుడవు నీవే. ఇన్నిటిలో పరిపూర్ణుడవై విశ్వమంతా నిండిన విశ్వాకారుడవు. పుణ్యమూర్తివి. నిర్వికారుడవు. కర్మస్వరూపంగా విస్తరించేవాడివి, వేదపాలకుడవు, మూడు లోకాలను సంరక్షించేవాడివి, సోమరూపుడవు, తేజోబల స్వరూపుడవు, స్వయంజ్యోతివి. అంతం లేనివాడివి, కర్మసాధకుడవు (కర్మములకు సాధనం), పురాణపురుషుడవు. యజ్ఞమే వీర్యంగా గలవాడవు. జీవుల తృప్తియే నీ తృప్తిగా భావించేవాడివి. పృథ్వీ స్వరూపుడవు. లోకస్వరూపుడవు. ఆకాశరూపివి. అంతకదీప్తివి. విశ్వకర్తవు. విష్ణుడవు. జిష్ణుడవు. అటువంటి నీకు నమస్కారం.

సీ. స్వర్గాపవర్గ సుద్వారాయ సర్వ ర, సాత్మనే పరమహంసాయ ధర్మ
పాలాయ సద్ధిత ఫలరూపకాయ కృ, ష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి
యుక్తాయ ఘన సాంఖ్య యోగీశ్వరాయ హి, రణ్య వీర్యాయ రుద్రాయ శిష్ట

నాథాయ దుష్టవినాశాయ శూన్య ప్ర, వృత్తాయ కర్మణే మృత్యవే వి

తే. రాట్ఛరీరాయ నిఖిల ధర్మాయ వాగ్వి, భూతయే నివృత్తాయ సత్పుణ్య భూరి
వర్చసేఽఖిల ధర్మదేహాయ చాత్మ, నేఽనిరుద్ధాయ నిభృతాత్మనే నమోఽస్తు.

703

తా ॥ స్వర్గానికి, మోక్షానికి మధ్య చక్కని ద్వారమైన వానికి నమస్కారం. అన్ని రసములకు ఆత్మయైన జలరూపుడవు. దేహేంద్రియాది మనోవికారాలు అంటని కేవల శ్వాసరూప ప్రణవమూర్తివి. కర్మఫలముల స్వరూపివి. సజ్జనులకు హితఫలరూపివి. సకల ధర్మముల అంతర్యామివి. కృష్ణుడవు, సర్వశక్తి యుక్తుడవు. గొప్పవారైన సాంఖ్యయోగులకు ఈశ్వరుడవు. హిరణ్యగర్భుడవు. రుద్రుడవు, శిష్టరక్షకుడవు, దుష్టశిక్షకుడవు. శూన్యమునందు ప్రవర్తించేవాడవు, కర్మస్వరూపుడవు. మృత్యుదేవతవు. విరాట్‌శరీరుడవు. నిఖిలధర్మ స్వరూపివి. వాక్‌సంపదలోని వైభవం నీవే. విరమించే సంకల్పంలోని అంతర్యామివి నీవే. సజ్జనుల పుణ్యముల యొక్క తేజస్సు నీవే. సకల ధర్మాల స్వరూపం నీవే. ఆత్మస్వరూపుడవు. నిరోధించుటకు సాధ్యపడని అనిరుద్ధుడవు. వృద్ధిక్షయాలులేని నిశ్చలుడవు. అటువంటి నీకు నమస్కారం.

తే. సర్వ సత్తాయ దేవాయ సన్నియామ, కాయ బహిర న్తరాత్మనే కారణాత్మ
నే సమస్తార్థ లిఙ్గాయ నిర్గుణాయ, వేధసే జితాత్మక సాధవే నమోఽస్తు.

704

తా ॥ సర్వసత్త్వుడవైన నీకు నమస్కారం. దైవానివి, నియామకుడవు. బయటా లోపల వ్యాపించి ఉండే అంతర్యామివి. దేనికైనా కారణరూపంగా వెలుగొందే వాడివి. సమస్త ప్రయోజనానికి చిహ్నంగా నిలచిన స్వరూపుడవు. నిర్గుణుడవు, బ్రహ్మస్వరూపుడవు. తనను తాను జయించిన వానికి సాధుస్వరూపుడవు. అటువంటి నీకు నమస్కారం.

వ. అని మఱియుఁ బ్రద్యుమ్నుం డవు నంతరాత్మవు సమస్త శేషకారణుండవు చాతుర్హోత్రరూపుండవు నంతకుండవు సర్వజ్ఞుండవు జ్ఞాన క్రియారూపుండవు నంతఃకరణవాసివియు నైన నీకు నమస్కరింతునని.

705

తా ॥ ఇంకా నీవు ప్రద్యుమ్నుడవు, అంతరాత్మవు, సమస్తశేషకారణుడవు, నాలుగు హోమస్థానాలలో ప్రయోగించే మంత్రాల రూపమైనవాడవు, సర్వజ్ఞుడవు. జ్ఞానక్రియాస్వరూపుడవు. అంతఃకరణంలో వసించేవాడివి. అటువంటి నీకు నమస్కారం.

క. అనఘా! దేవ! భవత్పద, వనరుహ సందర్శనేచ్ఛ వఱలిన మాకున్
విను వైష్ణవ సత్కృతమై, యెనయు భవద్దర్శనంబు నీవె మహాత్మా!

706

తా ॥ ఓ పుణ్యాత్మా! దేవా! నీ పాదపద్మాలను సందర్శించాలనే కోరిక మాకు అధికమయ్యింది. భక్తుల ద్వారా పూజలందుకొని ప్రకాశించే నీ దర్శనాన్ని ప్రసాదించవలసిందిగా అభ్యర్థిస్తున్నాం.

వ. అది యెట్టి దనిన.

707

తా ॥ నీ సందర్శనం ఎటువంటిదంటే,

క. అనఘ! సకలేంద్రియగుణాం, జనమును భక్త ప్రియంబు జలదశ్యామం
బును సౌందర్య సమగ్రము, ననుపమమును నిత్య మంగళావహ మగుచున్.

708

తా ॥ ఓ పాపరహితుడా! నీ దివ్యరూపము నీలమేఘవర్ణము. సకల ఇంద్రియాలకు

సంతోషప్రదము. భక్తులకు ప్రియమైనది. సంపూర్ణ సౌందర్యసమేతము. శాశ్వత శుభావహమైంది.

వ. మఱియును.

709

తా ॥ ఇంకా,

సీ. అళికులోపమ లసదలక శోభిత మగు, నమృతాంశు రేఖానిభాననమును
సమకర్ణ దివ్య భూషా ప్రభాకలితంబు, సుందర భ్రూనాస సురుచిరంబు
సలలిత కుంద కుట్మల సన్నిభ ద్విజ, పూరిత స్నిగ్ధ కపోల యుగముఁ
బద్మ పలాశ శోభన లోచనంబును, మందస్మితాపాంగ సుందరమును

తే. సస్మితాలోక సతత ప్రసన్న ముఖముఁ, గంబు సుందర రుచిర మంగళ గళంబు
హారమణి కుండల ప్రభాపూర కలిత, చారు మృగరాజ సన్నిభ స్కంధ యుతము.

710

తా ॥ తుమ్మెదల గుంపులవలె కదలుతున్నట్లున్న ముంగురులు, చంద్రరేఖవంటి నుదురు, దివ్య భూషణాల కాంతులతో ప్రకాశించే చెవులు, అందమైన కనుబొమలు, సొగసైన ముక్కు, మల్లెమొగ్గలవంటతెల్లని పలువరుస, నిగ్గు దేరిన చెక్కిళ్ళు, తమ్మిరేకుల్లా ప్రకాశించేకళ్ళు, చిరునవ్వులు తొణికిసలాడే కటాక్షాలు, చిరునవ్వులు చిందించే చూపులతో కూడిన ప్రసన్నముఖము, శంఖంవంటి సుందరమైన కంఠం, హారాలు మణికుండలాలు వెదజల్లే కాంతులతో ప్రకాశించే భుజాలు, సింహంవంటి నడుముతో నీ రూపం శోభిస్తోంది.

వ. వెండియు శంఖ చక్ర గదా పద్మ కలితాయత బాహు చతుష్టయంబును, వైజయంతీ వనమాలికా కౌస్తుభమణి శ్రీవిరాజితంబును, నిత్యానపాయిని యయిన యిందిరా సుందరీ

రత్న పరిస్పందంబునం దనరి తిరస్కృత నికషోపల వక్షస్థ్సలంబును, నుచ్ఛ్వాస నిశ్వాసంబులం జంచలంబులైన వళిత్రయ రుచిర ప్రకాశమాన దళోదరంబును, బూర్వవినిర్గత నిఖిల విశ్వంబునుం బ్రవిష్టంబుఁ జేయురీతి నొందు సలిలావర్త సన్నిభ గంభీరనాభీ వివరంబును, బంకజ కింజల్క విభాసిత దుకూలనిబద్ధ కనక మేఖలా కలాప శోభితశ్యామ పృథు నితంబ బింబంబును, నీల కదళీ స్తంభరుచిరోరు యుగలంబును, సమచారు జంఘంబును, నిమ్నజాను యుగళంబును, బద్మపత్ర భాసుర పాదద్వయంబును, మదీయాంతరంగ తమోనివారక నిర్మల చంద్రశకల సన్నిభనఖంబును, గిరీట కుండల గ్రైవేయహార కేయూర వలయ ముద్రికా మణి నూపురాది వివిధ భూషణ భూషితంబును, నిరస్త సమస్త నతజన సాధ్వసంబును, భక్తజన మనోహరంబును సర్వమంగళాకరంబును నైన భగవద్దివ్య రూపంబుఁ దామసజన సన్మార్గ ప్రదర్శకుండవైన నీవు మాకుఁ జూపి మమ్ముఁ గృతార్థులం జేయుమని వెండియు నిట్లనియె.

711

తా ॥ శంఖచక్రగదాపద్మాలు ధరించిన నాలుగు చేతులు కలవాడవు. 'వైజయంతి' అనే వనమాలికను, కౌస్తుభమణిని, లక్ష్మీదేవి అనే రత్నపుటద్దాన్ని వక్షఃస్థలాన ధరిస్తావు. నిత్యానపాయినియైన లక్ష్మితో కూడిన విష్ణుని వక్షఃస్థలం గీటురాయిలా ఉంటుంది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో కదలుతూ, మూడుముడుతలతో పొట్ట అలరారుతుంటుంది. నీటి సుడిగుండంవలె లోతైన నాభిరంధ్రం, ఈ వెలువడిన సృష్టినంతటినీ మళ్ళీ తనలోకే ప్రవేశింప జేసేలా ఉంది. పద్మకేసరాలవలె ప్రకాశించే పట్టుపీతాంబరం, బంగారు మొలనూలు, నల్లని బలిష్ఠమైన పిరుదులపై అలరారుతుంటాయి. నల్లని అరటి బోదెల్లాగా మరుగులు చిమ్మే తొడలు, అందమైన పిక్కలతో ఒప్పుతుంటాయి. మోకాటి చిప్పల దిగువనకనిపించే చిన్నిగుంటలు, పద్మపత్రాలవంటి పాదాలు, నా మనస్సులోని చీకటిని పోగొట్టే నిర్మలమైన చంద్రవంకవంటి గోరు, కిరీటం, కుండలాలు, కంఠహారాలు, ముత్యాలదండలు, భుజకీర్తులు, కంకణాలు, ఉంగరాలు, మణులు తాపిన అందెలు మొదలైన వివిధ భూషణాల చేత భూషించబడి, నతులై

నమస్కరించినవారి సమస్త భయాలను పోగొట్టి, భక్తుల మనస్సుల్ని హరించేదీ, సమస్త మంగళాలకు నిలయమైనదీ నీ దివ్యరూపం. తమోగుణంతో సంచరించే వారికి కూడా సన్మార్గాన్ని చూపించే నీవు, నీ దివ్యరూపాన్ని మాకు చూపించి మమ్మల్ని కృతార్థులను చెయ్యి.

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించు వారికి ధ్యేయ వస్తువు భవద్దివ్యమూర్తి!
యంచిత స్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధిక స్పృహణీయతముఁడ వీవు,
సద్భక్తియుత భక్తజన సులభుండవు దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ.
వాత్మదర్శనులకు నరయ గమ్యుండవు నై యర్థి విలసిల్లు దనఘచరిత!

తే. యిట్టి నిఖిల దురారాధ్య నీశు నిన్ను, నెఱయ సుజనులకైన వర్ణింపరాదు,
వఱల నెవ్వఁడు పూజించుఁవాడు విడువఁ, జాలునే పద్మదళ నేత్ర! సచ్చరిత్ర!

712

తా ॥ ఓ పద్మదళనేత్రా! పుణ్యచరిత్రా! మనస్సును పవిత్రం చేయాలని కోరుకునే వారికి, నీ దివ్యమూర్తి ధ్యానింపదగిన వస్తువు. స్వర్గరాజ్యాభిషిక్తుడైన వాడికి కూడా మిక్కిలి కోరదగినవాడవు నీవు. సద్భక్తిగల భక్తజనులకు సులభుడవు. దుష్టాత్ములకు దుర్లభుడవు. ఆత్మదర్శనం చేయగల ఆత్మజ్ఞులకు ఆత్మస్వరూపుడవై చెంతకు చేరుకుంటున్నావు. ఇలా ఆరాధించడానికి అందరికీ దుర్లభమైన నిన్ను సుజనులు సైతం వర్ణించలేరు, నిన్ను పూజించేవాడు విడువలేడు.

చ. ఎనసిన భక్తి యోగమున నే భవదీయపదాబ్జ మొందఁగా
ననయముఁ గోరువాఁడు చటులాగ్రహభీషణ వీర్యశౌర్య త
ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించు న
య్యనుపముఁడైన కాలుని భయంబును బొందఁడు సుమ్ము కావునన్.

713

తా ॥ విస్తరించిన భక్తియోగంతో, నీ పాదపద్మాలను పొందాలని కోరేవాడు, తీవ్రకోపంతో, భయంకరంగా, బలశౌర్యాలతో భయపెడుతూ సర్వలోకాలనూ ధ్వంసం చేసే యమునికి కూడా భయపడడు.

తే. ఇట్టి నీ పాదమూలంబు లెవ్వఁడేని, బొంది ధన్యాత్ముఁడౌ నట్టి పుణ్యుఁ డొందు
మనము లోపలఁ గోరునే మఱచియైన, నవ్యయానంద! గోవింద! హరి! ముకుంద!

714

తా ॥ ఇటువంటి నీ పాదమూలాన్ని ఆశ్రయించి, ధన్యుడైన పుణ్యాత్ముడు, మరచిపోయికూడా మదిలో మరొక వస్తువును కోరడు. అవ్యయానందా! గోవిందా! ముకుందా! హరి! నమస్సులు.

క. హరి! నీ భక్త జనులతో, నిరుపమగతిఁ జెలిమిసేయు నిమిషార్ధముతో
సరిగాదు మోక్ష మనిన న, చిరశుభ మగు మర్త్య సుఖముఁ జెప్పఁగ నేలా?

715

తా ॥ ఓ హరి! సాటిలేని నీ భక్తులతో చేసే స్నేహం అరనిమిషమైనా చాలు. ఎందుకంటే దానితో మోక్షం కూడా సమానం కాదు. అటువంటప్పుడు క్షణికాలైన లౌకిక సుఖాలను గురించి చెప్పేదేముంది?

క. దురిత వినాశక పదపం, కరుహఁ భవత్కీర్తి తీర్థకణచయ బాహ్యం
తర సేక ధూత కల్మష, పురుషులు ధరమీఁదఁ దీర్థభూతులు గారే!

716

తా ॥ పాపాలను నశింపచేసే పాదపద్మాలు గలవాడా! నీ సంకీర్తనమనే పుణ్యనదీ జల కణాలతో, లోపలి, వెలుపలి మాలిన్యాలను క్షాళనం చేసుకున్న జనులు, పవిత్రమైన పుణ్యతీర్థం

వంటివారు.

వ. అట్టి భూతదయాసమేతులను రాగాది విరహిత చిత్తులును నార్జవాది గుణ యుక్తులును నయిన భాగవత జనుల సంగంబు మాకుం గలుగంజేయు, మిదియ మమ్మనుగ్రహించుట యని వెండియు నిట్లనియె.

717

తా ॥ అటువంటి భూతదయ కలవారు, రాగద్వేషాదులు లేని చిత్తం కలవారు, ఋజుమార్గవర్తనులైన సుగుణయుక్తులూ అయిన భాగవత జనుల సహవాసాన్ని మాకు కలిగించవలసిందిగా కోరుతున్నాము. ఇదే మమ్మల్ని అనుగ్రహించడంగా తలుస్తాము.

చ. సరసిజనాభ! సత్పురుష సంగసమంచిత భక్తి యోగ వి
స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవాని చిత్త మ
స్థిర బహిరంగముం గనదు, చెందదు భూరితమస్స్వరూపసం
సరణ గుహం జిరంబు గనఁజాలు భవన్మహనీయతత్త్వమున్

718

తా ॥ ఓ పద్మనాభా! సజ్జనసాంగత్యం వల్ల కలిగిన భక్తియోగం చేత అనుగ్రహించబడి పరిశుద్ధులైనవారి మనస్సు, అస్థిరమైన బాహ్యవిషయాలలో చిక్కుకోదు. మిక్కిలి చీకటి స్వరూపమైన సంసారమనే గుహలో ప్రవేశించదు. నీదైన మహనీయ తత్త్వాన్ని తెలుసుకోగలదు.

వ. అది యెట్టిదనిన.

719

తా ॥ అది ఎటువంటిదంటే,

సీ. అరయంగ నేమిటి యందు నీ విశ్వంబు విదితమై యుండు నీ విశ్వమందు

నేది ప్రకాశించు? నెప్పుడు నట్టి స్వయంజ్యోతి నిత్యంబు నవ్యయంబు
నాకాశమును బోలి యవిరళ వ్యాపక మగు నాత్మతత్త్వంబు నధిక మహిమ
నమరు పరబ్రహ్మ మగు నని పల్కి యి ట్టనియె నవిక్రముండైన వాఁడు

తే. నెవ్వఁ డాతఁడు దనయందు నెపుడు నాత్మ, కార్యకరణ సమర్థంబు గాని భేద
బుద్ధి జనకంబు నాఁదగు భూరిమాయఁ, జేసి విశ్వంబు సత్యంబుగా సృజించె.

720

తా ॥ దేనియందు ఈ విశ్వం విశదంగా కనిపిస్తుందో, ఈ విశ్వంలో నిండి ఏది నిరంతరం ప్రకాశిస్తుందో, ఆ స్వయంజ్యోతి, శాశ్వతమైనది, అవ్యయమైనది. ఆకాశంలా సమస్తమూ వ్యాపించినది. అటువంటి ఆత్మతత్త్వమే పరబ్రహ్మం. ఆ పరబ్రహ్మం వికారం లేనిది. భేదబుద్ధిని కలిగించే మాయచేత, ఈ విశ్వాన్ని సృష్టించి, అదే సత్యంగా తోచేటట్లు చేశాడు.

ఆ. మరలఁ మరలఁ బెక్కుమాఱు లీ విశ్వంబు, జనన వృద్ధి విలయ సంగతులను
నందఁ జేయుచుండు నట్టి యీశ్వరుఁడవై, తనరు నిన్ను నాత్మ తత్త్వముగను.

721

తా ॥ మళ్ళీ మళ్ళీ అనేకసార్లు ఈ విశ్వాన్ని సృష్టించి, పోషించి వృద్ధిచేసి, లయం చేసే ఈశ్వరుడవై ప్రకాశించే నిన్ను ఆత్మతత్త్వంగా–

వ. తెలియుదు మని వెండియు నిట్లనియె, యోగపరాయణు లగువారు శ్రద్ధా సమన్వితులై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితం బయిన భవదీయ రూపంబు యజింతురు, వారు వేదాగమతత్త్వ జ్ఞానులు, నీ వాద్యుండవును ననాదియు నద్వితీయుండవును మాయాశక్తి యుక్తుండవునునై విలసిల్లుచుండుదు వట్టి మాయాశక్తిచేత.

722

తా ॥ తెలుసుకున్నాను. యోగపరాయణులైనవారు శ్రద్ధతో, తాముచేసే పనులతో మదిలో ఉపలక్షితమైన నీ రూపాన్నే అర్చిస్తారు. వాళ్ళు వేదాల మూల తత్త్వం తెలిసిన జ్ఞానులు. నీవు ఆద్యుడవు. మొదలు లేనివాడివి. అద్వితీయుడవు. మాయాశక్తి యుక్తుడవై ప్రకాశిస్తావు. అటువంటి మాయాశక్తిచేత–

సీ. చతురాత్మ! సత్త్వరజస్తమోగుణములు వరుస జనించెను, వాని వలన
మహదహంకార తన్మాత్రనభోమరు దనల జలావని ముని సుపర్వ
భూతగణాత్మక స్ఫురణ నీ విశ్వంబు భిన్న రూపమున నుత్పన్న మయ్యె,
దేవ! యీ గతి భవదీయ మాయను జేసి రూఢిఁ జతుర్విధ రూపమైన

తే. పురము నాత్మాంశమునఁ జెందు పురుషుఁ డింద్రి, యములచే విషయ సుఖము లనుభవించు మహిని మధుమక్షికాకృత మధువుఁ బోలి, యతనిఁ బురవర్తి యగు జీవుఁ డండ్రు మఱియు.

723

తా ॥ సత్త్వరజస్తమో గుణాలు వరుసగా జన్మించాయి. ఆ త్రిగుణాలవల్ల మహత్తు, అహంకారం, శబ్దస్పర్శరూపరసగుణాలనే పంచతన్మాత్రలు – ఆకాశం, గాలి, నీరు, అగ్ని, భూమి, ఋషులు, దేవతలు, భూతగణాలు మున్నగు ఈ విశ్వం ప్రభవించింది. ఈ విధమైన నీ మాయచేత నాలుగు విధాలైన రూపాలతో కూడిన పురాన్ని (దేహాన్ని) నిర్మించావు. అవికూడా నీలోని అంశాలే. ఈ పురమున చేరిన నీవు పురుషుడవై, తేనెటీగ తేనెను గ్రోలినట్లు ఇంద్రియాలతో ఇంద్రియసుఖాన్ని అనుభవిస్తున్నావు. ఈ పురము (దేహం) నందున్నపుడు నీవే జీవునిగా పేర్కొనబడుతున్నావు.

ఆధ్యాత్మికార్థంలో పురమే దేహం. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనే నాలుగు వ్యూహాలతో నిర్మించబడినదే దేహం. ఆ విషయాన్నే నాలుగు విధాలైన రూపాలతో పురాన్ని నిర్మించావని భగవంతుణ్ణి ఉద్దేశించి చెప్పటం. అలాగే పురుషుడంటే, ఈ పురంలో నున్న

జీవుడేనన్న సాంకేతికార్థాన్ని కూడా మనం ఇక్కడ గమనించాలి.

వ. ఇట్టి జగత్సర్జకుండవైన నీవు.

724

తా ॥ ఇలా జగత్తును సృష్టించే నీవు,

క. భూత గణంబుల చేతనె, భూతగణంబులను మేఘ పుంజంబుల ని
ర్ధూతముగఁ జేయు ననిలుని, భాతిని జరియింపఁ జేసి పౌరుష మొప్పన్.

725

తా ॥ పెనుగాలిచేత చెదరగొట్టబడిన మేఘసమూహంలాగ, భూతగణాలను భూతగణాలచేతనే నడిపించి, పాలిస్తున్నావు.

తే. రూఢిఁ దత్తత్క్రియాలబ్ధ రూపుఁ డవును, సుమహిత స్ఫురదమిత తేజుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘన భుజా విపుల మహిమ, విశ్వసంహార మర్థిఁ గావింతు వీశ!

726

తా ॥ రూఢంగా, ఆ యా పనులకు ఆ యా రూపాలను ధరించి, ప్రకాశించే గొప్ప తేజస్సుతో, తీవ్ర వేగంతో, గొప్ప భుజబలంతో ఈ విశ్వాన్ని నీవు ఉపసంహరిస్తావు.

వ. అది యెట్లనిన.

727

తా ॥ అది ఎలాగంటే,

క. ఇతి కర్తవ్య విచారక, మతిచేఁదగ నెప్పుడుం బ్రమత్తంబును సం
చిత విషయ లాలసము నూ, ర్జిత లోభము నైన యట్టి సృష్టి గడంకన్.

728

తే. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష! నీవు, మ్రింగుదువు చాల నాఁకట వ్రేఁగు చుండి
నాలుకలు గ్రోయు భూరిపన్నగము వాతఁ బడిన యెలుకను భక్షించు పగిది ననఘ!

729

తా ॥ ఓ పద్మాక్షా! కూడబెట్టుకున్న లోభంతో, కర్తవ్య విచారణ చేయలేని ఈ సృష్టిని అప్రమత్తుడవై నీవు నశింపజేస్తావు. అదెలాగంటే ఆకలి బాధతో తల్లడిల్లే పెనుబాము నాలుకలు చాచగా, దాని నోట పడిన ఎలుకలా నీవు ఈ సృష్టిని మింగేస్తావు.

చ. అనిశము నస్మదీయగురుఁడైన సరోరుహ సంభవుండు న
మ్మనువులు నాత్మసంశయము మాని భజించు భవత్పదాబ్జముల్
మనమున నిల్పి యుష్మదవమాన మహావ్యథఁ జెందునట్టి స
జ్జనుఁడు పరిత్యజించునె? భుజంగమతల్పక! భక్త కల్పకా!

730

తా ॥ ఓ శేషతల్పశాయి! భక్తకల్పద్రుమా! నా తండ్రియైన బ్రహ్మదేవుడు, మనువులు, మనస్సులో సందేహాన్ని వీడి, దృఢవిశ్వాసంతో నీ పాదపద్మాలనే మదిలో నిలుపుకొని భజిస్తున్నారు. నీవు కల్పించిన అవమానమనే మహావ్యథను పొందినప్పటికీ, సజ్జనుడు నీ పాదపద్మాలను విడిచిపెడతాడా?

క. కావున నాకును సూరి జ, నావళికిని సర్వసంశయంబులు వాపం
గావను బ్రోవను దగు గతి, నీవని వినుతించు నట్టి యీ స్తవ మెలమిన్.

731

తా ॥ కాబట్టి నాకు, విద్వజ్జనులకు, సర్వసంశయాలను పోగొట్టి రక్షించగలవాడివి నీవే!"

వ. రుద్రుండు ప్రచేతసుల కెఱింగించి వెండియు నిట్లనియెఁ, బ్రచేతసులారా! యిట్టి యోగాదేశ నామకంబైన యీ స్తోత్రంబు బహువారావృత్తిచేఁ బఠించి మనంబున ధరియించి సమాహిత చిత్తులై మీరందఱు నాదరంబున విశ్వాసయుక్తులును, స్వధర్మాచార వంతులును భగవదర్పితాశయులును నై జపియించుచు సర్వభూతావస్థితుండు నాత్మారాముండు నైన సర్వేశ్వరుని నుతించుచు ధ్యానయుక్తంబుగాఁ బూజించుచుండుఁడు, తొల్లి యీ స్తోత్రంబు భగవంతుండైన పద్మసంభవుండు సిసృక్షు వగుచు నాత్మజులమైన మాకును సృజియింప నిచ్ఛగించు భృగ్వాదులకును నెఱింగించె, మేము నా భృగ్వాదులును ప్రజాసర్గంబునందు బ్రహ్మ చోదితులమై యీ స్తోత్రంబునం జేసి విధ్వస్త సమస్త తమోగుణులమై వివిధ ప్రజాసర్గంబు గావించితిమి, కావున నీ స్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్ర చిత్తుండును వాసుదేవ పరాయణుండునై యెవ్వండు జపియించు, వాఁడు వేగంబె శ్రేయస్సును బొంది తదీయ జ్ఞాన ప్లవంబున

వ్యసనార్ణవ రూపంబయిన సంసారంబును సుఖతరంబుగఁ దరియించు, నిట్టి మదుపదిష్టంబయిన శ్రీహరి స్తవంబు నెవ్వండు సదువుచు దురారాధ్యుండైన శ్రీహరిం బూజించు వాఁడు మదుక్త స్తోత్ర గాన సంతుష్టుండును శ్రేయస్సులకు నేకాశ్రయ భూతుండును నగు, శ్రీమన్నారాయణుని వలన సమస్తాభీష్టంబులం బొందు, నెవ్వండు ప్రభాతంబున లేచి ప్రాంజలియు శ్రద్ధా సమన్వితుండునై యీ మంగళస్తవరాజంబును విను, వినుపించు వాఁ డు కర్మబంధ విముక్తుండగు నని మఱియు నిట్లనియె.

732

తా ॥ అని రుద్రుడు, ప్రచేతసులకు తెలియజెప్పి మళ్ళీ ఇలా అన్నాడు: "ప్రచేతసులారా! ఇటువంటి 'యోగస్థితి' ని ఉపదేశించే 'యోగాదేశమ' నే పేరుగల ఈ స్తోత్రాన్ని, అనేక పర్యాయాలు మళ్ళీ మళ్ళీ చదివి, మనస్సులో నిలుపుకొని, నిశ్చలమైన బుద్ధితో, విశ్వాసంతో జపించండి. స్వధర్మాచార పరాయణులై, భగవంతునకు అర్పించిన ఆశయాలు కలవారై ఈ స్తోత్రాన్ని జపిస్తూ, సమస్త జీవులలోనున్న ఆ అంతర్యామిని, ఆత్మారాముని, సర్వేశ్వరుణ్ణీ కీర్తిస్తూ

ధ్యానశీలురై పూజించండి. ఈ స్తోత్రాన్ని తొలుత, భగవంతుడైన బ్రహ్మదేవుడు సృష్టిని చేయగోరి, పుత్రులమైన మాకు, ఇదే సంకల్పంగల భృగువు మొదలైన మునీంద్రులకు ఉపదేశించాడు. మేము, ఆ భృగ్వాదులు ప్రజాసృష్టి చేయడానికి బ్రహ్మచే ప్రేరితులమై, ఈ స్తోత్రమహిమతో తమోగుణాన్ని వీడి సృష్టిని చేయగలిగాము.

కాబట్టి వాసుదేవుని యందు ఏకాగ్రచిత్తుడై, ఈ స్తోత్రాన్ని ఎవడు జపిస్తాడో, వాడు వెంటనే శ్రేయస్సును పొందుతాడు. అజ్ఞానమనే తెప్పను ఆధారంగా చేసుకొని, బాధల సముద్రమైన సంసారాన్ని సుఖతరంగా దాటుతాడు. నాచే ఉపదేశింపబడిన ఈ శ్రీహరి స్తోత్రాన్ని చదువుతూ, ఆరాధించడానికి దుర్లభుడైన శ్రీహరిని ఎవడు పూజిస్తాడో, వాడు శ్రేయస్సులకు ఏకాశ్రయమైన నారాయణునివల్ల కోరిన కోర్కెలను పొందుతాడు. నాచే చెప్పబడిన ఈ స్తోత్రాన్ని ఎవడు ప్రభాత సమయాన లేచి, శ్రద్ధతో, అంజలి ఘటించి వింటాడో, వినిపిస్తాడో వాడు కర్మబంధ విముక్తుడవుతాడు.

క. నరదేవతనయులారా!, పురుషాధీశుండుఁ బరమపురుషుఁడు నగు నీ
శ్వరు సుస్తోత్రము మీ కా, దరమునఁ దెలిపితిని, మీరు దద్దయు భ క్తిన్.

733

తా ॥ ఓ రాకుమారులారా! జీవులకు అధిపతి, పరమపురుషుడునైన శ్రీహరి స్తోత్రాన్ని మీకు తెలియచేశాను. మీరు కూడా భక్తితో,

క. ఏకాగ్రచిత్తులును సు, శ్లోకులునై జపము సేయుచును ఘనతపముం
గైకొని చేసిన మీకును, జేకుఱు మహితేప్సితార్థ సిద్ధి గడంకన్.

734

తా ॥ ఏకాగ్రచిత్తులై, చక్కని నడవడిక కలవారై, ఈ స్తోత్రాన్ని జపిస్తూ, గొప్ప తపస్సును చేయండి. మీరు కోరుకున్న గొప్ప కోర్కెలు సిద్ధిస్తాయి.”

క. అని యీ గతి నుపదేశం, బొనరించి సదాశివుండు నొగి వారలచే
తను బూజితుఁడై వారలు, గన నంతర్ధానుఁ డయ్యెఁ గౌతుక మొప్పన్.

735

తా ॥ అని ఈ విధంగా ఉపదేశించి, ప్రచేతసుల పూజలను స్వీకరించి, వాళ్ళు చూస్తుండగానే ఈశ్వరుడు అంతర్ధానుడయ్యాడు.

వ. అంత.

736

తా ॥ ఆ తరువాత,

తే. తివుట వారలు రుద్రోపదిష్టమైన, యచ్యుత స్తవము జపించు చయుత సంఖ్య
వత్సరము లుగ్ర తపము దుర్వార వారి, మధ్యమునఁ జేయుచున్న సమయమునందు.

737

తా ॥ ప్రచేతసులు, రుద్రుడు ఉపదేశించిన విష్ణుస్తోత్రాన్ని కోరి జపిస్తూ, పదివేల సంవత్సరాలు, నీటి మధ్యనే నిలబడి భయంకరమైన తీవ్ర తపస్సు చేశారు.

## 27. నారదుడు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును తెలియజేయుట

వ. ఘనకర్మాసక్త చిత్తుండై యున్న ప్రాచీనబర్హి కడకు నధ్యాత్మవేదియుం గృపాళువు నైన నారదుండు సనుదెంచి యా రాజునకు జ్ఞాన బోధంబు సేయుకొఱకు నతనితో నిట్లనియె, రాజా! యీ కర్మంబునం జేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్న వాఁడట్టి యనిష్ట నిరసనంబు నభీష్ట ప్రాప్తి కరంబు నయిన శ్రేయం బీ కర్మంబు వలన లభింప దనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె.

738

తా ॥ గొప్ప కార్యం చేయాలన్న ఆసక్తిగల మనస్సుతోనున్న 'ప్రాచీనబర్హి' వద్దకు, అధ్యాత్మ తత్త్వవేత్త, దయామయుడునైన నారదుడు వచ్చాడు. ఆ రాజుకు జ్ఞానబోధ చేసే ఉద్దేశంతో, ఇలా అన్నాడు: "ఓ రాజా! ఈ కర్మాచరణ వలన ఏ శుభాన్ని కోరుతున్నావు? అశుభాలు తొలగి, కోరిన కోర్కెలు నెరవేరాలని కదా! నీవు కోరుకుంటున్నది. అటువంటి శ్రేయస్సు నీకు ఈ కర్మాచరణ వలన లభించదు." అని పలుకగా, ప్రాచీనబర్హి నారదునితో ఇలా అన్నాడు:

సీ. అనఘ! మునీంద్ర! మహాభాగ! యేను గర్మాపవిద్ధ జ్ఞాని నగుచు మోక్ష
మెఱుఁగంగ లే నైతి నిట్టి నా కిప్పుడు గడు విమలంబును గర్మబంధ
నాశకంబును నగు జ్ఞానోపదేశంబు గావింపు మతిదయాకార! కూట
ధర్మంబులగు గేహతతులందుఁ జెంది జా, యా తనూజాత ధనాదికములె

తే. భూరి పురుషార్థములు గాఁగ బుద్ధిఁ దలఁచు, మతివిహీనుండు సంసార మార్గములను
దగఁ బరిభ్రామ్యమాణుఁడై యొగిని మోక్ష, పదము నొందంగఁ జాలఁడు భవ్యచరిత!

739

తా ॥ "ఓ పుణ్యాత్మా! మునీంద్రా! మహానుభావా! కర్మాసక్తివల్ల నాకు జ్ఞానం నశించింది. మోక్షస్థితిని తెలుసుకోలేక పోయాను. ఇటువంటి నాకు, నిర్మలమైనది, కర్మబంధనాశకమైనదీ

అయిన జ్ఞానోపదేశం చేయమని కోరుతున్నాను. కరుణామూర్తీ! కపటధర్మాలకు నిలయమైన గృహాలలో, భార్యాబిడ్డలు, ధనము మొదలగు వాటినే గొప్ప పురుషార్థాలుగా భావించి, సంసార చక్రంలో పరిభ్రమించేవాడు మోక్షపదాన్ని పొందలేడు."

క. అనవుఁడు నతనికి నతఁ డను, ననఘా! యీ యధ్వరంబులందును గృప మా
లిన నీచే విశసింపం, జని కూలిన పసుల వేల సంఖ్యలఁ గనుమా!

740

తా ॥ అలా పలికిన ప్రాచీనబర్హితో నారదుడిలా అన్నాడు: "ఓ పుణ్యాత్మా! ఈ యజ్ఞాలలో, దయమాలి నీ చేత చంపబడిన జంతువులు వేలసంఖ్యలో ఉన్నాయి! చూడు!

వ. కావునం బశువ్రాతంబులు త్వదీయవైశసంబును స్మరించుచున్నవై లోహయంత్రమయ శృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడు నిన్ను హింసింతు మని భవదీయమృతికి నెదురుచూచు చున్న, విట్టి సంకటంబు నొందం గల నీకు నిస్తారకం బయిన యొక్క యితిహాసంబు గల దెఱింగింతు విను మని యిట్లనియె.

741

తా ॥ ఆ పశుసమూహాలు, నీ కసాయితనాన్ని స్మరిస్తూ, లోహపు యంత్రాలచే చేయబడిన కొమ్ములతో నిన్ను హింసించాలని, ఎప్పుడు నీవు పరలోకం చేరుతావా? అని నీ చావుకు ఎదురుచూస్తున్నాయి. ఇటువంటి కష్టాన్ని పొందబోతున్న నీకు, ఆపద నుండి దాటించే ఒక ఇతిహాసాన్ని వివరిస్తాను. విను" అని ఇలా చెప్పాడు:

## 28. పురంజనోపాఖ్యానము

సీ. భూమీశ! విను మయ్య పూర్వకాలమునఁ బురంజనుం డను నొక్క రాజు గలఁడు,
అతని కవిజ్ఞాతుఁ డనుపేరఁ దగిలి విజ్ఞాత చేష్టితుఁ డగు సఖుఁడు కలఁడు,
ఆ పురంజనుఁడు పురాన్వేషియై ధరాచక్రంబుఁ గలయంగ సంచరించి
తన కనురూపమై పెనుపొందు పుర మెందు వీక్షింపఁ జాలక విమనుఁ డగుచు

తే. నే పురము లుర్విఁ బొడఁగనె నా పురములు, గామములఁ గోరు తనకు న
క్కామములను
బొందుటకు వానిని ననర్హములుగఁ దన మ, నమునఁ దలఁచి యొకానొకనాఁ డతండు.

742

తా ॥ "ఓ రాజా! విను. పూర్వకాలంలో పురంజనుడనే రాజు ఉండేవాడు. అతనికి విజ్ఞాతుడనే పేరుగల స్నేహితుడు ఉన్నాడు. అతడు విజ్ఞానచేష్టితుడు, అంటే జ్ఞానంతో కూడిన ప్రవర్తన గలవాడు. అటువంటి స్నేహితునితో కలసి, తనకు అనుకూలమైన పురం కోసం భూమండలమంతా తిరిగాడు. కనిపించిన ప్రతీ పురంలోను తన కోరికలు తీరే సదుపాయాలు లేకపోవడంతో, అవి పనికిరానివని మదిలో భావించాడు. ఒకనాడు–

వ. చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణ సానువులందు.

743

తా ॥ ఆ అన్వేషణలో, హిమాలయ పర్వతపు దక్షిణసానువులలో–

సీ. వరనవ ద్వార కవాట గవాక్ష తోరణ దేహళీగోపురముల నొప్పి
ప్రాకార యంత్రవప్రప్రతోళీ పరిఘాట్టాల కోపవనాళిఁ దనరి
సౌవర్ణ రౌప్యాయన ఘన శృంగంబుల రమణీయ వివిధ గేహముల మించి

రథ్యాసభా చత్వరధ్వజ క్రీడాయతన సుచైత్యాపణతతిఁ దనర్చి

తే. మరకత స్ఫటిక విదూర మణి వినూత్న, మౌక్తికాయుత ఖచిత హర్మ్యములు గలిగి
విద్రుమ ద్రుమ వేదుల వెలయు నొక్క, పురముఁ గనియె భోగవతినిఁ బోలు దాని.

744

తా ॥ భోగవతి లాంటి ఒక పురాన్ని చూశాడు. అది తొమ్మిది ద్వారాలు, ద్వారబంధాలు, కిటికీలు, తోరణాలు, గుమ్మాలు, గోపురాలు, ప్రాకారాలు, యంత్రాలతోకూడిన బురుజులు, కందకాలు, ఉద్యానవనాలు, బంగారు, వెండి, ఇనుము మొదలగు వాటిచే నిర్మించబడిన శిఖరాలతో అందమైన గృహాలు, రథాలు పోయే దారులు, నాలుగుబాటలు కలిసే కూడళ్ళు, పెద్దపతాకాలెగిరే జెండాస్తంభాలు, క్రీడాగృహాలు, రచ్చబండలు, అంగళ్ళు, పచ్చలు, స్ఫటికాలు, రత్నాలు, మణులు, కొత్త ముత్యాలు తాపిన మేడలు, పగడాలు కూర్చి కట్టిన వేదికతో సర్వలక్షణాలతో నాగుల నివాస పట్టణమైన భోగవతిని తలపింపచేస్తున్నది.

వ. ఇట్లు గనుంగొని యనంతరంబ ముందటం బురబాహ్యాంతరంబున దివ్యద్రుమ లతాకుంజ పుంజంబును, సమద నదద్విహంగ మత్త మధుకర కుల కోలాహల సంకుల జలాశయ శోభితంబును, హిమనిర్ఝరబిందు సందోహ పరిస్పంద కందళిత మందమలయ మరుదుచ్చలిత ప్రవాళ విటప నళినీతటంబును, బాంథజన మనోరంజనాహ్వాన బుద్ధిజనక కలహంస రాజకీర కోకిలాలాప విరాజమానంబును, మునివ్రత నానావిధ వనమృగవ్రాత బాధారహితంబును, నైన పురబాహ్యోద్యాన వనంబునందు యాదృచ్ఛికంబుగ నేకైక శతనాయకంబైన యనుచరదశకంబును, బంచమస్తకసర్ప ప్రతీహారుండును దోడరాఁ జనుదెంచుచున్న భర్త్రన్వేషిణియుం గామరూపిణియు నప్రౌఢయు నయినయట్టి.

745

సీ. ఘన సమవిన్యస్త కర్ణ కుండల రుచుల్ గండభాగంబుల నిండి పర్వఁ
దమ్మిరేకులసిరిఁ దటమటింపఁగ జాలు మెఱుఁగుఁ గన్నులు దలఁ దిరిగి రాఁగ

జఘన సంకలిత పిశంగ నీవీద్యుతి కనక కాంచీరుచిఁ గరము పెనుపఁ
జరణ సరోజ భాసుర చలన్నూపుర ఝణ ఝణ ధ్వని నర్మ సరణిఁ జూప

తే. లలిత యౌవన లక్ష్మీ విలాస భాసు, రోదయ వ్యంజిత ప్రభాయుక్త పీన
సమ నిరంతర కుచకుట్మలముల వ్రీడఁ, జెంది పయ్యెదఁ గప్పు బాలేందుముఖిని.

746

తా ॥ ఆ పురానికి వెలుపల కల్పవృక్షాల లతలు, పొదరిండ్లతో నిండిన ఉద్యానవనం ఉంది. అందులో మదించిన పక్షులు, తేనెత్రాగే తుమ్మెదలు విహరిస్తూ చేస్తున్న కోలాహలంతో కూడిన సరస్సులు ఉన్నాయి. సెలయేళ్ళలో నుండి పడుతున్న మంచునీటి బిందువులతో కూడిన చల్లని పిల్లగాలికి, కొలను ఒడ్డునున్న చెట్ల కొమ్మలూ, చిగుళ్ళూ ఊగుతున్నాయి. బాటసారుల్ని పిలుస్తున్నట్లు రాజహంసలు, చిలుకలు, కోయిలలు మధురంగా శబ్దాలు చేస్తున్నాయి. వన్యమృగాలు, మునుల వ్రతాన్ని పాటిస్తున్నట్లుగా ఎవ్వరికీ ఏ హాని చేయకుండా తిరుగుతున్నాయి. అటువంటి బాహ్యఉద్యానవనంలో పురంజనుడు, ఒక యువతిని చూశాడు. ఒక్కొక్కడు నూరు మందికి నాయకుడని చెప్పదగిన పదిమంది అనుచరులు, అయిదు తలలుగల పాము ముందు నడుస్తుండగా, పెద్దవై సమానంగా కూర్చబడిన చెవులకు అలంకరించుకున్న కుండలాల కాంతి ఆమె చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తోంది. తమ్మిరేకులవంటి ఆమె కన్నులు తలచుట్టూ తిరిగివచ్చేలా ఉన్నాయి. ఆమె పిరుదులపై అలంకరించుకున్న వంగపండురంగుగల వస్త్రం, బంగారు మొలనూలి కాంతిని అధికం చేస్తోంది. పాదపద్మాలకు అలంకరించుకున్న అందెల ధ్వనులు ఝణ ఝణమని మ్రోగుతూ భావగర్భితంగా వినిపిస్తున్నాయి. యౌవన లక్ష్మీదేవి ఉదయించే కాంతుల్ని వ్యక్తం చేస్తున్నట్లు, వక్షోజాలు నిండుగా ఉన్నతంగా వ్యక్తమవుతుంటే, ఆమె సిగ్గుతో పయ్యెదను కప్పుకుంటున్నది. లేతచంద్రుని వంటి నుదురుకలది ఆ యువతి.

వ. మఱియును బాలయు సుదతియు గజగామినియు నయిన యొక్క ప్రమదోత్తమం గాంచి.

747

తా ॥ కన్యకయు, అందమైన పలువరుసతో ప్రకాశించేదీ, గజగమన అయిన ఆ ఉత్తమజాతి కాంతను చూసి;

క. తరమిడి ప్రేమోద్గమమై, మరువిండ్లం బోలు కన్బొమలు గల తరుణీ
సరసాపాంగ విలోకన, శరపరివిద్ధాంగుఁ డగుచు జనవిభుఁ డనియెన్.

748

తా ॥ బలవత్తరమై, ప్రేమలో నుండి వెలువడి వస్తున్న మన్మథుని ధనుస్సులాగా ఆమె కనుబొమలున్నాయి. సరసమైన ఆమె కడగంటి చూపులు బాణాల్లాగా ఉన్నాయి. ఆ బాణాల వంటి చూపులు, తన శరీరానికి తగిలి, పురంజనుడిలా అన్నాడు:

క. 'ఎవ్వరి దానవు? జనకుం, డెవ్వఁడు? పేరేమి? భృత్యు లీ పది యొక రిం
దెవ్వరు? సతు లెవ్వరు? మఱి, యివ్వనమున నుండఁ గార్య మెద్ది మృగాక్షీ!

749

తా ॥ "లేడికళ్ళవంటి కళ్ళు గలదానా! నీవెవరి దానవు? నీ పేరేమి? తండ్రి ఎవరు? ఈ పదకొండు మంది సేవకులెవరు? ఈ స్త్రీలెవరు? ఈ వనంలో ఉండటానికి కారణమేమిటి?

క. భవదీయ పురస్సరుఁ డగు, పవనాశనుఁ డెవ్వఁ డతికృపామతి నాకున్
వివరింపు మనుచు వెండియు, ధవళేక్షణఁ జూచి ధరణిధవుఁ డిట్లనియెన్.

750

తా ॥ నీ ముందు నడుస్తున్న ఈ పాము ఎవరు? దయతో నాకు వివరించుమం" టూ మళ్ళీ ఆమెను చూసి ఇలా అన్నాడు:

సీ. తరళాక్షి! పతి యగు ధర్ము నన్వేషింపఁ జరియించు హ్రీ యను సతివొ, కాక
రుద్రు నన్వేషించు రుద్రాణివో కాక బ్రహ్మను వెదకు భారతివొ, కాక,

నారాయణుని భక్తిఁ గోరి యన్వేషించు నిందిరవో, కాక యెవ్వరీవు?
త్వత్పాద కామనత్వమునను సంప్రాప్త సకల కాముండగు సరసు నెట్టి
తే వాని వెదకెదు? తరుణీ? భవత్కరాగ్ర, పద్మకోశంబు నేఁడెందుఁ బతిత మయ్యె?
నాకు నెఱిఁగింపఁ దగుదు వివేక చరిత, యని నృపాలుఁడు మఱియు నిట్లనియె సతికి.

751

తా ॥ "ఓ చపలాక్షీ! భర్తయైన ధర్మదేవతను వెదకుతున్న హ్రీదేవివా? లేక రుద్రుణ్ణి వెదుకుతున్న రుద్రాణివా? బ్రహ్మను వెదుకుతున్న భారతివా? నారాయణుణ్ణి అన్వేషిస్తున్న ఇందిరాదేవివా? నీవెవరవు? నీ పాదాలను కోరిన సరసుడు, సకల కామాలను పొందినవాడవుతాడు. అటువంటి వాడెవడు? నీవు వెదుకుతున్న సరసుడెవరు? నీ చేతివ్రేళ్ళయందున్న తమ్మిమొగ్గ ఎక్కడిది? నాకు తెలియజెప్పవలసిందిగా కోరుతున్నాను.

క. కర మొప్పఁగ నీ విటు భూ, చర వగుటను హ్రీవి శివవు శారదవును సా
గర కన్యవుఁ గాకుండుటఁ, దరుణీ? పొడగంటి నని పదంపడి పలికెన్.

752

తా ॥ ఓ తరుణీ! నీవు శోభతో భూమిపై పాదాలనుంచి తిరుగుతుండటం చేత, హ్రీవి, పార్వతివి, సరస్వతివి, లక్ష్మీదేవివి కావని గమనించాన" ని పురంజనుడన్నాడు.

సీ. మొనసి యదభ్రకర్ముఁడ నైన నాచేత నిపుడు పాలితమైన యీ పురంబు
సరసిజోదరుని భుజాపాలితోదాత్త లలిత వైకుంఠ మలంకరించు
నిందిరా సుందరి చందంబునను నీ వ లంకరింపఁ గడంగు పంకజాక్షి!
యది గాక తావకీనాపాంగరుచి మోహితాంతరంగుండ నైనట్టి నన్ను
తే. మహిత సవ్రీడ భావ సన్మందహాస, చారు విభ్రమ భ్రూలతా ప్రేరితుఁడుగఁ దనరు
భగవంతుఁ డగునట్టి మనసిజుండు, పడఁతి! యుడుగక పీడింపఁ దొడఁగె నిపుడు.

753

తా ॥ ఒక మహాకార్యాన్ని పూని, జీవిస్తున్న నా చేత పరిపాలించబడే ఈ పురాన్ని, పద్మనాభునిచే పాలించబడే వైకుంఠాన్ని అలంకరించిన లక్ష్మీదేవిలా నీవు అలంకరించు. అంతేకాకుండా నీ కడగంటి చూపుల కాంతిచేత మోహించబడిన మనస్సుగల నన్ను, నీ సిగ్గుతో, చిరునవ్వుతో, అందమైన విలాసాలు చేసే కనుబొమలతో ప్రేరేపించబడిన మన్మథుడు నన్ను బాధిస్తున్నాడు.

వ. కావున

754

తా ॥ కాబట్టి,

చ. తరుణి! సుతారలోచన యుతంబును మంజుసుధాసమాన భా
సుర మృదువాక్యయుక్తమును శోభిత కోమల లంబమాన సుం
దర చికురాభిరామము నుదారము నైన భవన్ముఖాబ్జమున్
సురుచిరలీల నెత్తి ననుఁ జూడుము, సిగ్గును జెంద నేటికిన్?

755

తా ॥ తరుణీ! చక్కని కనుగ్రుడ్ల అమరికతో కూడిన కళ్ళు కలిగి, అమృతం లాంటి తీయని పలుకులు పలికి, సుకుమారంగ, వంపులు తిరిగి వ్రేలాడుతున్న కేశపాశంతో సౌందర్యాభిరామమైన నీ ముఖపద్మాన్ని పైకెత్తి నావైపు చూడు, సిగ్గుపడవలసిన పనేముంది?"

వ. అని యి వ్విధంబున నధీరుం డై పలుకు పురంజనుం జూచి యా ప్రమదోత్తమ వీరమోహితయై సస్మితానన యగుచు నానందంబు నొంది యిట్లనియె.

756

తా ॥ అని ఈ విధంగా పురంజనుడు ధైర్యాన్ని కోల్పోయి, మాట్లాడుతుంటే చూసిన ఆ కన్య, పురంజనుని వీర లక్షణాలకు మోహపడి, చిరునవ్వులు చిందిస్తూ ఆనందంతో ఇలా అంది:

క. పురుషవర! నాకు నీకును, గురువును నామమును గులముఁ గోరి యెఱుఁగ నీ
పురమున నుండుదుఁగా, కీ, పురమును నిర్మించి నట్టి పురుషు నెఱుంగన్.

757

తా ॥ "ఓ పురుషశ్రేష్ఠా! నీకూ—నాకూ తండ్రి ఎవరో? కులమేమిటో? పేరేమిటో తెలియదు. నేను ఈ పురంలో ఉంటాను. ఈ పురాన్ని నిర్మించిన వాడెవడో నాకు తెలియదు.

క. వీరుల నా సఖు లీలల, నారత్నము లార్యవినుత! నా చెలు! లీ వృ
ద్ధోరగ మే నిద్రింపఁగ, ధీరత మేల్కాంచి పురము ధృతిఁ బాలించున్.

758

తా ॥ వీళ్ళు నా సఖులు, ఈ స్త్రీరత్నాలు నా చెలికత్తెలు. ఈ ముసలిపాము నేను నిద్రించేటప్పుడు, ధైర్యంగా మేల్కొని, ఈ పురాన్ని పాలిస్తుంది."

వ. వెండియు నిట్లనియె.

759

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నది:

సీ. మనుజ నాయక! నీవు మద్భాగ్య వశమున నిటకు నేతెంచితి, విపుడు నీకు
మంగళంబగు, నీవు మహితేంద్రియగ్రామ భోగ్యంబు లగు కామపుంజములను
నర్థి సంపాదింతుఁ వనఘాత్మ! యీ నవ ద్వార ప్రయుక్తమై తనరు పురము
నీవు గైకొని యేలు, నీ కంటె దీనికి నధిపుఁ డన్యుండు లేఁ డనఘ! యందు

తే. మధుపనీతములైన కామముల ననుభ, వింపఁగ సమాశత మధిష్ఠింపు మెలమిఁ,
గోరి నీకంటెఁ బ్రియులు నెవ్వారు నాకు? నరసి చూడంగ మనుజేంద్ర! యదియుఁగాక.

760

తా ॥ "ఓ రాజా! నీవు నా భాగ్యవశాన ఇక్కడికి వచ్చావు. నీకు శుభం కలుగుతుంది. నీవు ఈ ఇంద్రియాలచేత అనుభవించదగిన సర్వకామాలను అనుభవించగలవు. తొమ్మిది ద్వారాలతో కూడిన ఈ పురాన్ని, నీవే స్వీకరించి పరిపాలించు. నీకంటే అధికుడైన రాజు మరొకరు లేరు. నాచే సమకూర్చి పెట్టబడే కోరికలనన్నిటినీ నూరేళ్ళు అనుభవించు. నీకంటే ప్రియమైనవారు నాకెవరున్నారు? అంతేకాకుండా,

వ. మఱియు రతిజ్ఞాన విహీనుండు నకోవిదుండు నిహపరచింతా శూన్యుండుఁ బశుప్రాయుండుఁ ద్వదన్యుండు నైన వాని నెవ్వని వరియింతు? గృహస్థాశ్రమమందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులును యశంబును యతి వేద్యంబులు గాని రజస్తమో విహీన పుణ్యలోకంబులును గలుగుఁ, బితృదేవర్షి మర్త్యభూత గణంబులకుం దనకు నీ లోకంబున గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్థం బయిన యాశ్రమం బండ్రు, గావున వదాన్యుండవు, వీర విఖ్యాతుండవు, ప్రియదర్శనుండవు, స్వయం ప్రాప్తుండవు నయి భోగి భోగ సదృశ భుజాదండంబులచే నొప్పు భవాదృశుం దగిలి మాదృశయగు కన్య వరియింపకుండునే యని వెండియు.

761

తా ॥ నిన్ను కాదని రతిజ్ఞానవిహీనుణ్ణి, ఏమీ తెలియని అపండితుణ్ణి, ఇహపరచింత లేనివాణ్ణి, పశుప్రాయుణ్ణి, ఎలా వరిస్తాను? గృహస్థాశ్రమంలో ధర్మార్థకామమోక్షాలు, సంతానాన్ని కనటం, ఆనందించటం, కీర్తి గడించటం, రజస్తమోగుణాలులేని పుణ్యలోకాలను పొందటం జరుగుతుంది. ఇవి యతులకు తెలియనివి. పితృదేవతలకు, దేవర్షులకు, మానవులకు, భూతగణాలకు, తమకు, గృహస్థాశ్రమమే ఈ లోకంలో సర్వక్షేమాలూ కలిగించే

ఆశ్రమమని అంటారు. కాబట్టి దాతవు, వీరులలో ప్రసిద్ధుడవు, చూడచక్కని వాడవు, స్వయంగా నాకు తగినవాడవు, పాముపడగ వంటి ఆకారం గల భుజదండాలు గల నీవంటి వాణ్ణి, నావంటి కన్య వరించకుండా ఎలా ఉంటుంది?

క. కరుణారస పరిపూర్ణ, స్ఫురిత స్మిత రుచి విలోక పుంజముచేతం
గర మర్థి దీన జన భయ, హరణుఁడవై సంచరింపు మఖిల జగములన్.

762

తా ॥ దయారసంతో నిండిన మందస్మిత కాంతులు విరజిమ్మే చూపులతో, దీనజనుల భయాన్ని తొలగించేవాడవై, అన్ని లోకాలలో సంచరించు."

క. అని యీ గతిఁ బలికిన యా, వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదం
బున నన్యోన్య ప్రీతిం, దనరుచుఁ దత్పురము సొచ్చి ధన్యుం డగుచున్.

763

తా ॥ అని ఈ విధంగా పలికిన ఆ పద్మాక్షిని, పురంజనుడు వరించాడు. ఒకరి మీద ఒకరికి గల అన్యోన్య ప్రీతితో, సంతోషంతో ఆ పురంలో ప్రవేశించి ధన్యుడయ్యాడు.

చ. శతసమకాల మప్పురి నజస్రము భూరి సమస్త సౌఖ్య సం
గతులఁ దనర్చి వందిజన గాయక సద్వినుతోరు గాన మో
దిత మతి నొప్పి సుందరసతీ జనసేవితుఁడై నృపాల కో
చిత లలితస్థలంబుల వసించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్.

764

తా ॥ పురంజనుడు వందసంవత్సరాల కాలం, ఆ పురంలో, నిరవధికంగా సమస్త సౌఖ్యాలను అనుభవించాడు. వందిమాగధులచే, గాయకులచే, సజ్జనులచే కీర్తించబడుతూ, ఆ

కీర్తిగానాన్ని విని ఆనందిస్తూ, అందమైన స్త్రీలచే సేవించబడుతూ, రాజులకు ఉచితమైన ప్రదేశాలలో నివసిస్తూ, క్రీడాసుఖాలను అనుభవించాడు.

క. నరనాథుఁడు లోకభయం, కరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం
దరళ లహరీ మనోహర, వరహ్రదిని సలిలమందు వసియించెఁ దగన్.

765

తా ॥ లోకభయంకరమైన వేసవికాలం రాగా, తరంగాలతో సంచరిస్తూ మనోహరంగా యున్న కోనేటి నీటిలో వసించాడు.

వ. ఇట్లు వసియించి కతిపయ దినంబు లగు సమయంబున.

766

తా ॥ ఇలా నివసిస్తూ కొన్ని రోజులు గడిచిన తరువాత,

సీ. అవనీశ్వరో త్తమ! య ప్పురంబున నాల్గు వంకలనున్న గవఁనులు వినుము
తూర్పు దిక్కునను నై దును దక్షిణోత్తరంబుల రెండుఁ బశ్చిమంబునను రెండుఁ
గాఁగ నా తొమ్మిది గవఁకుల నుపరి దిక్కున నేడుఁ గ్రింది దిక్కునను రెండు
నయి యుండు, మఱి వానియందుఁ బృథగ్విధ విషయ గత్యర్థమై వెలయు నీశ్వ

తే. రుం డొకం డరయఁ గలండు రూఢిఁ దత్పు, రంబుఁ బాలించునట్టి పురంజనుండు
నా పురద్వార నవకంబు, నందులోన, నర్థిఁ బ్రాగ్ద్వార పంచకమందు వరుస.

767

తా ॥ ఓ రాజశ్రేష్ఠా! ఈ పురానికి నలువైపులా ఉన్న ద్వారాల వివరాలు చెపుతాను విను. తూర్పున అయిదు, దక్షిణాన ఒకటి, ఉత్తరాన ఒకటి, పడమట రెండు, మొత్తం నాలుగు దిక్కులలో కలిపి తొమ్మిది ద్వారాలున్నాయి. ఈ తొమ్మిది ద్వారాలలో, తూర్పు, దక్షిణము,

ఉత్తరము దిక్కులనున్న ద్వారాలు ఊర్ధ్వంగా (పైభాగాన) ఉంటాయి. ఇవి ఏడు, పశ్చిమానగల రెండు ద్వారాలు క్రిందనున్నాయి. ఇవి రెండు. ఇన్ని ద్వారాలలో వేరువేరు విషయాలను పొందటానికి అధిపతులున్నారు. ఆ పురంలోని తొమ్మిది ద్వారాలకు, తూర్పున ఉన్న అయిదు ద్వారాలకు అధిపతి పురంజనుడే.

వ. ఖద్యోతయు హావిర్ముఖీయు నను నామంబులు గల ద్వారయుగంబున ద్యుమత్సఖుఁడై విభ్రాజితాఖ్య జనపదంబును బొందు, వెండియు నళినియు నాళినియు నను పేళ్లు గల వాకిళ్లు రెంటియందు నవధూతసఖుండై సౌరభరూపంబులయిన విషయంబులం బొందు, మఱియు ముఖ్యానామకంబైన ప్రధానప్రాగ్ద్వారంబున రసజ్ఞ విపణాన్వితుండై యాపణబహూదనంబులను విషయంబులనొందుఁ, బితృహూ నామకంబయిన దక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణ పాంచాలంబను రాష్ట్రంబు నొందు, దేవహూ నామకం బైన యుత్తరపు వాకిట శ్రుతధరాన్వితుండై యుత్తర పాంచాలంబను రాష్ట్రంబు నొందు, వెండియుం బడమటి వాకిళ్లు రెంటియందు నాసురీ నామకంబైన వాకిట దుర్మద సమేతుండై గ్రామక నామకంబైన విషయంబును, నిరృతి నామకం బయిన వాకిటయందు లుబ్ధకయుక్తుండై వైశసంబను విషయంబు నొందుచుండు, వెండియుం బురంజను డప్పురంబునం బౌరజనంబులందు నిర్వాక్పేశస్కరులను నిద్దఱంధులు గలరు. వారలచేత గమన కరణంబులను క్రియలనొందుచు నంతఃపురగతుండగు నప్పుడు విషూచీన సమన్వితుండై జాయాత్మ జోద్భవంబులైన మోహ ప్రసాద హర్షంబుల నొందుచుండు, నివ్విధంబునం గర్మాసక్తుఁడు గామాత్మకుండునై బుద్ధియను మహిషిచేత వంచితుం డయ్యె, న క్కామినియు.



తా ॥ తూర్పుదిక్కునగల ద్వారాలలో 'ఖద్యోత', హవిర్ముఖీ అనే పేర్లుగల రెండు ద్వారాలున్నాయి. వాటిగుండా 'ద్యుమంతుడు' అనే చెలికానితో 'విభ్రాజితము' అనే జనపదాన్ని

చేరుతుంటాడు. నళిని–నాళిని అనే పేర్లుగల తూర్పుదిశా ద్వారాల నుండి 'అవధూత' అనే స్నేహితునితో కలసి 'సౌరభ' రూపమైన విషయాన్ని పొందుతాడు. తూర్పుననున్న ద్వారాలలో ప్రధానమైనదైన 'ముఖ్య' ద్వారా, 'రసజ్ఞుడు', 'విపణుడు' అనే మిత్రులతో కలసి, 'ఆపణ', 'బహూదనములు' అనే విషయాలను పొందుతాడు.

దక్షిణ దిశనున్న ద్వారం పేరు 'పితృహూ'. ఈ ద్వారం నుండి 'శ్రుతధరుని' తో కలసి 'దక్షిణపాంచాల' మనే రాష్ట్రాన్ని పొందుతాడు. 'ఆసురి' అనే పడమటి వాకిలి నుండి, దుర్మదునితో కలిసి 'గ్రామకము' అనే పేరుగల విషయాన్ని, 'నిరృతి' అనే పేరుగల మరో పడమటి వాకిలి నుండి లుబ్ధకునితో కలిసి 'వైశసము' అనే విషయాన్ని పొందుతాడు. 'దేవహువు' అనే పేరుగల ఉత్తరపు వాకిలి నుండి 'శ్రుతధరుని' తో కలిసి 'ఉత్తరపాంచాలం' అనే విషయాన్ని పొందుతాడు.

పురంజనుని నగరంలోనున్న పౌరులలో 'నిర్వాక్కు', 'పేశస్కరుడు' అనే ఇద్దరు గ్రుడ్డివాళ్ళున్నారు. వాళ్ళ సాయంతో 'గమనము', 'కరణము' అనే పనుల్ని నెరవేర్చుకుంటాడు. అంతఃపురంలోకి వెళ్ళేటప్పుడు 'విషూచీ' అనే ఆమెతో కలసి, భార్యాపుత్రులవల్ల కలిగే మోహప్రసాద హర్షాలను పొందుతాడు. ఈ విధంగా పురంజనుడు కామాసక్తుడై, తదుచితమైన కర్మలలో చిక్కుకొని, బుద్ధి అనే పట్టమహిషి చేత వంచించబడ్డాడు. ఆమె కూడా–

సీ. పానంబు సేసినఁ దానుఁ బానముఁ జేయుఁ గుడిచినఁ దానును గుడుచు మఱియు
భక్షింపఁ దానును భక్షించు, నడచిన నడచును, నవ్విన నవ్వు, నేడ్వ
నేడుచుఁ, బాడినఁ బాడు, విన్నను వినుఁ, జూచినఁ జూచు, గూర్చున్న నుండు,
దుఃఖింప దీనుఁడై దుఃఖించు, నిలిచిన నిలుచు, నిద్రింపఁగ నిద్రవోవు

తే. ముట్టినను ముట్టు, మూర్కొన్న మూరు కొనును, బలుకఁ బలుకును, బవళింపఁ బవ్వళించు
హర్షమును బొంద నాత్మను హర్ష మొందు, మోదమును బొంద దానును మోద మందు.

769

తా ॥ పురంజనుడు త్రాగితేనే, తాను త్రాగుతుంది. అతడు తింటేనే ఆమె తింటుంది. అతడు నడిస్తే నడుస్తుంది. నవ్వితే నవ్వుతుంది. ఏడిస్తే ఏడుస్తుంది. పాడితే పాడుతుంది. వింటే వింటుంది. చూస్తే చూస్తుంది. కూర్చుంటే కూర్చుంటుంది. దుఃఖీస్తే దుఃఖీస్తుంది. నిలబడితే నిలబడుతుంది. నిద్రిస్తే నిదురిస్తుంది. అతడు ముట్టుకుంటే తానుకూడ ముట్టుకుంటుంది. వాసన చూస్తే చూస్తుంది. పలికితే పలుకుతుంది. పవళిస్తే పవళిస్తుంది. అతను సంతోషిస్తే తను కూడ మనస్సులో సంతోషిస్తుంది. ఆనందిస్తే తాను ఆనందిస్తుంది.

వ. ఇవ్విధంబున నతండు మహిషీ విప్రలబ్ధుండును వంచిత స్వభావుండునునై పారవశ్యంబునం జేసి యజ్ఞుండును నితరేచ్ఛా విరహితుండునునై క్రీడామృగంబు చాడ్పున వర్తించుచు నా పురంబునఁ గాపురం బుండఁ గొన్ని దినంబుల కా పురంజనుం డొకానొక దినంబున ధనుర్ధరుండై.

770

తా ॥ ఈ విధంగా పురంజనుడు, తన నిజస్వరూపాన్ని ఎడబాసి, పట్టమహిషి చేత మోసపోయి, ఆమెకు వశమై, జ్ఞానం కోల్పోయి, మరే కోరికా లేనివాడిలా ఆడుకునే పెంపుడు జంతువులా ప్రవర్తిస్తూ, ఆ పురంలోనే కాపురమున్నాడు. అలా కొన్నాళ్ళు గడిచాక, పురంజనుడు ఒకనాడు ధనుస్సును ధరించి,

సీ. పంచాస్య యుక్తంబుఁ బంచ బంధనముఁ జక్రద్వితయములు యుగద్వయంబు
నాశు వేగంబు నేకాక్షంబుఁ గూబర ద్వయముఁ బతాకాత్రితయ యుతంబు
నేక రశ్మియుతంబు నేకసారథికంబు సప్తవరూధంబు స్వర్ణ భూష
ము బంచ విక్రమమును నేక నీడంబుఁ బ్రకట పంచ ప్రహరణము నయిన

తే. రథము గాంచనరచిత వర్మము ధరించి, విలస దక్షయ తూణీర కలితుఁ డగుచుఁ

గణఁక దీపింప నెక్కి యేకాదశ ప్ర, సంఖ్య సేనాసమేతుఁడై సరభసముగ.

771

తా ॥ అక్షయతూణీరాలను, కవచాన్ని ధరించి బయలుదేరాడు. అయిదు గుర్రాలతో కూడి, అయిదు కట్లు గలిగి, రెండుచక్రాలు, రెండుయుగాలు, ఒక అక్షం, రెండునొగలు, మూడు పతాకలు, ఒకపగ్గం, ఒకసారథి, ఏడు పై పొరలు కవచంగా గలిగి, బంగారు భూషణాలు అలంకరించబడి, ఐదురకాల గతిభేదాలతో పయనించగలిగి, ఒకగూడును కలిగి, అయిదు విధాలైన ఆయుధాలు ఉంచబడి, ఆశువేగంతో పయనించగల రథాన్ని ఎక్కి, పదకొండు మంది సేనతో కలసి వేగంగా బయలుదేరాడు.

వ. పురంబు వెడలి పంచప్రస్థంబను వనంబునకుం జని యందు విడువరాని మహిషిని విడిచి మృగయాసక్తుండై దృప్తుం డగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసురవర్తనంబునం దగిలి ఘోరాత్ముండు నదయుండునై నిశాతసాయకంబుల చేత నమ్మృగ వ్రాతంబులం బరిమార్చె, రాజులకు మృగయా వినోదంబు విహితానుష్ఠానం బగుచుండ నాసురవృత్తి యెట్లయ్యె? నని యంటి వే? నిది రాగప్రాప్తం బగుటను విహితంబు గాదు, వినుము. శ్రాద్ధాదులందే ప్రఖ్యాత శ్రాద్ధ దివసంబుల యందే, రాజైన వాఁడే, మేధ్యంబులయిన పశువులనే, వనంబునందే యథోపయుక్తంబుగానే వధియింపం జను నను నియమ మాత్రంబు గలదు, గావున జ్ఞానియైన విద్వాంసుం డాచరింపండు గాన యాచరించినం గర్మానుష్ఠానజనితం బయిన జ్ఞానంబునం జేసి యందుఁ బొరయం, డట్టుగాక నియమోల్లంఘంబునం గర్మాచరణుం డగువాఁ డభిమానంబు నొంది కర్మబద్ధుండై గుణప్రవాహ పతితుండును, నష్టప్రజ్ఞుండునునై యధోగతిం గూలు, నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానందగు నని వెండియు నిట్లనియె. నంతం బురంజనుం డవ్వనంబున.

772

తా ॥ పురాన్ని వీడి, పురంజనుడు 'పంచప్రస్థము' అనే అడవికి వెళ్ళి, ఆ అడవిలో విడిచిపెట్టదగని పట్టమహిషిని విడిచి, వేటాడే కోరికతో ధనుర్బాణాలు ధరించి, దృప్తుడై (మదించి) సంచరించాడు. రాక్షసమైన ప్రవర్తనతో పాపాత్ముడై, దయమాలి వాడిబాణాలతో మృగసమూహాన్ని వధించాడు. 'రాజులకు వేటాడటం తగిన కార్యమే'. అటువంటప్పుడు రాక్షస కృత్యమేవిధంగా అవుతుందని పురంజనుని విషయంలో ప్రశ్నిస్తే, దానికి సమాధానమిది. పురంజనుడు చేసిన వేట ఆహారార్థం కాదు. రాగద్వేషాదులతో జీవుల్ని హింసించటం రాక్షస కృత్యం. తగని పని. 'పితృదేవతలకు శ్రాద్ధకర్మలు చేసే రోజులలో, ప్రఖ్యాతమైన శ్రాద్ధ దినాలలో మాత్రమే, యజ్ఞపశువులను మాత్రమే, అడవులలో మాత్రమే, అవసరమైనన్నింటిని మాత్రమే, రాజైనవాడు మాత్రమే చంపాలి' అనే నియమముంది. కాబట్టి జ్ఞానియైన విద్వాంసుడు ఇటువంటి హింసను చేయడు. ఒకవేళ చేసినా, కర్మాచరణ వలన కలిగిన జ్ఞానంచేత ఆ కర్మను పొందడు. అలా కాకుండా నియమాన్ని ఉల్లంఘించి ప్రవర్తించేవాడు, కర్తృత్వాభిమానాన్ని పొంది, కర్మఫలితాలకు బద్ధుడై, ప్రజ్ఞను కోల్పోయి, అధోగతి పాలవుతాడు. అందుచేత 'సజ్జనులకు అన్ని విధాలుగా రాక్షస ప్రవృత్తిని మానుకోవటం తగినపని' అని మళ్ళీ ఇలా చెప్పాడు. ఆ తరువాత పురంజనుడు, ఆ అడవిలో

క. వర చిత్ర పక్ష సునిశిత, శరములచే శశ వరాహ చమరీ రురు కా
సర గవయ శల్య హరిణీ, కరి హరి వృక పుండరీక కపి ఖడ్గములన్.

773

తా ॥ రంగురంగుల ఈకలు కట్టిన వాడిబాణాలతో కుందేలు, అడవిపంది, చమరీ మృగం, నల్లచారల దుప్పి, కారెనుపోతు, అడవిదున్న, ముళ్ళపంది, ఆడుజింక, ఏనుగు, సింహం, తోడేలు, పెద్దపులి, కోతి, ఖడ్గమృగం మొదలైన జంతువుల్ని వేటాడాడు.

వ. వధియించి మఱియును.

774

తా ॥ ఆ విధంగా వేటాడి, వధించి ఇంకా,

సీ. వరుస మేధ్యామేధ్య వనమృగంబుల ఘృణ సన దుస్సహ క్రీడ సంహరించి
శ్రమయుక్తుఁడై వేఁట సాలించి మరలి మం దిరమున కర్థి నే తెంచి యందు
సముచిత స్నాన భోజన కృత్యములు దీర్చి యతి పరిశ్రాంతి శయానుఁ డగుచుఁ
బరిమళ మిళిత ధూపవ్రాత వాసిత సర్వాంగుఁ డగుచు స్రక్చందనములు

తే. వివిధ భూషణ చేలముల్ వెలయఁ దాల్చి, తుష్టుఁడును హృష్టుఁడున్ మఱి ధృష్టుఁడై య
నన్యజాకృష్ట చిత్తుండునై రతి ప్ర, సంగ కౌతుక మాత్మను దొంగలింప.

775

తా ॥ యజ్ఞానికి పనికి వస్తాయి, పనికి రావన్న విచారణ లేకుండా, కనికరం లేక అడవిలోని జంతువుల్ని దుస్సహంగా వేటాడి అలసి పోయాడు. వేటను చాలించి, మళ్ళీ మందిరానికి వెళ్ళాడు. సముచితంగా స్నానభోజనాదులు ముగించి, బడలిక తీరేలా శయనించాడు. సుగంధ పరిమళాలతో కలిసిన ధూపాన్ని శరీరాంగాలకు పూసుకొని, పూలదండల్ని, మంచిగంధాన్ని, వివిధ భూషణాల్ని వస్త్రాల్ని ధరించాడు. వాటితో సంతృప్తుడై, హర్షంతో, దర్పంతో శయ్యకు చేరాడు. మన్మథునిచే ఆకర్షించబడిన చిత్తం గలవాడై, రతివాంఛ కలిగి,

వ. అంత స్వకీయ ప్రాణవల్లభ యగు మహిషియందు మనంబు నునిచిన యా వరారోహయు గృహమేధినియు నయిన గృహిణిం గానక విమనస్కుండై నిజాంతఃపుర కామినులం గనుంగొని యిట్లనియె.

776

తా ॥ తన ప్రియురాలైన, పట్టమహిషివైపు మనస్సు మళ్ళింది. మానవతి, ఇంటియజమానురాలైన తన ఇల్లాలిని కానక, కలత చెందిన మనస్సుతో, అంతఃపుర స్త్రీలను

చూసి ఇలా అన్నాడు:

క. రామాజనసంఘము లా, రా! మానవతీ లలామ రామామణి నా
రామకృప వడసి మెలఁగుదు, రా మానుగఁ గుశలమా? పరామర్శింపన్.

777

తా ॥ “ఓ స్త్రీజనులారా! అభిమానవతులందరిలో ఉత్తమురాలై, స్త్రీ జాతిలో మణిరత్నమైన ఆమె దయతో మీరంతా జీవిస్తున్నారు. మీకు కుశలమా?

ఉ. సారవివేకలారా! గృహసంపద లీ యెడఁ బూర్వరీతిచే
నారయఁగా రుచింపవు గృహస్థునకుం గృహమందు మాతగా
నీ రమణానుకూల రమణీ మణియై తనురారు భార్య గా
నీ రుచి నొందకున్నఁ గన నేర్చునె తద్గృహమేధి సౌఖ్యముల్.

778

తా ॥ విచారిస్తే, మీరంతా వివేకశీలురు. పూర్వంలాగా, గృహంలోని సంపదలు ఇప్పుడు నాకు రుచించటం లేదు. గృహంలో తల్లిగాని, అనుకూలవతియైన భార్యగాని లేకుంటే, గృహస్థునికి సౌఖ్యమెలా కలుగుతుంది?

వ. అదియునుం గాక.

779

తా ॥ అంతేకాకుండా,

క. పొగ డొందు జనని గానీ, తగవున వర్తించునట్టి దయితయ కానీ
తగ నుండని గృహమున నుం, టగుఁ జక్ర విహీన రథమునందుం టరయన్.

780

తా ॥ కీర్తించబడే ప్రేమమయి తల్లిగాని, పద్ధతిగా జీవించే భార్యగాని లేని ఇంట్లో నివసించటం, చక్రాలులేని రథంలో కూర్చోవటం లాంటిదే.

ప. కావున.

781

తా ॥ కాబట్టి,

చ. తలకొని నాకుఁ దానసుపదంబును బ్రజ్ఞ జనింపఁజేసి సం
చల దురు దుర్భర వ్యసన సాగరమగ్నుఁడ నైన నన్ను ని
శ్చలమతి నుద్ధరించి యనిశంబును మత్ప్రియయైన భార్య యే
వలనఁ జరించుచున్న దనివారణ నా కెఱిఁగింపరే దయన్.

782

తా ॥ మీరంతా పూనుకొని, నాకు మంచిమార్గాన్ని చెప్పి, తెలివి నేర్పి, దుర్భరమైన వ్యసన సాగరంలో మునిగిన నన్ను ఉద్ధరించి, ప్రాణతుల్యమైన నా భార్య ఏ దిక్కున సంచరిస్తున్నదో దయతో నాకు తెలుపండి."

క. అనవుడు విని య క్కాంతలు, జనపతి కిట్లనిరి రాజసత్తమ! యిదిగోఁ
దన కొంగైనను బఱపుగ, నొనరింపక నేలఁ బొరలుచున్నది వగలన్.

783

తా ॥ ఆ మాటల్ని విన్న, ఆ చెలికత్తెలు రాజుతో ఇలా అన్నారు: "ఓ రాజా! ఇదుగో తనకొంగైనా నేలమీద పరచుకోకుండా, దుఃఖీస్తూ పొర్లాడుతున్నది.

తే. ఏమి కతమున నున్నదో యెఱుఁగ మేము, నీవు సూడు మటన్న నా భూవరుండు
నేలఁ బడి పొరలెడు భార్యఁ బోలఁ జూచి, మనములో దుఃఖ తాపంబు మల్లడింప.

784

తా ॥ ఎందుకిలా దుఃఖీస్తుందో మాకు తెలియదు. మీరు చూడండి" అనగా, ఆ రాజు నేలమీద దుఃఖంతో పొర్లాడే భార్యను చూసి దుఃఖాక్రాంతుడయ్యాడు.

వ. అంత.

785

తా ॥ అప్పుడు,

ఆ. జలజనేత్ర! ప్రణయ సంజాత రోష భా, వమున నయిన యట్టి వక్రదృష్టి
జన విభుండు సూచి యనునయ కోవిదుఁ, డగుచు నప్పయోరుహాక్షిఁ జేరి.

786

తా ॥ ప్రణయకోపంతో కలిగిన బాధతో ఆమె చూస్తున్న వంకర చూపుల్ని గమనించి, ఓదార్చడంలో నేర్పరియైన ఆ రాజు, రాణిని సమీపించాడు.

క. పొలఁతుకఁ దన యుత్సంగం, బుల నిడి తత్పాద యుగళమును నంటుచు మం
జుల మృదు భాషణముల నా, లలనామణిఁ జూచి పలికె లాలన మొప్పన్.

787

తా ॥ ఆమెను తన తొడలపై కూర్చుండ బెట్టుకొని, ఆమె పాదాలు పట్టుకొని తాకుతూ మృదుమధుర వాక్కులతో బుజ్జగిస్తూ, లాలనగా ఆమెను చూసి ఇలా అన్నాడు:

చ. రమణిరో! భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప
క్షముఁ దలపోసి యుగ్రతర శాసనముం దెగిచేయ రట్లు గా
క మనసులోని కిన్కఁ దమకంబున నాజ్ఞ యొనర్చ్చ రేని ని

క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపగ నాజ్ఞ సేయుటే?

788

తా ॥ "ఓ రమణీ! సేవకులు తప్పు చేస్తే 'మనవాళ్ళే' నని భావించి, యజమానులు కఠినంగా శాసించరు. అలా కాకుండా మదిలోని కోపంతో కఠినంగా శాసిస్తే అది సేవకుల్ని అనుగ్రహించటమే, కాని శాసించి శిక్షించటం కాదు.

క. కమలానన! బాంధవ కృ, త్యముఁ దలఁపక రోషచిత్తుఁడగు కుటిలాత్మున్
సమదామర్షుఁడు నీతి, క్రమరహితుఁడు నైన బాలుఁగా నెన్నఁదగున్.

789

తా ॥ ఓ పద్మముఖీ! బంధుత్వంతో చేయవలసిన పనిని చేయకుండా, కోపం ప్రకటించే కుటిలాత్ముణ్ణి, నీతీ నియమం లేకుండా మదంతో రోషించేవాణ్ణి, జ్ఞానంలేని బాలునిగా భావించాలి."

వ. అని వెండియు నిట్లనియె. సుదతీ హృదయేశ్వరి వైన నీవు.

790

తా ॥ అని ఇంకా ఇలా అన్నాడు: "నా హృదయేశ్వరివైన నీవు

మ. సరసోదార సుధా రసోపమ వచశ్చాతుర్య సౌభాగ్యమై
హరినీలోపమ కోమలాలక యుతంబై విభ్రమ భ్రూలతా
పరిజుష్ట స్మిత సద్విలోకనమునై భాసిల్లు యుష్మన్ముఖాం
బురుహంబున్ భవదీయ దాసునకుఁ బూఁబోఁడీ! కృపం జూపవేఁ

791

తా ॥ పూబోడీ! సంతోషంతో, వికాసవంతంగా, అమృతరసోపమానములైన నీ

చతురవాక్కులతో, ఇంద్రనీలమణులవలె సుకుమారమైన నల్లని వెంట్రుకలతో, విలాసవంతంగా ప్రకాశించే కనుబొమ్మలతో, నవ్వురాజిల్లే చూపులతో ప్రకాశించే నీ ముఖపద్మాన్ని ఈ దాసునికి దయతో చూపించు.

క. విను వీరపత్ని నీయెడ, ననయంబును బ్రాహ్మణులును హరిభక్తులుఁ ద
క్కను నితరు లెగ్గు సేసిన, వనితా! శిక్షింతు నెంతవారల నయినన్.

792

తా ॥ నీవు వీరపత్నివి. విను. నీ పట్ల బ్రాహ్మణులు హరిభక్తులు తప్ప, ఇతరులెవ్వరు అపచారం చేసినా, వాళ్ళు ఎంతటివాళ్ళయినా సరే! శిక్షిస్తాను.

క. ఈ ముల్లోకము లందును, నా మనమున రోష మొదవినన్ భయరహితుం
డై మదిలోఁ బరితోషము, తో మెలఁ గెడువానిఁ గానఁ దోయజనేత్రా!

793

తా ॥ ఓ పద్మనేత్రీ! నా మదిలో కోపం వస్తే, భయంలేకుండా సంతోషంగా తిరిగేవాణ్ణి ఈ మూడులోకాల్లో నేను చూడలేదు.

సీ. ఇందీవరేక్షణ! యే నెందు భవదీయ తిలక విరహితము మలినయుతము
హర్ష శూన్యంబు అపాస్తరాగంబును యత్యమర్షయుతంబు నయిన ముఖము
గళితాశ్రుబిందు సంకలిత సంచిత శోభమాన పీనస్తన మండలమును
రమణీయ తాంబూలరాగ విహీన మై నట్టి సుపక్వ బింబాధరంబుఁ

తే. గాన నిట్లుంట కిపుడేమి కతము? నాకు, నర్థి నెఱిఁగింపవే మృగయాతిసక్తి
నబల! నీ కెఱిఁగింపక యరిగి నట్టి, తప్పు సైరించి కావంగఁ దగుదు నేను.

794

తా ॥ నల్లకలువల వంటి కళ్ళు గలదానా! నీ ముద్దుమోమున తిలకం లేదు. ధూళి కమ్ముకుంది. సంతోషం లేదు, మనస్సుకు వికాసాన్ని కలిగించనీయని రోషంతో జాలువారిన కన్నీటి బిందువులుపడి స్తనమండలం తడుస్తున్నది. దొండపండువంటి అధరం తాంబూలరాగరంజితం కాలేదు. ఇలా ఉండటానికి ఇప్పుడు కారణం ఏమిటి? నాకు తెలుపవా? వేటతమకంతో, నీకు చెప్పకుండా వెళ్ళిన నా తప్పును క్షమించి ఆదరించటం భావ్యం గదా!

క. వనితాజనపరవశుఁడై, మనసిజశర బాధ్యమానమానసుఁ డగు వా
నిని దగఁ గర్తవ్యార్థము, లను భజియింపక తొలంగు లలనలు గలరే?

795

తా ॥ స్త్రీలకు వశుడై, మదన బాణ వేదనతో తల్లడిల్లే మనస్సు గలవానిని, తగిన కర్తవ్యాలను నిర్దేశించి, ప్రయోజనాలను సాధించి పెట్టే ఉపచారాలతో సేవించకుండా తొలగిపోయే స్త్రీలు ఉంటారా?"

వ. అనుచుం దదీయ విభ్రమ వశంగతుండై పలికిన విని.

796

తా ॥ అని ఈ విధంగా, ఆమె విలాసాలకు లొంగి పురంజనుడు మాట్లాడగా విని,

క. కంజాతపత్రనేత్ర పు, రంజను దెస రోష ముడిగి రమణీయశ్రీ
మంజుల మృదూక్తుల మనము, రంజించుచుఁ బలికె సదనురాగ మెలర్పన్.

797

తా ॥ ఆ పద్మనేత్ర ఆతనిపై కోపాన్ని వీడి, వినుటకింపైన మృదుమధురమైన మాటలతో, మనస్సును రంజింపచేస్తూ, ప్రేమ ఉట్టిపడేలా మాట్లాడింది.

వ. అంత.

తా ॥ అప్పుడు,

సీ. అ మ్మహాదేవి నెయ్యంబున మంగళ, స్నాతయై మృదుల వస్త్రములు గట్టి
స్రక్చందనాది భూషణములు ధరియించి, కమనీయ మోహనాకార యగుచుఁ
బతికడ నిలిచిన నతఁడు సంతుష్టాంత, రంగుఁడై యభ్యంతరమున నుండి
యన్యోన్య సరస గాఢాలింగనంబులు, గావించి గోప్య వాక్యముల చేత,

తే. నతఁడు ప్రమదా పరిగ్రహ వ్యసనమునకు, గడఁక నపకృష్టఘన వివేకంబు గలిగి పగలు
రేయని ప్రొద్దు లేర్పఱుప రాక, యెనసి యాయుర్వ్యయంబు దా నెఱుఁగఁ డయ్యె.

799

తా ॥ ఆ రాణి స్నేహంతో, మంగళవిధితో స్నానం చేసి, మృదువైన వస్త్రాన్ని కట్టి, గంధాన్ని పూసుకొని, పూలదండలు ధరించి, నగలు అలంకరించుకొని, కమనీయమైన మోహనాకారంతో భర్తను సమీపించింది. పురంజనుడు సంతోషంతో పొంగిపోయాడు. అంతఃపురంలో ఒకరినొకరు గట్టిగా కౌగిలించుకున్నారు. శృంగార భావగర్భితమైన మాటలతో సంభాషించుకున్నారు. ఇలా స్త్రీలపట్ల గల వ్యసనంతో, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి, పగలు–రేయి అని గమనించలేని సుఖస్థితిలో ఆయువును వ్యయించాడు. ఇలా ఆయువు క్షీణించడాన్ని కూడ తెలిసికోలేని వాడయ్యాడు.

వ. మఱియు నతం డున్నద్ధమదుండును మహామనుండును నర్హశయ్యా శయానుండును మహిషీ భుజోపధానుండునునై యజ్ఞానాభిభూతుం డగుటం జేసి స్వరూప భూత పరమ పురుషార్థంబు నెఱుంగక నిజమహిషియె పరమ పురుషార్థంబుగాఁ దలంచుచు రమించుచుం గామ కశ్మలచిత్తుం డైన యతనికి నవయౌవనంబైన కాలంబు క్షణార్ధంబునుం బోలె గతం బయ్యె, నంత.

800

తా ॥ ఇలా పురంజనుడు మహామదంతో, ఒళ్ళు మరచిపోయిన ప్రవర్తనతో జీవితాన్ని గడిపాడు. తనకు తగిన శయ్యపై మాత్రమే పవళించేవాడు. రాణి భుజాన్నే తలగడగా చేసుకొని, అజ్ఞానంతో తన భార్యయే పరమ పురుషార్థంగా భావించాడు. తన సహజస్థితియైన మోక్షానుభవాన్ని మరచి, కామమనే కశ్మలంతో నిండిన మనస్సు కలవాడై ఆనందిస్తూ కాలాన్ని వెళ్ళబుచ్చాడు. ఆతని నవయౌవన కాలమంతా 'అరక్షణం' లాగ గతించి పోయింది. అప్పుడు—

క. విశద యశోజలనిధి యా, శశిముఖీ యగు భార్య వలన సమ్మతి నేకా
దశ శతపుత్రుల రణక, ర్కశ దేహులఁ గాంచి కౌతుకంబున మఱియున్.

801

తా ॥ స్వచ్ఛమైన కీర్తిని సముద్రమంతగల ఆ పురంజనుడు, చంద్రముఖీ వంటి తన భార్యవలన, పదకొండు వందలమంది పుత్రుల్ని కన్నాడు. వాళ్ళు, యుద్ధాలు చేయటం వలన కాఠిన్యం పొందిన దేహం కలవారు. ఆ తరువాత కోరి—

క. గురు శీలౌదార్య గుణో, త్తరలను సల్లలిత గుణ కదంబలఁ బ్రియలన్
వరకులపావనల దశో, త్తర శత దుహితలను గాంచెఁ దత్సతి వలనన్.

802

తా ॥ నూటపదిమంది కూతుళ్ళను కన్నాడు. ఆ కూతుళ్ళు గొప్ప సత్ప్రవర్తన గలవారు. దానదయాది సద్గుణాలచే, వంశాన్ని పావనంచేసే వాళ్ళు.

వ. ఇట్లు పుత్ర పుత్రికా జనంబు గని యున్నంత.

803

తా ॥ ఈ విధంగా పుత్రుల్ని, పుత్రికల్ని కన్నాక,

క. విను మాతని యాయువులో, నను నర్ధం బరిగె, నంత నరపతి కులవ
ర్ధనులగు సుతులకుఁ బరిణయ, మొనరించెన్ సదృశ లయిన యువిదల తోడన్.

804

తా ॥ అతని ఆయుష్షులో సగభాగం తరిగి పోయింది. తన వంశవృద్ధి కారకులైన కొడుకులకు, తగిన కన్యలతో వివాహం చేశాడు.

క. నరనాథుఁ డాఁడు బిడ్డల, వరరూప వయోవిలాసవైభవములచేఁ
బరఁగిన నిజతనయల సమ, వరులకు సంప్రీతితో వివాహము చేసెన్.

805

తా ॥ శ్రేష్ఠమైన రూపసంపద, వయస్సు, సొగసు, సంపద గల తనపుత్రికలను తగిన వరులకిచ్చి ప్రీతితో వివాహం జరిపించాడు.

వ. అట్లు వివాహంబులు గావించి యున్న సమయంబున.

806

తా ॥ ఇలా కొడుకులకు, కూతుళ్ళకు వివాహాలు చేసిన తరువాత,

క. విను, తత్సుతు లొక్కొకనికి, ననయముఁ బాంచాల దేశమందులఁ బౌర
జన కులవర్ధను లగుచున్, జనియించిరి నూర్వురేసి శౌర్య బలాఢ్యుల్.

807

తా ॥ పురంజనుని కొడుకులు ఒక్కొక్కరికి, శౌర్యబలసంపన్నులైన నూరుగురు కొడుకులు చొప్పున జన్మించారు. వారివలన పురంజనుని వంశం పాంచాల దేశంలో వృద్ధి పొందింది.

ఆ. అనఘ! యట్టి రిక్తహారుల గేహకో, శానుజీవ యుతులు నయిన యట్టి

నందనాదులందుఁ జెందిన మమత ని, బద్ధుఁడయ్యె నంతఁ బార్థివుండు.

808

తా ॥ ఓ పుణ్యాత్మా! ఆస్తిని పంచుకొంటూ, ఇంటిని ధనాన్ని ఆశ్రయించుకొని జీవించే ఇటువంటి సంతానం పట్ల పురంజనుడు అనురాగ బద్ధుడయ్యాడు.

చ. తిరమగు నిష్ఠతో నతఁడు దీక్షితుఁడై పశుమారకంబులున్
సరవి భయంకరంబులగు సన్మఖముల్ దగఁ బెక్కు సేసి యా
దరమున నీవునుం బలెను దత్తదనూన ఫలాప్తి కాముఁడై
సురపితృ భూత సంఘము నసూయ దనర్ప భజించె భూవరా!

809

తా ॥ స్థిరమైన నిష్ఠతో యజ్ఞదీక్ష వహించి, పశువుల్ని చంపి, భయంకరమైన యజ్ఞాలు అనేకం చేశాడు. ఆ యజ్ఞాలవలన గొప్ప ఫలాన్ని పొందాలనే కోర్కెతో, నీలాగే యజ్ఞాలు చేసి, దేవ, పితృ, భూతగణాలను పూజించాడు.

వ. ఇట్లాత్మహితంబు లైన కర్మంబులయం దనవహితుండును గుటుంబాసక్త మానసుండునునై యున్న యతనికి విరోధియై ప్రియాంగనాజనంబులకు నప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగ విఖ్యాతుండును గంధర్వాధీశుండు షష్ట్యుత్తర శతత్రయ సంఖ్యాకులైన గంధర్వులును నందఱ గంధర్విజనంబులును సితాసిత వర్ణంబులు గలిగి మిథునీభూతు లగుచు ననుగమింపం జనుదెంచి స్వపరిభ్రమణంబుచేతనే సర్వకామంబుల నిర్మితంబగు నా పురంబు నిరోధించిన నప్పు డా చండవేగానుచరులైన గంధర్వు లా పురంజను పురంబు వ్యాకులత్వంబు నొందించుచు నపహరింప నుపక్రమించు సమయంబునఁ బురంజన పురాధ్యక్షుండైన ప్రజాగరుం డనువాఁడు వింశత్యుత్తర సప్తశతంబులైన గంధర్వ గంధర్వీ జనంబుల నివారించి బలవంతుడై సవత్సరశతంబు

యుద్ధంబు గావించి యొక్కరుం డయ్యు నప్పెక్కంద్రతో నిట్లు పోరి క్షీణుండైనం బురంజనుండు దాన నిలిచి తత్పురంబున నల్పసుఖంబు లనుభవించుచుం బాంచాల దేశంబులందు నిజపార్షదులచేత నానీతంబులైన పదార్థంబుల నొందుచుం గామినీ జన సమేతుండై భయపర్యాలోచనంబు సేయనేరక రాష్ట్ర పురబాంధవ సమేతుండై యార్తి నొంది చింతాక్రాంతుండై యుండె, నంత,

810

తా ॥ ఇట్లు తనకు హితాన్ని కలిగించే కర్మలపట్ల శ్రద్ధ వహించకుండా, కుటుంబం పట్ల ఆసక్తిని పెంచుకొన్న మనస్సు కలవాడయ్యాడు. అటువంటి పురంజనునికి శత్రువై, అతని ప్రియకాంతలకు, అప్రియాన్ని కలిగించే కాలం సమీపించింది. అప్పుడు 'చండవేగుడు' అనే ప్రసిద్ధమైన గంధర్వరాజు, మూడు వందల అరవైమంది గంధర్వులు, అంతే సంఖ్యగల గంధర్వ స్త్రీలు, నలుపు–తెలుపు వర్ణంతో జంటలుగా వెంటరాగా వచ్చి, పురంజనుడున్న పురాన్ని చుట్టుముట్టాడు. అన్ని కోరికల్ని తీర్చేలా నిర్మించిన ఆ పట్టణాన్ని గంధర్వులు, స్వయంగా పరిభ్రమిస్తూ చికాకు పరచి, సంపదల్ని అపహరించడానికి ఉపక్రమించారు. ఆ సమయంలో, ఆ పురంజన పురానికి అధిపతియైన 'ప్రజాగరుడు' అనేవాడు, ఏడువందల ఇరవైమంది గంధర్వజనాన్ని (గంధర్వులు – గంధర్వకాంతలు) అడ్డుకొని ఒక్కడే నూరేండ్లపాటు యుద్ధం చేశాడు. ఒక్కడే అయినప్పటికీ, ఇంతమందితో పోరాడాడు. అలా పోరాడి క్షీణబలుడయ్యాడు. అయినప్పటికీ పురంజనుడు, ఆ పురంలోనే ఉండి అల్పమైన తుచ్ఛసుఖాలను అనుభవిస్తూ, తనకుటుంబీకులు తెచ్చియిచ్చే పదార్థాల్ని పొందుతూ, స్త్రీలతో గడుపుతూ, భయాన్ని గురించి చింతించకుండా, రాష్ట్రంలోను, పురంలోను ఉన్న తన బంధుజనంతో కలసి బాధపడి, చింతాక్రాంతుడై యున్నాడు. ఇలా ఉండగా,

క. అనయంబుఁ గాల పుత్రిక, యను నొక కామిని వరేచ్ఛ నఖిల జగంబుం
దనయంతఁ గలయఁ దిరుగుచుఁ, జని చని యొకనాఁడు రాజసత్తమ! వింటే.

811

తా ॥ 'కాలపుత్రిక' అనే ఒక కన్య, వరుని కోరి, తనంతటతానే అన్నిలోకాలను తిరుగుతూ ఒకరోజు—

సీ. అనఘాత్మ! రాజర్షి యైన యయాతి కుమారకుం డయినట్టి పూరుచేత
వరియింపఁగాఁ బడి వలనొప్ప నతనికి వర మిచ్చి దౌర్భాగ్యవశత నొంది
ప్రఖ్యాతి గనుట దుర్భగ యనుపేరను బరఁగు న క్కాంత నే పురుషవరుఁడు
వరియింపఁ డయ్యె, నా తరుణియు నొక నాఁడు గర మొప్ప బ్రహ్మలోకమున నుండి

తే. వసుధ కేతెంచి విను బృహద్వ్రతుఁడ నయిన, నన్ను వరియింపఁ గోరి మనమునఁ గామ
శరవిమోహిత యై వేఁడఁ గరము నేను, సమ్మతింపక యున్న రోషమున నలిగి.

812

తా ॥ రాజర్షియైన యయాతి కుమారుడైన పూరుని చేత వరించబడింది. సంతోషించిన ఆమె, అతనికి వరాన్నిచ్చింది. తన దౌర్భాగ్యవశం చేత, 'దుర్భగ' (చెడిపోయిన మర్మావయవం కలది) అనే పేరుతో ప్రసిద్ధి పొందింది. అందుచేత ఆమెను ఏ పురుషశ్రేష్ఠుడూ వివాహమాడలేదు. ఒకనాడు, ఆమె బ్రహ్మలోకం నుండి భూలోకానికి వచ్చి, పెద్ద వ్రతనియమం గల నన్ను వరించ గోరింది. మన్మథ బాణాలకు మదిలో తాళలేక నన్ను వేడుకున్నది. సమ్మతించని నాపై (మైత్రేయునిపై) కోపించి,

వ. ఇట్లను, మునీంద్రా! మదీయాశా విముఖుండవైన నీకు నేకత్రావస్థానంబు లేక యుండుంగాక! యని శపించి విహత సంకల్పయై మదుపదేశంబునం జని యవనేశ్వరుండును భయ నామకుండును నయిన వానిం గదిసి యిట్లనియె.

813

తా ॥ ఇలా శపించింది. "ఓ మునీంద్రా! నీవు నా కోర్కెని తిరస్కరించావు. 'నీవు ఒక చోటన లేక నిరంతరం తిరిగే యోగం పట్టుగాక!" అని శపించింది. ఇలా భగ్నసంకల్పయైన కాలకన్యకు నేను చేసిన ఉపదేశంతో, యవనదేశాధిపతియైన 'భయుడు' అనే పేరుగల వానివద్దకు వెళ్ళి ఇలా అన్నది:

క. అవనీపతి! భయనామక, యవనకులాధీశ్వరుండ వగు నినుఁ బతిఁగాఁ
దవిలి వరింపఁగ వచ్చితి, సవినయముగ వినుము భూత సంకల్పమునన్.

814

తా ॥ 'ఓ రాజా! భయుడనే పేరుగల యవనదేశాధిపతివైన నిన్ను పరిణయమాడి—

వ. కలుగు మత్కామితంబు వృథ గాదు, లోకంబున వేదంబులందు దేయగ్రాహ్యరూపం బైన వస్తువు యాచ్యమానం బగుచుండ నెవ్వం డొసంగం, డెవ్వం డిందు దీయమానం బగు చుండం గోరం డట్టి వీర లిద్దఱును జడస్వభావు లని సత్పురుషులు శోకంబు నొందుదురు! గావున నిన్ను భజియించుచున్న నన్నుం గరుణార్ద్ర చిత్తుండవై భజియింపు మిట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మం బని పలికిన నక్కాలపుత్త్రిక వచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షు వగు దానిం గనుంగొని మందస్మిత వదనుం డగుచు నిట్లనియె.

815

తా ॥ భర్తగా పొందాలని వచ్చాను. సవినయంగా నేను చేసే విన్నపమిది. భూత సంకల్పంచేత నాకు కలిగిన కోరిక వృథా కాదు. 'దానం చేయదగినది — స్వీకరించదగినది' అని వేదాలలో చెప్పబడిన వస్తువును, ఎవరైనా కోరినప్పుడు, ఇవ్వడానికి శక్తి కలిగి కూడ ఇవ్వనివాడు మూర్ఖుడు. అలాగే వస్తువును మరొకరు ఇస్తామన్నా, స్వీకరించడానికి ఇష్టపడనివాడు కూడా మూర్ఖుడే. అటువంటి వాళ్ళని చూసి, పెద్దలు బాధపడతారు. కాబట్టి నిన్ను సేవిస్తున్న నన్ను

దయతో ఆదరించు. ఇటువంటి కాలపుత్రిక మాటలను విని, యవనేశ్వరుడు, ఆ పలుకులు దేవరహస్యాలని, దానివల్లనే ఆమెకు తనపట్ల కోరిక కలిగిందని గ్రహించి, ఆ కన్యకను చూసి చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నాడు:

క. విను తరుణి! యాచ్యమానం, బనఁదగు నీ లోకమందు నత్యశుభవు స
జ్జనముల కసమ్మతవు నగు, నిను నభినందింపకుంద్రు నెఱి నెవ్వారున్.

816

తా ॥ "ఓ యువతీ! నీవు మిక్కిలి అశుభమైన దానివి. సజ్జనులు సమ్మతించని దానివి. అందుచేత ఈ లోకంలో, నీవు కోరిన వారిలో ఎవరూ నిన్ను మెచ్చుకోవటం లేదు.

వ. కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బతి నిరూపణంబు సేసెద, నది యెట్లనిన మదీయసేనా సాహాయ్యంబు వడసి ప్రజానాశం బొనరించునట్టి నీ వవ్యక్తగతివై కర్మనిర్మితంబైన లోకంబు ననుభవింపు, మీ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు, నీవు మదీయ భగినివి. మీ యిద్దఱం గూడి యీ లోకంబునందు నవ్యక్తుండును భీమసైనికుండును నై యేను వర్తింతు ననిన నా భయనామకుం డయిన యవనేశ్వరుని దిష్టకారులైన సైనికులు ప్రజ్వార కాలకన్యాయుక్తులై భూమండలం బెల్ల దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భౌమ భోగాఢ్యంబును జరత్పన్నగ పాలితంబును నయిన బురంజను పురంబు నావరించి యున్నంత స్వాభిభూతుం డయిన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టి కాలకన్యక బలాత్కారంబున నా పురంజను పురంబు ననుభవించె, నట్లు కాలకన్య కోపభుజ్యమానంబైన పురంబు సర్వద్వారంబులందును సర్వతో–ధికంబుగా న య్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బీడింప నిట్లు పురంబు ప్రపీడ్యమానం బగుచుండ నభిమానియైన పురంజనుండు.

817

తా ॥ అందుచేత నేను జ్ఞానదృష్టితో చూసి, నీకు భర్త ఎవరో నిరూపిస్తాను." అదెలాగంటే, "నా సేనాసహాయాన్ని పొంది, ప్రజలను నాశనం చేసేందుకు నీవు, అంతుచిక్కని గమనంతో, కర్మఫలాలతో నిర్మితమైన ఈ లోకాన్ని అనుభవించు. ఈ 'ప్రజ్వారుడు' నాకు సోదరుడు. నీవు నాకు సోదరివి. మీ ఇద్దరితో కలసి నేను అవ్యక్తంగా, భయంకరమైన సేనలు కలవాడనై, ఈ లోకంలో సంచరిస్తాను" అని అన్నాడు. భయుడనే పేరుగల ఆ యవన రాజు ఆజ్ఞను నెరవేర్చటం కోసం, సైనికులు, ప్రజ్వారునితో కాలకన్యకతో కలసి భూమండలమంతా తిరుగుతూ, ఒకరోజు, భూలోక భోగ సుఖాలలో శ్రేష్ఠమై, ముసలి పాముచేత రక్షించబడుతున్న పురంజనుని పురాన్ని అత్యంత వేగంతో వచ్చి ముట్టడించారు. తనచే ఓడింపబడి ఆక్రమించబడిన పురుషునికి నిస్సారత్వాన్ని కలిగించే కాలకన్యక, బలాత్కారంగా, ఆ పురంజనుని పురాన్ని అనుభవించింది. ఆ విధంగా కాలకన్యకచేత అనుభవింపబడుతున్న పురంయొక్క అన్ని ద్వారాలలో, అంతకంతకు పెరుగుతున్న యవనసైనికులు ప్రవేశించి, పీడించారు. అలా పీడింపబడుతున్న పట్టణాన్ని చూసి, ఆ పట్టణంపై అభిమానం గల పురంజనుడు,

సీ. అనఘ! యెంతయు మమతాకుల చిత్తుఁడై బహువిధ భూరితాపములఁ బొందె,
ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు నష్టసంపదుఁడు వినష్టమతియు
విషయాత్మకుండును వినిహతైశ్వరుండుఁ గృపణుండు సాల నకించనుండు
నగు పురంజనుఁడు శోకానిలభావుఁడై, గంధర్వ యవన సంఘములచేత

తే. నోజ సెడి వికలత నొందు నైజపురముఁ, దవిలి ప్రతికూలురును ననాదరణయుతులు
నయిన పుత్రులఁ బౌత్రుల ననుచరులను, సచివ పౌరోహితుల నిజసతినిఁ జూచి.

818

తా ॥ మమకారంతో చీకాకు పడిన మనస్సు కలవాడై అనేక విధాలుగా బాధపడ్డాడు. పెద్దకుటుంబం, ముసలితనం, సంపదలు పోవటం, కాలకన్యక కౌగిలిలో నలిగి పోవటం,

బుద్ధిబలాన్ని కోల్పోవటం, ఇంద్రియార్థాలే తానుగా జీవించటం, దీనత్వం, కడు నీచప్రవర్తనం గల పురంజనుడు శోకంతో తప్తుడయ్యాడు. గంధర్వ, యవనసైన్యాలచేత ఆక్రమించబడి, శోభను కోల్పోయి వికలత్వాన్ని పొందిన తన పురాన్ని, ఎదురు తిరిగి అనాదరించే పుత్రుల్ని, పౌత్రుల్ని, అనుచరుల్ని, మంత్రుల్ని, పురోహితుల్ని, భార్యను చూశాడు.

వ. మఱియుఁ గాలకన్యాగ్రస్తుం డయిన తన్నును నరిదూషితంబులైన పాంచాల బలంబులనుం జూచి యపార చింత నొంది తత్ప్రతీకారంబు సేయ నెఱుంగక కాలకన్యాపహృతవీర్యంబు లయినం గామంబుల నభిలషించుచు దీనుండును విగతాత్మగతికుండును స్నేహంబునం జేసి పుత్రదారోపలాలనపరుండునునై కాలకన్యోపమర్దితంబును గంధర్వ యవనాక్రాంతంబును నైన పురంబు విడువ నిచ్ఛలేకయు విడువ నుపక్రమించె, నప్పుడు.

819

తా ॥ ఇంకా కాలకన్యకచే మ్రింగబడిన తనను, శత్రువులచే ధ్వంసం చేయబడిన పాంచాలసైన్యాల స్థితిని చూసి, అపారమైన చింతను పొందాడు. తగిన ప్రతీకారం చేసే ఉపాయం తోచలేదు. కాలకన్యక చేత అపహరించబడిన శక్తిగలవాడైనప్పటికీ, నిస్సారమైన కోరికలనే కోరుకుంటూ, దీనుడై, వేరే గతిలేక, భార్యాబిడ్డలపై మమకారాన్ని చంపుకోలేక, వాళ్ళను బ్రతిమాలుతూ, కాలకన్యక చేత నలుగగొట్టబడి, గంధర్వ యవన సైన్యంచే ఆక్రమించబడిన ఆ పురాన్ని విడచి పెట్టడం ఇష్టం లేకపోయినా విడువడానికి ఉపక్రమించాడు.

క. అనఘా! భయనామాగ్రజుఁ, డనఁగల ప్రజ్వారుఁ డపుడ యరుదెంచి పురం
బును సకలంబును భయనా, మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్.

820

తా ॥ అప్పుడు 'భయుని' అన్న 'ప్రజ్వారుడు' వచ్చి, పురంజనుని పట్టణాన్ని మొత్తము

భయునికి ప్రీతి కలిగించేలా దహించాడు.

వ. అట్లు పురంబు దహ్యమానం బగుచుండఁ బౌరభృత్యవర్గాది సమన్వితుండును, గౌటుంబికుండును, పుత్రాది సమన్వితుండును, యవనోపరుద్ధాలయుండును, గాలకన్యాగ్రస్తుండును నయిన పురంజనుం డప్పురంబునందుఁ బ్రజ్వార సంస్పృష్టుండై యనుతాపంబునొంది తత్పురపాలనంబు నందు సమర్థుండు గాక పురకృచ్ఛ్రోరువేపథుండయి యందుండ నశక్తుం డయ్యె, నంత

821

తా ॥ ఈ విధంగా పురం తగలబడి పోతుంటే, పౌరులు సేవకులతో కూడిన పురంజనుడు, కొడుకులు మొదలైన వారితో కూడిన సంసారి యైనప్పటికీ, యవనులచే ముట్టడించబడి, కాలకన్యచే మ్రింగబడి, ప్రజ్వారునిచే స్పృశించబడి, దుఃఖించాడు. ఆ పట్టణాన్ని రక్షించి పాలించడంలో అసమర్థుడై, మాటిమాటికీ కలుగుతున్న నిరోధాలకు శక్తిహీనుడై వణకిపోయాడు.

క. దవశిఖీయుత తరుకోటర, నివసిత పన్నగము పగిది నిజపురి వెడలం,
దివురుచు నతఁడు శిథిల దవ, యవుఁడును గంధర్వ గణ విహత శౌర్యుండున్.

822

తా ॥ కార్చిచ్చు చుట్టుముట్టినప్పుడు, చెట్టుతొఱ్ఱలో నుండి బయటపడటానికి ప్రయత్నించే పాములాగా, పురంజనుడు పట్టణం నుండి వెలువడటానికి ప్రయత్నించాడు. అవయవాలు శిథిలమై, పట్టుతప్పగా, గంధర్వుల వలన శౌర్యం పోగొట్టబడిన వాడయ్యాడు.

సీ. అయి చాల ఘుర ఘుర మనుశబ్ద మడరంగ మనమునఁ జింతానిమగ్నుఁ డగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుర మనుమల నాప్తుల ననుచరాళి
ననయంబు నల్పమాత్రావశిష్టం బైన గృహకోశనివహ పరిచ్ఛదముల

మసలు నహంకార మమకారములఁ జేసి మతిహీనుఁ డగుచు నెమ్మనములోనఁ

తే. గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను, గటకటా! యిట్లు పరలోక గతుఁడ నైన
నిట్టి భార్య యనాథయై యీ కుమార, వరుల నేరీతిఁ బ్రోచునో యరసి యనుచు.

823

తా ॥ గొంతులో గురగురమనే శబ్దం పుట్టింది. మదిలో చింతిస్తూ, కొడుకుల్ని కోడళ్ళను, కూతుళ్ళను, అల్లుళ్ళను, మనుమల్ని, ఆప్తుల్ని, అనుచరుల్ని, మాటిమాటికి తలుచుకున్నాడు. తన ఇంట్లో కొద్దిగా మిగిలిన ధనాన్ని, వస్త్రాల్ని స్మరించాడు. అహంకార మమకారాలలో చిక్కి మతిహీనుడయ్యాడు. అయినప్పటికీ మదిలో పూనిక వహించి 'తాను మరణిస్తే, తన ఎడబాటుతో భార్య అనాథయై, తన కుమారుల్ని ఏ విధంగా కాపాడుతుందోన' ని దుఃఖించాడు."

వ. మఱియు నిట్లని తలంచు.

824

తా ॥ ఇంకా ఈ విధంగా అనుకున్నాడు:

సీ. పడఁతి యే మును భుజింపక భుజింపదు నేను, నిద్ర వోవక మఱి నిద్ర వోదు,
నేను నీళ్లాడక నీళ్లాడ నొల్లదు పదరి యేఁ గోపింప భయము నొందు,
భర్జించినను మాఱుపలుకక వాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధి సెప్పు!
లలి మీఱ నిట్టి కళత్రంబుతో నేను గడఁగి దేహాంతరగతుండ నైన

తే. ననయమును దాను బుత్త్రిణి యగుటఁ జేసి, యాత్మశోచిని యగుచు గృహస్థ ధర్మ
మాచరించుచు నుండునో? యనుగమనము, సేయునో యని మనమునఁ జింత నొంది.

825

తా ॥ "ఈమె ఎప్పుడూ నేను భుజించకుండా తాను భుజించేది కాదు. నేను

నిద్రించకుండా తాను నిద్రించదు. నేను స్నానం చేయకుండా తాను స్నానం చేయదు. నేను కోపిస్తే భయపడేది. గట్టిగా మాట్లాడితే తిరిగి మాట్లాడటానికి భయపడేది. బుద్ధి మందగించి తెలివిహీనుడనై ప్రవర్తించినప్పుడు తెలివిగా సరిదిద్దేది. ఇటువంటి, అనుకూలవతియైన కళత్రంతో జీవించి నేను మరణిస్తే, నాకోసం శోకిస్తూ, సంతానవతి కాబట్టి గృహస్థ ధర్మాన్ని నిర్వర్తిస్తూ బిడ్డల కోసం జీవించియుంటుందో? లేక సహగమనం చేస్తుందో?" నని మదిలో చింతించాడు.

క. తన పుత్రులుఁ దన పౌత్రులు, ననయముఁదాఁ జనినయెడ నిరాశ్రయు లగుచున్
వననిధి మధ్యంబున నవి, సిన కలముం బోలి యెట్లు జీవించెదరో?

826

తా ॥ 'తన పుత్రులు, మనుమలు, తన మరణానంతరం నిరాశ్రయులై, సముద్ర మధ్యంలో పగిలి బ్రద్దలైన ఓడలాగా ఎలా జీవిస్తారో?'

క. అని యి వ్విధమునఁ గృపణుని, యనువున ఘనదుఃఖ విహ్వాలానర్హుం డ
య్యును దుఃఖించు పురంజను, ననయముఁ గొనిపోవ నిశ్చితాత్ముం డగుచున్.

827

తా ॥ అని ఈ విధంగా, దీనుడై, దుఃఖాన్ని సహించే స్థితిలేనప్పటికీ,

క. చనుదెంచెను భయనాముం, డనువాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచన్.
వినుతాత! పశువు భంగిని, మనము గలఁగ యవన నీయమానుం డయ్యెన్.

828

తా ॥ దుఃఖించాడు. అలా దుఃఖిస్తున్న పురంజనుణ్ణి తీసుకపోవడానికి మనస్సులో నిశ్చయించుకొని 'భయుడు' వచ్చాడు. పురంజనుణ్ణి పశువును కొట్టినట్లు కొట్టి ఈడ్చుకొని

పోయాడు.

బద్ధజీవులు విషయాసక్తతలో చిక్కువడినవారు, స్ఫురణ లేనివారు. వీళ్ళు వలలో చిక్కుకుని ఉన్నారు, కాని వలలో చిక్కుకున్నాం అనే భావనే ఉండదు. వారి ముందు ఆధ్యాత్మిక ప్రస్తావన తెస్తే అక్కడ నుండి వెళ్ళిపోతారు. 'భగవంతుని గురించి అంత్యకాలంలో చూసుకోవచ్చు, ఇప్పుడు ఎందుకు?' అంటారు. మరణశయ్యపై ఉన్నప్పుడు భార్యాబిడ్డలను చూసి 'దీపంలో ఎందుకు ఇన్ని వత్తులు! ఒక వత్తి చాలు, లేకుంటే నూనె తీరిపోతుంది!' అంటారు. భార్యాబిడ్డలను తలచుకొని, 'అయ్యో! నేను మరణించాక వీరి గతి ఏమిటి?' అంటూ విలపిస్తారు. వీళ్ళు దేని కారణంగానైతే ఇన్ని కష్టాలు అనుభవిస్తూ ఉన్నారో, దాన్ని పదేపదే చేస్తూంటారు. ఒంటె ముళ్ళకంపలు తింటూ ఉన్నప్పుడు నోటి నుండి రక్తం ధారగా కారుతుంది, కాని వదలిపెట్టదు...

...బద్ధజీవులు మరణ సమయంలోనూ సంసారం గురించే పలవరిస్తారు. బాహ్యంగా జపమాలను త్రిప్పటం వలనా, గంగలో మునగటం వలనా, తీర్థయాత్రలు చేయటం వలనా ప్రయోజనం ఏమిటి? అంతరంగాన సంసారం పట్ల అనురక్తి ఉండే పక్షంలో మరణసమయంలో అది ముందుకు వచ్చి నిలబడుతుంది...

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. అనుచర వర్గంబు భృశాతురులును దుఃఖీతులునై వెనుచనుచుండ నుపరుద్ధంబగు భుజంగమం బప్పురంబు నెప్పుడు వాసె నప్పు డాపురంబు పురంజనుం బాసి విశీర్ణంబై ప్రకృతిం బొందె, బలవంతుం డయిన యవనునిచేత బలాత్కారంబున వికృష్యమాణుండైన పురంజనుండు దమఃపిహితుండై పూర్వ సుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగకుండె, నంతం బరలోకగతుండైన పురంజనుం గదిసి పూర్వంబున నదయుండైన యతనిచేత హింసింపంబడిన యజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ గుఠారంబుల నతని నఱకె, న వ్విధంబునఁ బ్రమదా సంగ దోష దూషితుండును, నపార తమోనిమగ్నుండును, నష్ట

జ్ఞానుండును నయి పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి ననుభవించి తద్భార్యయైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయ సంస్మరణంబునం జేసి తరువాతి జన్మంబున విదర్భరాజ గృహంబునం బ్రమదోత్తమయై జన్మించె నంత.

829

తా ॥ అనుచరులంతా, ఆతృత పడుతూ, దుఃఖీస్తూ పురంజనుని వెంటవెళ్ళారు. ఆ పురానికి రక్షగానున్న అయిదు తలలపాము, ఆ పురాన్ని ఎప్పుడయితే విడిచిపోయిందో, అప్పుడే ఆ పురం, పురంజనుని నుండి వేరయింది. ఆ పురము చెదరి పంచభూతాలలో కలసిపోయింది. బలవంతుడైన యవనుని చేత, బలాత్కారంగా లాగికొని పోబడుతున్న పురంజనుడు, అజ్ఞానంతో కప్పబడి, తన పూర్వ స్నేహితుడైన ఈశ్వరుణ్ణి తెలుసుకోలేకపోయాడు.

చనిపోయి పరలోకం చేరిన పురంజనుణ్ణి, అంతకు పూర్వం అతనిచేత చంపబడిన యజ్ఞపశువులు, మహాకోపంతో వచ్చి గొడ్డళ్ళతో నరికాయి. స్త్రీ సాంగత్య దోషం చేత చెడిపోయి, అజ్ఞానాంధకారం చేత తెలివి తప్పి చాలాకాలం పరలోకంలో బాధలను అనుభవించాడు. ఉత్తమజాతి స్త్రీగా తన భార్యను నిరంతరం మనస్సులో ఎప్పుడూ స్మరిస్తుండటం చేత, మరుజన్మలో విదర్భరాజు ఇంట్లో 'స్త్రీ' గా జన్మించాడు.

సీ. అవనీశ! వీర్యపణాత్త యైనట్టి వైదర్భిని మలయకేతనుఁ డనంగం
బరపురంజయుఁడైన పాండ్య భూమీశుండు దారుణ సంగర స్థలమునందు
శక్తి ననేక రాజన్యుల నిర్జించి పరిణయం బయ్యె,
నా గురుభుజుండు నా విదర్భాత్మజయం దసితేక్షణ యైన కూఁతును ద్రావిడాధినాథు

తే. లైన కొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె, వారలకు నెల్ల నొక్కొక్క వరుస నర్బు
దార్బుద సుతులు సంజాతు లైరి యతని, సుత ధృతవ్రత నా యగస్త్యుఁడు వరించె.

830

తా ॥ శత్రువుల పట్టణాలను జయించే, మలయకేతనుడనే పాండ్యరాజు, తన పరాక్రమాన్ని పణంగా పెట్టి, దారుణమైన యుద్ధంలో ఎందరో రాజుల్ని జయించి, విదర్భ రాకుమారిని వీర్యశుల్కంగా పొంది పరిణయం చేసుకున్నాడు. ఆమెకు, అతనికి కాటుక కళ్ళవంటి నల్లని చూపులుగల కూతురు, ద్రావిడ దేశాధిపతులైన ఏడుగురు కొడుకులు జన్మించారు. ఆ కుమారులకు ఒక్కొక్కరికి కోట్లు కోట్లు సంఖ్యగల కొడుకులు జన్మించారు. మలయకేతనుని కుమార్తె తపోవ్రత దీక్ష వహించి అగస్త్యుణ్ణి వివాహం చేసుకుంది.

క. అతఁ డా కన్యక వలనను, జతురుండై యిధ్మవాహ జనకుఁ డగు
దృఢ చ్యుతుఁడను మునీంద్రుఁ గనియెను, మతి నంత విరుక్తుఁ డగుచు మలయధ్వజుఁడున్.

831

తా ॥ అగస్త్యుడు, మలయకేతుని కుమార్తె యందు 'దృఢచ్యుతుడు' అనే కొడుకును పొందాడు. ఆ దృఢచ్యుతునికి 'ఇధ్మవాహుడు' జన్మించాడు. ఆ తరువాత మలయధ్వజుడు విరక్తుడై,

తే. క్ష్మాతలం బెల్ల నిజతనూజాతులకును, బంచి యిచ్చి సరోజాక్ష పాదపంక
జార్చనాయత్తుఁ డగుచుఁ గులాద్రి కరుగ, నంత మదిరాక్షి సతి యగు నా విదర్భి

832

తా ॥ భూమండలాన్ని మొత్తం తన కొడుకులకు పంచి ఇచ్చి, విష్ణుపాదపద్మాలను సేవించే నిమిత్తం కులపర్వతానికి వెళ్లాడు. ఆతని భార్యయైన వైదర్భి కూడా—

తే. కడఁగ గృహములు నఖిల భోగములు విడిచి, చంద్రు వెనుచను చంద్రిక చందమునను
భక్తి దళుకొత్తఁ బాండ్య భూపాలుఁ డయిన, మలయకేతను వెనుకొని మగువ సనియె.

833

తా ॥ పట్టుదలతో, ఇల్లూవాకిళ్ళు, అఖీల భోగాలను విడిచి, చంద్రుని వెన్నంటి వెళ్ళే వెన్నెలలా, భర్తయైన మలయకేతనుని వెంట భక్తితో వెళ్ళింది.

వ. ఇట్లు ధర్మపత్ని వెంట రాఁ జని యందుఁ జంద్రమసా తామ్రపర్ణీ నవోదక లను నదుల పుణ్యజలంబుల సుస్నాతుండయి ప్రక్షాళిత బాహ్యాభ్యంతరుండును గందమూల ఫలబీజ పుష్ప పర్ణ తృణ తోయాహారుండునై కాయకర్శనంబైన తపం బాచరించుచు శీతోష్ణ వర్ష వాతంబులు క్షుత్పిపాసలుఁ బ్రియా ప్రియంబులు సుఖదుఃఖంబులు నను ద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపోవిద్యాయమ నియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మంబునందు నిజాత్మ ననుసంధించి విజితేంద్రియ ప్రాణచిత్తుండై స్థాణువుంబోలె దివ్యవర్షశతంబు దపంబు సేసి భగవంతుం డయిన వాసుదేవుని యందు బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు 'మమేదం శిర శ్చిన్నమితి' యను ప్రతీతియందుం బలె వ్యతిరిక్తునిఁగ వ్యాపకునిఁగ నంతఃకరణవృత్తి సాక్షిగా నెఱింగి.

834

తా ॥ ఈ విధంగా తన ధర్మపత్ని వెంటరాగా, "చంద్రమస", "తామ్రపర్ణి", "నవోదక" లనే పుణ్యనదీ జలాలలో స్నానమాడి, లోపలి వెలుపలి మలినాల్ని తొలగించుకున్నాడు. కందమూలాలను, పండ్లను, గింజలను, పువ్వులను, ఆకులను, గడ్డిని, నీటిని ఆహారంగా స్వీకరిస్తూ, దేహాన్ని కృశింపచేస్తూ తపస్సు చేశాడు. శీతోష్ణాలు, వర్షపాతాలు, ఆకలిదప్పులు, ప్రియాప్రియాలు, సుఖదుఃఖాలు అనే ద్వంద్వాలను సమానంగా చూసే ప్రజ్ఞను సాధించాడు. తపోవిద్య చేత, యమనియమాల చేత, పక్వమైన పండులా అరిషడ్వర్గాల్ని జయించి, బ్రహ్మమునందు తన మనస్సును కూర్చి, ఇంద్రియాలను, ప్రాణగతులను, చిత్తగతులను దాటి, రాయిలా నిశ్చలుడై, వేయి దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. భగవంతుడైన వాసుదేవుని పట్ల ప్రీతి వహిస్తూ, మరొకటి తెలియక, ప్రవర్తించాడు. నేను, నాది అనే బంధాలు, తల నరుకబడినట్లుగా తెగిపోయాయి. ఇంద్రియాలతో, మనస్సుతో గల జీవితమంతా స్వప్నం

లాంటిదనీ, దానిని గమనిస్తున్న తాను ఆత్మసాక్షిగా తెలుసుకొన్నాడు.

సీ. సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును భగవంతుఁడును గృపాపరుఁడునైన
హరి యను లోకైక గురునిచే నుక్తమై సర్వతోముఖమును స్వప్రకాశి
తము నగు మహిత శుద్ధ జ్ఞానదీప ప్రభాతతిచేఁ బరబ్రహ్మమందుఁ
దన్నును, దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు నెనయఁ గన్గొనుచు దగ్ధేంధనాగ్ని

తే. భంగి నీషణములఁ, బెడఁబాసి భూరి, వ్యసన సాగర సంసృతి వలనఁ జాల,
నుపరతుం డయ్యె, నా మహితోన్నతుండు, నవని నాయక! విను మప్పు డతని భార్య.

835

తా ॥ సర్వేశ్వరుడు, భగవంతుడు, దయామయుడునైన శ్రీహరి అనే ఆచార్యుడు అనుగ్రహించిన జ్ఞానదీప ప్రభా పుంజం చేత, పరబ్రహ్మమందు తన ఉనికిని, తనయందు పరబ్రహ్మను కనుగొన్నాడు. తగులబడిన కట్టెలలో అగ్నిలా, ఈషణత్రయాన్ని విడిచిపెట్టాడు. గొప్ప బాధలకు సంద్రమైన సంసారం నుండి విశ్రాంతి పొందాడు. అప్పుడతని భార్యయైన వైదర్భి—

క. పతిదైవత శీల సమం, చిత వేణీ భూత చికుర చీరాంబర సు
వ్రత చర్య క్షామాంగి వి, గతదోష విదర్భరాజ కన్యక యచటన్.

836

తా ॥ పతినే దైవంగా భావించే శీలం గలది, కురులన్నీ జడలు కట్టగా, నారచీరలు ధరించి, వ్రత నియమాచరణతో చిక్కి, దోషాలు పోగొట్టబడగా,

తే. కమలలోచన నిఖీలభోగములం దొఱఁగి, మలయకేతనుఁ బరమ ధర్మజ్ఞుఁ జేరి
నిరుపమైన పతివ్రతా నియమ మొప్ప, సాధ్వియై భక్తిఁ బరిచర్య సలుపుచుండె.

తా ॥ అన్ని భోగాలను విడిచి, పరమధర్మజ్ఞుడైన మలయకేతనుని చేరి, సాటిలేని పతివ్రతా నియమంతో, భక్తితో సాధ్వియై పరిచర్యలు చేస్తోంది.

క. విమలమతి నిజేశు సమీ, పమునన్ సతి ధూమరహిత పవమానసఖా
గ్రమున వెలుఁగొందు కీల వి, ధమునఁ బ్రకాశించు చుండెఁ దద్దయు వేడ్కన్.

838

తా ॥ నిర్మలమైన మనస్సుతో, భర్తకు సామీప్యంగా 'పొగలేని అగ్నిహోత్రపు జ్వాలలాగ' వెలుగొందుతోంది.

క. సతి దన ప్రాణేశ్వరుఁ డుప, రతుఁ డగుట మనంబులో నరయకయె పూర్వ
స్థితి నుపచార క్రియ లం, చితమతిఁ గావింపఁ దలఁచి చిరతరభక్తిన్.

839

తా ॥ వైదర్భి, తన భర్త ప్రాణాలు త్యజించిన విషయం తెలియక, పూర్వం లాగే ఉపచార క్రియలు చేయాలని భక్తితో సమీపించింది.

క. అనుపమ సుస్థిర నియమా, సనుఁడగు నిజనాథు డాయఁ జని పూర్వగతిన్
వినమితయై సతి తత్పద, వనజము లర్చించునపుడు వరుపాదములన్.

840

తా ॥ సాటిలేని సుస్థిరమైన నియమ స్థితితో, పద్మాసనుడైన తన భర్తను సమీపించి, పూర్వంలాగే వంగి నమస్కరించింది. తన భర్త పాదాలలో—

క. విను మూష్మత లేకున్నను, గని యూథభ్రష్ట హరిణి కైవడి సతి నె

మ్మనమున బెడదుచు దీనత, ననయంబును బంధురహితయై శోకించెన్.

841

తా ॥ వేడి లేకపోవడాన్ని గమనించి, గుంపు నుండి బెదరిపోయిన ఆడులేడి వలె భయపడుతూ, బంధువులెవ్వరూ లేకపోవడంతో దీనత్వంతో శోకించింది.

చ. అనయము నిట్లు శోకవిపులాశ్రుపయః కణసిక్త మానిత
స్తనయుగయై వియోగపరితాపమునన్ హృదయంబు మాఁడ శో
భన లలితాధరోష్ఠ నవపద్మము గందఁగ సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె ననివారణఁ దద్విపినాంతరంబునన్.

842

తా ॥ విస్తృతమైన మహాశోకంతో కన్నీరు పాలిండ్లను తడపగా, వియోగం వల్ల కలిగిన వేదనతో హృదయం మాడిపోయినట్లయింది. అందమైన, సుకుమారమైన పెదవులతో పాటు పద్మంవంటి ముఖం కూడ కందిపోయింది. కంఠస్వరము విచ్చుకొని ఆ అడవిలో అడ్డులేకుండా ఏడ్చింది.

ఉ. హా! నరనాథ! హా! సుమహితాత్మక! హా! గుణశాలి! యింక నం
భోనిధి మేఖలాకలిత భూమి యధార్మిక రాజ చోర పీ
డా నిరతిం గృశింప నకటా! తగునయ్య యుపేక్షసేయ! శో
భా నయశాలి! నీవు పరిపాలన సేయుము, లెమ్ము భూవరా!'

843

తా ॥ 'ఓ మహారాజా! ఓ మహానుభావా! ఓ సద్గుణోపేతా! సముద్రం ఒడ్డాణంగా గల ఈ భూమి ఇక అధార్మికులైన రాజులు, చోరులు, నిరంతరం బాధించగా కృశించిపోతుంటే నీవిలా ఊరకుండటం తగునా? లేచి ధర్మంగా పరిపాలించు.'

చ. అని విలపించుచున్ సరసిజాక్షి నిజేశు పదారవిందముల్
దన నిటలంబు సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాల రో
దన మొనరించుచుం దగిలి దారువులం జితిఁబేర్చి యందులోఁ
బెనుపగ తత్కళేబరముఁ బెట్టి శిఖీం దరికొల్చి యిమ్ములన్.

844

తా ॥ అని విలపిస్తూ, పతి పాదపద్మాలపై బడి, తన నుదురు సోకగా విలపిస్తూ, పెద్దగా రోదిస్తూ, కట్టెలను తెచ్చి, చితిపేర్చి, అందులో భర్తదేహాన్ని తానే మోసితెచ్చి, పరుండపెట్టి, అగ్నిని రగుల్కొల్పి,

క. తా ననుగమనము సేయం, బూనుటయును నంతలోనఁ బూర్వసఖుఁడు వి
జ్ఞాన స్వరూపకుండును, నైన ధరాదివిజుఁ డొక్కఁ డబలం గదియన్.

845

తా ॥ సహగమనం చేయడానికి పూనుకొన్నది. అంతలోనే పూర్వపు మిత్రుడు, విజ్ఞానస్వరూపుడు, బ్రాహ్మణుడు అయిన వాడొకడు ఆమెను సమీపించి–

క. చనుదెంచి య త్తలోదరి, సునయోక్తుల ననునయించుచుం దగ నసియెన్
వనితా! నీ వెవ్వతె? వె, వ్వని దాన? వితం డెవండు? వగచెద వేలా?'

846

తా ॥ వచ్చి, ఆమెను నిపుణంగా ఓదారుస్తూ, "ఏమమ్మా! నీవెవరివి? ఎవరి భార్యవు? ఇతడెవడు? ఎందుకు దుఃఖీస్తున్నావు?"

క. అని యడిగి వెండియును ని, ట్లనియెను నీ సృష్టి పూర్వమందును నీ వె
వ్వనితోడ సఖ్య సౌఖ్యము, లనవరతము ననుభవించి తట్టి సఖుండన్.

తా ॥ అని అడిగి మళ్ళీ ఇలా అన్నాడు. ఈ సృష్టికి పూర్వం నీవు, ఎవనితో స్నేహం చేశావో?, ఎవనితో కలిసి సుఖాల్ని అనుభవించావో, ఆ సఖుడను నేనే.

క. న న్నెఱుంగు దేని మనమున, న న్నెఱుఁగక యున్న నై న నలినదళాక్షీ!
నన్నుఁ బురాతన సఖుఁగా, నెన్నంగలదాన; వై న నెఱుఁగవె చెపుమా!

848

తా ॥ నన్ను తెలిసినా, తెలియకున్నా పూర్వ సఖునిగా గుర్తించు.

వ. కావున నీవును నేనునుం బూర్వంబునందు మానస నివాసులమైన హంసలమై యుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖులమై వర్తించు నంత నీవు ననుం బాసి భౌమభోగ రతుండవై పదంబు నిచ్చగించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మరునప్పు డొక్క కామినీ నిర్మితంబుం బంచారామంబు నవద్వారసమేతంబు నేకపాలకంబు ద్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిపణంబుఁ బంచ ప్రకృతియు స్త్రీ నాయకంబు నైన యొక్క పురంబు వొడగంటి, వది యెట్టి దనినం బంచారామంబు లనం బంచేంద్రియార్థంబులు, నవద్వారంబు లన నాసికాది ద్వారంబు, లేకపాలకం బనం బ్రాణపాలనంబు, త్రికోష్ఠంబు లనం దేజోభిన్నంబులు, షట్కులంబు లన నింద్రియ సంగ్రహంబు, విపణంబులనం గర్మేంద్రియంబులు, పంచ ప్రకృతి యనం బంచ భూతంబులు, ప్రకృతి యను కామిని యన బుద్ధి, యిట్టి పురంబునం బ్రవిష్టుండైన పురుషం డంగనా పరతంత్రుఁడు నజ్ఞుండు నైన నీవ య ప్పురంబునం గామినీ సంస్పృష్టుండవై రమియించుచుఁ దత్సంగమంబున నష్టస్మృతివై వైదర్భీ జనసంభావిత సుఖాభాసంబులగు దుఃఖంబులచే నిట్టి పాపిష్ఠంబైన దశం బొందితివి, గావున.

849

తా ॥ "నీవు, నేను" పూర్వం మానస సరోవరంలో నివసించే హంసలం. మనం ఇంటిని విడిచి వేయి సంవత్సరాలు స్నేహితులమై ప్రవర్తించాము. అప్పుడు నీవు భౌతిక సుఖాల పట్ల ఆసక్తితో, అధికారాన్ని కోరి, నన్ను విడిచి భూమండలమంతా కలయ తిరిగావు. అప్పుడు, కామినీ నిర్మితమైనది, అయిదు ఆరామాలు కలది, తొమ్మిది వాకిళ్ళు గలది, ఒకే పాలకుడు గలది, మూడు చావళ్ళు గలది, ఆరుగుంపులు గలది, అయిదంగళ్ళు గలది, పంచప్రకృతులు గలది, స్త్రీయే నాయికగా గలది అయిన ఒక పురాన్ని నీవు చూశావు. అది ఎటువంటిదో వివరిస్తాను.

'పంచారామాలు' అంటే పంచేంద్రియార్థాలైన శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనే అయిదు. నవద్వారాలంటే కన్ను, ముక్కు, నోరు మొదలైన తొమ్మిది రంధ్రాలు. 'ఏకపాలకం' అంటే ప్రాణంచే పాలించబడేది. 'త్రికోష్ఠాలు' అంటే భూమి, జలం, అగ్ని అనే మూడు. 'షట్కులాలు' అంటే నాలుక, కన్ను, చెవి, ముక్కు, చర్మం అనే జ్ఞానేంద్రియాలు మనస్సు మొత్తం ఆరు. 'విపణములు' (బజారులు) అంటే వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అనే కర్మేంద్రియాలు. పంచప్రకృతి అంటే పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు. 'కామిని' అంటే బుద్ధి. ఇటువంటి పురంలో ప్రవేశించినవాడు ఎవడయినా స్త్రీలపై ఆధారపడిన అజ్ఞాని. అటువంటి పురంలోకి నీవు ప్రవేశించి, కామినికి చిక్కి, ఆమెతో ఆనందిస్తూ, ఆమె సాంగత్యంతో ఈశ్వరుని విస్మరించి వైదర్భివై, సుఖాలుగా జనులు భావించే ఈ దుఃఖాలను అనుభవిస్తూ పాపిష్ఠమైన ఈ దశను పొందావు. కాబట్టి—

సీ. నీవు వై దర్భివి గావు, వీరుఁ డితండు వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు
నొగి మున్ను పురమున నుపరుద్ధుఁ జేసిన యా పురంజన పతి వరయఁ గావు
మఱియు నీ వన్య సీమంతిని యనియును జర్చింపఁగాఁ బూర్వ జన్మమందు
బురుషుండ వనియును బుద్ధిఁ దలంచుట యరయంగ నీ యుభయము నసత్య

తే. మింతయును మామకీనమై యెసఁగు మాయఁ జేసి కల్పిత మయ్యెఁ జర్చింప మనము
పూర్వమున హంసలమ యని పూనియెఱుఁగఁ, బలికితిఁ దెలియు మనల రూపంబుఁ

జూడు.

850

తా ॥ నీవు విదర్భరాజపుత్రికవు కావు. ఈ మలయధ్వజుడు నీకు భర్త కాదు. ఇతఃపూర్వం, పురంలో ముట్టడించబడిన పురంజనుడవు కావు. ఈ అడవిలో, ఒకనికి భార్యగా నున్నానని అనుకోవటం ఎంతటి అసత్యమో, పూర్వజన్మలో పురుషుడైన పురంజనుణ్ణని భావించటమూ అంతే అసత్యం. ఇదంతా నా మాయ చేత కల్పించబడింది. మనం ఇరువురం పూర్వం హంసలం. నీకు తెలియజెప్పాను. తేజోరూపాన్ని గమనించి తెలుసుకో!

వ. నేనే నీవు గాని యన్యుండవు గావు, నీవే నేఁ గాని యన్యుండం గా, నిట్లని యెఱుంగుము. విద్వాంసులు మన యిద్దఱయందు నంతరంబు నీక్షింపరు, పురుషుండు ద న్నొక్కనినె యాదర్శ చక్షువులందు భిన్న రూపునింగాఁ దలంచు చందంబున మన యిద్దఱికిని భేదంబు గలిగిన యట్ల దోఁచు, నని యివ్విధంబున నతం డతని చేత నీవు పూర్వంబున మదీయసఖుండవైన హంస వని తెలుపం బడి స్వస్థుండై తద్వియోగ నష్టంబైన జ్ఞానంబు గ్రమ్మఱం బొందె నని చెప్పి నారదుండు ప్రాచీన బర్హింజూచి యీ యధ్యాత్మతత్త్వంబు రాజకథామిషంబున నీకు నెఱింగించితి ననిన.

851

తా ॥ నీవే నేను, నేనే నీవు. మనం వేరుకాదు. ఈ సత్యమును తెలుసుకో. విద్వాంసులైన వాళ్ళు మన ఇద్దరిలో భేదాన్ని చూడరు. మానవుడు అద్దంలో ప్రతిబింబించే రూపమూ బింబరూపమూ వేరుగా చూసినట్లు మనమధ్య భేదమున్నట్లు అనిపిస్తుంది." అని ఈ విధంగా సుజ్ఞాతుడు (ఈశ్వరుడు) పూర్వం నా సఖుడైన హంసవు నీవని పురంజనునకు (జీవునికి) చెప్పగా, పురంజనుడు తేరుకొని, వియోగం వల్ల కోల్పోయిన స్వరూప జ్ఞానాన్ని తిరిగి పొందాడు" అని చెప్పి నారదుడు, ప్రాచీనబర్హిని చూచి "రాజు కథ అనే మిషతో ఈ ఆధ్యాత్మ తత్త్వాన్ని నీకు తెలియ జెప్పాను" అని అన్నాడు:

క. విన భూమీశుఁడు నారద, ముని కను భవదీయ వచనములు సూరులు ద
క్కను గర్మ మోహితులమై, వనరెడు నే మెట్లు దెలియు వారము చెపుమా!

852

తా ॥ ప్రాచీనబర్హి నారదునితో ఇలా అన్నాడు: "నీ మాటలు విజ్ఞానులైన పండితులు తప్ప కర్మమోహితులమైన మేము ఎలా తెలిసికోగలము?"

వ. అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. నరేంద్రా! యేమి కతంబున నాత్మచేత నేక ద్విత్రి చతుష్పాదం బును బహుపాదంబును నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటం బగుచుండు, నా కతంబునం బురంజనుండును బురుషుం డయ్యె, నట్టి పురుషునకు నామ క్రియా గుణంబుల విజ్ఞాతుండు గాకుండుటం జేసి యవిజ్ఞాత శబ్దంబునం జెప్పంబడు. సఖుం డీశ్వరుండు, పురుషుండు సాకల్యంబునం జేసి దేహపరిగ్రహంబు సేయ నిచ్ఛించునప్పుడు నవద్వార కలితంబన ద్విహస్తచరణ యుక్తంబును నయిన పురం బేది గల, దదియ లెస్స యని తలంచి య ప్పురంబన దేహంబునందుఁ బురుషుం డింద్రియంబులం జేసి యే బుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు, నహంకార మమకారంబులకు నే బుద్ధితత్త్వంబు గారణంబగు నట్టి బుద్ధి ప్రమదోత్తమ యనంబడె, దానికి సఖులు జ్ఞానకర్మ కారణంబులైన యింద్రియ గుణంబులు, సఖీజనంబులు దదీయ వృత్తులు, పంచముఖోరగం బనం బంచవృత్తియైన ప్రాణంబు, నేకాదశ మహాభటులన బృహద్బలుండు నుభయేంద్రియ నాయకుండునైన మనంబు, నవద్వార సమేతంబైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాలదేశంబు లనం బంచ విషయంబులు, నవద్వారంబులన నాసికాకర్ణముఖ గుదశిశ్నంబులు, నందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వారపురస్కృతంబులు, దక్షిణోత్తర కర్ణంబులు దక్షిణోత్తర ద్వారంబులు, గుద శిశ్నంబులు పశ్చిమ ద్వారంబు, లందు నేకస్థల నిర్మితంబు లయిన ఖద్యోతావిర్ముఖులు నేత్రంబులు, విభ్రాజితంబన రూపంబు, ద్యుమంతుం డనం

జక్షురింద్రియంబు, నళినీ నాళిను లన నాసికా ద్వారంబులు, సౌరభం బనం గంధంబు, నవధూత యన ఘ్రాణేంద్రియంబు, ముఖ్య యన నాస్యంబు, విపణం బనవాక్కు, రసజ్ఞుం డన రసనం, బాపణం బన వ్యవహారంబు, బహూదనం బన వివిధాన్నంబు, పితృహు వన దక్షిణకర్ణంబు, దేవహు వన నుత్తరకర్ణంబు, చండవేగుం డనం గాలోపలక్షకంబైన సంవత్సరంబు, గంధర్వు లన దివంబులు, గంధర్వీ జనంబు లన రాత్రులు, పరీవర్తనం బన నాయుర్హరణంబు, గాలకన్యక యన జర, యవనేశ్వరుం డన మృత్యు, వతని సైనికులన నాధివ్యాధులు, ప్రజ్వారుం డనం బ్రాణిహింసయందు శీఘ్రవేగంబు గలిగి శీతోష్ణభేదంబులం ద్వివిధంబైన జ్వరంబు, దక్షిణ పాంచాలం బనం బితృలోక ప్రాపకంబును బ్రవృత్తి రూపకంబునైన శాస్త్రం, బుత్తర పాంచాలం బన దేవలోక ప్రాపకంబు నివృత్తి సంజ్ఞికంబు నయిన శాస్త్రంబు, శ్రుతధరుం డన శ్రోత్రంబు, నాసురీ నామకం బనం బశ్చాద్ద్వారంబయిన మేఢ్రంబు, గ్రామకం బన సురతసుఖంబు, దుర్మదుండన గుహ్యేంద్రియంబు, నిరృతినామకంబైన పశ్చిమ ద్వారం బన గుదంబు, వైశసం బన నరకంబు, లుబ్ధకుం డనం బాయువు, నంధులన హస్తపాదంబు, లంతఃపురం బన హృదయంబు, విషూచి యన మనం బని వెండియు నిట్లనియె.

853

తా ॥ అని అనగా నారదుడు ప్రాచీనబర్హితో ఇలా చెప్పాడు. ఏకపాదంతో, రెండుపాదాలతో, మూడుపాదాలతో, నాలుగు పాదాలతో, అనేక పాదాలతో, అసలు పాదాలే లేకుండా తయారైన దేహాలే 'పురాలు'. ఆ పురాలలో నివసించటం చేత జీవుడే పురుషుడు లేక పురంజనుడయ్యాడు. అటువంటి పురుషుడు పేరు చేతగాని, ప్రవర్తన చేతగాని, గుణములచేత గాని తెలియబడనందున 'అవిజ్ఞాతుడు' అని అంటారు. ఆతని మిత్రుడే ఈశ్వరుడు. పురుషుడు బుద్ధి పూర్వకంగా తొమ్మిది ద్వారాలతో, రెండు చేతులతో పాదాలతో కూడిన ఏ లోపం లేని దేహంలో ప్రవేశించాలని కోరుకుంటాడు. అలా బుద్ధిని ఆలంబనగా చేసికొని, ఇంద్రియాలచేత సుఖాలను అనుభవిస్తాడు. అహంకార మమకారాలను పొందుతాడు. వీటికి కారణమైన బుద్ధినే

'ఉత్తమ స్త్రీ' అని అన్నారు. ఆ బుద్ధి అనే స్త్రీకి స్నేహితులు జ్ఞానానికి, కర్మలకు కారణమైన 'ఇంద్రియ గుణాలు'. చెలికత్తెలు ఇంద్రియ వ్యాపారాలు. 'అయిదు తలల సర్పము' అంటే అయిదు ప్రవృత్తులు గల ప్రాణం. 'పదకొండుమంది మహాభటులు' అంటే కర్మేంద్రియాలను జ్ఞానేంద్రియాలను నియమించే మనస్సుతో కలసి పదకొండుమంది. 'తొమ్మిది ద్వారాలతో కూడిన ఆ పురాన్ని చుట్టి వచ్చిన 'పాంచాలదేశాలు' అంటే ఏమిటో చూద్దాం. పాంచాల దేశాలంటే ఇంద్రియార్థాలు ఐదు. 'తొమ్మిది వాకిళ్ళు' అంటే కళ్ళు, ముక్కు రంధ్రాలు, నోరు, చెవులు, మలద్వారం, మూత్రద్వారాలు. అంటే తలవైపున నుండే ద్వారాలు కుడిచెవి దక్షిణ ద్వారం, ఎడమచెవి ఉత్తర ద్వారం మలమూత్రద్వారాలు. పశ్చిమదిక్కున ఉంటాయంటే దేహానికి దిగువన ఉంటాయని అర్థం. ఒకేచోట నిర్మించబడిన 'ఖద్యోత', 'ఆవిర్ముఖీ' అనేవి రెండు నేత్రాలు. 'విభ్రాజితం' అంటే రూపం, ద్యుమంతుడు అంటే నేత్రేంద్రియం. నళిని, నాళినులు అంటే ముక్కురంధ్రాలు. సౌరభము' అంటే 'వాసన'. 'అవధూత' అంటే వాసన చూసే శక్తి (ముక్కు), 'ముఖ్య' అంటే నోరు. 'విపణము' వాక్కు 'రసజ్ఞుడు' అంటే నాలుక. 'ఆపణము' అంటే వ్యవహారం (సంభాషణ). 'బహూదనం' అంటే పలురకాలైన అన్నం. పితృహువు – అంటే కుడి చెవి. దేవహువు – అంటే ఎడమ చెవి. 'చండవేగుడు' అంటే కాలాన్ని సూచించే సంవత్సరం. గంధర్వులు అంటే పగళ్ళు. వారి భార్యలైన గంధర్వీజనం అంటే 'రాత్రులు'. పరివర్తనమంటే ఆయువు క్షయం కావటం. 'కాలకన్యక' అంటే 'ముసలితనం'. 'యవనేశ్వరుడు' అంటే మృత్యువు. ఆతని సైనికులు ఆధి (మానసిక బాధ), వ్యాధి (దేహబాధ) 'ప్రజ్వారుడు' అంటే శీతలత్వం, ఉష్ణత్వం అనే రెండు విధాలుగా ప్రాణుల్ని తీవ్రంగా హింసించే జ్వరం. 'దక్షిణపాంచాలం' అంటే పితృలోకాన్ని ప్రాప్తింప చేసే కర్మకలాప శాస్త్రం'. ఉత్తరపాంచాలం అంటే, దేవలోకాన్ని పొందింపచేసే జ్ఞానవైరాగ్య సంబంధ శాస్త్రం. 'శ్రుతధరుడు' అంటే చెవి. 'ఆసురి' అనే పేరుగల పడమటి ద్వారం 'మూత్రద్వారం', 'గ్రామకం' అంటే 'సంభోగం', 'దుర్మదుడు' అంటే రహస్యావయవం (యోని). నిర్మతి అనే పేరుగల పడమటి ద్వారం అంటే మలద్వారం (గుదం). 'వైశసం' అంటే నరకం. లుబ్ధకుడంటే మలం విడిచే తావు (పాయువు). 'సంధులు' అంటే హస్తాలు, పాదాలు. 'అంతఃపుర' మంటే 'హృదయం', 'విషూచి' అంటే

'మనస్సు'.

సీ. అనఘాత్మ! వినుము జాయాత్మజులును గుణా క్తం బగు మతి బుద్ధితత్త్వ మర్థి
వెలయ నే యే గతి వికృతి సేయం బడు నే యే తెఱంగుల నింద్రియములు
వికృతిని బొందు నా విధమునఁ దద్గుణాన్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును
ఘనుఁడు నుపద్రష్టయును దగు నాత్మయుఁ దద్వృత్తులను బలాత్కారమునను

తే. ననుకరింపంగ నర్థిఁ జేయంగఁ బడుట, ననయమును నాత్మమహిషిని
ననుసరించుటయు నెఱుఁగఁ జెప్పి యిట్టు లనియెను మఱియు, జనవరేణ్యునితో
యోగిసత్తముండు.

854

తా ॥ ఓ పుణ్యాత్మా! భార్యాపుత్రులనే గుణముతో చేరిన బుద్ధితత్త్వం ఏయే విధంగా వికారం చెందునో, ఏయే రీతులుగా ఇంద్రియములు వికారము నొందునో అట్టి విధంగా ఆ యా గుణాలు కలిగి, జీవుడు ఆ యా ప్రవర్తనలను పొంది, చూస్తుండేవాడు. బలాత్కారంగా తానా ప్రవర్తనల్ని అనుకరించేవాడు. అందుకే పురంజనుడు భార్యను అనుసరించి జీవించినట్లుగా చెప్పాను. అని మళ్ళీ రాజుతో ఇలా చెప్పాడు:

వ. 'మఱియు నరదం బన దేహంబు, దురంగంబులన నింద్రియంబు, లీషాద్వయం బన సంవత్సరంబును దత్కృత వయస్సును, జక్రద్వయం బనం బుణ్యపాప కర్మద్వయంబు, వేణుత్రయం బన గుణత్రయంబు, పంచబంధనం బనం బంచప్రాణంబులు, రశ్మి యన మనంబు, సారథి యన బుద్ధి, రథికోపవేశస్థానం బన హృదయంబు, గూబరంబు లన శోకమోహంబులు, పంచప్రహరణంబు లనం బంచేంద్రియార్థప్రక్షేపంబు, పంచవిక్రమం బనం గర్మేంద్రియంబులు, సప్తవరూథంబు లన ధాతువులు, హైమోపస్కరం బన రజోగుణం, బక్షయతూణీరం బన ననంతవాసనాహంకారోపాధి, యేకాదశ చమూపతి యన నేకా దశేంద్రియంబైన మనం, బాసురీవృత్తి యనం బాహ్యావిక్రమంబు,

పంచేంద్రియంబులచేత మృగయా వినోదంబు చందంబున హింసాదులం జేసి విషయంబు లనుభవించుటయ మృగయాచరణం, బీ విధంబున నుండ జీవుండు దేహంబున స్వప్న సుషుప్తి జాగ్రదవస్థలయందు నాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులైన బహువిధ దుఃఖంబులం జేసి క్లేశంబుల ననుభవించుచు నజ్ఞానావృతుండయి వర్షశతంబు నిర్గుణుం డయ్యును బ్రాణేంద్రియ మనోధర్మం బులం దనయందు నధ్యవసించి కామలవంబుల ధ్యానంబు సేయుచు నహంకార మమకార సహితంబుగాఁ గర్మాచరణంబు సేయుచుండు. 855

తా ॥ 'రథము' అంటే దేహం. 'తురంగాలు' (గుఱ్ఱములు) అంటే ఇంద్రియాలు. రెండువైపులనున్న బండి నొగలు అంటే సంవత్సరం – వయస్సు. 'రెండు చక్రాలు' అంటే పాపపుణ్య కర్మలు. మూడు పతాకలంటే త్రిగుణాలు. 'అయిదుకట్లు' అంటే పంచప్రాణాలు. 'పగ్గము' అంటే మనస్సు. సారథి అంటే బుద్ధి. 'గూడు' అంటే రథికుడు కూర్చునే ప్రదేశం అంటే హృదయం. రెండు జల్లలు (నొగలు) అంటే శోక మోహాలు. అయిదు గంటలు అంటే అయిదు ఇంద్రియార్థాలు. పంచవిక్రయాలు అంటే కర్మేంద్రియాలు. ఏడు కవచాలు అంటే దేహంలోని సప్తధాతువులు. (రసం, రక్తం, మాంసం, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్రం) 'స్వర్ణాభరణం' అంటే రజోగుణం. అక్షయతూణీరం అంటే అనంతమైన సంస్కారాలకు స్థానమైన అహంకారం. పదకొండు 'సేనలకు అధిపతి' అంటే జ్ఞానకర్మేంద్రియాలకు అధిపతియైన పదకొండవ ఇంద్రియమైన మనస్సు. ఆసుర ప్రవర్తనమంటే బాహ్య ప్రపంచంతో విజృంభించటం. 'వేట' అంటే పంచేంద్రియాలచేత హింసాదుల్ని చేసి విషయాల్ని అనుభవించే వినోదమే. ఈ విధంగా జీవి దేహవర్తియై, కల, నిద్ర, మెలకువ అనే స్థితులతో, వంద సంవత్సరాలు అధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికములైన దుఃఖాల చేత కష్టాలను అనుభవిస్తాడు. అజ్ఞానం చేత ఆవరించబడి, తాను స్వయంగా నిర్గుణుడైనప్పటికీ, ప్రాణాలు, ఇంద్రియాలు, మనస్సు తనయందే యున్నట్లు ఆరోపించుకొని, గుణాలకు చిక్కు, తీరని కోర్కెలను గురించి చింతిస్తూ వాటికొరకు అహంకారమమకారాలతో కర్మలను ఆచరిస్తాడు.

క. పురుషుఁడు నిజప్రకాశతఁ, బరఁగియు నలఘుఁడుఁ బరుండు భగవంతుండున్
గురుఁడును నగు న య్యాత్మను, బరువడి నెఱుఁగంగ లేక ప్రకృతి గుణములన్.

856

క. విను మెపుడు దగులు నప్పుడ, యొనరంగ గుణాభిమానియును గర్మవశుం
డనఁ దగు నా పురుషుఁడు దా, ఘనమగు త్రైగుణ్య కర్మకలితుం డగుచున్.

857

తా ॥ ప్రాణి (జీవుడు) ఎప్పుడయితే తాను స్వయం ప్రకాశుడు, గొప్పవాడు, ప్రకృతికి అతీతుడు, భగవంతుడు, ప్రబోధకుడైన గురువు అని తెలుసుకోలేక పోతాడో అప్పుడు ప్రకృతి గుణాల పట్ల ఆసక్తుడై చిక్కుకుని, గుణాలపట్ల అభిమానం గలవాడై, కర్మవశుడై, కర్మలలో మునిగి తేలుతుంటాడు.

సీ. ధృతి నొప్పుచున్న సాత్త్విక కర్మమునను బ్రకాశ భూయిష్ఠ లోకముల భూరి
రాజస ప్రకట కర్మమున దుఃఖోదర్క లోలక్రియాయాస లోకములను
గైకొని తామస కర్మంబునను దమ శ్శోక మోహోత్కట లోకములను
బొందుచుఁ బుంస్త్రీ నపుంసక మూర్తుల దేవతిర్యఙ్మర్త్య భావములను

తే. గలుగుఁ గర్మానుగుణములు గాఁగ జగతిఁ, బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టు చిట్లు
దివిరి కామాశయుండైన దేహి యెప్డు, నున్నతానతపదముల నొందుచుండు.

858

తా ॥ జీవుడు, ధైర్యంతో చేసే సాత్త్విక కర్మల వల్ల, వెలుగుతో కూడిన లోకాలను; రజోగుణంతో కూడిన కర్మల వల్ల, దుఃఖభూయిష్టమైన లోకాలను; తామస భూయిష్ఠమైన కర్మలవల్ల, చీకటి, దుఃఖం, మోహంతో కూడిన లోకాలను పొందుతాడు. అజ్ఞానంతో ఆ యా గుణముల ప్రభావంతో చేసిన ఆ యా కర్మలను అనుసరించి, దేవయోనిలో గాని,

మనుష్యయోనిలో గాని, పశుపక్ష్యాది యోనిలో గాని, పురుషుడుగా గాని, స్త్రీగా గాని, నపుంసకుడుగా గాని జన్మిస్తాడు."

వ. అని మఱియు నిట్లనియె.

859

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు:

మ. ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం బింటింటికిం బోవఁ బూ
నినఁ దద్దైవిక మైన దండహతి గానీ, కాక చౌర్యాన్నమై
నను గానీ తగఁ బొందు చందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీ జీవుఁడు దాఁ బ్రియా ప్రియములం బొందుం ద్రిలోకంబులన్.

860

తా ॥ "మిక్కిలి ఆకలిబాధతో తల్లడిల్లే కుక్క, ఇంటింటికి పోతుంది. దైవానుగ్రహంచే దానికి ఒకప్పుడు కర్రదెబ్బ, మరియొకప్పుడు అన్నం లభిస్తాయి. అలాగే దైవయోగంతో జీవుడు తనకిష్టమైనవి, ఇష్టం లేనివి, మూడు లోకాలలో పొంది అనుభవిస్తాడు.

చ. గొనకొని యిట్టి దుఃఖములకుం బ్రతికారము మానవేంద్ర! క
ల్గిన విను తత్ప్రతిక్రియ నకించనవృత్తి జనుండు మస్తకం
బున నిడుమోపు మూఁపునను బూనినఁ ద ద్భర దుఃఖ మాత్మఁ బా
యని గతి జీవుఁడుం ద్రివిధమై తగు దుఃఖముఁ బాయఁ డెన్నఁడున్.

861

తా ॥ ఇటువంటి దుఃఖాలకు కూడా విరుగుడు ఉన్నప్పటికీ, అది తాత్కాలికమే. నెత్తిమీద బరువు మోసేవాడు, ఆ బరువును భుజం మీదికి మార్చుకున్నప్పటికీ ఆ భారం మోసేది తానే.

అలాగే జీవుడు మూడురకాలైన దుఃఖాలను అనుభవించక తప్పదు.

క. ఘన దుఃఖ హేతుకర్మం, బును దత్ప్రతికార కర్మమును నివి మాయా
జననము లగుటను బురుషుండు, గనుఁ గలలోఁ దోఁచి నట్టి కల చందమునన్.

862

తా ॥ స్వప్నంలో మళ్ళీ స్వప్నం వచ్చినట్లు, దుఃఖానికి కారణమైన కర్మ, దానికి ప్రతిక్రియగా చేసే కర్మ, అవిద్యయైన మాయచేత కలుగుతాయి.

వ. సవాసనోచ్ఛేదకంబు గా దని వెండియు నిట్లనియె.

863

తా ॥ వాసనా సహితంగా కర్మలచేత సిద్ధించే ఫలాన్ని ఛేదించాలంటే వీలుకాదు" అని మళ్ళీ ఇలా అన్నాడు:

సీ. నరనాథ! వినుము స్వప్నంబు చందంబున నజ్ఞాన విలసితం బగుటఁ జేసి
తివిరి మిథ్యాభూత దేహాదికమునకు నరయ నివర్తనాయాస మేటి
కని యంటివేనియు నర్థంబు లేకున్న నర్థి సోపాధికం బైన మనము
వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిఁ బూని జాగ్రద్బోధచే నుపాధి

తే. చెడక స్వాప్నిక సంసృతి విడువనట్లు, తత్త్వ విజ్ఞానమున నవిద్యా నివృత్తి
దారదేహాదిక నివృత్తి దగులకున్నఁ, దివుట సంసృతి దా నివర్తింప కుండు.

864

తా ॥ "ఓ రాజా! విను. దేహము ఊహించనది, స్వప్నంవలె అజ్ఞానం వలె సంభవించేది. కావున అది అసత్యమైనదే. దానిని ప్రయాసచే తొలగించుకోవటం దేనికి? ఎందుకంటే దానితో ప్రయోజనం లేకున్నా, కలలో ఉపాధితో కూడిన మనస్సు పురుషుడను ఆశ్రయించి మెలకువ

వచ్చినను స్వప్న సంసారమును విడువదు. ఆ విధంగానే వైరాగ్యం వలన అజ్ఞానం పోగొట్టుకొనలేకపోయినను, భార్యను, దేహమును విడిచిపెట్టలేకపోయినను, సంసారము నుండి విముక్తి లేదు.

చ. ఘన పురుషార్థభూత మనఁగాఁ దగు నాత్మకు నే నిమిత్తమై
యొనర ననర్థహేతు వన నూల్కొను సంసృతి సంభవించు న
ట్లనయముఁ దన్నిమిత్త పరిహారక మర్థి జగద్గురుండు నాఁ
దనరిన వాసుదేవ పద తామరస స్ఫుటభక్తి యారయన్.

865

తా ॥ పరమ పురుషార్థమని చెప్పదగిన ఆత్మకు, అనర్థహేతువైన సంసారం ఏ కారణంగా కలుగుతుందో, ఆ కారణాన్ని జగద్గురువైన వాసుదేవుని పాదపద్మాల మీద భక్తి నశింపజేస్తుంది.

క. పూనిన తద్భక్తి సమీ, చీనగతిం దెలియ ననఘ! చిరవైరాగ్య
జ్ఞాన జనక మగు భక్తి ని, ధానము గోవింద వరకథాశ్రయమ యగున్.

866

తా ॥ వాసుదేవుని పాదపద్మాల మీది భక్తి శాశ్వతమైన జ్ఞానవైరాగ్యాలను కలిగిస్తుంది. ఆ భక్తి గోవిందుని సత్కథలను వినడం వల్లనే కలుగుతుంది.

వ. కావున నది తత్కథాకర్ణన గాన నిరతుండు, విశ్వాస సంయుక్తుండు నైన వానికి సంభవించు, మఱియును.

867

తా ॥ ఆ సత్కథలను వినటంలో, గానం చేయటంలో బుద్ధి కుదిరి, నమ్మకం కలిగిన వానికి భక్తియోగం కలుగుతుంది.

క. ధర సాధులు విమలాంతః, కరణులు భగవద్గుణానుకథన శ్రవణ
స్ఫురిత స్వాంతులు ననఘులు, వరధిషణులు నైన భాగవత జనుల సభన్.

868

క. సరసోదార మహో ము, ఖరితము లగు మధు విరోధి కమనీయ గుణో
త్కర సురుచిర చరితామృత, పరిపూరిత వాహినులను బరమ ప్రీతిన్.

869

క. మన మలరఁగ శ్రోత్రాంజలు, లను బానము సేయు పుణ్యులకు క్షుత్తృష్ణా
ఘన భయ శోకవిమోహము, లనయంబును సోఁకకుండు నవనీనాథా!

870

తా ॥ సజ్జనులు, నిర్మల హృదయులు, భగవద్గుణాలను అనుకథనం చేస్తూ, వింటూ జీవించే పుణ్యజనులు, గొప్ప బుద్ధిమంతులు అయిన భాగవత జనుల సభకు వెళ్ళాలి. అక్కడ సరసంగా, పవిత్రంగా చెప్పుకొంటున్న నారాయణుని గుణగణాలతో కూడిన చరితామృత ప్రవాహాలను చెవులనే దోసిళ్ళతో మనసారా త్రాగాలి. అటువంటి వారికి ఆకలీ, దాహము, భయమూ శోకము, వ్యామోహము సోకవు.

వ. కావున నిట్టి భాగవత సహవాసంబు లేక తనంతన భగవద్భాగవత గుణాభివర్ణన కథానుచింత నాదులయందుం బ్రవర్తించిన నాలస్యాది దోషంబు లొంది యీ జీవలోకంబు సహజక్షుధాదికంబును నుపద్రుతంబై సర్వేశ్వరకథామృత వాహిని యందు రతిం జేయ, దిది నిశ్చితం బని మఱియు నిట్లనియె.

871

తా ॥ కాబట్టి ఇటువంటి భాగవతజనుల సహవాసం లేకుండానే, తనంతట తానే భగవంతుని యొక్క, భాగవతుల యొక్క గుణకథా చింతనాదుల్ని కొనసాగిస్తే, ఆలస్యము

మొదలైన విఘ్నాలు కలుగుతాయి. జీవకోటికి సహజమైన ఆకలి దప్పుల చేత బాధించబడి, హరికథామృత ప్రవాహం పట్ల ఆసక్తిని కలుగనీయదు. ఇది నిజం." అని మళ్ళీ ఇలా చెప్పాడు:

సీ. పద్మసంభవుఁడును భవుఁడును మనుకుల సమితి దక్షాది ప్రజాపతులును
నైష్ఠికులైన సనకముఖ్య మునులుఁ బులస్త్యుండు భృగువుఁ బులహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు నంగిరసుండు నరుంధతీ విభుఁడును రూఢి మెఱయ
బహుపుణ్యు లే కడపల గాఁగఁ గల బ్రహ్మ వాదుల నందఱు వాక్కులకును

తే. నెనయ నీశ్వరులై యుండియును సమగ్ర, మతిఁ దపో యోగ విద్యా సమాధి వర వి
చారులై
యుండియును సర్వసాక్షి యైన, యీశ్వరుని వెదకియుఁ గాన రిద్ధచరిత!

872

తా ॥ "బ్రహ్మ, శివుడు, మనువులు, దక్షుడు మొదలైన ప్రజాపతులు, నిష్ఠాపరులైన సనకసనందనాది మునులు, పులస్త్యుడు, భృగుమహర్షి, పులహుడు, క్రతువు, అత్రి, మరీచి, అంగిరసుడు, వసిష్ఠుడు వీళ్ళంతా మహాపుణ్యాత్ములు, బ్రహ్మవాదులు, వాచస్పతులు, తపోయోగవిద్యా సమాధులచేత ఆత్మవిచారం కలవారు. అయినప్పటికీ సర్వసాక్షియైన పరమేశ్వరుణ్ణి వెదకులాడి కూడా చూడలేకున్నారు.

వ. అది యెట్లంటేని.

873

తా ॥ అదెలాగంటే,

మ. ఘనవిస్తార మపార మద్వయ మనంగా నొప్పు వేదంబు దా
మనువర్తించుచు మంత్రయుక్తి వివిధంబై నట్టి దేవాఖ్య శో

భనసామర్థ్యముచేత నింద్ర ముఖరూపం బిష్టదైవంబుగాఁ
గని వేడ్కన్ భజియించువారలు గనంగా నేర్తురే యీశ్వరున్.

874

తా ॥ గొప్పవిస్తృతి కలిగి, అంతు తెలియనిదై, అద్వితీయమై ప్రకాశించే వేదాన్ని అనుసరిస్తూ, వివిధ మంత్రాలచేత వివిధ దేవతల్ని, శోభాయమానమైన ఇంద్రాదిదేవతల రూపాల్ని ఇష్టదైవాలుగా భజించేవాళ్ళు సర్వేశ్వరుడైన పరమాత్మను చూడలేరు.

క. విను మాత్మ భావింతు డన, నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణం
దనరుచు ననుగ్రహించును, మనుజేశ్వర! యపుడు వాఁడు మహితాత్మకుఁడై,

875

క. ధీరత నీ లోకవ్యవ, హారంబును వైదికంబు ననఁదగు కర్మా
చారములందు వినిష్ఠిత, మై రూఢిఁ దనర్చు బుద్ధి నర్థిన్ విడుచున్.

876

తా ॥ భగవంతుడు ఎప్పుడు ఎవరిని దయతో అనుగ్రహిస్తాడో, వాడప్పుడు మహితాత్ముడై ఆత్మభావము పొంది, లోకవ్యవహారములందు, వైదికకర్మలను ఆచరించుట యందు నెలకొన్న బుద్ధిని త్యజిస్తాడు.

సీ. కావున రాజేంద్ర! నీవును బరమార్థ, రూపంబు లగుచుఁ బ్రరోచమాన
ములును గర్ణప్రియంబులును నస్పృష్ట వ, స్తువులును నైన యీ వివిధ కర్మ
ములయందుఁ బురుషార్థ బుద్ధి గావింపకు, మతిఘన స్వాంతు లైనట్టివారు
పరఁగు జనార్దన ప్రతిపాదకంబైన, శ్రుతిఁ గర్మపర మని చూపుచుండు

తే. వారు వేదజ్ఞు లనఁదగువారు గారు, రూఢి మఱివారు నిత్యస్వరూపభూత
మైన యీ యాత్మతత్త్వంబు నలరు వేద, కలిత తాత్పర్యమని యాత్మఁ దెలియలేరు.

877

తా ॥ కాబట్టి ఓ రాజశ్రేష్ఠా! నీవు కూడా, పరమప్రయోజనంగా కనిపిస్తూ, ఆసక్తిని కలిగిస్తూ, వినటానికి ఇంపై, అవాస్తవాలైన ఈ వివిధ కర్మలను పురుషార్థాలని భావించవద్దు. మలిన హృదయులు విష్ణువును ప్రతిపాదించే వేదాన్ని కర్మపరమని చూపిస్తారు. వాళ్ళు వేదజ్ఞులు కారు. వాళ్ళు శాశ్వత స్వరూపమైన ఈ ఆత్మతత్త్వంతో ప్రకాశించే ఈ వేద పరమార్థాన్ని తెలియలేరు.

వ. కావునం బ్రాగగ్రంబులైన దర్భలచేత సకలక్షితిమండలాస్తరణంబు గావించి యహంకార యుక్తుండవు నవినీతుండవు పెక్కుపశువులఁ జంపనే కాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగ, వా కర్మ విద్యాస్వరూపంబు లెట్టి వనిన సర్వేశ్వర పరితోషకం బేది, యదియ కర్మం, బా సర్వేశ్వరునియందు నేమిట మతి సంభవించు నదియ విద్య, యతండే దేహులకు నాత్మయు నీశ్వరుండు నగుచుండుఁ, గావునఁ బురుషులకు క్షేమ కరంబైన యాశ్రయంబు తద్పాద మూలంబ, యతండు ప్రియతముండును సేవ్యమానుండును నగుచుండ నణుమాత్రం బయిన దుఃఖంబులే, దట్టి యా భగవత్స్వరూపం బెవ్వం డెఱుంగు, వాఁడు విద్వాంసుండును గురుండును హరియు నని చెప్పి వెండియు నిట్లనియె.

878

తా ॥ కాబట్టి తూర్పువైపు కొనలుగల దర్భలను భూమండలమంతా పరచి, అహంకారంతో, అవినయంతో ఎన్నో పశువుల్ని చంపావు. కానీ, కర్మస్వరూపాన్ని విద్యాస్వరూపాన్ని తెలుసుకోలేక పోయావు. ఆ కర్మస్వరూపము, విద్యాస్వరూపము ఎటువంటిదంటే విను. సర్వేశ్వరునికి సంతోషాన్ని ఏది కలిగిస్తుందో అదే కర్మ. ఆ సర్వేశ్వరుని పట్ల మనస్సును లగ్నంచేసేది ఏదయితే ఉందో అదే విద్య. ఆ పరమాత్మయే దేహధారులకు ఆత్మ. ఈశ్వరుడు. కాబట్టి క్షేమకరమైన ఆశ్రయం నారాయణుని పాదమూలాలే. ఆ శ్రీమహావిష్ణువే

ప్రియాతిప్రియమైనవాడు, సేవించదగినవాడు. ఆయనను ఆశ్రయించి సేవించే వారికి అణుమాత్రమైనా దుఃఖం కలుగదు. ఆ భగవత్ స్వరూపాన్ని ఎవడు తెలుసుకుంటాడో వాడు విద్వాంసుడు. అతడే గురువు. అతడే హరిస్వరూపం." అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు:

క. అవనీశ! యీ విధంబున, భవదీయ ప్రశ్న మిట్లు పరిహృత మయ్యెం,
దవిలి యింక నొక్క గోప్యము, వివరించెదఁ జిత్తగింపు విమలచరిత్రా!

879

తా ॥ 'ఓ రాజా! ఈ విధంగా నీ ప్రశ్న పరిహరించబడింది. (సమాధానంతో తొలగింపబడింది).' ఇంకొక రహస్యాన్ని చెపుతాను. విను,

సీ. లలి సుమనోవాటికల యందు నల్ప ప్రసూన మరంద గంధానుమోద
సంచారియును మృగీసహితముఁ దన్నివేశిత చిత్తమును మధువ్రత నినాద
మేదుర శ్రవణానుమోదితమును బురోభాగ చరన్నిజ ప్రాణహారి
దీపిత వృక గణాధిష్ఠితమును లుబ్ధక క్రూర ఘన సాయక ప్రభిన్న

తే. పృష్ఠభాగంబునై తగ నెదను మృత్యు, భీతి వాటిల్ల నొండు దప్పింప వెరవు
గాన కడవిఁ జరించు మృగంబు పగిది, భూవరోత్తమ! వినవయ్య! పురుషుఁ డెపుడు.

880

తా ॥ "అందమైన పూలతోటలలో, చిన్న చిన్న కుసుమాల మకరందాన్ని, పరిమళాన్ని ఆఘ్రాణిస్తున్న తుమ్మెదల పాటలకు ప్రీతి చెందుతూ సంతోషంగా ఒక మగలేడి, ఆడలేడితో కలిసి సంచరిస్తోంది. దాని మనస్సంతా ఆడలేడిపైనే ఉంది. తుమ్మెదల ఝంకారం చెవులకు ఇంపు కలిగిస్తుంటే ఆనందంగా విహరిస్తోంది. దానికి ఎదురుగా తన ప్రాణాల్ని హరించే తోడేళ్ళ గుంపు తిరుగుతోంది. ఇంతలో తప్పించుకునే వీలులేకుండా బోయవాడు వేసిన క్రూరమైన వాడిబాణం, లేడి పృష్ఠభాగాన్ని చీల్చివేసింది. తప్పించుకొనే ఉపాయం లేక ఆ మగలేడి

మృత్యువుపాలయింది. పురుషుడు ఆ మగలేడివంటి వాడే సుమా!

వ. అంగనా నివాసంబుల యందు క్షుద్రతమంబగు కామ్య కర్మ పరిపాక జనితంబైన జిహ్వోపస్థాది కామజనిత సుఖలేశంబుల నన్వేషించుచుఁ, గామినీయుక్తుండును, దన్నివేశిత మానసుండును నతిమనోహర వనితాజనాలాప శ్రవణ తత్పర చిత్తుండును, బ్రత్యక్షంబున నాయుర్హరణ కార ణాహోరాత్రాది కాలవిశేషగణనా పరుండునుగాక పరోక్షంబునం గృతాంత శరనిర్భిన్న గాత్రుండును నగుచు నీ జీవుండు విహరించు చుండుం, గావున నీవు నీ జీవుని మృగచేష్టితునిఁ గా విచారించి శ్రోత్రాదులందున్న శబ్దాదులం బోలె బాహ్య వృత్తులగు శ్రౌతస్మార్తాది రూప కర్మంబును హృదయంబునందు నియమించుచు నసజ్జనయూథ వార్తాసహితం బైన గృహాశ్రమంబు విడువుము, సకల జీవాశ్రయుండైన యీశ్వరుని భజియింపు, మిట్లు సర్వతో విరక్తుండవు గమ్మని నారదుండు వలికినం బ్రాచీనబర్హి యిట్లనియె.

881

తా ॥ స్త్రీల ఇళ్ళను ఆశ్రయించి, అల్పమైన కోరికలతో నాలుక, మర్మావయవం వంటి అవయవాన్ని కామజనిత సుఖాపేక్షతో అన్వేషిస్తాడు. కామం గల స్త్రీలతో కలుస్తాడు. వాళ్ళపట్లనే మనస్సును లగ్నం చేసి, మనస్సును హరించే స్త్రీల మాటల్ని వినాలనే మనస్సు కలవాడై, ప్రత్యక్షంగా ఆయుష్షును హరించే రాత్రింబవళ్ళను పట్టించుకోకుండా, పరోక్షంగా యముని బాణాలతో చీల్చబడ్డ దేహం గలవాడై, జీవుడు సంచరిస్తుంటాడు. కాబట్టి నీవు ఈ జీవుణ్ణి, లేడివంటి చంచల స్వభావంతో కూడిన చేష్టలు గలవానిగా భావించు. చెవులందున్న శబ్దాల్లాగా, బాహ్య ప్రవర్తనలైన శ్రౌతస్మార్తాది కర్మలను హృదయంలో నియమిస్తూ, దుర్జన సమూహంతో కూడిన వ్యాపారం గల గృహాన్ని విడిచిపెట్టు. సకల జీవులకు ఆశ్రయమైన ఈశ్వరుణ్ణి భజించు. ఇలా సర్వ విధాలా విరక్తిని పొందు" అని నారదుడు పలుకగా విని ప్రాచీనబర్హి ఇలా అన్నాడు:

క. మునివర! భగవంతుడవు, ననుపమ విజ్ఞాననిధివి ననఁదగు నీచే

తను వివరింపంగాఁ దగి, యెనసిన యీ యాత్మతత్త్వ మిట నా చేతన్.

882

వ. శ్రుతంబును విచారితంబును నయ్యెఁ, గర్మనిష్ఠ లగు నుపాధ్యాయు లైనవార లీ యాత్మ తత్త్వంబును నెఱుంగ, రెఱింగిరేని యుపదేశింపరు, కావునఁ దద్కృతంబయిన మహా సంశయంబు నీ చేత నివృత్తం బయ్యెనని వెండియు నిట్లనియె.

883

తా ॥ "ఓ మునీంద్రా! సాటిలేని విజ్ఞాన నిధివి అయిన నీచే వివరింపబడిన ఈ ఆత్మతత్త్వాన్ని నేను విన్నాను. ఆలోచించాను. కర్మనిష్ఠులైన ఆచార్యులు ఈ ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేరు. తెలిసినప్పటికీ ఉపదేశించరు. అందుచేత నాకు కలిగిన మహా సంశయం నీ వల్ల తొలగింది." అని ఇంకా ఇలా అన్నాడు:

సీ. అనఘాత్మ! యేమిటి యందు నీ యింద్రియ వృత్తులు దగఁ బ్రర్తింపకుండు
టను జేసి ఋషులైన ఘనముగ మోహింతు రట్టి యర్థము నందు నాత్మ సంశ
యము గల్గుచున్నది, యది యెట్టి దనినను బురుషుఁ డే యే దేహమునను జేసి
కర్మముల్ సేసి తత్కాయంబు నీ లోక మందునే విడిచి తా నన్యదేహ

తే. మర్థితో ఘటియించి లోకాంతరమును, బొంది తత్కర్మఫలమును బొందు ననుచుఁ
బ్రకటముగ వేదవేత్తలు వలుకు చుందు, రన్న నది యెట్లు విన నుపపన్న మగును?

884

తా ॥ "మహాత్మా! ఈ ఆత్మతత్త్వ విషయంలో ఋషులు కూడ మోహితులవుతున్నారు. అటువంటి పరమార్థం పట్ల నాకు సందేహం కలుగుతోంది. అదేమంటే, పురుషుడు ఏయే దేహంతో కర్మలు ఆచరిస్తాడో, ఆ దేహాన్ని ఈ లోకంలోనే విడిచిపెట్టి మరొక దేహాన్ని ధరించి, ఇతర లోకాలు చేరి, అక్కడ కర్మఫలాన్ని అనుభవిస్తాడని వేదవేత్తలు చెబుతున్నారు. అదెలా

సమంజసం?

వ. అదియునుం గాక యాచరితంబైన కర్మంబు తత్క్షణంబు వినష్టంబగుటంజేసి జీవుండు దేహాంతర లోకాంతర భావి యయిన ఫలం బెట్లు సంభవించు ననిన ప్రాచీనబర్హికి నారదుం డిట్లనియె. నరేంద్రా! స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాతయైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి తాదృశంబ కాని యతాదృశంబ కాని యైన శరీరాంతరంబు నొంది మనంబునందు సంస్కార రూపంబున నాహితంబైన కర్మంబు ననుభవించు చందంబునం బురుషుం డే లింగశరీరంబునం జేసి కర్మంబు నాచరించు, నా లింగశరీరంబుననే లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫలం బనుభవించు, నదియునుం గాక దాన ప్రతిగ్రహాదుల యందు స్థూలదేహంబునకుం గర్తృత్వంబు గల దంటివేని నహంకార మమకార యుక్తుండైన పురుషుండు మనంబునం జేసి యే యే దేహంబు పరిగ్రహించు, నా యా దేహంబున సిద్ధంబైన కర్మం బా జీవుం డనుభవించు, నట్లు గాకున్నఁ గర్మంబు పునర్భవ కారణం బగుట యుపపన్నంబు గాకుండుఁ, గావున మనఃప్రధానం బైన లింగశరీరంబునకే కర్తృత్వం బుపపన్నం బగునని వెండియు నిట్లనియె. 885

తా ॥ అంతే కాకుండా, ఆచరించిన కర్మ ఆ క్షణంలోనే నశిస్తున్నది కదా! జీవుడు మరొక దేహంతో, మరొక లోకంలో అనుభవించటమేమిటి?" అని ప్రశ్నించిన ప్రాచీనబర్హికి నారదుడు ఇలా సమాధానమిచ్చాడు: "ఓ రాజా! స్వప్నావస్థలో లింగ శరీరధారియైన జీవుడు, మెలకువలో ఉన్నప్పటి దేహాభిమానాన్ని విడిచి, అటువంటిదో లేక అటువంటిది కాని మరొక శరీరాన్ని పొందుతున్నాడు. మనస్సులో సంస్కార రూపంతో కూడిన కర్మలను ఆచరిస్తూ అనుభవిస్తున్నాడు. ఏ లింగశరీరం ఆధారంగా కర్మను ఆచరిస్తాడో, ఆ లింగశరీరం చేతనే లోకాంతరంలో ఆ ఫలాన్ని అనుభవిస్తాడు. అంతే కాకుండా, ఇవ్వటం, పుచ్చుకోవటం మొదలైన వాటిలో స్థూలదేహానికే కర్తృత్వం ఉంది" అని భావిస్తే అహంకార మమకారాలతో కూడిన

పురుషుడు (జీవుడు), మనస్సు చేత ఏ దేహాన్ని పొందుతాడో, ఆ దేహం చేతనే ప్రాప్తించిన కర్మఫలాన్ని అనుభవిస్తాడు. అలా కాకపోతే, కర్మ పునర్జన్మకు కారణం కావటం పొసగదు. కాబట్టి మనఃప్రధానమైన లింగ శరీరానికే కర్తృత్వం వర్తిస్తుంది!" అని మళ్ళీ ఇలా అన్నాడు:

క. క్షితి నుభయేంద్రియ కర్మ, స్థితు లనుభవ మందఁబడిన చిత్తము పగిదిన్
ధృతిఁ జిత్తవృత్తులను ల, క్షిత మగుఁ దత్పూర్వ దేహకృత కర్మంబుల్.

886

తా ॥ "జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు వర్తించే స్థితిగతుల్ని అనుభవించే మనస్సులాగా, చిత్తవృత్తుల్ని బట్టి, పూర్వదేహం చేత నిర్వర్తించబడిన కర్మల్ని తెలిసికోవచ్చు.

వ. అది యెట్లనిన నీ దేహంబునం జేసి యే రూపంబు నే ప్రకారంబున నెప్పు డెచట నగు, నది యననుభూతంబును నదృష్టంబును నశ్రుతంబునునై యుండు, నట్టిది యొకానొక కాలంబున వాసనాశ్రయుం డయిన పురుషునకుఁ దదనుభవాది యుక్తం బగు పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని విశ్వసింపు, మీ మనంబున అననుభూతార్థంబు గోచరింపఁజాల, దీ మనంబు పురుషులకు శుభాశుభ నిమిత్తంబులైన పూర్వాపర దేహంబులం బ్రకాశింపం జేయుచుండు, నీ మనంబునందు నదృష్టంబు నశ్రుతంబు నైన యర్థంబు స్వప్నాదికమందుం దోఁచు నంటివేని నది దేశకాల క్రియాశ్రయంబని తలంపం దగు, నీ సమస్త విషయంబులఁ గ్రమానురోధంబున మనంబునం జేసి భోగ్యంబులగు నని మఱియు నిట్లనియె.

887

తా ॥ అదెలాగంటే, ఈ దేహం చేత అనుభవించబడనిది, చూడబడనిది, వినబడనిది అయినటువంటిది వాసనాశ్రయుడైన జీవునికి పూర్వదేహంలో అనుభవింపబడినది, చూడబడినది, వినబడినది అవుతుంది. ఈ మనస్సులో అనుభవించబడిన దాని ప్రయోజనం

మాత్రం తెలియదు. ఈ మనస్సే జీవులకు శుభాశుభకారకమైన ముందటి, తరువాతి పుట్టుకలను తెలుపుతుంది. ఈ మనస్సులో చూడని, వినబడని విషయాలు స్వప్నాదుల్లో కనిపించటం ఏమిటంటే, దేశకాల క్రియల్ని ఆశ్రయించుకొని ఆ స్వప్నం ఉంటుందని భావించాలి. ఈ సమస్త విషయాలు, క్రమాన్ని అనుసరించి మనస్సుచేత అనుభవించబడతాయి.

చ. సుమహిత శుద్ధసత్త్వగుణ శోభితమున్ సరసీరుహోదరో
త్తమ గుణచింతనాపరము ధన్యము నైన మనంబునందు భూ
రమణ! సుధాంశునందు నుపరాగమునన్ దివిఁ దోఁచు రాహు చం
దమునను గోచరంబగు నుదారత నీ యఖిల ప్రపంచమున్.

888

తా ॥ ఓ రాజా! మిక్కిలి గొప్పదైన శుద్ధసాత్త్విక గుణంచేత శోభిస్తూ, పద్మనాభుని గుణాలను ధ్యానించటంలో మగ్నమై, ధన్యమైన మనస్సులో ఈ సమస్త ప్రపంచమూ కనిపిస్తుంది. అదెలాగంటే గ్రహణ సమయంలో చంద్రమండలంలో రాహువు కనిపించినట్లు కనిపిస్తుంది."

వ. అని వెండియు నిట్లనియె. లింగదేహమునకు గర్తృత్వ భోక్తృత్వంబులు స్థూలదేహద్వారకంబు లగుటంజేసి స్థూలదేహ వినాశంబు గలుగం జీవునకుఁ గర్తృత్వ భోక్తృత్వంబులు లేకుండుటం జేసి ముక్తి గలుగు నంటివేని నీ స్థూలదేహ సంబంధంబు జీవునియందు బుద్ధి మనోమోక్షార్థ గుణమ్యూహరూపాది లింగశరీరభంగపర్యంతంబు గలుగుచుండును, సుషుప్తి మూర్ఛాదులందు నిష్టవియోగాది దుఃఖమందు నహంకారంబు గలిగియుండు, నది యింద్రియోపహతింజేసి యమావాస్య యందలి చంద్రుండునుంబోలెఁ దరుణపురుషునకు గర్భ బాల్యావస్థలయందు నింద్రియ పౌష్కల్యంబు లేకుండుటం జేసి యేకాదశేంద్రియ స్ఫురణ సమర్థం బయిన యహంకారంబు గర్భాదులకుఁ బ్రకాశింపని చందంబుం దోఁపకుండుఁ గావున స్థూలదేహ విచ్ఛేదంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న నీ సంసారంబు విషయంబులయం దాసక్తుండగు జీవునకు

స్వాప్నికానర్థాగమనంబునుంబోలె నివర్తింప, దీ తీరునం బంచతన్మాత్రాత్మకంబును ద్రిగుణాత్మకంబును షోడశ వికారాత్మకంబునునై విస్మృతంబు నయిన లింగ శరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు, మఱియును.

889

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు: “లింగదేహం, స్థూలదేహం ద్వారానే కర్తృత్వ భోక్తృత్వాలు పొందటం చేత, స్థూలదేహం నశించినంతనే జీవునికి కర్తృత్వభోక్తృత్వాలు ఉండవు. అందుచేతనే ముక్తి కలుగుతుంది అని భావిస్తే అది పొరపాటు. ఈ స్థూలదేహంతో సంబంధం, జీవునికి బుద్ధి, మనస్సు, మోక్షము, ప్రయోజనము, గుణము, కూర్పు, ఆకారము మొదలుకొని లింగశరీరము తొలగే వరకు ఉంటుంది. గాఢనిద్ర, మూర్ఛ మొదలైన వాటిలోను, ఇష్టమైన వ్యక్తులు, వస్తువులు దూరం కావటంతో కలిగే దుఃఖంలోను, దేహాభిమానం ఉన్నప్పటికీ, అది స్పష్టం కాదు. ఈ సందర్భములలో ప్రాణశక్తియే ఆశ్రయముగా గల ఇంద్రియాలు వ్యాకులములై ఉండుటచే దేహాభిమానం లుప్తమవుతుంది. అమావాస్యనాడు చంద్రునిలా ప్రకాశించదు. అదే విధంగా వ్యక్తి తల్లి గర్భంలో ఉన్నప్పుడు, బాల్యావస్థయందు కూడా ‘నేను’ అనే దేహాభిమానం ప్రకటమగుటలేదు. స్థూలదేహం నశించనందున, వస్తువులయొక్క సత్యత్వం, ప్రయోజనం లేకపోయినప్పటికీ విషయాసక్తుడైన జీవునికి, స్వప్నంలో అనర్థ దర్శనం కలిగినట్లు, సంసార జన్మాసక్తి తీరదు. పంచతన్మాత్రలు, షోడశవికారాలు, త్రిగుణాలు మొదలైనవన్నీ లింగశరీరాన్నే ఆశ్రయించుకొని ఉంటాయి. వీటికి చైతన్యాన్ని కలిగించేవాడే జీవుడని చెప్పబడతాడు.

సీ. తివిరి యప్పురుషుండు దేహంబుననుజేసి, యనయంబుఁ బెక్కు దేహాంతరముల
నంగీకరించుచు నవి విసర్జించుచు, సుఖదుఃఖ భయమోహశోకములను
బొలుపొందు తద్దేహములనె పొందుచు నుండు, నది యెట్టు లన్నను నగ్రభాగ
తృణ మూఁది మఱి పూర్వతృణ పరిత్యాగంబు, గావించు తృణజలూకయును బోలె

ఆ. జీవుఁడవనిఁ గొంత జీవించి మ్రియమాణు, డగుచు నొందు దేహ మర్థిఁ జెంది

కాని పూర్వమైన కాయంబు విడువఁడు, గాన మనమె జన్మకారణంబు.

890

తా ॥ ఇంకా పూనుకొని జీవుడు, ఒక దేహాన్ని పొందినట్లే నిరంతరం అనేక దేహాల్ని పొందుతూ, విడిచిపెడుతూ ఉంటాడు. సుఖ, దుఃఖ, భయ, మోహాల్ని ఆ యా దేహాల ద్వారానే పొందుతుంటాడు. అది ఎటువంటిదంటే గడ్డిమీద పాకే గడ్డిపురుగు ముందున్న గడ్డిపరకను పట్టుకొని, వెనుకటి గడ్డిపరకను విడవటం లాంటిది. అలాగే జీవుడు కొంతకాలం బ్రతికి చనిపోతూ, మరొక దేహం పొందిన తరువాతనే పూర్వదేహాన్ని విడిచిపెడతాడు. కాబట్టి మనస్సే జన్మకు కారణం.

తరలము

నరవరోత్తమ! యట్లు గాన మనంబె జీవులకెల్ల సం
సరణకారణ, మట్టి కర్మవశంబునన్ సకలేంద్రియా
చరణుఁడౌట నవిద్య గల్గును, సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహుదేహకర్మనిబంధముల్ గలుగుం జుమీ!

891

తా ॥ ఓ రాజా! మనస్సే జీవులందరికీ సంసార కారణం. అటువంటి కర్మవశం చేత, ఇంద్రియాల యందు సంచరించటం జరుగుతుంది. దానినే 'అవిద్య' అని అంటారు. అవిద్య వల్లనే అనేక జన్మలు, కర్మబంధాలు కలుగుతున్నాయి.

చ. విను మది గాన భూవర! యవిద్య లయించుటకై రమాపతిన్
ఘనజనన స్థితి ప్రళయాకరణ భూతినిఁ బద్మపత్త్ర లో
చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబుఁ దదాత్మకంబుగాఁ
గనుఁగొనుచుం దదీయపదకంజము లర్థి భజింపు మెప్పుడున్.

892

తా ॥ కనుక ఓ మహారాజా! ఈ అవిద్య తొలగేందుకు లక్ష్మీపతిని భజించు. సృష్టిస్థితిలయకారణుడైన పరమేశ్వరుణ్ణి, పద్మనేత్రుణ్ణి, ఈశ్వరుణ్ణి ధ్యానించు. సర్వజగత్తును భగవత్స్వరూపంగా తెలుసుకొని అతని పాదపద్మాలను ఆరాధించు."

క. అని యీ గతి భగవంతుం, డనఘుండు భాగవతముఖ్యుఁడగు నారదుఁ డా
ఘనునకు జీవేశ్వర గతి, ఘనకృప నెఱిఁగించి సిద్ధ గతిఁ జనిన యెడన్.

893

తా ॥ అని ఈ విధంగా భక్తశ్రేష్ఠుడు, భాగవత ప్రముఖుడు అయిన నారదుడు, ఆ ప్రాచీనబర్హికి, జీవుడు ఈశ్వరుణ్ణి చేరే మార్గాన్ని దయతో తెలిపి, సిద్ధగమనంతో తన దారిని వెళ్ళిపోయాడు.

సీ. రాజర్షి యైనట్టి ప్రాచీనబర్హి దాఁ దగఁ బ్రజాపాలనార్థంబు సుతుల
ధరకు నియోగించి తపము సేయుటకునై కపిలాశ్రమంబున కపుడు వోయి
యచ్చట నియతి నేకాగ్రచిత్తుండును ముక్తసంగుండును భూరిధైర్య
యుక్తుండు నగుచు సద్భక్తి యోగంబున ననఘ! గోవిందపదారవింద

తే. చింతనామృత పాన విశేషచిత్తుఁ, డగుచు విధిరుద్ర ముఖ్యుల కందరాని
యవ్యయానందమయ పద మందె నప్పు, డనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పె.

894

తా ॥ ఆ తరువాత, రాజర్షియైన 'ప్రాచీనబర్హి', తన ప్రజలను పరిపాలించే నిమిత్తం కొడుకుల్ని నియమించాడు. తపస్సు చేసుకొనేందుకు కపిల మహాముని ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ నియమంతో ఏకాగ్రచిత్తుడై, కోరికల్ని త్యజించి, గొప్ప ధైర్యాన్ని పూని భక్తియోగాన్ని

అవలంబించాడు. గోవిందుని పాదపద్మాల పట్ల నిరంతరం ధ్యానమగ్నమైన చిత్తంతో, బ్రహ్మరుద్రాదులు పొందని అవ్యయానందమైన పదాన్ని పొందాడు." అని మైత్రేయ మహాముని విదురునితో చెప్పి, మళ్ళీ ఇలా అన్నాడు:

వ. వెండియు నిట్లనియె, నిట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు, మనశ్శుద్ధికరంబు సర్వోత్కృష్ట ఫలప్రదాయకంబు, దేవర్షివర్య ముఖవినిస్సృతంబునైన యీ యధ్యాత్మ పారోక్ష్యంబు నెవ్వండు పఠియించు, నెవ్వఁడు విను, నట్టివాడు లింగ శరీర విధూననంబు గావించి ముక్తసమస్త బంధుండయి విదేహకైవల్యంబు నొంది సంసారంబునందుఁ బరిభ్రమింపం డనిన మైత్రేయునకు విదురుం డిట్లనియె.

895

తా ॥ "దేవర్షులలో ముఖ్యుడైన నారదునిచే ప్రబోధించబడిన ఈ ఆధ్యాత్మవిద్య హరికీర్తిని కొనియాడటం చేత ఈ విద్య లోకాల్ని పవిత్రం చేస్తుంది. మనస్సును శుద్ధి పరుస్తుంది. సర్వోత్కృష్ట ఫలాల్ని ప్రసాదిస్తుంది. ఈ ఆధ్యాత్మవిద్యను శ్రవణ, మనన నిదిధ్యాసనం చేసేవాడు లింగ శరీరాన్ని వీడి, సమస్త బంధాలను త్రెంచుకొని, దేహంతో సంబంధంలేని కైవల్యాన్ని పొందుతాడు. సంసారంలో పరిభ్రమించడు." అని చెప్పిన మైత్రేయునితో విదురుడిలా అన్నాడు:

క. మునినాథ! ప్రచేతసు లా, ఘన మగు రుద్రోపదిష్ట కమలోదర కీ
ర్తనమున నే గతిఁ బొందిరి, వనజాక్షుఁడు సంతసింప వా రనఘాత్మా!

896

తా ॥ "ఓ మునినాథా! పుణ్యాత్మా! ప్రచేతసులు, రుద్రునిచే ఉపదేశించబడిన రుద్రగీతమును ఏ విధంగా పొందారు. ఆ స్తోత్రం వలన శ్రీహరి సంతోషించేలాగ ఏ గతిని పొందారు.

## 29. ప్రచేతసుల తపస్సుకు భగవంతుడు మెచ్చి వరాలిచ్చుట

తే. కడఁగి మఱివారు యాదృచ్ఛికమునఁ జేసి, హరికి నిత్యప్రియుండగు హరునిఁ గాంచి
యతని వలన ననుగ్రహ మంది మోక్ష, మంది రని చెప్పి, తది నిశ్చయంబు మఱియు.

897

తా ॥ ప్రచేతసులు యాదృచ్ఛికంగా, శ్రీహరికి నిత్యప్రియుడైన శివుణ్ణి దర్శించి, ఆయన అనుగ్రహంతో మోక్షాన్ని పొందారని చెప్పావు కదా! అది నిజమే!

క. హరి దర్శన పూర్వం బిహ, పరలోకములందు నా నృపాల తనయు లం
దిరి యే ఫలముల నందఱు, నిరతి నెఱింగింపు మన మునివరుఁడు వలికెన్.

898

తా ॥ శ్రీహరిని దర్శించడానికి ముందు, ఇహపర లోకాలలో ఆ రాకుమారులు ఏయే ఫలాలు పొందారో నాకు తెలియజెప్పమ" ని విదురుడు కోరగా, మైత్రేయ మహాముని ఇలా చెప్పాడు:

క. విను జనకాదేశము ముద, మునఁ దాల్చి నృపాత్మజులు సముద్రోదరమం
దనుపమ జపయజ్ఞంబున, నొనరఁ దపం బూని ముదము నొందుచు నుండన్.

899

తా ॥ "తమ తండ్రి ఆదేశాన్ని శిరసావహించి, రాకుమారులైన ప్రచేతసులు, సముద్రగర్భంలో, సాటిలేని విధంగా జపయజ్ఞాన్ని స్వీకరించి, సంతోషంతో తపస్సు చేశారు.

క. పదివే లేఁడులు నిష్ఠను, వదలక తప మాచరింప వారల కర్థిన్
సదయాంతరంగుఁ డభయ, ప్రదుఁడు సనాతనుఁడు నైన పద్మోదరుఁడున్.

900

క. అనుపమ శాంతము లగు నిజ, తను రశ్ములచే నృపాల తనయ తపో వే
దనలు శమింపఁగఁ జేయుచు, ననయముఁ బ్రత్యక్ష మయ్యె, నచ్యుతుఁ డంతన్.

901

తా ॥ ప్రచేతసులు పదివేల సంవత్సరాలు నిష్ఠతో, వదిలిపెట్టకుండా తపస్సు చేశారు. అప్పుడు వారికి దయా హృదయుడు, సనాతనుడు అయిన పద్మనాభుడు అభయప్రదానం చేస్తూ ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు శాంతిప్రదాయకమైన తన శరీరకాంతుల చేత, ఆ రాకుమారుల తపోవేదనలను శమింపజేసేలా వాళ్ళ శరీరాల్ని స్పృశించాడు.

సీ. ఘనమేరుశృంగసంగత నీలమేఘంబు, నెఱి గరుడస్కంధ నివసితుండుఁ
గమనీయ నిజదేహకాంతి విపాటితాభీలాఖిలాశాంతరాళ తముఁడు
సుమహితాష్టాయుధ సుమనో మునీశ్వర, సేవక పరిజన సేవితుండు
మండితకాంచనకుండల రుచిరోప, లాలిత వదన కపోలతలుడుఁ

తే. జారు నవరత్న దివ్య కోటీరధరుఁడుఁ, గౌస్తుభప్రవిలంబ మంగళ గళుండు
లలిత పీతాంబర ప్రభాలంకృతుండు, హారకేయూర వలయ మంజీర యుతుఁడు.

902

తా ॥ మేరుపర్వత శిఖరం సమీపాన నీలిమేఘం ఉన్నట్లు, గరుత్మంతుని మూపుననున్నాడు. కమనీయమైన తన దేహకాంతితో, అన్ని దిక్కుల లోపలి చీకట్లను పారద్రోలుతున్నాడు. అష్టాయుధాలు, దేవతలు, మునీశ్వరులు, సేవకులు, పరివారజనులు సేవిస్తున్నారు. బంగారుకుండలాల కాంతులు ముఖంమీద, చెక్కిళ్ళపైన ప్రసరిస్తున్నాయి. అందమైన నవరత్నాలతో పొదిగిన దివ్య కిరీటాన్ని ధరించాడు. కౌస్తుభమణి కంఠానికి వ్రేలాడుతున్నది. లలితమైన పీతాంబరం కాంతుల్ని విరజిమ్ముతోంది. హారాలు, కేయూరాలు,

కంకణాలు, అందెలు అలంకరించుకున్నాడు.

క. లలితాయతాష్ట భుజ మం, డల మధ్య స్ఫురిత రుచి విడంబిత లక్ష్మీ
లలనా కాంత స్పర్ధా, కలిత లసద్వైజయంతికా శోభితుఁడున్.

903

తా ॥ మనోహరమై, విస్తారమైన ఎనిమిది భూజాలతోనున్న చక్రాకార మండలపు కాంతులతో, లక్ష్మీదేవి కాంతులు ఎకసక్కెమాడుతున్నాయి. ఆ లక్ష్మీదేవితో పోటీపడుతూ వనమాల ప్రకాశిస్తున్నది.

క. సురగరుడ యక్షకిన్నర, నిరుపమ జేగీయ మాన నిఖీలాశా సం
భరిత యశోమహనీయ, స్ఫురణుఁడు నగు న ప్పురాణ పురుషుం డెలమిన్.

904

క. కరుణావలోకనంబులు, నిరవొంద నృపాలసుతుల నీక్షించి రమా
వరుఁ డంబుద గంభీర మ, ధుర భాషలఁ బలికెఁ బ్రియము దూఁకొనుచుండన్.

905

తా ॥ దేవతలు, గరుడులు, యక్షులు, కిన్నరులు, నిరుపమానంగా శ్రీహరి కీర్తిని గానం చేస్తున్నారు. అన్ని దిక్కులయందు నిండిన కీర్తితో ప్రకాశించే ఆ పురాణ పురుషుడు తన దయామయమైన చూపులతో, రాకుమారుల్ని చూసి, మేఘగంభీరమైన మధురవాక్కులతో, ప్రేమ తొణకిసలాడగా ఇలా అన్నాడు:

తే. తాపసోత్తములగు ప్రచేతసులు! వేడ్క, వినుఁడు మీరలు సౌహార్దమున నభిన్న
ధర్ము లగుట భవత్సౌహృదమున కేను, జాలఁ బరితోష మందితి సమత నేఁడు.

906

తా ॥ "తాపసోత్తములైన ఓ ప్రచేతసులారా! వేడుకతో వినండి. మీరంతా మంచి మనస్సుతో కలసి మెలసి, భేదం లేని లక్షణంతో ఒకే ధర్మాన్ని అనుష్ఠిస్తున్నారు. మీ మంచి మనస్సుకు స్నేహానికి నేను చాలా సంతోషపడ్డాను.

క. అనయమును మీ మనోరథ, మొనరింతు, నెఱుంగఁ బలుకుఁ డుత్తములగు మి
మ్మనుదినము నెవ్వఁడు సుఖశ, యనుఁడై మదిలోనఁ దలఁచు నా నరుఁ డెపుడున్.

907

క. భ్రాతృజన సౌహృదంబును, భూతదయాగుణము విమల బుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖీంచును, వీత సమస్తాఘుఁ డగుచు విశ్వములోనన్.

908

తా ॥ నేనెల్లప్పుడూ మీ కోరికల్ని తీరుస్తాను. మీరు తెలియజెప్పండి. ఉత్తములైన మిమ్మల్ని ప్రతిరోజూ, సుఖంగా శయనించేటప్పుడు మదిలో స్మరించే నరులు సోదర జనస్నేహం, భూతదయాగుణము, నిర్మలమైన బుద్ధి, సజ్జనుల ప్రేమను పొంది సుఖీస్తారు. సమస్త పాపాలనుండి విముక్తి పొందుతారు.

వ. మఱియు రుద్రగీతం బయిన మదీయస్తవం బెవ్వ రనుదినంబును స్తోత్రంబు సేయుదురు, వారల కభిమతవరంబులు, శోభనకరంబగు ప్రజ్ఞయు నిత్తు, మీరలు ముదన్వితులై జనకాదేశం బంగీకరించుటం జేసి మీ కీర్తి లోకంబుల విస్తరిల్లు, మీకు ననూన బ్రహ్మగుణుండు నాత్మసంతతింజేసి లోకత్రయ పరిపూర్ణ గుణాకరుండు నైన పుత్రుండు సంభవింపంగలండు, కండు మహాముని తపోవినాశార్థంబుగా నింద్రునిచేతఁ బ్రేషిత యగు ప్రమ్లోచయను నప్సరస గర్భంబు దాల్చి య మ్మునీంద్రుని వీడ్కొని దివంబునకుం జను సమయంబునం బ్రసూతయై తత్పుత్రిని వృక్షంబులందుఁ బెట్టి చనిన.

909

తా ॥ రుద్రునిచే గానం చేయబడిన నా స్తోత్రాన్ని ప్రతిరోజూ ఎవరయితే స్తోత్రం చేస్తారో వాళ్ళకు కోరిన వరాలను, శుభకరమైన ప్రజ్ఞను ప్రసాదిస్తాను. మీరు సంతోషంతో తండ్రి ఆదేశాన్ని పాటించటం వలన మీ కీర్తి లోకాలలో వ్యాపిస్తుంది. మీకు సాటిలేని పరబ్రహ్మ లక్షణాలుగల కుమారుడు జన్మిస్తాడు. అతడు తన సంతతి వల్ల మూడు లోకాలలోను వ్యాపించే కీర్తిగలవాడు. పూర్వం కండు మహాముని చేసే తపస్సును భగ్నం చేయడానికి ఇంద్రునిచేత ప్రేరేపించబడిన 'ప్రమ్లోచ' అనే అప్సరస, ఆ కండు మహాముని వల్ల గర్భవతియై ఆ మహామునిని విడిచి స్వర్గానికి పోయేముందు పుత్రికను ప్రసవించింది. ఆ పుత్రికను చెట్లలో పెట్టి వెళ్ళిపోయింది.

సీ. ఆ శిశువపుడు పేరాఁకలిచేఁ గుంది వావిచ్చి బిట్టు వాపోవుచుండ
నాలించి యటకు రాజైన సోముఁడు వచ్చి వలనొప్ప నవసుధావర్షి యైన
యాత్మీయ తర్జని నర్థిఁ బానమ్ము సేయింపంగఁ బెరిఁగి య య్యిందువదనఁ
గన్య వరారోహఁ గడఁక మారిషయను చెలువఁ బుణ్యుండు ప్రాచీనబర్హి

తే. యన్నృపునిచేఁ బ్రజావిసర్గావసరము, నందు వేడ్కఁ దదాదిష్టు లైన మీర లందఱును
నెయ్యమున వివాహంబు గండ, యని సరోరుహనయనుఁ డిట్టనియె మఱియు.

910

తా ॥ అలా చెట్లలో ఉంచిన శిశువు, తీవ్రమైన ఆకలితో బాధపడుతూ, నోరు తెరచి పెద్దగా ఏడవటం మొదలు పెట్టింది. ఆ ఏడ్పు విన్న సోముడనే రాజు (చంద్రుడు) అక్కడికి వచ్చాడు. అమృతాన్ని వర్షించే తన చూపుడు వ్రేలును ఆ శిశువునోటిలో పెట్టాడు. శిశువు, ఆ అమృతాన్ని త్రాగి పెరిగింది. 'మారిష' అనే పేరుతో పెరిగి పెద్దదయింది. యౌవనవతియైన మారిషను, మీ తండ్రి ప్రాచీనబర్హి ఆజ్ఞతో, ప్రజాసృష్టి చేయడానికి పూనుకొన్న మీరు ప్రేమతో పెండ్లాడండి. అని పద్మాక్షుడైన ఆ శ్రీహరి ఇంకా ఇలా అన్నాడు:

వ. అనఘాత్ములారా! యభిన్న ధర్మశీలు రయిన మీకు నందఱకు నా సుమధ్యయైన కన్య

యభిన్న ధర్మశీలయు భవ దర్పితాశయయు నయిన భార్య యగు, మీర లప్రతిహత తేజస్కులై దివ్యవర్ష సహస్రంబులు భౌమ దివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవించెద, రంత నా యందుల భక్తిం జేసి నిర్మలాంతఃకరణులై యీ భోగంబులు నిరయప్రాయంబులుఁ గాఁ దలంచి మదీయ స్థానంబు నొందెద రని వెండియు నిట్లనియె.

911

తా ॥ "ఓ పుణ్యాత్ములారా! భేదం లేని ధర్మశీలం గల మిమ్మల్ని, అందరినీ, 'మారిష' కూడా భేదం లేని ధర్మశీలంతో, తన ఆశయాలనన్నింటినీ మీయందే అర్పించి సేవించే భార్య అవుతుంది. మీరు కూడా ఎదురులేని తేజస్సుతో, వేయి దివ్య సంవత్సరాలు భూలోక సుఖాలు, స్వర్గలోక సుఖాలు నా అనుగ్రహంతో అనుభవిస్తారు. ఆపైన, నా మీదగల భక్తితో, నిర్మలమైన మనస్సుతో, ఈ భోగాలను నరకప్రాయంగా భావించి, నా స్థానాన్ని చేరుకుంటారు.

చ. అరయ గృహస్థు లయ్యును మదర్పిత కర్ములు నస్మదీయ సుం
దర చరితామృత శ్రవణ తత్పరమానస యాతయాములున్
సరస గుణాఢ్యులై తనరు సాధులకీ గృహముల్ దలంప దు
ష్కరభవబంధ హేతువులు గావు, నృపాత్మజులార! యెన్నఁడున్.

912

తా ॥ పరిశీలిస్తే, గృహాస్థాశ్రమాన్ని స్వీకరించి కూడా చేసే సమస్త కర్మలను నాకు అర్పించి, నా కథామృతాన్ని వింటూ కాలాన్ని గడిపే మనస్సు గలవారై, ఆనందాన్ని కలిగించే సద్గుణాలతో గొప్పవారై ప్రకాశించే సజ్జనులకు గృహస్థాశ్రమము సంసారబంధ హేతువు కానే కాదు.

వ. అది యెట్లంటిరేని.

913

తా ॥ అది ఎలాగంటే,

చ. అనుపమ బ్రహ్మవాదు లగు నంచిత యోగిజనానుగీయమా
న నిజకథాసముత్సుకుఁ డనందగు నేను మదీయులంద నూ
తనముగ నుందుఁ గావున నుదారత వారికి నీ గృహావళుల్
ఘనభవబంధ హేతువులు గా, విది యంతయు నిక్కమారయన్.

914

తా ॥ బ్రహ్మవాదులైన యోగిజనులు నా కథలను గానం చేస్తారు. అందుచేత నేను నా కథాగానాన్ని వినేవారి హృదయాలలో నివసిస్తాను. కాబట్టి నా భక్తులకు ఈ గృహాలు భవబంధహేతువులు కావు. ఇది నిజం.

క. సరసుఁడ నగు ననుఁ బొందిన, పురుషులు ఘనశోక మోహమోదంబులఁ బొం
దరు, గావున నెనయఁగను ద్రి, పురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుదున్.

915

తా ॥ ఆనందస్వరూపుడనైన నన్ను పొందిన పురుషులు, శోకాన్ని గానీ, వ్యామోహాన్ని గానీ, మోదాన్ని గానీ పొందరు. కాబట్టి నేను త్రిపురుషులకు అధిపతిని. పరబ్రహ్మను.”

వ. అని యిట్లు వలుకుచున్న పురుషార్థ భాజనుండగు జనార్దనుని దర్శించి తద్దర్శన విధ్వస్త రజస్తమోగుణు లయిన ప్రచేతసులు.

916

తా ॥ అని ఇలా పలుకుతున్న ధర్మార్థకామాలకు ఆధారమైన శ్రీహరిని చూచి, ఆయన దర్శనంతో రజస్తమోగుణాలు తొలగి పోగా, ప్రచేతసులు—

చ. కరసరసీరుహంబు లెసకం బెసఁగన్ ముకుళించి గద్గద

స్వరములఁ జేసి యిట్లనిరి, సర్వశరణ్యు నగణ్యు నిందిరా
వరు నజితున్ గుణాఢ్యు ననవద్య చరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్.

917

తా ॥ ఇందిరారమణుడు, సర్వశరణ్యుడు, గణనకు అందనివాడు, జయింప బడనివాడు, గుణాలచే శ్రేష్ఠుడైనవాడు, మచ్చలేని చరిత్రగలవాడు, పవిత్రుడు, అచ్యుతుడు, అతీతుడు, పరమేశ్వరుడు, ప్రభువు, భవబంధ విమోచనుడు అయిన శ్రీహరిని, చేతులతో నమస్కరించి, గద్గద స్వరంతో ఇలా స్తుతించారు:

సీ. కేశవ! సంతత క్లేశనాశనుఁడవు గురుసన్మనో వాగగోచరుఁడవు
నిద్ధమనోరథ హేతుభూతోదార గుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవ స్థితి విలయార్థ ధృతనిత్య విపుల మాయాగుణ విగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియ మార్గ నిరధిగత మార్గుండ వతిశాంతమానసుఁడవు

తే. తవిలి సంసార హారిమేధస్కుఁడవును, దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూత నివాసివి సర్వసాక్షి, వైన నీకు నమస్కారమయ్య! కృష్ణ!

918

తా ॥ "కేశవా! నీవు నిరంతరం భక్తుల చిక్కుల్ని తొలగించేవాడివి. గురుజనుల మనోవాక్కులకు అందనివాడివి. ప్రసిద్ధమైన కోర్కెలకు కారణమైన ఉత్తమ గుణాలు పేర్లుగా కలవాడివి. సత్త్వగుణుడవు. సృష్టి, స్థితి, విలయాల కోసం మాయామయమైన బ్రహ్మాది గుణాలను ధరించిన రూపధారివి. సకల ఇంద్రియ మార్గాలకు తెలియని మార్గంగల వాడివి. అత్యంత శాంతమైన మనస్సు కలవాడివి. సంసార బంధాల్ని హరించే బుద్ధిబలం నీవే. దేవదేవుడవు. వాసుదేవుడవు. సర్వభూత నివాసివి. సర్వసాక్షివి. కృష్ణా! నీకు నమస్కారం.

వ. మఱియును.

919

తా ॥ ఇంకా,

ఉ. తోయరుహోదరాయ! భవదుఃఖహరాయ! నమో నమః పరే
శాయ! సరోజకేసర పిశంగవినిర్మల దివ్యభర్మ వ
స్త్రాయ! పయోజ సన్నిభ పదాయ! సరోరుహ మాలికాయ! కృ
ష్ణాయ! పరాపరాయ! సుగుణాయ! సురారిహరాయ! వేధసే!

920

తా ॥ పద్మనాభా! సంసార దుఃఖాలను హరించేవాడా! పరానికి ప్రభువైన వాడా! పద్మకేసరాల వంటి రంగుగల పచ్చని బంగారు పట్టుబట్ట ధరించినవాడా! పద్మాలవంటి పాదాలు గలవాడా! పద్మమాలను ధరించినవాడా! కృష్ణా! స్థూల సూక్ష్మరూపాల్ని ధరించినవాడా! సుగుణవంతా! నీవు రాక్షసులను హరిస్తావు. బ్రహ్మస్వరూపియైన సృష్టికర్తవు. నీకు నమస్కారం.

వ. అని వినుతించి.

921

తా ॥ అని స్తుతించి,

చ. కమలదళాక్ష! దుఃఖలయ కారణమై తగు తావకీన రూ
పము ననివార్య దుర్భర విపద్దశ దుఃఖము నొందు మాకు నీ
సుమహిత సత్కృపాగరిమఁ జూపుట కంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి గల్గునె? భక్త ఫల ప్రదాయకా!

922

తా ॥ భక్తుల కోర్కెల్ని తీర్చేవాడా! పద్మదళనేత్రా! దుఃఖాన్ని నశింపచేసే నీ రూపాన్ని, నివారింపరాని, భరింపరాని దుఃఖాలు పొందే మాకు చూపించావు. గొప్పదైన నీ దయా విశేషం చూపి అనుగ్రహించటం కంటే వేరొకటి లోకంలో ఏముంటుంది?

ఉ. భూరి శివేతరాపహవిభూతి సమేత! మహాత్మ! దీన ర
క్షా రతి నొప్పు నీవు చిరకాలమునన్ సుఖవృత్తి వీరు మా
వార లటంచు బుద్ధి ననవద్య! తలంచిన యంతమాత్ర స
త్కారమె చాలు నట్లగుట గా కిటు సన్నిధి వైతి వీశ్వరా!

923

తా ॥ అశుభమార్గాల్ని పోగొట్టే శుభమైన వైభవం కలవాడివి. మహాత్మా! దీనుల్ని రక్షించటమే ఆసక్తిగాగల నీవు, 'వీళ్ళు నావాళ్ళు' అని భావించి మమ్మల్ని స్మరించటమే గౌరవం. ఆమాత్రం సత్కారం మాకు చాలు.

చ. అరయఁగ క్షుద్రభూత హృదయంబుల యందుల నంతరాత్మవై
తిరముగ నుండు నీవు భవదీయ పదాంబురుహ ద్వయార్చనా
పరమతు లైన మాకును శుభప్రద భూరి మనోరథంబు లీ
వెఱుఁగవె? భక్తలోక హృదయేప్సిత దాయక! ముక్తినాయకా!

924

తా ॥ పరిశీలిస్తే, అల్పప్రాణుల హృదయాలలో కూడా 'అంతరాత్మవై నీవు స్థిరంగా ఉన్నావు. నీ పాదపద్మాలను పరమభక్తితో పూజించే మనస్సుగల మాకు ఇవ్వడానికి శుభప్రదమైన కోరికలేవో నీకు తెలియదా? భక్తుల హృదయాలలోని కోర్కెలు తీర్చేవాడా! ముక్తినాయకా! నీకు నమస్కారం.

సీ. అయినను విను సరోజాయత లోచన! వరమోక్షమార్గ ప్రవర్తకుఁడవుఁ.
బురుషార్థ భూత విస్తరుఁడవు నగు నీవు దగిలి ప్రసన్నుఁడ వగుట మాకు
నర్థి మనోభీష్ట మైన వరం బయ్యె నైనను నాథ! పరాపరుండ
వై న నిన్నొక వరం బర్థింతు మని నను భువిఁ దావకీన విభూతు లెన్న

తే. నంత మెఱుఁగంగ రామి ననంతుఁ డనుచుఁ, బలుకుదురు నిన్ను, నది గానఁ బరమ
పురుష! యే వరం బని కోరుదు మేము? దప్పి, గొన్న బాలకుఁ డబ్ధి నీళ్లెన్ని గ్రోలు?

925

తా ॥ పద్మలోచనా! మోక్షమార్గంలో నడిపించే వాడివి. పురుషార్థాల రూపాలను ధరించి, వ్యాపించినవాడివి. అటువంటి నీవు మాకు ప్రసన్నుడవు కావటమే మా మనస్సుకు ఇష్టమైన వరం. అయినప్పటికీ స్థూల సూక్ష్మమనే సమస్తరూపివి నీవే కాబట్టి, నిన్నొక వరాన్ని అడగాలనుకుంటే, నీ విభూతులేమో అనంతాలు. నీవేమో అనంతుడివి. నిన్నే వరం కోరగలం? దాహంగా ఉన్న బాలుడు సముద్రంలోని నీళ్ళను ఎన్ని త్రాగగలడు?

వ. ఇదియునుం గాక.

926

తా ॥ అంతేగాకుండా,

ఉ. పూని భవత్పదాంబురుహ మూల నివాసులమైన మేము మే
ధానిధి! నీ విలోకనముఁదక్కఁగ నన్యముఁ గోర నేర్తుమే?
మానిత పారిజాత కుసుమ స్ఫుట నవ్యమరందలుబ్ధ శో
భా నయశాలి యైన మధుపంబు భజించునె యన్యపుష్పముల్?

927

తా ॥ నీ పాదపద్మాలను ఆశ్రయించుకొని జీవించే మేము, నీ కటాక్షము తప్ప వేరొకటి కోరగలమా? పారిజాతకుసుమాలలోని మకరందాన్ని త్రాగడానికి అలవాటుపడిన తుమ్మెద వేరొక పుష్పం వద్దకు వెళుతుందా?

చ. హరి! భవదీయమాయ ననయంబును జెందిన నేము నిచ్చలుం
గర మనురక్తి నేది తుదిగా భవకర్ములమై ధరిత్రి పైఁ
దిరుగుదు, మంతదాఁక భవదీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁజేయు మాధవా!

928

తా ॥ ఓ లక్ష్మీపతీ! నీ మాయలో చిక్కిన మేము నిరంతరం సంసార బద్ధ కర్ములమై, ఈ భూమి మీద ఎంతకాలం ఆసక్తిగా సంచరిస్తామో, అంతవరకూ, మాకు నీ భక్తులైన భాగవత జనులతోడి సహవాసాన్ని జన్మజన్మలకు సమకూర్చి పెట్టు.

మ. కమలాధీశ్వర! తావకీన వర భక్తి వ్రాత సంసర్గ లే
శముతోడన్ సరిగాఁ దలంప, మెలమిన్ స్వర్గాపవర్గాది సౌ
ఖ్యము లన్నన్ విను మానుషంబు లగు నీ కామంబులం జెప్ప నే
ల! మునీంద్ర స్తుత పాదపద్మ! సుజనాలాపానుమోదాత్మకా!

929

తా ॥ కమలాపతీ! మునీంద్రులచే స్తుతించబడే పాదపద్మాలుగల ప్రభూ! సజ్జనుల సల్లాపాలలోని సంతోషరూపా! నీ భక్తి సంసర్గంతో, స్వర్గము, మోక్షము వంటి సౌఖ్యాలు కొంచెమైనా సరిగావు. ఇక మానవ సంబంధమైన కోర్కెల గురించి, స్వల్ప సుఖాలను గురించి ప్రత్యేకంగా చెప్పవలసిందేముంది?

వ. మఱియు భగవద్భక్తసంగంబులయందుఁ దృష్ణాప్రశమనంబులైన మృష్టకథలు

చెప్పంబడుటచే భూతంబులయందు వైరంబును నుద్వేగంబును లేకుండు నని.

930

తా ॥ భగవద్భక్తులైన భాగవత జనుల సాంగత్యంతో, కోర్కెల దాహం ఉపశమించే మధురమైన కథలు చెప్పబడతాయి. అందుచేత ప్రాణికోటిలో వైరమూ, ఉద్వేగమూ నశిస్తాయి.

చ. వనముల ముక్తసంగు లగువారు నుతింపఁ దనర్తు వీవు, గా
వున నిలఁ బుణ్యతీర్థములఁ బోలఁ బవిత్రము సేయఁ బూని య
ర్థిని బదచారులై ధరఁ జరించు భవత్పద భక్త సంగమం
బనుపమభూరి సంసృతి భయస్థుని బుద్ధి రుచింపకుండునే?

931

తా ॥ అన్ని బంధాలను త్యజించి, అడవులలో తపస్సు చేసుకునే వాళ్ళు నిన్ను కీర్తించగా వాళ్ళను నీవే తృప్తి పరుస్తావు. పుణ్య తీర్థంలాగ పవిత్రం చేయటం కోసం, పాదచారులై సంచరించే నీ భక్తుల సాంగత్యం, సాటిలేని బాధలమయమైన సంసారానికి భయపడే వాని బుద్ధికి రుచించకుండా ఎలా ఉంటుంది?

వ. కావున.

932

తా ॥ కాబట్టి,

చ. వనరుహ పత్రలోచన! భవత్సఖుండైన సుధాంశుమౌళి తో
డి నిమిషమాత్ర సంగతిఁ గడింది వ్రణంబును దుశ్చికిత్సము
న్ననఁ దగు జన్మరోగమున కర్మిలి వైద్యుఁడ వైన నిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి, కృతార్థులమై తగ మంటి మీశ్వరా!

933

తా ॥ ఈశ్వరా! పద్మదళలోచనా! నీ స్నేహితుడైన శంకరునితో నిమిషమాత్రం మాకు కలిగిన సహవాసం వల్ల, చికిత్సకు సాధ్యంకాని పెద్ద వ్రణం వంటి జననమరణ సంసార రోగాన్ని మాన్పే వైద్యుడవైన నిన్ను చూడగలిగాము. కృతార్థులమయ్యాము.

వ. దేవా! మదీయ స్వాధ్యాయాధ్యయనంబులును, గురుప్రసాదంబును విప్రవృద్ధానువర్తనంబును, నార్యజన నమస్కరణంబును, సర్వభూతానసూయయు, నన్నవిరహితంబుగా ననేకకాలం బుదకంబులయందు సుతప్తంబయిన తపంబు సేయుటయు, నివి యన్నియును బురాణ పురుషుండవైన భవదీయ పరితోషంబు కొఱకు నగుంగాక యని విన్నవించెద మని వెండియు నిట్లనిరి.

934

తా ॥ ఓ దేవా! మేము చేసే వేదాధ్యయనం, గురువుల అనుగ్రహం, విప్రులలో వృద్ధులైన వారి సేవ, పెద్దలకు నమస్కరించుట, జీవకోటి పట్ల అసూయ లేకుండటం, అన్నం లేకుండా చలికాలం నీటినే ఆహారంగా స్వీకరిస్తూ తపస్సు చేయటం, ఇవన్నీ పురాణ పురుషుడవైన నీ సంతోషం కోసమే అగుగాక! అని విన్నవిస్తాము.

మ. మను పద్మాసన ధూర్జటి ప్రముఖ ధీమంతుల్ తపోజ్ఞాన స
త్త్వ నిరూఢిం దగువారు నీ మహిమమున్ వర్ణింపఁ బారం బెఱుం
గని వాఁ డయ్యును నోపినంత వినుతుల్ గావింతు, రట్లాట నే
మును నిన్నర్థి నుతింతు మీశ! వరదా! బుద్ధ్యాది మూలంబుగన్.

935

తా ॥ తపస్సు, జ్ఞానముచేత శక్తి సంపన్నులైన మనువు, బ్రహ్మ, శివుడు మొదలైనవారు నీ మహిమను వర్ణించడానికి అంతుచిక్కకున్నప్పటికీ, చేతనైనంత మేరకు వర్ణిస్తారు.

అటువంటప్పుడు మేము కూడా నిన్ను, మా బుద్ధి కొలదీ, మాకు చేతనైనంత కీర్తిస్తాము."

వ. అని మఱియు సముండవు, నాదిపురుషుండవుఁ, బరుండవు, శుద్ధుండవు, వాసుదేవుండవు, సత్త్వమూర్తివియు, భగవంతుండవు నైన నీకు నమస్కరించెద మని యిట్లు ప్రచేతసుల చేత నుతింపంబడి శరణ్యవత్సలుం డగు హరి సంతుష్టాంతరంగుండై వారల కోరినయట్ల వరంబు లిచ్చిన.

936

తా ॥ అని ఇంకా "నీవు అందరియందు సముడవు. ఆది పురుషుడవు. ఇంద్రియాదులకు అతీతుడవు. నిర్మలుడవు. వాసుదేవుడవు. సత్త్వమూర్తివి. భగవంతుడవు. అట్టి నీకు నమస్సులు" అని ప్రచేతసులు నుతించగా, భక్తవత్సలుడైన శ్రీహరి, సంతృప్తిని పొంది, వాళ్ళు కోరినట్లే వరాలు ప్రసాదించాడు.

తరలము.
అనయ మా నృపనందనుల్ ముదమార సన్నుతిఁ జేయఁగా
మనములోఁ బరితోషమంది రమాహృదీశుండు భక్త పా
లన కరుండు తదీయ దర్శన లాలసాత్మకు లాత్మలం
దనివి సాలక చూడ నాత్మపదంబు కేఁగె రయంబునన్.

937

తా ॥ ఆ రాకుమారులు సంతోషంతో స్తుతించగా, మదిలో సంతోషాన్ని పొంది, లక్ష్మీనాథుడు, భక్తపాలకుడూ, అయిన శ్రీమహావిష్ణువును ఎంతచూసినా తనివి తీరక, తనను చూడటంలో ఆసక్తి గలవారై, అలాగే చూస్తుండగా తన వాసానికి వెళ్ళాడు.

వ. తదనంతరంబ ప్రచేతసులు భగవదాజ్ఞ శిరంబుల ధరియించి సముద్ర సలిల నిర్గతు లయి.

తా ॥ మిక్కిలి ఎత్తుగా, స్వర్గద్వారాన్ని అడ్డుకొనేలా పెరిగిన చెట్లచే కప్పబడిన భూమిని రాకుమారులు చూశారు.

క. భూరి సమున్నతి నాక, ద్వార నిరోధంబు గాఁగఁ దగఁ బెరిఁగిన యా
భూరుహ సంఛన్నాఖిల, ధారుణి నీక్షించి రాజతనయులు వరుసన్.

939

చ. ఘనకుపితాత్ములై విలయకాల భయంకర హవ్యవాహ లో
చను గతి నుగ్రులై ధరణి చక్రము నిర్వసుధారుహంబుగా
ననయముఁ జేయఁ బూనిన జనాధిపసూనుల మోముఁదమ్ముల
న్ననల సమీరముల్ జనన మంది కుజంబులఁ గాల్పఁ జొచ్చినన్.

940

తా ॥ ఆ రాకుమారులకు పట్టరాని కోపం కలిగింది. ప్రళయకాలంలో భయాన్ని కలిగించే, ముక్కంటకంటి మంటలా భయంకరులై, భూమండలం మొత్తాన్ని, వృక్షాలులేని దానినిగా చేయపూనుకున్నారు. ఆ రాకుమారుల ముఖపద్మాల నుండి అగ్నితో కూడిన గాలులు పుట్టి, వృక్షాలను కాల్చటం మొదలు పెట్టాయి.

క. నలినభవుఁ డా మహీజ, ప్రళయముఁ గని వచ్చి ధరణిపాల తనూజా
తుల మధురోక్తుల నుపశాం, తులఁ గావించుచుఁ బ్రియము దూఁకొనఁ బలికెన్.

941

తా ॥ వృక్షాలకు ఈ విధంగా కలిగిన పెనువిపత్తును చూచి, బ్రహ్మదేవుడు వచ్చి, ఆ రాకుమారులైన ప్రచేతసుల్ని తీయని మాటలతో ఉపశాంతుల్ని చేస్తూ ప్రేమతొణికేలా

మాట్లాడాడు.

వ. అట్లు పలికి వారల నుపశమితక్రోధులం జేసిన యనంతరంబ.

942

తా ॥ అలా మాట్లాడి, వాళ్ళ కోపాన్ని ఉపశమింపజేసి, తరువాత—

సీ. అవశిష్ట ధరణీరుహంబులు భయ మంది తివిరి చతుర్ముఖాదేశమునను
మారిష యను సతీమణిఁ దమ కూఁతును నా ప్రచేతసులకు నర్థి నిచ్చె,
నా నరపాలక సూనులు దక్షున కరయంగ మున్నీశ్వరాపరాధ
మునఁ బ్రాప్త మైనట్టి జనపాల జన్మంబునకుఁ గారణం బైన నలిననయన
తే. నాదరంబునఁ గమలజు నాజ్ఞఁ జేసి, కడఁక దీపింప విధివత్ప్రకారమునను
వరుస నందఱుఁ గూడి వివాహ మైరి, గడవ వచ్చునె దైవ సంకల్ప మెందు?

943

తా ॥ కాలిపోగా మిగిలిన వృక్షాలు భయపడి, బ్రహ్మ ఆదేశంతో 'మారిష' అనే సతీమతల్లిని, తమ కూతురిని, ఆ ప్రచేతసులకు ఇచ్చాయి. ఈశ్వరుని పట్ల అపరాధం చేసిన దక్షునికి, మళ్ళీ జన్మ ప్రసాదించడానికి కారణమైన మారిషను బ్రహ్మ ఆజ్ఞచేత, ప్రచేతసులందరూ విధివిధానంతో పెండ్లి చేసుకున్నారు. దైవసంకల్పాన్ని ఎవరు దాటగలరు?

క. కలదే జగతిం బదురు నృ, పుల కిల నొక భార్య యందుఁ బొసంగునె? వినఁగా
నలినోదరు ఘనమాయా, కలితాద్భుతములకు నతులు గావింపఁదగున్.

944

తా ॥ పదిమందిరాజులకు ఒక భార్య ఉండటం, ఈ భూమిపైన ఎక్కడైనా ఉందా? పద్మనాభుని మాయతో కూడిన అద్భుతాలకు నమస్కరించటమే తగిన పని.

వ. అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుండై యిష్ట ప్రజాసర్గంబు గావించుచుఁ ప్రతిశుద్ధుండైన దక్షుండు పూర్వ దేహంబు గాలవిద్రుతం బగుచుండం బ్రచేతసులకు న మ్మారిష యను భార్యయందు సంభవించి నిజకాంతిం జేసి సమస్త తేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మ దాక్ష్యంబున దక్షుండను నామంబు వహించి బ్రహ్మచేతం బ్రజాసర్గ రక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్త ద్వ్యాపారంబులందు నియోగించి యుండె, నంత.

945

తా ॥ చాక్షుషుడనే మనువు పాలిస్తున్న కాలంలో, దక్షుడు దైవప్రేరితుడై, తమకోరిక ప్రకారం, సంతానాన్ని కంటూ ప్రసిద్ధుడయ్యాడు. పూర్వదేహం కాలంలో కరిగిపోతుండగా, మారిష గర్భంలో ప్రచేతసులకు పుత్రుడై జన్మించాడు. తన తేజస్సుతో, తేజోధనులైన వారి అందరి తేజస్సును మాటుపరుస్తూ, కర్మలోని దక్షత్వంచేత దక్షుడనే పేరు పొందాడు. బ్రహ్మచేత ప్రజాసృష్టిని చేయటానికి రక్షించడానికి నియమింపబడి, మరీచి మొదలైన మహనీయుల్ని ఆయా పనులలో నియమించాడు. తరువాత—

## 30. నారదుని ఉపదేశం – ప్రచేతసులు ముక్తిని పొందుట

సీ. ఒనరఁ బ్రచేతసు లుత్పన్న విజ్ఞాను లగుచు వేగంబ నారాయణోక్తిఁ

దలఁచుచు నాత్మనందను కడ నిజభార్య నిడి వనవాసులై కడఁగి మున్ను

జాబాలి యను మునీశ్వరుఁడు సిద్ధుండైన భూరి పశ్చిమ వార్ధి తీరమునను

సర్వభూతాత్మ విజ్ఞానంబు గల యాత్మ ఘన విమర్శకృత సంకల్పులైరి.

తే. యంత నచటికి సమ్మోద మతిశయిల్ల, నరసురాసుర యక్ష కిన్నర వరేణ్య

మానితోన్నత సంపూజ్య మానుఁడైన, నారదుండు వివేక విశారదుండు.

946

తా ॥ ప్రచేతసులు, విజ్ఞానవంతులై, శ్రీమన్నారాయణుని మాటను స్మరిస్తూ, భార్యను తమ కొడుకు వద్ద ఉంచి, వనవాసాన్ని స్వీకరించి, పశ్చిమ సముద్ర తీరంలో, సిద్ధుడైన జాబాలి ముని ఆశ్రమానికి వెళ్ళారు. సర్వభూతాత్మ భావనతో ఆత్మవిచారాన్ని చేయడానికి పూనుకున్నారు. అప్పుడు నరుల చేత సురాసురులచేత, యక్షుల చేత, పూజింపబడే గొప్పవాడైన నారదుడు అక్కడికి వచ్చాడు.

వ. చనుదెంచి నిర్జితప్రాణ మనో వాగ్దర్శనులును జితాసనులును శాంతులును నసమాన విగ్రహులును నిర్మలంబైన పరబ్రహ్మంబు నందు నియోజితంబైన యంతఃకరణంబును గలవారును నైన రాజనందనుల కడ నిలిచిన.

947

తా ॥ అలా విచ్చేసి, తమ ప్రాణాన్ని, మనస్సును, వాక్కును, చూపును జయించి, ఆసనసిద్ధి కలిగి, శాంతమూర్తులై, ఇంద్రియాలను నిగ్రహించి నిర్మలమైన పరబ్రహ్మతో నియమింపబడిన మనస్సు గలవారైన ఆ రాకుమారులచెంత నిలిచాడు.

క. చనుదెంచిన నారదమునిఁ, గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్
వినమితులై సముచిత పూ, జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్.

948

తా ॥ అలా విచ్చేసిన నారదమునిని చూసి, రాకుమారులు లేచి, కుతూహలంగా వినయంతో వంగి నమస్కరించారు. సముచితమైన పూజలతో తృప్తి పరచి వినయంగా ఇలా అన్నారు:

చ. అనఘ! మునీంద్ర చంద్ర! భగవదాగమనంబు సమస్త లోక శో
భన మగు, నస్మదీయమగు భాగ్యవశంబున నేఁడు విశ్వ పా
వన! నినుఁ జూడఁగంటి మనివార్య భవద్భ్రమణంబు లోక లో
చనుగతి వోలెం బ్రాణులకు సర్వ భయాపహరంబు గావునన్.

949

తా ॥ "ఓ మునీంద్రా! పుణ్యాత్మా! మీ ఆగమనం సమస్త లోకాలకు, శుభాన్ని కలిగిస్తుంది. మా భాగ్యవశాన నేడు, విశ్వపావనకరులైన మిమ్ము చూడగలిగాము. అనివార్యమైన మీ సంచారం, సూర్య గమనంలాగా ప్రాణికోటికి సర్వభయాలనూ పోగొడుతుంది."

వ. అని మఱియు నిట్లనిరి.

950

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నారు:

సీ. 'అనఘాత్మ! భగవంతులైన కేశవ వామదేవులచే నుపదిష్టమైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగు మాకు ననయంబు విస్మృతం బయ్యె నట్టి
కలిత తత్త్వార్థ ప్రకాశకంబును భూరి ఘోర సంసారాబ్ధి తారకంబు,

నై కర మొప్పారు నాత్మతత్త్వము నేఁడు చిరదయామతిఁ బ్రకాశింపఁ జేయు'

తే. మని ప్రచేతసు లర్థిఁ బల్కినఁ జెలంగి, భగవదాయత్త చిత్తుండు భవ్యగుణుఁడు

నఖిలలోక విహారుండు నైన యట్టి, నారదుఁడు వల్కె నా రాకుమారులకును.

951

తా ॥ "ఓ పుణ్యాత్మా! భగవంతులైన కేశవుడు, ఈశ్వరుడు ఉపదేశించిన ఆత్మతత్త్వాన్ని గృహస్థులమైన మేము మరచాము. గొప్ప సంసార సాగరాన్ని తరింపజేసేది అయిన ఆత్మ తత్త్వాన్ని దయామతివై ఇప్పుడు మళ్ళీ ప్రసాదించు" అని ప్రచేతసులు అర్థించారు. భగవంతునికి అర్పించిన చిత్తము గలవాడు, సద్గుణ సంపన్నుడు, సకల లోకాలలో విహరించేవాడు, అయిన నారదమహర్షి ఆ ప్రచేతసులతో ఇలా అన్నాడు:

సీ. చర్చింప నరుల కే జన్మ కర్మాయుర్మనో వచనంబుల దేవదేవుఁ

డఖిల విశ్వాత్మకుం డైన గోవిందుండు విలసిల్లు భక్తి సేవింపఁబడెడు

నవియ పో, జన్మ కర్మాయుర్మనో వచనములను ధరణి నెన్నంగఁ దగును

వనరుహనాభ సేవా రహితము లైన జననోపనయన దీక్షాకృతంబు

తే. లైన జన్మంబు లేల? దీర్ఘాయు వేల? వేద చోదిత యగు కర్మవితతి యేల?

జప తపశ్శ్రుత వాగ్విలాసంబు లేల?, మహిత నానావధాన సామర్థ్య మేల?

952

తా ॥ "దేవదేవుడు, అఖిల విశ్వాత్మకుడు, గోవిందుడునై ప్రకాశించే పరమాత్మ పట్ల భక్తికలిగి సేవించే జన్మమే జన్మ. అటువంటి కర్మయే కర్మ. అలా కలిగిన ఆయుష్షే ఆయుష్షు. అటువంటి మనస్సే మనస్సు. అటువంటి వాక్కే వాక్కు. అటువంటి పుట్టుక, కర్మ, ఆయువు, వాక్కు, మనస్సులే పరిగణింప దగినవి. పద్మనాభుని సేవారహితమైన పుట్టుక, ఉపనయన దీక్ష మొదలైన సంస్కారాలు అన్నీ వ్యర్థమే. అటువంటి జన్మదేనికి? దీర్ఘాయువు దేనికి? వేద

కర్మలనాచరించటం దేనికి? జపం, తపం, పాండిత్యం, వాక్చమత్కారం ఇవన్నీ ఎందుకు? అనేకాంశాల్ని ధారణ చేసే సమర్థత దేనికి?

వ. మఱియు హరి విరహితంబైన యింద్రియ పాటవంబును నిపుణయైన బుద్ధియుఁ బ్రాణాయామాది యోగంబును దేహాది వ్యతిరిక్తాత్మ జ్ఞానంబును సన్న్యాసాధ్యయనంబులును దక్కిన వ్రతవైరాగ్యాది శ్రేయస్సాధనంబులును నేల? సర్వేశ్వరుండును సమస్త శ్రేయస్స్వరూపుండును సమస్త శ్రేయో-వధిభూతుండును సర్వభూతావాసుండును సర్వభూతాత్మప్రదుండును సర్వభూత ప్రియుండును సర్వవ్యాపకుండునుం గావున.

953

తా ॥ శ్రీమన్నారాయణుణ్ణి సేవించకపోతే ఇంద్రియసామర్థ్యం, నిపుణమైన బుద్ధి, ప్రాణాయామాది యోగం, దేహానికి భిన్నమైన ఆత్మజ్ఞానం, సన్న్యసించటం, వేదశాస్త్రాదుల్ని చదవటం, మిగిలిన వ్రతాలు, వైరాగ్యం వంటి శ్రేయస్సును కలిగించే సాధనాలు దేనికి? సర్వేశ్వరుడు, సమస్త శ్రేయస్సులను స్వరూపంగా గలవాడు, అన్ని మేళ్ళకు ఎల్లయైనవాడు, సర్వ జీవులకు నివాసమైనవాడు, సర్వ భూతాలకు ఆత్మయైనవాడు, ప్రాణికోటికి ప్రియమైనవాడు, సర్వవ్యాపకుడు అయినట్టి...

మ. కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్ర ప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తి హేతువును సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్చన
క్రమమై యొప్పు ధరావరేణ్య సుతులారా! బుద్ధి నూహించినన్.

954

తా ॥ కమలాపతిని పూజించటం సంపూర్ణ ప్రీతికి మార్గం. ప్రాణానికి తృప్తికరమైన వస్తువు సర్వేంద్రియాలకు తృప్తికారకం. ఓ రాకుమారులారా! బుద్ధితో పరిశీలిస్తే, ఇది చెట్టు

మొదలులో నీళ్ళు పోస్తే కొమ్మలకూ, రెమ్మలకూ పత్రపుష్పాలకు పుష్టి కలిగించటం లాంటిది. సర్వదేవతల్ని అర్చించే పద్ధతి ఇదే.

ప. అదియునుం గాక.

955

తా ॥ అంతే కాకుండా,

క. పెను పగు వర్షాకాలం, బున దిననాయకుని వలనఁ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం, బున సూర్యునియందు డిందుపోలిక మఱియున్.

956

తా ॥ విస్తారమైన వర్షాకాలంలో, సూర్యుని వలన మేఘాలై జలం కురుస్తున్నది. అదే జలం వేసవికాలంలో సూర్యునిలో లయమైపోతున్నది. అలాగే,

క. ధరణిఁ జరాచర భూతము, లరయఁగ జనియించి యందె యణఁగిన పగిదిన్
హరిచేఁ బుట్టిన విశ్వము, హరియందె లయంబు నొందు, నది యెట్లన్నన్.

957

తా ॥ భూమిమీద ప్రభవించిన చరాచరభూతాలు, తిరిగి భూమిలోనే అణగిపోయినట్లు, శ్రీహరి చేత సృష్టించబడిన ఈ విశ్వం, ఆ శ్రీహరియందే లయమవుతుంది. అది ఎలాగంటే,

మ. అరుదౌ నభ్రతమఃప్రభల్ మును నభంబం దొప్పఁగాఁ దోఁచి క్ర
మ్మఱ వీక్షింపఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీ శక్తులుం
బరికింపం ద్రిగుణ ప్రవాహమున నుత్పన్నంబులై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపం దగున్.

958

తా ॥ అరుదుగా ఆకాశంలో మేఘాల చీకట్లు, మెరుపులకాంతులు ఒక్కొక్కసారి కనిపిస్తాయి. మళ్ళీ చూద్దామని అనుకుంటే అవి అక్కడ కనిపించవు. అలాగే ఈ బ్రహ్మపదార్థంలో నుండి సృష్టి స్థితిలయ కారకమైన సత్త్వరజస్తమోగుణాలు ప్రవాహరూపంలో ఉత్పన్నమై, మళ్ళీ ఆ పరబ్రహ్మంలోనే లీనమవుతున్నాయి. కాబట్టి ఆ శ్రీహరిని, శ్రీమహావిష్ణువును భజించాలి.

వ. మఱియును సమస్త దేహులకు నాత్మయు, నిమిత్త భూతుండును, నద్వితీయుండును శ శ్వత్ప్రకాశుండును, బ్రధాన పురుషుండును, స్వతేజో విధ్వస్త గుణప్రవాహుండును, మానస బుద్ధి సుఖేచ్ఛా ద్వేషాది వికల్పరహితుండును, నగుణుండును దేహాత్మ భ్రమ నివృత్త్యుపలభ్యుండును, నాది మధ్యాంత రహితుండును, నిత్యానంద స్వరూపుండును, సర్వజ్ఞుండును, బరమేశ్వరుండు నైన నారాయణు నభేదబుద్ధింజేసి భజింపుం, డతండు సర్వభూత దయాళువులును నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్ట చిత్తులును, సర్వేంద్రియోపశాంతులును నగు పురుషులయెడ సంతుష్టుం డగు నని వెండియు నిట్లనియె.

959

తా ॥ ఇంకా సమస్త ప్రాణులకు ఆత్మ, కారణ భూతుడు, అద్వితీయుడు, ఎల్లప్పుడూ ప్రకాశించేవాడు, ప్రధాన పురుషుడు, గుణాల ప్రవాహాన్ని తన తేజస్సులోనే లీనం చేసినవాడు, మనస్సు, బుద్ధి, సుఖము, ఇష్టము, ద్వేషము మొదలైన భేదాలు లేనివాడు, గుణాలతో కూడినవాడు, దేహమే తాననుకునే భ్రమ తొలగినప్పుడే పొందగలిగినవాడు, ఆదిమధ్యాంత రహితుడు, నిత్యానంద స్వరూపుడు, సర్వజ్ఞుడు, పరమేశ్వరుడు అయిన నారాయణుని, అభేదబుద్ధితో ధ్యానించాలి. అతడు సర్వభూతదయాళువు, ఏమాత్రం లభిస్తే ఆ మాత్రానికే సంతృప్తి చెందే మనస్సు గలవాడు, సర్వేంద్రియాలు ఉపశాంతి గలవారి పట్ల శ్రీమన్నారాయణుడు సంతుష్టుడవుతాడు.” అని మళ్ళీ ఇలా అన్నాడు:

చ. చతురత నట్టి యీశ్వరుఁడు సజ్జనలోక నిరస్త సర్వ కా
మిత విమలాంతరంగమున మిశ్రిత భావనఁ జేసి సన్నిధా
పితుఁ డగుచున్ దయాకర గభీర గుణంబులఁ జాల నొప్పి
యా శ్రిత జన పారతంత్ర్యమును జేకొని పాయక యుండు నిచ్చలున్.

960

తా ॥ "అటువంటి పరమాత్మ, సజ్జనుల మనస్సుల్లో కోరికల్ని తొలగించి, చతురత్వంతో మనస్సును నిర్మలం చేస్తాడు. అటువంటి మనస్సుతో కూడిన ధ్యానం చేత పారతంత్ర్యం కలిగి, వాళ్ళ హృదయాలలో ప్రవేశించి, ఆ హృదయాలను దయకు నివాసంగా, గొప్ప గుణాలకు నిలయంగా ప్రకాశింపచేసి, అక్కడే వదలకుండా ఉంటాడు.

క. శ్రుత ధన కుల కర్మ సము, న్నత మదములఁ జేసి సజ్జన ప్రతతికి సం
తతమును నెగ్గొనరించు కు, మతు లర్థిం జేయు పూజ మతిఁ గొనఁ డెందున్.

961

తా ॥ కీర్తి, ధనం, ఉన్నత కులమన్న అహంకారం, తాను చేసే పనుల వల్ల గర్వం పెంచుకొని, మదించి సజ్జనులకు కీడుచేసే, దుర్జనుల పూజను ఆయన స్వీకరించదు.

వ. అది యెట్లనిన.

962

తా ॥ అది ఎలాగంటే,

సీ. వలనొప్పఁ దను ననువర్తించు నిందిరా కామినీ మణిఁ దదాకాంక్షు లగుచు
ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల నే ననువర్తింప కెప్పు డాత్మ
నిత్య స్వతంత్రుని నిజభక్త వరదుని దీనవత్సలు గుణాధీశు నజునిఁ

బురుషోత్తముని జగద్భరితు సర్వేశ్వరు నారాయణునిఁ జిదానందమయుని

తే. నజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ, దవిలి సేవింపకుండునే? ధర రసజ్ఞుఁ

డైన పురుషుండు సమ్మోదితాత్ముఁ డగుచుఁ, జారుమతులార! రాజకుమారులార!

963

తా ॥ ఓ పుణ్యాత్ములారా! రాకుమారులార! తగిన విధంగా తనను కోరి అనుసరించే ఇందిరా సతిని, సంపద కోసం ఆ లక్ష్మీదేవిని అనుసరించే దేవేంద్రుడు, వీళ్ళను శ్రీమన్నారాయణుడు పట్టించుకోడు. నిత్య స్వతంత్రుడు, నిజభక్తవరదుడు, దీనవత్సలుడు, గుణాధిపతి, పుట్టుకలేనివాడు, పురుషోత్తముడు, జగమంతా నిండినవానిని, సర్వేశ్వరుణ్ణి, నారాయణుని, చైతన్యమే ఆనందంగా గల స్వరూపిని, జయింపబడనివానిని, నాశరహితుణ్ణి, పుండరీకాలవంటి విశాలమైన నేత్రాలు గలవాణ్ణి, రసజ్ఞుడైన పురుషుడు, సంతోషంతో నిండిన హృదయంతో సేవించకుంటాడా?"

వ. అని మఱియు నిట్లనియె, భవదీయ వంశ ధుర్యుండుఁ జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృ వాగ్బాణ భిన్న హృదయుండై పంచవర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగు నపుడు మార్గంబున నాచే నుపదిష్టంబైన క్రమంబున భగవంతుండగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందెఁ గాన మీరును రుద్రోపదేశ క్రమంబున సర్వభూతాంతర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదంబునకై భజియింపుండు.

964

తా ॥ అని మళ్ళీ ఇలా అన్నాడు: "మీ వంశంలో గొప్పవాడు, చిత్రరథుడునైన ధ్రువుడు, సవతి తల్లి వాగ్బాణాలచే హృదయానికి గాయమై, అయిదు సంవత్సరాల పసివాడైనప్పటికీ, అడవికి వెళ్ళేటప్పుడు, దారిలో నేను చేసిన ఉపదేశాన్ని పాటించి, భగవంతుడైన పుండరీకాక్షుణ్ణి ఆరాధించి, ఇతరులెవరూ పొందరాని సర్వోత్తమమైన స్థానాన్ని పొందాడు. కాబట్టి మీరు కూడా

రుద్రుని ఉపదేశాన్ని అనుసరించి, సర్వభూతాంతర్యామియైన ఆ పరాత్పరుణ్ణి జన్మరాహిత్యం కోసం భజించండి."

క. అని యివ్విధమున నారద, ముని రాజకుమారులకును ముదము దలిర్పన్
వనజోదరు సచ్చరితము, వినిపించి సరోజభవుని వీటికిఁ జనియెన్.

965

తా ॥ అని ఈ విధంగా, నారదముని, రాకుమారులకు సంతోషం కలిగేలా పద్మనాభుని సచ్చరితాన్ని వినిపించి, బ్రహ్మలోకమైన సత్యలోకానికి వెళ్ళాడు.

వ. అట్లు నారదుండు సనిన యనంతరంబ.

966

తా ॥ ఆ విధంగా నారదుడు వెళ్ళిన తరువాత,

చ. నరవర నందనుల్ గడఁక నారద వక్త్ర వినిర్గతంబు సుం
దరమును మంగళావహము ధన్యము లోకమలాపహంబునై
పరఁగిన విష్ణు సద్యశము భక్తి నుతించి ముకుంద చింతనా
నిరుపమ భక్తిఁజెంది హరినిత్య పదంబును బొంది రున్నతిన్.

967

తా ॥ నారద మహర్షి నోటి నుండి వెలువడి, సుందరము, లోకమాలిన్య నివారకమైన శ్రీమహావిష్ణువు సత్కీర్తిని, భక్తితో పొగడి, ఆ ప్రచేతసులు, శాశ్వతమైన శ్రీహరి పదాన్ని పొందారు."

వ. అని మైత్రేయుండు విదురున కిట్లనియె. మహాత్మా! నీవు నన్నడిగిన ప్రచేతో నారద సంవాద రూపంబైన హరికీర్తనంబు మను పుత్త్రుండైన యుత్తానపాదుని వంశప్రకారంబును

జెప్పితి నని వెండియు నిట్లనియె. నారదు వలనం బ్రియవ్రతుం డాత్మ విజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచి యిచ్చి పరలోకగతుం డయ్యెఁ, ననిన.

968

తా ॥ అని చెప్పి, విదురునితో మైత్రేయుడు మళ్ళీ ఇలా అన్నాడు: "మహాత్మా! నీవు నన్ను అడిగినదీ, ప్రచేతసులకు నారదునికి జరిగిన సంవాద రూపమైన హరికీర్తనాన్ని, మనువు పుత్రుడైన ఉత్తానపాదుని వంశప్రకారాన్నీ చెప్పాను. నారదునివల్ల ప్రియవ్రతుడు ఆత్మజ్ఞానాన్ని పొంది, భూమండలాన్ని పాలించి, తరువాత, పుత్రులకు రాజ్యాన్ని పంచియిచ్చి, పరలోకగతుడయ్యాడు" అని చెప్పగా

క. విని విదురుం డా మునివరు, ఘన చరణము లాత్మమస్తకంబున మధు సూ
దను చరణాంభోరుహములు, మనమునఁ దగఁ దాల్చి పలికె మైత్రేయునితోన్.

969

తా ॥ విన్న విదురుడు, మునిశ్రేష్ఠుడైన మైత్రేయ మహర్షి పాదాలను, తన తలయందు, మధుసూదనుని పాదపద్మాలను మనస్సులోను ధరించి, మైత్రేయునితో ఇలా అన్నాడు:

క. మునినాథ చంద్ర! కరుణా, వననిధి! నీ చేత భక్త వత్సలుఁడగు నా
వనజాక్షు తత్త్వ మెఱిఁగితి, నని తత్పదములకు వినతుఁడై వినయమునన్.

970

తా ॥ "మునీంద్రచంద్రా! కరుణా సముద్రా! నీవల్ల భక్తవత్సలుడైన, ఆ శ్రీమహావిష్ణువు తత్త్వాన్ని తెలుసుకున్నాను" అని మైత్రేయుని పాదాలకు వినయంతో నమస్కరించాడు.

క. ఆ మునిచే నా మంత్రితుఁ, డై మనమున బంధు దర్శనాకాంక్షితుఁడై

ధీ మహితుఁడైన విదురుఁడు, సామజ పురమునకుఁ జనియె సమ్మద మొప్పన్.

971

తా ॥ మైత్రేయ మహాముని దగ్గర సెలవు తీసుకొని, మనస్సులో బంధువుల్ని చూడాలన్న కోరిక కలుగగా, జ్ఞానసంపన్నుడైన ఆ విదురుడు సంతోషంతో హస్తినాపురానికి వెళ్ళాడు."

క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపం జెప్పె నీ యుపాఖ్యానంబున్
వినువాఁ డైశ్వర్యాయు, ర్ధన కీర్తి స్వస్తి గతులఁ దగఁ బ్రాపించున్.

972

తా ॥ ఆ విధంగా శుకమహర్షి, పరీక్షిన్నమహారాజుకు దయతో చెప్పాడు. ఈ ఉపాఖ్యానాన్ని విన్నవాడు ఐశ్వర్యాన్ని, ఆయువును, ధనాన్ని, కీర్తిని, మంచిగతులను తగువిధంగా పొందుతాడు."

క. అని శుకయోగి పరీక్షి, జ్జనపాల సుధాపయోధి చంద్రున కర్థిన్
వినిపించిన కథ మోదం, బున సూతుఁడు శౌనకాది మునులకుఁ జెప్పెన్.

973

తా ॥ అని శుకమహర్షి, రాజవంశాలనే సముద్రానికి చంద్రుడైన, పరీక్షిన్మహారాజుకు వినిపించిన కథను, సంతోషంతో సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు.

చ. సరసవచోవిలాస! గుణసాగర! సాగర మేఖలా మహీ
భరణ ధురంధర ప్రకట భవ్య భుజా భుజగేంద్ర! రాజ శే
ఖర! ఖర దూషణ ప్రముఖ గాఢ తమః పటల ప్రచండ భా
స్కర! కఱకంఠ కార్ముక విఖండన ఖేలన! భక్తపాలనా!

974

తా ॥ రసవంతమైన వాక్కుల శోభగలవాడా! గుణసముద్రుడా! సముద్రాల దాకా విస్తరించిన భూభారాన్ని మోసే ఆదిశేషునివంటి భుజదండం గలవాడా! రాజశేఖరా! ఖరదూషణాది ప్రముఖ రాక్షసులనబడే చీకట్లను అంతరింపజేసిన సూర్యునివంటి తేజస్సు కలవాడా! శివుని విల్లును త్రుంచుటయే క్రీడగా కలిగినవాడా! భక్తుల్ని పాలించే వాడా!

క. శర విదళిత సారంగా!, సరస దయాపాంగ! భక్త జలధితరంగా!
దురిత ధ్వాంత పతంగా!, వర జనకసుతానుషంగ! వననిధి భంగా!

975

తా ॥ మాయలేడిని బాణంతో చంపినవాడా! దయారసంతో నిండిన కటాక్షం గలవాడా! భక్తులనే సముద్రానికి తరంగం వంటి వాడా! పరమ పావని సీతయందు ప్రేమకలవాడా! సముద్రుని గర్వాన్ని అణచినవాడా!

మాలిని.
సుర విమత విదారీ! సుందరీ శంబరారీ!
సరస వినుత సూరీ! సర్వలోకోపకారీ!
నిరుపమ గుణహారీ! నిర్మలానంద కారీ!
గురుసమర విహారీ! ఘోర దైత్య ప్రహరీ!

976

తా ॥ దేవతలకు శత్రువైన రాక్షసుల్ని వధించినవాడా! జగన్మోహనకారకా! విద్వాంసులచేత కీర్తించబడేవాడా! సర్వలోకాలకు ఉపకారం చేసేవాడా! సాటిలేని గుణాలతో ప్రకాశించేవాడా! నిర్మలమైన ఆనందాన్ని కల్గించేవాడా! గొప్ప రణరంగంలో విహరించేవాడా! భయంకరమైన రాక్షసుల్ని పడగొట్టినవాడా!

గద్యము. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య

పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు స్వాయంభువ మనువునకు నాకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్రతోత్తాన పాదులు జన్మించుటయు, నందు నాకూతిని రుచి ప్రజాపతికి నిచ్చుటయు, నా రుచి ప్రజాపతికి నాకూతి దేవియందు శ్రీ విష్ణు మూర్త్యంశజుండైన యజ్ఞుండును, లక్ష్మీ కళాంశజ యగు దక్షిణ యను కన్యకయు నుద్భవించుటయు, మనుపుత్రియైన దేవహూతిని గర్దమున కిచ్చుటయుఁ, బ్రసూతిం దక్ష ప్రజాపతి కిచ్చుటయుఁ, బ్రసూతి దక్షుల వలనం బ్రజాపరంపరలు గలుగుటయు, మఱియుం గర్దమ ప్రజాపతి పుత్త్రికా సముదయంబును క్షత్త్ర బ్రహ్మర్షుల కిచ్చుటయుఁ గర్దమ పుత్త్రి యైన కళవలన మరీచికిం గశ్యపుం డను పుత్రుండును బూర్ణిమ యను కూఁతురుం బుట్టుటయును, బూర్ణిమవలన గంగయు విరజుం డనెడు కుమారుండును జన్మించుటయు, గశ్యప ప్రజాపతివలన నయిన ప్రజా పరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు, నత్రిమహాముని తపంబును, నతనికి హరిహర బ్రహ్మలు ప్రత్యక్షం బగుటయు, ననసూయా పాతివ్రత్య మాహాత్మ్యంబు వలన ననసూయాత్రులకుం ద్రిమూర్తుల కళాంశజులయిన చంద్ర దత్తాత్రేయ దుర్వాసుల జన్మంబును, దక్షాత్మజల జన్మంబును, భృగువువలన ఖ్యాతి యను నంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయును, భృగుపౌత్రుం డయిన మార్కండేయు జన్మంబును, ధర్మునకు మూర్తివలన నరనారాయణులు సంభవించు టయును, సత్త్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును, దక్షాధ్వర ధ్వంసంబును, బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును, దక్షాదికృత శ్రీహరి స్తవంబును, శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును, సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాపించుటయు, నుత్తానపాదుని వృత్తాంతంబును, ధ్రువోపాఖ్యానంబును, ధ్రువుండు దండ్రిచేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయును, హరి ప్రసన్నుండై యతని మనోరథంబు లిచ్చుటయును, నతండు మరలఁ బురంబునకు వచ్చుటయు, గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును, ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్య భోగంబులం దనిసి తనయు నుల్కలునిం బట్టంబు గట్టి హరియనుగ్రహంబున ధ్రువక్షితిని

నిలుచుటయు, నుల్కలుండు వత్సరుం డను తన సుతనిఁ బట్టంబు గట్టి హరిం జేరుటయు, వత్సరుని వంశపరంపరయు, నందు నంగుని సుతుండయిన వేను కళేబరంబున లక్ష్మీనారాయణులయంశంబుననర్చియుబృథుండును జన్మించుటయుఁ, బృథుండు భూమిం గామధేనువురీతి నఖిల వస్తువులుం బిదుక నియమించి నిమ్నస్థలిం జేసి యింద్రుండు వశవర్తియై యుండ బహు యజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షం బగుటయు, నధ్యాత్మ ప్రబోధంబును, నింద్రుని వలనఁ బాషండ సంభవంబును, నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తు లగుటయు, విజితాశ్వునకు వసిష్ఠు శాపంబునం ద్రేతాగ్నులు దనయులై జనించుటయుఁ, బృథునిపౌత్త్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును నతని యజ్ఞంబు లసంఖ్యాతంబులైన నారదుండు మాన్పందలంచి పురంజను కథ నధ్యాత్మ ప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ, బ్రాచీనబర్హి సుతులయిన ప్రచేతసులు పదువురకు శ్రీ మహాదేవుండు ప్రత్యక్షంబై హరి స్తవంబుపదేశించుటయుఁ, బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షం బగుటయు, వారికి మారిష వలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేష ప్రయుక్త శాపంబునం బుత్త్రుండై జనియించుటయును, బ్రచేతసులు ముక్తికిం జనుటయును, విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబున కరుగుటయు నను కథలు గల చతుర్థ స్కంధము.

977

తా ॥ ఇది పరమేశ్వరానుగ్రహంతో కవితా వైభవం పొందిన కేసనామాత్యుని పుత్రుడు, సహజపాండిత్యం కలవాడు అయిన పోతనామాత్యునిచే రచించబడిన శ్రీమహాభాగవతమనే మహాపురాణంలో నాలుగవ స్కంధమిది. ఇందులో స్వాయంభువ మనువుకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే వాళ్ళు జన్మించటం, వాళ్ళలో ఆకూతిని 'రుచి' అనే ప్రజాపతికిచ్చి వివాహం చేయటం, ఆ రుచి ప్రజాపతికి 'ఆకూతి' యందు విష్ణుమూర్తి అంశతో యజ్ఞుడు జన్మించటం, లక్ష్మీకళాంశతో 'దక్షిణ' అనే కన్యక కలగటం,

మనువు కుమార్తెయైన దేవహూతిని కర్దమునకు ఈయటం, ప్రసూతిని దక్షప్రజాపతికీయటం, ప్రసూతి–దక్షులవలన ప్రజాపరంపరలు కలగటం, కర్దమ ప్రజాపతి తన పుత్రికల్ని క్షత్రియులకు, బ్రహ్మర్షులకు ఇవ్వటం, కర్దముని పుత్రికయైన కళవలన మరీచికి, కశ్యపుడనే పుత్రుడు, పూర్ణిమ అనే కూతురు జన్మించటం, పూర్ణిమకు గంగ అనే కూతురు, విరజుడనే కుమారుడు జన్మించటం, కశ్యప ప్రజాపతివలన కలిగిన ప్రజాపరంపరలచేత మూడు లోకాలు నిండిపోవటం, అత్రిమహాముని తపస్సు, ఆయనకు త్రిమూర్తులు ప్రత్యక్షమవటం, అనసూయాదేవి పాతివ్రత్యమాహాత్మ్యంవల్ల, ఆమెకు త్రిమూర్తుల అంశలతో చంద్రుడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు జన్మించటం, దక్షుని కుమార్తెల పుట్టుక, భృగువుకు ఖ్యాతికి శ్రీమహాలక్ష్మి జన్మించటం, భృగుని మనుమడైన మార్కండేయుడు జన్మించటం, ధర్మునికి మూర్తివలన నరనారాయణులు జన్మించటం, సత్త్రయాగంలో దక్షుడు శివుణ్ణి నిందించటం, దక్షుని యాగాన్ని ధ్వంసం చేయటం, బ్రహ్మచే ప్రార్థించబడి శివుడు దక్షాదుల్ని అనుగ్రహించటం, దక్షాదులచే చేయబడిన శ్రీహరిస్తోత్రము, శ్రీహరి ప్రసన్నుడై, దక్షుని యాగాన్ని సఫలం చేయటం, సతీదేవి హిమవంతునకు జన్మించి, శివుని చేరటం, ఉత్తానపాదుని వృత్తాంతం, ధ్రువోపాఖ్యానం, ధ్రువుడు తండ్రిచే అవమానించబడి నారదోపదేశంతో మధువనానికి పోయి తపస్సు చేయటం, హరిప్రసన్నుడై, ఆతని మనోరథాన్ని నెరవేర్చటం, ధ్రువుడు మళ్ళీ పట్టణానికి రావటం, కుబేరుని అనుచరులైన యక్షులతో యుద్ధం, యజ్ఞయాగాది క్రతువులు చేస్తూ, రాజ్యభోగాల పట్ల విరక్తి పొంది కొడుకైన ఉల్కలునికి పట్టాభిషేకం చేసి, శ్రీహరి అనుగ్రహంతో 'ధ్రువమండలం' పై నిలవటం, ఉల్కలుడు వత్సరుడనే తన కొడుకునకు పట్టం కట్టి హరినిచేరటం, వత్సరుని వంశపరంపర, అందులో అంగమహారాజు కొడుకైన వేనుని కళేబరం నుండి లక్ష్మీనారాయణుల అంశతో అర్చిమహాదేవి, పృథు చక్రవర్తి జన్మించటం, పృథు చక్రవర్తి, భూమాతను కామధేనువు లాగా చేసి, సమస్త వస్తువుల్ని పిదుకుట, భూమిని సమస్థలిగా చేయటం, ఇంద్రుడు తనకు వశుడై వర్తించుచుతుండగా అనేక యజ్ఞాలు చేసిన పృథువుకు శ్రీహరి ప్రత్యక్షం కావటం, అధ్యాత్మవిద్యను ప్రబోధించటం, ఇంద్రునివలన పాషండుడు రూపొందటం, ఇంద్రుణ్ణి జయించిన విజితాశ్వుణ్ణి, ఆతని తమ్ముల్ని భూమిని పాలించడానికి సింహాసనస్థుల్ని చేసి, పృథువు, అర్చి పరమపద

ప్రాప్తిని పొందటం, వశిష్ఠుని శాపంవలన విజితాశ్వునికి త్రేతాగ్నులు తనయులై జన్మించటం, పృథు చక్రవర్తి మనుమడైన 'ప్రాచీనబర్హి' రాజ్యాన్ని ఆతని అనంతమైన యజ్ఞాల్ని నారదుడు మాన్పించదలచి, పురంజనుని కథను అధ్యాత్మ ప్రవచనంగా చెప్పటం, ప్రాచీనబర్హి పుత్రులైన ప్రచేతసులు పదిమందికి, శ్రీమహాదేవుడైన రుద్రుడు ప్రత్యక్షమై, హరిస్తుతిని ఉపదేశించటం, ప్రచేతసుల తపస్సుకు మెచ్చి, హరి ప్రత్యక్షం కావటం, పూర్వకాలంలో శివవిద్వేషంతో ప్రవర్తించి పొందిన శాపకారణంగా, ప్రచేతసులకు మారిషవలన దక్షుడు జన్మించటం, ప్రచేతసులు ముక్తిని పొందటం, విదురుడు మైత్రేయుణ్ణి వీడి, హస్తినాపురానికి వెళ్ళటం, అనే కథలు గల చతుర్థ స్కంధం ఇది.

శ్రీ కర కరుణా సాగర !
ప్రాకటలక్ష్మీకళత్ర ! భవ్య చరిత్రా !
లోకాతీతగుణాశ్రయ !
గోకులవిస్తార ! నందగోపకుమారా !

1

తా ॥ శ్రీకృష్ణా! సిరులను కలిగించేవాడా! సాగరానికి ఎలా చివర లేదో అలా దయ చూపించడంలో అంతు లేనివాడా! సమస్త విశ్వంలోను సుప్రసిద్ధురాలైన లక్ష్మీదేవికి భర్తయైనవాడా! శుభప్రదమైన చరిత్ర కలవాడా! ఈ లోకాలలో వేటికీ అందని గుణాలకు నెలవైనవాడా! గోకులాన్ని విస్తరింపచేసినవాడా! ఓ నందగోపుని బిడ్డడా! అవధరించు.

ఈ పద్యంలో 'గోకుల విస్తార' అనే సంబోధనలో వాక్కులను అంటే వేదాల్ని ఉద్ధరించినవాడని, వేదాల వల్లనే మనకు గోచరమయ్యేవాడని, ఏ మాత్రం వేదజ్ఞానం లేకపోయినా అమాయక భక్తితో తనను సేవించిన గోకులవాసులకు తోడుగా నిల్చినవాడని కూడా భావించవచ్చు.

దశమ స్కంధంలో 352 వ పద్యంలో యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతం ఉంది. వసువుల్లో ముఖ్యుడైన ద్రోణుణ్ణి అతని భార్య ధరతో కలిసి భూమిపై పుట్టండని బ్రహ్మ పంపించాడు. వారు విష్ణుసేవ మాకు కలిగిస్తే అలా పుడతామని అన్నారు. బ్రహ్మ 'అలాగే అవుతుంది' అన్నాడు. విష్ణుసేవ చేస్తూ తరించాలని ధరాద్రోణులు యశోదానందులుగా జన్మించారు. అలా కృష్ణుడు నందగోప కుమారుడయ్యాడు.

'లోకాతీతగుణాశ్రయ' అన్న సంబోధనను లోకాతీత, గుణాశ్రయ అని రెండుగా చెప్పుకొంటే మరీ బావుంటుంది. దశమస్కంధంలో 97 వ పద్యంలో శుద్ధసత్త్వగుణస్వరూపుడు భగవానుడని, ఆ వెలుగు వల్లనే అజ్ఞానపు ఆవరణ పోయి విజ్ఞానం కూడి ఉంటుందని, ఆ

సత్త్వగుణం – మాటలకు, మనస్సుకు అవతల అందకుండా ప్రకాశిస్తుందనీ ఉంది. ఇది దృష్టిలో పెట్టుకొని చూస్తే 'లోకాతీత', 'గుణాశ్రయ' అని చెప్పుకోవడంలో మరింత బావుంటుంది.

వ. సకల పురాణార్థజ్ఞాన విఖ్యాతుండగు సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

2

తా ॥ మహనీయమైన గుణం గలవారిలో శౌనకాది మహర్షులు గొప్పవారు. వీరితో పురాణాలన్నింటినీ పరమార్థంతో చక్కని మాటలతో ప్రవచించే సూతుడు ఇలా అన్నాడు:

# 1. ప్రియవ్రతుని చరిత్ర

క. భూ నాథుఁ డుత్తరాత్మజుఁ, డైన పరీక్షిన్నరేంద్రుఁ డభిమన్యు
సుతుం డానందమంది ఘన సు, జ్ఞానుండగు శుకుని గాంచి సరసతఁ బలికెన్.

3

తా ॥ పరీక్షిత్తు ఉత్తరాభిమన్యుల కొడుకు. భూమిని ఏలుతున్నవాడు. అతడు బ్రహ్మజ్ఞాని అయిన శుకమహర్షితో భక్తి రసభావంతో ఇలా పలుకుతున్నాడు:

వ. మునీంద్రా ! పరమభాగవతుండు నాత్మారాముండునైన ప్రియవ్రతుండు గృహంబున నుండి యెట్లు రమించెఁ? గర్మ బంధంబు లయిన పరాభవంబులు గల గృహంబులయందు ముక్త సంబంధులైన పురుషులకు సంతోషంబు గా నేర; దుత్తమ శ్లోకుండైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృత చిత్తులైన మహాత్ములు గుటుంబంబునందు నిస్పృహత సేయుదురు; గాన ప్రియవ్రతునికి సంసారంబునందుఁ దగులంబు గలుగు టెట్లు? దారాగారసుతాదులందుఁ దగులంబు గలుగ వానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు? నీ సంశయంబుఁ దేట పఱపు మని పరీక్షిన్నరేంద్రుఁ డడిగిన శుక యోగీంద్రుం డిట్లనియె.

తా ॥ “మునీంద్రా! భగవద్భక్తులలో ప్రియవ్రతుడు అగ్రేసరుడు. ఆత్మారాముడు. అలాంటి ప్రియవ్రతుడు ఇంట్లోనే ఉంటూ ఆత్మానుభవాన్ని ఎలా పొందాడు? కర్మబంధం వల్ల ఆత్మజ్ఞానం నశిస్తుంది. ఇంటిపై ఆసక్తి ఉన్నవారికి కర్మబంధాలు తప్పవు. కనుక మోక్షసంబంధం కావాలనుకొనేవారికి గృహబంధం సంతోషాన్ని కలిగించలేదు. తెల్ల తామరలను పోలిన కన్నులు గల ఆ శ్రీహరి కీర్తనీయులలో ఉత్తముడు. తాపత్రయాలలో కాగిపోకుండా శ్రీహరి పాదాల నీడలో ఆనందంతో ఉండే మనస్సు గల మహాత్ములకు కుటుంబం పట్ల స్పృహ ఉండదు. ఇల్లు, ఇల్లాలు, పిల్లల మీద ఆసక్తి ఉన్నవారికి భక్తి కుదరదు.

భక్తుడికి ఇంటిపై మమకారం ఉండదు. కాని ప్రియవ్రతుడికి సంసారంతో సంబంధం ఎలా కుదిరింది? శ్రీహరి యందు సుస్థిరమైన బుద్ధి ఎలా నిలిచింది? ఈ సందేహాన్ని పోగొట్టు.”

అన్న పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడిలా అన్నాడు:

క. హరిచరణాంబుజ మకరం, ద రసావేశిత మనః ప్రధానుండగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ, బొరసినఁ దన పూర్వ మార్గమును విడువఁ డిలన్.

5

తా ॥ “రాజా! శ్రీహరి యొక్క పాదారవిందాల నుండి జాలువారే మకరంద ప్రవాహమే భక్తి. దాని యందు మనస్సు పెట్టిన సజ్జనుడికి ఒకవేళ మధ్యలో విఘ్నం వచ్చినా అతడు తన దారిని విడిచి ప్రక్కకు పోడు.

క. ధరణీవల్లభ! విను మా, నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని స
చ్చరణోపసేవఁ జెందుచు, నరుదుగ నధ్యాత్మ సత్త్ర యాగంబందున్.

6

తా ॥ రాజా! విను. రాకుమారుడైన ప్రియవ్రతుడు నారదమహర్షికి ప్రియశిష్యుడు. గురు పాదసేవలో గడుపుతూ అపూర్వమైన బ్రహ్మసత్త్రయాగం చెయ్యాలనే తలంపుతో...

అధ్యాత్మసత్త్రయాగం : 'బ్రహ్మసత్త్రేణ' అని మూలం. పరమార్థతత్త్వాన్ని గ్రహించి ఆత్మజ్ఞానవ్రతు డయ్యాడని శ్రీధరీయ వ్యాఖ్య. పరమపురుషార్థ తత్త్వావగాహనకు జ్ఞానయజ్ఞం మొదలుపెట్టి, స్వపర భేదాల యొక్క ఆధ్యాత్మ విజ్ఞాననిష్ఠ వహించాడని వీరరాఘవీయం. సన్న్యాసదీక్ష వహింపగోరాడని విజయధ్వజ తీర్థుల పదరత్నావళి.

సీ. దీక్షితుండై ధరిత్రీపాలనముఁ దండ్రి, పనిచిన సుజ్ఞాన భంగ
మనుచు నంగీకరింపమి నంతయుఁ దెలిసి ప, ద్మాసనుఁ డతనికి నతుల
రాజ్య మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు, ననుచును దన చిత్తమందుఁ
దలఁచి తారకాద్యనుసృత తారాధిపుని మాడ్కి, శ్రుతులతోఁ గూడి యచ్యుత విభూతి

తే. హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ, గదిసి సేవింప బ్రహ్మలోకమున
నుండి సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంససేయ, నల్ల నల్లన యుడువీథి నరుగు దెంచె.

7

తా ॥ దీక్ష వహించాడు. తండ్రి స్వాయంభువ మనువు రాజ్యపాలనం చెయ్యమని ప్రియవ్రతుణ్ణి ఆజ్ఞాపించాడు. కాని రాజ్యపాలనం వలన శరీర సంబంధమైన రాగద్వేషాలు పెరిగి భగవత్‌జ్ఞానం మరుగైపోతుందనే భయంతో అతను ఒప్పుకోలేదు. ఈ విషయం బ్రహ్మదేవుడికి తెలిసింది. ప్రియవ్రతుడికి ఏ భోగాలతోనూ సాటిలేని రాజ్యపాలనపై ఆసక్తి పుట్టిస్తానని బ్రహ్మ తన మనస్సులో సంకల్పించాడు. నక్షత్రాలు చంద్రుణ్ణి పొదిగికొన్నట్లు వేదాలు తనను పరివేష్టింపగా బ్రహ్మ తరగని విభూతితో హంసవాహనుడై బయల్దేరాడు. స్వర్గం నుండి ఇంద్రాది దేవతలు సమీపించి సేవింపగా, బ్రహ్మలోకం నుండి మరీచి మున్నగు ఋషిపుంగవులు కీర్తిస్తూ ఉండగా బ్రహ్మ అల్లనల్లన నక్షత్రాలు ప్రకాశిస్తున్న మార్గానికి దిగివచ్చాడు.

వ. మఱియు నయ్యై మార్గంబులయందు సిద్ధ సాధ్య గంధర్వ చారణ గరుడ కింపురుషు లిరు దెసల స్తోత్రంబులు సేయుచుండ గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుఁ జనుదెంచిన పద్మాసనునకు నారదుండు స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడి ముకుళిత కరకమలుండై యెదురు చనుదెంచి సంస్తుతి స్తబకంబులం బూజించిరి; విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు నిట్లనియె.

8

తా ॥ ఏతెంచి వచ్చేటప్పుడు ఆయా మార్గాలలో సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, చారణులు, గరుడులు, కింపురుషులు స్తుతిస్తూ ఉండగా బ్రహ్మదేవుడు గంధమాదన పర్వతం యొక్క లోయల్ని తన కాంతితో ప్రకాశింపచేస్తూ ఆ పర్వతం దగ్గరకు వచ్చాడు. అక్కడ నారదుడు స్వాయంభువ మనువుతోను, ప్రియవ్రతునితోను కలిసి ఉన్నాడు. నారదుడు వారితో పద్మాసనస్థుడైన బ్రహ్మకు ఎదురేగి, కమలాల వంటి తన చేతుల్ని జోడించి, నమస్కరించి, చక్కని స్తుతులతో పూజించాడు. బ్రహ్మ సంతోషించి, ప్రియవ్రతుణ్ణి చూసి నవ్వుతూ ఇలా అన్నాడు:

క. హరి నా ముఖమున నీకును, గర మెఱిఁగింపంగఁ బనిచెఁ గావున నిదె సు
స్థిర మతి విను మంతయు శ్రీ, హరి వాక్యముగా నెఱింగి యవనీ నాథా!

9

తా ॥ "ఓ రాజా! ప్రియవ్రతా! విష్ణుమూర్తి నా నోటిద్వారా తన నోటిమాటగా నీకు స్పష్టంగా తెలియచెప్పమని ఆజ్ఞాపించాడు. కనుక నీ బుద్ధి నిలకడ చేసుకొని శ్రద్ధగా విను. నువ్వు వినేదంతా శ్రీహరి శాసనంగా తెలుసుకో.

ఆ. కోరి వేడ్క నీవు నారదుండును నేను, నందఱమును నీశ్వరాజ్ఞఁ బూని
యుడుగ కెపుడు సేయనున్న వారము గాన, నతని యాజ్ఞఁదప్ప నలవి గాదు.

10

తా ॥ నేను, నారదుడు, నువ్వు అందరమూ మనకు ప్రభువైన శ్రీహరి ఆజ్ఞకు బద్ధులం. ఆ ఈశ్వరాజ్ఞను బట్టి ప్రవర్తించడమే మన విధి. అతని శాసనాన్ని తిరస్కరించడం వీలుకాని పని.

వ. మఱియు శ్రీహరి యాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగవీర్యజ్ఞానార్థ ధర్మంబులను దనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁ డుత్పత్తి స్థితి నాశంబులకు శోకమోహభయ సుఖదుః ఖంబులకు నీశ్వరాధీనుండె కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు; శ్రీహరి వాగ్రూపంబు లయిన శ్రుతులందు గుణత్రయంబను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకుఁ ద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశంబయిన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము; నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు; నేత్రంబులు గలవానిచేతఁ దివియంబడిన యంధుండునుం బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించుచున్న వారము; స్వప్నంబునం గన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలంచిన చందంబున మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రారబ్ధ సుఖ దుఃఖంబు లనుభవించుచు దేహాంతరారంభ కర్మంబులం బాయనొల్లఁడు; వనవాసి యైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాది సహితుం డగుటంజేసి సంసారబంధంబులు గలుగు; గృహస్థాశ్రమంబందును జితేంద్రియుండై యాత్మ జ్ఞానంబుగల పురుషునకు మోక్షంబు సిద్ధించు, శత్రువుల గెలువ నిచ్ఛయించిన పురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థియగు నీవును గృహాశ్రయుండ వగుచు శ్రీ నారాయణ చరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబు జయించి ముక్త సంగుండవై యీశ్వర కల్పితంబులగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందు మనినఁ బ్రియవ్రతుండు త్రిభువన గురుండయిన చతురానను వాక్యంబు లవనత మస్తకుండై బహుమాన పూర్వకంబుగ నంగీకరించె నంత.



తా ॥ అంతేకాదు. జీవుడు ఎంత తపస్సు చేసినా, ఎన్ని విద్యల్ని పొందినా, ఎంత

యోగశక్తిని కలిగి ఉన్నా, ఎంత వీర్యవంతుడైనా, ఎంతటి జ్ఞానియైనా, ఎంత ధనవంతుడైనా, ధార్మికుడైనా తనంత తానుగా గాని, తనకంటే గొప్పవాడైన మరొకడిని ఆశ్రయించి గాని సర్వేశ్వరుని ఆజ్ఞను అతిక్రమించలేడు. పుట్టుటకైనా, గిట్టుటకైనా, శోకానికైనా, మోహానికైనా, సుఖానికైనా, దుఃఖానికైనా జీవుడు పరమేశ్వరుడికి అధీనుడే గాని, స్వతంత్రుడు కాడు.

ఆ భగవంతుని వాక్కు వేదాలు. సత్త్వరజోస్తమోగుణాలు త్రాడు. అందరమూ భగవానుని వాక్కయిన వేదాన్ని అనుసరించి గుణత్రయమనే త్రాటితో బంధింపబడి ఉన్నాం.

వేదవిహితాలైన కర్మల్ని సత్త్వరజోస్తమోగుణాల వల్ల ఆచరిస్తూ జీవుడు శరీరబంధాన్ని పొందుతున్నాడు. మనమందరం ఈశ్వరాజ్ఞ అయిన వేదాన్ని అనుసరించి వేదవిహిత కర్మలు చేస్తూ ప్రవర్తిస్తున్నాం. ముకుత్రాటిచే పశువు మనుష్యులకు వశపడి ఉన్నట్లు మనం ఈశ్వరుడి ఆజ్ఞకు కట్టుబడి ఉన్నాం. సత్త్వరజస్తమోగుణాలచే ఆయా కర్మల్ని చేసి భగవంతుడొసగే సుఖాన్ని, దుఃఖాన్ని అనుభవిస్తున్నాం. చూపుగలవాడు చూపు లేనివాణ్ణి నడిపించేటప్పుడు చూపుగలవాడు ఎండలో నడిపించినా, నీడలో నడిపించినా గ్రుడ్డివాడు ఎలా అనుసరించి వెళ్తాడో – అలాగే మనం సర్వేశ్వరుడు నడిపించినట్లు నడుస్తున్నాం. మోక్షమందు కోరిక గల జ్ఞాని కూడా తనకు ప్రాప్తమైన సుఖదుఃఖాల్ని అనుభవిస్తాడు.

శరీరాన్ని ధరించడం, ప్రారబ్ధాన్ని అనుభవించడం ఎవడూ తప్పించుకోలేడు. అయితే మోక్షార్థి అయిన జ్ఞాని వీటిని కలలో చూసిన పదార్థాల్ని మేలుకొన్నాకా మిథ్యలు కదా! అని తలచినట్లు చూస్తాడు. కామక్రోధాదులకు వశపడి ఇంద్రియనిగ్రహం లేకుండా ఇల్లు వీడి అడవుల్లోకి పోయి ఉన్నా సంసారబంధం ఉన్నట్లే. ఇంద్రియ నిగ్రహం కలిగి, ఆత్మస్వరూపం తెలిసి, బ్రహ్మనిష్ఠ కలిగినవాడు గృహస్థుగా ఉన్నా అలాంటి జ్ఞానికి మోక్షం సిద్ధిస్తుంది. శత్రువుల్ని జయించాలనుకొన్న రాజు ఒక దుర్గాన్ని ఆశ్రయించి, దానిలో ఉండి యుద్ధం చేస్తే శత్రువుల్ని జయిస్తాడు. అలాగే మోక్షాన్ని కోరేవాడు ఇంట్లోనే ఉండి, శ్రీహరి యొక్క పద్మాలవంటి పాదాలు అనే దుర్గాన్ని ఆశ్రయించి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే

ఆరుగురు శత్రువుల్ని జయించగలుగుతాడు. నువ్వు కూడా భగవానుడు నీకు కల్పించిన భోగాలను అనుభవించు. వీటి పట్ల సంగం లేకుండా ప్రవర్తిస్తూ ముక్తిని పొందు" – అన్నాడు బ్రహ్మదేవుడు.

కోటలో ఉంటూ యుద్ధం చేయడం, కోటను విడిచిపెట్టి చేయడం కన్నా శ్రేయస్కరం కదా! అలాగే జ్ఞానియై సంసారాన్ని విడిచిపెట్టి సాధనలు చేయడం కన్నా, గృహస్థుడిగా ఉంటూ సాధనలు చేయడం సులభం కదా!

—శ్రీరామకృష్ణ పరమహంస

బ్రహ్మ ముల్లోకాలకు గురువు. అట్టి బ్రహ్మ ఆజ్ఞను ప్రియవ్రతుడు శిరస్సు వంచి నమస్కరించి, స్వీకరించి, గౌరవంతో ఒప్పుకొన్నాడు. అటుపై –

ఆ. సరసిజాసనుండు స్వాయంభువుని చేత, నధికమైన పూజలంది నార
దుండు నా ప్రియవ్రతుండును జూడంగఁ, జనియెఁ దనదు పూర్వ సదనమునకు.

12

తా ॥ స్వాయంభువ మనువు బ్రహ్మను శాస్త్రోక్తప్రకారం ఘనంగా పూజించాడు. ప్రియవ్రతుడు, నారదుడు చూస్తూ ఉండగా బ్రహ్మ మనస్సుకు, మాటకు అందని తన లోకానికి తిరిగి వెళ్ళాడు.

ఆ. సత్యసంధుఁడైన స్వాయంభువుం డను, మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ
నంది యంత నారదానుమతంబునఁ, దనదు సుతుని రాజ్యమునను నిలిపె.

13

తా ॥ సత్యసంధుడైన స్వాయంభువ మనువు యొక్క కోరికను బ్రహ్మ మన్నించి సాధించిపెట్టాడు. మనువు నారదులవారి అనుమతిని పొంది, తన కొడుకు ప్రియవ్రతుడికి

రాజ్యాన్ని అప్పగించాడు.

వ. ఇట్లు స్వాయంభువ మనువు భూచక్ర పరిపాలనంబునకుఁ బ్రియవ్రతునిఁ బట్టంబు గట్టి విషమంబులగు విషయంబుల వలన విముక్తుండై వనంబునకుం జనియె; నంత.

14

తా ॥ ఇలా స్వాయంభువ మనువు తన కొడుక్కి రాజ్యపరిపాలనకై పట్టాభిషేకం చేసి, విషసముద్రాల వంటివైన విషయాలనే విషాలపై ఆశలను విడిచి, అరణ్యానికి వెళ్ళాడు. ఆపై –

మ. ధరణీవల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మోదం బందుచున్ లీల నీ
శ్వర వాక్యంబునఁ గర్మతంత్ర పరుఁడై సంగంబులం బాపు శ్రీ
హరిపాదాంబుజ చింతన్ దగిలి నిత్యానందముం బొంది దు
ర్భర రాగాదులఁ బాఱఁదోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్.

15

తా ॥ మహారాజైన ప్రియవ్రతుడు భగవానుని ఆజ్ఞానుసారం సంతోషంగా రాజ్యపాలనం చేస్తూ, తాను చేయవలసిన కర్మల్ని ఆచరిస్తూ, వాటిపై సంగాన్ని విడిచిపెట్టి, విష్ణు పాదపద్మాలపైననే మనస్సు పెట్టి, నిత్యమూ ఆనందాన్ని అనుభవించాడు. భరింప శక్యంగాని రాగద్వేషాల్ని దరికి రానీయకుండా ప్రజల్ని ఎంతో గొప్పగా పరిపాలించాడు.

వ. ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు సేయుచు విశ్వకర్మ ప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యనుదానిం బత్నిగాఁ బడసి, యా సతివలన శీల వృత్త గుణ రూప వీర్యౌదార్యంబులం దనకు సమానులైన యాగ్నీ ధ్రేధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతో, ఘృతపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవులను నామంబులు గల పుత్రదశకంబును, నూర్జస్వతి యను నొక్క కన్యకను గాంచె నందుఁ గవి మహావీర సవనులు బాలకులయ్యు నూర్ధ్వ రేతస్కులై బ్రహ్మవిద్యా నిష్ణాతులై యుపశమనశీలు రగుచుం బారమహంస్య యోగం

బా్రశయించి, సర్వ జీవనికాయావాసుండును, భవభీతజన శరణ్యుండును, సర్వాంతర్యామియు భగవంతుండునగు వాసుదేవుని చరణారవిందావిరత స్మరణానుగత పరమభక్తి యోగానుభావంబున విశోధితాంతః కరణు లగుచు నీశ్వరు తాదాత్మ్యంబుఁ బొంది రంత.

16

తా ॥ ప్రియవ్రతుడు ఇలా సుఖంగా రాజ్యపాలనం చేస్తూ విశ్వకర్మ ప్రజాపతి కుమార్తె అయిన బర్హిష్మతిని వివాహం చేసుకొన్నాడు. ఆమె వల్ల తనతో సమానమైన నడవడి, గుణం, రూపం, వీర్యం, ఉదారత్వం కలిగిన పదిమంది కొడుకుల్ని, ఒక కుమార్తెను పొందాడు. ఆ కొడుకుల పేర్లు ఇవి – ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, మహావీరుడు, హిరణ్యరేతుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి. అమ్మాయి పేరు ఊర్జస్వతి.

కొడుకులలో కవి, మహావీర, సవనులు ముగ్గురూ బాల్యం నుండి జితేంద్రియులై నివృత్తిధర్మాన్ని ఆశ్రయించి, బ్రహ్మవిద్యలో పండి పరమహంసలయ్యారు. వారు పరమహంసాశ్రమంలో ఉంటూ సకల జీవసమూహాన్ని తమ శరీరంగా దాల్చి, సంసార భయం కలవారిని రక్షించేవారు, అన్నింటా అంతర్యామిగా ఉన్నవాడు, భగవంతుడు అయిన వాసుదేవుని చరణారవిందాల యందు ఎడతెగని స్మరణ గలవారై ఆ పరమేశ్వరుని యందు పరమ భక్తిగలవారయ్యారు. వారి మనస్సున భగవత్సాక్షాత్కారాన్ని పొంది ఉన్నారు. ఈశ్వరునితో వారు తాదాత్మ్యభావాన్ని పొందారు. ఆ తరువాత –

సీ. వసుధేశ! యా ప్రియవ్రతుఁ డొండు కాంతయం, దధికుల మన్వంతరాధిపతుల<br>
మఱియు నుత్తముఁడు తామసుఁడు రైవతుఁ డను, సుతులను బుట్టించె సుమహితులను;<br>
మున్ను జన్మించిన మువ్వురు పుత్త్రులు, నవ్యయ పదవికి నరుగుటయును<br>
నంతఁ బ్రియవ్రతుఁ డఖిల శాత్రవకోటిఁ, దన బాహుబలముచేతను జయించి.

తే. యతఁడు బర్హిష్మతీ కాంతయందుఁ బ్రీతి, గలిగి యౌవన లీలా వికాస హాస
హేలనాదులఁ జిత్తంబు గీలుకొల్పి, గత వివేకుండువోలె భోగములఁ బొందె.

17

తా ॥ రాజా! ప్రియవ్రతుడికి మరొక భార్యయందు ముగ్గురు కుమారులు జన్మించారు. ఉత్తముడు, తామసుడు, రైవతుడు – అనే పేర్లుగల ఆ ముగ్గురూ గొప్పవారే. వారు తరువాత మన్వంతరాలకు అధిపతులయ్యారు. మొదటి భార్యకు జన్మించిన పుత్రులలో ముప్పురు శాశ్వతంగా తరగకుండా ఉండే పదవికి వెళ్ళడం వల్ల ఈ ముగ్గురూ వారి స్థానాల్ని పొందారు. ప్రియవ్రతుడు తన బాహుబలంతో సకల శత్రువుల్ని జయించాడు. భార్యానురాగంతో ప్రీతితో యౌవనలీలలతో, హేలగా, సుఖాలతో త్రుళ్ళిపడుతూ వివేకం లేనివాడి వలె ప్రవర్తిస్తున్నట్లు ప్రవర్తించాడు.

## 2. ఆగ్నీ ధ్రాదుల జననం

వ. ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరంబులు రాజ్యంబుసేసి యొక్కనాఁడు మేరునగ ప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపంబూని భగవదుపాసనా జనితాతిపురుష ప్రభావుండై సవితృరథసదృక్ష వేగంబు గలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రుల నెల్ల దినంబు లొనర్తునని సప్త వారంబులు ద్వితీయ తపనుండునుం బోలె నరదంబు వఱపుటయు నా రథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును నా మధ్య భూసంధులు సప్త ద్వీపంబులు నయ్యె నందు. 18

తా ॥ ఇలా ప్రియవ్రతుడు పదకొండు కోట్ల సంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు. ఒకనాడు అతిమానుషమైన ఒక పని చేశాడు. సూర్యుడు మేరుపర్వతానికి చుట్టు తిరుగుతూ ప్రకాశాన్ని ఇస్తూ ఉంటాడు. సూర్యుడు ఒకవైపు ఉన్నప్పుడు మరోవైపు చీకటిగా ఉంటుంది – మేరుపర్వతానికి. ఆ చీకటిని పోగొట్టాలని ప్రియవ్రతుడు భగవదుపాసన వల్ల లభించిన అతిమానుషప్రభావంతో సూర్యుడి రథంతో సమానమైన వేగం, తేజస్సు కలిగిన రథాన్ని ఎక్కి రాత్రులను పగళ్ళుగా చేస్తానని ఏడు దినాలపాటు రెండవ సూర్యుడి వలె రథాన్ని పోనిచ్చాడు. రథచక్రపు తాకిడికి భూమిపై గోతులేర్పడ్డాయి. అవే సప్త సముద్రాలయ్యాయి. ఆ సముద్రాల మధ్య భాగం ఏడు ద్వీపాలయ్యాయి.

మేరుపర్వతం చుట్టూ ప్రియవ్రతుడు తన రథంతో ఏడు సార్లు ప్రదక్షిణం చేశాడు కనుక సముద్రాలు, ద్వీపాలు సప్త సంఖ్యలో వచ్చాయి.

సీ. సరస జంబూప్లక్ష శాల్మలిద్వీప కు, శ క్రౌంచ శాక పుష్కరము లనఁగ
నలరు నా ద్వీపంబులందు జంబూద్వీప, మొనరంగ లక్షయోజనము లయ్యె
నట యుత్తరోత్త రాయత సంఖ్యఁ దా ద్విగు, ణిత ములై యొండొంటి కతిశయిల్లు

క్షారేక్షురస సురాజ్యక్షీర దధ్యుద, కంబులు గలుగు సాగరము లేదు

తే. ద్వీప పరిమాణములు గల్గి విస్తరిల్లు, సంధి సంధిని బరిఖల చందమునను

గ్రమము దప్పక యొండొంటిఁ గలయకుండు, సకల జీవుల కెల్ల నాశ్చర్యముగను.

19

తా ॥ ఆ సప్త ద్వీపాలు ఇవి – జంబూ ద్వీపం, ప్లక్ష ద్వీపం, శాల్మలి ద్వీపం, కుశ ద్వీపం, క్రౌంచ ద్వీపం, శాక ద్వీపం, పుష్కర ద్వీపం. వీటిలో జంబూద్వీపం, లక్షయోజనాల పరిమాణం కలది. అక్కడి నుంచి ఒక్కొక్క ద్వీపం ముందుదాని కంటే తరువాతిది రెండు రెట్లు పెద్దది. సప్త సముద్రాలు ఇవి – లవణ సముద్రం, ఇక్షు సముద్రం, సురా సముద్రం, ఘృత (నేతి) సముద్రం, పాల సముద్రం, దధి (పెరుగు) సముద్రం, జల సముద్రం. సముద్రాలు ద్వీపాలకు అగడ్తల వలె ఉన్నాయి. సముద్రాలు, ద్వీపాలు ఒకదానితో ఒకటి కలిసిపోకుండా, సరిహద్దులు పెట్టినట్లు వరుస తప్పకుండా ఏర్పడటం చూసి, సకల జీవులూ విస్తుపోయాయి.

వ. అట్టి ద్వీపంబుల యందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు నాత్మసమాన శీలురునైన యాగ్నీ ధ్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథి వీతిహోత్రుల నొక్కొక్కని నొక్కొక ద్వీపంబునకుం బట్టంబు గట్టి యూర్జస్వతి యను కన్యకను భార్గవున కిచ్చిన నా భార్గవునకు నూర్జస్వతి యందు దేవయాని యను కన్యారత్నంబు జనించె; నట్టి బలపరాక్రమవంతుండైన ప్రియవ్రతుండు విరక్తుండై యొక్కనాఁడు నిజ గురువగు నారదుని చరణానుసేవానుపతిత రాజ్యాది ప్రపంచ సంసర్గంబుఁ దలంచి యిట్లనియె.

20

తా ॥ ప్రియవ్రతుడు తనతో సమానమైన శీలం కలిగిన వారైన తన కొడుకులు – ఆగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, హిరణ్యరేత, ఘృతపృష్ఠ, మేధాతిథి, వీతిహోత్రులను జంబూ మొదలైన ద్వీపాలకు పరిపాలకులుగా నియమించాడు. కుమార్తె ఊర్జస్వతిని శుక్రాచార్యుడి కిచ్చి పెళ్ళి

చేశాడు. వారికొక చక్కని ఆడపిల్ల పుట్టింది. ఆమెయే దేవయాని. అలా దివ్యశక్తి, అపరిమిత బలపరాక్రమాలు కలిగి ఉన్న ప్రియవ్రతుడికి సంసారం పట్ల విరక్తి కలిగింది. తన గురువైన నారదుని పాదాలను ఆశ్రయించినందుకు ఫలితంగా తాను రాజ్యాది భోగాలను ప్రాపంచికరూపంతో అనుభవించిన వృత్తాంతాన్ని, తలచి, దుఃఖించి — ఇలా అనుకొన్నాడు:

## 3. ప్రియవ్రతుడు వనములకేగుట – ఆగ్నీ ధ్రుని కథ

సీ. అక్కట, యే నింద్రియములచేఁ గట్టంగఁ, బడియుండి యందులఁ బాయలేక
యజ్ఞాన విరచితం బగు సర్వవిషయము, లను నంధకూపంబులందు నడఁగి
తరుణుల కే వినోదమృగంబనై యుండి, యవి యెల్ల నే నొల్ల ననుచు రోసి
హరికృపచే నప్పు డబ్బిన యాత్మ వి, ద్యను గల్గి తనవెంట నరుగుదెంచు

తే. కొడుకులకు నెల్ల రాజ్యము గుదురుపఱిచి, తనదు పత్నుల దిగనాడి ధనము విడిచి
హరివిహారంబు చిత్తంబునందు నిలిపి, పరఁగ నల్లన నారదపదవి కరిగె.

21

తా ॥ "అయ్యో! నేను మొదట ఇంద్రియాలచే కట్టబడని నివృత్తిమార్గంలో ఉండి కూడా, అజ్ఞానం వల్ల విషయభోగాలకు లొంగిపోయాను. విషయాలంటే గడ్డి పైనవేసి కప్పిన నూతులు. అలాంటి అంధకూపంలో పడిపోయాను. పడతుల వినోదార్థం నేను ఒక మృగంలా ఉండిపోయాను. ఇదేమీ నా కిష్టం లేదు" – అని ప్రియవ్రతుడు తన ప్రవృత్తిని అసహ్యించుకొని, భగవదనుగ్రహం వల్ల కల్గిన ఆత్మవిద్య ప్రకాశింపగా విరాగియై బైటకు వచ్చేశాడు. తన వెంబడి వస్తున్న కొడుకులకు రాజ్యాన్ని కుదురుపరచాడు. భార్యల్ని విడనాడాడు. ధనాన్ని విడిచిపెట్టాడు. చిత్తంలో శ్రీహరినే సుస్థిరంగా నిలిపి, గురువైన నారదులవారు ఉపదేశించిన మార్గంలో కాలం గడపాలని గంధమాదన పర్వతానికి వెళ్ళాడు.

వ. ఇట్లు దన రథమార్గంబులు సప్తద్వీపసాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతిసూర్యుండై సరిద్గిరివనాదులచే భూత నిర్వృతి కొఱకుఁ బ్రతిద్వీపంబునకు నవధులు గల్పించి ద్వీపవర్ష నిర్ణయంబులం బుట్టించి పాతాళ భూ స్వర్గాది సుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి విరక్తిం బొంది నిరంతర భగవద్ధ్యాన విమలీకృతాశయుం డగుచు హరిభక్తి ప్రియుండయిన ప్రియవ్రతు చరిత్రంబు లీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబుగా; దతని

మహిమంబులు నేఁడునుం గొనియాడుదురని శుకుండు మఱియు నిట్లనియె.

22

తా ॥ ఈ విధంగా తన రథమార్గాలను సప్తద్వీపాలుగా, సప్తసముద్రాలుగా చేసి, సూర్యుడికి రెండవ సూర్యుడిలా వెలుగొంది, నదులు పర్వతాలు, అరణ్యాలతో సహితంగా ప్రాణుల సుఖంకోసం ప్రతిద్వీపానికీ హద్దుల్ని ఏర్పరచి, ద్వీపాలకూ వర్షాలకూ పేర్లను నిర్ణయించిన ప్రియవ్రతుడు – దివ్యమైన భోగాల్ని గాని, మనుష్యలోకం లోని సుఖాల్ని గాని, పాతాళలోకాలలోని సుఖాల్ని గాని నరకంతో సమానంగా తలచి విరక్తి పొందాడు. ఎల్లప్పుడు భగవంతుణ్ణి ధ్యానిస్తూ నిర్మలుడై, భగవద్భక్తులకు ఆప్తుడై ప్రవర్తించాడు. ప్రియవ్రతుని చరిత్రలోని ఔన్నత్యాన్ని తెలియడం పరమేశ్వరుడికి తప్ప మరొకరికి సాధ్యం కాదు. అతని మహిమల్ని ఇప్పటికీ కీర్తిస్తూ ఉంటారు" – అని శుకమహర్షి ఇంకా ఇలా అన్నాడు:

క. హరిసేవనాప్రియవ్రతుఁ, డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే?
ధరఁ జండాలుం డైనను, హరి నామస్మరణఁ జెందు నవ్యయపదమున్.

23

తా ॥ "హరిని సేవిస్తూ ఆ ప్రియవ్రతుడు జన్మరాహిత్యాన్ని పొందడంలో క్రొత్త ఏముంది? చండాలుడైనా ఈ భూమిపై హరినామస్మరణ మాత్రంచేత ఎప్పటికీ తరగని స్థానాన్ని (బ్రహ్మైక్యాన్ని) పొందుతాడు."

వ. అని పలికి శుకుండు మఱియు నిట్లనియె.

24

తా ॥ అని చెప్పి, శుకుడు ఇంకా ఇలా అన్నాడు:

మ. జనుకుం డిట్లు విరక్తుఁ డైనను దదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే

పున ధర్మ ప్రతిపాలనుం డగుచు జంబూద్వీపము న్నేలుచుం
దన సత్పుత్త్రులమాడ్కి నెల్ల ప్రజలం దాత్పర్య చిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబుగా భూవరా!

25

తా ॥ "ఓ పరీక్షిన్మహారాజా! తండ్రి ఇలా విరక్తుడైనప్పటికి, అతని ఆదేశానుసారం అతని పెద్దకొడుకు ఆగ్నీధ్రుడు జంబూ ద్వీపాన్ని పాలించాడు. తన కన్నబిడ్డల్ని కాపాడినట్లు ప్రజల్ని కాపాడాడు. ఇలా చాలాకాలం గొప్పగా పరిపాలించి ప్రఖ్యాతుడయ్యాడు.

వ. ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్రకాముండై మందరాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుండై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి తన సమ్ముఖంబున సంగీతంబు సేయు పూర్వచిత్తియను నప్సరో–ంగనం బంపుటయు, నా యప్సరో–ంగన చనుదెంచి రమణీయ వివిధ నిబిడ విటపి విటప సమాశ్లిష్ట సమీప సువర్ణ లతికారూఢస్థల విహంగమ మిథునోచ్చార్యమాణ షడ్జాది స్వరంబులచే బోధ్యమాన సలిల కుక్కుట కారండవ బక కలహంసాది విచిత్ర కూజిత సంకులంబు లయిన నిర్మలోదక కమలాకరంబులు గల తదాశ్రమోపవనంబు నందు విహరించుచు విలాస విభ్రమ గతి విశేషంబులం జలనంబు నొందు స్వర్ణ చరణాభరణస్వనం బ న్నరదేవ కుమారుం డాలించి యోగసమాధింజేసి ముకుళిత నేత్రుండై యుండి యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబున మధుకరాంగనయుంబోలెఁ బుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవుల మనోనయనంబుల కాహ్లాదంబు బుట్టించుచున్న గతి విహార వినయావలోకన సుస్వరావయవంబుల మన్మథ శరపరంపరల నొందించుచు ముఖకమల విగళితామృత సమానహాస భాషణామోద మదాంధంబు లయిన మధుకర మిథునంబుల వంచించి, శీఘ్ర గమనంబునం జలించు కుచకచమేఖలలు గల దేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుండై జడుని చందంబున నిట్లనియె.

తా ॥ ఈ విధంగా రాజ్యపరిపాలనం చేస్తూ సంతానం కలిగితే గాని పితృలోకప్రాప్తి ఉండదని, పుత్ర సంతానం కోసం మందర పర్వతానికి వచ్చి ఏకాగ్రచిత్తంతో ప్రజాపతులందరికీ ప్రభువైన బ్రహ్మదేవుణ్ణి సమస్త ఉపచారాలతోనూ అర్చించాడు. బ్రహ్మ సంతోషించి, పూర్వచిత్తి అనే పేరు గల అప్సరసను ఆగ్నీధ్రుడి దగ్గరకు పంపించాడు. ఆమె ఆ వనానికి వచ్చింది. ఆ వనంలో అందంగా దట్టంగా ఉన్న చెట్లు, వాటికి చివుళ్ళతో, పూలతో నిండిన కొమ్మలు, ఆ చెట్లను అల్లుకొని బంగారుతీగల్లా మెరుస్తున్న లతలు, ఆ లతలపై జంటలు జంటలుగా పక్షులూ కనువిందు చేస్తున్నాయి. అక్కడ కమలాలతో నిండిన నిర్మలమైన జలాశయాలున్నాయి. వాటిలో నీటి కోళ్ళు, కారండవాలు, బాతులు, కలహంసలు మొదలైన జలపక్షులు తిరుగుతూ, ఇంపుగా కూస్తూ, వీనులకు విందు చేస్తున్నాయి. ఇలా రమణీయంగా ఉన్న ఆ వనంలో పూర్వచిత్తి కాలుమోపి విహరించడం మొదలుపెట్టింది. లలిత లలితంగా అడుగులు వేస్తూ విలాసంగా నడుస్తున్నప్పుడు ఘల్లు ఘల్లుమంటున్న ఆమె కాలి అందెల ధ్వని ఆగ్నీధ్రుడి చెవులబడింది. యోగసమాధిలో కన్నులు మూసుకొని ఉన్న ఆతడు కన్నులు విచ్చి చూశాడు. ఆమె తుమ్మెద పుష్పాన్ని వాసనచూస్తున్నట్లు వాసన చూస్తూ ఎదుటగా కనిపించింది. ఆమె నడకలు, విలాసాలు, బిడియంతో జంకుతూ చూసే ఆమె చూపులు దేవతలకు, మానవులకు సైతం మనస్సులో ఆహ్లాదాన్ని పుట్టిస్తున్నాయి. మన్మథుడు శరపరంపరతో దాడిచేస్తున్నట్లు ఆమె ముఖకమలం నుండి బయల్వెడలుతున్న అమృతంతో సమానమైన నవ్వులు, ఆ నవ్వుల సవ్వడులకు మత్తెక్కి గ్రుడ్డిగా ప్రవర్తిస్తున్న తుమ్మెదల జంటల్ని మరింత మోహపెడుతున్నాయి. ఆమె తొట్రుపాటు నడకలకు ఆమె స్తనాలు, జుట్టుముడి, వడ్డాణం చలిస్తున్నాయి. ఇలా తన హావభావాలతో మనస్సును హరిస్తున్న పూర్వచిత్తిని చూసి ఆగ్నీధ్రుడు కామ పరవశుడయ్యాడు. తన స్థితిని మరచి స్తబ్ధుడయ్యాడు. ఆమెను ఇలా ప్రశ్నించాడు:

క. సతి! నీ వెవ్వతె? వీ ప, ర్వతమున కేమేనిఁ గోరివచ్చిన వన దే

వతవో? శారదవో? రతి, పతి పంచిన మాయవో? తపస్సారమవో?

27

తా ॥ "ఓ సతీ! నువ్వెవరవు? ఈ మందర పర్వతం మీదికి ఏదైనా కావాలని వచ్చిన వనదేవతవా? శారదవా? మన్మథుడు పంపిన మాయవా? తపస్సుకు సారమైన రూపానివా?

ఉ. అంగజుఁ డెక్కుడించిన శరాసనమున్ ధరియించి యంత నా
యంగజు వేఁట మానవమృగావళిఁ జూచుచు నున్న దానవో?
రంగగు నీ నిజాకృతి తెఱం గెఱుఁగంగ నిజంబు పల్కుమా
యంగన నిన్నుఁ గన్గొనిన యంత ననంగుఁడు సందడించెడున్.

28

తా ॥ నారి కట్టకుండా రెండు విల్లులను (కనుబొమ్మలను) దాల్చావు. మన్మథుని వేటకు వచ్చి మానవులనే మృగాలపై ప్రయోగించాలని చూపుల తూపులతో చూస్తున్నావా? ఒయ్యారం ఒలకబోస్తున్న నీ చేష్టలు నాకు అర్థంగావడం లేదు. ఓ పడతీ! నువ్వు నిజం చెప్పు. నిన్ను చూడడంతోటే నాలో కామప్రకోపం మొదలైంది.

క. పొలుపగుచున్న విలాసం, బుల నంగజు బాణములను బోలెడి చం
చల సత్కటాక్షవీక్షణ, ముల నెవ్వని నింతి! చిత్తమునఁ గలఁచెదవే?

29

తా ॥ "ఓ ఇంతీ! అందమైన, విలాసవంతాలైన నీ చూపులు మన్మథుడి బాణాల్లా ఉన్నాయి. ఈ చంచలమైన కొన చూపులతో ఎవడి చిత్తాన్ని కలత పరచాలనుకొంటున్నావు?"

చ. చెదరఁగ వేదముల్ సదువు శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు మాడ్కిని మన్మథసామగానముల్

సదివెడు శిష్యులో యనఁగ షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ
బదపడి మీఁద రాలు గచభారము నందుల జాఱు క్రొవ్విరుల్.

30

తా ॥ ఆమె శరీరపు పరిమళాన్ని ఆఘ్రాణించి వెంబడి వస్తున్న తుమ్మెదల్ని చూసి ఇలా అంటున్నాడు.

“ఋషులు వేదశాఖలను నేర్వడానికి గురువుల్ని ఆశ్రయిస్తారు. అలాగే మన్మథసామగానాలు నేర్వడానికి తుమ్మెదలు నీ కేశపాశాన్ని ఆశ్రయిస్తున్నట్లున్నాయి. నీ జుట్టుముడిలోని పువ్వులు అల్లల్లాడుతున్న నీ కేశాలపై జారుతున్నాయి. అలా జారుతున్న అందమైన విరులు సామగానం చేస్తున్న వేదవిద్యార్థులనే తుమ్మెదలపై సంతోషంతో చల్లిన పూలలా ఉన్నాయి.

క. అందియల వెలయు రత్నము, లందంబుగ లలిత పదములన్ సుభగములై
యందంద మ్రోయుచును నా, డెందంబునఁ దగిలి సందడించెడిఁ దరుణీ!

31

తా ॥ తారుణ్యంలో ఉన్న ఓ జవ్వనీ! నీ సుకుమారమైన కాలి అందెలలోని రత్నాల సవ్వడి ఘల్లు ఘల్లుమంటూ లలితంగా, అందంగా, వినడానికి ఇంపుగా ఉంది. నా హృదయంలో ఆ రవళి సందడి చేస్తోంది.

క. పాయక కదంబ పుష్ప, చ్ఛాయం గల వస్త్రకాంతి సల్లెడుఁ గంటే!
యా యెడ నితంబరోచులు, గాయుచు నెడతెగక తఱిమి కప్పెడుఁ దన్వీ!

32

తా ॥ ఓ అందమైన శరీరం గలదానా! కాంతిమంతాలైన నీ పిరుదుల్ని కప్పిన బట్ట

నుంచి వస్తున్న కడిమి పూల వెలుగు అడ్డూ ఆపు లేకుండా నన్ను కప్పుతోంది.

క. నిరతము నీ తనుమధ్యముఁ, గర మరుదుగ నరసి చూడఁ గానంబడ, దీ
కరికుంభంబులఁ బోలెడి, గురుకుచముల నెట్లు నిలుపు కొంటి? లతాంగీ!

33

తా ॥ ఓ తీగవంటి మేను గలదానా! నీ కుచాలు ఏనుగుల కుంభస్థలాల్లా ఉన్నాయి. నీ నడుము కనిపించడమే లేదు. ఈ కుచాల్ని ఎలా నిలిపావు?

క. పొంకములగు కుచములపైఁ, గుంకుమ పంకంబుఁ బూసికొని వాసనలం
గొంకక వెదచల్లెదు నీ, బింకం బగు చన్నుదోయి పెంపో! సొంపో!

34

తా ॥ చన్నులు అతిశయించి బరువెక్కి ఉన్నాయి. వాటిపై కుంకుమ పంకం సొంపు మీరుతోంది. ఏ మాత్రం జంకకుండా ఆ సువాసనల్ని వెదజల్లుతున్నావు. ఇదంతా బిగువైన నీ చన్నుదోయి యొక్క పెంపును, సొంపును తెలుపుతోంది కదూ!

శా. ఏ లోకంబున నుండి వచ్చితివి? నీ విచ్చోటికిన్ మున్ను నే
నే లోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగన్ నీ సుందరాకారమున్
నీ లాలిత్యము లీ వినోదములు నీ కిట్లొప్పునే?
కామినీ! భూలోకంబున కెట్టు వచ్చితివి నా పుణ్యం బగణ్యంబుగన్?

35

తా ॥ ఓ కామినీ! నువ్వు ఏ లోకం నుంచి ఈ భూలోకానికి దిగివచ్చావు? నీ సౌందర్యం, లాలిత్యం, విలాసం గతంలో ఏ లోకంలోనూ ఉన్నట్టు నేను వినాలేదు, చూడాలేదు. నీకు మాత్రం ఎలా వచ్చాయి? లెక్కలేనంత నా పుణ్యమే నిన్ను నా దగ్గరకి పంపింది.

క. హాసావలోకనంబుల, భాసిల్లెడు నీ ముఖంబు పలుమఱు నిపు డే
యాసలు పుట్టింపఁగ నే, నాసగొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రా.

36

తా ॥ ఓ పద్మాల వంటి కన్నులు గలదానా! నీ చూపుల్లో నవ్వులొలుకుతున్నాయి. అలాంటి చూపుల్తో ఉన్న నీ ముఖం నాలో ఇప్పుడే ఎన్నెన్నో ఆశల్ని పుట్టిస్తోంది. నిన్ను చూడటంతోటే నాలో ఆశపుట్టింది – నీపై.

ఆ. కందులేని యిందుకళ మించి నెమ్మోము, కాంతి యుక్త మగుచుఁ గానుపించెఁ
గాన విష్ణుకలయుఁ గాఁబోలు నని నా మ, నంబునందుఁ దోఁచె నళిననేత్ర!

37

తా ॥ ఓ నళిననేత్రీ! నీ నిండైన, రమ్యమైన కాంతిమంతమైన ముఖం మచ్చలేని చంద్రకళను మించిపోయింది. ఇది విష్ణుకళ అని నా మనస్సుకు అనిపిస్తోంది.

మ. పటుతాటంక రథాంగ యుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడు గండుమీనములతో నాసన్న నీలాలకో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
ఱట కాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్.

38

తా ॥ నీ అందమైన ముఖం ఒక సరస్సులా ఉంది. నీ చెవికమ్మలు మకరాకారంలో ఉన్నాయి. ఆ మకరాల్ని చూసి భయపడుతున్న గండుచేపల్లా ఉన్నాయి నీ కళ్ళు. సరస్సులోని పూలపై వాలుతున్న తుమ్మెద రెక్కల్లా ఉన్నాయి – నీ ముఖం మీద వాలుతున్న కేశాలు. ఆ సరస్సులో తెల్లని హంసలు మొదలైన పక్షులు విహరిస్తున్నట్లున్నాయి – నీ దంతాల కాంతులు. అందుకే నీ ముఖం ఒక కొలనులా ప్రకాశిస్తోంది.

చ. కరువలిఁ బాయువస్త్రమును గట్ట నెఱుంగవు, చూడ్కి దిక్కులం
బఱపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబునం
బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప, విప్పు డి
ట్లరుదుగ రత్నకందుక విహారము సల్పెదు సంభ్రమంబునన్.

39

తా ॥ "గాలికి తొలగిపోతున్న బట్టను సరిగా కట్టుకోవాలని కూడా నీకు తెలియడం లేదు. నీ జుట్టుముడి ఊడిపోయి తుమ్మెదల వంటి నీ కేశాలు మెడపై పొర్లాడుతూ ఉంటే దిక్కులు చూస్తున్నావు గాని, ఆ జుట్టుముడి వేసుకోవాలని తలచడం లేదు. రత్నాలు పొదిగిన బంతితో అపురూపంగా ఆడుతూ విహరిస్తున్నావు. చాలా చిత్రంగా ఉంది."

వ. మఱియు నిట్లనుఁ దపోధనులగు వారల తపంబులను నీ రూపంబున నపహ్నవించిన దాన, వీ చక్కఁదనం బేమి తపంబున సంపాదించితివి? నా తోడం గూడి తపంబు సేయుము; సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము; పద్మాసనుండు నాకుం బ్రత్యక్షంబై నిన్ను నిచ్చిన వాఁడు; గావున నిన్ను విడువంజాలను; నీ సఖీజనంబులు నా వాక్యంబులకు ననుకూలింతురు గాక! నీవు చను చోటికి నన్నుం దోడ్కొని చను మని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కుభంగులం బలికిన నా పూర్వచిత్తియు నతని యనునయ వాక్యంబులకు సమ్మతించి వీర శ్రేష్ఠుండగు నా రాజవర్యుని బుద్ధిరూపశీలౌదార్య విద్యావయశ్శ్రీలచేఁ బరాధీనచిత్త యగుచు జంబూద్వీపాధిపతి యగు నా రాజశ్రేష్ఠునితోడం గూడి శతసహస్ర సంవత్సరంబులు భూస్వర్గభోగంబు లనుభవించె; నంత నాగ్నీధ్రుం డా పూర్వచిత్తివలన నాభి కింపురుష హరివర్షేలావృత రమ్యక హిరణ్మయ కురు భద్రాశ్వ కేతుమాల సంజ్ఞలు గల కుమారులఁ బ్రతిసంవత్సరంబు నొక్కొక్కనిగఁ దొమ్మండ్రం గాంచె; నంత నా పూర్వచిత్తి యా యర్భకుల గృహంబున విడిచి యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నా యాగ్నీధ్రపుత్రులు మాతృసామర్థ్యంబునం జేసి

స్వభావంబునన శరీరబలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమ నామంబులఁ బ్రసిద్ధంబు లయిన జంబూద్వీపాది వర్షంబులం బాలించు చుండి; రంత నాగ్నీధ్రుండు నా పూర్వచిత్తి వలనం గామోపభోగంబులం దృప్తి బొందక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబులగు కర్మంబులం జేసి తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుం జనియె; నిట్లు దండ్రి పరలోకంబునకుం జనిన నాభిప్రముఖులగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ బ్రతిరూపయు, నుగ్రదంష్ట్రయు, లతయు, రమ్యయు, శ్యామయు, నారియు, భద్రయు, దేవవతియు నను నామంబులు గల మేరు పుత్రికలగు తొమ్మండ్రు కన్యకలను వివాహంబై రంత.

40

తా ॥ అని ఇంకా ఇలా అన్నాడు – "తపస్సే ధనంగా ఉండేవారి తపస్సును నీ రూపంతో దొంగిలించావు. ఏ తపస్సు చేసి ఈ చక్కదనాన్ని సంపాదించావు? నాతో కలసి తపస్సు చెయ్యి. సంసారాన్ని పెంపొందింపచెయ్యి. బ్రహ్మ ప్రత్యక్షమై నిన్ను నాకిచ్చాడు. కనుక నేను నిన్ను విడువలేను. మా మాటలకు నీ చెలికత్తెలు కూడా అనుకూలిస్తారులే, నువ్వెళ్ళే చోటికి నన్ను కూడా తీసుకుపో" – అని స్త్రీలకు అనుకూలంగా మాటాడనేర్చిన ఆగ్నీధ్రుడు అనేక విధాల పలికాడు.

ఆ పూర్వచిత్తికి అతడి బుజ్జగింపు మాటలు నచ్చాయి, ఒప్పుకొంది. వీరులలో శ్రేష్ఠుడు, రాజుల్లో గొప్పవాడు అయిన ఆ ఆగ్నీధ్రుడి రూపం, శీలం, ఔదార్యం, విద్య, వయస్సు, సంపద – వీటికి ఆమె మనస్సు వశమైంది. జంబూ ద్వీప అధిపతి అయిన ఆ రాజశ్రేష్ఠుడితో కలసి లక్ష సంవత్సరాలు కలసి ఉండి భూమిపై ఉండే, స్వర్గంలో ఉండే భోగాలన్నింటిని అనుభవించింది. వాళ్ళిద్దరికీ ప్రతి సంవత్సరం ఒక్కొక్కరుగా తొమ్మండుగురు కుమారులు పుట్టారు. వారి పేర్లు – నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురుడు, భద్రాశ్వుడు, కేతుమాలుడు. ఆ తరువాత పూర్వచిత్తి ఆ పిల్లల్ని, ఆగ్నీధ్రుణ్ణి విడిచిపెట్టి

బ్రహ్మలోకానికి వెళ్ళిపోయింది. ఈ పిల్లలకు తల్లి అనుగ్రహం వలన సహజంగానే దృఢమైన శారీరక బలం ఏర్పడింది. తండ్రి ఆజ్ఞమేరకు జంబూ మొదలైన ద్వీపాల్ని పాలించడం మొదలుపెట్టారు.

పూర్వచిత్తితో కామోపభోగాలు పొందడంలో ఆగ్నీధ్రుడికి ఇంకా తృప్తి తీరలేదు. ఆమెనే తలపోస్తూ వేదవిహితమైన కర్మల్ని చేస్తూ ఆమె చేరిన బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ఇలా తండ్రి పరలోకానికి వెళ్ళాక నాభి మొదలైన ఆ ఆగ్నీధ్రుడి కొడుకులు తొమ్మండుగురు మేరువు యొక్క కుమార్తెలైన మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవవతి – అనే పేర్లుగల తొమ్మండుగురిని పెళ్ళాడారు. అప్పుడు –

# 4. ఋషభావతార గాథ

ఆ. నరవరేణ్యుఁడైన నాభి సంతానార్థ, మంగనయును దాను యజ్ఞ పురుషుఁ
డయిన వాసుదేవు నతులభక్తి శ్రద్ధ, లను జెలంగి పూజ లొనరఁజేసి.

41

తా ॥ నరులలో గొప్పవాడైన నాభి, తన భార్యతో కలసి సంతానం కోసం యజ్ఞపురుషుడైన వాసుదేవుణ్ణి సాటిలేని భక్తి శ్రద్ధలతో కొలిచి, పూజల్ని చేస్తూ ఉండగా –

వ. మఱియుం బ్రవర్గ్యసంజ్ఞికంబు లగు ధర్మంబులు శ్రద్ధా విశుద్ధ ద్రవ్యదేశకాల మంత్రర్త్విగ్దక్షిణా విధాన యోగంబులం బరమేశ్వరుని మెప్పించిన, నెవ్వరికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుండై సురుచిరావయవంబుతో యజనశీలం బయిన యాతని హృదయంబునందుఁ బాయని రూపంబు గలిగి మనోనయనానంద కరావయవంబులు గల తన స్వరూపం బాతనికిఁ జూపం దలంచి.

42

తా ॥ ఆ ఆరాధనలో ప్రవర్గ్యహోమాలు సాగుతున్నాయి. ఆ యాగంలో ద్రవ్యాలు, దేశం, కాలం, మంత్రాలు, ఋత్విక్కులు, దక్షిణ, విధానం – అనే ఏడు అంగాలలోను ఏ లోపం లేకుండా శ్రద్ధతో, విశుద్ధియై పరమేశ్వరుణ్ణి మెప్పించాడు – నాభి. ఎవ్వరికీ ప్రసన్నుడు గాని, తెల్లతామరలను పోలిన కన్నులు గల నారాయణుడు భక్తవత్సలుడై తన దివ్యమైన రూపాన్ని యజ్ఞశీలుడైన ఆ నాభి హృదయంలో ఎడబాయక నిల్చి ఉండేటట్లు మనస్సుకూ కళ్ళకూ, ఆనందం కలిగించే అవయవాలు గల్గిన తన రూపాన్ని దర్శింపచేయాలని తలచి.

"ఎవ్వరికిం బ్రసన్నుండు గాని" అంటే ఎంత విశుద్ధిగా, విధివిధానంగా కర్మ ఆచరించినా భక్తి, ఆర్తి లేకపోతే ప్రసన్నం కావడానికి దుర్లభుడు – అని భావం.

సీ. అంత నావిష్కృత కాంత చతుర్భుజం, బులును బీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ శ్రీరమా చిహ్నంబు, లురమందు రమ్యమై యిరవు పడఁగ
శంఖ చక్రగదాంబుజాత ఖడ్గాది ది, వ్యాయుధంబులు సేతులందు మెఱయ
నతులిత నవరత్న హాట కాంకిత, నూత్న ఘనకిరీటద్యుతుల్ గడలుకొనఁగఁ

తే. గర్ణకుండల కటి సూత్ర కనకరత్న, హారకేయూర వర నూపురాది భూష
ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు, దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్షమయ్యె.

43

తా ॥ అప్పుడు లక్ష్మీపతియైన శ్రీహరి నాభీ మేరుదేవులకు ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు. ఆ హరి యొక్క మనోజ్ఞమైన నాలుగు బాహువులు మెరిసిపోతున్నాయి. పచ్చని పట్టుబట్టను దాల్చాడు. శ్రీరమా చిహ్నాలైన శ్రీవత్సం, కౌస్తుభం, వక్షఃస్థలంపై రమ్యంగా కాంతులీనుతున్నాయి. శంఖం, చక్రం, గద, పద్మం, ఖడ్గం మొదలైన దివ్యమైన ఆయుధాలు హరి చేతులలో ప్రకాశిస్తున్నాయి.

నవరత్నాలూ పొదగబడి నిత్యనూతనంగా కాంతులు చిమ్ముతున్న సాటిలేని ఘనమైన కిరీటం యొక్క దీధితులు వ్యాపిస్తున్నాయి. చెవులకు కుండలాలు, మొలకు త్రాడు, బంగారు గొలుసులు, రత్నాల బాహుపురులు, కాలి అందెలు మొదలైన అలంకారాలతో అలంకృతుడై ఉన్నాడు.

తే. ఇట్లు ప్రత్యక్ష మగు పరమేశ్వరునకుఁ, బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేద మాడ్కి
హర్షమున ఋత్విగాదికు లవనతాస్య, లగుచు నభినుతి సేసి రిట్లనుచు నపుడు.

44

తా ॥ ఇలా దర్శనం ఇచ్చిన ఆ రమాదేవీ హృదయేశ్వరుణ్ణి అక్కడి ఋత్విక్కులు మొదలైన వాళ్ళంతా – కడు పేదవాడికి పెద్ద నిధి దొరికితే ఎంతగా సంతోషిస్తాడో అంతగా

సంతోషించారు. శిరసా ప్రణామాలు చేసి, ఇలా వేడుకొన్నారు.

క. పరిపూర్ణుఁ డవై యుండియు, మఱవక మా పూజ లెల్ల మన్నింతువు; నీ
చరణార విందసేవయు, ధరఁ బెద్దలు వినిచినటులు దగఁ జేసెదమో.

45

తా ॥ "నువ్వు పరిపూర్ణుడవు, అయినా మమ్మల్ని మరచిపోకుండా మా ఆరాధనల్ని స్వీకరిస్తావు. మా పెద్దలు నిర్దేశించినట్లు నీ పాదపద్మాల్ని తగిన విధంగా పూజిస్తాము."

క. ఏ మిపుడు సేయు సంస్తుతి, నీ మహిమ నెఱింగి కాదు; నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరొ, యా మతమునఁ బ్రస్తుతింతు మయ్య! మహాత్మా!

46

తా ॥ మహాత్మా! ఇప్పుడు మేము నీ మహిమల్ని తెలిసి నిన్ను కీర్తించడం లేదు. ఎల్లప్పుడూ మా పెద్దలు నిన్ను గూర్చి ఏమని ఉపదేశించారో – ఆ పద్ధతిలో నిన్ను స్తుతిస్తాము. "నమో నమః" అని మా పెద్దలు చెప్పగా నేర్చిన మాటల్నే మేము పలకగలము.

వ. మఱియు నీవు సంసారాసక్త మతి గలిగిన వారికి వశ్యుండవుగా; వీశ్వరుండవును బ్రకృతి పురుష వ్యతిరిక్తుండవును బరమ పురుషుండవును నయిన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిన నామరూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యం బగు; సర్వజీవులం జెందిన దురిత సంఘంబుల నిరసించు స్వభావంబు గల నీ యుత్తమ గుణంబులయందు నేకదేశంబ గాని సర్వగుణ నిరూపణంబు సేయ శక్యంబు గా నేరదు; నీ భక్తులు మిక్కిలి భక్తింజేసి సంస్తుతించు గద్గదాక్షరంబులను సలిల శుద్ధ పల్లవ తులసీదళ దూర్వాంకురంబులను సంపాదించిన పూజచే సంతసిల్లెడి నీకు బహువిధ ద్రవ్య సంపాదనంబు గలిగి విభవ యుక్తంబు లయిన యశ్వమేధాదులును దృప్తికరంబులు గా నేరవు; స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు

నశేషపురుషార్థ స్వరూపంబుఁ బరమానంద రూపంబు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదుల యందు నీకుఁ దృప్తి లేకయున్న నస్మదాదుల కోరికల నాపాదించు కొఱకు యజ్ఞాదుల నొనరింతు మని మఱియు నిట్లనిరి.

47

తా ॥ "ఈ సంసారం మీదనే దృష్టిగలవారికి నువ్వు చిక్కవు. నువ్వు ప్రకృతి కంటే, పురుషుడి కంటే పైవాడివి. నిన్ను దాటి మరేదీ లేదు. మేము ఈ లోకంలో ఒక పేరు, ఒక ఆకారం కలిగి ఉన్నాము, అలాంటి మాకు నీ తత్త్వాన్ని తెలుసుకోవడం శక్యం కాదు. సకల భూతాలలోని పాపాలను నిర్మూలించే ఉత్తమ గుణాలు నీవి. వాటిలో ఏ ఒక్కదానినో గాని, అన్ని గుణాలను తెలుసుకొనే శక్తి మాకు లేదు. భక్తులు అనురాగంతో గద్గదాక్షరాలతో చేసే స్తోత్రాల్ని, పూజలో సమర్పించే పరిశుద్ధమైన జలాన్ని, చివుళ్ళను, తులసి దళాన్ని, గరిక మొలకలను స్వీకరించి వారి భక్తికి నువ్వు సంతోషిస్తావు. నానా రకాల ద్రవ్యాలతో గొప్ప వైభవంగా అశ్వమేధాది క్రతువులు చేసినా (భక్తి లేకపోతే) నువ్వు తృప్తిపడవు. సర్వ కాలాలలోను సాక్షాత్కరించడం నీ స్వభావం. నీ ఉనికి మాకు అందేది కాదు. ధర్మము, అర్థము, కామము, మోక్షమూ – ఈ పురుషార్థాల స్వరూపం నువ్వే. నువ్వు పరమానంద స్వరూపుడవు. నువ్వు పరిపూర్ణుడవు. నీకు మేము చేసే యజ్ఞయాగాదులు తృప్తినిచ్చేవి కావు. అయినా మా కోరికల్ని తీర్చుకోవడం కోసం మేము యజ్ఞాలు చేస్తున్నాము." – అని ఇంకా ఇలా అన్నారు:

క. బాలిశుల మగుచు మిక్కిలి, మే లెఱుఁగని మమ్ము నీదు మించిన దయచేఁ
బాలించి యిత్తు వెప్పుడుఁ, జాలఁగ నిహపరములందు సకల సుఖంబుల్.

48

తా ॥ "మాకు ఏది మేలు చేకూరుస్తుందో తెలియని అజ్ఞానులం మేము. నీవు మిక్కిలి కరుణ స్వభావంతో మమ్మల్ని ఎప్పుడూ పాలించి కాపాడుతూ ఉంటావు. ఈ లోకంలోను, పై లోకాలలోను మాకెప్పుడూ సకల సుఖాలను ఎంతగానో అనుగ్రహించే దయామయుడవు

నువ్వు."

ఆ. ఇపుడు మేము నీకు నిష్టంబు లగు పూజ, లాచరింపకున్న నైన నధిక
మయిన నీ కృపాకటాక్ష వీక్షణములఁ, జక్కఁ జూచి తగఁ బ్రసన్నుఁ డగుచు.

49

తా ॥ నీకు ఏది ఇష్టమో ఆ పూజల్ని మేమిప్పుడు చెయ్యలేకపోయినా, దయగల నీ చూపులతో మమ్మల్ని ప్రసన్నంగా చూసి విచ్చేశావు.

క. వర మీయఁ దలఁచి మమ్ముం, గరుణించితి గాక! నిన్నుఁ గనుఁగొనుటకునై
యరసి నుతింపఁగ మాకుం, దర మగునే? వరద! నీరదశ్యామాంగా!

50

తా ॥ నీరు నిండుగా ఉన్న మేఘం వలె నీలమైన దేహం గలవాడా! వరాలనిచ్చేవాడా! వరమివ్వాలని మమ్మల్ని కరుణించి దర్శనమిచ్చావు కనుక సరిపోయింది కాని, మా అంతట మాకు నిన్ను చూడాలంటే నీ కోసం పరితపించి, నిన్ను కీర్తించడం మావల్ల ఎలా ఔతుంది?

వ. మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునం జేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాఁడ వగుచుండియుఁ బ్రసన్నుండవు, స్ఖలన క్షుతాది దురవస్థలందును జ్వరమరణాది దుర్దశలందును వివశుల మగు మాకుఁ గల్మష నాశకరంబులయిన భవ ద్దివ్యనామంబులు మా వచనగోచరంబు లగుంగాక, మఱియు నీ రాజర్షి పుత్త్రకాముండై నీ తోడ సమానుండయిన కుమారునిం గోరి కామంబుల స్వర్గాపవర్గంబుల నీ నోపిన నినుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండవైన నీవలన సంతానంబు గోరుచున్న వాఁ డు; జయింపరాని నీ మాయచేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండుగాక యుండు? నర్థకాములము

మదాంధులము నగు మేము నిన్ను నాహ్వానంబు సేసిన యపరాధంబు సర్వాత్మకుండ వగుటంజేసి సామ్యంబుచే మన్నింపం దగుదువు; మమ్ము దయఁ జూడుమని ప్రణమిల్లిన దేవతాశ్రేష్ఠుండైన సర్వేశ్వరుండు వర్షాధిపతియగు నాభిచేతను, ఋత్విక్కుల చేతను వంద్యమానుండై దయాకలితుం డగుచు నిట్లనియె.

51

తా ॥ ఎట్టి తగులమూ లేకుండా, నిశితమైన జ్ఞానంతో, ఏ మాలిన్యమూ లేనివారు, భగవంతుని యొక్క స్వభావాన్ని కల్గినవారూ, ప్రకృతికంటే వేరైన ఆత్మ స్వరూపాన్ని బ్రహ్మాత్మకంగా దర్శింపగల్గినవారూ అయిన మహర్షులే నిన్ను స్తుతించే స్థాయి గలవారు. అంతటి వారికే నువ్వు ప్రసన్నుడవవుతావు. జారినప్పుడు గాని, తింటున్నపుడు గాని ఇలాంటి అన్ని దురవస్థల్లోను, జ్వరంతో బాధపడటం, ప్రాణం పోయేటప్పుడు ఆయాసపడటం – ఇలాంటి దుర్దశలలో గాని మా ఒళ్ళు మాకు తెలియదు. ఇట్టి స్థితిలో ఉన్నప్పుడు సైతం పాపాలను నాశనం చేసే నీ దివ్యమైన నామాలను మేము నోరారా పలికేవారం కావాలి.

ఇంక ఈ నాభి రాజర్షి. పుత్రసంతానం కోసం నీవంటి కొడుకు కావాలని నిన్ను కోరుతున్నాడు. నువ్వు పరమ పురుషార్థాన్ని ఇవ్వగలవాడివి. అయినా దరిద్రుడు తనకెదురుగా ఉన్నవాణ్ణి కుబేరుడని తెలుసుకోలేక ఊకను కోరినట్లు స్వర్గాన్ని, మోక్షాన్ని ఇవ్వగల నిన్ను సంతానం ఇమ్మని కోరుతున్నాడు. నీ మాయ జయింపరానిది. దాని మోహంలో పడి విషయాలపై ఆసక్తి చూపకుండా ఎవడుండగలడు? క్షుద్రమైన ప్రయోజనం కోరి మత్తెక్కి, గ్రుడ్డివాళ్ళమై నిన్ను యజ్ఞంలో ఆహ్వానించి అపరాధం చేశాము. నువ్వు సర్వాత్మకుడివి. మన్నించు. మమ్మల్ని దయతో చూడు."

– అని సర్వేశ్వరుణ్ణి ఖండాధిపతి నాభి, ఋత్విక్కులు ప్రణమిల్లి నమస్కరించారు.

దేవతలలో గొప్పవాడైన పరమేశ్వరుడు దయచూపిస్తూ నవ్వుతూ వారితో ఇలా అన్నాడు:

క. మునులార! వేదవాక్యము, లను బ్రస్తుతి సేసి సర్వలక్షణముల నా
కెన యగు పుత్రుని నిమ్మని, వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్.

52

తా ॥ "మునులారా! వేదసూక్తాలతో నన్ను స్తుతించారు. ఇపుడు మీరు అన్ని విధాలా నాతో దీటైన కొడుకు నిమ్మని ఎంతో సంబరంగా పలికారు.

క. నాకాది లోకములలో, నాకున్ సరివచ్చునట్టి నందను నెటు నా
లోకింప లేరు; గావున, నాకున్ సరి నేన కా మనమున నెఱుఁగుఁడీ!

53

తా ॥ స్వర్గం మొదలైన లోకాలలో వెదికినా నాతో సమానమైన వాణ్ణి ఎక్కడా చూడలేరు. కనుక నా అంతటివాణ్ణి నేనే – అని నన్ను గూర్చి మీ మనస్సులో తెలుసుకోండి.

వ. అదియునుంగాక భూసురోత్తములు నా ముఖం బగుటంజేసి విప్రవాక్యంబు దప్పింపరాదు; మీరు నా యీడు కుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగు మేరుదేవియందు నేన పుత్త్రుండనై జనియించెదనని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి సూచుచుండ నా యజ్ఞంబున నంతర్ధానంబు నొంది యా నాభి మీఁది దయంజేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగు నైష్ఠికులకు యోగధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభి పత్ని యగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె నంత.

54

తా ॥ అయినా సరే, బ్రాహ్మణులు నా ముఖం కనుక మీరన్న మాట వ్యర్థం చేయకూడదు. మీరు నాకు సాటివచ్చే కుమారుణ్ణి అడిగారు. నాభి యొక్క పత్నియైన మేరుదేవియందు నేనే పుత్రుణ్ణై జన్మిస్తాను" – అని నాభి భార్య అయిన మేరుదేవి చూస్తూ ఉండగా ఆ యజ్ఞం నుంచి

అంతర్ధానమయ్యాడు. దిగంబరులు, తపశ్శాలులు, జ్ఞానులు, బ్రహ్మనిష్ఠాశీలురు అయిన నిష్ఠగలిగిన వారికి యోగధర్మాలను తెలియచేయాలని సంకల్పించి విష్ణుమూర్తి మేరుదేవి గర్భకూపంలో ప్రవేశించాడు – నాభిమీది దయతో.

ఆ. మేరుదేవియందు మేరుధీరుం డగు, హరి సమస్త లక్షణాన్వితుండు
శమదమాది గుణ విశారదుం డుదయించె, సకలజనుల కపుడు సంతసముగ.

55

తా ॥ మేరుసమానమైన ధీరత్వం గల ఆ హరి అన్ని మంచి లక్షణాలతో, ఇంద్రియనిగ్రహం మొదలైన గొప్ప గుణాలతో మేరుదేవి యందు అవతరించాడు. జనులంతటా సంతోషించారు.

ఆ. ధవళ కాంతియుక్తిఁ దనరు దేహంబును, మహిత బలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె, సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ.

56

తా ॥ ఆ కొడుకు యొక్క తెల్లని కాంతిని, గొప్ప బలపరాక్రమాలను, వీర్యవత్తను తలచి తండ్రియైన నాభి అతడికి “ఋషభుడు” అని మంచి తగిన పేరు పెట్టాడు.

క. ధరణీసురులును మంత్రులుఁ, బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు
స్థిరమతి నా బాలకునిం, గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్.

57

తా ॥ బ్రాహ్మణులు, మంత్రులు, రాజపరివారం, హితులు, ప్రజలు, బంధువులు మంచి నిలకడ గల మతిమంతుడైన ఆ బాలుణ్ణి ఎంతో అనురాగంతో తమ రాజుగా దర్శించారు.

క. పురుహూతుఁ డతని మహిమలు, సరగున విని చిత్తమునకు సహ్యము గామిం

బరికించి ఋషభుఁ డేలెడి, ధరణి ననావృష్టి మిగుల దట్టము సేసెన్.

58

తా ॥ ఇంద్రుడు ఋషభుని మహిమల్ని తరచు విని మనస్సులో సహించలేకపోయాడు. ఋషభరాజ్యంలో తీవ్రమైన అనావృష్టిని కల్పించాడు.

ఆ. అది యెఱింగి ఋషభుఁ డంతట యోగ మాయా బలంబుకతన నఖిల రాజ్య
మందుఁ గురియఁ జేసె నత్యంత సంపూర్ణ, వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద.

59

తా ॥ ఋషభుడు ఈ విషయం తెలుసుకొన్నాడు. వెంటనే తన యోగమాయ యొక్క బలం వల్ల తన రాజ్యం అంతటా సుష్ఠుగా వర్షాన్ని కురిపింపచేశాడు. దినదినమూ పెరుగుతూ వర్షం మేలు చేసింది.

వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసె, నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోక ధర్మంబు గల పుండరీకాక్షుని మాయావిలసిత మతింజేసి బాలకు నా తండ్రి! యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయిన పుత్త్రుని సమయసేతు రక్షణంబునకుఁ బూజ్యం బైన రాజ్యంబునం దభిషిక్తుంజేసి భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయణ స్థానంబయిన బదరికాశ్రమంబునకుం జని, యచ్చట మహాయోగ సమాధిచే నర నారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యా నాభి హరితాదాత్మ్యంబు నొందె నంత.

60

తా ॥ ఈ విధంగా సాగిన ఇంద్రుని దుష్టత్వానికి ఋషభుడు నవ్వుకొని, తానేలుతున్న అజనాభం అనే వర్షాన్ని సుభిక్షం చేశాడు. నాభి కూడా తాను కోరినట్లు సమర్థుడైన పుత్రుడు పుట్టి పెరుగుతున్నాడని సంతోషించాడు. పురాణపురుషుడైన భగవానుడే నరులతో సమానంగా ఉన్నాడని గుర్తించినా, నాభి మాయ కమ్మిన మనస్సుతో, 'బాలకా! నా తండ్రీ!' అంటూ మోహంతో లాలిస్తూ ఉన్నాడు. అందరికీ ఋషభుడంటే సమ్మతం. అట్టి ప్రజానురాగాన్ని పొందాడు ఋషభుడు. నాభి తన కొడుకు వర్ణాశ్రమ ధర్మరక్షణకు సమర్థుడని గుర్తించాడు. రాజ్యపాలనకు అభిషేకం చేసి బ్రాహ్మణులకు, ప్రధానులైన మంత్రులకు కొడుకును అప్పగించాడు. మేరుదేవితో నరనారాయణస్థానమైన బదరికాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ మహాయోగ సమాధిలో నరనారాయణులుగా పిలువబడేవాడు, ఉత్తమపురుషుల కంటే ఉత్తముడైన వాసుదేవుణ్ణి ఆరాధించాడు. ప్రారబ్ధకర్మ పూర్తయ్యాక దేహాన్ని వీడి శ్రీహరిలో లయమై ముక్తినొందాడు.

చ. సరసత నే నృపాలకుని జన్మము నందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె, నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే? నరనాథ! యన్యులన్.

61

తా ॥ రాజా! ఏ రాజు జన్మించాలని బ్రాహ్మణులు యజ్ఞంచేసి విష్ణుమూర్తి అనుగ్రహాన్ని చక్కగా పొందారో, విష్ణువే తనంతతానుగా గర్భంలో ప్రవేశించి ఏ రాజుకు కొడుకై పుట్టాడో, అట్టి రాజైన నాభితో ఇతర రాజుల్ని సాటిచేయడం తగదు కదా!

వ. అంత

62

తా ॥ ఆ పిమ్మట —

సీ. భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ, గర్మభూమిగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మతం, త్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు సేయుటకు గురువుల యొద్ద వేదంబు, సదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీ కన్యఁ, బరిణయంబై యట్టి పడఁతి వలన

తే. భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె, నట్టి భరతుని పేరను నవనితలము
పురవరాశ్రమ గిరితరుపూర్ణ మగుచు, నమరి భారత వర్ష నామమున మించె.



తా ॥ ఋషభదేవుడు తన వర్షమైన అజనాభాన్ని కర్మానుష్ఠానానికి యోగ్యమైన క్షేత్రంగా భావించాడు. ప్రజలందరికీ ఇష్టాపూర్తిగా కర్మతంత్రం తెలియచెయ్యాలనుకొన్నాడు. తాను కర్మలు చేయడానికి గురువుల దగ్గర వేదాధ్యయనం చేసి, వారి అనుమతితో ఇంద్రుడిచ్చిన జయంతి అనే కన్యను పెండ్లి చేసుకొన్నాడు. ఆమెవల్ల భరతుడు మొదలైన వందమంది కొడుకుల్ని పొందాడు. ఎన్నో పురాలు, ఆశ్రమాలు, కొండలు, చెట్లు మొదలైన వాటితో నిండిన ఈ వర్షానికి అతడి పేరుమీదనే "భరత వర్షం" అనే పేరు ప్రశస్తికెక్కింది.

ఋషభుడు సాక్షాత్తు భగవానుడే. అయినా తాను రాజుగా ప్రజలకు మార్గదర్శి కావడానికి విద్యాభ్యాసం చేసి, కర్మానుష్ఠానం చేశాడు.

వ. ఆ మహాభారతవర్షంబునందుఁ దమతమ పేరంబరఁగు భూములకుఁ గుశావర్తేలావర్త బ్రహ్మావర్తార్యావర్త మలయకేతు భద్రసే నేంద్రస్పృ గ్విదర్భ కీకటులను తొమ్మండ్రు కుమారులను దక్కంగల తొంబండ్రు పుత్రులకుఁ బ్రధానులంజేసె; నంతం గవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమీఢ చమస కరభాజను లను వారు దొమ్మండ్రును భాగవత ధర్మప్రకాశకులైరి; భగవ న్మహిమోపబృంహితంబు లగు వారల

చరిత్రంబులు ముంద రెఱింగించెదఁ; దక్కిన యెనుబది యొక్క కుమారులు పిత్రాదేశకరులు నతివినీతులు మహాశ్రోత్రియులు యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తము లైరి; ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులం బొరయక కేవలానందానుభవుం డయిన యీశ్వరుండై యుండియు బ్రాకృతుండునుం బోలెఁ గాలానుగతంబులగు ధర్మంబుల నాచరించుచు ధర్మ ప్రవర్తకులకు సముండును నుపశాంతుండును మైత్రుండును గారుణికుండునునై ధర్మార్థయశః ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ గొంత కాలంబు నీతి మార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు వేద రహస్యంబులగు సకల ధర్మంబులును స్వవిదితంబులైనను బ్రాహ్మణోపదేశ పూర్వకంబుగా ద్రవ్యదేశకాల వయశ్శ్రద్ధర్త్విగ్విధోద్దేశోపచితంబులుగా నొక్కొక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖం బుండె నంత.

64

తా ॥ ఆ మహాభారతవర్షంలో ఋషభుడు తన కొడుకులలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు – అనే తొమ్మండుగురిని వారివారి పేర్లతో ఉండేటట్లు భూభాగాలకు ప్రధానులనుగా చేశాడు. ఆపై కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమీడుడు (ద్రమీళుడు), చమసుడు, కరభాజనుడు – అనే తొమ్మండుగురు భాగవతధర్మాన్ని లోకంలో ప్రకాశింపచేయడానికై భాగవత ధర్మనిష్ఠ లయ్యారు. భగవంతుడి మహిమల్ని వెలికితీసినట్టి వారి చరిత్రలను తరువాత తెలియచేస్తాను. మిగిలిన ఎనభై ఒక్కరు కుమారులు తండ్రియైన ఋషభదేవుని ఆదేశాల్ని అమలు చేస్తూ ఎంతో వినయంతో, వేదోక్తప్రకారం నడుస్తూ, యజ్ఞాలు చేస్తూ కర్మనిష్ఠులైన బ్రాహ్మణోత్తములయ్యారు.

ఋషభుడు స్వతంత్రుడు, ఆనందస్వరూపుడు, సంసారధర్మాలలో చిక్కనక్కర్లేదు. అయినా

ప్రకృతి సంబంధుడైన మానవుడిలా కాలక్రమంలో వచ్చే సర్వధర్మాల్నీ ఆచరిస్తూ ధర్మప్రవర్తకుల పట్ల సమభావం కలిగి ఉండేవాడు.

ఋషభుడు ధర్మానికి ప్రతిరూపమైన భగవంతుడే. అయినా ప్రజలంతా ధర్మాన్ని ఆచరించాలి కనుక, తానొక సాధారణ కర్మబద్ధుడైన మనుష్యుడిలా ఏయే కాలాలలో ఏయే ధర్మాలను ఆచరించాలో ఆచరిస్తూ ఆదర్శంగా నిలిచాడు. తాను రాజు కనుక ధర్మం ఆచరించనివాళ్ళచేత కూడా ఆచరింపచేశాడు. తాను చేశాడు కనుక వాళ్ళూ చేశారు. ఇలా రాజ్యం ధర్మమయం చేశాడు. రాజ్యంలోని సర్వులూ ధర్మం ఆచరించినవారే – అంటే ధర్మ ప్రవర్తకులే. వాళ్ళందరిపట్ల సమభావంతో ఉండేవాడు. ఇక్కడ "ధర్మప్రవర్తకులకు సముండును" అంటే ఆనాడు అందరూ ధర్మ ప్రవర్తకులే కనుక అందరి యెడల సమభావంతో ఉండేవాడని చెప్పాలి.

ఆ ఋషభుడు రాగద్వేషాల మాలిన్యం అంటని ప్రశాంత చిత్తంతో ఉండేవాడు. సర్వభూతాలయందు మైత్రిని కలిగి ఉండేవాడు. ఇతరుల దుఃఖాన్ని చూసి ఓర్వలేని కరుణామయుడిగా ఉండేవాడు. ధర్మం, అర్థం, యశస్సు, సంతానం, ఆనందామృతాలతో ప్రజలను గృహస్థాశ్రమంలో ప్రవర్తింపచేస్తూ పాలించేవాడు. నీతిమార్గం తప్పకుండా ప్రజల్ని పరిపాలిస్తూ కొంత కాలం గడిపాడు. వేదాల రహస్యాలు, సకల ధర్మాలూ అన్నీ ఆయనకు తెలిసున్నవే. అయినా బ్రహ్మవేత్తల ఉపదేశాల్ని పొంది, వాళ్ళు చెప్పినట్లు నూరు యజ్ఞాలు చేశాడు. యజ్ఞాలు చేసేటప్పుడు అందులో ఉపయోగించవలసిన ద్రవ్యాలను, దేశాన్ని, కాలాన్ని, వయస్సును, శ్రద్ధను, ఋత్విక్కులను, విధానాలను బ్రాహ్మణులు చెప్పినట్లు పాటించి పద్ధతిని దాటకుండా చేసేవాడు. ఇలా సుఖించాడు.

ఋషభుడి కొడుకులు వందమంది. వీరిలో మొదటి పదిమందిలో భరతుడు పెద్దవాడు. తరువాత కుశావర్తుని నుంచి కీకటుని వరకు చెప్పబడిన తొమ్మండుగురు – మిగిలినవారిలో ప్రతి పదిమందికి ఒక్కొక్కరూ ప్రధానులు. మిగిలిన తొంభైమందిలో కవి మొదలు కరభాజనుడి

వరకు తొమ్మండుగురు భాగవతోత్తములయ్యారు.

క. జనవర! ఋషభుని రాజ్యం, బున నైహిక ఫలముఁ గోరు పురుషుని నొకనిం
గనుఁగొన నెఱుంగ మెన్నఁడు, నినతేజుం డతని మహిమ లేమని చెప్పన్.

65

తా ॥ రాజా! ఋషభుడి రాజ్యంలో ఈ లోకంలో ఫలాన్ని కోరి జీవించినవాణ్ణి ఏ ఒక్కణ్ణీ చూడం. అతడు సూర్య తేజస్వి. అతని మహిమల్ని ఇంక ఏమి చెప్పగలం?

## 5. పుత్రులకు ఋషభుని బోధ

సీ. ఆ ఋషభుండు రాజ్యంబు సేయుచునుండి, యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోక ఫల మపేక్షింపక, మోహంబు దిగనాడి పుత్త్రులకును
దనరాజ్యమెల్ల నప్పన చేసి వెనువెంటఁ, గొడుకులు మంత్రులుఁ గొలిచి రాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్త దేశంబు, నందుల నపుడు మహాత్ములయిన

తే. యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి, తనదు పుత్రుల నందఱ దాయఁ బిలిచి
పరమ పుణ్యుండు ఋషభుండు ప్రణయ మొప్ప, హర్ష మందుచు నప్పు డిట్లనుచుఁ బలికె.

66

తా ॥ ఋషభదేవుడు కేవల నివృత్తి ధర్మంతో రాజ్యపాలన చేశాక, ఒకనాడు తనలో – ఈ లోకంలో ఫలాన్ని కోరకుండా, మోహాన్ని దిగవీడి, కొడుకులకు సమస్త రాజ్యాన్ని ఇవ్వాలనుకొన్నాడు. వెంటనే అలా చేసి, బ్రహ్మావర్త దేశానికి వచ్చేశాడు. అతనితో కొడుకులు, మంత్రులూ కూడా వచ్చారు. మహర్షులంతా చూస్తూ ఉండగా, ఎంతో పుణ్యాత్ముడైన ఋషభుడు ప్రేమ పొంగిన సంతోషంతో కొడుకుల్ని దగ్గరకు రమ్మని పిలిచాడు. హర్షం ఉప్పొంగగా తన కొడుకులతో ఇలా చెప్పాడు.

ఆ. తనయులార! వినుఁడు ధరలోనఁ బుట్టిన, పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గానఁ గామంబుల, వలన బుద్ధి సేయవలదు మీరు.

67

తా ॥ "కుమారుల్లారా! నా మాట వినండి. ఈ భూమి మీద జన్మనెత్తిన పురుషులకు కోరికలు కలుగుతుండడం వల్ల కుక్కలకు వచ్చే కష్టాలన్నీ దాపురిస్తాయి. అందుచేత మీరు కోరికలమీద బుద్ధి పెట్టకండి.

చ. నరులకు నే తపంబున ననంతసుఖంబులు గల్గుచుండు, శ్రీ
కరమతి నా తపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు, వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు; దుష్ట వర్తనన్
జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు; మీఁద మేలగున్.

68

తా ॥ ఏ తపస్సు చేయడం వల్ల అంతంలేని సుఖాలు కలుగుతున్నాయో శుద్ధ సత్త్వ సంపన్నమైన బుద్ధితో ఆ తపస్సును శ్రద్ధగా చెయ్యండి. దాని వల్ల బ్రహ్మానందసౌఖ్యం కలుగుతుంది. అది సుస్థిరమైన సౌఖ్యం. వృద్ధుల్నీ, దీనుల్నీ ఆదుకోండి. కామంతో చెడుగా ప్రవర్తించే వారితో కలవకండి. ఇలా ఉంటే మేలు కలుగుతుంది."

ఈ శరీరం దివ్యమైన తపస్సు చెయ్యడానికి లభించిన సాధనం. భగవంతుణ్ణి గూర్చి ధ్యానం చేయడం వల్ల – భగవదారాధన వల్ల, సంసారబంధం తొలగుతుంది. అంతఃకరణం పరిశుద్ధమై అంతులేని బ్రహ్మసౌఖ్యం లభిస్తుంది. కాముకులతో కలిసి తిరిగితే కీడు తప్పదు. వృద్ధసేవనం, దీనజనోద్ధరణ తప్పనిసరి. దానివల్ల సర్వేశ్వరుడు సంతోషిస్తాడు.

వ. మఱియు నంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయరూపం బయిన సంసారంబగు; మహత్సంగంబు మోక్షద్వారం బగు; నట్టి మహాత్ము లెవ్వరనిన శత్రు మిత్రవివేకంబు లేక సమచిత్తులును శాంతులును గ్రోధరహితులును సకలభూత దయాపరులును సాధువులును నగు వారలు మహాత్ము లనం దగుదు; రట్టి మహాత్ములు నా యందలి స్నేహంబె ప్రయోజనంబుగాఁ గలిగి యుండుటం జేసి విషయవార్తా ప్రవృత్తులగు కుజనులందుఁ దమ దేహగృహమిత్ర దారాత్మజాదులందుఁ బ్రీతిలేక యుండుదురు; విషయాసక్తుఁ డయినవాఁడు వ్యర్థ కర్మంబులం జేయు; నట్టి దుష్కృత కర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముం డగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుఁ; గావునఁ బాపమూలంబు లయిన కామంబులు గోరకుఁ; డీ జ్ఞానం బెంతకాలంబుఁ లేకయుండు నంతకాలంబు నాత్మతత్త్వం

బెఱుంగంబడ; దా తత్త్వం బెఱుంగ కుండుటం జేసి దేహికి దుఃఖం బధికంబై యుండు; లింగదేహం బెంత దడవుండు నంత దడవును మనంబు కర్మ వశంబై జ్ఞానవంతంబుగాక యవిద్యం బాయకుండు, శరీరంబు గర్మమూలం బగుటవలనఁ గర్మంబులు సేయఁజనదు; వాసుదేవుం డగు నాయందుఁ బ్రీతి యెంతదడవు లేక యుండు నంతదడవును దేహ ధర్మంబులు బాధించు, విద్వాంసుఁడైనను దేహేంద్రియాదులయందుఁ బ్రీతిసేసిన మిథునీభావసుఖ ప్రధానంబగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూప స్మృతిశూన్యుండై మూఢుం డగుచు, నందు సంసార తాపంబులఁ బొందు; బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొందుట దనకు హృదయ గ్రంథియై యుండు; నందు జనునకు గృహ క్షేత్ర సుతాప్త విత్తంబులందు 'నేను నాయది' యనియెడి మోహంబు గలుగు; నట్టి స్త్రీ పురుష మిథునీ భావంబుచే సంతానంబు గలుగు; నా సంతాన కారణంబున గృహ క్షేత్ర విత్తాదులు సంపాదింపఁబడు; నందు మోహం బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు; నిట్లు సంసారంబునం దుండియు మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబును బాయు; మోక్షోపాయంబులు పరమ గురుండనైన నా యందుల భక్తి సేయుటకు విగతతృష్ణయు, ద్వంద్వ తితిక్షయు, సర్వలోకంబులందుల జంతు వ్యసనావగతియు, నీశ్వరవిషయక జ్ఞానాపేక్షయుఁ, దపంబును, విగతేచ్ఛయు, మత్కృతకర్మంబులు, మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబులును, నిర్వైరత్వ సామ్యోపశమంబులును, దేహ గేహంబులందు నాత్మ బుద్ధి జిహాసయు, నధ్యాత్మ యోగంబును, నేకాంత సేవయుఁ, బ్రాణేంద్రియాత్మల గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబును, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, గర్త వ్యకృత్యంబులందుల నప్రమత్తుం డగుటయు, వాఙ్నియమనంబును, సర్వంబు నన్న కాఁదలంచుటయు, జ్ఞానంబును, విజ్ఞాన విజృంభితంబైన యోగంబును, ధృత్యుద్యమంబును, సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు.

తా ॥ స్త్రీలోలురైన వారితో కూడి ఉండటం వల్ల దుర్గతులపాలై సంసారం బంధం కల్గుతుంది. మహాపురుషులతో సంగం మోక్షానికి ద్వారంవంటిది. అట్టి మహాత్ము లెవ్వరో వినండి. వీడు శత్రువనీ, వీడు మిత్రుడనీ భేదభావం లేకుండా అందరి యెడల సమానమైన మనస్సుతో ఉండేవారు, ఎప్పుడూ శాంతంగా ఉండేవారు, క్రోధం లేనివారు, సకల ప్రాణులందు దయ గలవారు, పరోపకారులూ అయినట్టివారు మహాత్ములని పిలవబడటానికి తగినవారు. అటువంటి మహాత్ములకు నాతో స్నేహం చెయ్యడమే ప్రయోజనం. అందువల్ల కేవలం విషయభోగాలమీదే ఆసక్తిగల చెడ్డవారిపట్ల, ఈ శరీరం, ఇల్లు, మిత్రులు, పెళ్ళాం, పిల్లలూ వీటిమీదా వారికి ప్రీతి ఉండదు.

లౌకికభోగాల మీద మనస్సున్నవాడు పనికిరాని పనుల్ని చేస్తూ ఉంటాడు. అలాంటి చెడ్డపనుల్ని చేసే వాడెప్పుడూ పాపాలు చేసిన వాడవుతూ కష్టాలు తెచ్చుకొనే శరీరాన్ని పొందుతాడు. అందుచేత పాపాలకు మూలమైన కామాన్ని కోరకండి.

ఈ జ్ఞానం కలుగనంతకాలమూ ఆత్మతత్త్వం తెలియదు. ఆ తత్త్వం తెలియకపోవడం వల్ల దేహందాల్చినవాడికి దుఃఖం పెరుగుతూ ఉంటుంది. లింగ శరీరం ఎంతకాలం ఉంటుందో అంతకాలమూ మనస్సు కర్మకు లోబడి ఉండి, జ్ఞానం కలుగకుండా అవిద్య నశింపకుండా ఉంటుంది.

కర్మల వల్లనే ఈ శరీరాన్ని ధరించవలసివస్తోంది. అందుచేత కర్మ చెయ్యడం వల్ల శరీరం పోదు. వాసుదేవుణ్ణయిన నాయందు భక్తి లేనంతకాలమూ శరీరధర్మాలు బాధిస్తూనే ఉంటాయి. బాగా చదువుకొన్నవాడైనా శరీరం మీదా ఇంద్రియాలమీదా ప్రీతిపడి జంటగా కలవడంలో ఉన్న సుఖాన్నే ప్రధానమనుకొని గృహస్థాశ్రమానికి తలవొగ్గి తానెవడో, తన స్వరూపం ఏమిటో మరచి, చివరికి ఏమీ లేనివాడై మూఢుడవుతాడు. దానితో సంసారం వల్ల తాపాల్ని అనుభవిస్తాడు.

పురుషుడు స్త్రీతో సంగమించడం వల్ల కలిగే సుఖాన్నే ప్రధానంగా భావించి, దానివల్ల ఇల్లు – భూమి – పిల్లలు – ఇష్టులు – డబ్బు – ఇలాంటివాటిపై "నేను, నాది" అనే మోహాన్ని కలిగించుకొంటాడు. స్త్రీ పురుష సంగమం వల్ల సంతానం కలుగుతుంది. ఆ సంతానం కోసం ఇల్లు–భూమి–డబ్బు సంపాదిస్తాడు. దానిమీద మోహం పెరిగిపోతుంది. ఆ మోహం వల్ల మోక్షమార్గం దూరమైపోతుంది. ఇలా సంసారంలో ఉన్నప్పటికీ మనస్సులో ఎప్పుడూ ముక్తికోసమే చింతిస్తూ ఉంటే సంసార బంధం విడివడుతుంది.

మోక్షసాధనకు ఉపాయాలు ఇవి –

పరమగురువైన నాయందే భక్తి నిలుపడానికి ఇతరమైన కోరికల్ని విడిచిపెట్టడం;

ఆకలి దప్పులు, ఎండచలువలు మొదలైన ద్వంద్వాల్ని ఓర్చుకోవడం;

సమస్త జీవుల కష్టాలపట్ల సానుభూతి వహించడం;

పరమేశ్వరుణ్ణి గురించి తెలుసుకోవాలని కాంక్ష కలిగి ఉండటం;

కోరికల్ని విడవడం; నాకు చెందిన కర్మలనే ఆచరించడం;

నా కథలను వినడం;

నేను తప్ప వేరెవ్వరూ దైవం లేరని తెలియడం; నా గుణాలను కీర్తించడం;

తనకెవ్వరితోను శత్రుభావం లేకుండా శాంతంగా ఉండటం;

దేహం పట్ల, ఇంటిపట్లా "నేను–నాది" అనే బుద్ధిని విడిచిపెట్టడం;

అధ్యాత్మయోగం కలిగి ఉండటం;

లోకములన్నిటా భూతములన్నిటా బ్రహ్మయే ఆత్మగా ఉన్నదని అన్నింటిని అంతటనూ బ్రహ్మాత్మకంగా తెలియడం;

ఆత్మతత్త్వాన్ని తెలిసి తాను దేహం కాననీ, పరమాత్మతో విడివడని వాడననీ, కలిసి ఉండేవాడనని తెలియడం;

భగవంతునికి ఏకాంతికమైన సేవచేయడం;

ప్రాణాన్ని, ఇంద్రియాలను, అహంకారాన్ని, జయించడం;

చెయ్యకూడని వాటిని చేయకుండటం;

చెయ్యవలసినవాటి మీద మంచి శ్రద్ధ కలిగి ఉండటం;

బ్రహ్మచర్యం పాటించడం;

చెయ్యవలసినవి చేస్తున్న కర్మల పట్ల ఏమరిపాటుతనం లేకుండా జాగరూకుడై ఉండటం;

మాటలాడడంలో నియమబద్ధత కలిగి ఉండటం;

భగవద్విషయాలనే మాటలాడటం, ఇతర విషయాల విషయంలో మౌనంగా ఉండాలనే నియమం కలిగి ఉండటం;

సర్వమూ నేనే (భగవంతుడే) అని తలచడం, జ్ఞానం కలిగి ఉండటం, విజ్ఞానంతో పరిపూర్ణమైన విజ్ఞాన యోగం కలిగి ఉండటం;

శాస్త్రాధ్యయనంచేసి జ్ఞానంతో భగవంతుని స్వరూప గుణ విభూతుల్ని తెలుసుకొని ధ్యానం చెయ్యడం;

ధృతి కలిగి ఉండటం;

ఎన్ని విఘ్నాలు ఎదురైనా చలింపని ధైర్యంతో ప్రవర్తిస్తూ తాను పొందవలసినదేమిటో, దానికి సాధనాలేమిటో తెలుసుకొని ఆచరించడంలో నేర్పు కలిగి ఉండటం;

సాత్త్విక స్థితిలో ఉండటం;

కోపతాపాలకు మదమోహాలకు వశంగాకుండా ఉండడం.

ఇటువంటి మార్గాల ద్వారా లింగ శరీరాన్ని జయించి ఈ శరీరాన్ని దాల్చిన జీవుడు నిత్య శాశ్వత సుఖాన్ని పొందాలి.

ఆ. అరయఁ గర్మరూప మగు నవిద్యాజన్మ, మైన హృదయబంధనాది లతల
నప్రమత్తయోగ మను మహాఛురికచేఁ, ద్రెంపవలయు నంతఁ దెంపుతోడ.

70

తా ॥ ఈ సంసార బంధాలకు మూలం అజ్ఞానం. అజ్ఞానానికి మూలం ఆత్మజ్ఞానం లేని కర్మాచరణం. సంసార బంధాలు తీగలవంటివి. ఆ తీగల్ని అమృతత్వమనే చురకత్తితో ధైర్యంగా త్రెంచాలి. ఇదే యోగం.

'ప్రమాదో మృత్యుః' – అని శంకరులు. ప్రమాదం లేకుండా – అంటే ఈ శరీరమే ఆత్మ అనే ప్రమత్తత లేకుండా ఉండటమే అమృతత్వం. పద్యంలోని "అప్రమత్తయోగం" – అంటే అమృతత్వం. దేహాత్మ భ్రాంతి లేకపోవడం, జీవేశ్వరైక్యం – అన్నమాట.

ఆ. ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁడైన, భూపుఁడైన శిష్యపుత్ర వరుల
యోగయుతులఁ జేయ నొప్పుగా వలయును, గర్మపరులఁ జేయఁగాదు కాదు.

71

తా ॥ ఈ యోగం కలిగి గురువు తన శిష్యులకు, తండ్రి తన బిడ్డలకు, రాజు తన ప్రజలకు దీనిని తప్పక చెప్పాలి, నేర్పాలి — అంతే గాని, ఆత్మజ్ఞానం లేకుండా కర్మాచరణమే ప్రధానమని ఎంచి, వారిని కర్మల్ని ఆచరించమని కేవల కర్మపరుల్ని చేయకూడదు.

సీ. జనులెల్ల నర్థ వాంఛలఁ జేసి యత్యంత, మూఢులై యైహికంబులు మనంబు
లందును గోరుదు; రల్ప సౌఖ్యములకు, నన్యోన్య వైరంబు లంది దుఃఖ
ములఁ బొందుదురు; గాన మునుకొని గురుఁడైన, వాఁడు మాయామోహవశుఁడు నెంత
జడుఁడు నైనట్టి యా జంతువులందును, దయ గల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ

ఆ. గన్నులున్నవాఁడు గానని వానికి, దెరువుఁ జూపి నట్లు దెలియఁ బలికి
యతుల మగుచు దివ్యమైన యా మోక్ష మార్గంబుఁ జూప వలయు రమణతోడ.

72

తా ॥ మూఢుడైనవాడికి తనకేది శ్రేయస్సునిస్తుందో తెలియదు. ఈ లోకంలోని సుఖాల్నే మనస్సులో కోరుకొంటూ వాటిని పొందడం కోసం అర్థాన్నే కాంక్షిస్తూ ఉంటాడు. ప్రజలంతా ఇలా సౌఖ్యంలేనిచోట సౌఖ్యం ఉందనుకొంటూ ఒకరితోనొకరు కలహించుకొంటూ దుఃఖాల్ని పొందుతున్నారు. అందువల్ల గురువైనవాడు ముందుగా, ప్రయత్నపూర్వకంగా ఇలాంటి మాయ కప్పివేసి మోహానికి వశమైపోయినవాణ్ణి — వాడెంత జడుడైనా సరే — వాడిపై దయచూపించి, ధర్మబుద్ధితో వాణ్ణి మంచి దారిలో నడిపించాలి. గ్రుడ్డివాడు తెలియక తప్పుదారిని పోతున్నా కన్నులున్నవాడు ఎవ్వడైనా సరే "అటు కాదు, ఇటు రా" అని చెప్పకుండా ఊరుకోలేడు కదా! అలాగే దివ్యమైన మోక్షమార్గాన్ని శ్రేయోదాయకంగా చూపించాలి.

వ. మఱియుఁ బితృ గురుజననీ బంధు పతి దైవతంబులలో నెవ్వరైనను సంసార రూప మృత్యురహితం బైన మోక్షమార్గంబుం జూపకుండిరేని వా రెవ్వరును హితులు గానేరరు; నాదు శరీరంబు దుర్విభావ్యంబు; నాదు మనంబు సత్త్వయుక్తంబును, ధర్మసమేతంబును, బాపరహితంబు నగుటంజేసి పెద్దలు నన్ను ఋషభుం డండ్రు; గావున శుద్ధ

సత్త్వమయంబైన శరీరంబునం బుట్టిన కుమారులైన మీ రలందఱును సోదరుండును మహాత్ముండును నగ్రజుండును నైన భరతు నన్నెకాఁజూచి యక్లిష్టబుద్ధిచే భజింపుం; డదియ నాకు శుశ్రూషణంబు; ప్రజాపాలనంబు సేయుట మీకును బరమ ధర్మంబని మఱియు నిట్లనియె.

73

తా ॥ అలా దివ్యమైన మృత్యువు లేని మోక్షమార్గాన్ని చూపించకుండా విషయవాసనల పట్ల ప్రవర్తింపచేసేవారు దేహ సంబంధంచే తండ్రి అయినా, గురువైనా, తల్లి అయినా, బంధువైనా, పెనిమిటైనా, దేవుడైనా ఎవ్వరైనా సరే, వారు మేలుకూర్చేవారు కాలేరు.

నా శరీరం "లోకంలోని అందరి శరీరాల వంటిది" అని భావించడానికి వీల్లేనిది. నా మనస్సు రజస్తమస్సుల సంపర్కం లేని సత్త్వగుణంతో కూడి ఉంది. కేవల ధర్మంతో ఉంది, పాపం లేనిది – అందువల్ల పెద్దలు నన్ను "ఋషభుడు" అని అన్నారు.

ఋషభుడు అంటే అందరికంటే శ్రేష్ఠుడు అని భావం.

అందువల్ల శుద్ధ సత్త్వమయిన శరీరానికి కుమారులై జన్మించిన మీరంతా మీకు అన్నదమ్ములలో పెద్దవాడు అయిన భరతుణ్ణి నన్ను చూసినట్లే చూడండి. మనస్సులో కపటం లేకుండా సేవించండి. మీరు అలా భరతుణ్ణి సేవించడమే నన్ను సేవించినట్లు లెక్క. ప్రజల్ని పరిపాలించడం మీకు కూడా పరమమైన ధర్మం" – అని, ఇంకా ఇలా అన్నాడు:

సీ. భూతజాలములందు భూజముల్ వర్యముల్, భూరుహముల కంటె భోగి కులము
భోగి సంతతి కన్న బోధనిష్ఠులు బోధ, మాన్యుల కన్నను మనుజవరులు
వీరి కన్నను సిద్ధ విబుధ గంధర్వులు, వారి కన్నను సురుల్ వారికన్న
నింద్రాది దేవత లిందఱి కన్నను, దక్షాది సన్మునుల్ దలఁప నెక్కు

తే. దంతకన్నను భర్గుఁ డా యభవుకన్నఁ, గనులభవుఁ డెక్కుఁ; డాతని కంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల నాదరించుఁ, గాన విప్రుండు దైవంబు మానవునకు.

74

తా ॥ "ఈ లోకంలోని సమస్త జీవరాసులలో భూమి నుంచి వెలుపలికి మొలిచి వచ్చే మొక్కలు గొప్పవి. వాటికన్నా పాములు గొప్పవి. పాములకన్నా జ్ఞానం కలిగిన పశువులు, వీటికన్నా మానవ శ్రేష్ఠులు, వీరికన్నా సిద్ధులు, కిన్నరులు, గంధర్వులు, సురగణాలు, రాక్షసులు, వీరికన్నా ఇంద్రాది దేవతలు, వీరికన్నా దక్షుడు మొదలైన మంచి ఋషులు, వీరికన్నా భర్గుడు, భర్గునికన్నా బ్రహ్మ, బ్రహ్మకన్నా విష్ణువు గొప్పవాడు. ఆ విష్ణువు బ్రహ్మజ్ఞాన సంపన్నులైన బ్రాహ్మణుల్ని ఆదరిస్తాడు. అందువల్ల మానవుడికి బ్రాహ్మణుడు దైవం.

బ్రాహ్మణులు = బ్రహ్మజ్ఞాన సంపన్నులు, సత్త్వగుణ ప్రధానులు.

క. భూసురులకు సరిదైవం, బీ సచరాచరమునందు నెఱుఁగను; నాకున్
భూసురులు గుడుచునప్పటి, యా సంతోషంబు దోఁప దగ్నులయందున్.

75

తా ॥ ఈ విశ్వంలో కదిలేవాటిలో గాని, కదలనివాటిలో గాని బ్రాహ్మణుడితో సమానమైన దైవం నాకు తెలియదు. అగ్నిలో హోమం చేయడం కంటే బ్రాహ్మణులకు సమర్పించినదానినే నేను సంతోషంగా స్వీకరిస్తాను.

సీ. మంగళం బైన బ్రహ్మస్వరూపంబును, వేదరూపంబు ననాది రూప
మగుచున్న నాదు దేహము బ్రహ్మణోత్తముల్, ధరియింతు రెప్పుడుఁ దత్త్వబుద్ధి
శమదమానుగ్రహ సత్యతపస్తితి, క్షలు గల్గు విప్రుండు సద్గురుండు;
గాన మిక్కిలి భక్తి గల్గి యకించను, లైన భూసురుల దేహముల వలన

తే. నందుచుండును నాదు దేహంబు గాఁగ, నెఱిఁగి వరులగు విప్రుల నెల్ల భక్తిఁ
బూజసేయుటయే నన్నుఁ బూజసేయు, టనుచు వినిపించి మఱియు నిట్లనుచుఁ బలికె.

76

తా ॥ నా మూర్తియే వేదం. అది శుభాలను కలిగిస్తుంది. బ్రహ్మ స్వరూపమున్ను. నా శరీరమైన ఆ వేదాన్ని బ్రాహ్మణులు ధరిస్తున్నారు. బ్రాహ్మణులలో ఎప్పుడూ తాత్త్వికచింతన, మనోనిగ్రహమనే శమము, బాహ్యేంద్రియనిగ్రహమనే దమమూ, సత్యసంధత, తపస్సు, ఓరిమీ ఉంటాయి. ఇవన్నీ ఉన్న బ్రాహ్మణుడు సద్గురువు. వారు నా యందు అత్యంత భక్తి కలిగి, నా నుండి కోరదగినది ఏమీ లేనివారై ఉంటారు. నేను ఇటువంటి బ్రాహ్మణుల శరీరంలో అందుబాటులో ఉంటూ ఉంటాను. ఇది తెలుసుకొని గొప్పవారైన బ్రాహ్మణుల్ని భక్తితో పూజించడమే నన్ను ఆరాధించడం" – అని చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

క. ఈ తెఱఁగు దెలిసి భూసుర, జాతిం బూజించునట్టి జనుఁడును మాయా
తీతుండై నిక్కంబుగ, భూతలమున మోక్షమార్గమును బొడగాంచున్.

77

తా ॥ "ఈ జ్ఞానంతో బ్రాహ్మణజాతిని పూజించేవాడు మాయలో పడకుండా ఈ భూమిపైనే మోక్షమార్గాన్ని తెలుసుకొంటాడు. ఇది సత్యం."

# 6. ఋషభుని తపస్సు

వ. ఇట్లు సదాచారు లగు కుమారులకు లోకానుశాసనార్థం బాచారంబు లుపదేశించి మహాత్ముండును బరమసుహృత్తును నగు భగవంతుండు ఋషభాపదేశంబునం గర్మత్యాగంబు సేసి యుపశమశీలురగు మునులకు భక్తిజ్ఞానవైరాగ్య లక్షణంబులు గల పారమహంస్య ధర్మం బుపదేశింపగలవాఁ డగుచుఁ బుత్రశతంబునం దగ్రజుండును బరమ భాగవతుండును భగవజ్జన పరాయణుండును నగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబు గట్టి తాను గృహమందె దేహమాత్రావలంబనంబు సేసి దిగంబరుండై యున్మత్తాకారుం డగుచుం బ్రకీర్ణ కేశుండై యగ్నుల నాత్మారోపణంబు సేసి బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధ బధిర మూక పిశాచోన్మాదులుం బోలె నవధూత వేషంబు నొంది జనులకు మాఱు పలుకక మౌన వ్రతంబునం బుర గ్రామాకర జనపదారామ శిబిర వ్రజఘోష సార్థగిరి వనాశ్రమాదుల యందు వెంటం జనుదెంచు దుర్జన తర్జన తాడనావమాన మేహన నిష్ఠీవన పాషాణశకృద్రజః ప్రక్షేపణపూతి వాత దురుక్తులం బరిభూతుం డయ్యును గణనం బెట్టక వనమదేభంబు మక్షికాది కృతోపద్రవంబునుం బోలెఁ గై కొనక దేహాభిమానంబునం జిత్త చలనంబు నొందక యేకాకియై చరియించు చుండ నతి సుకుమారంబులగు కరచరణోరస్థ్సలంబులు విపులంబులగు బాహ్వంసకంఠ వదనాద్యవయవ విన్యాసంబులుం గలిగి ప్రకృతి సుందరం బగుచు స్వతస్సిద్ధదరహాసరుచిర ముఖారవిందంబై, నవ నళిన దళంబులంబోలి శిశిర కనీనికలం జెలువొంది, యరుణాయతంబులగు నయనంబులచే నొప్పి యన్యూనాధికంబులగు కపోల కర్ణ కంఠ నాసాదండంబులచేఁ దేజరిల్లుచు నిగూఢస్మితవదన విభ్రమంబులం బ్రకాశించు తన దివ్య మంగళ విగ్రహంబుచేఁ బుర సుందరుల మనంబుల కత్యంత మోహంబు గలుగఁ జేయుచు.

తా ॥ ఈ విధంగా ఋషభదేవుడు తన కొడుకులు మంచి ఆచారం కలవారే అయినప్పటికీ లోకానికి తెలియచెప్పాలని ఆచారాల్ని ఉపదేశించాడు. మహాత్ముడు, సర్వభూతాలకు పరమాప్తుడు అయిన భగవానుడు ఋషభుడనే మిషతో అవతరించి కర్మల్ని త్యాగంచేసి, మనోనిగ్రహం కలిగిన మునులకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాల యొక్క స్వరూపంతో కూడిన పరమహంస యొక్క ధర్మాన్ని ఉపదేశించేవాడు. తన కొడుకులలో పెద్దవాడు భరతుడు; ఇతడు మహాభక్తుడు, భగవద్భక్తులంటే విశేషమైన ప్రేమ ఉన్నవాడు. ఇతణ్ణి భూమిని ఏలమని పట్టంకట్టి గృహంలోనే ఉంటూ కేవల శరీరాన్ని మాత్రమే దాల్చి దిగంబరంగా ఉన్నాడు. తరువాత పిచ్చివాడిగా, జుట్టు విరబోసుకొన్నవాడై అంతకాలం తానారాధించిన అగ్నుల్ని తనలోనే సమారోపణం చేసుకొని బ్రహ్మావర్తదేశం నుంచి బయటకు వచ్చేశాడు. జడునిలా, గ్రుడ్డివానిగా, చెవిటివానిగా, మూగవాడిలా, పిశాచం పట్టిన వాడిలా, పిచ్చెక్కిన వాడిగా అవధూత వేషంతో ఎవరైనా మాటాడినా బదులు చెప్పక మౌనవ్రతంతో తిరిగేవాడు. అలా సంచరించేటప్పుడు దారిలో పల్లెల్లో, జనపదాలలో, శిబిరాలలో, గొల్లపల్లెల్లో, కొండపట్టు ప్రాంతాలలో, వనాలలో, ఆశ్రమాలలో వెంబడి వచ్చే దుర్మార్గుల ప్రశ్నల్ని, అవమానాల్ని, కొట్టడాల్ని, తనపై ఉమ్మివేయడాన్ని, రాళ్ళు రువ్వడాన్ని, ఇసుక జల్లడాన్ని, మూత్రం పోయడాన్ని, నీచంగా మాట్లాడటాన్ని ఇలాంటి అవమానకర హేయకరమైన నీచకృత్యాలన్నింటినీ లెక్కపెట్టకుండా అడవిలో మదించిన ఏనుగు తనపై ఎన్ని ఈగలు ముసిరినా ఎలా లక్ష్యపెట్టదో అలా శరీరంపై అభిమానాన్ని విడిచి, మనస్సు చలించకుండా ఒక్కడూ తిరిగేవాడు.

అతని శరీరం ఎంతో సుకుమారమైంది. అతని చేతులు, కాళ్ళు, వక్షస్సు, విశాలమైన బాహువులు, కంఠం, ముఖం మొదలైన అవయవాలన్నీ అందంగా అమరి ఉన్నాయి. అతడిది పుట్టుకతోనే సహజంగా అందమైన రూపం. చిరునవ్వులతో ఉండే పద్మంలాంటి ముఖం. అప్పుడే వికసించిన తామరపూరేకుల్లా చల్లని కనుగ్రుడ్లు, ఎర్రగా విశాలంగా ఉన్న కళ్ళు, మంచి చెక్కిళ్ళు, చెవులు, కంఠం, ముక్కుపుటాలు అన్నీ ఏ మాత్రం తక్కువ కాని అందంతో తేజరిల్లుతున్నాయి. అంతుచిక్కని అందమైన చిరునవ్వుల మోము కాంతులతో ప్రకాశిస్తూ, దివ్యమంగళవిగ్రహంతో

ఆ పురంలోని అందగత్తెల మనస్సుకు ఎంతగానో మోహాన్ని కలిగించేవాడు.

ఆ. ధూళిచేత మిగుల ధూసరితంబునై, జడలు గట్టి కడుఁ బిశంగవర్ణ
మునగు కేశపాశమును వెలిఁగించుచు, నితరు లెవరుఁ దన్ను నెఱుఁగకుండ.

79

తా ॥ "అలాంటి ఋషభుడు ఇప్పుడు ధూళి క్రమ్మిన జుట్టుతో, జటలతో, కపిలవర్ణంగా మారిన జుట్టుతో తిరిగేవాడు. ఎవరూ అతణ్ణి గుర్తుపట్టేవారు కారు.

క. అవధూత వేషమున ని, ట్లవనిన్ మలినంబులైన యవయవములతోఁ
దవిలి చరించుచు నుండును, భువి భూతాక్రాంతుఁ డయిన పురుషుని మాడ్కిన్.

80

తా ॥ అతనికి అవధూత వేషం ఏర్పడింది. అవయవాలన్నీ మట్టికొట్టుకుపోయాయి, మలినంగా కనిపిస్తున్నాయి. ఏదో పిశాచం పట్టినవాడిలా గోచరించాడు.

ఆ. జనుల కిట్లు యోగసంచార మెల్ల వి, రుద్ధ మనుచు నాత్మ బుద్ధిఁ జూచి
యజగరంబు మాడ్కి నవనిపై నుండె బీ, భత్సకర్మమునకుఁ బాలు పడుచు.

81

తా ॥ ఇలా యోగసంచారం చేసే ఋషభుడు ప్రజలకిది విరుద్ధమని తనలో తలచి, తిరగడం మానివేశాడు. భూమిపైనే ఒక్క చోటనే కొండచిలువలా బీభత్సంగా ఉండిపోయాడు.

వ. ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజించుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరంబున నంటం బొరలుచుండు, మఱియు దత్పురీష సౌగంధ యుక్తంబగు వాయువు దశదిశలన్ దశయోజన పర్యంతంబు పరిమళింపం జేయుచుండ గోమృగకాక చర్యలం జరియించుచు భగవదంశంబైన

ఋషభుండు మహానందంబు ననుభవించుచుం దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధిం బొందిన వైహాయస మనోజవ పరకాయ ప్రవేశాంతర్ధాన దూర గ్రహణ శ్రవణాది యోగ సిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

82

తా ॥ ఇలా జుగుప్సావహంగా ఋషభుడు భూమి మీదనే పడిపోయిఉండి, తన నోటికి లభించిన దానినే తింటూ, నీరు త్రాగుతూ, మలమూత్రాలను అక్కడే విడుస్తూ, అవి తన శరీరానికి పట్టేటట్లు వాటిలోనే పొర్లాడుతూ ఉన్నాడు. మలం దివ్యమైన పరిమళంతో, ఆ సుగంధాన్ని దాల్చిన గాలి పది దిక్కులకూ పదేసి యోజనాల మేర సువాసనతో వ్యాపించి ఉంది. భగవదంశతో పుట్టిన ఋషభుడు కొంతకాలం గోవులా, కొంతకాలం మృగంలా, కొంతకాలం కాకిలా చరించేవాడు; మహానందాన్ని అనుభవించేవాడు. సకల చరాచర జగత్తునందూ నిండియున్న వాసుదేవుణ్ణి ప్రత్యక్షంగా చూస్తూ సిద్ధుల్ని పొందాడు. అతనికి కోరిక లేకపోయినా సర్వశక్తులు యోగబలం వల్ల లభించాయి. అతనికి ఇచ్ఛ లేకపోయినా ఆకాశంలో వెళ్ళగలిగిన శక్తి, మనస్సు యొక్క వేగంతో వెళ్ళగలిగిన శక్తి, పరకాయప్రవేశ శక్తి, మాయమయ్యే శక్తి, దూరగ్రహణ శక్తి, శ్రవణ శక్తి మొదలైన యోగసిద్ధులు వాటంతట అవే రాగా, అతడు అవన్నీ తన ముక్తికి విరోధులని ఆ శక్తుల్ని ఆదరించి స్వీకరించలేదు" – అని శుకులవారు చెప్పగా పరీక్షిత్తు విని, ఇలా అన్నాడు –

సిద్ధులను అశుద్ధం మాదిరి త్యజించాలి. పారమార్థిక సాధనల వల్ల సంయమనం వల్ల వాటంతట అవే సిద్ధులు కలుగుతూ ఉంటాయి. కాని సిద్ధుల మీద మనస్సు నిలిపితే అహంకారం పెరిగి, భగవంతుణ్ణి మరచిపోతారు.

–శ్రీరామకృష్ణ పరమహంస

క. మునివర! యోగజ్ఞానం, బునఁ జెఱుపంబడ్డ కర్మములు గల పెద్దల్

గని యుండెడి యైశ్వర్యం, బును బుషభుం డెఱిఁగి యేల పొందక యుండెన్?

83

తా ॥ "మునులలో శ్రేష్ఠుడవైన ఓ శుక మహర్షీ! యోగం వల్ల జ్ఞానం కలిగి కర్మబంధాలు నశిస్తాయి. అట్టి యోగస్థితిలో ఉన్న మహనీయులకు మహాసిద్ధులు ప్రాప్తిస్తాయి. ఈ విషయం తెలిసి కూడా బుషభుడు సిద్ధులను ఎందుకు వద్దన్నాడు?"

ఆత్మయందే సతతమూ ఆనందాన్ని అనుభవించేవారికి, భక్తియోగం వల్ల భగవత్సాక్షాత్కారాన్ని పొంది, జ్ఞానాగ్నిచే వాసనలు అనే కర్మ బీజాలు దగ్ధమైనవారికి ఐశ్వర్యాలున్నా, సిద్ధులున్నా ఇవేమీ వాళ్ళను బంధించలేవు. వాళ్ళకు సంసార బంధం అంటదు. అలాంటప్పుడు బుషభుడు సిద్ధుల్ని ఉపయోగించినా హాని ఉండదు కదా! ఎందుకు ఉపయోగించలేదు? అని పరీక్షిత్తు ప్రశ్న.

వ. అనిన శుకుం డిట్లనియె.

84

తా ॥ ఈ ప్రశ్న విని శుకులవారిలా అన్నారు:

మ. ధరణీవల్లభ! నీదు వాక్యములు దథ్యం బింతయుం దప్ప, దె
ట్లరయన్ వన్యమృగంబు పట్టుపడి తా నా వేళ నాలుబ్ధకున్
ధర వంచించిన మాడ్కి నింద్రియములన్ దండించి చిత్తంబు ని
ర్భరకామాదుల కాస యిచ్చుఁ గడు సంరంభంబుతోఁ గ్రమ్మఱన్.

85

తా ॥ "రాజా! నీ మాటలు నిజమే. కాని యోగికి కూడా సిద్ధులవల్ల పతనం తప్పదు. ఎలాగో చెబుతాను, విను. అడవిలో మృగాలు వేటగాడికి పట్టుబడతాయి. అంతమాత్రంచే అవి

లొంగిపోయాయని అనుకోకూడదు. వాణ్ణి మోసం చేసి, బైటకూ రాగలవు. అలాగే ఇంద్రియాల్ని దారిలో పెట్టుకొని, వశపరచుకొన్నా, అవకాశం దొరికితే మనస్సు భరింపలేకుండా ఉన్న కోరికలకు ఆశపడి, కట్టడి తెంపుకొని విజృంభిస్తుంది.

క. చిరకాల తపము నైనను, హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకున్ జారిణి, కరణిని నడరించు మనసు కామాదులకున్.

86

తా ॥ ఎంతోకాలం నుంచి చేసిన ఘోర తపస్సునైనా మనస్సు దొంగిలించగలదు. కనుక మహనీయులు దానిని నమ్మరు. మనస్సు జారిణి లాంటిది. కామక్రోధాలు మొదలైనవి విటుల వంటివి. జారిణి విటుల్ని ఆకర్షించినట్లు మనస్సు కామాదుల్ని లాక్కుపోతుంది.

క. కామక్రోధాదికముల్, భూమీశ్వర! కర్మబంధములు మఱియును జే
తో మూలము లగుటను దా, రీ మహిలో మనసు నమ్మ రెప్పుడుఁ బెద్దల్.

87

తా ॥ రాజా! కామక్రోధాదులు, కర్మ బంధాలు ఇవన్నీ మనస్సు వల్లనే ఏర్పడుతున్నాయి. అందుచే పెద్దలు ఏనాడూ మనస్సును నమ్మరు.

సీ. అదిగాన నెన్నఁడు నైశ్వర్యములను జే, పట్టఁ జూడఁడు, లోకభవ్యులైన
వారలచే నభివందనంబులు వొంది, వెలయంగ నవధూతవేష భాష
ణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వ, రూపంబు గలిగి యా రూపమందుఁ
బరమ యోగధ్యాన పరులకు నెల్ల దే, హత్యాగ సమయంబు నంతలోనఁ

తే. జూపు చుండియు దేహంబుఁ బాప నిచ్ఛ, గించె; నచ్చట దివ్య యోగీంద్రుఁ డాద్యుఁ
డతుల దివ్యప్రకాశకుఁ డమర గురుఁడు, పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర!

తా ॥ ఓ రాజేంద్రా! అందువల్లనే ఋషభుడు ఐశ్వర్యాలను చేపట్టలేదు. లోకులకంటే భిన్నమైన వేషంతో మహాత్ములు అభినందిస్తూ ఉండగా – అవధూత వేషభాషలతో తనను గుర్తుపట్టడానికి వీల్లేనంతగా సంచరించాడు. తాను సాక్షాత్తు భగవత్స్వరూపుడై, చివరకు తన శరీరాన్ని విడవాలనే కోరికతో యోగులు తమ శరీరాన్ని ఎలా విడవాలో అందరికీ నేర్పడానికై తన ఆచరణ చేత తెలియచేసినవాడై ఉండేవాడు. అతడు దివ్యయోగులలో గొప్పవాడు, ఆద్యుడు, సాటిలేని దివ్యమైన ప్రకాశంగలవాడు. దేవతలకు గురువు. పరమ పురుషుడు. అతడు తన దేహాన్ని విడవాలని నిశ్చయించుకొన్నాడు.

"దేహంబుఁ బాప నిచ్చగించె" అంటే స్థూల శరీరాన్ని కాదు; లింగశరీరాన్ని. అనగా మనస్సులో దేహమే 'నేను' అనే బుద్ధి తొలగి, శరీరంతో ఉన్నా తన్నుతాను వేరుగా భావిస్తూ దేహంమీద ఆదరణ తగ్గి సంచరించే స్థితికి వచ్చాడని భావం. ఈ భావం వల్ల శరీరం ఉండగానే ముక్తి పొందినట్లు. ఆత్మ శరీరంలో ఉన్నప్పటికీ శరీరాన్ని అంటకుండా ఉండడం జరుగుతుంది.

వ. అంత విముక్తలింగుండు భగవంతుండునగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి కులాల చక్రంబు కులాలుని చేత భ్రమియింపంబడి విసృష్టంబయ్యు భ్రమించు గతిం బ్రాచీన సంస్కార విశేషంబగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పి యుండియు, యోగమాయా వాసనచే యుక్తుండయ్యె; మఱియు నా ఋషభుం డొక్క దినంబునం గోంకణవంక పట కుటకంబులను దక్షిణ కర్ణాట దేశంబులకు యదృచ్ఛం జని కుటకాచలోపవనంబున నిజాస్యకృతశిలా కబళుం డగుచు నున్మత్తుని చందంబున వికీర్ణ కేశుండు, దిగంబరుండునై సంచరింప, వాయువేగ విధూత వేణుసంఘర్షణ సంజాతంబగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింప నందు దగ్ధుండయ్యె; నంత నతని కృత్యంబులు తద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుండగు తద్రాష్ట్రాధిపతి విని, నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి, దా నా యాచారంబుల నంగీకరించి, యధర్మ

బహుళం బగు కలియుగంబున భవితవ్యతచే విమోహితుండై మనుజుల నసమంజసం బగు పాషండ మతాభినివేశులం జేసె; మఱియును గలియుగంబునందు మనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛం జేసి దేవతా హేళనంబులు సేయుచు, నస్నానానాచమనాశౌచ కేశోల్లుంచనాది కాపవిత్ర వ్రతంబులం జేయుచు నధర్మ బహుళం బగు కలియుగంబునం జెఱుపంబడ్డ బుద్ధి ధర్మంబులం గలిగి వేద బ్రాహ్మణ యజ్ఞపురుషుల దూషించుచు లోకంబులం దమ తమ మతంబులకుం దామే సంతసిల్లుచు నవేద మూలంబగు స్వేచ్ఛం జేసి ప్రవర్తించి యంధపరంపరచే విశ్వాసంబు సేసి తమంతన యంధతమసంబునం బడుచు నుండుదు; రీ ఋషభుని యవతారంబు రజోవ్యాప్తులగు పురుషులకు మోక్ష మార్గంబు నుపదేశించుటకు నయ్యె; నదియునుంగాక సప్త సముద్ర పరివృతంబులగు నీ భూద్వీప వర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబు లతిశుద్ధంబులు నగు నెవ్వని కృత్యంబులు గీర్తింతురు, మఱియు నెవ్వని యంశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె, నెందు జగదాద్యుండగు పురాణపురుషుం డవతారంబు నొంది కర్మహేతుకంబులుగాని మోక్ష ధర్మంబులం దెలిపె, వెండియు నెవ్వండు యోగమాయా సిద్ధుల నసద్భూతంబు లగుటం జేసి నిరసించె, నట్టి ఋషభునితోడఁ దత్సిద్ధికృత ప్రయత్నుల నితర యోగీశ్వరులు మనోరథంబుననైన నెట్లు సరియగుదు? రిట్లు సకల వేదలోక దేవబ్రాహ్మణులకు గోవులకుం బరమ గురుండు, భగవంతుడు నగు ఋషభుని చరిత్రంబు వినిన వారలకు దుశ్చరితంబులు దొలంగు; మంగళంబులు సిద్ధించు; మిక్కిలి శ్రద్ధతోడ నెవ్వండు విను, వినిపించు, వానిక హరిభక్తి దృఢం బగు; నట్టి హరి భక్తి తాత్పర్యంబునం బెద్దలు భాగవతు లగుటం జేసి సంప్రాప్త సర్వపురుషార్థు లగుచు వివిధ వృజిన హేతుకంబగు సంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తియోగామృత స్నానంబు సేసి పరమ పురుషార్థంబయిన మోక్షంబును జెందుదురని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుందురు.

తా ॥ ఋషభుడు లింగశరీరం నుండి విముక్తుడై, మనస్సులో దేహంపై అభిమానాన్ని విసర్జించాడు. కుమ్మరి చక్రాన్ని త్రిప్పి ఆపివేసినా చక్రం కొద్దిసేపు తిరుగుతూనే ఉంటుంది. అలాగే ప్రాచీనమైన సంస్కార విశేషాల వల్ల దేహంపై అభిమానం లేకపోయినా ఇంకా ఉన్నట్లుగానే కన్పించి, శరీరం కదలడం మొదలైనవి ఇంకా జరుగుతూనే ఉంటాయి – జీవి పట్టించుకోకపోయినా. యోగమాయ వాసనల వల్ల ఆ శరీరం కొంకణ, వంక, పట, కుటకము లనే దక్షిణ కర్ణాటక దేశాలలో యథేచ్ఛగా సంచరించడం మొదలుపెట్టింది. కుటకాచలం యొక్క ఉపవనంలో నోటిలో రాళ్ళనే కబళంగా పెట్టుకొని పిచ్చివాడిలా, జుత్తు విప్పుకొని, దిగంబరంగా తిరిగేవాడు. ఇలా ఉండగా ఆ అడవిలో గాలి వేగానికి వెదురు బొంగులు పరస్పరం రాసుకోవడం వల్ల అగ్ని పుట్టింది. ఆ దావాగ్నికి అడవి తగులబడి, అందులో ఋషభదేవుని శరీరం కూడా దగ్ధమైంది.

ఆ దేశాలకు రాజు పేరు అర్హతుడు. ఋషభుడి ప్రవర్తనల్ని అక్కడి జనులు చెప్పగా రాజు విన్నాడు. ఆ రాజు తన ధర్మాల్ని విడిచిపెట్టి, తన దేశవాసులతో కలిసి, ఋషభుడి ఆచారాన్ని ఒప్పుకొని, కలియుగ ప్రభావం వల్ల జరుగబోయే కాలానికి మోహపడి, తన ప్రజల్ని అసమంజసమైన పాషండమతంతో ప్రవర్తింపచేశాడు.

అర్హతుడు అనుసరింపచేసిన పాషండ మతానికే “అర్హత ధర్మం” అని పేరు.

కలియుగంలో మనుష్యులు (కొందరు) సంస్కారహీనులవుతారు. దేవమాయ క్రమ్ముతుంది. శాస్త్రం చెప్పిన శౌచాన్ని, ఆచారాల్ని విడిచిపెడతారు. ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తారు. దేవతల్ని అవహేళన చేస్తారు. స్నాన సంధ్యావందనాదుల్ని ఆచరించరు. శుచిగా ఉండరు. జుత్తు కత్తిరించుకొంటారు. ఇలాంటి అపవిత్ర కార్యాలే వాళ్ళకు వ్రతాలు. అధర్మం పెచ్చుమీరుతుంది. బుద్ధి ధర్మాలు చెడిపోతాయి. వేదాల్ని, బ్రాహ్మణుల్ని, యజ్ఞపురుషుణ్ణి తిట్టుకొంటూ, వేదప్రమాణం లేని మతాల్ని పెట్టుకొని, ఎవడి మతానికి వాడే పొంగిపోతూ, ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తూ తమంత తామే అంధతమస్సు అనే నరకంలోకి పోతారు.

ఈ ఋషభదేవుడి అవతారం రజోగుణం ఎక్కువగా ఉన్న మానవులకు మోక్షమార్గం ఉపదేశించడం కోసం వచ్చింది. అంతమాత్రమేనా! సప్త సముద్రాలతో, సప్త ద్వీపాలతో కూడిన ఈ భూ ద్వీపవర్షం (భరతవర్షం) లోని జనులు పరమేశ్వరుని దివ్యమైన అవతారాల్ని ప్రతిపాదించే అతిశుద్ధములయిన ఎవని చేష్టల్ని కీర్తిస్తారో, ఎవని అంశంవల్ల అతికీర్తిమంతుడైన ప్రియవ్రతుడు జనించాడో, దేనిలో ఈ జగత్తుకి మూలమైన పురాణ పురుషుడు అవతరించి కర్మకారణం గాని మోక్షధర్మాల్ని ఉపదేశించాడో, మళ్ళీ ఎవడు యోగమాయ వల్ల కలిగే సిద్ధులు నిజంగా నిలిచేవి కాకపోవడం వల్ల ఆ సిద్ధుల్ని దగ్గరకు రానీయలేదో – అట్టి ఋషభదేవుడితో ప్రయత్నం చేసి, అంతటి సిద్ధిని పొందిన ఇతరులైన యోగీశ్వరులు చివరికి మనస్సులోనైనా సరితూగగలరా?

ఋషభుడు సకలవేదాలకు, లోకాలకు, దేవతలకు, బ్రాహ్మణులకు, గోవులకు పరమగురుడు, సాక్షాత్తు భగవానుడు. ఇట్టి ఈ ఋషభదేవుడి చరిత్రం వింటే చాలు, చెడ్డ వాళ్ళ చెడు తొలగుతుంది. మంగళాలు కలుగుతాయి. మిక్కిలి శ్రద్ధగా ఎవరు వింటారో, వినిపిస్తారో ఆ విన్నవారి, వినిపించినవారి హృదయాలలో హరి మీద గాఢమైన భక్తి గట్టిగా నాటుకొంటుంది.

ఇలా హరిభక్తి తాత్పర్యం వల్ల మహనీయులు భాగవతులవుతారు. ఇట్టి భాగవతులకు సర్వపురుషార్థాలూ సిద్ధిస్తాయి. పాపకారకమైన సంసారతాపం అంటదు. నిరంతరమూ ఆ భక్తియోగం అనే అమృతంలో స్నానమాడుతూ చిట్టచివరి పురుషార్థమైన మోక్షాన్ని పొందుతారు – అని ఋషభుడి చరిత్రాన్ని సప్తద్వీపాలవారు ఇప్పటికీ కొనియాడుతూ ఉంటారు.

ఆ. యాదవులకు మీకు నత్యంత కులగురు, వైన కృష్ణుఁ డెచట నైన గలఁడు;
కొలుచువారి కెల్ల సులభుఁడై మోక్షంబు, నిచ్చు ఁ జింతసేయ నేల నీకు?



తా ॥ రాజా! యాదవులకు, మీకూ (పాండవులకు) శ్రీకృష్ణుడు కులగురువు. ఆయన

గురుత్వం అంతులేనిది. అతడు సర్వత్రా ఉన్నాడు. తన్నారాధించే వారికి సులభంగా పట్టుపడతాడు. మోక్షాన్నిస్తాడు. నువ్వెందుకు చింతిస్తున్నావు?

సీ. నిత్యానుభూతమౌ నిజరూపలాభ ని, వృత్తమై తగు మహాతృష్ణ గలిగి
యతులిత విపుల మాయారచితంబైన, లాభంబునకుఁ దగులంబు లేని
మతి గల్గి లోకుల నతి వేడ్కఁ గరుణించి, యభయదానం బిచ్చి యందఱ కిల
నవ్యయంబై దివ్యమై మహానందమై, యత్యంత సేవ్యమై యతులమైన

తే. తనదు లోకంబు చూపంగఁ దగిన యట్టి, మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్త దేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్ష విష్ణు, వైన ఋషభుండు జనులకు నద్భుతముగ.

91

తా ॥ ఋషభదేవుడు నిత్యమూ బ్రహ్మాత్మకమైన స్వస్వరూపాన్ని అనుభవించడమే లాభంగా భావించాడు. ఇతర పురుషార్థాలపై అతనికి కోరిక లేదు. ఎటువంటివారికీ దాట శక్యం కాని మాయకు లోనై, ఆ మాయారచితమైన దేహాత్మబుద్ధి వల్ల శ్రేయోమార్గంలో ఆసక్తిలేని లోకుల్ని ఎంతో సంతోషంగా కరుణించాడు. వారి భయాన్ని పోగొట్టాడు. ఎప్పటికీ తరగని, దివ్యమైన ఎంతగానో సేవింపవలసిన, సాటిలేని తన విష్ణులోకాన్ని ప్రాప్తింపచేసే మోక్షమార్గాన్ని అందరకూ తెలియచెప్పాడు. సాక్షాత్తు విష్ణువైన ఆ ఋషభుడు ఇలా తన శరీరాన్ని వదిలి లయమయ్యాడు. జనులకు అద్భుతం కొలిపేటట్లు ఋషభదేవుని అవతారం ముగిసింది.”

# 7. భరతోపాఖ్యానము

మ. భరతుం డంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ
శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్ సంజాతయై యుండి ని
ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం
గరి మర్థిన్ ధరఁ బెండ్లియాడె శుభలగ్నం బందు భూవల్లభా!

92

తా ॥ “ఓ పరీక్షిన్మహారాజా! ఋషభుని అనంతరం ఆయన పెద్ద కుమారుడైన భరతుడు ఈ భూమండలానికి రాజయ్యాడు. రాజ్యపాలన సాగిస్తూ, రాజులలో గొప్పవాడైన విశ్వరూపుని కుమార్తె అయిన పంచజని అనే పేరుగల ఒక గొప్ప కన్యను ప్రీతితో ఒక శుభలగ్నంలో పెళ్ళి చేసుకొన్నాడు.

వ. ఇట్లు వివాహితుండై యా పంచజని వలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్ర భృత్సుదర్శనాచరణ ధూమ్రకేతువులను నేవురు పుత్రులం బుట్టించె; నటమున్న యజనాభంబను పేరం బరఁగు వర్షంబు భరతుండు పాలించు కతంబున భారత వర్షంబు నాఁ బరగె నంత.

93

తా ॥ అలా పెళ్ళాడిన పంచజనికి ఐదుగురు పిల్లలు పుట్టారు. వాళ్ళ పేర్లు సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆచరణుడు, ధూమ్రకేతువు. వీరు అహంకారం నుంచి పంచతన్మాత్రలు జనించినట్లు భరతుడికి కొడుకులై పుట్టారు.

భూతాది అనే అహంకారం నుంచి శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము – అనే పంచతన్మాత్రలు బయల్వెడినట్లు పంచజని యందు భరతుడికి జన్మించారు.

అంతకు ముందు ఈ భూభాగం పేరు అజనాభం. భరతుడు పరిపాలించింది మొదలు దీనికి "భరత వర్షం" అనే పేరు ఏర్పడింది.

క. భరతుఁడు నిజపిత లేలిన, కరణినిఁ గర్మముల నెల్లగైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను, ధరణీసురవరులు వొగడ ధరణీనాథా!

94

తా ॥ రాజా! భరతుడు తన తండ్రితాతల వలె ప్రజల్ని వాత్సల్యంతో పరిపాలించాడు. తన పూర్వులు చేసిన కర్మల్ని అన్నింటిని విడువకుండా ఆచరించాడు. శ్రీహరి యొక్క కృపతో ఇలా ధర్మబద్ధంగా పరిపాలన సాగించిన భరతుణ్ణి ఈ భూమిపై దేవతల వంటివారైన బ్రహ్మవేత్తలు ప్రశంసించారు.

సీ. భగవంతుఁడగు జగద్భరితు నల్పంబులు, నధికంబు లైన పెక్కధ్వరముల
దర్శపూర్ణిమలచేఁ దగను జాతుర్మాస్య, ముల నగ్నిహోత్రము వలనఁ గడఁకఁ
బశుసోమములచేతఁ బలుమాఱుఁ బూజించి, వేదోక్తమైన యా విమల కర్మ
ములఁ గల్గు ధర్మంబు బురుషోత్తమార్పణం, బుగఁ జేయుచును మఖంబులను మంత్ర
తే. ములను బలికెడు నా దైవములను శ్రీశు, నవయవంబులు గాఁగ భూధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ఘనత దలఁచి, యఖిల రాజ్యానుసంధానుఁ డగుచు నుండె.

95

తా ॥ ఈ జగత్తునంతటినీ భరిస్తున్న భగవంతుణ్ణి చిన్నవీ, పెద్దవీ అయిన అనేక యజ్ఞాలతోను; అట్టి యజ్ఞాలలో అగ్నిహోత్రం వలన దర్శపూర్ణమాసం, చాతుర్మాస్యం, పశుయాగాలు, సోమయాగాలను సైతం భరతుడు ఆచరించాడు. ఇలా ఎన్నోసార్లు పూజల్ని చేశాడు. వేదవిధానంగా నిర్మలమైన కర్మల్ని ఆచరిస్తూ కలిగిన ధర్మాన్ని భగవంతుడికి అర్పించేవాడు. యజ్ఞాలలో పలికే మంత్రాలను, ఆయా దైవాలను విష్ణువు యొక్క

శరీరాంగాలుగా భరతుడు భక్తితో భావించేవాడు. ఇలా ప్రతినిత్యం విడువకుండా యజ్ఞ కర్మల్ని ఆచరిస్తూ సకల రాజ్యపాలన గావించి గొప్ప ఖ్యాతి పొందాడు.

యజ్ఞస్వరూపుడు, క్రతు స్వరూపుడు అయినవాడు భగవానుడైన వాసుదేవుడు. యజ్ఞాలతో భరతుడు భగవంతుణ్ణే ఆరాధించాడు. యజ్ఞానికి చాతుర్హోత్రమని పేరు. ప్రధాన యాగానికి ముందు చెయ్యవలసిన ప్రాతస్సవనం మొదలైన మూడు సవనాల్ని ఆచరించి యాగాల్ని చేస్తూ ఉండాలి. యజ్ఞం ఒక కర్మ. అందుచేత కొద్ది సేపు ఉండి నశిస్తుంది. అయినా ఆ యజ్ఞాలచే ఆరాధింపబడిన భగవదనుగ్రహమే ఫలాన్ని ఇస్తుంది. ఈ విశ్వాసంతో ఇంద్రాది దేవతలలో అంతర్యామిగా ఉన్న భగవదారాధనగా భరతుడు యజ్ఞాల్ని చేశాడు. పరమపురుషుడికి అవయవభూతులుగా ఉండే దేవతలకు ఆరాధన చేసేవారి ద్వారా భగవంతుణ్ణే ఆరాధిస్తున్నాననే శ్రద్ధతో ఆరాధన చేసేవాడు. అట్టి యజ్ఞాలలో అగ్నిహోత్రంతో దర్శపూర్ణమాసం, చాతుర్మాస్యం, పశు–సోమయాగాల్ని సైతం అతడు చేశాడు. ఇలా యజ్ఞాల్ని ఆచరిస్తూ, ఆరాధింపబడేవాడు ఇంద్రాది దేవతా శరీరకుడైన వాసుదేవుడే అని భావిస్తూ, తమలో అంతర్యామిగా ఉన్న పరమాత్మయే యజ్ఞం చేసేవాడని తలుస్తూ, కర్మ సంబంధం అంటకుండా అతి నిపుణతతో యజ్ఞాల్ని ఆచరించాలి.

అధ్వర్యువు మొదలైనవారు హవిస్సుల్ని ఆయా మంత్రాలతో గ్రహించేప్పుడు ఆ యజ్ఞంలో భాగప్రతిగ్రహం చేసే దేవతల్ని పరమపురుషుడి యొక్క శరీరావయవాలుగా భావించి సమర్పించాలి. మహానుభావుడైన భరతుడు అలా చేశాడు.

క. ఈ రీతిఁ గర్మసిద్ధుల, నారయ నత్యంత శుద్ధ మగు చిత్తముతో
నా రాచపట్టి భరతుఁడు, ధారుణిఁ బాలించె నధిక ధర్మాన్వితుఁడై.



తా ॥ ఈ విధంగా పరిశుద్ధ కర్మాచరణం వల్ల భరతుడి అంతఃకరణం పవిత్రమైంది. ఇట్టి

పవిత్రచిత్తంతో ఆ రాకుమారుడు ధర్మనిష్ఠతో ఈ భూమిని పరిపాలించాడు.

వ. మఱియు నా భరతుండు శ్రీవత్స కౌస్తుభ వనమాలాలంకృతుండును, సుదర్శనాద్యాయుధోపలక్షి తుండును, నిజభక్తజన హృదయారవింద నివాసుండును, బరమ పురుషుండును నైన వాసుదేవుని యందు నధికభక్తి ననుదినంబును జేయుచుఁ నేఁబది లక్షల వేలేండ్లు రాజ్యంబు సేసి పితృ పితామహాద్యాయాతంబగు నా ధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచి యిచ్చి బహువిధ సంపదలు గల గృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె; నంత.

97

తా ॥ ఇలా నిత్యమూ భగవద్రూపాన్ని అనుసంధానం చేసుకోవడం వల్ల ఆ భరతుడికి శ్రీవత్స, కౌస్తుభ, వనమాలికలతో అలంకరింపబడినవాడు, సుదర్శనం మొదలైన ఆయుధాల్ని దాల్చినవాడు, తన భక్తుల హృదయపద్మాలలో నివసించేవాడు, పరమపురుషుడూ అయిన వాసుదేవుడి యందు అధికమైన భక్తి దినదినమూ తీవ్రమైంది. ఇలా ఏభైలక్షల వేల సంవత్సరాలపాటు భరతుడు రాజ్యపాలనం చేశాడు. తండ్రి తాతల నుంచి వచ్చిన ఆ రాజ్యధనాన్ని అర్హతకు తగినట్లు కొడుకులకు పంచిపెట్టాడు. సకల సంపదలను, రాజసౌధాలనూ వదలిపెట్టి తాను పులహాశ్రమానికి వచ్చేశాడు.

సీ. ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ, డచ్చటివారల నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు, నట్టి రమ్యంబైన యాశ్రమమున
నిలిచి సాలగ్రామములు గల గండకీ, నది యెందు నెంతయుఁ గదిసి యుండు
నచ్చోట నేకాకి యగుచును భరతుండు, బహువిధ నవపుష్ప పల్లవముల

తే. నతుల తులసీ దళంబుల నంబువులను, గందమూలాది ఫలములఁ గంజములను
ఘనత నర్పించు నిచ్చలుఁ దనివిలేక, సేవ సేయుచు నుండె నా శ్రీశు హరిని.

98

తా ॥ పులహాశ్రమంలో లక్ష్మీవల్లభుడైన శ్రీమహావిష్ణువు భక్తులమీద వాత్సల్యంవల్ల ఒక రూపాన్ని ధరించి ఎప్పుడూ దర్శనమిస్తూ ఉంటాడని చెబుతారు. అట్టి రమ్యమైన ఆశ్రమ సమీపంలో గండకీనది ప్రవహిస్తూ ఉంటుంది. అక్కడ చక్రాలతో కూడిన శిలలో – అంటే సాలగ్రామాలు ఉంటాయి. (గండకీనదినే చక్రనది అనీ అంటారు) అక్కడ భరతుడు ఒక్కడూ ఉంటూ అనేక రకాలైనవీ అప్పుడే వికసించినవీ అయిన పూలతో, చివుళ్ళతో సాటిలేనట్టి తులసీదళాలతో, నీటితో, కందమూల ఫలాలతో, పద్మాలతో విష్ణువును ఘనంగా అర్చించి, సేవించేవాడు. నిత్యమూ సేవిస్తున్నా, అతనికి తనివితీరేది కాదు.

వ. దానం జేసి విగత విషయాభిలాషుండై శమదమాది గుణంబులు గలిగి యథేచ్ఛం జేసి యెడతెగక పరమపురుషుని పరిచర్యాభక్తి భరంబున శిథిలీకృత హృదయగ్రంథిం గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు, నానంద బాష్పనిరుద్ధావలోక నయనుండు నగుచు నిజస్వామియైన హరిచరణారవిందానుధ్యాన పరిచిత భక్తి యోగంబునం బరమానంద గంభీర హృదయంబను నమృత హ్రదంబున నిమగ్నుం డగుచుఁ దా నపుడు పూజించు పూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజిన వాసస్త్రిషవణ స్నానంబుల నార్ద్రకుటిల కపిశవర్ణ జటాకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుం డయిన పరమేశ్వరుని హిరణ్మయ పురుషునిగాఁ దలంచుచు నిట్లనియె.



తా ॥ ఇలా అర్చించడం వల్ల భరతుడికి విషయాలపై కోరిక పూర్తిగా నశించింది. దానితో ఇంద్రియనిగ్రహం కలిగింది. పరమ పురుషుడికి ఎడతెగకుండా ఇలా సేవచెయ్యడమే అతని ఇచ్ఛ అయింది. మరే కోరికలు లేవు. భగవంతుడిపై భక్తి నిర్భరత అంతకంతకు వృద్ధి పొందింది. అతడి మనస్సు శిథిలమైంది. సంతోషంతో ఒళ్ళు పులకరించేది. కన్నులానందబాష్పాలతో నిండేవి. తన స్వామియైన హరి పాదపద్మాలనే తలుస్తూ, ఆ భక్తితోనే ఆక్రమింపబడిన మనస్సు కలవాడయ్యాడు. ఆ యోగంలో అంతకంటే ఇతరమైన ఆనందం ఏదీ మరి లేనివాడై, అట్టి

పరమానంద హృదయమనే అమృతపు మడుగులో మునిగిపోయేవాడు. అలా భక్తిలో మునిగి, తాను చేస్తున్న పూజను కూడా తెలుసుకొనేవాడు కాదు. ఇలా భరతుడు భగవద్వ్రతనిష్ఠుడై లేడి చర్మాన్ని బట్టగా ధరించాడు; మూడు కాలాలలోనూ స్నానం వల్ల జుత్తు తడిగానే ఉండి జటలు కట్టి ప్రకాశించేది, ఎర్రబారి కపిలవర్ణంలో ఉండేది. సూర్యుడు ఉదయించేసరికే లేచి సూర్యమండలాంతర్వర్తి అయిన పరమేశ్వరుణ్ణి హిరణ్మయమూర్తిగా తలుస్తూ ఇలా స్తుతించేవాడు:

సీ. కర్మఫలంబులఁ గడఁక నిచ్చుచు మనో, వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములఁజేసి యా లోకములకు నంతర్యామి, యగుచుఁ బ్రవేశించి యంత మీఁద
నానంద రూప మైనట్టి బ్రహ్మముఁ గోరు, చున్న జీవునిఁ దనమహిమ యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలన సేయు, చుండి యంతటను మర్తాండమధ్య

ఆ. వర్తి యగుచు నిట్లు వఱలుచు జగముల, యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతుల దివ్యమూర్తియైన యానంద రూ, పమును శరణ మొందె భరతవిభుఁడు.

100

తా ॥ "ఆనంద స్వరూపుడు, దివ్యమూర్తి అయిన సర్వేశ్వరుడు జీవులకు వాటి బుద్ధివృత్తుల వల్లనే ఫలాలనిస్తూ, మనస్సంకల్పం చేత అఖిల లోకాలను సృష్టిస్తాడు. సృష్టించిన ఈ జగత్తులోనికి అంతర్యామియై ప్రవేశిస్తాడు. సృష్టికి మూలమైన బ్రహ్మను, జీవుని కూడ తనలోని యోగశక్తులతో నిత్యం పాలిస్తూ ఉంటాడు. అతడే సూర్యమండలంలో తిరుగుతున్న పరబ్రహ్మం. అతడు ఈ లోకాలలో ఉంటాడు. ప్రకృతిలో ఉంటాడు. కాని దేనినీ పొందడు. అన్నిటికీ అతీతుడు. అట్టి పరమేశ్వరుణ్ణి శరణుకోరుతున్నాను" అని భరతుడు ఉపాసించాడు.

వ. అంత నాభరతుం డొక్కనాఁ డా మహానదిం గృతాభిషేకుండయి ముహూర్త త్రయం బంతర్జలంబు లందుఁ బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున నిర్భరగర్భిణియగు నొక్క హరిణి జలార్థినియై యొంటి జలాశయ సమీపంబునకు వచ్చి, జలపానంబు

సేయునెడ నా సమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబు సేయ నాహరిణి స్వభావంబున భీత యగుటం జేసి బెగ్గడిలి హరివిలోకనవ్యాకుల చిత్తయై దిగ్గన నదరి గగనంబునకు నెగిరి, యపగత తృష యగుచు నది నుల్లంఘించు నెడ నధిక భయంబునం జేసి యా గర్భంబు యోని ద్వారంబున గళితంబై జలంబులం బడియె; నా హరిణి యుల్లంఘనాది భయంబునం జేసి తత్తీరంబున నుండు గిరిదరింబడి శరీరంబుఁ బాసె; నంత నా హరిణపోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గను విచ్చి చూచి కరుణార్ద్ర చిత్తుండై మృత జనని యగు నా హరిణపోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతిం జేసి యుపలాలనంబు సేయుచుండఁ బోషణ పాలనప్రీణన లాల నానుధ్యానంబుల భరతునకు నాత్మనియమంబు లైన అష్టాంగయోగంబులును బరమ పురుష పూజా పరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్ని దినంబులకు సమస్తంబును నుత్సన్నం బయ్యెఁ; నంత.

101

తా ॥ ఇలా ఉంటూ ఉండగా ఒకనాడు భరతుడు ఆ మహానది చక్రతీర్థంలో స్నానం చేసి నిత్యం ఆచరించే ప్రణవజపాన్ని చేసుకొంటూ మూడు ముహూర్తాల కాలం ఆ నీటిలో ఉన్నాడు. ఆ సమయంలో నిండు గర్భిణియైన ఒక లేడి నీరు త్రాగుతూ ఉండగా దగ్గరలో నుంచి ఒక సింహం లోకభీకరంగా గర్జించింది. లేడిది సహజంగా బెదిరిపోయే స్వభావం. అదిరి పడింది. సింహాన్ని చూసింది. మనస్సు వ్యాకులమైపోయింది. దాహం తీరనే లేదు. ఒక్క ఉదుటను పైకెగిరింది. దాటిపోవాలని గెంతింది. భయం పెరిగిపోవడం వల్ల దాని గర్భం కదిలిపోయి యోనిద్వారం గుండా స్రవించి నీళ్ళల్లో పడింది. కంగారుగా ఎగిరి గెంతడం వల్ల, భయం వల్ల శ్రమ తట్టుకోలేక ఆ లేడి చక్రనదీతీరంలోని ఒక కొండ సమీపం వరకు పరుగెత్తి అక్కడ పడి ప్రాణాలు విడిచింది. దాని గర్భంలో నుంచి నీటిలో జారిపడ్డ లేడిపిల్ల ప్రవాహంలో తేలుతోంది. భరతుడు కళ్ళు విచ్చిచూశాడు. తల్లిలేని ఆ లేడిపిల్ల యొక్క స్థితికి భరతుడి మనస్సు దయతో తడిసిపోయింది. దాన్ని తన ఆశ్రమానికి తీసుకుపోయాడు. ఎంతో ప్రేమతో ఆ లేడిపిల్లను

లాలిస్తూ, పోషిస్తూ, సంరక్షిస్తూ దానిపై మమకారాన్ని పెంచుకొన్నాడు. నిత్యమూ ఆ లేడిపిల్ల ధ్యానమే. దానివల్ల క్రమక్రమంగా భరతుడి అష్టాంగయోగాలు, పరమేశ్వరుడికి చేసే పరిచర్యలూ ఒక్కొక్కటీ దూరమై, కొన్నాళ్ళకు సమస్తమూ జారిపోయాయి.

క. ఘనతపము చలన మొందుట, యును భరతుం డెఱుఁగ కాత్మయోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతముఁ, దన మదిలో నిల్పి ప్రీతి దప్పక పలికెన్.

102

తా ॥ ఇలా గతంలో తాను చేసిన మహా తపస్సు ఇప్పుడు స్థిరం తప్పిందని భరతుడు తెలుసుకోలేకపోయాడు. ఆత్మలో యోగనిష్ఠకు బదులు లేడిపిల్లమీది ప్రేమయే స్థిరపడిపోయింది. ఆ ప్రేమతో ఇలా అనుకొన్నాడు:

ఉ. అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి, నాయెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమఁ జేసి చరియించుచు నున్నది; నాదు సన్నిధిన్
మక్కువ చేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్.

103

తా ॥ "అరెరే! ఈ అర్భకురాలైన లేడికి ఆప్తులెవ్వరూ లేరు. ఏ దిక్కూ లేకపోవడం వల్ల నేనిలా తీసుకొనివచ్చి సాకడం వల్ల నాపై ఈ పసికూన ఎంతో ప్రేమ పెంచుకొని నా దగ్గర తిరుగాడుతోంది. దీనిని మరింత గారంగా, మక్కువ చేస్తూ పెంచి రక్షిస్తాను.

క. శరణని వచ్చిన జంతువుఁ, గరుణం గను విచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని మున్, కర మెఱిఁగించెను మునీంద్రగణములు ప్రేమన్.

104

తా ॥ పూర్వం గొప్ప ఋషిపుంగవులందరూ కూడా "దిక్కు నువ్వే" అని వచ్చిన జంతువును దయతో కనులు విచ్చి చూసి కాపాడాలని, అదే అధికమైన పుణ్యమనీ ఎంతో ప్రేమగా చెప్పారు".

వ. అని యిట్లు హరిణపోతంబుం దన యాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసన శయనాటనస్నాన సమిత్కుశ కుసుమ ఫల పలాశ మూలోదకాహరణ దేవపూజాజపాదుల యెడం దన యొద్దన యునిచి కొనుచు, వృక సాలా వృకాది క్రూరమృగంబుల వలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధిక ప్రణయభర పరీతహృదయుం డగుచు నతి స్నేహంబునం జేసి కొంతసేవు స్కంధంబుల వహించుచు, మఱి కొంత తడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలించుచు సంతసంబు నొందు; మఱియు నా భరతుండు నిత్య నైమిత్తికాది క్రియాకలాపంబు నిర్వర్తించు నెడ నంత నంత లేచి హరిణకుణకంబుం జూచుచుఁ గించిత్స్వస్థ హృదయుండై దాని నాశీః పరంపరల నభిసంధించుచుఁ జుంబనాదులం బ్రీతి సేయుచు నతిమోహంబునం బెంచుచుండునెడ.

105

తా ॥ అనుకొంటూ భరతుడు ఆ లేడిపిల్లపై ఆసక్తి మరీ పెరగడంతో తాను కూర్చున్నా, పడుకొన్నా, స్నానం చేసినా, తాను సమిధలకు, దర్భలకు, పూలకు, పళ్ళకు, మోదుగు కర్రలకు, దుంపలకు, నీళ్ళకు వేటికోసం ఎక్కడకు వెళ్ళివచ్చినా, దేవపూజ చేసినా, జపతపాలు చేసినా ఆ లేడిపిల్లను తనదగ్గరే పెట్టుకొని ఉండేవాడు. తోడేళ్ళవంటి క్రూరమృగాల భయంవల్ల దాని వెనువెంటనే తిరిగేవాడు. దానిపై ప్రేమ భారం అతని ఎదలో మరింత పెరిగింది. అతిస్నేహం వల్ల ఆ లేడిపిల్లను కొంతసేపు భుజాలపై ఎక్కించుకొని మోసేవాడు. ఇంకొంచెంసేపు గుండెమీద, మరికొంచెంసేపు ఒడిలోను పెట్టుకొని లాలిస్తూ పొంగిపోయేవాడు. ఇంకా తాను సంధ్యావందనం, దేవతారాధనం మొదలైనవి ఆచరించేటప్పుడు సైతం మధ్యమధ్యలో లేచి ఆ లేడిపిల్లవైపే చూసేవాడు. అలా చూస్తేనే అతని హృదయం కుదుటపడేది. ఆ లేడి సుఖంగా

ఉండాలని దానిని అనేకాశీస్సులతో అభినందించేవాడు. ముద్దులు పెట్టుకొని ప్రీతి చేసేవాడు. ఇలా అతి మోహంతో దాన్ని పెంచేవాడు.

చ. గురువులు వాటి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంత నంత డ
గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసి సేయుచున్
నొఱగుచు ధారణీశ్వరుని యూరువులన్ శయనించి యంతలో
నఱకడ యెక్కుచుం బొదలి యాడుచు నా హరిణంబు లీలతోన్.

106

తా ॥ ఆ లేడిపిల్ల చాలా వేగంతో పరుగులెత్తి పెద్దగా ఉరికేది. కొమ్ములతో చిమ్మేది. అంతలో దగ్గరకు వచ్చేది. కాలితో త్రవ్వేది. గోళ్ళతో గీరేది. బాధపెట్టేది. వాలిపోయేది. ఆ రాజు ఒడిలో పరుండేది. అంతలో భుజాలకెక్కేది. ఇలా ఎన్నో గారాలు పోతూ ఆడుకొనేది.

తే. గరిమ నీ రీతి మెల్లన కెరలు వొడిచి, చెలఁగి యాడంగ భరతుండు చిత్తమందు
సంతసిల్లుచునుండె నాశ్రమముఁ బాసి, హరిణడింభక మంతలో సురిఁగి చనిన.

107

తా ॥ ఈ విధంగా లేడిపిల్ల భరతుని దగ్గర చెలరేగుతూ ఆడుకొనేది. దాని లీలల్ని చూసి అతడు మదిలో సంతోషించేవాడు. ఇలా ఆడుతూ ఆడుతూ ఆ లేడిపిల్ల గెంతుకొంటూ ఎటో పారిపోయింది.

వ. భరతుండంతం దన్మృగశాబకంబు గానంబడమికి వ్యాకులచిత్తుం డగుచు నష్టధనుండునుం బోలె నతిదీనుండై కరుణతోడం గూడి తద్విరహవిహ్వల మతియై దానిన తలంచుచు నతిశోకంబుతో మనంబున దుఃఖించి యిట్లనియె.

108

తా ॥ ఆ లేడిపిల్ల కనిపించకపోయేసరికి భరతుడి మనస్సు పాడైంది. ధనం పోయినవాడిలా అతిదీనుడు అయిపోయాడు. కరుణతో దాని ఎడబాటుకు అతని బుద్ధి పాడైంది. దాన్నే తలుస్తూ ఎంతో జాలిగా, శోకంతో మనస్సులో దుఃఖీస్తూ ఇలా అన్నాడు:

తే. హరిణపోతంబ! నీకు వనాంతమందుఁ, గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ,
దలఁగి పోయితె? యనుచుఁ జిత్తంబునందు, రాజవృషభుఁడు భరతు డారాట మొంది.

109

తా ॥ "ఓ లేడికూనా! నీకీ అడవిలో క్రూరమృగాల బాధ లేకుండా ఉండాలని నేను కోరుకొంటూ ఉంటే నువ్వెక్కడికి వెళ్ళిపోయావు?" అని రాజర్షియైన భరతుడు తన మనస్సులో ఆరాటపడ్డాడు.

తే. తల్లి చచ్చిన హరిణపోతంబు వచ్చి, పుణ్య హీనుండ నగు నన్నుఁ బొంది పాసె,
నేమి సేయుదు? నే నింక నెట్లు గందుఁ?, జేరి యే రీతిఁ గాంచి రక్షించుకొందు?

110

తా ॥ "తల్లిలేడి చనిపోయింది. ఈ పిల్ల పుణ్యంలేని నేను రక్షిస్తానని నమ్మి నన్ను చేరింది. ఇంక నేను దాన్ని ఎలా చూడగల్గుతాను? ఎలా రక్షించుకొంటాను?

క. కట్టా! యీ యాశ్రమమునఁ, బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం
బిట్టట్టుఁ దిరుగు చుండఁగఁ, బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించె నొకో!

111

తా ॥ అయ్యో! ఈ ఆశ్రమంలో మొలిచిన గడ్డి పరకల్ని మేసి హాయిగా అటుఇటు తిరిగే ఆ లేడిని పట్టి ఏ సింహమైనా కొట్టి బాధించిందో! ఏమో!"

వ. ఇట్లు భరతుండు హరిణకుణక క్షేమంబు గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచు?

నానా ప్రకారంబులైన తన గతులచేత నన్ను నెప్పుడానందంబు నొందించు? ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోకుచు నుండు; నట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు? దేవ పూజా ద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి చూచినం గుమారుండునుంబోలె దూరంబునకుం జని నిలిచి మరల నేఁ బిలిచిన వెనుక నిలిచియుండు; నిట్టి మెలఁకువ స్వభావంబు గలుగుట యెట్టు? లీ భూదేవి యెంత తపంబు చేసినదియో? ఏ హరిణ పాదస్పర్శంబులం బవిత్రమైన భూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హయగు నట్టి హరిణ పోతంబు నెట్లు గనుఁగొందు? నదియునుంగాక భగవంతుడగు చంద్రుండు మృగపతిభయంబున మృత జననియు, స్వాశ్రమపరిభ్రష్టంబునైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో! మున్ను పుత్ర వియోగతాపంబును జంద్రకిరణబులం బాపుదు; నిపుడు హరిణపోతంబు దన శరీర స్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికం బగుచుం బుత్ర వియోగతాపంబు నివర్తింపఁజేసె ననుచుం బెక్కు భంగుల హరిణ నిమిత్తంబులైన మనోరథంబుల చేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబు వలన విభ్రంశితుం డగుచు నితరజాతింబుట్టిన హరిణపోతంబు మీఁది మోహం బగ్గలం బగుచుండ నుండెనని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె.

112

తా ॥ అని భరతుడు ఆ లేడిపిల్ల క్షేమాన్ని కోరుతూ “ఎప్పుడు వచ్చి నన్ను సంతోష పెడుతుంది? పెక్కు విధాల దూకుతూ నన్నెప్పుడు ఆనందింపచేస్తుంది? నేను ధ్యాన సమాధుల్లో ఉన్నప్పుడు నన్ను తన కొమ్ములతో గోకేది. అటువంటి ముచ్చట్లు ఎప్పుడు మళ్ళీ చూస్తాను? దేవుడి పూజకు సిద్ధం చేసుకొన్న ద్రవ్యాల్ని త్రొక్కి వాసన చూస్తూ ఉంటే నేను కోపంగా చూసేవాణ్ణి. నా చూపులకు కన్నకొడుకులా భయంతో దూరంగా వెళ్ళి నిల్చుని, మళ్ళీ నేను పిలిస్తే వచ్చి వెనుక నిలిచి ఉండేది. ఇలాంటి సందడి ఇంక ఎలా కన్పిస్తుంది? ఆ లేడి యొక్క పవిత్రమైన పాదాల స్పర్శ తాకడానికి ఈ భూదేవి ఎంత తపస్సు చేసిందో! స్వర్గాన్నీ, మోక్షాన్నీ కోరి యజ్ఞాలు చేసే మునులకు అర్హమైనట్టి ఆ లేడిపిల్లను ఎలా చూస్తాను?

తన పవిత్రమైన గిట్టలచే ఈ భూమిపై తిరిగి భూమిని పవిత్రం చేసి యజ్ఞార్హమైన క్షేత్రంగా చేసిందది. ఎంతటి ప్రేమ భరతుడికి ఆ లేడిపిల్లపై!

అంతట చంద్రోదయమయింది. హరిణాంకుడైన చంద్రుణ్ణి చూశాడు. ఇలా అనుకొన్నాడు —

"భగవంతుడైన చంద్రుడు సింహభయంతో తల్లి చనిపోగా, నా ఆశ్రమంలో ఉంటూ ఎక్కడికో

దారితప్పిపోయినట్టి పిల్లలేడిని పట్టుకొనిపోయి తన దగ్గర పెట్టుకొని పెంచుకొంటున్నాడా? గతంలో నేను పుత్రులకు దూరమై రావడం వల్ల కల్గిన తాపాన్ని చంద్రకిరణాల వల్ల పోగొట్టుకొన్నాను. లేడిపిల్ల వచ్చి నన్ను తాకుతుండడం వల్ల చంద్రకిరణాలు నన్ను తాకిన దానికన్నా ఎక్కువ సుఖాన్ని పొందాను. పుత్రవియోగ తాపాన్ని మృగశాబక స్పర్శ పోగొట్టింది."

— అనుకొంటూ భరతుడు లేడి కారణంగా బహువిధాల కోరికలతో సతమతమయ్యాడు. పూర్వకర్మవశం వల్ల యోగభ్రష్టుడయ్యాడు. భగవంతుణ్ణి ఆరాధించడం మానివేశాడు. నరజాతి కాకుండా ఇతర జాతిలో పుట్టిన లేడిపిల్లపై అతడికి మోహం మరింత తీవ్రమైంది."

— అని శుకయోగి చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

సీ. జననాథ! మున్ను మోక్షవిరోధ మని పాయ, ఁగా రాని పుత్రాదికంబునెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణ శా, బక పోషణంబునఁ బాలనమున
నతి లాలనప్రీణనానుషంగంబుల, మూషకబిల మతిరోషమునను
సర్పంబు సొచ్చిన చందంబునను యోగ, విఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ

ఆ. గాన నెంతవానికైనను గాలంబు, గడవ రామి నట్లు గాక పోదు

పరమమునుల కైనఁ బాయవు కర్మంబు, లొరు లనంగ నెంత? నరవరేణ్య!

113

తా ॥ “ఓ పరీక్షిన్మహారాజా! భరతుడు గతంలో తన మోక్షమార్గానికి విరోధులని విడిచిపెట్టరాని కొడుకులు మొదలైనవాళ్ళందరినీ విడిచిపెట్టాడు. తపస్వి అయ్యాడు. బాలమృగాన్ని పోషించాలని, సంరక్షించాలని దాని లాలనలో, ప్రేమలో – ఒక ఎలుక సుఖంగా ఉండాలని కన్నంలోకి దూరితే ఆ కన్నంలో అంతకుముందే ఒక పాము ఉండటం వల్ల దాని బారిన పడినట్లు పడి, పూర్తిగా యోగానికి ఆటంకాన్ని తెచ్చుకొన్నాడు. కనుక ఎంతటివాడికైనా కాలాన్ని దాటిపోవటం కానిపని. పరమ మహర్షులకైనా కర్మ ఎలా ఉంటే అలా జరిగితీరుతుంది. అలాంటప్పుడు నరులంటే ఎంతటివారు!

వ. ఇట్లు భరతుండు మృగవియోగ తాపంబు నొందుచుండు నెడ నా మృగశాబకంబు సనుదెంచిన సంతసిల్లుచుండె; నంత నొక్కనాఁడు.

114

తా ॥ భరతుడు ఇలా బాలమృగం యొక్క ఎడబాటు వల్ల కలిగిన తాపంతో ఉన్నాడు. ఎక్కడైనా లేడిపిల్ల (ఇంకొకటి) కనిపిస్తే దాన్ని చూసి సంతోషించేవాడు. ఇలా ఉండగా ఒకనాడు.

## 8. భరతుడు జింకపిల్లగా జన్మించుట

మ. భరతుం డల్లన నంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పు డా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్.

115

తా ॥ భరతుడికి వేగంగా అవసానదశ వచ్చింది. తండ్రి కొడుకుకోసం ఎదురు చూసినట్లు భరతుడు తన దగ్గర ఆ లేడిపిల్ల ఉన్నట్లే భావించి ఎంతో భక్తితో, ఎంతో ఆసక్తిగా చూడసాగాడు. దానినే తన ఆత్మలో నిలుపుకొని దేహాన్ని విడిచిపెట్టాడు. ప్రాణం పోయేటప్పుడు లేడినే తలుచుకోవడం వల్ల గతస్మృతితో ఒక లేడి గర్భంలో పడి లేడిపిల్లగా జన్మించాడు.

వ. ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధనసామర్థ్యంబునం దన మృగత్వకారణంబుఁ దెలిసి కడుం దాపంబు నొందుచు నిట్లనియె.

116

తా ॥ ఇలా భరతుడు, లేడి పుట్టుక పుట్టినా పూర్వజన్మలో భగవంతుణ్ణి ఆరాధించడంలో సమర్థుడైనందువల్ల తానెందుకు లేడిగా జన్మించవలసి వచ్చిందో తెలుసుకొన్నాడు. ఎంతగానో బాధపడుతూ ఇలా అనుకొన్నాడు:

ఉ. రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యా హరిణ దేహమునందలి ప్రీతిఁజేసి నా
యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై.

తా ॥ "రాజులు నన్ను కీర్తిస్తూ ఉండగా వసురాజుతో సమానుణ్ణై నా కొడుకుల్ని రాజ్యపాలకుల్ని చేశాను. మహర్షులు నన్ను రాజర్షి అని కొనియాడారు. అట్టి తేజస్సును పొంది కూడా లేడి శరీరంపై ప్రీతి ఏర్పడడం వల్ల నా ఓజస్సు నశించింది. యోగభ్రష్టుణ్ణై బేలనయ్యాను.

వ. ఇట్లు శ్రీహరి శ్రవణ మనన సంకీర్తనారాధనానుస్మరణాభియోగంబులం జేసి యశూన్య సకలయామంబగు కాలంబు గల నాకు హరిణపోతస్మరణంబు కతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యెఁ; మోక్షదూరుండనైతి నని నిగూఢ నిర్వేదుం డగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీల మునిగణ సేవితంబయి భగవత్క్షేత్రంబైన సాలతరునిబిడ తమ గ్రామసమీపపులస్త్య పులహాశ్రమంబునకుం గాలాంజన పర్వతంబు వలనఁ జనుదెంచి యందు మృగదేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకి యగుచు శుష్క పర్ణ తృణవీరు దాహారుండై మృగత్వనిమిత్తం బగు నా నదీతీర్థంబు నందుఁ దత్తీరోదక క్లిన్నంబగుచు నుండు శరీరంబు విడిచె నని శుక యోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు వినిపించి మఱియు నిట్లనియె.

118

తా ॥ శ్రీహరినే సతతమూ వింటూ, మనస్సులో ధ్యానం చేస్తూ, సంకీర్తనం చేస్తూ, ఆరాధిస్తూ, స్మరిస్తూ ఒక్క క్షణం కూడా భక్తియోగం విడువకుండా కాలం గడిపాను. అంతటి నాకు లేడిపిల్లను తలుచుకోవడం వైపే మనస్సు మరలింది. నా యోగానికి విఘ్నం దాపురించింది. మోక్షానికి దూరమైపోయాను" – అని లోలోన కుమిలిపోతూ, తల్లిలేడిని విడిచిపెట్టి; మనస్సును ఉపశమింపచేసేదీ, మునులు నిత్యం సేవించేదీ, భగవంతుని క్షేత్రమూ, మద్ది చెట్లతో బాగా దట్టంగా క్రమ్ముకొన్నదీ అయిన పులస్త్య పులహాశ్రమానికి కాలాంజన పర్వతం ద్వారా లేడిపిల్లగా పుట్టిన భరతుడు వచ్చేశాడు. అలా వచ్చి లేడి శరీరాన్ని విడిచిపెట్టాలని ఒంటరిగా అవసాన సమయం కోసం ఎదురు చూస్తూ, సంగాన్ని విడిచిపెట్టి,

ఎండుటాకులు, గడ్డి పరకలు మేస్తూ ఆ చక్రనదీ తీర్థంలో స్నానం చేసి ఉండగా భరతుడు ఆ లేడి శరీరాన్ని విడిచిపెట్టాడు.

## 9. భరతుడు బ్రాహ్మణకుమారునిగా జన్మించుట

సీ. హరిణ దేహముఁ బాసి యంత నాంగిర సాహ్వ, యుండు శుద్ధుఁడుఁ బవిత్రుండు ఘనుఁడు
మదమఘనతపస్స్వాధ్యాయ నిరతుండు, గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు
నైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి, సంగంబు వలనను జకితుఁ డగుచుఁ
గర్మ బంధంబుల ఖండింపఁ జాలు నీ, శ్వరుని నచ్యుతు నజు శ్రవణ మనన

తే. ములను హరిచరణధ్యానములను విఘ్న, భయమునను జేసి మనమందుఁ బాయనీక
నిలిపి సంస్తుతి సేయుచు నిలిచి యుండె, భరితయశుఁడైన భరతుండు పార్థివేంద్ర!

119

తా ॥ ఓ రాజా! కీర్తిమంతుడైన భరతుడు లేడి శరీరాన్ని విడిచిపెట్టాక, ఆంగిరసుని వంశంలో జన్మించిన ఒక బ్రాహ్మణుడికి పుత్రుడిగా జన్మించాడు. ఆ ఆంగిరసుడు పరిశుద్ధమైన స్వభావం కలవాడు, పవిత్రుడు, గొప్పవాడు, శమదమాదులు గలవాడు, స్వాధ్యాయ అధ్యయనపరుడు, గుణవంతులలో శ్రేష్ఠమైనవాడు, నీతిమంతులలో పండితుడు; ఇట్టి శ్రోత్రియుడికి కొడుకుగా పుట్టి భరతుడు తనవాళ్ళతో సంగం ఉంటే మళ్ళీ ఏ పతనం వస్తుందోనని భయపడుతూ ఉండేవాడు. కర్మబంధాల్ని త్రెంపగలిగిన ఈశ్వరుడు అచ్యుతుడు. బ్రహ్మ అయిన శ్రీహరి యొక్క పాదాలనే ధ్యానం చేసుకొనేవాడు. ఆ హరిచరణ ధ్యానానికి విఘ్నం కలుగుతుందేమోననే భయంతో తన మనస్సులో సుస్థిరంగా నిలిపి హరిని స్తుతిస్తూ ఉండేవాడు.

వ. ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబును, గనిష్ఠ భార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగం జేసిన నందుఁ బురుషుండు పరమ భాగవతుండును రాజర్షి ప్రవరుండును నుత్సృష్ట మృగశరీరుండను జరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగు

భరతుండయ్యె; నతం డా జన్మంబున నన్యజన సంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంత భయంబు నొంది కర్మబంధ విధ్వంసన శ్రవణస్మరణాదుల శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దన స్వరూపంబు నున్మత్తజడాంధబధిర రూపంబుల లోకులకుం జూపుచుండె, నంత.

120

తా ॥ ఈ ఆంగిరసుడికి ఇద్దరు భార్యలు. మొదటి భార్యకు తొమ్మండుగురు మగపిల్లలు పుట్టారు. చిన్న భార్యకు ఆడపిల్ల, మగపిల్లడు పుట్టారు. చిన్న భార్య కొడుకు పరమ భాగవతుడు, రాజర్షులలో శ్రేష్ఠుడు, మృగశరీరాన్ని వీడి బ్రాహ్మణ శరీరాన్ని పొందినవాడు, ఇదే చివరి శరీరంగా పొందినవాడు, బ్రాహ్మణదేహం గలవాడూ అయినట్టి భరతుడు. శ్రీహరి దయవల్ల అతనికి పూర్వజన్మల క్రమం స్మరణ ఉంది. దానిని స్మరిస్తూ అతడు బంధవిముక్తికోసం ఉన్మత్తునివలె పిచ్చెక్కిన జడుని వలె, చెవిటివాని వలె లోకులకు కన్పించేవాడు.

మ. జనకుండాంగిరసుండు నాత్మజుని వాత్సల్యంబునం బెంచుచుం
దనరం జౌలముఖాగ్ర్య కర్మముల చేతన్ సంస్కృతుం జేసి పా
యని మోహంబున నిచ్చలుం గడఁక శౌచాచారముల్ సెప్పినన్
ఘనుఁ డా భాగవతుం డసమ్మతిని దత్కర్మంబులం గైకొనెన్.

121

తా ॥ ఆంగిరసుడు తండ్రి కావడం వల్ల భరతుణ్ణి వాత్సల్యంగా పెంచుతూ, చౌలం మొదలుగా చెయ్యవలసిన ముఖ్యకర్మలన్నింటినీ చేసి, సంస్కారవంతుణ్ణి చెయ్యాలని, కొడుకుపై వీడలేని మోహంతో నిత్యం శౌచ సదాచారాలను నేర్పాడు. తనకిష్టం లేకపోయినా తండ్రి చెప్పే ఆ కర్మలన్నింటిని భరతుడు విధేయతతో స్వీకరించాడు.

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్చలేక యుండియును బితృనియోగ

నిర్బంధంబునం బితృసన్నిధి యందు యసమీచీనంబుగా వ్యాహృతి ప్రణవ శిరస్సహితం బగునట్లు గాయత్రీ మంత్రోపదేశంబు నొంది చైత్రాది చతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల నధ్యయనంబు సేయుచుండె; జనకుండాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింపవలయు నను లోకాచారంబు ననువర్తించి యాత్మభూతుండగు నాత్మజునందు నభినివేశిత చిత్తుం డగుచు శౌచాచమనాధ్యయన వ్రత నియమగుర్వనల శుశ్రూషణాదికంబుల ననభియుక్తంబు లయినం బుత్రునిచే నొనరింపించుచు నప్రాప్తమనోరథుం డయ్యె; నంత.

122

తా ॥ ఈ విధంగా ఆ బ్రాహ్మణ కుమారుడైన భరతుడు కర్మలను ఆచరించడం పట్ల కోరిక లేకున్నా తండ్రి చెప్పాడనే నిర్బంధం వల్ల గాయత్రీ మంత్రోపదేశాన్ని పొందాడు. చైత్రమాసం నుండి నాలుగు మాసాలు మిగిలినవాళ్ళతో కలిసి వేదాల్ని అధ్యయనం చేసేవాడు. ఆంగిరసుడు కొడుక్కి పెద్దల నుంచి వచ్చిన ఆచారాల్ని చెప్పాలన్న లోక సంప్రదాయం ప్రకారం తన కుమారుడైన భరతుడికి శౌచాచమనాన్ని, వేదాధ్యయనాన్ని, వ్రత నియమాల్ని, అగ్ని ఆరాధన మొదలైన ఆచారాల్ని చెప్పేవాడు. భరతుడికి ఇవేమీ అంగీకారం లేవు. అందువల్ల కొడుకు చేత చేయిస్తున్నా, ఆంగిరసుడికి కొడుకును పెద్దల సంప్రదాయంలో నడిపించాలన్న కోరిక తీరనే లేదు.

క. ఈ రీతిని గొడుకున కా, చారంబులు గఱపి చింత సద్గ్రహమున సం
సారి యగుచుండి విప్రుడు, బోరన దేహంబుఁ బాసి పోయినమీఁదన్.

123

తా ॥ ఆంగిరసుడు తన కొడుక్కి పూర్వాచార ప్రవర్తనకు చెందిన ఉపదేశాలనిస్తూ అతడు పట్టించుకోకపోయే సరికి బెంగపడ్డాడు. సంసారియైన ఆ విప్రుడు కొన్నాళ్ళకు దేహాన్ని విడిచిపెట్టాడు.

ఆ. తల్లి తండ్రితోడఁ దా నగ్నిఁ జొచ్చిన, నతని మహిమ లెఱుఁగ కంతలోన
సవతి తల్లి కొడుకు లవినీతు లగుచును, శాస్త్రవిద్య లతనిఁ జదువనీక.

124

తా ॥ భరతుడి తల్లి పతితో సహగమనం చేసింది. భరతుడి మహిమలు అతని (సవితి) సోదరులకు తెలియవు. వారు అవినీతిపరులై భరతుణ్ణి శాస్త్రవిద్యలు చదవనీయలేదు.

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లి కొడుకులు వేద విద్యల వలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన.

125

తా ॥ ఈ విధంగా విప్రకుమారుణ్ణి సవితి తల్లి కొడుకులు చదువు మానిపించి, వేదాధ్యయనాన్నీ మానిపించి, ఇంటి పనులు చెయ్యమని నియమించారు.

క. ధరణీసురోత్తముఁడు దా, నరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే
మఱ కందుఁ బ్రీతిసేయక, నిరతము గృహకర్మ మట్లు నెఱపుచు నుండెన్.

126

తా ॥ భరతుడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు. అన్నలు చెప్పిన ఇంటి పనుల్ని అన్నింటినీ; కర్మ చేయడంపై ఆసక్తి లేకపోయినా నిత్యమూ చేస్తూ ఉండేవాడు.

వ. ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు నుండ మూఢులగు ద్విపాత్పశువులచే నున్మత్త! జడ! బధిర! యని యాహూయమానుం డగునపుడు తదనురూపంబులగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలం జేసి విష్టివేతన యాచ్ఞాదులవలన నియుక్త కర్మంబులం బ్రవర్తించుచు.

127

తా ॥ ఈ విధంగా ఇంటిపనులన్నింటినీ చేసే భరతుణ్ణి మూర్ఖులైన, రెండు పాదాల పశువులైన నరులు, “పిచ్చివాడా! జడుడా! చెవిటివాడా!” అని పిలిచేవారు. భరతుడు వాళ్ళ పిలుపులకు సరిపడే మాటలనే వినయంగా మాట్లాడేవాడు. ఇష్టానికి అనురూపంగా వాళ్ళ బరువుల్ని మోయడం, కూలిపని చేయడం, బిచ్చమెత్తడం మొదలైన పనులు చేస్తూ కాలం గడపసాగాడు.

తే. అతుల మృష్టాన్నమైనఁ గదన్నమైన,
నెద్ది వెట్టిన జిహ్వకు హితముగానె
తలఁచి భక్షించుఁగా; కొండు దలఁచి మిగులఁ,
బ్రీతి సేయఁడు రుచులందుఁ బెంపుతోడ.

128

తా ॥ సాటిలేని రుచులు కలిగిన అన్నాన్ని సమృద్ధిగా పెట్టినా, పాచిపోయిన అన్నాన్ని పెట్టినా ఒకే విధంగా మేలని భావించి తినేవాడు. ఏది పెట్టినా అతని నోటికి రుచుల తారతమ్యం పట్టేది కాదు. “ఇది బాగుంది, ఇది బాగులేదు” – అనే రుచుల ఎంపిక మానివేశాడు. నిర్మలంగా ఉండేవాడు.

వ. మఱియు నా విప్రుం డాత్మనిత్యానంద సుఖలాభంబు గలిగి సుఖదుఃఖంబులందు దేహాభిమానంబు సేయక శీతోష్ణ వాత వర్షాతపంబులకు నోడి పై చీరగప్పక వృషభంబునుం బోలెఁ బీనుందును గఠినాంగుండును నగుచు స్థండిలశాయియై రజఃపటలంబునం గప్పంబడిన దివ్యమాణిక్యంబునుం బోలె ననభివ్యక్త బ్రహ్మవర్చసుండై మలినాంబర పరీతకటితటుండు నతి మషీలిప్త యజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు మందుండునని పలుక సంచరించుచుండం గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు దమవారును వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్ర విహిత సమవిషమ న్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు నూఁక

తవుడు తెలికపిండి పొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁ గల ద్రవ్యంబుల యందు నమృతంబు పగిది రుచిసేసి భక్షించుచుం జేని కావలి యుండునెడ నొక్కనాఁడు.

129

తా ॥ ఇంకా ఆ బ్రాహ్మణుడు దేహం మీద అభిమానం లేకుండా ఎటువంటి సుఖదుఃఖాలకు లోనుగాకుండా సతతమూ ఆత్మానందసుఖంతో లాభపడేవాడు. చలిలో, ఎండలో, గాలిలో, వర్షంలో ఒంటిమీద ఏమీ ఆచ్ఛాదన వస్త్రం లేకుండానే ఎద్దులా తిరిగేవాడు. బలిసిన శరీరంతో కఠినమైన అవయవాలతో ఉండేవాడు. రాళ్ళ మీదనే పడుకొనేవాడు. ధూళిలో కప్పుకుపోయిన దివ్యమైన మణిలా అతడి బ్రహ్మవర్చస్సు బయటకు తెలిసేది కాదు. మొలకొక చిన్న గుడ్డ కట్టుకొని ఉండేవాడు. అదికూడా మాసిపోయి ఉండేది. మెడకు జందెం ఉండేది. అదీ మలినమయ్యే ఉండేది; ఆ యజ్ఞోపవీతాన్ని చూసి ఇతడెవరో బ్రాహ్మణ కులానికి సంబంధించినవాడని, బుద్ధిహీనుడని అనుకొనేవారు. ఏవో పనులు చెప్పి చేయించుకొని ఇతరులు ఇంత తిండి పడేసేవారు. అతడి సోదరులు పొలం పనులు చేయించుకొనేవారు. వారేది పెట్టినా ఎక్కువని, తక్కువని ఎంచకుండా తినేసేవాడు. నూకలు పెట్టినా, తవుడు పెట్టినా, తెలకపిండి పెట్టినా, పొట్టు పెట్టినా, నిప్పులు పైన వేసి కాల్చిన పిండి రొట్టి పెట్టినా, గిన్నెలో అడుగంటిపోయిన మాడు అన్నం పెట్టినా, ఏమి పెట్టినా అమృతంలా భావించి అది అమృతం వంటి రుచి కలదానిగా ఎంచి తినేవాడు. ఇలా ఉంటూ అతడు పంట చేనుకు కాపలాగా ఉన్న ఒకరోజు...

## 10. కాళీబలికి భరతుణ్ణి తీసుకుపోవుట

క. పురి లోన వృషలపతి దా, నరుదుగ సంతాన కాముఁడై వేడుకతోఁ
పురుషుఁడగు పశువుఁ గాళికిఁ, దఱుముక కొనిపోవఁ బశువు దలఁగిన భృత్యుల్.

130

తా ॥ ఒక ఊళ్ళో శూద్రజాతికి నాయకుడొకడు పిల్లలు లేరని సంతానం కోసం కాళికకు ఒక పురుషుణ్ణి బలి ఇస్తే పిల్లలు పుడతారని అతడి సేవకులు రాత్రివేళ ఒక నరుణ్ణి పట్టుకొని తీసుకొని పోతున్నారు. ఆ నరుదు చీకట్లో తప్పించుకొని పారిపోయాడు. వాళ్ళు అతణ్ణి వెతకడం మొదలు పెట్టారు.

ఆ. అరసి కానలేక యా రాత్రి వీరాస, నమునఁ జేనిఁకాపు విమల బుద్ధి
నున్న విప్రయోగి నొయ్యనఁ బొడగాంచి, పశువు మంచి దనుచుఁ బట్టి రతని.

131

తా ॥ ఎంత వెతికినా, కానలేకపోయారు. నిర్మలమైన బుద్ధితో చేనుకు కాపలా కాస్తూ వీరాసనంలో కూర్చొన్న విప్రయోగి (భరతుడు) కనిపించాడు. దొరక్కపోయిన బలిపశువుకు బదులుగా మంచి బలిపశువని, అతణ్ణి పట్టారు.

క. ఆ రీతిని భూసురవరు, నారయ నా కాళికాగృహమునకు భృత్యుల్
బోరనఁ గొని చని సల్పిరి, చారుత రాభ్యంజనాది సంస్కారంబుల్.

132

తా ॥ ఆ విప్రుణ్ణి కాళికాలయానికి శూద్ర ప్రభుడి సేవకులు సంతోషంగా తీసుకొని వెళ్ళారు. బలిపశువుకు చెయ్యవలసిన తలంటుపోయడం వంటి సంస్కారాలు ఇతడికి చేశారు.

వ. ఇట్లభ్యంజనాది కృత్యంబులు దీర్చి నూతన వసనంబు గట్టనిచ్చి గంధ పుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజియింపంబెట్టి ధూపదీప మాల్యలాజకిసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి పంచ మహావాద్య ఘోషంబులతోడ నా పురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి యా వృషలపతి పురుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికామంత్రాభి మంత్రితంబు నతికరాళంబు నైన ఖడ్గంబంది నిజాభీష్ట సిద్ధికి హింసింపం దలంచిన.

133

తా ॥ భరతుడికి తలంటుపోశారు, క్రొత్త బట్టల్ని కట్టారు, గంధం పూశారు, పూలను, నగల్ని అలంకరించారు. అక్షతలతో పూజించారు, మంచి రుచికరమైన భోజనం పెట్టారు, ధూపం వేశారు, దీపం చూపారు, దండలు వేశారు, పేలాలు జల్లారు, లేత చివుళ్ళతో పండ్లతో ఉపహారం సమర్పించారు. పంచ మహావాద్యాల్ని మ్రోగిస్తూ ఆ పురుష పశువును కాళికాదేవి ఎదుటికి తీసుకొని వచ్చి కూర్చోబెట్టారు. ఆ శూద్ర నాయకుడు ఈ పురుష పశువు యొక్క రక్తంతో భద్రకాళిని సంతోషపరచాలని తలచి, కాళికామంత్రాలతో అభిమంత్రించిన అతిభయంకరమైన ఖడ్గాన్ని పుచ్చుకొని తన కోరిక నెరవేరడం కోసం హింసకు ఒడిగట్టడానికి నిర్ణయించుకోగా –

సీ. సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూ, తాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ
సుతుని తేజం బంతఁ జూడ దుస్సహమైన, భయమంది వడఁకుచు భద్రకాళి
క్రోధంబు ముమ్మడి గొనఁగ హుంకారంబు, సలుపుచు నట్టహాసంబు సేసి
పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస, తామస కర్మ సంధాను లగుచు

తే. విప్రవరు నట్లు హింసించు వృషలపతిని, భృత్యవర్గంబుతోఁ దలల్ పృథ్విఁ గూల్చి
యవుడు వృషలాధిపుని శిరమంది లీలఁ, బాడి యాడుచు నందంద క్రీడ సలిపె.

134

తా ॥ సకల చరాచర ప్రపంచానికి నెచ్చెలి, బ్రహ్మభావంతో నిండిన ఆత్మ గలవాడు, బాహ్య శత్రువులు గాని, అంతశ్శత్రువులు గాని లేనివాడూ అయిన ఆ బ్రాహ్మణుడి బ్రాహ్మీయమైన తేజస్సు తేరిపార చూడటానికి సహింప శక్యంగాకుండా వెలుగొందిపోతోంది. ఆ తేజస్సు భద్రకాళికే భయం కొలిపింది. ఆ తల్లికే వణకు వచ్చింది. ఒక్కసారిగా కాళికకు క్రోధం విజృంభించింది. హుంకారం చేసింది. వికటాట్టహాసం చేసింది. అక్కడ భరతుణ్ణి బలిపశువు చేయడానికి హింసకు సిద్ధపడిన పాపాత్ములు, దుష్ట కార్యాలనే చేసేవారు, రజోగుణ తమోగుణాలు కలిగిన పనులనే చేసేవారున్నూ. ఆ శూద్రనాయకుడూ, వాడి సేవకుల తలల్ని నేలపై రాలకొట్టింది కాళిక. శూద్ర నాయకుడి తలను లీలగా చేతితో పట్టుకొని ఆనందంతో గెంతుతూ ఆడింది.

మహా పురుషుల్ని హింసించాలని సంకల్పించినవాళ్ళని ఆ సంకల్పమే తిరిగి చంపుతుంది. తనను చంపాలనుకొన్నవాళ్ళపై భరతుడికి కొంచెం కూడా కోపం రానేలేదు. తాను చనిపోతానన్న భయం సహితమూ రాలేదు. ఇదే ఆశ్చర్యం. భగవద్భక్తులైన పరమహంసలు తమ తల తెగిపోతుందనే సన్నివేశం ఏర్పడినా సరే ఏ మాత్రమూ చలించరు, కలత చెందరు. వారికి శరీరమే ఆత్మ అనే భావం వాసనామాత్రంగా కూడ ఉండదు. వారికి ఎవరిపట్ల వైరిభావం ఉండదు. వారు భగవానుడి చేతనే రక్షింపబడతారు. చేతిలో చక్రాన్ని ధరించి శ్రీ మహావిష్ణువు కాపాడుతున్నట్లు ఎప్పుడూ వారికి దర్శనాన్ని ఇస్తాడు. ఎదుటగానున్న భద్రకాళిలోను, తనను చంపయత్నిస్తున్నవాళ్ళలోను కూడ భరతుడికి శ్రీహరి దర్శనమే అయ్యింది. అందువల్ల అతడికి భయద్వేషాది భేదభావాలుండవు. అదే జరిగిందిక్కడ.

క. ధర లోన నెవ్వరేనియు, ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా
రరయఁగఁ జెడుదురు, నిక్కము, హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేన్.



తా ॥ ఈ భూమి మీద ఎవ్వరైనా సరే ఈ ధరణికి దేవతలైన బ్రాహ్మణులకు హాని

తలపెడితే వాళ్ళు కీడు పొందడం తథ్యం. హరి ఈ భూదేవతలైన బ్రాహ్మణుల పక్షాన్ని ఉంటాడు.

వ. మఱియును.

136

తా ॥ మరి అప్పుడు.

ఉ. అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుక లేక చంపఁగా
వచ్చిన వారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
నచ్యుత భావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నత్తఱిన్.

137

తా ॥ కాళికాలయంలో బ్రాహ్మణపుత్రుడైన భరతుడు ఒక్కింతైనా భయంలేకుండా తనను చంపడానికి సిద్ధపడినవాళ్ళలోను, చంపడానికి ఎత్తబడిన కత్తిలోను, కాళికలోను వాసుదేవుణ్ణే దర్శిస్తూ హృదయంలో భగవంతుణ్ణే ఎట్టి సంశయం లేకుండా దృఢంగా నిల్పి నిర్వికారంగా ఉన్నాడు.

## 11. భరతుడు పల్లకీ మోయుట

వ. మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జని కావలి యుండు నెడ.

138

తా ॥ తరువాత బ్రాహ్మణోత్తముడు చండికాలయం నుంచి బైటకు వచ్చి తిరిగి చేనుకు కాపలా ఉండడానికి వెళ్ళాడు.

సీ. అంతటఁ గొన్ని హాయనములు సన సింధు, భూపాలనము సేయు భూవరుండు
ధీరత నిక్షుమతీ తీరమున నున్న, కపిల మహామునిఁ గాంచి తత్త్వ
విజ్ఞాన మెఱిఁగెడు వేడ్క తోడుత శిబి, కారోహణము సేసి యరుగుచుండ
నాలోన నా శిబికావహు లా చేనఁ, గాఁపున్న విప్రునిఁ గాంచి తెచ్చి

తే. శిబిక మోపింత మీతని చేత ననుచుఁ, బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి మోవు
మనుచు మోపించునంత ధరామరుండు, శిబిక మూఁపున నిడి యందుఁ జింత లేక.

139

తా ॥ ఆ తరువాత కొన్ని సంవత్సరాలు గడచాయి. సింధు దేశాన్ని రహూగణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఇతడికి కపిల మహర్షి నుండి తత్త్వవిజ్ఞానం తెలుసుకోవాలన్న కోరిక పుట్టింది. ఆ మహర్షి ఇక్షుమతీ నదీ తీరంలో ఉన్నాడు. రాచఠీవితో రాజు ఒక పల్లకీ ఏర్పాటు చేసుకొని దానిలో బయలుదేరాడు. పల్లకి బోయీలలో ఒకడు నడవలేకపోవడంతో వాడి స్థానంలో మరొక బోయవాడు అవసరమయ్యాడు. వెదకిచూస్తే చేనుదగ్గర కాపలాగా ఉన్న ఈ విప్రుడు కనిపించాడు. అతణ్ణి తీసుకొని వచ్చి అతడి మూపుమీద పల్లకిని పెట్టి మొయ్యమన్నారు. తన భుజంమీదికి పల్లకి మోత వచ్చిందని అతడికి ఏ మాత్రం చింతా కలగలేదు.

క. తన మనసు కొలఁది నప్పుడు, మునుకొని యట్ల ప్రయత్నమున నడవఁగ నా
జనపతి నిమ్నోన్నతమై, చనుట యెఱిఁగి శిబిక మోయు జనులకు ననియెన్.

140

తా ॥ తన మనస్సు కొద్దీ, తన ప్రయత్నం ఏమీ లేకుండానే భుజంమీద పల్లకి దండెం పెట్టుకొని నడుస్తున్నాడు బ్రాహ్మణుడు. పల్లకి మోసే వాళ్ళతో భరతుడి ఎత్తు సరిపడక, నడక సరిగా కుదరక ఎగుడు దిగుడు నడక వచ్చింది. లోపల కూర్చున్న రాజుకు ఈ కుదుపు తెలిసి బోయీలతో ఇలా అన్నాడు:

ఆ. వీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ, త్నంబుతోడఁ దగిలి నడుచుచుండ
విషమ మగుచు గమన వేగంబు నను బాధఁ, బెట్టుచున్న దనిన బెస్త లనిరి.

141

తా ॥ "మీరంతా ఏదో ప్రయత్నించి కలిసి నడవడం వల్ల పల్లకి నడక సమంగా ఉండకుండా విషమంగా ఉంది. నడుస్తున్న వేగం వల్ల నాకు బాధ పుడుతోంది" — అంటే దానికి బోయీలు ఇలా అన్నారు:

వ. దేవా! యీ విషమగమనంబు మావలన నైనది గా; దీ తురీయవాహకుండు సుఖగమనంబుగా నడువ నేరండు; వీనితోడ మేమును నడువనేర మనిన రహూగణుండను నా రా జుపాసితవృద్ధజనుండైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శ దప్పి నీఱు గప్పిన నిప్పునుం బోలె నెఱుంగ రాని బ్రహ్మతేజంబు గల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె.

142

తా ॥ "దేవా! ఈ ఎగుడు దిగుడు నడక మా వల్ల ఏర్పడింది కాదు. పల్లకి మోస్తున్న ఈ నాలుగో వాహకుడికి సుఖంగా నడవడం తెలియడంలేదు. వీడితో కలిసి సమంగా నడవడం మా

వల్లనూ కావడంలేదు" అన్నారు. ఈ మాటలకు రహూగణుడు విప్రుడిమీద కోపం తెచ్చుకొన్నాడు. వెనుకా ముందూ ఆలోచించకుండా నివురుగప్పిన నిప్పులా బైటకు బ్రహ్మతేజస్సు కన్పించకుండా అమాయక బ్రాహ్మణుడిగా ఉన్న భరతుడితో ఏవగింపుగా ఇలా నిష్ఠూరంగా అదిలిస్తూ మాట్లాడాడు.

ច. అలసితి, వెంతయున్ ముసలి, వాఁకట డస్సితి, వెన్ను మిక్కిలిం
బలుచన యున్న దీ శిబిక భారము; దూరము మోసి తేగతిన్
నిలిచెద? వంచు భూవరుఁడు నిష్ఠురముల్ దగఁ బల్క నా యెడం
బలుకక మోసె నా శిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా!



తా ॥ "చాలా అలసిపోయావు. ముసలివాడివి. ఆకలితో నీరసించి ఉన్నావు. శరీరం బాగా బక్కది. ఈ పల్లకిని ఎంత దూరం నుండి మోస్తున్నావు. ఎలా నిలబడగలవు?" అని రాజు వేళాకోళంగా నిష్ఠూరాలు పలికితే ఆ పల్లకి పట్టిన బ్రాహ్మణశ్రేష్ఠుడు మాత్రం మారు మాట్లాడకుండా పల్లకిని మోస్తూనే ఉన్నాడు. రాజా! విన్నావా!

రహూగణుడు భరతుడి మహిమ తెలియక ఎంతో అపహాస్యం చేస్తూ వ్యంగ్యంగా మాటాడాడు. ఇలాంటి వంకర మాటలు ఎంతటి సౌమ్యుడినైనా రెచ్చగొట్టి ఉక్రోషం రప్పిస్తాయి. భరతుడు మాత్రం ఏ మాత్రం చలించలేదు. తన పద్ధతిలో పూర్వంలాగా పల్లకిని మోస్తూనే ఉన్నాడు – స్థితప్రజ్ఞుని దృష్టితో.

వ. అప్పు డావిప్రవరుండు దనకుం గడపటిదియగు కళేబరంబునందు నహంకార మమకారంబులం బొరయక మిథ్యాజ్ఞాన రహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున నా శిబిక మోయు చున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుం డగుచు నా భూవరుండు వెండియు నిట్లనియె.

తా ॥ ఆ బ్రాహ్మణుడికి అదే చివరి జన్మ. అంటే అది చివరి శరీరం. ఆ శరీరంపై అహంకార మమకారాలేమీ అతడికి కలుగలేదు. సాక్షాత్తు పరబ్రహ్మమునందే చూపు కలిగిన నిష్ఠతో ఉన్నాడు. మిథ్యాజ్ఞానం అతనికి లేదు. మౌనంగా ఉన్నాడు. ఆ పల్లకీ మోయడంలో నడక సరిగా లేకపోవడాన్ని చూచి రాజుకు మరింత కోపం వచ్చింది. ఇలా నిందిస్తూ మాట్లాడాడు.

రహూగణుడు ముందు అధిక్షేపంగా మాట్లాడాడు. ఆ మాటలకు ఆ బ్రాహ్మణుడు భయపడతాడని, బాధపడి సర్దుకుంటాడనీ, పల్లకిని సరిగా మోస్తూ గమనంలో ఎగుడుదిగుడులు రాకుండా మంచిగా నడుస్తాడనీ రాజు అభిప్రాయపడ్డాడు. కాని ఆ విప్రుడు మహాతత్త్వజ్ఞానంతో పండిపోయి ఉన్నాడు. రాజు మాటలు అతణ్ణి బాధించలేదు. కర్మానుగుణంగా కర్మననుసరించి ఈ శరీరం ఏర్పడుతుంది. ఈ శరీరం పంచభూతాలతో, శబ్దాది విషయాలతో, వాక్కు మొదలైన కర్మేంద్రియాలతో, వాని విషయాలతో, అంతః కరణం, దానిని అంటిన వాసనలు అనే వాటితో కూడినట్టి – అచేతనమైన పదార్థం. రాజు చేసిన ఆక్షేపణం ఈ శరీరానికి సంబంధించింది. ఆ దూషణలు తనకు చెందనివి. దానికి దూషణ తెలియదు. కాని, శరీరమే తాను అనుకొనిన మిథ్యాజ్ఞానంలో ఉన్నప్పుడు ఆ తిట్లకు మనస్సు బాధపడుతుంది. ఈ బ్రాహ్మణుడికి ఆ బాధ లేదు. అతడు బ్రహ్మమునందే నిలిచి ఉన్నాడు. కర్మ ఉన్నంత వరకు ఈ శరీరాన్ని నడిపించి కర్మ పూర్తయ్యాక ఈ శరీరాన్ని వీడి మళ్ళీ జన్మలేకుండా పోవాలని అతడు భావిస్తున్నాడు. అందువల్లనే అతడు రాజుకు సమాధానం చెప్పలేదు. ముందులాగే నడుస్తున్నాడు. పల్లకి కుదుపు తగ్గలేదు. రాజుకు కోపం పెరిగింది. ఇలా తిట్టాడు:

సీ. ఓరి దుర్మద! విన రోరి జీవన్మృత!, నా యాజ్ఞఁ దప్పించి నడిచె దీవు,
ఈ వక్రమార్గంబు లిన్నియు విడిపించి, నడపింతు నిన్ను సన్మార్గమందు
నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయం, బున వృద్ధిఁ బొందిన భూవరుం డ
బద్ధ ప్రలాపముల్ పల్కు చుండినఁ జూచి, శమదమాదులచేఁ బ్రశస్తుఁ డగుచు

తే. జగతి బ్రహ్మస్వరూపమై సకల భూత, ములకు నత్యంత హితుఁడైన భూసురుండు
యోగి వర్తన దెలియ లేకున్న రాజు, నంత వీక్షించి యల్ల ని ట్లనుచుఁ బలికె.

145

తా ॥ “ఒరేయ్! పొగరు బలిసినవాడా! వినరా! నడపీనుగా! నా ఆజ్ఞ పాటించకుండా తప్పుగా నడుస్తావేమిటి? నీ వంకర నడకల నుంచి నిన్ను విడిపించి, సరిగా నడిపిస్తాను” – అని రాజు గర్వంతో కళ్ళు మూసుకుపోయి, మూడు గుణాలు బాగా పెరిగిపోయి, హద్దూ అదుపూ లేని మాటల్ని అన్నాడు. బ్రాహ్మణుడీ మాటల్ని విన్నాడు. ఇతడు శాంతి, దాంతి ఉన్నవారిలో అగ్రగణ్యుడు. సకల జగత్తును బ్రహ్మస్వరూపంగా భావిస్తూ సకల చరాచర జగత్తులోనూ బ్రహ్మనే దర్శిస్తున్నాడు. సకల ప్రాణులకు ఎంతో మేలు కూర్చేవాడు – ఈ భూసురుడు యోగి యొక్క ప్రవర్తన ఎలా ఉంటుందో రహూణుడికి తెలియదు. అందుకే తన రాజసాన్ని చూపి అలా నిందించాడు. భరతుడు అలా అన్నట్టి రహూగణుడి వైపు చూశాడు. చూచి, ఇలా పలికాడు:

## 12. భరతుని బోధతో రహూగణుని సంశయనివృత్తి

వ. నరేంద్రా! నీవు సెప్పినది సత్యంబు; భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగనేర; దైనను స్థౌల్యకార్శ్యం బులు వ్యాధులు నాధులు క్షుత్తోషనిద్రా జాగరణంబులు నహంకార మమకార మదశోషణాదులును దేహంబు తోడన జనియించుంగాని నాకుం గలుగనేరవు; జీవన్మృతుండ నేన కా దాద్యంతంబులు గలుగుటం జేసి యందఱియందును గలిగియుండు; స్వామిభృత్య సంబంధంబులు విధికృతంబు లగుచు వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుంగాని జీవునికి లేక యుండు; నదియునుం గాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెద వేనియుం బ్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె నట్లుగాక యే నేమి సేయుదు? నెఱిగింపు; మున్మత్తమూకాంధ జడులుంబోలె సహజ స్వభావంబునుం బొందిన నా యందు నీ శిక్షయేమి లాభంబుఁ బొందింప నేర్చు? నదియునుంగాక స్తబ్ధుండు మత్తుండునైన నాకు నీ శిక్ష వ్యర్థంబగు నని పలికి యుపశమ శీలుండైన మునివరుండు పూర్వకర్మ శేషంబునం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జనునెడ నా రాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుండై చనియెడి వాఁడగుటం దన హృదయ గ్రంథి విమోచకంబులను బహుయోగ గ్రంథ సమ్మతంబులును నగు బ్రాహ్మణవాక్యంబులును విని యా శిబిక దిగ్గన డిగ్గ నుఱికి యా విప్రునికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి సర్వగర్వవర్జితుండై ముకుళితహస్తుం డగుచు నిట్లనియె.



తా ॥ “రాజా! నువ్వు చెప్పేది నిజమే; బరువు ఈ శరీరానికే గాని, నాకు కలుగనే కలుగదు. అయినా లావు, సన్నం, రోగాలు, మనోవ్యాధులు, ఆకలి, దప్పిక, కోరిక, విరోధం, భయం, ముసలితనం, చావు, రోషం, నిద్ర, మేల్కోవడం, అహంకారం, మమకారం, ఎండిపోవడం మొదలైనవన్నీ శరీరంతోటి పుట్టేవే గాని, నాకు ఏర్పడేవి కావు. నేను నడయాడే

పీనుగునే. నేనే కాదు, పుట్టడం చనిపోవడం ఉంది కనుక అందరూ జీవన్మృతులే. వీడు ప్రభువు, వీడు సేవకుడు – ఈ సంబంధాలన్నీ విధి చేసినవై లోకవ్యవహారానికి పనికివస్తూ శరీరానికే ఉంటాయి గాని జీవుడికి ఉండవు. అదీగాక, నువ్వు రాజుననే అభిమానంతో నన్ను ఆజ్ఞాపించావని అనుకొంటే మత్తుగమ్మిన నీకు స్వామి స్వభావం ఎలా ఉంటుంది? అందువల్ల నేనేమి చేస్తాను? చెప్పు. పిచ్చివాడిలా, మూగవాడిలా, గ్రుడ్డివాడిలా, జడునిలా ఉంటూ బ్రహ్మాత్మస్వభావంతో ఉన్న నాపై నువ్వు విధించే శిక్ష వల్ల ఏం లాభం చేకూరుతుంది? అంతమాత్రమే కాదు, నేను శరీరభావం లేని స్తబ్ధుణ్ణి, మత్తుణ్ణి. అలాంటి నాకు నీ శిక్ష వ్యర్థమే అవుతుంది" – అని ప్రశాంతమనస్సు కలిగిన ఆ మునిశ్రేష్ఠుడు తన పూర్వకర్మ ఇంకా మిగిలి ఉండటం వల్ల – దాన్ని నశింపచేసుకోవాలంటే బరువు మోయాలి గనుక – పల్లకిని భుజం మీద పెట్టుకొని నడుస్తున్నాడు.

రహూగణుడు ఈ మాటల్ని విన్నాడు. తత్త్వజ్ఞానం కోసం ప్రయాణం సాగిస్తున్నాడు. అందువల్ల ఈ బ్రాహ్మణుడి మాటలు ఆ రాజుకు హృదయగ్రంథిని విడదీశాయి. ఆ మాటలు యోగశాస్త్రవచనాలు. వెంటనే రాజు పల్లకి నుంచి క్రిందికి ఉరికాడు. భరతుడికి సాష్టాంగదండ ప్రమాణం చేశాడు. గర్వాన్ని విడిచిపెట్టి, చేతులు జోడించి, ఇలా అన్నాడు:

భరతుడు సర్వమూ బ్రహ్మాత్మక దర్శనం చేస్తున్న మహాపురుషుడు. జీవించి ఉండటం అంటే చైతన్యం కలిగి ఉండటం. మృతుడు అంటే చైతన్యం లేకపోవటం. ఈ రెండూ శరీరానికే గాని ఆత్మకు (జీవుడికి) కావు. శరీరం పుట్టినప్పుడు జీవుడితో కలిసి "పుట్టింది" అనబడుతుంది. జీవుడు వీడిపోయినప్పుడు "చనిపోయింది" అనబడుతోంది. ఈ శరీరం ఎప్పుడూ జడమే. లోపల ఉన్నది జీవం. కనుక "జీవన్మృతుడు" అని రాజు తిట్టిన మాటలో ప్రతి దేహగత ప్రాణి జీవన్మృతుడే అవుతాడు. అందుకే "అందరూ జీవన్మృతులే" అన్నాడు భరతుడు. సకల జీవులూ సర్వేశ్వరుడికి అధీనాలు. శాసకుడు ఆయనొక్కడే. రాజుకు రాజశరీరం పోతే శాసకత్వం ఎలా ఉంటుంది? అందువల్ల శరీరమే ఆత్మ అనే మత్తులో ఉన్న రాజుకు స్వామి స్వభావం

(పూర్వస్వభావం) ఎలా ఉంటుందని భరతుడు ప్రశ్నించాడు.

సీ. ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడవు నీ, వవధూతవేషివై యవని యందు
నేమిటికై చరియింపంగ వచ్చి? తి, చ్చటికి నొక్కఁడ వొంటి ననుట నేఁడు
ననుఁ గృతార్థునిఁ జేయ ననుకూలుఁ డగుచున్న, యట్టి యా కపిల మహామునీంద్రుఁ
డవొ? నీ మహత్త్వంబు దవిలి విచారింప, నెఱుఁగక చేసితిఁ; గరుణఁ జూడు

తే. తప్పు సైరింపు; నే యమదండమునకు, హరుని శూలంబునకును వజ్రాయుధమున
కనల చంద్రార్క ధనదశస్త్రాస్త్రములకు వెఱవ విప్రుని కే మది వెఱచినట్లు.



తా ॥ "బ్రహ్మవేత్తలలో నీవెవరవు? అవధూత వేషంలో ఈ భూమిపై ఇక్కడెందుకు తిరుగుతున్నావు? ఒక్కడివి వచ్చావు? నన్ను కృతార్థుణ్ణి చేయడానికి వచ్చిన కపిలమహామునివ్? నీ మాహాత్మ్యాన్ని ఆలోచించకుండా తప్పుచేశాను. దయచూపించు. తప్పు క్షమించు. నేను యముడి దండానికి, శూలి శూలానికి, ఇంద్రుడి వజ్రాయుధానికీ కూడా భయపడను. అగ్నికి, చంద్ర సూర్యులకు, కుబేరుడి శస్త్రాస్త్రాలకు కూడా నేను భయపడను. బ్రహ్మవేత్త మనస్సు బాధపడితే మాత్రం చాలా భయపడతాను.

వ. మఱియు నిస్సంగుండవయి జడుఁడుంబోలె నిగూఢ విజ్ఞానంబు గలిగి చరియించుచు నున్న వాఁడవు; నీ వచనంబులు యోగశాస్త్ర సమానంబులై వాఙ్మానసంబులకు నభేద్యంబులయి యున్నవే; నవ్విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియునగు కపిలమహామునివలన బ్రహ్మవిద్య దెలియంగోరి చనుచున్నవాఁడ; నీవు లోక నిరీక్షణార్థం బవ్యక్తలింగుండవై చరియించుచున్న కపిల మహామునీంద్రుండవు గాఁబోలుదువు; మందుండైన గృహస్థుండు యోగీశ్వర చరిత్రంబు లెట్టు లెఱుంగనేర్చుఁ? గర్మవశంబున దృష్టంబై శ్రాంతి వహించుచు నడుచుచున్న యీ యాత్రమంబు నాకునుంబోలె నీకు నగునని తోఁచుచున్న; దది యెట్లనిన ఘటంబు లేక జలంబు దేనేరని తెఱంగున లేనిది

గలుగ నేరదు; గావునం బ్రమాణమూలం బయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి నీ వాడు వాక్యంబులు నాకు సమ్మతంబు గానేర వని సింధు దేశాధీశ్వరుండు వినిపించిన నా విప్రుండు లోక వ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం బగుఁ గాని నిత్యంబు గా నేరదని దృష్టాంత నిదర్శనంబుగా నిట్లనియె.

148

తా ॥ నువ్వు దేనియందూ సంగం లేకుండా ఉన్నావు. నీ బ్రహ్మజ్ఞానం మరుగుపరచబడి ఉంది. నువ్వు పలికిన మాటలు యోగశాస్త్రంలో నిరూపింపబడినవి. వాక్కు, మనస్సు ఆ మాటల్ని భేదించలేవు. నేను కపిలమహర్షి నుండి బ్రహ్మవిద్యను తెలుసుకొనగోరి వెళ్తున్నాను. లోకాన్ని పరిశీలించాలని, బయటకు తెలియని గుర్తులతో సంచరిస్తున్న కపిల మహామునీంద్రుడ వయ్యుంటావు. సంసారంలోనే ఆసక్తి కలిగిన నా లాంటి మందబుద్ధులకు మహాయోగుల చరిత్రలెలా తెలుస్తాయి? కర్మకొద్దీ తగుల్కొని శ్రాంతితో నడుస్తున్న ఈ గృహస్థాశ్రమం నాకే కాదు, మీకూ ఉందనిపిస్తోంది. అదెలాగంటే, కుండ లేకుండా నీరు తేలేనట్లు, లేనిది అనుభవానికి వచ్చే అవకాశమే లేదు. అందువల్ల లోకవ్యవహారమంతా ప్రమాణం మీదనే నమ్మబడి నడుస్తోంది. దానివల్ల మీరు చెప్పిన మాటలు నాకు ఒప్పుకొనేటట్లు అనిపించడంలేదు" అన్నాడు సింధుదేశపు రాజైన రహూగణుడు.

ఈ మాటలకు ఆ విప్రుడు "లోకవ్యవహారంలో నిత్యత్వం ఉపాధి పైన ఆధారపడి ఉంటుందే గాని, సత్యమైన నిత్యత్వం కాదు" అని చెప్పి, దృష్టాంతంలో నిరూపిస్తూ ఇలా చెప్పాడు:

రాజు గృహస్థుడై బాధ్యతలతో ఉన్నాడు. భరతుడు విరాగియై ఉన్నా అజ్ఞానుల్ని జ్ఞానులుగా చేసే బాధ్యతలో ఉన్నాడు. అందువల్లనే గృహస్థాశ్రమం నాకే కాదు, మీకూ ఉందనిపిస్తోందని రాజు అన్నాడు.

ఘటం అసత్యమే అయితే అది నీరు తేవడానికి పనికిరాదు. సత్యమైనదే నీరు తెస్తుంది. అందువల్ల వ్యవహారమంతా ప్రపంచంలో ప్రమాణం చేత ఉందని నిశ్చయింపదగినదే కాని అసత్యం కాదు అని భరతుడంటున్నాడు.

సీ. పావన శిఖలచే భాండంబు దాఁ దప్త, మగుఁ; దప్తఘటముచే నందు నున్న
జలము తపించు; నా జలముచేఁ దండులం, బులు తప్తమొంది యప్పుడు విశిష్ట
మైన యన్నం బగు; నా చందమునను దా, దేహేంద్రియంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్న యట్టి జీవునకు దే, హంబునఁ బ్రాణేంద్రియాదికమున

ఆ. జరుగుచుండు నిట్లు సంసారఘట శిక్ష, రక్షకుండు నయిన రాజు దుష్ట
కర్మములకుఁ బాసి కంజాక్షపద సేవఁ, జేసెనేని భవముఁ జెందకుండు.

149

తా ॥ “వంట కట్టెల మంటచే కుండ వేడెక్కుతుంది. కుండ వేడెక్కడం వల్ల దానిలోని నీరు మరుగుతుంది. ఆ వేన్నీళ్ళలో బియ్యం పోస్తే అవి ఉడికి, చక్కని అన్నం తయారవుతుంది. అలాగే తెలివితో కూడి ఉన్న దేహేంద్రియాలను ఆశ్రయించుకొని ఉండే జీవుడికి దేహంలో ప్రాణేంద్రియాదుల సమ్మేళనం వల్లనే వర్తన సాగిపోతుంది.

ఈ సంసారం ఒక ఘటం వంటిది. దానికి శిక్షణను, రక్షణను కలిగించేవాడు రాజు. అతడు చెడు కర్మల్ని మాని వాసుదేవుణ్ణి సేవిస్తే మళ్ళీ జన్మమెత్తకుండా సంసారంలో చిక్కకుండా ఉంటాడు.

ఆ. అనుచు ధారుణీసురాత్మజుఁ డీ రీతిఁ, బలుకుటయును రాజు పరిణమించి
వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ, బుణ్యుఁడైన సింధు భూవరుండు.

150

తా ॥ బ్రాహ్మణుడు చెప్పిన మాటల్ని విన్నాక రహూగణుడిలో మంచి మార్పు వచ్చింది. అతణ్ణి వినయంతో ప్రస్తుతించాడు. ఇలా అన్నాడు:

వ. మహాత్మా! నేను రాజు ననియెడి యభిమాన మదాంధుండనై మహాత్ములం దిరస్కరించిన నన్నుం గరుణింపుము; నీ వాప్త బంధుండవు; నీ కృపాదృష్టింజేసి మహాత్ముల నవమానంబు సేసిన దురితంబువలన విముక్తుండ నయ్యెద. విశ్వసుహృత్త వైన నీకుం గోపంబు గలుగనేర; దసమర్థు లయిన మాబోఁటి వారలు మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు; గావున నీవు దయాళుండ వయి నన్ను మన్నింపు మనిన నా విప్రుం డిట్లనియె.

151

తా ॥ "మహాత్మా! నేను రాజుననే దురభిమానంతో మదం వల్ల గ్రుడ్డిగా ప్రవర్తించి మహాత్ములను తిరస్కరించాను. నన్ను కరుణించు. నువ్వు ఆర్తులకు బంధుడవు. నీ దయాపూర్వకమైన చూపుల్ని నాపై ప్రసరింపచేయి. నీ చూపు పడితే నేను మహాత్ములను అవమానం చేసిన పాపం నుంచి బైటపడతాను. నువ్వీ విశ్వమంతటికీ నెచ్చెలివి. అట్టి నీకు కోపం రాదు. సమర్థత లేని మాలాంటివాళ్ళు మహాపురుషుల్ని అవమానించినందువల్ల వెంటనే నశిస్తారు. అందుచేత నువ్వు దయ చూపి నన్ను మన్నించు" – అన్నాడు రాజు. ఇది విని ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు.

క. కడువేడ్క నీ వవిద్వాం, సుఁడవై యుండియును మిగులఁ జోద్యము విద్వాం
సుఁడుఁ బోలెను బలికెద వి, ప్పుడు మే లనవచ్చుఁ గొంత పురుషుల లోనన్.

152

తా ॥ "రాజా! నువ్వు పండితుడివి కాకపోయినా పండితుడిలా చాల వేడుకతో మాట్లాడుతున్నావు. చాలా వింతగా ఉంది. అందుచేత నువ్వు తత్త్వవేత్తలైన పురుషులలో శ్రేష్ఠుడవుకావు.

ఆ. పరఁగఁ బెద్ద లీ ప్రపంచమంతయుఁ దథ్య, మనరు; నీవు తథ్య మనుచుఁ బలికి;
తట్లుగాన నిన్ను నధికుండ వని పల్క, రాదు నాకుఁ జూడ రాజచంద్ర?

153

తా ॥ రాజులలో చంద్రునివంటి వాడా! తత్త్వవేత్తలు ఈ ప్రపంచాన్నంతటినీ యథార్థమని అనరు. నువ్వు యథార్థమంటున్నావు. అందువల్ల నువ్వు గొప్పవాడివని చెప్పరాదనిపిస్తోంది నాకు.

సీ. యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ, దఱచుగాఁ దత్త్వవాదంబు లేదు
స్వప్నంబులందుల సౌఖ్యమాకారంబు, నందుల నిత్యమై యంతలేని
యట్టి చందమున వేదాంత వాక్యంబులు, తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁగాని
నిత్యంబులై యుండనేరవు; పురుషుని, చిత్తంబు గుణములఁ జెంది యెంత

తే. కాలముండును మరి యంత కాలమందు, నరయ విజ్ఞాన కర్మేంద్రియముల చేత
మరగి ధర్మంబులను నధర్మంబులట్లు, దగిలి పుట్టించుచుండు నత్యంత మహిమ.

154

తా ॥ యజ్ఞాలు మొదలైనవాటిలోను, వేదాలలోను సాధారణంగా తత్త్వనిర్ణయం భాసించదు. కలలో కలిగే సుఖం ఆ కల ఉన్నంత సేపు నిత్యమే అన్నట్లు ఉంటుంది. అంతలో మెలకువ రాగానే అది నిత్యం కాదన్న విషయం తెలుస్తోంది. అలాగే ఉపనిషద్వాక్యాలు తత్త్వాన్ని తెలిపి తప్పుకొంటాయి కాని, అవే నిత్యంగా ఉండలేవు. జీవుడి చిత్తం త్రిగుణాలకు చెందినదిగా ఉన్నంత కాలం జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు అలవాటు పడిపోయి, ధర్మంలోను అధర్మంలోనూ ప్రవర్తించి తిరిగి తిరిగి శరీరాలను పొందుతోంది.

వేదంలోని పూర్వభాగం చదివి దానిలో చెప్పబడ్డ కర్మల్ని ఆచరించేవాళ్ళకు పరమాత్మ స్వరూపం తెలియదు. కర్మల పట్ల రుచి పెంచుకొన్నవాడికి తత్త్వస్వరూపం ఎలా తెలుస్తుంది?

వేదంలో ఉత్తరభాగమైన ఉపనిషత్తులు అధ్యయనం చేస్తే ఈ శరీరం కంటే ఆత్మ ఒకటి ఉందని తెలుస్తుంది. కాని విషయవిరక్తి కలుగకపోతే బ్రహ్మప్రతిపాదకమైన తత్త్వజ్ఞానం కలుగదు.

కలలో చూసే వస్తువులు, రూపాలు, పొందే సుఖాలు అల్పం, అస్థిరం అని మేల్కొగానే తెలిసినా; లౌకికమైన, పారలౌకికమైన సుఖాలు స్వప్నంలోని వాటివనే భావించినా, అతడికి సాంసారిక సుఖాల పట్ల ఆసక్తి పోదు.

తర్కంవల్ల కాకుండా నిశ్చితంగా వచ్చిన అనుభవం ద్వారా సాంసారికమైన సుఖాలన్నీ, దుఃఖాలనే ఇచ్చే కర్మలన్న సత్యం తెలియాలి. ఆ కర్మల వల్లనే దేహ సంబంధం కలుగుతోంది. మనస్సుకు రజస్తమోగుణాలంటి, ఆ గుణాల వల్ల ప్రవర్తించే ఇంద్రియ వ్యాపారాలచే పుణ్యాపుణ్యాలు చేసి పురుషుడు మంచి లేదా చెడు శరీరాన్ని పొందుతున్నాడు.

ఆత్మ ఏ వికారాలు లేనిదే. అయినా, మనస్సుకు అంటిన వాసనలకు అధీనమైన అంతఃకరణంతో కూడా ఆ వాసనల వల్ల విషయానుభవంలో తగులుకొంటోంది. దానివల్లనే రకరకాల శరీరాలను పొందుతోంది.

వ. మఱియు ధర్మాధర్మ వాసనాయుక్తంబు విషయానురక్తంబునైన చిత్తంబు గుణ ప్రవాహంబులచేత వికారంబు నొంది దేవతిర్యఙ్మనుష్యరూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాల ప్రాప్తంబులైన సుఖదుఃఖ తదుభయ ఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూల సూక్ష్మరూపంబుల నుండు; స్వాంతంబు గుణరహితంబైన ముక్తి కారణంబగు; ఘృతవర్తులు గల దీపంబు సధూమశిఖలం బుట్టించు; ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందు; నీ తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మాదులం బుట్టించు, గుణకర్మంబులం బాసెనేనిం బరతత్త్వంబు నొందు; జ్ఞానేంద్రియంబు లేనును విషయంబుల మీఁదఁ దోఁచు; బుద్ధు లేనును నభిమానంబు నను నేకాదశవృత్తులం గూడిన మనంబు జీవుని నసంఖ్యంబు లయిన

జన్మంబులం బొందించు; మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతియైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము; స్థావర జంగమంబు లయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మ స్వరూపంబున నుండు; జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంత కాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండు గాఁ; దరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుం డగుఁ; జిత్తం బెంతకాలంబు విషయాసక్తం బగు నంతదడవు సంసారచక్రంబునందు సంచరించుం గావున మహావీరుం డయినను దనకు శత్రువైన మనంబు నప్రమత్తుండయి యుపేక్షా బుద్ధింజేసి యిచ్ఛా విహారంబున జరగనీక పరమగురుండైన శ్రీహరి చరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందునని విప్రుండు వలికిన నతని మహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డిట్లనియె.

155

తా ॥ మనస్సు ధర్మం, అధర్మం అనే వాసనలతో నిండి ఉంటుంది. శబ్ద స్పర్శాది విషయాలలో తగుల్కొని ఉంటుంది. అందువల్ల ఆ సత్త్వాదిగుణాలచే ఏర్పడిన వాసనలు ఒక ప్రవాహంలా మనస్సును ఎడతెగక ప్రభావితం చేస్తూనే ఉంటాయి. అలా వాసనల ప్రభావం వల్ల దేవతాజన్మ, పశుపక్ష్యాదుల జన్మ, మానవ జన్మ పొంది ఆయా దేహాలను ధరిస్తుంది. కాలానుగుణంగా సుఖాలను, దుఃఖాలను, ఆ రెండింటి ఫలితాలను పొందుతూ ఎల్లప్పుడు ఆత్మాభిమానరూపంలో వెల్లడవుతూ మనస్సు స్థూలరూపంగా సూక్ష్మరూపంగా ఉంటుంది.

మనస్సు గుణరహితమైనప్పుడు మోక్షానికి హేతువవుతుంది. నేతితో ఒత్తిని తడిపి దీపం పెడితే నేతితో తడిసిన ఒత్తిని అగ్ని కాలుస్తున్నా, జ్వాల పొగతో కూడి ఉంటుంది. రెండూ లేనప్పుడు స్వస్వరూపాన్ని పొందుతుంది. అలాగే గుణకర్మల సంబంధం కలిగిన మనస్సు ఆయా గుణాలకూ, కర్మలకూ తగిన జన్మలకు కారణమవుతుంది. గుణాలూ, కర్మ సంబంధం

మనస్సుకు లేకపోతే, మోక్షాన్ని అంటే దివ్యప్రకాశాన్ని మనస్సు పొందుతుంది.

జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, అభిమానం ఒకటి – ఈ పదకొండూ మనస్సు యొక్క వృత్తులు. ఈ వృత్తులతో కూడిన మనస్సు జీవునికి లెక్కలేనన్ని జన్మలను కలిగిస్తుంది. ఏ జీవి మనోవృత్తులను దాటి వర్తిస్తుందో దానిని పరంజ్యోతియైన నారాయణుడి స్వరూపంగా గుర్తించు. ఈ చరాచరప్రపంచానికంతటికీ వాయువు ఎలా ప్రాణంగా ఉందో ఈశ్వరుడు అన్నింటిలోను అంతర్యామియై అలాగే జీవాత్మ స్వరూపంగా ఉన్నాడు. జీవుడు మాయను జయించి తాను దేహం కానని, పరమాత్మకు చెందినవాడననే జ్ఞానం కలిగినప్పుడే సంసార సంగం నుండి విముక్తుడవుతాడు. కామక్రోధాది అంతశ్శత్రువులను జయించి పరతత్త్వాన్ని తెలుసుకొంటే ఈశ్వరుడే అవుతాడు. మనస్సు శబ్ద స్పర్శ రూప రస గంధ వాసనలకు లోనై ఉన్నంతవరకు ఈ చావు పుట్టుకల సంసార చక్రంలో తిరగడం తప్పదు. కనుక మనస్సే శత్రువు.

మహావీరుడైనా సరే తనకు శత్రువైన మనోవృత్తుల పట్ల ఏమరపాటు లేకుండా జాగ్రత్త వహించాలి. అలక్ష్యం పనికిరాదు. మనస్సును ఇష్టం వచ్చినట్లు విహరించడానికి ఒప్పుకోక నియంత్రించాలి. జీవుడు పరమగురువైన శ్రీహరి యొక్క పాదసేవనమనే అస్త్రంతో మనస్సును జయించి, పరతత్త్వాన్ని పొందు" అని విప్రుడు చెప్పాడు.

భరతుడి మాటలు రాజైన రహూగణుడికి మిను మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించాయి. రాజు చకితుడై, నమస్కరించి ఆ బ్రాహ్మణుడితో ఇలా అన్నాడు:

ఉ. కారణ విగ్రహంబు నురుకాయము నీ యవధూతవేషమున్
భూరిధరామరత్వమును బూర్వసమాగమ మాత్మభావముం
జారువిహార మత్యతుల శాంతి గుణంబును గూఢవర్తనం
బారయఁగల్గు నీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్.

156

తా ॥ "నువ్వు కారణజన్ముడివి. ఇట్టి నీ కారణ స్వరూపం, నిండైన శరీరం, అవధూత వేషం, బ్రాహ్మణుడి ఆకృతి, పైకి వికారంగా కన్పడుతున్నాయి. కాని నిత్యమూ పరమాత్మానుభవంలోనే ఉన్నావు. ఆ అనుభవ విహారివి నువ్వు. సాటిలేని పరమశాంతిని పొంది ఉన్నావు. ఇవన్నీ నీలో నిగూఢంగా దాగి ఉన్నాయి. వీటికి పైకి తెలియనీయకుండా నిగూఢంగా మెలగుతున్న మహాజ్ఞానివైన నీకు తిరిగి తిరిగి పెక్కు విధాల నమస్కరిస్తున్నాను.

మ. జ్వరితార్తుండగు రోగి కౌషధ మతీష్టంబైన చందంబునన్
ధరలో నాతపతప్త దేహి గడు శీతంబైన తోయంబునున్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహి దష్టుండనై
పరఁగున్ నాకును నీ వచో-మృతము దప్పన్ మందు వేఱున్నదే?

157

తా ॥ జ్వరంతో, రోగంతో బాధపడే రోగికి రుచికరమైన ఔషధం లభించినట్లు, వేసవి ఎండకు తాపంతో బాధపడుతున్నవాడికి చల్లని నీరు దొరికినట్లు అహంకారమనే సర్పముచే కరవబడిన నాకు నీ వచనములే అమృతంలా పనిచేశాయి. ఇది తప్ప వేరే మందు ఏమి కావాలి!

ఆ. విప్రవర్య! నేను వేడ్కతో నా సంశ, యంబులెల్ల నిన్ను నడగి తెలియఁ
దలఁచి యున్నవాఁడఁ; దప్పక యెఱిఁగింపు, ముచితవృత్తిఁ దత్త్వయోగమెల్ల.

158

తా ॥ ఓ బ్రాహ్మణవర్యా! నేను ఎంతో ఉత్సాహంతో నా సంశయాలన్నింటినీ నిన్నడిగి నివృత్తి చేసుకోవాలనే తలంపుతో ఉన్నాను. అధ్యాత్మయోగాన్నంతటిని నాకు యోగ్యమైన పద్ధతిలో తప్పకుండా తెలియజెప్పవా!"

వ. అని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె.

159

తా ॥ అని కోరిన రాజుతో ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు.

తే. కానవచ్చిన ఫలములు కర్మమూల, ము లగుటను జేసి సంసారములను జిత్త
మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగలేవు, తత్త్వయోగంబు మిగుల నిత్యం బటంచు.

160

తా ॥ "ప్రతి ఫలానికీ మూలం కర్మ. అందువల్ల మనస్సు సంసార బంధములో చిక్కుకొని ఉన్నంతవరకు తత్త్వయోగం శాశ్వతమనీ, సత్యమనీ తెలియలేవు."

వ. మఱియు నీ వసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘలు నా మీఁద జానువులా పొడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బట మీఁద నుర మందులకు నెక్కువ కంఠం బఁట మీఁద స్కంధం బందుల దారు వా దారువున శిబిక శిబిక యందు రాజు ననియెడి యభిమానంబు గలిగి నీ వున్న వాఁడ విట్టి శోచ్యులై కష్టదశం బొందిన జనుల దయలేక నిగ్రహించి నీవు ప్రజాపాలనంబు సేయుచున్నవాఁడ; నను గర్వంబున మా వంటి మహాత్ముల సభలలోనం బూజ్యుండవుగాక యున్నవాఁడ; వీ స్థావరజంగమంబులకు నివాసస్థానంబు వసుంధరయైన చందంబున సత్క్రియలచేత నెఱుంగం దగిన జగత్కారణంబైన తత్త్వంబు నెఱింగించెదఁ; బరమాణు సముదయం బీ ధరిత్రియైన చందంబున నవిద్యామనంబులచేతం గల్పితంబయిన కృశస్థూల బృహ దణుసద సజ్జీవాజీవ ద్రవ్య స్వభావాశయ కాలనామబుద్ధి రూపంబైన మాయచే జగత్తు రెండవదియై కల్పింపంబడియె; బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్ద వాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబునునైన బ్రహ్మం బొకటియే సత్యంబు; జగత్తసత్యం బగు నని పలికి మఱియును.

తా ॥ ఈ భూమిమీద కాళ్ళు, వాటిపై పిక్కలు, వాటిపై మోకాళ్ళు, వాటిపై తొడలు, ఆపై నడుము, దానిపై రొమ్ము, దానిపై కంఠం, దానిపై భుజాలు, ఆ భుజాల మధ్య బొంగు, దానిని ఆధారంగా పల్లకి, ఆ పల్లకిలో రాజునైన నేను కూర్చొని ఉన్నాను – అని ఈ భూమి మీద ఒకడు నిన్ను పల్లకిలో కూర్చోబెట్టుకొని మోస్తున్నాడనే భ్రాంతిలో పడిఉన్నావు – నువ్వు. ఇది వింత కలిగించే కష్టదశ. నువ్విలాంటి కష్టదశలో ఉండి కూడా ప్రజలపై దయచూపక, వారిని అదుపులో పెట్టి పరిపాలన చేస్తున్నాననే గర్వంతో ఉన్నావు. అందువల్ల ఆత్మజ్ఞానం గలవారి సభలలో పూజ్యస్థానాన్ని పొందలేకపోతున్నావు.

ఈ చరాచరజగత్తుకు నివాసస్థానం భూమి ఎలాగో మంచి పనుల ద్వారా తెలుసుకోవలసిన సర్వజగత్కారణమైన తత్త్వాన్ని గురించి తెలియచేస్తాను.

ఈ భూమి పరమాణువుల సముదాయంతో ఏర్పడింది. అలాగే అజ్ఞానం నిండిన మనస్సుచేత ఈ జగత్తు కల్పించబడింది. ఈ అవిద్య కారణంగా జగత్తు రెండవదిగా అయ్యింది. ఈ విధంగా ఒకటి రెండుగా కల్పితమైనదానిని మాయ అంటారు. ఈ కల్పితాలు అనేకములు. చిక్కినది, బలిసినది; లావైనది, సన్నపడ్డది; పెద్దది, చిన్నది; ఉన్నది, లేనిది, బ్రతికినది, చచ్చినది ఇలా ద్రవ్యాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి, ఆశయాన్ని బట్టి, కాలాన్ని బట్టి, నామాన్ని బట్టి, బుద్ధి రూపంగా కనిపిస్తూ మాయ కప్పిన జగత్తు రెండవదిగా కల్పింపబడింది.

బయటా లోపలా తనంతతానుగా ప్రకాశిస్తూ "భగవత్' అనే శబ్దంతో పిలవబడుతూ విశుద్ధమై, పరమార్థమై జ్ఞానరూపమైనట్టి పరబ్రహ్మమొక్కటే సత్యమైనది. జగత్తు అసత్యమైనది.

సీ. ధరలోన బ్రహ్మంబుఁ దపమున దానంబు, లను గృహధర్మంబులను జలాగ్ని
సోమసూర్యులచేత శ్రుతులచే నైనను, బరమ భాగవతుల పాదసేవఁ
బొందిన మాడ్కిని బొందంగ రాదని, పలుకుదు రార్యులుఁ బరమమునులు

ఘనతపోబాహ్య సౌఖ్యములకు విముఖులు, నై పుణ్యులు హరిగుణానువాద

తే. మోదితాత్ములు నగు బుధపాదసేవ, ననుదినంబును జేసిన నంత మీఁద

మోక్ష మార్గంబునకును బద్మాక్షునందుఁ, బట్టువడి యుండు నెప్పుడుఁ బరఁగ బుద్ధి.

162

తా ॥ దేహంకంటే వేరైన స్వరూప స్వభావాలు గల ఆత్మతత్త్వాన్ని, చేతనాచేతనాల కంటే విలక్షణమైన పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవడానికి మహాపురుషుల సేవ తప్ప ఇంకో సాధనం లేదు. ఆ జ్ఞానం తపస్సు వల్ల లభించదు. గృహస్థ ధర్మాల్ని ఆచరించడం వల్ల లభించదు. వేదాధ్యయనమూ దీనికి సాధనం కాదు. జలమధ్యంలో, అగ్నిమధ్యంలో నిలిచి తపస్సు చేసినా లభించదు. సూర్యోపాసన చేసినా లభించదు. పరమ భాగవతుల పాదసేవ చేయడం వల్లనే బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది. ఇది పెద్దలు చెబుతున్న మాట.

పరమమునులు మహాతపస్సు చేసుకొంటూ జీవితం గడుపుతారు. బాహ్యసౌఖ్యాల కోసం ప్రాకులాడరు. నిరంతరం కీర్తనీయుడైన హరిగుణాలనే కీర్తిస్తూ ఆత్మారాములై ఉంటారు. అట్టి మహాభాగవతుల్ని సేవించడం వల్ల గ్రామ్య కథల ప్రసంగముండదు. వారిని సేవిస్తే మోక్షసాధనకు పద్మాక్షుడైన హరి యందే మనస్సు నిలిచి ఉంటుంది.

వ. నరేంద్రా! యేను పూర్వంబున భరతుండను రాజను; సర్వసంగపరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబనై పుట్టియు నందును హరిభక్తి దప్పకుండిన కతంబున నిప్పుడు మనుష్యుండనై మనుష్య సంసర్గంబును బాసి యేకాకినై చరియించుచున్నవాఁడ; నరుండు వృద్ధసంసేవం జేసి సంసారమోహంబును బాసి హరిధ్యాన కథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందునని పలికి విప్రుండు మఱియు నిట్లనియె.

163

తా ॥ “ఓ రాజా! నేను పూర్వజన్మలో భరతుడనే రాజును. అన్నింటి సంగాన్ని విడిచి భగవంతుడినే ఆరాధిస్తూ ఉండేవాణ్ణి. కొన్నాళ్ళకు ఒక లేడిపట్ల స్నేహం కలిగింది. కనుక లేడినై పుట్టాను. మృగంగా పుట్టినా హరిభక్తి విడువకుండా గడిపాను. అందువల్ల ఇప్పుడు మనుష్యుడినై పుట్టాను. ఈ జన్మలో మళ్ళీ సంగం ఏర్పరచుకొంటే భ్రష్టుణ్ణి అయిపోతాననే బెంగతో అందరికీ దూరంగా ఉంటూ ఏకాకినై బ్రతుకుతున్నాను. నరుడు, మహాపురుషుల్ని సేవించడం వల్లనే ఈ సంసారమోహాన్ని విడిచి విష్ణుధ్యానంతో విష్ణుకథల్ని వినడంవల్ల జ్ఞానాన్ని పొంది, పుండరీకాక్షుడైన ఆ విష్ణువును పూజిస్తూ పరలోకాన్ని పొందుతాడు” – అని చెప్పి, ఆ విప్రుడు ఇంకా ఇలా అన్నాడు:

సీ. ధరణీశ! మాయచేతను దాఁటఁగా రాని, పథమునఁ బెట్టంగఁ బడ్డ జీవుఁ
డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ, మాశించి తిరుగు బేహారి మాడ్కి
ఫల మపేక్షించుచుఁ బాయక జీవుండు, సంసారగహన సంచారి యగుచు
నవవరతము నుండు నా మహావనమందుఁ, గామలోభాది తస్కరులు గూడి

తే. ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁబట్టి, ధర్మ మనియెడి యా మహాధనము నెల్ల
నరసి కొనిపోవుచుండుదు రనుదినంబుఁ, గాన సంసారమందు నాకాంక్ష వలదు.

164

తా ॥ “రాజా! మాయచేత దాటశక్యముగాని మార్గమున పెట్టబడిన జీవుడు, లాభాన్ని పొందాలని కోరుతూ తిరుగు వర్తకునివలె లాభదృష్టితో కర్మలు చేయుచూ సంసారమనే అడవిలో సంచరించును. ఆ అడవిలో కామం, లోభం మొదలైన దొంగలు తిరుగుచూ ఇంద్రియాలను జయించలేని మనిషిని ఆవహిస్తాయి. అవి జీవుడు దాచుకున్న ధర్మమనే మహాధనాన్ని దోచుకొని పోతాయి. ఇది మానవుడికి ప్రతినిత్యం జరిగే తంతు. అందువల్ల సంసారం పట్ల కోరిక పనికిరాదు.

క. అరయఁగ సంసారాటవిఁ, దరలక యీ పుత్రమిత్ర దారాదు లనం

బరఁగుచు నుండెడు వృకములు, పరువడి నరబస్తములను భక్షించు వడిన్.

165

తా ॥ ఆలోచించి చూస్తే – ఈ సంసారం అనే అడవిలో కొడుకు, స్నేహితుడు, భార్య – వీళ్ళంతా తోడేళ్ళు. తోడేళ్ళు మేకలను భక్షించినట్లు వీరంతా పురుషుణ్ణి పీక్కుతింటారు.

తరలము.

మలసి సంసృతి ఘోరకానన మందిరమ్ముల నెల్లచోఁ

జెలఁగి గుల్మలతాతృణాదులచేత గహ్వరమైన ని

శ్చలనికుంజములందు దుర్జన సంజ్ఞలం గల మక్షికం

బుల నిరోధము దన్ను సోఁకినఁ బొందు చుందురు దుర్దశన్.

166

తా ॥ సంసారం అనబడే భయంకరారణ్యంలో ఉన్న ఇళ్ళ చుట్టూ పొదలు, తీగలు, గడ్డి దుబ్బులు అల్లుకొన్నట్లు మనిషి చుట్టూ ఆపదలు ఉంటాయి. దుర్జనులనబడే కందిరీగలు పేట్రేగి బాధిస్తూ ఉంటాయి. దానితో జీవుడు ఎన్నో దుర్దశల పాలవుతాడు.

ఆ. మఱియు నీ గృహస్థమార్గంబునం దెల్ల, విషయములను బొంది విశ్వమెల్ల

గడఁకతోడ నిట్లు గంధర్వనగరంబుఁ, గాఁ దలంచి మిగుల మోదమందు.

167

తా ॥ గృహస్థ ఆశ్రమంలో ఉన్నవాడికి విషయాలను అనుభవించడం వల్ల ఏర్పడే సుఖమే సుఖమనుకొంటూ ఈ విశ్వం కనిపిస్తుంది. అలా చూడటం వల్ల ఎంతో సంతోషం కలుగుతుంది. కాని అది గంధర్వనగరం చూసి సంబరపడటం లాంటిది.

గంధర్వనగరం – అంటే లేనిది ఉన్నట్లు మురిపించి మాయారూపంగా కనిపించడం.

ఆ. మరగి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి, యగ్నిఁ గోరి వెంట నరుగు మాడ్కిఁ
గాంచనంబు గోరి కలవారి యిండ్ల పం, చలను దిరుగు నరుఁడు చలనమంది.

168

తా ॥ అడవిలో కొఱవి దయ్యాన్ని చూసి నిప్పు అనుకొని, దాని వెంబడి పోయి మోసపోయినట్లే బంగారం కోసం ధనికుల కొంపల చుట్టూ ఈ నరుడు ఆగకుండా తిరుగుతూ వ్యథలకు లోనవుతాడు.

ఆ. బహుకుటుంబి యగుచు బహుధనా పేక్షచే, నెండ మావులఁగని యేఁగు మృగము
కరణిఁ బ్రేమఁజేసి పరువులు వాఱుచు, నొక్కచోట నిలువకుండు నెపుడు.

169

తా ॥ నరుడికి కుటుంబం పెరుగుతున్నప్పుడు, దాన్ని పోషించడానికి ఎక్కువ ధనం కోసం వెంపర్లాడుతూ – ఎండమావుల్ని చూసి నీటికోసం పరుగులెత్తే మృగంలా – వృథా ప్రయాసలతో స్థిరం తప్పి వాడు తిరుగుతూనే ఉంటాడు.

ఆ. మఱియు నొక్క చోట మత్తుఁడై పవన ర, జో హతాక్షుఁ డగుచుఁ జూపు దప్పి
దిక్కెఱుంగ కొండుదిశ కేగు పురుషుని, కరణిఁ దిరుగు నరుఁడు నరవరేణ్య!

170

తా ॥ ఓ రాజా! మానవుడీ సంసారపు మత్తులో పడి కళ్ళు మూసుకుపోయి ఎటుపోవాలో తెలియక – కళ్ళల్లో దుమ్ము పడినవాడు చూపుపోయి, దారి తప్పి దిక్కు లేక తిరిగినట్లుగా – తిరుగాడుతూ ఉంటాడు.

వ. మఱియు నొక్కచోట నులూక ఝిల్లీస్వనంబులతోడ సమానంబు లయిన శత్రురాజి తిరస్కారంబులకు దుఃఖపడుచు, నొక్క చోట క్షుధార్దితుండై యపుణ్య ఫలవృక్షంబుల

నాశించు మాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులు నగు వారి నాశ్రయించుచు, నొక్క యెడం బిపాసాతురుండై జలహీనంబయిన నదికిఁ జనినరీతి నిహపరదూరులైన పాషండుల సేవించుచు, మఱియు నొక్క ప్రదేశంబునం దగ్నిచేతం దప్తుర్డయిన వాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి నన్నార్థి యగుచు దాయాదులం జేరి దుఃఖించుచు, మఱియు నొక్కచోట పరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖులైన పితృపుత్రభ్రాతృ జ్యేష్ఠుల నైనను వధియించుచు, మఱియు శూరులచేతం గొట్టువడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుండై దుఃఖించుచు నున్నంత గంధర్వనగర ప్రాయంబైన సంసార సుఖంబు ననుభవించి మోదించుచు, మఱియు నగారోహణంబు సేయు నరుండు కంటక పాషాణాదుల వలనం బాధాపీడితుం డగుచు దుః ఖించు చందంబున గృహాశ్రమోచిత మహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసన కంటక శర్కరాపీడితుండై దుఃఖించుచు, నొక్కచోటన్ జఠరాగ్ని పీడితుండై కుటుంబంబు మీఁద నాగ్రహించుచు వనంబున నజగర గృహీతుండై నిగీర్ణుండైన చందంబున రాత్రి గృహాటవియందు నిద్రాపరవశుండై యెఱుంగక వర్తించుచు మఱియును వనంబునఁ దృణచ్ఛన్న కూపపతితుం డగుచు సర్పదష్టుండైన తెఱంగున సంసారియె దుర్జనుల చేత వ్యథిత హృదయుం డగుచు నంధుండై యజ్ఞానాంధ కూపంబునం బడుచు, నొక్కయెడ జుంటి తేనియకునై మక్షికాబాధ నత్యంత దుఃఖితుండయిన మాడ్కిని సంసారకాముండై పరదార ద్రవ్యాభిలాషి యగుచు భూపాలకుల చేతనైనను గృహపతిచేతనైనం దాడితుండయి నరకంబునం బడుచు, యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులు పరులచేతం బోనాడిన విధంబున శీతవాతాద్యనేక ప్రయాసలబ్ధంబైన ధనంబు వోనాడి సంసారి యతిచింతా క్రాంతుండై యుండు; మరియును వనంబున లుబ్ధకులు సంసృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్య వైషమ్యంబునం గలహించిన విధంబున సంసృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడుచుండు నని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి వెండియు నిట్లనియె.

తా ॥ ఈ సంసారమనే అరణ్యంలో ప్రవేశించిన జీవుడికి గుడ్లగూబల కూతలు, కీచురాళ్ళ ధ్వనులు అనబడే శత్రువుల తిరస్కారపు మాటలు కలత పెట్టి దుఃఖపెడతాయి. అడవిలో తిరుగుతూ ఆకలికి తట్టుకోలేక విషపు పళ్ళనిచ్చే చెట్లను ఆశ్రయించినట్లు ఒక్కోసారి పాపం చేసే నీచుల్ని, ధనంలేనివాళ్ళను ఆశ్రయించవలసి వస్తుంది. దాహం వేసినప్పుడు ఒక్కోసారి నీళ్ళులేని నదికి పోయినట్లు – ఇహపర లోకాలకు దూరమై, నీతి బాహ్యులై వేదాల్ని నిందించే వాళ్ళను సేవించవలసి వస్తుంది. ఒక్కో చోట అగ్ని సెగకు తాళలేక పరుగెత్తి, దావాగ్నిలో చిక్కి దుఃఖం పొందినట్లు అన్నం కోసం దాయాదుల పంచకు చేరి ఏడ్చే దుఃస్థితి దాపురిస్తుంది.

ఒక్కోసారి శత్రుబాధకు తాళలేక రాజ్యకాంక్షతో ప్రాణంతో సమానులైనట్టి తండ్రిని, కొడుకును, అన్నదమ్ముల్ని కూడా చంపుతూ, శూరుల చేత దెబ్బల్ని తింటూ, సంపాదించిన సొమ్మునంతటినీ పోగొట్టుకొని, బాధపడుతూ, దుఃఖీస్తూ గడపవలసి వస్తుంది. గగనంలోని గంధర్వనగరంలోని మేడలను చూసి మురిసిపోయినట్లు, సారంలేని సుఖాలను అనుభవిస్తూ జీవనాన్ని సాగిస్తుంటాడు. దారిలో ముళ్ళు రాళ్ళూ గ్రుచ్చుకుపోతున్నా పాదాలు బొబ్బలెక్కి బాధిస్తూ ఉంటే ఏడుస్తున్నట్లు గృహస్థాశ్రమానికి అనువైన కార్యకలాపాలకు యత్నించి వ్యసనాలనే ముళ్ళు రాళ్ళూ పీడిస్తూ ఉండగా దుఃఖీస్తాడు.

ఒక్కోసారి ఆకలికి తట్టుకోలేక తన కుటుంబం మీద ఆగ్రహిస్తాడు. అరణ్యంలో కొండచిలువ పట్టి మ్రింగేసినట్లు జీవుణ్ణి ఇల్లనే అడవిలో నిద్ర మ్రింగివేస్తుంది.

అడవిలో గడ్డిచే కప్పబడిపోయిన లోతైన బావిలో పడి పాము కాటుకు గురైనట్టు, సంసారి దుర్మార్గుల బారిన పడి హృదయాన్ని కష్టపెట్టుకొని, గ్రుడ్డివాడై అజ్ఞానమనే చీకటి నూతిలో పడిపోతాడు. పట్టుతేనెకు ఆశపడి తేనెటీగలు కుట్టగా ఎంతగానో దుఃఖీంచినట్లు – సంసారం మీది కోరికతో మరొకడి భార్యను, మరొకడి సొమ్మును ఆశించి నేరస్థుడై రాజదండాన్ని కాని, ఇంటి యజమాని యొక్క దండాన్ని కాని పొంది నరకానికి పోతాడు.

యౌవనంలో సంపాదించిన సొమ్ము పరులచేత పోగొట్టుకొన్న విధంగా ఎండనక, చలి అనక, కష్టించి సంపాదించిన సొమ్ములు పోతూ ఉండగా సంసారి ఎంతో చింతలో మునిగిపోతాడు.

అడవిలో బోయవాళ్ళకు కొద్దిపాటి మాంసం దొరికినా దానికోసం ఒకరినొకరు మనస్సు పాడుచేసుకొని దెబ్బలాడుకొన్నట్లు కుతంత్రాలు కల్పించుకొంటూ ద్రవ్యాల కోసం పోరాడుకొంటారు.''

అని ఆ విప్రుడు రాజుకు సంసారమనే అడవి తీరు ఎలా ఉంటుందో చెప్పాడు. చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

ఆ. అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృప్తిఁ, బొంద కొరుల ధనముఁ బొందఁ గోరి
యరిగి వారివలన నవమానములఁ బొంది, యధికమైన దుఃఖ మనుభవించు.

172

తా ॥ "డబ్బు కొద్దిగా ఉన్నవాడు దానికి తృప్తి పొందకుండా తనకు విశ్రాంతి స్థావరాలైన తన ఇల్లు మొదలైన వాటిని వదిలిపెట్టి, మరొకళ్ళ ధనం తాను పొందాలనే కోర్కెతో వెంపర్లాడి, అవమానాలను పొంది, ఎంతగానో దుఃఖాన్ని అనుభవిస్తాడు.

ఆ. అంతఁ గొందఱల్ల నన్యోన్య విత్తాది, వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమైన
వైరములను బొంది పోరాట నొందుదు, రాత్మచింత లేక యనుదినంబు.

173

తా ॥ మరికొందరైతే నిరంతరమూ ఇంకొకళ్ళతో పరస్పరం డబ్బు ఇచ్చిపుచ్చుకోవడం, కూడబెట్టుకోవడం ఇలాంటి వినిమయ కార్యకలాపాల వల్ల పెరిగే కలహాలతో కొట్లాడుకొంటూ ఉంటారు. ఆత్మచింతన ఏనాడూ చేయరు.

సీ. సంసారమార్గ సంచారుఁడై యధిక ప్ర, యాసంబునన గూర్చు నర్థములను
విహరించుచును గొంద ఱిహలోక ఫలములఁ, గోరుచు మోక్షంబు గోర కంతఁ
జెడిపోవుచుందు; రెప్పుడు గాని యందుకుఁ, గడపటి యోగంబుఁ గాన లేరు;
మానవంతులు నసమానశౌర్యులు నగు, వారు మిక్కిలియైన వైరబుద్ధి

తే. నాహవంబున మడియుదు; రంతెకాని, మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి
ననుచు సంసార గహన విహారమెల్లఁ, దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు.

174

తా ॥ కొందరీ సంసారమార్గంలోనే తిరుగుతూ ఆ సంసార పోషణకు ఎంతో శ్రమపడిపోతారు. ఆ శ్రమవల్ల లభించే వస్తుధనసంపదలతో ఆనందిస్తూ, ఇహలోకంలో సుఖాన్నే కోరతారు గానీ మోక్షాన్ని కోరరు. అంతకంతకు చెడిపోతారే గాని ఏది ముఖ్యమైన యోగమో – దాన్ని గురించి పట్టించుకోరు.

ఇంకొందరుంటారు. వీరు అభిమానవంతులు, సాటిలేని శౌర్యం గలవారు కూడ. వీళ్ళకు శత్రుభావం మిక్కుటంగా ఉండి, యుద్ధాలు చేసి తనువు చాలిస్తారు. అంతేగాని మోక్షమార్గాన్ని చూడరు. మూర్ఖంగా గడుపుకొనిపోతారు. ఇదీ ఈ సంసారం అనే అడవిలో నరుడు తిరిగే తీరు."

– అని భరతుడు చెప్పి, మళ్ళీ ఇలా అన్నాడు.

వ. మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాక గృధ్ర బకసమానులైన పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వంచింతుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌతస్మార్త కర్మానుష్ఠానపరుండై విషయసుఖంబులందుఁ దగులువడి కాలంబు తుద నెఱుంగక వృక్షంబులుంబోలె నైహికార్థంబుల యందుఁ దృష్ణ గలిగి మైథున నిమిత్తంబు సుతదారాదుల యందు స్నేహంబు సేయుచుఁ బఠికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘనిమ్న కూపంబునం బడిన తెఱంగున సంసారమృత్యుగజ భయంబున

గిరికందర ప్రాయంబయిన యజ్ఞాన తమంబునం బడుం గావున మాయచేత సంసార మార్గంబైన రాజభావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపల గనుమని పలికిన భూపాలుం డిట్లనియె.

175

తా ॥ "రాజా! నరుడు కాలచక్రం యొక్క అదుపులో తిరుగుతూ చక్రాయుధుడైన శ్రీహరిని సేవించకుండా రాపులుగులు, గ్రద్దలు, కొంగలతో సమానమైన వేదబాహ్యులతో సఖ్యం చేసి, వాళ్ళ మోసానికి గురియైపోతాడు. బ్రాహ్మణకులంలో పుట్టినందువల్ల వేదవిహితమైన, స్మృతి నియతమైన కర్మల్ని చేస్తున్నా, భగవదారాధన లేక విషయలౌల్యంలో పడి, కాలం ముంచుకొస్తోందన్న సత్యం గుర్తించకుండా చెట్లవలె కేవల దృష్టార్థాలయిన ఐహికమైన సుఖాలకే ఆశపడుతూ, లైంగికమైన సుఖానికే అర్రులు చాస్తాడు. పెళ్ళాం పిల్లల పట్ల మక్కువ చూపిస్తూ బాటసారి ఏనుగుల భయంతో లోతైన నూతిలో పడిపోయినట్లు సంసారమృత్యువనే ఏనుగు భయంతో కొండలు, లోయలవంటి అజ్ఞానపు చీకట్లో పడిపోతాడు. కన్నుగానక ఆ చీకట్లో కర్మలనే చీపరపాపర తీగెలను పట్టుకొని ఆ కర్మాచరణల వల్ల మళ్ళీ మళ్ళీ జన్మలను పొందుతుంటాడు. అందుకోసం, రాజా! నువ్వు రాజభావాన్ని విడిచిపెట్టు. ఈ భావం సంసారమార్గం నుండి తప్పించదు. రాజభావాన్ని విడిచి, సకల చరాచర ప్రపంచంతోను మిత్రుడిగా ఉండు. ఇంద్రియాల్ని జయించు. జ్ఞానమనే ఖడ్గంతో మాయాపాశాన్ని తెగనటికి, జీవిత గమ్యస్థానం చేరుకో" – అన్నాడు విప్రుడు. వినిన రాజు ఇలా అన్నాడు.

క. అక్కట! మానుష జన్మము, పెక్కువయై యుండు నెపు డభేదమతిం బెం
పెక్కిన యోగిసమాగమ, మక్కజముగఁ గలిగెనేని యఖిలాత్ములకున్.

176

తా ॥ "ఔరా! మానవ జన్మ అన్నింటికంటే ఎక్కువైనదన్న సత్యం నీ వంటి మహాయోగిజనుల దర్శనం వల్లనే రూఢిపడుతుంది. నీవంటి సత్పురుషుల సహవాసం

లభించినప్పుడే మానవ జన్మకు సార్థకత.

క. ధరణీసురవర! నీ శ్రీ, చరణాంబుజ యుగ ళరేణు సంస్పర్శము నా
దురితంబు లడఁచె; నింతట, హరిభక్తియు నంతకంత కధికం బయ్యెన్.

177

తా ॥ ఓ బ్రాహ్మణోత్తమా! శోభావహమైన నీ దివ్యచరణాలనే పద్మాల రేణువులను తనివితీరా స్పర్శించడం వల్ల నా పాపాలన్నీ పటాపంచలైపోయాయి. నాకు హరిభక్తీ అంతకంతకు మరింతగా పెరిగింది.

వ. మఱియు విప్రవరులయందు యోగేశ్వరు లవధూత వేషంబునం జరియింపు చుందురు; గావున విప్రులు పిన్నలు పెద్దలనక యందఱకు నమస్కారం బని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యా రాజుచేత వందితచరణుండై పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణ కరుణారసపూరిత స్వాంతుడై వసుంధరం జరియించు చుండె; సింధుభూపతియును సుజన సమాగమంబున లబ్ధతత్త్వ జ్ఞానుండయి దేహాత్మ భ్రమం బాసె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

178

తా ॥ యోగీశ్వరులు పరివ్రాజక వేషంలో బ్రాహ్మణరూపంలో సంచరిస్తూ ఉంటారు. కనుక పిన్నలని, పెద్దలని భేదం ఎంచకుండా బ్రాహ్మణులందరికీ నమస్కారం" – అని రాజు స్తుతించాడు. యోగీశ్వరుడైన ఆ భరతుడు రాజుపై కరుణతో తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించాడు. సింధుపతి యొక్క నమస్కారాన్ని అందుకొని భరతుడు నిండు సముద్రంలా సంపూర్ణమైన దయ కలిగిన మనస్సుతో భూమిపై చరించాడు. సింధుపతి రహూగణుడు కూడా సజ్జన సాంగత్యం వల్ల తత్త్వజ్ఞానాన్ని పొంది, దేహమే ఆత్మ అనే భ్రాంతిని విడిచిపెట్టాడు."

– అని శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుతో ఇలా అన్నాడు.

చ. అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగలేని రీతి యీ
భరతుని సచ్చరిత్రములు ప్రస్తుతి సేయఁగ నీ వసుంధరన్
నరపతు లెల్ల నోపరు మనంబున నైననునెంచ, నింక నా
భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే?

179

తా ॥ "రాజా! ఈగ ఎగిరి ఎంత ప్రయత్నించినను ఎలా గరుత్మంతుని చేరుకోలేదో, ఈ భూమిపై ఉన్న రాజులందరూ ఆ భరతుడి సచ్చరిత్రాలను ప్రస్తుతించడానికి సరిజాలరు. మనస్సులో తలచడానికి కూడా వీళ్ళందరికీ అర్హత లేదు. అలాంటప్పుడు ఆ భరతుడి పుణ్యచరిత్రను ప్రస్తుతించడం నా తరమా?

వ. నరేంద్రా! భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వ కాలంబునంద విడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతి పురుష స్వరూపంబును బాసె, నట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టివారలఁ బుండరీకాక్షుండు రక్షించు, నాయు రభివృద్ధి యగు; ధనధాన్య సమృద్ధియు నగుచుండ స్వర్గోపభోగంబులం బొందుదురని.

180

తా ॥ రాజా! భరతుడు కొడుకుల్ని, భార్యను, రాజ్యాదుల్ని ఎప్పుడో విడిచి, భగవంతుని మీదే ధ్యాస గలవాడయ్యాడు. యజ్ఞరూపము, ధర్మ స్వరూపము, సాంఖ్యయోగమూ, ప్రకృతి పురుష స్వరూపమూ అయిన నారాయణునకు నమస్కరించి, తనకు వచ్చిన లేడి జన్మ నుంచి విముక్తి పొందాడు. అట్టి భరతుడి చరిత్రను ఎవరు చెబుతారో, ఎవరు వింటారో అట్టి వక్తను, శ్రోతను పరమేశ్వరుడు రక్షిస్తాడు. ఆయువు పెరుగుతుంది. ధనధాన్యాలు సమృద్ధిగా ఉంటాయి.

స్వర్గాది భోగాలు పొందుతారు.”

– అని చెప్పాడు శుకమహర్షి.

మ. నరదేవాసుర యక్షరాక్షస మునీంద్రస్తుత్య! దివ్యాంబరా
భరణాలంకృత! భక్త వత్సల! కృపాపారీణ! వైకుంఠ మం
దిర! బృందావన భాసుర ప్రియధరిత్రీనాథ! గోవింద!
శ్రీ కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కల్యాణ! గోపాలకా!

181

తా ॥ నరులచే, దేవతలచే, రాక్షసులచే, యక్షులచే, మునీశ్వరులచే స్తుతింపబడేవాడా! దివ్యమైన వస్త్రాలను, ఆభరణాలను ధరించినవాడా! భక్తులయందు వాత్సల్యం గలవాడా! కృప చూపించడంలో నేర్పరైనవాడా! వైకుంఠం మందిరంగా గలవాడా! బృందావనంలా ప్రకాశించే ప్రియమైన భూమికి నాథుడా! గోవిందా! సిరులను కలిగించేవాడా! పుణ్యాన్ని కలిగించేవాడా! త్రిలోకాలకు మంగళమైనవాడా! గోపాలకా! వాసుదేవా! నీకు వందనం.

క. పరమపదవాస! దుష్కృత, హర!కరుణాకర! మహాత్మ! హతదితిసుత! భా
సురగోపికామనోహర!, సరసిజదళనేత్ర! భక్త జననుతగాత్రా!

182

తా ॥ పరమపదం నివాసంగా కలవాడా! పాపాలను హరించేవాడా! కరుణాకరా! మహాత్మా! దైత్యుల్ని సంహరించినవాడా! గోపికల మనస్సును హరించినవాడా! పద్మపత్రాలవంటి కన్నులు కలవాడా! భక్తజనులచే నుతింపబడే శరీరం కలవాడా! శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

మాలిని.

సరస హృదయవాసా! చారులక్ష్మీ విలాసా!, భరితశుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమఘనగాత్రా! నిర్మలజ్ఞానపాత్రా!, గురుతరభవదూరా! గోపికాచిత్తచోరా!

183

తా ॥ సరసుల హృదయంలో నివసించేవాడా! లక్ష్మీదేవి విలాసంగా కలవాడా! శుభ చరిత్ర కలవాడా! సూర్యచంద్రులు కన్నులుగా కలవాడా! సాటిలేని శ్యామలవర్ణమయమైన శరీరం కలవాడా! విశుద్ధమైన జ్ఞానానికి పాత్రమైనవాడా! జన్మభారాన్ని బాపేవాడా! గోపికల చిత్తాన్ని దొంగిలించినవాడా! శ్రీకృష్ణా! నీకు నమస్కారములు.

గద్యము.

ఇది సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణంబు నందుఁ బ్రియవ్రతుని సుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబును, నాగ్నీధ్రాదుల జన్మంబును, నుత్తమతామస రైవతుల జన్మంబును, బ్రియవ్రతుండు వనంబునకుం జనుటయు, నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతుల జన్మంబును, నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయును, నాభిప్రముఖుల రాజ్యంబును, నాభియజ్ఞంబును, ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యాభిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు, భరతుండు హరిణపోతంబునందలి ప్రీతింజేసి హరిణగర్భంబున జనియించుటయు, మరల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికా గృహంబున బ్రదికి వచ్చుటయు, సింధుపతి విప్రసంవాదంబును నను కథలు గల పంచమ స్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

184

తా ॥ ఇది సత్కవులందరికి ఆనందాన్ని కలిగించేవాడైన బొప్పనామాత్యుడి కొడుకైన గంగనార్యుడు వ్రాసిన శ్రీమహాభాగవత పురాణంలోని ప్రియవ్రతుడి సుజ్ఞానదీక్ష, బ్రహ్మ దర్శనం, ఆగ్నీధ్రాదుల జననం, ఉత్తమ తామస రైవత మనువుల జన్మం, ప్రియవ్రతుడు అడవికి వెళ్ళడం,

ఆగ్నీధ్రుడు అప్సరఃస్త్రీని చేపట్టడం, వర్షాధిపతుల పుట్టుక, ఆగ్నీధ్రుడు అడవికి వెళ్ళడం, నాభి ప్రముఖుల రాజ్యం, నాభి యజ్ఞం, ఋషభుని జన్మవృత్తాంతం, అతని రాజ్యాభిషేకం, భరతుని జననం, ఋషభుడు తపస్సుకు వెళ్తూ కొడుకులకు సాటిలేని జ్ఞానాన్ని ఉపదేశించడం, భరతుని పట్టాభిషేకం, భరతుడు అరణ్యానికి వెళ్ళడం, భరతుడు లేడిపిల్లపై ప్రేమవల్ల లేడి కడుపున పుట్టడం, తిరిగి బ్రాహ్మణ కుమారుడిగా పుట్టడం, బ్రాహ్మణుడు చండికాలయంలో బ్రతికి రావడం, సింధురాజునకు బ్రాహ్మణుడికి జరిగిన సంవాదం – అనే ఈ కథలతో ఉన్న ఐదవ స్కంధంలోని మొదటి ఆశ్వాసం.

శ్రీ కాంతాహృదయప్రియ !
లోకాలోకప్రచార !
భవభయనివారక ! లోకేశ్వర సు శ్లోక !
గోకులమందార ! నందగోపకుమారా !

1

తా ॥ లక్ష్మీదేవి యొక్క హృదయానికి ప్రియమైనవాడా! లోకాల యొక్క అస్తిత్వమందును, అస్తిత్వం లేనప్పుడు కూడా ఉండేవాడా! లోకాలకు ప్రభువైనవాడా! సజ్జనులచే కీర్తించబడేవాడా! జన్మ భయాన్ని నివారించేవాడా! గోకులానికి కల్పవృక్షం వంటివాడా! నందగోపుని కుమారా! అవధరింపుము.

## 1. మహారాజు సుమతి వంశక్రమము

వ. సకల పురాణార్థ జ్ఞాన విఖ్యాతుండయిన సూతుం డిట్లనియె.

2

తా ॥ పురాణాలన్నింటి అర్థాన్ని, వాటిలో తత్త్వాన్ని తెలుపడంలో ఎంతో ఖ్యాతిగొన్న సూతమహర్షి ఇలా వినిపించాడు:

క. మునులార! బాదరాయణి, యనఘాత్మకుఁడైన యుత్తరాత్మజునకు స
ద్వినయోక్తి భరతుచరితము, వినిపించుచు మఱియు నిట్లు వినిపించెఁ దగన్.

3

తా ॥ “మునులారా! వ్యాసులవారి పుత్రుడైన శుకయోగి పుణ్యాత్ముడు, ఉత్తరకు కొడుకు అయిన పరీక్షిత్తుకు చక్కని వినయపు మాటలతో భరతుడి కథను చెప్పి, ఇంకా ఇలా చెబుతున్నాడు:

ఆ. పార్థివేంద్ర! యట్లు భరతాత్మజుండైన, సుమతి, ధర్మవర్తనమునఁ దిరుగ
నది యెఱింగి దుష్టులైన పాషండులు, దమమతంబు మిగులఁ దలఁచి పొగడి.

4

తా ॥ "రాజా! భరతుని కొడుకు సుమతి. ఇతను ధర్మవర్తనుడై పరిపాలన సాగిస్తున్నాడు. అది తెలిసి, దుష్టులైన పాషండులు తమ మతాన్ని స్థాపించాలని తలచారు.

క. ధరణీవల్లభ! నిన్నును, నిరతంబును బుద్ధదేవునిం గొలిచిన యా
తెఱఁగునఁ గొలిచెద మని భా, సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్.

5

తా ॥ ఆ పాషండులు సుమతితో "రాజా! నిత్యం నిన్ను బుద్ధదేవుణ్ణి కొలిచినట్లు కొలుస్తాం" – అని ప్రీతిగా అన్నారు.

వ. ఇట్లు పాషండబోధితుండైన సుమతికి ధ్రువసేనయందు దేవతాజిత్తను పుత్రుండు జనించె వానికి దేవద్యుమ్నుండను సత్పుత్రుం డాసురియం దుదయించె; న మ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె, నతనికి సువర్చలయందుఁ బ్రతీహుం డనువాఁడు సుతుండయ్యె, నప్పరమ పురుషుండు సకల జనులకు బ్రహ్మోపదేశంబు సేసి తాను శుద్ధాత్ముండై హరి స్మరణ సేయుచు యజ్ఞకరణ నిపుణులగు ప్రతిహర్త ప్రస్తోత యుద్గాత యను సత్పుత్రులం గాంచె, నా ప్రతిహర్తకు స్తుతి యందు వ్యోమభూమనామక పుత్త్రద్వయం బుత్పన్నంబయ్యె; నందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనియించె, నతనికి దేవకుల్య యందుఁ బ్రస్తోత గలిగె; నా ప్రస్తోతకు వరరుత్సయందు విభుండను తనయుం డుద్భవించె; నతనికి భారతియందుఁ బృథుషేణుం డుదయించె; నతనికి నాకూతియందు నక్తుండు గలిగె; నా నక్తునకు రాజర్షి శ్రేష్ఠుండగు గయుం డను మహాకీర్తి సంపన్నుం డుదయించె.

6

తా ॥ పాషండుల చేత ఇలా బోధింపబడ్డ సుమతికి (సుమతి అవధూతగా ప్రవర్తింపక ముందు) ధ్రువసేన అను భార్యయందు దేవజిత్తనే కొడుకు జన్మించాడు. ఇతని భార్య ఆసురి. ఆమెకు దేవద్యుమ్నుడనే కుమారోత్తముడు జన్మించాడు. ఆ మహాత్ముని భార్య ధేనుమతి. ఈమె యందు పరమేష్ఠి పుట్టాడు. ఇతడు సత్యధర్మపరాయణుడు. ఇతనికి సువర్చలయందు ప్రతీహుడు అనే కొడుకు పుట్టాడు. ఇతడు సకల జనులకు బ్రహ్మోపదేశం చేసిన పరమపురుషుడు. ఇతడు విశుద్ధమైన మనస్సు కలవాడు. శ్రీహరి నామస్మరణ చేసేవాడు. ఈ ప్రతీహుడికి యజ్ఞం చేయడంలో నిపుణత్వం కలిగిన ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత – అనే మంచి కొడుకులు జన్మించారు.

ఆ ప్రతిహర్త భార్య స్తుతి. ఆమెకు వ్యోముడు, భూముడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. వీరిలో భూముడికి ఋషికుల్యయందు ఉద్గీథుడు అనే సుతుడు పుట్టాడు. ఇతని భార్య దేవకుల్య. ఈమె కొడుకు ప్రస్తోతుడు. ఇతని భార్య విరురుత్స. ఈమె కొడుకు విభుడు. విభునికి రతి అను భార్య యందు పృథుషేణుడు జన్మించాడు. అతని భార్య ఆకూతి. ఈమె కొడుకు నక్తుడు. నక్తుని కొడుకు గయుడు. ఈ గయుడు గొప్ప కీర్తిమంతుడు, రాజర్షి.

ఆ. అట్టి గయునివలన నఖిల జీవులఁ బ్రోవఁ, దలఁచి సాత్త్విక ప్రధాన మయిన
యట్టి మేను దాల్చి యాత్మతత్త్వ జ్ఞానుఁ, డగుచు నుండె హరి నిజాంశమునను.

7

తా ॥ జగత్తును రక్షించాలనే కోరికతో శుద్ధ సత్త్వగుణాలు కలిగిన భగవంతుడు తన అంశచే గయుడిగా జన్మించాడు. ఆత్మతత్త్వాన్ని తెలిసిన జ్ఞానంతో ప్రకాశించేవాడు – గయుడు.

# 2. మహాపురుషుడు గయుని చరిత్ర

వ. ఇట్టి మహనీయ సుగుణాకరుండగు గయుని గాథానువర్ణనంబు పురావిదులగు మహాత్ములచే
నీ తెఱంగున నుతింపఁబడు చున్నది, సావధాన మనస్కుండవై యాలకింపు మని యిట్లనియె.

8

తా ॥ ఇంతటి మహనీయమైన సుగుణాలను కలిగియున్న గయుడి గాథను పూర్వం తెలుసుకొన్న కోవిదులు, మహాత్ములు ఇలా కీర్తించారు. ఏకాగ్రమైన మనస్సుపెట్టి విను" – అని ఇలా చెప్పాడు:

సీ. ధర్మమార్గంబున ధారుణీ జనులను, బ్రేమతోఁ బోషణ ప్రేషణోప
లాలనశాసనలక్షణాదులచేతఁ, బోషించుచును యజ్ఞములను యజ్ఞ
పురుషు నీశ్వరు జిత్తమున నిల్పి సేవించి, స్వాంతమందున్న యీశ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి నానంద మొసఁగుచు, నిరభిమానతమెయి ధరణినేలె

ఆ. సత్యమందు మిగుల సత్సేవయందును, ధర్మమందు యజ్ఞకర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని, మానవుండు గాఁడు మానవేంద్ర!

9

తా ॥ "ఓ రాజా! గయుడు ధర్మమార్గాన్ని వీడకుండా ఈ భూమిపై ప్రజల్ని ప్రేమతో పోషించి పాలించాడు. ఎవర్ని ఏయే పనులలో నియమించాలో అలా నియమించి, లాలిస్తూ రాజశాసనాలను అమలు పరుస్తూ రాజ్యపాలన చేశాడు. యజ్ఞపురుషుడైన పరమేశ్వరుణ్ణి మనస్సులో నిల్పి, దర్శించి, యజ్ఞాలు చేసేవాడు. సకల జీవరాశికీ ఆనందాన్ని కలిగించేటట్లు గర్వం లేకుండా రాజ్యాన్ని పాలించాడు. సత్యనిష్ఠలోను, సజ్జనుల్ని సేవించడంలోను,

ధర్మపాలనలోను, యజ్ఞకర్మల్ని ఆచరించటంలోను గయుడు ఈ భూమిపై అవతరించిన సాక్షాత్తు విష్ణువే, కేవల మానవుడు కాదు.

వ. అట్టి మహాపురుషగుణగణ పరిపూర్ణుండగు గయునికి దక్ష కన్యకలగు శ్రద్ధామైత్రిదయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ, నతని ప్రజలకు వసుంధర కామధేనువై పిదుక, వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ, సంగరమున భంగంబు నొందిన రాజు లప్పనంబు సేయ, విప్రులు ధర్మం బాఱవపాలు పంచియిడ, నిరంతర సోమపానంబును శ్రద్ధాభక్తి యోగంబులు గలిగి యొనర్చు యజ్ఞంబులు నింద్రాదిదేవతలు తృప్తులై యజ్ఞఫలంబుల నొసంగ, బ్రహ్మాది తృణగుల్మలతా పర్యంతంబు సకల లోకంబుల వారినిం దృప్తిం బొందించుచు, శ్రీహరిం దృప్తిం బొందజేయుచు, గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు సేసె; నట్టి గయునికి జయంతి యందుఁ జిత్రరథ స్వాత్యవరోధను లను ముప్వురు గొడుకులు పుట్టిరి; నా చిత్రరథునికి నూర్ణయందు సమ్రాట్టును, వానికి నుత్కళయందు మరీచియు, నా మేటికి బిందుమతియందు బిందుమంతుండును, నా బిందుమంతునకు సరఘయందు మధువును, మధువునకు సుమనస యను దాని యందు వీరవ్రతుండును, నా వీరవ్రతునకు భోజయందు మన్యు ప్రమన్యువులను నిరువురును, నందు మన్యువునకు సత్యయందు భువనుండును, నతనికి దోషయందుఁ ద్వష్టయు, నా త్వష్టకు విరోచనయందు విరజుండనువాఁడును జనియించి రంత.

10

తా ॥ గయుడు మహాపురుషుడు. సకల గుణాలలోను పరిపూర్ణుడు. అతనికి దక్షుని కుమార్తెలైన శ్రద్ధ, మైత్రి, దయలు వారంతటవారే వచ్చి అన్ని వరాలు ప్రసాదించారు. అతని ప్రజలకు భూమి కామధేనువై అన్ని కోర్కెలను వర్షించింది. వేదాలు అన్ని కోర్కెలను తీర్చాయి. యుద్ధంలో గయుడి చేతిలో రాజులు ఓడిపోయి, ఎన్నో కప్పాలను, ఎన్నో కానుకలను అర్పించారు. బ్రాహ్మణులు ధర్మపరిపాలనం చేత, దక్షిణల చేత ఆరాధింపబడి, తాము

ఆచరించిన ధర్మంలో ఆరవ భాగాన్ని గయుడికి సమర్పించేవారు. వాళ్ళు చేసే యజ్ఞాలకు తృప్తిచెంది ఇంద్రుడు స్వయంగా వచ్చి నిరంతరం సోమపానం చేసేవాడు. ఇంద్రాది దేవతలు యజ్ఞఫలాలను ఇచ్చేవారు. బ్రహ్మనుండి గడ్డిపరక వరకు, పొదలు, తీగలతో కూడా అన్ని లోకాలవారిని గయుడు యజ్ఞాలతో తృప్తుల్ని చేశాడు. శ్రీహరీ తృప్తి పొందాడు. ఇలా గయుడు చాలా కాలం రాజ్యపాలనం చేశాడు.

గయుడికి జయంతి యందు ముగ్గురు పుత్రులు కలిగారు. చిత్రరథుడు, స్వాతి, అవరోధనుడు వాళ్ళపేర్లు. చిత్రరథుడి భార్య ఊర్ణ, ఈమె కొడుకు సమ్రాట్టు. సమ్రాట్టునకు భార్య ఉల్క. ఈమె కొడుకు మరీచి. ఇతని భార్య బిందుమతి. ఈమె కొడుకు బిందుమంతుడు. ఇతని భార్య సరఘ. ఈమె కొడుకు మధువు. మధువు భార్య సుమనస. ఈమె కొడుకు వీరవ్రతుడు. ఇతని భార్య భోజ. ఈమెకు మన్యువు, ప్రమన్యువు – అని ఇద్దరు కొడుకులు. మన్యువుకు భార్య సత్య. సత్యకు కొడుకు భువనుడు. ఇతని భార్య దోష. ఈమెకు త్వష్ట కొడుకు. త్వష్ట భార్య విరోచన – ఈమె కొడుకు విరజుడు.

క. ఆ విరజున కుదయించిరి, భూవినుత విషూచియందుఁ బుత్ర శతంబు
న్నావల నొక కన్యకయు, న్నావేళ సమస్త జనులు హర్షం బందన్.

11

తా ॥ విరజుడి భార్య విషూచి. ఈమెకు వందమంది పుత్రులు, ఒక అమ్మాయి పుట్టారు. ప్రజలందరూ ఈ వార్త విని ఎంతో సంతోషించారు.

క. ఘనుఁడు ప్రియవ్రతు వంశం, బునకుం దుదయై విరజుఁడు భూవిభువంశం
బును దా నలంకరించెను, విను మింద్రావరజుఁ డయిన విష్ణుని మాడ్కిన్.

12

తా ॥ సాక్షాత్తు ఇంద్రుడి తమ్ముడైన ఉపేంద్రుని వలె (విష్ణువు) ఆ రాజవంశానికి

విరజుడు ఎంతో శోభ తెచ్చాడు. ప్రియవ్రతుడి వంశంలో మహాత్ముడైన ఈ విరజుడే చివరివాడు.”

క. అని పలికిన శుకయోగిం, గనుఁగొని యభిమన్యు సుతుఁడు గడు మోదముతో
వనజదళాక్షుని మహిమలు, విని సంతస మంది యనియె వేడుక మఱియున్.

13

తా ॥ అని శుకయోగి అభిమన్యుని కొడుకు పరీక్షిత్తుకు చెప్పాడు. పద్మాలవంటి కన్నులు కలిగిన విష్ణువు మహిమల్ని విని, పరీక్షిత్తు సంతోషించి, వేడుకపడుతూ ఇలా అన్నాడు:

వ. మునీంద్రా! సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు, నక్షత్ర యుక్తంబులైన చంద్రకిరణంబు లెంత మేరఁ దిరుగు, నంత దూరంబు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును, సప్తసముద్రంబులు నయ్యెనని పలికితి వా ద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబులుగా నెఱింగింపుము; గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరి శరీరంబగు నీ లోకంబునందు నిలిపిన చిత్తం బగుణంబును, సూక్ష్మంబును, నాత్మ జ్యోతియు బ్రహ్మంబును నైన వాసుదేవుని యందు నిల్చుం గావున, ద్వీపవర్షాదివిస్తారంబు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

14

తా ॥ “మునీంద్రా! ప్రియవ్రతుడి రథచక్రాల యొక్క అదురు వల్ల – సూర్యకిరణాలు ఎంతవరకు సోకుతాయో, అంత వరకు; నక్షత్రాలతో కూడిన చంద్రుడి కిరణాలు ఎంత వరకు వ్యాపిస్తాయో, అంత వరకు – ఏడు సముద్రాలు, ఏడు ద్వీపాలు ఏర్పడ్డాయని చెప్పావు. ఆ ద్వీపాల, ఆ సముద్రాల పరిమాణాలు నాకు వివరంగా తెలియజెప్పు. సత్త్వరజస్తమోగుణాలతో నిండిన ఈ విశాలమైన విశ్వం శ్రీహరియొక్క స్థూలరూపం అని గ్రహించి, ఆ గుణాలన్నింటికీ అతీతమైనవాడు, అత్యంత సూక్ష్మతముడు, స్వప్రకాశరూపుడు, బ్రహ్మాత్మకుడు అయిన

వాసుదేవుని యందు మనస్సు కుదురుకొంటుంది. అందువల్ల ద్వీపవర్షాదుల విస్తృతిని వివరించు." – అని అడిగిన పరీక్షిత్తుకు శుకులవారిలా చెప్పారు:

క. ధరణీ వల్లభ! విను శ్రీ, హరిమాయా గుణవిభూతు లగు జల నిధులుం
బరcగిన దీవులు వర్షము, లరయంగాc గొలcది వెట్ట నలవియె జగతిన్?

15

తా ॥ "రాజా! ఈ సముద్రాలు, ఈ ద్వీపాలు, వర్షాలూ, ఇవన్నీ లోకంలో శ్రీహరి మాయ వల్ల ఏర్పడిన గుణాల యొక్క వైభవాలు. అందువల్ల వాటిని సంపూర్ణంగా వివరించి చెప్పటం ఎవరి వల్లా కాదు.

ఆ. తెలిసినంత వట్టు దెలిపెద సంక్షేప, మునను జిత్త గించి వినుము దెలియ
ననుచుc జెప్పc దొడcగె నభిమన్యుసుతునకు, నింపుగాను శుకమునీంద్రుc డిట్లు.

16

తా ॥ నాకు తెలిసినంతవరకు సంగ్రహంగా చెబుతాను, మనస్సు పెట్టి విను" అని పరీక్షిత్తుకు చెవికి ఇలా ఇంపుగా చెప్పడం ప్రారంభించాడు శుకముని.

## 3. శుకయోగి భూనైసర్గిక స్వరూపాన్ని వివరించుట

వ. నరేంద్రా! జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమలపత్రంబునుం బోలె వర్తులాకారంబయి నవసహస్రయోజన పరిమితాయామంబు గల నవవర్షంబులు నష్ట మర్యాదా గిరులునుం గలిగి విభక్తంబయి యుండు; నందు మధ్యవర్షం బిలావృతవర్షంబగు; నందు మధ్యప్రదేశంబున సువర్ణమయంబయి.

17

తా ॥ “రాజా! ఈ భూమి ఒక పద్మం. దానికి మధ్యన జంబూద్వీపం ఉంది. ఈ జంబూద్వీపం యొక్క పొడవు లక్ష యోజనాలు, వెడల్పు లక్ష యోజనాలు. ఇది తామరాకులా గుండ్రంగా ఉంది. ఈ జంబూ ద్వీపంలో వర్షాలు అనే విభాగాలున్నాయి. ఇవి తొమ్మిది. ఒక్కొక్క వర్షానికి వైశాల్యం తొమ్మిదివేల యోజనాలు. ఈ వర్షాలను విభజిస్తూ ఎనిమిది పర్వతాలు సరిహద్దులుగా ఉన్నాయి. తొమ్మిది వర్షాలలో మధ్యదాని పేరు ఇలావృతం. దీనికి నడిమి భాగంలో బంగారు రంగుతో మేరు పర్వతం ఉంది.

క. భూపద్మమునకు మేరువు, దీపించుచుఁ గర్ణికాకృతిని బెం పగుచుం
బ్రాపై కులగిరిరాజుగఁ, జూపట్టును సురగణాళి చోద్యం బందన్.

18

తా ॥ భూమి అనే పద్మానికి నడుమ మేరు పర్వతం ప్రకాశిస్తూ ఉంటుంది. అది పద్మానికి మధ్యన ఉండే బొడ్డులా శోభిస్తూ ఉంటుంది. మేరువు కులపర్వతాలకు రాజు వంటిది. దాని స్థితి దేవతలకే అంతుబట్టక విడ్డూరం కొల్పుతూ ఉంటుంది.

ఇలావృతం అంటే భూమిచేత ఆవరింపబడ్డది. భూగోళానికి నడిమి భాగం నాభి. ఇది

భూగర్భానికి, భూమధ్యరేఖకు సూటిగా లోపల వైపున ఉంటుంది. మేరువు (అంటే ఇరుసు) అనగా భూపరిభ్రమణానికి కేంద్రం – అని అర్థం. దేవతలు కూడా మేరువు మహిమకు ఆశ్చర్యపడతారంటే – భూపరిభ్రమణం ఎలా జరుగుతుందో ఎవ్వరికీ అంతుచిక్కని పరమేశ్వరుడి లీల అని అర్థం.

సీ. మఱియును నా మేరుగిరి లక్షయోజనో, న్నత మగుచుండి యా నడిమి దళము
విదితమై పదియాఱువేల యోజనములు, నంతియ పాఁతునై యతిశయిల్లు
నామీఁద విస్తార మరయ ముప్పది రెండు, వేల యోజనముల వెలసి
యుండు నా గిరి కుత్తరంబందు నీల శ్వేత, శృంగ పర్వతములు నింగి ముట్టి

ఆ. యుండు; రెండువేల యోజనంబుల దాఁకఁ, బఱపు గలిగి పూర్వపశ్చిమాయ
తంబు దక్షిణోత్తరంబును విస్తార, మగుచు మిగుల రమ్యమై నరేంద్ర;



తా ॥ ఆ మేరు పర్వతం యొక్క ఎత్తు లక్ష యోజనాలు. మేరు పర్వత శిఖరం యొక్క ఎత్తు పదహారువేల యోజనాలు. ఈ శిఖరం భూమిలోకి కూడా పదహారువేల యోజనాలు లోతుకు చొచ్చుకొని ఉంటుంది. ఈ శిఖరం వైశాల్యం ముప్పైరెండువేల యోజనాలు. మేరువుకు ఉత్తరం వైపు నీలము, శ్వేతము, శృంగవత్తు – అనే పర్వతాలు ఆకాశాన్ని తాకుతూ ఉంటాయి. ఇవి రెండువేల యోజనాల విస్తీర్ణం కలవి. ఇవి తూర్పు పడమరలకు, దక్షిణ ఉత్తరాలకు విస్తరించి ఉన్నాయి. రాజా! ఇదొక రమ్యమైన దృశ్యం.

వ. ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణ సాగరాంతంబులై యున్న సీమాపర్వతంబులయందు నీలశ్వేతశృంగవ త్పర్వతంబులు నిడివిని యథాక్రమంబున దశమాంశ న్యూనప్రమాణ యోజనంబులు గలవిగా నుండు; వీని మధ్య ప్రదేశంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబు లను నామంబులు గల వర్షంబు లుండు; వాని విస్తారంబులు నవ సహస్ర యోజనంబులు గలిగి లవణ సముద్రాంతంబులై క్రమంబున నీలాది పర్వత దీర్ఘ పరిమాణంబుల నుండు;

నిలావృత వర్షంబునకు దక్షిణంబున నిషధ హేమకూట హిమవత్పర్వతంబులను సీమా పర్వతంబులును, బూర్వ పశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు, నా నీలాదిపర్వతంబుల తీరున నుండు; నా గిరుల మధ్య ప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబులను నామంబులు గల వర్షంబు లుండు; నా యిలావృత వర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును, బూర్వ భాగంబున గంధమాదనంబను సీమా పర్వంతంబులు; పూర్వపశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నీలపర్వత నిషధపర్వతంబులం గదిసి, ద్విసహస్ర యోజనంబుల విస్తారంబై యుండు; మాల్యవత్పర్వతంబు పశ్చిమ సముద్రాంతంబై కేతుమాలవర్షంబును, గంధమాదన పర్వతంబునకుఁ బూర్వ భాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వవర్షంబును, మేరువునకుం దూర్పున మందరపర్వతంబును, దక్షిణంబున మేరుమందర పర్వతంబులును, బడమటి పార్శ్వంబుల నుత్తరమునం గుముద పర్వతంబులు నను నామంబులు గలిగి యయుత యోజనోన్నతంబు లయి మేరునగం బను మధ్యోన్నత మేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభములుం బోలె నుండు; నా చతుస్స్తంభంబుల యందును బర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలెఁ జూతజంబు కదంబ న్యగ్రోధంబు లను వృక్షరాజంబులు గ్రమంబున నొండొంటికి నేకాదశశత యోజనాయతంబును శతయోజనవిస్తారంబును గలిగియుండు; మఱియు నా పర్వత శిఖరంబులం గ్రమంబునం బయో మ ధ్విక్షురస మృష్ట జలంబులు గలిగి శతయోజన విస్తారంబు లయిన సరోవరంబులు దేజరిల్లు; నందు సుస్నాతు లగువారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు; మఱియు నందన చైత్ర రథ వైభ్రాజిక సర్వతోభద్రంబులను నామంబులు గల దేవోద్యానంబు లా పర్వత శిఖరంబుల వెలుఁగొందుచుండు; నందు దేవతాగణంబులు దేవాంగనలం గూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతు రంత.

తా ॥ ఈ నీల శ్వేత శృంగవత్పర్వతాలనే సరిహద్దు పర్వతాలని అంటారు. వీటికి తూర్పున, పడమరన చిట్టచివర ఉప్పు సముద్రాలు తాకుతూ ఉంటాయి (అంటే తూర్పు పశ్చిమాల వైపు ఉప్పు సముద్రాలు తాకేటంతవరకు ఈ పర్వతాలు విస్తరించి ఉన్నాయి). ఇవి ఉత్తరం వైపు ఒకదాని కంటే ఒకటి పదవ వంతు పొడవు తగ్గుతూ ఉంటాయి. వీటి మధ్య ప్రదేశంలో రమ్యకం, హిరణ్మయం, కురు – అనే పేర్లు గల వర్షాలున్నాయి. అవి తొమ్మిదివేల యోజనాల మేర విస్తరించి ఉన్నాయి. ఉప్పు సముద్రాల వరకు ఇవి వ్యాపించి ఉన్నాయి. నీలము, శ్వేతము, శృంగవత్తు పర్వతాల మధ్యనున్న కొలతలతో సరిపడి ఉంటుంది – ఈ వర్షాల యొక్క విస్తారం.

ఇలావృత వర్షానికి దక్షిణంవైపు నిషధం, హేమకూటం, హిమవంతం – అనే పర్వతాలు ఉన్నాయి. ఇవి సరిహద్దు పర్వతాలు. తూర్పు నుంచి పడమరకు పొడవు గాను, ఉత్తరం నుంచి దక్షిణానికి వెడల్పు గాను నీలాది పర్వతాల పద్ధతిలోనే ఇవీ నెలకొని ఉంటాయి. ఈ పర్వతాల మధ్య ప్రదేశంలో మూడు వర్షాలున్నాయి. కింపురుషవర్షం, హరివర్షం, భారతవర్షం – అని ఆ మూడింటికి పేర్లు.

ఇలావృత వర్షానికి పడమట మాల్యవంత పర్వతం, తూర్పున గంధమాదన పర్వతం సరిహద్దు గిరులు.

ఈ పర్వతాలు రెండూ, ఉత్తరం వైపు నీలం, దక్షిణంవైపు నిషధం అనే పర్వతాల వరకు పొడవుగా ఉండి, రెండువేల యోజనాల విస్తీర్ణం కలిగి ఉన్నాయి. ఈ మాల్యవంత గంధమాదన గిరులు కేతుమాల వర్షానికి, భద్రాశ్వ వర్షానికి హద్దును నిర్దేశిస్తున్నాయి.

మేరు పర్వతానికి నాలుగు దిక్కుల్లోను నాలుగు పర్వతాలున్నాయి. అవి – తూర్పున మందర పర్వతం, దక్షిణంలో మేరు మందర పర్వతం, పశ్చిమంలో సుపార్శ్వ పర్వతం, ఉత్తరంలో కుముద పర్వతం. ఇవి ఒక్కొక్కటి పదివేల యోజనాల ఎత్తు, పదివేల యోజనాల

వైశాల్యం కలిగి ఉన్నాయి. ఇవి మధ్యలో ఉన్నతంగా స్తంభంలా ఉన్న మేరువుకు చుట్టూ నాలుగు చిన్న స్తంభాలలో ఉంటాయి.

ఈ నాలుగు పర్వతాలలోను మందరంలో మామిడి చెట్లు, మేరువులో నేరేడు చెట్లు, సుపార్శ్వంలో కదంబవృక్షాలు, కుముదంలో మఱ్ఱిచెట్లు బాగా ఎత్తుగా పెరిగి పతాకాలలా ఉంటాయి. ఈ చెట్లు పదకొండు వందల యోజనాల ఎత్తు, అంతే వైశాల్యంతో ఉంటాయి.

ఈ పర్వతాల శిఖరాలపై నాలుగు మడుగులున్నాయి. మందర పర్వతం శిఖరం మీద పాలతో నిండిన మడుగు, మేరువునందు తేనె నిండిన మడుగు, సుపార్శ్వంలో చెఱకు రసం నిండిన మడుగు, కుముదంలో మంచినీళ్ళు నిండిన మడుగు ఉన్నాయి. వాటిల్లో నిష్ఠగా స్నానం చేసినవారు సహజమైన సిద్ధుల వైభవాన్ని పొంది ఉంటారు.

ఈ పర్వత శిఖరాలపై నాలుగు ఉద్యానవనాలున్నాయి. ఇవి దేవోద్యానాలు. నందనం, చైత్రరథం, వైభ్రాజికం, సర్వతోభద్రం అని ఆ వనాలకు పేర్లు. వీటిల్లో దేవతాశ్రేష్ఠులు అప్సరసలతో కలిసి, అక్కడ గంధర్వుల గానాన్ని వింటూ, నృత్యాల్ని చూస్తూ విహరిస్తూ ఉంటారు.

ఉ. మందరపర్వతంబు తుది మామిడి పం డ్లమృతోపమానమై
మందరశైల శృంగక సమానములై గిరిమీఁద వ్రాల మా
కందఫలామృతంబు గలఁగం బడి జాఱి మహాప్రవాహమై
యం దరుణోదనామమున నద్భుతమై విలసిల్లు నెంతయున్.



తా ॥ మందర పర్వతానికి చివర మామిడి పళ్ళు అమృతంతో సమానమైన రుచితో, పర్వతశిఖరాలతో సమానంగా ఉంటూ కొండమీద రాల్తూ ఉంటాయి. అలా రాలిపడటంతో ఆ మామిడిపళ్ళు చితికి రసం గొప్ప ప్రవాహంగా మారింది. అదొక అద్భుతమైన నది. దానిపేరు

అరుణోదం.

మందర శిఖరానికి క్రింద భాగంలో పదకొండువందల యోజనాల ఎత్తైన ఒక దేవజాతి మామిడి చెట్టు ఉంది. దాని పైభాగంలో కొండ శిఖరాలవంటి పెద్ద మామిడి పళ్ళు అమృతంతో సమానమైన రసం గలవి ఉంటాయి. వాటిని ఎవ్వరూ కోయకపోవడం వల్ల మగ్గిపోయి నేలరాల్తూ ఉంటాయి. అలా అవి బ్రద్దలై, మధురసం ఒక నదీ ప్రవాహమైంది. అదే అరుణోద నది.

చ. కడు మధురంబునన్ సురభిగంధముచే నరుణ ప్రకాశతన్
వడిగొని మందరాచలము వంతల చెంతల జాఱి యంతలోఁ
దొడిదొడి నాయిలావృత్తముఁ దోఁచుచు వింతగఁ బూర్వవాహియై
యదరుఁ దరంగ సంతతుల నందఱి నచ్చటఁ జేయు ధన్యులన్.

22

తా ॥ అది ఎంతో తియ్యనైనది, మంచి పరిమళం గలది, ఎర్రగా ప్రకాశించే నది. మందర పర్వతానికి ఆనుకొని ప్రక్కల్లో ప్రవహిస్తూ ఉంటుంది. ఇలావృతానికి తూర్పు దిశను తడుపుతూ పూర్వవాహినియై అపూర్వంగా కనిపిస్తుంది. ఆ నదీ తరంగాలు అక్కడి వారినందరినీ ధన్యుల్ని చేస్తూ ఉంటాయి.

ఆ. ఆ నదీజలంబు లాడిన యచ్చటి, యంబికానుచరుల యంగగంధ
మంది పవనుఁ డంత మనుజేశ! పదియోజ, నములు సుట్టుఁ బరిమళముల నింపు.

23

తా ॥ రాజా! ఆ అరుణోద నదిలో పార్వతీదేవికి అనుచరులైన పుణ్య స్త్రీలు స్నానం చెయ్యడం వల్ల, ఆ దివ్య స్త్రీల శరీరసంపర్కం వల్ల, నది పొందిన దివ్యపరిమళాన్ని వాయుదేవుడు పదియోజనాల దూరం దాకా మోసుకొస్తూ ఉంటాడు.

ఆ. మేరు మందరముల మీఁద జంబూఫలం, బులు మహాగజోపములుగ వ్రాలి
యవిసి యంతఁ దద్రసామృతం బల్లన, య మ్మహానగంబునందుఁ బొడమి.

24

తా ॥ మేరు మందర పర్వతాల మీద నేరేడు చెట్లు ఉన్నాయి. వాటి ఒక్కొక్క పండు ఒక్కో పెద్ద ఏనుగంత ఉంటుంది. ఆ జంబూ ఫలాలు మిగల మగ్గిపోయి వాటంతటవే రాలి, చిట్లి, ఆ రసం అమృతప్రవాహంలా అక్కడి నగరాలలో పొడచూపుతుంది.

క. అనుపమ మగు జంబూనది, యను పేరను వెలసి లీల నరుగుచు నంతన్
ఘనత నిలావృత వర్షము, పనుపడఁ దడుపుచును ధరణిఁ బ్రవహించుఁ దగన్.

25

తా ॥ ఆ జంబూ ఫలాల రసప్రవాహమే జంబూనది. ఈ నదికి సాటి వచ్చేది మరి లేదు. ఇది ఇలావృత వర్షానికి దక్షిణం వైపు భూములలో ప్రవహిస్తోంది.

ఉ. ఆ నదినీటఁ దోఁగి పదనై యటు మృ త్తని లార్కసంగతిం
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం
బూనద నామమొంది సురముఖ్యుల కెల్లను భూషణార్హమై
మానుగ వన్నె మించి కడు మంచిదియై విలసిల్లు నెంతయున్.

26

తా ॥ ఆ నదీ జలాలు ఒరుసుకొంటూ నది ప్రవహిస్తున్నంత దూరమూ రెండు వైపుల తీరాల యందూ ఉన్న ఇసుక జంబూనదీ రసంచే తడుపబడి సూర్యకిరణాలకు, గాలికి బంగారంగా మారుతుంది. అందుకే స్వచ్ఛమైన బంగారానికి ‘జాంబూనదం’ అని పేరు వచ్చింది. దేవతలలో ప్రధానులైనవారు ఈ జాంబూనదాన్ని ఆభరణాలుగా దాలుస్తారు. ఈ జంబూనదీ రసం నుండి వచ్చిన బంగారం ప్రకాశవంతమైన వన్నె కలది, మంచి నాణ్యమైనది.

వ. మఱియు సుపార్శ్వ నగాగ్రంబునందుఁ బంచవ్యామపరీణాహ బంధురంబులగు నైదు మధుధారా ప్రవాహంబులు పంచముఖంబులు వెడలి సుపార్శ్వనగ శృంగంబులం బడి యిలావృత వర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు, నా తేనియ ననుభవించువారల ముఖమారుత సుగంధంబు శతయోజన పర్యంతంబుఁ బరిమళించు.

27

తా ॥ సుపార్శ్వ పర్వతం పై కొన నుంచి ఐదు తేనె ధారలు ప్రవహిస్తూ ఉంటాయి. ఐదు ముఖాలుగా ఆ ప్రవాహం సాగుతుంది. ఆ కొండ కొమ్ముల మీద నుంచి ఈ ధారలు ఇలావృత వర్షం యొక్క పడమటి భాగాన్ని తడుపుతూ ప్రవహిస్తాయి. ఆ తేనియను అనుభవించేవాళ్ళ ముఖం నుంచి వచ్చిన గాలి మంచి వాసనతో నిండి, వంద యోజనాల దూరం వరకు గుబాళిస్తూనే ఉంటుంది.

సీ. కుముద పర్వత శిఖాగ్రమున నుత్పన్నమై, కనుపట్టు వటతరు స్కంధమునను
నుదయించునట్టి పయో దధి ఘృత మధు, గుడ విశిష్టాన్నంబు లుడుగ కెపుడు
నంబర శయ్యాసనాభరణాది వ, స్తువులు గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్ష, మున జనులకు నెల్ల భోగ్యములను

ఆ. వదల కొసఁగు, వారి వళిపలితంబులు, దలఁగు దుష్టగంధములను బాయు
మరణభయము ముదిమి పొరయు దెన్నఁడును శీ, తోష్ణబాధ సెందకుండు నధిప!

28

తా ॥ "రాజా! కుముద పర్వత శిఖరంపై పుట్టిన ఒక పెద్ద మఱ్ఱిచెట్టు యొక్క కొమ్మల నుంచి పాలు, పెరుగు, నేయి, తేనె, బెల్లం, విశిష్టమైన అన్నం ఉదయించి, క్రిందకు ఇలావృత వర్షం మీదికి జారతాయి. అలాగే బట్టలు, మంచాలు, ఆసనాలు, నగలు మొదలైన వస్తువులు మానవుల కోర్కెలు తీర్చడానికి, భోగభాగ్యాలను సమకూర్చడానికి ఇలావృత వర్షంపై కుముద పర్వతం నుంచి వచ్చిపడతాయి. ఈ వస్తువుల్ని వాడుకోవడం వల్ల అక్కడివారికి శరీరం మీద

ముడుతలు పడవు, చెమట పట్టదు (శ్రమ ఉండదు), మరణ భయం రాదు, ముసలితనం ఉండదు. చలి, వేడిమిల బాధ సోకదు.”

ఆ వటవృక్షం పేరు శతవల్శ. దాని మొదళ్ళ నుండి పాలు, పెరుగు మొదలైన తినదగిన పదార్థాలు క్రిందపడి అంతటా వ్యాపిస్తూ ఉంటాయి.

ఆ. దేవదానవులును దివ్యమునీంద్ర గం, ధర్వు లాదిగాఁగఁ దగిలి యాశ్ర
యించి యుందు, రా గిరీంద్ర మూలమునందు, హర్షమంది ఘన విహార లీల.

29

తా ॥ ఈ కుముద పర్వతం యొక్క మూలాన్ని ఆశ్రయించుకొని దేవతలు, దానవులు, దివ్యమునీంద్రులు, గంధర్వులు మొదలైన వారెందరో సంతోషంగా సంచరిస్తూ ఉంటారు. విహరిస్తూ ఉంటారు.

వ. నరేంద్రా! కురంగ కురర కుసుంభ వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖాదులయిన పర్వతంబులు మేరుపర్వతకర్ణికకుఁ గేసరంబులయి పరివేష్టించి యుండు, నామేరు నగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవకూటంబులును, బశ్చిమంబునం బవనపారియాత్రంబులు నను పర్వతంబులు నాలుగు, నొండొంటికి దక్షిణోత్తరంబుల నష్టాదశ సహస్ర యోజనంబుల నిడుపును బూర్వ పశ్చిమంబుల ద్విసహస్ర యోజనంబుల వెడల్పును నగుచు దక్షిణంబునఁ గైలాసకర వీరంబులును, నుత్తరంబునఁ ద్రిశృంగమకరంబులను నామంబులు గల పర్వతంబులు నాలుగును, బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును, దక్షిణోత్తరంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును నగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణం బగుచున్న పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్ట నగంబులు నిలిచియుండు, మేరు శిఖరంబున దశసహస్ర యోజనంబుల నిడుపు నంతియ విస్తారంబు

నగుచు సువర్ణమయంబయిన బ్రహ్మపురంబు తేజరిల్లుచుండు, నా పట్టణంబునకు నష్టదిక్కుల యందును లోక పాలుర పురంబు లుండు.

30

తా ॥ రాజా! మేరు పర్వతానికి చుట్టూ తామర పువ్వుతోడి కర్ణికకు కేసరాలలా కురంగ, కురర, కుసుంభ, వైకంకత, త్రికూట, శిశిర, పతంగ, రుచక, నిషధ, శితివాస, కపిల, శంఖ (వైదూర్య చారుధి హంస విహంగ ఋషభ నాగ కాలంజర నారదాది) పర్వతాలుంటాయి. తూర్పు వైపున జఠరం, దేవకూటం అనే పర్వతాలున్నాయి. పశ్చిమాన పవన, పారియాత్రాలనే పర్వతాలున్నాయి. ఇవి ఒకదానికొకటి పద్దెనిమిదివేల యోజనాలు దక్షిణం నుంచి ఉత్తరానికి పొడవుగా వ్యాపించి ఉంటాయి. తూర్పు నుంచి పశ్చిమానికి రెండువేల యోజనాలు వెడల్పు కలిగి ఉంటాయి.

మేరువుకు దక్షిణ భాగంలో కైలాస, కరవీర పర్వతాలున్నాయి. ఉత్తర భాగంలో త్రిశృంగ, మకర పర్వతాలున్నాయి. వీటి పొడవు వెడల్పులు కూడా పై పర్వతాల ప్రమాణంతోటే ఉంటాయి.

మేరునగానికి ఇలా ఎనిమిది పర్వతాలూ బంగారానికి చుట్టూ అగ్నిపురుషుడు ప్రదక్షిణం చేస్తున్నట్లుగా ఉంటాయి.

మేరు శిఖరంలో మధ్యభాగాన పదివేల యోజనాల వెడల్పు, అంతే ప్రమాణంగల పొడవు ఉండి (సమచతురస్రంగా) బంగారుమయమైన ఒక పట్టణం ఉంది. అది బ్రహ్మపురం, ప్రకాశమయమై ఉంటుంది. (దానిపేరు 'శాతకౌంభి') ఈ బ్రహ్మపురానికి ఎనిమిది దిక్కులలోను లోకపాలకుల పురాలున్నాయి.

ఇంద్రాది దిక్పాలకుల ఆ నగరాల పేర్లు – తూర్పు నుంచి ఈశాన్యం వరకు వరుసగా ఇవి – అమరావతి, తేజోవతి, సంజ్ఞమణి, కృష్ణాంగన, శబ్దావతి, గంధవతి, మహోదయ, యశోమతి. ఈ పట్టణాలు రెండు వందల ఎనభైవేల యోజనాల వైశాల్యం కలిగి ఉంటాయి.

క. పరమేష్ఠి పట్టణంబున, హరి మున్ను త్రివిక్రమణము లందన్ సర్వే
శ్వర చరణాగ్ర నఖాహతిఁ, బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా!

31

తా ॥ రాజా! బ్రహ్మ పట్టణంలో పూర్వం హరి వామనావతారం ఎత్తి ఎదిగినప్పుడు సర్వేశ్వరుడైన ఆ త్రివిక్రముని యొక్క కాలిగోటి దెబ్బకు ఊర్ధ్వాండం పగిలిపోయింది.

వ. ఇట్లు చరణనఖస్పర్శంజేసి భేదింపంబడ్డ యూర్ధ్వకటాహ వివరంబు వలన నంతః ప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాదస్పర్శం జేయుచుఁ, జనుదెంచి సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాది యనుపేరం దేజరిల్లుచు దీర్ఘ కాలంబు స్వర్గంబున విహరించుచు, విష్ణుపదంబున నుత్తానపాద పుత్రుండును బరమ భాగవతుండునైన ధ్రువుండు తన కులదేవతయైన శ్రీహరి పాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుండై యానందబాష్పంబుల రోమాంచితగాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచున్నవాఁ; డతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదక ప్రభావంబు నెఱింగి తాము పొందు తపశ్శుద్ధి యాకాశగంగాజలంబుల స్నాతు లగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరునియందు భక్తి సలిపి యితర పదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తి మార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమ జటాజూటంబుల యందు నేఁడును ధరియించుచుండుదురు.

32

తా ॥ ఇలా పగిలిన బ్రహ్మాండం యొక్క పై భాగంలో కన్నం పడి నీటిధార అండంలోకి ప్రవేశించింది. ఆ జలధార శ్రీహరి కాలిని తాకడం వల్ల అన్ని లోకాలలోని అందరి జనుల పాపాల్నీ నశింపచేస్తూ – భగవత్పాదం నుంచి వెలువడినది కావడం వల్ల – “భగవత్పది” (విష్ణుపది) అనే పేరుతో ప్రకాశవంతమైంది. ఆ పుణ్యధార చాలా కాలం స్వర్గంలో

విహరించింది. అదే విష్ణుపదం (ఇది ద్యులోకం). ఉత్తానపాదుని కొడుకు, మహాభక్తులలో గొప్పవాడూ అయిన ధ్రువుడు వసించే మండలం అదే. అతడు ఇవ్వాళ్టికి కూడా ఆనాటి నుంచీ ప్రతినిత్యం తన కులదైవం అయిన విష్ణుపాదోదకాన్ని భక్తితో, కనులు మూసుకొని, ఆనందంతో కన్నులు చెమ్మగిల్లగా, ఒళ్ళు పులకరిస్తూ ఉండగా ఎంతో ఆదరంతో తలపై దాల్చి సేవిస్తూ ఉంటాడు.

భగవత్పది ధ్రువమండలం చేరి కొన్ని యుగాలైంది. ధ్రువుడు మొట్టమొదటగా దానిని దర్శించినప్పుడు ఎంతటి భక్తిపారవశ్యాన్ని పొందాడో! ఇప్పటికీ ప్రతినిత్యం అంతటి పారవశ్యంతోనే ఆ పుణ్యతీర్థాన్ని సేవిస్తున్నాడు.

మహాభక్తులు భగవత్పాదతీర్థాన్ని ప్రతినిత్యమూ ఇలాగే పూజించి, సేవించి ధన్యులవుతారని గ్రహించాలి.

ధ్రువమండలానికి క్రింద సప్తర్షిమండలం ఉంది. అందున్న ఋషులకు హరిపాదం నుండి వచ్చిన జలం యొక్క ప్రభావం ఎంతటిదో తెలుసు. వారు "తపస్సునకు సిద్ధి ఆకాశగంగా జలాలలో స్నానం చెయ్యడమే" అని సకల చరాచర జగత్తులోను అంతర్యామియై ఉండి నడిపిస్తున్న ఈశ్వరుని యందు భక్తి నిలిపి, మోక్షాన్ని కోరేవాడు మరి యే ఇతర పురుషార్థాల పట్ల కాంక్ష లేకుండా ముక్తిమార్గమందే తన శక్తుల్ని ధారపోసి ముక్తిని బహుమానంగా పొందేటట్లు ఎలా ప్రవరిస్తాడో అలాగే సప్తర్షులూ ఆకాశగంగను తమ తమ జటాజూటాలలో ఇప్పటికీ ధరిస్తూ ఉంటారు.

సీ. అంత నసంఖ్యంబులైన దివ్య విమాన, సంకులంబుల సువిశాలమైన
దేవమార్గంబున దిగి వచ్చి చంద్రమం, డలముఁ దోఁచుచు మేరునగ శిఖాగ్ర
మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు, వచ్చి యందులఁ జతుర్ద్వారములను
వరుసతో దీర్ఘ ప్రవాహంబు లగుచును, బ్రవహించి యమల ప్రభావములను

ఆ. నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు, మోములందు నాల్గు నామములను
దన్నుఁ గన్నవారిఁ దన వారిఁదోఁగిన, వారికెల్ల నమృతవారి యగుచు.

33

తా ॥ ఆ నది అక్కడి నుంచి అసంఖ్యాకమైన విమానాలు ఆవరించి ("అనేక సహస్రకోటి విమానానీక" – అని మూలం) క్రిక్కిరిసి ఉన్న మార్గాల గుండా వచ్చి విశాలమైన దేవయాగ మార్గం ద్వారా చంద్రమండలాన్ని చుట్టి, తడిపి, మేరు పర్వత శిఖరమందున్న బ్రహ్మలోకం మీద పడుతోంది. అక్కడ నాలుగు ద్వారాలలోను నాలుగింటిగా విడిపోతుంది. (విష్ణుపదికి ఇక్కడ నాలుగు పేర్లు. అవి సీత, అలకనంద, చక్షువు, భద్ర) ఈ నాలుగు నదులూ దీర్ఘంగా ప్రవహించి ఉప్పు సముద్రంలో కలుస్తాయి. తన జలాలను సేవించిన వారికందరికీ అమృతత్వాన్ని ప్రసాదిస్తూ విష్ణుపది ఇలా ప్రవహిస్తోంది.

వ. ఇట్లు సీత యను పేర వినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వ ద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వ లవణసాగరంబునం బ్రవేశించుఁ; జక్షు వనుపేరం దేజరిల్లెడు దీర్ఘ ప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాలవర్షంబుం బవిత్రంబు సేయుచుఁ బశ్చిమ లవణార్ణవంబునం గలియు, భద్ర యను పేర వెలుఁగొందిన యతుల ప్రవాహం బుత్తర ద్వారంబున వెడలి కుముదనీల శ్వేతాఖ్య పర్వత శిఖరంబులం గ్రమంబునం బ్రవహించుచు శృంగనగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తర కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తర లవణ సాగరంబుఁ జేరు, నలకనంద యనం బ్రఖ్యాతిఁ గాంచిన యమ్మహానదీ ప్రవాహంబు బ్రహ్మసదన దక్షిణద్వారంబున వెడలి యత్యంత దుర్గమంబు లైన భూధరంబులఁ గడచి హేమకూట హిమకూట నగంబుల నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారత వర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణ లవణాంబుధిం గలయు నంత.

తా ॥ నాలుగింటిగా విడిపోయి ప్రవహిస్తున్న ఈ నది పాయలలో సీతానది తూర్పు వైపు ప్రవహిస్తోంది. బ్రహ్మసదనం నుండి కేసర పర్వత శిఖరాలపై పడి క్రిందకు పాటి, గంధమాదన పర్వతం యొక్క శిఖరాల పై భాగంలో పడి భద్రాశ్వవర్షాన్ని ఏలుతూ తూర్పున ఉప్పు సముద్రంలో ప్రవేశిస్తోంది.

చక్షువు అనే పేర ప్రసిద్ధి పొందిన నది పశ్చిమద్వారం నుంచి వచ్చి, మాల్యవత్పర్వతం మీద పడి, అటునుంచి కేతుమాల వర్షాన్ని పవిత్రం చేస్తోంది. అలా వచ్చి, పడమటి లవణసాగరంలో కలుస్తోంది.

భద్ర అను పేరుగల నది తన సాటిలేని ప్రవాహంతో ఉత్తర ద్వారం నుంచి వచ్చి, కుముద నీల శ్వేతాఖ్య పర్వత శిఖరాలపై క్రమంగా ప్రవహించి, శృంగపర్వతానికి వచ్చి, మానసోత్తరాలైన కురుభూముల్ని పవిత్రం చేస్తోంది. అలా వచ్చి ఉత్తరపు ఉప్పు సముద్రంలో లీనమవుతోంది.

అలకనందగా ప్రఖ్యాతి గాంచిన నది బ్రహ్మసదనం నుంచి దక్షిణంగా ప్రవహిస్తోంది. వెళ్ళ సాధ్యం కాని పర్వతాల మీదికి వెళ్తోంది. హేమకూట, హిమకూట పర్వత శిఖరాలను త్రుళ్ళి పడుతూ తాకి, మహావేగంతో కర్మక్షేత్రమైన భారతవర్షాన్ని పవిత్రం చేస్తోంది. అలా వచ్చి, దక్షిణపు లవణసముద్రంలో లయమవుతోంది.

సీ. జగతిలో మేరు వాదిగఁ బర్వతములకుఁ, బుత్త్రిక లైనట్టి పుణ్యతీర్థ
ములు వేల సంఖ్యలు గలవు; జంబూద్వీప, మందు భారతవర్ష మరయఁ గర్మ
భూమి; దక్కిన వర్షముల దివంబున నుండి, భువికి వచ్చినవారు పుణ్యశేష
ములు భుజించుచు నుంద్రు; భూస్వర్గ మనఁదగు, నా వర్షముల నుండునట్టి వార

ఆ. లయుత సంఖ్య వత్సరాయువు లయుత మా, తంగబలులు దేవతాసమాను

లతులవ్రజదేహు లధిక ప్రమోదితు, లప్రమత్తు లార్యు లనఘు లధిప!

35

తా ॥ రాజా! లోకంలో మేరువు మొదలైన పర్వతాలకు పుత్రికలై జన్మించిన పుణ్యతీర్థాలు (నదులు) వేలకు వేలుగా ఉన్నాయి.

జంబూద్వీపంలో భారతవర్షం కర్మభూమి.

మిగిలిన వర్షాలలో స్వర్గం నుంచి భూమికి వచ్చినవారు తమకు మిగిలి ఉన్న పుణ్యం యొక్క ఫలాన్ని అనుభవిస్తూ ఉంటారు. భూమీ స్వర్గం అనబడే ఆ ఎనిమిది వర్షాలలో ఉండేవారు – పదివేల సంవత్సరాల ఆయువు కలిగి ఉంటారు. పదివేల ఏనుగుల బలం గలవారు, దేవతలతో సమానులు, వజ్రసమానమైన శరీరం గలవారు, ఎక్కువ సంతోషంతో ఉంటారు. ఏమరుపాటుతో ఉండరు, పూజ్యులు, పుణ్యులు.

వర్షాలన్నింటిలోను భరతవర్షమే కర్మక్షేత్రం. ఏ వర్షంలో ఎవరు ఎట్టి సుఖాల్ని దుఃఖాల్ని అనుభవించినా దానికి కారణాలైన పుణ్యకర్మల్నీ, పాపకర్మల్నీ ఆచరించే స్థలం భారత వర్షం. తక్కిన ఎనిమిది వర్షాలు పుణ్యకర్మల్ని అనుభవించే స్థానాలు. పుణ్యకర్మల్ని అనుభవించే స్థానానికి స్వర్గం అని పేరు. ఆ కర్మలో కొంతవరకు కర్మఫలాన్ని అనుభవించి, మిగులు ఉండగా జీవులు భూమిని చేరుతూ ఉంటారు. అలా చేరి, మిగిలి ఉన్న పుణ్యఫలాన్ని అనుభవిస్తారు. వాటిని భౌమ స్వర్గాలని అంటారు. అట్టి భౌమ స్వర్గాలు ఎనిమిది వర్షాలు. దానికి మూలమైన పుణ్యాన్ని ఆచరించే స్థానం భారత వర్షం.

వ. మఱియు సురతసుఖానందంబున మోక్షంబునైనం గైకొనక సకృత్ప్రసూతు లగుచు ననవరతంబును ద్రేతాయుగ కాలంబు గలిగి ప్రవర్తింతు; రీ యష్టవర్షంబులయందు దేవతాగణంబులు దమ భృత్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ నెల్ల ఋతువుల యందుం గిసలయ కుసుమ ఫల భరితంబులైన లతాదుల శోభితంబు లగు వనంబులు గల

వర్ష నిధిగిరి ద్రోణుల యందును, వికచ వివిధ నవకమలామోద ముదిత రాజహంస కలహంసలు గల సరోవరంబుల యందును జలకుక్కుట కారండవ సారస చక్రవాకాది వినోదంబులు గలిగి మత్తాళిఝుంకృతి మనోహరంబులై నానా విధంబులైన కొలంకులయందును దేవాంగనల కామోద్రేకజంబు లయిన విలాస హాస లీలావలోకనంబులం దివియంబడిన మనోదృష్టులు గలిగి విచిత్ర వినోదంబులం దగిలి యిచ్ఛావిహారంబులు సలుపుచుండుదురు.

36

తా ॥ ఆ ఎనిమిది వర్షాలలో ఉండేవారు నిరంతర సుఖాలలో మునిగి ఉంటారు. వారికి ఆ సుఖం ముందు మోక్షం కూడా చిన్నదే. అందువల్ల మోక్షాన్నీ స్వీకరించరు. అక్కడి స్త్రీలు ఒక్క పర్యాయమే సంతానాన్ని కంటారు. వారు త్రేతాయుగంలో ఉన్నట్లు గొప్ప సుఖంతో ప్రవర్తిస్తారు. ఈ ఎనిమిది వర్షాలలోని దేవతాగణాలు తమ సేవకుల మహోపచారాల్ని అందుకొంటూ ఋతువులన్నింటిలోను చివుళ్ళతో, పూలతో, పండ్లతో నిండిన తేనెలు, వృక్షాలు నిండిన సుందరమైన ఉద్యానవనాలలో హాయిగా విహరిస్తూ ఉంటారు. అచ్చట వర్షాలతో లోయలు నిండి ఉంటాయి. సరోవరాలు పద్మాలతో, రాజహంసలతో, నీటి కోళ్ళతో, బెగ్గురు పిట్టలతో, జక్కవలతో, ఆయా పక్షుల వినోదాలతో కలబోసుకొని ఉంటాయి. తేనె త్రాగి మత్తెక్కిన తుమ్మెదలు ఝుమ్మని శబ్దం చేస్తూ ఉంటాయి. దేవతా స్త్రీలు ఒయ్యారంగా ఒలకపోసే చూపులతో కామోద్రేకాన్ని పుట్టిస్తారు. ఆ సుందరులను చూస్తున్న దేవపురుషులు విచిత్రంగా వినోదిస్తూ ఇష్టం వచ్చినట్లు స్వేచ్ఛగా విహరిస్తూ ఉంటారు.

క. ఈ నవవర్షంబులయం, దా నారాయణుఁడు వచ్చి యనవరతము లో
కానుగ్రహమునకై సు, జ్ఞానం బీఁ దలఁచి లీలఁ జరియించుఁ దగన్.

37

తా ॥ ఈ తొమ్మిది వర్షాలలోను (ఇలావృతం మొదలుగా) భగవానుడైన నారాయణుడు

అవతరించి, నిత్యం లోకాలను అనుగ్రహిస్తూ, లోకులందరికీ సుజ్ఞానం ఇస్తాడు. తన దివ్యలీలావిలాసంతో ప్రవర్తిస్తూ ఉంటాడు.

సీ. వసుధ నిలావృత వర్షాధిపతియైన, పురహరుం డా వర్షమున వనంబు
నందు నుండుటకు నా యంబికాశాప వ, శంబున నా వనస్థలములందు
నెవ్వరు వచ్చిన నింతులై యుందు రా, వనమందుఁ బార్వతి యనుదినంబు
నంగనాజన సహస్రార్బుదంబులతోడ, నసమలోచనుఁ గొల్చు నతులభక్తి

ఆ. నట్టి శివునిఁ గోరి యా యిలావృతవర్ష, మునఁ జరించు జనులు మోదమునను
గదిసి తత్ప్రకాశముకలైన మంత్ర తం, త్రములఁ బూజఁ జేసి తలఁతు రెపుడు.

38

తా ॥ ఇలావృత వర్షానికి అధిపతి త్రిపురాలను హరించిన రుద్రుడు. ఈయన తప్ప మరెవ్వరూ పురుషుడు లేడు. అందరూ స్త్రీలే. పార్వతీ దేవి శాపం వల్ల ఆ వనస్థలంలోకి ఎవరు వచ్చినా స్త్రీలుగానే అవుతారు. అక్కడ అంబిక ప్రతినిత్యం వెయ్యికోట్లమంది పరిచారికలతో కలిసి త్రినేత్రుణ్ణి సాటిలేని భక్తితో సేవిస్తూ ఉంటుంది. అక్కడివారు పరమ శివుని మెప్పించే మంత్రాలతో, తంత్రాలతో పూజలు చేసి ఎప్పుడూ ఆరాధిస్తూ ఉంటారు.

క. భద్రాశ్వవర్షమందుల, భద్రశ్రవుఁ డనెడి పేరఁ బరఁగుచుఁ
దపనీ యాద్రి సమధైర్యుఁ డగుచు స, ముద్రాంతంబైన జగతిఁ బొలుపుగ నేలున్.

39

తా ॥ భద్రాశ్వ వర్షానికి అధిపతి భద్రశ్రవుడు. ఇతడు ధైర్యంలో మేరుపర్వతంతో సమానుడు. సముద్రం వరకు వ్యాపించి ఉన్న ఈ జగత్తును ఇతడు ఏలుతాడు.

క. ఆ నరవరునకుఁ బ్రియతముఁ, డైన హయగ్రీవమూర్తి ననవరతంబున్

ధ్యానస్తోత్రజపాను, ష్ఠానాదులఁ బూజసేసి సజ్జను లంతన్.

40

తా ॥ భద్రశ్రవుడికి ఇష్టుడైనవాడు హయగ్రీవుడు. ఇతణ్ణి నిత్యం ధ్యానాలతో స్తోత్రాలతో, జపాలతో, పూజాది కార్యాలతో సత్పురుషులు సేవిస్తూ ఉంటారు.

ఆ. తత్ప్రకాశకృ త్ప్రధాన మంత్రార్థ సం, సిద్ధిఁ జేసి ముక్తిఁ జెంది
రప్పు డట్టి వర్షమందు నా హయగ్రీవునిఁ, దలఁచి కొలిచి మిగుల ధన్యు లగుచు.

41

తా ॥ ఆ హయగ్రీవమూర్తిని వెలికి తెచ్చే మంత్రాలతో భద్రాశ్వవర్షంలోని వారు కొలిచి ముక్తి చెందుతారు. హయగ్రీవారాధకులు ఎంతో ధన్యులు.

సీ. హరివర్ష పతియైన నరహరి ననిశంబు, నందున్న జనులు మహాత్ములయిన
దైత్యదానవ కులోత్తములు ప్రహ్లాదాది, వృద్ధులఁగూడి సంప్రీతితోడ
సుస్నాతులై భక్తిఁ జూచుచు నుందురు, రమ్యదుకూలాంబరములు దాల్చి
తత్ప్రకాశక మంత్ర తంత్రజపస్తోత్ర, పఠన సుధ్యానతపః ప్రధాన

గీ. మైన సత్పూజలను జేసి యచల బుద్ధి, శ్రీ నృసింహునిఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు, భుక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య!

42

హరివర్షానికి అధిపతి నరసింహస్వామి. దైత్యులు, దానవకులంలోని ఉత్తములు అయిన ప్రహ్లాదాది మహాత్ములు నరసింహస్వామిని నిత్యం పరమప్రీతితో పెద్దలతో కలసి సేవిస్తారు. పవిత్రంగా స్నానం చేసి, భక్తితో, శుచిగా మడిబట్టలు కట్టుకొని, నరసింహస్వామిని వెలికి తెచ్చే మంత్రాలతో, తంత్రాలతో, జపాలతో, స్తోత్రాలతో, పఠనాలతో, ధ్యానాలతో, తపస్సులతో

సుస్థిరమైన మనస్సు పెట్టి ప్రధానమైన పూజల్ని జరిపి, శ్రీ నృసింహుని దయను పొంది, హరివర్ష జనులు భుక్తినీ ముక్తినీ చేపడుతూ ఉంటారు.

వ. మఱియుఁ గేతుమాల వర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకుఁ గామ దేవరూపంబున నుండు; నమ్మహాపురుషుని యస్త్రతేజః ప్రకాశంబునఁ బ్రజాపతి దుహితలగు రాత్ర్యధి దేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించు, నా కామదేవుండును దన గతి విలాసలీలావిలోకన సుందర భ్రూమండల సుభగ వదనారవింద కాంతులం జేసి శ్రీరమాదేవిని రమింపజేయు; భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ ప్రజాపతి పుత్రికలును బుత్రులునైన రాత్రులం బగళ్లం గూడి కామదేవుని స్తోత్రపఠన పూజాధ్యానాదులం బూజించు చుండు; మఱియును.

43

తా ॥ కేతుమాల వర్షంలో భగవానుడు కామదేవుడు (ఈయనే ప్రద్యుమ్నుడు) అనే పేరుతో లక్ష్మీదేవికి ప్రీతిని కలిగిస్తూ ఉంటాడు. ఈ వర్షానికి అధిపతులు ప్రజాపతియైన సంవత్సరుని కుమార్తెలు, కుమారులు. కొడుకులు పగళ్ళు, కూతుళ్ళు రాత్రులు. మహాపురుషుడైన భగవంతుని అస్త్రతేజస్సు యొక్క వెలుగు వల్ల ప్రజాపతి కుమార్తెలైన రాత్ర్యభిమానదేవతలకు (రాత్రులకు) మనస్సు భీతి చెంది ఉంటుంది. దానివల్ల వాళ్ళు గర్భాలు ధరించినా సంవత్సరం చివర ఆ గర్భాలు ప్రాణాలు లేకుండా వెల్వడతాయి. తన అందమైన నడకలతో, విలాసాలతో, చిరునవ్వులతో, చూపులతో, సుందర ముఖకాంతులతో ఆ కామదేవుని రూపంలో ఉన్న శ్రీహరి రమాదేవిని సంతోషపెడతాడు. శ్రీదేవి భగవన్మాయ యొక్క రూపం. ఆ తల్లి, ప్రజాపతి పుత్రికలు పుత్రులు అయిన రాత్రింబగళ్ళతో కలిసి కామదేవుడిని స్తోత్రాలతో, మంత్రపాఠాలతో, పూజలతో, ధ్యానాలతో పూజిస్తూ ఉంటుంది.

క. విమలమతిఁ జిత్తగింపుము, రమణీయంబైన విమలరమ్యక మను వ
ర్షమునకు నధిదేవత దా, నమరంగా మత్స్యరూపుఁడగు హరి దలఁపన్.

44

తా ॥ రాజా! నిర్మలమైన మనస్సుపెట్టి విను. రమ్యక వర్షానికి అధిదేవత మత్స్యరూపంలో ఉంటాడు. అతడు హరియే.

ఆ. అట్టి వర్షమునకు నధిపతి యగుచున్న, మనువు పుత్రపౌత్ర మంత్రివరులఁ
గూడి మత్స్యమైన కుంభినీధరుఁ జిత్త, మతుల భక్తియుక్తి హత్తఁ గొలుచు.

45

తా ॥ ఈ వర్షాధిపతి మనువు. మనువు తన కొడుకులతో మనుమళ్ళతో కలిసి భూమిని ధరించే మత్స్యమూర్తిని ఆరాధిస్తూ ఉంటాడు.

ఆ. తత్ప్రకాశ కృత్ప్రధాన మంత్రస్తోత్ర, ములను ధర్మకర్మములను హోమ
ములను జనులు సేసి పుణ్యులై భుక్తి ము, క్తులను బొందుచుందు రెలమితోడ.

46

తా ॥ మత్స్యరూపుడైన విష్ణుని ప్రకాశింపచేసే ప్రధానమైన మంత్రాలతో, స్తోత్రాలతో, ధర్మాలతో, కర్మలతో, హోమాలతో రమ్యకవర్షంలో జనులు పుణ్యులై భక్తి కలిగి ఉండి ఆరాధిస్తారు. దాని వల్ల వారు ఇహపరసౌఖ్యాలను, మోక్షాన్నీ పొందుతారు.

క. వినుము; హిరణ్మయ వర్షం, బునకుం గూర్మావతారమును దాల్చిన యా
వనజోదరుఁ డధిదేవత, యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా!

47

తా ॥ రాజా! తరువాతది హిరణ్మయ వర్షం. దీనికి అధిదేవత కూర్మావతార రూపుడైన ఆ పద్మగర్భుడు శ్రీ మహావిష్ణువు. రాజా! పితృదేవతలకు అధిపతి, పుణ్యాత్ముడు, మహాత్ముడు అయిన అర్యముడు హిరణ్మయవర్ష పాలకుడు.

క. ఆ వర్షమందు నర్యముఁ, డా వర్షజనంబుఁగూడి హరిఁ జిత్తముతో
భావించి సంస్తవంబులు, గావించుచు భుక్తి ముక్తి గాంతురు గడఁకన్.

48

తా ॥ ఈ అర్యముడు హిరణ్మయ వర్షంలోని జనులతో కలసి హరిని మనస్సున ధ్యానిస్తూ, స్తుతిస్తూ ఉంటాడు. ఇహలోక సుఖాలన్నీ పొంది, కడకు అందరూ భక్తి మూలాన ముక్తిని పొందుతారు.

క. ఉత్తర కురుభూములఁ దను, హత్తుకొని వరాహదేవుఁ డధిపతియైనన్
సత్తుగ భూసతి యతనిం, జిత్తములో నిలిపి పూజ సేయుచు నుండున్.

49

తా ॥ ఉత్తర కురుభూములకు వరాహదేవుడు అధిపతి. వరాహదేవుణ్ణి తన మనస్సులో నిల్పుకొని భూదేవి పూజ చేస్తూ ఉంటుంది.

క. ఆ వర్షమందులను బ్రజ, లా విపులవరాహమూర్తి ననవరతంబున్
సేవించి కొలిచి సంస్తుతిఁ, గావించుచుఁ గాంతు రంతఁ గైవల్యంబున్.

50

తా ॥ ఈ వర్షంలోని వారు ఆ మహావరాహస్వామిని నిరంతరం సేవించుకొని, అర్చించి, ఆయనను సన్నుతించి, మోక్షస్థితిని పొందుతారు.

క. అరయఁగ సీతాలక్ష్మణ, పరివృతుఁడై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం, పురుష మహావర్షమునకు భూపవరేణ్యా!

51

తా ॥ రాజా! కింపురుష వర్షానికి సీతాలక్ష్మణులతో కలిసి ఉన్న శ్రీరామభద్రుడు అధిపతి.

ఆ. అట్టి రామభద్రు నంజనీసుతుఁడు గిం, పురుషగణముఁ గూడి పూజ సేసి
తత్ప్రకాశ కృత్ప్రధానమంత్ర స్తోత్ర పఠనములను దగ నుపాస్తి సేయు.

52

తా ॥ శ్రీరాముణ్ణి ఆంజనేయ స్వామి కింపురుషగణంతో కూడి పూజిస్తాడు. శ్రీరామతేజస్సును ప్రకాశింపచేసే ప్రధానమైన మంత్రాలతో, స్తోత్రాలతో ఉపాసిస్తాడు హనుమ.

సీ. భారతవర్షాధిపతియైన బదరికా, శ్రమమున నున్న నారాయణుండు
భూనాథ! యా మహాత్ముని నారదాదులు, భారతవర్షంబు ప్రజలఁ బ్రేమఁ
బాయక చేరి యుపాస్తి సేయుచు సాంఖ్య, యోగంబు నుపదేశ ముచితవృత్తి
నంది యందఱును గృతార్థులై యట్టి నా, రాయణదేవు నారాధనంబు

ఆ. సేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా, శకము లయిన మంత్ర సంస్తవములఁ
బూజసేసి ముక్తిఁ బొందుచు నుండుదు, రచలమైన భక్తి ననుదినంబు.

53

తా ॥ భారతవర్షానికి అధిపతి నారాయణుడు. బదరికాశ్రమంలో (నరుడితో కలిసి) తపస్సు చేశాడు. నారదాది మునుల సాంగత్యంతో సాంఖ్యయోగాన్ని ఉపదేశం పొంది, జనులంతా యోగ్యమైన ప్రవర్తనతో ఉండి, నారాయణుడి ఆరాధనతో అందరూ కృతార్థులవుతారు.

నిత్యమూ నారాయణుణ్ణి ఉద్దీపింపచేసే సుస్థిరమైన భక్తితో మంత్రాలతో, స్తవాలతో పూజల్ని చేసి, వారు నారాయణుడి అనుగ్రహాన్ని పొంది ముక్తినందుతారు.

ఆ యా మూర్తులను వెలికితీసే మంత్రాలు, అంటే ప్రత్యేకంగా ఆ యా మంత్రాలతో ఉపాసన చేయాలని కాదు. మీరు ఏ మంత్రాలతో పూజించినా, ఆ పూజలన్నీ చివరకు ఆ

పరమాత్మునికే చేరతాయన్న భావన ఉండాలి. 'సర్వదేవ దేవీ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి'.

క. భారతవర్షమునందుల, సారాంశములైన పుణ్యశైలంబులు గం
భీర ప్రవాహములు గల, వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా!

54

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! భారతవర్షంలో ఎన్నో పుణ్యశైలాలు, గంభీరంగా ప్రవహించే అనేకమైన నదులు ఉన్నాయి. వాటిని తెలియచెబుతాను, విను.

వ. మలయపర్వతంబును, మంగళ ప్రస్థంబును, మైనాకంబును, త్రికూటంబును, ఋషభపర్వతంబును, గూటరంబును, గోల్లంబును, సహ్యపర్వతంబును, వేదగిరియు, ఋష్యమూక పర్వతంబును, శ్రీశైలంబును, వేంకటాద్రియును, మహేంద్రంబును, వరాధరంబును, వింధ్య పర్వతంబును, శుక్తి మత్పర్వతంబును, ఋక్షగిరియును, బారియాత్రంబును, ద్రోణపర్వతంబును, జిత్రకూటంబును గోవర్ధనాద్రియును, రైవతకంబును, గుకుంభంబును, నీలగిరియును, గాకముఖంబును, నింద్రకీలంబును, రామగిరియు నాదిగాఁ గల పుణ్యపర్వతంబు లనేకంబులుగల, వా పర్వతపుత్రికలైన చంద్రపటయుఁ, దామ్రపర్ణియు, నవటోదయుఁ, గృతమాలయు, వైహాయసియుఁ, గావేరియు, వేణియుఁ, బయస్వినియుఁ, బయోదయు, శర్కరావర్తయుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియు, భీమరథియు, గోదావరియు, నిర్వింధ్యయుఁ బయోష్ణయుఁ, దాపియు, రేవానదియు, శిలానదియు, సురసయుఁ, గౌశికియు, మందాకినియు, యమునయు, సరస్వతియు, దృషద్వతియు, గోమతియు, సరయువును, భోగవతియు, సుషమయు, శతద్రువును, జంద్రభాగయు, మరుద్వృథయు, వితస్తయు, నసిక్నియు, విశ్వయు నను నీ మహానదులును; నర్మద, సింధువు, శోణయను నదంబులును నైన మహాప్రవాహంబు లీ భారత వర్షంబునఁ గల; వందు సుస్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు; మఱియు నీ భారత వర్షంబున జన్మించిన పురుషులు శుక్ల లోహిత కృష్ణవర్ణ రూపంబులగు త్రివిధ

కర్మంబులంజేసి క్రమంబుగ దేవ మనుష్య నరకగతులను త్రివిధ గతులం బొందుదురు; వినుము; రాగద్వేషాది శూన్యుండు నవాఙ్మానసగోచరుండు, ననాధారుండునగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్ము లవిద్యాగ్రంథి దహనంబు గావించుటం జేసి పరమభాగవతోత్తములు పొందెడు నుత్తమగతిం జెందుదురు; కావున భారతవర్షంబు మిగుల నుత్తమం బని మహాపురుషు లిట్లు స్తుతింపుచుండుదురు.

55

తా ॥ పుణ్యశైలాలు – మలయ పర్వతం, మంగళ ప్రస్థం, మైనాకం, త్రికూటం, ఋషభం, కూటకం, కోల్లకం, సహ్యం, వేదగిరి, ఋష్యమూకం, శ్రీశైలం, వేంకటాద్రి, మహేంద్రం, వారిధరం, వింధ్యపర్వతం, శుక్తిమత్పర్వతం, ఋక్షగిరి, పారియాత్రం, ద్రోణపర్వతం, చిత్రకూటం, గోవర్ధనం, రైవతకం, కుకుభం, నీలగిరి, గోకాముఖం, ఇంద్రకీలం, రామగిరి మొదలైన పుణ్యపర్వతాలు ఎన్నో ఉన్నాయి.

### పవిత్ర నదులు

ఈ పర్వతాలకు పుత్రికలైన పుణ్యనదులు – చంద్రపట, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, శిల, సురస, చర్మణ్వతి, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసోమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయువు, భోగవతి, సుషోమ, శతద్రువు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ – అనే ఈ మహానదులు; నర్మదా నది, సింధువు, శోణ – అనే నదాలు ఈ భరతవర్షంలో ప్రవహిస్తున్న మహాప్రవాహాలు. వీటిల్లో పవిత్రంగా స్నానాలు చేసిన మానవులు ముక్తిని పొందుతారు.

ఈ భారతవర్షంలో జన్మించిన పురుషులు తెలుపు, ఎరుపు, నలుపు రంగుల రూపాల

సత్త్వరజస్తమోగుణాలను కలిగి ఉంటారు. మూడు విధాలైన కర్మల్ని ఆచరించి క్రమంగా దేవలోకంలో, మనుష్యలోకంలో, నరకలోకంలో తిరుగుతూ ఉంటారు.

రాజా! విను. రాగద్వేషాలు లేనివాడు, మాటకు మనస్సుకు అందనివాడు, సర్వానికీ తానే ఆధారమైనవాడూ అయిన శ్రీ వాసుదేవుని చిత్తంలో నిలుపుకొని భక్తియోగంతో ఆరాధిస్తారు. ఆ మహాత్ములు అవిద్య అనే ముడిని నశింపచేసుకోవడం వల్ల వారు పరమ భాగవతోత్తములు పొందే ఉత్తమ గతిని పొందుతారు. అందువల్ల భారతవర్షం ఎంతో ఉత్తమమైనదని మహాపురుషులు ఈ భారతవర్షాన్ని ఇలా స్తుతిస్తారు.

ఉ. భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు? నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయు బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచు నుండు నెంతయున్.

56

తా ॥ భారతవర్షంలో జన్మించినవారి భాగ్యాన్ని చెప్పడం సాధ్యంకాదు. వారి భాగ్యమే భాగ్యం. ఈ భారతవర్షంలో శ్రీహరి ఎన్నో సార్లు అవతరించి, జీవులకు తత్త్వం ఉపదేశించాడు. శ్రీహరి ఇక్కడికి దిగివచ్చి ప్రాణులతో స్నేహం చేసి, బంధువుగా ఉండి వారి కష్టసుఖాలలో పాలు పంచుకొని కృతార్థుల్ని గావించాడు.

క. తన జన్మ కర్మములనుం, గొనియాడెడి వారికెల్లఁ గోరిన వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం, బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁ డవనీనాథా!

57

తా ॥ శ్రీకృష్ణుడు తన అవతారాలనూ, లీలావిలాసాలనూ తాత్త్వికదృష్టితో తెలుసుకొని ఆనందాన్ని పొంది, స్తుతించేవారికి దయతో అన్ని కోరికలను తీరుస్తూ మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

వ. ఇట్లు భారత వర్షంబునందుల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు. నారాయణ స్మరణంబు సకల దురితంబుల నడంచుఁ; దన్నామస్మరణ రహితంబులైన యజ్ఞ తపో దానాదులు దురితంబుల నడంపలేవు, బ్రహ్మకల్పాంతంబు బ్రతికెడి యితర స్థానంబునం బునర్జన్మ భయంబున భీతిల్లుచు నుండుటకన్న భారత వర్షంబునందు క్షణమాత్రంబు మనంబున సర్వసంగ పరిత్యాగంబు సేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణ పదప్రాప్తి యతి సులభంబుగ సంభవించుం; గావున నట్టి యుత్తమంబగు నీ భారత వర్షంబె కోరుచుండుదురు; మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు, నే దేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు, రే భూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేక యుండు, నది సురేంద్రలోకంబైన నుండందగదు; జ్ఞానానుష్ఠాన ద్రవ్యకలాపంబుచేత మనుష్యజాతిం బొంది తపంబున ముక్తిం బొందకుండెనేని మృగంబుల మాడ్కి నతండు దనుకుం దానె బంధనంబు నొందు; భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞములయందు వేల్వంబడు హవిస్సులను బెక్కునామంబులం బుండరీకాక్షుం దంది తనమీఁది భక్తి యధికంబుగాఁ జేయు; నట్టి భారతవర్షంబు నందలి ప్రజమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపర సౌఖ్యంబుల నొసంగుచుండు; జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపంబూని భూఖననంబు సేయుటం జేసి స్వర్ణప్రస్థ చంద్రశుక్లావర్తన రమణక మందేహారుణ పాంచజన్య సింహళ లంకాద్వీపంబులను నెనిమిది యుపద్వీపంబులు గలిగె.

58

తా ॥ అందువల్ల భారత వర్షంలోని జనులకు సాధ్యం కానిది ఏదీ లేదు. నారాయణుణ్ణి స్మరించడం వల్ల అన్ని పాపాలు నశిస్తాయి. నారాయణ స్మరణ లేని యజ్ఞం, తపస్సు, దానం మొదలైనవేవీ పాపాల్ని అణచలేవు.

ఇతర ప్రదేశాలలో బ్రహ్మకల్పం చివరి దాకా ఉన్నా మళ్ళీ జన్మమెత్తాలన్న భయం

తప్పదు. సుఖం ఉండదు. కాని భారత వర్షంలో ఒక్క క్షణకాలం చాలు – మనఃపూర్వకంగా సర్వ సంగపరిత్యాగం చేస్తే అతడు పురుషశ్రేష్ఠుడవుతాడు. అట్టి పురుషశ్రేష్ఠుడికి శ్రీమన్నారాయణుడి యొక్క పాదముల వద్ద చిరస్థానం ఎంతో సులభంగా లభిస్తుంది. కనుక ఇలాంటి ఉత్తమమైన ఈ భారత వర్షాన్నే మహాత్ములు కోరుకొంటారు.

మరో విషయం గుర్తుంచుకో. అది దేవేంద్రలోకమైన స్వర్గమైనా సరే, అక్కడ విష్ణు కథల వాసన లేకపోయినా, సజ్జనులైన మహాభక్తులు అక్కడ ఉండకపోయినా, ఆ నేలపై యజ్ఞేశ్వరుడైన విష్ణుని మహోత్సవాలు లేకపోయినా, ఆ లోకంలో ఉండకూడదు.

ఈ భారతవర్షంలో ఏ జీవులు భగవంతుణ్ణి ఆరాధించడానికి అక్కడకు వచ్చే కర్మేంద్రియాల్నీ జ్ఞానేంద్రియాల్నీ కలిగి ఉండి కూడా, దానికి ఉపయోగించదగిన ద్రవ్యాలు కలిగి ఉండి కూడా, మనుష్యజన్మం పొంది ఉండి కూడా, భక్తితో భగవంతుణ్ణి ప్రేమించి ముక్తి కోసం ప్రయత్నించరో – అలాంటివాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు వేటగాడి వలలో పడ్డ మృగంలా తమకు తామే బంధనంలో పడి చస్తారు. మళ్ళీ బంధనాన్ని పొందుతారు.

ఈ భారతవర్షంలో ప్రజలు శ్రద్ధగా అనుష్ఠించే యజ్ఞాలలో హవిస్సుల్ని వేలుస్తారు. అనేక నామాలతో పుండరీకాక్షుణ్ణి ఆవాహన చేస్తూ హవిస్సుల్ని అర్పిస్తారు. పరమేశ్వరుడు వాటిని అందుకొని తనపై వారికి అధిక భక్తి కలిగేటట్లు అనుగ్రహిస్తాడు. భారత వర్షం యజ్ఞభూమి కనుక యజ్ఞేశ్వరుడైన సర్వేశ్వరుడు ఇచ్చటి ప్రజల భక్తియుక్తమైన యజ్ఞకర్మలకు ప్రీతినంది, కరుణించి వీరికి ఇహపరసౌఖ్యాల్ని అనుగ్రహిస్తాడు.

సగరుని కొడుకులు జంబూద్వీపంలో అశ్వమేధం కోసం విడువబడ్డ యాగాశ్వాన్ని వెతుక్కుంటూపోవడం వల్ల వారు భూమిని త్రవ్వవలసి వచ్చింది. దానితో జంబూద్వీపానికి ఎనిమిది ఉపద్వీపాలు ఏర్పడ్డాయి. అవి – స్వర్ణప్రస్థం, చంద్రశుక్లం, ఆవర్తనం, రమణకం, మందేహారుణం, పాంచజన్యం, సింహళం, లంక – అనే పేర్లతో ఉన్నాయి.

భారతవర్షం మోక్షాన్ని పొందడానికి అనువైన కర్మభూమి, యజ్ఞభూమి. మిగిలిన వర్షాలలో ఇంద్రియ సుఖం ఎక్కువ. దానివల్ల భగవత్స్మరణ నశిస్తుంది. అందువల్ల ఆ వర్షాలలో కల్పాంతం వరకూ ఉన్నా ఫలితం లేదు. మళ్ళీ పుట్టుక తప్పదు. కాని, భారత వర్షంలో నరుడు ఒక్క క్షణకాలం జీవించినా తాను చేసే సర్వకర్మల్నీ భక్తితో భగవంతునికి అర్పించి, భయం దరికిరాని విష్ణుపదాన్ని పొందగలడు.

సీ. లక్షయోజనములు లవణాబ్ధి పరివృత, మగుచు జంబూద్వీప మతిశయిల్లు;
విను రెండు లక్షలు విస్తృతముగను బ్ల, క్షద్వీపముండు నా క్షార సాగ
రముఁ జుట్టి, యందుల రమ్యమై యొప్పెడు, వృక్షంబు ప్లక్షంబు విదితముగను;
దనరు నా ద్వీపంబు దరునామ మహిమచే, మిగులఁ బ్లక్షం బన మించి రహిని;

ఆ. నందు సంచరించు నట్టి వారల కగ్ని, దేవుఁ డమరు నాదిదేవతయుఁగ,
నందులోన నా ప్రియవ్రత సుతుఁడగు, నిధ్మజిహ్వుఁడను మహీవరుండు.



తా ॥ జంబూ ద్వీపానికి చుట్టూ లక్షయోజనాల మేర ఉప్పు సముద్రం చుట్టి ఉంది. ప్లక్ష ద్వీపానికి చుట్టూ చెఱకు రసం నిండిన సముద్రం ఉంది. అది రెండు లక్షల యోజనాల మేర చుట్టి ఉంది. ద్వీప మధ్య భాగంలో ప్లక్షం అనే జువ్వి వృక్షం ఉంది కనుక ఈ ద్వీపానికి ప్లక్ష ద్వీపం అని పేరు వచ్చింది. అగ్నిదేవుడు దీనికి అధిపతి. ప్రియవ్రతుని కొడుకైన ఇధ్మజిహ్వుడు దీన్ని పరిపాలిస్తున్నాడు.

వ. నరేంద్రా! యా యిధ్మజిహ్వుం డా ప్లక్షద్వీపంబు నేడు వర్షంబులుగ విభజించి యందు నా వర్ష నామధారులుగ నుండు తన పుత్త్రులగు శివ యశస్య సుభద్ర శాంత క్షేమాభయామృతు లనియెడు నేడుగుర నేడు వర్షంబుల కధిపతులం గావించి తపంబునకుం జనియె, నా వర్షంబులయందు మణికూట వజ్రకూటేంద్ర సేన జ్యోతిష్మద్ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాలంబులను నామంబులు గల సప్త

కులపర్వతంబులను, నరుణయు నృమణయు నంగిరసియు సావిత్రియు సుప్రభాతయు ఋతంభరయు సత్యంభరయు నన సప్త మహానదులును, నా నదుల యందు సుస్నాతు లగుచు గత పాపులైన హంసపతం గోర్ధ్వాయన సత్యాంగులను నామంబులుగల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు, నందుఁ బురుషులు సహస్ర వత్సర జీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం గ్లమస్వేదాది రహితంబగు నపత్యోత్పాదనంబు గలవార లగుచు వేదత్రయాత్మకుండును, స్వర్గద్వారభూతుండును, భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమున సేవింపుదురు; ప్లక్షద్వీపం బాదిగా మీఁ దటి ద్వీపపంచకంబు నందలి పురుషులకు నాయు రింద్రియ పటుత్వంబులను దేజో బలంబులును దోడనే జనియించుచుండు.

60

తా ॥ రాజా! ఇధ్మజిహ్వుడు ఈ ప్లక్ష ద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించాడు. వాటిని తన ఏడుగురు కొడుకులకు కట్టబెట్టాడు. ఇధ్మజిహ్వుని కొడుకుల పేర్లే ఆ ద్వీపాలకూ పేర్లయ్యాయి. అవి – శివ, యశస్య, సుభద్ర, శాంత, క్షేమ, అమృత, అభయ – అనేవి.

కొడుకుల్ని వర్షాధిపతుల్ని చేసి ఇధ్మజిహ్వుడు తపస్సు చేసుకోవాలని వెళ్ళిపోయాడు.

ఈ సప్త వర్షాలకు సప్త కులపర్వతాలు ఉన్నాయి. వాటి పేర్లివి: మణికూటం, వజ్రకూటం, ఇంద్రసేనం, జ్యోతిష్మంతం, ధూమ్రవర్ణం, హిరణ్యగ్రీవం, మేఘమాలం. ఈ వర్షాలకు సప్త మహానదులు ఉన్నాయి. అవి – అరుణ, నృమ్ణ, ఆంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర – అనేవి. ఈ నదీజలాలలో స్నానం చేసి పాపాలు తొలగినవారై హంస, పతంగ, ఊర్ధ్వాయన, సత్యాంగులనే నాలుగు వర్ణాలవారు ఉంటారు. అక్కడి వారి ఆయుర్దాయం వెయ్యేళ్ళు. వాళ్ళు దేవతలతో సమానమైన వాళ్ళు. వాళ్ళు కేవలం చూపు మాత్రంతోటే శ్రమ, చెమట లేనట్టి సంతానం కలిగి ఉంటారు. వాళ్ళు వేదత్రయ స్వరూపుడు, స్వర్గద్వారం వంటివాడు, భగవత్స్వరూపుడూ అయిన సూర్యుణ్ణి ఋగ్యజుస్సామ వేదాలతో సేవిస్తారు.

ప్లక్ష ద్వీపం మొదలైన ఐదు ద్వీపాలలో పురుషులందరికి ఆయువు, ఇంద్రియ పటుత్వం, తేజస్సు, బలం పుట్టుకతోనే సిద్ధిస్తాయి.

క. ప్లక్షద్వీపము, ద్విగుణిత, లక్షేక్షురసాబ్ధి సుట్టిరా విలసిల్లు; న్నిక్షురసోదద్విగుణం, బక్షయముగ శాల్మలీ మహాద్వీప మిలన్.

61

తా ॥ ప్లక్ష ద్వీపానికి ముందు, జంబూద్వీపానికి మధ్య లవణ సముద్రం ఉన్నట్లు ప్లక్ష శాల్మలీ ద్వీపాలకు మధ్యలో ఇక్షురస జలంతో నిండిన ఇక్షురస సముద్రం ఉంది. ఇది రెండు లక్షల యోజనాల విస్తీర్ణం కలది. ఇక్షురస సముద్రానికి రెట్టింపు వైశాల్యం కలిగినది శాల్మలీ ద్వీపం.

వ. అందు శాల్మలీ వృక్షంబు ప్లక్షాయామంబై తేజరిల్లు; నా వృక్షరాజంబునకు నధోభాగంబునం బతత్త్రిరాజుగా నుండు గరుత్మంతుండు నిలుకడగా వసించు; నా శాల్మలీ వృక్షంబు పేర నా ద్వీపంబు శాల్మలీ ద్వీపంబన విలసిల్లు; నా ద్వీపపతియైన ప్రియవ్రతాత్మజుండగు యజ్ఞబాహువు దన పుత్రులగు సురోచన సౌమనస్య రమణక దేవబర్హ పారిబర్హాప్యాయ నాభిజ్ఞాతు లనియెడు వారిపేర నేడు వర్షంబుల నేర్పఱిచి యా వర్షంబులయం దేద్వురఁ గుమారుల నభిషిక్తులంజేసె; నా వర్షంబులయందు స్వరస, శతశృంగ, వాసుదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతులను పర్వత సప్తకంబును ననుమతియు, సినీవాలియు, సరస్వతియుఁ, గుహువును, రజనియు, నందయు, రాకయునను సప్తమహానదులును గల; వందు శ్రుతధర, విద్యాధర, వసుంధ, రేధ్మధర, సంజ్ఞులగు నా వర్ష పురుషులు భగవత్స్వరూపుండును, వేదమయుండు, నాత్మ స్వరూపుండునగు సోముని వేదమంత్రంబులచే నారాధింపుదు; రాద్వీపంబు లక్షచతుష్టయ పరిమిత యోజన విస్తృతం బయిన సురాసముద్రంబుచే నావృతంబై తేజరిల్లు; నందు.

62

తా ॥ శాల్మలీ ద్వీపంలో శాల్మలీ వృక్షం (బూరుగు చెట్టు) ప్లక్ష ద్వీపం యొక్క విస్తీర్ణమంత విస్తీర్ణం కలదై వ్యాపించి ఉంటుంది. ఈ శాల్మలీ వృక్షం వల్లనే ఆ ద్వీపానికి శాల్మలి అని పేరు. ఈ వృక్షం మూలంలో (వేదాలే అవయవాలుగా ఉన్న పతత్రిరాజు) పక్షిరాజైన గరుత్మంతుడు నివసిస్తూ ఉంటాడు.

ఈ శాల్మలీ ద్వీపానికి యజ్ఞబాహువు పాలకుడు. ఇతడు ప్రియవ్రతుని కొడుకు. యజ్ఞబాహువుకు ఏడుగురు కొడుకులు, వారి పేర్లతో ఏడు వర్షాలను విభజించి వారికిచ్చాడు. ఆ వర్షాలు – సురోచనం, సౌమనస్యం, రమణకం, దేవబర్హం, పారిభద్ర, ఆప్యాయనం, అభిజ్ఞాతం – అనేవి.

ఈ వర్షాలలో సరిహద్దు పర్వతాలు ఏడు ఉన్నాయి. అవి సురస, శతశృంగ, వామదేవ, కుంద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతులు.

ఏడు నదులు అక్కడ ప్రవహిస్తున్నాయి. ఆ నదుల పేర్లు – అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహువు, రజని, నంద, రాకలు.

ఆ వర్షాలలో పురుషులు నాలుగు వర్ణాలుగా విభజింపబడి ఉంటారు. వారిని శ్రుతిధర, విద్యాధర, వసుంధర, ఇధ్మధరులని పిలుస్తారు. వీరు వేదమయుడు, ఆత్మస్వరూపుడు అయిన సోముని ఆరాధిస్తారు.

శాల్మలీ ద్వీపానికి చుట్టూ సురా సముద్రం ఉంది. దాని విస్తీర్ణం నాలుగు లక్షల యోజనాలు.

సీ. భూనాథ! యా సురాంభోధికిఁ జుట్టుగా, నుండు కుశద్వీప మూర్వీమీఁదఁ;
దోరమై తా ద్విచతుర్లక్ష యోజనం, బులను విస్తారమై పొలుపు మిగులు;
నందుఁ గుశస్తంబ మనిశంబు దేవతా, కల్పితం బైనట్టి కాంతిచేత

దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన, పేర సత్కీర్తి పెంపుసేయు;

తే. నట్టి దీవికి నధిపతి యగు ప్రియవ్ర, త తనయుండు హిరణ్య రేతసుఁ డనం ద నరెడి భూపతి తన సుతనామములను, వర్షములు సేసె నత్యంత హర్షమునను.

63

తా ॥ రాజా! సురా సముద్రానికి చుట్టూ కుశ ద్వీపం ఉంది. దాని విస్తీర్ణం ఎనిమిది లక్షల యోజనాలు. (కుశద్వీపం చుట్టూ ఘృత సముద్రం ఉంది). ఆ ద్వీపంలో దేవతలు నిర్మించిన కుశస్తంభం ఉంది. దాని కాంతి దిక్కులన్నింటిని ప్రకాశింపచేస్తోంది. కుశ స్తంభం ఉండటం మూలంగానే దానికి కుశ ద్వీపం అని పేరు ఏర్పడింది.

కుశద్వీపానికి ప్రియవ్రతుని కొడుకైన హిరణ్యరేతసుడు అధిపతి. ఇతడు ఎంతో సంతోషంగా తన కొడుకుల పేర్లతో వర్షాల్ని విభజించి ఏర్పాటు చేశాడు.

వ. ఇట్లు హిరణ్యరేతుసుండు వసుదాన దృఢరుచి నాభి గుప్త సత్యవ్రత విప్ర వామదేవులను నామంబులు గల పుత్రుల నామంబుల సప్తవర్షంబులం గావించి యా కుమారుల నందు నిలిపి తాను దపంబునకుం జనియె; నా వర్షంబునందు బభ్రు చతుశ్శృంగ కపిల చిత్రకూట దేవానీకోర్ధ్వరోమ ద్రవిణంబులను నామంబులు గల సప్తగిరులును; రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు, మంత్రమాలయు నను సప్త మహానదులును గల; వా నదీ జలంబులఁ గృతమజ్జను లగుచు భగవంతుండగు యజ్ఞపురుషునిఁ గుశల కోవిదాభియుక్తకులక సంజ్ఞలు గల వర్షపురుషు లారాధించు చుందురు.

64

తా ॥ ఇలా హిరణ్యరేతసుడు వసుడు, వసుదానుడు, దృఢరుచి, నాభిగుప్తుడు, సత్యవ్రతుడు, విప్రుడు, వామదేవుడు – అనే తన ఏడుగురు కొడుకులకు వారి పేర్ల మీద

కుశద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించి పాలించుకోమని ఇచ్చాడు. పిమ్మట హిరణ్యరేతసుడు తపస్సుకు వెళ్ళాడు.

కు (ద్వీప) వర్షంలో బభ్రువు, చతుశ్శృంగం, కపిల, చిత్రకూటం, దేవానీకం, ఊర్ధ్వరోమం, ద్రవిణం – అనే ఏడు పర్వతాలు ఉన్నాయి.

రసకుల్య, మధుకుల్య, శ్రుతవింద, మిత్రవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల – అనే ఏడు మహానదులు ఉన్నాయి. ఈ నదీ జలాలలో పవిత్ర స్నానాలు చేసి యజ్ఞపురుషుణ్ణి కుశల, కోవిద, అభియుక్త, కులకులనే పేర్లు గల వర్షపురుషులు సేవిస్తూ ఉంటారు.

సీ. ఆ కుశద్వీపంబు నరికట్టుకొని యుండు, నెనిమిది లక్షల ఘనఘృతాబ్ధి
యా ఘృతసాగరం బవ్వల షోడశ, లక్షయోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప, ముర్వీశ యందు మ, ధ్యప్రదేశంబున నట్టి దీవి
పేరుగాఁ దన పేరఁ బెద్దగాఁ జేసిన, క్రౌంచాద్రి గల; దా నగంబు మున్ను

ఆ. షణ్ముఖుండు దివ్య శరమున ఘననితం, బంబు దూయ నేయఁ బాలవెల్లి
గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప, నందు మిగుల భయము నొందకుండె.



తా ॥ కుశద్వీపానికి చుట్టుకొని ఘృతసముద్రం ఉంది. దాని వైశాల్యం ఎనిమిది లక్షల యోజనాలు. దానికి అవతల పదహారు లక్షల యోజనాల విస్తీర్ణంతో క్రౌంచద్వీపం ఉంది. దాని మధ్యలో క్రౌంచం అనే ఒక పర్వతం ఉంది. దీని మూలంగానే ఆ ద్వీపానికి క్రౌంచ ద్వీపం అన్న పేరు ఏర్పడింది. ఈ ద్వీపంలోని చరియలనే పూర్వం షణ్ముఖుడు తన దివ్యమైన బాణాలతో పెకలించాడు. అయినా ఆ పర్వతం తనకు నలువైపుల ఉన్న క్షీరసముద్ర జలాలతో తడుపబడి, వరుణదేవుడి రక్షణను పొంది, అంతగా భయం లేకుండా ఉంది.

వ. నరేంద్రా! యా క్రౌంచద్వీపపతియగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నాపేళ్ళ గల యామోద మధు వహ మేఘపృష్ఠ సుదామ ఋషిజ్య లోహితార్ణ వనస్పతులను వర్షంబుల కభిషిక్తులం జేసి, పరమకల్యాణగుణ యుక్తుండయిన శ్రీహరి చరణారవిందంబుల సేవించుచుం దపంబునకుం జనియె, నా వర్షంబులయందు శుక్ల వర్ధమాన భోజనోపబర్హణానంద నందన సర్వతోభద్రంబులను సప్త సీమాపర్వతంబులును నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్థవతియు, దృప్తిరూపయుఁ బవిత్రవతియు, శుక్లయు నను సప్తనదులును గల, వందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞలు గలిగి వరుణ దేవుని నుదకాంజలులం బూజించుచున్న చాతుర్వర్ణ్యంబుండు. 66

తా ॥ రాజా! క్రౌంచ ద్వీపానికి అధిపతి ఘృతపృష్ఠుడు. (ఇతని తండ్రి ప్రియవ్రతుడే). ఇతడు తన కొడుకులైన ఆమోద, మధువహ, మేఘపృష్ఠ, సుధామ, ఋషిజ్య, లోహితార్ణ వనస్పతు – లనే వాళ్ళ పేర్లమీద వర్షాలను ఏర్పాటు చేసి, వాటికి వాళ్ళను వర్షాధిపతుల్నిగా అభిషేకం చేశాడు. అలా చేసి, పరమ కల్యాణగుణాలతో నెలకొని ఉన్న శ్రీహరి యొక్క పాదపద్మాలను సేవిస్తూ ఉండటం కోసం తపస్సుకు వెళ్ళిపోయాడు.

ఆ వర్షంలో (క్రౌంచద్వీపంలో) శుక్ల, వర్ధమాన, భోజన, ఉపబర్హణ, నంద, నందన, సర్వతోభద్రము– అనే పేర్లతో ఏడు పర్వతాలు; అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల – అనే పేర్లుగల ఏడు నదులు ఉన్నాయి. వీటి పవిత్రజలాలను సేవిస్తూ, ఆ వర్షంలోని జనులు గురు, ఋషభ, ద్రవిణ, దేవకు లనే పేర్లతో నాలుగు వర్ణాలుగా ఉండి, వరుణదేవుణ్ణి ఆ నదీ జలాలను దోసిళ్ళతో పట్టి ఆరాధిస్తూ ఉంటారు.

సీ. జగతీశ! వినుము క్రౌంచద్వీపమును జుట్టి, యుండు షోడశ లక్ష యోజనముల
విస్తారమై పాలవెల్లి, యందునను శా, కద్వీప మతుల ప్రకాశ మొందు,
దండిమై ముప్పది రెండు లక్షల యోజ, నముల విస్తారమై యమరి యుండు,

నందుల శాకవృక్షామోద మా ద్వీప, మును సుగంధంబునఁ బెనఁగఁ జేసి

తే. యంతఁ దనపేర దీవి ప్రఖ్యాత మగుటఁ, జేసి యందుల మిగులఁ బ్రసిద్ధి కెక్కె
నందు మేధాతిథియుఁ గర్త యగుచునుండెఁ, దవిలి వేడుకఁ దనదు నందనులఁజూచి.

67

తా ॥ రాజా! విను. క్రౌంచ ద్వీపాన్ని చుట్టుకొని పాల సముద్రం ఆవరించి ఉంది. దాని విస్తీర్ణం పదహారులక్షల యోజనాలు. దానిలో శాక ద్వీపం ఉంది. దీని కాంతికి సాటి వచ్చేది ఏదీ లేదు. ఇది ముప్పై రెండు లక్షల యోజనాల విస్తీర్ణంతో ఉంది. ఆ ప్రదేశమంతా శాక వృక్షం యొక్క సుగంధంతో నిండి ఉంటుంది. కనుక ఆ ద్వీపానికి శాకద్వీపం అను పేరు ప్రఖ్యాతమైంది. (ప్రియవ్రతుని కొడుకైన) మేధాతిథి ఈ శాక ద్వీపానికి అధిపతి. ఇతనికి ఏడుగురు కొడుకులు. ఒకనాడు ఎంతో సంతోషంతో వారందర్నీ పిలిపించి –

వ. మఱియు నా ప్రియవ్రతపుత్రుం డయిన మేధాతిథి దనపుత్రుల పేరం గల పురోజన మనోజన వేపమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వచారంబులను సంజ్ఞలు గల సప్తవర్షంబుల యందు వారలకుఁ బట్టంబు గట్టి శ్రీహరి పాదసేవ సేయుచుఁ దపోవనంబుకుఁ జనియె, నా శాకద్వీపంబునందు నీశానోరుశృంగ బలభద్ర శతకేసర సహస్రస్రోతో దేవపాల మహానస నామంబులు గల సీమాగిరులును, ననుఘాయుర్దోభయ సృష్ట్యపరాజిత పంచపదీ సహస్రసృతి నిజధృతులను సప్తనదులును గల, వా నదీ జలంబు లుపయోగించి యచ్చటి వారలు ప్రాణాయామంబు సేసి విధ్వస్తరజ స్తమోగుణులయి పరమ సమాధిని వాయురూపంబైన భగవంతుని సేవింతురు; ఋతవ్రత సత్యవ్రత దానవ్రత సువ్రత నామంబులుగల చాతుర్వర్ణ్యం బందుఁ గలిగి యుందు.

68

తా ॥ వారి పేర్లమీదనే వర్షాలను విభజించి పట్టం గట్టాడు. అవి – పురోజవ, మనోజవ, పవమాన, ధూమ్రానీక, చిత్రరథ, బహురూప, విశ్వాధారాలు. కొడుకులకు పట్టాభిషేకం చేశాక

మేధాతిథి శ్రీహరి పాదసేవ చేస్తూ తపోవనానికి వెళ్ళాడు.

రాజా! ఈ శాక ద్వీపానికి ఏడు సరిహద్దు పర్వతాలు ఉన్నాయి. అవి ఈశాన, ఉరుశృంగ, బలభద్ర, శతకేసర, సహస్ర స్రోత, దేవపాల, మహానసాలు. ఈ ద్వీపంలో అనఘ, ఆయుర్ద, ఉభయసృష్టి, అపరాజిత, పంచపది, సహస్రస్మృతి, నిజధృతి – అనే సప్త మహానదులు ఉన్నాయి. ఈ నదీజలాలలో అచ్చటి వారు ప్రాణాయామం చేస్తూ రజోగుణాన్ని, తమోగుణాన్ని పోగొట్టుకొని వాయురూపుడైన భగవంతుణ్ణి పరమసమాధిలో ఆరాధిస్తారు. అక్కడి జనులు ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, సువ్రతతులు – అని నాలుగు వర్ణాలుగా ఉంటారు.

సీ. అట్టి శాకద్వీప మరికట్టి తత్ప్రమా, ణంబున దధిసముద్రంబు వెలుఁగు,
నందుకు, బరివృతంబై పుష్కరద్వీప, మిలఁ జతుష్షష్టి లక్షల విశాల;
మ మ్మహాద్వీపమం దయుత కాంచన పత్త్ర, ములు గల్గి కమల గర్భునకు నాస
నంబగు పంకేరుహంబుండు, నా ద్వీప, మధ్యంబునను నొక్కమానసోత్త

ఆ. రం బనంగఁ బర్వతం; బుండుఁ దనకుఁ బూ, ర్వాపరముల నుండునట్టి వర్ష
ములకు రెంటి కిట్లు నిలిచిన మర్యాద, నగ మనంగఁ జాలఁ బొగడ నెగడు.



తా ॥ శాక ద్వీపాన్ని ఒరుసుకొంటూ చుట్టూ పెరుగు సముద్రం ఉంది. దానిలో పుష్కర ద్వీపం ఉంది. దీని విస్తీర్ణం అరవై నాలుగు లక్షల యోజనాలు. ఇది మహాద్వీపం. దీనిలో పదివేల బంగారు రేకులతో పద్మం ఉంది. ఇది బ్రహ్మదేవుడికి పీఠం. ఈ పుష్కర ద్వీపం మధ్యలో మానసోత్తరం అనే పర్వతం ఉంది. ఇది వర్షాల మధ్య సరిహద్దు గిరిలా ఉంటుంది. ఎంతో కీర్తనీయమైన పర్వతమిది.

వ. ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబునుంబోలె నున్న మానసోత్తర పర్వతం బయుత యోజన విస్తారంబును, నంతియ యౌన్నత్యంబును గలిగి

యుండు, నా నగంబునకు నలుదిక్కులయందు నాలుగు లోకపాలుర పురంబులుండు, నా మానసోత్తర పర్వతంబు తుద సూర్యరథ చక్రంబు సంవత్సరాత్మకంబయి యహోరాత్రంబులయందు మేరు ప్రదక్షిణంబు సేయు, నందు నా పుష్కరద్వీపాధిపతి యగు వీతిహోత్రుండు రమణక ధాతకనామంబులు గల పుత్రుల నిరువుర వర్షద్వయంబు నభిషిక్తులం జేసి తాను బూర్వజు లేగిన తెఱంగున భగవత్కర్మశీలుం డగుచుఁ దపంబునకుం జనియె; నంత.

70

తా ॥ తనకు లోపలా వెలుపలా ఉన్న వర్షాలకు మధ్యలో సరిహద్దు కొండలా ఉన్న ఈ మానసోత్తర పర్వతం యొక్క ఎత్తు పదివేల యోజనాలు. వైశాల్యమూ అంతే. దీనికి చుట్టు నాలుగు పురాలున్నాయి. అవి (ఇంద్ర, అగ్ని, వరుణ, కుబేరుల) లోకపాలుర పురాలు. ఈ పర్వతానికి పైన సంవత్సరాత్మకమై సూర్యరథ చక్రం మేరు ప్రదక్షిణం చేస్తూ ఉంటుంది. అది ఒకసారి ప్రదక్షిణం చేసే కాలమే అహోరాత్రం అనబడుతుంది.

(ప్రియవ్రతుని కొడుకైన) వీతిహోత్రుడు ఈ పుష్కర ద్వీపానికి అధిపతి. ఇతనికిద్దరు కొడుకులు. వాళ్ళ పేర్ల మీదుగానే రెండు వర్షాలుగా – రమణక, ధాతక పేర్లతో – విభజించి వాళ్ళకు అభిషేకం చేశాడు. తరువాత గతంలో వారి మార్గాన్నే అనుసరించి భగవంతుని సేవకోసం తపస్సుకు వెళ్ళిపోయాడు.

క. మనుజేశ్వర! యా వర్షం, బున నప్పుడు సంచరించు పురుషులు పద్మా
సను దగ సకర్మకారా, ధన సేయుదు రచల బుద్ధి తాత్పర్యమునన్.

71

తా ॥ రాజా! పుష్కర ద్వీపంలోని ప్రజలు వేదోక్త కర్మలతో, సుస్థిరమైన బుద్ధిపెట్టి, తత్పరత కలిగి, ఎప్పుడూ పద్మాసనుడైన చతుర్ముఖుణ్ణి ఆరాధిస్తూ ఉంటారు.

క. ధరణీవల్లభ! విను పు, ష్కర మను ద్వీపమున లేరు చాతుర్వర్ణ్యల్
పరగఁగ భేదము లేకే, సరసత సము లగుదు రందు సకల జనంబుల్.

72

తా ॥ ఈ ద్వీపజనులు నాలుగు వర్ణాల వారు. వాళ్ళలో వాళ్ళకు ఎక్కువ తక్కువలేమీ తెలియవు. ఎల్ల జనులూ సమానత్వంతో కలిసి మెలిసి మెలిగేవారు.

వ. మఱియు పుష్కరద్వీపంబు చతుష్షష్టి లక్షయోజన విస్తారంబైన శుద్ధోదక సముద్రముద్రితం బగుచుండు, నవ్వల లోకాలోక పర్వతంబుండు, శుద్ధోదక సముద్ర లోకాలోకపర్వతంబుల నడుమ రెండుకోట్ల యోజన విస్తారంబయిన నిర్జన భూమిదర్పణోదర సమానంబై దేవతావాస యోగ్యంబుగా నుండు, నా భూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగ నుండు; నట మీఁద లోకాలోకపర్వతం బెనిమిది కోట్ల యోజనంబులు సువర్ణభూమియు సూర్యాది ధ్రువాంతంబు లగు జ్యోతిర్గణంబులు మధ్యంబున నుండుటం జేసి లోకాలోక పర్వతం బనందగి యుండు; బంచాశత్కోటి యోజన విస్తృతంబగు భూమండల మానంబునకుఁ దురీయాంశ ప్రమాణంబు గల యా లోకాలోకపర్వతంబు మీఁద నఖిల జగద్గురువగు బ్రహ్మచేతఁ జతుర్దిశలయందు ఋషభ పుష్కర చూడ వామ నాపరాజిత సంజ్ఞలు గల దిగ్గజంబులు నాలుగును లోకరక్షణార్థంబు నిర్మితంబై యుండు; మఱియును.

73

తా ॥ ఇప్పటిదాకా శుద్ధోదక సముద్రం వరకు ఉండే సప్తద్వీపరూపంగా ఉన్న భూమండల వర్ణనం జరిగింది.

పుష్కర ద్వీపాన్ని చుట్టుకొని అరవైనాలుగు లక్షల యోజనాల విస్తీర్ణంతో శుద్ధోదక సముద్రం ఉంది. ఈ సముద్రానికి అవతల లోకాలోకం అనే పర్వతం ఉంది.

ఇది వెలుగుకు, చీకటికి మధ్యలో ఉండటం వల్ల దీనికి లోకాలోకం అనే పేరు వచ్చింది.

శుద్ధోదక సముద్రానికి, లోకాలోక పర్వతానికి మధ్యలో ఎనిమిది కోట్ల ముప్పైతొమ్మిది లక్షల యోజనాలకు విస్తరించి ఒక ప్రదేశం ఉంది (అది బంగారు రంగులో అద్దంలా ఉంటుంది. దేవతలు ఉండటానికి వీలుగా ఉంటుంది). అక్కడ నేలమీద పెట్టిన ఏ వస్తువైనా తిరిగి తీసుకోవడం కుదరని పని.

అది నున్నగా ఉండడం వల్ల ప్రతిదీ జారిపోతుంది. ఏదీ నిలబడదు, కనబడదు. కనుక అక్కడ ఏ జంతువూ నిలవలేదు.

అక్కడి నుంచి లోకాలోక పర్వతం ఎనిమిది కోట్ల యోజనాలు.

సూర్యుడు మొదలుకొని ధ్రువుని వరకు ఉండే జ్యోతిర్మండలం యొక్క కిరణాలకు (లోకాలకు) సరిహద్దుగా ఉన్నందున, ఆ తర్వాత మొత్తం అలోకం (చీకటి) ఉన్నందున దానికి లోకాలోక పర్వతమని పేరు వచ్చింది.

భూమండలం మొత్తం (సప్త ద్వీపాలతో కూడి ఉన్న మొత్తం భూమండలం) యాభై కోట్ల యోజనాల విస్తీర్ణం కలది. దానిలో నాల్గవ వంతు లోకాలోక పర్వతం యొక్క ప్రమాణం ఉంది. దీనిలో సకల జగద్గురువైన బ్రహ్మ అంతర్యామియై ఉంటాడు. బ్రహ్మదేవుడు ఋషభం, పుష్కరచూడం, వామనం, అపరాజితం – అనే పేర్లు గల నాలుగు దిగ్గజాలను లోకాలను రక్షించడానికి నిలిపి ఉంచాడు.

సీ. తనదు విభూతులై తనరిన యా దేవ, బృందతేజశ్శౌర్య బృంహణార్థ
మై భగవంతుండు నాదిదేవుండును, నైన జగద్గురుం డచ్యుతుండు
సరిలేని ధర్మవిజ్ఞాన వైరాగ్యాదు, లయిన విభూతుల నలరి యున్న
యట్టి విష్వక్సేనుఁ డాదిగాఁ గలుగు పా, ర్షదులతోఁ గూడి ప్రశస్తమైన

గీ. నిజవరాయుధ దోర్దండ నిత్య సత్త్వు, డగుచు నా పర్వతంబుపై నఖీల లోక రక్షణార్థంబు కల్పపర్యంత మతఁడు, యోగమాయా పరీతుఁడై యొప్పుచుండు.

74

తా ॥ భగవంతుడు, ఆదిదేవుడు, జగద్గురువు అయిన ఆ అచ్యుతునకు దేవతల సమూహం, తేజస్సు, శౌర్యమూ విభూతులు, సాటిలేని ధర్మం, విజ్ఞానం, వైరాగ్యం మున్నగు విభూతులతో ప్రకాశించే విష్వక్సేనాదులతో కూడి ఉన్నవాడై, తన ఆయుధాలైన చక్రాదులతో ప్రకాశిస్తున్న భుజాలు కలవాడై, నిత్య సత్త్వరూపుడై ఉన్న భగవంతుడు సకల లోకాల్ని రక్షించడానికి లోకాలోక పర్వతం మీద కల్పాంతం వరకు వేంచేసి ఉంటాడు.

“ఆకల్పమేష ఏవం గతో భగవా నాత్మయోగమాయా విరచిత వివిధ లోకయాత్రా – గోపీథాయే త్యర్థః” – అని మూలం.

వివిధాలైన ఈ లోకయాత్రలన్నీ భగవంతుడి చిచ్ఛక్తిస్వరూపిణి యైన యోగమాయచే విరచితాలే.

వ. ఇట్లు వివిధమంత్ర గోపనార్థం బా నగాగ్రంబున నున్న భగవంతుండు దక్క లోకాలోక పర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యంబయి యుండు; బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్యగతుండై యుండ; నా సూర్యునకు నుభయ పక్షంబుల యందు నిరువదేనుకోట్ల యోజనపరిమాణంబున నండకటాహం బుండు; నట్టి సూర్యుని చేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణయింపంబడు; దేవతిర్య ఙ్మనుష్య నాగ పక్షి తృణగుల్మలతాది సర్వజీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు.

75

తా ॥ ఇలా అనేక మంత్రరహస్యాలతో ఆ లోకాలోక పర్వత శిఖరంపై ఉన్న భగవంతుడికి తప్ప ఆ పర్వతానికి ఆవల వైపు ఇతరులెవ్వరికీ సంచరించడానికి వీలుపడదు.

సూర్యుడు బ్రహ్మాండ మధ్యమందు ఉన్నాడు. సూర్యుడి నుంచి అండగోళం యొక్క అంచులు రెండింటికి ఇరవై అయిదు కోట్ల యోజనాల మేర ఉంది. ఇలా ఉన్న సూర్యుడి వల్లనే దిక్కులు, స్వర్గం, మోక్షం, నరకం మొదలైనవన్నీ ఏర్పడుతున్నాయి. దేవతలకు, ప్రాకెడు జంతువులకు, మనుష్యులకు, నాగులకు, పక్షులకు, గడ్డికి, లతలకు, పొదలకు, భూమి నుంచి మొలిచే సర్వ జీవసమూహానికీ సూర్యుడే ఆత్మగా ఉన్నాడు.

క. కరమనురాగంబున నీ, ధరణీమండలము సంవిధానం బెల్లన్
నరవర! యెఱుఁగం జెప్పితి, మఱి చెప్పెద వినుము దివ్యమాన మ్మెల్లన్.

76

తా ॥ ఓ రాజా! నీ మీద ఉన్న ఎంతో అనురాగం కొద్దీ ఇప్పటి దాకా నీకు ఈ భూమండల వ్యవస్థను గూర్చి సమగ్రంగా తెలియచెప్పాను. స్వర్గలోకపు దివ్యమానాన్ని గురించి ఇకపై చెబుతాను, విను.

# 4. ఖగోళ విషయ విస్తారము

ఆ. కమలజాండ మధ్యగతుఁడైన సూర్యుండు, భరితమైన యాతపంబుచేత
మూఁడు లోకములను ముంచి తపింపంగఁ, జేసి కాంతి నొందఁ జేయుచుండు.

77

తా ॥ బ్రహ్మాండమధ్యంలో ఉన్న సూర్యుడు ముల్లోకాలను తన తేజస్సుతో నింపి తపింపచేస్తూ, కాంతిమంతం చేస్తూ ఉన్నాడు.

వ. అట్టి భాస్కరుం డుత్తరాయణ దక్షిణాయన విషువులను నామంబులు గల మాంద్య తీవ్ర సమానగతుల నారోహణావరోహణ స్థానంబుల యందు దీర్ఘ హ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు.

78

తా ॥ ఈ సూర్యుడికి ఏడాది నడకలో ఉత్తరాయణం, దక్షిణాయనం, విషువం – అనే మూడు గమనాలున్నాయి. ఉత్తరాయణంలో మీదికి వెళ్తాడు. దక్షిణాయనంలో క్రిందికి వెళ్తాడు. ఉత్తరాయణంలో మెల్లగా నడుస్తాడు. కనుక పగళ్ళు ఎక్కువ, రాత్రుళ్ళు తక్కువగా ఉంటాయి. దక్షిణాయనంలో వేగంగా నడుస్తాడు కనుక పగళ్ళు తక్కువ, రాత్రుళ్ళు పొడవుగా ఉంటాయి. విషువంలో సమానం. రాత్రింబగళ్ళ ఎక్కువ తక్కువలు ఉండవు.

ఆ. మేషతులలయందు మిహిరుం డహోరాత్రు, లందుఁ దిరుగు సమవిహారములను
బరఁగఁగ వృషభాది పంచ రాసులను, నొక్కొక్క గడియ రాత్రి దక్కి నడుచు.

79

తా ॥ సూర్యుడు మేషరాశిలోను, తులారాశిలోను ప్రవేశించినపుడు పగలు, రాత్రి సమానంగా ఉంటాయి. మేషంలోకి వచ్చినప్పటి మర్నాటి నుంచి రోజురోజుకు పగలెక్కువ, రాత్రి

తక్కువ అవుతూ ఉంటుంది. సూర్యుడు వృషభం, మిథునం, కర్కాటకం, సింహం, కన్య – ఈ రాశులలో ప్రవేశించేటప్పుడు నెలకు ఒక్కొక్క ఘడియ పగటి పూట పెరుగుదల, రాత్రి పూట తరుగుదల ఉంటాయి.

ఆ. మించి వృశ్చికాది పంచరాసులను నొ, క్కొక్క గడియ రాత్రి నిక్కి నడుచు
దివములందు నెల్ల దిగజాఱు నొక్కొక్క, గడియ నెలకుఁ దత్ప్రకారమునను.

80

తా ॥ సూర్యుడు వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం – ఈ రాశుల్లోకి ప్రవేశించినప్పుడు నెలకు ఒక్కొక్క ఘడియ పగటి పూటలో తరుగుదల, రాత్రి పూటలో పెరుగుదల ఉంటాయి.

వ. మఱియు ని వ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద నొక్క యహోరాత్రంబున నేకపంచాశదుత్తర నవ కోటియోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబునందుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును, దక్షిణంబున సంయమని యను యమనగరంబును, బశ్చిమంబున నిమ్లోచని యను వరుణ పట్టణంబును, నుత్తరంబున విభావరి యను సోముని పుటభేదనంబును దేజరిల్లుచుండు; నా పట్టణంబుల యందు నుదయ మధ్యాహ్న సమయ నిశీథంబు లనియెడు కాలభేదంబులను భూతప్రవృత్తి నివృత్తి నిమిత్తం బచ్చటి జనులకుఁ బుట్టించుచుండు, సుర్యుం డెపుడింద్ర నగరంబున నుండి గమనించు నది యాదిగాఁ బదియేను గడియలను రెండుకోట్ల ముప్పదియేడు లక్షల డెబ్బదియైదువేల యోజనంబులు నడుచు, ని వ్విధంబున నింద్ర యమ వరుణ సోమపురంబుల మీఁదఁ జంద్రాది గ్రహ నక్షత్రంబులగూడి సంచరించుచుఁ బండ్రెండంచులు, నాఱు కమ్ములును, మూడు దొలులుం గలిగి సంవత్సరాత్మకంబయి యేకచక్రం బయిన సూర్యుని రథంబు ముహూర్తమాత్రంబున ముప్పది నాలుగు లక్షలు నెనమన్నూఱు యోజనంబులు సంచరించు.

తా ॥ దినములు, ఉత్తరాయణం, దక్షిణాయనం, పెరగడం, తరగడం ఇలా ఏర్పడుతున్నాయి. సూర్యుడు తన రథంలో మానసోత్తర పర్వతం చుట్టు తిరగడానికి ఒక పగలు, ఒక రాత్రి పూర్తవుతాయి. ఆ పర్వతం యొక్క చుట్టుకొలత తొమ్మిది కోట్ల ఏభై ఒక్క లక్షల యోజనాలు.

ఈ మానసోత్తర పర్వతానికి తూర్పు దిక్కున ఇంద్రుడి పట్టణం ఉంది. దానిపేరు దేవధాని. దక్షిణ దిక్కున యముడి పట్టణం ఉంది. దాని పేరు సంయమని. పడమటి వైపు వరుణుడి పట్టణం ఉంది. దానిపేరు నిమ్లోచని. ఉత్తరం వైపు చంద్రుడి పట్టణం ఉంది, దానిపేరు విభావరి.

(జ్యోతిశ్చక్రం భ్రమించడం వల్ల) భూమి యందు సూర్యుడు కన్పించటం ఉదయం, ఆకాశంలో కన్పించటం మధ్యాహ్నం, భూమిలోకి చొచ్చినట్లు కన్పించటం అస్తమయం, దూరంగా ఉండటం రాత్రి. ఈ ఉదయాస్తమయాదులు జీవుల ప్రవృత్తి నివృత్తులకు హేతువులై ఉన్నాయి.

సూర్యుడు ఇంద్రపురం నుంచి యమపురానికి వెళ్ళేటపుడు పదిహేను గడియల్లో రెండు కోట్ల ముప్పై ఏడు లక్షల డెబ్బై అయిదువేల (2, 37, 75, 000) యోజనాల దూరం దాటి వెళ్తాడు. యమపురి నుంచి వరుణపురి, అట్నుంచి సోమపురి ఇదే లెక్క. ఇలా చంద్రగ్రహనక్షత్రాదులతో కూడి తిరుగుతూ ఉన్న సూర్యుడి రథ చక్రానికి పన్నెండు అంచులు, ఆఱు కమ్ములు, మూడు నాభులు ఉంటాయి. ఆ చక్రానికి సంవత్సరం అని పేరు. సూర్యుడి రథానికి ఒకటే చక్రం. ఈ ఏకచక్రరథం ఒక్క ముహూర్తకాలంలో ముప్పై నాలుగు లక్షల ఎనిమిది వేల యోజనాల మేర సంచరిస్తుంది.

సీ. ఇనురథంబున నున్న యిరుసొక్కటియ మేరు, శిఖరంబునందును జేరి యుండు;

నొనరఁ జక్రము మానసోత్తర పర్వతం, బందులఁ దిరిగెడు నా రథంబు
నిరుసున నున్న రెం డిరుసులు దగులంగఁ, బవన పాశంబుల బద్ధ మగుచు
ధ్రువమండలంబునందుల నంటి యుండఁగా, సంచరించుచు నుండు సంతతంబు;

గీ. నట్టి యరదంబు ముప్పది యాఱులక్ష, లందు నంటిన కాఁడియు నన్ని యోజ
నముల విస్తారమై తురంగముల కంధ, రములఁ దగులుచు వెలుఁగొందు రమణతోడ.

82

తా ॥ సూర్యుడి రథానికి ఉన్న ఇరుసు మేరుశిఖరం మొదలు మానసోత్తర పర్వతం వరకు వ్యాపించి ఉంటుంది. (దీని పొడవు ఒక కోటి యాభై ఏడు లక్షల యాభైవేల యోజనాలు.) ఈ ఇరుసుకు చక్రం అమర్చబడి, (గానుగ చక్రంలా) మానసోత్తర పర్వతం పైన సూర్యరథం తిరుగుతుంటుంది. ఇరుసొకటి ఉత్తర ధ్రువం పై వరకు, ఇంకోటి దక్షిణ ధ్రువం క్రింది దాకా ఉంటుంది. ఈ ఇరుసులు రెండింటిపై ఈ చక్రం ధ్రువాల యందు బిగింపబడి ఉంటుంది. భూ పరిభ్రమణం వల్ల ఉత్తర – దక్షిణ ధ్రువాలలో గాలి సుడిగుండా లేర్పడతాయి. అవే త్రాళ్ళుగా ఆ త్రాళ్ళతో ఇరుసులు ధ్రువాలకు బిగింపబడి ఉంటాయి. ఆ రథంలో సారథి కూర్చోవడానికి అనువైన చోటు ముప్పైఆరు లక్షల యోజనాలు పొడవు, తొమ్మిది లక్షల యోజనాల వెడల్పు కలిగినది. ఆ రథానికి కాడి సయితం అదే ముప్పై ఆరు లక్షల యోజనాల విస్తృతి కలిగి ఉంటుంది. ఆ కాడి గుర్రాల మెడలపై ప్రకాశిస్తూ ఉంటుంది.

వ. ఆ రథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు, భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు నియుక్తుండై రథంబు గడపుచుండు; వెండియు నంగుష్ఠపర్వమాత్ర శరీరంబులు గల యఱువదివేల వాలఖిల్యాఖ్యులగు ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింప, మఱియు ననేక మునులును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును నెలనెల వరుసక్రమంబున సేవింపం దొమ్మిదికోట్లు నే బదియొక లక్షయోజనంబుల పరిమాణంబు గల భూమండలంబునందొక

క్షణంబున సూర్యుండు రెండువేల యేబది యోజనంబులు సంచరించుచు, నొక యహోరాత్రంబునందె యీ భూమండలం బంతయు సంచరించు, ననిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

83

తా ॥ ఈ సూర్యరథానికి గాయత్రి మొదలైన ఏడు ఛందస్సులు గుర్రాలై ఉంటాయి. సూర్యుడికి ముందు అరుణుడు రథసారథిగా నియమింపబడి ఉంటాడు. వాలఖీల్యుడు మొదలైన అరవై వేల మంది ఋషిశ్రేష్ఠులు సూర్యుని ముందర సౌరసూక్తాన్ని స్తుతిస్తూ ఉంటారు. ఈ ఋషులు బొటన వ్రేలులో పై భాగం ఎంత ఉంటుందో అంత శరీరం కలవారై ఉంటారు. ఇంకా ఎందరో మునులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, నాగులు, అప్సరలు, పతంగులు మొదలైన వారంతా నెలనెల వరుసక్రమంలో సూర్యుణ్ణి సేవిస్తూ ఉంటారు. ఇంతమంది తనను సేవిస్తూ ఉండగా సూర్యుడు తొంభై కోట్ల ఏభై ఒక్క లక్షల యోజనాల పరిమాణం ఉన్న భూమండలాన్ని అంతటిని ఒక్క పగలు, రాత్రిలో సంచరించి వస్తూ ఉంటాడు. (ఒక్క క్షణానికి రెండు వేల రెండు యోజనాలు సంచరిస్తాడు)" – అని చెప్పాడు శుకమహర్షి.

వినిన పరీక్షిత్తు ఇలా అన్నాడు:

ఏడు ఛందస్సులు : 1) గాయత్రి 2) ఉష్ణిక్ 3) త్రిష్టుప్ 4) అనుష్టుప్ 5) జగతి 6) పంక్తి 7) బృహతి.

క. మునివర! మేరుధ్రువులకు, నొనరఁ బ్రదక్షిణము దిరుగుచుండెడు నజుఁ డా
యినుఁ డభిముఖుఁడై రాసుల, కనుకూలత నేగునంటి; వది యెట్లొప్పున్?

84

తా ॥ "మునివరా! మేరువుకు, ధ్రువానికి సూర్యుడు ప్రదక్షిణం చేస్తాడని చెప్పావు. మళ్ళీ రాశిచక్రం మీదను సంచరిస్తాడని అన్నావు. ఇదెలా కుదురుతుంది?"

ఉత్తర ధ్రువం ఉండేది ఉత్తర దిశలో. రాశి చక్రం ఉండేది భూమధ్య రేఖ మీద. ఉత్తర ధ్రువానికి ప్రదక్షిణం, రాశి చక్రం మీద సంచరించడం ఏక కాలంలో ఎలా? అన్నది పరీక్షిత్తునకు వచ్చిన సందేహం.

క. అని పలికిన భూవరునిం, గనుఁగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁడై
మనమున శ్రీహరిఁ దలఁచుచు, విను మని క్రమ్మఱఁగ నిట్లు వినిపించెఁ దగన్.

85

శుకయోగి పరీక్షిత్తు యొక్క సందేహాన్ని తెలుసుకొన్నాడు. మిక్కిలి కరుణతో రాజువైపు చూశాడు. మనస్సులో శ్రీహరిని తలచుకొన్నాడు. "విను" అని వెంటనే ఇలా అన్నాడు:

సకలమూ భగవత్సృష్టి విలాసం. ఆ సృష్టిలోని కొన్ని విషయాలను శుకయోగి చెబుతున్నాడు. దానిపై శ్రోతకు వచ్చే సందేహాలను తీర్చగలిగినవాడు సర్వేశ్వరుడే. అందుకే యోగీంద్రుడు పరమేశ్వరుణ్ణి మనస్సులో ధ్యానించాడు.

శ్రోత సందేహాలకు వక్త విసుక్కోవడం, చిరాకుపడడం మన సంప్రదాయం కాదు. అందువల్లనే "మిగులఁ గరుణాన్వితుఁడై" అన్నాడు కవి.

వ. నరేంద్రా! యతివేగంబునం దిరుగుచుండు కులాల చక్రంబునందుఁ జక్రభ్రమణంబునకు వేఱైన గతి నొంది బంతిసాగి తిరిగెడు పిపీలికాదుల చందంబున నక్షత్రరాసులతోడం గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగునపు డా కాలచక్రంబు వెంట సంచరించు సూర్యాదిగ్రహంబులకు నక్షత్రాంతరంబులయందును రాశ్యంతరంబులయందును నునికి గలుగుటం జేసి సూర్యాది గ్రహంబులకుఁ జక్రగతి స్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు; మఱియు నా సూర్యుండాదినారాయణమూర్తి యగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబై కర్మసిద్ధి నిమిత్తంబై దేవర్షి గణంబులచే వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమానం బగుచున్న తన

స్వరూపంబును ద్వాదశ విధంబులుగ విభజించి వసంతాది ఋతువుల నా యా కాలవిశేషంబులయందుఁ గలుగఁ జేయుచుండు; నట్టి పరమపురుషుని మహిమ నీ లోకంబున మహాత్ములగు పురుషులు దమ తమ వర్ణాశ్రమాచారంబుల చొప్పున వేదోక్త ప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబు నొందుచుందు; రట్టి యాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయతేజః పుంజదీపితాఖిల జ్యోతిర్గణంబులు గలవాఁడై ద్వాదశరాసులయందు నొక సంవత్సరంబున సంచరించుచుండు; నట్టి యాదిపురుషుని గమన విశేషకాలంబును లోకు లయన ఋతు మాస పక్ష తిథ్యాదులచే వ్యవహరించు చుందురు; మఱియు నప్పరమ పురుషుం డా రాసులయందు షష్ఠాంశ సంచారంబు నొందిన సమయంబును ఋతువని వ్యవహరింపుదు; రా రాసులయందు నర్ధాంశ సంచారమ్మున రాశిషట్క భోగం బొందిన తఱి యయనం బని చెప్పుదురు; సమగ్రంబుగా రాసుల యందు సంచార మొందినయెడల నట్టి కాలంబును సంవత్సరం బని నిర్ణయింపుదు; రిట్టి సమగ్రరాశి సంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతు లనియెడు త్రివిధగతి విశేషంబుల వలన వేఱుపడెడు నా వత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బనువత్సరం బిద్వత్సరంబని బంచవిధంబులఁ జెప్పుదురు, చంద్రుండు నీ తెఱంగున నా సూర్యమండలంబు మీఁద లక్షయోజనంబుల నుండి సంవత్సర పక్ష రాశి నక్షత్ర భుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించునంత వృద్ధిక్షయ రూపంబునం బితృగణంబులకుఁ బూర్వపక్షాపరపక్షంబులచే నహోరాత్రంబుఁ గలుగఁ జేయుచు సకల జీవ ప్రాణంబై యొక్క నక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశ కళలు గలిగి మనోమయాన్నమ యామృతమయ దేహుండై దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయన శీలుం డగుటం జేసి సర్వసముం డనంబడు.

86

తా ॥ “రాజా! కుమ్మరి చక్రాన్ని తిప్పేటప్పుడు ఆ చక్రభ్రమణానికి ఒక వేగం ఉంటుంది.

ఆ చక్రం మీద చీమల బారు ముందుకు ప్రాకుతోందనుకొంటే ఆ చీమలకు తమంత తాము కదులుతున్న వేగం ఒకటి, చక్రం యొక్క వేగం ఒకటి – ఇలా రెండు వేగాలు ఒకేసారి చీమలకు ఉంటాయి. ఇలాగే నక్షత్రాలతో, రాశులతో కూడిన కాలచక్రం ధ్రువానికి మేరువుకు ప్రదక్షిణం చేసేటప్పుడు ఆ కాలచక్రం వెంట సంచరించే సూర్యాది గ్రహాలకు నక్షత్రాలలోను, రాశులలోను ఉనికి ఉండటం వల్ల చక్రగతి వల్ల, వాటంతట వాటికి ఉన్న గతుల వల్ల రెండు గతులు ఉంటూ ఉంటాయి. ఆదిపురుషుడైన భగవానుడు నారాయణుడే లోకాలకు యోగక్షేమాల్ని కూర్చడానికై సూర్యుని రూపంలో మనకు దర్శనమిస్తున్నాడు.

ఆ సూర్యుడు మూడు వేదముల యొక్క స్వరూపం. కర్మల్ని సిద్ధింపచెయ్యడం కోసం నారాయణుడు సూర్యునిగా ప్రకాశిస్తున్నాడు. దేవతల చేత, మహర్షుల చేత ఉపనిషత్తులలో నిరంతరమూ తర్కింపబడుతూ ఉండే స్వరూపం భగవంతుడు. పరమపురుషుడు తననే పన్నెండు విధాలుగా విభజించుకొని వసంతం మొదలైన ఆరు ఋతువులను ఆయా కాలాలలో జరిగే విశేషాల్ని బట్టి ఏర్పాటు చేశాడు.

అతడు పరమ పురుషుడు. అతని మహిమను ఈ లోకంలో మహాత్ములైనవారు వారి వారి వర్ణాశ్రమ ఆచారాలను బట్టి వేదం చెప్పినట్టు మిక్కిలి భక్తితో ఆరాధిస్తూ శుభాల్ని పొందుతూ ఉంటారు. అతడు ఆదినారాయణ మూర్తి. జ్యోతిశ్చక్రం లోపల ప్రవర్తిస్తూ తనదైన తేజస్సుతో సకల జ్యోతిర్గణాలను దీపింపచేస్తున్నాడు. మేషాది పన్నెండు రాశులలోను ఒక్కో మాసం వంతున ఒక సంవత్సరం సంచరిస్తాడు.

ఆదిపురుషుడైన సూర్యనారాయణ మూర్తి యొక్క గమనంలోని విశేషమైన కాలాన్ని లోకులు అయనాలుగా, ఋతువులుగా, మాసాలుగా, పక్షాలుగా, తిథులుగా వ్యవహరిస్తారు. ఆ పరమ పురుషుడు రాశులలో ఆరవ అంశం సంచారం పొందినప్పుడు (అంటే సంవత్సరంలో ఆరవ వంతు – రెండు మాసాల కాలం – సూర్యుడు సంచరిస్తే) దానిని ఋతువని అంటారు. (కాలచక్రంలో సూర్యుడు సగభాగం – అంటే ఆరు రాశులలో సంచరించే కాలం అయనం.)

పూర్తిగా పన్నెండు రాశులలో సూర్యుడు సంచరించిన కాలం ఒక సంవత్సరం. ఈ సమగ్ర సంచారంలో శీఘ్రగతి, మందగతి, సమగతి అని మూడు గతి విశేషాలున్నాయి. ఈ గతి విశేషాల వల్ల తేడా కనిపించే సంవత్సరాన్ని సంవత్సరం, పరివత్సరం, ఇళావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం – అని అయిదు విధాలుగా చెబుతారు.

చంద్రుడు సూర్యకిరణాల కంటే లక్షయోజనాలపైగా శీఘ్రంగా సంచరిస్తాడు. పక్షం, రాశి, నక్షత్రం – వీటి శేషాన్ని గ్రహిస్తూ ముందుకు సంచరిస్తూ చంద్రుడు పెరుగుతూ, తరుగుతూ ఉంటాడు. శుక్లపక్షంలో వృద్ధి పొందుతున్న కళలచే, కృష్ణపక్షంలో క్షీణిస్తున్న కళలచే చంద్రుడు పితృదేవతలకు పగటిని, రాత్రిని కలుగచేస్తున్నాడు.

సకల జీవులకు ప్రాణకారకుడు చంద్రుడు. అతడు ఒక నక్షత్రంలో ముప్పై ఘడియలు ఉంటాడు. పదహారు కళలతో ఉంటాడు. అతడు మనఃకారకుడు, అన్నస్వరూపుడు, అమృతమయుడు. దేవతలకు, పితృదేవతలకు, మనుష్యులకు, భూతాలకు, పశువులకు, పక్షులకు, ప్రాకెడు ప్రాణులకు, అన్ని చెట్లకు, లతలకు, సమస్త జీవరాశి ప్రాణాలకు తృప్తిని కలిగిస్తాడు. కనుక చంద్రుణ్ణి "సర్వసముడు" అన్నారు.

క. చందురునకు మీఁదై యా, నందంబున లక్షయోజనంబులఁ దారల్
గ్రందుకొని మేరుశైలం, బంది ప్రదక్షిణము దిరుగు నభిజిద్భముతోన్.



తా ॥ చంద్రుడికి పైన లక్ష యోజనాల ఎత్తులో తారకలు గుమిగూడి మేరుశైలానికి ప్రదక్షిణంగా తిరిగి వస్తూ ఉంటాయి. అభిజిత్తు అనే నక్షత్రం కూడా ఈ తారా చక్రంలో ఉండి తిరుగుతూ ఉంటుంది.

అశ్విని నుంచి రేవతి వరకు ఇరవై ఏడు నక్షత్రాలే మనకు తెలుసు. ఉత్తరాషాఢ – శ్రవణా నక్షత్రాల మధ్యలో అభిజిత్తు అనే నక్షత్రం ఒకటి ఉంది. దీనితో కలిపి నక్షత్రాలు ఇరవై ఎనిమిది.

సీ. అట మీఁదఁ దారల కన్నిటి కుపరియై, రెండు లక్షల శుక్రుఁడుండి భాస్క
రుని ముందఱం బిఱుందను సామ్యమృదు శీఘ్ర, సంచారములును భాస్కరుని మాడ్కిఁ
జరియించుచుండును జనులకు ననుకూలుఁ, డై వృష్టి నొసఁగుచు నంతనంతఁ
జతురత వృష్టి విష్కంభక గ్రహశాంతి, నొనరించువారల కొసఁగు శుభము

తే. లుండు నామీఁద సౌమ్యుండు రెండు లక్ష, లను జరించుచు రవిమండలంబుఁ బాసి
కానఁబడినను జనులకు క్షామ డాంబ, రాది భయములఁ బుట్టించు నతుల మహిమ.

88

తా ॥ ఆపై తారలన్నింటికి రెండు లక్షల యోజనాల పైన శుక్రుడు ఉంటాడు. శుక్రుడు సూర్యుడు ఉండే రాశికి ముందు రాశిలో గాని, వెనుక రాశిలో గాని, అతడితో సమంగా గాని సంచరిస్తూ ఉంటాడు. జనులకు అనుకూలుడై వర్షాన్ని ఇచ్చేవాడు శుక్రుడు. వర్షానికి ఆటంకం ఏర్పరచే శక్తుల్ని తొలగించి శుభాలనిస్తాడు. అటుపై, రెండు లక్షల యోజనాల పైన బుధుడు చరిస్తున్నాడు. బుధుడెప్పుడు సూర్యుడికి దగ్గరగానే ఉంటాడు కనుక కనపడడు. సూర్యుడితో దూరమెక్కువై ఎప్పుడైనా బుధుడు మన కంటికి కనిపిస్తే అతని సాటిలేని మహిమ వల్ల ప్రజలకు పెనుగాలులు, క్షామం, దోపిడీలు మొదలైన భయాలు కలుగుతాయి. బుధుడు చంద్రుడి కొడుకు.

సీ. ధరణీతనూజుఁ డంతటిమీఁద రెండు ల, క్షల నుండు మూఁడు పక్షముల నొక్క
రాశి దాఁటుచు నుండుఁ; గ్రమమున ద్వాదశ, రాసులు భుజియించు రాజసమున;
వక్రించియైన నవక్రత నైనను, దఱుచుగాఁ బీడలు నరుల కొసఁగు;
నంగారకుని టెంకి కావల రెండు ల, క్షల యోజనంబుల ఘనత మించి

ఆ. యొక్క రాశినుండి యొక్కొక్క వత్సరం, బనుభవించుచుండు నమరగురుఁడు
వక్రమందునైన వసుధామరులకును, శుభము నొసఁగు నెపుడు నభినవముగ.

89

తా ॥ బుధుడికి పైన రెండు లక్షల యోజనాల దూరంలో భూమికి పుత్రుడైన అంగారకుడు చరిస్తున్నాడు. ఇతడు ఒక్కొక్క రాశి దాటడానికి మూడు పక్షాల సమయం పడుతుంది. ఇలా పన్నెండు రాశులను దాటుతాడు. ఒక్కోసారి వెనక్కి వచ్చి మళ్ళీ ముందుకు వెళ్తూ ఉంటాడు. – వక్రగతిలోనూ, శుభగ్రహయోగం లేనప్పుడూ అంగారకుడు (కుజుడు) ప్రజలకు పీడల్ని కలిగిస్తాడు.

కుజుడికి రెండు లక్షల యోజనాలపైన బృహస్పతి చరిస్తాడు. ఇతడు ప్రతి రాశిలోను ఒక్కో సంవత్సరం ఉంటాడు. ఇతడు దేవతలకు గురువు. వక్రగతిలో లేనప్పుడు బ్రాహ్మణులకు అనుకూలుడై ఉంటాడు.

క. సురగురునకు మీఁదై భా, స్కరసుతుఁ డిరు లక్షలను జగములకుఁ బీడల్
జరపుచుఁ ద్రింశన్మాసము, లరుదుగ నొక్కొక్క రాశి యందు వసించున్.

90

తా ॥ సూర్యుని కొడుకు శని. ఇతడు బృహస్పతికి రెండు లక్షల యోజనాల పైన చరిస్తూ ఉంటాడు. ఒక్కో రాశిలో ముప్పై నెలలు సంచారం చేస్తాడు. లోకాలకు పీడ కలిగిస్తాడు.

క. ప్రాకటముగ రవి సుతునకు, నేకాదశ లక్షలను మహీసురులకు నీ
లోకులకు మేలు గోరుచు, జోకగ మునిసప్తకంబు సొంపు వహించెన్.

91

తా ॥ శనికి పైన పదకొండు లక్షల యోజనాల దూరంలో సప్తర్షిమండలం ఉంది. వీరు బ్రాహ్మణులకు, సకల లోకాలకు మేలు కలిగిస్తున్నారు.

క. మునిసప్తకమున కెగువం, దనరుచు నా మీఁదఁ ద్రియుత దశలక్షలఁ బెం
పున శింశుమారచక్రం, బనఁగా నిన్నిటికి నుపరి యగుచుండు నృపా!

92

తా ॥ సప్తర్షి మండలానికి పైన పదమూడు లక్షల యోజనాల దూరంలో శింశుమార చక్రం ఉంది. ఇది అన్నింటికంటే పైన ఉంటుంది.

క. ఆ శింశుమారాఖ్యమగు చక్రమున భాగ, వతుఁడైన ధ్రువుఁ డింద్ర వరుణ కశ్య
ప ప్రజాపతి యమ ప్రముఖులతోఁ గూడి, బహుమానముగ విష్ణుపదముఁజేరి
కణఁక నిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ, జెలఁగి యుండును గల్పజీవి యగుచు;
ననఘుఁ డుత్తాన పాదాత్మజుఁ డార్యుఁడు, నయిన యా ధ్రువుని మహత్త్వమెల్లఁ
తే. దెలిసి వర్ణింప బ్రహ్మకు నలవిగాదు, నే నెఱింగిన యంతయు నీకు మున్న
తెలియఁ బలికితిఁ; గ్రమ్మఱఁ దలఁచికొనుము, జితరిపువ్రాత! శ్రీపరీక్షిన్నరేంద్ర!

93

తా ॥ విష్ణువు యొక్క పదం శింశుమార చక్రం. భక్తుడైన ధ్రువుడు – ఇంద్రుడు, అగ్ని, కశ్యప ప్రజాపతి మొదలైన ప్రముఖులతో – నిత్యమూ మిక్కిలి భక్తితో ప్రదక్షిణం చేస్తూ ఉంటాడు. ధ్రువుడు ఉత్తానపాదుని కొడుకు. ఈ కల్పంలో జీవించేవాళ్ళందరికి ఆ ధ్రువుడే సేవింపదగినవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ ధ్రువుని మహత్తును వర్ణించటం బ్రహ్మ తరం కూడా కాదు. నాకు తెలిసున్నంతవరకు గతంలో నీకు చెప్పాను. ఓసారి తిరిగి గుర్తుచేసుకో.

వ. మఱియు నా ధ్రువుండు గాలంబుచేత నిమిషమాత్రం బెడ లేక సంచరించు జ్యోతిర్గ్రహ నక్షత్రంబులకు నీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁ బశువులకై యేర్పఱచిన మేధిస్తంభంబు తెఱంగున మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు; గగనంబు నందు మేఘంబులును శ్యేనాదిపక్షులును వాయువశంబునం గర్మ సారథులై చరించు తెఱంగును

జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుష యోగ గృహీతాశులై కర్మ నిమిత్తగతి గలిగి వసుంధరం బడకుందురు.

94

తా ॥ భగవంతుడైన కాలంచే అఖండంగా పరిభ్రమింపచేయబడుతున్న అన్ని జ్యోతిర్గ్రహ నక్షత్ర మండలాలకు నిశ్చలమైన ఆధారంగా భగవానుడు ధ్రువుణ్ణి స్థిరంగా నిలిపాడు. (ధ్రువుడు ధాన్యాన్ని నూర్చేటపుడు పశువుల కోసం కట్టిన మేధి స్తంభం లాంటివాడు.)

గానుగకు మధ్యలో ఓ కర్రను పాతి చుట్టూ ఎడ్లను త్రిప్పుతారు. ఆ మధ్యలో స్తంభాన్ని మేధి (మేడి) స్తంభం అని అంటారు. ధాన్యాన్ని నూర్చేటపుడు ఆ మేధి స్తంభానికి పశువుల్ని కట్టి త్రిప్పుతారు. అలాగే నక్షత్రాలు, సూర్యాది గ్రహాలు మేధి స్తంభంలా ఉన్న ధ్రువుడికి దగ్గరగా కొన్ని, దూరంగా కొన్ని, బాగా వెలుపలగా కొన్ని ఉండేటట్లు వాయువు యొక్క ప్రేరణ వలన కల్పాంతం వరకు పరిభ్రమిస్తూ ఉంటాయి.

ఆకాశంలో మేఘాలు, డేగలు మొదలైన పక్షులూ వాయువశం వల్ల నేలరాలక సంచరిస్తున్నాయి. వాటిని జగత్కర్మయే సారథ్యం చేసి నడిపిస్తోంది. అలాగే అంతరిక్షంలో గ్రహాలన్నీ ప్రకృతి పురుష సంయోగం వల్ల ఏర్పడిన ఒక విచిత్రమైన కర్మగతి నడిపిస్తూ ఉంటే నేలపై పడకుండా సంచరిస్తున్నాయి.

క. పొందుగ జ్యోతిర్గణముల, నందఱ నా శింశుమారమందుల నుండం
గొందఱు దఱుచుగఁ జెప్పుచు, నుందురు; వినిపింతు, విను మనూనచరిత్రా!

95

తా ॥ శింశుమార చక్రం నుంచి ఈ జ్యోతిర్గణాలను కొన్నింటిని కొందరు యోగులు గుర్తించి చెబుతూ ఉంటారు. గొప్ప ఉన్నతమైన చరిత గల్గిన ఓ రాజా ! నీకు ఆ విషయాలు చెబుతాను, విను.

క. తలక్రిందై వట్రువయై, సలలితమగు శింశుమార చక్రము నందున్
నెలకొని పుచ్ఛాగ్రంబున నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మల చరితా!

96

తా ॥ నిర్మలమైన చరిత గలవాడా! రాజా! ఒక సర్పం వలయాకారంగా దేహాన్ని చుట్టుకొని క్రిందవైపు తల వచ్చేటట్లు ఉంటే ఎలా ఉంటుందో అలాగే శింశుమార చక్రం ఉంటుంది. దాని తోక చివర ధ్రువుడు ఉంటాడు.

వ. మఱియు నా శింశుమార చక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్ర ధర్ములును, బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును, గటి ప్రదేశంబున ఋషి సప్తకంబును, దక్షిణావర్త కుండలీభూత శరీరంబునకు నుదగయన నక్షత్రంబులును, దక్షిణపార్శ్వంబున దక్షిణాయన నక్షత్రంబులును, బృష్టంబున దేవమార్గంబును, నాకాశగంగయు, నుత్తరభాగంబునఁ బునర్వసు పుష్యంబులును, దక్షిణాయనంబున నార్ద్రాశ్లేషలును, దక్షిణ వామపాదంబుల నభిజి దుత్తరాషాఢలును, దక్షిణ వామ నాసారంధ్రంబుల శ్రవణ పూర్వాషాఢలును, దక్షిణ వామలోచనంబుల ధనిష్ఠామూలలును, దక్షిణ వామకర్ణంబుల మఘాద్యష్ట నక్షత్రంబులును, వామపార్శ్వంబున దక్షిణాయనంబును, దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాది నక్షత్ర త్రయంబును, నుత్తరాయణంబును. వామదక్షిణ స్కంధంబుల శతభిషగ్జ్యేష్ఠలును, నుత్తరహనువున నగస్త్యుండును, నపర హనువున యముండును, ముఖంబున నంగారకుండును, గుహ్యంబున శనైశ్చరుండును, మేఢ్రంబున బృహస్పతియును, వక్షంబున నాదిత్యుండను, నాభిని శుక్రుండును, మనంబునం జంద్రుండును, స్తనంబుల నశ్వినులును, బ్రాణాపానంబుల బుధుండును, గళంబున రాహువును, సర్వాంగంబులఁ గేతుగ్రహంబును, రోమంబులఁ దారలును నుండు; నది సర్వదేవతామయంబైన పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునింగా నెఱుంగుము.

97

తా ॥ శింశుమార చక్రం సకల దేవతలతో నిండి ఉన్న వాసుదేవుని యొక్క దివ్యదేహం. వలయాకార సర్పం వలె ఉన్న ఈ శింశుమార చక్రం తోక చివరకు ముందు భాగంలో ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్ముడు ఉంటారు. తోకకు మూలంలో ధాత, విధాత ఉంటారు. కటి ప్రదేశంలో సప్తర్షులు ఉంటారు.

కుడివైపు సుడిగా తిరిగి ఈ శింశుమారం ఉంటుంది. అలా దక్షిణావర్తంగా వలయాకారంగా ఉన్న శరీరం గల శింశుమారానికి దక్షిణం వైపు ఉత్తరాయణ నక్షత్రాలు – అనగా అభిజిత్తు నుంచి పునర్వసు వరకు పధ్నాలుగు నక్షత్రాలు ఉంటాయి. ఎడమ వైపు దక్షిణాయన నక్షత్రాలు పుష్యమి నుంచి ఉత్తరాషాఢ వరకు ఉంటాయి. వీపు వైపు దేవ మైన అజవీథి (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రాల సముహం), కడుపున ఆకాశగంగ, ఉత్తరభాగంలో పునర్వసు, పుష్యమి నక్షత్రాలు (కుడి ఎడమ తుంట్లవలె) ఉంటాయి. పునర్వసు నక్షత్రం ఉత్తరాయణానికి చివరిది. పుష్యమి దక్షిణాయనానికి మొదటి నక్షత్రం.

ఆర్ద్ర, ఆశ్లేషలు కుడి ఎడమ పాదాల వెనుక భాగాలలో ఉంటాయి. కుడి పాదంలో ఆర్ద్ర, ఎడమ పాదంలో ఆశ్లేష ఉంటాయి. ముక్కుకు కుడివైపు కన్నంలో అభిజిత్తు, ఎడమవైపు కన్నంలో ఉత్తరాషాఢ ఉంటాయి. కుడి కంటిలో శ్రవణం, ఎడమ కంటిలో పూర్వాషాఢ ఉంటాయి. కుడి ఎడమ చెవుల్లో ధనిష్ఠా మూలలు ఉంటాయి. మఖ నుంచి అనూరాధ వరకు ఉన్న ఎనిమిది దక్షిణాయన సంబంధమైన నక్షత్రాలు ఎడమ ప్రక్క నున్న ఎముకలలోను, కుడిప్రక్కనున్న ఎముకలలో మృగశీర్ష నుంచి ప్రతిలోమ క్రమంలో పూర్వాభాద్ర వరకు గల ఉత్తరాయణ సంబంధమైన ఎనిమిది నక్షత్రాలు ఉంటాయి.

కుడి భుజంలో జ్యేష్ఠ, ఎడమ భుజంలో శతభిషం ఉంటాయి. ఉత్తరపు దౌడలో అగస్త్యుడు, దక్షిణపు దౌడలో యముడు ఉంటారు. ముఖంలో అంగారకుడు, గుహ్యంలో శని, మెడ వెనుక భాగంలో గురుడు, రొమ్ములో రవి, నాభిలో శుక్రుడు, మనస్సులో చంద్రుడు, వక్షోజాలలో అశ్వినీ దేవతలు, ప్రాణాపానాలలో బుధుడు, గళంలో రాహువు, శరీరంలోని అన్ని

భాగాలలోను కేతువు, రోమాలలో అన్ని తారకలు, (హృదయంలో నారాయణుడు) ఉంటాయి. ఇది సర్వ దేవతామయుడైన పుండరీకాక్షుని దివ్య దేహమని తెలుసుకో (ఇదే ధ్రువ మండలం).

సీ. ఇట్టి దివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం, బందు సంధ్యాకాల మతుల భక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయ, త్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు, నీ సంస్తవంబు దానెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్ర సే, వ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు

ఆ. విపుల శింశుమార విగ్రహంబునకు వం, దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించెనేని సకలార్థ సిద్ధులఁ, బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప!

98

తా ॥ రాజా! ఇది పరమేశ్వరుడి దివ్య శరీరం. దీనిని భక్తితో ప్రతిదినమూ సంధ్యా కాలాలలో ఎనలేని భక్తితో మనస్సున నిలపాలి. ఏకాగ్రతతో, ఎంతో ప్రయత్నపూర్వకంగా, నియమంగా, తాత్త్విక బుద్ధితో మౌనవ్రతంతో దర్శించాలి. స్తుతించాలి. ఎంతో ప్రేమతో జపించాలి. ఈ శింశుమార చక్రం ఎంతో ప్రశస్తమైంది. మునీంద్రులందరి సేవలను అందుకొనేది. ఈ జ్యోతిస్స్వరూపంలో వెలుగొందే శింశుమార విగ్రహాన్ని "వందనం, వందనం" అని నుతించాలి. ఇలా చేసిన భక్తుడికి ఇలలో సకలార్థాలు సిద్ధిస్తాయి, అనంతరం ముక్తి లభిస్తుంది.

క. ఇనమండలంబునకుఁ గ్రిం, దను దశసాహస్ర యోజనంబుల స్వర్భా
నుని మండలంబు గ్రహమై, ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా!

99

తా ॥ రాజా! సూర్యుడికి క్రిందవైపు పదివేల యోజనాల దూరంలో రాహు గ్రహం అపసవ్యమార్గంలో ఉంటుంది.

క. అసురాధముఁడగు రాహువు, బిసరుహసంభవుని వరము పెంపున నెంతో
పసయగు నమరత్వంబున, నసమానంబైన గ్రహవిహారముఁ బొందెన్.

100

తా ॥ రాహువు రాక్షసాధముడు (సింహిక కొడుకు). అమరత్వానికి అర్హుడు కాడు. అయినా భగవంతుడి కృపవల్ల అమరత్వాన్ని, గ్రహత్వాన్ని పొందాడు.

సీ. జననాథ! రాహువు జన్మకర్మంబులు, వినిపింతు ముందఱ విస్తరించి
యయుత యోజన విస్తృతార్క మండలము ద్వి, షట్సహస్ర విశాల చంద్రమండ లముఁ
బర్వకాలంబులను ద్రయోదశ సహ, స్ర విశాలమై మీఁద రాహు గప్పు
నది చూచి యుపరాగ మనుచును బలుకుదు, రెల్ల వారును స్వధర్మేచ్ఛు లగుచు
ఆ. నంతలోన నినశశాంక మండలములఁ, గరుణఁ బ్రోవఁదలఁచి హరిసుదర్శ
నంబు వచ్చునను భయంబున నై దాఱు, గడియలకును రాహు నడిఁకి తొలఁగు.

101

తా ॥ ఓ రాజా! రాహువు యొక్క జన్మ వృత్తాంతాన్ని, అతని కర్మల్ని ముందు ముందు వివరంగా చెబుతాను. సూర్యమండలం యొక్క వ్యాసం పదివేల యోజనాల విస్తృతి కలది. చంద్రమండలం వ్యాసం పన్నెండు వేల యోజనాలు. పర్వకాలాలలో అతడు సూర్యమండలాన్ని కాని, చంద్రమండలాన్ని కాని పూర్తిగా కప్పుతాడు. దానిని చూచి భూమిపై జనులు గ్రహణం పట్టిందని అంటారు. ఆ సమయంలో వేదోక్త కర్మల్ని ఆచరిస్తారు. ఇంతలో సూర్య, చంద్ర మండలాల్ని రక్షించడానికై విష్ణువు యొక్క సుదర్శనాయుధం వస్తుందనే భయంతో ఐదారు గడియలలోగా రాహువు గ్రహణాన్ని విడిచి వెళ్తాడు.

క. నరవర! యా రాహువునకు, సరసత నాక్రింద సిద్ధచారణవిద్యా
ధరు లయుత యోజనంబులఁ, దిరముగ వసియించి లీలఁ దిరుగుదు రచటన్.

102

తా ॥ రాజా! రాహువుకు పదివేల యోజనాల క్రింద సిద్ధులు, చారణులు, విద్యాధరులు నివసించి సంచరించే స్థానాలు ఉన్నాయి.

క. పరికింప సిద్ధ విద్యా, ధరులకుఁ బదివేలు క్రిందఁ దరలక యక్షుల్
మఱియును భూత ప్రేతలు, చరియింతురు రాక్షసులు పిశాచులు గొలువన్.

103

తా ॥ ఆ ప్రదేశాలకు పదివేల యోజనాల క్రింద పిశాచాలు రాక్షసులు తమను సేవిస్తూ ఉండగా యక్షులు, భూత ప్రేతాలు చరిస్తూ ఉంటారు.

ఆ. వారిక్రిందఁ దగిలి వాయువశంబున, మలయుచుండు మేఘమండలంబు
మేఘమండలంబు మీఁ దగుచుండు భూ, మండలంబు క్రిందనుండు నధిప!

104

తా ॥ యక్ష భూత ప్రేతాలు చరించే అంతరిక్షానికి క్రింద మేఘమండలం ఉంది. ఇది గాలికి చరిస్తూ ఉంటుంది. మేఘమండలానికి క్రింద భూమండలం ఉంది.

ఇప్పటివరకు ధ్రువ మండలం నుంచి భూమండలం వరకు చెప్పడం జరిగింది. ఇక భూమండలానికి అడుగున ఉన్నవాటి గురించి చెబుతున్నాడు.

# 5. పాతాళ లోకముల వివరములు

వ. అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంతరంబున నండ కటాహాయామంబు గలిగి క్రమంబున నొండొంటికిఁ గ్రిందగుచు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ లోకంబు లుండు; నట్టి బిల స్వర్గంబులయందు నుపరి స్వర్గంబున కధికంబైన కామభోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధ వనోద్యాన క్రీడా విహారస్థానంబుల ననుభవించుచు దైత్యదానవ కాద్రవేయాది దేవయోనులు నిత్య ప్రముదితానురక్తు లగుచుఁ గళత్రాపత్య సుహృద్బంధు దాసీదాస పరిజనులతోఁ జేరుకొని మణిగణఖచితంబులగు నతి రమణీయ గృహంబులయందు నీశ్వరుని వలనం జేటులేని కాయంబులు గలిగి వివిధ మాయా విశేష వినిర్మిత నూతన కేళీసదన విహరణ మండప విచిత్రోద్యానాదులయందు గేళీవినోదంబులు సలుపుచుఁ జరియింతు; రంత.

105

తా ॥ భూమండలానికి అడుగున ఏడు లోకాలున్నాయి. అవి అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళలోకాలు. ఇవి వరుసగా ఒకదానికొకటి క్రిందికి ఉన్నాయి. ఒక్కోటి పదివేల యోజనాల లోతు.

వీటిని బిల స్వర్గాలని అంటారు. వీటిల్లోనూ పైనున్న స్వర్గం కంటే ఎక్కువగా కామభోగాలు, సంపదలు, ఆనందాలు, భవనాలు, ఉద్యానవనాలు, క్రీడా విహార స్థలాలు ఉన్నాయి. ఈ భోగాల్ని సమృద్ధిగా అనుభవిస్తూ దైత్యులు, దానవులు, కాద్రవేయులు (పన్నగ జాతి) మొదలైనవారు ఉంటారు. వీళ్ళంతా దేవజాతి వారే. వీళ్ళు నిత్యమూ ఆనందంతో, అనురాగంతో భార్యాభర్తలు, బిడ్డలు, స్నేహితులు, బంధువులు, దాసదాసీలు, పరిజనాలు – అందరితో కలసి ఈశ్వరానుగ్రహం వలన హాని కలుగని దేహములు కలిగి మణులు తాపడం చేసిన ఎంతో రమణీయమైన భవనాలలో విహరిస్తూ ఉంటారు.

సీ. అట్టి పాతాళంబులందును మయకల్పి, తములగు పుటభేదనములయందు
బహురత్న నిర్మిత ప్రాకార భవన గో, పుర సభా చైత్య చత్వర విశేష
ములయందు నాగాసురుల మిథునములచే, శుక పిక శారికా నికర
సంకు లముల శోభిల్లు కృత్రిమ భూములును గల, గృహములచే నలంకృతము లగుచు

ఆ. గుసుమచయ సుగంధి కిసలయ స్తబక సం, తతులచేత ఫలవితతులచేత
నతులరుచిర నవలతాంగ నాలింగిత, విటపములను గలుగు విభవములను.

106

తా ॥ ఆ పాతాళాల బిలాలలో మాయలు తెలిసిన అసురుడైన మయుడు పట్టణాలను నిర్మించాడు. ఆ పట్టణాలలో చిత్రవిచిత్రాలైన మణులతో నిర్మించిన భవనాలున్నాయి. వాటికి ఎత్తైన ప్రాకారాలున్నాయి. గోపురాలు, సభామంటపాలు, చైత్యవిహార స్థలాలు ఉన్నాయి. వాటిల్లో నాగులు, అసురులు, జంటలు జంటలుగా విహరిస్తూ ఉంటారు. అక్కడ చిలుకలు, కోకిలలు, గోరువంకలు గుంపులు గుంపులుగా శోభిల్లుతూ ఉంటాయి. కృత్రిమంగా నిర్మింపబడిన భూములు, ఇళ్ళు చక్కగా అలంకరింపబడి ఉంటాయి. పూలు, పండ్లు, సుగంధపు చివుళ్ళు గుత్తులు గుత్తులుగా విరగబూసి, కాయడం వల్ల చెట్ల కొమ్మలు చేతుల్లా వంగి, లతలనే అంగనలను కౌగిలించుకొంటున్నట్లు – అక్కడ లతలతో కూడిన చెట్లు కనువిందు చేస్తాయి.

వ. మఱియు మానసేంద్రియంబుల కానందకరంబులైన నానావిధ జలవిహంగమ మిథునంబులు గలిగి నిర్మల జలపూరితంబులై మత్స్యకుల సంచర క్షుభితంబులైన కుముదకువలయ కల్హార లోహిత శతపత్త్రాదికంబులఁ దేజరిల్లెడు సరోవరంబులు గల యుద్యాన వనంబుల యందుఁ గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించిన వివిధ విహారంబులు గలిగి యహోరాత్రాది కాల విభాగ భయంబులు లేక మహాహిప్రవరులయిన శేషాదుల శిరోమణి దీధితులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు; నా లోకంబునందు నఖీల జనులు దివ్యౌషధి రస

రసాయనంబుల ననవరతంబు నన్న పానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును, వలిత పలితంబులును, జరారోగంబులును, శరీర వైవర్ణ్యంబులును, స్వేదదౌర్గంధ్యంబులును గలుగక పరమకల్యాణ మూర్తు లగుచు హరిచక్రభయంబు దక్క నన్యంబగు మృత్యుభయంబు నొందక యుందు; రదియునుంగాక.

107

తా ॥ అక్కడ నిర్మలమైన నీరు నిండిన సరస్సులున్నాయి. వాటిలో నీటి పక్షులు జంటలు జంటలుగా విహరిస్తూ ఉంటాయి. చేపలు త్రుళ్ళిపడుతూ ఉండటం వల్ల నీరు అలల కదలికలతో అల్లల్లాడుతూ ఉంటుంది. ఆ సరస్సులలో కలువలు, పద్మాలు, రకరకాల రంగులతో, దళాలతో వికసించి తేజోమయంగా ఉంటాయి. అట్టి సరస్సులలో వారు ఇళ్ళు నిర్మించుకొని ఉంటారు. స్వర్గభూములలోని విహారాలను తలదన్నే విహారాలతో రాత్రి పగలు తేడా లేకుండా, కాలం మారుతుందనే భయం లేకుండా, అక్కడి వారు హాయిగా ఉంటారు. నాగరాజైన శేషుని పడగల మీదనున్న మణుల ధగధగచే అక్కడ రాత్రి తెలియదు. ఎప్పుడూ వెలుగే. ఎప్పుడూ పగలే. అక్కడివారు దివ్యమైన ఓషధులు, రసాలు, రసాయనాలు అన్నపానాలుగా స్వీకరించడం వల్ల వాళ్ళకు శారీరక రుగ్మతలు, మానసిక వ్యాధులు ఏమీ రావు. జుట్టు తెల్లబడదు. ఒళ్ళు ముడతలు పడదు. ముసలితనం, రోగాలు రావు. శరీరం పాలిపోవడం జరుగదు. చెమట పట్టదు, దుర్వాసన రాదు. వాళ్ళంతా పరమ కల్యాణమూర్తులుగా ఉంటారు. వాళ్ళకు హరి చక్రమైన సుదర్శనం యొక్క భయం తప్ప ఇంకో భయం ఏదీ లేదు.

తే. అట్టి పాతాళలోకంబునందు విష్ణు, చక్ర మెప్పుడేనియు బ్రవేశంబు నొందు
నప్పుడెల్లను దైత్యకులాంగనలకు, గర్భసంపద లందంద కరఁగుచుండు.

108

తా ॥ అట్టి పాతాళంలోకి విష్ణు చక్రం ఎప్పుడు ప్రవేశిస్తుందో అప్పుడు అక్కడి అందరి దైత్య కుల కాంతల గర్భం స్రావమై సంతానం నశించిపోతుంది.

చ. అతలమునందు నమ్మయుని యాత్మజుఁడైన బలాసురుండు స
మ్మతిఁ జరియించు షణ్ణవతి మాయలఁ గూడి వినోద మందుచుం
గుతలములందు నేఁడు నొక కొందఱు నచ్చటి మాయఁ జెంది సం
తతముఁ జరించుచుండుదురు దప్పక మోహనిబద్ధ చిత్తులై.

109

తా ॥ ఆ లోకాలలో అతలం మొదటిది. అక్కడ మయుని కొడుకైన బలాసురుడు నివసిస్తున్నాడు. అతడివద్ద తొంభై ఆరు మాయలున్నాయి. అవి వినోదాన్ని ఇస్తాయి. భూలోకంలో ఈ మాయలకు లొంగిపోయి మోహం పొందిన చిత్తంతో సంచరిస్తూంటారు.

వ. అట్టి బలుని యావలింతలను స్వైరిణులు కామినులు పుంశ్చలు లను స్త్రీ గణంబులు జనియించి; రా కామినీ జనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి హాటక రసం బనియెడు సిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధునిం గావించి యతని యందు స్వవిలాసావలోక నానురాగస్మిత సల్లాపోపగూహనాదుల నిచ్ఛా విహారంబులు సలుపుచుండ నా పురుషుండు మదాంధుండై తానే సిద్ధుండ ననియును నాగాయుత బలుండ ననియును దలంచి నానావిధ రతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు.

110

తా ॥ ఆ బలుడు ఆవలించినప్పుడు అతని ముఖం నుంచి స్వైరిణులు, కామినులు, పుంశ్చలులు అనబడే మూడు తెగల స్త్రీజనం పుట్టింది. ఈ కామినీ జనులు పాతాళ లోకానికి వచ్చిన మగాడిని (హాటక రసం అనే ఒక సిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధుణ్ణి చేసి) తమ విలాసాల చూపులతో అనురాగం నింపిన చిరునవ్వుతో, సల్లాపాలతో, రహస్య సంభాషణలతో ఆకర్షించి వాడితో స్వేచ్ఛావిహారం చేస్తారు. వాడు కొవ్వెక్కి, కామంతో కళ్ళు మూసుకుపోగా తాను సిద్ధుడిననీ, పదివేల ఏనుగుల బలంగలవాడిననీ అనుకొని ఆ కామినులతో రకరకాల రతిక్రీడలు సలుపుతూ అదే పరమానందంగా భావిస్తాడు.

సీ. హాటకేశ్వరుఁడైన యంబికాధీశుండు, వితలంబునందున వేడ్క నిలిచి
తనదు పార్షదభూతతతులతో బ్రహ్మ స, ర్గోపబృంహణమున నొక్క చోటఁ
బార్వతీ సంభోగపరుఁ డగుచుండఁగా, వారల వీర్యంబు వలనఁ బుట్టి
నట్టిది హాటకి యనియెడు నది యని, లాగ్నులు భక్షించి యంత నుమియ

తే. నదియు హాటక మనుపేర నతిశయిల్లి, వన్నె మీఱుచు శుద్ధసువర్ణమయ్యె
నా సువర్ణంబు నాలోకమందు నున్న, జనులకెల్లను వినుతభూషణము లయ్యె.

111

తా ॥ అతలానికి క్రిందనున్న వితలలోకంలో హాటకేశ్వరుడనే పేరుతో హరుడు తన పార్షదులైన గణాలతో వసించి ఉంటాడు. సృష్టిని వృద్ధి పొందించాలని బ్రహ్మ చెప్పగా రుద్రుడు భవానితో కలసి అక్కడ రమిస్తూ ఉంటాడు. భవునికి భవానితో కలిగిన కలయికచే వెలువడిన వీర్యం హాటకి అనే నదిగా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నదీజలాన్ని అగ్ని పానం చేసింది. త్రాగి, వాటిని పుక్కిట బట్టి ఉమ్మి వేసింది. అది హాటకం అనే పేరుతో మేలిమి బంగారమైంది. ఈ శుద్ధ సువర్ణం అతలలోకంలో ఉన్న జనులందరికి మంచి నగల్ని సమకూర్చింది.

సీ. ఆ క్రింద సుతలంబు నందు మహాపుణ్యుఁ, డగు విరోచనపుత్త్రుఁడైన యట్టి
బలిచక్రవర్తి యా పాకశాసనునకు, ముద మొసంగఁగఁ గోరి, యదితిగర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివి, క్రమ రూపమునను లోకత్రయంబు
నాక్రమించిన దానవారాతిచేత ముం, దటన యీఁబడిన యింద్రత్వ మిట్లు

ఆ. గలుగువాఁడు పుణ్యకర్మసంధానుండు, హరిపదాంబుజార్చ నాభిలాషుఁ
డగుచుఁ శ్రీరమేశు నారాధనము సేయు, చుండు నెపుడు నతిమహోత్సవమున.

112

తా ॥ దాని క్రింద సుతలం ఉంది. అందు బలి చక్రవర్తి నివసిస్తున్నాడు. అతడు

మహాపుణ్యుడైన విరోచనుడి కొడుకు. ఇంద్రుడికి సంతోషం కలుగజెయ్యాలని శ్రీహరి అదితి కడుపున వామనాకృతిలో పుట్టాడు. వామన బ్రహ్మచారియై శ్రీహరి బలినుండి మూడడుగుల నేలను దానం పొంది త్రివిక్రమరూపంతో త్రిలోకాలను ఆక్రమించాడు. భగవానుడే బలిపై దయదలచి సుతలంలో అతణ్ణి ప్రవేశింపజేసి, పరిపాలకుడిగా నియమించాడు. అట్టి బలి చక్రవర్తి నిరంతరం విష్ణువును ఆరాధిస్తూ ఉన్నాడు.

వ. నరేంద్రా! సకల భూతాంతర్యామియుఁ దీర్థభూతుండును నయిన వాసుదేవుని యందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుం; గాని పాతాళ స్వర్గరాజ్యంబులు ఫలంబులు గానేర వయిన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటంజేసి లోక ప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె; క్షుత పతన ప్రస్ఖల నాదులందును వివశుండైన యెడల నామస్మరణంబు సేయు పురుషుండు గర్మబంధంబు వలన విముక్తుం డగుచు సుజ్ఞానంబునం బొందు; నట్టి వాసుదేవుం డాత్మజ్ఞాన ప్రపోషణంబు సేయు మాయామయంబు లయిన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు ననవలదు; భగవంతుండు యాచ్ఞచేసి సకల సంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణపాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రు డిట్లనియె.

113

తా ॥ "రాజా! వాసుదేవుడు అన్ని ప్రాణులలోను అంతర్యామియై ఉన్నాడు. పుణ్యతీర్థాల స్వరూపాన్ని ధరించి ఉన్నాడు. అట్టి వాసుదేవునిపై మనస్సు పెట్టి చేసిన భూదానానికి ఫలం కళ్ళెదుట కనిపించే మోక్షం. అంతేగాని పాతాళంలోని స్వర్గరాజ్యభోగాలు ఫలమెట్లా అవుతాయి?

అయితే, ఎవ్వరికీ మోక్షం కంటికి కనిపించేది కాదు. దానిని లోకానికి చూపించాలని త్రివిక్రముడు బలికి పాతాళంలో స్వర్గరాజ్యాలనిచ్చాడు. తుమ్మినప్పుడు, కాలుజారినప్పుడు, పడిపోయేటప్పుడు, వశం తప్పి ఉన్నా సరే భగవన్నామస్మరణ చేసేవానికి కర్మబంధాలు పోయి, సుజ్ఞానం లభిస్తుంది. అలా సుజ్ఞానాన్ని అనుగ్రహించే వాసుదేవుడు బలికి మోక్షాన్నే ఇవ్వకుండా

సుతలాధిపత్యాన్ని ఇవ్వటం తగునా? అని అనిపిస్తుంది. అలా అనకూడదు. భగవంతుడు బలిని యాచించి సంపదలన్నింటిని తాను గ్రహించాడు. కేవలం ఒక్క శరీరంతో బలిని మిగిల్చి వరుణపాశాలతో కట్టి విడిచాడు. అప్పుడు బలి ఇలా అన్నాడు:

"ప్రారబ్ధకర్మను అనుభవిస్తూ భగవంతుణ్ణి ఆరాధించడమనే రూపంగా కర్మను ఆచరించి ప్రాచీన కర్మను నశింపచేసుకొని భక్తితో మోక్షాన్ని పొందాలి. అందువల్ల భగవంతుడు తనను గూర్చిన స్మరణను మరపించే ముల్లోకాల ఐశ్వర్యాన్ని తానే అడిగి తీసుకొన్నాడు."

తన దర్శనంతో బలిలో భగవత్స్మరణ యందు, దాస్యమునందు రుచి కలిగించాడు. వరుణపాశాలతో బంధించి మరల విడిపించాడు. ఇలా బలీంద్రుడి కర్మానుభవాన్ని అంతటిని పూర్తిచేసి ప్రారబ్ధకర్మ ఉన్నంతకాలమూ తన ఆరాధనగా కర్మ చేయడానికి తగిన ఐశ్వర్యాన్ని ఇచ్చాడు. ఇలా త్రివిక్రముడు బలిని అనుగ్రహించాడే గాని నిగ్రహించలేదు.

సీ. పరమేశ్వరునకు నెప్పటి పదార్థములందు, దృష్టి లేకుండుట దెలిసినాఁడ
నింద్రాదులెల్ల నుపేంద్రునిఁ బ్రార్థించి, యడిగిరి గాని శ్రీహరికిఁ గోరి
కలు లేవు; మిక్కిలి గంభీరమగు మహా, కాలస్వభావంబు గలుగుచుండు
నరయఁగ మన్వంత రాధిపత్యమును లో, కత్రయంబును నెంత గానఁ దలఁప

ఆ. మత్పితామహుండు మానవంతుండు ప్ర, హ్లాదవిభునిఁ జూచి హర్షమంది
యెద్దియైనఁ గోరు మిచ్చెద ననుటకు, నంతలోన నీశ్వరాజ్ఞఁ దెలిసి.



తా ॥ "స్వామీ! పరమేశ్వరుడికి ఏ పదార్థం పట్ల కాంక్ష లేదన్న విషయం ఇప్పటికి నాకు తెలిసింది. ఇంద్రాదుల ప్రార్థన వల్ల శ్రీహరి బలిని యాచించాడు గాని, తన కోరికల కోసం కాదు. కాలస్వభావం ఎంతో గంభీరమైనది. భగవానుడి స్వభావమూ అదే. అందువల్ల నాకు భగవంతుడే ముఖ్యం గాని, అతడు స్వీకరించిన త్రిలోకాలు ఎంత? నాకు వచ్చిన

మన్వంతరాధిపత్యం ఏపాటిది? మా తాత ప్రహ్లాదుడు ఎంతో అభిమాని. అతణ్ణి చూచి విష్ణుమూర్తి నరసింహరూపంలో ఏది కోరుకొన్నా ఇస్తానన్నప్పుడు అతను ఈశ్వరాజ్ఞను గ్రహించాడు.

వ. ఇట్లకుతోభయంబు, పిత్ర్యంబయిన రాజ్యంబు నొల్లక పరమేశ్వరు దాస్యంబ కోరె, నా ప్రహ్లాద చరిత్ర కథనావసరమ్మున నీ తండ్రికిని నీకును విశేషంబుగా పురుషుండు భగవదనుగ్రహంబుఁ బొంద నోవు నని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్యమాణగ్రంథంబున విస్తరించెద! నా బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిల లోకగురుండైన శ్రీమన్నారాయణుండు గదా పాణియును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధ ధరుండును నగుచు నిప్పుడును దేజరిల్లుచుండు; నట్టి బలిద్వారంబున లోకంబుల గెలువ నిచ్చగొన్న దశగ్రీవుం డుల్లంఘిత శాసనుండై ప్రవేశంబు గావింప నయ్యాదిపురుషుండు దన పాదాంగుష్ఠంబున యోజనాయుతాయుతంబులం జిమ్మె, వినుము.

115

తా ॥ ప్రహ్లాదుడు తండ్రి రాజ్యాన్ని కోరలేదు. ఈశ్వరుడికి దాసుడిగా ఉండాలనే కోరాడు. ప్రహ్లాదుడితో నరసింహమూర్తి, “నీ తండ్రిని, నిన్ను, విశేషంగానే అనుగ్రహించాను” అన్నాడు. జీవుడు ఇలాగే భగవదనుగ్రహాన్ని పొందుతాడు. ఓ పరీక్షిన్మహారాజా! పుండరీకాక్షుడైన విష్ణుమూర్తి ప్రహ్లాదునికి చెప్పిన మాటల్ని నీకు తరువాత వివరిస్తాను.

శ్రీమన్నారాయణుడు అఖిలలోకాలకు గురువు. అట్టివాడు ఆ బలి యొక్క ఇంటిముందు శంఖచక్రగదలను దాల్చి భక్తులపై దయచూపిస్తూ ఇప్పటికీ తేజరిల్లుతున్నాడు. లోకాలన్నింటిని గెలవాలనే నిశ్చయంతో పది తలలు కలిగిన రావణాసురుడు హద్దుమీరి బలిచక్రవర్తి గృహద్వారంలోనికి ప్రవేశించాలని చొచ్చుకుపోతూ ఉంటే కావలిగా ఉన్న విష్ణుమూర్తి తన కాలిగోటితో వాడిని చిమ్మాడు. రావణుడు ఒక్కొక్క దూకుకు పదివేల యోజనాల చొప్పున

దూకొ్కంటూ పారిపోయాడు.

క. ఆ సుతలమునకుఁ గ్రింద్రై, భాసిల్లుఁ దలాతలంబు; ప్రభువందు మయుం
డాసురపుర నిర్మాతగ, వాసిగఁ బొగడంది యేలు వసుధాధీశా!

116

తా ॥ రాజా! ఆ సుతలానికి క్రింద తలాతలం ఉంది. దానికి అధిపతి మయుడు. రక్కసులకు పురాలను నిర్మించడంలో మయుడు మంచి వాసిగలవాడు. తలాతల ప్రభువుగా కీర్తనీయుడయ్యాడు.

చ. పురహరుచే రమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱుసేసె; శరణాగతు నా మయుఁ గాఁచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ గర్తఁగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండుఁగాఁ దగన్.

117

తా ॥ ప్రాణులన్నింటికి మేలు చెయ్యాలని లక్ష్మీపతియైన విష్ణుమూర్తి పరమశివునిచే త్రిపురాలను బుగ్గి చేయించాడు. ఈ త్రిపుర భస్మ ఘటన ఎంతో గొప్పది. ఆ సందర్భంలో మయుడు విష్ణువును శరణుకోరాడు. మయుడి మీద ఎంతో దయచూపించి శ్రీధరుడు అతన్ని తలాతలానికి రాజును చేసి కాపాడాడు. కనుక తలాతలంలో మయుడు ఒక్క విష్ణువు యొక్క సుదర్శన చక్రానికి తప్ప మరి దేనికీ భయపడకుండా సుఖంగా ఉన్నాడు.

క. తలఁపఁగ నా క్రింద మహా, తలమునఁ గద్రువవధూటి తనయులు సర్పం
బులు గలవు పెక్కు శిరములు, నలరంగాఁ గ్రోధవశగణావళి యనఁగన్.

118

తా ॥ తలాతలానికి క్రింద మహాతలం ఉంది. ఆ లోకంలో కద్రువ బిడ్డలైన పాములు ఉంటాయి. ఈ పాములకు చాలా తలలు ఉంటాయి. వీనిలో క్రోధవశం అనే ఒక వర్గం ఉంది. ఈ గణంలోని సర్పాలకు పగ ఎక్కువ.

వ. మఱియును గుహక తక్షక కాళియ సుషేణాది ప్రధాను లయినవార లతులశరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనంబైన పతగరాజభయంబున ననవరతంబు నుద్వేజితు లగుచు స్వకళ త్రాపత్య సుహృద్బాంధవ సమేతు లయి యుండుదు; రా క్రింద రసాతలంబున దైత్యులు దానవులు నగు నివాతకవచ కాలకేయులను హిరణ్యపుర నివాసులగు దేవతాశత్రువులు మహాసాహసులును దేజో-ధికులును నగుచు సకల లోకాధీశ్వరుండైన శ్రీహరితేజంబునం బ్రతిహతులై వల్మీకంబులందు నడంగియున్న సర్పంబుల చందంబున నింద్రదూతి యగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రాత్మక వాక్యంబులకు భయంబు నొందు చుండుదురు.

119

తా ॥ ఈ క్రోధవశ గణంలోనివారే కుహకుడు, తక్షకుడు, కాళియుడు, సుషేణుడు మొదలైనవారు. వీరు చాలా ముఖ్యులు. వీళ్ళ శరీరం చాలా పొడవుగా పెద్దదిగా ఉంటుంది. ఆదినారాయణమూర్తి వాహనమైన గరుత్మంతుడంటే వీళ్ళకు చచ్చేటంత భయం. అందువల్ల తమ తమ పెళ్ళాం పిల్లలతో, స్నేహితులతో, బంధువులతో కలిసి వీళ్ళు మహాతలంలోనే ఉంటారు.

ఆ క్రింద రసాతలం ఉంది. అక్కడ నివాతకవచులు, కాలేయులు, హిరణ్యపురవాసులు అయిన దైత్యులు, దానవులు ఉన్నారు. వీళ్ళు దేవతలకు విరోధులు. వీళ్ళ సాహసం దొడ్డది. వీళ్ళ తేజస్సూ అధికమైంది. అయితే అన్ని లోకాలకు అధీశ్వరుడైన విష్ణువు యొక్క తేజస్సు వీళ్ళను ఓడించింది. పుట్టల్లో అణగిమణగి ఉన్న పాముల్లా భయంతో ఉంటారు. ఇంద్రదూతియైన సరమ (కుక్క)చే వీళ్ళకు భయం పట్టుకొంది. సరమ తన మంత్రాలతో వీళ్ళను అణగార్చింది.

క. ఇందుకులోద్భవ! వినుమా, క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా
నందము నొందుచు నుండును, సందడిఁబడి నాగకులము చతురతతోడన్.

120

తా ॥ చంద్రవంశంలో జన్మించిన ఓ పరీక్షిన్మహారాజా! ఆ క్రింద పాతాళం ఉంది. అక్కడ నాగకులం చతురతతో సందడిగా మసలుతూ ఉంటుంది.

వ. ఇట్లు వాసుకి ప్రముఖులైన శంఖ కుళిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబళాశ్వతర దేవదత్తాదు లయిన మహానాగంబు లై దాఁటేడు పదియు నూఱు వేయు శిరంబులు గలిగి ఫణామణికాంతులంజేసి పాతాళ తిమిరంబును బాపుచుండుదురు.

121

తా ॥ పాతాళంలోని చీకటి అచ్చటి నాగముల పడగలలోని మణుల కాంతుల వల్ల పటాపంచలవుతుంది. వాసుకి వంటి ప్రముఖమైన మహానాగాలు అక్కడ ఉన్నాయి. అవి శంఖ, కుళిక, మహాశంఖ, శ్వేత, ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబళ, అశ్వతర, దేవదత్త మొదలైన నాగుల జాతులు. వీటిలో కొన్నింటికి ఐదు తలలు, కొన్నింటికి ఏడు, కొన్నింటికి పది, కొన్నింటికి నూఱు, కొన్నింటికి వెయ్యి తలలు ఉన్నాయి. ఈ శిరస్సుల మీది మణుల కాంతులే పాతాళంలోని అంధకారాన్ని పోగొడుతున్నాయి.

సీ. పాతాళలోకంబు పాఁతున శేషుండు, వెలయంగ ముప్పది వేల యోజ
నంబుల వెడలుపునను దోఁకఁ జుట్టగాఁ, జుట్టుకయుండు; విష్ణుని మహోగ్ర
మైన శరీరంబు; దానై యనంతాఖ్య, సంకర్షణుం డుండు సంతతంబు,
నట్టి యనంత నామాభిధానుని మస్త, కమున సిద్ధార్థంబు కరణి ధరణి.

ఆ. యంత నా విభుండు నఖిలలోకంబుల, సంహరింపఁగోరి చండకోప
వశత సృజనఁ జేయు వరుస, నేకాదశ రుద్రమూర్తు లనెడు రౌద్రమతుల.

తా ॥ పాతాళలోకానికి ముప్పైవేల యోజనాల అడుగున ఆదిశేషుడు ఉన్నాడు. అతడు తన తోకచుట్టతో ఉన్నాడు. ఆదిశేషుడు విష్ణువు యొక్క భయంకర శరీర రూపం. శేషుడినే అనంతుడని, సంకర్షణుడని అంటారు. అంతులేని సద్గుణాలు, మహిమ గల పేర్లు ఉన్న ఆ అనంతుడి శిరస్సుపై ఈ భూమండలం తెల్లని ఆవగింజంతగా ఉంటుంది. అతడు ప్రళయకాలంలో అఖీలలోకాలను సంహరించాలనుకొన్నప్పుడు రుద్రమతులైన ఏకాదశ రుద్రుల్ని సృష్టిస్తాడు.

ఆ. అట్టి రుద్రమూర్తు లతులత్రినేత్రులు, నఖీలశూల హస్తు లగుచు నుందు;
రందు నున్న ఫణికులాధిపుల్ శేషుని, పాదపంకజముల భక్తిఁ జేరి.

123

తా ॥ అలా సృజింపబడిన ఏకాదశ రుద్రమూర్తులకూ మూడేసి కన్నులుంటాయి. అందరూ త్రిశూలాలను తమ చేతులలో ధరిస్తారు. వారు, అక్కడుండే నాగేంద్రులు ఆదిశేషుని పాదపద్మాలకు భక్తితో నమస్కరించి –

ఆ. నమ్రు లగుచు ననుదినంబును మౌళి ర, త్నములచేతఁ గడు ముదంబు నొంది
కోరికలు దలిర్ప నీరాజనంబుల, నిచ్చుచుందు రెపుడు మచ్చికలను.

124

తా ॥ వినయంగా వంగి, తమ శిరస్సులపై ఉండే మణుల కాంతులతో నీరాజనాల నిచ్చి అర్చిస్తూ ఉంటారు. ఆదిశేషుణ్ణి అలా దగ్గరగా చనువుగా సేవించడమే ఆ నాగేంద్రుల కోరిక. అందువల్ల వారు నిత్యమూ ఆనందంగా ఉంటారు.

వ. మఱియు నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గలవార లగుచు నొప్పెడి

శరీర విలాసంబులంజేసి యగురు చందన కుంకుమ పంకంబు లను లేపనంబులు సేయుచు, సంకర్షణ మూర్తి దర్శన స్పర్శనాదుల నుద్బోధిత మకరధ్వజావేశిత చిత్తంబులు గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి స్మితావలోకనంబుల సవ్రీడితలై యవలోకించుచుండ ననంత గుణంబులు గల యనంత దేవుం డుపసంహరింపఁ బడిన క్రోధంబు గలిగి లోకంబులకు క్షేమంబు గోరుచు సురాసుర సిద్ధ గంధర్వ విద్యాధర మునిగణంబు లనవరతంబు ధ్యానంబు సేయ సంతత సంతోషాతిశయంబున ప్రాఁగన్ను వెట్టుచు, సలలిత గీతావాద్యంబుల నానందంబు నొందుచుఁ, దన పరిజనంబుల నతి స్నేహంబున నవలోకించుచు నవతులసీగంధ పుష్పరసామోదిత మధుకర వ్రాత మధుర గీతంబులు గల వైజయంతీ వనమాలికల ధరియించుచు నీలాంబరధరుండును, హలధరుండును నగుచు నితండు మహేంద్రుండొ హరుండొ యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయు నధ్యాత్మ విద్యాయుక్తంబయిన యానంద హృదయ గ్రంథిని భేదించు నట్టి శేషుని స్వాయంభువుండగు నారదుండు తుంబురు ప్రభృతులగు ఋషి శ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానంబునందు నిట్లు స్తుతియించుచుండు.

125

తా ॥ ఆ సంకర్షణమూర్తిని నాగరాజ కన్యలు కోరికలతో సేవిస్తూ ఉంటారు. చూడచక్కనైన శరీర విలాసంతో ఆ నాగకన్యలు అగరుతో, చందనంతో, కుంకుమతో అతని శరీరానికి అనులేపనాలను పూస్తారు. సంకర్షణమూర్తిని చూడటం వల్ల, తాకడం వల్ల, ఆ కన్యలకు కామం ఆవేశిస్తుంది. అనురాగ మద జనిత హర్షం వల్ల ఎరుపెక్కిన కన్నులను కలిగి, ముఖమంతా కరుణ ఉట్టిపడుతున్న ఆయనను తిలకించి చిరునవ్వు లొలకబోస్తారు. కోరిక మరింత పెరిగి, నవ్వుతున్న చూపులతో సిగ్గుతో ముడుచుకొనిపోయి చూస్తూ ఉంటారు. ఆ కన్యల చేష్టలకు అనంత గుణాలు కలిగిన అనంతుడు (జగత్సంహారసమయంలో తనకు కలిగిన) క్రోధాన్ని ఉపశమింపచేసుకొంటాడు. లోకకళ్యాణం కోసం సురలు, అసురులు, సిద్ధులు,

గంధర్వులు, విద్యాధరులు, మహర్షులు, అనంతుణ్ణి నిరతమూ ధ్యానం చేస్తూ ఉంటారు. సంకర్షణుడు నిత్యమూ అతిశయ సంతోషంతో ఉండటం వల్ల మాగన్నుగా ఉండి (కళ్ళు బరువెక్కి మూతబడుతూ ఉండి), పరవశిస్తూ ఉంటాడు. సంగీతవాద్యాల లాలనలో ఆనందిస్తూ తన పరిజనులందర్నీ ఎంతో స్నేహంతో పరికిస్తూ ఉంటాడు. అతడు వైజయంతీ మాలను ధరించి ఉంటాడు. ఆ మాలలో క్రొత్త తులసితోపాటు అప్పుడే వికసించిన సుగంధభరితమై, తేనె నిండిన పుష్పాలు ఉంటాయి. ఆ పుష్ప మాధురీ రుచులకు తుమ్మెదలు ఝుమ్మని మధురగీతాలను పాడుతూ తిరుగాడుతూ ఉంటాయి. అతడు నీలమైన వర్ణం గల వస్త్రాన్ని ధరించి, నాగలి చేత దాల్చి ఉంటాడు. అతడు మహేంద్రుడా? ఈశ్వరుడా? అని అక్కడివారు అనుకొంటూ ఉంటారు. మోక్షం కోరేవారు ధ్యానాలు చేస్తూ ఉండగా వారికి అజ్ఞానం వల్ల కలిగిన ప్రాచీన కర్మవాసనలతో కూడిన హృదయ గ్రంథులన్నిటినీ త్రెంచివేసి, ఆయన మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

ఇట్టి ఆదిశేషుణ్ణి స్వాయంభువుడైన నారదమహర్షి తుంబురుడు మొదలైన ఋషిపుంగవులతో కలిసి ఇలా స్తుతి చేస్తూ ఉంటాడు:

సీ. ఓలిమై నెవ్వని లీలా వినోదముల్, జన్మ సంరక్షణ క్షయములకును
హేతువు లగుచుండు, నెవ్వని చూపుల, జనియించె సత్త్వరజస్తమంబు,
లెవ్వని రూపంబు లేకమై బహువిధం, బులను జగత్తులc బ్రోచుచుండు,
నెవ్వని నామంబు లెఱుగcక తలcచిన, యంతన దురితంబు లడcగుచుండు

తే. నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు, నైన శేషుని వినుతి సేయంగc దరమె?
తలcప నెప్పుడు వాఙ్మనంబులకు నింక, మూcడు లోకంబులందును భూతతతికి.



తా ॥ "ఎవని లీలా వినోదాలు కారణాలుగా సృష్టి స్థితి లయాలు జరుగుతున్నవో, ఎవని చూపుల వల్ల సత్త్వరజస్తమోగుణాలు పుట్టినవో, ఎవని రూపం ఈ జగత్తు యొక్క రక్షణకు అనేక

రూపాలై అనేక విధాలుగా ఉంటుందో, ఎవని పేరు తెలియక తలచినప్పటికీ పాపాలను నశింపచేస్తోందో, అట్టి సంకర్షణమూర్తి తరుగుదల లేనివాడు. అట్టి ఆదిశేషుని కీర్తించడం ఎవడి తరం? ముల్లోకాలలోని సకల ప్రాణులకు అతడు మనస్సుకు, మాటకు అందనివాడు.

ఆ. మఱియుఁ బెక్కు గతుల మాబోఁటి వారలఁ, బ్రోవఁ దలఁచి శేషమూర్తి సాత్త్వి
క స్వభావ మొందెఁ గడఁకతో నట్టి శే, షునకు మ్రొక్కుచుందు ననుదినంబు.

127

తా ॥ మాలాంటివాళ్ళను కాపాడాలనే తలంపుతో ఆదిశేషుడు సాత్త్విక స్వభావంతో ఉన్నాడు. అట్టి ప్రసన్నుడైన శేషునకు ప్రతిదినమూ మ్రొక్కుతున్నాము."

వ. మఱియు నా శేషుని నెవ్వెండేని నాకస్మికంబుగ నయినను నార్తుండగుచు నయినను స్మరించిన మాత్రాన యఖిలపాపంబులం బాసి సకల శ్రేయస్సులం బొందు, నట్టి శేషునినే ముముక్షువు లాశ్రయించి ధ్యానం బొనర్చి భవబంధ నిర్ముక్తు లగుదు, రతని ఫణంబుల యందు భూగోళం బణుమాత్రం బగుచు నుండు; నతని మహామహిమలు గణుతింప సహస్ర జిహ్వలు గల పురుషుండైన నోపండని పలుకుచుందు; రా యనంతుండు పాతాళంబున నుండి సకలలోకహితార్థంబు భూమిని ధరియించునని లోకతిర్యఙ్మనుష్య గతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింకనేమి వినిపింతు నెఱింగింపు మనినం బరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రున కిట్లనియె.

128

తా ॥ ఆ శేషుణ్ణి అప్పటికప్పుడు ఆకస్మికంగానైనా, ఆర్తితోనైనా ఎవ్వడు స్మరించినా, ఆ స్మరణ మాత్రం వల్లనే పాపాలన్నీ తొలగి సకల శ్రేయస్సులను పొందుతాడు. జన్మబంధం నుండి విముక్తి కోరే ముముక్షువులు అతణ్ణి శరణుజొచ్చి, ధ్యానం చేసి, తిరిగి జన్మ లేకుండా చేసుకొని మోక్షాన్ని పొందుతారు.

ఆ శేషుని పడగలపై భూగోళం అణువంత మాత్రమై ఉంటుంది. అతని మహిమలు అనంతాలు. వెయ్యి నాలుకలున్నవాడైనా ఆతని కళ్యాణగుణాలను లెక్కింపలేడని చెబుతూ ఉంటారు. ఆ అనంతుడు పాతాళంలో ఉండి లోకాలన్నింటికి మేలు చేకూర్చడం కోసం ఈ భూమిని ధరిస్తున్నాడు,"

— అని శుక యోగీంద్రుడు పరీక్షిత్తుకు భూ వివరణ, లోకస్థితి, తిర్యక్కుల — మనుష్యుల గతులను గూర్చి చెప్పి, "ఇంకా ఏమి చెప్పమంటావో చెప్పు" అన్నాడు. ఈ మాటలకు పరీక్షిత్తు ఇలా అన్నాడు:

క. మునివర! లోక చరిత్రం, బనుపమము మహావిచిత్ర మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ, బనుపడి నా చిత్తమందుఁ బాయక నిలిచెన్.

129

తా ॥ "ఓ మహర్షీ! లోక చరిత్రాన్ని చెప్పడానికి ఎవ్వరూ సాటిరారు అన్నట్లుగా, గొప్ప విచిత్రంగా నాకు వినిపించావు. ఇదంతా సమగ్రంగా నా మనస్సులో స్థిరపడింది" — అన్నాడు.

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

130

తా ॥ దీనికి శుకులవారు ఇలా అన్నారు:

ఆ. జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ, కములు గాన వారి కర్మ గతుల
తారతమ్యములును దగిలి యిన్నియు వివి, ధంబు లగుచు సంతతంబు నుండు.

131

తా ॥ "జీవరాశులలో ప్రతిజీవికి ఏదో ఒకదాని పట్ల శ్రద్ధ ఉంటుంది. సత్త్వరజస్తమస్సులలో ఏదో ఒకటి ప్రధాన గుణంగా ఉంటుంది. ఈ గుణ ప్రాధాన్యం ఆ జీవి

యొక్క కర్మగతి మీద ఆధారపడి ఉంటుంది. ఆ గుణాలతో మళ్ళీ అనుగుణమైన కర్మవాసనలు ఏర్పడుతూ ఉంటాయి. ఇలా జీవుల యొక్క శ్రద్ధలలో తారతమ్యాలు పొడచూపుతాయి. ఈ గుణాల కలయికల వల్ల అనంతమైన స్వభావాలు, వాటికి అనుగుణమైన శ్రద్ధలు ఏర్పడుతూ ఉంటాయి.

వ. నరేంద్రా! ప్రతిషిద్ధలక్షణంబగు నధర్మం బాచరించు నరుని శ్రద్ధ విపరీతంబుగాఁ బ్రవర్తిల్లు నట్టి వానికిఁ గలిగెడి కర్మఫలంబును విపరీతంబుగానె యుండుం గావున ననాద్యవిద్యాకామ ప్రవర్తనల వలనఁ బెక్కు తెఱంగులఁ గలిగెడి కర్మగతులఁ సంగ్రహంబుగ నెఱింగించెద ననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

132

తా ॥ రాజా! నిషేధింపబడినదానిని ప్రతిషిద్ధమందురు. అట్టి తగని కార్యములను చేయడాన్నే అధర్మం అంటారు. అటువంటి ప్రతిషిద్ధ లక్షణమైన అధర్మాన్ని ఆచరించే మానవుని శ్రద్ధ విపరీతంగా ఉంటుంది. దానికి తగ్గట్లు కర్మఫలాలూ భిన్నంగా ఉంటాయి. అందువల్ల అనాదికాలం నుండి ఉన్న అజ్ఞానం వలన ఏర్పడు కామప్రవర్తనల వలన కలిగే నానావిధ కర్మగతులను సంగ్రహంగా చెబుతాను విను" అన్నాడు శుకయోగి. దీనికి రాజైన పరీక్షిత్తు ఇలా పలికాడు:

ఆ. మునివరేణ్య! నరకములు ముజ్జగంబుల, యందొ యంతరాళమందొ వెలినొ
యదియుఁ గాక దేశమందుండు భూవిశే, షముల యందొ తెలుపు సంతసమున.

133

తా ॥ మునివరేణ్యా! నరకాలనేవి ముల్లోకాల లోపల ఉన్నాయా? మధ్యలో ఉన్నాయా? బైట ఉన్నాయా? కాకుంటే నరకాలకు ప్రత్యేకమైన ప్రదేశాలేమైనా ఉన్నాయా? చెప్పు" – అన్నాడు.

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

134

తా ॥ ఈ ప్రశ్నలకు శుకులవారి సమాధానం ఇలా సాగింది:

# 6. శుకుడు పరీక్షిత్తుకు తెలిపిన నరకలోక విషయములు

క. ఎడతెగక ముజ్జగంబుల, కడపల నయ్యామ్యదిశను గదలక నిలుచుం
గడు ఘోరములుగ నరకము, లడరంగా నంతరాళమందుల నధిపా!

135

తా ॥ రాజా! నరకాలు చాలా ఘోరమైనవి. ఇవి త్రిలోకాలకు చివరలో అంతరాళంలో (మధ్య భాగాలలో) దక్షిణ దిశగా ఉంటాయి.

నరకాలు దక్షిణం వైపు భూమి క్రింద అండానికి చుట్టూ ఆవరించుకొని ఉన్న జలాలకు పైన ఉన్నాయి.

వ. మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాది పితృగణంబులు దమ గోత్రజులకు మేలు గలుగుట కొఱకు సత్యంబులగు నాశీర్వాదంబులు నొసంగుచుండుదు; రచ్చటి పితృపతియగు శమనుండు దన లోకంబునకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగిన ఫలంబుల నిచ్చి శిక్షించుచునుండు; నందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీపాకంబును గాలసూత్రంబును నసిపత్త్రవనంబును సూకరముఖంబును నంధకూపంబును గ్రిమిభోజనంబును సందంశంబును దప్తోర్మియు వజ్రకంటకశాల్మలియు వైతరణియుఁ బూయోదంబును బ్రాణరోధంబును విశసనంబును లాలాభక్షంబును సారమేయాదంబును నవీచిరయంబును రేతః పానంబును నను నేకవింశతి మహా నరకంబులును, మఱియును క్షారకర్దమంబును రక్షోగుణ భోజనంబును శూలప్రోతంబును దందశూకంబును నవట నిరోధనంబును నపర్యావర్తనంబును సూచీముఖంబు నన సప్త విధ నరకంబుల తోడఁ గూడి యష్టావింశతి నరకంబులు గల వని కొందఱు నొదువుదు, రందు.

136

తా ॥ ఆ దక్షిణ దిక్కునందే అగ్నిష్వాత్తులు మొదలైన పితృగణాలు ఉంటాయి. వారు సమాధితో, జ్ఞానంతో తమ గోత్రంలో జన్మించినవారి క్షేమం కోరుతూ ఉంటారు. వారి ఆశీస్సు సత్యమైంది.

ఆ దక్షిణ దిక్కునందే పితృదేవతలకు అధిపతియైన యముడు ఉంటాడు. శరీరం వీడి తనలోకానికి వచ్చే జీవులకు వాళ్ళు చేసుకొన్న కర్మల్ని బట్టి యముడు తగిన ఫలాలనిచ్చి శిక్షిస్తుంటాడు.

ఆ నరకాలను గూర్చి విను. తామిస్రం, అంధతామిస్రం, రౌరవం, మహారౌరవం, కుంభీపాకం, కాలసూత్రం, అసిపత్రవనం, సూకరముఖం, అంధకూపం, క్రిమిభోజనం, సందశం, తప్తసూర్మి, వజ్రకంటకశాల్మలి, వైతరణి, పూయోదం, ప్రాణరోధం, విశసనం, లాలాభక్షం, సారమేయాదనం, అవీచిరయం, రేతఃపానం – ఇవి ఇరవైఒక్క మహానరకాలు. ఇంకా క్షారకర్దమం, రక్షోగణభోజనం, శూలప్రోతం, దందశూకం, అవట నిరోధనం, పర్యావర్తనం, సూచీముఖం అనబడే ఏడు విధాలైన నరకాలతో మొత్తం ఇరవై ఎనిమిది నరకాలున్నాయని కొందరు చెబుతారు.

క. పరవిత్త కళత్రంబులఁ బరికింపక యపహరించు పాపాత్ముఁడు దు
ష్కరపాశ బద్ధుఁడై యమ, పురుషులచే నధిక బాధఁ బొందుచు నుండున్.



తా ॥ ఇతరుని ధనానికి, భార్యకు ఆశపడి దొంగిలించే పాపాత్ముడు యమభటులు కట్టిన త్రాళ్ళకు బద్ధుడై ఎంతో బాధ పొందుతాడు.

వ. మఱియు నవ్విధంబున బాధితుం డగుచుఁ దామిస్ర నరకంబునంబడి యనశనాద్రిపాతన దండతాడన తర్జనాది బాధలం జెంది కడు భయంబున మూర్ఛలం బొందుచుండు.

138

తా ॥ ఇది తామిస్ర నరకం. ఎంతో చీకటిగా ఉంటుంది. యమభటులు ఇందులో పాపుల్ని తిండిపెట్టక, నీళ్ళివ్వక, కొండల మీది నుంచి పడద్రోసి, కర్రలతో చితగ్గొట్టి, నానా బాధలు పెడతారు. ఈ పాపులు ఆ బాధలకు తాళలేక భయంతో మూర్ఛబడిపోతారు.

క. పరకాంత నెవ్వఁడేనియు, బురుషుం దుండంగ మొఱఁగి పొందిన యమ కిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద, త్తరమునఁ బడవైతు రంధతామిస్రమునన్.

139

తా ॥ భర్తను మోసగించి అతడి భార్యను పొందిన పాపాత్ముణ్ణి యమకింకరులు బంధించి వెంటనే అంధతామిస్రం అనే నరకంలోనికి త్రోసివేస్తారు.

మగవాణ్ణి వంచించి, వాడికి మిత్రుడిలా వ్యవహరిస్తూ కొందరు వాడి భార్యతో రమిస్తారు. వీళ్ళకు అంధతామిస్ర నరకమే గతి. అనేక రకాల బాధలకు, వేదనలకు ఈ నరకకూపం పుట్టిల్లు. వేదన అనుభవిస్తూ మతి చెడి, చూపుపోయి, చెట్టు మొదట వ్రేళ్ళు నరకగా నరకగా చెట్టు నేలకూలిపోయినట్లు ఒక్కొక్క ఇంద్రియమే పోయి పోయి వాడు నేలపడునట్లు చేస్తుంది ఈ నరకయాతన.

వ. నరేంద్రా! యెవ్వఁడేనిం గుటుంబ పోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు, నా నరుండు రౌరవ నరకంబునం బడు; నెవ్వం డిహలోకంబునందు స్వేచ్ఛా విహారంబున సంచరించుచుఁ బరోపద్రవ పరాఙ్ముఖంబు లయియుండు పశుపక్షి మృగాదుల బాధించు, నా యామృగంబులు రురురూపంబులఁ దాల్చి యట్టి పాపజనుల నానా విధ యాతనల బాధించుటం జేసి రౌరవ మహా రౌరవ నరకంబులం బడు; నెవ్వండేని దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబు సేసి వధించు, నా నిష్కరుణుండైన పురుషుని గుంభీపాక నరకంబుల యందుఁ గల తప్త తైలంబులం బెక్కు బాధలం బొందింతురు.

తా ॥ రాజా! తన కుటుంబాన్ని పోషించుకోవాలని ఎవడు ఇతరులకు ద్రోహం చేసినా వాడు రౌరవం అనే నరకంలో పడతాడు. సర్పం కంటే కడు క్రూర స్వభావంతో పెద్ద పెద్ద కొమ్ములు గల రురువు అనే పేరుగల జంతువులు కరిచి, పొడిచి, కుమ్మి హింసిస్తాయి. అందుచే దీనికి రౌరవం అని పేరు.

ఈ లోకంలో ఇష్టమొచ్చినట్లు సంచరిస్తూ ఇతరుల కష్టాలలో పాలు పంచుకోకుండా ఉంటూ, పశుపక్షి మృగాదుల్ని బాధిస్తూ ఉన్నవాడిని ఆయా మృగాలు రురు రూపాల్ని దాల్చి, ఆ పాపజనుల్ని నానా విధాల హింసిస్తాయి. అదే రౌరవ నరకం. ఇంతకంటే ఘోరమైనది మహారౌరవ నరకం.

మాంసం కోసం మృగాదుల్ని చంపితినే వాడే మహా రౌరవంలోకి పోతాడు. వీడిని ఇక్కడ రురుమృగాలు పడత్రోసి వాడి మాంసాన్ని తింటాయి.

శరీర పోషణ కోసం కొంతమంది పశువుల్ని, మృగాల్ని బలవంతంగా ప్రాణం పోగొట్టి కాల్చుకు తింటారు. ఇలాంటి దయమాలినవాళ్ళను కుంభీపాకం అనే నరకంలో పడత్రోస్తారు. మరగకాగుతున్న నూనెలో వేసి ఈ పాపుల్ని అనేక బాధలు పెడతారు.

పెద్ద కడుపు, సన్నని మూతగల కుండలో నూనెపోసి, మరగించి ఆ నూనెలో వీళ్ళను పడవేసి ఉడికిస్తారు. అలా కుండలో ఉడికించు నరకం కనుక దీనికి కుంభీపాకం – అని పేరు.

సీ. తల్లిదండ్రులకును ధరణీ సురులకును, నహితంబు సేసిన యట్టివాఁడు
కాలసూత్రం బను కడుఁదీవ్రనరకంబు, నందును నందంద యయుత యోజ
నాయతపాత్రాదులందుల సూర్యుఁ డా, మీఁద గ్రిందను వహ్ని మిగుల మండ
నత్యంత క్షుత్పిపాసాదులచేతను, బాధితుం డగుచుండఁ బాయ కెపుడుఁ

ఆ. బరువు వెట్టుచున్నఁ బడియున్న నిలిచినఁ, గదలకున్నఁ జాల నొదిఁగియున్న
బాధఁ బొందుచుండుఁ బశురోమముల లెక్క, వరుస నపరిమేయ వత్సరములు.

141

తా ॥ తరువాత నరకం కాలసూత్రం. అమ్మా నాన్నలకు, బ్రాహ్మణులకు కీడు చేసినవాడికోసం ఈ నరకం ఉంది. ఈ నరకం పదివేల యోజనాల విశాలమైన ధాన్యం ఉడకపెట్టే ఓ పెద్ద తావా వలె ఉంటుంది. ఈ పాత్రకు పైన సూర్యుడి వేడి, క్రింద మండిపోతున్న అగ్ని. ఈ రెంటి మంటల మధ్య తట్టుకోలేని ఆకలి దప్పికలతో జిల్లార్చుకుపోతాడు జీవుడు. ఈ పాపులు ఆ రాగితావాలోనే పరుగులు పెట్టడం, పడిపోవడం, సోలిపోవడం, బాధపడటం, పశువుకు ఎన్ని వెంట్రుకలుంటాయో అన్ని వేల ఏళ్ళపాటు ఈ నరకంలో మరిగిపోవడం తప్పదు.

వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాచరించు పురుషుని నసిపత్త్రవనంబునందు యమకింకరులు తఱట్ల నడచుచుఁ బరిహసించుచుం దోలు నెడ యసిపత్త్రంబు లిరుగెలంకుల శరీరంబుం ద్రెంచుచుండ నడుగడుగున బిట్టు మొఱవెట్టుచుండ బాధించుచుండుదురు.

142

తా ॥ తరువాత నరకం అసిపత్రవనం. వేదమార్గాన్ని విడిచి ఏ వేదం లేకుండా అనవసరంగా వేదబాహ్యంగా పాషండులై ఉండేవాళ్ళని ఈ నరకంలో పడవేస్తారు. ఇదొక అడవి. ఇందులో ఆకులు కత్తుల్లా ఉంటాయి. ఈ అడవిలో యమభటులు కొరడాలతో కొట్టి పరుగెత్తిస్తారు. అపహాస్యం చేస్తూ తోలుతారు. ఒక ప్రక్క కొరడా దెబ్బలు; మరోవైపు రెండువైపులా పదనుదేరిన కత్తులవంటి ఆకుల కోత. అవయవాలు ముక్కలై తెగిపడుతూ ఉంటాయి. అడుగడుగునా మొఱలు, బాధలు.

క. దండింపఁ దగని వారల, దండించిన విప్రవరుల తనువులు ముట్టం

దండించిన దుర్మతులం, దండింతురు కాలసూత్ర నరకము లందున్.

143

తా ॥ తరువాత నరకం సూకరముఖం. రాజా! దండింపతగని వారిని, గొప్ప బ్రాహ్మణుల్ని దండిస్తే ఈ నరకంలోకి త్రోస్తారు.

ఆ. మఱియు నట్టి దుష్టమానవుఁ గింకరుల్, విఱిచి చెఱకుఁగోల విఱిచినట్లు
బాధపెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచు, మొఱలు వెట్టుచుండ భూపవర్య!

144

తా ॥ ఇంకా, అటువంటి పాపాత్ముల్ని యమకింకరులు చెఱకు ముక్క విరిచినట్లు విరిచి పీల్చి పిప్పిచేస్తారు. ఆ బాధకు తాళలేక మూర్ఛబడి గగ్గోలపెట్టి దిక్కుతోచక ఈ నరకంలోని పాపులు పరుగులు తీస్తారు.

వ. నరేంద్రా! యెవ్వండేని నీశ్వరకల్పితవృత్తి గల జంతువుల హింసించు నట్టివాని నంధకూపంబను నరకంబునఁ బడవైచిన నందు నతండు దొల్లి తాను జేసిన భూత ద్రోహంబున నచ్చట వివిధక్రూర పక్షి మృగ పశు సర్ప మశక మత్కుణ మక్షికాదుల చేత హింసం బొందుచు, మహాంధకారంబునందు నిద్రానుభవసుఖ లేశంబును లేక కుశరీరంబు నందుల జీవుండునుంబోలె మృతప్రాయుండై యుండు; నంత.

145

తా ॥ తరువాత నరకం అంధకూపం. రాజా! సర్వేశ్వరుడు కొన్ని జంతువులు బ్రతకడానికి వాటికి కొన్ని వృత్తుల్ని ఏర్పరచాడు. ఎవడైనా ఆ జంతువుల్ని హింసిస్తే వాణ్ణి ఈ అంధకూపంలోకి త్రోస్తారు. వాడు గతంలో తాను చేసిన భూతద్రోహానికి తగ్గట్లు ఈ నరకంలో ఉండే క్రూరమైన పక్షులు, మృగాలు, పశువులు, సర్పాలు, దోమలు, నల్లులు, ఈగలు వాణ్ణి హింసిస్తాయి. గాఢాంధకారం. నిద్ర పట్టదు. పిసరంత సుఖం కూడా ఉండదు. పాడైపోయిన

శరీరంలో జీవుడు అవస్థ పడినట్లు ఈ నరకంలో పాపాత్ముడు చచ్చినట్లు పడిఉంటాడు.

క. తన కలిమి నెవ్వఁడేనియుఁ, దన బాంధవవరులఁగూడి తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షిం, చిన మాడ్కిం దిన్నవాని శీఘ్రమె యచటన్.

146

తా ॥ తరువాతది క్రిమిభోజనం. తనకున్నదాన్ని బంధువర్గానికి పెట్టకుండా తానొక్కడే కాకి తిన్నట్లు తినేస్తే అట్టి పాపిని దీనిలో పడవేస్తారు.

క. క్రిమిభోజన మనియెడి నర, కమునం బడి క్రిములె కూడుగాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా, ణము గల క్రిమికుండ మందు నాటుక యుండున్.

147

తా ॥ ఈ నరకంలో పురుగుల్ని తిని ఉండాలి. ఇది లక్షయోజనాల పరిమాణం గల పురుగుల గుంట. ఆ పురుగులు వీణ్ణి పొడుచుకుతింటూ ఉంటాయి.

వ. మఱియు నీ భూలోకంబున నెవ్వఁడేనియు నవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్య రత్నాది ద్రవ్యంబుల నపహరించు, నట్టి పురుషుని నగ్ని వర్ణంబులగు నయః పిండంబుల నగ్ని తప్తంబులగు శూలంబుల నతని శరీరంబునం దివియుచుండుదురు; మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబులు సేసిరేని నట్టివారిని యమలోకంబున నతితీక్ష్ణ కశాతాడితులంజేసి యగ్నిమయంబు లయిన యుక్కు ప్రతిమల నాలింగనంబు సేయింతురు.

148

తా ॥ దొంగతనం గాను, బలవంతం గాను బ్రాహ్మణుల బంగారం, రత్నాలు మొదలైన సంపదల్ని దోచుకొంటే అట్టి పాపిని అగ్నిలా కాలుతున్న ఇనుపగుండుల్ని పెట్టి శరీరంపై

దొర్లిస్తారు. కాలిన ఇనుపశూలాలతో గ్రుచ్చుతారు.

కామంతో కళ్ళు మూసుకుపోయి స్త్రీ గాని, పురుషుడు గాని దారితప్పి పరపురుష, పరస్త్రీ సంపర్కం చేస్తే అతి తీక్షణంగా ఉండే అగ్నితో కాలిపోతున్న ఉక్కు ప్రతిమల్ని కౌగలింపచేస్తారు. ఈ నరకం పేరు తపశూర్మి.

ఆ. సర్వజంతుజాల సంగమ మొందెడు, వానిఁ బట్టి కట్టి వజ్ర దంష్ట్ర
కముల గలుగునట్టి ఘనతర శాల్మలీ, తరువులందుఁ జేర్చి దంతు రెపుడు.

149

తా ॥ సర్వ జంతువులతో సంగమం చేసేవాడిని కట్టి, వజ్రాల కంటే వాడియైన ముళ్ళున్న బూరుగు చెట్లకు రాస్తూ తాటదీస్తారు.

ఆ. పార్థివేంద్ర! నరుఁడు పాషండదర్శనుఁ, డగుచు ధర్మమార్గ మడఁచెనేని
వాఁడు నరకమందు వైతరణీనది, నుడుగ కెపుడుఁ బొరలి పడుచునుండు.

150

తా ॥ రాజా! ధర్మాన్ని రక్షించవలసినవాడు దారితప్పి పాషండుడై ప్రవర్తిస్తే వాణ్ణి వైతరణి అనే నదిలోకి త్రోసివేస్తారు.

వ. మఱియు నట్టి వైతరణీనది యందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపం బ్రాణంబులు నిర్గమింపఁ దన పాపంబు లుచ్చరించుచు విణ్మూత్రపూయ శోణిత కేశ నఖాస్థి మేదోమాంస వసావాహిని యందుఁ దప్తం డగుచు నుండు; విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుండై పశువుంబోలెఁ జరియించెనేని నతండు నరకంబునుం బొంది యందుఁ బూయ విణ్మూత్రలాలాశ్లేష్మ పూర్ణార్ణవమందు ద్రొబ్బంబడి యతిబీభత్సితంబులగు నా ద్రవ్యంబుల భుజియించుచుండు.

తా ॥ ఆ నదిలో భయంకరంగా క్రూరంగా మాంసభక్షణం చేసే జలచరాలుంటాయి. అవి ప్రాణాలు తోడేస్తాయి. ఆ పాపాత్ముడు తన పాపాల్ని చెప్పుకొంటూ అమేధ్యం, మూత్రం, చెడువాసన గల రక్తం, వెంట్రుకలు, గోళ్ళు, ఎముకలు, కొవ్వు, మాంసం మొదలైనవి నిండి, పొంగి పొర్లుతున్న ఆ నదిలో నానా బాధలు పడుతూ కొట్టు మిట్టాడుతాడు.

బ్రాహ్మణుడు తన శుచినీ ఆచారాల్నీ మంటకలిపి, సిగ్గు వదిలి, పశువులా శూద్రకామినుల సంపర్కం పొందితే వాణ్ణి దుర్వాసనలు గల అమేధ్యం, మూత్రం, మలం, కఫం నిండిన సముద్రంలా ఉన్న నరకంలో పడవేస్తారు. అతి బీభత్సాలైన ఆ నరకంలోని ద్రవ్యాలను తింటూ వాడు యాతనలు పడాలి.

క. శునకములఁ బెంచి యెవ్వం, దనయంబును వేఁట సలిపి యాత్మార్థముగా
వనమృగములఁ జంపును నా, మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్.

152

తా ॥ కుక్కల్ని పెంచి ప్రతిరోజు తన (వినోదం) కోసం వేటకు వెళ్ళి అడవి మృగాలను చంపే మనుజాధముడిని యమభటులు బాణాలతో వేటాడి హింసిస్తారు.

ఆ. జృంభణమున నెవఁడు దంభార్థమై పశు, వులను జంపి జన్నములను జేయు
వానిఁబట్టి యమునివారలు గోయుచు, నుందు రెపుడు మిగుల సందడిలుచు.

153

తా ॥ లేని పోని గొప్ప కోసం పశువుల్ని చంపి కపట యాగాలు చేసేవాళ్ళను పట్టి యమకింకరులు రంపపు కోతలు కోస్తారు.

వ. కామమోహితుండై యెవ్వండేనియుఁ దన భార్యచేత రేతఃపానంబు సేయించు నా

పాపాత్ముని రేతోప్రదంబునం ద్రోచి యా రేతంబునే పానంబు సేయించుదురు; రాజభటులైనను జోరులైనను ధనికుల గ్రామంబులపైఁ బడి యందు గృహదాహంబు సేయువారలను, విషాదుల వలన నన్యులఁ జంపెడు వారలను, వజ్ర దంష్ట్రలు గల వింశత్యుత్తర సప్త శతశునకంబు లెడతెగక తిగిచి భక్షించుచుండు.

154

తా ॥ కామమోహం చేత తన భార్యతో వీర్యాన్ని త్రాగించే పాపాత్ముణ్ని పట్టి యమభటులు పురుషవీర్యంతో నిండిన ఒక మడుగులో పడవేసి వాడిచేత ఆ వీర్యం త్రాగిస్తారు.

రాజభటులైనా, దొంగలైనా గ్రామాలపైపడి ఇళ్ళకు నిప్పు అంటించేవారిని, మందుమాకు పెట్టి ఇతరుల్ని చంపేవారినీ వజ్రాల్లాంటి కోరలు ఉన్న ఏడు వందల ఇరవై బలమైన కుక్కలున్న నరకంలో పడవేస్తారు. ఆ కుక్కలు వాళ్ళను అదే పనిగా చెడకరుస్తాయి.

సీ. లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబు, పలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత మానక వీచి యను నరకమునందు, శతయోజనోన్నత శైల శిఖర
మునఁ దలక్రిందుగా నునిచి యధోముఖం, బుగఁ బడద్రొబ్బిన బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని కమలాకరముఁబోలెఁ, జదరమైయున్న పాషాణమందుఁ

తే. బడిన యంతన దేహంబు పగిలి పెక్కు, తునుకలై పాసి యది గూడికొనుచు నుండ
దండి యాకులతను బొందుచుండుఁగాని, చావు లేకుండు నా దుష్టజంతువునకు.

155

తా ॥ లంచం పుచ్చుకొని సాక్ష్యాన్ని మోసం చేసి అబద్ధపు సాక్ష్యం చెప్పిన పాపిని కట్టి నూరు యోజనాల ఎత్తైన పర్వతం మీద నుంచి క్రిందకు పడవేస్తారు. క్రింద చక్కని సరస్సు ఒకటి ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అది సరస్సు కాదు. పెద్ద బండరాయి. వీడు ఆ రాయిపై పడ్డం వల్ల శరీరం తునాతునకలైపోతుంది. మళ్ళీ కూడుకొంటుంది. చావు రాదు, బాధ తప్పదు. వాణ్ణి

మళ్ళీ కొండపైకి ఎక్కించి క్రిందికి త్రోస్తారు. ఇలా నరకయాతన పెడతారు.

ఆ. సోమయాజిభార్యఁ గామించి పొందిన, వానిఁ గపట మద్యపాన సోమ
పాన మనుదినంబుఁ బానంబు సేయు విట్, క్షత్రియులను బట్టి సంభ్రమమున.

156

తా ॥ యజ్ఞం చేసిన సోమయాజి భార్య సోమిదమ్మను కామించి ఆమెతో కూడిన పాపిని; సోమపానమంటూ దొంగచాటుగా మద్యపానం చేసే వైశ్యుల్ని, క్షత్రియుల్ని, బ్రాహ్మణుల్ని వదిలిపెట్టరు. బ్రాహ్మణుడు కాని, వైశ్యుడు కాని, క్షత్రియుడు కాని పవిత్రంగా ఉండకుండా మద్యం త్రాగితే —

ఆ. ఱొమ్ముఁ ద్రొక్కి మోము ఱిమ్మవట్టఁగ మోఁది, యనలముఖమునందు నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు, నీరు వోతు రేచి నిష్ఠురముగ.

157

తా ॥ ఆ పాపిని యమభటులు పట్టి గుండెమీద కాలువేసి త్రొక్కి, బాది, నిప్పుల్లో సలసల కాగిన ఉక్కుద్రవాన్ని నోరు పెగలదీసి పోస్తారు.

వ. మఱియు నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుం దపో దాన విద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయు వాఁడు క్షారకర్దమంబను నరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు; స్త్రీ పురుషు లెవ్వరేని శరీర రక్షణార్థంబు పశువుల మానవుల బలి యిచ్చి రేని వారలను నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు సేయుచుం బాఁటాడుచుందురు; గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులఁ గావించి హింసించుచు హర్షించుచున్న వారలను శూలప్రోతంబను నరకంబునందు శూలప్రోతుల జేసిన క్షుత్పిపాసాపరు లగుచుండఁ గంకగృధ్రాదులు దీక్ష్ణ తుండాగ్రంబులం దిగిచి భక్షించుచుందు; మఱియు ధూర్త స్వభావంబునం జంతుపీడనంబుఁ గావించెడు

పాపాత్ముల దందశూకంబను నరకంబునందు వైవ నైదు నేడు ముఖంబుల సర్పంబులు గఱచుచుండు.

158

తా ॥ తపస్సుచే, దానంచే, విద్యాచారాలచే పెద్దవారైన వారిని ఆ మూడూ లేని నీచుడు అవమానిస్తే అలాంటి పాపిని క్షారకర్దమం అనే నరకంలో పడవేస్తారు. క్రిందికి ముఖాన్ని వ్రేలాడదీసి ఈ నరకంలో యాతన పెడతారు.

కొందరు స్త్రీలు, పురుషులు తమ శరీరాన్ని రక్షించుకోవాలనే స్వార్థంతో పశువుల్ని, మానవుల్ని బలులుగా ఇచ్చి క్షుద్రపూజలు చేస్తూ ఉంటారు. ఇలాంటి వాళ్ళను ఈ నరకంలో పడద్రోసి యమభటులు తమ కత్తులతో వీళ్ళను నరికి రక్తం త్రాగుతారు. అలా వీళ్ళ రక్తంతో వినోదిస్తూ ఆడుతూ పాడుతూ ఉంటారు.

కొంతమంది గ్రామాలలోను, అడవులలోను ఏ పాపము ఎరుగని, నిర్భయంగా నమ్మి చరించే జంతువుల్ని ఉరిపోసి, వలపన్ని హింసిస్తూ వేడుక చేసుకొంటారు. ఇలాంటి నీచుల్ని శూలప్రోతం అనే నరకంలో పడవేస్తారు. అక్కడ వాడి ముక్కులున్న కాకులు, గ్రద్దలు వీళ్ళను పొడిచి పొడిచి తింటాయి.

కొందరు ధూర్త స్వభావంతో పాములవలె మరొకరిని పీడిస్తూ ఉంటారు. ఇలాంటి పాపుల్ని దందశూకం అనే నరకంలో వేస్తారు. అక్కడ పాములు కొన్ని ఐదు, కొన్ని ఏడు ముఖాలతో ఉంటాయి. అవి వీళ్ళను కరచి బాధిస్తాయి.

ఆ. ఎనయ దొడ్లలోన నిండ్లలో నైనను, బశుపతంగ హరిణ పంక్తి నెల్లఁ బట్టి హింససేయు పాపాత్ము విషవహ్ని, ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల!

159

తా ॥ కొందరు దొడ్లలో గాని, ఇండ్లలో గాని పశువుల్ని లేదా పక్షుల్ని లేదా లేడి పిల్లల్ని పట్టి హింసిస్తారు. అలాంటివాళ్ళను విషంతో కూడిన అగ్నిహోత్రజ్వాలలు వీస్తూన్న నరకాలలో విసిరివేస్తారు.

క. తన యింటికి వచ్చిన మను, జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచినవానిం
గనుఁగవల వజ్రదంష్ట్రలఁ, దనరిన యా కంక గృధ్రతతి భక్షించున్.

160

తా ॥ కొంతమంది గృహస్థులయ్యుండి కూడ తమ ఇంటికి వచ్చిన అతిథుల్ని తమ ఇంటిలోకి వచ్చారన్న కోపంతో అనాదరంతో రుసరుసలాడుతూ చూసి బాధిస్తారు. ఇట్టి పాపుల్ని తీవ్రమైన ముక్కులు గల కాకులు, గ్రద్దలు, డేగలు ఎగిరి వచ్చి వీళ్ళపై వాలి ముక్కులతో కళ్ళను పెకలించి తింటాయి.

మ. ధనవంతుండగు మానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం
బను నా దుర్గతిఁ బట్టి త్రోచి నిధిగాపై యున్న భూతం బటం
చును బాశంబులఁ బట్టి కట్టి వడిలో నొప్పింతు రత్యుగ్రులై.

161

తా ॥ లోకంలో ధనవంతులై ఉండి కూడా ధర్మకార్యాలను, పరోపకారాల్ని చేయకుండా ఉండే పాపులు కొందరు ఉంటారు. ఒక భూతం నిధిని కాపాడునట్లు తమ ధనాన్ని కాపాడుకొంటూ ఉంటారు. ఇట్టి వాళ్ళను సూచీముఖం అనే ఈ నరకంలోకి త్రోస్తారు. యమభటులు వీళ్ళను ఉగ్రంగా త్రాళ్ళతో బంధించి ఒళ్ళంతా బలమైన సూదులతో, దారాలతో కుట్టేస్తారు.

ఆ. నరవరేణ్య! యిట్టి నరకముల్ యమలోక, మందుఁ గలవు మఱి సహస్ర సంఖ్య

లందు శమనదూత లనిశంబు బాధింతు, రవని ధర్మదూరు లయిన నరుల.

162

తా ॥ రాజా! ఇలాంటి నరకాలు యమలోకంలో వేలకొద్దీ ఉన్నాయి. ధర్మాన్ని విడిచిన పాపాత్ముల్ని ఈ నరకకూపాలలో యమభటులు నిరంతరం బాధిస్తూనే ఉంటారు.

ఆ. ధర్మవంతులెల్లఁ దప్పక స్వర్గంబు, నందు భోగసమితిఁ బొందుచుందు
రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ, బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత.

163

తా ॥ పుణ్యమైన చరిత్ర గల ఓ పరీక్షిన్మహారాజా! ధర్మాత్ములైనవారు తప్పక స్వర్గానికి వెళ్ళి స్వర్గభోగాలను అనుభవిస్తారు. పుణ్యపాపాలు మిగిలిపోవడం వల్ల కర్మను అనుభవించడానికి మరల ఈ భూమిపై పుడుతూ ఉంటారు.

వ. నరేంద్రా! మోక్షమార్గంబు మున్నె వినిపించితి; నిప్పుడు నీ కెఱింగించిన వెల్లను బ్రహ్మాండ కోశంబునం జతుర్దశ కోశంబులు గలవని పురాణంబులు పలుకుచుండు; నట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూలశరీరం బగుటం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకల శ్రేయస్సులుం గలుగు; నీశ్వర స్థూలశరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి సూక్ష్మదేహంబు నెఱుంగ వచ్చు; భూద్వీప వర్ష సరి దద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారాగణ లోకసంస్థితం బయిన సకల జీవనికాయ్యంబై యద్భుతంబైన శ్రీహరి స్థూలశరీర ప్రకారంబు వినిపించితిని.

164

తా ॥ రాజా! మోక్షమార్గాన్ని గురించి ముందే చెప్పాను. ఇప్పుడు నీకు తెలియచెప్పివన్నీ బ్రహ్మాండకోశంలో పదునాలుగు లోకాలని పురాణాలు చెబుతున్నాయి. అట్టి ఈ బ్రహ్మాండం శ్రీమన్నారాయణుడి స్థూలశరీరం. అందువల్ల బ్రహ్మాండాన్ని గురించి ఎవరు వర్ణించినా, ఎవరు

వినినా వారికి సకల శుభాలు కలుగుతాయి.

ఈశ్వరుడి యొక్క స్థూలశరీరం గురించి తెలిసినవాళ్లకు శ్రద్ధతో, భక్తితో సూక్ష్మశరీరం తెలుసుకొనే స్థితి ఉంటుంది. భగవంతుడైన శ్రీహరి యొక్క స్థూలశరీరమైన – భూమి, ద్వీపాలు, వర్షాలు, భూమిపై నదులు, పర్వతాలు, అంతరిక్షం, సముద్రాలు, పాతాళం వరకు ఉండే భూమి అడుగు భాగాలు, నరకాలు, నక్షత్రాలు, వాటిల్లో ఉండే సకల జీవ సమూహాలు, ఆయా అద్భుతాలన్నీ – నీకు వినిపించాను."

ఈ చరాచరసమస్తంలోనూ వ్యాపించి ఉన్న శక్తి శ్రీమహావిష్ణునే అని గ్రహించు. ఆ సర్వేశ్వరుని పాదపద్మాలను ఎల్లవేళల ధ్యానించుకొనేవారు ఆ కైవల్యపదాన్ని చేరుకొంటారు. నువ్వు భాగవతోత్తముడివీ, శ్రీమన్నారాయణుడే పరమదైవమని నమ్మినవాడివీ కనుక నీకు ఇంత వివరంగా చెప్పాను. ఈ పరమపుణ్యదాయకమైన కథను విన్నవాడు సర్వపాపాల నుంచి విముక్తుడై వైకుంఠవాసాన్ని పొందుతాడు."

అని సూతుడు శౌనకాదిమహామునులకు చెప్పాడు.

చ. జలజభవాదిదేవ మునిసన్నుత తీర్థపదాంబుజాత! ని
ర్మల నవరత్న నూపురవిరాజిత! కౌస్తుభ భూషణాంగ! యు
జ్జ్వల తులసీ కురంగ మదవాసన వాసిత దివ్యదేహ! శ్రీ
నిలయ శరీర! కృష్ణ! ధరణీధర! భాను శశాంకలోచనా!



తా ॥ బ్రహ్మ, దేవతలు, మహర్షులు – వీరందరూ కొనియాడేవాడా! తీర్థాలన్నీ నీ పాదపద్మంలో ప్రభవింపచేసినవాడా! స్వచ్ఛమైన నవరత్నాలు పొదిగిన నూపురంతో ప్రకాశిస్తున్నవాడా! శ్రీకౌస్తుభాన్ని అలంకారంగా దాల్చినవాడా! ఉజ్జ్వలమైన తులసి, మందారమాలికల సువాసనలతో ఉన్న దివ్యదేహం కలవాడా! లక్ష్మీదేవికి నిలయమైన శరీరం

కలవాడా! భూమిని ధరించేవాడా! సూర్యచంద్రులు కన్నులుగా గలవాడా! శ్రీకృష్ణా నీకు వందనం.

క. శ్రీ తరుణీ హృదయస్థిత!, పాతకహర! సర్వలోకపావన! భువనా
తీత గుణాశ్రయ! యతి వి, ఖ్యాత! సురార్చిత పదాబ్జ! కంసవిదారీ!

166

తా ॥ లక్ష్మీదేవి యొక్క హృదయంలో నెలకొని ఉన్నవాడా! పాపాలను పోగొట్టేవాడా! అన్ని లోకాలను పవిత్రం చేసేవాడా! లోకాతీతమైన గుణాలకు ఆశ్రయమైన వాడా! అత్యంతము విఖ్యాతియైనవాడా ! దేవతలచే మ్రొక్కబడే పాదపద్మములు కల్గినవాడా! కంసుణ్ణి చీల్చినవాడా! శ్రీకృష్ణా నీకు నమస్కారం.

మ.కో.
దండితారిసమూహ! భక్తినిధాన! దానవిహార! మా
ర్తాండ మండల మధ్య సంస్థిత! తత్త్వరూప! గదాసి కో
దండ శంఖ సుదర్శనాంక! సుధాకరార్క సునేత్ర! భూ
మండలోద్ధరణార్త పోషణ! మత్తదైత్య నివారణా!

167

తా ॥ శత్రువులందరిని దండించినవాడా! భక్తులకు తావైనవాడా! దానమందు విహరించేవాడా! సూర్యమండలాంతర్వర్తియైనవాడా! తత్త్వరూపుడా! గద, ఖడ్గం, కోదండం, శంఖం, సుదర్శనం – ఇవి చిహ్నములుగా ఉన్నవాడా! చంద్రసూర్యులే నేత్రములుగా గలవాడా! భూమండలాన్ని ఉద్ధరించి ఆపన్నులను పోషించినవాడా! మదించిన రాక్షసుల్ని అణచినవాడైన శ్రీకృష్ణునకు వందనం.

గద్యము

ఇది శ్రీ సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత మహాపురాణంబునందు భరతాత్మజుండయిన సుమతికి రాజ్యాభిషేకంబును, బాషండ దర్శనంబును, సుమతి పుత్ర జన్మ విస్తారంబును, గయుని చరిత్రంబును, గయుని సంస్తుతియు, భూద్వీప వర్ష సరిదద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారకాగణ సంస్థితియు నను కథలు గల పంచమ స్కంధంబునందు ద్వితీయాశ్వాసము.

168

తా ॥ ఇది శుభంకరులైన కవులందరకు ఆనందాన్ని ఇచ్చేవాడు, బొప్పన మంత్రి గారి కొడుకు అయిన గంగన వ్రాసిన శ్రీమద్భాగవత మహాపురాణంలోని – భరతుని కొడుకైన సుమతికి రాజ్యాభిషేకం, పాషండ దర్శనం, సుమతి పుత్రుల జన్మవివరణ, గయుని చరిత్ర, గయుని సంస్తుతి, భూమండలం, ద్వీపాలు, వర్షాలు, నదులు, పర్వతాలు, అంతరిక్షం, సముద్రాలు, పాతాళాది లోకాలు, దిక్కులు, నరకాలు, నక్షత్రాలు వీటన్నింటి సంస్థితి అనే కథలు ఉన్న ఐదవ స్కంధంలోని రెండవ ఆశ్వాసం.

శ్రీ వత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్థ్సల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాత భూ
దేవేంద్రాది సమస్తదేవ మకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.

1

తా ॥ శ్రీవత్సమనే పుట్టుమచ్చతో శోభిల్లువాడు, కౌస్తుభమనే మణితో ప్రకాశించువాడు, లక్ష్మీదేవికి స్థానమైన అందమైన వక్షస్థల వైభవంతో వెలుగొందువాడు, నీలవర్ణుడు, రాజీవాక్షుడు, పద్మసంభవ, దేవేంద్రాది సమస్త దేవతల కిరీటాలలోని రత్నప్రభలతో వెలుగొందు పాద సరోజములు కలవాడు, కృపకు స్థానమైనవాడు అయిన శ్రీమహా విష్ణువును నుతిస్తున్నాను.

# 1. ఉపోద్ఘాతం

ఉ. నిండుమతిం దలంతుఁ గమనీయ భుజంగమ రాజమండలీ
మండనుఁ జంద్రఖండ పరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారు కో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్.

2

తా ॥ కమనీయము, శ్రేష్ఠము అయిన సర్పరాజులను అలంకరించుకున్నవాడు, చంద్రరేఖతో ప్రకాశించే జటాజూటం కలవాడు, మల్లెపువ్వువలె తెల్లని శరీర వర్ణం కలవాడు, దుష్టులను శిక్షించేవాడు, హేమాచలాన్ని కోదండంగా ధరించినవాడు, మదించిన ఏనుగు వంటి బలంకల గజాసురుడనే రాక్షసుడిని సంహరించినవాడు, భక్తులను రంజింపచేయువాడు అయిన మహేశ్వరుణ్ణి పరిపూర్ణ విశ్వాసంతో నా మనస్సులో సేవించెదను.

ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతా కులో
త్తంసము నాగమాంత విదిత ధ్రువపుణ్య రమావతంసముం
గంసజిఘాంసు నంశమును గర్బురసూత్ర సమావృతాంసమున్
హింస నడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్.

3

తా ॥ హంస వాహనమైనవాడు, పరమహంస అయినవాడు, దేవతా కులానికి సిగబంతి అయినవాడు, ఉపనిషత్తులచేత తెలుపబడిన శాశ్వత పుణ్యలోకములకు నివాసమైనవాడు, కంసుని సంహరించిన వాసుదేవుని అంశావతారమైనవాడు, బంగారు యజ్ఞోపవీతములు ధరించినవాడు హింసా రహితుడయిన విధాతను శాశ్వత శుభములకై సేవించెదను.

ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచిత భక్తఫల ప్రదాయకున్
మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్.

4

తా ॥ కుడుము హస్తమునందు కలవానిని, ఎలుక వాహనంగా కలవానిని, ఏకదంతుని, వ్రేలాడుతూన్న పొట్ట కలవానిని, పార్వతీదేవి యొక్క కుమారుడైన వానిని, శాశ్వతమైన పుణ్యమూర్తిని, దేవతలకు మిక్కిలి సంతోషము కలిగించువానిని, ఏనుగు తల కలవానిని, భక్తులకు ఫలములు ఇచ్చు వానిని నేను సేవిస్తున్నాను. అట్టి గణనాథుడు సంతోషంతో చేతులు మోడ్చి కొలిచిన దానికి నా కోరికలను నెరవేర్చు గాక!

ఉ. కల్లతనంబు గాక పొడగట్టిన పూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నత తేజముతోడ భక్తి రం

జిల్లిన చూపుగూడ విధిఁ జెందిన ప్రోఢ బుధాళి నీడ మా

తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ!

5

తా ॥ తల్లీ! దయామయీ భారతీ! నువ్వు ఒకప్పుడు నాకు దర్శనమిచ్చావు. ఇప్పుడు కూడా అలాగే నా మనస్సులో తేజోరూపిణివై ఉండవమ్మా! భక్తి రంజిల్లే చూపుతో విధాతను చేపట్టిన సమర్థురాలవు, పండితులకు తోడు నీడవు అయిన నీవు ఆశ్రితుల కల్పవల్లివి.

క. విలస త్కంకణరవరవ, కలితం బగు నభయ వరద కరములు బెరయం

జెలరేఁగి భక్తులకు నల, కలుములు దయసేయు జలధికన్యకఁ దలఁతున్.

6

తా ॥ అభయ హస్తము, వరద హస్తము రెండు హస్తములు కంకణ రవముతో ప్రకాశించగా భక్తులకు సిరి సంపదలను ఇచ్చు జలధి కన్యక అయిన శ్రీమహాలక్ష్మిని తలుస్తాను.

క. కాళికి బహుసన్నుత లో, కాళికి కమనీయ వలయ కరకీలిత కం

కాళికిఁ దాపస మానస, కేళికి వందనము సేసి కీర్తింతు మదిన్.

7

తా ॥ కాళికా దేవికి, లోకాలన్నిటి చేత కీర్తింపబడే తల్లికి, కమనీయ కాంచన కంకణములు సొగసుగా ధరించిన హస్తములో కపాలమును ధరించే అమ్మకు, తపోధనుల మనస్సులో సంచరించే మాతకు నమస్కరించి మనస్సులో కీర్తిస్తాను.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు సేసి.

8

చ. పరమసమాధిధుర్యుఁ బటు పావనకర్మ విధేయ దేవతా

వర నర వంద్యు సద్విమలవాక్కు జనార్దన కీర్తన క్రియా
భరణ సమర్థు వేద చయ పారగు భవ్యుఁ ద్రికాలవేది భా
సురమతిఁ గొల్చు టొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్.

9

క. వ్యాసుని భగవ త్పదసం, వాసుని నాగమ పురాణ వర విష్ణుకథా
వాసుని నిర్మల కవితా, భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిన్.

10

తా ॥ అని ఇష్ట దేవతలను ప్రార్థించి పిమ్మట త్రికాలవేది బుధశోభితుడు పుణ్యుడు పరాశరాత్మజుడు అయిన వేదవ్యాసుని పాదపద్మాలను మనస్సులో భావిస్తాను. ఆ మహానుభావుడు ఎల్లప్పుడూ సమాధియందు ఉంటాడు. పావనమైన కర్మలను ఆచరిస్తూ ఉంటాడు. నరులకు దేవతలకు నమస్కరింప తగినవాడు. విమలమైన వాక్కు కలవాడు. ఎప్పుడూ జనార్దనుని యొక్క గుణములను కీర్తించేవాడు. వేద పారంగుడు. ఎప్పుడూ సత్యమునే పలుకువాడు. భూతభవిష్యవర్తమానములు తెలిసిన వాడు. ఆగమములు పురాణములు చెప్పినవాడు, విష్ణుకథలను చెప్పినవాడు. నిర్మలమైన కవిత్వమును చెప్పగలవాడు.

సీ. వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థ వైభవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణ మయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లక భారవి మాఘుల ఘన సుధా మధుర వాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షము గొల్చి నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

తే. వెలయఁ దిక్కన సోమయాజుల భజించి, యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి
సుకవిసోముని నాచన సోము నెఱఁగి, కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి.

11

తా ॥ శ్రేష్ఠమైన కవిత్వం చెప్పిన ఆదికవి వాల్మీకి మహర్షిని కొనియాడుతాను. భాగవతం యొక్క వైభవాన్ని లోకానికి తెలియ చేసిన శుకయోగిని ప్రార్థిస్తున్నాను. బాణుని, మయూరుని, వారి ప్రతిభను కొనియాడుతాను. భాసుడు, సౌమిల్లకుడు, భారవి, మాఘుడు వీరి యొక్క అమృతోపమానమైన వాక్కులను మరీ మరీ తలుస్తాను. మహాకవి కాళిదాసు అనే కల్పవృక్షమును కొలుస్తాను. నన్నయ భట్టారకుని వర్ణనలను ఇష్టపడి పొగడుతాను. తిక్కన సోమయాజిని భజిస్తాను. ఎఱ్ఱనామాత్యుని, భాస్కరుని ప్రస్తుతిస్తాను. కవి చంద్రుడైన నాచన సోమనాథుని మిక్కిలి గౌరవిస్తాను. కవి మనోనాథుడైన శ్రీనాథ మహాకవి ఘనతకు నా కైమోడ్పులు.

ఉ. ఎమ్మెలు సెప్పనేల? జగ మెన్నఁగఁ బన్నగరాజ శాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తి లో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజు కవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

12

తా ॥ నేను కేవలం కవిత్వం విలాసం కోసం అనటం లేదు. లోకం అంతా మెచ్చగా ఆదిశేషువుపై శయనించే వానికి సమర్పించిన ధనంగా తన కవితాసంపదను సమర్పించిన వానికి, భక్తితో నమ్మిన వానికి, భాగవతుడైన వానికి, పరమ నిష్ఠతో భాగవతమును వ్రాసిన వానికి, కవి పట్టపు రాజు అయిన వానికి బమ్మెర పోతరాజుకి నేను మ్రొక్కుతాను.

## 2. కృతిపతి నిర్ణయము

వ. అని సకల సుకవి నికరంబులకు ముకుళిత కరకమలుండనై.

13

ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతి కారణం
బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మి రూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్య మంత్రమున్.

14

తా ॥ సకల సుకవి సమూహానికి చేతులు జోడించి నమస్కరిస్తున్నాను. ఏది కర్మబంధాలన్నింటిని హరిస్తుందో, ఐశ్వర్యాన్ని ఏది ఇస్తుందో, పూర్వ కాలం నుండి సన్మునీంద్రుల కవితా సంపదకు ఆశ్రయమైనది ఏదో, మంత్రాలన్నింటిని ఏలినది ఏదో మోక్షలక్ష్మికి రూపు ఏదో అట్టి భాగవతమనే మంత్రాన్ని పలుకుతాను.

వ. అని శ్రీమహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియింపంబూని మదీయ కవితామహాలక్ష్మికి నారాయణుండె నాథుఁడగుటంజేసి యీ కృతి కృష్ణార్పణంబుఁ జేసితి. అది యెట్లనిన, నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండొక నై యుండ నొక్కనాఁడు దివంబున.

15

తా ॥ ఇప్పుడు నేను శ్రీమహా భాగవత పురాణంలోని ఆరవ స్కంధాన్ని ఆంధ్ర భాషలో రచించడానికి తలపెట్టాను. నా కవితా మహాలక్ష్మికి నారాయణుడే నాథుడయిన కారణంగా ఈ కృతిని కృష్ణార్పణం చేస్తున్నాను. దీనికి కారణమేమంటే... నేను విద్యాభ్యాసం చేస్తూన్న రోజులలో ఒకనాడు....

చ. కలిత విశేషవస్త్రములు గట్టి హిమాంబు సుగంధ చందనం
బలఁది వినూత్న భూషణము లారయఁ దాల్చి వినోదలీల నిం
పుల మృదుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం
గలయఁ దటిద్విలాసములు గట్టిగ నొక్కట నిల్చు పోలికన్.

16

తా ॥ విలువైన వస్త్రములు ధరించి పన్నీరు కలిపిన మంచి గంధాన్ని అలది నూతనమైన భూషణములను ధరించి మృదువయిన శయ్యపై నిద్రిస్తున్నాను. ఆ నిద్రలో దట్టమైన మెరుపులు ఆకాశంలో కనిపిస్తూన్నట్లు కలగన్నాను.

సీ. ఉరవడి ప్రాగ్వీథి నుదయించు మార్తాండ కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహర బ్రహ్మల యాత్మలలో నుబ్బి కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకర కర తీవ్ర గతినిఁ గరంగుచు హేమాద్రి సోగ పెల్లెగసినట్లు
ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి సుషిరంపు వెలిదల చూపినట్లు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెల్ల నూఁదినట్లు, తేజ మెసఁగంగ నా మ్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ, జూచి యిట్లని పలికె మంజులముగాను.

17

తా ॥ ఎలా ఉంది ఆ స్వప్నం? కోటి సూర్య బింబములు తూర్పుదిక్కున ఉదయించినట్లుగా ఉంది. హరి, హరుడు, బ్రహ్మ.... ఈ ముగ్గురి ఆత్మలలో ఉన్న కరుణ మూర్తీభవించి ఒక రూపం ధరించినట్లు ఉంది. సూర్యకిరణముల వేడికి కరిగి హేమాద్రి ప్రవహించినట్లు ఉంది. ఆదిశేషువు పడగల మీది మణిగణముల యొక్క కాంతులు వెలికి వచ్చినట్లుగా ఉంది. ఈ విధంగా నా ముందు దివ్యవాణి సాక్షాత్కరించి మంజులంగా ఇలా పలికింది:

ఉ. ఆటలు పాటలుం జదువు లద్భుతముల్ విననొప్పు వాద్యముల్
సాటి దలంపరాని బలుసాములు మున్నగు విద్యలెల్ల నీ
కాటలు పాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁగిడ్డ భంగి నా
చాటునఁ జాటుకారపద సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్.

18

తా ॥ "నీ ఆటలు పాటలు చదువులు అద్భుతం. ఇక నువ్వు వాయించే వాద్యాలు ఇంకా వినాలనే ఉంటుంది. సాటిలేని సాముగరిడీలు నీకు ఆటపాటలు అయ్యాయి. అన్నిటికీ మెరుగుపెట్టే విధంగా నా ఆశీర్వచనంతో నువ్వు సాధు కవిత్వాన్ని చెప్పు"

వ. అని యానతిచ్చు జగన్మాతృ కృపావలోకన సుశ్లోకుండనై యే నొక శ్లోకంబు నా క్షణంబు నొడివితి. అది యెట్టి దనిన.

19

తా ॥ అని ఆనతిచ్చిన జగన్మాత యొక్క కృపా కటాక్ష వీక్షణాల వలన ఆ క్షణంలో ఒక శ్లోకం నా నోట్లోంచి వచ్చింది. ఆ శ్లోకం ఏమిటి అంటే....

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ, నారాయణాయ నిఖీలాయ నిరాశ్రయాయ
।
స త్సంగ్రహాయ సగుణాయ నిరీశ్వరాయ, సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే ॥

20

తా ॥ పరమహంస స్వరూపుడు, సత్త్వ నిలయుడు, సదాశ్రయుడు, నారాయణుడు, సర్వము తానైనవాడు, నిరాశ్రయుడు, అన్ని గుణములు తానే అయినవాడు, నిరీశ్వరుడు, సంపూర్ణుడు, పుణ్యపతి అయిన నారాయణునకు నమస్కారము.

వ. ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె. అంత మేలుకాంచి యానంద భరితుండ నై నాఁటనుండి, చంద్రానుగత యగు చంద్రికయుం బోలె, నారాయణాంకితం బైన కవిత్వ తత్త్వ జ్ఞానంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని.

21

ఆ. పలుకఁ గలిగె మొదలు భాగవతార్థంబు, భర్త కృష్ణుఁ డాయె భాగ్య మొదవె
నమృతరసము గోర నలరు చింతామణి, పాత్ర సంభవించు భంగి నిపుడు.

22

తా ॥ నా శ్లోకాన్ని ఆ దేవి అంగీకరించింది. తర్వాత నిద్రనుంచి మేలుకొని ఎంతో ఆనందాన్ని పొందాను. చంద్రునితో పాటు వెన్నెల అన్నట్లుగా నారాయణ పరంగా కవిత్వ తత్త్వం అర్థమైంది. దానికి ఫలంగా శ్రీకృష్ణుని మనస్సులో పెట్టుకున్నాను. భాగవతాన్ని ఆంధ్రభాషలో వ్రాసే అదృష్టం లభించింది. దానికి కృతిభర్తగా కృష్ణపరమాత్మ అయ్యే భాగ్యం లభించింది. ఇది ఎలా ఉందంటే అమృత రసాన్ని కోరితే ఆ అమృత రసం చింతామణి పాత్రతో సంభవించినట్లుగా ఉన్నది.

ఆ. భాగవతము తేటపఱుప నెవ్వఁడు సాలు, శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క
బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత, భక్తి నిగిడినంత పలుకువాఁడ.

23

తా ॥ భాగవతాన్ని తేటపరచడానికి ఎవడు సరిపోతాడు? ఒక్క శ్రీశుకుడు తప్పితే లేదా ఆ శ్రీకృష్ణ పరమాత్మ అయి ఉండాలి. అందుచేత ఏదో నా బుద్ధికి తోచినంత, పండితులు చెప్పగా విన్నంత, నా భక్తికి అర్థమైనంత మేరకు పలుకుతాను.

ఉ. పుట్టిననాఁట నుండియును బుట్టద యెట్టియ దట్టు నైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శుభం బగు మద్వరవాక్యసీమకుం

బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పుదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్.

24

తా ॥ నేను పుట్టిన రోజు నుండి గర్వం అనేది ఎరుగను. శ్రీహరిని ఎవరు నుతిస్తారో వారికి అన్నీ శుభాలే కలుగుతాయి. ఆ కారణంగా శ్రేష్ఠమైన నా భాగవత రచనను ఆయనకే పట్టం కట్టాను. హరిని విడిచిపెట్టకుండా ఆయన కథామృతాన్ని నేను ఎంతో చక్కగా చెబుతాను. బుధోత్తములు వీనుల విందుగా గ్రోలండి.

వ. అని,

25

## 3. గ్రంథకర్త వంశ వర్ణనము

సీ. శ్రీవత్స గోత్రుండు శివభక్తి యుక్తుఁ డాపస్తంబ సూత్రుఁ దపార గుణుఁడు
నేర్చూరి శాసనుం డెఱ్ఱన ప్రెగ్గడ పుత్త్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగు నాదెయామాత్యునకుఁ బోలమాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి సింగధీమణియు నంచితగుణాఢ్యు

తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ, సొరిది మూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువన ప్రభువునకును, ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె.

26

తా ॥ ముందుగా నా వంశాన్ని గురించి చెబుతాను. శ్రీవత్స గోత్రుడు, శివభక్తుడు, ఆపస్తంభ సూత్రుడు, సుగుణుడు అయిన ఎఱ్ఱనామాత్యుడు ఏర్చూరుకు శాసకుడు. ఎఱ్ఱన కుమారుడు పుణ్యమూర్తి అయిన వీరన. ఆ వీరన కుమారుడు నాదయామాత్యుడు. ఆయన భార్య పోలమాంబ. ఆ దంపతులకు కసువనామాత్యుడు, వీరన్న, సింగన్న అనే ముగ్గురు పుత్రులు జన్మించారు. ఆ మూర్తిత్రయం చక్కని కీర్తితో వెలుగొందారు. అందులో కసువనామాత్యునకు ముమ్మడమ్మ అనే సాధ్వి భార్యగా అలరారింది.

ఉ. ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీఁడగా
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్ళి, కల్ల మా
టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటి యే
చేడియ లేదు చూరికుల శేఖరు కస్వయ ముమ్మడమ్మకున్.

27

తా ॥ ముమ్మడమ్మ భర్త మాటకు ఎప్పుడు ఎదురు చెప్పదు. ఇంటికి వచ్చిన చుట్టాలు వెంటనే వెళ్ళిపోయేటట్లు ఎప్పుడూ మాట్లాడదు. అవసరానికి మించి అధికంగా మాట్లాడదు. ఇల్లు

విడిచి వెళ్ళి పొరుగు వారితో కల్ల మాటాడదు. ఏర్చూరి కులశేఖరుడైన కసువనామాత్యుని భార్య అయిన ముమ్మడమ్మకు ఇందిరాదేవి సాటిగాని ఇతరులెవరూ కారు.

క. ఆ కసువయమంత్రికిఁ బు, ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మయు మము న
వ్యాకుల చిత్తుల నిరువుర, శ్రీకర గుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్.

28

తా ॥ ఆ కసువయ మంత్రికి పుణ్యవతి అయిన ముమ్మడమ్మకు మేము ఇరువురు పుత్రులం కలిగాము. మేము ఏ విషయంలోను వ్యాకులత్వం లేకుండ స్థిరమైన చిత్తం కలవారము. సద్గుణ సంపన్నులం. పుణ్యశీలురము.

క. అంగజసమ లావణ్య శు, భాంగుల హరి దివ్యపద యుగాంబుజ విలస
ద్భృంగాయమాన చిత్తులు, సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్.

29

తా ॥ మేము ఇరువురము మన్మథునితో సమానమైన సౌందర్యం కలవారము. హరి యొక్క దివ్యమైన పదముల యందు తుమ్మెదవలె సంచరించే మనస్సు కలవారము, నా పేరు సింగయ. నా తమ్ముని పేరు తెలగయ.

క. అం దగ్రజుండ శివపూ, జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని
ష్యంది పటు వాగ్విలాసా, నందోచిత మానసుఁడను నయకోవిదుఁడన్.

30

తా ॥ ఆ ఇద్దరిలోను నేను పెద్దవాడిని. శివపూజలో విలసిల్లువాడిని. విష్ణు చరితం అనే అమృతం స్రవించు వాగ్విలాసానందంలో మునిగి తేలే మనస్సు కలవాడిని. చాలా మృదుస్వభావిని.

వ. కావునం గృష్ణపాదారవింద సందర్శ నాదర్శతలాయమాన చిత్తుండ నై.

31

తా ॥ అట్టి నేను కృష్ణుని యొక్క పాదారవిందములను సందర్శించాలనే సంకల్పంతో నా హృదయాన్ని అద్దంవలె స్వచ్ఛంగా తీర్చి దిద్దుకున్నాను.

## 4. షష్ఠ్యంతములు

క. శ్రీపతికి మత్పతికి నుత, గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం తాప నివారణ మతికినిఁ, బ్రాపితసనకాది తతికి బహుతర ధృతికిన్.

32

తా ॥ లక్ష్మీదేవికి ప్రాణనాథుడు, నాకు అధీశ్వరుడు, నుతింపబడిన గోలోకాధీశ్వరుడు, మూడు లోకాలకు అధిపతి అయినవాడు, గురుజనులు, బుధులు వీరి సంతాపాన్ని పోగొట్టేవాడు, సనక సనందనాది మహర్షులకు ఆశ్రయమైనవాడు, ఈ లోకాలను ధరించేవాడు అయిన శ్రీకృష్ణునకు– (ఈ కృతి సమర్పణం గావిస్తున్నాను)

క. హరికి గురు కలుషకుంజర, హరికి బలాభీలహరికి నంతస్థ్సిత గ
హ్వరికి నరహరికి రక్షిత, కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్.

33

తా ॥ హరికి, భయంకరమైన పాపాలనే ఏనుగులను సింహంవలె చీల్చి చెండాడే వానికి, తన బలం చేత ఇంద్రుని గర్వమును అణచివేసిన వానికి, సజ్జనుల అంతరంగాలలో చరించే వానికి, నరసింహ స్వరూపునికి, గజేంద్రుణ్ణి రక్షించిన వానికి, కొనగోటితో గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన వానికి, ఆది వరాహావతారుడు అయిన శ్రీకృష్ణునకు– (ఈ కృతి సమర్పణం గావిస్తున్నాను)

క. గుణికి సమాశ్రిత చింతా, మణికి మహేంద్రాది దివిజమండల చూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా, ఫణికి నురోభాగ కౌస్తుభ ప్రియమణికిన్.

34

తా ॥ సమస్త సుగుణములు కలవానికి, తనను ఆశ్రయించిన వారికి చింతామణి వంటి

వానికి, ఇంద్రాది దేవతలకు చూడామణి వంటి వానికి, ఆదిశేషువును శయ్యగా చేసుకొని శయనించే వానికి, వక్షస్థలమందు కౌస్తుభమును ధరించే శ్రీకృష్ణునకు– (ఈ కృతి సమర్పణం గావిస్తున్నాను)

క. కంసాసుర సంహారున, కంసాంచిత కర్ణకుండ లాభరణునకున్
హింసాపర పరమస్తక, మాంసకరాళిత గదాభిమత హస్తునకున్.

35

తా ॥ కంసుడు అనే రాక్షసుని సంహరించిన వానికి, భుజములను స్పృశించు కర్ణకుండలములు ఆభరణములుగా కలవానికి, హింసా పరులయిన శత్రువుల శిరస్సులను చితకబాది ఆ మాంస ఖండములతో కూడిన గదాదండమును హస్తమునందు ధరించిన శ్రీకృష్ణునకు– (ఈ కృతి సమర్పణం గావిస్తున్నాను)

క. వరయోగిమానసాంతః, కరణ సుధాంభోధి భావకల్లోల లస
త్పరతత్త్వ శేషశాయికిఁ, జిరదాయికి సకలభక్త చింతామణికిన్.

36

తా ॥ శ్రేష్ఠమైన యోగీశ్వరుల అంతఃకరణమనే పాల సముద్రములో భావ తరంగాలలో తేలియాడు పరతత్వవాసికి, భక్తులకు చింతామణివంటి శ్రీకృష్ణునకు– (ఈ కృతి సమర్పణం గావిస్తున్నాను)

## 5. కథా ప్రారంభము

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన షష్ఠస్కంధంబునకుం గథా ప్రారంభక్రమం బెట్టిదనిన, హరి చరణస్మరణ పరిణామ వినోదు లయిన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాస నిర్ణయ విఖ్యాతుండైన సూతుం డిట్లనియె.

37

తా ॥ కృష్ణసమర్పితమయ్యేదైన మహా భాగవతంలోని షష్ఠ స్కంధాన్ని ప్రారంభిస్తున్నాను. శ్రీహరి పాదములను స్మరించటం వలన సంతుష్టులయిన శౌనకాదులతో పురాణ ఇతిహాసములను చెప్పటంలో విఖ్యాతుడయిన సూతుడు ఇలా అన్నాడు:

క. శ్రీరమణీ రమణ కథా, పారాయణ చిత్తుఁడగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున, సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్.

38

తా ॥ "శ్రీమన్నారాయణుని కథలను పారాయణం చేస్తూ పరీక్షిన్నరేంద్రుడు ఆదరంతో ఆనంద సాంద్రుడయిన శుక యోగీంద్రుని ఇలా అడిగాడు:

సీ. షడ్గుణైశ్వర్య శాశ్వతమూర్తి వైనట్టి మునినాథ! దయతోడ ముక్తిపదము
మున్నుగా నే మార్గమును వినిపించితి వారయ నపవర్గ భూరిమహిమఁ
గ్రమ యోగసంభవ బ్రహ్మంబు తోడన యనుహొంద నగు నవి వినుతి కెక్క
మఱియు సత్త్వరజ స్తమః ప్రభావంబులఁ గడిఁదియై యున్నట్టి కర్మచయము

తే. నప్పటప్పటి కణఁగని యట్టి ప్రకృతిఁ, గలుగు పురుషుని భోగార్థఘటన దేహ
కారణారంభరూప మార్గంబు మొదలు, మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ.

39

తా ॥ ఐశ్వర్యము, ధైర్యము, కీర్తి, తేజస్సు, జ్ఞానము, వైరాగ్యము అనే ఆరు గుణములతో వెలుగొందే మునినాథా! దయతో ముక్తి మార్గాన్ని గూర్చి నాకు వినిపించావు. నివృత్తి మార్గంలో మానవుడు జ్ఞానయోగం ద్వారా బ్రహ్మ సాయుజ్యాన్ని పొందుతాడని చెప్పావు. మానవుడు సత్త్వరజస్తమో గుణముల వల్ల ప్రకృతికి లొంగి అనేక దుష్కర్మలు ఆచరిస్తాడు. దాని వలన అనేక జన్మలను ఎత్తి సంసార బంధాల్లో చిక్కుకొంటాడు. ఇట్టి ప్రవృత్తి మార్గాన్ని నాకు చెప్పావు.

వ. మఱియు ననేక పాపలక్షణంబులగు నానావిధ నరకంబులును వాని కాద్యంతంబులును, స్వాయంభువ సంబంధియగు మన్వంతరంబును, బ్రియవ్రతోత్తానపాదుల వంశంబును, దచ్చరిత్రంబును, ద్వీప వర్ష సముద్రాద్రి న ద్యుద్యాన వనస్పతులును, భూమండల సంస్థానంబును, వాని పరిమాణంబును, జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును, విభుండైన పరమేశ్వరుం డె వ్విధంబున నిర్మించె, నా విధం బంతయు నెఱింగించినాఁడవు. ఇప్పుడు.

40

తా ॥ ఇంకా అనేక పాప లక్షణాలు, నానావిధ నరకములు వానికి ఆది – అంతములు గురించి చెప్పావు. స్వాయంభువ మన్వంతరం, ప్రియవ్రత ఉత్తానపాదుల వంశం వాళ్ళ చరిత్ర గురించి వివరించావు. ద్వీపములు నవవర్షములు సముద్రములు నదులు ఉద్యానములు, వృక్ష విశేషములు కుల పర్వతములు వాటి గురించి ఎరిగించావు. భూమండలం దాని పరిమాణం జ్యోతిశ్చక్రం కదిలే తీరు, అసలు ఈ సృష్టిని అంతా పరమేశ్వరుడు ఎలా నిర్మించాడో ఆ విధం అంతా చెప్పావు.

తే. కడిఁది వేదనలకుఁ గారణంబై యుండు, గుఱుతు లేని నరక కూపరాశి
పాలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు, పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య!

41

తా ॥ పరమపుణ్య! శుకదేవా! వేదనలకు కారణభూతమైన నరక కూపంలో పడకుండా

నరుడు సుఖంగా ఉండే మార్గం నాకు చెప్పు స్వామీ!"

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

42

తా ॥ అని అడిగిన పరీక్షిన్నరేంద్రునితో శుకయోగీశ్వరుడు ఇలా అంటున్నాడు:

క. కట్టా! త్రికరణములచేఁ, బుట్టిన దురితముల నపుడు పొలియింపని యా
కట్టఁడి దేహం బుడిగినఁ, గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్.

43

తా ॥ "నరేంద్రా! మనస్సు, వాక్కు, శరీరము ఈ మూడింటిని త్రికరణములు అంటారు. ఈ మూడింటి చేత పుట్టిన పాపములు కారణంగా ఆ దేహం విడిచిపెట్టిన తరువాత ఆ జీవుడు నరక కూపంలో పడి బాధలు అనుభవిస్తాడు.

ఉ. కాపునఁ గాలకింకర వికారముఁ గానకమున్న మృత్యు దు
ర్భావన చిత్తమున్ వెడఁగుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్గుచుండి తన చెల్వము దప్పకమున్న మున్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ బాయుతెఱం గొనరింపఁగాఁదగున్.

44

తా ॥ కనుక వికారమైన ఆకారాలతో కాలకింకరులు కంటికి కనిపించక ముందే, మృత్యువు నన్ను మ్రింగబోతూన్నది అని మనస్సు జడత్వాన్ని పొందక ముందే, శరీరం పటుత్వాన్ని కోల్పోకముందే పావనమైన చిత్తంతో పాపాలను తొలగించుకొనే ఉపాయాన్ని ఆలోచించాలి.

క. కాలం బెడగని పాపము, మూలముఁ బెఱుపంగవలయు మును రోగములన్

దేలిన దోషము నెఱుఁగుచు, వాలాయము దాని నడఁచు వైద్యుని భంగిన్.

45

తా ॥ రోగం రావడానికి మూలకారణాన్ని కనిపెట్టి దానిని తగ్గించే వైద్యునివలె మానవుడు తన పాపాలకు మూలము తెలుసుకొని, కాలం వృథాకాకుండా దానిని నశింపచేసుకోవాలి."

సీ. అనవుడు నాతని కనియె భూకాంతుండు కనుకలి వినుకలి గలిగినట్టి
పాపము దనకు నొప్పని దని కని చాలఁ బరితృప్తుండయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది యారయ నెఱిఁగింపు మదియుఁగాక
కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ గావింపకుండుఁ దత్కర్మమెఱిఁగి

తే. యట్టి జనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన, నది ఫలింపనేర దని తలంతు
సలిలమందు మేలి మలినంబు వోవంగ గజము గ్రుంకువెట్టు గతియుఁ బోలె.

46

తా ॥ ఆ మాటలు విని పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు: "పాపాలను కళ్ళారా చూస్తూ, చెవులార వింటూ పాపములు చెయ్యకూడదు అని తీర్మానించుకుంటాడు. కానీ దానిని ఉల్లంఘించి తిరిగి పాపాలు చేస్తాడు. అటువంటి మూఢునికి పరిహారం ఏమిటి? అదీకాక మానవుడు ఒక్కొక్కప్పుడు పాపం చేస్తాడు. ఒక్కొక్కప్పుడు చెయ్యడు. అట్టి వాడు పుణ్యం చెయ్యడు, చేసినా అది ఫలించదు అని తలుస్తాను. ఏనుగు నీళ్ళలో మునిగినా దాని మలినం పోదు, అది చాలక మరింత దుమ్ము జల్లుకుంటుంది."

వ. అనిన శుకుం డిట్లనియె.

47

క. కర్మము కర్మముచేతను, నిర్మూలము గాదు తెలియనేరక తా నే
కర్మము సేసినఁ ద త్ప్రతి, కర్మం బొనరింప వలయుఁ గలుషవిదూరా!

48

తా ॥ అప్పుడు శుకుడు ఇట్లా అన్నాడు: "ఓ పుణ్యమూర్తీ! ఒక కర్మ చేసినందువల్ల వచ్చే ఫలితం వేరొక కర్మ చేసినందువలన నిర్మూలనం కాదు, అంటే తెలిసి చేసిన కర్మ అని అర్థం. తెలియక చేసిన కర్మఫలం ప్రాయశ్చిత్తం చేసుకొంటే నశిస్తుంది.

క. హితము గల కుడుపు మటి రు, గ్వితతులఁ బొడమంగ నీని విధమున నతి స
ద్వ్రతుఁ డైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్.

49

తా ॥ హితవైన భోజనం చేస్తే రోగాలు రాని విధంగా, సత్ప్రవర్తన కలవాడు నిర్మలమైన మనస్సుచే పాపాలను తొలగించుకుంటాడు.

చ. తపమున బ్రహ్మచర్యమున దానములన్ శమ సద్దమంబులన్
జపముల సత్యశౌచముల సన్నియమాది యమంబులన్ గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తను వాక్యజంపుఁ బా
పపు గుదిఁ ద్రుంతు రగ్ని శతపర్వ వనంబుల నేర్చుకైవడిన్.

50

తా ॥ తపస్సు చేత, బ్రహ్మచర్యము చేత, దానముల చేత, శమదమాదుల చేత, జపములు సత్య శౌచముల చేత, యమనియమముల చేత, ధర్మవర్తనులు మనోవాక్కాయ కర్మలకు చెందిన పాప సమూహాన్ని అగ్ని వెదురు డొంకలను కాల్చివేసినట్లుగా దహించి వేస్తారు.

వ. అదియునుం గాక.

51

ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమార పదారవింద జా

నంద మరందపాన కలనారత షట్పదచిత్తు లౌచు గో
విందపరాయణుల్ విమల వేషులు దోష మడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచు కైవడిన్.

52

తా ॥ అంతే కాకుండా కొందరు పుణ్యాత్ములు ఉంటారు. వారు శ్రీకృష్ణుని చరణామృత మకరందాన్ని పానం చెయ్యటంలో తుమ్మెదల వంటివారు. నిరాడంబరులైన ఆ గోవింద పరాయణులు తమ ఆత్మలో పెంపొందిన భక్తిచేత, రవి మంచును హరించునట్లుగా సమస్త దోషాలను అణచివేస్తారు.

క. మరి భక్తి చేతఁ గొందఱు, బరిమార్తురు. మొదలు ముట్టఁ బాపంబుల ని
ష్ఠురతర కరముల సూర్యుం, డరుదుగఁ బెనుమంచుఁ బించ మణఁచిన భంగిన్.

53

తా ॥ మరికొందరు సూర్యుడు తన ప్రచండ కిరణాలతో పెనుచీకటిని అణచివేసినట్లుగా తమ భక్తిచేత పాపములను నిర్మూలిస్తారు.

క దంతిపురనాథ! విను మొక, మంతన మెఱిఁగింతు శమ దమంబులు నంహో
వంతు శుభవంతుఁ జేయవు, కంతుని గురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్.

54

తా ॥ ఓ రాజా! విను! నీకు ఒక రహస్యాన్ని తెలియచెపుతాను. శ్రీహరి మీది భక్తి ముక్తిని కలిగించినట్లుగా శమదమాది సద్గుణాలు పాపాత్ముణ్ణి శుభవంతునిగా చెయ్యలేవు.

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండు వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తచరుల సేవించిన వాని కైవల్య మెవ్వనికి లేదు

వైకుంఠ నిర్మల వ్రతపరుం డై నట్టి, వాని కైవల్య మెవ్వనికి
లేదు సరసిజోదరు కథాశ్రవణ లోలుండైన వాని కైవల్య మెవ్వనికి లేదు

తే. లేదు తపముల బ్రహ్మచర్యాది నిరతి, శమ దమాదుల సత్యశౌచముల దాన
ధర్మసుఖముల సుస్థిర స్థానమైన, వైష్ణవజ్ఞాన జనిత నిర్వాణపదము.

55

తా ॥ రాజా! ఎవరైతే తన అర్థమును, ప్రాణమును హరికి అర్పిస్తారో వానికి లభించే కైవల్యం ఇతరులకు లేదు. శ్రీహరి యొక్క భక్తులను ఎవరు సేవిస్తారో వానికి లభించే కైవల్యం పరులకు లేదు. శ్రీహరి యొక్క నిర్మల వ్రతాన్ని ఎవరు ఆచరిస్తారో వానికి లభించే కైవల్యం ఒరులకు లేదు. శ్రీహరి యొక్క కథలను వినుటయందు ఎవరు ఆసక్తి కనబరుస్తారో వానికి లభించే కైవల్యం ఇతరులకు లేదు. తపస్సు వలన కాని, బ్రహ్మచర్యం వలన కాని, శమదమాదుల వలన కాని, సత్యశౌచముల వలన కాని, దానధర్మముల వలన కాని ప్రాప్తించని కైవల్యపదం ఒక్క విష్ణుభక్తి వల్లనే సంప్రాప్తమవుతుంది.

తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టి ముక్తి, వర్త్మ మీ లోకమందు నెవ్వనికిఁ గలదు?
సాధులును బుణ్యశీలురు సజ్జనులును, హరిపరాయణ తత్పరు లగుటఁ గాక.

56

తా ॥ సాధువులు, పుణ్యశీలురు, సజ్జనులు, హరిభక్తి పరాయణులయిన వారికేతప్ప పునరావృత్తం కానివ్వని ముక్తిమార్గం ఈ లోకంలో గల ఇతరులకు లభ్యం కాదు.

క. అరుదుగ నరహరి భక్తిం, బొరయని యా పురుషు సుకృతి పుంజంబులు వే
మఱు పుణ్యుఁ జేయ నేరవు, నరవర! మధుఘటముఁ బెక్కునదులుం బోలెన్.

57

తా ॥ ఓ రాజా! శ్రీహరి మీద భక్తిలేనినాడు ఆ పురుషుడు చేసిన ఎన్ని పుణ్యకార్యాలైనా వ్యర్థమే. ఎన్ని నదులలో ముంచినా మద్యభాండం పవిత్రం కానట్లు హరిభక్తిలేని పాపాత్ముడిని పుణ్యునిగా చెయ్యలేవు.

చ. సతతముఁ గృష్ణపాద జలజంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులు తదీయ శుద్ధ గుణరాగులు కాలుని యగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభటవర్గములం గలలోనఁ గానరే
గతులను దుష్టకర్మములు గైకొని రావలఁ జెందనేర్చునే?

58

తా ॥ ఓ రాజా! ఎల్లప్పుడూ కృష్ణపాద కమలములయందు మనస్సును నిలిపే సువ్రతులు, ఆయన గుణములయందు అనురక్తులు.... యముణ్ణి కాని, ఆయన భటవర్గంలోని వారిని కాని కలలో కూడ చూడరు. అట్టివారిని దుష్టకర్మలు ఏమాత్రము దరిచేరవు.

వ. కావున నీ యర్థంబునకుం బురాతనంబగు నొక్క యితిహాసంబు గలదు. అది విష్ణుదూత యమదూతల సంవాదం బనంబడు. దాని నెఱింగింతు. ఆకర్ణింపుము.

59

తా ॥ ఓ నరేంద్రా! ఈ అర్థాన్ని తెలియజేసే ప్రాచీనమైన ఒక ఇతిహాసం ఉంది. దానిని విష్ణుదూత – యమదూతల సంవాదము అంటారు. దానిని చెపుతాను విను!

# 6. అజామిళోపాఖ్యానము

సీ. నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁ గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగ
బాతకుం డతుల నిర్భాగ్యుం డవజ్ఞుండు నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబు లందును జౌర్యంబునందు మచ్చరము గలిగి
తొత్తును బత్నిగా మత్తుఁడై వరియించి కొడుకులఁ బదుగురం బడసి చాల

తే. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీర, బాల లాలనాది లీలఁ దగిలి
పెద్దకాల మతఁడు పెంపార సుఖీయించి, బలిత మెల్లఁ దొలఁగి పలితుఁడయ్యె.

60

తా ॥ రాజా! వినుము. పూర్వం కన్యాకుబ్జపురంలో అజామిళుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను చాలా పాతకుడు, నిందా చరిత్రుడు, అజ్ఞాని, ఆచార రహితుడు. జూదములయందు, దుర్వాదముల యందు దొంగతనముల యందు చాలా ఆదరం కలిగి ఉండేవాడు. ఒక దాసీదానిని భార్యగా చేసుకొని పదిమంది కొడుకులను కన్నాడు. మోహ సముద్రంలో పూర్తిగా మునిగి ఉంటూ, సంతానాన్ని పాలించటం లాలించటం ఇత్యాది గృహకృత్యాలలో మునిగిపోయాడు. చాలాకాలం సంసార సుఖంలో మునిగి తేలుతూ కొంత కాలానికి ముసలివాడయ్యాడు.

సీ. నిర్మలం బనఁ జాలనెఱయు చిత్తం బన నల్లని వెండ్రుకల్ తెల్లనయ్యెఁ
దగు మోహపాశ బంధంబు జాఱిన మాడ్కిఁ బొదలిన యంగంబు వదల వ్రాలె
నింద్రియంబుల కోర్కులిఁక నొల్ల ననుభంగి నుడుగక తల చాల వడఁకఁ జొచ్చెఁ
దమకంబు ప్రాయంబు దగిలిపోయిన మాడ్కి లోచనంబుల చూడ్కి నీచమయ్యె

తే. వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁదొడఁగెఁ జెదరె మనం బంతఁ, గడిఁది యైన ముప్పుకాలమునను.

61

తా ॥ మలినమై ఉన్న మనస్సు ఎప్పటికైనా నిర్మలం అవగలదు అనేలాగా అతని నల్లని వెంట్రుకలు తెల్లబడ్డాయి. మోహపాశ బంధాలు జారిన విధంగా శరీర అవయవాలు పట్టుదప్పసాగాయి. ఇంద్రియ వాంఛలు ఇక అక్కర లేదు అన్నట్లుగా తల వణకటం ప్రారంభమైంది. వయస్సుతో పాటే మోహం తరిగిపోయిన విధంగా కంటిచూపు తగ్గిపోయింది. ఉబ్బసం ఎక్కువయింది. దంతాలు ఊడిపోయాయి. దగ్గు ఆయాసం ఎక్కువయింది, తలనొప్పి ప్రారంభమైంది. మనస్సు చెదిరింది. ముసలితనం ముంచుకు వచ్చిన కాలానికి ఇవన్నీ వచ్చాయి.

తే. ఎనయ నతని కెనుబ దెనిమిది వర్షంబు, లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ
గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు, బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి.

62

తా ॥ అతనికి ఎనభై ఎనిమిది ఏండ్లు గడిచాయి. అయినా సంసారం మీద భ్రాంతి పోలేదు. తన చిన్న కొడుకైన నారాయణుడు అనేవాడు అంటే అతనికి చాలా ఇష్టం.

క. తన సతియుఁ దానుఁ గూరిమి, మనమునఁ బెనఁగొనఁగ న క్కుమారుని ననిశం
బును ముద్దు సేయుచుండెను, జనవర! వాత్సల్య మాత్మ సందడిఁ గొనఁగన్.

63

తా ॥ ఓ రాజా! తన భార్య, తను కూడా మనస్సులో ప్రేమభావం పొంగి పొరలగా ఆ కుమారుడిని ఎప్పుడూ ముద్దు చేస్తూ ఉండేవారు.

క. బాలునిఁ ముగ్ధవచోబుజు, ఫాలుని నిజ జనక బంధు పరిణామ కళా
శీలుని లోలతఁ గనుఁగొని, యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్.

64

తా ॥ ముద్దువచనాలు ఆడుతూ చక్కని ఫాలభాగం కలిగి తన తండ్రిని, బంధువులను సంతోష పెడుతూ ఉన్న ఆ బాలుని చూచి అజామిళుడు చాలా సంతోషపడుతూ ఉండేవాడు.

క. అత్యంత పాన భోజన, కృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత, మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై.

65

తా ॥ అన్నపానాదుల యందు, ఆటపాటల యందు ఆ బాలునితో పొత్తు కలిగి తనకు రాబోయే మృత్యువును సైతం గమనించలేక పోయాడు అజామిళుడు.

తే. తెలియ కీ రీతి నతఁడు వర్తింపుచుండ, భయద మగు మృత్యుకాలంబు ప్రాప్తమైన
భూరి వాత్సల్య వృత్తి న పుత్త్రుఁ దలఁచి, యాత్మఁ బ్రలపించు నారాయణా యటంచు.

66

తా ॥ ఇలా తెలియక వర్తిస్తూన్న అజామిళునకు భయంకరమైన మృత్యువు సంప్రాప్తమైంది. అప్పుడు ఎంతో వాత్సల్యంతో తన కన్న కొడుకును తలచుకొని "నారాయణా!" అని పెద్దగా అరిచాడు.

వ. అప్పుడు.

67

క. కింకరుల ధర్మరాజ వ, శంకరుల దురంత దురిత సమధిక జన నా
శంకరుల సకలలోక భ, యంకరులను గనియె నింద్రియాకులుఁ డగుచున్.

68

తా ॥ అప్పుడు సకల లోక భయంకరులు, పాపములు చేసినవాళ్ళని శిక్షించేవారు కింకరులు అయిన యమభటులు అతనికి కనిపించేసరికి అవయవాలదరగా భయంతో

కంపించిపోయాడు.

క. ఘాతకుల దండ దండిత, పాతకుల మహోగ్ర కర్మ భర నిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక, దూతక సంతతుల నతఁడు దూరమునందున్.

69

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠ వికారవక్త్ర విలస ద్గర్వేక్షణోపేతులన్
జన సంత్రాస కరోద్యతాయత సుపాశ శ్రేణికా హేతులన్
హననవ్యాప్తి విభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్.

70

తా ॥ జీవులను శిక్షించువారు, పాపులను దండించువారు, ఉగ్రంగా శిక్షించటంలో కరుణలేనివారు అయిన యమభటులను అజామిళుడు దూరం నుండి చూచాడు. ప్రాణోత్క్రమణ సమయంలో ముగ్గురు యమ దూతలను చూచాడు. వాళ్ళు రోషంతో నిప్పులు కక్కుతున్నారు. క్రిందికి వ్రేలాడుతూన్న పెదవులు, వికారమైన ముఖాలు, గర్వంతో కూడిన చూపులు, చేతుల్లో భయంకరమైన పాశములు, ఖడ్గములు కలిగి ప్రాణములు హరించడానికి సిద్ధంగా ఉన్నారు.

వ. ఇట్లతివికృత తుండ గండభాగ విషమ వివృత్త నేత్రులు, నతి పుష్ట నిష్ఠుర తనుయష్టి సంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్త సమస్త జీవాపహరణ కరణ ప్రశస్త హస్త విన్యస్త పాశధారులు నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును వికృతలోచనుండును, విహ్వలాత్మకుండు నై.

71

తా ॥ ఈ విధంగా అతి వికృతమైన నోరు, మొగము, చెక్కిలి, విషమంగా ఉన్న కళ్ళు, అతిగా బలసిన శరీరములు, నిక్కపొడుచుకున్న రోమములు కల యమభటులు ముగ్గురు

అజామిళునికి కనిపించారు. వారి చేతులలో సమస్తమైన జీవాలను అపహరించు ప్రశస్తమైన పాశములు ఉన్నాయి. వారిని చూడగానే అజామిళునికి ఇంద్రియాలు పట్టుతప్ప ప్రాణాలు కంపించాయి. నిలువు గ్రుడ్లుపడి ప్రాణాలు కొట్టుమిట్టాడాయి.

క. దూరమున నాడు బాలుఁడు, బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో
నారాయణ! నారాయణ!, నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్.

72

తా ॥ దూరంగా ఆడుకొంటున్న బాలుడు తన మనస్సులో తోచే సరికి పుత్రభ్రాంతితో "నారాయణా! నారాయణా! నారాయణా!" — అంటూ తన కుమారుణ్ణి పిలిచాడు.

చ. మరణపువేల న ద్దనుజమర్దను సంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరిపాలకు నామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడసూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట కల్పిత వేషుల దీర్ఘ రోషులన్.

73

తా ॥ ఆ ప్రకారంగా మరణవేళ నారాయణుణ్ణి సంస్మరించేసరికి, ఆ పరిసరములలో ఉండే విష్ణు దూతలు నారాయణ నామాన్ని విని వెంటనే అక్కడకు వచ్చారు. వచ్చి అక్కడ ఉన్న వికటంగా మాట్లాడేవారు, వికటంగా వేషం వేసుకున్నవారు, కోపంతో మండిపడుతూన్న వారు... అయిన యమ కింకరులను అదల్చారు.

క. దాసీభర్త నజామిళ, భూసురుఁ దత్తనువువలన బోరన వెలికిం
దీసెడు యమభటులును బోఁ, ద్రోసిరి శ్రీవరుని కూర్మిదూతలు కడిమిన్.

74

తా ॥ అదల్చి, దాసీ భర్త అయిన అజామిళుడు అనే భూసురోత్తముని శరీరం నుండి ప్రాణాలను వెలికి లాగుతున్న యమభటులను బలవంతంగా త్రోశారు విష్ణు దూతలు.

వ. ఇట్లు విష్ణుదూతల వలన నిర్ధూత ప్రయత్నులై యమదూత లిట్లనిరి.

75

తా ॥ ఇట్లు అడ్డగింపబడిన యమ దూతలు విష్ణు దూతలతో ఇలా అన్నారు:

క. ఎవ్వనివారలు? మాతోఁ, జివ్వకుఁ గత మేమి? యిట్లు చిక్కినవానిం
గ్రొవ్వన విడిపించితి; రిఁక, నవ్వులకో? జముని శాసనంబులు జగతిన్.

76

తా ॥ "మీరు ఎవ్వని భటులు? మాతో కలహానికి కారణం ఏమిటి? ఈ విధంగా మాచేత చిక్కిన వానిని మీరు విడిపించారు. ఇక యమధర్మరాజు శాసనం నవ్వులాటకు తప్ప మరిదేనికీ పనికి రాదు.

వ. అదియునుం గాక.

77

సీ. ఎవ్వరు మీ రయ్య! యీ భవ్యరూపముల్ కన్నుల కద్భుతక్రమ మొనర్చె;
దివిజులో భువిజులో? దేవతాప్రవరులో? సిద్ధులో? సాధ్యులో? చెప్పరయ్య!
దళిత పాండు పద్మదళ దీర్ఘ నేత్రులు వర పీత కౌశేయ వాసు లరయ
గండమండల నటత్కుండల ద్వయులును బటు కిరీటప్రభా భాసితులును

తే. భూరి పుష్కర మాలికా చారువక్షు, లమిత కోమల నవయౌవ నాధికులును
బాహు కేయూర మణిగణ భ్రాజమాన, ఘన చతుర్భుజు లభ్రసంకాశ రుచులు.

78

తా ॥ అది అలా ఉంచితే, అసలు మీరు ఎవరు? మీ మంగళకరమైన రూపములు చూస్తుంటే కన్నులకు ఆనందంగా ఉంది. మీరు దేవతలా? మనుష్యులా! సిద్ధులా? సాధ్యులా? చెప్పండి! వికసించిన తెల్లని పద్మదళ నేత్రులు, పసుపుపచ్చని పట్టు వస్త్రాలను ధరించిన వారు, చెక్కిళ్ళపై నటించే కుండలములను ధరించినవారు, కిరీట కాంతులతో ప్రకాశించువారు, తామర పువ్వుల మాలికను వక్షస్థలమందు ధరించినవారు, అమితమైన కోమలులు, నవ యవ్వనంలో ఉన్నవారు, బాహు పురులతో మణిగణ ప్రభాభాసమైన చతుర్బాహువులు కలవారు, నీలమేఘములవంటి శరీరచ్ఛాయ కలిగిన మీరు ఎవ్వరు?

క. ధనువులు నిషంగచయములు, కన దంబుజ శంఖ చక్ర ఖడ్గ గదా సా
ధనములు ధరయించిన మీ, తనువులు లోకముల కద్భుతం బొనరించెన్.

79

తా ॥ ధనుస్సులు, అమ్ములపొదులు, పద్మ శంఖ చక్ర ఖడ్గ గదా సాధనములు ధరించిన మీ శరీరములు లోకాలకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

క. శాంతంబు లైన మీ తను, కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ
ధ్వాంతములఁ బాఱఁదోలుచు, సంతస మొనరించె నిపుడు సర్వంకషమై.

80

తా ॥ శాంత రస స్వభావులు అయిన మీ శరీర కాంతులు లోకంలోని చీకట్లను పారద్రోలుతూ సంతోషాన్ని కలిగించే విధంగా ఉన్నాయి.

వ. ఇట్లఖిల లోకానందకర కమ్రాకారులు, నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును, నిఖిలధర్మ పాలురునగు మీరు ధర్మ పరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి? యనిన మందస్మిత కందళిత ముఖారవిందులై గోవిందుని కందువ మందిరంబు కావలి వారలు వారివాహ గంభీర నిర్ఘోష పరిపోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి.

తా ॥ లోకాలకు ఆనందాన్ని కలిగించే సుందరమైన దేహం కలవారు, చూచుటకు శక్యంకాని తేజస్సుతో ప్రకాశించువారు, నిఖిల ధర్మములను ఆచరించువారు అయిన మీరు యమధర్మరాజు దూతలమై ధర్మమును పాటించే మమ్ము అడ్డగించడానికి కారణం ఏమిటి?" అని అడిగేసరికి చిరునవ్వు ముఖంలో కనిపిస్తుండగా గోవిందుని దూతలైన వాళ్ళు మేఘ గంభీర భాషణములతో ఇలా అన్నారు:

ఉ. మీరు పరేతనాయకుని మేలిమి దూత లటేనిఁ బల్కుఁ డా
తోరపుఁ బుణ్యలక్షణము, దుష్కృతభావము, దండకృత్యమున్
బీరముతోడ నీతని కభీష్టనివాసము, పూని దండ్యు లె
వ్వారలు? సర్వభూతములొ? వారక కొందఱు పాపకర్ములో?

82

తా ॥ "అయితే మీరు యమ ధర్మరాజు కింకరులన్నమాట! సంతోషం! అలా అయితే చెప్పండి. పుణ్య లక్షణము, పాప లక్షణము వివరించండి. దండింప తగిన వారెవరు, ఎవరు కారు... మాకు తెలియ చెయ్యండి. ఇతను ఎక్కడి వాడో చెప్పండి. దండింప తగిన వారెవ్వరు? ప్రపంచంలోని సకల ప్రాణులా లేక అందులో పాపం చేసిన వారేనా?"

వ. అనిన యమభటు లి ట్లనిరి

83

తా ॥ దానికి సమాధానంగా యమ భటులు ఇట్లా అన్నారు:

క. వేద ప్రణిహితమే యను, మోదంబుగ ధర్మ మయ్యె మున్ను, త దన్యం
బేది యగు నది యధర్మం, బాదియు హరిరూపు వేద మన విను కతనన్.

84

తా ॥ "వేదంలో చెప్పబడినదే ధర్మం. దానికి విరుద్ధమైనది అధర్మం. శ్రీమహా విష్ణువు యొక్క స్వరూపమే వేదం అని పెద్దలు చెప్పగా విని ఉన్నాము.

సీ. ఎవ్వనిచేఁ దన యిరవొందు త్రిగుణ స్వభావమైనట్టి యీ ప్రాణిచయము
లనుగుణ నామక్రియా రూపములచేత నెంతయుఁ దమయంత నెఱుఁగఁబడును
నర్యముం డనలంబు నాకాశమును ప్రభంజనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దినములు శర్వరీచయములు కాలంబు వసుమతీ జాలములును

తే. దేహధారికి సాక్షులై తెలుపుచుండ, దండన స్థాన విధము సద్ధర్మగతియుఁ
దగుల మీ రీ క్రమానురోధనము చేసి, యఖిల కర్ములు దండార్హు లరయ నెపుడు.

85

తా ॥ ఎవనిచే త్రిగుణ స్వభావమైన ఈ ప్రాణికోట్లు పుట్టుచున్నారో, ఎవనిచే తమకు అనుగుణమైన నామములు, క్రియలు, రూపములు పొందుచున్నారో, ఎవనిచే తమంత తాముగా తెలియబడుచున్నారో... ఆ శ్రీమహా విష్ణువు అంతర్యామి స్వరూపంగా సకల ప్రాణులయందు ఉన్నాడు. సూర్యుడు, అగ్ని, ఆకాశము, వాయువు, గోవులు, చంద్రుడు, సంధ్యలు, దినములు, పగలు, రాత్రి, కాలము, భూమి... ఇవన్నీ దేహధారికి సాక్షులు. వీరి సాక్ష్యాన్ని బట్టి పాపపుణ్యముల నిర్ణయం జరిగి తదనుగుణంగా జీవులు శిక్షింపబడతారు. మీరీ క్రమానికి ఆటంకం ఏర్పరిచారు. అఖిల కర్ములు వారి ధర్మాధర్మముల ననుసరించి దండార్హులే.

తే. కోరి కర్మంబు నడపెడువారి కెల్లఁ, గలిత శుభములు నశుభముల్ గలుగుచుండు!
నరయఁగా దేహి గుణసంగి యైన యపుడె, పూని కర్మంబు సేయక మానరాదు.

86

తా ॥ కర్మలను చేసే వారికి ఎప్పుడూ శుభము – అశుభము కలుగుతూ ఉంటాయి. దేహధారులు త్రిగుణాలతో ఉన్నందున దేహికి కర్మలను చేయకుండా ఉండటం కుదరదు.

క. ప్రకృతమునఁ దా నొనర్చిన, సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
వికృతిఁ గని యనుభవించు, న్నకృతమతిన్ ద త్ఫలంబు నతి నిపుణుండై.

87

తా ॥ ఈ జన్మలో ప్రస్తుతం తాను చేసిన సుకృతము – దుష్కృతములను బట్టి, ఎంత అయితే అంత ఫలమును అనుభవిస్తాడు.

వ. మఱియు వినుండు, జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను, సుఖదుఃఖ గుణంబులచేత నయినను, ధార్మికాది గుణంబులచేత నైనను, సకల భూతంబులు త్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు, దేవుండైన యముండు సర్వ జీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వరూపంబులను మనస్సుచే విశేషంబుగఁ జూచుచుండి, వాని కనురూపంబులఁ జింతింపుచుండు. అవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీన కర్మంబుల నేర్పడ్డ వర్తమాన దేహంబు, నే నని తలంపుచుండి, నష్ట జన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు. మఱియుఁ గర్మేంద్రియములచేతఁ గర్మంబులఁ జేయుచుండి, జ్ఞానేంద్రియంబుల చేతఁ దమోవిషయంబు లయిన శబ్దస్పర్శ రూప రసగంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి, పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైన జీవుండు, సర్వేంద్రియ విషయ ప్రతి సంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులం బొందుచుండి, షోడశ కళలం గలిగి, లింగ శరీరం బనంబరఁగి, గుణత్రయకార్యం బను నిమిత్తంబున హర్షశోక భయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియింపుచుండు. అజిత షడ్వర్గుండైన దేహి కర్మంబు లొల్లని బుద్ధి నెఱింగియు, వినియుఁ, గర్మంబులు సేయుచుండి, తన సంచార కర్మంబునం

జుట్టుకొన్న పసిరికాయ పురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాది కాలంబు, భూత భావి వసంతకాల యోగ్యం బైన పుష్ప ఫలాదులు తత్కాల జ్ఞాపకంబు నెట్లు సేయు, నట్లు భూత భావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు. ఒక్కనరుండు నొక క్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేఁడు. పూర్వసంస్కారంబులం గల గుణంబుల చేతఁ బురుషుం డవశుండు గావునఁ బలిమిఁ గర్మంబులు సేయింపబడుచుండు. అవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబు లైన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతా పితృ సదృశంబు లగుచుండు. ఇట్టి విపర్యయంబు పురుషునికిఁ బ్రకృతి సంగమంబునం గలుగుచుండు. ఆ ప్రకృతి పురాణ పురుషుం డైన య ప్పరమేశ్వరుని సేవించినఁ దలంగుచుండు.

88

తా ॥ ఇంకా వినండి. శాంత, ఘోర, మూఢ గుణములచే గాని, సుఖ–దుఃఖ గుణములచే గాని, ధర్మము–అధర్మము ఇత్యాది గుణములచేగాని జీవులన్నీ సత్త్వం–రజస్సు–తమస్సు అనే గుణముల సంబంధం పొంది, దానిని బట్టి జన్మలను పొందుతూ ఉంటారు. ధర్మస్వరూపుడైన యముడు సర్వ జీవులయందు అంతర్యామి స్వరూపంగా ఉంటూ ఆ జీవుడు చేసిన ధర్మము – అధర్మముతో కూడిన పనులను గమనిస్తూ, దానికి అనురూపమైన మార్గాన్ని ఏర్పరుస్తూ ఉంటాడు. అవిద్య ఉపాధిగా కల జీవుడు తమోగుణంతో కూడి ప్రాచీన కర్మల చేత ఏర్పడిన దేహమే తానని భ్రమిస్తాడు. దానివలన పూర్వజన్మ స్మృతిని కోల్పోయి పూర్వాపరములు తెలియక కర్మేంద్రియముల చేత కర్మలను చేస్తూ, జ్ఞానేంద్రియములచేత తమస్సుకు సంబంధించిన శబ్ద స్పర్శ రూపరస గంధాదులను మాత్రమే గ్రహిస్తూ ఉంటాడు. ఈ విధంగా అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు, మనస్సుతో కలిపి పదహారు కాగా జీవుడు పదిహేడవ వాడయి, ఈ పదహారు ఉపాధులతో సంబంధం కలిగి సంసారంలో చిక్కుకొంటాడు. ఈ పదహారు కళ్లతో కూడి లింగ శరీరం అని పిలువబడుతూ సత్త్వగుణం వల్ల హర్షాన్ని, రజోగుణం వల్ల శోకాన్ని తమోగుణం వల్ల భయాన్ని పొందుతూ

ఉంటాడు జీవుడు. ఈ ప్రకారంగా అరిషడ్వర్గాన్ని జయించలేక సంసారంలో ఉండి జీవుడు కర్మలు బంధహేతువులని బుద్ధితో గ్రహించినా, కర్మలను చేస్తూనే ఉంటాడు. పట్టుపురుగు తన నోట్లో నుండి వచ్చిన దారాలతోటే గూడు అల్లుకొని అందులోనే నశించినట్లు జీవుడు కూడా తను ఏర్పరచుకొన్న కర్మబంధాలలోనే తాను చిక్కుకొని నశించిపోతున్నాడు.

వర్తమాన కాలంలో నడుస్తున్న వసంత కాలాన్నిబట్టి భూతకాలంలోను భవిష్యకాలంలోను జరిగిన, జరగనున్న పుష్పఫలాలను, శీతోష్ణ పరిస్థితులను మనం ఊహిస్తాము. అలాగే భూతకాలంలో గడిచిన జన్మలకు భవిష్యత్తులో రాబోయే జన్మలకు అవసరమైన కారణాలను వర్తమాన జీవితాన్ని బట్టి ఊహింపవచ్చు. నరుడు ఒక్క క్షణం కూడా కర్మ చెయ్యకుండా ఉండలేడు. పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి పురుషుని గుణములు ఉంటాయి. ఆ గుణాలే బలవంతంగా పురుషునిచేత పనులు చేయిస్తూ ఉంటాయి. ఆ పూర్వ జన్మ సంస్కారం నుండి పురుషుని స్థూల సూక్ష్మ శరీరాలు కలుగుతూ ఉంటాయి. ఈ స్థితి ప్రకృతి సంబంధం వలన కలుగుతుంది. సంసారకారణమై ఉన్న ఈ ప్రకృతి, పురాణ పురుషుడైన పరమేశ్వరుణ్ణి సేవిస్తేనే తొలగిపోతుంది తప్ప మరో దారి లేదు.

సీ. కావున నితఁడు సత్కర్మ వర్తనమున భూదేవకులమునఁ బుట్టినాఁడు
దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై సకల వేదంబులఁ జదివినాఁడు
అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ జేరి శుశ్రూషలు చేసినాఁడు
సర్వభూతములకు సమబుద్ధియై చాల బహు మంత్ర సిద్ధులఁ బడసినాఁడు

తే. సత్యభాషణ నియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు
దండి లోభాది గుణములఁ దరపినాఁడు, మంచిగుణములు దనయందు మరపినాఁడు.



తా ॥ ఈ అజామిళుడు పూర్వజన్మలో తాను చేసుకున్న పుణ్యకర్మల వలన ఈ జన్మలో బ్రాహ్మణ కులంలో జన్మించాడు. ఇంద్రియాలను జయించి, ధర్మమార్గంలో ఉంటూ సకల

వేదములను చదివాడు. ఎల్లప్పుడూ గురువులను అతిథులను పెద్దలను చేరి శుశ్రూషలు చేసాడు. సర్వ భూతములను సమభావంతో చూస్తూ చాలా మంత్రసిద్ధులు పొందాడు. ఎప్పుడూ సత్యాన్ని పాటించేవాడు. నిత్యనైమిత్తిక విధులు చక్కగా నెరవేర్చాడు. లోభాది దుర్గుణాలను దరికి రానీయకుండా మంచిగుణములతో మసిలాడు.

క. సతతాచార సమంచిత, మతియై సుజ్ఞానములకు మరగెడి తఱి నా
యతగతి నాతని కంగజ, మతమై నవయౌవనాగమం బెడ సొచ్చెన్.

90

తా ॥ ఎల్లప్పుడూ మంచి ఆచారములను పాటించుటయందు బుద్ధి కలిగి, చక్కని జ్ఞానాన్ని కలిగి ఉండే స్థితిలో అతనిలో నవయౌవనం ప్రవేశించింది.

సీ. కడకంట యౌవనగర్వంబు వొడ గట్టె మదిలోన నుద్రేకమదము దొట్టెఁ
గడు మేనఁ గామవికారంబు దలసూపె ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం బయ్యె దేహం బెల్లఁ గచభారమున నెఱికప్పు మెఱసె
కటిభారమున నూరుకాండముల్ జిగి మీఱె బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె

తే. నురము విపుల మయ్యె నుల్లసద్వరకాంతి, పూర మంగకమునఁ బొందుపడియె
భూరితేజుఁ డైన భూసురాన్వయునకు నభినవైక యౌవ నాగమమున.

91

తా ॥ ఆ సమయంలో అతని కన్నుల్లో యౌవనగర్వం పొడసూపింది. మదిలో ఉద్రేకమదం పొంగుకొచ్చింది. మేనిలో కామవికారం తల చూపింది. ముఖంలో చిరునవ్వు మొలకలెత్తింది. దేహం అంతా అతి పుష్టిగా నిష్ఠురమైంది. శిరోజములు బాగా నల్లబడ్డాయి. కటి భారంచేత ఊరువులు బాగా నునుపెక్కాయి. బాహువులు దీర్ఘమైనాయి. వక్షస్థలము విశాలమైంది. అవయవములన్నీ నూతన తేజస్సుతో ప్రకాశిస్తున్నాయి. ఈ ప్రకారంగా ఆ

బ్రాహ్మణ కుమారుడు నూతనయౌవనంలో ప్రవేశించి అధిక తేజస్సుతో ప్రకాశించాడు.

క. హృదయమునఁ బొడము యౌవన, మదము వెలిం దోఁచుభంగి మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు, పొదలుచుఁ గప్పడరి చూడుఁ బొంకంబయ్యెన్.

92

తా ॥ హృదయంలో పొడమిన యౌవనమదము వెలికి వచ్చిన విధంగా అతని ముఖంమీద నూనూగు మీసాలు పొంకంగా మొలకెత్తాయి.

వ. మఱియును.

93

క. తమ్మివిరిమీఁద వ్రాలిన, తుమ్మెద పంక్తియును బోలెఁ దొరపులీలం
గ్రమ్ముకొని విప్రతనయుని, నెమ్మొగమునఁ గానఁబడియె నెఱిమీసంబుల్.

94

తా ॥ తామర పువ్వుమీద వ్రాలిన తుమ్మెదల వరుసవలె ఆ బ్రాహ్మణ కుమారుని ముఖంమీద మీసములు వచ్చాయి.

వ. అంత ననంగ బ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చు నంకురార్పణారంభంబునుం బోలె లలిత కిసలయ విసర ప్రసార భాసుర బహు పాదపాది పురోపవన పవన జవనప్రభావ పరికంపిత విట విటీజన హృదయ ప్రఫుల్ల పల్లవ భల్లంబును, ననూన ప్రసూన నిర్భర గర్భావిర్భూత సురభి పరాగపటల పటఘటిత నభోమండలంబును. నమంద నిష్యంద మరంద బిందుసందోహ కందళిత చిత్తమత్త మధుప సంకుల ఝుంకార ముఖరిత సకల దిశావలయంబును, నిరంతర ధారాళ రసభరిత పరిపక్వ ఫలానుభవ ప్రభవ సమ్మోదవాద శుకప్రముఖ పతంగ కోలాహలంబు నైన మధుమాసంబు సర్వజన మనోహరంబునై నిఖీల

వనపాదపంబుల నలంకరించె. అయ్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశం బునం గుశ సమిత్పుష్ప ఫలార్థంబు వనంబున కరిగి, తిరిగి వచ్చు సమయంబున నొక్క లతాభవనంబున.

95

తా ॥ ఇంతలో అనంగుడనే విధాత మొదలుపెట్టిన తంత్రానికి వసంతుడనే పురోహితుడు అంకురార్పణ ఆరంభించినట్లు, వసంత ఋతువు రాగానే ఉద్యానవనాలలోని వృక్షములన్నీ చిగిర్చాయి. చిరుగాలికి కొద్దికొద్దిగా కదలుతూన్న చిగురుటాకులు విటవిటీజన హృదయాల్లో గ్రుచ్చుకొన్న కత్తుల్లా ఉన్నాయి. వికసిత కుసుమముల నుండి ఎగిరిన పరాగము గగన భాగాన వ్రేలాడ కట్టిన చాందినీవలె అందంగా ఉన్నది. వికసించిన కుసుమములయందున్న తియ్యని తేనెను త్రాగినందువలన మత్తెక్కిన తుమ్మెదల ఝుంకారంతో దిక్కులన్నీ మారుమ్రోగుతున్నాయి. మధురమైన ఫలాలను ఆస్వాదిస్తూ ఉన్న శుక సంతతి కోలాహలంతో వనం అంతా మారుమ్రోగుతోంది. ఈ ప్రకారంగా అందరికీ సంతోషాన్ని ఇచ్చే వసంతం వృక్షములన్నింటికీ నూతన శోభను సమకూర్చి పెట్టింది. ఆ వేళ అజామిళుడు పితృపాదులు చెప్పిన ప్రకారం దర్భలు, సమిధలు, పుష్పములు, పండ్లు వీటి నిమిత్తం వనానికి వెళ్ళి తిరిగివచ్చే సమయంలో ఒక పొదరింట్లో ఒక దృశ్యాన్ని చూచాడు.

క. బద్ధానురాగయై స్మర, యుద్ధంబున కలరు బుద్ధి నురు కామకళా
సిద్ధ యగు వృషలితోఁ బ్రియ, వృద్ధిం దగఁ గూడియున్న విటు నొరుఁ గాంచెన్.

96

తా ॥ గాఢమైన అనురాగంతో కామక్రీడకు సిద్ధంగా ఉన్న తన ప్రియురాలితో ఆనందిస్తూన్న ఒక విటుణ్ణి చూచాడు.

క. భటునిన్ రతిశాస్త్ర కళా, ర్భటునిన్ వర యౌవనాభవ మదవిభవో

ధృటునిన్ సురతేచ్ఛా సం, ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్.

97

తా ॥ ఆ విటుడు రతిశాస్త్రంలో ఆరితేరినవాడు. పొంగిపొరలే యౌవనంలో కామంచేత కళ్ళు కనిపించకుండా ఉన్నాడు. సురతేచ్ఛ చేత నిండి ఉన్నాడు. కట్టుకున్న బట్ట జారిపోతూన్న విషయం కూడ తెలియనంత మైకంలో ఉన్న ఆ జారుణ్ణి చూచాడు... అజామిళుడు.

శా. హాలా ఘూర్ణిత నేత్రతో మదన తంత్రారంభ సంరంభతో
ఖేలాపాలన యోగ్య భూవిభవతోఁ గీర్ణాలకాజాలతో
హేలాలింగన భంగి వేషవతితో నిచ్ఛావతీ మూర్తితోఁ
గేళిం దేలుచునున్న వానిఁ గనెఁ బుంఖీభూత రోమాంచుఁడై

98

తా ॥ అతనితో క్రీడిస్తూన్న ఆమె సురాపానం చేసిన మత్తులో అరమోద్పు కన్నులతో మదన సంరంభంతో విజృంభిస్తూన్నది. కదులుతూన్న కనుబొమ్మలతో నుదుటి మీద చిరువెంట్రుకలు నాట్యం చేస్తున్నాయి. కౌగిలింత కోసం కలవర పాటుతో అనేక విధాల భంగిమలు చూపుతున్నది. ఆ విధంగా శృంగార కేళీ పరతంత్రుడై ఉన్న వారిని చూచేసరికి అజామిళుడికి రోమాంచితమైంది.

క. కలికి వగ మదన కదనపుఁ, బలుకుల కలకలము బెడఁగు వడు మేఖల ము
వ్వల రవళిఁ దగిలి గతిగొనఁ, గలకంఠి రతంబు సలుపు గమకముఁ గనియెన్.

99

తా ॥ ఆ మన్మథ క్రీడా పారవశ్యంలో ఆ విటుని కంఠంలో నుండి మదన కదన మధుర ధ్వనులు సుకుమారంగా వస్తున్నాయి. అతను చేస్తూన్న ధ్వనులకు ఆ సుందరాంగి నడుముకు ఉన్న ఒడ్డాణపు మువ్వల సవ్వడి తాళం వేస్తూన్నట్లుగా ఉంది. ఈ విధంగా ఆ కలకంఠి తన

ప్రియునితో రతిని సలపాలనే ఆకాంక్షను అజామిళుడు కనుగొన్నాడు.

క. కవకవనై పదనూపుర, రవరవ లాగుబ్బుకొన్న రతిపతి గతులం
జివచివనై విటు చెవులకు, రవళిన్ రతిసల్పు రతుల రవరవఁ గనియెన్.

100

తా ॥ అంత ఆ మానిని యొక్క కాలి నూపురముల రవరవము ఒకదానితో ఒకటి పోటీ పడుతూ చక్కగా ధ్వనిస్తున్నాయి. ఆ ధ్వని విటుని వీనులకు విందుగా వినిపిస్తొన్నది. ఇలా వారిద్దరిని నిశితంగా గమనించాడు.

చ. కురు లళికంబుపై నెగయుఁ గ్రొమ్ముడి వీఁడగ గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స
త్కర వర కంకణావళులు గర్జిలఁ గౌ నసియాడ మీఁదుగా
మరుని వినోదముల్ సలిపె మానిని యౌవన గర్వరేఖతోన్.

101

తా ॥ కురులు లలాటంపై వ్రాలగా, కొప్పుముడి వీడగా, చనుదోయిపై హారములు వ్రేలాడగా, మొలనూలు కటిభాగం మీద తాళం వేయగా, చేతి కంకణములు ధ్వనింప, నడుము జవజవలాడగా ఆ మానిని మరుని వినోదములు యౌవన గర్వరేఖతో సలిపింది.

క. మవ్వపు సుకుమారాంగిని, జవ్వని నుపగూహనాది సముచిత రతులన్
నివ్వటిలుదానిఁ గని మది, నువ్విళ్ళూరంగ మన్మథోద్దీపనుఁడై

102

తా ॥ అత్యంత సౌకుమార్యంగల ఆ జవ్వని యొక్క కౌగిలింతలు మొదలైన శృంగార క్రీడలను చూచి అతను మన్మథుని చేత ప్రేరేపింపబడ్డాడు.

తరలము.

బహుళ దృక్పరిపాక మోహ నిబద్ధుఁ డౌచు మనంబులో
సహజ కర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహిత చిత్తము వట్టి పట్టఁగ నేరఁడయ్యె సదా మనో
గహనమందు మరుండు పావకు కైవడిన్ జరియింపఁగాన్.

103

తా ॥ అట్లా చూడటం వల్ల మోహనిబద్ధుడైనందున, నిత్యకృత్యాలైన వేదశాస్త్రాలు, జపతపాలను మరచిపోయాడు. మనస్సు అనే కారడవిలో మరుడు అనే పావకుడు చరిస్తూ ఉంటే, అతని చిత్తం పట్టు తప్పింది.

శా. ఆ లీలావతి గండపాళికలపై హాస ప్రసాదంబు పై
నాలోలాలక పంక్తిపై నొసలిపై నాకర్ణ దృగ్ద్యుతి పై
హేలాపాది కుచద్వ యోరు కటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై

104

తా ॥ అజామిళుడు ఆ శృంగార దృశ్యాన్ని చూచినది మొదలు ఆ లీలావతి యొక్క అందమైన చెక్కిళ్ళను, చక్కని చిరునగవును, నుదుటిపై ఎగసి పడుతూన్న ముంగురులను, అవయవ సంపదను అనుక్షణము స్మరించసాగాడు. అతడు మన్మథాగ్నికి లోనయ్యాడు.

గీ. మఱి కులాచార వర్తన మాటు చేసి, పరగుఁ పిత్రర్థములు దాని పాలు చేసి
సాధు లక్షణ గుణవృత్తిఁ జాలు చేసి, లోలలోచన పసఁ జెంది లోలుఁ డయ్యె.

105

తా ॥ కులాచారాన్ని కూలద్రోసి, పిత్రార్జితాన్ని నేలపాలు చేసి, సాధు లక్షణాలను

విడిచిపెట్టి ఆ లోలలోచనకు లోలుడయ్యాడు.

క. శ్యామఁ గుసుమాస్త్ర ఖేలన, కామఁ గులస్త్రీలలామఁ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక, ధామంబున డించి క్రించుఁదనమునఁ బొడవై.

106

తా ॥ అందగత్తె అయిన భార్య ఇంటివద్ద ఉన్నది. ఆమె కులస్త్రీ. కమనీయ గుణములు కలది. అట్టి సుందరాంగిని వదలి అల్పత్వంతో ఆ వెలయాలి ఇంట్లోనే కాపురం పెట్టాడు.

ఉ. బంధులఁ దిట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెన్
బందెలు సుట్టి యీరములు పట్టి పథంబులు గొట్టి దిట్టయై
నిందల కోర్చి సాధులకు నిందితుఁడై గడియించు విత్త మా
సుందరి కిచ్చి మచ్చికలు సొంపెదఁ గూర్చి వసించెఁ దత్కృపన్.

107

తా ॥ ఈ విధంగా అజామిళుడు బంధువులను తిడుతూ, సత్పురుషులను బాధలు పెడుతూ, అనాథలను చిక్కులుపెడుతూ, పొదరింట్లో దాగి దారులు కొల్లగొట్టడంలో దిట్టయై అనేకమంది తనను నిందిస్తూ ఉంటే విత్తమును ఆర్జించాడు. ఆర్జించిన సొమ్మంతా ఆ సుందరికిచ్చి ఆమెకు దాసుడై, ఆ వెలయాలి కృపతో జీవించసాగాడు.

సీ. సముచిత శ్రుతిచర్చ చర్చింప నొల్లక సతి కుచద్వయచర్చఁ జర్చసేయుఁ
దర్క కర్కశ పాఠ తర్కంబు గాదని కలికితోఁ బ్రణయ తర్కంబు సేయు
స్మృతి పదవాక్య సంగతిఁ గాక తత్సతి పదవాక్య సంగతిఁ బరఁగఁ జేయు
నాటకాలంకార నైపుణం బుడిగి త న్నాటకాలంకార పాటిఁ దిరుగుఁ

గీ. బరఁగఁ జిరకాల మీ రీతిఁ బాపనియతి, రమణ దాసీ కుటుంబ భారము వహించి

యది కుటుంబిని గాఁగఁ బాపాత్ముఁ డగుచు, నశుచియును దుష్టవర్తనుఁడై మెలంగె.

108

తా ॥ తనకు ఉచితమైన వేదాలను గూర్చి చర్చింప నొల్లక తన ప్రియురాలి కుచద్వయం మీద చందన చర్చ చేయసాగాడు. కర్కశమైన తర్క పాఠం కాదని కలికితో ప్రణయ తర్కం మొదలు పెట్టాడు. ధర్మశాస్త్ర గ్రంథాలలోని విషయములు కాకుండ తన సఖీ యొక్క పద వాక్యాలను చర్చించటం మొదలు పెట్టాడు. నాటకాలలోని అలంకారాల గురించి చర్చించటం మానేసి తన ఇష్టసఖీ యొక్క నటనలను, అలంకారాలను చూస్తూ తిరుగసాగేడు. ఈ విధంగా చాలా కాలం అజామిళుడు పాపబుద్ధితో ఆ దాసీ, దాని యొక్క కుటుంబ భారాన్ని వహించి అదే తన కుటుంబంగా భావించి పాపాత్ముడై, అశుచి అయి దుష్టవర్తనుడై మెలగాడు.

క. అటు గానఁ బాపకర్మునిఁ, గుటిలుని సుజనార్తు ధూర్తుఁ గ్రూరుని నే మా
రటమునఁ గొని యేగెద మం, తట దండమువలన నితఁడు ధన్యత నొందున్.

109

తా ॥ ఆ కారణంగా... ఈ పాపకర్ముని, కుటిలుని, ఈ దుర్జనుని, ధూర్తుని మేము బలాత్కారంగా తీసుకొనిపోతున్నాము. మా దండనము వలన ఇతడు ధన్యతను పొందుతాడు.”

వ. ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి, నయకోవిదులైన భగవద్దూత లిట్టనిరి.

110

తా ॥ అని ఇలా పలుకుతూన్న యమభటులతో, నీతి కోవిదులయిన విష్ణుదూతలు ఇలా అన్నారు:

క. అవురా! ధర్మవివేక, ప్రవరుల పస గానఁ బడియెఁ బాపము పుణ్యో
ద్భవుల నదండ్యుల దండన, వివరం బొనరింపఁ బడియె విధి యెఱుఁగమిచేన్.

111

తా ॥ "ఔరా! మీ మాటలను బట్టి మీ పాండిత్యపు పస కనపడుతూన్నది. దండన చేయకూడని వారిని దండించే మీ అజ్ఞానం మాకు తెలిసింది.

చ. సములును సాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో
త్తమగుణులైన యట్టి తలిదండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ
గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జాలువారు సం
భ్రమమున మీ మనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా!

112

తా ॥ సమత్వం కలవారు, సాధువులు, ధర్మంగా నడచుకొనేవారు, దయామూర్తులు, మంచి గుణములు కలిగిన తల్లిదండ్రులే తమ బిడ్డలకు ఎగ్గుసేయ తలపెడితే ఇక ఆ పిల్లలు ఎవ్వరికి మొరపెట్టుకుంటారు? మీ మనస్సులలో మీరే చర్చ చేసి చూడండి.

గీ. ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన, నదియ చేతు రితరు లైన వార
లతఁడు సత్య మిట్టి దనె నేని లోకంబు, తత్ప్రవర్తనమునఁ దగిలి యుండు.

113

తా ॥ ఎరుక కలవాడు ఏది చేస్తే ఇతరులు కూడా అదే చేస్తారు. అతడు దేనిని సత్యం అని అంటాడో లోకం కూడా దానినే సత్యం అంటుంది.

గీ. నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని, నమ్మఁదగినవాఁడు నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరునే? యెందైనఁ, బ్రీతి లేక ధర్మదూతలార!

114

తా ॥ మీరు ధర్మదూతలు కదా! నమ్మి తొడల మీద నిద్రించే చెలికాని నీతిని విడిచి

ద్రోహబుద్ధితో ఎవ్వడైనా చంపడానికి సిద్ధపడతాడా?

గీ. చిత్తమెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి, నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడుఁ గడుసౌమ్యుఁ డగువాఁడుఁ, జింతసేయ కెట్లు సెఱుప నేర్చు?

115

తా ॥ స్నేహంతో వచ్చి చిత్తమంతా ఇచ్చి పరిపూర్ణంగా మెచ్చుకొని నమ్మిన వాడిని... దయకలవాడు సౌమ్యుడు అనే ఆలోచన లేకుండా అపకారం చేస్తాడా?

వ. అదియునుం గాక.

116

ఉ. ఈతఁడు కోటి సంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ జెంది యా
యాతము లైన పాప నివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలెఁ బ్ర
ఖ్యాత మతిన్ మహామరణ కాలమునన్ హరిపుణ్యనామ సం
భూత సుధామయాద్భుత విభూతికరాక్షర సంగ్రహంబునన్.

117

తా ॥ ఇతడు కోటి జన్మలలో చేసిన పాపములను అన్నింటినీ ఈ జన్మలో పారద్రోలాడు. మరణ కాలము సమీపించేసరికి హరి యొక్క పుణ్యనామాన్ని సంకీర్తన చేసిన అద్భుతమైన అదృష్టం అతనికి కలిగింది.

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని కీలలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూర సర్పములకుఁ గేకులు హరినామ
కీర్తనములు తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికిఁ గేసరుల్ హరినామ కీర్తనములు

గీ. మహిత యోగోగ్ర నిత్యసమాధి విధుల, నలరు బ్రహ్మాది సురులకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య, ఖేలనంబులు హరినామ కీర్తనములు.

118

తా ॥ బ్రహ్మహత్యాది అనేక పాపాలనే అడవులను కాల్చే అగ్నికీలలు కదా హరినామ సంకీర్తనలు! గురుద్రోహమనే క్రూరసర్పాలకు నెమళ్ళు కదా హరినామ సంకీర్తనలు! బంగారాన్ని అపహరించడం అనే పాపరూపమైన చీకట్లను పారద్రోలే సూర్యకిరణములు కదా హరినామ కీర్తనములు! మధుపానం అనే తప్పుడు పనివల్ల సంక్రమించిన పాపము అనే మదించిన ఏనుగుల సమితికి సింహము వంటిది కదా హరినామ సంకీర్తనం! గొప్పదైన యోగం వలన లభించే నిత్యసమాధిలో ఉండే బ్రహ్మాది దేవతలు కూడా పొందలేని నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్యాలు కదా హరినామ సంకీర్తనలు!

సీ. ముక్తికాం తైకాంత మోహన కృత్యముల్ కేలిమై హరినామ కీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషి క్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
బహుకాల జనిత తపఃఫల సారముల్ కేలిమై హరినామ కీర్తనములు

గీ. పుణ్యమూలంబు లనపాయ పోషకంబు, లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామ కీర్తనములు.

119

తా ॥ ముక్తికాంత యొక్క ఏకాంత మోహన కృత్యములు కదా హరినామ సంకీర్తనములు! సత్యలోకం యొక్క ఆనందము, సౌభాగ్యము వీటితో కూడి ఉండేవి కదా హరినామ కీర్తనములు! గొప్పదైన నిర్వాణ సామ్రాజ్యమునకు పట్టాభిషేకం చేసేవి కదా హరినామ సంకీర్తనములు! బహుకాలానికి లభించే తపః ఫల సారం కదా హరినామ సంకీర్తనములు! పుణ్యాలకు మూలం, అపాయం లేనిది, కోరుకున్న దానిని ఇచ్చేవి, అజ్ఞానమును

హరించేవి, వేదముల యొక్క చివరన ఉండే ఉపనిషత్తుల లబ్ధీ, అమృతాన్ని అందించేవి, ఆర్తులైన వారికి శుభములను ఇచ్చేవి కదా ఈ హరినామ కీర్తనములు!

క. కామంబు పుణ్యమార్గ, స్థేమంబు మునీంద్ర సాంద్ర చేతస్సరసీ
ధామంబు జిష్ణు నిర్మల, నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే?

120

తా ॥ అందరూ కోరుకునేది, పుణ్యమార్గానికి నిలయము, మునీంద్రుల మనస్సులనే పద్మములకు స్థానమైనది, అట్టి శ్రీమహా విష్ణువు యొక్క నిర్మలమైన నామమును నిత్యము తలచుకొనేవాడు చక్రవర్తితో సమానం కదా!

క. డెందంబు పుత్రు వలనన్, జెందిన దని తలఁప వలదు శ్రీపతి పే రే
చందమున నైనఁ బలికిన, నందకధరుఁ డందె కలఁడు నాథుం డగుచున్.

121

తా ॥ బిడ్డకు నారాయణుని పేరు పెట్టుకొని ఆ పేరుతో పిలిచినా, ఇతని హృదయం పుత్రుని మీదనే లగ్నమై ఉన్నదని మీరు అనుకొనవద్దు. శ్రీపతి పేరు ఏ విధంగా పలికినా ఆ శ్రీహరి అక్కడే ఉంటాడు.

గీ. బిడ్డపేరుఁ బెట్టి పిలుచుట విశ్రామ, కేళి నైన మిగుల గేలి నైన
పద్య గద్య గీత భావార్థముల నైనఁ, గమలనయనుఁ దలఁపఁ గలుషహరము.

122

తా ॥ కుమారుని ఆ హరి పేరు పెట్టి పిలిచినా, విశ్రాంతి సమయంలోనైనా, ఆటలోనైనా, పద్యగద్య గీతములలోనైనా, అర్థంలోనైనా, భావంలోనైనా ఏ విధంగా ఆ శ్రీహరిని తలచినా చాలు, సమస్త కలుషాలు దూరమౌతాయి.

ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్.

123

తా ॥ నేలమీద పడినప్పుడు కాని, దెబ్బలు తిని బాధపడ్డప్పుడు కాని, జ్వరం వచ్చి ఏవో కలవరింత పలుకులు పలికినప్పుడు కాని, సర్పము మొదలయిన వాటి బాధను అనుభవిస్తూన్నప్పుడు కాని, ఆర్తితో దుఃఖీస్తూన్నప్పుడు కాని శ్రీమహా విష్ణువును స్మరిస్తే చాలు, యమధర్మరాజు యొక్క బాధలను అనుభవించరు.

సీ. అతిపాపములకుఁ బ్రయత్న పూర్వకముగఁ దనుపాపములకు మితంబుగాఁగ
సన్ముని వరులచే సంప్రోక్తమై యుండు నిర్మలం బగు పాప నిష్కృతములు
క్రమరూపమున నుపశమనంబులగుఁ గాని తత్క్షణంబున నవి దరువలేవు
సర్వకర్మంబుల సంహార మొనరించి చిత్తంబునకుఁ దత్త్వసిద్ధి నొసఁగు
గీ. నొనర నీశుసేవ యోగిమానస సరో, వాసుసేవ హేమవాసు సేవ
వేదవేద్యుసేవ వేదాంత విభుసేవ, పరమపురుష పాదపద్మ సేవ.

124

తా ॥ అతిగా పాపం చేస్తే అతిగాను, కొంచెం తక్కువ చేస్తే మితంగాను, మునివరులు ప్రాయశ్చిత్తాన్ని చెప్పారు. ఆ ప్రాయశ్చిత్తములను పాటిస్తే క్రమరూపంలో ఉపశమనం కలుగుతుందే కాని పూర్తిగా ఆ పాపం క్షాళనం కాదు. సర్వ కర్మములను నాశనం చేసి చిత్తమునకు తత్త్వమును చేకూర్చేది శ్రీహరి సేవ, అది ఒక్కటే సరి అయిన మార్గం. ఆ ఈశ్వరుణ్ణి, యోగుల యొక్క మానస సరస్సులలో ఉండేవాడిని, కనకాంబర ధారుని, ఆ వేదవేద్యుని, ఆ వేదాంత విభుని, ఆ పరమ పురుషుని పాదపద్మములను సేవిస్తే కైవల్యం తప్పక

కలుగుతుంది.

క. హరి నెఱుఁగని యా బాలుఁడు, హరి భక్తులతోడఁ గూడి హరియను వాఁడున్
సరియై దోషము లడఁచును, గరువలితో నగ్ని తృణముఁ గాల్చిన భంగిన్.

125

తా ॥ హరి అంటే ఏమిటో తెలియనివాడు బాలుడైనా హరి భక్తులతో కూడి హరి! హరి! అని అంటే తన పూర్వజన్మ పాపములు పటాపంచలు అవుతాయి. వాయువుతో కూడి అగ్ని గడ్డిని దహించినట్లు హరినామ స్మరణ సర్వ పాపములను దహించి వేస్తుంది.

ఉ. ఆరయ వీర్యవంత మగు నౌషధమెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద
చ్చారు గుణంబు రోగములఁ జయ్యనఁ బాపినమాడ్కిఁ బుణ్య వి
స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే!

126

తా ॥ వీర్యవంతమయిన ఔషధాన్ని తెలియక తీసుకొన్నా, దానియొక్క గొప్పగుణం వలన రోగం నుండి విముక్తి కలుగుతుంది. అలాగే పుణ్యమూర్తి అయిన శ్రీమహా విష్ణువు యొక్క నామాన్ని పామరుడు అజ్ఞానంచే పలికినా దాని యొక్క ప్రభావము శాశ్వతంగా చూపిస్తుంది.

క. ధృతి దప్పిన తఱినిఁ బురా, కృతమునఁ గాకెట్లు దోఁచుఁ గేశవుఁడు మదిన్
మితిలేని జగముఁ దాల్చిన, యతఁ డొక్కని మనములోన నణఁగెఁడు వాఁడే?

127

తా ॥ మరణం ఆసన్నమైనప్పుడు, ధైర్యాన్ని కోల్పోయిన ఆ సందర్భంలో, ఏదో పూర్వజన్మ కర్మ విశేషం ఉంటేనే కాని ఆకారం లేని పరాత్పరుడు మనస్సుకి స్ఫురించడు. దానికి ఏదో

కారణం ఉంటుంది.

మ. నిరతంబై నిరవద్యమై నిఖిల చిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకార గుణాఢ్యమై నియమమై నిర్దోష మైనట్టి శ్రీ
హరి నామస్మర ణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థం బగున్?

128

తా ॥ మరణం ఆసన్నమైనప్పుడు ఈ అజామిళుడు హరి యొక్క నామస్మరణ అనే అమృతాన్ని ప్రత్యక్షంగా సేవించాడు. ఎల్లప్పుడూ ఉండేది, మేరలేనిది, జ్ఞానరూపమైనది, నిత్యమైనది, అహంకారం లేనిది, సుగుణములతో కూడినది, నియమబద్ధమైనది, దోషములు లేనిది అయిన శ్రీహరి యొక్క నామస్మరణ ఇతడు ప్రత్యక్షంగా చేసాడు కదా! ఇట్టి ధర్మం వృథాగా ఎందుకు పోతుంది?"

వ. అని యిట్లు భగవద్దూతలు భాగవత ధర్మంబు నిర్ణయించి, యీ యర్థంబున మీకు సంశయంబు గలదేని మీ రాజు నడుఁగుడు. పొండు అని పలికి బ్రాహ్మణుని నతిఘోరం బైన యామ్యపాశ బంధ నిర్ముక్తునిం గావించి, మృత్యువు వలని యెదరు వాపిరి. అంత నా యమదూతలు చేయునది లేక యమ లోకంబునకుం జని, పితృపతికి సర్వంబును నెఱింగించిరి. అంత.

129

తా ॥ అని ఈ ప్రకారంగా విష్ణు దూతలు భాగవత ధర్మాన్ని నిర్ణయం చేసి, 'ఈ విషయంలో మీకు ఏదైనా అనుమానం ఉంటే వెళ్ళి మీ రాజును అడగండి! వెళ్ళండి!' అని పలికి ఆ బ్రాహ్మణుని, అతి ఘోరమైన యమపాశ బంధములనుండి, మృత్యువు నుండి విడిపించారు. అప్పుడు ఆ యమదూతలు చేసేదేమీ లేక యమలోకానికి వెళ్ళి యమధర్మరాజుకి అంతా

చెప్పారు.

క. అతఁడును బాశచ్యుతుఁడై, గతభయుఁడై ప్రకృతి నొంది కదు నుత్సవ సం
గతిఁ జూచి మ్రొక్కి మదిలో, నతులిత ముద మొదవి పొదలి హరిదాసులకున్.

130

తా ॥ ఇక ఇక్కడ అజామిళుడు యమపాశముల నుండి విడిపింపబడినందున, భయం తొలగిపోగా ఉత్సాహంతో విష్ణుదూతలకు పట్టరాని సంతోషంతో మ్రొక్కాడు.

తే. నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి, చెలఁగుచున్న లోనితలఁపుఁ దెలిసి
చక్రధరుని కూర్మిసహచరు లరిగి ర దృశ్యు లగుచు దేవదేవు కడకు.

131

తా ॥ నమస్కరిస్తూ ఏదో చెప్పబోతున్నాడు. అతనిని గమనించి అతని అంతరంగాన్ని అర్థం చేసుకొని విష్ణు దూతలు అదృశ్యులై దేవదేవుని కడకు వెళ్ళిపోయారు.

క. వేదత్రయ సంపాద్యము, మోదంబు గుణాశ్రయంబు మును భగవ ద్ధ
ర్మాదేశంబగు తద్భట, వాదంబు నజామిళుండు వదలక వినుచున్.

132

తా ॥ వేదత్రయ సారము, సంతోష దాయకము, సమస్త సద్గుణములకు ఆశ్రయము, భగవంతుని ధర్మాదేశము అయిన ఆ భటుల యొక్క చర్చను విన్నాడు అజామిళుడు.

క. శ్రీమన్నారాయణ పద, తామరస ధ్యానసలిల ధౌత మహౌఘ
స్తోముండై సద్భక్తికి, ధామం బగుచుండెఁ దెలిసి తత్క్షణ మాత్రన్.

133

తా ॥ శ్రీహరి యొక్క పాదపద్మములను ధ్యానించటమనే నిర్మల సలిలం అతని మహా పాతకాలను క్షాళనం చేసింది. అతని హృదయం సద్భక్తికి స్థానంగా నిలిచి క్షణమాత్రంలో జ్ఞానం వికసించింది.

క. బరవసమున నరికట్టిన, దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్
హరి నీశు నాశ్రయింపుచుఁ, బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్.

134

తా ॥ తాను చేసిన దురితములను తలచి పరితాపమును పొందుతూ పరమేశ్వరుడైన హరిని శరణు వేడాడు. పశ్చాత్తాపంతో ఇలా అనుకున్నాడు:

సీ. వృషలియం దనురాగ వృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁ ద్రోచి
రచ్చల కెక్కిపెన్ రజ్జుసేతల సరి వారిలోపలఁ దలవంపు చేసి
కట్టిఁడిముదుక నై కర్మబంధంబుల పుట్టనై నిందల ప్రోవ నగుచుఁ
దరుణుల రోఁతల దవిలి భోగించిన కడిఁది నా జన్మంబు గాలిపోయెఁ

ఆ. జదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె, బుద్ధి పురువు మేసెఁ బుణ్య మణఁగె
నీతి మట్టుపడియె నిర్మలజ్ఞానంబు, మొదలి కుడిగె బోధ మూరిఁబోయె.

135

తా ॥ "నేను పుట్టిన కులాన్ని నీటిలో వదిలేసి, జారిణి అయిన శూద్రకాంతయందు అనురాగాన్ని పెంచుకుని సంతానాన్ని కన్నాను. రచ్చలకెక్కి తప్పుడు పనులు చేస్తూ తోటివారిలో తలవంపులు పడ్డాను. ముదుసలినయినా కర్మబంధములను త్రెంచుకోలేక నిందలను పడుతూ తరుణీ సుఖాలలో మునిగి తేలుతూ నా జన్మమును వృథా చేసుకున్నాను. నా చదువు పనికి రాకుండా పోయింది. శాస్త్రజ్ఞానం శూన్యం అయింది. బుద్ధిని పాపపు పురుగు తినగా పుణ్యం అణగిపోయింది. నీతి అడుగంటింది. నా జ్ఞానం మొదలే లేకుండా పోయింది, నా తెలివి

తెల్లారింది.

క. చిక్కని చక్కని చన్నుల, మక్కువ యిల్లాలి విడిచి మాయలు గల యీ
వెక్కసపు మద్యపానపు, డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్.

136

తా ॥ నా ఇల్లాలిని, చక్కని దానిని విడిచి, మాయలు గల ఈ మద్యపానపు డొక్కును నేను తగులుకొని విటుడనై చెడిపోయాను.

ఉ. అక్కట! ఘోర దుష్కృత మహానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కణఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చెనహో! దురాత్మునిం
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే
దిక్కును లేనివారిఁ బెనుతీపులఁ బెట్టుచుఁ బాఱఁ దోలితిన్.

137

తా ॥ అయ్యో! నేనెంత దురాత్ముణ్ణి! నా తల్లిదండ్రులను, కల్మషంలేని వారిని, పెద్దవారైన వారిని, మరే దిక్కులేని వారిని, అనేక కష్టములు పెట్టాను కదా! నా ఘోరమైన పాపపుపనులు అగ్నిశిఖలై నన్ను చుట్టుముట్టి భస్మం చేయక ఇలా ఉండనిచ్చినాయంటే ఆశ్చర్యమే మరి!

క. అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ, బ్రకృతిం గల బంధువులను బాల్యమున ననున్
వికృతిఁ జనకుండఁ బెంచిన, సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్.

138

తా ॥ కృతజ్ఞత అనేది లేకుండా నేను నా బంధువులను, బాల్యంలో నాకే లోటు రానీయకుండ పెంచిన సుకృతులు అయిన నా తల్లిదండ్రులను అందరినీ వదలివేశాను.

వ. అప్పుడు

139

తే. పెక్కు పాతకముల భృశదారుణం బైన, దొడ్డ నరకమందుఁ బడ్డ నన్ను
నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి, రిట్టి ధర్మపురుషు లెందు వారొ?

140

తా ॥ ఈ విపత్కర సమయంలో దొడ్డ నరకంలో పడ్డ నన్ను ఆపదలను పొందకుండా అరికట్టి రక్షించినట్టి ఆ ధర్మపురుషులు ఎక్కడివారో కదా?

శా. చోద్యంబై కలవోలె నీ క్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రు లా
యుద్యోగంబుల వారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం
పాద్యానేక వికారరూప కుటిల ప్రఖ్యాతు లెం దేఁ గిరో?

141

తా ॥ ఇది చాలా చోద్యంగా ఉంది. ముందు కలలా కనిపించినా తరువాత క్షణంలో ప్రత్యక్షంగా గోచరమయ్యింది. నన్ను మృత్యుపాశాలతో ఈడ్చుకొని వచ్చిన మహావీరులు, ఆ ఉగ్రులు, ఆ వికృతాకారులు, పాశధరులు తమ ఉత్సాహాన్ని వదలి ఎక్కడికి వెళ్ళారో!

ఉ. దారుణ పాశబంధన విధానములన్ నరకార్ణవంబులోఁ
గూరినవాని నన్నుఁ జెడకుండ నొనర్చిన పుణ్యవంతు లం
భోరుహనేత్రు లుజ్జ్వల నభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయా సమంచిత విచారులు నల్వురు నెందుఁ బోయిరో?

142

తా ॥ దారుణమైన యమ పాశాలలో చిక్కుకున్న నన్ను, నరక సముద్రంలో

కూరుకుపోయిన నన్ను రక్షించిన పుణ్యవంతులు పద్మనేత్రులు, ఉజ్జ్వలమైన సూర్యుని వంటి తేజస్సు కలవారు కంటికింపైన వారు, దయాశాలురు అయిన ఆ నలుగురు ఎక్కడకు వెళ్ళారో?

 మ. నను రక్షించిన పుణ్యవంతులు కన న్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబిత కర్ణవేష్టన సువర్ణచ్ఛాయ దివ్యాంబరుల్
ఘన కారుణ్య రసైక పూర్ణులు సమగ్రస్ఫూర్తి నెం దేఁగిరో?

143

తా ॥ నన్ను రక్షించిన ఆ పుణ్యవంతులు, పద్మపత్రాక్షులు, నీలవర్ణులు, శంఖచక్రములను ధరించిన వారు, ఆజానుబాహులు, ఆ నవ్వుముఖం కలవారు, భుజంవరకు వేలాడు మకర కుండలాలను కలవారు, సువర్ణచ్ఛాయని కలిగినవారు, దివ్యమైన వస్త్రాలను ధరించినవారు, కరుణా రసంతో వెలిగిపోయేవారు... ఎక్కడివారో? ఎక్కడికి వెళ్ళారో?

వ. పాతకుండ నగు నాకు ని వ్విబుధోత్తమ దర్శనంబు పురాకృత మదీయ పుణ్య విశేషంబునం గాని పొంద శక్యంబు గాదు. త త్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నంబై యొప్పు. అట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్తనై యుండి మృతిం బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణ నామ గ్రహణంబు సంభవింపనేరదు. మఱియును.

144

తా ॥ పాపాత్ముడనైన నాకు ఆ దివ్యపురుషుల దర్శనం పూర్వజన్మ పుణ్యవిశేషం వల్లనే లభ్యమైనది కాని మరొకటి ఏదీ కారణం కాదు. వారి సందర్శనం చాలా ఆనందంగా ఉంది. అలా కాకపోతే పాపపు పనులు చేస్తూ శూద్ర స్త్రీకి భర్తనై ఉండి మరణ సమయంలో ఉన్న నాకు శ్రీమన్నారాయణ నామాన్ని ఉచ్చరించే అదృష్టం సంభవించదు.

తే. పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను, మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకు? నారాయణుని దివ్య, నామ విమల కీర్తనంబు మదికి.

145

తా ॥ నేను అత్యంత పాపాత్ముడను. వట్టి మూర్ఖుడను. బ్రహ్మహత్య చేసిన వాడిని. లోభము, మోహము, మాత్సర్యము కలవాడిని. అలాంటి నాకు శ్రీమన్నారాయణుని దివ్యనామాన్ని కీర్తించే అదృష్టం ఎలా లభ్యమవుతుంది?

సీ. దారుణ మోహాంధకార పూరితుఁడను హరి విస్మయ స్మరణార్హ మతినె?
పంచ మహాతీవ్ర పాతకోపేతుఁడ హరి విస్మయ స్మరణార్హ మతినె?
కౌటిల్య కితవ వికార పారీణుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?
అఖిల దుఃఖైక ఘోరార్ణవ మగ్నుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?

తే. నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ, మందభాగ్యుండ నే నేడ? మధువిదారి
దివ్య గుణనామ కీర్తన తెఱఁగదేడ?, పూర్వ సుకృతంబు లే కెట్లు పొందఁ గలుగు?

146

తా ॥ దారుణమైన మోహమనే అంధకారంలో కూరుకుపోయిన వాడను. హరి యొక్క నామాన్ని స్మరించడానికి అర్హుడనా? పంచ మహాపాపములతో కూడుకొన్న వాడిని. కుటిలత్వంతో జూదం ఆడే నేను హరి యొక్క నామాన్ని స్మరించడానికి అర్హుడనా? దుఃఖమనే భయంకరమైన సముద్రంలో మునిగినవాడిని. హరి యొక్క నామాన్ని స్మరించడానికి అర్హుడనా? నిందలకు నెలవైన వాడిని, మందభాగ్యుడను, అయిన నేనెక్కడ? హరినామ సంకీర్తనం చేయడం ఎక్కడ? పూర్వజన్మ సుకృతం లేకుండ హరినామ సంకీర్తనం చేసే భాగ్యం ఎలా కలుగుతుంది?”

వ. అని వితర్కించి.

147

మ. యతచిత్తేంద్రియ మారుతుండ నగుచున్ యత్నం బొనర్తున్ హరి
వ్రత సంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ము ఖాసక్తికిన్
యుత నిర్వాణ పదానురక్తికి సుఖోద్యోగ క్రియాశక్తికిన్
ధృతి లబ్ధో త్తమ ముక్తికిన్ సకల ధాత్రీధుర్య సద్భక్తికిన్.

148

తా ॥ అని తర్కించి అజామిళుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. “నేను చిత్తాన్ని జయించి, ఇంద్రియాలను లొంగదీసుకుని అలాగే వాయువును కూడా నిరోధించి శ్రీహరి దర్శనానికి ప్రయత్నం చేస్తాను. ఆయనమీద భక్తే ఈ అనంత విశ్వానికి ఆధారభూతమైనది, నిర్వాణానికి కారణమైనది, సర్వ సుఖాలకు ఆలవాలమైనది, ముక్తికి సాధనమైనది, ఈ ప్రపంచాన్ని నడిపించేది.

క. విడిచితి భవబంధంబుల, నడఁచితి మాయావిమోహ మయిన తమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ, గడచితి నా జన్మ దుఃఖ కర్మార్ణవమున్.

149

తా ॥ ఇప్పుడే ఈ భవబంధాలను విడిచిపెడుతున్నాము. మాయతో కూడిన చీకటిని నశింపచేశాను. అరిషడ్వర్గాలను జయించాను. జననమరణాలు అనే దుఃఖసముద్రాన్ని దాటాను.

క. యోషి ద్రూపంబున నను, నేషణ ముఖగహ్వరమున నెగ్రమింగి కడున్
ద్వేషమునఁ గోఁతిఁ జేసిన, దోషద యగు నాత్మ మాయఁ దొలఁగం గంటిన్.

150

తా ॥ మంచి యవ్వనవతి అయిన స్త్రీ రూపంలో వచ్చి కోరికలనే ముఖాన్ని తెరచి నన్ను భయంకరమైన గుహలోకి నెట్టేసింది. నన్ను కోతిని చేసి ఆడించిన దోష భూయిష్ఠమగు మాయ తొలగిపోయింది.

వ. అని యిట్లు వైష్ణవ జ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన బ్రాహ్మణుండు.

151

మ. భగవద్ధర్మపరాయ ణోత్తముల సంభాషైక మంత్రంబులన్
మిగులన్ జ్ఞానము పుట్ట మోహ భవ సమ్మిశ్రాత్మబంధంబులన్
దెగ ఖండించి సబంధు మిత్ర సుత పత్నీ మోహ విశ్రాంతుఁడై
జగతీనాథు రమేశుఁ గృష్ణుని దయైశ్వర్యంబులం గోరుచున్.

152

తా ॥ ఇలా అనుకొని ఆ బ్రాహ్మణుడు వైష్ణవ జ్ఞానదీపం ఆత్మలో వెలిగేసరికి భాగవత ధర్మాన్ని పాటించే ఉత్తములు అయిన వారితో స్నేహం చేశాడు. అతనిలో కలిగిన జ్ఞానంతో బంధాలన్నింటిని ఖండించాడు. బంధువులు, మిత్రులు, సుతులు, భార్య వీళ్ళందరికి దూరంగా వెళ్ళిపోయాడు. శ్రీమహా విష్ణువు యొక్క దయను, ఐశ్వర్యాన్ని కోరాడు.

క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్
వర ముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని యరుదగు కోటల్.

153

తా ॥ 'విష్ణుభక్తులతో స్నేహం ఎప్పటికీ చెడిపోని పుణ్యధనము యొక్క మూటలు. శ్రేష్ఠమైన ముక్తికాంత వలె నిర్మలమైనది. అరిషడ్వర్గము ఎప్పటికి ప్రవేశించలేని అరుదైన కోటలు...' అని ఈ విధంగా అజామిళుడు భావించాడు.

సీ. అనుచు నా బ్రాహ్మణుం డతి తత్త్వవేదియై భవబంధముల నెల్లఁ బాఱఁదోలి
మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ బ్రబ్బిన దేవతాభవనమందు
నాసీనుఁడై యోగ మాశ్రయించి చెలంగు దేహేంద్రియాదుల తెరువువలన
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి మానుగా యోగసమాధిచేత

ఆ. గుణగణంబుఁ బాసి కొూమ రొొప్పిన భగవ, దనుభవాత్మయందు నాత్మఁ గలిసి
రమణఁ దన్ను మొదల రక్షించినట్టి యా, పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె.

154

తా ॥ ఇట్లా అనుకొని ఆ బ్రాహ్మణుడు తత్త్వవేది అయి, భవబంధములను పారద్రోలి గంగా తీరానికి వెళ్ళి అచ్చట ఒక దేవతా భవనంలో ఆసీనుడయ్యాడు. యోగ మార్గాన్ని ఆశ్రయించి దేహం యొక్క అవసరాలను పట్టించుకోవటం మానేశాడు. ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకున్నాడు. సమాధిచేత పరతత్త్వాన్ని దర్శించి తన ఆత్మను అందులో లీనం చేశాడు. అప్పుడు తనను మొదట రక్షించినటువంటి ఆ దివ్యపురుషుల దర్శనం అయింది. వాళ్ళకు మ్రొక్కాడు.

వ. అ ట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్య శరీరుండై యగ్రభాగంబునం బ్రా గుపలబ్ధులైన మహా పురుష కింకరులం గాంచి, సమంచిత రోమాంచిత చల చ్ఛటా పింజరిత స్వేదబిందు సందోహ మిష నిష్యంద మహానందవల్లికా మతల్లికాంకుర సంకుల పరిశోభిత తనుండును, హర్ష నికర్షమాణ మానసోద్యోగ యోగప్రభావోత్సాహ విస్మయ మందస్మిత ముఖారవింద కందళితుండును, నిఖిల జగజ్జేగీయమానాఖండ శుభప్రద శుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై, ప్రణామంబు లాచరించుచు భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచి, తత్క్షణంబున హరిపార్శ్వవర్తను లైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి, యా విష్ణుసేవకులతోఁ గూడి దివ్య మణి గత ఖచితంబగు సువర్ణమయం బయిన యసమాన విమానం బెక్కి, నిఖిలానంద భోగభాగ్యానుభ వాకుంఠితం బైన వైకుంఠంబున శ్రీమన్నారాయణ పాదారావింద సేవాచరణ పరిణామ స్థితికిం జనియె. ఇట్లు విప్లావిత సర్వధర్ముండైన దాసీపతి, గర్హిత కర్మంబులచేతఁ బతితుండును, హతవ్రతుండును నై నరకంబునం గూలుచుండి, భగవన్నామ గ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున.

155

తా ॥ ఈ ప్రకారంగా అజామిళుడు యోగమార్గం ద్వారా శరీరాన్ని పరిత్యజిస్తూ ఉండగా, తన పుణ్యశరీరంతో తన ముందు తాను ఇంతకు ముందు చూసిన దివ్యపురుషులను చూసాడు. వారిని చూసేసరికి ఒక్కసారి శరీరం గగుర్పొడిచి పారవశ్యంతో చెమర్చింది. మనస్సు ఆనందంలో మునకలు వేసింది. చిత్తం సంతోషంతో నిండిపోయింది. యోగప్రభావం చేత ఉత్సాహవిస్మయాలతో కూడిన మందస్మితంతో ముఖం వెలిగిపోయింది. నిఖిల జగత్తుకు అఖండమైన శుభములను ఒసగే దివ్యాకారులను సందర్శించిన కారణంగా ఆనందంతో పొంగిపోయాడు. ప్రణామాలు చేస్తూ, గంగాతీరంలో శరీరాన్ని విడిచిపెట్టాడు. విడిచి పెట్టిన మరుక్షణమే హరికి సన్నిహితంగా మసలుతూ ఉన్న దాసవరుల స్వరూపాన్ని ధరించాడు. ఆ విష్ణుసేవకులతో కూడి దివ్యమణులతో ప్రకాశించే బంగారు విమానాన్ని ఎక్కాడు. భోగభాగ్యాలకు నెలవైనది, ఆనందాన్ని ఇచ్చేది అయిన వైకుంఠానికి శ్రీమన్నారాయణ పాదసేవనానికై వెళ్ళాడు. ఈ విధంగా సర్వధర్మాలను విడిచిపెట్టిన వాడు, దాసీ దానిని పెండ్లి చేసుకున్నవాడు, అనేక తప్పుడు పనులు చేసినవాడు అయిన ఆ బ్రాహ్మణుడు నరకంలో కూలబోతూ కేవలం మరణాసన్న సమయంలో "నారాయణా!" అని పిలిచిన కారణంగా ముక్తుడైనాడు.

క. కర్మంబు లెల్లఁ బాయను, మర్మము దలఁపంగ లేదు మధురిపు పేరే
పేర్మిని నొడువుటకంటెను, దుర్మదమునఁ జిత్త మెన్ని త్రోవలఁ జన్నన్.

156

తా ॥ కర్మములను విడిచిపెట్టడానికి ఒక్కటే ఉపాయం ఉన్నది. అదేమిటి అంటే చిత్తం ఎన్ని త్రోవలలో వెళ్ళినా సర్వదా నారాయణ నామాన్ని విడువకుండ ఉచ్చరించటమే.

ఉ. పాండవ వంశపావన నృపాలక! యీ యితిహాస మెవ్వఁ డే

నొండొక భక్తి లేక విను నొప్పుమెయిం బఠియించు నాతఁ డు
ద్దండత ముక్తికామినికిఁ దానకమై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమదూతల చూడ్కి కగోచరాకృతిన్

157

తా ॥ ఓ పాండవ వంశ పావనా! ఈ ఇతిహాసాన్ని ఎవ్వరు భక్తితో ఏకాగ్రతతో చదువుతారో, వారు యమదూతలను అందక ముక్తికాంతను ఆశ్రయించి, మహా విభూతితో విష్ణులోకంలో ఉంటారు.

తే. అరయ పుత్త్రోపచారిత మైన విష్ణు, నామ మవసానకాలంబునను భజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు, నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమి చెప్ప?

158

తా ॥ ఆలోచిస్తే, కేవలం విష్ణువు పేరుగల తన కొడుకును “నారాయణా!” అని అజామిళుడు పిలిచాడు. అలా పిలిచినంత మాత్రముచేత అతను మరణించిన తరువాత విష్ణులోకమును చేరుకున్నాడు. అటువంటప్పుడు హృదయం నిండా భక్తితో, శ్రీమహా విష్ణువు నామాన్ని ఉచ్చరించితే ఇక చెప్పేదేమి ఉంది!

క. కోరినవారల కెల్లను, జేరువ కైవల్యపదము సిరివరుని మదిం
గోరనివారల కెల్లను, దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్.

159

తా ॥ నిండు మనస్సుతో కోరుకున్న వారికి మోక్షసామ్రాజ్యము చాలా చేరువగా ఉంటుంది. కోరని వారికి కైవల్యం చాలా చాలా దూరంగా ఉంటుంది.”

వ. అనినం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. మునీంద్రా! ఆజ్ఞా భ్రష్టుం డై యమధర్మరాజు

శ్రీవిష్ణు నిర్దేశకులచేత నిహతు లైన భటులచేత వర్ణింపంబడ్డ నారాయణుని నామప్రభావం బాకర్ణించి, వారల కే మనియె? మఱియు, నెన్నఁడేనియు యమదండంబు విఫలం బై పోయిన తెఱంగు గలదేని వినవలయు. ఈ సందేహంబుఁ బాప మహాత్మా! నీవు దక్కఁ దక్కినవారలు సమర్థులు గా రని తలంచుచున్నవాఁడ. చిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయ వచన సుధాధారలఁ బ్రసాదింప వలయు అనిన శుకుఁ డిట్లనియె.

160

తా ॥ ఇంతవరకు విన్న పరీక్షిత్తు, శుకయోగీంద్రునితో ఇలా అన్నాడు. మునీంద్రా! తన ఆజ్ఞ వ్యర్థమైనందుకు యమధర్మరాజు ఏమనుకున్నాడు? యమభటులు వెళ్ళి చెప్పారు కదా! అప్పుడు తన భటుల చేత వర్ణింపబడిన నారాయణుని నామప్రభావాన్ని ఆకర్ణించి వాళ్ళతో ఏమన్నాడు? ఈ సందర్భంలో కాకుండా ఇంక ఎప్పుడైనా యమదండము విఫలం అయిందా? నాకు కలిగిన సందేహాన్ని తీర్చటానికి మీరు తప్ప తక్కిన వారలు సమర్థులు కారని నేను అనుకొంటున్నాను. నా మనస్సు సంతోషించేటట్లు మీరు మీ వచనామృతాన్ని అందించండి!" అప్పుడు శుకుడు ఇట్లా అన్నాడు:

క. శ్రీకృష్ణభటులచేత ని, రాకృతులయి యామ్యభటులు యమునకు నాత్మ
స్వీకృత విప్రకథాక్రమ, మీ క్రియ మున్ దెలిపి రదియు నెఱిఁగింతుఁ దగన్.

161

తా ॥ "యముని భటులు విష్ణుదూతల చేత అనాదరం చేయబడి, యమునితో చెప్పిన విప్రకథాక్రమం గురించి చెపుతాను.

తే. చేరి త్రివిధకర్మలఁ జేయు జీవతతికిఁ, గర్మ ఫలములఁ దెలిపెడు కారణంబు
నగుచు శిక్షించువారు లీ యవనిమీఁద, దేవ! యెందఱు గలరయ్య? తెలియవలయు.

162

తా ॥ యమునితో యమదూతలు ఇలా అన్నారు – "దేవా! మూడు రకాలైన కర్మలు చేయు జీవజాలానికి, ఆ కర్మఫలాలను తెలియజేసేవారగుచూ శిక్షించువారు ఈ భూమిపై ఎందరున్నారయ్యా తెలియజెప్పు?

క. దక్షిణదిశాధినాయక!, శిక్షం దగఁ జేయువారు క్షితిఁ బెక్కం డ్రే
నీ క్షయము న్నక్షయమును, సాక్షాత్తుగ రెండు నెందు సంపన్న మగున్?

163

తా ॥ ఓ దక్షిణ దిశాధీశ్వరా! శిక్షించేవాడివి నీవొక్కడివే అని మా అభిప్రాయం. అలా కాక పోయినట్లయితే చావుపుట్టుకలు రెండూ సమానంగా లోకంలో ఎలా వృద్ధినొందుచున్నాయి?

తే. దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల, నాజ్ఞ పెట్టెడువారు పెక్కైనచోట
నకట! శాస్తృత్వ ముపచార మయ్యెఁ గాదె!, శూరులై నట్టి మండలేశులకుఁ బోలె.

164

తా ॥ కర్మబంధములకు శిక్షలను నిర్ణయించేవారు ఒక్కరే ఉండాలి. అలా కాకుండా ఎక్కువమంది ఉన్నట్లయితే "శాసకుడు" అనేమాట కేవలం వాడుక కోసమే అవుతుంది.

ఉ. కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులందు సం
భావిత భూతకోటిఁ బరిపాకవశంబున శిక్ష సేయఁగా
నీ వర శాసనం బఖిలనిర్ణయమై తనరారుచుండ నేఁ
డీవలఁ గ్రమ్మఱింప మఱి యెవ్వఁడు శక్తుఁడు ? ధర్మపాలకా!

165

తా ॥ ముల్లోకాలకు నీవు ఒక్కడవే కర్తవు. జీవుల కర్మను అనుసరించి శిక్షించడానికి

నీకొక్కడికే అధికారం ఉంది. ఓ ధర్మపాలకా! నీ శ్రేష్ఠమయిన శాసనం తిరుగులేనిది. అట్టిచో దానిని దాటడానికి మరి ఎవ్వడు శక్తుడు?

క. చండ కర తనయ! యొరులకు, దండ ధరత్వంబు గలదె! తన జగమునను
ద్దండధరవృత్తి నొత్తిలి, దండింతువు నిన్ను దండధరుఁ డని పొగడన్.

166

తా ॥ ఓ సూర్యపుత్రా! ఇతరులను దండించే అధికారం నీకు తప్ప మరెవరికీ లేదు. నిన్ను దండధరుడు అని పొగడుతారు. పాపం చేసిన వారిని దండధరవృత్తిచేత నువ్వు దండిస్తావు.

సీ. ఇట్టి నీ దండంబ యీ మూఁడు జగములఁ దెగువయై నేఁడు వర్తిల్లుచుండ
మనుజలోకంబుల మహితాద్భు తాకార సిద్ధుల మిగులఁ బ్రసిద్ధు లైన
వారు నల్వురు వేగ వచ్చి నిర్దేశంబు భంగించి మ మ్మంతఁ బాఱఁదోలి
మీ శాసనంబున మే మీడ్చి కొని వచ్చు క్రూరచిత్తునిఁ బుచ్చి కొని యదల్చి
తే. పాశబంధంబు లీసునఁ బట్టి త్రెంచి, బలిమి మిగులంగ మమ్మునుఁ బాఱఁ దోలి
యిచ్చఁ జనినారు వారు దా మెచటివార, లాదరమ్మున నేఁడు మా కానతిమ్ము.

167

తా ॥ నీ శాసనం మూడు లోకాలలోను వర్తిల్లుతోంది. అట్టి స్థితిలో మనుష్య లోకంలో దీనికి భిన్నంగా ఒక వింత జరిగింది. దివ్యపురుషులు ఎవరో నలుగురు వచ్చి, నీ శాసనం ప్రకారం మేము ఈడ్చుకొని వస్తూన్న క్రూరాత్ముణ్ణి పాశబంధములను త్రెంచి, మమ్ములను పారద్రోలి వాళ్ళు వెళ్ళిపోయారు. వాళ్ళెక్కడివారో మీరు మాకు ఆనతివ్వండి.”

వ. అనిరి. అని మఱియు శుకుం డిట్లనియె. అట్లు దూతలు పరితాప సమేతులై పలికిన, దండధరుండు పుండరీకాక్షుని చరణ కమలంబుల మానసంబున సన్నిహితంబులుగఁ జేసి,

వందనం బాచరించి, పరమ భక్తిపరుండై వారల కిట్లనియె.

168

తా ॥ అని. ఈ విధంగా యమదూతలు పరితాపంతో పలికార" ని చెబుతూ శుకుడు ఇంకా ఇలా అన్నాడు: "యమధర్మరాజు శ్రీమహా విష్ణువు చరణకమలాలను తన మనస్సులో తలచుకొని వందనం చేసి భక్తితో తన భటులతో ఇలా అన్నాడు:

సీ. కలఁడు మదన్యుండు ఘనుఁ డొక్కఁ డతఁ డెందు వెలికిఁ గానఁగరాక విశ్వమెల్ల
నతిలీనమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి నుండును గోక నూలున్నభంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి నామసంకీర్తన
స్థేమగతుల విహరించు నెవ్వఁడు విలసిత మత్పూజ లెవ్వని పదముల నివ్వటిల్లుఁ

తే. గనుట మనుట చనుట గల్గు నెవ్వనిలీల, లందు లోక మెవనియందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వని నామముల్, కర్మబంధనముల పేర్మి నడఁచు.

169

తా ॥ 'ఉన్నాడు – నాకంటే అన్యుడైన ఘనుడు ఒకడు ఉన్నాడు. ఆతడు బయటకు కానరాకుండ విశ్వమంతా లీనమై సమగ్రస్ఫూర్తితో మహాద్భుతంగా ఉంటాడు. అతడు చీరలో నేయబడిన దారాలవలె విశ్వమంతా ఉంటాడు. త్రాడుతో పశువులు కట్టబడినట్లుగా అతని ఆజ్ఞానుసారం జీవులు బంధించబడి ప్రవర్తిస్తూ ఉంటారు. నామసంకీర్తనం చేత ఎవడు విహరిస్తూ ఉంటాడో, నిత్యము నేను ఎవని పాదములకు పూజ చేస్తానో, జననము మనుగడ మరణము ఎవని లీలలో, ఈ లోకం ఎవనిని పొందుతుందో, ఎవని నామాన్ని జపిస్తే కర్మబంధనములు పటాపంచలు అయిపోతాయో, అతనినే నేను నిత్యమూ జపిస్తాను.

తరళము
వినుఁడు నేను మహేంద్రుఁ డప్పతి వీతిహోత్రుఁడు రాక్షసుం

డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరి సంయమి సిద్ధులున్
మొనసి కన్గొనఁజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తియై.

170

తా ॥ ఓ దూతలారా! వినండి! నేను, మహేంద్రుడు, వరుణుడు, అగ్ని, నైఋతి, వాయుదేవుడు, సూర్యుడు, చంద్రుడు, బ్రహ్మ, మరుత్తులు, మహేశ్వరుడు, రుద్రవర్గము, సిద్ధులు... అందరమూ కూడి కూడా అతని యొక్క స్వరూపాన్ని కనుగొన జాలము.

క. సత్యేతర గుణ పాశ వ, శత్వంబునఁ బొంద వీరు జలజాక్షు సదై
కత్వంబు గాన నోపరు, సత్త్వ ప్రాధాన్యు లితర జనులకుఁ దరమే?

171

తా ॥ లోకంలో సత్త్వగుణంకంటే ఇతరములైన రజస్తమో గుణములనే పాశములతో బంధితులయిన వారు ఆ జలజాక్షుని ఏకత్వాన్ని కానలేరు. సత్త్వగుణాధిక్యత కలవారు కొంత గుర్తిస్తారు. ఇక ఇతరుల మాట చెప్పేదేమిటి?

చ. అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో
నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మ వా
గ్విభవ గరిష్ఠులై వెదకి వీఁటిఁడి ప్రాణులు; సర్వవస్తువుల్
శుభగతిఁ జూడనేర్చి తనుఁ జూడఁగ నేరని కంటిపోలికన్.

172

తా ॥ పరమేశ్వరుడు పుట్టుక లేనివాడు, కొలతలకు అందనివాడు, అంతములేనివాడు, నిత్యుడు. జీవులశరీరాలలో క్షరమూ, అక్షరమూ అయి ఉన్నది కూడా ఆయనే. అట్టి ఆయనను మనస్సునందు, వాక్కునందు కర్మలయందు గరిష్ఠులై కూడ మానవులు దర్శింపలేరు. ఇది

ఎలాంటిదంటే సర్వ వస్తువులను చూడనేర్చిన కన్ను తనను తాను చూడనేరదు కదా!

చ. పరముని భక్తలోక పరిపాలన శీలుని దుష్టలోక సం
హరుని పతంగపుంగవ విహారుని కూరిమి దూతలా మనో
హరులు సురేంద్రవందితులు నా హరిరూప గుణ స్వభావులై
తిరుగుచునుందు రెల్లెడల దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్

173

తా ॥ ఆయన భగవంతుడు, భక్తలోక పరిపాలుడు, లోకంలోని దుష్టులను సంహరించువాడు. గరుడునిపై విహరించువాడు. ఆయన దూతలు చాలా మనోహరులు. ఇంద్రాదులు వారికి సైతం నమస్కరిస్తారు. దూతలు కూడ శ్రీమన్నారాయణ రూపధారులై దివ్యతేజంతో ఎల్లెడలా తిరుగుతూ ఉంటారు.

ఉ. లెక్కకు నెక్కువై కసటులేని మహాద్భుత తేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతి భీమబలాఢ్యులు విష్ణుదూత లా
చక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్
గ్రక్కిఁటి సీ జగంబునను గేశవసేవక రక్షణార్థమై.

174

తా ॥ లెక్కపెట్టడానికి వీలు లేనంతమంది విష్ణుదూతలు అద్భుతమైన తేజస్సుతో ఈ లోకంలో అన్నిచోట్లా కేశవుని సేవించే వారిని రక్షించే నిమిత్తమై చరిస్తూ ఉంటారు. వారు భీమ బలాఢ్యులు, ధర్మమూర్తులు, శాంతులు, అతి సాహసవంతులు, దేవతలచేత సైతం పూజింపబడేవారు.

క. నా వలనను మీ వలనను, దేవాసుర గణమువలనఁ ద్రిజగంబులలో
నే వగలఁ బొందకుండఁగఁ, గావం గలవారు పుడమిఁ గల వైష్ణవులన్.

175

తా ॥ నా వలన, మీ వలన, దేవాసురుల వలన, మూడులోకాలలోను ఉన్న విష్ణుభక్తులను ఏ ఆపదలు రాకుండ వారు కాపాడుతూ ఉంటారు.

క. భగవ త్ప్రణిహిత ధర్మం, బగపడ దెవ్వారి మతికి ననిమిష గరుడో
రగ సిద్ధ సాధ్య నర సుర, ఖగ తాపస యక్ష దివిజ ఖచరుల కైనన్.

176

తా ॥ దేవతలు, గరుడులు, పాములు, సిద్ధులు, సాధ్యులు, నరులు, పక్షులు, తాపసులు, యక్షులు, ఖేచరులు.... ఎవ్వరూ కూడా భగవంతుని తత్త్వాన్ని గుర్తించలేరు.

క. ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు, పన్నగపతిశాయి తత్త్వభావము మేనం
గన్నుల వేల్పును డాపలఁ, జన్నమరిన వేల్పు ముదుక చదువుల వేల్పున్.

177

తా ॥ ఆదిశేషువు మీద పవళించే ఆ పరమాత్ముని తత్త్వాన్ని సహస్రాక్షుడైన ఇంద్రుడుగాని, అర్ధనారీశ్వరుడు కాని, విధాత కాని ఎప్పటికీ తెలుసుకోలేరు.

సీ. వర మహాద్భుత మైన వైష్ణవజ్ఞానంబు తిరముగా నెవ్వరు తెలియఁగలరు?
దేవాదిదేవుండు త్రిపుర సంహరుఁ డొండెఁ గలమసంభవుం డొండెఁ గార్తికేయ
కపిల నారదు లొండె గంగాత్మజుండొండె మను వొండె బలి యొండె జనకుఁ డొండెఁ
బ్రహ్లాదుఁ డొండె నేర్పాటుగా శుకుఁడొండె భాసురతర మతి వ్యాసుఁ డొండెఁ

తే. గాక యన్యుల తరమె? యీ లోకమందు, నీ సుబోధంబు సద్బోధ మీ పదార్థ
మీ సదానంద చిన్మయ మీ యగమ్య, మీ విశుద్ధంబు గుహ్యంబు నీ శుభంబు.

178

తా ॥ మహాద్భుతమైన వైష్ణవ జ్ఞానాన్ని ఎవరు తెలుసుకోగలరు? దేవాదిదేవుడయిన శివుడు, బ్రహ్మ, కార్తికేయుడు, కపిల మహర్షి, నారదుడు, భీష్ముడు, మనువు, బలిచక్రవర్తి, జనక మహారాజు, ప్రహ్లాదుడు, శుక మహర్షి, వేదవ్యాసుడు... వీరు కొంతవరకు గ్రహించగలరేమో.... వీరు కాకుండా అన్యులకు వైష్ణవ జ్ఞానాన్ని తెలుసుకోవటం శక్యం కాదు. ఈ విశేష జ్ఞానమూ, సద్బోధ, బ్రహ్మపదార్థపు తత్త్వం, చిదానందమూ, చిన్మయమూ, అగమ్యమూ, విశుద్ధమూ, రహస్యమూ, సర్వశుభంకరమైన దానిని తెలుసుకోవటం అన్యులకు సాధ్యం కాదు.

క. ఈ పన్నిద్దఱు దక్కఁగ, నోపరు తక్కొరులు తెలియ నుపనిష దుచిత
శ్రీపతినామ మహాద్భుత, దీపిత భాగవత ధర్మ దివ్యక్రమమున్.

179

తా ॥ ఈ పన్నెండు మంది తప్ప ఇతరులు ఎవరూ కూడా ఉపనిషత్తుల చేత చెప్పబడిన శ్రీపతి నామం యొక్క మహాద్భుతాన్ని, భాగవత ధర్మాన్ని తెలుసుకోలేరు.

ఆ. ఏది జపియింప నమృతమై యెసఁగుచుండు, నేది సద్ధర్మపథ మని యెఱుఁగఁ దగిన
దదియె సద్భక్తి యోగంబు నలవరించు, మూర్తిమంతంబు దా హరికీర్తనంబు.

180

తా ॥ ఏ నామాన్ని జపిస్తే అమృతమై అలరారుతూ ఉంటుందో, ఏది ధర్మపథంగా భాసిస్తుందో అదే భక్తియోగంగా పరిణమిస్తుంది. అటువంటి మూర్తిమంతమైన భక్తియోగమే హరినామ సంకీర్తనం.

తే. కంటిరే మీరు సుతులార! కమలనేత్రు, భవ్య మగు నామకీర్తన ఫలము నేఁడు
తవిలి మృత్యువు పాశబంధములవలన, జాణతనమున వీడె నజామిళుండు.

181

తా ॥ మీరు కళ్ళారా చూసారు కదా! ఆ కమలనేత్రుని భవ్యమైన నామకీర్తన ఫలాన్ని! అజామిళుడు మృత్యువు యొక్క పాశబంధముల నుండి ఎంతో నేర్పుగా బయటపడ్డాడు.

ఉ. ఏటికి జాలిఁ బొంద? నరు లీ క్రియఁ, గృష్ణుని కీర్తనంబు పా
పాటవులం దహింపఁ గల దౌటకు సందియ మేల? యిప్పు డీ
తూఁటరి దోసకారి పెనుదోషి యజామిళుడంత మొందుచుం
బాటిగ విష్ణునామమును బల్కుచుఁ గేవలముక్తి కేగఁడే?

182

తా ॥ మానవులు దిగులు చెందవలసిన అవసరం ఏముంది? కృష్ణుని నామ సంకీర్తనం పాపమనే అడవులను కాల్చేస్తుంది. ఇప్పుడీ తుంటరి, దుష్టుడు అయిన అజామిళుడు కేవలం "నారాయణా!" అని తన కుమారుని పిలిచాడు. దానికే అతను మోక్షాన్ని పొందాడు.

క. ఇంతయును దథ్య మని మది, నెంతయుఁ దెలియంగ లేరు హీనాత్ములు దు
ర్దాంతతర ఘటిత మాయా, క్రాంతాత్యంత ప్రకాశ గౌరవ జడులై.

183

తా ॥ అజ్ఞానులైన మానవులు ఇదంతా నిజమని గుర్తించలేక అంతంలేని మాయలో పడి కేవలం జడులయిపోతున్నారు.

మంగళ మహాశ్రీవృత్తము.
ఈ విధమునన్ విబుధు లేకతమ చిత్తముల నేకతము లేక హరి నీశున్
భావమున నిల్పి తగు భాగవతయోగ పరిపాకమున నొందుదురు వారిన్
దేవలదు దండనగతిన్ జనదు మాకు గుఱుతింప నఘముల్ దలఁగు మీఁదన్
శ్రీవరుని చక్రము విశేషగతిఁ గాఁచు సురసేవితులు ముక్తిఁ గదుఁ బెద్దల్.

184

తా ॥ జ్ఞానవంతులైనవారు ఏకాగ్రమైన మనస్సుతో శ్రీహరిని భావంలో ఉంచుకొని భాగవతులుగా రూపొందుతున్నారు. మీరు అట్టివారిని తీసుకొని రాకండి. వారిని దండనకు గురిచేయటం మా వల్ల కాదు. వారిని గుర్తిస్తే పాపాలు తొలగిపోతాయి. అంతేకాకుండా శ్రీపతి చక్రము వారిని విశేషంగా రక్షిస్తూ ఉంటుంది. అట్టి భక్తులను దేవతలు సేవిస్తూ ఉంటారు, వారు ముక్తిని పొందుతారు.

ఉ. ఎవ్వరు సిద్ధసాధ్య ఖచరేశ లస త్పరిగీత గాథలం
దెవ్వరు ముక్తిభోగతల హేమ మనోహర చంద్రశాలలం
దెవ్వరు శంఖచక్ర గురుహేతి గదా రుచిరోగ్రపాణు లా
మవ్వపు రూపవంతు లసమానులు వో ధరలోని వైష్ణవుల్.

185

తా ॥ మహనీయులు, అసమానులైన వైష్ణవులను సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు గీతములతో గానం చేస్తారు. వారు ముక్తిసోపానమైన మనోహర కనకపు చంద్రశాలల్లో ఉంటారు. వారి అరచేతుల్లో శంఖములు, చక్రములు, గదాఖడ్గములు రేఖలుగా ప్రకాశిస్తూ ఉంటాయి.

సీ. శ్రుత్యంత విశ్రాంత మత్యనుక్రమణీయ భగవ త్ప్రసంగతుల్ భాగవతులు
సనకాదిముని యోగిజన సదానందైక పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణ పద ధ్యాన కేవ లామృతపాన పరిణామ యుతులు శ్రీభాగవతులు
బహుపాత కానీక పరిభవ ప్రక్రియా పరుషోగ్ర మూర్తులు భాగవతులు

తే. భావ తత్త్వార్థ వేదులు భాగవతులు, బ్రహ్మవా దానువాదులు భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని, పదవి నొప్పారువారు వో భాగవతులు.

186

తా ॥ భాగవతులు ఎప్పుడూ ఉపనిషత్ ప్రసంగములు చేస్తూ ఉంటారు. భాగవతులు ఎప్పుడూ సనకాది మునులు అనుభవించే ఆనందాన్ని అనుభవిస్తూ ఉంటారు. భాగవతులు ఎప్పుడూ శ్రీకృష్ణుని పాదములను ధ్యానం చేస్తూ అమృతాన్ని పానం చేస్తూ ఉంటారు. భాగవతులు ఎప్పుడూ బహు విధములైన పాపములకు దూరంగా ఉంటారు. భాగవతులు ఎప్పుడూ తత్త్వ విచారణ చేస్తూ వేదాంత వీథులలో విహరిస్తూ ఉంటారు. ఎప్పుడూ పరబ్రహ్మమును గూర్చి విచారణ చేస్తూ ఉండే మహోదైశ్వర్య సంపన్నులే భాగవతులు.

క. అదిగాన విష్ణుభక్తులఁ, గదియఁగఁ జనవలదు మీరు కరివరదు లస
త్పదపద్మ వినతి విముఖులఁ, దుది నంటఁగఁ గట్టి తెండు ధూర్తులు వారల్.

187

తా ॥ కనుక మీరు విష్ణుభక్తుల జోలికి వెళ్ళవద్దు. శ్రీహరి పాదపద్మములను ఆరాధించని ధూర్తులను తీసుకొనిరండి.

సీ. ఎకసక్కెమున కైన నిందిరా రమణునిఁ బలుకంగలేని దుర్భాషితులను
గలలోన నైన శ్రీకాంతుని సత్పాద కమలముల్ సూడని కర్మరతుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ దార్పనేరని దుష్కథా ప్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశుని గుడి త్రోవఁ ద్రొక్కఁగలేని దుష్టదులను
ఆ. బరమ భాగవతుల పాదధూళి సమస్త, తీర్థసార మనుచుఁ దెలియలేని
వారి వారివారి వారిఁ జేరినవారిఁ, దొలుతఁ గట్టి తెండు దూతలార!

188

తా ॥ ఓ దూతలారా! ఎకసక్కెమునకైనా ఇందిరారమణుని పేరును ఉచ్చరించని దుర్మార్గులను, కలలోనయినా శ్రీకాంతుని పాదములను చూడని నీచులను, నవ్వులాటకునయినా కృష్ణ ప్రశంస ఎప్పుడూ వినని క్రూరులను, కనీసం యాత్రోత్సవంలో అయినా ఈశ్వరుని

గుడిలోకి అడుగుపెట్టలేని దుష్టులను, పరమ భాగవతుల పాదధూళి సమస్త తీర్థముల సారమని తెలియలేని మూర్ఖులను... వారిని, వారిని ఆశ్రయించుకున్న వారిని కట్టి తీసుకొని రండి.

ఆ. ఎల్లపాపములకు నిల్లైన యింటిలో, బద్ధతృష్ణ లగుచు బుద్ధిఁ దలఁగి
పరమహంసకులము గుఱితప్పి వర్తించు, ధూర్తజనులఁ దెండు దూతలార!

189

తా ॥ తమ గృహముల్లోనే సకల పాపములను చేస్తూ, విపరీతమైన ఆశతో మసలుతూ, పరమహంసలను నిందిస్తూ గురితప్పి చరించే ధూర్తులను పట్టి తీసుకొని రండి.

తే. అరయఁ దనదు జిహ్వ హరిపేరు నుడువదు, చిత్త మతని పాదచింతఁ జనదు,
తలఁపఁ దమకు ముక్తి తంగేటి జున్నొకో?, సకల విష్ణు భక్తులకును బోలె.

190

తా ॥ వీరి నాలుక ఎప్పుడూ హరినామాన్ని పలుకదు. చిత్తం ఎప్పుడూ విష్ణుపాదముల చెంతకు వెళ్ళదు. మరి అటువంటి వారికి ముక్తి ఎందుకు లభిస్తుంది? అదేమైనా పెరట్లోని తంగేడు చెట్టుకు పట్టిన తేనెపట్టు వంటిదా?

ఆ. పద్మనయను మీఁది భక్తి యోగం బెల్ల, ముక్తియోగ మనుచు మొద లెఱుంగు
వారి వారివారి వారిఁ జేరినవారి, త్రోవఁ బోవ వలదు దూతలార!

191

తా ॥ ఓ దూతలారా! పద్మనయనుని మీది భక్తియోగమే ముక్తియోగమని భావించేవారిని, వారికి సన్నిహితంగా మసలే వారిని మీరు కన్నెత్తికూడా చూడవద్దు.'"

వ. అని పలికెనని చెప్పి మఱియు శుకుం డిట్లనియె. శ్రీకృష్ణనామ సంకీర్తనంబు జగన్మంగళం బనియును, జగన్మోహనం బనియును, జగజ్జేగీయమానం బనియును, నిఖిల

మాయాగుణ విచ్ఛేదకం బనియును, ఉద్దామంబు లగు హరి వీర్యంబుల నాకర్ణించు వారల చిత్తంబు లతినిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులుం గావనియు, శ్రీకృష్ణ పదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపువారలన్య పాపకర్మంబు లగు నవిద్యావ్యసనంబులం బొరయనేర రనియును, నిజస్వామి యైన యమధర్మ రాజుచేత గీర్తింపఁబడ్డ భగవ న్మహత్త్వంబు నాకర్ణించి, విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱిచూడ వెఱతురు. నరేంద్రా! పరమగుహ్యంబగు నీ యితిహాసంబును బూర్వకాలంబున సకల విజ్ఞాన గోచరుండైన కుంభసంభవుండు సకల దుఃఖవిలయంబును, సకల పుణ్యనిలయంబును నైన మలయంబునఁ బురాణ పురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించెను అని చెప్పిన విని విస్మయానంద హృదయుండై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె.

192

తా ॥ అని శుకుడు ఇంకా ఇట్లా అన్నాడు: "శ్రీకృష్ణనామ సంకీర్తనం లోకాలకు శుభాలను చేకూరుస్తుంది. జగన్మోహనంగా ఉండి విశేషంగా గానం చేయబడుతుంది. మాయను పోగొడుతుంది. హరి యొక్క గాథలను వినే వారి చిత్తములు నిర్మలమైనట్లుగా తక్కిన వ్రతములవల్ల జరుగదు. శ్రీకృష్ణ పాదపద్మములను తమ హృదయంలో నిలుపుకొన్న వారు ఇతరమైన పాపకృత్యముల జోలికి వెళ్ళరు." అని యమధర్మరాజు తన భటులకు ఉపదేశించాడు. ఆనాటి నుండి ఆ భటులు వైష్ణవ జనములను తేరి చూడటానికి కూడా భయపడతారు. పరమ రహస్యమైన ఈ ఇతిహాసాన్ని పూర్వం విజ్ఞానవేత్త అయిన అగస్త్య మహర్షి మలయపర్వతం మీద పురాణ పురుషుడైన పురుషోత్తముని ఆరాధిస్తూ నాకు చెప్పాడు" అని చెప్పేసరికి పరీక్షిత్తు ఇట్లా అన్నాడు:

## 7. దక్షుడి జననం – సకల జీవరాశుల సృష్టి

క. స్వాయంభువ మనువేళల, నో యయ్య! సురాసురాండ జోరగ నర వ
ర్గాయత సర్గముఁ దెలిపితి, పాయక యది విస్తరించి పలుకం గదవే.

193

తా ॥ "శుక మహర్షీ! స్వాయంభువ మనువు వృత్తాంతాన్ని చెబుతూ దేవతలు, రాక్షసులు, పక్షులు, పాములు, నరులు మొదలైనవారి సృష్టిక్రమాన్ని చెప్పావు. దానిని ఇంకొంచెం విస్తరించి చెప్పు."

క. ఉత్తర కొడు కిట్లడిగిన, యుత్తరమును న మ్మునీంద్రుఁ డుత్తమ చేతో
వృత్తి ముదమంది పలికెను, దత్తరపా టుడిగి వినుఁడు తాపసులారా!

194

తా ॥ ఉత్తరాదేవి కొడుకు అయిన పరీక్షిత్తు ఇలా అడిగేసరికి, సంతోషాన్ని పొందిన శుకమహర్షి ఇలా పలికాడు: 'ఓ తాపసులారా! నిదానంగా ఆలకించండి' అని శౌనకాది మహర్షులతో సూతుడు ఇలా అన్నాడు:

సీ. పూని ప్రచేతసుపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిష ప్రాఖ్య గలుగు
వారు మహాంబోధి వలన వెల్వడి వచ్చి తగ వృక్ష వృత్తమైన ధరణిఁ జూచి
మేదినీజములపై మిక్కిలి కోపించి మదిలోన దీపితమన్యు లగుచు
వక్త్రంబులను మహావాయు సంయుతమైన యనలంబుఁ గల్పించి యవనిజములఁ

తే. బెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి, వారి కోపంబు వారించువాఁడ పోలెఁ
బలికెఁ జందురుఁ డో మహాభాగులార!, దీనములు వృక్షములమీఁదఁ దెగుట తగునె?

195

తా ॥ "ప్రచేతసుని పుత్రులు పదిమంది "ప్రాచీన బర్హిషు" లు సముద్రగర్భంలోంచి బయటకు వచ్చి వృక్షాలతో నిండి ఉన్న భూమిని చూపారు. అంగుళం కూడా చోటు లేకుండ భూమి అంతా వ్యాపించిన వృక్ష సంతతిని చూసి మిక్కిలి కోపించి తమ నోళ్ళు తెరచి మహావాయువుతో కూడిన అగ్నిని కల్పించారు. దానితో చెట్లన్నీ భస్మమవసాగాయి. అందుకు తల్లడిల్లి వారి కోపాన్ని తగ్గించేందుకు చంద్రుడు – "ఓ మహానుభావులారా! నోరులేని వృక్షముల మీద మీ ఆగ్రహం తగునా!" అని శాంతంగా పలికాడు.

తే. మొదల వర్ధిష్ణు లగు మిమ్ము సదయ హృదయు, లగు ప్రజాపతు లనుచు సర్వాత్ముఁ
డనియె, నట్టి మీరు ప్రజాసృష్టి కైన వార, లీ వనస్పతి తతుల దహింపఁ దగునె?

196

తా ॥ వృద్ధి పొందువారైన మిమ్ములను దయగల ప్రజాపతులుగా, సర్వాత్ముడయిన భగవంతుడు సృష్టించాడు. మీరు ప్రజాసృష్టికోసమే సృష్టింపబడినారు. అట్టి మీరు ఈ వనస్పతులను దహించటం న్యాయమా చెప్పండి.

సీ. ఆదికాలంబున నా ప్రజాపతి పతి యయిన లోకేశ్వరుం డచ్యుతుండు
పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధి ముఖ్య జాతంబు నిషము నూర్జంబుఁ గోరి
కల్పించె; నందు ముఖ్యంబైన యన్నంబు నచరంబు లైనట్టి యపద మెల్ల
బాదచారులకును బాల్వెట్టి యిరుగాళ్ళ చేతులు గలిగిన జీవతతికి
తే. హస్తములు లేని యా చతుష్పాదు లెల్ల, నన్నముగఁ బూని కావించె నదియుఁగాక
యా మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున, మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపఱిచె.

197

తా ॥ ఓ ప్రాచేతసులారా! ఈ సృష్టికి ప్రారంభంలో ఆ ప్రజాపతి అయిన లోకేశ్వరుడు, పద్మనేత్రుడు, అచ్యుతుడు అయిన శ్రీమన్నారాయణుడు వనస్పతులను, ఓషధులను కల్పించాడు.

శరీరానికి బలం ఇవ్వటం కోసం జీవులకు వాటిని ఆహారంగా కల్పించాడు. కదిలేవి, పాదచారులు అయిన జీవులకు పాదములు లేని వృక్షములను ఆహారంగా కల్పించాడు. రెండు చేతులు రెండు కాళ్ళు కల ప్రాణులకు నాలుగు కాళ్ళ జంతువులను, వృక్షాలను ఆహారంగా ఏర్పాటు చేశాడు. ఆ కారణంగా మీరు ఈ చెట్లను కాల్చివేయటం సృష్టికి విరుద్ధం, అన్యాయమూను. అదీకాక ఆ మహాభాగుడయిన అచ్యుతుడు మీకు ఆదరంతో "అనఘులు" అనే ప్రఖ్యాతిని, విఖ్యాతిని కల్పించాడు.

క. నిజముగ దేవాధీశ్వరుఁ, డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్ముఁన్
సృజియించె నిట్టివారికిఁ, గుజదహనము సేయ నెట్లు కోరిక వొడమెన్?

198

తా ॥ వాస్తవంగా దేవతలకు అధీశ్వరుడయిన బ్రహ్మ ప్రజలను సృష్టించటం కొరకు పాపరహితులయిన మిమ్ములను సృష్టించాడు. ఇట్టి మీకు చెట్లను దహించాలనే కోరిక ఎలా కలిగింది?

చ. సతత మహత్త్వ సత్త్వగుణ సత్పురుష స్మృతిఁ బొందరయ్య! మీ
పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు
ష్కృతమతమైన కోపమునఁ గిల్బిషభావము మానరయ్య! సం
భృత కరుణావలోకమున భీత తరుప్రకరంబుఁ జూచుచున్.

199

తా ॥ ఎల్లప్పుడూ మీరు సత్త్వగుణ ప్రధానులయి సత్పురుషులుగా మెలగండి. మీ తండ్రులు, తాతలు ఎప్పుడూ మీరు పొందిన కోపాన్ని పొందలేదు. అట్టి కోపానికి లోనై మహా పాపాన్ని మూటకట్టుకోకండి. చూడండి! ఈ వృక్ష సముదాయమంతా ఏ విధంగా భయంతో, గడగడ వణుకుతున్నాయో ఒక్కసారి కరుణతో అవలోకించండి.

ఉ. తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిన్
ఱెప్పలు నాతికిం బతి నరేంద్రుఁడు లోకుల కెల్ల నర్థికి
న్నొప్ప గృహస్థు మూఢులకు నుత్తము లెన్నఁగ వీరు బంధువుల్
ముప్పునఁ గావలేని కడుమూర్ఖులు గారు నిజాల బంధువుల్.

200

తా ॥ పిల్లలకు తల్లిదండ్రులు, నేత్రములకు రెప్పలు, స్త్రీకి పతి, ప్రజలకు నరేంద్రుదు, అర్థులకు గృహస్థు, మూఢులకు ఉత్తములు అయిన బుద్ధిమంతులు... వీరు బంధువులు. అంతేకాని ఆపదలందు రక్షించలేని కఠినులు బంధువులు కానేకారు.

సీ. అఖిల భూతముల దేహాంతస్థ్స మగు నాత్మ యీశుఁ డచ్యుతుఁడని యెఱుఁగవలయు,
నెఱిఁగి సర్వం బైన యిందిరారమణు లో చూపునఁ దనివిగాఁ జూడవలయుఁ,
జూచిన చిద్రూప శుద్ధాత్ము లగు మిమ్ము నెనసిన వేడ్కతో నిచ్చ మెచ్చు,
మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగినచోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ;

ఆ. బాపి దగ్ధశేష పాదపజాలంబుఁ, దియ్య మెసఁగ బ్రతుకనీయవలయు;
ననఘులార! మీర లస్మదీయ ప్రార్థ, నంబు పరఁగఁ జేకొనంగవలయు.

201

తా ॥ అనఘులారా! లోకంలో ఉండే సర్వ భూతములకు వాటి దేహములయందు ఉండే ఆత్మ ఈశ్వరుడే అని తెలుసుకోండి. తెలుసుకొని సర్వత్రా వ్యాపించి ఉన్న శ్రీహరిని మీరు మీ ఆంతర్యంలో తనివితీర దర్శించాలి. అట్లా చూస్తే చిద్రూపులు, శుద్ధాత్ములు అయిన మిమ్ములను వేడుకతో పరమేశ్వరుదు మెచ్చుకొంటాడు. అట్టి పరమేశ్వరుదు అన్నిటా, అంతటా ఉన్నాదని ఎరిగి మీరు క్రోధాన్ని విడనాడాలి. దయతో మీ కోపాగ్నికి దగ్ధం కాకుండా మిగిలిన వృక్ష సముదాయాన్నయినా బ్రతుకనీయండి. ఓ పుణ్యాత్ములారా! నా ప్రార్థనను మీరు ఆలకించండి!

క. ఇదె వృక్ష సముద్భవ యగు, మది రేక్షణ నాప్సరసిఁ గుమారిక నిత్తున్
వదలక బత్నిఁగఁ జేకొని, ముద మందుఁడు పాదపముల మోసము వాయన్.

202

తా ॥ ఇదుగో! ఇలా చూడండి! ఈమె వృక్షసముదాయం నుండి పుట్టిన అందమైన చూపులుగల అప్సరస. ఈ లతాంగిని మీకు భార్యగా ఇస్తున్నాను. ఈమెను స్వీకరించి ఈ వృక్షసంతతికి ఎట్టి హాని తలపెట్టక సంతోషంతో ఉండండి.”

వ. అని యి ట్లామంత్రణంబు సేసి, మారిష యను కన్యకను వారల కిచ్చి చంద్రుండు సనియె. నప్పుడు

203

తా ॥ అని ఇట్లా చెప్పి ప్రాచేతసులను ఒప్పించి, మారిష అను ఆ కన్యకను వారలకు ఇచ్చి చంద్రుడు వెళ్ళిపోయాడు.

క. వారలు పర్యాయంబు, నీరేజముఖీన్ వరించి నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁడై, వారక దక్షుండు పుట్టె వనజజ సముఁడై.

204

తా ॥ వారు అప్సరస అయిన మారిషను వరించి, వివాహం చేసుకొని ఆమెతో సుఖంగా ఉన్నారు. అప్పుడు ధీరుడు, బ్రహ్మతో సమానుడు అయిన దక్ష ప్రజాపతి జన్మించాడు.

క. ఎవ్వని సంతానంబులు, నివ్వటిలెన్ వసుధ నెల్ల నెఱి నా దక్షుం
డి వ్వలన జగము లన్నిటఁ, బ్రవ్వ జలము నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్.

205

తా ॥ ఈ భూమి మీద ఉన్న సకలమైన జీవరాసులూ, అన్నీ ఆ దక్షుని సంతానమే! ఈ

ప్రకారం ఈ దక్షప్రజాపతి జగత్తుని అంతా, కుండలో జలమును నింపినట్లు తన సంతానముతో నింపివేశాడు.

ఉ. వారని వేడ్కతో దుహితృ వత్సలదక్షుడుఁ దక్షుఁడాత్మచేఁ
గోరి సృజించెఁ గొన్నిటి నకుంఠిత వీర్యముచేతఁ గొన్నిటిం
బోరన ఖేచరంబులను భూచరముఖ్య వనేచరంబుల
న్నీరచర వ్రజంబు రజనీచరజాల దివాచరంబులన్.

206

తా ॥ ఆడపిల్లలు అంటే వాత్సల్యం చూపే దక్షప్రజాపతి వేడుకతో వారిని ఆత్మశక్తిచే సృష్టించాడు. కొందరిని తన వీర్యము చేత సృష్టించాడు. కొన్నిటిని ఆకాశ సంచారులుగా, కొన్నిటిని భూమిమీద సంచరించే వానిగా, కొన్నిటిని రాత్రిపూట సంచరించు వానిగా, కొన్నిటిని పగలు సంచరించువానిగా సృష్టి చేశాడు.

క. నరసుర గరు డోరగ కి, న్నర దానవ యక్ష పక్షి నగ వృక్షములం
దరమిడి సృష్టి యొనర్చెను, దిరముగ దక్షప్రజాపతి వితతకీర్తిన్.

207

తా ॥ దక్ష ప్రజాపతి నరులను, దేవతలను, గరుడులను, సర్పములను, దానవులను, యక్షులను, పక్షులను, జలచరాలను, వృక్షములను సృష్టించి శాశ్వతమైన కీర్తిని సంపాదించాడు.

క. బహువిధముల బహుముఖముల, బహురూపము లైన ప్రజల బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో, బహుమానము నొందఁ డయ్యెఁ బ్రఖ్యాతముగన్.

208

తా ॥ అనేక విధాలుగా, అనేక రూపాలతో కూడిన జీవులను, అనేక లోకాలలో

విస్తారంగా సృష్టించినా కూడా ఆయనకు మనస్సులో ఆనందం కలుగలేదు.

తే. అప్రజాసర్గ బృంహితం బైన జగము, దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది మఱియు జననంబు నొందించు మతము రోసి, పరమపురుషుని నాశ్రయింపంగఁ దలఁచె.

209

తా ॥ అనేక విధములైన ప్రజాసర్గములతో కూడి ఉన్న జగములను వీక్షించి తన మదిలో తాపమును పొందాడు దక్షప్రజాపతి. ఇక సృష్టి చెయ్యాలనే సంకల్పాన్ని విరమించాడు. పరమ పురుషుని ఆశ్రయించాలనే నిర్ణయానికి వచ్చాడు.

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టుం జేయువాఁడై

210

తా ॥ ఈ ప్రకారంగా దక్షప్రజాపతికి తను చేసిన సృష్టి తనకు సంతృప్తిని కలిగించలేదు. తన మనస్సులో లక్ష్మీకాంతుని సంతుష్టుణ్ణి చెయ్యాలని అనుకున్నాడు.

క. మోదం బై పరిదూషిత, ఖేదం బై శాబర్ధీ కిలికించిత దృ
గ్భేదం బై బహుసౌఖ్యా, పాదం బై యొప్పు వింధ్యపాదంబునకున్.

211

తా ॥ అంతట దక్షుడు తపస్సు చేసేందుకు వింధ్యపర్వత ప్రాంతానికి వెళ్ళాడు. ఆ పర్వతం మనస్సులోని దుఃఖాన్ని పోగొట్టేదిగా, ఆనందాన్ని కలిగించేదిగా ఉన్నది. అంతే కాక, శబరస్త్రీల విలాసమైన వీక్షణాలతో ఉన్నది. ఆనందాన్ని, ఆహ్లాదాన్ని అందించేదిగా ఉంది ఆ ప్రాంతం.

వ. అరిగి, యం దఘమర్షణం బను తీర్థంబు సర్వ దురితహరం బై యొప్పుదాని

ననుసవనంబు సేవించి, యతిఘోరం బైన తపంబు సేయుచు హరిం బ్రసన్నుంజేసి, హంసగుహ్యం బను స్తవరాజంబున నిట్లని స్తుతించె.

212

తా ॥ అక్కడకు వెళ్ళి, అఘమర్షణం అనే తీర్థంలోకి ప్రవేశించాడు. అది సర్వ పాపములను క్షాళనం చేస్తుంది. అందులో ప్రతినిత్యమూ స్నానం చేస్తూ, అతి ఘోరమైన తపస్సుని చేసి హరిని ప్రత్యక్షం చేసుకొని "హంసగుహ్యం" అనే స్తోత్రంతో దక్షుడు ఈ విధంగా స్తుతించాడు:

## 8. దక్షుడు చేసిన హంసగుహ్యం అను స్తవరాజం

తే. పరమునికి వందనము సేతుఁ బరిఢవించి, ము న్నవితథానుభూతికి మ్రొక్కికొందు,
మెఱయు గుణములఁ దేలు నిమిత్తమాత్ర, బంధుఁడై నట్టి వానికిఁ బ్రణుతి సేతు.

213

తా ॥ "పరంధామునికి నా నమస్కారం. అనుభూతియే ఆకారమైన వానికి నా వందనములు. సర్వ సుగుణములతోనూ ప్రకాశిస్తూ, నిమిత్తమాత్రంగా అందరికీ బంధువైనట్టి వానికి నా ప్రణామములు.

ఆ. తవిలి గుణముచేతఁ దత్త్వబుద్ధులచేత, నిగిడి కానరాని నెలవుకాని
మొదలఁ దాన కలిగి ముక్తి మానావధి, రూపమైనవాని ప్రాపుఁ గందు.

214

తా ॥ గుణములచేతగాని, తత్వబుద్ధులచేతకాని వెతికే వారికి నీ ఉనికి కానరాదు. నీవు అనాదివి, ముక్తిస్వరూపుడవు. అట్టినిన్ను ఆశ్రయిస్తున్నాను.

తే. ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ, బొందు సేసినట్టి పొందుకాని
పొందు వొందలేఁడు పురుషుండు గుణముఁదా, గుణినిఁ బోలె నట్టి గుణి భజింతు.

215

తా ॥ జీవుల అన్ని శరీరములయందు అంతర్యామిస్వరూపంగా ఉంటున్నావు. కాని ఎవరూ నిన్ను తెలిసికొన లేకుండా ఉన్నారు. ఆ జీవులందరు వారిలో వారు పొందు చేస్తున్నారే కాని నీతో పొందు చెయ్యలేకుండగా ఉన్నారు. గుణములలో చిక్కుకొన్న జీవులు గుణములకు ఈశ్వరుడవయిన నిన్ను పట్టించుకోవటం లేదు. అట్టి గుణివయిన నిన్ను భజిస్తున్నాను.

ఉ. పూని మనంబులుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులున్
బ్రాణములున్ వివేక గతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగ నేర వా గుణనికాయములం బరికించునట్టి స
ర్వానుగతు న్సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్.

216

తా ॥ మనస్సు, తనువు, పంచభూతాలు, పంచ ఇంద్రియాలు పంచప్రాణములు వీటితో ఉన్న జీవులు "నేను" అంటే, అవే అనుకొంటున్నారు. అజ్ఞానంతో అంతకంటే వేరేమీ లేదనే ఉద్దేశ్యంతోనే నిన్ను గుర్తింపలేకున్నారు. సమస్తమునకు హితుడైన వాడు, పరమాత్మ స్వరూపుడు ఆది పురుషుడు అయిన నిన్ను ఆశ్రయిస్తాను.

వ. మఱియు బహువిధ నామ రూప నిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలన గలిగెడు నుపరామం బగు సమాధియందుఁ గేవల జ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మల ప్రతీతిస్థానంబైన హంసస్వరూపికి నమస్కరింతు. దారువందు నతిగూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డైన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబుల చేతం దేజరిల్లం జేయుదురు. అట్టి దేవుండు సకల మాయావిచ్ఛేదకం బైన నిర్వాణ సుఖానుభవంబులం గూడి యుచ్చరింపం గొలఁదిగాని శక్తిగల విశ్వరూపి నాకుం బ్రసన్నుండగుం గాక. వాగ్బుద్ధీంద్రియ మానసంబులచేతం జెప్పను, నిట్టి దని నిరూపింపను, నలవిగాక యెవ్వని గుణరూపం బులు వర్తించు, నెవ్వఁడు నిర్గుణుండు, సర్వంబు నెవ్వని వలన నుత్పన్నంబగు, నెవ్వని వలన స్థితిం బొందు, నెవ్వని వలన లయంబగు, నట్టి పరాపరంబులకు బరమంబై, యనన్యంబై సర్వవ్యాపకంబై, యదియ బ్రహ్మంబై, యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు. ఎవ్వని ప్రభావంబు మాటలాడెడు వారలకు, వాదంబు సేయువారలకు వివాదస్థలం బగుచు, నప్పటప్పటికి మోహంబు నొందింపుచుండు, నట్టి యనంతగుణంబులు గల మహాత్మునకుం

ప్రణామంబు సేయుచు నస్తి నాస్తి యను వస్తుద్వయ నిష్ఠలం గలిగి, యొక్కటనఁ గలిగియుఁడి, విరుద్ధ ధర్మంబులుగ నుపాసనాశాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై, వీక్షింపఁదగిన పరమంబు నాకు ననుకూలంబగుం గాక, ఎవ్వఁడు నామరూపంబులు లేకుండియు, జగదనుగ్రహంబు కొఱకు జన్మకర్మంబులచేత నామరూపంబులు గల్గి తేజరిల్లు, నట్టి యనంతుండైన భగవంతుండు సుప్రసన్నుండగుఁ గాక. ఎవ్వఁడు జనుల పురాకృత జ్ఞాన పదంబుచేత నంతర్గతుండై, మేదినింగలుగు గంధాది గుణంబుల నాశ్రయించిన వాయువుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబు సేయుంగాక అనుచు భక్తి పరవశుండై యుక్తి విశేషంబున స్తుతియింపుచున్న దక్షునికి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొందిప్రత్యక్షం బయ్యె నంత.

217

తా ॥ మనస్సు అనేక విధాలైన నామరూపాలతో ఏర్పడింది. మనస్సు వాటిని గుర్తిస్తూ ఉంటుంది... నామరూపాత్మకమైన ఈ ప్రపంచం తొలగిపోయినప్పుడు మనస్సు లేకుండా పోతుంది. అప్పుడే జ్ఞానస్వరూపమైన ఆత్మ గోచరిస్తుంది. దానినే 'సమాధి' అని అంటాం. అట్టి సమాధికి ఆశ్రయభూతుడవైన హంస స్వరూపుడవు, నీకు నమస్కారము.

ఎండుకట్టెలో గూఢంగా ఉన్న అగ్నిని రగుల్కొల్పినట్లు కొందరు బుద్ధిమంతులు హృదయంలో ఉన్న పరమపురుషుని మాయను తొలగించి, పరమపురుషుడవైన నిన్ను ప్రకాశింపచేస్తారు. అట్టి విశ్వరూపి నాకు ప్రసన్నుడగు గాక!

ఆ విశ్వరూపి వాక్కుచేతకాని, బుద్ధిచేతకాని, ఇంద్రియముల చేతకాని, మనస్సు చేతకాని నిరూపించడానికి వీలులేనివాడు. ఎవడు నిర్గుణుడో, సర్వానికి జన్మకారణుడు ఎవడో, ఎవడు స్థితి కారకుడో, ఎవడు లయకారుడో, ఎవడు పరా—అపరములకు పరుడో, ఎవడు అనన్యుడో, ఎవడు సర్వ వ్యాపకుడో... అట్టి దానినే బ్రహ్మము అని అంటారు. నేను అట్టి ఆది కారణమైన

తత్త్వాన్ని ఆశ్రయిస్తాను. అట్టి పరబ్రహ్మ ప్రభావం వల్లనే మాట్లాడేవారు మాట్లాడగలుగుతున్నారు. వాదం చేసే వారు వాదం చేయగలుగుతున్నారు. అటువంటి అనంత గుణములు కల మహాత్మునకు నేను ప్రణామాలు చేస్తున్నాను.

అస్తి (ఉన్నది), నాస్తి (లేదు) అనే రెండు ధర్మాలుగా కనపడుతున్నా, అవి ఒకదానికి మరొకటి విరుద్ధంగా ఉన్నా ఉపాసనా శాస్త్ర, సాంఖ్య శాస్త్రములద్వారా వాటికి సమత్వాన్ని చేకూర్చే పరమాత్మ నాకు అనుకూలమగుగాక! ఎవనికి వాస్తవంలో నామము–రూపము లేకపోయినా లోకం మీది అనుగ్రహం కొరకు నామరూపాదులు కలిగి తేజరిల్లుతూ ఉంటాడో అట్టి పరమేశ్వరుడు నాకు ప్రసన్నుడు అగుగాక! ఎవరు లోకంలోని జనుల పూర్వజన్మ కర్మ విశేషాల చేత సుగంధాన్ని మోసుకొని వచ్చే వాయువు వలె ప్రవర్తిస్తూ ఉంటారో అట్టి పరమేశ్వరుడు నా మనోరథాన్ని సఫలం చేయుగాక!" ఈ విధంగా భక్తి పారవశ్యం చేత స్తుతి చేస్తూ ఉన్న దక్షప్రజాపతి ముందు భక్తవత్సలుడైన శ్రీహరి సాక్షాత్కరించాడు.

సీ. భర్మాచలేంద్ర ప్రపాతద్వయంబునఁ గలిగిన నీలంపుఁ గను లనంగ
మొనసి తార్క్ష్యు యిరుమూఁపుపై నిడినట్టి పదముల కాంతులు పరిఢవింపఁ
జండ దిఙ్మండల శుండాల కరముల కైవడి నెనిమిది కరము లమరఁ
జక్ర కోదండాసి శంఖ నందక పాశ చర్మ గదాదుల సరవిఁబూని

ఆ. నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ, జల్లచూపు విబుధ సమితిఁబ్రోవ
బసిఁడికాసెఁ బూని బహు భూషణ కిరీట కుండలముల కాంతి మెండు కొనఁగ.



తా ॥ ఆ శ్రీహరి గరుడునిపై కూర్చుని ఉన్నాడు. ఆయన చాచిన రెండు పాదములు ఆ బంగారు పర్వతం చరియకు రెండు ఇంద్రనీల మణుల గనులవలె ప్రకాశిస్తున్నాయి. ఆయన అష్ట బాహువులు అష్ట దిగ్గజముల తొండముల వలె శోభిల్లుతూ చక్రము, ధనుస్సు, ఖడ్గము, శంఖము, పద్మము, పాశము, డాలు గదలతో శోభిల్లుతూ ఉన్నాయి. నల్లని శరీరంతో, నవ్వుముఖంతో,

చల్లని చూపుతో, కిరీటము కుండలముల కాంతి అతిశయింప బహు భూషణములతో శ్రీమహా విష్ణువు దక్షప్రజాపతి సన్నిధిలో ప్రత్యక్షమయ్యాడు.

సీ. కుండల మణి దీప్తి గండస్థలంబులఁ బూర్ణేందురాగంబుఁ బొందుపఱుప
దివ్యకిరీట ప్రదీప్త లంబర రమా సతికిఁ గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్థ్సలంబుపై వనమాల మాలికల్ శ్రీవత్స కౌస్తుభ శ్రీల నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని నిలిచిన విద్యుల్లతలభాతిఁ గనకాంగదములు మెఱయ

ఆ. నఖిలలోక మోహనాకార యుక్తుఁడై, నారదాది మునులు చేరి పొగడఁ
గదిసి మునులు పొగడ గంధర్వ కిన్నర, సిద్ధ గానరవము సెవుల నలర.

219

తా ॥ ఆయన ధరించిన మణిమయ కర్ణకుండలముల దీప్తులు ప్రసరించి, చెక్కిళ్ళు చంద్రబింబంవలె మెరిసిపోతున్నాయి. శిరస్సున ధరించిన దివ్య కిరీటము యొక్క కాంతులు ఆకాశ లక్ష్మికి కుంకుమ రంగు వస్త్రం వలె శోభిల్లుతున్నది. ఆయన వక్షస్థలం మీద వెలుగొందే వనమాలికలు శ్రీవత్సంతోను, కౌస్తుభంతోను పోటీ పడసాగాయి. మెరుపు తీగలవలె ఆయన భజకీర్తులు నీలగిరిని చుట్టినట్లుగా మెరుస్తున్నాయి. నారదాది మునులు పొగుడుతుండగా, గంధర్వులు, కిన్నరులు, సిద్ధుల యొక్క గానము చెవులకు ఆనందాన్ని అందిస్తుండగా అఖిల లోకాలకు సంతోషాన్నిచ్చే మోహన స్వరూపంతో శ్రీహరి సాక్షాత్కరించాడు.

క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు, సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై
సర్వంబు చేరి గొలువఁగ, సర్వదుఁడై దక్షునకుఁ బ్రసన్నుం డయ్యెన్.

220

తా ॥ సర్వేశ్వరుడు, ఆత్మస్వరూపుడు, సర్వగతుడు, సర్వమయుడు అయిన అచ్యుతుడు సర్వము తనను చేరి కొలువ, దక్షప్రజాపతికి ప్రసన్నుడయ్యాడు.

వ. ఇట్లు ప్రసన్నుండైన సర్వేశ్వరుని సర్వంకషంబై మహదాశ్చర్యధుర్యంబై తేజరిల్లు దివ్యరూపంబుం గాంచి, భయంబును, హర్షంబును, విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పిఱి, కప్పరపాటునఁ బుడమిపై నిడుసాగిలంబడి, దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు మొగిడ్చి సెలయేఱులతోఁ గొట్టువడి, యిట్టట్టు పట్టుచాలక నిట్టవొడిచి, మున్నీరు దన్ని నిలిచిన పెన్నీరునుంబోలె, సర్వాంగంబులుం దొంగలింపఁ, జిత్తంబు నాత్మాయత్తంబు సేసి, పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను, నత్యంత మంగళసందోహాపాదకంబు లైన తన్నామంబు లుగ్గడింపను, నతి నిర్మలంబులైన తదీయ కర్మంబులు దడవను, విబుధ హర్షకరంబులైన తత్పౌరుషంబులు పొగడను, నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి, సర్వజీవ దయాపరుండును, సర్వసత్త్వ హృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుం గావున నతని భావంబు దెలిసి, జగన్నాథుం డార్త షోషణంబుల భాషణంబుల నిట్లనియె.

221

తా ॥ ఈ ప్రకారంగా ప్రసన్నుడైన సర్వేశ్వరుని దివ్యరూపం వెలుగొందుతూ అన్ని దిక్కులలో ప్రకాశిస్తూ ఉంటే దక్షునకు మహదాశ్చర్యాన్ని కలిగించింది. దానిని వీక్షించిన అతని హృదయంలో భయము, సంతోషము, ఆశ్చర్యము పెనగొన్నాయి. ఆ తన్మయత్వం నుండి మెల్లగా తేరుకొని సాగిలపడి దండప్రణామాన్ని ఆచరించాడు. సెలయేరుల కలయికతో ఒడ్డులొరసి ప్రవహిస్తూ సముద్రాన్ని చేరుకున్న పెద్ద నదీ ప్రవాహం వలె దక్షప్రజాపతి పిక్కటిల్లిన సంతోషంతో భగవంతుని ఎదుట నిలిచాడు. తన చిత్తాన్ని ఆత్మయందు నిక్షిప్తం చేసి సంతోషంతో భగవంతుని గూర్చి పలకాలని ఉన్నా పలుకలేకపోతున్నాడు. మంగళాన్ని ఆపాదించే ఆయన నామములను ఉచ్చరించాలని అనుకొన్నాడు. అతి నిర్మలమైన ఆయన లీలలను పొగడాలనుకున్నాడు. అందరికీ సంతోషమును కలిగించే ఆయన పరాక్రమాన్ని స్తుతించాలని అనుకొన్నాడు. తన మనసులోని భావాలను ఆయనకు చెప్పాలనుకొన్నాడు. కాని

అనుకున్నది ఒక్కటి నెరవేర్చలేకపోయాడు. ప్రజలను పుట్టించాలనే కోరికతో ఉన్న దక్షప్రజాపతిని ఆ స్థితిలో చూసి, సర్వులయందు దయ కలిగినవాడు, అందరి హృదయములలో ఉన్నవాడు, సర్వజ్ఞుడు అయిన భగవంతుడు ఆర్తులను పోషించే మాటలతో ఇలా అన్నాడు:

క. మెచ్చితి ప్రాచేతస ! తప, మిచ్చట ఫలసిద్ధి మయ్యె నిట్లతిభక్తిన్
హెచ్చగు మద్వరవిభవము, నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు? జగతిని.

222

తా ॥ "ఓ దక్షప్రజాపతీ! నిన్ను మెచ్చుకొన్నాను. నీ తపస్సు ఫలించింది. ఈ విధంగా అత్యంత భక్తితో సేవించి నా నుంచి వరాలనందుకోవడానికి నీవు తప్ప అర్హుడైన అన్యుడు ఎవడున్నాడు ఈ లోకంలో.

ఆ. తపము చాలు నింకఁ దగ భూతతతికి వి, భూతు లొనరుఁ గాక పొందుపడఁగ,
నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి, పొసఁగ నీదువలనఁ బొందుపడియె.

223

తా ॥ ఇక నీ తపస్సు చాలించు. సకల భూత సమూహములకు శుభములు కలుగుగాక! నీవు సృష్టి చెయ్యాలనే కోరికతో తపస్సు చేశావు. నా మనస్సులోని ఇష్టమైన కోరిక అదే, ఈ విధంగా నెరవేరింది.

వ. వినుము, బ్రహ్మయు, భర్గుండును, బ్రజాపతులును, మనువులును, నింద్రులును, వీరలు నిఖిల భూతంబులకు భూతి హేతువులైన మద్భూతి విభవంబులు. మఱియు నాకు యమ నియమాది సహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు. సాంగ జపవ ద్ధ్యానరూపం బగు విద్య శరీరంబు. ధ్యానాది విషయ పుంవ్యాపారంబుగా నుండు భావనాది శబ్దవాచ్యంబగు క్రియ యాకృతి. క్రతు జాతంబు లంగంబులు. ధర్మం బాత్మ. దేవతలు ప్రాణంబులు. నిగమంబు మత్స్వరూపంబు. జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన

తేజరిల్లుచుంటి. బహిరంతరంబుల వేఱొక్కటియు లేదు. సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం బగుటం జేసి సంజ్ఞామాత్రుండును, నవ్యక్తుఁడునుఁగా నుండు జీవునిభంగి నొక్కఁడన యుండుదు. అనంతుండ నయి యనంత గుణంబు వలన గుణవిగ్రహం బగు బ్రహ్మాండంబును, నయోనిజుఁడు స్వయంభవుం డగు బ్రహ్మయును నుదయించిరి. మదీయ వీర్యోపబృంహితుండై మహాదేవుం డగు నా బ్రహ్మ యసమర్థునిఁబోలె నకృతార్థమ్మన్యమాన మనస్కుఁడై, సృజింప నుద్యమించు తఱి తపం బాచరించుమని నాచేత బోధితుండై, యఘోరంబైన తపం బాచరించి తొలుత సృష్టికర్తృత్వము వహించిన మిమ్ము సృజించె. అంతఁ బంచజనుం డను ప్రజాపతి తనూజ యగు నసిక్ని యను పేరిట వినుత నొందియున్న యిక్కన్యకను నీ కిచ్చితి. దీనిం బత్నిగాఁ గైకొని మిథునవ్యవాయ ధర్మంబు గలవాఁడవై, మిథునవ్యవాయ ధర్మంబుగల యీ నాతియందుఁ బ్రజాసర్గంబు నతి విపులంబుగ గావింపం గలవాఁడవు. మఱియు నీకుఁ బిదప నిదే క్రమంబున నిఖీల ప్రజలును మన్మాయా మోహితు లయి, మిథునవ్యవాయ ధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండఁ గలవారు అని పల్కి, విశ్వభావనుండైన హరి, స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందె. అప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై పాంచజని యగు నసిక్ని యందు హర్యశ్వ సంజ్ఞల వినుతిఁ జెందియున్న యయుత సంఖ్యా పరిగణితులైన పుత్త్రులం గాంచె. అప్పు డా ధర్మశీలురైన దాక్షాయణులు, పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు కొఱకుఁ దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని, యచ్చట సింధు సముద్ర సంగమంబున సమస్త దేవ ముని సిద్ధగణ సేవితంబై, దర్శనమాత్రంబున నిర్ధూత కల్మషులను, నిర్మల చిత్తులం జేయుచున్న నారాయణ సర స్సనం బరఁగు తీర్థరాజంబున నవగాహనంబుఁ జేసి, నిర్మలాంతరంగులై పరమహంస ధర్మంబు నందు నుత్పన్న మతులై ప్రజాసర్గంబు కొఱకుఁ దండ్రి యనుమతంబున నుగ్రతపంబు సేయుచుండ. వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె.

తా ॥ ఓ దక్షప్రజాపతి! విను. బ్రహ్మ, శివుడు, ప్రజాపతులు, మనువులు, ఇంద్రులు... వీరంతా నా నుండి పుట్టిన వారే! యమనియమములు, సంధ్యావందనము.... ఈ రూపంలో చేసే తపస్సే నా హృదయం. సాంగోపాంగమైన జపము, ధ్యానరూపమైన విద్యయే నా శరీరం. ధ్యానం మొదలైన విషయములలో భావము, దానిని చెప్పే శబ్దజాలము – ఈ క్రియ నా ఆకృతి. క్రతువులు నా అంగములు. ధర్మమే ఆత్మ. దేవతలు ప్రాణములు. నిగమం నా స్వరూపం.

ఈ జగత్తు పుట్టడానికి ముందు నేను ఒక్కడినే తేజరిల్లుతూ ఉండేవాడిని. బయట కాని లోపలగానీ వేరే ఏమీ లేదు. ఈ సర్వ జగత్తు సుషుప్త్యావస్థలో ఉండగా సర్వము లీనమై ఉన్న కారణంగా సంజ్ఞామాత్రంగా అవ్యక్తునిగా ఉన్న జీవునివలె నేనొక్కడినే ఉన్నాను. అనంతుడనైన నానుండి నా అనంత గుణముల వలన గుణములుగల బ్రహ్మాండమును, అయోనిజుడు, స్వయంభువు అయిన బ్రహ్మ ఉదయించారు. నా తేజస్సు నుండి జనించిన మహాదేవుడయిన బ్రహ్మ అసమర్థునివలె కృతార్థుడు కాక ఉండిపోయిన సందర్భంలో, తపస్సును ఆచరించమని నేనే బోధ చేశాను. అప్పుడు ఘోరమయిన తపస్సును ఆచరించి సృష్టికర్తృత్వాన్ని వహించి మిమ్ములను సృజించాడు.

ఓ దక్షప్రజాపతీ! ఇప్పుడు పంచజనుడు అనే ప్రజాపతి పుత్రిక అయిన "అసిక్ని" అనే పేరుకల ఈ కన్యను నీకు ఇస్తున్నాను. ఈమెను భార్యగా గ్రహించి దాంపత్యధర్మంతో ప్రజాసర్గమును బహుళంగా సృష్టిస్తావు. నీ అనంతరం ఇదే క్రమంలో ప్రజాభివృద్ధిని పొందించగలరు. వారందరు నన్ను ఆరాధిస్తూ ఉండకలరు" అని పలికి ఆ హరి స్వప్నంలో కనిపించిన పదార్థం వలె అదృశ్యమైనాడు.

అప్పుడు దక్షుడు విష్ణుమాయచేత వర్ధమానుడై, పంచజనుని పుత్రిక అయిన అసిక్ని యందు "హర్యశ్వులు" అనే పేరుగల పదివేలమంది పుత్రులను కన్నాడు. అప్పుడు ధార్మికులైన ఆ దక్షపుత్రులు తండ్రి ఆజ్ఞ చొప్పున ప్రజలను సృష్టించే నిమిత్తం ముందుగా పశ్చిమ దిక్కుకు వెళ్ళారు. అచ్చట సింధునదీ సంగమం దగ్గర సమస్త దేవతలు, మునులు, సిద్ధుల చేత

సేవింపబడుతూ ఉన్న "నారాయణ సరస్సు" అనే తీర్థరాజమును చూసారు. ఆ తీర్థరాజం సమస్త దోషాల నుండి విముక్తులుగా చేస్తుంది. నిర్మల చిత్తులను చేస్తుంది. ఆ తీర్థంలో హర్యశ్వులు స్నానం చేసి నిర్మలాంతరంగులై పరమహంస ధర్మాన్ని పాటిస్తూ ప్రజాసర్గం కొరకు తండ్రిగారి ఆజ్ఞ ప్రకారం ఉగ్రతపస్సు చేస్తూన్న వారి దగ్గరకు నారదుడు వచ్చి ఇలా అన్నాడు:

సీ. మీ రతిమూఢులు మీఁదటి గతి గాన రెన్నంగఁ బసిబిడ్డ లన్నలార!
పుడమిఁ దా నింతని కడ పరికింపరు ప్రజలఁ బుట్టించ నే ప్రతిభ కలదు?
అట్లైన నొక్క మహాత్ముఁడు పురుషుండు బహురూపములు గల భామ యొకతె
పుంశ్చలీ భర్తయుఁ బురణింప నుభయ ప్రవాహంబు గల నది వఱలఁ గదల

ఆ. నంచ యొకటి యిరువదై దింటి మహిమలఁ, గలిగియుండు తెరువు గానరాక
వజ్రనిబిడ మగుచు వరుసఁ దనంతన, తిరుగు, రాష్ట్రబిలము దేటపడఁగ.

225

తా ॥ "నాయనలారా! మీ భవిష్యత్తు మీకు తెలియని మీరు అతి మూఢులవలె కనిపిస్తున్నారు. మీరు పసిబిడ్డలవలె ఉన్నారు. ఈ భూమి పరిమాణం ఇంత అని మీకు తెలిసినట్టు లేదు. ప్రజలను పుట్టించడానికి మీ దగ్గర ఉన్న ప్రతిభాసామర్థ్యములు ఏమిటి? ఆత్మస్వరూపుడైన పురుషుడు ఒకడు ఉన్నాడు. బహు రూపములు కల స్త్రీ వలె ప్రకృతి ఉన్నది. వీరిద్దరూ కలసి సంసారం చేస్తున్నారు. ఈ సంసారం అనే నది రెండు వైపుల ప్రవాహం కలది. ఆ సంసార నదీ ప్రవాహంలో హంస ఒకటి ఇరవై అయిదు మహిమలు కలిగినది తిరుగుతూ ఉంటుంది. దానికి మార్గం తెలియక వజ్రకాంతులతో దట్టమైన జలప్రవాహం పడే గోతిచుట్టూ తను తిరుగుతూ ఉంటుంది, అందులో పడితే మళ్ళీ లేవలేదు.

క. వినుఁ డందుల యనురూపము, నను వొందఁగ నెఱుఁగ కాత్మ నాత్మగురూక్తిం
గొనసాగించెద మను మి, మ్మన నేమియు లేదు మూఢు లని తెలిసి తగన్.

226

తా ॥ కనుక వినండి! అందుకు తగినట్లుగా ఎలా ప్రవర్తించాలో తెలియక కేవలం మీ తండ్రిగారి మాటలను కొనసాగించటం కొరకు మీరు పూనుకొన్నారు. ఇందులో మిమ్ములను అనడానికి ఏమీ లేదు. మీరు అజ్ఞానులు అని తెలుస్తోంది."

వ. అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారద వాక్యంబులను దమలో నిట్లని వితర్కించిరి.

227

తా ॥ ఈ ప్రకారంగా నారద మహర్షి బోధించే సరికి హర్యశ్వులు నారదుని మాటలు విని తమలో తాము ఇట్లా అనుకున్నారు:

తే. సొరిది క్షేత్రజ్ఞుఁ డన నతిసూక్ష్మ బుద్ధి, నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ
దేహమున నెద్ది గల దది దెలియకున్నఁ, గలదె? మోక్షంబు దుష్కర్మ గతులచేత.

228

తా ॥ "ముందుగా క్షేత్రజ్ఞుడు అంటే ఎవరు అనేది మనం సూక్ష్మబుద్ధిచేత గ్రహించాలి. పిమ్మట అజ్ఞానబంధనమైన లింగదేహంలో ఉన్నది ఏమిటో దానిని తెలుసుకోవాలి. వాటిని తెలుసుకోకుండా కేవలం కర్మాచరణ వలన మోక్షం కలుగుతుందా?

తే. కలఁడు జగదేక సన్నుత కారణుండు, స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ, గలుగునే? ముక్తిపదము దుష్కర్మగతుల.

229

తా ॥ ఈ లోకాలన్నింటికీ మూలకారణుడు ఒకడు ఉన్నాడు. ఆయనే సృష్టికి స్వామి. ఆ భగవంతుడు జనన–మరణాదులు లేనివాడు. ఆత్మాశ్రయుడు. ఆయనే పరుడు. అతనిని గూర్చి తెలుసుకోకుండా ఆయనను దర్శించకుండా బ్రహ్మకైన ముక్తి కలుగదు.

ఆ. పురుషుఁ డెట్టులేని పూని బిల స్వర్గ, గతుఁడు వోలె వర్తకంబు మాను
నట్టి బ్రహ్మ మెఱుఁగు నయ్యకు స్వర్భోగ, కర్మగతుల నేమి కానఁబడును?

230

తా ॥ జీవుడు తానాచరించే కర్మలు అన్నీ స్వర్గప్రాప్తి కొరకే అని ఆచరిస్తాడు. స్వర్గప్రాప్తి అనంతరం ఇంకేమీ లేదని అనుకొంటాడు. అట్టివానికి బ్రహ్మమును గురించి ఏమి తెలుస్తుంది?

శా. త న్నిష్ఠాగతి లేనివారికి నసత్కర్మ ప్రచారంబుచే
మున్నేమయ్యెడి నాత్మబుద్ధి గుణసమ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ వెట్టుక వింతబాగుల తఱిన్ వర్తించు దౌర్గుణ్య సం
పన్న స్త్రీయునుబోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండఁగన్

231

తా ॥ బ్రహ్మమునందు నిష్ఠలేని వానికి అసత్కర్మలు చేసుకొంటూపోయే వానికి ఉపయోగం ఉండదు. జీవుని బుద్ధి చంచలమైనది. అది ఎన్నో వన్నెలు పెట్టుకొని వింత వింతగా చరిస్తుంది. అది దుర్గుణాలు కల సంపన్న స్త్రీ వంటిది, దాని నుండి బయటపడకుంటే కైవల్యం ప్రాప్తించదు.

సీ. అనువొంద సృష్టి నవ్యయముగఁ జేయుచుఁ బ్రచుర ప్రవాహ సంపతిత మైన
నెఱయఁ గూలం బను నిర్గమ స్థానంబు నందు వేగముగల క్రందు మాయఁ
గదలి యహంకార గతివశంబునఁ జాల వివశుఁ డై బోధకు విపరి యైన
వానికి నీరీతి వలవంత కర్మ ప్రచారంబులను మీఁదఁ జక్కనైన

ఆ. జన్మ మరణ ముఖ్య జాడ్యంబుతోఁ బాసి, యఖీల సౌఖ్య పదవి నరసి కర్మ
మార్గ మైన యట్టి మహనీయ ధామంబు, చిత్త మార నెట్లు చేరఁ గలఁడు!

232

తా ॥ ఈ సృష్టికార్యాన్ని కొనసాగిస్తూ ఆ ప్రవాహంలో పడి కొట్టుకొని పోతూ ఒడ్డు కనిపించినా దానిని పొందలేడు. మాయలో పడి కొట్టుకొని పోతూ అహంకారం చేత వివశుడై జ్ఞానమార్గానికి దూరం అవుతాడు. దుష్కర్మలు చేస్తూ ఉంటాడు. ఈ ప్రకారంగా జన్మము, మరణము, రోగము అనే జాడ్యములలో చిక్కుకున్న జీవుడు సర్వ సౌఖ్యాలకు నెలవైన మోక్షమార్గాన్ని ఎలా చేరగలడు?

తే. దాని సంసర్గ గుణములు దప్పి నడచు, కుచ్చితపు భార్యఁ జేకొన్న కుమతివోలె
తివిరి సుఖదుఃఖములఁ గూడి తిరుగు జీవ, రూప మెఱుఁగని వారికిఁ బ్రాపు గలదె?

233

తా ॥ కుమతి అయిన పురుషుడు కుత్సిత బుద్ధికల స్త్రీని భార్యగా పెళ్ళి చేసుకుంటే ఆ సంసారం సక్రమంగా నడవదు. జీవస్వరూపాన్ని తెలుసుకోకుండా, సుఖదుఃఖములలో పరిభ్రమిస్తూ, సంసారంలో పడి కొట్టుకుంటూన్న వానికి మోక్షం ప్రాప్తించదు.

మ.కో.
పంచవింశతి తత్త్వరాశి కపారదర్పణ మయ్యెఁ దాఁ
గొంచెమై పురుషుండు తత్త్వముఁ గోరి పట్టఁగ నేర కే
మంచుఁ గించుఁ దలంచువార లమార్గ కర్మము సేయఁగా
మంచిలోకము వారి కేటికి మానుగా సమకూరెడిన్?

234

తా ॥ అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచ భూతములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, పురుషుడు... ఈ ఇరవై అయిదు తత్త్వములు ప్రతిబింబిస్తాయి అద్దం వంటి పరతత్త్వంలో. ఆ తత్త్వాన్ని జీవుడు పట్టుకోగలగాలి. పట్టుకోలేక మనకెందుకులే అని తలపోసే వారికి మంచి లోకములు ఎలా సమకూరుతాయి?

క. బంధానుమోక్షణ క్రమ, సంధా నైశ్వర్యధుర్య శాస్త్ర సమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ పాంధునకు నకర్మ గతుల నగునే శుభముల్.

235

తా ॥ బంధంలో తగుల్కొన్న వారికి మోక్షాన్ని ఇచ్చేది అధ్యాత్మిక విద్య. అట్టి విద్యను పరిత్యజించ కర్మకలాపాలలో చిక్కుకునే అజ్ఞానాంధునికి శుభం కలుగుతుందా?

మ.కో.

చూడ నీ జగమంతయున్ వెసఁ జుట్టి పుట్టుక లీల నే
జోడులేక రయంబునం గుడి చుట్టినట్టి స్వతంత్రముం
గూడి యుండిన కాలచక్రముఁ గోరిచూడని వారి కే
జాడఁ గల్గు నకర్మ సంగతిఁ జారుమోక్ష పదం బిలన్?

236

తా ॥ ఈ కాలచక్రం ఉన్నదే, అది చాలా స్వతంత్రమైనది. ఈ జగత్తును చుట్టి వేగంగా మాయం చేసే పద్ధతులు ఆ కాలచక్రమునకు బాగా తెలుసు. అట్టి కాలాన్ని గూర్చి తెలుసుకోకుండా కర్మలు చేస్తూ ఉండే వారికి మోక్షం ఎలా వస్తుంది?

తే. జన్మ హేతు వైన జనకునిర్దేశంబు, తనకుఁజేయ రాని దనుచుఁ దెలిసి
గుణమయ ప్రవృత్తి ఘోరాధ్వ నిశ్వాస, నిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు.

237

తా ॥ అసలు విషయం ఏమిటంటే ఈ సృష్టి చెయ్యాల్సిన బాధ్యతను మన జనకుడు అయిన దక్షప్రజాపతికి మన తాతగారైన విధాత అప్పచెప్పాడు. అయితే మన తండ్రిగారైన దక్ష ప్రజాపతి తన జనకుడైన బ్రహ్మగారి నిర్దేశం తనకు చెయ్యటం ఇష్టంలేక మనకు అప్పచెప్పాడు. ఘోరమైన ప్రవృత్తి మార్గం ఇష్టంలేకనే మన తండ్రిగారలా చేశారు."

వ. అని తనలో వితర్కించి యా కుమారు లప్పుడు—

238

సీ. వినవయ్య! భూపాల! మునివరేణ్యుని మాట లనువొందఁ దలపోసి వినయ మలర
వలగొని యతనికి వందనం బొనరించి తిరిగి యెన్నఁడు రాని తెరువు వట్టి
చయ్యన నేగిరి సహజ స్వర బ్రహ్మ మయమైన పంకజనయను పాద
పద్మ మరందంబు పానంబు సేయుచు మత్తిల్లి నిలిచిన మానసాళి

తే. పరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి, సరణిమ్రోయు మహతి సంఘటించి
నారదుండు గుణవిశారదుం డెందేనిఁ జనియె జగము దన్ను సన్నుతింప.

239

తా ॥ అని ఆ కుమారులు వాళ్ళలో వాళ్ళు తర్కించుకొని నారద మునీంద్రుని ఆదేశానుసారం ఆచరించారు. వినయంతో నారద మునీంద్రునికి వందనం చేసి వెనుకకు తిరిగి రాని మోక్షమార్గాన్ని అవలంబించారు. నారదుడు స్వర బ్రహ్మమయమైన పంకజనయనుని పాదపద్మ మకరందాన్ని పానం చేస్తూ, తన మనస్సు అనే మధుపం పరవశింపగా తన వీణ అయిన మహతిని మీటుకుంటూ జగములు సన్నుతింపగా వెళ్ళిపోయాడు.

క. అప్పుడు దక్షుఁడు తనయులు, దప్పి మహాపథము గనుట తగ నారదుఁడే
చెప్పినఁ గప్పిన శోకము, ముప్పిరిగొని చిత్తవృత్తి మూరిం బోవన్.

240

తా ॥ నారదుడు వెళ్లి దక్షప్రజాపతిని కలుసుకొని “నీ కుమారులు నివృత్తి మార్గమైన మహాపథములోనికి వెళ్ళిపోయారు” అని చెప్పగా ఆయనలో శోకం పెల్లుబికింది.

చ. అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁ బల్కె మున్

పడసిన లీలఁ బుత్రుల నపార గుణాఢ్యులఁ గాంచుమన్న నా
పడఁతుక వల్లఁగ్రమ్మఱను బల్వురఁ దా శబళాశ్వ సంజ్ఞలం
బెడఁగగు వారి పుణ్యములఁ బేర్చినవారి సహస్ర సంఖ్యులన్.

241

తా ॥ అప్పుడు బ్రహ్మ వచ్చి దక్షునికి ధైర్యం చెప్పాడు. పూర్వం పొందినట్లే అపార గుణాఢ్యులయిన పుత్రులను పొందమని ఉత్సాహ వచనాలను చెప్పాడు. అంత దక్షుడు తన పత్ని అయిన "అసిక్ని" యందు వేలకొలది పుత్రులను పొందాడు. వారే శబలాశ్వులు, వారు పుణ్యమూర్తులు.

క. పుట్టించిన జనకుని మదిఁ, బుట్టిన తలఁపెఱిఁగి వారు పూనిక ప్రజలం
బుట్టించు వ్రతము గై కొని, గట్టిగఁ దప మాచరింపఁగాఁ జనిరి వెసన్.

242

తా ॥ అంత ఆ శబలాశ్వులు తమ జనకుని మదిలోని సంకల్పాన్ని ఎరిగి పట్టుదలతో ప్రజలను సృష్టించాలనే వ్రతంతో తపస్సు ఆచరించే నిమిత్తం వెళ్ళారు.

వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబు కొరకుఁ దండ్రి పంపునం దపంబు సేయువారై యే తీర్థంబు తీర్థరాజం బై సకల తీర్థఫలంబులు నాలోకన మాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నే తీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుదు, రట్టి నారాయణ సరస్సను పుణ్యతీర్థంబునకుం జని, త దుపస్పర్శ మాత్రంబున నిర్ధూత మలాశయులై,

243

తా ॥ ఆ విధంగా శబలాశ్వులు సంతానమును కోరి తపస్సు చేయటం కొరకు నారాయణ సరోవరం చేరారు. ఆ సరోవరం కేవలం చూచిన మాత్రం చేతనే అనుగ్రహిస్తుంది.

సకల పాపరాశిని తొలగిస్తుంది. ఆ తీర్థ ప్రభావం చేత అందరూ ఫలసిద్ధిని పొందుతారు. అట్టి పుణ్యతీర్థమును ఆశ్రయించి సమస్త దోషాలను పోగొట్టుకున్నారు.

శా. బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతింపుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వికలపై బ్రహ్మణ్యమంత్రంబు స
ద్బ్రహ్మలోకన వాంఛతో నిలుపుచున్ బ్రహ్మం బితం డంచు మున్
బ్రహ్మజ్ఞాన గురున్ హరిం దపమునం బాటించి ర బ్బాలకుల్.

244

తా ॥ ఆ శబలాశ్వులు బ్రహ్మ, ఇంద్రుడు అందుకోలేని పరబ్రహ్మమును గూర్చి చింతిస్తూ బ్రహ్మానందాన్ని పొందారు. వారు పరమాత్మకు సంబంధించిన మంత్రాన్ని ఆయనను దర్శించాలనే కాంక్షతో జపిస్తూ హరిని గూర్చి తపస్సు చేశారు.

సీ. ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి నిశ్చల కాయులై నిక్కి నిలిచి
కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి గుఱుతుగాఁ బెనుబయల్ గుట్టి పట్టి
నిడివిగాఁ గ్రూరమై నిగిడిన చూడ్కులఁ గడు తీవ్రభానునిఁ బొదివిపట్టి
వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి యంతనుండియు నిరాహారు లగుచు
తే. సకల లోకములకు సంహారకరమును బేర్చి దేవతలకు భీతికరముఁ
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి, మహిత చిత్తు లక్కుమారవరులు,

245

తా ॥ దక్షుని కుమారులైన ఆ బాలురు ఒంటికాలు మీద నిశ్చలంగా నిలబడి తపస్సు చేయసాగారు. తీవ్రమైన చూపులతో భానుని చూస్తూ కొంతకాలం వాయువును మాత్రమే ఆహారంగా తీసుకొంటూ, ఆపై అది కూడా మానివేసి నిరాహారులై తమ తపస్సును కొనసాగించారు. అప్పుడు సకల లోకాలు భయంతో వణికాయి. దేవతలు భయపడ్డారు. ఈ

విధంగా శబలాశ్వులు నిర్మల చిత్తంతో భయంకరమైన తపస్సును చేయసాగారు.

## 9. నారదుడు శబలాశ్వులకు నివృత్తి మార్గమును ఉపదేశించుట

వ. ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు, నెడతెగక భగవన్మంత్రంబుల నొడువుచుఁ, బ్రజాసర్గ కాములై యున్న యచ్చిన్ని బాలుర కడకు నారదుండు సనుదెంచి, పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె. భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబు వలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనిన మార్గంబునఁ జనుండు. ఎవ్వఁడేనియుఁ దన యగ్రజులు గన్న మార్గంబునం దానునుం దప్పక వర్తించు, నట్టివాని విశేషధర్మం బెఱింగిన వాఁడంద్రు, సతతంబును బుణ్య బంధువులైన దేవతలంగూడి సుఖం బుండుం. డని పల్కి నారదుండు సనియె. వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమ పదంబునకు నాస్పదంబులైన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి.

246

తా ॥ ఇట్లా తపస్సు చేస్తూ నిరంతరము భగవన్మంత్రాన్ని జపిస్తూ ప్రజలను సృష్టించాలనే కాంక్షతో ఉన్న ఆ చిన్ని బాలుర దగ్గరకు నారద మహర్షి వచ్చాడు. వచ్చి పూర్వంలాగానే పలికాడు. "మీ అన్నలమీద ఎంతో వాత్సల్యంతో ఉన్న మీరు, వేదాంతసారం పలుకుతున్న నా మాటలు వినండి. మీరు మీ అన్నలు వెళ్ళిన మార్గంలోనే వెళ్ళండి. ఎవరు తన అన్నగారిని అనుసరిస్తారో అట్టివాడిని విశేష ధర్మజ్ఞుడు అంటారు. మీరు ఎల్లప్పుడూ పుణ్య బంధువులు అయిన దేవతలతో కూడి సుఖంగా ఉండండి" అని పలికి నారద మహర్షి వెళ్ళిపోయాడు. వాళ్ళు కూడా సృష్టి చెయ్యాలనే కర్మయందు వ్యామోహాన్ని విడిచి పెట్టేశారు. పరమపదానికి ఆస్పదమైన నారదుని వాక్యములను ఆశ్రయించారు.

ఉ. అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజు లేగినట్టి యా
చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేష పద్ధతిం
దప్పక పోయిరయ్య! గుణధాములు, నేఁడును మళ్ళరేమి నేఁ
జెప్పెదఁ గాక రాక కడఁజేరిన రాత్రులఁబోలి భూవరా.

247

తా ॥ అప్పుడు తమ ప్రవర్తనకు తామే సిగ్గుపడుతూ, శబలాశ్వులు తమ పూర్వులయిన అగ్రజులు వెళ్ళిన త్రోవనే, ఎన్నటికీ తిరిగిరాని మోక్షమార్గంలో పోయారు. ఇంక గతించిన రాత్రులు తిరిగి రానట్లు వారు తిరిగిరారు.

క. దక్షున కా కాలంబున, లక్షిత మై యుండెఁ బెక్కు లాగుల నుత్పా
త క్షోభంబులు వానికి, రూక్షవ్యథ నొంది యా పురుష నాశమునున్.

248

క. నారదకృత మని యెఱిఁగి మ, హా రోషముతోడ నేగి యాతనిఁ గని దుః
ఖారూఢ చిత్తుఁడై మది, నూఱడిలం దెరువు లేక యుగ్రుం డగుచున్.

249

తా ॥ ఆ సమయములో దక్షప్రజాపతికి పెక్కు ఉత్పాతములు గోచరించాయి. ఆయన మనస్సులో చాలా బాధపడ్డాడు. తన కుమారులు ప్రజాసృష్టికి వ్యతిరేకంగా వెళ్ళిపోయారని గ్రహించాడు. దానికి కారణం నారదుడే అని గ్రహించి మహా రోషముతో అతని దగ్గరకు వెళ్ళి, దుఃఖంతో నిండిన మనస్సుతో ఊరడిల్లలేక ఉగ్రుడయ్యాడు.

తే. మోము జేవుఱింప ముడివడ బొమదోయి, చూపు వెంట మంట సుడిగొనంగఁ
బెదవు లదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు, దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె.

250

తా ॥ ముఖం జేవురింపగా, కనుబొమలు ముడివడగా, చూపులలో మంటలు సుడులు తిరుగగా, పెదవులు అదరగా, పండ్లు పటపట కొరుకుతూ దక్షుడు ఆగ్రహంతో నారదుడిని చూసి ఇలా అన్నాడు:

చ. నెరయఁగ సాధురూపమున నీ వతి బాలుర కాత్మజాళికిం
గఱకున భిక్షుమార్గ మగు కందువ సెప్పితి వేల? ధూర్తవై
మఱుఁగక యుండవచ్చునె? కుమారుల నీ దురితంబు వొంద, ని
న్నొఱలఁగఁద్రోతు నాదు సమదోగ్ర మహాగ్రహ శాపవహ్నులన్.

251

తా ॥ "నీ పని నెరవేరునట్లు సాధురూపంలో వచ్చి చిన్నపిల్లలు అయిన నా కొడుకులకు కఠినమైన భిక్షు మార్గమును బోధించావు. ధూర్తుడవై నువ్వెంతకాలం చాటుగా ఉంటావు. ఈ దుఃఖాన్ని నేను తట్టుకోలేను. నీవు కూడా విలపించేటట్లుగా నా దారుణమైన శాపాగ్నికి గురి చేస్తాను.

## 10. దక్షుడు నారదుణ్ణి శపించి ప్రజాసర్గము చేయుట

వ. అది యెట్లంటేని, దేవర్షి పితృ ఋణంబులు దీర్చక అమీమాంసిత కర్మంబులు గల బాలురకు బుద్ధిఁ జెఱిచి వారలకు నుభయ లోకంబుల శ్రేయోహాని నొనర్చితివి. ఇట్లీ పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుదువు గాక! నిరపరాధులై వైరంబులేని నా పుత్రుల పట్ల ద్రోహకృత్యం బొనర్చిన నీవు తప్పఁ దక్కిన భాగవతోత్తములు సకల భూతానుగ్రహ పరవశులు. అతి కుతూహలంబున నీ చేత స్నేహపాశ నికృంతనం బైన మిత్రభేదంబె కాని తదుపశమనంబు గాకుండెడు. ఇంతనుండియుఁ బురుషుండు విషయ తీక్ష్ణత్వంబు లనుభవింపక కాని తెలియ కుండెడు. జ్ఞానంబు తనంతనె కాని యొరులచే బోధింపఁబడి తెలియరాకుండెడి. నిరంతరంబును లోకసంచారియైన నీకు నే లోకంబున నునికిపట్టు లేకుండుఁ గాక అని నిర్దయుండై శాపం బిచ్చె. అంత నారదుండు త త్క్రోధవాక్యంబుల కలుగక యట్ల కానిమ్మని సమ్మతించి చనియె. ఇట్టి శాంతభావం బెవ్వనివలనం గలుగు, నతండు సర్వాతీతుండై సర్వేశ్వరుం డనంబడు. మరియు, దక్షుండు తన మనోరథంబు విఫలం బగుటం జేసి యతి దుఃఖీత మనస్కుండై పొగులుచున్న పితామహుండు చనుదెంచి, మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన, నా ప్రజాపతి ప్రియభామ యైన యసిక్నియందుఁ బితృ వత్సల లైన పుత్రికల నఱువదుంద్రం బుట్టించి వారిలో ధర్మునకుం బదువురను, గశ్యపునకుం బదుముగ్గురను, జంద్రునకు నిరువదేడ్గురను; భూతునకు, నాంగిరసునకుఁ, గృశాశ్వునకు నిద్దరేసి చొప్పున నార్గురును, తార్క్ష్యుఁడను నామాంతరము దాల్చిన కశ్యపునకు మరలఁ గడమ నల్గుర న్నీ క్రమంబున నిచ్చె. వారి నామంబు లాకర్ణింపుము.



తా ॥ ఇదిగో విను! దేవఋణం, ఋషి ఋణం, పితృఋణం జన్మ ఎత్తిన ప్రతివాడు తీర్చాలి. వాటిని తీర్చకుండానే కర్మలు చెయ్యనివారు అయిన నా బాలురకు బుద్ధిని చెరచి వారికి

ఉభయ లోకాలలోన శ్రేయోహాని కలిగించావు. నీవు ఈ పాతకాన్ని చేసినందుకు, భాగవతోత్తములలో లజ్జాహీనుడవై యశోహానిని పొంది చరిస్తావు. ఉత్తములు అయిన నా పుత్రుల విషయంలో ద్రోహబుద్ధితో చరించిన నువ్వు తప్ప మిగిలిన భాగవతోత్తములు అందరు అమిత దయామయులు. నీవు ఇకముందు మిత్రభేదం పెడుతూ ఉంటావు. ఈపైన పురుషుడు విషయములను అనుభవిస్తేనే కాని దాని తీక్షణత తెలియకుండు గాక! అలాగే జ్ఞానం కూడా తనంత తానుగా అనుభవిస్తేనే గాని తెలియకుండు గాక! నిరంతరము లోకాలు సంచరించు నీకు ఏ లోకంలోను కూడ శాశ్వతమైన నివాసము లేకుండు గాక!" ఈ విధంగా దయావిహీనుడై దక్షప్రజాపతి శాపం ఇచ్చాడు. అయితే నారదుడు మాత్రం ఆ శాపానికి ఏమాత్రం అలుగక అట్లే కానిమ్మని సమ్మతించాడు. ఇట్టివారు సర్వమునకు అతీతులై పరమేశ్వర స్వరూపంగా పిలువబడుతారు.

ఈ విధంగా దక్షుడు నారదుడిని శపించి తన కోరిక విఫలమైన కారణంగా దుఃఖంతో ఉండగా బ్రహ్మ వచ్చి ప్రజలను పుట్టించే ఉపాయాన్ని చెప్పాడు. అప్పుడు దక్షప్రజాపతి తన ప్రియభామ అయిన "అసిక్ని" యందు తనకు ఇష్టలయిన పుత్రికలను అరవై మందిని పుట్టించాడు. అందులో పదిమందిని ధర్మునకు, పదముగ్గురిని కశ్యపునకు, ఇరవై ఏడుగురిని చంద్రునకు; భూతునకు ఆంగిరసునకు కృశాశ్వునకు ఇద్దరేసి చొప్పున ఆరుగురిని; తార్క్ష్యుడను నామాంతరంకల కశ్యపునకు కడమ నలుగురిని ఇచ్చి వివాహం చేశాడు.

ఆ. ఎట్టి పుణ్యవతులొ? యీ చేడియలు సెప్ప, సవతు లేనియట్టి సవతులయ్యుఁ
గడుపు వడసి రెట్టి కడుపున ఁబుట్టిరో, కడిఁది త్రిజగ మెల్లఁ గడుపు గాఁగ.



తా ॥ ఆ పుత్రికలు ఎట్టి పుణ్యమూర్తులో చెప్పలేను. సాటిలేని సవతులయి మూడు లోకాలను కడుపున మోసి కన్నారు.

వ. వార లెవ్వరనిన భానువును, లంబయుఁ, గకుప్పును, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు ననంబదుగురు ధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి. వారెవ్వ రంటేని భానువునకు వేదఋషభుండు వుట్టె. ఆతనికి నింద్రసేనుండు నుదయించె. లంబకు విద్యోతుండు గలిగె. అతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి. కకుబ్దేవికి సంకుటుండు వుట్టె, సంకుటునకుం కీకటుండు వుట్టె. కీకటునకు దుర్గాభిమానినులైన దేవతలు జన్మించిరి. జామిదేవికి దుర్గభూముల కధిష్ఠాన దేవతలు జనియించిరి. వారికి స్వర్గుండును, నందియు జన్మించిరి. విశ్వ యనుదానికి విశ్వేదేవతలు జన్మించిరి. వార లపుత్రకు లనం బరఁగిరి. సాధ్యయను దానికి సాధ్యగణంబులు వుట్టె. వానికి నర్థసిద్ధి యను వాఁడు వుట్టె. మరుత్వతి యనుదానికి మరుత్వతుండు, జయంతుం డనువార లుదయించిరి. అందు జయంతుండు వాసుదేవాంశజుండైన యుపేంద్రుం డనంబడి, వినుతి నొందె. ముహూర్త యనుదానికి సకల భూతంబులకు నా యా కాలంబులఁ గలిగెడు నా యా ఫలంబుల నిచ్చు మౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి. సంకల్పయను దానికి సంకల్పుం డుదయించె. ఆ సంకల్పునకు కాముండు జనించె. వసు వను దానికి ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండును, నర్కుండును, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసు వను నెనమండ్రు వసువు లుదయంబు నొందిరి. అందు ద్రోణునకు నభిమతి యను భార్యయందు హర్ష శోక భయాదులు పుట్టిరి. ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండును, నాయువును, బురోజవుఁడను వారును గలిగిరి, ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధంబులగు పురంబులు వుట్టె. అర్కునికి భార్యయగు వాసనయందు తర్షాదులుదయించిరి. అగ్నికి భార్యయైన వసోర్ధారయందు ద్రవిణ కాదులు వుట్టిరి. మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె. ఆ స్కందునకు విశాఖాదు లుదయించిరి. దోషునకు శర్వరి యను భార్యయందు హరికళయగు శింశుమారుం డుదయించె. వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మ యనుశిల్పాచార్యుం డుదయంబందె. ఆ విశ్వకర్మకు నా కృతి యను సతియందు చాక్షుషం డను మనువు జనించె. ఆ మనువువలన విశ్వులు, సాధ్యులు ననువారలు పుట్టిరి. విభావసునకు నుష

యను భార్యయందు వృష్టియు, రోచిస్సును, నాతపుండును జనించిరి. అందు నాతపునికిఁ బంచ యాముండను దివసాభిమాన దేవత జనించె. శంకరాంశజుండైన భూతునకు సురూప యను భార్యయందుఁ గోట్ల సంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి. మఱియు రైవతుండు, నజుండు, భవుండు, భీముండు, వాముండు, నగ్రుండు, వృషాకపియు, నజైకపాత్తును, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును. మహాంతుండును ననువారలును, రుద్రపారిషదులును నతిభయంకరులైన ప్రేతలును, వినాయకులును బుట్టిరి. అంగిరసుండను ప్రజాపతికి స్వధ యను భార్యయందుఁ బితృగణంబులు వుట్టిరి. సతియను భార్యకు నథర్వవేదాభిమాన దేవతలు వుట్టిరి. కృతాశ్వునకు అర్చిస్సను భార్యయందు ధూమ్రకేశుం డను పుత్రుం డుదయించె. వేదశిరస్సుకు ధిషణ యను భార్యయందు దేవలుండును, వయునుండును. మనువునుం బుట్టిరి. తార్క్ష్యునకు వినత కద్రువ, పతంగి యామిని యను నలువురు భార్యలు. అందుఁ బతంగికిఁ బక్షులు వుట్టె, యామినికి శలభంబులు వుట్టె. వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనం బైన గరుడుండును. సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి. కద్రువకుఁ బెక్కు తెఱంగుల భుజంగమంబులు వుట్టె. చంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలు. వారలయందుఁ జంద్రుఁడు రోహిణియందు మాత్రము మోహితుం డగుటంజేసి దక్షశాపంబున క్షయ రోగగ్రస్తుండై సంతానంబు వడయనేరఁడయ్యె. అంత దక్షప్రసాదంబున క్షయపీడితంబు లగు కళల మరలం బొందె. మఱియును.

254

తా ॥ దక్షుడు ధర్మునకు ఇచ్చిన పదిమంది పేర్లు ఇవి: భానువు, లంబ, కకుబ్దేవి, జామిదేవి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప. వీరిలో "భానువు" కు వేదఋషభుడు, అతనికి ఇంద్రసేనుడు పుట్టారు. లంబకు విద్యోతుడు, అతనికి స్తనయిత్నువు కలిగారు. "కకుబ్దేవి" కి సంకటుడు, అతనికి కీకటుడు, అతనికి దుర్గాభిమానినులైన దేవతలు జన్మించారు. "జామి" దేవికి దుర్గములకు అధిష్ఠాన దేవతలు జన్మించారు. వారికి స్వర్గుడు,

నంది జన్మించారు. “విశ్వ” కు విశ్వేదేవతలు కలిగారు. వీరికి సంతానం జన్మించలేదు. “సాధ్య” కు సాధ్యగణములు జన్మించాయి. వారికి అర్థసిద్ధి అనేవాడు పుట్టాడు. “మరుత్వతి” కి మరుత్వంతుడు, జయంతుడు అనేవారు పుట్టారు. అందులో జయంతుడు వాసుదేవాంశతో ఉపేంద్రుడు అనే నామధేయంతో కీర్తివంతుడు అయ్యాడు. “ముహూర్త” కు సకల భూతములకు ఆయా కాలాల్లో ఆయా ఫలములను ఇచ్చే మౌహూర్తికులు అనే దేవగణాలు జన్మించారు. “సంకల్ప” కు సంకల్పుడు పుట్టాడు. ఆ సంకల్పునకు కాముడు పుట్టాడు. “వసువు” కు ఎనిమిది మంది కుమారులు కలిగారు. వారిపేర్లు ఇవి: ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వస్తువు, విభావసువు. వీరు ఎనమండుగురు అష్టవసువులుగా ప్రసిద్ధిని దాల్చారు.

వీరిలో ద్రోణుని భార్య అయిన అభిమతియందు హర్ష, శోక, భయాదులు కలిగాయి. ప్రాణునకు భార్య అయిన ఊర్జస్వతి యందు సహుజుడు, ఆయువు, పురోజవుడు అనే పుత్రులు కలిగారు. ధ్రువుని భార్య అయిన ధరణి యందు అనేక విధములయిన నగరములు పుట్టాయి. అర్కుని భార్య అయిన వాసనకు తర్షుడు ఇత్యాదులు జన్మించారు. అగ్నికి భార్య అయిన వసుధార యందు ద్రవిణకుడు మొదలైనవారు పుట్టారు. కృత్తిక అనే భార్యయందు స్కందుడు జన్మించాడు. ఆ స్కందునకు విశాఖుడు మొదలైన వారు జన్మించారు. దోషునకు శర్వరి అను భార్యయందు శ్రీహరి యొక్క కళ అయిన శింశుమారుడు కలిగాడు. వస్తువు అనే వానికి ఆంగిరస అనే భార్యయందు విశ్వకర్మ అను శిల్పాచార్యుడు జన్మించాడు. ఆ విశ్వకర్మకు ఆకృతి అను సతియందు చాక్షుషుడు అనే మనువు జన్మించాడు. ఆ మనువునకు విశ్వులు, సాధ్యులు అనేవారు పుట్టారు. ఇక విభావసునకు ఉష అను భార్య అందు వ్యుష్టియు, రోచిస్సును, ఆతపుడు జన్మించారు. అందులో ఆతపునికి పంచ యాముడు అనే దివసాభిమాన దేవత జన్మించాడు.

శంకరుని అంశతో జన్మించిన భూతునకు సురూప అనే భార్యయందు కోట్ల సంఖ్యలో రుద్రగణం పుట్టారు. మరియు రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహాంతుడు అనేవారు

రుద్రపారిషదులు, ఇంకా అతి భయంకరులైన ప్రేతలు, వినాయకులు పుట్టారు.

అంగిరసుడు అనే ప్రజాపతికి స్వధ అనే భార్యకు పితృగణములు పుట్టాయి. సతి అనే ఆమెకు అధర్వవేదాభిమానులు అయిన దేవతలు జన్మించారు.

దక్షుని కుమార్తెలలో కృశాశ్వుని భార్య అయిన వారిద్దరిలో అర్చి అనే ఆమెకు ధూమ్రకేతువు, ధిషణ అనే ఆమెకు దేవలుడు, వయునుడు, మనువును పుట్టారు.

దక్షుని పుత్రికలలో నలుగురు తారుక్ష్య కశ్యపునికి భార్యలయ్యారు కదా! వారిపేర్లు వినత, కద్రువ, పతంగి, యామిని. వీరిలో పతంగికి, పక్షులు పుట్టాయి. యామినికి మిడుతలు మొదలయిన కీటకములు జన్మించాయి. వినతకు యజ్ఞాధిపతి అయిన శ్రీమహా విష్ణువుకు వాహనమయిన గరుత్మంతుడు, సూర్యునకు సారథి అయిన అనూరుడును జన్మించారు. కద్రువ అనేక విధములయిన నాగులను కన్నది.

ఇక కృత్తికాది నక్షత్రములు ఇరవై ఏడు చంద్రునికి భార్యలు. వారలలో కేవలం రోహిణియందు మాత్రమే అతడు మోహితుడు. అయినా దక్ష శాపవశం చేత క్షయరోగగ్రస్తుడు అయిన కారణంగా సంతానాన్ని పొందలేకపోయాడు. తిరిగి దక్షుని అనుగ్రహం వలన తన కళలను పొందాడు.

సీ. కామిత ప్రదుఁడైన కశ్యపు కౌఁగిట ముచ్చట దీర్తురే ముద్దరాండ్రు,
అఖిల లోకములకు నవ్వలై జగమెల్లఁ బూజింప నుందురే పూవుఁబోండ్లు,
బలియురై పుత్త్రులుఁ బౌత్త్రులుఁ ద్రిజగంబు లేలంగఁ జూతురే యిందుముఖులు,
ముంగొంగు పసిఁడియై మూల్గు పుణ్యంబుల విఙ్ఞీఁగుదు రెట్టి వింతరాండ్రు,

తే. వారి కలగంప కడుపుల నేరుపఱుప, నరిది బిడ్డలఁ బడసిన బిరుదుసతుల
నామములు నన్వయంబులు నీ మనంబు, పూనఁజెప్పుదు వినవయ్య! మానవేంద్ర!

255

తా ॥ ఓ మానవేంద్ర! విను! దక్షప్రజాపతి తన అరవైమంది పుత్రికలలోను పదముగ్గురిని కశ్యప ప్రజాపతికి భార్యలుగా ఇచ్చాడని ఇంతకుముందు చెప్పాను కదా! కోరిన కోరికలను తీర్చే కశ్యపుని యందు వారు ప్రేమానురాగాలతో ఉంటారు. ఆ పువ్వుబోండ్లు జగమంతా పూజింప అఖిల లోకములకు తల్లులైనందున పూజించదగినవారు. ఆ ఇందుముఖులు తమ కొడుకులు, మనుమలు మూడు లోకాలను పాలిస్తూ ఉంటే సంతోషిస్తూ ఉంటారు. ఆ అంగనామణులు కొంగుబంగారమైన పుణ్యరాసులతో అలరారుతూ ఉంటారు. వారి సంతాన సౌభాగ్యాన్ని లెక్కించి చెప్పటం అసాధ్యం. వారి పేర్లు, అన్వయాలు నీ మనస్సుకు ఎక్కేటట్లుగా చెపుతాను.

తరల.

అదితియుం దితి కాష్ఠయుం దను వ య్యరిష్టయుఁ దామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్
మొదలుగాఁ దిమియు న్నిళప్రియముఖ్య యా సరమాదిగా
ముదిత లెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా!

256

తా ॥ అదితి, దితి, కాష్ఠ, దనువు, అరిష్ట, తామ్ర, క్రోధవశ, సురస, సురభి, ముని, తిమి, ఇళ, సరమ... ఈ పదమువ్వురు కశ్యప్రజాపతి భార్యలు. వీరి సంతానంతో మూడు లోకాలు నిండిపోయాయి.

సీ. చాలంగఁ దిమికిని జలచరంబులు వుట్టె శ్వాపదంబులు వుట్టె సరమయందు,
సురభికి మహిషాది సురభులు జనియించెఁ, దామ్రకు శ్యేన గృధ్రములుఁ
గలిగె మునికి నప్సరసల మూఁకలు జనియించె, నిళ గనె భూరుహములను,
గ్రోధ వశ కుద్భవిల్లె దుర్వార సర్పంబులు, సరి యాతుధానులు సురస కరయ

తే. నుప్పతిల్లిరి గంధర్వు లొక్క మొగి న, రిష్టకు సుతుల్, దనువునకుఁద్రిదశ రిపులు
పదియు నెనమండ్రునై నట్టి విదితబలులు, వారి నామాన్వయంబులఁ గోరి వినుము.

257

తా ॥ వీరిలో తిమికి జలచరాలు పుట్టాయి. సరమకు వ్యాఘ్రములు కలిగాయి. సురభికి గోవులు ఉద్భవించాయి. తామ్రకు డేగలు, గ్రద్దలు జన్మించాయి. మునికి అప్సరసలు కలిగారు. ఇళ వృక్షములకు జన్మనిచ్చింది. క్రోధవశకు అడ్డుకోవడానికి వీలులేని భయంకర సర్పములు కలిగాయి. సురస రాక్షసులను (యాతుధానులను) కన్నది. అరిష్టకు గంధర్వులు, దనువుకు బలవంతులయిన దానవులు పద్దెనిమిదిమంది పుట్టారు. వారి నామములు, అన్వయములు విను!

వ. ద్విమూర్ధుండును, శంబరుండును, అరిష్టుండును, హయగ్రీవుండును, విభావసుండును, అయోముఖుండును, శంకుశిరుండును, స్వర్భానుండును, కపిలుండును, అరుణియును, పులోముండును, వృషపర్వుండును, ఏకచక్రుండును, అనుతాపకుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, విప్రచిత్తియు, దుర్జయుండు నను వారలు. వీరలలోన స్వర్భానునకు సుప్రభయను కన్యక వుట్టె. దాని నముచి వివాహం బయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు వుట్టె. దాని నహుష పుత్త్రుండైన యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు నుపదానవి, హయశిర, పులోమ, కాలక యను నలువురు పుత్రిక లుదయించిరి. అందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె. హయశిరను గ్రతువు వివాహం బయ్యె. పులోమ, కాలక లను నిరువురకును గశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునం గైకొనియె. ఆ యిరువురకును సమరకోవిదు లైన దానవులు పౌలోమ కాలకేయులనం బుట్టిరి. మఱియు నా యిరువురకు నఱువదివేల రాక్షసులు జన్మించిరి. వారు యజ్ఞకర్మంబులకు విఘాతుకులై వర్తింప, వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుం డగు నర్జునుండు వధించె. మరియు, విప్రచిత్తి, సింహిక యను దానియందు రాహుప్రముఖంబుగాఁ గల కేతు శతంబును బడసె. వారలు గ్రహత్వంబుఁ

గైకొనిరి. మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమ భాగ్యవతియైన యదితి గర్భంబున నుదయించె. ఆ యదితి వంశంబును విదితంబుగా వినిపించెద. సావధానుండవై వినుము. వివస్వంతుండును, అర్యముండును, పూషుఁడును, త్వష్టయు, సవితయు, భగుండును, ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండును, ఉరుక్రముండును నను ద్వాదశాదిత్యులు జన్మించిరి. అందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె. మఱియు యముండు, యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. మఱియు నా సంజ్ఞాదేవి బడబాస్వరూపంబు నొంది యశ్వినీ దేవతలం గనె. ఛాయాదేవి యందు శనైశ్చరుండును, సావర్ణి యను మనువును, దపతియను కన్యకయుం బుట్టిరి. ఆ తపతిని సంవరణుండు వరియించె. అర్యమునకు మాతృక యను పత్నియందు చర్షణు లుదయించిరి. వారి మూలంబున మనుష్యజాతి యీ లోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె. పూషుండు భర్గునిం జూచి దంతంబులు వివృతంబులుగా నగిన, నతండు క్రోధించి దంతంబు లూడనడిచిన, నాఁటినుండియు భగ్నదంతుండై, యనపత్యుండై పిష్టాదులు భక్షింపుచుండె. త్వష్టకు దైత్యానుజ యైన రచన యను కన్యకకు నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు వుట్టె. అంత నా దేవతలు బృహస్పతిం గోపింప, నతఁ డు తలఁగిపోయినం దమకు నా విశ్వరూపుని నాచార్యునింగా వరియించిరి అని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

258

తా ॥ ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణి, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు..... అనేవి వారి నామధేయములు.

వీరిలో స్వర్భానునకు సుప్రభ అనే కూతురు పుట్టింది. ఆమెను నముచి వివాహం చేసుకొన్నాడు. వృషపర్వునికి శర్మిష్ఠ అనే కూతురు జన్మించగా, ఆమెను నహుషపుత్రుడైన యయాతి పెండ్లి చేసుకొన్నాడు.

వైశ్వానరునికి ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అనే నలుగురు పుత్రికలు పుట్టారు. ఇందులో ఉపదానవి హిరణ్యాక్షునకు భార్య అయింది. హయశిరను క్రతువు వివాహం చేసుకొన్నాడు. పులోమ, కాలకలను చతుర్ముఖుని వాక్యానుసారంగా కశ్యపప్రజాపతి భార్యలుగా స్వీకరించాడు. ఆ ఇద్దరకు... పులోమకు పౌలోములు, కాలకేయులు సమరకోవిదులు జన్మించారు. వారు యజ్ఞకర్మలకు విఘాతం కల్పిస్తూ ఉంటే వారిని ఇంద్రునికి సంతోషం కలిగేటట్లు నీ తాతగారైన అర్జునుడు వధించాడు.

సింహికను విప్రచిత్తి పరిణయమాడాడు. ఆమెయందు రాహువు, కేతువు మొదలుగా నూరుగురు కుమారులు కలిగారు. వారంతా గ్రహములుగా మారారు.

పరమ భాగ్యవతి అయిన అదితి గర్భాన శ్రీమన్నారాయణుడు తన అంశతో వామనుడై జన్మించాడు. ఆ అదితి యొక్క వంశాన్ని వివరంగా వినిపిస్తాను. సావధానంగా విను. ఆ అదితి దేవి వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శుక్రుడు, ఉరుక్రముడు... అనే పన్నెండు మంది ఆదిత్యులను కన్నది. వారిలో వివస్వంతునకు సంజ్ఞాదేవియందు శ్రాద్ధదేవుడు అనే మనువు జన్మించాడు. అంతేకాకుండా యముడు, యమి అనే కవలలు కూడ కలిగారు. ఆ సంజ్ఞాదేవి ఆడుగుఱ్ఱం రూపాన్ని ధరించి అశ్వినీదేవతలను కన్నది. ఆ వివస్వంతునికి ఛాయాదేవి అని ఇంకొక భార్య ఉన్నది. ఆమెకు శనైశ్చరుడు, సావర్ణి అనే మనువు, తపతి అనే కన్యక కలిగారు. అందు తపతిని సంవరణుడు వరించాడు.

అర్యముడికి మాతృక అనే భార్యయందు చర్షణులు కలిగారు. వారి మూలంగానే ఈ

మానవజాతి భూలోకంలో శాశ్వతంగా ఉండేటట్లు బ్రహ్మదేవుని చేత కల్పింపబడింది. పూషుడు దక్షయజ్ఞంలో పరమశివుని చూచి పండ్లు బయటపెట్టి పరిహాసం చేశాడు. అది చూచి కోపించిన పరమేశ్వరుడు వాని దంతములు ఊడేటట్లు తన్నాడు. నాటినుండి దంతములులేక, దానితో పాటు సంతానం కూడ లేక పిండి ముద్దలే ఆహారంగా భక్షిస్తున్నాడు. ఇక త్వష్టకు దైత్యుల యొక్క చెల్లెలు అయిన రచనకు అధిక బలాఢ్యుడు అయిన విశ్వరూపుడు పుట్టాడు. ఒకప్పుడు దేవతలు బృహస్పతిని కోపిస్తే అతను కోపంతో వెళ్ళిపోయాడు. అప్పటి నుండి దేవతలు విశ్వరూపుని తమ ఆచార్యునిగా వరించారు. అంత పరీక్షిత్తు శుకయోగీంద్రుని ఇలా అడిగాడు:

## 11. బృహస్పతి ఇంద్రాదులను తిరస్కరించుట

సీ. అరయంగ యోగీంద్ర! యద్భుతం బయ్యెడు సురలపై నేటికి సురగురుండు
కోపించె? నీతండు గురుభావమున దేవతల కేమి యాపదఁ దలఁగఁ జేసె?
నెఱిఁగింపు మనవుడు నింద్రుండు త్రిభువ నైశ్వర్య మదంబున
సత్పథంబు గానక వసు రుద్ర గణములు నాదిత్య మరు దశ్విదేవాది మండలములు

తే. సిద్ధ చారణ గంధర్వ జిహ్మగాది, సురులు మునులును రంభాది సుందరాంగు
లాడఁ బాడంగ వినుతి సేయంగఁ గొలువ, నొక్క భద్రాసనంబున నుక్కుమీఱి.

259

తా ॥ "యోగీంద్రా! దేవతలపై బృహస్పతికి ఎందుకు కోపం వచ్చింది? ఆ కారణంగా దేవతలకు ఎట్టి ఆపద వాటిల్లింది?" నాకు వివరించండి. అప్పుడు శుకయోగి ఇలా అన్నాడు: "ఒకనాడు ఇంద్రుడు త్రిభువనాలను నేనే పాలిస్తున్నాననే మదంతో సన్మార్గాన్ని అతిక్రమించాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినీ దేవతలు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, ఉరగులు మొదలుగా ముక్కోటి దేవతలతో భద్రాసనం మీద ఆసీనుడయి కొలువుతీరాడు. రంభ, ఊర్వశి మొదలయిన అప్సరసలు పాడుతూ ఆడుతున్నారు.

సీ. నిండు పున్నమనాఁడు గండరించిన చంద్ర మండల శ్రీలతో మాఱుమలయ
భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలంగ మిన్నేటి తరఁగల మేలుకొలుపఁ
గలిత దివ్యాంగనా కరతల చాతుర్య చామర శ్రేణులు జాడపడఁగఁ
జింతామణి స్ఫుట కాంత రత్నానేక ఘటిత సింహాస నాగ్రంబునందు

తే. నూరుపీఠంబుపై శచి యుండ నుండి, వరుస దిక్పాలకాది దేవతలు గొలువ
సాటి చెప్పంగరాని రాజసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁ డగుచు.

260

తా ॥ నిండు పున్నమినాటి చంద్రమండలం వలె ప్రకాశిస్తూన్న శ్వేతచ్ఛత్రం నయనానందకరంగా విరాజిల్లుతూ ఉన్నది. ఆకాశగంగా తరంగాలను మించిన వింజామరములతో దివ్యాంగనలు స్వర్ణకంకణాలను ధరించిన చేతులతో వీస్తున్నారు. చింతామణివలె అనేక రత్నములచేత స్థాపితమైన సింహాసనం మీద శచీదేవితో కలిసి ఆసీనుడయ్యాడు ఇంద్రుడు. దేవతలు కొలుస్తున్నారు. సాటిలేని రాజసంతో ప్రకాశిస్తున్నాడు.

వ. అ య్యవసరంబున.

261

క. గురుతర ధర్మక్రియ నయ, గురుఁడు మరున్మంత్ర విషయ గురుఁడు వచ■

గురుఁడు సమస్తామరగణ, గురుఁడు గురుం డరుగుదెంచెఁ గొల్వునకు నృపా!

262

తా ॥ ఆ సమయంలో గొప్ప ధర్మశాస్త్ర కోవిదుడు, నీతిశాస్త్ర పారంగతుడు, మంత్రాలోచన తత్పరుడు, మాటలాడుట యందు నేర్పరి, సమస్తమైన దేవతా సమూహానికి గురుడు అయిన బృహస్పతి కొలువుకు వచ్చాడు.

చ. అమిత తపః ప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్య దు

ర్దమ మదరేఖ నింద్రుడు వృథా తనగద్దియ లేవకుండె నె

య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోప చా

రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్.

263

తా ॥ అమితమైన తపస్సుచేత వెలిగిపోతున్న కరుణామూర్తి అయిన బృహస్పతిని చూచి రాజ్యగర్వంచేత సింహాసనంపై కూర్చున్న ఇంద్రుడు తన ఆసనం నుండి లేవలేదు, ఆయనకు స్వాగతం చెప్పలేదు. కూర్చోమని ఆసనం ఈయలేదు. గౌరవ ఉపచారముల చేత ఆయనను

ప్రసన్నునిగా చేయలేదు. ఆ దివ్య సభాంతరాళంలో ఏ మర్యాదలు చేయకుండా అలాగే కూర్చున్నాడు.

క. అప్పుడు సురపతి కన్నులఁ, గప్పిన సురరాజ్య మదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున, క పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై

264

తా ॥ అప్పుడు దేవరాజు కన్నులు కప్పిన రాజ్యాధికారపు అహంకారానికి ఖిన్నుడైన బృహస్పతి స్పందించకుండా వెనుతిరిగి తన నివాసానికి వెళ్ళిపోయాడు.

చ. ఎఱుఁగమిఁ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరుపడి భీతినొంది యతిచింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్రు విశేష పాద పం క
రుహముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై.

265

తా ॥ తాను చేసినట్టి గురుహేళన విచక్షణతో తెలుసుకొని ఇంద్రుడు ఆశ్చర్యపడి, భయాన్నిపొంది మిక్కిలి చింతించాడు. అప్పుడు ఇలా అన్నాడు. "ఆ పరమ పవిత్ర మూర్తిని, లోకనుతుణ్ణి, ఆ భవ్యచరితుణ్ణి ఆయన పాదపంకేరుహములను పూజసేయక ఉపేక్షించాను. అల్పబుద్ధిచేత చెయ్యరాని పని చేశాను.

క. త్రిభువన విభవ మదంబున, సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస
త్ప్రభువునకు నెగ్గు సేసితి, శుభములు దొలఁగంగ నే నసురభావమునన్.

266

తా ॥ మూడు లోకాలను పాలిస్తున్నాను అనే గర్వంతో నా గురువునకు, అనుగ్రహ

మూర్తికి, ప్రభువుకు తలవంపులు చేశాను. అసురభావం చేత చేసిన నాకు ఇక శుభములు ఎలా కలుగుతాయి?

ఆ. పారమేష్ఠ్య మయిన పదవి నొందిన భూపు లెట్టివారి కైన లేవవలదు,
విబుధులిట్లు సెప్పు విధమెన్న వారలు, ధర్మవేత్త లనుచుఁ దలపఁబడరు.

267

తా ॥ పరమేష్ఠి పదవిలో ఉన్నా చక్రవర్తులు ఎట్టివారొచ్చినా లేవకూడదు అని చెప్పే పండితులు ధర్మం తెలిసినవారు అని తలపబడరు.

తే. కుపథవర్తు లగుచుఁ గుత్సిత దుర్వచో, నిపుణు లైనవారు నిడివి దెలిసి
తొలఁగలేక తా రధోగతిఁ బడుదురు, తప్పులేక రాతితెప్ప భంగి.

268

తా ॥ తప్పుడు మార్గంలో నడుస్తూ, చెడిపోయిన బుద్ధి కలిగి ఎప్పుడూ దుర్భాషలను పలికేవారు, ధర్మమార్గాన్ని తెలుసుకొనలేక రాతితెప్ప మాదిరిగా అధోగతిలో పడతారు.

ఉ. కావున లోకవందితుని కార్యవిచారుని యింటి కేగి త
త్పావన పాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి త
త్సేవ యొనర్చి చిత్తము వశించి ప్రసన్నునిఁ జేతు నంచు న
ద్దేవవిభుండు వోయె నతితీవ్రగతిం గురుధామ సీమకున్.

269

తా ॥ కనుక నేనిప్పుడు లోకవందితుడు, కార్యవిచారుడు అయిన గురువుగారి ఇంటికి వెళ్ళి ఆయన పాదపద్మాలపై నా కిరీటం సోకేటట్లు మ్రొక్కి, ఆయనకు సేవచేసి, చిత్తమును మెప్పించి ప్రసన్నునిగా చేసుకుంటాను” అని ఈ ప్రకారంగా అనుకొని అత్యంత వేగంగా

గురువుగారి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు.

సీ. ఈ రీతిఁ దనయింటి కేతెంచు దేవతా పతి రాక యా బృహస్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై పోయె నప్పుడు దేవపుంగవుండు
సకలంబుఁ బరికించి జాడ గానక గురుఁ జింతించి తలపోసి చిన్న వోయెఁ
బోయిన విధమెల్ల దాయలు రాక్షస వీరులు వేగులవారివలనఁ

తే. దెలిసి మిక్కిలి తమలోనఁ దెలివి నొంది, యందఱును గూడి భార్గవు నాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువు వెట్టి.

270

తా ॥ ఈ రీతిగా తన ఇంటికి వస్తూన్న దేవతాపతి రాకను బృహస్పతి గుర్తించి అధ్యాత్మ మాయచేత అదృశ్యుడై కనిపించకుండా పోయాడు. అప్పుడు ఇంద్రుడు అంతా పరికించి బృహస్పతి జాడ కనిపెట్టలేక మనస్సులో బాధపడి చాలా చిన్నబోయాడు. జరిగినదంతా రాక్షసవీరులు తమ వేగుల వారి వలన విని సంతోషించి అందరూ కూడి గురువుగారైన శుక్రాచార్యుల వారిని ఆశ్రయించారు. ఆయన యొక్క కృపాదృష్టిచేత తమ శక్తితోను దేవతల మీద యుద్ధానికి బయలుదేరారు.

# 12. దేవాసుర యుద్ధ ప్రారంభము

క. ధూర్తులు సమస్త కల్బిష, మూర్తులు వర ధర్మ కర్మ మోచిత మార్గా
వర్తులు దుర్ణయ నిర్మిత, కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై.

271

తా ॥ ధూర్తులు, సమస్తమైన పాపములను చేసినవారు, ధర్మమార్గాన్ని విడిచిపెట్టిన కర్మలు కలవారు, అవినీతి పరులైన రాక్షసులు గీర్వాణుల మీదికి యుద్ధానికి బయలుదేరారు.

స్రగ్ధర.
దండిం గోదండ కాండోద్ధత రథ హయ వేదండ తండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా న ద్దనుజనికరముల్ దైవవర్గంబు మీఁదం
జండ బ్రహ్మాండభే ద్యోచ్ఛ్రయ జయరవముల్ సర్వదిక్ క్షోభగా ను
ద్దండ ప్రఖ్యాతలీలన్ దలపడిరి సురల్ దర్పులై వారి తోడన్.

272

తా ॥ శౌర్యంతో విల్లు బాణములు పూని, రథములు, గుఱ్ఱములు, ఏనుగుల సమూహముతో, రాక్షససైన్యం దేవతలపై దండెత్తింది. దేవతలు కూడ బ్రహ్మాండ భాండం బ్రద్దలయ్యేటట్లుగా జయ జయ ధ్వానాలు చేస్తూ సర్వ దిక్కులకు క్షోభను కలిగిస్తూ దర్పంతో రాక్షసులను ఎదుర్కొన్నారు.

చ. మదమున దేవదానవులు మచ్చరముల్ గడుఁ బిచ్చలింప సం
పదలను గోరి పోరునెడ భార్గవ మంత్రకళా విశేషులై
యెదురులు వాలి యస్త్రమున నేయ మహాసురు లేచియేచి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు కోల్తల కోర్వక పాటి రయ్యెడన్.

273

తా ॥ మదంతో దేవదానవులు మాత్సర్యం పెచ్చు మీరగా పోరాటం మొదలుపెట్టారు. అసురులు శుక్రాచార్య మంత్ర కళా విశేషంచేత అస్త్రప్రయోగం చేసే సరికి దేవతా సమూహం బాణసమూహానికి నిలువలేక పారిపోసాగారు.

ఆ. దనుజవీరు లేయు దారుణ దివ్యాస్త్ర, దళితదేహు లగుచుఁ దలలు వీడ
నోడి పాఱి రద్భుతోపేత బలులైన, త్రిదశవరులు బిట్టు దిట్టినట్లు.

274

తా ॥ దనుజవీరులు వేసే దారుణమైన దివ్యాస్త్రములకు తమ శరీరములు భేదిల్లగా ఓడిపోయి పారిపోవటం మొదలుపెట్టారు దేవతలు.

క. ఒక మొగము గాక దివిజులు, తికమక గొని వైరులెల్ల దీకొనఁ దమ్ముం
బకపకలై నకనక లై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్.

275

తా ॥ శత్రువులు అన్నివైపుల నుండి చుట్టుముట్టగా దేవతాసమూహం అంతా తికమకతో, తొట్రుపాటుతో పారిపోవటం మొదలుపెట్టారు.

చ. దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోకయున్
మనుజవిశేష భోజనుల మచ్చరికంబు నిశాటకోటి యే
చిన బల శౌర్యముం దమకు సిగ్గును హాని మహాభయంబు ని
ర్గుణతను జేయు నుమ్మలికఁ గోల్తల కోపక పాఱి రార్తులై.

276

తా ॥ దనుజుల గర్వము, దానవ వీరుల బాణ పరంపర, రాక్షస వీరుల మాత్సర్యము,

నిశాచర వీరుల బల శౌర్యములు... తమకు సిగ్గు, హాని, మహా భయమును కలుగ చేయగా దేవతలు శరపరంపరలకు తట్టుకోలేక ఆర్తులై పారిపోవటం మొదలు పెట్టారు.

క. అమరులు విసృష్ట దానవ, సమరులు శరభిన్న దేహ సంతాపగుణ
భ్రమరులు దైత్య కిరాతక, చమరులు కమలజుని కడకుఁ జనిరి భయార్తిన్.

277

తా ॥ దేవతలు రాక్షసులతో సమరం చాలించి బాణములచేత తూట్లు పడిన శరీరాలతో, దైత్యులనే కిరాతకులచే కొట్టబడిన చమరీ మృగాలవలె, భయంతో బ్రహ్మ దగ్గరకు పరుగెత్తారు.

ఉ. ధాతకు దేవతా విభవదాతకుఁ బుణ్యజనానురాగ సం
ధాతకు సర్వలోక హితదాతకు వైదిక ధర్మమార్గ ని
ర్ణేతకు నుల్లస ద్విభవ నేతకు సర్వజగ జ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్య యోగిజన భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్.

278

తా ॥ అలా చేరుకున్న దేవతలు ఆయనకు మ్రొక్కారు. బ్రహ్మదేవుడు దేవతలకు వైభవాన్ని ఇచ్చేవాడు. రాక్షసులంటే కూడా అనురాగం కలవాడు. సర్వ లోకాలకు హితాన్ని కలిగించేవాడు. వైదిక ధర్మమార్గమును నిర్ణయించేవాడు. లోకములకు వైభవాన్ని ఇచ్చేవాడు. మన్మథునికి అన్నగారైన వాడు. పుణ్యులైన యోగిజనుల యొక్క హృదయాలను జయించినవాడు.

క. ఆఖండలుండు మొదలుగ, లేఖానీకముల బ్రహ్మ లేనగవున ని
త్యాఖండ సత్కృపారస, శేఖర వాక్యముల వారి సేదలు దేర్చెన్.

279

తా ॥ దేవేంద్రుడు మొదలుగా సకల దేవతానీకాన్ని విధాత చిరునగవుతో, దయా పూరిత

సాంత్వన వాక్యములతో వారిని పలుకరించి సేదతీర్చాడు.

వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖులైన దేవతల కనుకంపాతివిభవంబున నభయం బొసంగి యిట్లనియె.

280

తా ॥ ఈ విధంగా బ్రహ్మ దేవేంద్రుడు మొదలుగా సకల దేవతలను దయతో పలుకరించి అభయమిచ్చి ఇలా అన్నాడు:

ఉ. నెట్టనఁ బాపకర్మమున నేరమిఁ జేసితి రేమి చెప్ప! మీ
పుట్టిన నాఁటనుండియును బుద్ధులు సెప్పి జగంబు లేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళా విధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁ దొట్టిన పొట్ట క్రొవ్వునన్.

281

తా ॥ "మీరు పాపకర్మ చేశారు. మీరు పుట్టిన నాటినుండి మీకు బుద్ధులు చెప్పి ఈ జగత్తును పరిపాలించమని అధికారాన్ని ఇచ్చి పెంచిన కృపానిధి, బ్రహ్మజ్ఞాని అయిన బృహస్పతిని అధికార మదంతో దూరం చేసుకున్నారు.

వ. బ్రహ్మిష్ఠుఁడైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురు ద్రోహంబుఁ జేసితిరి. తద్దోషం బిపుడు మీకుఁ జేసేఁత శత్రుకృతం బై యనుభవింపం జేసె. అతి బలవంతులైన మిమ్ము నతిక్షీణులైన రాక్షసులు జయించుట, తమ యాచార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్ర ప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యు లగుటచేతనే ఇప్పుడు మదీయం బైన నిలయంబు నాక్రమింపం గలవారై మదోద్రేకంబున నెదురులేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుఁ ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయంబు. అభేద్య మంత్రబలంబు గల భార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవింద గవేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల

కరిష్టం బగు. కావున మీరిప్పుడు త్వష్ట యను మను పుత్రుం డగు విశ్వరూపుండను ముని నిశ్చల తపో మహత్త్వ సత్త్వస్వభావుం డగు నతని నారాధించిన, మీకు నభీష్టార్థంబు నతండు సంఘటిల్లఁజేయు. ఎట్టి దుర్దశల నైన నతం డడంచు అని చెప్పిన దిక్పాలకాదులు డెందంబులు డిందుపడి, కమలగర్భుని వీడ్కొని, విశ్వరూప కడకుం జని యిట్లనిరి.

282

తా ॥ బ్రహ్మనిష్ఠుడయిన మీ ఆచార్యుని విషయంలో గురుద్రోహం చేశారు. ఆ దోషానికి ఫలం ఇప్పుడు మీరు అనుభవిస్తున్నారు. అతి బలవంతులయిన మిమ్ములను బలహీనులైన రాక్షసులు జయించటం అనేది అసాధ్యం, కాని అది సాధ్యమైంది. ఎందువల్ల అంటే వారు తమ గురువయిన శుక్రాచార్యుణ్ణి ఆరాధించి ఆయన యొక్క మంత్రప్రభావంచేత తిరిగి బలాన్ని పొందారు. అట్టి వారికి స్వర్గాన్ని ఆక్రమించటం చాలా సులువు. ఇపుడు గోబ్రాహ్మణ భక్తులు, గోవింద భక్తులు తప్ప మిగిలిన వారికి అరిష్టమే కలుగుతుంది. కనుక మీరు ఇప్పుడు "త్వష్ట" అను మనువు యొక్క కుమారుడైన విశ్వరూపుడనే మునిని నిశ్చలమైన తపస్సులో ఉన్న అతనిని ఆరాధించండి. మీ కోరిక నెరవేరుతుంది. ఎట్టి దుర్దశలు మీకు కలిగినా అతను అణచివేస్తాడు." అని విధాత చెప్పేసరికి దేవతలు కొంత కుదుటపడి విశ్వరూపుని దగ్గరకు వెళ్ళారు.

తే. అన్న! మేలగు నీకు ని న్నడుగఁ గోరి, వచ్చినారము భవదీయ వనమునకునుఁ
దండ్రులకు నేఁడు సమయోచితంబు లైన, కోర్కు లొనఁగూడఁజేసి చేకొనుము యశము.

283

తా ॥ "నీకు శుభమగుగాక! నిన్ను అర్థించేందుకు ఇక్కడకు వచ్చాం. నీ తండ్రులమైన మా సమయోచితమైన కోర్కెలను తీర్చి కీర్తిని గడించు.

క. సుతులకుఁ బితృశుశ్రూషణ, మతిపుణ్యము సేయుచుండు నాత్మజులు గుణో
న్నతి బ్రహ్మచారు లైనను, మతితో గురుసేవకన్న మఱియుం గలదే?

284

తా ॥ తమ తండ్రికి శుశ్రూష చేస్తే కొడుకులకు పుణ్యం కలుగుతుంది. ఆ కుమారులు గొప్ప గుణములు కలవారు, బ్రహ్మచారులు అయితే, గురుసేవ కంటే కోరుకోవలసినది ఏముంది?

వ. అదియునుం గాక.

285

సీ. అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు, దండ్రి తలంపంగ ధాతరూపు,
రూపింప భ్రాత మరుత్పతి రూపంబు, దెలియంగఁ దల్లి భూదేవిరూపు
భగిని కరుణరూపు, భావంబు ధర్మ స్వరూపంబు దా నర్థిరూపు మొదల
నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవుని రూపు సర్వభూతములుఁ గేశవుని రూపు

తే. గానఁ దండ్రి! వేగఁ గడు నార్తులగు పితృ, జనుల మైన మమ్ముఁ జల్లఁ జూచి
పరభయంబు వాపి నిరుపమం బగు తపో, మహిమచేత మెఱసి మనుపవయ్య!

286

తా ॥ అదీకాక ఆచార్యుడు పరమాత్మ స్వరూపుడు. తండ్రి బ్రహ్మ స్వరూపుడు. తల్లి భూదేవి యొక్క రూపం. సోదరుడు ఇంద్ర స్వరూపం. సోదరి కరుణా స్వరూపిణి. భావము ధర్మస్వరూపం. తాను అర్థి స్వరూపం. అభ్యాగతుడు అగ్ని స్వరూపుడు. కనుక తండ్రీ! మిక్కిలి ఆర్తులమూ, పితృజనులము అయిన మమ్ము చల్లగా చూడు. శత్రుభయాన్ని పోగొట్టి నీ తపోమహిమచేత మమ్ము రక్షించు.

వ. ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్ను నా చార్యునిఁగా వరించి, భవదీయ తేజో విశేషంబుచేత వైరివీరులం బరిమార్చెదము. ఆత్మీయార్థంబైన యవిష్ఠ పాదాభివందనంబు నిందితంబు గాదని వేదవాక్యంబు గలదు. కావున నీవు నమస్కరించుచున్న దేవతలం గైకొని

పౌరోహిత్యంబు సేయుము అనినఁ బ్రహసిత వదనుండై య మ్మునీశ్వరుం డిట్లనియె.

287

తా ॥ బ్రహ్మనిష్ఠుడవైన నిన్ను ఇప్పుడు ఆచార్యునిగా వరిస్తున్నాము. నీ తేజోవిశేషం చేత శత్రువులను సంహరిస్తాము. ఆత్మ రక్షణార్థం చిన్నవాని పాదాలకు సైతం వందనం చేయవచ్చని వేదవాక్యం ఉన్నది. కనుక నీకు నమస్కారం చేస్తూన్న దేవతలమైన మాకు పౌరోహిత్యం చెయ్యవలసిందిగా ప్రార్థిస్తున్నాం అన్న సురలతో నవ్వు ముఖంతో ఆ మునీశ్వరుడు ఇలా అన్నాడు:

ఆ. బ్రహ్మతేజంబు వోయెడి ప్రార్థనంబు, ధర్మగుణ గర్హితం బని తా నెఱింగి
సొరిది ననుబోఁటి తపసి యీ సురల చేతఁ, బ్రకట మధురోక్తి నేటికిఁ బలుకఁబడియె.

288

తా ॥ "మీ ప్రార్థనను అంగీకరించి నేను కనుక పౌరోహిత్యానికి అంగీకరిస్తే నా బ్రహ్మతేజస్సు నశిస్తుంది. మీ ప్రార్థన ధర్మవిరుద్ధం. నావంటి తపస్విని గూర్చి మీరు ఇలాంటి పలుకులు పలకటం శ్రేష్ఠం కాదు.

వ. విశేషించి.

289

క. గురుధనముఁ గూర్పనేటికి, గురుశిక్షం దగిలి మంత్రకోవిదులై స
ద్గురుధర్మ నిరతు లేనియు, గురువులకును శిష్యవరులె కూర్చిన ధనముల్.

290

తా ॥ అయినా గురువుకు ధనాన్ని కూర్చిపెట్టడం దేనికి? గురుశిక్షకు లోనై మంత్రకోవిదులై ధర్మ మార్గంలో నడుచుకుంటూన్న శిష్యశ్రేష్ఠులే గురువులకు కూర్చిన ధనం.

అంతకు మించినది ఏముంటుంది?

సీ. అరయ నకించను లై నట్టివారికిఁ దగు శిలోంఛనవృత్తి ధనము సుమ్ము,
దానిచే నిర్వర్తిత ప్రియసాధు సత్క్రియ గలవారలై ప్రీతినొందె
దరు గాన సద్గర్హితాచారమైన యాచార్యత్వ మిపుడు మీ శాసనమునఁ
గైకొంటి, గురువుల కామంబు బ్రాణార్థ వంచనములు లేక వడి నొనర్తు
ఆ. ననుచు విశ్వరూపుఁ డనియెడి ముని ప్రతి జ్ఞోక్తిఁ బలికె వారి నూఱడించి
మహిత మైన తత్సమాధిచే గురుభావ, మమరఁ జేసె దేవసమితి కపుడు.

291

తా ॥ దారిద్ర్యంలో ఉన్నవారికి ధాన్యాన్ని ఏరుకొని జీవించటమే ధనం. సాధు పురుషులు ఆ వృత్తిని చేసుకొంటూ సత్క్రియలు చేస్తూ ప్రీతిగా ఉంటారు. అట్టివారు సైతం గర్హించే పౌరోహిత్యాన్ని మీ కోరికను అనుసరించి తీసుకొంటున్నాను. పెద్దల యొక్క కోరికను ప్రాణాలకు ధనమునకు ఎట్టి వంచన లేకుండనే నెరవేరుస్తాను." ఈ ప్రకారంగా విశ్వరూపుడు అనే మునీంద్రుడు ప్రతిజ్ఞగా పలికి దేవతలను ఊరడించి గురుభావాన్ని స్వీకరించాడు.

క. భార్గవవిద్యా గుప్త, స్వర్గశ్రీ ద్విగుణ దనుజ సమధిక సంప
ద్వర్గముల విష్ణుమాయా, నర్గళగతిఁ దెచ్చి యింద్రునకు నిచ్చె నృపా!

292

తా ॥ ఓ రాజా! శుక్రాచార్యుల విద్యచేత ఆ స్వర్గాన్ని ఆక్రమించిన దనుజుల యొక్క సంపద రెండింతలు అయినా దానిని మించిన ఐశ్వర్యాన్ని విశ్వరూపుడు ఇంద్రునకు విష్ణుమాయ వలన తెచ్చి ఇచ్చాడు.

క. ఏ విద్యచేత రక్షితుఁ, డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచెన్

భావింప నట్టి విద్యను, శ్రీవరమాయామతంబుఁ జెప్పెను హరికిన్.

293

తా ॥ ఏ విద్యచేత రక్షితుడైన ఇంద్రుడు రాక్షసులను త్రుంచకలడో అట్టి విద్యను, విష్ణుమాయా తత్త్వాన్ని విశ్వరూపుడు ఇంద్రునకు చెప్పాడు."

ఉ. నావుడు ఁబాండవాన్వయుఁడు నమ్మినభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దన చిత్తమునన్ భజియించి పల్కె నో
దేవగణార్చితాంఘ్రియుగ! దివ్య మునీశ్వర! విశ్వరూపుఁ డ
ప్పావనమైన విద్య సురపాలున కే క్రియ నిచ్చెఁ? జెప్పవే!

294

తా ॥ అప్పుడు పరీక్షిత్తు భక్తితో జగన్నివాసుడు, రాజీవ దళాక్షుడు అయిన శ్రీకృష్ణణ్ణి తన చిత్తమునందు నిలుపుకొని ఇలా పలికాడు: "ఓ దేవగణముల చేత పూజింపబడిన పాదములు కలవాడా! దివ్య మునీశ్వరా! విశ్వరూపుడు అనే మునీంద్రుడు ఆ పావనమైన విద్యను దేవేంద్రునకు ఎలా ఇచ్చాడు?

ఉ. ఎందును రక్షితుం డగుచు నింద్రుఁడు లీలయ పోలె వైరి సే
నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకములఁ జేకొని యేలె మునీంద్ర! దాని నే
విందు సుఖంబుఁ గందు నిఁక వీనులు సంతస మందఁ బల్కవే?

295

తా ॥ ఏ విద్యను గ్రహించి సురేంద్రుడు రక్షితుడై లీలగా శత్రువులను దునుమాడి దేవతలు అంతా సుఖింపగా సంపదలతో సమస్త లోకములను ఏలాడో ఆ విద్యను నా వీనులు సంతోషమును పొందేటట్లు చెప్పండి.

# 13. శ్రీమన్నారాయణ కవచము

క. వర నారాయణ కవచము, నరిభీకర వజ్రకవచ మాశ్రిత సంప
త్పరిణామ కర్మసువచము, పురుహూతున కెట్లు మౌని బోధించెఁ? దగన్.

296

తా ॥ శ్రేష్ఠమైన నారాయణ కవచాన్ని, భీకరమైన శత్రువుల నుండి రక్షించే వజ్రకవచాన్ని, తనను ఆశ్రయించిన వారిని రక్షించి మేలు చేకూర్చే కవచాన్ని దేవేంద్రునకు ఆ విశ్వరూపుడు ఎట్లా బోధించాడో చెప్పండి."

వ. అనినం బరీక్షి జ్జనపాలునకు మునినాథుం డిట్లనియె.

297

సీ. వినవయ్య! నారనాథ! మునినాథుఁ డింద్రున కనువొంద నారాయణాఖ్య మైన
కవచంబు విజయ సంకల్పంబు నప్రమేయ స్వరూపంబు మహాఫలంబు
మంత్రగోప్యము హరిమాయావిశేషంబు సాంగంబుతోడ నెఱుంగఁజేసె!
దాని నే వినిపింతుఁ బూని తదేకాగ్ర చిత్తంబుతోడుతఁ జిత్తగింపు,

తే. మొనర ధౌతాంఘ్రిపాణి యై యుత్తరంబు, ముఖముగా నుత్తమాసనమున వసించి
కృత నిజాంగ కరన్యాస మతిశయిల్ల, మహిత నారాయణాఖ్య వర్మము నొనర్చె.

298

తా ॥ అప్పుడు పరీక్షిత్తుతో మునినాథుడైన శుకుడు ఇలా అన్నాడు: "ఓ రాజేంద్రా! విను! మునినాథుడైన విశ్వరూపుడు ఇంద్రునకు తెలియచేసిన నారాయణ కవచం ఉన్నదే, అది విజయాన్ని చేకూర్చేది. ఊహకు అందని ప్రభావాన్ని కలిగించేది, మహాఫలవంతమైనది, గోప్యమైనది. హరి యొక్క మాయావిశేషంతో కూడినది. దానిని నేను నీకు వినిపిస్తాను. ఏకాగ్ర

చిత్తంతో విను. మొట్టమొదట కాళ్ళుచేతులు కడుక్కోవాలి. పిమ్మట ఉత్తర ముఖంగా ఉత్తమ ఆసనంమీద వసించాలి. అంగన్యాస కరన్యాస పూర్వకంగా ఈ నారాయణ కవచాన్ని ప్రయోగించాలి.

వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను, జానువులను, ఊరువులను, ఉదరంబునను, హృదయంబునను, ఉరంబునను, ముఖంబునను, శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకం బైన యష్టాక్షరీ మంత్రరాజంబు విన్యాసంబుఁ జేసి, ద్వాదశాక్షర విద్యచేత కరన్యాసంబు చేసి, మంత్రమూర్తియై భగవచ్ఛబ్ద వాచ్యంబైన ప్రణవాది యకారాంతమగు మహామంత్రంబు చేత నంగుళ్యంగుష్ఠ సర్వసంధులయందు న్యసించి, మఱియు హృదయంబున ఓంకారము, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబునందు, ణకారంబు శిఖయందు, వేకారంబు నేత్రంబులయందు, నకారంబు సర్వసంధులయందు, మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించెనేని మంత్రమూర్తియగు. మఱియును అస్త్రాయ ఫట్ అను మంత్రంబున దిగ్బంధనంబుచేసి, పరమేశ్వరునిఁ దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ, దపోమూర్తియు నగు షట్ఛక్తి సంయుతంబైన నారాయణ కవచాఖ్య మైన మంత్రరాజంబు నిట్లని పఠించె.

299

తా ॥ పిమ్మట నారాయణ కవచాన్ని కూర్చి "ఓం నమో నారాయణాయ" – అనే ప్రణవంతో కూడిన ఎనిమిది అక్షరాలను పాదములు, జానువులు, ఊరువులు, ఉదరము, హృదయము, వక్షఃస్థలము, ముఖము, శిరస్సు అనే అష్టాంగములయందు విన్యాసం చెయ్యాలి. పిమ్మట "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే ద్వాదశాక్షర మంత్రంతో కరన్యాసం చేయాలి. అనగా మంత్రంలోని పన్నెండు అక్షరాలతో రెండు చేతుల వ్రేళ్ళ కణుపులయందు న్యాసం చెయ్యాలి. పిమ్మట సాధకుడు మంత్రమూర్తియై 'ఓం విష్ణవే నమః' అనే మంత్రాన్ని గ్రహించి.... హృదయంలో 'ఓం' కారాన్ని, శిఖయందు 'ణ' కారాన్ని, నేత్రములయందు 'వే' కారాన్ని న్యాసం

చెయ్యాలి. 'న' కారాన్ని సర్వ సంధులలోను మరియు అస్త్రముద్రతో 'మ' కారాన్ని ఉంచి సాధకుడు మంత్రమూర్తి కావాలి. పిమ్మట 'అస్త్రాయ ఫట్' అనే మంత్రంతో దిగ్బంధనం చేసి పరమేశ్వరుణ్ణి తన మనస్సులో ధ్యానిస్తే విద్యామూర్తి, తపోమూర్తి అవుతాడు. ఆ మంత్రరాజమును ఇట్లా పఠించాలి:

చ. గరుడుని మూఁపుపై పదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్ర చ
ర్మ రుచిర శార్ఙ్గ ఖడ్గ శర రాజితపాశ గదాది సాధనో
త్కర నికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతి
సం భరిత మహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

300

తా ॥ "గరుత్మంతుని మూపుమీద తన రెండు పాదములను ఉంచినవాడు, శంఖము, చక్రము, కవచము, ధనుస్సు, ఖడ్గము, బాణము, పాశము, గద అనే ఆయుధములను తన కరముల యందు ధరించినవాడు అయిన శ్రీమహా విష్ణువు కృపతో నను రక్షించు గాక!

ఆ. ప్రకట మకర వరుణ పాశంబులందుల, జలములందు నెందుఁ బొలయ కుండఁ
గాచుఁగాక నన్ను ఘనుఁడొక్కఁ డైనట్టి, మత్స్యమూర్తి విద్యమానకీర్తి.

301

తా ॥ ఘనమైన కీర్తితో ప్రకాశించే ఆ మత్స్యావతారమూర్తి నన్ను వరుణ పాశాలలో పడనివ్వక జలాల్లో సదా రక్షించు గాక!

క. వటుఁడు సమాశ్రిత మాయా, నటుఁడు బలి ప్రబల శోభన ప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, చటుల స్థలమందు నన్ను సంరక్షించున్.

302

తా ॥ తన నటనతో, మాయతో, వటువుగా వచ్చి బలిచక్రవర్తి యొక్క వైభవాన్ని అపహరించిన త్రివిక్రమదేవుడు నన్ను అన్ని చోట్లా రక్షించుగాక!

చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్ని కీలలం
దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథప వధోగ్రుఁడు విస్ఫురి తాట్టహాస వ
క్త్రుఁడు ఘన దంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై.

303

తా ॥ దేవతలకు శత్రువులైన రాక్షసులను వధించినవాడు, అట్టహాసంతో కూడి ఉన్న ముఖం కలవాడు, గొప్పవైన కోరల నుండి బయటకు వచ్చిన అగ్ని జ్వాలలచే చెదరగొట్టబడిన దిగంతములు కలవాడు, అప్రమేయుడు అయిన శ్రీ నృసింహ స్వామి అడవుల్లో, ప్రమాదస్థలాల్లో, యుద్ధరంగంలో నన్ను రక్షించుగాక! అగ్ని కీలల బారి నుండి నన్ను కాపాడు గాక!

చ. అరయఁగ నెల్ల లోకములు నంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్న మైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా
కిరిపతి యగ్ని కల్పుఁ డురుఖేలుఁడు నూర్జిత మేదినీ మనో
హరుఁడు కృపావిధేయుఁడు సదాధ్వముల న్ననుఁ గాచుఁగావుతన్

304

తా ॥ లోకములన్నీ ఆపదను పొంది జలమధ్యంలో మునిగిపోగా, భూమండలాన్ని తన కొమ్మున ఎత్తినట్టి ఆ ఆదివరాహమూర్తి, అగ్నితో సమానుడు, గొప్ప ఆటగాడు, ధరణీ మనోహరుడు, కృపావిధేయుడు అయిన ఆ శ్రీమహా విష్ణువు నన్ను రక్షించు గాక!

క. రాముఁడు రాజకులైక వి, రాముఁడు భృగు సత్కులాభిరాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును, శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్.

305

తా ॥ క్షత్రియ కులమును మట్టుపెట్టిన వాడు, భృగువంశమునందు జన్మించినవాడు, సుగుణముల చేత ప్రకాశించువాడు, అయిన పరశురాముడు పర్వత శిఖరముల యందు నన్ను రక్షించును గాక!

సీ. తాటక మర్దించి తపసి జన్నముఁ గాచి, హరివిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలు లైనట్టి విరాధ కబంధోగ్ర ఖరదూషణాది రాక్షసులఁ దునిమి
వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి జలరాసి గర్వంబుఁ జక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభ కర్ణాది వీరులఁ గడిమిఁ ద్రుంచి

తే. యలవిభీషణు లంకకు నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేత పురము నందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు, వరుస ననుఁ బ్రోచుచుండుఁ బ్రవాసగతుల.

306

తా ॥ రామచంద్రుడు తాటకను సంహరించి, తపస్వి అయిన విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించాడు. శివుని విల్లును విరిచాడు, ధైర్యంతో బలసంపన్నులయిన విరాధుడు, కబంధుడు, ఖరుడు, దూషణుడు ఇత్యాది రాక్షసులను చంపాడు. వానర విభుడైన సుగ్రీవుణ్ణి ఏలి వాలిని చంపాడు. సముద్రుని గర్వాన్ని అణచాడు. సేతువుతో బంధించాడు. రావణ కుంభకర్ణాది వీరులను మట్టుబెట్టాడు. విభీషణుణ్ణి లంకకు అధిపునిగా చేశాడు, భూపుత్రిక అయిన సీతాదేవితో కూడి అయోధ్యా నగరంలో పట్టాభిషేకం జరుపుకున్నాడు. అట్టి శ్రీరామచంద్రుడు నేను ఇతర దేశాలలో ఉన్నప్పుడు నన్ను రక్షించుగాక!

వ. మఱియు నఖిల ప్రమాదంబులైన యభిచార కర్మంబు వలన నారాయణుండును, గర్వంబువలన నరుండును, యోగ భ్రంశంబు వలన యోగనాథుం డైన దత్తాత్రేయుండును, గర్వబంధమువలన గణేశుం డైన కపిలుండును, గామదేవుని వలన సనత్కుమారుండును,

మార్గంబుల దేవహేళనంబుఁ జేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును, దేవతానమస్కార తిరస్కార దేవపూజా చ్ఛిద్రంబుల వలన నారదుండును, నశేష నిరయంబుల వలనఁ గూర్మంబును, నపథ్యంబువలన భగవంతుండైన ధన్వంతరియును, ద్వంద్వంబువలన నిర్జితాత్ముండైన ఋషభుండును. జనాపవాదంబువలన నగ్నిదేవుండును, జనన మరణాదులం గలుగఁ జేయు కర్మంబులవలన బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబుల వలన శేషుండును, అప్రబోధంబువలన ద్వైపాయనుండును, బాషండ సమూహంబు వలన బుద్ధ దేవుండును, శనైశ్చరునివలనఁ గల్కియునై, ధర్మరక్షణ పరుండైన మహావతారుండు నన్ను రక్షించుఁగాత! ప్రాత స్సంగమ ప్రాహ్ణ మధ్యాహ్నా పరాహ్ణ సాయంకాలంబులను ప్రదో షార్ధరాత్రాపర రాత్ర ప్రత్యూ షానుసంధ్యలను ప్రభాతంబు గదాద్యాయుధంబుల ధరియించి కేశవ, గోవింద, నారాయణ, విష్ణు, మధుసంహర, త్రివిక్రమ, వామన, హృషీకేశ, పద్మనాభ, శ్రీవత్సధామ, సర్వేశ్వరేశ, జనార్దన, విశ్వేశ్వర, కాలమూర్తులను నామరూపంబులు గల దేవుండు నన్ను రక్షించుఁగాక. ప్రళయకాలాన లాతితీక్ష్ణసంభ్రమ భ్రమణ నిర్వక్రవిక్రమ వక్రీకృత దనుజచక్రంబైన సుదర్శన నామ చక్రంబ! మహావాయు ప్రేరితుండై హుతాశనుండు నీరస తృణాటవుల భస్మీభూతంబు సేయు భంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరి సైన్యంబుల దగ్ధంబు గావింపుము. జగత్సంహారకాల పటు ఘటిత చటుల మహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభి వర్జిత ఘనఘనాంతర నిష్ఠ్యూత నిష్ఠుర కోటి శతకోటి సంస్పర్శస్ఫుర ద్విస్ఫులింగ నిర్గ మానర్గళ భుగ భుగాయమాన మూర్తి విస్ఫూర్తి! నారాయణ కరకమలవర్తి! గదాయుధోత్తమ! మదీయ వైరితండోపతండంబుల భండనంబులం జండ గతిం బిండిపిండిగాఁ గూశ్మాండ వై నాయక యక్ష రక్షోభూత గ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదము సలుపుము. దరేంద్రంబ వైన పాంచజన్యంబ! సర్వలోక జిష్ణుండైన శ్రీకృష్ణుని నిఖిల పుణ్యైక సదన వదన నిష్ఠ్యూత నిశ్వా సాధర వేణు పరిపూతంబవై యున్మత్త భూత, ప్రేత, పిశాచ, విప్రగ్రహాది క్రూర దుర్గ్రహంబులు విద్రావణంబులుగా, నస్మత్పరవీర మండలంబుల గుండియలతో దదీయమానినీ దుర్భర గర్భంబులు గర్భ స్థార్భక

వివర్జితంబులుగా నవియ, బ్రహ్మాండభాండ భీకరంబైన భూరి నాదంబున మోదింపుము. అతి తీవ్రధారా దళిత నిశాటకోటి కఠోర కంఠ కరాళ రక్తధారా ధౌత మలీమస విసరంబ వైన నందక మహాసి శేఖరంబ! జగదీశ ప్రేరితంబవై మద్విద్వేషి విషమ వ్యూహంబులు బెండువడ మెండు గడికండలుగ ఖండించి చెండాడుము. నిష్కళంక నిరాతంక నిశ్శంక సాంద్ర చంద్ర మండల పరిమండిత సర్వాంగ లక్షణ విచక్షణ ధర్మ నిర్మితంబ వైన చర్మంబ! దుర్మద మద్వైరిలోక భీకరాలోకంబులను సమాకుల నిబిడ నీరంధ్ర నిష్ఠుర తమఃపటల పటు ఘటనంబులం గుటిల పఱుపుము. నిఖిల పాపగ్రహంబుల వలనను, సకల నర మృగ సర్ప క్రోడ భూతాదులవలనను నగు భయంబులు భగవ న్నామ రూప యాన దివ్యాస్త్రంబుల వలనం బొందకుండుఁ గాక! బృహ ద్రథంతరాది సామంబులచేత స్తోత్రంబు చేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుంగాక. శ్రీహరి నామ రూప వాహన దివ్యాయుధ పారిష దోత్తమ ప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియ మనః ప్రాణంబుల సంరక్షించు భగవంతుండైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగదైక్యభావంబైన ధ్యానంబు గలవానికి వికల్పరహితుండై, భూషణాయుధ లింగాఖ్య లగు శక్తులం దన మాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁ గాక. లోకభయంక రాట్టహాస భాసుర వదన గహ్వరుం డగుచు, సమస్త తేజోహరణ ధురీణ తేజః పుంజ సంజాత దివ్య నృసింహావతారుం డగు నప్పరమేశ్వరుండు, సర్వ దిగ్భాగంబుల వలన, సమస్త బహిరంతరంబులవలన నన్ను రక్షింపుచుండుఁ గాక అని నారాయణాత్మక కవచ ప్రభావం బితిహాస రూపంబున నింద్రుండు దెలిసి కొని, ధ్యానంబు చేసి, తద్విద్యాధారణ మహిమవలన నరాతుల నిర్జించె. కావున, నెవ్వరేని నిర్మలాత్ము లగు వార లేతద్విద్యా ధారణులై యనుదినంబును బఠియించిన, నతిఘోర రణంబుల నత్యుత్కట సంకటంబులను, సర్వగ్రహ నిగ్రహ కర్మ మారణ కర్మాది దుష్కర్మజన్య క్లేశంబులను వదలి, అవ్యాకుల మనస్కులై విజయంబు నొందుదురు. మఱియును, సర్వరోగంబులకు నగమ్య శరీరులై సుఖంబు నొందుదురు. అదియునుంగాక.

తా ॥ మరియు అన్ని ప్రమాదములకు కారణభూతమైన అభిచార కర్మములనుండి నారాయణుడు నన్ను రక్షించు గాక! గర్వం నుండి నరుడు రక్షించు గాక! యోగం నుండి భ్రష్టుడనైతే నన్ను యోగనాథుడైన దత్తాత్రేయుడు రక్షించు గాక! గర్వబంధం నుండి కపిల మహర్షి నన్ను రక్షించు గాక! కామదేవుని నుండి సనత్కుమారుడు రక్షించు గాక! ప్రయాణ సమయంలో దేవాలయాలయందు దర్శనం చేసుకోకుండానే ప్రయాణం చేసినందువలన కలిగే పాపమునకు శ్రీ హయగ్రీవమూర్తి నన్ను రక్షించు గాక! ఆ దేవతలకు నమస్కారం చేయకుండా తిరస్కరించినందులకు, దేవపూజలు చేయకుండా ఉన్నందులకు నారద మహర్షి నన్ను రక్షించు గాక!

అన్ని నరకముల నుండి నన్ను కూర్మమూర్తి కాపాడు గాక! అపథ్యం నుండి ధన్వంతరి నన్ను కాపాడు గాక! ద్వంద్వాల నుండి, వానిని జయించిన ఋషభుడు నన్ను కాపాడు గాక! జనాపవాదం నుండి అగ్నిదేవుడు నన్ను కాపాడు గాక! జననమరణాదుల నుండి బలభద్రుడు నన్ను కాపాడు గాక! కాలం నుండి యముడు నన్ను కాపాడు గాక! సర్పసమూహం నుండి ఆదిశేషువు నన్ను కాపాడు గాక! అజ్ఞానం నుండి ద్వైపాయన మహర్షి నన్ను రక్షించు గాక! పాషండుల నుండి బుద్ధదేవుడు నన్ను రక్షించు గాక! శని నుండి కల్కి నన్ను కాపాడు గాక! అన్ని విధాలైన నరకాల నుండి ధర్మరక్షణపరుడైన శ్రీమన్నారాయణుడు నన్ను రక్షించు గాక!

ప్రాతస్సంగమం, ప్రాహ్ణం, మధ్యాహ్నం, అపరాహ్ణం, సాయంకాలం, ప్రదోషం, అర్ధరాత్రి, అపరరాత్రి, ప్రత్యూషం, సంధికాలములు, ప్రభాతము... ఈ కాలముల యందు గదాది ఆయుధములను ధరించి కేశవుడు, గోవిందుడు, నారాయణుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, హృషీకేశుడు, పద్మనాభుడు, శ్రీవత్సధాముడు, సర్వేశ్వరుడు, జనార్దనుడు, విశ్వేశ్వరుడు, కాలమూర్తి అనే నామరూపములు కల భగవంతుడు నన్ను రక్షించు గాక!

ఓ సుదర్శన చక్రమా! ప్రళయ కాలంలో అతి తీక్ష్ణజ్వాలలతో తిరుగుతూ నిర్వక్ర పరాక్రమంతో దనుజులను చీకాకు పరుస్తావు. అంతేకాదు మహా వాయువు చేత ప్రేరితుడైనట్టి అగ్నిదేవుడు ఎండు గడ్డితో కూడిన అడవులను భస్మీభూతం చేసినట్లుగా భగవంతునిచేత ప్రయోగింపబడి, నా శత్రుసైన్యములను దగ్ధం చెయ్యి.

ఓ గదాదండమా! ఈ జగత్తు యొక్క సంహార కాలంలో మహోత్పాతములతో గర్జిస్తూ దశ దిశలలోను క్రమ్మిన కారుమబ్బుల నుండి వెలువడుతూన్న పిడుగుల నుండి వస్తూన్న అగ్నికణాల భుగభుగ ధ్వనులతో నిండి నారాయణ కరకమలంలో వెలుగుతూ ఉండే నీవు నా వైరులను పిండి పిండిగా చెయ్యి. కూష్మాండులు, వైనాయకులు, యక్షులు, రాక్షసులు, భూతములు, గ్రహములు మొదలైన దుష్టశక్తులను చూర్ణంచేసి వినోదాన్ని సలుపు.

ఓ పాంచజన్యమా! సర్వలోకములను జయించిన శ్రీకృష్ణదేవుని పుణ్యసదనమైన వదనం నుండి పూరింపబడుతూ ఉన్నావు. ఉన్మత్త భూతములు, ప్రేతములు, పిశాచములు, బ్రహ్మరాక్షసులు... ఇవన్నీ భయంతో పారిపోతూ ఉన్నాయి. నా వైరి వీరుల గుండెలతో పాటు వారి భార్యల దుర్భర గర్భములు అవిసేటట్లు భీకరమైన నాదం చెయ్యి.

ఓ నందకమనే ఖడ్గమా! అతి తీవ్రమైన అంచుతో రాక్షసుల కఠోర కంఠములను నరికి ఆ కరాళ రక్తధారలలో మునిగి తేలే నీవు ఆ జగదీశ్వరుని చేత ప్రేరేపింపబడి నా శత్రువులను ఖండాలుగా ఖండించి చెండాడు.

నిష్కళంకము, నిరాటంకము అయిన నూరు చంద్ర మండలాలతో అలంకరింపబడి సర్వాంగ శుభలక్షణములతో కూడి కేవలం ధర్మంతో నిర్మింపబడిన ఓ చర్మాయుధమా! (డాలు) మదించిన నా శత్రువుల యొక్క కడు భీకరమైన చూపులను దట్టమైన వెలుగును వ్యాపింపచేసి అంధకారంలో చిక్కుకొనేటట్లు చెయ్యి.

అనేక పాప గ్రహంబుల వలన, అనేకమంది నరుల వలన మరియు అనేక మృగముల

వలన సర్పముల వలన, అడవి పందుల వలన, భూతాదుల వలన కలిగే భయములను తొలగించి భగవంతుని రూపము, నామము, వాహనం, దివ్యాయుధము నన్ను రక్షించు గాక!

అనేక సామముల చేత గానం చేయబడుచున్న గరుత్మంతుడు రక్షాదక్షతతో నన్ను రక్షించు గాక! శ్రీహరి యొక్క నామ రూప వాహన దివ్యాయుధ పారిషదులు నా బుద్ధిని, ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను రక్షింతురు గాక! భగవంతుడైన శేషుడు ఉపద్రవములను నాశనము చేయుగాక! ఈ సృష్టి యావత్తు భగవత్ స్వరూపంగా ధ్యానం చేసే వానికి ఏ విధమైన భ్రాంతిలేక భూషణములు ఆయుధములు మొదలయిన వాటిని కేవలం తన మాయచేత ధరించి తేజరిల్లుతూ ఉండే లక్ష్మీనారాయణుడు నన్ను రక్షించు గాక.

లోకభయంకరంగా అట్టహాసం చేస్తూ కొండగుహవంటి నోరు తెరచి, సమస్తమైన తేజస్సును హరించే దివ్యమైన నృసింహావతారుడైన ఆ పరమేశ్వరుడు సర్వదిక్కుల వలన, లోపల, బయట అనే భేదం లేకుండ నన్ను రక్షించు గాక! ఈ ప్రకారంగా నారాయణ కవచ ప్రభావాన్ని ఇంద్రుడు తెలుసుకొన్నాడు. దానిని ధ్యానం చేసి శత్రువులను జయించాడు. కనుక ఎవరైనా సరే పరిశుద్ధమైన అంతఃకరణతో ప్రతి నిత్యము దీనిని చదువుతారో వారు అతి ఘోరమైన యుద్ధములలోను, అతి క్లిష్టమైన సంకటముల నుండి, గ్రహదోషముల నుండి, కర్మఫలం నుండి మారణం ఇత్యాది దుష్కర్మల నుండి విడుదలై వ్యాకులత్వంలేని మనస్సుతో సుఖంగా ఉంటారు. అంతే కాకుండా ఏ రోగము రాకుండా ఆరోగ్యంగా ఉంటారు.

సీ. అతిభక్తిఁ గౌశికుం డను బ్రాహ్మణుఁడు దొల్లి యీ విద్య ధరియించి యెలమి మించి
మరుభూమియందు నిర్మలచిత్తుఁడై యోగ ధారణంబున బిట్టు తనువు విడిచె
దానిపై నొకఁడు గంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుఁ డఁజేయుఁ దొంటిఁ
జదలఁ జనంగఁ దచ్ఛాయ తదస్థిపైఁ గదిసిన నాతఁడు గళవళించి

ఆ. యువిద పిండుతోడ నవ విమానముతోడఁ దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్లి
తిరిగి లేవలేక తికమక గుడువంగ, వాలఖిల్యమౌని వానిఁ జూచి.

308

తా ॥ పూర్వం కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఈ విద్యను ఉపాసించి ఒక మరు భూమియందు నిర్మల చిత్తంతో యోగధారణ చేసి శరీరాన్ని విడిచిపెట్టాడు. ఆ సమయంలో చిత్రరథుడు అనే గంధర్వ రాజు విమానం మీద ఆకాశం మీద వెడుతున్నాడు. ఆ విమానం యొక్క నీడ ఆ బ్రాహ్మణుని అస్థికల మీద పడేసరికి అతని విమానం భూమిమీద పడిపోయింది. చిత్రరథుడు కూడ తన రాణులతో కలసి ధరణిపై పడ్డాడు. తిరిగి లేవలేకపోయిన ఆ గంధర్వరాజుని వాలఖీల్యుడు అనే మునీంద్రుడు చూసి ఇలా అన్నాడు:

క. నారాయణ కవచ సమా, ధారణ పుణ్యాస్థి దీని దగ్గఱ నీకుం
గూరెడినె? విష్ణుభక్తుల, వారక చేరంగ నెట్టివారికిఁ దరమే?

309

తా ॥ "ఓ రాజా! ఇది నారాయణ కవచ ప్రభావం. నారాయణ కవచాన్ని చక్కగా చదివి ఉపాసించి ఆ పిమ్మట శరీరాన్ని విడిచిపెట్టిన వాని పుణ్యాస్థికలు ఇవి. దీని దగ్గర ఏ మహిమలు పనిచేయవు. విష్ణుభక్తులను చేరడానికి ఎవరికీ శక్యం కాదు.

ఇంద్రవజ్రము.
సంధించి నీ యంగక సంధు లెల్లన్, బంధించి తన్మంత్రబలంబు పేర్మి
న్నందంబు మాన్పింపఁ ద దన్య మేదీ? సింధుప్రవా హోన్నతి చేతఁ దీరున్.

310

తా ॥ నారాయణ కవచం వల్లనే నీ విమానము, నీ అవయవసంధులు అన్ని బంధింపబడ్డాయి. దీనికి వేరే కారణం లేదు. ఈ ఆపదను తొలగించుకునేందుకు నీవు ఒక సంకల్పం చేస్తే ఆ బంధం నుండి విడుదల అవుతావు. అదేమిటంటే పవిత్ర నదీ జలాలలో అతని ఎముకలను కలిపితే నీ కష్టాలు తీరుతాయి.

వ. కావున నీ పుణ్యశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రహహించెడు సరస్వతీ జలంబుల నిక్షేపణంబు సేసి కృతస్నానుండ వై యాచమనంబు చేసిన, నీ సర్వాంగ బంధనంబు లుడుగు ననిన నతం డట్లుచేసి, తన విమానం బెక్కి నిజస్థానంబున కరిగెం గావున.

311

తా ॥ కనుక ఈ పుణ్యుని అస్థులను భక్తితో తీసుకొనివెళ్ళి తూర్పుదిక్కుగా ప్రవహించే సరస్వతీ నదీ జలాలలో కలుపు. పిమ్మట స్నానం చేసి ఆచమనం చెయ్యగానే నీ సర్వాంగముల బంధనాలు విడిపోతాయి." అని ఆ మహర్షి చెప్పాడు. గంధర్వరాజు అట్లాగే చేసి బంధ నిర్ముక్తుడై తన లోకానికి వెళ్ళిపోయాడు.

క. అనుదినము దీని నెవ్వరు, వినిరేనిఁ బఠించి విస్మయ మొదవన్
ఘన భూతజాల మెల్లను, మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్.

312

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! ప్రతినిత్యము ఈ నారాయణ కవచాన్ని ఎవరు వింటారో లేక ఎవరు పఠిస్తారో వారిని దర్శించగానే సమస్త భూతజాలము వారికి ఎప్పుడూ మ్రొక్కుతూ ఉంటుంది.

ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకరమైన, యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁడపుడు
మూఁడు లోకములకు ముఖ్యమైనట్టి శ్రీ, ననుభవించి మించె నధికమహిమ.

313

తా ॥ ఈ ప్రకారంగా విశ్వరూపుని వలన ఐశ్వర్యకరమైన ఇట్టి విద్యను పొంది ఇంద్రుడు మూడు లోకాలకు ప్రభువై సకల భోగభాగ్యాలను అనుభవించాడు.

సీ. భూపాల! యా విశ్వరూపున కరుదైన తలలు మూఁ డనువొందఁ దగిలియుండు
సొరిది సురాపాన సోమపానంబులు నన్నాద మనఁగను నమరవరుల
తోఁగూడి భుజియించి తూకొని వారితో యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది
కై కొనుచుండి దుష్కర్ముఁడై యా యజ్ఞ భాగంబు రాక్షస ప్రవరులకును

ఆ. దల్లి మీఁదఁ గలుగు తాత్పర్యవశమున, దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చె
నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై, తనకుఁగాని యతని తలలు ద్రుంచె.

314

తా ॥ ఓ రాజేంద్రా! ఆ విశ్వరూపునకు అరుదైన తలలు మూడు. అందులో మొదటి శిరస్సు సురాపానం చేస్తుంది. రెండవ శిరస్సు సోమపానం చేస్తుంది. మూడవ శిరస్సు అన్నాన్ని తీసుకొంటుంది. ఆ విశ్వరూపుడు దేవతలతో కూడి భుజిస్తూ ప్రత్యక్షంగా వారితో కలసి యజ్ఞభాగాలు స్వీకరిస్తూ ఒక దుష్కర్మ చేశాడు. అతని తల్లి రాక్షసుల ఇంటి ఆడపడచు. తన తల్లి అయిన రచన మీద ఉండే అభిమానంతో ఆ యజ్ఞభాగాన్ని దేవతలకు తెలియకుండ అసురులకు ఇవ్వటం ప్రారంభించాడు. దానిని తెలుసుకున్న ఇంద్రుడు భయంతోను, కోపంతోను ఆ విశ్వరూపుని మూడు తలలను ఖండించాడు.

క. భూసురుఁ డనక మహాత్మా, గ్రేసరుఁడన కతఁడు పూర్వకృత కర్మగతిన్
వేసరఁ దనక మహేంద్రుఁడు, భూసురు తల లపుడు రోషమునఁ దెగ నడిచెన్.

315

తా ॥ బ్రాహ్మణుడని అనుకోకుండా, మహాత్ములలో అగ్రేసరుడని భావించక, పూర్వ కర్మను అనుసరించి జరిగింది అనుకోకుండా ఆ విశ్వరూపుని మూడు తలలను ఇంద్రుడు కోపంతో తెగ నరికాడు.

వ. ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడిచిన

సోమపానంబు చేయు శిరంబు కపింజలం బయ్యె. సురాపానంబు చేయు శిరంబు గలవింకం బయ్యె. అన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి యయ్యె. ఇట్లు త్రివిధ పక్షి స్వరూపంబు దాల్చి, బ్రహ్మహత్య యే తెంచి, యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపుడింద్రుం డతి భీతచిత్తుండై త్రిలోకనాయకుండైనం దానిం దప్పించుకొనఁజాలక యంజలి యొగ్గి, య మ్మహా దోషంబుఁ గైకొని, తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి, యంతం బాపుకొనువాఁడై భూ జల వృక్ష స్త్రీలం బ్రార్థించి, మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చుకొనుం డనిన, భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బైనం బావనం బగు నట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగునను వరంబును, స్త్రీ లెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగు నను వరంబును గోరిన, నతం డట్లుగాక యని యొసంగిన, నతని దుష్కృతంబు ధరణి యిరిణ విధంబునను, నుదకంబు బుద్బుదఫేన రూపంబునను, మహీరు హంబులు నిర్యాసభావంబునను, నింతులు రజోవికారంబునను నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరి. అంత.

316

తా ॥ ఈ ప్రకారంగా ఇంద్రుడు కోపాన్ని సహింపలేక ఆ విశ్వరూపుని తలలు ఖడ్గంతో నరికేటప్పటికి అందులో సోమపానం చేసే శిరస్సు కౌజు పిట్టగా మారిపోయింది. సురాపానం చేసే శిరస్సు పిచ్చుకగా మారిపోయింది. అన్నం తినే శిరస్సు తీతువు పిట్టగా అయింది. ఈ ప్రకారంగా బ్రహ్మహత్య మూడు పక్షి స్వరూపాలతో వచ్చి ఇంద్రుని చుట్టుముట్టు తమ్ము పరిగ్రహింపుమని నిర్బంధించసాగాయి. అప్పుడు ఇంద్రుడు భయంతో త్రిలోక నాయకుడైనా, దానిని తప్పించుకొనలేక నమస్కరించి తాను చేసిన మహాదోషాన్ని ఒక్క సంవత్సర కాలం అనుభవించాడు. పిమ్మట ఎలాగైనా సరే ఆ పాపాన్ని వదిలించుకొనాలని అనుకొని భూమిని, జలమును, వృక్షములను, స్త్రీలను ప్రార్థించాడు. భూమి తనయందు చేయబడిన గొయ్యి తనే పూడుకొనేటట్లుగా, జలము సమస్తమూ తన యందు పావనం అయ్యేటట్లుగా, వృక్షములు

నరకబడి తిరిగి మొలకెత్తేటట్లుగా, స్త్రీలు తమకు కామసుఖం అధికంగా కలిగేటట్లుగా వరములు కోరగా, ఇంద్రుడు వాటికి అనుగ్రహించాడు. అప్పటి నుండి ధరణీదేవి చవిటినేల రూపంలోను, జలములు నురుగ రూపంలోను, వృక్షములు జిగురు రూపంలోను, ఇంతులు రజస్సు రూపంలోను... ఈ ప్రకారం నలుగురు నాలుగు పాపభాగాలను పంచుకున్నారు.

# 14. వృత్రాసుర వృత్తాంతము

మ. హతపుత్రుం దగు విశ్వరూపజనకుం డా త్వష్ట దుఃఖాయతో
ద్ధత రోషానల దహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ
క్రతు హోమంబు నొనర్ప నందుఁ బొడమెం గల్పాంతకాకార వి
శ్రుత కీలానల నిష్ఠు రేక్షణ గుణ క్షుభ్య త్రిలోకోగ్రుఁడై.

317

తా ॥ తన కుమారుడైన విశ్వరూపుడు ఇంద్రుని చేతిలో చనిపోయాడని తెలుసుకున్న అతని తండ్రి అయిన త్వష్ట ప్రజాపతి దుఃఖంతోను, రోషంతోను ఉడికిపోయాడు. ఇంద్రుని మీద మారణ హోమాన్ని మొదలు పెట్టేసరికి ఆ హోమ కుండంలోంచి కల్పాంతవేళ భీకరమైన దృక్కులతో త్రిలోకాలను కాల్చేస్తూ ఒక భూతం వెలువడింది.

సీ. యుగము గ్రుంగెడునాఁడు జగములు వొలియించు నంతకు మూర్తిపై నింత యగుచుఁ
బఱపును నిడుపును బ్రతిదినంబును నొక్క శరపాత మంగంబు విరివిఁగొనుచుఁ
గడుదగ్ధశైలసంకాశ దేహమునందుఁ గరము సంధ్యారాగకాంతిఁ బెరయ
మును గాఁక రాగిచేఁ గను మించు మించులఁ గఱకు మీసలు కచాగ్రములు మెఱయఁ

తే. జండ మధ్యాహ్న మార్తాండ మండలోగ్ర, చటుల నిష్ఠుర లోచనాంచల విధూత
దశ దిశాభాగుఁ డుజ్జ్వలతర కరాళ, భిదుర సునిశిత దంష్ట్రోరు వదనగుహుఁడు.

318

తా ॥ ప్రళయ కాలంలో ఈ సృష్టిని నాశనం చేసే యమునికంటే భయాన్ని గొల్పుతూ ఉంది ఆ రూపం. దిన దినమూ ఒక బాణమంత ప్రమాణం ఎదుగుతూన్న అంగములతో కూడి ఉంది ఆ శరీరం. దగ్ధమైన పర్వతం వంటి దేహంనుండి సంధ్యారాగ కాంతులు వెలువడుతున్నాయి. కాల్చిన రాగి రేకులవంటి కాంతితో ఎర్రనైన మీసములు, శిరోజములు

మెరుస్తున్నాయి. మధ్యాహ్న కాలంలో రోహిణీకార్తెలో మండిపోతూన్న మార్తాండ మండలం వలె భయంకరమైన చూపులతో పదనైన కోరలతో వృత్రాసురుడు జన్మించాడు.

ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై శిఖలందుఁ బర్వు ను
త్తుంగ త రాగ్నిజాలములఁ దొ్ట్రిలుచుం గ్రహపంక్తి జాఱ ని
స్సంగ కరాళశాత ఘన సద్ఘృణి మండల చండ శూల ము
ప్పొంగుచుఁ గేల లీలఁగొని భూమిచలింపఁగ సోలియాడుచున్.

319

తా ॥ వాని శరీరం నేల నుండి నింగికి తాకుతూ ఉన్నది. వాని శిరస్సుమీది శిఖల నుండి వెలువడే అగ్ని జ్వాలలకు తడబడుతూ ఆకాశం మీది గ్రహములు జారిపడుతున్నాయి. చెదరిన ప్రభలతో భయాన్ని కలిగిస్తూ గొప్పదైన కాంతులతో తళతళ మెరిసే శూలాన్ని ఉప్పొంగుతూ చేతితో తీసుకొని భూమి కంపించగా సోలి ఆడుతూ వృత్రాసురుడు వస్తున్నాడు.

సీ. వదలక విరివిగా వదనంబు దెఱచుచు నాకాశమంతయు నప్పళించుఁ,
గడునాల్క నిగుడించి గ్రహతారకంబుల నయమెల్ల దిగజాఱ నాకి విడుచు,
నలవోకయును బోలె నట్టహాసము చేసి మెఱసి లోకములెల్ల మ్రింగఁ జూచుఁ,
దనదు దిగ్దంతి దంతములు చెక్కలువాఱ నుగ్రదంష్ట్రలు ద్రిప్పు నుక్కుమిగిలి,

తే. త్వష్ట బలితంపుఁ దపమునఁ బుష్టినొంది, యఖిల లోకంబు లెల్లఁ దా నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతాశత్రుఁ డగుచు, దారుణాకారుఁ డఖిల దుర్దముఁడు మెఱసె.

320

తా ॥ వాడు ఒక మారు వదలకుండా నోరు తెరచి ఆకాశాన్ని చప్పరిస్తున్నాడు. మరోసారి నాలుకను సాచి గ్రహతారకా సముదాయాన్ని నాకుతున్నాడు. ఇంకొకసారి అలవోకగా అట్టహాసం చేసి లోకాలన్నింటిని మ్రింగుతున్నాడు. అష్ట దిగ్గజముల దంతములు

ముక్కలయ్యేటట్లు తన భయంకరమైన కోరలను త్రిప్పుతాడు. త్వష్ట ప్రజాపతి చేసిన బలమైన తపస్సు వలన వృద్ధిపొంది అఖీల లోకములను తాను ఆక్రమించి దేవతలకు శత్రువైన వృత్రాసురుడు ఈ విధంగా దారుణంగా విజృంభించాడు.

మ.కో.

అట్టి వృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెనుమూఁక లై
చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు సూపి యేపున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి శూరతఁ జోక నార్చె మహోగ్రుఁడై.

321

తా ॥ అట్టి వృత్రాసురుని మీద దేవతాసమూహం ఉగ్రమైన కోపంతో చుట్టుముట్టి భయంకరమైన మహా అస్త్రాలను ప్రయోగించారు. అప్పుడా వీరుడు వారలు వేసిన క్రూరమైన శస్త్రాస్త్రములన్నిటిని పట్టి మ్రింగేసి మహోగ్రరూపుడై నిల్చున్నాడు.

క. భక్షిత దివ్యాస్త్రుం డగు, రక్షోనాయకుని నమరరాజ ప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి, రక్షకుఁ జింతించి కొనుచు రయ మొప్పారన్.

322

తా ॥ ఈ విధంగా దివ్యాస్త్రములను మ్రింగేసిన రాక్షస నాయకుడైన వృత్రాసురుణ్ణి చూడటానికి భయపడినవారై, దేవతాసైన్యం అంతా కూడా తమకు రక్షకుడు ఎవరా అని చింతిస్తూ వేగంగా పారిపోసాగారు.

వ. ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరువడి చేయునది నేరక త త్తేజోవిశేష విభవంబునకు భయంబు నొంది. కందిన డెందంబునం గుందుచుఁ, బురందర ప్రముఖు లార్తరక్షకుండగు పుండరీకాక్షునకుం గుయ్యిడు వారలై.

323

తా ॥ ఇట్లు దేవతాస్త్రములు అన్నిటిని వృత్రాసురుడు మ్రింగేసరికి ఆశ్చర్యపడిన దేవతలు అతని తేజోవిశేషములకు భయపడ్డారు. మనస్సులో దిగులుపడుతూ చెదరిన హృదయాలతో ఆత్మరక్షకుడైన పుండరీకాక్షుని శరణు వేడుదామనుకున్నారు.

లయగ్రాహి.

వీఁడు కడు దుర్దముఁడు వాఁడి మన కైదువులు, పోఁడి సెడఁగా మెసఁవి యీడు గనకున్నాఁ
డేడ బ్రతుకింకఁ? బెనుకీడు వొడమెన్ మనకుఁ, దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్.
వేఁడుదము శ్రీధరునిఁ, గూడుదము సద్భటులఁ, బాడుదము గీతములఁ జాడఁబడు నంతన్
వీఁడు చెడుత్రోవ దయతోడ నెఱిఁగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడ దింకన్.

324

తా ॥ ఈ వృత్రాసురుణ్ణి మనం జయించలేము! మన వాడి అయిన ఆయుధాలన్నింటిని వాటి రూపు రేఖలు చెడిపోయేటట్లు మ్రింగేశాడు. వీనితో సమానమైన వీరుడు ఎక్కడా కనిపించటం లేదు. చాలా పెద్ద ముప్పు వచ్చింది మనకు. ఆ హరి తప్ప మనకు సహాయం చేసేవాడు ఎవ్వరూ కనిపించటం లేదు, ఆ హరినే ప్రార్థిద్దాం. ఆయన భక్తులతో సత్సంగం చేస్తూ, ఆయనను కీర్తిద్దాము. ఆయన మనకు, వీడు చెడిపోయే త్రోవ చెబుతాడు. అప్పుడే స్వర్గం సురక్షితమౌతుంది.

క. అని తలపోయుచుఁ దమలో, మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపు కడకున్
గునుకుచుఁ గునుకుచు నేగిరి, ఘనరాక్షసుఁ గన్న కన్నుఁగవ బెగ్గిలఁగన్.

325

తా ॥ అని తలపోస్తూ, తమలో సంతాపిస్తూ శ్రీమహా విష్ణువు దగ్గరకు సందేహంతో ఎలాగో భయపడుతూ వెళ్ళారు.

వ. ఇట్లు భయార్తులైన యమర్త్యవ్రాతంబు సనిచని, ముందట నభంగ భంగ రంగ దుత్తుంగ డిండీర మండల సముద్దం డాడంబర విడంబిత నారాయణ నిరంతర కీర్తి లతా కుసుమగుచ్ఛ స్వచ్ఛంబును, అనవరత గోవింద చరణారవింద సేవా సమాకుల కలితఫలిత మహాపుణ్య ఫలాయమాన సముద్దీపితావర్తవర్తిత దక్షిణావర్త రుచిర శంఖమండల మండితంబును, నతి నిష్ఠుర కఠిన పాఠీన పృథురోమ రాజీవ శకుల తిమి తిమింగిల కర్కట కమఠ కచ్ఛప మకర నక్ర వక్రగ్రహ గ్రహణ ఘుమ ఘుమారావ దారుణగమన విషమిత విషమ తరంగఘట్టన ఘట్టిత సముద్ధూత శీకర నికర నీరంధ్ర తారకిత తారాపథంబును, మహోచ్ఛ్రయ శిలోచ్చయ శిఖరాగ్ర ప్రవహిత దుగ్ధనిర్ఝర సమ్మార్జిత పురాణపురుష విశుద్ధ శుద్ధాంత విహరణధురీణ నవసుధాధౌత ధావళ్య ధగద్ధగాయమాన రమ్య హర్మ్య నిర్మాణ కర్మంబును, అతిపవిత్రగుణ విచిత్ర నిజకళత్ర ప్రేమానంద సందర్శిత ముకుంద పరిస్రవ దంతరంగ కరుణారస పరిమిళిత భావబంధుర విద్రుమ వల్లీమతల్లి కాంకుర శోభితంబును, ప్రసిద్ధ సిద్ధరసాంబువాహ సంగమ సముత్థిత గంభీర ఘోష పరిపూరిత సకల రోదో–ం తరాళంబును, సముద్రమేఖ లాఖీలప్రదేశ విలసిత నవీన దుకూలాయమానంబును, హరిహర ప్రముఖ దేవతానిచయ పరిలబ్ధామృత మహైశ్వర్య దానధౌరేయ మహానిధానంబును, వైకుంఠపుర పౌరవార మనోహర కామ్యఫలఫలిత మందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘన వనానుకూల కూలంబునునై యెప్పుచుఁ గుబేరు భాండాగారంబునుం బోలె బద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల, వర సమగ్రంబై, విష్ణు కరకమలంబునుం బోలె సుదర్శనావర్త ప్రగల్భంబై, కైలాస మహీధరంబునుం బోలె నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై, యింద్రవైభవంబునుం బోలె కల్పవృక్ష కామధేను చింతామణి జనిత విశేషంబై, సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడ హరిసంచారంబై, నారాయణోదరంబునుంబోలె నిఖిల భువన భారభరణ సమర్థంబై, శంకరు జటాజూటంబునుం బోలె గంగాతరంగిణీ సమాశ్రయం బై, బ్రహ్మలోకంబునుం బోలెఁ బరమహంసకుల సేవ్యంబై, పాతాళ లోకంబునుంబోలె ననంత భోగి భోగ్యయోగ్యంబై, నందనవనంబునుం బోలె నైరావత మాధవీరంభాది

సంజననకారణంబై, సౌదామినీ నికరంబునుం బోలె నభ్రంకషంబై, విష్ణునామకీర్తనంబునుం బోలె నిర్మల స్వభావం బై, క్రతుశత గతుండునుంబోలె హరిపదభాజనంబై, యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి, శ్వేతద్వీపంబున వసియించి, యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించిరంత.

326

తా ॥ ఇలా భయం చేతనూ, దుఃఖం చేతనూ, బాధపడుతూ దేవతాసమూహం వెళ్ళి శ్రీమన్నారాయణుణ్ణి దర్శించారు. ఆయన ఉంటూన్న పాల సముద్రం నిండా ఎగసి పడుతూ ఉన్న కెరటాల మీది నురుగు సమూహం నారాయణుని కీర్తిలతలు పూచిన పూగుత్తులవలె అందంగా ఉంది. ఆ క్షీరసాగరంలో ఎప్పుడూ గోవింద చరణారవిందములను సేవించుటయందు ఆసక్తులైన పుణ్యులయిన భక్తుల మహా పుణ్యంవలె దక్షిణావర్త శంఖములు ఉన్నాయి. ఆ పాల సముద్రంలో మిక్కిలి కర్కశములైన వేయి కోరల చేపలు, ముఖముమీద పొడవైన రోమములు కల చేరులు, రాజీవములు అనెడి మత్స్యములు, వేగంగా పోయే శకులములు అనే చేపలు, తిమింగలాలు, ఎండ్రకాయలు, తాబేళ్ళు, మొసళ్ళు... ఇత్యాది జలచరములు తిరుగుతూన్న వేగంవలన కెరటములు గగనంలోని నక్షత్రములను అంటుకొనేటట్లు ఎగసి పడుతున్నాయి. ఎగసిపడుతూన్న జలకణములు ఆకాశంలోని నక్షత్రాలవలె భ్రాంతిని గొలుపుతున్నాయి. ఆ పాల సముద్రములో ఉన్న పర్వత శిఖరాలపై ఎగిరి పడుతూ సముద్ర తరంగాలు ప్రవహిస్తున్నాయి. అవి పరిశుద్ధ అంతఃపుర విహారాలలో క్రొత్తగా ధవళితం చేయబడిన ధగద్ధగాయమానంగా వెలిగిపోతున్న మేడలను పోలి ఉన్నాయి. ఆ క్షీరసాగరంలో పగడాల తీగలు అతి పవిత్రమైన గుణంతో విరాజిల్లే తన సుందరీమణులతో ప్రేమానందంతో క్రీడించే ముకుందుని అంతరంగం నుండి కరుణారసంతో కూడిన అనురాగ తరంగములవలె శోభిస్తున్నాయి. సిద్ధరసాలయిన మేఘములు పరస్పరం ఢీకొనటం వలన పుట్టిన గర్జనలతో భూమ్యాకాశములు నిండిపోతున్నాయి.

సముద్రం మొలనూలుగా కలిగిన భూదేవికి కొత్తగా కట్టుకున్న పట్టుపుట్టంలాగ ఉన్నాయి... ఆ సముద్రజలాలు. విష్ణువు, శివుడు మొదలయిన దేవతలకు అందిచ్చిన అమృతానికి మహానిధానం... ఆ పాల సముద్రం. వైకుంఠపుర పౌరులకు కోరిన కోరికలను తీర్చు మందారము, పారిజాతము, కల్పవృక్షము, సంతానము, హరి చందనము మొదలయిన వృక్షములకు అనుకూలంగా ఒప్పుతూన్నది ఆ సాగర తీరం. కుబేర భాండాగారం వలె పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము మొదలైన వాటితో ఒప్పుతూన్నది... ఆ మహా సముద్రం. చూడటానికి ఎంతో మనోహరంగా ఉన్న ఆ క్షీరసాగరం సుదర్శనాయుధంతో కూడిన శ్రీమహా విష్ణువు కరకమలం వలె ఉన్నది. కైలాస పర్వతం వలె అమృత కిరణుడైన చంద్రునికి స్థానమై ఉంది ఆ పాలసముద్రం. కల్పవృక్షము, కామధేనువు, చింతామణి ఇత్యాది వాటికి జన్మస్థానమై ఇంద్రవైభవాన్ని పోలి ఉంది... ఆ క్షీరసాగరం. హరి యొక్క సంచారంతో కూడిన ఆ క్షీరవారాశి అపరిమితమైన హరి (కోతుల) యొక్క సంచారంతో కూడిన సుగ్రీవుని సైన్యంవలె ఉంది. నారాయణుని ఉదరం వలె నిఖిల భువనాల భారమును భరించుటకు సమర్థమై ఉంది.... ఆ సముద్రం.

శంకరుని యొక్క జటాజూటం వలె గంగానదికి ఆశ్రయభూతమై ఉన్నది... ఆ క్షీరవారాశి. బ్రహ్మ లోకాన్ని పోలి పరమహంసలకు సేవ్యమై ఉన్నది.... ఆ పాలసముద్రం. పాతాళ లోకంవలె మహా సర్పములకు స్థానమై ఉన్నది... ఆ పాల కడలి. ఐరావతము, లక్ష్మీదేవి, రంభ మొదలైన వారికి జన్మస్థానమైన ఆ క్షీరసాగరం నందనవనంలాగ ఉన్నది... ఆ వారాశి సౌదామినీ సమూహంవలె మేఘాలను అంటుతున్నది. విష్ణునామ సంకీర్తనం వలె నిర్మలమైన స్వభావం కలిగి ఉన్నది. నూరు యజ్ఞములు చేసిన వానిని పోలి ఇంద్రపదవికి ఒప్పుతూ ఉన్నది. అట్టి క్షీరసాగరాన్ని సమీపించి దేవతలందరు దేవదేవుడైన శ్రీమన్నారాయణుణ్ణి ఆశ్రయించి ఈ ప్రకారంగా స్తుతించారు:

సీ. పంచమహాభూత పరినిర్మితంబైన ముజ్జగంబుల కెల్ల నొజ్జ యైన

బ్రహ్మయు మేమును బరఁగ నందఱుఁ గూడి యెవ్వనికై పూజలిత్తు మెపుడు

నట్టి సర్వేశ్వరుం డాగమ వినుతుండు సర్వాత్మకుఁడు మాకు శరణ మగును

అతిపూర్ణకాము నహంకారదూరుని సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని

తే. మాని యన్యుని సేవింపఁ బూనునట్టి, కపట శీలుని నతి పాపకర్మబుద్ధి

శునక వాలంబు వట్టుక ఘనతరాబ్ధిఁ, దరియఁ జూచుట గాదె! తాఁ దామసమున.

327

తా ॥ "పంచ మహా భూతముల వలన నిర్మితమైన మూడు లోకాలకు గురువయిన బ్రహ్మదేవుడూ, మేము అందరము కూడి ఎవరికై పూజలు చేస్తామో అట్టి సర్వేశ్వరుడు, ఆగమ వినుతుడు, సర్వాత్మకుడు మాకు శరణు ఇవ్వాలి. పరిపూర్ణుడు, అహంకారం లేనివాడు, సముడు, శాంతుడు, కృపాస్పదుడు, గురువు అయిన అట్టి మహా పురుషుని కాదని అన్యులను సేవింప పూనినవాడు కపట శీలుడు, అతి పాపకర్ముడు. అట్టివాడు కుక్కతోక పట్టుకుని సముద్రాన్ని దాటడానికి ప్రయత్నించిన మూర్ఖునితో సమానం.

చ. ఉదకమయంబునన్ వసుధ నోడఁగఁ జేసి తనర్చు కొమ్మునన్

వదలక యంటఁగట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి స

మ్మదమున మమ్ముఁబ్రోచు ననుమానము మానఁగ వృత్రుచేతి యా

పదఁ దొలఁగించి నేఁడు సురపాలుర పాలిటి భాగ్యదైవమై.

328

తా ॥ పూర్వం ప్రళయ కాలంలో అంతా జలమయం అయినప్పుడు పరమేశ్వరుడు మత్స్యావతారాన్ని వహించి ఈ వసుధను ఓడగా చేసి తన కొమ్ముతో ఎత్తిపట్టి మనువును, మమ్ములను అందరినీ రక్షించాడు. అట్టి దయాసముద్రుడు మమ్ములను రక్షించు గాక! వృత్రాసురుని వలన కలిగిన ఈ ఆపద నుండి మా పాలిటి భాగ్యదైవమై మమ్ములను రక్షించు గాక!

మ.కో.

రంతు సేయుచు వాతధూత కరాళ భంగుర భంగ దు

ర్దాంత సంతత సాగరోదక తల్ప మొంది వసించు బ్ర

హ్మాంతవానిని బొడ్డుఁదమ్మిని నాఁచి కాచిన నేర్ప రిం

తంతవాఁ డనరాని యొంటరి యాదరించు మముం గృపన్.

329

తా ॥ క్రీడగా ప్రళయకాల మహా వాయువుల చేత భయంకరమై, అణచడానికి వీలుకాని సాగర తరంగాలను తల్పంగా చేసుకొని వసించువాడు, బ్రహ్మ అంతటి వానిని తన నాభికమలమునందు ఉంచి రక్షించినవాడు, ఇంతవాడు అంతవాడు అని చెప్పడానికి వీలుకానివాడు అయిన ఆ అప్రమేయుడు మమ్ము కృపతో రక్షించుగాక!

తే. దేవతల మైన మే మిట్టి దేవదేవు, సర్వలోక శరణ్యుని శరణు చొచ్చి

బలిత మైనట్టి వీని యాపదలఁబాసి, మీఁటి శుభములఁ జే కొనువార మిపుడు.

330

తా ॥ దేవతలమైన మేము అట్టి దేవదేవుని, సర్వలోక శరణ్యుణ్ణి శరణు వేడుకుంటున్నాము. బలవంతుడైన ఈ వృత్రాసురుని వలన కలిగే ఆపదలను పోగొట్టుకొని శుభములను పొందుతాము.”

వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుండయ్యె. అప్పుడు.

331

తా ॥ అని ఇలా ప్రార్థిస్తున్న దేవతలకు భక్తవత్సలుడు అయిన శ్రీమన్నారాయణుడు ప్రసన్నుడై దర్శనం ఇచ్చాడు.

సీ. తగు శంఖ చక్ర గదా ధరుం డగు వాని శ్రీవత్స కౌస్తుభ శ్రీల వాని
గమనీయ మాణిక్య ఘన కిరీటమువాని దివ్యవిభూషణ దీప్తివాని
మండిత కోటీర కుండలంబులవాని, సిరి యురస్థ్సలమునఁ జెలఁగు వానిఁ
దనుఁబోలు సేవకతండంబు గలవాని, జిలుఁగైన పచ్చని వలువవానిఁ

ఆ. దెల్లఁ దమ్మివిరులఁ దెగడు కన్నులవాని, నవసుధా ద్రవంపు నవ్వువానిఁ
గనియె వేల్పుపిండు కప్పరపాటుతోఁ, గన్నులందు నున్న కఱవు దీఱ.

332

తా ॥ ఆ స్వామి శంఖము, చక్రము, గద ధరించి ఉన్నాడు. రొమ్ముమీద శ్రీవత్సమనే పుట్టుమచ్చ, కౌస్తుభము వెలుగొందుతున్నాయి. శిరస్సుమీద అందమైన కిరీటం శోభిస్తూన్నది. దివ్యభూషణములు వెలుగొందుతూ ఉన్నాయి. కుండలములు మెరిసిపోతున్నాయి. లక్ష్మీదేవి వక్షఃస్థలం మీద ప్రకాశిస్తున్నది. పీతాంబరమును ధరించి ఉన్నాడు. తెల్లని తామరల వలె నేత్రములు మెరిసి పోతున్నాయి. ఆయన నవ్వు అమృతాన్ని చిందిస్తూ ఉన్నది. అట్టి దివ్య సౌందర్యంతో వెలుగొందుతూ ఉన్న శ్రీమహా విష్ణువును దేవతలు అందరు తమ కన్నుల కరవు తీర చూచారు. ఆయన వలెనే సేవకులు ఉన్నారు.

సీ. తన సేవకులలోనఁ దడబడు రూపంబు శ్రీవత్స కౌస్తుభశ్రీలు దెలుప
వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల కడల దై వాఱెడు కరుణ దెలుప
నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ గాఁపురం బుండెడు కమల దెలుప
మూఁడు మూర్తులకును మొదలైన తేజంబు ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప

ఆ. బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద, కమల జనిత యైన గంగ దెలుప
నప్రమేయుఁ డభవుఁ దవ్యక్తుఁ దవ్యయుఁ, డాదిపురుషుఁ డఖిలమోది యొప్పె.

333

తా ॥ సేవకులు విష్ణువుని పోలిఉన్నా, కేవలం ఆయనకు గల ప్రత్యేకతలు ఇక్కడ తెలియచేస్తున్నారు. ఆయన వక్షఃస్థలం మీద శ్రీవత్సము, కౌస్తుభము ప్రకాశిస్తూ ఆయన ప్రత్యేకతను తెలుపుతున్నాయి. వికసించిన పద్మముల వంటి ఆయన నేత్రములు ఆయన యొక్క అపార కరుణను తెలియజేస్తున్నాయి. సమస్త లోకాలకు ఆలవాలమైన ఐశ్వర్యాన్ని వక్షఃస్థలం మీద ఉన్న శ్రీమహాలక్ష్మి తెలుపుతూ ఉన్నది. ధాతకు నెలవైన నాభికమలం ముగ్గురు మూర్తులకు మూల భూతమైన తేజస్సును వెల్లడిస్తూన్నది. ఆయన పాదకమలముల నుండి ప్రభవించిన గంగాదేవి మన బుద్ధి అందుకోలేని పుణ్యాన్ని తెలుపుతూ ఉన్నది. ఇట్టి దివ్యరూపంతో అప్రమేయుడు, అభవుడు, అవ్యక్తుడు, అవ్యయుడు, ఆదిపురుషుడు అయిన శ్రీమహా విష్ణువు అందరికీ సంతోషమును కలిగిస్తూ ఒప్పుతూ ఉన్నాడు.

వ. ఇట్లు జగన్మోహనాకారుండైన నారాయణుని కృపావలోకనాహ్లాద చకిత స్వభావ చరితులై
సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, ఫాలభాగాన పరికీలిత కరకమలులై యిట్లనిరి.

334

తా ॥ ఈ ప్రకారంగా జగన్మోహనుడైన నారాయణుని కృపతో కూడిన చూపులకు సంతోషించి సాష్టాంగ దండ ప్రణామాలు చేసి తమ చేతులు నుదుటికి చేర్చి ఇట్లా స్తుతించారు:

ఆ. దుర్గమంబు లైన స్వర్గాది ఫలములఁ, బుట్టఁ జేయఁ జాలునట్టి గుణము
గలిగి మెలఁగుచున్న ఘనుఁడ వైనట్టి నీ, కరయ మ్రొక్కువార మాదిపురుష!

335

తా ॥ "ఓ ఆదిపురుషా! కనీసం ప్రవేశించుటకు సైతం అత్యంత కష్టమైన స్వర్గాది ఫలములను ప్రాప్తింపచేసే ఘనుడవు నీవు! అట్టి నీకు మ్రొక్కుతున్నాము.

సీ. దండంబు యోగీంద్రమండల నుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును,
దండంబు మండిత కుండల ద్వయునకు దండంబు నిష్ఠుర భండనునకు,

దండంబు మత్తవేదండ రక్షకునకు దండంబు రాక్షసఖండనునకు,
దండంబు పూర్ణేందు మండల ముఖునకు, దండంబు తేజః ప్రచండునకును,

తే. దండ మద్భుత పుణ్యప్రధానునకును, దండ ముత్తమ వైకుంఠధామునకును
దండ మాశ్రిత రక్షణ తత్పరునకు, దండ మురు భోగినాయక తల్పునకును.

336

తా ॥ యోగీంద్రుల చేత పొగడబడేవాడవు, శారమనే వింటిని ధరించిన వాడవు. కుండలములు ధరించిన వాడవు, భయంకరమైన యుద్ధం చేసిన వాడవు, ఆర్తుడైన గజరాజును రక్షించిన వాడవు, రాక్షసులను సంహరించిన వాడవు, పున్నమి చంద్రునితో సరిపోల్చతగిన ముఖం కలవాడవు, గొప్ప తేజస్సుతో వెలిగిపోయే వాడమా... అయిన నీకు ప్రణామములు. అద్భుతమైన పుణ్య ప్రధానుడవు, వైకుంఠ ధాముడవు, ఆశ్రిత రక్షణ తత్పరుడవు, ఆదిశేషువును శయ్యగా అలంకరించుకున్న వాడవు.... అయిన నీకు నమస్కారము.

ఉ. చిక్కిరి దేవతావరులు చిందఱ వందఱలైరి ఖేచరుల్,
స్రుక్కిరి సాధ్యసంఘములు, సోలిరి పన్నగు లాజి భూమిలో,
ప్రక్కిరి దివ్యకోటి, కడు ప్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ
చిక్కినవారి నైన దయసేయుము నొవ్వకయుండ నో హరీ!

337

తా ॥ ఓ హరీ! వృత్రాసురుని పరాక్రమానికి ఆగలేక దేవతలు చిక్కులపాలైనారు. ఆకాశ చారులు చిందర వందరయ్యారు. సాధ్యులు భయపడ్డారు. పన్నగులు సోలిపోయాయి. సిద్ధులందరూ కాంతిహీనులయ్యారు, యక్షులు నష్టపోయారు, వానినుండి బయటపడిన మమ్మల్ని రక్షించు.

క. మొదలాఁటిన రక్కసులకు, మొదలై మా కాపదలకు మూలం బగుచుం

దుద మొదలు లేని రక్కసు, తుదిఁ జూపఁగదయ్య! తుదకుఁ దుదియైన హరీ!

338

తా ॥ రాక్షసులు సంపూర్ణంగా నశించారనుకుంటే, వీడు మళ్ళీ మొదలై మాకు ఆపదలకు మూలమైనాడు. తుది మొదలు లేని రక్కసులను తుదముట్టించు స్వామీ! నీవు అంతానికి అంతం చూపగల అనంతుడివి కదా!

తే. అకట! దిక్కుల కెల్ల దిక్కైన మాకు, నొక్క దిక్కును లేదు కా లూన నైన,
దిక్కుగావయ్య! నేఁడు మా దిక్కు! జూచి, దిక్కు లేకున్నవారల దిక్కు నీవ.

339

తా ॥ ఔరా! దిక్కులకు దిక్కైన మాకు కాలు పెట్టుకోవడానికి కూడ చోటులేదు. ఒక్కసారి మా దిక్కుకు చూడు. దిక్కులేని వాళ్ళకి దిక్కైన నీవు మాకు దిక్కు కావలసినదిగా కోరుతున్నాము.

క. నీ దిక్కు గానివారికి, నే దిక్కును వెదక నుండ దిహపరములకున్
మోదింపఁ దలఁచువారికి, నీ దిక్కే దిక్కుసుమ్ము! నీరజనాభా!

340

తా ॥ నీ దిక్కు చూడనివారికి ఇహపరములలో ఇక ఏ దిక్కూలేదు. లోకంలో సుఖంగా జీవించాలని అనుకునే వారికి నీవే దిక్కు! కమలనాభా రక్షించు!

తే. అరయ మా తేజములతోడ నాయుధములు, మ్రింగి భువన త్రయంబును మ్రింగుచున్న
భీకరాకారు వృత్రునిఁ బీఁచ మణఁచి, యెల్ల భంగుల మా భంగ మీఁగు మభవ!

341

తా ॥ ఓ దేవా! ఈ వృత్రాసురుడు మా తేజస్సులతో పాటు మా ఆయుధాలను కూడా మ్రింగి వేశాడు. భువన త్రయాన్ని మ్రింగగలిగిన భీకరాకారుడైన వీడి పీచమణచి మా

భంగపాటుకు ప్రతీకారం చెయ్యాలి.

ఆ. పరమపురుష! దుఃఖభంజన! పరమేశ!, భక్తవరద! కృష్ణ! భవవిదూర!
జలరుహాక్ష! నిన్ను శరణంబు వేఁడెద, మభయ మిచ్చి కావు మయ్య! మమ్ము.

342

తా ॥ ఓ పరమ పురుషా! దుఃఖభంజన! పరమేశ! భక్తవరద! కృష్ణా! పుట్టుక లేనివాడా? పద్మముల వంటి కన్నులు కలవాడా! నిన్ను శరణుకోరి వచ్చాము, మాకు అభయమిచ్చి రక్షించు!

వ. నమస్తే భగవన్నారాయణ! వాసుదేవ! ఆదిపురుష! మహానుభావ! పరమమంగళ! పరమకళ్యాణ! దేవ! పరమ కారుణికు లైన పరమహంసలగు పరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధి భేదంబులం బరిభావిత పరిస్ఫుటం బైన పరమహంస ధర్మంబుచేత నుద్ఘాటితం బగు తమః కవాటద్వారంబున నపావృతం బైన యాత్మలోకంబున నుపలబ్ధిమాత్రుండవై, నిజసుఖానుభవుండవై యున్న నీ వాత్మ సమవేతంబులై యుపేక్షింపం బడని యీ శరీరంబులకు నుత్పత్తి స్థితి లయ కారణుండ వై యుండుదువు. గుణసర్గ పతితుండవై యపరిమిత గుణగణంబులున్న నీవు, దేవదత్తుని మాడ్కిఁ బారతంత్ర్యంబున స్వకృతంబులైన కుశలా కుశల ఫలంబుల ననుభవింతువు. షడ్గుణైశ్వర్య సంపన్నుండ వైన నీ వాత్మారామ స్వభావుండ వై, యపరిమిత గుణగణంబులు గలిగి, యీశ్వ రాహ్వయానవగాహ్య మాహాత్మ్యంబందు నర్వాచీన వికల్ప వితర్క విచార ప్రమాణాభాసంబులగు కుతర్కశాస్త్రంబులఁ గర్కశంబులైన ప్రజ్ఞలు గలిగి, దురవగ్రహవాదు లయిన విద్వాంసుల వివాదావసరంబుల యందు నుపరతంబులగు అస్తి నా స్తీత్యాది వాక్యంబుల సమస్త మాయామయుండవై నిజమాయచేతఁ గానంబడని యుక్తి గోచరుండవై, సమ విషమ రూపంబుల బ్రవర్తింతువు. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు, ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మంబైన నీ యందుఁ బ్రపంచ భ్రాంతి గలుగుచుండు. సర్వేశ్వరా!

సర్వ జగత్కారణ రూపంబవైన నీవు సర్వభూత ప్రత్యగాత్మ వగుటం జేసి సర్వగుణావభాసోపలక్షితుండవై కానంబడుచుందువు. లోకేశ్వరా! భవ న్మహిమ మహామృత సముద్ర విప్రు ట్సకృత్పాన మాత్రంబున సంతుష్టచిత్తులై, నిరంతర సుఖంబున విస్మారిత దృష్ట శ్రుత విషయసుఖ లేశాభాసులైన పరమ భాగవతులు, భవచ్చరణ కమల సేవాధర్మంబు విడువరు. త్రిభువనాత్మ భవన! త్రివిక్రమ! త్రిణయన! త్రిలోక మనోహరానుభావ! భవదీయ వైభవ విభూతి భేదంబు లైన దనుజాదులకు ననుపక్రమ సమయం బెఱింగి, నిజమాయాబలంబున సుర నర మృగ జలచరాది రూపంబులు ధరియించి, తదీయావతారంబుల ననురూపంబైన విధంబున శిక్షింతువు. భక్తవత్సలా! భవన్ముఖ కమల నిర్గత మధుర వచనామృత కళావిశేషంబుల, నిజదాసులమైన మా హృదయతాపం బడంగింపుము. జగదుత్పత్తి స్థితి లయ కారణ ప్రధాన దివ్య మాయా వినోదవర్తివై సర్వ జీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబులయందు బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూప ప్రధాన రూపంబుల దేశకాల దేహావస్థాన విశేషంబులఁ, దదుపాదానానుభవంబులు గలిగి, సర్వప్రత్యయ సాక్షివై, సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుండవై యుండెడి నీకు నేమని విన్నవించు వారము? జగదాశ్రయంబై, వివిధ వృజిన సంసార పరిశ్రమోపశమనం బైన భవదీయ దివ్యచరణ శతపలాశచ్ఛాయ నాశ్రయించెదము అని పెక్కువిధంబుల వినుతించి యిట్లనిరి.

343

తా ॥ నమస్తే! నారాయణా! వాసుదేవా! ఆదిపురుషా! మహానుభావా! పరమ మంగళా! పరమ కళ్యాణ స్వరూపా! దేవాధిదేవా! పరమ దయామూర్తులు, పరమహంసలు అయిన పరివ్రాజకులు యోగంలో సమాధి స్థితిని పొందినప్పుడు శుద్ధమైన అంతఃకరణలో పరమహంస ధర్మం గోచరిస్తుంది. అప్పుడు ఆంతర్యంలో తమోరూపమైన కవాట ద్వారం తెరచుకుంటుంది. అప్పుడు ఆత్మలోకం ప్రకాశితమౌతుంది. ఆ సమయంలో ఉత్పత్తి స్థితి లయ కారణుడవై ఉన్న నీవు గోచరిస్తావు. నీవు కోరకపోయినా సృష్టి, స్థితి, లయాలకు కారణంగా నిలుస్తావు.

గుణాతీతుడైన బ్రహ్మస్వరూపుడవు అయినప్పటికి నీ గుణాలు అనంతం. నువ్వు దేవదత్తుని వలె పారతంత్ర్యంలో ఉంటూ సుఖదుఃఖాలను అనుభవిస్తావు. షడ్గుణ ఐశ్వర్య సంపన్నుడవైన నీవు ఆత్మారాముడవై నా అపరిమిత గుణములు కలిగి ఉంటావు. పరమేశ్వరుడవైన నీ స్వరూప స్వభావాదులు ఒరులకు గోచరం కానివి.

వికల్పము, వితర్కము, విచారము మొదలైన ప్రమాణాభాసములతో కూడి కుతర్కంతో కర్కశమైన ప్రజ్ఞ కలిగి విద్వాంసులు పనికిమాలిన వాదాలతో ప్రొద్దుపుచ్చుతూ ఉంటారు. కొందరు దేవుడు ఉన్నాడంటారు, కొందరు లేదు అంటారు. నీ యథార్థ స్వరూపం తెలియక అలా ప్రవర్తిస్తూ ఉంటారు. సమస్త మాయామయుడవయిన నీవు నిజమాయ చేత కనపడవు. యుక్తిచేత మాత్రం తెలియబడుతూ సమ విషమ రూపాలలో గోచరమవుతూ ఉంటావు. దేవా! చీకటిలో త్రాడును చూచి పాము అనే భ్రాంతి కలిగినట్లు బ్రహ్మము అయిన నీ యందు ప్రపంచము అనే భ్రాంతి కలుగుతుంది. సర్వేశ్వరా! సమస్త జగత్తుకు కారణభూతుడవు అయిన నీవు సర్వ భూతములయందు అంతర్యామి స్వరూపంగా ఉన్నందు వలన అనేక గుణములతో ఉన్నట్లు కనబడుతావు.

లోకేశ్వరా! నీ ఐశ్వర్యం అనంతం. ఆ అమృతసాగరంలోని లవలేశాన్ని రుచి చూచిన భాగవతోత్తములు నీ చరణ కమలములసేవను విడువరు. వారు అంతులేని ఆనందాన్ని అనుభవిస్తూ నిరంతర సుఖాన్ని పొందుతూ, విషయ సుఖాలను పట్టించుకోరు. నీవు లేని చోటు లేదు, మూడు లోకాలలోను ఉన్నది నీవే! నీవు త్రివిక్రముడవు! త్రినేత్రుడవు! నీవు గొప్ప మహిమలతో ఎప్పుడూ వెలుగొందుతూ ఉంటావు. నీ విభూతిలో భేదములే ఈ రాక్షసులు కూడ! వారికి అంత్యకాలం సమీపించినది అని తెలుసుకొని నీ మాయా ప్రభావం వలన దేవతలు, నరులు, మృగములు, జలచరములు ఇత్యాది రూపాలను ధరించి ఆ రాక్షసులను శిక్షిస్తావు. భక్తవత్సలా! నీ ముఖకమలము నుండి వెలువడుతూ ఉన్న మధురమైన వచనం అనే అమృతం చేత నీ దాసులమైన మా హృదయతాపాన్ని పోగొట్టవలసింది. ఈ జగత్తు యొక్క ఉత్పత్తి స్థితి

లయము ఈ మూడింటికి కారణమైన మాయ నీ అధీనంలో ఉంటుంది. సర్వ జీవ సమూహానికి బాహ్యంలోను, ఆంతర్యంలోను బ్రహ్మముగాను, ప్రత్యగాత్మ స్వరూపంగాను వర్తించే నీకు ఏమని విన్నవించేది? దేశము, కాలము, దేహము మొదలైన అవస్థా విశేషాలకు సాక్షివై సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడవై ఉన్న నీకు మేము ఏమని విన్నవించుకోగలము? సర్వ జగత్తుకు ఆశ్రయమై అనేక విధములయిన పాపాలను సంసార తాపాలను పోగొట్టే నీ దివ్యమైన చరణములను ఆశ్రయిస్తున్నాము" అని అనేక విధాలుగా దేవతలు శ్రీహరిని నుతియించి ఇంకా ఇలా అన్నారు:

క. తేజంబు నాయువును వి, భ్రాజిత దివ్యాయుధములఁ బరువడి వృత్రుం
డాజిముఖంబున మ్రింగెను, మా జయ మిం కెందుఁ? జెప్పుమా! జగదీశా!

344

తా ॥ "ఓ జగదీశ్వరా! మా తేజస్సును, ఆయువును, మా బలమైన ఆయుధాలను ఆ వృత్రాసురుడు యుద్ధరంగంలో అన్నింటిని మ్రింగేశాడు. ఇంక మాకు జయమెక్కడ?"

వ. అని యిట్లతిమనోహర చతుర వచనంబుల భక్తిపరవశులై వినుతి సేయుచున్న దేవతలం జూచి, యప్పరమేశ్వరుం డమృత ప్రాయంబు లగు గంభీరభాషణంబుల నిట్లనియె.

345

తా ॥ అని ఇట్లు వినుతితో కూడి ఉన్న వచనములతో ప్రార్థిస్తూ, భక్తి పారవశ్యంతో ఉన్న దేవతలను చూసి పరమేశ్వరుడైన ఆ హరి అమృతోపమానమైన గంభీర వచనాలతో ఇట్లా అన్నాడు:

క. మ దుపస్థానం బగు మీ, సదమల సుజ్ఞానమునకు సంతోషమునం
బొదలె మది ప్రీతి నొందితి, వదలక నా భక్తి వొడమి వ్యర్థం బగునే!

346

తా ॥ “నా చేరికను పొందిన మీ స్వచ్ఛమైన జ్ఞానానికి నాకు ఎంతో సంతోషం కలిగింది. నా మనస్సు ఎంతో ఆనందాన్ని పొందింది. నా మీది భక్తి ఎన్నటికీ వ్యర్థం కాదు.

వ. మఱియు, నతిప్రీతుండనైన నాయందు భక్తులకుం బొంద రాని యర్థంబు లేదు. విశేషించి నాయందు నేకాంతమతి యైన తత్త్వవిదుం డన్యంబులం గోరకుండు. గుణంబులయందుఁ దత్త్వ జ్ఞానగోచరుం డైనవాఁడు విషయ నివృత్త చిత్తుండై సంసార మార్గంబు నిచ్ఛయింపఁ డు. కావున మీకు శుభం బయ్యెడు. దధీచియను ఋషిసత్తముండు గలండు. అతని శరీరంబు మద్విద్యాతిశయ మహత్త్వంబునం దేజో విశేషంబున సారం బై యున్నయది. అతని నడిగి, తచ్ఛరీరంబుఁ బుచ్చికొనుండు. అతండు పూర్వకాలంబున నశ్వినీ దేవతలకు నశ్వశిరోనామం బను బ్రహ్మ స్వరూపం బగు నిష్కళంకం బైన విద్య నుపదేశించిన, వారలు జీవన్ముక్తిత్వంబు నొందిరి. మఱియుఁ ద్వష్టృ పుత్త్రుండైన విశ్వ రూపునకు మదాత్మకం బైన యభేద్య కవచంబు నిచ్చె. కావున నతం డతివదాన్యుండు. అశ్వినీదేవతలచేత యాచింపంబడి, దేహంబు వంచింపక మీ కిచ్చు. అతని శల్యంబులు విశ్వకర్మ నిర్మితంబు లై, శతధారలు గల యాయుధ శ్రేష్ఠం బై, మత్తేజోపబృంహితంబై వృత్రాసుర శిరోహరణ కారణంబై యుండు. దానంజేసి మీరు పునర్లబ్ధ తేజో–స్త్రాయుధ సంపదలు గలిగి వెలింగెదరు. విశేషించియు మద్భక్తవరు లైనవారలే లోకంబుల నెవ్వరికి నజేయులు. కావున మీకు భద్రంబయ్యెడు అని భూతభావనుండైన భగవంతుం డదృశ్యుం డయ్యె. అప్పుడు దేవతలు దధీచిముని కడకుం జనిన నత్తఱి యింద్రుం డిట్లనియె.

347

తా ॥ నేను తృప్తిని పొందితే నా నుండి నా భక్తులు పొందరానిది ఏదీ లేదు. మరొక్క విషయం. నా యందు అనన్యమైన భక్తికల తత్వవిదుడైన వాడు నన్ను తప్ప అన్యమేది కోరడు. తత్వజ్ఞానాన్ని తెలుసుకున్న వాడు విషయముల నుండి దూరంగా ఉంటూ ఈ సంసారం అంటే ఇష్టపడడు. కనుక మీకు శుభం కలుగుతుంది.

సురులారా! దధీచి అనే ఋషి సత్తముడు ఉన్నాడు. అతని శరీరం నా విద్య యొక్క అతిశయం వలన తేజోవిశేషం చేత సారభూతమై ఉంటుంది. మీరందరూ అతని శరీరాన్ని అతన్ని అడిగి, పుచ్చుకోండి. అతడు పూర్వ కాలంలో అశ్వినీదేవతలకు "అశ్వశిరం" అనే పేరు కల బ్రహ్మస్వరూపమగు నిష్కళంకమైన విద్యను ఉపదేశించాడు. ఆ విద్యతో వాళ్ళు జీవన్ముక్తులయ్యారు. అంతే కాకుండ "త్వష్ట" అనే ప్రజాపతికి పుత్రుడైన విశ్వరూపుడనే వానికి నారాయణ కవచాన్ని అనుగ్రహించాడు. కనుక ఆ దధీచి మహర్షి అతి వదాన్యుడు. మీరు అశ్వినీ కుమారులను ముందు నిలబెట్టి కోరితే అతని దేహాన్ని మీకిస్తాడు. అతని శల్యములతో విశ్వకర్మ నూరు అంచులు కల ఆయుధాన్ని చేస్తాడు. ఆ ఆయుధంతో వృత్రాసుర శిరస్సును ఖండించండి. దాని వలన మీరు తిరిగి తేజస్సు, ఆయుధములు, సిరి సంపదలు పొందుతారు. నా భక్తులను ఎవ్వరూ జయించలేరు. మీకు భద్రమయ్యెడు గాక" అని పల్కి శ్రీమన్నారాయణుడు అదృశ్యుడయ్యాడు. అప్పుడు ఇంద్రునితో కలిసి దేవతలు దధీచి మహాముని దగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నారు:

ఆ. దేహి సుఖముఁ గోరు దేహంబు ఘటియించి, దేహి విడువలేఁడు దేహ మెపుడు,
దేహి! యస్మదీయ దేహంబుకొఱకునై, దేహ మీఁగదయ్య! దేవతలకు.



తా ॥ "మహానుభావా! ఈ దేహాన్ని ఎత్తిన ప్రతివాడు సుఖాన్ని కోరతాడు. అందుకే దేహి దేహాన్ని ఎప్పుడు విడువలేడు. దేవతలమైన మేము మా దేహం కొరకు నీ దేహాన్ని అడగడానికి వచ్చాము. కనుక దయతో నీ దేహాన్ని మాకు ఇవ్వు.

ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని కోర్కి నేఁడు మా
తెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగఁ వచ్చినార, మే
మెక్కడ! తీవ్ర కర్మగతి యెక్కడ! దైవకృతంబుగాక! యీ
త్రొక్కుడు దాన మీ వరుస రోయక వేఁడుదురే జగంబులన్?

349

తా ॥ లోకంలో ఎక్కడ ఎవ్వరూ కోరని కోరికను నేడు మాకు వచ్చిన విపత్తు వల్ల నిన్ను కోరవలసి వచ్చింది. మేము ఎక్కడ? అతి తీవ్రమైన కర్మగతి ఎక్కడ? విధి వైపరీత్యం కాక దీన్ని ఏమనాలి? మాకు ఆపద కలిగింది కనుక కోరాము కాని లేకపోతే ఇట్టి కోరికను లోకంలో ఎవరూ కోరరు.

క. నీచగతి యెల్లభంగుల, యాచన యని తెలిసి తగని దడుగుదు రేనిన్
యాచక వర్గము లోపల, నీచకు లనఁబడరె? యెంత నేర్పరులైనన్.

350

తా ॥ యాచన అనేది ఎలా ఆలోచించినా చాలా నీచమైన పని. ఈ విషయం తెలిసికూడా ఎవరైతే అడుగుతారో వారు ఎంత నేర్పరులైనా నీచులే కదా!

క. అడుగంగరాని వస్తువు, లడుగరు బతిమాలి యెట్టి యర్థులు నిను నే
మడిగితిమి దేహ మెల్లను, గడు నడిగెడు వారికేడ కరుణ? మహాత్మా!

351

తా ॥ మహాత్మా! యాచకులు ఎట్టివారైనా అడుగతగని వస్తువుని అడగరు. అట్టి మేము అడుగరానిదైన నీ దేహాన్ని కోరి వచ్చాము. నిజానికి అడిగేవారికి కరుణ ఎక్కడిది?"

ఉ. నావుడు నా దధీచియు మనంబు సంతసమంది నవ్వి సం
భావిత వాక్య పద్ధతులఁ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో
దేవతలార! ప్రాణులకుఁ దెక్కలి మృత్యు భయంబు పూనుటే
భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీ మనంబులన్.

352

తా ॥ ఆ మాటలు విన్న దధీచి మహర్షి మనస్సులో సంతోషించి, నవ్వుతూ గౌరవంగా ఇట్లా అన్నాడు: "ఓ దేవతలారా! ప్రాణులకు ఎప్పుడూ మృత్యువు పొంచి ఉంటుంది. దేవతలు కనుక మీకీ విషయం ఎప్పుడూ భావంలోకి రాదు.

ఆ. ఎలమి బ్రతుక నిచ్చయించిన వారికి, దేహ మెల్లభంగి దీపు గాదె?
యచ్యుతుండు వచ్చి యర్థించె నేనియు, తన్ను నిచ్చునట్టి దాత గలఁడె?

353

తా ॥ ప్రతి ప్రాణి బ్రతకాలనే కోరుకొంటుంది. అలా కోరుకునే వారికి ఈ దేహం తీపి కదా! అచ్యుతుడు వచ్చి అడిగినా సరే తన దేహాన్ని ఇచ్చే దాత ఉండడు.

వ. అదియునుం గాక.

354

సీ. అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గా కంగంబు వేఁడెడి యర్థి గలఁడె?
తగఁ గోరికల నిచ్చు దానశీలుఁడు గల్గుఁ దన దేహ మీ నేర్చు దాత గలఁడె?
యీ నేర్చువాఁడు దన్నిచ్చిన రోయక చంపెడునట్టి యాచకుఁడు గలఁడె?
చంపియుఁ బోవక శల్యంబు లన్నియు నేఱి పంచుక పోవువారు గలరె?
ఆ. రమణ లోకమెల్ల రక్షించు వారికి, హింస సేయుబుద్ధి యెట్టు వొడయె?
బ్రాఁతి యైనయట్టి ప్రాణంబుపైఁ దీపు, తమకుఁ బోలె నెదిరిఁ దలఁప వలదె?

355

తా ॥ అదీకాకుండా ధనాన్ని కోరే యాచకులు ఉంటారు. కాని దేహాన్ని కోరే యాచకులు ఎక్కడైనా ఉంటారా? యాచకుడు కోరే కోరికలను ఇచ్చే దానశీలుడు ఉంటాడు కాని తన దేహాన్ని ఇచ్చే దాత ఉండడు. ఒకవేళ తన శరీరాన్ని ఇచ్చేదాత ఉండవచ్చు గాక సిగ్గుమాలి చంపే యాచకుడు ఉంటాడా? చంపితే చంపవచ్చు గాక ఎముకలు అన్నిటిని ఏరి పంచుకునే వారు

ఉంటారా? లోకములు అన్నిటిని రక్షించే దేవతలు అయిన మీకు బ్రతికున్న మహానుభావుడిని చంపాలనే కోరిక ఎలా కలిగింది? అత్యంత ప్రేమాస్పదమైన ప్రాణముల మీద తీపి మీలాగే ఎదుటి వారికి కుడా ఉంటుంది అనే విశయం మీ తలపుకు రాలేదా?"

వ. అనిన దేవత లిట్లనిరి.

356

తే. సర్వ భూతదయాపర స్వాంతులకును, బుణ్యవర్తను లగు మిమ్ముబోఁటి వారి
కమిత సత్కీర్తి కాముల కలఘుమతుల, కియ్యరాని పదార్థంబు లెవ్వి గలవు?

357

తా ॥ అప్పుడు దధీచి మహర్షి మాటలకు దేవతలు ఇట్లా సమాధానం చెప్పారు: "స్వామీ! సర్వ జీవులయందు దయ కలిగిన మీ వంటి పుణ్యవర్తనులు, సత్కీర్తిని కోరుకునేవారు, పెద్ద మనసు కలవారు అయిన వారికి మావంటి వారు కోరితే ఇవ్వరాని పదార్థములు అంటూ ఉండవు కదా!

ఆ. అడుగరాని సొమ్ము లడుగ రాదని మానఁ, డడుగువాని మాట లడుగ నేల?
భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు, నిచ్చువాఁడు దాపఁ డిచ్చుఁగాని.

358

తా ॥ అవసరం కొద్ది అడగడానికి వచ్చినవాడు... అడుగరానిదైనా అడిగి తీరతాడు. ఇక ఇచ్చేవాడు యాచకుడు ఏమి కోరినా ఇస్తాడు... చివరకు ప్రాణమైనా సరే!"

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు కార్యపరత సవినయ వాక్యపరంపరలం బ్రార్థించిన, నతండు దరహసితవదనుండై, యఖిల లోకధర్మం బెఱింగియు నొక్కింత కాలంబు ప్రతివాక్యం బిచ్చితి, దీని సహింపందగుదురు. మీ యట్టి వారలకుం బ్రియం

బగునేని నెప్పుడైన న్విడువందగిన శరీరంబు విడుచుట యేమి దుర్లభంబు? అధ్రువంబైన యీ దేహంబుచేతం గీర్తి సుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతి కఠినుండు. మీ యట్టి పుణ్యశ్లోకులచేత నాకాంక్షింపండిన యీ శరీరం బప్రమేయ ధర్మార్జితంబు. ఏ దేహంబుచేతనైనను సకల భూతంబులు శోకానుభవంబున శోకించు, హర్షానుభవంబున హర్షించునట్టి మహాకష్టదైన్యాకరం బైన యీ శరీరంబు కాక శునక సృగాలాదులపాలు గాకుండ మే లయ్యె అని నిశ్చితాత్ముండై దధీచి, తత్త్వావలోకనంబుచేత నిరసిత బంధనుండై, బుద్ధీంద్రియ మానసంబులతోఁగూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మ స్వరూపంబైన భగవంతునందు నేకీభూతంబుఁ జేసి, యోగజ్ఞానంబున శరీరంబు విడిచె, అప్పుడింద్రుఁ డతని శల్యంబుల విశ్వకర్మ నిర్మితంబై, నిశిత శతధారా సమావృతం బై వెలుంగు వజ్రాయుధంబు గైకొని, భగవత్తేజోపబృంహితుండై, యైరావతారూఢుండై, సకలదేవోత్తమ గరుడ గంధర్వ ఖచర కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర పరిసేవితుండై, సకల మునిజనంబులు వినుతింపఁ ద్రిలోక హర్షకారియై, భగవ దనుగ్రహ సంప్రాప్త మహోత్సాహ వికసిత వదనారవిందుండై వృత్రాసురు పై నడచె. అప్పుడు.

359

తా ॥ అని ఈ ప్రకారంగా దాత యొక్క కష్టాన్ని తలపక దేవతలు కార్యం సానుకూలం చేసుకోవటం కోసం వినయంగా ప్రార్థించారు. దధీచి మహర్షి నవ్వుముఖంతో ఇలా అన్నాడు: “ఓ దేవతలారా! లోకధర్మం నాకు బాగా తెలుసు. అయినా మీకు కొద్దిసేపు ఎదురు సమాధానం ఇచ్చాను, దీనికి మీరు ఏమీ అనుకొనవద్దు. మీవంటి ఉత్తములకు సంతోషం కలుగుతుంది అంటే విడిచిపెట్టవలసిన శరీరాన్ని మీకు అర్పించటం కంటే నాకు ఇష్టమైనది ఏముంటుంది? అనిత్యమైన ఈ శరీరం చేత సుకృతాన్ని ఎవడు పొందడో వాడు పాషాణ సమానుడు. మీవంటి పుణ్యశ్లోకుల చేత కోరబడిన ఈ శరీరం అప్రమేయమైన ధర్మాన్ని ఆర్జిస్తున్నది. శరీరం ఏదైనా కష్టంవస్తే శోకిస్తుంది. సుఖం వస్తే సంతోషిస్తుంది. అట్టి ఈ శరీరం కుక్కలకు నక్కలకు గురికాకుండా, మీవంటి వారికి ఉపకరించటం నిజంగా ఎంతో మేలు అయింది.”

అని ఆత్మయందు నిశ్చితం చేసుకొని, తత్త్వాన్ని దర్శించి, అన్ని బంధాలు తెంపుకుని బుద్ధి ఇంద్రియములు మనస్సు వీటితో కూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మ అయిన భగవంతుని యందు ఏకీభూతం చేసి, దధీచి శరీరాన్ని విడిచిపెట్టేశాడు. అప్పుడు విశ్వకర్మ దధీచి ఎముకలను తీసుకొని నూరు అంచులుకల పదునైన వజ్రాయుధాన్ని చేసి దానిని దేవేంద్రునికి ఇచ్చేడు. దానిని తీసుకొని భగవత్తేజం చేత ప్రకాశమానుడై ఐరావతాన్ని అధిరోహించి ఉత్తములు అయిన దేవతలు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు... వీళ్ళందరూ తనను సేవిస్తూ ఉండగా వృత్రాసురుని మీదికి ఇంద్రుడు యుద్ధానికి బయలుదేరాడు. అప్పుడు సకల మునిజనములు వినుతించారు. ఈ విధంగా మూడు లోకాలు సంతోషింప భగవంతుని అనుగ్రహం వలన లభించిన మహోత్సాహంతో రాక్షసుని మీదికి బయలుదేరాడు.

ఉ. వృత్రుఁడు దాన వాన్వయ పవిత్రుఁడు లోక జిఘాంసక క్రియా
సూత్రుఁడు నిగ్రహాగ్రహణ సుస్థిర వాక్య వివేక మాన చా
రిత్రుఁడు దేవతోరగ దరీకృత వక్త్రుఁడు రోష దూషితా
మిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలియైన యుగాంతకాకృతిన్.

360

తా ॥ రాక్షస వంశంలో జన్మించిన అతి పవిత్రుడు, శత్రులోకాన్ని మట్టుపెట్టడానికి కంకణం కట్టుకొన్న వాడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు, మాట్లాడటంలో నేర్పరి, దేవతలనే సర్పములను మ్రింగే భయంకరమైన నోరు కలవాడు అయిన వృత్రుడు రోషం చేత దూషిస్తూ, శత్రువులు అయిన దేవతలు వస్తున్నారని తెలుసుకొని యుగాంతపు వేళ యమధర్మరాజులా బయలుదేరాడు.

క. మెండు గల దనుజ నాయక, మండలములు గొల్వ నడచె మహిమోద్ధతి వే
దండముల నడుమఁ జను నడ, గొండయునుం బోలె నిబిడ కోపోద్ధతుఁడై.

తా ॥ అతిశయంతో రాక్షస సేనాసమూహం తనను కొలువగా మదపుటేనుగుల మధ్య కదలివస్తున్న పెద్ద కొండలా కోపంతో నడిచాడు వృత్రాసురుడు.

క. కాలగళుఁ డదరి కడువడిఁ, గాలుని పైఁ గవయు మాడ్కి ఖరతర రవ సం
చాలిత పూర్వ దిగంతరుఁ, డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా!

362

తా ॥ శివుడు వీరావేశంతో విజృంభించి యముని పైకి దూకినట్లు, వృత్రాసురుడు తూర్పు దిక్కు అదిరేటట్లు గాడిదతో సమానమైన కంఠరవంతో తూర్పుదిక్కుగా బయలుదేరి దేవేంద్రుని మీదకు దూకాడు.

వ. ఇట్లు రుద్రగణంబులు, మరుద్గణంబులు, నాదిత్యగణంబులు, నశ్వినీదేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, వహ్నియు; యమ, నైరృతి, వరుణ, వాయు, కుబే, రేశానాదులు; సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, గరుడ, గంధర్వ, ఖేచర, ప్రముఖంబులగు నింద్ర సైన్యంబులతోడ నముచియు, శంబరుండును, ననర్వుండును, ద్విమూర్ధుండును, వృషభుండును, నంబరుండును, హయగ్రీవుండును, శంకుశిరుండును, విప్రచిత్తియు, నయోముఖుండును, పులోముండును, వృషపర్వుండును, హేతియు, ప్రహేతియు, నుత్కటుండును, ధూమ్రకేశుండును. విరూపాక్షుండును, కపిలుండును, విభావసుండును, నిల్వలుండును, పల్వలుండును, దందశూకుండును, వృషధ్వ జుండును, గాలనాభుండును, మహానాభుండును, భూత సంతాపనుండును, వృకుండును, సుమాలియు, మాలియు మున్నగు దైతేయ దానవ యక్షరాక్షసా ద్యసంఖ్యంబులగు వృత్రాసురు బలంబులు దలపడి సమరంబుం జేసిరి. అప్పుడు.

363

తా ॥ ఇంద్రుని సైన్యంలో రుద్రగణాలు, మరుద్గణాలు, ఆదిత్యగణాలు, అశ్వినీ దేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, అగ్ని, యముడు, నైరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, సిద్ధులు, సాధ్యులు, కిన్నెరులు, కింపురుషులు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు... మొదలైన వీరాగ్రేసరులయిన దేవతాగణాలు అందరూ ఉన్నారు. అటు వృత్రాసురుని సేనాసమూహంలో నముచి, శంబరాసురుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, వృషభుడు, అంబరుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, హేతి, ప్రహేతి, ఉత్కటుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, కపిలుడు, విభావసుడు, ఇల్వలుడు, పల్వలుడు, దందశూకుడు, వృషధ్వజుడు, కాలనాభుడు, మహానాభుడు, భూతసంతాపనుడు, వృకుడు, సుమాలియు, మాలి మొదలైన దైత్య దానవ యక్ష రాక్షసులు అసంఖ్యాకులై యుద్ధం చెయ్యటం మొదలుపెట్టారు.

చ. అసురులకున్ సురావలికి నయ్యె మహారణ మప్పు డొండొరుల్
ముసల గదాసి కుంత శర ముద్గర తోమర భిండివాల ప
ట్టస పటుశూల చక్రముల డంబము చూపి యదల్చి యార్చుచున్
మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలు మింట నంటఁగన్.

364

తా ॥ దేవతలకు రాక్షసులకు మధ్య భయంకరమైన మహా సంగ్రామం జరిగింది. ఒకరినొకరు రోకళ్ళతో, గదలతో, కత్తులతో, కుంతములతో, బాణాలతో, ముద్గరములతో, తోమరములతో, భిండివాలములతో, పట్టసములతో, శూలములతో, చక్రములతో పరాక్రమాన్ని చూపుతూ యుద్ధం చెయ్యటం మొదలుపెట్టారు. ఒకరినొకరు అదలించి అరుస్తూ అస్త్రములతో ఆకాశంలో మంటలు చెలరేగేలా యుద్ధం చేయసాగారు.

క. ఒండొరులఁ గడవ నేసిన, కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా
దండములఁ బోలి నిష్ఠుర, భండన ముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై.

365

తా ॥ ఎదుటివాని అంతం చూడాలనే లక్ష్యంతో ఒకరిపై మరొకరు ప్రయోగించిన బాణ సమూహం ఆకాశాన్ని అంటుతూ కప్పేశాయి. ఆ దృశ్యం ఎలా ఉంది అంటే ప్రళయకాలంలో ఆకాశమంతా నిండిన ఉల్కాపాతంలా ఉంది.

చ. సురవరు లేయు బాణములు సూడ్కి కగోచర మై నభస్థ్సలం
బరిమురిఁ గప్పి రేసి దివసాంతముఁ జేసిన లీల నా సురే
శ్వర బలయూథ వీరు లురు సాయక పంక్తుల చేత వాని
రూ పఱ శతధూళి సేసి పఱపైన తమం బొనరించి రార్చుచున్.

366

తా ॥ ఆ దేవతాశ్రేష్ఠులు వేసే బాణసమూహం కంటికి కనిపించకుండా ఆకాశమంతా కప్పేసి సంధ్యాసమయాన్ని కల్పించాయి. రాక్షససేనా నాయకులు తమ బాణసమూహం చేత దేవతలు వేసే బాణాలను చిందరవందర చేసి కేకలు వేస్తూ యుద్ధరంగం అంతా చీకటిమయం చేసారు.

చ. సమరమదాంధు లై సుర నిశాచర వీరులు సైనికాంఘ్రి సం
క్రమిత మహీపరాగములు గ్రమ్మిన నుమ్మలికంపుఁ జీఁకటుల్
దమ కనుదోయి కడ్డముగఁ దార్కొనినం జల మూఁది పోరి రా
క్రమిత నిజాంతరంగ పరిఘట్టిత రోష మహాగ్ని పెంపునన్.

367

తా ॥ యుద్ధం అంటే ఒడలు తెలియక కన్ను కనుపించని మైకంలో పరస్పరం పోరాడుతూ ఉంటే ఆ దేవదానవ వీరుల కాలి తొక్కిడికి రేగిన ధూళితో ఆ ప్రాంతమంతా అంధకారం వ్యాపించింది. దట్టమైన చీకట్లు తమ కనుదోయికి అడ్డంగా వచ్చేసరికి తమకు ఏమీ

కనిపించకపోయినా తమ అంతరంగములలో రేగిన రోష మహాగ్నితో వారు యుద్ధం చేస్తూనే ఉన్నారు.

క. అతిగళిత రక్తధారా, క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో
ద్ధత రోషవహ్ని కీలలు, వితతం బై పిక్కటిల్లి వెడలెడు భంగిన్.

368

తా ॥ తమ శరీరంపై కారుతూ ఉన్న రక్తధారలు మంటను కలుగజేస్తూ వారి శరీరంలోంచి అగ్నిజ్వాలలు వస్తూన్నట్లుగా ఉంది.

సీ. రవణించు శింజినీ టంకార రవములు భట సింహనాదంబుఁ బరిభవింప
భీషణోత్తమ హయ హేషావిఘోషంబు కరి బృంహిత స్ఫూర్తిఁ గ్రందుకొలుప
సమర నిశ్శంకాంక శంఖ నినాదంబు నేమి స్వనంబుల నిహ్నవింపఁ
దుములమై చెలఁగెడు దుందుభి ధ్వానంబు లట్టహాసంబుల నాక్రమింప

తే. ఘటిత శస్త్రాస్త్ర నిష్ఠుర ఘట్టనోత్థ, ఖర కఠో రోరు విస్ఫులింగంబు లడరి
దివ్య కోటీర మణిఘృణి ధిక్కరింప, సమర మొనరించి రసురులు నమరవరులు.

369

తా ॥ ఆ సంగ్రామరంగంలో మోగే ధనుష్టంకారాలు భటుల యొక్క సింహనాదములను అతిక్రమించేలా ఉన్నాయి. భయాన్ని కలిగించే అశ్వాల సకిలింతలు ఏనుగుల ఘీంకారాలను మించి ఉన్నాయి. సమరాంగణంలో శంక లేకుండగా మ్రోగుతున్న శంఖధ్వనులు రథముల యొక్క చక్రధ్వనులను మించి ఉన్నాయి. దొమ్మిగా చెలరేగుతున్న దుంధుభి ధ్వానము వీరుల అట్టహాసమును అతిక్రమిస్తూన్నది. ప్రయోగింపబడిన శస్త్రాస్త్రముల కఠినమైన ఘర్షణవలన పుట్టిన గొప్ప అగ్నికణముల కాంతులు వారి దివ్యమైన కిరీటములలోని మణుల యొక్క కాంతులను ధిక్కరిస్తున్నాయి.

వ. ఇట్లు ప్రళయసంరంభ విజృంభిత సముత్తుంగ రంగత్తరంగిత భైరవారావ నిష్ఠ్యూత నిష్ఠుర మహార్ణవంబునుం బోలె, యుగాంతర సంక్రాంత ఝంఝూపవన పరికంపిత దీర్ఘ నిర్ఘాత నిబిడ నిష్ఠుర నీరదంబులుం బోలె, నుభయసైన్యంబులుం గలసి సంకుల సమరంబు సలుపు సమయంబున, యుగాంత కృతాంత సకలప్రాణి సంహార కారణలీలయుంబోలెఁ, బదాతి రాహుత్త గజారోహక రథిక మహారథిక వీరు లొండొరులు చండగతిం గాండంబులుఁ బఱపుచుఁ గదలం జదుపుచుఁ, గత్తులఁ గత్తళంబులఁ జినుఁగం బొడుచుచు, నడిదంబుల నడఁచుచుఁ, గుంతంబులం గ్రుచ్చుచుఁ, గుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁ దుచు, ముద్గరంబులం బాఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, సబళంబుల నొంచుచు, సురియల మెఱముచుఁ, శూలంబులఁ దుఱుముచు, వాజుల కుఱికియు, వాలంబుల నఱికియుఁ, దొడలు తుండించియుఁ, దొండంబుల ఖండించియు, మెడలెడయించియు, మొదళ్ళ గెడయించియు, నడుములు ద్రుంచియు, నాసికలుఁ ద్రెంచియుఁ, బదంబులు విఱిచియుఁ, బార్శ్వంబులం జెఱిచియు, గజంబులఁ బఱిపియు, గాత్రంబుల నుఱిపియుఁ, గుంభంబులఁ బగిలించియుఁ, గొమ్మల నగిలించియు, హస్తంబులఁ ద్రెంచియు, నంగంబులఁ జించియు, రథంబుల నలియించియు, రథికులం బొలియించియు, సారథులం జంపియు, సైంధవులం దంపియు, శిరంబులు నొగిలించియు, సీసకంబు లగిలించియు, ఛత్రములం దుఱుమాడియుఁ, జామరంబులం దునుమాడియు, సైన్యం బులఁ జదిపియు, సాహసుల మెదిపియు, నడుములు ద్రుంచియు మఱియును బరస్పర గుణవిచ్ఛేదనంబును, నన్యోన్య కోదండ ఖండన పటుత్వంబులు, నుభయ సైంధవ ధ్వజ సారథి రథిక రథ వికలనంబును, నొండొరుల పాద జాను జంఘా హస్త మస్తక నిర్దళనంబును, రక్తమాంసమేదః పంకసంకలిత సమరాంగణంబునై యతిఘోర భంగిం బెనంగిరి, అప్పుడు.

370

తా ॥ ఈ విధంగా యుద్ధరంగం అంతా ప్రళయ కాలంలో విజృంభించి ఎగసిపడే

కెరటాల భీషణ ఘోషలతో, భయాన్ని కొలిపే మహా సముద్రం వలె ఉంది. వీచే పెను గాలులకు వణికిపోతూ, పిడుగులు వర్షించే నిష్ఠూరమైన నల్లని మేఘాలవలె, ఉభయ సైన్యములు కలసి యుద్ధం చేస్తూన్న ఆ దృశ్యం యుగాంతవేళ యమధర్మరాజు సకల ప్రాణులను సంహరించే క్రీడా విహారంవలె ఉంది. ఆ రణరంగంలో పదాతులు, హయములను ఎక్కినవారు, ఏనుగులు ఎక్కినవారు, రథములను ఎక్కినవారు, మహారథికులు... ఒండొరులు భయంకరంగా శరప్రయోగం చేసుకొంటున్నారు. గదలతో చంపుకొంటున్నారు. అడిదములతో పొడుచుకుంటున్నారు. బల్లెములతో గ్రుచ్చుకొంటున్నారు. గొడ్డళ్ళతో చీల్చుతున్నారు. రోకళ్ళతో మోదుకుంటున్నారు. ఇనుప గుదియలతో బాదుకొంటున్నారు. చక్రములతో నరుక్కొంటున్నారు. బరిసెలతో కుమ్ముతున్నారు. శూలాలతో పొడి అయ్యేటట్లు గ్రుచ్చుకొంటున్నారు. కొందరు గుఱ్ఱములపైకి దూకి తోకలు నరుకుతున్నారు. కొందరు తొడలు ఖండిస్తున్నారు. కొందరు ఏనుగుల నాలుకలను త్రుంచుతున్నారు. కొందరు మెడలు, మెదళ్ళు, నడుములు, నాసికలు, పాదములు, పార్శ్వములు... ఖండ ఖండాలుగా నరుకుతున్నారు. కొందరు ఏనుగులను మీదకు తోలుతున్నారు. శరీరాలను ఖండిస్తున్నారు. కొందరు గజముల కుంభాలను పగులకొడుతున్నారు. ఒకళ్ళనొకళ్ళు ఎత్తిపొడుచుకుంటున్నారు. ఉభయులు గుఱ్ఱములను, ధ్వజములను, సారధులను, రథికులను, రథములను వికలం చేసుకొంటున్నారు. ఒండొరులు పాదములను, కాళ్ళను, కీళ్ళను, తొడలను, చేతులను, తలకాయలను పగులకొట్టుకుంటున్నారు. సమరాంగణం అంతా రక్తము, మాంసము ఇత్యాదుల చేత నిండి అతి ఘోరంగా కనబడుతూ ఉన్నది.

చ. సమజయమున్ సమాపజయ సామ్య పరిశ్రమమున్ సమోరు వి
క్రమము సమాస్త్రశస్త్రబల గర్వము నై కడు ఘోరభంగి నా
నముచి విరోధి సైన్య గణనాథులతోడ నిశాచరేశ్వ రో
త్తములు దురంబు సేసి రొగిఁ దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్.

తా ॥ దేవతలు, రాక్షసుల సైన్యాలు రెండూ కూడ సమానమైన బల పరాక్రమములతో ఉన్నాయి. అందువల్ల ఇద్దరికీ జయాపజయములు సమానంగా ఉన్నాయి, ఇద్దరి పరాక్రమం సమంగా ఉన్నది. అస్త్రశస్త్రబలములు సమంగా ఉన్నాయి. దేవతలతో నిశాచరోత్తములు వృత్రుని బలం కారణంగా సమానంగా పోరాడసాగారు.

వ. అప్పుడు.

372

లయగ్రాహి.

మొత్తముగఁ బాఱు పెనునెత్తురు మహానదులఁ, దత్తఱముతో నుఱికి కుత్తుకలు మోవన్
జిత్తముల నుబ్బి వెస నెత్తుకొను భూతముల, నత్తుకొని శాకినులు జొత్తిలెడి మాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయు మద, మత్తఘన ఢాకినులు నృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములం దిగిచి మెత్తమెదదుల్ మొనసి, గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్.

373

తా ॥ అప్పుడు ఆ యుద్ధరంగం అంతటా నెత్తుటి ఏరులు పాఱసాగాయి. అందులోకి ఉరికి కుత్తుక లోతు రక్త ప్రవాహాలలో భూత సముదాయం తిరుగాడజొచ్చింది. శాకినీ సముదాయం పుష్కలంగా మాంసం తిని నృత్యం చేశాయి. మదించి మత్తెక్కిన ఢాకినీ సముదాయం ప్రేవులు మెడనిండా ధరించి మెత్తని మెదడులు గుత్తగా తింటూ భయంకరంగా తిరుగసాగాయి.

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి, త్రేతాయుగంబుఁ జొచ్చునంత కాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయుచుండ, నంత వృత్రాసురు భుజబలంబు పెంపునఁ దెంపుఁజేసి కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై సొంపుపెంపు చూపి, మహావృక్ష పాషాణ గిరిశిఖరంబులు వర్షించిన.

374

తా ॥ ఈ విధంగా దేవదానవులు నర్మదానదీ తీరంలో కృతయుగంలో మొదలుపెట్టి త్రేతాయుగం వచ్చేవరకు పోరు దారుణంగా చేస్తూనే ఉన్నారు. వృత్రాసురుని భుజబలం వలన చెదిరిపోకుండ రాక్షసులు గుంపులు గుంపులుగా దేవతలపై మహా వృక్షములు, పెద్దపెద్ద బండరాళ్ళు, గిరి శిఖరాలు... వీటిని వర్షిస్తూనే ఉన్నారు.

మ. గిరి పాషాణ మహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని
ష్ఠుర నారాచపరంపరల్ పఱపుచున్ జూర్ణంబుఁ గావింప ని
ర్భరలీలం దమచేయు సత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ
దెరలెన్ రాక్షస యోధవీరుల మదోద్రేకంబు సంఛిన్నమై.

375

తా ॥ ఈ విధంగా రాక్షసులు కొండలు, బండలు, చెట్లు మొదలైనవన్నీ కురిపిస్తూంటే దేవతలు వాటన్నిటిని భయంకరమైన బాణ పరంపరలతో చూర్ణం చేస్తూ వచ్చారు. తమ పరాక్రమం వ్యర్థం అయ్యేసరికి రాక్షసవీరులు మరింత రెచ్చిపోయారు.

క. ప్రచురముగ రాక్షసావళి, ఖచరులపై నేయు నిబిడకాండావళి దు
ర్వచనుఁ డెడ నాడు మాటలు, సుచరిత్రుని యందుఁ బోలెఁ జొరవయ్యె నృపా!

376

తా ॥ రాక్షససమూహం దేవతలమీద కురిపించిన శరపరంపర దుర్జనుడు పలికే దుష్ట వచనములు సజ్జనుని విషయంలో వృథా అయినట్లే వృథా అయ్యాయి.

వ. అప్పుడు.

377

వనమయూరము.

అంత సురలేయు నిబిడాస్త్రములపాలై, పంతములు దక్కి హత పౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం, గంతుగొని పాఱి రపకారపరు లార్వన్.

378

తా ॥ అప్పుడు తిరిగి దేవతలు వేసే అంతులేని అస్త్రములకు రాక్షసులు తల్లడిల్లి పౌరుషం వీడి, సిగ్గు విడిచి పారిపోయారు. దేవతలు జయజయ ధ్వానాలు చేశారు.

క. కొండలఁ బోలెడు రక్కసు, లొండొరులం గడవఁ బాఱి రుక్కఱి పటు కో
దండముఖ సాధనంబులు, భండనమున వైచి దివిజపతు లార్వంగన్.

379

తా ॥ కొండలవంటి రాక్షసులు తమ కోదండములు బల్లెములు మొదలైన యుద్ధ సాధనములను యుద్ధ రంగంలోనే పారవైచి దేవతలు హేళన చేస్తుండగా పారిపోయారు.

వ. ఇట్లు సమరతలంబు వాసి తన ప్రాపు మాసి, తీసి పఱచుచుండు దండనాయకులం
జూచి, యకుటిలమతిం బకబక నగి, వృత్రాసురుం డిట్లనియె.

380

తా ॥ ఈ విధంగా రణరంగాన్ని వదలి పారిపోతూన్న తన సైన్యాధిపతులను చూసి కుటిలత్వం లేకుండా పకపక నవ్వి వృత్రాసురుడు ఇలా అన్నాడు:

ఉ. క్షుల్లకవృత్తి మీ కగునె? శూరుల కిమ్మెయి కీర్తి భోగముల్
గిల్లగఁ జేయు చావు మదిఁ గోరినవారల కైనఁ గల్గునే?
తల్లడ మంది యీ సమరధర్మము మాని తలంగఁ బాడియే?
మల్లుఁడు దుర్దమ ప్రథనమత్తుని వృత్రుని ప్రాపెఱుంగరే?

381

తా ॥ "మీరు వీరులు కదా! ఇలాంటి నీచమైన కార్యం మీకు తగదు. శూరులు రణరంగంలో ప్రాణత్యాగం చేయటం గొప్ప అదృష్టం. ఈ యుద్ధరంగంలో గణనకెక్కిన పరాక్రమంకల వృత్రాసురుని ఆశ్రయం ఎంత గొప్పదో మీకు తెలియదా?

క. చావు ధ్రువమైన ప్రాణికిఁ, జావులు రెం డరసికొనుఁడు సమరమునందున్
భావింప యోగమందును, జావంగా లేని చెడుగుచావుం జావే?

382

తా ॥ ప్రతీ ప్రాణికి చావు తప్పదు. ప్రాణులకు రెండు చావులు ఉత్తమమైనవి. ఒకటి యుద్ధరంగంలోను. రెండవది యోగ మార్గంలోను. ఈ రెండు కాకుండా చనిపోవటం చాలా నీచం."

వ. అని వాసుదేవ తేజోవిశేష విశేషితులై దావానలకీలలం బోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి, స్వర్గానుభవంబున నిచ్చలేకుండె నేని మదవలోకన స్పర్శన మాత్రంబు ముందర నిలుతురుగాక అని యేచి కల్పాం తానల్ప ఘనఘనా టోపంబునుం బోలెఁ గఠోర కంఠ హుంకార తర్జనంబులం గర్జిల్లుచుఁ, బ్రళయకాల పవనపరిభాసిత మహాశిఖీ శిఖావళులం దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం, గాల పరిపక్వ లీలాలోలుండైన శూలిపోలిక నాభీలమూర్తియై సకల జీవభార భరణ దుర్భర భగ్న బ్రహ్మాండ భాండ మహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన.

383

తా ॥ అని రాక్షస వీరులను హెచ్చరించి... వాసుదేవుని తేజోవిశేషంతో కారుచిచ్చు అడవిని చుట్టుముట్టినట్లు వెలుగుతూ తరుముకొస్తున్న సురవీరులను చూసాడు. భయంతో వెన్నిచ్చి పారిపోతున్న అసురవీరుల వెనుకనే వస్తూన్న దేవతలతో హుంకారం చేసి "స్వర్గంలో

ఉండాలన్న కోరిక మీకు లేకపోతే నాముందు నిలవండి" —అంటూ అరిచాడు. వృత్రాసురుడు అరచిన అరుపు కల్పాంత కాలంలో గొప్పదైన మేఘ గర్జనను పోలి ఉంది. ఈ విధంగా కఠోరమైన కంఠహుంకార రవంతో గర్జిల్లుతూ, ప్రళయకాలంలో వీచే మహా ప్రభంజనానికి ఎగసిపడే దహనుని శిఖలను తృణీకరించు కుటిల వీక్షణాలతో చూసాడు. కాలం పరిపక్వానికి వచ్చినప్పుడు ప్రళయ కాలరుద్రునివలె భయంకరంగా బ్రహ్మాండ భాండం బ్రద్దలు అయ్యేటట్లు భుజములు చరిచాడు.

ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్య సుధాంశు; లద్రు లూ
టాడె, నభస్థ్సలం బగిలె, నంబుధు లింకె, నుడుగ్రహాళి ప
ట్టూడె, వడిం దిశల్వగిలె, నుర్వర గ్రుంగె, నజాండభాండ మ
ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టినన్.

384

తా ॥ ఆ విధంగా వృత్రుడు బొబ్బ పెట్టేసరికి జగములన్ని చీకాకు పడ్డాయి. సూర్యచంద్రులు అస్తమించారు. మహా పర్వతాలు చలించాయి. ఆకాశం బ్రద్దలయ్యింది. మహా సముద్రములు అల్లకల్లోలమయ్యాయి. తారకా సముదాయము, గ్రహరాశి పట్టుతప్పాయి. భూభాండం అల్లాడిపోయింది, విధాత చలించాడు.

లయగ్రాహి.

కూలిరి వియచ్చరులు, సోలిరి దిశాధిపులు, వ్రాలి రమరవ్రజము, దూలి రురగేంద్రుల్, ప్రేలిరి మరుద్గణము, జాలిగొని రశ్వినులు, కాలుడిగి రుద్రు లవలీలఁ బడి రార్తిన్ వ్రేలిరి దినేశ్వరులు, కీ లెడలి నట్లు సుర, జాలములు పెన్నిదుర పాలగుచు ధారా భీల గతితోడఁ దమ కేలిధనువు ల్విడిచి, నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా!

385

తా ॥ ఆ పెనుకేకకి, ఆకాశ సంచారులు నేలకూలారు. దిక్పాలకులు సోలిపోయారు. దేవతాసమూహం వ్రాలిపోయారు. నాగులు తూలారు. మరుత్తులు ప్రేలారు. అశ్వినీ కుమారులు దిగులు చెందారు. కాలు కదపలేక రుద్రగణాలు ఆర్తికి గురయ్యారు. ద్వాదశాదిత్యులు పట్టుజారి వ్రేలాడారు. దేవతా సమూహం పెద్ద నిద్దుర ముంచెత్తినట్లు తమ చేతిలోని ధనువును, బాణములను విడిచి నేలమీద పడి మూర్ఛలలో మునిగిపోయారు.

వ. ఇట్లు కఠోర కంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి మూర్ఛిల్లిన, దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గజగజ వడంక, నిశితశూలంబు కేల నంకింపుచు, మదించిన భద్రమాతంగంబు కమలవనంబు సొచ్చి, మట్టిమల్లాడు విధంబున నిమీలితాక్షుం డగుచుఁ, బదతలంబుల రూపంబులు మాయం జమురుచు, వెక్కసంబుగఁ గ్రీడించు వానింగని వజ్రి వజ్ర శతోపమ నిష్ఠుర గదాదండం బాభీల భంగిఁ బ్రళయకాల మార్తాండ చండపరివేష ఘోరంబుగాఁ ద్రిప్పి వైచిన.

386

తా ॥ ఇట్లు వృత్రాసురుడు చేసిన కఠోర కంఠనాదానికి, పిడుగుపాటుకు కూలిన ప్రాణి సమూహం వలె, స్పృహ తప్పి ఇంద్రుని యొక్క దేవతా సైన్యం మూర్ఛపోయింది. యుద్ధరంగంలో అణచుటకు వీలుకాని వృత్రుని పాదముల దెబ్బలకు భూమండలం అంతా గజగజ వణకుతోంది. నిశితమైన శూలాన్ని చేత ధరించి, మదించిన భద్రమాతంగం, కాసారంలోని కమలవనంలో కదలాడినట్లు రణభూమిలో తిరుగాడ జొచ్చాడు. కన్నులు మూసుకొని కదలుతూ ఉన్న ఆ రాక్షసరాజు పాదముల క్రింద దేవతల దేహాలు రూపు మాసిపోసాగాయి. అలా ఆశ్చర్యంగా క్రీడిస్తూన్న వాడిని చూసి ఇంద్రుడు నూరు వజ్రాయుధములను పోలిన గదాదండంతో భయంకరంగా ప్రళయకాలంలో మార్తాండుని

చుట్టూ గుడి కట్టినట్లు ఘోరంగా త్రిప్పుతూ వృత్రుని మీదుకు విసరివేశాడు.

మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీల వేగంబునన్
గదియన్ వచ్చిన లీల వామకర సంక్రాంతంబు గావించె బె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరు పాతంబులం
జదియన్ మోఁదె గజేంద్ర మస్తకము నుత్సాహైక సాహాయ్యుఁడై.

387

తా ॥ అది ఆకాశంలో పెనుమంటలు గక్కుతూ వేగంగా దగ్గరకు వచ్చేసరికి, దానిని లీలగా తన ఎడమ చేతితో పట్టుకొని, క్రూరుడైన వృత్రాసురుడు కఠినంగా ఐరావతాన్ని దానితో చావమోదాడు.

ఆ. అగ్గజంబు కులిశహతిఁ గూలు కులమహీ, ధ్రంబు వోలె రక్తధార లురల
మస్తకంబు పగిలి మదమఱి జిర జిర, తిరిగి విఱుగు సూపి తెరలి పఱచె.

388

తా ॥ వజ్రాయుధం దెబ్బకు కూలిన కుల పర్వతం వలె ఐరావతం తలపగిలి రక్తధారలు కారగా, మదం దిగజారి తల్లడిల్లుతూ భయంతో తొలగి పోయింది.

ఉత్సాహవృత్తము.
గజము దెరలి దాని కొఱలి గర్జ లిడుచుఁ బాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచున్
నిజసుధార సైకపాన నిర్ణయార్ద్ర కరమునన్
ఋజుత మీఱ నిమిరె నపుడు రీతి మెఱసి క్రమ్మఱన్.

389

తా ॥ ఈ విధంగా విలపిస్తూ పారిపోతున్న ఐరావతాన్ని ఇంద్రుడు అంకుశంతో అదుపులోనికి తెచ్చి ఆపాడు. అమృతరసాన్ని పానం చేసే తన చల్లని చేతితో మెల్లగా దానిని నిమిరాడు.

వ. ఇ వ్విధంబున నైరావతంబును సేదదేర్చుచు, నెదుర నిలుచున్న భిదుర పాణింగని, తోఁ బుట్టువుం జంపిన తెంపు దలంచి, మోహశోకంబును విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై వృత్రుం డిట్లనియె.

390

తా ॥ ఈ విధంగా ఐరావతాన్ని సేదతీరుస్తూ తన ఎదురుగా నిల్చున్న ఇంద్రుని చూడగానే ఆ వృత్తాసురునికి తన తోబుట్టువైన విశ్వరూపుణ్ణి ఇంద్రుడు చంపిన విషయం గుర్తుకు వచ్చింది. ఒక్కసారి దుఃఖం పెనగొన కోపంతో అట్టహాసంగా నవ్వుతూ వృత్రుడు ఇంద్రునితో ఇలా అన్నాడు:

శా. నాకుం బెద్దయు నీకు సద్గురువు దీనవ్రాత రక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతివై లోభంబుతో ని య్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీ శూలమం
దాకంపింపఁగ నిన్నుఁగ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చెదన్.

391

తా ॥ "నాకు అన్నగారు, నీకు సద్గురువు. దీనులైన వారికి రక్షకుడు, ఎల్లరకు శుభాన్ని కోరేవాడు, చల్లని చూపులవాడు, అట్టి విశ్వరూపుణ్ణి పాపబుద్ధితో, లోభంతో నువ్వు చంపావు. ఈనాడు లోకులు నవ్వేటట్లుగా నా బాహుబలానికి చిక్కావు. గడగడ వణుకుతున్న నిన్ను నా శూలానికి గ్రుచ్చి నా అగ్రజుని ఋణం తీర్చుకుంటాను.

క. ఎట్టి తులు వైనఁ గానీ, నెట్టనఁ దన బ్రతుకు కొఱకు నీవలె గురువుం

జుట్టమునుఁ బుణ్యు బ్రాహ్మణుఁ, బట్టి వధింపంగఁ గలఁడె? పశువుంబోలెన్.

392

తా ॥ ఎటువంటి అధముడైనా నీలాగా గురుడైన వానిని, చుట్టమైన వానిని, పుణ్యుడైన వానిని బ్రాహ్మణోత్తముని పట్టుకొని, పశువువలె వధిస్తాడా?

చ. దయయును సత్యమున్ విడిచి ధర్మము మాని యశంబుఁ బాసి శ్రీ
జయములఁ బాఱఁదోలి పురుషత్వము గానక లోకనింది తా
హ్వయుఁ డగువాని చావునకు నార్యులు గుందుదురే? సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ? బ్రేలక చేరునె? కంక గృధ్రముల్.

393

తా ॥ ఓ ఇంద్రా! దయ, సత్యము, ధర్మము, యశస్సు... వీటిని విడిచిపెట్టి, కీర్తిని, జయమును పారద్రోలి, పౌరుషాన్ని కోల్పోయి లోకం అంతా నిందించే నీలాంటి వాని చావునకు ఆర్యులయినవారు విచారించరు. నీవంటి వాని శవాన్ని నక్కలు కూడా అంటుకోవు. కాకులు, గ్రద్దలు సైతం దరికి చేరవు.

క. నిక్కమగు పాపములచేఁ, జిక్కితివి నిశాత శూల శిఖరాగ్రమునన్
ద్రక్కించి నీదు మాంసము, నక్కలుఁ గుక్కలును జేరి నమలఁగఁ జేతున్.

394

తా ॥ నీవు చేసిన పాపాలకు ఫలంగా నా చేతికి చిక్కావు. నిశితమైన నా శూలాన్ని నీ గుండెల్లోకి దించి నీ మాంసాన్ని కుక్కలు నక్కలకు విందు చేస్తాను.

ఉ. దీకొని నీకు నేఁ డిచట దిక్కని వచ్చిన వారు గల్గిరే
నేకమతిం బిశాచముల కెల్లను దృప్తిగ మన్నిశాత శూ

లైక మహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజి నై
మేకలఁ జేసి వేల్చెద నమేయ మదోద్ధతి వ్రాలి యియ్యనిన్.

395

తా ॥ నీవే దిక్కు అని నేడు ఇచటకు వచ్చినవాడు ఎవరైనా ఉంటే వారిని రమ్మను. నా నిశితమైన శూలం నుండి వచ్చే మహాగ్ని కీలలలో, సోమయాజి మేకలను వేల్చినట్లు ఈ యుద్ధరంగంలో నిన్ను వేల్చి పిశాచాలకు తృప్తిగా విందు చేస్తాను.

క. కాక ననుఁ గులిశధారల, దీకొని నిర్జింపఁ గలిగి తేనియు భూతో
ద్రేకంబు సేసి శూరుల, ప్రాకట పదపద్మ ధూళి భాగం బగుదున్.

396

తా ॥ అలా కాకుండా నీవే నీ వజ్రాయుధంతో ఢీకొని నన్ను నిర్జింప కలిగితే, ఈ పంచ భూతాలలో కలిసి శూరుల యొక్క చరణధూళిలో భాగం అవుతాను.

సీ. సందేహ మేటికి జంభారి! వేవేగ భిదురంబు వ్రేయు మాభీలభంగి
నతిలోభి నడిగిన యర్థరాశియుఁబోలెఁ గడపకు మిది వృథ గాదు సుమ్ము,
మురమర్దనుని తేజమున నా దధీచి వీర్యాతిశయంబుల నధికమైన
యదిగాన హరిచే నియంత్రి తోన్నతుఁడ వై గెలువుము శత్రుల గీ టడంచి

ఆ. యెందు గలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు, పొందు గాఁగ వచ్చి పొందుచుండుఁ,
గాన భక్త వరదుఁ గమలాక్షు సర్వేశు పదములందు మనము పదిలపఱుతు.

397

తా ॥ ఓ సురేశ్వరా! సందేహమెందుకు? నీ భయంకరమైన వజ్రాయుధాన్ని ప్రయోగించు. అత్యంత లోభిని అర్థిస్తే ఏ ప్రయోజనము చేకూరదు, నీ వజ్రాయుధం అట్టిది

కాదు. శ్రీమహా విష్ణువు తేజస్సుతోను దధీచి మహర్షి వీర్యాతిశయం వల్ల నీ వజ్రాయుధం అధికమైనది. అందువల్ల హరిచేత నియంత్రితుడవై నీ శత్రువైన నన్ను జయించు. శ్రీమహా విష్ణువు ఎక్కడ ఉంటే జయం అక్కడ ఉంటుంది. కనుక నేను భక్తవరదుడూ, కమలాక్షుడు, సర్వేశ్వరుడు అయిన భగవంతుని పాదముల యందు నా మనస్సును భద్రంగా ఉంచుతున్నాను.

వ. ఇట్లు వజ్రధారలం ద్రెంపఁబడిన విషయ భోగంబులు గల వాఁడనై శరీరంబు విడిచి, భగవ ద్ధామంబునుం బొందెద. నారాయణుని దాసుండ నైన నాకు స్వర్గమర్త్య పాతాళంబులం గల సంపద్భోగంబులు నిచ్ఛయింపఁబడవు. త్రైవర్గికాయాస రహితం బైన మహైశ్వర్యంబు ప్రసాదించుం గావున ననుపమేయం బైన భగవత్ప్రసాదం బన్యుల కగోచరంబు. అ ద్దేవుని పాదైక మూలంబుగా నుండు దాసులకు దాసానుదాసుండనై యున్నవాఁడ అని యప్పరమేశు నుద్దేశించి.

398

తా ॥ నీ వజ్రాయుధం వ్రేటుకు నా విషయ భోగాలు అన్నీ తెగిపోయి నేను శరీరాన్ని విడిచి భగవంతుని సన్నిధికి చేరుకుంటాను. నారాయణ దాసుడనైన నాకు స్వర్గ మర్త్య పాతాళ లోకాలలోని భోగాలు ఏమీ రుచించవు. ధర్మార్థకామాల బాధలేని మహైశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది కనుక భగవత్ప్రసాదం అన్యులకు తెలియరానిది. ఆ మహనీయుని పాదాలను ఆశ్రయించుకుని ఉండే దాసులకు దాసాను దాసుడను" – అని ఆ పరమేశ్వరుని ఉద్దేశించి ఇలా ప్రార్థించాడు వృత్రుడు.

చ. అరయఁగ భక్తపాలనము లైన భవచ్చరితంబు లాత్మ సం
స్మరణము సేయ వాక్కు నిను సన్నుతి సేయ శరీర మెల్లఁ గిం
కర పరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ గాని యొల్ల నే
నరిది ధ్రువోన్నత స్థలము నబ్జజు పట్టము నింద్ర భోగమున్.

తా ॥ ఓ పంకజాక్ష! నా మనస్సు ఎల్ల వేళల భక్తులను రక్షించు నీ చరిత్రను సంస్మరించాలి. నా వాక్కు నిన్నే నుతించాలి. నా శరీరం ఎల్లప్పుడు నీకే సేవ చేయాలి. ఇదే నా మదిలోని కాంక్ష. దీనిని మించి ధ్రువ స్థానాన్ని కాని, బ్రహ్మ పదమును కాని, ఇంద్ర భోగాన్ని కాని నేను కోరను.

ఉ. ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీఁకలు రాని పక్షులుం
దీకొని తల్లికిన్ మఱి విదేశగతుండగు భర్త కంగజ
వ్యాకులచిత్త యైన జవరాలును దత్తఱ మందు భంగి నో
శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే!

400

తా ॥ ఓ శ్రీహరీ! ఆకలితో బాధపడే లేగ దూడలు, ఈకలు రాని పక్షి పిల్లలు తమ తల్లికోసం ఎదురు చూస్తాయి. అలాగే దూరదేశానికి వెళ్ళిన పతి కొరకు విరహం చేత బాధపడే జవరాలు తత్తర పడుతూ ఉంటుంది. అట్లాగే నిన్ను చేరాలని నామది తహతహ లాడుతూ ఉన్నది.

క. నాకును సఖ్యము పుణ్య, శ్లోకులతోఁగాని తత్త్వశూన్యులు సంసా
రైక విమోహులతోడం, గాకుండ నొనర్పు మయ్య! కంజదళాక్షా!

401

తా ॥ ఓ కమలనేత్రా! నాకు తత్త్వశూన్యులు, సంసార మోహంలో చిక్కుకున్న వారితోనూ కాకుండా కేవలం పుణ్యశ్లోకులతో మాత్రమే స్నేహాన్ని అనుగ్రహించు.

మహాస్రగ్ధర.
హరి పై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వన్
సరిమేనుప్పొంగఁ జావుం జయమును సరిగా సంతసం బందుచుం భీ

కరుఁడై కాలాగ్ని వోలెన్ గనలుచుఁ గవిసెన్ గర్వదుర్వారుఁడై దు

ర్భరలీలం భూమి గంపింపఁగ దిశ లద్రువన్ భండనోద్దండవృత్తిన్.

402

తా ॥ ఈ ప్రకారంగా సర్వాత్ముడు, అగణిత గుణుడు అయిన శ్రీహరిపై వృత్రాసురుడు తన మనస్సును కేంద్రీకరించాడు. తన మేను ఉప్పొంగగా యుద్ధంలో చావు, జయము రెండూ ఒకటిగానే భావించాడు. భయంకరాకారుడై కాలాగ్ని వలె మహా రౌద్రంతో, గర్వంతో సంగ్రామ రంగంలో దూకగా భూమి కంపించి దిక్కులు దద్దరిల్లాయి.

క. దొరకొని ప్రపళయోదకమున, హరిపైఁ గైటభుఁడు గవియు హంకారమునన్

సురనాథు మీఁద వృత్రా, సురుఁడు మదోద్వృత్తి నడచె శూలాయుధుఁడై.

403

తా ॥ ప్రళయ కాలంలో సాగర జలాలపై కైటభుడనే రాక్షసుడు హరిమీదకు హుంకారంతో దుమికినట్లు... ఇంద్రునిపై వృత్రాసురుడు శూలాన్ని ధరించి రోషంతో దూకాడు.

శా. కల్పాంతాగ్నియుఁబోలె నుల్క లెగయంగా ద్రిప్పుచున్ దీన నో

యల్పా! చావు మటంచు శూలము రయంబారంగఁ బై వైచినం

బోల్పం గోటిరవి ప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా

వేల్పుల్పొంగఁగ వజ్రధారఁ దునిమెన్ విన్నాణ మొప్పారఁగన్.

404

తా ॥ కల్పాంత కాలంలో అగ్నివలె ఉల్కలు ఎగసి పడేటట్లుగా త్రిప్పుతూ... "ఓ నీచుడా! దీనితో నీకు మరణం తప్పదు" – అంటూ వేగంగా శూలాన్ని ఇంద్రునిపైకి విసిరాడు వృత్రుడు. కోటి సూర్య ప్రకాశంతో తన మీదకు వస్తూన్న శూలాన్ని వీక్షించి వజ్రాయుధంతో ఖండించాడు. అప్పుడు దేవతలు సంతోషించారు.

ఆ. శూల మప్పు డతఁడు స్రుక్కఁగ ఖండించి, పూని తోన కదిసి భుజముఁ ద్రుంచె,
నసుర గనలి యేకహస్తుఁడై పరిఘంబు, గొని మహేంద్రుఁ గిట్టి హనువు లడిచె.

405

తా ॥ ఇంద్రుడు శూలాన్ని ఖండించి వెంటనే అతని భుజాన్ని కూడా ఖండించాడు. దానితో వృత్రాసురుడు ఏక హస్తుడై, ఇనుపగుదియ నొక దానిని పట్టుకొని దానితో మహేంద్రుని మీదికి దూకాడు.

వ. ఇట్లు ప్రళయకాల భీషణ పరివేష పోషంబుగా రోషంబునం బరిఘంబు ద్రిప్పి, కుప్పించి, గజ కుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన.

406

తా ॥ ఇట్లా విజృంభించి ప్రళయ కాలంలో సూర్య మండలాన్ని భయంకరంగా చుట్టుకొన్న పరివేష మండలం వలె ఇనుప గుదియను త్రిప్పుతూ కుప్పించి ఐరావతం యొక్క కుంభస్థలాన్ని బ్రద్దలు కొట్టాడు. ఇంద్రుని యొక్క చెంపను కఠినంగా నొప్పించాడు.

క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁకవెట్టఁ గులిశము నేలన్
భజన చెడి విడిచె నింద్రుఁడు, గజిబిజితో బెగడె నసురకడిమి జగంబుల్.

407

తా ॥ ఆ దెబ్బకు ఐరావతం మదం దిగజారి తిరుగుతూ కేక పెట్టేసరికి, ఇంద్రుడు ధైర్యం కోల్పోయి తన వజ్రాయుధాన్ని నేలకు జారవిడిచాడు. ఆ అసురుని పరాక్రమానికి లోకాలన్నీ భయపడ్డాయి.

క. గరుడుఁడు వొదివిన నాగము, కరణిన్ వృత్రాసురేంద్రు కడిమికి లోనై
తిరుగుడు వడ్డ హరిం గని, పురపుర నాహా! యటంచుఁ బొగిలె జగంబుల్.

408

తా ॥ గరుత్మంతుడు పట్టుకున్న కాలసర్పం వలె, వృత్రునియొక్క పరాక్రమానికి లోనయి తిరుగుతూ ఉన్న ఇంద్రుణ్ణి చూసి లోకాలన్నీ విచారించాయి.

వ. అప్పుడు.

409

తే. గజముపాటుఁ జూచి కడు దీనగతిఁ జూచి, పవి కరంబు జాఱి పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి యున్న శత్రునిఁ జూచి, సిగ్గుతోడ వజ్రి శిరము వంచె.

410

తా ॥ అప్పుడు ఐరావతం యొక్క దైన్యావస్థను చూచి, తన చేతిలోని వజ్రాయుధం జారి పడటం చూచి, యుద్ధ ధర్మాన్ని ఎరిగిన వాడు కనుక తన మీదకు దాడి చేయకుండ నిలబడి ఉన్న వృత్రుని చూచి... సిగ్గుతో ఇంద్రుడు శిరస్సు వంచుకున్నాడు.

వ. ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడిన వజ్రంబుఁ బుచ్చికొనక నివ్వెఱపడి, లజ్జించి యున్న పాకశాసనుంజూచి వృత్రుం డిట్లనియె.

411

తా ॥ ఇట్లా యుద్ధరంగంలో తన శత్రువు ముందు జారిపడ్డ వజ్రాయుధాన్ని తీసుకొనక సిగ్గుతో నివ్వెరపాటుతో నిలబడిపోయాడు ఇంద్రుడు. అప్పుడు వృత్రుడు ఇలా అన్నాడు:

క. దురమునఁ గైదువు వదలిన, శరణన్నను వైరిజనులఁ జంపము మది ని
వ్వెఱఁగొందనేల? కులిశము, కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా!

412

తా ॥ "ఇంద్రా! నీ మనస్సులో భయపడకు! యుద్ధంలో ఆయుధం విడిచిపెట్టిన వానిని, శరణు అన్న వానిని మేము చంపము. నీ చేతినుండి జారిన ఆయుధాన్ని తీసుకో!

సీ. వజ్రంబు గైకొని వైరి నిర్జింపు, మి ట్లడలంగ వేళగా దమరనాథ!
యరయ దేహాధీనులైన మూర్తుల కెల్ల నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి
కడతేఱ జయములు గల్గునె యెందైనఁ దలపోసి చూడుమా! తత్త్వదృష్టి
నీ లోకపాలురు నెవ్వని వశగతి వలఁ బడ్డ పక్షుల వర్తనమునఁ

తే. జిక్కి చేష్టలు సేయుచుఁ జింతసేతు, రట్టి మృత్యు బలంబుల నాత్మజయము
తమదిగాఁ గోరి యజ్ఞాన తంత్రు లగుచుఁ, గమలలోచను లీలా వికారములను.

413

తా ॥ ఓ అమరనాధా! నీ ఆయుధాన్ని తీసుకొని వైరిని జయించు. శోకించడానికి ఇది వేళ కాదు. దేహాధీనులు అయిన వారందరికి సర్వేశ్వరుడైన లక్ష్మీనాథుడిని విడిచి వెడితే జయం ఎక్కడ లభ్యమవుతుంది? తాత్త్వికమైన దృష్టితో ఆలోచించు. ఈ లోకపాలకులందరు వలలో పడిన పక్షులవలె ఎవ్వని వశంలో పడి చేష్టలు చేస్తూ చింతన చేస్తున్నారో తెలుసుకో! ఇదంతా కమల లోచనుని లీల అనే విషయాన్ని మరచి తమ జయానికి తామే కారణమనే అజ్ఞానంతో పూర్తిగా మునిగి ఉన్నారు.

తే. మెఱయ యంత్రమయం బైన మృగముభంగి, దారునిర్మిత మైనట్టి తరణిపోల్కి
శక్ర! యెఱుఁగుమ యీ భూతజాల మెల్ల, దళిత పంకేరుహాక్షు తంత్రంబు గాఁగ.

414

తా ॥ ఓ ఇంద్రా! యంత్రంతో చేయబడిన జంతువువలె, చెక్కతో నిర్మింపబడిన ఓడ వలె... ఈ జగత్తులోని భూత జాలమంతా కూడా ఆ మహావిష్ణువు మాయాతంత్రం చేత ఆడించబడుతోందని తెలుసుకో.

వ. మఱియు భూతంబులచేతను, నింద్రియంబుల చేతను నవశుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱుచేయబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖీయించుచుండు. అవిద్వాంసుండైన వాఁ డనవతరంబుఁ దన్ను స్వతంత్రునిఁగాఁ దలంపుచుండు. భూతంబుల వలన భూతంబులుం బుట్టుచుండు. ఆ భూతంబులు భూతంబులచేత భక్షింపఁ బడుచుండు. పురుషున కాయువు, శ్రీయును, గీర్తియు, నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతకాలంబు ప్రాప్తం బంతకాలంబు నివసించు. ఆ ప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవి యుండక పోవుచుండు. కావున గుణంబును, నవగుణంబును, గీర్త్యపకీర్తులును, జయాపజయంబులును, సుఖదుఃఖంబులును, జావు బ్రతుకులును, సమంబులై కలుగుచుండు. అజ్ఞానియైన వానికి సత్త్వరజస్తమో గుణంబులు గలిగియుండు. అట్టివానికి గుణమయంబులైన యింద్రియాదులే యాత్మయని తోఁచుచునుండు. కావున వాఁ డా గుణంబులచేత బద్ధుండగు. ఆ గుణంబులకు సాక్షిమాత్రం బైన శరీరంబు వేరని యెవ్వం డెఱుంగనోపు, వాఁ డా గుణంబులచేత బద్ధుండు కాఁడు. కావున గుణంబులును; గుణియును; భోక్తయును, భోగ్యంబును; జయంబు నపజయంబును, హర్తయును; హన్యంబును, నుత్పత్తిస్థితి లయకర్తయై, సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండే కాని యన్యంబు లేదు. ఇప్పుడొక్క హస్తంబు నాయుధంబును బోయినను భవత్ప్రా ణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడుము అని వృత్రాసురుండు మఱియు నిట్లనియె.

415

తా ॥ పంచ భూతములకు, పంచ ఇంద్రియములకు లొంగిన పురుషుడు ప్రకృతిచే వేరు చేయబడి, అవిద్వాంసుడై, ఎప్పుడూ తాను స్వతంత్రుడను అని అనుకొంటూ ఉంటాడు. ఆ అజ్ఞానావస్థలోనే సుఖీస్తున్నాను అని అనుకొంటున్నాడు. లోకంలో జీవుల వలన జీవులు పుడుతున్నాయి. ఆ జీవులు జీవులకు ఆహారమై భక్షింపబడుతున్నాయి. పురుషునికి ఆయువు, సంపద, కీర్తి, ఐశ్వర్యం, మొదలయినవి ఎంతకాలం ప్రాప్తమో అంతకాలం అనుభవిస్తాడు. ఆ

ప్రాప్తకాలం తీరిపోయాక అవి ఉండవు. కనుక జీవునికి గుణములు – అవగుణములు, కీర్తి – అపకీర్తి, జయము – అపజయము, సుఖము – దుఃఖము, చావు – బ్రతుకు... ఇవన్నీ సమంగా కలుగుతూ ఉంటాయి. సత్త్వరజస్తమో గుణములకు లొంగిన అజ్ఞాని గుణములతో కూడిన ఇంద్రియములే ఆత్మ అని అనుకొంటాడు. కనుక వాడు అందులోనే బద్ధుడై ఉంటాడు. కాని ఆ గుణములకు సాక్షి వేరుగా ఉన్నాడని ఎంత మందికి తెలుసు? నిజానికి ఆ ఆత్మయే తానని శరీరం వేరని ఎవరికి తెలుసు? కనుక గుణములు – గుణములు కలవాడు, భోక్త – భోగ్యవస్తువు, జయము – అపజయము, చంపేవాడు – చంపబడేది... ఇవన్నీ సర్వోత్కృష్టుడైన పరమేశ్వరుడే కాని అన్యము కాదు. ఇప్పుడు నన్నుచూడు! ఒక హస్తము లేదు, ఆయుధం విరిగి పోయింది. కాని నేను నీ ప్రాణం తీయడానికి సిద్ధంగా ఉన్నాను." అని వృత్రాసురుడు ఇంకా ఇలా అన్నాడు:

తే. వాహనంబులు సారెలు వాఁడిశరము, లూర్జి తాక్షము లసువులు నొడ్డణములు గాఁగఁ
బోరెడు నీ ద్యూతకర్మమందు, నెసఁగ జయమును నపజయ మెవ్వఁ డెఱుఁగు?

416

తా ॥ "వాహనములే ఆట బల్లలు. పదనైన బాణములే పాచికలు. ప్రాణములే పందెములుగా చేసుకొని పోరే ఈ యుద్ధం అనే ద్యూతక్రియలో జయాపజయములు ఎవనికి తెలుసు?"

చ. అనవుడు వృత్రుమాటలకు నద్భుత మంది సురేంద్రుఁ డెంతయుం
దనమదిఁ గుత్సితం బుడిగి దైవముగా నతనిన్ తలంచి కై
కొనియెఁ గరంబునం దిగువఁ గూలిన వజ్రము, నప్పుడాత్మలోఁ
దనరె జగంబు లన్నియు, ముదంబునఁ బొందిరి ఖేచరావళుల్.

417

తా ॥ అప్పుడు వృత్రుని మాటలను విన్న దేవేంద్రుడు ఎంతో ఆశ్చర్యమును పొంది తన మనస్సులోని నికృష్టమైన భావాన్ని విడిచి అతనిని దైవ సమానుడుగా భావించాడు. అప్పుడు వంగి కూలిన వజ్రాయుధాన్ని తీసుకొన్నాడు. అది చూసి లోకాలన్నీ సంతోషించాయి. దేవతలు ఆనందించారు.

క. రాహుగ్రహ వక్త్ర మహో, గేహాంతము వాసి వచ్చి కిరణావళి స

ద్బాహుళ్య మొప్ప వెలిగెఁడు, నా హరిదశ్వుండు వోలె హరి యొప్పె నృపా!

418

తా ॥ అప్పుడు ఇంద్రుడు గ్రహణానంతరం రాహుగ్రహం యొక్క ముఖం నుండి బయటకు వచ్చి సహస్ర కిరణాలతో వెలిగిపోతున్న సూర్య భగవానుని వలె ప్రకాశించాడు.

వ. ఇట్లు కరకలిత వజ్రాయుధ రుఙ్మండల మండిత దిఙ్మండలుండై జంభారి గంభీర వాక్యంబుల విస్మయ మందస్మిత ముఖారవిందుండై వృత్రున కిట్లనియె.

419

తా ॥ ఈ విధంగా తేజరిల్లుతూ, తన హస్తాన్ని అలంకరించిన వజ్రాయుధం తన కాంతులతో దిక్కులను ప్రకాశింప చేస్తుండగా ఇంద్రుడు విస్మయ మందస్మిత ముఖారవిందంతో గంభీరంగా వృత్రునితో ఇలా అన్నాడు:

క. ఓ దానవేంద్ర! నీ మతి, వేదాంతము వోలె తత్త్వ విజ్ఞాన కళా

మోదము, నీ వతిభక్తుఁడ, వాదిమ పురుషునకు హరికి నబ్జాక్షునకున్.

420

తా ॥ "ఓ దానవేంద్ర! నీ బుద్ధి వేదాంతాన్ని కలిగి ఉండి తత్త్వ జ్ఞానంతో ప్రకాశిస్తూన్నది. ఆది పురుషుడైన ఆ హరికి నీవు మహా భక్తుడవు అని తెలుసుకున్నాను.

ఉ. లోకములెల్ల నిండి తన లోనుగ సర్వముఁజేసి ప్రాణులన్
దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు సూపెడి విష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తిది యేల? మహాసురు రూపుమాని సు
శ్లోకు పురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్.

421

తా ॥ తాను లోకాలన్నింటా నిండి ఉండి, లోకాలన్నీ తనలో నింపుకొని, ప్రాణులను ఎదిరించి యాతనలను పెట్టే విష్ణుమాయను నీవు నీ చిత్తంలో తెలుసుకొన్నావు. ఇక ఈ భయంకరమైన రాక్షస రూపాన్ని వదలి శోభన మూర్తి అయిన పురాణ పురుషుని రూపాన్ని ధరించు.

ఉ. ఏ నియమంబు సల్పితివొ! యెట్టి మహాతప మాచరించితో
పూని రజోగుణాభిరతిఁ బొందిన నీ మతి శాంత దాంత స
న్మానస మానసానుభవ మత్తమరాళుఁ నరోష భావ స
న్మాను నమేయు నా దనుజమర్దను భక్తి పొసంగె నెంతయున్.

422

తా ॥ నీవు ఏ నియమాలను పాటించావో? ఎట్టి తపస్సును ఆచరించావో? రజోగుణ యుక్తమైన నీ మనస్సు, శమదమాది సద్గుణ సంపన్నమైన సత్పురుషుల మనస్సు విహరించే రాజమరాళం అయిన శ్రీహరి యందు ఆసక్తమై ఉంది. రాగద్వేషాదులు లేనివాడు, అమేయుడు, దనుజ మర్దనుడి ఎడల నీ భక్తి ఎంతగానో పొసగి ఉన్నది.

క. నారాయణ రూపామృత, పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ
దారకృత ఖాత కోదక, పూరంబుల నేల తృప్తిఁ బొందు? మహాత్మా!

423

తా ॥ మహాత్మా! నారాయణుని ప్రేమ స్వరూపమనే అమృత పారావారంలో మునిగి తేలే భక్తుడు, పంది ముట్టెలతో త్రవ్వబడిన మురికి గుంటలలో ఎలా తృప్తిని పొందుతాడు?"

వ. ఇట్లు పలుకుచున్న యింద్రు నుపలక్షించి, వృత్రాసురుం డాయోధన దుర్మర్షణ సంఘర్షమాణ మానుసుండై వైరిం బురికొల్పుకొని, వామహస్తంబునఁ బరిఘంబు ద్రిప్పుచు, మత్సరంబునం గుప్పించుచు, బ్రహ్మాండకర్పరంబు నిష్ఠుర భైరవారావంబునం బగిలించుచు, సముత్తుంగ మత్త మాతంగ పుంగవంబు వృషభంబుపైఁ గదియు భంగి సురవృషభు పేరుర ముపలక్షించి, భీషణాశని నిపాత వేగంబునఁ గొట్టిన, నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి, తోడనే శేష ఫణా విశేష భాసురం బైన బాహు దండంబు ఖండించె, అప్పుడు వృత్రుండు భిన్న బాహుద్వయుం డై, రక్తధారలం దోఁగుచు వజ్రిచేతఁ బక్షహతంబై దివంబుననుండి జాఱుచున్న కులపర్వతంబునుంబోలెఁ జూపట్టి, ప్రళయకాల సంహార నిటలచ్చటచ్ఛ టార్భట కఠోర కీలాభీలాగ్ని సమాన క్రూర కుటిల నిరీక్షణ దుర్నిరీక్షుండై భూనభో మండలంబులఁ గ్రింది మీఁది దౌడల హత్తించి, నభోమండలంబునుం బోలెఁ దుది మొద లెరుంగరాక, వికృతంబుగా వక్త్రంబు దెరచి, మందర మథన మథ్యమాన విషధరజనిత విష విషమ జిహ్వాభీలం బగు నాలుక నభంబు నాకుచుఁ గాల సంహార కారణుం డైన కాలుని భుజదండ మండితంబగు దండంబునుం బోలు దంష్ట్రల చేత జగత్త్రయంబును మ్రింగెడు వానిం బోలె నతిమాత్ర మహాకాయుండై, పర్వతంబులం దలంగ మీటుచు, నడగొండయుంబోలె నభోభాగ భూభాగంబుల నాక్రమించి యప్పుడు.

424

తా ॥ ఇట్లా పలుకుతూన్న ఇంద్రుణ్ణి వృత్రాసురుడు యుద్ధానికి పురికొల్పి తాను తన ఎడమ చేతితో పరిఘను త్రిప్పుతూ మాత్సర్యంతో కుప్పించాడు. బ్రహ్మాండ భాండాన్ని భయంకరమైన భైరవారావంతో పగులగొట్టుతూ; మదించిన మాతంగం ఆబోతు మీదికి

దూకినట్లు దూకి దేవేంద్రుని రొమ్ముమీద పిడుగు లాంటి దెబ్బను కొట్టాడు. అప్పుడు ఇంద్రుడు తన వజ్రాయుధంతో ఆ పరిఘను తునిమి వెంటనే ఆదిశేషుని పడగవంటి ఆ రాక్షసుని బాహువును ఖండించాడు. అప్పుడు వృత్రుడు రెండు చేతులు తెగిపోయి రక్తధారలు కారుతూ... రెక్కలు నరకగా స్వర్గం నుండి జారిపడుతూ ఉన్న కులపర్వతంవలె కనుపించాడు. ఆగ్రహంతో కనుబొమలు చిట్లించి ప్రళయ కాలంలో భయంకరంగా జ్వలిస్తూన్నటువంటక్రూర కుటిల వీక్షణాలతో దుర్నిరీక్షుడై వికృతంగా నోరు తెరిచాడు. క్షీరసాగర మథన సమయంలో మందర మహీధరానికి చుట్టబడి విషాన్ని కక్కుతూన్న నాలుకను సాచి గగనాన్ని నాకుతూ సంహార కారణుడైన యముని బాహువుల వంటి దంష్ట్రలతో మూడు లోకాలను మ్రింగబోయాడు. అపరిమిత శరీరంతో పర్వతాలను మీటుతూ నడచి వస్తూన్న కొండవలె భూమ్యాకాశాలను ఆక్రమించాడు.

ఉ. కాలమునాఁటి మృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్
గ్రాలఁగ దేవసంఘములు కంపము నొంద జగంబు లెల్ల నా
హా లులి తారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టి పట్టి సురనాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్.

425

తా ॥ ప్రళయ కాలంనాటి మృత్యు దేవత ముఖం నుండి విస్ఫులింగాలవలె వృత్రాసురుని ముఖం నుండి అగ్ని పుట్టుకొచ్చింది. దానిని చూచి దేవతాసంఘములన్నీ కంపించాయి. జగములన్నీ హాహాకారములు చేయ, ఆ రాక్షస రాజు నాలుక సాచి మహా అద్భుతంగా ఐరావతాన్ని, ఇంద్రుణ్ణి కలిపి మ్రింగేశాడు.

ఆ. లోకమెల్ల నపుడు చీకాకు పడెఁ దమం, బడరె నుడుగణంబు లవనిఁ బడియె,
సోనవానఁ గురిసె సూర్యచంద్రాగ్నుల, రశ్మ లుడిగె దిశలు రభస మయ్యె.

426

తా ॥ అప్పుడు లోకాలన్నీ చీకాకు పడ్డాయి, అంతటా చీకటి క్రమ్ముకుంది. నక్షత్రములు నేల రాలాయి. రక్తం వర్షం కురిసింది. సూర్యచంద్ర అగ్నులు తమ కాంతిని కోల్పోయారు. దిక్కులు వేగంగా తిరగటం మొదలుపెట్టాయి.

వ. అప్పుడు.

427

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన మొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు దత్తఱింపఁడు విశేషము చెప్పఁడు వైష్ణవీ జయా
నందపరైక విద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁగాని సం
క్రందనుఁ డానిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై.

428

తా ॥ అప్పుడు ఆ నిశాచరుని గర్భంలో ఉన్న ఇంద్రుడు ఏమీ కందలేదు, భయపడలేదు, భీతి చేత వణకిపోలేదు, అసలు తత్తర పడలేదు. ఎటువంటి అతిశయాన్ని పలుకలేదు. జయానందమును కూర్చు వైష్ణవీ విద్యను మనసులో జపిస్తూ విష్ణువు వలన రక్షింపబడుతూ ఆ నిశాచరుని గర్భంలో కదలకుండా ఉన్నాడు.

వ. ఇట్లు కవచరూప శ్రీమన్నారాయణ కృపాపాలితుండై యోగ బలంబున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి, యైరావణ సహితుం డై వెడలి, యతని కంధరంబు తెగనడువ వజ్రంబు ప్రయోగించిన, నతి నిష్ఠుర వేగంబున వృత్ర హరణార్థంబుగం దిరుగుచు సూర్యాది గ్రహ నక్షత్రంబులకు దక్షిణోత్తర గతిరూపంబైన సంవత్సర సంధియందు నహోరాత్ర మధ్యంబున వృత్రు శిరంబు పర్వత శిఖరంబునుం బోలెఁ ద్రుంచి కూలం ద్రోచె. నప్పుడు.

429

తా ॥ ఇట్లు కవచ రూప శ్రీమన్నారాయణుని యొక్క కృపచేత రక్షింపబడిన ఇంద్రుడు తన వజ్రాయుధం చేత వృత్రుని ఉదరాన్ని ఛేదించాడు. ఐరావతంతో కూడా బయటకు వచ్చి, రాక్షస రాజు కంఠాన్ని ఛేదించడానికి వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. అది అతి నిష్ఠూరమైన వేగంతో తిరుగుతూ సూర్యాది గ్రహ నక్షత్రములకు దక్షిణ ఉత్తరాయణముల సంధి కాలంలో, పగలు రాత్రి సంధికాలమైన సంధ్యా సమయంలో వృత్రుని శిరస్సును పర్వత శిఖరంవలె కూలత్రోసింది.

మ. మొరసెం దుందుభు లంబరంబునఁ గడున్ మోదించి గంధర్వులున్
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ సొంపార వృత్రఘ్ను భీ
కర తేజోవిభవ ప్రకాశకర విఖ్యాతైక మంత్రంబులం
దిర మొప్పం బఠియించుచుం గురిసి రెంతేఁ గ్రొత్త పూ సోనలన్.

430

తా ॥ అప్పుడు ఆకాశంలో దేవ దుందుభులు మ్రోగాయి. సంతోషంతో గంధర్వులు, దేవతలు, సాధ్యులు, సిద్ధులు, మునులు వృత్రాసురుడిని సంహరించిన ఇంద్రుని పరాక్రమాన్ని వైభవాన్ని తెలియచేసే మంత్రములను పఠిస్తూ అప్పుడే వికసించిన పువ్వులతో వాన కురిపించారు.

ఆ. ఏమి చెప్ప నప్పు డింద్రారి తనువున, నొక్క దివ్యతేజ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ లోకంబు చూడని, లోక మరిగి విష్ణులోను సొచ్చె.

431

తా ॥ అప్పుడు వృత్రాసురుని తనువు నుండి ఒక దివ్యతేజం వెలువడి లోకం అంతా చూస్తూండగా విష్ణులోకంలోకి ప్రవేశించి శ్రీమహా విష్ణువులో అంతర్ధానమైంది.

వ. ఇట్లు లోకభీకరుం డైన వృత్రాసురుండు గూలిన, నఖిల లోకంబులుఁ బరితాపంబు

లుడిగి సుస్థితిం బొందె, దేవ ఋషి పితృగణంబులు దానవులతోడం గూడి, యింద్రునకుం జెప్పక తమ తమ స్థానంబులకుం జనిరి అనిన విని, పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

432

తా ॥ ఇలా లోక భయంకరుడైన వృత్రాసురుడు కూలిన వెనక, అఖిల లోకములు శోకాన్ని విడిచి సుస్థితిని పొందాయి. దేవతలు, ఋషులు, పితృగణములు, దానవులు... వీరందరు ఇంద్రునితో చెప్పకుండానే తమతమ స్థానాలకు వెళ్ళారు." ఇంతవరకు వినిన పరీక్షిన్నరేంద్రుడు శుకయోగితో ఇట్లా అన్నాడు:

తే. ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక, సురలు వోయి? రట్టి సురగణంబు
లెందుచేత సుఖముఁ జెందిరి? వజ్రికిఁ జేటు గలుగు టెట్లు? చెప్పు మయ్య!

433

తా ॥ "ఎందుచేత ఇంద్రునితో చెప్పకుండా దేవతలు వెళ్ళారు? అలా వెళ్ళిన దేవగణం ఎందుచేత సుఖాన్ని పొందారు? అట్టి చేటు ఇంద్రునికి ఎలా కలిగింది? నాకు చెప్పవలసింది" అని అడిగాడు.

వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమ చకితులైన నిఖిల దేవతలును మహర్షి గణంబులును, మున్ను వృత్రవధార్థం బింద్రునిం బ్రార్థించిన, నతండు బ్రహ్మహత్య చేయఁజాలక, తొల్లియు విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబులందును విభజించి పెట్టితి, ఇపు డీ హత్య యేరీతిం బాపుకొనువాఁడ? నా కశక్యంబు అనిన మహర్షు లశ్వమేధ యజ్ఞంబు సేయించి, యజ్ఞ పురుషుండైన శ్రీ నారాయణదేవుని సంతుష్టునిం జేసి, యీ హత్యఁ బాపం గలవారము. స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జన హంతలైనవార లే దేవునిం

గీర్తించి శుద్ధాత్మ లగుదురు, అద్దేవుని నశ్వమేధ మహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యి ద్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయంగలదు? అని యొడంబఱచిన, నింద్రుండు వల్లెయని యీ విధంబున మూర్తునిం బరిమార్చి, బ్రహ్మహత్యం బొంది, యప్పాపంబు భరియింప నోపక దుర్దశం బొందె. నప్పుడు.

434

తా ॥ అప్పుడు శుకుడు ఇట్లా అన్నాడు: "మున్ను వృత్రుని యొక్క పరాక్రమానికి భయపడ్డ దేవతలు, మహర్షిగణం ఇంద్రుణ్ణి ప్రార్థించినప్పుడు అతడు 'ఈ బ్రాహ్మణ హత్యను నేను చెయ్యలేను. తొల్లి విశ్వరూపుని చంపిన పాపాన్ని స్త్రీలయందు, భూమియందు, జలములయందు, చెట్లయందు విభజించిపెట్టి బయట పడ్డాను. ఇప్పుడీ హత్యాపాపాన్ని ఎట్లా పోగొట్టుకోవాలి? అందువల్ల నేను ఈ వృత్రాసుర సంహారం నా వల్ల జరగని పని' అని సమాధానం ఇచ్చాడు. అప్పుడు మహర్షులంతా వృత్ర వధానంతరం నీచేత అశ్వమేధ యాగం చేయించి యజ్ఞపురుషుడైన శ్రీమన్నారాయణుణ్ణి సంతుష్టుని చేసి బ్రహ్మహత్యా పాపం నీకు అంటకుండా చేస్తాం, నిజానికి బ్రాహ్మణులను, తల్లిదండ్రులను, గోవులను, సజ్జనులను చంపిన వాళ్ళే ఆ నారాయణుడిని కీర్తించి పాపాన్ని బాపుకుంటారు. కనుక నువ్వు నారాయణుణ్ణి అశ్వమేధ యాగంలో శ్రద్ధతో సేవిస్తే నీచుడైన వృత్రుణ్ణి సంహరించిన పాపం నిన్ను ఏమీ చెయ్యదు. అని చెప్పి ఒప్పించేసరికి ఇంద్రుడు సరే అని వృత్రుణ్ణి పరిమార్చి బ్రహ్మహత్యను పొంది ఆ పాపాన్ని భరింపలేక దుర్దశను పొందాడు.

సీ. పాపంబుఁ జండాలరూపంబు గలదాని ముదిమిచే నొడలెల్లఁ గదలు దానిఁ క్షయకుష్ఠరోగ సంచయకృతం బగు దాని నురురక్త పూరంబుఁ దొరఁగు దాని నెరసిన వెంద్రుకల్ బెరసిన తలదాని నటఁ బోకుపో కుండు మనెడు దానిఁ గదురు కంపునఁ బ్రేవు లదరఁ జేసెడుదానిఁ దా నెందుఁ బాఱినఁ దఱుము దాని ఆ. నాగుణంబు లెల్ల భోగింప కేరీతి, నరుగ నెంతవాఁడ వనెడు దాని బిట్టు దిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో, దేవనాయకుండు

దెరలి పఱచె.



తా ॥ ఆ బ్రహ్మహత్యా మహా పాపం చండాల రూపంతో ఇంద్రుని వెంటపడింది. ముసలితనం చేత దాని శరీరం అంతా కదలుతూ క్షయ కుష్ఠరోగముల వలన రక్తం కారుతూన్నది. తలవెంట్రుకలు అన్నీ నెరసి "పోకు! పోకు!" అంటూ వెనకాలపడజొచ్చింది. ప్రేవులు బయటకు వచ్చేటంత చెడ్డ కంపు కొడుతూ తను ఎక్కడకు వెడితే అక్కడికే వస్తూన్నది. నా గుణములు అన్ని నువ్వు అనుభవింపకుండా వెళ్ళడానికి నువ్వు ఎంతటి వాడివి? — అంటూ వెనకాల పడుతూన్న బ్రహ్మహత్యా మహా పాతకాన్ని చూసి సిగ్గుతో, భయంతో దేవేంద్రుడు పరుగెత్త సాగాడు.

వ. ఇ ట్లతి వికృత రూపంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబు లెల్లం దిరిగి, చొరం దెరువులేక దీర్ఘ నిర్ఘాతాటోప నిశ్వాస దూషితుండై, యీశాన్య భాగంబునకుం బఱచి, యద్దెస నమేయ పుణ్యగణ్యంబైన మానస సరస్సుం బ్రవేశించి, యందు నొక్క కమల నాళంబు సొచ్చి, యందుఁ దంతువులం గలసి, రూపంబు లేక యలబ్ధభోగుండై, బ్రహ్మహత్యా విమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె. ఆ చండాలియు నది పరమేశ్వర దిగ్భాగం బగుటం జేసి యందుం జొరరాక కాచియుండె, అంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల యోగబలంబులం బాలించుచుండి, సంపదైశ్వర్య మదాంధుండై, యింద్రపత్నిం గోరి, యింద్రుండు వచ్చునందాఁ క నాకుం బత్నివి గమ్మనిన, నా శచీదేవియును బృహస్పతి ప్రేరితయై, బ్రహ్మర్షి వాహ్యశిబికంబు నెక్కివచ్చి, నన్ను భోగింపు మనిన, నతం డట్లు చేసి, కుంభ సంభవ శాపహతుండై, యజగర యోనియందుఁ బుట్టె. నంత నింద్రుండు బ్రహ్మర్షి గణోపహూతుండై, త్రిదివంబునకు వచ్చె. అంతకాలంబు నారాయణ చరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు, దిశాధినాయకుం డైన శంకరుచేత రక్షింపఁబడ్డవాఁడై

యుండుటం జేసియుఁ, ద ద్దోషబలంబు దఱిగి, సహస్రాక్షుం బీడింపలే దయ్యె. నప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది, బ్రహ్మర్షి పరివృతుండై, మహిపురుషారాధనంబు చేసి, హయామేధాధ్వరంబునకుం దీక్ష గైకొని, బ్రహ్మర్షులచేతం యజనంబు సేయింపఁ బడుచున్న వాఁడై, సర్వదేవతా మయుండైన నారాయణుం బరితృప్తుం జేసి, మంచు విరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్ర వధరూప పాపంబును నాశంబు నొందించి, సకల దివిజ యక్ష గంధర్వ సిద్ధ మునిజన సంస్తూయ మానుండయి త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గైకొనియె. అప్పుడు.

436

తా ॥ ఇట్లా వికృత రూపంతో బ్రహ్మహత్యా పాతకం వెంటపడే సరికి ఇంద్రుడు ఆకాశము, భూమి, దిక్కులు అన్నీ తిరిగాడు. ఎక్కడా చొరడానికి దారిలేక కడు దీర్ఘమైన నిట్టూర్పు ఒకటి విడిచి ఈశాన్య దిక్కుకు పరుగెత్తి అక్కడ అమేయ పుణ్యరాశి అయిన మానస సరస్సులోకి ప్రవేశించాడు. అందులోని ఒక పద్మ నాళంలో దూరి దాని తంతువులతో కలసి అదృశ్య రూపుడై ఏ భోగములు అనుభవించకుండ తాను చేసిన బ్రహ్మహత్యా దోషం ఎలా పోతుందా అని చింతిస్తూ వేయి సంవత్సరాలు ఉన్నాడు. ఈశాన్య దిక్కు పరమేశ్వరునికి సంబంధించినది కావడం వల్ల బ్రహ్మహత్య పాతకం ఆ కమలనాళంలో చొరలేక కాచుకొని ఉంది. అప్పుడు విద్యాబల తపోబల యోగబలముల చేత నహుషుడు స్వర్గాన్ని పాలిస్తూ ఐశ్వర్య మదంచేత శచీదేవిని కోరి ఇంద్రుడు వచ్చేటంత వరకు నాకు భార్యగా ఉండవలసింది అని కోరాడు. అంత శచీదేవి బృహస్పతి చెప్పినట్లు బ్రహ్మర్షులు మోస్తున్న పల్లకి ఎక్కి వచ్చి నన్ను భోగించవలసింది అన్నది.

నహుషుడు అట్లాగే చేసి అగస్త్య మహర్షి శాపానికి గురియై అజగర యోనియందు పుట్టి స్వర్గ భ్రష్టుడు అయ్యాడు. అప్పుడు ఇంద్రుడు బ్రహ్మర్షుల చేత ఆహ్వానింపబడి స్వర్గానికి వచ్చాడు. ఇంతకాలం నారాయణ చరణారవిందములను ధ్యానిస్తూన్న కారణంగానూ, వేయి సంవత్సరాలు

పరమేశ్వరుని దిక్కు అయిన ఈశాన్యంలో ఉన్న కారణంగానూ, బ్రహ్మహత్యా దోషం క్రమంగా క్షయించి ఇంద్రుణ్ణి పీడింపలేక పోయింది. పిమ్మట ఇంద్రుడు నిజైశ్వర్యాన్ని పొంది బ్రహ్మర్షులతో కూడి అశ్వమేధానికి దీక్షను గైకొని బ్రహ్మర్షులచేత యజ్ఞాన్ని చక్కగా జరిపించుకొన్న వాడై సర్వదేవతామయుడైన నారాయణుణ్ణి సంతృప్తుణ్ణి చేశాడు. దీనివల్ల మంచును కరిగించు సూర్యకిరణాల వలె త్వష్టకుమారుని వధ వలన కలిగిన పాపమును నశింపచేసుకున్నాడు. దేవతలు, యక్షులు, గంధర్వులు, సిద్ధులు, మునులు తనను స్తుతించ త్రిభువన భోగ భాగ్యములకు అధికారి అయ్యాడు.... ఇంద్రుడు.

చ. సతత మరీచి ముఖ్య మునిసంఘముచేత యథోచితంబుగాఁ
గృత ఘన వాజిమేధమునఁ గేశవు నీశుఁ బురాణ పూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి నిష్టఫలప్రదు నంతరంగ సం
గతు భజియించి వజ్రి గతకల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా!



తా ॥ ఈ విధంగా ఇంద్రుడు మరీచి మొదలైన మునులచేత యథావిధిగా అశ్వమేధ యాగాన్ని చేయించాడు. అందులో కేశవుడు, ఈశుడు, పురాణ పురుషుడు, హితుడు, జగదీశుడు, యజ్ఞపతి, ఇష్టఫలప్రదుడు, అందరి అంతరంగములలోను ఉండేవాడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి ఆరాధించి తన కల్మషాలన్నింటిని పోగొట్టుకుని వర్ధిల్లాడు.

సీ. మఱియుఁ బుట్టింపంగ మనుసు వెట్టినయట్టి క్రూరకర్మాంభోధి కుంభజుండు
అంగారములు సేయ నాహుతిఁ గన నోపు బహు పాపకానన పావకుండు
కందక దిగమ్రింగి గఱ్ఱునఁ ద్రేపంగఁ గల్మషగరళ గంగాధరుండు
ఘనగుహాంతరములఁ గాలూన నియ్యని కలుష దుస్తర తమోగ్రహవిభుండు

ఆ. సకల ముక్తిలోక సామ్రాజ్య సమధిక, సహజ భోగ భాగ్య సంగ్రహైక
కారణాప్రమేయ కంజాక్ష సర్వేశ, కేశవాది నామ కీర్తనంబు.

తా ॥ పునర్జన్మలకు కారణభూతమైన క్రూర కర్మలను సముద్రాన్ని పానం చేసిన అగస్త్యుడులాగా శ్రీహరి పానం చేయగలడు. మహా పాపములనే కీకారణ్యములను ఆహుతులు గైకొనే అగ్నిహోత్రునిలాగా స్వీకరిస్తాడు. భక్తుల కల్మషములనే గరళాన్ని కందకుండా దిగమ్రింగి గ్రున త్రేన్చే గంగాధరుని పోలినవాడు. తరించుటకు శక్యము కాని కలుషములనే చీకట్లను గుహలలో సైతం కాలు పెట్టనియ్యని సూర్యుని వంటివాడు. అట్టి కమలనేత్రుడైన కేశవుని యొక్క నామ సంకీర్తనం ముక్తిలోక సామ్రాజ్యాన్ని, సకల భోగభాగ్యములను సమకూరుస్తుంది.

సీ. అఖిల దుఃఖైక సంహారాది కారణం బఖిలార్థ సంచ యాహ్లాదకరము
విమల భక్త్యుద్రేక విభవ సందర్శనం బనుపమభక్త వర్ణనరతంబు
విబుధహర్షానేక విజయ సంయుక్తంబు గ్రస్తామరేంద్ర మోక్షక్రమంబు
బ్రహ్మహత్యానేక పాప నిస్తరణంబు గమనీయ సజ్జన కాంక్షితంబు

తే. నైన యీ యితిహాసంబు నధికభక్తి, వినిఁ జదివిన వ్రాసిన ననుదినంబు
నాయు రారోగ్య విజయభాగ్యాభివృద్ధి, కర్మనాశము సుగతియుఁ గలుగు ననఘ!

439

తా ॥ పవిత్రమైన వృత్రాసుర సంహారమనే ఈ ఇతిహాసాన్ని అధిక భక్తితో చదివినా, వ్రాసినా, విన్నా వారికి ఆయువు, ఆరోగ్యము, విజయము, భాగ్యము, కర్మనాశము, అభివృద్ధి, సుగతి... ఇవన్నీ కలుగుతాయి. అఖిల దుఃఖములు నశిస్తాయి. అఖిలమైన కోరికలు నెరవేరుతాయి. స్వచ్ఛమైన భక్తిని పెంపొందిస్తుంది. మహాభక్తులను సందర్శించాలనే కోరిక పుడుతుంది. విబుధులైన వారికి హర్షాన్ని చేకూరుస్తుంది. అమరులకు ఆనందాన్ని కలిగిస్తుంది. బ్రహ్మహత్య వలన కలిగే పాపాన్ని సైతం పోగొడుతుంది. సజ్జనులు ఎప్పుడూ దీనినే కోరతారు."

సీ. నావుడు యోగీంద్ర! నా మనం బీ వృత్రు వివరంబు నీచేత విన్న మొదలు

కడు నద్భుతంబునఁ గళవళం బందెడుఁ, గోరి రజస్తమోగుణములందు
వర్తించు నీ పాపవర్తికి నేరీతి మాధవ పదభక్తి మది వసించె?
సత్త్వ స్వభావులై సమబుద్ధు లై తపో నియమ ప్రయత్నులై నిష్ఠచేత

తే. నిర్మలాత్మకు లై నట్టి ధర్మపరుల, కమరులకుఁ బుణ్యమునులకు నంబుజాక్షు
భూరి కైవల్య సంప్రాప్తి మూలమైన, భక్తి వీనికిఁ బోలె నేర్పాటు గాదు.

440

తా ॥ అప్పుడు పరీక్షిత్తు ఇలా అంటున్నాడు: "ఓ యోగీంద్రా! నా మనస్సు వృత్రుని వివరాలన్నీ విన్నది మొదలు ఆశ్చర్యంతో కళవళ పడుతూన్నది. ఎప్పుడూ రజస్తమోగుణముల యందు మాత్రమే ప్రవర్తించే ఆ పాప చరితునకు మాధవుని యందు భక్తి ఎలా కుదిరింది? సత్వగుణ సంపన్నులు, సమబుద్ధులు, తపో నియమ సంపన్నులు, నిష్ఠాపరులు, నిర్మలాత్ములు, ధర్మమూర్తులు అయిన అమరులకు, పుణ్యాత్ములైన మునులకు సైతం శ్రీహరి మీది భక్తి ఈ వృత్రుని వలె కుదరదే? అట్టి గొప్పదైన కైవల్యానికి మూలమైన భక్తి ఇతనికి ఎలా సంప్రాప్తించింది?

సీ. భూస్థలిఁ గల రేణువులకన్న దట్టమై కడు నొప్పు జీవసంఘములు గలవు,
ఆ జీవములలోన నరయ ధర్మాయత మతి వసించినవారు మనుజజాతి
యీ మనుష్యులలోనఁ గామంబు లెడఁబాసి మోక్షార్థు లగువారు మొదల
నరిది, మోక్షమార్గం బాత్మ మూలంబుగా నుండు వారిలో ముక్తులు లేరు తఱచు

తే. ముక్తు లై నట్టి వారిలో యుక్తిఁ దలఁపఁ, జాల దుర్లభుఁ డమిత ప్రశాంతి పరుఁడు
పరమ సుజ్ఞాన నిరతుండు భద్రగుణుఁడు, రమణ శ్రీవాసుదేవపరాయణుండు.

441

తా ॥ ఈ భూమి మీద ఉన్న రేణువులకంటే, అధికంగా జీవసముదాయం ఉంది. ఆ

జీవులలో ధర్మంగా జీవించేవారు మనుష్యజాతి. ఈ మనుష్యులలో కామ వాంఛలను త్రోసిపుచ్చి మోక్షాన్ని కోరేవారు చాలా అరుదు. అట్టి మోక్షార్థులలో ముక్తిమార్గాన్ని చేరుకున్నవారు చాలా తక్కువ. అట్టి ముక్తులయిన వారిలో శాంతి పరుడు, పరమ సుజ్ఞాన నిరతుడు, భద్రమైన గుణములు కలవాడు, వాసుదేవుని యందు భక్తి కలవాడు దుర్లభుడు.

తే. సకలలోకాపకారి దుస్సంగతుండు, వృత్రుఁ డేక్రియ సుజ్ఞాన నిరతుఁ డయ్యె?
సమరమునఁ బౌరుషంబుచే నమరవిభుని, నెట్టు మెప్పించె? దీని నా కెఱుఁగఁ జెపును.

442

తా ॥ అట్టి స్థితిలో సకల లోకాపకారి, దుస్సాంగత్యం కలవాడు అయిన వృత్రుడు అంత గొప్ప జ్ఞానవంతుడు ఎలా అయ్యాడు? యుద్ధరంగంలో దేవేంద్రుణ్ణి ఎలా మెప్పించాడు? దీనిని నాకు తెలియ చెప్పవలసింది.”

## 15. చిత్రకేతూపాఖ్యానము

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాది మునులకుం జెప్పి, మఱియు నిట్లనియె. అట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణ శ్రద్ధాపరుండై యిట్లనియె. తొల్లి కృష్ణద్వైపాయన నారద దేవల మహర్షులు నా కెఱింగించిన యితిహాసంబు గలదు దాని నెఱింగించెద. సావధానుండ వై యాకర్ణింపుము అని యిట్లనియె.

443

తా ॥ అని ఈ ప్రకారంగా పరీక్షిత్తు శుకయోగీంద్రుణ్ణి అడిగాడ" ని, సూతమహర్షి శౌనకాది మునులతో చెప్పాడు. అట్లా పరీక్షిత్తు అడిగేసరికి శుక మహర్షి శ్రీహరి స్మరణయందు శ్రద్ధతో ఇట్లా అన్నాడు: "పూర్వం కృష్ణ ద్వైపాయనుడు, నారదుడు, దేవల మహర్షి నాకు తెలియచెప్పిన వృత్తాంతం ఒకటి ఉన్నది. దానిని నీకు చెబుతాను. సావధానంగా వినవలసింది..." అని ఇట్లా చెప్పడం మొదలు పెట్టాడు:

చ. అమితవిభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరసేన దే
శములకు భర్త యై ప్రజలు సంతస మందఁగ సార్వభౌముఁడై
క్షమ దన కెల్లకాలమును గామ దుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణమండనుఁ డంచిత కీర్తికాముఁడై.

444

తా ॥ "అపారమైన ఐశ్వర్యాన్ని కలిగి, ఇంద్రునితో సమానంగా, శూరసేన దేశాన్ని చిత్రకేతువు అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని పాలనలో ప్రజలు అంతా సంతోషంగా ఉండేవారు. ఆ మహారాజు విశ్వమంతటా వ్యాపించిన కీర్తి కలవాడు, సద్గుణముల చేత ప్రకాశించే వాడు.

సీ. మానిత తారుణ్య మదనతురంగులు కందర్ప విజయైక ఖడ్గలతలు
మదనసమ్మోహన మంత్రాధిదేవతల్ పంచశిలీముఖు బందెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు నడకించు బొమ్మలు నాత్మసంభవుని కట్టాయితములు
పుండ్రేక్షుకోదండు భూరితేజంబులు శంబర విద్వేషి సాయకములు

తే. నాఁగఁ బొలుపారు నొకకోటి నళినముఖులు, దనకుఁ బత్నులు గాఁగ నత్యంత విమల
కీర్తివైభవ సన్మార్గవర్తి యగుచు, జగతిఁ బాలింపుచుండె నా జనవిభుండు.

445

తా ॥ ఆ చిత్రకేతువు మహారాజుకు అనేక మంది భార్యలు ఉన్నారు. వారందరూ అరుదైన రూపలావణ్యాలను కలిగి ఉన్నవారు. వారు చిగురుటాకులవలె, ఆటబొమ్మలవలె, పుష్పబాణములవలె సౌందర్యాన్ని కలిగి ఉన్నారు. వారందరితో కలిసి ఉంటూ, తన అఖండ కీర్తి వైభవంతో ఆ రాజు రాజ్యపాలనను సన్మార్గంలో గావిస్తున్నాడు.

తే. కలిమి వేవేలు భార్యలు గలిగియుండఁ, బరఁగ సంతతి యొకరునిఁ బడయ లేక
చిత్తమునఁ జాల బాయని చింత వొడమి, బడలఁ జొచ్చెను వేసవి మడువువోలె.

446

తా ॥ వేలకొలది భార్యలు ఉన్నా ఆ చక్రవర్తికి సంతానం కలగలేదు. సంతాన కాంక్షతో అతని చిత్తం విచారంతో వేసవికాలంలో మడుగులాగా రోజురోజుకు క్షీణించ సాగింది.

ఉ. రూపము సత్ప్రతాపము మరుత్పతిభోగము యౌవనంబు సం
దీపిత చారువర్తనము దిగ్విజయంబును సత్యముం జగ
ద్వ్యాపిత కీర్తియున్ సతులు వైభవముఖ్యము లెల్ల మాన్పఁగా
నోపకయుండె నా నృపతి నొందిన సంతతిలేని దుఃఖమున్.

447

తా ॥ అతనికి అందమైన రూపం, ప్రతాపం, భోగం, యౌవనం, చక్కని నడవడిక ఉన్నాయి. అతని విజయాలకు కొరతలేదు. సత్యము, కీర్తి, భార్యలు... ఇన్ని వైభవములు ఉన్నా సంతతిలేని దుఃఖాన్ని తీర్చలేక పోయాయి.

వ. ఇట్లు సంతతి లేక యతిదుఃఖ మానసుండైన యా నరేంద్రుని మందిరంబున కంగిరసుం డను మహాముని వచ్చి, యతని చేత నతిథిసత్కారంబులు వడసి, కుశలం బడిగి, రాజ్యంబు భవదధీనంబు కదా! పృథివ్యప్తేజో వాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపఁబడిన జీవుండునుం బోలె, నమాత్య జనపద దుర్గ ద్రవిణ సంచయ దండ మిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండ వై, ప్రకృతి పురుషులయందు భారంబు వెట్టి, రాజసుఖంబు లనుభవింతువు కదా! మఱియు దార ప్రజామాత్య భృత్య మంత్రి పౌర జానపద భూపాలురు నీకు వశవర్తులు గదా! సర్వంబునుం గలిగి సార్వభౌముండ వైన నీ వదనంబు విన్నఁ దనంబు గలిగి యున్నయది. కతంబేమి? అనిన నా మునిప్రవరునకు నతండు, మీ తపోబలంబున మీకు నెఱుంగరాని యదియుం గలదే? అని తలవంచి యూరకున్న నతని యభిప్రాయం బెరింగి, యా భగవంతుండైన యంగిరసుండు దయాళుండై, పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేష మతని యగ్ర మహిషి యైన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్రుండు గలిగెడి. అతని వలన సుఖదుఃఖంబు లనుభవింపగలవు అని చెప్పి చనియె. ఆ కృతద్యుతి యనుదేవి గర్భంబు ధరియించి, నవమాసంబులు నిండినం గుమారునిం గనియె. ఆ కాలంబున రాజును, సమస్త భృత్యామాత్య జనంబులును బరమానందంబునం బొందిరి. అపుడు చిత్రకేతుండు కృతస్నానుండై, సకల భూషణ భూషితుండై, సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి, బ్రాహ్మణులకు నపరిమిత హిరణ్య రజత దానంబులును, వస్త్రా భరణంబులును, గ్రామంబులును, గజంబులును, వాహనంబులును, ధేనువులును, నాఱేసి యర్బుదంబుల ద్రవ్యంబును దానంబు సేసి, ప్రాణి సముదాయంబునకుం బర్జన్యుండునుం బోలెఁ దక్కినవారలకు నిష్టకామంబులు వర్షించి, పరమానంద హృదయుండై యుండె. అంతం బుత్రమోహంబునం గృతద్యుతి యందు

బద్ధానురాగుం డై మహీధవుండు వర్తింపుచుండం, దక్కిన భార్యలు సంతాన సంతోష వికలలై, యీ మోహంబునకుం గారణంబు పుత్త్రుండ యని యీర్ష్యం జేసి దారుణచిత్తలై కుమారునకు విషం బిడిన, సుఖనిద్రితుండునుం బోలె బాలుఁడు మృతిఁ బొందె. అప్పుడు వేఁగుటయు దాది బోధింపం జని, యా కుమారుని వికృతాకారంబుఁ జూచి, విస్మయ శోక భయార్తయై పుడమిం బడి యాక్రందించె. నప్పుడు.

448

తా ॥ ఇట్లు సంతానం లేక బాధపడుతున్న ఆ రాజు యొక్క మందిరానికి ఒకరోజున అంగిరసుడు అనే మహాముని వచ్చాడు. వచ్చిన మహర్షి చిత్రకేతువు నుండి అతిథి సత్కారాలు పొంది కుశల వార్తలు అడిగి ఇలా అన్నాడు: "హే! రాజన్! రాజ్యం అంతా నీ అధీనంలో ఉన్నది కదా! పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశము, మహత్తు, అహంకారము అనే ఏడింటి చేత జీవుడు రక్షింపబడుతున్నట్లే... ప్రభువైన నీవు అమాత్యులు, మిత్రులు అనే సప్త ప్రకృతుల చేత రక్షింపబడుతూ రాజ్య భోగములు అనుభవిస్తున్నావు కదా? నీ భార్యలు, ప్రజలు, మంత్రులు, పౌరులు, జనపదులు, సామంతులు... అంతా నీవు చెప్పినట్లే నడుచుకుంటున్నారు కదా! సర్వాన్ని కలిగి సార్వభౌముడవైన నీ ముఖంలో విచారం గోచరిస్తున్నది. దానికి కారణం ఏమిటి?"

అని అడిగిన ముని శేఖరునితో ఆ రాజు, 'మీ తపోబలం చేత మీరెరుగనిది లేదు కదా స్వామీ!' అని మాట్లాడలేక తలవంచుకొని కూర్చున్నాడు. అతని అభిప్రాయాన్ని తెలుసుకొని మహాత్ముడైన అంగిరసుడు దయతో రాజు చేత పుత్రకామేష్టిని చేయించాడు. ఆ యజ్ఞశేషాన్ని అతని పెద్ద భార్య అయిన కృతద్యుతికి ఇచ్చి వెళ్ళిపోయాడు. నీకు పుత్రుడు కలుగుతాడు, అతని వలన నీవు సుఖదుఃఖములు అనుభవిస్తావు అని చెప్పిన అంగిరసుని వాక్కు చొప్పున ఆమె గర్భాన్ని ధరించి నవ మాసములు నిండిన తదుపరి కుమారుని కన్నది. అప్పుడు రాజు, సమస్తమైన భృత్యులు, అమాత్యులు సంతోషాన్ని పొందారు. అప్పుడు చిత్రకేతువు స్నానం చేసి

సకల భూషణాలు ధరించి కుమారునికి జాతకర్మను నిర్వర్తించాడు. బ్రాహ్మణులకు అపరిమితంగా బంగారము, వెండి, వస్త్రాభరణాలు, గ్రామాలు, ఏనుగులు, వాహనాలు, ఆవులు, అపారమైన ద్రవ్యం దానం చేశాడు. ప్రాణికోటికి మేఘం వలె తక్కిన వారికి ఇష్టకామ్యాలను వర్షించాడు. పుత్రవ్యామోహం చేత కృతద్యుతి యందు పరమానందంతో ఉన్నాడు. తక్కిన భార్యలు దీనిని చూచి సహించలేక రాజు యొక్క మోహానికి పుత్రుడే గదా కారణం అని ఈర్ష్యచే, కర్కశ హృదయులై ఆ బాలునికి విషప్రయోగం చేసేసరికి సుఖంగా నిద్రపోతూన్నవాడు నిద్రపోతూన్నట్లే మృతి చెందాడు. అప్పుడు తెల్లవారింది. నిద్ర లేపుదామని వెళ్ళిన దాది బాలుని వికృతాకారాన్ని చూచి విస్మయంతోనూ, భయంతోనూ భూమిపైబడి ఏడవటం మొదలుపెట్టింది.

తరల.

పుడమి నిట్టక నిల్వునం బడి పొక్కుచుం గడుదీనయై
యడఁకు వేమియు లేని వాక్కుల నావు రంచు విలాపమం
దెడరు తోఁప భృశాతురోన్నతి నేడ్చినన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి కాంత గ్రక్కున నేగుచున్.

449

తా ॥ నేలమీద పడి దీనంగా భోరుమని దుఃఖీస్తూన్న దాది యొక్క ఏడుపు విని మహారాణి వెంటనే అక్కడకు వచ్చింది.

ఆ. బాలుఁ డొక్కరుండు పరిణామశీలుండు, వంశకర్త తపసి వరము వలనఁ
బుట్టి మిన్న కట్లు పొలిసియున్నట్టి యా, కొడుకుఁ జూచి తల్లి యడలఁ జొచ్చె.

450

తా ॥ తన ఏకైక పుత్రుడు, క్రమంగా పెరిగి పెద్దవాడవుతూన్న వంశకర్త, తాపసి వరం వల్ల జన్మించినవాడు... చనిపోవటం చూసి తల్లి మిక్కిలి శోకించింది.

ఉ. కుంకుమరాగ రమ్య కుచకుంభములన్ గడు కజ్జలంబుతోఁ
బంకిలమైన బాష్పములఁ బాల్పడ మజ్జన మాచరింపుచున్
కంకణపాణి పల్లవయుగంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావిత పంచమ సుస్వరంబునన్.

451

తా ॥ కుంకుమ పువ్వు పూతలతో శోభిస్తూన్న కుచకుంభములు కాటుక కంటి నీటితో తడిసి స్నానము చేయగా, కంకణములచేత అలంకరింపబడిన తన చిగురాకువంటి చేతులతో రొమ్ము బాదుకుంటూ కోయిల కంఠంతో ఏడవసాగింది.

క. ఆ యార్తరవమునకు భూ, నాయకుఁడు భయంబు నొంది నయ ముడిగి సుతున్
డాయఁగ వేగంబునఁ జని, పాయని మోహంబు తోడ బాలుని మీఁదన్.

452

స్రగ్విణి. వ్రాలి యో పుత్ర! నీ వార్త దంభోళియై, కూలఁగా వ్రేయ కీ కొద్ది న న్నేటికిన్ జాలి
నొందించె? నా జాడ యిం కెట్టిదో?, తూలి మీ తల్లికిన్ దుఃఖ మె ట్లాఱునో?

453

తా ॥ ఆ రోదన ధ్వనికి మహారాజు భయాన్ని పొంది, పరుగున తన కుమారుణ్ణి చూడాలనే సంకల్పంతో వచ్చి, చనిపోయిన బాలుని మీద పడ్డాడు. కుమారా! నీ మరణవార్త పిడుగుపాటులాగ నన్ను చంపకుండా ఎందుకు బ్రతికించిందో? ఇక నేనెట్లా బ్రతికేదిరా? నీ తల్లికి ఈ దుఃఖం ఎట్లా చల్లారుతుంది? అంటూ విలపించసాగాడు.

వ. అని తల మొల యెఱుంగక పలవించుచు, భృత్యామాత్య బంధుజనంబులం గూడి యడలుచు నున్న యా రాజు దుఃఖం బెఱింగి, యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి, మృతుండైన పుత్రుని పదతలంబున మృతుండునుం బోలె పడియున్న యా

రాజునుం గనుంగొని యిట్లనియె.

454

తా ॥ ఈ విధంగా తలమునకలుగా దుఃఖావేశంలో భృత్యులు, అమాత్యులు, బంధుజనంతో కూడి బాధపడుతున్నాడు. ఆ రాజు యొక్క దుఃఖాన్ని తెలుసుకుని అంగిరసుడు నారదునితో కలసి వచ్చి చనిపోయిన కుమారుని కాళ్ళదగ్గర మృతునివలె పడిఉన్న రాజును చూచి ఇట్లా అన్నాడు:

సీ. నీకు వీఁ డెవ్వఁడు? నీ వెవ్వనికి శోక సంతాప మందెదు సార్వభౌమ?
పుత్త్ర మిత్త్రాదులు పూర్వజన్మంబున నెవ్వని వారలో యెఱుఁగఁ గలరె?
మొదలు నదీవేగమున నాడ కాడకు సికతంబు గూడుచుఁ జెదరుచుండు,
నారీతిఁ బ్రాణుల కతికాల గతిచేతఁ బుట్టుట సచ్చుట పొసఁగుచుండుఁ

ఆ. గాన భూతములకుఁ గలుగు భూతంబులు, మమత తోడ విష్ణుమాయఁ జేసి
దీని కడల నేల? ధృతిఁ దూలఁగా నేల? బుద్ధిఁ దలఁప వలదె? భూత సృష్టి.

455

తా ॥ "ఓ రాజా! నీకు వీడు ఏమవుతాడు? నీవు ఎవరికోసం దుఃఖపడుతున్నావు? ఈ జన్మలో పుత్రమిత్రాదులు పూర్వజన్మలో నీకు ఏమవుతారో తెలుసునా? నదీ ప్రవాహ వేగానికి అక్కడక్కడ ఇసుక తిన్నెలు ఏర్పడుతూ ఉంటాయి. మళ్ళీ అవి చెదరిపోతూ ఉంటాయి. ఆ విధంగానే కాల ప్రవాహంలో ప్రాణులు పుడుతూ ఉంటాయి, చచ్చిపోతూ ఉంటాయి. కనుక విష్ణుమాయ వల్ల జీవులకు జీవులు జన్మిస్తూన్నట్లు కనిపిస్తుంది. అందుకు సంతోషించడం కాని మరణిస్తూంటే విచారించడం గాని తగదు.

వ. మఱియు నేను, నీవును, దక్కిన వారలును బ్రవర్తమాన కాలంబునం గలిగిన జన్మంబు నొంది, మృత్యువు వలన విరామంబు నొందంగలవారమై యిపుడ లేకపోవుదుము. చావు

పుట్టువులకు నిక్కువంబు లేదు. ఈశ్వరుండు దన మాయచేత భూతజాలంబుల వలనం భూతంబులం బుట్టించు, వాని నా భూతంబుల చేతనే రక్షించు. వాని నా భూతంబులచేతన హరించు. స్వతంత్రంబు లేని తన సృష్టిచేత బాలుండునుం బోలె నపేక్ష లేకయుండు. దేహియైన పితృదేహంబు చేత దేహియైన పుత్రదేహంబు మాతృదేహంబు వలనం గలుగుచుండు. ఆ ప్రకారంబున బీజంబు వలన బీజంబులు పుట్టుచు నుండు. దేహికి నివి శాశ్వతంబై జరుగు చునుండు. పూర్వకాలంబున సామాన్య విశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దేవిధంబునం గల్పింపంబడియె, నా ప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్య విభాగంబు పూర్వకాలంబున నజ్ఞాన కల్పితం బయ్యె. జన్మఫలంబులను జూచుచున్న వారికి దహనక్రియల నగ్ని పెక్కు రూపంబులం గానంబడు భంగి, నొకండైన జీవుండు పెక్కుభంగుల వెలుంగుచుండు. ఇవి యన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహి దేహసంయోగంబున స్వప్నంబునందు భయావహం బైన ప్రయోజనంబు నడపుచుండి, మేలుకాంచి, యా స్వప్నార్థంబైన ప్రయోజనంబు తనది గాదని యెరుంగుభంగి, జీవుండే తా నని జ్ఞానగోచరుండైన వాఁడెఱుంగు. కావున నన్నియును మనోమాత్రంబని తెలిసి, మోహతమంబు వాసి, భగవంతుండైన వాసుదేవుని యందుఁ జిత్తంబు వెట్టి, నిర్మలాత్మకుండ వగుము అని బోధించినం జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె.

456

తా ॥ ఓ రాజా! నీవు, నేను, తక్కినవారు మనమందరము వర్తమాన కాలంలో ఇక్కడ ఉన్నాము. మరణించిన పిదప ఇక్కడ ఉండము. కనుక చావు పుట్టుకలు సత్యం కాదు. ఈశ్వరుడు తన మాయ వలన ప్రాణులకు ప్రాణులనే పుట్టిస్తాడు, వాటిని ఆ ప్రాణులే రక్షిస్తాయి... ఆ ప్రాణులే వాటిని హరిస్తాయి. ఈ సృష్టి ఈశ్వరునికి ఒక క్రీడ. దీనియందు ఆయనకు ఏమాత్రము అపేక్ష లేదు. లోకంలో తల్లిదండ్రుల వలన పిల్లలు కలుగుతారు. బీజం వల్ల బీజం పుట్టడం అనేది ప్రకృతి సిద్ధమైన ధర్మం. అందువల్ల దేహికి ఇది శాశ్వతమైన ధర్మం. దేహము–జీవుడు అనే విభాగం, ఇది అజ్ఞాన కల్పితం. అగ్ని స్వభావం చేత ఒక్కటే అయినా,

లోకంలో పెక్కు రూపాలలో కానవచ్చినట్లుగా జీవుడు ఒక్కడే అయినా పెక్కు రీతులుగా కానవస్తూ ఉంటాడు. నిద్రిస్తూన్నప్పుడు వచ్చే కలల్లో నవరసాలు అనుభవిస్తూ మేల్కొని కల అని తెలుసుకుంటాం. అదే విధంగా ఈ బాంధవ్యాలు నిజం కావని తెలుసుకో. అజ్ఞానాంధకారం నుండి వెలువడి వాసుదేవుని యందు నీ చిత్తాన్ని నిలిపి నిర్మలాత్ముడవు కావలసింది" అని చెప్పేసరికి విని చిత్రకేతుడు అంగిరసునితో ఇలా అన్నాడు:

సీ. యతివేషములు పూని యతి గూఢగతి నిందు నేతెంచినట్టి మీ రెవ్వరయ్య?
కడఁగి నన్ బోలిన గ్రామ్యబుద్ధుల నెల్ల బోధింప వచ్చిన పుణ్యమతులొ?
రమణఁ గుమార నారద ఋష భాదులొ దేవ లాసితు లను ధీరమణులొ?
వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ గౌతమ శుక రామ కపిల మునులొ?

తే. యాజ్ఞవల్క్యుండుఁ దరణియు నారుణియును, చ్యవన రోమశు లాసురి జాతుకర్ణ
దత్తమైత్రేయ వర భరద్వాజ బోధ్య, పంచ శిఖులొ? పరాశర ప్రభీతి మునులొ?

457

క. వీరులలో నెవ్వరు సుర, చారణ గంధర్వ సిద్ధ సంఘంబులలో
వారలొ? యీ సుజ్ఞానము, కారణమై యెవరియందుఁ గలదు తలంపన్?

458

తా ॥ "యతి వేషములు ధరించి అతి గూఢంగా ఇక్కడకు వచ్చిన మీరెవ్వరు? మందబుద్ధి కలిగిన నాలాంటి వానికి బోధించడానికి వచ్చిన పుణ్యమూర్తులా? సనత్కుమారులా? నారద ఋషభాదులా? అసిత దేవలులా? వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ, గౌతమ శుక, పరశురామ, కపిలులా? లేక యాజ్ఞవల్క్య, తరణి, ఆరుణి, చ్యవనుడు, రోమశుడు, ఆసురి, జాతుకర్ణుడు, దత్తాత్రేయుడు, మైత్రేయుడు, భరద్వాజుడు, పంచ శిఖుడు, పరాశరుడు మొదలైన మునులా? కాక దేవతలు, చారణులు, గంధర్వులు, సిద్ధులు మొదలైన వారా? అట్టివారు కానిచో ఇంత సుజ్ఞానం ఎవరిలో ఉంటుంది?

క. పొందుగ గ్రామ్య పశుత్వముఁ, బొంది మహాశోకతమముఁ బొందిన నాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ, జెందించిన వారి మిమ్ముఁ జెప్పుడు తెలియన్.

459

తా ॥ కేవలం పశుత్వాన్ని పొంది మహాశోకంలో ఉన్ననాకు దివ్యజ్ఞానమును బోధించిన మీరు ఎవ్వరో నాకు తెలియచెప్పండి?"

వ. అనిన నంగిరసుం డిట్లనియె. నేను పుత్త్రకాంక్షివైన నీకుం బుత్త్రుం బ్రసాదించిన యంగిరసుండ. ఇతండు బ్రహ్మపుత్త్రుండైన నారదభగవంతుండు. దుస్తరంబైన పుత్త్రశోకంబున మగ్నుండ వైన నిను ననుగ్రహించి, పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి. నీ దుఃఖం బెఱింగి, బుత్త్రు నిచ్చితి మేనిఁ బుత్త్రవంతులైన వారి తాపంబు నీచేత ననుభవింపంబడు. ఈ ప్రకారంబున లోకంబున సతులును, గృహంబులును, సంపదలును, శబ్దాదులయిన విషయంబులును, రాజ్యవైభవంబును జంచలంబులు. మఱియు రాజ్యంబును, భూమియును, బలంబును, ధనంబును, భృత్యామాత్య సుహృజ్జనంబులును మొదలయినవి శోక మోహభయ పీడలం జేయుచుండుం గాని సుఖంబుల నీ నేరవు. గంధర్వ నగరంబునుం బోలె స్వప్న లబ్ధ మనోరథంబునుంబోని యర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబులయిన యర్థంబులం గూడి స్వార్థంబులై కానంబడనేరవు. కర్మంబులచేత ధ్యానంబులు సేయుచుండు మనంబులు నానాకర్మంబు లగుచు నుండు, నీ దేహిదేహంబు ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబై దేహికి వివిధ క్లేశసంతాపంబులం జేయుచుండుఁ గావున నీవు నిర్మలంబయిన మనంబుచేత నాత్మగతి వెదకి ధ్రువం బయిన పదవి నొందు మనియె. అప్పుడు నారదుం డిట్లనియె, నుపనిషద్గోప్యంబగు నే నిచ్చు మంత్రం బెవ్వండేని సప్తరాత్రంబులు పఠియించు, నతండు సంకర్షణుండైన భగవంతునిం జూచు నెవ్వని పాదమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి యీ మోహంబు వదలి యతి శీఘ్రంబున నుత్తమ

పదంబు నొందు, మిప్పు డిక్కుమారునకును నీకును బ్రయోజనంబు గలదేనిం జూడు మని నారదుండు మృతబాలకుని కళేబరంబు జూచి యోజీవుండ! నీకు శుభం బయ్యెడు. ఇందుఁ బ్రవేశించి మీ తల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరల దుఃఖంబు లార్చి యీ కళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు ననుభవించి పితృధీనంబైన రాజ్యాసనంబునం గూర్చుండు మనిన న బ్బాలుం డిట్లనియె.

460

తా ॥ ఈ విధంగా అడిగిన చిత్రకేతునితో అంగిరసుడు ఇట్లా అన్నాడు: "నీవు పుత్రకాంక్షతో ఉన్నప్పుడు నీచేత పుత్రకామేష్ఠిని చేయించి నీకు పుత్రుణ్ణి ప్రసాదించిన అంగిరసుణ్ణి నేనే! ఇతడు బ్రహ్మమానస పుత్రుడైన నారద మహర్షి. పుత్రశోకంలో కూరుకుపోయిన నిన్ను అనుగ్రహించి జ్ఞానాన్ని ఉపదేశించడానికి వచ్చాం. నీకు తిరిగి పుత్రుణ్ణి అనుగ్రహిస్తే పుత్రవంతులైన వారికి కలిగే తాపం తిరిగి నీకు కలుగుతుంది. లోకంలో భార్యలు, గృహములు, సంపదలు, శబ్దాదులైన విషయములు, రాజ్య వైభవములు... ఇవన్నీ చంచలములు. ఇంకొక్క విషయం... రాజ్యం, భూమి, బలము, ధనము, భృత్యులు... వీటితోటి సంబంధాలన్ని శోక మోహ భయపీడలను కలగచేస్తాయే కాని సుఖాలను ఇయ్యవు. జాగ్రదవస్థలో మన మనస్సులో కలిగే భావాలే స్వప్నంలో కనిపిస్తూంటాయి, తిరిగి అదృశ్యమవుతూ ఉంటాయి. ఈ జీవి యొక్క దేహం ఉన్నదే అది ద్రవ్యము, జ్ఞానము, క్రియ అనే వాటితో కూడి ఈ దేహికి దుఃఖ కారణం అవుతుంది. కనుక నువ్వు నిర్మలమైన మనస్సుచేత ఆత్మజ్ఞానాన్ని అలవరచుకొని శాశ్వతమైన పదవిని పొందు."

అప్పుడు నారదుడు ఇట్లా అన్నాడు: "ఉపనిషత్తులలో చెప్పబడిన ఒక మంత్రాన్ని నేను నీకు చెబుతాను. ఈ మంత్రాన్ని ఏడు రాత్రులు ఎవడు పఠిస్తాడో అతడు సంకర్షణుండైన భగవంతుని చూస్తాడు. సర్వాశ్రయమైన శ్రీమన్నారాయణుని పాదకమలములను సేవించి లోకంమీది మోహాన్ని వదలి శీఘ్రంగా ఉత్తమ పదాన్ని పొందుతాడు. ఇప్పుడీ కుమారునికి, నీకు

ఎటువంటి సంబంధము లేదు. ఒకవేళ నీకు ఏదైనా ఇతనిలో ప్రయోజనం ఉందని భావిస్తున్నావేమో! అలా అయితే చూడు" అని నారదుడు మృత బాలుని కళేబరాన్ని చూచి "ఓ జీవుడా! నీకు శుభం! నీవు తిరిగి ఈ శరీరంలో ప్రవేశించి నీకున్న ఆయుశ్శేషాన్ని అనుభవించి పిత్రాధీనమైన రాజ్యాన్ని అనుభవించు" – అని అనేసరికి ఆ బాలుడు ఇట్లా అన్నాడు:

తే. కర్మవశమున నెందు సుఖంబు లేక, తిర్యఙ్ను యోనులఁ దిరుగు నాకు
వెలయ నే జన్మమందునొ వీరు తల్లి, దండ్రు లయినారు చెప్పవే తాపసేంద్ర!

461

తా ॥ "ఓ తాపసేంద్ర! నా కర్మవశం చేత సుఖం అనేది లేకుండ నేను ఇన్నాళ్ళూ అనేక యోనుల యందు పుట్టాను. ఏ జన్మలో వీరు నాకు తల్లిదండ్రులు అయ్యారో చెప్పవలసింది?

తే. బాంధవజ్ఞాతిసుతులును బగతు రాత్మ, వరు లుదాసీన మధ్యస్థవర్గములును సరవిఁ
గనుచుందు రొక్కొక్క జన్మమునను, నెఱయఁ బ్రాణికి నొక వావి నిజము గలదె?

462

తా ॥ బాంధవులు, జ్ఞాతులు, సుతులు, శత్రువులు, ఆత్మీయులు, ఉదాసీనులు, మధ్యవర్గం వారు... ఇట్లా కర్మానుసారంగా జీవునకు కలుగుతూ ఉంటారు. వాస్తవంగా జీవునకు ఎవరితోనూ సంబంధం అంటూ ఏమీ లేదు.

తే. రత్నములు హేమములు ననురాగలీల, నమ్మకంబుల నీవల నావల నగు భంగి
నరులందు జీవుండు ప్రాప్తుఁ డగుచు, నెలమిఁ దిరుగుచునుండుఁ, దా నెందుఁ జెడఁడు.

463

తా ॥ రత్నములు, బంగారము మన కోరికను అనుసరించి, ఎలా క్రయవిక్రయాలలో అటు ఇటు చేరుతూ ఉంటాయో అలాగే జీవుడు కూడా అక్కడ ఇక్కడ పుడుతూ ఉంటాడు.

తనలో మాత్రం ఎట్టి మార్పు ఉండదు.

సీ. ఒక్కఁడై నిత్యుఁడై యెక్కడఁ గడలేక సొరిది జన్మాదుల శూన్యుఁడగుచు
సర్వంబు నందుండి సర్వంబుఁ దనయందు నుండంగ సర్వాశ్రయుం డనంగ
సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమునఁ వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు నఖిల ప్రభావుఁడై యఖిలంబు దనయందు నడఁచి కొనుచు

తే. నాత్మమాయాగుణంబుల నాత్మమయము, గాఁగ విశ్వంబుఁ దనసృష్టి ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వసంజీవనుండు, రమణ విశ్వాత్ముఁ డయిన నారాయణుండు.

464

తా ॥ శ్రీమన్నారాయణుడున్నాడే ఆయన. ఆయన నిత్యుడు, శాశ్వతుడు. ఆయనకు జన్మాదులు లేవు. సర్వము ఆయనలో ఉంటుంది, అంతటా ఆయన ఉన్నాడు. ఆయన సర్వాశ్రయుడు. సూక్ష్ముడు స్థూలుడూ, స్వప్రకాశుడు. అఖిలమును చూస్తూ అఖిలాన్ని తన ప్రభావంచేత నడుపుతూ అఖిలమును తనయందు అణచుకుంటాడు. ఆయన ఎల్లప్పుడూ తన సృష్టికి ఘనతను చేకూరుస్తూ ఉంటాడు.

క. సతు లెవ్వరు? సుతు లెవ్వరు?, పతు లెవ్వరు? మిత్ర శత్రు బంధు ప్రియ సం
గతు లెవ్వరు? సర్వాత్మక, గతుఁడై గుణసాక్షి యైన ఘనుఁ డొక్కనికిన్.

465

తా ॥ సర్వాత్ముడు, సర్వమునకు సాక్షి అయిన ఆయనకు సతులు, సుతులు, పతులు, మిత్రులు, శత్రువులు, బంధువులు, ప్రియులు అంటూ ఎవ్వరూ లేరు.

## 16. చిత్రకేతుని తపస్సు – నారాయణుని అనుగ్రహం

వ. మఱియు సుఖదుఃఖంబులఁ బొందక సర్వోదాసీనుండై పరమాత్మయై యుండు న ప్పరమేశ్వర రూపుండ నయిన నాకును మీకు నెక్కడి సంబంధంబు? మీకు దుఃఖంబునకుం బని లేదని పలికి యా జీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతి విస్మిత చిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునా నది యందు నక్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించిరి, చిత్రకేతుండు గాఢపంకంబునం బడి వెడలిన యేనుంగునుంబోలె గృహాంధకూపంబునందుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగఁ గృతస్నానుండై మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధి పూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె. చిత్రకేతుండును నారదోపదేశ మార్గంబున నిరాహారుండై సమాధినియతుండై నారాయణ రూపంబయిన యా విద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతంబయిన విద్యాధరాధిపత్యంబున భాస్వద్రత్న దివ్య విమానంబునుం బడసి నారాయణునను గ్రహంబునుం బొంది మనోగమనంబునం ద్రిజగంబులం జరియించుచుండఁ గొన్ని దినంబులకు నొక్కచోట.

466

తా ॥ మరియు సుఖదుఃఖాలను పొందక, అన్ని విషయాలలోను ఉదాసీనుడనై, పరమేశ్వర స్వరూపుడనైన నాకు, మీకు ఎట్టి సంబంధము లేదు. మీరు నా కొరకు దుఃఖించవలసిన అవసరము లేదు.” అని ఇట్లా పలికి ఆ జీవుడు వెళ్ళిపోయాడు. అప్పుడు చిత్రకేతుమా, అతని బంధువులు ఎంతో విస్మయాన్ని పొంది శోకాన్ని విడిచిపెట్టి యమునానదీ తీరానికి వెళ్ళి ఆ కుమారునికి ఉత్తర కర్మలు చేసారు. పిమ్మట చిత్రకేతువు బురద నుండి బయట పడ్డ ఏనుగువలె సంసారం అనే అంధకూపం నుండి బయటపడి యమునా నదిలో స్నానం చేసి మౌనంగా నారదునకు నమస్కరించాడు. అతడు ప్రసన్నుడై భగవన్మంత్రాన్ని ఉపదేశించాడు.

అనంతరం నారదుడు అంగిరసునితో కలిసి బ్రహ్మలోకానికి చేరుకున్నాడు. పిమ్మట చిత్రకేతుడు నారదుడు చెప్పినట్లు నిరాహారుడై సమాధిలో ఉండి నారాయణ స్వరూపాన్ని ధ్యానం చేసాడు. ఏడు రాత్రులు ఆ విద్యను ఆరాధించే సరికి విద్యాధర చక్రవర్తిత్వం లభించింది. నారాయణుని అనుగ్రహం చేత ఒక దివ్య విమానాన్ని అధిరోహించి మనోవేగంతో మూడు లోకాలు సంచరించసాగాడు.

సీ. తారహారపటీర ధవళ దేహమువాని రమణీయ నీలాంబరంబువాని
మణికిరీట స్ఫురన్మస్తకంబులవానిఁ గంగణకేయూర కరమువానిఁ
గర్బురమయదీప్త కటిసూత్రములవానిఁ దరళయజ్ఞోపవీతములవాని
నతిసుప్రసన్న వక్త్రాంబుజంబులవానిఁ దరుణవివృత్త నేత్రములవాని

ఆ. సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర, సిద్ధి వెలసినట్టి యిద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ బాదపీఠంబైన, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు.

467

తా ॥ ఆ సమయములో... తారకల వలె, మంచి ముత్యాల వలె, మంచి గంధము వలె, తెల్లదైన దేహం కలవానిని, అందమైన నీలాంబరమును ధరించిన వానిని, మణికిరీటముల చేత ప్రకాశించు శిరస్సులు కల వానిని, కంకణములు కేయూరములు ధరించిన హస్తములు కల వానిని, బంగారపు మొలనూలు ధరించిన వానిని, ప్రకాశించు యజ్ఞోపవీతములు కలవానిని, సుప్రసన్నమైన వక్త్రాంబుజముల వానిని, విశాలమైన నేత్రములు కలవానిని శ్రీమహా విష్ణువుకు పాదపీఠమైన వానిని, ఘనుడైన ఆదిశేషువును చూచాడు చిత్రకేతు మహారాజు. సిద్ధ సంఘం సేవిస్తూండగా ఆయన పుణ్యరాశిగా వెలుగొందుతున్నాడు.

ఆ. కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి, విమలచిత్తుఁ డగుచు విశదభక్తి
నిట్టరోమములకుఁ బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె.

468

తా ॥ అట్టి పావన మూర్తి అయిన ఆదిశేషువును చూసేసరికి చిత్రకేతువు పాపములన్ని తొలగిపోయాయి. భక్తితోను, నిర్మలమైన మనస్సుతోను పులకించి పోయాడు. శరీరం అంతా రోమాంచం కలిగి ఆనంద భాష్పములు రాలగా నమస్కరించాడు చిత్రకేతువు.

క. సంతోషాశ్రులచేత న, నంతునిఁ బరిషిక్తుఁజేసి యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక, కొంతయుఁ బలుకంగలేక కొండొక వడికిన్.

469

తా ॥ సంతోషముతో కూడిన అశ్రుధారలతో ఆదిశేషువును అభిషేకించి అతడు సంతోషాతిశయంతో ఏమీ పలకలేక కొంతసేపు అలా ఉండిపోయాడు.

చ. మది నొకయింతమాత్రన సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసిన యింద్రియంబుల నొకంతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం
గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్చుచు శాశ్వత విగ్రహంబునా
సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి సేయఁదొడంగె నిమ్ములన్.

470

తా ॥ అలా కొంతసేపయిన తర్వాత బాహ్య వర్తనం లోనికి వచ్చి, ఇంద్రియములను స్వాధీనం చేసుకొని, మనస్సును వాక్కును అధీనంలోనికి తెచ్చుకుని దయామూర్తి, పరమ శాంతుడు, లోక గురువు అయిన ఆది శేషువును ఈ విధంగా సన్నుతి చేయసాగాడు:

క. అజితుఁడవై భక్తులచే, విజితుఁడ వైనాఁడ విపుడు వేడుక వారున్
విజితులు నీచేఁ గోర్కులు, భజియింపనివారు నిన్నుఁ బడయుదురె హరీ!

471

తా ॥ "ఓ అనంతా! నువ్వు అజితుడవు (జయించశక్యం కాని వాడివి) అయినా భక్తులచే

విజితుడవు (భక్తులకు లొంగిపోతావు). ఆ భక్తులు కూడా నీ చేత జయింపబడ్డవారు. కోరికలను జయింపలేనివారు నిన్ను చేరగలరా?

ఉ. నీ విభవంబు లీ జగము నిండుట యుండుట నాశమొందుటల్
నీ విమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించువార లో
దేవ! భగవద్గుణాంబుధుల తీరముఁ గానక యీశ! బుద్ధితో
వావిరిఁ జర్చచేయుదురు వారికి వారలు దొడ్డవారలై.

472

తా ॥ ఈ లోకములు పుట్టడం, పెరగటం, నశించటం అనేవి నీ అంశలు మాత్రమే. ఈ జగములను సృజించు వాళ్ళు నీ గుణ సముద్రములో అవతలి ఒడ్డు చేరలేక వారిలో వారే గొప్ప వాళ్ళం అనుకొని చర్చ చేసుకుంటూ ఉంటారు.

క. పరమాణువు మొదలుగఁ గొని, పరమము దుదిగాఁగ మధ్యపరికీర్తనచే
స్థిరుఁడవు త్రయీవిదుఁడవై, సరి సత్త్వాద్యంత మధ్య సదృశగతుఁడవై.

473

తా ॥ వేదవేత్తవయిన నీవు పరమాణువు మొదలు పరతత్త్వం వరకు వ్యాపించి ఉన్నావు. స్థిరుడవైన నీవు ఆద్యంతముల మధ్య అంతటా వ్యాపించి ఉన్నావు.

తే. ఉర్వి మొదలైన యేడు నొండొకటికంటె, దశగుణాధికమై యుండు, దానినండ
కోశమందు, రజాండంబు కోటి యెవని, యందు నణుమాత్రమగు ననంతాఖ్యుఁ డతఁడు.

474

తా ॥ పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, మహత్తు, అహంకారము అనే ఏడున్నూ ఒకదాని కంటే మరొకటి పదిరెట్లు అధికంగా ఉన్నాయి. దానినే అండకోశము

అంటారు. ఇట్లాంటి అండకోశములు కోటాను కోట్లు నీలో అణుమాత్రంగా ఉన్నాయి. అందు వల్లనే నువ్వు అనంతుడవు అయ్యావు.

వ. మఱియు నొక్కచోట విషయతృష్ణాపరులైన నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మాని యైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు, వారిచ్చు సంపదలు రాజకులంబునుంబోలె వారలం గూడి నాశంబునం బొందుచుండు, విషయకాము లేని నిన్ను సేవించినవారు వేఁ చిన విత్తనంబునుం బోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు, నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞాన రూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునింగా జ్ఞానులు భావింతురు. నీ భజనం బేరూపున నయిన మోక్షంబు ప్రసాదించు. జితమతివైన నీవు భాగవత ధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి, వా ప్రకారంబున సర్వోత్కృష్టుండ వయిన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబు కొఱకు సేవించుచున్నారు. ఈ భాగవత ధర్మంబునందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ డన్యకామ్యధర్మంబునందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని వచియించు చున్నవాఁ డధర్మనిరంతుండై క్షయించుచుండు. స్థావర జంగమ ప్రాణి సమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రం? ఇపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశయము లుండనైతి. మూఢుండ నయిన నాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె, నది నేఁడు నాకు వరదుండవైన నీకతంబున దృష్టంబయ్యె, ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండవైన నీ మహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్రసిద్ధం బైనదిగా, దం దుత్పత్తిస్థితి లయకారణుండవై భగవంతుండవైన నీకు నమస్కరించెద నని మఱియును.



తా ॥ కోరికలలో కూరుకు పోయిన నరపశువులు పరతత్వం అయిన నిన్ను కాదని తక్కిన

దేవతలని ఆరాధిస్తారు. వారిచ్చే సంపదలు కొంతకాలం ఉండి ఆ తరువాత నశించి పోతాయి. కోరికలు లేకుండా నిన్ను సేవించినవారు వేయించిన విత్తనాలవలె మరణానంతరం తిరిగి జన్మించరు. నిర్గుణుడవు అయిన నిన్ను జ్ఞానవిజ్ఞాన రూపాలను పొందిన గుణవంతునిగా జ్ఞానులు భావిస్తారు. ఏ రూపంలో నిన్ను సేవించినా వారికి మోక్షమునే నీవు ప్రసాదిస్తావు. నీవు భాగవత ధర్మాన్ని ఏ ప్రకారంగా నిర్ణయించావో, అదే విధంగా ఉంటూ ఉన్నతుడవైన నిన్ను మోక్షాన్ని కోరి సనత్కుమారాదులు సేవిస్తున్నారు. ఈ భాగవత ధర్మాన్ని ఆచరించు వారిలో జ్ఞానహీనుడు ఒక్కడూ లేడు. అన్యులైన వారు మందబుద్ధిచేత “నేను, నీవు, నాకు, నీకు” – అని అంటూ అధర్మాన్ని ఆశ్రయించి నాశనం అవుతున్నారు. సమస్తమైన ప్రాణులను సమదృష్టితో చూసే వానికి నీ దర్శనం వలన పాపం నశించడంలో ఆశ్చర్యంలేదు. ఇప్పుడు నీ పవిత్ర పాదదర్శనం వలన నాలోని మాలిన్యం అంతా పూర్తిగా నశించింది. అజ్ఞానంలో ఉన్న నాకు పూర్వం నారద మహర్షి అనుగ్రహం వల్ల ఈ భాగవత ధర్మం పట్టుబడింది. అందువల్ల నేడు నీ దర్శనం ప్రాప్తించింది. మిణుగురులకు సూర్యుడు కనిపించనట్లు సామాన్యులకు నీ మహత్త్వం గోచరించదు. ఈ జగత్తు యొక్క ఉత్పత్తికి స్థితికి లయమునకు కారణభూతుడవైన సర్వేశ్వరా! నీకు నమస్కారము.

తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ననునయించి, భక్తియుక్తుల మనమునఁ బ్రస్తుతింతు
రవని యెవ్వని తలమీఁద నావగింజఁ, బోలు నా వేయిశిరముల భోగిఁ గొల్తు.

476

తా ॥ బ్రహ్మాదులు ఎవరిని ఆశ్రయించి భక్తియుక్తులతో మనస్సులలో ప్రస్తుతిస్తారో; ఈ భూమి ఎవని తలమీద ఆవగింజవలె నిలబడుతుందో... అట్టి వేయి శిరస్సులతో వెలుగొందే నిన్ను నేను కొలుస్తాను.”

క. ఈ విధమున వినుతింపఁగ, నా విద్యాధరులభర్త కనియె ననంతుం
డో విమలబుద్ధి! నీ దగు, ధీ విభవంబునకు మెచ్చితిం బ్రియమారన్.

477

ఆ. అరయ నారదుండు నంగిరసుండును, దత్త్వ మొసంగినారు, దాని కతన
నన్నుఁ జూడఁగల్గె నా భక్తి మదిఁ గల్గె, నా పథంబు నీకు నమ్మఁ గలిగె.

478

తా ॥ అని ఈ విధంగా వినుతించేసరికి, 'ఓ చిత్రకేతుడా! నీ బుద్ధి వైభవానికి ప్రియాన్ని పొందాను' అని ఆది శేషుడు ఇంకా ఇలా అన్నాడు: "నారదుడు, అంగిరసుడు నీకు నా యథార్థ స్వరూపాన్ని చెప్పారు. ఆ కారణంగా నన్ను చూడగలిగావు. నీ మనస్సులో నాయందు భక్తి స్థిరంగా నెలకొన్నది. నా మార్గం నీకు అవగాహన అయింది.

సీ. పూని నా రూపంబు భూతజాలంబులు, భూతభావనుఁడ నేఁ బొందువడఁగ
బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వతంబైన తనువులు దగిలె నాకు
నఖిలలోకములందు ననుగతంబై యుందు, లోకంబు నాయందు జోకఁ జెందు,
నుభయంబు నాయందు నభిగతంబై యుండు, నభిలీన మగుదు న య్యుభయమందు!

తే. వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ, జూచి మేల్కాంచి తా నొక్క చోటివానిఁ
గా వివేకించు మాడ్కి నీ జీవితేశ, మాయ దిగనాడి పరమధర్మంబుఁ దెలియు.

479

తా ॥ ఈ భూత జాలములన్నీ నా రూపములే. నేను కేవలము సర్వభూతముల భావనలో మాత్రమే ఉంటాను. బ్రహ్మము మరియు శబ్ద బ్రహ్మము అనే రెండు శాశ్వతమైన శరీరములు ఉన్నాయి నాకు. నేను అన్ని లోకములలోను ఉన్నాను, అన్ని లోకాలు నాలో ఉన్నాయి. ఈ రెండు స్థితులు నాకున్నాయి. ఈ రెంటి యందు నేను లీనమై ఉంటాను. నిద్రించే వాని యొక్క ఆత్మ ఈ విశ్వమంతా వ్యాపించి, తెలివి వచ్చాక తానెక్కడ ఉన్నది తెలుసుకుంటాడు. అదే విధంగా ఈ జీవులు కొంత కాలానికి మాయను విడిచి పరమ ధర్మాన్ని తెలుసుకుంటారు.

ఆ. నిద్ర వోవువేళ నిరుత్తరుడై దేహి దా, నెట్టి గుణముచేత నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ గను, నట్టి బ్రహ్మంబుఁ, గడిమి మెరయ నన్నుఁగా నెరుంగు.

480

తా ॥ నిద్రపోయేటప్పుడు జీవుడు పిలిస్తే పలుకకుండగా, ఏ గుణములు లేకుండా ఇంద్రియాతీతంగా ఉంటాడో, అట్టి ఆనంద స్థితినే బ్రహ్మముగా తెలుసుకో; ఆ బ్రహ్మమే నేను.

ఆ. స్వప్నమందు నెట్లు సంచార మొనరించు, మేలుకాంచి దృష్ట మోలి నెఱుంగు
నుభయ మెఱుఁగునట్టి యుత్తమజ్ఞానంబు, తత్త్వ, మట్టిదైన తలఁపు నేను.

481

తా ॥ స్వప్నంలో జీవుడు అనేక చోట్ల సంచారం చేసి పిమ్మట మేల్కొని స్వప్నంలో చూసిన దానిని గుర్తుకు తెచ్చుకుంటాడు. ఈ ఉభయ స్థితులను తెలుసుకునే ఉత్తమ జ్ఞానమే "నేను".

సీ. అరయంగ నెవ్వని కలవిగానట్టి యీ సలలిత మానుషజాతిఁ బుట్టి
యాత్మతత్త్వ జ్ఞానహతుఁడైన వానికిఁ గలుగునె యెందు సుఖం బొకింత?
వెలయఁ బ్రవృత్తినివృత్తి మార్గంబుల సుఖదుఃఖ చయముల సొరిదిఁ దెలిసి
పనిచెడి సంకల్పఫల మూలమునఁ బాఱి కడు సుఖదుఃఖ మోక్షములకొఱకు

ఆ. దంపతి క్రియామతంబు వర్తింతురు, దాన మోక్ష మేల దక్కి యుండు?
నఖీల దుఃఖహేతు వయిన యీ కర్మంబు, నెఱిఁగి నన్నుఁ దలఁప రిచ్చలోన.

482

తా ॥ లోకంలో ఎవరికీ సాధ్యంకాని ఈ మానవ జన్మను ఎత్తి కూడా ఆత్మతత్త్వ జ్ఞానాన్ని తెలుసుకోకుండా ఉంటే వానికి ఒకింత కూడ సుఖం లభించదు. జనులు ప్రవృత్తి నివృత్తి మార్గాలలో సుఖదుఃఖముల క్రమాన్ని తెలుసుకొని దుఃఖ నివృత్తి కోసం యత్నిస్తూ ఉంటారు.

కొందరు దాంపత్య ధర్మాన్ని అవలంబిస్తారు. దానివల్ల మోక్షం ఎలా వస్తుంది? నన్ను విస్మరించి దుఃఖహేతువైన ఈ కర్మలలో చిక్కుకొన్న వారికి మోక్షం కలగదు.

వ. మఱియు విజ్ఞానాభిమాను లయిన మనుష్యులకు నతి సూక్ష్మంబయిన యాత్మగతి నిజస్థానత్ర యలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబులచేతను వివేక బలంబుచేతను నియుక్తుండై జ్ఞానవిజ్ఞాన సంతృప్తుండైన పురుషుండు నాకు భక్తుండగు నీ విధంబులు గలవారలు యోగ నైపుణ్య బుద్ధి గలవారలునై స్వార్థంబయిన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు. నీవు నీ క్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండవై విజ్ఞాన సంపన్నంబులైన వాక్కులచేత స్తోత్రంబుసేసి ముక్తుండ వైతి వని యా శేషభగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుండై పోయె. ఏ దిక్కున సర్వాత్మకుండైన యనంతుం డంతర్ధానంబు నొందె, నా దిక్కునకు విద్యాధర భర్త నమస్కరించి గగనచరుండై చని లక్షల సంఖ్యలైన దివ్య వర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగి పురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణగంధర్వులును వినుతి సేయం గుల ద్రోణాది శైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు శ్రీనారాయణ దత్తంబగు దివ్యవిమానంబు నందుఁ జరియించుచు నుండి.

483

తా ॥ విజ్ఞానాభిమానులైన మానవులు జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అనే మూడు అవస్థలను దాటి తురీయమైన ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలి. అట్టి పురుషుడు ఐహిక, ఆముష్మిక విషయముల చేత, వివేకం చేత నియుక్తుడై, జ్ఞానవిజ్ఞానముల చేత సంతృప్తుడై నాకు భక్తుడవుతాడు. ఇట్టివాళ్ళు యోగంలో నైపుణ్యాన్ని సంపాదించి ఆత్మ వలన పరమాత్మను దర్శిస్తారు. నువ్వు ఈ క్రమంలో నాయందు భక్తిశ్రద్ధలు కలిగి విజ్ఞానంతో కూడిన వాక్కుల చేత స్తోత్రం చేసి ముక్తుడవు అయ్యావ" ని భగవంతుడైన ఆదిశేషువు చిత్రకేతువుతో పలికి అదృశ్యుడయ్యాడు.

అంత చిత్రకేతువు భగవంతుడు అంతర్ధానమైన దిక్కుకు నమస్కరించి, గగనచారియై లక్షల దివ్య సంవత్సరాలు అడ్డులేని బలంతో యోగులు, మునీంద్రులు, సిద్ధచారణ గంధర్వులు తనను వినుతిసేయ ద్రోణాది పర్వతాలు, ఇంకా ఇతర రమ్య ప్రదేశములలోను వినోదించాడు.

శా. ఆడించున్ హరి దివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం,
బాడించున్ జలజాత నేత్రబిరుద ప్రఖ్యాత గీతంబులం,
గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ గోవిందనామావళుల్
క్రీడం గిన్నరయక్ష కామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై.

484

తా ॥ చిత్రకేతువు కిన్నర, యక్షకాంతల చేత శ్రీహరి దివ్య నాటక గుణములను నృత్యం చేయించాడు. ఆ జలజాత నేత్రుని ప్రఖ్యాతమైన గీతములను వారిచే పాడించాడు. ఆ గోవిందుని నామాలను వారి నాలుకల మీద పలికించాడు.

సీ. వాసించు నాత్మఁ బో వైష్ణవ జ్ఞానంబు, నాశించు భాగవతార్చనంబు,
భూషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని, భాషించు హరికథా ప్రౌఢి మెఱసి,
ఘోషించు హరినామగుణనికాయంబులు, పోషించుఁ బరతత్త్వ బోధ మరసి,
సేవించు శ్రీకృష్ణ సేవకనికరంబు, సుఖమునఁ జేయు నీశునకు బలులు,

తే. పాడుఁ బాడించి వైకుంఠభర్త నటన, రూపవర్తన గుణనామ దీపితోరు
గీతజాతప్రబంధ సంగీత విధులఁ, గేశవ ప్రీతిగాఁ జిత్రకేతుఁ డపుడు.

485

తా ॥ చిత్రకేతుడు మనస్సులో వైష్ణవ జ్ఞానాన్ని, భాగవత అర్చనాన్ని గుబాళింపచేసుకున్నాడు. ఎప్పుడూ పుండరీకాక్షుణ్ణి స్తుతిస్తూ, ఆ హరి యొక్క కథలనే చెబుతూ ఉండేవాడు. ఎల్లప్పుడూ హరి గుణములనే చాటుతూ ఆ పరతత్త్వం యొక్క బోధలనే చెబుతూ

ఉండేవాడు. శ్రీకృష్ణ సేవకులను సేవిస్తూ వాళ్ళకే సుఖమును కలిగిస్తూ ఉండేవాడు. కృష్ణుని పాటలు పాడుతూ, పాడిస్తూ ఆయన గుణములనే సంకీర్తనం చేసేవాడు.

## 17. చిత్రకేతుణ్ణి పార్వతీదేవి శపించుట

మ. హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు సేవించుచుం
బరమానందము నొందుచున్ జగములం బ్రఖ్యాతి వర్తించుచున్
సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేఁగుచున్.

486

తా ॥ ఈ ప్రకారంగా హరిని కీర్తిస్తూ, మనస్సులో సేవిస్తూ, పరమానందాన్ని పొందుతూ, లోకంలో కీర్తి ప్రతిష్ఠలతో వెలుగొందుతూ... ఇంద్ర సన్నిభుడైన చిత్రకేతు మహారాజు యక్ష గణములు, విద్యాధరులు, అప్సరసలు తనను కొలువగా హిమవత్పర్వత ప్రాంతంలో సంచరించ సాగాడు.

శా. ఆ విద్యాధరభర్త గాంచె హరనీహారామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజాసేవాగతాయాసమున్
దేవానీక వికాసమున్ శుభమహాదేవాంఘ్రి సంవాసమున్
భూవిఖ్యాత విలాసముం ద్రిభువనీ పూతంబుఁ గైలాసమున్.

487

తా ॥ అలా సంచరిస్తూ కైలాస పర్వతాన్ని సందర్శించాడు. శివుని వలె, మంచువలె, అమృతమువలె ఆ రజత పర్వతం ప్రకాశిస్తూన్నది. సిరులతో వెలుగొందుతూ ఉన్నది. గిరిజామహేశ్వరులను సందర్శించడానికి వచ్చే భక్తుల ఆయాసాన్ని పోగొడుతున్నది. అమరులకు వికాసాన్ని ఇస్తూ ఉన్నది. పరమేశ్వరుని పాద స్పర్శచే పవిత్రమైనది, విశ్వవిఖ్యాతిని పొందింది, మూడు లోకాలను పవిత్రం చేసేది.

క. ఆ రజత భూధరంబున, నీరేజభవామరాది నికరము గొల్వం
బేరోలగమున నుండిన, గౌరీయుతుఁడయిన హరునిఁ గనియె నరేంద్రా!

488

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! ఆ వెండికొండ మీద బ్రహ్మాది దేవతలు అంతా కొలువ, గౌరీదేవితో కూడియున్న పరమేశ్వరుణ్ణి చూసాడు ఆ చిత్రకేతు మహారాజు.

సీ. తన నిజరూప మింతయు నున్కి దెలియక, వాదంబుసేసెడు వేదరవముఁ
గరుణావలోకనాకాంక్షితులై యున్న బ్రహ్మాది సనకసంప్రణుతిరవము
సారశివానంద సల్లాపముల నొప్పు ప్రమథగణాళి యార్భటరవంబు
డమరుమృదంగాది ధమధమధ్వనితోడి పటుభృంగి నాట్యవిస్ఫారరవము

తే. మానుగాఁ జామరలు వీచు మాతృకాది, కామినీజన మహిత కంకణరవంబు
మెండు జెలఁగఁగఁ గన్నుల పండువయ్యెఁ, గొండరాచూలి పెనిమిటి నిండుకొల్వు.

489

తా ॥ ఆ కొలువుకూటం ఎలా ఉంది అంటే ఒక ప్రక్క పరమ శివుని యొక్క యథార్థ స్వరూపం తెలియక వేదరాశి తమలో తాము వాదించుకుంటున్నాయి, మరొక ప్రక్క ఆయన యొక్క కరుణాతరంగిత వీక్షణం కోసం బ్రహ్మ, సనకుడు ఇత్యాది వారందరూ స్తుతిస్తున్నారు. వేరొక ప్రక్క శివుని యొక్క ఆనంద సల్లాపములను చెప్పుకుంటూ ప్రమథగణాలు ఆర్భాటం చేస్తున్నాయి. ఇంకొక ప్రక్క డమరుకము, మృదంగము ఇత్యాది వాద్యధ్వనులతో భృంగీశ్వరాదులు నాట్యం చేస్తున్నారు. మరొకవైపు చామరములు వీచే కామినుల కంకణరవం చెవులకు పండుగ చేస్తూన్నది. ఈ ప్రకారంగా పార్వతీ పరమేశ్వరుల కొలువుకూటం కన్నులకు పండువగా ఉంది.

వ. ఇట్లు బ్రహ్మాది సురనికర సేవితుండై యూరుపీఠంబున నున్న భవానిఁ గౌఁగిటం

జేర్చుకొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగి యద్దేవి వినుచుండ నిట్లనియె.

490

తా ॥ ఈ ప్రకారం బ్రహ్మాది దేవతాసమూహం సేవిస్తూ ఉండగా తన తొడమీద అధివసించి ఉన్న భవానీ దేవిని కౌగిట చేర్చుకున్నాడు పరమేశ్వరుడు. అది చూచి చిత్రకేతుడు పకపక నవ్వి పార్వతీదేవి వింటూ ఉండగా ఇలా అన్నాడు:

సీ. కొమరొప్పఁగా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబుఁ దాన యగుచు
జడలు ధరించియు సరిలేని తపమునఁ బొడవైన యీ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో మిథున రూపంబున మెలఁతతోడఁ
బ్రాకృతుండునుబోలె బద్ధానురాగుఁడై లాలితుం డయ్యె నిర్లజ్జత నిట

ఆ. నకట! ప్రకృతి పురుషుఁ డై నఁ దా నేకాంత, మందు సతులతోడ నలరుఁగాని
యిట్లు ధర్మసభల నింతులతోఁగూడి, పరిఢవింపలేఁడు భ్రాంతి నొంది.

491

తా ॥ "తాను సకలలోకాలకు గురువై ఉండి, పరమేశ్వరుడు జటాధారులు, తపస్సంపన్నులు, యోగి పుంగవులు, బ్రహ్మవాదులు అయిన మహర్షులు తనను కొలుస్తుండగా, లౌకికుని వలె అనురాగబద్ధుడై నిర్లజ్జగా భార్యను కౌగిలించుకున్నాడు. అకటా! ఎట్టి పామరుడైనా ఏకాంతంలో సతులతో క్రీడిస్తాడు కాని ఇట్లా ధర్మ సభలలో ఇంతులతో కలిసి సల్లాపములు సాగింపలేడు కదా!"

క. అన విని పరమేశ్వరుఁ డా, తని నేమియు ననక నవ్వెఁ దత్సభవారుం గనుఁగొని యూరక యుండిరి, మనుజేశ్వర! యీశుధైర్య మహి మెట్టిదియో?

492

తా ॥ అనగా విన్న పరమేశ్వరుడు అతన్ని ఏమీ అనక ఒక చిరునవ్వు నవ్వాడు. ఆ సభలో ఉన్నవారు కూడా దానిని చూచి ఊరకున్నారే కాని అంతకు మించి వారుకూడా ఏమీ అనలేదు.

వ. ఇట్లు దన పూర్వకర్మశేషంబున నింద్రియజయుండ నని పుట్టిన యహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుఁ జూచి భవాని యిట్లనియె.

493

తా ॥ అయితే పూర్వకర్మశేషం వల్లనో, జితేంద్రియుడను అని పుట్టిన అహంకారం వల్లనో కాని; సాక్షాత్తు పరమేశ్వరుణ్ణి పెక్కు దుర్భాషలాడిన చిత్రకేతువును చూచి పార్వతీదేవి ఇలా అన్నది:

క. మముబోఁటి లజ్జ లుడిగిన, కుమతులకుం గర్త యగుచుఁ గోపింపంగా
నమితాజ్ఞానిపుణుం డగు, శమనుండా నేఁడు వీఁడు జగముల కెల్లన్?

494

తా ॥ "మా వంటివారిని సిగ్గుమాలిన వారనీ, మతిలేనివారని కోపించడానికి, ఆక్షేపణ చేయడానికి తగిన ఘనత ఇతని వద్ద ఉన్నదా? ఇతను జగాలన్నింటిని పాలించేవాడా!

క. భృగునారద కపిలాదులు, నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో!

495

తా ॥ భృగుమహర్షి, నారదుడు, కపిల మహర్షి మొదలైన వేదాంతులు, యోగ విద్యా విశారదులు సైతం త్రిగుణాతీతుడు అయిన పరమేశ్వరుణ్ణి చూచి ఎప్పుడూ నవ్వలేదే! అతనికి తెలిసిన ఆపాటి ధర్మనిర్ణయం వాళ్ళకి తెలియదా?

సీ. ఎవ్వని పదపద్మ మింద్రాది విబుధుల, చూడాగ్ర పంక్తుల నీడఁ జూచు,

నెవ్వని తత్త్వంబ దెనయంగ బ్రహ్మాది, యోగిమానసపంక్తి నోలలాడు,
నెవ్వని రూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద
మడుచు నెవ్వని కారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యెంతయు ధన్యతములఁ జేయు

తే. నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు, శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గు పల్కిన పాపాత్ముఁ డెల్లభంగి, దండనార్హుండు గా కెట్లు దలఁగఁ గలఁడు?

496

తా ॥ ఈశ్వరుని యొక్క పాదపద్మాలు ఇంద్రాది దేవతల కిరీట కాంతులలో ఎప్పుడూ విరాజిల్లుతూ ఉంటాయి. మహేశ్వరుని యొక్క తత్త్వాన్ని తెలుసుకోవడానికి బ్రహ్మాది మహా యోగుల మనస్సులు ఓలలాడుతూ ఉంటాయి. మహాదేవుని యొక్క రూపాన్ని నిరూపించలేక వేదాలు వాదులాడుకుంటూ ఉన్నాయి. పరమేశ్వరుని కారుణ్యం సృష్టికంతటికీ ధన్యతను చేకూరుస్తుంది. అట్టి సర్వేశ్వరుని, పాప సంహారుని, ధీరుని, శాశ్వతైశ్వర్యుని, ఆత్మ సంసారుని, ఈశ్వరుని దూషించిన ఈ పాపాత్ముడు దండనార్హుడు.

తే. నిఖిలలోకాశ్రయంబు సన్నిహిత సుఖము, సకలభద్రైక మూలంబు సాధుసేవ్య
మైన కంజాక్షు పాదపద్మార్చనంబు, ననుసరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె?

497

తా ॥ నిఖిల లోకాలకు ఆశ్రయభూతమైనది, కోరిన వారికి సుఖములను ఇచ్చేది, భద్రములకు మూలకారణమైనది, సాధువులకు సేవింప తగినది అయిన శ్రీమహావిష్ణువు యొక్క పాదపద్మములను అర్చించడానికి వీడు ఎంతమాత్రం అర్హుడు కాడు.

వ. కావున నోరి! దురాత్మక! యీ పాపంబునం బాపస్వరూపంబైన రాక్షసయోనిం బుట్టుమని శపియించి యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుండు మని పలికినఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి య ద్దేవికి దండప్రణామంబు లాచరించి

కరకమలంబులు దోయిలించి యిట్లనియె. ఓ జగన్మాత! భవచ్ఛాప వాక్యంబులట్ల కైకొంటిఁ బ్రాచీన కర్మంబులం బ్రాప్తంబైన సంసార చక్రంబుచేత నజ్ఞాన మోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖ దుఃఖంబులును నైజంబులై ప్రవర్తిల్లుచుండు నిందులకుఁ బరతంత్రులైన వా రాత్మ పరసుఖదుఃఖంబులకు నెవ్వరు కర్త లీగుణంబుల నిమిత్తమై శాపానుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుః ఖంబులును సమంబులు. భగవంతుం డొక్కండ తన మాయచేత జగంబులు సృజియించుచు వారివారికి బంధాదిరాగంబులు గలుగం జేయుచుఁ దాను వానికి లోనుగాక నిష్కళుండై యుండు, నీ విధంబునం బుట్టుచున్న నరునకుం బత్ని బంధుశత్రు మిత్రోదాసీనత్వంబు లెక్కడివి? వారి వారి కర్మవశంబునం బరమేశ్వరుండు కల్పించుచు సర్వసముండై యుండు. అప్పరమేశ్వరునకు సుఖ దుఃఖంబులచేత రాగంబు లేదు. రాగానుబంధంబైన రోషంబును లేదు. అతని మాయాగుణవిసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులను గల్పించుచుండుం గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము. శాపభయశంకితుండం గాను. జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించు చున్నవాఁ డ నని దండప్రణామంబు లాచరించి పార్వతీ పరమేశ్వరులం బ్రసన్నులం జేసి తనవిమానం బెక్కి చనియె. నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షిదైత్యదానవ ప్రమథ గణంబులు వినుచుండఁ బార్వతి కిట్లనియె. నీకు నిప్పుడు దృష్టంబయ్యెఁగదా నారాయణదాసదాసానుచరుల నిస్స్పృహభావంబు! హరితుల్యార్థదర్శనులై నిస్స్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు. ప్రాణులకు దేహసంయోగంబు వలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాదిసుఖదుఃఖంబు లాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయంబడియె, నిట్టి విపర్యయంబులు భగవంతుండయిన వాసుదేవునిభక్తి గలవారిం జెందవు, మఱియును.



తా ॥ కావున ఓ దురాత్మా! ఈ పాపానికి ఫలంగా నీవు రాక్షస జన్మ ఎత్తుతావు.

ఇకముందైనా మహాత్ములను అవమానించకు" అని శపించింది పార్వతీదేవి. అంత చిత్రకేతుడు విమానం దిగి భవానీ దేవికి దండప్రణామం చేసి చేతులు జోడించి ఇట్లా అన్నాడు. "ఓ జగన్మాతా! నీ శాపం నీవు ఆనతిచ్చినట్లే అగుగాక! కర్మఫలం చేత ప్రాప్తమైన సంసారంలో, అజ్ఞానం చేత తిరిగే జీవులకు, సుఖదుఃఖములు సహజంగానే కలుగుతూ ఉంటాయి. పరతంత్రులు అయినవారు అనుభవించే సుఖదుఃఖములకు వారు కర్తలు కారు. ఆ కారణంగా శాపము—అనుగ్రహము, స్వర్గము—నరకము, సుఖము—దుఃఖము ఇవన్నీ సమమైనవే. భగవంతుడు ఒక్కడూ మాత్రం తన మాయ చేత ఈ లోకములను సృష్టించి అందులో జీవులను సృష్టించి వారికి రాగద్వేషములు కలుగజేస్తూ ఉంటాడు. తను మాత్రం దానికి లోనవకుండా నిష్కళంకంగా ఉంటాడు. ఈ విధంగ జన్మించే నరునకు భార్య, బంధువులూ, శత్రువులు, మిత్రులు అంటూ ఎవరున్నారు? వారి వారి కర్మఫలానుసారంగా పరమేశ్వరుడు కల్పిస్తూ ఉంటాడు. తను మాత్రం సర్వసముడుగా ఉంటాడు. ఆ పరమేశ్వరునికి జీవులకు సుఖదుఃఖాలు కల్పించటంలో రాగద్వేషములు లేవు. కేవలం ఇదంతా అతని మాయ. కావున నీకు నమస్కారం. నన్ను అనుగ్రహించ వలసిందిగా కోరుతున్నాను. నీవు ఇచ్చిన శాపానికి నేను భయపడటంలేదు. జగన్మాతవు అయిన నిన్ను నేను శంకించిన పాపానికి భయపడుతున్నాను" అని దండప్రణామాలు చేసి పార్వతీపరమేశ్వరులను ప్రసన్నులను చేసుకొని తన విమానం ఎక్కి వెళ్ళిపోయాడు.

అప్పుడు పరమేశ్వరుడు బ్రహ్మాది దేవతలు, దైత్యులు, దానవులు, ప్రమథగణములు, అందరూ వింటూ ఉండగా పార్వతితో ఇట్లా అన్నాడు: "ఓ పార్వతీ! ఇప్పుడు నీకు తెలిసిందా? నారాయణ దాస దాసానుచరుల నిస్పృహ భావం. విష్ణువును దర్శించిన భాగవతులకు స్వర్గము, నరకము ఇట్టి భేదభావాలు లేవు. జీవులకు శరీరంతో కూడటం వల్ల నారాయణ లీలలచే ఈ ద్వంద్వ సుఖం ఆత్మయందు అజ్ఞానం చేత కల్పింపబడింది. ఇట్టి ద్వందములు వాసుదేవుని యందు భక్తి కలవారికి చెందవు.

ఉ. నేనుఁ గుమారనారదులు నీరజ గర్భుఁడు దేవసంఘమున్
మానితయోగివర్యముని మండల మిట్లగు వార మందఱున్
దానవవిద్విడంశ జనితాత్ముల మయ్యుఁ దదీయ తత్త్వముం
గానఁగనేర, మీశు ఘనగర్వమునం దలపోసి చూచుచున్.

499

తా ॥ నేను, కుమారస్వామి, నారదుడు, బ్రహ్మ, దేవతలు, యోగులు ఇట్టి వారమందరము ఆ దానవులను నిర్జించిన శ్రీమన్నారాయణుని అంశవల్ల జనియించిన వారమే. అయినా గర్వంచేత ఆయన తత్త్వాన్ని తెలుసుకోలేక పోతున్నాము.

క. ఆతనికిఁ బ్రియుఁ డ ప్రియుఁ, డే తెఱఁగున లేఁడు నిఖిల మెల్లను దానై
భూతముల కాత్మ యగుటయు, భూతప్రియుఁ డొక్కఁ డాదిపురుషుఁడు తన్వీ!

500

తా ॥ ఓ పార్వతీ! ఆ విష్ణువుకు ప్రియుడు – అప్రియుడు అంటూ ఎవ్వడూ లేడు. సర్వమూ ఆయనే. సర్వభూతములకు ఆత్మ ఆయనే. ఆయన భూతప్రియుడు, ఆది పురుషుడు.

ఆ. అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక, సముఁడు విష్ణుభక్తి సంగతుండు,
నితని నేమి సెప్ప? నీశుండ నగు నేను, నువిద! యచ్యుత ప్రియుండఁ జుమ్మి!

501

తా ॥ చిత్రకేతువు అతి శాంతుడు. అందరినీ సమంగా చూసేవాడు. విష్ణు భక్తుడు. ఏం చెప్పమంటావు ఇతన్ని గురించి. ఈశ్వరుడనైన నేను సయితం విష్ణుభక్తుడను.

క. కావున భగవద్భక్తుల, భావమునకు విస్మయంబు పనిలేదు మహా
ధీ విభవశాంత చిత్తులు, పావన పరతత్త్వనిపుణ భవ్యులు వారల్.

502

తా ॥ కావున భగవద్భక్తుల విషయంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. వారు బుద్ధిమంతులు శాంతచిత్తులు పావనమైన పరతత్త్వాన్ని బాగా తెలుసుకున్న వారు.”

వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్త యయ్యె, నట్లు పరమభాగవతుండయిన చిత్రకేతుం డద్దేవికిఁ బ్రతిశాపం బియ్య సమర్థుం డయ్యును మరల శపింపక యతి శాంత రూపంబునఁ దచ్ఛాపంబు శిరంబున ధరియించె. ఇట్టి సాధులక్షణంబులు నారాయణ పరాయణు లయిన వారలకుంగాక యొరులకుఁ కలుగ నేర్చునే? యిట్లు శాపహతుండయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున దక్షిణాగ్ని యందు దానవయోనిం బుట్టి వృత్రాసురుం డన విఖ్యాతుండయి భగవద్‌జ్ఞానపరిణతుం డయ్యెం గావున.

503

తా ॥ అని శివుడు ఈ విధంగా పలికేసరికి పార్వతీదేవి విస్మయాన్ని విడిచి పరమ శాంతురాలు అయింది. చిత్రకేతువు పార్వతీదేవికి ప్రతి శాపాన్ని ఈయ సమర్థుడు అయినప్పటికీ పరమ శాంతుడై శాపాన్ని శిరస్సున ధరించాడు. ఇటువంటి సాధు లక్షణాలు విష్ణుభక్తులకు కాక వేరే వాళ్ళకు ఉండవు. ఈ విధంగా శాపానికి గురి అయిన చిత్రకేతుడు త్వష్ట చేసే యజ్ఞంలో దక్షిణాగ్నిలో దానవ యోనిలో పుట్టి వృత్రాసురుడు అనే పేరుతో భగవత్ భక్తుడు అయ్యాడు.

సీ. నరనాథ! యీ వృత్రునకు రాక్షసాకృతి గలిగిన యీ పూర్వకారణంబు
చిరపుణ్యుఁ డయినట్టి చిత్రకేతు మహానుభావంబు భక్తితోఁ బరఁగ విన్నఁ
జదివినవారికి సకల దుష్కర్మముల్ శిథిలంబులై కడుఁ జెదరిపోవు
సకలవైభవములు సమకూరుఁ దమయంతఁ దొల్కాడు కోర్కులతోడఁ గూడి

ఆ. నిర్మలాత్ము లగుచు నిత్యసత్యజ్ఞాన నిరతు లగుచు విగత దురితు లగుచు

బంధుమిత్ర పుత్త్ర పౌత్త్రాదులను గూడి యనుభవించుచుందు రధిక సుఖము.

504

తా ॥ ఓ నరనాథా! ఇదయ్యా వృత్రునకు రాక్షస జన్మ కలగడానికి గల కారణము. ఈ చిత్రకేతు మహారాజు పవిత్ర చరిత్రను భక్తితో చదివిన వారికి, విన్నవారికి సకల దుష్కర్మలు నశిస్తాయి. సకల వైభవాలు సమకూరతాయి. కోరికలు నెరవేరుతాయి. వారు నిర్మలాత్ములై, సత్యజ్ఞాన నిరతులై సమస్త పాపములు పోగొట్టుకొని బంధుమిత్ర పుత్ర పౌత్రాదులతో సుఖంగా ఉంటారు.

## 18. సవితృ వంశ ప్రవచనాది కథ

సీ. వినవయ్య! నరనాథ! విశదంబుగాఁ ద్వష్టృ వంశంబు సెప్పితి, వాని వెనుక
సవితృండు పృశ్నియు సావిత్రి వ్యాహృతి యను భార్యలందు నింపారు వేడ్క
నగ్నిహోత్రంబుల నరయంగఁ బశుసోమ పంచయజ్ఞంబులఁ బరఁగఁ గనియె,
భగుఁడు సిద్ధిక యను భార్యకు మహిమానుభావుల విభవులఁ దాఁ బడసె మువురఁ

ఆ. దనయ నొకతెఁ గాంచెఁ దదనంతరము నా, తరళనేత్ర సద్వ్రతస్వధామ
పుణ్యశీల సుగుణ పూరిత చారిత్ర, యఖిలలోక పూజ్య యాశిషాఖ్య!



తా ॥ ఓ నరనాథా! నీకు విశదంగా త్వష్ట ప్రజాపతి యొక్క వంశమును గురించి చెప్పాను. ఇప్పుడు సూర్యవంశాన్ని గురించి వివరిస్తాను. అదితికి జన్మించిన ద్వాదశ ఆదిత్యులలో అయిదవవాడు సవిత. ఆ సవిత అనే ప్రజాపతి పృశ్ని, సావిత్రి, వ్యాహృతి అను భార్యలందు అగ్నిహోత్రము, పశు యాగము, సోమయాగము, పంచ యజ్ఞములు వీటిని కన్నాడు. ఇక భగుడు అనేవాడు సిద్ధిక అనే భార్య యందు మహిముడు, విభుడు, ప్రభుడు అనే ముగ్గురు కొడుకులను, 'ఆశిష' అనే కుమార్తెను కన్నాడు. పిమ్మట తరళనేత్ర అయిన ఆ "ఆశిష" సద్వ్రతములను ఆచరిస్తూ పుణ్యశీలయై, సుగుణాల రాశియై, చక్కటి నడవడిక కలిగి అఖిల లోకములలోను పూజ్యురాలు అయింది.

వ. మఱియు ధాతకుఁ గల కుహూ సినీవాలీ రాకానుమతు లని యెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయమను సుతునిం గాంచె, సినీవాలి దర్శాఖ్యునిం బడసె, రాక ప్రాతరాఖ్యునిఁ గాంచె, ననుమతి పూర్ణిమాఖ్యునిఁ గనె, విధాత క్రియమను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె, వరుణునకుఁ జర్షిణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్త్రుండయిన భృగువును వల్మీకంబునం జనియించిన వాల్మీకియు నుదయించిరి.

మిత్రావరుణులకు నూర్వశియందు రేతోద్గమంబైన, దానిఁ గుంభంబునం బ్రవేశింపం జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండును జనియించిరి. ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గసంభవులైన యరిష్టయుఁ బిప్పలుండును ననువారలు జనియించిరి. శుక్రునకుఁ బౌలోమియందు జయంత ఋషభ విదుషు లన ముగ్గురు పుట్టిరి. వామనుం డయిన యురుక్రమ దేవునకుఁ గీర్తియను భార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె, నా బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి. మఱియు మహాను భావుండయిన కశ్యపప్రజాపతికి నదితియందు శ్రీమన్నారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద. దితిసుతులైన దైతేయుల వంశంబు సెప్పెద. ఆ దైతేయ వంశంబునం బ్రహ్లాద బలులు పరమ భాగవతులై దైత్యదానవ వందితులై వెలసిరి. దితి కొడుకులు హిరణ్యకశిపు హిరణ్యాక్షులనఁ బ్రసిద్ధి నొంది, రందు హిరణ్యకశిపునకు జంభాసుర తనయయైన కయాధువను వధువునకుఁ బ్రహ్లాదానుహ్లాద సంహ్లాదహ్లాదులను నలుగురు కొడుకులును సింహికయను కన్యకయు జన్మించి, రా సింహికకు రాహువు జనియించె. నా రాహువు శిరం బమృతపానంబు సేయ హరి దన చక్రంబునం ద్రుంచె. సంహ్లాదునకు గతి యను భార్యయందుఁ బంచజనుండు వుట్టె. హ్లాదునకు దమని యను భార్యయందు వాతాపీల్వలులు పుట్టిరి. వారల నగస్త్యుండు భక్షించె. అనుహ్లాదునకు సూర్మ్యయను భార్యయందు బాష్కలమహిషులు గలిగిరి. ప్రహ్లాదునకు దేవి యను భార్యయందు విరోచనుండు వుట్టె. నతనికి బలి జన్మించె. నా బలికి నశన యను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్వురు గొడుకులు పుట్టిరి. ఆ బలి ప్రభావంబు వెనుక వివరించెద, బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణంబులకు ముఖ్యుండయ్యె, మఱియు నా దితిసంతానంబులగు మరుత్తులేకోన పంచాశత్సంఖ్యగలవార, లందఱు ననపత్యులై యింద్రునితోఁ గూడి దేవత్వంబు నొంది రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.



తా ॥ ఆదిత్యులలో ఏడవవాడైన ధాత అనే ప్రజాపతికి కుహూ, సినీవాలి, రాక, అనుమతి

అని నలుగురు భార్యలు. అందులో మొదటి భార్య అయిన కుహూదేవికి సాయంకాలం అనే కుమారుడు పుట్టాడు. రెండవ భార్య అయిన సినీవాలికి దర్శ అనే కుమారుడు పుట్టాడు. మూడవ భార్య అయిన రాకకు ప్రాతఃకాలము అనే కుమారుడు కలిగాడు. నాల్గవ భార్య అయిన అనుమతి పూర్ణిమాఖ్యుడు అనే పేరుగల పుత్రుణ్ణి కన్నది. తరువాత ప్రజాపతి అయిన విధాత తన భార్య అయిన క్రియతో అగ్ని పురీష్యాదులకు జన్మను ఇచ్చాడు. పిమ్మటి ప్రజాపతి అయిన వరుణుడు తన భార్య అయిన చర్షిణి యందు పూర్వకాలంలో బ్రహ్మ అయిన వాని పుత్రుడైన భృగువు, వాల్మీకి అనే కుమారులను కన్నాడు. పిమ్మటి వారైన మిత్రావరుణులకు ఊర్వశి కారణంగా రేతస్సు స్ఖలనం కాగా కుండలో ఉంచిన ఆ వీర్యం నుండి అగస్త్యుడు, వసిష్ఠుడు జన్మించారు. తిరిగి ప్రత్యేకంగా మిత్రునకు రేవతి అనే భార్య యందు త్యాగ మూర్తులు అయిన అరిష్టుడు, పిప్పలుడు అనే వాళ్ళిద్దరు జన్మించారు. పిమ్మటి వాడైన ఇంద్రునకు అతని భార్య అయిన శచీదేవి యందు జయంతుడు, ఋషభుడు, విదుషుడు అనే ముగ్గురు కొడుకులు పుట్టారు. పిమ్మటి వాడైన వామనునకు కీర్తి అను భార్య యందు బృహత్ శ్లోకుడు పుట్టాడు. ఆ బృహత్ శ్లోకునకు సుభగుడు ఇత్యాదులు కలిగారు. ఇక మహానుభావుడయిన కశ్యప ప్రజాపతికి అతని భార్య అయిన అదితియందు శ్రీమన్నారాయణుడు వామనుడై అవతరించిన విషయాన్ని వివరిస్తాను.

ఓ రాజా! ఇంతవరకు అదితి కుమారులైన ఆదిత్యుల వంశమును విన్నావు. ఈ పైన దితి సుతులైన దైతేయుల వంశాన్ని చెబుతాను. ఆ దైత్య వంశంలో ప్రహ్లాద, బలి చక్రవర్తులు పరమ భాగవతోత్తములై వెలుగొందారు. దితి యొక్క కొడుకులు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడూను. అందులో హిరణ్యకశిపునకు జంభాసురుని కూతురు అయిన దత్తకు ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అని నలుగురు పుత్రులు సింహిక అనే కన్యక జన్మించారు. ఆ సింహికకు రాహువు జన్మించాడు. ఆ రాహువు అమృత పానం చేసేటప్పుడు విష్ణువు తన చక్రం చేత అతని శిరస్సును ఖండించాడు. సంహ్లాదునకు గతి అనే భార్యయందు పంచజనుడు పుట్టాడు. హ్లాదునికి దమని అనే భార్యయందు వాతాపి, ఇల్వలుడు అని ఇద్దరు కుమారులు కలిగారు. వాళ్ళని అగస్త్య మహాముని భక్షించాడు. అనుహ్లాదునికి ఊర్మి అను భార్య యందు బాష్కలుడు, మహిషుడు

జన్మించారు. ఇక ప్రహ్లాదునకు దేవి అనే భార్యయందు విరోచనుడు పుట్టాడు. విరోచనునకు బలి పుత్రుడైనాడు. ఆ బలికి అశన అను భార్యయందు బాణుడు పెద్ద కుమారుడుగా నూరుగురు కొడుకులు కలిగేరు. ఆ బలి చక్రవర్తి యొక్క ప్రభావాన్ని ఇక ముందు వివరిస్తాను. బాణాసురుడు పరమేశ్వరుని ఆరాధించి ప్రమథ గణాలలో ముఖ్యుడయ్యాడు. ఆ దితి సంతానమైన నలభై తొమ్మిది మంది మరుత్తులు సంతానం లేకుండా ఇంద్రునితో కూడి దేవతలు అయ్యారు."
ఇంతవరకు విన్న పరీక్షిన్నరేంద్రుడు శుక మహర్షితో ఇట్లా అన్నాదు:

## 19. మరుద్గణముల జననం

ఆ. ఏమి కారణమున నింద్రునికిని మరు, చ్ఛయము లాప్తు లగుచు శాంతి నొంది?
రరయఁ దత్సమాను లగుచు వర్తించిరి?, దీని వినఁగ వలయుఁ దెలుపవయ్య!

507

తా ॥ "ఏ కారణం వలన మరుత్తులు ఇంద్రునికి ఆప్తులయి శాంతిని పొందారు? దేవత్వాన్ని పొందారు? దీనిని వినాలని ఉంది. కనుక తెలుపవలసింది."

వ. అనిన శుకుం డిట్లనియె.

508

సీ. నరనాథ! విను తన నందను లందఱు నమరేంద్రుచే హతు లగుచునుండఁ
గోపశోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన మండుచు దితి చాల మఱుఁగఁ దొడఁగె,
భ్రాతృ ఘాతుకుఁ డతిపాతకుం డీ యింద్రుఁ జంపక నాకేల సొంపు గలుగు?
వీని భస్మము సేయువానిఁగా నొక సుతుఁ బడసెద నని చాల భర్తఁ గోరి

ఆ. ప్రియము సేయఁదొడఁగెఁ బెక్కు భావంబుల, భాషణముల నధిక పోషణముల
భక్తియుక్తిచేతఁ బరిచర్యగతిచేత, నుతులచేత నతుల రతులచేత.

509

తా ॥ అప్పుడు శుక మహర్షి ఇలా అన్నాడు: "ఓ నరనాథా! విను. తన కుమారులు అందరు అమరేంద్రుని చేత హతులు అగుతూ ఉండగా కోపశోకముల చేత కుతకుతలాడి పోయింది దితి. ఈ ఇంద్రుడు భ్రాతృ ఘాతకుడు, అతి పాతకుడూను. వీడిని సంహరింపకపోతే నా మనస్సుకు శాంతి లేదు. వీడిని భస్మం చేసే సుతుని కంటాను అని సంకల్పం చేసి భర్త అయిన కశ్యప ప్రజాపతిని అనేక విధాల ఆరాధించింది. మృదు భాషణముల చేత భక్తి యుక్తి

చేత పరిచర్యల వలన మధురమైన మాటలతో శృంగారపరమైన క్రీడలతోను ఆయనకు ప్రియం చేసింది.

చ. కలికి కటాక్ష వీక్షణ వికారములన్ హృదయానురాగ సం
కలిత విశేషవాఙ్మధుర గర్జనలన్ లలితాననేందు మం
డల పరిశోభి తామృత విడంబిత సస్మిత సుప్రసన్నతా
ఫల రుచిర ప్రదానముల భామిని భర్తమనంబుల లోఁగొనెన్.

510

తా ॥ మనోహరాంగి అయిన దితీదేవి తన కటాక్ష వీక్షణముల చేత, అనురాగంతో కూడిన మధురమైన వాక్కుల చేత, లలితమైన చంద్రుని వంటి ముఖంలో అమృతాన్ని మించే చిరునవ్వులతోను, రుచికరమైన రసాయనములతోను భర్త మనస్సును లోగొన్నది.

తే. అఖిల మెఱిఁగిన కశ్యపు నంతవాని, హితవు తలకెక్కు రతుల సంగతులచేత
నవశుఁ గావించె వ్రేల్మిడి నబ్జవదన, పతుల భ్రమియింప నేరని సతులు గలరె?

511

తా ॥ దితీ దేవి సర్వజ్ఞుడైన కశ్యప ప్రజాపతి అంతటి వానిని అనేక ఉపచారముల చేత, శృంగార క్రీడల చేత పరవశుణ్ణి చేసింది. లోకంలో పతులను భ్రమింప చేయలేని సతులు లేరు కదా!

క. ఏ తలఁ పెఱుఁగక నిలిచిన, భూతంబులఁ జూచి ధాత పురుషుల మనముల్
ప్రీతి గొలుపంగ యువతీ, వ్రాతంబు సృజించెఁ బతులు వారల కరుదే!

512

తా ॥ పూర్వం విధాత పురుషులను సృజించి వారు ఏ తలపు లేకుండ నిశ్చల చిత్తులై

ఉండటాన్ని చూచి వారికి ప్రీతిని కలిగించటం కోసం యువతులను సృష్టించాడు. అట్టి యెడ పతులు వారికి లొంగి పోవటం పెద్ద ఆశ్చర్యం కాదు.

వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యప ప్రజాపతి యా సతికిం బరమప్రీతుండై యిట్లనియె. ఓ తన్వీ! నీకుఁ బ్రసన్నుండనైతి. వరంబు గోరు మిచ్చెద. నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి కొఱంత? సతికిం బతియె దైవంబు. సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండే భర్త. నామరూప కల్పితులైన సకల దేవతామూర్తులచేతం బురుషులచేతను భర్తృరూపధరుం డయిన భగవంతుండు సేవింపంబడు చుండు. విశేషించి స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపంబడుఁగావునం బతివ్రతలైన సుందరులు శ్రేయస్కామలై యేకచిత్తంబున నాత్మేశ్వరుం డయిన య ప్పరమేశ్వరుని భర్తృ భావంబున సేవించుచుండుదురు. ఏమను నీకీ భావంబున వరదుఁడ నైతి. దుశ్శీల లయిన వినతలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద. వేఁడు మనిన నా కశ్యపునకు దితి యిట్లనియె.

513

తా ॥ ఈ విధంగా అనేక పరిచర్యల చేత లాలితుడైన కశ్యప ప్రజాపతి పరమ ప్రీతితో ఇలా అన్నాడు: “ఓ సుందరీ! నేను ప్రసన్నుడనయ్యాను. నీకు ఇష్టమైన వరాన్ని కోరుకో ఇస్తాను. భర్త ప్రసన్నుడైతే స్త్రీలకు కోరికలు తీరటం పెద్ద విశేషం కాదు. సతికి పతియే దైవం. సర్వ భూతములకు వాసుదేవుడే భర్త. దేవతామూర్తుల చేత, పురుషుల చేత భగవంతుడే సేవింపబడుతూ ఉంటాడు. అందు ముఖ్యంగా స్త్రీల చేత పతిరూపంలో సేవింపబడుతూ ఉంటాడు. కనుకనే పతివ్రతలైన స్త్రీలు శ్రేయస్సును కోరి ఏక చిత్తంతో ఆ పరమేశ్వరుని భర్తృ భావంతో సేవిస్తూ ఉంటారు. అందువల్లనే నీకు వరాన్ని అనుగ్రహించాను. దుశ్శీలలయిన పడతులు పొందరాని వరాన్ని నీకిచ్చాను. కోరుకో!” — అప్పుడు కశ్యపునితో దితి ఇలా అన్నది:

ఆ. వరము గోర నాకు వరదుండ వేనియు, నింద్రుఁ ద్రుంచునట్టి యిద్ధబలుని

నమిత తేజుఁ దనయు నమరత్వసంప్రాప్తు, నెందుఁ జెడనివాని నిమ్ము నాథ!

514

తా ॥ “నాథా! నీకు నాయందు అనుగ్రహం కలిగి వరాన్ని ఈయ తలచినట్లైన ఇంద్రుని తల నరకగల బలవంతుడు, తేజోవంతుడు, అమరత్వం సంప్రాప్తించిన కుమారుణ్ణి నాకు ఇవ్వవలసినది.

వ. అనవుడు.

515

క. ఉట్టిపడునట్టి వర మీ, కట్టిఁడి న న్నెట్టు వేఁడె? గటకట యనుచున్
మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచు నుండెన్.

516

తా ॥ అప్పుడు కశ్యపుడు ఈ మాటలకు ఉలిక్కిపడి ఇట్టి కోరిక కోరిందేమిటా అని మనస్సులో బాధపడి లోలోపల తల్లడిల్లాడు.

చ. ప్రకృతినిఁ గర్మపాశమున బద్ధుఁడ నై తిఁ గదయ్య! నేఁడు నే
వికటసతీ స్వభావమున వేఁదుఱు గొల్పిన మాయ నింద్రియా
ధికమతి యైనవాఁడు దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా
తకములఁ గూలకున్నె? నను దైవము నవ్వదె లోలితాత్మునిన్?

517

తా ॥ అయ్యో! ఇప్పుడు కర్మపాశ బద్ధుడను అయ్యాను. నేడు నా భార్య యొక్క వికట స్వభావం చేత పిచ్చివాడినయ్యాను. ఇంద్రియాలకు లోనైన వాడు తన మనస్సును కూడా పాపపు ఆలోచనలకు గురిచేసి అందులోనే కూలిపోతాడు. లోలితాత్ముడనైన నన్ను చూచి దైవం నవ్వదా?

సీ. ఖండ శర్కరతోడఁ గలహించు పలుకులఁ బద్మవిలాస మేర్పఱచు మోముఁ
దుహినాంశు కళలతోఁ దులదూఁగు చెయ్వులఁ జెమటఁ గ్రొన్నెత్తురు సేయు మేను
నిలువెల్లఁ గరఁగించు నేర్పుల యింపులఁ బువ్వుల కరుదైన ప్రోది సేఁత
తమకంబు రెట్టించు తరితీపు తలఁపులు నెనసిన మదిలోని యిచ్ఛగింత

ఆ. గలిగి కఱవనున్న కాలాహిపోలికిఁ, జెలఁగుచున్న సతులచిత్తవృత్తిఁ
దెలియవశమె యెంత ధృతి గలవారికి, నాక కాదు నిఖిలలోకములకు.

518

తా ॥ నాకే కాదు, నిఖిల లోకాలకు తెలుసుకోవడానికి స్త్రీల చిత్తవృత్తి ఎంత కష్టం? వారి పలుకులు కలకండ పలుకులతో కలహిస్తూ ఉంటాయి. వారి ముఖం పద్మవిలాసాన్ని తిరస్కరిస్తుంది. వారి చేష్టలు చంద్రకళలతో తులతూగుతూ ఉంటాయి. చెమటను కొత్త నెత్తురుగా చేస్తుంది వారి సాన్నిహిత్యం. వారి నేర్పులు నిలువెల్ల కరిగిస్తుంది. పూలకంటే మృదువుగా వారి వైభవం ఉంటుంది. కోరికను రెట్టింపు చేస్తుంది వారి తీయని వలపు. ఇంతకీ వారి మనస్సులోని కోరిక మాత్రం పురుషుని తోడి పొందిక. స్త్రీల చిత్తవృత్తి కరవడానికి సిద్ధంగా ఉన్న త్రాచుపాము వంటిది.

ఆ. కోరి సతుల కెల్లఁ గూర్చువా రెవ్వరు?, పతులనైన సుతుల హితులనైన
బలిమిఁ జేసి యైనఁ బరహ స్తమున నైన, హింసపఱతు రాత్మహితము కొఱకు.

519

తా ॥ సతులకు ఇష్టులు అంటూ ఎవరూ లేరు. పతులనైనా, సుతులనైనా, హితులనైనా బలవంతంగానైనా సరే వేధించి తమ పని జరుపుకుంటారు. ఎంత కావలసిన వారైనా సరే వారిని స్వలాభంకోసం హింసిస్తారు.

వ. అని చింతించి దీనికి నే మని ప్రతివాక్యం బిచ్చువాఁడ? మద్వచనం బెందు నమోఘంబు.

త్రిలోక పరిపాలన శీలుండయిన భిదురపాణి వధార్హుండె? యేను దీనికి నైనది యొకటి గల్పించెద నని దితిం జూచి “యో తనుమధ్య! నీకు నట్లు దేవబాంధవుం డయిన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడు. నొక్క సంవత్సరంబు వ్రతంబునం జరియింపుము. దాని ప్రకారం బెల్ల నేను జెప్పెద విను, మెల్లజీవులవలన హింసాభావంబు లేక యతిధ్వనివాక్యంబు లుడిగి కోపంబు మాని యనృతంబులు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక యస్థి కపాలాదులైన యమంగళంబులు నంటక నదీతటాకాదులన కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు సేయక దుర్జన సంభాషణంబు వర్జించి కట్టిన కోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరియింపక భోజనంబుల యందు నుచ్ఛిష్టాన్నంబును జండికా నివేదితాన్నంబును గీశ శునక మార్జార కంక క్రిమికపిపీలికాది విదూషితాన్నంబును సామిషాన్నంబును వృషలాహృతాన్నంబును నను నీ పంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణియై యలంకార విహీనగాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు సేసికొని కాని శయనింప యార్ద్ర పాదయై పవ్వళింపక పశ్చిమ శిరస్కయయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌత వస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళ సంయుక్తయై ప్రాతః కాలంబునఁ దూర్పు మొగంబై లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్య పాద్యోపస్పర్శన వాసోపవీత భూషణ పుష్పధూప దీపోపచారాద్యు పచారంబుల నర్చించి హవిశ్శేషంబు ద్వాదశాహుతుల వేల్పించి ప్రణామంబు లాచరించి భగవన్మం త్రంబును దశవారంబు లనుసంధించి స్తోత్రంబుసేసి గంధపుష్పాక్షతంబుల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్త్రుం గుక్షిగతుంగా భావించి యి వ్విధంబున మార్గశీర్షశుద్ధ ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి యా ద్వాదశ మాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు. నీ వీ పుంసవనం బనియెడు వ్రతంబు ద్వాదశమాస పర్యంతం బేమఱక సల్పిన నీవు గోరిన కుమారుండు గలిగెడు మనిన సేవించుచు వ్రతంబు తోడనె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాత్రభిప్రాయం బెఱింగి యా యమ్మ నహరహంబును రహస్యంబున సేవించుచు

వ్రతంబునకుం దగిన పుష్పఫల సమిత్కుశ పత్త్రాంకురంబులు మొదలయిన వస్తువితతిం ద్రికాలంబులం దెచ్చి యిచ్చుచుఁ బుండరీకంబు హరిణికిం బొంచియున్న భంగి నా యమ్మవ్రత భంగంబునకై కాచి శుశ్రూష సేయుచు నా యమ్మ ధరియించిన తేజోవిశేషంబునకు బెగ్గలించుచుఁ గృశించుచునుండె, నంత నొక్కనాఁడు.

520

తా ॥ ఈ విధంగా తన మనసులో చింతించి నేనేమని సమాధానం చెప్పాలి? ఆడిన మాట తప్పరాదు కదా! మూడు లోకాలను పాలించే ఇంద్రుడు వధార్హుడు ఎట్లా అవుతాడు అని బాధపడ్డాడు కశ్యప ప్రజాపతి. దీనికి ఒకటి కల్పిస్తాను అని దితిని చూచి ఓ తలోదరీ! నువ్వు కోరుకున్నట్లే ఇంద్రుణ్ణి సంహరించే పుత్రుడు కలుగుతాడు. దానికి ఒక్క సంవత్సరం వ్రతాన్ని ఆచరించవలసి ఉంటుంది. ఎలా చెయ్యాలో నేను చెబుతాను. విను. వ్రతం పూర్తయ్యే వరకూ అన్ని జీవుల పట్ల హింసాభావం కూడదు. గట్టిగా మాట్లాడ రాదు. కోపం వహింపరాదు. అనృతములు పలుకరాదు. గోళ్ళు, వెంట్రుకలు కత్తిరించ కూడదు. ఎముకలు, కపాలము ఇట్టి అమంగళకరమైన వస్తువులు ముట్టరాదు. నదులలో కాని, చెరువులో కాని స్నానం చెయ్యాలి. నూతి దగ్గర స్నానం చెయ్యకూడదు. దుష్టులతో మాట్లాడరాదు. విడిచిన చీర కట్టుకొనరాదు. ముడిచిన పూలు తిరిగి పెట్టుకొనరాదు. ఇక భోజనం విషయంలో ఎంగిలి అన్నం పనికిరాదు. చండికకు నివేదించిన అన్నం పనికిరాదు. తలవెంట్రుక పడిన అన్నం కాని, కుక్క పిల్లి పక్షి క్రిములు చీమలు ముట్టుకొన్న అన్నంగాని తినకూడదు. మాంసాహారం తినకూడదు. శూద్రులు పట్టుకొని వచ్చిన అన్నం తినరాదు. ఈ విధంగా పంచ విధాలుగా నిషేధింపబడిన అన్నం తిన కూడదు. దోసిలితో నీరు త్రాగకూడదు. సంధ్యాకాలంలో తలవెంట్రుకలు విరబోసుకొన కూడదు. మితంగా మాట్లాడాలి. అలంకారం లేకుండ ఉండరాదు. ఇంటి వెలుపల తిరుగరాదు. కాళ్ళు కడుక్కొని నిద్రించాలి. తడి కాళ్ళతో నిద్రించరాదు. పశ్చిమంగా తలపెట్టి నిదురించరాదు. నగ్నంగా నిదురించరాదు. సంధ్యాకాలంలో నిదురపోకూడదు. ప్రతి నిత్యము తెల్లని వస్త్రములు కట్టుకోవాలి. శుచిగా ఉండాలి. ఎప్పుడూ మంగళ ద్రవ్యాలతో కూడి ఉండాలి. ఉదయకాలంలో

తూర్పు ముఖంగా కూర్చుని లక్ష్మీనారాయణులను ఆరాధించాలి. ఆహ్వానం, అర్ఘ్యం, పాద్యం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, అలంకారం, పుష్పం, ధూప, దీపం – ఇత్యాది ఉపచారాలతో అర్చించాలి. పన్నెండు ఆహుతులతో హవిశ్శేషాన్ని వేల్చి నమస్కరించాలి. భగవన్మంత్రాన్ని పదిసార్లు జపించి స్తోత్రం చెయ్యాలి. మంచి గంధము, పుష్పములు, అక్షతలు వీటితో ముత్తైదువులను పూజించాలి. భర్తను సేవిస్తూ పుత్రుడు గర్భంలో ఉన్నట్లే భావించాలి.

ఈ ప్రకారం మార్గశీర్ష శుద్ధ పాడ్యమి మొదలు క్రమం తప్పకుండ ఒక్క సంవత్సరం ఈ వ్రతాన్ని సలిపి పదిరెండు మాసముల అనంతరం శాస్త్ర విధిగా ఉద్యాపనం చెయ్యాలి. నువ్వు పుంసవనం అనే ఈ వ్రతాన్ని పదిరెండు మాసముల పర్యంతము ఏ విధమైన ప్రమాదము వాటిల్లకుండ సలిపితే నువ్వు కోరుకున్న కుమారుడు కలుగుతాడు. అని కశ్యప ప్రజాపతి చెప్పేసరికి దితి యథావిధిగా వ్రతాన్ని అవలంబించి గర్భవతి అయింది. అప్పుడు ఇంద్రుడు తల్లి యొక్క అభిప్రాయాన్ని తెలుసుకొని ఆమెను అహరహము రహస్యంగా సేవిస్తున్నాడు. వ్రతానికి అవసరమైన పుష్పములు, ఫలములు, వంటచెరకు, దర్భలు, పత్రములు, అంకురములు మొదలైనవి అన్నీ మూడు కాలములలోను తెచ్చి ఇచ్చేవాడు. పెద్దపులి లేడికోసం పొంచి ఉన్నట్లుగా ఆ అమ్మ వ్రతభంగం కొరకు కాచుకొని కూర్చున్నాడు. దితి ధరించిన తేజో విశేషానికి బెంగ పెట్టుకొని కృశింప సాగాడు.

సీ. వామాక్షి యనుదిన వ్రతధారణోన్నత పరిచర్య విధులచే బడలి యలసి
యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్టయై పద ప్రక్షాళనాదులఁ బాసి మఱచి
తన కర్మ మోహంబు దవిలి నిద్రింపంగ నింద్రుండు సయ్యన నెడరు గాంచి
యోగమాయా బలోద్యుక్తుఁడై యా యింతి యుదరంబుఁ జొరఁబడి యుగ్రుఁ డగుచుఁ

తే. దివిరి దేదీప్యమానమై తేజరిల్లు, నర్భకుని వజ్రధారల నడిచె నేడు దునుకలుగ
వాఁడు దునిసియుఁ దునుక దునుక, చెడక యొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న.

తా ॥ ఆ వామాక్షి అనుదినము వ్రతాన్ని పాటిస్తూన్నందు వలన పరిచర్య విధులచేత అలసి పోయింది. ఒక రోజున సంధ్య వేళ భోజనం చేసి పాద ప్రక్షాళనం మరచి కర్మ ఫలం కారణంగా నిద్రించింది. అంత ఇంద్రుడు వెంటనే యోగమాయా బలంతో ఆమె ఉదరములో చొరబడి ఉగ్రుడై దేదీప్యమానంగా తేజరిల్లుతూన్న అర్భకుని తన వజ్రాయుధం చేత ఏడు ఖండాలుగా ఖండించాడు. ఆ తునకలు చెడిపోకుండ ఒక్కొక్కటి ఒక్కొక్క బాలుడై ఆడుకోసాగారు.

క. వా రేడ్వు రగుచుఁ గుయ్యిడ, నోరి యఱవ కనుచుఁ ద్రుంచె నొక్కొక్కని నా
శూరుం డేడ్గురుఁ దునుకలు, గా రయమున వారు సెడక ఖండితు లయ్యున్.

522

తా ॥ ఆ ఏడ్వురు బాలురు నోరు తెరచి అరుస్తూ ఉండగా "మీరు అరవకండి!" – అంటూ ఆ శూరుడయిన ఇంద్రుడు ఒకొక్కరిని ఏడు ఖండములుగా ఖండించాడు.

క. ఖండము లన్నియు నందఱుఁ, జండాంశు సమప్రకాశ శాశ్వతు లగుచున్
యొండుకొని నిల్చి యని రా, ఖండలునకుఁ గరుణ వుట్టుగతి మదిఁ దోఁపన్.

523

తా ॥ అలా ఖండములుగా ఉన్న బాలలందరు సూర్యునితో సమానమైన కాంతి కలిగి ఇంద్రునకు కరుణ కలిగేటట్లు ఇలా వేడుకున్నారు:

వ. అందఱు ముకుళిత కరకమలులై నీకుం దోడంబుట్టువులము. మమ్ము హింసింపంబని లేదు. నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము. మమ్ము రక్షింపుమనిన నారాయణ ప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులకుం గృపాళుండై యింద్రుండు వారల సహోదరులంగాఁ గైకొని మఱి హింసింపక మానె. అశ్వత్థామశరాగ్నివలన నారాయణ రక్షితుండ వయిన నీవునుంబోలెఁ గులిశధారల శకలంబు లయిన

కుమారులన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరిం బూజించినవారు గావున నింద్రుతోడం గూడ నేకోన పంచాశద్దేవత లయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడి రంత దితి మేల్కాంచి యనల ప్రకాశులై యింద్రుతోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషింపక యింద్రుం జూచి నీకు మృత్యురూపంబయిన పుత్త్రుం గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి, సంకల్పించిన పుత్త్రుం డొక్కరుం డీ సప్త సప్త సంఖ్య గల కుమారు లగుట కేమి కతంబు? నీ వెఱింగిన భంగిన తథ్యంబు పలుకుమనిన నింద్రుం డిట్లనియెఁ" దల్లీ! భవద్వ్రతంబుఁ జింతించి సమయ విచ్ఛేదనంబున గర్భంబు జొచ్చి పాప చిత్తుఁడనై వజ్రధారల గర్భంబు విదళనంబు సేసిన నాశకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారులైరి. మహాపురుష పూజాసంసిద్ధి కార్యానుషంగి గాకుండునే? భగవదారాధనంబుఁ గోరికలఁ బాసి యెవ్వరు గావింతురు? వారిహపరంబుల సర్వార్థకుశలు లగుదురు. అ మ్మహాపురుష వ్రతసముత్పన్న తేజంబు నడంప నెవ్వండోపుఁ? గావున దుర్మదంబున బాలిశ స్వభావుండనై దోషంబు సేసిన నా దౌర్జన్యకర్మంబు సహింపఁ దల్లికన్న నెవ్వరు సమర్థులు? పాపాత్ముండ నగు నన్నుం గావుము. నేను వీరలతోడివాఁడ నని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవి యట్లగాక యని శాంతచిత్త యయ్యె, నింద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి సోమపాన హవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండె నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె.

524

తా ॥ అంత వారందరు చేతులు జోడించి "మేము నీకు తోడబుట్టిన వారము. మమ్ము హింసింప వలసిన అవసరం లేదు. నీ ప్రమథగణంలో ఉంటూ మరుద్గణములమై నిన్ను సేవిస్తాము. మమ్ములను రక్షించు!" – అని ప్రార్థించేసరికి నారాయణుని అనుగ్రహం వలన మరుద్గణముల యొక్క పలుకులకు దయ తలచి ఇంద్రుడు వాళ్ళని తన తోటి సహోదరులుగా భావించి, హింసింపక విడిచిపెట్టాడు. అశ్వత్థామ శరాగ్ని నుండి కృష్ణుడు నిన్ను రక్షించినట్లే,

వజ్రాయుధం బారినుండి వారిని రక్షించాడు. శకలములు అయిన కుమారుడు అన్ని రూపాలతో సంవత్సరం కాలం హరిని పూజించినందువలన నలుబది తొమ్మిది మంది మరుద్గణాలుగా మారి దితి గర్భం నుండి ఇంద్రునితో కలిసి బయటకు వచ్చారు. అంత దితికి మెలకువ వచ్చింది. అగ్ని తేజస్సుతో ఇంద్రునితో కూడి వెలిగిపోతూన్న కుమారులను చూసి సంతోషింప లేదు సరికదా ఇంద్రునితో ఇలా అన్నది: "నేను నీకు మృత్యు రూపమైన పుత్రుని కోరి కఠినమైన తపస్సు చేశాను. నేను ఒక్క పుత్రుని కోరితే ఈ నలుబది తొమ్మిది మంది పుత్రులు ఎలా వచ్చారు? దీనికి కారణం ఏమిటి? నీకు తెలిసిన విషయం, నిజం చెప్పు" — అప్పుడు ఇంద్రుడు ఇలా అన్నాడు: "తల్లీ! నీ వ్రత సంకల్పాన్ని తెలుసుకున్న నేను నీ గర్భంలోకి ప్రవేశించి పాపచిత్తంతో నా వజ్రాయుధంతో నీ గర్భంలోని పిండాన్ని ముక్క ముక్కలుగా నరికాను. అవి నలబది తొమ్మిది ఖండములై మహాశ్చర్యంగా చెడిపోకుండ ఈ విధంగా కుమారులయ్యారు. మహా పురుషులను సేవిస్తే కార్యం సానుకూలం కాకుండా ఎలా ఉంటుంది? నిష్కామంగా భగవదారాధనం చేసిన వారికి ఇహపరములు సిద్ధిస్తాయి. ఆ మహా పురుషుని వ్రతం చేసిన వారికి వచ్చే తేజస్సును అణచే శక్తి ఎవరికి ఉంటుంది? కనుక దుర్మదం చేత మూర్ఖుడనై దోషం చేసిన నా దౌర్జన్య కర్మను సహించడానికి తల్లి కంటే సమర్థులు ఎవరున్నారు? పాపాత్ముడనైన నన్ను మన్నించు. నేను నీ కుమారుల తోటి వాడినే." అని నిష్కపటంగా ప్రార్థించే సరికి ఆ దేవి శాంత చిత్తురాలు అయింది. ఇంద్రుడు కూడా వారలతో కూడి స్వర్గానికి పోయి సోమపాన హవిర్భాగాలు మరుత్తులకు పంచిపెట్టి సుఖంగా ఉన్నాడు." అని చెప్పి శుక యోగీంద్రుడు ఇంకా ఇలా అన్నాడు:

క. హరి వరదుఁ డయిన వ్రతమఁట, హరి యంశజు లగుచు నెగడు నమరులజన్మ
స్ఫురణం బఁట! పఠియించిన, నరయఁగ నురుదీర్ఘపాప హరమగు టరుదే!

525

తా ॥ "సాక్షాత్తు శ్రీమహా విష్ణువు వరాలను అనుగ్రహించే వ్రత కథ ఇది. శ్రీహరి అంశ

నుండి జన్మించిన మరుత్తులకు అమరత్వాన్ని ప్రసాదించిన విషయం ఇందులో ఉంది. ఇట్టి కథను పఠించిన పుణ్యాత్ములకు అనేక పూర్వ జన్మల పాపాలు తొలగిపోతాయి."

వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమాన మానసులైన శౌనకాది మహామునులకు సూతుండు సెప్పెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె ననుటయు.

526

తా ॥ ఈ ప్రకారంగా విష్ణు కథలను వినాలనే కుతూహలం కల శౌనకాది మహా మునులకు సూత మహర్షి చెప్పాడని శుక యోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు చెప్పాడు.

క. రాజీవరాజపూజ్య, శ్రీజిత గోపీకటాక్ష సేవాంతర వి
భ్రాజితమూర్తి! మదోద్ధత, రాజకులోత్సాద రామరాజాఖ్యనిధీ!

527

తా ॥ పద్మముల సౌందర్యాన్ని జయించిన గోపికల కటాక్షముల చేత సేవలందుకొనే వాడా! మదంచేత ఉద్ధతులైన రాజులను సంహరించిన వాడా! శ్రేష్ఠమైన గుణములు కలవాడా!

తరల.
మురవిదారణముఖ్య కారణ! మూలతత్త్వ విచారణా!
దురిత తారణ దుఃఖవారణ! దుర్మదాసుర మారణా!
గిరి విహారణ! కీర్తిపూరణ! కీర్తనీయ మహారణా!
ధరణి ధారణ! ధర్మతారణ! తాపస స్తుతి పారణా!

528

తా ॥ మురాసురుని సంహరించిన వాడా! సృష్టికి మూలమైన వాడా! దురితములను తరింప చేయువాడా! దుఃఖములను హరించువాడా! మదించిన అసురులను నాశనము చేయు

వాడా! గిరిపై విహరించిన వాడా! కీర్తిచేత లోకములన్ని నిండిన వాడా! భయంకరమైన యుద్ధాలలో కీర్తనీయుడైన వాడా! భూభారాన్ని వహించే వాడా! ధర్మమును కాపాడువాడా! తాపసులచేత స్తుతింపబడు వాడా!

తోటకము.

కరుణాకర! శ్రీకర! కంబుకరా!, శరణాగత సంగత జాడ్యహరా!

పరిరక్షిత శిక్షిత భక్తమురా!, కరిరాజ శుభప్రద! కాంతిధరా!

529

తా ॥ కరుణకు స్థానమైన వాడా! సంపదలను ఇచ్చేవాడా! పాంచ జన్యమనే శంఖమును ధరించిన వాడా! శరణాగతులయిన వారి కష్టములను తీర్చువాడా! మురాసురుని శిక్షించి భక్తులను రక్షించిన వాడా! కరి రాజునకు శుభమును చేకూర్చిన వాడా! ఓ జ్ఞాన స్వరూపా!

గద్యము

ఇది సకల సుకవి జనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువ యామాత్య పుత్త్ర బుధజన ప్రసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులఁ జంద్రుం డామంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియుఁ, బ్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు, నతనికి న ప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, హర్యశ్వ కబళాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు, నారదు వచనప్రకారంబున వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మ వరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్ర సంఖ్యాకులగు పుత్త్రులం గాంచుటయు, సృష్టినిర్మాణేచ్ఛా నిమిత్తంబున దక్షుపంపున వార లగ్రజన్ములు సిద్ధింబొందిన దీర్ఘరాజంబైన నారాయణ సరస్సునకుం జనుటయు, వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు వారు పూర్వజు లేగిన ప్రకారంబున మోక్షంబు

నొందుటయుఁ, దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టంబని తెలిసి నారదుని శపియించుటయు, నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయుఁ దక్షునకు మరల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబు కొఱకుఁ గూఁ తులఱువండ్రు జనించుటయు నందుఁ గశ్యపునకు నిచ్చిన పదమువ్వుర వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసురనర తిర్యఙ్మృగఖగాదుల జన్మంబులును దేవేంద్ర తిరస్కారంబున బృహస్పతి యధ్యాత్మ మాయచేతం గానరాకుండుటయుఁ, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టులై దేవతలపై నెత్తి వచ్చుటయు, దేవాసుర యుద్ధంబును, నాచార్య తిరస్కారంబున దివిజరాజ పలాయనంబును బలాయమానులైన దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్టృ కుమారుం డయిన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును, విశ్వరూపు ప్రసాదంబున నింద్రుండు నారాయణ వర్మంబను మంత్ర కవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ, బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డయిన విశ్వరూపు నింద్రుండు వధించుటయు విశ్వరూప వధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం బయిన నింద్రుండు స్త్రీ భూ జలద్రుమంబులయందుఁ బంచిపెట్టుటయు, విశ్వరూపుండు హతుం డగుటకుఁ ద్వష్ట కోపించి యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రాసురుండు జనియించుటయు, వృత్రాసుర యుద్ధంబునఁ బరాజితులై యింద్రసహితులైన దేవతలు శ్వేతద్వీపంబునకు ఁజనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుండై దధీచి వలన భిదురంబు గైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మ హత్యా పీడితుండై మానస సరస్సుఁ బ్రవేశించుటయు, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి, యింద్రాధిపత్యంబు వడయుటయు, నహుషుం డగస్త్య శాపంబున సురరాజ్య చ్యుతుండై, యజగరయోనిం బుట్టుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబును, నింద్రుండు త్రిలోకాధిపత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మ ప్రకారంబును నను కథలం గల షష్ఠస్కంధము సంపూర్ణము.

తా ॥ ఇది సకల సుకవిజనులకు మిత్రుడు, శ్రీవత్స పవిత్రగోత్రుడు, కసువయామాత్యుని పుత్రుడు, పండితుల సాహిత్య ప్రసంగాలతో సంబంధం కలవాడు అయిన సింగయ కవిచే రచింపబడిన శ్రీమహా భాగవత పురాణంలో అజామిళోపాఖ్యానమూ, ప్రచేతసులను చంద్రుడు శాంతింపజేయటమూ, దక్షప్రజాపతి జన్మముగా, ప్రజాసృష్టి, దక్షుడు శ్రీహరిని గూర్చి తపస్సు చేయటమూ, అతనికి పరమేశ్వరుడు ప్రత్యక్షం కావటమూ, హర్యశ్వశబళాశ్వుల పుట్టుకా, నారదుడు వారికి వైరాగ్యం బోధించటమూ, వారు నారదుని మాటల ప్రకారం ప్రవర్తించి మోక్షం పొందటమూ, ఆ వృత్తాంతాన్ని నారదునివలన ఆకర్ణించి దక్షుడు శోకించటమూ, అనంతరం బ్రహ్మవరంచే దక్షుడు శబళాశ్వులనే వేయిమంది తనయులను కనటమూ, సృష్టిచేయాలనే కోర్కెతో దక్షుని ఆజ్ఞమేరకు వారు తమ అన్నలు సిద్ధిబొందిన తీర్థశ్రేష్ఠమైన నారాయణ సరస్సుకు పోవటమూ, వారికి నారదుడు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించటమూ, వారు తమ అగ్రజుల అడుగుజాడలలో నడచి మోక్షాన్ని పొందటమూ, ఆ వృత్తాంతాన్ని దక్షుడు దివ్యజ్ఞానంవలన తెలుసుకొని నారదుణ్ణి శపించటమూ, నారద మహర్షి దక్షుని శాపాన్ని స్వీకరించటమూ, బ్రహ్మవరంచే సృష్టిని విస్తరింపజేసే నిమిత్తం దక్షునకు అరవై మంది కూతుళ్ళు పుట్టడమూ, అందులో కశ్యప ప్రజాపతికి ఇచ్చిన పదముగ్గురు కూతుండ్ర సంతానంవల్ల సకల లోకాలు నిండటమూ; దేవతలు, రాక్షసులు, మానవులు, మృగాలు, పక్షులు మొదలైనవాని జన్మములూ, దేవేంద్రుని తిరస్కారం సహింప లేక బృహస్పతి అదృశ్యం కావటమూ, ఆ వృత్తాంతాన్ని రాక్షసులు విని శుక్రునిచే ప్రేరేపింపబడినవారై దేవతలపై యుద్ధానికి రావటమూ; దేవ రాక్షస యుద్ధమూ; గురుతిరస్కారఫలంగా సురేంద్రుడు పరాజితుడై పారిపోవటమూ, దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్ళటమూ, బ్రహ్మ మాట ప్రకారం త్వష్ట కుమారుడైన విశ్వరూపుణ్ణి గురుదేవునిగా దేవతలు వరించటమూ, విశ్వరూపుని దయవల్ల ఇంద్రుడు “నారాయణకవచం” అనే మంత్రకవచాన్ని ధరించి రాక్షసులను జయించటమూ, పరోక్షంగా రాక్షసులకు అనుకూలుడైన విశ్వరూపుణ్ణి ఇంద్రుడు వధించటమూ, విశ్వరూపుణ్ణి చంపటంవల్ల ఇంద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తించటమూ, ఆ పాపాన్ని దేవేంద్రుడు స్త్రీ, భూ, జల, వృక్షాలకు పంచి పెట్టడమూ;

విశ్వరూపుణ్ణి చంపినందుకు త్వష్ట కోపించి ఇంద్రుణ్ణి వధించే నిమిత్తం మారణహోమం చేయటమూ, వృత్రాసురుని జననమూ, వృత్రాసురునిచే ఓడింపబడిన దేవతలు ఇంద్రునితో గూడి శ్వేతద్వీపానికి పోవటమూ, శ్రీహరి దయగలవాడై దధీచి మహర్షిని ప్రార్థించి ఆయన వల్ల వజ్రాయుధాన్ని తీసుకోమని చెప్పటమూ, ఇంద్రుడు వజ్రాయుధం సంపాదించి వృత్రుణ్ణి సంహరించటమూ, ఇంద్రుడు బ్రహ్మహత్యచే పీడింపబడినవాడై మానస సరస్సులో ప్రవేశించటమూ, నహుషుడు నూరు అశ్వమేధ యజ్ఞాలు చేసి ఇంద్రపదవిని పొందటమూ, నహుషుడు అగస్త్యుని శాపంచే సురరాజ్య భ్రష్టుడై కొండచిలువగా మారిపోవటమూ, ఇంద్రుడు స్వర్గంలో ప్రవేశించి అశ్వమేధయాగం చేసి మరల త్రిలోకాధిపత్యాన్ని అందుకోవడమూ, చిత్రకేతుని ఉపాఖ్యానమూ, మరుద్గణంబుల జన్మక్రమమూ అనే కథలతో కూడిన షష్ఠ స్కంధమిది.

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీ మహాభాగవతము – మూడవ సంపుటము

సప్తమ, అష్టమ, నవమ స్కంధములు


అనువాదకులు:
డాక్టర్ బి. రుక్మిణి
డాక్టర్ అపర్ణాశ్రీనివాస్
శ్రీ విశ్వనాథం సత్యనారాయణమూర్తి
డాక్టర్ వై. బాలగంగాధరరావు



రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాద్ – 500 029

# ముందుమాట

సనాతన ధార్మిక స్పృహను ఈ జాతికి ఊపిరిగా అందించిన అద్భుత ప్రక్రియ 'పురాణం'. సనాతన ధర్మాన్ని సామాన్యులకు అందించే అసామాన్య గ్రంథం, మహాపురాణం 'శ్రీ మహాభాగవతం'. భగవంతుని ద్వారా చెప్పబడినది భగవద్గీత అయితే భగవంతుడి గురించి చెప్పబడింది భాగవతం. ఈ మహాగ్రంథాన్ని సమకాలీన సమాజానికి అన్వయిస్తే యుగధర్మం ఆవిష్కృతమవుతుంది. భాగవత దివ్యగ్రంథంలో అంతటా అంతర్యామిగా వెలుగుతున్నవాడు నారాయణుడైన శ్రీకృష్ణుడు. భాగవత మహాపురాణానికి అక్షర రూపాన్నీ, అక్షరమైన రూపాన్నీ అందించిన వాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవానుడు. భాగవత పురాణాన్ని తెలుగువారికి తేనెల విందుగా చేసినవాడు సహజకవి బమ్మెర పోతనామాత్యుడు. 'పలికెడిది భాగవతమట! పలికించెడి వాడు రామభద్రుండట!...' అనే భాగవతంలోని పద్య పాదం తెలుగువారి లోగిళ్ళలో వినసొంపుగా వినిపిస్తుంది. సాక్షాత్తూ శ్రీరామచంద్రుడే తెలుగులోకి అనువదించమని ఆనతిని ఇవ్వడం ద్వారా ఈ మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీ మహాభాగవతం ఈశ్వర ప్రేరితమై, తెలుగువారి అభిమాన కావ్యమై తరతరాలుగా తెలుగు హృదయాలను రంజింపచేస్తున్నది.

శ్రీ మహాభాగవతం మూడవ భాగంలో సప్తమ, అష్టమ, నవమ స్కంధాలు పొందుపరచబడ్డాయి. సప్తమ స్కంధములో ప్రహ్లాదునికి, హిరణ్యకశిపునికి మధ్య జరిగిన సంభాషణలోని మనోరంజకమైన పద్యాలు, జీవునికి అధ్యాత్మిక లక్ష్యాన్ని గుర్తు చేస్తాయి. హిరణ్యకశిపుడు వధింపబడిన తరువాత నృసింహస్వామి భీకర రూపాన్ని చూసి బ్రహ్మాది దేవతలు భీతిల్లి, భక్తుడైన ప్రహ్లాదుణ్ణి నృసింహస్వామి వద్దకు పంపారు. ఆ బాలభక్తుడు భక్తితో

పాడిన స్తోత్రాలను విని భగవంతుడు పరవశించి ఆ బాలుడిని అనురాగంతో ఆశీర్వదించాడు. ఈ ఘట్టాన్ని వినగానే శ్రీరామకృష్ణులు భావపారవశ్యంలో 'ఆహా! ఆహా! భక్తుని పట్ల ఎంత వాత్సల్యం!' అంటూ భావసమాధిని పొందేవారు. రాగభక్తి జనించకుండా భగవత్సాక్షాత్కారం కలుగదు. భగవంతుడి పట్ల ప్రేమ కలగాలి. విషయబుద్ధి పూర్తిగా తొలగిపోయి, మనస్సు నూటికి నూరుపాళ్ళు భగవంతుని మీద లగ్నమైనప్పుడే భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. ప్రహ్లాదునిది రాగభక్తి అనేవారు శ్రీరామకృష్ణులు. ఇక అష్టమ స్కంధానికి తలమానికమై ఒప్పే గజేంద్ర మోక్షం భగవంతుని పట్ల ఉండాల్సిన శరణాగత భావాన్ని తెలియజేస్తుంది. నవమ స్కంధములోని యయాతి జీవనం — నెయ్యిని అగ్నిలో వేసినప్పుడు అగ్ని ప్రజ్వరిల్లే రీతిగా కోరికలను అనుభవిస్తూ పోతే మనిషి ఎంత అధఃపతితుడవుతాడో వివరిస్తుంది. ఈ స్కంధాలలో గద్యానికి అవసరమైన చోట విశేష అర్థంతో పాటు ఆధ్యాత్మిక సందేశాన్ని పొందుపరచడం జరిగింది. సందర్భానుసారం పురాణ, వేదాంత సారాన్ని చక్కని గ్రామ్య భాషలో ప్రబోధించిన శ్రీరామకృష్ణుల అమృత వచనాలను ఉటంకించడం జరిగింది.

ఈ గ్రంథంలోని సప్తమ స్కంధాన్ని డాక్టర్ బి.రుక్మిణి గారు అనువదించగా, అష్టమ స్కంధాన్ని డాక్టర్ అపర్ణాశ్రీనివాస్ గారు మరియు శ్రీ విశ్వనాథం సత్యనారాయణ గారు, నవమ స్కంధాన్ని డాక్టర్ వై.బాలగంగాధరరావు గారు అనువదించారు. వీరందరికీ మా హృదయపూర్వక ధన్యవాదములు. ఇక ఈ బృహత్ యజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ ఒక్కరికీ మా ధన్యవాదాలు.

పాఠకులు ఈ మహాభాగవత కథా సుధారసాన్ని గ్రోలి, భాగవత ధర్మాన్ని అనుష్ఠించి, అమృతత్వాన్ని చేరుకోవాలని మా ఆకాంక్ష, అభిలాష.

— ప్రకాశకులు

శ్రీమ ద్విఖ్యాతి లతా
క్రామిత రోదోఽంతరాళ! కమనీయ మహో
జీమూత తులితదేహ
శ్యామల రుచిజాల! రామచంద్రనృపాలా!

1

తా ॥ శ్రీరామచంద్ర మహాప్రభూ! సంపత్ప్రదమైన కీర్తిలత చేత భూమ్యాకాశాలను ఆక్రమించిన స్వామీ! నీలమేఘచ్ఛాయను పోలిన సుందర శరీరధారీ! అవధరించు.

పోతనకు దర్శనమిచ్చిన శ్రీరాముణ్ణి సంబోధిస్తూ శ్రీకృష్ణుని కథను చెప్పిన విధానం ఇక్కడి ప్రత్యేకత. నిత్యపూజ శివార్చన కాగా, తనకు సాక్షాత్కరించినవాడు శ్రీరాముడు. రచన శ్రీకృష్ణుని కథనం.

వ. మహనీయ గుణ గరిష్ఠులగు న మ్ముని శ్రేష్ఠులకు నిఖీల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండయిన సూతుం డి ట్లనియె, నట్లు ప్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నవలోకించి.

2

తా ॥ సమస్త పురాణ సారాన్ని వివరించడానికి సామర్థ్యం కలిగిన సూతుడు – ఉత్తమ గుణయుక్తులైన శౌనకాది మహామునులతో ఈ విధంగా అన్నాడు: మునివరేణ్యులారా! ముముక్షత్వంతో, పవిత్రమైన మనస్సుతో, ప్రాయోపవేశం చేసి పవిత్ర వ్రత దీక్షలో ఉన్న పరీక్షిన్మహారాజు శుక యోగిని చూసి ఇలా అన్నాడు:

## నారాయణుని వైషమ్యా భావమును తెలుపుట

సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం, డైన వైకుంఠుఁ డనంతుఁ డాద్యుఁ

డింద్రుని కొఱకు దైత్యేంద్రుల నేటికి, విషముని కైవడి వెదకి చంపె?
నసురులఁ జంపంగ నమరులచేఁ దన, కయ్యెడి లాభ మింతైనఁ గలదె?
నిర్వాణ నాథుండు నిర్గుణుం డగు తన, కసురుల వలని భయంబుఁ బగయుఁ

ఆ. గలుగ నేర, దట్టి ఘనుఁడు దైత్యులఁ జంపి, సురలఁ గాచుచునికి చోద్యమనుచు సంశయంబు నాకు జనియించె! మునినాథ! ప్రజ్ఞ మెఱసి తెలియఁ బలుకవయ్య.

3

తా ॥ "మునిచంద్రమా! అంతములేనివాడూ, సమర్థుడైన ఆ వైకుంఠుడు సకల ప్రాణులకు సముడు, హితుడు, ప్రియమైనవాడు కదా! అటువంటి విష్ణువు, ఇంద్రుని కొరకై రాక్షసముఖ్యులందరినీ అసమభావంతో ఎందుకు వెదకి మరీ చంపాడు? రాక్షసులను సంహరిస్తే దేవతల వల్ల తనకు కలిగే లాభమేమిటి? ముక్తి నొసగేవాడు, నిర్గుణుడు అయినవానికి రాక్షసుల వలన భయం కాని, విరోధం కాని కలుగకూడదు. అటువంటివాడు రాక్షసులను సంహరించి దేవతలను రక్షించటం ఆశ్చర్యం కలిగించే విషయం. అందువల్ల నాకు కలిగిన ఈ సంశయాన్ని నీ ఎఱుకతో నివృత్తి చేయవలసింది."

వ. అనిన శుకుం డిట్లనియె.

4

అని పలికిన పరీక్షిత్తుతో శుకుడు ఈ విధంగా అన్నాడు:

శా. నీ సంప్రశ్నము వర్ణనీయము గదా, నిక్కంబు, రాజేంద్ర! లక్ష్మీ సంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ, దద్దాసాఖ్యానము లొప్పు విష్ణుచరణధ్యాన ప్రధానంబులై శ్రీ సంధానములై మునీశ్వర వచో జేగీయమానంబులై.

5

తా ॥ "ఓ రాజేంద్రా! నీవు అడిగిన ప్రశ్న నిజంగా అభినందించ తగినది. లక్ష్మీనాథుడైన విష్ణుని సచ్చరిత్రము చాలా ఆశ్చర్యాన్ని కలిగించేది. విష్ణుభక్తుల కథలు వింటే మనస్సులు శ్రీమహావిష్ణువు యొక్క పాదములందే ధ్యానమగ్న మౌతాయి. మునీశ్వరులు కీర్తించిన ఆ కథలు శ్రేయోదాయకాలు, భక్తి ముక్తి సాధనాలు!

క. చిత్రంబులు త్రైలోక్య ప, విత్రంబులు భవలతా లవిత్రంబులు స న్మిత్రంబులు మునిజన వన, చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

6

తా ॥ శ్రీమహావిష్ణువు చరిత్రములు మహిమాన్వితములైనవి, త్రిలోకపావన మైనవి. భవబంధాలనే లతలకు కొడవలి వంటివి. సజ్జనులకు మిత్రముల వంటివి, మహర్షులనే వనములకు వసంతఋతువుల వంటివి.

వ. నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము. వ్యక్తుండు గాక, గుణంబులు లేక, ప్రకృతిం జెందక, భవంబుల నొందక పరమేశ్వరుండు దన మాయవలన నయిన గుణంబుల నావేశించి బాధ్య బాధకత్వంబుల నొందు, నతండు గుణరహితుండు, సత్త్వ రజ స్తమంబులు ప్రకృతి గుణంబు, లా గుణంబులకు నొక్కొక్క కాలంబున హాని వృద్ధులు గల, వా యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్ష రక్షోగణంబులను విభజించె. సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుండయిన తెఱంగునఁ దద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు. తత్త్వ విదులయిన పెద్దలు తమలోనం బరమాత్మ స్వరూపంబున నున్న యీశ్వరు నవ్విధంబున నెఱుంగుదురు. జీవాత్మకుఁ బరుండైన సర్వమయుండు దనమాయ చేత విశ్వంబు సృజియింపంగోరి రజంబును, గ్రీడింపంగోరి సత్త్వంబును, నిద్రింపంగోరి తమంబును నుత్పాదించి చరమైన కాలంబును సృజియించు, నా కాలంబున సర్వదర్శనుండయిన యీశ్వరుండును గాలాహ్వయుండునునై

సత్త్వగుణంబయిన దేవతానీకంబునకు వృద్ధియు, రజస్తమోగుణు లయిన రాక్షసులకు హానియుం జేయుచుండు.

7

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! వేదవ్యాసునికి నమస్కరించి, విష్ణుకథలు వివరిస్తాను విను. వాక్కుచేత, మనస్సుచేత తెలియబడని వాడు, సత్త్వరజస్తమస్సులనే గుణములు లేనివాడు, మాయను చెందక భవమును పొందనివాడు అయిన పరమేశ్వరుడు తన మాయ వలన కల్పింపబడిన గుణాలను పొంది; బాధింప తగిన, బాధను పొందే స్థితిని కలిగి ఉంటాడు. కాని అతడు నిర్గుణుడు. సత్త్వరజస్తమో గుణాలు ప్రకృతి సంబంధమైనవి. ఆ గుణాలకు ఒక్కొక్క సమయంలో నాశము, వృద్ధి కలుగుతుంటాయి. సత్త్వగుణాలకు దేవతలు, ఋషులను; రజోగుణాలకు రాక్షసులను; తమోగుణాలకు యక్ష రాక్షసులను సమూహాలుగా ఈశ్వరుడు విభజించాడు. అనేక ప్రదేశాలలో కనుపించే సూర్యుడు ఒక్కడే అయినట్లు, అన్నిటియందు ఉన్నటువంటి భగవంతుడు వేరు కాదు. తాత్త్వికులైనవారు తమలోని పరమాత్మస్వరూపుని ఈ విధంగానే తెలుసుకుంటారు. జీవాత్మకు ఇతరుడైన పరమాత్ముడు తన మాయాలక్షణము వలన విశ్వాన్ని సృష్టింపదలచి రజోలక్షణాలతో, లీలావిలాసాలను సలుపుటకై సత్త్వలక్షణంతో, నిద్రాసక్తుడై తమోగుణాన్ని కలిగించి, కాలమునందు మార్పును కలిగించాడు. ఆ 'కాలం' లో శ్రీహరి సర్వదర్శనుడైన ఈశ్వరుడు, 'కాలస్వరూపుడు' అయ్యాడు. ఆ స్వామి దేవగణాలకు వృద్ధిని, రజస్తమోగుణాలు కలిగిన రాక్షసులకు హానిని కలిగిస్తుంటాడు.

క. జన నాయక! యీ యర్థము, ఘన యశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్ ముని నారదుండు సెప్పెను, వినిపించెద వినుము చెవులు విమలత నొందన్.

8.

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! తత్త్వసారంతో కూడిన ఈ విషయాన్నంతా పూర్వం ధర్మరాజుకు యజ్ఞం చేసే సందర్భంలో నారదుడు ఉపదేశించాడు. వీనులవిందుగా ఈ

విషయాన్ని నీకు వినిపిస్తాను. శ్రద్ధతో విను.

వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుం డైన శిశుపాలుండు హరిని నిందించి, నిశిత నిర్వక్ర చక్రధారా దళిత మస్తకుండయి తేజోరూపంబున వచ్చి హరి దేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలో నున్న నారదునిం జూచి యిట్లనియె.

9

తా ॥ పూర్వం ధర్మరాజు రాజసూయ యాగం చేసినప్పుడు బాలుడైన (తెలియనివాడు, అజ్ఞాని, మాయామోహితుడు అయిన) శిశుపాలుడు శ్రీహరిని నిందించి, వాడియైన చక్రాయుధంతో శిరస్సు ఖండింపబడి, తేజోరూపంలో శ్రీహరి దేహంలో ప్రవేశించాడు. అది చూసి ఆశ్చర్యపడిన ధర్మరాజు సభలోనున్న నారదునితో ఈ విధంగా పలికాడు:

ఆ. ఎట్టివారికైన నేకాంతులకు నైన, వచ్చి చొరఁగరాని వాసుదేవు
తత్త్వమందుఁ జేదిధరణీశుఁ డహితుఁడై, యెట్లు సొచ్చె మునివరేణ్య! నేడు.

10

తా ॥ “మునిశ్రేష్ఠుడా! ఎటువంటి వారికైనా, పుణ్యాత్ముల వంటి వారైనా ప్రవేశింప వీలుకాని విష్ణుతత్త్వంలో ఈనాడు చేదిదేశపు రాజు శిశుపాలుడు, శత్రుభావం గలవాడు, ఏ విధంగా ఐక్యం కాగలిగాడు? ఈ పుణ్యపదం వీనికి ఎలా కలిగింది?

ఉ. వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁడై తమో
లీనుఁడు గాఁడె? తొల్లి మదలిప్తుఁడు చైద్యుఁడు పిన్న నాఁట నుం
డేనియు మాధవున్ విన సహింపఁడు భక్తి వహింపఁ డట్టి వాఁ
డే నిబిడ ప్రభావమున నీ పరమేశ్వరునందుఁ జొచ్చెనో?

11

తా ॥ పూర్వం వేనుడనే రాజు విష్ణువును దూషించినందుకు బ్రాహ్మణులు శపించగా, నరకాన్ని పొందలేదా? మదోద్ధతుడైన చేదిరాజు శిశుపాలుడు చిన్ననాటినుండి విష్ణువు పట్ల విరోధాన్ని వహించినవాడు, భక్తిరహితు డైనవాడు. ఏ మహిమ వల్ల పరమాత్మునిలో ఐక్యం చెందగలిగాడు?

మ. హరి సాధింతు, హరిన్ గ్రసింతు, హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ, దా
హరికిన్ వైరి నటంచు వీఁడు పటురోషాయత్తుఁడై యెప్పుడున్
దిరుగుం బ్రువ్వదు నోరు వ్రీలి పడ, దా దేహంబు దాహంబుతో
నరకప్రాప్తియు నొందఁ; డే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో?

12

తా ॥ విష్ణువును పట్టుకుంటాను, విష్ణువును ఓడిస్తాను, విష్ణువును సంహరిస్తాను – విష్ణువుకు నేను శత్రువును అంటూ కోపంతో, రోషంతో ఎప్పుడూ వ్యర్థప్రలాపాలాడుతూ తిరుగుతుంటే వీని నోరు పడిపోనూ లేదు. శరీరమంతా మంటలెక్కి నీరసంతో నేలకూలలేదు. వీడు నరకలోకాన్ని పొందక ఏ విధంగా జగన్నాథునిలో ప్రవేశించాడు?

వ. అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నిందసేయుదురు, నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినిపింపుము, పవనచలిత దీపశిఖయునుం బోలె నా హృదయంబు సంచలించుచున్న దనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె. దూషణభూషణ తిరస్కారంబులు శరీరంబునకుఁ గాని పరమాత్మకు లేవు, శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున 'నేను', 'నాయది' యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబు నందు సంభవించు. అభిమానంబు బంధంబు. నిరభిమానుండై వధించినను వధంబు గాదు. కర్తృత్వ మొల్లని వానికి హింసయు సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు. గావున.

తా ॥ అంతేకాదు. శిశుపాలుడు, అతని సోదరుడైన దంతవక్త్రుడు ఎల్లప్పుడు గోవిందుని నిందిస్తూనే ఉంటారు. అటువంటివారు, సమస్త జనులు చూస్తుండగా విష్ణుసాయుజ్యాన్ని పొందిన హేతువేమిటి? "గాలికి కదలాడే దీపశిఖవలె చలించే నా హృదయం ఈ వార్తను విన్నప్పటినుంచి కలత చెందుతున్నది."

అని పలికిన ధర్మరాజుతో నారదుడు ఈ విధంగా అన్నాడు:

"పొగడ్తలు, అవమానాలు శరీరగతములే కాని పరమాత్మను అంటవు. శరీరాభిమానం కలవారికి దండనం, కఠినోక్తులు హింసగా భావించబడతాయి. 'నేను—నాది' అనే స్వార్థ ద్వేష భావాలు కూడా జీవులకు శరీరం వల్లనే కలుగుతాయి. నిరభిమానులకూ, కర్తృత్వకాంక్ష లేనివారికీ హింసాభావము అంటదు. సర్వప్రాణులలోనూ ఉన్న శ్రీహరికి స్వపర భేదభావం లేదు.

ఆ. అలుకనైనఁ జెలిమి నైనఁ గామంబున, నైన బాంధవమున నైన భీతి నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ, జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు.

14

తా ॥ కోపంతో కానీ, స్నేహంచేత కానీ, కోరికతో కానీ, బంధుత్వంతో కానీ, భయంతో కానీ, నిరంతర హరినామస్మరణతో అఖిలాత్ముడైన శ్రీహరిని చేరవచ్చు. ఆ శ్రీహరికి పరాయివారెవ్వరూ ఉండరు.

క. వైరానుబంధనంబునఁ, జేరిన చందమున విష్ణుఁ జిరతర భక్తిం జేరఁగరా దని తోఁచును, నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్.

15

తా ॥ విరోధ భావంతో (త్వరగా) దగ్గరకు చేరినట్లు విష్ణువును అనురాగంతో చేసే

ఆరాధనతో చేరలేమని నా మనస్సుకు తోచింది చెప్పాను.

భగవదవతారాలకు సన్నిహితంగా వర్తించే నారదునికి పూర్వం వైరభక్తి ద్వారా భగవదనుగ్రహం పొందినవారి గురించి తెలుసు కనుక అనుభవపూర్వకంగా ఆ మాట అన్నాడు.

క. కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున బంభ్రమింప భ్రాంతంబై తత్కీటకము భ్రమరరూపముఁ, బాటించి వహించుఁగాదె భయయోగమునన్.

16

తా ॥ తుమ్మెద ఒక పురుగును తెచ్చి దానిచుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగగా – భ్రాంతితో ఆ కీటకం తుమ్మెదని తలచి తాను కూడా భ్రమరరూపం పొందటం లేదా?

భావంతో ఏ విధంగా సాధన చేసిననూ – భయం వల్లగానీ, స్మరణం వల్లగానీ, శ్రవణం ద్వారా గానీ శ్రీహరి సారూప్యాన్ని పొందటం సహజం.

వ. ఇవ్విధంబున.

17

తా ॥ ఈ విధంగా –

శా. కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైర క్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు, భక్తి నేము, నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!

18

తా ॥ మహారాజా! మన్మథ భావంతో గోపికలు, భయంతో కంసుడు, వైరభావంతో

శిశుపాలుడు మొదలైన రాజన్యులు, బంధువులై యాదవులు, ప్రేమభావనతో మీరు, భక్తిచేత మేము విష్ణువును పొందగలిగాము. నిరంతర ధ్యాననిష్ఠతో ఏ విధంగానైనా శ్రీహరిని చేరవచ్చును.

## శ్రీ మహావిష్ణుని ద్వారపాలకులను సనకసనందాదులు శపించుట

వ. మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి తద్గతిం జెందిరి. హరి నుద్దేశించి క్రోధాదులైన యే నింటి లోపల నొక్కటియైన వేనునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుండయ్యె. మీ తల్లికి చెలియలి కొడుకు లయిన శిశుపాల దంతవక్త్రులు దొల్లి విష్ణు మందిర ద్వారపాలకులు. విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబునన్ జన్మించి, రనిన విని యుధిష్ఠిరుండు నారదుని కిట్లనియె.

19

తా ॥ కోరిక, విరోధము, భయము, స్నేహము, సేవాభావము ఆలంబనతో ఎందరో విష్ణువుపై మనస్సును లగ్నపరచి సుగతిని పొందారు. వేనునికి శ్రీహరిపట్ల క్రోధాదులైన ఈ ఐదు విధాల చింతనలలో ఏ భావం లేనందువల్ల నిష్ప్రయోజకుడైనాడు. మీ పినతల్లి కొడుకులైన శిశుపాల దంతవక్త్రులు పూర్వం విష్ణుసన్నిధి అయిన వైకుంఠానికి కావలివారు. బ్రాహ్మణశాపము వల్ల పదవిని పోగొట్టుకొని భూమిపై జన్మించారు.” అనగానే ధర్మరాజు నారదునితో ఈ విధంగా అన్నాడు:

మ. అలుగం గారణ మేమి? విప్రులకు ము న్నా విప్రు లెవ్వారు? ని
శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశాను వ
ర్తులు వైకుంఠ పురీనివాసు లన విందున్, వారి కెబ్బంగి నీ
ఖల జన్మంబులు వచ్చె? నారద! వినం గౌతూహలం బయ్యెడిన్.

20

తా ॥ “నారదా! ఆ బ్రాహ్మణులు కోపించడానికి కారణమేమిటి? ఆ బ్రాహ్మణులెవరు? చంచలస్వభావం లేనివారు, ఇంద్రియనిగ్రహం కలవారు, సంసారలంపటం లేనివారు,

పరమాత్ముని అనుసరించేవారు విష్ణుదేవుని వైకుంఠపురమున ఉంటారని విన్నాను. అటువంటివారికి ఈ అధమ జన్మ ఎందుకు కలిగింది? నేను వినడానికి కుతూహల పడుతున్నాను."

వ. అనిన నారదుం డిట్లనియె. ఒక్కనాఁడు బ్రహ్మమానస పుత్త్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునందును సంచరించుచు, నై దా ఱేండ్ల ప్రాయంపు బాలకుల భావంబున దిగంబరులయి హరి మందిరంబునకు వచ్చి చొచ్చు నెడ, మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి.

21

తా ॥ అనగానే నారదుడు ఈ విధంగా చెప్పాడు – "ఒకనాడు బ్రహ్మమానసపుత్రులైన సనక సనందనాదులు దైవప్రాప్తిచేత ముల్లోకాల్లో సంచరిస్తున్నారు. పసిబాలకుల భావనతో దిగంబరులైన వారు వైకుంఠమున ప్రవేశించబోగా, వాకిటనున్న ద్వారపాలకులు వారిని చూసారు.

క. డింభకుల ననర్గళ వి, స్రంభకుల రమాధినాథ సల్లాప సుఖా రంభకుల ముక్త మానస, దంభకులం జొరఁగ నీక తరిమి రధీశా!

22

తా ॥ "ఓ రాజేంద్రా! విష్ణువునందు అమిత భక్తిగలవారు, రమానాథునితో సంభాషణసుఖాన్ని కోరేవారు, మనస్సున దంభాన్ని వదలిన బాలకులైన సనక సనందనాదులను వైకుంఠమున ప్రవేశింపనీయక తరిమివేశారు.

క. వారించిన తమకంబున, వా రించుక నిలువలేక వడిఁ దిట్టిరి దౌ
వారికుల నసురయోని న, వారితులై పుట్టుఁడనుచు వసుధాధీశా!

23

తా ॥ ధర్మజా! వారు తమను అడ్డగించినందుకు కోపించి, భగవద్దర్శనానికై మరి వేచి ఉండలేక, సహనం కోల్పోయి, వెంటనే ద్వారపాలకులను "రాక్షసులై పుట్టండి" అని శపించారు.

వ. మఱియు నా పిన్న పెద్దలు వారలం జూచి 'మీర లీయెడ నుండ నర్హులు గారు. నారాయణ చరణమూలంబు విడిచి రజస్తమోగుణులైన రాక్షసయోనిం బుట్టుం' డని శపియించిన వారు నా శాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన న మ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱం గరుణించి మూఁడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు మని నిర్దేశించి చని, రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వ చరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపు హిరణ్యాక్షులన దితికి జన్మించి, రందుఁ గనిష్ఠుండైన హిరణ్యాక్షుని హరి వరాహ రూపంబున సంహరించె, నగ్రజుండయిన హిరణ్యకశిపుండు నరసింహమూర్తి యయిన శ్రీహరిచేత విదళితుండయ్యె, నతని కొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత హింసితుం డయ్యును నారాయణ పరాయణుండై శాశ్వతుం డయ్యె. రెండవ భవంబునఁ గైకసి యను రాక్షసికి రావణ కుంభకర్ణులయి సంభవించిన, విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండయి యవతరించి వారల వధియించె, న మ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయ ఋషివలన నెఱింగెదవు, తృతీయజన్మంబున మీ తల్లి చెలియలికి శిశుపాల దంతవక్త్రులన నుద్భవించి.

24

తా ॥ వయస్సులో చిన్నవారైనా, జ్ఞానవృద్ధులైన సనకసనందనాదులు ద్వారపాలకులను చూసి, "మీరిక్కడ ఉండటానికి అర్హులు కారు. విష్ణుసన్నిధిని విడిచి రజస్తమోగుణాలతో రాక్షసజన్మ పొందు" దని శపించగా, వారు వైకుంఠపదం నుంచి పదవీభ్రష్టులై, దుఃఖంతో మునులను ప్రార్థించారు. ఆ మహాత్ములు దయ తలచి, "మూడు జన్మలలో వైరభావంతో భగవత్సాన్నిధ్యం లభిస్తుం" దని చెప్పి వెళ్ళారు. ఈ విధంగా శాపగ్రస్తులైన వీరు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా దితికి జన్మించారు. విష్ణువు వరాహరూపంలో హిరణ్యాక్షుని; నృసింహ

అవతారంలో హిరణ్యకశిపుని సంహరించినాడు. హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు తండ్రిచే హింసింపబడినప్పటికీ శ్రీహరి పదధ్యానమగ్నుడై శాశ్వతుడైనాడు. ద్వారపాలకులు రెండవ జన్మలో కైకసికి రావణ కుంభకర్ణులుగా జన్మించి, రఘుకులసంజాతుడైన రామునిచే హతులైనారు. ఆ మహాత్ముని పరాక్రమం గురించి నీకు మార్కండేయ మహర్షి తెలియజేస్తాడు. మూడవజన్మలో వారు మీ తల్లి చెల్లెలైన సాత్వతికి శిశుపాల దంతవక్త్రులుగా జన్మించారు.

శా. వక్రత్వం బెటు లేక పాయని మహావైరంబుతో నిత్య జా
తక్రోధ స్మరణంబులన్ విదళితోద్యత్పాప సంఘాతులై
చక్రచ్ఛిన్న శిరస్కులై మునివచ శ్శాపావధి ప్రాప్తులై
చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్య భావంబునన్.

25

తా ॥ ఏ మాత్రం తక్కువ కాని, ఏనాడూ ఎడతెగని వైరభావంతో – అనునిత్యం ఉద్భవించే క్రోధస్మరణతో, ఉద్ధృతమైన ఉత్కంఠతో అదే ధ్యాసలో ఉండేవారు. అందుచేత వారి సమస్త పాప సమూహం పోగొట్టబడింది. శ్రీకృష్ణుడు వారి శిరస్సులను సుదర్శనంతో ఖండించాడు. సనకాదుల శాపఫలాన్ని అనుభవించి, చివరికి వారు విష్ణు సన్నిధానంలో సారూప్యాన్ని (విష్ణుభావమును) పొందారు."

రాక్షసజన్మను పొందినా నిత్యమూ భగవంతుని వైరభావంతో భజించినందువల్ల వారికి శాపం కూడా వరంగా పరిణమించింది.

వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె.

26

తా ॥ నారదుడు చెప్పినది విన్న, ధర్మనందనుడు ఈ విధంగా పలికాడు:

క. బాలున్ హరిపద చింతా, శీలున్ సుగుణాలవాలు శ్రీమన్మేధా
జాలున్ సంతోషింపక, యేలా శిక్షించె? రాక్షసేంద్రుం డనఘా!

27

తా ॥ "పుణ్యాత్ముడవైన నారదా! పసివాడు, విష్ణుపాద చింతన గలవాడు, సద్గుణుడు, బుద్ధిశాలి అయిన కుమారుని చూసి సంతసించి ప్రేమభావనతో ఉండక రాక్షసరాజైన హిరణ్యకశిపుడు ఎందుకు శిక్షను విధించాడు?

క. పరిభూత వ్యథనంబులు, నిరుపమ సంసార జలధి నిర్మథనంబుల్ నరకేసరి కథనంబులు, పరిరక్షిత దేవ యక్ష ఫణి మిథునంబుల్.

28

తా ॥ శ్రీహరి కథలు – వ్యథలను పోగొట్టేవి, సాటిలేని సంసారసాగరాన్ని దాటించేవి, దేవ, యక్ష, నాగ మిథునాలందరికీ క్షేమమును కలిగించేవి. అటువంటి దైవచింతన సంతరించుకున్న ప్రహ్లాదున్ని చూసి సంతసించక ఎందుకు శిక్షింపదలచాడు.

వ. మునీంద్రా వినిపింపు మనిన నారదుం డిట్లనియె. కమలోదరుచేతం దన సహోదరుండు హతుం డయ్యె నని విని, హిరణ్యకశిపుండు రోష శోక దందహ్యమాన మానసుండయి ఘూర్ణిల్లుచు, నాభీల దావదహనజ్వాలా కరాళంబులయిన విలోకన జాలంబుల గగనంబునం బొగ లెగయ నిరీక్షింపుచుఁ దటిల్ల తాంకుర సంకాశ ధగద్ధగిత దంత సందష్ట దశనచ్ఛదుండును, నదభ్ర భయంకర భ్రుకుటిత ఫాలభాగుండును, నిరంతరాక్రాంత దురంతవైర వేగుండును నై మహాప్రభాజాల జటాలంబగు శూలంబుఁ గేల నందుకొని, సభామండపంబున నిలువంబడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖులైన దైత్య దానవుల నాలోకించి యిట్లనియె.

29

తా ॥ మునీంద్రా! ఆ కథలు వినిపించు" అని ధర్మరాజు అడుగగా, నారదుడు ఈ విధంగా తెలుపసాగాడు:

"విష్ణువుచేత తన తమ్ముడైన హిరణ్యాక్షుడు చంపబడినాడని విని, హిరణ్యకశిపుడు క్రోధోద్వేగాలు మనస్సును దహించగా, కలవరపడి, భయంకరమైన కార్చిచ్చు జ్వాలల వంటి చూపులు గగనభాగంలో పొగలు చిమ్మగా చూస్తూ, మెరపు తీగల కొనల వలె ప్రకాశవంతమైన దంతాలతో పెదవులు కొరుకుతూ, భయాన్ని కలిగించే బొమముడితో, దుఃఖవేగమున వైరముచేత కలిగిన తొందరపాటుతో, వెలుగులు చిమ్ముతున్న మంటల సమూహం గల త్రిశూలం చేతపట్టి, సభామంటపంలో నిలబడి – త్రిమస్తకుడు, త్రిలోచనుడు, శకుని, శంబరుడు, శతబాహుడు, నముచి, హయగ్రీవుడు, పులోముడు, విప్రచిత్తి మొదలుగా గల దితి దనువుల సంతతి వారిని చూసి ఈ విధంగా అన్నాడు:

శా. నాకుం దమ్ముఁడు, మీకు నెచ్చెలి, రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృత దేవయక్షుఁడు హిరణ్యాక్షుండు, వానిన్ మహా
సౌకర్యాంగము దాల్చి దానవవధూ సౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించిపోయెనఁట! యీ వార్తాస్థితిన్ వింటిరే?

30

తా ॥ 'నాకు తమ్ముడు, మీకు ప్రియమిత్రుడూ అయిన హిరణ్యాక్షుడి వృత్తాంతం విన్నారా? యుద్ధతంత్ర ప్రవీణుడు, బాహుబలం చేత దేవతలను, యక్షులను ఓడించిన హిరణ్యాక్షుడిని మహా వరాహరూపుడైన శ్రీ మహావిష్ణువు వధించి – రాక్షస స్త్రీల సౌభాగ్యాలు హరించివేశాడు.

చ. వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడు, సం
జనన మెఱుంగ రెవ్వరును, జాడ యొకింతయు లేదు, తన్ను డా

సిన మఱి డాయు, వెంటఁబడి చిక్కక చిక్కఁడు, వీని నొక్క కీ
లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగ వచ్చునే?

31

తా ॥ వనములలో నివసిస్తాడు కాని వరాహము కాదు. మునుల హృదయాలలో దూరి ఉంటాడు. ఎవరికీ అతని పుట్టుక తెలియదు, మార్గము ఎరుకపడదు. తనను సమీపించితే తానే దరిజేరేవాడు, వెంటబడి తగులుకొంటే గాని దొరకడు. అటువంటివాడిని ఒక యుక్తిచేత మనమంతా వెనుదీయక స్వాధీనం చేసుకోగలమా?

మహావిష్ణువు సర్వాంతర్యామి. సకల జీవరాశుల హృదయాలలో నివసించేవాడు, చావుపుట్టుకలు లేనివాడు. భక్తితో తనను కోరి వెళితే సులభసాధ్యుడు. అపరిమితుడైనవాడిని ఎక్కడ వెదకగలం. అందుచేత జ్ఞానంతో తెలుసుకొని, ఆయనను అనుభుతి చేసుకోవాలి. రాక్షసుడు రజోగుణులు. శుద్ధ సత్త్వగుణం ఉన్నవాళ్ళకి ఆయన సులభసాధ్యుడు. అందుచేత వారు ఎలా పట్టుకోగలరని వాళ్ళ అభిప్రాయం.

సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి, మున్నీట మునిఁగిన మునుఁగుఁగాక
యలయించి పెనఁగ నా యచలసంభ్రమమున, కెఱఁగి వె న్నిచ్చిన నిచ్చుఁగాక
జగడంబు సైఁపక సౌకర్య కాంక్షి యై, యిలక్రింద నీఁగిన నీఁగుఁగాక
క్రోధించి యటు గాక కొంత పౌరుషమున, హరిభంగి నడరిన నడరుఁ గాక

ఆ. కఠినశూలధారఁ గంఠంబు విదళించి, వాని శోణితమున వాఁడి మెఱసి
మత్సహోదరునకు మహిఁ దర్పణము సేసి, మెఱసి వత్తు, మీకు మేలు దెత్తు.

32

తా ॥ వాడు నా భుజశక్తికి ఎదురు నిలువలేక జంకుతో సముద్రంలో దాక్కొన్నా, అలసిపోయేటట్లు చేసే నా స్థైర్యానికి వికలుడై వెన్ను చూపినా, పోరాటం సహించక

వరాహరూపంలో నేల లోపలికి దూరిపోయినా, క్రోధంతో పౌరుషం వహించి సింహం వలె ఎదుర్కొన్నా, కఠిన శూలంతో అతని కంఠాన్ని త్రుంచి, పౌరుషం ప్రకాశించగా అతని రక్తంతో నా సోదరునికి తర్పణం వదలి, విజయుడనై మీకు ఆనందం కలిగిస్తాను.

ఈ విధంగా విష్ణువును శత్రువుగా భావించే హిరణ్యకశిపుడు ద్వేషంతో మీన, కూర్మ, వరాహ అవతారాలను స్మరించటమే కాక, తనకు మృత్యురూపమున రాబోతున్న నరసింహాకృతిని కూడా స్మరించటం ఇక్కడి విశేషం.

క. ఖండిత మూలద్రుమమున, నెండిన విటపముల భంగి నితఁడు వడిన నా
ఖండల ముఖ్యులు వడుదురు, భండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్.

33

తా ॥ నేను యుద్ధంలో ఇతణ్ణి పరిమార్చితే, వేర్లు తెగిన చెట్టు కొమ్మలు ఎండి కూలినట్లు విష్ణువే ప్రాణమని భావించిన ఇంద్రుడు మొదలైన వారుకూడా నిర్జీవులౌతారు.

శ్రీమద్భగవద్గీత – పురుషోత్తమ ప్రాప్తియోగంలో భగవానుడు 'ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్' అంటూ – జీవరాసుల ఉత్పత్తి పరమాత్మ నుండే కనుక సంసారవృక్ష మూలములు పైన ఉండి, కొమ్మలు క్రిందికీ పైకీ అంతటా వ్యాపించినవని, ప్రబల వైరాగ్యమనే శస్త్రంతో మూలచ్ఛేదం చేస్తే పరమపదం లభిస్తుందనీ బోధించాడు. ఇక్కడ హిరణ్యకశిపుడు దేవతల మూలాధారాన్ని కనిపెట్టి, అది వశం చేసుకుంటే అంతా స్వాధీనమైనట్లేనని భావించాడు. ఇదే వైరభక్తి లోని పరమార్థం.

సీ. పొందు దానవులార! భూసురక్షేత్ర సం, గతమైన భూమికి గములు గట్టి
మఖతపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల, వెదకి ఖండింపుఁడు, విష్ణుఁ డనఁగ
నన్యుఁడొక్కఁడు లేఁడు, యజ్ఞంబు వేదంబు, నతఁడె, భూదేవ క్రియాది మూల
మతఁడె, దేవర్షి పిత్రాది లోకములకు, ధర్మాదులకు మహాధార మతఁడె

తే. యే స్థలంబుల గో భూసురేంద్ర వేద, వర్ణ ధర్మాశ్రమంబులు వరుస నుండు
నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱచి, దగ్ధములు చేసి రండు మీ దర్ప మొప్ప.

34

తా ॥ రాక్షసులారా! మీరందరూ సమూహంగా పోయి, బ్రాహ్మణ మాన్యములతో కూడిన చోట్లకు వెళ్ళి, యజ్ఞములు – తపస్సు – వేదపఠనం – మౌనవ్రతం అవలంబించినవారిని వెతికి, సంహరించండి. విష్ణువంటే ఎవరో వేరుగా లేదు. యజ్ఞకర్మము, వేదము అతని స్వరూపములే. బ్రాహ్మణుల కర్మలన్నిటికీ మూలము అతడే; దేవాది లోకాలకు, ధర్మార్థకామములకు అతడే ఆధారం. ఏ ప్రదేశాలలో గో బ్రాహ్మణ వేద కులాచారాలు క్రమం తప్పక ఉంటాయో అక్కడికి పోయి, మీ దర్పం కొద్దీ వాటిని నాశనం చేయండి.

హిరణ్యకశిపుడు రాక్షసులను దుష్టకార్యాలకు పురికొల్పినా విష్ణుతత్త్వాన్ని, విష్ణువు ఉనికిని తెలియజెప్పాడు. మోక్షసాధకులకు ఉండే ఎఱుక జన్మసంస్కారం వల్ల హిరణ్యకశిపునికి ఉన్నదని దీని భావం.

వ. అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దను నిర్దేశంబులు శిరంబుల ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని.

35

తా ॥ అని ఈ విధంగా ఆదేశించిన హిరణ్యకశిపుని ఆజ్ఞ శిరసావహించి రాక్షసులు అనేకులు భూమండలంపై పడ్డారు.

సీ. గ్రామ పుర క్షేత్ర ఖర్వట ఖేట ఘో, షారామ నగ రాశ్ర మాదికములు
గాలిచి కొలఁకులు గలఁచి ప్రాకార గో, పుర సేతువులు ద్రవ్వి, పుణ్యభూజ
చయములు ఖండించి సౌధ ప్రపాగేహ, పర్ణశాలాదులు పాడుచేసి
సాధు గోబ్రాహ్మణ సంఘంబులకు హింస, గావించి వేదమార్గములు సెఱచి

ఆ. కుతల మెల్ల నిట్లు కోలాహలంబుగా, దైత్యు లాచరింపఁ దల్లడిల్లి నష్టమూర్తు లగుచు నాకలోకము మాని, యడవులందుఁ జొచ్చి రమరవరులు.

36

తా ॥ పల్లెలు, పట్టణాలు, వ్యవసాయక్షేత్రాలు, గొల్లపల్లెలు, తోటలు, రాజధానులు, ఆశ్రమాలను ధ్వంసం చేస్తూ, నీటిమడుగులు పాడుచేసి; ప్రహరులు, కోట బురుజులు, ఆనకట్టలు తవ్వి; పుణ్యావాసాలయిన వృక్షాలను నరికి, మేడలు, చలివేంద్రాలు, ఇండ్లు, పర్ణశాలలు పాడుచేసి; సాధువర్తనులను, గోవులను, బ్రాహ్మణ సమూహములను హింసించి; వేదవిహితమైనవాటిని చెడగొట్టి, భూమండలమంతటినీ రాక్షసులు చీకాకు పరిచారు. ఆ కోలాహలానికి తల్లడిల్లిన దేవతలు నిజాకృతులు కోల్పోయి, స్వర్గం వదలి అడవులకు పారిపోయారు.

వ. అంత హిరణ్య కశిపుండు దుఃఖీతుండై మృతుండైన సోదరునకు నుదక ప్రదానాది కార్యంబు లాచరించి యతని బిడ్డలగు శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ ప్రముఖుల నూఱడించి వారల తల్లితోఁగూడ హిరణ్యాక్షుని భార్యల నందఱ రావించి, తమ తల్లియైన దితి నవలోకించి యిట్లనియె.

37

తా ॥ తరువాత హిరణ్యకశిపుడు దుఃఖీతుడై, మరణించిన సోదరునికి ఉత్తరక్రియలు చేసి – సోదరుని కొడుకులు శకుని, శంబరుడు, కాలనాభుడు, మదోత్కచుడు మొదలుగా గల ప్రముఖులను ఓదార్చాడు. వారి తల్లినీ, హిరణ్యాక్షుని మిగిలిన భార్యలనందరినీ రప్పించి, తమ తల్లి దితిని చూసి, ఈ విధంగా అన్నాడు:

శా. నీరాగారనివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు గూడి విత్తురు, సదా సంగంబు లేదొక్కచో

శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్సూనుండు దల్లీ! మహా
శూరుం డాతఁడు త ద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్?

38

తా ॥ "అమ్మా! నీ కొడుకు వియోగానికి దుఃఖీస్తున్నావెందుకు? లోకం ఒక చలివేంద్రం వంటిది. ప్రాణులందరూ దాహం కోసం వచ్చిన బాటసారులు. వాళ్ళ దాహం తీరిన వెంటనే వెళ్ళిపోతున్నట్లుగా సంసారమందు కూడా వాళ్ళు వచ్చిన పని కాగానే వెళ్ళిపోతూంటారు. ఎల్లప్పుడు ఒకేచోట కలసి ఉండటమనేది లేదు. పరాక్రమవంతులు వెళ్ళే మార్గంలోనే నీ కుమారుడు వెళ్ళి వీరగతిని పొందాడు. అతను మహాయోధుడు. అటువంటి వీరుని కోసం దుఃఖీంచటం నీ వంటి అసుర మాతకు తగదు.

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం, డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన, మాయా ప్రవర్తన మహిమ వలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున, లింగ శరీరంబు లీలఁ దాల్చి
కంపిత జలములోఁ గదలెడి క్రియఁ దోఁచు, పాదపంబుల భంగి భ్రామ్యమాణ

ఆ. చక్షువుల ధరిత్రి చలిత యై కానంగఁ, బడిన భంగి వికల భావరహితుఁ
డాత్మమయుఁడు కంపితాంత రంగంబునఁ, గదలినట్ల తోఁచుఁ గదలకుండు.

39

తా ॥ సర్వము తెలిసినవాడు, సర్వజగత్ప్రభుడు, సర్వాత్మకుడు, నాశము లేనివాడు, నిర్మలుడు, సత్యమైనవాడు, అంతము లేనివాడు, సర్వశక్తిమంతుడు, ఆత్మరూపుడై నిరంతరం తన మాయ వలన గుణములను కల్పించి, వానితో లింగశరీరం ధరించి, కదలాడే నీటిలో కదలుతున్నట్లు కనబడే చెట్లవలె, తిరుగుడు బడే కన్నులకు భూమి కదలుతున్నట్లు కనబడిన విధంగా – ఆత్మమయుడైన ఆ భగవంతుడు చపలచిత్తులకు కదలినట్లు కనపడుతాడు కాని, వైకల్యం లేనివాడు కనుక చలించడు.

పరమాత్ముని నిజతత్త్వం తెలిసినవాడు హిరణ్యకశిపుడు. అయినా బలగర్వంతో, మాయామోహితుడైన వైరభక్తుడు.

# సుయజ్ఞోపాఖ్యానము

వ. అవ్వా! యవ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందు, సంభవ వినాశ శోక వివేకావివేక చింతా స్మరణంబులు వివిధంబు, లీ యర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధు యమసంవాదంబను నితిహాసంబు నుదాహరింతురు, వినుండు చెప్పెద, నుశీనర దేశంబునందు సుయజ్ఞుం డను రాజు గలం డతండు శత్రువుల చేత యుద్ధంబున నిహతుండయి యున్నయెడ.

40

తా ॥ అమ్మా! భగవంతుడు ఏ లక్షణం లేనివాడైనా కర్మ వలన సంభవించిన సంసారం వల్ల సంయోగవియోగ లక్షణాలతో, జనన మరణ దుఃఖాలు, జ్ఞాన – అజ్ఞానములు, విచారణ, మననం మొదలైన వివిధ లక్షణాలతో కూడినవాడుగా కనుపిస్తాడు. ఈ విషయ వివరణ కొరకు పెద్దలైనవారు "ప్రేతబంధు యమ సంవాదం" అనే చరిత్రను ఉదాహరణగా చెబుతారు. ఆ కథను వివరిస్తాను వినండి:

"ఉశీనర దేశంలో సుయజ్ఞుడనే రాజు ఉండేవాడు. అతడు యుద్ధంలో శత్రువుల చేతిలో మరణించాడు.

సీ. చినిఁగిన బహురత్న చిత్రవర్మముతోడ, రాలిన భూషణరాజితోడ
భీకర బాణ నిర్భిన్న వక్షము తోడఁ, దఱుచుఁ గాఱెడు శోణితంబుతోడఁ
గీర్ణమై జాఱిన కేశబంధము తోడ, రయరోషదష్టాధరంబు తోడఁ
నిమిషహీనం బైన నేత్రయుగ్మము తోడ, భూరజోయుత ముఖాంబుజము తోడఁ

ఆ. దునిసి పడిన దీర్ఘదోర్దండముల తోడ, జీవ రహితుఁడగు నుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా, క్రాంత లగుచు నతని కాంత లెల్ల.

41

తా ॥ అప్పుడతని రత్నమయమైన కవచము చినిగిపోగా, ఆభరణాలు రాలిపోయి, భయంకర బాణాలచే చీల్చబడిన వక్షమునుండి రక్తం స్రవిస్తూ ఉంది. చెదరిన కేశబంధంతో, రోషభారం వలన త్వరితగతిని దంతములతో పీడింపబడే అధరంతో, మూతపడిన కన్నులతో, భూమిపై ధూళితో కమ్మిన ముఖపద్మంతో, తెగిపడిన ఆజానుబాహువులతో నిర్జీవుడైన ఉశీనరపతిని బంధుజనులు చుట్టుచేరి ఉండగా భయభ్రాంతులైన అతని అంతఃపుర స్త్రీలందరూ విలపించసాగారు.

శా. స్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాఁచి మోఁదుకొనుచున్ హా నాథ! యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశు పాదంబుపై
నస్తోక స్తనకుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షింపుచున్.

42

తా ॥ జారిన కేశపాశాలతో, తెగిన హారావళులతో, చేతులు చాచి మోదుకుంటూ, "అయ్యో, నాథా! అంటూ అనేక విధాలుగా ప్రలాపిస్తూ దుఃఖించారు ఆ కాంతలు. కన్నీటి వలన వక్షోభాగంలో అరుణవర్ణపు కుంకుమ విస్తారమై వర్షిస్తుండగా నాథుని పాదాలపైబడి వలవల ఏడ్వసాగారు.

మ. అనఘా! నిన్ను నుశీనర ప్రజల కర్థానంద సంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే? ధాత్రీశ! నీబోఁటికిం
జనునే పాసి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులం బుత్త్రులన్?

43

తా ॥ ఓ పుణ్యాత్ముడా! ప్రజలను సంపదలతో, సంతోషంతో పరిపాలించటానికి బ్రహ్మ

నిన్ను సృష్టించాడు. ఆ విధాత దయలేనివాడై నిన్ను తుదముట్టించాడు. ఈ దేశానికి, నీ పుత్రులకు, మాకు, ఆత్మీయులకు, మిత్రులకు, పరిజనులకు ఇక దిక్కేది? వీరందరినీ దుఃఖసాగరంలో త్రోసి నీవు వదలి వెళ్ళవచ్చునా?

మ. జనలోకేశ్వర! నిన్నుఁబాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతర గామివై మరల కీ చందంబునన్ నీవు వో
యిన మే మెట్లు చరింతు? మొల్లము గదా యీ లోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడఁగన్.

44

తా ॥ ప్రభూ! నీ ఎడబాటులో నిముషాలు సంవత్సరాలుగా గడుస్తాయి. తిరిగి రాని లోకాలకు నీవు ఈ విధంగా వెళ్ళిపోతే మేము ఏ విధంగా జీవించి ఉండగలము? మాకు ఈ ప్రపంచంతో పనిలేదు. అగ్నిలో దూకి మరణించి నిన్ను చేరుకుంటాము.'

వ. అని యిట్లు రాజభార్య లా రాజశవంబు డగ్గఱి విలపింపఁబ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణ బాలకుండై యముండు సనుదెంచి ప్రేత బంధువులం జూచి యిట్లనియె.

45

తా ॥ అని ఈ విధంగా ఆ సుయజ్ఞుని భార్యలు శవం వద్ద విలపిస్తుండగా, సూర్యాస్తమయ సమయంలో, వారి రోదనలు విని యముడు బ్రాహ్మణ బాలకుని రూపంలో వచ్చి, వారినందరినీ చూసి ఓదారుస్తూ ఇలా అన్నాడు:

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము, దేహి వుట్టుచుం
జచ్చుచునుండఁ జూచెదరు, చావక మానెడు వారిభంగి నీ
చచ్చిన వాని కేడ్చెదరు? చావున కొల్లక డాఁగవచ్చునే?

యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్.

46

తా ॥ "వీరి మోహాధిక్యం చూడగా చిత్రమౌతున్నది. జీవుడు పుట్టడం, మరణించటం చూస్తూనే ఉన్నారు. వీరికి మాత్రం మరణం సంభవించనట్లు ఈ చచ్చినవానికై దుఃఖీస్తున్నారు. మరణాన్ని కాదని, దాగి ఉండటం సాధ్యమా! జీవులు ఎక్కడినుండి ఉద్భవిస్తారో తిరిగి అక్కడికే పోవటం సహజం.

క. జననీ జనకులఁ బాసియు, ఘన వృకముల బాధ వడక కడుఁ బిన్నలమై మనియెద, మెవ్వఁడు గర్భం, బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్.

47

తా ॥ తల్లిదండ్రులు వదలిపెట్టినా, క్రూరమృగాల బారిన పడకుండా బ్రతకటం లేదా! మునుపు మాతృగర్భంలో ఉన్నప్పుడు ఎవడు కాపాడినాడో, వాడే ఏ అరణ్యంలో ఉన్నా రక్షిస్తాడు.

క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల, నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ, డివ్విధమున మనుచుఁ బెనుచు హేలారతుఁడై.

48

తా ॥ ఎవడు ప్రాణులను పుట్టిస్తాడో, ఎవడు రక్షిస్తాడో, ఎవడు సంహరిస్తాడో, ఎవడు నాశము లేనివాడో, ఎవడు ప్రభువై ఉన్నాడో, వాడే ఈ విధంగా తన లీలావిలాసంతో ఈ లోకాన్ని రక్షిస్తూ, పోషిస్తూ ఉంటాడు.

ఆ. ధనము వీథిఁబడిన దైవవశంబున, నుండుఁ బోవు మూలనున్న నైన నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు.

49

తా ॥ వీథిలో పడిన ధనమైనా దైవకృప ఉంటే, అక్కడే సురక్షితంగా ఉంటుంది. ఇంట్లో మారుమూల దాచిన సంపదైనా మటుమాయమవ్వవచ్చు. రక్షణ లేని దుర్బలుడు అడవిలో ఉన్నా, భగవంతుని దయ ఉంటే క్షేమంగా ఉంటాడు. సౌధం లోపల రక్షింపబడుతున్న రాజైనా, భగవంతుని కృపలేకపోతే మరణించవచ్చు.

క. కలుగును, మఱి లేకుండును, గల భూతములెల్లఁ గాలకర్మవశము లై
నిలఁబడుఁ, బ్రకృతిం దద్గుణ, కలితుఁడుగాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్.

50

తా ॥ కాల కర్మములకు లోబడి ప్రాణులన్నీ జనన మరణాలను పొందుతుంటాయి. ప్రకృతి కార్యమగు అట్టిదేహమునందు ప్రకటమగుచున్ననూ, ఆత్మ విలక్షణమైనది కనుక ప్రకృతి గుణములచే బంధింపబడుటలేదు. విచారింపగా జీవుడు ఆ గుణాలన్నింటికీ అతీతుడు, ఆత్మమయుడు, అగమ్యుడు (పొందరానివాడు).

సీ. పాంచ భౌతికమైన భవనంబు దేహంబు, పురుషుండు దీనిలోఁ బూర్వ కర్మ వశమున నొకవేళ వర్తించు దీపించుఁ, దఱి యైన నొకవేళఁ దలఁగి పోవుఁ జెడునేని దేహంబు సెడుఁగాని పురుషుండు, సెడఁ డాతనికి నింతసేటు లేదు పురుషునికిని దేహపుంజంబునకు వేఱు, గాని యేకత్వంబు గాన రాదు

ఆ. దారువుల వెలుంగు దహనుని కైవడిఁ, గాయములఁ జరించు గాలి భంగి నాళలీనమైన నభము చాడ్పున వేఱు, దెలియవలయు దేహి దేహములకు.

51

తా ॥ భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశములను అయిదింటిని పంచభూతాలు అంటారు. ఈ పంచమహాభూతాలతో శరీరం తయారయ్యింది. పాంచభౌతిక దేహమనే ఇంటిలో పూర్వకర్మ వశం చేత జీవుడు ప్రవర్తిస్తూ ఉంటాడు. కొంతకాలం ప్రకాశిస్తాడు, సమయానుసారం

తొలగిపోతాడు. నశించేది దేహమే కాని, ఆత్మస్వరూపుడైన పురుషుడు కాదు. దేహసంబంధములైన కర్మలకూ పురుషునికీ సంబంధం లేదు. కట్టెలో ఉండే అగ్ని వలె, శరీరాలలో సంచరించే వాయువు వలె, తామర తూడులో ఉన్న ఆకాశం (శూన్యం) వలె దేహి వేరు, దేహము వేరు అని తెలిసి ఉండాలి."

వ. అని మఱియు నిట్లనియె.

52

తా ॥ అని ఇంకా బ్రాహ్మణ బాలకుని రూపంలో ఉన్న యముడు ఈ విధంగా పలికినాడు:

సీ. భూపాలకుఁడు నిద్రవోయెడి నొండేమి?, విలపింప నేటికి వెఱ్ఱులార!
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు, నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు
ప్రాణభూతుండైన పవనుఁ డాకర్ణింప, భాషింప నేరఁడు ప్రాణి దేహ
ములకు వేఱై తాను ముఖ్యుఁడై యింద్రియ, వంతుఁడై జీవుండు వలను మెఱయఁ

ఆ. బ్రాభవమున భూత పంచకేంద్రియమనో, లింగదేహములను లీలఁ గూడు, విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు, వొగలనేల? వగలఁ బొరల నేల?

53

తా ॥ "అమాయకులారా! రాజు శాశ్వత నిద్రను పొందాడు, దుఃఖించటం తగని పని. ఎవడు మాట్లాడేవాడో, వినేవాడో, అటువంటి జీవుడు ఎప్పుడో దాటిపోయాడు. ఈ దేహంలో ప్రాణరూపంగా ఉన్న వాయువు వినలేదు, మాట్లాడలేదు. ప్రాణానికీ, దేహానికీ భిన్నుడైన జీవుడు ఇంద్రియ చైతన్య సామర్థ్యంతో పంచభూతాలలో, మనస్సులో, సూక్ష్మదేహాదులలో ప్రవేశిస్తూ, ఈ దేహాన్ని వదలిపోతూ ఉంటాడు. ఇతరమైన వేరొకడు దీనికి అధిపతి. నశించిపోయిన ఈ దేహం కోసం మీరు దుఃఖించి, బాధపడటం ఎందుకు?

క. ఎందాఁక నాత్మదేహము, నొందెదు నందాఁకఁ గర్మయోగము లటపైఁ జెందవు, మాయాయోగ, స్పందితులై రిత్త జాలిఁబడ నేమిటికిన్?

54

తా ॥ ఎంతవరకు ఆత్మ దేహంలో ఉంటుందో అంతవరకు కర్మసంబంధమైన క్రియలుండి, ఆ తరువాత ఏమీ ఉండవు. మాయాజాలంలో చిక్కి, వృథాగా దీనస్థితిని పొందటం దేనికోసం?

మ. చెలులుం దల్లులుఁ దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు, మహామాయా గుణ భ్రాంతులై
కలలోఁ దోఁచిన యర్థముల్ నిజములే? కర్మానుబంధంబులం
గలుగున్ సంగము, లేక మానుఁ బిదపం గర్మాంత కాలంబునన్.

55

తా ॥ మిత్రులు, తల్లిదండ్రులు, పుత్రులు, ప్రభువులు, భార్య అని గృహసంబంధమైన వాటిపట్ల మాయామోహితులైన మనుషులు ఈ బంధాలను ప్రేమిస్తారు. కలలో కనిపించిన సంపద నిజం కానట్లే, కర్మబంధం చేత ఏర్పడే బాంధవ్యాలు కూడా కర్మఫలం తీరిపోగానే బంధం విడిపోయి, వియోగం ఏర్పడుతుంది.

తన సంపదను, అధికారాన్ని, పేరుప్రతిష్ఠలను, ఆధిక్యాన్ని చెప్పుకుని గర్వించేవారు కొందరుంటారు. నిజానికి ఇవన్నీ మూడునాళ్ళ ముచ్చటలే కదా! మరణానంతరం వీటిలో వెంట వచ్చేది ఏదీ లేదు.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడు తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి

సుఖ దుఃఖంబులం జెంద, రజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు, తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతకభూతుండైన యెఱుక గలఁ డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటంబైన వేఁట తమకంబున.

56

తా ॥ మాయతో కూడిన ప్రపంచము యొక్క లక్షణం తెలిసిన తాత్త్వికులు శాశ్వతములను గురించీ, క్షణభంగురములను గురించీ సుఖదుఃఖాలకు లోను కారు. తెలియనివారు (అజ్ఞులు) సంయోగ వియోగాలకు, సుఖదుఃఖాలకు లోనౌతారు.

పూర్వం ఒక కారడవిలో పక్షులను పట్టి బంధించే (యముని వంటి) వేటగాడు ఉండేవాడు. ఒకనాడు ప్రొద్దున లేచి, తనకు అనుకూలమైన వేటయందలి వ్యామోహం చేత అడవికి బయలుదేరాడు.

క. వల లురులు జిగురుఁ గండెలుఁ, జలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచుం బులుఁగులఁ బట్టెడు వేడుక, నలుగులు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్.

57

తా ॥ ఉరితాళ్ళ వంటి వలలు, జిగురు పూసిన దారపు కండెలు, చద్ది అన్నం, చిక్కములు, విల్లంబులు ధరించి పక్షులను పట్టుకునే వేడుక అధికం కాగా అడవిలోపలికి ప్రవేశించాడు.

వ. ఇట్లడవికిం జని తత్ప్రదేశంబునందు.

58

తా ॥ ఈ విధంగా అడవికి పోయి, అక్కడ –

క. కట్టలుకఁ దడుకు చాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున ఱెక్కల్ వట్టి విఱిచి చిక్కములోఁ, బెట్టుచు విహరించె లోకభీకరలీలన్.

59

తా ॥ మితిమీరిన ఉద్వేగంతో (క్రోధంతో) కంచెల మాటున దాగి, పక్షులకై ఉరితాళ్ళతో గల వలను పన్నాడు. కర్కశంగా వలలో చిక్కిన పిట్టల రెక్కలు పట్టి, విరిచి, చిక్కంలో పడవేస్తూ, భీకరంగా సంచరింపసాగాడు.

వ. మఱియు నానావిధంబులగు శకుంతంబుల నంతంబు నొందించుచు సకల పక్షి సంహార సంరబ్ధకుండైన లుబ్ధకుండు తన ముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కుళింగపక్షి మిథునంబుల గనుంగొని యందుఁ గుళింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులో వైచినం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె.

60

తా ॥ ఇంకా రకరకాల పక్షులను చంపుతూ, అన్నిటినీ అంతం చేయాలనే యత్నం గల ఆ వేటగాడు తనముందర కాలం మూడి సంచరించే అడవి పిచ్చుకల జంటను చూసి, అందులో ఆడపిచ్చుకను ఉచ్చులోకి ఆకర్షించి, తన సంచిలో వేసుకొన్నాడు. అది చూసిన మగపక్షి దుఃఖిస్తూ – ఈ విధంగా అన్నది:

చ. అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కి
క్కడ విహరింప నేఁడకట! కట్టిఁడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ
బడుమని వ్రాసెనే నుదుటఁ? బాపపు దైవము కంటికింత యె
క్కుడు బరువయ్యెనే బ్రదుకు? కోమలి! యే మన నేర్తుఁ జెల్లరే!

61

తా ॥ "ఎవరికీ హాని చేయక అడవిలో మేత మేస్తూ విహరించే మనను క్రూరదైవం వేటగాని చేతిలో పడమని నుదుట వ్రాశాడు. సుకుమారీ! ఏమనగలను? ఔరా! పాడుదైవము కంటికి మన బ్రతుకు ఇంత బరువైనదా?

క. ఒక మాటు మనల నందఱఁ, బ్రకటించి కిరాతు వలలఁ బడఁ జేయక ని
న్నొకటిన్ వలఁ బడఁ జేసిన, వికటీకృత దక్షమైన విధి నే మందున్?

62

తా ॥ మనందరినీ ఒక్కమాటుగా వేటగాని వలలో పడేటట్లు చేయకుండా నిన్నొక్క దానినే వలలో తగులుకొనేటట్లు చేసిన దైవం ఒడుదొడుకు పనులను ఏమనగలను?

ఉ. ఱెక్కలు రావు పిల్లలకు, ఱేపటి నుండియు మేఁత గానమిం
బొక్కుచుఁ గూఁటిలో నెగసి పోవఁగ నేరవు, మున్ను తల్లి యీ
దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి న
ల్దిక్కులుఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా!

63

తా ॥ అయ్యయ్యో! పిల్లలకు ఇంకా రెక్కలు కూడా రాలేదు. రేపటి నుంచి గూటిలో మేత కనబడకపోతే ఆకలికి అంగలారుస్తుంటాయి. ఎగిరిపోతాయా అంటే, ఇంకా నేర్చుకోలేదు. తల్లి ఏ వైపునుంచి వస్తున్నదో అని, మరలని చూపులతో నిక్కి, నిక్కి నలుదిక్కులు అతిదీనంగా చూస్తుంటే, ఆ దిగులు నేనెట్లా భరింపగలను? అయ్యో, ఎలాంటి కష్టం వచ్చింది!"

వ. అని ఇవ్విధంబున.

64

తా ॥ అని ఈ విధంగా—

క. కుంఠిత నాదము తోడను, గంఠము శోషింప వగచు ఖగమును హననో
త్కంఠుండైన కిరాతుఁ డ, కుంఠిత గతి నేసె నొక్క కోలం గూలన్.

65

తా ॥ సన్నగిల్లిన ధ్వనితో, గొంతు ఎండి పోయేటట్లు దుఃఖించే మగపిచ్చుకను చంపదలచిన కిరాతుడు దానిని ఒక్క బాణంతో పడగొట్టాడు.

క. కాలము వచ్చిన శబరుని, కోలను ధరఁ గూలె ఖగము ఘోషము తోడం గాలము డాసిన నేలం, గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్?

66

తా ॥ ఆయువు తీరిపోయిన ఆ మగ పిచ్చుక వేటగాని బాణంతో ఘోషిస్తూ నేలకూలింది. ఎటువంటసద్గుణాలు కలవారికైనా పోగాలం సమీపించినప్పుడు నేలకూలక తప్పుతుందా?

ఉ. కావున మీరు చచ్చుతఱిఁ గానరు, చచ్చి ధరిత్రిఁ బడ్డ ధా
త్రీవిభు దేహముం గదిసి దీనత నేడువ నేల? పొందు, చిం
తావతులార! వత్సరశతంబులకైన నిజేశు చక్కికిం
బోవుట దుర్లభంబు, మృతిఁ బొందిన వారలు చేర వత్తురే?

67

తా ॥ కనుక, చనిపోయి, నేలపైబడ్డ రాజు దేహాన్ని పట్టుకొని దుఃఖిస్తున్నారు కాని మీరు మరణించే విషయాన్ని తెలుసుకొనలేకపోతున్నారు. “దుఃఖమతులారా! వందల ఏండ్లు గడచినా మీకు మీ పతిని చేరటం సాధ్యం కాదు. మరణించినవారు మళ్ళీ బ్రతికి దగ్గరికి వస్తారా? వెళ్ళండి, వెళ్ళండి.”

వ. అని యిట్లు కపట బాలకుండై క్రీడించుచున్న యముని యుపలాల నాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి సాంపరాయిక కృత్యంబులు సేసి చని, రంత నంతకుం దంతర్హితుం డయ్యెనని చెప్పి హిరణ్య కశిపుండు దన తల్లిని, దమ్ముని భార్యలం జూచి యిట్లనియె.

68

తా ॥ అని ఈ విధంగా మాయాబాలకుడై విహరించే యముని ఓదార్పు మాటలు విని, సుయజ్ఞుని బంధువులందరూ తెల్లబోయి, ఈ సమస్తప్రపంచం శాశ్వతం కాదని తెలుసుకొని, దుఃఖాన్ని వదలి, సుయజ్ఞునికి ఉత్తరక్రియలు చేసి వెళ్ళిపోయారు. అప్పుడు యముడు అంతర్ధానం చెందాడు" – అని చెప్పి హిరణ్యకశిపుడు తన తల్లిని, తమ్ముని భార్యలను చూసి ఈ విధంగా అన్నాడు:

క. పరు లెవ్వరు? దా మెవ్వరు?, పరికింపఁగ నేక మగుట భావింపరు, త
త్పరమజ్ఞానము లేమిని, బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్.

69

తా ॥ 'తామెవరు? ఇతరులెవరు? అన్నీ ఒకటే అనే భావాన్ని గమనించరు. ఈ విషయం గురించి సరైన జ్ఞానం లేనందువల్ల ప్రాణులు తామూ ఇతరులూ వేరు వేరని భావిస్తారు.'

వ. అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె.

70

తా ॥ అని బోధపరచిన హిరణ్యకశిపుని మాటలు విని దితి, ఆమె కోడండ్లు దుఃఖం మాని, సత్యవిషయం తెలిసి, చనిపోయిన కొడుకు కోసం విలపించటం మానుకొని అక్కడ నుండి వెళ్ళిపోయార" ని చెప్పి, నారదుడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు:

క. అజరామర భావంబును, ద్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో
ర్విజితాఖీల శాత్రవమును, గజరిపు బలమును హిరణ్యకశిపుఁడు గోరెన్.

71

తా ॥ హిరణ్యకశిపుడు – తనకు వృద్ధాప్యమూ, మరణమూ లేకుండటాన్ని, ముల్లోకాధిపత్యాన్ని, తనను ఎదుర్కొనేవాడు లేకుండటాన్ని, శత్రువిజయాన్ని, సింహబలాన్ని కోరుకున్నాడు.

వ. ఇట్లు గోరి మందరాచల ద్రోణికిం జని యందుఁ గాలి పెను వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వ బాహుండయి మిన్ను సూచుచు వాఁడి మయూఖంబుల తోడి ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభా జాలంబులతోడ నెవ్వరికిం దేఱిచూడరాక పరమ దారుణంబైన తపంబు సేయుచుండె, నిర్జరులు నిజస్థానంబుల నుండి, రంత.

72

తా ॥ ఈ విధంగా కోరుకొని, మందర పర్వతం పల్లపు ప్రాంతానికి పోయి, బొటనవేలిపై నిలబడి, చేతులు పైకెత్తి, ఆకాశంవైపు చూస్తూ, తీవ్రకిరణాలు కలిగిన ప్రళయకాలసూర్యుని వలె ఎఱ్ఱని, పొడవైన జడల సమూహం కలిగి, ఎవరూ ముఖమెత్తి చూడలేని విధంగా ఉగ్రమైన తపస్సుని ఆరంభించాడు. దేవతలు తమ తమ స్థానాలలో ఉండి చూస్తున్నారు.

మ. అదరెం గుంభిని సాద్రియై, కలఁగె నేడంభోనిధుల్, తారకల్
సెదరెన్, సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ, బె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి, నుగ్రాచారదైత్యేంద్ర మూ
ర్ధ దిశోద్ధూత సధూమ హేతిపటలోదంచత్తపోవహ్నిచేన్.

73

తా ॥ ఘోరమైన తపశ్చర్యలో ఉన్న రాక్షస రాజు శిరము నుండి పొగలు వెలువడసాగాయి. అగ్నిశిఖల విజృంభణంతో పర్వతాలతో కూడిన భూమి అదిరింది. సప్తసముద్రాలు కల్లోలమయ్యాయి. తారకలు చెదిరాయి. గ్రహాలతో కూడిన దిక్కులు చీలి, మండిపోయాయి. జంతుసమూహాల గుండెలు అదిరాయి.

వ. ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజ తపో విజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకేశ్వరుండయిన బ్రహ్మకు వినతులయి యిట్లని విన్నవించిరి.

74

తా ॥ ఈ విధంగా ముల్లోకాలకు తాపం కలిగించిన రాక్షసరాజు తపస్సు విజృంభణను సహించలేక, దేవతలు స్వర్గలోకాన్ని విడిచి బ్రహ్మలోకానికి పోయి లోకాధిపతి బ్రహ్మకు మ్రొక్కి, ఈ విధంగా విన్నవించారు:

క. దితి కొడుకు తపము వేఁడిమి, నతి తప్తుల మైతి, మింక నలజడి నమరా
వతి నుండ వెఱతు, మె య్యది, గతి మాకును? దేవదేవ! కారుణ్యనిధీ!

75

తా ॥ “దయానిధీ! దేవదేవా! హిరణ్యకశిపుని తపస్సు వేడిమికి తపించిపోయాం. కలత చెంది స్వర్గంలో ఉండటానికి భయావహులమయ్యాము. ఇక మాకు దిక్కేది?

శా. శంకా లేశము లేదు, దేవ! త్రిజగ త్సంహారమున్ దేవతా
సంకోచంబును వేదశాస్త్ర పదవీ సంక్షేపమున్ లేక యే
వంకన్ లేవ నటంచు దుస్సహ తపోవ్యావృత్తి చిత్తంబులో
సంకల్పించె నిశాచరుండు, ప్రతిసంస్కారంబు చింతింపవే.

76

తా ॥ దేవా! ఏ మాత్రమూ అనుమానం లేదు. ముల్లోకాలను రూపుమాపటం, దేవతలను అణచివేయటం, వేదశాస్త్రమార్గాన్ని పాడుచేయటమనే ధ్యేయంతో రాక్షసరాజు ఈ ఘోరతపస్సును సంకల్పించాడు. అవి జరిగితే గాని తపస్సునుంచి లేవకూడదని నిశ్చయించుకొన్నాడు. దీనికి ప్రతిచర్యను నీవే ఆలోచింప వలసింది.

శా. నీ వే రీతిఁ దపోబలంబున జగ న్నిర్మాణముం జేసి యీ

దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించి, తిబ్బంగిఁ దా

నీ విశ్వంబుఁ దపస్సమాధి మహిమన్ హింసించి వే ఱొక్క వి

శ్వావిర్భావకరత్వశక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా!

77

తా ॥ బ్రహ్మదేవా! నీవు ఏ విధంగా తపోబలంచేత జగత్తును సృష్టించి దేవతల అధిపతుల కంటే ఎక్కువ ఉన్నతస్థితిని పొంది ఉన్నావో, అదే విధంగా ఈ ప్రపంచాన్ని తన తపోనియమ మహత్త్వం చేత నాశనం చేసి, మరొక విశ్వసృష్టిని చేసే సామర్థ్యాన్ని కోరుతున్నాడు.

సృష్టికర్త కనుక బ్రహ్మదేవుని ఆధిపత్యాన్ని అంగీకరించిన హిరణ్యకశిపుడు అటువంటి కార్యాన్నే చేయదలచి తపస్సు మొదలుపెట్టాడు. కాని విష్ణువును భగవంతుడని కాని, విష్ణువు యొక్క ఉనికిని కాని సహింపలేకపోతున్నాడు. చేస్తున్నది తపస్సే అయినా, లోకక్షేమానికై గాక లోకవినాశానికి కాబట్టి నీవు ఆపక తప్పదు.

వ. అదియునుం గాక కాలాత్మకులగు జీవాత్ముల కనిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగ సమాధిబలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచి నాఁడని మఱియు నిట్లనిరి.

78

తా ॥ అంతేకాక కాలవశులైన జీవాత్మలకు శాశ్వతత్వం లేదు కనుక, యోగము, సమాధి అనే శక్తుల సామర్థ్యం చేత శాశ్వతత్వం సంపాదించాలని అతడు తపస్సు తలపెట్టాడు" అని, దేవతలు ఇంకా ఈ విధంగా అన్నారు:

మ. భవదీయం బగు నున్నతోన్నత మహాబ్రహ్మైక పీఠంబు సం

స్తవనీయంబగు భూతియున్ విజయమున్ సౌఖ్యంబు సంతోషమున్
భువనశ్రేణికి నిచ్చు దైత్యుని తపస్స్ఫూర్తిన్ నివారించి యో
భువనాధీశ్వర! కావనే భువనముల్ పూర్ణప్రసాదంబునన్.

79

తా ॥ "లోకాలకు అధిదేవతవైన ఓ ప్రభూ! అత్యున్నతమైన నీ బ్రహ్మస్థానాన్ని, స్తుతింపదగిన నీ సృష్టి సంపదను, ఉత్కర్షను సుఖసంతోషాలను లోకముల పాలు చేయదలచిన రాక్షసరాజు యొక్క తపస్సు ప్రయత్నాన్ని మాన్పి, ఈ లోకాలను నీ సంపూర్ణ కృపచేత రక్షించవలసింది."

## బహ్మదేవుడు హిరణ్యకశిపునకు వరములిచ్చుట

వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును, భగవంతుండు నైన నలుమొగంబుల వేల్పుప్రోడ భృగు దక్షాదులతోడ మందర పర్వతంబునకు వచ్చి యందు నియమ యుక్తుండును, బిపీలికావృత మేదో మాంసచర్మరక్తుండును, వల్మీకతృణ వేణుపటల పరిచ్ఛన్నుండును, మహాతపః ప్రభావ సంపన్నుండునునై నీరంధ్ర నిబిడ నీరద నికర నివిష్ట నీరజ బంధుండునుం బోలె నివసించియున్న నిర్జరారాతిం జూచి, వెఱఁగుపడి నగుచు నిట్లనియె.

80

తా ॥ అని దేవతలు విన్నవించగా స్వయంభువు అయిన భగవంతుని మనస్సు కరుణతో పొంగింది, అంతట ఆ దేవతల అధిపతి నలువ – భృగువు, దక్షుడు మొదలైనవారితో మందర పర్వత ప్రాంతానికి వచ్చి, అక్కడ తపోనియమంతో ఉన్నందువల్ల చీమలు శరీరాంతర్భాగాలను ఆక్రమించగా; వెదురు, గడ్డిదుబ్బులు, పుట్టలతో కప్పబడి, గొప్ప తపోమహిమతో, దట్టమైన మేఘసమూహం మాటున ఉన్న కమలబాంధవుని వలె గోచరించే దేవతల శత్రువైన హిరణ్యకశిపుని చూసి, ఆశ్చర్యంతో నవ్వుతూ ఈ విధంగా అన్నాడు:

మత్తకోకిలము.

ఓ సురారి కులేంద్ర! నీ క్రియ నుగ్రమైన తపంబు మున్<br>
చేసి చూపినవారు లే రిఁకఁ జేయువారును లేరు, నే<br>
నీ సమాధికి మెచ్చితిన్, విను, నీ యభీష్టము లిత్తు, నా<br>
యాస మేటికి? లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్.

81

తా ॥ "ఓ రాక్షసాధిపతీ! నీ వలె ఘోరతపస్సు చేసి చూపినవారు ఇంతకు పూర్వం ఎవరూ లేరు. ఇకముందు ఉండబోరు. నీ సామర్థ్యాన్ని మెచ్చాను. ఇక శ్రమ పడనక్కరలేదు. మహాత్మా! వెంటనే నీ అభీష్టాలేవో కోరుకో, అనుగ్రహిస్తాను.

శా. దంశ వ్రాతములం బిపీలికలు మేదః క్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులు సేసి పట్టి తినఁగా శల్యావశిష్టుండవై
వంశచ్ఛన్న తృణావళీయుత మహావల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయు లేక నీకు నిలువం బ్రాణంబు లెట్లుండెనో?

82

తా ॥ అడవి ఈగలు, చీమలు నీ మెదడు, మాంసము, రక్తములను బాగా సడలింపజేసి, పట్టి తినగా ఎముకలు మాత్రమే మిగిలి – వెదురు, గడ్డి దుబ్బులు ఆవరించిన పెద్ద పుట్టలో ఇంద్రియ చలనం లేకుండా ఉన్న నీలో ప్రాణాలు ఏ విధంగా నిలిచి ఉన్నాయి?

ఉ. ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీ క్రియ నూఱు దివ్య సం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే?
యుత్సవ మయ్యె మాకు, మము నుగ్రతపంబున గెల్చి తీవు, నే
వత్సలతన్ నినుం గదియ వచ్చితిఁ, గోరిక లెల్ల నిచ్చెదన్.

83

తా ॥ పట్టుదలతో నీటిని, ఆహారాన్ని వదలి ఈ విధంగా నూరేండ్లు శరీరంలో ప్రాణాలను నిలుపుకొనటం సామాన్యమా? నీ కృషి మాకెంతో సంతోషాన్ని కలిగించింది. తీవ్రమైన తపోవిధానంతో నా హృదయాన్ని ఆకట్టుకొన్నావు. ప్రేమకొద్దీ నేను నీ వద్దకు వచ్చాను. నీ కోరికలన్నీ తీరుస్తాను."

వ. అని పలికి వనమక్షికా పిపీలికా భక్షితంబైన రక్షోవిభుని దేహంబు మీఁదం

గమండలుజలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుండు కమలాసన కరకమల కమనీయ కనకమయ దివ్యామోఘ కమండలు నిర్గతనిర్మల నీరధారా బిందుసందోహ సంసిక్త సకలాంగుండయి, తపంబు సాలించి, సాంద్ర కీచక సంఘాత సంఛాదిత వామలూరు మధ్యంబు వెలువడి, మహా ప్రభావబల సౌందర్య తారుణ్య సహితుండును వజ్రసంకాశ దేహుండును దప్తసువర్ణ వర్ణుండునునై నీరసేంధన నికరనిర్గత వహ్నియునుం బోలె వెలుంగుచుం జనుదెంచి.

84

తా ॥ అని పలికి బ్రహ్మదేవుడు తన కమండలంలోని మంత్రజలమును శిథిలమైన ఆ రాక్షసరాజు శరీరం మీద చల్లగా, ఆ హిరణ్యకశిపుడు – బ్రహ్మదేవుని చేతులలోని దివ్యసుందర కనక కమండలంలోని పవిత్రమైన జలధారల చేత సర్వాంగాలు తడిసినవాడై, తపస్సుని చాలించాడు. దట్టమైన వెదురు పొదలతో కప్పబడిన పుట్ట మధ్యనుండి బయటికి వచ్చి, మంత్రజల ప్రభావంతో బల సౌందర్య యౌవనమును పొంది వజ్రశరీరుడు అయి, పుటము పెట్టిన పసిడికాంతుల వర్ణంతో, ఎండిన కర్రనుండి వెలువడిన అగ్నివలె ప్రకాశిస్తూ వచ్చాడు.

మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకున్
సవిశేషోత్సవ సంవిధాతకు నమత్సంత్రాతకున్ సత్తపో
నివహాభీష్ట వరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకున్
వివిధ ప్రాణి లలాట లేఖన మహావిద్యానుసంధాతకున్.

85

తా ॥ సరస్వతీదేవికి ప్రాణనాథుడు, అమితానందాన్ని ఇచ్చేవాడు, మ్రొక్కినవారిని రక్షించేవాడు, తపోధనులకు వరముల నిచ్చి రక్షించేవాడు, జగత్తు సృష్టికర్త, వివిధ ప్రాణుల నుదుటి వ్రాత అనే గొప్ప విద్య తెలిసిన బ్రహ్మదేవుని చూసి, దేవసైన్యానికి విరోధి అయిన హిరణ్యకశిపుడు నమస్కరించాడు.

వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివినున్న హంసవాహనునకు ధరణీ తలంబున దండ ప్రణామంబు లాచరించి సంతోష బాష్పసలిల సంవర్ధిత పులకాంకురుండై యంజలి సేసి కంజగర్భుని మీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె.

86

తా ॥ ఈ విధంగా రాక్షసరాజు ఆకాశంలో ఉన్న బ్రహ్మదేవునికి భూమిపై సాష్టాంగ నమస్కారం చేసి, ఆనందబాష్ప పులకితశరీరుడై దోసిలొగ్గి, పద్మభవునిపై దృష్టి నిలిపి, గద్గదస్వరంతో ఈ విధంగా స్తుతించాడు:

సీ. కల్పాంతమున నంధకార సంవృతమైన, జగము నెవ్వఁడు దన సంప్రకాశ
మున వెలిఁగించుచు, మూఁడుభంగుల రజ, స్సత్త్వ తమోగుణసహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు, నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు
శోభితుండై స్వయంజ్యోతియై యొక్కట, విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి

ఆ. సమయ మయిన మానసప్రాణ బుద్ధీంద్రి, యములతో నెవ్వఁ డలఘుమహిమ నడరు,
నట్టి సచ్చిదానంద మయునకు, మహిత భక్తి నే నమస్కరింతు.

87

తా ॥ “యుగాంతంలో చీకటి కమ్మిన జగత్తును ఎవడు తన వెలుగు చేత ప్రకాశింపజేస్తూ, త్రివర్గమైన సత్త్వరజస్తమో గుణాలతో కూడి సృష్టిని – రక్షణను – చివరకు సంహారాన్నీ కావిస్తాడో; ఆద్యుడు, అన్నిటికీ మూలకారణమై ప్రకాశించే వాడెవడో, తనకు తాను వెలుగును సమకూర్చుకొని, ఒక్కడై సర్వాధిపత్యంతో ఎవ్వడు వెలుగుతుంటాడో, కాలానుసారంగా మనసు – ప్రాణము – బుద్ధి – ఇంద్రియాలతో, గొప్ప మహత్త్వంతో ఎవడు అతిశయించినవాడో – అటువంటి సచ్చిదానందమయునికి భక్తితో నమస్కరిస్తున్నాను.

బ్రహ్మదేవుని త్రివిధ త్రిగుణ సత్త్వునిగా జగత్తుకు మూలమని నమ్మిన హిరణ్యకశిపునికి

విష్ణువు శక్తిపట్ల విరోధం, అపనమ్మకం.

వ. దేవా! నీవు ముఖ్యప్రాణం బగుటంజేసి ప్రజాపతివి, మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు, మహాభూతగణంబులకు నాధార భూతుండవు, త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు, సకల విద్యలు నీతనువు, సర్వార్థ సాధకులకు సాధనీయుండ, వాత్మనిష్ఠా గరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మవు, కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు, జ్ఞాన విజ్ఞానమూర్తి, వాద్యంత రహితుండ, వంతరాత్మవు, మూఁడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు, జీవలోకంబునకు జీవాత్మవు, సర్వంబును నీవ, నీవు గానిది లేశంబును లేదు, వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండ వైన నీవు ప్రాణేంద్రియ మనోబుద్ధి గుణంబుల నంగీకరించి పరమేష్ఠిపద విశేషంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు, భగవంతుండవైన నీకు మ్రొక్కెద నని మఱియు నిట్లనియె.

88

తా ॥ దేవా! నీవు ప్రాణాధారం కనుక సూత్రాత్మ రూపుడవై ప్రజలకు అధిపతివి. మనస్సుకు, బుద్ధికి, చిత్తమునకు, ఇంద్రియాలకు యజమానివి. పృథివ్యాది మహాభూతములకు, వాటి గుణాలైన శబ్దాదులన్నిటికి ఆధారమైనవాడివి. వేదమయ శరీరంతో యజ్ఞాలను వ్యాప్తి చేసేవాడివి. సమస్త విద్యలు నీ దేహస్వరూపం. సమస్త సాధకులకు నీవు ఆశ్రయం. ఆత్మతత్త్వవిదులైన వారికి లక్ష్యమైనవాడివి. కాలమనే పేరిట ప్రాణుల ఆయువును హరించే వాడివి. జ్ఞాన స్వరూపుడివి. ఆద్యంతాలు లేనివాడివి. అంతరంగమునందుండే చైతన్యానివి. త్రిమూర్తులకు మూలమైన పరమాత్ముడవు. ప్రాణికోటికి ప్రాణము, ఆత్మవు, సమస్తము నీవే. నీవు కానిది ఏదీ లేదు. పరమాత్మవై తెలియబడక, ఆదిస్వరూపుడవై, అంతము లేని నీవు ప్రాణ ఇంద్రియ మనో బుద్ధి గుణాల కలయికతో పరమాత్మ స్థానంలో నిలిచి బాహ్యశరీరంతో అంతా విస్తరింపజేసేవాడివి. భగవంతుడివైన నీకు నమస్కరిస్తున్నాను" అని, ఇంకా ఈ విధంగా

పలికాడు:

అద్వైతభావంతో సృష్టిస్థితిలయాల విషయం తెలిసి పలికినవాడు, మాయకు లోబడి వరాలు కోరటం హిరణ్యకశిపుని జన్మలక్షణాన్ని తెలియజేస్తున్నది.

క. కోరిన వారల కోర్కులు, నేరుపుతో నిచ్చి మనుప నీ క్రియ నన్యుల్ నేరరు కరుణాకర!
నేఁ, గోరెద, నీ విచ్చెదేనిఁ గోరిక లభవా!

89

తా ॥ "కోరుకున్నవారి కోరికలు నైపుణ్యంతో ఇచ్చి సంరక్షించే నీ సాటి ఎవరూ లేరు. భక్తవరదా! కరుణాసముద్రా! నీవు ఇవ్వదలిస్తే నేను కోరికలు కోరుకుంటాను.

శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహ రక్షోమృగ
వ్యాళాదిత్య నరాదిజంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ
స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ! యిప్పింపవే.

90

తా ॥ లోకాధిపతీ! గాలిలో, నేలమీద, అగ్నిలో, నీటిలో, ఆకాశంలో, దిక్కులలో, రాత్రులలో కానీ, పగటివేళ కానీ, చీకటిలో కాని; తమోగుణప్రధానములై, గొప్పవైన జలచరాలు, రాక్షసులు, క్రూరమృగాలు, పాములు, వేల్పులు, మానవులు మొదలైనవారితో యుద్ధాలలో కాని, సమస్త అస్త్రశస్త్రాల సమూహంతో కాని మరణం లేని జీవనాన్ని నాకు ప్రసాదించ వలసింది."

కఠినమైన తపస్సు చేసి, లక్ష్యసిద్ధి పొందినవాడికి మరణభయం ఉన్నందువల్లనే వరాలు కోరినాడు. మరణం ఏ విధంగానైనా సంభవించకూడదని లోకంలో ప్రత్యక్ష పరోక్షాలన్నిటిని పేర్కొన్నాడు. ఇవన్నిటికి సమాధానంగా భగవంతుడు అవతారం ధరించవలసి వచ్చింది.

వ. అని మఱియు రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును లోకపాలుర నతిక్రమించు మహిమయును భువనత్రయ జయంబును హిరణ్యకశిపుండు గోరిన నతని తపంబునకు సంతోషించి దుర్లభంబు లయిన వరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె.

91

తా ॥ అని ఇంకా యుద్ధాలలో తనకు ఎదురులేని పరాక్రమాన్ని, లోకపాలకులను దండెత్తి జయించే సామర్థ్యాన్ని, ముల్లోకాలలో విజయాన్ని, హిరణ్యకశిపుడు కోరగానే అతని తపస్సుకు సంతోషించి, పొందరాని వరాలన్నీ ఇచ్చి బ్రహ్మదేవుడు కరుణతో ఈ విధంగా అన్నాడు:

శా. అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లెవ్వారికిన్,
ము న్నెవ్వారలుఁ గోర రీవరములన్, మోదించితిన్ నీ యెడన్
నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండు మీ సుమతివై భద్రైక శీలుండవై.

92

తా ॥ "నాయనా! కశ్యప పుత్రా! నీవు కోరిన ఈ కోరికలు ఎవరికిని పొందరానివి. ఇంతకు పూర్వం ఇటువంటి వరాలెవరూ కోరలేదు. నీపై అనుగ్రహంతో కోరినవన్నీ అనుగ్రహించాను. నేర్పు కలిగి, జ్ఞానసంపదతో శుభదృష్టి గలవాడవై ప్రవర్తించు."

రాక్షసరాజు తపస్సును మెచ్చాడు కనుక బ్రహ్మదేవునికి వరాలివ్వక తప్పలేదు. కోరికలు విన్నప్పుడే అందులోని ఔచిత్యం తెలిసింది. అందుకే బ్రహ్మ హిరణ్యకశిపుని హెచ్చరించాడు. ప్రవీణత్వం, బుద్ధి సంపన్నత్వం కలిగి భద్రైక శీలుడవై ప్రవర్తించాలనే నియమం, తాను అనుగ్రహించిన వరాల కొరకే అని బ్రహ్మదేవుడు చెప్పినా హిరణ్యకశిపునికి మాత్రం పరిమితి లేకపోయింది.

వ. అని యి ట్లమోఘంబు లయిన వరంబుల లిచ్చి దితినందను చేతం బూజితుండై

యరవింద సంభవుండు బృందారక సందోహవంద్య మానుం డగుచు నిజమందిరంబునకుం జనియె, నివ్విధంబున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని.

93

తా ॥ అని ఈ విధంగా తిరుగులేని వరాలిచ్చి, హిరణ్యకశిపునిచే పూజింపబడి, బ్రహ్మదేవుడు దేవతాసమూహంచే పూజలందుకొని, నిజసదనానికి తరలివెళ్ళాడు. ఈ విధంగా దేవతల శత్రువైన హిరణ్యకశిపుడు అనేక వరాలు సంపాదించాడు.

క. సోదరుఁ జంపిన పగకై, యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం
జోదరుపై వైరము దు, ర్మాద రతుం డగుచుఁ జేసె మనుజాధీశా!

94

తా ॥ తన సోదరుని (హిరణ్యాక్షుని) సంహరించాడనే పగతో, ఏ మాత్రం మన్నన లేక, రాక్షసరాజు దుర్బుద్ధి గలవాడై, విష్ణువు పట్ల శత్రుత్వం వహించాడు.

సీ. ఒకనాఁడు గంధర్వ యూథంబుఁ బరిమార్చు, దివిజుల నొకనాఁడు దెరలఁదోలు, భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు, గ్రహముల నొకనాఁడు గట్టివైచు, నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు, నొకనాఁడు విహగుల నొడిసిపట్టు నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు, మనుజుల నొకనాఁడు మద మడంచుఁ

తే. గడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య, చారణ ప్రేత భూత పిశాచ వన్య సత్త్వ విద్యాధరాదుల సంహరించు, దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు.

95

తా ॥ దితి పుత్రుడైన హిరణ్యకశిపుడు సహింపరాని పరాక్రమంతో విజృంభించి –

ఒకనాడు గంధర్వసమూహాన్ని సంహరిస్తాడు. ఒకప్పుడు దేవతలను తరిమికొడతాడు. మరొకనాడు నాగలోక వాసులకు కష్టం కలిగిస్తాడు. ఒకనాడు నవగ్రహాలను కట్టి పడవేస్తాడు. ఒకనాడు యక్షజాతిని దండిస్తాడు. ఒకప్పుడు పక్షిజాతిని పట్టుకుంటాడు. మరొకనాడు సిద్ధపురుషులను ఓడించి బంధిస్తాడు. ఒకనాడు మనుషులను అణచివేస్తాడు. అతిశయంతో కిన్నర, గగనచర, సాధ్య, చారణ, ప్రేత, భూత, పిశాచ, వన్యమృగ, విద్యాధరాదులను సైతం సంహరిస్తాడు.

వరాలను గ్రహించిన బ్రహ్మదేవుని హెచ్చరికను లెక్క చేయక, వరగర్వంతో, మృత్యువును జయించానన్న అహంకారంతో ప్రవర్తించే హిరణ్యకశిపుని చేష్టలు భగవదవతరణకు కారణం.

క. అట్టళ్ల తోడఁ గోటలఁ, గట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ జుట్టు విడిసి దిక్పాలుర,
పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా!

96

తా ॥ రాక్షసులను వెంటబెట్టుకొని హిరణ్యకశిపుడు బలోద్ధతుడై, క్రోధంతో దిక్పాలుర పట్టణాలపై దండెత్తి, కోటలను బురుజులను ధ్వంసం చేసి, వశపరచుకొన్నాడు.

క. కృశలై సంప్రాపిత దు, ర్దశలై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా
వశలై నిశలును, దివములు, దిశ లెల్లను గట్టువడియె దీనత ననఘా!

97

తా ॥ ఈ దానవుని ధాటికి దిక్కులన్నీ కృశించి, హీనస్థితిని పొందాయి. చివరికి రాత్రింబగళ్ళు కూడా కట్టుబడిపోయి, దీనత్వంతో ఉండిపోయాయి. లోకమంతా అతి దీనంగా అతని ఆజ్ఞకు కట్టుబడి పోయింది.

వ. మఱియు న ద్దానవేంద్రుండు విద్రుమ సోపానంబులును, మరకత మణిమయ

ప్రదేశంబులును వైడూర్యరత్న స్తంభ సముదయంబులును, జంద్రికాసన్నిభ స్ఫటిక సంఘటిత కుడ్యంబులును, బద్మరాగ పీఠ కనక కవాట గేహళీ విటంక వాతాయనంబులును, విలంబమాన ముక్తా ఫలదామ వితానశోభిత ధవళ పర్యంకంబులును, వివిధ విచిత్ర విమానంబులును, నిరంతర సురభి కుసుమ ఫల భరిత పాదప మహోద్యానంబులును, హేమారవింద సౌగంధిక బంధుర సరోవరంబులును, రమణీయ రత్న ప్రాసాదవిశేషంబులును, మనోహర పరిమళశీతల మందమారుతంబులును, మృదుమధుర నినద కీరకోకిలకుల కోలాహలంబులును గలిగి విశ్వకర్మ నిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీ శోభితంబైన మహేంద్ర భవనంబు సొచ్చి.

98

తా ॥ ఇంకా ఆ రాక్షసరాజు – పగడపు సోపానాలు, వివిధ మణులు తాపిన స్థలాలు, వైడూర్య రత్నాలతో కూడిన స్తంభాల సమూహాలు, వెన్నెల లీనుతున్న స్ఫటికముల గోడలు, పద్మరాగమణుల పీఠములు, బంగారు ద్వారాలు, గవాక్షాలు, ముత్యాల హారాలు వేలాడే ధవళకాంతుల పర్యంకాలు, చిత్రములైన ఆకాశయాన సాధనాలు, సతతం ఫలపుష్పభరితాలై ఉండే వృక్షాలు గల ఉద్యానవనాలు, పరిమళాలు వెదజల్లే సువర్ణకమలాలు కలిగిన సరోవరాలు, మనోహరమైన మణిమయసౌధాలు, సుగంధభరితమై మెల్లగా ప్రసరించే గాలులు, మధురంగా ధ్వనించే చిలుకలు కోకిల సమూహాల రవములు కలిగి – దేవశిల్పి విశ్వకర్మ నిర్మించినదీ, త్రిలోక రాజ్యలక్ష్మీ సంపదతో అలరారేదీ అయిన దేవేంద్రుని సౌధాన్ని ఆక్రమించాడు.

మ. దితిపుత్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్ర సింహాసనో
ద్ధతుఁడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దప్పంగ భీతిన్ సమా
గతులై తక్కిన యక్ష కిన్నరమరుద్గంధర్వ సిద్ధాదు లా
నతులై కానుక లిచ్చి కొల్తు రతనిన్ నానా ప్రకారంబులన్.

99

తా ॥ హిరణ్యకశిపుడు త్రిలోకైకప్రభువు వలె దేవేంద్రుని సింహాసనం అధిష్ఠించి గర్వంతో ఉండగా, శివ, కేశవ, బ్రహ్మలు తప్ప తక్కిన దేవతా గణాలవారందరూ భయంతో నమ్రులై కానుకలు సమర్పించి అనేక విధాలుగా సేవిస్తూ ఉన్నారు.

త్రిమూర్తుల స్థానాలు తప్ప తక్కిన దేవగణాలన్నిటిని హిరణ్యకశిపుడు స్వాధీనం చేసుకున్నాడు. వారితో ఊడిగం చేయిస్తున్నాడు.

శా. ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో యే దేవు బంధించునో
యే దిగ్భాగము మీఁద దాడి చనునో యే ప్రాణులం జంపునో
యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దా రింద్రాదు లాస్థాన భూ
వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూత రోమాంచులై.

100

తా ॥ ఇంద్రాదులు – హిరణ్యకశిపుడు కొలువుతీరిన సభాప్రాంగణపు వేదికను తొంగిచూస్తూ, భయం వల్ల కలిగిన గగుర్పాటుతో – ఏ దిక్పాలురను చూసి కోపిస్తాడో, ఏ దేవుని బంధిస్తాడో, ఏ దిక్కు పైన దండయాత్ర చేస్తాడో, ఏ ప్రాణులను సంహరిస్తాడో, ఈ రాక్షసరాజు – అని ఒకరినొకరు నిక్కించి చూసుకోవడం మొదలైంది.

సీ. కోలాహలము మాని కొలువుఁడీ సురలార! తలఁగి దీవింపుఁడీ తపసులార!
ఫణు లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార! ప్రణతులై చనుఁడి దిక్పాలురార!
గానంబు సేయుఁడీ గంధర్వవరులార! సందడిఁ బడకుఁడీ సాధ్యులార!
యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార! చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార!

తే. శుద్ధకర్పూర వాసిత సురభి మధుర, భవ్య నూతన మైరేయ పానజనిత సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు, శాంతి లేదంద్రు నిచ్చలుఁ జారు లధిప!

101

తా ॥ దేవవైరి అయిన ఆ రాక్షసరాజు పచ్చకర్పూరపు పరిమళం చేత రుచికరమైన కొత్త మధువును తాగి నెమ్మది లేక మైమరచి ఉన్నాడు. దేవతలారా! సందడి చేయకుండా సేవించండి. ఋషులారా! దూరంగా నిలబడి దీవించండి. సర్పరాజములారా! పడగ లెత్తకండి. దిక్పాలకులారా! నమస్కరించి పొండి. గంధర్వశ్రేష్ఠులారా! పాడండి. సాధ్యులారా! అల్లరి చేయకండి. అప్సరసలారా! నాట్యం చేయండి. సిద్ధులారా! సమీపానికి వచ్చి నమస్కరించండి – అని హిరణ్యకశిపుని కొలువులోనివారు (సేవకులు) హెచ్చరికలు చేస్తున్నారు.

శా. లీలోద్యాన లతా నివాసములలో లీలావతీ యుక్తుఁడై
హేలాపాన వివర్ధమాన మద లోలావృత్త తామ్రాక్షుఁడై
కేళిం దేలఁగ నేనుఁ దుంబురుఁడు సంగీత ప్రసంగంబులన్
వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా!

102

తా ॥ ధర్మరాజా! క్రీడోద్యానవనంలో పువ్వుల పొదరిల్ల నివాసంలో భార్యాసమేతుడై మదిరాపానం చేత మదోద్ధతుడై ఎఱ్ఱబడిన కండ్లు తిరుగుడుపడగా విహరిస్తున్నాడు. దేవద్వేషియైన హిరణ్యకశిపుణ్ణి ఆ సమయంలో నేను(నారదుడు), తుంబురుడు ఎప్పుడూ సంగీతధోరణులతో ఆ రాక్షసరాజును సంతోషింపజేస్తుంటాము.

క. యాగములు బుధులు ధరణీ, భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి
ర్భాగములు దాన కై కొనుఁ, జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్.

103

తా ॥ భూమిపై పండితులు యజ్ఞాలు చేస్తున్నప్పుడు రాక్షసరాజు పరుగు పరుగున వచ్చి యజ్ఞంలో సమర్పణ చేసిన హవిస్సులను దేవతలకు చెందనీయక తానే సంగ్రహిస్తాడు.

సీ. సకల మహాద్వీప సహిత విశ్వంభరా, స్థలిని దున్నక పండు సస్యచయము

కామధేన్వాదుల కరణి నర్థులు గోరు, కోర్కులు గగనంబు గురియుచుండు వననిధు లేడును వాహినీ సందోహ, ములును వీచుల రత్నములు వహించు నుర్వీరుహంబులు నొక్క కాలంబున, నఖిలర్తు గుణముల నతిశయిల్లు

తే. నంబు సంపూరిత ద్రోణు లగుచు నొప్పుఁ, బర్వతంబులు సర్వదిక్పాల వివిధ గుణము లెల్లను దానె కైకొనుచు దైత్య, విభుఁడు త్రైలోక్యరాజ్య సంవృద్ధి నుండ.

104

తా ॥ దిక్పాలకులందరి అధికారాన్నీ (సత్త్వమును) హిరణ్యకశిపుడు గ్రహించి ముల్లోకాధిపత్యం వహించి ఉండగా – గొప్ప ద్వీపసమూహాలతో కూడిన భూమండలమున దున్నకుండానే పంటలు పండినవి. కామధేనువు కల్పవృక్షమువలె కోరిన విధంగా ఆకాశం వర్షించేది. సప్తసముద్రాలు, నదుల సమూహాలు తమ తరంగాలతో రత్నాలను ఇచ్చాయి. వృక్షాలన్నీ అన్ని ఋతువుల లక్షణాలను ఒకే కాలంలో కలిగి, ఫల పుష్ప భరితాలైనవి. పర్వత ప్రాంతంలోని పల్లపు ప్రదేశాలన్నీ నీటి మడుగులై ఒప్పారినవి.

వ. ఇట్లు సకల దిక్కులు నిర్జించి, లోకైకనాయకుండై, తన యిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుం, దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి, విరించి వరజనిత దుర్వార గర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్ద కాలంబు రాజ్యంబు సేయునెడ.

105

తా ॥ ఈ విధంగా దిక్కులను జయించి, లోకాలకు తానొక్కడే ప్రభువై తన ఇష్టప్రకారం ఇంద్రియ సుఖాలను అనుభవిస్తూ తృప్తిలేనివాడై నియమమార్గాన్ని (శాస్త్రవిధిని) అతిక్రమించాడు. బ్రహ్మవరం వల్ల కలిగిన గర్వం అతిశయించగా హిరణ్యకశిపుడు త్రిలోకాధిపతియై చాలాకాలం అధికారాన్ని ప్రదర్శింపసాగాడు.

ఉ. ఎన్నఁడు మాకు దిక్కుగల! దెన్నఁడు దైత్యుని బాధ మాను? మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁగల? మెవ్వరు రక్షకు లంచు దేవతా
కిన్నర సిద్ధ సాధ్య ముని ఖేచర నాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరి భవబంధవిమోచనుఁ బద్మలోచనున్.

106

తా ॥ ఆ సమయంలో దేవతలు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు, మహర్షులు మొదలగు (ఆకాశగమనం గల) ముఖ్యులంతా పన్నగశయనుడు, సంసారబంధాన్ని తొలగించేవాడైన శ్రీమహావిష్ణువును ఆశ్రయించి, మాకు దిక్కేది? ఈ రాక్షసుని బాధ మాకెన్నడు తొలగుతుంది? మాకు మేలు ఎప్పుడు కలుగుతుంది? మమ్మల్ని రక్షించేవారెవరు? అని దుఃఖించసాగారు.

వ. ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్య శరణులై రహస్యంబున నందఱుం గూడికొని.

107

తా ॥ ఈ విధంగా రాక్షసరాజు కఠిన శిక్షలకు భయపడి, వేరే దిక్కులేక, ఏకాంతంగా అందరూ సమావేశమయ్యారు.

ఉ. ఎక్కడ నున్న వాఁడు జగదీశ్వరుఁ? డాత్మమయుండు మాధవుం
డెక్కడి కేఁగె శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం
దిక్కులనెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగు నట్టి దిక్కుకై
మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయ రక్షకున్.

108

తా ॥ 'లోకాధీశుడు ఎక్కడ ఉన్నాడు? ఆత్మస్వరూపుడైన విష్ణువు ఎక్కడికి పోయాడు?

శాంతచిత్తులైన మునీశ్వరులు, విరాగులు ఏ పరమపదానికి చేరితే తిరిగి రాకుండా ఉంటారో (పుట్టుక లేనివారవుతారో), దిక్కులన్నిటికో దిక్కు అయిన ఆ తేజోమూర్తికి, విశ్వాన్నంతటినీ తనలో విలీనం చేసుకునే ఆ విష్ణుమూర్తికి మేము రెండు చేతులూ ఎత్తి మమ్మల్ని రక్షించవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

వ. అని మఱియు నాహారనిద్రలు మాని, చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహిత బుద్ధులై భగవంతుండును, మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధ జ్ఞానానంద మయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ, మేఘరవసమాన గంభీర నినదంబున దిశలు మ్రోయించుచు సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండు గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె.

109

తా ॥ అని వారందరూ ఆహారం, నిద్ర మానుకొని, మనస్సును పరాధీనం కానీయక, స్థిరమైన బుద్ధితో భగవంతుడు, మహాపురుషుడు, నిర్మలమైన జ్ఞానస్వరూపుడు అయినటువంటి విష్ణువునకు నమస్కరించారు, ఆ సమయంలో మేఘగర్జన వంటి గంభీర స్వరంతో దిక్కులలో ధ్వనించగా, అదృశ్యంగా ఉన్న శ్రీహరి సుజనులకు అభయం ప్రసాదించి, ఈ విధంగా పలికాడు:

మ. భయముం జెందకుఁడయ్య నిర్జరవరుల్! భద్రంబు మీ కయ్యెడున్
జయముం లాభము భూతసంతతికి మత్సందర్శన ప్రాప్తి న
వ్యయమై చేరు, నెఱుంగుదున్ దితిసుత వ్యాపార భాషా విప
ర్యయముల్, కాలము గూడఁ జంపెదఁ, జనుం డందాఁక మీ త్రోవలన్.

110

తా ॥ "దేవతలారా! భయపడకండి. మీకు మేలు కలుగుతుంది. ప్రాణికోటికి నా దర్శనం వల్ల జయము, లాభము ప్రాప్తిస్తుంది. దితి పుత్రుడైన హిరణ్యకశిపుడి దుష్కృత్యాలు నాకు

తెలుసు. సమయం వచ్చినప్పుడు అతణ్ణి సంహరిస్తాను. అంత వరకు మీమీ స్థానాలలో వేచి ఉండండి.

ఆ. శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు, గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నా యందు వాఁ, డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు.

111

తా ॥ సత్ప్రవర్తన గల సజ్జనులు, దేవతలు, వేదాలు, బ్రాహ్మణ సమూహం, గోవులు, ధర్మమార్గంతోపాటు నా పట్ల ద్వేషం వహించినవాడు పతనం చెందడం ఖాయం.

భగవంతుడు చెప్పిన విషయాలలో – దైవానికి మాత్రమే విరోధి కాక సాధువులు, దేవతలు, వేదాలు, బ్రాహ్మణులు, గోవులు, ధర్మం – వీటన్నిటి పట్లా బాధ్యతారాహిత్యంగా ఉండేవాడు నశిస్తాడనటంలో ఎన్ని విషయాలలో ఎన్ని మార్గాలలో భగవత్సాక్షాత్కారం కలుగగలదో సూచించాడన్నమాట.

క. కన్నకొడుకు శమ దమ సం, పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా, పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్.

112

తా ॥ శాంత స్వభావుడు, నియమ నిష్ఠలకు ఓర్చువాడు, ఎటువంటి విరోధం లేనివాడు అయిన కన్నకొడుకు ప్రహ్లాదునికి ఎప్పుడు ఆపద కలిగిస్తాడో అప్పుడే ఆ హిరణ్యకశిపుణ్ణి పట్టి సంహరిస్తాను."

భగవదపచారమైనా భగవంతుడు సహిస్తాడేమో కాని భాగవతాపచారం సహించడు. ఇన్ని విషయాలు చెప్పినా చివరికి భక్తునికి ఆపద కలిగినప్పుడే అవతరణం సంభవిస్తుందని అర్థం.

శా. వేధోదత్తవర ప్రసాద గరిమన్ వీఁ డింతవాఁడై మిమున్
బాధం బెట్టుచు నున్నవాఁడని మదిన్ భావింతు, భావించి నే
సాధింపం దఱిగాదు, కావునఁ గడున్ సైరించితిన్, మీఁదటన్
సాధింతున్ సురలార! నేఁడు చనుఁడా శంకింప మీ కేటికిన్?

113

తా ॥ "దేవతలారా! బ్రహ్మ ఇచ్చిన వరప్రభావంతో ఈ హిరణ్యకశిపుడు కన్నుకానకుండా మిమ్మల్ని బాధిస్తున్నాడని అనుకుంటున్నాను. అందువల్ల అతనిని అడ్డుకోవడానికి ఇది తగిన సమయం కాదు. కనుక ఓర్పు వహించాను. సమయానుసారం తగిన రీతిలో అణచివేస్తాను. సందేహమెందుకు? ఇక ఇప్పుడు వెళ్ళిరండి."

వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన, నిలింపులు గుంపులు గొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కం బని తమ తమ దిక్కులకుం జనిరి. హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రులు నలువురు పుత్రు లుద్భవించి రందు.

114

తా ॥ అని ఈ విధంగా రాక్షస సంహారకుడైన విష్ణువు చెప్పగా, దేవతల సమూహం ఆ దేవదేవునికి నమస్కరించి – ఈ రాక్షసుడు సంహరింపబడటం సత్యమని భావించి, తమతమ నివాసస్థానాలకు తరలి వెళ్ళిపోయారు. ఆ తర్వాత హిరణ్యకశిపునికి అద్భుతచరిత్ర కలిగిన నలుగురు కొడుకులు పుట్టారు.

# ప్రహ్లాదుని చరిత్ర

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి, సమహితత్వంబున బరగువాఁడు!
పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడిఁ, జేరి నమస్కృతుల్ సేయువాఁడు!
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన, మాతృభావము సేసి మరలువాఁడు!
తల్లి దండ్రులభంగి ధర్మవత్సలతను, దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు, దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు, లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప!

115

తా ॥ ధర్మరాజా! సమస్త ప్రాణులందు, తనయందు ఒకే విధంగా మెలగేవాడు, పెద్దలైనవారిని చూసి సేవకుని వలె దగ్గర చేరి నమస్కరించేవాడు, పరస్త్రీలు కంటబడినప్పుడు మాతృభావంతో ప్రక్కకు తొలగిపోయే గుణవంతుడు, దీనులను వాత్సల్యధర్మంతో తల్లిదండ్రుల వలె రక్షించే ఆలోచన కలవాడు, స్నేహితుల పట్ల సోదరభావంతో ఉండేవాడు, గురువులను దైవంగా భావించేవాడు, హాస్యానికైనా అబద్ధమాడని సత్యవంతుడైన ప్రహ్లాదుడు ఒప్పిదమైన ప్రవర్తన కలవాడు.

సకలప్రాణిహితభావం పుట్టుకతో ఉన్నవాడు కనుక 'ఆత్మవత్ సర్వభూతాని' అనే జ్ఞానంతో ప్రవర్తించాడు. రాకుమారులకు లేమి బాధ తెలియదు. కాని ఈతడు దీనజనపోషణ కొరకు తాపత్రయపడే స్వభావం కలవాడు. మంచి గుణానికి ప్రతీక భక్తి ఒక్కటే కాదు. అందుకే పోతనగారు సకలభూతహితం, సత్యవాక్యపాలనం, వృద్ధసేవాసక్తి, స్త్రీలపట్ల మాతృభావం, స్నేహభావం, గురుభావం – ఇవన్నీ మంచిగుణాలకు సంకేతంగా చెప్పారు.

వ. మఱియును.

116

తా ॥ ఇంకా –

సీ. ఆకారజన్మ విద్యార్థవరిష్ఠుఁడై, గర్వసంస్తంభ సంగతుఁడు గాడు
వివిధమహానేక విషయసంపన్నుఁడై, పంచేంద్రియములచేఁ బట్టువడఁడు
భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై, కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన, వ్యసనసంసక్తి నా వంకఁబోఁడు

ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు, వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు ధరణినాథ!
దైత్య తనయుండు హరి పర తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు.

117

తా ॥ రాజా! రాక్షసరాజు పుత్రుడైన ప్రహ్లాదుడు – ఆకారము, పుట్టుక, విద్య, ధనం కలిగిన శ్రేష్ఠుడైనా, ఇసుమంత గర్వం కూడా లేనివాడు. వివిధ (లౌకిక) విషయ సంపన్నుడైనా ఇంద్రియ పంచకానికి పట్టుబడడు (ఇంద్రియ నిగ్రహం కలవాడు). చక్కని వయస్సు, బలము కలిగిన అధికుడైనా కామక్రోధాదులతో అతిశయించడు (అవి లేనివాడు). స్త్రీ మొదలుగా సుఖభోగాలెన్ని ఉన్నా వాటి జోలికి పోడు (ఆ వ్యామోహం లేనివాడు). ప్రపంచంలో చూసిన, విన్న సంపదలను కేవల వస్తువులుగా భావించి, అవి కావాలని కోరడు (ప్రాపంచికమైనవాటిని నిష్ఫల పదార్థాలుగా భావించి, వాటిపైని కోరిక లేనివాడు). విష్ణువుకు దాసుడై సదా విష్ణు చింతనలో, విష్ణు ధ్యాసలో ఉంటూ ఇతర విషయాలన్నీ వదలినవాడు.

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి, యసుర రాజతనయునందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయని విధమున, నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ!

118

తా ॥ నిర్మల చిత్తము కలవాడా! అనుక్షణం విష్ణు ధ్యాసలో ఉన్న ఆ ప్రహ్లాదుణ్ణి లోకంలో ఉండే అన్ని సద్గుణాలు సమూహమై ఆశ్రయించాయి. ఆ సుగుణాలు విష్ణువును విడిచిపెట్టని

విధంగానే ఎప్పుడూ ప్రహ్లాదుని చెంతనే ఉంటాయి. ఆతడు సకల సద్గుణస్వరూపుడు.

మ. పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాద సంకాశులన్
సుగుణోపేతుల నెందు మే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులన్
బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ భూనాథ! మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజ తనయున్ బాటించి కీర్తింపరే!

119

తా ॥ ఓ రాజా! (పారంపర్య) శత్రువులైన దేవేంద్రాదులు కూడా ప్రహ్లాదుని వంటి వారిని, అన్ని సుగుణాలు గలవారిని ఎక్కడా చూడలేదని సభలలో పద్య, గీతాలతో సత్కవుల వలె స్తుతిస్తుంటారు. మీ వంటి యోగ్యులైన భక్తులు ప్రహ్లాదుడినే లక్ష్యంగా కీర్తిస్తారు కదా!

క. గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునన్ గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.

120

తా ॥ గుణముల ప్రోవైన ప్రహ్లాదుని సద్గుణాలు ఎన్నైనా ఉన్నాయి. అతడు సుగుణాలకు నిధివంటివాడు. ఆదిశేషునికి, దేవగురువు బృహస్పతికి, సరస్వతీ పతి బ్రహ్మదేవునికి సైతం వర్ణించడానికి సాధ్యం కాదు.

వ. ఇట్లు సద్గుణ గరిష్ఠుండయిన ప్రహ్లాదుండు భగవంతుండయిన వాసుదేవుని యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుండై.

121

తా ॥ ఈ విధంగా సద్గుణాలచే గొప్పవాడైన ప్రహ్లాదుడు భగవంతుడైన విష్ణువును అనుదినం ఆరాధిస్తూ, ధ్యానిస్తూ ఉండేవాడు.

ప్రహ్లాదుని వర్తనం – శరణాగతి మార్గాన్ని స్పష్టంగా తెలియజేసిన విధం ఈ సందర్భంలో గమనించవచ్చు.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైనఁ, జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు
నసురారి దనమ్రోల నాడినయట్లైన, నసుర బాలుర తోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించి నట్లైనఁ, బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైనఁ, జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు

తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున, నంతరంగంబు నిండినట్లైన నతఁడు నిత్య పరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి, జడత లేకయు నుండును జడుని భంగి.

122

తా ॥ శ్రీపతియైన విష్ణువు తనను చేరినట్లు భావించి, స్నేహితుల వద్దకు పోవటం మరచిపోయేవాడు. రాక్షసాంతకుడు తన చెంత ఆటలాడినట్లు భావించి, తోడి అసురబాలురతో ఆడటం మరచిపోయాడు. భక్తుల పట్ల వాత్సల్యం గల భగవంతుడు తనతో సంభాషించినట్లుగా తలచుకొంటూ, ఇతరులకు బదులు పలుకడు. దేవతలు పొగిడేవానిని తనలోనే దర్శించుకొంటూ ఈ సమస్త ప్రపంచాన్నీ మరచిపోయేవాడు. శ్రీహరి పాదపద్మాల భావనామృతం అంతరంగంలో నిండినవాడై, పరిపూర్ణత్వంతో ప్రకాశించి, అన్నీ మరచి, నిశ్చేష్టుని వలె జడునిలా కనిపించేవాడు.

శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా!

123

తా ॥ రాజా! ప్రహ్లాదుడు – నీరు తాగినా, ఆహారం తిన్నా, మాట్లాడినా, నవ్వు, వినోదం,

నిద్ర మొదలైనవి ఆచరించినా, తిరిగినా, చూస్తున్నా, నిరంతరం శ్రీమన్నారాయణుని పాదపద్మద్వయాన్ని ధ్యానించటం వల్ల – ఆ అమృతాన్ని సేవించే ధ్యాసలో – ఈ బాహ్యప్రపంచాన్ని మరిచాడు.

లౌకిక చింతలూ, తాపత్రయమూ నీ మనస్సును కలవర పెట్టనివ్వకు. విధ్యుక్తకర్మలను సకాలంలో నిర్వర్తిస్తూ నీ మనస్సును మాత్రం సదా భగవంతుడి మీద లగ్నంచెయ్యి. ఓడలోని దిక్సూచియంత్రం ఖచ్చితంగా ఉత్తరదిక్కును చూపించే టంత వరకు ఓడ త్రోవ తప్పుతుందని కాని, అపాయం వాటిల్లుతుందని కాని భయపడనక్కర్లేదు. జీవన నౌకకు దిక్సూచి అనదగ్గ మనస్సు భగవంతుడి వైపుకు తిరిగి ఉండి చలించకుండేటంత వరకు మానవుడికి ఏ అనర్థమూ వాటిల్లదు.

–శ్రీరామకృష్ణ పరమహంస

సీ. వైకుంఠ చింతా వివర్జిత చేష్టుఁడై, యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢ చిత్తుఁడై, యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియ కాని వేఱొండు లే దని, యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నే నని, యుబ్బి గంతులు వై చు నొక్కచోటఁ

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్ష జనిత బాష్పసలిల మిళితపులకుఁడై నిమీలిత నేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు.

124

తా ॥ ఆ ప్రహ్లాదుడు విష్ణుధ్యానంలో చేష్టలు దక్కి ఒంటరిగా ఒకచోట కూర్చొని దుఃఖీస్తాడు. అంతులేని హరిభావము చిత్తంలో కలుగుతుంటే ఆనందంతో ఒక్కొక్కసారి గానం చేస్తాడు. విష్ణువు తప్ప వేరు ప్రపంచం లేదని అమితంగా నవ్వుతాడు. పద్మనేత్రుడనే నిధిని కనుగొన్నానని పొంగిపోయి వేరొకసారి గంతులు వేస్తాడు. మరొకసారి ప్రేమ పారవశ్యం వల్ల

పొంగిన ఆనందాశ్రువులతో, కన్నులు మూసుకొని, పులకించిన శరీరంతో ఒకచోట ఊరకే నిలిచి ఉంటాడు.

ఆత్మపరిశుద్ధికి తోడ్పడే సాధనాంగాలు ఇవి: 1. సాధు సాంగత్యం, 2. శ్రద్ధ (గురువాక్యాల పట్ల భక్తి విశ్వాసాలు) 3. నిష్ఠ, 4. భక్తి, 5. భావం (భగవద్భావనలో తన్మయత్వం), 6. మహాభావం : భావం తీవ్రమైనప్పుడు మహాభావమనబడుతుంది. భక్తుడు పిచ్చివాడి మాదిరి ఒకప్పుడు నవ్వుతాడు, మరొకప్పుడు ఏడుస్తాడు . అతడు ఇంద్రియాలను సంపూర్ణంగా జయించి ఉంటాడు, శరీరస్పృహ అతడికి ఉండదు. మహాపురుషులకు లేక అవతార మూర్తులకే గాని జీవులకు ఈ దశ సాధారణంగా లభించేది కాదు. 7. ప్రేమ (అఖండమైన భగవద్భక్తి) : ఇది మహాభావానికి సహచారిగా ఒప్పుతుంది. (1) ప్రపంచ స్ఫురణ లేకపోవడం, (2) సంపూర్ణమైన శరీర విస్మృతి ఈ స్థితికి చిహ్నాలు. ఇది భగవంతుణ్ణి ముఖాముఖీని దర్శింపచేస్తుంది – జీవిత పరమావధిని పొందిస్తుంది.

–శ్రీరామకృష్ణ పరమహంస

వ. ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గ సమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వ నిర్వాణ భావంబు విస్తరించుచు, నప్పటికి దుర్జనసంసర్గ నిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు, నప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజన విధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణి గణగరిష్ఠుండును, బరమ భాగవత శ్రేష్ఠుండును, గర్మబంధ లతాలవిత్రుండును, బవిత్రుండునునైన పుత్రుని యందు విరోధించి, సురవిరోధి యనుకంప లేక చంపం బంపె నని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె.



తా ॥ ఈ విధంగా – పూర్వజన్మలోని ఉత్తమ భక్తుల చేరికతో లభించిన విష్ణుపాదార్చనం

వల్ల కలిగిన అఖండ ఆనందభావం చేత, చెడ్డవారు చెంతనే ఉన్నా మనస్సును పరాధీనం కానీయక స్వాధీనంలో ఉంచుకొని జాగ్రత్త వహించేవాడు. సంసారబంధం లేనివాడు, పండితుల పట్ల గౌరవం కలవాడు, భక్తి అనే గొప్ప భాగ్యం కలవాడు, సద్గుణాలనే మణులచే పరిభూషితుడు, పరమభక్తులలో ఉత్తముడు, కర్మబంధాలనే తీగెలకు కొడవలి పెట్టు వంటివాడు, పుణ్యసౌభాగ్యుడు అయిన తన కన్నబిడ్డతో విరోధించి హిరణ్యకశిపుడు దయావిహీనుడై అతనిని చంపించడానికి వెనుకాడలేద" ని చెప్పిన నారదునితో ధర్మరాజు ఈ విధంగా అన్నాడు:

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప, రెట్టియెడ నా సౌజన్యరత్నాకరుం
బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి నెగులుం బొందింప నెట్లోర్చెనో?

126

తా ॥ "పుత్రులు అభ్యాసం చేసినా, చేయకపోయినా (నేర్పరులు కాకున్నా) తల్లిదండ్రులు పోషణ గావిస్తారు. స్నేహభావంతో బుద్ధులు చెప్పి చెడువికాసాన్ని నివారిస్తారు. అంతేకానీ కుమారులతో ఎవరైనా శత్రుత్వం వహిస్తారా? అందునా సాధుస్వభావానికి నెలవైనవాడు, లోకపావనుడైన పుత్రుడు ప్రహ్లాదుణ్ణి కష్టపెట్టడానికి తండ్రి ఏ విధంగా సమ్మతించాడు?

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహ చింతన క్రియా
లోలుఁ గృపాళు సాధు గురు లోక పదానతఫాలు నిర్మల
శ్రీలు సమస్త సభ్య నుతశీలు విఖండిత మోహవల్లి కా
జాలు నదేల తండ్రి వడిఁ జంపఁగ బంపె? మునీంద్ర! సెప్పవే?

127

తా ॥ వయసున చిన్నవాడు, తేజోవంతుడు, శ్రీహరి పాదపద్మాల చింతనయే పనిగా

గలవాడు, భూతదయ గలవాడు, సాధువులు గురువుల పాదాలకు తలవంచి నమస్కరించేవాడు, గొప్ప తేజస్సు కలవాడు, సమస్త సాధుజనులచే సన్నుతింపబడేవాడు, మోహపాశాలను తెంచుకున్నవాడు అయిన కుమారుణ్ణి సంహరించడానికి తండ్రి ఎందుకు సంకల్పించాడు? నారద మునీంద్రా! తెలియజేయండి."

వ. అనిన నారదుం డిట్లనియె.

128

తా ॥ అనగానే నారద మహర్షి ఇలా వివరించాడు:

శా. లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁడశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు, వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై.

129

తా ॥ ఒకనాడు హిరణ్యకశిపుడు తన పుత్రుణ్ణి ప్రేమతో పిలిచి, పుత్రుని స్వభావాన్ని పరిశీలనగా చూసి ఇలా అనుకున్నాడు. "దేవేంద్రపదవి లభించినా లెక్కచేయడు. ఎప్పుడూ జడుని వలె బలహీనుడై అవివేకి వలె ప్రవర్తిస్తున్నాడు వీడు." విద్య నేర్చుకొంటేనే గాని బుద్ధి చుఱుకుగా ఉండదని తలచి ఇలా విచారించాడు:

ప్రహ్లాదుని ప్రవర్తన తండ్రికి నచ్చలేదు. భక్తితన్మయత్వంతో పరవశుడై నిశ్చలమతితో ఉన్న ప్రహ్లాదుడు తండ్రికి మందబుద్ధిగా, నిరుత్సాహిగా, బలప్రదర్శన చేయలేని జడునిగా కనిపించాడు. (రాక్షస ప్రవృత్తికి తగిన) విద్య నేర్పించాలని తలచాడు. తాననుకొన్న విద్యావిధానం ప్రహ్లాదునికి సరిపడుతుందో లేదో తండ్రిగా గ్రహించలేదు.

క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ, జదివిన సదసద్వివేక చతురత గలుగుం జదువఁగ
వలయును జనులకుఁ, జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!

130

తా ॥ "నాయనా! చదువు నేర్వకపోయినట్లయితే అజ్ఞానిగా ఉంటావు. చదివితే మంచిచెడుల విచక్షణ కలుగుతుంది. అందరికీ చదువు ముఖ్యం. కనుక నీకు చదువు నేర్పిస్తాను. గురువుల వద్ద చక్కగా అభ్యాసం చేయి."

వ. అని పలికి యసురలోక పురోహితుండును భగవంతుండును నయిన శుక్రాచార్యు
కొడుకులఁ బ్రచండవితర్కులఁ జండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె.

131

తా ॥ అని పలికి హిరణ్యకశిపుడు రాక్షసుల పురోహితుడు, పూజ్యుడైన శుక్రాచార్యుని పుత్రులు, తర్కశాస్త్రంలో అమితమైన పాండిత్యం కలవారైన చండుడు, అమర్కుడులను పిలిపించి, సత్కరించి ఈ విధంగా అన్నాడు:

శా. 'అంధప్రక్రియ నున్నవాఁడు, పలుకం, డస్మత్ప్రతాపక్రియా
గంధం బించుక లేదు, మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించి యీ బాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే!'

132

తా ॥ "ప్రహ్లాదుడు అంధుని వలె అజ్ఞానిగా ఉన్నాడు. ఏమీ మాట్లాడడు. మా పరాక్రమ లక్షణాలేవీ నా బిడ్డకు లేవు. మీరు మాకు గురువులు, దయ గలవారు, ఆత్మీయులు, గౌరవింప దగినవారు, పెద్దలు. మమ్ము అనుగ్రహించి ఈ పిల్లవానికి విద్యనేర్పి, నీతిశాస్త్రంలో నేర్పరిని చేసి, కాపాడండి."

వ. అని పలికి వారలకుం బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం డనిన వారును దనుజ రాజకుమారునిం
గొనిపోయి యతనికి సవయస్కులగు సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి.

133

తా ॥ అని పలికి హిరణ్యకశిపుడు, కొడుకును తోడ్కొని వెళ్ళమని గురువులకు అప్పగించాడు. ఆ గురువులు ప్రహ్లాదుణ్ణి సమాన వయస్సుగల రాక్షస విద్యార్థులతో జత కలిపారు.

ఉ. అంచిత భక్తితోడ దనుజాధిపు గేహసమీపముం బ్రవే
శించి సురారి రాజసుతఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము, లాకుమారుఁ డా
లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తి పూర్ణుఁడై.

134

తా ॥ శుక్రాచార్యుని పుత్రులు అమిత భక్తితో రాక్షసరాజు ఇంటి నుండి ప్రహ్లాదుని తీసుకొనిపోయి చదువదగిన అనేక శాస్త్రాలు చదివించారు. ఆ బాలుడు వారు చెప్పిన విద్యలన్నీ పఠించినా విష్ణుభక్తి మాత్రం వీడలేదు.

క. ఏ పగిది వారు సెప్పిన, నా పగిదిం జదువుఁ గాని యట్టి ట్టని యా క్షేపింపఁడు, తా నన్నియు, రూపించిన మిథ్యలని నిరూఢమనీషన్.

135

తా ॥ గురువులు ఏ విధంగా బోధన చేస్తే ఆ విధంగానే చదివాడు కాని, 'ఇలా కాదు అలా' అని గురువులకు అడ్డు చెప్పలేదు. తనకు ఇష్టం లేనివి గురువులు బోధించినా, ఈ విద్యలన్నీ అసత్యాలనీ, భ్రమలనీ తెలిసికూడా ఆక్షేపించేవాడు కాదు. గురువులు చెప్పినట్లు

నేర్చుకొన్నాడు.

శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుండై నిజనందనున్ గురువు లే జాడం బఠింపించిరో
భ్రాంతుం డేమి పఠించెనో, పిలిచి సంభాషించి విద్యా పరి
శ్రాంతిం జూచెదఁగాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై.

136

తా ॥ కొన్నాళ్ళు గడిచిన తరువాత దేవతల శత్రువైన హిరణ్యకశిపుడు మనస్సులో సంశయిస్తూనే తన పుత్రుని గురువులు ఏ విధంగా చదివిస్తున్నారో, భ్రమకలిగిన బుద్ధితో పసివాడేమి చదువుతున్నాడో పిలిపించి, సంభాషించి, విద్యాపాటవాన్ని తెలుసుకోవాలని భావించి, తన సౌధంలో కూర్చున్నాడు.

కొడుకు ప్రవర్తన గమనించిన వాడు కనుక మధ్యలో ఒకసారి తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. తల్లిదండ్రులకు తమ పిల్లలు ఎట్లా చదువుతున్నారో, గురువులేమి బోధిస్తున్నారో అనే కుతూహలం సహజం.

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁ బంచెఁ బ్ర
హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోష లో
భాది విరోధివర్గ పరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాద కఠోరకుం గలుషజాల మహోగ్రవనీకుఠారకున్.

137

తా ॥ సంసార సముద్రాన్ని తరించేవాడు, కామక్రోధాది అరిషడ్వర్గాన్ని పరిహరించినవాడు, విష్ణుచింతనామృతపానమే లక్ష్యంగా గలవాడు, ఆ అమృతాన్ని ఆస్వాదించడం వల్ల గట్టి నియమం గలవాడు, పాపసమూహమనే దట్టమైన అడవికి గొడ్డలి

వంటివాడైన ప్రహ్లాదుని కోసం రాక్షసాధిపతి సంతోషంతో పిలువనంపాడు.

వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు చనుదెంచిన.

138

తా ॥ ఈ విధంగా భటులచే పిలువబడిన ప్రహ్లాదుడు వచ్చాడు.

శౌ. ఉత్సాహ ప్రభు మంత్రశక్తి యుతమే యుద్యోగ? మారూఢ సం
వి త్సంపన్నుఁడ వైతివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్?
వత్సా! రమ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్.

139

తా ॥ అలా రాగానే రాక్షసరాజు ప్రేమతో – నాయనా ఇట్లా రమ్మని దగ్గరకు పిలిచి, పుత్రుని ఒడిలో కూర్చుండ బెట్టుకొని, ఎంతో ఉత్సుకతతో ఇలా అడిగాడు: "విద్యయందు నీ కృషి ప్రయత్నము, సామర్థ్యము, తగిన యోచనతో కూడి ఉంటుందా? విదిత విజ్ఞానసంపన్నుడవైనావా? వేదాలు, శాస్త్రాలు అధ్యయనం చేసినావా?"

రాజనీతికి ప్రధానమైన శక్తిత్రయం ఉత్సాహం = ప్రయత్నం, ప్రభుశక్తి = సామర్థ్యం, మంత్రశక్తి = ఆలోచన. వీటిగూర్చి ప్రథమంగా అడిగి, తరువాత వేదశాస్త్రాలు చదివినావా? అని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని అడుగుతున్నాడు. నీతిశాస్త్రమే పరిపూర్ణ జ్ఞానాన్నిచ్చేదని రాక్షసరాజు భావన. తన రాజ్యానికి వారసుడయ్యేవాడికి లక్షణాలు ఎట్లా ఉండాలో ప్రణాళిక ఏర్పరచుకున్నాడు కనుక నేర్చిన విద్య గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో ప్రశ్నించాడు.

క. అనుదిన సంతోషణములు, జనితశ్రమతాపదుఃఖ సంశోషణముల్ తనయుల సంభాషణములు, జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్.

140

తా ॥ తండ్రులకు తనయుల ముద్దుమాటలు ఎప్పుడూ సంతోషాన్ని కలిగించేవి. శ్రమవల్ల కలిగిన తాపాన్నీ, దుఃఖాన్నీ పోగొట్టేవి, చెవులకు పసందైన విందుల వంటివి.

వ. అని మఱియుఁ బుత్రా! నీ కెయ్యది భద్రంబై యున్నది? సెప్పు మనినఁ గన్న తండ్రికిఁ
బ్రియనందనుం డిట్లనియె.

141

తా ॥ అని, ఇంకా "నాయనా! చదివిన విషయాలలో నీ మనస్సుకు నచ్చినది ఏదో చెప్పు" అని అడిగిన తండ్రితో ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు:

ఉ. ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలం
ద్రెళ్ళక వీరు నే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!

142

తా ॥ "తండ్రీ ! శరీరం ధరించిన ప్రాణులన్నీ ఇల్లు అనే చీకటి నూతిలో పడక, 'వీరు, వారు' అనే భిన్నదృష్టితో భ్రాంతిచెంది ప్రవర్తించక, సమస్తమూ ఆ విష్ణుని దివ్యలీలా విలాసమయమని భావించి, హరియందే ధ్యానం నిలిపి, తాము అడవిలో ఉన్నా మేలే కదా!"

కామినీ కాంచన వ్యామోహంలో మునిగిపోయిన మనస్సు లేత పోకకాయ లాంటిది. పోక పచ్చిగా ఉన్నంత వరకు పై బెరడుకు గట్టిగా అంటిపట్టుకునే ఉంటుంది; కాని అది పండి ఎండినప్పుడు వక్కా, డొల్లా వేరుపడి కదలించినప్పుడు వక్క లోపల కదులుతుంది. అలాగే కామినీ కాంచన వ్యామోహం ఇగిరిపోయినప్పుడు ఆత్మ శరీరం కంటే వేరైనదని బాగా

గ్రాహ్యమౌతుంది. అప్పుడు 'వీరు, వారు' అనే భేదబుద్ధి తొలగిపోతుంది.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. అని కుమారుం డాడిన ప్రతిపక్షానురూపంబు లయిన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె.

143

తా ॥ అని శత్రుపక్షానికి అనుకూలమైన మాటలు కుమారుడు మాట్లాడగా విని హిరణ్యకశిపుడు నవ్వుతూ ఈ విధంగా అన్నాడు:

క. ఎట్టాడిన న ట్టాడుదు, రిట్టి ట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్
దట్టించి యెవ్వ రేమని, పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్?

144

తా ॥ "పిల్లలు పెద్దలను అనుకరిస్తారు. ఎలా అనమంటే అలా పలుకుతారు. కాని ఈ విధమని, ఆ విధమని ఎదురు చెప్పరు. శత్రుపక్షంవారు ఎవ్వరేమి అదలించి ఈ బాలునికి తప్పుడు బుద్ధులు చెప్పారో?

శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా! నా తండ్రి! యీ బుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో? పరులు దుర్నీతుల్ పఠింపించిరో?
యేకాంతంబున భార్గవుల్ పలికిరో? యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్?

145

తా ॥ నాయనా! నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. ఇటువంటి బుద్ధులు నీకు స్వయంగా తోచినవా? లేక పరులెవరైనా చెడు నీతులు చదివించారా? ఏకాంతంలో గురువులేమైనా

ఇటువంటివి పలికారా? ఈ రాక్షసజాతికి విష్ణువు ద్రోహమొనర్చినవాడు. అతనిని స్తుతించటం నీకెందుకు?

మ. సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధులం
బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో? యక్ష కి
న్నర గంధర్వ విహంగనాగపతులన్ నాశంబు నొందించుటో
హరి యంచున్ గిరి యంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా!

146

తా ॥ కుమారా! దేవతలను తరిమికొట్టటమో! దేవేంద్రాదులను అలయింప జేయటమో! సిద్ధులను వేధించటమో! మునిశ్రేష్ఠులను బాధ పెట్టమో! యక్ష కిన్నర గంధర్వ విహంగ నాగలోక వాసులను నాశనం చేయటమో! అటువంటిది గొప్ప కార్యం కాని, 'హరి' 'గిరి' అంటూ అజ్ఞానంతో మోహపడి, అంధుడవై, చెడిపోవటం ఎందుకు?" అని కొడుకు తెలియక, విష్ణువును పొగడుతున్నాడనుకొన్న హిరణ్యకశిపుడు నవ్వుతూ హితబోధ చేస్తున్నాడు.

వ. అనినఁ దండ్రిమాటకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె, మోహ నిర్మూలనంబు సేసి యెవ్వని యందుఁ దత్పరులయి యెఱుక గల పురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం బయిన యసద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ, దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద.

147

తా ॥ అని తండ్రి మాట్లాడగా, గురువులు నిరీక్షిస్తుండగా చూసి, ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు: మోహం నశింపజేసుకొని, ఎవనియందు ధ్యానం నిలిపితే జ్ఞానం పొందిన పురుషులకు 'వారు – మేము' అనే మాయవల్ల కలిగే విజ్ఞానహీనమైన భేదం కనబడదో అటువంటి పరమాత్మునికి నమస్కరిస్తాను.

శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా నేర, రా
జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే?

148

తా ॥ కొందరు అజ్ఞానులు మేము అనీ, వారు అనీ భ్రమలో ఉంటారు. అటువంటివారు భగవంతుణ్ణి ఎంతో తెలివితేటలను, పాండిత్యమును ఉపయోగించి కూడా తెలుసుకోలేరు. సర్వాత్మకుడు, జ్ఞానలభ్యుడు, బ్రహ్మాది వేదవిదులు కూడా ఆ జ్ఞానమార్గాన్ని తెలియనివారైనప్పుడు పరమాత్ముడైన విష్ణువుని సామాన్యులు దర్శింపలేరు గదా!

తే. ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత, మగు హృషీకేశుసన్నిధి నా విధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి, బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు.

149

తా ॥ బ్రాహ్మణోత్తమా! ఇనుము అయస్కాంత సమీపంలో ఏ విధంగా (కదలుతుందో) ఆకర్షింపబడుతుందో ఆ విధంగా దైవవశాన విష్ణుసన్నిధిలో నా మనస్సు విహరిస్తున్నది.”

కొడుకు చదువు గురించి తండ్రి ప్రశ్నవేస్తే, సమాధానం గురువులను చూస్తూ సంబోధిస్తూ ప్రహ్లాదుడు భాషిస్తున్నాడు. భక్తుని మనస్సు భగవంతుని వైపు ఆకర్షింపబడటం దైవయోగం అన్నాడు.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు, మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు, రాయంచ సనునె తరంగిణులకు?
లలిత రసాలపల్లవ ఖాది యై చొక్కు, కోయిల సేరునే కుటజములకుఁ?
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం, బరుగునే సాంద్ర నీహారములకు?

తే. నంబుజోదర దివ్య పాదార వింద, చింతనామృత పానవిశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు? వినుత గుణశీల! మాటలు వేయు నేల?

150

తా ॥ "నుతింపబడే ఉత్తమోత్తమ గుణాలు కలవాడా! వేయి మాటలెందుకు? కల్పవృక్షదివ్యకుసుమాల లోని మకరందం తీయదనాన్ని ఆస్వాదించే తుమ్మెద పిచ్చిపూలయిన ఉమ్మెత్తలను చేరుతుందా? స్వచ్ఛమైన ఆకాశ గంగాతరంగాలపై తేలియాడే రాజహంస సామాన్య నదీ ప్రవాహం వైపు పోగలదా? మనోహరమైన మామిడి చిగుళ్ళు తిని మైమరచే కోయిల కొండమల్లికల చెంత చేరుతుందా? పూర్ణచంద్రుని వెన్నెలను ఆస్వాదించే చకోరము దట్టమైన పొగమంచు పొరలను అస్వాదించగలదా? పద్మనాభుని దివ్య పాదపద్మాల చింతనమనే అమృతాన్ని సేవించి తన్మయత్వాన్ని భజించే చిత్తం ఇతరమైన వాటిని ఎలా కోరుతుంది?"

సంస్కారాన్ని బట్టి మనస్సుకు మార్గం ఏర్పడుతుంది. ప్రహ్లాదుడు పుట్టక మునుపే హరిభక్తికి అంకితమయ్యాడు. ఇంకొక దానిపై నా చిత్తాన్ని మరల్చలేను, నాకు సాధ్యం కాదు అన్నాడు.

వ. అనిన విని రోషించి రాజసేవకుం డైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి, తిరస్కరించి యిట్లనియె.

151

తా ॥ అని ప్రహ్లాదుడు పలుకగా – హిరణ్యకశిపుని పట్ల సేవాభావం గల గురువు కోపించి, అతణ్ణి చూసి తిరస్కారంతో ఇలా అన్నాడు:

ఉ. పంచశర ద్వయస్కుఁడవు, బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు, చెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట మాకు నౌదలల్

వంచుకొనంగఁ జేసితివి వైరి విభూషణ! వంశదూషణా!

152

తా ॥ "వంశానికి మచ్చ తెచ్చే విధంగా పలుకుచున్నావు. శత్రువులను స్తుతిస్తున్నావు. ఐదేండ్ల వయస్సు గల పసివాడివి, ఇంత లేవు. తర్ (వాద) వాక్యాలు పలుకుతున్నావు. మేము బోధించిన శాస్త్రాలలోని విషయాలు కొంచెమైనా చెప్పవు, మహారాజు ముందు మాకు తలవంపులు కలిగిస్తున్నావు.

చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు, దైత్య చం
దనవనమందుఁ గంటకయుత క్షితిజాతముభంగిఁ బుట్టి నాఁ,
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్.

153

తా ॥ ఈ ప్రహ్లాదుడు దానవరాజుకి పుత్రుడు కాదు శత్రువు! రాక్షసులనే చందనవనంలో పుట్టిన ముండ్ల చెట్టు. ఎప్పుడూ రాక్షసవంశనాశకుని కీర్తిస్తుంటాడు. దండిస్తే తప్ప మేము నేర్పించే విద్యల దరిజేరడు. పట్టుకొని కఠినంగా శిక్షిస్తే తప్ప దారికి రాడు.

క. ఈ పాపనిఁ జదివింతుము, నీ పాదము లాన, యింక నిపుణతతోడం గోపింతుము దండింతుము, కోపింపకుమయ్య దనుజకుంజర! వింటే!

154

తా ॥ రాక్షసశ్రేష్ఠా! విను. ప్రమాణపూర్తిగా నైపుణ్యంతో ఈ బాలుని చదివిస్తాము. గట్టిగా కోపించి శిక్షిస్తాము. నీవు ఆగ్రహించవద్దు. నీ పాదాల పైన ఆన."

వ. అని మఱియు నా రాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁజూపుచు

రాజసన్నిధిం బాపి, తోడుకొని పోయి యేకాంతంబున.

155

తా ॥ అని ఇంకా ఆ రాజకుమారుని వివిధోపాయాలచేత భయపెడుతూ గురువు రాజు సమక్షం నుండి ప్రహ్లాదుణ్ణి ఏకాంత ప్రదేశానికి తీసుకొనిపోయారు.

క. భార్గవనందనుఁ డతనికి, మార్గము చెడకుండఁ బెక్కు మాఱులు నిచ్చల్
వర్గ త్రితయము చెప్పె న, నర్గళమగు మతివిశేష మమర నరేంద్రా!

156

తా ॥ ఆ రాకుమారునికి (అసుర) సంప్రదాయం తప్పకుండా నిరంతరం సర్వశక్తులు ఒడ్డి ధర్మార్థకామాలను గురించి అమితమైన బుద్ధిచాతుర్యం చేత శుక్రుని పుత్రుడు బోధింపసాగాడు.

వ. మఱియు, గురుండు శిష్యునకు సామ దాన భేద దండోపాయంబు లన్నియు నెఱింగించి, నీతి కోవిదుం డయ్యె నని నమ్మి నిశ్చయించి, తల్లికి నెఱింగించి, తల్లి చేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి.

157

తా ॥ ఇంకా — సామ దాన భేద దండోపాయాలన్నీ ఉపయోగించి శిష్యునికి బోధించాడు. రాజనీతిలో సుశిక్షితుడైనాడని భావించిన తర్వాత, ఆ విషయాన్ని నమ్మకంతో ప్రహ్లాదుని తల్లి అయిన లీలావతి దగ్గరకు తీసుకువెళ్ళి తెలియజేశారు. అనంతరం తల్లి చక్కగా అలంకృతుడిని చేసి, ప్రహ్లాదున్ని తండ్రి వద్దకు వెళ్ళమని చెప్పింది. అప్పుడు గురువు ఇలా అన్నాడు:

ఉ. త్రిప్పకు మన్న మా మతము దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకు మన్న! నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్

చెప్పిన నీతిగాని మఱి చెప్పకుమన్న విరోధి నీతులన్
విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థజాలముల్.

158

తా ॥ "నాయనా! ప్రహ్లాదా! మేము చెప్పిన విషయాలు మరువకు. ధర్మార్థకామాలకు సంబంధించిన పాఠాలు తప్పక వివరించు. రాక్షసరాజు సముఖంలో మేము ముందుగా బోధించిన రీతిలో తప్ప శత్రువు ధర్మాలను ప్రస్తావించకు. దుష్టమైన విష్ణుసంబంధ విషయాలేవీ చెప్పవద్దు."

వ. అని బుజ్జగించి, దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన.

159

తా ॥ అని అనునయంగా మాట్లాడి, రాక్షసరాజు సముఖానికి తీసుకొనివచ్చారు.

సీ. అదు గద్గునకు మాధ వానుచింతన సుధా, మాధుర్యమున మేను మఱచు వాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని, హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ, జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు, శ్రీ విష్ణుమయ మని చెలఁగువాని

తే. వినయ కారుణ్యబుద్ధి వివేక లక్ష, ణాది గుణముల కాటపట్టయిన వాని శిష్యు
బుధలోక సంభావ్యుఁ జేరి గురుఁడు, ముందఱికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు.

160

తా ॥ ప్రతిక్షణం విష్ణుధ్యానమనే అమృతమాధుర్యంలో తన్మయుడైనవానిని, బ్రహ్మాదులు సైతం నేర్వలేని విష్ణుభక్తియే ఆకారంగా గలవానిని, మాతృగర్భంలో ప్రవేశించింది మొదలుగా విష్ణువునందే మనస్సు లగ్నం చేసిన వానిని, తనలోను సమస్త ప్రపంచంలోను విష్ణువే నిండి

ఉన్నాడనే భావనలో ఆనందించేవాణ్ణి, వినయం, కారుణ్యం, మంచి బుద్ధి, వివేకము మొదలైన గుణాలకు ఆలవాలమైనవానిని, జ్ఞానులందరూ గౌరవించే శిష్యుని – గురువు పిలిచి, తండ్రికి నమస్కారం చేయుమని చెప్పాడు.

క. శిక్షించితి మన్యము లగు, పక్షంబులు మాని నీతి పారగుఁడయ్యెన్.
రక్షోవంశాధీశ్వర!, వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్.

161

తా ॥ గురువు హిరణ్యకశిపుణ్ణి చూచి, "రాక్షసవంశాధిపతీ! నీ కుమారుని విద్యాకౌశలాన్ని పరిశీలించు. శత్రుపక్షంవారి విషయాలు మాన్పి, నీతిశాస్త్ర విషయాలలో పరిపూర్ణునిగా తీర్చిదిద్దాము" అని అన్నాడు.

వ. అని పలికిన, శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి, దానవేంద్రుండు దనకు దండ ప్రణామంబు సేసి నిలుచున్న కొడుకును దీవించి, బాహుదండంబు సాఁచి, దిగ్గనన్ దగ్గఱం దిగిచి, గాఢాలింగనంబు సేసి, తన తొడలమీఁద నిడుకొని, చుంచు దువ్వి, చుబుకంబు పుణికి, చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేక సంజనిత బాష్పసలిలబిందు సందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు, మందమధురాలాపంబుల నిట్లనియె.

162

తా ॥ అలా చెప్పిన శుక్రాచార్యుని కొడుకు మాటలు విని – రాక్షసరాజు తనకు సాష్టాంగ నమస్కారం చేసిన కొడుకును దీవించి, చేతులు చాచి, వడిగా దగ్గరకు తీసుకొని, గట్టిగా కౌగలించుకొని, తన ఒడిలో కూర్చుండ బెట్టుకొని, తల నిమిరి, గడ్డము పుణికి, చెక్కిలి ముద్దుపెట్టి, శిరస్సును ఆఘ్రాణించి, అతిశయించిన ప్రేమతో ఆనందబాష్పధారలతో బాలుని ముఖం తడుపుతూ నెమ్మదిగా ప్రేమపూర్వకమైన మాటలతో ఈ విధంగా పలికాడు:

శా. చోద్యం బయ్యెడి, నింతకాల మరిగెన్, శోధించి యే మేమి సం

వేద్యాంశంబులు సెప్పిరో? గురువు లే వెంటం బఠింపించిరో?
విద్యాసార మెఱుంగఁ గోరెద భవ ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా!

163

తా ॥ "చిత్రంగా ఇంత కాలం గడచిపోయింది. పరిశీలించి తెలిసికొనదగిన విషయాలు ఏవేవి గురువులు చెప్పారు? ఏ విధంగా చదివించారు? నీ చదువు సామర్థ్యాన్ని తెలుసుకొన గోరుతున్నాను. నీవు నేర్చిన శాస్త్రవిషయాలలోని ఒక పద్యాన్ని చెప్పి, అర్థ తాత్పర్యాలను వివరించు.

శా. నిన్నున్ మెచ్చరు నీతిపాఠ మహిమన్ నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షు లై
యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ దంచున్ మహా వాంఛతో
నున్నాఁడన్, ననుఁ గన్న తండ్రి! భవదీయోత్కర్షముం జూపవే!

164

తా ॥ నాయనా! నీతోపాటు నీతిశాస్త్ర పాఠాలు చదివిన రాక్షసబాలురు నిన్ను మెచ్చుకోవటం లేదు. వారు గురువులు చెప్పినవన్నీ చదివి అనుభవంలోకి తెచ్చుకొన్నారు. గ్రంథసారాన్ని గ్రహించి, నేర్పరులై సమర్థంగా అన్నీ చెప్పగలుగుతున్నారు. నీవు ఎప్పుడు పండితుడవౌతావో అని ఎంతో ఆశతో ఉన్నాను. నన్ను కన్నతండ్రీ! నీ గొప్ప ప్రతిభను ప్రదర్శించవయ్యా!"

వ. అనినం గన్న తండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డి ట్లనియె.

165

తా ॥ అన్న తండ్రితో ప్రియపుత్రుడైన ప్రహ్లాదుడు ఈ విధంగా పలికాడు:

క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ!

166

తా ॥ "తండ్రీ! ధర్మశాస్త్రాలు, అర్థశాస్త్రాలు ముఖ్యమైనవి అనేకం గురువులు నన్ను చదివించారు. చదువులలోని రహస్యార్థమంతా గ్రహించాను.

సాత్త్వికలక్షణం గలవారికి మాత్రమే బోధపడే విధంగా చదువులోని మర్మం ప్రహ్లాదుడు గ్రహించ గలిగాడు. అదే బ్రహ్మజ్ఞానం. గురువులే శాస్త్రార్థాలు చెప్పినా ప్రహ్లాదునికి బోధపడే అర్థం విష్ణుతత్త్వం.

మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

167

తా ॥ రాక్షసశ్రేష్ఠా! తనువుతో, మనస్సుతో, వాక్కుతో – భగవంతుని తోడి చెలిమిని (సఖ్యం), భగవంతుని గూర్చి వినడాన్ని (శ్రవణం), భగవంతుని యొక్క సేవాభావాన్ని (దాస్యం), భగవంతునికి వందనాన్ని (వందనం), భగవంతుని పూజించడాన్ని (అర్చనం), భగవంతుని పరిచర్యను (సేవనం), భగవంతుని గూర్చినదైన ఆత్మజ్ఞానాన్ని (ఆత్మనివేదనం), భగవన్నామ రూప సంకీర్తనను (కీర్తనం), భగవంతుని ధ్యానించటమనే (చింతనం) ఈ తొమ్మిది విధాల భక్తిమార్గాలతో విశ్వరూపుడైన శ్రీహరిని నమ్మి సాధుస్వభావంతో ఉండటం క్షేమకరమని తలుస్తాను.

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స

ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్.

168

తా ॥ హరిభక్తి లేనివారి వ్యర్థమైన జీవితం (సంసారము) – అంధునికి చంద్రోదయం వంటిది. చెవిటివానికి శంఖధ్వని వంటిది. మూగవాడు మంచి గ్రంథాలు బోధించటం వంటిది. నపుంసకుడు మగువ పొందు కోరినట్లు, చేసిన మేలు మరచినవారి బంధుత్వం వలె, బూడిదలో పోసిన హోమద్రవ్యాల వలె, పిసినిగొట్టు వాని సంపద వలె, పందికి సువాసన వలె నిరర్థకమైనవి.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు, మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు, పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి.

169

తా ॥ పద్మనేత్రుని పూజించేవే చేతులు. లక్ష్మీపతిని వర్ణించేదే నాలుక. దేవతల రక్షకుని చూసేవే చూపులు. పన్నగతల్పునికి మ్రొక్కెడిదే శిరము. విష్ణుసంబంధమైన కథలు వినునవే చెవులు. మధుసూదనుణ్ణి తలచే మనస్సే మనస్సు. భగవంతునికి ప్రదక్షిణాలు చేసేవే పాదములు. పురుషోత్తముడైన హరియందు ప్రసరించేదే బుద్ధి. దేవతలకు దేవుడైనవానిని తలచినదే దినము. చక్రధారిని గూర్చి తెలియజేసేదే చదువు. భూమీశుడైన విష్ణువును గూర్చి బోధించేవాడే గురువు. హరిని పొందుమని చెప్పేవాడే తండ్రి.

ఏ విద్య నేర్చావు? గురువు లేమి బోధించారు? ఏ శాస్త్రం చదివావు? అని తండ్రి అడిగినప్పుడు... శ్రీహరిని పూజించని చేతులు, స్తుతించని నాలుక, ధ్యానించని మనస్సు, విష్ణుదర్శనం నోచుకోని చూపులు, ఆ దేవదేవునికి మ్రొక్కని శిరసు, భగవంతుని లీలా వినోదాలను వినని వీనులు, విష్ణుని యందు కలుగని బుద్ధి నిరర్థకాలని, వాటి భగవద్భావనే వాటి పరమార్థమని, ఆ స్వామిని తలంచని క్షణాలూ దినాలూ లెక్కించ దగ్గవి కావని; భగవంతుని నిరూపించని చదువుకు అర్థమే లేదని, అటువంటభగవత్సాక్షాత్కారం కలిగించే భక్తిమార్గాన్ని బోధించని గురువు గురువు కాడని, చివరకు జన్మను ఇచ్చినంత మాత్రాన తండ్రి కాడని, ఆ జగజ్జనకుని తెలుసుకొమ్మని ప్రబోధించని తండ్రి తండ్రే కాదని చెప్పకనే చెప్పాడు ప్రహ్లాదుడు.

చదువుల మర్మం తెలిసినవాడు కనుక ఉపాధి శరీరానికున్న ప్రయోజనం, జన్మను ఇచ్చిన తండ్రికి ఉండవలసిన అర్హత ఏమిటో వివరించాడు.

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే?, పవనగుంఫిత చర్మ భస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే?, ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక!
హరిపూజనము లేని హస్తంబు హస్తమే?, తరుశాఖ నిర్మిత దర్విగాక!
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే?, తనుకుడ్యజాల రంధ్రములుగాక!

ఆ. చక్రి చింతలేని జన్మంబు జన్మమే?, తరళ సలిలబుద్బుదంబు గాక!
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?, పాదయుగముతోడి పశువు గాక!



తా ॥ కమలనేత్రునికి ఉపయోగపడని శరీరం గాలితో నిండిన చర్మపు కొలిమి తిత్తి వంటిది. వైకుంఠవాసుని పొగడని నోరు ఢమఢమ ధ్వని చేసే ఢక్క వంటిది. శ్రీహరిని పూజించని చేయి చెట్టుకొమ్మతో చేసిన తెడ్డు వంటిది. లక్ష్మీపతిని చూడని కన్నులు శరీరమనే గోడకు గల గవాక్షరంధ్రాల వంటివి. చక్రధారిని గూర్చి చింతించని జన్మము కదలాడే నీటి బుడగ వంటిది.

విష్ణుభక్తి లేనివాడు విద్వాంసుడైనా రెండు పాదాలు కలిగిన పశువు వంటివాడు.

విష్ణుభక్తి ప్రభావాన్ని ప్రహ్లాదుడు హిరణ్యకశిపునికి వర్ణించి చెప్పాడు. మానవుని సర్వాంగాలూ భగవన్నిమిత్తంగానే ఉపకరించాలి. లేనినాడు ఆ జన్మ వ్యర్థం.

సీ. సంసారజీమూత సంఘంబు విచ్చునే?, చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లాఱునే?, విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే?, హరి మనీషాబడబాగ్ని లేక
ఘన విపద్గాఢాంధకారంబు లడఁగునే?, పద్మాక్ష నుతిరవిప్రభలు లేక

తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక, ముక్తినిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక, తామరసగర్భునకు నైన దానవేంద్ర!

171

తా ॥ దానవనాథా! విష్ణుదాసత్వమనే హోరుగాలి లేకపోతే సంసారమేఘముల సమూహం చెదరగలదా? విష్ణువును సేవించటమనే అమృతవృష్టి లేకుంటే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనే తాపత్రయ భయంకర దావాగ్నులు చల్లారుతాయా? విష్ణునియందలి జ్ఞానమనే బడబాగ్ని లేనప్పుడు అంతటా నిండిన పాపసముద్ర సమూహాలు ఎండిపోగలవా? పద్మనేత్రుని స్తుతులనే సూర్యకాంతులు లేకుండినట్లయితే, గొప్ప ఆపదలనే దట్టమైన చీకట్లు తొలగిపోతాయా? ముక్తిసాధనకు ప్రధానమైన విష్ణుని యొక్క స్మరణమనే అంజనం లేకుండా సాటిలేని జన్మరాహిత్యమనే నిర్మలమైన మోక్షనిధి కానవస్తుందా? బ్రహ్మదేవునికైనా సాధ్యం కాదు."

వ. అని యి వ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకు సెడి పలికెడి కొడుకు నుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ గటము లదరఁ బెదవులం గఱచుచు నదరిపడి గురుసుతునిం గనుంగొని విమత కథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుం

డిట్లనియె.

172

తా ॥ అని ఈ విధంగా భయం కాని, మరపు కాని తెలియక, లెక్కచేయక పలికే కొడుకు మాటలు చెవులకు కఠినంగా తోచగా, కణతలు అదురుతుండగా, పెదవులు కొరుకుతూ అదరిపాటుతో గురుపుత్రుని చూసి, 'విరోధి కథలా నీవు నేర్పించినది' అని హిరణ్యకశిపుడు ఈ విధంగా పలికాడు:

చ. పటుతర నీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి న నర్థములైన విరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
గటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే!

173

తా ॥ "సమర్థమైన నీతి శాస్త్రాలలో పాండిత్యం గలవానిగా చేస్తామని బాలుణ్ణి తీసుకపోయి, పనికిరాని శత్రుసంబంధమైన దుర్విషయాలను కపటత్వంతో బోధించావు. భృగువంశ శ్రేష్ఠ బ్రాహ్మణుడవని నమ్మాను. అయ్యయ్యో! బ్రాహ్మణాకృతి ధరించినవాడివే గాని నీవు నిజంగా బ్రాహ్మణుడివా?

క. ధర్మేతరవర్తనులును, దుర్మంత్రులునైన జనుల దురితము లొందున్
మర్మములు గలఁచి కల్మష, కర్ముల రోగములు పొందు కైవడి విప్రా!

174

తా ॥ ఓ బ్రాహ్మణుడా! ధర్మం తప్పి ప్రవర్తించేవారు, చెడుతలపు గలవారు అయిన జనుల పాపాలు వారి ఆయువు పట్టులలో వ్యాధిరూపంగా పీడిస్తాయి."

హిరణ్యకశిపుని ఆగ్రహం మొదట గురుపుత్రులపై ప్రసరించింది. పుత్రుడు చిన్నవాడు కనుక విష్ణుభక్తి అతనికి సహజలక్షణమని భావించటం లేదు. గురువులే వక్రమార్గం పట్టించారేమో అని సందేహం కలిగింది. గురుపుత్రులు కనుక హింసామార్గం అనుసరించక నిందారోపణలు చేస్తున్నాడు.

వ. అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె.

175

తా ॥ అనిన హిరణ్యకశిపునితో పురోహితుడు ఇలా అన్నాడు:

ఉ. తప్పులు లేవు మా వలన దానవనాథ! విరోధిశాస్త్రముల్
చెప్పము, క్రూరులై పరులు సెప్పరు, మీ చరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష, యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు, ప్రతిచింతఁ దలంపుము నేర్పు కైవడిన్.

176

తా ॥ "ఓ రాక్షసరాజా! మాయందు దోషం లేదు. శత్రువులకు సంబంధించిన సమాచారమేదీ మేము దుర్బోధ చేయలేదు. మీ పాదాలపై ప్రమాణం చేసి చెబుతున్నాం. పరులెవరూ బోధించలేదు. ఇదంతా మీ కుమారునికి నైజగుణంగా ఏర్పడిందే కాని ఎవరూ నేర్పించినది కాదు. దీనికి ప్రతిక్రియ నీ నైపుణ్యంతో ఆలోచించవలసిందే కాని వేరు మార్గం లేదు.

క. మిత్రులము పురోహితులము, పాత్రుల మే మదియుఁగాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెఁ జేయఁగ, శత్రులమే? దైత్యజలధిచంద్రమ! వింటే?

177

తా ॥ అసురవంశమనే సముద్రమున చంద్రుని వంటి రాజా! విను. మేము నీకు హితాన్ని

కోరే వారము. పురోహితులము. సమర్థులమైన మంత్రులము (దుర్మంత్రులమని నీవన్నది సరికాదు). అంతేకాక భృగువంశంలో జన్మించాము. (శుక్రాచార్యుని పుత్రులం.) నీ కుమారుని ఈ విధంగా (విపరీత వర్తనం గలవానిగా) చేయడానికి శత్రువులం కాము కదా!"

హిరణ్యకశిపుని ఆగ్రహ భాషణానికి బదులుగా శుక్రుని పుత్రులు తమ నిర్దోషత్వం నిరూపించుకోవలసి వచ్చింది. అధ్యయన సమయంలోనే ప్రహ్లాదుని విషయం తెలిసినా, హిరణ్యకశిపుని ఎదుట తాము బోధించిన విద్యనే ప్రదర్శిస్తాడనే నమ్మకంతో బుద్ధులు చెప్పి తీసుకొని వచ్చినవారు కాబట్టి ఈ నిరూపణ తప్పలేదు.

వ. అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యిట్లనియె.

178

తా ॥ అని పలికిన గురుపుత్రుని యెడ కోపింపక హిరణ్యకశిపుడు కొడుకును చూసి ఈ విధంగా అన్నాడు:

క. ఒజ్జలు సెప్పని యీ మతి, మజ్జాతుఁడ వైన నీకు మఱి యెవ్వరిచే నుజ్జాత మయ్యె బాలక!, తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్.

179

తా ॥ "కుమారా! గురువులు చెప్పని ఈ బుద్ధి నీకు మరెవరైనా నేర్పినారా? నావంటి వానికి (దేవతల విరోధికి) జన్మించిన నీకు ఇటువంటి లక్షణాలు అలవడటం దుర్లభం. ఆ ఇతరులెవరో వాళ్ళ పేర్లు నా ఎదుట చెప్పు."

వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె.

180

తా ॥ అన్న తండ్రితో ప్రహ్లాదుడు ఈ విధంగా పలికాడు:

ఉ. అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరి ప్రబోధముల్?

181

తా ॥ "గాఢాంధకారం (అచ్చపు చీకటి)లో ఉండి, ఇల్లు వదలక, విషయసంబంధులై, మరణిస్తూ, జన్మిస్తూ పదేపదే వారు ఈ సంసార చక్రంలో తిరుగుతూ ఉంటారు. ఒకవేళ ఇతరులు బోధించినా, తమంత తమకైనా, ఏది ఇచ్చినా, అడవులకు పోయినా, విష్ణువుకు సంబంధించిన జ్ఞానం అంత వేగంగా వారికి కలుగుతుందా?

గర్భస్థశిశువుకు నారద భక్తిసూత్రాలు ఒంటబట్టినవి. కనుక తండ్రికి ఈ విధమైన చదువుల మర్మాన్ని తెలియజేస్తున్నాడు.

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోఽభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!

182

తా ॥ రాక్షసరాజా! చూడలేని అంధుని ఆధారంతో మరొక అంధుడు తనకు కావలసిన విశేషవస్తువులను తెలుసుకోలేడు. అదే విధంగా విషయాసక్తులై కర్మబంధాలలో చిక్కినవారు, విష్ణువును చూడలేరు. విష్ణుపాదపద్మపరాగం చేత అభిషిక్తులైన కొందరు మాత్రం శ్రీహరి సాన్నిధ్యాన్ని పొందుతారు.

సంసార బంధాలను వదలి పరమపదాన్ని చేరడానికి పరమాత్మునిపై భక్తే శరణ్యం అని

అర్థం. మానవుడు, తనను బంధించే సంసార కర్మలను ఆధారం చేసుకుంటే పరాత్పరుని చేరటం కష్టం.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వే యేటికిన్
గాథల్ మాధవశేముషీతరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాఁటఁగ వచ్చునే? సుతవధూమీనోగ్ర వాంఛా మద
క్రోధోల్లోల విశాల సంసృతి మహా ఘోరామితాంభోనిధిన్.

183

తా ॥ రాక్షసరాజా! సమస్త శాస్త్రాలు అధ్యయనం చేశాను. కథలు, గాథలు అనేకం తెలుసుకున్నాను. భార్యాబిడ్డలనే జలచరాలు, గాఢమైన కోరికలు, గర్వము, క్రోధమనే పెద్ద అలలు కలిగిన భయంకర సంసార సముద్రాన్ని శ్రీహరి యందు మగ్నమైన బుద్ధి అనే ఓడ సహకారం లేకుండా దుష్టబుద్ధితో దాటడానికి వీలు కలుగుతుందా?"

హిరణ్యకశిపునిది లౌకిక దృష్టి. ఆధ్యాత్మిక (దృష్టి) చింతన గల ప్రహ్లాదునికి సర్వమూ విష్ణుమయమే. తండ్రి అడిగే ప్రశ్నలు దేనికి సంబంధించివైనా అన్నిటి సారము, తరణోపాయము విష్ణుసాన్నిధ్యమనే సమాధానం ప్రహ్లాదునిది.

వ. అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసుల ఱేఁడు దన తొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపులు మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్లనియె.

184

తా ॥ అని పలికినంతనే కొడుకును తిరస్కారంకొద్దీ, ప్రేమ ఏ మాత్రం చూపక, రాక్షసరాజు తన ఒడిలో ఉండనీయక, వెంటనే పడదోసి, అతిశయించిన కోపం ప్రజ్వరిల్లగా, వేడి చూపులనే మంటలు ఆకాశానికి ఎగిసి పడగా, మంత్రులను చూసి ఈ విధంగా అన్నాడు:

శా. క్రోడంబై పినతండ్రిఁ జంపె నని తాఁ గ్రోధించి చిత్తంబులో
వీడం జేయఁడు, బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై
యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁడొప్పించు చున్నాఁడు నా
తోడన్ వైరము పట్టె, నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే?

185

తా ॥ "తన పినతండ్రిని వరాహరూపంలో చంపినాడని అయినా ద్వేషం వహించి, హరి తలపును మానడు. సిగ్గులేక, పగవానికి, ఆ శ్రీహరికి సేవకుని వలె భక్తుడై, పట్టువీడటం లేదు. కాదంటే ప్రాణాలు అప్పగించి ఊరకుంటాడు. నాతోనే విరోధం వహించాడు. ఇటువంటి పితృద్రోహిని ఈ భూమిపై చూశారా?"

వ. అని రాక్షసవీరుల నీక్షించి యిట్లనియె.

186

తా ॥ అని, రాక్షస వీరులను చూస్తూ ఇట్లా అన్నాడు:

## హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి అనేక విధముల హింసించుట

శా. పంచాబ్దంబులవాఁడు, తండ్రినగు నా పక్షంబు నిందించి య
త్కించిద్భీతియు లేక విష్ణు నహితుం గీర్తించుచున్నాఁడు, వ
ల్దంచుం జెప్పిన మానఁ, డంగమునఁ బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్, వీని వధించి రండు దనుజుల్ మీమీ పటుత్వంబులన్

187

తా ॥ "వీడి వయస్సు ఐదేండ్లు. తండ్రినైన నా సిద్ధాంతాన్ని నిందించి, ఏ మాత్రం భయమంటూ లేక శత్రువైన విష్ణువును కీర్తిస్తున్నాడు. వద్దని చెప్పినా మానటం లేదు. నా శరీరంలో పుత్రుని రూపాన వ్యాధి పుట్టింది. ఓ రాక్షసులారా! ప్రహ్లాదుణ్ణి తీసుకొని వెళ్ళి మీ పరాక్రమంతో వీడిని వధించి రండి.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం, గులము నిర్దోషంబు గావించెదన్.

188

తా ॥ అవయవాలలో చెడిపోయిన భాగాన్ని శస్త్రచికిత్సతో వైద్యుడు ఖండించి మిగతావానిని రక్షించే విధంగా, ఈ అజ్ఞానిని, వంశానికి మచ్చ తెచ్చినవాడిని, చెడు సాంగత్యం గలవాడిని, హరిపక్షమే పొందినవాడిని, నీచుడైన వీడిని సంహరించి, గొప్ప పరాక్రమవంతుడననే కీర్తిని పొందుతాను. వంశానికి కళంకం లేకుండా చేస్తాను.

క. హంతవ్యుఁడు రక్షింపను, మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్

గంతవ్యుఁడు వధమున కుప, రంతవ్యుం డనక చంపి రం డీపడుచున్.

189

తా ॥ వీడు చంపదగినవాడే కాని రక్షింప తగనివాడు. ఆ ఆలోచనకైనా అనర్హుడు. తప్పక యమసదనానికి పోదగినవాడు. నా కొడుకు కాబట్టి, దాక్షిణ్యం వహించి వధ ప్రయత్నం, మానుకోమని అనకండి. ఈ పిల్లవానిని వెంటనే వధించండి."

వ. అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గల రక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలెఁ దామ్ర సంకాశంబు లయిన కేశంబులు మెఱయ భేదన వాదనచ్ఛేదనంబులు సేయుచు.

190

తా ॥ అని రాక్షసరాజు ఆజ్ఞ ఇవ్వగా వాడికోరలు గల రాక్షసులు అనేకులు శూలాలు ధరించి, నోళ్ళు తెరచి భయంకరంగా అరుస్తూ, పొగతో కూడిన కార్చిచ్చుల వలె, రాగివర్ణం గల కేశాలు ప్రకాశిస్తుండగా ఆ బాలుణ్ణి దూషించడం, దండించడం ప్రారంభించారు.

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సం
శీలుఁడు వీఁ డ వధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్ర వా
చాలత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా!

191

తా ॥ బాలుడని, రాకుమారుడని, దయగలవాడని, సాధువర్తనుడని, లోకులు గౌరవించే ప్రవృత్తి గలవాడని, చంప తగనివాడని ఎంచకుండా జంకులేక, వెనుదీయక, కఠినమైన మనస్సుతో శూలాలు చేత పట్టి, దృఢంగా నిలిచి, అతనిని కఠోరవాక్కులతో బాధింపసాగారు. (తీవ్ర పదజాలం ప్రయోగిస్తూ రాక్షసులు ఈ పని చేస్తుండగా) రాక్షసరాజు వారింపకుండా

చూస్తూ ఉన్నాడు.

 చ. పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము
న్నొలియదు, లోపలన్ రుధిర ముబ్బదు, కందదు, శల్య సంఘమున్
నలియదు, దృష్టివైభవము నష్టము గాదు, ముఖేందు కాంతియుం
బొలియదు, నూతనశ్రమము పుట్టదు, పట్టదు దీనభావమున్.

192

తా ॥ అంతమంది రాక్షసులు శూలాలతో బాధిస్తుంటే బాలుని దేహం ఏ మాత్రం గంటుపడలేదు. రక్తం చిందలేదు. కందిపోలేదు. ఎముకలు గాయపడలేదు. చూపు చెదరలేదు. చంద్రుని వంటి ముఖం వన్నె తరుగలేదు. కొత్తగా అలుపు కలుగలేదు. దీనభావాన్ని పొందలేదు.

ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటి మాటి 'కో
పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా
పన్న శరణ్య! యో నిఖిలపావన!' యంచు నుతించుఁగాని తాఁ
గన్నుల నీరు దేఁడు, భయకంపసమేతుఁడు గాఁడు భూవరా!

193

తా ॥ రాజా! ఆ ప్రహ్లాదుడు తనను రాక్షసులు బాధిస్తుంటే అనేకమార్లు ఓ శేషశాయీ! ఓ రాక్షసమర్దనా! ఓ జగత్పతీ! ఓ దీనరక్షకా! సమస్తాన్నీ పావనం చేసేవాడా! అని పొగడుతున్నాడే కాని, కంట నీరు పెట్టలేదు, భయకంపితుడు కాలేదు.

దేహం తాను కాదనే భావన గల ప్రహ్లాదునికి సర్వమూ హరిమయమే కనుక విష్ణువు అనంత నామాలను పేర్కొంటూ బ్రహ్మభావనలో మగ్నమైనాడు. ఉపాధి శరీరానికి కలిగే ఏ చర్యా ప్రహ్లాదుని బాధించలేదు.

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు, బాహువు లొడ్డఁడు, బంధురాజిలోఁ
దూఱఁడు, ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని, మిత్రవర్గముం
జీరఁడు, మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిం
దాఱఁడు, కావరే యనఁడు, తాపము నొందఁడు కంటగింపఁడున్.

194

తా ॥ రాక్షసులెంతగా తనను హింసించినా ఎక్కడికీ పారిపోవటం లేదు. హింసకు ప్రతిగా చేతులు అడ్డుపెట్టడు. బంధువుల చాటుకు వెళ్ళడు. ఆ హింసాత్మకమైన చర్యలకు తండ్రిని నిందించడు. ఆదుకోమని స్నేహితులను పిలవడు. తల్లులు నివసించే అంతఃపురానికైనా పోడు, రక్షించమని అనడు. ఇదేమని బాధ పడడు, ఎవరితోను విరోధించడు.

వ. ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టి దని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై య మ్మహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మయుండయి పరమానందంబునుం బొంది యున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు దన కింకరుల చేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్ముని యందుఁ బ్రయుక్తంబులైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి.

195

తా ॥ ఈ విధంగా ప్రహ్లాదుడు సమస్తము తానే అయినదానిని – అది ఇది అని చెప్పడానికి సాధ్యం కానిదైన పరబ్రహ్మము తానే అయ్యాడు. మహావిష్ణువునందు మనస్సు లయింపజేసి, తన్మయత్వంతో పరమానంద స్వరూపుడై ఉన్న ప్రహ్లాదుని పట్ల రాక్షసరాజు తన భటులతో జరిపించే హింసాపూర్వకమైన చర్యలు – పాపకర్మునికి చేసే ఉపకారాల వలె విఫలం కావటం ఆ హిరణ్యకశిపుడు చూసాడు.

ఉ. శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా

బాలుఁడు నేలపైఁ బడఁడు, పాఱఁడు, చావఁడు, తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరపక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ, దనపాయత నొందుట కేమి హేతువో?

196

తా ॥ 'రాక్షసులు వెనుదీయక ఎంతగా శూలాలతో దేహాన్ని హింసించి, బాధించినా బాలుడైన ప్రహ్లాదుడు నేలపై పడక, పారిపోక, మృత్యువును పొందకున్నాడు. తండ్రినైన నా వద్దకు వచ్చి హరిచింతన మానుకున్నానని నా పాదాలపై తలవంచి నమస్కరించడు. ఇంత జరిగినా ఆపదను పొందకపోవడానికి కారణం ఏమై ఉంటుంది?'

వర ప్రభావంతో తాను మృత్యువును జయించాననే నమ్మకం, గర్వం హిరణ్యకశిపునికి. బాలుని ఎన్ని విధాల హింస పెట్టినా మృత్యువును పొందక, బాధపడక ఎట్లా ఉన్నాడనే సందేహం కలిగింది.

వ. అని శంకించుచు.

197

తా ॥ అని ఆ దానవుడు సంశయించ సాగాడు.

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి, కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు
నొకమాటు విషభీకరోరగ శ్రేణులఁ, గడువడి నర్భకుఁ గఱవఁ బంపు
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన, విసరి కుమారుని వ్రేయఁ బంపు
నొకమాటు కూలంకషోల్లోల జలధిలో, మొత్తించి శాబకు ముంపఁ బంపు

ఆ. విషముఁ బెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపుఁ, దొడ్డకొండ చఱులఁ ద్రోయఁ బంపుఁ
బట్టి కట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు, బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప!

198

తా ॥ రాజేంద్రా! ఆగ్రహంతో హిరణ్యకశిపుడు – ఒకమారు దిగ్గజాల సమూహాన్ని ఉసిగొలిపి ప్రహ్లాదుని తొక్కించాడు. ఒకమారు భయంకరమైన విషసర్పాలతో కరిపించాడు. ఒకమారు ఉగ్రంగా ప్రజ్వలించే మంటల సమూహంలో విసరివేయించాడు. ఒకమారు అల్లకల్లోలమైన సముద్రంలోకి బాలకుని త్రోయించాడు. విషము పెట్టించి, చీల్చి చెండాడి, ఎత్తైన పర్వత శిఖరాగ్రం నుండి క్రిందికి త్రోయించి, బంధించి అనేకవిధాలుగా బాధపెట్టాడు.

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు, నొకవేళ నెండల నుండఁ బంచుఁ
నొకవేళ వానల నుపహతి నొందించు, నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు
నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు, నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు, నొకవేళఁ బాఁతించు నుర్వియందు

తే. నీర మన్నంబు నిడనీక నిగ్రహించుఁ, గశల నడిపించు ఱువ్వించు గండ శిలల
గదల వ్రేయించు, వేయించు ఘనశరములఁ, గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు,

199

తా ॥ ఇంకా ఆగ్రహంతో – ఒకమారు మారణహోమం చేయించి, ఒకమారు ఎండలో ఉంచి, ఒకమారు వానలో తడిపించి, ఒకమారు నవరంధ్రాలు మూయించి, తన మాయ చేష్టలతో భయపెట్టి, మంచులో నిలబెట్టి, పెనుగాలికి ఎదురు నిలిపి, భూమిలో పాతించి, నీరు, ఆహారం పెట్టనీయక దండించి, కొరడాలతో ఝళిపించి, పెద్ద శిలలతో రువ్వించి, గదలతో మొత్తించి, వాడియైన బాణాలతో నొప్పించి – పుత్రుని చాలా విధాల హింసించాడు.

వ. మఱియు ననేక మారణోపాయంబులఁ బాపరహితుండైన పాపని రూపుమాపలేక
యేకాంతంబున దురంత చింతా పరిశ్రాంతుండయి రాక్షసేంద్రుండు దన మనంబున.

200

తా ॥ ఇంకా అనేకవిధాల మారణోపాయాలచేత నిష్కల్మషుడైన ఆ పసివాడిని చంపలేక విఫలుడై, ఏకాంతప్రదేశంలో అమితమైన చింతను పొందినవాడై రాక్షసరాజు తన మనస్సులో ఇలా అనుకోసాగాడు:

ఉ. ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైలతటంబులందు ద్రొ
బ్బించితి, శస్త్రరాజిఁ బొడిపించితి, మీఁద నిభేంద్రపంక్తి ఁ ద్రొ
ప్పించితి, ధిక్కరించితి, శపించితి, ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితిఁ, బెక్కుపాట్ల నలయించితిఁ, జావఁ డి దేమి చిత్రమో!

201

తా ॥ 'సముద్రాలలో నెట్టించాను, గదలతో చావగొట్టించాను, కొండచరియలలో తోయించాను, నానావిధాల ఆయుధాలతో పొడిపించాను, గజాలను వరుసపెట్టి త్రొక్కించాను, బెదరించాను, నిందించాను, భయంకరాగ్నులలో పడవేయించాను, ఇంకా అనేక విధాల కష్టపెట్టినా మరణించటం లేదు. ఇదేమి వింత?

చ. ఎఱుఁగఁడు జీవనౌషధము, లెవ్వరు భర్తలు లేరు, బాధలం
దరలఁడు, నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు, మిక్కిలిన్
మెఱయుచు నున్నవాఁ డొక నిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగునఁ ద్రుంతు? వేసరితి, దివ్యము వీని ప్రభావమెట్టిదో!

202

తా ॥ ప్రాణాలను కాపాడే ఔషధాలు ఎరుగడు. రక్షించేవారెవరూ లేరు. కష్టాలలో తన సహజ తేజస్సును కోల్పోడు. మోహాన్ని పొందదు. మరింత ప్రకాశవంతంగా కనపడుతున్నాడు. ఏ మాత్రం దీనత్వాన్ని పొందదు. ఇటువంటివాడిని ఏ విధంగా చంపగలను? వీడి అసాధారణ సామర్థ్యమేమిటో కాని, ఆయాసం, విసుగు కలుగుతున్నాయి.

వ. అదియునుం గాక తొల్లి శునశ్శేఫుండను మునికుమారుండు దండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుండయి తండ్రి తనకు నపకారి యని తలంపక బ్రతికిన చందంబున.

203

తా ॥ అదీకాక, పూర్వం శునశ్శేఫుడనే మునికుమారుడు తండ్రిచేత యాగంలో యజ్ఞపశువుగా ఇవ్వబడి, తండ్రిని అపకారి అని తలచక బ్రతికాడు.

క. ఆగ్రహమున నేఁ జేసిన, నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్
విగ్రహము లనుచుఁ బలుకఁ డ, నుగ్రహములుగా స్మరించు, నొవ్వఁడు మదిలోన్.

204

తా ॥ కోపంతో నేను విధించిన శిక్షల గురించి ఏనాడూ ఇతరులతో నేరాలు చెప్పడు. విరోధంగా భావించడు. మనస్సులో ఏ మాత్రం దుఃఖపడక, ఇవన్నీ తనకు హితమనే భావిస్తాడు. కానీ నొచ్చుకోడు.

వ. కావున వీఁడు మహాప్రభావ సంపన్నుండు, వీని కెందును భయంబు లేదు, వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు నని నిర్ణయించి చిన్నవోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రిందు సూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామర్కు లిట్లనిరి.

205

తా ॥ కనుక వీడు గొప్ప మహిమ కలవాడు. వీడికి ఎటువంటి భయమూ లేదు. వీడితో విరోధిస్తే మృత్యువు కలుగుతుందని నిర్ణయించి, దీనభావంతో విచారించి, సంతోషం లేనివాడై, నేలచూపులు చూస్తూ దుఃఖంతో ఆలోచిస్తున్న రాక్షసరాజుతో, ఏకాంతంగా గురువులైన చండామర్కులు ఈ విధంగా అన్నారు:

మృత్యువు లేని వరాన్ని పొందినా కొడుకు ప్రవర్తన చూసిన తరువాత హిరణ్యకశిపునికి చింతన మొదలైంది, మృత్యుభయం పట్టుకున్నది. శత్రువు జాడ తెలుసుకోవాలనే తపన, ఆగ్రహం హిరణ్యకశిపుని మృత్యువు (మోక్షం) వైపు నడిపిస్తున్నాయి.

శా. శుభ్రఖ్యాతివి నీ ప్రతాపము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మ విజృంభణమ్మున దిగీశవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు! వీఁడెంత? యీ
దభ్రోక్తుల్ గుణదోష హేతువులు, చింతం బొంద నీకేటికిన్.

206

తా ॥ "రాక్షసశ్రేష్ఠా! నీవు స్వచ్ఛమైన కీర్తి గలవాడవు. నీ పరాక్రమం మహా ఆశ్చర్యకరమైనది. రోషంతో కూడి ఉన్న నీ కనుబొమల విజృంభణం యుద్ధంలో దిక్పాలకులను సైతం కలచివేసింది. ఈ ప్రపంచాన్నే ఏలినవాడివి. ఈ బాలకుడెంతటివాడు? ఇతని అజ్ఞానపు అల్పమైన మాటలు కారణంగా, నీవెందుకు విచారించటం?

శా. వక్రుండైన జనుండు వృద్ధగురు సేవంజేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు, మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణబద్ధుఁ జేయుచు మదిం జాలింపుమీ రోషమున్,
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్.

207

తా ॥ రాజా! వక్రబుద్ధి కలిగినవాడు, పెద్దలను గురువులను సేవించటం వల్ల బుద్ధి వికసించి ప్రకాశిస్తాడు. వయస్సు పెరిగిన కొద్దీ బాలునికి ఇంద్రుని పట్ల ద్వేషం కలిగేటట్లు చేయవచ్చు. పసివాడిపై ఆగ్రహించకు. శుక్రాచార్యులు వచ్చే సరికి ఇతడు మంచి జ్ఞానవంతుడౌతాడు."

వ. అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపఁ దగిని ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞ చేసిన వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన, నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులు దనకు నగ్రాహ్యంబు లనియును, వ్యవహార ప్రసిద్ధికొఱకైన భేదంబుగాని యాత్మభేదంబు లేదనియును, ననర్థంబులయం దర్థకల్పన సేయుట దిగ్భ్రమం బనియును నిశ్చయించి గురూపదిష్ట శాస్త్రంబులు మంచివని తలంపక గురువులు దమ గృహస్థ కర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున.

208

తా ॥ అని గురుపుత్రులు చెప్పగా; రాక్షసరాజు గృహస్థులైన రాజులకు చెప్పవలసిన ధర్మార్థ కామాల గురించి ప్రహ్లాదునికి ఉపదేశించుడని ఆజ్ఞాపించగా; వారు ఆ బాలునికి త్రివర్గాన్ని (ధర్మ, అర్థ, కామాలను) ఉపదేశించారు.

ప్రహ్లాదుడు – రాగద్వేషాల వల్ల ఇంద్రియలోలురైన వారికి సమ్మతములైన, ధర్మార్థకామాలు తనకు ఇష్టం లేవన్నాడు. లోకములో వ్యవహార నిమిత్తం ఈ భేదంకాని, ఆత్మకు ఎటువంటి భేదం లేదని తలచాడు. అశాశ్వతమైన వాటిపట్ల భ్రాంతి పొందటం అనవసరమని భావించి, గురువులైన వీరిద్దరూ బోధించే శాస్త్రవిద్యలు మంచివి కావని తలచాడు. గురువులు ఇండ్లలో తమ గృహకృత్యాలు, కర్మానుష్ఠానాలకు వెళ్ళిన సమయం గమనించాడు.

క. ఆటలకుఁ దన్ను రమ్మని, పాటించి నిశాటసుతులు భాషించిన దో
షాటకులేంద్రకుమారుఁడు, పాటవమున వారిఁ జేరి ప్రజ్ఞాన్వితుఁడై.

209

తా ॥ ఇతర రాక్షస బాలురు తనను ఆటలాడటానికి రమ్మని పిలువగా, నిశాచరులకు రాజైన హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు తెలివితో నేర్పుగా వారిని చేరదీసాడు.

క. చెప్పఁడొక చదువు మంచిది, చెప్పెడిఁ దగులములు చెవులు చిందఱ గొనఁగా
నెప్పుడు మనయెడ నొజ్జలు, చెప్పెద నొక చదువు వినుఁడు చిత్తము లలరన్.

210

తా ॥ "మన గురువులు ఎప్పుడూ మంచి చదువేదీ మనకు బోధించటం లేదు. కర్మబంధాలను గూర్చి చెప్పే మాటలు చెవులు చిల్లులుపడేట్లుగా ఉన్నవే కాని, హితవుగా లేవు. మీ మనస్సులు సంతోషించేటట్లు నేను మంచి చదువును బోధిస్తాను, వినండి."

వ. అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ నగియెడి చందంబునఁ
గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె.

211

తా ॥ అని, రాకుమారుడు చనువుగా, ధైర్యంగా స్నేహితులతో కలిసి నవ్వుతూ, ఆటలాడుతూ తన ఈడు వారైన రాక్షస బాలురతో రహస్యంగా ఇలా అన్నాడు:

ఉ. బాలకులార! రండు మన ప్రాయపుబాలురు గొంద ఱుర్విపైఁ
గూలుటఁ గంటిరే! గురుఁడు క్రూరుఁ డనర్థ చయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి, గ్రాహ్యము గాదు శాస్త్రముల్
మే లెఱిఁగించెదన్! వినిన మీకు నిరంతర భద్ర మయ్యెడిన్.

212

తా ॥ "పిల్లలారా! మన వయస్సు వారైన బాలురు కొందరు అకాలంలో చనిపోతుండటం చూస్తున్నాము కదా! గురువుగారు దయలేనివాడు. దుర్బుద్ధితో సుస్థిరం కాని లౌకిక విషయాలను బోధిస్తూ అపార్థాలు కల్పించి, ఆ సుఖాలే స్థిరమనే భావన కలిగిస్తున్నాడు. అది గ్రహించ తగినది కాదు. లాభకరమైనదీ, ఎప్పటికీ క్షేమాన్ని కలిగించేదీ అయిన విషయాన్ని మీకు తెలియ జేస్తాను. వినండి.

వ. వినుండు, సకల జన్మంబులందును ధర్మార్థాచరణ కారణంబయిన మానుషజన్మంబు దుర్లభం, బందుఁ బురుషత్వంబు దుర్గమం, బదియు శతవర్ష పరిమితంబైన జీవిత కాలంబున నియతంబై యుండు, నందు సగ మంధకార బంధురంబయి రాత్రి రూపంబున నిద్రాదివ్యవహారంబుల నిరర్థకంబయి చనుఁ, జిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్యకైశోర వయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచుఁ, గడమ ముప్పది యబ్దంబుల చేతఁ బట్టువడి దురవగాహంబులయిన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమాణమైన తృష్ణకు లోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగచాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబు లయిన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయో రూపధన్యలగు కన్యలను, వినయ వివేకవిద్యాలంకారులయిన కుమారులను, గామిత ఫలప్రదాత లగు భ్రాతలను, మమత్వ ప్రేమదైన్య జనకు లయిన జననీ జనకులను, సకల సౌజన్య సింధువు లయిన బంధువులను, ధనకనక వస్తువాహన సుందరంబు లయిన మందిరంబులను, సుకరంబులైన పశుభృత్య నికరంబులను, వంశపరంపరాయత్తంబు లయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జించు నుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబయిన మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మ బద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండయి నిజకుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబుఁ దెలియ నేరక స్వకీయ పరకీయ భిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించుఁ, గావునఁ గౌమార సమయంబున మనీషా గరిష్ఠుం డై పరమ భాగవతధర్మంబు ననుష్ఠింపవలయు, దుఃఖంబులు వాంఛితంబు గాక చేకుఱుభంగి సుఖంబులును గాలాను సారంబులై లబ్ధంబు లగుం; గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు, హరిభజనంబున మోక్షంబు సిద్ధించు, విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. ముముక్షువైన దేహికి దేహావసాన

పర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు.

213

తా ॥ అన్ని జన్మలలో ధర్మమును, అర్థమును ఆచరించే హేతువైన మానవ జన్మం సులభంగా పొందరానిది. అందులోను పురుష జన్మ మరింత పొందరానిది. నూరేండ్ల పరిమితి గల జీవితకాలం నిర్ణయమై ఉన్నది. ఈ నూరేండ్ల సమయంలో సగం రాత్రిరూపంలో అంధకారమై నిద్రాసక్తితో వ్యర్థంగా గడచిపోతుంది. తక్కిన యాభై సంవత్సరాలలో శిశుప్రాయం నుండి బాల్య కౌమార కిశోర యౌవన పరిణామ దశలతో ఇరవై ఏండ్లు గడచిపోతాయి. ఆ పైని ముప్పై ఏండ్లలో ఇంద్రియవశమై దాటరాని అరిషడ్వర్గాలనే (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే) తాళ్ళతో కట్టబడి, విడిపించుకోను సమర్థుడు కాక, ప్రాణాలకన్నా మధురమనిపించే ఆశకు లోబడి సేవకులు, దొంగలు, వర్తకుల కర్మల వల్ల ప్రాణహాని కలిగినా అంగీకరించి, పరుల సొమ్మును ఆశిస్తూ, రహస్య సుఖానుభవాన్ని కోరుకొంటాడు. నైపుణ్య సౌందర్య విశేషాలతో, ధైర్యమనే తీగకు కొడవండ్ల వంటి వారైన భార్యలను, గొప్పవై మధురమైన మాటలు కలిగి వశులైన పసివారిని, మంచి నడవడి కలిగి వయోరూపాలచే ధన్యులైన కుమార్తెలను, వినయ వివేక విద్యలచే ప్రకాశించే కుమారులను, కోరిన కోర్కెలు తీర్చే సోదరులను, మమకారం ప్రేమభావం కరుణ కలిగిన తల్లిదండ్రులను, సాధుస్వభావులైన బంధువుల యందు ఆసక్తి చూపుతారు. ధన కనక వస్తు వాహనాలచే సుందరంగా కనుపించే మందిరాలను(వసతులను), సుఖకారకాలైన పశువులు, సేవకుల సమూహాన్ని, పారంపర్యంగా సంక్రమించిన ధనాన్ని వదలుకోలేక; సంసార మందలి బంధాన్ని విడిచి పెట్టే ఉపాయం కనబడక, తానే అల్లిన దారాల సమూహంలోనుంచి బయటకు వచ్చే మార్గం లేని సాలెపురుగు వలె బందీయై, వెలుపలకు వచ్చే నేర్పు లేక, గృహస్థుడు తాను చేసుకొన్న కర్మల వలన కట్టుబడినవాడై, సంగమసుఖం, భోజనసుఖాలతో మైమరచి, తన కుటుంబసంరక్షణ నిమిత్తం సమ్మోహితుడై, ఆ సుఖాలను వదలిపెట్టే విధానం తెలియక, తనది, ఇతరులది అనే భేదభావంతో అజ్ఞానమనే చీకటిలోనికి ప్రవేశిస్తాడు. కనుక కుమారదశలో ఉన్నప్పుడే బుద్ధిబలంతో ఉత్తమ

భక్తుల ధర్మాన్ని అనుసరించాలి. దుఃఖాలు కోరకున్నా లభించే విధంగా సుఖాలు కూడా కాలానుసారం లభిస్తాయి. కనుక వ్యర్థప్రయత్నాలతో ఆయువును పోగొట్టు కొనకూడదు.

శ్రీహరిని స్మరించటం వలన మోక్షం కలుగుతుంది. విష్ణువు సమస్తప్రాణులకు ఆత్మరూపుడు, ఇష్టుడు. మోక్షాన్ని కోరుకునేవారికి శరీరం ఉన్నంత వరకు నారాయణుని పాదపద్మాలను సేవించటం ఒక్కటే చేయతగిన పని.

ఇల్లు, కుటుంబం, సంతానం – ఇవన్నీ మనకు కొద్ది కాలమే ఉండేవి – ఇవన్నీ అశాశ్వతాలు. తాటిచెట్టే ఉండేది; ఒకటి రెండు పళ్ళు చెట్టు నుంచి కిందపడినంత మాత్రాన మనం విచారించటం ఎందుకు?

–శ్రీరామకృష్ణ పరమహంస

సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై, విఫలులై కైకొన్న వెఱ్ఱి తనము?
భద్రార్థులై యుండి పాయరు, సంసార పద్ధతి నూరక పట్టువడిరి
కల యోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ, బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు, కర్మతంత్రుఁడై కడపట, ముట్టఁడు భవశతములకు నయిన

ఆ. దీన శుభము లేదు, దివ్యకీర్తియు లేదు, జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకుఁ? బుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి.



తా ॥ చూశారు కదా! గొప్పవారు, గృహస్థులైన మనవారు గార్హస్థ్యధర్మాన్ని మరచి, మూఢులై ఉన్నారు. ఆనందం కోరుకునేవారైనా రక్తిమార్గాన్ని విడువలేక సంసార బంధంలో పట్టుబడి పోయారు. ఈ జీవుడు లోకంలో ఉన్న అన్ని యోనులలో ప్రవేశించి, గర్భవాసాది అవస్థలు పడి జన్మలు పొందుతుంటాడు. కర్మకు కట్టుబడి తనను తాను తెలుసుకోలేకున్నాడు.

వందలకొద్దీ జన్మలెత్తినా కర్మబంధాలనుంచి విముక్తిని పొందలేడు. ఈ సంసారం వల్ల కలిగే సుఖం, కీర్తి ఏమీ లేవు. జగత్తులో పుడుతూ, మరణిస్తూ మనం ఇందులోనే ఎందుకు వ్యథ చెందాలి? పుట్టుక, మరణం లేని మార్గం వెతికి తెలుసుకోవటం గొప్ప బుద్ధి.

శా. హాలాపాన విజృంభమాణ మదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే!

215

తా ॥ గొప్ప పండితుడైనా – మధువు తాగటం వల్ల, మితిమీరిన గర్వంతో మేనుమరచి, స్త్రీ చూపులనే సంకెళ్ళకు కట్టుబడి, ఏ మాత్రం తరుణోపాయం లేక, స్త్రీల విలాసానికి ఆకర్షింపబడిన లేడికూన చందాన హీనస్థితిని పొందుతాడు. వింటున్నారా?

ఈ విధమైన సంకెళ్ళలో బంధించబడి జీవిత సమయం వృథా అయిపోతున్నప్పటికీ గమనించక మానవుడు తన ఉత్తమ స్థితినుండి హీనస్థితికి దిగజారిపోతున్నాడు.

ఆ. విషయసక్తులైన విబుధాహితుల తోడి, మనికి వలదు, ముక్తి మార్గవాంఛ
నాది దేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త, సంగజనులఁ గూడి శైశవమున.

216

తా ॥ ఇంద్రియలోలత్వం కలిగిన చెడ్డవారితో సహవాసం తగని పని. ముక్తిమార్గాన్ని కోరుతూ ఆదిదేవుడైన విష్ణువును ఆశ్రయించండి. విషయాసక్తులు కాని మహాత్ములను కలిసి, బాల్యప్రాయంలోనే వారిని సేవించండి.

ఎండు కట్టెలను చిదుగులను పోగుచేసి కష్టపడి ఎవడైనా మంట రాజేస్తే దాని సెగతో

అనేకులు చలికాచుకుంటారు. అలాగే తీవ్ర జపతపాలను గావించి ఈశ్వర సాక్షాత్కారం పొందిన మహనీయుల సాంగత్యం చెయ్యటం చేతా వారి సదుపదేశాలను అనుసరించటం చేతా అనేకులు తమ మనస్సును భగవంతుడి మీద లగ్నం చేసుకోగలరు.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. కావున విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు, రమ్యమయ్యును బహుతర ప్రయాస గమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద, సర్వభూతాత్మకుండై సర్వ దిక్కాల సిద్ధుండై బ్రహ్మ కడపలగాఁ గల చరాచర స్థూల సూక్ష్మజీవసంఘంబు లందును, నభోవాయుకుంభినీ సలిల తేజంబు లనియెడు మహాభూతంబులయందును, భూతవికారంబు లయిన ఘటపటాదుల యందును, గుణసామ్యం బయిన ప్రధానమందును, గుణవ్యతిరేకం బైన మహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమోగుణంబుల యందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచకశబ్దంబులు గల్గి కేవలానుభవానంద స్వరూపకుండు నవికల్పితుండు ననిర్దేశ్యుండు నయిన పరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్య మాయచేత నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుండును భోక్తయు నయి నిర్దేశింపందగి వికల్పితుండై యుండుఁ, దత్కారణంబున నాసుర భావంబు విడిచి సర్వ భూతంబులందును దయాసుహృద్భావంబులు కర్తవ్యంబులు, దయాసుహృద్భావంబులు గల్గిన నధోక్షజుండు సంతసించు, ననంతుం డాద్యుండు హరి సంతసించిన నలభ్యం బెయ్యదియు లేదు, జనార్దనచరణ సరసీరుహ యుగళస్మరణ సుధారస పానపరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై, సిద్ధించు ధర్మార్థకామంబులు, కాంక్షితంబై సిద్ధించు మోక్షం బననేల? త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్కదండనీతి జీవికాదు లన్నియుఁ ద్రైగుణ్య విషయంబు లయిన వేదంబుల వలనం బ్రతిపాద్యంబులు, నిస్త్రైగుణ్యలక్షణంబునం బరమ పురుషుండైన హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలు,

పరమాత్మ తత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతి సేయక పురుషుండు యోగావధూతతత్త్వంబున నాత్మ వికల్పభేదంబునం గలలోఁ గన్న విశేషంబుల భంగిం దథ్యం బనక మిథ్యయని తలంచు నని మఱియుఁ బ్రహ్లాదుం డిట్లనియె.

217

తా ॥ కనుక విషయాసక్తులైన రాక్షసులకు శ్రీహరిని భజించటం వీలుపడదు. ఒకవేళ ఇష్టపడినా ఎంతో ప్రయాస మార్గమని అనుకుంటారేమో! చెబుతాను – సర్వప్రాణులందున్నవాడై, అన్ని దిక్కుల కాలాలలో ఉన్నవాడై, బ్రహ్మమున కవతల గల స్థిర చర స్థూల సూక్ష్మ ప్రాణిసమూహాలలో, పంచభూతాలలో (నీరు, వాయువు, భూమి, ఆకాశము, అగ్నులలోను), వీటి నుండి పుట్టిన ఘట పటాదుల (కుండ, గుడ్డ మొదలైనవాని) లోను, గుణసహితమైన మూల ప్రకృతిలోను, గుణాతీతములైన గొప్ప తత్త్వాలలో, సత్త్వరజస్తమోగుణాలలో భగవంతుడు ఉన్నాడు. అతడు నాశము లేనివాడు, ఈశ్వరుడు, పరమాత్మ, పరబ్రహ్మమనే పేర్లతో పిలువబడుతున్నాడు. కేవలం అనుభవం ద్వారా తెలుసుకోగలిగిన ఆనందస్వరూపుడు, మార్పు లేనివాడు, వేదోక్తులచే నిర్దేశింపదగినవాడు, ఇదీ అని నిర్దేశింపరానివాడు అయిన పరమేశ్వరుడు. సత్త్వరజస్తమోగుణాత్మకమైన తన మాయ చేత మరుగు పడిన వైభవం గలవాడై; వ్యాపించే, వ్యాపింపజేసే రూపాలతో చూడతగినవాడు, చూసేవాడు, అనుభవింపదగినవాడు, అనుభవించేవాడు అయి, నిర్దేశించడానికి రూపకల్పన చేయబడినవాడై ఉంటాడు. ఆ కారణం వల్ల మానవుడు రాక్షస భావం వదలి సర్వప్రాణులందు దయ గలిగి, స్నేహభావంతో ఉండాలి. ఈ గుణాలు ఉన్నప్పుడు భగవంతుడు సంతోషిస్తాడు. అంతం లేనివాడు, ఆద్యుడు అయిన శ్రీహరి సంతోషిస్తే లభించనిదంటూ ఏదీ లేదు. జనార్దనుని పాదపద్మాల స్మరణ అనే అమృతపానంతో పరవశులం కాగలిగితే, మనకు దైవకృప చేత, కోరకున్నా ధర్మార్థకామాలు సిద్ధిస్తాయి. ఇక మోక్ష విషయం చెప్పనేల? (చెప్పకుండానే సిద్ధిస్తుందని భావం). ధర్మార్థకామాలు, ఆత్మవిద్య, తర్కము, శిక్ష, స్మృతి వంటి బ్రతుకు తెరువుకు అవసరమైనవన్నీ సత్త్వరజస్తమోగుణ విషయాలు వేదాలలో ప్రతిపాదింపబడినవి.

త్రిగుణాతీత లక్షణం కలిగిన పురుషోత్తముడైన శ్రీహరికి ఆత్మసమర్పణం చేయటం మేలు. పరమాత్ముని తత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞానంతో 'నేను వేరు – ఇతరులు వేరు' అనే భ్రమ చెందని పురుషుడు యోగి వలె, అవధూత వలె ఆత్మతత్త్వం గ్రహిస్తాడు. స్వప్నంలో చూసిన విశేషాలను ఎలా నిజం కావో అలాగే ఈ లోకం కూడా నిజం కాదని తెలుసుకొంటాడు" అని చెప్పి, ఇంకా ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు:

మ. నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుడంతయున్
వరుసన్ నారద సంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముం జేసె మున్
హరిభక్తాంఘ్రి పరాగశుద్ధతను లేకాంతుల్ మహాకించనుల్
పరతత్త్వజ్ఞులు గాని నేరరు మదిన్ భావింప నీ జ్ఞానమున్.

218

తా ॥ నరనారాయణులు చెలిమి కలిగి ఉంటున్నప్పుడు నారాయణుడు ఈ విషయాన్నంతా నారద మునీంద్రునికి వివరించి చెప్పాడు. ఈ బ్రహ్మజ్ఞానాన్ని విష్ణుభక్తుల పాదపరాగం చేత పవిత్రమైన శరీరం గల ఆంతరంగికులైన భక్తులు, సర్వసంగ పరిత్యాగులు, పరతత్త్వం తెలిసినవారు తప్ప సామాన్యులు మదిలో ఊహించలేరు.

వ. తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహాముని వలన సవిశేషం బయిన యీ జ్ఞానంబును బరమభాగవత ధర్మంబును వింటి, ననిన వెఱఁగుపడి దైత్యబాలకు లద్దనుజ రాజకుమారున కిట్లనిరి.

219

తా ॥ పూర్వం నేను అతీంద్రియ జ్ఞానం గల నారదమహర్షి వలన ఈ పరమార్థజ్ఞానాన్ని, ఈ ఉత్తమమైన భాగవత ధర్మాన్ని విన్నాను." అనగానే రాక్షస బాలకులు ఆశ్చర్యపడి, రాక్షసరాజు కుమారునితో ఈ విధంగా అన్నారు:

ఉ. మంటిమి గూడి భార్గవకుమారకులొద్ద ననేక శాస్త్రముల్
వింటిమి, లేఁడు సద్గురుఁడు వే ఱొకఁ డెన్నఁడు రాజశాల ము
క్కంటికి నైన రాదు సొరఁగా, వెలికిం జన రాదు, నీకు ని
ష్కంటక వృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు సెప్పె గుణాఢ్య! సెప్పుమా.

220

తా ॥ "గొప్ప గుణాలు కలవాడా! మనమంతా కలిసి పెరిగినవాళ్ళము. శుక్రాచార్యుని కుమారుల వద్ద అనేక శాస్త్రాలు విన్నాము. వేరే సద్గురువు ఎవరూ మనకు లేదు. మన రాజభవనంలోనికి ముక్కంటికి కూడా రాకపోకలకు వీలులేదు. ఏ నేర్పరి నీకు అరమరిక లేక ఈ జ్ఞానాన్ని ఉపదేశించాడు?

క. సేవింతుము నిన్నెప్పుడు, భావింతుము రాజ వనుచు బహుమానములం
గావింతుము, తెలియును నీ, కీ వింతమతిప్రకాశ మే క్రియఁ గలిగెన్?

221

తా ॥ ప్రహ్లాదా! నిన్నెప్పుడూ సేవిస్తుంటాము. నీవే రాజువని తలచి గౌరవిస్తాము. కాని నీవు ఇంతటబుద్ధిప్రకాశం గలవాడివని ఎరుగము. నీకు ఈ అపురూపమైన జ్ఞానం ఏ విధంగా లభించింది?

వ. అని ఇట్లు దైత్యనందనులు ద న్నడిగినఁ బరమభాగవత కులాలంకారుండైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబు వినంబడిన నారదు మాటలు దలంచి యిట్లనియె.

222

తా ॥ అని ఈ విధంగా రాక్షసకుమారులు తనను అడిగితే పరమభక్తులకు ఆదర్శరూపుడైన ప్రహ్లాదుడు చిరునవ్వు నవ్వి – పూర్వం తనకు వినబడిన నారదుని మాటలు తలచుకొని, ఈ విధంగా అన్నాడు:

## రాక్షసబాలురకు ప్రహ్లాదుడు తెలిపిన జన్మవృత్తాంతం, భక్తితత్త్వం

శా. అక్షీణోగ్ర తపంబు మందరముపై నర్థించి మా తండ్రి శు
ద్ధ క్షాంతిం జని యుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్
భక్షింపంబడెఁ బూర్వ పాపములచేఁ బాపాత్మకుం డంచు మున్
రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై.

223

తా ॥ "బాలకులారా! మా తండ్రి ఎడతెగని ఘోరతపస్సు చేయదలచి నిర్మలమైన చిత్తముతో మందరగిరికి పోయి చాలా కాలమైనందువల్ల, చీమల సమూహం పాలబడిన పాములవలె, పూర్వజన్మ పాపాల వల్ల దుర్మార్గుడు నశించాడని దేవతలు భావించారు. మా తండ్రి నగరంలో లేని అవకాశం కనిపెట్టి ఉత్సాహంతో రాక్షస సమూహంపై యుద్ధం చేయదలచారు.

శా. ప్రస్థానోచిత భేరి భాంకృతులతోఁ బాకారియుం దారు శౌ
ర్య స్థైర్యంబుల నేగుదెంచినఁ దదీయాటోప విభ్రాంతులై
స్వస్థేమల్ దిగనాడి పుత్రధనయోషామిత్ర సంపత్కళా
ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై.

224

తా ॥ యుద్ధయాత్ర సంరంభానికి తగిన భేరీధ్వనులతో ఇంద్రుడు, తక్కిన దేవతలూ ధైర్యపరాక్రమాలతో దండెత్తి రాగా, వారి సంరంభానికి భయపడి ధైర్యం సడలిపోగా రాక్షసులు తమ తమ బిడ్డలను, ధనమును, భార్యలను, మిత్రులను, ఐశ్వర్యాన్ని, నిజతేజస్సును విడిచిపెట్టి, తమ ప్రాణాలు కాపాడుకోవడానికి అక్కడినుంచి పారిపోయారు.

మత్తకోకిలము.

ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం
గొల్లవెట్టి సమస్త విత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా
నిల్లు సొచ్చి విశంకుఁడై యమరేశ్వరుం డదలించి మా
తల్లిఁ దాఁ జెఱవట్టె సిగ్గునఁ దప్తయై విలపింపఁగాన్.

225

తా ॥ దుర్మార్గవర్తనంతో దేవతలు గర్వంకొద్దీ రాచనగరును దోచి, క్రూరచిత్తులై సమస్త సంపదను తీసుకొనిపోగా, ఇంద్రుడు జంకులేక అంతఃపురంలోనికి పోయి, భయపెట్టి, సిగ్గుతో తపించి విలవిల విలపిస్తున్న మా తల్లిని (లీలావతిని) చెఱపట్టాడు.

వ. ఇట్లు సురేంద్రుండు మా తల్లిం జెఱగొని పోవుచుండ న మ్ముగుద కురరి యను పులుఁగు క్రియ మొఱలిడినఁ దెరువున దైవయోగంబున నారదుండు పొడగని యిట్లనియె.

226

తా ॥ ఈ విధంగా దేవేంద్రుడు మా తల్లిని చెఱపట్టి తీసుకొని పోతుండగా ఆమె ఆడు లకుముకిపిట్ట లాగా ఆర్తధ్వని చేస్తుంటే త్రోవలో దైవవశాత్తు నారదుడు చూసి, ఇట్లా అన్నాడు:

ఉ. స్వర్భువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కిలిన్
నిర్భరపుణ్యమూర్తివి, సునీతివి, మానినిఁ బట్ట నేల? యీ
గర్భిణి నాతురన్ విడువు, కల్మషమానసురాలు గాదు, నీ
దుర్భరరోషమున్ నిలుపు దుర్జయుఁడైన నిలింప వైరిపై.

227

తా ॥ 'స్వర్గలోకాధిపతీ! దేవతలలో శ్రేష్ఠుడా! దేవతలలో మిక్కిలి పుణ్యాత్ముడవు. నీతిమంతుడవు. ఈ ఇల్లాలిని ఎందుకు చెఱపట్టావు? ఈమె గర్భవతి. భయంతో వణికిపోతున్నది. ఈమెను విడిచిపెట్టు. పాపచింతన లేనిది. గెలువ శక్యంకాని రాక్షసరాజుపై

అధికమైన నీ ప్రతాపాన్ని చూపించు.'

వ. అనిన వేల్పుఁదపసికి వేయిగన్నుల దేవర యిట్లనియె.

228

తా ॥ అనగానే దేవర్షితో వేయికన్నులు గల నేర్పరి ఈ విధంగా అన్నాడు:

ఉ. అంతనిధానమైన దివిజాహితువీర్యము దీని కుక్షి న
త్యంత సమృద్ధి నొందెడి మహాత్మక! కావునఁ దత్ప్రసూతి ప
ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రపుధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడనై తుదిన్ విడుతు, సిద్ధము దానవరాజవల్లభన్.

229

తా ॥ "ఓ మహాత్మా! ఈమె గర్భంలో వినాశకరమైన దేవతల శత్రువు రేతస్సు వృద్ధి పొందుతున్నది. కనుక ఈమె ఆ బిడ్డను ప్రసవించే వరకు చెఱలో ఉంచి, ఆ తరువాత, జన్మించిన బాలుణ్ణి వజ్రాయుధంతో సంహరించి, దిగులుబాసి, చివరికి రాక్షసరాజు భార్యను తప్పక వదలిపెడతాను."

వ. అని పలికిన వేల్పు ఱేనికిం దపసి యిట్లనియె.

230

తా ॥ అని పలికిన ఇంద్రునితో నారద మహర్షి ఇట్లన్నాడు:

శా. నిర్భీకుండు ప్రశస్త భాగవతుఁడున్ నిర్వైరి జన్మాంతరా
విర్భూతాచ్యుత పాదభక్తి మహిమా విష్ణుండు దైత్యాంగనా
గర్భస్థుండగు బాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవద్దోర్దర్ప విభ్రాంతుఁడై,

తా ॥ 'రాక్షసరాజు భార్య గర్భంలో ఉన్నవాడు బాలుడు – భయం లేనివాడు, భక్తశ్రేష్ఠుడు, జ్ఞానసంపన్నుడు. అతనికి శత్రువులు లేరు. బహుజన్మల ఫలంగా ఒనగూడిన విష్ణుభక్తి మహిమ గలవాడు. దురాలోచన కొద్దీ బాహుబల పరాక్రమాది ఉపాయాలతో ఎన్ని విధాలుగా నీవు ప్రయత్నించినా అతనికి మరణం లేదు.'

వ. అని దేవముని నిర్దేశించిన నతని వచనంబులు మన్నించి తానును హరిభక్తుండు గావున దేవేంద్రుండు భక్తిబాంధవంబును మా యవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె, మునీంద్రుడు మజ్జననియందుఁ బుత్రికాభావంబు సేసి యూఱడించి నిజాశ్రమంబునకుం గొనిపోయి నీవు పతివ్రతవు, నీ యుదరంబునఁ బరమభాగవతుండయిన ప్రాణి యున్నవాఁ డు, తపోమహత్త్వంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలం, డందాఁక నీ విక్కడ నుండు మనిన సమ్మతించి.

232

తా ॥ అని దేవర్షి చెప్పగా అతని మాటలు గౌరవించి, తాను కూడా హరిభక్తుడు కనుక భక్తి ప్రధానంగాగల బంధుత్వంతో ఇంద్రుడు మా అమ్మను విడిచి, ప్రదక్షిణ నమస్కారం చేసి, దేవలోకానికి పోయాడు. నారద మహర్షి కూడా మా తల్లిని పుత్రికాభావంతో అనునయించి, తన ఆశ్రమానికి తీసుకొనిపోయి, "నీవు పతివ్రతవు, నీ గర్భంలో గొప్ప భక్తుడైన జీవుడున్నాడు, తన తపస్సు ఫలించి లక్ష్యసిద్ధిని పొంది నీ భర్త రాగలడు, అంతవరకు నీవిక్కడ ఉండు" అనగా మా అమ్మ సరేనని ఒప్పుకుంది.

శా. యోషారత్నము నాథదేవత విశాలోద్యోగ మా తల్లి, ని
ర్వైషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోషయై
యోషద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు

శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్త శీలంబునన్.

233

తా ॥ భర్తను దేవుడుగా భావించే గొప్ప పూనిక గల స్త్రీరత్నము మా అమ్మ. సాధుస్వభావంతో భర్త రాకకై ఎదురుచూస్తూ దోషము లేనిదై, భయపడక, తన గర్భాన్ని రక్షించుకొనే ఆలోచనతో, భక్తి కలిగిన నడవడితో నారదమహర్షికి సేవలు చేస్తూ ఉన్నది.

వ. ఇట్లు దనకుఁ బరిచర్య సేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షా విశారదుండైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండనైన నన్ను నుద్దేశించి ధర్మ తత్త్వంబును నిర్మల జ్ఞానంబును నుపదేశించిన నమ్ముద్దియ దద్దయుం బెద్ద కాలంబునాఁటి వినికి గావున నాఁడుది యగుటం జేసి పరిపాటి దప్పి సూటిలేక మఱచె, నారదుండు నా యెడఁ గృపగల నిమిత్తంబున.

234

తా ॥ ఈ విధంగా తనకు సేవలు చేస్తున్న రాక్షసరాజ పత్నికి, ఆశ్రయించినవారిని రక్షించే సామర్థ్యం గల నారదుడు తన శక్తి మేరకు అభయమిచ్చి, గర్భంలో ఉన్న నన్ను ఉద్దేశించి ధర్మస్వరూపాన్ని, స్వచ్ఛమైన జ్ఞానాన్ని ఉపదేశించాడు. మా అమ్మ చాలాకాలం క్రితం విన్నందువలన, తిరిగి వాటిపై మనస్సును సూటిగా నిలుపలేక, అభ్యాసం లేనిదై ఆ సంగతి మరచిపోయింది. నారదమహర్షికి నా యందు గల కరుణ కారణంగా –

క. వెల్లిగొని నాఁటనుండియు, నుల్లసితంబైన దైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు, నుల్లంబున మఱపు పుట్ట దొకనాఁడైనన్.

235

తా ॥ ఆయన ఉపదేశించిన జ్ఞానం, ఆయన దయవల్ల, భగవంతుని దయవల్ల ఆ తత్త్వమంతా నా మనస్సులో స్థిరంగా నాటుకుంది. అందుచేత అప్పటినుంచి ఇప్పటివరకు

మఱచిపోవటం జరగలేదు.

ఆ. వినుఁడు నాదు పలుకు విశ్వసించితి రేని, సతుల కయిన బాలజనుల కయినఁ
దెలియవచ్చు మేలు దేహాద్యలంకార, దళననిపుణమైన తపసి మతము.

236

తా ॥ వినండి. నా మాటపై నమ్మకం కలిగితే, దేహాదులందలి మమకారాన్ని పోగొట్టి విష్ణుభక్తిని కలిగించే నారదుని భక్తితత్త్వం తెలుసుకోవడానికి స్త్రీలైనా, భక్తులైనా అర్హులే!

వ. అని నారదోక్త ప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె, నీశ్వరమూర్తియైన కాలంబునంజేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థాన వర్ధనాపక్షీణత్వ పరిపాకనాశంబులు ప్రాప్తంబులైన తెఱంగున దేహంబునకుంగాని షడ్భావ వికారంబు లాత్మకు లే, వాత్మ నిత్యుండు, క్షయ రహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, గ్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టి హేతువు, వ్యాపకుండు, నిస్సంగుండుఁ, బరిపూర్ణుండు, నొక్కండునని వివేక సమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకార మమకారంబులు విడిచి పసిండి గనులు గల నెలవున విభ్రాజమాన కనకలేశంబులైన పాషాణాదులందుఁ బుటంబు పెట్టి వహ్ని యోగంబునఁ గరంగ నూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయుభంగి నాత్మకృత కారణంబుల నెఱింగెడి నేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నయిన యుపాయంబునం జేసి బ్రహ్మభావంబుఁ బడయు, మూలప్రకృతియు, మహదహంకారంబులును, బంచతన్మాత్రంబులు, నివి యెనిమిదియుం బ్రకృతి గుణంబు లనియు, గర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థంబులును జ్ఞానేంద్రియుంబులైన శ్రవణనయన రసనా త్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిల తేజోవాయు గగనంబులును నివి పదాఱును వికారంబు లనియును గపిలాది పూర్వాచార్యులచేతఁ జెప్పంబడియె, సాక్షిత్వంబున నీ యిరువదేడింటిని

నాత్మగూడియుండుఁ బెక్కింటి కూటువ దేహ, మదియు జంగమస్థావరరూపంబుల రెండు విధంబులయ్యె, మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై, మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబు చందంబున నాత్మ యిన్నింటియందునుం జొచ్చి దీపించు, నాత్మకు జన్మస్థితి లయంబులు గలవంచు మిథ్యాతత్పరులుగాక వివేక శుద్ధమైన మనంబునం జేసి విచారించి దేహంబునం దాత్మ వెదకవలయు, నాత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని, యవస్థలు లేవు, జాగరణస్వప్న సుషుప్తులను వృత్తు లెవ్వనిచేత నెఱుంగంబడు, నతండాత్మయండ్రు. కుసుమధర్మంబులైనగంధంబులచేత గంధాశ్రయుండయిన వాయువు నెఱింగెడు భంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మజన్యంబు లయిన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగు నని చెప్పి.

237

తా ॥ అని నారదుడు బోధించిన విషయమంతా బాలకులతో ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు:

“భగవత్స్వరూపమైన కాలానుసారంగా చెట్టు పెరిగి, ఫలాలనిస్తుంది. ఆ ఫలానికి కాయటం, పెరగటం, కృశించటం, పండటం, ఎండిపోవటం, నశించటం అనే దశలున్నట్లు దేహానికి మాత్రమే ఈ ఆరు విధాలైన దశలు కలుగుతాయి కాని ఆత్మకు లేవు. ఆత్మ (పరమాత్ముడు కనుక) నిత్యుడు, నశించనివాడు, స్వచ్ఛమైనవాడు, భగవత్స్వరూపుడు (నేర్పరి), ఆకాశాది పంచభూతాలకు ఆశ్రయమిచ్చేవాడు, ఏ పనిని అంటనివాడు (నిష్క్రియుడు), స్వయంగా ప్రకాశించేవాడు, ఈ సృష్టికి కారణమైనవాడు, అంతటా వ్యాపించినవాడు, దేనితోనూ సంబంధం లేనివాడు, అంతటా నిండినవాడు, అద్వితీయుడు. ఈ విధంగా ఆత్మలక్షణాలు మొత్తం పన్నెండని విజ్ఞులు చెబుతారు.

బంగారపు గనులలో ప్రకాశించే బంగారు రేణువులు కలిగిన రాళ్ళను అగ్నిలో పుటం పెట్టి, కరగబెట్టి స్వర్ణకారులు వాటిలోనుంచి బంగారం తీస్తారు. అదే విధంగా ఆత్మతత్త్వం

తెలిసినవారు మోహకారణమైన అహంకార మమకారాలు విడిచిపెట్టి దేహాదులకంటే ఆత్మను భిన్నంగా భావించి తెలివిగా బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందుతారు. మాయ, బుద్ధి, అహంకారం, శబ్ద స్పర్శ రూప రస గంధాదులు ఐదు, కలిసి ఈ ఎనిమిదింటికి ప్రకృతులని పేరు. రజోగుణం, సత్త్వగుణం, తమోగుణం మూడూ ప్రకృతిగుణాలు. కర్మేంద్రియాలైన వాక్కు పాణి పాదము గుదము మర్మావయము; జ్ఞానేంద్రియాలైన చెవి కన్ను నాలుక చర్మము ముక్కు; మనస్సు; భూమి నీరు అగ్ని వాయువు ఆకాశం – ఇవన్నీ కలిపి పదహారు వికారాలని (మార్పులని) కపిలుడు మొదలైన పూర్వగురువుల చేత చెప్పబడింది. సాక్షీభూతంగా (తటస్థంగా) మాత్రమే ఈ ఇరవై ఏడింటితో ఆత్మ కలిసి ఉంటుంది. దేహం వీటన్నిటికీ స్థానం. అది కూడా కదిలేదీ, కదలనిది అని రెండు విధాలు. మాయ (అవిద్య) మొదలుగా గల సమూహానికి భిన్నంగా పొదవిన మణుల సమూహంలోని దారం వలె ఆత్మ ఇన్నిటి లోపల ఉండి ప్రకాశిస్తుంది. ఆత్మకు పుట్టుక ఉనికి నాశము ఉన్నాయనేది, అసత్యం. స్వచ్ఛమైన వివేకం గల మనస్సుతో ఆలోచించి, దేహంలో ఉన్న ఆత్మను వెదకాలి. ఆత్మకు (శరీరగతమైన) అవస్థలున్నట్లు కనిపిస్తుంది కాని ఆ పరిణామాలు వాస్తవంగా లేవు. జాగృతి, స్వప్నము, సుషుప్తి, నిద్ర అనేవి ఎవరిచేత తెలియబడతాయో అతడే ఆత్మస్వరూపుడు. పూలకు సహజధర్మమైన సువాసన వల్ల ఆ గంధానికి ఆశ్రయమైన వాయువును గుర్తించగలిగినట్లే సత్త్వరజస్తమో గుణాత్మకమై కర్మకారణంగా పుట్టే చిత్తవృత్తుల వలన ఆత్మను తెలుసుకోవచ్చు."

సీ. సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ, గణబద్ధ మజ్ఞానకారణంబు
కలవంటి, దింతియ కాని నిక్కము గాదు, సర్వార్థములు మనస్సంభవములు
స్వప్నజాగరములు సమములు, గుణశూన్యు, డగు పరమునికి గుణాశ్రయమున
భవవినాశంబులు పాటిల్లి నట్లుండుఁ, బట్టి చూచిన లేవు బాలులార!

తే. కడఁగి త్రిగుణాత్మకములైన కర్మములకు, జనకమై వచ్చు నజ్ఞాన సముదయమును
ఘనతర జ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి, కర్మవిరహితులై హరిఁ గనుట మేలు.

తా ॥ బాలులారా! ఈ సంసారం బుద్ధివల్లనే ఏర్పడుతుంది. సత్త్వరజస్తమోగుణాల వల్ల ఏర్పడే కర్మలన్నీ అజ్ఞానానికి కారణాలు. సంసారం కలవంటిదే కాని నిజం కాదు. సమస్త విషయాలు మనస్సులోనే జన్మిస్తాయి. స్వప్నం, మెలకువ రెండూ సమానమైనవే. గుణరహితుడైన ఆత్మకు గుణాల చేరికతో జననమరణాలు సంభవించినట్లుంటుంది. ఆలోచిస్తే, అటువంటివి లేవు. త్రిగుణాత్మకములైన కర్మలకు కారణమైన జన్మకారణంగా వచ్చే అజ్ఞానసమూహాన్ని ప్రయత్నపూర్వకంగా, ఘనతరమైన జ్ఞానాగ్ని చేత దహించి, కర్మబంధాలు లేనివారై, విష్ణువును చేరటం మంచిది.

వ. అది గావున గురుశుశ్రూషము సర్వలాభసమర్పణంబును, సాధుజన సంగమంబును, నీశ్వర ప్రతిమా సమారాధనంబును, హరికథాతత్పరత్వంబును, వాసుదేవునియందలి ప్రేమయు, నారాయణగుణకర్మ నామకీర్తనంబును, వైకుంఠ చరణకమలధ్యానంబును, విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును మొదలయిన విజ్ఞాన వైరాగ్య లాభసాధనంబులైన భాగవత ధర్మంబులపై రతిగలిగి సర్వభూతంబుల యందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలండని సమ్మానంబు సేయుచుఁ గామ క్రోధ లోభమోహ మద మాత్సర్యంబులన్ గెలిచి యింద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణు దేవుని యందలి గతి సిద్ధించు.

239

తా ॥ ఆ విధంగా చేయటం వల్ల – గురువులను సేవించటం, కర్మలు ఈశ్వరార్పణం కావించటం, ఉత్తముల తోడి సాంగత్యం, దేవుని విగ్రహాలను పూజించటం, విష్ణుని కథలందే నిష్ఠ ఉండటం, వాసుదేవుని పట్ల ప్రేమభావం, నారాయణుని గుణాలు, కర్మలు, నామముల యొక్క సంకీర్తన చేయటం, వైకుంఠవాసుని పాదపద్మములందే ధ్యానం, లోకాన్ని భరించేవానిని దర్శించటం, పూజించటం మొదలుగా జ్ఞాన వైరాగ్యములను సాధించేందుకు నిమిత్తాలైనవి భాగవత ధర్మాలు. వీటిపట్ల ఆసక్తి కలిగి, సర్వప్రాణులలో ఈశ్వరుడు భగవత్స్వరూపమైన

ఆత్మగా ఉన్నాడని సంభావిస్తూ, అరిషడ్వర్గాలను జయించి (బాహ్య, అంతర శత్రువులను అదుపులోకి తెచ్చుకొని), ఇంద్రియాలను కట్టడి చేసి, భక్తిభావంతో ఉన్నప్పుడు సర్వవ్యాపకుడైన విష్ణుదేవుని సాన్నిధ్యం కలుగుతుంది.

సీ. దనుజారి లీలావతారంబులందలి, శౌర్య కర్మంబులు సద్గుణములు
విని భక్తుఁడగు వాఁడు వేడ్కతోఁ బులకించి, కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ కమలాక్ష! వైకుంఠ!, వరద! నారాయణ! వాసుదేవ!
యనుచు నొత్తిలి పాడు నాడు నాక్రోశించు, నగు జింతనము సేయు నతి యొనర్చు

తే. మరులు కొనియుండుఁ దనలోన మాటలాడు, వేల్పుసోఁకిన పురుషుని వృత్తిఁ దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలి గాల్చి విష్ణుఁ, బ్రాపించుఁ దుది భక్తివివశుఁ డగుచు.

240

తా ॥ రాక్షసులకు శత్రువైన విష్ణువు లోకరక్షణార్థం అవతరించిన వివిధ సందర్భాలలోని పరాక్రమ విశేషాలు, సద్గుణాలు విని భక్తుడైనవాడు ఆనందంతో పులకించి పోతాడు. కన్నుల ఆనందబాష్పాలు రాలగా, గద్గద స్వరంతో పద్మనేత్రుడా! వైకుంఠవాసీ! వరాల నిచ్చేవాడా! నారాయణా! వసుదేవుని పుత్రుడా! అంటూ బిగ్గరగా పాడుతూ, ఆడుతూ, పెద్దగా పిలుస్తూ, ధ్యానం చేస్తూ మ్రొక్కుతూ, మోహపరవశుడై ఉంటాడు. తనలో తానే మాట్లాడుకుంటాడు. సంసారబంధాలను వదలి, అజ్ఞానాన్ని నాశనం చేసుకొని, చివరగా భక్తిపారవశ్యంతో విష్ణువును పొందుతాడు.

తనను ప్రేమించే పరిశుద్ధాత్ముల కోసం భగవంతుడు మానవ రూపంలో అవతరిస్తాడు.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. కావున రాగాదియుక్త మనస్కుండయిన శరీరి సంసారచక్ర నివర్తకం బయిన

హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణ సుఖంబెట్టి దట్టిదని బుధులు దెలియుదురు, హరి భజనంబు దుర్గమంబు గాదు, హరి సకల ప్రాణి హృదయంబుల యందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు, విషయార్జనంబుల నయ్యెడిది లేదు, నిమిషభంగుర ప్రాణులయిన మర్త్యులకు మమతాస్పదంబులును జంచలంబులును నైన పుత్రమిత్ర కళత్ర పశు భృత్య బల బంధు రాజ్య కోశ మణి మందిర మంత్రి మాతంగ మహీ ప్రముఖ విభవంబులు నిరర్థకంబులు. యాగప్రముఖ పుణ్యలబ్ధంబు లైన స్వర్గాదిలోక భోగంబులు, పుణ్యానుభవ క్షీణంబులుగాని నిత్యంబులు గావు, నరుండు విద్వాంసుండ నని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందుఁ, గర్మంబులు గోరక చేయవలయుఁ, గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ, బురుషుండు దేహంబు కొఱకు భోగంబుల నపేక్షించు, దేహంబు నిత్యంబు గాదు, తోడ రాదు, మృతంబయిన దేహంబును శునకాదులు భక్షించు, దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు, నజ్ఞానంబునంజేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు, నజ్ఞాన తంత్రంబులు ధర్మార్థ కామంబులు. జ్ఞానలభ్యంబు మోక్షంబు. మోక్షప్రదాత యగు హరి సకల భూతంబులకు నాత్మేశ్వరుండు, ప్రియుండు, దన చేతనయిన మహాభూతంబుల తోడ జీవసంజ్ఞితుం డయి యుండు, నిష్కాములై హృదయగతుం డయిన హరిని నిజభక్తిని భజింపవలయును.

241

తా ॥ కనుక రాగద్వేషాలతో కూడిన మనస్సు కలవానికి సంసార బంధనాలను పోగొట్టే విష్ణుధ్యానం ఒకటే ఉపాయం. బ్రహ్మానందానుభవ సుఖం ఎటువంటిదో విష్ణు ధ్యానం కూడా అటువంటిదని విజ్ఞులు తెలుసుకుంటారు. శ్రీహరిని సేవించటం కష్టమైనదేమీ కాదు. విష్ణువు సమస్త ప్రాణుల హృదయాలలో ఆకాశం వలె వ్యాపించి ఉంటాడు. ఇంద్రియసుఖాల వల్ల ఎటువంటి లాభం లేదు. రెప్పపాటు కాలంలో నశించే ప్రాణం గల మానవులకు (నాది అని) మమతను పెంచుకునే అస్థిరమైన సంతానం, స్నేహితులు, భార్య, పశువులు, సేవకులు, దగ్గరి

బంధువులు, రాజ్యాలు, ధనాగారాలు, మణిమందిరాలు, మంత్రులు, ఏనుగులు – ఇటువంటి భోగాలన్నీ ప్రయోజనం లేనివి. యజ్ఞయాగాదులు చేయటం వల్ల లభించిన పుణ్యంతో ప్రాప్తించే స్వర్గసుఖాలు పుణ్యం క్షీణించిపోగానే తొలగిపోతాయి కాని ఎప్పటికీ ఉండేవి కావు. మానవుడు సర్వం తెలిసినవాడననే అహంకారంతో కర్మలు చేసి, గొప్పవైనా అనుకూలం కాని ఫలాలను పొందుతాడు. ఫలాన్ని ఆశించక కర్మలు చేయాలి. ఆశించి చేస్తే దుఃఖం కలుగుతుంది. మానవుడు దేహం కొరకే సుఖాలను కోరుకుంటాడు. దేహం నిలిచేది కాదు. వెంట రాదు. ఏ దేహం కొరకు కర్మలను చేశాడో, మరణించిన తర్వాత ఆ దేహాన్ని కుక్కలు మొదలైనవి తింటాయి. దేహం కల మానవుడు కర్మలు చేసి, కర్మలకు కట్టుబడి, తిరిగి కర్మకు అనుకూలమైన దేహాన్నే పొందుతాడు. అజ్ఞానం వల్ల మానవుడు కర్మలు చేసే దేహాలనే పొందుతుంటాడు. ధర్మార్థకామాలనేవి అజ్ఞానకారణాలు. జ్ఞానం వలన లభించేది మోక్షం. మోక్షాన్నిచ్చే విష్ణువు సకల ప్రాణులకు ఆత్మస్వరూపుడు, ఇష్టుడును. తన వలన కల్పించబడిన పంచభూతాలతో జీవుడనే పేరుతో ఉంటాడు. కోరికలు లేనివారై, హృదయంలో ఉన్న శ్రీహరిని నిజభక్తితో సేవించాలి.

సంసారంలో అనురాగం హెచ్చేకొద్దీ జ్ఞానలాభాన్ని పొందే అవకాశం సన్నగిల్లుతూంటుంది. సంసారంపై అనురాగం తగ్గేకొద్దీ జ్ఞానలబ్ధిని పొందే అవకాశం అధికమవుతూ ఉంటుంది.

–శ్రీరామకృష్ణ పరమహంస

క. దానవదైత్య భుజంగమ, మానవగంధర్వ సురసమాజములో ల
క్ష్మీనాథు చరణకమల, ధ్యానంబున నెవ్వఁ డయిన ధన్యత నొందున్.



తా ॥ దానవులు, దితి పుత్రులు, నాగులు, మనుషులు, గంధర్వులు, దేవతల

సమూహాలలో ఎవరైనా లక్ష్మీనాథుడైన శ్రీహరి పాదపద్మాలందలి ధ్యానంతో కృతార్థులౌతారు.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ, జిక్కఁడు, దానముల శౌచశీలతపములం
జిక్కఁడు, యుక్తిని భక్తిని, జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ!

243

తా ॥ వ్రతాలు చేసినా, యజ్ఞాలు చేసినా (విష్ణువు) దొరకడు. దానాలు చేసినా, సదాచారాలు పాటించినా, తపస్సు చేసినా దొరకడు. (శాస్త్ర తర్క విషయాల) యుక్తికి కూడా లభించడు. భక్తి లక్షణం కలిగినవారికి మాత్రమే విష్ణువు లభిస్తాడు సుమా!

ఈ పనులన్నీ చేయకూడదని కాదు భావం. ఏ పని చేసినా నిష్కామంగా చేయాలని. భగవంతుడు భక్తజనులకే వశుడు.

క. చాలదు భూదేవత్వము, చాలదు దేవత్వ మధిక శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప వి, శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్.

244

తా ॥ గొప్ప పూనిక కలిగిన బాలులారా! విష్ణువును మెప్పించడానికి బ్రాహ్మణత్వం కాని, దేవతా స్వభావం కాని, అధిక శాంతస్వభావం కాని సరిపోదు. భక్తి ఒక్కటే ఆయనను మెప్పించేది.

ఆ. దనుజ భుజగ యక్ష దైత్యమృగాభీర, సుందరీ విహంగ శూద్ర శబరు
లైనఁ బాపజీవు లైన ముక్తికిఁ బోదు, రఖిల జగము విష్ణుఁ డనుచుఁ దలఁచి.

245

తా ॥ సర్వం విష్ణుమయమని భావిస్తే – రాక్షసులు, నాగులు, యక్షులు, దైత్యులు, మృగాలు, గోపాలకులు, స్త్రీలు, పక్షులు, శూద్రులు, కిరాతులైనా, పాపాత్ములైనా మోక్షాన్ని

పొందుతారు.

క. గురువులు దమకును లోఁబడు, తెరువులు సెప్పెదరు, విష్ణుదివ్యపదవికిం
దెరువులు సెప్పరు చీఁకటిఁ, బరువులు పెట్టంగనేల? బాలకులారా!

246

తా ॥ బాలకులారా! చదువు చెప్పే గురువులు తమకు తెలిసిన జాడలే (చదువులు కానీ, ఇతరవిషయాలు కానీ) చెబుతారు కాని విష్ణుసన్నిధి చేరడానికి మార్గం చెప్పరు. మనం వారివెంట అంధకారంలో పరుగెత్తటం ఎందుకు?

జ్ఞానమార్గంలో ప్రయాణించే భక్తుడు శ్రీహరి అనే కాంతిగమ్యాన్ని చేరుతాడు. లౌకిక శాస్త్ర విషయాలు, గురుబోధలు ఏవీ ఆ కాంతిని చూపించలేవు. వారు బోధించేవి కేవలం అపరావిద్యే. శ్రీహరిని చేరే కాంతిగమ్యాన్ని తెలియజెప్పేది పరావిద్య.

క. తెం డెల్ల పుస్తకంబులు, నిం డాచార్యులకు, మరల నేకతమునకున్
రండు! విశేషము సెప్పెదఁ, బొం డొల్లనివారు కర్మపుంజముపాలై.

247

తా ॥ మీ అన్ని పుస్తకాలను తీసుకువచ్చి ఆచార్యులకు తిరిగి ఇవ్వండి. మళ్ళీ ఈ ఏకాంత ప్రదేశానికి రండి. మంచి మార్గాన్ని చెబుతాను. ఇందుకు ఇష్టపడనివారు వెళ్ళండి. మీ కర్మలను మీరు అనుభవించండి.

క. ఆడుదము మనము, హరి రతిఁ, బాడుద మే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్,
వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్.

248

తా ॥ హరియందలి ప్రేమను మనస్సునిండా నింపుకొని ఆడుకొందాము.

మంగళప్రదమైన హరికీర్తనలను ఎప్పుడూ పాడుకుందాము. రాక్షసుల స్నేహాన్ని మానుకుందాము. విష్ణుభక్తులతోనే కలిసి ఉందాం.

క. విత్తము సంసృతిపటలము, వ్రత్తము కామాది వైరి వర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్.

249

తా ॥ సంసార బంధాల్ని విడివడ జేద్దాము. కామక్రోధాది శత్రుసమూహాన్ని చీల్చివేద్దాము. మనస్సును శ్రీహరికి అర్పించుదాము. మనకు శుభము కలిగేటట్లుగా మోక్షస్థానాన్ని చేరుకుందాము."

శరణాగతి తత్త్వం ప్రహ్లాదునిలో సర్వాంగసుందరంగా భాసించింది. కనుకనే ప్రాచీన భక్త పరంపరలో నారదుని కన్నా ముందుగా ప్రహ్లాదుని స్మరించటం ఉన్నది.

వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున న య్యావేళల రాక్షస కుమారులకు నపవర్గమార్గంబు నెఱింగించిన వారును గురుశిక్షితంబులైన చదువులు చాలించి నారాయణ భక్తి చిత్తంబులం గీలించి యుండుటం జూచి మరల యేకాంత భావంబుఁ దెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె.

250

తా ॥ అని ఈ విధంగా ప్రహ్లాదుడు రహస్యంగా సమయం దొరికినప్పుడు రాక్షసకుమారులకు మోక్షమార్గాన్ని తెలియపరచగా వారు కూడా గురువులు చెప్పిన చదువులు కట్టిపెట్టి, నారాయణుని యందు భక్తి మనసుల్లో స్థిరంగా ఉంచసాగారు. గురువులు వారి ఆంతర్యాన్ని తెలుసుకొని, భయపడి, హిరణ్యకశిపుని చెంతకు వచ్చి ఈ విధంగా అన్నారు:

## ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదం

శా. రక్షో బాలుర నెల్ల నీ కొడుకు చేరంజీరి లోలోన నా
శిక్షామార్గము లెల్లఁ గల్ల లని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు, మనకున్ మోసంబు వాటిల్లె, నీ
దక్షత్వంబునఁ జక్కఁ జేయవలయున్ దైతేయవంశాగ్రణీ!

251

తా ॥ "రాక్షసరాజ శ్రేష్ఠుడా! నీ పుత్రుడు రాక్షసబాలురందరినీ రహస్యంగా దగ్గరికి పిలిచి, నేను ఉపదేశించిన సిద్ధాంతాలన్నీ అబద్ధాలని నిందారోపణ చేసి, అందరినీ మోక్షమార్గానికి అనురక్తులుగా చేశాడు. మనకు ప్రమాదం సంభవించింది. ఇక నీ కుమారుడిని నీవే సమర్థతతో సరిచేయాలి.

క. ఉల్లసిత విష్ణుకథనము, లెల్లప్పుడు మాకుఁ జెప్పఁడీ గురుఁడని న
న్నుల్లంఘించి కుమారకు, లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే.

252

తా ॥ రాక్షస రాజా! విను. ఉజ్జ్వలమై భాసించే విష్ణుచరిత్రలను ఈ గురువు ఎప్పుడూ మాకు చెప్పడని, నన్ను తిరస్కరించి, బాలకులెవరూ నేను చెప్పే విద్యను అంగీకరించటం లేదు.

క. ఉడుగఁడు మధురిపు కథనము, విడివడి జడుపగిదిఁ దిరుగు, వికసనమున నే
నొడివిన నొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా!

253

తా ॥ ఓ ప్రభూ! నీ కుమారుడు విష్ణుకథలను వదలిపెట్టడు. వేరుగా ఉండి, మూఢుని వలె తిరుగుతునే ఉంటాడు. మనోవికాసం కోసం నేను చెప్పిన సూక్తులు చదవడు. ఇటువంటి దుష్టుని

చదివించటం మాకు శక్యం కాదు.

క. చొక్కపు రక్కసి కులమున, వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్
నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుఁగంటి? రాక్షసేశ్వర! వెట్టిన్

254

తా ॥ రాక్షస రాజా! అచ్చమైన రాక్షస కులంలో ఇటువంటి వెట్టివాడు (వికారి) పుట్టాడు. విష్ణువు పట్ల నిజమైన ప్రేమను విడిచిపెట్టడు. ఎటువంటి కొడుకును కన్నావయ్యా?"

వ. అని యిట్లు గురుసుతుండు చెప్పినఁ గొడుకు వలని విరోధ వ్యవహారంబులు కర్ణరంధ్రంబుల ఖడ్గ ప్రహారంబులయి బిట్టు మిట్టిపడి పదాహతంబైన భుజంగంబు భంగిఁ, బవన ప్రేరితంబైన దవానలంబు చందంబున, దండతాడితం బయిన కంఠీరవంబు కైవడి, భీషణరోషరసావేశజాజ్వల్యమాన చిత్తుండును, బుత్రసంహారోద్యో గాయత్తుండును. గంపమాన
గాత్రుండును, నరుణీకృత నేత్రుండును నై కొడుకును రప్పించి సమ్మాన కృత్యంబులఁ దప్పించి నిర్దయుండై యశనిసంకాశ భాషణంబుల నదల్చుచు.

255

తా ॥ అని ఈ విధంగా గురువైన శుక్రుని కొడుకు చెప్పగా తన పుత్రుని వ్యతిరేకవిధానాలు చెవులకు కత్తివేటు వలె తగిలేసరికి హిరణ్యకశిపుడు ఒక్కసారిగా అదరిపడ్డాడు. తోక తొక్కిన పాము వలె, గాలికి రగిలిన అగ్ని వలె, కఱ్ఱతో కొట్టబడిన సింహం వలె, భయంకరమైన కోపం చేత దహించబడిన మనస్సుతో, పుత్రుని సంహరించడానికి సిద్ధమయ్యాడు. కంపించే శరీరంతో ఎఱ్ఱబడిన కన్నులతో కొడుకును పిలిపించాడు. గారాబు చేష్టలు మాని, దయలేనివాడై, పిడుగులవంటి మాటలతో ప్రహ్లాదుణ్ణి బెదరించసాగాడు.

శా. సూనున్ శాంత గుణప్రధాను నతిసంశుద్ధాంచిత జ్ఞాను న

జ్ఞానారణ్య కృశాను నంజలిపుటీ సంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్.

256

తా ॥ శాంతగుణమే ప్రధానంగా గలవాడు, గొప్ప జ్ఞానసంపద గలవాడు, అజ్ఞానమనే అరణ్యానికి అగ్ని వంటివాడు, నమస్కరించడానికి పట్టిన దోసిలిచే ప్రకాశించేవాడు, నిరంతరం నారాయణ పాదపద్మ స్మరణమనే అమృతాన్ని ఆస్వాదించేవాడు – అయిన ప్రహ్లాదుడితో దేవతల శత్రువైన రాక్షసరాజు తిరస్కారంతో ఈ విధంగా అన్నాడు:

సీ. అస్మదీయంబగు నాదేశమునఁ గాని, మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు
నన్ని కాలములందు ననుకూలుఁడై కాని, విద్వేషియై గాలి వీవ వెఱచు
మత్ప్రతాపానల మందీకృతార్చి యై, విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు
నతితీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి, శమనుండు ప్రాణులఁ జంప వెఱచు

తే. నింద్రుఁ డౌదల నా మ్రోల నెత్త వెఱచు, నమర కిన్నర గంధర్వ యక్ష విహగ
నాగ విద్యాధరావలి నాకు వెఱచు, నేల వెఱవవు? పలువ నీ కేది దిక్కు?

257

తా ॥ "దుష్టుడా! నేను ఆదేశిస్తే తప్ప సూర్యుడు ఆకాశంలో ప్రకాశించడానికి భయపడుతాడు. అన్ని కాలాలలో అనుకూలంగానే తప్ప ప్రతికూలంగా ప్రసరించడానికి వాయువు భయపడుతాడు. నా ప్రతాపాగ్ని ముందు తగ్గిన వేడిమితో వెలుగుతాడు, కానీ తన ఇష్టమైన రీతిలో రగిలి పోవడానికి అగ్ని భయపడుతాడు. తీవ్రమైన నా ఆజ్ఞను దాటి ప్రాణులను సంహరించడానికి యముడు భయపడుతాడు. ఇంద్రుడు నా ముందు తల ఎత్తటానికే భయపడుతాడు. దేవతలు, కిన్నరులు, గంధర్వులు, యక్షులు, పక్షులు, నాగులు, విద్యాధరుల సమూహం నాకు భయపడుతారు. నీ వెందుకు భయపడవు? నీకెవరు అండగా ఉన్నారు?

శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషు లయ్యున్ మదీ
యాజ్ఞాభంగము సేయనోడుదురు, రోషాపాంగదృష్టిన్ వివే
క జ్ఞానచ్యుతమై జగత్త్రితయముం గంపించు, నీ విట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి? సాహంకారతన్ దుర్మతీ!

258

తా ॥ దుష్టబుద్ధి గలవాడా! ఎంతో శక్తిసామర్థ్యం కలిగిన లోకపాలకులు నాయందు అధికద్వేషం గలవారైనా నా ఆజ్ఞను ధిక్కరించడానికి వెనుకాడుతారు. క్రోధం కలిగిన నా కడగంటి చూపు ప్రసరిస్తే ఆలోచనాజ్ఞానం నశించి, ముల్లోకాలూ వణికిపోతాయి. అటువంటప్పుడు నీవు అహంకారివై నా ఆజ్ఞను ఏ విధంగా ధిక్కరించ గలుగుతున్నావు?

శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై
కుంఠుం జెప్పెదు దుర్జయుం డనుచు, వైకుంఠుండు వీరవ్రతో
త్కంఠాబంధురుఁడేని నే నమరులన్ ఖండింప దండింపఁగాఁ
గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్?

259

తా ॥ బాలకుడవు! జయింప శక్యం కాని వాడని గొంతెత్తి బిగ్గరగా స్థిరంగా వైకుంఠుని గురించి చెప్పుతున్నావు. నిజంగా ఆ విష్ణువు పరాక్రమం ప్రదర్శించే ఉత్సాహం కలవాడైతే దేవతలను నేను సంహరిస్తూ, శిక్షిస్తూ ఉన్నప్పుడు ఎక్కడో దాగి ఉండక, నేను భీకరయుద్ధం చేసే ప్రదేశానికి రావాలి కదా!

శా. ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ
వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్య వం
శాచారంబులు నీఱు సేసితివి, మూఢాత్మ్మం గులద్రోహి నిన్

నీచుం జంపుట మేలు, చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్.

260

తా ॥ ఆచార్యులు చెప్పింది నీవు వినలేదు. పైగా నీ తోటి బాలురకు మోక్షమందు ఆసక్తి కలిగించి, నీ మాటకారితనం చూపి, పగవాడైన విష్ణువును పొగడి, నా రాక్షసవంశాచారాన్ని బూడిదపాలు చేసావు. మూర్ఖుడవు, వంశానికి చెడ్డపేరు తెచ్చినవాడివి, నీచునివి అయిన నిన్ను చంపడమే శ్రేయస్కరం, క్షేమం. చంపి, వంశానికి కళంకం లేకుండా చేస్తాను.

క. దిక్కులు గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక, ది క్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్.

261

తా ॥ అన్ని దిక్కులను జయించినాను. ఓరీ! నీకు ఇంకా దిక్కెవరు? దేవేంద్రుడు మొదలైన దిక్పాలకులే వేరే దిక్కులేక ఇతడే దిక్కని నన్ను సేవిస్తున్నారు.

క. బలవంతుఁడ నే జగముల, బలములతోఁ జనక వీరభావమున మహా
బలుల జయించితి, నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై.

262

తా ॥ అన్ని లోకాలలో నేనే బలవంతుడను. ఏ బలగాన్నీ తీసుకొనిపోక నేనొక్కడినే పరాక్రమంతో గొప్పబలం కలవారి నందరినీ జయించినాను. నీవు నాకు శత్రువై, ఎవరి బలం చూసుకొని ఈ ఆటలాడుతున్నావు?"

వ. అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె.

263

తా ॥ అని మాట్లాడిన తండ్రితో మెల్ల మెల్లగా, వినయంతో కొడుకు ఈ విధంగా

అన్నాడు:

క. బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును, బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!

264

తా ॥ "రాక్షసరాజా! బలము కలవారికి, బలం లేనివారికి ఎవడు బలమో; నీకు, నాకు, బ్రహ్మాది దేవతలకు ఎవరు బలమో? అన్ని ప్రాణులకు ఎవడు ఆధారమో (బలమో)? అటువంటి ప్రభువు నాకు దిక్కు (బలము).

హిరణ్యకశిపుడు ఆగ్రహంతో పలికినవన్నీ విన్న ప్రహ్లాదుడు నెమ్మదిగా సమాధానం చెబుతున్నాడు. దేవతలందరిపై తన అధికారాన్ని వివరించి, ప్రకృతి సైతం తన అధీనంలో ఉన్న విషయం ఎంతగా చెప్పినా ప్రహ్లాదుడు అన్నిటికీ విష్ణువే మూలమని అన్నాడు.

క. దిక్కులు కాలముతో నే, దిక్కున లేకుండుఁ, గలుగు దిక్కుల మొదలై
దిక్కు గల లేని వారికి, ది క్కయ్యెడు వాఁడు నాకు దిక్కు మహాత్మా!

265

తా ॥ మహాత్మా! దిక్కులకూ, కాలానికీ అతీతుడైన వాడెవడో, అన్ని దిక్కులకు, మూలమై ఉన్నవాడు, దిక్కు ఉన్నవారికి, ఏ దిక్కులేనివారికి దిక్కైనవాడు నాకు దిక్కు (రక్షకుడు).

సీ. కాలరూపంబులఁ గ్రమ విశేషంబుల, నలఘు గుణాశ్రయుం డయిన విభుఁడు
సత్త్వబలేంద్రియ సహజ ప్రభావాత్ముఁ, డై వినోదంబున నఖిల జగముఁ
గల్పించు, రక్షించు, ఖండించు, నవ్యయుం, డన్ని రూపములందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము, మార్గంబుఁ, దప్పి వర్తించు చిత్తంబుకంటె

తే. వైరు లెవ్వరు, చిత్తంబు వైరిగాక, చిత్తమును నీకు వశముగాఁ జేయవయ్య!

మదయుతాసురభావంబు మానవయ్య!, యయ్య నీ మ్రోల మేలాడరయ్య! జనులు.

266

తా ॥ తండ్రీ! కాలానుగుణంగా, విశేషవర్తనంతో సర్వసద్గుణాలు గల దేవుడు – సత్త్వ, బల, ఇంద్రియ నైజమైన ప్రభావంతో తన వేడుక కొరకు సమస్త జగత్తును సృష్టించి, రక్షించి, లయింపజేస్తాడు. నాశము లేనివాడు, అన్ని రూపాలలోను ఉన్నాడు. నీ మనస్సును స్థిరమార్గంలో ఉండేటట్లు చేయి. వశము తప్పి ప్రవర్తించే మనస్సు కంటే వేరే శత్రువులెవరున్నారు? నీ మనస్సే నీకు శత్రువు. అట్లా కానివ్వక, నీ మనస్సును నీవు స్వాధీనపరచుకోవయ్యా! మదించిన రాక్షసభావాన్ని విడిచిపెట్టు. నీ ముందు నీ ప్రజలంతా నీకు ప్రియమైనదే చెబుతున్నారు. కానీ హితమైనది చెప్పడం లేదు.

ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ, వింద్రియా
నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు! నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు, నేర్పునఁ జూడుము దానవేశ్వరా!

267

తా ॥ రాక్షసరాజా! లోకాలన్నీ గడియ మాత్రంలో జయించావు. ఇంద్రియాలను, మనస్సును గెలువలేకున్నావు. నిన్ను బంధించే నీ భయంకర శత్రువులైన అరిషడ్వర్గాన్ని (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యం) ఓడిస్తే – ఈ జీవసమూహంలో నీకు ఒక్క విరోధి కూడా లేదు. సరిగా గమనించి చూడు.

క. పాలింపుము శేముషి, ను, న్మూలింపుము కర్మబంధముల, సమదృష్టిం
జాలింపుము సంసారముఁ, గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్.

268

తా ॥ నీ బుద్ధిలోని మాలిన్యాన్ని దూరం చెయ్యి. కర్మబంధాలన్నీ తెంపివేయి. సంసారబంధాన్ని తొలగించుకో. మనస్సులో విష్ణుభక్తిని పాదుకొలుపు."

దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు భగవంతుడు అవతరిస్తాడు. భగవద్విరోధు లైనవారిలో హిరణ్యకశిపుని వంటివారున్నారు. కాని విరోధి సంతానంలో ప్రహ్లాదుని వంటి వారు లేరు. భవబంధాల గురించి తండ్రికి హితవు చెప్పి, సన్మార్గవర్తనుని చేయాలని, భగవంతునికి సన్నిహితునిగా మార్చాలని పుత్రుని తాపత్రయం.

వ. అనినఁ బరమభాగవత శేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె.

269

తా ॥ అని చెప్పిన పరమ భక్తశ్రేష్ఠునితో నిశాచరవరిష్ఠుడైన హిరణ్యకశిపుడు ఈ విధంగా అన్నాడు:

క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి పలువ! కఠినోక్తుల నన్
గుంపించెదు, చావునకుం, దెంపరివై వదరువాని తెఱఁగునఁ గుమతీ!

270

తా ॥ "చెడుబుద్ధి గలవాడా! చంపితే చనిపోతాననుకొని, ఏ మాత్రం బెదురులేక, గడుసు మాటలతో నన్ను లెక్కచేయక అతిక్రమిస్తున్నావు. చావుకు తెగించినవాడివై నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావు.

శా. నాతోడం బ్రతిభాష లాడెదు, జగన్నాథుండు నా కంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సంపూర్ణ ప్రభావుండు, మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు, మఱి వాఁడెం దుండురా? దుర్మతీ!

271

తా ॥ ఓరీ దుష్టబుద్ధీ! నాతో ఎదురు వాదాలు చేస్తున్నావు. నేనే ఈ భూత జగత్తుకు అధిపతిని. నన్ను మించి ఈ ప్రాణికోటికి వేరొక ప్రభువు, అధికమహిమ కలవాడు లేడు. నా సోదరుని చంపిన నారాయణునికై – ఇంతకు ముందే ఎన్నోమార్లు వెతికాను. ఈ ప్రపంచంలోనే లేడు. మరి, వాడు ఎక్కడున్నాడురా?

క. ఎక్కడఁ గలఁ? డే క్రియ నే, చక్కటి వర్తించు? నెట్టి జాడను వచ్చున్?
జక్కడుతు నిన్ను విష్ణునిఁ, బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్.

272

తా ॥ ఎక్కడున్నాడు? ఏ విధంగా ఉంటాడు? ఏ ప్రదేశంలో ఉంటాడు? ఏ మార్గంలో వస్తాడు? నిన్ను, నీ విష్ణువును రూపుమాపుతాను. వాడి సేవకునివలె అధికంగా పొగడుతున్నావు.”

పుత్రుని సమాధానాలు విన్నకొద్దీ హిరణ్యకశిపునిలో క్రోధం రెచ్చి, ఎట్లాగైనా శత్రువు జాడ కనిపెట్టాలనే ఉద్వేగంతో ప్రశ్నిస్తున్నాడు.

వ. అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకుర సంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు నిట్లనియె.

273

తా ॥ అనగానే విష్ణువుకు దాసుడైన ప్రహ్లాదుడు జంకులేక, సంతోషంతో పులకించిన దేహంతో, క్రోధపడక, మనస్సున శ్రీహరిని తలచి, నమస్కరించి, బాల్యచేష్టలతో నాట్యం చేస్తూ ఈ విధంగా పలికాడు:

మ. కలఁడంబోధిఁ, గలండు గాలిఁ, గలఁడాకాశంబునం, గుంభినిం
గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గల, డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల యీ యా యెడన్.

274

తా ॥ "తండ్రీ! భగవంతుడైన శ్రీహరి లేనిచోటు ఈ విశ్వంలో లేదు. సముద్రంలో ఉన్నాడు. వాయువునందున్నాడు. ఆకాశమునందున్నాడు. భూమియందు ఉన్నాడు. అగ్నియందున్నాడు. దిక్కులలో, రాత్రింబగళ్ళలో, సూర్యచంద్రాత్మలలో ఉన్నాడు. ఓంకారంలో, త్రిమూర్తులలో, స్త్రీపుంనపుంసక వ్యక్తులలో ఉన్నాడు. ఈశ్వరుడంతటా వ్యాపించి ఉన్నాడు. అక్కడ, ఇక్కడ అని వెదకడం ఎందుకు?

క. ఇందుఁ గలఁ డందు లేఁడని, సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన, నందందే కలఁడు, దానవాగ్రణి! వింటే.

275

తా ॥ రాక్షసరాజా! చక్రధారియైన విష్ణువు ఇక్కడున్నాడు, అక్కడ లేడనే అనుమానం వద్దు. అన్నిటిలోను ఉన్నవాడు ఎక్కడెక్కడ వెతికి చూస్తే అక్కడక్కడే ఉంటాడు. విన్నావా!"

జ్ఞానప్రాప్తి అయ్యాక మానవుడికి భగవంతుడు దూరాన ఎక్కడో కైలాసంలోనో, వైకుంఠంలోనో ఉన్నట్లుగా గోచరించదు. అప్పుడు భగవంతుడు 'అతడు' అనిగాక, 'ఇతడు, ఇది – అంతరాత్మ' గా అనిపిస్తుంది. భగవంతుడు సర్వాంతర్యామి; తనను అన్వేషించేవారికి భగవంతుడు గోచరిస్తాడు.

–శ్రీరామకృష్ణ పరమహంస

వ. అని యి వ్విధంబున.

276

తా ॥ అని ఈ విధంగా –

మ. 'హరి సర్వాకృతులం గలం' డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁడై 'యెందును లేఁడు లేఁ' డని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండ ప్రభావంబునన్.

277

తా ॥ శ్రీహరి అన్ని రూపాలలో ఉన్నాడని ప్రహ్లాదుడు అంటుండగా, తొందరపాటుకొద్దీ ఎక్కడా లేడు లేడని రాక్షసరాజు గద్దించాడు. అప్పుడు సకల స్థావర జంగమ సమూహాల అంతర్యామియై, అన్ని ప్రదేశాలలోనూ, గొప్ప మహిమతో అన్ని వస్తువులలో అణువు అణువునా అచ్యుతుడు శ్రీమన్నారాయణుడు శ్రీనరసింహ రూపంలో నిండి ఉన్నాడు.

వ. అయ్యవసరంబున న ద్దానవేంద్రుండు.

278

తా ॥ ఆ సమయంలో ఆ రాక్షసరాజు,

క. డింభక! సర్వస్థలముల, నంభోరుహ నేత్రుఁ డుండు ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁ జూపఁ గలవె? చక్రిన్ గిక్రిన్.

279

తా ॥ "బాలకా! అన్ని ప్రదేశాలలో పద్మపత్రనేత్రుడు ఉంటాడని ఎంతో ఆడంబరంగా పలికావు. ఈ స్తంభంలో ఆ చక్రినీ, గిక్రినీ చూపగలవా?

క. స్తంభమునఁ జూపవేనియుఁ, గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి, స్రంభంబున నడ్డపడఁగ శక్తుం డగునే.

280

తా ॥ ఈ స్తంభంలో చూపలేకపోతే నీ శిరస్సును ఖండించి నేలపై పడవేస్తాను. ఆ సమయంలో నిన్ను రక్షించడానికి ఆ విష్ణువు వస్తాడా? వచ్చేటంత సామర్థ్యం కలవాడా హరి?"

హిరణ్యకశిపుడు ఉక్రోషంతోనూ, శ్రీహరిని చూడాలనే తపనతోనూ స్తంభంలో చూపగలవా అని, చక్రి గిక్రి అని సంబోధించాడు. ఒకవేళ చూపకపోతే కొడుకు తల ఖండించే సమయంలోనైనా వస్తాడేమో! అనే నమ్మకం కొంత. లేకుంటే, ప్రహ్లాదుడంత రూఢిగా ఉన్నాడని ఎట్లా అంటాడు? ప్రహ్లాదుడు అన్నందుకైనా శ్రీహరికి స్తంభంలో అవతరించక తప్పలేదు.

భక్తుడైన ప్రహ్లాదునికి 'కలడు' అని నిశ్చయమే ఉంది. ఇది నమ్మకంకంటే గొప్పది. ఇది అనుభవం. ఈ నిశ్చయమూ, అనుభవము... ఇదే ప్రహ్లాదుని స్థితి. ఇదే జ్ఞానభక్తి.

వ. అనిన భక్తవత్సలుని భటుం డి ట్లనియె.

281

తా ॥ అనగానే, భక్తవత్సలుడైన శ్రీహరిని నమ్మిన దాసుడు ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు:

శా. 'అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే?
స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు, ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్'.

282

తా ॥ "బ్రహ్మ మొదలుగా గడ్డి పరక వరకు సమస్త ప్రపంచంలోనూ వ్యాపించి ఉన్నాడు. అలాంటప్పుడు పెద్ద స్తంభంలో మాత్రం ఉండడా? స్తంభంలోపల ఉన్నాడనటానికి ఏ అనుమానం లేదు. ఇప్పుడు శ్రీహరి ప్రత్యక్షంగా తన నిజరూపంతో కనిపిస్తాడు."

హిరణ్యకశిపుని దృష్టిలో విష్ణువు 'సర్వవ్యాపక చైతన్యం' కాదు. అతడు కూడా ఒక భిన్న వస్తువు. కంటికి కనబడే ప్రకృతి పదార్థం. అంతేకాని 'ప్రకృతి పదార్థంలో వ్యాపించిన పరమ చైతన్యమే విష్ణువు' అనే ఏకజ్ఞానం లేదు. అందుకే జ్ఞానాన్ని బోధిస్తున్న ప్రహ్లాదుని మాటలు అర్థం కావటంలేదు.

వ. అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గనుఱికి యొఱఁ బెట్టిన ఖడ్గంబు పెఱికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవత శిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరించుచు.

283

తా ॥ అనగానే విని, పెడబొబ్బలు పెట్టి, దిగ్గున లేచి, సింహాసనం దిగి, ఒరలో ఉన్న కత్తితీసి చేతపట్టుకొని, పరమభక్తశ్రేష్ఠుడైన ప్రహ్లాదుని భయపెడుతూ, ధిక్కరిస్తున్నాడు.

మ. వినరా! డింభక! మూఢచిత్త! గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద, వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై
దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహోదగ్ర ప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్.

284

తా ॥ "డింభకా! మూర్ఖుడా! బాలకా! వినరా తెలివితక్కువతనంతో హరి విశ్వాత్మకుడని గొప్పగా పలుకుతున్నావు. అయితే ఇందులో ఉన్నాడా?" అంటూ గర్వాతిశయంతో రాక్షసరాజు తన అరచేతిలో గొప్ప కాంతితో ప్రకాశిస్తూ జీవకోటి చూడ శక్యం కాకుండా, శ్రీహరి సంరంభంతో ఆవిర్భవించే ఆ స్తంభాన్ని గట్టిగా పగులగొట్టాడు.

## శ్రీహరి నరసింహరూపములో స్తంభమునందు ఆవిర్భవించుట

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయ గాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, దామసగుణచంక్రమ్యమాణ స్థైర్యుండును నై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁజూపు మని కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతి దంత భేదన పాటవ ప్రశస్తంబగు హస్తంబున సభామండప స్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను మిడుంగుఱులు చెదఱం జిటిలి పెటిలిపడి బంభజ్యమానం బగు నమ్మహా స్తంభంబు వలనఁ బ్రళయ వేళా సంభూత సప్తస్కంధ బంధుర సమీరణ సంఘటిత ఘోరజోఘుష్యమాణ మహావలాహక వర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాత సంఘ నిర్ఘోషనికాశంబులైన ఛటచ్ఛట స్ఫటస్ఫట ధ్వని ప్రముఖ భయంకరారావ పుంజంబులు జంజన్య మానంబు లయి యెగసి యాకాశ కుహరాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టు సాలక దోదూయమాన హృదయంబులయి పరవశంబులయి పితామహా మహేంద్ర వరుణ వాయు శిఖీ ప్రముఖ చరాచర జంతుజాలంబుల తోడ బ్రహ్మాండ కటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాసురచక్ర చాప హల కులిశాంకుశ జలచర రేఖాంకిత చారుచరణతలుండును, జరణచంక్రమణఘనవినమిత విశ్వ విశ్వంభరాభార ధౌరేయ దిక్కుంభి కుంభీనస కుంభినీధర కూర్మ కులశేఖరుండును, దుగ్ధజలధిజాత శుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండమహోరు స్తంభ యుగళుండును, ఘణ ఘణాయమాన మణి కింకిణీగణ ముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబర శోభిత కటి ప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్తవర్తుల కమలాకర గంభీరనాభి వివరుండును, ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధమధ్యుండును, గులాచలసాను భాగ సదృశ కర్కశ విశాల వక్షుండును, దుర్జన దనుజభట ధైర్య లతికా లవిత్రాయమాణ రక్షోరాజ వక్షోభాగ విశంకట క్షేత్ర విలేఖన

చుంచులాంగలాయమాన ప్రతాప జ్వలన జ్వాలాయమాన శరణాగత నయన చకోర చంద్రరేఖాయమాణ వజ్రాయుధ ప్రతిమాన భాసమాన నిశాతనఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగ సన్నిభ వీర సాగర వేలాయమాన మాలికా విరాజమాన నిరర్గళానేకశత భుజార్గళుండును, మంజు మంజీర మణిపుంజ రంజిత మంజుల హార కేయూర కంకణ కిరీట మకర కుండలాది భూషణ భూషితుండును, త్రివళీయుత శిఖరిశిఖరాభ పరిణద్ధ బంధుర కంధరుండును, ప్రకంపన కంపిత పారిజాత పాదపల్లవ ప్రతీకాశ కోపావేశ సంచలితాధరుండును, శరత్కాల మేఘజాలమధ్య ధగద్ధగాయమాన తటిల్లతా సమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుండును, గల్పాంతకాల సకల భువన గ్రసన విలసన విజృంభమాణ సప్తజిహ్వ జిహ్వాతులిత తరలతరాయమాణ విభ్రాజమాన జిహ్వుండును, మేరు మందర మహాగుహాంతరాళ విస్తార విపులవక్త్ర నాసికా వివరుండును, నాసికావివర నిస్సరన్నిబిడ నిశ్వాస నికర సంఘట్టన సంక్షోభిత సంతప్యమాన సప్త సాగరుండును, బూర్వపర్వత విద్యోతమాన ఖద్యోతమండల సదృక్ష సమంచిత లోచనుండును, లోచనాంచల సముత్కీర్యమాణ విలోల కీలాభీల విస్ఫులింగ వితాన రోరుధ్యమాన తారకాగ్రహ మండలుండును, శక్రచాప సురుచిరోదగ్ర మహా భ్రూలతాబంధ బంధుర భయంకర వదనుండును, ఘనతర గండశైలతుల్య కమనీయ గండభాగుండును, సంధ్యారాగ రక్త ధారాధర మాలికా ప్రతిమ మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుండును, సటాజాలసంచాలన సంజాతవాత డోలాయమాన వైమానిక విమానుండు, నిష్కంపిత శంఖవర్ణ మహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమాన మందర వసుంధరాధర పరిభ్రమణ వేగ సముత్పద్యమాన వియన్మండల మండిత సుధారాశి కల్లోల శీకరాకార భాసుర కేసరుండును, బర్వాఖర్వ శిశిరకిరణ మయూఖగౌర తనూరుహుండును, నిజ గర్జానినాద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ సార్వభౌమ ప్రముఖ దిగిభరాజ కర్ణ కోటరుండును, ధవళ ధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుండును, దేహ ప్రభాపటల నిర్మథ్యమాన పరిపంథి యాతుధాన నికురుంబ గర్వాంధ కారుండును, బ్రహ్లాద

హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీర రస సంయుతుండును, మహాప్రభావుండును నయిన శ్రీ నృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని.

285

తా ॥ ఈ విధంగా రాక్షస శ్రేష్ఠుడు – పంతముతోడి వైరము కలవాడు, వైరభావంతో ఉజ్జ్వలంగా ప్రకాశించే రోషాగ్ని కలవాడు, రోషానలంతో జ్ఞానవినయాలు నశించినవాడు, వినయ గాంభీర్య ధైర్యాలతో ప్రకాశించే హృదయం కలవాడు, హృదయ చాంచల్యం వలన తమోగుణం కలవాడు, తామసగుణం వల్ల కమ్ముకొన్న స్థైర్యంకలవాడై ఆవేశంతో హుంకరించి, బాలుని తిరస్కరించి, హరిని ఇందులో చూపించుమని – ప్రకాశించే బంగారు మణిమయ కంకణాల ధ్వనులతో, దిగ్గజాల దంతాలను ఛేదించే నేర్పు కలిగిన గొప్ప చేతితో సభాప్రాంగణం లోని స్తంభాన్ని కొట్టిన దెబ్బతో దిక్కుల నిప్పు రవ్వలు చెదరి చిట్లి పెటిలిపడింది. పగిలిన ఆ మహాస్తంభం వల్ల ప్రళయసమయాన వ్యాపించే సప్తవాయువుల కలయికతో భయంకరంగా గర్జించే గొప్ప మేఘసమూహం నుండి బయలుదేరి దట్టమై, కఠినమై భరించరాని పిడుగుల సమూహపు మోతతో సమానమైన ఛటఛట ధ్వనులు మొదలైన భయంకర ధ్వనుల ప్రతిధ్వనులు ఎడతెగక పుడుతూ, ఎగసి ఆకాశమంతా నిండి, పట్టుచాలక బెదరిపోయిన గుండె కలవై, తమ స్వాధీనంలో లేనివై – బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు, వాయువు, అగ్ని మొదలుగా జంగమస్థావరాలైన జంతుసమూహంతో కూడి, బ్రహ్మాండమనే కొప్పెర పగిలి ముక్కలయ్యేట్లు విరబూసిన తామరల ప్రకాశంతో నరసింహుడు ఆవిర్భవించాడు. చక్రము, ధనుస్సు, నాగలి, వజ్రము, చేప మొదలైన రేఖలు గల అరికాళ్ళు కలవాడు; పాదం మోపడం వల్ల బాగా కుంగిన సమస్త భూమండలాన్ని మోసే దిగ్గజాలు, ఆదిశేషుడు, కులపర్వతాలు, ఆదికూర్మము కలవాడు; పాలసముద్రంలో పుట్టిన ఐరావతం తొండం వలె మెరిసే మధ్యభాగాలు గల భీకరమైన పెద్ద స్తంభాలవంటి తొడలు గలవాడు; గణగణ మోగే మణుల మువ్వలున్న గజ్జెల చేత ధ్వనించే మొలతాడుతో చుట్టబడిన పట్టు ధోవతిచే ప్రకాశించే నడుము గలవాడు; ఆకాశగంగానదిలోని

సుడివలె గుండ్రనై, లోతైన సరస్సు వంటి నాభి రంధ్రం గలవాడు; పిడికెడు సన్నని నడుమువాడు; కులపర్వతసానువులతో సమానమైన విశాల వక్షఃస్థలం కలవాడై ప్రకాశిస్తున్నాడు. ఆ నరసింహుని వంకరలు తిరిగిన గోళ్ళు, దుష్ట రాక్షసుల ధైర్యమనే తీగలను తెగకోసే కొడవళ్ళవలె ఉన్నాయి. రాక్షసరాజుల బండ బారిన విశాల వక్షఃస్థలమనే భూమిని దున్నే పదునైన నాగళ్ళు ఆ గోళ్ళు. శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమరములు మొదలుగా వివిధ ఆయుధాలతో ఒప్పే గొప్ప ఎత్తైన పర్వతశిఖరం కొమ్ముల వంటి – సముద్రపు చెలియలి కట్ట వంటి, బారులు తీరిన పూలమాలలు గల పలునూర్ల గడియమానుల వంటి బాహువులు గలవాడు; మనోహరమైన అందెలు, మణులతో అలంకరించబడిన హారాలు, భుజకీర్తులు, కిరీట మకరకుండలాలు మొదలైన సొమ్ములతో అలంకరింపబడినవాడు; మూడు రేఖలతో కూడిన పర్వత శిఖరంవలె చక్కని మెడ గలవాడు; గాలికి కదలే పారిజాతపు చిగురుటాకు వంటి కింది పెదవి కోపావేశంతో చలించేవాడు; శరదృతువులో మేఘాల నడుమ మెరిసే మెఱపు తీగెల వలె ప్రకాశించే కోరలుగలవాడు; ప్రళయకాలంలో లోకాలను మింగడానికి చెలరేగే కాలాగ్నిశిఖలతో పోల్చదగి ప్రకాశించే ఎఱ్ఱని నాలుక గలవాడు; మేరు–మందర పర్వతాల గుహల నడిమి భాగం వలె విశాలమైన నోరు, ముక్కురంధ్రాలు కలవాడు; ముక్కునుండి వెలువడే దట్టమైన ఊర్పుల తాకిడికి సంక్షోభం చెంది, కాగుతున్న ఏడు సముద్రాలు గలవాడు; తూర్పుకొండపై వెలిగే సూర్యమండలం వలె ఉన్న అందమైన కన్నులు గలవాడు; కనుగొనల నుండి రాలుతూ చలించే మంటల భయంకరమైన మిణుగురుల గుంపులతో అడ్డగింపబడిన నక్షత్రాలు, గ్రహాలు కలవాడు; ఇంద్రధనుస్సు వలె అందమైన, ఉగ్రమైన పెద్ద కనుబొమల ముడితో దృఢమై భయంగొలిపే ముఖముగలవాడు; పెద్ద పర్వతశిలల వంటి సుందరమైన చెక్కిళ్ళు గలవాడు; సంధ్యాసమయంలోని వర్ణంతో ఎఱ్ఱనై మేఘమాలికల వలె విరిసే జటలు గలవాడు; జటలను విసురుగా కదలించటం వల్ల పుట్టిన గాలుల చేత ఉయ్యాలలూగే దేవతావిమానాలు గలవాడు; కదలని పెద్ద శంఖాలవంటి చెవులు గలవాడు; మందరపర్వతం కవ్వమై తిరిగినప్పటి వేగంచేత ఆకాశమంతా నిండి ప్రకాశించే పాలసముద్రపు తరగల తుంపరల వంటి అందమైన కేసరాలు గలవాడు, పున్నమ చంద్రుని కిరణాలవలె తెల్లనైన జూలుగలవాడు, తన గర్జన ధ్వనుల చేత

చీల్చబడిన కుముద – సుప్రతీక – వామన – ఐరావణ – సార్వభౌమాది దిగ్గజాల కర్ణ రంధ్రాలు గలవాడు; తెల్లనైన కైలాసగిరి వలె పొడవై, చూడశక్యం కాని దేహంగలవాడు; శరీరకాంతులచే శత్రువులైన రాక్షసుల గర్వమనే చీకటిని అణచేవాడు; ప్రహ్లాదుని సుఖింపజేయడానికి – హిరణ్యకశిపుని చంపడానికి కారణాలయిన, లోపలా వెలుపలా ఉన్న, పొగడబడే కరుణ – వీర రసాలు కలవాడు, గొప్ప మహిమ గలవాడు; అయిన శ్రీనరసింహదేవుడు ఆవిర్భవించాడు. అద్భుతమైన ఈ దృశ్యాన్ని గాంచిన హిరణ్యకశిపుడు ఆశ్చర్యవిహ్వాలుడై ఇలా అనుకోసాగాడు:

భక్తుల నిమిత్తం భగవంతుడు వివిధరూపాలను దాలుస్తాడు. (రంగుల) అద్దకంలో చిత్రమైన పద్ధతిని అవలంబించేవా డొకడుండే వాడు. అద్దకం కోసం తన వద్దకు వచ్చేవారితో అతగాడు "మీ వస్త్రాలకు ఏ రంగు అద్దాలి?" అని అడిగేవాడు. ఎరుపురంగు కావాలంటే, తన తొట్టెలో ఆతడు వస్త్రాన్ని ముంచి, "ఇదుగో, మీ వస్త్రానికి ఎరుపురంగు వేశాను" అని బయటికితీసి చూపేవాడు. మరొకడు పచ్చరంగు వెయ్య మంటే, అతడు అదే తొట్టెలో వస్త్రాన్ని ముంచి పైకి తీసేసరికి అది పచ్చగా ఉండేది. అదే విధంగా నీలి, నారింజ, ఊదా, ఆకుపచ్చ మొదలైన ఏ రంగు వేయవలసినా ఆతడు అదే తొట్టెను అదే ప్రకారం వినియోగించేవాడు. ఇదంతా గమనిస్తూన్న ఒకడు రంజకుడి వద్దకు వచ్చి ఇలా అన్నాడు: "మిత్రుడా! నీకు ఏ రంగులోను ప్రీతిలేదు. నీ అభిరుచిని తెలుసుకొని నా వస్త్రానికి నీ ఇష్టం వచ్చిన రంగును వేయించుకోవడమే నా కోరిక." భక్తుడి అభీష్టం మేరకు సాకారుడుగా గాని, నిరాకారుడుగా గాని భగవంతుడు అతడికి సాక్షాత్కరిస్తాడు. దివ్యదర్శనాలు సాపేక్షాలు, అంటె వివిధ పరిస్థితుల్లో ఉన్న వివిధ వ్యక్తుల మనోభావాన్ని అనుసరించి అవి యథార్థాలై ఒప్పుతాయి. తన రంగు ఏదో ఆ దివ్యరంజకుడి కొక్కడికే తెలుసు. ఆతడి దివ్యరూపాల కెవరూ పరిమితిని కల్పించలేరు – 'భగవంతుడు ఈ రూపంలో ప్రత్యక్షమౌతాడు, ఆ రూపంలో కాబోడు' అని ఎవరూ నిర్ణయించలేరు.

—శ్రీరామకృష్ణ పరమహంస

క. నరమూర్తి గాదు, కేవల, హరిమూర్తి యుఁ గాదు మానవాకారముఁ గే
సరి యాకారము నున్నది, హరిమాయారచితమగు యథార్థము చూడన్.

286

తా ॥ "మానవరూపం కాదు, కేవలం సింహాకృతీ కాదు. మానవ, సింహరూపముగా ఉన్నది. చూడగా విష్ణుమాయ చేత నిర్మితమైన నిజరూపమిది!

ఉ. తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహ శరీరముఁ దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియంచుఁ దలంతు నైన నా
సొంపును బెంపు నందఱును జూఁడఁ జరింతు, హరింతు శత్రువున్.

287

తా ॥ సాహసంతో బాలుడు పలికిన సత్యమైన వాక్కుల బలాన్ని, తన సర్వవ్యాపకత్వాన్ని స్థిరపరచదలచి ఈ స్తంభంలో నరసింహరూపం ధరించి, ధీరుడై విష్ణువు (నన్ను) శిక్షించడానికి వచ్చాడు. విష్ణువు చేత మరణం తప్పదనుకుంటాను. అయినా అందరు చూసేటట్లు నా బలశౌర్యాలు ప్రదర్శించి, విరోధిని సంహరిస్తాను."

నరసింహుని ఆకృతిని చూసిన తరువాత హిరణ్యకశిపునికి తన మరణం తప్పదనిపించింది. అయినా, మాయాప్రభావం కమ్ముకున్నది. చివరి క్షణం వరకు సడలని వైరం మరింత బలపడి, తన రాజస వైభవాన్ని చూపించాలనుకున్నాడు. తన పరాక్రమం సొగసును మరణానికి ముందే అందరి ఎదుట ప్రదర్శించాలనే కోరిక బలపడింది.

## నృసింహమూర్తి హిరణ్యకశిపుణ్ణి వధించుట

వ. అని మెత్తంబడని చిత్తంబున గద నెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠిత కంఠీరవంబు దగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచర కుంజరుండు నరసింహదేవున కెదురు నడచి తదీయదివ్యతేజోజాల సన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గత ప్రభుండయి యుండె, నప్పుడు.

288

తా ॥ అని, సడలిపోని మనోనిశ్చయంతో గద ఎత్తి, తొందరపాటుతో అరుస్తూ, వెనుకంజ వేయని సింహాన్ని సమీపించే మదగజం వలె రాక్షసశ్రేష్ఠుడు నరసింహదేవునికి ఎదురు నడిచాడు. ఆ మూర్తి యొక్క అమానుష దివ్యకాంతి సమూహాల ముందు హిరణ్యకశిపుడు మిణుగురు పురుగు వలె కర్తవ్య శూన్యుడై, తేజస్సు ఉడిగిపోయి ఉన్నాడు. అప్పుడు,

మ. ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో
ధకమై యున్న తమిస్రమున్ జగము నుత్పాదించుచోఁ ద్రావి సా
త్త్విక తేజోనిధియైన విష్ణునెడ నుద్దీపించునే? నష్టమై
వికలంబై చెడుఁగాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా!

289

తా ॥ ధర్మరాజా! ప్రళయాంతంలో పూర్వం బ్రహ్మాండమంతా కమ్ముకున్న అంధకారాన్ని, లోకాలను సృష్టించే సమయంలో ఆపోశన పట్టిన సత్త్వగుణ తేజస్సు గల విష్ణువు ముందు తమోగుణం ప్రధానమైనవారి పరాక్రమం వికలమై నశిస్తుంది తప్ప ప్రకాశిస్తుందా?

వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి

నరమృగేంద్రుని వ్రేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టికొనిన మిట్టిపడి దట్టించి బిట్టు కట్టలుక న య్యసుర వరుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టు దప్పించుకొని విడివడి దిటవు దప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగ కులరాజచరణ నిర్గళిత భుజంగంబు తెఱంగునం దలంగ నుఱికి తన భుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని తలంచి కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడ నీరద నికరంబుల మాటున నిలింపులు గుంపులు గొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయ జీవన శంకా కళంకితులై మంతనంబులఁ జింతనంబులు సేయుచు నిరీక్షింప నక్షీణ సమర దక్షతా విశేషం బుపలక్షించి ఖడ్గ వర్మంబులు ధరియించి భూనభో భాగంబుల వివిధ విచిత్ర లంఘనా లాఘవంబులం బరిభ్రమణ భేదంబులఁ గరాళవదనుండయి యంతరాళంబునఁ దిరుగు సాళువడేగ చందంబున సంచరించిన సహింపక. 290

తా ॥ ఆ హిరణ్యకశిపుడు భయంకరమైన గదను గిరగిరా తిప్పి నరసింహునిపై విసిరాడు. అంతట ఆ స్వామి పామును నేర్పుతో బంధించే గరుడుని వలె దితి పుత్రుని పట్టుకున్నాడు. దానవేంద్రుడు ఎగిరిపడి, అదలించి, ఎంతో కోపంతో ఆ రాక్షసరాజు బలప్రయోగంతో అటు ఇటు ఎగిరి, పట్టు తప్పించుకొని, అప్పటికి ముప్పు వదలించుకొని, ధైర్యం సడలక, దూకి, పైకెగిరి, గరుత్మంతుని కాలినుండి జారిన పాము విధాన తొలగి, పరుగెత్తి, తన భుజబలం చేత నరసింహుడు ఓడినాడని భావించి, బెదరక రెచ్చిపోయి తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఆకాశంలో దట్టమైన మబ్బుల చాటున దేవతలు గుంపులుగా దాగి రాక్షసుణ్ణి చూస్తూ 'వీడి బాధను తప్పించుకోలేమా' అని ఆలోచనలు చేస్తూ నిరీక్షించసాగారు. అతిశయించిన యుద్ధనైపుణ్యంతో, ఖడ్గ కవచాలు ధరించి, భూమ్యాకాశాలలో వివిధంగా విచిత్ర గతులతో, నేర్పుతో పరిపరి విధాల చుట్టు తిరుగుతూ, భయంకరమైన ముఖం కలిగి ఆకాశంలో తిరిగే డేగలాగా ఎగిరిపడుతున్న రాక్షసరాజు అహంకారాన్ని సహించక ఆగ్రహించాడు.

సీ. పంచాననోద్ధూత పావక జ్వాలలు, భూనభోఽంతరమెల్లఁ బూరితముగ

దంష్ట్రాంకురాభీల ధగధగాయిత దీప్తి, నసురేంద్రు నేత్రము లంధములుగఁ
గంటక సన్నిభోత్కట కేసరాహతి, నభ్రసంఘము భిన్నమై చలింపఁ
బ్రళయాభ్రచంచలా ప్రతిమభాస్వరములై, కరనఖరోచులు గ్రమ్ముదేర

తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి, దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి, పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప!

291

తా ॥ ధర్మరాజా! ఆ ఉగ్ర నరహింహుడి ముఖం నుండి ఎగసిన అగ్నిశిఖలు భూమ్యాకాశాలు నిండగా, ఆయన కోరల ధగధగలతోడి భయంకరకాంతుల చేత హిరణ్యకశిపుని కన్నుల చీకట్లు కమ్మాయి. ముండ్లవంటి వాడియైన ఆయన రోమాలు తాకటం వల్ల మబ్బులు చెల్లా చెదరై పోయాయి. ప్రళయకాల మేఘములలోని మెఱపుల వలె సాటిలేక ప్రకాశించే తీక్షములైన గోళ్ళ కాంతులు వ్యాపించగా, జూలు ఝళిపించి, గర్జించి, చెలరేగి, చూపు పరచి, కనుబొమలు ముడిచి, కోపంతో నాలుక ఆడించి, పైకురికి, చేతితో ఆ హిరణ్యకశిపుని ఒడిసిపట్టుకొన్నాడు.

క. సరకుగొనక లీలాగతి, నురగేంద్రుఁడు మూషకంబు నొడిసిన పగిదిన్
నరకేసరి దను నొడిసిన, సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా!

292

తా ॥ లెక్కచేయక పాము ఒడుపుగా ఎలుకను పట్టిన విధంగా నరసింహుడు తనను పట్టుకోగా, దేవతల శత్రువు హిరణ్యకశిపుడు ప్రాణభీతితో సుళ్ళు తిరిగిపోయాడు.

క. సురరాజవైరి లోఁబడెఁ, బరిభావిత సాధుభక్త పటలాంహునకున్
నరసింహునకు నుదంచ, త్ఖరతరజిహ్వునకు నుగ్రతరరంహునకున్.

293

తా ॥ సజ్జన భక్తుల పాపసమూహాన్ని పోగొట్టేవాడు, మెరసే కరకు నాలుక గలవాడు, భయంకర వేగం గలవాడైన నరసింహునికి హిరణ్యకశిపుడు లొంగిపోయినాడు.

వ. అంత.

294

తా ॥ అప్పుడు –

మ. విహగేంద్రుం డహి వ్రచ్చుకైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహు దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్ర హుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయ శ్రీకరున్.

295

తా ॥ గరుత్మంతుడు పామును చీల్చునట్లు నరసింహస్వామి ఆగ్రహంతో, వజ్రాయుధంవంటి శరీరం గలవాడు, తిరుగులేని అనన్య ఉత్సాహవంతుడు, గొప్ప భుజాలు గలవాడు, ఇంద్రాగ్నియములకు సైతం భయం కలిగించేవాడు, మహా బాహుబలం కలవాడు, రాక్షసవంశానికి వన్నె తెచ్చినవాడు అయిన హిరణ్యకశిపుని పట్టుకొని తన తొడలపై చేర్చి, గోళ్ళతో చీల్చివేశాడు.

శా. చించున్ హృత్కమలంబు, శోణితము వర్షించున్ ధరామండలిం,
ద్రెంచుం గర్కశనాడికావళులు, భేదించున్ మహావక్షముం,
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా, దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై.

296

తా ॥ నిస్తులంగా ప్రకాశించే తన గోళ్ళతో నరసింహుడు, హిరణ్యకశిపుని హృదయాన్ని చీల్చి భూమిపై రక్తం వర్షింపజేశాడు. కఠినమైన నరాలను తెంచివేశాడు. విశాల వక్షఃస్థలాన్ని బద్దలు చేశాడు. మాంసము ముక్కలు ముక్కలుగా నరికి పోగులుపెట్టాడు. పాపాత్ముడైన రాక్షసుని చీల్చి గర్వంతో అతని ప్రేగులను మెడలో హారాలుగా ధరించాడు.

నరసింహుని రౌద్ర బీభత్స రూపం, హిరణ్యకశిపుని నానావిధాల హింసించటం భౌతికంగా కనిపించే సంఘటన. వైరభక్తునికి దర్శనం, స్పర్శనం, భాషణం, చివరకు సాయుజ్యం లభించటం ఇక్కడి ప్రత్యేకత. శిక్ష వరమై రూపొందిన ఘట్టం ఇది.

సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో, ఘన కుఠారంబులకరణి నొప్పు
గంభీర హృదయపంకజము భేదించుచోఁ, గుద్దాలముల భంగిఁ గొమరుమిగులు
ధమనీ వితానంబు దవిలి ఖండించుచోఁ, బటు లవిత్రంబుల పగిది మెఱయుఁ
జఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ, గ్రకచ సంఘంబుల గరిమఁజూపు

తే. నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున, శస్త్రచయముల నొంపక సంహరించి
యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర, సమర ముఖరంబులై యుండె జనవరేణ్య!

297

తా ॥ ఆ నృసింహస్వామి గోళ్ళు హిరణ్యకశిపుని వక్షఃస్థలాన్ని బద్దలు చేసేటప్పుడు పెద్ద గండ్రగొడ్డళ్ళవలె ఒప్పారాయి. దేవవిరోధి హృదయకమలాన్ని పెకలించేటప్పుడు తవ్వుగోల వలె, నరాలను పూనికతో కోసేటప్పుడు బలమైన కొడవళ్ళుగాను, అసురేశ్వరుని ప్రేగులును తెంచేటప్పుడు రంపములు గాను ఆ స్వామి గోళ్ళు దీపించాయి.

క. స్ఫురిత విబుధజనముఖములు, పరివిదళిత దనుజ నివహపతి తనుముఖముల్
గురు రుచి జిత శిఖిశిఖములు, నరహరిఖరనఖము లమరు నతజన సఖముల్.

298

తా ॥ ఆ నరసింహుని నఖాలు సాధుజనులకు హితమును చేకూర్చేవి. అవి రాక్షసరాజు శరీరమును చీల్చివేసి దేవతల ముఖాలను వికసింపజేశాయి. అగ్ని జ్వాలలను సైతం జయించగల గొప్ప కాంతి గలవై దివ్యతేజస్సుతో శోభించాయి.

వ. ఇట్లు కేవల పురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున, రేయునుం బవలునుం గాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున, గగనంబునుం భూమియునుం గాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితంబులును గాని నఖంబులం ద్రైలోక్యజన హృదయ భల్లుండయిన దైత్యమల్లుని వధియించి మహాదహన కీలాభీల దర్శనుండును, గరాళవదనుండును లేలిహానభీషణ జిహ్వుండును శోణిత పంకాంకిత కేసరుండునునై ప్రేవులు కంఠమాలికలుగా ధరించి కుంభి కుంభ విదళనంబుసేసి చనుదెంచు పంచాననంబునుంబోలె దనుజకుంజర హృదయకమల విదళనంబు సేసి తదీయ రక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగ రక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్తరంబున రణంబునకు నురవడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదిక నిర్వక్ర సాధనంబుల నొక్కనిఁ జిక్కకుండం జక్కడిచె, ని వ్విధంబున.



తా ॥ ఈ విధంగా కేవల మానవాకారం కాని, కేవల మృగరూపం కాని నారసింహరూపంతో, రాత్రీ కాని పగలూ కాని సంధ్యాసమయంలో, ఇంటిలోపల ఇంటి బయట కాని కొలువు కూటపు వాకిటిలో, ఆకాశము భూమి కాని తొడలపైన, ప్రాణాలున్నవి లేనివి కాని గోళ్ళతో, ముల్లోకాల జనుల హృదయాలకు బల్లెము వంటివాడైన రాక్షసవీరుని సంహరించాడు.

పెద్ద అగ్నికీలల వలె భయంకరమైన చూపులు గలవాడు, భీతిగొల్పే ముఖములతో, భయానకమైన నాలుకతో నాకుతూ నెత్తురు బురద అంటిన జూలుతో, ప్రేగులు మెడలో

హారాలుగా ధరించి, ఏనుగు కుంభస్థలాన్ని చీల్చివచ్చే సింహం వలె, రాక్షసరాజనే ఏనుగు హృదయకమలాన్ని చీల్చి, ఆ నెత్తురుతో తడిసిన గోళ్ళు సంధ్యాకాలపు ఎఱ్ఱదనంతో రాగరంజితమైన చంద్రకళల అందాన్ని పొంది ప్రకాశిస్తున్నాయి. సహించలేని రాక్షసులు అనేక వేలమంది నరసింహుని కన్నుల ముందు ఆయుధాలు ధరించి సంరంభంతో యుద్ధానికి సిద్ధం కాగా, చక్రము మొదలైన గొప్ప ఆయుధాలతో ఒక్కడు కూడా మిగులకుండా నరసింహుడు వారందరిని సంహరించాడు.

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై
యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దన్
వీక్షింపం బలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్.

300

తా ॥ ఈ విధంగా రాక్షస వీరులందరినీ సంహరించి, యుద్ధపు సంరంభాన్ని ఆపినా చూపులలో ఆగ్రహం పొగలు క్రక్కుతుండగా; క్రోధావేశం ప్రజ్వరిల్లగా, భయంకరమైన ముఖంతో ఆ ఉగ్రనరసింహుడు అగుపించాడు. దేవతలకు కూడా చూడటానికి, మాట్లాడటానికి భయపడి దిగ్భ్రాంతిని కలిగించగా చాటున నిలువగా, సభాస్థానంలోని సింహాసనంపై ఆసీనుడైన నారసింహుడు ఉగ్రరూపుడై ప్రకాశించాడు.

క. సురచారణ విద్యాధర, గరుడోరగ యక్షసిద్ధగణములలో నొ
క్కరుఁడైన డాయ వెఱచును, నరహరి న య్యవసరమున నరలోకేశా!

301

తా ॥ ధర్మరాజా! ఆ సమయంలో – దేవతలు గాని, చారణులు గాని, విద్యాధరులు గాని, గరుడులు గాని, నాగులు గాని, యక్షులు గాని, సిద్ధులు గాని, భయకంపితులై, ఆ

గణాలవారిలో కనీసం ఒక్కరైనా నరసింహరూపుని సమీపించడానికి జంకసాగారు.

క. తర్షంబుల నరసింహుని, హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో
త్కర్షంబులఁ గుసుమంబుల, వర్షంబులు గురిసి రత్సువంబుల నధిపా!

302

తా ॥ రాజా! దేవ వనితలు మక్కువతో, ఆనందంతో నరసింహుని ప్రసన్నుని చేసుకోవడానికై చూసి, గొప్పగా కొనియాడుతూ, సంతోషంతో పూలవానలు కురిపించారు.

వ. మఱియు న య్యవసరంబున మింట ననేక దేవతా విమానంబులును, గంధర్వగానంబులును, నప్సరోగణనర్తన సంవిధానంబులును, దివ్యకాహళ భేరీపటహ మురజాది ధ్వానంబులును, బ్రకాశమానంబు లయ్యె, సునందకుముదాదు లయిన హరి పార్శ్వచరులును మహేశ్వరవిరించి మహేంద్ర పురస్సరులగు త్రిదశకిన్నర కింపురుష పన్నగ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును బ్రజాపతులును నరకంఠీరవ దర్శనోత్కంఠు లయి చనుదెంచి.

303

తా ॥ ఇంకా ఆ సమయంలో ఆకాశంలో అనేక దేవతా విమానాలు, గంధర్వుల పాటలు, అప్సరసల నాట్యవిన్యాసాలు, దివ్యములైన కాహళలు, భేరులు, తప్పెటలు, మద్దెలలు మొదలైన ధ్వనులు మారుమ్రోగాయి. సునందుడు, కుముదుడు మొదలైన విష్ణు పరిచారకులు; శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు, అశ్వముఖులు, అశ్వదేహులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు, గరుడులు, గంధర్వులు చారణులు, విద్యాధరులు, ప్రజాపతులు నరసింహమూర్తిని చూడాలని వేడుక గలిగి, వచ్చారు.

## బ్రహ్మాది దేవతలు నరసింహమూర్తిని స్తుతించుట

క. కరకమల యుగళ కీలిత, శిరులై దగ్గఱక భక్తిఁ జేసిరి బహు సం
సరణాబ్ధి తరికి నఖరికి, నరభోజనహస్తి హరికి నరకేసరికిన్.

304

తా ॥ (ఆ దేవతలు) తామరలవంటి చేతులతో శిరస్సున అంజలి ఘటించి – విస్తారమైన సంసార సముద్రాన్ని దాటించే నావ వంటి వానికి, నరభక్షకుడైన హిరణ్యకశిపుడనే ఏనుగుకు సింహం వంటివాడైన నరసింహస్వామిని సమీపించలేక దూరము నుండే భక్తితో నమస్కరించారు.

వ. ఆ సమయంబున దేవత లందఱు వేఱు వేఱ వినుతించి, రందుఁ గమలాసనుం డిట్లనియె.

305

తా ॥ ఆ సమయంలో దేవతలందరు ఒక్కరొక్కరు వివిధ రీతులుగా స్తుతించారు. వారిలో బ్రహ్మదేవుడు ఈ విధంగా అన్నాడు:

మ. ఘనలీలా గుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్ర వీ
ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్య ప్రసాదార్థినై.

306

తా ॥ "గొప్పవైన, వేడుక కొరకైన, సత్త్వాది గుణాల చాతుర్యంతో లోకాలను సృష్టించి, రక్షించి, నాశనం చేసే గొప్ప సామర్థ్యం కలవానికి, పరిమితి లేని దివ్యతేజం కలవానికి,

ఆశ్చర్యం గొలిపే పరాక్రమం కలవానికి, ఎప్పుడూ పవిత్ర కర్మలను ఆచరించేవానికి, నాశము లేని ఆత్మస్వరూపునికి, దయానుగ్రహం కోరి నమస్కారం చేస్తున్నాను."

వ. రుద్రుం డిట్లనియె.

307

తా ॥ రుద్రుడు ఈ విధంగా స్తుతించాడు:

చ. అమరవరేణ్య! మీఁదట సహస్ర యుగాంతము నాఁడు గాని కో
పమునకు వేళ కాదు, సురబాధకుఁడైన తమస్వినీచరున్
సమరమునన్ వధించితివి చాలుఁ దదాత్మజుఁడైన వీఁడు స
ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్త వత్సలా!

308

తా ॥ "దేవశ్రేష్ఠుడా! రానున్న కాలాన వేలయుగాలు గడచిన తరువాత కాని, నీవు కోపించే సమయం రాదు. దేవతలను బాధించిన రాక్షసుణ్ణి యుద్ధంలో సంహరించావు, చాలు. ఆతని కొడుకు ప్రహ్లాదుడు, నిర్మలమైనవాడు, నీకు భక్తుడు, పవిత్రుడు. కనుక, భక్తులందు దయగలవాడా! ఈ పిన్నవానిని రక్షించు."

వ. ఇంద్రుం డిట్లనియె.

309

తా ॥ ఇంద్రుడు ఈ విధంగా అన్నాడు.

సీ. ప్రాణి సంఘముల హృత్పద్మ మధ్యంబుల, నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు
దింతకాలము దానవేశ్వరుచే బాధ, పడి చిక్కియున్న యాపన్న జనుల
రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁ జంపి, క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల

మంటిమి నీ సేవ మరగిన వారలు, కైవల్య విభవంబు కాంక్షసేయ

ఆ. రితర సుఖము లెల్ల నిచ్ఛయింపఁగ నేల, యస్థిరంబు లివి యనంత భక్తిఁ

గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక, చిత్తభయద రంహ! శ్రీనృసింహ!

310

తా ॥ "క్రూరులైన రాక్షససమూహాల మనస్సులకు భయం కలిగించే నరసింహ స్వామీ! ప్రాణుల హృదయపద్మాలలో ప్రకాశించేవాడికి తెలియనిదేమున్నది? హిరణ్యకశిపుని చంపటం వలన ఇంతకాలం రాక్షసరాజు వల్ల బాధలు పడి బందీలై అపాయానికి లోనైన జనులను, మమ్మల్నీ రక్షించావు. మాకు మళ్ళీ యజ్ఞహవిర్భాగాలు లభించాయి. నీ దయవల్ల బ్రతికాము. నిన్ను సేవించడానికి అలవాటు పడినవారు మోక్షవైభవాన్ని కాంక్షించరు. అటువంటిది ఇతరములైన సుఖాలన్నీ కోరటం దేనికి? ఇవన్నీ అశాశ్వతమైనవి. ఎడతెగని భక్తితో నిన్ను సేవించనివ్వు."

వ. ఋషు లిట్లనిరి.

311

తా ॥ ఋషులు ఈ విధంగా అన్నారు:

మ. భవదీయోదరలీన లోకముల నుత్పాదించి రక్షింప నేఁ

డవి దైత్యేశునిచేత భేదితము లై హ్రస్వంబులై యుండ నీ

యవినీతు న్నరసింహరూపమున సంహారంబు నొందించి వే

ద విధిం గ్రమ్మఱ నుద్ధరించితి గదా! ధర్మానుసంధాయివై.

312

తా ॥ "ధర్మమూర్తీ! నీవు లోకాలను సృష్టించి రక్షిస్తున్నావు. నేడు అవి ఈ రాక్షసరాజు

చేత చెరుపబడి క్షీణించాయి. ఈ నీతిమాలిన వానిని నరసింహరూపంలో సంహరించి, నీవు వేదధర్మాన్ని మళ్ళీ నిలబెట్టావు.

రాక్షస రాజుదృష్టిలో దైవాన్ని ఎదిరించటమంటే దైవసృష్టిలోని జగద్రక్షాధర్మాన్ని అస్తవ్యస్తం చేయటం. అది భగవంతుని దుష్టశిక్షణలీల వల్ల మళ్ళీ సవరించబడింది."

వ. పితృదేవత లిట్లనిరి.

313

తా ॥ పితృదేవతలు ఈ విధంగా అన్నారు:

శా. చండక్రోధముతోడ దైత్యుఁడు వడిన్ శ్రాద్ధంబులన్ మత్సుతుల్
పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మా కీక యు
ద్దండత్వంబునఁ దాన కై కొను మహోదగ్రుండు వీఁడిక్కడన్
ఖండింపంబడె నీ నఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా!

314

తా ॥ "పరమాత్మ స్వరూపా! దారుణమైన క్రోధంతో ఈ రాక్షసుడు మా సుతులు మాకు శ్రాద్ధ కర్మలలో పింద ప్రదానాలు నువ్వుల నీళ్ళతో సమర్పించగా మాకు అందకుండా దౌర్జన్యంతో తానే అపహరించాడు. ఎంతో క్రూరుడు. వీడు ఈ చోట నీ గోళ్ళ చేత ఖండించబడ్డాడు. నిన్ను సన్నుతిస్తాము స్వామీ!"

వ. సిద్ధు లి ట్లనిరి.

315

తా ॥ సిద్ధులు ఈ విధంగా అన్నారు:

క. క్రుద్ధుండై యణిమాదిక, సిద్ధులు గైకొనిన దైత్యుఁ జీరితివి మహా

యోద్ధవు నీ కృప మాకును, సిద్ధులు మఱలంగఁ గలిగె శ్రీనరసింహా!

316

తా ॥ “ఓ నరసింహస్వామీ! దుర్మార్గుడైన ఈ రాక్షసుడు ఆగ్రహంతో అణిమ, మహిమ, గరిమ మొదలైన అష్టసిద్ధులను తీసుకొనగా, నీవు వాడిని గోళ్ళతో చీల్చి సంహరించావు. నీ దయవల్ల మాకు మళ్ళీ మా సిద్ధులు లభించాయి.”

వ. విద్యాధరు లిట్లనిరి.

317

తా ॥ విద్యాధరులు ఈ విధంగా అన్నారు:

క. దానవునిఁ జంపి యంత, ర్ధానాదిక విద్యలెల్ల దయతో మఱలం
గా నిచ్చితివి విచిత్రము, నీ నిరుపమ వైభవంబు నిజము నృసింహా!

318

తా ॥ “నృసింహా! హిరణ్యకశిపుని చంపి మా అదృశ్య శక్తులు దయతో తిరిగి మాకు లభింపజేశావు. సాటిలేని నీ మహిమ ఆశ్చర్యకరమైనది.”

వ. భుజంగు లి ట్లనిరి.

319

తా ॥ నాగులు ఈ విధంగా అన్నారు:

క. రత్నములను మత్కాంతా, రత్నములనుఁ బుచ్చుకొన్న రక్కసు నురమున్
యత్నమున వ్రచ్చి వైచితి, పత్నులు రత్నములుఁ గలిగిఁ బ్రతికితి మీశా,

320

తా ॥ “సర్వాత్మకుడా! రత్నమాణిక్యాలను, మా భార్యలను దౌర్జన్యంగా కబళించిన రాక్షసుని వక్షఃస్థలాన్ని ప్రయత్నపూర్వకంగా చీల్చి, చంపావు. రత్నాలు, మా భార్యలు తిరిగి లభించి బ్రతికిపోయాము.”

వ. మనువు లి ట్లనిరి.

321

తా ॥ మనువులు ఈ విధంగా అన్నారు:

క. దుర్ణయుని దైత్యుఁ బొరగొని, వర్ణాశ్రమ ధర్మ సేతు వర్గము మరలం
బూర్ణముఁ జేసితి వేమని, వర్ణింతుము కొలిచి బ్రదుకువారము దేవా!

322

తా ॥ “దేవా! దుర్నీతి గల హిరణ్యకశిపుని సంహరించి, వర్ణాశ్రమ ధర్మాలను మళ్ళీ సంపూర్ణంగా బాగుచేశావు. నిన్ను ఏ విధంగా వర్ణించగలము? నిన్ను సేవించి బ్రతికే వారము మేము.

సమాజరక్షణకు, దేశ సుస్థిరతకు, ప్రజల భద్రతకు వర్ణాశ్రమధర్మాలు ఏర్పడ్డాయి. కట్టుబాట్లు, సంప్రదాయాలు ఆచరించటం మానవులు తమను తాము ఉద్ధరించుకోవడానికే. మనుధర్మం ప్రజాక్షేమానికి అని భావించినప్పుడు రాక్షసరాజు ప్రవర్తన వల్ల అవన్నీ తారుమారయ్యాయి. నృసింహుడు మళ్ళీ వాటిని నెలకొల్పాడు.

వ. ప్రజాపతు లి ట్లనిరి.

323

తా ॥ ప్రజాపతులు ఈ విధంగా అన్నారు:

మ. ప్రజలం జేయుటకై సృజించితి మముం బాటించి దైత్యాజ్ఞచేఁ
బ్రజలం జేయక యింతకాలము మహాభారంబుతో నుంటి, మీ
కుజనున్ వక్షముఁ జీరి చంపితివి, సంకోచంబు లే కెల్లచోఁ
బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమానోదయా!

324

తా ॥ "లోకక్షేమానికై అవతరించిన స్వామీ! ప్రజలను సృష్టించడానికై నీవు మమ్మల్ని సృష్టించావు. రాక్షసుని ఆదేశం మూలాన ఇంతకాలం సృష్టి చేయక, గొప్ప దుఃఖభారంతో ఉన్నాము. ఈ దుర్మార్గుని వక్షఃస్థలాన్ని చీల్చి చంపావు. ఇక ఏ అనుమానమూ లేక, అంతటా ప్రజాసృష్టి చేస్తూ మా ధర్మాన్ని నిర్వర్తిస్తాము."

వ. గంధర్వు లి ట్లనిరి.

325

తా ॥ గంధర్వులు ఈ విధంగా అన్నారు:

క. ఆడుదుము రేయుఁ బగలుం, బాడుదుము నిశాటునొద్ద, బాధించు, దయం
జూడఁడు, నీచే జమునిం, గూడె మహాపాతకునకుఁ గుశలము గలదే?

326

తా ॥ "స్వామీ! రాత్రింబవళ్ళు ఈ రాక్షసుని కొలువులో (నిర్బంధంగా) ఆడుతూ, పాడుతూ ఉండినాము. దయలేనివాడై మమ్మల్ని బాధించేవాడు. పాపాత్ముడు నీ వల్ల యముని చేరుకొన్నాడు. అటువంటి వాడికి మంగళం కలుగుతుందా?"

వ. చారణు లి ట్లనిరి.

327

తా ॥ చారణులు ఈ విధంగా అన్నారు:

క. భువనజన హృదయభల్లుఁడు, దివిజేంద్ర విరోధి నేఁడు దెగె నీ చేతన్,
భవరోగ నివర్తక మగు, భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రదికెద మీశా,

328

తా ॥ "ప్రభూ! లోకంలోని జనుల హృదయాలకు బల్లెము వంటివాడు, ఇంద్రుని శత్రువు అయిన ఈ హిరణ్యకశిపుడు నీ వలన సంహరింపబడ్డాడు. సంసారమనే రోగాన్ని నివారించే నీ పాదపద్మాలను చేరి బ్రతుకుతాము."

వ. యక్షు లి ట్లనిరి.

329

తా ॥ యక్షులు ఈ విధంగా అన్నారు:

ఉ. భ్రంశము లేని నీ భటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి ని
స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారము సేయుచు నుండు వీఁడు, ని
స్త్రింశముతోడ వీనిఁ గడతేర్చితి, వా పద మానె నో చతు
ర్వింశతి తత్త్వశాసక! త్రివిష్టపముఖ్య! జగన్నివాసకా!

330

తా ॥ "ఇరవైనాలుగు తత్త్వాలను శాసించే ప్రభూ! స్వర్గాదిలోకాలన్నింటికీ అధిదైవతమా! జగత్తు అంతటా నిండి ఉన్న దేవా! ఆపద, పరాభవం తెలియని నీ కింకరులమైన మాపై ఎక్కి ఏ మాత్రం సంకోచించక దిక్కుల వెంబడి తిరుగుతుండేవాడు. కత్తుల వంటి గోళ్ళతో వీడిని చంపి మా కష్టాన్ని పోగొట్టావు."

చతుర్వింశతి తత్త్వాలు –

పంచ జ్ఞానేంద్రియాలు = చెవి, చర్మం, కళ్ళు, నాలుక, ముక్కు.
పంచ కర్మేంద్రియాలు = వాక్, పాణి, పాద, పాయి, ఉపస్థ.
పంచ ఇంద్రియార్థాలు = శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం.
పంచ మహాభూతాలు = ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి.
మనస్సు, బుద్ధి, అహంకారం, అవ్యక్తం.

వ. కింపురుష లి ట్లనిరి.

331

తా ॥ కింపురుషులు ఇట్లా అన్నారు:

క. పురుషోత్తమ! నేరము, కిం, పురుషుల, మల్పులము, నిన్ను భూషింపఁగ, దు
ష్పురుషున్, సకల సుజన హృ, త్పరుషుం జంపితివి జగము బ్రదికె నధీశా!

332

తా ॥ "పురుషోత్తమా! కింపురుష జాతివారమైన మేము అధములము. నిన్ను పొగడటం తెలియనివారము. దుర్మార్గుడిని, సకలజనుల హృదయాలకు కంటకుడైన వాడిని సంహరించావు. జగన్నాథా! జగత్తు నీ వల్లనే బ్రతికింది."

వ. వైతాళికు లిట్లనిరి.

333

తా ॥ వైతాళికులు ఈ విధంగా అన్నారు:

క. త్రిభువన శత్రుఁడు పడియెను, సభలందును మఖములందు జగదీశ్వర! నీ
శుభగీతములు పఠించుచు, నభయులమై సంచరింతు మార్త శరణ్యా!

334

తా ॥ "దీనులను రక్షించేవాడా! ముల్లోకాలకు శత్రువైనవాడు మరణించాడు. సభలలో, యజ్ఞస్థలాలలో నీ మంగళకర గీతాలు పాడుతూ నిర్భయంగా సంచరిస్తాము."

వ. కిన్నరు లి ట్లనిరి.

335

తా ॥ కిన్నరులు ఈ విధంగా అన్నారు:

క. ధర్మము దలఁపఁడు, లఘుతర, కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్మునిఁ జంపితి, వున్నత, శర్ములమై నీదు భక్తి సలిపెదము హరీ!

336

తా ॥ "శ్రీహరీ! న్యాయం విచారించక, మా చేత నీచకర్మలు చేయించాడు. పాపాత్ముడు, క్రూర కర్ముడిని సంహరించావు. దివ్యసుఖాన్ని అనుభవిస్తూ నీయందు భక్తి కలిగి ఉంటాము."

వ. విష్ణుసేవకు లిట్లనిరి.

337

తా ॥ విష్ణుదేవుని సేవకులు ఇట్లా అన్నారు:

ఉ. సంచితవిప్రశాపమునఁ జండనిశాచరుఁడైన వీని శి
క్షించుట కీడు గాదు, కృప సేసితి వీశ్వర, భక్తితోడ సే
వించుటకంటె వైరమున వేగమ చేరఁగ వచ్చు నిన్ను నీ
యంచితనారసింహతను వద్భుత, మాపదఁబాసి రందఱున్.

338

తా ॥ "ఈశ్వరా! పూర్వజన్మలో బ్రాహ్మణులైన సనక సనందుల వల్ల శాపాన్ని పొంది,

క్రూర రాక్షసుడైన వీనిని సంహరించడం అపకారం కాదు. మేలు చేశావు. నిన్ను భక్తితో సేవించటం కంటే శత్రుత్వంతో త్వరగా చేరుకోవచ్చునని అనుకుంటున్నాము. లోకాలన్నింటిచే పూజింపబడే నీ నరసింహ రూపం అద్భుతమైనది. అందరి ఆపదా తొలగిపోయింది.

విష్ణుభక్తులకు రాక్షసుని వైరభక్తిని చూసి ఆశ్చర్యం కలిగింది. సంహార క్రియ లౌకికమే. దానివల్ల శాశ్వతమైన నిధిని పొందాడు రాక్షసుడు.

వ. ఇట్లు బ్రహ్మరుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరులైన దేవముఖ్యు లందఱు నెడ గలిగి యనేక ప్రకారంబుల వినుతించి, రందు రోష విజృంభమాణుం డయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యిట్లనిరి.

339

తా ॥ ఈ విధంగా బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, సిద్ధులు, సాధ్యులు, మొదలైన దేవతా ప్రముఖులంతా దూరంగా ఉండి అనేక విధాలుగా స్తుతించారు. వారిలో ఒక్కరైనా కోపంచేత చెలరేగిన నరసింహస్వామికి దగ్గరగా పోవడానికి భయపడి లక్ష్మీదేవిని పిలిచి, ఈ విధంగా అన్నారు:

క. హరికిం బట్టపు దేవివి, హరిసేవా నిపుణమతివి, హరిగతివి, సదా
హరిరతివి, నీవు సని నర, హరిరోషము డింపవమ్మ! హరివరమధ్యా!

340

తా ॥ “లోకజననీ! శ్రీమహావిష్ణువుకు ప్రియసతివి. విష్ణుసేవలో నేర్పరివి. శ్రీహరి దిక్కుగా గలదానవు. నిత్యం శ్రీహరియందే చిత్తము గలదానవు. నీవే నరసింహుని కోపాన్ని తగ్గించ గలవు, తల్లీ! మాపై దయతో నీవు వెళ్ళి స్వామిని ప్రసన్నుని గావించు”

వ. అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నా కలకంఠకంఠి నరకంఠీరవుని

యుపకంఠంబునకుం జని.

341

తా ॥ అనగానే ఒప్పుకొని, ఎంతో ప్రేమతో, భక్తితో ఆ లక్ష్మీదేవి నరసింహస్వామి సమీపానికి వెళ్ళింది.

సీ. ప్రళయార్కబింబంబు పగిది నున్నది గాని, నెమ్మోము పూర్ణేందు నిభము గాదు
శిఖీ శిఖా సంఘంబు చెలువు సూపెడుఁ గాని, చూడ్కి ప్రసాదభాసురము గాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁ గాని, భూరి కృపారస స్ఫూర్తి గాదు
భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడుఁ గాని, దరహసితాంబుజాతంబు గాదు

తే. కఠిన ఖర నారసింహ విగ్రహము గాని, కామినీజన సులభ విగ్రహము కాదు,
విన్నదియుఁ గాదు, తొల్లి నే విష్ణువలనఁ, గన్నదియుఁ గాదు భీషణాకార మనుచు.

342

తా ॥ ప్రళయకాలంలోని సూర్యబింబం వలె ఉన్నది కాని (నరసింహుని) నిండుమోము పూర్ణ చంద్రుని వలె ప్రసన్నముగా లేదు. అగ్నిశిఖల సమూహపు సౌందర్యం కనపడుతున్నది కాని కడగంటి చూపు చల్లదనం చేత ప్రకాశించటం లేదు. వీరరసంచేత కోపం, అద్భుతావేశం కనబడుతున్నవి కాని గొప్పదైన కరుణారసం తోచటం లేదు. భయం గొలిపే మొలక కోరల కాంతులు కమ్ముకొన్నవి కాని వికసించే పద్మం వంటి చిరునవ్వు కానరాదు. కఠినమై వాడిగల నరసింహుని రూపమే గాని, స్త్రీలకు వశమయ్యే విలాసరూపం కాదు. పూర్వం స్వామి వల్లనైనా నేను వినలేదు, చూడలేదు. ఇది భయంకరాకారము అని అంటూ ఆశ్చర్యపోయింది లక్ష్మీదేవి.

క. పలికెద నని గమకముఁ గొనుఁ, బలికినఁ గడు నలుగు, విభుఁడు ప్రతివచనములం
బలుకఁడని నిలుచు శశిముఖీ, బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్.

343

తా ॥ చంద్రుని వంటి ముఖము గల లక్ష్మీదేవి శ్రీహరితో మాట్లాడుదామని ప్రయత్నించి చూసి, ఒకవేళ మాట్లాడితే ప్రభువు ఆగ్రహిస్తాడేమో, మారుమాట్లాడడేమో! అని, మనస్సులో ఒక విధంగా మచ్చిక (నయము), భయంతో సంకోచించింది.

వ. ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుండైన వెనుక దగ్గఱెద నని చింతించుచున్న వారిజ సంభవుం డ ద్దేవుని రోషంబు నివారింప నితరుల కలవి గా దని ప్రహ్లాదుం జీరి యిట్లనియె.

344

తా ॥ ఈ విధంగా నరసింహుని రూపాన్ని పద్మాసన లక్ష్మీదేవి చూసి, సంశయించి, నెమ్మది పొందిన తరువాత దగ్గరకు పోవచ్చునని తలచే సమయంలో – బ్రహ్మదేవుడు ఆ నరసింహుని ఆగ్రహం తగ్గించటం ఇక ఇతరులెవరికీ సాధ్యం కాదని, ప్రహ్లాదుని పిలిచి ఇట్లా అన్నాడు:

క. తీండ్రమగు రోషమున మీ, తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్
వేండ్రము విడువఁడు, మెల్లన, తండ్రీ! శీతలునిఁ జేసి దయ సేయఁగదే!

345

తా ॥ "నాయనా! మీ తండ్రి కారణంగా విష్ణువు తీవ్ర రోషంతో ఉన్నాడు. ఆ ఉగ్రస్వరూపాన్ని ఉపసంహరించుట లేదు. మెల్లగా స్వామి దరికి చేరి చల్లబరచు."

వ. అనిన 'నౌఁగాక' యని మహాభాగవత శేఖరుండయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మందగమనంబున నమంద వినయ వివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగ దండ ప్రణామంబు సేసిన భక్త పరాధీనుండగు నయ్యీశ్వరుం డాలోకించి.

346

తా ॥ అనగానే, సరేనని పరమ భక్తశ్రేష్ఠుడైన బాలుడు పద్మాల వంటి చేతులు జోడించి, మెల్లని నడకతో, అమితమైన వినయంతో, విచక్షణతో నరసింహస్వామి దగ్గరగా పోయి, సాష్టాంగపడి ప్రణామం చేశాడు. భక్తులకు వశుడైన ఆ పరమేశ్వరుడు ప్రసన్నుడై ప్రహ్లాదుని ప్రేమగా చూశాడు.

ఇంతవరకు సమస్తదేవతలు, లక్ష్మీదేవి సైతం చేరడానికి భయపడి, రకరకాలుగా స్తుతించినా ఏ మార్పు చెందనివాడు పరమభక్తుడైన ప్రహ్లాదుడు సాష్టాంగపడగానే దృష్టి మరల్చాడు. భగవంతుడు భక్తసులభుడు, వశుడు అనడానికి నిదర్శనం ఈ సంఘటన.

ఉ. ప్రాభవ మొప్ప నుత్కట కృపామతియై కదియంగఁ జీరి సం
శోభిత దృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లో
కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ డుద్భటకాల సర్ప భీ
తాభయ దానశస్తము ననర్గళ మంగళ హేతుహస్తమున్.



తా ॥ నరసింహమూర్తి అతిశయమైన దయ కలిగి, ప్రహ్లాదుణ్ణి దగ్గరగా పిలిచాడు. అందంగా ప్రకాశించే చూపులు ప్రసరింపజేసి – లోకాలచే స్తుతింపబడేవాడు, రాక్షస సంహారకుడు – క్రూరమైన కాలసర్పానికి భయపడిన వారికి అభయం ప్రసాదించేదీ, శ్రేష్ఠమైనదీ, నిత్యమంగళం కలిగించేది అయిన తన చేతిని బాలుని తలపై ఉంచాడు.

వ. ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్రహ్మ జ్ఞాన సహితుండును, బులకితదేహుండును, సముత్పన్న సంతోష బాష్పసలిలధారా సమూహుండును, బ్రేమాతిశయ గద్గద భాషణుండును, వినయవివేక భూషణుండును, నేకాగ్రచిత్తుండును, భక్తి పరాయత్తుండును నయి య ద్దేవుని చరణ కమలంబులు దనహృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకుళించి యిట్లని వినుతించె.

తా ॥ ఈ విధంగా శ్రీహరి చేతిస్పర్శ చేత భయంలేనివాడై, బ్రహ్మజ్ఞానం కలవాడై, పులకించిన శరీరంతో, సంతోషంతో ఉబికిన బాష్పధారలతో, ఆప్యాయతతో కంఠం గద్గదమయ్యింది. వినయవివేకాలు తనకు అలంకారాలై భాసించగా, విష్ణువునందే చిత్తం గలవాడు, భక్తి తన్మయుడు అయి ప్రహ్లాదుడు ఆ భగవంతుని పాదపద్మాలు తన మనస్సున నిలిపి, కరకమలాలు జోడించి, ఈ విధంగా స్తుతించాడు:

## ప్రహ్లాదుడు నరసింహమూర్తిని స్తుతించి శాంతపరచుట

మ. అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్య చి
త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతిసేయ నోపరఁట, నే రక్ష స్తనూజుండ, గ
ర్వ మదోద్రిక్తుఁడ, బాలుఁడన్, జడమతిన్, వర్ణింప శక్తుండనే?

349

తా ॥ స్వామీ! దేవతలు, సిద్ధులు, మునిశ్రేష్ఠులు, బ్రహ్మాదిదేవతలైనా ఏకాగ్రత కలిగిన మనస్సులతో నిన్ను అనేక విధాల, ఎప్పుడూ ధ్యానిస్తున్నవారే అయినా, సంపూర్ణంగా పొగడటానికి చాలరట. నేను తమోగుణం కలిగిన రాక్షసుని కొడుకును; అభిమానం, పొగరు గలవాడిని, బాలుడిని. నా బుద్ధిజాడ్యం కొద్దీ నిన్ను వర్ణించటం నాకు శక్యమా ప్రభూ!

మ. తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్
నిపుణత్వంబుఁ బ్రతాప పౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపహోమంబులుఁ జాల వీశ్వర! భవత్సంతుష్టికై దంతి యూ
థపుఁ జందంబున భక్తిచేయ వలయుం దాత్పర్య సంయుక్తుఁడై.

350

తా ॥ ఓ ప్రభూ! నిన్ను మెప్పించడానికి నీ సాయుజ్యం పొందడానికి – తపస్సు, కులము, తేజస్సు, వేదశాస్త్రాధ్యయనం, అందం, ప్రయత్నం, నేర్పరితనం, పరాక్రమం, పౌరుషం, పూనిక గల వ్రతచర్యలు సరిపోవు జపహోమాల ద్వారా నిన్ను పొందలేము. గజేంద్రుడు అమితమైన భక్తితో నిన్ను మెప్పించాడు. కాబట్టి కేవలం భక్తి ఒక్కటే నిన్ను చేరే సాధనం.

మ. అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర

త్వములన్ యజ్ఞతపోఽనసూయలఁ గడున్ దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోఽర్థప్రాణ వాక్కర్మముల్
సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డౌఁ దుదిన్.

351

తా ॥ నిర్మలమైన జ్ఞానం, మంచి దానము, ధర్మమునందు దీక్ష, సత్యము, శమము, మాత్సర్యం లేక పోవటం (ఒకరికి మేలు కలిగినందువల్ల అసూయ చెందకపోవటం), యజ్ఞము, తపస్సు, అసూయ ఇవన్నీ ఉండి గర్వించే బ్రాహ్మణుని కంటే త్రికరణశుద్ధిగా సమదృష్టితో నిన్ను సేవించే చండాలుడు ఉత్తముడు. వాడు నీ సాన్నిధ్యం పొంది తన వంశం మొత్తానికి శోభ కలిగిస్తాడు.

సీ. అజ్ఞుండు సేసిన యారాధనములఁ జే, పట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుటఁ
జేపట్టు నొకచోట సిద్ధ మీశ్వరునకు, నర్థంబు లేకుండు, నతఁడు పూర్ణుఁ
డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁ, జేయుట ధర్మంబు సేసెనేని
నద్దంబుఁ జూచిన నళికలలామంబు, ప్రతిబింబితంబగు పగిది మరల

తే. నర్థములు దోఁచుఁ, గావున నధికబుద్ధి, భక్తిసేయంగ వలయును, భక్తి గాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ, బరమ కరుణుండు హరిభక్తి బాంధవుండు.

352

తా ॥ భగవంతుడు దయాసముద్రుడు కనుక అజ్ఞుడు చేసిన అపరాధాలను లెక్కచేయడు. సామాన్య జనులకు ఈశ్వరుడు అర్థం కాడు. ఆయన పరిపూర్ణుడు. కాబట్టి ఫలితాలను ఈశ్వరునికి అర్పించటం ధర్మం! అట్లా చేస్తే అద్దంలో చూసినప్పుడు నుదుటిపై ఉన్న బొట్టు ఎదురుగా కనబడినట్లుగా, మళ్ళీ ఈశ్వరార్పితాలు మనకే లభిస్తాయి. కనుక ఎక్కువ ఆదరణతో కూడిన భక్తిని కలిగి ఉండాలి. సమర్పణ భావనలో భక్తిని తప్ప సంపదలను మెచ్చడు. ఆయన దయాసింధువు. భక్తిగలవారికి బంధువు.

క. కావున నల్పుఁడ, సంస్తుతిఁ, గావించెద వెఱపు లేక కల నేరుపునన్
నీవర్ణనమున ముక్తికిఁ, బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా!

353

తా ॥ కనుక మూఢబుద్ధి గల నేను, భయం లేక నాకున్న నేర్పుతో నిన్ను స్తుతిస్తాను. అవ్యయుడవైన ఓ ప్రభూ! పురుషుడు తనకు చేతనైనంతలో నీ గుణాలను కీర్తించడం చేత అజ్ఞానాన్ని జయించి, మోక్షాన్ని పొందుతాడు.

సీ. సత్త్వాకరుఁడవైన సర్వేశ! నీ యాజ్ఞ, శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మందుచున్నారు, నీ భీషణాకృతి నేఁడు చూచి
రోషంబు మాను, నీ రుచిర విగ్రహములు, కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక, పన్నగంబుల భంగి భయముఁ జేయు

తే. నసుర మర్దించితివి, సాధుహర్ష మయ్యె, నవతరించిన పని దీఱె నలుక యేల?
కలుషహారివి సంతోషకారి వనుచు, నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ!

354

తా ॥ సర్వేశ్వరా! నిర్మలాత్మ స్వరూపా! నీవు సత్త్వగుణం ప్రధానమైనవాడవు. నీ ఆజ్ఞను తలదాల్చి నడచుకొనే బ్రహ్మాదిదేవతలు నీ భయంకరాకృతిని చూసి నేడు భయపడుతున్నారు. ఆగ్రహాన్ని వదలిపెట్టు. లోకోత్తర దివ్య సౌందర్యవంతములైన నీ రూపాలు శుభాన్ని కలిగించేవే కాని భయాన్ని కలిగించవు. లోకాలకు తేళ్ళు, పాముల వలె బాధను కలిగించే రాక్షసుని సంహరించినావు. సాధుజనులు ఆనంద పడుతున్నారు. నీవు అవతరించిన పని నెరవేరింది. ఇంకా ఆగ్రహమెందుకు? కల్యాణకరుడవనీ, కల్మషహరుడవనీ లోకులు నిన్ను తలచుకుంటారు.

మ. ఖరదంష్ట్రా భ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానయున్ రక్త కే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ

నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ, బూర్ణక్రూర దుర్వార దు
ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే!

355

తా ॥ స్వామీ! క్రూరమైన కోరలు, బొమముడి, జటలు, గోళ్ళు, భయంకర గర్జనలు, ఎఱ్ఱని జూలు, పొడవైన ప్రేగుల మాలిక, నిప్పులు కురిసే కన్నులు గల నీ నరసింహాకృతిని చూసి నేను భయపడను. కానీ తరగనిది, ఘోరమై వారింపరానిది అయిన భరింపరాని సంసారమనే కార్చిచ్చుకు భయపడుతాను. నన్ను నీ పాదాల సన్నిధికి చేర్చుకొనరాదా!

వ. దేవా! సకలయోనులందును సుఖవియోగ దుఃఖసంయోగ సంజనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై, దుఃఖ నివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బర దేవతవు నైన నీ యొక్క బ్రహ్మగీతంబు లయిన లీలావతార కథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండనై దుఃఖ పుంజంబులఁ దరియించి భవదీయ చరణకమల స్మరణ సేవా నిపుణులైన భక్తులం జేరి యుండెద, బాలునిఁ దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తం బయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడివాని నావయును దక్కొరులు రక్షింపనేరని తెఱంగున సంసారతాపతంతప్యమానుండై నీ చేత నుపేక్షితుండయిన వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాఁడు, జగంబుల నెవ్వండేమి కృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధియై యే స్థలంబున నే సమయంబునం దేమి రూపంబున నే గుణంబున నపరంబైన జనకాది భావంబు నుత్పాదించి పరంబయిన బ్రహ్మాది భావంబున రూపాంతరంబు నొందించునట్టి వివిధ ప్రకారంబు లన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైన నీవ, నీ యంశంబైన బురుషునికి నీ యనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరిత యై కర్మమయంబును బలయుతంబును బ్రధానలింగమును నైన మనంబును నీ మాయ సృజియించు, నవిద్యార్పితవికారంబును,

వేదోక్తకర్మ ప్రధానంబును, సంసార చక్రాత్మకంబైన యీ మనమున నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేఁడు, విజ్ఞాననిర్జిత బుద్ధి గుణుండవు నీవు, నీ వలన వశీకృతకార్య సాధన శక్తియైన కాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తంబయిన సంసార చక్రంబుఁ జేయుచుండు, సంసారదావ దహన తంతప్యమానుండనగు నన్ను రక్షింపుము.

356

తా ॥ దేవా! ఏ జన్మమైనా సుఖానికి వియోగం, దుఃఖానికి సంయోగం ప్రాప్తిస్తూనే ఉంటుంది. అందువలన నాకెప్పుడూ శోకమే ప్రాప్తిస్తూ, ఆ శోకాగ్ని దహిస్తూ ఉంటుంది. సుఖం ఇవ్వదని తెలిసికూడా ఈ దేహభిమానమనే మమకారాల చేత మోహితుడనై తిరిగే నాకు ఇష్టుడవు, మిత్రుడవు, ఉత్తమ దైవానివి నీవు. బ్రహ్మచే పొగడబడి, లీలావతార విశేషాలు చదువుతూ రాగద్వేషాలను వదలి, దుఃఖ పరంపరను దాటి నీ పాదపద్మాలు స్మరించి, సేవించే భక్తులను చేరి ఉంటాను.

పిల్లవానికి తల్లిదండ్రులు, రోగికి వైద్యుడిచ్చే ఔషధం, సముద్రంలో మునిగేవాడికి నావ తప్ప తక్కినవారు రక్షించటం తెలియని విధంగా – సంసారమనే వేడిమిచే తపతప తపించే వాళ్ళను నీవే కాపాడాలి. నీ చేత ఉదాసీనంగా చూడబడినవాడిని, ఉద్ధరించడానికి నీవు తప్ప ఇతరుడు సమర్థుడు కాడు. లోకాలలో ఎవడు ఏ పనిని, ఎవని చేత పురికొల్పబడి, ఏ ఇంద్రియాలతో, ఎందుకు, ఎవరి కొరకు, ఎవని సంబంధంగా, ఏ స్థలంలో, ఏ సమయంలో, ఏ రూపంలో, ఏ గుణం వల్ల, జనకాది భావాన్ని పుట్టించి, పరమైన బ్రహ్మభావనతో శ్రీకైవల్యరూపంగా పరిణమింప జేస్తాడో, వివిధములైన ఆ పరిణతరూపాలన్నీ నీవే! సమస్తమూ నీవే. నీవు నిత్యముక్తుడవు. నీవు సత్యరక్షకుడవు.

నీవు నీ అంశమైన మూర్తి గల పురుషునికి నీ అనుగ్రహం చేత కాలానుగుణంగా ప్రేరేపింపబడి, కర్మరూపమూ, బలమైనదీ – లింగశరీరమనే గుర్తుగల మనస్సును నీ మాయ

సృష్టిస్తుంది. అవిద్య వల్ల కల్పించబడిన మార్పును, వేదవిధి కర్మలే ప్రధానమై, సంసార చక్రంలో పడి తిరుగుతున్నది. ఇటువంటి ఈ మనస్సుతో నిన్ను సేవించకుండా తరించగల సమర్థుడు ఒక్కడు కూడా లేదు. విజ్ఞానం చేత జయింపబడిన బుద్ధి గుణము కలవాడవు నీవు. కార్యకారణ శక్తిని కాలం నీ వలననే వశం చేసుకుంటుంది. ఈ 'కాలం' మాయతో కలిసి పదహారు వికారాలతో కూడిన సంసార చక్రాన్ని నిర్మించి త్రిప్పుతూ ఉంటుంది.

సీ. జనులు దిక్పాలుర సంపదాయుర్విభ, వములు గోరుదురు భవ్యంబు లనుచు
నవి యంతయును రోషహాసజృంభితమైన, మా తండ్రి బొమముడి మహిమఁ జేసి
విహతంబు లగు, నట్టి వీరుండు నీ చేత, నిమిషమాత్రంబున నేఁడు మడిసెఁ
గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల, శ్రీవిభవంబులు జీవితములుఁ

తే. గాలరూపకుఁడగు నురుక్రముని చేత, విదళితము లగు, నిలువవు వేయు నేల?
యితర మేనొల్ల నీమీఁది యెఱుక గొంత, గలిగియున్నది కొలుతుఁ గింకరుఁడ నగుచు.

357

తా ॥ దేవా! ఈ లోకులు – దిక్పాలకులకున్న సంపద, ఆయువును, వైభవాలను మంచివని కోరుకుంటారు. అవి అన్నీ కోపం వల్ల పుట్టిన వికటాట్టహాసంతో చెలరేగే మా తండ్రి (హిరణ్యకశిపుని) యొక్క బొమముడి ప్రభావంతో నశించిపోయేవి. అటువంటి వీరుడు కూడా నీ చేత రెప్పపాటు కాలంలో నేడు మరణించాడు. కనుక బ్రహ్మ మొదలైనవారి వైభవాలు, జీవితాలు శాశ్వతం కావు. అవన్నీ కాలస్వరూపుడైన మహావిష్ణువు చేతిలో కనిపించకుండా పోతాయి నశిస్తాయి. వేయి మాటలెందుకు? ఇతరములైన వేవీ నాకు అక్కరలేదు. నీ మీద కొంత భక్తి, జ్ఞానం నాకు ఉన్నది. దాసుడనై నిన్ను సేవిస్తాను.

మత్తకోకిలము.

ఎండమావులవంటి భద్రము లెల్ల సార్థము లంచు మ

ర్త్యుండు రోగనిధాన దేహముతో విరక్తుఁడు గాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే
రండు పారము దుష్టసౌఖ్య పరంపరాక్రమణంబునన్.

358

తా ॥ మరణధర్మం గల మానవుడు – ఎండమావుల వంటి ఇహలోక సుఖాలన్నీ ప్రయోజన కారులని భావిస్తాడు. రోగాలకు తావైన దేహం పట్ల విరక్తుడు కాక, విజృంభించే కామాగ్ని చేత ఎప్పుడూ తపిస్తూ, నీచమైన సౌఖ్యపరంపరలలో మునిగి, ఒక్కనాడు కూడా సంసార సాగరాన్ని దాటాలని ఆలోచించడు.

కామినీ కాంచనాల పట్ల మోహం కారణంగా సంసార బద్ధులయ్యే మానవులు వాటి మూలంగా వేనవేలు అవమానాలను పొందుతూన్నా వాటి బంధాన్ని విదలించుకుని మనస్సును భగవంతుడి వైపు తిప్ప జాలకున్నారు.

–శ్రీరామకృష్ణ పరమహంస

ఉ. శ్రీమహిళామహేశ సరసీరుహగర్భులకైన నీ మహో
ద్దామకరంబుచే నభయదానము సేయవు, నేను బాలుఁడం
దామస వంశ సంభవుండ, దైత్యుఁడ, నుగ్రరజోగుణుండ ని
స్సీమ దయం గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్యమీశ్వరా!

359

తా ॥ సర్వజగాలకు ప్రభువైనవాడా! లక్ష్మీదేవి, పరమేశ్వరులు, బ్రహ్మకైనా గాని గొప్ప మహిమ గల నీ చేతితో అభయాన్నివ్వవు. నేను బాలుడిని. తమోగుణప్రధానమైన వంశంలో పుట్టిన వాడిని. రాక్షసుడను. క్రూరమైన రజోగుణం కలవాడిని. అంతులేని కరుణతో నీవు నీ కరకమలాన్ని నా తలపై ఉంచటమంటే ఎంత ఆశ్చర్యం ప్రభూ!

వ. మహాత్మా! సుజనులయిన బ్రహ్మాదులందును, దుర్జనులైన మాయందును సేవానురూపంబునం బక్షాపక్షంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫలప్రదానంబు సేయుదువు, కందర్పసమేతంబగు సంసార కూపంబునం గూలుచున్న మూఢ జనులం గూడి కూలెడి నేను భవదీయ భృత్యుండగు నారదుని యనుగ్రహంబునం జేసి నీ కృపకుఁ బాత్రుండనైతి, నన్ను రక్షించి మజ్జనకు వధియించుట నా యందులఁ బక్షపాతంబు గాదు, దుష్టదనుజ సంహారంబును శిష్టభృత్యమునిజన రక్షా ప్రకారంబును నీకు నైజ గుణంబులు, విశ్వంబు నీవ; గుణాత్మకంబైన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతు భూత గుణయుక్తుండవై రక్షక సంహారకాది నానా రూపంబుల నుండుదువు; సదసత్కారణ కార్యాత్మకం బయిన విశ్వంబునకుం బరమకారణంబు నీవ; నీ మాయచేత వీఁడు దానని యెడు బుద్ధివికల్పంబు దోఁచుఁ; గాని నీ కంటె నొండెద్దియు లేదు; బీజంబు నందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాదివర్ణంబునుం గలుగు తెఱంగున విశ్వంబునకు నీ యంద జన్మస్థితి ప్రకాశ నాశంబులుం గలుగు; నీ చేతనయిన విశ్వంబు నీ యంద నిలుపుకొని తొల్లి ప్రళయకాల పారావారంబునఁ బన్నగేంద్ర పర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుని భంగి యోగనిమీలిత లోచనుండవై మెలంగుచుఁ గొంతకాలంబునకు నిజకాల శక్తిచేతం బ్రేరితంబులై ప్రకృతి ధర్మంబులయిన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి చాలించి వెలుంగుచున్న నీ నాభియందు వటబీజంబు వలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్క కమలంబు సంభవించె, నిట్టి కమలంబువలన నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొం డయిన రూపంబు లేకుండుటఁ జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి జలంబులందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి తన జన్మంబునకు నుపాదానకారణంబైన నిన్ను దర్శింప సమర్థుండు గాక మగిడి కమలంబు కడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్భర తపంబు సేసి పృథివియందు గంధంబు గను చందంబునఁ దనయందు నానా సహస్రవదన శిరో నయన నాసా కర్ణ వక్త్ర భుజ కర చరణుండును బహువిధాభరణుండును మాయాకలితుండును మహాలక్షణలక్షితుండును

నిజప్రకాశ దూరీకృతతముండును బురుషోత్తముండును నయిన నిన్ను దర్శించె, నయ్యవసరంబున.

360

తా ॥ మహాత్మా! సాధువర్తనులైన బ్రహ్మాది దేవతలకు, దుర్మార్గవర్తనులమైన మాకు, సేవకు తగినట్లు స్వపరభేదం లేకుండా కోరినవి ఇచ్చే కల్పవృక్షం వలె, ఐహిక ఆముష్మిక ఫలాలను ఇస్తున్నావు. మన్మథభావంతో కూడిన సంసారకూపంలో కూలుతున్న మూర్ఖజనాలతో పాటు కూలిపోయేవాడను. నేను నీ సేవకుడైన నారదుని అనుగ్రహంతో నీ కరుణకు తగినవాడనైనాను. నన్ను కాపాడి, మా తండ్రిని చంపటం నా పట్ల మమకారంతో కాదు. దుష్టుడైన రాక్షసుని చంపటం, సాధువులైన సేవకులూ మునులను రక్షించే విధానం – నీకు సహజగుణాలు.

ఈ లోకమే నీవు. నీవే సత్త్వరజస్తమోగుణాలు కలిగిన జగత్తును సృష్టించి, అందులో ప్రవేశించి, కారణ గుణాలతో కలిసి – రక్షణ, సంహారం మొదలైన వివిధ రూపాలలో ఉంటావు. నిత్యానిత్య, కారణ సంబంధం కలిగి ఉన్న విశ్వానికి ముఖ్యహేతువు నీవు. నీ మాయ వల్ల ఇతరుడు – తాను అని బుద్ధి భ్రమ కలుగుతుంది. కానీ, నీకన్న వేరేదీ లేదు. విత్తులో అతి సూక్ష్మంగా వస్తుతత్త్వం నిక్షిప్తమైనట్లు, వృక్షంలో నీలాది నానావర్ణాలు దాగి ఉన్నట్లు జగత్తుకు నీయందే పుట్టుక, స్థితి, వృద్ధి, నాశములు కలుగుతాయి.

నీవు సృష్టించిన లోకాన్ని నీలో నిలిపి, మునుపు ప్రళయకాల సమయంలోని సముద్రమున ఆదిశేషుని తల్పంపై, క్రియలేమీ చేయక, ఆత్మసుఖాన్ననుభవిస్తూ నిద్రించేవాని మాదిరి యోగముద్రలో కనులు మూసి ఉండి, కొంతకాలం తరువాత నీదైన కాలశక్తి చేత పురికొల్పబడి, ప్రకృతి ధర్మాలైన సత్త్వాది గుణాలు అంగీకరించి, సమాధి చాలించి, ప్రకాశించే నీ యొక్క నాభిలో నుంచి మఱ్ఱి విత్తనం నుండి పుట్టే మఱ్ఱివృక్షం వలె ఒక కమలం పుట్టింది.

ఆ కమలం నుండి నాలుగుముఖాలు గల బ్రహ్మ జన్మించి, దిక్కులను పరిశీలించగా, కమలం తప్ప మరొక రూపం ఆయనకు కనిపించలేదు. ఆలోచించి, నీటిలో ప్రవేశించి, నూరు దేవతా వత్సరాలు వెదకి, తన పుట్టుకకు ముఖ్యహేతువైన నిన్ను చూడటానికి తగిన శక్తి లేక దర్శించలేకపోయాడు. మళ్ళీ కమలం వద్దకు పోయి, ఆశ్చర్యపడి, ఎంతోకాలం గొప్ప తపస్సుచేసి పృథ్వియందు గంధాన్ని కనుగొన్నట్లు తనలో, అనేక వేల శిరస్సులు, ముఖాలు, కన్నులు, ముక్కులు, చెవులు, నోళ్ళు, భుజాలు, చేతులు, కాళ్ళు గలవాడు; అనేక తీరుల ఆభరణాలు కలవాడు, మాయతో కూడినవాడు, గొప్ప లక్షణాలతో ప్రకాశించేవాడు, స్వప్రకాశంతో చీకటిని (అజ్ఞానాన్ని) పోగొట్టేవాడు, పురుషులలో ఉత్తముడు అయిన నిన్ను (విష్ణువును) దర్శించాడు.

క. ఘోటక వదనుఁడవై మధు, కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం
బాటించి యజున కిచ్చిన, కూటస్థుఁడ వీశ్వరుఁడవు! కోవిదవంద్యా!

361

తా ॥ తత్త్వజ్ఞులచే నమస్కరింపబడువాడా! అశ్వముఖుడవై మధుకైటభులనే రాక్షసులను సంహరించి, వేదాలను ఉద్ధరించి బ్రహ్మదేవుడకు ఇచ్చావు. నీవు అవికారుడవు, ఈశ్వరుడవు.

వ. ఇవ్విధంబునఁ గృత త్రేతా ద్వాపరంబులను మూఁడు యుగంబులందును దిర్యఙ్మానవ మునిజలచరా కారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు హరించుచు యుగానుకూల
ధర్మంబులం బ్రతిష్ఠింపుచు నుండుదువు. దేవా! యవధరింపుము.

362

తా ॥ ఈ విధంగా కృత, త్రేతా, ద్వాపరములనే మూడు యుగాలలో మృగ పక్ష్యాదులు, మనుషులు, మునులు, జలజంతువుల రూపాలలో అవతరించి లోకాలను కాపాడుతూ, ధరిస్తూ,

నశింపజేస్తూ యుగధర్మాన్ని నిలుపుతూ ఉంటావు. ఓ స్వామీ! చిత్తగించు.

సీ. కామహర్షాది సంకలితమై చిత్తంబు, భవదీయచింతన పదవి సొరదు
మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ, నీ వర్ణనమునకు నిగుడనీదు
సుందరీముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి, తావకాకృతులపైఁ దగులువడదు
వివిధ దుర్భాషలు వినఁ గోరు వీనులు, వినవు యుష్మత్కథావిరచనములు,

తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ,
దవులు గొలుపదు వైష్ణవధర్మములకు,
నడఁగి యుండవు, కర్మేంద్రియములు పురుషుఁ,
గలఁచు సవతులు గృహమేధి! గలఁచునట్లు.

363

తా ॥ కామం, క్రోధం, హర్షం మున్నగు గుణాలతో నిండిన మనస్సు నిన్ను గూర్చిన ధ్యానమార్గంలో పోదు. నాలుక తీపి మొదలైన వివిధ రసాలకు లోనై, ఆనందాన్ని పొందుతూ, నిన్ను వర్ణించడానికి వేగిరపడదు. చూపులు అందమైన స్త్రీల ముఖాలను చూడగోరుతాయే కాని, నీ దివ్యమంగళ రూపాన్ని చూడటానికి ఇష్టపడవు. చెవులు రకరకాల చెడు మాటలు వినగోరుతాయే కాని నీ కథలను వినవు. ముక్కు దుర్వాసనలను చూడటానికి వేగంగా అలవాటు పడుతుంది. కానీ విష్ణు ప్రీతికరాలైన ధర్మాలకు (ప్రాణాయామాది యోగ క్రియలకు) ఒప్పదు. సవతులు గృహస్థుని బాధించే రీతిగా నిరంతరం కర్మేంద్రియాలు పురుషుణ్ణి కలచివేస్తాయి.

వ. ఇవ్విధంబున నింద్రియంబులచేతం జిక్కువడి స్వకీయ పరకీయ శరీరంబులందు మిత్రామిత్ర భావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీ నిమగ్నం బయిన లోకంబు నుద్ధరించుట లోకసంభవ స్థితిలయ కారణుండ వైన నీకుం గర్తవ్యంబు, భవదీయ సేవకుల మయిన మా యందుం బ్రియభక్తులయిన వారల నుద్ధరింపుము.

364

తా ॥ ఈ విధంగా జీవులు ఇంద్రియాలకు వశులై తమయొక్క, ఇతరుల యొక్క దేహాల పట్ల మిత్రత్వ, శత్రుత్వభావాలు పాటిస్తూ ఉంటారు. జన్మిస్తూ, మరణిస్తూ సంసారమనే నిప్పుల ప్రవాహంలో మునిగిన ప్రాణులను ఉద్ధరించటం లోకాలకు సృష్టి స్థితి లయ కారకుడుగా నీకు కర్తవ్యం. నీ దాసులము, ప్రియ భక్తులమైన మమ్మల్ని ఉద్ధరించు.

మ. భగవద్దివ్య గుణానువర్తన సుధా ప్రాప్తైక చిత్తుండనై
బెగడన్ సంసరణోగ్ర వైతరణికిన్, భిన్నాత్ములై తావకీ
య గుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గానని మూఢులన్ గని మదిన్ శోకింతు సర్వేశ్వరా!

365

తా ॥ సమస్తలోకాలకు ప్రభువైన వాడా! నీ దివ్యగుణాలను కీర్తించి, అనుసరించినందున అమృతప్రాప్తి కలిగిన నాకు సంసారమనే వైతరణి గురించి భయంలేదు. భేదబుద్ధి కలవారై, నీ గుణకీర్తనం చేయడానికి విముఖులై, మాయాసుఖాలనే నిజమని నమ్మి, ఉత్తమగతి పొందలేని అజ్ఞానులను చూసి మనస్సులో దుఃఖీస్తున్నాను.

ప్రారంభదశలో కర్మ సంబంధమైన గందరగోళం ఎక్కువగా ఉంటుంది. కాని నువ్వు భగవంతుణ్ణి సమీపించేకొద్దీ కర్మ క్షీణిస్తూంటుంది. చివరకు సంపూర్ణమైన కర్మ పరిత్యాగమూ సమాధిస్థితీ లభిస్తాయి. సాధారణంగా సమాధిస్థితిని పొందాక శరీరం ఎక్కువకాలం నిలువదు. కాని కొందరి విషయం వేరు. లోకానికి బోధించే నిమిత్తం వారి శరీరం నిలుస్తుంది. నారదుడిలాంటి మహర్షులూ, శ్రీచైతన్యుడిలాంటి అవతారపురుషులూ ఇలాంటి వారు. బావి తవ్వాక తట్టలు, పారలు మొదలైన పరికరాల నన్నింటిని కొందరు పారేస్తారు. కాని మరికొందరు ఇరుగు పొరుగులకు పనికి వస్తాయని వాటిని జాగ్రత్తగా దాచి ఉంచుతారు. అలాంటిమహనీయులు లోకులను చూసి జాలిపడతారు, పరితపిస్తారు. తమ జ్ఞానప్రాప్తిని మాత్రమే చూసుకొనేటంత స్వార్థపరులు కారు వారు.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. దేవా! మునీంద్రులు నిజవిముక్తి కాములయి విజనస్థలంబులం దపంబు లాచరింతురు, కాముకత్వంబు నొల్లక యుండువారికి నీ కంటె నొండు శరణంబు లేదు, గావున నిన్ను సేవించెదc, గొందఱు కాముకులు కరద్వయ కండూతి చేతం దనియని చందంబునc దుచ్ఛంబయి పశుపక్షి క్రిమికీట సామాన్యం బయిన మైథునాది గృహమేధి సుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతు లగుదురు, నీ ప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముండయి యుండు, మౌనవ్రత జపతపశ్శ్రుతాధ్యయనంబులును, నిజధర్మవ్యాఖ్యాన విజనస్థలనివాస సమాధులును, మోక్షహేతువులగు, నైన నివి పదియు నింద్రియ జయంబు లేని వారికి, భోగార్థంబు లయి విశ్రమించు వారికి జీవనోపాయంబు లయి, డాంబికులకు వార్తాకరంబులయి యుండు, సఫలంబులు గావు, భక్తిలేక భవదీయజ్ఞానంబు లేదు, రూపరహితుండవైన నీకు బీజాంకురంబుల కైవడిc గారణకార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశ మానంబులగు, నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుc బొడగందురు, పంచభూత తన్మాత్రంబులును, బ్రాణేంద్రియంబులును, మనోబుద్ధ్యహంకార చిత్తంబులును నీవ, సగుణంబును నిర్గుణంబును నీవ, గుణాభిమానులయిన జన్మమరణంబుల నొందు విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు, తత్త్వజ్ఞు లయిన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని వేదాంత ప్రతి పాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతు, రది గావున.

366

తా ॥ దేవా! మునులు సహజస్వభావం చేత ముక్తిని కోరి, కోరికలు విడిచి ఏకాంతప్రదేశాలలో తపస్సు చేస్తుంటారు. కోరికలు లేనివారికి నీకన్న మరొకటి కోరదగినది లేదు. అందుకనే నిన్ను సేవిస్తాను. కొందరు రెండు చేతులా గోకినా తృప్తి చెందనట్లు కాముకులు

తుచ్ఛమైన పశుపక్ష్యాదులకూ, క్రిమికీటకాదులకూ ఉండే శరీర సౌఖ్యాన్ని కోరి, తృప్తి చెందక, చివరకు అమితమైన దుఃఖానికి లోనవుతారు. నీ అనుగ్రహం కలిగిన గుణవంతుడు కోరికలు లేనివాడై ఉంటాడు.

మౌనము, వ్రతము, జపము, తపము, వేదశాస్త్ర శ్రవణం, అధ్యయనం, స్వధర్మం, వివరణ (అధ్యాపనం), ఏకాంతస్థల నివాసం, ఏకాగ్రత మొదలైనవి మోక్షానికి హేతువులు. ఈ పది ఇంద్రియాలను జయించనివారికి భోగకారణాలుగా, వాటిని అమ్ముకొనేవారికి బ్రతుకు తెరువుగా, ఆడంబరం కలవారికి కాలక్షేపవిషయాలుగా ఉండి, ప్రయోజనవంతం కావు. భక్తి లేకుండా నిన్ను గురించిన జ్ఞానం అలవడదు.

నిరాకారుడవైన నీకు – విత్తు నుండి వెలువడే మొలక వలె కారణ కార్యాలైన సత్, అసత్ రూపాలు రెండు. ప్రకాశించే ఆ రెండిటిలో భక్తిగల బుద్ధిమంతులు రాపిడితో కట్టెలోని అగ్నిని కనుగొన్న విధాన నిన్ను చూడగలరు. పంచభూతాలు (భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం), వాని తన్మాత్రలు (శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం), ప్రాణేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తము మొదలైనవన్నీ నీవే. గుణాలు కలవాడివి నీవే, లేనివాడివి నీవే. సత్త్వ, రజ, స్తమో గుణాభిమానులై జనన, మరణాలను పొందే పండితులు నీ ఆద్యంతాలు తెలుసుకోలేరు. నిరాకారుడవైన నిన్ను గుర్తించలేరు. నీ తత్త్వం తెలిసిన విజ్ఞులు వేదాలను చదవటం వంటి కర్మలు చేయక, వేదాలచే ప్రతిపాదింపబడిన నిన్ను ఏకాగ్రత చేత, ధ్యానవిశేషాల చేత తెలుసుకొని సేవిస్తారు.

సీ. నీ గృహాంగణ భూమి నిటలంబు మోవంగ, మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీ మంగళ స్తవనికర వర్ణంబులు, పలుమాఱు నాలుకఁ బలుకఁడేని
నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు, ప్రియభావమున సమర్పింపఁడేని
నీ పదాంబుజముల నిర్మలహృదయుఁడై, చింతించి మక్కువఁ జిక్కఁడేని

తే. నిన్నుఁ జెవులార వినఁడేని, నీకు సేవ, సేయ రాఁడేని బ్రహ్మంబు జెందఁ గలఁడె?

యోగియైనఁ దపోవ్రతయోగియైన, వేదియైన మహాత్తత్త్వ వేదియైన.

367

తా ॥ స్వామీ! యోగి అయినా, తపము వ్రతము చేసేవాడైనా, వేదాలు చదివినా, గొప్ప తత్త్వాలను తెలిసినవాడైనా – నిత్యం నీ గుడి వాకిట తలను తాకించి ఆనందంతో నమస్కరించనివాడు, శుభం కలిగించే నీ స్తోత్ర సమూహ అక్షరాలు అనేకమార్లు నాలుకపై నిలిపి పలుకనివాడు, సమస్తకార్యాలు నీ అధీనమనే ప్రేమభావంతో సమర్పించనివాడు, స్వచ్ఛమైన మనస్సుతో నీ పాదపద్మాలను ఇష్టపూర్వకంగా ధ్యానించి పరవశం కానివాడు, నీ గూర్చి చెవులారా విననివాడు, నిన్ను సేవించడానికి రానివాడు – బ్రహ్మస్వరూపుడవైన నిన్ను పొందగలడా?

వ. కావున భవదీయ దాస్యయోగంబు కృపసేయు మని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె.

368

తా ॥ కనుక నీ సేవను ప్రాప్తింపజేసి దయచూపుమని నమస్కరించిన ప్రహ్లాదుని స్తుతికి మెచ్చి రాగద్వేషాది గుణాలు లేని శ్రీహరి కోపాన్ని వదలి ఈ విధంగా అన్నాడు:

శా. సంతోషించితి నీ చరిత్రమునకున్, సద్భద్ర మౌఁగాక !నీ<br>
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం?<br>
జింతం జెందకు, భక్త కామదుఁడ నే, సిద్ధంబు దుర్లోక్యుఁడన్,<br>
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా!

369

తా ॥ "వత్సా! నీ నడవడికి సంతోషించాను. నీకు శుభం కలుగు గాక. నీ మనస్సులో కోరిన కోరికలన్నీ దయతో ప్రసాదిస్తాను. విచారాన్ని పొందకు. భక్తుల కోర్కెలు తీర్చేవాడిని.

నిజము. ప్రాణులకు చూడ శక్యం కాని వాడిని. నన్ను చూసిన జీవకోటికి మళ్ళీ పుట్టుక ఉండదు.

ఆ. సకలభావములను సాధులు విద్వాంసు, లఖిల భద్రవిభుఁడ నైన నన్నుఁ
గోర్కు లి మ్మటంచుఁ గోరుదు, రిచ్చెదఁ, గోరు మెద్దియైనఁ గుఱ్ఱ! నీవు.

370

తా ॥ నాయనా! సజ్జనులు, పండితులు, అన్ని విధాలా – సమస్త శుభాలకు అధిపతినైన నన్ను కోరికలు ప్రసాదించుమని అడుగుతారు. నీమా ఏదైనా కోరుకో! అనుగ్రహిస్తాను."

వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియు కొఱకు వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముండైన యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యిట్లనియె, నుత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తి గల నాకు వరంబు లిచ్చెద నని వంచింప నేల? సంసార బీజంబునకు హృదయ బంధకంబు లయిన కామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబు కొఱకు నేమంబున నిన్నుం జేరితిఁ, గామంబులును, నింద్రియంబులును, మనశ్శరీర ధైర్యంబులును, మనీషాప్రాణ ధర్మంబులును, లజ్జాస్మరణ లక్ష్మీసత్య తేజో విశేషంబులును, నశించు; లోకంబులందు భృత్యు లర్థకాములయి రాజుల సేవింతురు, రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదు, రవ్విధంబునం గాదు, నాకుం గామంబు లేదు, నీకుం బ్రయోజనంబు లే, దయినను దేవా! వరదుఁడ వయ్యెద వేనిఁ గామంబులు వృద్ధిబొందని వరంబు కృపసేయుము, కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమాన విభవుం డగు, నరసింహ! పరమాత్మ! పురుషోత్తమ! యని ప్రణవ పూర్వకంబుగా నమస్కరించిన హరి యిట్లనియె.

371

తా ॥ అని నరసింహస్వామి ప్రహ్లాదునిలోని కోరికలు జయించాడా లేదా అని

తెలుసుకోవడానికి అడుగగా – ప్రహ్లాదుడు కోరికలే లేని అంతరంగ భక్తుడు కనుక కోరిక భక్తియోగానికి అడ్డు అని తలచి, ఈ విధంగా అన్నాడు:

"పుట్టుకతోనే స్వభావరీత్యా కామనలయందు ఆసక్తి గలిగియున్న నాకు వరాలు ఇస్తానని మోసగిస్తావెందుకు? సంసారమనే విత్తుకు, మనస్సును బంధించే కోరికలకు భయపడి, మోక్షాన్ని అర్థిస్తూ, మేలుకోరి, నియమంతో నీ సన్నిధికి వచ్చాను. కోరికల మూలాన, ఇంద్రియాలు, మనస్సు, శరీరం, ధైర్యం, బుద్ధి, ప్రాణం, ధర్మం, సిగ్గు, జ్ఞాపకం, సంపద, సత్యం, కాంతి విశేషాలన్నీ నశిస్తాయి.

ప్రపంచంలో సేవకులు, ధనాన్ని కోరి రాజులను సేవిస్తారు. రాజులు కూడా తమకు కావలసిన పనులను నెరవేర్చుకొనగోరి ఆ సేవకులకు ధనాన్ని ఇస్తారు. నా విషయం ఆ విధంగా భావించకు. నాకు కోరిక లేదు. నీకు కూడా నా వల్ల కావలసిన కార్యం లేదు. అయినా దేవా! వరాలనిచ్చే వాడివైతే కోరికలు పెరుగకుండా వరాన్ని ఇవ్వు. కోరికలు వదలిన పురుషుడు నీతో సమాన వైభవం గలవాడౌతాడు. నరసింహా! పరమాత్మా! పురుషోత్తమా!" అని ఓంకార పూర్వకంగా నమస్కరింపగా విని, శ్రీహరి ఈ విధంగా అన్నాడు:

సీ. నీయట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు, గోర్కులు నాయందుఁ గోర నొల్ల
రట్లైనఁ బ్రహ్లాద! యసురేంద్రభర్తవై, సాగి మన్వంతర సమయ మెల్ల
నిఖీలభోగంబులు నీవు భోగింపుము, కల్యాణబుద్ధి నా కథలు వినుము
సకల భూతములందు సంపూర్ణుఁడగు నన్ను, యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి

ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన మాచరింపు మీశ్వరార్పణముగ,
భోగముల నశించుఁ బుణ్యంబు, వ్రతములఁ బాపసంచయములు పాయు నిన్ను.



తా ॥ ప్రహ్లాదా! నీ వంటి మంచి బ్రహ్మజ్ఞాననైపుణ్యం కలవారు, అంతరంగభక్తులు నన్ను

కోరికలు కోరడానికి ఇష్టపడరు. అట్లయినా, రాక్షసశ్రేష్ఠులకు రాజువై వర్ధిల్లి, మన్వంతరకాలమంతా సమస్తభోగాలు అనుభవించు. క్షేమకరమైన బుద్ధితో నా సంబంధమైన గాథలు విను. అన్ని ప్రాణులలో నిండి ఉన్న నన్ను, యజ్ఞాలకు అధిపతిగా, ఈశ్వరునిగా తెలుసుకొని మనస్సులో నిత్యం ఆరాధించు. కర్మబంధాలను ఖండించి ఈశ్వరునికి అర్పించి, పూజ చేయి. భోగాలను అనుభవించడం వల్ల (పూర్వ) పుణ్యాలు నశిస్తాయి. వ్రతాల మూలమున పాపసమూహాలు నీ నుండి తొలగిపోతాయి.

ప్రహ్లాదుడు కోరికలు కోరకున్నా రాజ్యాధికారాన్ని, భోగాలనే కర్మలను అనుభవించక తప్పదు. కనుక, నరసింహుడు ఆ కర్మలన్నీ ఈశ్వరార్పణం చేస్తే పాపపుణ్యాలు రెండూ అంటని జీవునికి దేవునితో అభేదం సిద్ధిస్తుందని చెబుతున్నాడు.

వ. మఱియు నటమీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్య విరాజమానంబును, దివిజరాజజేగీయమానంబును బరిపూరిత దశదిశంబును నైన యశంబుతోడ ముక్తబంధుఁడవై నన్ను డగ్గఱెదవు. వినుము.

373

తా ॥ ఇంక ఆ తరువాత కాలక్రమాన ఉపాధి అయిన శరీరం వదలి ముల్లోకాలలో విరాజమానమై, దేవేంద్రుని చేత పొగడబడినది, పది దిక్కుల నిండినది అయిన కీర్తితో సంసారవిముక్తుడవై, నన్ను చేరుకుంటావు; విను.

ఆ. నరుఁడు ప్రియముతోడ నా యవతారంబు, నీ యుదారగీత నికరములును మానసించునేని మఱి సంభవింపఁడు, కర్మబంధ చయముఁ గడిచిపోవు.

374

తా ॥ మానవుడు ప్రీతిపూర్వకంగా నా నరసింహావతారాన్ని, నీవు చేసిన గొప్పవైన స్తుతుల గీతికలను మననం చేసినట్లయితే మళ్ళీ జన్మించడు, కర్మబంధాలను అతిక్రమిస్తాడు.”

వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె.

375

తా ॥ అనగానే, ప్రహ్లాదుడు ఈ విధంగా అన్నాడు:

సీ. దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు, నీవు చంపుటఁ జేసి నిగ్రహమున
మా తండ్రి రోషనిమగ్నుఁడై సర్వలో, కేశ్వరుఁ బరము నిన్నెఱుఁగ లేక
పరిపంథి పగిది నీ భక్తుండనగు నాకు, నపకారములు సేసె; నతఁడు నేఁడు
నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ, గావునఁ బాపసంఘంబు వలనఁ

తే. బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర!, వరము వేఁడెద నా కిమ్ము వనజనేత్ర!
భక్త సంఘాత ముఖపద్మ పద్మమిత్ర! భక్త కల్మషవల్లికా పటులవిత్ర!

376

తా ॥ "భక్తసమూహము యొక్క ముఖములనే పద్మాలకు సూర్యునివంటి దేవా! భక్తుల పాపాలనే తీగలకు కొడవలి వంటి ప్రభూ! దివ్యమంగళ స్వరూపా! కమలనేత్రా! కోరలు గల వరాహమై అవతరించి, మునుపు మా తండ్రి సోదరుని నీవు చంపటం వల్ల తిరస్కారభావంతో క్రోధంలో మునిగిన మా తండ్రి సమస్త లోకాలకు ప్రభువైన, పరమాత్ముడవైన నిన్ను తెలుసుకోలేక – శత్రువు వలె, నీ భక్తుడినైన నాకు అపకారాలు చేసినాడు. అటువంటివాడు ఇప్పుడు పవిత్రమైన నీ చూపుల వల్ల (కల్మషం తొలగి) స్వచ్ఛతను పొందాడు. కనుక పాపసమూహం తొలగి పవిత్రుడయ్యేటట్లుగా వరం కోరుతున్నాను. అనుగ్రహించు."

వ. అనిన భక్తవత్సలుం డిట్లనియె.

377

తా ॥ అనగానే భక్తుల పట్ల వాత్సల్యం గల నరసింహస్వామి ఇట్లా అన్నాడు:

మ. నిజభక్తుండవు నాకు, నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిస్సప్త పూ
ర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు, విజ్ఞాన దీ
ప జితానేక భవాంధకారు లగు మద్భక్తుల్ వినోదించు దే
శ జనుల్ దుర్జనులైన శుద్ధులు సుమీ! సత్యంబు దైత్యోత్తమా!

378

తా ॥ "రాక్షసులలో శ్రేష్ఠుడా! ప్రహ్లాదా! నీవు నాకు నిజమైన భక్తుడివి. నీ తండ్రి నిన్ను కొడుకుగా పొంది తన పితరులు ఇరవైఒక్క తరం వారితోపాటు పావనుడై శుభస్థితిని పొందుతాడు. విజ్ఞానదీపం చేత అనేకజన్మల పాపపు చీకటిని జయించిన నా భక్తులు సంతుష్టులై నివసించే ప్రదేశాలలో ఉండి వారి ప్రేమకు పాత్రులైన జనులు దుర్మార్గులైనా పవిత్రులౌతారు సుమా! ఇది సత్యం.

సీ. ఘన సూక్ష్మభూత సంఘాతంబు లోపల, నెల్లవాంఛలు మాని యెవ్వ రయిన
నీ చందమున నన్ను నెఱయ సేవించిన, మద్భక్తు లగుదురు, మత్పరులకు
గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతి, విటమీఁద, వేదచోదితమైన విధముతోడఁ
జిత్తంబు నామీఁదఁ జేర్చి మీ తండ్రికిఁ, బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు

తే. మతఁడు రణమున నేఁడు నా యంగమర్శ, నమున నిర్మల దేహుఁ డై నవ్యమహిమ
నపగతాఖిల కల్మషుఁడై తనర్చి, పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత!

379

తా ॥ పావనమైన నడవడి కలవాడా! స్థూల సూక్ష్మములైన ప్రాణుల సమూహంలో ఎవరైతే కోరికలన్నింటినీ వదలుతారో వారు (నీ వలె) నన్ను సంపూర్ణంగా సేవించే నా భక్తులవుతారు. నా భక్తులలో లక్ష్యంగా చెప్పడానికి నీవే తగినవాడవు. ఇకపై నా యందే నీ మనస్సు చేర్చి, వేదశాస్త్రవిధితో మీ తండ్రికి అపరకర్మలు సంతృప్తికరంగా ఆచరించు. యుద్ధంలో ఈనాడు అతడు నా దేహస్పర్శతో పవిత్రదేహం కలవాడై, సరికొత్త వైభవంతో,

సమస్తపాపాలు పోగొట్టబడినవాడై, ఉత్తమలోకాలకు చేరుతాడు."

వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్య కశిపునకుం బ్రహ్లాదుండు పరలోక క్రియలు సేసి భూసురోత్తములచేత నభిషిక్తుం డయ్యె, నయ్యెడం బ్రసాద సంపూర్ణ ముఖుండైన శ్రీ నృసింహదేవునిం జూచి దేవతా ప్రముఖ సహితుండైన బ్రహ్మదేవుం డిట్లనియె.

380

తా ॥ అని ఈ విధంగా నరసింహదేవుడు అనుజ్ఞ ఇవ్వగా, ప్రహ్లాదుడు హిరణ్యకశిపునికి పరలోక క్రియలు చేసిన తర్వాత బ్రాహ్మణశ్రేష్ఠులు పుణ్యనదీజలాలతో అతనిని అభిషేకించారు. ఆ సమయంలో అనుగ్రహంతో సుప్రసన్నముఖుడైన శ్రీనరసింహదేవుని చూసి దేవతాప్రముఖులతో ఉన్న బ్రహ్మదేవుడు ఇట్లన్నాడు:

సీ. దేవ దేవాఖిల దేవేశ! భూత భావన! వీఁడు నాచేత వరము వడసి
మత్సృష్టజనులచే మరణంబు నొందక మత్తుఁడై సకల ధర్మములుఁ జెఱచి
నేఁడు భాగ్యంబున నీ చేత హతుఁడయ్యెఁ, గల్యాణ మమరె లోకముల కెల్ల,
బాలు నీతని మహాభాగవత శ్రేష్ఠుఁ బ్రదికించితివి మృత్యుభయముఁ బాపి

తే. వరము కృప సేసితివి మేలుఁ వారిజాక్ష! నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని, బాధ నొందరు, మృత్యువు బారిఁ బడరు.

381

తా ॥ "దేవదేవా! సమస్తదేవతలకు ప్రభువైనవాడా! ప్రాణులను కాపాడేవాడా! ఈ హిరణ్యకశిపుడు నాచే వరాన్ని పొంది, నేను సృష్టించిన ప్రాణుల వల్ల మరణాన్ని పొందక, గర్వించి, సమస్త శిష్టాచారాలను పాడుచేసి, నేడు అదృష్టం కలిగి నీ చేత చంపబడ్డాడు. లోకాలన్నిటికి శుభం కలిగింది. బాలుడైన పరమ భక్తశ్రేష్ఠుని రక్షించావు. ఇతనికి

మృత్యుభయం, జన్మభయం లేకుండా వరాన్ని ప్రసాదించావు. కమలాల వంటి కన్నులు గల స్వామీ! మేలు. నీ నృసింహావతారాన్ని స్థిరమైన పూనికతో తదేకంగా స్మరించేవారు యముని వల్ల బాధ పొందరు. అపమృత్యువును పొందరు.''

వ. అనిన నరసింహ దేవుం డిట్లనియె.

382

తా ॥ అనగా నరసింహదేవుడు ఇట్లా అన్నాడు:

క. 'మన్నించి దేవశత్రుల, కెన్నఁడు నిటువంటి వరము లీకుము, పాపో
త్పన్నులకు వరము లిచ్చుట, పన్నగముల కమృత మిడుట పంకజగర్భా!'

383

తా ॥ ''పద్మగర్భుడా! దేవతలకు శత్రువులైన రాక్షసులను గౌరవించి ఇటువంటి ఇవ్వరాని వరాలు ఎన్నడూ ఇవ్వకు. నీచ జన్మ గలవారికి వరాలు ప్రసాదించటం పాములకు అమృతాన్ని పోయడం వంటిది.''

వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతా సమూహంబుచేఁ బూజితుండై భగవంతుండైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యెఁ, బ్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు సేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది మునీంద్ర సహితుండై దైత్య దానవ రాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజితుండై దీవించె. అంత నీశానాది నిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబులకుఁ జనిఁ, రిట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణ శాపంబునం జేసి ప్రథమ జన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్ష హిరణ్య కశిపులను వరాహ నారసింహ రూపంబుల నవతరించి వధియించె, ద్వితీయ భవంబున రాక్షసజన్మంబు

దాల్చిన రావణకుంభకర్ణులను శ్రీరామ రూపంబున సంహరించెఁ దృతీయ జన్మంబున శిశుపాల దంతవక్త్రులను పేరులం బ్రసిద్ధి నొందిన వారలను శ్రీకృష్ణ రూపంబున ఖండించె, నివ్విధంబున మూఁడు జన్మంబుల గాఢ వైరానుబంధంబున నిరంతర సంభావిత ధ్యానులై వారలు నిఖిల కల్మష విముక్తులై హరిం గదిసి, రని చెప్పి నారదుం డిట్లనియె.

384

తా ॥ అని ఈ విధంగా ఆజ్ఞ ఇచ్చి, బ్రహ్మాది దేవతలచే పూజలంది, భగవంతుడైన శ్రీనరసింహ దేవుడు అంతర్ధానమైనాడు. ప్రహ్లాదుడు కూడా శివునికి నమస్కరించి, బ్రహ్మకు వందనమాచరించి, ప్రజాపతులకు మ్రొక్కి, భగవత్స్వరూపాలైన దేవతలకు నమస్కరించగా చూసి బ్రహ్మదేవుడు శుక్రాచార్యుడు మొదలైన మునిశ్రేష్ఠులతో కూడి దితిజులు, దనుజులు గల రాక్షసరాజ్యానికి ప్రహ్లాదుని పట్టాభిషిక్తుని చేసి, అతనిచేత పూజింపబడి, దీవించాడు. తరువాత ఈశ్వరుడు మొదలైన సమస్త దేవతలు వివిధంగా ఆశీర్వదించి, ప్రహ్లాదుని ధన్యుని చేసి, బ్రహ్మదేవుణ్ణి ముందుంచుకొని తమతమ స్వస్థానాలకు తరలివెళ్ళారు.

ఈ విధంగా విష్ణువు వైకుంఠ ద్వారపాలకులిద్దరినీ బ్రాహ్మణ శాపం మూలంగా మొదటి జన్మలో – దితి పుత్రులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను – వరాహ నారసింహ రూపాలతో అవతరించి సంహరించాడు. రెండవ జన్మలో – రాక్షసపుట్టుక ధరించిన రావణ కుంభకర్ణులను శ్రీరాముని రూపంలో సంహరించాడు. మూడవ జన్మలో – శిశుపాల దంతవక్త్రులను పేరుతో ప్రఖ్యాతివహించిన వారిని శ్రీకృష్ణుని రూపంతో సంహరించాడు. ఈ విధంగా మూడు జన్మల దృఢమైన వైరముతో, అనుబంధంతో, నిరంతరం అలవడిన ధ్యానంతో వారు సమస్తదోషాల నుండి విముక్తి పొంది విష్ణువును చేరుకొన్నారు" అని చెప్పి నారదుడు ఈ విధంగా అన్నాడు:

ఉ. శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రు సం
హారముఁ బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథ పుత్త్రు సం
చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా

కారముతోడ నే భయముఁ గల్గని లోకముఁ జెందు భూవరా!

385

తా ॥ "ధర్మరాజా! లక్ష్మీప్రదమైన నరసింహుని లీలా ఖేలనాన్ని, ఇంద్రశత్రువైన హిరణ్యకశిపుని సంహారాన్ని, పావనుడైన భగవద్భక్తుడు ప్రహ్లాదుని నడవడిని – మంచి ఆలోచనతో విన్నా, చదివినా, మంగళాకారంతో ఏ భయము కలుగని లోకాన్ని పొందుతాడు.

మ. జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిం
బలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ
జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించుటలు నీ భాగ్యంబు రాజోత్తమా!

386

తా ॥ రాజశ్రేష్ఠా! బ్రహ్మాదిదేవతలు సైతం మనస్సులో ఆలోచించి, వాక్కుతో వర్ణించశక్యం గాని జనార్దనుడనే పేరుతో అవతరించిన పరబ్రహ్మ స్వరూపం నీ ఇంట – మిత్రుడై, మేనత్త కొడుకై, మంత్రియై, మనస్సుకు ఇష్టుడై, గొప్పవైన ఇహపర ఫలాలను ఇచ్చేవాడై మెలగటం నీ అదృష్టం" అని ధర్మరాజునకు నారద మునీంద్రుడు ప్రహ్లాద చరిత్రను వినిపించాడు.

## త్రిపురాసుర సంహారము

క. బహుమాయుఁడైన మయుచే, విహతంబగు హరుని యశము విఖ్యాత జయా
వహముగ నీ భగవంతుఁడు, మహితాత్ముఁడు ము న్నొనర్చె మనుజవరేణ్యా?

387

తా ॥ "ధర్మజా! మయాసురుని వల్ల మహేశ్వరుని మహిమాన్వితమైన యశస్సుకు మచ్చ గలిగింది. అప్పుడు మహా విష్ణువు మహాదేవునికి జయం కలిగించి ఆయన కీర్తికి వన్నె తెచ్చాడు."

వ. అనిన ధర్మనందనుం డిట్లనియె.

388

తా ॥ అనగానే ధర్మరాజు ఈ విధంగా అడిగాడు:

క. ఏ కర్మంబున విభుఁ డగు, శ్రీ కంఠుని యశము మయునిచే సుడివడియెన్?
వైకుంఠుఁ డెవ్విధంబునఁ, గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్?

389

తా ॥ "ఏ పని వల్ల ప్రభువైన శివుని కీర్తికి మయాసురునిచే భంగపాటు కలిగింది? వైకుంఠవాసుడు ఏ విధమైన పూనికతో ఆ కీర్తిని చక్కబరిచాడు? నాకు వివరంగా చెప్పు."

వ. అనిన నారదుం డి ట్లనియె,

390

తా ॥ అనగా నారదుడు ఇట్లా అన్నాడు:

క. చక్రాయుధ బలయుతు లగు, శక్రాదుల కోహటించి శమమున నసురుల్

సక్రోధంబున నరిగిరి, విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా!

391

తా ॥ "రాజా! విష్ణువు యొక్క ఆశ్రయం కలిగిన బలవంతులైన ఇంద్రాదిదేవతల యొక్క పరాక్రమానికి వెనుకకు తగ్గిన రాక్షసులు, కష్టపడినా, కోపం అణచుకొని, పరాక్రమం చూపక, మయుని చాటుకు చేరుకొన్నారు.

వ. ఇట్లు రక్కసులు దన వెనుకఁ జొచ్చిన మాయా నిలయుండును దుర్నయుండును నైన మయుండు దన మాయాబలంబున నయోరజత సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులు వితర్కింపరాని కర్కశ పరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన నక్తంచరు లందఱు నందుఁ బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి సనాయకంబులయిన లోకంబుల నస్తోకంబయిన నిజబలాతి రేకంబున శోకంబు నొందించిన.

392

తా ॥ ఈ విధంగా రాక్షసులు తన వెనుక చేరగా మోసగాడు, దుర్మార్గుడైన మయుడు గర్వంతో విర్రవీగాడు. తన మాయాప్రభావంతో ఇనుముతో, వెండితో, బంగారుతో నిర్మింపబడినటువంటి ఎవరికి తెలియకుండా ఉండే విధంగా కఠినమైన కప్పుతో నిర్మింపబడిన కోటలతో మూడు పురాలను రాక్షసుల కోసం నిర్మించి ఇచ్చాడు. ఇవ్వగా రాక్షసులంతా అందులో ప్రవేశించి, యథేచ్ఛగా తిరుగుతూ, పూర్వపు శత్రుత్వం తలచి, లోకపాలురతో కూడిన లోకాలను శోకాలపాలు చేయసాగారు.

క. లోకాధినాథులెల్లను, శోకాతురు లగుచు శరణు సొచ్చిరి దుష్టా
నీక విదళనాకుంఠున్, శ్రీకంఠున్ భువనభరణ చిత్తోత్కంఠున్.

393

తా ॥ లోకపాలకులందరూ దుఃఖోద్వేగం చెందారు. నిరాటంకంగా దుష్టుల సమూహాలను అణచగలవాడు, లోకాలను కాపాడటానికి ఉత్కంఠతో నిండిన మనస్సు కలవాడు అయిన గరళకంఠుని శరణుజొచ్చారు.

వ. ఇట్లు సకల లోకేశ్వరుండగు మహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి.

394

తా ॥ ఈ విధంగా సమస్తలోకాలకు ప్రభువైన మహేశ్వరుని సమీపించి, లోకపాలకులు ఆయనకు నమస్కరించి, పూజించి, పద్మాల వంటి చేతులు జోడించి ఇలా పలికాడు.

క. త్రిపురాలయులగు దానవు, లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబున్
వపురాది పీడఁ జేసెద, రపరాధకులను వధింపు మగజాధీశా!

395

తా ॥ 'పార్వతీదేవికి ప్రభువైన వాడా! త్రిపురాలలో నివాసమైన రాక్షసులు జయింప రానివారై మాకు ఎప్పుడూ శారీరకంగా అపాయాన్ని తలపెడుతున్నారు. అటువంటి అపరాధులను సంహరించు.

క. దీనులము గాక యుష్మద, ధీనులమై యుండు మేము దేవాహిత దో
ర్లీనుల మైనారము, బల, హీనుల మగు మమ్ముఁగావు మీశాన! శివా!

396

తా ॥ ఈశ్వరా! శివా! నీ ఆధీనంలో మేము సర్వదా దివ్యానందంలో ఓలలాడేవాళ్ళం. కానీ ఇప్పుడు రాక్షస బలం పెరిగి, వారి చేతిలో అణిగిపోయాము. శక్తిలేని వారమైన మమ్ము రక్షించు.'

వ. అనిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు శరణాగతులైన గీర్వాణుల వెఱవకుండుడని దుర్వార బలంబున బాణాసనంబుఁ గేల నందికొని యొక్క దివ్యబాణంబు సంధించి త్రిపురంబుల పయినేసిన మార్తాండ మండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేక బాణసహస్రంబులు సంభవించి భూనభోఽంతరాళంబులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలుగొని త్రిపురంబుల పయిఁ గప్పె, నప్పుడు తద్బాణపావక హేతి సందోహ దందహ్యమానులై గతాసులైన త్రిపురపుర నివాసులం దెచ్చి మహాయోగియైన మయుండు సిద్ధరస కూపంబున వైచిన.

397

తా ॥ అనగానే భక్తుల పట్ల ప్రేమగల పరమేశ్వరుడు తనను శరణువేడిన దేవతలను భయపడవద్దని చెప్పాడు. వారింపరాని బలంతో విల్లును చేతితో అందుకొని, ఒక దివ్యబాణాన్ని గురిపెట్టి త్రిపురాలపై వేయగా సూర్యగోళం నుండి వెలువడే కిరణజాలం వలె ఆ బాణంవల్ల ఉజ్జ్వలమై ప్రకాశించే అనేక వేల బాణాలు పుట్టి, భూమ్యాకాశాలు నిండి మండిపోతూ కుప్పలు తెప్పలై త్రిపురాలను కప్పివేశాయి. అప్పుడు ఆ బాణాల నుండి వెలువడిన అగ్నిశిఖల వలన దహింపబడి ప్రాణాలు కోల్పోయిన త్రిపురాలలోని రాక్షసులను తెచ్చి మహాయోగి అయిన మయుడు తన యోగబలంచేత అమృతరసమున్న (సిద్ధరసం) బావిలో పడవేశాడు.

క. సిద్ధామృత రస మహిమను, శుద్ధ మహావజ్రతుల్య శోభిత తనులై
వృద్ధిం బొందిరి దానవు, లుద్ధత నిర్ఘాతపావకోపము లగుచున్.

398

తా ॥ యోగసిద్ధమైన అమృతరస మహిమతో – స్వచ్ఛమైన, గొప్ప వజ్రసమానమైన తేజం కలిగిన శరీరాలతో రాక్షసులు ఉగ్రమైన పిడుగులు, నిప్పుల వలె వృద్ధి పొందసాగారు.

క. కూపామృతరస సంగతి, దీపితులై నిలిచియున్న దేవాహితులన్

రూపించి చింత నొందెదు, గోపధ్వజుఁ జూచి చక్రి కుహనాన్వితుఁడై.

399

తా ॥ బావిలోని అమృతరస సంబంధం వల్ల ప్రకాశిస్తూ నిలిచి ఉన్న రాక్షసులు ఇలా ప్రబలిపోవటం, నందికేశ్వరుణ్ణి ధ్వజముగా కలిగిన శివునికి చింత కలిగింది. ఇది తెలుసుకున్న విష్ణువు తన మాయావిలాసంతో ఒక ఉపాయాన్ని ఆలోచించాడు.

శా. ఉత్సాహంబున నొక్కపాఁడి మొదవై యూథంబు ఘ్రాణించుచున్
వత్సంబై తన వెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుఁ డే తెంచి యు
ద్యత్సత్త్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్ విలోకించుచుం
దత్సౌభాగ్య నిమగ్నులై మఱచి రాదైత్యుల్ నివారింపఁగన్.

400

తా ॥ వేడుకతో ఒక పాడి ఆవుగా రూపు ధరించాడు. బ్రహ్మ దాని పొదుగును చుంబించే గోవత్సంగా మారాడు. విష్ణువు అక్కడికి వచ్చి, మహాబలంతో ఆ బావిలోని అమృతరసాన్ని తాగాడు. (అక్కడ కాపలా ఉన్న) రాక్షసులు ఆవు అందచందాలు చూడటంలో మునిగి, అడ్డుపెట్టడం మరచిపోయారు.

వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువయి త్రిపురమధ్య కూపామృత రసంబు ద్రావిన నెఱింగి శోకాకుల చిత్తులయిన రసకూపపాలకుంజూచి మహాయోగియైన మయుండు వెఱఁగు పడి, దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె.

401

తా ॥ ఈ విధంగా విష్ణువు మోహపరచే రూపంతో గోవుగా వచ్చి త్రిపురాల మధ్యనున్న బావిలోని అమృతరసం త్రాగటం తెలిసి, దుఃఖంతో వికలమనస్కులైన బావి కాపలాదారులను చూసి యోగసిద్ధుడైన మయుడు ఆశ్చర్యపడి, విధి చేతకు విచారించి, దుఃఖపడక ఇట్లా అన్నాడు:

ఆ. అమరులైన దనుజు లైనను నరులైన, నెంత నిపుణులైన నెవ్వరైన
దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు, వలదు దనుజులార! వగవ మనకు!

402

తా ॥ 'రాక్షసులారా! దేవతలైనా, రాక్షసులైనా, మానవులైనా, ఎంత నేర్పరులైనా, ఎవరైనా దైవగతి దాటలేరు. కాబట్టి మనం దుఃఖించటం తగదు.'

వ. అని పలికె. అంత విష్ణుండు నైజంబులైన ధర్మ జ్ఞాన విద్యాతపో విరక్తి సమృద్ధి క్రియాశక్తి విశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథ సూత కేతువర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైకొని.

403

తా ॥ అని పలికాడు. అప్పుడు విష్ణువు తన సహజశక్తులైన ధర్మము, జ్ఞానము, విద్య, తపస్సు, విషయ వైరాగ్యం, పూర్ణత్వం, క్రియా శక్తి సామర్థ్యముల చేత శివునికి ప్రాముఖ్యం ఇచ్చి, రథము, సారథి, ధ్వజము, కవచము, ధనుస్సు మొదలుగా ప్రధానములైన యుద్ధసాధనాలను కల్పించి ఇవ్వగా, ఈశ్వరుడు వాటిని తీసుకున్నాడు.

మ. శరి యై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై
సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై
పరమేశుం డొక బాణమున్ విడిచెఁ దద్బాణానల జ్వాలలం
బురముల్ గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగన్.

404

తా ॥ శివుడు విల్లంబులు ధరించి, కవచం తొడిగి, గుఱ్ఱాలు పూన్చిన సారథి గల రథం అధిరోహించి, సైన్యంతోపాటు మంచి జండాను, గొడుగును కలిగినవాడై యుద్ధానికి ఉపక్రమించి, ఒక బాణం విడిచాడు. ఆ బాణం నుండి వెలువడిన అగ్నిజ్వాలలు చెలరేగాయి.

ఒక్కసారిగా ఛటఛట ధ్వనులతో భూమి ఆకాశముల నడుమ ప్రదేశం అంతటా నిండిపోయింది. త్రిపురాలు కాలిపోయాయి.

వ. ఇట్లు హరుండు దురవగాహంబులైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబుసేసి కూల్చిన, నమర గరుడ గంధర్వ సిద్ధ సాధ్య యక్ష వల్లభులు వీక్షించి, జయ జయ శబ్దంబులు సేయుచుఁ గుసుమ వర్షంబులు వర్షించిరి, ప్రజలు హర్షించిరి, బ్రహ్మాదులు కీర్తించి, రప్సరసలు నర్తించిరి, దివ్యకాహళ దుందుభి రవంబులును, మునిజనోత్సవంబులును, బ్రచురంబు లయ్యె, నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసుర సంహారంబున నఖిల లోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున.

405

తా ॥ ఈ విధంగా శివుడు చొరరానివైన త్రిపురాలను అభిజిన్ముహూర్తంలో(మధ్యాహ్న సమయంలో) భస్మంచేసి పడగొట్టగా, అమరులు, గరుడులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, యక్షులు చూసి జయజయధ్వనులు చేస్తూ పూలవర్షం కురిపించారు. ప్రజలు సంతోషించారు. బ్రహ్మాదిదేవతలు పొగడసాగారు. అప్సరసలు నాట్యమాడారు. దేవతల వాద్యాలు, కాహళ, దుందుభి శబ్దాలు, మునుల వేడుకలు అధికమై చెలగాయి. ఈ విధంగా జనులకు మేలైన త్రిపురాసుర సంహారంతో సమస్త ప్రజలు సంతోషించారు.

ఆ. తృణకణముల భంగిఁ ద్రిపురంబుల దహించి, పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు శివుఁడు పద్మజాది జేగీయమానుఁడై, నిజ నివాసమునకు నెమ్మిఁ జనియె.

406

తా ॥ అగ్నిహోత్రుడు ఎండుగడ్డిని దహించినట్లుగా త్రిపురాలను నాశనం చేశాడు. శ్రేష్ఠుడు, ఎట్టి వినాశము లేనివాడు, శుభకరమైన కీర్తి గలవాడు అయిన శివుడు బ్రహ్మాదులచే నుతించబడి, నెమ్మదిగా తన కైలాసానికి వెళ్ళాడు.

వ. ఇట్లు నిజమాయా విశేషంబున మర్త్యలోకంబున విడంబించు చున్న విష్ణుని పరాక్రమ విధానంబులు మునిజన వంద్య మానంబులై, సకల లోక కల్యాణ ప్రదానంబులై యుండు ననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె.

407

తా ॥ ఈ విధంగా మానవలోకంలో తన మాయాజాలాన్ని ప్రకటించే విష్ణుని పరాక్రమం తీరుతెన్నులు మునీశ్వరులకు వందనీయాలై, సకలలోకాలకు శుభాలనిచ్చేవిగా ఉంటాయి" అని పలికిన నారదునితో ధర్మనందనుడు ఈ విధంగా అన్నాడు:

## నారదుడు ధర్మరాజుకు వర్ణాశ్రమ ధర్మాలు తెలుపుట

సీ. అనఘాత్మ! సకలవర్ణాశ్రమాచార స, మ్మత ధర్మ మెయ్యది మానవులకు?
నే ధర్మమున నరుం డిద్ధ విజ్ఞానము, భక్తియుఁ బ్రాపించుఁ? బద్మజునకు
సాక్షాత్సుతుండవు, సర్వజ్ఞుఁడవు, నీకు, నెఱుఁగరానిది ధర్మమింత లేదు
నారాయణ పరాయణస్వాంతు లనఘులు, శాంతులు సదయులు సాధువృత్తి

ఆ. మెఱయుచున్న ఘనులు మీ వంటివా రెద్ది, పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు?
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు, వినఁగ నిచ్చ గలదు విమలచరిత!

408

తా ॥ "పుణ్యాత్ముడా! మానవులు అన్ని వర్ణాలవారికి, ఆశ్రమాలకు (వర్ణాశ్రమ ధర్మాలవారికి) సమ్మతమైన ధర్మమేది? ఏ ధర్మాన్ని ఆచరించటం వల్ల మానవుడు ప్రయోజనకరమైన తెలివిని, భక్తిని పొందుతాడు? నీవు బ్రహ్మదేవునికి ఔరస పుత్రుడివి, సమస్తము తెలిసినవాడివి. నీకు తెలియని ధర్మం అంటూ లేదు. నారాయణునియందే చిత్తం నిలిపేవాడవు, పాపములంటని వాడవు, శాంతమూర్తివి, సదయ హృదయుడవు. మీ వంటివారు ఏది పరమ ధర్మమని భక్తిపూర్వకంగా తలుస్తారో, అటువంటి ధర్మరూపాన్ని సమస్తం తెలియజేయి. నిర్మల చరిత గలవాడా! ఎన్నాళ్ళనుంచో వినాలని ఇష్టపడుతున్నాను."

వ. అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి, భువన శోభనంబు కొఱకు బదరి కాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనంబగు ధర్మంబు వింటి, నది సెప్పెద, సకల వర్ణంబుల జనులకు సత్యంబును, దయయును, నుపవాసాది తపంబును, శౌచంబును, సైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, హింసలేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచిత జపంబును, సంతోషంబును, మార్దవంబును,

సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబు లయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకి కొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచి యిచ్చుటయుఁ బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీనారాయణ చరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మ సమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు, నందు సత్కులాచారుండయి మంత్ర వంతంబులైన గర్భాధానాది సంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు. ద్విజునకు యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితంబులు. రాజునకుఁ బ్రతిగ్రహ వ్యతిరిక్తంబులయిన యజనాది కర్మంబు లయిదును బ్రజాపాలనంబును, బ్రాహ్మణులు గానివారివలన దండశుల్కాదులు గొనుటయు, విహితకర్మంబులు. వైశ్యునికిఁ గృషి వాణిజ్య గోరక్షణాది కర్మంబులు, బ్రాహ్మణ కులానుసరణంబును విహితంబులు. శూద్రునకు ద్విజశుశ్రూష సేయ వలయును.

409

తా ॥ అని అడిగిన ధర్మరాజును చూసి నారదుడు ఇట్లా అన్నాడు: "దక్షుని పుత్రికకు తన అంశతో జన్మించి లోకక్షేమం కొరకు బదరీవనంలోని ఆశ్రమంలో తపస్సు చేస్తున్న నారాయణుని ద్వారా సనాతన ధర్మాన్ని విన్నాను. అది వివరిస్తాను. అన్ని వర్ణాల వారికి సత్యము, దయ, ఉపవాసము మొదలైన దీక్షలు, సదాచారము, ఓరిమి, మంచి చెడుల తెలివి, మనస్సును వశమందుంచటం, బహిరింద్రియాలను జయించటం, హింస చేయకుండటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, దానము (కలిగినది ఇవ్వటం), క్రమం తప్పక తగిన జపం చేయటం, సంతృప్తి, మృదుస్వభావం, సర్వమునందు స్వపరభేదం లేని ఉత్తములను సేవించటం, తుచ్ఛమైన కోరికలు కోరకుండటం, ప్రయోజనం లేని పనులు వదలి పెట్టడం, తగినదే మాట్లాడటం, దేహం కంటే వేరైన తనను వెదకటం, అన్నము నీరు ప్రాణులకు పంచిపెట్టడం, ప్రాణులలో పరమాత్మను దర్శించడం, అభేదబుద్ధితో ప్రవర్తించటం, శ్రీమన్నారాయణుని చరణాలను స్మరించటం,

కీర్తించటం, (కథలు) వినటం, సేవించటం, పూజించటం, నమస్కరించటం, దాస్యం నెరపటం, ఆత్మసమర్పణ చేయటం, మిత్రత్వం నెరపటం అనే ముప్పై లక్షణాలు ఉండాలి.

మంచి కులాచారాన్ని పాటిస్తూ, మంత్రయుక్తంగా గర్భాదానాది కర్మలు చేసేవాడు బ్రాహ్మణుడు. ఈ సంస్కారాలకు భంగం కలగకుండా జరపాలి. యజ్ఞాలు చేయటం, చేయించటం, వేదశాస్త్రాలు చదవటం, చదివించటం, దానం ఇవ్వటం, తీసుకోవటం అనే ఆరు కర్మలు శాస్త్రంలో విధింపబడ్డాయి. దాన స్వీకారం తప్ప మిగిలిన అయిదు ధర్మాలూ ప్రజాపాలనం, బ్రాహ్మణులు కానివారి నుండి దండుగలు, పన్నులు తీసుకోవటం దోషులైన వాళ్ళను దండించడం క్షత్రియ ధర్మాలు. వైశ్యునికి (కోమటికి) వ్యవసాయం, వ్యాపారం, గోరక్షణ మొదలైన పనులు, బ్రాహ్మణజాతిని అనుసరించటం శాస్త్రవిధి. విప్రపరిచర్య శూద్రుల ధర్మం.

సీ. విను, కర్షణాదిక వృత్తికంటెను మేలు, యాచింప నొల్లని యట్టి వృత్తి
ప్రాప్తంబుఁ గైకొని బ్రదుకు కంటెను లెస్స, యనుదినంబును ధాన్య మడిగికొనుట
యాయావరముకంటె నధిక కళ్యాణంబు, పఱిగ యెన్నుల ధాన్య భక్షణంబు
శిలవృత్తికంటెను శ్రేయ మాపణములఁ, బడ్డ గింజలు దిని బ్రదుకుఁ గనుట

ఆ. యెదరుచోట నృపతి కీ నాల్గువృత్తులుఁ, దగుఁ, బ్రతిగ్రహంబు దగదు తలఁప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి, వృత్తి నున్న దోషవిధము గాదు.



తా ॥ విను. (మట్టిని) దున్నటం, అడగటం మొదలైన పనికన్నా ఒకరిని అడుగని పని (లభించిందే తీసుకోవటం) మంచిది. తనకు లభించింది తీసుకొని బ్రతకటం కంటే ప్రతిదినం ధాన్యం అడిగి తెచ్చుకోవటం మంచిది. ధాన్యాన్ని ముష్టి ఎత్తటం కంటే చేలలో రాలిపడిన గింజలు ఏరుకొని తినటం మంచిది. అట్లా ఏరుకొని తినటం కంటే అంగడుల వద్ద పడి ఉన్న ధాన్యం తిని బ్రతకటం మేలు. ఆపద సంభవించినప్పుడు రాజుకు ఈ నాలుగు విధాల జీవనం

తగినది. ఆపదలో అవసరమైన వేళలో నీచజాతివాడు మేలుజాతివారి వృత్తిని (జీవనాన్ని) పాటించినా దోషం కాదు.

వ. వినుము. శిలవృత్తియు నుంఛవృత్తియు ఋత మనియు, నయాచితవృత్తి యమృత మనియు, నిత్యయాచ్ఞావృత్తి మృత మనియుఁ, గర్షకవృత్తి ప్రమృత మనియు నెన్నుదు, రట్టి వృత్తుల జీవించుట మేలు, వాణిజ్యంబు సత్యానృత మనియు, శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలుకుదురు, సర్వవేదమయుండు బ్రాహ్మణుండు, సర్వదేవమయుండు క్షత్రియుడు. బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు.

411

తా ॥ విను. రాలిన గింజలు ఏరుకోవటం, పరిగ లేరటం అనే పనులు సత్యమని, ఒకరిని అడుగకుండా బ్రతుకటం అమృతమని (చావులేనిది), నిత్యం అడిగి జీవించటం మృతం (చావుతో సమానం) అని, భూమి దున్నుకొని బ్రతకటం ప్రమృతం (నాతినింద్యము) అంత నిందించ తగినది కాదు అని, వర్తకము – సత్యమూ అబద్ధం కలిసినదని, నీచులను సేవించటం కుక్క బ్రతుకు వంటిదని అంటారు. సమస్త వేదాల స్వరూపం బ్రాహ్మణుడు, సమస్త దేవతల స్వరూపం క్షత్రియుడు (రాజు). బ్రాహ్మణునికి, రాజుకు తగువిధంగా గౌరవించి, సేవించాలి.

క. దమమును, శౌచముఁ, దపమును, శమమును, మార్దవముఁ, గృపయు, సత్యజ్ఞాన క్షమలును, హరిభక్తియు, హ, ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా!

412

తా ॥ రాజా! బాహ్య ఇంద్రియ నిగ్రహం (దమము), శుచిత్వం, తపస్సు, అంతరింద్రియ నిగ్రహం (శమము), సౌమ్యత, దయ, సత్యం, జ్ఞానం, క్షమ, హరియందలి భక్తి, సంతోషగుణం అగ్రజాతివారికి నిజమైన లక్షణాలు.

ఉ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజమున్

ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామమున్ బుధా
చార్యముకుంద సేవలును సత్కృతియుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్.

413

తా ॥ రాజశ్రేష్ఠుడా! పరాక్రమం, దానమిచ్చే స్వభావం, సౌమ్యంగా ఉండటం, మనస్సు వశమందుండటం, ప్రకాశం, ధైర్యం, దేవతలందు భక్తి; పండితులు, గురువులు, భగవంతుడు – వీరిని సేవించటం, ఇతరులను గౌరవించటం, సంతోషింపజేయటం, న్యాయమైన పరాక్రమం, శిష్టులను రక్షించటం రాజుకు ఉండవలసిన లక్షణాలు.

క. ధర్మార్థ కామ వాంఛయు, నిర్మల గురుదేవ విప్ర నివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము, శర్మకరత్వమును వైశ్యజన లక్షణముల్.

414

తా ॥ ధర్మార్థకామాలను కోరటం, రాగద్వేషాలు లేని స్వచ్ఛస్వభావులైన గురువు, భగవంతుడు, బ్రాహ్మణుడు మొదలైన వారిని పూజించటం, గర్వం లేకపోవటం, సంతోషం, తగిన మేలు చేయటం వైశ్యజనుల లక్షణాలు.

ఉ. స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులన్
మాయలు లేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయున్ ధరామరుల సేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియున్ మనుజనాథ! యెఱుంగుము శూద్ర ధర్మముల్.

415

తా ॥ రాజా! దొంగతనం లేని జీవనం, మంచి ఆచారం, స్తుతించటం, నిష్కపటంగా సేవచేయటం, మంత్రాన్ని చదువక పంచయజ్ఞాలు (బ్రహ్మ, పితృ, దేవ, భూత, మనుష్య

యజ్ఞాలు) చేయటం, బ్రాహ్మణులను సేవించటం, గోసంరక్షణ, న్యాయ జీవనం శూద్ర ధర్మాలని తెలుసుకో.

సీ. నిలయము పాటించి నిర్మల దేహియై, శృంగార మే ప్రొద్దుఁ జేయవలయు
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు, చిత్తంబు ప్రేమ రంజింప వలయు
దాక్షిణ్య సంతోష ధర్మమేధాదుల, దైవత మని ప్రియుఁ దలఁప వలయు
నాథుఁ డే పద్ధతి నడచు నా పద్ధతి, నడచి సద్బంధుల నడపవలయు

ఆ. మార్దవమునఁ బతికి మజ్జన భోజన, శయన పాన రతులు జరప వలయు
విభుఁడు పతితుఁడైన వెలఁది ప్రాతివ్రత్య, మహిమఁ బుణ్యుఁ జేసి మనుప వలయు.

416

తా ॥ స్త్రీ ఇంటిని చూసుకొంటూ తాను శుచియై, ప్రతినిత్యం తన ఇంటిని అందంగా అలంకరించుకోవాలి. సత్యమైన, ప్రియమైన మాటల నేర్పరియై భర్త మనస్సును సంతోషపెట్టాలి. దయ, తృప్తి, ధర్మచింతనం, తెలివితేటలు కలిగిన దేవునిగా భర్తను తలచుకోవాలి. భర్త ఏ విధంగా ఉంటే తాను అదే విధానాన్ని పాటించి దగ్గరి బంధువులను ఆదరించాలి. మృదు స్వభావంతో పతికి స్నానపాన ఆహారాదులు సమకూర్చి సౌఖ్యం కలిగించాలి. భర్త భ్రష్టుడైతే స్త్రీ తన పతివ్రతా ధర్మంతో అతనిని ధర్మమార్గానికి మళ్ళించి, ఉత్తమునిగా తీర్చిదిద్దుకోవాలి.

క. తరుణి దన ప్రాణవల్లభు, హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరి కైవడి వర్తించును, హరిలోకమునందు సంతతానందమునన్.

417

తా ॥ స్త్రీ తన భర్తను విష్ణు స్వరూపంగా భావించాలి. తాను లక్ష్మిలా ప్రవర్తించాలి. ఇలా ఉంటే వీరిరువురూ విష్ణు లోకంలో ఆనందంగా జీవిస్తారు.

క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల? భర్త దైవత మని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి, నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్.

418

తా ॥ రాజా! ఉపవాసాలు, వ్రతాలు, జపాలు అనేకం ఎందుకు? భర్త దైవమని కపటం లేకుండా సేవించిన పతివ్రతకు సమస్త లోకాలలో పొందరానిది అంటూ లేదు.

వ. మఱియు సంకర జాతులయిన రజక చర్మకారక నట బురుడ కైవర్తక మ్లేచ్ఛ భిల్లురగు నంత్యజాతు లేద్వురకును జండాల పుల్కస మాతంగ జాతులకును నా యా కులాగతంబులయిన వృత్తులఁ జౌర్య హింసాదులు వర్జించి సంచరింపవలయు, మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబులందును సుఖకరంబు లని వేదవిదులైన పెద్దలు సెప్పుదురు, కారుకారున దున్నెడు క్షేత్రంబు లావు సెడు, నందుఁ జల్లిన బీజంబులు నిస్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు, నిరంతర ఘృత ధారా వర్షంబున దహనంబునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు, నందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు, తద్విధంబున ననవరత కామానుసంధానంబునఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులఁ దనిసి నిష్కామంబై విరక్తి నొందుం గావున సత్త్వ స్వభావంబు తోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహిత ధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు, జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు. శమదమాది వర్ణ లక్షణ వ్యవహారంబులఁ గనవలయు నని మఱియు నారదుం డిట్లనియె.

419

తా ॥ ఇంకా – వివిధ కులాల కలయిక వల్ల కలిగిన జాతులు – చాకలి, మాదిగ, నట్టువ, మ్లేచ్ఛ, జాలరి, యవన, బోయ మొదలైన వారు చండాలురు, బోయలలోని ఒక తెగ, మాతంగులలో ఒక తెగవారికి ఆయా కులాచార ప్రకారం వచ్చిన వృత్తులు ఆచరిస్తూ

జీవించాలి. దొంగతనం, హింస మొదలైనవి ఎవరికీ తగవు. మానవులకు ప్రతియుగంలో స్వభావసిద్ధమైన రెండు ధర్మాలు లోకంలో మేలు చేసేవని వేదాల నెరిగినవారు చెబుతుంటారు.

ప్రతీ కార్తెలో దున్నే భూమి సారాన్ని కోల్పోతుంది. ఆ భూమిలో చల్లిన విత్తనాలు నిస్సారమై బాగా మొలకెత్తవు. ఎడతెగకుండా నేయి ధారగా కుమ్మరిస్తే అగ్ని జ్వలించే శక్తిని కోల్పోయి చల్లారుతుంది. అందులో హోమం చేసిన వస్తువులు ఫలితాన్ని ఇవ్వవు. ఆ విధంగానే నిరంతరం కోరికల అనుభవంతో తాదాత్మ్యం చెందిన మనస్సు కోరికలు తీరి, తృప్తిని చెంది, ఇక కోరికలు లేక, విరక్తిని పొందుతుంది. కనుక సాత్త్విక ధర్మంతో ఎప్పుడూ వంశాచార క్రమంగా తనకు విధింపబడిన ధర్మాన్ని తప్పక ప్రవర్తించే మానవుడు మెల్లగా స్వభావసిద్ధమైన కర్మాచరణను విడిచి, ముక్తిని పొందుతాడు. పుట్టుకతో, మానవుని కులాన్ని నిర్ణయించనక్కరలేదు. అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహాదులు మొదలైన లక్షణాల ఆచరణతో గుర్తించాల" ని ఇంకా నారదుడు ఈ విధంగా అన్నాడు:

క. క్రమమున వర్ణంబుల చి, హ్నము లెల్లను జెప్పఁబడియె, నాశ్రమముల ధ
ర్మము లెఱిఁగించెద నన్నియు, సమదాహిత హృదయశూల! సదమలశీలా!

420

తా ॥ "గర్వించే శత్రువుల గుండె శూలానివి, నిర్మల స్వభావుడవు అయిన ధర్మరాజా! వరుసగా జాతుల ధర్మాలన్నీ చెప్పాను. ఇక బ్రహ్మచర్యాది ఆశ్రమ ధర్మాలన్నీ తెలియజేస్తాను.

వ. వినుము – బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పలాశదండ కమండలు ధరుండును. సంస్కారహీన శిరోరుహుండును, దర్భహస్తుండును, శీల ప్రశస్తుండును, మౌనియునై త్రిసంధ్యంబును బ్రహ్మ గాయత్త్రి జపియించుచు, సాయం ప్రాత రవసరంబుల నర్కపావక గురుదేవతోపాసనంబులు సేయుచు, గురుమందిరంబునకుం జని దాసుని చందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి వేదంబులు చదువుచు

నధ్యయనోపక్రమావసానంబులు గురుచరణంబులకు నమస్కరించుచు, రేపు మాపును విహిత గృహంబుల భిక్షించి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మిత భోజనంబు గావించుచు, విహిత కాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజన మాత్రభాషణంబు లొనర్చుచు, గురుపరాంగనల వలన నభ్యంగకేశ ప్రసాధన శరీర మర్దన మజ్జన రహస్య యోగంబులు వర్జించుచు, గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్య భాషణుండయి సంచరింపవలయు.

421

తా ॥ బ్రహ్మచర్యంలో ఉన్నవాడు మూడు వరుసల గడ్డి తాడును (మౌంజి), గోచి, జందెము, జింక చర్మం, మోదుగు కఱ్ఱ, కమండలాలను ధరించి, సంస్కారం చేయని శిరోజాలు గలవాడు, దర్భలు చేత కలవాడు, మంచి నడవడి కలవాడు, ఎక్కువ మాట్లాడనివాడు అయి, మూడు సంధ్యలలో బ్రహ్మరూప గాయత్రి మంత్రాన్ని జపిస్తాడు. ప్రాతః సాయంకాలాలలో సూర్యోపాసనం, అగ్ని ఆరాధన, గురువందనం, దేవతార్చనం చేయాలి. గురువు గృహానికి పోయి సేవకుని వలె భక్తి, వినయం, చిత్త నిర్మలత్వం కలిగి వేదాధ్యయనం చేస్తూ, చదువు ఆరంభానికి ముందు, చివర గురువు పాదాలకు నమస్కరించాలి. పగలు, రాత్రి శాస్త్ర విహితములైన ఇండ్లలో భిక్షచేసి, ఆ భిక్షను గురువుకు సమర్పించి, ఆయన అనుమతితో మితంగా ఆహారం స్వీకరించాలి. శాస్త్రంలో చెప్పిన సమయాలలో ఉపవాసం ఉంటూ, స్త్రీలతోనూ, స్త్రీలపట్ల ఆసక్తిగలవారితోనూ సంభాషించకుండా, వారికి దూరంగా ఉండాలి. గురుపత్ని చేత, ఇతరస్త్రీల వల్ల – తలంటు, తల దువ్వించటం, శరీరానికి నలుగు పెట్టించుకోవటం, స్నానం, ఏకాంతంగా సంభాషించటం మొదలైనవి వదలిపెట్టి, వారి ఇంటిలో ఉండక, ఇంద్రియాలను వశపరచుకొన్నవాడై, సత్యాన్నే మాట్లాడుతూ నడచుకోవాలి.

ఆ. పొలఁతి దావవహ్ని; పురుషుఁ డాజ్యఘటంబు, కరఁగ కుండరాదు కదిసెనేని,
బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు, వడుగు కింతి పొత్తు వలదు వలదు.

422

తా ॥ రాజా! స్త్రీ కార్చిచ్చు వంటిది. పురుషుడు నేతి కుండ వంటివాడు. సెగ తగలగానే కుండలోని నేయిలా కరగిపోతాడు. అన్నివిధాలా బ్రహ్మచారికి స్త్రీ సాంగత్యం పనికిరాదు.

వ. వినుము. స్వరూప సాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాదికం బయిన యంతయు నాభాస మాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుం డయిన యీశ్వరుండు గాకుండు, నంతదడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి బుద్ధిమానుట కర్తవ్యంబు గాదు, బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁడైన జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానంబు సేసిన మూఢుండగుం గావున, రహస్యంబునం బుత్త్రిక నైనం డాయకుండవలయు.

423

తా ॥ విను. ఆత్మస్వరూపం తెలుసుకున్న జీవుడు బాహ్యేంద్రియాలకు కనిపించేదంతా ఆభాస (ప్రతిఫలనం)గా నిశ్చయించి, తానూ, ఈశ్వరుడు ఒకటేనని మానవుడు ఎంతవరకూ గ్రహించలేడో, అంతవరకు ఈమె స్త్రీ, నేను పురుషుడిని అనే భేదభావం వదలటం మంచిది కాదు. బ్రహ్మచారి, తపస్వి, గృహస్థు వీరిలో ఎవరైనా మనస్సు పరిణతి చెందకుండా స్త్రీపురుష భావం లేక (అద్వైతానుసంధానం) అభేదాన్ని పాటిస్తే యుక్తాయుక్తాలను కోల్పోతాడు. కనుక ఒంటరిగా ఉన్నప్పుడు పుత్రికనైనా సమీపించకూడదు.

చ. శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం
కరణము లెల్ల మాని ఋతుకాలమునన్ నిజభార్యఁ బొందుచుం
దరుణులఁ జూడఁబాఱక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జి యై
గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్క గృహస్థు భూవరా!

424

తా ॥ రాజా! శిరస్సునకు, శరీరానికి స్నానాలూ, చందన భూషణాదులు మొదలైన అలంకారాలే ప్రధానమని భావించక, ఋతుకాలంలో మాత్రమే ఆ యా సంస్కారాలు చేసుకుని తన భార్యను పొందాలి. ఇతర స్త్రీలను చూడటానికి ఇష్టపడక, నిష్ఠ కలిగి మధుమాంసాలను విడిచి, సత్ప్రవర్తనతో తన ధర్మం నిర్వర్తించినవాడే ఉత్తమ గృహస్థుడు.

వ. మరియు ద్విజుండు గృహస్థుండై గురువుల వలన నుపనిషదంగ సహితంబైన వేదత్రయంబును బఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు సేసి తన బలంబు కొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె, వనంబున నొండె, నైష్ఠికత్వంబు నాశ్రయించి, ప్రాణులతోడ జీవించుచు గురువునందు, నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుతదర్శనంబు సేయుచు నింద్రియ వ్యసనాది మగ్నుండు గాక యెఱుక గలిగి వర్తించుచుఁ బరబ్రహ్మంబు నొందు.

425

తా ॥ ఇంకా బ్రాహ్మణుడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, గురువుల వద్ద ఉపనిషత్తులు, శిక్ష, వ్యాకరణం ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనే అంగాలతో కూడిన మూడు వేదాలనూ చదివి, తన బుద్ధిబలం కొద్దీ అర్థవిచారం చేసి, గురువులకు కోరినవానిని దక్షిణగా ఇవ్వాలి. ఇంట గాని, అడవిలో కాని, నియమనిష్ఠలతో ఉండాలి. గురువులో, అగ్నిలో, ఆత్మలో, సర్వప్రాణులలోనూ అచ్యుతుణ్ణి దర్శించాలి. విషయాసక్తిలో మునిగిపోక, వ్యసనాలకు లోనుగాక, తెలివి కలిగి ప్రవర్తిస్తూ గృహస్థుడు పరబ్రహ్మమును పొందుతాడు.

క. వినుము వనప్రస్థునకున్, మునికథితము లైన నియమములు గల, వా చొ
ప్పున వనగతుఁడై మెలఁగెడి, ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా!

426

తా ॥ రాజా! విను. వానప్రస్థ జీవనంలో ఉన్నవారి కోసం మునులు కొన్ని ధర్మాలు

బోధించారు. వారు చెప్పిన విధంగా నియమాలు పాటిస్తూ అడవిలో సంచరించే పుణ్యాత్ముడు తేజోలోకమైన మహర్లోకాన్ని పొందుతాడు.

వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని, దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబుసేసి యొండె. నామంబులు సేసియొండె నర్కపక్వంబులైన ఫలాదులొండె భక్షించుచు వన్యాహారంబుల నిత్య కృత్యంబులయిన చరు పురోడాశంబు లొనర్చుచుఁ, బ్రతిదినంబును బూర్వ సంచితంబులు పరిత్యజించి నూతనద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్ని కొఱకుఁ బర్ణశాలయైనఁ బర్వత కందరం బయిన నాశ్రయించుచు, హిమ వాయు వహ్ని వర్షాతపంబులను సహించుచు, నఖ శ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక, జటిలుం డై వసియించుచు, దండాజిన కమండలు వల్కల పరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన, నెనిమిదైన, నాలుగైన, రెండైన నొక వత్సరంబయినఁ దపః ప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు, దైవవశంబున జరారోగంబుల చేతఁజిక్కి నిజధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుఁడయి యగ్నుల నాత్మారోపణంబులు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీర రంధ్రంబులును, గాలియందు నిశ్వాసంబును, దేజంబు లోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంస ప్రముఖంబులును, వహ్నియందు వక్తవ్యంబుతోడ వాక్కును, నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులును, బ్రజాపతి రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును, సూర్యుని యందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబులందుఁ బ్రచేతస్సహితయయిన జిహ్వయు, క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, గవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియం దహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడఁ జిత్తంబును, బరంబునందు గుణంబులతోడ వైకారికంబును డిందించి

యటమీఁదఁ బృథివిని జలంబునందును, జలంబును దేజంబు నందును, దేజంబును వాయువునందును, వాయువును గగనంబునందును, గగనంబును నహంకార తత్త్వంబునందును, నహంకారంబును మహత్తత్త్వంబునందును, మహత్తత్త్వంబును బ్రకృతియందును, బ్రకృతి నక్షరుండైన పరమాత్మయందును లయంబు నొందించి, చిన్మాత్రావశేషితుం డయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైన వహ్నిచందంబునఁ బరమాత్మయైన నిర్వికార పరబ్రహ్మంబునందు లీనుండు గావలయును.

427

తా ॥ ఆ తరువాత గృహస్థధర్మాన్ని వదలి, అడవికి పోయి, భూమి దున్నకుండా ఫలించే తృణధాన్యం మొదలైనవానిని అగ్నిలో వేగినవి కాని, పచ్చివి కాని, సూర్యకాంతితో పండిన ఫలాలు కాని తింటూ, అడవిలో దొరికే ఆహారంతో ప్రతిదినం చేయదగిన చరు పురోడాశాలు (హవ్యమున వండే కుండలో యజ్ఞార్థం చేసే అపూపము) చేస్తూ; ప్రతిదినం – మునుపు సంపాదించినది వదలిపెట్టి, కొత్త పదార్థాలు సంపాదిస్తూ; అగ్నికార్యానికై కుటీరాన్ని కాని, కొండ గుహను కాని చేరి; మంచు, గాలి, నిప్పు, వర్షము, ఎండ మొదలైన వానిని భరిస్తూ (ఓర్చుకుంటూ), గోళ్ళు, మీసాలు, కేశాలు, గడ్డము తొలగించక, జడలు ధరించినవాడై; దండము, చర్మము, కమండలం నారచీర దర్భాదులు ధరించి పన్నెండైనా, ఎనిమిదైనా, నాలుగైనా, రెండైనా, ఒక సంవత్సరమైనా తపస్సు చేసి కష్టంతో చిత్తము భ్రమించక, ముని వలె తిరుగుతూ జీవించాలి.

దైవయోగం చేత వృద్ధాప్యం వచ్చి, వ్యాధులకు లోనై, స్వధర్మాన్ని ఆచరించడానికి సమర్థుడు కాని సమయంలో ఆహారం మాని, అగ్నులను తనలో నిలుపుకొని, అన్ని కర్మలు వదలి (సన్న్యాసియై) – ఆకాశంలో శరీరగత రంధ్రాలను, గాలిలో శ్వాసను, వెలుగులో శరీరతాపాన్ని, నీటిలో రసాన్ని (శరీరంలోని ద్రవ పదార్థాన్ని), ఎముకలు మాంసము మొదలైనవానిని భూమిలో

విలీనం చేయాలి. అగ్నిలో పలుక దగిన వాక్కును, ఇంద్రునిలో చేతిపనితో పాటు చేతులను, విష్ణువులో నడకతోపాటు పాదాలను, ప్రజాపతిలో రతితోపాటు ఉపస్థను(యోనిని), మృత్యువులో విసర్జనతో పాటు పాయువును(గుదమును), దిక్కులలో శబ్దముతో పాటు చెవిని, వాయువులో స్పర్శతోపాటు చర్మాన్ని, సూర్యునిలో తేజస్సుతోపాటు కన్నులను, నీటిలో వరుణాంశతో కూడిన నాలుకను, భూమిలో వాసనతో కూడిన ముక్కును, చంద్రునిలో కోరికలతోపాటు మనస్సును, వర్ణన చాతుర్యం గల బ్రహ్మలో తెలివితోపాటు బుద్ధిని, రుద్రునిలో అహంకార మమకారాలను, జీవునిలో సత్త్వగుణంతోపాటు మనస్సును, పరబ్రహ్మములో గుణాలతోపాటు వికారాలను విలీనం చేసి, తరువాత భూమిని నీటిలో, నీటిని అగ్నిలో, అగ్నిని వాయువులో, వాయువును ఆకాశంలో, ఆకాశాన్ని అహంకారంలో, అహంకారాన్ని మహత్తత్త్వంలోను, మహత్తత్త్వాన్ని ప్రకృతిలోను, ప్రకృతిని నాశము కాని పరమాత్మలోను లయంచేయాలి. జ్ఞానమొకటే మిగిలిన జీవుని అక్షర రూపముగా తెలిసి, తనకన్నా వేరు లేదని కాల్చబడిన కట్టెలోని అగ్ని వలె పరమాత్ముడైన, మార్పులేని పరబ్రహ్మములో లీనం కావాలి.

క. అనఘ! వనప్రస్థుండై, చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియున్
మనెనేని సన్న్యసింపం, జను నటమీఁదటను ముక్తసంగత్వమునన్.

428

తా ॥ పుణ్యాత్ముడా! అడవిలో నివాసముండి, వానప్రస్థ ధర్మాలు ఆచరిస్తూ, ఇంకా కొంతకాలం బ్రతికినట్లయితే ఆ తరువాత అన్ని బంధాలనుండి విడివడి, సన్న్యసించాలి.

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును, సర్వభూత నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండును, నాత్మారాముండును, సర్వభూతసముండును, శాంతుండును సమచిత్తుండును, నారాయణ పరాయణుండును నై కౌపీనంబను నాచ్ఛాదన మాత్రంబైన వస్త్రంబు ధరియించి దండాది వ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులు గాని శాస్త్రంబులు తర్కింపక యెందును బక్షీకరింపక

శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక. బహువిద్యల జీవింపక మత్తాది వ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కు దినంబు లొక్కయెడ వసింపక. యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ, గార్యకారణ వ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు, సదసన్మయంబైన విశ్వంబునందుఁ బర బ్రహ్మంబయిన యాత్మ నవలోకించుచు జాగరణ స్వప్న సంధి సమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు, నాత్మకు బంధమోక్షణంబులు మాయా మాత్రంబులు గాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువం బనియును నెఱుంగుచు, భూతదేహంబుల సంభవనాశంబులకు మూలం బయిన కాలంబుఁ బ్రతీక్షించుచు, నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞాన విశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాది చిహ్నంబులు ధరియించి యొండె, ధరియింపక యొండె బహిరంగవ్యక్త చిహ్నుండు గాక యంతరంగ వ్యక్తంబైన యాత్మానుసంధానంబు గలిగి మనీషియైన బాహ్యానుసంధాన భావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్త బాలమూకుల తెఱంగుఁ జూపుచుండ వలయును.

429

తా ॥ ఈ విధంగా వానప్రస్థాశ్రమం ఆచరించి, సన్న్యాసం తీసుకొని, దేహమాత్రావిశిష్టుడై జీవించాలి. సర్వభూతాలయందు ఎట్టి అపేక్ష లేనివాడు, భిక్ష తీసుకునేవాడు, ఆశ్రయం లేనివాడు, తనలో తానే క్రీడించేవాడు, అన్ని ప్రాణుల పట్ల సమభావం కలవాడు, శాంతుడు, సుఖదుఃఖాల పట్ల సమస్థితి కలవాడు, విష్ణువునే తలపున నిలిపినవాడు అయి, గోచిమాత్రమే అడ్డుగా ధరించి, దండ కమండలాలు తప్ప తక్కిన వస్తువులను వదలి, పరమాత్మపరం కాని శాస్త్రాలు విసర్జించి, జ్యోతిషాది విద్యలతో జీవనం సాగించక, జీవుడు దేవుడు అనే భేదాలతో యుక్తి శాస్త్రాలను వాదించక, ఏ మతపక్షము వహించక, శిష్యులకు శాస్త్రవిషయాలు మోసగించి చెప్పక, అనేక విద్యలతో జీవించక, మఠాలూ ఆశ్రమాలను నెలకొల్పి వ్యాపారాలు మొదలుపెట్టి ఆ లాభార్జనతో సంతోషాన్ని పొందే ప్రయత్నాలు చేయక, చాలా రోజులు ఒక దగ్గర నివసించక,

ప్రతి ఊరిలో ఒకరాత్రి మాత్రమే నిలుస్తూ, కార్యము – కారణాల కన్న వేరైన పరమాత్మలో విశ్వాన్ని చూస్తూ, సత్యాసత్యమైన విశ్వంలో పరబ్రహ్మమైన ఆత్మను చూస్తూ; మెలకువ, స్వప్నముల సంధి సమయాలలో ఆత్మదర్శనానికై నిరీక్షిస్తూ, ఆత్మకు బంధమోక్షాలు మాయామాత్రాలు, కాని వాస్తవంగా లేవని భావించాలి. దేహానికి బ్రతుకటం స్థిరం కాదని, మృత్యువు సత్యమని తెలుసుకుంటూ, పాంచభౌతిక దేహాల పుట్టుకకు, నాశమునకు మూలమైన కాలానికై ఎదురుచూస్తూ ఈ విధంగా జ్ఞానం కలిగే వరకు మెలగి, ఆ తరువాత విశిష్టమైన తెలివి కలిగిన పరమహంస తత్త్వాన్ని పొంది, దండము మొదలైన చిహ్నాలు ధరించి కానీ, ధరించక కానీ భౌతికంగా కనిపించే లక్షణాలు కాక మనోగోచరమైన జీవబ్రహ్మైక్య భావనతో ప్రజ్ఞ కలవాడై మెలగాలి. బయటికి తెలిసే ధర్మాల మూలంగా ఇతరులకు ఉన్మత్తునిలా, బాలునివలె, మూగవానివలె కనిపించాలి.

# ప్రహ్లాద అజగర సంవాదము

క. మునివల్లభుఁ డజగరుఁడును, సునయుండు హిరణ్యకశిపు సూనుండునుము
న్నొనరించిన సంవాదము, విను మీ యర్థంబునందు వెలయు నరేంద్రా!

430

తా ॥ ధర్మరాజా! పూర్వం మునిశ్రేష్ఠుడైన అజగరునకు, హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదునకు జరిగిన సంభాషణ ఈ సందర్భానికి తగినది. చెబుతాను విను.

వ. తొల్లి భగవత్ప్రియుండయిన ప్రహ్లాదుండు కతిపయామాత్య సమేతుండయి లౌకికతత్త్వంబు నెఱింగెడి కొఱకు లోకంబుల సంచరించుచు నొకనాఁడు కావేరీతీరంబున సహ్యపర్వత తటంబున ధూళి ధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబుల తోడ గూఢంబైన నిర్మల తేజంబుతోఁ గర్మాకారవచోలింగ వర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁబడక నేల నిద్రించుచు నజగర వ్రత ధరుండైన మునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబు దెలియ నిశ్చయించి యి ట్లనియె.

431

తా ॥ పూర్వం భగవంతునికి ఇష్టుడైన ప్రహ్లాదుడు కొద్దిమంది మంత్రులతో కూడి లోకధర్మాన్ని తెలుసుకోవడానికి దేశాలలో తిరుగుతూ, ఒకనాడు కావేరీ నదీ తీరం చేరుకున్నాడు. అక్కడ సహ్యపర్వత ప్రాంతంలో దుమ్ముతో కప్పబడిన కాళ్ళు చేతులు గల శరీరంతో, అద్భుతమైన తేజస్సుతో కార్యం వల్ల కానీ, ఆకాశం వల్ల కానీ, మాట వల్ల కానీ లింగ భేదం వల్ల కానీ వర్ణాశ్రమాదుల వల్ల కానీ, ఏ మాత్రం గుర్తించడానికి వీలుకాకుండా నేలపై నిద్రిస్తూ కొండచిలువ నడవడితో ఉన్న ఒకానొక మునిని చూసి, దగ్గరగా పోయి, శాస్త్రవిధిని పూజించి, మునిపాదాలకు తలను ఆన్చి మ్రొక్కి, అతనిని గూర్చి తెలుసుకోవాలనే అభిప్రాయంతో

ఈ విధంగా అన్నాడు:

సీ. భూమి నుద్యోగియై భోగియై యుండెడి, నరునికైవడి మునినాథ! నీవు
ఘనశరీరము దాల్చి కదలవు, చిత్ర ము, ద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు
ధనవంతునకుఁ గాని తగు భోగములు లేవు, భోగికి గాని సంపూర్ణమైన
తనువు లే, దుద్యోగ ధనభోగములు లేక, నేల నూరక వడి నిద్ర వోపు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు?, సముఁడ వార్యుఁడవు, విశారదుఁడవు
బుద్ధినిధివి, జనులఁ బొగడవు, దెగడవు, నిద్ర ప్రతిదినంబు నిలుప నేల?

432

తా ॥ "మునిశ్రేష్ఠుడా! నీవు మహాప్రయత్నం చేసి, మహాభోగి వలె జీవితం గడిపే మానవుడిలా గొప్ప శరీరాన్ని కలిగి, కదలక మెదలక ఉన్నావు. ఆశ్చర్యం గొలిపే విషయం. కష్టపడే వానికి గాని సంపద లభించదు. సంపద గల వానికి గాని తగిన సుఖాలు లభింపవు. సౌఖ్యాలను అనుభవించేవానికి గాని సర్వాంగ సంపూర్ణ (అందమైన) దేహం కలుగదు. ప్రయత్నం, సంపద, సుఖాలు లేక నేలపై ఊరకే (నిష్క్రియంగా) పడి నిద్రపోయే నీకు సాటిలేని ఈ సుందర దేహం ఏ విధంగా కలిగింది? స్థితప్రజ్ఞుడవు, పూజనీయుడవు, విద్వాంసుడవు, జ్ఞానివి, జనులను నిందించవు; పొగడవు. ప్రతిదినం నిద్రావస్థలోనే ఎందుకుంటున్నావు"

వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుండయి మునీంద్రుడు తదీయ మధురాలాపసుధారస ప్రవాహంబులు కర్ణంబులఁ బరిపూర్ణంబులైన నతని నవలోకించి యిట్లనియె.

433

తా ॥ అని ఈ విధంగా ప్రహ్లాదుడు అడుగగా, వెలిగిపోయే ముఖం గల ఆ మునిశ్రేష్ఠుడు ఆతని తీయని మాటలనే అమృతధారలు చెవులకు ఇంపుగా తోచి, ఆతని చూసి ఈ విధంగా

అన్నాడు:

సీ. ఆంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు, వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!
విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తి ల, క్షణములు నీ యెఱుంగనివి లేవు,
భగవంతుఁడగు హరి పాయక నీ మనో, వీథి రాజిల్లుచు వెలుఁగు ఠేని
క్రమమున బహుళాంధకారంబుఁ బరిమార్చుఁ, బరమ సాత్త్వికుఁడవు, భద్రబుద్ధి

ఆ. వైన నీవు నన్ను నడిగెదు గావున, విన్న ధర్మమెల్ల విస్తరింతు
నిన్నుఁ జూడఁ గలిగె నీ తోడిమాటల, నాత్మశుద్ధి గలిగె ననఘచరిత!

434

తా ॥ "పుణ్యాత్ముడా! సూక్ష్మదృష్టితో అంతా తెలిసినవాడవు. అసురశ్రేష్ఠా! పెద్దలకు ఇష్టుడవు. సమస్త ప్రాణికోటి ప్రవృత్తి, నివృత్తి లక్షణాలలో నీకు తెలియనివి లేవు. భగవంతుడైన శ్రీహరి ఎప్పుడూ నీ హృదయంలో సూర్యుని వలె ప్రకాశిస్తూ అజ్ఞానాంధకారాన్ని పోగొడతాడు. గొప్ప సాత్త్వికలక్షణం కలవాడివి, మంచిబుద్ధి గల నీవు నన్ను అడుగుతున్నావు కనుక (పెద్దవారి వల్ల) విన్న ధర్మవిషయాలన్నీ వివరిస్తాను. నిన్ను చూసి మాట్లాడినందువల్ల మనస్సుకు నిర్మలత్వం కలిగింది.

వ. వినుము. ప్రవాహకారిణియై విషయంబుల చేతం బూరింపరాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేను నానావిధ యోనులందుఁ బ్రవేశించుచు, వెడలుచు నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గ ద్వారంబును, నధర్మంబున శునకసూకరాది తిర్యగ్జంతు యోని ద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణ దుఃఖమోక్షణంబుల కొఱకు ధర్మంబు సేయు దంపతుల వ్యవహారంబు గని సర్వక్రియా నివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుఁడై ప్రకాశించునని నిర్ణయించి భోగంబులు మనోరథ జాత మాత్రంబులు గాని, శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల

ననుభవించుచు నుండుదు, నివ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుఁగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబులైన శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబులని పాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోర సంసార చక్ర పరిభ్రాంతుండై దైవతంత్రంబులైన దేహాదుల చేత నాత్మకు సుఖంబును దుఃఖనాశనంబునుం గోరుచు నిరీశుండైన వాని ప్రారంభంబులు నిష్ఫలంబులగు, నదియునుంగాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖకరంబుగాని సుఖకరంబు గాదు, లోభవంతులయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజచోర యాచక శత్రుమిత్రాది సర్వస్థలంబులందు శంకించుచు దానభోగంబులు మఱచి యుండుదురు, ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు, శోకమోహ భయక్రోధరాగశ్రమాదులు వాంఛామూలంబులు, వాంఛ లేకుండవలయును.

435

తా ॥ విను. విషయ సుఖాల ప్రవాహంలో పడి, తృప్తి పొందక పరుగులిడుతూ కర్మబంధంలో చిక్కుకుని అనేక గర్భాలలో ప్రవేశిస్తూ, బయటపడుతూ, చివరికి మానవదేహం ధరించాను. దానిలో ధర్మవర్తనం చేత స్వర్గలోకాన్ని పొందీ, అధర్మవర్తనంతో శునక, సూకరాది వివేకహీన జంతువుల కడుపున పుట్టి, తిరిగి మానవునిగా జన్మించాలని విచారించి, సుఖప్రాప్తి కొరకు, దుఃఖనివృత్తి కొరకు సద్వర్తనం గల భార్యాభర్తల నడవడిని చూసాను. సమస్త క్రియలనుంచి నివృత్తి పొందిన జీవుడు స్వతంత్రుడుగా ప్రకాశిస్తాడని నిశ్చయించి, భోగాలనేవి మనస్సున పుట్టినవే కాని స్థిరంకావని పరీక్షించి, (కోరికల నుండి) మరలి, ఏ ప్రయత్నం లేక, నిద్రిస్తూ, పూర్వం కూడబెట్టిన కర్మభోగాలను అనుభవిస్తూ ఉన్నాను.

ఈ విధంగా తనకు సుఖానుభవమైన పురుషార్థం తనయందే ఉన్నదని తెలియని పురుషుడు నాచుతో కప్పబడిన మంచినీటిని విడిచి (భ్రమింపజేసే) ఎండమావులను నీరుగా భావించి పరుగెత్తే మూర్ఖునివలె నిజం కాని భేదభావంలో ప్రవేశించి, దారుణమైన సంసార

చక్రంలో పడి తిరుగుతున్నాడు. భగవంతునిచే కల్పించబడిన దేహాదుల వల్ల ఆత్మకు సుఖాన్నీ దుఃఖనివృత్తినీ కోరుతూ, ఈశ్వరుణ్ణి తెలుసుకొనలేనివాడి పనులు నిష్ఫలాలు అవుతాయి. అదీగాక మానవునికి సంపద లభిస్తే అది దుఃఖాన్ని కలిగిస్తుంది కాని, సుఖకరం కాదు. లోభగుణం కలిగిన సంపన్నులు నిద్రాహారాలు లేక రాజు, దొంగలు, బిచ్చగాళ్ళు, విరోధులు, మిత్రులు అందరినీ అనుమానిస్తూ దానం చేయటం, సుఖపడటం మరచిపోతారు. ప్రాణంమీద, ధనంమీద తీపి ఉన్నవాళ్ళు నిత్యం భయపడుతుంటారు. దుఃఖం, మోహం, భయం, క్రోధం, ప్రేమ, అలసట మొదలైనవన్నీ కోరికలే మూలంగా కలిగినవి. కనుక విషయతృష్ణ లేకుండా ఉండాలి.

మ. సరఘల్ గూర్చిన తేనె! మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో
భ రతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశియై
తిరుగం బోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగమై యుండియుం
జిరకాలంబును వాని వర్తనములం జింతించి యేకాంతినై.

436

తా ॥ తేనెటీగలు జమచేసిన తేనె మానవులకు లభించినట్లు, లోభగుణం కలవారు కూడబెట్టిన సంపద ఇతరుల పాలవుతుంది. లభించిందే తిని, తిరుగకుండానే, పెద్ద శరీరం కలిగి ఉండే కొండచిలువ చాలా కాలం బ్రతుకుతుంది. చాలా కాలం ఆ పాముల నడవడిని గురించి ఆలోచించి, ఒంటరినయ్యాను.

బుద్ధిని ఉపయోగించే మానవునికి ప్రకృతే పాఠశాల. సృష్టిలోని ప్రాణుల నుండి (సజీవ–నిర్జీవముల నుండి) గ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయి. అజగర ముని కొండచిలువ ప్రవృత్తిని, తేనెటీగ లక్షణాన్ని లోభి మానవునికి పోలికగా చెప్పి, ఆ రెంటిని మార్గదర్శకంగా భావించి, కర్మరహితుడైనట్లు వివరిస్తున్నాడు.

క. అజగరమును జుంటీఁగయు, నిజ గురువులగాఁ దలంచి నిశ్చింతుఁడనై
విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్.

437

తా ॥ ఆ కొండచిలువను, ఆ తేనెటీగను (నాకు తత్త్వబోధ చేసిన) నిజమైన గురువులుగా భావించుకొని, చింతలేని వాడనై, జనం సంచరించని ప్రదేశంలో, కర్మబంధాల చిక్కులు లేక మంచి నడవడితో ఉన్నాను.

సీ. అజినవల్కల దుకూలాంబరంబులు గట్టి, యైన గట్టక యైనఁ నలరుచుందు
నాందోళికారథ హయనాగముల నెక్కి, యైన నెక్కకయైన నరుగుచుందు
గర్పూరచందన కస్తూరికా లేప, మైన భూరజమైన నలఁదుచుందు
భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణ, భస్మంబు లందైనఁ బండుచుందు

ఆ. మానయుక్తమైన మానహీనంబైనఁ, దీయనైన మిగులఁ దిక్తమైనఁ
గుడుతు సగుణమైన గుణవర్జితంబైన, నల్పమైనఁ జాల నధికమైన.

438

తా ॥ తోలు, నారచీరలు, పట్టువస్త్రాలు కట్టినా కట్టకపోయినా ఒక విధంగానే ఉంటాను. పల్లకి, రథం, గుఱ్ఱాలు, ఏనుగులు ఎక్కినా ఎక్కకపోయినా తిరుగుతూనే ఉంటాను. కర్పూరం, గంధం, కస్తూరి మొదలైన సుగంధ ద్రవ్యాల పైపూతలైనా, భూమిపై ధూళి అయినా ధరిస్తుంటాను. బంగారు పడకనైనా, ఆకులు, శిలలు, గడ్డి, బూడిదలో అయినా నిశ్చింతగా పడుకుంటాను. మానవమానాలు పట్టించుకోను. లభించేది భుజిస్తాను. బాగుందని, బాగుండలేదని కానీ, తియ్యగా ఉంది, చేదుగా ఉందని కానీ; మనస్సులో దేనిని గురించీ నాకు చింత లేదు!

క. లే దని యెవ్వరి నడుగను, రా దని చింతింపఁ బరులు రప్పించినచోఁ

గా దని యెద్దియు మానను, ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్.

439

తా ॥ నాకు లేదని ఎవరినీ అడుగను, ఇది లభించలేదని విచారించను. ఇతరులెవరైనా పంపినా దానిని కాదనను, వద్దనను. దేన్నీ కోరను. దుఃఖం గానీ సంతోషం గానీ లేనివాడినై విహరిస్తాను.

క. నిందింపఁ బరుల నెన్నఁడు, వందింప ననేకపీడ వచ్చిన, మది నా
క్రందింప, విభవముల కా, నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా!

440

తా ॥ రాజా! ఇతరులనెన్నడు నిందించను. ఎటువంటి కష్టాలు కలిగినా, బాధపడను. సంపదల కొరకు మనస్సులో దుఃఖించను. ఎప్పుడూ నిశ్చింతగా, సంతృప్తిగా ఉండటం అభ్యాసం చేసుకొన్నాను.

వ. ఇట్లు గోరిక లేక యొక్క సమయంబున దిగంబరుండనై పిశాచంబు చందంబున వర్తించుచుఁ బెక్కు దినంబులం గోలెఁ బెనుఁ బాఁప వర్తనంబుఁ గైకొని నిమీలిత లోచనత్వంబున నేకాంత భావంబున విష్ణునియందు వికల్పంబును భేదగ్రాహక చిత్త వృత్తులఁ జిత్తంబు నర్థరూప పరిభ్రమణంబు గల మనంబు నందు మనంబును, నహంకారంబునందు నహంకారంబును, మాయయందు మాయను, నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తినొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు. నీవు భగవత్పరుండవు గావున రహస్యంబైన పరమహంస ధర్మంబు స్వానుభవ గోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరం బగునట్లు సెప్పితి ననిన విని.

441

తా ॥ ఈ విధంగా ఏ కోరిక లేనివాడినై ఒక సమయంలో దిగంబరంగా, దయ్యం వలె ప్రవర్తిస్తూ, చాలా దినాలనుండి కొండచిలువ నడవడి కలిగి, కనులు మూసి, నిశ్చలభావం విష్ణునిలో నిలిపి, భ్రాంతినీ, భేదబుద్ధినీ కలిగించే మనోధర్మాలలోనూ, చిత్తాన్ని వస్తురూపాలలో పరిభ్రమించే మనస్సులోనూ, మనస్సును అహంకారంలోనూ, అహంకారాన్ని మాయలో – మాయను ఆత్మానందంలో లయం చేసాను. సత్యదర్శనం చేస్తూ, విరక్తి పొంది, స్వానుభవంతో ఆత్మస్థితిని అలవరచుకొన్నాను. నీవు భాగవతోత్తముడివి కనుక రహస్యమైన పరమహంస ధర్మాన్ని నాకు అనుభవపూర్వకంగా తెలిసినంతవరకు నీ మనస్సుకు తెలియ చెప్పాన" ని అజగరముని అన్నాడు.

క. ఘను నజగరముని వల్లభు, దనుజేంద్రుఁడు పూజసేసి తగ వీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ, జనియెన్ నిజగేహమునకు శశికులతిలకా!

442

తా ॥ చంద్రవంశ శ్రేష్ఠుడా! ముని మాటలు విని, ఆ అజగర మునీంద్రుణ్ణి పూజించి, యథోచితంగా సెలవు తీసుకొని, అంతరంగంలో సంతోషిస్తూ, స్వగృహానికి తరలి వెళ్ళాడు."

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె.

443

తా ॥ అనగా ధర్మరాజు ఈ విధంగా అన్నాడు:

క. ననుబోఁటి జడగృహస్థుఁడు, మునివల్లభ! యిట్టి పదవి మోదంబున నే
యనువునఁ జెందును? వేగమ, వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాన నిధీ!

444

తా ॥ "మునిశ్రేష్ఠా! నా వంటి అజ్ఞాని గృహస్థుడు ఈ అజగర ముని పొందిన బ్రహ్మానంద

పదవిని అందుకోవడం సాధ్యమా? అందుకై ఏమి చేయాలి? ఓ జ్ఞాననిధీ! త్వరగా నాకు ఆ మర్గాన్ని బోధించు.”

# చతుర్విధ ఆశ్రమముల ధర్మములు

వ. అనిన నారదుం డిట్లనియె, గృహస్థుం డయినవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచిత క్రియ లనుసంధించుచు మహామునుల సేవించి వారల వలన నారాయణ దివ్యావతార కథా శ్రవణంబు సేయుచు, నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచుఁ, బుత్ర మిత్ర కళత్రాది సంగంబులు గలల వంటివని యెఱుంగుచు లోపల నాసక్తి లేక సక్తుని కైవడి వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ దగులంబులేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖీ జ్ఞాతి జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు, ధనధాన్య నిధాన దైవలబ్ధంబుల వలన నభిమానంబు మాని యనుభవించుచు, గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణ మాత్రంబు దొంగిలినవాని దండింపక భుజగ మృగ మూషక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్త్రులభంగి నీక్షించుచు, దేశకాల దైవంబుల కొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు, శునక పతిత చండాలాదులకైన భోజ్యపదార్థంబులు దగిన భంగి నిచ్చుచు నిజవృత్తి లబ్ధంబులగు నశనాదులచేత దేవ ఋషి పితృభూత మానవుల సంతర్పించుచుఁ బంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామి పురుషయజనంబును నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు.

445

తా ॥ అనగానే నారదుడు ఈ విధంగా అన్నాడు: "గృహస్థధర్మంలో ఉన్నవాడు, ఇంట చేసే పనులన్నీ వాసుదేవార్పణంగా చేయాలి. గొప్ప మునులను సేవించి, వారిద్వారా నారాయణుని దివ్యమైన అవతార కథలను వినాలి. ఆ యా సమయాలలో శాంతమూర్తులైన వారితో మెలగాలి. సంతానం, మిత్రులు, భార్య వంటి బంధాలు కలల వంటివని తెలుసుకొని, అంతరంగంలో మక్కువ లేకున్నా ఇష్టం కలిగినట్లు పురుషప్రయత్నాలు చేయాలి. బంధంలో చిక్కుకోక, ధనాన్ని ఇచ్చి తండ్రి – కొడుకు – కూతురు – తోబుట్టువులు – మిత్రులు – దాయాదులకు సంతోషం చేకూరుస్తూ, ధన ధాన్య నిధులు దైవసంకల్పం చేత లభించినవాని పట్ల

అభిమానం పెంచుకోకుండా అనుభవించాలి.

ఇంట గాని, పంటచేనులో గాని కడుపు నింపుకోవడానికి మాత్రమే దొంగిలించినవారిని శిక్షించక, పాములు – మృగాలు – ఎలుకలు – కోతులు – ఈగలు – గాడిదలు – ఒంటెలు వీటిని బాధించక, సంతానం వలె ఆదరిస్తూ, దేశ కాల దైవాలకు అనుగుణంగా ధర్మార్థకామాలందు ప్రవర్తించాలి. కుక్కలు – భ్రష్టులు – చండాల జాతుల వారికైనా తినదగిన పదార్థాలు ఉచితంగా ఇస్తూ, కులవృత్తి చేత లభించిన ఆహారాదులతో దేవతలు – మునులు – పితృదేవతలు – ప్రాణులు – మానవులను తృప్తి పరచాలి. తన కులవృత్తి వలన ప్రాప్తమైన ఆహార పదార్థాలను దేవతలకూ, ఋషులకూ, పితృదేవతలకూ, మానవులకూ, జీవజంతువులకూ సంతర్పణ చేయాలి. ఈ విధంగా పంచయజ్ఞాలు జరిపి అనంతరం పరమాత్మను అర్చించి, జీవుడు బ్రతుకు సదుపాయాన్ని చక్కగా నిర్వర్తించాలి.

ఆ. జనక గురులనైనఁ జంపు నర్థమునకై, ప్రాణ మైన విడుచు భార్య కొఱకు,
నట్టిభార్యఁ బురుషుఁ డతిథిశుశ్రూష సే, యించి గెలుచు నజితు నీశునైన.

446

తా ॥ లోకంలో మానవుడు ధనానికి దాసోహమని తండ్రినైనా, గురువులనైనా సంహరిస్తాడు. కాని భార్యకోసం ధనమేమిటి? ప్రాణమైనా ధారపోస్తాడు. అటువంటి భార్యచేత అతిథి శుశ్రూష చేయించి ధర్మమార్గంలో ఈశ్వరుణ్ణి కూడ గెలవవచ్చు.

ఆ. పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణ ముఖమున, నాహరించి తుష్టుఁ డయిన భంగి
నగ్ని ముఖమునందు హవ్యరాసులు గొని, యైనఁ దుష్టి నొందఁ డనఘచరిత!

447

తా ॥ పుణ్యచరితా! పరాత్పరుడైన ఈశ్వరుడు బ్రాహ్మణ రూపాన భుజించి, తృప్తి పొందినట్లు – అగ్నిముఖంగా వేల్చిన హవ్యసమూహాన్ని స్వీకరించినప్పుడు కూడా తృప్తిపడడు.

వ. కావున గృహస్థుఁడు బ్రాహ్మణులందును, దేవతలందును మర్త్యపశు ప్రముఖ జాతులందును నంతర్యామియు, బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునందు నయ్యై కోరికలు సమర్పించి సంతర్పణంబు సేయవలయు, భాద్రపదంబునఁ గృష్ణ పక్షంబులందును, దక్షిణోత్తరాయణంబులందును, రేయింబగలు సమమైన కాలంబులందును, వ్యతీపాతంబునందును, దినక్షయంబులందును, సూర్యచంద్రగ్రహణంబు లందును, శ్రవణద్వాదశి యందును, వైశాఖ శుక్ల తృతీయయందును, గార్తిక శుక్లనవమియందును, హేమంత శిశిరంబులలోన నాలుగష్టకలందును, మాఘశుక్ల సప్తమియందును, జన్మ నక్షత్రంబుల తోడం గూడిన పున్నమలందును, ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణానూరాధలందును, నుత్త రాత్రయ సహితంబు లయిన యేకాదశుల యందును, జన్మ నక్షత్ర యుక్త దివసంబులందును, మఱియుఁ బ్రశస్తకాలంబు లందును, జననీ జనక బంధుజనులకు శ్రాద్ధంబులును, జపహోమస్నాన వ్రతంబులును, దేవబ్రాహ్మణ సమారాధనంబులును, నాచరింపవలయు, భార్యకుఁ బుంసవనాదికంబును, నపత్యంబునకు జాత కర్మాదికంబును, దనకు యజ్ఞదీక్షాదికంబును, బ్రేతజనులకు దహనాదికంబును, మృతదివసంబున సాంవత్సరికంబును జరపవలయు.

448

తా ॥ కనుక గృహస్థుడు బ్రాహ్మణుల యందు, దేవతలందు, మానవులు, పశువులు మొదలైన జాతులందు, అంతర్యామిగా ఉన్న బ్రాహ్మణముఖుడు అయిన జీవరూప ఈశ్వరునికి ఆ యా కోరికలు సమర్పించి, సంతృప్తి పరచాలి. భాద్రపద మాసం కృష్ణ పక్షంలో, దక్షిణాయన ఉత్తరాయణాలలోనూ, రాత్రి, పగలు సమానంగా ఉండే కాలాలలో, ఒకానొక గ్రహయోగ స్థితిలో, దినక్షయ కాలాలలో, సూర్య చంద్ర గ్రహణ సమయాలలో, శ్రవణానక్షత్రంలో ఉన్న ద్వాదశిలో, శుక్లపక్ష తదియలో, కార్తీక శుక్ల నవమిలో, హేమంత శిశిరాలలో (మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం) నాలుగు అష్టకల (శ్రాద్ధభేదాల)లో, మాఘశుక్ల సప్తమిలో, ఆ యా మాసాల పేర్లు గల నక్షత్రాలతో కూడిన పౌర్ణమి దినాలలో, ద్వాదశితో కూడిన ఉత్తర,

ఉత్తరషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణ, అనూరాధ లందు, ఆ ఉత్తరత్రయంతో కూడిన ఏకాదశులలోను, జన్మనక్షత్రం కలిగిన దినాలలోను, ఇంకా పుణ్యకాలాలలో, తల్లికి, తండ్రికి, బంధుజనులకు శ్రాద్ధకర్మలు, జప హోమ స్నాన వ్రతాలను, దేవతలు బ్రాహ్మణులకు పూజలు, సంతర్పణలను చేయాలి. భార్యకు సీమంతాది కర్మలు, సంతానానికి జాతకర్మాది విధులు, తనకు యజ్ఞదీక్షాదికాలు, మరణించినవారికి దహనాది క్రియలు, చనిపోయిన తిథిలో ఏడాదికి జరుపవలసిన శ్రాద్ధము చేయాలి.

మ. విను, మే దేశములన్ దయా గుణ తపో విద్యాన్వితంబైన వి
ప్రనికాయంబు వసించు, నే స్థలములన్ భాగీరథీ ముఖ్య వా
హిను లుండున్, హరిపూజ లెయ్యెడల భూయిష్ఠప్రకారంబులం
దనరున్ భూవర! యట్టి చోటులఁ దగున్ ధర్మంబులం జేయఁగన్.

449

తా ॥ రాజా! ఏ పుణ్య ప్రదేశాలలో దయాగుణంతో, తపస్సుతో, పాండిత్యంతో కూడిన బ్రాహ్మణ సమూహం నివసిస్తుందో, ఏ ప్రదేశాలలో గంగానది వంటి పవిత్ర ప్రవాహాలుంటాయో, విష్ణుపూజ లెక్కడ ఎక్కువ శ్రద్ధాభక్తులతో ఒప్పుతాయో, అటువంటి చోట ధర్మకార్యాలు చేయటం తగిన పని.

క. హరియందు జగము లుండును, హరిరూపము సాధుపాత్రమం దుండు, శివం
కరమగు పాత్రము గలిగిన, నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా!

450

తా ॥ పావన చరితా! విష్ణువునందు సమస్త లోకాలు ఉంటాయి. శ్రీహరి సాధు సజ్జనులలో ఉంటాడు. సాధుసత్తములు నివసించే ప్రదేశం ఉత్తమమైన తీర్థక్షేత్రంగా భావించవచ్చు.

వ. మఱియుఁ గురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగంబును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును సేతువును బ్రభాసంబును గుశస్థలియును వారణాసియు మధురాపురియును బంపాబిందు సరోవరంబులును నారాయణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్ర మలయాదులైన కులాచలంబులును హరిప్రతిమార్చన ప్రదేశంబులును హరిసేవాపరులైన పరమభాగవతులు వసించెదు పుణ్యక్షేత్రంబులును శుభకాముండైన వాఁడు సేవింపవలయు.

451

తా ॥ ఇంకా – కురుక్షేత్రం, గయాసురుని శిరస్సుపడిన ప్రదేశం, ప్రయాగ, పులహాశ్రమం, నైమిశం, ఫల్గునీ నదీ తీరం, సేతు రామేశ్వరం, ప్రభాస తీర్థం, కుశస్థలి, కాశి, మధురాపురి, పంపా బిందు సరోవర ప్రాంతాలు, నరనారాయణాశ్రమం, సీతారామాశ్రమం, మహేంద్ర – మలయ పర్వతాలు మొదలైన కులపర్వతాలు, విష్ణు ప్రతిమలు పూజింపబడే ప్రదేశాలు, హరిసేవ చేసే భాగవతోత్తములు నివసించే పుణ్యక్షేత్రాలను – శుభాన్ని కోరే మానవుడు సేవించాలి.

ఆ. భూవరేంద్ర! యిట్టి పుణ్యప్రదేశంబు, లందు నరుఁడు సేయునట్టి ధర్మ
మల్పమైన నది సహస్రగుణాధిక, ఫలము నిచ్చు హరికృపావశమున.

452

తా ॥ రాజులలో శ్రేష్ఠుడా! ఇటువంటి పుణ్యస్థలాలలో నరుడు చేసే ధర్మకార్యాల ఫలం స్వల్పమైనా, విష్ణుదేవుని కృపావిశేషం వలన వేయిరెట్లు అధిక ఫలాన్ని ఇస్తుంది.

వ. వినుము. చరాచరం బయిన విశ్వమంతయు విష్ణుమయం బగుటంజేసి పాత్ర నిర్ణయ నిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రం బని పలుకుదురు, దేవఋషులు బ్రహ్మ పుత్రులైన సనకాదులును నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి

సమ్మతుం డయ్యె, ననేక జంతు సంఘాత సంకీర్ణంబైన బ్రహ్మాండ పాదపంబునకు నారాయణుండు మూలంబు, తన్నిమిత్తంబున నారాయణ సంతర్పణంబు సకల జంతు సంతర్పణంబని యెఱుంగుము, ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు, వానియందుఁ దారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుండయిన హరి వర్తించుటం జేసి పురుషుం డనఁ బ్రసిద్ధుఁ డయ్యె, నందుఁ దిర్యగ్జాతుల కంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు, పురుషులలోన హరితనువైన వేదంబును ధరించుచు సంతోష విద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు. బ్రాహ్మణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండయిన యోగి ముఖ్య పాత్రం బని పలుకుదురు, పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబుగాఁ ద్రేతాయుగంబునందు హరిప్రతిమలు గల్పింపఁబడియెఁ, గొందఱు ప్రతిమార్చనంబు సేయుదురు, పాత్ర పురుష ద్వేషులైన వారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు, మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును.

453

తా ॥ విను. కదిలేదీ, కదలనిదీ అయిన ప్రపంచమంతా విష్ణుమయం. కనుక, ఉత్తమమైనదానిని నిర్ణయించే నిపుణత్వం గల విద్వాంసులు, నారాయణుడే ఉత్తమ ధర్మనిధి అని అంటారు. దేవర్షులు, బ్రహ్మపుత్రులైన సనకాది మునులు ఉండగా నీవు చేసే రాజసూయ యాగంలో మొదటి సత్కారం అందుకోవడానికి (అగ్రపూజకు) కృష్ణుణ్ణి అందరూ అంగీకరించారు. లెక్కలేని జంతువుల సమూహంతో నిండి ఉన్న బ్రహ్మాండమనే చెట్టుకు నారాయణుడు మూలం (ఉత్పత్తి కారణం). ఆ కారణం వల్ల నారాయణుణ్ణి సంతృప్తి పరచటం సకల ప్రాణులను సంతృప్తి పరచటమని గ్రహించు. మునులు, మానవులు, జంతువులు, పక్షులు, దేవతల శరీరాలకు పురములు అని పేరు. వీనిలో న్యూనాధిక భేదాలతో జీవాత్మ స్వరూపంతో భగవంతుడైన శ్రీహరి ఉండటం వల్ల పురుషుడు (పురమున ఉన్నవాడు) అని ప్రసిద్ధి పొందాడు. అందులో పశుపక్ష్యాదులకన్నా పురుషునిలో గొప్పతనం ఉన్నందువలన పురుషుడు యోగ్యుడు.

పురుషులలో శ్రీహరి అంశమైన వేదాన్ని (ధరిస్తూ) నేర్చి నిత్యతృప్తి, అధ్యయనం, తపస్సులచేత గొప్పవాడైన బ్రాహ్మణుడు యోగ్యుడు. బ్రాహ్మణులలో ఆత్మజ్ఞానం చేత పరిపూర్ణమైన యోగి (మనస్సును నియంత్రించేవాడు) అధికయోగ్యుడని అంటారు. పరస్పర యోగ్యతను సహించని మానవులకు త్రేతాయుగంలో పూజ కొరకు విష్ణుప్రతిమలు ఏర్పడ్డాయి. కొందరు విగ్రహాలను పూజిస్తారు. యోగ్యులైన పురుషులను ద్వేషించేవారికి అటువంటి విగ్రహారాధన ఫలప్రదం కాదు. పరిపక్వం కాని బుద్ధి గలవారికి విగ్రహారాధన – పురుషార్థాలను, ధర్మార్థకామాలను ఇస్తుంది.

ఆ. అఖిల లోకములకు హరి దైవతము చూడ, హరికి దైవతము ధరాధినాథ!
పదపరాగ లేశపం క్తిచేఁ ద్రైలోక్య, పావనంబు సేయు బ్రాహ్మణుండు.

454

తా ॥ రాజా! విచారించగా సమస్తలోకాలకు విష్ణువే దైవం. ఆ విష్ణువుకు దైవం – మూడు వేదాలను చదివినవాడూ, సర్వప్రాణులలోను అచ్యుదుణ్ణి దర్శించేవాడూ, ముల్లోకాలను తన పాదధూళితో పవిత్రం చేయగల బ్రాహ్మణుడు.

వ. అటువంటి బ్రాహ్మణ జనులందుఁ గర్మనిష్ఠులు, దపోనిష్ఠులు, వేదశాస్త్రనిష్ఠులు, జ్ఞానయోగ నిష్ఠులునై కొందఱు వర్తింతు, రందు జ్ఞాన నిష్ఠునికి ననంత ఫలకామియైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు, దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైనఁ బితృకార్యంబునకు ముువ్వురనైన నొకరినైన భోజనంబు సేయింప వలయు, ధనవంతునకైనను శ్రాద్ధవిస్తారంబు కర్తవ్యంబు కాదు. దేశ కాలప్రాప్త కందమూల ఫలాదికం బయినవారి నై వేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదంబయి యక్షయ ఫలకారియగు, ధర్మతత్త్వవేదియైన వాఁడు శ్రాద్ధంబులందు మాంస ప్రదానంబు సేయక భక్షింపక చరింపవలయుఁ; గందమూలాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు, ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు

లేదు, యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములయి బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞాన దీపంబులందు గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు.

455

తా ॥ అటువంటి బ్రాహ్మణులలో కర్మలను ఆచరించేవారు, తపస్సు నిష్ఠగా చేసేవారు, వేదశాస్త్రనిరతులు, జ్ఞానసంబంధులై కొందరు ప్రకాశిస్తారు. వారిలో జ్ఞానసంపద కలవానికి – అమితఫలాన్ని ఆశించే గృహస్థుడు తన పితృజనులను ఉద్దేశించి కవ్యము (వారికి ఇచ్చే అన్నము), దేవతల కొరకు హవిస్సులను సమర్పించటం ముఖ్యం. దేవతా సంబంధమైన కార్యానికి ఇద్దరికైనా లేదా ఒకరికైనా, పితృకార్యానికి ముగ్గురికైనా లేదా ఒకరికైనా భోజనం పెట్టాలి. బ్రాహ్మణునికి సంతోషంగా సంతర్పణ జరిగితే ధనవంతుడైనా, అధికంగా శ్రాద్ధవిధి చేయవలసిన అవసరం ఉండదు. దేశకాలానుసారం లభించే కందమూలఫలాదులతో హరికి సమర్పించే నైవేద్యంగా శాస్త్రోక్తంగా, శ్రద్ధతో పాత్రలో పెట్టిన అన్నం – కోరినదాన్నిచ్చే అక్షయఫలాన్ని ఇస్తుంది. ధర్మతత్త్వాన్ని తెలిసినవాడు శ్రాద్ధకర్మలలో మాంసాన్ని ఇవ్వక, తాను తినక, ప్రవర్తించాలి. కందమూలాలను ఇవ్వటం వల్ల కలిగే ఫలం జంతుహింస వల్ల కలుగదు. ప్రాణిహింస చేయకుండా వర్తించటం కన్నా మంచి ధర్మం లేదు. యాగవిధి తెలిసిన నేర్పరులు కోరికలు లేనివారై, బాహ్యమైన కర్మలు చేయక, బ్రహ్మజ్ఞానమనే అగ్నిలో కర్మమయమైన యజ్ఞాలు చేస్తారు.

క. పశువులఁ బొరిగొని మఖములు, విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తమున్
విశసనము సేయునో యని, క్రశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా!

456

తా ॥ రాజా! పశువులను వధించి యజ్ఞాలు ప్రకాశవంతంగా చేసే పండితులను చూసి జంతుజాలం తమను కూడ చంపుతాడని, కుంగిపోయి, భయపడటం జరుగుతుంది.

వ. అది గావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక క్రియలఁ జేయవలయు, నిజధర్మ బాధకం బయిన ధర్మంబును, పరధర్మ ప్రేరితంబయిన ధర్మంబును, నాభాసధర్మంబును, బాషండ ధర్మంబును, గపటధర్మంబును ధర్మజ్ఞుండయిన వాఁడు మానవలయు, నైసర్గిక ధర్మంబు దురితశాంతి సమర్థంబగు, నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రసేయుచునైన ధనంబు గోరవలదు, జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక కార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరక బ్రదికెడి సుగుణునికిం గల సుఖంబు కామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు, పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదుల వలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబుల వలన నివృత్తి గల వానికి నెల్ల కాలంబును భద్రంబగు, నుపస్థమునకును జిహ్వాదైన్యంబునకుఁ బురుషుండు గృహపాలక శునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు, సంతోషి గాని విప్రుని విద్యా తపో విభవ యశంబులు నిరర్థకంబులగు, నింద్రియ లోలత్వంబున జ్ఞానంబు నశించు, సకలభూలోక భోగంబుల భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షా పిపాసవలనఁ గామపారంబును, హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు, సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును, నర్థానర్థ దర్శనంబున లోభంబును, నద్వైతానుసంధానంబున భయంబును, నాత్మా నాత్మ వివేకంబున శోకమోహంబులును, సాత్త్విక సేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమిని హింసయు, హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును, సమాధిబలంబున దైవిక వ్యథయుఁ బ్రాణాయామాదికంబున మన్మథవ్యథయు, సాత్త్వికాహారంబున నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును, నుపశమంబున సత్త్వంబును గురుభజన కుశలుఁడై శీలంబున జయింపవలయు.



తా ॥ కనుక ధర్మం తెలిసినవాడు దైవవశాత్తు లభించిన కందమూలాలతో నిత్యము చేసే

(వైశ్వదేవాదుల కర్పించే కవ్యముల) పనులు చేయాలి. స్వధర్మానికి నష్టం కలిగించే ధర్మం, పరధర్మం చేత ప్రేరేపింపబడిన ధర్మం, ఆభాసధర్మం, పాషండ ధర్మం, కపట ధర్మం వంటివి ధర్మతత్త్వం తెలిసినవాడు చేయకూడదు. ప్రకృతిసహజమైన ధర్మం పాపాలను పోగొట్టే సామర్థ్యం కలది. ధనం లేనివాడు ధర్మం కొరకు యాత్ర చేయడానికైనా ధనాన్ని కోరకూడదు. బ్రతుకుతెరువు కోసం అటూ ఇటూ తిరుగక, దైన్యం లేక, అజగర వృత్తితో ఆత్మారాముణ్ణి ఆరాధిస్తూ, నిష్కాముడై బ్రతకాలి. అటువంటి సుగుణశాలి పొందే గొప్ప సుఖం కామలోభాలు కలిగి పది దిక్కులకు పరుగెత్తేవాడికి కలుగదు. కాళ్ళకు చెప్పులున్నవాడికి రాళ్ళు, ముండ్లు మొదలైనవాటి వల్ల భయంలేక నడక అలవాటైన విధంగా, కోరికల నుండి మరలినవారికి ఏ కాలమైనా క్షేమాన్ని కలిగించేదే. జననేంద్రియ, రసనేంద్రియాల సుఖానికై దీనత్వం పొందిన పురుషుడు ఇంటి కావలి కుక్క వలె తిరుగుతూ, సంతృప్తి లేక, చెడిపోతాడు. సంతోషం లేని బ్రాహ్మణుని విద్య, తపస్సు, ఐశ్వర్యం, కీర్తి ప్రయోజనం లేనివి. ఇంద్రియాలకు వశమైతే జ్ఞానం నశిస్తుంది. సమస్త భూలోక సౌఖ్యాలు అనుభవించి, దిగ్విజయాలు చేసినా ఆకలిదప్పుల వల్ల కామాన్ని, హింస వల్ల క్రోధాన్ని అంతమొందించడం దుర్లభం. సంకల్ప వర్జనంలో కామాన్నీ, కామవర్జనంతో క్రోధాన్నీ, నిత్య అనిత్య వస్తు వివేకంవల్ల లోభాన్నీ, జీవేశ్వరుల ఏకత్వ భావనతో భయాన్నీ, ఆత్మ పరమాత్మ వివేకంతో శోకమోహాలను, సాధుసాంగత్యంతో డాంబికత్వాన్నీ, మితభాషణతో నియమబాధను, శరీరవాంఛ లేకపోవటంతో హింసను, మేలుచేయటం వల్ల ప్రాణుల దుఃఖాన్నీ, నియమధారణ వల్ల దైవప్రాప్త దుఃఖాన్నీ, ప్రాణాయామం మొదలైన వానిచేత కామవికారాన్నీ, సాత్త్వికాహారంతో నిద్రను, సత్త్వగుణంతో రజస్తమోగుణాలను, ఓర్పుతో బలోద్రేకాన్ని – పెద్దలను సేవించే లక్షణం కలిగినవాడు శీలసంపదతో జయించవచ్చు.

ఆభాస ధర్మం – మానవుడు తన ఆశ్రమానికి భిన్నంగా, స్వేచ్ఛగా ఏ ధర్మాన్ని కల్పిస్తాడో అది ఆభాసము.

పాషండ ధర్మం – జటలు, భస్మాదులు ధరించటం వల్ల కలిగిన గర్వం పాషండము.

కపట ధర్మం – శాస్త్రంలో చెప్పబడినవాటిని వేరే విధంగా వ్యాఖ్యానించటం కపటము.

క. హరిమహిమ దనకుఁ జెప్పిన, గురువున్ నరుఁ డనుచుఁ దలఁచి కుంఠితభక్తిం
దిరుగు పురుషు శ్రమ మెల్లను, గరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా!

458

తా ॥ రాజా! తనకు విష్ణువు మహిమను చెప్పిన గురువును సామాన్య మానవుడని భావించి, ఆయన యెడ భక్తి సన్నగిల్లి, మరొక గురువు కోసం తిరిగే పురుషుని యత్నమంతా ఏనుగు శుచిత్వం వలె (నీళ్ళతో ఎంత స్నానం చేసినా ఏనుగు ఒడ్డుకు రాగానే తొండంతో మళ్ళీ బురద దుమ్మును ఒంటిపై చల్లుకున్నట్లు) వ్యర్థమౌతుంది.

ఉ. ఈ వనజాత నేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్
దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగి సం
సేవిత పాదపద్ముఁ దమ చిత్తములన్ నరుఁ డంచు లోకు లి
చ్ఛావిధిఁ జూచుచుండుదురు సన్మతి లేక నరేంద్ర చంద్రమా!

459

తా ॥ రాజశ్రేష్ఠుడా! తామరలవంటి కన్నులు గలవానిని, పరమేశ్వరుని, మహాత్ముని, పురుషోత్తముని, దేవతలు శరణుకోరే వానిని, సజ్జనులకు వశుడైనవానిని, అంతము లేనివానిని, పురాణపురుషులైన మహాయోగులచే సేవింపబడిన పాదపద్మాలు గల శ్రీమహావిష్ణువును లోకులు తమ మనస్సులలో సామాన్య మానవుడని, సరైన వివేకం లేక, తమ ఇష్టం వచ్చినట్లు భావిస్తారు.

వ. వినుము. షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థులమైతి మను వారలు ధారణాభ్యాస సమాధి యోగంబుల సాధింపలేరు, కృషి ప్రముఖంబులు సంసార సాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు, కుటుంబ సంగంబునఁ జిత్త విక్షేపం బగుఁ, జిత్త విజయ ప్రయత్నంబున సన్న్యసించి

సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధ వివిక్త సమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబు సేయుచు రేచక పూరక కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబయిన చిత్తంబునఁ బరిభ్రమణంబు మాని కామ విసర్జనంబుసేసి మరలు నంతకు నిజనాసాగ్ర నిరీక్షణంబు సేయుచు నవ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు కాష్ఠ రహితంబైన వహ్ని తెఱంగున శాంతిఁ జెందుఁ, గామాదులచేత వేధింపంబడక ప్రశాంత సమస్త వృత్తం బయిన చిత్తంబు బ్రహ్మసుఖ సమ్మర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు.

460

తా ॥ విను. ఆరు ఇంద్రియాలలో (పంచజ్ఞానేంద్రియాలు, మనస్సు) ఒక దానియందు ఆసక్తి కలవారై, కోరికలు తీర్చుకుంటూ కృతకృత్యులమైనామని భావిస్తారు. ధారణ (మనస్సును లక్ష్యంపై నిలకడగా ఉంచటం), అభ్యాసం (యోగానికి అలవాటుపడే నియమం), సమాధి (మనోలయం) వంటి యోగవిధులను సాధించలేరు. కృషి (దున్ని, పైరు వేయటం) మొదలైనవి సంసార సాధనలే (కూడు గుడ్డ సంపాదించుకోవటం) కాని, మోక్షాన్ని సాధించేవి కావు. కుటుంబ (భార్య, సంతానం, మిత్రులు, బంధువుల) సాంగత్యంతో మనస్సు వికలమౌతుంది. మనస్సును జయించే ప్రయత్నంతో సన్యాసం తీసుకొని, బంధాలు వదలి, మితంగా, భిక్షాన్నం తింటూ, నిర్మలమైన ఏకాంత సమప్రదేశంలో ఒకచోట కూర్చొని దృఢప్రయత్నంతో, ఓంకారాన్ని జపిస్తూ, రేచక పూరక కుంభకాలతో (ప్రాణాయామ పద్ధతులతో) ప్రాణాపానాలు నిరోధించి, కోరికలతో, కల్మషమైన మనస్సులో భ్రమపడటం మానుకొని, కోరికలు విడిచి, ఏకాగ్రత సాధించేవరకు నాసికాగ్రంపై దృష్టిని నిలిపి చూస్తూ – ఈ విధంగా చిత్తవృత్తి నిరోధం చేసేవాని మనస్సు కట్టెలులేని అగ్ని విధాన శాంతిస్తుంది. కోరికలచేత వేధింపబడక ప్రశాంత భావన గలిగిన మనస్సు బ్రహ్మానందానుభవంలో కలిసిపోయి, తిరిగి విషయవాంఛలపైకి పోదు.

మ. ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం

బరివర్జించి పునర్విలంబమునఁ దత్ర్ప్రారంభి యౌనేని లో
భ రతిం గ్రక్కిన కూడు మంచి దనుచున్ భక్షించి జీవించు దు
ర్నరు చందంబున హాస్యజీవనుఁ డగున్ నానా ప్రకారంబులన్.

461

తా ॥ బ్రాహ్మణుడు సన్న్యసించి, యోగియై, ధర్మార్థకామాలను వదలి, మళ్ళీ కొంత కాలానికి వదలిన కర్మబంధాలలో తగులుకుంటే అప్పుడు లోభగుణం చేత కక్కిన కూడు మంచిదని తిని బ్రతికే మానవుని చందాన నలుగురిలో నానావిధాల నవ్వులపాలవుతాడు. కర్మారంభమే కష్టాలకు మూలం.

క. మలమునఁ గ్రిమియును బడు క్రియ, నిలఁబడు నొడ, లాత్మ గాదు హేయం బనుచుం
దలఁతురు తద్జ్ఞులు, పొగడుదు, రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞు లిలేశా?

462

తా ॥ రాజేంద్రా! మలంలో క్రిమి పడిన విధంగా దేహం నేలపై పడుతుంది. పడేది దేహమే కాని, ఆత్మ కాదు. తత్త్వం తెలిసినవారు ఇది (శరీరం) పారవేయదగిన తుచ్ఛవస్తువని భావిస్తారు. తత్త్వం తెలియనివారు (అజ్ఞానులు) బుద్ధి మందగించటం వల్ల శరీరమే ఆత్మ, అదే నిత్యమైనదని పొగడుతారు.

ఆ. వ్రతము మానఁ దగదు వడుగుఁ గుఱ్ఱనికిని, గ్రియలు మానఁ దగదు గృహగతునికిఁ,
దపసి కూర నుండఁ దగదు, సన్న్యాసికిఁ, దరుణి తోడి పొత్తు దగదు తగదు,

463

తా ॥ బ్రహ్మచారి (తన ఆశ్రమవిధికి తగిన ఆచారము) వ్రతాన్ని విడువకూడదు. గృహస్థ ధర్మాన్ని ఆచరించేవారు ప్రతిదినం చేసే పనులు మానరాదు. వానప్రస్థుడై తపస్సు చేయగోరినవాడు జనపదంలో నివసించకూడదు. సన్న్యాసికి (సర్వసంగపరిత్యాగికి) స్త్రీ

సాంగత్యం పనికిరాదు.

సీ. రథము మే నెల్ల, సారథి బుద్ధి, యింద్రియ, గణము గుఱ్ఱములు, పగ్గములు మనము
ప్రాణాది దశవిధ పవనంబు లిరుసు ధ, ర్మాధర్మగతులు రథాంగకములు
బహుళతరంబైన బంధంబు చిత్తంబు, శబ్దాదికములు సంచార భూము
లభిమాన సంయుతుం డయిన జీవుఁడు రథి, ఘనతర ప్రణవంబు కార్ముకంబు

తే. శుద్ధజీవుండు బాణంబు, శుభదమైన, బ్రహ్మమంచిత లక్ష్యంబు, పరులు రాగ
భయ మద ద్వేష శోక లోభ ప్రమోహ, మాన మత్సర ముఖములు మానవేంద్ర!

464

తా ॥ రాజా! శరీరమే ఒక రథం. రథాన్ని నడిపే సారథి బుద్ధి. ఇంద్రియ సమూహం గుఱ్ఱాలు. మనస్సు పగ్గం. ప్రాణాలైన పది వాయువులు (బండి) ఇరుసు. ధర్మ అధర్మ వర్తనాలు బండి కండ్లు (చక్రాలు). చిత్తము పెద్ద మోకు ముడి. శబ్ద స్పర్శ రూపాదికాలు రథం తిరిగే ప్రదేశాలు. నేను – నాది అనే అహంకారంతో కూడిన జీవుడు రథంలో ఉండే పురుషుడు. మహనీయమైన ఓంకారం విల్లు. నిర్మలుడైన జీవాత్మ బాణం. శుభాన్ని చేకూర్చే బ్రహ్మము తగిన లక్ష్యం. రాగద్వేషాలు, లోభ, మోహ, మదమాత్సర్యాదులు బద్ధ శత్రువులు.

పదివాయువులు: ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ.

వ. ఇట్లు మనుష్య శరీర రూపంబయిన రథంబు దన వశంబు సేసికొని మహాభాగవత చరణకమల సేవానిశితంబయిన విజ్ఞాన ఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణ కరుణావలోక బలంబున రాగాదిశత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మమనియెడు గుఱియందుఁ బడవేసి యహంకార రథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవలయు, నట్టి విశేషంబు

సంభవింపని సమయంబున బహిర్ముఖంబు లయిన యింద్రియ ఘోటకంబులు బుద్ధి సారథి సహితంబులై స్వాభిమాన రథికుని ప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తి మార్గంబు నొందించి విషయశత్రు మధ్యంబునం గూల్చిన.

465

తా ॥ ఈ విధంగా మానవ శరీర రూపమైన రథాన్ని తన వశంలో ఉంచుకోవాలి. ఉత్తములైన విష్ణుభక్తుల పాదపద్మాలను సేవించడం వల్ల పదనెక్కిన విజ్ఞానమనే కత్తిని ధరించి, శ్రీమన్నారాయణుని దయగల చూపుల బలం చేత రాగద్వేషాది శత్రువులను సంహరించాలి. ఓంకారమనే విల్లునందు నిర్మలుడైన జీవుడనే బాణాన్ని ఎక్కుపెట్టి, బ్రహ్మమనే లక్ష్యంపై గురిపెట్టాలి. అహంకార రథంలోని జీవుడు రథికత్వం (నడిపే ప్రయత్నం) మాని, సహజమైన బ్రహ్మానందంలో ఉండాలి. అటువంటి భాగ్యం దొరకనప్పుడు – బయటకు పరుగెత్తే ఇంద్రియాలనే గుఱ్ఱాలు బుద్ధి అనే సారథితో సహా రథమును, అహంకారం గల జీవుడనే రథికుని (రథంలో ఉన్నవాడు) ప్రమత్తునిజేసి, అతనిని కర్మమార్గంలో నడిపించి, విషయాలనే శత్రువుల మధ్య పడవేస్తాయి.

ఆ. విషయ శత్రులెల్ల విక్రాంతితోడ సా, రథి సమేతుఁడయిన రథికుఁ బట్టి
యుగ్రతిమిర మృత్యుయుతమగు సంసార, కూప మధ్యమందుఁ గూల్తు రధిప!

466

తా ॥ రాజా! విషయవాసనలనే శత్రువులు పరాక్రమంతో విజృంభించి (బుద్ధి అనే) సారథి సహితుడైన రథికుని పట్టి, భయంకరమైన చీకటి అనే మృత్యువుతో కూడిన సంసారమనే నూతిలో తోసివేస్తారు.

వ. వినుము. వైదికకర్మంబు ప్రవృత్తంబును, నివృత్తంబును నన రెండు దెఱంగులయ్యె, నందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును, నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ,

బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండు మార్గంబులు గల, వందు హింసా ద్రవ్యమయ కామ్యరూపంబులయిన దర్శ పూర్ణమాసపశు సుత వైశ్వదేవ బలిహరణ ప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు, దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు, ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబున దేహి హృదయాగ్రంబున వెలుంగు, వానితోడ నింద్రియంబులుంగూడ భూతసూక్ష్మయుక్తుండై ధూమ దక్షిణాయన కృష్ణపక్ష రాత్రి దర్శంబుల వలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుండై వృష్టి ద్వారంబునఁ గ్రమంబున నోషధి లతాన్న శుక్ల రూపంబులం బ్రాపించి భూమియందు జన్మించు, నిది పునర్భవ రూపంబయిన పితృమార్గంబు, నివృత్త కర్మనిష్ఠుం డయిన వాఁడు జ్ఞానదీప్తంబు లయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి యింద్రియంబుల దర్శనాది సంకల్ప మూలంబయిన మనంబునందు వికారయుక్తంబయిన మనంబును, వాక్కునందు విద్యావిలక్షణమైన వాక్కును, వర్ణసముదాయంబు నందు వర్ణసముదాయంబును, నకారాది స్వరత్రయాత్మకం బయిన యోంకారంబునందు నోంకారంబును బిందువందు, బిందువును నాదంబునందు, నాదంబును బ్రాణంబునందును బ్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయును, దేవమార్గంబయిన యుత్తరాయణ శుక్ల పక్ష దివా ప్రాహ్ణ పూర్ణిమా రాకల వలన సూర్య ద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధియైన విశ్వుండై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి, తుర్యుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును.

467

తా ॥ ధర్మజా! విను. వేదంలో చెప్పబడిన కర్మము ప్రవృత్తి మార్గం (కర్మమార్గాన్ని అనుసరించేది), నివృత్తి మార్గం (మోక్షమార్గాన్ని అనుసరించేది) అని రెండు విధాలు. అందులో ప్రవృత్తి మార్గం వల్ల పునర్జన్మలు కలుగుతుంటాయి. నివృత్తి మార్గం మోక్షమును ప్రసాదిస్తుంది.

ప్రవృత్తి కర్మలలో ఇష్టము – పూర్తము అని రెండు మార్గాలున్నాయి.

అందులో – హింస, ద్రవ్యరూప కామ్యరూపాలైన అమావాస్య పౌర్ణములందు చేసే యజ్ఞాలు, పశుయాగం, వైశ్వదేవం (విశ్వదేవ సంబంధమైనది), పాకయజ్ఞం, బలిహరణం మొదలైన యాగసంబంధులు – ఇష్టములు. దేవాలయ నిర్మాణం, వనాలు పెంచటం, బావులు చెఱువులు త్రవ్వించటం మొదలైనవి పూర్తములనే పేరు గలవి. ప్రవృత్తి కర్మలలో దేహం వదలి వేరే దేహం ధరించబోయే ముందు జీవుని హృదయాగ్ర భాగంలో ప్రకాశించేవానితో ఇంద్రియాలు కూడి, సూక్ష్మదేహం ధరించి, ధూమ (పొగ) మార్గంలో, దక్షిణాయనం కృష్ణ పక్షంలోని చీకటి రాత్రి అమావాస్య వల్ల చంద్రమండలం చేరి, పుణ్యఫలం పూర్తికాగానే సుఖాల అంతంలో దేహం విలీనమై; వర్షపు నీటి ద్వారా క్రమంగా ఓషధులు, లతలు, అన్నము, శుక్లము(వీర్యము) అనే రూపాలు ప్రాప్తించి, భూమిపై జన్మిస్తాడు. ఇది మళ్ళీ జన్మించడమనే పితృదేవతల మార్గం. ఇదే ప్రవృత్తి మార్గం.

నివృత్తి మార్గంలో ఉన్నవాడు వివేకంతో ప్రకాశించే ఇంద్రియాలలో కర్మయజ్ఞాలతో యాగం చేసి, ఇంద్రియాలను సంకల్పరూపమైన (వినటం, చూడటం మొదలైన) మనస్సులోను; నానా వికారాలతో కూడిన మనస్సును వాక్కులోను; విద్యచేత సంస్కరింపబడిన వాక్కును అక్షరమాలలోను; వర్ణసముదాయాన్ని అకార ఉకార మకారములతో చేరిన ఓంకారంలోను; ఓంకారాన్ని బిందువులోను, బిందువును నాదం(స్వరం)లోను; నాదాన్ని ప్రాణంలోను; ప్రాణాన్ని బ్రహ్మములోనూ లయింపజేయాలి. దేవతల మార్గమైన ఉత్తరాయణ శుక్ల పక్షం పగలు దినపూర్వభాగం, పౌర్ణమి, అన్ని కళలు కలిగిన రాకాపూర్ణిమలో సూర్యమార్గం ద్వారా బ్రహ్మలోకాన్ని చేరుకొంటాడు. పుణ్యఫలం తీరిన తరువాత, స్థూలకారణుడైన విశ్వరూపుడై, సూక్ష్మాంశాలలో లయించి, సూక్ష్మోపాధి గల తేజస్వి అవుతాడు. సూక్ష్మపదార్థాన్ని కారణంలో పొందించి, కారణ ఉపాధి గల సమర్థుడై, కారణాన్ని సాక్షిస్వరూపంలో లయింపజేసి, ఆత్మస్వరూపుడై సూక్ష్మరూపంలో విలీనమై, పరిశుద్ధాత్ముడై, ఈ విధంగా యోగి మోక్షాన్ని

పొందుతాడు.

ఆ. అమర నిర్మితంబులై యొప్పు పితృదేవ, సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్ర దృష్టి
నట్టివాఁడు దేహియై మోహమున నొందఁ, డతిశయించు బుద్ధి నవనినాథ!

468

తా ॥ ధరణీనాథా! దేవతలచే కల్పించబడి, ఒప్పిదమైన పితృ, దేవ మార్గాలను అంటే ప్రవృత్తి, నివృత్తి మార్గాలను శాస్త్రవిధితో ఎవడు తెలుసుకుంటాడో, అటువంటివాడు శరీరాన్ని ధరించి కూడా యుక్తాయుక్తవివేకం ఉదయించినందువల్ల మోహాన్ని పొందడు.

వ. వినుము : దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధికత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయుఁ బరంబున నపరంబును జ్ఞానంబున జ్ఞేయంబును వచనంబును వాచ్యమును నప్రకాశంబునఁ బ్రకాశంబును నైన వస్తువునకు వేఱొండు లేదు, ప్రతిబింబాదికంబు వస్తుతత్త్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడు భంగి నైంద్రియకం బైన సర్వంబును నర్థత్వంబున వికల్పితంబయి తోఁచుంగాని పరమార్థంబు గాదు. దేహాదికంబులు మిథ్యాత్మకంబులు, వానికి హేతువులయిన క్షితి ప్రముఖంబులును మిథ్యాత్మకంబు లగుట సిద్ధంబు, పరమాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబు దోఁచు నంత దడవును భ్రమంబునుం దోఁచు, నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్యయయి శాస్త్రవిధి నిషేధంబులు గల లోపల మేలుగన్న తెఱం గగు, భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల, వందుఁ బటతంతు న్యాయంబునఁ గార్య కారణంబులందు వస్తు వొక్కటియై యుండు నని యెఱింగి, యేకత్వాలోచనంబు సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు, మనోవాక్కాయ కృతంబులైన సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు పుత్త్రమిత్రకళత్రాది సర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కరుండను పరమార్థత్వంబున

నర్థకామంబుల యెడ నైక్యదృష్టిం జేయుట ద్రవ్యాద్వైతంబు, నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైత త్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియు, స్వకీయ పరకీయ బుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మానవలయు.

469

తా ॥ ధర్మజా! విను. శరీరం మొదలైనవాటికి ఉత్పత్తి కారణం వల్ల ఆరంభంలో కాలపరిమితి నిర్ణయం వల్ల – చివరలో పుడుతూ – బాహ్య ప్రపంచంలో అనుభవించ తగినవాడు, అంతరంగంలో అనుభవించే వాడు, ఇతరమైన దానిలో ఇతరము కానిది, తెలివి మూలాన తెలియదగినది, వాక్కుచే మాట్లాడతగినది, వెలుగు లేనిచోట వెలుతురును అయిన పరమాత్మ వస్తువు కంటే వేఱొకటి లేదు. అద్దంలో కనుపించే నీడ రూపాన్ని బట్టి అద్దానికంటే నీడ అన్యమని భావించినట్లు, ఇంద్రియవికారమంతా వస్తుభావంతో వేరుగా భావించబడుతుంది కాని, సత్యం కాదు. దేహము మొదలైనవి అసత్యాలు. దేహాదులకు కారణాలైన భూమి, నీరు మొదలైనవన్నీ అసత్యాలని రూఢి అయింది. అజ్ఞానం వల్ల పరమాత్మ ఎంతవరకు వికల్పం అనిపిస్తాడో, అంతవరకు భ్రమ ఉన్నట్లే. అజ్ఞానం తొలగగానే అంతా మిథ్య అయి, శాస్త్రవిధి నిషేధాలు అన్నీ పోయి కలలో నుంచి మేలుకొన్నట్లు అవుతుంది.

భావాద్వైతం, క్రియాద్వైతం, ద్రవ్యాద్వైతం అని మూడున్నాయి. అందులో – వస్త్రంలోని దారం వలె కార్యకారణాలలో వస్తువు ఒకటే అని తెలిసి, ఏకత్వభావనతో, భేదం లేదని నిశ్చయించటం భావాద్వైతం. మనస్సుచే, వాక్కుచే, శరీరముచే చేసిన కర్మలన్నీ ఫలముల తారతమ్యం ఎంచక పరబ్రహ్మకు అర్పించటం క్రియాద్వైతం. కొడుకులు, మిత్రులు, భార్య మొదలైన జీవులకు, తనకు, దేహానికి లోపల పంచభూతాత్మకత్వంతో అనుభవించేవాడు ఒకడే అనే పరమార్థ లక్షణంతో, కోరికలు – ద్రవ్యము ఇవి ఒకటే అని భావించటం ద్రవ్యాద్వైతం. నైపుణ్యంతో బ్రహ్మతత్త్వాన్ని సాక్షాత్కరింప చేసుకొని, భావ – క్రియా – ద్రవ్యాద్వైతాలు మూడింటిని వస్తుతత్త్వం వివిధమనే భావం కలిగి, పుణ్యాపాపకర్మలు వేరని (కర్మభేదబుద్ధి), తన

పర అనే భావన (స్వకీయ పరకీయ బుద్ధి) – ఇవన్నీ కలలు మాత్రమేనని భావించే ముని (ఆత్మతత్త్వానుసంధానం చేసేవాడు) ఈ భేదాలను వదలుకోవాలి.

క. వాదములు వేయు నేటికి?, వేదోక్త విధిం జరించు విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ, పాదంబులు గొలిచి ముక్తిపదమున కేగున్.

470

తా ॥ వేయి వాదాలెందుకు? వేదప్రకారంగా నడుచుకొనే పండితుడు ఇంటిలో ఉన్నా, మన్ననతో విష్ణుపాదాలు సేవించి ముక్తిని పొందుతాడు.

శా. భూపాలోత్తమ! మీరు భక్తిగరిమ స్ఫూర్తిన్ సరోజేక్షణ
శ్రీపాదాంబుజ యుగ్మమున్ నియతులై సేవించి కాదే మహో
గ్రాపత్సంఘము లోనఁ జిక్కక సమస్తాశాంత నిర్జేతలై
యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్ర ప్రభావంబునన్.

471

తా ॥ రాజులలో ఉత్తమమైనవాడా! మీరు (పాండవులు) భక్తిగౌరవాలతో సరోజేక్షణుడైన శ్రీకృష్ణుని పాదపద్మములను నియమంతో సేవించే కదా, భయంకరమైన ఆపదల సమూహంలో చిక్కువడక, అన్ని దిక్కులలో గెలుపు సాధించి, అతిశయంగా, దేవేంద్ర వైభవంతో యజ్ఞం (రాజసూయయాగం) చేశారు!

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము

వ. వినుము. పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డనుపేర గంధర్వుండ నైన నేను సౌందర్య మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్త్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబు సేయుకొఱకు నప్సరోజనులను గంధర్వులనుం జీరిన.

472

తా ॥ ధర్మనందనా! నా పూర్వజన్మ వృత్తాంతం వివరిస్తాను. విను. గడచిపోయిన మహాకల్పంలో గంధర్వులలో ఉపబర్హణుడనే పేరు గల గంధర్వుడిని నేను. సౌందర్యం, మాధుర్యం, గాంభీర్యం మొదలైన గుణాలచే స్త్రీలకు ఇష్టుడినై విహరించేవాడిని. లోకాలను నిర్మించే సృష్టికర్తలైన ప్రజాపతులు దేవసత్త్రమనే పేరుగల యాగాన్ని చేసే సమయంలో నారాయణుని కథలు పాడటానికి అప్సరసలను, గంధర్వులను ఆహ్వానించారు.

ఆ. క్రతువులోని కేను గంధర్వ గణముతోఁ, గలిసిపోయి విష్ణుగాథ లచటఁ
గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై, తలఁగి చనితి నంత ధరణినాథ!

473

తా ॥ ధరణీనాథా! గంధర్వగణంతో కలిసి నేను క్రతువు జరుగుతున్న చోటికి పోయి, విష్ణుగాథలను అక్కడ కొన్ని గానం చేశాను. అక్కడ స్త్రీలను కలిసి, మోహపడి, కర్తవ్యాన్ని మరచి తర్వాత (అక్కడి నుండి వారితోపాటు) వెళ్ళిపోయాను.

క. వారిజ గంధుల పొత్తున, వారిం గైకొనక తలఁగి వచ్చిన బుద్ధిన్
వా రెఱిఁగి శాప మిచ్చిరి, వారింపఁగ రాని రోషవశమున నధిపా!

474

తా ॥ రాజా! అప్సరసల మోహంలో పడిపోయి ఆ సృష్టికర్తల అనుజ్ఞను లెక్కచేయక తొలగివచ్చిన నా ఆలోచన వారికి తెలిసి, పట్టరాని కోపంతో నన్ను శపించారు.

ఆ. 'పంకజాక్షు నిచటఁ బాడక కామినీ, గణముఁ గూడి చనిన కల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున, శూద్రజాతి సతికి సుతుఁడ వగుము.'

475

తా ॥ 'ఈ మహాక్రతువులో విష్ణువును గూర్చి పాడకుండా, స్త్రీజనంతో కలిసి వెళ్ళిపోయిన పాపకార్యం వల్ల కాంతిహీనుడివై, భూమిపై శూద్రజాతి స్త్రీకి పుత్రుడిగా జన్మించు!'

వ. అని యిట్టు విశ్వస్రష్టలు శపించిన నొక బ్రాహ్మణదాసికిఁబుత్త్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూష సేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మ పుత్త్రుండనై జన్మించితి.

476

తా ॥ అని ఈ విధంగా విశ్వాన్ని సృష్టించే బ్రహ్మలు శపించగా, ఒక బ్రాహ్మణ దాసికి కొడుకుగా పుట్టి, బ్రహ్మవిద్యాధరులైన పెద్దలకు సేవచేసిన మహిమ కారణాన ఈ మహాకల్పంలో బ్రహ్మమానసపుత్రునిగా పుట్టాను.

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే, ధర్మ మాచరించి తగిలి పోవు
నట్టి ధర్మ మెల్ల నతివిశదంబుగాఁ, బలుకఁ బడియె నీకు భవ్యచరిత!

477

తా ॥ శుభచరితా! గృహస్థుడు నేర్పుతో ఏ ధర్మాన్ని ఆచరించి మోక్షపదమును చేరతాడో, అటువంటధర్మమంతా పూర్తిగా, వివరంగా నీకు చెప్పబడింది.

మ. అఖిలాధారుఁ డజాది దుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ
మఖమం దర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై
సఖియై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై
సుఖదుం డయ్యె, భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా!

478

తా ॥ మహారాజా! సమస్తమునకు ఆధారమైనవాడు, బ్రహ్మాదులకైనా లభించనివాడు, పరబ్రహ్మ స్వరూపమైన శ్రీమహావిష్ణువు మానవరూపంలో నీ యాగసందర్భంలో పూజింపబడి, నీ ఇంట కొలువై, సేవలందుకొని, స్నేహితుడై, (సలహాలిచ్చే) మంత్రియై, ఇహపర సుఖాలనిచ్చేవాడైనాడు. నీ గొప్పతనం అద్భుతం కదా!”

వ. అని యిట్లు నారదుండు సెప్పిన వృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమ విహ్వలుండై వాసుదేవునిం బూజించె. వాసుదేవ ధర్మనందనుల చేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియె నని శుక యోగీంద్రుండు పాండవ పౌత్త్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన.

479

తా ॥ అని ఈ విధంగా నారదుడు చెప్పిన విషయమంతా విని ధర్మరాజు ప్రేమతో మైమరచి శ్రీకృష్ణుణ్ణి పూజించాడు. శ్రీకృష్ణుని చేత, ధర్మరాజు చేత పూజింపబడి నారద మహర్షి కూడా ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు.”

అని యోగులలో శ్రేష్ఠుడైన శుకమహర్షి పాండవుల మనుమడైన పరీక్షిత్తు మహారాజుకు చెప్పినట్లుగా సూతుడు శౌనకాది మహామునులకు చెప్పాడు.

క. రాజీవ సదృశలోచన!, రాజీవ భవాదిదేవ రాజవినుత! వి
భ్రాజిత కీర్తిలతావృత, రాజీవ భవాండ భాండ! రఘుకుల తిలకా!

480

తా ॥ పోతనామాత్యుడు శ్రీరామచంద్రమూర్తిని ఇలా ప్రస్తుతిస్తున్నాడు: "రఘువంశానికి వన్నె తెచ్చినవాడా! శ్రీరామచంద్రా! తామరరేకుల వంటి కన్నులున్నవాడా! కమలభవుడైన బ్రహ్మ మొదలైన దేవతల సమూహంచేత పొగడబడే వాడా! ప్రకాశించే కీర్తిలతలతో అల్లుకొన్న బ్రహ్మాండభాండం గలవాడా! నీకు ప్రణామములు.

మాలిని

ధరణిదుహితృరంతా! ధర్మమార్గానుగంతా!
నిరుపమనయకాంతా! నిర్జరారాతిహంతా!
గురుబుధసుఖ కర్తా! కుంభినీచక్రభర్తా!
సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా!

481

తా ॥ భూమాత కుమార్తె అయిన సీతకు వల్లభుడైన ఓ దేవా! ధర్మమార్గాన్నే అనుసరించేప్రభూ! సాటిలేని నీతిమార్గాన నడచిన ఆదర్శమూర్తి! దేవతల శత్రువులైన రాక్షసులను సంహరించిన పరాక్రమశాలీ! గురువులకు, పండితులకు సుఖాన్ని కూర్చే జగన్నాయకా! భూమండలానికి అధిపతీ! దేవతల భయాన్ని పోగొట్టిన అభయప్రదాతా! జ్ఞానుల చిత్తంలో విహరించేవాడా! శ్రీరామచంద్రా! నీకు నమస్కారము."

గద్యము:

ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీ మహాభాగవతంబను మహా పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మ వృత్తాంతంబు

సెప్పుటయు, హిరణ్యకశిపు దితి సంవాదంబును, సుయజ్ఞోపాఖ్యానంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభ గర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రంబును, బ్రహ్లాద విద్యాభ్యాస కథయును, బ్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదంబును, బ్రహ్లాదు వచనంబు బ్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాది స్తూయమానుండై తిరోహితుం డగుటయుఁ,ద్రిపురాసుర వృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమ ధర్మ వివరణంబును, బ్రహ్లాదాజగర సంవాదంబును, స్వధర్మ ప్రవర్తకుఁడగు గృహస్థుండు ముక్తుండగు మార్గంబు నారదుండు ధర్మజునకుఁ దెలుపుటయు, నారదుని పూర్వజన్మ వృత్తాంతంబును నను కథలు గల సప్తమ స్కంధము.

ఈ మహా పురాణాన్ని పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుడు, కేసన మంత్రిగారి పుత్రుడు, సహజ పాండిత్యుడూ అయిన పోతనామాత్యుడుచే రచింపబడ్డ శ్రీ మన్మహాభాగవతము. ఈ మహా పురాణంలో ధర్మరాజుకు నారదమహర్షి చెప్పిన గాథలు వివరింపబడ్డాయి

హిరణ్యాక్ష హిరణ్య కశిపుల పూర్వజన్మ వృత్తాంతం, దితి హిరణ్యకశిపుల సంభాషణం, సుయజ్ఞోపాఖ్యానం, యమ సల్లాపం, బ్రహ్మవల్ల వరాలు పొంది గర్వించిన హిరణ్యకశిపుని చరిత్రం, ప్రహ్లాదుని విద్యాభ్యాసం, ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదం, ప్రహ్లాదుని మాట నిలబెట్టడానికి విష్ణువు నరసింహస్వామి రూపంలో ఆవిర్భవించటం, హిరణ్యకశిపు సంహారం, ప్రహ్లాదునకు నరసింహదేవుని వరప్రదానం, అఖిల దేవతాగణంచేత ప్రహ్లాదునిచేత ప్రస్తుతింపబడి నరసింహస్వామి అంతర్ధాన మవటం, త్రిపురాసుర వృత్తాంతం, త్రిలోచనుడు త్రిపురాలను దహించటం, వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు, ప్రహ్లాద అజగర సంవాదం, గృహస్థుడు మోక్షం పొందేమార్గం, నారదుని పూర్వజన్మ వృత్తాంతం – అనే వివిధ కథల కదంబం – ఈ సకల శుభప్రదమైన మహాభాగవత సప్తమ స్కంధం!

శ్రీమన్నామ! పయోద
శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
రామాజనకామ! మహో
ద్ధామ! గుణస్తోమధామ! దశరథరామా!

1

తా ॥ శుభకరమైన పేరు కలవాడా! నీలిమేఘం వంటి వర్ణాన్ని కలిగి ఉన్నవాడా! భూమిని పాలించిన వారిలో ప్రఖ్యాతి చెందినవాడా! లోకంలో మనోహరమైనవాడా! యువతీ జనులకు అందమైనవాడా! గొప్పవాడా! మంచి గుణములకు స్థానమైనవాడా! ఓ దశరథ రామా! విను!

# ఉపోద్ఘాతము

వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షన్నరేంద్రుఁడు శుకయోగీంద్రుం గనుంగొని.

2

క. వినఁబడియెను స్వాయంభువ, మనువంశము వర్ణ ధర్మ మర్యాదలతో మనుజుల దనుజుల వేల్పుల, జననంబుల స్రష్ట లెల్ల జనియించుటయున్.

3

తా ॥ గొప్ప గుణాలు కలిగిన మునిశ్రేష్ఠులకు పురాణాలను వ్యాఖ్యానం చేసి చెప్పడంలో శ్రేష్ఠుడయిన సూతుడిలా అన్నాడు: "ఆ విధంగా ప్రాయోపవేశంలో ఉన్న పరీక్షిన్మహారాజు శుక యోగీంద్రునితో, "ఓ యోగిశేఖరా! స్వాయంభువ మనువు వంశాన్ని గురించి, వర్ణములకు తగిన ధర్మాలను గురించి, ఆనాటి మనుష్యులు రాక్షసులు దేవతలు, బ్రహ్మలు జన్మించడాన్ని గురించి

లెస్సగా ఆకర్ణించాను.

ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె? నే
మేమి యొనర్చె? నమ్మనువులే? రతఁ డే క్రియఁ జేయుచున్న వాఁ?
డేమి నటించు మీఁద? గత మెయ్యది? సజ్జనులైనవారు ము
న్నే మని చెప్పుచుందురు? మునీశ్వరః నా కెఱిఁగింపవే దయన్.

4

వ. అనిన శుకుం డిట్లనియె.

5

తా ॥ ఓ మునీశ్వరా! ఏయే మనువుల కాలంలో పరమపురుషుడైన విష్ణువు జన్మించాడు? ఆ సమయంలో ఏమేమి చేసాడు? అతడు చేసిన క్రియల గురించి, దానికి గల పూర్వ కారణాలను గురించి, సత్పురుషుల భావనను అనుసరించి నాకు విశదంగా తెలియజేయండి."

క. ఈ కల్పంబున మనువులు, ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో; లోకముల జనుల పుట్టువు, లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా!

6

తా ॥ "ఓ రాజా! ఈ కల్పంలో పద్నాలుగు మంది మనువులలో ఆరుగురు మనువులు మిక్కిలి ప్రసిద్ధిని గాంచారు. ఇంక సృష్టిక్రమ విధానం, ప్రాణుల పుట్టుకల గురించి నీకు ఇది వరకే తెలియజేశాను కదా!

వ. ప్రథమ మనువైన స్వాయంభువునకు, నాకూతి దేవహూతులను నిరువురు గూఁతులు గలరు. వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబు సేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్న చెప్పంబడియె;

యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము.

7

తా ॥ ప్రథమ మనువైన స్వాయంభువునికి ఆకూతి, దేవహూతి అని ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. వాళ్ళకి క్రమంగా కపిలుడు, యజ్ఞుడు అనే పేర్లతో లోకాలకు ధర్మాన్ని జ్ఞానాన్ని బోధించడం కోసం శ్రీహరి కుమారుడుగా పుట్టాడు. అందులో కపిలుని యొక్క చరిత్ర నీకు ఇంతకు ముందు చెప్పాను. ఇక యజ్ఞుని చరిత్రను చెపుతాను, వినుము.

మ. శతరూపాపతి కామభోగ విరతిన్ సంత్యక్త భూ భారుఁడై
సతియుం దానును గాన కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమస్ఫూర్తితో
గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా!

8

తా ॥ ఓ రాజా! శతరూపకు భర్త అయిన స్వాయంభువుడు(ప్రథమ మనువు) కామభోగాలపై విరక్తి చేత రాజ్యభారాన్ని విడిచి భార్యతో కలిసి అరణ్యానికి తపస్సుకై వెళ్ళాడు. సునందా నదీ తీరంలో నూరు సంవత్సరాలు మౌనవ్రతాన్ని పూని నియమంగా ఒంటికాలిపై నిలిచి లోకంలో ప్రసిద్ధికెక్కునట్లుగా తపస్సు చేశాడు.

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువ మనువు దనమనంబులోన.

9

సీ. సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు? సృష్టి యెవ్వని చేఁతచే జనించు?
జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు?
నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ? నెవ్వని నిజధనం బింత వట్టు
బొడగాన రాకుండఁ బొడగను? నెవ్వఁడే నెవ్వని దృష్టికి నెదురు లేదు?

ఆ. జననవృద్ధి విలయ సంగతిఁ జెందక, యెవ్వఁ డెడపకుండు నెల్ల యెడల?
దన మహత్త్వసంజ్ఞఁ దత్త్వ మెవ్వఁడు దాన, విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు?

10

వ. అని మఱియు నిరహంకృతుండును బుధుండును నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గ సంస్థితుండును నిఖిలధర్మ భావనుండునునైన పరమేశ్వరునకు నమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని.

11

తా ॥ ఇలా తపస్సు చేస్తూ స్వాయంభువ మనువు తన మనస్సులో ఇలా అనుకున్నాడు: 'ఎవడు సృష్టిచేత తాను చేతనత్వాన్ని పొందటం కాకుండా తన చైతన్యం చేత సృష్టి చేస్తాడు? లోకాలు నిద్రిస్తూ ఉంటే తాను మాత్రం జాగ్రత్తులో ఉంటూ ఈ బ్రహ్మాండ విజ్ఞానానికి మూలమైనవాడు ఎవరు? అఖిలమైన జగత్తుకి ఆధారంగా నిలిచి ఆత్మయైన వాడు ఎవ్వరు? అగోచరుడై ఉన్నా ఎదురులేని దృష్టి కలిగిన వాడెవ్వడు? జననమరణాలు లేక శాశ్వత్త్వాన్ని కలిగి ఉన్న వాడెవ్వడు? విశ్వాన్ని రూపంగా చేసుకోగల మహత్త్వ పూర్ణజ్ఞుడు ఎవ్వడు?

ఈ లక్షణాలన్నీ కలిగి ఉన్న నిరహంకారునికి, ప్రజ్ఞాశీలికి, పరిపూర్ణునికి, ఆశారహితునికి, ఎవరినుండి ప్రేరణను పొందకున్నా సర్వులకు ప్రేరణయైన స్వతంత్రునికి, స్థిరమైన ధర్మస్వరూపునికి నమస్కరిస్తున్నాను' అని ఆ స్వాయంభువు మనువు ఉపనిషత్తుల పరమార్థాన్ని తలపోయసాగాడు.

క. రక్కసులు దినఁగఁ గడఁగిన, వెక్కసముగ యజ్ఞనామ విష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల, మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్.

12

తా ॥ అలా ధ్యానంలో ఉన్న వానిని చూసిన రాక్షసులు ఆ మనువును భక్షించే ప్రయత్నం చేసారు. ఆ సందర్భంలో యజ్ఞుడుగా ఉన్న విష్ణువు తన చక్రం చేత దేవతలు బాగు బాగు అని శ్లాఘించుచుండగా రాక్షసులనందరినీ సంహరించాడు.

వ. ఇది ప్రథమ మన్వంతరం; బింక ద్వితీయ మన్వంతరంబు వినుము.

13

తా ॥ ఇది ప్రథమ మన్వంతరం సంగతి. ఇక ద్వితీయ మన్వంతరంలో జరిగినది చెబుతాను. వినవలసింది.

సీ. స్వారోచిషుం డన సప్తార్చిబిడ్డఁడు మనువు వానికి నా ద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢ పుత్త్రులు ధాత్రి నేలిరి; రోచనుఁ డింద్రుఁ డయ్యె;
నధికులు తుషితాదు లమరు లూర్జస్తంబ ముఖ్యు లాఢ్యులు సప్తమునులు నాఁడు
వేదశిరుం డను విప్రుని దయితకుఁ దుషితకుఁ బుత్త్రుఁడై తోయజాక్షుఁ

ఆ. డవతరించెను విభుఁ డన నశీత్యష్ట స, హస్ర మునులు నధికు లయినవారు;
ఘను లనుగ్రహింపఁ గౌమారక బ్రహ్మ, చారి యగుచు నతఁడు సలిపె వ్రతము.

14

తా ॥ అగ్ని కుమారుడైన స్వారోచిషుడు మనువయ్యాడు. అతనికి ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలైన వారు పుత్రులై ఈ ధరణిని పాలించారు. అప్పుడు రోచనుడు ఇంద్రుడైనాడు. తుషితుడు మొదలైన వారు దేవతలుగా ఉన్నారు. ఊర్జస్తంభుడు మొదలైన వారు సప్తఋషులు అయ్యారు. అప్పుడు వేదశిరుడు అనుపేరుకల బ్రాహ్మణుని భార్య అయిన తుషితకు కుమారుడుగా శ్రీ మహావిష్ణువు విభుడనే నామంతో జన్మించాడు. అతడు కుమార బ్రహ్మచారియై వ్రతదీక్షను గైకొని ఎనభై ఎనిమిదివేల మంది మునుల ఆదరణను పొందాడు.

వ. తదనంతరంబ.

15

సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిల యెల్లఁ బవనసృంజయ యజ్ఞ హోత్రాదు లాతని పుత్త్రు లధిక
గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు లైరి సప్తర్షులు నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు సత్యభద్రాద్యులు సురలు ధర్మునికిని సూనృతకును

తే. బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య, సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజ యక్షపతుల దండించె సత్య జి, న్మిత్రుఁ డనఁగ జగము మే లనంగ.

16

తా ॥ ఆ పిమ్మట ప్రియవ్రతుని కుమారుడు "ఉత్తముడు" మూడవ మనువై ఈ భూమండలాన్నంతా పరిపాలించాడు. అతనికి పవనుడు, సృంజయుడు, యజ్ఞహోత్రుడు మొదలైన వారు కుమారులు. వారంతా చాలా గుణవంతులు. అప్పుడు వసిష్ఠుని పుత్రులు ప్రమథుడు మొదలైనవారు సప్త ఋషులు అయ్యారు. సత్యజిత్తనే వాడు ఇంద్రుడయ్యాడు. సత్యుడు, భద్రుడు మొదలైనవారు దేవతలు అయ్యారు. ధర్మునికి సూనృతకు పుట్టిన సత్యసేనుడనే వాడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు యొక్క అవతారం. అతడు సత్యజిత్తుకు మిత్రుడై లోకం మెచ్చుకొనేటట్లుగా దుష్టులైన రాక్షసులను, యక్షులను దండించాడు.

# గజేంద్ర మోక్షం

వ. చతుర్థమనువు కాల ప్రసంగంబు వివరించెద.

17

సీ. మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు తామసుం డనఁగ నుత్తముని భ్రాత
పృథ్వీపతులు కేతు వృష నర ఖ్యాత్యాదు లతని పుత్త్రులు పద్గు రధికబలలు
సత్యకహరి వీర సంజ్ఞులు వేల్పులు త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు
మునులు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు; హరి పుట్టె హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు;

ఆ. గ్రాహబద్ధుఁ డయిన గజరాజు విడిపించి, ప్రాణభయము వలనఁ బాపి కాచె
హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ, డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు.

18

తా ॥ ఓ రాజా! ఇప్పుడు నాల్గవ మన్వంతరం గురించి చెబుతాను. ఉత్తముని సోదరుడు "తామసుడు" అనేవాడు నాల్గవ మనువు అయ్యాడు. అతని కుమారులైన కేతువు, వృషుదు, నరుడు, ఖ్యాతి మొదలైన వారు పదిమంది చాలా బలవంతులు; వారంతా రాజులయ్యారు. అప్పుడు సత్యకులు, హరులు, వీరులు మొదలైన వారు దేవతలయ్యారు. త్రిశిఖుడనే వాడు ఇంద్రుడయ్యాడు. జ్యోతిర్వ్యోముడు మొదలైన వారు సప్తఋషులైనారు. విష్ణువు 'హరి' అను నామంతో హరిమేధునికి, హరిణికి జన్మించాడు. దయా సముద్రుడు, అఖిల లోకేశ్వరుడు అయిన ఆ శ్రీహరి మొసలి బారి నుండి గజరాజును విడిపించి దానిని ప్రాణాపాయం నుండి కాపాడాడు" అని చెప్పగా అప్పుడు శుకునితో రాజేంద్రుడు ఇలా అన్నాడు:

క. నీరాట వనాటములకుఁ, బోరాటం బెట్లు గలిగెఁ? బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను, ఘోరాటవిలోని భద్ర కుంజరమునకున్.

19

క. మునినాథ! యీ కథాస్థితి, వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్;
వినియెదఁ గర్ణేంద్రియముల, పెనుఁబండువు సేయ మనముఁ బ్రీతిం బొందన్.

20

క. ఏ కథల యందుఁ బుణ్య, శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతి హర్షమునన్.

21

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండైన పరీక్షిన్న రేంద్రుండు బాదరాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె; నట్లు శుకుండు రాజున కిట్లనియె.

22

తా ॥ "మహర్షీ! నీళ్ళలో తిరిగే మొసలికి అడవిలో సంచరించే ఏనుగుకి అసలు పోరాటం ఎలా కలిగింది? శ్రీ మహావిష్ణువు ఏ విధంగా ఆ ఏనుగు పరితాపాన్ని తీర్చాడు? ఈ వివరాలను వినాలని ఎంతో కుతూహలంగా ఉంది, చెవులకు ప్రీతిపాత్రంగా మనస్సుకి ఆనందం కలిగించే ఆ కథను వివరించు. ఏ కథలలో పుణ్యశ్లోకుడైన శ్రీహరి చెప్పబడతాడో ఆ కథలు పుణ్యకథలని అంటారు పెద్దలు" అని పరీక్షిత్తు శ్రీ శుకుణ్ణి అడిగాడు" అని చెప్పి, సభాసదులయిన మునులను చూసి సూతుడు పరమోత్సాహంతో చెప్పాడు: "అంత శుకమహర్షి రాజుతో ఇలా అన్నాడు:

సీ. రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వతము త్రికూటం బనఁ దనరుచుండు
యోజనాయుతమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
గాంచనాయస్సారకలధౌతమయములై మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;
దట శృంగబహురత్న ధాతుచిత్రితములై దిశలు భూనభములుఁ దేజరిల్లు;

తే. భూరిభూజలతా కుంజ పుంజములును, మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరఁగి తిరిగెడు దివ్య విమానములును, జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి.

తా ॥ "ఓ రాజా! విను! క్షీర సాగరంలో పదివేల ఆమడల పొడవు, అంతే వెడల్పు అంతే ఎత్తు కలిగి త్రికూటం అని ఒక పర్వతం ఉంది. అది బంగారము, వెండి, ఇనుముతో నిండిన మూడు శిఖరాలను కలిగి ఉంది. ఆ పర్వతం యొక్క శృంగములలో ఉండే అనేక రత్నములు, ధాతువుల వలన దిశలు, భూమి, ఆకాశము తేజరిల్లుతూ ఉంటాయి. అక్కడ మహావృక్షములు, లతలు, మధుర ధ్వనితో పారే సెలయేరులు, ఎప్పుడూ తిరిగే దివ్య విమానములు, దాని చరియలలో విహరించే కిన్నర సమూహంతోటప్రకృతి పరమ రమణీయంగా ఉంటుంది.

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుల వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును, మణివాలుకానేక విమల పులినతరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖీశాఖాంతర పరిపక్వ ఫలరంధ్రప్రవర్షిత రసప్రవాహ బహుళంబును, గనకమయ సలిల కాసార కాంచన కుముద కహ్లార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీభూత భూన భో-ంతరాళంబును, దుహినకరకాంత మరకత కమలరాగ వజ్రవైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మయానేక శిఖరతట దరీవిహరమాణ

విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖీల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపంబునందు.

24

తా ॥ ఆ త్రికూట పర్వతం మీద మాదీఫలం, లవంగం, పుల్ల మాదీఫలం, మామిడి, మొగలి, జీడి, అంబాళం, తెల్లతెగడ, పనస, రేగు, పొగడ, ప్రబ్బ, మర్రి, కొండమల్లె, మొల్ల, ఎర్రగోరింట, తుమ్మ, కోవిదారం, ఖర్జూరం, నారికేళం, వావిలి, చందనం, వేము, మందారం, నేరేడు, నిమ్మ, పూగురివెంద, ఇప్ప, తాడి, తక్కోలం, తమాలం, గిరకతాడి, రసాలం, మద్ది, మోరటి, మారేడు, ఉసిరిక, పోక, కడిమి, గన్నేరు, అరటి, వెలగ, ఉమ్మెత్త, కలజువ్వి, దిరిసెన, ఇరుగుడు, అశోకం, మోదుగు, పొన్న, సురపొన్న, సంపెంగ, తామర, మరువకం, మంచి మల్లె ఇత్యాది చెట్లు తీగలు ఉన్నాయి. వసంతకాలం రాగానే అవి అంకురించి, చిగురిస్తూ, మొగ్గతొడుగుతూ పూలుపూస్తూ ఎంతో అందంగా ఉంటాయి.

అనేక మణులతో నిండిన ఇసుక తిన్నెలు రమణీయంగా ఉన్నాయి. చెట్ల కొమ్మలలో గుమిగూడిన చిలుకలు, కోయిలలు పరిపక్వ ఫలాలను తమ వాడి అయిన ముక్కులతో పొడుస్తూ ఉంటే, వాటి నుండి వెలువడే రసం ప్రవాహ రూపంలో వస్తోంది. ఆ కొండలో బంగారపు నీటితో కూడిన సరస్సులలో తెల్ల కలువలు, ఎర్రకలువలు, పద్మములు వీటి సువాసనతో నిండిన మకరందాన్ని పానం చేసి మదించిన భ్రమరాలు తమ అంగనలతో క్రీడిస్తూ ఉంటాయి. వాటి చెంతనే శకుంత పక్షులు, హంసలు, కారండవ పక్షులు, నీటి కోళ్ళు, చక్రవాకాలు, కొక్కెరలు, చీకు కొక్కెరలు ఇత్యాది జలపక్షులు రమణీయంగా తిరుగుతూ ఉంటాయి. అవి చేసే కోలాహలధ్వనులు భూమ్యాకాశములను నింపుతున్నట్లుగా ఉంది.

ఆ కొండలో చంద్రకాంత మణులు, మరకతాలు, వజ్రాలు, వైడూర్యాలు, నీలములు, గోమేధికాలు, పుష్యరాగాలు సమృద్ధిగా ఉన్నాయి. వాటిని కలిగి ఉన్న బంగారు, వెండి పర్వత శిఖరములలో విద్యాధరులు, దేవతలు, సిద్ధులు, చారణులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు తమ ప్రియురాండ్రతో కలిసి ఎల్లప్పుడూ విహరిస్తూ ఉంటారు. ఆ పర్వతం వద్ద మత్తగజములు, గురుపోతులు, గండభేరుండములు, ఖడ్గమృగాలు, సింహాలు, శరభమృగాలు, పులులు, కుందేళ్ళు, చమరీ మృగాలు, ముండ్ల పందులు, ఎలుగుబంట్లు, జింకలు, తోడేళ్ళు, అడవి పందులు, అడవి దున్నలు, కోతులు, భయంకరమైన సర్పాలు, పిల్లులు మొదలైన జంతువులు కూడా ఉన్నాయి. అవి ఎప్పుడూ సమర సన్నాహంలో ఉంటాయి. వాటికి భయపడి యమభటులు సైతం శరణు వేడుకుంటారు.

క. ఖిల్లీ భిల్ల లులాయక, భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ
ఝిల్లీ హరి శరభక కిటి, మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్.

25

తా ॥ ఆ త్రికూట పర్వతం దగ్గరున్న అరణ్యంలో చెంచులు, చెంచెతలు నెలవు ఏర్పరచుకున్నారు. అడవి దున్నలు, ఎలుగుబంట్లు, పాములు, ఖడ్గమృగాలు, గురుపోతులు, కోతులు.... వంటివి కూడా అక్కడ ఉన్నాయి.

శా. అన్యాలోకన భీకరంబులు జితాశానేకపానీకముల్
వన్యేభంబులు గొన్ని మత్తతనులై వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరి భూధరదరీ ద్వారంబులందుండి సౌ
జన్యక్రీడల నీరుగాలి వడి కాసారావగాహార్థమై.

26

తా ॥ ఆ అరణ్యంలో చూడటానికి సైతం భయంకరంగా ఉండే మత్తగజాలు దిగ్గజాలను

మించి ఉన్నాయి. అవి కొండ గుహలలో నుండి విహారం కోసం బయలుదేరి చెర్లాటలు ఆడుతూ, అలసటతో, దాహంతో గాలిగమనం వలన కొలను జాడను పసిగడుతూ నడక సాగిస్తాయి.

ఆ. అంధకార మెల్ల నద్రిగుహాంతర, వీథులందఁ బగలు వెఱచి డాఁగి
యెదరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న, వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.

27

తా ॥ పగలు భయపడి కొండ గుహల్లో దాక్కొని, సూర్యుడు సాయంకాలమయ్యే సరికి వృద్ధుడయ్యాడనే ధైర్యంతో బయటకు వచ్చిన అంధకారం వలె ఉన్నాయి ఆ ఏనుగుల గుంపులు.

క. తలఁగవు కొండలకైనను, మలఁగవు సింగములకైన మార్కొను కడిమిం
గలఁగవు పిడుగుల కైనను, నిల బలసంపన్న వృత్తి నేనుఁగు గున్నల్.

28

తా ॥ ఆ ఏనుగు గున్నలు కొండలను "ఢీ" కొనడానికి సైతం తొలగిపోవు. సింహములను సైతం ఎదిరిస్తాయి. తమ బల సంపత్తి చేత పిడుగులను సైతం లెక్క చేయవు. అటువంటి ధీరలక్షణాలను కలిగి ఉన్నాయి.

సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;
భూదారములు నేల బొఱియలలో డాఁగు; హరిదంతముల కేఁగు హరిణచయము;
మడువుల జొరఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు నీల కంఠంబులు నింగి కెగయు;

తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల, చామరంబుల విహరణశ్రమము వాయ
భయదపరిహేల విహరించు భద్రకరుల, గాలివాఱిన మాత్రన జాలిఁ బొంది.

29

తా ॥ ఆ మత్త గజములు భయంకరంగా విహరిస్తూంటే వాటిని చూసి పులులు పొదరిండ్లలో దూరుతున్నాయి. ఘోరమైన ఎలుగుబంట్లు గుహల్లోకి పరుగిడుతున్నాయి. అడవి పందులు నేల గోతుల్లో దాక్కుంటున్నాయి. జింకల గుంపులు అన్ని దిక్కులా పరుగులు పెడుతున్నాయి. అడవి దున్నలు మడుగులలోకి జొరబడుతున్నాయి. వానర సమూహం బండలపైకి, కొండలపైకి ఎగబ్రాకుతున్నాయి. అడవి పాములు పుట్టల్లో ఒదిగి ఉన్నాయి. నెమళ్ళు దారిచ్చేందుకు ఆకాశంలోకి ఎగురుతున్నాయా అన్నట్లున్నాయి. చమరీ మృగాలు భయపడి తమ తోక కుచ్చులతో సంచార శ్రమ తీరేటట్లుగా వాటికి విసరసాగాయి. ఈ విధంగా ఆ మదపుటేనుగులు స్వైరవిహారం చేస్తున్నాయి.

క. మదగజ దానామోదము, గదలని తమకములఁ ద్రావి కడుపులు నిండన్
బొదలుచుఁ దుమ్మెదకొదమల, కదుపులు ఝుం ఝుమ్మటంచు గానము సేసెన్.

30

తా ॥ ఆ మదపుటేనుగుల యొక్క సుగంధ భరిత మదజలాన్ని కడుపునిండా త్రాగి తుమ్మెదల గుంపులు కదలలేక ఝుంఝుమ్మని గానం చేయసాగాయి.

క. తేఁటి యొకటి యొరు ప్రియకును, మాటికి మాటికిని నాగ మదజల గంధం
బేటి కని తన్నుఁ బొందెడి, బోటికి నందిచ్చు నిండు బోటుఁ దనమునన్.

31

తా ॥ ఒక తుమ్మెద తన ప్రియురాలికి మాటి మాటికి మదజల గంధాన్ని అందివ్వటం ఎందుకని తనను కూడటం కోసం చెంతకు చేరిన బోటికి అందిస్తోంది.

క. అంగీకృత రంగ న్మా, తంగీ మదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల, భృంగీగణ మొప్పె మ్రానుపెట్టెడి మాడ్కిన్.

32

తా ॥ ఏనుగుల మదగంధాన్ని ఆస్వాదిస్తూ అలా వేడుకతో ఆ తుమ్మెదగణం అంతా తమ సంగీత విశేషాలతో ఆ అరణ్యాన్ని అలరించసాగాయి.

క. వల్లభలు పాఱి మునుపడ, వల్లభ మని ముసరి రేని వారణదానం
బొల్లక మధురవల్లభు, లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్.

33

తా ॥ గజముల మదజలానికి భ్రమరకులం ఆనందంతో పోయి ముసురుకొంటే ఆ దానజలానికి ఆశపడకుండా మగతుమ్మెదలు తమ మనసుల్లో ఉల్లాసాన్ని పొందుతున్నాయి.

వ. అప్పుడు.

34

మ. కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబుల రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచుం
బులులం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గొలకుఁల్ సొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్.

35

తా ॥ ఆ మందలోని గున్న ఏనుగులు చిన్న చిన్న నీటి గుంటలను వాసన చూసి నడుస్తూ, ఫలించిన చెట్లను రాసుకుంటూ, చిగుళ్ళను మేస్తూ, వేడుకకై పులులను, ఎనుపోతులను, జింకలను పోనియ్యక నిలిపి ఉంచుతూ, కొలనుల్లో దిగి నీటిని కలచివేస్తూ, గిరులమీద దుమ్మును నెత్తి మీద చల్లుకుంటూ విహరిస్తున్నాయి.

క. తొండంబుల మదజలవృత, గండంబులఁ గుంభములను ఘట్టన సేయం
గొండలు దలక్రిందై పడు, బెండుపడున్ దిశలు చూచి బెగడున్ జగముల్.

తా ॥ ఆ మత్త మాతంగాలు తమ పరాక్రమాన్ని చూపే విధంగా తొండములతో, మదజలం నిండిన చెక్కిళ్ళతో తమ కుంభ స్థలాలతో కొండలు తలక్రిందులను చేస్తున్నాయా అన్నట్లుగా ఢీ కొట్టసాగాయి. దానితో దిక్కులు పిక్కటిల్లుతూ లోకాలు భయకంపితం అవుతున్నాయి.

క. ఎక్కడఁ జూచిన లెక్కకు, నెక్కువయై యడవి నడచు నిభయూథములో
నొక్కకరినాథు డెడతెగి, చిక్కొనొక కరేణుకోటి సేవింపంగన్.

37

తా ॥ ఎక్కడ చూసినా లెక్కపెట్టేందుకు వీలు గాని విధముగా ఆ అడవిలో విహరిస్తున్న ఆ గజ సమూహంలో ఒక్క గజనాథుడు వెనుక పడ్డాడు. కొన్ని ఆడ ఏనుగులు అతనిని సేవిస్తూ అతని వెనకాలే ఉన్నాయి.

వ. ఇట్లు వెనుక ముందట నుభయ పార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగు దప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణు సముదయంబును నొక్క తెరువై పోవుచు.

38

తా ॥ ఈ విధంగా వెనక ముందు ఉభయ పార్శ్వాలలోను వస్తూన్న ఏనుగుల గుంపు కనబడక దారి తప్పి దూరంగా నిలిచిపోయిన ఆ గజరాజు ఈశ్వర సంకల్పం చేత కొన్ని ఆడ ఏనుగులు తనను వెంబడిస్తూ రాగా వేరే దారి పట్టి పోవుచున్నాడు.

సీ. పల్వలంబుల లేఁతపచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక;
ఇవురుజొంపములఁ గ్రొవ్వెలయు పూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు,

ఘనదానశీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువు లరసి;

మృదువుగాఁ గొమ్ముల మెల్లన గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు;

తే. పిఱుఁదు చిక్కట్ల డగ్గఱి ప్రేమతోడ, డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు

వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు, మత్తమాతంగ మల్లంబు మహిమతోడ;

39

తా ॥ ఆ సమయంలో మత్తుడైన గజేంద్రుడు ప్రేమతో తన ప్రియురాండ్రకు నీళ్ళున్న గుంటల్లో మొలిచిన లేత పచ్చికను కొరత లేకుండ అందిస్తున్నాడు. చిగురు గుత్తులను, పూలకొమ్మలను తన ప్రాణ వల్లభలకు కోసి హాయిగా పంచిపెడుతున్నాడు. మదజలంచేత చల్లనైన విసరు కర్రల వంటి తన చెవులతో వాటి చెమటలు పోగొడుతున్నాడు. మృదువుగా తొండముతో మెల్లగా కంఠ భాగములు నిమురసాగాడు. ప్రేమతో వాసన చూస్తూ, ఆకాశం వైపు తొండాన్ని సాచి కొంతసేపు క్రీడిస్తూ, తరువాత విశ్రమిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు.

సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతులు కుచములు పయ్యెదకొంగు లీఁగఁ

దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ

దన కరశ్రీఁ గని తలఁగి బాలలు చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ

దన దంతరుచికోటి తరుణుల నగవుల ముఖచంద్ర దీప్తుల ముసుఁగు దిగువఁ

తే. దనదు లావణ్య రూపంబుఁ దలఁచి చూడ, నంజనాభ్రము కపిలాదిహరిదిభేంద్ర

దయిత లందఱుఁ దనవెంటఁ దగిలి నడవఁ, గుంభివిభుఁ డొప్పె నొప్పుల కుప్పవోలె.

40

తా ॥ గజరాజు యొక్క కుంభస్థలాల పూర్ణతకు ఈడు రాకపోవటం వల్ల యువతుల కుచములు పయ్యెద కొంగు చాటుకు చేరాయి. ఆ గజం నడకలోని గాంభీర్యానికి సరిచాలక అబలామణుల నడక అందెల ఆశ్రయాన్ని కోరాయి. అతని తొండము యొక్క వైభవానికి

తోడురాక బాలికల చిన్నతొడలు వడ్డాణమును పైకి అలంకారంగా తెచ్చుకున్నాయి. ఆ ఏనుగు దంతముల కాంతి, తరుణుల నవ్వుతూన్న ముఖచంద్ర కాంతులకు ముసుగు వేస్తూన్నది. ఆ గజరాజు లావణ్యమైన రూపాన్ని చూసి దిగ్గజముల భార్యలయిన అంజన, అభ్రము, కపిలాదులు వెంట వస్తున్నాయో అన్నట్లుగా ఆ ఆడ ఏనుగులు అతనిని అనుసరిస్తున్నాయి.

వ. మఱియు నానాగహన విహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి పిపాసా పరాయత్త చిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని.

41

తా ॥ మరియు అనేక అడవులలో విహరిస్తూ వస్తున్నందున ఆ మత్తగజానికి మిక్కిలి దాహం వేసింది. వెంటనే ఆడ ఏనుగులతో కలిసి, దప్పికతో బాధ పడుతూ నీటి కోసం అన్వేషించసాగాడు.

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవపుల్లాంభోజకల్హారమున్  
నటదిందిందిర వారముం గమఠమీనగ్రాహ దుర్వారమున్  
వట హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం  
జటులోద్ధూత మరాళచక్రబక సంచారంబుఁ గాసారమున్.

42

తా ॥ అలా వెళ్ళగా వెళ్ళగా, ఆ గజరాజుకు ఒక పెద్ద కొలను కనిపించింది. ఆ కాసారంలో క్రొత్తగా వికసించిన పద్మాలు, కలువలు అనేకం ఉన్నాయి. వాటి చుట్టూ తుమ్మెదలు తిరుగుతున్నాయి. ఆ జలాల్లో తాబేళ్ళు, చేపలు, గొప్ప మొసళ్ళు ఉన్నాయి. హంసలు, చక్రవాకములు, కొంగలు సంచరిస్తున్నాయి. ఆ కాసార తీరంలో మఱ్ఱి, తాడి, మామిడి, మద్ది, పూదీగెలు, పొదరిండ్లు అనేకం ఉన్నాయి. ఆ వాతావరణమంతా ఎంతో ఆహ్లాదంగా ఉంది.

వ. ఇట్లనన్య పురుష సంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని.

సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని మెల్లని గాడ్పుల మేను లలరఁ
గమల నాళాహార విమలవాక్కలహంస రవములు సెవుల పండువులు సేయ
ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు వదన గహ్వరముల వాడు దేర్పఁ

తే. త్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన, విభవ మీక్షణములకును విందు సేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను, మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁ జొచ్చె.

44

తా ॥ ఈ విధంగా వేరే గజములచేత కల్లోల పరచకుండా, నిర్మలంగా ఉన్న ఆ కొలనుని చూసాయి. పద్మపరిమళంతో కూడిన చల్లని గాలి, బడలికగొన్న శరీరాలకు హాయిని చేకూరుస్తోంది. తామర తూండ్లు ఆహారంగా తీసుకొన్న స్వచ్ఛమైన రాయంచల కలకూజితములు చెవులకు పండుగ చేయసాగాయి. వికసించిన కలువలు, పద్మాలు వీటియొక్క గంధము నాసికా రంధ్రములకు తృప్తినిస్తోంది. నిర్మలమైన తరంగాల మీదుగా వచ్చే జలము వాడిన ముఖాలకు హాయిని చేకూరుస్తుంది. ముల్లోకాలలోను అభినవము, సౌభాగ్యవంతము అయిన ఆ వైభవం నేత్రాలకు విందు చేస్తోంది. ఆ జలాశయాన్ని చూసేసరికి పంచేంద్రియాలకు కావలసిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ గుణాలు ఐదూ ఆ కొలనుయందే ఉన్నాయనే తన్మయత్వంతో ఆ ఏనుగుల సమూహము కొలనులోకి ప్రవేశించాయి.

క. తొండంబులఁ బూరించుచు, గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు, నిండన్ వేదండకోటి నీటిం ద్రావెన్.

45

తా ॥ తొండములతో హాయిగా నీటిని త్రాగుతూ, చెక్కిళ్ళ మీద చల్లుకొంటూ,

ఏనుగులన్నీ గడగడ మనే శబ్దం చేస్తూ కడుపుల నిండా నీళ్ళు త్రాగాయి.

వ. అప్పుడు.

46

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం
డభ మార్గంబున కెత్తి నిక్కివడి నుడ్డాడించి పింజింప నా
రభటిన్ నీరములోన బెల్లెగసి నక్రగ్రాహ పాఠీనముల్
నభమం దాడెడు మీనకర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్.

47

తా ॥ అప్పుడు ఆ గజరాజు తన తొండంతో నీటిని పీల్చి పూరించి పైకి చిమ్మే సరికి నీటితో పాటు పైకెగిరిన ఎండ్రకాయలు, మొసళ్ళూ, చేపలు ఆకాశంలో తిరిగే మీన రాశిని కర్కాటక రాశిని పట్టుకొన్నాయా అనిపించింది. ఆ వింత చూసి దేవతలు ఆశ్చర్యచకితులయ్యారు. ఇది మదగజేంద్రుని బల నిరూపణకు తార్కాణము.

వ. మఱియు న గ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున.

48

సీ. కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు
హస్తినీ హస్త విన్యస్తపద్మంబుల వేయుగన్నులవాని వెరవు సూపుఁ
గలభసముత్కీర్ణ కల్హార రజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీ పరిచిత కుముదకాండంబుల ఫణిరాజ మండన ప్రభ వహించు

ఆ. మదకరేణు ముక్త మౌక్తిక శుక్తుల, మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు, వనజగేహకేళి వ్రాలునపుడు.

49

తా ॥ ఈ విధంగా ఎదురు లేకుండా ఆ గజరాజు ఆ కాసారంలో ఈదులాడుతుంటే ఆడ ఏనుగులు తొండముల చేత నీళ్ళు చల్లాయి. ఆ జలధారలతో తడిసి ఉన్న అతడు సెలయేళ్ళతో కూడిన నీలగిరి వలె ఒప్పారుచుండెను. ఆడ ఏనుగులు అతని మీదకు విసిరిన పద్మములతో దేవేంద్రుని వలె వెలుగొందాడు. ఆడ ఏనుగులు చల్లిన కలువల పుప్పొడి చేత బంగారు కొండలా ఘనత వహించాడు. అతని శరీరం మీద వేసిన కలువ కాడలతో అతడు సర్పహారాలు ధరించిన ఈశ్వరునిలా ఉన్నాడు. మదించిన ఆడ ఏనుగులు అతని మీద చల్లిన ముత్యాల చిప్పలతో అతడు మెరుపులతో కూడిన మేఘాలను ఎగతాళి చేసేలా ఒప్పారాడు.

వ. మరియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమ కోమలియునుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధుకర నికరయు, విగతరస వదనకమలయు, నిజస్థాన చలిత కుచరథాంగ యుగళయు, లంపటిత జఘనపులినతలయునై యుండె; నంత.

50

తా ॥ మరియు ఆ సరోవరానికి ఆ మదగజం యొక్క వివిధమైన విహారముల వలన పూర్వపు అందచందాలు పోయి కొత్త సొగసు వచ్చింది. అనంగ విద్యలో ఆరితేరిన విటునితో సంభోగిస్తూ అలంకారం చేసుకొన్న కుసుమ కోమలివలె ఆ సరసి ఒప్పారింది. మత్తతతో కూడిన తుమ్మెదలు చెదరిన ముంగురులుగా రసవిహీనమైన పద్మములు ముఖముగా, తమ స్థానముల నుండి విడివడిన చక్రవాకములు స్తనాలుగా, త్రొక్కబడిన ఇసుకతిన్నెలు పిరుదులుగా ఉన్నాయి. సరోవర రూపాన్ని సౌందర్యాధి దేవతగా ఇక్కడ వర్ణన చేశారు.

సీ. భుగభుగాయితభూరి బుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ;
భువన భయంకరఘూత్కార రవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ,
వాలవిక్షేప దుర్వార ఝంఝానిల వశమున ఘుమఘుమావర్త మడరఁ

గల్లోలజాల సంఘట్టనంబులఁ దటీ తరులుమూలములతో ధరణిఁ గూల,

తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి, యుదరి కుప్పించి లంఘించి హుంకరించి భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది, నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె.

51

తా ॥ అట్టి గజరాజును ఆ మడుగులో దాగి ఉన్న ఒక మొసలి చూసింది. భుగభుగమంటూ, భయంకరమైన బుడగల చప్పుళ్ళతో, ఆకాశానికి ఎగిరేటట్లు ఒక్కసారిగా పైకి ఎగిరింది. లోకాలు భయపడేటట్లు చేసిన ఆ మకరం పూత్కార రవానికి ఘోరమైన మొసళ్ళు, చేపలు ఇత్యాది జలజంతువులన్నీ భయపడ్డాయి. తోక జాడిస్తే పుట్టిన ఝంఝానిలానికి ఆ సరస్సులో సుడిగుండాలు కదలాడాయి. అది నీటిలో తిరిగేటప్పుడు పుట్టిన కల్లోలానికి, ఆ అలల ఉధృతి తాకిడిచే ఒడ్డున ఉన్న చెట్లన్నీ నేల కూలాయి. హూంకరిస్తూ సరస్సు నుండి కుప్పించి ఒక్క ఎగురు ఎగిరి, రాహువు సూర్యుడిని పట్టుకొన్నట్లు ఆ మకరరాజు ఆ కరిరాజును పట్టుకొన్నది.

క. వడిఁ దప్పించి కరీంద్రుడు, నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబున్
బొడ వడఁగినట్లు జలములఁ బడి, కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్.

52

తా ॥ మొసలి యొక్క పట్టు తప్పించుకునేందుకు గజేంద్రుడు తన పొడవైన తొండాన్ని పైకెత్తి మొసలి మీద వేసేసరికి ఆ ధాటికి అది తట్టుకోలేక ఒక్కసారిగా నీటిలో పడిపోయింది. అంతలోనే తమాయించుకుని వేగంగా లేచి, ఆ ఏనుగు ముందర కాళ్ళను రెండూ ఒడసి పట్టింది.

చ పదములఁ బట్టినం దలఁకుఁబా టొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం

జెదరఁగఁ జిమ్మె న మ్మకరిచిప్పలు పాదులు దప్ప నొప్పఱన్
వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ గోఱలన్.

53

తా ॥ మొసలి పాదాలను పట్టుకున్నా చలించక, శూరత్వంతో ఆ గజరాజు ధైర్యంగా తన రెండు దంతములతోను ఆ మకరి చిప్పలు పట్టు తప్పేటట్లుగా పొడిచేసరికి, ఆ మొసలి, ఏనుగు కాళ్ళు విడిచి తోకను పట్టుకుని కోరలతో చీరింది.

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ, గరి దరికిని మకరిఁ దిగుచు గరకరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి, భర మనుచును నతల కుతల భటు లరుదు పడన్.

54

తా ॥ మొసలి ఏనుగును నీళ్ళలోకి లాగుతుంటే ఏనుగు మొసలిని గట్టుపైకి లాగుతోంది. రెండూ పరస్పరం ద్వేషాన్ని పెంచుకుంటున్నాయి. దానిని చూసిన అతల కుతల లోకాలలో ఉండే వీరులంతా ఏనుగు కంటే మొసలి – మొసలిని మించి ఏనుగు బలమైనవి అని ఆశ్చర్యపడ్డారు. మొసలికి నీటిలోపల బలం ఎక్కువ, ఏనుగుకి నేలయందు బలం ఎక్కువ, అందుచేత ఎవరికి వారు స్థానబలిమిని పెంచే ప్రయత్నాన్ని చేస్తున్నారు.

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై, యన్యోన్యవిజయశ్రీ వశీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం దాఁకి పెఱితివియక పెనంగు తెఱంగును నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ గొలంకు గలంకంబందఁ గడువడి నిట్టట్టు పడి తడఁబడక బుడబుడాను కారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వరంబుల నప్పళింపుచు నిశితనితాంత దురంతదంత కుంతంబుల నింతింతలు దునియలయి

నెప్పళంబునం బునుక చిప్పలు గుదుళ్ళు దప్పి రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు వదలక కుదురై వర్తించుచుఁ బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభసంబున నిక్కలువడ మ్రక్కం ద్రొక్కుచు మెందుచెడి బెండువడి నాఁచు గుల్లచిప్పతండంబులం బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నోలమాసగొనక గెలుపుఁ దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులై నిర్గత నిద్రాహారంబులై యవక్ర పరాక్రమ ఘోరంబులై పోరుచున్న సమయంబున.

55

తా ॥ ఈ విధంగా ఆ ఏనుగు, మొసలి రెండూ సమస్తలోకంలో ఉండే చూపరులకు భీకరంగా ఉండేటట్లుగా ఒకదాన్నొకటి ఢీకొన్నాయి. ఒకదానిని ఒకటి గెలవాలనే పట్టుదలతో ఆ కాసారాన్ని కలచివేయసాగాయి. సింహాన్ని సింహము, కొండను కొండ వెనుదీయకుండా పెనగినట్లు నీళ్ళలో అవి పోరాటాన్ని సాగించాయి. ఒకదాని నొకటి పట్టుకుంటూ నీటి లోపలికి ఒకటి లాగుతూంటే, వెలుపలికి రెండోది లాగుతూ కొలనులోని నీరు కళంకిత మయ్యేటట్లుగా దెబ్బలాడుకొంటున్నాయి. బుడ బుడమంటూ బుగులు బుగులు అనే చప్పుళ్ళతో, ఆ కాసారపు నీరు నురుగలతో ఆకాశమంటుతుందా అన్నట్లుగా ఉంది. ఈ విధంగా ఆ రెండూ కూడా తలలు ముక్కలయ్యేట్లు ఒకదానినొకటి ఢీ కొంటూ నెత్తురు కారేటట్లుగా హుమ్మంటూ వాడియైన పళ్ళతో పొడుచుకుంటున్నాయి. ఆ ఘర్షణలో తమ పాదాల పట్టు వదలకుండా నిలత్రొక్కుకుంటున్నాయి. సరస్సులోని నీళ్ళు సుళ్ళు తిరుగుతూ ఉంటే ఆ నీళ్ళ తాకిడికి తాబేళ్ళు, ఎండ్రకాయలు, చేపలు, కప్పలు మొదలైన నీటి జంతువులు ప్రాణాలను కోల్పోతున్నాయి. వీరి భీకర పోరాటానికి నాచు, గుల్ల చిప్పలు వంటివి చిందరవందరగా వాటి శరీరాల నిండా పరుచుకుంటున్నాయి. ఎలాగైనా సరే గెలవాలనే పట్టుదలతో చెలరేగి రేయింబవళ్ళు నిద్రాహారాలు లేకుండా అవక్ర పరాక్రమంతో

ఘోరంగా పోరాడుతున్నాయి.

క. జవమును జలమును బలమును, వివిధములుగఁ బోరు కరటివీరతకు భువిన్
దివి మకరమీన కర్కట, నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్.

56

తా ॥ వేగంతో, పట్టుదలతో, బలంతో, ఇంకా అనేక విధాలుగా పోరాడుతున్న ఆ గజరాజు యొక్క వీరత్వానికి అచ్చెరువొంది ఆకాశంలోని మకర, మీన, కర్కాటక సమూహమంతా మిత్రనిలయంలోకి (సూర్యుడు ఉండే రాశిలోకి) చేరాయి.

శా. ఆటోపంబునఁ జిమ్ము ఔొమ్మగల వజ్రాభీల దంతంబులం
దాటించున్ మెడఁ జుట్టిపట్టి హరి దోర్దండాభ శుండాహతిన్
నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటమున్ నీటి పో
రాట న్నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై.

57

తా ॥ మాటి మాటికి నీటిలోపలికి లాగుతూన్న మొసలిని ఓడించడానికి గజరాజు బహు ప్రయత్నం చేయసాగాడు. తన తొండంతో దానిని మెడ పెట్టి పైకి విసిరి, వజ్రసమానంగా ఉన్న తన దంతాలతో దాని రొమ్ము యందు పొడవసాగాడు.

వ. అప్పుడు.

58

ఆ. మకరితోడఁ బోరు మాతంగఁ విభుని నొ, క్కరుని డించి పోవఁ గాళ్ళు రాక
కోరి చూచు చుండెఁ గుంజరీయూథంబు, మగలు దగులు గారె మగువలకును.

59

తా ॥ ఆ సమయంలో మొసలితో పోరాడుతున్న గజరాజుని ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళడానికి కాళ్ళురాక ఆడ ఏనుగులన్నీ చూస్తూ ఉండిపోయినాయి. భార్యలకు భర్తలంటే విపరీతమైన ఆసక్తి కదా! ఇహమందు ఈ సంసార బంధము ఎంతో బలమైనది కదా!

వ. అంత.

60

ఆ. జీవనంబు దనకు జీవనంబై యుంట, నలవుఁ జలము నంతకంత కెక్కి
మకర మొప్పె డస్సె మత్తేభమల్లంబు, బహుళపక్ష శీతభాను పగిది.

61

తా ॥ క్రమంగా నీళ్ళల్లో జీవించే మొసలికి బలము, పట్టుదల అంతకంతకు పెరగసాగాయి. గజరాజుకు కృష్ణపక్షంలో చంద్రునిలా, అంతకంతకూ బలం క్షీణించసాగింది. స్థానబలము ఎంత గొప్పదో కదా!

మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ, బాదంబులన్
నెఱయం గంతము వెన్నుదన్ను; నెగయున్ హేలాగతిన్, వాలముం
జఱచున్; నుగ్గుగఁ దాఁకుః ముంచు; మునుఁగున్; శల్యంబులున్ దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండ యూథోత్తమున్.

62

తా ॥ అంతంలోనే సింహంలా హుంకారం చేస్తూ ఆ మొసలి ఏనుగు కుంభస్థలం పైకి దూకింది. తన పాదాలతో కంఠమును, వెన్నును గాయపరుస్తోంది. ఎగిరెగిరి తోకతో బాదుతోంది. శరీరమంతా వక్కలు అయ్యేటట్లు ఢీకొంటోంది. ఆ గజేంద్రుణ్ణి నీటిలోనికి ముంచుతోంది. ఎముకలు, దంతాలు విరిగేటట్లుగా కొడుతోంది. అదను చూసి మరీ దెబ్బలాడుతోంది. ఈ విధంగా ఆ గజేంద్రుణ్ణి ఎన్నో రకాలుగా బాధిస్తోంది.

మ. పొడగానం బడకుండ డాఁగు వెలికిం బోవంగఁ దా నడ్డమై
పొడచూపుం జరణంబులం బెనగొనుం బో రాక రారాక బె
గ్గడిలం గూలఁగఁదాఁచు లేచుతఱి నుద్ఘాటించు లంఘించు బ
ల్విడిఁ జీరుం దలఁగున్ మలంగు నొడియున్ వేధించుఁ గ్రోధించుచున్.

63

తా ॥ ఆ మొసలి తన రూపును కనబడనీయకుండా దాక్కొని, గజేంద్రుడు గట్టు ఎక్కే ప్రయత్నం చేసేసరికి, మళ్ళీ కనిపిస్తోంది. కాళ్ళకు అడ్డం పడుతోంది. కదలనీయక భయపడేటట్లు చేస్తోంది. కదిలితేచాలు పెద్ద మొరపెడుతూ పైకి లంఘిస్తోంది. వేగంగా వెనక్కి వెళ్ళి తిరిగి ముందుకు వచ్చి క్రోధంతో ఆ గజేంద్రుణ్ణి వేదిస్తూ బాధిస్తోంది.

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబు నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞాన దీపంబు నతిక్రమించు మహా మాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహ బహువిధ జలావగాహం బయిన గ్రాహంబు మహాసాహసంబున.

64

తా ॥ ఈ విధంగా ఆశ్చర్యకరంగా మొసలి అడ్డులేని పరాక్రమంతో, ఉత్సాహంతో, కలహ సన్నాహంలో బహువిధాలుగా, మహాసాహసంతో గజరాజును పట్టేసింది. అది ఎలా ఉందంటే చిరుజ్ఞానదీపాన్ని మహామాయ అనే అంధకారం కమ్మి వేసిన విధంగా ఉంది.

శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై.

65

తా ॥ 'అలా ఆ గజేంద్రుని రెండు పాదాలను గట్టిగా పట్టుకున్న మొసలి ఏకాగ్రతను ఇక్కడ అద్భుత ఉపమానంతో వర్ణిస్తున్నారు.' శ్వాసను బిగపట్టి, పంచేంద్రియాలను స్వాధీనపరచుకుని, బుద్ధి అనే తీగకు పరబ్రహ్మమనే మారాకుని అమర్చి, అందులీనమై ఆ బ్రహ్మపదములో నిశ్చలానందమును పొందే యోగీశ్వరునిలా ఉన్నది ఆ మొసలి.

ఆ. వనగజంబు నెగుచు వనచారిఁ బొడగని, వనగజంబ కాన వజ్రిగజము

వెల్ల నై సురేంద్రు వేచి సుధాంధులఁ, బట్ట పట్టనీక బయలు ప్రాఁకె.

66

తా ॥ జలచరమైన మొసలి, వనాలలో తిరిగే గజేంద్రుణ్ణి ఆ విధంగా నీటిలోనికి లాగడాన్ని చూసిన ఐరావతం విస్తుపోయింది. ఎందుకంటే దేవేంద్రుని వాహనమైన ఆ ఐరావతం క్షీరసాగర మథనంలో, సాగరజలం నుండి ఉద్భవించినదే కదా! తన జాతికి చెందిన ఏనుగు ఆపదకు తల్లడిల్లి ఇంద్రున్ని పడవేసి, దేవతలకు పట్టుబడక అటుఇటు పరుగెత్త సాగింది.

ఉ. ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా

మోహలతా నిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం

దేహముఁబొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ

గ్రాహదురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

67

తా ॥ (ఇక్కడ గజేంద్రుని స్థితి ఎలా ఉన్నదో తెలియజేస్తున్నారు.) సంసారపంకమందు సుఖమును వెతుకుతూ, కలత చెందిన బుద్ధితో మోహమనే తీగలతో బంధించబడగా అందుండి వెలువడ లేక నిస్సహాయుడై అలమటించు జీవుని వలె, మొసలిచే పట్టుబడ్డ ఆ గజరాజు ఆక్రోశిస్తోంది.

వ. ఇ వ్విధంబున.

68

క. అలయక సొలయక వేసట, నొలయక కరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు, సలిపెం బో రొక్కవేయి సంవత్సరముల్.

69

తా ॥ అయినా అలసిపోకుండా వెనుదియ్యకుండా విసుగు చెందకుండా, ఆ గజరాజు తన పరాక్రమంతో రాత్రులు, పగళ్ళు, సంధ్యలు మొత్తం కలిపి ఒక వేయి సంవత్సరాల కాలం ఆ మొసలితో పోరాడింది.

మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తన లావు వైరిబలముం జింతించి మిథ్యామనో
రథమిం కేటికి? దీని గెల్వ సరి పోరం జాలరా దంచు స
వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్;

70

తా ॥ గొప్పదైన తన శక్తితో ఆ గజరాజు నీటిలో ఉండే మొసలితో పోరాడి పోరాడి చివరకు ఓపిక క్షీణించగా తన బలమూ, తన శత్రువు యొక్క బలమూ, ఈ రెంటిని గూర్చి తలపోసాడు. చివరికి ఇలా అనుకున్నాడు– “ఇక అసత్యపు ఊహలు అనవసం. దీనిని గెలవడానికి నా శక్తి చాలదు” అని బాధపడుతూ పూర్వ పుణ్యం వల్ల కలిగిన దివ్యజ్ఞానంతో తనలో తాను అనుకొన్నాడు:

శా. ఏ రూపంబున దీనిగెల్తు? నిట మీఁ దేవేల్పుఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు? నెవ్వరడ్డ? మిఁక ని వ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపార పారాయణుల్
లేరే! మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

71

తా ॥ 'ఏ విధంగా ఈ మొసలిని గెలువగలను? ఇప్పుడు ఏ దేవున్ని ప్రార్థించాలి? నాకు సహాయంగా ఎవరిని పిలవాలి? నా ఆపదకు అడ్డు పడేవారెవరు? ఉద్ధండమై ఉన్న ఆ మొసలిని నివారించగల వారెవ్వరు? అఖిలమైన కార్యాలను చక్కబెట్టగల సమర్థులు ఎవరు? నా మొర ఆలకించి నన్ను కావగల అట్టి పుణ్యాత్ములకు నమస్కరిస్తున్నాను.

శా. నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్ట చందన లతాంతచ్ఛాయలం దుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి, భయం బెట్లోకదే యీశ్వరా!

72

తా ॥ ఈ అడవిలో ఎంతో కాలముగా ఏనుగుల సమూహానికి రాజుగా ఉంటూ గౌరవించబడుతున్నాను. పది లక్షల కోట్ల ఏనుగులకు నాథుడనై ఉన్నాను. నా మదజలధారలచే సంతుష్టిని పొందుతున్న చందన వృక్షాల ఛాయలో హాయిగా ఉండక దప్పికతో ఈ కొలను వద్దకు ఎందుకు వచ్చాను? ఓ భగవంతుడా! భయం కలుగుతోంది.

ఉ. ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;
యెవ్వని యందు డిందుఁ; బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూల కారణం
బెవ్వఁ; డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు; సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

73

తా ॥ అసలు ఈ లోకాలన్నీ ఎవరి నుండి సృష్టించబడ్డాయో, ఎవరి వల్ల సంరంక్షించబడుతున్నాయో, చివరికి ఎవరియందు లయమౌతున్నాయో అన్నింటికీ

మూలకారణుడైన ఆ పరమేశ్వరుడు ఎవ్వరో; ఆది మధ్యాంతరహితుడైన ఆ ప్రభువు ఎవ్వరు? సర్వమూ తానైన ఆ ఈశ్వరుణ్ణి నేను శరణు వేడుతాను.

క. ఒకపరి జగములు వెలి నిడి, యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థ సాక్షి యగు న, య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్.

74

తా ॥ ఒకపరి సృష్టికర్తయై లోకాలను సృష్టిస్తూ, ఇంకొకసారి సంహారకర్తయై తిరిగి లోకాలను తన లోపల విలీనం చేసుకుంటూ, రెంటికీ తానే మూలమై, సమస్తమైన ప్రపంచానికి సాక్షిగా ఉంటూ, అకళంకుడైన ఆ పరమాత్మను ధ్యానిస్తున్నాను.

క. లోకంబులు లోకేశులు, లోకస్థులుఁ దెగిన తుది నలోకం బగు పెం
జీఁ కటి కవ్వల నెవ్వం, డే కాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.

75

తా ॥ లోకాలు, లోకాలను పాలించే వారు, లోకాలలో నివసించి ఉండేవారు... వీరంతా నశించినప్పుడు – అంటే సకల లోకాలు ఆ పరమేశ్వరునిలో లయము చెందిన తరువాత ఏర్పడే అలోక రహిత స్థితిలో, ఆ గాఢాంధకారానికి ఆవలగా ఉండి, అఖండమైన తేజస్సుతో ఏకమై ప్రకాశించే ఆ జ్యోతిస్వరూపుడిని నేను భావించి సేవిస్తాను.

క. నర్తకుని భంగిఁ బెక్కగు, మూర్తులతో నెవ్వఁడాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుఁగ రట్టి వాని నుతింతున్.

76

తా ॥ నటునివలె అనేక రూపాలతో ఎవరు ప్రవర్తిస్తున్నాడో, మహర్షులు దేవతలు సైతం ఎవరిని అర్థం చేసుకొని కీర్తింపలేరో, ఎవరి ప్రవర్తన అంతు పట్టనిదై ఉంటుందో, అటువంటి

దేవదేవుని నేను ప్రార్థిస్తాను.

ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు, సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశ వ్రతాఢ్యులై కొల్తు రెవ్వని, దివ్యపదము వాఁడు దిక్కు నాకు.

77

తా ॥ లౌకిక సంబంధాలను త్యజించిన మహర్షులు, పరమేశ్వరుణ్ణి దర్శించాలని కోరుకునే వారు, సమస్త ప్రాణుల హితాన్ని కోరుకునేవారు, సాధు చిత్తులైనవారు ఏకాగ్రచిత్తంతో ఎవరిని కొలుస్తారో ఆ పరమేశ్వరుడు నాకు దిక్కు అగుగాక!

సీ. భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నాహ్వయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికినిఁ బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ, గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁడైన వాని నిష్కర్మతకు మెచ్చు, వాని కే నొనర్తు వందనములు.

78

తా ॥ పరమేశ్వరునికి జననము, దోషము, రూపము, కర్మ, నామాలు, గుణములు అనేవి లేవు. సృష్టిచేసే సమయంలో తన మాయాప్రభావంతో ఇవన్నీ ధరిస్తాడు. అట్టి పరమాత్మ స్వరూపునకు, అనంతుడైనవానికి, శక్తిమంతుడైన సృష్టికర్తకు, రూపం లేనివాడైనా అన్ని రూపములలో వెలుగొందువానికి, చిత్రమైన చరిత్రలు కలవానికి, సాక్షి స్వరూపునికి, ఆత్మస్వరూపునికి, పరబ్రహ్మ స్వరూపుడైన వానికి, మాటలకు ఊహలకు మనస్సుకు అందనివానికి, శుద్ధ సత్త్వగుణంతో చేరతగిన వానికి, ఫలాపేక్ష లేని నేర్పరి అయిన వానికి నా నమస్కారములు అందజేస్తున్నాను.

సీ. శాంతున కపవర్గసౌఖ్య సంవేదికి నిర్వాణ భర్తకు నిర్విశేష
నకు, ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధిక విజ్ఞాన మయున
కఖిలేంద్రియ ద్రష్ట కధ్యక్షునకు బహు క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మ మూలున కఖిలేంద్రియ జ్ఞాపకునకు దుఃఖాంత కృతికి

అ. నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు, నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిల కారణునకు, నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచు కొఱకు.

79

తా ॥ శాంత స్వరూపుడైన వానికి, మోక్ష స్వరూపం తెలిసిన వానికి, నిర్వాణం తన అధీనంలో కలవానికి, అన్ని విశేషములు తనవైనా తన యందు ఏమీ ఉంచుకోనివానికి, దుష్టశిక్షకుడైన వానికి మనస్సుకి గోచరం కానివాడికి, సరళ స్వభావంతో, గుణాలను ధర్మంగా వర్తింపజేయువానికి, సచ్చిదానందస్వరూపుడైన వానికి నా నమస్కారములు. సర్వజ్ఞుడైన ఆ దయాసముద్రునకు, అన్నింటికీ మూలకారణుడైనవానికి, ఇంద్రియాధీశునికి, దుఃఖనివారకునకు ఇవే నా ప్రణామములు. మాయ అనే ఛాయను కలిగి ఉన్న పరాత్పరునికి, ఏ కారణమూ లేనివాడైన మహోత్తరునికి నమస్కరిస్తున్నాను.

క. యోగాగ్ని దగ్ధకర్ములు, యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగ విభాసిత మనముల, బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్.

80

తా ॥ తమ కర్మలను యోగాగ్నిలో దగ్ధం చేసి యోగీశ్వరులైనవారు ఏ మహాత్ముణ్ణి నిరంతరము ధ్యానిస్తారో అట్టి పరమేశ్వరుడిని నేను ప్రార్థిస్తాను.

సీ. సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ మయునికి నుత్తమ మందిరునకు
సకలగుణారణిచ్ఛన్న బోధాగ్ని కిఁ దనయంత రాజిల్లు ధన్యమతికి

గుణలయోద్దీపిత గురు మానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు
దిశ లేని నాఁబోఁటి పశువుల పాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ

తే. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ, వంతునకుఁ దనూజపశునివేశ
దారసక్తు లయినవారి కందఁగరాని, వాని కాచరింతు వందనములు.

81

తా ॥ భగవంతుడు అన్ని ఆగమాలకు, వేదాలకు సముద్రము వంటివాడు. మోక్ష స్వరూపుడు, అన్ని గుణాలకు నిలయమై ఒప్పేవాడు, కట్టెలలో దాగి ఉన్న అగ్నివలె సుగుణములలో ఉండేవాడు, స్వయంప్రకాశుడు, గుణములచే ప్రకాశించు గొప్ప మనస్సు కలవాడు, ప్రళయ స్వరూపుడు, నావంటి దిక్కులేని ప్రాణుల పాపములను పోగొట్టువాడు. అంతరాత్మ స్వరూపునిగా వెలుగొందువాడు, భార్యాపుత్రాది మోహంలో ఆసక్తులైన వారికి అందరానివాడు. అటువంటి పరమేశ్వరునికి నా నమస్కారములు.

వ. మఱియును.

82

సీ. వరధర్మకామార్థ వర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు? చేరి కాంక్షించువారి కవ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?
ముక్తాత్ములెవ్వని మునుకొని చింతింతు? రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు?

ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ, యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మమైన వానిఁ బరుని నతీంద్రియు, నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు.

83

తా ॥ ధర్మార్థకామములను త్యజించిన పండితులు ఎవరిని సేవించి మోక్షాన్ని

పొందుతారో అట్టివానికి నేను నమస్కరిస్తున్నాను. దరిజేరినవారిని కరుణతో కాపాడి శాశ్వతత్వాన్ని ఇచ్చేవానికి, జీవన్ముక్తుల అంతరంగ మునకల్లో నిండి ఉన్నవానికి నా నమస్సులు. ఆ భగవంతుని పావన చరిత్రను పాడుతూ, ఏకాంతంలో ఉన్నవారికి ఆనందాన్ని ప్రసాదించేవాడైన ఆ శుభంకరునికి నా నమస్కారములు. అవ్యక్తుడై, ఆద్యుడై ఆధ్యాత్మయోగం చేత పొందదగిన ఆ పరిపూర్ణునికి, అతీంద్రియునికి, స్థూలసూక్ష్మ శరీరధారియైన ఈశ్వరునికి నా నమస్కారములు.

వ. అని మఱియు నిట్లని వితర్కించె.

84

సీ. పావకుం దర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు
రా క్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘన నామ రూప భేదములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియమ్ములుఁ దాన యై గుణ సంప్రవాహంబు బఱపు

తే. స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక, తిర్య గమర నరాది మూర్తియును గాక
కర్మ గుణ భేద స దసత్ప్రకాశి గాక, వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు.

85

తా ॥ అని ఆ గజేంద్రుడు ఇంకా ఈ విధంగా భావించాడు: ‘అగ్ని జ్వాలలనే కిరణాలను భానుడు వ్యాపింపచేసి, తిరిగి శమింపచేసే విధంగా, భగవంతుడు తన కిరణములనే చేతులతో బ్రహ్మాది దేవతలనూ, అఖీల జంతువులను, జగములను నామరూపాలతో పుట్టించి తిరిగి లయింప చేస్తాడు. ఆయన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు అన్నీ తానే అయి, తగిన గుణాలతో ఒప్పారుతాడు. ఆయన స్త్రీ, నపుంసకుడు, పురుషుడు ఇందులో ఏదీ కాదు. అమరుడూ, నరుడూ, జంతు స్వరూపుల్లో ఏదీ కాదు. ఆ పరమాత్మునికి కర్మ, గుణ, భేదాలు లేవు. ఉండటం, లేకపోవడం అనే వాటికి అతీతుడైన ఆ ప్రభువుని నేను ధ్యానిస్తున్నాను.

క. కలఁ డందురు దీనుల యెడఁ, గలఁ డందురు పరమయోగి గణములపాలం
గలఁ డందు రన్నిదిశలను, గలఁడు కలం డనెడు వాఁడు గలఁడో లేఁడో!

86

తా ॥ దీనుల పాలిట ఉంటాడని అంటారు, పరమయోగీశ్వరులైన వారి చెంతనే ఉంటాడని చెబుతారు. అన్ని దిక్కులలో నిండి ఉండే సర్వవ్యాపకుడని కీర్తిస్తారు. అలా ఉన్నాడు, ఉన్నాడు అనే భగవంతుడు నిజంగానే ఉన్నాడా, లేడా?

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక కలుగువాఁడు;
నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు;
లీలతో నా మొఱాలింపఁ డే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు;
తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు, నాదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు, వినఁడె చూడఁడె తలపఁడె వేగ రాఁడె!

87

తా ॥ వెనువెంటనే తనను తాను నిభాయించుకుంటూ, ‘ఉన్నవాడని లేనివాడని కాకుండా అందరిపక్షాన ఉండేవాడు దీనుడనైన నా పక్షాన ఉండడా? దుర్మార్గుల చేత బాధపడుతూన్న సాధువులకు అడ్డుపడేవాడు నా కష్టానికి అడ్డుపడడా? తనను నమ్మిన వారిని కృపతో చూసేవాడు నా పాటు చూడడా? దీనుల మొరలు గుర్తించేవాడు నా మొర ఆలకించడా? అఖిల రూపాలు తానే అయినవాడు ఆది మధ్యాంతములు లేనివాడు, భక్తజనులకు, దీనులకు దిక్కుగా కలవాడు నా మొర వినడా? నా బాధను చూడడా? నా యందు దయ చూపడా? నన్ను తలచి వేగంగా రాడా?

క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్

శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు, నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్.

88

తా ॥ ఈ అనంత విశ్వాన్ని సృష్టించినా దానికి అతీతుడై ఉంటూ, ఈ విశ్వానికి ఆత్మయై ఉన్నవానిని, ఈ విశ్వం తెలుసుకో తగిన వానిని, ఈ విశ్వము తానే అయినవానిని, శాశ్వతుడైన వానిని, పుట్టుకలేని వానిని, ఈ విశ్వాన్ని నడిపిస్తున్న పరబ్రహ్మమును నేను ప్రార్థిస్తున్నాను.'

వ. అని పలికి తన మనంబున నగ్గజేంద్రు డీశ్వర సన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె.

89

తా ॥ అని దీనంగా ప్రార్థిస్తూ తన మనస్సులో భగవంతుణ్ణి నిలుపుకుని ఈ ప్రకారంగా అన్నాడు:

శా. లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యెఁ; బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపం దగున్ దీనునిన్,
రావే యీశ్వర! కావవే వరద; సంరక్షింపు భద్రాత్మకా!

90

తా ॥ "దేవాధిదేవా! నా శరీరంలో ఇంక ఏ మాత్రమూ బలం లేదు, పూర్తిగా శక్తి విహీనమైపోయింది. ధైర్యం క్షీణించిపోయింది. పోరాటపు శ్రమతో శరీరం అలసిపోయి ఉంది. మూర్ఛిల్లుతానని అనిపిస్తోంది, ప్రాణాలు కదలాడుచున్నాయి. నీవు తప్ప నాకు తెలిసిన వారెవరూ లేరు. ఇటువంటి నిస్సహాయ స్థితిలో ఉన్న నన్ను మన్నించి కాపాడేందుకు రావయ్యా ఈశ్వరా! కోరిన వరాలను ఇచ్చే వరదా, కరుణతో రక్షించు!

క. విను దఁట జీవుల మాటలు, చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో

యను దఁట పిలిచిన సర్వముఁ, గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ!

91

తా ॥ జీవుల ఆర్తిని బాగా తెలుసున్న వాడివట, నీవు శరణు కోరినవారి కోసం ఎటువంటి చోటికైనా వెళ్ళగలిగే వాడవుట; ఎవరైనా పిలిస్తే వెంటనే 'ఓ' యని జవాబిచ్చి కాపాడతావు అని అంటారు. మరి నేను ఇంత వేడుతున్నా నీకు వినిపించలేదా, నీ గురించి చెప్పిన మాటలు నిజమేనా అనే సందేహం కలుగుతోంది. నీవు కరుణాసముద్రుని వేనా?

ఉ. ఓ కమలాప్త! యోవరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు

య్యో! కవియోగివంద్య సుగుణోత్తమ! యో శరణాగతామరా

నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమలప్రభావ! రా

వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే!

92

తా ॥ కమలములకు ఆప్తుడైనవాడా! భక్తుల కోర్కెలను తీర్చువాడా! స్వపక్షం ప్రతిపక్షం అంటూ ఏమీ లేని వాడా! నా మొరాలకించవా! కవుల చేత యోగుల చేత పొగడబడే వాడా! ఉత్తమమైన గుణాలు కలవాడా! శరణు కోరిన వారికి కల్పవృక్షం వంటి వాడా! మునీశ్వరులకు ప్రియమైన వాడా! నిర్మలమైన మహిమను కల తండ్రీ! కరుణించవా! నన్ను తలచవా! శరణు కోరిన వానిని, నన్ను రక్షింపవా!"

వ. అని పలికి మఱియు నరక్షిత రక్షకుండైన యీశ్వరుం డాపన్నుండైన నన్నుం గాచుఁ గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయ లాలకించుచు న గ్గజేంద్రుడు మొఱ సేయుచున్న సమయంబున.

93

తా ॥ అని పలికి మరియు ఆపదలో ఉన్న వారిని రక్షించే ఈశ్వరుడు ఆపన్నుడనైన నన్ను

రక్షించుగాక అని ఆకాశంవైపుకు నిక్కిచూస్తూ, నిట్టూర్పులు విడిచిపెడుతూ, ఆకాశం వైపు చెవి ఉంచి ఆలకిస్తూ ఆ గజేంద్రుడు మొరపెడుతున్నాడు.

ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి, రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డుపడఁ దలంచె.

94

తా ॥ విశ్వమంతా నిండి ఉండే శక్తిలేని కారణంగా బ్రహ్మ మొదలయిన వారు ఆ ప్రార్థనలు విన్నా, ఊరకే ఉండిపోయారు. అప్పుడు విశ్వమంతా వ్యాపించి ఉన్నవాడు, సర్వమునకు ప్రభువు అయిన విష్ణువు ఆర్తభక్తితో శరణు వేడుతున్న ఆ గజరాజును కాపాడదలుచుకున్నాడు.

మ. అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోప లో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యనఁ గుయ్యాలించి సంరంభియై.

95

తా ॥ ఆ సమయంలో, ఆ విష్ణువు వైకుంఠ పురంలో ఉన్నాడు. అందమైన సౌధం పక్కనే గల ఉద్యానవనంలో, అమృత సరస్సుకి సమీపంలో, చంద్రకాంత శిలావేదిక యందు అమర్చబడిన నల్లకలువల పాన్పుపై లక్ష్మీదేవితో కూడి వినోదిస్తున్నాడు. 'పాహి పాహి' అన్న గజేంద్రుని ఆర్తనాదం విన్నంతనే ఆ దీనజనార్తుడు వేగిరపాటుతో బయలుదేరాడు.

మ. సిరికిం జెప్పఁడు; శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో

పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

96

తా ॥ ఆ గజరాజు ప్రాణాలను కాపాడాలనే తొందరలో లక్ష్మీదేవితో చెప్పలేదు. శంఖుచక్రాలను ధరించలేదు. పరివార సమూహాన్ని ఎవరినీ పిలవలేదు. గరుడ వాహనాన్ని నియోగించలేదు. చెవికి అలంకరించుకొన్న తామర దుద్దులో చిక్కుకున్న జుట్టు ముడినిసైతం సవరించుకొనలేదు. వివాదంతో కోపాన్ని అభినయిస్తున్న లక్ష్మీదేవి పైటచెంగును పట్టి ఉంచిన తన గుప్పిటను తెరువలేదు.

వ. ఇట్లు భక్తజన పాలన పరాయణుండును, నిఖిల జంతుహృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరి కులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయు నప్పుడు;

97

తా ॥ ఈ విధంగా భక్త జనులను పాలించుటయందు ఆసక్తి కలవాడు, సకల ప్రాణుల హృదయారవిందముల యందు నివసించువాడైన నారాయణుడు, గజరాజు దీనాలాపములను విని లక్ష్మీదేవితో వినోదాలు చాలించాడు. సంభ్రమంతో గజేంద్రుణ్ణి రక్షించాలనే సంకల్పంతో తన ఆయుధాలను మరల ధరించి గగన మార్గాన వస్తున్నాడు.

వీధినాటకాలను చూశారు కదా? వాటిలో కృష్ణలీలా నాటకంలో తాళమృదంగాదులతో పాటగాళ్లు ఎలుగెత్తి, “రావయ్యా! ఓ కృష్ణా! ఇమ్ము దర్శనము!” అని పాడుతూన్నంత సేపు కృష్ణవేషధారి వారి ఘోషను కొంచెమైనా పట్టించుకోడు. చుట్టకాలుస్తూ తెరచాటున వేషాలు వేసేచోట కూర్చుని దగ్గరివారితో ప్రగల్భాలు కొడుతూంటాడు. వారి రొద అణగి నారదమహర్షి,

మార్దవం, మనోహరం అయిన కంఠస్వరంతో, "శరణం, తవచరణం భవహరణం మమ గోవింద!" అంటూ గానం ఆరంభించ గానే శ్రీకృష్ణుడు ఇక ఆలస్యం చెయ్యక వెంటనే రంగం మీద ప్రత్యక్ష మౌతాడు. సాధకుడు, "ప్రభూ! అనుగ్రహించు, నాకు దర్శనమివ్వు" అంటూ ఊరక అరుస్తూన్నంత వరకు జగత్ప్రభువు దర్శనం ఇవ్వడు. భగవంతుడు సాక్షాత్కరించేటప్పుడు భక్తుడి హృదయం ప్రేమసాగరంలో లీనమై ఉంటుంది. అప్పుడెంతో ప్రశాంతచిత్తుడై ఉంటాడు. మునుపటి గోల అంతా పూర్తిగా అంతరిస్తుంది. ప్రేమపూరిత హృదయుడై, మనసార భక్తుడు ప్రార్థించగానే భగవానుడు ఇక ప్రత్యక్షమవడానికి నిమిషమైనా ఆలస్యం చెయ్యలేదు.

—శ్రీరామకృష్ణ పరమహంస

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

98

తా ॥ ఆయన వెనకాలే లక్ష్మీదేవి, ఆవిడ వెనుక అంతఃపుర స్త్రీలు, ఆ వెనుక పక్షిరాజైన గరుత్మంతుడు, అతని పక్కనే ధనుస్సు, కౌమోదకి, శంఖం, చక్రం, నారదుడు, విష్వక్సేనుడు వారి వెనుక వైకుంఠ పురంలో ఉన్న వారంతా కూడా వచ్చేశారు.

వ. తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందమానానందదిందిందిర యగు నయ్యిందిరాదేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచల యై పోవుచు.

99

తా ॥ అప్పుడు అరవిందం వంటి లక్ష్మీదేవి ముఖంలో మకరంద బిందువులను పోలిన

స్వేదకణాలకు తుమ్మెదలు ఆనందంతో ముసురుకోగా ఆ గోవిందుని చేత చిక్కిన తన పైట కొంగుని వదలక వెళుతుంటే, ఆయనను అనుసరిస్తూ వెళుతూ ఉన్న లక్ష్మీదేవి ఇలా అనుకుంది:

మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీ జనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో ఖలుల్ వేదప్రపంచంబులన్,
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్.

100

వ. అని వితర్కించుచు.

101

తా ॥ 'నాథుడు ఎక్కడికి వెళుతున్నాడో చెప్పలేదే! దిక్కులేని స్త్రీల దుఃఖాన్ని విన్నాడా! దుర్మార్గులైన రాక్షసులు వేదాలను అపహరించారా లేదా ఆ దనుజ సమూహం దేవతల రాజధాని అయిన అమరావతిపై దండెత్తారా! దుష్టులు భక్తులను చూసి ఎక్కడ మీరు పూజించే చక్రాయుధుడు చూపండని ధిక్కరించారా...' అంటూ ఆలోచించసాగింది.

శా. తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,
శాటీముక్త కుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణ లా
లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,
గోటీంద్రుప్రభతో, నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్.

102

తా ॥ గజేంద్రుణ్ణి రక్షించాలని వేగంగా నాథుని వెనకాలే వెడుతూన్న ఇందిరాదేవి కర్ణాభరణములు కదలాడినాయి. భుజములపై జారిన కేశబంధం నటిస్తోంది. పైట చెదిరిపోయింది. ఒడ్డాణం తన దృఢత్వాన్ని కోల్పోయింది, నుదుటి పూత సడలింది. ఆమె పైట

చెరుగుని మాత్రం నాథుడు తన మనోహరమైనటువంటి చేతితో పట్టుకునే ఉన్నాడు. కోటి చంద్రుల కాంతితో ఆమె ముఖం ప్రకాశిస్తోంది.

క. అడిగెద నని కడు వడిఁ జను, నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ, నడు గిడు; నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.

103

తా ॥ (ఆ సమయాన లక్ష్మీదేవి మనస్థితిని చెబుతున్నారు.) ఆ సిరుల తల్లి, నాథుడు ఎక్కడికి వెళుతున్నాడో అడగాలని వడిగా అడుగువేసింది, అడిగితే చెప్పడేమో అని మళ్ళీ నడక తగ్గిస్తోంది. దానితో తడబడుతూ అడుగులు వేస్తూంది. ఈ విధంగా రకరకాలుగా ఆలోచిస్తూ సరిగా అడుగులు వెయ్యలేక పోతోంది.

సీ. నిటలాలకము లంట నివుర జుంజుమ్మని ముఖసరోజము నిండ ముసరుఁ దేంట్లు;
నళులఁ జోఁపఁగ జిల్క లల్ల నల్లఁనల్లఁ జేరిన యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మందాకినీ పాఠీనలోక మెగుచు;
మీన పంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు;

తే. శంపలను జయింపఁ జక్రవాకంబులు, కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుసూపు; మెలఁత
మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె, జలదవర్ణు వెనుకఁ జనెడు నపుడు.

104

తా ॥ మేఘం వెనకనే మెరుపు తీగలాగా హరి వెనకాలే ఇందిరాదేవి వెళుతోంది. ఆ సమయాన ఆమె ఫాలభాగానికి అంటుకొన్న ముంగురులను సరిదిద్దుకోబోతే జుంజుమ్మంటూ తుమ్మెదలు ముసురు కుంటున్నాయి. తుమ్మెదలను అదలించగానే చిలుకలు దొండపండు వంటి ఆమె యొక్క క్రింది పెదవి కోసం వచ్చి వ్రాలాయి. చిలుకలను తోలగానే, ఆమె మీనాల వంటి నేత్రాల మీదకు మందాకినిలోని వేయి కోరల చేపలు ఎగిసి పడుతున్నాయి. మీనములను

దాటేసరికి తీగవంటి ఆమె శరీరంతో రాసుకోవడానికి మెరుపు తీగలు ఆకాశంమీద వరుస కడుతున్నాయి. మెరుపుతీగలను జయించే సరికి చక్రవాకములు ఆమె కుచయుగాన్ని తాకసాగాయి.

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్ర హృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృంద ప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్.

105

తా ॥ రాక్షసుల జీవనాధారాన్ని పోగొట్టువాడు, కరుణ నిండినవాడు, యోగీంద్రుల హృదయాలలో సంచరించేవాడు, సహనం కలవాడు, భక్తజన సమూహం యొక్క ప్రాభవాన్ని పెంచేవాడు, ప్రకాశించే ఇందిరాదేవిని సేవించేవాడు, జయశీలుడు, కాంతిమంతుడు అయిన ఆ శ్రీహరి వినువీథిలోంచి వస్తూండగా అమరులు చూసారు.

వ. ఇట్లు పొడగని.

106

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె! హరి పజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖ నినాదం బదె; చక్రమల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె; క్ర
న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతి ని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్.

107

తా ॥ గజేంద్రునికై వెళుతున్న ఆ శ్రీహరిని చూసి దేవతలు ఇలా అనుకుంటున్నారు – ‘అదిగో, పరమాత్ముడైన ఆ శ్రీహరి ఇటు వస్తున్నాడు. అతని వెనుకనే లక్ష్మీదేవి, ఆ వెనుకనే

శంఖనినాదం వినవస్తోంది! అదిగదిగో చక్రం! గరుత్మంతుడు కూడా వస్తున్నాడు! అదిగో వచ్చేసాడు శ్రీహరి' అని ఆ దేవతలంతా 'నమో నారాయణా!' అంటూ ఆ గజేంద్రుని ఆపదోద్ధారకునికి నమస్కరించారు.

వ. అయ్యవసరంబునం గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్స మాన సంచారుండై పోయి పోయి కొంతదూరంబున శింశుమార చక్రంబునుం బోలె గురుమకరకుళీర మీన మిథునంబై, కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ వరకచ్ఛపంబై, భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె సరాగజీవనంబై, వైకుంఠంబునుంబోలె శంఖచక్ర కమలాలంకృతంబై, సంసార చక్రంబునుం బోలె ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని. 108

తా ॥ ఆ సమయంలో గజరాజును రక్షించాలనే దీక్షతో వెళుతున్న విష్ణువు, ఆ దేవతా నమస్కారాలు అందుకోలేదు. మనోవేగంతో వెళ్ళి ఏనుగు మొసలి పోరాడే సరస్సుని చూసాడు. శింశుమార చక్రంవలె భయంకరమైన మొసళ్ళు, ఎండ్రకాయలు, చేపలు జంటలుగా ఉన్న ఆ సరస్సుని చూసాడు. ఆ కొలనులో కుబేరుని భాండాగారం వలె స్వచ్ఛము, శ్రేష్ఠము అయిన తాబేళ్ళు కూడా ఉన్నాయి. అదృష్టశాలి జీవనం వలె ఆ సరస్సు అనేక జలచరాల జీవనంతో ఒప్పారుతోంది. వైకుంఠంలోని శంఖము చక్రము కమలములవలె అలంకృతమై ఉంది. అంతేకాదు సంసార చక్రాన్ని పోలుతూ, సుఖదుఃఖ ద్వంద్వాలనే బురదతోనూ నిండి ఉంది.

మ. కరుణా సింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖీల సుధాంధశ్చక్రముం జక్రమున్.

109

తా ॥ కరుణాసింధువు అయిన ఆ శౌరి మొసలిని ఖండించడానికి తన చక్రాయుధాన్ని పంపాడు. ఆ చక్రం భూమిని వణికింపచేసే శక్తి గలది. తన విస్ఫులింగాలతో గగన మండలాన్ని ధిక్కరించగల శక్తిమంతమైనది. అనేక బ్రహ్మాండ భాండముల కాంతి పుంజములతో కూడినది, దేవతలను రక్షించగలిగేది.

వ. ఇట్లు పంచిన.

110

శా. అంభోజాకరమధ్య నూతన నలిన్యాలింగన క్రీడనా
రంభుండైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభధ్వానముతోఁ గొలంకును గలంకం బొందఁగాఁ జొచ్చి దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై.

111

తా ॥ అలా పంపించబడిన విష్ణుచక్రం ఆ సరస్సులో అప్పుడే వికసిస్తున్న పద్మాలను ఆలింగనం చేసుకునేందుకు వెళుతున్న సూర్యబింబంలా ఉన్నది. మహావేగంతో కొలను యందు గుభుల్‌మనే శబ్దం చేయుచూ, సరస్సుని కలవరపెడుతూ, దూసుకుంటూ ఆ మొసలిని సమీపించింది.

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశు క్రియన్
హేమక్ష్మాధర దేహముం జకితవన్యేభేంద్ర సందోహముం
గామక్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు నీ
స్సీమోత్సాహము వీత దాహము జయశ్రీ మోహమున్ గ్రాహమున్.

112

తా ॥ అలా చక్రాయుధం వేగంగా వెళ్ళి భయంకరంగా మొసలి తల తెగనరికి,

సులువుగా ప్రాణాలు తీసి వేసింది. ఆ మొసలి మేరుపర్వతం వంటి దేహం కలిగి అడవి ఏనుగులకు సైతం భయంకరమైనది. అది కామక్రోధాలకు పుట్టిల్లువంటిది. అంతేకాదు ఏనుగు యొక్క రక్తధారలను త్రాగినది. హద్దులేని ఉత్సాహంతో గెలుపు కోసం పోరాడుతున్నది. అట్టి మొసలి శిరమును ఆ శ్రీహరి చక్రము ఖండించి వేసింది.

వ. ఇట్లు నిమిష స్పర్శనంబున సుదర్శనంబు మకరి తలఁద్రుంచు నవసరంబున.

113

క. మకర మొకటి రవిఁ జొచ్చెను, మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్;
మకరాలయమునఁ దిరిగెడు, మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్.

114

తా ॥ ఇలా నిముషంలో సుదర్శన చక్రం మొసలి తలను ఖండించే సమయంలో ద్వాదశ రాసులలో ఉండే మకరం రవిచాటున నక్కింది. నవనిధులలోని మకరం కుబేరుని చాటున దాక్కుంది. సముద్రంలో తిరుగాడే మకరములు ఆదికూర్మం చాటుకు వెళ్ళి దాక్కున్నాయి. ఈ విధంగా ఆ చక్రపు ధాటికి మకర నామం గలవన్నీ భీతిని పొందాయి.

మ. తమముం బాసిన రోహిణీ విభుక్రియన్ దర్పించి సంసార దుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁడై.

115

తా ॥ అంతట రాహువు నుండి విడువబడిన చంద్రునిలా, సంసార దుఃఖాన్ని విడిచిన విరక్త చిత్తునిలా, గజరాజు మొసలి పట్టు విడిపించుకొని ఉత్సాహంతో పాదములు కదిలించాడు. సంతోషంతో ఆడ ఏనుగులు అన్నీ తొండములు చాచి ఆ సరోవరంలో గజరాజుని

అభిషేకించాయి. దానితో సేదతీరిన గజేంద్రుడు ఆనందంగా ఉన్నాడు.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదారసిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

116

తా ॥ అప్పుడు హరి పాంచజన్యాన్ని పూరించాడు. ఆ శంఖము కృపారసానికి సాగరం వంటిది, అధికమైన ధ్వనితో పంచ మహాభూతాలను కదిలించేది. గొప్పదైన కాంతితో దేవేంద్రాది ప్రభువులకు సైతం భయం కలిగించేది. ఆపన్నుల దైన్యాన్ని దూరం చేసేది, శత్రుసైన్యాన్ని పారద్రోలగలది.

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం; బువ్వుల వానజల్లు గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్; దిక్కులయందు జీవజయ శబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ దరంగ చుంబిత నభో గంగాముఖాంభోజమై.

117

తా ॥ పాంచజన్యం వినగానే దేవతల దుందుభులు మ్రోగాయి. పద్మపు సువాసనలతో గాలి చామరమై వీచింది. పుష్పవాన కురిసింది. అమరాంగనలు నాట్యం చేశారు. సకల ప్రాణుల జయ జయ ధ్వానాలతో దిక్కులు ప్రతిధ్వనించాయి. సముద్రుడు తన తరంగాలతో ఆకాశాన్ని ముద్దుపెట్టుకుంటున్నాడా అన్నట్లుగా అగుపించాడు.

క. నిడుద యగు కేల గజమును, మడువున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు, నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా!

118

తా ॥ ఓ రాజా! అప్పుడు శ్రీమహావిష్ణువు తన విశాలమైన బాహువును సాచి, ఆ గజరాజును కొలను నుండి బయటకు తీసుకొని వచ్చి మదజలధారలను తుడిచి మెల్లగా స్పృశిస్తూ దుఃఖాన్ని పోగొట్టాడు.

క. శ్రీహరి కర సంస్పర్శను, దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీ సం
దోహంబుఁ దాను గజపతి, మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్.

119

తా ॥ శ్రీహరి కర స్పర్శవల్ల దేహతాపం పోగా, సంతోషంతో, ఆడ ఏనుగులతో కలిసి ఘీంకార శబ్దాలతో శ్రీహరిని అలరించాడు.

క. కరమున మెల్లన నివురుచుఁ, గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమున బ్రదుకుచుఁ, గర పీడన మాచరించెఁ గరిణులు మరలన్.

120

తా ॥ శ్రీహరి దయవల్ల బ్రతికిన గజరాజు, ఆడ ఏనుగులను చేరుకొని, తుండంతో మెల్లగా తాకి అనురాగంతో వాటి తొండాలను పట్టుకున్నాడు.

సీ. జననాథ! దేవలశాప విముక్తుఁడై పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూ నామ గంధర్వుఁ డప్పుడు దన తొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు పాడి
యా దేవు కృప నొంది యందంద మఱియును వినత శిరస్కుఁడై వేడ్కతోడ

ఆ. దళిత పాపుఁ డగుచుఁ దనలోకమున కేగె, నపుడు శౌరి కేల నంటి తడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞాన రహితుఁడై, విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.

121

తా ॥ ఓ రాజా! బలమైన ఆ మొసలి, దేవలముని పెట్టిన శాపం నుండి కలిగిన తన మొసలి రూపాన్ని విడిచి, హూహూ అనే గంధర్వుడుగా మారి నిర్మలమైన శరీరాన్ని పొందింది. అతడు అవ్యయుడైన హరికి అతి భక్తితో మ్రొక్కి, కొన్ని గీతములు పాడి, ఆయన కృపను పొంది శిరసువంచి నమస్కరించి, పాపముల నుండి నిర్ముక్తుడై తన లోకానికి చేరుకున్నాడు. అనంతరం శ్రీహరి తన చేతితో ఒక్కసారి స్పృశించేసరికి, ఆ గజరాజు తన అజ్ఞానాన్ని పోగొట్టుకొని విష్ణురూపాన్ని పొందాడు.

మ. అవనీనాథ! గజేంద్రుఁ డా మకరితో నాలంబు గావించె మున్
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్న నాముండు వై
ష్ణవ ముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్
సవిశేషంబుగఁ బూజ సేసెను మహాశైలాగ్రభాగంబునన్.

122

తా ॥ ఓ రాజా! మొసలితో యుద్ధం చేసిన గజేంద్రుడు పూర్వ జన్మలో ద్రవిడ దేశాన్ని పాలించే పుణ్యతముడైన ఇంద్రద్యుమ్నుడనే రాజు. అతడు చాలా గొప్ప వైష్ణవ భక్తుడు. అతడు ఒక పర్వతాగ్ర భాగాన నిలిచి నారాయణుని గూర్చి మౌనంగా విశేషంగా పూజలు చేశాడు.

మ. ఒకనాఁ డా నృపుఁ డచ్యుతున్ మనములో నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి లే
వక పూజింపక యున్న మౌనిఁ గని నవ్య క్రోధుఁడై మూఢ! లు
బ్ధ! కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు' మని శాపం బిచ్చె భూవల్లభా!

123

తా ॥ ఓ భూనాథా! ఆ ఇంద్రద్యుమ్నుడు అచ్యుతుణ్ణి మనస్సులో భావిస్తూ మౌనంగా

ఏకాగ్రచిత్తంతో ఉన్న సమయంలో అగస్త్య మహాముని అక్కడికి వచ్చాడు. రాజు తీవ్రమైన తపోనిష్ఠలో ఉన్న కారణంగా వచ్చిన మహర్షికి తగిన పరిచర్యలు చెయ్యలేక పోయాడు. లేచి తనను పూజింపక ఉన్న రాజుని చూసి ముని క్రోధవశుడై ఏనుగుగా పుట్టమని శపించాడు.

క. మునిపతి నవమానించిన, ఘనుఁ డింద్రద్యుమ్న విభుఁడు గౌంజరయోనిం
జననం బందెను; విప్రులఁ గని యవమానింపఁ దగదు ఘన పుణ్యులకున్.

124

తా ॥ మహర్షి అయిన అగస్త్యుడిని అవమానించిన కారణంగా ఘనుడైన ఇంద్రద్యుమ్నుడు కుంజర యోనియందు జన్మించాడు. అందుకే ఎంత గొప్ప పుణ్యాత్ములైనా సరే, విప్రులను అవమానించ కూడదని తెలుసుకోవాలి.

క. కరినాథుఁ డయ్యె నాతఁడు, కరులైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్
హరిచరణ సేవ కతమునఁ, గరి వరునకు నధికముక్తి గలిగె మహాత్మా!

125

తా ॥ మహాత్మా! ఆ ఇంద్రద్యుమ్నుడే కరినాథుడయ్యాడు, అతని సేవకులంతా ఏనుగులుగా జన్మించారు. అయితే ఏనుగుగా జన్మించినా, శ్రీహరిసేవ కారణంగా అతనికి గొప్పదైన ముక్తి లభించింది.

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు, నుభయ నియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన, ప్రబలమైన విష్ణుభక్తి సెడదు.

126

తా ॥ భక్తులైన వారు విష్ణుపూజలు చేయుచూ, నిత్యకర్మలను నిష్కామంగా నిర్వర్తించాలి. ఈ నియమాన్ని పాటిస్తే కర్మబంధాలు శిథిలమై, విష్ణుభక్తి వృద్ధి చెందుతుంది.

క. చెడుఁ గరులు హరులు ధనములు, జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకుం; జెడక మనునట్టి గుణులకుఁ, జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్.

127

తా ॥ దైవబలం లేని దుర్జనులకు ఏనుగులు, గుర్రాలు, సంపదలు, సతులు, సుతులు అందరూ నశిస్తారు. సజ్జనులైన వారు దానినుండి రక్షింపబడతారు. విష్ణుసేవ యందలి ఆసక్తి ఉన్నవారు చెడ్డదారిన పోరు కదా!

వ. అప్పుడు జగజ్జనకుండగు న ప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె.

128

క. 'బాలా! నా వెనువెంటను, హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట, కాలో నేమంటి నన్ను నంభోజముఖీ!

129

తా ॥ అప్పుడు లోకాలకు తండ్రి అయిన ఆ విష్ణుమూర్తి నవ్వుతూ, లక్ష్మీదేవిని చూసి ఇట్లా అన్నాడు: "తామర పువ్వు వంటి ముఖం కలదానా! నా వెంట నీవు ఆకాశమార్గం గుండా వస్తూన్నప్పుడు నీ పైట చెరగును విడువక పట్టుకున్నందుకు నా గురించి ఏమనుకున్నావో?

క. ఎఱుఁగుదు తెఱవా యెప్పుడు, మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్ మఱతు నని యెఱిఁగి మొఱఁగక, మఱవక మొఱ యిడిర యేని మఱి యన్యములన్.

130

తా ॥ ఓ మగువా! నన్ను మరువని వారిని నేనెన్నడు మరువను. నన్ను మరచిపోతే వారిని నేనూ మరచి పోతాను. ఈ విషయాన్ని తెలుసుకుని ఇతరులను ప్రార్థించకుండా, నన్నే ఎవరైతే

ప్రార్థిస్తారో వారిని నేను ఎప్పుడూ రక్షిస్తాను."

వ. అని పలికిన నరవింద మందిర యయిన న య్యిందిరాదేవి మందస్మిత చంద్రికా సుందర వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె.

131

తా ॥ అని పలికిన ముకుందునితో చిరునవ్వు చంద్రికలు వెదజల్లుతున్న ముఖంతో ఇందిరాదేవి ఇలా అన్నది:

క. దేవా! దేవర యడుగులు, భావంబున నిలిపి కొలుచు పని నా పని గా
కో వల్లభ! యే మనియెద, నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ!

132

తా ॥ "దేవా! మీ పాదపద్మాలను మనస్సులో నిలుపుకొని పూజించటమే నా పని. కాబట్టి ఇందులో అనుకునేది ఏమీ లేదు, మిమ్మల్ని అనుసరిస్తూ వచ్చాను. అంతే!

క. దీనుల కుయ్యాలింపను, దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును, దీన పరాధీన! దేవదేవ! మహేశా!

133

తా ॥ ఓ దేవాధిదేవా! మహేశా! దీన పరాధీనా! దీనుల యొక్క ఆర్తి వినడానికి దీనులను రక్షించడానికి వారి మేలైన పొగడ్తలను పొందడానికి నీవు తగినవవాడవు."

వ. అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న య ప్పరమ వైష్ణవీరత్నంబును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు నిజసదనంబునకుం జనియె; నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె.

తా ॥ అని ఈ విధంగా సముచితంగా పలుకుతున్న లక్ష్మీదేవిని సాదర పూర్వకంగా సరస సల్లాప మందహాస వదనారవిందంతో ఆలింగనం చేసుకొని గరుడ గంధర్వులు, సిద్ధులు, విబుధులు జయజయ ధ్వానాలు చేస్తూండగా గరుడ వాహనారూఢుడై ఆ శ్రీహరి, తన నిజసదనానికి బయలుదేరాడు" అని ఇంతవరకు చెప్పి శుకయోగి తరువాత కథను చెప్పటం ప్రారంభించాడు:

సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁ బడిన యీ కృష్ణానుభావమైన
గజరాజమోక్షణకథ వినువారికి యశము లిచ్చును గల్మషాపహంబు;
దుస్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబుఁ; బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు;

తే. సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁబొందు; సుఖము సిద్ధించు; వర్ధిలు శోభనములు;
మోక్ష మఱచేతిదై యుండు; ముదము చేరు, ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.

135

తా ॥ "ఓ రాజా! నీకు నా చేత చెప్పబడిన ఈ గజేంద్రమోక్ష కథను విన్నవాళ్ళకి యశస్సు కలుగుతుంది. సకల పాపాలు నశిస్తాయి. చెడ్డకలలు రావు. దుఃఖాలు దూరమవుతాయి. ఉదయమే మేల్కొని శుచియై నిర్మల హృదయంతో నిత్యము ఎవరైతే పఠిస్తారో, సజ్జనులైన ఆ విప్రులకు బహువైభవాలు కలుగుతాయి. పీడలు తొలగి పోతాయి. శాంతిని పొందుతారు. సుఖం కలుగుతుంది. శుభయోగాలు కలుగుతాయి. సంతోషం సమకూరుతుంది. గజేంద్రుడు శ్రీహరిని శరణు జొచ్చిన విధంగా ఈ కథను చదివినవారు సర్వసమర్పణా భావాన్ని పొందితే మోక్షం సులభతరం అవుతుందని శ్రీమహావిష్ణువు ప్రీతితో ఆనతిచ్చాడు."

వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె; నెవ్వరేని నపరరాత్రంబున

మేల్కాంచి సమాహిత మనస్కులయి నన్నును నిన్నును నీ సరోవరంబును శ్వేతద్వీపంబున నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హేమ నగంబును నిగ్గిరి కందర కాననంబులను వేత్రకీచక వేణులతాగుల్మ సురపాదపంబులను నేనును, బ్రహ్మయు, ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదాదిఋషులను మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను దదవతార కృతకార్యంబులను సూర్యసోమపావకులను బ్రణవంబును ధర్మతపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసుర సాధు పతివ్రతా జనంబులను జంద్రకాశ్యపజాయా సముదయంబును గౌరీగంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును నమరులను నమర తరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్య శ్లోకులయిన మానవులను సమాహిత చిత్తులై తలంచు వారలకుఁ బ్రాణావసాన కాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందిత చరణారవిందుండై విహగపరివృఢ వాహనుండై వేంచేసె; విబుధానీకంబు సంతోషించెనని చెప్పి శుకుండు రాజున కిట్లనియె.

136

తా ॥ "ఇంతే కాకుండా ఆ శ్రీహరి ఇట్లా అన్నాడు: "ఎవ్వరైనా సరే తెల్లవారు జామునే మేలుకొని పరిశుభ్రమైన మనస్సుతో నన్నూ, నిన్నూ, ఈ సరోవరాన్ని, శ్వేత ద్వీపాన్ని, నాకు ప్రియమైన క్షీరసాగరాన్ని, బంగారు కొండను, ఈ కొండలలో ఉండే గుహలను, అడవులను, పేము వెదురు పొదలతో కూడిన కల్పవృక్షాలను, నేను, బ్రహ్మ, ఈశ్వరుడు నివసించే ఆ త్రికూటగిరి శిఖరాలను, కౌమోదకి కౌస్తుభ సుదర్శన పాంచజన్యాలను, శ్రీదేవిని ఆది శేషుని గరుత్మంతుని వాసుకిని ప్రహ్లాదుని నారదాది ఋషులను, మత్స్య కూర్మ వరాహాది అవతారాలను, ఆ అవతారాలు నెరవేర్చిన కృత్యములను, సూర్యచంద్ర అగ్నులను, ఓంకారాన్ని, ధర్మాన్ని, తపస్సును, సత్యాన్ని, వేదాలను, వేదాంగాలను, శాస్త్రాలను, గోవులు, బ్రాహ్మణులు

సాధువులు, పతివ్రతా జనాలు, చంద్రుని భార్యలను, కాశ్యపుని భార్యలను, గౌరీగంగా సరస్వతీ కాళిందీ సునందా మొదలైన పుణ్యనదులను, దేవతలను, దేవతా వృక్షాలను, ఐరావతాన్ని, అమృతాన్ని, ధృవుని, బ్రహ్మఋషులను, పుణ్యాత్ములయిన మానవులను తలచుకొంటారో అలాంటి వారికి ప్రాణం పోయేసమయంలో ఉత్తమ గతులను ప్రసాదిస్తాను." ఈ విధంగా విష్ణువు చెప్పి, శంఖాన్ని పూరించి దేవతలంతా నమస్కారాలు చేస్తూండగా గరుడవాహనారూఢుడై తన లోకానికి వెళ్ళాడు." అని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు:

క. గజరాజ మోక్షణంబును, నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజ వరదుఁ డిచ్చును, గజతురగ స్యందనములుఁ గైవల్యంబున్.

137

తా ॥ "ఎవరైతే ఈ గజేంద్ర మోక్ష గాథను భక్తినియమాలతో చదువుతారో లేక వింటారో అట్టి నియమ పరులకు శ్రీమహావిష్ణువు గజములు, గుర్రములు, రథాలు కలిగిన భోగాలనూ, చివరకు కైవల్యాన్ని ఇస్తాడు.

క. తామసు తమ్ముఁడు రైవత, నామకుఁడై వెలసె మనువు; నలువురమీఁదన్
భూమికిఁ బ్రతివింధ్యార్జున, నామాదులు నృపులు మనువు నందనులు నృపా.

138

తా ॥ ఓ రాజా! తామసుడనే పేరుగల వాని తమ్ముడు రైవతుడనేవాడు అయిదవ మనువు అయ్యాడు. ప్రతివింధ్యుడు, అర్జునుడు మొదలైన పేర్లు కల అతని కొడుకులు భూలోకంలో రాజులయ్యారు.

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండను వీరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి;
యీ యిద్దఱకుఁ బుత్త్రుఁడై తన కళలతో వైకుంఠు ఁ డనఁ బుట్టి వారిజాక్షుఁ

డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ గల్పించె నెల్ల లోకములు మ్రొక్క;

తే. రమ యెదుర్కోలు సేకొనె రాజముఖ్య!, తదనుభావంబు గుణములుఁ దలఁపఁదరమె?
యీ ధరారేణు పటలంబు నెఱుఁగవచ్చుఁ, గాని రాదయ్య హరిగుణగణము సంఖ్య.

139

తా ॥ ఓ రాజా! ఈ మన్వంతరంలో హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు వేద శీర్షుడు మొదలైన వారు సప్తఋషులు అయ్యారు. భూతరయుడు మొదలైన వారు అమరులు అయ్యారు. శుభ్రునికి, అతని భార్య అయిన పరమ సాధ్వి వికుంఠకు వైకుంఠుడనే పుత్రుడై, తన కళలతో పుట్టాడు విష్ణువు. అనంతరం ఈ భూమిమీద వైకుంఠమనే లోకాన్ని సృష్టించాడు. అన్ని లోకాలు మ్రొక్కేటట్లుగా శ్రీమహాలక్ష్మిని వివాహం చేసుకొన్నాడు. ఈ భూమి మీది ధూళికణాలను అయినా లెక్కించ వచ్చేమో కాని ఆ హరి గుణాలు లెక్కించడం సాధ్యం కాదు.

వ. తదనంతరంబు.

140

సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుం డను వీరుఁ డాఱవ మనువయ్యె నవనినాథ!
భూమీశ్వరులు పురుఃపురుష సుద్యుమ్నాదు లాతని నందను; లమర విభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ డమర్త్యు లాప్యాదికులాహవిష్మద్వీరకాదిఘనులు
మునులందు విభుఁడు సంభూతికి వైరాజునకుఁ బుట్టి యజితుఁడు నాఁగ నొప్పె

ఆ. నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని, నుదధి జలములోన నుండి మోచె;
నతఁడు సువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ, ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు.

141

తా ॥ ఓ రాజా! ఆపైన చక్షువు కొడుకైన చాక్షుషుడు అనే వీరుడు ఆరవ మనువు అయ్యాడు. అతని కుమారులైన పురుడు, పురుషుడు, సుద్యుమ్నుడు మొదలైన వారు

రాజులైనారు. మంత్రద్యుముడు ఇంద్రుడవగా ఆప్యాదులు దేవతలయ్యారు. హవిష్మంతుడు, వీరకుడు మొదలైన గొప్పవారు సప్తఋషులు అయ్యారు. సంభూతికి వైరాజుకి విష్ణువు అజితుడు అనే పేరుతో జన్మించాడు. అతడే ఆదికూర్మమై మందర పర్వతాన్ని సముద్ర జలములలో మునగకుండా మోసాడు. అతడే దేవతలు ప్రార్థిస్తే పాలసముద్రాన్ని చిలికి అమృతాన్ని ఇచ్చాడు.''

# క్షీరసాగర మథనం

వ. అని పలికినం బరీక్షిన్న రేంద్రుడు మునీంద్రున కిట్లనియె.

142

తా ॥ అని మునీంద్రుడు చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు:

మ. విను; ము న్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్
వనధిం జొచ్చి య దెట్లు మోచె బలుకవ్వంబైన శైలంబు? దే
వ నికాయం బమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం
జనితం బయ్యె? మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే!

143

తా ॥ "ఓ యోగీంద్రా! విష్ణువు పాలకడలిని ఎందుకు మథించాడు? సముద్రంలో కూర్మాకృతిలో ప్రవేశించి మందర పర్వతాన్ని కవ్వంగా ఎలా మోసాడు? దేవతలకు అమృతాన్ని ఏ విధంగా పంచాడు? ఆ సాగరం నుండి ఏమేమి పుట్టాయి? మునీంద్రా! ఆశ్చర్యకరమైన విషయాలన్నింటినీ తెలియజేయండి.

క. ఆప్పటినుండి బుధోత్తమ!, చెప్పెదు భగవత్కథావిశేషంబులు నా
కెప్పుడుఁ దనివి జనింపదు, సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలన్.

144

తా ॥ ఓ పండితోత్తమా! నీవు ఇప్పటి వరకు చెప్పిన భగవత్కథా విశేషాల వల్ల నాకు తృప్తి కలగలేదు. శ్రీహరి యొక్క కథలను ఇంకా చెప్పి నా చెవులకు వీనులవిందు చేయండి."

వ. అని మఱియు నడుగం బడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప

నుపక్రమించె నని సూతుండు ద్విజుల కిట్లనియె; నట్లు శుకుండు రాజుం జూచి.

145

తా ॥ శుకుడు అతనిని అభినందించి హరి యొక్క కథలను చెప్పడానికి ఉపక్రమించాడ" ని చెప్పి సూతుడు మునులతో ఇలా అన్నాడు:

క. కసి మసఁగి యసుర విసరము, లసి లతికల సురల నెగువ నసువుల వెడలం బసఁ
జెడిరి; పడిరి; కెడసిరి, యసమ సమర విలసనముల నను వెడలి నృపా!

146

తా ॥ "శుక మహర్షి ఇలా చెప్పసాగాడు: "ఓ రాజా! అసురులు పగతో ఆయుధాలను ధరించి దేవతలను ఎదుర్కొని యుద్ధాన్ని ఆరంభించారు. కొంతకాలానికి దేవతల బలం తగ్గి, అనేక విధాలుగా నొప్పించబడి, గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని శత్రువులను జయించే ఉపాయం తెలియక చలించి పోయారు.

క. సురపతి వరుణాదులతో, సురముఖ్యులు గొంద అరిగి సురశైలముపై
సురనుతుఁడగు నజుఁ గని యా, సుర దుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై.

147

తా ॥ ఆ సమయంలో దేవేంద్రుడు వరుణుడు ఇత్యాది దేవతలతో కలిసి మేరు పర్వతంలో ఉన్న బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి నమస్కరించి, రాక్షసులు పెట్టే బాధలను ఆయనకు ఇలా విన్నవించాడు..

క. దుర్వాసు శాపవశమున, నిర్వీర్యత జగములెల్ల ని■్శకములై
పర్వతరిపుతోఁ గూడ న, పర్వము లయి యుండె హతసుపర్వావళులై.

148

తా ॥ దుర్వాసుని శాపవశం చేత లోకాలన్నీ తమ శక్తిని, సంపదను కోల్పోయాయి. యుద్ధంలో మేమంతా పరాజితులమైనాము. మా వేడుకలు అన్నీ నశించాయి.

ఆ. నెలవు వెడలి వచ్చి నిస్తేజులై నట్టి, వేల్పుగములఁ జూచి వేల్పుఁ బెద్ద
పరమ పురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల, పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ.

149

తా ॥ ఇలా వాళ్ళ స్థానం విడిచి, తేజస్సును కోల్పోయి వచ్చిన దేవతాసమూహాన్ని చూసి దేవతలలో పెద్దవాడైన బ్రహ్మదేవుడు ఒక్కసారి ఆ పరమపురుషుణ్ణి ధ్యానించి, నమస్కరించి చిరునవ్వుతో వారితో ఇలా అన్నాడు:

క. ఏనును మీరును గాలము, మానవ తిర్యగ్లతాద్రుమ స్వేదజముల్
మానుగ నెవ్వని కళలము, వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా?

150

తా ॥ "నాకు, మీకు, కాలానికే కాక, సృష్టిలోని సమస్త ప్రాణి కోట్లకూ(మానవ, పశు, పక్ష్యాదులు...) మూలమైన వాడు ఒక్కడే. మనమంతా ఆయన అంశలమే కనుక ఆయననే శరణు వేడుదాం. ఇంతమాత్రానికి బాధపడటం ఎందుకు?

క. వధ్యుండు రక్షణీయుఁడు, సాధ్యుఁడు మాన్యుఁడని లేని సర్గత్రాణా
వధ్యాదు లొనర్చు నతం, డాద్యంత విధానమునకు నర్హుఁడు మనకున్.

151

తా ॥ ఆ పరమాత్మునికి వధింప తగినవాడు, కాపాడదగినవాడు, సాధింపతగినవాడు, గౌరవించదగినవాడు అనే తారతమ్యాలు లేవు. సృష్టిని రక్షించాలన్నా, లయం చేయాలన్నా ఆయనకే సాధ్యం. ఆద్యంతాలు లేని ఆ మహనీయుడే మనకు ఆధారమైనవాడు, మన కష్టాలను

తొలగించువాడు.

క. వరదునిఁ బరమ జగద్గురు, గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు సెదునని సురలకు, సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్.

152

వ. తానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునం గానంబడని య
వ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె.

153

తా ॥ వరాలిచ్చేవాడు, పరమాత్ముడూ, జగద్గురుమా, దయామయుడైన ఆ స్వామిని మనం దర్శిస్తే మన సర్వ దుఃఖాలు నాశనం అవుతాయి" అని బ్రహ్మదేవుడు దేవతలతో చెప్పాడు. తరువాత బ్రహ్మ వారితో కలిసి వెళ్ళి అదృశ్యరూపుడై ఉన్న స్వామికి నమస్కరించి, వినయంతో, ఏకాగ్రచిత్తంతో ఇలా ప్రార్థించసాగాడు.

సీ. ఎవ్వని మాయకు నింతయు మోహించుఁ దఱిమి యెవ్వని మాయ దాఁట రాదు;
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు,
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనితమయిన,
ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబు గన్నులు సోమకమలహితులు,

తే. చెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము, మూఁడు మూర్తుల పుట్టిల్లు, మొదలి నెలవు
గర్భ మఖిలంబు, మూర్ధంబు గగన మగుచు, మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు.

154

తా ॥ "ఓ స్వామీ! ఈ సమస్త సృష్టి నీ మాయచేత మోహంలో నిండి ఉంది. నీ మాయను అతిక్రమించడం సాధ్యతరం కానిది. నీ మాయను జయించిన వారెవ్వరూ లేరు. నిన్ను మునీశ్వరులు సైతం దర్శింపలేరు. అన్ని జీవరాశుల యందు నీవు సమంగా మెలగుతావు. శివుని

మనస్సుగా, అగ్ని ముఖంగా, సూర్యచంద్రులు నేత్రాలుగా, దిక్కులు చెవులుగా, రేతస్సు జలంగా, భూమిని పాదాలుగా కల వాడవు నీవు. నీ రూపం త్రిమూర్తులకు పుట్టినిల్లు. నీ ఉదరం సమస్త సృష్టికి మూలాధారం, ఆకాశమే నీ శిరస్సు. ఇటువంటి విశ్వరూపాన్ని కలిగిన నీకు నమస్కరిస్తున్నాను.

వ. మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును, బ్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బౌరుషంబున విరించియు, నింద్రియంబుల వలన వేదంబులును మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియును, వక్షంబున లక్ష్మియు, ఛాయ వలనఁ బితృదేవతలును, స్తనంబుల వలన ధర్మంబును, బృష్ఠంబుల వలన నధర్మం బును, శిరంబు వలన నాకంబును, విహాసంబు వలన నప్సరోజనం బులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబు వలన విప్రులును, భుజంబుల వలన రాజులును (బలంబును,) నూరువుల వలన వైశ్యులును (నైపుణ్యంబును,) బదంబుల వలన శూద్రులును, (నవేదంబును) నధరంబువలన లోభంబును, సుపరిరదచ్ఛదంబు వలనఁ బ్రీతియు, నాసాపుటంబువలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగళంబున యమంబును, బక్షంబున గాలంబును సంభవించె; నెవ్వని యోగమాయా విహితంబులు ద్రవ్యవయః కర్మగుణ విశేషంబులు; చతుర్విధభూత సర్గం బెవ్వని యాత్మతంత్రం; బెవ్వని వలన సిద్ధించి లోకంబులును లోకపాలురును బ్రదుకు చుందురు, పెరుఁగుచుందురు; దివిజులకు నాయువు బలంబునై, జగంబులకు నీశుండై, ప్రజలకుఁ ప్రజనుండై, బ్రజావన క్రియాకాండ నిమిత్త సంభవుండగు జాతవేదుండై, యంతస్సముద్రంబున ధాతు సంఘాతం బులం బ్రపంచించుచు బ్రహ్మమయుండై, ముక్తికి ద్వారంబై, యమృత, మృత్యు స్వరూపుండై, చరాచర ప్రాణులకు ప్రాణంబై యోజస్సహోబల వాయురూపంబులైన ప్రాణేంద్రియాత్మ శరీర నికేతనుండై పరమ మహాభూతి యగు న ప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుం డగుంగాక! యని మఱియును.

తా ॥ దేవా! నీ బలం వలన ఇంద్రుడు, నీ అనుగ్రహం వలన దేవతలు, నీ ఆగ్రహం నుండి రుద్రుడు, నీ పౌరుషం వలన బ్రహ్మ, నీ ఇంద్రియాల నుండి వేదములు, మునులునూ, నీ మేఢ్రంబున ప్రజాపతి, నీ వక్షంబు నుండి లక్ష్మి, నీ ఛాయ నుండి పితృదేవతలు, నీ స్తనముల వలన ధర్మము, నీ పృష్ఠ భాగం నుండి అధర్మము, నీ శిరము నుండి స్వర్గము, నీ నవ్వు వలన అప్సరసలు, నీ గుహ్యం నుండి బ్రహ్మ, నీ ముఖం నుండి విప్రులు, నీ భుజముల నుండి రాజులు, నీ ఊరువుల నుండి వైశ్యులు, నీ పాదాలనుండి శూద్రులు, నీ క్రింది పెదవి నుండి లోభము, నీ పైపెదవి నుండి ప్రీతి, నీ ముక్కు పుటముల నుండి కాంతి, నీ స్పర్శ నుండి కామము, నీ కనుబొమల నుండి యముడు, నీ ప్రక్క భాగం నుండి కాలమూ సంభవించాయి.

నీ యోగమాయ వల్ల ద్రవ్యము, వయస్సు, కర్మము, గుణవిశేషాలు సిద్ధించాయి. నీ ఆత్మతంత్రం నుండి ధర్మము, అర్థము, కామము, మోక్షమూ కలిగాయి. నీ వలన లోకములు, లోకపాలురు ఏర్పడి వృద్ధి నొందుతారు. దేవతలకు ఆయువు, బలము అన్నీ నీవే. ఈ జగములకు ఈశ్వరుడవు నీవే. ప్రజల కర్మకలాపాల నిమిత్తం ఉద్భవించిన అగ్నిహోత్రానివి నీవే! సముద్రంలో రత్నరాసులను పుట్టించేది నీవే! ముక్తికి ద్వారం నీవే. జనన మరణాలు నీ వలన ఏర్పడినవే! చరాచర ప్రాణులకు ప్రాణం నీవే. తేజస్సు, అహంకారము, వాయువు గల ప్రాణుల ఇంద్రియాలలో ఆత్మలో, శరీరాలలో నీవు నివసిస్తావు. ఓ పరమపురుషా! మాపై దయను చూపు!

క. మొదల జల మిడిన భూజము, దుది నడుమను జల్లఁ దనము దొరఁకొను మాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన, ముద మొందుదు మెల్ల వేల్పుమూఁకలు నేమున్.



తా ॥ వృక్షానికి మొదట్లో నీరు పోస్తే, చెట్టంతా వ్యాపించి శాఖలు, ఆకులు నవనవలాడినట్లుగా, ముందుగా నీకు మ్రొక్కితే నేను, దేవతలందరు కూడా సంతోషిస్తాము.

క. ఆపన్నులగు దిదృక్షుల, కో పుణ్య! భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ

ప్రాప్తింపఁ జేయు సంపద, నోపరమదయానివాస! యుజ్జ్వలతేజా

157

తా ॥ ఓ పరమ దయా నివాసా! గొప్పదైన తేజస్సును కలిగి ఉన్నవాడా! నిన్ను చూడాలనుకునే వారికి సమగ్రమైన సంపద కలుగుతుంది.

వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేక విధంబులం గీర్తించుచు నున్న పరమేష్ఠియందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె.

158

తా ॥ అని ఇట్లు దేవతాగణములతో కూడి అనేక విధాలుగా కీర్తిస్తూన్న బ్రహ్మదేవున్ని దయతో అనుగ్రహించి విష్ణువు ప్రత్యక్షమైనాడు.

మ. ఒక వేయర్కులు గూడిగట్టి కరువై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చనుదెంచు మాడ్కి హరి దా నొప్పారె; నా వేలుపుల్
వికలాలోకనులై, విషణ్ణమతులై; విభ్రాంతులై మ్రోలఁ గా
నక శంకించిరి కొంత ప్రొద్దు; విభుఁ గానం బోలునే వారికిన్?

159

తా ॥ ఆ శ్రీమహావిష్ణువు వేయి మంది సూర్యులు కూడి ప్రకాశిస్తూనట్లుగా చూడశక్యంగాని తేజస్సుతో ఒప్పారాడు. దానితో దేవతల చూపులు చెదిరిపోయి వారంతా భయవిహ్వలైనారు. ఎంతటివారికైనా ఆ పరమపురుషుడిని చూడటం సాధ్యపడుతుందా!

వ. అప్పుడు.

160

సీ. హార కిరీట కేయూర కుండల పాద కటక కాంచీలతా కంకణాది

కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీ శంఖ చక్రశరాసన సంయుతంబు

మరకతశ్యామంబు సరసిజ నేత్రంబుఁ గర్ణాభరణ కాంతి గండ యుగము

గలిత కాంచన వర్ణ కౌశేయవస్త్రంబు శ్రీ వన మాలికా సేవితంబు

ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య, మైన యతని రూపు హర్ష మెసఁగఁ జూచి బ్రహ్మ

హరుఁడు సురలును దానును, బొంగి నమ్రుఁ డగుచుఁ బొగఁడఁ దొడఁగె.

161

తా ॥ అంతటి వారి యందు కరుణతో ఆ దేవాధిదేవుడు ఈ విధంగా దర్శనమిచ్చాడు. హారములు, కిరీటము, భుజకీర్తులు, కుండలములు, పాదములకు అందెలు, మొలనూలు, కంకణములు, కౌస్తుభరత్నము, కౌమోదకి, శంఖము, చక్రము, ధనుస్సు వీటితో కూడి దర్శనమిచ్చాడు. మరకతమణిని పోలిన వంటి నల్లని శరీరఛాయ, కమలముల వంటి కన్నులు, కర్ణాభరణముల కాంతి వైభవంగా ప్రకాశిస్తున్నాయి. పసిడి కాంతులతో పట్టు వస్త్రము, కంఠమందు వనమాల వెలుగొందుతున్నాయి. మనోహరమై దివ్య సౌభాగ్యమైన ఆయన దివ్యమంగళ విగ్రహాన్ని హర్షంతో బ్రహ్మ, ఈశ్వరుడు, దేవతలు దర్శించారు. అప్పుడు బ్రహ్మ భగవంతునకు నమస్కరించి ఇలా స్తోత్రం చేశాడు.

క. జననస్థితిలయ దూరుని, మునినుతు నిర్వాణసుఖ సముద్రుని సుగుణుం

దనుతనునిఁ బృథుల పృథులుని, ననఘాత్ము మహానుభావు నభినందింతున్.

162

తా ॥ "మహానుభావా! నీకు ఆదిమధ్యాంతములు లేవు. మోక్షమనే ఆనందానికి సాగరం వంటివాడవు నీవు. సుగుణరూపుడైన నిన్ను మునులు ఎన్నో విధాలుగా కీర్తిస్తూ ఉంటారు. సూక్ష్మమైనవాటి కన్నా సూక్ష్మమైనవాడవు, స్థూలములకెల్లా స్థూలమైనవాడవు, అనఘుడివి. అటువంటి నిన్ను నేను స్తుతిస్తున్నాను.

క. పురుషోత్తమ! నీ రూపము, పరమ శ్రేయంబు భువన పంక్తుల కెల్లన్
స్థిరవైదిక యోగంబున, వరుసను మీ యంద కానవచ్చెను మాకున్.

163

తా ॥ ఓ పురుషోత్తమా! అన్ని లోకాలలోను నీ రూపం పరమ శ్రేయోదాయకమైనది. అటువంటి దివ్యస్వరూపంతో స్థిరమైన వేదమంత్రాలతో కూడి మాకు కనిపిస్తోంది.

క. మొదలును నీలోఁ దోఁచెను, దుదియును నటఁ దోఁచె; నడుము దోఁచెను; నీవే
మొదలు నడుము దుది సృష్టికిఁ, గదియఁగ ఘటమునకు మన్ను గతియగు మాడ్కిన్.

164

తా ॥ కుండకు మట్టి ఆధారమైనట్లుగా ఈ సృష్టికి నీవే ఆధారం. ఈ సృష్టికి మొదలూ, మధ్యమం, అంతం, అన్నీ నీ వల్లనే సాధ్యపడుతున్నాయి.

క. నీ మాయ చేత విశ్వము, వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపద విని, నేమంబున సగుణుఁడైన నినుఁ గాంతు రొగిన్.

165

తా ॥ నీ మాయ చేత ఈ విశ్వమును అనేకసార్లు సృష్టించిన కారణంగా నిన్ను విష్ణువని బుద్ధిమంతులు తలుస్తూ నీ గుణసంపదలు శ్రవణం చేసి కీర్తిస్తూ సాకారరూపమున నిను దర్శిస్తారు.

ఆ. అన్న మవనియందు నమృతంబు గోవుల, యందు వహ్ని సమిధలందు నమర
యోగవశతఁ బొందు నోజను బుద్ధిచే, నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు.

166

తా ॥ భూమి యందు, ఆహారంలో, గోవులలోని పాలయందు, సమిధలలో (కట్టెలలో)

అగ్ని యందు నిన్ను కనుగొన్న విధంగా, ఆత్మవిదులైనవారు తమ బుద్ధిచేత గుణరహితుడవైన నిన్ను ఈ విశ్వమందు గాంచుతారు.

మత్త. పట్టులేక బహుప్రకార విపన్న చిత్తులమైతి; మే
మెట్టకేలకు నిన్నుఁగంటి మభీప్సితార్థము వచ్చుఁ; బె
న్వెట్టయైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్
నిట్టనేర్చిన గంగలోపల నీరు గాంచిన చాడ్పునన్.

167

తా ॥ ఆధారం కోల్పోయి మేము కష్టాల కడలిలో చిక్కుకున్నాము. దావానలంలోని కార్చిచ్చు ధాటికి తపించిపోతూ ఉన్న ఏనుగుల సమూహానికి శీతల గంగా జలాలను చూడగానే ఉపశమనం కలిగినట్లుగా నిన్ను చూడగానే మా తాపం చల్లారింది. ఇక మా అభీష్టాలు అన్నీ సిద్ధిస్తాయి.

మత్త. నీకు నే మని విన్నవింతుము! నీవు సర్వమయుండవై
లోకమెల్లను నిండి యుండఁగ లోకలోచన! నీ పదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు కేతుతతిక్రియన్.

168

వ. అని కమల సంభవ ప్రముఖులు వినుతి సేసి రని చెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె.

169

తా ॥ నీవు అన్ని లోకాల యందు వ్యాపించి ఉన్న మహనీయుడవు. అన్ని లోకాలను వీక్షిస్తూ ఉంటావు. అట్టి నీకు ఏమని విన్నవించగలము? నీకు సర్వమూ తెలుసు. నీ పాదదర్శనం మాకు శుభాలను కలిగిస్తుంది. అగ్నిలోని విస్ఫులింగాలవలె లోకపాలకులూ, నేనూ, దేవతలు నీ

అంశలమే కదా!" ఈ విధంగా బ్రహ్మాది ప్రముఖులు స్తుతించార" ని చెప్పి పరీక్షిన్మహారాజుతో శుక మహర్షి ఇట్లా అంటున్నాడు:

శా. ఈ రీతిం జతురాననాది నుతుఁడై యేపార జీమూత గం
భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం
డారోమాంచిత కాయులన్ నవవిముక్తాపాయులం బ్రేయులం
బ్రారబ్ధోగ్ర మహార్ణవోన్మథన వాంఛానల్పులన్ వేల్పులన్.

170

తా ॥ "ఈ రీతిగా బ్రహ్మాదులు నుతింపగా భగవంతుడు ఆనందించాడు. దేవతలంతా శరీరాలు పులకింపగా సంతోషించి ప్రారబ్ధమనే ఉగ్రసముద్రాన్ని మథించడానికి సిద్ధపడ్డారు. అప్పుడు ఆ స్వామి మేఘగంభీర స్వరంతో ఇట్లా పలికాడు:

క. ఓ నలువ! యో సురేశ్వర!, యో నిటలతటాక్ష! యో సురోత్తములారా!
దానవులతోడ నిప్పుడు, మానుగఁ బోరామి గలిగి మనుటే యొప్పున్.

171

తా ॥ "ఓ చతురాననా! ఓ దేవేంద్రా! ఈశ్వరా! దేవతోత్తముడా! దానవులతో మీరిప్పుడు స్నేహం చేసి మెలగుటయే క్షేమము.

వ. అది యెట్లంటిరేని.

172

క. ఎప్పుడు దనకును సత్త్వము, సొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును, నొప్పుగ నహి మూషకమున కొదిగిన భంగిన్.

173

తా ॥ అలా ఎందుకంటే, ఎలుక కోసం పాము ఒదిగి ఉన్నట్లుగా, తనకు బలం వచ్చేదాకా శత్రువుల బారినుండి శరీరాన్ని రక్షించుకొని ఉండటం శ్రేయస్కరం.

క. అమృతోత్పాదన యత్నము, విమల మతిం జేయు టొప్పు; వేల్పులు వినుఁడీ,
యమృతంబుఁ ద్రావి జంతువు, లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్.

174

తా ॥ ఓ దేవతలారా! వినండి! అమృతోత్పాదన యత్నాన్ని స్వచ్ఛమైన మనస్సుతో మీరు చేయటం మంచిది. అమృతాన్ని త్రాగిన వారు ఎవరైనా సరే వారికి ఆయువు పెరిగి, మృత్యువు లేని స్థితి కలుగుతుంది.

సీ. పాలమున్నీటి లోపల సర్వతృణలతౌషధములు దెప్పించి చాల వైచి
మందర శైలంబు మంథానముగఁ జేసి తనర వాసుకిఁ దరిత్రాడు సేసి
నా సహాయతచేత నలి నందఱును మీరు తరువుఁడు వేగ మతంద్రు లగుచు;
ఫలము మీఁదయ్యెడు బహుళ దుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు;
ఆ. అలసటయును లేక యఖిలార్థములుఁ గల్గు, విషధిలోన నొక్క విషము పుట్టుఁ;
గలఁగి వెఱవ వలదు; కామరోషంబులు, వస్తుచయము నందు వలదు చేయ.

175

తా ॥ పాలసముద్రం లోపల పలువిధాలైన తృణములు, లతలు, ఔషధములను వేసి మందర పర్వతాన్ని కవ్వంగా వాసుకిని కవ్వపు త్రాడుగా చేసి నా సహాయం చేత మీరందరు మథించండి. అప్పుడు మీకు ఫలం లభిస్తుంది. అనేక పాపాలు చేసిన రాక్షసులు చాలా దుఃఖాల పాలవుతారు. మీకు శ్రమలేకుండ సమస్తమైన పదార్థాలు లభిస్తాయి. అయితే ముందు సముద్రంలో ఒక విషము పుడుతుంది. దానికి భయపడకుండా ఉండండి. దానిలో పుట్టే వస్తువుల యందు ఇష్టానిష్టాలు పనికి రావు."

వ. అని యాదేశించి.

176

క. అంతాది రహితుఁ డచ్యుతుఁ, డంతర్ధానంబు నొందె; నజ ఫాలాక్షుల్
సంతోషంబునఁ దమ తమ, కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్.

177

తా ॥ అని చెప్పి ఆద్యంతములు లేని అచ్యుతుడు అంతర్ధానమయ్యాడు. బ్రహ్మ, రుద్రుడు సంతోషంతో తమ తమ నివాస స్థానాలకు వెళ్ళారు.

క. కయ్యంబు సేయ నొల్లక, నెయ్యంబున నతులు వెట్టి నిర్జర నికరం
బియ్యప్పనములు వెట్టుచుఁ, దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్.

178

తా ॥ దానితో దేవతలు యుద్ధం ప్రసక్తి వదిలి పెట్టారు. రాక్షస రాజైన బలి చక్రవర్తి పట్ల స్నేహాన్ని, భక్తిని కనబరుస్తూ, అతనికి అనుగుణంగా వర్తించసాగారు.

క. పసచెడి తనకును వశమై, సుసరపుగతిఁ గొల్చుచున్న సురసంఘములన్ గసిమసఁగి చంపఁ బూనిన, నసురుల వారించె బలియు నతినయయుక్తిన్.

179

వ. అట్లు వారించి వైరోచని రాక్షస సముదయంబున కిట్లనియె.

180

తా ॥ దేవతలు ఈ విధంగా బలహీనులై, తమ రాజుని సేవించడం చూసిన రాక్షసులు ఆ దేవతలందరినీ సంహరించాలనుకున్నారు. అయితే బలి చక్రవర్తి వారిని వారిస్తూ ఇలా అన్నాడు:

క. పగవారు శరణు చొచ్చిన, మగతనములు నెఱపఁ దగునె మగవారలకున్

దగు సమయ మెఱుఁగ వలదే, మగఁటిమిఁ బాటింప వలదు మర్త్యులతోడన్.

181

తా ॥ "శరణు వేడిన శత్రువులను వీరులైన వారెన్నడూ బాధించరూ, సంహరించరు. సమయాన్ని గుర్తించాలి. కనుక ఇప్పుడు మీ బలాన్ని ప్రకటించవద్దు."

వ. అని పలికి కొలువు కూటంబున నసుర నికర పరివృతుండై నిఖీల లోక రాజ్యలక్ష్మీ సహితుండై యఖీల విబుధ వీర విజయాహంకార నిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచన నందనుం గని శచీవిభుం డుత్తమ సచివుండునుం బోలె సాంత్వన వచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసులగు దానవుల నొడంబఱిచి, జంభుని సమ్మతంబు సేకొని, హయగ్రీవుని విగ్రహంబు మాన్చి, నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తికిం బొత్తు హత్తించి, శకుని విరోచన ప్రహేతులకుఁ బోరామి సూపి, మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి; కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమ కాలకేయ నివాత కవచాదులయెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి వశుండై, యితర దానవ దైత్యసమూహంబు వలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్క చెలియండ్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి? నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్య విరోధంబు లేల? తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి; మిది మొదలు దనుజ దివిజ సముదయంబులకు రాజు విరోచన నందనుండ; మనమందఱ మతని పంపు సేయంగలవార; ముభయ కులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతునని యమృతజలధిమథన ప్రారంభ కథనంబు దెలియం జెప్ప; నట్లు సురాసుర యూథంబులు బలారాతిబలి ప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్త చిత్తులై యైకమత్యంబు నొంది యమంద గమనంబున మందర నగంబునకుం జని.

182

తా ॥ అని పలికి, కొలువు కూటంలో అసుర సమూహం తనను పరివేష్టించి ఉండగా, అఖిలమైన పండితులు, వీరులు కొలువ, రాజ్యలక్ష్మితో కూడి సుఖంగా ఉన్నాడు బలి చక్రవర్తి. అతడిని చూసి దేవేంద్రుడు ధర్మస్వరూపుడైన మంత్రివలె మనస్సుకు నచ్చే మాటలు పలుకుతూ శాంతిని కలిగించసాగాడు. అంతేకాక, ఆ పురుషోత్తముడు తెలిపిన నీతి వాక్యాలను కొన్ని రాక్షసులైన శంబరుడు, అరిష్టనేమి, త్రిపురాసురులు వంటివారికి అనునయపూర్వకంగా చెప్పాడు. వీరినే కాక, జంభుడు, హయగ్రీవుడు, నముచీ, తారకుడూ, బాణుడూ, విప్రచిత్తీ, శకుని, విరోచనుడు, ప్రహేతి, మయుడూ, మాలీ, సుమాలీ, కుంభుడు, నికుంభుడు, పౌలేముడు, కాలకేయుడు, వజ్రదంష్ట్రుడు, నివాతకవాచులు మొదలైన రాక్షసులతో కూడా సంబంధ బాంధవ్యాలను నెరుపుతూ వినయంగా ఉండసాగాడు.

ఇతరులైన దైత్యులతోనూ అతి స్నేహాన్ని పాటించాడు. “అక్కాచెల్లెండ్ర బిడ్డలమైన మన మధ్య ద్వేషం వద్దు, ఏదైనా కార్యం సాధించాలనుకుంటే మనమధ్య అడ్డం లేకుండా కలిసికట్టుగా ఉంటూ సాధిద్దాం. మనకు విరోధం ఎందుకు? పూర్వం ఈ విరోధంవల్ల చాలా ఇబ్బందులు పడ్డాం. ఇప్పటినుండి రాక్షసులకు, దేవతలకు బలిచక్రవర్తియే రాజు. మనమందరం అతను చెప్పినట్లే నడచుకుందాం. మన ఉభయ కులాలు వర్ధిల్లే ఉపాయం చెబుతాను.” అని ఇంద్రుడు అమృతం కొరకు సముద్రాన్ని మథించే ఉపాయాన్ని చెప్పాడు. వారిని ఒప్పించాడు. అప్పుడు దేవతలు రాక్షసులు... ఇద్దరూ ఏకమై... దేవతలందరికీ ఇంద్రుడు, రాక్షసులందరికీ బలిచక్రవర్తి నాయకులుగా, అమృతాన్ని సంపాదించడానికి ఐకమత్యంగా అందరూ వేగంగా మందర పర్వతం దగ్గరికి వెళ్ళారు.

సీ. వాసవు వర్ధకి వాఁడిగాఁ జఱచిన కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి
ముసలాగ్రములు చొన్పి మొదలి పాఁ తగలించి దీర్ఘ పాశంబులఁ దిండు సుట్టి
పెకలించి బాహులఁ బీడించి కదలించి పెల్లార్చి తమ తమ పేరువాడి
పెఱికి మీఁదికి నెత్తి పృథుల హస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ

తే. నాని మెల్లన కుఱుతప్పుటడుగు లిడుచు, భార మధికంబు మఱవక పట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని, దేవదైత్యులు జలరాశి తెరువు వట్టి.

183

తా ॥ ముందుగా దేవతా శిల్పి అయిన త్వష్ట చేత త్రవ్వగోలను పదను పెట్టించి, దానితో మందర పర్వతాన్ని కొంత తవ్వినారు. తరువాత రోకళ్ళను లోపలకు చొప్పించి, పొడవైన తాళ్ళతో బిగించి, చుట్టి, చేతులతో పట్టుకుని కదిలించారు. తమ గొప్పలను చెప్పుకుంటూ, బలమైన చేతులతో, భుజాలతో తలలతో ఆ పర్వతం జారకుండా పైకి లేపారు. మెల్లగా అడుగులు వేస్తూ, బాగా బరువుగా ఉంది, బాగా బరువుగా ఉంది, జాగ్రత్త, పట్టు విడువవద్దని పరస్పరం హెచ్చరికలు చేసుకుంటూ, ఆ పర్వతాన్ని నెమ్మదిగా సముద్రం వద్దకు చేర్చే ప్రయత్నం చేసారు.

క. మందరముమోవ నోపమి, నందఱపై ఁబడియె నదియు నతిచోద్యముగాఁ;
గొందఱు నేలం గలిసిరి, కొందరు నుగ్గైరి; చనిరి కొందరు భీతిన్.

184

తా ॥ అయితే మందర పర్వతాన్ని మోయడానికి శక్తిచాలని కారణంగా అది ఆశ్చర్యకరంగా నేలమీదకు ఒరిగిపోయింది. అప్పుడు కొందరు మరణించారు, కొందరు నలిగిపోయారు. కొందరు భయంతో పారిపోయారు.

క. ఏలా హరికడ కేఁగితి, మేలా దొరఁకొంటి మధిక హేలనశైలో
న్మూలనము వేసి తెచ్చితి, మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్?

185

క. ఏటికి మముఁ బని పంచెను?, నేటికి మనఁ బోఁటివారి కింతలు పను? లిం
కేటికి రాఁడు రమేశ్వరుఁ?, డేటి కుపేక్షించె? మఱవనేటికి మనలన్?

తా ॥ 'మనం అసలు విష్ణువు దగ్గరకు ఎందుకు వెళ్ళాం? ఎందుకు ఈ పనికి పూనుకొన్నాం? ఈ పర్వతాన్ని ఎందుకు పెళ్ళగించి తెచ్చాము? అనేక మంది ఎందుకు చనిపోయారు? ఎందుకని మమ్మల్ని ఈ పనికి ఆ శ్రీహరి నియోగించాడు? మనవంటి చిన్న వారికి ఇంతలేసి పెద్దపనులెందుకు? ఆయన ఎందుకని రాడు? ఎందుకుని ఉపేక్ష చేస్తున్నాడు? మనలను ఎందుకు మరచిపోయాడో?'

వ. అని కులకుధర పతనజన్యంబు దైన్యంబు సహింపనోపక పలవించుచున్న దివిజ దితిజుల భయంబు మనంబున నెఱింగి సకల వ్యాపకుండగు హరి తత్సమీపంబున.

187

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
హరికోటిప్రభతో నొహో వెఱవకుం డంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ నలువొందఁ గందుకము మాడ్కిం బట్టి క్రీడించుచున్
గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్.

188

తా ॥ అని కులపర్వతం పడిపోయినందువల్ల పుట్టిన దుఃఖాన్ని సహింపలేక బాధపడసాగారు. దేవతల, రాక్షసుల భయాన్ని సకల వ్యాపకుడైన శ్రీహరి తెలుసుకున్నాడు. గరుడుణ్ణి అధిరోహించి గదను ధరించి, కరుణతో ఆ శ్రీహరి కోటి సూర్యుల కాంతితో వారి ముందు ప్రత్యక్షమయ్యాడు. ఓహో! భయపడకండి! అంటూ ఆ కొండను బంతివలె పట్టి ఆడించాడు. కరుణారసపూరితమైన చూపులతో ఆ సురాసురుల ప్రాణాలను కాపాడాడు.

క. వారలు గొలువఁగ హరియును, వారాన్నిధి కరుగు మనఁగ వసుధాధరమున్ వారిజ నయనునిఁ గొంచు న, వారిత గతిఁ జనియె విహగవల్లభుఁ డఱుతన్.

189

తా ॥ అంతట వారి చేత సేవలందుకొన్న విష్ణువు, సముద్రం దగ్గరకు కొనిపొమ్మని గరుత్మంతునికి ఆజ్ఞ ఇవ్వగా, ఆ శ్రీహరిని తీసుకొని పర్వతాన్ని కూడా మూపున దాల్చి గరుత్మంతుడు అడ్డులేకుండా పైకి ఎగిరాడు.

క. చని జలరాశి తటంబున, వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు, పని వినియెను భక్తి నాత్మభవనంబునకున్.

190

తా ॥ వెళ్ళి సముద్రం ఒడ్డున శ్రీహరిని, గిరిని దించి వందనము లొనర్చి స్తుతించి గరుత్మంతుడు భక్తి భావంతో తన స్వస్థితిలో నెలకొని ఉన్నాడు.

వ. అప్పుడు.

191

సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లన చేతుల మేను నివిరి
'నీవ కా కెవ్వరు నేర్తు? రీ పని కియ్య కొ' మ్మని యతని కైకోలు వడసి
కవ్వంపుఁ గొండ నిష్కంటకంబుగఁ జేసి ఘర్షించి యతని భోగంబు జుట్టి

ఆ. కడఁగి యమృత జలధిఁ గలశంబు గావించి, త్రచ్చు నవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్రకేశభారులై యా రెండు, గములవారు తరువఁ గదిసి రచట.

192

తా ॥ అప్పుడు దేవతలు, రాక్షసులు సర్పరాజైన వాసుకిని పిలిపించి అతనితో ప్రియంగా మాట్లాడి అమృతంలో భాగం ఇవ్వడానికి అంగీకరించారు. మెల్లగా చేతులతో అతని శరీరాన్ని

నిమిరి, 'నీవు కాకుండా ఎవరు చేస్తారీపని మిత్రమా! అంగీకరించు' అని కవ్వపు త్రాడుగా ఆ వాసుకిని చేసి క్షీర సాగరాన్ని కలశముగా చేసారు. బారులు తీర్చి, వస్త్రాలను గట్టిగా కట్టుకుని, కేశాలను బంధించి ముడి వేసుకుని మథనానికి సిద్ధపడ్డారు.

వ. తదనంతరంబ.

193

క. హరియును దేవానీకము, నురగేంద్రుని తలలు పట్ట నుద్యోగింపన్ హరిమాయా పరవశులై, సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్.

194

తా ॥ పిమ్మట శ్రీహరి, దేవతలు కలిసి ఉరగేంద్రుడైన వాసుకి తలలు పట్టుకోవడానికి సిద్ధపడినారు. హరిమాయకు పరవశులైన రాక్షసులు అతిశయంతో వాదులాటకు దిగారు.

మత్త. స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁబట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగ? బూరుషత్వము గల్గి మే
మచ్ఛమైన తపోబలాధ్యయనాన్వయంబుల వారమై
యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి?నిండు మాకు ఫణాగ్రముల్.

195

వ. అని పలుకు దనుజులం జూచి.

196

తా ॥ 'స్వచ్ఛమైన పడగలను చక్కగా పట్టుకొని మీరు మథిస్తూ ఉంటే ఈ తోకను మేమెందుకు పట్టుకోవాలి? మాకు ఇది అవమానకరం. పౌరుషం కలిగి తపస్సు, బలము, అధ్యయనము చేసి ఉన్న వాళ్ళమైన మేము ఈ నీచత్వానికి అంగీకరిస్తామా? మేము

శిరోభాగమునే పట్టుకుంటాము. తోకను మీరు పట్టుకోండ' ని వాదించారు. అలా మాట్లాడుతున్న రాక్షసులను చూసి,

క. విస్మయముఁ బొంది దానవ, ఘస్మరుఁ డహిఫణము విడువ గైకొని యసురుల్ విస్మితముఖులై యార్చి ర, విస్మితముగఁ గొనిరి సురలు వీఁకం దోఁకన్.

197

తా ॥ ఆశ్చర్యాన్ని పొందినట్లుగా నటిస్తూ రాక్షసకుల నాశకుడైన శ్రీహరి వాసుకి యొక్క పడగలను విడిచిపెట్టాడు. రాక్షసులు సంతోషంతో పడగలు పట్టుకొన్నారు. దేవతలు వినయంగా తోకను పట్టుకున్నారు.

వ. ఇట్లు సమాకర్షణ స్థానభాగ నిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును, బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్త చిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున.

198

తా ॥ ఈ విధంగా స్థానభాగాలను నిర్ణయం చేసుకొని, దేవతలు తోకను, రాక్షసులు పడగలను పట్టుకొని సముద్ర మధ్యంలో మందర పర్వతాన్ని పెట్టి సంతోషంతో చిలకనారంభించారు.

క. విడువిడుఁడని ఫణి పలుకఁగఁ, గడుభరమున మొదలఁ గుదురు గలుగమిఁ వెడఁగై బుడ బుడ రవమున నఖిలము, వడ వడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్.

199

తా ॥ ఆ సమయంలో "విడువండి! విడువండి!" – అని వాసుకి అంటూండగానే, కొండ అడుగు భాగంలో కుదురు లేనందువలన, ఆ పర్వతం బరువు వలన బుడ బుడమంటూ

సముద్రంలో మునిగిపోయింది. దానితో అందరూ వణికిపోయారు.

ఉ. గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింపలేక దో
స్సార విహీనులై యుభయ సైనికులుం గడు సిగ్గుతో నకూ
పార తటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ! యె
వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్?

200

తా ॥ ఓ రాజా! అలా మునిగిన మందర పర్వతం ఎత్తి నిలపెట్టడానికి బలం చాలనందున దేవదానవులు ఉభయులూ కడు సిగ్గుతో, పౌరుషం చెడి సముద్రం ఒడ్డున నిల్చుని బాధపడసాగారు. బలవంతమైన విధిని అతిక్రమించడం ఎవరికీ శక్యం కాదుగదా!

క. వననిధి జలముల లోపల, మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్ మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని, వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్.

201

తా ॥ అలా సముద్ర జలాల్లో మునుగుతున్న గిరిని, దుఃఖంతోను, చింతతోనూ చూస్తున్న దేవతలను పరికించిన శ్రీహరి, వారందరూ చూస్తూండగానే సముద్రంలోనికి దిగాడు.

తమ కష్టాలను బాపుకునేందుకు విష్ణువుని శరణు వేడిన దేవతలు స్వామి దర్శనంతో ప్రారబ్దమనే భయంకర సాగరాన్ని మథించేందుకు సిద్ధపడ్డారు (170). ప్రారబ్ధాన్ని రూపుమాపితే గానీ కర్మలు పూర్తిగా సంచితమై అమృతత్త్వస్థితి లభించదు. ఈ మృత్యురహిత స్థితిని పొందేందుకు శుద్ధ మనస్సు అత్యావశ్యకమని విష్ణువు దేవతలకు ఉపదేశిస్తాడు (174). అంతేకాదు, ఈ మథనంలో ప్రాప్తించే వస్తువుల పట్ల ఇష్టానిష్టాలు ఉండరాదని చెబుతాడు (175). శరణు కోరినవారికి అన్నీ తానే అయి కార్యసాఫల్యంలో తోడ్పడతాననే విషయాన్ని క్షీరసాగర మథనమనే ఘట్టంలో నిరూపిస్తాడు మహావిష్ణువు. దీనినే ఆ మథనంలో చిలికేవాడు

తానే, చిలికే కవ్వము తానే, చిలికే పాత్రకు కుదురు తానే, కవ్వానికి చుట్టిన తాడు తానే..... ఇలా అన్నీ తానే 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః' అన్న వాక్య నిరూపణంతో చూపాడు (205). ఈ మథనంలో ఎన్నో అమూల్య వస్తువులు ప్రాప్తించాయి. వాటిని దేవతలు, దానవులు ఇరువురూ పంచుకున్నారు. సంపదలు అందరికీ లభిస్తాయి కానీ అమృతం పొంది మృత్యురహిత స్థితికి చేరగలిగిన వారు దేవతలు మాత్రమే. దైవీగుణాలు ఉన్నవారికే అమృతం లభిస్తుంది.

సాధనాపరంగా ఈ ఘట్టాన్ని అన్వయిస్తే సదా ఆలోచనలనే కల్లోలిత తరంగాలను కలిగి ఉన్న హృదయమే క్షీరసాగరం. జీవుడు అంతరంగ శోధన కొనసాగిస్తూ అమృతత్త్వాన్ని బడయకలగడమే దీని అంతరార్థం. జీవుని బుద్ధి మందర పర్వతం, అహంకారం వాసుకి, సద్గుణాలు దేవతలు, రాగద్వేషాదులు రాక్షసులు. ఈ మథనానికి ముందు చెప్పుకున్నట్లుగా శుద్ధ మనస్సు, సాధనలో ప్రాప్తించే సిద్ధుల ఎడ అనాసక్తత అత్యావశ్యకాలు; వీటితో స్థిరంగా ముందుకు సాగితే ఆ విష్ణుకృప చేత అమృతత్త్వ స్థితి ప్రాప్తించగలదనే సూచన ఈ ఘట్టం ద్వారా తెలియబడుతుంది.

## కూర్మావతార కథ

సీ. సవరనై లక్షయోజనముల వెడలుపై కడుఁ గఠోరమునైన కర్పరమును

నదనైన బ్రహ్మాండమైన నాహారించు ఘన తరంబగు ముఖగహ్వరంబు

సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు

విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁ బడ్డ నాఁగినఁ గదలని యట్టి కాళ్ళు

తే. వెలికి లోనికిఁ జనుదెంచు విపుల తుండ, మంబుజంబులఁ బోలెడు నక్షియుగము

సుందరంబుగ విష్ణుండు సురలతోడి, కూర్మి చెలువొంద నొక మహా కూర్మమయ్యె.

202

తా ॥ శ్రీమహావిష్ణువు దేవతల ఎడల తన వాత్సల్యాన్ని వెల్లడిస్తూ ఒక మహా కూర్మంగా మారిపోయాడు. ఆ తాబేలుకి లక్షయోజనముల వెడల్పు కలిగిన కఠినమైన వీపుడిప్ప ఉంది. ఆకలివేస్తే బ్రహ్మాండాన్ని సైతం ఆహారంగా చేసుకోగల పెద్ద నోరు ఉంది. కదిలేవి, కదలనివి అయిన జంతురాసులను(చరాచరాలు) అన్నింటినీ మ్రింగి జీర్ణం చేసుకొనే పెద్ద కడుపు ఉంది. ఈ విశ్వం మీద ఇంకొక విశ్వం పైన పడ్డా తట్టుకునే కాళ్ళు ఉన్నాయి. లోపలికి బయటికి కదలాడే పెద్ద తుండం(మూతి) ఉంది. పద్మములను పోలిన కన్నుల జంట ఉన్నది.

మ. కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తి చందంబునన్

నమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో

నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁగదే! బాపురే!

కమలాక్షా! శరణంబు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్.

203

తా ॥ ఆ విధంగా తాబేలుగా మారిన శ్రీహరి ముత్తెపు చిప్ప మాదిరిగా జలరాశిలోనికి ప్రవేశించాడు. దానిని చూస్తున్న ఇంద్రాదులు శరీరాలు కంపిస్తుండగా “మేలు! మేలు!

కమలాక్షా! నీకు శరణు! "—అంటూ భూమి, దిక్కులు, ఆకాశము మ్రోగునట్లుగా జయ జయ ధ్వానాలు చేశారు. ఆ శ్రీహరి తాబేలు రూపంలో నీటిలో ప్రవేశించి వాసుకితో పాటుగా మందర పర్వతాన్ని అవలీలగా ఎత్తాడు.

వ. ఇవ్విధంబున.

204

క. తరిగాంద్రలోన నొకఁడఁట, తరి కడవకుఁ గుదురు నాఁక త్రాడఁట చేరుల్; దరి గవ్వంబును దా నఁట, హరి హరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్.

205

తా ॥ ఆ శ్రీహరి లీలలు ఏమని చెప్పగలం! ఆ శ్రీహరి సముద్రాన్ని మథించే వారిలో ఒకనిగా ఉన్నాడు. సముద్రమనే కలశానికి కుదురుగా తానే నిలిచి ఉన్నాడు. చిలికే కవ్వమూ తానే, చుట్టిన తాడు తానే అయినవాడైన ఆ శ్రీహరి లీలలు ఆయనకు మాత్రమే తెలుసును కానీ ఇతరులకు తెలియునా! సర్వం విష్ణుమయం జగత్ అనే ఉపనిషద్వాక్య నిరూపణ ఇక్కడ చూపబడింది.

ఆ. జలధిఁ గడవ సేయ శైలంబుఁ గవ్వంబు, సేయభోగిఁ ద్రాడుసేయఁ దరువ సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క, నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె?

206

తా ॥ సాక్షాత్ సముద్రాన్నే కడవగా, ఒక మహాపర్వతాన్ని కవ్వంగా, పెనుసర్పాన్ని తాడుగా చేసి మథనం చేసేందుకు గానీ, సిరుల తల్లి అయిన మహాలక్ష్మిని, అమరత్వాన్ని ప్రసాదించే అమృతాన్ని పొందడానికి గానీ ఆ శ్రీవల్లభునికే సాధ్యము కానీ మరొకరికి ఇది సాధ్యపడగలదా!

ఆ. గొల్లవారి బ్రదుకు గొఱఁతన వచ్చునే, గొల్లరీతిఁ బాలకుప్పఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు, చేటు లేని మందు సిరియుఁ గనిరి.

207

తా ॥ గోపాలకుల జీవనం ఏమైనా సామాన్యమా ఏమిటి? దేవతలందరూ ఆ గొల్లవారి వలె ఇప్పుడు సముద్రాన్ని చిలుకుతున్నారు కదా! అందుకే దేవతలంతా గొల్లలు కాగా, వారికి వేల్పుగా ఆ శ్రీహరి కూడా గొల్లవాడైనాడు. అమరత్వాన్ని ప్రసాదించే అమృతమూ, శ్రీ మహాలక్ష్మి అందుకనే సంప్రాప్తించాయి.

వ. ఇట్లు సురాసుర యూథంబును హరిసనాథంబులయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు పిరిచుట్టు సుట్టికొని, కరంబులు కరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొరయుచు, లెండు లెండు దరువఁ దొడంగుండు రండని యమందగతిం బెరుఁగుం ద్రచ్చు మందగొల్లల చందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందర మహీధర విలగ్నభోగి భోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ, బెనుబొబ్బలం బ్రహ్మాండ కటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యురలు కొండకవ్వంబుగుత్తి జిఱ జిఱం దిరుగు వేగంబున ఛటచ్ఛటాయ మానంబులయి బుగులు బుగుళ్ళను చప్పు ళ్లుప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలువడు మిసిమి గల మీఁది మీఁగడపాల తేటనిగ్గుఁదుంపరల పరంపరల వలన నిజకరక్రమ క్రమాకర్షణ పరిభ్రాంత ఫణి ఫణాగర్భ సముద్భూత నిర్భర విష కీలి కీలజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక యకూపార వేలాతట కుటజ కుసుమగుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛ మకరంద సుగంధి గంధవహంబులం గ్రొంజెమట నీటి పెను వఱదగము లొడళ్ల నిగుర నొండొరులం బరిహసించుచుఁ బేరువాడి విలసించుచు, మేలుమే లని యుగ్గడించుచు, గాదు కాదని భంగించుచు, నిచ్చ మెచ్చని మచ్చరంబు వలన వనధి వలమాన వైశాఖ వసుంధరాధర పరివర్తన సముజ్జనిత ఘుమ ఘుమారావంబును, మథనగుణాయమాన

మహోహీంద్రప్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి ఘోర ఘూత్కార ఘోషంబును, గులకుధర పరిక్షేపణ క్షోభిత సముల్లంఘన సమాకులితంబులై వెఱచఱచి గుబురు గుబురులై యొరలు కమఠ కర్కట కాకోదర మకర తిమితిమింగిల మరాళచక్రవాక బలాహకభేక సారసానీకంబుల మొఱలునుం గూడికొని ముప్పిరిగొని, దనుజ దివిజ భటాట్టహాస తర్జన గర్జన ధ్వనులు నలుపురియై మొత్తినట్లైన దశదిగంత భిత్తులును, బేఁటెత్తి పెల్లగిలం ద్రుళ్ళుచుఁ గికురు పొడుచుచు నొకఁ డొకనికంటె వడియునుం, గడుపునుం గలుగఁ ద్రచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు నూతన పదార్థంబులకు నెదుళ్లు సూచుచు నెంతదడవు ద్రత్తమని హరి నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురువు డింపక త్రచ్చు సమయంబున.

208

తా ॥ ఈ విధంగా సురలు అసురులు హరితో కూడి కవచాలు ధరించారు. బట్టలు మెలిచుట్టి కట్టారు. చేతులు చేతులు చరచుకున్నారు. భుజములు భుజములు ఒరుసుకోగా, లేవండి లేవండి ఈ సముద్రాన్ని చిలికేందుకు రండి! అంటూ హెచ్చరించుకున్నారు. పెరుగును చిలికే గొల్లల మాదిరిగా సముద్ర మధ్యంలో కవ్వంలా ఉన్న మందర పర్వతానికి త్రాడైన సర్పం యొక్క శిరోభాగాన్ని రాక్షసులూ, తోక భాగాన్ని దేవతలు పట్టుకొని మథించసాగారు. వారి పెద్ద పెద్ద కేకలతో బ్రహ్మాండం అంతా నిండి పోయింది. గుబగుబమని కొండ గిరగిర తిరిగే వేగానికి, ఛటఛట మంటూ చప్పుళ్ళు ఆకాశానికి వ్యాపించినాయి. లెక్కకు మిక్కిలి అయిన పాల చుక్కలు చక్కదనంతో ఆ మీగడపాల తుంపురుల పరంపరలు పైకెగిరినాయి. తమ తమ చేతులతో గట్టిగా పట్టుకొని చిలకడం వలన తిరుగుతున్న వాసుకి శరీరంలో నుండి విషాగ్ని కీలలు విపరీతంగా పుట్టాయి. దానివలన సురాసురులకు దప్పిక ఎక్కువైంది అయినా వారు అలసట చెందలేదు.

ఆ సముద్రతీరం వెంబడి కొండమల్లె పూగుత్తులలోని విరివిగాకల మకరంద సుగంధాలతో నిండిన మందమారుతాలు వీచాయి. ఆ మలయానిలానికి వారి శరీరాల మీది

చెమట ధారలు ఇంకిపోయాయి. వారు ఒకరినొకరు వేళాకోళం చేసుకొంటూ మేలు మేలు అనుకొంటూ, అలా కాదు ఇలాగని అడ్డుకుంటూ, ఒకరితో ఒకరు పోటీపడుతూ సముద్రాన్ని మథించసాగారు. ఆ కవ్వపు కొండ తిరిగేటప్పుడు 'ఘుమఘుమ' అనే శబ్దం ఉద్భవించింది. ఆ కవ్వానికి త్రాడుగా కట్టిన వాసుకి నోట్లోంచి భయంకరమైన పూత్కార శబ్దాలు చెలరేగినాయి. పర్వతం తిరగడం వల్ల ఆ మహాసాగరం లోపల గుంపులు గుంపులుగా ఉన్న తాబేళ్ళు, ఎండ్రకాయలు, పాములు, మొసళ్ళు, పెద్ద చేపలు, తిమింగిలాలు, హంసలు, చక్రవాకములు, కొక్కెరలు, కప్పలు, బెగురు పక్షులు భయంతో ఆర్తనాదాలు చేశాయి. రాక్షసులూ, దేవతలూ పెద్దగా అట్టహాసాలు హెచ్చరికలు చేశారు. వారి తర్జన గర్జన శబ్దాలకు దిక్కులన్నీ చలించిపోతున్నాయి. ఒకరిని మించి మరొకరు చిలుకుతూ, మాట్లాడుకుంటూ, అమృతం కోసం ఉబలాటపడ్డారు. ఆ కొత్త పదార్థము పుట్టుక కోసం ఎదురు చూస్తూ, ఇంకా ఎంత తడవు చిలకాలి అని శ్రీహరిని ఆత్రంగా అడుగుతూ పట్టువదలకుండా మథింపసాగారు.

క. అప్పాల వెల్లిలోపల, నప్పటి కప్పటికి మందరాగము దిరుగం
జప్పుడు నిండె నజాండము, సెప్పెడి దే మజుని చెవులు సిందఱగొనియెన్.

209

తా ॥ ఆ పాలజలధి లోపల మందర పర్వతం గిరగిర తిరుగుతూన్న శబ్దానికి బ్రహ్మాండమంతా దద్దరిల్లగా బ్రహ్మదేవుని చెవులే గింగురు మనసాగాయి. ఇంక చెప్పేందుకు ఏముంది?

వ. అంత న ప్పయోరాశి మధ్యంబున.

210

క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచుఁ, గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి గడలిం గడ లెడల సురలు నసురులుఁ, దొడి తొడి ఫణి ఫణము మొదలుఁ దుదియును దిగువన్.

211

తా ॥ అలా ఆ సముద్ర మధ్యంలో మందర పర్వతం ప్రారంభంలో ఎడమనుండి కుడికి తిరుగుతూ, ఆ వెనుక కుడి నుండి ఎడమకు తిరుగుతూంటే, సురలు, అసురులు ఉండేచోట్లు తారుమారయ్యేవి. వారు మాత్రం చాలా వేగంగా కదులుతూ వాసుకి యొక్క తలతోకను వదలకుండ పట్టుకుని చిలుకుతున్నారు.

క. వడిగొని కులగిరిఁ దరువఁగ, జడనిధి ఖగ మకర కమఠ ఝష ఫణిగణముల్ సుడివడుఁ
దడఁబడుఁ గెలఁకులఁ, బడు భయపడి నెగసి బయలఁబడు నురలిపడున్.

212

తా ॥ వడిగా పర్వతాన్ని అలా తరుస్తూ ఉంటే, ఆ జలనిధి నుండి పక్షులు, మొసళ్ళు, తాబేళ్ళు, చేపలు, మహా సర్పాలు చీకాకు పడుతూ, తడబడుతూ, పక్కలకు పడుతూ, భయపడుతూ, ఎగసి గట్టున పడుతూ దొర్లుతున్నాయి.

క. అమరాసుర కరవిపరి, భ్రమణ ధరాధరవరేంద్ర భ్రమణంబును దాఁ
గమఠేంద్రు వీఁపు తీఁటను, శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా!

213

తా ॥ ఓ రాజా! సురాసురులు చేతులతో త్రిప్పుతున్న అంతటి మహాపర్వతం యొక్క రాపిడి కూడా ఆ ఆదికూర్మం యొక్క వీపు తీటను పోగొట్టలేక పోయింది. ఎంతటి మహా కూర్మమో కదా!

వ. తదనంతరంబ.

214

క. ఆలోల జలధి లోపల, నాలో నహి విడిచి సురలు నసురులుఁ బఱవం గీలా

కోలాహలమై, హాలాహల విషము పుట్టె నవనీనాథా!



తా ॥ ఆ తరువాత కాసేపటికి, అల్లకల్లోలంగా ఉన్న ఆ పాల సముద్రం నుండి, దేవదానవులు భయపడి పరుగెత్తే విధంగా అగ్నిజ్వాలలతో కూడిన హాలహాలమనే విషం పుటింది.

వ. అదియునుం బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానల శతంబు చందంబున నమందంబై విలయ దహన సహస్రంబు కైవడి వడియై, కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితంబై, తుదిరేయి వెలింగిన మొగిలు గమలు వలనుం బడు బలు పిడుగుల వడువున బెడిదంబై, పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై, భుగ భుగాయమానంబులైన పొగలును, జిటజిటాయమానంబులైన విస్ఫులింగంబులును, ధగధగాయ మానంబులైన నెఱమంటలును గలిగి మహార్ణవ మధ్యంబున మందర నగం బమంథరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై నింగికిం బొంగి, దిశలకుం గేలుసాఁచి బయళ్లు ప్రబ్బికొని, తరిగవ్వంపుఁ గొండ నండ గొనక, నిగిడి కడల నలుగడలకుం బఱచి, దరుల కుఱికి, సురాసుర సముదయంబులన్ దరికొని, గిరివర గుహాగహ్వరంబుల సుడివడక, కులశిఖరి శిఖరంబుల నెరగలివడి, గహనంబుల దహించి, కుంజ మంజీర పుంజంబుల భస్మంబు సేసి, జనపదంబు లేర్చి, నదీ నదంబు లెరియించి, దిక్కుంభి కుంభములు నిక్కలు వడ నిక్కి, తరణితారామండలంబులపై మిట్టించి, మహర్లోకంబు దరికొని, యుపరిలోకంబునకు మాఱు గొనలిడి. సుడివడి, ముసరుకొని, బ్రహ్మండ గోళంబు చిటిలిపడన్ దాఁటి పాతాళాది లోకంబులను వ్రేళ్లువాఱి, సర్వలోకాధికంబై శక్యంబు గాక యెక్కడఁ జూచినం దానయై, కురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు భుజంగంబు విధంబున నొడియుచు, సింగంబుభంగి లంఘించుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహల

దహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున, మెలకు సెగల మిడుక జాలక నీఱైన దేవతలును, నేలంగూలిన రక్కసులును, డుల్లిన తారకలును గీటడంగిన కిన్నర మిథునంబులును, గమరిన గంధర్వ విమానంబులును, జీకాకుపడిన సిద్ధ చయంబులును, జిక్కుపడిన గ్రహంబులును, జిందఱవందఱ లయిన వర్ణాశ్రమంబులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలిన పురంబులును బొనుఁగు పడిన పురుషులును బొక్కిపడిన పుణ్యాంగనా జనంబులును, బగిలిపడిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణి సంఘంబులును, వేఁగిన లోకంబులును, వివశలైన దిశలును, నొద్ద గెడవులైన భూజ చయంబులును, నఱవఱలైన భూములునునై, యకాల విలయకాలంబై తోఁచుచున్న సమయంబున.

216

తా ॥ (అలా వెలువడిన హాలహల వర్ణనం ఇక్కడ తెలియజేస్తున్నారు.) అది ప్రళయకాలంలోని ఫాలలోచనుని కంటి మంటకు వందరెట్లు అధికంగా ఉంది. ప్రళయ కాలపు అగ్నికి వెయ్యిరెట్లు తీవ్రంగా ఉంది. ప్రళయ కాలపునాడు వెలిగే లక్ష సూర్యులవలె చూసేందుకు భయంకరంగా ఉంది. ఈ సృష్టి అంతమయ్యే చివరి రోజు(ప్రళయకాల రాత్రి) మెరిసే మేఘముల నుండి కురిసే పిడుగుల వలె చాలా భీకరంగా ఉంది. పంచ భూతములు తేజోరూపంలో ఆవిర్భవించినట్లు దుస్సహంగా ఉంది. భుగభుగాయమానంగా పొగలు, చిట చిటాయ మానంగా అగ్నికణాలు, ధగ ధగాయ మానంగా మంటలు కలిగి ఆ మహా విషం ఆకాశానికి పొంగింది. అన్ని దిశలకు చేతులు సాచింది. కులపర్వతాన్ని దాటి కడలి నలువైపులా పాకింది. సురాసుర సమూహాన్ని దాటిపోయింది. కొండ గుహలలో చిక్కుకోకుండా కులపర్వత శిఖరాలను దహించి వేసింది. అరణ్యాలలోని వృక్షములను భస్మం చేసింది. పూగుత్తులను కాల్చేసింది. గ్రామాలను దహించి, నదీనదాలను నశింపచేసింది. దిగ్గజాల కుంభస్థలాల గర్వం పోయేటట్లు వ్యాపించింది. సూర్య నక్షత్ర మండలాలపై ఎగిరి పడింది. మహర్లోకాన్ని భస్మం చేసింది. పై లోకాల్లోకి ఎగబాకింది. బ్రహ్మాండ గోళం చిట్లిపోయేలా విస్తరించింది. పాతాళలోకం

దాకా వ్యాప్తి చెందింది.

ఆ హాలాహలం ఎవరికీ ఆప శక్యం కాని విధంగా, ఎక్కడ చూసినా తానే అయి, లేడివలె గంతులేస్తూ, పామువలె ఎగబాకుతూ, సింహంవలె లంఘిస్తూ, పక్షివలె ఎగురుతూ, ఏనుగువలె నిలబడి పోయింది. ఈ విధంగా లోకాలలో గగ్గోలును పుట్టించింది. ఆ మంటలలో కొందరు దేవతలు చిక్కుకొని భస్మమయ్యారు, రక్కసులు నేలకూలారు. చుక్కలు రాలాయి, కిన్నర మిథునాలు మరణించారు. గంధర్వ విమానాలు కాలిపోయాయి. సిద్ధులు చెదిరి పోయాయి. గ్రహాలు చిక్కుపడ్డాయి. నదులన్ని ఎండిపోయాయి. సముద్రాలు ఇంకిపోయాయి. అడవులు మాడిపోయాయి. పట్టణాలు పరితపించాయి. పురుషులు నిస్తేజితులయ్యారు, పుణ్యాంగనలు దుఃఖించారు. పర్వతాలు పగిలిపోయాయి. ప్రాణిసమూహం అంతా భస్మం అయిపోతోంది. లోకాలన్ని తపించసాగాయి. దిక్కులు కలత చెందాయి. చెట్లన్నీ ఒరిగి పోగా భూములన్నీ ధ్వంసమయ్యాయి. అప్పుడు అకాలంలో ప్రపంచానికి విలయం వచ్చినట్లుగా ఉంది.

క. ఒడ్డారించి విషంబున, కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్ గొడ్డేటి ప్రమంది రా లన, బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా!

217

తా ॥ ఓ రాజా! ఆ సమయంలో ఆ విషాగ్నికి ఎదురునిలచి అడ్డగించే వారు లేనందున ఆలుబిడ్డలనే మమకారాన్ని వదులుతూ జనులందరూ తమ ప్రాణాలను కోల్పోసాగారు.

వ. అప్పుడు.

218

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యా<br>సున దౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి 'కుయ్యో! మొఱో!<br>విను మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు' మం చంబుజా

నన ముఖ్యుల్ గని రార్తరక్షణ కళాసంరంభునిన్ శంభునిన్.

219

తా ॥ ఆ విపత్కర సమయాన, బ్రహ్మాది దేవతలు కైలాసానికి వెళ్ళారు. ద్వారం వద్ద ద్వారపాలకులు అడ్డగించబోగా, అత్యవసరమని తెలుపుతూ లోనికి చొచ్చుకు పోయారు. ఆర్తుల మొరలను ఆలకించడంలో ముందుండే ఆ బోళానాధుడైన శంభుని చూసి 'శరణు శరణు' అనుచూ రక్షించమని ప్రార్థింపసాగారు.

క. వారలు దీనత వచ్చుటఁ గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురు దానుం బేరోలగమున నుండి
ద, యారతుఁడై చంద్రచూడుఁ డవసర మిచ్చెన్.

220

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగ దండప్రణామంబులు గావించి ప్రజాపతి ముఖ్యు లిట్లని స్తుతియించిరి.

221

తా ॥ అలా దేవతలంతా దీనంగా రావడాన్ని చంద్రచూడుడు వీక్షించాడు. ఆ సమయాన ఆ స్వామి సతీసమేతుడై ఉన్నాడు. దేవతల ఆర్తనాదాలను సానుభూతితో విన్నాడు. బ్రహ్మాదులు అప్పుడు సాగిలపడి దండ ప్రమాణాలు ఆచరించి ఇలా స్తుతించసాగారు:

సీ. భూతాత్మ! భూతేశ! భూత భావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!
యీ లోకముల కెల్ల నీశ్వరుండవు నీవు; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్త శరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;
సకల సృష్టి స్థితి సంహారకర్తవై బ్రహ్మవిష్ణు శివాఖ్య బరఁగు దీవు;

ఆ. పరమ గుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త, మంబు నీవ; శక్తి మయుఁడ వీవ శబ్ద
యోని వీవ; జగదంతరాత్మవు నీవ, ప్రాణ మరయ నిఖీలమునకు.

222

తా ॥ "పంచభూతాలకు, సకలజీవులకు ఆత్మయై, భావనామాత్రం చేత రూపాన్ని ధరించి గలిగిన దేవదేవా! మహాదేవా! దేవతలచే వందనాలను స్వీకరించువాడా! సమస్తలోకాలకు నీవు ఈశుడవు, బంధమోక్షాలకు ప్రభుడవు నీవు! ఆర్తులను ఆదుకునే గురుడవు నీవే! సృష్టి స్థితి లయాలకు కర్తవు నీవే! బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే నామాలతో ప్రకాశించేవాడవు నీవే! పరమరహస్యమైన ఆ పరబ్రహ్మము నీవే! ఈ విశ్వాంతర్యామివి నీవే!

క. నీయంద సంభవించును, నీయంద వసించి యుండు నిఖిల జగములున్ నీయంద లయముఁ బొందును, నీయుదరము సర్వభూత నిలయము రుద్రా!

223

తా ॥ ఓ రుద్రా! నీ యందే అన్ని లోకాలు పుడతాయి, నీ యందే ఉంటాయి, నీయందే లయాన్ని చెందుతాయి. సర్వభూతములకు నీ ఉదరమే ఆలవాలం.

సీ. అగ్నిముఖంబు; పరాపరాత్మక మాత్మ; కాలంబు గతి; రత్నగర్భ పదము;
శ్వసనంబు నీ యూర్పు; రసన జలేశుండు; దిశలు కర్ణంబులు; దివము నాభి;
సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు; జఠరంబు జలధులు; చదలు శిరము;
సర్వౌషధులు రోమచయములు; శల్యంబు లద్రులు; మానస మమృతకరుఁడు;

తే. ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ;, మాస్య పంచక ముపనిష దాహ్వయంబు; నయిన నీ రూపు పరతత్త్వమై శివాఖ్య, మై స్వయం జ్యోతియై యొప్పు నాద్య మగుచు.

224

తా ॥ అగ్ని నీ ముఖం. జీవాత్మ పరమాత్మల కలయిక నీ ఆత్మ. కాలం నీ నడక. భూమి నీ

పాదం. వాయువు నీ శ్వాస. నీ నాలుక వరుణుడు. దిక్కులే నీ చెవులు. స్వర్గము నీ నాభి. సూర్యుడు కన్నులు. నీరు నీ శుక్లం. సముద్రాలు నీ గర్భం. ఆకాశం నీ శిరస్సు. సమస్తమైన ఓషధీ సమూహములు నీ రోమములు. పర్వతములు నీ ఎముకలు. అమృత నిలయుడైన చంద్రుడు నీ మనస్సు. వేదములు నీ ధాతువులు. ధర్మ శాస్త్రాలు నీ హృదయం. ఉపనిషత్తులు నీ పంచముఖాలు. ఇట్టి నీ రూపం పరతత్త్వమై, మంగళకరమై, స్వయం జ్యోతియై భాసిస్తూ ఉంటుంది.

క. కొందఱు గలఁ డందురు నినుఁ;, గొందఱు లేఁ దందు రతఁడు గుణి గాఁ డనుచుం
గొందఱు; గలఁ డని లేఁ డని, కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా!

225

తా ॥ ఓ మహేశ్వరా! కొందరు నీవు ఉన్నావని అంటారు. కొందరు నీవు లేవని అంటారు. మరికొందరు నీవు గుణాతీతుడవని అంటారు. నీవు ఉన్నావో, లేవో అనే సందేహంలో ఇంకొందరుంటారు.

సీ. తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్యగుణ స్వభావుఁడవు, కాలక్రతువులును నీవ;
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును, నీవు ముఖ్యుండవు నిఖిలమునకు
ఛందోమయుండవు సత్త్వరజస్తమ, శ్చక్షుండవై యుందు సర్వరూప
కామ పురాధ్వర కాలగతాది భూతద్రోహభయము చోద్యంబు గాదు;

తే. లీలలోచనవహ్ని స్ఫులింగ శిఖల, నంతకాదులఁ గాల్చిన యట్టి నీకు రాజఖండావతంస!
పురాణ పురుష!, దీన రక్షక! కరుణాత్మ! దేవ దేవ!

226

తా ॥ ఓ చంద్రకళా కిరీటా! పురాణ పురుషా! దీన రక్షకా! కరుణాత్మా! దేవ దేవా! ప్రాణము, ఇంద్రియములు, ద్రవ్యములు, గుణములు నీకు స్వభావ సిద్ధాలు. కాలము, క్రతువులు

నీవే. సత్యము, ధర్మము, అక్షరము (ఓంకారము), మోక్షమును నీవే. నిఖీలమునకు నీవు ముఖ్యుడవు. వేద స్వరూపుడవు నీవే. సత్యము రజస్సు తమస్సు నీ నేత్రాలు. అన్ని రూపాలు నీవే. నీ లీలగా త్రినేత్రంతో యమాదులను భస్మం చేయగల నీకు మన్మథుడు, త్రిపురాసురులు, హాలహలం వల్ల భయం ఎంత మాత్రమూ లేదు.

ఆ. మూఁడు మూర్తులకు మూఁడు లోకములకు, మూఁడు కాలములకు మూల మగుచు భేద
మగుచుఁ దుది నభేదమై యొప్పారు, బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన!

227

తా ॥ ఓ ఫాలనేత్రా! మూడు మూర్తులకు, మూడు లోకాలకు, మూడు కాలాలకు మూలం నీవే. భేదం కన్పించినా తుదకు, అభేదమై ఒప్పుతూన్న పరబ్రహ్మవు నీవే!

క. సదసత్తత్త్వ చరాచర, సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్ పెదవులు గదలుప
వెఱతురు, వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా!

228

తా ॥ ఓ దేవా! సదసద్రూపమైన ఈ చరాచర ప్రపంచానికి మూలమైన నిన్ను పొగడటానికి బ్రహ్మాదులకు కూడా శక్యం కాక పెదవులు కదపటానికి భయపడతారు. అట్టి నిన్ను పొగడటానికి మేము ఎంతటివారము!

మత్త. బాహుశక్తి సురాసురుల్ చని పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె నేరి కలంఘ్య మై భువనంబు గో
లా హలంబుగఁ జేసి చిచ్చును లాగముం గొని ప్రాణి సం
దోహమున్ బ్రదికింపవే? దయ దొంగలింపఁగ నీశ్వరా!

229

తా ॥ ఈశ్వరా! సురాసురులు తమ బాహుశక్తితో పాలసముద్రమును మథింపగా హాలాహలం పుట్టింది. దానిని ఎవరూ ఎదిరించలేక పోతున్నారు. అది సమస్త భువనాలను అల్లకల్లోలం చేస్తూ ఉన్నది. ఆ కాలకూట విషాన్ని లాఘవంగా గ్రహించి ప్రాణికోట్లను బ్రతికించు. దయను చూపించు.

క. లంపటము నివారింపను, సంపదఁ గృపసేయ జయము సంపాదింపం జంపెడివారి వధింపను, సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా!

230

తా ॥ ఓ చంద్రశేఖరా! ఆపదలను తొలగించడానికి, దయను చూపేందుకు, జయాన్ని కలిగేంచుదుకు, సంపదలు ఇచ్చేందుకు, దుర్మార్గులను వధించేందుకూ నీవే సమర్థుడవు.

క. నీకంటె నొం డెఱుంగము;, నీకంటెం బరులు గావ నేరరు జగముల్; నీకంటె నొడయఁ డెవ్వఁడు, లోకంబుల కెల్ల నిఖిలలోక స్తుత్యా!

231

తా ॥ అన్ని లోకాల చేత పొగడ బడుతూన్న వాడా! నిన్ను తప్ప ఇతరులెవ్వరినీ ఆశ్రయించము. నీ కంటే పరులెవరూ ఈ లోకాలను కాపాడలేరు. నీ కంటే ప్రభువెవ్వడూ లేడు.”

వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతి ముఖ్యులం గని సకలభూత సముండగు నద్దేవుండు దన ప్రియసతి కిట్లనియె.

232

తా ॥ అని ఈ విధంగా తనను స్తుతిస్తున్న బ్రహ్మాదులను చూసి అఖిల భూతాలను సమదృష్టితో చూసే పరమేశ్వరుడు తన ప్రియ సతితో ఇట్లా అన్నాడు:

## శివుడు దేవప్రార్థితుడై హాలాహలమును సేవించుట

సీ. కంటే జగముల దుఃఖము, వింటే జలజనిత విషము వేఁడిమి; ప్రభువై
యుంటకు నార్తుల యాపద, గెంటించుట ఫలము; దానఁ గీర్తి మృగాక్షీ!

233

తా ॥ "ఓ మృగాక్షీ! లోకాల దుఃఖాన్ని చూసావా? జలముల నుండి పుట్టిన ఆ విషాగ్ని ఎంత భయంకరమైన వేడిమిని కలిగి ఉందో గ్రహించావా? ప్రభువు యొక్క కర్తవ్యం ఆర్తుల యొక్క ఆపదను తొలగించటమే కదా! అది కీర్తి ప్రదం కూడా!

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లం; బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిష భంగురము లని మగువా!

234

తా ॥ ఓ మగువా! ప్రాణాల మీద ఆశతో వచ్చిన ప్రాణులను ప్రభువులైన వారు రక్షించాలి. ప్రాణాలు క్షణభంగురములు. కాని కీర్తి మాత్రం శాశ్వతం. ఈ పరమ సత్యం తెలుసు కనుకనే సాధుపురుషులు ఇతర ప్రాణుల రక్షణకై తమ ప్రాణాలను సైతం లెక్క చేయరు.

క. పరహితము సేయు నెవ్వఁడు, పరమ హితుం డగును భూత పంచకమునకుం బరహితమె పరమ ధర్మము, పరహితునకు నెదురులేదు పర్వేందుముఖీ!

235

తా ॥ ఓ చంద్రముఖీ! ఎవడు పరులకు హితం చేస్తాడో వాడు పంచ భూతములకు పరమ హితుడు అవుతాడు. మానవునికి పరహితమే పరమ ధర్మం. అటువంటి వానికి లోకంలో అపజయము లేదు.

క. హరి మది నానందించిన, హరిణాక్షి! జగంబులెల్ల నానందించున్ హరియును జగములు మెచ్చఁగ, గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షి!

236

తా ॥ ఓ పద్మాక్షీ! శ్రీహరి మనస్సులో ఆనందిస్తే సమస్త లోకాలు ఆనందిస్తాయి. కనుక ఆ విష్ణుమా, సకల లోకాలు మెచ్చుకొనేటట్లుగా ఆ భయంకరమైన విషాన్ని అడ్డుకోవటం మంచిది.

క. శిక్షింతు హాలహలమును, భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్ రక్షింతుఁ బ్రాణి కోట్లను, వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ!

237

తా ॥ ఓ కమలాక్షీ! ఇప్పుడే ఈ హాలాహలాన్ని అణచివేస్తాను. మధురమైన చిన్న ఫలంవలె భక్షిస్తాను. నీవు చూస్తుండగా నేడు ఈ ప్రాణికోట్లను రక్షిస్తాను."

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ 'దేవా! దేవర చిత్తంబుకొలంది నవధరింతురు గాక!' యని పలికె నని చెప్పిన యమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె.

238

తా ॥ అని పలికిన ప్రాణ వల్లభునితో ఉమాదేవి దేవా! మీ చిత్తాన్ని అనుసరించి చేయండి – అని పలికింది. ఈ విధంగా చెప్పిన ఆ మునీంద్రునితో, పరీక్షిత్తు ఇలా అన్నాడు.

మ. అమరన్ లోకహితార్థమందు నభవుం డౌఁ గాక యం చాడెఁబో<br>
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజ గర్భాదులం<br>
దముఁ గావన్ హర! లెమ్ము లెమ్మనిరి వో తాఁ జూచి కన్గంట న<br>
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్.

239

వ. అనిన శుకుం డిట్లనియె.

240

తా ॥ లోక హితాన్ని కోరి ఈశ్వరుడు భక్షిస్తాను అని అంటే అనవచ్చు, దేవతలు భయంతో మ్రింగమనవచ్చు. బ్రహ్మాదులు తమ్ము రక్షించడానికి ఓ ఈశ్వరా పూనుకోవలసింది అని కోరితే కోరవచ్చు. కానీ ఆ ఉమాదేవి ప్రత్యక్షంగా ఆ భయంకర హాలాహలాన్ని చూస్తూ తన ప్రాణేశ్వరుణ్ణి ఎలా మింగమన్నది?" అప్పుడు శుక మహర్షి ఇలా అన్నాడు:

క. మ్రింగెడు వాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్ మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!

241

తా ॥ "ఆ హాలహలాన్ని మింగేవాడు తన ప్రాణనాథుడే అని తెలిసినప్పటికీ, మింగేది కాలకూట విషం అని తెలిసినప్పటికీ, దాని వలన సకలలోకాలకూ మేలు జరుగుతుందని తెలిసిన సర్వశుభంకరి అయిన ఆ ఉమాదేవి మింగమని చెప్పింది. ఆహా! ఆమె మనస్సులో తన మాంగళ్యరక్షణపై ఎంత నమ్మిక ఉన్నదో కదా!

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘన గంభీర రవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బన సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్.

242

తా ॥ అంతట దేవతలంతా శివుని చుట్టూ చేరి జయజయ ధ్వానాలు చేయసాగారు. అప్పుడు గంభీరమైన కంఠస్వరంతో ఆ ఈశ్వరుడు, లోకములకు ద్రోహం తలపెట్టిన ఓ కాలకూట విషమా! పారిపోకు. ఇటు రమ్మని పిలుస్తూ, అంతటా వ్యాపించి ఉన్న మహావిషాన్ని

తన చేతిని చాచి పట్టుకుని, ముద్దగా చేసి, నేరేడు పండు వలె కనిపిస్తున్న దానిని విలాసంగా మింగాడు.

వ. అ య్యవిరళ మహాగరళ దహన పాన సమయంబున.

243

మ. కదలం బాఱవ పాఁప పేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు వు
ట్టదు; నేత్రంబులు నెఱ్ఱగావు; నిజజూటా చంఁద్రుడుం గందఁడున్;
వదనాంభోజము వాడ; దా విషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుండై కడి సేయుచో దిగుచుచోఁ భక్షించుచో మ్రింగుచోన్.

244

తా ॥ అంతటి మహా గరళాన్ని పానం చేసేటప్పుడు, ఆ విషాన్ని ఆహ్వానించేటప్పుడు, దాని దగ్గరకు తీసుకున్నప్పుడు, పదిలంగా ముద్దగా చేసేటప్పుడూ, ఆకర్షించేటప్పుడు, భక్షించేటప్పుడు, మ్రింగేటప్పుడు ఆయన శరీరం మీది సర్పహారములు కించిత్ కూడా కదలలేదు. శరీరం మీద చెమట బిందువులు పుట్టలేదు. నేత్రములు ఎర్రబడలేదు. జటాజూటంలో చంద్రుడు కందలేదు. ముఖ పద్మం వాడలేదు. ఆయనలో ఏ మార్పు సంభవించలేదు. ఎలా ఉన్నవాడు అలాగే చిరునవ్వులు చిందిస్తూ ఉన్నాడు. ఇది మనస్సుకి, వాక్కుకి అందని ఆ మహాదేవునికి మాత్రమే సాధ్యం!

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి శివుఁడు చటుల విషాగ్నిం గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్.

245

తా ॥ ఈశ్వరుని ఉదరం సమస్త లోకాలకు నిలయం. అందువల్ల ఆయన ఆ భయంకరమైన విషాగ్నిని లోపలిగి పోనివ్వక తన కంఠబిలంలో పదిలంగా, సూక్ష్మమైన

ఫలరసంలాగ నిలుపుకున్నాడు.

క. మెచ్చిన మచ్చిక కలిగిన, నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె, చిచ్చఱచూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్.

246

తా ॥ తగినంత స్నేహం ఉన్నప్పుడూ, అవతలివారు నచ్చినప్పుడూ, వారిని మెచ్చుకున్నప్పుడూ, ఎవరైనా ప్రేమతో ఏదైనా ఇస్తే ఇవ్వవచ్చును. అంతేకానీ ఇతరుల కోసం భగభగమండే చిచ్చుని అలా ముద్ద చేసి మింగడం ఆ చిచ్చరకంటివానికి (త్రినేత్రునికి) తప్ప ఇంకెవరికి సాధ్యపడుతుంది!

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ, గప్పు గలిగి తొడవు కరణి నొప్పె; సాధురక్షణంబు సజ్జనులకు నెన్న, భూషణంబు గాదె భూవరేంద్ర!

247

తా ॥ ఓ రాజా! శివుడు తన కంఠంలో హాలాహలాన్ని ఉంచుకోవటం వలన ఆ భాగం నల్లగా మారింది. అదికూడా ఒక అలంకారం వలె శోభిల్లింది. సాధు జనులను రక్షించటం అనేది సజ్జనులకు ఒక అలంకారమే కదా!

వ. తదనంతరంబ.

248

క. గరళంబుఁ గంఠబిలమున, హరుఁడు ధరించుటకు మెచ్చి యౌ నౌ ననుచున్ హరియు విరించియు నుమయును, సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్.

249

తా ॥ అలా గరళాన్ని కంఠంలో శివుడు ధరించడాన్ని చూసి భేష్ భేష్ అంటూ శ్రీహరి,

బ్రహ్మ, ఉమాదేవి, సురనాథుడు వీళ్ళంతా స్థిరమైన మనస్సుతో మెచ్చుకున్నారు.

క. హాలాహల భక్షణ కథ, హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్ వ్యాళానల వృశ్చికముల, పాలై చెడ రెట్టి జనులు భయవిరహితులై.

250

వ. మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ.

251

తా ॥ ఈ హాలాహల భక్షణ కథను ఎవరైతే సంతోషంగా వింటారో, ఎవరు వ్రాస్తారో, ఎవరు పఠిస్తారో, వారు పాముల వల్ల, తేళ్ళ వల్ల, అగ్ని వల్ల దుఃఖాన్ని పొందరు. వాటివల్ల భయాన్ని కూడా పొందరు. దేవదానవులు తిరిగి పాలసముద్రాన్ని మథించటం మొదలు పెట్టారు.

## పాలకడలి నుండి ఐరావతాదులు జనించుట

క. తెల్లని మేనును నమృతము, జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములుం బెల్లుగ నర్థుల కోర్కులు, వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్.

252

తా ॥ ఇలా చిలుకుతున్న పాల సముద్రం లోంచి తొలుతగా కామధేనువు పుట్టింది. అది తెల్లని అందమైన శరీరమూ, జిల్లుమంటూ పాలను కార్చే పొదుగు, వాడియైన కొమ్ములను కలిగి ఉన్నది. అది కోరిన కోర్కెలు తీర్చగల శక్తి గలది.

ఆ. అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవ, మునులు పుచ్చికొనిరి మున్నెఱింగి విబుధ సంఘములకు వెరవుతో నధ్వర, హవులు వెట్టుకొఱకు నవనినాథ!

253

తా ॥ కామధేనువు అగ్నిహోత్రాది హోమకార్యాలకు తగినది అని ఎరిగి దేవమునులు హవిస్సులు సమకూర్చడం కొరకు ఆ సురభిని తీసుకొన్నారు.

వ. మఱియు నా జలరాశియందు.

254

క. సచ్చంద్రపాండురంబై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ మొగి జనియించెం బుచ్చి కొనియె బలి దైత్యుం, డిచ్చఁ గొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్.

255

తా ॥ తరువాత ఆ క్షీరాబ్ధిలో చంద్రుని వలె తెల్లగా ఉన్న ఉఉచ్చైశ్రవమనే గుర్రం పుట్టింది. దానిని బలి చక్రవర్తి తీసుకొన్నాడు. ఈశ్వర సంకల్పం చేత ఇంద్రుడు కాదనలేదు.

క. ఒఱ పగు నురమును బిఱుఁదును, నెఱిఁ దోకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచ చెవులుఁ దెలిగన్నులుఁ, దఱచగు కందంబుఁ జూడఁ దగు నా హరికిన్.

256

తా ॥ ఆ అశ్వం చక్కని రొమ్ము, అందమైన తోక, సిరులు ఒలికే ముఖం, నిర్మలమైన కాలి గిట్టలు, పొట్టిగా ఉన్న చెవులు, తెల్లని కన్నులు, అధికమైన మూపు కలిగి ఉండి చూడటానికి చాలా అందంగా ఉంది.

వ. అంత న ప్పాలకుప్పయందు.

257

క. దంత చతుష్టాహతి శై, లాంతంబులు విఱిగి పడఁగ నవదాత కుభృ
త్కాంతంబగు నైరావత, దంతావళ ముద్భవించె ధరణీనాథా!

258

తా ॥ పిమ్మట ఆ పాల సముద్రంలో, నాలుగు దంతాలను కలిగి, వాటితో కొండ శిఖరాలను సైతం కూల్చివేయగల వెండికొండ వంటి తెల్లని ఐరావతం అనే ఏనుగు ఉద్భవించింది.

క. తడలేని నడపు వడి గల, యొడలును బెను నిడుదకరము నురుకుంభములున్ బెడఁగై
యువతుల మురిపపు, నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్.

259

తా ॥ ఆ ఐరావతం తొట్రుపాటు లేని అందమైన నడక, వేగంగా నడిచే శరీరము, పెద్ద తొండం, కుంభస్థలంతో ఉంది. దాని నడక ప్రాయపు యువతుల నడకలను మరిపించే విధంగా ఉంది.

వ. మఱియు నత్తరంగిణీ వల్లభు మథించు నయ్యెడ.

260

ఆ. ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై, యింద్రు విరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చువారి కోర్కుల నీనెడు, వేల్పుమ్రాను బాలవెల్లిఁ బుట్టె.

261

తా ॥ ఇంకా ఆ పాలసముద్రాన్ని మథించేటప్పుడు కల్పవృక్షం పుట్టింది. అది ఎల్ల ఋతువులందును విరబూచి, రాలని పూలతో ఇంద్రుని విరులతోట అయిన నందన వనానికి ఇంపును తెచ్చి, కోరిన వారి కోర్కెలను తీర్చగలిగేది.

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె; నంత.

262

క. క్రొక్కారు మెఱుఁగు మేనులు, గ్రిక్కిరిసిన చన్నుగవలుఁ గ్రస్సిన నడుముల్ పిక్కటిలి యున్న తుఱుములుఁ, జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్.

263

తా ॥ ఆపైన క్షీర సాగరాన్ని మథింపగా, మథింపగా అప్సర స్త్రీలు పుట్టారు. వారు మెరుపు తీగల వంటి కాంతులతో కూడిన శరీరాలు, క్రిక్కిరిసిన చన్నుగవయును, అల్పమైన నడుములు, పిక్కటిల్లియున్న కొప్పులూ, చక్కని చూపులతో ఎంతో మనోహరంగా ఉన్నారు.

వ. మఱియు నా రత్నాకరంబు వందు సుధాకరుం డుద్భవించి, విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె; నంత.

264

తా ॥ మరియు ఆ పాలసముద్రంలో చంద్రుడు ఉదయించాడు. బ్రహ్మదేవుని అనుమతితో

తన యథాస్థానానికి చేరుకున్నాడు.

క. తొలుకారు మెఱుఁగు కైవడిఁ, దళ తళ మని మేను మెఱయ ధగ ధగ మనుచున్
గలుముల నీనెడు చూపులఁ, జెలువంబుల మొదలి టెంకి సిరి పుట్టె నృపా!

265

తా ॥ ఓ రాజా! అప్పుడు ఆ రత్నాకరంలో అందచందాలకు అధిష్ఠానమైన లక్ష్మీదేవి పుట్టింది. ఆమె తొలకరి మెరుపు తీగలా, తళ తళమని మెరుస్తూన్న మేనుతో, ధగ ధగమని కలిమి కురుస్తూన్న చూపులతో, మనోహరంగా ఉన్నది. సకలైశ్వర్యాలకు మూలం కదా ఆ తల్లి!

సీ. పాలమున్నీటి లోపలి మీఁది మీఁగడ, మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి
క్రొక్కారు మెఱుఁగుల కొనల తళుక్కుల మేనిచే గలనిగ్గు మెఱుఁగు సేసి
నాడుఁ నాఁటికిఁ బ్రోది నవకంపుఁదీవల నునుఁ బోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁ బ్రొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోది వెట్టి
తే. పసిఁడి చంపక దామంబు బాగుఁగూర్చి, వాలు క్రొన్నెల చెలువున వాఁడి దీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి, నలువ యీ కొమ్మ నొఁగి జేసినాఁడు నేఁడు.

266

తా ॥ బ్రహ్మ క్షీరసాగరం లోపల ఉండే మీగడ మిసిమ జిడ్డుతో ఆమె శరీరం చేసి ఉండాలి. తొలకరి మెరుపుల కొనల తళుక్కుల కాంతితో ఆ శరీరానికి మెరుగు పెట్టి ఉండాలి. నవనవోన్మేషమైన తీగలతో నెయ్యమును సమకూర్చి ఉండాలి. వికసించిన ఎఱ్ఱతామరల సరస్సులో తెల్లవారకట్ల వచ్చే సువాసనతో పోషణ చేసి ఉండాలి. బంగారు సంపెంగల దండ అందాన్ని కూర్చి ఉండాలి. బాలచంద్రుని శోభతో పదను పెట్టి ఉండాలి. ఆ మనోజ్ఞ రూపం ఊహింపశక్యం కానిది!

క. కెంపారెడు నధరంబును, జంపారెడి నడుము సతికి శంపారుచులన్
సొంపారు మోముఁ గన్నులుఁ, బెంపారుచు నొప్పుగొప్పు ఁబిఱుఁదును గుచముల్.

267

తా ॥ ఆ లక్ష్మీదేవి కెంపువలె గల ఎఱ్ఱని మృదువైన అధరము, సన్నని నడుము, మెరుపు తీగల కాంతి వలె సొంపైన మోము, పెంపారే కన్నులతో, మంగళకరంగా వెలుగొందుతూ ఉంది.

వ. అని జనులు పొగడు చుండ.

268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయింత మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయ పీఠంబు; మంగళవతులైన వేలుపు గరితలు విమల తోయ
పూర్ణంబులై యున్న పుణ్యాహ కలశంబు లిడిరి వల్లవముల నిచ్చెభూమి;
గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె మలసి వసంతుఁడు మధు వొసంగె;

తే. మునులు కల్పంబుఁ జెప్పిరి మొగిలుగములు, పణవ గోముఖ కాహళ పటహ మురజ
శంఖ వల్లకీ వేణు నిస్వనము లిచ్చెఁ, బాడి రాడిరి గంధర్వ పతులు సతులు.

269

తా ॥ ఆ తల్లి మంగళకర రూపాన్ని వీక్షించగల్గిన వారంతా పొగడుతూ ఉండగా, ఆ తరుణికి మంగళ స్నానం చేయిద్దామని ఇంద్రుడు మణిమయ ఆసనాన్ని ఏర్పాటు చేశాడు. పుణ్యాంగనలు అయిన దేవతా స్త్రీలు స్వచ్ఛమైన జలాలతో కూడిన పుణ్య కలశాలను తెచ్చారు. భూదేవి కలశాలలోనికి చిగుళ్ళను ఇచ్చింది. గోవులు పంచ గవ్యములను ఇచ్చాయి. వసంతుడు తేనెను ఇచ్చాడు. మునులు సంకల్పాన్ని చెప్పారు. మేఘముల సమూహం, పణవాలు, గోముఖాలూ, పెద్దపెద్ద బాకాలూ, తప్పెటలూ, మద్దెలలూ, శంఖములు, వీణలు, వేణువులు

ఎవరో వాయిస్తూన్నట్లుగా చక్కగా మ్రోగాయి. గంధర్వ పతులు పాడారు, సతులు ఆడారు.

క. పండిత సూక్తుల తోడుతఁ, దుండంబులు సాఁచి తీర్థ తోయములెల్లం గుండముల
ముంచి దిగ్వే, దండంబులు జలక మార్చెఁ దరుణీ మణికిన్.

270

తా ॥ మహా పండితులు మంగళాశాసనాలను పలుకుతూ ఉండగా ఏనుగులు తుండములు సాచి పుణ్యతీర్థములలోని జలాలతో ఆ లక్ష్మీదేవిని అభిషేకించాయి.

సీ. కట్టంగఁ బచ్చని పట్టుఁబుట్టముదోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె
మత్తాళి నికరంబు మధు వాన మూఁగిన వైజయంతీమాల వరుణుఁ డిచ్చెఁ
గాంచన కేయూర కంకణ కింకిణీ కటకాదులను విశ్వకర్మ యిచ్చె
భారతియొక మంచి తారహారము నిచ్చెఁ బాణిపద్మము నిచ్చెఁ పద్మభవుఁడు

తే. కుండలివ్రజంబు గుండలముల నిచ్చె, శ్రుతులు భద్రమైన నుతులు సేసె నెల్ల
లోకములకు నేలిక సానివై, బ్రదికె దనుచు దిశలు పలికె నధిప!

271

తా ॥ రాజా! లక్ష్మీదేవికి పచ్చని పట్టు వస్త్రాల జతను సముద్రుడు తెచ్చి ఇచ్చాడు. మకరందంతో నిండిన వైజయంతీ మాలను వరుణుడు ఇచ్చాడు. కాంచన కేయూరాలు, కంకణాలు, కడియాలు, గజ్జెలు ఇత్యాది అలంకారాలను విశ్వకర్మ ఇచ్చాడు. భారతీదేవి ఒక మంచి ముత్యాల హారాన్ని ఇచ్చింది. బ్రహ్మదేవుడు హస్తంలో ధరించడానికి లీలాకమలాన్ని ఇచ్చాడు. నాగరాజులు కర్ణాభరణాలను ఇచ్చారు. శ్రుతులు మంత్రాలను పఠించాయి. "ఎల్ల లోకాలను ఏలవమ్మా" – అంటూ దిక్కులు నినదించాయి.

వ. మఱియును.

272

సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించె వాఁడెపో బ్రహ్మయనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు
మెయిదీఁగ నెవ్వని మేనితోఁ గదియించె వాఁడెపో పరమ సర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెప్పుడు నివసించు నేయింట నాయిల్లు పరమగు నమృత పదము

ఆ. నింతి చూపు వాఱె నెచ్చోటి కచ్చోటు, జిష్ణుధనద ధర్మ జీవితంబు గొమ్మ పిన్న నగవు గురుతర దుఃఖ ని, వారణంబు సృష్టి కారణంబు.

273

తా ॥ అట్టి లక్ష్మీదేవి, పలుకులలో అమృతం చిలుకుతూ ఎవనితో భాషిస్తుందో అతడే విరించి. ఆసక్తితో తన మృదువైన హస్తంతో ఎవరిని వరిస్తుందో, అతడే సకల లోకాలకు వల్లభుడు. అత్యంత సుకుమారమైన తీగవంటి తన శరీరంతో ఎవని శరీరాన్ని సోకుతుందో, అతడే సర్వజ్ఞమూర్తి. ఆమె ఎప్పుడు ఏ ఇంట్లో శాశ్వతంగా నివసిస్తుందో ఆ గృహమే అమృతపదం. ఆ ఇంతి చూపు ఎక్కడ ప్రసరిస్తుందో ఆ చోటు ఇంద్రునికి, కుబేరునికి, యమునికి పరమ ధార్మికమైన చోటు. ఆమె చిరునగవు మహా భయంకరమైన దుఃఖాన్ని నివారిస్తుంది, సృష్టికి కారణమవుతుంది.

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున.

274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు నాటల బొమ్మరిల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతులని తలంచు
బాటించి యొకమాటు బ్రహ్మాది సురులను దనయింటిలో బొమ్మలని తలంచుఁ
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁటని తలంచు.

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల, నచటి దీపకళిక లని తలంచు
భామ యొక్క మాటు భారతీదుర్గల, నాత్మసఖు లటంచు నాదరించు.

275

తా ॥ ఆ మహాలక్ష్మి తన మనస్సులో ఈ బ్రహ్మాండమంతా తను ఆటలాడుకొనే బొమ్మరిల్లు అని భావిస్తుంది. ఈ భువనాలన్నింటిని తన ఇంటిలో పేర్చుకున్న కుండల దొంతులని అనుకుంటుంది. బ్రహ్మాది సురలను తన ఇంటిలో అలంకారంకోసం పెట్టుకొన్న బొమ్మలని తలుస్తుంది. ఒకోసారి భూమండలాన్ని బొమ్మల కొలువుగా ఊహిస్తూ సూర్యచంద్రుల కాంతులను అచటి దీప కళికలని అనుకొంటుంది. సర్వశక్తి ప్రదాయిని అయిన ఆ తల్లి భారతీదేవి, దుర్గాదేవులను తన చెలికత్తెలుగా ఆదరిస్తుంది.

వ. తదనంతరంబ.

276

ఆ. చంచరీకనికర ఝంకార నినదంబు, దనరు నుత్పలముల దండ ఁ బట్టి మేఘకోటి నడిమి మెఱుఁగుఁ బుత్తడి మాడ్కి, సురల నడుమ నిలిచె సుందరాంగి.

277

తా ॥ అలాంటి లక్ష్మీదేవి తుమ్మెదల సమూహం ఝంకారం చేస్తుంటే, కలువపూల దండను పట్టుకొని మేఘ సమూహం మధ్య పుత్తడి మెరుపులా దేవతాసమూహం మధ్య నిలిచి ఉంది.

క. ఆ కన్నులు నా చన్నులు, నా కురు లా పిఱుఁదు నడుమ నాముఖ మా న వ్యాకారముఁ
గని వేల్పులు, చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్.

278

తా ॥ సౌందర్యానికే అధిదేవత అయిన ఆ శ్రీ మహాలక్ష్మి మంగళకర ముగ్ధ మోహనరూపాన్ని, తేజోవిరాజితములుగా ఉన్న అవయవములను చూసి నిలువగలిగినాడు ఆ శ్రీహరి ఒక్కడే. తక్కినవారంతా ధైర్యాన్ని కోల్పోయి తల దించుకున్నారు.

వ. అట్లు నిలిచి దశ దిశలం బరివేష్టించి యున్న యక్ష రక్షస్సిద్ధసాధ్య దివిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ నిఖిల యూథంబులం గనుంగొని య ప్పరాణ ప్రౌఢకన్యకారత్నంబు దనమనంబున నిట్లని విత్కరించె.

279

తా ॥ అలా నిలిచి, తన చుట్టూ పరివేష్టించి ఉన్న యక్ష, రాక్షస, సిద్ధ, సాధ్య, దివిజ, గరుడ, గంధర్వ చారణ ప్రముఖులను చూసి ఆ సిరుల తల్లి తన మనస్సులో ఇట్లా అనుకున్నది:

సీ. ఐదువ నై యుండ నలవడ దొక చోట నొకచోట సవతితో నోర్వ రాదు
తగ నొకచోట సంతత వైభవంబు గా దొకచోట వేఁడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన నొకచోట దగ్గఱి యుండ బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు చర్చింప నొకచోట జడత గలదు.

ఆ. కొన్ని చోట్లు కామగుణ గరిష్ఠంబులు, క్రోధ సంయుతములు గొన్ని యెడలు గొన్ని మోహలోభ కుంఠితంబులు గొన్ని, ప్రమద మత్సరానుభావకములు.

280

వ. అని సకల సత్పురుష జనన వర్తనంబు మానసించి పరిహరించి.

281

తా ॥ 'ముత్తైదువగా ఉండటానికి ఒకచోట కుదరదు. ఒకచోట సవతితో పోరు తప్పదు. నిరంతర వైభవం ఒకచోట ఉండదు. ఒకచోట భరించరాని వేడిమి ఉంటుంది. ఒకచోట కరుణ అనేది లేదు. సన్నిహితంగా ఉండటం ఒకచోట సాధ్యం కాదు. ఒకచోట నిలుకడ లేదు. వేరేచోట

జడత్వం అధికం. కొన్ని చోట్ల కామం ఎక్కువ, క్రోధం ఎక్కువ కొన్ని చోట్ల. కొన్ని చోటల మోహం, లోభం ఎక్కువ కలిగి ఉంటుంది. గర్వము, మత్సరము కొన్నిచోట్ల ఎక్కువగా ఉంటుంది.' ఈ విధంగా తాను సత్పురుషుల చెంతన ఉండే విధానాన్ని తలంచి అచట ఉండే వారిలో లోపాలను గమనించింది.

సీ. అమర ముత్తైదువనై యుండ వచ్చును వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు శృంగార చందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు సకల కార్యములందు జడత లేదు;

ఆ. సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు, నాథుఁ డయ్యె నేని నడప నోపు నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ, బుష్ప దామకమునఁ బూజసేసె.

282

తా ॥ అప్పుడు శ్రీమహావిష్ణువును చూసి, 'ఇతని వద్ద సౌభాగ్యంగా ఉండవచ్చు, సవతులా లేరు. ఇతని ఇల్లు ఎప్పుడూ వైభవంతో ఉంటుంది. ఇతనెప్పుడూ చందనంతో శృంగారంగా ఉంటాడు, కలత చెందనివాడు, కరుణామయుడు, మాలిన్య రహితుడు. సన్నిహితంగా ఉండి సేవలు జరుపుకోవచ్చు. ఆడిన మాట తప్పనివాడు. నిలకడ కలవాడు. ఏ పనీ ఆలస్యం చెయ్యడు. ఎప్పుడూ సాధువులను రక్షిస్తాడు. కామ, క్రోధాదులు లేనివాడు. ఇట్టివాడు నాకు నాథుడైతే బాగుంటుంది' అని అనుకొని అతని మెడలో పూలమాల వేసి వరించింది.

క. ఇందీవర దామమున ము, కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్ మందిరముగఁ దద్వక్షము, నంద సలజ్జా సుదృష్టి నాలోకించెన్.

283

తా ॥ అలా కలువపూల మాలతో ముకుందుణ్ణి పూజించి, తాను కూడి నివసించడానికి

తగిన మందిరంగా ఆయన వక్షఃస్థలాన్ని లజ్జాపూరిత దృక్కులతో చూసింది.

ఆ. మోహరుచుల వలన ముద్దియ తలయెత్తు, సిగ్గువలన బాల శిరము వంచు నింతి వెఱఁగు వలన నెత్తదు వంపదు, తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి.

284

తా ॥ మోహపాశం వలన ముద్దియ తల ఎత్తుతూన్నది, సిగ్గుతో మళ్ళీ శిరస్సు వంచుకుంటూ ఉన్నది. ఆమె ఆశ్చర్యంతో ప్రాణవల్లభుని చూసి తన ముఖమును ఎత్తదు, అలాగే దించదు.

క. హరి సూచిన సిరి సూడదు, సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్ హరియును సిరియును దమలో, సరిచూపుఁ జూడ మరుఁడు సందడి వెట్టెన్.

285

తా ॥ హరి చూస్తే సిరిచూడదు – సిరి చూస్తే హరి చూడటానికి సిగ్గు పడుతున్నాడు. లక్ష్మీనారాయణులు ఇద్దరూ ఒకరినొకరు మనసారా చూసుకోవడానికి మన్మథుడు చాలా తొందర పెడుతున్నాడు.

చ జగముల తండ్రియై తనరు శౌరి జగంబుల తల్లి నిందిరం<br>దగ నురమందుఁ దాల్చె; నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్<br>మగుడఁగఁ దొంటి భంగి నతిమంగళసాధ్వి పతిత్వసంపదన్<br>నెగడిన లోకముల్ గని; రనేక శుభంబులఁ బొంది రత్తఱిన్.

286

తా ॥ అంతట లోకాలకు తండ్రియై ఒప్పే శౌరి లోకాలకు తల్లి అయిన ఇందిరా దేవిని తన వక్షఃస్థలమందు ధరించాడు. అప్పుడు ఆ కరుణారస పూరితమైన లక్ష్మీదేవి చూపులవల్ల

ప్రజలు సుఖశాంతులు అనుభవించారు. అట్టి మంగళ సాధ్వి పతిని పొందిన సౌభాగ్యం వల్ల లోకాలు అనేక శుభాలను పొందాయి.

వ. అట మున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యం బయిన కౌస్తుభంబు పేరిట యనర్ఘ మణి రాజంబు న య్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దన వక్షస్థ్సలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికా తారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షు వక్షస్థ్సలంబున వసియించె; న య్యవసరంబున.

287

తా ॥ ఆ సమయంలో అబ్ధిరాజైన క్షీరసాగరుడు తనయందున్న అమూల్యమైన కౌస్తుభమనే అమూల్యరత్నాన్ని శ్రీమహావిష్ణువుకు సమర్పించాడు. అప్పుడాయన దానిని తన వక్షఃస్థలంలో ధరించాడు. ఆదిలక్ష్మియూ శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలికా తారహారములచే అలంకృతమైన పుండరీకాక్షుని వక్షఃస్థలంమీద వసించింది.

శా. మ్రోసెన్ శంఖ మృదంగ వేణురవముల్ మున్నాడి; పెంజీఁకటుల్
వాసెన్, నర్తన గాన లీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ
ద్వాసుల్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ దల్లింగ మంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్ప శ్రేణి వర్షించుచున్.

288

తా ॥ ఆ సమయంలో శంఖముల, మృదంగముల, వేణునాదములు మ్రోగాయి. చీకట్లు తొలగి పోయాయి. ఆడుతూ పాడుతూ దేవతలు భాసిల్లారు. పుష్పరాశి వర్షిస్తుండగా లోకంలోని ఆర్యులు, బ్రహ్మాది దేవతలు, విష్ణువును మంత్రములచే వినుతించారు.

క. ఆ పాలవెల్లి కూఁతురు, దీపుల చూపులను దోఁగి తిలకించిఁ బ్రజల్ చేపట్టిరి సంపదలను, బ్రాపించెను మేలు; జగము బ్రదికె నరేంద్రా!

289

తా ॥ ఓ రాజా! పాలకడలి కూతురైన లక్ష్మీదేవిని ఒక్కసారి చూసేసరికి ప్రజలందరికీ సంపదలు ప్రాప్తించాయి, శుభం చేకూరగా లోకాలన్నీ ఆనందములో తేలి ఆడాయి.

క. పాలేటిరాచకన్నియ, మేలారెడు చూపులేక మిడు మిడు కంచుం జాలిం బురపురఁ
బొక్కుచు, దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా!

290

తా ॥ ఓ రాజా! క్షీరసాగర పుత్రికైన ఆ లక్ష్మీదేవి యొక్క శుభకరమైన చూపులు తమ యందు పడనందున మిడుకు మిడుకు అంటూ జాలిగా రక్కసులు దుఃఖించారు, వారికి కీడు తోచింది. మోక్షలక్ష్మి చూపు అసురుల వైపు పడదు కదా!

క. వారిధిఁ దరువఁగ నంతట, వారుణి యన నొక్క కన్య వచ్చిన నసురుల్ వారిజలోచను
సమ్మతి, వారై కైకొనిరి దాని వారిజనేత్రన్.

291

తా ॥ అనంతరం చిలుకగా చిలుకగా వారుణి అనే ఒక కన్యక పుట్టింది. ఆమెను విష్ణువు అనుమతితో రాక్షసులు గ్రహించారు.

వ. మఱియుం దరువం దరువ న ప్పయోరాశియందు.

292

సీ. తరుణుండు దీర్ఘ దోర్దండుండు గంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాలిత భూషణాలంకృతుం దరుణాక్షుఁ డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచిత కేశ నివహుండు జలధర శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు నంశాంశ సంభవుం డమలమూర్తి

ఆ. భూరియాగభాగ భోక్త ధన్వంతరి, యనఁగ నమృత కలశహస్తుఁ డగుచు నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది, వేల్పు వెజ్జు కడలి వెడలి వచ్చె.

293

తా ॥ ఆ తరువాత పాలకడలి యందు అమృత కలశాన్ని చేత ధరించి ధన్వంతరి అనే దివ్య పురుషుడు ఉద్భవించాడు. అతడు మంచి వయస్సులో ఉన్నవాడు, దీర్ఘమైన దండముల వంటి బాహువులు కలవాడు, శంఖం వంటి కంఠం కలవాడు, పీతాంబరమును ధరించినవాడు, పూలదండ ధరించిన వాడు, భూషణాలంకృతుడు, ఎఱ్రని నేత్రములతో, ఉన్నతమైన వక్షాన్ని కలిగి ఉన్నవాడు, అత్యుత్తముడు. నల్లని కేశభారం కలవాడు, నీలిమేఘంతో సమానమైన శరీర వర్ణం కలవాడు, సింహం వంటి శరీర బలం కలవాడు. కర్ణములకు మణులతో కూడిన కుండలములు ధరించినవాడు, రత్నములు అలంకరింపబడిన కాలి అందెలు కలవాడు, విష్ణువు అంశతో జన్మించినవాడు. అతడు మాలిన్యంలేనివాడు, యజ్ఞాలందు హవిర్భాగం పొందగలిగినవాడు, వైద్యశాస్త్ర నిపుణుడు, ఆయుర్వేది, దేవతలకు వైద్యుడు.

వ. తదనంతరంబ.

294

ఆ. అతనిచేత నున్న యమృత కుంభము సూచి, కెరలు వొడిచి సురలఁ గికురువెట్టి పుచ్చికొనిరి యసుర పుంగవు లెల్లను, మాఱులేని బలిమి మానవేంద్ర!

295

తా ॥ ఓ రాజా! పిమ్మట అతని చేతిలో ఉన్న అమృత కలశాన్ని చూసి అసురులు విజృంభించి తమ బలంతో, దర్పంతో దేవతలను త్రోసిపుచ్చి దానిని అందుకున్నారు.

వ. వెండియు.

296

ఆ. చావులేని మందు చక్కఁగ మన కబ్బె, ననుచుఁ గడవ నసురు లాఁచి కొనిన వెఱచి
సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా, పూర్ణఘటము వోయెఁ బోయె ననుచు.

297

తా ॥ "చావు లేని మందు చక్కగా మనకు దొరికింది!" – అంటూ రాక్షసులు అమృత కుంభాన్ని అపహరించారు. దానితో భయపడి, పూర్ణకుంభం పోయింది, పోయింది అంటూ దేవతలు శ్రీహరికి మొరలు పెట్టారు. అమృతాన్ని గురించిన యోచనలో కూడా దేవదానవుల మధ్యన ఎంతటి వ్యత్యాసం ఉన్నదో కదా!

## విష్ణుమూర్తి మోహినీ స్వరూపాన్ని పొందుట

వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజన కామదుండగు న ప్పరమేశ్వరుండు 'మీరలు దుఃఖీంప వలవ దేను నా మాయాబలంబునం జేసి మీ యర్థంబు మరల సాధించెద' నని పలికెఁ; దత్సమయంబున నయ్యమృత పూరంబు నేమ త్రావుద' మని తమకించు దైత్యదానవ జనంబుల లోపల నమంగళంబగు కలి సంభవించిన కతంబునఁ బ్రబలులగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబు నందు నడచు చందంబునఁ దుల్యప్రయాస హేతువులగు సురలును సుధాభాగంబున కర్హు లగుదురు గావునఁ బంచి కుడుచుట కర్తవ్యం; బిది సనాతనంబగు ధర్మం బగుటం జేసి యియ్యమృత కుంభంబు విడువుం డని దుర్బలులగు నిశాచరులు జాత మత్సరులై ప్రబలు లైన తమవారల వారించుచున్న సమయంబున.

298

తా ॥ ఈ విధంగా తనను శరణుకోరి వచ్చిన దేవతల దైన్యాన్ని చూసి, భృత్య జనుల కోరికలను తీర్చే ఆ మహావిష్ణువు, "మీరు దుఃఖీంచకండి. నేను నా మాయా బలంచేత మీ కోరిక నెరవేరుస్తాను" అని పలికాడు. ఆ సమయంలో, ఆ అమృతాన్ని మనమే త్రాగుదాము అని తొందర పడుతున్న దైత్యులు దానవుల మధ్యన ఒక అమంగళకరమైన కలహం బయలుదేరింది. అందులో కొందరు బలవంతులైన రాక్షసులను చూసి, "సత్త్రయాగంలోవలె కష్టం ఇద్దరిదీ సమమే... కనుక దేవతలు కూడ అమృతానికి అర్హులే! కనుక పంచుకొని తీసుకోవటం న్యాయం. ఇది సనాతనమైన ధర్మం. ఈ అమృత కుంభాన్ని విడవండి" అంటూ అడ్డుకున్నారు.

ఆ. ఒకని చేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై, పుచ్చికొనిన వాని బొదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృత కుంభము నెత్తి, కొంచుఁ బాఱెఁ బరులు గుయ్యిడంగ.

299

తా ॥ ఒకని చేతిలో ఆ కలశం ఉంటే, బలిష్ఠుడైన ఇంకొకడు లాక్కున్నాడు. వానిని పట్టుకుని అంతకంటే అధికుడు ఆ అమృతకుంభాన్ని లాక్కొని పరుగెడుతున్నాడు. దానితో తక్కిన వారు అరవడం మొదలు పెట్టారు.

వ. అంత.

300

సీ. మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు లరఁటి కంబముల దోయైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడు లేఁత నడుమును బల్లవారుణకాంతి పాణియుగముఁ
గడు దొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నలికుంతలంబులు బాలేందు సన్నిభ ఫాలతలము

తే. సమరఁ గుండల కేయూర హార కంక, ణాదు లే పార మంజీర నాద మొప్ప
నల్ల నవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర, పతుల నడఁగింప నాఁడురూపంబుఁ దాల్చి.

301

తా ॥ అప్పుడు అసుర పతులను అణగించటం కోసం విష్ణువు మోహినీ రూపాన్ని ధరించి తన రూపాన్ని చూసుకొని తనే చిన్నగా నవ్వుకున్నాడు. ఈ మాయా మోహినికి మెత్తని అడుగులు, నిగనిగలాడే మోకాళ్ళు, అరటి కంబముల వంటి తొడలు, ఘనమైన పిరుదులు, సన్నని నడుము, చిగురుటాకుల వంటి ఎర్రని చేతులు, దొడ్డ పాలిండ్లు, శంఖం వంటి కంఠం, దొండపండు వంటి అధరం, చంద్రబింబంలాంటి ముఖం, తెల్లని కన్నులు, తుమ్మెదల వంటి శిరోజములు, బాలచంద్రుని వంటి ఫాలతలం... పరమ రమణీయంగా ఉన్నాయి. కుండలములు, కేయూరములు, హారములు, కంకణములు మంజీరములు... ఈ అలంకారములన్నీ పరమ శోభాయమానంగా ఉన్నాయి. ఈ విధంగా జగన్నాథుడు జగన్మోహినిగా మారాడు.

వ. అ య్యవసరంబున జగన్మోహనాకారంబున.

302

సీ. పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు జాఱించి మెల్లనఁ జక్క నొత్తుఁ
దళుకు దళ్కను గండఫలకంబు లొలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడుమెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
సవరని దరహాస చంద్రికఁ జిలికించుఁ జిలికించు కెమ్మోవిఁ జిక్కువఱచు

తే. దళిత ధమ్మిల్ల కుసుమ గంధమ్ము నెఱవుఁ, గంకణాది ఝణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకఁబాఱు, సన్న వలిపంపుఁ బయ్యెద చౌకళింప.

303

తా ॥ లోకాలను సమ్మోహనపరిచే జగన్మోహనాకారంలో హొయలు ఒలికించసాగింది మోహిని. తళుకు తళుక్కనే చెక్కిళ్ళ కాంతిని వ్యాపింప చేస్తుంది. చేసి మళ్ళీ అరచేతిని చెక్కిలిపై ఉంచుకొని తొలగిస్తుంది. మెరుపులవంటి చూపులతో వాలుకన్నులను అల్లారుస్తుంది. అల్లార్చి తిరిగి రెప్పలు మూస్తుంది. అందమైన దరహాస చంద్రికలను చిలికిస్తూ, తన మోవితో చిక్కు పరుస్తుంది. వికసించిన పూల పరిమళాన్ని నలుగడలా వ్యాపింపచేస్తుంది. తన చేతి కంకణముల గలగలా రావాన్ని అతిశయంతో పలికించేది. సన్నని తెల్లని వస్త్రం శరీరపు కాంతులను దాచి పెట్టలేక ఉలికి పడుతోంది.

వ. ఇవ్విధంబున నక్కపట యువతీరత్నంబు జగన్మోహనదేవతయునుం బోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటి మొత్తంబులన్ గెలిచి చిగురు జొంపంబుల నెడగలుగ జడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుంగొని.

304

తా ॥ ఈ విధంగా మాయతో ఆకృతిని దాల్చిన ఆ కపట యువతీ రత్నం లోకాలను

మోహించపజేసే దేవతవలె ఉంది. పూర్ణచంద్రబింబం వంటి ఆమె ముఖం యొక్క పరిమళానికి మత్తెక్కిన తుమ్మెదల సమూహాన్ని గెలిచి... చిగురాకు గుబురులు దూరమయ్యే సరికి కొంచెం బాధపడుతూ, మురిసిపోతూ ఆమె అలా వస్తూ ఉంటే రాక్షస వీరులు చూసారు. చూడగానే పరవశించారు.

సీ. అవుఁగదే లావణ్య, మవుఁగదే మాధుర్య మవుఁగదే సతి నవయౌవనాంగి! యెటనుండి వచ్చితి? వేమి యిచ్చించెదు? నీ నామ మెయ్యది నీరజాక్షి? యమర గంధర్వ సిద్ధాసురచారణ మనుజకన్యలకు నీ మహిమ గలదె? ప్రాణ చిత్తేంద్రియ పరిణామ దాయివై నిర్మించెఁ బో విధి నిన్నుఁ గరుణ,

తే. వనిత! గశ్యపు సంతతి వార మేము, భ్రాతలము సురలకు నిద్ధపౌరుషులము జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ, బాలు దీరని యర్థంబు పంచి యిమ్ము.

305

తా ॥ "ఓ లావణ్యవతీ! ఓ మధుర మూర్తీ! ఓ నవయౌవనాంగి! నీవు ఎక్కడ నుండి వచ్చావు? ఏం కోరుకొంటున్నావు? నీ పేరు ఏమిటి? అమరులు, గంధర్వులు, సిద్ధులు, అసురులు, చారణులు, మనుజ కన్యకలు... వీళ్ళలో ఎవరికీ నీకున్న మనోహర లావణ్యం లేదు. ప్రాణములకు, చిత్తమునకు, ఇంద్రియములకు క్షేమాన్ని కల్పించటం కోసం విధి కరుణతో నిన్ను నిర్మించి ఉండాలి. మేము కశ్యప ప్రజాపతి సంతతి. దేవతలు మాకు సోదరులు. సాటిలేని పరాక్రమం కలవారము. ఒక్క ప్రయోజనము కోరి ఇక్కడకు వచ్చాము. దేవతలకు మాకు ఒక విషయంలో పంచుకోవటం కుదరటం లేదు. కనుక నీవు దీనిని సక్రమంగా పంచిపెట్టు.

క. సభయై యుండెద మిందఱ, మభయంబున వచ్చు కొలఁది నమృతంబును నీ విభరాజగమన! తప్పక, విభజింపు విపక్షపక్ష విరహితమతి వై.

306

తా ॥ ఓ గజగామినీ! మేము అందరమూ సభలో కూర్చున్నట్లుగా కూర్చుంటాము. నా వారు, పరాయి వారు అనే భేద భావం ఏమాత్రం లేకుండా ఈ అమృతాన్ని నీవు పంచిపెట్టు."

వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతి రూపుడగు హరి తన వాఁడి వాలు చూపు టంపఱలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె.

307

తా ॥ అని హెచ్చరికగా చెబుతున్న దైత్యులను చూసి మోహినీ రూపంలో ఉన్న హరి తన వాడి అయిన చూపులతో చూస్తూ వాళ్ళ ఓరిమిని చికాకు పరుస్తూ చిరునవ్వుతో ఇలా అన్నాడు:

క. సుందరులగు పురుషులఁ గని, పొందెడు నాయందు నిజము పుట్టునె మీకున్? బృందారకరిపులారా!, చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్.

308

తా ॥ "ఓ రాక్షసులారా! సుందరాంగులయిన పురుషులను ప్రేమించే దానను నేను. అట్టి నా పై మీకు నమ్మకం ఉందా? పెద్దలైన వారు కామినులను విశ్వసించరు కదా!

క. పలుకులు మధురసధారలు, దలఁపులు నానా ప్రకార దావానలముల్
సెలుములు సాలావృకములు, చెలువల నమ్ముటలు వేదసిద్ధాంతములే!

309

తా ॥ సుందరాంగనల పలుకులు మధురమైన రసధారలు. తలపులు అనేక విధములైన కార్చిచ్చులు. వారితో స్నేహం తోడేళ్ళతో స్నేహం వంటిది. కనుక అట్టి చెలియలను నమ్మటం వేద సమ్మతం కాదు.

క. నా నేర్చుకొలఁది మీకును, మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకన్ గానిం

డనవుడు నిచ్చిరి, దానవు లమృతంపుఁ గడవఁ దరుణీ మణికిన్.

310

తా ॥ సరే! మీ కోరికను కాదనలేక నాకు చేతనైనంత అందంగా మీకు పంచిపెడతాను! ఏమీ శంక పెట్టుకోకండి!" అని ఆమె అనేసరికి దానవులు అమృతకలశాన్ని ఆ తరుణీమణికి ఇచ్చారు. మాయామోహితులకు యుక్తాయుక్త విచక్షణ ఉండదు కదా!

క. ఆ శాంతాలోకనములు, నా శీతల భాషణములు నా లాలితముల్ రాశి పరంపర లగుచుం, బాశములై వారి నోళ్ళు బంధించె నృపా!

311

తా ॥ ఆమె శాంతరసపూరితమైన చూపులు, ఆ చల్లని మాటలు, ఆ లాలన రాసులు రాసులుగా వచ్చి రాక్షసులకు పాశములై వాళ్ళ నోళ్ళు బంధించాయి. అలా వారు మాయాపాశ బద్ధులైనారు.

వ. ఇట్లు సుధాకలశంబు కేల నందుకొని మందస్మిత భాషణంబుల సుందరీ రూపుం డగు ముకుందుండు 'మేలు గీ డనక నేను బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం' బనవుడు 'నగుంగాక' యని సురాసుర దైత్యదానవ సమూహం బుపవసించి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి తదాశీః ప్రవచనంబును గైకొని ధవళపరిధానులై గంధమాల్య ధూపదీపాలంకృతం బగు కనకరత్న శాలా మధ్యంబునఁ బ్రాగగ్రకుశ పీఠంబులం బూర్వ దిశాభిముఖులై పంక్తులు గొని యున్న సమయంబున.

312

తా ॥ ఇట్లు పలికి అమృత కలశాన్ని చేతితో అందుకొని, చిరునవ్వుతో కూడిన మాటలతో మోహినీ రూపంలో ఉన్న ముకుందుడు, నేను పంచి ఇచ్చిన విధంగా అంగీకరించటం మీ

కర్తవ్యం, ఇది ఒప్పు, ఇది తప్పు అనరాదు. ఆ మాటకు సరే అని సురులు, అసురులు, అంతా ఉపవసించి స్నానం చేసి హోమాలు ఆచరించారు. బ్రాహ్మణులకు గోవులు, భూమి, బంగారము మొదలైన దానములు ఇచ్చి వారి ఆశీర్వచనాలు తీసుకొన్నారు. తెల్లని వస్త్రాలు ధరించి గంధము, పూవులు, ధూపము, దీపములు ఇత్యాది వాటిచే అలంకరింపబడిన బంగారు మండపంలో చేరారు. తూర్పుగా కొసలు ఉండేటట్లు పరిచిన దర్భాసనాలపై తూర్పు ముఖంగా పంక్తులలో కూర్చున్నారు.

క. శ్రోణీభర కుచయుగ భర, వేణీభరములను డస్సి వివిధాభరణ క్వాణ యయి యువిద వచ్చెను, బాణి సరోజమున నమృతభాండముఁ గొంచున్.

313

తా ॥ అట్టి సమయంలో మోహినీదేవి పద్మం వంటి తన హస్తంలో అమృతభాండాన్ని పట్టుకొని వచ్చింది. ఆమె కటిభారం చేత, కుచ భారం చేత, వేణీ భారం చేత అలసిపోయి వివిధాభరణములు బహు సుకుమారంగా మ్రోగుతూ ఉండగా ఆమె వచ్చింది.

క. భాసుర కుండల భాసిత, నాసాముఖ కర్ణ గండనయనాంచలయై శ్రీసతి యగు సతిఁ గని దే, వాసుర యూథంబు మోహ మందె నరేంద్రా!

314

తా ॥ ఓ నరేంద్రా! ప్రకాశిస్తూన్న ఆమె కుండలాల కాంతులు ఆమె ముక్కు, ముఖము, చెవులు, నయనములు, చెక్కిళ్ళు... ముఖమంతా వ్యాపించింది. లక్ష్మీదేవికి సాటి అయిన ఆ సతిని చూసినవారంతా మోహంలో మునిగి పోయారు.

వ. అప్పుడు.

315

క. 'అసురుల కమృతము వోయుట, వొసఁగదు పాములకుఁ బాలు వోసినమాడ్కిన్
దొసఁగగు నంచును వేఱొక దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవాహితులన్.

316

వ. ఇట్లు రెండు పంక్తులుగా నేర్పరించి.

317

తా ॥ అప్పుడు అసురులకు అమృతాన్ని పోయటం అంటే పాములకు పాలు పోసినట్లే అవుతుంది అనుకొని మోహిని వాళ్ళని వేరే వరుసలో కూర్చుండపెట్టింది. ఈ విధంగా దేవతలను అందరిని ఒక పంక్తిలోను రాక్షసులను అందరిని వేరొక పంక్తిలోను తన చాతుర్యం చేత కూర్చోపెట్టింది.

సీ. వేగిర పడకుఁడీ వినుఁడు దానవులార! తడవు సేయక వత్తు దైత్యులార!
యటుసక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి చనుఁగవ పయ్యెద జాఱఁ దిగిచి
వదినె మఱందుల వావులు కల్పించి మర్మంబు లెడలించి మఱుఁగు సేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి కడు జాణ మాటలఁ గాకు పఱచి

ఆ. యసుర వరుల నెల్ల నడకించి సురలను, దడవు సేయ వలదు; ద్రావుఁ డనుచు వచ్చు
కొలఁది నమృతవారి విభాగించెఁ, దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ.

318

తా ॥ "రాక్షసులారా! తొందర పడకండి. దానవులారా! దైత్యులారా! ఆలస్యం చెయ్యకుండా వస్తాను. మీరంతా అటు ప్రక్క చక్కగా కూర్చోండి" అని కన్నుల అల్లార్చి రకరకాలుగా పయ్యెద జారవిడిచింది. వివిధ రీతులలో వారిని అలరించింది. చిరునవ్వులతో మైమరిపించింది. జాణతనంతో మాట్లాడి వాళ్ళని బలహీనులుగా చేసింది. రాక్షసులనందరినీ వంచిస్తూ దేవతలనందరినీ ఆలస్యం చెయ్యకుండా అమృతాన్ని త్రాగండి అంటూ పంచుతోంది.

అలా దేవతలు అంతా తృప్తితో పొగడేటట్లు అమృతాన్ని పంచిపెట్టింది.

వ. ఆ య్యవసరంబున.

319

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ బంచి పెట్టెద నని పడఁతి పూనెఁ
దానేల తప్పును? దప్పదు తరళాక్షి గాక రమ్మనుచును గడఁకఁ బిల్వ
మఱుమాట లాడదో మఱి చూడకుండునో చనుఁగవఁ గప్పునో చాలు ననుచు
నొండాడఁ గలఁగుచు నొక్కింత సొలయునో మనయెడఁ గందునో మగువ యనుచు

ఆ. నెలఁత చూడ్కి గముల నీరై కరంగుచుఁ, బ్రణయ భంగ భీతి బద్ధ లగుచు నూరకుంద్రు గాని 'యువిద! తే తెమ్మ' ని, యడుగఁ జాల రప్ప డసుర వరులు.

320

తా ॥ ఆ సమయంలో మోహినీ దేవి చూపులకు దానవులు నీరై కరిగి పోయారు. ఈమె మనకు వేల్పులకు భేదం లేకుండా పంచి పెడతానని పూనుకుంది. అన్నమాట ఎందుకు తప్పుతుంది? తప్పదు. ఒకవేళ మనం రమ్మని పిలిస్తే బదులు ఇవ్వదేమో! పైట కప్పేసుకుంటుందేమో! కనుక మాట్లాడవద్దు. మరో మాట మాట్లాడితే వెనుతీస్తుందేమో. మనమీద కోపం తెచ్చుకుంటుందేమో! ఇలా అనుకుంటూ ఊరకే ఉండిపోయారే కాని "ఓ సుందరీ! ఇటు తీసుకొనిరా!" అని అడుగలేక పోయారు. మాయ నుండి బయటకు రావడం అసురులకు అసాధ్యమైనది కదా!

వ. అప్పుడు.

321

మ. అమర వ్రాతములోనఁ జొచ్చి దివిజుండై రాహు పీయూష పా
నము సేయం గని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం

డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధము దదన్యాంగంబు నేలం బడెన్.

322

తా ॥ ఆ సమయంలో మోహిని దేవతలకు మాత్రమే అమృతం పోయడాన్ని గమనించిన రాహువు అనే రాక్షసుడు, దేవతాసమూహంలోనికి ప్రవేశించి, అమృతాన్ని పానం చేశాడు. దానిని చూసి చంద్రసూర్యులు మోహినికి సైగలు చేయగా, నారాయణుడు రాహువు శిరస్సును ఖండించాడు. అమృతం త్రాగిన కారణంగా శిరస్సు అమరత్వాన్ని పొంది నిర్జీవం కాక అలా ఉండిపోయింది, మొండెం మాత్రం నేలపై పడింది.

ఆ. అజుఁడు వాని శిరము నంబరవీథిని, గ్రహము సేసి పెట్టి గారవించె; వాఁడు పర్వములను వైరంబు దప్పక, భానుచంద్రములను బట్టు చుండు.

323

తా ॥ బ్రహ్మదేవుడు ఆ రాహువు శిరస్సును ఆకాశవీథిలో ఒక గ్రహంగా నిలబెట్టి గౌరవించాడు. ఆ రాహుగ్రహం పర్వదినాలలో వైర భావంతో సూర్యచంద్ర బింబములను తప్పక పట్టుకుంటూ ఉంటాడు.

క. ఒక బొట్టుఁ జిక్క కుండఁగ, సకల సుధారసము నమర సంఘంబులకుం బ్రకటించి పోసి హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసుర శూరులు బెగడన్

324

తా ॥ ఈ విధంగా విష్ణువు ఒక్క బొట్టు కూడా మిగల్చకుండా అమృతమంతా దేవతాసమూహానికే బహిరంగంగా అసురుల ముందే పంచాడు. తదనంతరం శ్రీహరి ఆ రాక్షసులంతా బాధ పడేటట్లుగా తన మామూలు రూపాన్ని ధరించాడు.

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పులైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా మత్యంత దోర్గర్వులై;
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ గల్యాణ సంయుక్తులే?

325

తా ॥ దేవతలు రాక్షసులు ఇద్దరికీ ఓపిక, బలము, తెలివి, ధనము, ఆత్మగౌరవము సమానమే. అయినా రాక్షసులు ఫలితాన్ని పొందలేకపోయారు. అమరులు శ్రేయస్సును పొందారు. కమలాక్షుణ్ణి శరణు వేడని జనులకు కళ్యాణం సంప్రాప్తం కాదు కదా! భగవత్ కృపను పొందేందుకు అర్హతను సాధించడం ఆవశ్యకం కదా!

# దేవాసుర యుద్ధము

క. దానవు లమృతము ద్రావం, బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలిన మాడ్కిన్ శ్రీనాథ పరాఙ్ముఖులగు, హీనులు వొందంగఁజాల రిష్టార్థంబుల్.

326

తా ॥ దానవులు అమృతాన్ని త్రాగాలనే కాంక్షతో పాలకడలిని చిలికి చివరకు దుఃఖానికి గురి అయ్యారు. శ్రీహరిపై మనస్సు ఉంచని హీనులు తాము కోరుకున్న సంపదలను పొందలేరు.

క. శోధించి జలధి నమృతము, సాధించి నిలింపవైరి చక్షుర్గతులన్ రోధించి సురల కిడి హరి, బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా!

327

తా ॥ నరేంద్రా! ఈ విధంగా క్షీరసాగరాన్ని శోధించి, అమృతాన్ని సాధించి, శ్రీమహావిష్ణువు రాక్షసుల కన్ను కప్పి దేవతలకు ఇచ్చి, ఖగరాజును ఎక్కి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

క. శుద్ధముగ సురల కమృతము, సిద్ధించిన నసుర వరులు సిడిముడిపడుచున్ గ్రుద్ధులు నానాయుధ స, న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్.

328

తా ॥ పరిపూర్ణంగా అమృతం దేవతలకే సిద్ధించిన కారణంగా రాక్షసులు క్రోధావేశాలతో నానా విధాలైన ఆయుధాలతో యుద్ధానికి సన్నద్ధమై వచ్చారు.

క. ధన్యులు వైరోచని శత, మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో నన్యోన్యరణము బాహా, సిన్న్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్.

329

తా ॥ బలిచక్రవర్తి దేవేంద్రుడు మొదలైనవారు వారి వారి గణాలకు నాయకులై అత్యంత పరాక్రమంతో ఖడ్గాలను చేబూని యుద్ధం చేసేందుకు సన్నద్ధులైనారు.

మ. అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
పరశస్త్రాస్త్ర సమేతమై తరళమై వైహాయసంబై మహా
సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సు
స్థిరకాంతిన్ బలి చామరధ్వజ చమూదీప్తస్థితిన్ ముందటన్.

330

తా ॥ ఆ బలి చక్రవర్తి పూర్ణచంద్రుని వలె వెలుగొందుతూ తన రథం మీద బయలుదేరాడు. ఆయన రథం మాయాసురుని చేత నిర్మితమైనది. అది అరుదైనది, ఇష్టానుసారంగా పయనించేది. అనేక శస్త్రాస్త్రములచే నిండినది. అంతేకాక చూపరులకు కనిపించకుండా ఆకాశ గమనాన్ని కలిగి ఉన్నది. గొప్ప రాక్షస భటులతో కూడి ఉన్నది. ఆ రథానికి ముందు వింజామరలతో జెండాలతో రాక్షస సైన్యాలు నడువ సాగాయి.

వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూత సంత్రాస హయగ్రీవ కపిలేల్వ లోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచన వజ్రదంష్ట్ర తార కారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరః ప్రముఖులును, బౌలోమ కాలకేయులును, నివాత కవచ ప్రభృతులును, దక్కిన దండ యోధులునుం గూడికొని యరదంబులం దురంగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి కీట జలచరంబులను, శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గోవృషాది మృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగిలాది జలచరంబులను, నరులను, నసుర సుర నికర

వికృతి విగ్రహరూపంబులగు జంతువులను నారోహించి, తమకు నడియాలంబులగు గొడుగులు జోడుఁగైదువులు పక్కెరలు బొమిడికంబులు మొదలగు పోటుముట్లాయితంబుగఁ గైకొని వేఱు వేఱ మొనలై విరోచననందనుండగు బలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుఁడై వైశ్వానర వరుణవాయు దండధరా ద్యనేక నిర్జరవాహినీ సందోహంబును, దాను నెదురుపడి పిఱు తివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహ సముత్సాహంబుల రెండు దెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించు చున్న సమయంబున,

331

తా ॥ ఆ బలి చక్రవర్తి ముందు భాగంలో నముచి, శంబరుడు, చాణుడు, ద్విమూర్ధుడు, కాలనాభుడు, శకుని, జంభుడు, అయోముఖుడు, ప్రహేతి, హేతి, భూత సంత్రాసుడు, హయగ్రీవుడు, కపిలుడు, ఇల్వలుడు, ఉత్కలుడు, మేఘదుందుభి, మయుడు, త్రిపురాధిపుడు, విప్రచత్తి, విరోచనుడు, వజ్రదంష్ట్రుడు, తారకుడు, అరిష్టుడు, అరిష్టనేమి, శుంభుడు, నిశుంభుడు, శంకు శిరుడు మొదలైన ప్రముఖులునూ, పౌలోమ కాలకేయులును, నివాత కవచులు మొదలయిన వారూ; తక్కిన మహావీరులు, వేరు వేరుగానూ నిలబడ్డారు. వారు రథములు, గుర్రములు, ఏనుగులు, జింకలు, సింహములు, పందులు, శరభ మృగాలు, దున్నపోతులు, గురుపోతులు, ఖడ్గ మృగాలు, గండ భేరుండాలు, చమరీ మృగాలు, నక్కలు పెద్ద పులులు, గోవులు, ఎద్దులు, మొదలైన మృగాలనూ; రాబందులు, గ్రద్దలు, కాకులు, కోడి పుంజులు కొంగలు, డేగలు, హంసలు మొదలైన పక్షులనూ; తిములు, తిమింగలములు మొదలయిన జలచరంబులనూ; మనుష్యులను, అసురులను సురలను పోలిన విగ్రహ రూపంలో ఉన్న జంతువులను ఆరోహించారు. తమకు చిహ్నములైన గొడుగులు జెండాలు కిరీటాలు మొదలైనవి ధరించి బలిచక్రవర్తి ముందర నిలబడ్డారు.

దేవేంద్రుడు ఐరావతాన్ని ఎక్కి, అగ్ని, వరుణుడు, వాయువు, యముడు మొదలయిన

దేవతా సమూహంతో ఎదురు వచ్చి వెనుదీయక సిద్ధమయ్యాడు. ఆ విధంగా సంరంభంతో సన్నాహంతో ఉత్సాహంతో ఉభయ పక్షాలవారు పోరాటానికి సిద్ధమయ్యారు.

సీ. వజ్రదంష్ట్రాంచిత వ్యజనంబులును బర్హ చామరంబులు సితచ్ఛత్రములును
జిత్రవర్ణధ్వజ చేలంబులును వాత చలితోత్తరోష్ణీష జాలములును
జప్పుళ్ల నెసఁగు భూషణ కంకణంబులుఁ జండాంశురోచుల శస్త్రములును
వివిధ ఖేటకములు వీరమాలికలును బాణపూర్ణములైన తూణములును

ఆ. నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీర, సైన్యయుగ్మకంబు సాల నొప్పె గ్రాహతతుల తోడఁ గలహంబునకు వచ్చు, సాగరముల భంగి జనవరేణ్య!

332

తా ॥ రాజా! వజ్రము వంటి కోరలు, విసనకర్రలు, నెమలి పురులు, వింజామరలు, వెల్ల గొడుగులు, రంగు రంగుల జెండాలు, గాలికి కదిలే తలపాగాలు, శబ్దించే భూషణ కంకణాలు, సూర్య కాంతితో మెరిసే శస్త్రములతో, రకరకాల డాలువార్లు, హారాలు, నిండిన అంప పొదులు, వీటితో నిండి ఉన్న దేవ దానవ సైన్యం యుద్ధానికి సిద్ధంగా ఉంది. అవి మొసళ్ళతో నిండి కలహానికి సిద్ధంగా ఉన్న రెండు సముద్రాల వలె ఉన్నాయి.

క. భేరీ భాంకారంబులు, వారణ ఘీంకారములును వరహరి హేషల్ భూరి రథనేమి రవములు, ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్.

333

తా ॥ భేరీ వాద్యాలనుండి వెలువడే భాంకారాలతో, ఏనుగుల ఘీంకారాలతో, గుర్రాల సకిలింతలతో, రథచక్రాల సవ్వడులతో ఘోరంగా ఉండి పర్వతాలను పెళ్ళగించేలా ఉంది.

వ. ఇ వ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుండును, దారకునితో

గుహుండును, హేతితో వరుణుండును, ప్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁ ద్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁ బరాజితుండును, వృషపర్వునితో నశ్వినీ దేవతలును, బలిసుతబాణాది పుత్త్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభ నిశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వల వాతాపులతో బ్రహ్మపుత్త్రులును, దుర్మర్షణునితోఁ గామదేవుండును, నుత్కలునితో మాతృకా గణంబును, శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు నమరులును, బౌలోములతో విశ్వేదేవగణంబును, గ్రోధవశులతో రుద్రులును, నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వ యుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులను దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్య తిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బల నుబ్బిఁరేగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబులం దంకరించుచు, శరంబుల నాఁటించుచుఁ, బరశువుల నఱకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులఁ బొడుచుచు, గదల నడచుచు, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ బట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచు, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులన్ జదుపుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబుల నుఱుముచుఁ, శూలంబుల జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరుశైలంబుల ఱువ్వుచు, నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహ విహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులైన కపాలంబులును, వికలంబులైన కపోలంబులును, జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులైన దంతంబులును, గృత్తంబులైన భుజంబులును, ఖండితంబులైన కరంబులును, విదళితంబులైన మధ్యంబులును, వికృతంబులైన వదన

బింబంబులును, వికలంబులైన నయనంబులును, వికీర్ణంబులైన కర్ణంబులును, విశీర్ణంబులైన నాసికలును, విఱిగి పడిన యూరుదేశంబులును, విసంధులైన పదంబులును, జిరిఁగిన కంకటంబులును, రాలిన భూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గయిన రథంబులును, నుఱుమైన హయంబులును, జిందఱవందఱలైన భటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొరలెడు మేనులును, నుబ్బియాడెడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలు గొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి కళేబరంబులును, గలకలంబులు సేయు కంక గృధ్రాది విహంగంబులు నయి యొప్పు న ప్పోరతి ఘోరంబయ్యె నప్పుడు.

334

తా ॥ ఈ విధంగా ఉభయ సైన్యాలు మోహరించిన తరువాత బలితో ఇంద్రుడునూ, తారకునితో గుహుడునూ, హేతితో వరుణుడునూ, ప్రహేతితో మిత్రుడునూ, కాలనాభునితో యముడునూ, మయునితో విశ్వకర్మయూ, శంబరునితో త్వష్టయూ, విరోచనునితో సవితయూ, నముచితో పరాజితుడునూ, వృషపర్వునితో అశ్వినీ దేవతలునూ, బలిసుతులు అయిన బాణాదులతో సూర్యుడునూ, రాహువుతో సోముడునూ, పులోమునితో అనిలుడునూ, శుంభనిశుంభులతో భద్రకాళియూ, జంభునితో వృషాకపీయునూ, మహిషునితో విభావసుడునూ, ఇల్వల వాతాపులతో బ్రహ్మ పుత్రులునూ, దుర్మర్షణునితో మన్మథుడునూ, ఉత్కలునితో మాతృకాగణమునూ, శుక్రునితో బృహస్పతియూ, నరకునితో శనైశ్చరుడునూ, నివాతకవచులతో మరుత్తులునూ, కాలకేయులతో వసువులు అమరులునూ, పౌలోములతో విశ్వేదేవ గణంబునూ, క్రోధవశులతో రుద్రులునూ ఈ విధంగా కలిసి పెనగుతూ ద్వంద్వ యుద్ధం చేస్తున్నారు.

మరియు రథాలమీద ఉండేవారు రథాలమీద ఉండే వారితోనూ, కాలిబంట్లు కాలి

బంట్లతోనూ, వాహనాలు ఎక్కిన వారు వాహనాలు ఎక్కిన వారితోను ఒకరి నొకరు తాకి సింహనాదాలు చేస్తూ, అట్టహాసాలు చేస్తూ, పరస్పరం ఆహ్వానాలు పలుకుతూ, ఒకళ్ళ నొకళ్ళు తిరస్కారం చేస్తూ, భుజాలు తట్టుకుంటూ విజృంభిస్తూ, పెద్ద పెద్ద బొబ్బలు పెడుతూ, హుంకరిస్తూ, అహంకరిస్తూ, అల్లె త్రాటిని మ్రోగిస్తూ, బాణాలను వేసుకొంటూ, గండ్రగొడ్డళ్ళతో నరుకుతూ, చక్రాలతో చెక్కుతూ, శక్తి ఆయుధాలతో ఖండిస్తూ, కొరడాలతో కొడుతూ, గొడ్డళ్ళతో పొడుస్తూ, గదలతో అణచివేస్తూ, చేతులతో పొడుస్తూ, కత్తులతో నరుకుతూ, అడ్డ కత్తులతో నొప్పిస్తూ, పాశముల చేత కట్టివేస్తూ, ఈటెల చేత పొడుస్తూ, రోకళ్ళచేత మొత్తుతూ, సమ్మెటలతో బాదుతూ, పిడికిళ్ళతో పొడుస్తూ, చిల్లకోలల చేత గర్జిస్తూ, శూలాలతో చిమ్ముతూ, గోళ్ళతో రక్కుతూ, చెట్ల మొదళ్ళను రువ్వుతూ కొరవులతో కాలుస్తూ... ఈ విధంగా భయంకరమైన యుద్ధం చేశారు.

కొందరికి కపాలాలు బ్రద్దలయినాయి. కొందరికి కపోలములు వికలమయ్యాయి. కొందరికి తలవెంట్రుకలు చిక్కుపడ్డాయి. మరి కొందరికి దంతములు విరిగిపోయాయి. మరికొందరికి భుజములు తెగిపడ్డాయి. ఇంకా కొందరికి చేతులు తెగిపడ్డాయి. ఇంకా కొందరికి నడుములు విరిగాయి. మరి కొందరికి ముఖములు వికృతంగా తయారయ్యాయి. కొందరికి నయనములు వికలమయ్యాయి. కొందరికి చెవులు తెగిపడ్డాయి. కొందరికి నాలుకలు నరుకబడ్డాయి. కొందరికి తొడలు విరిగి పోయాయి. రక్త ప్రవాహములు పారాయి. మాంస ఖండములు గుట్టలుగా పడ్డాయి. రాబందులు, గ్రద్దలు, పక్షులు కలకలములు చేస్తున్నాయి. ఈ విధంగా ఆ పోరు అతి ఘోరంగా సాగుతోంది.

శా. నాకాధీశుఁ బదింట; మూఁట గజమున్, నాల్గింట గుఱ్ఱంబుల
న్నేకాస్త్రంబున సారథిం జొనిపె, దైత్యేంద్రుండు వీఁకన్ వియ
ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోడ్తో నన్నిభల్లంబులన్
రాకుండన్ రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్.

335

తా ॥ ఆ రణంలో బలిచక్రవర్తి స్వర్గాధిపతి అయిన ఇంద్రుణ్ణి పది బాణాలతోను, అతని గజమైన ఐరావతాన్ని మూడు బాణాలతోను, నాలుగు బాణాలతో గుర్రములను, ఒక బాణాన్ని సారథి మీదకు వేశాడు. శీఘ్రంగా దేవేంద్రుడు అన్ని బాణాలను త్రుంచివేసి బలిచక్రవర్తి మెచ్చుకొనేటట్లుగా శత్రు సైన్యాన్ని సంహరించాడు.

సీ. తన తూపులన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోదు విన్ననువు మెఱసి బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ; మఱి ప్రాసశూల తోమరములు గైకొన్నఁ దోడ్తోడ నవియును దునిమివైచె; నంతటఁ బోక యెయ్యది వాఁడు సంధించెఁ దొడరి తా నదియును దుమురు సేసె;

ఆ. నసురభర్త విరథుఁడై తన పగఱకుఁ, గానఁబడక వివిధ కపట వృత్తి నేర్పు మెఱసి మాయ నిర్మించె, మింటను వేల్పుగములు సూచి వెఱఁగు పడఁగ.

336

తా ॥ తన బాణాలన్నింటినీ వరుసగా ఇంద్రుడు నరికేసరికి వీరుడైన బలి మహాశక్తిని ప్రయోగించాడు. దానినీ ఖండించాడు ఇంద్రుడు. వెంటనే బలి ఈటెను, శూలాన్ని, తోమరాన్ని ప్రయోగిస్తే వాటినీ ఖండించాడు. బలి వేటిని ప్రయోగిస్తే వాటిని ముక్కలు చేసాడు. అప్పుడు బలి రథం భగ్నంకాగా ఇతరులకు కనపడకుండా నేర్పుగా ఆకాశం మీద మాయను నిర్మించాడు. దేవతలు దానిని చూసి ఆశ్చర్యపోయారు.

వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె; దావాగ్ని దందహ్యమాన తరువర్షంబులు గురిసె; సటంక శిఖర నికరశిలాసారంబులు గప్పె; మహోరగ దందశూకంబులు గఱచె; వృశ్చికంబులు మీటె; వారాహ వ్యాఘ్ర సింహంబులు గదిసి విదళింపన్ దొరఁకొనియె; వనగజంబులు మట్టి

మల్లాడం జొచ్చె; శూలహస్తులు దిగంబరులునై రండు రండని బలురక్కసులు శతసహస్రసంఖ్యులు భేదనచ్ఛేదన భాషణంబులు సేయం దొడంగిరి; వికృత వదనులు గదా దండధారులు నాలంబిత కేశ భారులునై యనేక రాక్షస వీరులు 'పోనీకు పోనికుఁడు; తునుము తునుముం' దని వెనుతగిలిరి; పరుష గంభీర నిర్ఘాత సమేతంబులయిన జీమూత సంఘాతంబులు వాతాహతంబులై యుప్పతిల్లి నిప్పుల కుప్పలు మంటల ప్రోవులం గురిసె; మహాపవన విజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబు చందంబునం దరికొనియెఁ, బ్రచండ ఝుంఝూనిల ప్రేరిత సముత్తుంగ తరంగావర్తభీషణంబయిన మహార్ణవంబు సెలియలికట్ట దాఁటి వెల్లి విరిసి నట్లమేయంబై యుండె; నా సమయంబునం బ్రళయకాలంబునుం బోలె మిన్ను మన్నును, రేయుంబగలు నెఱుంగ రా దయ్యెఁ; న య్యవసరంబున.

337

తా ॥ ఈ విధంగా బలి చక్రవర్తి మాయా విశేషంతో పోరు సల్ప సాగాడు. దానితో దేవతలపై పర్వతాలు పడ్డాయి. దావాగ్నిలో అంటుకుపోతూన్న చెట్లు వానలా పడ్డాయి. కొండ శిఖరాల నుండి రాళ్ళు పడ్డాయి. భయంకరమైన పాములు పైన పడి కరిచాయి. తేళ్ళు కుట్టాయి, అడవి పందులు, పెద్ద పులులు, సింహములు మీదకు దూకి చీల్చడం మొదలుపెట్టాయి. ఏనుగులు భీతితో పడదోయసాగాయి. శూలాలు చేతిలో ధరించి దిగంబరులై అనేకమంది రాక్షసులు నరుకుతాం, చీలుస్తాం అంటూ అరవడం మొదలు పెట్టారు. వికారమైన ముఖం కలవారు గద దండము ధరించినవారు అయిన రాక్షసవీరులు తమ తలవెంట్రుకలు వ్రేలాడుతూ ఉండగా పోనీకండి! పోనీకండి! నరకండి! నరకండి! అంటూ వెనకాల పడ్డారు. పరుషము గంభీరము అయిన పిడుగులతో కూడిన మేఘముల సమూహం గాలికి కదులుతూ, నిప్పుల కుప్పలను మంటల రాశులను కురిపించాయి. భయంకరమైన గాలిచే రెచ్చగొట్టబడిన కార్చిచ్చు ప్రళయ కాలంలో అగ్నివలె చుట్టుముట్టింది. ప్రచండమైన గాలులతో కూడి ఎగసిపడే కెరటాలతో కూడిన భీషణమైన సముద్రం చెలియలి కట్ట దాటి వస్తూన్నట్లు భీతావహంగా ఉంది. ఆ

సమయంలో ప్రళయ కాలంలోవలె భూమి—ఆకాశం, రాత్రి—పగలు అనే తేడా తెలియకుండా పోయింది.

క. ఆ యసురేంద్రుని బహుతర, మాయా జాలంబులకును మా ఱెఱుఁగక వ
జ్రాయుధ ముఖరాదిత్యు ల, పాయంబునుఁ బొంది చిక్కువడిరి నరేంద్రా!

338

తా ॥ ఆ అసురేంద్రుడైన బలిచక్రవర్తి యొక్క అధికమైన మాయాజాలానికి ప్రతిక్రియ ఏమిటో తెలియక ఇంద్రుడు సూర్యుడు ఇతరులైన దేవతలు అపాయాన్ని పొంది చిక్కుల్లో మునిగిపోయారు.

వ. అప్పుడు.

339

క. ఇ య్యసురులచేఁ జిక్కితి, మెయ్యది దెరు? వెందుఁ జొత్తు? మిటు వొలయఁ గదే యయ్యా! దేవ! జనార్దన!, కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్.

340

తా ॥ అప్పుడు దేవతాసమూహం 'ఈ రాక్షసులకు చిక్కాము. ఇక మనకు దారి ఏమిటి? ఎక్కడకు వెళతాము?' అనుకుని 'దేవా! జనార్దనా!' అంటూ దేవతలు ఆ విష్ణువుతో మొరపెట్టుకున్నారు.

వ. అట్లు మొఱయిడు నవసరంబున.

341

మ. విహగేంద్రాశ్వ నిరూఢుఁడై మణిరమా విభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్ర రథాంగ సంకలితుఁడై భాస్వ త్కిరీటాది దు

స్పష్టుఁడై నవ్యపిశంగచేల ధరుఁడై సంపుల్ల పద్మాక్షుడై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్.

342

తా ॥ అప్పుడు పక్షిరాజైన గరుత్మంతుని వాహనంపై శ్రీహరి అక్కడకు వచ్చాడు. ఆయన వక్షస్థలం కౌస్తుభమణితోను లక్ష్మీదేవితోను ప్రకాశిస్తున్నది. అనేకమైన శస్త్రములు, అస్త్రములు ధరించి ఉన్నాడు. శిరస్సున ధరించిన కిరీటం వెలుగులు చిమ్ముతూ ఉన్నది. కొత్తది అయిన పసుపు పచ్చని పట్టు వస్త్రమును ధరించి ఉన్నాడు. వికసించిన పద్మములవంటి నేత్రములతోను, అలంకారములతోను మాధవుడు అక్కడికి వచ్చాడు.

చ. అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను; నిద్రనొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పులందఱుం;
బస సెడ కేలయుండు హరిపాద పరిష్కృతిసేయ నాపదల్?

343

తా ॥ రాక్షసుల యొక్క ఆ మాయలన్నీ మాధవుడు అక్కడకి వచ్చేటప్పటికి నిరర్థకమై వెంటనే తొలగి పోయాయి. అప్పుడే నిద్రనుండి మేలుకొన్న వారివలె దేవతలంతా సంతోషించారు. శ్రీహరి పాదాలను నమ్ముకున్న వారికి ఆపదలు దూరం కాకుండా ఎందుకు ఉంటాయి!

వ. అయ్యెడ.

344

ఆ. కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి, తార్క్ష్య శిరము శూలధారఁ బొడువ
నతని పొటుముట్టు హరి కేల నంకించి, దానఁ జావఁ బొడిచె దానవునిని.

345

తా ॥ అప్పుడు కాలనేమి అనే రాక్షస వీరుడు భయంకరమైన సింహాన్ని ఎక్కి గరుత్మంతుణ్ణి శూలంతో పొడిచే సరికి ఆ శూలం లాక్కుని గరుత్మంతుడు ఆ దానవున్ని పొడిచి చంపాడు.

క. పదపడి మాలి సుమాలులు, బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథు చక్రహతిన్; గదఁగొని గరుడుని ఱెక్కలు, సెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రేసెన్.

346

తా ॥ పిమ్మట మాలి సుమాలి అనేవారు మాధవుణ్ణి బెదిరించే సరికి చక్రాయుధంతో వారిద్దరి తలలు నరికేడు. గదతో గరుడుని రెక్కలను చెదరగొట్టిన మాల్యవంతుని శిరస్సును శ్రీహరి చక్రంతో ఖండించాడు.

వ. ఇట్లు పరమపురుషుండగు హరి కరుణాపర్వతంబునఁ బ్రత్యుపలబ్ధ మనస్కులైన వరుణవాయువాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు, వారు వారలం దలపడి నొప్పించి; ర య్యవసరంబున.

347

తా ॥ ఈ విధంగా పరమ పురుషుడైన హరి యొక్క కరుణతో తిరిగి లేచిన వరుణుడు, వాయువు, ఇంద్రుడు మొదలైన ప్రముఖులు ఇంతకు ముందు ఎవరు ఎవరితో యుద్ధం చేస్తున్నారో తిరిగి వారితో తలపడ్డారు.

క. బాహు బలంబున నింద్రుఁడు, సాహసమున బలిని గెలువ సమకట్టి సము
త్సాహమున వజ్ర మెత్తిన, హాహా నినదంబు సేసి రఖిల జనంబుల్.

348

తా ॥ అప్పుడు బాహుబలంతో ఇంద్రుడు బలిని గెలుద్దామనే కాంక్షచేత ఉత్సాహంతో వజ్రాయుధాన్ని ఎత్తేసరికి రాక్షసులందరూ హాహాకారాలు చేశారు.

వ. ఇట్లు సముద్యత భిదుర హస్తుండై యింద్రుండు దన పురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచన నందనుని ఉపలక్షించి యిట్లనియె.

349

తా ॥ ఈ విధంగా వజ్రాయుధాన్ని ధరించి ఇంద్రుడు తన ఎదుట పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్న బలిచక్రవర్తితో ఇలా అన్నాడు:

మ. 'జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె? ధైర్యంబె?తా మగవాఁ డయ్యునుఁ దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్ బగవానిం గని డాఁగెనేని మెయి సూపం జాలఁడేనిం గటా! నగరే బంధులు? దిట్టరే బుధులు? గన్యల్ గూర్తురే? దానవా!

350

తా ॥ "ఓ దానవ వీరుడా! లోకంలో శత్రువును మాయచే గెలవటం అదీ ఒక శౌర్యమేనా! ధైర్య ప్రకటన మేనా! పౌరుషం కల వీరుడు తన శక్తి సామర్థ్యాలను తెలుసుకోవాలి. ఎదిరించ కలిగే సామర్థ్యము ఉండి కూడా శత్రువును చూసి భయపడి దాక్కుంటే జనులు నవ్వరా?

శా. మాయల్ సేయఁగ రాదు పో; నగవులే మాతోడి పోరాటముల్? దాయా! చిక్కితి; వ్రక్కలించెదఁ గనద్దంభోళి ధారాహతిన్; నీ యిష్టార్థము నెల్లఁ జూడుము వెసన్ నీ వారలం గూడుకో నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ!

351

వ. అని యుపాలంభించిన విని విరోచన నందనుం డిట్లనియె.

352

తా ॥ ఓ దుర్మతీ! ఇక నీ మాయలు కుదరవు. మాతో పోరాటం అంటే నవ్వులాట కాదు. నాకు చిక్కావు. నా వజ్రాయుధంతో నిన్ను చీలుస్తాను. నీకు ఇష్టమైనవన్నీ ఒక్కసారి చూసుకో. త్వరలో నీ వాళ్ళను కలుసుకొంటావు. నీ దురహంకారాన్ని ఇప్పుడే అణచి వేస్తాను." దానిని విన్న బలి చక్రవర్తి ఇలా అన్నాడు:

శా. నీవే పోటరివే? సురేంద్ర! తెగడన్ నీకేల? గె ల్పోటముల్ లేవే? యెవ్వరి పాలఁ బోయినవి? మేల్గీడుల్ విరించాదులుం ద్రోవం జాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా దైవం బేమి? కరస్థలామలకమే! దర్పోక్తులుం బాడియే?

353

తా ॥ "ఓ సురేంద్రా! నీవొక్కడివే మేటిగాడవు కావు. నిందించటం నీకు తగదు. యుద్ధంలో గెలుపు – ఓటమి ఉంటాయి, ఎవరికైనా అవి తప్పవు. మేలుకీడులు బ్రహ్మాదులు సైతం తప్పించుకోలేరు. సంతోషించటం కాని శోకించటం కాని తగదు. అదృష్టం అంటే అరచేతిలో ఉసిరికాయ అనుకొంటున్నావా? నీ గర్వోక్తులు ఇక చాలించు.

ఆ. జయము లపజయములు సంపద లాపద, లనిల చలిత దీపికాంచలములు చంద్రకళలు మేఘచయములు దరఁగలు, మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు.

354

తా ॥ అమరేంద్రా! జయాపజయములు, సంపదలు, ఆపదలు ఇవన్నీ శాశ్వతాలు కావు. గాలికి కదిలే దీపాలు, చంద్రకళలు, మేఘసమూహములు, కెరటములు, మెరుపు తీగల వంటివి. కనుక మిడిసి పడకు."

వ. అని యి ట్లాక్షేపించి.

355

క. వీరుఁడు దానవ నాథుఁడు, నారసముల నింద్రు మేన నాఁటించి మహా ఘోరాయుధకల్పములగు, శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్.

356

తా ॥ అని ఇట్లా అక్షేపించి వీరుడైన దానవ నాథుడు బాణాలను ఇంద్రునిపై ప్రయోగించాడు. అంతేకాక, శౌర్యముతో కూడిన మాటలను దేవేంద్రుని చెవులను బాధించునట్లు పలికాడు.

వ. ఇట్లు తథ్యవాది యైన బలిచే నిరాకృతుండై.

357

క. శత్రువు నాక్షేపంబునఁ దోత్త్రాహత గజము భంగిఁ ద్రుళ్ళుచు బలి నా వృత్రారి వీచి వైచిన, గోత్రాకృతి నతఁడు నేలఁగూలె నరేంద్రా!

358

తా ॥ ఓ పరీక్షిన్నరేంద్రా! ఈ విధంగా సత్యభాషణ చేసిన బలి తిరస్కార వాక్యాలకు దేవేంద్రుడు, అంకుశంతో పొడిచిన ఏనుగువలె త్రుళ్ళి పడ్డాడు. ఆగ్రహంతో వజ్రాయుధంతో బలిని కొట్టేసరికి అతను పర్వతం వలె నేలకూలాడు.

క. చెలికాని పాటు గనుఁగొని, బలి సఖుఁడగు జంభుఁ డతులబాహాశక్తిం జెలితనము సాల నెఱపుచు, నిలు నిలుమని వీఁకఁ దాఁకె నిర్జర నాథున్.

359

తా ॥ అప్పుడు తన చెలికాని పాటు చూసి, బలి చక్రవర్తి సఖుడైన జంభుడనే వాడు తన స్నేహాన్ని ప్రకటిస్తూ తన బాహు పరాక్రమంతో నిలు నిలుమంటూ ఇంద్రుణ్ణి ఎదుర్కొన్నాడు.

క. పంచానన వాహనుఁడై, చంచద్గద జంభుఁడెత్తి శైలారిని దాఁ

కించి సురేభంబును నొ, ప్పించి విజృంభించి యార్చి పేర్చెం గడిమిన్.

360

తా ॥ సింహంపై కూర్చొని గదను ఎత్తి ఇంద్రునికి తాకించి ఐరావతాన్ని నొప్పించి విజృంభించి ఉప్పొంగిపోతూ కేకలు వేశాడు.

క. వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁ కయుఁ గదలింపలేక దుస్సహపీడన్ మోఁకరిలఁ బడియె నేలను, సోఁ కోర్వక దిగ్గజంబు సుడిసుడి గొంచున్.

361

తా ॥ జంభుని గదాఘాతానికి తోకను కదిలింపలేక, భరింపరాని వేదనతో దిగ్గజమైన ఐరావతం మోకరిల్లుతూన్నట్లుగా నేలపై వాలి పోయింది.

వ. అయ్యెడ.

362

క. సారథి వేయు హయంబుల, తే రాయిత పఱచి తేర దేవేంద్రుఁడు దా<br>
నారోహించెను దైత్యుఁ డు, దారత మాతలిని శూలధారం బొడిచెన్.

363

తా ॥ అప్పుడు సారథి అయిన మాతలి వేయి గుర్రాలుకల రథాన్ని ఆయత్తం చేసి తీసుకొనిరాగా ఇంద్రుడు దానిని ఆరోహించాడు. అప్పుడు జంభుడు మాతలిని శూలంతో పొడిచాడు.

ఆ. శూల నిహతి నొంది స్రుక్కక యార్చిన, సూతు వెఱకు మంచు సురవిభుండు వాని శిరముఁ దునిమె వజ్రఘాతంబున, దైత్యసేన లెల్లఁ దల్ల డిల్ల.

364

తా ॥ జంభుని బల్లెం దెబ్బకు మాతలి కేకలు వేసే సరికి భయపడవద్దని చెబుతూ ఇంద్రుడు, జంభుని శిరస్సును వజ్రాయుధంతో ఖండించాడు. అది చూసి దైత్యసేన అంతా తల్లడిల్లి పోయింది.

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు సచ్చుట నారదుండు సె
ప్పిన విని వాని భ్రాతలు గభీర బలాధికుఁ డా బలుండు పా
క నముచు లాపురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘన జలధారలన్ నగముఁ గప్పిన చాడ్పునఁ గప్పిరమ్ములన్.

365

తా ॥ దేవేంద్రుని చేతిలో రణరంగంలో జంభుడు చచ్చిపోయాడనే విషయం నారద మహర్షి చెప్పగా విని వాని సోదరులైన బలుడు, పాకుడు, నముచి అనేవారు విన్నారు. బలపరాక్రమశాలురైన వారు రణరంగంలో దూకి దేవేంద్రుణ్ణి పౌరుషమైన మాటలతో తూలనాడుతూ, జలధారలు పర్వతాన్ని కప్పిన రీతిలో బాణాలతో ముంచేసారు.

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్ని కోలల బలుఁ డదర నేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును నా రీతి నింద్రు ప్రత్యంగకమును
వేధించెఁ; బాకుండు వింట వాఁ డస్త్రంబు లేయుట దొడుగుట యెఱుఁగరాదు;
కనకపుంఖంబుల కాండంబు లొకపది యేనింట నముచియు నేసి యార్చె;

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత, సహితు ముంచి రస్త్రజాలములను వనజలోక
సఖుని వాన కాలంబున, మొగిలు గములు మునుఁగ మూఁగినట్లు.

366

తా ॥ ఇంద్రుని వేయి గుర్రాలను వేయి బాణాలతో ఆ బలాసురుడు కప్పేశాడు. రెండు వందల బాణాలతో ఇంద్రుని సారథి అయిన మాతలిని, మరో రెండు వందలతో రథాన్ని, ఆ

విధంగానే ఇంద్రుని ప్రతి అవయవాన్ని వేధించాడు. పాకాసురుడు వింటితో బాణాలను ఎక్కుపెట్టడం తెలియనంత వేగంతో యుద్ధం చేశాడు. బంగారు పిడి గల పదిహేను బాణాలను నముచి ప్రయోగించి భీకరంగా కేకలు పెట్టాడు. ఈ విధంగా వానకాలంలో మేఘాలు భానుడిని కప్పేసినట్లుగా ముగ్గురూ ఇంద్రుని రథాన్ని, సారథిని అస్త్రాలతో ముంచి వేశారు.

వ. అయ్యవసరంబున.

367

మ. అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే;
యమరాధీశ్వర! యంచు భిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియన్ దైత్యాధిప వ్యూహ మ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్వానంబులం జేయుచున్.

368

తా ॥ ఆ సమయంలో, రాక్షసుల యొక్క బాణసమూహానికి గురి అయ్యావా! అయ్యో! అమరాధీశ్వరా! అని ఆర్తనాదాలు చేస్తూ కూలిన చెట్లవలె, సముద్రంలో మునిగి పోతూన్న వర్తకుల మాదిరిగా దేవతలందరూ ఆ విపత్తులో చిక్కుకొని హాహాకారాలు చేయసాగారు.

శా. 'ఓహో దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ' నం చంబు భృ
ద్వాహుం డా శరబద్ధ పంజరము నంతం జించి తేజంబునన్
వాహోపేత రథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా మార్తాండు చందంబునన్.

369

తా ॥ అప్పుడు దేవేంద్రుడు, 'ఓహో! దేవతలారా! బాధపడకండి! నేను క్షేమంగానే ఉన్నాను' అని అరుస్తూ తన చుట్టూ కప్పేసిన శరపంజరాన్ని చీల్చుకుని తేజస్సుతో గుర్రాలతో

కూడిన రథంతో బయటకు వచ్చాడు. రాత్రి గడిచాక ఉదయ కాలంలో పొడుచుకొచ్చే మార్తాండునిలా వెలువడ్డాడు ఇంద్రుడు.

వ. ఇట్లు వెలువడి.

370

చ. విఱిగిన సేనఁగాంచి సువీరుఁ 'డొహో!' యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాకబల మస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వాని చుట్టముల్
వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్.

371

తా ॥ ఇట్లా బయటకు వచ్చిన ఇంద్రుడు పౌరుషం విడిచి పరుగెడుతున్న తన సైన్యాన్ని చూసి ఓహో అంటూ బిగ్గరగా పిల్చి తిరిగి వారందరినీ యుద్ధానికి పురికొల్పాడు. అప్పుడు పాకుని యొక్క తలను, బలాసురుని శిరస్సును నిశితమైన అస్త్రధారల చేతను, కాంతులు చిమ్మే వజ్రాయుధం చేతను నేలకూల్చాడు. దానితో బలిచక్రవర్తి అనుచరులు భయపడ్డారు, సేనాపతులు భయంతో పారిపోయారు.

వ. అప్పుడు నముచి నిలువంబడి.

372

మ. తనచుట్టంబులఁ జంపెఁ వీఁడనుచు నుద్యత్క్రోధ శోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటాసమేతంబునై
జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రునిపై 'దీన హతుండ వౌ' దని మృగేంద్రుం బోలి గర్జించుచున్.

373

తా ॥ అప్పుడు నముచి వచ్చాడు. తన బంధువులను చంపాడు అనే క్రోధంతో బాధపడుతూ చివరన బంగారము కలిగి, చిరు గంటలతో ఒప్పే శూలాన్ని, చూడటానికే భయంకరమైన దానిని దేవేంద్రుని మీదకు విసిరి దీనితో మరణం ఖాయం అంటూ సింహంలా గర్జించాడు.

శా. ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించి నా
నా కాండంబుల వాని కంఠము దెగ న్దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం ద్రుంపంగ లేదయ్యెఁ; వాఁ
డా కంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్.

374

వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి బలభేది దన మనంబున.

375

తా ॥ అలా ఆకాశం నుంచి వస్తూన్న నముచి శూలాన్ని ఇంద్రుడు ఖండించాడు. అనేక బాణ సముదాయంతో వాని కంఠాన్ని నరకడానికి ప్రయత్నించి చివరకు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. అది కూడా ఆ రాక్షసుని కంఠమును నరకలేక పోయేసరికి ఇంద్రుడు అత్యాశ్చర్యాన్ని పొందేడు. రాక్షసుడు మాత్రం ఒక్క పిసరు కూడా చలనం లేకుండా నిల్చున్నాడు.

సీ. 'కొండల ఱెక్కలు ఖండించి వైచుచో వజ్రమెన్నడు నింత వాఁడి సెడదు;
వృత్రాసురాదుల విదళించుచో నిది దిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని;
యింద్రుండఁ గానొకో యేను దంభోళియుఁ గాదొకో యిది ప్రయోగంబు సెడెనొ
దనుజాధముఁడు మొనతాఁకుఁ దప్పించెనో భిదురంబు నేఁ డేల బెండువడియె!'

ఆ. ననుచు వజ్రి వగవ 'నార్ద్ర శుష్కంబులం, జావకుండఁ దపము సలిపె నీతఁ డితర మెద్ది

యైన నింద్ర! ప్రయోగింపు, వైళ' మనుచు దివ్యవాణి పలికె.

376

తా ॥ 'కొండల రెక్కలను ఖండించేటప్పుడుసైతం నా వజ్రాయుధం ఎప్పుడూ ఇంత పదను కోల్పోలేదు. వృత్రాసురాదులను సంహరించేటప్పుడు కూడా తన పని పూర్తి చేసికాని ఇది వెనక్కి తిరుగలేదు. ఒకవేళ నేను దేవేంద్రుడను కానా? నేను ప్రయోగించిన ఆయుధం వజ్రాయుధం కాదా? అసలు ఈ రాక్షస వీరుడు వజ్రాయుధం దెబ్బకు ఎలా తప్పించుకున్నాడు. దీని ప్రయోగంలో లోపం జరిగిందా? లేనిచో ఇంత భయంకరమైన ఆయుధం నేడు బెండువలె ఎలా అయింది' అని అనుకొంటూ విచారిస్తూన్న దేవేంద్రునితో, "ఈ రాక్షసుడు తడి వాటితోనూ పొడి వాటితోను తనకు మరణం లేకుండా తపస్సులో వరాన్ని పొందాడు. కనుక వేరే దేనినైనా ప్రయోగించుమ" ని ఆకాశవాణి పలికింది.

వ. ఇట్లాదేశించిన దివ్యవాణి పలుకు లాకర్ణించి పురందరుండు.

377

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు, గాని సాధనంబు ఫేన మనుచు నది యమర్చి దాన నమరులు మెచ్చంగ, నముచి శిరముఁ ద్రుంచె నాకవిభుఁడు.

378

తా ॥ ఇలా పలికిన దివ్యవాణి పలుకులు విన్న ఇంద్రుడు తడిది పొడిది కాని సాధనం సముద్రపు నురుగు ఒక్కటే అని నిశ్చయించి దానిని తన వజ్రాయుధానికి అమర్చి దేవతలు మెచ్చగా ప్రయోగించి నముచి శిరస్సు ఖండించాడు.

వ. అ య్యవసరంబున.

379

సీ. పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముదము తోడ;

గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁ డును బరావసుఁడు నింపెనయఁ బాడి;
రమరాంగనాజను లాడిరి; దేవతా దుందుభులును మ్రోసె దురములోన; వాయు వహ్ని
కృతాంత వరుణాదులను బ్రతిద్వంద్వుల గెల్చి రుద్దండవృత్తి;

తే. నల్ప మృగముల సింహంబు లట్ల తోలి, రమరవర్యులు దనుజుల నదటు వాయ
నజుఁడు పుత్తేర నారదుఁ డరుగు దెంచె, దైత్యహరణంబు వారింప ధరణినాథ!

380

వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె.

381

తా ॥ దానితో దేవేంద్రుని పొగుడుతూ పుష్పాంజలులు సమర్పించి మునులు ఆనందంతో దీవించారు. గంధర్వులైన ఘనులు విశ్వావసుడు పరావసుడు ఇంపుగా పాడారు. దేవతా స్త్రీలు మనోహరంగా ఆడారు. దేవ దుంధుభులు మ్రోగాయి. యుద్ధంలో వాయువు అగ్ని యముడు వరుణుడు వీరంతా తమ శత్రువులను గెలిచారు. సింహం అల్పమృగాలను తోలినట్లు అమరులు రాక్షసుల అహంకారాన్ని అణచి వేశారు. ఆ సమయంలో బ్రహ్మ పంపించిన నారద మహర్షి ఇక రాక్షస సంహారం చాలు అని చెప్పడం కోసం దేవతల దగ్గరికి వచ్చాదు. వచ్చి వారితో ఇలా అన్నాడు:

శా. సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథ సంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును; విద్వేషుల్ మృతిం బొంది!రీ
యుద్ధం బేటికి? నింకఁజాలుఁ; బనిలేదో హో పురే;' యంచు సం
బద్ధాలాపము లాడి మాన్చె సురలం బాండవ్యవంశాగ్రణీ!

382

తా ॥ "దేవతలారా! అమృతం మీకు సిద్ధించింది. విష్ణువు దయచేత మీరంతా వృద్ధిలో

ఉన్నారు. మిమ్మల్ని ద్వేషించే వారు మరణాన్ని పొందారు. ఇక యుద్ధాన్ని ఆపండి! చాలు!" అని అంటూ తగిన మాటలు పలికి యుద్ధాన్ని మాన్పించాడు.

వ. ఇట్లు నారద వచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకలదేవ ముఖ్యులును త్రివిష్టపంబునకుం జనిరి; హతశేషులైన దైత్యదానవులు విపన్నుండైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరి శిఖరంబుఁ జేరిరి; విధ్వంసమాన కంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవనియైన తనవిద్య పెంపునం జేసి బ్రదికించె; బలియును భార్గవానుగ్రహంబున విగత శరీర వేదనుండై పరాజితుం డయ్యును లోకతత్త్వ విచక్షణుం డగుటం జేసి దుఃఖీంపక యుండె నని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె.

383

తా ॥ ఈ విధంగా నారద మహర్షి మాట మేరకు యుద్ధాన్ని చాలించి దేవతలంతా స్వర్గానికి వెళ్ళారు. చావగా మిగిలిన దైత్యులు, దానవులు విపత్తును పొందిన బలిచక్రవర్తిని తోడ్కొని పశ్చిమగిరి శిఖరానికి చేరుకున్నారు. యుద్ధరంగంలో మరణించిన రాక్షసులనందరినీ శుక్రుడు తన మృత సంజీవిని విద్యా ప్రభావం వలన బ్రతికించాడు. శుక్రుని అనుగ్రహం చేత శరీర బాధలు చల్లారాడు. ఓడిపోయినా, అపారమైన లోకజ్ఞానం కలవాడు కనుక బలిచక్రవర్తి దుఃఖీంచలేదు" అని పరీక్షిత్తుతో శుకమహర్షి ఇలా అన్నాడు:

సీ. 'కైలాసగిరి మీఁద ఖండేందు భూషణుఁ డొకనాఁడు గొలువున నున్నవేళ నంగనయై విష్ణుఁ డసురుల వంచించి, సురలకు నమృతంబు సూఱ లిడుట విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూతసంగములు గొలువ మధుసూదనుండున్న మందిరంబున కేగి పురుషోత్తముని చేతఁ బూజ వడసి

తే. తారు గూర్చుండి పూజించె దనుజ వైరిఁ, గుశలమే మీకు మాకును గుశల మనుచు మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి, హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి.

384

తా ॥ "ఒకనాడు కైలాస గిరి మీద శివుడు కొలువ్వు ఉండగా మోహినీ అవతారం ఎత్తి విష్ణువు రాక్షసులను వంచించి దేవతలకు అమృతాన్ని పంచి పెట్టిన సంగతి ప్రస్తావనకు వచ్చింది. వెంటనే శివుడు సతీదేవితో కూడి వృషభాన్ని ఎక్కి ప్రమథగణాలతో కూడి మధుసూదనుడు ఉన్న మందిరానికి వచ్చాడు. అలా వచ్చిన శివుని పురుషోత్తముడు పూజించాడు. కుశల ప్రశ్నలనంతరం మధుర భాషణంలో శివుడు హరిమీద మైత్రితో ఇలా అన్నాడు:

సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్వ్యాపకస్వరూప!
యఖిల భావములకు నాత్మయు హేతువు నైన యీశ్వరుఁడ వాద్యంతములును
మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణమై యమృతమై భూరిసత్య
మానంద చిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు నగుణ మఖిల

తే. సంభవస్థితి లయముల దంభకంబు, నైన బ్రహ్మంబు నీవ; నీ యంఘ్రియుగము నుభయ
సంగ విసృష్టులై యున్న మునులు, గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు.

385

తా ॥ "దేవా! జగత్స్వరూపంగా కనిపించే వాడా! దేవేశా! జగదీశా! ఈ కాలము, జగత్తూ ఈ రెంటి యొక్క వ్యాపకత్వానికి కారణమైన వాడా! అన్ని భావములకు ఆత్మయు హేతువు అయిన వాడవు నీవే! ఆద్యంతములు లేక అంతటా నిండి ఉన్న నీవు పూర్ణ స్వరూపుడవు. అమృత స్వరూపుడవైన వాడవు నీవు. నీవు దుఃఖాతీతుడవు, గుణాతీతుడవు, మార్పు చెందని శాశ్వతుడవు. అఖిలానికి కారణం నీవే. సృష్టి స్థితి లయములకు కారణం నీవే. స్వార్థాన్ని, అహంకారాన్ని విడిచిన మునులు కైవల్యాన్ని కోరి నీ పాదద్వయాన్ని సేవిస్తారు.

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి కొందఱు ధర్మ మనియుఁ జర్చించి కొందఱు సదసదీశ్వరుఁడని సరవిఁ గొందఱు శక్తి సహితుఁడనియుఁ జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁడనియుఁ దొడరి యూహింతురు తుది

సద్వయద్వయ సదసద్విశిష్ట సంశ్రయుఁడ వీవు;

తే. తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె, కంకణాదులు పసిఁడి యొక్కటియ కాదె? కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె? భేద మందును నిను వికల్పింప వలదు.

386

తా ॥ కొందరు నీవే బ్రహ్మమని అంటారు. కొందరు ధర్మం అనీ, కొందరు పురుష ప్రకృతులకు అతీతుడైనవాడివనీ అంటారు. శక్తి సహితుడవు నీవే అని, కొందరు నాశరహితుడవనీ, స్వతంత్రుడవనీ, అధికుడవనీ ఇలా రకరకాలుగా అనుకుంటారు. సత్తుకి అసత్తుకి ఆశ్రయం నీవే. వస్తు భేదం లేనప్పుడు ఆభరణాదులు, బంగారమూ ఈ రెండు ఒక్కటే కదా! సముద్రాలు ఎన్ని ఉన్నా అందులో ఉన్న నీరు ఒక్కటే కదా! ఆ కారణంగా పైకి భేదాలుగా కనిపిస్తున్నా వాస్తవంలో నీవు ఈ విశ్వానికంటే వేరైన వాడవు కాదు.

సీ. యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు; నిత్యుఁడనై యున్న నేను నెఱుఁగ
యన్మాయ నంధులై యమరాసురాదులు వనరెద రఁట; యున్న వారలెంత?
యే రూపమునఁ బొంద కేపారుదువు నీవు; రూపివై సకలంబు రూపుసేయ
రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచరాఖ్యమై విలసిల్లు దంబరమున

తే. ననిలుఁ డే రీతి విహరించు నట్ల నీవు, గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప; జగములకు నెల్ల బంధమోక్షములు నీవ, నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష!

387

తా ॥ నీరజాక్షా! నీ లీలలను మరీచి వంటి మహర్షులు సైతం తెలుసుకోలేరు. నిత్యుడనై ఉన్న నాకు సైతం తెలియదు. నీ మాయ తెలియక అజ్ఞానులై అమరులు, అసురులు కూడా బాధపడతారు. ఇంక మిగతా వాళ్ళ లెక్కేమిటి? నీవు ఏ రూపాన్ని పొందకుండా శోభిల్లుతూ ఉంటావు! రూపాన్ని పొంది సకలాన్ని పుట్టించి, రక్షించి, పిమ్మట లయం కావడానికి

కారణమవుతావు. సకల చరాచర రూపుడవై వెలుగొందుతూ ఉంటావు. ఆకాశంలో వాయువు ఏ రీతిలో విహరిస్తాడో అలాగే సర్వాత్మకుడవైన నీవు అంతటా ఉంటావు. ఈ జగత్తుకు బంధమోక్షములు నీవే! సర్వమూ నీవే!

మ. ఘనతన్ నీ మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నార; మే
నిను విన్నారము; చూడ మెన్నఁడును మున్ నీ యాఁడు చందంబు; మో
మెహినివై దైత్యులఁ గన్నుఁ బ్రామి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపముఁ జూపుమా! కుతకముం జిత్తంబునం బుట్టెడిన్.

388

తా ॥ ఓ పద్మనాభా! నీవు అనేక అవతారాలను ధరించడాన్ని చూసాను. కానీ మోహినీ అవతారంతో రాక్షసులను మోసగించి అమృతాన్ని దేవతలకు ఇచ్చిన రూపాన్ని చూడాలని మనస్సు కుతూహల పడుతూన్నది.

క. మగవాఁడ వై జగంబులఁ, దగిలిచి చిక్కులను బెట్టు దంటకు నీకున్ మగువ తనంబున జగములఁ, దగులము బొందింప నెంతతడవు ముకుందా!

389

తా ॥ ముకుందా! పురుషుడవై ఉంటూనే లోకాలను చిక్కులు పెట్టే నేర్పరివి. అట్టి నీకు నేర్పరివి ప్రకృతి రూపంలో లోకాలను ఆకర్షించడంలో ఆశ్చర్యం ఏముంటుంది?"

వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షింతుడై విష్ణుండు భావగంభీరమగు నవ్వు నివ్వటిల్ల న వ్యాసు దేవు న కిట్లనియె.

390

తా ॥ అని ఇట్లా పలుకుతూన్న శివుని పలుకులకు విష్ణువు గంభీరమైన ఒక్క నవ్వు నవ్వి

ఇలా అన్నాడు:

శా. 'శ్రీకంఠా! నిను నీవ యేమఱకు మీ చిత్తంబు రంజించెదన్,
నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము నీవై చూచెదేఁ జూపెదం;
గైకో నర్థము లంద్రు కాముకులు సంకల్ప ప్రభూతార్థముల్'

391

తా ॥ "శ్రీకంఠా! నీవు ఏమరుపాటు చెందకు. నీ చిత్తాన్ని రంజింప చేస్తాను. రాక్షసులను మోహింప చేసిన మోహినీ అవతారాన్ని నీవు చూస్తానంటే తప్పక చూపిస్తాను. మనః సంకల్పం వలన పుట్టిన కోరికలు తీర్చుకోవటం మంచిదే కదా!"

జగత్తును లయం చేసే ఈశ్వరునికి నిర్వికారుడైన ఆ పరబ్రహ్మం యొక్క మాయామోహిత స్వరూపం చూడాలనే భ్రాంతి కలిగింది.

## శ్రీహరి తన మోహినీ రూపముచే ఈశ్వరుణ్ణి మోహింప జేయుట

వ. అని పలికి, కమలలోచనుం. డంతర్హితుండయ్యె; నయ్యుమా సహితుం డయిన భవుండు విష్ణుండెటు వోయెనో యెందుఁ జొచ్చెనోయని దిశ దిశలం గలయ నవలోకించుచుండం దనపురోభాగంబున.

392

సీ. ఒక యెల దోఁటలో నొకవీథి నొక నీడఁ గుచకుంభముల మీఁది కొంగు దొలఁగఁ గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు సిక్కువడఁగ ననుమానమై మధ్యమల్లాడఁ జెక్కులఁ గర్ణకుండల కాంతి గంతు లిడఁగ నారోహభరమున నడుగులు దడఁబడఁ దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప

తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి, కనక నూపుర యుగళంబు గల్లనంగఁ గంకణంబులఁ ఝణఝణత్కార మెసఁగ, బంతిచే నాడు ప్రాయంపుటింతిఁ గనియె.

393

తా ॥ ఇంతలో ఎదురుగా ఒక ఉద్యానవనం కనిపించింది. ఆ వనంలో చెట్ల నడుమ బంతితో ఆడుతూ ఉన్న ఒక ఇంతి కనిపించింది. ఆమె నుదిటి మీద ముంగురులు ముసిరి ఉన్నాయి. గాలికి, పైట చెంగు తొలగిపోగా కొప్పు ముడి వీడిపోయింది. ఆ జవరాలి నడుము జవజవలాడగా, తళుకు చూపులు, దిక్కులను కప్పివేస్తున్నాయా అనేలా ఉంది. చేతి కంకణాలు ప్రకాశిస్తుండగా, చీరకుచ్చెళ్ళను ఎడమ చేతితో పట్టుకుని, కాలికి గల బంగారు అందెలు ఘల్లు ఘల్లు మని మ్రోగుతుండగా ఆమె బంతితో ఆడుకోసాగింది. విశ్వంతో క్రీడించే జగన్నాథునికి అసాధ్యమైనది ఏముంది!

వ. కని, మున్ను మగువ మరగి సగమయిన మగవాఁ డమ్మగువ వయో రూప గుణ విలాసంబు

దన్ను నూరింప గనుఱెప్పవ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున.

394

తా ॥ అంతట అర్ధనారీశ్వరుడైన శివుడు ఆ మగువ, రూప, గుణ, విలాసాల పాశంలో చిక్కి, చిత్తం మెత్తబడేలా చూపుని సారించాడు. ఆ జగన్మోహన స్వరూపానికి అర్ధనారీశ్వరుడైనవాడు కూడా లోబడినాడు.

శా. 'ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో? యీ యాఁదురూపంబు ము
న్నే కల్పంబులయందుఁ గాన; మఱుఁ డీ యింతిన్ సృజింపంగఁ దా
లేకుంటెల్ల నిజంబు, వల్లభత నీ లీలావతిం జేరఁగా
నే కాంతుండు గలండొ క్రీడలకు నా కీ యింతి సిద్ధించునే?'

395

తా ॥ స్త్రీలలో రత్నం వంటిదైన ఈమె ఎవరు? ఇటువంటి మూర్తిని నేను ఏ కల్పంలోనూ చూసి ఉండలేదు. ఈమె విధాత సృష్టికి అందనిది. ఈమెకు నాథుడయ్యేవాడు ఉన్నాడా? నాకు ఈమె లభిస్తుందా అని మోహంతో భావించాడు శివుడు.

వ. అని మఱియుం జెఱకువిలుతుని కోలలు మేరమీఱి దఱుమ నెఱబిరుదు వెఱంగుపడం దెఱవ దుఱిమిన తుఱుము బిగిముడి వదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన కురుల నొసలి మృగమద తిలకంపుటసలు మసల, వివవిస నగు మొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుపఁ, జిఱునగవు మెఱయ నునుఁ జెమటం దడంబడి పులకరములు గులకరములు గొన, హృదయానంద కందంబగు కందుకంబు గరారవిందంబునం దమర్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్లమెల్లన గెల్లాడు కరకమలంబుల గనక మణివలయంబుల ఝణఝణయనం గుచకలశంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడిం

దడంబడఁ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు, నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్ని పన్నిదంబులు సేసికొని బదుగునడుము బెడఁకి వడ వడ వడంకి నఱితి సరులు గలయం బడఁ దిరుగుచుఁ దిరుగునెడఁ బెనఁకువలుగొనఁ జెవుల తొడవుల రుచులు గటముల నటనములు సలుపఁ, బవిరి తిరిగి యొడియుచు, నొడసి కెలంకులన్ జడియిచు, జడిసి జడనుపడక వలువ నెలవు వదలి దిగంబడం, గటిస్థలంబునఁ గాంచీ కనకమణి కింకిణులు మొరయఁ, జరణ కటకమ్ములు గల్లు గల్లు మనం, గరకంకణ మణి గణములు మెఱయ, మితి దప్పిన మోహాతిరేకం బుప్పొంగ వెనుకొని యుఱికి పట్టుచుఁ, బట్టి పుడమిం బడవైచి, పాటు వెంటనే మింటికెగసినం గెంటక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయ నడుచుచు, నెగయు నెడం దిగంబడు తఱిని నీలంపు మెఱుంగు నిగ్గు సోగపగ్గంబుల వలలు వైచిరాఁ దిగిచిన పగిది వెనుకొనంగ, విలోకన జాలంబులు నిగిడించుచు, మగిడించుచుఁ, గర లాఘవంబున నొకటి, పది, నూఱు, వేయు సేసి నేర్పులు వాటించుచు, నరుణ చరణకమల రుచుల నుదయ శిఖరి శిఖర తరణి కరణి సేయుచు, ముఖచంద్ర చంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడ నెడ నురోజ దుర్గ నిర్గతచేలాంచలంబుఁ జక్క నొత్తుచుఁ గపోలఫలకాలోల ఘర్మజలబిందు బృందంబుల నఖాంకురంబుల నొనరించుచు, నధరబింబారుణ సంభ్రాంత సమాగత రాజకీరంబులం జోపుచు, ముఖసరోజ పరిమళాసక్త మత్తమధుపంబుల నివారించుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్తమరాళ యుగ్మంబులకుం దలంగుచు, విలాస వీక్షణానందిత మయూర మిథునంబులకు నెడఁగలుగుచుఁ, బొదరిండ్ల యీఱములకుం బోక మలంగుచుఁ, గరకిసల యాస్వాద కాముక కలకంఠ దంపతులకుఁ దూరమగుచుఁ, దీఁగె యుయ్యెలల నూఁగుచు; మాధవీ మండపంబు లెక్కుచుఁ, గుసుమరేణు పటలంబుల గుబ్బళ్లు వ్రాఁకుచుఁ, మకరందస్యంద బిందుబృందంబు నుత్తరించుచుఁ, గృతక శైలంబుల నారోహించుచుఁ బల్లవ పీఠంబుల పరిశ్రమంబు పుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడసూపుచు, నున్నత కేతకీ స్తంభంబుల నొరగుచుఁ, బుష్పదళ రచిత వాతాయనంబులం దొంగిచూచుచుఁ, గమల కాండ పాలికల నాలంబించుచుఁ, జంపక దేహళి మధ్యంబుల నిలువంబడుచుఁ; గదళికాపత్ర కవాటంబున

నుద్ఘాటించుచుఁ, బరాగ నిర్మిత సాలభంజికా నివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదికల నొలయుచు, రత్నపంజర శారికా నివహంబులకుం జదువులు సెప్పుచుఁ, గోరిన క్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చిన క్రియ వెఱఁగు పడుచు, వెఱఁగుపడిన క్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంత విభ్రమంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమయంబున.

396

తా ॥ శివుణ్ణి మన్మథుని బాణాలు తరుముతుంటే జగన్మోహిని తురుముకున్న కొప్పుముడి వీడి కురులు కదలి భుజములపైన మెడలపైన చెదరి పడ్డాయి. ఆమె ధరించిన నుదుటి కస్తూరి బొట్టు కరిగి పోయింది. నవ్వు ముఖం కాంతులు దశదిశలకు ప్రాకుతున్నాయి. లేత చెమటలో తడిసిన ఆమె శరీరం మీద పులకలు మొలకలు ఎత్తుతున్నాయి. హృదయానికి ఆనందాన్నిచ్చే బంతిని అరవిందం వంటి చేతితో పట్టుకున్నది. కమలముల వంటి చేతులతో బంగారు కంకణములు ఝణఝణ అంటూ మ్రోయ, కుచకలశములు ఒకదానితో ఒకటి రాచుకోగా కుడి ఎడమలకు తడబడేటట్లు బంతిని ఆకాశంలోకి ఎగురవేసింది. తనకు తానే కొన్ని చిన్న చిన్న పందెములు వేసుకొని నడుము వణకగా మెడలో హారాలు చిక్కుపడేటట్లు తిరిగింది. తిరిగేటప్పుడు చెవులకు ధరించిన ఆభరణాల కాంతులు చెక్కిళ్ళపై చిందులువేయ ఆమె గుండ్రంగా తిరుగుతూ బంతిని పట్టుకొని ప్రక్కలకు కదులుతున్నది. చేతి రత్నాల గాజులు మెరుస్తున్నాయి. మితిలేని మోహంతో బంతిని పట్టుకొంటూ మళ్ళీ నేలపై కొట్టుచూ వెంటనే పైకి ఎగిరినప్పుడు రెండు చేతులతోను పలుమార్లు కొడుతూ బంతి ఎగిరేటప్పుడు క్రిందకు దిగేటప్పుడు నీలపు వలలు వేసినట్లు అందమైన చూపులు చూస్తున్నది. చేతితో నేర్పుగా కొడుతూ ఒకటి పది నూరు వేయి అంటూ లెక్క పెడుతున్నది. విశ్వాతీతునికి విశ్వంతో ఆట కొత్తది కాదు కదా!

ఎర్రనైనటువంటి ఆమె చరణ కమలాల కాంతి ఉదయిస్తూన్న సూర్యబింబాన్ని పోలి ఉంది. ముఖమనే చంద్రుడు కురిపిస్తున్న వెన్నెలతో చంద్రమండలాలను పుట్టిస్తూన్నది. నుదుటి చెమట బిందువులను తన కొన గోళ్ళ చేత సుకుమారంగా మీటుతున్నది. కమలం వంటి ముఖ పరిమళానికి ఆశపడి వచ్చిన తుమ్మెదలను నివారిస్తున్నది. తన వద్ద మందగమనాన్ని అభ్యాసం చెయ్యటం కోసం వచ్చిన రాజ హంసలను తోలుతున్నది. విలాసయుతమైన తన చూపులకోసం ముచ్చటపడి వచ్చిన నెమళ్ళకు కొంచెం దూరంగా పోతున్నది. పొదరిండ్ల దరిచేరకుండా తిరుగుతూన్నది. తీగ ఉయ్యాలలు ఎక్కి ఊగుచూ, మాధవీ మండపాలను ఎక్కుతూ, పుప్పొడి గుట్టలు దాటుతూ, మకరందముల మడుగులు ఉత్తరిస్తూ, క్రీడా పర్వతాలపై ఎక్కి ఆనందిస్తూ, చిగుళ్ళ పీఠముల మీద కూర్చొని అలసట తీర్చుకుంటూ, తీగ ఇండ్లలో కనపడుతూ, ఉన్నతమైన మొగలి స్తంభాల మీద కొద్దిసేపు ఒరగుతూ, పూలరేకుల గవాక్షముల నుండి తొంగిచూస్తూ, మెట్ట తామరలను స్పృశిస్తూ, సంపెంగ గడపల మధ్య నిలబడుతూ, అరటి ఆకుల తలుపులు తెరుస్తూ, పుప్పొడి చేత నిర్మింపబడిన బొమ్మలను ఆదరిస్తూ, రత్నములచే అలంకరింపబడిన రాతి కట్టడాలకు ఆనందిస్తూ, చంద్రకాంత వేదికలను సమీపిస్తూ, రత్నపంజరంలో ఉండే గోరువంకలకు పాఠాలు చెబుతూ, సవిలాసంగా చూస్తూ చూసిన దానిని మెచ్చుకుంటూ మెచ్చిన దానికి ఆశ్చర్యపడుతూ మైమరుస్తూ ఏకాంతంగా ఆ వనంలో అనేక విభ్రమాలతో జగన్మోహిని విహరిస్తూన్నది.

ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁజూపుల, శూలి ధైర్యమెల్లఁ గోలుపోయి తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల, నాలి మఱచె నిజగణాలి మఱచె.



తా ॥ ఆ వాలుగంటి యొక్క వాలు చూపులకు శివుడు ధైర్యాన్ని కోల్పోయి తనను తాను మరచి భార్యను మరచి ప్రమథ గణాలను మరిచాడు. మోహం ఎంత బలీయమైనదో కదా!

వ. అప్పుడు.

398

ఆ. ఎగురవైచి పట్ట నెడలేమిఁ జే దప్పి, వ్రాలు బంతిఁ గొనఁగ వచ్చు నెడను బడఁతి వలువ
వీడి పడియె మారుతహతిఁ, జంద్రధరుని మనము సంచలింప.

399

తా ॥ అప్పుడు మోహినీ దేవి బంతిని ఎగురవేసింది కాని పట్టుకోవడానికి వీలుకాకపోయింది. జారిపడ్డ బంతిని తీసుకోవడానికి వచ్చే సందర్భంలో చంద్రధరుని మనస్సు చలించేలా గాలి తాకిడికి ఆమె వలువ ముడి వీడింది.

మ. రుచిరాపాంగిని వస్త్రబంధన వరన్ రోమాంచ విభ్రాజితం
గుచభారానమితం గరద్వయపుటీ గూఢీకృతాంగిం జల
త్కచ బంధం గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత సూడఁ గదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్.

400

తా ॥ అందమైన కడగంటి చూపులతో ఆమె దానిని కట్టుకునే ప్రయత్నం చేస్తుండగా ఆమె శరీరం పులకాంకితమైంది. కొప్పుముడి వీడగా మనోజ్ఞ రూపంగా ఉన్న ఆమెను చూసి మన్మథావేశంతో శివుడు చలించి పోయాడు. తన కాంత అయిన సతీదేవి చూస్తున్నా లక్ష్య పెట్టక మోహినీదేవి చేయి పట్టుకోవడానికి వెళ్ళాడు.

ఆ. పదము సేరవచ్చు ఫాలాక్షుఁ బొడగని, చీరవీడి పడిన సిగ్గుతోడ మగువ నగుచుఁ దరుల
మాటున డాఁగెను, వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె.

401

తా ॥ తనను చేర వస్తున్న ఫాలాక్షుణ్ణి చూసి వలువ జారి పోయిందనే సిగ్గుతో మగువ

నవ్వుతూ చెట్లచాటుకు వెళ్ళింది. శివుడు ఆమె వెంట పడ్డాడు.

మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
డబలా! పోకుము; పోకుమీ యనుచు డాయం బాఱి కెంగేలఁ ద
త్కబరీ బంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ల నోలార్చె నం
త బహిః ప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్తయై.

402

తా ॥ మదించిన మగ ఏనుగు ఈడు వచ్చిన ఆడ ఏనుగుతో రమించడానికి వెడుతూన్నట్లు శివుడు 'అబలా పోకు! పోకు!' అని అంటూ తన చేతితో ఆమె జుట్టు పట్టుకొని వేగిరపాటుతో కౌగిలించుకొన్నాడు. కామవాంఛతో ఉన్న అతని బాహువుల నుండి ఆ మాయారూపిణి పట్టు విడిపించుకున్నది.

సీ. వీడి వెన్నున నాడు వేణిభరంబుతో జఘన భారాగత శ్రాంతితోడ
మాయావధూటియై మఱలిచూచుచుఁ బాఱు విష్ణునద్భుత కర్ము వెంటఁ దగిలి
యీశాను మరల జయించె మరుం డనఁ గరిణి వెన్నను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు దాఁటి శంభుఁడు సనం దన్మహాత్ము

తే. నిర్మలామోఘ వీర్యంబు నేలమీఁదఁ బడిన చోటెల్ల వెండియుఁ బైఁడి యయ్యె ధరణి
వీర్యంబు వడఁ దన్నుఁదా నెఱింగి దేవ మాయాజడత్వంబు దెలిసె హరుఁడు.

403

తా ॥ వీపుపై కదలాడే జడతో పిరుదుల భారంచేత అలసి సొలసి నడుస్తూ వెనుతిరిగి చూస్తున్నది. ఆమెను ఆడ ఏనుగును వెంటాడే మగ ఏనుగువలె, మన్మథుడు తిరిగి శివుడిని జయించాడా అన్నట్లు వెంటాడినాడు. ఆమె వెంట ఈశ్వరుడు కొండలు, ఏరులు, కొలనులు, వనములు దాటి వెళ్ళాడు. అప్పుడు నిర్మలము, అమోఘము అయిన ఈశ్వరుని రేతస్సు నేలమీద

పడేసరికి పడిన చోటెల్లా వెండిగా బంగారంగా మారిపోయింది. అప్పటికి ఆ ముక్కంటికి జ్ఞానోదయమై విష్ణు మాయను తెలుసుకొన్నాడు.

క. జగదాత్మకుఁడగు శంభుఁడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగతత్రపుఁడై నిలిచెను, మగువతనం బుడిగి హరియు మగవాఁడయ్యెన్.

404

తా ॥ ఈ జగత్తుకు ఆత్మస్వరూపుడైన ఈశ్వరుడు తన మహిమాతిశయం వల్ల శ్రీహరి మాయను తెలుసుకొని వెనుతిరిగాడు. అంతట స్త్రీ రూపాన్ని విడిచి శ్రీహరి కూడ తన స్వస్థితికి వచ్చాడు.

ఆ. కాము గెలువవచ్చుఁ గాలారి గావచ్చు, మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాఁడువారి చూపుటంపఱ, గెలువంగ వశము గాదు త్రిపురవైరి కైన.

405

తా ॥ కామున్ని గెలువ వచ్చు. యముని ధిక్కరించ వచ్చు. మృత్యువును జయించ వచ్చు. ఆడవారి ఓరచూపులనే బాణాలను గెలవటం త్రిపురాంతకుడైన ఈశ్వరునికైనా సాధ్యం కాదు.

వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె.

406

తా ॥ ఈ విధంగా పురుషాకారాన్ని వహించిన విష్ణువు శివునితో ఇలా అన్నాడు:

సీ. 'నిఖిలదేవోత్తమ! నీ ఒక్కరుఁడు దక్క నెవ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు?
మానిని యైన నా మాయచే మునుఁగక ధృతి మోహితుండవై తెలిసి తీవు
కాలరూపంబునఁ గాలంబుతోడ నాయందును నీ మాయ యధివసించు
నీ మాయ నన్ను జయింప నేరదు నిజ మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య

తే. మిపుడు నీ నిష్ఠపెంపున నెఱింగి' తనుచు, సత్కరించిన సఖ్యంబు సాల నెఱపి దక్షతనయ
గణంబులుఁ దన్నుఁ గొలువ, భవుఁడు విచ్చేసెఁ దగ నిజభవనమునకు.

407

తా ॥ "నిఖిల దేవోత్తమా! నీవు ఒక్కడవు తప్ప నా మాయను తెలుసుకోవడానికి ఇతరులెవ్వరికీ సాధ్యం కాదు. మోహినిగా మారిన నా మాయలో పూర్తిగా మునుగక మోహితుడవైనా వెంటనే తెలుసుకొన్నావు. కాలరూపంలో కాలంతో కలిసి నాయందు నీ మాయ ఉంటుంది. కనుక నీ మాయ నన్ను జయింపనేరదు. అల్పజ్ఞులు తెలుసుకోలేని నా మాయను నీవు తెలుసుకున్నావు" అని సత్కరించగా, సతీదేవి గణములు తనను కొలుస్తూ ఉండగా శివుడు తన భవనానికి విచ్చేశాడు.

శా. పారావారముఁ ద్రచ్చుచో గిరి సముద్వాహార్థమై కచ్ఛపా
కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదార సుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా!

408

తా ॥ ఓ రాజా! సముద్రాన్ని తరించేటప్పుడు మందర పర్వతాన్ని ఉద్ధరించడం కోసం కూర్మావతారాన్ని ధరించిన శ్రీహరి యొక్క చరిత్రను వినినా కీర్తించినా సంసార సముద్రంలో మునిగి పోతున్న అల్పజ్ఞులైన జనులు శ్రేయస్సును పొంది విస్తారమైన సుఖాలను పొందుతారు. ఇది తథ్యం.

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకుం సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మల రేఖల్ విలసిల్లు శ్రీ విభునిఁ దన్మాయావధూరూపముం

దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్క రూపంబుగన్. 409

వ. అని చెప్పి శుకుం డిట్లనియె.

410

తా ॥ అసురులను స్త్రీ రూపంలో నేర్పుగా మోహింపచేసి, ఆపన్నులైన దేవతలకు అమృతాన్ని పంచిపెట్టాడు ఆ శ్రీహరి. నిర్మలంగా ప్రకాశించే ఆ విభునికి, ఆయన ధరించిన మోహినీ రూపాన్ని భావిస్తూ నమస్కరిస్తున్నాను. ఆ రూపం అజ్ఞానపు చీకట్లను రూపుమాపే సూర్యుని స్వరూపంగా భావిస్తాన" ని శుకుడు ఇలా అన్నాడు:

తే. నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న, వాఁడు సప్తమ మనువు వైవస్వతుండు; శ్రాద్ధదేవుం డనందగు జనవరేణ్య!, పదురు నందను లతనికిఁ బ్రకట బలులు.

411

వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, వృషద్ధుండును, వసుమంతుండును నను వారు పదుగురు రాజులు; పురందరుండను వాఁడింద్రుం; డాదిత్య మరుదశ్వి వసు రుద్ర సంజ్ఞులు గలవారు దేవతలు, గౌతమ కశ్యపాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠులనువారు సప్తర్షులయి యున్నవా; రందుఁ గశ్యపున కదితి గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుం డయ్యె; నిప్పు డేడు మన్వంతరంబులు సెప్పంబడియె; రాఁగల మన్వంతరంబులును శ్రీహరి పరాక్రమంబునుం జెప్పెద; దత్తావధానుండవై విను మని శుకుం డిట్లనియె.

412

తా ॥ "ఓ నరవరా! ఇప్పుడు నడుస్తూ ఉన్నది వైవస్వత మన్వంతరం. ఇది ఏడవ మనువు పాలించే కాలం. ఇతనినే శ్రాద్ధదేవుడు అంటారు. బలవంతులైన పదిమంది కొడుకులతనికి

ఉన్నారు. వాళ్ళ పేర్లు ఇక్ష్వాకుడు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, వృషధ్రుడు, వసుమంతుడు. ఈ పదిమందీ రాజులు. పురందరుడు అనేవాడు ఇంద్రుడు. ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, రుద్రులు అనే సంజ్ఞలు కలవారు దేవతలు. గౌతముడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, వసిష్ఠుడు అనేవారు సప్త ఋషులు. అందులో కశ్యపునికి అదితి గర్భంలో విష్ణువు వామన రూపంలో జన్మించి ఇంద్రునికి తమ్ముడయ్యాడు. ఇంతవరకు ఏడు మన్వంతరాలు చెప్పాను. రాబోయే మన్వంతరాలలో శ్రీహరి యొక్క పరాక్రమాన్ని గురించి చెపుతాను. నీవు శ్రద్ధగా వినవలసింది అని శుక మహర్షి ఇలా చెప్పడం ప్రారంభించాడు.

సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు వల్లభ లిటమున్న చెప్పితిఁ బరఁగుఁ దృతీయయు బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ;
ఛాయకుఁ దపతియు సావర్ణియును శనై శ్చరుఁడును గలిగిరి; సంవరణుఁడు

తే. దపతి నాలిగఁ గైకొనెఁ దా వరించె, నశ్వియుగళంబు బడబకు నవతరించె; వచ్చు నష్టమ వసుపు సావర్ణి; వాఁడు, తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ!



తా ॥ ఓ రాజా! విశ్వకర్మ కుమార్తెలు అయిన సంజ్ఞాదేవి, ఛాయాదేవి అనే పేర్లు కలవారు సూర్యునకు భార్యలుగా ఉన్నారని నేను ఇంతకు ముందు చెప్పాను. వీరిద్దరే కాకుండా మూడవ భార్య బడబ అనే ఆవిడ ఉంది. సంజ్ఞకు యముడు, శ్రాద్ధదేవుడు, యమున పుట్టారు. ఛాయాదేవికి తపతి, సావర్ణి, శనైశ్చరుడు కలిగారు. సంవరణుడు తపతిని భార్యగా చేసుకొన్నాడు. బడబకు అశ్వినీదేవతలు కలిగారు. ఇక రాబోయే కాలంలో సావర్ణి అనేవాడు ఎనిమిదవ మనువుగా వస్తాడు. ప్రస్తుతం ఆయన తపస్సులో ఉన్నాడు.

క. ఒకపరి సూచిన వెండియు, నొకపరి సూడంగ లేకయుండు సిరులకై యొక నొకని చేటు

వేళకు, నొకఁ డొక్కఁడు మనువుఁ గాంచి యుండు నరేంద్రా!

414

తా ॥ ఓ రాజా! ఒకసారి కనిపిస్తూ, మరొకసారి కనిపించని అశాశ్వతాలైన ఐశ్వర్యాల కోసం ఒక మనువు తన కాలపరిమితిని ముగించుకునే లోపునే, ఇంకొక మనువు కాచుకుని ఉంటాడు.

వ. సూర్య సావర్ణి మన్వంతరంబున నతని తనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపో విరజోమృత ప్రభులను వారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయుఁ, గృపుండును, మజ్జనకుండగు బాదరాయ ణుండును, ఋశ్యశృంగుండును సప్తర్షు లయ్యెదరు; వార లిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమ మండలంబులం జరియించు చున్నవారు; విరోచన నందనుండగు బలి యింద్రుం డయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె.

415

తా ॥ సూర్య సావర్ణి పాలించే ఎనిమిదవ మన్వంతరంలో అతని తనయులు నిర్మోహుడు, విరజస్కుడు మొదలైన వారు రాజులు అవుతారు. సుతపులు, విరజులు, అమృతులు, ప్రభులు అనువారు దేవతలుగా ఉంటారు. గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, ద్రోణాచార్యుని కొడుకైన అశ్వత్థామ, కృపాచార్యుడు, నా తండ్రి అయిన వ్యాసుడు, ఋష్యశృంగుడు వీరు సప్తర్షులు. వీళ్ళు ఇప్పుడు తమ యోగ బలంచేత తమ ఆశ్రమ ధర్మంలో ఉన్నారు. విరోచనుని కుమారుడైన బలి ఇంద్రుడవుతాడు". ఇంతవరకు చెప్పి శుకుడు తిరిగి చెప్పడం మొదలు పెట్టాడు:

సీ. బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుండై హరి వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరము కంటె సుభగమైన

సుతల లోకంబున సుస్థితి నున్నాఁడు వెతలేక యట మీఁద వేదగుహికి
నా సరస్వతికిఁ దా నట సార్వభౌముండు నాఁ బ్రభువయి హరి నాకవిభునిఁ

ఆ. బద విహీనుఁ జేసి బలిఁ దెచ్చి నిలుపును, బలియు నిర్జరేంద్రు పదము నొందు;
నింద్రపదము హరికి నిచ్చిన కతమున, దానఫలము సెడదు ధరణినాథ!

416

తా ॥ "ఓ రాజా! మునుపు బలి చక్రవర్తి తన పరాక్రమంతో స్వర్గలోకాన్ని కైవశం చేసుకోగా, శ్రీహరి వామనుడిగా వెళ్ళి మూడు అడుగులు దానమడిగాడు. దానమిచ్చిన బలి భగవంతుని ఆదేశానుసారం అమరావతి(స్వర్గ లోకం) కన్నా సొగసైన సుతలలోకానికి వెళ్ళి సుఖంగా ఉన్నాడు. అటు తరువాత విష్ణువు వేదగుహికీ, సరస్వతికీ 'సార్వభౌముడ' నే పేరుతో జన్మిస్తాడు. శ్రీహరి దేవేంద్రుని పదవిలో బలిని నిలుపుతాడు. విష్ణువు నుండి బలి దేవేంద్ర పదవి పొందినప్పటికీ బలి విష్ణువుకి ఇచ్చిన దానఫలం చెడదు, అది అలాగే ఉంది.

వ. అట మీఁదటి కాలంబున వరుణ నందనుండగు దక్షసావర్ణి తొమ్మిదవ మను వయ్యెడు; అతని కొడుకులు ధృతకేతు, దీప్తకేతు ప్రముఖులు రాజులును, బరమరీచిగర్గాదులు నిర్జరులును, నద్భుతుం డనువాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతు లగు వారలు ఋషులును నయ్యెద రందు.

417

తా ॥ అటు తరువాత కాలంలో వరుణుని కొడుకైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువు అవుతాడు. అతని కొడుకులైన ధృతకేతువు, దీప్తకేతువు మొదలైన ప్రముఖులు రాజులు అవుతారు. పరుడు, మరీచి, గర్గుడు మొదలైన వారు దేవతలు అవుతారు. అద్భుతుడు అనేవాడు ఇంద్రుడు గానూ, ద్యుతిమంతుడు మొదలైన వారు ఋషులుగానూ ఉంటారు.

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు, నకు జనించి రక్షణంబు సేయ

మూఁడు లోకములను మోదంబుతో నేలు, నద్భుతాఖ్య నొప్పు నమరవిభుఁడు.

418

తా ॥ ఆ కాలంలో శ్రీమహా విష్ణువు అంబుధారకు ఆయుష్మంతునికి జన్మిస్తాడు. మూడు లోకాలను సంతోషంతో అద్భుతుడు అనే పేరుతో పాలిస్తాడు.

వ. మఱియు నుపశ్లోక సుతుం డగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడిఁ; దత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖులు మునులును, శంభుండను వాఁ డింద్రుండును, విబుద్ధ్యాదులు నిర్జరులును నయ్యెద; రందు.

419

తా ॥ ఓ రాజా! పిమ్మట ఉపశ్లోకుని సుతుడైన బ్రహ్మసావర్ణి అనేవాడు పదవ మనువు అవుతాడు. అతని పుత్రులైన భూరిషేణుడు మొదలైనవారు రాజులవుతారు. హవిష్మంతుడు మొదలైన వారు సప్తర్షులు అవుతారు. శంభుడనే వాడు ఇంద్రుడు అవుతాడు. విబుద్ధుడు మొదలైనవారు దేవతలు అవుతారు.

ఆ. విశ్వసృజుని యింట విభుఁడు విషూచికి, సంభవించు నంశ సహితుఁ డగుచుఁ జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ, డనఁగ జగముఁ గాచు నవనినాథ!

420

తా ॥ ఓ రాజా! ఆ కాలంలో విశ్వసృజునికి విషూచికి శ్రీమహావిష్ణువు "విష్వక్సేనుడు" అనే పేరుతో జన్మించి శంభునితో చెలిమి చేసి లోకాలను రక్షిస్తాడు.

వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మను వయ్యెడి; మను తనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణి పతులును; విహంగము కామగమన నిర్వాణరుచు లనువారు సురలును, వైధృతుం దనువాఁ డింద్రుండును, నరుణాదులు

ఋషులును నయ్యెద; రందు.

421

తా ॥ ఆ తరువాత వచ్చే కాలంలో ధర్మసావర్ణి పదకొండవ మనువు అవుతాడు. ఆ మనువు యొక్క తనూజులు సత్యధర్ముడు మొదలైన పదిమంది రాజులు అవుతారు. విహంగములు, కామగమనులు నిర్మాణరుచులు అనేవారు దేవతలు అవుతారు. వైధృతుడు అనువాడు ఇంద్రుడు అవుతాడు. అరుణుడు మొదలయిన వారు సప్తర్షులు అవుతారు.

ఆ. అంబుజాత నేత్రుఁ డా సూర్య సూనుఁడై, దర్మసేతు వనఁగఁ దగ జనించి వైభవాఢ్యుఁ

డగుచు వైధృతుఁ డలరంగఁ, గరుణఁ ద్రిజగములను గావఁ గలఁడు.

422

తా ॥ ఆ కాలంలో విష్ణువు "ధర్మసేతువు" అనే పేరుతో సూర్యుని పుత్రుడుగా జన్మించి వైభవంతో ఒప్పారుతూ వైధృతుడు సంతోషించేటట్లుగా కరుణతో మూడు లోకాలను కాపాడుతాడు.

వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పంద్రెండవమను వయ్యెడి; నతని నందనులు దేవవ దుపదేవ దేవ జ్యేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముం దనువాఁ డింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తి తపాగ్నీధ్రకాదులు ఋషులును నయ్యెద; రందు.

423

తా ॥ అటు పిమ్మట భద్రసావర్ణి పంద్రెండవ మనువు అవుతాడు. అతని పుత్రులు దేవవంతుడూ, ఉపదేవుడు, దేవజ్యేష్ఠుడు మొదలైన వారు రాజులు అవుతారు. ఋతుధాముడు అనేవాడు ఇంద్రుడవుతాడు. హరితుడు ఇత్యాదులు దేవతలు, తపోమూర్తి, తపస్వీ, అగ్నీధ్రకుడూ ఇత్యాదులు ఋషులు అవుతారు.

ఆ. జలజలోచనుండు సత్యతపస్సూనృ, తలకు సంభవించుఁ దనయుఁ డగుచు ధరణిఁ
గాచు నంచిత స్వధామాఖ్యుఁడై, మనువు సంతసింప మానవేంద్ర!

424

తా ॥ ఆ కాలంలో విష్ణువు సత్యతపునికి సూనృతకు "స్వధాముడు" – అనే పేరుతో జన్మించి, మనువు సంతోషించేలాగా భూమిని పాలిస్తాడు.

వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదుమూఁడవ మనువయ్యెడి; మనుకుమారకులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులును, సుకర్మ సుత్రామ సంజ్ఞలు గలవారు బృందారకులును, దివస్పతి యను వాఁ డింద్రుండును, నిర్మోహ తత్త్వదర్శ్యాద్యులు ఋషులును నయ్యెద; రందు.

425

తా ॥ ఆ తరువాత కాలంలో దేవసావర్ణి అనేవాడు పదమూడవ మనువు అవుతాడు. మనుపుత్రులైన చిత్రసేనుడు, విచిత్రుడు మొదలైన వారు రాజులు అవుతారు. సుకర్ములూ, సుత్రాములూ దేవతలు అవుతారు. దివస్పతి అనేవాడు ఇంద్రుడు అవుతాడు. నిర్మోహుడు, తత్వదర్శుడు మొదలైన వారు సప్తర్షులు అవుతారు.

ఆ.ధరణి దేవహోత్ర దయితకు బృహతికి, యోగవిభుఁడు నాఁగ నుద్భవించి వనజనేత్రుఁ డా
దివస్పతి కెంతయు, సౌఖ్యమాచరించు జగతినాథ!

426

తా ॥ ఆ కాలంలో విష్ణువు దేవహోతకు, అతని భార్య అయిన బృహతికీ "యోగవిభుడు" – అనే పేరుతో ఉద్భవించి, దివస్పతికి ఎంతో సహాయం చేస్తాడు.

వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాల్గవ మను వయ్యెడి; మన

నందనులు గంభీరవస్వాదులు రాజులును, బవిత్రచాక్షుషు లనువారు దేవగణంబులును, శుచి యనువాఁ డింద్రుండును, నగ్ని బాహు శుచి శుక్ర మాగధాదులు ఋషులును నయ్యెద; రందు.

427

తా ॥ రాబోవు కాలంలో ఇంద్రసావర్ణి అనేవాడు పదునాల్గవ మనువు అవుతాడు. అతని కొడుకులు గంభీరుడు, వసువు మొదలయినవారు రాజులు అవుతారు. పవిత్రులు, చాక్షుషులూ అనువారు దేవతలు అవుతారు. శుచి అనువాడు ఇంద్రుడు అవుతాడు. అగ్ని, బాహువు, శుచి, శుక్రుడు, మాగధుడు ఇత్యాదులు సప్తఋషులు అవుతారు.

తే. తనర సత్రాయణునకు వితానయందు, భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ విస్తరించుఁ గ్రియాతంతు విసరములను, నాకవాసులు ముదమంద నరవరేణ్య!

428

తా ॥ ఆ కాలంలో సత్రాయణునకు అతని భార్య అయిన వితానకు విష్ణువు "బృహద్భానుడు" – అనే పేరుతో జన్మించి దేవతలు ముదమందునట్లుగా క్రియాకలాపములను నిర్వర్తిస్తాడు.

క. జగతీశ! త్రికాలములను, బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెం; దగఁ బదునలువురు మనువులుఁ, దెగ యుగములు వేయు నడవ దివ మజున కగున్.

429

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

430

తా ॥ ఓ రాజా! భూత భవిష్యత్ వర్తమాన కాలములో గల ప్రసిద్ధ మనువుల గురించి ఈ

విధంగా చెప్పబడింది. అలా పద్నాలుగు మంది మనువులు అంతరించిన అది వేయి యుగాలు, అది గడిస్తే బ్రహ్మకు ఒక పగలు అవుతుంది." అని శుకుడు చెప్పేసరికి పరీక్షిత్తు ఇట్లా అడిగాడు:

ఆ. ఈ పదంబులందు నీ మను ప్రముఖుల, నెవ్వ రనుపువార లేమి కతన నధిక విభవులైరి? హరి యేల జనియించె?, నెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత!

431

వ. అనినం బారాశర్య కుమారుం డిట్లనియె.

432

తా ॥ "ఓ మునీంద్రా! మనువులను ఈ పదవుల్లో నియోగించేవారు ఎవరు? వారికి అంతటి గొప్ప వైభవం ఏమి చేస్తే లభించింది? ఆయా మన్వంతరాలలో విష్ణువు ఎందుకు జన్మిస్తాడు? వివరంగా తెలియజేయమ" నిన ఆ వ్యాస కుమారుడైన శుకుడు ఇలా అన్నాడు:

సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు నమరులు హరియాజ్ఞ నడఁగువారు
యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు లా మనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు రొగి నాల్గుయుగముల కడపటఁ గాల సంగ్రస్తమైన
నిగమచయంబును నిజతపోబలముల మరలఁ గాంతురు ఋషివరులు; దొంటి

తే. పగిది ధర్మంబు నాలుగు పాదములును, గలిగి వర్తిల్లు; మనువులు గమల నేత్రు నాజ్ఞఁ దిరుగుదు; రేలుదు రవనిపతులు, జగతి భాగించి తమ తమ సమయములను.

433

తా ॥ "మనువులు, సప్తర్షులూ, మనువు యొక్క సంతానమూ, ఇంద్రులూ, అమరులు వీరంతా విష్ణువు యొక్క ఆజ్ఞకు లోబడే ఉంటారు. యజ్ఞుడు మొదలైన వారందరూ శ్రీహరి యొక్క అంశలుగా రూపుని దాల్చగా, మనువులు వారి సహాయంతో లోకాలను పరిపాలిస్తూ ఉంటారు. నాలుగు యుగముల తరువాత చివరలో కాలం వేదాలను కబళిస్తుంది. అప్పుడు తిరిగి

ఋషులు వాళ్ళ తపోబలం చేత వేదాలను మళ్ళీ దర్శిస్తారు. పూర్వం వలెనే ధర్మం నాలుగు పాదాల మీద నడుస్తుంది. విష్ణు భగవానుని ఆజ్ఞ మేరకు మనువులు పరిపాలన చేస్తారు. రాజులు ఈ జగత్తును విభాగించుకొని తమ తమ కాలాలలో వారు పాలిస్తారు.

వ. మఱియుఁ బ్రాప్తులయిన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహితకర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు; లోకంబులు సువృష్టులై యుండును.

434

తా ॥ అర్హత ఉన్నవారిని ఇంద్ర పదవిలోను, కొందరిని అనేక విధాలైన దేవపదములయందు శ్రీహరి ప్రతిష్ఠ చేస్తాడు. వాళ్ళు వారి కర్మలను ఆచరిస్తూ లోకాలను పాలిస్తారు. దాని వలన లోకాలన్నీ సుభిక్షంగా ఉంటాయి.

సీ. యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు మౌని రూపమునఁ గర్మంబుఁ దాల్చి
సర్గంబు సేయుఁ బ్రజాపతి రూపుఁడై యింద్రుఁడై దైత్యుల నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ గాలరూపమునఁ బాకంబు సేయుఁ
నానావిధములైన నామరూపంబులఁ గర్మలోచనులకుఁ గానఁబడఁడు.

ఆ. చనిన రూపములను జనురూపముల నింకఁ, జనఁగనున్న రూపచయము నతఁడు వివిధుఁడై యనేకవృత్తుల వెలిఁగించు, విష్ణుఁ డవ్యయుండు విమల చరిత!

435

తా ॥ ఓ విమల చరితా! శాశ్వతుడైన విష్ణువు విషయాసక్తులకు కనబడడు. అతడు మూడు కాలాల్లోనూ వివిధ రూపాల్లో, అనేక వృత్తుల్లో వెలుగొందుతాడు. అతడు యోగీశ్వరుని రూపంలో యోగాన్ని బోధిస్తున్నాడు. మౌనిరూపాన కర్మానుష్ఠానాన్ని ప్రబోధిస్తాడు. ప్రజాపతి రూపంగా సృష్టిని చేస్తాడు. ఇంద్రుడై రాక్షసులను సంహరిస్తాడు; సిద్ధునిగా జ్ఞానబోధను చేస్తాడు.

కాలరూపంగా సర్వాన్ని కడ తేరుస్తాడు. ఈ విధంగా అన్నీ తానే, అంతా తానై ఉంటాడు.”

# వామన చరిత్ర కథా ప్రారంభం

వ. అనిన భూవరుం డిట్లనియె.

436

మ. బలి నంభోరుహ నేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె? ని
శ్చలుఁడుం బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమా సంపన్నుఁడై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్.

437

వ. అనిన శుకుం డిట్లనియె.

438

తా ॥ అంతట పరీక్షిత్తు ఇలా ప్రశ్నించాడు: "పూర్ణ పురుషుడైన విష్ణువు ఎటువంటి కోరికలు లేనివాడు, వాటికి అతీతుడైనవాడు. అంతేకాక సిరుల తల్లిని కూడి ఉన్నవాడు, నిశ్చలుడు, అటువంటివాడు దీనుని వలె బలి చక్రవర్తిని మూడడుగుల నేల కోసం ఎందుకు యాచించ వలసి వచ్చింది? అంతేకాదు, ఏ తప్పు చేయని పుణ్యాత్ముడైన బలిని ఎందుకు బంధించాడు? నాకు తెలుసుకోవాలని ఎంతో కుతూహలంగా ఉంద" నగా శుకుడు ఇలా చెప్పసాగాడు:

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబురాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప వారు నాతని భక్తి వలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప భవ్యకాంచనపట్ట బద్ధ రథము
నర్కువాజులఁ బోలు హరులఁ గంఠీరవ ధ్వజము మహాదివ్యధనువుఁ బూర్ణ

తే. తూణయుగళంబుగఁ గవచంబుఁ దొలుత హోమ, పావకుం డిచ్చె; నమ్లాన పద్మమాలఁ

గలుష హరుఁడగు తన తాత కరుణ నొసఁగె;, సోమ సంకాశ శంఖంబు శుక్రుఁ డిచ్చె.

439

తా ॥ "దేవాసుర యుద్ధంలో, ఇంద్రుని చేతిలో పరాజితుడైన బలి చక్రవర్తి గురువైన శుక్రాచార్యుని కృప వలన తేరుకున్నాడు. గురువు మనస్సుని గుర్తించి సేవించిన బలి యందు శుక్రాచార్యుడు ప్రసన్నుడై అతని భక్తికి మెచ్చుకున్నాడు. బలి చేత విశ్వజిత్ యాగాన్ని శాస్త్రోక్తంగా చేయించాడు. అంతట ఆ హోమాగ్ని నుండి సూర్యుని గుర్రాలను పోలిన గుర్రాలతో పూన్చిన స్వర్ణమయ రథం వెలువడింది. ఆ రథంలో గొప్పదైన విల్లూ, బాణాలతో కూడిన అమ్ముల పొదలు, కవచమూ ఉన్నాయి. ఆ రథానికి సింహపు గుర్తులు గల జెండా ఉంది. పుణ్యాత్ముడైన తాతగారు ప్రహ్లాదుడు మనవడైన బలికి వాడిపోని తామరపూల మాలను ఇవ్వగా, చంద్రకాంతితో సమానంగా మెరిసే శంఖాన్ని శుక్రాచార్యుడు ఇచ్చాడు.

వ. ఇ వ్విధంబున.

440

క. పాణియు, రథియుఁ గృపాణియుఁ, దూణియు, ధన్వియును స్రగ్వి తురగియు దేహ
త్రాణియు ధిక్కృత విమత, ప్రాణియు మణికనక వలయ పాణియు నగుచున్.

441

తా ॥ ఈ విధంగా బాణాలు, రథము, ఖడ్గము, తూణీరము, విల్లు, పూలదండ, గుర్రములు, కవచము, మణిఖచిత కనక కంకణాలను, సంపాదించిన పిమ్మట శత్రువులపై పగతీర్చుకోవాలని బలి నిశ్చయించుకొన్నాడు.

మ. పలుదానంబుల విప్రులం దనిపి తద్భద్రోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి, ని
ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై

వెలిఁగెన్ దానవభర్త శైల శిఖరోద్వేల్లద్దవాగ్ని ప్రభన్.

442

తా ॥ అంతట బలిచక్రవర్తి బ్రాహ్మణులకు అనేక దానాలు చేసి వారి ఆశీర్వచనములు అందుకొన్నాడు. పెద్దలైన వారికి నమస్కరించాడు. ఏకాగ్ర భక్తితో ఇలవేల్పులను పూజించాడు. నిర్మలుడైన ప్రహ్లాదునికి శిరస్సు వంచి నమస్కారం చేశాడు. తరువాత ప్రకాశమానమైన రథాన్ని అధిరోహించగా, ఆ బలి చక్రవర్తి, కొండ శిఖరాగ్రమందు వెలిగే దావాగ్నిని పోలిన ప్రకాశంతో వెలిగిపోయాడు.

క. దండిత మృత్యు కృతాంతులు, ఖండిత సుర సిద్ధ సాధ్య గంధర్వాదుల్
పిండిత దిశు లమరాహిత, దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్.

443

తా ॥ ఆ బలి చక్రవర్తికి పరాక్రమంలో సమ ఉజ్జీలైన దండనాథులు ఆయన ముందు వినమ్రతతో నిలిచి ఉన్నారు. వారంతా యమధర్మరాజుని, మృత్యువుని ధిక్కరించి దండించగలరు. దేవతలను, సిద్ధులను, సాధ్యులను, గంధర్వులను గెలువగలిగిన వీరులు. దిక్కులనే వణికించగల శూరులు.

క. చూపుల గగనము మ్రింగుచు, నేపున దివిభువియు నాత లీతల సేయన్ రూపించుచు
దనుజేంద్రుఁడు, ప్రాపించెను దివిజనగర పథము నరేంద్రా!

444

తా ॥ ఓ రాజా! ఈ విధంగా బలి చక్రవర్తి తన చూపులతో ఆకాశాన్ని కబళించేలా, నింగిని, నేలను తలక్రిందులు చేయగల ఉత్సాహంతో దేవతల నగరమైన అమరావతికి బయలు దేరాడు.

వ. ఇట్లు బలవంతుండగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమనంబుల సేసి, నిడుద పయనంబుల జని చని.

445

మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్న పీడాన్న ఖా
దన సంశోకముఁ బుష్ప పల్లవ ఫలోద్దామ ద్రుమానీకమున్
స్వనితోద్ధూత పతాకముం బ్రవిచరద్వైమానికానీకమున్
ఘన గంగాసలిలైకమున్ మఘవయుక్త శ్రీకమున్ నాకమున్.

446

తా ॥ ఈ ప్రకారంగా బలవంతుడైన బలి చక్రవర్తి, ఇంద్రునిపై పగ సాధిద్దామని చాలా దూరం ప్రయాణించి, స్వర్గాన్ని సమీపించాడు. ఆ స్వర్గం పుణ్యాత్ములకు నివాస స్థానం. అక్కడ రోగాలు, దుస్వప్నములు, ఆకలి బాధలు, దుఃఖాలు వంటివి ఏమీ ఉండవు. సువాసనగల పుష్పములు, చిగుళ్ళు, ఫలములతో నిండి ఉన్న చెట్లు విస్తారంగా ఉంటాయి. గాలికి సవ్వడి చేస్తూ జెండాలు ఎగురుతూ ఉంటాయి. దేవతా విమానములు తిరుగుతూ ఉంటాయి. పవిత్రమైన ఆకాశ గంగ ప్రవహిస్తూ ఉంటుంది. ఆ దేవేంద్రుని నగరం సంపదకు ఆలవాలం.

వ. కని రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పుగల వేల్పుల నెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికిం జని చని, ముందట నెడపడక మొనమోసి యిగురుచు చిగురు తలిరాకు జొంపంబునన మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁపదోరగాయ పండుగెలల తండంబుల వ్రేఁగు లాఁగలేక మూఁగి వీఁగి వ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకలకుఁ బేఁట లగు పెందోఁ టలును, దోఁటల గాటంబులై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు వివ్వక కసిమసలు గలిగి ముసరు కొసరి పూని పోని తేనియ లాని విసరు గలిగి మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని జుమ్మజుమ్మనుచు జంజాటించు తేఁటి దాఁటులును, దాఁటు వడక నాఁటుకొని కూడి జోడు వీడక క్రొమ్మావుల కమ్మని కొమ్మల నిమ్ముల ముసరి పసిమి గల

కిసలయమ్ములు వొసగంగ మెసంగి కిసరువడక కసరు సెడి బిట్టు రట్టడి తనంబు మించి కరాళించు కోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబునం దియ్యని పండ్లకుఁ గయ్యంబులు నేసి చయ్యన నెసరేఁగి, బేసంబులు గాసంబులు గొని వాసికెక్కి పలుబాసలాడు బహుప్రకారంబులగు కీరంబులును, గీరంబులకు సరిగడచి మింటినంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టుఁ జనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగల రవమ్ములు గలుగు కలరవమ్ములును, గలరవమ్ము లలరం గొలంకుల కెలంకులఁ గడంకలఁ బ్రియల నిడుకొని క్రమ్మిదొమ్మి సేసి యెలదమ్మి తూఁడుల వాఁడులగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయు కలహంసంబులును, హంసరుచి జనిత వికసనముల వికవిక నగుచుం బసగలిగి మిసమిస మెఱచు పసిడి కెందమ్ము లిందిరా మందిరమ్ముల చందంబులుగ నందమ్ములగు కొలంకులును, కొలంకుల కరళ్ళఁ దడిసి వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొని సాఁగిన తీగెయిండ్ల గండ్ల యీఱములం దోరములు సెడి పలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం దూఱలేక యీడిగిలం బడు గాడ్పులును, గాడ్పుల వలననెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమ పరాగంబులును, బరాగంబుల సరాగంబులగు వాఁగు వ్రంతల చెంతల గుంపులుగొని గఱిక జొంపంబులు లంపుదిని మంపులుగొని పెల్లు నెమర్లు వెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడల వాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకం గూడుకొని యిండ్ల వాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారిక లగుచు నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువులకు నిలువ నీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగ బుడుకు కల్పతరువులును, కల్పతరువుల పల్లవ మంజరులఁ గుంజరులకు విఱచి యిచ్చుచు, మచ్చికల కలిమి నిచ్చ మెచ్చుచుఁ గృతకగిరుల చఱుల సిరుల నడరు పడఁతుల నడలకు గురువు లగుచు మెఱయు మురువుల నొత్తరించు మత్తేభంబులును, నిభంబుల సరస నొరసికొని వరుసఁ బరుసఁదనము లెడలి సుకరములగు మకరతోరణస్తంభంబులును, తోరణస్తంభంబుల చేరువ నిలిచి చెఱకు విలుతుండొఱ

వెఱికిన బెడిదములగు నవకంపు మెఱుఁగుం జిగురు టడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం గరచరణాది శాఖలు గల చంద్రరేఖల పోఁడిమిని వాహిని గల మోహినీ విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గలిగి యనూనంబు లగు విమానంబు లెక్కి చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోకొన పోవు రంభాది కుంభికుంభకుచల కలకలంబులును, గలహంస కారండవ కోక సారసబృంద సుందర సుందరియు, నిందీవరారవింద నందదిందిందిరయు, సభంగయు నగు గంగ నింగికిం బొంగెనో యని మిగుల దిగులువడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును, నగడ్తల మిన్నేటి తేటనీట నీటులీను పాటి సూటి చల్లులాటలు మేటి కూటువలు గొనుచు నేచిన ఖేచర కన్యకావారంబులును, వారవనితానుపూజిత రాజిత దేహళీ పాటవంబులగు గోపుర కనక కవాటంబులును, గవాట వేదికాఘటిత మణిగణ కిరణోదారంబు లగు నింద్రనీల స్తంభ గంభీరతలును, గంభీర విమల కమల రాగ పాలికా వారంబులగు చతుర్ద్వారంబులును, ద్వార దేశంబుల చావిళ్ళం గావళ్లుండి ప్రొద్దువోక రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులు సెప్పికొనుచున్న యస్త్ర శస్త్రధారులు శూరులు నయిన మహాద్వారపాలక వీరులును, వీరరస జలధివేలోదారంబులయి శుద్ధస్ఫటికబద్ధ మహోత్తానంబులగు సోపాన సుభగాకారంబులును, సుభగాకార ప్రదీపంబులగు వజ్రమహారజత వప్రంబులును, వప్రోపరి వజ్రకుడ్య శిరోభాగ చంద్రకాంత తరుణ హిమకరకిరణ ముఖరంబు లగు సాలశిఖరంబులును; శిఖర స్తోమధామ నికృత్తతారకంబులును, దారతార మణి శిలా కఠోరంబు లగుచు మిగుల గరిత యగు నగరిసిరి మీఱ నమరు మొగులు వొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడి తెరలు వలువల బెడంగునం దోరంబులగు ప్రాకారంబులును, బ్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహాఖర్వ గంధర్వ వాహినీ పాలకంబులగు మరక తాట్టాలకంబులును, నట్టాలకోత్తుంగ వజ్రమయస్తంభోదంచనంబులును, బరభట ప్రాణవంచనంబులు సముదంచనంబులు నగు దంచనంబులును, దంచనంబుల తుదను రథంబుల యిరుసులు నొరసికొనం, గోట

యీావలి యావలి తివియని దివియల కరణి రుచిరము లగుచుఁ బచరించు నహిమకర హిమకర మండలంబులును, హిమకర మండలంబు నిద్దంపు టద్దంబని బూఁగి తొంగి చూచుచు నళిక ఫలకంబులఁ గులకములు గొను నలకములం దరపి తిలకములం దెఱఁగు పఱుచుకొను సమయముల వెనుక నొదిగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితర సతుల రతుల కనుమతులని కనుకనిన్ మరలి నీడ తలంగినం గలంగి చని కాంతులకు సొలయు ముగుదలకు నేకాంతంబులై గగన సముత్సేధంబులైన రాజసౌధంబులును, సౌధంబుల సీమల ముత్తియంపు సరులతోడి నిబ్బరపు గుబ్బచన్నులు చెన్నులం బ్రక్కలం జుక్కపదవులుండ మండిత సౌధ శిఖరంబులకు శృంగారంబులయిన భృంగారంబులును, భృంగారశయన జాలక డోలికా శ్రేణికాది విశేషరమ్యంబులైన హర్మ్యంబులును, హర్మ్యకనక గవాక్షరంధ్ర నిర్గత కర్పూర కుంకుమాగరు ధూపధూమంబులను, ధూమంబులు జీమూత స్తోమంబులని ప్రేమంబు లుబ్బ గొబ్బునం డబ్బాటు పబ్బంబు లబ్బెనని మరులుగొని పురుల వన్నియల సిరులు సరులు గొనం గుటవిటపములఁ దటపెట నటించుచుఁ బలుకులు విసిరి కికురువొడుచు వలతేని మఱుగ్రు చదువుల టీక లనం గేకలిడు నెమిళ్లును, నెమిళ్ల పురుల నారలు నారులగు రతనంపు విండ్ల నినదంబులను తలంపుం దోఁకలు వడసి వీఁకలు మెఱసి మూఁకలు గొని దివికెగిరి రవికిం గవిసిన రాహువు క్రియం దివిఁ దడంబడు పడగలును, బడగలును గొడుగులును దమకు నాలంబులకు నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబుల మెఱసి బెబ్బులుల గబ్బునం గరుల సిరుల సింగంబుల భంగుల శరభంబుల రభసంబుల ధూమకేతువుల రీతుల వైరిం జీరికిం గొనక శంకలుడిగి అంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్కసుల చక్కటి యెక్కటి కయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభట కదంబంబులును, గదంబకరవాల శూలాదుల మెఱుంగులు మెఱపుల తెఱంగుల దిశల చెఱంగులం దుఱంగలింప నేమి నినదంబులు దళములగు నుఱుములుగ నడమొగిళ్ళ పెల్లునం బ్రవర్షిత రథికమనోరథంబులగు రథంబుల గములను గములుగొని గమనవేగముల వలన హరిహరుల నగి గాలిం జాలిబడం గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును,

రంగదుత్తుంగ విశద మదకల కరటి కటతట జనిత మదసలిల కణగణ విగళితదళ శతనయన భుజ సరళ మిళిత లలిత నిఖిల దిగధిపతి శుభకర కరకనక కటకఘటిత మణిసముదయ సముదిత రేణువర్గ దుర్గమంబు లయిన నిర్వక్రమార్గంబులును, మార్గస్థలోపరి గతాగత శతశతాయుతానేక గణనాతీత రోహణాచల తట విరాజమానంబులగు విమానంబులును, విమాన విహరమాణ సుందర సుందరీ సందోహ సంవాదిత భూరిభేరీ వీణా పణవ మృదంగ కాహళ శంఖాది వాదనా నూన గాన సాహిత్య నృత్య విశేషంబులును, విశేషరత్న సంఘటిత శృంగార శృంగాటక వాటికాదేహ దేహళీ ప్రదీపంబులును, దీపాయమాన మానిత సభామండప ఖచిత రుచిరచింతా రత్నంబులునుం గలిగి రత్నా కరంబునుం బోలె ననిమిషకౌశిక వాహినీ విశ్రుతంబయి, శ్రుతివాక్యంబునుం బోలె నకల్మష సువర్ణప్రభూతంబయి, భూతపతి కంఠంబునుం బోలె భోగిరాజకాంతంబయి, కాంతాకుచంబునుం బోలె సువృత్తంబయి, వృత్తజాతంబునుం బోలె సదా గురులఘు నియమాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుం బోలె ఖర దూషణాది దోషాచరాను పలబ్ధంబయి, లబ్ధవర్ణు చరిత్రంబునుం బోలె నమలాంతరంగ ద్యోత మానంబయి, మానధనుని నడవడియునుం బోలె సన్మార్గాభాతి సుందరంబయి, సుందరోద్యానంబునుం బోలె రంభాంచితాశోక పున్నాగంబయి పున్నాగంబుమం బోలె సురభి సుమనో విశేషంబయి, శేషాహిమస్తంబును బోలె నున్నతక్షమావిశారదంబయి, శారదసముదయంబునుంబోలె ధవళ జీమూత ప్రకాశితంబయి, సితేతరాజిన దానంబును బోలె సరసతిలోత్తమంబై, యుత్తమ పురుష వచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షంబై, వర్షాదియునుం బోలె నుల్లసదింద్ర గోపంబయి, గోపతి మూఁపురంబునుం బోలె విచక్షురార్యాలంకృతంబయి, కృతార్థం బయిన యమరావతీ నామనగరంబు సేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱక యుండె; నంత.

తా ॥ ఆ విధంగా బలిచక్రవర్తి మిక్కిలి విశాలంగా ఉన్న దేవతల రాజధాని పొలిమేర్లలోకి ప్రవేశించి ముందుకు సాగుతున్నాడు. మొదట పెద్ద పెద్ద తోటలు కనిపించాయి. ఆ తోటలలోని చెట్లు ఎల్లప్పుడూ అందంగా చిగురిస్తూ, రెమ్మలతో, మొగ్గలతో, సగం విచ్చిన పూలతో, నిండుగా విరిసిన పూలగుత్తులతో, పూపిందెలతో, లేత కాయలతో, దోరకాయలతో, పండ్లగెలలతో నిండి బరువెక్కి వంగి ఉన్నాయి.

దట్టమైన ఆ తోటలలో తుమ్మెదల గుంపుల జంటలు వదలకుండ సొగసైన పూలతో నిండి ఉన్న మకరందాన్ని కొసరి కొసరి త్రాగి ఝుంఝుమ్మని సంతోషంతో విహరిస్తున్నాయి. కోయిల గుంపులు జంట బాయక కలసి మెలసి గున్నమామిడి చెట్ల కొమ్మలలో ముసరి సొంపుగా చిరుగుటాకులు తింటూ ఉత్సాహంతో గానం చేస్తున్నాయి. చిలుకల గుంపులు త్వరపడుతూ, పోరాడుతూ నేర్పుతో తియ్యని పండ్లు తింటూ కలకల ధ్వనులు చేస్తున్నాయి. పావురాలు చిలుకలను మించి ఆకాశానికి ఎగురుతూ తమ నెలవులపై వ్రాలి ఇంపుగా గుబాళిస్తున్నాయి.

రాయంచలు చెలువైన సరస్సుల వద్ద ఉత్సాహంగా పెంటి హంసలతో కలిసి తమ వాడి ముక్కులతో లేత తామరతూండ్లు చీల్చి తింటూ సంతోషంగా సవ్వడి చేస్తున్నాయి. అందమైన ఆ సరస్సులు హంసల కాంతికంటే అధికంగా మిలమిల మెరుస్తూ లక్ష్మీమందిరాల వంటి బంగారు పద్మాలతో విరాజిల్లుతున్నాయి. ఆ సరస్సుల అలల్లో తడిసిపోయి, వడవడ వడకుతూ అల్లిబిల్లిగా అల్లుకొని నేలవ్రాలిన దట్టమైన తీగల సందులలో చొరబడి, ఇంపైన పూలవాసనలతో బరువెక్కిన చల్లగాలులు లోపలకు దూరలేక చతికిల పడుతున్నాయి. ఆ గాలులతో కలసి పైకెగిరిన పుప్పొడులు ఆకాశంలో నిండి రంగురంగుల మేలుకట్టు చాందినీలను సృష్టిస్తున్నాయి.

పుప్పొడి రంగులతో కలసిన కాలువల గట్లపై ఇచ్చవచ్చినట్లుగా పచ్చిక గుబురులు మేస్తూ మైమరచి నెమరువేస్తూ తమ పెద్ద పొదుగులు కదలిస్తూ కామధేనువులు నడచివస్తున్నాయి. వాటి దూడలు చెంగు చెంగున దూకుతూ, ఆడుకొంటూ తల్లుల వెంట

వెదుతున్నాయి. కామధేనువులు దూడలతో కూడి ఇండ్లవాంకిండ్లు చేరి పౌరులు కోరినంత పాలను కురిపిస్తున్నాయి. కోరిన కోరికలు తీర్చే కల్పవృక్షాలు ఆ కామధేనువులకు నిలువ నీడను ఇస్తున్నాయి. ఆ కల్పవృక్షాల చిగుళ్ళను, పూలగుత్తులను కోసి మదపుటేనుగులు ఆడ ఏనుగులకు ప్రేమతో ఇచ్చి సంతోషింప చేస్తున్నాయి. ఆ మదపుటేనుగులు క్రీడాపర్వతాల సొగసుతో ఒప్పారుతున్నాయి.

తళతళలాడే మకర తోరణాల స్తంభాల వద్ద రంభాద్యప్సరసలు నిలబడి ఉన్నారు. వారు మన్మథుడు ఒరలోనుండి తీసిన వాడి కత్తులవలె తళ తళ మెరుస్తున్నారు, నిలుకడగల మెరుపు తీగవలె ఉన్నారు. కాళ్ళు చేతులు గల నెలవంకల వలె ఉన్నారు. రూపు దాల్చిన మోహినీ విద్యలవలె చూపులకు హాయి కలిగిస్తూ, విమానాలపై స్వర్గలోకానికి వచ్చే పుణ్యాత్ములకు త్వరగా ఎదురుపోయి సగౌరవంగా తోడ్కొని పోతున్నారు.

ఆ పట్టణానికి చుట్టూ అందమైన అగడ్తలు ఉన్నాయి. ఆ అగడ్తల నీటిలో కలహంసలు, రాజహంసలు, చక్రవాకములు, బెగ్గురు పక్షులు విహరిస్తూ ఉంటాయి. అందలి కలువలతోను కమలాలతోను, తుమ్మెదలు సంతోషంతో సంచరిస్తూ ఉంటాయి. ఆ అగడ్తలు తరంగాలు లేని గంగానది ఆకాశానికి పొంగినట్లు వెరగు కలిగిస్తూ ఉంటాయి. దేవకన్యలు గుంపులు గుంపులుగా చేరి వాటిలోని తేట నీటిలో అందంగా హాయిగా జలకాలు ఆడుకొంటూ ఉంటారు.

ఆ పట్టణం ముంగిట్లో భద్రమైన బంగారు తలుపులు గల పెద్ద గోపురాలున్నాయి. ఆ గోపుర ద్వారాల గడపలను అక్కడి దేవవేశ్యలు పూజిస్తూ ఉంటారు. ఆ ద్వారాల ప్రక్కన అరుగులపైన రత్నాల కాంతులు వెదజల్లే ఇంద్రనీలాల స్తంభాలు ఉన్నాయి. ఆ నాలుగు ద్వారాలకు పద్మరాగాల మాలలు వ్రేలాడుతున్నాయి. ఆ ద్వారాల దగ్గర ఉన్న చావిళ్ళలో పరాక్రమవంతులైన ద్వారపాలకులు ఆయుధాలు ధరించి మెలకువతో కాపలా కాస్తూ ఉంటారు. వారు దేవదానవుల యుద్ధాల ముచ్చట్లు చెప్పుకుంటూ ఉంటారు. అచ్చటి ఎత్తైన మెట్ల వరుసలు వీరర్స అ సముద్రపు చెలియలి కట్టల వంటి అచ్చమనై పాలరాళ్ళతో కటబ్బ డి ఉన్నాయి. అచ్చటి

కోటలు అత్యంత శోభాయమానములై వజ్రాలతోనూ వెండితోనూ నిర్మింపబడి ఉన్నాయి. ఆ కోటల పైభాగాలు నిండు చంద్రుని కిరణాలు వెల్లివిరిసే తెల్లని అద్దాలవలె ఉన్నాయి. వాటి కాంతులు చుక్కలను ధిక్కరిస్తూ ఉంటాయి. పెద్దపెద్ద వెండి ప్రాకారాలు ప్రకాశవంతములై ఉండగా, ఆ ప్రాకారాలపై మరకత మణులతో నిర్మించిన బురుజులు ఉన్నాయి. కోట్ల కొలది గంధర్వసైనికులు యుద్ధ సన్నద్ధులై వాటిని కాపాడుతూ ఉంటారు. ఆ బురుజులపై ఎత్తైన వజ్రాల స్తంభాలున్నాయి. వాటి మీద శత్రువీరుల ప్రాణాలు తీసే శతఘ్నులు అమర్చబడి ఉన్నాయి. వాటికి రెండు వైపులా ఆరిపోని దీపాలవలె సూర్యచంద్ర మండలాలు వెలుగుతూ ఉంటాయి.

ఆ పట్టణంలోని మేడలు ఆకాశాన్ని తాకుతూ ఉంటాయి. అందలి సుందరీ మణులు చంద్రబింబాన్ని నిగ్గుటద్దంగా భావించి తొంగిచూస్తూ తమ నొసటిపైని ముంగురులను సరిదిద్దుకొని తిలకాలను అలంకరించుకుంటారు. ఆ మేడల లోపల బంగారు మయములైన పరుపులూ కిటికీలు ఉయ్యాలలు సోపానాలు మొదలయినవి ఎంతో మనోహరంగా విరాజిల్లుతూ ఉన్నాయి.

ఆ మేడల యొక్క బంగారు కిటికీల నుండి కర్పూరము, కుంకుమ పువ్వు, సాంబ్రాణి కలసిన సువాసనల పొగలు వెలువడుతూ ఉంటాయి. ఆ పొగలను మేఘాలని భ్రమపడిన నెమళ్ళు అనుకోకుండా తమకు పండుగ వచ్చిందని ఆనందంతో తమ రంగురంగుల పింఛాలు విప్పి చెట్ల కొమ్మలపై నాట్యాలు చేస్తూ ఉంటాయి. అప్పుడు నెమళ్ళపింఛాలను అల్లెత్రాళ్ళుగాను, వాటి కేకలను ధనుష్టంకారాలుగాను భావించి వెంటనే సూర్యునిపైకి ఉరికే రాహువువలె జెండాలు ఆకాశానికి ఎగురుతున్నాయి. జెండాలు గొడుగులు తమ యుద్ధలక్షణాలుగా అవక్రపరాక్రమంతో విజృంభించి పెద్ద పులులవలె, ఏనుగులవలె, సింహాలవలె, శరభ మృగములవలె, తోకచుక్కలవలె శత్రువులను లెక్క చేయకుండ కేకలు వేస్తూ గుములు గుములై వీరసైనిక సమూహాలు రాక్షసులతో ద్వంద్వయుద్ధాలు చేయటం కోసం దుముకుతున్నాయి.

చక్రాల ధ్వనులు ఉరుములవలె ధ్వనింపగా వీరుల శర వర్షాలతో మేఘాలవలె

ఒప్పుతూన్న రథాలు రాజిల్లుతున్నాయి. ఆ రథాలకు సూర్యుని గుర్రాలను, వాయువును, మనస్సును మీరిన వేగంతో పరుగెత్తగల గుర్రాలు పూన్చబడి ఉన్నాయి. ఆ పట్టణంలో ఎత్తైన తెల్లని మదపుటేనుగులు ఉన్నాయి. వాటి చెక్కిళ్ళమీది మదజల కణాల సమూహాలు సహస్రనయనుడైన దేవేంద్రుని ఔదార్య విశేషాలను లెక్కిస్తున్నట్లు ఉంటాయి. ఇంద్రుణ్ణి సందర్శించడానికి గుమికూడిన సమస్త దిక్పాలకుల శుభకరములైన బంగారు కరకంకణాల నుండి రాలిన ధూళికణాలతో ఆ పట్టణంలోని వీథులన్ని నిండి ఉన్నాయి. ఆ మార్గాలకు పై భాగాలలో లక్షల కొలది విమానాలు వస్తూ పోతూ ఉంటాయి. అవి రోహణ పర్వతం చరియలవలె వెలుగులు వెదజల్లుతూ ఉంటాయి. ఆ విమానాలలో తమ ప్రియులతో విహరించే అందగత్తెలు భేరి, వీణ, పణవము, మద్దెల, బాకా, శంఖము మొదలైన వాటిని మ్రోగిస్తూ వాటికి తగినట్లుగా పాటలు పాడుతూ నాట్యాలు చేస్తూ ఉంటారు. ఆ నగరంలోని చతుష్పదాలలోని గృహ పరంపరల ముంగిళ్ళలో పెద్ద పెద్ద రత్నాల దీపాలు వెలుగుతూ ఉంటాయి. దేదీప్యమానములైన సభామండపాలలో చింతామణులు ప్రకాశిస్తూ ఉంటాయి.

ఆ స్వర్గ పట్టణం సముద్రం చేపలతో, నదుల సంగమంతో పేరు పొందినట్లుగా దేవతలతో, ఇంద్రునితో, ఆకాశగంగతో పేరెన్నిక గన్నది.

ఆ పట్టణం పవిత్రమైన అక్షరాలతో నిండిన వేదవాక్యం వలె నిర్మలమై ఉన్న సువర్ణంతో భాసిస్తుంది.

ఆ పట్టణం సర్పరాజులతో ప్రకాశించే శివుని కంఠం వలె, ధనవంతులైన ప్రభువులతో ఒప్పారుతోంది.

ఆ పట్టణం గురువులతో, లఘువులతో, యతులతో కూడి ఉన్న వృత్తం వలె, గురువైన బృహస్పతి యొక్క నీతినియమాలను కూడుకుని ఉన్నది.

ఆ పట్టణం ఖర దూషణాది రాక్షసులు చేరుకోలేని శ్రీరామచంద్రుని తేజస్సు వలె

కఠినమైన దోషాలను కలిగి ఉన్నవారికి పొందరానిదై శోభిల్లుతోంది.

ఆ పట్టణం స్వచ్ఛమైన హృదయంలో స్ఫురించే విద్వాంసుని చరిత్ర వలె నిర్మల మనస్సులతో కూడి ఉన్న పుణ్యాత్ములతో ప్రకాశిస్తోంది.

ఆ పట్టణం అభిమానవంతుని ప్రవర్తన మంచి మార్గంతో కూడి ప్రకాశించినట్లుగా, ఆకాశ మార్గంలోని చుక్కలతో కూడి చక్కగా ఉన్నది.

ఆ పట్టణం అందమైన అరటిచెట్లు, అశోకవృక్షాలను కలిగి ఉన్న ఉద్యానవనం వలె రంభాదులతో కూడి ఉంది.

ఆ పట్టణం సుగంధంతో కూడిన పుష్పాల వలె కామధేనువుతో, దేవతలతో నిండి ఉంది.

ఆ పట్టణం మహోన్నతమైన భూమండల భారాన్ని ఓర్పుతో వహిస్తున్న ఆదిశేషుని శిరస్సు వలె విశేషమైన క్షమాగుణంతో ఒప్పారుతోంది.

అటువంటి ఐశ్వర్యవంతమైన పరమ ధన్యమైన, ఆ అమరావతీ నగరానికి చేరిన బలి చక్రవర్తి ఆ నగరం కోటను చుట్టుముట్టడానికి సైన్యాలకు ఆజ్ఞను ఇచ్చాడు. మార్గాలన్నీ అరికట్టి గట్టి పట్టుదలతో ఉన్నాడు.

క. మాయరు నగవులకును గను, మూయరు కాలంబు కతన ముదియరు ఖలులన్ డాయరు
పుణ్యజనంబులఁ, బాయరు సురరాజు వీటి ప్రమదాజనముల్.

448

తా ॥ ఆ ఇంద్రుని నగరంలోని స్త్రీజనం ఎప్పుడూ చిరునగవులతో నిత్య నూతనంగా ఉంటారు. కాలానికి లొంగి కన్నుమూయరు. ఎప్పుడూ నిత్య యవ్వనవతులై ఉంటారు. అధార్మిక ప్రవర్తన కలవారి చెంత చేరరు. పుణ్యజనుల సాంగత్యాన్ని ఎప్పుడూ విడిచిపెట్టరు.

వ. అప్పుడు.

449

క. దుర్భర దానవ శంఖా, విర్భూత ధ్వనులు నిండి విబుధేంద్ర వధూ
గర్భములు పగిలి లోపలి, యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్.

450

తా ॥ అటువంటి పట్టణంలో భరించ శక్యం కాకుండా వెలువడుతున్న రాక్షసుల శంఖ ధ్వనులు దేవతా స్త్రీల గర్భములు చలించి, లోపలి శిశువులు ఆవురు ఆవురుమంటూ ఆక్రోశించే విధంగా ఉన్నాయి.

వ. అంత.

451

సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగాఁ గోటకుఁ గాపు వెట్టి
దేవవీరులుఁ దాను దేవతామంత్రిని రప్పించి సురవైరిరాకఁ జెప్పి
ప్రళయానలుని భంగి భాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులను గూడినాఁడు
మన కోడి చని నేఁడు మరల వీఁ డేతెంచె నే తపంబున వీని కింత వచ్చె?

ఆ. నీ దురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె?, నింక వీని గెల్వ నేది త్రోవ? యేమి సేయువార?
మెక్కడి మగఁటిమి?, నెదురు మోహరింప నెవ్వఁ డోపు?

452

తా ॥ అప్పుడు బలిచక్రవర్తి వచ్చి పట్టణాన్ని ముట్టడించడాన్ని చూసిన దేవేంద్రుడు వెంటనే కోటకు రక్షణ ఏర్పాటు చేశాడు. దేవతావీరులతో కలసి గురువైన బృహస్పతిని పిలిపించి బలిచక్రవర్తి దండయాత్ర గురించి తెలియచెప్పాడు. “ఆ బలి ఘోర రాక్షసులతో కూడి ప్రళయాగ్నిలా మండిపడుతున్నాడు. పూర్వం జరిగిన యుద్ధంలో మనతో ఓడిపోయి నేడు తిరిగి

వచ్చాడు. ఏ తపస్సు వల్ల వీడికీ శక్తివచ్చిందో తెలియటంలేదు. ఈ దుర్మార్గునకు ఎవరు తోడుగా వచ్చాడో? వీనిని గెలవడానికి తగిన సాధనం ఏమిటి? ఇప్పుడేమి చేద్దాం? వీని పరాక్రమానికి అడ్డు పడేది ఎవరు?

క. మ్రింగెడు నాకాశంబును, బొంగెడు నమరాద్రి కంటెఁ బొడవై వీఁడున్ మ్రింగెడుఁ గాలాంతకు క్రియ, భంగించును మరలఁ బడ్డఁ బంకజగర్భున్

453

తా ॥ ఈ బలిచక్రవర్తి ఆకాశాన్ని మ్రింగేటట్లుగా ఉన్నాడు. ఉప్పొంగిన పరాక్రమంతో మేరువు కన్నా ఉన్నతంగా ఉన్నాడు. కాలాంతకునివలె సమస్తాన్నీ మ్రింగేవాడిలా ఉన్నాడు. ఇప్పుడు వీనిని ఎదుర్కొంటే బ్రహ్మ అయినాసరే భంగపడతాడు.

క. ఈరాదు రాజ్యమెల్లను, బోరాదు రణంబు సేయఁ; బోయితి మేనిన్ రారాదు దనుజుచేతను, జారా దిట మీఁద నేమి జాడ మహాత్మా!"

454

వ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె.

455

తా ॥ మహాత్మా! ఇతనికి రాజ్యాన్ని అప్పచెప్పడం కుదరదు, అలాగని వీనితో యుద్ధంచేయటం కష్టతరం. యుద్ధం చేస్తే తిరిగి సుఖంగా వస్తామనే నమ్మకం లేదు, అలాగని వదిలేయలేము. ఇప్పుడు దారేది?" అని భీతితో పలుకుతూన్న ఇంద్రునితో బృహస్పతి ఇలా అన్నాడు:

సీ. 'వినవయ్య దేవేంద్ర! వీనికి సంపద బ్రహ్మావాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు నెదురను నిలువంగ హరి యీశ్వరుఁడు దక్క నన్యజనుల

నీవును నీ సముల్ నీకంటె నధికులుఁ జాలరు; రాజ్యంబు సాలు; నీకు
విడిచి పోవుట నీతి విబుధనివాసంబు; విమతులు నలఁగెడు వేళ సూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట మా మతంబు;, విప్రబలమున వీనికి వృద్ధివచ్చె వారిఁ గైకొన కిటమీఁద వాఁడి సెడును;, దలఁగు మందాఁక రిపు పేరు దడవవలదు.

456

తా ॥ "దేవేంద్రా! విను! బ్రహ్మవాదులయిన భృగువంశ బ్రాహ్మణులు ఈ బలికి అపారమైన సంపదనూ, ఆశీస్సులను అందించారు. ఈ రాక్షసరాజుని ఎదుర్కొని యుద్ధం చేయాలంటే శ్రీహరికి, ఈశ్వరునికీ తప్ప ఇతరులెవ్వరికీ అనగా నీకు కానీ, నీకు సమానమైన వారు కానీ, ఇంకొంచెం అధికుల వల్లగానీ సరిపోదు. ఈ సందర్భంలో నీవు రాజ్యం వదలి వెళ్ళడమే సరియైన కార్యం. శత్రువులను, అననుకూల కాలాన్ని గుర్తించి, జయించడం మేలని నా అభిప్రాయం.ఈ రాక్షసరాజు అభివృద్ధికి విప్రుల ఆశీర్వాద బలమే కారణం. ఇతడు వారి ఎడల నిరాదరణను చూపినప్పుడు, ఆ పరాక్రమం కాస్తా సన్నగిల్లుతుంది. అప్పటి వరకు ఓర్పుతో వేచి ఉంటూ ఈ లోపున, ఇతని పేరుని కూడా ఉచ్చరించకపోవడం శ్రేయస్కరం.

క. పరు గెలువ వలయు నొండెను, సరిపోరఁగ వలయునొండెఁ జా వలె నొండెన్ సరి గెలుపు మృతియు దొరకమి, సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్.

457

తా ॥ శత్రువును ఎదిరించి గెలవాలి లేదా వానితో సమానంగా పోరాడాలి లేదా యుద్ధంలో వీర మరణం పొందాలి. అంతేగాని విజయమూ లభించక, వీరమరణమూ లభించనప్పుడు ముందుగానే తొలగిపోవడం మంచిది."

వ. అనినఁ గార్యకాల ప్రదర్శియగు బృహస్పతి వచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమ తమ పొందుపట్లకుం జనిరి; బలియునుం బ్రతిభట వివర్జిత యగు

దేవధాని నధిష్ఠించి జగత్త్రయంబునుం దన వశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె; శిష్యవత్సలులగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి; తత్కాలంబున.

458

తా ॥ ఈ విధంగా సమయానుకూలంగా కార్యాన్ని నెరవేర్చడంలో నేర్పరి అయిన బృహస్పతి వచనాలు విన్న కామరూపులైన దేవతలు స్వర్గాన్ని విడిచిపెట్టి అనుకూల ప్రదేశాలకు వెళ్ళిపోయారు. దేవతలు విడిచిపెట్టిన దేవరాజధానిని అధిష్ఠించిన బలి మూడు లోకాలనూ తన వశం చేసుకొని నిరాటంకంగా రాజ్యపాలన చేయసాగాడు. శిష్యవత్సలుడైన శుక్రుడు ఇతర విప్రులతో కలిసి అశ్వమేధయాగాలు చేయించసాగాడు.

శా. అర్థుల్ వేఁడరు; దాతలుం జెడరు; సర్వారంభముల్ పండుఁ; బ్ర
త్యర్థుల్ లేరు; మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ; బూ
ర్ణార్థుల్ విప్రులు; వర్షముల్ గరియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్.

459

తా ॥ ఆ బలిచక్రవర్తి రాజ్యంలో దానమును అడిగేవాడు లేడు. అనగా యాచకులు లేరు. దాతలకు ఏ లోటూ లేదు. సకల ప్రయత్నాలు ఫలితాన్ని ఇచ్చేవి. మంచి పనికి వ్యతిరేకించే వారు లేరు. దేవాలయాలలో మహోత్సవాలు జరుగుతూ ఉండేవి. బ్రాహ్మణులు కోరుకున్నవి సఫలమయ్యేవి. కాలానికి అనుగుణంగా వర్షములు కురిసేవి. ధనాన్ని ధరిస్తుంది కనుక భూమికి వసుంధర అన్న పేరు సార్థకమైంది. ఈ విధంగా బలి పాలన సుభిక్షంగా సాగుతోంది.

వ. అంత.

460

సీ. తన తనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును భావించి సురమాత పరితాపమునఁ బొంది పగ ననాథాకృతి వనరుచుండ నా యమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ మఱియొకనాడు సమాధి మాని తన కుటుంబిని యున్న ధామంబునకు నేగి నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కంది వాడిన యిల్లాలి, వదనవారిజంబు వడువుఁజూచి చేరఁ దిగిచి మగువచిబుకంబు పుడుకుచు, వారిజాక్షి! యేల వగచె దనుచు.

461

వ. అ మ్మహాత్ముం డిట్లనియె.

462

తా ॥ అమరుల మాతృమూర్తి అయిన అదితి తన పుత్రుల నగరమైన అమరావతిని రాక్షసులు జయించటం, వారు నగరాన్ని విడిచి, ఎక్కడో దాక్కోవటం తెలుసుకొని మనస్సులో బాధ పడసాగింది. ఒకనాడు అదితి భర్త అయిన కశ్యపబ్రహ్మ తపస్సు చాలించి ఇంటికి వచ్చాడు. అప్పుడు భార్య చేత పూజించబడిన కశ్యపుడు ఆమె ముఖంలోని బాధను గమనించి చేరదీసి ఆ వ్యథకు కారణం తెలుసుకోగోరి ఇలా అన్నాడు:

మ. 'తెఱవా! విప్రులు పూర్ణులే? చెలఁగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?
నెఱి నభ్యాగతి కోటి కన్న మిడుదే? నీరంబునుం బోయుదే?
మఱ లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పై దలీ?

463

తా ॥ "మగువా! ఏ లోటూ లేక విప్రులు సంపూర్ణ మనోరథులై ఉన్నారు కదా! దేవాలయాల అర్చనలు సక్రమంగా జరుగుతున్నాయా? గృహస్థులు దేవకార్యాలను సక్రమంగా

నెరవేరుస్తున్నారా? నీ పుత్రులు ధార్మిక మార్గంలో ఉన్నారు కదా? అతిథి అభ్యాగతులకు అర్ఘ్యపాద్యాదులిచ్చి అన్నాదులతో ఆదరిస్తున్నావా? మరువక సజ్జనులను, సేవకులను, యాచకులను తగు రీతిలో సత్కరిస్తున్నావా?

ఆ. అన్న మైనఁ దక్రమైనఁ దోయంబైన, శాకమైనఁ దనకు జరుగు కొలఁది నతిథి జనులకడ్డ మాడక యిడరేని, లేమ! వారు కలిగి లేనివారు.

464

తా ॥ అన్నమైనా, మజ్జిగైనా, మంచి నీళ్ళయినా, కూరగాయలైనా ఏది వీలైతే అది సాధ్యమైనంత వరకూ అతిథి జనులకు పెట్టనివారు ధనవంతులైనా దరిద్రులతో సమానమే!

వ. మఱియు.

465

ఆ. నెలఁత! విష్ణునకును నిఖిలదేవాత్మున, కాననంబు శిఖియు నవనిసురులు; వారు దనియఁ దనియుఁ వనజాతలోచనుఁ, డతఁడు దనియ జగము లన్ని దనియు.

466

తా ॥ ఓ కల్యాణీ! అఖిల దేవతలకు ఆత్మస్వరూపుడైన వాడు విష్ణువు. అగ్ని, బ్రాహ్మణులు విష్ణువుకు ముఖాలు. వారు సంతోషిస్తే విష్ణువు సంతోషిస్తాడు. విష్ణువు సంతోషిస్తే లోకాలన్నీ సంతోషిస్తాయి.

క. బిడ్డలు వెఱతురె నీ కఱ, గొడ్డంబులు సేయ కెల్ల కోడంద్రును మా
ఱొడ్డారింపక నడతురె, యెడ్డము గాకున్నదే మృగేక్షణ; యింటన్!

467

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె.

468

తా ॥ ఇంట్లో ఏమీ ఇబ్బంది లేదు కదా! నీ బిడ్డలు వినయంగా ఉంటున్నారా? నీవు చెప్పిన దానికి ఎదురు చెప్పకుండా నీ కోడళ్ళు నీ మాట వింటున్నారా?" అని అడిగిన పతితో అదితి ఇట్లా అన్నది:

ఉ. ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా
భీమ బలాఢ్యులై తనదు బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచు నున్నవారు; నీ
కే మని విన్నవింతు? హృదయేశ్వర! మేలు దలంచి చూడవే!

469

తా ॥ "హృదయేశ్వరా! ప్రేమానురాగాలు లేకుండా దితి సంతానమూ, వారి సంతానమూ అయిన అసురులు మహాపరాక్రమంతో నా బిడ్డలయిన దేవతలను అందరినీ పారద్రోలి, సాహసంతో అమరావతిని ఆక్రమించుకుని పరిపాలిస్తున్నారు. మీకు ఏమని విన్నవించను? మేలు కలిగేటట్లు చెయ్యవలసింది.

క. అక్కా చెల్లెండ్రయ్యును, దక్కదు నాతోడి పోరు; దానున్ దితియున్ రక్కసుల సురల మొత్తఁగ, నక్కట! వల దనదు చూచు నౌనౌ ననుచున్.

470

తా ॥ దితీ, నేను అక్కా చెల్లెళ్ళమైనా ఆమె నాతో పోరు మానకుండా కలహిస్తూనే ఉంటుంది. రాక్షసులు దేవతలను బాధపెడుతున్నా మెచ్చుకుంటుందే కాని తగదు అని పలుకదు.

సీ. ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను జాలిఁ బడియె నేఁడు త్రిభువన సామ్రాజ్య విభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు గలిమి గారాబు బిడ్డలు

జయంతాదులు శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు నమరుల కాధారమగు నమరావతి యసురుల కాటపట్టయ్యె నేఁడు

ఆ. బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు, వాని గెలువరాదు వాసవునకు యాగభాగమెల్ల నతఁ డాహరించుచుఁ, గడఁగి సురల కొక్కకడియు నీఁడు

471

తా ॥ ఎండ కన్నెరుగని ఇంద్రుని ఇల్లాలు అయిన శచీదేవి ఈనాడు కష్టాలకు గురియై పలు పంచలలో తిరుగుతూ ఉన్నది. మూడు లోకాల వైభవాన్ని కోల్పోయి దేవేంద్రుడు నేడు అడవులలో సంచరిస్తున్నాడు. అపారమైన సిరిసంపదలు కలిగి కడు గారాబంగా పెరిగిన జయంతాదులు నేడు అడవులలో శబరులతో కలిసి తిరుగుతున్నారు. అమరులకు ఆటపట్టైన అమరావతీ పట్టణం నేడు అసురుల పాలయ్యింది. నేడు లోకాలన్నింటిలోను బలమైన వాడు బలిచక్రవర్తి ఒక్కడే. ఇంద్రునికి అతడిని గెలవటం సాధ్యం కాదు. యజ్ఞాలలో హవిర్భాగాలు అన్నింటినీ అతడే తీసుకొంటున్నాడు. దేవతలకు ఏ మాత్రం దక్కనివ్వటం లేదు.

క. ప్రజలకు నెల్లను సముఁడవు, ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం ప్రజలందు దుష్టమతులను, నిజముగ శిక్షింప వలదె నీవు? మహాత్మా!

472

తా ॥ మహాత్మా! ప్రజలందరినీ సమభావంతో చూసేవాడవు నీవు. ప్రజలందరికీ కన్న తండ్రివి. అలాంటి నీవు సంతానంలో దుష్టచిత్తులైన వారిని శిక్షించాలి కదా?

మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి ని
ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే
వెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే?
కరుణాలోక సుధాఝురిం దనుపవే? కల్యాణ సంధాయకా!

473

తా ॥ ఓ మహాత్మా! ఆర్తులైన దేవతల శోకాన్ని నివారించి వారిని తిరిగి వారి స్థానాల్లో నిలుపవలసినది. రాక్షసులను శాసించే సత్కార్యం ఎలా నెరవేరుతుందో మీరు ఆలోచించండి. మీ అమృత దృష్టిచేత అమరులను సంతోషింప చెయ్యండి."

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె.

474

తా ॥ అని పలికే సరికి ఆమె మాటలు ఆలకించి, కొద్దిసేపు యోచించి జ్ఞాన దృష్టితో జరుగబోయే కార్యాలను తెలుసుకొని కశ్యప ప్రజాపతి ఇట్లా అన్నాడు:

మ. 'జనకుం డెవ్వడు?జాతుఁ డెవ్వఁడు? జనిస్థానంబు లెచ్చోటు? సం<br>
జననం బెయ్యది? మేను లేకొలఁది? సంసారంబు లేరూపముల్?<br>
వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వే ఱేమియున్ లేదు; మో<br>
హ నిబద్ధంబు నిదాన మింతటికి జాయా; విన్నఁబో నేటికిన్?

475

వ. అగు; నయిననుం గాలోచిత కార్యంబు సెప్పెద.

476

తా ॥ "ఓ దేవీ! విను! అసలు తండ్రి ఎవరు? కొడుకు ఎవరు? ఈ సంబంధాలు ఎక్కడివి? ఈ పుట్టుకలకు కారణం ఏమిటి? సంసారం యొక్క రూపాలు ఏమిటి? అని యోచిస్తే ఇదంతా విష్ణు మాయ కానీ మరొకటి కాదని తెలుస్తుంది. దీనికి అజ్ఞానమే మూలకారణం. అందువలన జరిగిన దానికి చింతించవద్దు. ఇప్పుడు చేయవలసినది చెబుతాను, విను.

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరిసేవ సేయు; మతఁడున్ సంతుష్టినిం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి సేకూరెడిన్;
భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ' !

477

వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె.

478

తా ॥ పరమై ఉన్న ఆ జనార్దనున్ని, దయాసముద్రున్ని, సర్వాంతర్యామిని ఆరాధించు. పురుషోత్తముడూ, జగన్నాథుడు అయిన ఆ శ్రీహరిని సేవించు. ఆ భగవంతుడు సంతోషిస్తే నీ కోరికలన్నీ నెరవేరగలవు. భగవంతుని సేవచే సమస్త సౌభాగ్యాలు లభ్యం కాగలవ" ని చెప్పిన కశ్యపుని మాటలకు అదితి ఇలా అన్నది:

క. 'నారాయణుఁ బరమేశ్వరు, నేరీతి దలంతు? మంత్ర మెయ్యది? విహితా చారంబు లే ప్రకారము?, లారాధన కాలమెద్ది? యానతి యీవే.'

479

తా ॥ "పరమాత్ముడైన ఆ నారాయణుణ్ణి ఏ విధంగా ధ్యానించాలి? అందుకు తగిన మంత్రం ఏమిటి? పాటించవలసిన నియమాలు ఏమిటి? ఆ ఆరాధనా పద్ధతిని వివరంగా చెప్పవలసింది."

వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణంబను వ్రతం బుపదేశించి తత్కాలంబును, దన్మంత్రం బును, దద్విధానంబును, దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించిన నదితియును ఫాల్గుణ మాసంబు శుక్లపక్షంబునఁ ప్రథమ దివసంబునన్ దొరఁకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబుసేసి వ్రతాంతంబున

నియతమై యున్న యెడఁ జతుర్బాహుండును, బీతవాసుండును, శంఖచక్రగదా ధరుండునునై, నేత్రంబుల కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని.

480

తా ॥ అలా అడిగిన భార్యకు కశ్యప్రజాపతి "పయోభక్షణం" అనే వ్రతాన్ని ఉపదేశించాడు. దానికి తగిన కాల నియమాన్ని, మంత్రాన్ని, ఆ విధానాన్ని, ఉపవాసాన్ని, చెయ్యవలసిన దాన భోజనాది నియమాలను అన్నింటిని తెలిపాడు. వెంటనే అదితి ఫాల్గుణ మాసంలో శుక్లపక్షంలో, పాడ్యమి నాడు మొదలుపెట్టి పన్నెండు రోజులు శ్రీహరిని నియమానుసారంగా పూజించింది. వ్రత సమాప్తి సమయమందు పచ్చని పట్టువస్త్రాన్ని ధరించి, నాలుగు చేతులు కలిగినవాడైన, శంఖచక్రగదాధారుడైన నారాయణుడు, సామాన్యులకు అగోచరమైనవాడు అదితికి సాక్షాత్కరించాడు.

క. కన్నుల సంతోషాశ్రులు, చన్నులపైఁ బఱవఁ బులక జాలము లెసఁగన్
సన్నతులును సన్నుతులును, నున్నత రుచిఁ జేసి నిటల యుక్తాంజలియై.

481

తా ॥ ఆ నారాయణుణ్ణి దర్శించగలిగిన అమె కన్నులు సంతోషంతో కూడిన అశ్రువులను ధారగా వర్షించాయి. శరీరమంతా పులకించగా, నుదిటికి రెండు చేతులను చేర్చి అంజలి ఘటిస్తూ, భక్తితో స్తోత్రం చేస్తూ నమస్కరించింది.

క. చూపుల శ్రీపతి రూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై వాపుచ్చి మంద మధురా,
లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్.

482

తా ॥ అదితీదేవికి దేవదేవుడైన ఆ శ్రీహరి రూపాన్ని ఎంతసేపు చూసినా తనివి తీరడం లేదు. ఆనందాతిశయంతో ఆ స్వామి మంగళకర రూపాన్ని చూస్తూ మధురమైన పలుకులతో

ఇలా కీర్తించసాగింది:

సీ. 'యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణ మంగళనామధేయ! లోకస్వరూప!
యాపన్న భక్త జనార్తి విఖండన! దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవస్థితి విలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞాన యుక్తియు వైరిజయము, నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార!, ప్రణత వత్సల! పద్మాక్ష! పరమపురుష!

483

తా ॥ "ఓ యజ్ఞేశ్వరా! విశ్వంభరా! అచ్యుతా! మంగళకరమైన నామధేయములు కలవాడా! లోకమే స్వరూపంగా కలవాడా! ఆపన్నులైన భక్తులను రక్షించేవాడా! దీనులకు ఆధారభూతుడైన వాడా! పాదముల నుండి పావన గంగను ఉద్భవింప చేసిన వాడా! ఈ ప్రపంచపు సృష్టి స్థితి లయలను నిర్వర్తించేవాడా! ఆనంద స్వరూపుడా! లీలా విలాసములను చూపేవాడా! కోరిన కోరికలను ఇచ్చే కల్పవృక్షము వంటి వాడా! వేదస్వరూపుడా! ఓంకార స్వరూపుడా! పరమ పురుషా! ఈ లోకంలో ఆయువు, యోగ్యమైన శరీరము, సంపద, భూమి, ఇహమూ, పరమూ, వేదవిజ్ఞానము,... ఇవన్నీ నిన్ను పూజించని వారికి లభించవు కదా!

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి, నాక మేలుచున్న నాఁట నుండి కన్న కడుపు
గాన కంటఁ గూరుకు రాదు, కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య'

484

వ. అనిన విని దరహసిత వదనుండయి యాశ్రిత కామధేనువైన యప్పరమేశ్వరుడుం డిట్లనియె.

485

తా ॥ తండ్రీ! రాక్షసులు నా పుత్రులైన దేవతలను అదలించి, బెదరించి స్వర్గలోకాన్ని కైవసం చేసుకున్నారు. అప్పటి నుండి కన్న తల్లినైన నాకు కంటికి నిద్రలేదు. నా పుత్రుల శోకాన్ని తీర్చి కాపాడవయ్యా" అని ప్రార్థించగా విష్ణువు చిరునవ్వుతో ఇలా అన్నాడు:

శా. నీ కోడండ్రును, నీకుమారవరులున్, నీనాథుఁడున్, నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్ట నీ సుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్

486

తా ॥ "అమ్మా! నీ కోడళ్ళు, నీ కుమారులు, నీ భర్త, నీవు... మీరంతా సంతోషించే విధంగా రాక్షసులు శోకించేటట్లుగా నీ గర్భంలో తేజోమూర్తినై జన్మిస్తాను. నీకు పుత్రుడనై పుట్టి నీ ఒడిలో ఆడుకోవాలని నాకు చాలా వేడుకగా ఉంది.

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునం గాని; సం
చలనం బొందకు; నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్;
బలి విద్వేషియు నా నిలింపగణము బౌలోమియున్ మెచ్చ దై
త్యుల రాజ్యంబు హరింతు, నింద్రునికి నిత్తున్; దుఃఖ మింకేటికిన్?

487

తా ॥ వినయంతో, ఉపాయంతో దైత్యులను లొంగదీసుకోవాలి కాని వాళ్ళని సంహరించే వీలులేదు. నీవు బాధపడవద్దు. నీ నియమనిష్ఠలకి, భక్తికీ మెచ్చాను. ఇంద్రుడు, దేవతాసమూహము, శచీదేవి వీరంతా సంతోషించేలాగా దైత్యుల నుండి స్వర్గాన్ని హరించి ఇంద్రునికి ఇస్తాను. ఇంక నీవు దుఃఖించే పని లేదు.

క. నీ రమణుని సేవింపుము, నా రూపము మానసించి నలినీ గర్భా

గారంబు వచ్చి చొచ్చెద, గారామునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్.

488

తా ॥ నా రూపాన్ని తలచుకొంటూ నీ భర్తని సేవించు. నేను నీ గర్భంలో ప్రవేశిస్తాను. నన్ను కరుణతోను, ప్రేమతోను పెంచు తల్లీ!

క. ఏలింతు దివము సురలను, బాలింతు మహేంద్రయువతి భాగ్య శ్రీలం
దూలింతు దానవుల ని, ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్!

489

తా ॥ దేవతలు స్వర్గాన్ని పాలించేటట్లు చేస్తాను. మహేంద్రుని భార్య అయిన శచీదేవి సౌభాగ్యాన్ని కాపాడుతాను. రాక్షసులకు స్వర్గాధిపత్యం లేకుండా చేస్తాను, వారి భార్యల భూషణాలను తొలగిస్తాను." (అంటే వారి సౌభాగ్యాన్ని హరిస్తాను అని అర్థం).

వ. అని యిట్లు భక్తజన పరతంత్రుండగు పురాణపురుషుం డాన తిచ్చి తిరోహితుం డయ్యె; న య్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; నంత నొక్కదినంబున.

490

ఆ. ఘన సమాధినుండి కశ్యపుఁ డచ్యుతు, నంశ మాత్మ నొలయ నదితియందుఁ దనదు
వీర్య మధికతరము సేర్చెను గాలి, శిఖిని దారువందుఁ జేర్చినట్లు

491

తా ॥ అని ఈ విధంగా భక్తజన విధేయుడూ, పురాణ పురుషుడైన హరి ఆనతిచ్చి అదృశ్యుడైనాడు. అదితి ఎంతో సంతోషంతో తన భర్త అయిన కశ్యపున్ని ఆశ్రయించి సేవించసాగింది. అంత ఒకనాడు తపస్సమాధి స్థితిలో ఉన్న కశ్యపునిలో అచ్యుతుని యొక్క

అంశ ప్రవేశించగా దానిని అదితి గర్భంలో గాలి అగ్నిని దారువునందు ప్రవేశపెట్టినట్లుగా చేర్చాడు.

వ. ఇట్లు కశ్యప చిరతర తపస్సంభృత వీర ప్రతిష్ఠిత గర్భయై సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె; నంత.

492

తా ॥ ఓ రాజా! ఈ విధంగా కశ్యప ప్రజాపతి చిరకాల తపోబలంచేత గర్భాన్ని ధరించిన అదితి మనస్సులో చాలా సంతోషాన్ని పొందుతూ ఉన్నది.

క. చలచలనై పిదపిదనై, గలలంబై కరుదు గట్టి గళనాళముతోఁ దల యేర్పడి గర్భంబై, నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా!

493

తా ॥ ఒక నెల గడిచేసరికి అదితి గర్భంలో, కదిలే స్థితి నుండి మృదువైన రూపంలోకి వచ్చి ఆపైన గడ్డకట్టి పిండరూపం ఏర్పడింది. ఒక నెల పూర్తయ్యేసరికి తల ఏర్పడింది. (సర్వవ్యాపకుడైనవాడూ, నిరాకారుడూ అయిన హరి మెల్లగా ఆకారాన్ని ఏర్పరుచుకుంటున్నాడు)

క. నెలఁతకుఁ జూలై నెల రె, న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుసన్ నెల లంత కంత కెక్కఁగ, నెలలును డగ్గఱియె నసుర నిర్మూలతకున్.

494

తా ॥ అదితి చూలాలై నెల, రెండు నెలలు, మూడు నాలుగు నెలలు గడుస్తూ నెలలు పెరుగుతున్నకొద్దీ రాక్షసులను నిర్మూలించడానికి నెలలు దగ్గరవుతున్నాయి.

క. మహితతర మేఘమాలా, పిహితాయుత చండభాను బింబప్రభతో విహితాంగంబులఁ

కశ్యపు, గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా!

495

తా ॥ ఓ రాజా! గొప్పవైన మేఘాల చేత కప్పబడిన ప్రచండ భాస్కరునివలె అదితీదేవి గర్భంలో శిశువు కదలాడుతున్నాడు. (కొద్ది సమయంలోనే మేఘాలను తొలగించి తన ప్రతాపం చూపే భానుని వలె ఉన్నాడు)

క. తన కడుపున నొక వెఱవున, వనరుహ గర్భాండభాండ వనధిచయంబుల్ గొనకొని జగముల నిడుకొని, తనుగతిఁ గడు నడఁగి మడఁగి తనరెన్ బెడఁగై.

496

తా ॥ సమస్త భూమండలాన్ని, ఖగోళాన్ని, సముద్రాలను, సమస్తమైన లోకాలను తన కుక్షియందు ఉంచుకున్న ఆ శిశువు ఎంతో అణకువతో అదితి గర్భమునందు ఒదిగి ఉన్నాడు.

వ. అంత న క్కాంతాతిలకంబు క్రమక్రమంబున.

497

మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్ విశదిమన్ నేత్రంబులం, జూచుకం<br>బుల నాకాళిమ, మేఖలం ద్రఢిమ నెమ్మో మారఁగా బాండిమన్<br>బలిమం జన్నుల, శ్రోణిపాళిగరిమ, న్మధ్యంబునన్ బృంహిమ<br>న్లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారయై.

498

తా ॥ అదితీదేవి క్రమక్రమంగా నిండుచూలాలైంది. గర్భవతుల శరీరంలో జరిగే మార్పులన్నీ ఆమెలో చోటు చేసుకున్నాయి. అంతేకాక సాక్షాత్ శ్రీహరిని గర్భంలో ధరించి ఉన్నందున ఆమె నేత్రాలు మాలిన్యరహితములై నిర్మలంగా ప్రకాశించసాగాయి. అరుదైన

తేజస్సుతో ఆమె ముఖం కాంతివంతమవగా, మనస్సు తేటగా, స్వచ్ఛంగా తేలికపడుతోంది.

క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురు మేనఁ బట్టుఁ బుట్టపుదోయిం బెట్టుదురు వేల్పులమ్మకుఁ, గట్టుదురు సురక్ష పడఁతి గర్భంబునకున్.

499

తా ॥ అంతట ముత్తైదువులంతా ఆమెకు నుదుట విభూతి పెట్టి తిలకం దిద్దారు. పట్టుబట్టల జతను కట్టబెట్టారు. ఆమె గర్భానికి రక్ష కట్టారు.

వ. ఇ వ్విధంబున.

500

తే. విశ్వగర్భుఁడు దనగర్భ వివరమందుఁ, బూఁటపూఁటకుఁ బూర్ణుఁడై పొటకరింప వ్రేఁకఁ జూలాలితనమున వేల్పుఁ బెద్ద, పొలఁతి కంతట నీళ్లాడు ప్రొద్దు లయ్యె.

501

తా ॥ ఈ విధంగా విశ్వగర్భుడు తన గర్భంలో పూటపూటకు పూర్ణుడయి ప్రకాశిస్తూ ఉండగా గర్భం బరువెక్కి ఆమె ప్రసవించే సమయం దగ్గరైనది.

వ. తదనంతరంబునఁ జతురాననుం డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ విభ్రముం డగు న ప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె.

502

తా ॥ అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి అదితి గర్భంలో కదలుతూన్న ఆ పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి ఇట్లా స్తుతించాడు:

సీ. 'త్రిభువన జయరూఢ! దేవ! యురుక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!

ప్రీతత్రిణాభ! త్రిపృష్ఠ! జగంబుల, కాద్యంత మధ్యంబు లరయ నీవ!
జగమస్థావర జననాది హేతువు నీవ; కాలంబ వై నిఖీల మాత్మ
లోపల ధరియింతు లోనిజంతుల నెల్ల స్రోతంబులోఁ గొను సుందరతను;

తే. బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ; దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ, దేల నాధార మగుచున్న తెప్పవీవ.

503

తా ॥ "దేవాధిదేవా! మూడు లోకాలను జయించిన వాడా! మహానుభావా! ఈ జగముల కన్నిటికి ఆది అంతము మధ్య అంతా నీవే! కదిలేవి కదలనివి... అన్నీ పుట్టడానికి కారణం నువ్వే! నీవు కాలస్వరూపుడవు! ఈ నిఖీలమును కాలరూపంగా నీయందు ధరిస్తావు. ప్రవాహం ప్రాణికోటిని ధరించినట్లు నీవు సమస్త జీవులను నీలోనే ఉంచుకొని రక్షిస్తావు. సృష్టికర్తలకు సృష్టికర్తవు నీవు. స్వర్గాన్ని విడిచిపెట్టి దుర్దశతో దుఃఖసముద్రంలో మునిగి ఉన్న దేవతలందరికీ ఆధారమై ఉన్న తెప్పవు నీవే.

క. విచ్చేయు మదితి గర్భము, చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్ విచ్చలవిడి లేకమరులు, ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్.

504

తా ॥ మహాత్మా! చిరకాలంగా దేవతలు స్వేచ్ఛగా సంచరించలేక బాధపడుతున్నారు. వారు సంతోషాన్ని పొందేటట్లుగా అదితి గర్భము నుండి వెలికి రావయ్యా!"

## వామనమూర్తి ఆవిర్భావ ఘట్టము

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు న య్యవసరంబున.

505

మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజి త్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతకున్.

506

తా ॥ అని ఈ విధంగా బ్రహ్మదేవుడు స్తోత్రం చేశాడు. అనంతరం రవి మధ్యాహ్న కాలంలో ఉండగా, గ్రహములు, నక్షత్రములు, చంద్రుడు, భద్ర స్థితిలో ఉండగా, శ్రావణ శుద్ధ ద్వాదశినాడు శ్రవణా నక్షత్రంలో అభిజిత్తు లగ్నంలో శ్రీమహా విష్ణువు వామన రూపంలో పరమ పతివ్రత అయిన అదితియందు ఉద్భవించాడు.

వ. మఱియు న ద్దేవుండు శంఖచక్రగదా కమల కలిత చతుర్భుజుండును, బిశంగవర్ణవస్త్రుండును, మకర కుండల మండిత గండ భాగుండును, శ్రీవత్సవక్షుండును, నలిన చక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబాలంబిత వనమాలికా పరిష్కృతుండును, మణీకనక కాంచీవలయాంగద కిరీటహార నూపురాలంకృతుండును, కమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నిఖీలజన మనోహరణుండునునై యవతరించిన సమయంబున.

507

తా ॥ అప్పుడు ఆ పరమాత్మ శంఖము, చక్రము, గద, కమలము నాలుగు చేతులలో ధరించి ఉన్నాడు. కపిల వర్ణం కలిగిన వస్త్రము, మకర కుండలాలతో కూడిన చెక్కిళ్ళు,

శ్రీవత్సమనే పుట్టుమచ్చతో కూడిన వక్షస్థలము, పద్మముల వంటి కన్నులను కలిగి ఉన్నాడు. నిరంతరము తుమ్మెదలు మూగిన సుందరమైన వనమాల ధరించి ఉన్నాడు. మణులతో కూడిన కనకపు ఒడ్డాణము, బాహుపురులు, కిరీటము, హారములు, కాలి అందెలు వీటితో ప్రకాశిస్తున్నాడు. అందమైన కంఠభాగాన కౌస్తుభం మెరిసి పోతున్నది. అఖిల జనులను ఆకర్షించేలాగా మనోహరంగా ఉన్నాడు.

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్యచారణ మునీశ బ్రహ్మ విద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు; రంగద్గీత వాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్.

508

తా ॥ శ్రీమహా విష్ణువు వామనుడై జన్మించగానే యక్షులు గరుడులు దేవతలు సిద్ధులు నాగులు మొదలైన వారంతా విచారించటం మానేశారు. సాధ్యులు, చారణులు, ఋషులు, ఋత్విక్కులు, విద్యాధరులు వీరంతా సంతోషించారు. సూర్యచంద్రులు చాలా ప్రకాశవంతంగా ఉన్నారు. కింపురుషులు గంధర్వులు కిన్నరులు ఆడుతూ పాడుతూ వాద్యాలను వాయిస్తూ నృత్యం చేశారు.

క. దిక్కుల కావిరి వాసెను, నెక్కువ నిర్మలత నొందె నేడు పయోధుల్ నిక్కమెయి నిలిచె ధరణియుఁ, జుక్కల త్రోవయును విప్రసుర సేవ్యములై.

509

తా ॥ దిక్కులలో ఎక్కడా నలుపు అనేది లేకుండా, అన్నీ తేజోవంతంగా ఉన్నాయి. సప్తసముద్రాలు ఎంతో నిర్మలంగా ఉన్నాయి. ధరణీదేవి పులకించి పోయింది. బ్రాహ్మణులు, దేవతలు పరమానందాన్ని పొందారు.

క. ముంపుగొని విరుల వానల, జొంపంబులు గురియ సురలు, సుమనోమధువుల్ తుంపర లెగయఁ బరాగపు, రొంపుల భూభాగ మతి నిరూషిత మయ్యెన్.

510

తా ॥ పొదరిండ్లు అన్నీ పూలను విరజిమ్మాయి. దేవతలు కురిపించిన పూలవానకు మకరందపు తుంపరలు ఎగసి పడగా, పుప్పొడి కుప్ప తెప్పలుగా భూభాగం అంతా నిండిపోయింది.

వ. తదనంతరంబ.

511

ఆ. ఈ మహానుభావుఁడె ట్లింత కాలంబు, నుదరమందు నిలిచి యుండె ననుచు నదితి వెఱఁగుపడియె నానంద జయశబ్ద, ములను గశ్యపుండు మొగి నుతించె.

512

తా ॥ ఆ వామన మూర్తిని దర్శించిన అదితి ఈ మహానుభావుడు ఇంతకాలం నా ఉదరంలో ఎలా నిలిచి ఉన్నాడా అని ఆశ్చర్యపోయింది. ఆనందంతో కూడిన జయ జయ ధ్వానాలతో కశ్యప ప్రజాపతి నుతించాడు.

వ. అంత నవ్విభుండు సాయుధ సాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుని చందంబున నుపనయన వయస్కుండైన వామన బాలకుండై దల్లి ముందటఁ గుమార సముచితా లాపంబు లాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుం దన యవలోకన పరిణామ పారవశ్యంబున.

513

తా ॥ అటు పిమ్మట శ్రీమహా విష్ణువు ఆయుధాలూ, అలంకారములూ కలిగి ఉన్న తన

దివ్యరూపాన్ని ఉపసంహరించుకుని, రూపాంతరమునొంది కపట బ్రహ్మచారి రూపంలో నిలిచాడు. ఉపనయన వయస్సులో గల ఆ బాలుడు తల్లిముందు నిలిచి అలరించగా అదితి ఆనందంతో పరవశించింది.

ఆ. నన్నుఁ గన్న తండ్రి! నా పాలిదైవమ!, నాతపఃఫలంబ? నా కుమార!
నాదు చిన్ని వడుగ! నాకులదీపక!, రాఁగదయ్య! భాగ్య రాశి వగుచు.

514

క. అన్నా రమ్మని డగ్గఱిఁ, చన్నుల పాలేఱువాఱ సంశ్లేషిణియై
చిన్నారి మొగము నివురుచుఁ, గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్.

515

తా ॥ ఆ వామనుని దగ్గరకు చేర్చుకుని, 'నా కన్న తండ్రీ! నా పాలి దైవమా! నా తపః ఫలముగా జన్మించావు కదా! నా చిట్టి తండ్రీ! నా కులదీపకా! ఈ వడుగు బ్రహ్మచారి రూపంలో ఎంత ముచ్చటగా ఉన్నావు నాన్నా!' అని అంటూ, ఆ చిన్నారి బాలుని ముఖం నిమురుతూ, కళ్ళనిండుగా చూడసాగింది.

క. పురు డీ బోటికి నిందిర, పురు దంబిక గాక యొరులు పురుడే? యనుచున్ బురుటాలికిఁ
బది దినముల, పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపు గరితల్.

516

తా ॥ ఈమెకు లక్ష్మీ పార్వతులే సమానమైన వారు. ఒరులు సమానం కారు... అంటూ పుణ్యస్త్రీలు పురుటాలికి పది రోజులు పురుడు నడిపారు.

వ. అంత నా బ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితో పనయన కర్మకలాపంబులు సేయించిరి; సవిత సావిత్రి నుపదేశించె; బృహస్పతి

యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి గృష్ణాజినంబును, దండంబు వనస్పతియగు సోముండును, గగనాధిష్ఠాన దేవత ఛత్రంబును, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు గుశ పవిత్రంబులు నిచ్చిరి, మఱియును.

517

తా ॥ పిమ్మట ఆ బాలునికి ఉపనయనం చేసేందుకు సంతోషంతో మహర్షులందరూ కశ్యప ప్రజాపతిని ముందు పెట్టుకుని యథావిధిగా ఉపనయన కర్మకలాపాలను చేయించారు. అప్పుడు సూర్యుడు గాయత్రీ మంత్రాన్ని బోధించాడు. బృహస్పతి యజ్ఞోపవీతాన్ని, కశ్యపుడు ముంజ దర్భల మొలత్రాడును, అదితి కౌపీనాన్ని, భూదేవి నల్లని జింక చర్మాన్ని, చంద్రుడు దండాన్ని, ఆకాశం ఛత్రాన్ని, బ్రహ్మ కమండలాన్ని, సరస్వతీదేవి రుద్రాక్షమాలను, సప్తఋషులు పవిత్రమైన దర్భలను ఇచ్చారు.

క. భిక్షాపాత్రిక నిచ్చెను, యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్ సాక్షాత్కరించి పెట్టెను, భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా!

518

తా ॥ ఓ రాజా! కుబేరుడు భిక్షాపాత్రను ఇచ్చాడు. పార్వతీదేవి సాక్షాత్కరించి “అక్షయం” అంటూ ఆ బ్రహ్మచారికి పూర్ణభిక్ష పెట్టింది.

క. శుద్ధబ్రహ్మర్షి సమా, రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం బ్రోద్ధంబగు ననలంబున, వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడఁకన్.

519

తా ॥ పరిశుద్ధులైన బ్రహర్షులు ఒప్పుగా వేదమంత్రాలను పఠిస్తూ ఉండగా ప్రజ్వరిల్లుతున్న అగ్నిహోత్రంలో సంప్రదాయ సిద్ధంగా హోమం చేసాడు.

## బలిచక్రవర్తి వద్దకు వామనమూర్తి అరుదెంచుట

వ. ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె.

520

తా ॥ ఈ విధంగా ఉపనయనాన్ని పూర్తి చేసుకున్న ఆ మాయా బ్రహ్మచారి ఇతర ప్రదేశముల నుండి వచ్చిన కొందరు బ్రాహ్మణులతో ఈ విధంగా అన్నాడు:

క. వత్తురె విప్రులు? వేఁడఁగ, నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం? దెత్తురె మీరును సంపద?, లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ చెపుఁడా?

521

వ. అనిన నఖిల దేశీయు లగు భూసురు లిట్లనిరి.

522

తా ॥ "విప్రులు కోరిన కోరికలను తీర్చే దాతలు ఉన్నారా? అటువంటి వారివద్దకు విప్రులు వెడతారా? మీరు అలా ధనాన్ని ఎవరి వద్దైనా తెచ్చుకున్నారా? అలా అడిగిన వారికి లేదనకుండా ఇచ్చే దానవీరులు ఎవరైనా ఉంటే చెప్పండి" అని ఆ నూతన వటువు అడిగేసరికి అన్ని ప్రాంతాలనూ సందర్శించే బ్రాహ్మణులు ఇలా అన్నారు:

మ. 'కలరున్ దాతలు; నిత్తురుం ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురు; గాని యీవిని బలింబోలన్ వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే;
బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా!

523

తా ॥ "ఓ వామనా! లోకంలో దాతలు అనేకమంది ఉన్నారు, వారి వద్ద నుండి విప్రులు ధనాన్ని పొందుతారు. అయితే దాతలలో బలిచక్రవర్తిని మించినవారు ఇంకొకరు లేరు. అతను శుక్రాచార్యుని ఆధ్వర్యంలో నూరు యాగాలను ఘనంగా చేసాడు. అతన్ని ఆశ్రయిస్తే నీకు అనేక విధాలుగా లాభం చేకూరుతుంది."

వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులు గైకొనుచుఁ దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి.

524

తా ॥ అని చెప్పిన బ్రాహ్మణుల మాటలు విని లోకాలకు మేలు కలగచెయ్యటం కొరకు వామనుడు తల్లిదండ్రుల వద్ద ఆశీర్వచనములు పొంది శుభముహూర్తంలో బయలుదేరాడు.

క. ప్రక్షీణ దివిజ. వల్లభ, రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం డా క్షణమున బలి యింటికి, భిక్షాగమనంబు సేసెఁ బేదటికముతోన్.

525

తా ॥ శక్తిసామర్థ్యాలు నీరసించిన దేవేంద్రున్ని రక్షించటం కొరకు రాజీవాక్షుడు ఆ క్షణంలో బలిచక్రవర్తి ఇంటికి భిక్షకై పేదవాని వలె బయలుదేరాడు. ఆహా! ఆపన్నులకై ఎటువంటి కార్యానికైనా వెనుదీయడు కదా ఆ కృపాసింధువు.

క. హరి హరి! సిరి యురమునఁ గల, హరి హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెం; బరహితరతి మతియుతులగు, దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్.

526

తా ॥ తన వక్షస్థలం మీద సకలైశ్వర్యప్రదాయిని అయిన లక్ష్మీదేవిని ధరించిన

శ్రీమహావిష్ణువు ఇంద్రుని కొరకు బలిచక్రవర్తిని యాచించుటకై వెళ్ళాడు. ఇతరుల నిమిత్తం యాచించడం కూడా గొప్పవారికి ఒక అలంకారమే కాబోలు!

క. సర్వప్రపంచ గురుభర, నిర్వాహకుఁ డగుటఁజేసి నెఱిఁ జనుదేరన్ ఖర్వుని వ్రేఁగు సహింపక, యుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్.

527

తా ॥ సర్వ ప్రపంచాన్ని భరించే నిర్వాహకుడయిన కారణంగా అతడు నడిచి వచ్చేటప్పుడు ఆ భారాన్ని సహింపలేక ధరణి క్రుంగింది. ఆదిశేషువు వంగిపోయాడు.

వ. ఇట్లు సని చని.

528

క. శర్మద, యమదండ క్షత, వర్మద, నతి కఠినముక్తి వనితాచేతో మర్మద, నంబునివారిత, దుర్మద, నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్.

529

తా ॥ ఇలా బయలుదేరిన వామనుడు నర్మదా నదిని దాటాడు. ఆ నది శుభాలను చేకూర్చేది. యమధర్మరాజు వేసే శిక్షలకు కవచం వలె కాపాడేది. అత్యంత కఠినమైన ముక్తి వనిత యొక్క మనస్సులోని రహస్యాలను బయటపెట్టేది. స్నానం చేసిన వారి మనస్సులను క్షాళనం చేసేది.

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు.

530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధ స్సిద్ధ కూటంబు, వే

దండాశ్వధ్వజినీ కవాటము, మహోద్యద్ధూమ సంఛన్న మా
ర్తాండ స్యందన ఘోటమున్, బలిమఖాంతర్వేదికావాటమున్.

531

తా ॥ ఆ విధంగా మహా తేజస్సుతో వామనుడు వెళుతూ ఆ నర్మదా నదిని దాటి ఉత్తర తీరంలో బలిచక్రవర్తి యాగం చేస్తూన్న ప్రదేశాన్ని చూసాడు. అక్కడ దానవులు అనేక విధాలుగా ఉపయుక్తం కాని మాటలు మాట్లాడుతున్నారు. యజ్ఞానికి ఆహూతులైన మునీశ్వరులను చూసి దేవతలు, సిద్ధులు భయపడుతున్నారు. ఆ యాగశాలకు ముందుగా గజములు, అశ్వములు, సైన్యము మోహరించి ఉన్నాయి. ఆ యజ్ఞకుండాల నుండి వెలువడే ధూమం సూర్యుని రథానికున్న గుర్రాలను కప్పివేసినట్లుగా ఉంది.

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియం జొచ్చు నయ్యవసరంబున.

532

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాశుఁడో వహ్నియో
దంభాకారత వచ్చెఁ గాక, ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞతనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

533

తా ॥ అటువంటి అశ్వమేధ వాటిక లోపలికి వామనుడు ప్రవేశించగానే ఆ సభలోని వారందరూ ఆ వటువు తేజస్సుని చూసి విస్మయ భ్రాంతులై ఇలా సంభాషించుకుంటున్నారు. ఇతడు శివుడో! విష్ణువో! బ్రహ్మయో! సూర్యుడో! అగ్నియో! మారువేషంలో వచ్చాడు కాని లేకపోతే ఇంతటి కాంతి, అందం గల మనోహరుడు ఈ లోకంలో ఉంటాడా? అంటూ విస్మయంతో చూడసాగారు.

క. గుజగుజలు వోవువారును, గజిబిజిఁ బడువారుఁ జాలఁ గలకల పడుచున్ గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టివడుగు బాపని రాకన్.

534

తా ॥ అలా పొట్టివాడైన బ్రహ్మచారి రాగానే ఆ సభలో ఉన్నవారు కొందరు గుసగుసగా మాట్లాడుతున్నారు. కొందరు గజిబిజి అయ్యారు. కొందరు తికమక పడ్డారు. మొత్తానికి ఆ సభాస్థలిలో కలకలం చెలరేగింది.

వ. ఆ సమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి.

535

సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు సదువు నుద్గాతల చదువు వినుచు
మంత్ర తంత్రార్థ సంబంధ భావములు పే ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు
హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల వెలిఁగించు యాజక వితతిఁ గనుచు
దక్షులై బహువిధాధ్వర విధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ

తే. బెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప, నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు గోరి చరియించె సభలోనఁ గొంతదడవు, పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు.

536

తా ॥ భగవానుడు సమగ్రమైన ఆరు లక్షణాలని కలిగి ఉన్నవాడు – మాహాత్మ్యం, ధైర్యం, యశస్సు, సంపద, జ్ఞానం, వైరాగ్యం. ఇన్ని లక్షణాలను కలిగి ఉన్న ఆ స్వామి, పుట్టుకే లేనివాడు అయినా అదితికి పుత్రునిగా జన్మించాడు; లక్ష్మీదేవికి ఆటపట్టైనవాడు యాచనకు వచ్చాడు. అలాంటి లక్షణాలను కలిగి ఉన్న ఆ భగవానుడు బలిచక్రవర్తి సభామండపానికి వచ్చి ఆ ప్రాంగణంలో ఏమీ తెలియనివానివలె అటు ఇటు తిరుగాడసాగాడు. సామవేదాన్ని పఠిస్తున్న ఉద్గాతల గానం వింటున్నాడు. హోమం చేస్తూ మంత్ర తంత్రాల సంబంధిత భావాలను

వివరిస్తున్న హోతలను కలుసుకున్నాడు. హోమగుండంలో మూడు రకాలైన అగ్నులను ప్రజ్వలింపచేస్తున్న ఋత్విజులను చూడసాగాడు. దక్షతను కలిగి ఉండి, యాగ విధాలను వివరిస్తున్న సభాపతులచెంత నిలిచాడు. ఇలా ఆ ప్రాంగణం అంతా కలయతిరుగుతున్నాడు.

వ. మఱియును.

537

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నఱిముఱి గుబురులకుఁ జనుచు హరి హరి యనుచున్
మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ, గుఱుమట్టపుఁ బొట్టివడుగు గొంత నటించెన్.

538

తా ॥ ఇంతేకాక భయపడుతూ, వంగి నడుస్తున్నాడు. గుంపుగా ఉన్న జనసమూహంలోనికి దూరుతూ, మధ్యమధ్యలో 'హరి, హరి' అని ఉచ్చరిస్తూ చాటుకి వెడుతూ, అంతలోనే ఉలిక్కిపడుతూ... ఇలా కొంత తడవు ఆ బాలవటువు వలె నటించాడు.

క. కొందఱతోఁ జర్చించును, గొందఱతో జటలు సెప్పు గోష్ఠిం జేయుం గొందఱతోఁ
దర్కించును, గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్.

539

వ. మఱియు ననేక విధంబుల నందఱకు నన్ని రూపులై వినోదించుచు.

540

తా ॥ అంతేకాక కొందరితో చర్చిస్తూ, కొందరితో వేదం జట చెబుతూ, కొందరితో గోష్ఠి జరుపుతూ, కొందరితో తర్కిస్తూ, కొందరితో ముచ్చటలు ఆడుతూ, కొందరితో నవ్వుతూ..... ఇలా అనేక విధాలుగా వ్యవహరిస్తూ వినోదిస్తున్నాడు.

క. వెడవెడ నడకలు నడచుచు, నెడనెడ నడు గిడఁగ నడరి యిల దిటఁ బడఁగా

బుడి బుడి నొడువులు నొడువుచుఁ, జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్.

541

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె.

542

తా ॥ ఇలా ఆ మాయావటువు మెల్లమెల్లగా అడుగులు వేస్తూ, నడుస్తున్నప్పుడు పాదాలు తడబడగా అక్కడ భూమి కుంగుతుంటే, తన బుల్లి బుల్లి పాదాలతో జాగ్రత్తగా నడుస్తూ ఆ బలిచక్రవర్తిని సమీపించాడు. ఆ రాజుని చూసి ఇలా అన్నాడు:

మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గార్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ
వ్రతదాన ప్రవణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధత చంద్రాపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్.

543

వ. అని కుశ పవిత్రాక్షత సంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె.

544

తా ॥ "ఇతడేనా ఆ దానవ చక్రవర్తి! ఇతడేనా ఇంద్రుడు, అగ్నీ, యముడు ఆదిగాగల దిక్పాలకుల గర్వాన్ని పోగొట్టిన రారాజు! లోభగుణం లేనివాడితడేనా! అనేక యజ్ఞములలోను వ్రతములలోను సంతోషంతో దానమిచ్చేవాడు ఇతడేనా! దేవతా స్త్రీల మనస్సును కలవరపరచే చంద్రిక వంటి కీర్తి కలవాడు ఇతడేనా! ఇతడేనా సత్యము కరుణ, ధర్మము వీటితో వెలుగొందే వాడు!" అని అంటూ దర్భలు, పవిత్రమైన అక్షతలను కలిగి ఉన్న తన కుడి చేతిని చాచి ఇట్లా అన్నాడు:

ఉ. స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు, హాసమాత్ర వి

ధ్వస్త నిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్.

545

తా ॥ "మూడు లోకాలను శాసించగలవాడా! అవలీలగా ఇంద్రుని సార్వభౌమాధికారాన్ని విధ్వంసం చేసిన దానవ రాజా! ఉదార పదములచే వ్యవహరించేవాడా! మంగళకరములైన యాగాలు చేస్తూ మునీంద్రుల చేత పొగడబడినవాడా! దేవతాస్త్రీల మంగళ సూత్రాలను పరిహరించగలవాడా! దానవులకు సార్వభౌముడైనవాడా! నీకు జయమగు గాక!"

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండచ్ఛత్త్రుండును, గక్షలంబిత భిక్షాపాత్రుండును, గరకలిత జలకమండలుండును, మనోహర చంద్రవదన మండలుండును, మాయావాదన నటుండును, నగు వటువుం గని దినకర కిరణ విహతంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్న యెడల లేచి సేమం బడిగి తియ్యని మాటల నాదరించిరి, బలియును నమస్కరించి తన గద్దియ నునిచి, పాదంబులు దుడిచి తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులు వోయ వడుగుం గొమరుని చరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున.

546

తా ॥ అని దీవించి ఆ బలిచక్రవర్తి ముందు నిలిచాడు వామనుడు. ఆ సమయమున అతడు వేదరాశి అంతా ఆకారందాల్చి కరచరణాది అవయములతో నిల్చినట్లుగా ఉన్నాడు. నిష్కళంకుడైన ఆ వటువు జడలు గట్టిన జుట్టుతో, దండం, గొడుగుని పట్టుకుని ఉన్నాడు. మరొక చేతిలో కమండలం ఉన్నది, చంకలో భిక్షాపాత్ర వేలాడుతోంది. మనోహరమైన చంద్రుణ్ణి పోలిన ముఖాన్ని కలిగిన ఆ మాయా వటువును చూసాడు బలి. ఆ బాల వటువు తేజస్సు

ముందు అక్కడ కూర్చున్న భృగువంశపు పురోహితుల ముఖాలు కాంతివిహీనంగా తోచసాగాయి. సూర్యుని తేజస్సు ముందు మరుగున పడిన ఇతర గ్రహాల వలె ఉన్నారు వారు. అతనిని చూసి వారు దిగ్గున లేచి, ఆ బ్రహ్మచారిని క్షేమం అడిగి ఆదరించారు. బలిచక్రవర్తి కూడా తన ఆసనం నుండి లేచి, తన ఇల్లాలు బంగారు కలశంతో నీళ్ళు ధారగా పోస్తుంటే, వామనుని పాదములు కడిగి తడిని తుడిచాడు.

ఆ. వటుని పాద శౌచవారి శిరంబునఁ, బరమ భద్ర మనుచు బలి వహించె నే జలము
గిరీశుఁ డిందుజూటుఁడు దేవ, దేవుఁ డుద్వహించె ధృతి శిరమున.

547

వ. మఱియు న య్యజమానుం డభ్యాగతున కిట్లనియె.

548

తా ॥ చంద్రుణ్ణి తన శిరస్సున శిరోభూషణంగా ధరించిన మహాదేవుడైన శివుడు ఏ జలమును తన శిరస్సున ధరిస్తాడో, అట్టి వటుని పాదములను కడిగిన జలాన్ని మేలు కలిగిస్తాయనే విశ్వాసంతో బలిచక్రవర్తి తన తలపై చల్లుకొన్నాడు. పిమ్మట అభ్యాగతుడైన వామనునితో ఇట్లా అన్నాడు:

మ. వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలం బెయ్య? ది
య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫల మయ్యెన్ వంశమున్ జన్మముం;
గడు ధన్యాత్ముఁ డనైతి, నీ మఖము యోగ్యంబయ్యె; నా కోరికల్
గడతేఱెన్! సుహుతంబులయ్యె శిఖులుం! గల్యాణ మిక్కాలమున్.

549

తా ॥ "ఓ బ్రహ్మచారీ! నీవు ఎవరి పిల్లవాడివి? నీపేరేమిటి? నీవు ఎక్కడ ఉంటావు? ఇక్కడకు నీవు రావడం వలన నా వంశమూ, జన్మమూ కూడ సఫలమయ్యాయి. నేను

ధన్యుడనయ్యాను. నా యజ్ఞం ఫలించింది. నా కోరికలన్నీ తీరాయి. అగ్నులు చక్కగా వేల్చబడ్డాయి. ఈ కాలం ఎంతో కల్యాణప్రదమైనది.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీ ఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా!

550

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుం డిట్లనియె.

551

తా ॥ ఓ బ్రాహ్మణోత్తమా! నీకు ఏమి కావాలి? శ్రేష్ఠమైన వస్త్రములా? ధనమా? ఫలములా? అడవిలో లభించే సంపదలా? ఆవులా? రత్నములా? రథములా? మంచి భోజనమా? కన్యలా? ఏనుగులా? బంగారమా? చక్కటి ఇల్లా? గ్రామములా? భూములా? నువ్వేలుకోవడానికి భూభాగమా? ఇవికాక ఇంకేమైనా కావాలా?" అని ధర్మయుక్తంగా పలికిన బలిచక్రవర్తి మాటలను విని సంతోషిస్తూ వామనుడు ఇట్లా అన్నాడు:

సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు? నొకచో టనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు? నాయంతవాఁడనై నడవనేర్తు;
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవ నేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ? నేరువు లన్నియు నేన నేర్తు

ఆ. నొరులు గారు నాకు నొరులకు నే నౌదు, నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా టెంకి, సుజనులందుఁ దఱచు సొచ్చియుందు.

552

తా ॥ "ఓ రాజా! ఇదీ నేను నివసించే చోటని నీకు ఎలా చెప్పగలను? ఒక్కచోటు అని కాక నేను అన్ని చోట్లా ఉంటాను. నేనెవరివాడినని అడిగావు, దానికీ నా వద్ద సమాధానం లేదు, అందరూ నావారే; నా నడవడి ఇది అని ఎలా చెప్పను? నా అంతవాడను నేనే, పూనికతో మూడు పోకల్లో ఉండగలను. అది నేర్చుకున్నాను, ఇది అభ్యసించాను అని చెప్పడం దేనికి? అన్ని విద్యలూ నావే; నాకు పరాయివారంటూ ఎవరూ లేరు, అందరికీ నేను కావలసినవాడినే. అలా అని నాకు బంధువులంటూ ఎవ్వరూ లేరు, నేను ఒంటరివాడనే! ముందు నాకు సిరి ఉండేది. నేను మంచివారితో కలిసి ఉంటాను, నా నివాసస్థానం అదే!

వ. అది యట్లుండ నిమ్ము.

553

సీ. జననాథ! నీ మాట సత్యంబు సత్కీర్తిదంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ గరుణానువర్తులు ఘనతత్త్వ మూర్తులు గాని మీ కులమందుఁ గలుగ రొరులు రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన దానశౌండిమమునఁ దనుపుదు రధికులై మీ తాత లందఱు మేటిమగలు

ఆ. మీ కులంబునందు మెఱయుఁ ప్రహ్లాదుండు, మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు, నీరరాశి భంగి నెగడు చుండు.

554

తా ॥ ఓ రాజా! ఆ సంగతి అలా ఉంచు. ఇప్పుడు నీవు అన్న మాట సత్యము. కీర్తినిచ్చేది, నీ కులానికి అర్హమైనది, ధర్మంతో కూడినది; మీ కులంలో పుట్టిన వారందరూ కరుణామూర్తులు, తత్త్వవేత్తలూ. ఇప్పటి వరకు వేరేవారు ఎవరూ పుట్టలేదు. యుద్ధము అంటే భయపడే వారుకానీ, కోరిన వారికి లేదనే వారుకానీ ఎవరూ లేరు. చెంతకు వచ్చినవారు ప్రత్యర్థులయినా సరే

అడిగింది లేదనకుండా ఇస్తారు. మీ పెద్దలు అందరూ సాటిలేని పరాక్రమవంతులు. మింటిలో మెరిసే పూర్ణచంద్రునివలె మీ వంశపువాడైన ప్రహ్లాదుని కీర్తిప్రతిష్ఠలు ఆకాశాన్ని అంటుతున్నాయి. గొప్పదైన కీర్తిప్రతిష్ఠలతో మీ వంశం సముద్రంవలె ఉప్పొంగుతూ ఉన్నది.

వ. తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతి వీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుం దది విని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును, బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజ మర్దను మందిరంబునకుం జనియె; నప్పుడు–

555

తా ॥ మీ పూర్వీకుడైన హిరణ్యాక్షుడు ఈ విశ్వాన్నంతటినీ జయించి గదను ధరించి భూమి మీద తనతో సమానమై తనను ఎదిరించే వీరుణ్ణి కానక సంచరించేవాడు. శ్రీమహా విష్ణువు వరాహ రూపంలో అతన్ని వధించాడు. అతని సోదరుడైన హిరణ్యకశిపుడు అది విని హరి పరాక్రమానికి ఆశ్చర్యపోయి హరి యొక్క జయాన్ని, బలాన్ని పరిహసిస్తూ హరియొక్క మందిరానికి వెళ్ళాడు.

క. శూలాయుధహస్తుండై, కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ, శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్.

556

తా ॥ శూలాన్ని ధరించి ప్రళయ కాలంలో యముని వలె వస్తూన్న హిరణ్యకశిపుణ్ణి చూసి సమయాసమయాలు తెలిసినవాడూ, మాయలమారి అయిన విష్ణువు తన మనస్సులో ఇలా అనుకొన్నాడు.

మ. ఎదురై పోర జయింప రాదితనిఁ; గా కెందేనినిం బోవ భీ

ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బై వచ్చు నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్వాస రం
ధ్ర దిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్ష క్రియా భీరుఁడై.

557

తా ॥ ఇతనిని ఎదురుగా పోరి జయించలేము. అలా అని ఎక్కడికైనా పోదామంటే ప్రాణులపైకి మృత్యువులా వస్తాడు అని అనుకొని పనిని నెరవేర్చే సామర్థ్యంగల విష్ణువు ఆ దైత్యుని సూక్ష్మరూపంతో ముక్కు రంధ్రం గుండా అతని హృదయంలోనికి ప్రవేశించాడు.

వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబు మానక మిన్ను మన్ను నన్వేషించి, త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూ వివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి, తనలో నిట్లనియె.

558

తా ॥ దానితో దైత్యవల్లభుడైన ఆ హిరణ్యకశిపుడు జనార్దనుని మందిరంలోనికి ప్రవేశించి అంతటా వెతికినా, ఆ విష్ణువుని చూడలేక పోయాడు. కోపంతో ఆ రాక్షసుడు ఆకాశం, భూమి, స్వర్గలోకం, దిక్కులు, భూమిలోపల అంతటా అన్నిటా వెతికాడు. సముద్రములు వెతకి, నగరాలు శోధించి, అడవులను పరిశీలించాడు కాని ఎక్కడా హరి కనిపించక పోయేసరికి తనలో తాను ఇలా అనుకొన్నాడు:

క. 'పగవాఁడు మడియనోపును, దెగఁ డేనిని నెదురువడఁడే? దేహధారులకుం దెగినయెడఁ
బగఱ మీఁదను, బగ గొనఁ దగ' దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్.

559

వ. అతండు మీ ప్రపితామహుం; డనతిగుణంబు లనేకంబులు గల; వవి యట్లుండనిమ్ము.

560

తా ॥ 'నా శత్రువు మరణించి ఉండవచ్చును. చావకుండా బ్రతికి ఉంటే నన్ను ఎదుర్కొని ఉండేవాడే. బ్రతికి ఉంటే వైరంకాని చనిపోయిన వానితో పగ ఏమిటి?' – ఇలా అనుకొని హరితో శత్రుత్వాన్ని విరమించి దండయాత్రను ఆపేశాడు. అట్టి హిరణ్యకశిపుడు మీ ప్రపితామహుడు, ఇలాంటి గొప్ప గుణాలు ఇంకా చాలా ఉన్నాయి. అది అలా ఉండనిమ్ము.

క. ఆతుర భూసురగతిఁ బురు, హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొం డనుచున్ మీ తండ్రి యిచ్చె నాయువు, నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్?

561

తా ॥ ఇంక నీ తండ్రి సామాన్యుడా! ఇంద్రాదులు బ్రాహ్మణులవలె తనను ప్రార్థింపగా మీ తండ్రి తీసుకోండని ఆయువును దానం ఇయ్యలేదా? నీవు మాత్రం వారికి ఏ విధంగా తీసిపోగలవు?

క. ఏలితివి మూఁడు జగములుఁ, దోలితి వింద్రాది సురలఁ, దొల్లిటివారిం బోలితివి దానగుణముల, చాలితి వీ రాక్షసులను సంరక్షింపన్.

562

తా ॥ మూడు లోకాలను పాలించావు. ఇంద్రాది దేవతలనందరినీ జయించావు. దానగుణంలో మీ పూర్వులకు సమానమైన వాడివి. రాక్షసులనందరినీ చక్కగా సంరక్షిస్తున్నావు.

వ. అదియునుం గాక.

563

క. రాజ్యంబు గలిగె నేనిం, బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్ భాజ్యముగ బ్రదుకఁ డేనిం, ద్యాజ్యంబులు వానిజన్మ ధన గేహంబుల్.

564

తా ॥ అంతే కాకుండా పరిపాలనలో ఉన్న రాజులు పూజ్యులైన వారిని గౌరవించాలి. యాచకులకు దానం చెయ్యాలి. విప్రులను సత్కరించాలి. ఇవేమీ చేయనివారికి ఎంత ధనమూ, వైభవమూ ఉన్నా ఆ జన్మము నిరర్థకమే అవుతుంది.

క. మున్నెన్నుదురు వదాన్యుల, నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్; ఇన్ని దినంబుల నుండియు, నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రము సేయన్.

565

తా ॥ దాతలను లెక్కించేటప్పుడు ముల్లోకాలలోను ముందుగా నిన్నే కీర్తిస్తారు. ఇంతవరకూ నాకు ఇది కావాలి అని నిన్ను నేను అడిగింది లేదు.

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగులు, మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ; గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద, దానకుతుక సాంద్ర! దానవేంద్ర!

566

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె.

567

తా ॥ ఓ రాజా! దానం ఇవ్వాలనే కుతూహలం నీకు మెండుగా ఉన్నది. నేను ఒంటరివాడిని నాకు సొమ్ములు, భూములు అవసరం లేదు. నాకు మూడు అడుగుల మేర భూమి ఇస్తే చాలు. దానితో నా కోరికలన్నీ తీరగలవు. నేను బ్రహ్మానందాన్ని పొందుతాను” అని అడిగిన వామనునితో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు:

ఆ. ‘ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ!, సత్యగతులు వృద్ధసమ్మతంబు; లడుగఁ దలఁచి కొంచె మడిగితివో చెల్ల!, దాత పెంపుఁ సొంపుఁ దలఁపవలదె?’

568

వ. అని మఱియు నిట్లనియె.

569

తా ॥ "ఓ విప్రోత్తమా! నీవు అన్నమాటలన్నీ యథార్థములే. అవన్నీ పరమ సత్యములు, పైగా శ్రేష్ఠులైన వారిచే ఆమోదించబడినవే! అయినా కోరిన వాడవు ఇంత చిన్న కోరికను కోరావు ఏమిటి? కోరేటప్పుడు దాత యొక్క అభివృద్ధీ, దాతృత్వాన్ని, అతని సంతోషాన్ని కూడా తలచుకోవాలి కదా!" అని ఇంకా ఇలా అన్నాడు:

మ. వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్ వెస నూహించితొ? కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో? పసిబాలుండవు; నేర వీ వడుగ; నీభాగ్యంబు లీపాటిగా కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీనేర్చునే?

570

వ. అన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె.

571

తా ॥ "భూభాగాన్ని కోరావా? ఏనుగులను వాంఛించినావా? గుర్రాలను ఊహించావా? యువతులను వీక్షించి కాంక్షించినావా? నీవు పసి బాలుడవు. నీకు అడగటం కూడా తెలియదు. అందువలన అలా కోరావు. నీవు మూడడుగుల నేలను భాగ్యంగా భావించినా, ఇంతటి రాక్షసరాజు ఆ స్వల్పమైన దానినే ఎలా ఇస్తాడు" అని బలిచక్రవర్తి అన్నాడు. బలిచక్రవర్తి తన సంపదలే గొప్పవి అనే ఆలోచనలో ఉన్నాడు (గృహమేధి), అలాంటి బలిని చూసి అసలైన మేధస్సుని కలిగి ఉన్నవాడైన వామనుడు (మేధావి) చిరునవ్వుతో ఇలా అన్నాడు:

మ. 'గొడుగో, జన్నిదమో, కమండలువొ, నాకున్ ముంజియో, దండమో,
వడు గేనెక్కడ? భూము లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె

క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైవ మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.

572

తా ॥ "ఓ రాజా! నేను బ్రహ్మచారిని. నాకు గొడుగో, యజ్ఞోపవీతమో, కమండలమో, మొలత్రాడు, దండమో... ఇవి అవసరం. బ్రహ్మచారిని నేనెక్కడ? భూములెక్కడ? గజములు, యువతులు, అశ్వములు.... ఇవేమీ నాకు అక్కర లేదు. వాటికి, నా నిత్యకృత్యాలకూ సంబంధం లేదు. నేను కోరిన మూడు అడుగుల మేర కాదనకుండా నాకిచ్చుటే నా పాలికి బ్రహ్మాండం.

వ. అదియునుం గాన.

573

క. వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచుం దృప్తిం జెందని మనుజుఁడు, సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే?

574

తా ॥ అదీకాక, ఏది ప్రాప్తించినా అది కొంచెమే అయినా సరే అదే మేలని భావించక ఏదో ఊహలతో ఉంటూ బాధపడేవాడికి సప్తద్వీపాలలోని ఐశ్వర్యాన్ని ఇచ్చినా తృప్తిని పొందలేడు.

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు సేకూరియుం
గాసిం పొందిరి గాక వైన్య గయ భూకాంతాదులు; న్నర్థ కా
మాశం బాయఁగ నేర్చిరే ముని నిజాశాంతంబులం జూచిరే.

575

తా ॥ ఓ రాజేంద్రా! మనుజునికి ఈ ఆశ అనే పాశం ఉన్నదే, అది చాలా పొడవైనది. దానికి అంతం అంటూ లేదు. సముద్రం అంతంగా కల భూవలయమంతా పొందిన రాజులు కూడా శ్రమనే పొందారు కానీ తృప్తిని పొందలేదు. పృథుచక్రవర్తి, గయుడు మొదలైన రాజులు కూడా ధనం మీదా, కామం మీదా ఆశను వదలుకోలేదు. అలాగని వారి కోరికలు తీరనూ లేదు.

సీ. సంతుష్టుఁ డీమూఁడు జగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడు జరుగు సుఖము సంతోషి గాకుంట సంసార హేతువు సంతసంబున ముక్తి సతియు దొరకుఁ బూఁట పూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ తుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ బరితోష హీనతఁ బ్రభసెడి పోవును జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట, దగవు కాదు నాకుఁ; దగిన కొలఁది యేను వేఁడి కొనిన యీ పదత్రయమును, జాల దనక యిమ్ము; చాలుఁ జాలు!

576

తా ॥ లభించిన దానితో తృప్తి చెందే సంతుష్టుడు ముల్లోకాలలోనూ పూజ్యుడు. అలాంటి వానికి ఎల్లప్పుడూ సుఖంగానే ఉంటుంది. సంతోషం లేకపోవడమనే కారణం చేతనే జన్మ పరంపరలు కలుగుతున్నాయి. సంతుష్టిగలవానికి మోక్షం లభిస్తుంది. తనంత తానుగా లభించిన దానితో తృప్తి పొందే వారి తేజస్సు రోజురోజుకి పెరుగుతుంది. అలా తృప్తి కలగని వారి తేజస్సు అగ్ని నీటిని చల్లార్చినట్లుగా క్షీణించిపోతుంది. నీవు చక్రవర్తివని నిన్ను అన్నీ ఇవ్వమని అడగడం సమంజసం కాదు. నాకు తగినట్లుగా నేను కోరాను, కాదనకుండా ఈ మూడు అడుగులు ఇస్తే నాకు అంతేచాలు."

వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి కరకలిత సలిల కలశుండైన య వ్వితరణముఖరునిం గని నిజవిచారయుక్తదనుజ రాజ్య చక్రుండు శుక్రుం డిట్లనియె.

577

తా ॥ అని ఇలా పలికిన మాయా వటువుకి మూడు అడుగులు దానం ఇవ్వడానికి సిద్ధపడి, చేతిలో జల కలశం పుచ్చుకొని ఉన్న బలిచక్రవర్తితో, రాక్షస రాజ్య నిర్మాణ చాతుర్యుడైన శుక్రాచార్యుడు ఇలా అన్నాడు:

సీ. 'దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునం గశ్యపసూనుఁడై కలిగె; నకట!
యెఱుఁగ కీతని కోర్కి నిచ్చెద నంటివి దైత్య సంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చుఁ దా వాసవునకు;

ఆ. మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల, నఖిలకాయుఁ డగుచు నాక్రమించు సర్వ
ధనము విష్ణు సంసర్జనము సేసి, బడుగు పగిది నెట్లు బ్రదికె దీవు?

578

తా ॥ "ఓ దనుజేంద్రా! ఈతడు బ్రాహ్మణుడు కాడు. దేవ కార్యాన్ని సాధించడం కోసం శ్రీహరియే కశ్యప ప్రజాపతికి కొడుకుగా అదితి గర్భమందు పుట్టాడు. ఆ విషయం తెలియక ఇతని కోరిక తీరుస్తాను అన్నావు. దీని వలన నీకు ఉపద్రవం వస్తుంది. నీ లక్ష్మి, నీ తేజస్సు, నీ రాజ్యం, నీ ఐశ్వర్యం ఇవన్నీ నిన్ను వంచించి తీసుకొనిపోయి ఆ ఇంద్రునికి ఇస్తాడు. మూడు పాదాలతో మూడు లోకాలు ఆక్రమిస్తాడు. సమస్తాన్ని విష్ణువుకు ధారపోసి పేద వానిలా నీవు ఎలా బ్రతుకుతావు?

క. ఒక్కపదంబున భూమియు, నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్ దిక్కులు
గగనముఁ దానై, వెక్కసమై యున్న నెందు వెడలెదు చెపుమా!

579

తా ॥ ఇతను ఒక పాదంతో భూమిని, ఇంకొక పాదంతో స్వర్గాన్ని ఆక్రమించి దిక్కులు గగనము అన్నీ తానై యుంటాడు. అప్పుడు నువ్వెక్కడికి వెడతావు?

సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబుఁ ద్రోవ నీవును సమర్థుఁడవు గావ;
యే దానమున నాశ మేతెంచు నదియును దానంబు గా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దానయింటఁ గల సర్వధనమును నైదు భాగములుగా విభజించి కామమునకు

ఆ. నర్థమును ధర్మయశముల కాశ్రిత, బృందములకు సమతఁ బెట్టునట్టి పురుషుఁడిందు
నందుఁ బూర్ణుఁడై మోదించు, దన్నుమాని చేఁత దగవు గాదు. 580

వ. అదియునుం గాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ గీతార్థంబు గల దొక్కటి
సావధానుండవై యాకర్ణింపుము.

581

తా ॥ ఇస్తానని చెప్పి ఇవ్వకపోతే నరకం వస్తుంది. దాన్ని త్రోసి పుచ్చడానికి నువ్వు కూడా సమర్థుడవు కావు. అయితే దాతకు నాశనం కలిగించే దానం అది దానమే కాదని తత్త్వవిదులు అంటారు. దానము, యజ్ఞము, తపము, కర్మము... ఈ నాలుగు తాను ధనవంతుడైనప్పుడు చెయ్యాలి. తన వద్దగల సర్వమైన ధనాన్ని అయిదు భాగాలుగా విభాగం చేసుకొని కామమునకు, అర్థానికి, ధర్మానికి, కీర్తికి, తనను ఆశ్రయించి ఉన్నవారికి సమానంగా పంచేవాడు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ కూడా పూర్ణ జీవితాన్ని అనుభవిస్తాడు. అందుకని తనకు మాలిన ధర్మం పనికిరాదు. అదీ కాకుండ ఈ విషయంలో ఋగ్వేదం చెప్పే సూక్తి ఒకటి ఉంది. దానిని చెబుతాను విను.

సీ. అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో నన్నృతంబు గాదు లే దనిన నధిప!
యాత్మ వృక్షము మూల మనృతంబు నిశ్చయ మనృత మూలము గల్గ నాత్మ సెడదు;
పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య మా మ్రాను బ్రదుకమి నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక పససెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె?

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ, నిచ్చు పురుషుండు సెడకుండు

నిద్ధచరిత! కాక యంచిత సత్య సంగతి నటంచు, నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు.

582

తా ॥ ఓ సచ్చరిత్రా! ఇస్తానని చెప్పినా సరే దేనిని ఇస్తే సమస్తమూ పోతుందో దానిని ఇవ్వటం కుదరదు అని చెప్పడం చేత అసత్యదోషం కలుగదు. ఆత్మ అనే వృక్షానికి మూలం అసత్యమే. అసత్యం మూలంగా కల ఆత్మ ఎప్పటికీ చెడిపోదు. ఈ ఆత్మ అనే వృక్షానికి సత్యమే పువ్వులు, పండ్లు. మూలం బతక్కపోతే చెట్టు వాడిపోతుంది, పువ్వులు, పండ్లు చెడిపోతాయి. అవి లేకపోయినా మొదలు బాగుంటే వృక్షం వృద్ధిని పొందుతుంది. కనుక మూలానికి చేటు రాకుండా, కొరత లేకుండా, నలుగురిలోను పలుచన కాకుండా దానిమిచ్చే దాత చెడిపోడు. అలా కాకుండా సత్యం కోసం దానం చేస్తే చివరకు మిగిలేది ఏమీ ఉండదు.

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు, నడుగ 'లే' దటంచు ననృతమాడు చెనఁటి పంద నేమి సెప్పఁ బ్రాణము తోడి, శవము వాఁడు! వాని జన్మమేల?

583

వ. మఱియు నిం దొక్క విశేషంబు గలదు; వివరించెద.

584

తా ॥ అయితే సమస్తాన్ని కలిగి ఉండి, వాటిని అడిగితే లేదని చెప్పరాదు. అలా అసత్యం పలికేవాడు నీచుడు, పిరికివాడు. అటువంటి వాడిని గురించి చెప్పేదేముంది, ప్రాణమున్నా వాడు చనిపోయినవాడితో సమానం. వాడి జన్మ వ్యర్థం. అయితే ఇందులో ఒక విశేషం ఉంది, దానిని విను.

ఆ. వారిజాక్షులందు వైవాహికము లందుఁ, బ్రాణవిత్తమానభంగమందుఁ జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు, బొంకవచ్చు నఘము వొందఁ డధిప!

585

తా ॥ ఓ రాజా! స్త్రీల విషయంలోనూ, వివాహం విషయంలోనూ, ప్రాణానికి ధనానికి గౌరవానికి భంగం కలిగినప్పుడు, భయపడిన గోవులు, బ్రాహ్మణులను రక్షించేటప్పుడు అబద్ధం చెప్పడం దోషం కాదు. దానివల్ల ఎటువంటి పాపం కలుగదు.

మ. కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపు మీ కుబ్జకుండు విశ్వంభరుం డలఁతిం బోఁడు; త్రివిక్రమస్ఫురణ వాఁడై నిండు బ్రహ్మాండముం గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్; వల దీ దానము గీనముం; బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా!

586

వ. అని ఇట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె.

587

తా ॥ ఓ వదాన్యోత్తమా! నీ కులాన్ని, రాజ్యాన్ని, నీ తేజస్సునీ కాపాడుకో. ఈ పొట్టివాడున్నాడే వీడు సామాన్యుడు కాదు, వీడు సాక్షాత్తు విష్ణువు. ఇతడు ఊరికే పోడు. మూడు అడుగులు అడిగి బ్రహ్మాండం అంతా నిండుతాడు. ఇతడిని అడ్డుకోవడం ఎవరి తరమూ కాదు. నా మాటలను ఆలకించు. దానము వద్దు, గీనము వద్దు. వచ్చిన వాడిని వెళ్ళమని చెప్పు" అని ఈ ప్రకారంగా తనకు హితం చెబుతూన్న శుక్రాచార్యునితో, కొంచెంసేపు కళ్ళు మూసుకొని ఆలోచించిన తరువాత బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు:

సీ. నిజ మాన తిచ్చితి నీవు మహాత్మక! మహిని గృహస్థ ధర్మంబు నిదియు
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థ లోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు? పలికి లే దనుకంటెఁ బాప మెద్ది?
'యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని సత్యహీనుని మోవఁజాల' ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ, సమరమున నుండి తిరుగకఁ జచ్చుకంటెఁ బలికి

బొంకక నిజమునఁ బరఁగుకంటె, మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె!

588

తా ॥ "ఓ మహాత్మా! నీవు చెప్పింది నిజం. అది గృహస్థ ధర్మం కూడా. అయితే అర్థం, కామం, యశస్సు, వృత్తి వీటిలో ఏది అడిగినా ఇస్తానని చెప్పి, తిరిగి ధనం మీది ఆశ చేత దానం అడిగిన వాడిని పొమ్మని ఎలా చెప్పను? ఆడిన మాట కాదనడం కంటే పాపం మరొకటి ఉండదు. పూర్వం భూదేవి ఎట్టి దుష్కర్ముడిని అయినా నేను భరిస్తాను కాని సత్యహీనుణ్ణి మాత్రం మొయ్యలేను అని అన్నదట. యుద్ధరంగం నుండి ప్రాణభీతిచే వెనుతిరిగి రావడం కంటే వీరమరణాన్ని పొందడమే శ్రేయస్కరం. అలాగే ఇస్తానని పలికి లేదనడం కంటే మానధనులయిన వారికి మరొక దోషం ఉంటుందా?

క. ధాత్రిని హలికునకును సు, క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం జిత్రముగ దాత కీవియుఁ, బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే?

589

తా ॥ రైతుకు సుక్షేత్రము, మంచి విత్తనములు ఈ రెండూ ఒకచోట దొరికినట్లుగా, దాతకు పాత్రతను చేకూర్చే ఉత్తమునికి దానం ఇవ్వడం కంటే మరొక భాగ్యం ఉంటుందా?

శా. కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ సిరి మూట గట్టుకొని పోవం జాలిరే? భూమి పైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

590

తా ॥ ఓ భార్గవా! పూర్వం రాజులు ఎంత మంది లేరు! వారంతా రాజ్యాలను అహంకారంతో పాలించారు. కాని వెళ్ళేటప్పుడు వారెవ్వరూ ఈ సిరిసంపదలను మూట

కట్టుకొని వెళ్ళలేదు. కనీసం ఈ భూమిమీద అట్టివారి పేరైనా ఉందా? శిబి చక్రవర్తి వంటి వారు ప్రీతితో కీర్తికోసం అడిగినవారి కోర్కెలు తీర్చారు. అట్టి వారిని ఇప్పటికీ లోకం మరువలేదు కదా!

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ, బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట; ననుబోఁటికి, నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్.

591

తా ॥ ఓ మహానుభావా! ఎడతెగకుండా యజ్ఞాలు, యాగాలు చేసినా, వ్రతాలు చేసినా కనిపించని విశ్వరూపుడు నేడు తన రూపుని కుంచింపచేసుకుని నా వద్దకు వచ్చి అడుగుతున్నాడు. అలాంటివాడు కోరుకున్నది ఇవ్వడం కంటే నాకు కావలసినది ఇంకేమి ఉంటుంది?

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిం దగుట మీఁదై నా కరంబుంట మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?

592

తా ॥ నా ముందు చేతిని చాచి అడుగుతున్న ఇతని చేయి ఎంతటి ఘనమైనది! ఇదివరకు సాక్షాత్ లక్ష్మీదేవిని అలరించగలిగిన చేయి; అటువంటి ఆ గొప్పదైన హస్తము నేడు కింద ఉండి, పైన ఇచ్చే నా చేయి ఉండటం నా అదృష్టం కాదా? ఈ రాజ్యం ఆ అదృష్టం ముందు ఏపాటిది? ఈ రాజ్యం, శరీరం, ఇవన్నీ శాశ్వతాలా? ఎప్పటికైనా నశించేవే కదా!

మ. నిరయంబైన, నిబద్ధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము; కానిమ్ము పో;
హరుఁడైనన్, హరియైన, నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ;

దిరుగన్ నేరదు నాదు జిహ్వ; వినుమా! ధీవర్య; వేయేటికిన్?

593

తా ॥ ఆచార్యా! నాకు ఎటువంటి దుర్గతి ప్రాప్తించినా, బంధనం ప్రాప్తించినా, నా రాజ్యం పోయినా, నాకు మరణమే ప్రాప్తించినా, నా కులానికి ముప్పు వచ్చినా సరే... రానీ! జరగవలసినది జరగనీ! శివుడైనా, విష్ణువైనా, బ్రహ్మదేవుడైనా నా మాటకు తిరుగు లేదు, నా నాలుక మరొకటి పలకలేదు.

ఆ. నొడివినంత పట్టు నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ డేటి మాట? గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును, విడువకుండ నిమ్ము విమల చరిత!

594

తా ॥ ఓ విమల చరితా! వారు కోరినది మనం ఇస్తే విష్ణువు మాత్రం ఎందుకు బంధిస్తాడు? ఒకవేళ బంధించినా తిరిగి కరుణతో ఆయనే విడిచి పెడతాడు. సరే! ఒకవేళ విడిచి పెట్టకపోతే పోనిమ్ము!

క. మేరువు దలక్రిందైనను, బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ, దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్.

595

తా ॥ మేరు పర్వతం తలక్రిందులయినా, సముద్రాలు ఇంకిపోయినా, ఈ భూమండలం అంతా నశించి పోయినా సరే, మిన్ను విరిగి మీదపడ్డా... నేను మాత్రం ఆడిన మాటను తప్పను. దానాన్ని తప్పక ఇస్తాను.

మత్తకోకిలము.

ఎన్నఁడుం బరు వేడఁ బోఁడఁట! యేకలుం డఁట! కన్న వా

రన్నదమ్ములు నైన లేరఁట; యన్నివిద్యల మూల గో
ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జఁట; చేతు లొగ్గి వసింప నీ
చిన్ని పాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా!

596

తా ॥ ఓ సత్పురుషా! ఈ వటువు ఇదివరలో ఎవ్వరినీ ఏది యాచించినవాడు కాదట! ఒక్కడైన వాడట! తల్లిదండ్రులు గాని, అన్నదమ్ములు గాని లేనివాడట! సకల విద్యా సారాన్ని కలిగి ఉన్నవాడట! అటువంటివాడు నా ముందు చేయి చాచి అడుగుతుంటే కాదనేందుకు నా మనస్సు అంగీకరించడం లేదు."

వ. అని యిట్లు సత్య పదవీ ప్రమాణ తత్పరుండును, వితరణ కుతూహల సత్వరుండును, విమల యశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్య సంధుండును, నర్థిజన బంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి మదీయ శాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె; బలియును గురుశాప తప్తుండయ్యు ననృతమార్గంబున కభిముఖుండు గాకుండె; నప్పుడు.

597

తా ॥ అని ఈ విధంగా తానన్న మాటకు కట్టుబడి, సత్యవాక్కు నుండి వైదొలగక, వితరణ చేయుటయందు కుతూహలం కలవాడూ, స్వచ్ఛమైన కీర్తికలవాడూ, దృఢమైన మనస్సు కలవాడూ, అర్థులకు బంధువు అయిన బలిచక్రవర్తిని చూసిన శుక్రుడు కోపించాడు. కోపంతో నా శాసనాన్ని అతిక్రమించావు కనుక శీఘ్రకాలంలో పదభ్రష్టుడవు అవుతావు అని శపించాడు. అయితే బలిచక్రవర్తి గురువుగారు కోపంతో శాపం ఇచ్చినా చలించక అసత్యమార్గం వైపు మళ్ళక నిశ్చలంగా ఉండిపోయాడు.

ఆ. బ్రదుక వచ్చుఁగాక బహుబంధనములైన, వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక జీవధనములైనఁ

జెడుఁగాక పడుఁగాక, మాటఁ దిరుగలేరు మానధనులు.

598

తా ॥ మానధనులైన వారు అనేక కష్టాలు చుట్టుముట్టినా, పేదరికం వచ్చినా, తన జీవన మార్గానికి అపాయం వాటిల్లి చేటు కలిగినా, ప్రాణాపాయమే సంభవించినా మాట తప్పరు కదా!

వ. అ య్యవరసంబున.

599

ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి, రాజవదన మదమరాళ గమన వటుని కాళ్లు గడుగ వరహేమ ఘటమున, జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి.

600

వ. అ య్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె.

601

తా ॥ రాక్షస రాజయిన బలిచక్రవర్తి భార్యపేరు వింధ్యావళి. ఆమె బహు సుందరాంగి. చంద్రుణ్ణి పోలిన ముఖాన్ని కలిగి ఉన్న ఆమె భర్త సంజ్ఞను గ్రహించి రాజహంస వంటి నడకతో వామనుని కాళ్ళు కడగటం కొరకు బంగారు పాత్రలో జలమును తెచ్చి బలికి అందించింది. అప్పుడు కపట వటువుతో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు:

క. రమ్మా! మాణవకోత్తమ!, లెమ్మా! నీ వాంఛితంబులే దన కిత్తుం దెమ్మా యడుగుల నిటు రా, నిమ్మా కడుగంగవలయు నేఁటికిఁ దడయన్?

602

తా ॥ "ఓ బాలకశ్రేష్ఠా! రావయ్యా! నీవు కోరుకున్న దానిని లేదనకుండా ఇస్తాను. నీ పాదములను కడుగనియ్యవయ్యా! ఇక ఆలస్యం దేనికి?"

వ. అనిన విని.

603

మ. బలి దైత్యేంద్ర కరద్వయీ కృతజల ప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగి సుమనస్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్ర రమాలలాట పదవీ కస్తూరికా శాదమున్
నళినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్.

604

తా ॥ ఆ మాటలు విన్న శ్రీమహా విష్ణువు... బలిచక్రవర్తి తన రెండు చేతులతోను కడిగేందుకు వీలుగా తన కుడి పాదమును ముందుకు సాచాడు. ఆ పాదం, యోగులు దేవతలు కోరుకునే సంపదలను తీర్చగలిగిన పాదం. భక్తితో ప్రణమిల్లిన శ్రీమహాలక్ష్మి లలాటము నందలి కస్తూరీ పంకంతో కూడి ఉన్న పాదం. పద్మముల పరిమళంతో గుబాళించేది పాదం. అంతేకాదు, వేదరాశిని అందెగా అమరించుకున్న దివ్యపాదమది.

క. సురలోక సముద్ధరణము, నితర శ్రీకరణ మఖీల నిగమాంతాలం కరణము భవసంహరణము, హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్.

605

వ. ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశ కాలాది పరిగణనంబు సేసి.

606

తా ॥ దేవతలను ఉద్ధరించేవీ, నిత్యమూ శుభాలను ప్రసాదించేవీ, అఖీలమైన ఉపనిషత్తులకు అలంకార ప్రాయమైనవి, భవబంధములను దూరం చేసేవి అయిన ఆ పాదాలను కడుగనారంభించాడు బలి చక్రవర్తి. ముందుగా కుడి పాదాన్ని, పిమ్మట ఎడమ పాదాన్ని కూడా

కడిగి ఆ పావన జలమును శిరస్సుపై చల్లుకొన్నాడు. ఆపై ఆచమనం చేసి దేశము, కాలము మొదలైన వాటిని పరిగణించాడు.

కా. 'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య విదే త్రిపాద ధరణీం దాస్యామి' యంచుం గ్రియా
క్షిప్తుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి' బ్ర
హ్మప్రీత' మ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్

607

తా ॥ తరువాత వామనుణ్ణి పూజించి, "బ్రాహ్మణుడవు, ప్రసిద్ధమైన వ్రతం కలవాడవు, విష్ణుస్వరూపుడవు, వేదముల యొక్క ప్రామాణికత్వమును తెలిసినవాడవు అయిన నీకు మూడు అడుగుల నేలను దానం చేస్తున్నాను" – అని బలిచక్రవర్తి పలుకుతూ, పరమాత్మునికి ప్రీతి కలుగుగాక, అని నీటిని ధారపోసాడు. అది చూసి సకలలోకాలు ఆశ్చర్యం చెందాయి.

వ. తత్కాలంబున.

608

ఆ. నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ, గలశరంధ్ర మాఁపఁగాను దెలిసి హరియుఁ
గావ్యునేత్ర మటఁ గుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు.

609

తా ॥ ఆ సమయంలో నీటి ధారను రానివ్వకుండా ఈగగా మారి కలశ రంధ్రమునకు అడ్డం వచ్చి ఆపేశాడు శుక్రుడు. ఆ సంగతి గ్రహించిన శ్రీహరి దర్భమొనతో కమండలం కొమ్ములో పొడిచేసరికి ఒక కన్ను పోయి, ఏకనేత్రుడయ్యాడు శుక్రాచార్యుడు.

వ. అంత.

610

మ. అమరారాతి కరాక్షతోజ్ఝిత పవిత్రాంభః కణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండిత దివౌకస్స్వామిజిన్మస్తముం
గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకచోపాస్తమున్
విమలశ్రీ కుచశాత చూచుక తటీవిన్యస్తమున్ హస్తమున్.

611

తా ॥ అటు పిమ్మట బలిచక్రవర్తి ధారపోసిన పవిత్రమైన జలబిందువులకు హరి తన చేతిని ముందుకు సాచాడు. ఆ చెయ్యి అసురుల శిరస్సులను ఖండించగలిగినది, కమలాదేవిని ఆకర్షించడంలో ప్రశస్తమైనది. రమాదేవి యొక్క శిరోజముల చేత సేవింపబడేది. విమలమైన లక్ష్మీదేవి యొక్క కుచాగ్రముల మీద మన్ననను పొందినది.

క. మునిజన నియమాధారను, జనితాసుర యువతి నేత్ర జలకణధారన్
దనుజేంద్రనిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్.

612

తా ॥ మునిజనుల యొక్క నియమములకు ఆధారమైనది, అసుర యువతుల కన్నీటి ధారలకు కారణమైనది, రాక్షస రాజులను నిరాధారులను చేసేది అయిన ఆ జలధారను బలిచక్రవర్తి నుండి వామనుడు స్వీకరించాడు.

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు, నెఱిఁగి శుక్రు మాట లెఱిఁగి నాశ మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి, మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె.

613

తా ॥ వచ్చినవాడు కమలనాభుడని తెలుసుకొని, కాలాన్ని దేశాన్ని తెలుసుకొని, శుక్రుని

మాటలు ఆలకించి తనకు ముప్పు వాటిల్లుతుందని గ్రహించి... అయినా సరే పాత్రతను గుర్తెరిగి యోగ్యుడైన వానికి దానం ఇచ్చాడు బలిచక్రవర్తి. అలాంటి మహాదాత ఈ లోకంలో మరొకరు ఎవరు ఉన్నారు?

క. బలి సేసిన దానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం గలకల మని దశదిక్కులు, బళి బళి యని పొగడె భూతపంచక మనఘా!

614

తా ॥ ఓ రాజా! హరి నిఖిల భూతములకు నాయకుడైన కారణంగా బలిచక్రవర్తి దానం చేయగానే దిక్కులన్నీ తేజోవంతమైనాయి. పంచ భూతములు "భళి! భళి!" అంటూ పొగిడాయి.

క. క్షితి దానమిచ్చు నతఁడును, నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు, శతముఖ లోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్.

615

వ. అట్లు గావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరా దానం బిచ్చితి; వుభయ లోకంబులం గీర్తిసుకృతంబులు వడయు మని పలికి య మ్మాయా వటుం డిట్లనియె.

616

క. ఇది యేమి వేఁడితిని నీ, మది వగవక ధారవోయుమా; సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం, బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్.

617

తా ॥ అంతట వామనుడు బలితో ఇలా అన్నాడు: "భూమిని దానమిచ్చేవాడు, కోరికతో పరిగ్రహించువాడు వీరిద్దరూ సమస్త పాపములు పోగొట్టుకొని నూరు సంవత్సరాలు ఇంద్రలోకంలో స్వేచ్ఛా విహారం సలుపుతారు. ఆ కారణంగా ఏ దానము కూడా భూదానానికి

సాటిరాదు. కనుక భూదానం చేసిన నీవు ఉభయ లోకాలలోను కీర్తి సుకృతాలు పొందు... అని అంటూ, ఆ మాయా వటుడు ఇది ఏమి కోరిక అని చింతించకుండా నాకు దానమియ్యి. సత్యం వర్ధిల్లేటట్లుగా నేను కోరాను. నాకు మూడు అడుగులు ఇస్తే ముల్లోకాలు ఇచ్చినట్లే!"

వ. అని పలికిన వటుని పలుకులకు హర్ష నిర్భర చేతస్కుండై వైరోచనుండు.

618

ఆ. 'పుట్టి నేర్చు కొనెనొ పుట్టక నేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టి పొట్టివడుగుఁ బొట్ట నున్న వెల్ల బూమెలు' నని నవ్వి, యెలమి ధరణి దాన మిచ్చె నపుడు.

619

తా ॥ అని పలికిన వటుని మాటలకు బలి చక్రవర్తి చాలా సంతోషించాడు. సంతోషిస్తూ ఇలా అనుకున్నాడు: 'పుట్టి నేర్చుకున్నాడో! పుట్టక ముందే నేర్చుకొన్నాడో! ఈ పొట్టి వడుగు పొట్టలో ఉన్నవన్నీ మాయలే!' అని నవ్వుకొంటూ భూమిని సంతోషంగా దానం చేసాడు.

## వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట

ఆ. గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర, యక్ష పక్షి దేవతాహిపతులు వొగడి రతని పెంపుఁ; బుష్పవర్షంబులు, గురిసె దేవతూర్యకోటి మొరసె.

620

తా ॥ ఆ బలిచక్రవర్తి ఔదార్యానికి గ్రహములూ, మునీంద్రులూ, సిద్ధులూ, గంధర్వులూ, కిన్నరులూ, యక్షులూ, పక్షి గణములూ, దేవతలూ, సర్పరాజులూ అందరూ పొగిడారు. అతనిపై పుష్పవృష్టిని కురిపించారు. దేవతల విజయ దుందుభులు మ్రోగసాగాయి.

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి.

621

శా. ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దా నింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువుని పైనంతై, మహర్వాటి పై
నంతై, సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

622

తా ॥ ఈ విధంగా దానాన్ని పరిగ్రహించిన వామనుడు ఇంతవాడు, అంతవాడయ్యాడు. అంతవాడు మరింతవాడైనాడు. క్రమంగా పెరుగుతూ ఆకాశమంత ఎత్తు ఎదిగేడు. మేఘరాశిని దాటాడు. వరుసగా ప్రభారాశిని, చంద్రమండలాన్ని, ధ్రువతారనూ, మహర్లోకాన్ని దాటుతూ సత్యలోకం వరకూ ఎదుగుతూ బ్రహ్మాండమంతా నిండిపోయి ఉన్నాడు.

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై

ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచ ద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

623

తా ॥ అలా వామనుడు ఎదుగుతున్న క్రమంలో సూర్యబింబం ముందుగా ఒక గొడుగువలె ఉన్నది, పిమ్మట శిరోరత్నమైనది. ఆ తరువాత చెవికి పోగు అయి, ఆ పైన కంఠాభరణం అయింది. అనంతరం బంగారు భుజకీర్తిగా వెలుగొందుతూ, అటుపిమ్మట చేతి కంకణమై, అటు తర్వాత మొలలోని గంటగా, పిమ్మట కాలి అందెగా మారుతూ చిట్టచివరకు పాదాల క్రింద పీఠంగా అమరింది ఆ సూర్యబింబం. ఆ విధంగా ఎదిగాడు వామనమూర్తి.

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, దిశాఛిద్రంబులును, సముద్రంబులును, జల దచల దఖిల భూతనివహంబులుం దానయై యేకీభవించి, క్రమ క్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్ణోకంబును దల కడచి, మహర్లోకంబు దాఁటి జనోలోకంబునకు మీఁదై, తపోలోకంబునకు నుచ్ఛ్రితుండై, సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేవ మహితుండై చరణతలంబున రసాతలంబును, బాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువులఁ బతత్త్రిసముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, వాసస్థ్సలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును నురోజంబుల ఋతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబునఁ గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును,

నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణినఖిలచ్ఛంద స్సముదయంబును, రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠం బున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావర జంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండునునై బ్రహ్మాండంబు దన మేనికప్పు తెఱంగువ నుండ విజృంభించి.

624

తా ॥ ఈ విధంగా శ్రీమహా విష్ణువు సత్త్వరజస్తమో గుణాత్మకమైన విశ్వరూపాన్ని ధరించాడు. భూమి, ఆకాశము, స్వర్గము, దిక్కులు, దిక్కుల మధ్య భాగాలు, సముద్రములు, చరాచరాలు, అఖీల భూతసమూహములు తానే అయ్యాడు. క్రమక్రమంగా భూలోకాన్ని దాటి, భువర్లోకాన్ని అతిక్రమించి, సువర్లోక మహర్లోకాలను దాటి, జనోలోక తపోలోకములకు మీదై, సత్యలోకం కంటే ఔన్నత్యాన్ని వహించాడు. అన్ని చోట్లలో మరుగులు, రంధ్రములు లేకుండా నిండిపోయాడు. మహాదేవుడైన ఆ హరి తన చరణాల క్రింద రసాతలాన్ని, పాదాలలో భూమిని, పిక్కలలో పర్వతాలను, మోకాళ్ళలో పక్షిసమూహాన్ని, ఊరువుల యందు ఇంద్రసేన మరుద్గణాలను, వస్త్రంలో సంధ్యాకాలాన్ని, రహస్యాంగంలో ప్రజాపతులను పిరుదులలో దనుజులను, నాభి ప్రదేశంలో ఆకాశాన్ని, కడుపులో సప్త సముద్రాలను, వక్షస్థలంలో నక్షత్రాలను, హృదయ స్థానంలో ధర్మమును, స్తన ద్వయంలో ఋతాన్ని సత్యాన్ని, మనస్సులో

చంద్రుడును, రొమ్ముయందు కమలమును చేతిలో ధరించిన లక్ష్మీదేవినీ, కంఠంలో సమస్త వేదరాశినీ, భుజములలో ఇంద్రాది దేవతలను, చెవులలో దిక్కులను, శిరస్సుయందు స్వర్గలోకాన్ని, శిరోజములయందు మేఘసముదాయాన్ని, నాసిక యందు వాయువును, నేత్రముల యందు సూర్యుడు, ముఖంలో అగ్నిని, వాక్కుయందు అఖిలమైన ఛందస్సును, నాలుక యందు వరుణున్ని, కనుబొమ్మల యందు విధి నిషేధములను, రెప్పలయందు రేయింబవళ్ళనూ, లలాటంలో కోపాన్ని, క్రింది పెదవియందు లోభాన్ని, స్పర్శయందు కామాన్ని, రేతస్సుయందు జలాన్ని, వీపుయందు అధర్మాన్ని, అడుగులలో యజ్ఞాలను, నీడలయందు మృత్యువును, నవ్వుయందు అనేక మాయా విశేషాలనూ, రోమములయందు అనేక ఓషధులను, నాడీ ప్రదేశములయందు నదులునూ, గోళ్ళలో రాళ్ళనూ, బుద్ధియందు బ్రహ్మనూ, ప్రాణములయందు దేవ ఋషుల సముదాయాన్నీ ఉంచుకుని శరీరంలో చరాచర ప్రాణులన్నింటనీ అమరించుకున్నాడు.

ఆయన మేఘం వలె నినదించే శంఖ, శార్ఙ్ఞ, సుదర్శన, గదాదండ, ఖడ్గ, అక్షయ బాణములతో కూడిన అంపపొదులతో వెలుగొందుతున్నాడు. మకర కుండల, కిరీట, కేయూరహార కటక, కంకణ కౌస్తుభమణి, మేఖల, అంబర వనమాలికలతో విరాజిల్లుతున్నాడు. సునందుడు, నందుడు, జయుడు, విజయుడు ఇత్యాది పరిచారకులతో కూడి ఉన్నాడు. అద్భుతమైన తేజస్సుతో బ్రహ్మాండం ఆయనకు మేలి ముసుగుగా ఒప్పారి ఉంది.

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁది జగంబులెల్లఁ దొడి, యొం డొంటిన్ విలంఘించి, ప
ట్టక బ్రహ్మాండ కటాహముం బగిలి వేంద్రంబై పరుల్ గానరా
కొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్.



తా ॥ ఇలా విశ్వరూపాన్ని ధరించిన ఆ వామనుడు ఒక్క అడుగుతో భూమిని కొలిచాడు.

ఇంకొక అడుగుతో స్వర్గాది లోకాలన్నింటినీ కప్పివేసాడు. అలా రెండు పాదాలతో అంతటా విస్తరించి ఉన్న ఆ మహారూపాన్ని ఇముడ్చుకోలేక బ్రహ్మాండమంతా పటపటమంటూ పగిలిపోసాగింది. ఆయన తప్ప ఇతరులెవ్వరూ గోచరించని విధంగా విశ్వాకృతిని దాల్చి వెలుగొందుతున్నాడు ఆ పరమాత్ముడు.

ఆ. ఒక పదంబు క్రింద నుర్వి పద్మము నంటి, కొన్న పంకలవము కొమరుఁ దాల్చె; నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా, వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున.

626

తా ॥ ఓ రాజా! ఆ విశ్వరూపంలో ఉన్న వామనునికి ఒక పాదం క్రింద ఉన్న భూమి పద్మానికి అంటుకొన్న చిన్న బురద ముద్దవలె మనోజ్ఞంగా ఉంది. రెండవ పాదం మీద ఉన్న ఆకాశం పద్మం మీద వ్రాలిన తుమ్మెదవలె ప్రకాశించింది.

వ. తత్సమయంబున.

627

ఆ. జగములెల్ల దాఁటి చనిన త్రివిక్రము, చరణనఖర చంద్ర చంద్రికలను బొనుఁగు పడియె సత్యమున బ్రహ్మతేజంబు, దివసకరుని రుచుల దివియ వోలె.

628

తా ॥ ఆ సమయంలో అన్ని లోకాలను దాటి వెళ్ళిన ఆ త్రివిక్రముని కాలిగోళ్ళ కాంతులకు సత్యలోకంలోని బ్రహ్మ తేజస్సు కాస్తా సూర్యుని ముందు చిన్న దీపం వలె తన తేజస్సును కోల్పోయింది.

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు
లా మారీచ్యాదులు నా సనందాదులు నా దివ్య యోగీంద్రు లచట నెపుడు

మూర్తి మంతంబులై మ్రోయు పురాణ తర్కామ్నాయ నియమేతిహాస ధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ములై మఱియును గలుగునట్టి

ఆ. వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు, నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తి దమ
మనంబులందుఁ దలఁచు నిధానంబుఁ, గంటి మనుచు నేఁడు మంటి మనుచు.

629

తా ॥ భవబంధాలను త్రెంచుకొని బ్రహ్మలోకంలో నివాసం ఉన్న మరీచాది మహర్షులు, సనకసనందాది దివ్య యోగీంద్రులూ, రూపాన్ని పొంది మారు మ్రోగుతున్న పురాణములూ, తర్కాది శాస్త్రాలూ, వేదములూ, వేదాంగములూ, ఇతిహాసములూ, ధర్మశాస్త్రములూ, జ్ఞానులైన పుణ్యాత్ములూ, అందరూ లోకోత్తరుడైన ఆ శ్రీమహా విష్ణువు పాదాన్ని దర్శించారు. వారంతా అధిక భక్తితో నమస్కరిస్తూ తమ మనస్సులలో మేము భావిస్తూన్న పెన్నిధి కనిపించింది, మేము ధన్యులమయ్యాము అని అనుకోసాగారు.

మ. తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి, నటించి యున్నతపదంబుం జూచి తత్పాద సే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తి ప్రభన్.

630

తా ॥ నేను పుట్టిన ప్రదేశం ఇదే సుమా అంటూ బ్రహ్మదేవుడు విష్ణువు యొక్క బొడ్డు తామరను చూసి ఆనందించాడు. తరువాత తన కమండలంలోని జలంతో స్వామి పాదాన్ని కడుగగా, ఆ జలధారలు ఆ విశ్వాత్ముని కీర్తికి సాక్షిగా ఆకాశ వీథిలో దేవనదిగా ప్రవహించసాగాయి.

వ. తత్సమయంబున.

631

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ పుష్పదామంబులఁ బూజసేసి
దివ్యగంధంబులు తెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు సల్లి ఫలములు గానిక లిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవములు జయ ఘోషములుఁ జేసి 'కరుణాంబునిధి! త్రివిక్రమ' యటంచు

ఆ. బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి; రెల్ల దిశల వనచరేశ్వరుండు జాంబవంతుఁ
డరిగి చాటె భేరీధ్వని, వెలయఁ జేసి విష్ణు విజయ మనుచు.

632

తా ॥ ఆ సమయంలో బ్రహ్మ మొదలైన లోకపాలకులంతా మహా విష్ణువును యోగమార్గంలో ఊహించి పలువిధాలైన పుష్పమాలికల చేత పూజించారు. దివ్యమైన గంధములు తెచ్చి సమర్పించారు. ధూపదీపాలను ఇచ్చి, పేలాలు అక్షతలుగా చల్లి, ఫలములను కానుకలుగా ఇచ్చారు. సంగీతపరంగా స్తుతిస్తూ, శంఖములతో జయ జయ ధ్వానాలు చేస్తూ "హే! కరుణాంతరంగా! త్రివిక్రమ దేవా" – అంటూ కొనియాడారు. వనచరేశ్వరుడయిన జాంబవంతుడు ఇది విష్ణు విజయమని అంటూ అన్ని దిక్కులా భేరీధ్వని చేశాడు.

క. అన్ని జగంబులఁ దానై, యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గన్నందక మన మందక, సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్.

633

తా ॥ ఈ సమస్తమైన సృష్టికి ప్రభువైన ఆ జగన్నాథుడు అన్ని లోకములలో అలా వ్యాపించగా, కంటితో చూడటానికి మనస్సుతో ఊహించేందుకు వీలుకాక ఆ బలిచక్రవర్తీ, ఆయన సభలోని వారు స్తోత్రం చేసారు.

వ. అంత నొయ్యనఁ బూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం

గని 'పదత్రయ వ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూప తిరోహితుండగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుడు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబులే; దీ కుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున సజ్జకంబుగా ని జ్జగంబులం బరిగ్రహించి, పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచి యున్నవాఁ, డీ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుట కర్జం' బని తర్జనంబులును గర్జనంబులును జేయుచు, వజ్రాయుధాది మరుజ్జేతలగు హేతి ప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశు పట్టిస భల్లాది సాధనంబులు ధరియించి, కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినం చూచి హరి పరిచరులు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్‌క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖులగు దండనాథు లయుత వేదండ సముద్దండబలులు దమతమ యూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవానీకంబులఁ బరలోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనంబునకుం బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రుశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డి ట్లనియె.

634

తా ॥ ఆ పిమ్మట అంతకు పూర్వం వలెనే వామనాకారమును ధరించి ఉన్న వామనుణ్ణి చూసి ఇంద్రాది దేవతలను జయించిన హేతి, ప్రహేతి, విప్రచిత్తి మొదలైన రాక్షసులు, మూడడుగుల నెపంతో ఇతడు ప్రపంచాన్నంతా ఆక్రమించాడు. వామన రూపంలో వచ్చింది విష్ణువని తెలియక మన దానవరాజైన బలి సత్యసంధుడు కనుక తన మాట నిలబెట్టుకున్నాడు. అతనిలో తప్పులేదు. ఈ పొట్టివాడు ఎదురులేని తేజంతో ఈ లోకాలను పరిగ్రహించి ఇంద్రాదులకు ఇవ్వాలని అనుకుంటున్నాడు. ఈ బ్రహ్మచారిని పారిపోకుండా జయించటమే మన తక్షణ కర్తవ్యం అని భావిస్తూ, పరాక్రమంతో యుద్ధానికి సన్నద్ధులై నిలిచారు. వారందరూ పరశువు, పట్టిసం, బల్లెము ఇత్యాది సాధనాలను ధరించి చెలరేగుతూ గుంపులుగా అన్ని ప్రక్కలా మూగారు. అది చూసి హరి పరిచరులయిన సునందుడు, నందుడు, జయుడు, జయంతుడు,

విజయుడు, ప్రబలుడు, ఉద్బలుడు, కుముదుడు, కుముదాక్షుడు, గరుడుడు, పుష్పదంతుడు, విష్వక్సేనుడు, శ్రుతదేవుడు, సాత్వతుడు మొదలైన ప్రముఖులగు సేనాపతులు పదివేల గజముల బలంతో కూడి తమతమ సైన్యంతో, ఆయుధాలతో రాక్షసులను ఎదుర్కోవడానికి సిద్ధపడ్డారు. దానిని చూసిన బలిచక్రవర్తి శుక్రుని శాపాన్ని తలచుకొని ఇలా అన్నాడు:

సీ. రాక్షసోత్తములార! రండు పోరాడక; కాలంబు గాదిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నే మందుము మనపాలిభాగ్యంబు మహిమ గాక;

తే. వెఱచి పలుమాఱుఁ బాఱెడి విష్ణుభటులు, మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె? మనకు నెప్పుడు దైవంబు మంచిదగును, నాఁడు గెలుతము పగవారి; నేఁడు వలదు.

635

తా ॥ "ఓ రాక్షసోత్తములారా! ఇది పోరాడటానికి తగిన సమయం కాదు కనుక ఆగండి. సర్వ భూతములకు, సంపదలకు, ఆపదలకు ప్రభువైన దైవాన్ని మనం ఎదిరించలేము. పూర్వం మనకు రాజ్యాన్ని, దేవతలకు భాగ్యహీనతను ఇచ్చాడు. ఇప్పుడు దానికి వ్యతిరేకంగా చేస్తూన్న దైవాన్ని ఏమనగలము? మన భాగ్యం ఇంతే అనుకోవాలి. ఇంతకు ముందు భయపడి పారిపోయిన విష్ణుభటులు ఇప్పుడు మిమ్ములను ఎదిరించటం దైవ సంకల్పం కాకపోతే మరేమిటి? అనుకూల సమయాన్ని చూసి శత్రువులను జయిద్దాము, ఇప్పుడు కాదు.

వ. అదియునుం గాక.

636

క. బలు దుర్గంబులు సచివులు, బలములు మంత్రౌషధములు బహుశేముషియుం గలిగియు సామోపాయంబులఁ గాల మెఱింగి నృపుఁడు వోరుట యొప్పున్.

తా ॥ అదీ కాక రాజైనవాడు పలు దుర్గాలు, మంత్రులు, సైన్యాలు, మంత్రాలు, ఓషధులు, బుద్ధిబలము అన్నీ ఉన్నా, కాలాన్ని గమనిస్తూ ఓర్పుతో నేర్పుతో యుద్ధం చేయడం శ్రేయస్కరం.

వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రుల మోహరించుట కార్యంబు గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగక తొలఁగుఁ డనినఁ దలంగి భాగవత భట భీతులై చిక్కి రక్కసులు రసాతలంబునకుం జని; రంత హరి హృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల నసురవల్లభుని బంధించె; నంత.

638

తా ॥ అందుకని శత్రువులతో యుద్ధానికి సిద్ధపడటం ఇప్పుడు మంచిది కాదు. మనకు కాలం అనుకూలమైనప్పుడు జయిద్దాం. మీరు అనవసరంగా శ్రమపడవద్దు" అని బలి చక్రవర్తి పలికేసరికి భాగవతులైన విష్ణుభటులకు భయపడి రాక్షససైన్యం రసాతలానికి వెళ్ళిపోయారు. అంత విష్ణువు యొక్క హృదయాన్ని ఎరిగి గరుత్మంతుని పుత్రుడు యాగం యొక్క చివరి దినాన బలిని వరుణ పాశములచే బంధించాడు.

క. బాహులుఁ బదములుఁ గట్టిన, 'శ్రీహరికృప గాక యేమి సేయుదు?' నని సం
దేహింపక బలి నిలిచెను, హాహారవ మెసఁగె దశ దిగంతములందున్.

639

తా ॥ చేతులు, కాళ్ళు బంధించబడినా శ్రీహరి దయలేకపోతే ఏమి చేస్తాను అని మౌనంగా బలిచక్రవర్తి నిలిచాడు. అప్పుడు పది దిక్కులలోనూ హాహాకారములు చెలరేగాయి.

క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును లేక తొంటికంటెను బెంపుం దెంపును

నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్.

640

తా ॥ ఐశ్వర్యం నశించినా ఆ రాక్షసరాజైన బలిచక్రవర్తిలో ఎటువంటి భయమూ, దైన్యమూ కలుగలేదు. ఇదివరకటి కంటే అధికమైన గౌరవమూ, జ్ఞానమూ, ధైర్యమునూ కలిగి ఉన్న బలిని చూసి వామనుడు ఇలా అన్నాడు:

సీ. దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు
రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును;, స్వర్లోకమును నొక్కచరణమయ్యె;
నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు; గడమ పాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు నిరయంబుఁ బొందుట నిజము గాదె?

తే. కాన దుర్గతికిని గొంతకాల మగును, కాక యిచ్చెదవేని వేగంబు నాకు నిపుడు మూఁడవ
పదమున కిమ్ము చూపు, బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె?

641

తా ॥ "ఓ దానవ రాజేంద్రా! మూడు అడుగుల పాదముల నేల ఇస్తానని అన్నావు. చంద్రుడు, సూర్యుడు ఎంతవరకు ఉంటారో అంతమేర భూమి నాకు ఒక అడుగయింది. స్వర్గలోకం రెండవ అడుగు అయింది. నీకున్న సంపద అంతా రెండు అడుగుల్లో పూర్తి అయింది. మూడవ పాదమునకు చోటు ఎక్కడ ఉంది? ఇస్తానని అన్న అర్థాన్ని ఇవ్వనివాడు నరకానికి వెడతాడు. కనుక నీకు నరకం సంప్రాప్తించకుండా ఉండాలంటే మూడవ అడుగు నాకిప్పుడు చూపు. బ్రాహ్మణులకు స్వాధీనం కావలసిన దానిని కాదనేందుకు బ్రహ్మకు కూడా సాధ్యం కాదు."

వ. అని యిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్యనికృత్త హృదయుండయ్యును విషణ్ణుండు గాక వైరోచని ప్రసన్న వదనంబుతోడఁ జిన్ని ప్రోడ

వడుగున కి ట్టనియె.

642

తా ॥ అని ఇలా వామనుడు పలికేసరికి సత్యభంగం అవుతుందేమో అనే సందేహం బలిచక్రవర్తికి కలిగింది. విషం పూసిన బాణంవలె అది హృదయాన్ని గాయపరచింది. అయినా బలి చక్రవర్తి విచారించకుండా ప్రసన్నమైన వదనంతో నేర్పరియైన ఆ వటువుతో ఇలా అన్నాడు:

ఆ. సూనృతంబ గాని సుడియదు నాజిహ్వ, బొంకఁజాల; నాకు బొంకు లేదు; నీ తృతీయ పదము నిజము నా శిరమున, నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ!

643

తా ॥ "ఓ నిర్మలాత్మా! నా నాలుక ఎప్పుడూ సత్యాన్నే పలుకుతుంది. అన్న మాటకు తిరుగు లేదు. నేను అసత్యం ఆడను. నీ మూడవ పాదాన్ని శాశ్వతంగా నా శిరస్సుపైన పెట్టు.

ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును, బదవిహీనతకును బంధనమున కర్థ భంగమునకు నఖిలదుఃఖమునకు, వెఱవ దేవ! బొంక వెఱచినట్లు.

644

తా ॥ స్వామీ! నేను అసత్యమాడేందుకు భయపడినట్లుగా నరకానికి కానీ, ఇప్పుడు ప్రాప్తమైన ఈ శిక్షకు కానీ, పదవి పోయిందని కానీ, బంధింపబడినందుకు కానీ, ఐశ్వర్యం నశించినందులకు కానీ, ఎటువంటి కష్టాలకైనా గానీ భయపడను.

వ. అదియునుం గాక.

645

సీ. తల్లిదండ్రులు, నన్నదమ్ములుఁ, జెలికాండ్రు, గురువులు శిక్షింపఁ గొఱఁతవడునె? పిదప మేలగుఁగాక! పృథుమదాంధులకును దానవులకు మాకుఁ దఱియెఱింగి విభ్రంశచక్షువు

వెలయ నిచ్చుటఁ జేసి గురువులలో నాదిగురువ వీవ; నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు, లాది యోగీంద్రు లందెడునట్టి టెంకి నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి!, యీశ! నీయెడ దుర్లభమేమి గలదు?

646

తా ॥ ఓ ఆనంద స్వరూపా! తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ, స్నేహితులూ, గురువులూ వీళ్ళు బుద్ధి చెప్పడం కోసం శిక్షించటంలో తప్పులేదు, చివరకు మేలే జరుగుతుంది. మదంతో అంధులమై పోయిన మా వంటి దానవులకు సమయం చూసి చెదరని చూపును ఇచ్చిన నీవు గురువులలో ఆదిగురువువి. నీవు నన్ను బంధించటం శిక్షగా కాని, లజ్జగా కాని, నష్టంగా కాని, బాధగా కానీ నేను తలచను. నిన్ను ఎదిరించి నీతో పోరాడిన రాక్షసులు యోగీంద్రులు పొందిన స్థానమును పొందారు కదా ఈశ్వరా! నీకు ఇవ్వలేనిది అంటూ ఏముంది?

మ. చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవార్థులే కింకరుల్? శిలలం జేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే! చలితం బౌట యెఱుంగ కీ కపట సంసారంబు నిక్కంబుగాఁ దలఁచున్ మూఢుఁడు సత్యదాన కరుణాధర్మాదినిర్ముక్తుఁడై.

647

తా ॥ ఎవ్వరికీ మృత్యువు స్నేహితుడూ కాదు. యముడు దగ్గర బంధుమా కాదు. సేవకులు సేవించాలనే బుద్ధిమంతులు కారు. ఈ శరీరాన్ని బ్రహ్మ ఏమీ శిలలతో చెయ్యలేదు. జీవితం అనేది శాశ్వతం కాదు. ఎప్పుడు పోతుందో తెలియని ఈ ప్రాణాన్ని నమ్ముకొని, ఈ కపట సంసారము నిజమని నమ్మిన మూర్ఖుడు సత్యం, దానం, కరుణ, ధర్మం వీటిని వదిలేస్తున్నాడు.

సీ. చుట్టాలు దొంగలు; సుతులు ఋణస్థులు; కాంతలు సంసార కారణములు; ధనము

లస్థిరములు; దను వతి చంచల; గార్యార్థు లన్యులు గడచుఁగాల మాయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్రమని కాదె తమ తండ్రి నతకరించి మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలంబు నియతిఁ జేసె

తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రదుకు గలిగె, వైరులై కాని తొల్లి మావారు గాన
రర్థివై వచ్చి నీవు న న్నడుగు టెల్లఁ, బద్మలోచన! మా పుణ్యఫలము గాదె?

648

తా ॥ బంధువులు, దొంగలు, కొడుకులు, అప్పుల వాళ్ళు, కాంతలు సంసారానికి కారణం; ధనం అస్థిరం, తనువు అతి చంచలం ఇతరులు ఏదైనా పని ఉంటేనే వస్తారు; కాలము నిలిచేది కాదు; ఆయువు వేగంగా వెడుతూనే ఉంటుంది; ఐశ్వర్యం అతి శీఘ్రంగా నశిస్తుంది... అనే విషయాలను తెలుసుకొని తన తండ్రిని కాదని మా తాత అయిన ప్రహ్లాదుడు నీ పాదకమలములను సేవించాడు. అదృష్టవంతుడైన అతనికి మరణంలేని శాశ్వతమైన జీవితం లభ్యమైంది. శత్రువులుగా మారితే తప్ప మావారు నిన్ను చేరుకోలేక పోయారు. ఓ పద్మలోచనా! అలాంటి నీవు అర్థివై వచ్చి నన్నడగటం అనేది కేవలం నా పుణ్యఫలం కాకపోతే మరేమిటి?"

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున.

649

శా. ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా
చ్ఛాదున్, నిర్మలసాధువాదు, ఘన సంసారాది విచ్ఛేదు, సం
శ్రీదున్, భక్తిలతాతిరోహిత హరి శ్రీపాదు నిఃఖేదుఁ బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్.

650

తా ॥ అని బలి చక్రవర్తి ఇలా పలుకుతూన్న సమయంలోనే పరమ భాగవతోత్తముడైన

ప్రహ్లాదుడు అక్కడికి వచ్చాడు. అతడు... విశాలమైన వక్షము, అప్పుడే వికసించిన తామర రేకుల వంటి కన్నులు, పచ్చని పట్టు వస్త్రము ధరించినవాడు. సాధువువలె మాట్లాడేవాడు. సంసార బంధాలను త్రెంచుకొన్నవాడు. భగవంతుని పాదములను సేవించేవాడు. దుఃఖాన్ని పారద్రోలి జ్ఞాన విద్యతో సంతోషించేవాడు. అట్టి ప్రహ్లాదుణ్ణి బలిచక్రవర్తి సంతోషంగా సందర్శించాడు.

వ. ఇట్లు సమాగతుం డైన తమ తాతం గనుంగొని విరోచన నందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రువిలోల లోచనుండై సిగ్గుపడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు సెల్లించె; నంతఁ బ్రహ్లాదుండు ముఖమండపంబున సనందాది పరిచర సమేతుండై కూర్చున్న వామన దేవునిం గని యానంద బాష్పంబులుఁ బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె.

651

తా ॥ అయితే బలిచక్రవర్తి వరుణపాశముల చేత కట్టబడిన వాడు కనుక తన తాతగారికి నమస్కారం చెయ్యడానికి వీలు లేకపోయింది. కన్నుల నిండుగా అశ్రువులు పొంగగా సిగ్గుతో శిరస్సువంచి తలదించుకొని మనస్సులోనే మ్రొక్కు చెల్లించుకున్నాడు. అంత ప్రహ్లాదుడు ముఖమండపంలో సనందుడు మొదలైన వారితో కూర్చున్న వామనదేవుణ్ణి చూసి ఆనంద బాష్పములు జాలువారగా, శరీరంలో పులకాంకురాలు వ్యాపింపగా దండప్రణామం చేసి ఇట్లా విన్నవించాడు:

సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు
మోహనాహంకృతి మూలంబు గర్వాంధ తమసవికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుటగాక బంధించుటే? తత్త్వజునకు మహేంద్రత్వమేల?
నీ పాదకమలంబు నియతిఁ గొల్చిన దానిఁ, బోలునే సురరాజ్య భోగపరత?

తే. గర్వమేపారఁ గన్నులు గానరావు;, చెవులు వినరావు; చిత్తంబు సిక్కుపడును; మఱచు నీ

సేవ లన్నియు మహిమ మాన్పి, మేలు సేసితి నీ మేటి మేర సూపి.

652

తా ॥ "స్వామీ! ఇతనికి మునుపు ఇంద్రపదవిని ఇచ్చి నేడు తొలగించావు. చాలా మేలు చేశావు. ఆ పదవి అహంకృతికి మూలమైనది. గర్వమనే అంధకారాన్ని కల్పించేది. అట్టి దానిని పోగొట్టడం రక్షించడమే అవుతుంది కాని బంధించటం అవదు. తత్వజ్ఞానికి ఇంద్రపదవి ఎందుకు? నీ పాదకమలములను నియమంతో కొలిచే వానికి ఇంద్రపదవి కొరగానిది కదా! ఇంద్రపదవిలో గర్వం పెరిగి కన్నులు కనిపించవు. చెవులు వినిపించవు. మనస్సుకు మైకం కమ్ముతుంది. నీ సేవలు అన్నీ మరచిపోతాడు. అట్టి పదవిని కూలద్రోసి వీనికి గొప్ప మేలు చేశావు స్వామీ!"

వ. అని పలికి జగదీశ్వరుండు నిఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున.

653

తా ॥ అని ప్రహ్లాదుడు జగదీశ్వరుడు, లోకసాక్షి అయిన నారాయణునకు నమస్కరించి పై విధంగా పలికాడు.

మ. తతమత్తద్విపయాన యై కుచ నిరుంధ చ్చోళ సంవ్యానయై
ధృత బాష్పాంబు వితానయై కరయుగాధీ నాలిక స్థానయై
'పతి భిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే!' యంచుఁ ద
త్సతి వింధ్యావలి సేరవచ్చెఁ ద్రిజగ ద్రక్షామనున్ వామనున్.

654

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె.

655

తా ॥ ఆ సమయంలో బలిచక్రవర్తి భార్య అయిన వింధ్యావళి కన్నీరు కారుస్తూ మందగమనంతో అక్కడకు వచ్చింది. ఆమె నిండుగా పైట చెరగు కప్పుకొన్నది. రెండు హస్తములను లలాటమునందు చేర్చి "ఓ దయామయా! పద్మాపతీ! నాకు పతి భిక్షను అనుగ్రహించు" అంటూ మూడు లోకాలకు రక్షకుడైన వానిని వామన మూర్తిని వేడుకొని ఇంకా ఆ ఇల్లాలు ఇట్లా అన్నది:

క. నీకుం గ్రీడార్థములగు, లోకంబుల జూచి పరుల లోకులు కుమతుల్ లోకాధీశుల మందురు, లోకములకు రాజ వీవ లోకస్తుత్యా!

656

తా ॥ "ఓ లోకపూజ్యా! ఈ లోకాలన్నీ నీకు క్రీడాస్థలములు. అజ్ఞానంతో మూర్ఖులు తామే పాలకులమని విర్రవీగుతారు కానీ సమస్త లోకాలకు అధీశుడవు నీవే అయి ఉన్నావు.

క. కా దనఁడు పొమ్ము లే దీ, రాదనఁడు జగత్త్ర యైక రాజ్యము నిచ్చెన్ నా దయితుఁ గట్ట నేటికి?, శ్రీదయితా చిత్తచోర! శ్రితమందారా!

657

తా ॥ నీవు లక్ష్మీదేవికి ప్రాణనాథుడవు! ఆశ్రితుల పాలిటి కల్పవృక్షానివి! నా భర్త నిన్ను కాదనలేదు, పొమ్మనలేదు, లేదు అనలేదు, ఇవ్వడానికి వీలు లేదు అనలేదు. మూడు లోకాలను నీకు ధారపోసాడు కదా! అటువంటి వానిని ఎందుకు బంధించావు?"

వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె?

658

తా ॥ అని ఈ విధంగా ప్రహ్లాదుడు, వింధ్యావళి విన్నవిస్తూన్న సమయంలో బ్రహ్మదేవుడు

వచ్చి వామనునితో ఇట్లా అన్నాడు:

సీ. భూతలోకేశ్వరా! భూతభావన! దేవ దేవ! జగన్నాథ! దేవ వంద్య!
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీ కిచ్చె దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు;
గరుణింప నర్హుండు గమలలోచన! నీకు విడిపింపు మీతని వెఱపు దీర్చి;
తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ జేసి నీ పదము లర్చించునట్టి
తే. భక్తియుక్తుఁడు లోకేశపదము నందు, నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్య మంతయు నిచ్చినట్టి, బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు?

659

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె.

660

తా ॥ "ఓ దేవదేవా! జగన్నాథా! నీవు సమస్త ప్రాణులను కాపాడేవాడవు. ఈ బలిచక్రవర్తి గొప్పదాత, దండనకు అర్హుడు కాదు కదా! తన సమస్తాన్ని నీకు సమర్పించినవాడు. నీవు కరుణ చూడదగినవాడు కనుక ఇతడిని బంధవిముక్తుడిని గావించు. నీ పాదపద్మాలను యథావిధిగా పూజించిన భక్తుడూ; వచ్చినవాడవు నీవు అని తెలిసీ దానం ఇచ్చేందుకు సంసిద్ధతను చూపిన ఈ బలిచక్రవర్తిని ఈ దృఢమైన పాశాలతో బంధించడం న్యాయమేనా?" అని బ్రహ్మదేవుడు అడుగగా భగవంతుడు ఇలా అంటున్నాడు:

సీ. 'ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసార గురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు, దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁడెల్లకాలంబు నఖిలయోనులయందుఁ బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప
విత్త వయో రూప విద్యా బలైశ్వర్య కర్మజన్మంబుల గర్వ ముడిగి
తే. యేకవిధమున విములుఁడై యెవ్వఁ డుండు, వాఁడు నా కూర్చిరక్షింపవలయువాఁడు;

స్తంభలోభాభిమాన సంసార విభవ, మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు.

661

తా ॥ "ఎవనిపై కరుణ చూపాలని నేను కోరుకుంటానో వాని సకలమైన సంపదలను నేను అపహరిస్తాను. సంసార సంబంధమైన మైకంలో ఎవడు లోకాన్ని, నన్ను ధిక్కరిస్తాడో అతడు ఎల్లకాలము నానా యోనులయందు పుడుతూ దుర్గతిని పొందుతాడు. ధనము, వయస్సు, రూపము, విద్య, బలము, ఐశ్వర్యము, కర్మ, జన్మ మొదలైన వాటివల్ల వచ్చే గర్వాన్ని విడిచిపెట్టి ఏ విధమైన మాలిన్యము లేకుండా ఎవడు ఉంటాడో నేను వానిని రక్షిస్తాను. నన్ను నమ్ముకున్నవాడు ఎన్నడూ లోభము, అభిమానము, సంసారము, వైభవము... అనే వాటివలన చెడిపోడు.

శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁ డు
ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే?

662

తా ॥ ఈతడు బంధింపబడినా, గురువు యొక్క శాపానికి గురి అయినా, బంధుజనం చేత వదలివేయబడినా, లభించిన ఐశ్వర్యము అంతా కోల్పోయినా, వైభవం అంతా క్షీణించినా, నిరుపేద అయినా పరిశుద్ధత్వాన్ని, సత్యాన్ని, కరుణను ఏమాత్రము విడిచిపెట్టలేదు. తన బుద్ధిబలంచేత మాయను గెలిచాడు. ఇతడు గొప్ప పుణ్యం చేసుకొన్న వాడేకాని అల్పుడు ఎంతమాత్రం కాదు.

అ. అసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద, యేను జూత మనుచు నింత వలుక నిజము వలికె నితఁడు నిర్మలాచారుండు, మేలు మేలు నాకు మెచ్చువచ్చు.

663

తా ॥ ఈ పుణ్యాత్ముడైన అసురనాథుని మర్యాద ఎలా ఉంటుందో చూద్దామనే ఉద్దేశ్యంతోనే నేను ఇంతసేపు పలుకకుండా ఊరకున్నాను. ఇతడు సత్యవాది, నిర్మలమైన ఆచారం కలవాడు. ఇతని ప్రవర్తన ప్రశంసనీయం.

క. సావర్ణిమనువు వేళను, దేవేంద్రుం డగు నితండు దేవతలకు; దు
ర్భావిత మగు నా చోటికి, రావించెద; నంత మీఁద రక్షింతు దయన్.

664

తా ॥ ఇతను సావర్ణి మనువు కాలంలో దేవతలందరికీ దేవేంద్రుడవుతాడు. భావించడానికి వీలుకాని ఆ పదవిలోనికి రావడానికి నేనే పిలిపిస్తాను. దయతో రక్షిస్తాను.

క. వ్యాధులు దప్పులు నొప్పులు, బాధలు చెడి విశ్వకర్మభావిత దనుజా
రాధిత సుతలాలయమున, నేధిత విభవమున నుండు నితఁ డందాఁకన్'.

665

వ. అని పలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె.

666

తా ॥ వ్యాధులు, శ్రమము, ఆపదలు లేని విశ్వకర్మచేత సృష్టింపబడిన సుతల లోకంలో రాక్షసులతో కూడి వైభవంతో ఉంటాడు" అని పలికి బలిని చూసి భగవంతుడు ఇట్లా అన్నాడు:

సీ. సేమంబు నీ కింద్రసేన మహారాజ! వెఱవకు! మేలు నీ వితరణంబు;
వేలుపు లందుండి వేడుక పడుదురు; దుఃఖంబు లిడుమలు దుర్మరణము
లాతురతలు నొప్పు లందుండు వారికి నొందవు; సుతలమందుండు నీవు;
నీ పంపు సేయని నిర్జరారాతుల నా చక్ర మేతెంచి నఱకుచుండు;

ఆ. లోకపాలకులకు లోనుగా వక్కడ, నన్ను లెంతవార లచట?నిన్ను నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షంచెదఁ, గరుణతోడ నీకుఁ గానవత్తు.

667

తా ॥ "ఓ ఇంద్రసేన మహారాజా! నీకు క్షేమం కలుగుగాక! నీవు దేనికీ భయపడవద్దు. నీ దానం బహు ప్రశంసనీయం. నువ్వు సుతల లోకంలో ఉండు. ఆ లోకసౌభాగ్యానికి దేవతలు సైతం కుతూహల పడతారు. దుఃఖము, కష్టాలు, దుర్మరణములు, వ్యాధులు, బాధలు అక్కడ ఉండే వారికి ఉండవు. నీ ఆజ్ఞను పాటించని రాక్షసులను నా చక్రం వచ్చి సంహరిస్తుంది. దిక్పాలకులకు సైతం అక్కడ నీపై అధికారం ఉండదు. ఇక మిగతా వారి గురించి చెప్పేదేముంది. నిన్ను ఎప్పుడూ నేను రక్షిస్తూ ఉంటాను. నీవు కోరినప్పుడు కనిపిస్తాను.

క. దానవ దైత్యుల సంగతిఁ, బూనిన నీ యసురభావమును దోడ్తో ను
ద్ధ్యానమునఁ దొలఁగి పోవును, మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్.

668

తా ॥ దానవులు, దైత్యులు... వీరి కలయిక వల్ల నీకు కలిగిన అసురభావం నన్ను ధ్యానించటం వలన తొలగిపోతుంది. నా ఆజ్ఞను అనుసరించి నువ్వు సుతల లోకంలో ఉండు."

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుఁ జెఱకు రసంపుసోనలు వీనుల తెరువులం జొచ్చి లోను బయలు నిండి ఱెప్పల కప్పు దప్పం ద్రోచికొని కనుఁగవ కొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురః ఫలకంబునం బులకంబులు కులకంబులయి తిలకంబు లొత్తఁ, గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడువడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాటలు రక్కసులఱేఁ డిట్లనియె.

669

తా ॥ అని ఇట్లు పలుకుచున్న భగవంతుని మధురమైన మరియు స్నేహపూరితమైన పలుకులు చెరకు రసపు జల్లులవలె చెవులలో ప్రవేశించాయి. లోపల బయట నిండి రెప్పలను తొలగ త్రోసుకుంటూ కను కొలకుల నుండి సంతోషంతో కన్నీరు మున్నీరుగా వస్తోంది. రొమ్ము అంతా పులకాంకురములతో నిండిపోయింది. చేతులు జోడించి మనస్సును చిక్కపట్టుకొని మధురమైన మాటలతో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు:

ఉ. ఎన్నడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నా బ్రదుకు నోజయు నానతి యిచ్చి కాచి; తీ
మన్నన లీ దయారసము మాటలు పెద్దఱికంబుఁ జాలదే?
పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే?

670

తా ॥ "ఓ పన్నగశయనా! దిక్పాలకులపైన సైతం నీవు ఇంత దయను చూపలేదు. నేడు నీవు నన్ను ఎంతగానో ఉన్నతున్ని చేసి నాపై కరుణ చూపించావు. నీవు చూపిన ఈ మన్నన, కరుణ, దయారసం నాకు చాలు, ఇంతకు మించి ఇంకేమి కావాలి! నిన్ను గుర్తెరిగి ఆశ్రయించినవారికి ఎన్నడూ ఆపదలు కలుగవు."

వ. అని పలికి హరికి నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబు సేసి, యిందుధరునకు వందనం బాచరించి, బంధవిముక్తుండై తన వారలతోఁ జేరికొని బలి సుతలంబునకుఁ జనియె; నంత హరి కృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె.

671

తా ॥ అని పలికి హరికి నమస్కరించి, బ్రహ్మకు ప్రణామం చేసి శివునికి వందనం చేసి బంధవిముక్తుడై తన వారితో కూడి బలి సుతల లోకానికి వెళ్ళాడు. ఈ విధంగా హరి దయచేత

కృతార్థుడైన కులోద్ధారకున్ని చూసి ప్రహ్లాదుడు సంతోషించాడు. ప్రహ్లాదుడు భగవంతునితో ఇట్లా అన్నాడు:

సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు; శర్వుఁ డీ లక్ష్ముల జాడఁ బొందఁ,
డన్యుల కెక్కడి? దసురులకును మాకు బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి; పద్మజాదులు భవత్పాదపద్మ
మకరంద సేవనమహిమ నైశ్వర్యంబు లందిరి కాక మే మల్పమతుల

తే. మధిక దుర్యోనులము కుత్సితాత్మకులము, నీ కృపాదృష్టిమార్గంబు నెలవు సేర నేమి తప
మాచరించితి మెన్నఁగలమె?, మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మ!

672

తా ॥ “ఓ మంగళ స్వరూపా! బ్రహ్మదేవుడు కూడా ఇంతగా నీ ప్రసన్నతను పొందలేదు. శివుడు కూడా ఇంతటి మన్ననను పొందలేదు. ఇక అన్యులు ఎంత! బ్రహ్మాదుల చేత పూజింపబడే పాదములు కలిగిన నీవు రాక్షసులమైన మాకు దుర్గ రక్షకుడవైనావు. నీ పాదపద్మ మకరంద సేవన మహిమ వలన బ్రహ్మాదులు ఐశ్వర్యమును పొందారు. కానీ మేము చాలా అల్పమతులము. అటువంటి వారమైన మాపై నీ కృపాదృష్టి కలిగింది. అంటే మేము ఏమి తపస్సు ఎప్పుడు చేసామో కూడా ఊహించలేము. మాయందు కరుణను చూపించుటయే చిత్రము!

వ. అదియునుం గాక.

673

ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు, నొకట విషమవృత్తి నుండు దరయ
నిచ్చ లేనివారి కీవు భక్తులు గోరు, తలఁపు లిత్తు కల్పతరువు మాడ్కి.

674

వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి, పరమ పురుషుం డిట్లనియె.

675

తా ॥ అంతేకాకుండా నీవు అందరిలోనూ ఉంటావు. అందరినీ సమంగా చూస్తావు. అయినా కొన్ని సందర్భాలలో అసమానమైన వృత్తిలో ఉన్నట్లు కనిపిస్తావు. నీయందు భక్తిలేని వారికి నీవేమీ ఇయ్యవు. భక్తులు కోరుకున్న కోరికలన్నీ కల్పతరువువలె తీరుస్తావు. ఎవరి భావనను అనుసరించి అది వారికి తీరుస్తూ ఉంటావు" అని విన్నవిస్తూన్న ప్రహ్లాదుణ్ణి చూసి భగవంతుడు ఇలా అన్నాడు:

తే. వత్స! ప్రహ్లాద! మేలు నీ వారి నీవు, సొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ, జేరి రక్షింతు దురితంబు సెంద దచట.

676

తా ॥ "వత్సా! ప్రహ్లాదా! సంతోషం! నీవు నీ మనుమని తోడ్కొని సుతల లోకానికి వెళ్ళు. నేను గదాపాణినై రక్షిస్తాను. అక్కడ ఏ దురితములు మీకు కలుగవు."

వ. అని యిట్లు నియమించిన బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుటఘటిత నిటల తటుండై, వీడ్కొని బలిం దోడ్కొని సకల సురయూథంబునుం దానునొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుఁడు సుతలలోకంబునకుం జనియె; నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె.

677

తా ॥ అని ఈ ప్రకారంగా ఆజ్ఞాపించిన భగవంతునికి నమస్కరించి ప్రదక్షిణం చేసి కరకమలములు రెండూ లలాటమునందు చేర్చి వీడ్కొని బలిని తోడ్కొని పోయాడు. సకల రాక్షస సమూహమును వెంటబెట్టుకుని ఒక మహాబిల ద్వారంగుండా ప్రహ్లాదుడు సుతలలోకానికి

వెళ్ళాడు. తరువాత బ్రహ్మవాదులైన ఋత్విక్కుల నడుమ సభామధ్యంలో కూర్చున్న శుక్రునితో నారాయణుడు ఇట్లా అన్నాడు:

ఆ. 'ఏమి గొఱంత వడియె నీ బలి జన్నంబు, విస్తరింపు కడమ విప్రవర్య! విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ, జనులు సూచినంత సమతఁ బొందు'

678

వ. అనిన శుక్రుం డిట్లనియె.

679

తా ॥ "ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఈ బలి చక్రవర్తి యాగానికి కొరత ఏమీ రాకూడదు. మిగిలిన కార్యాన్ని నీవు నెరవేర్చు. ఎన్ని లోటుపాట్లు జరిగినా మీ వంటి బ్రహ్మవేత్తల వీక్షణ మాత్రమున సమత్వాన్ని పొందుతాయి" అని పలికిన వారితో శుక్రుడు ఇలా అన్నాడు:

సీ. అఖిల కర్మంబుల కధినాథుఁడవు నీవ; యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష! ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ గడ మేల కల్గు నే కర్మములకు? ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను; నయినఁ గావింతు నీయానతి భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలుగాదె?

తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు, ననుచు హరిపంపు శిరమున నావహించి కావ్యుఁ డసురేంద్రుజన్నంబు కడమఁ దీర్చె, మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప.

680

తా ॥ "ఓ యజ్ఞపురుషా! అఖిల కర్మలకు నీవే అధినాథుడవు. యజ్ఞేశుడవు నీవే! ప్రత్యక్షంగా నీవు సంతృప్తి చెందితే ఏ కార్యాలకైనా కొరత ఎందుకుంటుంది? నిన్ను ధ్యానం చేస్తే ధనము, దేశము కాలము, మంత్ర తంత్రములు, వీటిలో వచ్చే లోటుపాట్లు అన్నీ సర్దుకుంటాయి. నీ ఆనతి ప్రకారమే నడచుకుంటాను. అలా నడచుకోవడమే జనులకు మేలు. ఇంతకంటే శుభం

నాకు ఎచ్చట కలుగుతుంది." అంటూ హరి యొక్క ఆజ్ఞప్రకారం శుక్రాచార్యుడు బలి చక్రవర్తి మొదలు పెట్టిన యజ్ఞమును మునులు, బ్రాహ్మణులు సహాయం చెయ్యగా పూర్తి చేశాడు.

వ. ఇ వ్విధంబున వామనుం డయి హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసంగె; నత్తఱి దక్షభృగు ప్రముఖ ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును, దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోపాలురకు 'వామనుండు వల్లభుం' డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు స్వర్గాపవర్గంబులకు 'నుపేంద్రుండు ప్రధానుం' డని సంకల్పించె; నా సమయంబున.

681

తా ॥ ఈ విధంగా హరి వామనావతారాన్ని ఎత్తి బలి చక్రవర్తి నుండి భూమిని పరిగ్రహించి తనకు అన్నగారైన ఇంద్రునకు స్వర్గాన్ని దయతో ఇచ్చాడు. ఆ సమయంలో దక్షుడు, భృగువు మొదలైన ప్రజాపతులూ, శివుడూ, కుమార స్వామీ, దేవర్షి పితృగణంబులూ, రాజులూ ఉండగా బ్రహ్మదేవుడు కశ్యపునకు అదితికి సంతోషం కలిగేటట్లుగా, సమస్త లోకాలకు లోకపాలురకు వామనుడు ప్రభువు అని నియమించాడు. అంతే కాకుండా ధర్మానికీ, కీర్తికీ, లక్ష్మికీ శుభములకూ, దేవతలకూ, వేదములకూ స్వర్గానికి మోక్షానికి వామనుడే ప్రధానుడు అని నిర్ణయం చేశాడు.

క. కమలజుఁడు లోకపాలురు, నమరేంద్రునిఁగూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను, నమరం గొనిపోయి రంత నట మీఁద నృపా!

682

తా ॥ ఓ రాజా! అటు తరువాత లోకపాలకులూ, దేవేంద్రునితో కూడి బ్రహ్మదేవుడు

విమానం మీద వామనున్ని అమరావతికి గౌరవంగా తీసుకొని వెళ్ళాడు.

ఆ. బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని, కింద్రపదము సేరు టిట్లు గలిగెఁ; దనకు నాఢ్యుఁడైన తమ్ముఁడు గలిగినఁ, గోర్కు లన్న కేల కొఱఁత నొందు?

683

తా ॥ బలవంతుడైన తమ్ముని సహాయంతో ఇంద్రునికి ఇంద్రపదవికి చేరటం అనేది ఈ విధంగా జరిగింది. ఉత్తముడైన తమ్ముడు ఉంటే అన్నగారి కోర్కెలకు కొరత ఎందుకు ఉంటుంది!

క. పా లడుగఁడు మే లడుగం, డేలఁడు భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగముల్ వేలుపుతల్లి కడపటి, చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్.

684

తా ॥ దేవతల తల్లి అయిన అదితికి ఆఖరివానిగా జన్మించిన వామనుడు బిచ్చమడిగి తెచ్చిన మూడు లోకాలను తన అగ్రజునకే ఇచ్చాడు. అందులో భాగాన్ని కోరలేదు. లాభాన్ని అడుగలేదు. దాన్ని తాను ఏలలేదు. ఈ విధంగా వామనునితో ఎవరూ సరిపోలలేరు.

ఆ. కడుపు బదరగాఁగఁ గొడుకులఁ గనుకంటెఁ, దల్లికొకఁడె చాలు బల్లిదుండు; ద్రిదశగుణముఁ గన్న యదితి కానుపు దీర్చి, జిన్ని మేటివడుగుఁ గన్న యట్లు.

685

తా ॥ దేవతాసమూహాన్ని కన్న అదితి చిట్టచివర తన అదృష్టం పండేటట్లుగా వామనున్ని కన్నది. ఎందరో కొడుకులను కలిగి ఉండటం కన్నా ఉత్తముడైన వాడు ఒక్కడున్నా చాలు కదా!

వ. ఇట్లు దేవేంద్రుడు వామన భుజపాలితం బగు త్రిభువన సామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుండును, గుమారుండును, భృగుప్రముఖు లయిన

మునులును, బితృదేవతలును, దక్షాది ప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును మఱియుం దక్కినవారలును, బరమాద్భుతం బైన విష్ణుని సుమహా కర్మంబులకు నాశ్చర్యంబు వొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచుం, దమతమ నివాసంబులకుం జని; రని చెప్పి శుకుం డిట్లనియె.

686

తా ॥ ఈ విధంగా దేవేంద్రుడు వామనుడు సంపాదించి ఇచ్చిన త్రిభువనాలను తిరిగి పొందాడు. అప్పుడు బ్రహ్మ, శివుడు, కుమార స్వామి, భృగువు మొదలైన మునులు, పితృ దేవతలు, దక్షుడు మొదలయిన ప్రజాపతులు, సిద్ధులు, వైమానికులు మరియు తక్కిన వారూ పరమాద్భుతమైన విష్ణుని లీలా విశేషాలకు ఆశ్చర్యపడుతూ, పొగడుతూ, తమతమ నివాసాలకు వెళ్ళారు. అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు.

తే. మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది, యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?
గంభినీ రేణుకములు గుఱుతు పెట్టు, వాఁడు నేరఁడు దక్కినవారి వశమె?

687

తా ॥ ఓ రాజా! ఆ త్రివిక్రముని మహిమ తెలుసుకోవడానికి ఎవరు సరిపోతారు? భూమండలంలోని అన్ని రేణువులూ లెక్కపెట్ట కలిగిన వాడు సైతం తెలుసుకోలేడు. ఇంక తక్కిన వారి గురించి చెప్పేది ఏముంది?

క. అద్భుత వర్తనుఁడగు హరి, సద్భావితమైన విమలచరితము విను వాఁ
డుద్భట విక్రముఁడై తుది, నుద్భాసితలీలఁ బొందు నుత్తమ గతులన్.

688

తా ॥ అద్భుతమైన లీలతో ఉన్న హరి యొక్క ఈ విమలమైన చరిత్రను విన్నవాడు అద్భుతమైన పరాక్రమం కలవాడై చిట్టచివరన ఉత్తమ గతులను పొందుతాడు.

తే. తగిలి మానుష పైతృక దైవకర్మ, వేళలందుఁ ద్రివిక్రమ విక్రమంబు లెక్క డెక్కడఁ
గీర్తింతు రెవ్వరేనిఁ, బొందుదురు నిత్య సౌఖ్యంబు భూవరేంద్ర!

689

తా ॥ ఓ రాజా! మానుష, పైతృక, దైవ సంబంధమైన పుణ్యకార్యాలను చేసేటప్పుడు ఈ త్రివిక్రమ విక్రమాన్ని ఎవరైతే కీర్తిస్తారో, కీర్తించినవారు విన్నవారు కూడా నిత్య సౌఖ్యాన్ని పొందుతారు."

## మత్స్యావతార కథ

వ. అని యిట్లు శుకుఁడు రాజునకు వామనావతార చరితంబు సెప్పెనని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కిట్లనిరి.

690

తా ॥ అని ఈ ప్రకారంగా శుక మహర్షి పరీక్షిత్తునకు వామనావతార చరిత్రను చెప్పాడ" ని సూతుడు మునులకు చెప్పాడు. దానిని వినిన వారు అతనితో ఇట్లా అన్నారు:

సీ. 'విమలాత్మ! విన మాకు వేడ్క యయ్యెడు; మున్ను హరి మత్స్యమైన వృత్తాంతమెల్లఁ; గర్మబద్ధుని భంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక నిందింతంబై తమోనిలయమైన మీనరూపము నేల మే లని ధరియించె? నెక్కడ వర్తించె? నేమి సేసె? నాద్యమై వెలయు న య్యవతారమునకు నెయ్యది కారణంబు? గార్యాంశ మెట్లు?

ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ, దెలియఁ జెప్పవలయు, దేవదేవు! చరిత మఖిలలోక సౌభాగ్యకరణంబు, గాదె; విస్తరింపు క్రమముతోడ'

691

వ. అని, మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె; మీర లడిగిన యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు బాదరాయణి యిట్లనియె.

692

తా ॥ "పుణ్యాత్ముడా! మునుపు హరి మత్స్యావతారాన్ని ధరించిన విధానం మాకు విశదీకరించుము. కర్మకు బద్ధుడైన వానివలె భగవానుడు లోకప్రసిద్ధం కానిదీ, తమస్సు చేత నిండినదీ అయిన మీనరూపాన్ని మేలని ఎందుకు భావించాడు? అప్పుడు ఏమేమి చేసాడు? మొదటగా ధరించిన ఆ మత్స్యావతార ప్రాశస్త్యాన్ని మాకు వివరంగా చెప్పగల సమర్థుడవు నీవే!

ఆ దేవాధిదేవుని చరితం లోకశుభంకరమైనది కదా!" అని మునులంతా సూతమహర్షిని ప్రార్థించగా, మీరు అడిగినట్లే పరీక్షిత్తు కూడా శుకుణ్ణి అడిగాడు. దానికి ఆ వ్యాసపుత్రుడు ఈ విధంగా తెలిపాడు:

సీ. విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి
గాలిచందంబున ఘనరూపములయందుఁ దనురూపములయందుఁ దగిలియుండు;
నెక్కువ దక్కువ లెన్నఁడు నొందక నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు;
గురుతయు గొఱఁతయు గుణసంగతివహించు; మనుజేశ! చోద్యమే మత్స్య మగుట?

తే. వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి, ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు నీరు ద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ, దపముఁ గావించె నొక యేటితటమునందు.

693

తా ॥ "ఓ రాజా! విను. ఆ జగన్నాథుడు వేదాలనూ, బ్రాహ్మణులనూ, గోవులనూ, దేవతలనూ, సాధువులనూ, ధర్మార్థములనూ రక్షించేందుకు వాయువు వలె అంతటా వ్యాపించి ఉంటాడు. వృద్ధి క్షయాలు లేని నిర్గుణస్వరూపుడైనప్పటికీ ఆ పరబ్రహ్మ ఒకొక్కసారి ఎక్కువ తక్కువ గుణాలను కూడి ఉన్నట్లుగా గోచరిస్తూ ఉంటాడు. అందువలన మత్స్య రూపాన్ని ధరించడంలో వింత ఏమీ లేదు! గత కల్పంలో ద్రవిడ దేశపు రాజైన సత్యవ్రతుడు కేవలం నీటినే ఆహారంగా తీసుకుంటూ ఒక నదీ తీరంలో విష్ణువు గురించి నిష్ఠతో తపస్సు చేసేవాడు.

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీ కాంతుండు గృతమాలికయను నేటిపొంత హరిసమర్పణంగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నా రాజు దోసిట నొక్క మీనుపిల్ల; దవిలి వచ్చిన నులికిపడి, మరలం దరంగిణీ జలంబునందు శకుల శాబకంబు విడిచె నట్లు విడివడి నీటిలో నుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె.

694

తా ॥ ఆ సత్యవ్రతుడు ఒకనాడు ఆ కృతమాలికా నదీ తీరంలో విష్ణువుకి జలతర్పణం గావించేందుకు నీటిని దోసిట తీసుకున్నాడు. అందులో ఒక చిన్న చేపపిల్ల కనిపించగా ఉలిక్కిపడుతూ దానిని తిరిగి నీటిలో విడిచిపెట్టాడు. అంతట ఆ చేపపిల్ల రాజుతో ఇట్లా అన్నది:

మత్తకోకిల.

"పాటువచ్చిన జ్ఞాతి ఘాతులు పాపజాతి ఝషంబు లీ
యేటఁ గొండొక మీనుపిల్లల నేఁటి పట్టి వధింప న
చ్చోట నుండక నీదు దోసిలి సొచ్చి వచ్చిన నన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ?

695

తా ॥ "ఓ దయానిధీ! ఈ ఏటిలో చిన్నచిన్న చేపపిల్లలను పట్టుకొని మ్రింగివేసే పెద్ద చేపలు ఉన్నాయి. అందువల్ల ఇక్కడ ఉండలేకే నీ దోసిలిలోకి వచ్చాను. నన్ను ఇలా తిరిగి విడిచిపెట్టడం న్యాయమేనా? ఓ రాజా! నీకు దయ లేదా?

ఆ. వలలు దారు నింక వచ్చి జాలరి వేఁట, కాఱు వేఱు గలఁచి గారవెట్టి మిడిసి పోవనీక మెడఁ బట్టుకొనియెద;, రప్పుడెందుఁ జొత్తు? ననఘ చరిత!

696

తా ॥ ఓ అనఘుడా! ఇప్పుడు జాలరులు కూడా వలలతో వచ్చి నదిని కలచివేసి నన్ను బంధిస్తారు. ఎగిరిపోనీయకుండా మెడ పట్టుకుంటారు. అప్పుడు ఎక్కడికి పోగలను?

క. భక్షించు నొండె ఝషములు, శిక్షింతురు ధూర్త లొండెఁ; జెడకుండ ననున్ రక్షింపు దీనవత్సల!, ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము కలదే?"

697

తా ॥ ఓ దీనవత్సలా! నన్ను పెద్ద చేపలైనా భక్షిస్తాయి లేదా బెస్తవారు అయినా పట్టుకుంటారు. అలా చనిపోకుండా నన్ను రక్షించు. బలహీనులను కాపాడటం కంటే పుణ్యప్రదమైనది మరొకటి లేదు కదా!"

వ. అనిన విని కరుణాకరుండగు న వ్విభుండు మెల్లన య య్యంభశ్చరడింభకంబును గమండలు జలంబునం బెట్టి తన నెలవునకుం గొనిపోయె, నదియు నొక్క రాత్రంబునం గుండిక నిండి తనకు నుండ నిమ్ము సాలక రాజన్యున కిట్లనియె.

698

తా ॥ అన్న ఆ చేపపిల్ల మాటలను విన్న కరుణాకరుడైన ఆ రాజు నీళ్ళలో ఉండే ఆ చేపపిల్లను మెల్లిగా కమండలం జలంలో పెట్టి, తను ఉండే చోటుకి తీసుకొని పోయాడు. ఒక్కరాత్రి అయ్యేసరికి ఆ చేపపిల్ల కమండలమంతా నిండిపోయి తను కదలడానికి చోటు లేక ఆ రాజుతో ఇట్లా అన్నది:

క. 'ఉండ నిది గొంచె మెంతయు, నొండొకటిం దెమ్ము భూవరోత్తమ?' యనుడున్ గండకముఁ దెచ్చి విడిచెను, మండలపతి సలిలకలశ మధ్యమునందున్.

699

తా ॥ "ఓ భూవరోత్తమా! నేను ఉండటానికి చోటు చాలడం లేదు. ఇంకా కొంచెం పెద్ద పాత్రను తీసుకొని రమ్ము" అని అనేసరికి సత్యవ్రతుడు దానిని పెద్ద పాత్రలో విడిచాడు.

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడు చేతులనిడుపై యుదంచనంబు నిండి పట్టు సాలక వేఱొండు దెమ్మనవు డా నా రాచపట్టి కరుణాగుణంబునకు నీడపట్టు గావున గండకంబు నొండొక్క చిఱుతమడుఁగున నునిచె; నదియు నా సరోవర జలంబునకు నగ్గలంబై 'తనకు సంచరింప నిదిగొంచెం' బని పలికినం బుడమిఱేఁడు మంచివాఁ డగుటం జేసి యా కంచరంబు నుదంచిత జలాస్పదంబైన హ్రదంబునందు నిడియె; నదియు

నాసలిలాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము సాలదని చెప్పికొనిన నప్పుణ్యుం డొప్పెడి నడవడిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున విడిచె; నదియును మకరాకరంబునం బడి రాజున కి ట్లనుఁ బెనుమొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి; నింత కాలంబు నడపి కడపట దిగవిడువకు; వెడలఁ దిగువు' మని యెలింగింపఁ దెలిసి య న్నీటి తిరుగుడు ప్రోడకుం బుడమిఱేఁ డిట్లనియె.

700

తా ॥ క్షణకాలంలోనే ఆ చేప మూడు చేతుల పొడుగై ఆ పాత్ర అంతా నిండి ఉండి, చోటు చాలనందున మరొక పాత్ర తీసుకొని రమ్ము అనేసరికి ఆ రాజు కరుణాకరుడు కావున ఆ చేపను ఒక చిన్న మడుగులో ఉంచాడు. అయితే ఆ చేప సరోవర జలంకంటే కూడా పెద్దదై తను తిరగడానికి ఇది కూడ చాలదు అనే సరికి ఆ రాజు మంచివాడు అయిన కారణంగా ఆ చేపను పెద్ద జలాశయంలో విడిచిపెట్టాడు. అది ఆ జలాశయానికి అధికంగా పెరిగే సరికి ఆ మహా మీనాన్ని మహాసముద్రంలో విడిచిపెట్టాడు. అప్పుడు పెద్ద పెద్ద మొసళ్ళు నా చుట్టూ చేరి విజృంభించి నన్ను మ్రింగేస్తాయి. ఇంతకాలం కాపాడి ఇప్పుడు విడువకు, నన్ను బయటకు తీయమని ఎలుగెత్తి అరిచేసరికి నీటిలో తిరిగే ఆ చేపను చూసి ఇది సాధారణ మత్స్యం కాదని భావించిన రాజు ఇలా అన్నాడు:

సీ. ఒక దినంబున శతయోజనమాత్రము విస్తరించెదు నీవు; వినుము చూడ
మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము; మీనజాతుల కిట్టి మేను గలదె?
యేమిటి కెవ్వఁడ? వీ లీలఁ ద్రిప్పెదు కరుణ నాపన్నులఁ గావ వేఁడి
యంభశ్చరంబైన హరివి నే నెఱిఁగితి నవ్యయ! నారాయణాభిధాన!

తే. జనన సంస్థితి సంహార చతురచిత్త!, దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ
నీదు లీలావతారముల్ నిఖిలభూత, భూతి హేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య!

701

తా ॥ "ఒక్క రోజులోనే శత యోజనాలు విస్తరించావు. నీలాంటి చేపలను మేము ఎన్నడూ కనీవినీ ఎరుగము. చేపలకు ఇటువంటి శరీరం ఉంటుందని మాకు తెలియదు. నీవు ఎవరు? ఎందుకు ఈ ప్రకారం మమ్మ త్రిప్పుతున్నావు? నీవు ఆపన్నులను రక్షించే హరివి అనే విషయాన్ని నేను తెలుసుకున్నాను. ఓ అవ్యయా! నారాయణా! సృష్టి స్థితి సంహార కారణుడవు నీవు! దీనులకు భక్తులమైన మాకూ దిక్కు నీవే! నీ అవతారాలు అన్నీ ప్రాణులకు క్షేమదాయకాలు. ఓ పురుషోత్తమా! ఇవే నా వందనములు.

క. ఇతరులము గాము చిత్సం, గతులము మాపాల నీవు గలిగితి భక్త
స్థితుఁడవగు నిన్ను నెప్పుడు, నతిసేసిన వాని కేల నాశము గలుగున్?

702

తా ॥ మేము నీకు పరాయివారం కాము. నిర్మలమైన జ్ఞానం కలవాళ్ళము. మాకు అండగా నీవు ఉన్నావు. ఎప్పుడూ భక్తులయందు ఉండే నీకు నమస్కారం చేసిన వానికి ఎన్నటికీ చేటు వాటిల్లదు.

క. శ్రీలలనాకుచవేదికఁ, గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవు దామసాకృతి, నేలా మత్స్యంబ వైతి వెఱిగింపు హరీ!"

703

వ. అని పలుకు సత్యవ్రత మహారాజునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయవేళా సముద్రంబున నేకాంతజన ప్రీతుండయి విహరింప నిచ్చించి మీనరూపధరుండైన హరి యిట్లనియె.

704

తా ॥ ఓ హరి! లక్ష్మీదేవి యొక్క కుచ వేదిక యందు ఆసక్తితో క్రీడించే నీవు ఆనందస్వరూపుడవు. అటువంటి నీవు కేవలం తామస గుణంతో కూడిన మత్స్యావతారమును

ఎందుకు ఎత్తావు" అని అడిగిన సత్యవ్రత మహారాజుతో మీనరూపంలో వచ్చిన హరి ఇలా అన్నాడు: "ఓ రాజా! ఈ యుగం చివర ప్రళయవేళ సముద్రంలో ఒంటరిగా విహరించడానికి ప్రీతిగా వచ్చాను.

సీ. ఇటమీఁద నీ రాత్రి కేడవదినమునఁ బద్మగర్భుని కొక్కపగలు నిండు;
భూర్భువాదిక జగంబులు మూఁడు విలయాబ్ధి లోన మునుంగు; నా లోనఁ బెద
నావ సేరఁగ వచ్చు; నా పంపు పెంపున దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులుఁ కలసి తిరుగ

ఆ. మ్రోలఁ గాన రాక ముంచు పెంజీఁకటి, మిడుకుచుండు మునుల మేని వెలుఁగు
దొలఁకుచుండు జలధి దోదూయమాన మై, నావ దేలుచుండు నరవరేణ్య!

705

తా ॥ ఓ నరవరేణ్యా! ఈ రాత్రి గడిచిన తరువాత రాబోయే ఏడవ దినముతో బ్రహ్మకు ఒక పగలు పూర్తవుతుంది. అప్పుడు భూలోకం మొదలుకుని మూడు లోకాలు ప్రళయ సముద్రంలో మునిగిపోతాయి. అప్పుడు నా ఆజ్ఞను అనుసరించి ఒక పెద్ద నావ నీ చెంతకు వస్తుంది. దానిలో ఓషధీ సమూహం సమస్త బీజరాసులు ఉంచి ఆ ప్రళయ సముద్ర జలాలలో విహరించు. సప్త ఋషులు నీతో కలసి ఉంటారు! అప్పుడు మీ ముందు ఏమి ఉందో కానరాని పెను చీకటి క్రమ్ముతుంది. మునుల యొక్క శరీర కాంతి మాత్రం మిణుకు మిణుకుమంటూ మెరుస్తూ ఉంటే నావ తేలుతూ వెడుతుంది.

వ. మఱియు నన్నావ మున్నీటి కరళ్లకు లోనుగాకుండ, నిరుగెలంకుల వెనుక ముందట నేమఱకుండఁ బెన్నెఱులగు నా గఱులన్ జడియుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నొడియుచు సంచరించెద; నొక్క పెనుఁబాము చేరువ నా యనుమతిం బొడసూపెడు దానంజేసి సుడిగాడ్పుల కతంబున నావ వడిం దిరుగంబడకుండ నా కొమ్ము తుదిం బదిలముచేసి నీకును మునులకును నలజడి సెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి

రేయి వేగునంతకు మెలంగెద; నది కారణంబుగా జలచర రూపంబుఁ గయికొంటి; మఱియును; నిన్ను ననుగ్రహింతు నని సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుండయ్యె; న య్యవసరంబున.

706

తా ॥ ఆ ఓడ సముద్రపు అలలకు లోనుకాకుండగా దానిని అన్ని వైపులా ప్రమాదం లేకుండా సంరక్షిస్తూ, పెద్ద ఈకలతో కూడిన నా రెక్కలను కదిలిస్తూ ఉంటాను. నావను భగ్నం చెయ్యడానికి వచ్చిన పెద్ద పెద్ద జలచరాలకు చిక్కకుండా సంచరిస్తాను. నా ఆజ్ఞానుసారంగా ఒక పెద్ద సర్పం కనిపిస్తుంది. సుడిగాడ్పులకు నావ తిరగబడకుండా ఆ పాముతో నా కొమ్ముచివరను నావకు కట్టి బంధించు. నీకూ, మునులకూ ఎటువంటి అలజడి లేకుండా ఆ ప్రళయ రాత్రి పూర్తయ్యేటంత వరకు నేను రక్షిస్తూ ఉంటాను. దీనికోసమే నేను జలచర రూపాన్ని ధరించాను. నిన్ను అనుగ్రహిస్తున్నాను" అని సత్యవ్రతుడు చూస్తూ ఉండగా హరి అదృశ్యమయ్యాడు.

ఆ. మత్స్య రూపియైన మాధవు నుడుగులు, దలఁచి కొనుచు రాచతపసి యొక్క
దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి, కాచి యుండె నాఁటి కాలమునకు.

707

తా ॥ అలా మత్స్యరూపంలో గల మాధవుని యొక్క పలుకులను తలచుకొంటూ సత్యవ్రతుడు దర్భశయ్యను తూర్పువైపు తలగడగా చేసుకొని పరుండి ప్రళయకాలం కోసం వేచి ఉన్నాడు.

వ. అంతఁ గల్పాంతంబు డాసిన.

708

క. ఉల్లసిత మేఘపంక్తులు, జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్ వెల్లి విరిసి జలరాసులు, సెల్లెలి కట్టలను దాఁటి సీమల ముంచెన్.

709

తా ॥ అంతలోనే కల్పాంతం ప్రవేశించింది. మెరుపులతో కూడిన మేఘరాశి మహోగ్రమైన వర్షరాశిని ఎడతెరిపి లేకుండా కురిపించాయి. వెల్లి విరిసిన జలరాశి చెలియలి కట్టలను దాటి వచ్చి భూమండలాన్నంతటినీ ముంచివేసింది.

వ. తదనంతరంబ.

710

తే. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర!, బ్రాహ్మ మనఁగ నైమిత్తిక ప్రళయవేళ నింగిపై
నిట్టతొలఁకు మున్నీటిలోనఁ, గూలె భూతాళి జగముల కొలఁదు లెడలి.

711

తా ॥ ఓ నరేంద్రా! మున్ను బ్రాహ్మమనే ఆ కల్పాంత వేళలో ఆ ప్రళయంలో సముద్ర జలాలు హద్దులు దాటి ఆకాశమంతా వ్యాపించాయి. సమస్త జీవరాశులూ ప్రాణాలు కోల్పోయాయి.

వ. అంత న మ్మహారాత్రియందు.

712

మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీఁ
పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుండే సృష్టియున్ మాని మే
నొఱగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్
గుఱు వెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా!

713

తా ॥ అంత ఆ మహారాత్రి యందు బ్రహ్మదేవుడు అవిరామంగా ప్రాణికోట్లను నిర్మించి

అలసినందున శరీరం బడలికతో ఉంది. ఆవులిస్తూ సృష్టికార్యాన్ని మానేశాడు. మేను ఒరిగి పోయింది. రెప్పలు మూసుకు పోతున్నాయి. చెయ్యి తలగడగా చేసుకొని కలలు కంటూ గురకలు పెడుతూ నిద్రిస్తున్నాడు.

ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి, ముఖమునందు వెడలె మొదలి శ్రుతులు నపహరించె నొక హయగ్రీవుఁడను దైత్య, భటుఁడు; దొంగఁదొడరఁ బరులవశమె!

714

తా ॥ అలసి నిదుర పోతూన్న ఆ పరమేష్ఠి ముఖం నుండి వేదరాశి ఉత్పన్నమయ్యింది. హయగ్రీవుడనే రాక్షసుడు ఆ వేదాలను అపహరించాడు. హయగ్రీవుడికి తప్ప బ్రహ్మను దరిచేరడానికి పరులకు శక్యం కాదు.

క. చదువులు దన చేవడినం, జదువుచుఁ బెన్ బలయ నుండ శంకించి వడిం జదువుల ముదుకఁడు గూరుకఁ, జదవుల తస్కరుఁడు సొచ్చె జలనిధి కడుపున్.

715

తా ॥ జ్ఞాననిధులు అయిన వేదాలు తన చేతిలో పడేసరికి హయగ్రీవుడు బయట ఉండటానికి సందేహించి, బ్రహ్మ నిద్రలో కూరుకుని ఉండటం చూసి ఆ వేదరాశిని తస్కరించినవాడు కాస్తా సముద్రంలోనికి ప్రవేశించాడు.

వ. ఇట్లు వేదంబు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని జయింపవలసియు, మ్రానుదీఁగెల యందు విత్తనంబుల పొత్తరలు పెన్నీట నాని చెడకుండా మనుపవలసియు నెల్లకార్యంబులకుం గావలి యగు నాపురుషోత్తముం డప్పెనురేయి చొరుదలయందు.

716

తా ॥ ఈ విధంగా ఆ ప్రళయ కాలంలో వేదాలను దొంగిలించి సముద్రంలో మునిగిన

వానిని జయింపవలసిన కర్తవ్యము, ఓషధాలు, విత్తనాల సంచులు సముద్రంలో తడవనీయక కాపాడవలసిన కర్తవ్యము ఈ రెండు భగవంతుని కార్యములే అయ్యాయి.

క. కుఱుగఱులు వలుఁద మీసలు, చిఱుఁదోఁకయు బసిఁడి యొడలు సిరిగల పొడలున్ నెఱి మొగము నొక్క కొమ్మును, మిఱుచూపులుఁ గలిగి విభుఁడు మీనం బయ్యెన్.

717

తా ॥ దానితో మహావిష్ణువు మత్స్యరూపాన్ని ధరించాడు. చిన్న రెక్కలు, పెద్ద మీసములు, చిరుతోక, బంగారపు రంగు శరీరము, దానిపై సిరిగల మచ్చలు, అందమైన ముఖము, ఒకే ఒక కొమ్ము, మిరుమిట్లు గొలిపే చూపులు కలిగి ఉన్న ఆ మహామత్స్యం ప్రకాశవంతంగా ఉంది.

వ. అట్లు లక్షయోజనాయతం బయిన పాఠీనంబై విశ్వంభరుండు జలధి సొచ్చి.

718

సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁ గూడు నొకమాటు దరులకు నుఱికి వచ్చు; నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు; నొకమాటు వారాశి నొడలు ముంపఁగఁ జూచు నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు; నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు నొకమాటు జలముల నుమిసివైచు

తే. గఱులు సారించు మీసలు గడలు కొలుపుఁ, బొడలు మెఱయించుఁ గన్నుల పొలప మార్చుఁ; నొడలు జళిపించుఁ దళతళ లొలయు మీన, వేషి పెన్నీట నిగమ గవేషి యగుచు.

719

తా ॥ (ఈ విధంగా లక్ష యోజనాల పొడవు గల మహామత్స్యరూపాన్ని ధరించిన ఆ విష్ణువు జలధిలోనికి ప్రవేశించి ఏ విధంగా విహరిస్తున్నాడో ఇక్కడ చెబుతున్నారు.) ఒకసారి జలచరాలతో కలిసి తిరుగుతాడు, ఒకసారి వేగంగా గట్టువైపుకి దుముకుతూ వస్తాడు. ఒకసారి ఆకాశానికి ఎగురుతాడు, ఒకసారి నీటి లోపలే దాగి ఉంటాడు. ఇంకోసారి సముద్రంలో ఒళ్ళు

తడుపుదామని చూస్తాడు, మరొకసారి బ్రహ్మాండాన్ని ఒరుసుకునే ప్రయత్నం చేస్తాడు. ఒకసారి చేపలగుంపును పట్టి మింగుతూ, ఒకసారి నీటిని లోపలికి పీల్చి బయటకు చిమ్ముతూ ఉంటాడు. ఈ విధంగా రకరకాలుగా విహరిస్తూ, ఆ మత్స్యమూర్తి తన రెక్కలను చాస్తూ, మీసాలను కదిలిస్తూ, మేని పొడలను మెరిపిస్తూ, కళ్ళనుండి ప్రకాశాన్ని ప్రసరిస్తూ, ఒళ్ళు విరుచుకుంటూ, తళతళలాడుతూ ఆ సాగరగర్భంలో ఆ ప్రళయజలాల్లో వేదాలను అన్వేషించడం మొదలుపెట్టాడు.

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్తపరాధీనుండగు హరిం దలచుచునుండ నారాయణ ప్రేరితయై యొక్క నావ వచ్చినం గనుంగొని. 720

మ. చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని వ్రాన్సీఁగ వి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులు దాను నెక్కి వెఱతో మున్నీటిపై ఁ దేలుచుం
గనియెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్.

721

తా ॥ అంతకు ముందు మహా సముద్రాలన్నీ భూమండలాన్ని ముంచివేసే ముందే సత్యవ్రతుడు భక్తపరాధీనుడు అయిన హరిని ధ్యానిస్తుండగా ఒక నావ అక్కడకు వచ్చింది. దానిని చూసిన సత్యవ్రతుడు ఉత్సాహంతో విత్తనాలతో కూడిన తీగలను పెక్కింటిని నావపై అమర్చాడు. హరిధ్యానం చేస్తూ దానిపై మునులతో పాటు తానూ ఎక్కి మున్నీటిపై తేలుతూ ఆ సముద్రంలో ప్రయాణిస్తుండగా భక్తుల హృదయాలకు అలంకారప్రాయమైన మహా మీనమును చూసాడు.

వ. కని, జలచరేంద్రుని కొమ్మున నొక్కపెనుఁ బాఁపత్రాట న న్నావఁ గట్టి, సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నారాచపెద్ద మీనాకారుండగు వేల్పుఁతేని నిట్లని

పొగడం దొడంగె.

722

తా ॥ చూసి వెంటనే ఆ మహామీనం కొమ్ముకి ఒక పెద్ద పామును త్రాడుగా చేసి కట్టివేసినాడు. అతని హృదయం ఆనందంతో నిండిపోగా ఋషులతో కలిసి మీనరూపంలో ఉన్న శ్రీమహా విష్ణువును ఈ విధంగా కీర్తించసాగారు:

మ. తమలోఁ బుట్టు నవిద్య గప్పిగొనుదుం దన్మూలసంసార వి
భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవ యో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదంబందుదు రట్టి నీవు కరుణం బాలింపు మ మ్మీశ్వరా!

723

తా ॥ "ఈశ్వరా! తమను ఆవరించి ఉన్న అజ్ఞానం కారణంగా దానికి మూలమైన సంసారంలో పడి కొందరు మునుగుతూ తేలుతూ ఉంటారు. అట్టివారు దైవయోగం చేత పరమేశ్వరుడైన నిన్ను కొలిచి ఘనులై కైవల్యాన్ని పొంది ఆనందిస్తారు. ఈశ్వరా! మమ్ములను కరుణతో పాలించు.

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు సన్మతి దా గురుఁడౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతిజాడఁ జూపవే!

724

తా ॥ ఓ లక్ష్మీపతీ! సూర్యుడే కన్నులుగా సమస్త ప్రపంచాన్ని నీవు వీక్షిస్తూ ఉంటావు. మూఢునికి గురువువు నీవే. కనుక కన్నులున్నవాడు చూపులేనివానికి త్రోవ చూపినట్లుగా మమ్మ

ఉద్ధరించి సద్గతిని చూపు.

క. ఇంగలముతోడి సంగతి, బంగారమువన్నె గలుగుభంగినిఁ ద్వత్సే
వాంగీకృతుల యఘంబులు, భంగంబులఁ బొందు ముక్తి ప్రాప్తించు హరీ!

725

తా ॥ ఓ స్వామీ! అగ్నిసంస్కారం వల్ల బంగారమునకు వన్నె వచ్చిన విధంగా నీ సేవవల్ల పాపములు నశించి ముక్తి ప్రాప్తిస్తుంది.

క. హృదయేశ! నీ ప్రసన్నత, పదివేలవపాలి లేశభాగముకతనం
ద్రిదశేంద్రత్వము గలదఁట!, తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా!

726

తా ॥ ఓ హృదయేశ్వరా! నీ ప్రసన్నతలో పదివేలవ వంతులో ఒక లేశభాగం దొరికినా దానివల్ల ఇంద్రపదవి వస్తుందట. నిన్ను మెప్పించిన వారికి దొరకని భాగ్యం అంటూ ఏముంటుంది లక్ష్మీరమణా!

క. పెఱవాఁడు గురుఁ డటంచును, గొఱగాని పదంబు సూపఁ గుజనుండగు నీ
నెఱత్రోవ నడవ నేర్చిన, నఱమఱ లేనట్టిపదమునందు దయాబ్ధీ!

727

తా ॥ ఓ దయాబ్ధీ! అన్యులను గురువనే భ్రాంతితో దరిచేరితే చెడిపోతారు. నీవు చెప్పిన సన్మార్గంలో నడిస్తే సందేహం లేకుండా నీ రక్షణలో ఉంటారు.

మ. చెలివై చుట్టమవై మనస్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కుల పంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకే
పలువెంటంబడి లోక మక్కట! వృథా బద్ధాశమై పోయెడిన్

నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా!

728

తా ॥ ఓ పన్నగశయనా! నీవు స్నేహితుడవై, బంధువై, జ్ఞానస్వరూపునివై సకల జీవుల అంతరంగంలో నివసిస్తావు. అట్టి ఆత్మనైన నిన్ను కాదని లోకం వృథాపరుగులతో, ఆశలతో కాలం గడుపుతుంది. భాగ్యంలేనివానికి బంగారు రాశి లభించినా దానిని నిలుపుకోలేడు కదా!

ఆ. నీరరాశిలోన నిజకర్మ బద్ధమై, యుచితనిద్రఁ బొంది యున్న లోక
మే మహాత్ముచేత నెప్పటి మేల్కాంచు, నట్టి నీవు గురుఁడ వగుట మాకు.

729

క. ఆలింపుము విన్నప మిదె, వేలుపు గమిఱేని నిన్ను వేఁడికొనియెదన్ నాలోని చిక్కు మానిచి, నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా!

730

తా ॥ ఓ నిఖిలాధీశ్వరా! కర్మఫలాలకు లోబడి సంసార సాగరంలో మునిగిపోయే లోకాన్ని మేలు కొలిపేందుకు వచ్చిన మహనీయుడవు నీవు! దేవతలకు ప్రభువైన నీవు మాకు గురుడవైనావు. అట్టి నిన్ను మా విన్నపాలను ఆలకించమని వేడుకుంటున్నాము. మా లోపల గల చిక్కులు తీర్చి నీ లోనికి మమ్ము తీసుకొని పొమ్మని ప్రార్థిస్తున్నాము.”

వ. అని ఇట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటంజేసి, సాంఖ్య యోగక్రియాసహితయగు పురాణ సంహిత నుపదేశించె; నమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుం డయ్యె; నతం డిమ్మహా కల్పంబున వివస్వంతుం డనంబరఁ గిన సూర్యునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరికృపావశంబున నేడవ మనువయ్యె; నంత నవ్విధంబునఁ బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు

నారాయణుండు దన్నిశాంత సమయంబున.

731

తా ॥ అని ఈ ప్రకారంగా సత్యవ్రతుడు ఋషులు ప్రార్థించగా సంతోషించి, మత్స్యరూపంలో మహాసముద్రంలో విహరిస్తూన్న హరి పురాణపురుషుడైన కారణంగా సాంఖ్య యోగంతో కూడిన వేద సంహితను ఉపదేశించాడు. ఆ మహారాజు మునులతో కూడి భగవంతుడు చెప్పిన సనాతనమైన బ్రహ్మజ్ఞానాన్ని విని కృతార్థుడయ్యాడు. అతడు ఈ కల్పంలో వివస్వంతుడనే పేరుతో పిలువబడే సూర్యునికి శ్రాద్ధ దేవుడనే పేరుతో కొడుకుగా పుడతాడు. పుట్టి విష్ణు కృప వలన ఏడవ మనువైనాడు. ఈ విధంగా ప్రళయరాత్రి పూర్తయ్యేవరకు జలచరాకారంలో నారాయణుడు సంచరిస్తూనే ఉన్నాడు.

మ. ఉఱ కంభోనిధి రోసి వేదముల కుయ్యున్ దైన్యముం జూచి వే
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే
న్మెఱయన్ దౌడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళిత గ్రావున్ హయగ్రీవునిన్.

732

వ. అంతం బ్రళయావసాన సమయంబున.

733

తా ॥ అంతలో వేదముల దైన్యాన్ని చూసాడు. వేగంగా రెక్కలు అల్లార్చాడు. ముఖమును సాచి, తోకను సారించి, మేను మెరయగా, దౌడలు సరి చేసుకొని, మీసములు కదలగా పెద్ద చేప ఆకారంలో గల శ్రీమహావిష్ణువు, హయగ్రీవుని వధించాడు. అంతటితో ప్రళయకాలం ముగింపుకి వచ్చింది.

సీ. ఎప్పుడు వేగునం చెదురు చూచుచు నుండు మునుల డెందంబులు ముదము నొందఁ,

దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి యోరపయ్యెఁద జక్కనొత్తి కొనఁగ,
మలినమై పెను రేయి గ్రమ్మిన తేజంబు దొంటి చందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచితభాగధేయంబులు గన్నుల కొలఁకులఁ గానఁబడఁగ,

తే. నవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిఱి, మేల్కాంచి, నీల్గి, మలఁగి, యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టి సంధాత యగుచు.

734

తా ॥ ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూస్తున్న మునుల మనస్సులు సంతోషించాయి. మైమరిచి నిద్రిస్తూన్న భారతీదేవి బ్రహ్మదేవుని పక్కన కూర్చుని సరిచేసుకొన్నది. మలినమై పోయిన బ్రహ్మ తేజస్సు మరల మిసమిసలాడింది. ప్రాణులు కూడబెట్టుకున్న పుణ్యపాపములు ఆయన కనుకొలకులకు కనబడుతున్నాయి. దానితో అవయవాలు అన్నీ విదలించి ఆవులించాడు. నిదురనుండి పూర్తిగా మేలుకొన్నాడు. కన్నులు తుడుచుకొని ఒళ్ళు విరుచుకుంటూ ఆ ధాత తిరిగి సృష్టి చెయ్యటం కోసం కూర్చున్నాడు.

వ. అ య్యవసరంబున.

735

ఆ. వాసవారిఁ జంపి వానిచే పడియున్న, వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి నిదుర మానియున్న నీరజాసనునకు, నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు.

736

తా ॥ ఆ సమయంలో హయగ్రీవుడిని చంపిన శ్రీహరి వాడి దగ్గర ఉన్న వేదరాశిని తెచ్చి మేల్కొని ఉన్న బ్రహ్మదేవునికి కరుణతో ఇచ్చాడు.

క. జలరుహనాభుని కొఱకై, జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా

జలధి బ్రదికి మను వయ్యెను, జలజాక్షునిఁ గొలువ కెందు సంపద గలదే?

737

తా ॥ విష్ణువుకి అర్ఘ్యం ఇచ్చి సత్యవ్రతుడు ఆ జలధి నుండి బయటపడి తదుపరి కల్పానికి 'మనువు' అయ్యాడు. విష్ణువును పూజించే వారికి ఐశ్వర్యానికి ఏమీ లోటు ఉండదు కదా!

అ. జనవిభుండు దపసి సత్యవ్రతుండును, మత్స్యరూపి యైన మాధవుండు సంచరించినట్టి సదమలాఖ్యానంబు, వినినవాఁడు బంధ విరహితుండు.

738

తా ॥ రాజు, తాపసి అయిన సత్యవ్రతుని గురించి, మత్స్యరూపి అయిన విష్ణువును గురించి తెలిపే ఈ కథను విన్నవాడు శుభాన్ని పొందుతాడు.

క. హరిజలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్ నరుఁ డొందు వాని కోర్కులు, ధరణీశ్వర! సిద్ధిబొందుఁ దథ్యము సుమ్మీ!

739

తా ॥ ఈ విష్ణువు యొక్క మత్స్యావతార కథను ప్రతిదినము చదివితే వాడు పరమ పదాన్ని పొందుతాడు. వాని కోరికలు నెరవేరుతాయి. ఓ రాజా! వాడు సిద్ధిని పొందుతాడు. ఇది సత్యం!

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందు వాణీశు మో
ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
దలరన్ బ్రహ్మయు మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్.

740

వ. అని చెప్పి.

741

తా ॥ ప్రళయ సముద్రంలో ఒడలు మరచి నిద్రపోయే బ్రహ్మదేవుని ముఖముల నుండి వచ్చిన వేదములను గైకొన్న దైత్యుని చంపి, సత్యవ్రతుడు సంతోషించేలాగా బ్రహ్మమును గూర్చి తన మాటలలో తెలుపుతూ, సర్వమునకు ఆధారుడై, మీనమై, జలధిలో మునుగుతూ తేలుతూ సంచరించిన శ్రీమహా విష్ణువుకు నమస్కరిస్తున్నాను, అని ఈ విధంగా శుకయోగీంద్రుడు పరీక్షిత్తుతో పలికాడు.

క. రాజేంద్ర! దైత్యదానవ, రాజమహాగహన దహన! రాజస్తుత్యా! రాజవతంస! మానిత, రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవ రామా!

742

తా ॥ ఓ రాజేంద్రా! రాక్షసరాజులనే మహారణ్యాన్ని దగ్ధం చేసినవాడా! రాజుల చేత స్తుతించబడేవాడా! రాజులలో తలమానికమై ఉన్నవాడా! నెలరాజుని ధరించిన శివుని చేత పూజించబడినవాడా! గుణసంపన్నుడా! రఘువంశకుల తిలకా! శ్రీరామా!

మాలిని. దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!, భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!, ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ!

743

తా ॥ రాక్షసులను దునుమాడినవాడా! దేవతలకు ఉపకారమొనర్చిన వాడా! భూభారాన్ని తగ్గించినవాడా! పుణ్యాత్ములను రక్షించువాడా! నిర్మలమై ఉన్న మంగళకర రూపాన్ని కలిగి ఉన్నవాడా! నీ వారనుకున్నవారిని పోషించేవాడా! స్వచ్ఛమైన కీర్తిని కలిగి ఉన్నవాడా! ధర్మమును ఎల్లప్పుడూ అనుసరించేవాడా! ఇవే నమస్కారములు.

గద్యము

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణంబను మహాప్రబంధము నందు స్వాయంభువ స్వారోచిషోత్తమతామస మనువుల చరిత్రంబును, గరిమకరంబుల యుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుష మనువుల వర్తనంబును, సముద్రమథనంబును, గరళ భక్షణంబును, నమృతాది సంభవంబును, దేవాసుర కలహంబును, హరి కపటకామినీ రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయును, రాక్షసవధంబును, హరిహర సల్లాపంబును, హరి కపట కామినీక్రూప విభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణీ మనువుల వృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసుల సుతల గమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమస్కంధము.

744

తా ॥ ఇది పరమశివుని దయవల్ల కలిగిన కవితా సౌందర్యం కలవాడూ, కేసనమంత్రి పుత్రుడూ, సహజపాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణమనే మహాకావ్యంలోని అష్టమస్కంధం. దీనిలో స్వాయంభువుడూ, స్వారోచిషుడూ, ఉత్తముడూ, తామసుడూ అనే మనువుల చరిత్రమూ; ఏనుగుకూ మొసలికీ జరిగిన పోరాటమూ; శ్రీహరి గజేంద్రుణ్ణి కాపాడటమూ; రైవతుడూ చాక్షుషుడూ అనే మనువుల చరిత్రమూ; దేవదానవులు సముద్రాన్ని మథించడమూ, పరమేశ్వరుడు విషాన్ని మ్రింగడమూ, పాలసముద్రంలో అమృతం మొదలైనవి పుట్టడమూ, దేవతలకూ రాక్షసులకూ పోరాటం జరగడమూ, విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మోసగించి దేవతలకు అమృతాన్ని

పోయడమూ, రాక్షస సంహారమూ, శివకేశవుల సరస సంభాషణమూ, విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి భ్రమింప జేయడమూ; వైవస్వతుడూ, సూర్యసావర్ణీ, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణీ, ధర్మసావర్ణీ, భద్రసావర్ణి, దేవసావర్ణీ, ఇంద్రసావర్ణి అనే మనువుల వృత్తాంతమూ, బలిచక్రవర్తి యుద్ధానికి వెళ్ళడమూ, స్వర్గలోక వర్ణనమూ, దేవతల పలాయనమూ, వామనావతారమూ, శుక్ర బలిచక్రవర్తుల సంభాషణమూ, వామనుని త్రివిక్రమస్ఫురణమూ, రాక్షసులు సుతలానికి పోవడమూ, సత్యవ్రతుని వృత్తాంతమూ, మత్స్యావతార చరిత్రమూ అనే కథలున్నాయి.

శ్రీరాజిత! మునిపూజిత!,

వారిధి గర్వాతిరేకవారణబాణా!

సూరిత్రాణ! మహోజ్జ్వల,

సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా!

1

తా ॥ సౌందర్యమూర్తీ! మహర్షుల పూజలనందుకొనే మహనీయా! సాగరాన్ని కట్టడి చేసిన అస్త్రసంపద గల మాననీయా! లోకహితాన్ని కోరే విద్వాంసుల కార్యసాధనకు కంకణం కట్టుకొని, అనంతమూ వైభవోపేతమూ అయిన కీర్తిని మూటగట్టుకున్న మహోన్నతమూర్తీ! శ్రీరామచంద్రప్రభూ! అవధరించు.

## సూర్యవంశారంభము

వ. మహనీయ గుణ గరిష్ఠులగు న మ్ముని శ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

2

తా ॥ సద్గుణ సంపన్నులైన ఆ మునివర్యులతో, సకల పురాణాలు, అందలి రహస్యాలూ సాకల్యంగా తెలిసి, విశదపరచగల వివేకసంపన్నుడు సూతమహర్షి ఇలా అన్నాడు: “మహనీయులారా! అలా నిరాహారియై నిర్యాణం కొరకు వేచివున్న పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూస్తూ ఇలా అన్నాడు:

సీ. మనువుల నడవళ్ళు మర్యాదలును వింటి; మన్వంతరంబున మాధవుండు దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుం డనురాజు ద్రవిళ దేశాధిపుండు పోయిన కల్పాంతమున విష్ణు సేవించి

విజ్ఞానమును బొంది వెలుఁగుజేని కతఁడు వైవస్వతుండై పుట్టి మను వయ్యె; నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ

తే. బదురు గొడుకులు గల రండ్రు పరఁగ వారి, వంశ మేరీతి వర్తించె? వారిలోనఁ జనిన వారిని జనువారిఁ జనెడువారిఁ, జెప్పవే వ్యాసనందన! చిత్తగించి.

3

తా ॥ మహానుభావా! వ్యాసమునీంద్రకుమారా! నీ దయ వలన మనువులూ, వారి చరిత్రలూ, వారి వారి కార్యకలాపాలూ, ఇంతకు ముందే సాకల్యంగా తెలిసికొన్నాను. అలాగే మన్వంతరంలో మాధవుని కార్యకలాపాలను, కనపరచిన లీలలను గురించీ విన్నాను. పోయిన కల్పాంతంలో ద్రవిడ దేశాన్నేలిన సత్యవ్రతుడనే ప్రభువు విష్ణుదేవుని ఆరాధించి, తత్త్వజ్ఞానాన్ని పొంది, పిదప సూర్యదేవునికి వైవస్వతుడనే పేరుతో జన్మించి మనువైన విషయమూ తెలుసు. అతనికి ఇక్ష్వాకుడూ మున్నగు పదిమంది కుమారులు జన్మించారని చెప్పగా విన్నాను.

వారి వంశం ఎలా వర్ధిల్లింది ? వారిలో కాలం చెల్లి వెళ్ళిపోయినవారు, ఇప్పుడున్నవారు, ముందు రాగలవారు ఎవరు? వారి వారి విశేషాలు మనసారా చెప్పవలసిందిగా కోరుతున్నాను.

క. చెవులార నేఁడు వినియెద, రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్ వివరింపు వరుసతోడను, భువిఁ బుణ్యుల కీర్తి వినినఁ బుణ్యము గాదే!

4

తా ॥ అలా మీరు సూర్యవంశపు రాజుల చరిత్రలను వరుసగా వివరిస్తే చెవులారా విందామని వుంది. మరి లోకంలోని పుణ్యశాలురను గూర్చి, వారి కార్యకలాపాలను గూర్చి, ఔన్నత్యాన్ని గూర్చి వినడం కూడా పుణ్యమే గదా!"

వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె.

తా ॥ అని ఆ రాజు అలా అడుగగా శుకమహర్షి ఇలా చెప్పనారంభించాడు:

# వైవస్వత మనువంశ కథనము

ఆ. వినుము, మనువుకులము వేయి నూఱేండ్లును, బరఁగ విస్తరించి పలుకరాదు నాకుఁ
దోఁచినంత నరనాథ! వేగంబ, యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు.

6

తా ॥ "రాజా! అలా అయితే విను. కాని, ఒక మాట! మనువులు, వారి వంశాలను గూర్చి చెప్పడమంటే – వేయినూరేళ్ళయినా చాలదు. అయినా సాధ్యమైనంత త్వరగా చెప్పడానికి ప్రయత్నిస్తాను.

క. ఎక్కువ తక్కువ పొడవుల, కెక్కటి మొదలైన పురుషుఁడింతయుఁ జెడఁ దా
నొక్కఁడుఁ గల్పాంతంబున, నక్కజమై నిల్చె విశ్వ మతఁడై యుంటన్.

7

తా ॥ అన్నింటికీ ఆదిమూలమైనవాడు విశ్వపురుషుడు. ఆయన అవతారాలు ఎన్నో! కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. అంటే ఈ లెక్క, ఆయా అవతారాల్లో ఆ మహాపురుషుడు నిలిచి ఈ లోకంలో మనుగడ సాగించిన కాలమన్నమాట. అలాంటి ఆ మహానుభావుడు కల్పాంతకాలంలో ప్రాకృతప్రళయం సంభవించిన తర్వాత సమస్త భూతసృష్టిని తన బొజ్జలో దాచి, తానొక్కడే నిలిచి ఉన్నాడు. మరి విశ్వమే ఆయన. ఆయనే ఈ నిఖిల బ్రహ్మాండం గదా! అయినప్పుడు అలా నిలిచి ఉన్నాడంటే – మనకు ఆశ్చర్యం కావచ్చు గాని, ఆయన విషయంలో అదేమంత అబ్బురం గనుక!

సీ. భూమీశ! య మ్మహాపురుషుని నాభిమధ్యమున బంగారుఁ గెందమ్మి మొలిచె;
నా తమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుగు మోముల నలువ పుట్టె
నా బ్రహ్మమనమున నట మరీచి జనించె; గశ్యపుం డతనికిఁ గలిగె; నంత

నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై చీఁకటిగొంగ వొడమె;

తే. జలజ బంధుని పెండ్లాము సంజ్ఞయందు, శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁడయ్యె
మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ, బదురు గొడుకులు గలిగిరి భద్రయశులు.

8

తా ॥ ఇక అప్పటి విశేషాలు చెబుతాను, విను! ఆ మహాపురుషుని బొడ్డు నడుమ నుండి ఒక కెంపువన్నె బంగారు పద్మం పుట్టుకొచ్చింది. ఆ పద్మకోశం నుండి తనంత తానుగా, నాలుగు ముఖాలు గల బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ మనస్సులో సంకల్పించగా మరీచి కలిగాడు. ఆయనకు కశ్యప ప్రజాపతి జన్మించాడు. ఆ కశ్యపునికీ, దక్ష ప్రజాపతి కుమార్తె అదితికీ సూర్యుడు కుమారునిగా జన్మించాడు. ఆ సూర్యుని భార్య సంజ్ఞ. ఆ దంపతులిరువురికీ శ్రాద్ధదేవుడనే మనువు పుట్టాడు.

ఆ మనువుకి శ్రద్ధ అనే భార్య వలన, పదిమంది కుమారులు కలిగారు. అందరికి అందరూ గొప్ప కీర్తిమంతులై వెలుగొందారు.

వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండను, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుండును, వృషధ్రుండును, నభగుండును, గలియు నన నెగడి; రటమున్ను మనువు కొడుకులు లేని వాఁడై, మిత్రావరుణుల నుద్దేశించి.

9

తా ॥ వారి పేర్లు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కలి అనేవి. అయితే అంతకుముందు, మనువు కొడుకులు లేకపోవడం చేత మిత్రావరుణులను గూర్చి యజ్ఞం చేశాడు.

మిత్రావరుణులు : మిత్రుడు అంటే సాధారణార్థం స్నేహితుడు, సహచరుడు అని. కాగా

మిత్రుడు కూడా అదితిపుత్రుడే. సాధారణంగా వరుణునితో కలిపి వ్యవహరింపబడతాడు. అయితే ఋగ్వేదంలో మిత్రుడు మాత్రమే ప్రస్తుతింపబడ్డాడు. అక్కడ, అతడు జనులను కార్యోన్ముఖులను గావించేవాని గాను, భూమ్యాకాశాల స్థితికి కారణభూతుని గాను, పిపీలికాది బ్రహ్మపర్యంతం గల సర్వజీవరాశిని సదాకాలం రెప్పవెట్టక జాగరూకతతో కనిపెట్టి చూస్తూ ఉంటాడని చెప్పడం జరిగింది (ఋగ్వేదము 3–59). అనంతరకాలంలో నక్షత్రమండలంలోని అనూరాధ మండల దైవతంగాను, ఉత్సర్గకు తండ్రిగాను (తల్లి రేవతి) చెప్పబడింది.

# సుద్యుమ్నాదుల చరిత్ర

సీ. మనువు బిడ్డలు పుట్ట మఖ మాచరించుచో నతని భార్యయు హోత నాశ్రయించి
కూఁతురు పుట్ట నాకును జేయు మని పల్కి వరభక్తితోఁ బయోవ్రతము సల్పె;
నా పతి సెప్పిన ట్లధ్వర్యుఁడును హోత నగుఁ గాక! వేలువు, మనుచుఁ బలికె;
హవి నందుకొని 'కూఁతు రయ్యెడు' మని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వేల్వ

తే. హోత పెడచేఁత నిల యను నువిద పుట్టె, దానిఁ బొడగని మనువు సంతాప మంది
"కొడుకు మేల్ గాక! యేటికిఁ గూఁతు? రకట!, చెప్పవే" యని పోయె వసిష్ఠుకడకు.

10

తా ॥ అలా మనువు కుమారుల కొరకు యజ్ఞం చేస్తున్న సందర్భంలో, ఆయన భార్య, హోతను తనకు కూతురు కలిగేట్లు చేయమని వేడుకోవడమే గాక, అందుకొరకుగా పాలనే ఆహారంగా స్వీకరిస్తూ పయోవ్రతమనే పేరుగల వ్రతం చేసింది. ఆమె కోరిన విధంగానే అధ్వర్యుడు, హోత ఇరువురూ 'అలాగే అగుగాక' అంటూ, హవిస్సును వేల్చమని చెప్పగా, ఆమె అలా చేసింది. హవిస్సు అందుకొని, 'కూతురు కలుగు గాక!' అంటూ హోత వషట్కారం చేసి, ఎడమచేతిలో హవిస్సును వేల్చిన కారణంగా ఇళ అనే ఆడుబిడ్డ అవతరించింది. దానికి మనువు, కుమారుడు మేలు గాని – కుమార్తె దేనికి? అని చాలా విచారించి, వసిష్ఠుని వద్దకు వెళ్ళాడు.

1. హోత – 2. అధ్వర్యుడు : 200 పద్యం దగ్గర చూడండి.

3. వషట్కారం : అధ్వర్యుడు హవిస్సును యజ్ఞకుండంలో సమర్పించిన తరువాత హోత పరిపూర్తి అయినట్లు చేసే ధ్వని. ఉదా: పూషణే వషట్, సాధారణార్థం – ఆశ్చర్యాన్ని ధ్వనిపూర్వకంగా ప్రకటించటం. వషట్కారాన్ని ఒక దేవతగా పరిగణించడం కూడ ఉంది.

వ. చని యిట్లనియె.

11

తా ॥ అలా వెళ్ళి, ఆయనతో ఇలా అన్నాడు:

క. "అయ్యా! కొడుకుల కొఱకై, యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను?, మీయంతటివారి కొండు మేరయుఁ గలదే!

12

తా ॥ "అయ్యా! మీరు అనుమతించగా, కొడుకుల కొరకు నేను యజ్ఞం చేస్తే, కుమార్తె ఎలా పుట్టింది? తమవంటి పెద్దలు చెప్పిన దానికి భిన్నంగా జరుగుతుందా! మరి ఇదేమిటిలాగ జరిగింది.

వ. అదియునుంగాక, మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరు; పాపంబు లందకుండం జేయించువా; రిదియేమి?" యనవుడు, మా ముత్తాత వసిష్ఠుండు హోతృవ్యభిచారం బెఱింగి, మనువున కిట్టనియె!

13

తా ॥ అది అలా వుండగా మీరు బ్రహ్మవాదులు. మంత్రవాదులు, వేదవాదులు కూడా. ప్రాయశ్చిత్తం చేయవలసిరాకుండా పూర్ణాహుతి చేయించగలవారు గదా! మరి ఎందుకిలా జరిగింది?" అని అనగా, మా తాతగారు వసిష్ఠులవారు, హోత చేసిన దోషాన్ని గమనించి, మనువుతో ఇలా అన్నారు:

బ్రహ్మవాది : వేదాలను వ్యాఖ్యానించగలవాడు. వేదప్రామాణ్యాన్ని అంగీకరించేవాడు. వాటిని సమర్థించేవాడు.

మంత్రవాది: సామవేదాన్ని, తైత్తిరీయ ఆరణ్యకాన్ని గానం చేసేవాడు.

వ్యభిచారి: ఆశించినదానికి, అనుసరణకు భిన్నంగా వర్తించేవాడు.

తే. 'అధిప! సంకల్ప వైషమ్య మగుటఁజేసి, హోత కల్లతనంబున నువిద గలిగె; నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని, నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పుబలిమి'

14

తా ॥ "రాజా! తలచినదానికి భిన్నంగా జరగటం వలన, హోత చేసిన మోసం వలన ఆడుబిడ్డ కలిగింది. అయితేనేమి! నేను నా శక్తిని ఉపయోగించి నీకు కుమారుడు కలిగేట్లు చేస్తానుగా!"

వ. అని పలికి భగవంతుడగు వసిష్ఠుండు గీర్తి తత్పరుండు గావున మనువు కూఁతు మగతనంబు కొఱకు నేక చిత్తంబున నాదిపురుషుండగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుండను కుమారుండయి రాజ్యంబు సేయుచు.

15

తా ॥ అని చెప్పి, సాక్షాత్తూ భగవత్స్వరూపులైన వసిష్ఠులవారు, పేరు పెంపూ కోరుకునే వారు గనుక, మనువుకు కలిగిన కుమార్తెను కుమారునిగా మార్పునొందించడానికి గాను, ఆదిపురుషుడైన హరిని ప్రస్తుతించారు. దానికి ప్రసన్నుడైన శ్రీమహావిష్ణువు, ఆయన కోరిన వరాన్ని దయచేశాడు. ఆ కారణంగా ఇళగా జన్మించిన ఆ కన్య కుమారునిగా మారి, సుద్యుమ్నుడనే పేరుతో రాజ్యం చేస్తూ వచ్చాడు.

ఆదిపురుషుడు : పురుషప్రకృతి, సర్వవ్యాపకుడు, అనాది నిధనుడు, సర్వాంతర్యామి, విష్ణువు, సర్వేశ్వరుడు, పరంధాముడు, విశ్వపురుషుడు. ఇలా ఈ అన్ని పదాలు ఒకే మూర్తిని సంభావిస్తాయి.

సీ. ప్రొద్దు వో కొకనాఁడు వోయి పేరడవుల, వెంట వేఁటాడుచు వేడ్కతోడఁ
గొందఱు మంత్రులు గూడ రా సైంధవం బయిన గుఱ్ఱము నెక్కి యందమైన
బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెను మెకంబుల వెంట బిఱుసుతోడ
నుత్తరదిశను మహోగ్రుఁడై చని చని మేరువు పొంతఁ గుమారవనముఁ

తే. జేరె నందు మహేశుండు శివయు నెపుడు, రతి సలుపుచుందు రందుఁ జొరంగఁ బోవ
నాఁడుదయ్యెను రాజు; రాజానుచరులుఁ, బడఁతులైరి తదశ్వంబు బడబ యయ్యె.

16

తా ॥ అలా అతగాడు రాజ్యం చేస్తూ ఉన్న కాలంలో ఒకనాడు కాలక్షేపం కొరకు వేటాడే నిమిత్తం మహారణ్యాలకు వెళ్ళాడు. వెళ్ళడం ఎలా! వెంట మంత్రులు కొందరు అనుసరించి రాగా, సింధుదేశానికి చెందిన జాతి గుఱ్ఱాన్ని అధిరోహించి, మంచి ధనుస్సు, పదనైన బాణాలతో వెళ్ళి పెద్ద పెద్ద మృగాలను వేటాడుతూ, తనివితీరక, రోషంతో వాటిని తరుముకుంటూ, అవి చిక్కక పోయేసరికి, తీరని కోపంతో వాటి వెంటపడ్డాడు. అలా అతడు ఉత్తరదిశగా సాగి, సాగి, మేరుపర్వత సమీపంలోని కుమారవనమనే వనంలో ప్రవేశించాడు. ఆ వనంలో ఏ ప్రొద్దూ పార్వతీపరమేశ్వరులు రాసక్రీడలో మునిగి తేలుతూవుంటారు. అలా ఆ రాజు, ఆ వనంలో ప్రవేశించాడో లేదో, ఆయనకు స్త్రీరూపు వచ్చింది. అనుచరులూ స్త్రీరూపులైనారు. చివరికి ఆయన ఎక్కి వచ్చిన గుఱ్ఱం కూడా ఆడుదైపోయింది.

వ. ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి మఱుఁగుచుండి; రనిన విని శుకునకు రాజిట్లనియె.

17

తా ॥ అలా పురుషత్వాన్ని పోగొట్టుకొని ఆడువారై ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ దుఃఖపడసాగారు" అని శుక యోగీంద్రుడు చెప్పగా పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు:

ఆ. 'రాజుఁ దోడివారు రమణులై రంటివి, కాంత లగుట యేమికారణమున? నిట్టి దేశ మెఱుఁగ మెన్నఁడు నా కథల్, వేడ్కదీర నాకు విస్తరింపు.

18

తా ॥ "మహానుభావా! యోగీంద్రసత్తమా! ఏమిటేమిటి! రాజు, ఆయన సహచరులు అందరూ స్త్రీలైనారని కదా చెప్పారు! అలా కావడానికి కారణమేమిటంటారు? అదలా ఉండగా, ప్రవేశించటం ఆలస్యంగా మగవారు ఆడువారైపోయే ప్రాంతం ఒకటి ఉన్నదంటూ ఇంతకుముందెప్పుడూ విన్నది కాదే. ఆ వైనమెలాంటిదో విశదంగా చెప్పగోరుతున్నాను."

వ. అదియునుం గాక.

19

ఆ. మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ, గాక పేరుఁ బెంపు గాసి గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె, మానవంతుఁడైన మానవునకు?

20

తా ॥ అని అడిగి, మరో మాటంటూ, "స్త్రీ పురుషుడు గావచ్చు. అంటే, అలా కావాలని కోరుకోవచ్చు. కోరి దానికి ప్రయత్నించనూ వచ్చు. దానికేం గాని, పరువు మర్యాదగల మగవాడు, తన మగతనాన్ని వదులుకొని స్త్రీగా మారవచ్చునా? ఆత్మాభిమానంగల వానికి అది అవమానం కాదా?" అని అడిగాడు.

వ. అని యడిగిన నర్జున పౌత్త్రునకు వ్యాసపుత్త్రుం డిట్లనియె.

21

తా ॥ అలా అడిగిన అర్జునుని మనుమడైన పరీక్షిత్తుతో వ్యాస కుమారుడైన శుకమహర్షి ఇలా చెప్పాడు:

సీ. 'పురవైరి కొకనాఁడు పొడసూపు వేడుకఁ దద్దయు దిక్కుల తమము లెల్ల
దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ గొందఱు మౌనులు గోరి రాఁగఁ
బ్రాణేశు తొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘ లీల

తే. నొంటి దమలోనఁ గ్రీడించుచున్న వారు, మనకు సమయంబు గా దని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు, మెలఁగు చోటికి నడచిరి మేదినీశ!

22

తా ॥ "ఒకనాడు, మునులు పరమేశ్వరుని దర్శిద్దామనే కోరికతో బయలుదేరి వచ్చారు. అలా వారు వస్తుంటే వారి తేజస్సుకు చీకటి, దిక్కుల సందుగొందుల్లోకి నక్కిపోయింది. అంతటా వెలుగు నిండింది. వారు చేరుకున్న సమయానికి, పార్వతీదేవి, తన ప్రాణవల్లభుడైన పరమేశ్వరుని తొడలపై ఒంటిపై నూలుపోగు అనేది లేని స్థితిలో వుంది. మునులను గమనించిన పార్వతి అప్పటి తన స్థితికి సిగ్గుపడి త్వరత్వరగా చీరను ధరించింది. అయ్యో! పార్వతీపరమేశ్వరులు ఏకాంతంగా రహస్యక్రీడలో ఉండగా వచ్చామే! ఇది మనం దర్శింప దగ్గ సమయం కాదని విచారించి మునులు వెనుదిరిగి నరనారాయణులున్న చోటికి వెళ్ళిపోయారు."

వ. అది కారణంగా, భగవంతుం డగు శివుండు తన ప్రియురాలి వేడుకల కొఱకు నిట్లని వక్కాణించె.

23

తా ॥ ఆ కారణంగా, రాజా! శివుడు తన దేవి వేడుకకు మరెన్నడూ అలాంటి అంతరాయం కలుగనీయరాదని ఇలా అనడం జరిగింది:

క. ఈ నెల వెవ్వఁడు సొచ్చిన, మానిని యగు ననిన తొంటి మాటకతమునన్ మానవుఁడు
మగువ పోఁడిమి, మానక పేరడవులందు మఱియుం దిరిగెన్.

24

తా ॥ "అదేమిటంటే – ఈ ప్రాంతంలోనికి వచ్చిన పురుషుడు వెంటనే స్త్రీ యగుగాక అని. ఆయన ఆ మాట ప్రకారం ఇప్పుడు ఈ రాజు స్త్రీత్వాన్ని పొంది అడవుల్లో సంచరిస్తూ ఉండటం జరిగింది.

వ. ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నా రాచపూఁబోఁడి చూపుల నాఁడు పోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును, భగవంతుండును నగు బుధుని యాశ్రమంబు సేరి మెలఁగుచున్న యెడ.

25

తా ॥ అలా, ఆయనా, ఆయన అనుచరులు స్త్రీరూపు పొందిన కారణంగా, అతడు రాకుమార్తె కాగా, వారు చెలికత్తెలై తనను అనుసరింపగా, స్త్రీసహజమైన వాలుచూపులు ప్రసరింపజేస్తూ అడవిలో సంచరిస్తూ, అదృష్టవశాత్తూ చంద్రుని కుమారుడూ, భగవత్స్వరూపుడూ అయిన బుధుని ఆశ్రమానికి చేరి, అక్కడ తిరుగాడుతూ వున్నారు.

ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి దొంగ కాముఁ డంత దొందడిఁ జిగురాకు, వాలు వెఱికి యుఱికి వారి మొత్తె.

26

తా ॥ బుధుడు ఆ పద్మనయనను, ఆ పద్మముఖీ ఆయనను పరస్పరం చూసుకోవడం జరిగింది. వయసులో ఉన్న వారిని చూస్తే, మన్మథుడు ఊరకుంటాడా! తన చిగురాకు ఖడ్గాస్త్రాన్ని వారిపై సంధించి బాధించాడు.

వ. ఇట్లలరువిల్తుని నెఱబిరుదు చిగురు టడిదంబు మొనకు నోహటించి వార లిరువురుం బై పడి వేదుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం దను కుమారుండు పుట్టె. ని వ్విధంబున.

27

తా ॥ అలా వారు మన్మథుని అస్త్రాల బారిన పడి పరస్పరము ప్రేమావేశపూరితులై మన్మథక్రీడలో మునిగి తేలారు. ఫలితంగా వారికి పురూరవుడనే కుమారుడు జన్మించాడు. ఈ విధంగా,

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలి తనమున, గొడుకుఁ గాంచి విసివి కుంది కుంది చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె, నతని తలఁపుతోన నతఁడు వచ్చె.

28

తా ॥ మనువు కుమారుడైన ఆ రాచబిడ్డ ఆడుతనాన్ని పొంది బుధునికి భార్యయై వర్తించి, కొడుకును పొంది, తన స్థితికి చాలా విచారించి, దుఃఖించి, గురువైన వసిష్ఠ మహర్షిని మనస్సులో తలచుకోగా, తక్షణం ఆయన ఎట్టఎదుట ప్రత్యక్షమైనాడు.

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాడగు కొఱకు న మ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె.

29

తా ॥ అలా వచ్చి, స్త్రీరూపంలోనున్న సుద్యుమ్నునికి తిరిగి పురుషరూపాన్ని సంతరించే నిమిత్తం ఆయన శంకరుని ఆరాధించాడు. వసిష్ఠుని ఆరాధనకు, పూనికకు సంతసించిన పరమేశ్వరుడు ప్రసన్నుడై ఇలా అన్నాడు:

మ. 'తన మున్నాడిన మాటయున్ నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా
మనుజుండున్ నెల వో నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా
మినియై యీ గతి వీడుపాటమర భూమిం దాన రక్షించుఁ బొ
మ్మనినన్ మెచ్చ వసిష్ఠుఁ; డా మనుసుతుం డా రీతి రాజ్యస్థుఁడై.

తా ॥ "తాను ముందు అన్న మాట పొల్లుపోకుండా ఉండే విధంగాను, వసిష్ఠునికి సంతోషం కలిగించే విధంగాను, 'మనువు కుమారుడైన ఈ సుద్యుమ్నుడు ఒక నెల పురుషుడుగాను, మరో నెల స్త్రీగాను ఉంటూ, రాజ్యాన్ని పాలిస్తాడు గాక!' అని వసిష్ఠునికి చెప్పాడు. అలా అతడు రాజ్యం చేస్తూ వచ్చాడు.

ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును, భూతధాత్రి యంత నాతఁ డేలెఁ బ్రజలు సంతసింప బాహాబలముతోడ, గురుని కరుణఁ జేసి కువలయేశ!

31

తా ॥ రాజా! అలా గురువు దయవలన, స్త్రీగా, మరల పురుషుడుగా ఉంటూ, ఆ సుద్యుమ్నుడు తన బాహుబలపరాక్రమంతో రాజ్యపాలన చేస్తూవచ్చాడు.

వ. అతనికి నుత్కలుండును, గయుండును, విమలుండును నను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజు లయిరి! సుద్యుమ్నుండు ముదుసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుం జనియె. న వ్విధంబున.

32

తా ॥ అతనికి ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే మువ్వురు కొడుకులు జన్మించారు. ముగ్గురికి ముగ్గురూ ధర్మపరులు. వారు ఉత్తర భారతదేశానికి ప్రభువులైనారు. కాలం మీదట సుద్యుమ్నుడు వృద్ధుడై, రాజధాని ప్రతిష్ఠానపురాన్ని వదలి, రాజ్యాన్ని బుధుని వలన కలిగిన పురూరవునికి ఇచ్చి, తాను అడవులకు వెళ్ళిపోయాడు.

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ వందుచు మనువు వైవస్వతుండు

దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన;
హరియంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు పుత్త్రుల నిచ్చెను బొసఁగ; వారి
యందుఁ బృషధ్రాఖ్యుఁ డనువాడు గురునాజ్ఞ విమల ధర్మంబులు వెలయఁబూని

తే. పసుల కదుపులఁ గాచుచు బలు మొగిళ్లు, వచ్చి నడురేయి జోరున వాన గురియ మంద
విడియించి చుట్టు నేమఱకయుండె, నడవి మెకములు సొరకుండ నరసికొనుచు.

33

తా ॥ అలా, కొడుకు సుద్యుమ్నుడు కారడవులకు వెళ్ళిపోవడంతో, వైవస్వత మనువు (శ్రాద్ధదేవుడు) చాలా దిగులుపడ్డాడు. బిడ్డలు కలగాలని కోరి, యమునలో హరిని గూర్చి నూరు సంవత్సరాలు తపస్సు చేశాడు. హరి ప్రసన్నుడైనాడు. ఇక్ష్వాకుడు మున్నగు పదిమంది కుమారులు కలిగే విధంగా అనుగ్రహించాడు. ఆ పదిమందిలో పృషధ్రుడనే వాడు ఒకడు. అతడు ధర్మమూర్తి. ధర్మాచరణంలో ఆసక్తి గలవాడు. గురువు ఆజ్ఞ చొప్పున పశువులను కాస్తూ ఉండేవాడు. ఒకనాడు అర్ధరాత్రి బాగా మబ్బులు కమ్ముకొని జోరున వర్షం కురవసాగింది. అప్పుడు మంద వేసిన పశువులకు క్రూరమృగాల నుండి హాని కలగకుండా, ఎంతో జాగరూకతతో ఏమాత్రం ఏమరుపాటు లేక కాపలా కాస్తూ ఉన్నాడు.

వ. అంత.

34

తా ॥ అంతలో—

క. ప్రబ్బికొనిన పెంజీఁకటి, నిబ్బరముగ నడిఁకి నింగికి వడితో
గొబ్బున నెగసి తటాలున, బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుఱి యఱవన్.

35

తా ॥ కన్ను పొడుచుకున్నా కానని ఆ చీకటిలో పెద్దపులి ఒకటి ఉవ్వెత్తున ఎగసి మందలోనికి దూకి ఒక ఆవును పట్టుకుంది. అది భయంతో ఒక్కపెట్టున అంబారావం చేసింది.

క. ఉల్లముల గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును లేచి విచ్చల విడితోఁ జెల్లాచెదరై పాఱెను, బెల్లుగ నంబే యటంచు బెబ్బులి గాలిన్.

36

తా ॥ ఆ అరుపుకు మందలోని ఆవులన్నీ భయపడిపోయి, పులిని చూసి బెదరి పెద్దపెట్టున అంబారావాలు చేస్తూ గుంపులు గుంపులుగా చెల్లాచెదురుగా పారిపోయాయి.

వ. అ య్యవసరంబున

37

తా ॥ అంతట,

శా. ఆ పెంజీఁకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం
చా పుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం, బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబుచేఁ
బై పై గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్.

38

తా ॥ ఆ చిమ్మచీకటిలో, అతడు కత్తి చేతబట్టి, పులి అని భ్రమించి ఆవు తలను తెగ నరికాడు. పులి చావలేదని గ్రహించి, దాని తలను తెగనరికి చంపాడు. వెనుదిరిగి రక్తసిక్తమైన ఖడ్గాన్ని నేలనంటించి గీరుకుంటూ రాగా, అక్కడ – తల తెగిన ధేనువును చూశాడు.

వ. చూచి దుఃఖితుఁడై యున్న పృషధ్రునింగని, కులగురుండగు వసిష్ఠుండు కోపించి 'నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరాధంబున శూద్రుండవు గ' మ్మని శపియించె;

నతండును గృతాంజలియై తన కులాచార్యుని వలన మరలం గైకోలు వడసి యతని యనుమతంబున.

39

తా ॥ చూసి, ఆవు మరణించినందుకు దుఃఖీస్తున్నాడు. ఆ స్థితిలో కులగురువైన వసిష్ఠుల వారు వచ్చి, అతనిపై కోపించి, నీవు చేసిన ఈ అపరాధం వలన రాజత్వానికి తగవు. శూద్రుడవవుతావు అని శపించాడు. అంతట ఆ రాజకుమారుడు గురువు గారికి చేతులు మోడ్చి నమస్కరించాడు. ఆయన ప్రసన్నుడైనాడు. అలా గురువు గారి అంగీకారాన్ని పొంది ఆయన అనుమతించగా –

సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
యూర్ధ్వరేతస్కుఁ డై యున్న ప్రాణులకెల్ల నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి
సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండునై కోరక యుండి తనకు
వచ్చిన యదియ జీవనము గావించుచుఁ దనుఁదాన నిలుపుచు ధన్యబుద్ధి

తే. జడుని తెఱఁగున నంధుని చందమునను, జెవిటి భంగిని మహినెల్లఁ జెల్లఁ దిరిగి యడవులకు నేఁగి కార్చిచ్చు నందుఁ జొచ్చి, చిక్కి నియతుడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు.

40

తా ॥ అతడు పరమాత్మ స్వరూపుడు, పరాత్పరుడు అయిన హరియందు నిండు భక్తిగలవాడై, ఊర్ధ్వరేతస్కుడై సర్వజీవకోటికి ఆప్తుడై, సర్వేంద్రియాలను అదుపులో ఉంచుకొని, ఎవరితోనూ కూడక, పరమశాంతుడై, ఎవరి నుండీ ఏమీ కోరక, పుచ్చుకోక, తనంత తానుగా లభ్యపడింది మాత్రమే గ్రహించి జీవిస్తూ, సంతుష్టమనస్కుడై, నిరాసక్తుడై, గ్రుడ్డివాని వలె, చెవిటివాని వలె, దారితెన్నూ అంటూ లేకుండా భూములు పట్టి తిరుగుతూ, అడవిలోనికి వెళ్ళి, కార్చిచ్చుకు ఆహుతైపోయి, బ్రహ్మత్వాన్ని పొందాడు.

క. కవి యను కడపటి కొమరుఁడు, భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ, బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి వరముం బొందెన్.

41

తా ॥ ఇక ఆ మనువు కడగొట్టు కుమారుడు కవి. అతడు రాజభవనాన్ని, రాజ్యాన్ని విడిచి, బంధువులతో అడవికి వెళ్ళి, పరమపురుషుడైన పరాత్పరుని ధ్యానంలో మునిగి, మోక్షసిద్ధిని పొందాడు.

వ. మఱియుఁ గరూశుం డను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్రియులు గలిగి, ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి; ధృష్టుని వలన ధార్ష్టం బను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె; నృగుని వంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె; నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీతుండు గలిగెఁ; బ్రతీతునికి నోఘవంతుఁడు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె; నరిష్యంతుండును మనుపుత్త్రునికి జిత్రసేనుం, డా విభునకు దక్షుం, డా పుణ్యునకు మీఢ్వాంసుం, డా సుజనునికి శర్వుం, డమ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డా సుమతికి సత్యశ్రవుం, డాఘనునికి నురుశ్రవుం, డా వీరునకు దేవదత్తుం, డా పండితునకు నగ్ని వేశుండు సుతులయి జనియించి; రయ్యగ్నివేశుండు కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె; నతని వలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె; నవ్విధంబున.

42

తా ॥ మనువు మరో కుమారుడు కరూశుడు. అతని సంతతి కారూశులనే క్షత్రియులు. వారు ధర్మపరులై బ్రాహ్మణానువర్తనులై ఉత్తరాపథానికి ప్రభువులై వర్తించారు. ధృష్టుడనే కుమారుని వలన ధార్ష్ట అనే వంశం ఏర్పడింది. వారి వలన భూమిపై బ్రాహ్మణత్వం నెలకొన్నది.

ఇక నృగుడు అనే వాని వంశంలో సుమతి జన్మించాడు. అతనికి భూతజ్యోతి జన్మించాడు. అతనికి వసువు, వసువుకు ప్రతీతుడు జన్మించారు. ఈయనకు ఓఘవంతుడు పుట్టాడు. ఓఘవంతుని కుమార్తె ఓఘవతి. ఈమెను సుదర్శనుడు వివాహం చేసుకున్నాడు.

కాగా మనువు మరో కుమారుడు నరిష్యంతుడు. అతనికి చిత్రసేనుడు జన్మించాడు. అతనికి దక్షుడు జన్మించగా, ఆ పుణ్యాత్మునికి మీఢ్వాంసుడు, అతనికి శర్వుడు జన్మించారు. ఆ మహాత్మునికి ఇంద్రసేనుడు, ఇంద్రసేనునికి వీతిహోత్రుడు జన్మించారు. ఇతనికి సత్యశ్రవుడు, సత్యశ్రవునికి ఉరుశ్రవుడు, ఉరుశ్రవునికి దేవదత్తుడు జన్మించారు. ఆయనకు అగ్నివేశ్యుడు జన్మించాడు. ఈ అగ్నివేశ్యుడు కానీనునిగా సంభావింపబడి, జాతకర్ణుడనే పేరుతో మునియైనాడు. అతని వలన ఆగ్నివేశ్యాయనమనే బ్రాహ్మణ గోత్రం ఏర్పడింది.

కానీనుడు: కన్యకు జన్మించిన వాడు. ఇక్కడ అగ్నివేశ్యుడు కానీనునిగా చెప్పబడ్డాడు. అంటే, అతనికి జన్మనిచ్చిన తల్లి, కన్యగా వున్న సందర్భంలో దేవదత్తుని వలన అగ్నివేశ్యునికి జన్మనిచ్చింది. తరువాత ఆమె మరొకరిని వివాహమాడి ఉండవచ్చు. వ్యాసమహర్షి, కర్ణుడు కూడా కానీనులే.

క. తెలుపఁబడె నరిష్యంతుని, కుల మెల్లను నీకు దిష్టకులమున్ దెలియం దెలిపెద రాజేంద్రోత్తమ!, తెలియును సర్వంబు నీకుఁ దేటపడంగన్.

43

తా ॥ ఇప్పుడు నీకు నరిష్యంతుని వంశాన్ని గూర్చి తెలియజెప్పాను కదా! రాజా! ఇక ఇప్పుడు, మనువు మరో కుమారుడు దిష్టుని వంశక్రమ విశేషాలను వివరిస్తాను గాక!

# మరుత్తుని చరిత్ర

వ. దిష్టుని కొడుకు నాభాగుం డను వాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె; నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమతియుఁ, బ్రమతికి ఖమిత్రుండును, ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుండైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండు, గరంధనున కవిక్షిత్తు, నా యవిక్షిత్తునకు మరుత్తుండు జనియించి; మరుత్తుండు చక్రవర్తి యయ్యె; నతని చరిత్రంబు వినుము.

44

తా ॥ దిష్టుని కుమారుడు నాభాగుడు. అతనికి కర్మవశాన వైశ్యత్వం సంప్రాప్తించింది. అతనికి హలంధనుడనేవాడు జన్మించాడు. అతనికి వత్సప్రీతి, అతనికి ప్రాంశువు, ప్రాంశువుకు ప్రమతి, అతనికి ఖమిత్రుడు, ఖమిత్రునికి చాక్షుషుడు, అతనికి వివింశతి, వివింశతికి రంభుడు, రంభునికి ధార్మికుడైన ఖనినేత్రుడు, అతనికి కరంధనుడు, కరంధనునికి అవీక్షిత్తు, అతనికి మరుత్తుడు జన్మించారు. ఆ మరుత్తుడు చక్రవర్తి అయ్యాడు. అతని చరిత్రను చెపుతాను వినవలసింది.

చక్రవర్తి : ఎవరి రథచక్రాలు ఏ అడ్డంకీ లేకుండా భూమి అంతటా తిరుగుతాయో, అలాంటి ప్రభువు చక్రవర్తి. సర్వంసహాధిపత్యం గలవాడు. సముద్రం నుండి సముద్రం వరకు గల భూమి చక్రం. ఆ అంత భూమిపై ఆధిపత్యం కలవాడు.

సీ. అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతని యాగమునకు యాజకుండు,
దిరిగి యుండెడివారు మరుదాఖ్యగణము లొ ప్పారు విశ్వేదేవు లచటి సభ్యు
లధిక దక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను; సోమపానంబున సురవరుండు
మది నుబ్బి బంగారు మయము గావించెను యాగవస్తువు లెల్ల; నధిక నియతి

తే. నా మరుత్తుఁడు సేసిన యట్టిభంగి, ధీరభావంబుఁ జాగంబుఁ దెంపుఁ గలిగి మఖము సేసిన వారిని మఱియు నెఱుఁగ, మెల్ల లోకములందు నరేంద్రముఖ్య!

45

తా ॥ మరుత్తుడు ఒకప్పుడు ఒక యాగం చేశాడు. అలాంటి యాగం, మరొకరు ఎన్నడూ ఈ భూమిపై చేసింది లేదు. సాక్షాత్తూ అంగిరసుని కుమారుడూ మహాయోగీ అయిన సంవర్తుడు అతని యాగానికి యాజకత్వం వహించాడు. విశ్వేదేవులు సభ్యులుగా వచ్చారు. అంతులేని దక్షిణలనిచ్చి బ్రాహ్మణులను సంతృప్తి పరచాడు. ఇన్నెందుకు! సాక్షాత్తూ ఇంద్రుడు సోమపానం గావించి పరితృప్తుడై యాగవస్తువులన్నింటిని బంగారుమయం చేశాడంటే – ఆ యాగాన్ని గూర్చి ఇక వేరుగా చెప్పవలసిందేముంటుంది.

వ. ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, కేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించి; రంత.

46

తా ॥ అదిగో ఆ మరుత్తునకు దముడు, దమునికి రాజవర్ధనుడు, రాజవర్ధనునికి సుధృతి జన్మించారు. సుధృతి కుమారుడు సౌధృతేయుడు. అతనికి కేవలుడు జన్మించాడు. కేవలుని కుమారుడు బంధుమంతుడు. బంధుమంతుని కుమారుడు వేగవంతుడు. అతని కుమారుడు బంధుడు. బంధునికి తృణబిందుడు జన్మించాడు.

క. అచ్చరకన్య యలంబుస, గ్రచ్చఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం బచ్చవిలుకాని యమ్ముల, ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతురయై.

47

తా ॥ ఆ తృణబిందుని చూచిన అలంబుస అనే అప్సరస, మన్మథుని పదనైన బాణాల ప్రభావం చేత అతనిపట్ల ఆకర్షితురాలైంది. కామాతుర అయింది. మన్మథతాపం వల్ల మోహావేశపూరితురాలై అతనిని కూడింది.

# తృణబిందు వంశము

వ. ఆ దంపతులకు నిలబిల యను కూఁతురు జన్మించె; నా కొమ్మను విశ్రవసుండు వొందిన నైల బిలుండనం గుబేరుండు పుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్య బంధుండును, ధూమ్రకేతుండునుననువారు ముగ్వురు గొడుకులు గలిగి, రందు విశాలుండును వంశవర్ధనుండై వైశాలియను నగరంబు నిర్మించె; నా రాజునకు హేమచంద్రుం, డా నరేంద్రునకు ధూమ్రాక్షుం, డా పుడమిఱేనికి సహదేవుం, డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం డాతనికి సోమదత్తుండు జన్మించె; నతండు.

48

తా ॥ ఆ దంపతులకు ఇలబిల అనే కుమార్తె జన్మించింది. ఆమెను విశ్రవసుడు చేపట్టాడు. వారికి ఐలబిలుడనే పేరుగల కుబేరుడు జన్మించాడు. ఇది ఇలా ఉండగా తృణబిందునకు విశాలుడు, శూన్యబంధుడు, ధూమ్రకేతుడు అనే ముగ్వురు కుమారులు జన్మించారు. ఈ ముగ్వురిలో విశాలుడనేవాడు వంశకర్తయై వైశాలి అనే నగరాన్ని నిర్మించాడు. అతనికి హేమచంద్రుడు జన్మించగా, అతనికి ధూమ్రాక్షుడనే వాడు పుట్టాడు. ఆ రాజుకు సహదేవుడు జన్మించాడు. అతడు గొప్ప బలశాలి. ఆయనకు కృశాశ్వుడు జన్మించగా, ఆ కృశాశ్వునికి సోమదత్తుడు జన్మించాడు.

ఆ. అమర విభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి, భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి; సోమదత్తుకొడుకుఁ సుమతికి జనమేజ, యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె.

49

తా ॥ రాజా! ఆ సోమదత్తుడు ఇంద్రుడు మెచ్చే విధంగా అశ్వమేధయాగం చేశాడు. స్వర్గానికి వెళ్ళాడు. సోమదత్తునికి సుమతి, సుమతికి జనమేజయుడు జన్మించారు.

వ. వీరలు వైశాలు రనం బరఁగి తృణబిందుని కీర్తి వహించి, రాజ్యంబు సేసిరి. మఱియును.
50

తా ॥ వీరందరూ వైశాలురు అని పిలువబడి, తృణబిందునితో సాటి అయిన కీర్తిని పొంది రాజ్యాన్ని పాలించారు.

# శర్యాతి చరిత్ర

సీ. శర్యాతియను రాజు జనియించె బ్రహ్మవరుండైన మనువుకు రూఢితోడ;

నతఁ డంగిరుని సత్త్రమందు రెండవనాఁటి విహితకర్మము నెల్ల వెలయఁ జెప్పె;

నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి దన తండ్రితోఁ దపోవనికి నరిగి

చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱ తిరిగి

ఆ. యొక్కపుట్టలోన నొప్పారు జ్యోతుల, రెంటిఁగాంచి వాఁడి ముంటఁ బొడిచెఁ; గన్య ముగుద మఱచి ఖద్యోతయుగ మంచు, దైవ వశముకతనఁ దమకి యగుచు.



తా ॥ మనువు మరో పుత్రుడు శర్యాతి. అతడు అంగిరసులనే ఋషులు కావించిన సత్త్రయాగంలో రెండవనాడు గావించవలసిన కార్యాలను విశదం చేసిన ఘనుడు. ఆయన కుమార్తె సుకన్యక. ఆమె తండ్రితోపాటు ఒకనాడు తపోవనానికి వెళ్ళింది. అక్కడ ఆమె చ్యవన మహర్షి ఆశ్రమంలో చెలికత్తెలతో కూడా పూలూ పండ్లూ కోస్తూ, దైవవశాత్తు అక్కడ ఒక పుట్టలో నుండి ప్రకాశిస్తున్న రెండు జ్యోతులను మిణుగురు పురుగులని భావించి, ఆకతాయితనంతో ఒక వాడి ముల్లుతో వాటిని పొడిచింది.

అంగిరుడు : అథర్వణుని నుండి బ్రహ్మవిద్యను గ్రహించిన మహర్షి. ఆయన దానిని అంగిరసుని గురువైన సత్యవాహునికి అందించాడు.

సత్త్రయాగము : 13 రోజుల నుండి 100 రోజుల వరకూ చేసే యాగం. దీనిని పలువురు బ్రాహ్మణులు కలిసి నిర్వహిస్తారు. శ్రీ మహాభారతంలో శౌనకాదిమునులు 12 ఏళ్ళపాటు దీర్ఘసత్త్రయాగం చేసినట్లు చెప్పబడింది.

క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతల నెత్తురుల గురిసె వసుధేశభట వ్రాతముల కెల్ల

నచ్చుట, నా తఱి మలమూత్ర బంధమయ్యె నరేంద్రా!

52

తా ॥ అలా పొడిచేటప్పటికి, ఆ పుట్ట కళ్ళ నుండి రక్తం ప్రవహించింది. అదే క్షణంలో శర్యాతి వెంట వచ్చిన అనుచరగణానికి మలమూత్రాలు స్తంభించిపోయాయి.

వ. వారలంజూచి రాజర్షియగు శర్యాతి విస్మితుండై 'మీరలియ్యాశ్రమ దూషణంబు సేయ నోపుదురది కారణంబుగా మీకీ నిరోధంబు సిద్ధించె. నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె.

53

తా ॥ వారి అవస్థను చూచిన రాజర్షి శర్యాతి చాలా ఆశ్చర్యానికి లోనై, 'వారితో మీరు ఈ ఆశ్రమాన్ని గూర్చి వక్రంగా మాట్లాడి ఉంటారు. అందువల్లనే మీకు ఈ దురవస్థ కలిగి ఉంటుంది' అని అంటున్నంతలో, కుమార్తె సుకన్యక తండ్రితో ఇలా అంది:

తే. అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి, యిందులో రెండుజ్యోతుల నేనుఁ గాంచి కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె, నే విధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు.

54

తా ॥ "తండ్రీ! ఇదిగో ఈ పుట్ట సమీపంలో మేము చాలా సేపు ఆడుకొని, అందులో రెండు జ్యోతులు కనుపించగా వాటిని చాపల్యం కొద్దీ ముల్లుతో పొడిచాను. అంతట వాటినుండి రక్తం స్రవించసాగింది. అలా ఎందుకు జరిగిందో తెలుసుకోండి"

వ. అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడకుం జని యందుఁ దపంబు సేయుచున్న చ్యవనుని గని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసి చిత్తంబు నెఱింగి తన పుత్రిక నిచ్చి యెట్ట కేలకుం బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం

జనియె; నంత.

55

తా ॥ ఆ మాట వినడంతో ఆయన చాలా భయపడి, పుట్ట సమీపానికి వెళ్ళి, అందులో తపస్సు చేసుకుంటున్న చ్యవన మహర్షిని చూసి, ఎలాగో ఆయనను ప్రసన్నుణ్ణి గావించుకొని, మహర్షి మనస్సును ఎరిగినవాడై ఆయనకు తన కుమార్తె సుకన్యకను సమర్పించి, బ్రతుకుజీవుడా అనుకుంటూ మునీశ్వరుని వద్ద శెలవు తీసుకొని రాజధానికి వెళ్ళిపోయాడు.

ఆ. పరమకోపుఁ డయిన భార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనుల యెడల మెచ్చఁ దిరిగి యతని పర్ణశాల నా సుకన్యక యను, మగువ గొన్ని యేండ్లు మనువు మనియె.

56

తా ॥ అంతట సుకన్యక, భార్గవ వంశస్థుడూ, పరమ కోపిష్ఠీ అయిన చ్యవన మహర్షి ఆశ్రమంలోని పనులన్నీ మెలకువతో చక్కబెడుతూ భర్త మెప్పును పొంది పెక్కేండ్లు కాపురం చేసింది.

వ. అంత నొక్కనాఁ డ య్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైన యాశ్వినులిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుం డిట్లనియె, 'మీకు మున్న యాగభాగంబుల లేని సోమపానంబు నేడు గల్పించి యిచ్చెద, సోమపాన సమయంబునఁ బాన పాత్రంబు మీకు నందిచ్చెద; నా ముదిమి మానుపుం' దని యిట్లనియె.

57

తా ॥ అలా జరుగుతూ ఉన్న కాలంలో, ఒకనాడు దేవవైద్యులైన ఆశ్వినులిద్దరు చ్యవనుని ఆశ్రమానికి వచ్చారు. వారికి తగు సపర్యలు గావించి, మహర్షి వారి వద్ద చేరి, తన వార్ధక్యాన్ని చూపి, 'మీకు యజ్ఞయాగాదికాల్లో లేని సోమపానార్హతను నేను కల్పిస్తాను. సోమపాన సమయంలో, పానపాత్రను నేనే మీకు అందిస్తాను. దానికి ప్రతిగా, మీరు నా వార్ధక్యాన్ని

పోగొట్టవలసింద' ని కోరి, ఇలా అన్నాడు:

క. నవకంబగు ప్రాయంబున, జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్ శివతరముగఁ గృప సేయుఁడు, దివిజాధిప వైద్యులార! దీవింతు మిమున్.

58

తా ॥ "కోడె వయసుతో, యువతులను సంతోషింపచేయగల అందంతో, శోభస్కరంగా ఉండేట్లు నన్ను కనికరించండి. మిమ్మల్ని ఆశీర్వదిస్తాను."

వ. అనిన నశ్వినీదేవతలు సంతోషించి సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున మునుఁగు మని పలికి.

59

తా ॥ అని మహర్షి కోరగా, అశ్వినీ దేవతలు చాలా సంతోషించి, 'అలాగైతే సిద్ధులచే కల్పింపబడిన ఈ మడుగులో స్నానమాచరింపవలసింది!' అని చెప్పారు.

సీ. ముసలితాపసుఁబట్టి మొగి నెత్తుకొనిపోయి ముగురు నా మడుఁగున మునిఁగి లేచి
వనితాజనము నెల్ల వలపించువారలై సుందర మూర్తులై సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ గనకకుండలములతో మంచి చీరలతోడఁ దుల్యు
లై సూర్యతేజస్కులై యున్న వారల మువ్వురఁ బొడఁగాంచి ముగుద బాల

తే. యిందు బెనిమిటి వీఁ డని యెఱుఁగ లేక, గరిత గావున నిజనాథుఁ గానఁ గోరి సుభగమతులార! నా నాథుఁ గానఁ జూపుఁ డనుచు, నశ్వినీదేవతలకు నయ్యబల మ్రొక్కె.

60

తా ॥ అలా చెప్పి వారు ఆయన్ని ఎత్తుకొని వెళ్ళి, ముగ్గురూ మడుగులో మునిగి లేచారు. అలా లేచేటప్పటికి, వారు ముగ్గురూ, స్త్రీలను మోహింపచేయగల సుందరమూర్తులుగా మారారు.

పద్మాల మాలలతో, బంగారు కుండలాలతో, మంచి విలువైన వస్త్రాలతో, సూర్యసమాన తేజస్వులై ప్రకాశిస్తున్న వారిని చూసి, ముగ్ధ అయిన సుకన్యక, వారిలో తన భర్త ఎవరో తెలియనేరక, ఆమె పతివ్రత గనుక తన భర్తను తెలుసుకోగోరి, 'మహానుభావులారా! మీలో నా పతి ఎవ్వరో తెలుపవలసింద' ని అశ్వినీదేవతలను ప్రార్థించింది.

వ. వార లా పతివ్రత నిజమరితనంబునకు మెచ్చి వయోరూప సంపన్నుం డయిన చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపుల ప్రోలికిం జని, రంత.

61

తా ॥ అంతట వారు ఆమె పాతివ్రత్యానికి, సత్యశీలతకు మెచ్చి, ప్రాయంలోనూ, రూపంలోనూ సంపన్నుడైన చ్యవనుణ్ణి చూపి, ఆ దంపతుల వద్ద వీడ్కోలు పొంది, వారు విమానాన్ని ఎక్కి దేవనగరం అమరావతికి వెళ్ళిపోయారు.

సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి, చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ
గూఁతు నల్లునిఁ దోడుకొని పోవు వేడుక వచ్చి పుత్త్రికకుఁ బార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారు నరుఁ గని, వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు;
చెల్లరే! యని పుత్త్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి

తే. మాఱుమాటాడ దీవింప మనసు రోసి, "చ్యవనుఁ డధికుండు మునిజన సత్తముండు
భువన సన్నుతుఁ డెందుఁ బోయె? నాతఁ, డెట్లు వంచింపఁ బడియె? వీఁ డెవ్వఁ డబల!

62

తా ॥ అలా కాలం జరుగుతూ ఉండగా, శర్యాతి యజ్ఞం చేయతలపెట్టి కూతుర్నీ అల్లుణ్ణీ వెంట తీసుకొని వెళ్ళడానికి ఆహ్వానింపగోరి చ్యవన మహర్షి ఆశ్రమానికి వచ్చాడు. వచ్చి తన కుమార్తె ప్రక్కన సూర్యతేజస్సుతో మెరిసిపోతున్న యువకుని చూసి, ఇతడెవరు? ఈమె భర్త కాదే! అని సందేహించి, కుమార్తె చేసిన సపర్యలనూ సత్కారాలనూ గ్రహింపక, తలవంచుకొని,

ఆమెతో మాట్లాడటానికి కూడా ఇష్టపడక, మనస్సులో అసహ్యించుకుంటూ, 'చ్యవనుడు అన్నింటా గొప్పవాడు. మునిజనంలో ప్రముఖుడు. ఉత్తముడు. లోకమంతటిచేతా అంతటివాడు మరిలేడంటూ కీర్తిని పొందినవాడు. ఆయన ఏడి. ఎక్కడకు వెళ్ళాడు. అతనిని ఎందుకు మోసం చేశావు. అసలిది ఎలా జరిగింది. ఇతడెవరు?

మ. తగవే? ధర్మమె ! శీలమే? కులజ వై దర్పించి మోదింప నా
జగదారాధ్యుని బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్
మగనిన్ మాని భుజంగుఁ బొందఁదగునే మానంబు వాటింపఁగాఁ
దగదే! దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా!

63

తా ॥ ఇదేమైనా బాగుందా! ఇది న్యాయమేనా? ధర్మమా? ఇది మంచి నడవడి అవుతుందా? మంచి వంశంలో జన్మించిన నీవు, ఈ విధంగా నీ సంతోషం కొరకు, నీ ఆనందం కొరకు, మదించి, జగదారాధ్యుడూ, సదాచారసంపన్నుడూ, తపస్వీ, భార్య మనస్సును సంతోషపెట్టేవాడు అయిన భర్తను విడిచి విటుని పొందటం తగినదేనా? గౌరవమర్యాదలను పాటింపవద్దా. ఈ పని చేసి నీ తండ్రినైన నన్నూ, నీ భర్తనూ పాపగతికి నెట్టివేశావే! బిడ్డా! ఇది తగినదేనా?

ఆ. పద్మనయన! మగఁడు ప్రాయంపువాఁడైనఁ, గాపు వెట్టి కొంతఁ గావ నేర్చుఁ గడఁగి
ముసలి తపసి గావంగ నేర్చునే, యువతి ముదుకఁ గూర్ప నొప్ప దెందు."

64

తా ॥ అమ్మాయి! వయసులోనున్న మగడైతే కాపలావుంచి కొంతైనా కాచుకుంటాడు. ముసలి తపస్వి నిన్నెలా కాచుకోగలదు? ఏమైనా, ముసలివానికి పడుచుదానిని జతచేయడం మంచిది కాదు'.

వ. అని పలికిన న ప్పరమపతివ్రతా లలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ దండ్రి కిట్లనియె.

65

తా ॥ అని శర్యాతి అనగా, పరమపతివ్రతాశిరోమణి అయిన సుకన్యక, చెక్కిళ్ళలో తన చిరునగవుల కాంతులు ప్రకాశించగా తండ్రితో ఇలా అంది:

క. 'నీయల్లుఁడితఁడు భార్గవుఁ, డయ్యా! జారుండు గాఁడు హర్షము తోడన్ నెయ్యంబు నిల్పు' మంచును, దొయ్యలి సర్వంబు దండ్రితో వినిపించెన్.

66

తా ॥ 'తండ్రీ! నీవనుకుంటున్నట్లు ఇతడు విటుడు కాదు. నీ అల్లుడే. భార్గవ వంశస్థుడైన చ్యవనుడే ఈయన. కనుక కోపించవద్దు. మునుపటి ప్రేమనే చూపవలసింది' అంటూ, జరిగినదానినంతా తండ్రికి వివరించింది.

వ. అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌఁగిలించుకొని గారవంబున' నయిదువవు గ' మ్మని దీవించె; నంత భార్యాసహితుండై చ్యవనుండు సని తన మామకు యాగంబు సేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజ తపో బలమున నశ్వినీదేవతల కిచ్చినం జూచి.

67

తా ॥ అంతట శర్యాతి తేరుకొని కూతురిని కౌగిలించుకొని, నిండిన ప్రేమతో, సుమంగళివి కమ్మని ఆశీర్వదించాడు. పిమ్మట చ్యవన మహర్షి భార్యాసమేతంగా మామగారి రాజధానికి వచ్చి ఆయన చేత యాగం చేయించాడు. అనంతరం ఒక పాత్రలో సోమరసాన్ని పట్టి తన తపోబలంచేత అశ్వినీ దేవతలకు అర్పించాడు.

క. కోపముతోడుత వాసవుఁ, డేపున ముని పైని వజ్రమెత్తిన మరలం
దాపసుఁడు వజ్రిభుజమున, నాపవి నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్.

68

తా ॥ దానిని చూసి ఇంద్రుడు కోపించి, మునిపైకి వజ్రాయుధాన్ని ఎత్తగా, ప్రపంచం అంతా ఆశ్చర్యపడే విధంగా ముని తిరిగి ఆ వజ్రాయుధాన్ని వాసవుని భుజంపైనే ఉంచాడు.

వ. ఇవ్విధంబున నశ్వినీదేవతలిద్దఱు దేవతావైద్యులై సోమభాగంబు లేని వారయ్యుఁ జ్యవనుసామర్థ్యంబునఁ బ్రాప్తభాగు లయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు, నానర్తుండును, భూరిషేణుండు నను మువ్వురు కొడుకులు గలిగి; రందు.

69

తా ॥ ఈ విధంగా అశ్వినీ దేవతలిరువురూ వైద్యులు కావటం వల్ల సోమభాగం లేనివారై కూడా చ్యవనుని వలన సోమభాగాన్ని పొందడానికి అర్హత పొందారు. శర్యాతికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిక్షేణుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు.

# రైవతుని చరిత్ర

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె! నతఁడు కుశస్థలి యనుపురంబు
నీరధిలోపల నిర్మించి పెంపుతో, నావర్తముఖ విషయంబు లేలెఁ;
గనియెఁ గకుద్మిముఖ్యంబైన నందన శతము; రైవతుఁడు విశాల యశుఁడు
దనకూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి, తగు వరు నడిగెడి తలఁపుతోడఁ

తే. గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి, యచట గంధర్వ కిన్నరు లజుని మ్రోల
నాటపాటలు సలుపఁగ నవసరంబు, గాక నిలుచుండె నతఁ డొక్కక్షణము తడవు.

70

తా ॥ ఆనర్తునికి రైవతుడనే పేరుగల కుమారుడు కలిగాడు. అతడు సముద్రంలోపల కుశస్థలమనే పట్టణాన్ని నిర్మించి, ఆనర్తముఖ ప్రాంతాలను చాలా గొప్పగా పాలించాడు. కకుద్మి మున్నుగా నూరుమంది కుమారులను పొందాడు.

కీర్తిమంతుడైన ఆ రైవతుని కుమార్తె రేవతి. ఆమెను బ్రహ్మకు చూపి, ఆమెకు కాగల భర్త ఎవరో తెలుసుకుందామనే ఆలోచనతో, కూతుర్ని వెంటబెట్టుకుని బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ఈయన వెళ్ళిన సమయానికి గంధర్వులు, కిన్నరులు బ్రహ్మ సమక్షంలో నాట్యం చేస్తూ గానం చేస్తున్నారు. అది తగిన సమయంకాదని భావించిన రైవతుడు ఒక క్షణం ఆగాడు.

ఆనర్తదేశము : ఉత్తర కథియవాడు ప్రాంతము.

వ. అంత నవసరంబైన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిఁ జూపి యిట్లనియె.

71

తా ॥ అంతట సందర్భం అనువుపడగా కుమార్తె రేవతిని బ్రహ్మకు చూపి ఇలాగన్నాడు:

ఆ. చాల ముద్దరాలు జవరాలు గొమరాలు, నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ
మగఁడు? సెప్పు' మనిన మదిఁ జూచి పకపక, నవ్వి భూమిపతికి నలువ పలికె.

72

తా ॥ 'ఈమె చాల ముగ్ధ, యువతి. ఈ సుమనస్వినికి భర్త కాగలవాడు ఎవరు?' అని అడుగగా, బ్రహ్మ ఆలోచించి, పకపక నవ్వుతూ, ఆ రాజుతో అన్నాడు గదా,

సీ. 'మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన, వార లెల్లరు గాల వశతఁ జనిరి;
వారల బిడ్డల వారల మనుమల, వారల గోత్రంబు వారినైన
వినము మేదిని మీఁద; వినుము నీ వచ్చిన యీలోన నిరువదియేడు మాఱు
లొండొండ నాలుగు యుగములుఁ జనియె; నీ వటు గాన ధరణికి నరుగు మిపుడు

తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ, భూమి భారంబు మాన్పంగఁ బుట్టినాఁడు; సకల
భూతాత్మకుఁడు నిజాంశంబు తోడ, యువతి మణి నిమ్ము జనమణి కున్నతాత్మ!

73

తా ॥ "ఓ రాజా! ఈమె కొరకు మనస్సులో ఆలోచించి నిర్ణయించిన వారు కాలవశులై వెళ్ళి పోయారు. ప్రస్తుతం భూమిమీద వారి బిడ్డలు గాని, బిడ్డల బిడ్డలు గాని, వారి వంశాలవారు గాని ఎవరూ లేరు గాక లేరు. నీవు ఇక్కడకు వచ్చిన ఇంత లోపల ఇరవై ఏడు పర్యాయాలు నాలుగు యుగాలూ ఒకటి తరువాత ఒకటిగా జరిగిపోయాయి. కనుక ఇక నీవు భూలోకానికి వెళ్ళి సర్వభూతాత్మకుడూ, దేవదేవుడూ అయిన హరి, భూభారాన్ని తొలగించే నిమిత్తం బలదేవుడనే పేరుతో తన అంశతో జన్మించాడు. కనుక ఈ యువతీరత్నాన్ని ఆ ఉత్తమ మానవరత్నానికివ్వవలసింది."

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుఁ జనుదెంచి సోదరస్వజన హీనంబగు తన నగరంబున కారాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి

నారాయణాశ్రమంబగు బదరికా వనంబునకు నియమంబునఁ దపంబు సేయం జనియె.

74

తా ॥ అని బ్రహ్మ చెప్పగా, రైవతుడు ఆయనకు నమస్కరించి భూలోకానికి వచ్చాడు. వచ్చి తన సోదరులు గాని, తనవారు గాని ఎవ్వరూ లేని తన రాజధానీ నగరాన్ని చేరుకున్నాడు. బలభద్రుని చూసి, ఆయనకు రేవతినిచ్చి, తాను నియమనిష్ఠలతో తపస్సు చేసుకునే నిమిత్తం నారాయణాశ్రమమైన బదరికావనానికి వెళ్ళిపోయాడు.

# నాభాగుని వృత్తాంతం

క. నభగుఁడను మనుజపతికి, శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం
బ్రభులై మనియెడు తలఁపున, విభజించిరి భ్రాత లతని విత్తము నధిపా!

తా ॥ నభగుడనే రాజుకు నాభాగుడనే ఉత్తముడు జన్మించాడు. అయితే అతని తోబుట్టువులు ప్రభువులై, స్వార్థంతో, అతని సంపదను విభాగాలు చేసుకున్నారు.

వ. అంత నాభాగుండను బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబుల పాలడగిన వారలు 'దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద' మనిన నాభాగుండు తండ్రియగు నభగు కడకుం జని' విభాగంబు సేయు' మని పలికిన నతం 'డిందు నంగిరసుల మేధ గలవార లయ్యును సత్త్రయాగంబు సేయుచు నాఱవ దినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢు లయ్యెదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు; దానంజేసి వారు కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు, సత్త్ర పరిశేషితంబైన ధనంబు నీ కిచ్చెద' రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని యట్టు సేసిన నంగిరసులు సత్త్ర పరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జని రంత.



తా ॥ అంతట బ్రహ్మచారి అయిన నాభాగుడు తన సోదరులను ధనంలో భాగం ఇవ్వవలసిందని అడిగాడు. దానికి వారు మన తండ్రిగారు చెప్పిన పద్ధతి ప్రకారం ఇస్తామని చెప్పగా, అతడు తండ్రి వద్దకు వెళ్ళి భాగం పెట్టవలసిందని అడిగాడు. దానికి ఆయన, "ఇక్కడ అంగిరసులు మేధావంతులై కూడా సత్త్రయాగం చేస్తూ ఆరవ దినాన చేయవలసిన కర్మలు ఏవో తోచని మతిహీనులవుతారు. వారికి నీవు వైశ్వదేవ సూక్తాలు రెండు చెపితే, నీవు కవిగా పేరుపొందుతావు. వారికి నీవు అలా చేయడం కారణంగా వారు కృతకృత్యులై స్వర్గానికి వెళుతూ సత్త్రయాగంలో మిగిలిన ధనాన్ని నీకిస్తారు" అని చెప్పగా అతడు తండ్రి వద్ద సెలవు తీసుకొని

వెళ్ళి అలా చేయగా, అంగిరసులు మిగిలిన ధనాన్ని అతనికి ఇచ్చి స్వర్గలోకానికి వెళ్ళారు. అంతట.

క. అంగిరసు లిచ్చు పసిఁడికి, మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ డు
త్తుంగుఁడు గృష్ణాంగుఁడు దగ, ముంగల నిలుచుండి విత్తముఁ జేకొనియెన్.

77

తా ॥ అంగిరసులిచ్చిన బంగారాన్ని గ్రహిద్దామని సంతోషంతో నాభాగుడు వెళ్ళగా, అక్కడ ఒక పొడవాటి నల్లనివాడు, అతని ముందు చేరి ఆ ధనాన్ని గ్రహించాడు.

వ. వానిం జూచి నాభాగుండు దనకు మును లిచ్చుటంజేసి తన ధనం బని పలికిన, నమ్మహాపురుషుండు 'మీ తండ్రి సెప్పిన క్రమంబ కర్తవ్యం' బనిన నాభాగుండు నభగు నడిగిన, నతండు యజ్ఞమందిరగతంబై 'యుచ్ఛిష్టంబగు ధనంబుఁ దొల్లి మహామునులు రుద్రున కిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబులకు నర్హుం' డనిన విని, వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి 'దేవా! యీ ధనంబు నీ యధీనం' బని మా తండ్రి సెప్పె, నే నపరాధంబు సేసితి; సహింపు' మనవుడు భక్త వత్సలుండగు న మ్మహాపురుషుండు నభగు సత్యవచనంబునకు, నాభాగుని నిజంబునకు మెచ్చి 'నీవు దప్పక పలికితివి కావున, సత్త్రపరిశేషితంబగు ధనంబు నీకు నిచ్చితి' నని పలికి యంతర్దర్శిత్వంబును, సనాతనం బగు బ్రహ్మజ్ఞానంబును నుపదేశించి తిరోహితుండయ్యె; నివ్విధంబున.

78

తా ॥ అతనిని చూచిన నాభాగుడు, మునులు ధనాన్ని తనకు ఇచ్చారని చెప్పగా, ఆ మహాపురుషుడు, మీ తండ్రి చెప్పినట్లు చేయటం తగదు అని చెప్పగా, అతడు తండ్రిని అడుగగా, యజ్ఞశాలలో వదిలిన ధనాన్ని మహామునులు పూర్వం రుద్రుని పరం చేయటం కారణంగా,

సర్వధనానికి ఆ దేవుడే అర్హుడని చెప్పాడు. అంతట నాభాగుడు తిరిగివచ్చి ఆ మహాదేవునికి నమస్కరించి, ఈ ధనం మీదేనని మా తండ్రి గారు చెప్పారు. మీ పట్ల నేను చేసిన ఈ దోషాన్ని మన్నింప గోరుతున్నానని ప్రార్థింపగా, భక్తవత్సలుడైన ఆ దేవుడు నభగుని సత్యసంధతకు, నాభాగుని సద్గుణానికి మెచ్చుకొని, నీవు సత్యం పలికావు గనుక, యాగంలో మిగిలిన ఈ ధనాన్ని నీకు నేను ఇస్తున్నానని చెప్పి, అంతర్దర్శిత్వాన్ని (లోచూపును), సనాతనమైన బ్రహ్మజ్ఞానాన్నీ ఉపదేశించి ఆయన మార్గాన ఆయన వెళ్ళిపోయాడు. ఈ విధంగా

క. భువిలో నాభాగునికథ, దవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచిన మాత్రం
గవి యగు; మంత్రజ్ఞుండగుఁ, బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై.

79

తా ॥ జరిగిన నాభాగుని చరిత్రను ఎవడు కోరి ఉదయ సాయం సమయాల్లో తలచుకుంటాడో అతడు కవి (కం బ్రహ్మతత్త్వం యో విజ్ఞాయతే – అనగా బ్రహ్మతత్త్వవేత్త) అవుతాడు. మంత్రజ్ఞుడవుతాడు. మంచి బుద్ధిగలవాడై కడకు పుణ్యగతికి చేరుకుంటాడు.

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతని యందు జగదప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని యేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబు వలన నతండు విడువం బడియె ననిన నప్పుడమిఱేనికి శుకుం డిట్లనియె.

80

తా ॥ ఆ పిదప నాభాగునికి అంబరీషుడు జన్మించాడు. అతడు ఎంతటివాడంటే – బ్రాహ్మణశాపం మరల్పరానిది గదా! అయినా అలాంటిది కూడా అతని పట్ల నిరర్థకమై, అతనిని ఏమీ చేయలేకపోయింది సుమా” అని శుకమహర్షి చెప్పగా, అదెలా జరిగింది! ఏ కారణం చేత అతడు బ్రాహ్మణుని శాపం నుండి తప్పుకోగలిగాడు? అని పరీక్షిన్మహారాజు అడిగాడు. దానికి శుకమహర్షి ఇలా చెప్పాడు:

## అంబరీషోపాఖ్యానము

శా. సప్తద్వీప విశాల భూభరము దోఃస్తంభంబునం బూని సం
ప్రాప్త శ్రీయుతుఁడై మహీవిభవసంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణ గరిష్ఠుం డంబరీషుం డిలన్.

81

తా ॥ "అంబరీషుడు సామాన్యుడు కాదు. మాన్యులలో మాన్యుడు. సద్గుణాలు రూపుదాల్చిన మూర్తి. తన భుజశక్తితో ఈ ఏడు ద్వీపాల భూభారాన్ని వహించాడు. ఆనువంశికంగా అంతులేని సంపద సంప్రాప్తించింది. అది అనంతమైన వైభవాన్ని మూటగట్టి ఇచ్చింది. అయితే దానిని దుర్వ్యయం చేయక, వైష్ణవార్చనలకు వినియోగించాడు. అలా ఎంత చేసినా, ఆ సేవలో ఆయనకు తనివి తీరేది కాదు. విసుగూ విరామం లేకుండా ఏ ప్రొద్దూ అందులోనే నిమగ్నమై దాని పట్ల ఎంతో ఉత్సాహాన్ని చూపుతూ ఉండేవాడు.

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద; పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిర మార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవింద రూపవీక్షణమంద; శిరము గేశవ నమస్కృతుల యంద;
పదము లీశ్వరగేహపరిసర్పణ మంద; కామంబు చక్రికైంకర్యమంద;

తే. సంగ మచ్యుత జనతనుసంగమంద, ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలములంద; రసన దులసిదళములంద; రతులు పుణ్య, సంగతులయంద యా రాజచంద్రమునకు.

82

తా ॥ మనస్సును శ్రీహరి పాదాలయందు, మాట ఆ మహాపురుషుని గుణకీర్తనయందు, చేతులు విష్ణుమందిరాన్ని పరిశుభ్రం చేయటంలో, చెవులు ఆ హరి వృత్తాంతాలను వినటంలో,

చూపులు ఏ వేళా ఆ మనోహర సుందరమూర్తిని సంవీక్షించటంలో, శిరస్సును ఆ శ్రియఃపతికి నమస్కరించటంలో, పాదాలను విష్ణుమందిరానికి దారితీయించటంలో, కోరికను శ్రీపతికి కైంకర్యం చేయటంలో, స్నేహాన్ని విష్ణుపదార్చకుల చెలిమిలో, వాసనను శ్రీమహావిష్ణుభక్తకోటి పదకమలాల సువాసనను గ్రహించటంలో, అభిరతిని పుణ్య కథలయందూ సంలగ్నం చేసిన మహానుభావుడు ఆ అంబరీష మహారాజు.

వ. మఱియు నమ్మహీవిభుండు.

83

తా ॥ అంత మాత్రమే కాదు. ఆ ప్రభువు –

సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁ గూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ దగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి
సమలోష్ట హేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగ నవని యేలె;

ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ, లంక మెడల మనసు లంకె పెట్టి
విహితరాజ్యవృత్తి విడువని వాఁడునై, యతఁడు రాచతపసి యనఁగ నొప్పె.

84

తా ॥ అత్యంత వైభవంతో, పాపాలకు దూరంగా ఉంటూ, యజ్ఞమూర్తి శ్రీమహావిష్ణువును గూర్చి వసిష్ఠాదిమహామునులను కూర్చుకొని సరస్వతీ నదీ తీరాన, అనేక పర్యాయాలు అశ్వమేధయాగాలు చేశాడు. అంతులేని ధనాన్ని దక్షిణలుగా పంచిపెట్టాడు. రాతికీ, బంగారానికి ఒక భేదాన్ని గమనించినవాడు కాదు. రెండింటి పట్లా ఒకటే భావం. అంత నిర్లిప్తుడు ఆయన. ఆయన చేసిన అన్ని పనులూ ఆ శ్రియఃపతి, ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకునికి అర్పణగానే చేసి, అత్యంత వైభవంగా, ధర్మబుద్ధితో ఈ ప్రపంచాన్ని పాలించాడు. శ్రీ

మహావిష్ణువును ఎంతగా ఆరాధించేవాడో విష్ణు పదార్చకులనూ అలాగే, ఎలాంటి భేదభావం లేకుండా అర్చించేవాడు. ఇంతగా దైవభక్తి ఉన్నా, రాచకార్యాలను ఎంతో జాగరూకతతో పరికించేవాడు. రాజర్షి అంటే ఇలాగ ఉండాలి అన్నదానికి ఉదాహరణగా నిలిచాడు.

వ. వెండియు న మ్మహాభాగవతుండు.

85

తా ॥ అంతేగాదు, ఆ మహానుభావుడు –

క. హరియని సంభావించును; హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;
హరియని రుచిగొనఁ దలఁచును, హరిహరి! ఘను నంబరీషు నలవియె పొగడన్?

86

తా ॥ ఏ పని చేసినా ముందు హరిని తలచేవాడు. దేనిని చూసినా 'హరి' అంటూ దర్శించేవాడు. స్పృశించినా, వాసన చూసినా చివరకు దేనినైనా రుచిచూసే సందర్భంలోనైనా సరే హరినామాన్ని ఉచ్చరిస్తూ, భజిస్తూ, భావిస్తూ, సర్వం హరిమయంగా తలచాడు. రాజా, ఆయన గొప్పతనాన్ని గూర్చి ఏమని పొగిడేది? హరి హరీ! మాటలు చాలవంటే నమ్ము.

వ. ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున.

87

తా ॥ అలా ఆ పుణ్యమూర్తి, సర్వాన్ని సర్వేశ్వరాయత్తం చేసి, పాలన సాగిస్తున్న సమయంలో.

ఆ. అతని కీహ మానె హరులందుఁ గరులందు, ధనములందుఁ గేళివనములందుఁ,
బుత్త్రులందు బంధుమిత్రులయందును, బురమునందు నంతిపురమునందు.

88

తా ॥ ఆయనకు కోరికలు నశించాయి. వేటి మీదా – గుఱ్ఱాలేమి, ఏనుగులేమి, ధనమందేమి, ఉద్యానవన విహార భూములయందేమి, పుత్రులు, చుట్టాలు, స్నేహితులందేమి, కడకు అంతఃపురంపై కూడా ఆయనకు ఆసక్తి లేకుండా పోయింది.

వ. అంతఁ గొంతకాలంబున క మ్మేదినీకాంతుండు సంసారంబు వలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తి పరవశుండయి యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగ దవక్రంబునగు చక్రంబు నిచ్చి చనియె నంత.

89

తా ॥ అలా కొంతకాలం గడువగా, ఆ ప్రభువు సంసారంపై మోహాన్ని వదులుకొని, దేనినీ పట్టించుకోక, నిర్మలమైన మనస్సుతో, భగవంతునిపై దృష్టినిలిపి ఏకాంతంగా ఉండసాగాడు. అలాంటి సమయంలో భక్తసులభుడూ, భక్తవత్సలుడూ అయిన పురుషోత్తముడు శత్రువులను శిక్షించడంలోనూ, స్వజనులను రక్షించడంలోనూ సమర్థమైనది, ఎందునా తిరుగులేనిది అయిన చక్రాన్ని అంబరీషునికి ప్రసాదించి వెళ్ళాడు. అంతట –

క. తనతోడి నీడకైవడి, ననురూప గుణాఢ్యయైన యాత్మ మహిషితో జనవిభుఁడు ద్వాదశీవ్రత, మొనరఁగ హరిఁగూర్చి చేసె నొక యేఁడధిపా!

90

తా ॥ తన నీడ తనను ఎలా అనుసరిస్తుందో అలా అన్నింటా తనకు సహచరి అయిన ప్రాణేశ్వరితో కూడా, ఒక సంవత్సర కాలంపాటు శ్రీమహావిష్ణువును గూర్చి ద్వాదశీవ్రతాన్ని చేశాడు.

వ. ఇట్లు వ్రతంబు సేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనంబున మహాభిషేక విధానంబున విహిత పరికర సంపన్నుండయి, హరి నభిషేకంబు సేసి, మనోహరంబు లయిన గంధంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ.

91

తా ॥ అలా ఆ వ్రతాన్ని పరిసమాప్తి గావించి, వ్రతాంతంలో కార్తికమాసంలో మూడు రాత్రులు ఉపవాసం చేసి, కాళిందీనదిలో స్నానమాడి, మధువనంలో మహాభిషేకం కావించేందుకు ఆవశ్యకమైన పరికరాలన్నింటినీ సమకూర్చుకొని శ్రీహరికి అభిషేకం చేసి, మనోహరములైన వివిధ గంధములను, అక్షతలను సమర్పించి అప్పుడప్పుడే వికసించిన సుగంధపుష్పాలతో పూజ కావించాడు. అనంతరం—

ద్వాదశీ వ్రతం : మార్గశీర్ష మాసం శుక్లపక్ష దశమినాడు సర్వశుచియై, సంకల్పించి, ఏకాదశి నాడు ఉపవాసం ఉండి, రాత్రి జాగరణం చేయాలి. సర్వోపచారాలతో శ్రీహరిని పూజించి, మౌనంగా ఉంటూ, మనస్సును ఇంద్రియార్థాల పైకి మళ్ళనీయక జపయజ్ఞం ఆచరించాలి. ఆ తర్వాత హోమం చేసి, ద్వాదశీ విష్ణుపూజను కావించి, ఉద్యాపనానంతరం దానధర్మాలు చేయాలి. ఇది రాజ్యప్రద ద్వాదశి, శుక్ల ద్వాదశి, కృష్ణ ద్వాదశి, కామ ద్వాదశి, తిల ద్వాదశి అని పెక్కు విధాలుగా ఉన్నది. ఏడాదిపాటు ఈ వ్రతాన్ని చేసుకొంటే అన్ని పాపాలూ తొలగిపోతాయి. జీవితాంతం పాటించినవారు శ్వేతద్వీపవాసానికి నోచుకొంటారు. నెలలోని ఉభయపక్షాలలోనూ ఆచరించినవారికి స్వర్లోకలాభం కలుగుతంది. ఇతర మాసాలలోనూ యావత్కాలం వ్రతాన్ని ఆచరించినవారికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. విష్ణుధర్మోత్తర పురాణం ప్రథమ ఖండంలో దీని వివరాలు ఉన్నాయి.

శా. పా లేఱై ప్రవహింప దగ్గఱుచు లేఁ బ్రాయంబులున్ రూపము
ల్మేలై ధూర్తలు గాక వెండిగొరిజ ల్వేమోరు శృంగంబులుం

గ్రాలం గ్రేపుల యఱ్ఱు నాఁకుచును రంగచ్ఛాయలై యున్న మం
దాలన్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదిక శ్రేణికిన్.

92

తా ॥ అందమైనవీ, పోట్ల మారివికానివీ, గిట్టలకు వెండి, కొమ్ములకు బంగారం తాపడం చేసినవీ, తమ దూడల మెడలను గోముగా నాకుచున్నవీ, మేలివస్త్రాల కాంతితో ప్రకాశిస్తున్నవీ, పొదుగుల నిండా పాలు నింపుకొన్నవీ అయిన ఆవెయ్యలు అరవై అర్బుదాలను ఆ రాజు వేదపండితులైన బ్రాహ్మణోత్తములకు సభక్తికంగా సమర్పించాడు.

న్యర్బుదషట్కము : ఆరు న్యర్బుదాలు. పది అర్బుదాలు ఒక న్యర్బుదము. అర్బుదమంటే ఒక కోటి.

క. పెక్కండ్రు విప్రవరులకు, గ్రక్కున నతిభక్తి తోడఁ గడుపులు నిండం
జొక్కపు టన్నంబిడి విభుఁ, డొక్కడఁ బారణము సేయ నుద్యోగించెన్.

93

తా ॥ ఎంతోమంది బ్రాహ్మణులకు అత్యంత భక్తితో, వారు కడుపారా భుజించేటట్లు షడ్రసోపేతమైన భోజనం పెట్టించాడు. తాను కూడా ఉపవాస విరమణ గావించే ప్రయత్నంలో ఉండగా.

వ. అ య్యవసరంబున.

94

తా ॥ అంతలో,

క. భాసుర నిగమ పదోప, న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా
భ్యాసుఁడు రవిభాసుఁడు దు, ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్.

తా ॥ వేదాలను గూర్చి చక్కగా ఉపన్యసింపగలవాడూ, తపఃప్రభావం చేత ప్రకాశిస్తున్నవాడూ, సాటిలేని ఆత్మయోగాన్ని అభ్యసించినవాడూ, సూర్యతేజస్సుతో వెలిగిపోయేవాడూ అయిన దుర్వాసమహర్షి అక్కడకు అతిథిగా వేంచేశాడు.

అతిథి : ముందుగా వర్తమానం చేయకుండా వచ్చిన భోజనార్థి. ఆదరింపదగినవాడు, సత్కరింపదగినవాడు.

వ. అట్లతిథియై వచ్చిన న మ్మిని వల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి, కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమం బరసి తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముండును సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబులగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు, మునింగి లేచి రాక తడవుసేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశి యందుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి.

96

తా ॥ అలా విచ్చేసిన ఆ మునిశ్రేష్ఠునికి లేచి నమస్కరించి, "ఆసీనులు కం" దని ఆసనాన్ని అమరించి, ఆయన పాదాలను కడిగి పూజించి క్షేమసమాచారాలను పరామర్శించి, తన ఇంట ఆతిథ్యాన్ని స్వీకరించవలసిందని ప్రార్థించాడు. దానికి ఆ మహానుభావుడు ఎంతో సంతోషించి, అలాగేనని తన అంగీకారాన్ని తెలిపి, స్నానార్థం కాళిందీ నదికి వెళ్ళాడు. పవిత్రము, స్వచ్ఛము అయిన ఆ కాళిందీ నదీ జలాలలో ధ్యానం చేస్తూ మునుగుతూ ఎంతసేపటికీ ఆయన రాకున్నాడు. ఇవతల ద్వాదశీ తిథి అతిక్రమించబోతోంది. ఉపవాసదీక్ష ఆ తిథి లోపలే ముగించవలసివుంది. అంబరీషునికి ఏమీ తోచటం లేదు. దుర్వాసమహర్షి రాకుండా

పారణ గావిస్తే బ్రాహ్మణుని అవమానించిన దోషం చుట్టుకుంటుంది. ఈ ఆలోచనతో ఆ మహారాజు పండితులను రప్పించారు.

క. 'ముని నీరు సొచ్చి వెడలఁడు, చనియెడు ద్వాదశియు నింత సనియె న్నీలో
నన పారణచేయవలయు, వినిపింపుం డర్హమైన విధ మెట్టిదియో?'

97

తా ॥ "మహానుభావులారా! దుర్వాసమహర్షి స్నానార్థమై కాళిందీనదికి వెళ్ళి ఎంతకూ రాకున్నాడు. ద్వాదశీ తిథి అతిక్రమించబోతోంది. ఆ లోపలే పారణ చేయాలి గదా! ఎలా? ఇలాంటి సందర్భంలో అనుసరింపదగిన విధి విధానం ఏమిటి?"

వ. అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి.

98

తా ॥ అని రాజు అడుగగా ఆ పండితులు ఇలా అన్నారు:

ఆ. 'అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి, పారణంబు మానఁ బాడి గాదు
గుడువకుంటఁ గాదు
కుడుచుటయును గాదు, సలిలభక్షణంబు సమ్మతంబు.'

99

తా ॥ "అతిథి రాకపోవటం కారణంగా పారణ చేయకుండా ఉండటం పద్ధతి కాదు. అలా అని అతిథి రాకుండా భోజనం చేయటమూ ధర్మం కాదు. కనుక అటూ ఇటూ కాని విధంగా మంచి నీటిని స్వీకరించడం సరియైనది."

వ. అని ధర్మసందేహంబు వాపిన, నా రాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు సేసి, జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచుచున్న సమయంబున.

100

తా ॥ అని ధర్మసందేహానికి దారి చూపగా, ఆ రాజర్షి అంబరీషుడు హరిని స్మరించి, మంచినీటిని గ్రహించి, స్నానార్థం వెళ్ళిన, తపస్వి రాకకు ఎదురుచూస్తున్నాడు. అంతట,

సీ. యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి కొట్టుమిట్టాడంగ నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందఱుఁ గంటిరే? విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్నుఁ

తే. గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు, ధర్మభంగంబు సేసి దుష్కర్ముఁ డయ్యె!
నయిన నిప్పుడు సూపెద నన్ని దిశల, నేనుఁ గోపింప మాన్పువాఁ డెవ్వఁ? డనుచు.

101

తా ॥ దుర్వాసమహర్షి యమునలో స్నానమాడి వచ్చాడు. రాజు ఆయనకు స్వాగతం పలికి, సత్కరించాడు. ముని రాజువల్ల జరిగిన పారణ విషయమంతా మనస్సుతో గ్రహించి, ముఖం గంటుపెట్టుకొని, కోపం వలన దేహం వణికిపోతుండగా, అసలే మాంచి ఆకలితో ఉన్నాడేమో – అక్కడి వారితో ఇలా అన్నాడు: ‘ఇతనికి సంపదతో గర్వం అధికమైంది. ఎంతటి దురహంకారమో, ఎంతటి క్రూరుడో ఇతడు. నన్ను భోజనానికి రమ్మని తానై ఆహ్వానించి, నేను రాకముందే తాను తిన్నాడు. ఇతడెలాంటి విష్ణుభక్తుడనుకోవాలి? ధర్మానికి విఘాతం కల్పించి పాపకర్ముడైనాడు! నన్ను అవమానించాడు. అయితే ఏమయింది గనుక! దానికి ఫలితమేమిటో ఇప్పుడే చూపిస్తానుగా! నేనంటూ ఆగ్రహిస్తే, దానిని మాన్పగలిగినవాడు ఈ అఖిల ప్రపంచంలోనే లేదు సుమా!’

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును, భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్
పొటపొట రాల, గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరించుచున్,

జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో
త్కట వలమాన హస్తయుతఁగా నొనరించె నయించె రాజుపైన్'

102

తా ॥ అంటూ పటపట పండ్లు కొరుకుతూ, భయంకరమూర్తియై, కళ్ళల్లో నిప్పులు రాలుస్తున్న విధంగా తీక్షణంగా చూస్తూ, దవడలు పొంగగా, హుంకరిస్తూ, తన జడ మొదలంటగా పెరికి దానితో శూలాయుధ సహితంగా కృత్యను ఆవాహనం గావించి రాజుపై ప్రయోగించాడు.

కృత్య : ఆభిచారిక హోమాలలో క్షుద్రప్రయోగం చేసినప్పుడు ఆవిర్భవించే ఒక రాక్షస శక్తి. ఇది స్త్రీ పురుష రూపాలలోనూ జ్వరరూపంలోనూ ఆవిర్భవిస్తుందని, శత్రువును పైకొన్నప్పుడు మొదట మూర్ఛిల్లజేసి, ఆ తర్వాత మట్టుపెడుతుందని తంత్రశాస్త్ర గ్రంథాలలో ఉన్నది. దీనికి ప్రతిక్రియలు శరభ సాళ్వ పక్షిరాజ సుదర్శనాదులు.

వ. అంత.

103

తా ॥ అంతట,

క. కాలానల సన్నిభయై, శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్,
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు, వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్.

104

తా ॥ ఆ మహాకృత్య, కాలాగ్ని వలె, శూలాయుధాన్ని చేతిలో ధరించి, సుడిగాలి వలె అత్యంత వేగంగా తన పాదాలతో నేలపై బలంగా తన్నుతూ రాజును సమీపించింది.

ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు, 'వెట్టితపసి సేయు వేడబంబుఁ జక్కఁ బెట్టు'

మనుచుఁ జక్రంబుఁ బంచిన, వచ్చె నదియుఁ బ్రళయ వహ్నిపగిది.

105

తా ॥ మతిమాలి, దుర్వాసమహర్షి చేసిన ఈ వెఱ్ఱిచేష్టను గమనించిన శ్రీ మహావిష్ణువు, దానిని చక్కదిద్ది రమ్మని తన చక్రాయుధాన్ని ప్రేరేపించాడు.

వ. వచ్చి ముని పంచిన కృత్యను దహించి, తనివి సనక ముని వెంటంబడిన, మునియును మేరుగుహ సొచ్చిన నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును.

106

తా ॥ మహాప్రసాదమంటూ బయలుదేరిన చక్రాయుధం కృత్యను దగ్ధం చేసి, అంతటితో తనివి తీరక ముని వెంటపడింది. భయపడ్డ మహర్షి, మేరుపర్వతం గుహలోనికి ప్రవేశించాడు. అయితే చక్రాయుధం కూడా, మహాసర్పాన్ని తరుముకుంటూ వెళ్ళే కార్చిచ్చు వలె ఆ గుహలో ప్రవేశించింది.

మ. భువి దూఱన్ భువిదూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు; నుద్వేగియై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి
క్కి వెసం గ్రుంకినఁ గ్రుంగు; నిల్వ నిలుచు; గ్రేడింపఁ గ్రేడించు నొ
క్క వడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై.

107

తా ॥ అంతేకాదు, ఆ మహర్షి ఎక్కడికి వెళితే అక్కడ ప్రత్యక్షమవుతూ వచ్చింది. ఆ దివ్యాయుధం, ముని నేలలో దూరితే తానూ నేలలో ప్రవేశించింది. సముద్రంలోకి వెళితే సముద్రంలోకి, దిక్కులకు, దిగంతాలకు ఇలా ఆయన వెళ్ళిన ప్రతి చోటికి వెళ్ళింది. ఆయన నేలపైకి వ్రాలితే తానూ నేల వ్రాలింది. నిలుచుంటే నిలుచుంది. త్రోవతొలగితే తానూ ఆయన్నే

అనుసరించింది. ఇలా ఆయన వేగాన్నే తానూ అనుసరించింది, తనకు ఒక అడ్డంటూ లేక ఆయన వెంటపడింది.

శా. ఏలోకంబున కైన వెంటఁబడి తో నేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ
డాలోకించి "విధాత! విశ్వజనన వ్యాపార పారీణ రే
ఖా లీలేక్షణ! కావవే కరుణఁ జక్రంబు న్నివారింపవే."

108

తా ॥ అలా ఆ ముని తాను ఏ లోకానికి, ఏ ప్రాంతానికి వెళితే, అక్కడికంతా తనను అనుసరించి వస్తున్న చక్రాయుధ అగ్నిజ్వాలలను అడ్డుకొని తనను రక్షించే వారెవరినీ కానక, చివరికి బ్రహ్మ దగ్గరికి వెళ్ళి, 'మహానుభావా! సృష్టికర్తా! ఈ సకల లోక వ్యవహారాన్నీ నీ కడకంటితో ఒక హేలగా గమనిస్తూ ఉంటావు. నా స్థితి చూస్తున్నావు గదా! నన్ను రక్షింపరాదా! ఈ చక్రాయుధం బారినుండి నన్ను దయతో కాపాడవా, దేవా!' అని దీనంగా వేడుకున్నాడు.

వ. అనిన బ్రహ్మ యిట్లనియె.

109

తా ॥ దానికి బ్రహ్మ మునితో ఇలా అన్నాడు:

మ. కర మర్థిన్ ద్విపరార్థ సంజ్ఞగల యీ కాలంబుఁ గాలాత్ముఁడై
సొరిదిన్ నిండగఁ జేసి లోకములు నా చోటున్ విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁగ్రేవఁ గెంపుగదురన్ భస్మంబుగాఁ జేయు నా
హరిచక్రానల కీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే?

110

తా ॥ "మహర్షీ! అనంతమై ద్విపరార్ధమనే పేరు గల కాలానికి తానే ఆత్మయై, అంతటా తానై వ్యాపించి లోకాలను, కడకు నా స్థానాన్ని సైతం, తన కడకంటి కోపాగ్ని వీక్షణంతో భస్మం చేయగల ఆ శ్రీహరి చక్రాయుధ అగ్నికీలలను ఎదుర్కోగల వాడంటూ ఒకడెవడైనా ఉన్నాడా?

ద్విపరార్ధము : ఏభై బ్రహ్మ సంవత్సరాలకు సమానమైన కాలావధి ఒక పరార్ధం. అలాంటివి రెండు ఊహకు అందనంత కాలము. 100000 కోట్ల బిలియన్ సంవత్సరాలు అని విశేషార్ధం.

ఆ. ఏను, భవుఁడు, దక్షు, డింద్రాదులునుఁ బ్రజా, పతులు, భృగుఁడు, భూతపతులు శిరము లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం, బంచు భూరికార్యమతుల మనుచు.

111

తా ॥ ఆ శ్రీహరి తలపెట్టిన కార్యమేదైనా అది లోకహితాన్నే కోరుతుంది గనుక, దానికి ఈడైనది, ఎదురైనది మరొకటి లేదనే ఉద్దేశంతో, నేను, శివుడు, దక్షుడు, ఇంద్రుడు, ప్రజాపతులు, భృగుమహర్షి, భూతపతులు – అందరమూ ఆయన ఆజ్ఞను శిరసావహిస్తాము.

వ. కావున సుదర్శనానల నివారణంబునకు నోపనని విరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి, చక్రానలంబు తెఱం గెఱింగించిన న మ్మహాదేవుం డిట్లనియె.

112

తా ॥ కనుక సుదర్శనచక్రాన్ని అడ్డుకోవడమనేది నా వల్ల సాధ్యమయ్యే పనికాదు. నేనందుకు అశక్తుణ్ణి" అని బ్రహ్మ చెప్పగా, దుర్వాసమహర్షి అంతట కైలాసానికి వెళ్ళి శివుని దర్శించి, చక్రాగ్ని వలన తన ఇబ్బందిని గూర్చి చెప్పగా పరమేశ్వరుడు ఇలా అన్నాడు:

సీ. వినవయ్య! తండ్రి! యీ విశ్వేశ్వరుని యందుఁ జతురాస్య జీవకోశములు పెక్కు

వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి, నగుచుండుఁ జనుచుండు; నదియుఁగాక
యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁ దసురేంద్ర సుతుఁడు
నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ డాకపిలుఁడు మరీచ్యాదు లన్య

ఆ. పారవిదులు సిద్ధపతులు నెవ్వని మాయ, నెఱుఁగలేము దాన నింత పదుదు మట్టి నిఖీల
నాథు నాయుధశ్రేష్ఠంబుఁ, దొలఁగఁజేయ మాకు దుర్లభంబు.

113

తా ॥ "నాయనా! దుర్వాసమహర్షీ! ఒకమాట చెబుతాను విను. శ్రీహరి విశ్వేశ్వరుడు. ఈ చతురాస్య జీవకోశాలు వేల సంఖ్యలో, ఆయా సమయాలననుసరించి ఆయనలోనే పుడతాయి, గిడతాయి. ఇదంతా ఎలా, ఎవరివలన ఇలా జరుగుతోందా అని నేను, దేవతలు, యముదు, నారదుడు, బ్రహ్మ, సనత్కుమారుడు, ధర్ముడు, కపిలుడు, మరీచి, తత్వవేత్తలు, సిద్ధులు – ఈ అంతమందిమీ అనుకుంటూ ఉంటాము. ఇది ఎవరి మాయా విలాసమో తెలియరాదు. దానిని గమనించటం, అనుభవంలోనికి తెచ్చుకోవటం మాత్రమే తెలుసు. అలాంటి ఆ సర్వేశ్వరుని ఆయుధాల్లో శ్రేష్ఠమైన చక్రాయుధాన్ని మరల్పగల శక్తి మాకు లేదంటే లేదు. అంతవరకూ నిజం.

చతురాస్య జీవకోశములు : బ్రహ్మాండములు.

వ. మునీంద్రా! నీవు న మ్మహాత్ముని శరణంబు వేఁడు మతండు మేలు సేయంగలవాఁడని పలికిన నీశ్వరునివలన నిరాశుండై, దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని.

114

తా ॥ కనుక, మహర్షిసత్తమా! నీవు ఆయన్నే శరణువేడు! తప్పక అతడు రక్షిస్తాడు". పరమేశ్వరుడు ఆ విధంగా చెప్పగా, చేసేది లేక దుర్వాసమహర్షి వైకుంఠానికి వెళ్ళాడు.

శా. ఆ వైకుంఠములోని భర్మ మణి సౌధాగ్రంబు పై లచ్చి దాఁ

గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి "యో వరద! యో దేవేశ! యో భక్త ర
క్షా విద్యాపరతంత్ర! మానుపఁ గదే, చక్రానలజ్వాలలన్.

115

తా ॥ అలా వెళ్ళి, వైకుంఠంలో రత్నమయమైన బంగారు మేడ పైభాగాన, ఒక ప్రక్కన, శ్రీలక్ష్మితో సరససల్లాపాలతో కాలక్షేపం చేస్తున్న పుణ్యమూర్తి, దేవాధిదేవుడైన ఆ శ్రీహరిని దర్శించి, "మహాత్మా! దేవతాధీశ్వరా! భక్తజనసంరక్షకా! దయానిధీ! చక్రాగ్ని కీలల నుండి నన్ను రక్షింపవా!" అని విన్నపం చేశాడు.

ఉ. నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక నీ
ప్రేమకు వచ్చు దాసునకుఁ గ్రించుఁదనంబున నెగ్గు చేసితిన్
నా మఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ
న్నామము చింతసేసిన ననంత సుఖస్థితిఁ జెందకుండునే?

116

తా ॥ సముద్రమంత విశాలమైన నీ మహత్త్వపు దరి కానక, నీ ప్రేమకు నోచుకున్న నీ భక్తునికి ఎగ్గు తలపెట్టాను. నా అజ్ఞానాన్ని మన్నింప వేడుతున్నాను. పాపాత్ములైనా, నీ పేరును మనస్సులో స్మరించినంత మాత్రం చేత సుస్థిరమైన సుఖస్థితిని పొందుతున్నారు గదా! మరి నన్ను దయచూడరాదా!"

వ. అని పలికి, పాదకమలంబులకు మ్రొక్కి, లేవకయున్న దుర్వాసునిం గని హరి యిట్లనియె.

117

తా ॥ అంటూ, శ్రీహరి పాదపద్మాలపై వ్రాలి లేవకున్న దుర్వాసుని చూచి, శ్రీహరి ఇలా

అన్నాడు:

చ. చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలి కొనిపోవుచుందురు రకిల్బిషభక్తి లతాచయంబుల
న్నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్
వలలకుఁ జిక్కి భక్తజన వత్సలతన్ జనుచుందుఁ దాపసా!

118

తా ॥ "మహర్షిసత్తమా! నీవడిగింది బాగానే ఉంది. మంచిదే! అయితే, నేనొక మాట చెబుతాను, బాగా ఆలకించు. బుద్ధిమంతులైన ఈ సాధుజనులు, పుణ్యాత్ములున్నారే! వీళ్ళు, పాపాలను తొలగ ద్రోసి, నిష్కళంకమైన భక్తి అనే తీవెలతో, నా హృదయాన్ని లీలగా పట్టి తమతో కొనిపోయి, నేర్పుగా మదపుటేనుగును బంధించినట్లు బంధిస్తారయ్యా! ఇక నేను చేసేదేమీ లేక, ఆ భక్తజనులపై గల వాత్సల్యంతో, అలా కట్టుబడిపోతాను.

ఆ. నాకు మేలుఁ గోరు నా భక్తుఁ డగువాఁడు, భక్తజనుల కేన పరమగతియు; భక్తుఁడెందుఁ
జనినఁ బఱతెంతు వెనువెంట, గోవు వెంటఁ దగులు కోడెభంగి.

119

తా ॥ నిజానికి నా కొరకుగా ఏ సుఖాన్నీ కోరుకునేది లేదు. సకల శుభాలు నా భక్తజనులకు కలగాలని మాత్రమే ఆశిస్తూ ఉంటాను. మరి వారికి నేనే కదా పరమగతి. కనుక, ఆవు వెంట దాని కోడెదూడ వెళ్ళినట్లు, నేనూ, వారినే అనుసరిస్తూ ఉంటాను.

వ. అదియునుం గాక.

120

తా ॥ అంత మాత్రమే కాదు.

ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల, నాలి విడిచి, సంపదాళి విడిచి
నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని, వారి విడువ నెట్టివారి నైన.

121

తా ॥ శరీరంపైనా, జీవనంపైనా విరక్తి చెంది, కొడుకుల్నీ, చుట్టాల్నీ, కడకు భార్యనూ, సంపదనూ విడిచి, ఇతరులను ఆశ్రయింపక అనన్యభక్తితో నన్నే ఆశ్రయించినవారిని, వారు ఎటువంటివారు కానీ గాక, నేను అట్టివారిని విడిచేది లేదు సుమా!

క. పంచేంద్రియముల తెరువుల, వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును, మంచివరుం బుణ్యసతులు మరగిన భంగిన్.

122

తా ॥ పుణ్యసతులు సద్గుణవంతులైన భర్తలను ఎలా వదిలి ఉండలేరో, అలాగే, వారు కూడా పంచేంద్రియాలు నడిపించే మార్గంలో పోక, ఇతరులను మనస్సులోనికి రానీక నన్నే వారి మనసుల్లో స్థిరంగా నిలుపుకుంటారు.

క. సాధుల హృదయము నాయది;, సాధుల హృదయంబు నేను; జగముల నెల్లన్ సాధుల
నేన యెఱుంగుదు, సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా!

123

తా ॥ సాధుజనులుంటారే – వారే నా హృదయం. వారి హృదయమూ నేనే! జగత్తులోని సాధువులందర్నీ నేనెరుగుదును. వారందరూ నన్నూ, నా నడవడినీ ఎరుగుదురు.

ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు, ముక్తి చేయుచుండు ముదముతోడ;
దుర్వినీతులైన దుర్జను లగువారి, కివియుఁ గీడు సేయ కేలయుండు?

124

తా ॥ తపస్సూ, విద్య – ఈ రెండూ బ్రాహ్మణులకు ముక్తిని ప్రసాదిస్తాయి. అయితే దుర్మార్గంలో నడిచే వారికి ఆ రెండే కీడు చేస్తాయనడంలో సందేహం లేదు సుమా!

క. నా తేజము సాధులలో, నాతతమై యుండు వారి నలఁచు జనులకున్ హేతిక్రియ భీతి నిచ్చుం, జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మీ.

125

తా ॥ నా తేజస్సు సాధుజనులను అంటిపెట్టుకొని ఎన్నటికీ విడువదు. అలాంటి వారికి శ్రమ, కీడు, అపాయం కలిగిస్తే, ఆ తేజస్సే ఆయుధమై భయాన్ని కలిగిస్తుంది. మానసిక స్వస్థతకూ భంగం కలిగిస్తుంది. ఇంతవరకూ ఇది సత్యం, తప్పదు సుమా!

క. అదె పో బ్రాహ్మణ! నీకును, సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుత గుణా
స్పదుఁ డిచ్చు నభయ మాతని, మది సంతసపఱచి వేఁడుమా శరణంబున్,.

126

తా ॥ కనుక, ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఆ నాభాగుని కుమారుడు అంబరీషుడినే ఆశ్రయించు. అతడు దయామయుడు. సకల సద్గుణ సమోపేతుడని కీర్తిగన్నవాడు. అతడు తప్పక నీకు అభయమిస్తాడు. మనస్సులో మరో శంక లేక సంతోషంతో ఆయన్నే ఆశ్రయించు" అని శ్రీహరి ప్రబోధించాడు.

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁ డ
ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషున్ విదో
షు నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్.

127

తా ॥ శ్రీమన్నారాయణుని మాట ప్రకారం, చక్రాగ్నిజ్వాలలతో బాధకు గురై వికాసాన్ని కోల్పోయి, ఆయాసంతో ఎగశ్వాసకు లోనై, ఆ దుర్వాసమహర్షి వెంటనే కరుణా లావణ్యంతో ప్రకాశిస్తున్నవాడూ, పుణ్యాత్ముడూ, నీతిమంతుడూ, ఉదారుడూ, మహామనీషి, హిత మితభాషి అయిన అంబరీషుని వద్దకు చేరుకున్నాడు.

వ. కని, దుఃఖితుండై, యమ్మహీవల్లభు పాదంబులు వట్టి విడువకున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరిత హృదయుండై, హరిచక్రంబు నిట్లని స్తుతియించె.

128

తా ॥ అలా వచ్చి, మహాదుఃఖంతో అంబరీషుని పాదాలు పట్టి విడువకున్నాడు. అలా మహాముని తన పాదాలు పట్టుకున్నందుకు మనస్సులో చాలా బాధపడ్డాడు అంబరీషుడు. దయార్ద్ర హృదయుడై, ఆ శ్రీహరి చక్రాయుధాన్ని ఇలా ప్రస్తుతించాడు:

సీ. నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు; నీవ చంద్రుండవు; నీవ జలము; నీవ నేలయు; నింగి నీవ; సమీరంబు నీవ; భూతేంద్రియ నికర మీవ; నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును; నీవ యజ్ఞంబును; నీవ ఫలము; నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు; నీవ కాలంబును! నీవ జగము;

తే. నీవ బహుయజ్ఞభోజివి; నీవ నిత్య, మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ నీరజాక్షుండు చాల మన్నించు నట్టి, శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని!

129

తా ॥ "ఓ మహాయుధమా! నీవే అగ్నివి, నీవే సూర్యునివి, చంద్రుడవైనా, నీరైనా, నేలైనా, నింగి అయినా, గాలి అయినా నీవే! పంచభూతాలూ ఇంద్రియాలూ సమస్తమూ నీవే! బ్రహ్మము, సత్యము, యజ్ఞము, యజ్ఞఫలమూ నీవే! సర్వలోకేశులూ నీవే! విశ్వాత్మమా నీవే! కాలమూ,

జగమూ నీవే! సకలయజ్ఞ భుక్కుమా, నీవే! నిత్యమైనట్టి, మూల తేజమూ నీవే! ఆ శ్రీమన్నారాయణుడు అన్ని ఆయుధాలకంటే నిన్నే మిన్నగా మన్నిస్తాడు. అలాంటి నీకు మ్రొక్కి వేడుకుంటున్నాను. రక్షించుదువు గాక! జరిగింది చాలు. ఇక నీ తేజస్సు ఉపసంహరింతువు గాక! మునిని రక్షింతువు గాక!

మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ ము న్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మునుపే దైత్యేశ్వర వ్రాతముల్
శిరముల్ పాదములన్ భుజాయుగళముల్ చేతుల్ నిజాంగంబు ల
ప్డొరగం ప్రాణసమీరముల్ వెడలు నీ యుద్ధంబులం జక్రమా!

130

తా ॥ ఓ చక్రాయుధమా! పూర్వం ఆ శ్రీహరి నిన్ను ప్రయోగించి విడువగా, నీ పదనైన చక్రధారలతో భూమిపైకి ఒరగటం తప్పదని, ముందుగానే రాక్షస రాజసమూహాలు పాదాలు, తలలు, భుజాలు శరీరాల నుంచి తొలగిపోగా, నీ తోడి కయ్యంలో ప్రాణాలు వదిలారు.

ఆ. కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన, నిన్నుఁ జూచి దీర్ఘ నిద్ర వోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర, భాతమందు లేచి పలవరింప.

131

తా ॥ నీ భయంతో కలత చెంది నిద్రకొరిగిన అసురవీరులు, కలలో నిన్ను కాంచినంత మాత్రంచేతనే, శయ్యల మీదనే ప్రాణాలు వదలగా, ఉదయాన మేల్కాంచిన వారి ప్రాణవల్లభలు పలవరించిపోయారు గదా!

ఉ. చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స
శ్రీకులఁ జేయు నీరుచులు చెల్వుగ ధర్మసమేతలై నినున్
వాకున నిట్టి దట్టిదని వర్ణన సేయ విధాత నేరఁ డ

స్తోకము నీదు రూపు గలదుం దుది లేదు పరాత్పరాద్యమై.

132

తా ॥ చీకటిని పోగొట్టి, వెలుగు నింపుతూ, స్వధర్మయుక్తాలయిన నీ కాంతులు సజ్జనకోటికి సర్వశుభాలను ప్రసాదిస్తాయి. అట్టి నీ మాహాత్మ్యం ఇలాంటిది, ఇంతటిది అని మాటల్లో కీర్తించటం ఆ విధాత వల్లనైనా అయ్యే పని కాదు! నీ రూపం అనల్పము. పరాత్పరుడే మూలమైన నీకు ఆది, అంతములు లేవు కదా!

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగc, బాలు సేయ నీవు పాలు వడితి
వైన నింకcజాలు నాపన్నుcడై యున్న, తపసిc గావు నీవు ధర్మవృత్తి.

133

తా ॥ ఆ శ్రీమన్నారాయణుడు, ఆ మహావిష్ణువు దుర్మార్గులను శిక్షించడం కొరకుగా నిన్ను సృష్టించినందువలన గదా నీవు సృష్టినందావు. కనుక ఇంతటితో, నీ తేజస్సును ఉపసంహరించి, నీదైన ధర్మప్రవృత్తితో విపన్నుడైన ఈ మునిని రక్షించుదువు గాక! అదే ధర్మం."

వ. అని వినుతించి కేలుcదమ్మిదోయి నొసలం బొసంగించి యిట్లనియె.

134

తా ॥ అని చక్రాయుధాన్ని ప్రస్తుతించి, నమస్కరించి, ఇలా అన్నాడు:

ఆ. ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ, కేతువునకు ధర్మ సేతువునకు విమల రూపమునకు విశ్వదీపమునకుc, జక్రమునకు గుప్త శక్రమునకు.

135

తా ॥ "ఇంద్రుని శత్రువుల పాలిట తోకచుక్క అయి, విరుద్ధములైన ధర్మాలకు సమన్వయాన్ని కూర్చే వారధి వంటిదీ, పవిత్రరూపమైనదీ, విశ్వానికి దర్శనాన్ని ప్రసాదించేదీ,

ఇంద్రునికి రక్షగా నిలిచేదీ అయిన చక్రాయుధానికి నేను భక్తితో వినయంతో నమస్కరిస్తున్నాను."

వ. అని మఱియు నిట్లనియె.

136

తా ॥ అని, ఇంకా ఇలా అన్నాడు:

ఆ. విహితధర్మమందు విహరింతు నేనియు, నిష్టమైన ద్రవ్య మిత్తునేని ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని, విప్రునకు శుభంబు వెలయుఁగాక!

137

తా ॥ "ఆచరింపదగిన ధర్మమేదైతే వుందో, దానిని నేను ఆచరిస్తున్నవాడినే అయితే, సద్బ్రాహ్మణుణ్ణి దైవంగా భావించి, అతడు కోరినదానిని కాదనకుండా నేను ఇస్తున్నవాడినే అయితే, ఇప్పుడు ఈ మహాముని రక్షింపబడు గాక! శుభము కలుగు గాక!

క. అఖిల గుణాశ్రయుఁ డగు హరి, సుఖియై నా కొలువు వలనఁ జొక్కెడి నేనిన్ నిఖిలాత్మమయుం డగుటకు, సుఖమందుం గాక భూమిసురుఁ డివ్వేళన్.

138

తా ॥ సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలకూ ఆశ్రయుడైన ఆ శ్రీహరి నిజంగా నా సేవను అంగీకరించి, ఆనందించినవాడై వుంటే, సర్వుల ఆత్మలయందు ఉన్నవాడు తానే కనుక, ఇప్పుడు ఈ మహర్షి ఎలాంటి బాధకు లోనుగాక సుఖించి సంతోషించును గాక!"

వ. అని యివ్విధంబునం బొగడు పుడమిఱేని వలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసుల గొంగ చక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మేలిమి మాటల నా రాజుం దీవించి, యిట్లనియె.

తా ॥ అని ఈ విధంగా స్తుతిస్తున్న అంబరీషుని ప్రార్థనను మన్నించి, చక్రాయుధం, మునిని బాధింపక వెనుతిరిగి వెళ్ళిపోయింది. దుర్వాసమహర్షి కుదుటపడి, చల్లని మాటలతో రాజును దీవిస్తూ ఇలా అన్నాడు:

మ. 'నరనాథోత్తమ! మేలు సేసితి కదా! నాతప్పు మన్నించి శ్రీ
హరి పాదాబ్జము లింతముట్టఁ గొలుతే? యాశ్చర్య మౌ నెన్నుచో
నరుదంద్రే నినుఁ బోఁటి సాధులకుఁ దానై యిచ్చుటల్ గాచుటల్
సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుం గాదె మిత్రాకృతిన్.

140

తా ॥ "ఆహా! మహారాజా! నాతప్పు కాచావు. రక్షించావు. ఆ శ్రీహరి పాదాలను నీవు ఎంతగా ఆశ్రయించావయ్యా! చాలా ఆశ్చర్యంగా ఉంది సుమా! అవును! స్నేహభావంతో ఇవ్వటం, రక్షించటం అనేవి నీలాంటి సాధుజనునికి, స్వభావసిద్ధమైన గుణాలే కదా!

వ. అదియునుం గాక.

141

తా ॥ అంతే కాదు,

మ. ఒక మా టెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుఁ దా
నకలంకస్థితి గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ!

142

తా ॥ రాజా! ఎవని పేరు ఒక్కటంటే ఒక్కసారి వీనుల విందుగా సోకితే, సకల పాపాలు హరించుకుపోతాయో, అట్టి మహాత్ముని, పావనమైన తీర్థము వంటి సర్వాశ్రయపాదుని, హరిని, విష్ణుని, దేవాధిదేవుని నిష్కల్మషమైన మనస్సుతో సేవించే నీవంటి భక్తాగ్రేసరులకు సాధ్యం కానిదంటూ ఏముంటుంది గనుక! వారి కార్యాలకు ఏది మాత్రం అడ్డు నిలుస్తుంది గనుక!

మత్తకోకిల.

తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తౌ
నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్
సెప్ప మున్మను వోయి క్రమ్మఱం జేరె ధన్యుఁడ నైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా!

143

తా ॥ నా తప్పును మన్నించావు. చక్రాగ్ని వల్ల కలిగిన ఆర్తినుంచి కాపాడావు. నీ దయారసమెంతటిదని పొగడగలను? ఆహా! నీ ఔదార్యం నీకే తగును. రాజా! ఉన్నమాట చెప్పాలంటే — నిజానికి నా ప్రాణాలు పోయి నీ దయవలన తిరిగి వచ్చాయనే భావిస్తున్నాను. ధన్యుణ్ణి అయ్యాను. నీకు ఎల్లప్పుడూ సర్వశుభాలు కలగాలని ఆశిస్తున్నాను. నాకు సెలవిప్పిస్తే వెళ్ళివస్తాను" అన్నాడు మహర్షి.

క. అనిన విని రాజముఖ్యుఁడు, మునివల్లభు పాదములకు మ్రొక్కి కదున్ మ
న్నన సేసి యిష్టభోజన, మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్.

144

తా ॥ అలా అన్న ఆ మహర్షి మాటలు ఆలకించి, అంబరీషుడు మునినాథుని పాదాలకు నమస్కరించి, ఎంతో మన్ననతో, గౌరవంతో ఆయనకు తృప్తిగా భోజనాన్ని వడ్డింపగా, ముని ఎంతో సంతోషించాడు.

వ. మఱియు న మ్మునీంద్రుం డిట్లనియె.

145

తా ॥ అలా భోజనం ముగించి, ఆ మహర్షిసత్తముడు ఇలా అన్నాడు:

శా. "కంటిన్ నేఁటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయ ప్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిన్ బోయెద! నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁ గల రీమీఁద న్నరేంద్రాగ్రణీ!

146

తా ॥ "మహారాజా! ఇంతకాలానికి కన్నులపండువుగా నిన్ను చూశాను. వీనుల విందుగా నీ మాటలు ఆలకించాను. నీ ఇంట తృప్తిగా మృష్టాన్నభోజనం గావించాను. నేను కోరిన కోరిక సఫలీకృతమైంది. నీ వలన పునర్జీవితుడనైనాను. వెళ్ళివస్తాను.

ఇకమీదట నీ పుణ్యచరిత్రను, దేవతలు, మానవులు సుఖాసీనులై అటు స్వర్లోకంలోనూ, ఇటు భూలోకంలోను వినవేడుకగా కీర్తిస్తుంటారు గాక!"

వ. అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి, కీర్తించి, మింటి తెరువున బ్రహ్మలోకమునకుం జనియె. మునీశ్వరుండు తిరిగి చనువేళకు నొక సంవత్సరంబు నిండి, వ్రతంబు పరిపూర్ణం బయిన.

147

తా ॥ అని చెప్పి, అంబరీషుని దీవించి, ఆకాశమార్గాన ఆ దుర్వాసమహర్షి బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అలా మునీశ్వరుడు వచ్చి వెళ్ళే వేళకు సంవత్సరకాలం పూర్తి కావడంతో వ్రతం కూడా పరిపూర్ణమైంది.

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రంబైన, వంటకంబు భూమి వరుఁడు గుడిచెఁ దపసి నెగులు మాన్పఁ దానెంత వాఁడను, హరి కృపామహత్త్వ మనుచుఁ దలఁచి.

148

తా ॥ అంతట, మహర్షి భుజింపగా, మిగిలిన అన్నాన్ని ఆ మహారాజు భుజించి మనస్సులో నిజానికి మహర్షికి కలిగిన ఇబ్బందిని తీర్చడానికి నేనెంతటివాడను గనుక! అంతా ఆ శ్రీమన్నారాయణుని కృప, మహత్త్వం తప్ప! అని భావించాడు.

వ. మఱియును.

149

తా ॥ అంతేగాక,

క. హరిఁ గొల్చుచుండు వారికిఁ, బరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్ నరకసమము లను తలఁపున, ధరణీ రాజ్యంబుతోడి తగులము మానెన్.

150

తా ॥ హరిని సేవించేవారికి, బ్రహ్మపదం మొదలుకొని ఎటువంటి పదభోగాలైనా నరకంతో సమానమని భావించి, రాజ్యవిషయాల పట్ల విముఖుడైనాడు.

వ. ఇట్లు విరక్తుం డై

151

తా ॥ అలా విరక్తుడై,

ఆ. తనకు సదృశులైన తనయుల రావించి, ధరణి భరము వారిఁ దాల్పఁ బంచి కాననంబు సొచ్చెఁ గామాది విజయుఁడై, నరవిభుండు హరిసనాథుఁ డగుచు.

తా ॥ ముమ్మూర్తులా తనను పోలిన తన తనయులను సమ్ముఖానికి రప్పించుకొని, రాజ్యభారం వారికి అప్పగించి, కోరికలను విసర్జించి, హరిని ధ్యానిస్తూ, అతడే సర్వస్వమని నమ్మి వానప్రస్థానికి వెళ్ళిపోయాడు.

క. ఈ యంబరీషచరితము, తీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం, డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా!

153

తా ॥ రాజా! ఈ అంబరీషుని చరిత్రను కోరి విన్నా, చదివినా – అతడు బుద్ధి సంపన్నుడవుతాడు. భోగాలనుభవిస్తాడు. పుణ్యాత్ముడై వెలుగొందుతాడు.

వ. విను మయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండు నను వారు ముప్వురు కొడుకు; లందుఁ గేతుమంతుండును, శంభుండును హరింగూర్చి తపంబు సేయువారై, వనంబునకుం జనిరి. విరూపునికిఁ బృషదశ్వుండును, బృషదశ్వునకు రథీతరుండును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁడను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధులైన కొడుకులం గలిగించె; వారలు రథీతరగోత్రులు, నాంగిరసులను బ్రాహ్మణులునై, యితరులందు ముఖ్యులయి ప్రవర్తిల్లి రని చెప్పి శుకుం డిట్లనియె.

154

తా ॥ అదలావుంచు. ఆ అంబరీషునికి విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అనే ముప్వురు కుమారులు. వారిలో కేతుమంతుడు, శంభుడు ఇరువురూ శ్రీమహావిష్ణువుని గూర్చి తపస్సు చేసుకునే నిమిత్తం అడవులకు వెళ్ళిపోయారు. విరూపునికి పృషదశ్వుడనే కుమారుడు కలిగాడు. అతనికి రథీతరుడు జన్మించాడు. అతనికి సంతానం కలుగకపోవడంతో అంగిరసుడనే

మహర్షి అతని భార్యయందు బ్రహ్మతేజోనిధులైన కుమారులను పుట్టించాడు. వారు రథీతరగోత్రులుగా, ఆంగిరసులనే బ్రాహ్మణులుగా లోకంలో అందరికంటే ప్రసిద్ధులై వర్ధిల్లార" ని చెప్పి, శుకమహర్షి తరువాతి వృత్తాంతాన్ని ఇలా కొనసాగించాడు:

## ఇక్ష్వాకు వంశానుక్రమము

క. ఒకనాఁడు మనువు దుమ్మిన, వికలుఁడు గా కతని ఘ్రాణవివరము వెంటం బ్రకటయశుం డిక్ష్వాకుం, డకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై.

155

తా ॥ "ఒకనాడు వైవస్వత మనువు తుమ్మాడు. అయితే, ఇబ్బందేం కలుగలేదు గాని అతని ముక్కురంధ్రం నుండి సూర్యవంశ దీపకుడై ఇక్ష్వాకుడనే కీర్తిశాలి, పుణ్యాత్ముడు జన్మించాడు.

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్త్రు లెలమిఁ బుట్టిరి నూర్వు రమర వికుక్షియు నిమియు దండ
కుండు నాతని పెద్దకొడుకులు మువ్వురార్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య మూర్వీమండలము కొంత యేలిరి యిరువదియేవు రొక్క
పొందున నా తూర్పు భూమి పాలించిరి యందఱు పడమటి కధిపులైరి

తే. యున్న నలువది యేడ్గురు నుత్తరోర్వి, దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర, సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన,
మాంసఖండంబుఁ దెమ్మనె మహితయశుఁడు.

156

తా ॥ ఆ ఇక్ష్వాకునకు నూర్గురు కుమారులు కలిగారు. వారిలో పెద్దవారైన ముగ్గురు వికుక్షి, నిమి, దండకుడు అనే వారు ఆర్యావర్తంలో హిమాచలం, వింధ్యపర్వతం మధ్యగల భూభాగంలో కొంత భాగాన్ని పరిపాలించారు. ఇరవై అయిదుగురు కుమారులు తూర్పుప్రాంత భూభాగాన్ని పరిపాలించారు. అంతేమంది కొడుకులు పడమటి భాగానికి ఏలికలైనారు. ఇంకా మిగిలిన నలభై ఏడుగురు ఉత్తర దక్షిణ దిక్కుల్లో గల భూమిని పాలించారు.

అలా కాలం జరుగుతుండగా, ఇక్ష్వాకు తన జ్యేష్ఠ కుమారుడైన వికుక్షిని పిలిచి, అష్టకాశ్రాద్ధ కర్మ చేయాలని ఉంది. అందుకు పరిశుద్ధమైన మాంసం కావలసి ఉంది, తీసుకురావలసింది అని చెప్పాడు.

అష్టకాశ్రాద్ధము : బహుళపక్ష అష్టమినాడు, ముఖ్యంగా హేమంత, శిశిర ఋతువుల్లో పితృదేవతల ప్రీత్యర్థం చేసే శ్రాద్ధకర్మ.

మ. అగుఁగా కంచు వికుక్షి వేఁట సని ఘోరారణ్య భూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా, మే నొల్లఁబో నాఁకటన్
సగమై యొక్క శశంబుఁ బట్టి తిని శేషంబైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంక స్ఫూర్తి వర్తిల్లఁగాన్.

157

తా ॥ అలాగేనంటూ తండ్రితో చెప్పి వికుక్షి, వేట నిమిత్తమై ఘోరారణ్యానికి వెళ్ళి, చాలా మృగాలను చంపాడు. బడలికతో శరీరం వడలిపోయింది. అతనికి బాగా ఆకలి వేయటంతో అతను ఒక కుందేలును పట్టి, దాని మాంసాన్ని ఆరగించాడు. మిగిలిన మాంసాన్ని భుక్తశేషాన్నం నైవేద్యానికి పనికిరాదని తెలియక శీఘ్రమే తెచ్చి తండ్రి తలపెట్టిన శ్రాద్ధకర్మ నిమిత్తం ఆయనకు సమర్పించాడు.

తరలము.

కులగురుండు వసిష్ఠుఁడంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి 'యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుం' డన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్.

158

తా ॥ అయితే కులపురోహితుడైన వసిష్ఠ మహర్షి అతీంద్రియ జ్ఞానంతో వికుక్షి కుందేటి మాంసాన్ని తిన్న వైనాన్ని గ్రహించి, ఎంగిలి అయినది పితృకర్మకు పనికిరాదు. వీడు దురాత్మకుడని వికుక్షి గూర్చి చెప్పగా, తండ్రి ఇక్ష్వాకుడు అతనిని దేశం విడిచి పొమ్మని ఆదేశించాడు.

ఆ. కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ, డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె నదియుఁ
జేసి యోగి యై వనంబునఁ గళే, బరము విడిచి ముక్తి పదము నొందె.

159

తా ॥ అలా కొడుకును దేశ బహిష్కృతుని చేసి, వసిష్ఠుడు ఏమి చేయమని ఆదేశించినా, దానిని ఆచరించి, యోగియై వనాలకు వెళ్ళి శరీరాన్ని విడిచి, ఇక్ష్వాకుడు ముక్తిపదాన్ని చేరుకున్నాడు.

చ. జనకుఁడు ముక్తిఁ బొంద నయశాలి వికుక్షి శశాదు డందు భూ
జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁ గూర్చి పురంజయుఁ బుత్త్రుఁ గాంచెఁ బే
ర్కొనె "నమరేంద్ర వాహుఁడు గకుత్‌స్థుఁడు" నంచును వానిలోకముల్.

160

తా ॥ తండ్రి అలా లోకాంతరగతుడై ముక్తిని పొందగా, అనంతరం వికుక్షి శశాదుడనే పేరుతో, ప్రజానుకూలుడై అశేషరాజ్యాన్ని పరిపాలించాడు. విష్ణువును ఉద్దేశించి పలు యజ్ఞయాగాలు నిర్వహించాడు. అతనికి పురంజయుడనే పుత్రుడు కలిగాడు. అతనిని లోకం అమరేంద్రవాహుడు, కకుత్‌స్థుడు అనే పేర్లతో సంభావించింది.

అమరేంద్రవాహుడు: ఇంద్రుడు వాహనంగా గలవాడు. కకుత్‌స్థుడు: ఎద్దుమూపుపై ఆసీనుడైనవాడు.

సీ. కృతయుగాంతంబున దితి సుతామరులకు రణ మయ్యె; నందు నా రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు పురంజయుని యందు
వచ్చి నే నుండెద వాసవ! వృషభంబ వై మోవు మని పల్క నమర విభుఁడు
గోరాజమూర్తిఁ గకుత్ప్రదేశంబున నా పురంజయు మోచె నంత నతఁడు.

తే. విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల, దివ్య చాపంబు చేఁబట్టి దీర్ఘ నిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప, నంత కాలాగ్ని చాడ్పున ననికి నడచె.

161

తా ॥ కృతయుగాంతంలో దైత్యులకూ, దేవతలకూ యుద్ధమైంది. అందులో ఇంద్రుడు ఓటమిపాలై, హరిని ఆశ్రయించాడు. అంతట హరి ఇంద్రునితో, నేను పురంజయుణ్ణి ఆవహిస్తాను. నీవు వృషభరూపంలో ఆయన్ని మోయవలసిందని చెప్పగా ఇంద్రుడు అలా వృషభరూపాన్ని ధరించి, పురంజయుణ్ణి తన మూపుపై ఎక్కించుకొని మోశాడు. అంతట పురంజయుడు విష్ణుతేజము తనను ఆవహింపగా, దివ్యమైన ధనుస్సును ధరించి, పదనైనవీ పొడవైనవీ అయిన బాణాలను సమకూర్చుకుని, దేవతలు జేజేలు పలుకగా కాలాగ్నివలె సమరభూమికి వెళ్ళాడు.

చ. నడచి శరావళిన్ దనుజనాథుల మేనులు చించి కంఠముల్
దొడిఁదొడిఁ ద్రుంచి త్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్
వడి నురగాలయంబున నివాసము సేయఁగఁ దోలి యంత నూ
రడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చె పురంజయాఖ్యతన్.

162

తా ॥ వెళ్ళి, బాణాలతో దనుజుల శరీరాలను తూట్లుపడేటట్లు కొట్టాడు. తలలను తరిగాడు. అలా చేసి కొందరిని యమపురికి, మరి కొందరిని నాగ లోకానికి తరిమేశాడు. అంతటితో ఊరుకోక వారి పట్టణాలను నేలమట్టం చేశాడు. అలా పురంజయుడనే పేరు

ఆయనపట్ల సార్థకమైంది.

వ. ఇ వ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసుల పురంబులు జయించిన కతనం బురంజయుండును, వృషభరూపుండైన యింద్రుడు వాహనం బగుటంజేసి యింద్రవాహనుండును, నతని మూపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండును నన నీ మూఁడు నామంబులం బ్రసిద్ధి కెక్కి దైత్యుల ధనంబులు నింద్రుని కిచ్చె, నప్పురంజయుని పుత్త్రుం డనేనసుండు. అతని పుత్త్రుండు పృథుండు, పృథుని కొడుకు విశ్వగంధుండు, విశ్వగంధునకు నందనుండు చంద్రుండు. చంద్రసుతుండు, యవనాశ్వుండు, యవనాశ్వ తనూభవుండు శవస్తుండు. అతండు శావస్తి నామ నగరంబు నిర్మించె. శవస్త తనయుండు బృహదశ్వుండు. బృహదశ్వ తనూజుండు గువలయాశ్వుం; డానరేంద్రచంద్రుండు.

163

తా ॥ అలా శశాదపుత్రుడు రాక్షసుల పట్టణాలను జయించటం వలన పురంజయుడనీ, వృషభరూపంలో ఇంద్రుడు తనకు వాహనం కావటం వలన ఇంద్రవాహనుడని, ఆయన మూపురం (కకుత్తు) ఎక్కి యుద్ధం చేసిన కారణాన కకుత్స్థుడని – అతనికి ఈ మూడు పేర్లూ ప్రసిద్ధమైనాయి. దైత్యుల సర్వధనాన్ని ఇంద్రుని పరం చేశాడు. ఆ పురంజయునికి అనేనసుడు జన్మించాడు. అతని కుమారుడు పృథుడు. పృథునికి విశ్వగంధుడు జన్మించాడు. అతనికి చంద్రుడు జన్మింపగా, ఆ చంద్రునికి యువనాశ్వుడు పుట్టాడు. అతనికి శావస్తుడనే కుమారుడు జన్మించి తనపేర శావస్తి అనే పట్టణాన్ని నిర్మించాడు. శావస్తుని కుమారుడు బృహదశ్వుడు. బృహదశ్వుని కుమారుడు కువలయాశ్వుడు.

క. లావు మెఱసి యిరువది యొక, వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు పనుప దు, రావహుఁడై చంపె ధుంధు నమరాబంధున్.

164

తా ॥ ఆ కువలయాశ్వుడు తానూ, తన ఇరవైఒక్క వేలమంది కుమారులతో, ఉదంకుడనే బ్రాహ్మణోత్తముని ఆజ్ఞచొప్పున బహుపరాక్రమంతో ధుంధుడనే రాక్షసుణ్ణి వధించాడు.

వ. అది కారణంబుగా దుంధుమారుం డన నెగడె. నయ్యసురు ముఖానలంబునఁ గువలయాశ్వ కుమారు లందఱు భస్మంబై; రందు దృఢాశ్వుండును, గపిలాశ్వుండును, భద్రాశ్వుండును ననువారలు ముగ్గురు సిక్కి; రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునుకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనియించి; ర య్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దానును నిర్వేఱపడియుండ, నా రాజునకు మునులు కృపసేసి, ఇంద్రునిఁ గూర్చి సంతతి కొఱకై యైంద్రయాగంబు సేయించి రందు.

165

తా ॥ ఆ కారణంగా కువలయాశ్వునికి ధుంధుమారుడనే పేరు స్థిరపడింది. అయితే, ఆ రాక్షసుని ముఖంనుండి వెలువడిన అగ్నిజ్వాలలకు చిక్కి ఆయన కుమారుల్లో దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనే ముగ్గురు తప్ప మిగిలిన ఇరవై రెండు మంది కుమారులు భస్మమైపోయారు. అందులో దృఢాశ్వునికి హర్యశ్వుడనే వాడు జన్మించాడు. అతనికి నికుంభుడు, నికుంభునికి బర్హణాశ్వుడు జన్మించారు. ఆయనకు కృశాశ్వుడు, కృశాశ్వునికి సేనజిత్తు జన్మింపగా అతనికి యువనాశ్వుడు జన్మించాడు. అతనికి నూర్వురు భార్యలు. అయినా వారిలో ఎవరికీ సంతానం కలుగలేదు. ఇదేమా అని వారు చాలా ఆశ్చర్యపడ్డారు. అంతట మునులు ఆయన పట్ల జాలిపడి, ఆయన చేత ఇంద్రుణ్ణి ఉద్దేశించి ఇంద్రయాగం చేయించారు.

# మాంధాత వృత్తాంతము

సీ. భూమీశు భార్యకుఁ బుత్త్ర లాభమునకై పోయు తలంపున భూమిసురులు
జలమును మంత్రించి జలకలశము దాఁచి నియమంబుతోఁ గూడి నిద్రవోవ
ధరణీశ్వరుఁడు పేరు దప్పితో నా రాత్రి ధృతిలేక యజ్ఞమందిరముఁ జొచ్చి
యా నీరుఁ ద్రావిన నంత మేల్కని వార 'లెవ్వఁడు ద్రావె నీరెందుఁ బోయె?'

ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి, యెఱిఁగి చోద్యమంది యీశ్వ రాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ; నీశ్వరునకు నమ, స్కార మనుచు నేది కార్య మనుచు.

166

తా ॥ పిదప ఆ మునులు జలాన్ని మంత్రించి, ఒక కలశంలో పోసి, అవి రాజుగారి భార్యకు ఇద్దామనే తలంపుతో దాచిపెట్టి నిద్రపోయారు. ఒక రాత్రి వేళ రాజుకు మెలకువ వచ్చింది. ఆయనకు విపరీతమైన దప్పిక కలిగింది. అంతట ఆయన యజ్ఞమందిరంలోనికి వెళ్ళి ఆ నీళ్ళు త్రాగాడు. పిదప మునులు నీరు లేకపోవటం చూసి, ఎవరు త్రాగి ఉంటారా? అని ఆలోచించి, తమ దివ్యజ్ఞానంతో, అవి రాజు త్రాగడం గ్రహించి, ఆశ్చర్యపడ్డారు. అంతట ఈశ్వరేచ్ఛ అలా ఉన్నప్పుడు ఎవరు మాత్రం చేయగలిగింది ఏముందని తమలో తాము సమాధానపడి దైవానికి ఒక నమస్కారం పెట్టి, ఇక తాము చేయగలిగిందేముందని అనుకున్నారు.

వ. వారలు దుఃఖింపుచుండు నంతఁ గొంత తడవునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని, చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి, తల్లి లేని కతంబునం గడుపునకు లేక యేడ్చుచుండ, ఇంద్రుండు వచ్చి, శిశువునకు నాఁకటి దీఱు కొఱకు వానినోటం దనవ్రేలిడినం, ద్రావిన కతంబున వాని పేరు మాంధాత యని నిర్దేశించి చనియె. ని వ్విధంబున.

167

తా ॥ అలా వారు చింతిస్తూ ఉండగానే, కొంతసేపటికి యువనాశ్వుని కడుపు చీల్చుకొని, చక్రవర్తి లక్షణాలతో కుమారుడు జన్మించాడు. అయితే తల్లి లేని కారణంగా బిడ్డ పాలకు ఏడుస్తున్నాడు. అంతట ఇంద్రుడు వచ్చి, ఆకలి తీరటం కొరకు, ఆ శిశువు నోటిలో తన చూపుడువ్రేలును ఉంచాడు. అలా ఆ శిశువు వ్రేలు కుడిచిన కారణంగా అతని పేరు 'మాంధాత' అని చెప్పి ఇంద్రుడు వెళ్ళిపోయాడు.

ఆ. కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ, దీఱఁ డయ్యెఁ దండ్రి దేవవిప్ర
కరుణ యట్ల కాదె? కడిఁది దైవము లావు, కలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె?

168

తా ॥ అయితే, కడుపు చీల్చుకొని బిడ్డ జన్మించినా రాజు మరణించలేదు. దేవతల, బ్రాహ్మణుల దయ, వారి మాహాత్మ్యం అలాగే ఉంటాయి మరి! అవును మరి! దైవసహాయం పుష్కలంగా కలవాడు సుఖంగా బ్రతుకుతాడు! ఎందుకు చెడిపోతాడు గనుక!

వ. ఇట్లు బ్రతికియున్న యువనాశ్వుండు, కొంత కాలంబునకుఁ దపంబుసేసి, సిద్ధిం బొందె; నంత.

169

తా ॥ అలా దేవతల, మునుల కరుణతో మరణింపక బ్రతికిన యువనాశ్వుడు కొంతకాలం తరువాత తపస్సు చేసి, సిద్ధిని పొందాడు.

సీ. పడమటఁ బొడమెడు బాలచంద్రుని మాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁ బొందె బాలుఁ;
డల్లన పరిపూర్ణ యౌవనారూఢుఁడై రావణాది రిపుల రాజవరుల
దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ డంకింప శూరుఁడై యఖిల దేవ

మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీను నాత్మఁ గూర్చి

తే. చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి, ద్రవ్యయజమాన విధిమంత్ర ధర్మయజ్ఞ

కాల ఋత్వి క్ప్రదేశ ముఖ్యంబు లెల్ల, విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు

170

తా ॥ అంతట ఆ బాలుడు శుక్లపక్షంలో పడమట ఉదయించిన బాలచంద్రుని వలె ఆనాటికానాడు ఆరోజుకారోజు చక్కగా పెరుగుతూ వచ్చాడు. కాలం మీదట పరిపూర్ణ యౌవనాన్ని పొందాడు. రావణాది శత్రువుల్నీ, ఇతర రాజుల్నీ జయించాడు. ఇంద్రుడు ఆయన పరాక్రమాన్ని స్తుతిస్తూ, ఆయనను త్రసదస్యుడనే విధంగా కీర్తించాడు. పిదప ఆ త్రసదస్యుడు, అఖిల దేవతామయుడూ తానే అయినవాడూ, అతీంద్రియుడూ, విష్ణువూ, మాధవుడూ, అజుడూ, యజ్ఞమూర్తి అయిన శ్రీమన్నారాయణుణ్ణి ఆత్మలో నిలుపుకొని, ఎన్నో యజ్ఞాలు చేశాడు. అంతులేని దక్షిణలతో బ్రాహ్మణోత్తములను సత్కరించాడు. యజ్ఞద్రవ్యాన్నీ, యజమాన విధి పూర్వక మంత్రాలతో గావించే యజ్ఞకార్యాన్నీ, దానిని నిర్వహింపచేసే ఋత్విజులనూ, యజ్ఞప్రదేశాన్ని, కాలాన్ని, ఇలా అన్నింటినీ అతడు సర్వ విష్ణుమయంగా, విష్ణు రూపాలుగా భావించాడు.

క. బలిమి నడంచుచు నరులం, జలి వెలుఁగున్ వేఁడివెలుఁగుఁ జనుచోటెల్లన్

జలరుహనయనుని కరుణను, జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్.

171

తా ॥ తన పరాక్రమంతో, బాహుబలంతో రాజులను, ప్రజలనూ దారికి తెచ్చి, ఎండా వెన్నెలా వ్యాపించే భూమండలాన్నంతటినీ, ఆ శ్రీమహావిష్ణువు కరుణతో, సౌభాగ్య సంపదలతో, ఆ మాంధాత ఈ జగత్తును పాలించాడు.

వ. అంత నా రాజునకు శతబిందుని కూఁతురగు బిందుమతి యందుఁ బురుకుత్సుండు;

నంబరీషుండును, ముచుకుందుండును ననువారు ముగ్గురు గొడుకులు, నేఁబండ్రు కూఁతులును జనియించి, పెరుఁగుచున్న యెడ.

172

తా ॥ అంతట ఆ మాంధాత ప్రభువు శశబిందుని కుమార్తె బిందుమతిని వివాహమాడి, పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అనే ముగ్గురు కుమారులను, యాభైమంది కుమార్తెలను పొందాడు. వారంతా చక్కగా పెరుగుతున్నారు.

సీ. యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జలస్థలమునందుఁ
బిల్లలుఁ దనప్రాణవల్లభయునుఁ గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసార కాంక్షియై మాంధాత నొకకన్య నడుగ నృపోత్తముండు
తరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవుడు ననుఁ జూచి యౌవనాంగి

ఆ. యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి, వాఁడఁ జాల నరసినాఁడ నొడల జిగియు
బిగియు లేని శిథిలుండఁ గరఁగింప, బాలఁ దిగిచికొను నుపాయ మెట్లు?

173

తా ॥ ఆ సమయంలో సౌభరి అనే గొప్ప తపస్వి ఒకాయన యమునా నదీ జలాల్లో తపస్సు చేసుకుంటూ, ఆ నీటిపట్టులో మీనరాజు తన పిల్లలతో, భార్యతో సుఖంగా కాలక్షేపం చేస్తుండటం చూశాడు. ఆయనకూ సంసార కాంక్ష కలిగింది. మాంధాత ప్రభువును తనకొక కన్యను ఇమ్మని అడిగాడు. దానికి మాంధాత అలాగే, దానికేం అంటూ స్వయంవరంలో నీవు నా కుమార్తెను పొందవచ్చునని చెప్పాడు. అంతట సౌభరి ఆలోచనలో పడ్డాడు. “నేనా ముసలివాణ్ణి. అయినప్పుడు యౌవనవతి నన్నెలా వరిస్తుంది గనుక? నా దేహమా వణికిపోతోంది, తల నెరసిపోయింది, శరీరం జిగీ బిగీ లేక పట్టుదప్పిపోయింది. అయినప్పుడు కన్యను పొందటం ఎలా, దానికేమిటి దారి అనే ఆలోచనకు లోనైనాడు.

వ. అదియునుం గాక.

174

తా ॥ అంతే గాక,

ఆ. బాల పువ్వుఁబోడి ప్రాయంపు వానినిఁ, జెన్నువాని ధనముఁ జేర్చువాని మరగెనేనిఁ గొంత మరగుఁగా కెదిరిఁ ద, న్నెఱిఁగి ముసలితపసి నేల మరఁగు?

175

తా ॥ యువతి, అందమైనవాడినీ, ధనవంతుణ్ణీ గ్రహిస్తే కొంతవరకూ గ్రహింపవచ్చునేమో గాని, తెలిసి తెలిసి ముసలివాణ్ణి ఎందుకు చేసుకుంటుంది గనుక?"

వ. అని విచారించి సౌభరి దనతపోబలంబునం జేసి ముసలి తనంబు విడిచి యెల ప్రాయంపుఁ గొమరుం డయి యలంకరించుకొని ముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల నగరు గాచికొని యున్నవారికి సెలవు సేసిన వా రమ్మునీంద్రుని నా రాజపుత్రికలున్న యెడకుం గొనిపోయి చూపిన.

176

తా ॥ అని ఆలోచించి సౌభరి తన తపోబలం చేత ముసలితనాన్ని పోగొట్టుకొని యువకుడై అలంకరించుకొని రాగా, మాంధాత ప్రభువు రాచనగరు సేవకులతో చెప్పగా వారు సౌభరిని రాజకుమార్తెలున్న చోటికి తీసుకొనివెళ్ళి చూపించారు.

ఉ. 'కోమలులార! వీఁడు నలకూబరుఁడో! మరుఁడో! జయంతుడో!
యేమఱి వచ్చె; వీనిఁ దడ వేల వరింతుము నేమ యేమ' యం
చా మునినాథుఁ జూచి చలితాత్మికలై సొరిదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు గీయని ఘంట వ్రేయఁగన్.

177

తా ॥ అంతట ఆ రాచకూతుళ్ళు సౌభరిని చూసి, వారిలో వారు ఇలా అనుకున్నారు. ఇతగాడు నలకూబరుడేమోనే ! లేక మన్మథుడో, జయంతుడో కాదు గదా ! ఏదో, ఎక్కడికనో బయలుదేరి పొరపాటున ఇక్కడికి వచ్చి వుండాలి. మరి ఇక మనం జాగు చేయడం దేనికి? అని వారిలో వారు కూడబలుక్కొని, మన్మథుడు గీమంటూ ఘంట మ్రోగిస్తే గనుక ఎలా కంపించిపోతాయో అలా వారి మనస్సులు కంపించి పోయాయా అన్నట్లు సౌభరి అందానికి ముగ్ధలైన ఆ కోమలులందరూ ఒక్కటై ఆయనను వరించారు.

వ. ఇట్లు రాజకన్యకల నందఱుం జేకొని సౌభరి నిజతపః ప్రభావంబున ననేక లీలావినోదంబులఁ గల్పించి.

178

తా ॥ అలా వారు తనను వరించటంతో, సౌభరి వారినందరినీ పెండ్లి చేసుకొని, తన తపస్సు ప్రభావం చేత అనేక లీలా వినోదాలను వారి కొరకు కల్పించాడు.

సీ. గృహరాజములయందుఁ గృతకాచలములందుఁ గలువలు విలసిల్లు కొలఁకులందుఁ
గలకంఠ శుకమధుకర నినాదములచే వర్ణనీయములైన వనములందు
మణివేదికల యందు మహనీయ పర్యంక పీఠలీలాశైల బిలములందు
శృంగార వతులగు చెలువలు పలువురు తనపంపు సేయ సుస్థలములందు

తే. వస్త్ర మాల్యానులేప సువర్ణహార, భూరి సంపద నిష్టాన్న భోజి యగుచుఁ
బూఁట పూటఁకు నొక వింత పొలుపుఁ దాల్చి, రాజకన్యల నందఱ రతులఁ దేల్చె.

179

తా ॥ చక్కని గృహాల్లో తానై కల్పించిన కొండలపైనా, చక్కని మృదు మధురమైన తమ

గొంతుకలతో చిలుకలు, తుమ్మెదలు గానం చేస్తున్న ఉద్యానవనాల్లోనూ, మణిమయ వేదికలపైనా, మంచి శయ్యలు కలిగిన కొండగుహల్లోనూ, అందమైన యువతులెందరో తన ఆజ్ఞ చొప్పున సేవలందిస్తున్న రమ్యమైన స్థలాల్లో, అందమైన వస్త్రాలు, చక్కని పూమాలలు, లేపన ద్రవ్యాలు, బంగారు ఆభరణాలు, గొప్ప సంపద, రుచికరమైన అన్నపానీయాలు వారికి అమర్చే ఏర్పాట్లు గావించి సౌభరి పూటకొక విధంగా, ఎప్పటికప్పుడు ఒక క్రొత్త పద్ధతిలో తానూ అలంకరించుకుంటూ ఆ రాజకన్యలనందరినీ మన్మథ క్రీడల్లో ఓలలాడించాడు.

క. పెక్కండ్రు రాజముఖులకు, నొక్కఁడు మగఁడయ్యుఁ దనియకుండె మునీంద్రుం డెక్కుడు
ఘృతధారలచే, నక్కజమై తృప్తి లేని యనలుని భంగిన్.

180

తా ॥ అంతమంది రాజకుమార్తెలకూ తాను ఒక్కడే భర్త అయినా, ఎంత నేయి పోసినా తృప్తి చెందని అగ్నిదేవుని వలె, సౌభరికి తనివి తీరలేదు.

వ. ఇవ్విధంబున

181

తా ॥ ఈ విధంగా.

క. ఆరామంబున మునివరుఁ, డా రామలతోడ బహువిహార మయుండై
గారాములఁ దన కిట్టటు, పోరాముల సేసి కొన్ని ప్రొద్దులు పుచ్చెన్.

182

తా ॥ సౌభరి ఉద్యానవనాల్లో, ఆ రాజపుత్రికలతో బహుభంగుల విహరిస్తూ వారితో తన ముద్దుముచ్చట్లు తీర్చుకుంటూ కాలక్షేపం చేస్తూ వచ్చాడు.

వ. అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీ వల్లభుఁడు, మునీశ్వరుం డెందుఁబోయెఁ?

గూఁతు లెక్కడ నలజడి పడుచున్న వారలో' అని తలంచి, వెదుక వచ్చి, యొక్క మహానగరంబున, మణిమయ సౌధంబులం, జక్రవర్తియుం బోలెఁ గ్రీడించుచున్న తాపస రాజుం గని, సంతసించి, వెఱఁగుపడి, మన్ననలం బొంది, మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె.

183

తా ॥ అలా కాలం జరుగుతుండగా ఒకనాడు మాంధాత ప్రభువు, ఈ మునీశ్వరుడెక్కడికి వెళ్ళి ఉంటాడు, తన కుమార్తెలు ఎలాంటి ఇబ్బందులు పడుతున్నారోనని ఆందోళనకులోనై, వారిని వెతుక్కుంటూ వచ్చి, ఒక మహారణ్యంలో గొప్ప మణిమయ సౌధంలో చక్రవర్తి వలె వైభవంగా జీవిస్తున్న ఆ మునిశ్రేష్ఠుణ్ణి చూసి సంతోషించాడు. ముని కూడా ప్రభువును ఎంతో ఆదరించి, సత్కరించాడు. ఆ తరువాత మెల్లగా కుమార్తెలను చూసి, వారిని తగు విధంగా సత్కరించి, వారితో ఇలా అన్నాడు:

క. నా తోడులార! మీ పతి, మీ తోడే? పనుల యెడల మేలే' యనుడున్
'నా తోడిదె నా తోడిదె, తాతా మే!' లనుచు ననిరి తరుణులు వరుసన్.

184

తా ॥ "నా గారాబు తల్లులారా! మీ భర్త మిమ్మల్ని బాగా చూసుకుంటున్నాడు గదా! ఏ లోటూ లేదు గదా!" అని ఆయన అనగా, వారు ఎవరికి వారు, తమ భర్త తమతోనే ఉంటున్నాడని తమతోడిదే లోకంగా మమ్మల్ని చక్కగా ఆదరిస్తున్నాడని తండ్రికి విన్నవించి చెప్పారు.

వ. అంతఁ గొంతకాలంబునకు గృహగతచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని, మీనమిథున సంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున నిట్లనియె.

185

తా ॥ అలా కొంతకాలం గడువగా గడువగా సౌభరిలో కొంత చింత చోటు చేసుకుంది. అదేమంటే యమునలోని మీన దంపతుల సంగమాన్ని చూసిన తప్పిదం వలన గదా తనకీ సంసార వాంఛ కలిగింది! అనే పశ్చాత్తాపానికి లోనై, తనలో తాను ఇలా అనుకున్నాడు:

మ. ఉపవాసంబుల డయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?
తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?
యపలాపంబున నేల పొందితి? హతం బయ్యెం దపం బెల్ల నీ
కపటస్త్రీ పరిరంభముల్ మునులకుం గైవల్య సంసిద్ధులే?

186

తా ॥ "అయ్యో! ఇదేమిటి, నేను మునిని అయివుండి ఇలాగైపోయాను. ముని అన్నవాడు, ఉపవాసాలు చేయటం, విషయ భోగాలను దగ్గరకు రానీయకుండటం, కోరి తపస్సు చేయటం, శ్రీహరి పాదాలయందు మనస్సును లగ్నం చెయ్యటం – ఇవి గదా తాపసి చేయాల్సిన పనులు. వాటిని వదిలి నేను స్త్రీల కౌగిళ్ళ సుఖాన్ని మరిగానేమిటి? చేసిన తపస్సు అంతా వ్యర్థమైపోయింది గదా! అయ్యో! మనస్సును మోసం చేసి, దానిని లోగొనే స్త్రీల కౌగిళ్ళు కాదు గదా మునులకు కైవల్యసిద్ధిని కలిగించేవి!

చ. ముని నట! తత్త్వవేది నఁట! మోక్షమకాని సుఖంబు లెవ్వియుం
జన వఁట! కాంత లేఁబ దఁట! సౌధచయం బఁట వాసదేశముం,
దనయులు నైదువే లఁట! నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గను టఁట చెల్లరే నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే?

187

తా ॥ మునిని కావడమేమి? తాత్త్విక చింతన చేయటమేమి? మోక్షం తప్ప సుఖాన్ని

ఇచ్చేది మరొకటలేదనుకున్నానా? మరి ఇదేమిటి? యాభైమంది భార్యలా? మేడలూ మిద్దెలా? నివాసం సౌధం లోనా? అయిదు వేలమంది కుమారులా! ఆహా! దీనంతటికి కారణం మీన సంసారాన్ని చూడటం గదా! హవ్వ! మహాత్ములు మెచ్చుకునే పనేనా ఇది?

ఆ. తపము సేయువాఁడు దత్త్వజ్ఞుఁ డగువాఁడు, నెలమి మోక్ష మిచ్ఛ నెంచువాఁడు
నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు, కాఁపురంబు సేయుఁ గఱటితపసి.

188

తా ॥ తపస్సు చేసుకునేవాడూ, తాత్త్వికుడు కాదలచినవాడూ, మోక్షం మీదే తన దృష్టి నిలిపేవాడూ, ఏకాంతాన్ని విడిచి లంపటుడైతే ఎలా? సంసారంచేసే తపసి మూర్ఖుడవుతాడు తప్ప మరొకటి కాడు గదా!"

వ. అని దుఃఖించి, తన్నుం దాన నిందించుకొని, తనవేడబంబు వివేకించుచు, నిహపరసాధుకుండై, కాఁపురంబు విడిచి, సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు సేసి, శరీరంబు గుదియించి, యగ్ని సహితుండై, పరబ్రహ్మంబు సొచ్చె; నంత.

189

తా ॥ అని భావించి, చాలా దుఃఖానికి లోనై, తాను చేసిన దానికి తనను తాను నిందించుకొని, జరిగిపోయిన మోసాన్ని గూర్చి ఆలోచించుకొని, ఇహపరాలను సాధించుకోవడానికి ఒక నిశ్చయానికి వచ్చి, సంసారాన్ని విడిచి, భార్యలతో సహా వానప్రస్థధర్మం ఆచరించే నిమిత్తం అడవికి వెళ్ళి, ఘోరమైన తపస్సు చేశాడు. శరీరం కృశించిపోయింది. చివరకు యోగాగ్నికి ఆత్మార్పణ కావించి పరబ్రహ్మాన్ని చేరుకున్నాడు సౌభరి. అంతట,

క. మునిపతి వనమున కరిగిన, వనితలు తో నరిగి ప్రాణవల్లభు గతికిం

జనిరి వెనుతవిలి విడువక, యనలునితో శిఖలు నిలువ కరిగిన భంగిన్.

190

తా ॥ మునితో పాటు కానలకేగిన అతని భార్యలు కూడా మనస్సులో ఏ విధమైన సంకోచం లేకుండా అగ్నిని వెన్నంటి ఉండే శిఖల వలె భర్త ననుసరించి అగ్నికి ఆహుతై పోయారు.

వ. అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుం డగుటం జేసి యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండు గావలయునని కోరి తెచ్చుకొనియె; న య్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారితుండు జనియించి, రది కారణంబుగా నంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునకుఁ బ్రవరులైరి; మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుం; డతని నురగలోకంబునకుఁ గొనిపోయి భుజంగ కుమారులు దమ చెల్లెలి నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి; పురుకుత్సుండు నక్కడ ననేక గంధర్వ నాథుల వధించి తన నాగలోక సంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగి వచ్చె; నా పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననరణ్యుండు, నా యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండుఁ; ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించి; రా సత్యవ్రతుండు త్రిశంకుఁడనం బరఁగె; నతండు.

191

తా ॥ ఆ పిదప, మాంధాత పెద్దకొడుకైన అంబరీషుని, అతని తాత అయిన యువనాశ్వుడు తనకు పుత్రుడు కావాలనే కోరికతో, అతనిని కుమారునిగా గ్రహించాడు. ఈ అంబరీషునికి యువనాశ్వుడనే పుత్రుడు కలిగాడు. ఈయనకు హరితుడు జన్మించాడు. ఆ కారణంగా మాంధాతృ గోత్రానికి అంబరీష, యువనాశ్వ, హరితులు ప్రవర పురుషులైనారు. మాంధాత రెండవ కుమారుడు పురుకుత్సుడు. అతనిని నాగ కుమారులు రసాతల లోకానికి

తీసుకొని వెళ్ళి, తమ చెల్లెలు నర్మద నిచ్చి వివాహం గావించారు. పురుకుత్సుడు అక్కడ గంధర్వరాజులు అనేక మందిని సంహరించాడు. అంతేగాక, తన ఈ నాగలోక సంచారాన్ని తలచుకునేవారికి, సర్పాల వలన ఏ విధమైన హానీ, భయం లేకుండా ఉండే విధంగా నాగలోకవాసుల నుండి వరం పొంది ఆయన ఈ లోకానికి తిరిగివచ్చాడు. ఆ పురుకుత్సునికి త్రసదస్యుడు, అతనికి అనరణ్యుడు జన్మించగా, అనరణ్యునికి హర్యశ్వుడనే కుమారుడు కలిగాడు. అతనికి అరుణుడు, అరుణునకు త్రిబంధనుడు, అతనికి సత్యవ్రతుడు జన్మించారు. ఈ సత్యవ్రతుడే త్రిశంకుడని పేరుపొందాడు.

# హరిశ్చంద్రుని కథ

సీ. గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి
యతని లావున దివిజాలయంబున కేఁగ మన్నింప కమరులు మరలఁ ద్రోయఁ
దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుం డెప్పటి ఘనత మెఱసి
నిలిపె. నాకసమున; నేఁడు నున్నాఁడు త్రిశంకుఁ; డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె

తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి, యాగ దక్షిణామిషమున నఖిలధనముఁ గొల్లఁ
గొని మీఁదఁ గులహీనుఁ గొలువఁబెట్ట, బొంక కలజడిఁ బొందె నా భూవరుండు.



తా ॥ ఆ త్రిశంకుడు గురువు గారి శాపకారణంగా పతితుడై చండాలుడైనాడు. అంతట ఆయన కౌశికుడైన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించి, ఆయన తపోబలం చేత స్వర్గానికి వెళ్ళాడు. అయితే దేవతలు ఆయన రాకను అంగీకరింపక స్వర్గం నుండి త్రోసివేశారు. అంతట అతడు తల్లక్రిందులుగా నేలపై పడిపోయి, కౌశికునికి తన గోడు వెళ్ళబోసుకున్నాడు. అప్పుడు విశ్వామిత్రుడు, పూర్వం వలెనే తన తపోబలంతో అతనిని ఆకాశంలో నిలిపాడు. ఇప్పటికీ ఆ త్రిశంకుడు అక్కడే, ఆకాశంలోనే ఉన్నాడు. అతనికి హరిశ్చంద్రుడు జన్మించాడు. ఆ హరిశ్చంద్రుని కోరి, అతని సర్వసంపదను యాగదక్షిణ నెపంతో గ్రహించి, విశ్వామిత్రుడు కడకు ఆయన్ని చండాలుని సేవలో కుదురుకునేట్లు చేశాడు. ఆయన అలా ఎంత ఇక్కట్టుకు గురి అయినా, అతడు అబద్ధం మాత్రం ఆడలేదు.

వ. అట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృధ్రమ్మవు గమ్మని శపించె. విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబవు గమ్మని శపించెఁ; బక్షి రూపు లయ్యును వైరంబు మానక య య్యిరువురును యుద్ధంబు సేసి; రంత హరిశ్చంద్రుండు పుత్త్రులు లేక నారదు నుపదేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ

జేయ నా వరుణుండు ప్రత్యక్షంబైన నతనికిఁ మ్రొక్కి యిట్లనియె.

193

తా ॥ విశ్వామిత్రుడు, ఇలా హరిశ్చంద్రుణ్ణి ఇక్కట్లకు గురిచేసిన వైనాన్ని తెలుసుకున్న వసిష్ఠుడు ఆయనను గ్రద్దవు కమ్మని శపించాడు. విశ్వామిత్రుడూ వసిష్ఠుని కొంగ వగుదువు గాక అని శపించాడు. అలా వారిరువురూ పక్షి రూపాలు ధరించినా, పూర్వ వైరాన్ని మరువక, మానక యుద్ధం చేశారు.

అది అలా ఉండగా, హరిశ్చంద్రుడు కుమారులు లేకపోవటాన నారదుణ్ణి ఆశ్రయించి, ఆయన ఉపదేశానుసారం వరుణదేవుని ఉపాసించాడు. వరుణదేవుడు ప్రత్యక్షం కాగా ఆయనకు నమస్కరించి హరిశ్చంద్రుడు ఆయనను ఇలా వేడుకున్నాడు:

ఆ. 'వరుణదేవ! నాకు వరవీర గుణములఁ, గొడుకు పుట్టె నేనిఁ గొడుకుఁ బట్టి
పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ, గొడుకు నీఁ గదయ్య కొసరు లేక!

194

తా ॥ "వరుణదేవా! శ్రేష్ఠమైన వీర గుణాలతో నాకు కొడుకు కలిగేట్లు వరం దయచేస్తే, అతన్నే యజ్ఞపశువుగా చేసి నీ కొరకు, నీవు సంతోషించే విధంగా యజ్ఞం చేసి బలి ఇస్తాను. కనుక నాకు దయతో ఆ లోటు లేకుండా పుత్రుని ప్రసాదింపవలసింది" అని ప్రార్థించి అడిగాడు.

వ. అని పలికినం గుమారుండు గలిగెడు మని వరంబిచ్చి వరుణుండు సనియె; నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను కుమారుండు జన్మించె; వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి.

195

తా ॥ హరిశ్చంద్రుని ప్రార్థనను మన్నించిన వరుణదేవుడు అలాగే 'కుమారుడు కలుగును

గాక!' అని వరం అనుగ్రహించి, అంతర్ధానం చెందాడు. వరుణ దేవుని అనుగ్రహ ఫలితంగా ఆయనకు రోహితుడనే కుమారుడు కలిగాడు. అంతట వరుణదేవుడు రోహితుని కోసం వచ్చాడు.

సీ. పురిటిలోపల వచ్చి పుత్త్రువేలుపు మన్నఁ బురుడు వోయినఁ గాని పొసఁగ దనియెఁ; బలురాక మును వచ్చి బాలు వేలుపు మన్నఁ బండ్లు లేకుంట నభావ్యఁ దనియెఁ; బండ్లు రాఁజూచి డింభకుని వేలుపు మన్నఁ బడి పండ్లు రామి నభావ్యఁ దనియెఁ; బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలుపు మన్నఁ బోరుల కొదవక పోల దనిపెఁ;

ఆ. దొడరి యెట్లు గొడుకుతోడి మోహంబునఁ, బ్రొద్దు గడుపుచుండె భూవరుండు
దండ్రి తలఁపు కొలఁదిఁ దనలోనఁ జింతించి, యింట నుండ కడవి కేగెఁ గొడుకు.

196

తా ॥ పురిటి లోపల వచ్చి అన్నమాట ప్రకారం పుత్రుని ఇమ్మంటే, హరిశ్చంద్రుడు పురుడు వెళితే గాని ఇవ్వడం బాగుండదు కదా! అన్నాడు. వరుణుడు కొంతకాలం వేచి ఉండి, దంతాలు రాకముందు వచ్చి అడిగితే, అదెలాగా? దంతాలు రాకుండా బలికి అనర్హుడు కదా! అన్నాడు. అవి వచ్చిన తరువాత అడిగితే, ఇవి పాలపళ్ళే గదా, పెద్ద దంతాలు రానివ్వు, అప్పుడు చూద్దామన్నాడు. సరే అలాగేనని అవి వచ్చిన తర్వాత కొడుకును ఆహుతిమ్మని అడిగితే, యువకుడు కాకుండా, అతడు యుద్ధాల్లో పాల్గొనకుండా ఎలాగన్నాడు. ఇలా అన్నింటికీ అన్నీ చెప్పి హరిశ్చంద్ర మహారాజు కొడుకు మీది మోహంతో, కాలం గడుపుతున్నాడు. కొడుకేమో తండ్రి వరుణదేవునికి తనను బలి ఇస్తారన్న ఆలోచన తెలుసుకొని, తనలో తాను మథనపడి, ఇంటనుండక అడవులకు వెళ్ళిపోయాడు.

వ. ఇట్లు వనంబునకుం జని శరశరాసన ధరుండయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదర వ్యాధిచే బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రా గమకింప నింద్రుండు ముసలి తపసియై వచ్చి యిట్లనియె.

తా ॥ అలా రోహితుడు అడవులకు వెళ్ళి, ధనుర్బాణాలు ధరించి అడవుల్లో సంచరిస్తుండగా, తండ్రి వరుణ పీడితుడై ఉదరవ్యాధితో బాధపడుతున్నాడని తెలిసి, రాజధానికి రావాలని, తండ్రిని చూడాలని అనుకొన్నాడు. అప్పుడతని వద్దకు ఇంద్రుడు ముసలి తాపసి రూపంలో వచ్చి ఇలా అన్నాడు:

ఆ. పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ, గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;
పుణ్యకథలు వినుము భూపాలపుత్రక!, మేలు గలుగునట్టి మేర గలదు.

198

తా ॥ "చూడు, రాజకుమారా! నేనొక మాట చెపుతా విను! నీవు పవిత్రమైన ప్రదేశాలకు వెళ్ళు. పుణ్యతీర్థాల్లో స్నానమాడు. పుణ్యపురుషులైన వారిని దర్శించు. పుణ్య కథలు విను. అలాగైతే నీ తండ్రికి శుభం కలిగే అవకాశం ఉంది" అని చెప్పాడు.

వ. అని యిట్లు మగుడించినం దిరిగి చని రోహితుం డొక్క యే డవ్వనంబునం దిరిగి
క్రమ్మఱఁ జనుదేర నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె; ని వ్విధంబున.

199

తా ॥ అలా ఆ వృద్ధ తాపసి రూపంలోని ఇంద్రుడు రోహితుణ్ణి త్రిప్పి పంపగా అతడు అడవికి చేరి, అక్కడే ఒక ఏడాది గడిపి, తిరిగి నగరానికి తండ్రిగారిని చూడాలని బయలుదేరాడు. మరల ఇంద్రుడు మునుపటి వలెనే వచ్చి అతగాడిని అడ్డుకున్నాడు.

సీ. ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డా బాలు నాఱవయేటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు నెలమి నజీగర్తు మధ్యమ పుత్త్రు సన్మాన్య చరితు
ఘను శునశ్శేపునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;
బురుషమేధము సేసి భూపాల వర్యుఁడు వరుణాది నిఖిల దేవతలఁ దనిపె

తే. హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డొనర భృగువు;, బ్రహ్మ జమదగ్ని; సామంబు పాడువాఁడు ముని వసిష్ఠుఁ డా ముఖమున ముదముఁ బొంది, కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి.

200

తా ॥ ఇలా అయిదేళ్ళపాటు ఇంద్రుడు రోహితుడిని అడ్డుకుంటూ వచ్చాడు. ఆరవ సంవత్సరం అలా తిరిగి వస్తూ, అజీగర్తుడనే వాని నడిమి కుమారుడైన శునశ్శేఫుడనే వానిని యాగపశువు నిమిత్తం తెచ్చి తండ్రి హరిశ్చంద్రునికి అప్పగించాడు. అంతట హరిశ్చంద్రుడు కౌశికుని హోతగా, భృగుమహర్షిని అధ్వర్యునిగా, జమదగ్నిని బ్రహ్మగా, సామవేదం గానం చేయడానికి వసిష్ఠుని నియమించుకొని, వరుణునికి తృప్తి కలిగేట్లు పురుషమేధం గావించాడు. దేవతలనందరినీ తగు విధంగా సంతోషింపజేశాడు. ఇంద్రుడు ఎంతో సంతోషించి, హరిశ్చంద్రునికి బంగారు రథాన్ని బహుమతిగా ఇచ్చాడు."

1. హోత : యజ్ఞం చేయించే వారిలో ముఖ్యుడు. యజ్ఞసమయంలో ఋగ్వేదం పఠించే ఋత్విజుడు లేదా దేవతలను ప్రేరేపించి, యజ్ఞానికి ఆహ్వానించేవాడు. ఇతనికి ముగ్గురు సహాయకులు మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు, గ్రావస్తుతుడు అనే వారుంటారు. కొన్ని సందర్భాల్లో వీరి ముప్పురికి మరో ముప్పురు సహాయకులు బ్రాహ్మణాచ్ఛంసి, అగ్నీధ్రుడు, పోత్రి అనే వారుంటారు. సాధారణంగా వీరు ముగ్గురూ బ్రహ్మకు అనుబంధింపబడతారు. కొన్ని సందర్భాల్లో గ్రావస్తుతునికి బదులుగా, అధ్వర్యుని సహాయకుడైన నేష్ట్రి నియమింపబడవచ్చును. నేష్ట్రిని త్వాష్ట్రి అని కూడా అంటారు. యజ్ఞకర్త భార్యను హోమకుండం వైపుకు తీసుకువెళ్ళటం, సుర తయారుచేయడం ఇతని విధులు.

2. అధ్వర్యుడు : యజ్ఞం చేయించడంలో ఇతడూ ప్రధానుడే. అయితే హోత, ఉద్గాత, బ్రహ్మ అనేవారు నిర్వర్తించే విధుల కంటే ఇతని విధులు భిన్నమైనవి. నిర్దిష్ట ప్రమాణాల మేరకు యజ్ఞవేదికను, శాలను నిర్మించడం, కావలసిన సంభారాలను సిద్ధం చేయడం, అంటే పాత్రలు,

సమిధలు, వేల్వవలసిన ఇతర వస్తువులు, నీరు, యజ్ఞపశువును సమకూర్చడం మొదలైనవన్నీ ఇతని విధులు. ఈ సందర్భంలో యజుర్వేదాన్ని వల్లించడం జరుగుతుంది. ప్రతిప్రస్థాత్రి, నేష్ట్రి, ఉన్నేత్రుడు అనే సహాయకులుంటారు.

3. బ్రహ్మ : ఇతరుల వలెనే ఇతడూ ప్రధానుడే. ఇతడు మహాపండితుడై ఉండాలి. ముఖ్యంగా మూడు వేదాలు తెలిసివుండాలి. అంతేగాక మొత్తం యజ్ఞనిర్వహణను పర్యవేక్షించగలిగి ఉండాలి. దోషాలేమైనా ఉంటే సవరించగలిగి ఉండాలి. ఇతనికి కూడా బ్రాహ్మణాచ్ఛంసి, అగ్నీధ్రుడు, పోత్రి అనే సహాయకులుంటారు.

4. ఉద్గాత : యజ్ఞసమయంలో సామవేదాన్ని వల్లె వేసే వ్యక్తి. ఇతనికి ప్రస్తాత, ప్రతిహర్త, సుబ్రహ్మణ్యుడనే ముగ్గురు సహాయకులుగా వుంటారు. ఈ విధంగా యజ్ఞనిర్వహణకు నలుగురు ప్రధాన యాజ్ఞికులు, వారి సహాయకులు 12 మంది చొప్పున మొత్తం 16 మంది అవసరమవుతారు.

5. సదస్యులు : యజ్ఞాన్ని చూడవచ్చినవారు అనేది సాధారణార్థం. పర్యవేక్షకుని కూడా సదస్యుడంటారు. అంటే ఇతడు 17 వ ఋత్విజుడు. తప్పొప్పులను గమనిస్తూ, దోషాలను సవరించడం ఇతని విధి.

> వ. శునశ్శేఫుని ప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుండైన హరిశ్చంద్రు వలన నత్యంత ప్రీతుండై విశ్వామిత్రుం డతనికి ముఖ్యజ్ఞానంబుఁ గృపసేసిన మనం బన్నమయంబు గావున, నన్న రూపియైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నణంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, తేజంబు వాయువువలనం జేర్చి, వాయువు నాకాశంబునం గలిపి, యాకసంబు దామసాహంకారంబునందు లయంబు జేసి, యహంకారత్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలం పైన మహత్తత్త్వంబునందు విషయాకారంబు నివర్తించి విషయ

వివర్జితుండై పరతత్త్వంబుల నెఱుంగుచు, న య్యేఱుకవలన సంసార హేతువైన ప్రకృతిని భస్మంబుఁ జేసి, యయ్యేఱుకను నిర్వాణ సుఖ పారవశ్యంబునం బరిహరించి, సకల బంధ విముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మానస గోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; నతని కుమారునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంపనామధేయుండు జనియించె; నతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె; నా చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించి; రందు బాహుకుండు.

201

తా ॥ ఇలా చెప్పి, శుకమహర్షి రాజుతో శునశ్శేఫుని మహిమ తరువాత వివరిస్తాను అంటూ ముందు ఈ హరిశ్చంద్రుని వృత్తాంతం పూర్తి గావిస్తానంటూ ఇలా చెప్పసాగాడు:

"భార్యాసహితంగా హరిశ్చంద్రుడు గావించిన దానివలన విశ్వామిత్రుడు ఎంతో సంతోషించి ఆయనకు ప్రధానమైన జ్ఞానం ఎరుకపడేటట్లు చేశాడు. అదేమిటంటే – మనస్సు అన్నమయము. మనస్సుతో అన్నరూపంలోనున్న పృథివిని తెలుసుకోవటం. ఆ పృథివిని నీటితో అణచి, ఆ నీటిని తేజంలో ఇంకించాలి. అప్పుడు దానిని వాయువుతో చేర్చాలి. ఆ వాయువును ఆకాశంలో మిళితం చేయాలి. ఆ ఆకాశాన్ని తామసాహంకారాల్లో కలిపివేయాలి. పిదప ఆ అహంకారత్రయాన్ని మహత్తత్త్వంలో మునిగేట్లు చేయాలి. అలా చేసి ప్రవాహతత్త్వంలో (రససిద్ధిలో) లోకాలను సృష్టించాలి అనే బుద్ధి కలిగితే, మహత్తత్త్వంలో తాను కర్తననే భావం విడనాడి, ఇంద్రియ సంబంధమైన విషయాలను దరిచేరనీయక పరతత్త్వాన్ని ఎరిగి, ఆ జ్ఞానంతో సంసారానికి హేతుభూతమైన ప్రకృతి తత్త్వాన్ని రూపుమాపి, ఆ ఎరుకను మోక్షసుఖ పారవశ్యంతో పోగొట్టుకొని, సకల బంధనాల నుండి విముక్తుడు కావాలి. ముఖ్యజ్ఞానం అంటే ఇదే. దీనిని ఆకళింపు చేసుకున్న హరిశ్చంద్రుడు, మాటతో, మనస్సుతో చెప్పడానికి సాధ్యం కాని రూపంతో వెలుగొందాడు.

హరిశ్చంద్రుని కుమారుడు రోహితునికి హరితుడు జన్మించాడు. ఆ హరితునికి చంపుడు అనేవాడు జన్మించాడు. అతడు తన పేరుతో చంపానగరాన్ని నిర్మించాడు. ఆ చంపునికి సుదేవుడు జన్మించగా, అతనికి విజయుడు, విజయునికి రురుకుడు, అతనికి వృకుడు, వృకునికి బాహుకుడు జన్మించారు.

# సగర చక్రవర్తి కథ

సీ. దండించి పగవారు దనభూమిఁ జేకొన్న నంగనలును దాను నడివి కేఁగి
యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన నాతని భార్య దా ననుగమింపఁ
గదియుచో నా స్త్రీకి గర్భంబు గలుగుట యౌర్వమునీశ్వరు డాత్మ నెఱిఁగి
వారించె; నంత న వ్వనజాక్షి సవతులు సూలు నిండారినఁ జూడఁ జాల

తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి విషము వెట్టిరి; పెట్టిన విరిసి పడక
గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టి, వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె.

202

తా ॥ వారిలో బాహుకునిపై శత్రువులు దండెత్తి ఆయన రాజ్యాన్ని కైవశం చేసుకోవటంతో ఆయన భార్యలతో అడవుల పాలై, వృద్ధుడై అక్కడే చనిపోయాడు. ఆయన భార్య ఆయనతో సహగమనం చేయబోగా, ఆమె గర్భవతి అని తెలుసుకున్న ఔర్వ మహాముని ఆమెను అలా చేయవద్దని వారించాడు. అంతట ఆమెకు నెలలు నిండగా, ఆమె సవతులకు అది గిట్టక ఆమె ఆహారంలో విషం కలిపి పెట్టారు. అయినా ఆమెకు ఏమీ జరుగకపోగా ఆ గరమును (విషంతో) కూడి సగరుడు అనే కుమారుడు జన్మించి, గొప్ప యశస్సును ఆర్జించిన చక్రవర్తి అయ్యాడు.

శా. చండస్ఫూర్తి నతండు తండ్రివగకై సంగ్రామరంగంబులం
జెండెన్ హైహయబర్బరాదుల; వధించెం దాళజంఘాదులన్;
ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సబీభత్సులై
యుండం జేసె నిజారులన్ సగరనామోర్వీ విభుం డల్పుఁడే.

203

తా ॥ ఆ సగరుడు బహు విక్రమంతో తండ్రి పగతీర్చటం కొరకు హైహయ, బర్బరులపై

దండెత్తి కదనరంగంలో వారిని సంహరించాడు. తాళజంఘాదులను తలలు గొరిగించి, బట్టలూడదీయించి, వికృత రూపులునుగా చేసి విడిచిన ఆ సగరుడు సామాన్యుడు కాదు సుమా !

క. ఖగరాజరుచులు గల యిల, పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్ నగరాజధీరు శూరున్ , సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్.

204

తా ॥ సూర్యుని కాంతి ప్రసరించే, సప్తద్వీపవిలసితమైన ఈ భూమండలంలోని శత్రురాజులనందరినీ తన బాహు పరాక్రమంతో జయించి, పాలించిన మేరునగధీరుడూ, శౌర్యశాలీ అయిన సగరుడు ప్రశంసార్హుడు కదా!

సీ. ఔర్వుండు సెప్పంగ నమర వేదాత్మకు హరినీశు నమృతు ననంతుఁ గూర్చి;
వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె నం దొక్క ముఖమున హయము విడువ
నగభేది గొనిపోయి నాగలోకంబునఁ గపిలుని చేరువఁ గట్టి తొలఁగె;
నంత గుఱ్ఱము గాన కా రాజు దనపుత్ర నివహంబు దిశలకు నెమకఁ బంప

తే. వారు నిల యేడుదీవుల వరుస వెదకి, మఖతురంగంబు లేకున్న మగుడి రాక
ప్రాభవంబున దోర్దండబలము మెఱసి, గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల.

205

తా ॥ ఔర్వమహర్షి ఆదేశానుసారం అతడు, వేదాత్మకుడు, హరి, జగన్నాయకుడు, మహాదేవుడు, అనంతుడు అయిన శ్రీమహావిష్ణువు ప్రీత్యర్థం అశ్వమేధ యాగాలు అనేకం చేశాడు. అలా చేసిన యాగాల్లో ఒక యాగంలో విడిచిన గుఱ్ఱాన్ని ఇంద్రుడు తీసుకొనిపోయి నాగలోకంలో కపిలమహర్షి సమీపంలో కట్టివేసి, తన దారిని తాను వెళ్ళాడు. ఎంతకాలానికీ గుఱ్ఱం జాడ తెలియకపోవటంతో సగరుడు తనకు సుమతి యందు జన్మించిన కుమారులను గుఱ్ఱాన్ని వెదికితెచ్చే నిమిత్తం పంపాడు. వారు యజ్ఞాశ్వం కొరకు ఏడులోకాలూ గాలించారు.

కాని ఎక్కడా కనిపించలేదు. అయినా వారు తమ ప్రయత్నాన్ని విడువక, తమ చేతుల సత్తువ కొద్దీ భూమిని త్రవ్వారు.

వ. ఇట్లు సుమతికొడుకులు నేలం ద్రవ్వి పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగంబునం గపిలముని పొంతనున్న తురంగంబుఁ గని.

206

తా ॥ అలా, ఆ రాజపుత్రులు భూమిని త్రవ్వి, పాతాళ లోకంలో ఈశాన్యదిశన కపిలమహర్షి సమీపంలోనున్న గుఱ్ఱాన్ని చూశారు.

చ. 'ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి? గుఱ్ఱపు దొంగ వీఁడె; యీ
జఱభునిఁ బట్టి చంపు; దతిసాధు మునీంద్రుఁడువోలె నేత్రము
ల్దెఱవక బాకినోరు మెదలింపక బైసుకపట్టె' నంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్.

207

తా ॥ చూసి, ఇంకేం ఇతడే గుఱ్ఱాన్ని దొంగిలించింది. పైగా ఏమీ ఎరుగనట్లు పెద్ద సాధువైన మునీంద్రుడు లాగా కళ్ళూ, బాకినోరూ మూసుకొని పెద్ద నియమవంతుడు లాగా బాసిపట్టు వేసుకుని నంగనాచి వలె కూర్చున్నాడు. వీడొక పెద్ద దొంగ. ఇక ఆలస్యం చేయడం అనవసరం అంటూ అరవై వేల మందీ ఆయన్ని చంపడానికి కత్తులు ఝళిపించి, ఆయన మీదకు వెళ్ళబోయారు.

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగా దమ మేనుల మంట పుట్టి తా
రపగతధైర్యులై పడి యహంకరణంబున మూఢచిత్తులై
నృపసుతు లందఱున్ ధరణి నీఱయి రా క్షణమంద; సాధులం
దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్ములు నిల్వనేర్తురే?

208

తా ॥ ఆ క్షణంలో కపిలమహర్షి కళ్ళు తెరిచాడు. అంతే! వారి శరీరాల్లో మంటలు పుట్టాయి. వారి మూర్ఖత్వం, వారి గర్వం వారి చేత అంతపనికి నెట్టుకొనేట్లు చేసింది. వారు ఆ క్షణంలో కాలిపోయి బూడిదరాసులై పోయారు. అవును అదంతే గదా! ఒళ్ళు కొవ్వెక్కి సాధువుల్ని, తాపసుల్ని ఇబ్బందిపెట్టే వారు భూమిపై అకాలంగా చెల్లిపోకుండా ఎలా ఉంటారు గనుక!

సీ. కొందఱు కపిలుని కోపానలంబున ౖమందిరి సగరకుమారు లనుచు
నందు రాముని శాంతుఁ డానందమయమూర్తి తొడరి కోపించునే? దువ్వనేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున? నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యు భయమును లంఘింతు రా బుద్ధిఁ జేయు పరాత్మ భూతుఁ

తే. డఖిలబోధకుఁ డతనికి నరసి చూడ, సఖు లమిత్రులు నెవ్వరు? సగరసుతులు
దాము దమచేయు నేరమి దనువులందు, ననలకీలలు వుట్టి నీఱైరి గాక.

209

తా ॥ ఇది తెలిసిన కొందరు, సగరుని కుమారులు కపిల మహర్షి కోపానికి ఆహుతై పోయారు అంటారు కాని, ఆ ముని పరమశాంతుడు, ఆనందమూర్తి, ఆయనకు కోపం రావటమేమిటి? దుమ్మూ ధూళి భూమి మీద పుడతాయి గాని, ఆకాశంలో పుడతాయా ఏమి? సాంఖ్యాన్ని అవలంబించే జ్ఞానమూర్తులు సంసారసముద్రాన్ని, మృత్యుభయాన్ని అవలీలగా దాటిపోతారు గదా! ఆ చింతనలో ఉండే ఆ కపిలమహర్షికి, ఆ పరాత్మభూతునికి, ఆ జ్ఞాన బోధకునికి అయిన వారెవరు? కాని వారెవరు గనుక! సగరుని కుమారులు తమంత తాముగా చేసుకున్న దాని ఫలితంగా వారిలోనే మంటలు చెలరేగాయి. ఆహుతైపోయారు తప్ప, ఇందులో ఆ మహర్షిని అనవలసిందేమి లేదు సుమా!

వ. మఱియు, సగరుండు గేశినియందుఁ గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమంజస గుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుఁడై యుండి, సంగదోషంబు వలన యోగ భ్రష్టుండయి, సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబు వారలకుఁ దమవారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు, నొక్కనాఁడు.

210

తా ॥ సగరుని మరోభార్య కేశిని. ఆమెకు అసమంజసుడనే కుమారుడు జన్మించాడు. అతడు పూర్వజన్మలో యోగీశ్వరుడై ఉండి కూడా యోగ్యమైన గుణాలు లేక, సంగదోషం చేత యోగభ్రష్టుడై ఇప్పుడు ఇలా కేశినీ సగరులకు జన్మించాడు. పూర్వజన్మలో సంభవించిన ఘటనలన్నీ జ్ఞాపకం ఉండటం వల్ల అతడు మళ్ళీ బంధాలలో చిక్కుకోకుండా కన్నవారి పట్లనేమి, ఇతరుల పట్లనేమి దురుసుగా ప్రవర్తిస్తూ, అల్లరిచిల్లరగా తిరుగుతూ వుండేవాడు. ఎవరికీ అతనంటే పడేది కాదు.

చ. వరుస నయోధ్యలోనఁ గల వాడల నాడెడు పిన్నవాండ్ర నా
సరయువులోన వైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ
డురుమతిఁ గొన్ని ప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం
దిరిగి పురంబు లోపలికిఁ దెచ్చిన నివ్వెఱగంది రందఱున్.

211

తా ॥ వాడు ఒకసారి, అయోధ్యలో తనతో కూడి ఆడే పిల్లలనందరినీ సరయూ నదిలోనికి త్రోసివేశాడు. పిల్లల తల్లిదండ్రులూ, కన్నతండ్రి సగరుడూ అతన్ని అనేక విధాలుగా తిట్టిపోశారు. కొన్ని దినాలకు యోగబలం కారణంగా అతడి బుద్ధిలో మార్పురావడమే గాక, సరయువులోనికి త్రోసివేసిన పిల్లలనందరినీ తిరిగి పట్నంలోనికి తీసుకు వచ్చాడు, జనమంతా ఆశ్చర్యపోయారు.

వ. ఆ య్యసమంజసుని కొడుకు అంశుమంతుం డనువాఁడు వినీతుండై, తనయొద్దఁ

బనులు సేయుచుండు నంత సగరుం డమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన నతండు దమతండ్రుల చొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి, యందు భస్మరాసుల పొంత నున్న హయంబునుం గని, హయసమీపంబునం దున్న కపిలాఖ్యుండైన విష్ణునికి దండప్రణామంబు సేసి, యిట్లని స్తుతియించె.

212

తా ॥ ఆ అసమంజసుని కొడుకు అంశుమంతుడు. అతడు చాలా యోగ్యుడు. తాత సగరుడు చెప్పిన పనులన్నీ చక్కబెడుతూ ఉండేవాడు. ఒకనాడు సగరుడు మనుమని పిలిచి యాగాశ్వాన్ని వెదకి తెమ్మన్నాడు. అతడు అలాగేనంటూ తన తండ్రులు వెళ్ళిన మార్గం వెంట వెళ్ళి, వారు త్రవ్విన మహాగర్తం లోనికి ప్రవేశించి, బూడిదరాసుల సమీపంలోనున్న గుఱ్ఱాన్ని చూసి, ఆ సమీపంలో కపిల నామంతో ఉన్న శ్రీ మహావిష్ణువుకు దండప్రణామాలు ఆచరించి, ఆయనను స్తుతించాడు.

సీ. మతిసిక్కఁబట్టి సమాధి గౌరవమున వ్రాలియు దనకు నవ్వల వెలుంగు
నినుఁ గానఁ డొకనాఁడు ని న్నెఱుంగునె? బ్రహ్మ యజుని మనంబున నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు హీనులమైన మా కెఱుఁగ వశమె?
తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములు చూతురు గుణములైనఁ

తే. గాన రొకవేళ జీఁకటిఁ గందు రాత్మ, లందుఁ దెలియరు వెలుపల నమరు పొందు
లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ, గడిఁది నీ మాయ నెన్నఁడు గడవలేక.

213

తా ॥ మహానుభావా! చిత్తాన్ని ఎటూ పోనీయక స్థిరంగా నిలిపి, సమాధి స్థితిని పొంది, తనకు మించిన వెలుగుతో ప్రకాశిస్తున్న నిన్ను ఎన్నడూ తెలుసుకొన్నది లేదు బ్రహ్మ. అయినప్పుడు విష్ణువు మహాభీష్టం ప్రకారం, ఆయన అవయవాల నుండి, బుద్ధి నుండి జన్మించిన జంతుకోటిలో హీనులమైన మాకు, నిన్ను తెలియటం – మా వల్లనవుతుందా? వారిలోనే

నీవున్నావు. అయినా వారు నిన్నెరుగరు గదా! బాహ్యములైన ప్రకృతి గుణాలను బట్టి పోల్చుకుంటారు. కాని ఆ గుణాలు కల్పించిన మాయకు చిక్కి బాహ్యమునే చూతురు గాని తమయందు అంతర్యామిగానున్న నిన్ను తెలుసుకొనలేరు."

వ. అని వినుతి సేయుచు, హయంబు విడువుమని చెప్పక తన తండ్రులు నీ ఱగుటం దడవక, మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుండగు గపిలుం డిట్లనియె.

214

తా ॥ అని అలా స్తుతిస్తూ, గుఱ్ఱాన్ని విడువుమని గాని, తన తండ్రులు భస్మమైపోయిన విషయాన్ని గాని ప్రస్తావించక, నమస్కరించి నిలిచివున్న అంశుమంతుని చూచి దయాసముద్రుడైన కపిలమహాముని ఇలా అన్నాడు:

క. 'గుఱ్ఱము గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ! మీ తాతయొద్దకున్ నీతండ్రుల్ వెఱ్ఱులు నీఱై రదె! యీా, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్.'

215

తా ॥ "అబ్బాయి! గుఱ్ఱాన్ని తీసుకుపోయి నీ తాతగారికి అప్పగించు. నీ తండ్రులు అవివేకులై – చూడు, బూడిదైపోయారు. ఆ బూడిద కుప్పలపై గంగాజలం ప్రవహిస్తే అంతా శుభం అవుతుంది సుమా!"

వ. అని పలికిన, నమస్కరించి, తురగంబుఁ గొనివచ్చి యా సగరున కిచ్చిన సగరుం డా పశువు వలన జన్నంబు కడమ నిండించి, యంశుమంతునకు రాజ్యం బిచ్చి, ముక్తబంధనుండై, యౌర్వుండు సెప్పిన మార్గంబున నుత్తమ గతికిం జనియె నంత.

216

తా ॥ అని మహాముని చెప్పగా, అంశుమంతుడు ఆయనకు నమస్కరించి, గుఱ్ఱాన్ని తెచ్చి

తాతగారికి అప్పగించాడు. అంతట సగరుడు దానితో అశ్వమేధ యజ్ఞాన్ని పూర్తి గావించి, రాజ్యాన్ని అంశుమంతునికి అప్పగించి, అన్ని భవబంధాల నుండి విముక్తుడై, ఔర్వమహర్షి ఉపదేశించిన మార్గాన నడచుకొని, ఉత్తమగతులకు వెళ్ళిపోయాడు.

క. జనకులు ప్రగ్గిన చోటికి, ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిన్ జని తపము సేయఁ
జాలక, మనమున వగ లొలయ నంశుమంతుఁడు దీఱెన్.

217

తా ॥ అంతట అంశుమంతుడు, తండ్రులు భస్మమైపోయిన చోటికి దేవనది గంగను తెస్తాను గాక అని అనుకొని తపస్సు చేయడానికి అడవి దారి పట్టాడు గాని, తపస్సు చేయలేక మనోవ్యథలకు చిక్కి, కాలం తీరి, తనువు చాలించాడు.

క. ఆతనికొడుకు దిలీపుఁడు, భూతలమున గంగఁ దెచ్చి పొందించుటకై
ప్రీతిం దపంబు సేయుచు, భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్.

218

తా ॥ అంశుమంతుని కుమారుడు దిలీపుడు. ఆయన ఎలాగైనా ఆకాశగంగను భూమార్గం పట్టించాలనే పట్టుదలతో తపస్సు చేశాడు. కాని ఆ పని చేయలేక ఆయనా కడతేరిపోయాడు.

## భగీరథుని ప్రయత్నము

క. అతని సుతుండు భగీరథుఁ, డతితప మొనరించి కనియె నమృతాపాంగన్ సుతరంగన్ ముఖవనరుహ, రతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్.

219

తా ॥ దిలీపుని కుమారుడు భగీరథుడు. అతడు ఘోరమైన తపస్సు చేసి, కడకన్నుల్లో దయామృతాన్ని నింపుకున్నదీ, ఉప్పొంగే అలలతో నిండి ఉన్నదీ, ముఖపద్మంపై తుమ్మెదల బారులవంటి ముంగురులతో శివుని జటాజూటంలో నాట్యం చేయనున్న గంగను దర్శించాడు.

వ. కని నమస్కరించిన గంగ కృపసేసి, వరంబు వేఁడు మనిన, నా రాచపట్టి యిట్లనియె.

220

తా ॥ చూసి నమస్కరించగా, గంగాదేవి దయ నిండారగా అతనితో వరం కోరుకోమని చెప్పింది. అంతట ఆ రాకుమారుడు భగీరథుడు ఇలా అన్నాడు:

క. మా వారి భస్మరాసుల, నీ వారిం గలిపికొనుము; నెఱి మావారల్ నీ వారిఁ గలయ నాకము, మావారికి గలుగు; నిది ప్రమాణము తల్లీ!

221

తా ॥ “తల్లీ! మా వారు భస్మరాసులై పడి ఉన్నారు. వారిని నీ పావన జలధారలతో ముంచెత్తితే, వారు నీ నీట కలిసి స్వర్గాన్ని పొందుతారు. ఇది యథార్థం.”

ఇంద్రవజ్ర.

చెల్లన్ మది న్ని న్ను భజింతు గంగన్, ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్ గల్లోల లక్ష్మీజితకాశమల్లిన్, దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్.

222

తా ॥ అని ఇలా స్తుతించాడు: "అమ్మా! పెద్ద మనస్సు గలదానివి, సకల పుణ్యాలకు ఆటపట్టైన దానివి. ఎగసెగసి పడే నీ ప్రవాహంలో రాజహంసలు విహరిస్తాయి. విద్వాంసుల పాలిట కల్పలతమా, మాతృస్థానీయురాలమా అయిన నిన్ను నా మదిలో ఎల్లప్పుడు ధ్యానిస్తూ ఉంటాను."

వ. అని వినుతులు సేయుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె.

223

తా ॥ అంటూ స్తుతిస్తున్న భగీరథునితో లోకాలకు పావనత్వాన్ని అబ్బించే గంగామాత ఇలా అంది:

మ. వినువీథిం బఱతెంచి నేలఁబడ నా వేగంబును న్నిల్ప నో
పిన వాఁడెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళమున్
జనుదున్; వచ్చితినేని నా జలములన్ సుస్నాతులై మానవుల్
ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబుఁ బొందించెదన్.

224

తా ॥ "నాయనా! ఒకవేళ నీ మనవి ప్రకారం, ఆకాశం నుండి నేలకు దిగివస్తానే అనుకో, కానీ నా వేగాన్ని ఆపగలవాడెవడు? భూమిని ఛేదించి నేను పాతాళానికి వెళ్ళిపోతాను. అదీగాక భూలోకంలోని జనులు నా యందు స్నానంచేసి, తమ పాపాలను నాకు అంటగడతారు. వాటిని నేను ఎక్కడ, ఎలా వదిలించుకోవాలి?

వ. అది కారణంబుగా విచారించెదనని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె.

తా ॥ ఈ కారణాల వలన, ఎలాగా అని ఆలోచిస్తున్నాను" అని లోకమాత అనగా ఆ రాకుమారుడు ఇలా అన్నాడు:

మ.పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపః పారీణు లార్యుల్ ఘనుల్
పురుష శ్రేష్ఠులు వచ్చి తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా
నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘ సం
హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దా నై యుంట మందాకినీ!

226

తా ॥ "అమ్మా! మందాకినీ! పాపాలు అంటుతాయని గదా మీరంటున్నది. పరతత్త్వ స్వరూపం తెలిసిన వేదాంతులు, శాంతత్వాన్ని నిలుపుకున్న మహామనీషులు, తపోధనులూ, గౌరవాధ్యులూ అయిన మహానుభావులెందరో నీ జలాలలో స్నానమాడుతున్నప్పుడు, సాధారణ జనుల పాపాలు నిన్నెలా, ఎందుకు అంటుతాయి తల్లీ! ఎలాగంటావా – జగన్నాథుడూ, సకల పాపాలను హరింప సమర్థుడూ, అయిన శ్రీ మహావిష్ణువు వారి మనస్సుల్లో తానై స్థిరంగా కొలువై ఉన్నాడు కదా తల్లీ!

మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటం దా నిన్నిటం గల్గుటన్
జననీ! తంతువులందుఁ జీర గల యాచందంబునన్ విశ్వ భా
వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీ వారి న్ని వారింప నే
ర్చిన వార్వెరు; నిన్ ధరించు కొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్.

227

తా ॥ అమ్మా! మరొక మాటన్నావు. నీ వేగాన్ని ఆపగల వారెవ్వరని! అయితే నాదొక మాట మన్నించు తల్లీ! దారాలలో వస్త్రమున్నట్లుగా ఈ సకల భువనాలను కల్పించి, వాటి

అన్నింటా తానే వున్న, విశ్వభావనుడైన ఆ పరమేశ్వరుడు తప్ప నీ ప్రవాహవేగానికి అడ్డుకట్ట వేయగలవారు మరెవ్వరున్నారు గనుక! దాని కొరకుగా నేను ఆ శ్రీకంఠుని ఆరాధిస్తాను గాక!"

వ. అని యెఱింగించి వీడ్కొని, చని, భగీరథుండు మహేశ్వరు నుద్దేశించి, గ్రద్ధనఁ దపంబు సేసిన.

228

తా ॥ అని మనవి చేసి, ఆమె వద్ద సెలవు పొంది, భగీరథుడు శివుని గూర్చి తపస్సు చేయనారంభించాడు.

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ, రథుని మెచ్చి నిజశిరంబునందు శౌరిపాదపూత సలిల యై దివి నుండి, ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు.

229

తా ॥ భక్తవత్సలుడైన ఆ పరమేశ్వరుడు భగీరథుని పూనికను ప్రశంసించి, అతని అభీష్టం మేరకు, విష్ణుపాదోద్భవి అయిన ఆ పవిత్ర గంగానదిని దివి నుండి భువికి దిగి వచ్చే వేళ తన శిరస్సునందలి జటాజూటంపై ధరించాడు.

# గంగా ప్రవాహ వర్ణన

వ. ఇ ట్లమ్మహానది, పురారాతి జటాజూట రంధ్రంబు వలన దిగంబడి, నిరర్గళ ప్రవాహంబై, నేలకు జల్లించి నెఱసి, నిండి, పెల్లువెల్లిగొని, పెచ్చు పెరిఁగి, విచ్చలవిడిం గ్రేపువెంబడి నుఱక క్రేళ్ళుఱుక మఱక ప్రాయంపుఁ గామధేనువు చందంబున ముందఱికి నిగుడుచు, ముద్దుఁ జందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్యనదరి చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబు కైవడిఁ బెంపుగలిగి, మహేశ్వరు వదన గహ్వరంబు వలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్ద బ్రహ్మంబు భంగి నదభ్రవిభ్రమంబై య మ్మహీపాల తిలకంబు తెరువువెంట నంటివచ్చు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును, వఱద మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగట నర్ధోన్మీలిత కర్పూర తరుకిసలయంబుల్ గేలిగొను సుళ్ళును, సుళ్ళ కెలంకుల ధవళ జలధర రేఖాకారంబులు బాగు మెచ్చని నిడుదయేఱులును, నేఱులం గలసి వాయువశంబున నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి, మీఁది కెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబుల కొనల భిన్నభిన్నంబులై కుప్పించి, యుప్పరం బెగసి; ముత్తి యంపు సరుల వడువున, మల్లికాదామంబుల తెఱంగునఁ, గర్పూరఖండ కదంబంబుల చెలువంబున, నిందు శకలంబున తేజంబునఁ, దారకా నికరంబుల పొలుపున మెఱయుచు; ముక్తి కన్యా వశీకరంబులైన శీకరంబులునుం గలిగి మధ్యమలోక శ్రీకరంబై, శ్రీకరంబు తెఱంగున విష్ణుపదంబు ముట్టి, విష్ణు పదంబు భాతి నుల్లసిత హంస రుచిరంబై, రుచిరపక్షంబురీతి నతిశోభిత కువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రాభిరామంబై, రామచిత్తంబు వెలఁపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కభయప్రదాన చణంబై, ప్రదాన చణవర్తనంబుభాతి సముపాసిత

మృత్యుంజయయంబై, మృత్యుంజయు రూపంబుపోలిక విభూతి సుకుమారంబై, కుమారచరిత్రంబుతేవను గ్రౌంచప్రముఖవిజయంబై, విజయ రథంబుభాతి హరిహయామంథరంబై, మంథరవిచారంబు గ్రద్దన మహారామ గిరివన ప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపిత మకరంబై, మకర కేతనుబాణంబు కైవడి విలీన పరవాహినీకలిత శంబరంబై, శంబరారాతి చిగురుఁ గుంతంబుసూడి నధ్వగవేదనా శమనంబై, శమనదండంబు జాడ న్నిమ్నోన్నత సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడిఁ గలిగి సదా గురులఘు వాక్యచ్ఛటా పరిగణితంబై, గణితశాస్త్రంబు కొలఁదిని ఘనఘనమూల వర్గమూల సంకలిత భిన్న మిశ్ర ప్రకీర్ణ ఖాతభీష్మంబై, భీష్మపర్వంబు పెంపున ననేక భగవద్గీతంబై, గీతాశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను ఘన నానాశబ్దంబై, శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చువడి హల్లు గలిగి, మహాభాష్య రూపావతారవృత్తి వృద్ధిగుణసమర్థంబై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్య గుణ విశేషంబై, శేషవ్యాపారంబు కరణిని సుస్థిరోద్ధరణ తత్పరంబై, పరబ్రహ్మంబు గరిమ నతిక్రాంతానేక నిగమంబై, నిగమంబు నడవడిని బ్రహ్మవర్ణ పద క్రమసంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరిపాటిని కర్కట మీన మిథున మకర రాశి సుందరంబై, సుందరి ముఖంబు పోఁడిమిని నిర్మల చంద్రకాంతంబై, కాంతాధరంబు రుచిని శోణచ్ఛాయావిలాసంబై, విలాసవతి కొప్పు నొప్పునఁ గృష్ణనాగాధికంబై, యధికమతి శాస్త్ర సంవాదంబు సొంపున నపార సరస్వతీ విజయవిభ్రమంబై, విభ్రమవతి చనుదోయి పగిది నిరంతర పయోవ్యాప్తాఖిలలోక జీవన ప్రదతుంగ భద్రాతిరేఖా సలలితంబై, లలితవతి నగవు మించు నపహసిత చంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖల కన్యకావిస్తారం బై, తారకెంగేలి యొడికంబున నాక్రాంత సూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబు పోలిక భీమరథ్యాటోపవారణంబై, వారణంబుపరుసునం బుష్కరోన్నత సంరంభంబై, రంభ నెమ్మొము డాలున సురసాతిశయ దశంబై, దశరథ తనయు బొమముడి చాడ్పున సింధుగర్వ ప్రభంజనంబై, ప్రభంజనతనయు గదపెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన

దుర్మద నివారకంబై, వార కన్యక ముంజేతి గతిని ముహుర్ముహు రుచ్చలిత కంకణాలంకృతంబై, కృతయుగంబు నోజ నపంకంబై, పంకజాసన ముఖంబు నఱపునఁ బ్రభూతముఖవర్ణంబై, వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘబిందు విసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబు సొబగున మహానందనందనంబై, నందవనంబు పొందున విహరమాణ కౌశికంబై, కౌశికహయంబు రీతి సుదశధ్రువంబై, ధ్రువుతలంపు క్రియం గ్రియాపరిశీలత విశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునఁ బ్రముదిత నరంబై, నరసింహ నఖరంబుల భాతి నాశ్రిత ప్రహ్లాద గురువిభవ ప్రధానంబై, దానకాండంబు సిరిం గామధేను కల్పలతాద్యభినవంబై, నవసూతికాకుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనంబై, ధనదు నిలయంబు తూనికను సంభృత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై, కచ్ఛప కర్పరంబు బలిమిని పతితశైల సముద్ధరంబై, ధరణీధరంబు సాటి నుత్తుంగ తటముఖ్యంబై, ముఖ్య వరాహంబు గరిమ నున్నతక్షమంబై, క్షమాసుర హస్తంబు గరగరికను సత్పవిత్ర మనోభిరామంబై, రామచంద్రుబాణంబు కడింది నభ్యాగత ఖరదూషణ మదాపహరణ ముఖరంబై, ముఖర రామ కుఠారంబు రీతిని భూభృన్మూలభేదన ప్రబలంబై, బలరామ హలంబుభాతిని బ్రతికూల సన్నికర్షణ ప్రబుద్ధంబై, బుద్ధదేవుని మేని యొఱపున నభియాతి రక్షోదార మనోహరంబై, హరతాండవంబు మేర నుల్లసి తానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతి మంగళ ప్రదంబై, ప్రదాత యోఁగి సూటి నర్థపరంపరా వామనంబై, వామన చరణరేఖను బలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబు మార్గంబున సామ భేద మాయోపాయ చతురంబై, చతురాననాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానంబై, మానిని యన లోఁతు సూపక, గరితయన సడిచప్పుడు సేయక, ముగుద యన బయలుపడక, ప్రమద యనఁ గ్రయ్యఁ బాఱుచుఁ బతివ్రత యన నిట్టట్ట సనక, తల్లి యన నెవ్వియైన లోఁగొనుచు, దైవంబన భక్త మనోరథంబు లిచ్చుచు, నంతకంతకు విస్తరించి గుటి గడచి, యవాఙ్మనస గోచరంబై ప్రవహించి.

తా ॥ అలా ఆ మహా ప్రవాహం, పరమేశ్వరుని జటాజూటం నుండి ఒక అడ్డు అంటూ లేక భూమికి అవతరించి, నిండుగా పెద్ద వరద రూపెత్తి, ఉరవళ్ళు పరవళ్ళతో, కామధేనువు తన తొలిచూలు కోడెదూడ చెంగనాలు వేస్తూ పరుగెడుతుంటే దాని వెంట వెంటే ఉరుకుతున్నట్లు మున్ముందుకు సాగుతూ; ముద్దులు మూట గడుతూ, పున్నమినాటి చంద్రుడు ఉదయిస్తున్న వేళ, అతనిపై మమకారంతో సంతోషాన పాలసంద్రము ఉప్పొంగగా; దాని ఒడ్డున తీర్చిన రేఖలాగా తెట్టకట్టిన నురుగువలె; మహేశ్వరుని నోట వెలువడ్డ ఓంకార ప్రణవనాద శబ్ద బ్రహ్మపు తరంగాలవలె, ఆ భగీరథ మహారాజు ప్రయాణిస్తున్న మార్గాన్ని వెన్నంటి; ఐరావతపు తొండాలను అనుకరిస్తున్న వరద ప్రవాహాలు, ఆ ప్రవాహ ముఖాలతో అక్కడక్కడ అప్పుడప్పుడే ఈడేరిన సరస్వతీదేవి చనుకట్టు ప్రమాణంలో పుట్టిన నీటి బుడగలు; ఆ బుగ్గలనంటి పారిజాత పుష్పాల గుత్తుల సొబగును ధిక్కరిస్తున్న తెల్లని నురుగు; ఆ నురుగుల నంటి కర్పూర వృక్షశాఖల నుండి అప్పుడప్పుడే పొటమరిస్తున్న లేచివుళ్ళ అందాలను అధఃకరిస్తున్న నీటిసుడులు; ఆ వెనుక తెలిమబ్బుల రేఖలను త్రోసిరాజంటున్న పెను ప్రవాహపు చాళ్ళు; గాలి తాకిడికి అవి ఒకదాని నొకటి ఒరుసుకోవడం కారణంగా పాపాలను మటుమాయం చేయ సామర్థ్యంతో మింటికెగసిన అలలు; అవి ఒకదానితో ఒకటి ఢీకొన్న కారణంగా, ఛిన్నాభిన్నమై ముత్యాల దండల, కర్పూరశకలాల, చంద్రకాంత శిలాఖండాల, నక్షత్ర సమూహాల ప్రకాశాన్ని తలపింపచేస్తూ, ముక్తికాంతను వశీకరింప చేసుకోవడానికి చిలకరిస్తున్న పన్నీటి జల్లులను తలపిస్తూ ఆకాశానికెగసిన నీటి తుంపురులు; మానవలోకానికి శుభాన్ని ఆపాదింపగోరి, శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి సేవకు పాత్రమైన తన శ్రీపాదంతో ఆకాశాన్ని ఆక్రమించినట్లు అంత ఎత్తుకు ఎగసిపడుతూ, విష్ణుపాద కమలాలు పరమహంసలైన మహామనీషులకు ఎలా నెలవో అలా విష్ణుపాదోద్భవియైన గంగ హంసల సమూహాలకు నెలవై; శుక్లపక్షపు వెన్నెల వెలుగులో నల్ల కలువలు వికసించిన రీతిగా బహుప్రాణి కోటితో విలసిల్లుతున్న భూమండలంవలె; బహు జల ప్రాణులకు జీవనాధారమై విస్తృత పరిమాణంలో జీవనాన్ని (జలాన్ని) కలిగి; సుమనో

వికాస ప్రఫుల్లమవుతూ, శ్రీ మహాభారతంలోని ఆది, సభాపర్వాలు ఏకచక్రపురంలో సంభవించిన భీమ బకాసుర యుద్ధం, సుభద్రార్జున పరిణయ ఘట్టాలతో ఎలా శోభావహమైనాయో అలా బకకచ్చాన్ని తత్పరిసరపర్వత ప్రాంతాలను చుట్టి, అర్జునా (బహుదా) నదిని విలీనం చేసుకొని అభిరామమై, రామచంద్రుని అభీష్టాన్ని అనుసరించి ఆయన పక్షంలో చేరిన దుష్టనిశాచరులకు ఆయన తన పాదపద్మాల వద్ద అభయమిచ్చినట్లుగా తనలో విలీనం కాదలచిన ప్రవాహాలకు అభయప్రదానం గావిస్తున్న పాయలు కలదై, అభయ ప్రదానమే తన లక్ష్యమైన మృత్యుంజయుని వలె, మృత్యుంజయుని మహారూపంవలె గొప్పరూపును, విస్తృతిని పొందినదై, మృదుత్వ సౌకుమార్యాలతో కుమారస్వామి క్రౌంచ పర్వతాన్ని, తారకాసుర ప్రభృతులను తన మొక్కవోని పరాక్రమంతో సాధించినట్లు క్రౌంచ పర్వత శ్రేణి నుండి ఉద్భవించిన శుక్తిమతి (క్రౌంచ) నదిని తనలో కలుపుకొని; సూర్యుని రథాశ్వాల వేగాన్ని మించిన అర్జునుని రథంలా వేగంగా సాగిపోతూ, మందర వక్రమైన ఆలోచనల ఫలితంగా శ్రీరామచంద్రుడు వనవాసం చేసినట్లు మందర పర్వతాలను, వనాలను పోలిన పర్వతాలతో, వనాలలో ప్రవేశించి, గమనాన్ని మార్చుకొని మహారణ్యాలలో ప్రవహిస్తూ; కామకేతనుని ధ్వజంపై ప్రకాశిస్తున్న మకరంవలె, భయంకరమైన మకరాలతో (మొసళ్ళతో) నిండి; మన్మథుని యొక్క బాణము శంబరాసురుని ఆక్రమించినట్లు జలపూర్ణమై, శంబరారాతి(మన్మథుడు) బాణం చిగురుటాకు గురి తప్పని విధంగా అధ్వగ (ఋజు) మార్గాన ప్రవహిస్తూ, తన తీరం వెంట ప్రయాణిస్తున్న బాటసారుల (అధ్వగుల) మార్గాయాసాన్ని తన శీతలత్వంతో సేద తీరుస్తూ; శమనుని (యముని) దండం నిష్పక్షపాతంగా వ్యవహరించినట్లు మిట్టపల్లాలను ఏకంచేస్తూ; ఛందశ్శాస్త్రం గురువులు లఘువులతో కూడి వళులతో (యతులు) పద్యనిర్మాణానికి, నడకకు గమకం కలిగించినట్లు, తన ప్రవాహ మార్గంలోని పెద్ద, చిన్న ప్రవాహాలను కలుపుకొని వడిని పుంజుకొని; గణితశాస్త్రం ఘనం, ఘనమూలం, వర్గమూలం, భిన్నాలు, మిశ్రమూలం, ప్రకీర్ణం, ఘాతాలను బోధించే విధంగా పాయలుగా చీలుతూ, విస్తృతిని పొందుతూ, విడివడ్డ పాయలు మళ్ళీ కలుస్తూ, సుళ్ళు తిరుగుతూ, అగాధాలను ఏర్పరుస్తూ భయానకమై (భీష్మమై) శ్రీమహాభారత భీష్మ పర్వంలోని భగవద్గీతల వలె మునిశ్రేష్ఠుల ప్రశంసలను అందుకుంటూ; గీతశాస్త్ర (సంగీతము) విధి

విధానాన విలంబితాది స్వరబద్ధ నానావిధ శబ్దసందోహంతో వేణువు రంధ్రాల నుండి వెలువడే మధురమంజుల గానానందంవలె ఇంపైన ధ్వనితో; వ్యాకరణశాస్త్ర మర్యాద ననుసరించి అచ్చులు హల్లులు ఉన్న క్రమంలో ప్రవాహవేగం గలదై, మహాభాష్య రూపావతారవృత్తి వృద్ధి గుణ సంధులను వివరించినట్లు, అంతకంతకు పెరుగుతున్న సుడులతో, అర్థశాస్త్ర (లౌకిక జీవన విధి విధానము) ప్రభావం చేత బహు ప్రయోజనాలను ఆశించి ప్రమాణ పూర్వకంగా ఋజువు పరచిన విధంగా, ప్రవాహం బహుయోజనాల గమిస్తూ, ఆదిశేషుడు భూమండలానికి స్థిరత్వం కల్పించిన విధంగా నిర్దేశిత గమ్యాన్ని చేరుకోవటంలో, గమనింపదగిన జాగ్రత్తలు తీసుకోవటంలో ఎలాంటి ఏమరిపాటు లేక; పరబ్రహ్మ మహత్త్వానికి గుర్తుగా భాసించే అనంతమైన వేద జ్ఞానమార్గం వలె ప్రవాహ మార్గంలో అనేక జనావాసాలను అధిగమిస్తూ, వేదం పవిత్రమైన అక్షరాలతో, ధ్వనులతో, పదక్రమంలో సంయోజింపబడి పఠింపబడిన విధాన, సంధ్యాకాల సమయాన వేదవిహిత మంత్రాలను వల్లెవేస్తున్న సద్బ్రాహ్మణులను దాటుకుంటూ, గ్రహగతుల నియమానుసారం కర్కాటక, మీన, మిథున, మకర రాశుల సుందర కూటములు ఏర్పడినట్లు ఎండ్రకాయలు (కర్కాటకములు) చేపలు (మీనములు) అందలి వివిధ జాతులు, మొసళ్ళ (మకరములు) సమూహంతో కూడి సొగసరి ముఖ చంద్ర బింబంవలె నిర్మలమైన చంద్రకాంత శిలా వర్ణపు మిలమిలలతో, అందమైన అధరాల రక్తిమ నిండిన కాంతులను తలపించే శోణానది జలాలను తనలో విలీనం చేసుకొని విలాసంగా సాగుతూ; నల్లని త్రాచును తలపించే విలాసవతి జడను పోలిన నల్లని సొరచేపలతో నిండినదై; జ్ఞానదీప్తితో నడచే పండిత గోష్ఠులలో పాండిత్యంతో, దానికి తగిన భాషా పటిమతో వక్త విజయం సాధించి వికాసం పొందినట్లు, సరస్వతీ నదిని విలీనం చేసుకున్న అతిశయంతో మరింత వేగాన్ని, అందాన్ని (విభ్రమాన్ని) సంతరించుకొని; తరుణి రసపూర్ణమైన చనుదోయి వలె, సర్వకాల సర్వావస్థల యందు జలపూర్ణమై, సకల జీవులకు జీవనాధారమైన జలాల్ని సమకూర్చే తుంగభద్రానది వేగాన్ని సహితం అతిక్రమించినదై చంద్రుని వెన్నెలను పరిహసించే సుదతి చిరునవ్వువలె చంద్రభాగానదీ జలాలను పరిహసిస్తూ బంగారు వడ్డాణాలు ధరించిన కన్యలు కలకలలాడుతూ కలియ దిరుగుతున్న భాగ్యవంతుడైన వాని వివాహ వైభోగ సంరంభం వలె సముద్రమేఖలయైన

భూమిపై విస్తరిస్తూ తార ముంజేయిని గ్రహించిన సుగ్రీవుని (సూర్య తనయుడు) వలె; సూర్యతనయయైన యమునానదిని ఆక్రమించి, సూర్య తనయుడైన కర్ణుని బాణాలు భీముని అడ్డగించినట్లు, భీమరథీనది ఆటోపాన్ని అరికట్టి తనలో కలుపుకొని; మగఏనుగు (వారణము) సాంగత్యంలో సంతోషాతిశయమబ్బిన ఆడయేనుగు (పుష్కరము) వలె, వరుణా, పుష్కర నదులను విలీనం చేసుకొని రంభ అందమైన ముఖలావణ్యం వలె, మధురజలపూర్ణమై; శ్రీరామచంద్రుని ముడివడ్డ భ్రుకుటి సముద్రుని గర్వాన్ని అణచినట్లు, జలాధిక్యం చేత హోరుపెడుతూ సింధునదీ గర్వ ప్రభంజనమై; భీముని (ప్రభంజన తనయుడు) గదాఘాతం, తనను సమీపించిన దుశ్శాసనుని పీచమణచినట్లు, తనలో మునిగి తేలుతున్న వారి పాపపంకిలాన్ని క్షాళనం చేస్తూ వేశ్యా కన్యక ముంజేతి కదలికవలన మాటిమాటికి చలిస్తూ మంజుల ధ్వానం చేస్తున్న గాజుల గలగలల వలె, పర్యాయక్రమంలో ఎగసెగసి పడుతున్న అలల నీటి తుంపురులతో; పాపరహితమైన కృతయుగ పావిత్ర్యం వలె ముమ్ముందుకు సాగుతున్న వేళ బురదతో మలినం కాక స్వచ్ఛమై; బ్రహ్మముఖం నుండి వెలువడ్డ ఓంకారం వలె సుడులు తిరుగుతూ అక్షరాభ్యసన క్రమంలోని దీర్ఘము, బిందువు, విసర్గల వలె ప్రవాహ ఉపరితలాన పెద్ద పెద్ద అలలు జనింపగా వ్యాకోచాన్ని పొందుతూ, అంతలో విడిపోతూ, సర్గబంధమనే రసవంతమైన కావ్య గమనంవలె గంభీరమై, భావమాధుర్య స్పర్శ కలదై, నందనందనుని ఉనికి వలన మధురా నగరం శోభించినట్లు నిండారిన సంతోషంతో విష్ణు పాదోద్భవియై; నందనోద్యాన వనంలో ఇంద్రుని విహరణ వలె విహరణ గలదై; ఇంద్రుని ఉచ్చైశ్రవం వలె తెల్లని ప్రవాహం గలదై ధ్రువుడు ఆకాశంలో నక్షత్ర రూపంలో ఉండి భూమండలాన్ని పరిశీలిస్తున్నట్లు, తన పవిత్రజలాలతో భూమిని తడుపుతూ; శ్రీమహావిష్ణువు యొక్క పాంచజన్య దక్షిణావర్త సుడులు తిరుగుతూ ఉత్తరాభిముఖమై ఉత్తరాభిమన్యుల పరిణయ వేడుక నరులకు సంతోషం కలిగించినట్లు, లోకులకు సంతోషం కలిగిస్తూ నరసింహుని వాడి గోళ్ళ గీటులు తనను ఆశ్రయించిన ప్రహ్లాదుని మనోభీష్టాన్ని ఈడేర్చే నిమిత్తం హిరణ్యకశిపుని మట్టుపెట్టడంలో, తద్వారా దానవుల పాపచరిత్రను మాయించటంలో వైభవాన్ని సంతరించుకున్న విధంగా అత్యధిక జలపూర్ణమై; దానకాండంలో కామధేనువు కల్పవృక్షాల వలె నిత్యనూతనమైన

పరంపరాభివృద్ధి కలిగి, పచ్చి బాలింతరాలైన యువతి స్తనాలు స్తన్యంతో ఎలా సమృద్ధ పూర్ణమై ఉంటాయో అలా నిరంతర జలవృద్ధి కలిగి పూర్ణమై, కుబేరుని రాజధాని అలకాపురి మకర, పద్మ, మహాపద్మ, కచ్ఛపాది నవనిధులు రత్న మాణిక్యాలతో అలరారుతున్న విధంగా మొసళ్ళు (మకరములు) పద్మ, మహాపద్మాది జలచరాలు, తాబేళ్ళు(కచ్ఛపాలు) కలిగినదై; ఆదికూర్మం ఒరిగిపోనున్న మంధరను నిలిపినట్లు, తన తీరాల గల మహావృక్షాల కుదుళ్ళ కూకటి వేళ్ళ బలిమితో జారిపోతున్న పర్వత శిలలను పడిపోకుండా ఆపుతూ; పర్వతాలంత సమున్నతమైన తీరాలు గలదై; ఆదివరాహం భూమిని భరించిన విధాన సమస్తాన్ని భరింపగల సామర్థ్యం కలదై, నిరంతరము ధర్భలు ధరించిన బ్రాహ్మణుని హస్తం వలె పావిత్ర్యాన్ని సంతరించుకుని, సుమనస్కుల మనస్సులను రంజింపచేస్తూ; శ్రీరామచంద్రుని బాణప్రతాపం ఖరదూషణాది రాక్షసుల గర్వాన్ని అణచినట్లు, తనను చేరవచ్చిన వెడల్పు తక్కువ, వడి ఎక్కువ అయిన వాగులను, వంకలను విలీనం చేసుకుంటూ; పరశురాముని గండ్రగొడ్డలి క్షత్రియులను రూపుమాపిన విధాన, అడ్డుగా నిల్చిన మట్టికొండలను మూలమట్టుగా కుళ్ళగిస్తూ; బలరాముని నాగలి శత్రువులను నిర్మూలించిన విధాన తీరాలను కోసి వేసి విస్తృతిని పొందుతూ; బుద్ధదేవుని మేని మెరపు విరోధులైన రాక్షసుల భార్యలను మోహింప చేసిన పద్ధతిలో, తనతో పోటీ పడుతున్న చిన్న, పెద్ద ప్రవాహాలను ఉదార బుద్ధితో తనలో కలిపి వేసుకుంటూ, పరమేశ్వరుని తాండవం దేవతాశ్రేణికి (అనిమిషులకు) సంతోషాన్ని కలిగించిన విధంగా, అనిమిషములైన మత్స్యసంపదలతో అలరారుతూ; శ్రీ మహావిష్ణువు మత్స్యావతార చరితను వేదాలు శుభావహంగా కీర్తించిన విధాన మధుర మంజుల ధ్వానంతో; ఈవి గలిగిన దాత దానం వలన గ్రహీత అమిత సౌభాగ్య సంపదను పొందినట్లు సంపద అవామనంబై కామితార్థాలను ప్రసాదించే సుదీర్ఘమైన ప్రవాహంగలదై, బలిని వామనుడు పదవీభ్రష్టుని చేసినట్లు తీరానగల వెరుదు పొదలను నిర్మూలిస్తూ సామ, భేద మాయోపాయ విలసితమైన నీతి శాస్త్ర విధాన, ఒకచోట వృద్ధి, ఒకచోట చీలికలు, మరోచోట కృశత్వం, ఇంకొకచోట ఒడ్డులకంటా ఒరుసుకుంటూ; బ్రహ్మ తన భావన మాత్రంచేత బ్రహ్మాండమందలి నిఖీల జీవకోటిని సంరక్షించిన విధాన తనలోని సకల జలజంతుకోటికి ఆశ్రయమిచ్చినదై, మానిని తన

అంతరంగాన్ని బయల్పడనీయనట్లు, తన లోతు ఎంతో తెలియనీయనంత అగాధమై; గరిత తన గడసరితనాన్ని వెలువరించక నెమ్మదిగా ఉన్నట్లు నింపాదియైన గమనంతో; ముగ్ధ అతిశయాన్ని ప్రదర్శించనట్లు, తన ఉనికిని బయలు పరచక, ప్రమద నడవడికను పోలి, పతివ్రత శీలం వలె ఋజుగమనంతో; కన్నతల్లి బిడ్డల ఆగడాన్ని భరించినట్లు సమస్తాన్ని భరిస్తూ; దైవం భక్తకోటి మనోరథాలను ఈడేర్చినట్లు, లక్ష్యాన్ని చేరుకొనే దిశగా, ఇదిగో ప్రవాహం ఇలా సాగుతోంది సుమా! అని మాటల్లో చెప్పడానికి కుదరని విధంగా గంగానది ప్రవహిస్తూంది.

మ. జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిం దాఁటి త
త్సగరక్ష్మాపకుమార భస్మముల మీఁదన్ ముంచి పాఱన్ మరు
న్నగరావాసము వారు పొందిరి నవీనశ్రీలతో గంగ నీ
రు గతిం గాక మహాదురంత సుజన ద్రోహానలం బాఱునే.

231

తా ॥ భగీరథుని రథం వెనుక, అత్యంత వేగంతో అనేక దేశాలను దాటి సగర రాజకుమారుల భస్మరాసులను ముంచెత్తి ప్రవహించగా వారందరూ, కొంగ్రొత్త వైభవంతో స్వర్గాన్ని చేరుకున్నారు. మరి గంగాజలం వలన గాక, సుజనుల పట్ల చేసిన మహాదురంతమైన పాపాగ్ని మరెలా చల్లారుతుంది గనుక!

మ. హరు మెప్పించి మహా తపో నియతుఁడై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంత కీర్తిలతికా స్తంభంబుగా నవ్య సు
స్థిర లీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేక దు
స్తర వంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్య శ్రీకరుం డల్పుఁడే!

232

తా ॥ పరమేశ్వరుణ్ణి మెప్పించి, మహాతపోదీక్షతో ఆ ఆకాశగంగానదిని భూమికి తెచ్చి,

తన కీర్తిలతకు ఆధారకల్పంగా సుస్థిరమైన దీక్షతో పితృకార్యాన్ని సమగ్రంగా నిర్వహించి, వంశానికి పట్టిన అపకీర్తిని బాపిన ఆ భగీరథుడు, ఆ నిత్య శుభసంపన్నుడు సామాన్యుడు కాడు గదా!

క. హరిఁదమ మనమున లోనిడి, హరి పాదాంభోజ జనితమైన నదిన్ సు
స్థిరులై గ్రుంకి మునీంద్రులు, హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్.

233

తా ॥ హరిని తమ మనస్సులలో స్థిరంగా నిలుపుకొని, హరి పాదపద్మాల నుంచి జన్మించిన పావన గంగానదిలో స్నానమాడి మునీంద్రులు సత్త్వరజస్తమోగుణ రహితులై ఆ సమయంలో హరిని చేరుకున్నారు.

వ. అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండును, సింధుద్వీపునకు నయుతాయువును, నయుతాయువునకు ఋతుపర్ణుదును జనియించె. నతండు.

234

తా ॥ ఆ భగీరథునికి శ్రుతుడు, శ్రుతునికి నాభవరుడు జన్మింపగా, అతనికి సింధుద్వీపుడు కలిగాడు. ఆయనకు అయుతాయువు, అతనికి ఋతుపర్ణుడు జన్మించారు.

ఆ. నయ విశాలబుద్ధి నలచక్రవర్తితో, సంగడీనితనము చాలఁ జేసి
యక్షహృదయ మతని కభ్యస్తముగ నిచ్చి, యశ్వవిద్య నేర్చె నతని వలన.

235

తా ॥ ఆ ఋతుపర్ణుడు నీతిశాస్త్ర విద్యలో ఘనుడు. నలచక్రవర్తితో స్నేహంచేసి అతనికి పాచికలాటలోని మెలకువలను నేర్పి, ఆయన వద్దనుండి అశ్వవిద్య నేర్చుకున్నాడు.

# కల్మాషపాదుని వృత్తాంతం

వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీ వల్లభుండైన సుదాసుండును బుట్టె. నా రాజశేఖరుని మిత్రసహుండును, గల్మాషపాదుండునని చెప్పుదు రాభూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుండై, తన కర్మంబున ననపత్యుండయ్యె ననిన విని పరీక్షిన్నరేంద్రుం, డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె నని యడిగిన శుకుం డిట్లనియె.

236

తా ॥ ఆ ఋతుపర్ణునికి సర్వకాముడు పుట్టాడు. అతనికి సుదాసుడు జన్మించాడు. ఈయన భార్య మదయంతి. ఈ సుదాసుడిని మిత్రసహుడని, కల్మాషపాదుడని కూడా అనేవారు. ఇతడు వసిష్ఠుని శాపకారణంగా రాక్షసుడై, తన దుష్కర్మకు ఫలంగా సంతానంలేనివాడయ్యాడు" అని శుకమహర్షి చెప్పగా పరీక్షిన్మహారాజు, సుదాసునికి వసిష్ఠుడు శాపమివ్వడానికి కారణమేమిటని అడిగాడు. ఆయన ఇలా సెలవిచ్చాడు:

సీ. ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేగి గర్వించి యొక్క రక్కసునిఁ జంపి
వానితోఁ బుట్టిన వానిఁ బో విడిచిన వాఁడును దనతోడివాని చావు
వోనీక కపటియై భూపాలు గృహమున నడబాలతనమున నర్థిఁ గొలిచి
యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ నతనిఁ బనుప

తే. వాఁడు మానవ మాంసంబు వండి తెచ్చి, మునికి వడ్డింపఁ గోపించి మునినరేంద్రుఁ
బిల్చి మానవమాంసంబుఁ బెట్టి తనుచు, నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె.

237

తా ॥ "ఒకప్పుడు సుదాసుడు వేటకు వెళ్ళి అహంకారంతో ఒక రాక్షసుణ్ణి చంపాడు. అయితే అతగాడి సోదరుని విడిచిపెట్టాడు. అతడు ఆ పగ తీర్చుకోవడం కోసం మోసబుద్ధితో

రాజగృహంలో వంటవాడిగా చేరాడు. అలా ఉండగా ఒకనాడు సుదాసుడు వసిష్ఠునికి భోజనం ఏర్పాటు చేయమని ఆ వంటవానితో చెప్పగా, అతడు మానవ మాంసం వండి తెచ్చి మునికి వడ్డించాడు. ముని, తనకు మానవ మాంసం వడ్డించావంటూ రాజుపై కోపించి, రాక్షసుడవు కమ్మని శపించాడు.

వ. ఇట్లు శపించి పదంపడి, రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుని యెఱుఁగమియుఁ దన మనంబున నెఱింగి, వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవై యుండుమని నియమించె; న య్యవసరంబున.

238

తా ॥ పిదప ఆయన అది రాక్షసుని పని అని, అందులో సుదాసుని ప్రమేయం లేదని, దివ్యదృష్టితో తెలుసుకొని, పన్నెండు సంవత్సరాలు మాత్రం రాక్షసునిగా ఉండమని అనుగ్రహించి చెప్పటం జరిగింది.

మ. గురువున్ మాఱు శపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్ వారింప మిన్నున్ దిశల్
గరయుం జీవమయంబకా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయ పదంబులం గరపుటీ వాఃపూరమున్ బొక్కుచున్.

239

తా ॥ అయితే, సుదాసుడు తనను శపించిన దానికి ప్రతీకారంగా గురువు గారిని శపిస్తాను గాక అని దోసిటిలోనికి నీరు తీసుకోగా, ఆయన భార్య అలా చేయవద్దని భర్తను అడ్డుకుంది. అప్పుడు ఆ రాజు ఆకాశము, దిక్కులు, భూమి సమస్తమూ ప్రాణమయంగా భావించి, దోసిటిలోని ఆ నీటిని తన కాళ్ళపై పోసుకున్నాడు.

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండై శపియింప నొల్లక, సుదాసుండు

రాక్షసభావంబు నొంది, కల్మషవర్ణంబు లయిన పాదంబులతో నడవులం దిరుగుచు.

240

తా ॥ ఈ విధంగా సుదాసుడు మిత్రసహుడు కావటాన, భార్య చెప్పిన దానిని పాటించేవాడు కావటాన, గురువుగారిని శపించడానికి ఇష్టపడక, రాక్షసుడై, నల్లని పాదాలతో అడవుల్లో సంచరిస్తూ వచ్చాడు. అందువల్ల అతనికి కల్మాషపాదుడని పేరు కలిగింది.

క. ఆఁకట మలమల మాడుచు, వీఁక నతం డడవి నున్న విప్రమిథునమున్ దాఁకి తటాలున విప్రునిఁ, గూఁకటి చేఁబట్టి మ్రింగఁ గొనిపోవు తఱిన్.

241

తా ॥ అలా అతడు అడవుల్లో సంచరిస్తూ ఉండగా, ఒకనాడు ఆకలికి నకనకలాడుతూ, ఆ సమయాన అడవిలోనున్న బ్రాహ్మణ దంపతులను చూసి, అందులో విప్రుని జుట్టుపట్టి మ్రింగడానికి పట్టుకొని పోతున్నాడు.

వ. అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి, యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె.

242

తా ॥ అప్పుడు ఆ బ్రాహ్మణుని భార్య మొత్తుకుంటూ, దుఃఖీస్తూ, పూడుకుపోయిన గొంతుతో భర్తకు అడ్డుగా నిలిచి రాక్షస రూపంలో ఉన్న రాజుతో ఇలా అంది:

క. మానుషదేహము గలుగుట, భూనాయక! దుర్లభంబు పుట్టినమీఁదన్ దానము పరోపకారము, భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్?

243

తా ॥ “రాజా! మానవ జన్మ ఎంతో దుర్లభం! అలా ఈ జన్మ ఎత్తి, పురుషుడైనందుకు

ఫలితం దానాలు చేయటం, పరోపకారం చేయటం, తద్వారా కీర్తిని పొందటం గదా!

మ. రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాయివై
భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై
వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రున్ దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే?

244

తా ॥ సూర్యవంశంలో జన్మించి, అగ్రేసరుడవని పేరుపొంది, సమస్త భూమిని పాలిస్తూ, లోకంలో కీర్తిని పొంది, ఇతరులకు మేలు చేస్తూ, పుణ్యకార్యాలపట్ల ఆసక్తి గలవాడవైన నీవు, మతిమాలినవాడవై ఇలా నా భర్తను, తపోనిధిని, బ్రాహ్మణశ్రేష్ఠుని, బ్రహ్మతత్త్వవేదిని, లోకంలో కీర్తి పొందినవానిని, సత్యాసత్యాలు చూడకుండా భక్షింపబూనటం – అదెలాంటి ధర్మమయ్యా!

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డం డ్రా మాటలు లేవె? భూమిసుర గోహత్యాభిలాషంబు గై
కొండ్రే మీ యటువంటి సాధువులు? రక్షోభావ మిట్లేల? మీ
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునం బోఁగదే!

245

తా ॥ నాయనా! మీ వంటి సూర్యవంశ రాజులకు బ్రాహ్మణుడే దైవమని లోకమంతా చెప్పుకుంటుంది. అది అబద్ధమేనా? గో బ్రాహ్మణ వధ మీలాంటి సాధువర్తనులు చేయవచ్చునా? ఈ రాక్షస ప్రవృత్తి ఏమిటి? మీ తాత తండ్రులు చేసిన పుణ్యకార్యాలనైనా తలచుకోవద్దా? వారు ఇలా చేశారా ఎన్నడైనా? ధర్మపద్ధతిలో నడుచుకోవద్దా?

శా. అన్నా! చెల్లెల నయ్యెదన్; విడువు నీకన్నంబు వెట్టింతు నా
హృన్నాథున్ ద్విజు గంగికుట్టి నకటా! హింసింప నేలయ్య? నీ

వెన్నం డింతులతోఁడఁ బుట్టవె? నిజం బిట్టైన ముమ్మట్ట నా
పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే.

246

తా ॥ అన్నా! నేను నీ చెల్లెలు లాంటి దాన్ని. నీకు ఆకలిగా ఉంటే నేను అన్నం పెట్టిస్తానయ్యా! నా భర్తను, నా ప్రాణేశ్వరుని, బ్రాహ్మణుని, గంగిగోవు వంటి సాధువును హింసించటం – ఇదేమి పద్ధతయ్యా! నీవు పుట్టిందీ నాలాంటి స్త్రీ మూర్తికే కాదా! అయినా కూడా నీవు అలాగే చేయదలచుకుంటే, ముందు నన్ను చంపి, పిదప నా భర్తను భక్షింపవయ్యా! ఆయన మరణాన్ని నేనెలాగయ్యా నా కళ్ళతో చూసేది."

క. అని కరుణపుట్ట నాడుచు, వనితామణి పలవరింప వసుధాదేవుం దినియె నతఁడు పులి పశువుం, దినుక్రియ శాపంబు కతన ధీరహతుండై.

247

తా ॥ అని ఈ విధంగా ఆమె ఎంతో జాలి గొలిపేటట్లు ప్రార్థించినా, పులి పశువును భక్షించినట్లు, శాపకారణంగా దయమాలి ఆ బ్రాహ్మణుణ్ణి పొట్టన పెట్టుకున్నాడు ఆ రాజు.

వ. అంత నా బ్రాహ్మణి కోపించి కామార్తనైన నాదు పెనిమిటిని భక్షించితివి గావున, నీవు నెలఁ తలం బొందఁ జేరిన వేళ మరణంబును బొందు మని, కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్ని ప్రవేశంబు సేసి సుగతికిం జనియె. నంతఁ బండ్రెండేండ్లు సనిన నా రాజు మునిశాప నిర్ముక్తుండై.

248

తా ॥ అంతట ఆమెకు కోపం వచ్చి, ఇలా అంది: "కామార్తనై ఉన్న సమయంలో నా భర్తను భక్షించావు. కనుక నీవు కూడా స్త్రీ సంగమం చేసే వేళ మరణిస్తావు సుమా" అని శపించింది. పిదప ఆమె భర్త ఎముకలతో సహగమనం చేసి అగ్నిముఖాన స్వర్గలోకానికి

వెళ్ళిపోయింది. పన్నెండేళ్ళు గడువగా సుదాసుడు శాపం నుండి విముక్తుడైనాడు.

ఆ. రతులకొఱకు భార్య రావింప నదియును, బెదరి విప్రసతి శపించు టెఱిఁగి మగని నడ్డపెట్టి మైథునకర్మంబు, మాన్చె సతుల గోష్ఠి మానె నతఁడు.

249

తా ॥ ఒక దినాన అతడు సంగమ సౌఖ్యాన్ని ఆశించి, భార్యను రప్పించగా, ఆమెకు బ్రాహ్మణి శాపం తెలిసిన కారణంగా, భర్తకు నచ్చచెప్పి, మైథున క్రియ నుండి అతడు దూరమయ్యేట్లు చేసింది. నాటి నుండి అతడు స్త్రీ సాంగత్యాన్ని మానుకున్నాడు.

క. అది కారణముగఁ బుత్రా, భ్యుదయము లే దా సుదాసభూపాలునకున్ దదనుమతి న వ్వసిష్ఠుఁడు, మదయంతికిఁ గడుపుసేసె మదన క్రీడన్.

250

తా ॥ ఆ కారణంగా అతనికి పుత్రుల్ని కనే యోగ్యత లేకుండా పోవడంతో వసిష్ఠుడు ఆయన అనుమతిలో మదయంతికి గర్భదానం చేసి ఆమెకు గర్భము కలిగేటట్లు చేశాడు.

వ. ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరియించి, నీళ్ళాడ సంకటపడు చున్న వసిష్ఠుండు వాఁడియగు నశ్మమున నా గర్భంబుఁ జీరిన, నశ్మకుండను కుమారుండు పుట్టె, నతనికి మూలకుండు పుట్టె నతండు.

251

తా ॥ అలా సుదాసుని భార్య మదయంతి చూలాలై ఏడు సంవత్సరాల పాటు కడుపుతో ఉండి, ప్రసవించడానికి కష్టపడుతున్న సమయంలో వసిష్ఠుడు రాతి మొనతో ఆమె కడుపును చీల్చగా అశ్మకుడనే కుమారుడు కలిగాడు. అతనికి మూలకుడు అనే వాడు జన్మించాడు.

క. వీరుఁ డగు పరశురాముఁడు, ఘోర కుఠారమున నృపులఁ గూలుచు వేళన్

నారీజనములు దాఁచిన, నారీకవచుం డనంగ నరనుతి కెక్కెన్.

252

తా ॥ అతగానిని నారీకవచుడని లోకం పిలిచేది. దానికి కారణం ఏమంటే, పరశురాముడు, తన గండ్ర గొడ్డలితో క్షత్రియులపై దండెత్తి చంపే సమయంలో, ఈ మూలకుడిని స్త్రీ జనం అంతఃపురంలో దాచిపెట్టారు. నారీజనం చేత రక్షింపబడ్డాడు గనుక అతన్ని అలా పిలిచేవారు.

## ఖట్వాంగుని చరిత్ర

వ. ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవి వంశంబునకు మూలం బగుటం జేసి, మూలకుం డనఁబరఁగె నామూలకునకు విశ్వసహుండు పుట్టె. విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యె. నతండు.

253

తా ॥ అలా తెగిపోయిన సుదాసుని సూర్యవంశానికి ఆ నారీకవచుడు మూలం కావడం వలన అతనిని మూలకుడని కూడా అన్నారు. అతనికి విశ్వసహుడనే వాడు జన్మించాడు. విశ్వసహునికి ఖట్వాంగుడు జన్మించి చక్రవర్తి అయ్యాడు.

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన బ్రదుకు కాల
మెంతని యడిగిన 'నిదె నిండుచున్నది తడవులే దే మైన నడుగు' మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరుని యంద భావంబుఁ గీలించి కులదైవత ద్విజకులము కంటె

తే. నంగనా ప్రాజ్యరాజ్య పుత్త్రాదు లెల్లఁ, గావు ప్రియములు; ధర్మంబు గడచి నాదు మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ, నన్య మా యీశ్వరునిఁ దక్క ననుచు మఱియు.

254

తా ॥ అతడు దేవతల మాట మీదట రాక్షస ప్రభువులను సంహరించాడు. అప్పుడు అతడు దేవతలను ఇంకా తన జీవితకాలమెంత ఉందని అడగ్గా వారు ఇంక 'ఎంతో సమయం లేదు, అడుగ దలచింది ఏమైనా ఉంటే అడగ' మన్నారు. అతడు వారిని ఏమీ కోరకుండా దివ్యవిమానం ఎక్కి తన రాజధానికి వచ్చి, మనస్సును పరమేశ్వరుని యందు నిలిపి, ఇలా ఆలోచించుకున్నాడు: "కులదైవం కంటే, ద్విజకులం కంటే, భార్య, ప్రాణం, రాజ్యం, కుమారుడు – ఇవేవీ ప్రియమైనవి కావు. ధర్మాన్ని తప్పి నా బుద్ధి ఎన్నడూ నడిచింది లేదు. ఆ ఈశ్వరుడే

దిక్కని నమ్మాను. మరి దేనినీ నా మనస్సులో నిలిపిందీ లేదు. ఆశ్రయించిందీ లేదు" అనుకున్నాడు.

మ. ఇలమీఁదం బ్రతుకేల? వేల్పుల వరం బేలా? ధనం బేల? చం
చల గంధర్వపురీ విడంబనము లైశ్వరంబు లేలా? జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్.

255

తా ॥ ఇంకా అనుకున్నాడు గదా, "ఈ లోకంలో ఇంకా జీవించటం దేనికి! దేవతల వరాలు నా కేల! ధనమేల? ఈ నాటకమేల? ఐశ్వర్యమేల? లోకాలను సృష్టించే నిమిత్తం ప్రకృతితో కలసి, చివరకు దానినీ విడిచి పవిత్రమైనదీ, ఇలాంటిది అని చెప్పడానికి వాక్కుకూ, మనస్సుకూ అందని ఆ పరబ్రహ్మాన్ని చేరుకుంటాను గాక!

వ. అని నిశ్చయించి.

256

తా ॥ అని నిశ్చయించుకొని,

మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డశ్రాంతమై
కల దయ్యున్ మఱి మీఁద లే దనెడిదై కల్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగ రానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నా బ్రహ్మమున్.

257

తా ॥ అన్ని విధాలైన బంధాలనూ వదలుకొని, శాశ్వతమై కూడా, ఉండీ లేదనిపించేది,

శుభప్రదమైనది, మనస్సులో భావించడానికి, మాటలలో చెప్పడానికి అనువుపడనిది, పరమమైనది, వేదాంతులు, పండితులు తమ హృదయకమలాలలో వాసుదేవునిగా భావించి నిలుపుకున్న ఆ పరబ్రహ్మములో లీనమయ్యాడు.

వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘ బాహువునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టి; రా దశరథునకు సుర ప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశ సంభూతుండై జన్మించెఁ; దచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితం బైనది; యైననుం జెప్పెద; సావధాన మనస్కుండవై యాకర్ణింపుము.

258

తా ॥ ఆ ఖట్వాంగునికి దీర్ఘబాహుడు, అతనికి రఘువు జన్మించారు. ఆ రఘువుకు పృథుశ్రవుడనే పుత్రుడు జన్మించాడు. అతనికి అజుడు, అజునికి దశరథుడు జన్మించారు. దేవతల ప్రార్థనపై పరబ్రహ్మమయుడైన ఆ శ్రీమన్నారాయణుడు నిజాంశసంభూతుడై నాలుగు రూపాలుగా శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనే పేర్లతో ఆ దశరథునికి జన్మించాడు. ఆ చరిత్ర అంతా వాల్మీకి మున్నగు ప్రముఖ మహర్షుల చేత కీర్తింపబడింది. అయినా చెబుతాను. సావధానమతివై వినవలసిందంటూ శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు ఇలా చెప్పసాగాడు:

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండై నట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాత సంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యక తుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్.

259

తా ॥ "ఆ దశరథ మహారాజు భార్యల్లో ఒకరు కౌసల్య. ఆమె పవిత్రత ఇలాంటిది అని చెప్పటం సాధ్యమయ్యేది కాదు. ఆమెకు ఆమే సాటి. సంసారానికి ఫలమైన సత్సంతానాన్ని భర్తకు ప్రసాదించిన సర్వోత్తమ చరిత్ర. అలాంటి ఆమెకు తూర్పుదిక్కు అనే కాంతకు చంద్రుడు ఉదయించినట్లు, మదాంధుడైన రావణాసురుని శిరస్సును ఖండించడానికి ఉద్యుక్తుడై ఆ శ్రీమన్నారాయణుని అంశతో శ్రీరామచంద్రుడు జన్మించాడు.

మ. సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజ త్ఖేటకం దాటకన్.

260

తా ॥ విశ్వామిత్రుని యాగ సంరక్షణార్థం, ఆయన కోరికపై తండ్రి పంపగా వెళ్ళి, అక్కడ శ్రీరామచంద్రుడు, బంగారు కాంతులను త్రోసిరాజనే శిరోజాల కాంతి గలది, మాయమాటలతో మోసపుచ్చటంలో కడు నేర్పరి, వేగంలో ఆడు గుఱ్ఱాన్ని మించినది, తన చేతులే ఆయుధాలుగా గలది అయిన తాటకి అనే రాక్షసిని సంహరించాడు.

క. గారామునఁ గౌశికమఖ, మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్ ఘోరాజిఁ
ద్రుంచి తోలెను, మారీచు న్నీచుఁ గపటమంజులరోచున్.

261

తా ॥ తాటకిని వధించి, విశ్వామిత్రుని యాగం నిర్విఘ్నంగా పరిసమాప్తి పొందేటట్లు కాపాడాడు. సుబాహుడనే రాక్షసునితో ఘోరమైన యుద్ధం చేసి అతనిని సంహరించాడు. తన మోసపూరితమైన దేహ వర్ణ కాంతులతో మోసపుచ్చిన నీచుడు మారీచుని వధించాడు.

మ. ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బా
ల కరీంద్రంబు సులీలమైఁ జెఱుకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహ క్షమా
పక గేహంబున సీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్.

262

తా ॥ మూడు వందల మంది మోసుకుని తెచ్చిన శివధనుస్సును, మదపుటేనుగు ఎంత సునాయాసంగా చెరకుగడలను విరిచివేస్తుందో అంత అవలీలగా, ఎంతోమంది రాజులు ఆశ్చర్యంతో చూస్తూవుండగా, విదేహ ప్రభువు జనకుని సభాంగణంలో, సకల గుణమణియైన సీతాదేవిని చేపట్టడం కొరకు, ఒక విలాసంగా విరిచివేశాడు ఆ శ్రీరామచంద్రుడు.

క. భూతలనాథుఁడు రాముఁడు, ప్రీతుండై పెండ్లి యాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్, సీతన్ ముఖకాంతివిజిత సితఖద్యోతన్.

263

తా ॥ అంతట రామచంద్రుడు సకల సుగుణమణి, భాగ్యశాలిని, తన ప్రశాంతమూ ఉజ్జ్వలమూ అయిన ముఖకాంతితో చల్లని వెన్నెల కురిపించే చంద్రుని కూడా మరపించే సీతాదేవిని ఎంతో సంతోషంగా పెండ్లాడాడు.

క. రాముఁడు నిజబాహుబల, స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో ద్దాముని విదళీకృతనృప,
భామున్ రణరంగభీము భార్గవరామున్.

264

తా ॥ ఆ శ్రీరామచంద్రుడు, తన పటుతమమైన బాహుబలంతో రణరంగ భీముడూ, పదనైనదీ పెద్దదీ అయిన గండ్ర గొడ్డలిని ధరించి ఇలాతలంలోని రాజులందరినీ హతమార్చినవాడూ అయిన పరశురాముని అవలీలగా జయించాడు.

క. దశరథుడు మున్ను గైకకు, వశుఁడై తానిచ్చి నట్టి వరముకతన వా
గ్దశ చెడక యడవి కనిచెను, దశముఖ ముఖకమల తుహినధామున్ రామున్.

265

తా ॥ తండ్రి దశరథమహారాజు పూర్వం తన భార్యలలో ఒకరైన కైకకు మాట ఇచ్చిన కారణంగా, ఆమె మాటపై, కమలముల వంటి పదిముఖాలు గల రావణాసురుని పాలిటి హిమకరుని (చంద్రుని) వంటివానిని, శ్రీరామచంద్రుని అరణ్యవాస నిమిత్తం అడవులకు పంపాడు.

దశముఖ కమల తుహినధాముడు : కమలముల వంటి పది ముఖాలు గల వాని పాలిట హిమకరుడైన (చంద్రుడు) వాడు. అంటే చంద్రోదయంలో కమలాలు ముడుచుకు పోయినట్లుగా రావణాసురుడు నశిస్తాడని చెప్పటం.

క. జనకుఁడు పనిచిన మేలని, జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్ జనపతి రాముఁడు విడిచెను, జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్.

266

తా ॥ అలా తండ్రి ఆజ్ఞాపించగా, అలాగేనంటూ భార్య జానకి, సోదరుడు లక్ష్మణుడు

తనను సేవించే నిమిత్తం తోడై రాగా, రాజలోకానికి ఆరాధ్యమూ, శత్రువులకు అభేద్యమూ అయిన రాజధానీ నగరం అయోధ్యను విడిచి అడవులకు సాగిపోయాడు శ్రీరామచంద్రుడు.

క. భరతున్ నిజపదసేవా, నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్ సురుచిరరుచి పరిభావిత, గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్.

267

తా ॥ తన పాదసేవారతుడైన మరో సోదరుడు భరతుణ్ణి రాజ్యాభిషిక్తుడను చేసి, తాను బహురత్న కాంతులతో కడు రమ్యమైన కులపర్వతం చిత్రకూట పర్వతాన్ని అధిరోహించాడు.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తము శరణ్యము నుద్ధత బర్హిబర్హ లా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్.

268

తా ॥ అంతట, అక్కడ నుండి ఆ పావనమూర్తి, అరణ్యాల్లో పేరెన్నిక గన్నదీ, గౌతమీ నదీ నిర్మల జలశీకరాలతో తేజరిల్లేదీ, పెద్ద పెద్ద వృక్షాలతో, పొదరిండ్లతో విలసిల్లేదీ, తాపసోత్తములకు ఆవాసమైనది, ఆనందాతిరేకంతో పురులు విప్పి నాట్యం చేస్తున్న నెమళ్ళతో కూడినదీ అయిన దండకారణ్యాన్ని చేరుకున్నాడు.

సీ. ఆ వనంబున రాముఁడనుజ సమేతుఁడై, సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లెలు రతిఁగోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు వేవు రా రామవిభుఁడు కలన
బాణానలంబున భస్మంబు గావింప జనకనందన మేని చక్కఁదనము

తే. విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు, నర్థిఁ బంచిన బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె, నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు.

269

తా ॥ ఆ దండకారణ్యంలో ఒక పర్ణశాల నిర్మించుకొని; భార్యతో, సోదరునితో ఉండసాగాడు. అంతట రావణాసురుని చెల్లెలు శూర్పణఖ రాముని మోహించి రాగా, లక్ష్మణుడు దాని ముక్కు చెవులు కోసి, అక్కడి నుండి తరిమేశాడు. అది తెలిసి ఖర, దూషణులనే రాక్షసులు పధ్నాలుగు వేలమందితో దండెత్తి రాగా, శ్రీరామచంద్రుడు తన బాణాగ్నితో వారిని మూలమట్టుగా దహించి వేశాడు.

రావణుడు సీతాదేవి చక్కదనాన్ని గూర్చి తెలుసుకొని మోహవివశుడై, మాయోపాయంతో ఆమెను అపహరింపగోరి, వారిని ఏమార్చే నిమిత్తం మారీచుని పంపగా, వాడు బంగారు లేడి రూపంలో వచ్చాడు. శ్రీరాముడు ఆ నీచుణ్ణి వెంటాడి సంహరించాడు. అంతలో రావణుడు సీతను అపహరించి తీసుకుపోయాడు.

ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయత హేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్ర కార్య ద
త్తాయువుఁ బక్షవేగ పరిహాసిత వాయువు న జ్జటాయువున్.

270

తా ॥ దయమాలి సీతాదేవిని అలా అమిత వేగంతో ఆకాశమార్గాన అధర్మపరుడై తీసుకుపోతుండగా, ఆమెను సంరక్షించే నిమిత్తం, తన రెక్కల విదలింపుతో వాయుదేవుని కూడా పరిహసింప సమర్థుడైన జటాయువు రామకార్య నిమిత్తమై అడ్డుపడగా, అతడిని వజ్రాయుధం వంటి తన కత్తివాదరతో కూల్చి వేశాడు రావణాసురుడు.

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుం బరలోక క్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని.

271

తా ॥ పిదప శ్రీరామచంద్రుడు, సోదరుడు లక్ష్మణునితో సీతను వెతుక్కుంటూ బయలుదేరి, తన కొరకు ప్రాణాలర్పించిన జటాయువుకు అంతిమ సంస్కారం గావించి, ఋశ్యమూక పర్వతానికి చేరుకున్నాడు.

క. నిగ్రహము నీకు వల దిఁక, నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో నగ్రేసరుగా నేలెను, సుగ్రీవున్ చరణఘాతచూర్ణ గ్రావున్.

272

తా ॥ కొండ నుగ్గు నుగ్గు అయ్యే విధంగా తన్నిన, మహాబలశాలి అయిన సుగ్రీవునితో, 'మీ అన్న వాలిని తప్పక సంహరిస్తాను, ఇక నీవు బందీగా ఉండవలసిన పని ఎంతమాత్రం లే' దని, ప్రభువుగా చేస్తానని సుగ్రీవునికి ప్రమాణపూర్వకంగా అభయమిచ్చాడు శ్రీరామచంద్రుడు.

వ. లీలన్ రామవిభుఁడొక, కోలం గూలంగ నేసె గురు నయశాలిన్ శీలిన్ సేవితశూలిన్, మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్.

273

తా ॥ ఇచ్చిన మాట ప్రకారం శ్రీరామచంద్రుడు, శివారాధకుడూ, వీరోచితమైన శీలము కలవాడు, గొప్ప నీతికోవిదుడు, దేవేంద్రుడిచ్చిన కాంచన మాలికను ధరించినవాడు, రావణాసురుని గర్వాన్ని వదిలించినవాడూ, పరాక్రమవంతుడూ అయిన వాలిని ఒకే ఒక్క బాణంతో సంహరించాడు.

క. ఇలమీఁద సీత వెదకఁగ, నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్, బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్.

274

తా ॥ పిదప, ఛలవంతుడు (శరీరాన్ని అణువుగానూ, మహా ప్రమాణం కలది గానూ మార్చివేయగల మంత్రసిద్ధుడు), బుద్ధిమంతుడూ, బలపరాక్రమాలు గలవాడూ, కీర్తి ప్రతిష్ఠలు గలవాడూ అయిన హనుమంతుణ్ణి సీతను అన్వేషించే నిమిత్తం శ్రీరామచంద్రుడు నియమించాడు.

క. అలవాటు కలిమి మారుతి, లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణసంబంధిన్, జలపూరిత ధరణి గగన సంధిన్ గంధిన్.

275

తా ॥ అంతట ఆ హనుమంతుడు, నదులకు సంగమ స్థానమైనది, నీటిమయమై భూమ్యాకాశాలు స్పృశించే రేఖ పర్యంతం (మిన్నులు పడ్డచోటు) వ్యాపించిన సముద్రాన్ని, అలయొక్క పోకడను గలిగి, తనకు అభ్యాసము కూసు విద్య అన్న పద్ధతిలో, ఎంతో సులువుగా లంఘించాడు.

వ. ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి.

276

తా ॥ అలా సముద్రాన్ని దాటి, సీతను కనుగొని, తిరిగి వచ్చే సమయంలో హనుమంతుడు రావణుని కుమారుడైన అక్షుడనే వానిని, ఇతరులనూ సంహరించాడు.

క. సముదగ్రత ననిలసుతుం, దమరాహిత దత్త వాల హస్తాగ్నుల భ

స్మము సేసె నిరాతంకన్, సమదాసుర సుభటవిగతశంకన్ లంకన్.

277

తా ॥ అప్పుడు రాక్షసులు ఆయన తోక కొసకు నిప్పంటించగా, అతడు దానితో, రాక్షసభట సమూహం ఆశ్చర్యంలో మునిగిపోయేటట్లు, తనకు మరెవరూ సాటిలేరనే విధంగా, మొత్తం లంకను దగ్ధం కావించాడు.

వ. ఇట్లు లంకాదహనం చేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ యూథంబులుం దానును, జని చని.

278

తా ॥ అలా లంకను కాల్చి, హనుమంతుడు తిరిగి వచ్చి సీత జాడను వివరించగా, శ్రీరామచంద్రుడు సుగ్రీవుని వానర సైన్య బలగాన్ని వెంటపెట్టుకుని బయలుదేరాడు.

శా. ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధ రత్నాగారమున్ మీన కుం
భీరగ్రాహ కఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్య విభిన్న భంగభవ నిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబర పారమున్ లవణ పారావారమున్ జేరువన్.

279

తా ॥ అలా ఆయన వెళ్ళి వెళ్ళి, అనేక రత్నరాసులకు నిలయమైనదీ, చేపలు, మొసళ్ళు, సర్పాలతో కూడినది, ఎంతో గంభీరమైనది, ఉవ్వెత్తున ఎగసిపడుతున్న అలలు ఒకదానితో ఒకటి ఢీకొనడం వలన పుట్టిన ధ్వనితో, ఆకసాని కెగసిన నీటి తుంపురులతో విలసిల్లుతున్న ఉప్పు నీటి కడలి సమీపానికి చేరుకున్నాడు.

వ. కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మిన్నందిన నా రాచపట్టి

రెట్టించిన కోపంబున.

280

తా ॥ అలా సముద్రాన్ని చేరుకొని, తనకు దారి ఇమ్మని వేడుకోగా, దారి ఇవ్వకపోగా ఆకాశమంత ఎత్తు ఎదగడంతో సముద్రంపై బాగా కోపగించుకున్నాడు శ్రీరామచంద్రుడు.

క. మెల్లని నగవున నయనము, లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్ గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ, బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్.

281

తా ॥ అంతటి కోపంలోనూ, హేలగా రెప్పలల్లార్చి, చిరునవ్వుతో ధనుస్సును, బాణాలను అందుకున్నాడు. అలా అందుకున్నాడో లేదో – అంత సముద్రమూ, నత్తగుల్లలు, నాచు, ఆల్చిప్పలు అన్నీ బయలుపడేట్లుగా నీరంతా ఇంకిపోయి, పెద్ద బీడుభూమిగా పరిణమించింది.

వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తి మంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుఁ జొచ్చి యిట్లని స్తుతియించె.

282

తా ॥ అలా మహాపదకు గురైన సముద్రుడు, సకల నదులతో కూడా రూపు దాల్చి, శ్రీరాముని సన్నిధికేతెంచి, ఆయన పాదాలపై వ్రాలి, రక్ష కోరి, ఈ విధంగా స్తుతింపసాగాడు:

శా. 'ఓ కాకుత్స్థకులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే
నీ కోపంబున కెంతఁవాఁడ? జడధిన్; నీవేమి భూరాజవే?
లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్ నిక్కంబు సర్వాత్మకా!

283

తా ॥ "ఓ కాకుత్‌స్థ వంశేంద్రుడా! సకల సద్గుణనిధీ! ఆపన్న రక్షకా! నీవు కోపించడానికి నేనెంతటి వాడిని గనుక! నేనా, జడత్వానికి ఆటపట్టయిన ఒక సముద్రుడను! నీవా, సామాన్య ప్రభువువు కాదు! సర్వలోకానికి ప్రభుడవు! ఆదిమూర్తివి. సర్వలోకాలు నీ కడుపులో నుండి ఉద్భవిస్తాయి. అందులోనే ఉంటాయి. అందులోనే సమసిపోతాయి. సర్వాత్మకుడవు నీవే గదా! ఇది ఉన్నమాటే గదా!

క. ధాతల రజమున దేవ, వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్ జాతులుఁగా
నొనరించు గు, ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా!

284

తా ॥ రజోగుణంతో ప్రజాపతులను, సత్త్వగుణంతో దేవతలను, తమోగుణంతో భూతపతులైన రుద్రులను సృజించినప్పటికీ, నీవు మాత్రం ఆ గుణాలన్నింటికీ అతీతుడవు. ఆ గుణాతీత తత్త్వమే నీకు గల అలంకార గుణం.

క. కట్టుము సేతువు. లంకం జుట్టుము; నీబాణవహ్ని సురవైరితలల్ గొట్టుము నేలంబడఁ
జే, పట్టుము నీ యబల నధికభాగ్యప్రభలన్.

285

తా ॥ నీదైన బాహుపరాక్రమంతో వారధిని నిర్మించు. లంకను చుట్టుముట్టు. నీ బాణాగ్నికి, రాక్షసుల శిరస్సులను ఆహుతి గావించు. నీ అర్ధాంగిని, సర్వసౌభాగ్య సముపేతురాలిని, సీతాదేవిని చేపట్టవలసింది.

ఆ. హరికి మామ నగుదు; నఁటమీఁద శ్రీదేవి, తండ్రి; నూరకేల? తా గడింపఁ గట్టఁగట్టి
దాఁటు కమలాప్తకులనాథ, నీ యశోలతలకు నెలవు గాఁగ.

286

తా ॥ శ్రీమహావిష్ణువుకు నేను మామను కాదా! ఆపైన శ్రీలక్ష్మికి తండ్రిని. తాగాడి వలె కట్టగట్టి దాటవయ్యా సూర్యవంశకుల దీపకా! అది నీ కీర్తిలతామతల్లికి కుదురవుతుంది. అంతే తప్ప, ఉత్తి పుణ్యానికి నా పైన ఎందుకయ్యా కోపిస్తావు?"

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు; పొమ్మని వీడుకొల్పె; నంత.

287

తా ॥ అని సముద్రుడు విన్నవించగా, ఆయన మనవిని ఆలకించిన శ్రీరామచంద్రుడు, అలాగేనంటూ, ఆయన్ని 'యథా పూర్వ స్థితిలో ఉందువు' గాక అని సెలవిచ్చి సాగనంపాడు.

క. ఘనశైలంబులుఁ దరువులు, ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్ ఘనవనరాశిం గట్టిరి, ఘనవాహ ప్రముఖ దివిజగణము నుతింపన్.

288

తా ॥ అంతట వానర కుల ప్రముఖులు అంతమందీ, తమదైన జవసత్త్వాల కొద్దీ, పెద్దపెద్ద కొండలను, చెట్లను పెరికి తెచ్చి సముద్రానికి వారధి కట్టారు. దీనిని చూసిన ఇంద్రాది దేవతలు ఆ ఘనకార్యాన్ని చూసి ప్రశంసించారు.

వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుఁ జని విడిసి వేడె పెట్టించి లగ్గలు పట్టించిన.

289

తా ॥ అలా శ్రీరామచంద్రుడు సేనతో సముద్రాన్ని దాటాడు. అంతట రావణుని తమ్ముడు విభీషణుడు వచ్చి శరణు కోరగా అతనికి అభయమిచ్చి, లంకలో ప్రవేశించి విడిదిచేసి కోటను

ముట్టడించడానికి అనుమతి నిచ్చి, దానికి లగ్గలు పట్టించాడు.

సీ. ప్రాకారములు ద్రవ్వి, పరిఖలు పూడిచి కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్లు పెకలించి తలుపులు విఱచి యంత్రములు సెఱిచి
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనంబులు సించి సోపానములు గదల్చి

ఆ. గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి, భర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను సొచ్చి కలఁచిన కైవడిఁ, గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు.

290

తా ॥ అప్పుడు వానరసేన, కోటగోడలను కుళ్ళగించింది. అగడ్తలు పూడ్చేసింది. కోట బురుజులు నేలమట్టం చేసి, ద్వారబంధాలు పగులగొట్టి, తలుపులు విరుగగొట్టి, కీళ్ళు సడలించి, శిఖరాలను నేలరాల్చి, వీథులను రూపుమాపి, మకర తోరణాలను త్రెంచి, జెండాలను చించి, మెట్ల మార్గాలను ధ్వంసం చేసి, ఇళ్ళను పడగొట్టి, మేడలను పెకలించి, స్వర్ణకుంభాలను పీకి పారవేసి, ఏనుగులు సరస్సును కలచివేసినట్లు, లంకలోనికి ప్రవేశించి నానావిధాలుగా ధ్వంసం చేసి బీభత్సాన్ని సృష్టించింది.

వ. అంత న య్యసురేంద్రుడు పంచిన గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమర గదా ఖడ్గ శూల భిందిపాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు సేయు సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీల కుముద జాంబవదాదు లా రక్కసుల నెక్కటి కయ్యంబులందుఁ దరుల, గిరులఁ, గరాఘాతంబుల నుక్కడంచి రంత.

291

తా ॥ అప్పుడు రావణాసురుడు పంపగా కుంభుడు, నికుంభుడు, ధూమ్రాక్షుడు, విరూపాక్షుడు, సురాంతకుడు, నరాంతకుడు, దుర్ముఖుడు, ప్రహస్తుడు, మహాకాయుడు మొదలగు రాక్షస వీరప్రముఖులు, విండ్లు, బాణాలు, తోమరాలు, గదలు, ఖడ్గాలు, శూలాలు, గిరగిరా తిప్పికొట్టే వడిసెల గుదియలు, గండ్రగొడ్డళ్ళు, పిడిబాకులు, బరిసెలు, ఈటెలు మొదలైన ఆయుధాలు ధరించి గుర్రాలపై, ఏనుగులపై, రథాలపై వచ్చి యుద్ధం సాగించారు. వారికి దీటుగా సుగ్రీవుడు, హనుమంతుడు, పనస, గజ, గవయ, గంధమాదన, నీల, అంగద, కుముద, జాంబవంతాది వానరవీరులు ఆ రాక్షసులతో ద్వంద్వయుద్ధానికి పూనుకొని, చెట్లతో, కొండలతో, పిడికిటి పోట్లతో వారిని ఎదుర్కొని, సంహరించారు.

క. ఆ యెడ లక్ష్మణుఁ డుజ్జ్వల, సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో, పాయున్ నయగుణ విధేయు న య్యతికాయున్.

292

తా ॥ అంత లక్ష్మణుడు పదనైన బాణాలతో కొండంత లావైనవాడూ, దేవతలకు కూడా అలవి మాలినవాడూ నయగుణ విధేయుడూ అయిన అతికాయుడనే వాడిని కూల్చివేశాడు.

ఆ. రామచంద్ర విభుఁడు రణమున ఖండించె, మేటి కడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తి పూర్ణుఁ బటుసింహనాద సం, కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు.

293

తా ॥ శ్రీరామచంద్రుడు ఆనాటి యుద్ధంలో నల్లని మేఘం వంటి శరీరచ్ఛాయగలవాడూ, భుజశక్తి సంపన్నుడూ, చెవులు గళ్ళుపడేట్లు సింహనాదం చేసేవాడూ అయిన కుంభకర్ణుని సంహరించాడు.

క. అలవున లక్ష్మణుఁ డాజి, స్థలి గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్ బలభేది జయవినోదున్, బలజనిత సుపర్వ సుభటభావవిషాదున్.

తా ॥ తన సుమనోహర రూపంతో చూసేవారికి ఆహ్లాదం కలిగించేవాడు, ఇంద్రుని జయించినవాడు, ఇంద్రుని దేవగణాన్ని చీల్చి చెండాడినవాడూ అయిన మేఘనాథుని, శ్రమకోర్చి లక్ష్మణుడు రణరంగానికి బలి చేశాడు.

వ. అంత.

295

తా ॥ అంతట.

క. తనవారందఱు మ్రగ్గిన, ననిమిషపతివైరి పుష్ప కారూఢుండై
యనికి నడచి రామునితో, ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్.

296

తా ॥ తన వారందరూ యుద్ధంలో సమసిపోగా, దేవవిరోధి అయిన ఆ రావణాసురుడు, పుష్పక విమానాన్ని అధిరోహించి యుద్ధభూమి కేతెంచి, అత్యంత రోషంతో, పెచ్చు రేగిన కోపంతో రామునితో బాణయుద్ధం చేయసాగాడు.

వ. అ య్యవసరంబున.

297

తా ॥ ఆ సమయంలో.

క. సురపతిపంపున మాతలి, గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కెను, ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్.

298

తా ॥ ఇంద్రుడు పంపగా అతని సారథి మాతలి గొప్ప దివ్యరథాన్ని తీసుకొని వచ్చాడు. సూర్యభగవానుడు తూర్పు దిక్కును అధిరోహించినట్లుగా శ్రీరామచంద్రుడు ఆ రథాన్ని అధిరోహించాడు.

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె.

299

తా ॥ ఇట్లా ఆ దివ్యరథారూఢుడై శ్రీరామచంద్రుడు రావణునితో ఇలా అన్నాడు:

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపట బ్రాహ్మణమూర్తివై యబల నా కాంతార మధ్యంబునం
దపలాపించుటయో మదీయశిత దివ్యామోఘ బాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా!

300

తా ॥ "రావణా! మతిమాలి, మొదటే నీవు రాక, వెనుక ఉండి, బంగారు లేడిని పంపావు. బ్రాహ్మణుని వలె వేషం వేసుకొని వచ్చి, అరణ్యంలో ఉన్న అబలను ఎత్తుకొచ్చావు. బాగుంది. కాని, పదనైనవీ, దివ్యమైనవీ, ప్రయోగిస్తే తమ కార్యాన్ని ముగించటం తప్ప వ్యర్థం కానివీ అయిన నా బాణాల నుండి ఎలా తప్పించుకోగలవు? అది సాధ్యం కాదే!

క. నీ చేసిన పాపములకు, నీచాత్మక! యముఁడు వలదు నేఁ డిట నా నా
రాచములఁ ద్రుంచి వైచెద, ఖేచర భూచరులుఁ గూడి క్రీడన్ జూడన్.

301

తా ॥ నీవు చేసిన దురాగతాలకు, ఆ యమునితో పనిలేదు. అటు దేవతలు, ఇటు మానవులు చూస్తూ ఉండగా, ఒక హేలగా నా బాణాలతో నిన్ను కడతేరుస్తాను, కాచుకో!"

వ. అని పలికి.

302

తా ॥ అంటూ —

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమంబుగాఁ
బ్రళయోగ్రానల సన్నిభంబగు మహాబాణంబు సంధించి రా
జ లలాముండగు రాముఁ దేసె ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భ స్రావణున్ రావణున్.

303

తా ॥ అత్యంత దృఢమైన తన విల్లందుకొని, బ్రహ్మాండమంతా ప్రతిధ్వనించేటట్లుగా నారిని లాగి ధనుష్టంకారం గావించి, ప్రళయకాలం నాటి కాలాగ్ని వంటి మహాబాణాన్ని సంధించి, కఠోరమైన మాటలు వినటంలో ఆసక్తి గలవాడూ, దేవసైన్యాన్ని హడలగొట్టినవాడూ, శత్రురాజుల భార్యల గర్భపాత కారకుడూ అయిన ఆ రావణాసురునిపై రాజశేఖరుడైన శ్రీరామచంద్రుడు గురిచూసి కొట్టాడు.

క. దశరథ సూనుం డేసిన, విశిఖము హృదయంబుఁ దూఱ వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను, దశవదనంబులను రక్తధారలు దొరఁగన్.

304

తా ॥ దశరథ పుత్రుడు వేసిన ఆ బాణం గుండెల నుండి దూసుకొని పోగా, ఆ దశకంఠుడు వివశుడై తన దశముఖాల నుండి రక్తం క్రక్కుతూ తూలి నేల కొరిగాడు.

వ. అంత నా రావణుండు దెగుట విని.

305

తా ॥ అంతట రావణుని మరణ వార్త విని –

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప
సేసముత్యంబులు సెదరఁ గర్ణిక లూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్ళవఱద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల బరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ

ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు బాఱ, నట్టు నిట్టు తప్పుటడగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూత వేతాళ, సదనమునకు ఘోరకదనమునకు.

306

తా ॥ అసురకాంతలు, కొప్పులు విడిపోయి, పూలచెండ్లు ఊడిపోయి భుజాలపై పడి ముత్యాలు చెదరి, చెవి కమ్మల దుద్దులు ఊడి, మెడలోని హారాలు చిక్కుపడి, ముఖపద్మాలు వాడబారి, పెదవులు ఎండి, కన్నీళ్ళు వరదలై పారగా దేహాలు తడిసిపోయి, సన్ననైన నడుములు వణికిపోతుండగా, పాలిండ్లు బరువుతో నడుముకు దిగజారగా, తలలు బాదుకుంటూ, పైట చెరగులు జారిపోయి, నడకలు గతిదప్పి తూలిపోతూ, భూతపిశాచాల నిలయమైన రణభూమికి చేరుకున్నారు.

వ. ఇట్లు వచ్చి తమ తమ నాథులం గని, శోకించి, రందు, మందోదరి రావణుంజూచి యిట్లనియె.

307

తా ॥ అలా వచ్చి, అక్కడ తమ భర్తల కళేబరాలను చూసి ఒక్కపెట్టున రోదించారు. రావణుని ఇల్లాలు మందోదరి రావణుని కళేబరాన్ని చూస్తూ ఇలా విలపించింది:

ఉ. హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం

ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక సో
న్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికిఁ దెచ్చి? తప్పు డేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబును బొంది తక్కటా!

308

తా ॥ "అయ్యో! రాక్షసేశ్వరా! దేవ గణాంతకా! ప్రాణవల్లభా! దేవేంద్రాదులను గెలిచినవాడవు, మన్మథుని పుష్పాస్త్రాలను గెల్వలేక, కామోన్మాదానికి గురియై, రఘునాయకుని ఇల్లాలిని దేనికి తెచ్చినట్లు? నేను అప్పుడే చెప్పాను గదా, అది తగదని. నా మాట పట్టించుకోకపోతివి. కాలుని వశమైపోతివి గదా!

ఆ. ఎండఁగాయ వెఱచు నినుఁడు వెన్నెలఁగాయ, వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు
లంకమీఁద; నిట్టి లంకాపురికి మాకు, నధిప! విధవభావ మడరె నేఁడు

309

తా ॥ లంకపై తిన్నగా ఎండకాయడానికి సూర్యుడు బెదరేవాడు! వెన్నెల కురిపించడానికి భయపడ్డాడు చంద్రుడు. వీయాలంటే గాలి వెరచింది. అంతా నీ ఆజ్ఞ చొప్పున నడుచుకున్నారు. చూడు ఇప్పుడేమైందో! మేమూ, లంకా రెండూ నాథుడు లేని వారమై పోయాము గదా!

క. దురితముఁ దలఁపరు గానరు, జరుగుదు రెటకైన నిమిష సౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును, బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే?

310

తా ॥ అయ్యయ్యో! నిమిషం పాటి సౌఖ్యం కొరకు పాపమని ఆలోచించరు పురుషులు. కన్నుగానరు. ఎక్కడికైనా, ఎంత దూరమైనా వెళతారు గదా! పరుల స్త్రీలను, ధనాన్ని ఆశించేవారికి ఇహపరాలు రెండూ దక్కవే!"

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపు వడసి, రావణునకు దహనాది క్రియలు గావించె, నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపాతరుసమీపంబు నందు.

311

తా ॥ అని ఆమె పనవి పనవి దుఃఖించింది. అంతట రాముని మాటపై విభీషణుడు రావణునికి అంతిమ సంస్కారం కావించాడు. ఆ పిమ్మట శ్రీరామచంద్రుడు అశోకవనంలోని శింశుపా వృక్ష సమీపానికి వెళ్ళాడు.

శా. దైతేయ ప్రమదా పరీత నతిభీతన్ గ్రంథి బంధాలక
వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణ జీవంజీవదారామ భూ
జాతన్ శుష్కకపోల కీలిత కరాబ్జాతం బ్రభూతం గృశీ
భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్.

312

తా ॥ అక్కడ రాక్షసాంగనలు చుట్టి ఉండగా తన ప్రాణంలో ప్రాణమైన సీతాదేవిని చూశాడు. భీతిగొని, శిరోజాలు అట్టకట్టిపోయి, నిట్టూర్పుల వేడి వాయువులతో శుష్కించిపోయిన ఉద్యానవన వృక్షం వలె, లోతుకుపోయిన చెక్కిళ్ళపైని కరకమలాన్ని ఆనించికొని ఉన్న దీనవదనను, పరమ పావనమూర్తిని, కృశించిపోయి, మూర్తీభవించిన శోక దేవతవలె ప్రాణాలను తనకై నిలుపుకొని, ఎదురు చూస్తున్న సీతాదేవిని ఆ ధరణీపతి తన ఎదుట చూశాడు.

వ. కని రామచంద్రుడును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు సేసి, దేవతల పంపున దేవిం జేకొని.

313

తా ॥ ఆ స్థితిలో ఆమెను చూసి రామచంద్రుడు కూడా అమితమైన దుఃఖానికి

గురియైనాడు. ఆమె యందు ఏ దోషమూ లేదని తనకు తెలిసినా, ఆమె పుణ్యచరిత్రను అగ్నిముఖంగా ప్రకటింపచేసి, దేవతల మాట చొప్పున ఆమెను పరిగ్రహించాడు.

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గ మ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్య పోషణుఁ గృపాగుణభూషణు న వ్విభీషణున్.

314

తా ॥ ఆ తరువాత, ఆ దానవాంతకుడు, ఆ రాజచంద్రుడు, ఆ శ్రీరాముడు – కోరిన వారి కోర్కెలను ఈడేర్చేవాడు, పాప నిర్మూలకుడు, నిందాగుణం లేని శాంతస్వభావుడు, రోషమన్నది ఏ కోశానా లేనివాడు, ఏది ఎంతవరకూ మాట్లాడాలో అంతవరకే చక్కగా ఎదుటవారికి ఆహ్లాదం గొలిపేటట్లు మాట్లాడగల మాట నేర్పుగలవాడు, ఆర్తులను పోషించడంలో ముందుండేవాడు, దయాళువు అయిన విభీషణుని ఆకల్పాంతం చిరాయువుగా వర్ధిల్లమని ఆశీర్వదించి, రావణుని అశేషరాజ్య వైభవానికి పట్టం గట్టాడు.

వ. ఇట్లు విభీషణ సంస్థాపనుండై రామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుండై, సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుండై, వేల్పులు గురియు పువ్వుల సోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువు జాడలు సీతకు నెఱింగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున.

315

తా ॥ విభీషణుణ్ణి అలా పట్టాభిషిక్తుని చేసి, శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై సుగ్రీవుడు, హనుమంతుడు మున్నగువారితో పుష్పక విమానాన్ని అధిరోహించాడు. దేవతలు ఒక్కపెట్టున పూలవాన కురిపించారు. విమానం బయలుదేరింది. తాను ముందు వచ్చిన

త్రోవలను సీతాదేవికి చూపుతూ వాటిని గూర్చి వివరిస్తూ నందిగ్రామానికి చేరుకున్నాడు శ్రీరాముడు.

ఆ. రామచంద్రవిభుని రాక వీనుల విని, భరతుఁ డుత్సహించి పాదుకలను మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను, లెల్ల గొలువ నన్న కెదురు వచ్చె.

316

తా ॥ శ్రీరామచంద్రుని రాకను తెలుసుకొని భరతుడు ఎంతో సంతోషంతో, మనస్సు మురిపెంతో, శ్రీరాముని పాదుకలను శిరసుపై పెట్టుకొని, పురజనులు వెంటరాగా, అన్నగారికి ఎదురుకోలు చెప్పడానికి వచ్చాడు.

వ. వచ్చి, పాదుకల ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు, మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని తనివిలేక మఱియు, న ప్పదకమలంబు లక్కున మోపికొనుచు, సంతసంపుఁ గన్నీటం గడిగి, సేమంబు లరయుచుండె. నంత సీతాలక్ష్మణ సహితుండై విభుండును, దన కెదురు వచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి తక్కిన వారలచేత మన్ననలు వొంది వారల మన్నించె, నయ్యవసరంబున.

317

తా ॥ వచ్చి, పాదుకలను తన ముందుంచుకొని పదేపదే సాష్టాంగ దండ నమస్కారాలు చేస్తూ, మెల్ల మెల్లగా అన్నగారి సమ్ముఖానికి వచ్చి, ఆయన పాదాలకు తన నొసలును తాకించి, పాదాలను మెత్తగా తుడిచి, ఆ ధూళిని తన తలపై జల్లుకొని, అప్పటికీ తనివి తీరక, అన్నగారి పాదపద్మాలను తన రొమ్ముపై ఉంచుకున్నాడు. సంతోషాన కన్నులుబికి వచ్చిన నీటితో ఆయన పాదాలను కడిగి, యోగక్షేమాలను ఆరా తీస్తూ వచ్చాడు. అంతట శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై తనను స్వాగతించడానికి వచ్చిన బ్రాహ్మణులకు నమస్కరించి, ఇతరులచేత తాను

మన్ననలు పొంది, వారి యోగక్షేమాలను తెలుసుకున్నాడు. అంతట –

చ. నృపవర! పెక్కునాళ్ల ఁగోలె నిన్ గనకుండిన యట్టి నేఁడు మా
తపములు పండె నిందఱము ధన్యుల మైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ సేసి రెల్లెడన్.

318

తా ॥ అక్కడ కూడిన ప్రజలందరూ జేజేలు పెడుతూ, 'మహారాజా! ఎన్ని నాళ్ళయింది మిమ్మల్ని కళ్ళారా చూసి! ఈ నాటికి మా తపస్సులు ఫలించాయి. నిన్ను చూశాము. మా జన్మ ధన్యమైంది' అంటూ, తమ పైపంచెలను గాలిలో ఎగురవేసి త్రిప్పుతూ, ఊపుతూ, ఎగురవేస్తూ, పూలు చల్లుతూ, వసంతాలాడుతూ, పాటలు పాడుతూ, ఒళ్ళూ, పై తెలియకుండా, ఆ క్షణాన తమ పెద్దరికపు మర్యాదలను కూడా విడిచి కేరింతలు కొడుతూ, ఉల్లాసంగా పండుగ చేసుకున్నారు.

సీ. కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస రాజు నొక్కెడఁ జామరములు వీవ
హనుమంతుఁ డతి ధవళాతపత్రముఁ బట్టఁ బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్నుఁ డమ్ములుఁ జాపంబుఁ గొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనపుసూప
జలపాత్ర చేఁబట్టి జనకజ గూడిరాఁ గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

ఆ. బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి, కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహము లెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ, చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె.

319

తా ॥ సుగ్రీవుడు, విభీషణుడు ఒక జతగా కూడి శ్రీరామునికి రెండువైపుల చామరాలు వీస్తున్నారు. హనుమంతుడు తెల్ల గొడుగు పట్టాడు. భరతుడు పాదుకలు తెస్తున్నాడు.

శత్రుఘ్నుడు విల్లూ బాణాలూ పట్టుకొని తెస్తున్నాడు. లక్ష్మణుడు సేవకుడై పాదాల వద్ద కూర్చున్నాడు. సీతాదేవి నిండుగా నీరున్న కలశాన్ని పట్టుకుంది. బంగారు ఖడ్గాన్ని అంగదుడు, డాలును జాంబవంతుడు పట్టుకోగా; గ్రహాలన్నీ సేవిస్తుండగా పూర్ణచంద్రుడు ఎలా భాసిస్తాడో అలా శ్రీరామచంద్రుడు, పుష్పక విమానంలో బయలుదేరాడు.

వ. ఇట్లు పుష్పకారూఢుండై, కపి బలంబులు చేరి కొలువ, శ్రీరామచంద్రుం డయోధ్యకుం జనియె. నంతకు మున్న య ప్పురంబునందు.

320

తా ॥ ఇలా పుష్పక విమానారూఢుడై, వానరసేన సేవిస్తూ ఉండగా, శ్రీరామచంద్రుడు అయోధ్యా నగరానికి వెళ్ళాడు. వీరు అక్కడకు చేరడానికి పూర్వమే, ఆ పట్నంలో –

సీ. వీథులు సక్కఁ గావించి తోయంబులు సల్లి రంభాస్తంభచయము నిలిపి
పట్టుచీరెలు సుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్లు గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి ప్రాసాదములు దేవభవనములును

తే. గోపురంబుల బంగారు కుండలెత్తి యెల్ల వాకిండ్లఁ గానుక లేర్పరించి జనులు గైసేసి తూర్య ఘోషములతోడ నెదురు నడతెంచి రా రాఘవేంద్రుకడకు.

321

తా ॥ వీథులన్నింటిని ఊడ్చి పరిశుభ్రం చేసి, దుమ్ము లేవకుండా నీళ్ళుచల్లారు. బాట కిరువైపులా అరటి బోదెలను నిలిపారు. వాటికి పట్టు వస్త్రాలు చుట్టి, తోరణాలు కట్టారు. బంగారు కలువపూదండలను వ్రేలాడదీశారు. ముంగిళ్ళు, అరుగులు అలికించి, వివిధరత్నాల కాంతులు వెదచల్లే విధంగా, బహువిధాలుగా ముగ్గులు పెట్టారు. గోడలపై రామవృత్తాంతాలను బొమ్మలుగా చిత్రించారు. మేడలపైనా, దేవాలయ శిఖరాలపైనా బంగారు కలశాలను నిలిపారు.

వాకిళ్ళ ముందు రామచంద్రునికి సమర్పించడానికి కానుకలను ఉంచారు. అలా పట్టణాన్ని అలంకరించి, పురజనులంతా మంచి బట్టలు ధరించి, అలంకరించుకొని, మంగళ తూర్యారవాలతో శ్రీరామచంద్రునికి ఎదుర్కోలు నడిపారు.

క. సమద గజదానధారల, దుమదుమలై యున్న పెద్ద త్రోవల తోడన్ రమణీయ మయ్యె న
పురి, రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్.

322

తా ॥ అదంతా ఎలా ఉందంటే – మదపుటేనుగుల మదజలధారలతో రాజమార్గాలన్నీ బురదతో నిండి, భర్త రాగా ఆనందాతిరేకానికి గురియైన భార్యవలె, అంతా బహు రమణీయంగా ఉంది.

ఆ. రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో, రథగజాశ్వసుభటరాజితోడ
నమరెఁ బురము, చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు, జంతుభంగమిళిత జలధిభంగి.

323

తా ॥ రామచంద్రుడు అలా తూర్యారవాలతో, రథాలు, ఏనుగులు, గుఱ్ఱములు, భటులతో నగరప్రవేశం చేయడంతో నగరమంతా ఒకటే సందడి. ఆ సందడి ఎలా ఉందంటే చంద్రోదయ వేళ, తనలోని జంతు సంతానంతో కడలి ఉప్పొంగి ఘోషపెడుతోందా అన్నట్లుగా ఉంది.

వ. 'ఇట్లొప్పుచున్న య పురంబు ప్రవేశించి, రాజమార్గంబుల రామచంద్రుం డరుగుచున్న
సమయంబున.

324

తా ॥ అలా అంతటా ఒక పండుగ వాతావరణం చోటు చేసుకున్న పట్నంలోనికి, రాజమార్గంలో శ్రీరామచంద్ర ప్రభువు ప్రవేశించాడు.

మ. 'ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబల కాయింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు
త్సుతుం డాచెంగట నా విభీషణుఁ' డటంచుం జేతులం జూపుచున్
సతులెల్లన్ బరికించి చూచిరి పురీసౌధాగ్ర భాగంబులన్.

325

తా ॥ ఆ సమయంలో ఆయనను చూడటానికి మేడలపైకి చేరుకున్న స్త్రీలు, ఆయనను చూపుతూ, చూస్తూ తమలో తాము, 'ఈయనే శ్రీరామచంద్రుడు! ఇదిగో సీతాదేవి! ఆమె కొరకే ఆయన రావణాసురుని మట్టుపెట్టాడు. అదిగో, అల్ల అక్కడ ఉన్నాడే ఆయనే లక్ష్మణస్వామి! ఆయనేమో సుగ్రీవుడు, ఆ ప్రక్కన ఉన్నాడే, ఆయనేమో హనుమంతుడు! ఆ దగ్గరగా ఉన్న ఆయన విభీషణుడు' అంటూ వారిని పరీక్షగా చూస్తూ ఒకరికొకరు అతిశయంగా చెప్పుకుంటున్నారు.

వ. ఇట్లు సమస్త జనులు సూచుచుండ రామచంద్రుండు రాజ మార్గంబునం జనిచని.

326

తా ॥ అలా సమస్త ప్రజానీకం ఆనందంగా కళ్ళప్పగించి చూస్తూ ఉండగా, రామచంద్రుడు రాజమార్గంలో వెళుతున్నాడు.

సీ. పటికంపు గోడలు పవడంపు వాకిండ్లు నీలంపు టరుగులు నెఱయఁ గలిగి
కమనీయమై దూర్యక స్తంభ చయముల మకరతోరణముల మహిత మగుచుఁ
బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ జిగురు తోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను బహుతర ధూపదీపముల మెఱసి

తే. మాఱువేల్పుల భంగిని మలయుచున్న, సతులు పురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరాని ధనముల కుప్పలున్న, రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు.

327

తా ॥ స్ఫటికపు గోడలు, పగడాల ముంగిళ్ళు, నీలపుటరుగులతో, వైడూర్యాలు తాపిన అందమైన స్తంభాలతో, మకరతోరణాలతో శోభిల్లుతున్న మందిర భవనాలు; ఆ భవనాల ద్వారాలకు కట్టిన మాణిక్యాలు కూర్చిన జాలరులు, లేత చిగురుటాకుల తోరణాలు, పూదండలు, ధూపదీపాల నుండి గుప్పుమంటూ అంతటా వ్యాపించిన సుగంధపరిమళాలు, దేవతలను తలపించే స్త్రీ పురుషుల సంచారంతో ఏ వేళా ఒకటే సందడిగా, చెప్పడానికి అలవికాని సంపద రాసులతో శోభిస్తున్న రాజగృహానికి రామచంద్రుడు వేంచేశాడు.

వ. ఇట్లు వచ్చి.

328

తా ॥ అలా వచ్చి,

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాలికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
ఫుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాలమన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్.

329

తా ॥ తల్లులైన సుమిత్ర, కైకలకు, తన తల్లిగారైన కౌసల్యకు మ్రొక్కి నమస్కరించాడు. పండితకోటికి తలవంచి వినయంగా నమస్కరించాడు. స్నేహితులను, తమ్ముళ్ళను కౌగిలించుకున్నాడు. మంత్రులను, తన చిన్ననాటి సేవకా సమూహాన్ని ఆనందంతో దయ జాలువారగా వారి వారి అర్హతలననుసరించి అందరినీ మన్నన చేశాడు.

వ. తత్సమయంబునఁ దల్లులు.

తా ॥ అప్పుడు, తల్లులు

చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులన్ బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దులు గొంచు నవ్వుచున్ దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్ వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు నుబ్బుచున్.

331

తా ॥ తమకు మ్రొక్కిన కొడుకుల్ని, పెద్ద కోడలు సీతాదేవిని, చేతులతో పైకి ఎత్తి లేవదీసి, వారి బుగ్గలు పుణికి, ముఖాలపైనా, శిరస్సులపైన ముద్దులు పెట్టి, సంతోషంతో వారిని తొడలపై కూర్చోపెట్టుకొని, పోయిన ప్రాణాలు తిరిగి వచ్చాయి గదా! అంటూ, వారు ఎంతో సంతోషంతో తమ కన్నీళ్ళతో వారిని తడిపేశారు.

వ. అంత వసిష్ఠుండు, శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం, దానును సమంత్రకంబుగా దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చందంబున, సముద్ర నదీజలంబుల నభిషేకంబు సేయించె; రఘువరుండును, సీతాసమేతుండై, జలంబు లాడి, మంచిపుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి, కౌసల్యకుఁబ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగా రాజ్యంబు సేయుచుండె; నప్పుడు.

332

తా ॥ అంతట కుల పురోహితుడు వసిష్ఠులవారు వచ్చి శ్రీరామచంద్రుని జడముడిని విప్పించాడు. వంశంలోని వృద్ధులూ, తానూ మంత్రపూర్వకంగా, బృహస్పతి దేవేంద్రునికి మంగళస్నానం చేయించినట్లుగా, సముద్రజలాలు, నదీజలాలతో శ్రీరామునికి అభిషేకం

గావించాడు. శ్రీరాముడు, సీత ఇరువురూ స్నానాలు చేసి, క్రొత్త బట్టలు ధరించారు. మంచి పువ్వులు పెట్టుకున్నారు. సుగంధ ద్రవ్యాలు పూసుకున్నారు. ఆభరణాలు ధరించారు. భరతుడు తనకు సమర్పించిన సింహాసనాన్ని అధిష్ఠించి, తల్లి కౌసల్యకు సంతోషాన్ని చేకూరుస్తూ, లోకమంతటి చేతా గౌరవ మన్ననలందుకుంటూ రాజ్యపాలనం చేస్తూ వచ్చాడు.

సీ. కలఁగు టెల్లను మానెఁ గంధు లేడింటికిఁ జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు; దీనభావము మానె దిక్పతులకు;
మాసి యుండుట మానె మార్తాండ విధులకుఁ; గావిరి మానె దిక్తటములకును;
నుడిగి పోవుట మానె నుర్వీరుహంబుల; కణఁగుట మానెఁ ద్రేతాగ్నులకును;

ఆ. గడిఁది వ్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ, కమఠములకుఁ బ్రజల కలఁక మానె;
రామచంద్ర విభుఁడు రాజేంద్రరత్నంబు, ధరణి భరణరేఖఁ దాల్చు నపుడు

333

తా ॥ అలా ఆయన పాలిస్తున్న కాలంలో ఏడు సముద్రాలు ఎన్నడూ కల్లోలాలను ఎరుగవు. భూమి ఎన్నడూ కంపించింది లేదు. విష్ణువుకు జగత్తును కనిపెట్టి చూసే అవసరం కలుగలేదు. దిక్పతులు దిగులన్నది ఎరుగరు. సూర్యచంద్ర కాంతులకు ఎన్నడూ మాపన్నది కలుగలేదు. దిగంతాలలో కావిరి ఎన్నడూ ఏర్పడలేదు. చెట్లు ఉడిగిపోక చక్కగా పెరిగాయి. త్రేతాగ్నులకు ఆరుదల అన్నది లేక ఏ వేళా చక్కగా ప్రజ్వలించాయి. దిగ్గజాలకు, కుల పర్వతానికి, ఆదివరాహానికి ఆదిశేషునికి, ఆదికూర్మానికి బరువు బాధ్యతలు తప్పిపోయాయి. ప్రజల్లో ఎలాంటి కల్లోలాలు లేక సుఖశాంతులతో వర్ధిల్లారు.

వ. మఱియును.

334

తా ॥ అంత మాత్రమే కాదు.

సీ. పొలఁతుల వాలుఁజూపులయంద చాంచల్య; మబలల నడుములయంద లేమి;
కాంతాలకములంద కౌటిల్యసంచార; మతివల నడపులయంద జడిమ;
ముగుదల పరిరంభములయంద పీడన; మంగనాకుచముల యందు పోరు;
పడఁతుల రతులంద బంధసద్భావంబు; సతులఁ బాయుటయంద సంజ్వరంబు;

తే. ప్రియులు ప్రియురాంద్ర మనముల బెరసి తార్పు, లంద చౌర్యంబు; వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళు పట్టులం దక్రమంబు; రామచంద్రుండు పాలించు రాజ్యమందు.

335

తా ॥ రామచంద్రుడు రాజ్యం చేస్తున్న కాలంలో – చపలత్వం, లేమి, పలుగాకి పోకిళ్ళు, మందకొడితనం, పీడ, పోరు, బంధనం, తాపం, చౌర్యం, అక్రమం అనేవాటికి ఆస్కారమే ఉండేది కాదు. ఒకవేళ ఉన్నా అవెలా ఉండేవంటే – యువతుల వాలు చూపుల్లో చంచలత్వం, వారి సన్నని నడుముల్లో లేమి, వారి ముంగురులలో కుటిలత, వారి నడకలలో మెల్లదనం, కౌగిళ్ళలో ఒరపిడి, కుచసంపదలో పరస్పర ఘర్షణ, వారి తోడి రతులలో చిత్రబంధాలు, ఎడబాటులో జ్వరార్తి, ప్రేయసీ ప్రియులు ఒకరి మనస్సు నొకరు దొంగిలించటం, భర్తలు తమ భార్యలను సాంగత్యం కొరకు కొప్పుపై చేయివేసి లాగటంలో మాత్రమే అక్రమం ఉండేవి తప్ప, రామరాజ్యంలో ఆ అవలక్షణాలకు మరెక్కడా చోటే లేదు.

క. దండ్రిక్రియ రామచంద్రుఁడు, దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్ దండ్రుల నందఱు మఱచిరి, తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్.

336

తా ॥ కన్న తండ్రివలె రామచంద్ర ప్రభువు, ప్రజలను కంటిరెప్పవలె రక్షించటంతో, వారు తమ తండ్రులను కూడా మరచి, ఆయన్నే తమ తండ్రిగా భావించారు.

వ. మఱియు, నా రామచంద్రుండు రాజర్షి చరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీ

వ్రతుండును, సర్వలోక సమ్మతుండును నగుచు, ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబు గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగ కుండ రాజ్యంబు సేయుచుండె, నయ్యెడ.

337

తా ॥ ఆయన, పూర్వరాజర్షులు ఎలా నడుచుకున్నారో అలా నడచుకున్నాడు. తనదైన ధర్మమేదో ఎరిగి ప్రవర్తించాడు. ఏకపత్నీవ్రతాన్ని పాటించాడు. సర్వలోకాలలో మెప్పుపొందాడు. ధర్మమైన పద్ధతిలో మాత్రమే ఇహలోకసౌఖ్యాలను అనుభవించాడు. తానున్నది త్రేతాయుగమైనా, కృతయుగం నాటి ధర్మాన్ని పాటించి, ప్రతిష్ఠించాడు. శిశుమరణాలు మొదలైన అరిష్టాలు ఆయన పాలనాకాలంలో మచ్చుకైనా కానరాకుండా రాజ్యం చేస్తున్నాడు. అప్పుడు.

ఆ. సిగ్గు వడుట గల్గి సింగారమును, గల్గి, భక్తి గల్గి చాల భయము గల్గి
నయముఁ బ్రియముఁ గల్గి, నరనాథు చిత్తంబు, సీత దనకు వశము చేసికొనియె.

338

తా ॥ ఆయన అలా పరిపాలన చేస్తూ ఉంటే – సీతాదేవి సిగ్గు, బిడియం, అందచందాలు, అలంకారం భక్తి, భయం, వినయం, వందనం మొదలగు సుగుణాలతో నాథుని తన కనుసన్నల్లో ఉంచుకుంది.”

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె.

339

తా ॥ అలా శుకమహర్షి చెపుతుండగా వింటున్న పరీక్షిన్మహారాజు మధ్యలో ఇలా అడిగాడు:

ఆ. భ్రాతృజనుల యందు బంధువులందును, బ్రజలయందు రాజభావ మొంది
యెట్లు మెలఁగె? రాముఁ డీశ్వరుం డగు తన్నుఁ, గూర్చి క్రతువు లెట్ల గోరి చేసె?'

340

తా ॥ 'బాగుంది మహానుభావా! మరి తమ్ములు, బంధువులు, ప్రజలు – వీరి పట్ల ఎలా మెలగుతూ వచ్చాడు ఆయన? ఎవరి సంప్రీతి కొరకు ఎలాంటి యజ్ఞయాగాలు ఎలా చేస్తూ వచ్చాడు. ఆ వైనం వివరించండి' అని అడిగాడు.

వ. అనిన శుకుం డిట్లనియె.

341

తా ॥ దానికి మహర్షి ఇలా చెప్పసాగాడు:

సీ. భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁదాన కూర్చి యధ్వరములు సేసెను; హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయనికి శమనదిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి సొమ్ముల పంచి భూసురుల కొసంగి

తే. తనదు రెండు పుట్టంబులుఁ దనకు నైన, మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె; నా రాము వితరణంబు, పాండవోత్తమ! యేమని పలుకవచ్చు?

342

తా ॥ "ఆ రామభద్రుడే సాక్షాత్తూ భగవంతుడు కదా! అందువలన దేవోత్తముడు, సర్వదేవమయుడూ అన్నీ తానే కనుక ఒక విధంగా తనను గూర్చే – అంటే విష్ణువును గూర్చే యజ్ఞయాగాలు చేశాడు. చేసి, అంతటా తానే గనుక హోతకు తూర్పు, సామగానం చేసిన వానికి ఉత్తర దిక్కును, బ్రహ్మస్థానం వహించినవానికి దక్షిణపు దిక్కును, అధ్వర్యునికి పడమటి దిక్కు,

మిగిలింది ఆచార్యునకు, పాడిపశువులను బ్రాహ్మణులకు పంచి ఇచ్చాడు. తనకు రెండు వస్త్రాలు, తన భార్య మెడలోని మంగళసూత్రపు పతకము తప్ప మిగిలినవన్నీ ఇచ్చి వారికి వినమ్రుడై నమస్కరించాడు. మరి, రాజా! పాండవ కులశ్రేష్ఠా! ఆయన వితరణ ఎలాంటిదని, ఎంతటిదని చెప్పాలి? చెప్పటం సాధ్యమేనంటావా? ఏమంటావు!"

వ. అంత నా రామచంద్రుని దాన శీలత్వంబునకు మెచ్చి విప్రవరులు తమతమ భూములు మరల నిచ్చి యిట్లనిరి.

343

తా ॥ అంటూ ఇంకా ఇలా చెప్పాడు: 'అంతట ఆ శ్రీరామచంద్రుని దానగుణాన్ని మెచ్చుకుంటూ, బ్రాహ్మణోత్తములు తమకిచ్చిన భూములనన్నింటినీ ఆయనకే ఇచ్చి, ఇలా అన్నారు:

ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల? నీ, వఖిలలోక గురుఁడవైన హరివి; మా మనంబు లందు మలయు చీఁకటిఁ బాపు, భవ దుదారరుచులఁ బార్థివేంద్ర!

344

తా ॥ "రామచంద్రప్రభూ! మేమా తపస్సు చేసుకునేవాళ్ళం. మాకేల ఈ భూమి? అఖిల లోకానికి జనకుడవైన హరివి నీవు. నీకు మాపై దయ కలిగితే, నీ ఔదార్యానికి మమ్మల్ని పాత్రుల్ని చేసి, దాని కాంతులతో మా మనస్సులలోని అజ్ఞానాంధకారాన్ని వెడలగొట్టి దివ్యజ్ఞానాన్ని ప్రతిష్ఠింతువు గాక!"

వ. అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సని రిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున.

345

తా ॥ అని చెప్పి బ్రాహ్మణులకు ఆరాధ్యుడైన రామచంద్రుని అనేక విధాలుగా ప్రస్తుతులతో కీర్తించి, పూజించి, వారు తమ దారిని తాము వెళ్ళిపోయారు. అలా చాలాకాలం రామచంద్రుడు రాజ్యం చేస్తూ వచ్చాడు. అలాంటి దినాల్లో ఒకనాడు,

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయిఁ దిరుగుచో నాగరజనములో నొక్కఁడు దన సతి యొప్పకున్న
నొరునింటఁ గాఁపురం బున్న చంచలురాలిఁ బాయంగ లేక చేపట్ట నేమి
తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే, బేల, పొమ్మను మాట బిట్టు వలుక

ఆ. నాలకించి మఱియు నా మాట చారుల, వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి, పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి.

346

తా ॥ రాజ్యంలో జరుగుతున్న కార్యకలాపాలను గూర్చి సమాచారం తెలుసుకునే నిమిత్తం అర్ధరాత్రి వేళ సంచరిస్తున్న సమయంలో, పట్నంలోని జనుల్లో ఒకడు తన భార్యను ఏలుకోవడానికి అంగీకరించక పోవడంతో అది మంచి పని కాదని అంటున్న వారితో, 'చపలచిత్తురాలైన దాన్ని విడిచిపెట్టక ఏలుకోవడానికి నేనేమైనా ఆ రామచంద్ర ప్రభువునా!' అని అతడు అంటున్న మాటల్ని శ్రీరామచంద్రుడు విన్నాడు. అలా ఆయన వినడమే గాక, ఆ తరువాత ఆ మాట ఆ నోటా ఈ నోటా రాజ్యమంతా వ్యాపించటాన్ని గూఢచారుల వలన తెలుసుకొని, సీత నిద్రపోతున్న వేళ, ఆమెకు చెప్పకుండా, తెలియకుండా రాత్రికి రాత్రే వాల్మీకి ఆశ్రమంలో దిగవిడచి రమ్మని ఆజ్ఞాపించాడు.

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును, చంద్రకేతుండును; భరతునకుఁ దక్షుండును, బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించి రయ్యెడ.

347

తా ॥ ఆ సమయానికి సీతాదేవి గర్భవతి. వాల్మీకి ఆశ్రమంలోనే ఆమె కుశలవులనే ఇద్దరు బాలకులను ప్రసవించింది. వారికి వాల్మీకి మహర్షి జాతకర్మలు నిర్వర్తించాడు. ఇది ఇలా ఉండగా, లక్ష్మణునికి అంగదుడు, చంద్రకేతుడు; భరతునికి దక్షుడు, పుష్కలుడు; శత్రుఘ్నునికి సుబాహుడు, శ్రుతసేనుడు అనే కుమారులు కలిగారు.

క. బంధురబలుఁడగు భరతుఁడు, గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁడగు నన్న కిచ్చెను, బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్.

348

తా ॥ అలా ఉంటూ ఉండగా, బలశాలియైన భరతుడు గంధర్వులను జయించి, ఎంతో బంగారాన్ని తెచ్చి అన్నగారికి సమర్పించాడు. దానికి బంధువులేమి, తల్లులేమి, ప్రజలేమి – అందరూ ఆయన్ని ప్రశంసించారు.

ఆ. మధువనంబులోన మధునందనుం డగు, లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ, డన్న రామచంద్రుఁ డౌననంగ.

349

తా ॥ పిదప అన్నగారైన రామచంద్రుని అంగీకారాన్ని పొంది, మధుభాషియైన శత్రుఘ్నుడు మధువనంపై దండెత్తి తన బాహుబలంతో మధునందనుడైన లవణుని సంహరించి, మధుపురాన్ని నిర్మించాడు.

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులైన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాది విద్యలయందు నేర్పరులై పెక్కు సభలను సతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు, నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని.

350

తా ॥ అలా కొంతకాలం గడిచింది. రామచంద్రుని కుమారులు లవకుశులు వాల్మీకి మహాముని శిక్షణలో వేదాది విద్యల్లో ఆరితేరారు. పెక్కు సభల్లో రామకథను శ్రుతిహితంగా తాళలయబద్ధంగా గానం చేస్తూ వచ్చారు. అలా గానం చేస్తూ ఒకనాడు శ్రీరామచంద్రుని యజ్ఞశాలకు వచ్చారు.

మత్త.వట్టిమ్రాఁకులు పల్లవింప నవారియై మధుధార దా
నుట్టఁబాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్
బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌదల లూఁచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్.

351

తా ॥ వచ్చి, వారు రామకథను గానం చేశారు. ఎండిన చెట్లు చిగిర్చి ఎడతెగకుండా తేనెల వాకలు స్రవిస్తున్నాయా అన్నట్లు సాగిన వారి గానమాధుర్యానికి, రామచంద్రప్రభువేమి, అక్కడి జనమేమి ఆనందసముద్రంలో మునిగిపోగా వారి కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్ళు జాలువారాయి. శెభాష్! అంటూ తలలూపారు. ఆ బాలకులపై వారికెంతో మక్కువ కలిగింది.

వ. అంత నా రామచంద్రుండు కుమారుల కిట్లనియె.

352

తా ॥ ఆ స్థితిలో రామచంద్రుడు వారిని చేర పిలిచి, ఆ కుమారులను ఇలా అడిగాడు:

ఆ. చిన్న యన్నలార! శీతాంశుముఖులార!, నళినదళ విశాలనయనులార! మధుర భాషలార! మహి మీఁద నెవ్వరు, తల్లి దండ్రి మీకు ధన్యులార!

353

తా ॥ "నాయనలారా! చంద్రబింబాలవంటి ముఖబింబాలతో, తామరరేకుల వలె విశాల నయనాలతో, తీయని కంఠస్వరం గల బాలకులారా! మిమ్మల్ని కన్న తల్లిదండ్రులెవరో, ఆ ధన్యులెవరో తెలుసుకోవచ్చునా" అని అడిగాడు.

వ. అనిన వార 'లేము వాల్మీకిపౌత్త్రులము; రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితి' మనవుడు మెల్లన నగి 'యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనియె.

354

తా ॥ దానికి వారు, "అయ్యా! మేము వాల్మీకి మహాముని మనుమలము. శ్రీరామచంద్రుని యాగం చూడటానికి ఇలా వచ్చాము" అని చెప్పగా, రామచంద్రుడు మందహాసం చేసి, "సరే, అలాగైతే రేపు ఉదయం మీ తండ్రిని గూర్చి తెలియవచ్చును. ఈ పూటకు మీరు ఇక్కడే ఉండండ" ని వారికి విడిది ఏర్పాటుచేసి వారిని సత్కరించి పంపాడు. మరునాడు వాల్మీకి మహర్షి, సీతను వెంటపెట్టుకొని కుశలవులతో రామచంద్రుని సమక్షానికి వచ్చి, ఆయనను బహువిధాలుగా కీర్తించి ఇలా అన్నాడు:

ఆ. 'సీత శుద్ధురాలు, చిత్తవాక్కర్మంబు, లందు సత్యమూర్తి యమలచరిత పుణ్యసాధ్వి విడువఁ బోలదు చేకొను, రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!

355

తా ॥ "రామచంద్రా! రవివంశాబ్ధి చంద్రమా! ఈ సీత కల్లాకపటం ఎరుగని ఇల్లాలు. త్రికరణశుద్ధి గల సత్యవంతురాలు. పుణ్యచరిత. సాధ్వీమతల్లి. ఒక దోషమంటూ ఎరుగనిది. నీవు విడువ తగనిది. గ్రహింతువు గాక!"

వ. అని వాల్మీకి వలుక, రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ, గుశలవులను వాల్మీకికి

నొప్పగించి, రామచంద్ర చరణ ధ్యానంబు సేయుచు, నిరాశయై సీత భూ వివరంబు సొచ్చె. నయ్యెడ.

356

తా ॥ అని వాల్మీకి చెప్పగా శ్రీరామచంద్రుడు తనను పట్టించుకోక కుమారులను గూర్చి వివరాలను అడుగుతున్నంతలో సీతాదేవి నిరాశతో కుశలవులను వాల్మీకి మహర్షికి అప్పగించి, శ్రీరామచంద్రుని పాదపద్మాలను మనస్సులో నిలుపుకొని, ఆమె భూమిలోనికి వెళ్ళిపోయింది. అంతట.

మ. ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీవాక్యంబు విన్పింపవే
తుదిసేయం దగ దంచు నీశ్వరుఁడనై దుఃఖించె భూపాలుఁ డా
పద గాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్?

357

తా ॥ శ్రీరామచంద్రుడు, 'దేవీ! భూమిలో ఎందుకు ప్రవేశించావు. మన పరస్పర ప్రేమను, అన్యోన్యతను ఒక్క క్షణమైనా ఆలోచించలేదేమి? ఒక్కసారి నీ ముఖపద్మాన్ని చూపవా! నీ ప్రియభాషణాన్ని విన్పించవా! ఇలా విడుమర చెప్పటం ధర్మమా?' అంటూ, తాను పరమేశ్వరుడే అయినా సామాన్యుని వలె, ఆ ప్రభువు అమితంగా దుఃఖించాడు. అవును మరి! ప్రాణేశ్వరిని కోల్పోయిన వారి దుఃఖం అలాంటిదే కదా!

వ. అని వగచి, రామచంద్రుడు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడతెగకుండ నగ్ని హోత్రంబులు సెల్లించి, తానీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం జనియె; ని వ్విధంబున.

358

తా ॥ అలా దుఃఖించి, ఆ పిదప శ్రీరామచంద్రుడు బ్రహ్మచర్యాన్ని పాటించి పదమూడువేల సంవత్సరాలపాటు నిత్యమూ అగ్నికార్యం తీర్చి, తానే ఈశ్వరుడు గనుక తిరిగి తన యథాపూర్వస్థానమైన వైకుంఠాన్ని చేరుకున్నాడు.

ఆ. ఆదిదేవుఁడైన యా రామచంద్రుని, కబ్ధిఁ గట్టు టెంత యసురకోటిఁ జంపుటెంత
కపులసాహాయ్య మది యెంత, సురల కొఱకుఁ గ్రీడ చూపెఁ గాక.

359

తా ॥ అవునా? అయినా ఆదిదేవుడైన ఆ రామచంద్రునికి సేతువును నిర్మించటం, అసురులను యావన్మందినీ సంహరించటం, దానికి వానరుల సహాయం – ఇవన్నీ పెద్ద పనులా! కాకపోతే ఆ భగవానునికి దేవతల నిమిత్తమై చూపిన ఇదొక లీలా వినోదం తప్ప మరొకటి మరొకటి కాదు సుమా!

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతా నివర్తికిన్
దశదిగధీశమౌళిమణి దర్పణమండిత దివ్యకీర్తికిన్;
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్.

360

తా ॥ సముద్రపు ఎగసిపాటును అడ్డుకున్నవాడు, దశదిశల్లోని దిక్పాలకుల కిరీట మణిమయ కాంతులవలె తన కీర్తిని ప్రకాశింపచేసినవాడు, వేయిమంది సూర్యుల కాంతితో వెలిగిపోయేవాడు, అమృతంవలె మధురభాషణలు మాట్లాడేవానికి, సాధుజనరక్షకుడూ, దశరథమహారాజు కుమారుడూ, రావణాసురుని మట్టుపెట్టినవాడూ అయిన ఆ మహితాత్మునికి, ఆ దివ్యస్వరూపునికి, ఆ దేవదేవునికి దాసుడనై మ్రొక్కుతున్నాను.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్

విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్.

361

తా ॥ నీలమేఘ శ్యామల వర్ణుడు, పద్మపత్రాల వంటి విశాలమైన కన్నులు కలవాడు, మహోన్నతములైన బాణాలను, విల్లునూ ధరించినవాడు, విశాలమైన వక్షస్థలం కలవాడు, శుభాలను చేకూర్చేవాడు, ఎగుభుజాలవాడు, దిగంతాల వరకూ తన కీర్తిని వ్యాపింప చేసినవాడు అయిన రఘుకులాబ్ధి చంద్రుడు, ఆ శ్రీరామచంద్రుడు మా అభీష్టాలను తీర్చు గాక!

ఆ. రామచంద్రుఁ గూడి రాకల పోకలఁ, గదిసి తిరుగువారుఁ గన్నవారు నంటికొన్నవారు
నా కోసల ప్రజ, లరిగి రాదియోగు లరుగు గతికి.

362

తా ॥ నాటి ఆ కాలంలో రామచంద్రుని నిత్యవ్యవహారాల్లో ఆయనతో కూడిమాడి తిరిగినవారు, ఆయనను కళ్ళారా చూసినవారూ, ఆయనతో బంధుత్వం నెరిపినవారూ అయిన ఆ కోసల దేశపు ప్రజలు అందరూ, ఆదియోగులైనవారు ఏ సద్గతికి వెళ్ళారో వారూ అదే సద్గతిని పొందారు సుమా!

క. మంతనములు సద్గతులకు, పొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహోఘ ని, కృంతనములు రామనామ కృతి చింతనముల్.

363

తా ॥ పవిత్రమైన రామనామాన్ని ఎల్లవేళలా భజించేవారి ఆలోచనలన్నీ సద్గతులకు సంబంధించినవే! చేసే ప్రయత్నాలన్నీ పుణ్యకార్యాల నిమిత్తమే. అంతేకాదు, ఆ చింతన, వర్తమానంలో చేస్తున్న, పూర్వం చేసిన పాపాలన్నింటినీ హరించి వేస్తుందంటే – ఆ మాట నిజం

సుమా!”

వ. ఆ రామచంద్రునకుఁ గుశండును, గుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకు జలుండను, జలునకు నర్కసంభువుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యనాభుండును జనియించిరి. ఆ హిరణ్యనాభుండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యముని వలన నధ్యాత్మయో గంబు నేర్చి, హృదయ కలుషంబులం బాసి యోగ చర్యుండయ్యెఁ; నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టి; రా రాజయోగి సిద్ధుండయి, కలాపగ్రామంబున నున్నవాఁడు; కలియుగాంతంబున నష్టం బయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గల వాఁ; డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నాప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహాస్వంతుండును, నా మహాస్వంతునకు విశ్వసాహ్యుండును, నా విశ్వసాహ్యునకు బృహద్బలుండును జనియించి రా బృహద్బలుండు భారత యుద్ధంబున మీ తండ్రియగు నభిమన్యునిచేత హతుండయ్యెఁ; వినుము.

364

తా ॥ అని శుకమహర్షి తరువాతి వృత్తాంతాన్ని కొనసాగించాడు:

“ఆ రామచంద్రుని కుమారుల్లో ఒకడు కుశుడని చెప్పాను గదా! అతని కుమారుడు అతిథి. ఆయనకు నిషధుడు జన్మించాడు. నిషధుని కొడుకు నభుడు. నభుని కుమారుడు పుండరీకుడు. ఆయనకు క్షేమధన్వుడు కలిగాడు. అతనికి దేవానీకుడు, అతనికి అహీనుడు,

అహీనునికి పారియాత్రుడు, అతనికి బలుడు జన్మించారు. బలుని కుమారుడు చలుడు. చలునికి సూర్యుని అంశతో వజ్రనాభుడు జన్మించాడు. అతనికి శంఖణుడు, శంఖణునికి విధృతి, విధృతికి హిరణ్యనాభుడు జన్మించారు. ఆ హిరణ్యనాభుడు, జైమిని మహాముని శిష్యుడైన యాజ్ఞవల్క్య మహర్షి వలన అధ్యాత్మయోగాన్ని అభ్యసించి పాపవిముక్తుడై యోగచర్యుడైనాడు.

హిరణ్యనాభుని కుమారుడు పుష్యుడు. పుష్యుని కుమారుడు ధ్రువసంధి. ఇతనికి సుదర్శనుడు జన్మించగా, సుదర్శనునికి అగ్నివర్ణుడు, అతనికి శీఘ్రుడు జన్మించారు. ఆ శీఘ్రునికి మరువు అనే రాజశ్రేష్ఠుడు జన్మించాడు. ఆయన రాజయోగసిద్ధుడై కలాపమనే గ్రామంలో ఉంటున్నాడు.

కలియుగాంతంలో ఈ సూర్యవంశం నశింపు అవుతుంది. అప్పుడు మరువు తిరిగి సూర్యవంశాన్ని పునరుద్ధరిస్తాడు. ఆ మరువు కుమారుడు ప్రసుశ్రుతుడు. అతని కుమారుడు సంధి. ఈ సంధికి అమర్షణుడు, అమర్షణునికి మహస్వంతుడు జన్మించారు. మహస్వంతుని కుమారుడు విశ్వసాహ్వుడు. ఇతని కొడుకు బృహద్బలుడు. ఈ బృహద్బలుని భారతయుద్ధంలో నీ తండ్రి అభిమన్యుడు సంహరించాడు.

## భవిష్యద్రాజేతిహాస వర్ణనము

తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ, దుదయుఁ గాఁగ రాజులఁ దోడుతోడ నెఱుఁగ జెప్పితి నీ వారి; నింకమీఁదఁ, బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర!

365

తా ॥ అవునా! నీవడిగినట్లుగా ఇక్ష్వాకుడు మొదలుగా బృహద్బలుని వరకూ గల సూర్యవంశ వృత్తాంతాన్ని, ఇంతవరకు చెప్పాను గదా! ఇక మీద పుట్టబోయేవారి సంగతిని వివరిస్తాను గాక! సావధానంగా వినవలసింది.

వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండునూ, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్త్రుండును, సుతక్షత్త్రునకు ఋక్షకుండును, ఋక్షకునకు నంతరిక్షుండును, నతనికి సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, రణంజయునకు సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధొదుండును, శుద్ధొదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును, బుట్టుదురు. సుమిత్రుని యనంతకాలంబున సూర్యవంశంబు నశింపం గలదు. వీరలు బృహద్బలుని నుండి క్రమంబునం బుట్టంగలవారలు అని చెప్పి శుకుం డిట్లనియె.

366

తా ॥ ఆ బృహద్బలునికి బృహద్రణుడు, అతనికి ఉరుక్షతుడు, ఉరుక్షతునికి వత్సప్రీతుడు, అతనికి ప్రతివ్యోముడు, అతనికి భానుడు, భానునికి సహదేవుడు జన్మిస్తారు. సహదేవునికి బృహదశ్వుడు జన్మింపగా అతనికి భానుమంతుడు, భానుమంతునికి ప్రతీకాశ్వుడు, అతనికి సుప్రతీకుడు, అతనికి మేరుదేవుడు జన్మిస్తారు. మేరుదేవునికి సునక్షత్రుడు, అతనికి ఋక్షకుడు, ఋక్షకునికి అంతరిక్షుడు, అతనికి సుతపుడు, సుతపునికి అమిత్రజిత్తు జన్మించనున్నారు. అమిత్రజిత్తుకు బృహద్వాజి, అతనికి బర్హి, బర్హికి ధనంజయుడు, అతనికి రణంజయుడు, అతనికి సృంజయుడు, సృంజయునికి శాక్యుడు, శాక్యునికి శుద్ధాదుడు, అతనికి లాంగలుడు, లాంగలునికి ప్రసేనజిత్తు, అతనికి క్షుద్రకుడు, అతనికి ఋణకుడు, ఋణకునికి సురథుడు, అతనికి సుమిత్రుడు అనేవారు జన్మిస్తారు. సుమిత్రుని తరువాత సూర్యవంశం అనేది ఉండదు. బృహద్బలుని అనంతరం జన్మించేవారు వీరు" అని చెప్పి శుకమహర్షి ఇలా అన్నాడు:

సీ. 'ధన్యుఁ డా యిక్ష్వాకు తనయుఁడౌ నిమి యాగ మాచరింపఁగఁ గోరి యా వసిష్ఠు
నార్త్వి జ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ డింద్రుని మఖము సేయింప నియ్య
కొనినాఁడ మఱి వత్తుఁ గొదవ లే దన వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల? గ్రతువు సేసెద' మని యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి

తే. సేయ నింద్రుని యాగంబు చెల్లఁజేసి, గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోప మెత్తి
యోరి నా వచ్చు నిందాఁక నుండ వనుచు, నతని దేహంబు వడుఁగాక యని శపించె.



తా ॥ "ఇక్ష్వాకుని మరో కుమారుడు నిమి. ఆ ధన్యుడు యాగం చేయగోరి, వసిష్ఠుని ఋత్విక్కుగా రావలసిందని కోరాడు. దానికి ఆయన, నేను ఇప్పటికే ఇంద్రుడు తలపెట్టిన యజ్ఞానికి వస్తానని చెప్పాను. కనుక ఇప్పుడు కుదరదు. కాని నేను తప్పక తరువాత వచ్చి యాగం చేయిస్తానని చెప్పాడు. అయితే నిమి ఆయన వద్ద నుండి వచ్చి, ఈ సంసారం అతి చంచలమైనది. నమ్మటానికి లేదు. కనుక కాలయాపన ఎందుకని, ఇతరుల నెవరినో

ఋత్విక్కుగా నియమించుకొని యాగం ప్రారంభించాడు. అంతలో ఇంద్రుని యాగం పూర్తి చేసి, గురువు వచ్చి, విషయం తెలుసుకొని, 'ఏమి? నే వచ్చేదాక ఆగలేకపోయావు' అంటూ నిమిపై కోపించి, 'చస్తావు గాక!' అని శపించాడు.

వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన, నిమియును వసిష్ఠుని దేహంబు పడుఁగాక యని మరల శపించిన న వ్వసిష్ఠుండు మిత్రావరుణుల వలనఁ గడపట నూర్వశికి జన్మించె. గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైన నిమి, విగతదేహుండైన, నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి, దాఁ చి, దొరకొన్న సత్త్రయాగంబు సెల్లించిరి. యాగంబు కడపటను దేవగణంబులు మెచ్చి వచ్చిన, వారలకు నిమిదేహంబు సూపి, బ్రతుకం జేయుం' డనవుడు వారలు 'నిమి ప్రాణంబులు వచ్చుంగాక' యని పలికిన, నిమి తనదేహంబు సొరనొల్లక యిట్లనియె.

368

తా ॥ అలా వసిష్ఠుడు శపించగా, నిమి కూడా ఆగ్రహంతో ఆయన్ని కూడా 'మరణింతువు గాక!' అంటూ శపించాడు. ఆ పిదప వసిష్ఠుడు మిత్రావరుణుల వలన ఊర్వశికి జన్మించాడు. గురు శాపకారణంగా బ్రహ్మజ్ఞానియైన నిమి మరణించగా, మునీశ్వరులు అతని శరీరాన్ని సుగంధ ద్రవ్యాలతో జాగ్రత్త చేసి, ప్రారంభించిన సత్త్రయాగాన్ని పరిపూర్తి చేశారు. దానికి దేవగణాలు వచ్చి మెచ్చుకున్నారు. అంతట మునులు నిమి శరీరాన్ని చూపి, బ్రతికించమని వేడుకున్నారు. వారు ఆ ప్రార్థనను మన్నించి, 'నిమి బ్రతుకుగాక!' అని పలికారు. కాని నిమి తన దేహంలో ప్రవేశించడానికి ఇష్టపడక, ఇలా అన్నాడు:

మ. అతి మోహాకులితంబు సాంద్ర మమతాహంకారమూలంబు సం<br>తత నానాసుఖదుఃఖపీడిత మనిత్యం బిట్టి దేహంబు సం<br>కృతి నా కేటికి? మీనజీవనము భంగిం భీతి బాహుళ్య మం<br>చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ మదిన్ గొల్చెదన్.

తా ॥ “ఈ దేహమున్నదే – ఇది మోహంతో నిండినది. గాఢమైన మమతకు, అహంకారానికి నిలయం. అనేక విధాలైన సుఖదుఃఖాలతో పీడింపబడినది. అయినప్పుడు నేను ఈ దేహంలో ప్రవేశించటం దేనికి? వివేకవంతులు అనిశ్చితమైన ఉనికి గల, చేప శరీరం వలె నశించేది, అనేక భయాలకు నిలయమైనది కనుక ఈ శరీరాన్ని గ్రహించనే గ్రహించరు, సర్వేశ్వరుడైన శ్రీహరిని సేవిస్తూ గడుపుతారు.”

వ. అని పలికిన నిమిమాటలు గ్రమ్మఱింప నేరక, శరీరులు గన్నులు దెఱచినప్పుడును, మూసినప్పుడును, నిమి గాన వచ్చుంగాక యని పల్కి దేవతలు సనిరి. అంత.

370

తా ॥ అలా అన్న నిమి మాటలను కాదనలేక, శరీరధారులు వారు కనులు తెరచేటప్పుడు, మూసేటప్పుడు నిమి చక్రవర్తి వారికి కనిపిస్తాడు గాక! అని పలికి, దేవతలు వారి మార్గాన వారు వెళ్ళిపోయారు.

ఆ. పెద్దలైన మునులు పృథ్వీస్థలికి రాజు, లేమిఁ జూచి నిమి కళేబరంబు తరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని, జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల.

371

తా ॥ అంతట వృద్ధులైన మునులు, భూమికి రాజు లేకపోవడాన్ని గమనించి, నిమి కళేబరాన్ని మథించగా ఒక కుమారుడు జన్మించాడు. లోకం ఆయన్ని ‘జనకుడు’ అని పిలువసాగింది.

వ. మఱియు నతఁడు విగతదేహుండు గావున వైదేహు డనియును, మనజాతుండు గావున మిథిలుం డనియుం బరఁగె. అ మ్మిథులునిచేత నిర్మితం బైనది గావున మిథిలా నగరంబు

నాఁ బరఁగె; ఆ జనకునకు నుదావసుండును, నుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును పుట్టె. అతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండు, నతనికి మరువు, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండు, నతనికి మహారోముండు, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టిరి.

372

తా ॥ అయితే అతడు విదేహజుడు గనుక వైదేహుడని, మథనం వలన జన్మించాడు గనుక మిథిలుడని కూడా అన్నారు. ఆ మిథిలుని చేత నిర్మింపబడిన నగరమే మిథిలానగరం. ఆ జనకునికి ఉదావసుడు జన్మించగా, అతనికి నందివర్ధనుడు, అతనికి సుకేతుడు జన్మించారు. సుకేతుని కుమారుడు దేవరాతుడు. దేవరాతునికి బృహద్రథుడు జన్మించాడు. అతనికి మహావీర్యుడు, అతనికి సుధృతి, సుధృతికి ధృష్టకేతుడు, అతనికి హర్యశ్వుడు జన్మించారు. హర్యశ్వునికి మరువు జన్మింపగా, అతనికి ప్రతింధకుడు, అతనికి కృతరయుడు జన్మించారు. కృతరయుని కుమారుడు దేవమీఢుడు, అతనికి విధృతుడు, విధృతునికి మహాధృతి, అతనికి కీర్తిరాతుడు, కీర్తిరాతునికి మహారోముడు, అతనికి స్వర్ణరోముడు, అతనికి హ్రస్వరోముడు జన్మించారు. హ్రస్వరోముని కొడుకు సీరధ్వజుడు.

ఆ. అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ, లాంగలంబుకొనను లక్షణాంగి
సీత జాత యయ్యె సీరధ్వజుండునుఁ, దాన జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు.

373

తా ॥ ఆ సీరధ్వజుడు యజ్ఞం చేయటం కొరకు భూమిని దున్నించాడు. ఆ సందర్భంలో నాగలి కఱ్ఱుకు చూడచక్కని సీత జన్మించింది. అలా ధన్యుడైన అతనిని లోకం సీరధ్వజుడని

సంభావించింది.

వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకుఁ గృతధ్వజ, మితధ్వజులను వారిద్దఱుఁ బుట్టిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁ డుదయించె. అతండుఁ దన్నుఁ దా నెఱింగెడి విద్యయందు నేర్పరి యయ్యె. మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి, తండ్రివలన నెఱుక గలవాఁడై, కర్మతత్త్వంబు నేర్చి, కేశిధ్వజునివలన భీతుండై యేగె, ఖాండిక్యునకు భానుమంతుడును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్ననికి శుచియు, శుచికి సనద్వాజుండును, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తును, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వుండును, బార్శ్వునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, ఉపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుర్వుండును, ఉపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చసుండును గలిగె, అతఁడె సుభూషణుండని వినంబడు. ఆ సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును, ధృతునకు ననఘుండును, అనఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జన్మించిరి. వీరలు మైథిలులగు రాజులని చెప్పంబడుదురు. యోగీశ్వరు ప్రసాదంబున గృహస్థులై యుండియు బంధవిముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదురు అని పలికి శుకయోగీంద్రుం డిట్లనియె.

374

తా ॥ ఆ సీరధ్వజునికి కుశధ్వజుడు జన్మించాడు. అతనికి ధర్మధ్వజుడు, ఆ ధర్మధ్వజునికి కృతధ్వజుడు, మితధ్వజుడు అనే ఇరువురు కుమారులు జన్మించారు. అందులో కృతధ్వజునికి

కేశిధ్వజుడనేవాడు జన్మించి, తానెవరో తెలుసుకునే ఆత్మవిద్యను సాధించాడు. కాగా మితధ్వజునికి ఖాండిక్యుడనే వాడు జన్మించి, తన తండ్రి వలన శిక్షణ పొంది, కర్మయోగ తత్త్వం తెలుసుకున్నాడు. అయితే కేశిధ్వజునికి భయపడి, ఎటో వెళ్ళిపోయాడు. ఆ ఖాండిక్యుని కుమారుడు భానుమంతుడు. అతనికి శతద్యుమ్నుడు, అతనికి శుచి, శుచికి సనద్వాజుడు, అతనికి ఊర్ధ్వకేతుడు, అతనికి అజుడు, అతనికి కురుజిత్తు, కురుజిత్తునికి అరిష్టనేమి జన్మించారు. అరిష్టనేమి కుమారుడు శ్రుతాయువు. అతని కుమారుడు పార్శ్వకుడు. పార్శ్వకునికి చిత్రరథుడు, అతనికి క్షేమాపి, అతనికి హేమరథుడు జన్మించారు. హేమరథుని కుమారుడు సత్యరథుడు. అతనికి ఉపగురుడు, అతనికి అగ్నిదేవుని అనుగ్రహం వలన ఉపగుర్వుడు, అతనికి సావనుడు, సావనునికి సువర్చసుడు కలిగారు. ఈ సువర్చసునే సుభూషణుడని కూడా అంటారు. ఇతనికి జయుడు జన్మింపగా, అతనికి విజయుడు, విజయునికి ధృతుడు, అతనికి అనఘుడు, అనఘునికి వీతిహవ్యుడు జన్మించారు. ఈ వీతిహవ్యునికి ధృతి, అతనికి బహుళాశ్వుడు, అతనికి కృతి, కృతికి మహావశి జన్మించారు. వీరిని మైథిల ప్రభువులనేవారు. యోగీశ్వర ప్రభావం చేత వీరు గృహస్థ జీవనాన్ని గడిపినా, సంసారబంధ విముక్తులై, ఆత్మజ్ఞానం కలిగినవారై, ఏవేళా బ్రహ్మానుసంధానం గావిస్తూ ఉండేవారు' అని చెప్పి శుకమహర్షి ఇంకా ఇలా చెప్పనారంభించాడు:

## చంద్రవంశ్యులగు రాజుల ఇతిహాసము

ఆ. చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ, జంద్రకీర్తితోడ జనితమైన
యట్టి పుణ్యమతులు నైళాదిరాజుల, నింక వినుము మానవేంద్రచంద్ర!

375

తా ॥ 'రాజచంద్రమా! పరీక్షిన్మహారాజా! ఇక చంద్రుని తెల్లదనంతో సాటిరాగల విశుద్ధమైనది, చంద్రకీర్తితో ఉద్భవించిన చంద్రవంశపు రాజులు ఐలుడు మున్నగువారి చరిత్ర చెబుతాను, ఆలకించు!' అంటూ ఇలా చెప్పనారంభించాడు.

సీ. ఒకవేయుతలలలో నుండు జగన్నాథు బొడ్డుఁ దమ్మిని బ్రహ్మ పుట్టె మొదల;
నతనికి గుణముల నతనిఁ బోలిన దక్షుఁ, డగు నత్రి సంజాతు డయ్యె; నత్రి
కడగంటి చూడ్కులఁ గలువలసంగడీఁ, డుదయించె విప్రుల కోషధులకు
నమరఁ దారాతతి కజుని పంపున నాథుఁడై యుండి రాజసూయంబు సేసి

తే. మూఁడులోకములను గెల్చి మోఱకమునఁ, జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలుసొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు, వేఁడునందాఁక నయ్యింతి విడువఁ డయ్యె.

376

తా ॥ మొదామొదలు జగన్నాథుడైన శ్రీమహావిష్ణువు నాభికమలం నుండి బ్రహ్మ వేయి తలలతో జన్మించాడు. అతనికి అన్ని విధాల సాటి రాగలవాడూ, సర్వసమర్థుడూ అయిన అత్రి జన్మించాడు. ఆయన కడకంటి చూపుల నుండి, కలువలకు చెలికాడైన చంద్రుడు జన్మించాడు. ఆయన బ్రహ్మ మాట చొప్పున బ్రాహ్మణులకు, ఓషధులకు, తారా సమూహానికి ప్రభువైనాడు. రాజసూయం చేసి ముల్లోకాలనూ జయించాడు. అంతవరకూ బాగానే ఉంది. కాని, అంతలో మూర్ఖత్వంతో ఒక తిక్కపని చేశాడు. అదేమంటే – గురువు బృహస్పతి ఉన్నాడు గదా! ఆయన ఇంట్లో చొరబడి ఆయన భార్య అందాలరాశి తారను ఎత్తుకొచ్చాడు. అదేమని బృహస్పతి

అడిగినా విడిచిపెట్టడే!

వ. అంత వేల్పులతో రక్కసులకుం గయ్యం బయ్యె, బృహస్పతి తోడి వైరంబునం జేసి, కావ్యుఁ డు రాక్షసులతోఁ జేరికొని చంద్రునిఁ జేపట్టి, సురాచార్యునిం బోఁదోలిన హరుండు భూతగణసమేతుండై, తన గురుపుత్త్రుండైన బృహస్పతినిఁ జేపట్టె. దేవేంద్రుడును, సురగణంబులుం, దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె, అ య్యవసరంబున బృహస్పతి భార్యా నిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరం బయ్యె. ఆలోన బృహస్పతి తండ్రియగు నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి, గర్భిణి అయిన తారను మరల నిప్పించినం జూచి, బృహస్పతి దాని కిట్లనియె.

377

తా ॥ అదే సమయంలో దేవతలకు, రాక్షసులకూ యుద్ధమైంది. శుక్రునికీ, బృహస్పతికీ మొదటినుండి ఎలాగూ వైరమే. ఇంకేమి! శుక్రుడూ, రాక్షసులూ చంద్రుని పక్షంచేరి, బృహస్పతిని తరిమేశారు. దాంతో శివుడు తన భూతగణాన్ని వెంటేసుకుని తన గురుపుత్రుడైన బృహస్పతికి సాయం వచ్చాడు. దేవేంద్రుడు కూడా తన సైన్యాన్ని వెంటేసుకుని బృహస్పతికి అండగా నిలిచాడు. అలా తార నిమిత్తమైన వివాదం దేవతలు, రాక్షసులు ఇరుపక్షాలకూ వినాశకరంగా పరిణమించింది. అప్పుడు బృహస్పతి తండ్రి అంగిరసుడు వెళ్ళి బ్రహ్మకు విషయం చెప్పగా; ఆయన వచ్చి చంద్రుని మందలించి, గర్భిణియైన తారను తిరిగి బృహస్పతికి ఇప్పించాడు. బృహస్పతి తారపై కోపించి ఇలా అన్నాడు:

ఉ. సిగ్గొకయింతలేక వెలచేడియ భంగి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా! కడు పేల దెచ్చి కొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
బ్రగ్గఁగ జేసెదన్ జెనఁటి మానవతుల్ నినుఁ జూచి మెత్తురే?

378

తా ॥ "సిగ్గూ ఎగ్గూ లేకుండా, ధర్మాన్ని కీర్తినీ నాశనం చేసి, వేశ్యలాగా చంద్రుని చేరావు. కడుపు తెచ్చుకున్నావు. అప్రతిష్ఠకు కూడా వెరవ లేదు. గర్భపాతం చేసుకో! లేకపోతే నిన్ను పాతేస్తాను. ఛీ! ఛీ! కులటవైనావు. నిన్ను చూస్తే పుణ్యస్త్రీలు తలదించుకుంటారు"

వ. అని కోపించుచుండ, నా చెలువఁకు బసిండిచాయ మేనుగల కుఱ్ఱ పుట్టె. వానిం జూచి మోహంబు చేసి, బృహస్పతి తన కొడుకనియునుం, జంద్రుండు దన కన్నవాఁ డనియును, జగడించిరి. అప్పుడు–

379

తా ॥ అని అలా నిందిస్తున్నంతలో ఆమెకు బంగారు మేనిఛాయతో మగబిడ్డ జన్మించాడు. వాడిని చూసిన మోహంతో బృహస్పతీ, చంద్రుడూ ఇరువురూ నా కన్నకొడుకంటే నా కన్న కొడుకని వివాద పడ్డారు.

ఆ. వారి వాదు చూచి వారింపఁగా వచ్చి, యేర్పరింపలేక యెల్లమునులు నమరవరుల నడుగ నా వేడుకలకత్తె, యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి.

380

తా ॥ వారి ఈ తగాదాను మాన్పించమని మునులంతా దేవతలను వేడుకున్నారు. వారు, 'దీనిని ఎవరు తీరుస్తారు? అతడెవరి బిడ్డో ఆ వగలాడే చెప్పవలసిందే తప్ప ఇతరులకు తెలిసేది కాదు గదా!' అన్నారు.

వ. ఆ పలుకులు విని, సిగ్గుపడి యున్న తారకుఁ జిన్ని కొమరుం డిట్లనియె.

381

తా ॥ వారి మాటలు విన్న తార, నోటమాటరాక సిగ్గుతో చిమిడిపోయింది. అప్పుడు, పుట్టిన బిడ్డ ఆమెతో ఇలా అన్నాడు:

క. ఇలువరుస చెడఁగ బంధులు, దలవంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా! వెలినేల నన్ను గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో.

382

తా ॥ 'అమ్మా! ఇంటి పరువు మర్యాదలు మంట గలసిపోయాయి. చుట్టపక్కాల్లో తలవంపులు వచ్చేటట్లుగా, అన్యులవల్ల నన్నెందుకమ్మా కన్నావు. నాకు జన్మనివ్వడానికి కారకుడెవరు? చంద్రుడా, బృహస్పతా తెలియజెప్పు తల్లీ!' అని అడిగాడు.

వ. అని పలుకుచున్న కొడుకునకు మాఱు మాటలాడనేరకున్న తార నేకాంతంబునకుం జీరి మంతనంబున బ్రహ్మ యిట్లనియె.

383

తా ॥ అలా అడుగుతున్న కొడుకుకు సమాధానం చెప్పలేక తలదించుకోగా, బ్రహ్మ ఆమెను ఏకాంతంగా పిలిచి, రహస్యంగా ఇలా అడిగాడు:

మ. చెలువా! నీయెల సిగ్గు వాసి, గురుఁడో శీతాంశుఁడో యెవ్వడౌ
లలితాకారుఁ గుమారుఁ గన్న యతఁ? డేలా దాఁప? నీ పాటు నీ
తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము; కాంతల్ కామినుల్ గారె? మా
టల నిందేమియుఁ బోదుపో యొరులతోడం జెప్ప; విన్పింపవే.

384

తా ॥ 'అమ్మాయి! నీవు సిగ్గుతో చెప్పలేకున్నావు. సంబాళించుకో! ఇలాంటి దానికి నీవే మొదలు కాదులే! ఊరకే ఎందుకలా బాధపడతావు? స్త్రీలు కాముకులే! దానికేమి? వాళ్ళూ, వీళ్ళూ ఏదో అంటుంటారు. అవన్నీ పట్టించుకోకు. నేనెవరికీ చెప్పనుగా! ఈ బిడ్డకు తండ్రి ఎవరో నాతో చెప్పు. చెబుతావు కదూ' అంటూ బుజ్జగించి అడిగాడు.

వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి, మంతనంబున నయ్యింతి చంద్రునికిం గన్న దాన ననవుఁడు నా బాలకునకు బుధుండని పేరు పెట్టి, చంద్రున కిచ్చి బ్రహ్మ సనియె. నంత.

385

తా ॥ అలా అడిగిన బ్రహ్మకు సమాధానం చెప్పడానికి ఆమె వెరచింది. ఒక పట్టాన చెప్పలేదు. కాని బ్రహ్మ పదే పదే బుజ్జగించి అడగడంతో, బిడ్డకు తండ్రి చంద్రుడని ఎట్టకేలకు చెప్పగా, బ్రహ్మ ఆ బిడ్డకు బుధుడు అని నామకరణం చేసి, అతనిని చంద్రునికి అప్పగించి, ఆయన తన దోవన తాను వెళ్ళిపోయాడు.

ఆ. బుద్ధిమంతుడైన బుధుఁడు పుత్త్రుండైన, మేను పెంచి రాజు మిన్ను ముట్టె; బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి, మిన్ను ముట్టకేల మిన్నకుండు?

386

తా ॥ అంతట బుద్ధిమంతుడైన పుత్రుడు బుధుణ్ణి చూసి, చంద్రుడు సంతోషంతో ఆకాశమంతా వెలిగిపోయాడు. ఆయన సంతోషం అంబరాన్ని అంటిందంటే, అంటదా మరి! బుద్ధిమంతుడైన కొడుకును కన్న తండ్రి సంతోషం మిన్నుముట్టడం ఎక్కడా ఉన్నదే!

# పురూరవుని కథ

వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యక వలనఁ బురూరవుండు పుట్టె; ఆ పురూరవునకుఁ గల శౌర్యసౌందర్య గాంభీర్యాది గుణంబులు నారదుని వలన నింద్ర సభలోన నూర్వశి విని, మిత్రావరుణుల శాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి, పురూరవు ముందట నిలువంబడి.

387

తా ॥ ఆ బుధునికి, ఇంతకు పూర్వం ఇళాకన్య సంగతి చెప్పాను గదా, ఆ ఇళ వలన పురూరవుడు జన్మించాడు. ఆ పురూరవుని శౌర్యపరాక్రమాలను గూర్చి, అందచందాలను గూర్చి నారదుని వలన ఇంద్రుని కొలువుకత్తె ఊర్వశి తెలుసుకొని, ఆమెకు గల మిత్రావరుణుల శాపం కారణంగా మానవ కాంతయై భూలోకానికి వచ్చి, పురూరవుని ఎదుట నిలచి,

తరలము.

సరసిజాక్షు మృగేంద్రమధ్య విశాలవక్షు మహాభుజున్
సురుచి రానన చంద్రమండల శోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపరజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరి తూపులన్ మదిఁ దూలపోవఁగ భ్రాంతయై.

388

తా ॥ తామరరేకుల వంటి కన్నులూ, సింహం వంటి నడుమూ, విశాలమైన రొమ్మూ, పెద్దవైన భుజాలు, చంద్రకాంతులను తలపించే ముఖమూ, సుకుమారుడూ, మగధీరుడూ అయిన పురూరవుని చూసి – మన్మథుని వాడి పూబాణాలకు మోహపరవశురాలై అలా బొమ్మలాగా నిలిచిపోయింది.

వ. ఊర్వశి నిలిచి యున్నంత

389

తా ॥ అలా ఊర్వశి నిలువగా,

ఉ. భావజు కోలయో? మొగులుఁవాసి వెలుంగు మెఱుంగొ? మోహినీ
దేవతయో? నభోరమయొ? దీని కరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురా కడిదమ్ము జిమ్ములం
దా వడఁకెన్ బురూరవుఁడు తామర పాకు జలంబు కైవడిన్.

390

తా ॥ మన్మథదేవుడు తనను వశపరచుకోవడానికి పెట్టిన ఎర కాబోలు నన్నట్లుగా, మబ్బువీడి వెలుగొందుతున్న మెరుపు లాగా, మోహినీ దేవతయో? గగనలక్ష్మియో? అన్నట్లుగా ఉన్న ఆమెను చూసి, ఈమెను చేపట్టక ఇక బ్రతికి మాత్రం ప్రయోజనమేమిటి? అనుకుంటూ, మన్మథుని చిగురుటాకుల బాణాలకు తామరాకు కదలాడిపోయినట్లు నిలువునా విలవిల్లాడిపోయాడు పురూరవుడు.

వ. ఇట్లు రాచపట్టి చెఱకు వింటి వాని దాడికి నోడి, యెట్టకేలకు సైరణచేసి నిలుకడం దెచ్చికొని; యచ్చెలువ కిట్లనియె.

391

తా ॥ అలా ఆ రాకుమారుడు చలించిపోతూ, ఎట్టకేలకు సంబాళించుకొని, ఆమెతో ఇలా అన్నాడు:

ఉ. ఎక్కడనుండి రాక? మన కిద్దఱికిం దగు నీకుఁ దక్కితిన్
ద్రుక్కడి వచ్చెనే యలరు ముల్కుల వాఁడడిదంబుఁ ద్రిప్పు చే

దిక్కు నెఱుంగ నౌ యబల! దేహము దేహము గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్నుఁ గావవే.

392

తా ॥ "ఎక్కడ నుండి నీ రాక ఇక్కడకు? మనం ఒకరికొకరం తగినవాళ్ళం. నీకూ నాకూ సరిజోడు. నీకు దొరికిపోయాను. మన్మథుని ఖడ్గచాలనానికి తట్టుకోలేకున్నాను. మరి వేరే దిక్కులేదు నాకు. నన్ను కనికరించు. దేహంతో దేహం, చేతులతో చేతులు, నీ చెక్కిళ్ళతో నా చెక్కిళ్ళు తాకించి తగు లాలనలతో దీనుడనైన నన్ను మన్నించి, ఈ ఆపద నుండి గట్టెక్కించవా!"

వ. అనినం బ్రోడచేడియ యిట్లనియె

393

తా ॥ అని పురూరవుడు వేడుకోగా ఆమె అన్నది గదా!

మ. ఇవి నా కూర్చుతగళ్ళు రెండు దగ నీ వెల్లప్పుడున్ గాచె దే
ని వివస్త్రుండవు గాక నాకడ సదా నీవుండు దేనిన్ విశే
ష విలాసాధిక! నీకు నా ఘృతము భక్ష్యంబయ్యె నేనిన్ మనో
జ వినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ!

394

తా ॥ "ఓ చంద్రవంశోత్తమా! ఈ రెండు గొఱ్ఱెలూ నాకు ప్రియమైనవి. మరి వీటిని ఎప్పుడూ వెంటవుండి కాస్తావా? నా ఎదుట ఎప్పుడూ నీవు వివస్త్రుడవు కారాదు. అలా నీవు ఉండేటట్లయితే, నాకువలె నేయి భక్ష్యం నీకు అంగీకారమైతే, అలాగే నిన్ను మన్మథక్రీడల్లో ఆనందింప చేస్తాను"

వ. అని పల్కిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల కియ్యకొని తన మనంబున.

395

తా ॥ అని చెప్పిన ఊర్వశి మాటలకు అంగీకరించి, తన మనస్సులో పురూరవుడు ఇలా అనుకున్నాడు:

క. మంచిదఁట రూపు ననురతి, నంచిత యఁట దేవగణిక యఁట మరుచేతన్
సంచలితచిత్తయై కా, మించిన దఁట యింతకంటె మేలుం గలదే.

396

తా ॥ "మంచిదే! అందచందాలు కలిగిన దేవవేశ్య. రతిక్రీడలందు నిపుణురాలు. మరుని తాపానికి గురియై నన్ను కామించింది. ఇంతకంటే కోరుకోదగింది ఏముంటుంది గనుక!

వ. అని నిశ్చయించుకొని

397

తా ॥ అని నిర్ణయించుకొని,

ఆ. రాజు రాజముఖీని రతిఁ దేల్చె బంగారు, మేడలందుఁ దరుల నీడలందుఁ దోఁటలందు
రత్నకూటంబులందును, గొలఁకులందు గిరుల కెలఁకులందు.

398

తా ॥ ఆ రాజు ఆ రాజముఖీని బంగారు మేడల్లో, చెట్లనీడల్లో, తోటల్లో, రత్నమయమందిరాలలో, సరస్సులలో, కొండల సానువుల్లో రతిక్రీడలో ఓలలాడించాడు.

వ. అంత న య్యిద్దరకుం తగులంబు నెలకొనిన

399

తా ॥ అంతట వారిద్దరూ ఒకరిని విడిచి మరొకరు ఉండలేకపోయారు.

క. ఒక దిక్క యేగుదురు వా, రొకచోటన కాని నిలిచి యుండరు దమలో
నొకటియె మనమున నెంచుచు, నొకనిమిషము పాయకుందు రువిదయుఁ దానున్.

400

తా ॥ వెళితే ఇద్దరూ ఒక దిక్కుకే వెళ్ళేవారు. ఉంటే ఇరువురూ ఒక చోటనే ఉంటారు. వారిరువురి ఆలోచనా ఒక్కటే. అతను, ఆమె ఒకరిని విడిచి మరొకరు క్షణం ఉండలేరు.

క. దయ్య మెఱుంగును వారల, నెయ్యంబును మక్కువలును నిజమరితనముల్
వియ్యములును నెడసందినిఁ, బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్.

401

తా ॥ వారి ప్రేమలు, వారి స్వభావాలు, సంబంధాలు, ఎలాంటివో దైవానికే తెలియాలి తప్ప ఇతరులకు అంతుబట్టేవి కావు. ఒకరిని ఒకరు నిముషం కానకుంటే, పయ్యెద కొంగు అడ్డమైతే చాలు వారి ప్రాణాలు నిలువవేమో అన్నంతగా ఉండేవి వారి తగులాటాలు.

వ. ఇ ట్లూర్వశియుం బురూరవుండు నొం డొరువుల వలన మక్కువలు చెక్కులొత్తం బగళ్లు రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుడు గొలువుండు తఱిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి.

402

తా ॥ అలా ఊర్వశీ పురూరవులు పగలని లేదు, రాత్రని లేదు, ఏ ప్రొద్దూ ఒకరిని విడిచి మరొకరుండక అన్నిచోట్లా వారి విహరణలే. ఇలా ఉంటూ ఉండగా ఒకనాడు దేవసభలో, దేవేంద్రుడు ఊర్వశి లేకపోవడాన్ని గమనించాడు.

క. ఇన్ని దినంబులవలె నా, యున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్ విన్నఁ దనంబున నున్నది, వన్నె దఱిఁగి యున్న పసిఁడివదువున ననుచున్.

403

తా ॥ అలా ఆమె లేకపోవడం చూసి, 'ఔరా! ఊర్వశి లేక సభ వన్నె తగ్గిన బంగారం లాగా చిన్నపోయింది గదా' అనుకున్నాడు.

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుకొన్న యేడకంబులం బట్టిన నవి రెండును మొఱవెట్టిన వాని మొఱ విని రతిభిన్నుండై మేనుమఱచి కూరుకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె.

404

తా ॥ అలా అనుకొని, ఆమెను వెతకటం కొరకు ఇంద్రుడు గంధర్వులను పంపించాడు. వారు అర్ధరాత్రి వేళ వచ్చి చీకట్లో ఆమె పెంచుకొంటున్న గొఱ్ఱెలను పట్టుకోగా అవి రెండూ అరిచాయి. ఆ సమయానికి రతిశ్రమతో అలసి నిద్రిస్తున్నాడు పురూరవుడు. అతని కౌగిటిలోనున్న ఊర్వశి వాటి అరపులను విని, ఇలా అంది:

మ. 'అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీ మగపంద; కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్
వదలం జాలఁడు నాదు కౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై చెల్లరే'

405

తా ॥ "అయ్యో! అక్కడ దొంగలు నా బిడ్డల్ని పట్టుకొని, తమకొక అడ్డంటూ లేకుండా పట్టుకు పోతున్నారు. వాళ్ళని అడ్డుకోడానికి శక్తి చాలక ఇతడు ఇక్కడ నా కౌగిలిని వదలకుండా, పిరికి పందలాగా, గుఱ్ఱుపెడుతూ నిద్రలో జోగుతున్నాడు. మరి ఇలాంటివాళ్ళనే కదా పనికిమాలిన వాళ్ళనేది!

క. పగతురు దొంగల రేఁపఁగ, మగఁటిమి వారింపలేక మగతన మెల్లన్ మగువల కౌఁగిటఁ జూపెదు, మగవాఁడగుకంటె మగఁడు మగువగు టొప్పున్.

406

తా ॥ శత్రువులు మీద పడి దొంగతనంగా ఎత్తుకుపోతుంటే వారిని అడ్డుకోలేరు గాని ఈ మగవాళ్ళు స్త్రీల కౌగిళ్ళలో మాత్రం తమ ప్రతాపం బాగా చూపిస్తారు. ఇలాంటి మగడు మగవాడవటం కంటే మగువ కావడం మంచిది.

ఆ. అధముఁడైన వాని కా లగుకంటె న, త్యధికునింట దాసి యగుట మేలు; హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల? యువతిజనుల కూరకుంట లెస్స.

407

తా ॥ పౌరుషహీనుడైన వానికి భార్య కావటం కంటే, బలపరాక్రమాలు గలవాడింట్లో దాసిగా ఉండటం మేలు. యువతులు పిరికిపందలను కట్టుకొని, తమ మరునింటిని నొప్పికి గురిచేయటం కంటే, వివాహం చేసుకోకుండా ఉండటమే మేలు!

క. ఏటిది నీరాచఱికం, బాఁటది మొఱవెట్టఁ బశువులాతురపడ నో<br>యాఁటదని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవముక్రియ నుండె దిదే.

408

తా ॥ దేనికయ్యా నీ రాచరికం! పశువులు పోతున్నాయని ఒక ప్రక్క అబల మొఱ పెడుతూ ఉంటే, లేచి దొంగల పనిపట్టకుండా, చచ్చినవాడి లాగా కదలక మెదలక పడున్నావు. ఏం పనయ్యా ఇది?

ర. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురబోతు మందుని నకటా! నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే.

తా ॥ నీవు వింటున్నావో, వినడం లేదో తెలియదు. విని ఊరకుంటున్నావో తెలియదు. అయినా నిన్ను అనాల్సిన పనేముంది! నీలాంటి మందమతిని చక్రవర్తిని చేశాడే ఆ బ్రహ్మ, అంటే ఆయన్ని అనాలి. అంతకంటే మూర్ఖుడు మరొకడుంటాడా?"

వ. అని పెక్కుభంగుల నయ్యింతి, పరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁజొనుప, నా రాజశేఖరుం డంకుశంబు పోట్ల నడరు మదగజంబు చందంబున చీరమఱచి, దిగంబరుండై వాలు కేల నంకించి, నడురేయి దొంగల నఱకి వైచి మేషంబుల విడిపించుకొని, తిరిగివచ్చునెడ.

410

తా ॥ అలా ఆమె ఎన్నో విధాలుగా దెప్పిపొడిచిన మాటలు ఆయన చెవుల్లో బాకుల్లాగా గుచ్చుకోవడంతో ఆ రాజు అంకుశంతో పొడిస్తే మదపుటేనుగు విజృంభించినట్లుగా లేచి, ఒంటిపైన బట్టవుందో లేదో చూసుకోకుండా అదే పోకగా దిగంబరుడై దొంగల వెంటపడి, తన వాడియైన ఖడ్గంతో వారిని నరికి పోగులుపెట్టి గొఱ్ఱెలను విడిపించుకొని తెచ్చాడు.

ఆ. చీఱలేని మగనిఁ జెలువ దా నీక్షించి, కన్ను మొఱఁగి పోవఁ గడఁక నతండు వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడి లేచి, పొటిలి తెఱలి స్రుక్కి పొక్కిపడియె.

411

తా ॥ ఎప్పుడైతే అతడు దిగంబరుడై కన్పించాడో, ఆ క్షణాన ఉర్వశి మాయమైపోయింది. ఆమె కనిపించకపోవటంతో, మతి మతిలో లేక తెరలు తెరలుగా దుఃఖం అతన్ని కమ్మేసింది. క్రిందపడి దొర్లాడాడు.

వ. మరియుఁ బురూరవుండు మదనాతురుండై, వెతకుచు, సరస్వతీ తీరంబునఁ

జెలికత్తెలతోఁ గూడియున్న నూర్వశిం గని, వికసితముఖుండై యిట్లనియె.

412

తా ॥ అలా అతడు కామాతురుడై ఆమెను వెతుకుతూ, చివరకు సరస్వతీ నది ఒడ్డున ఆమె తన చెలికత్తెతో ఉండటాన్ని చూసి, అతని ముఖం సంతోషంతో చేటంత కాగా ఆమెతో ఇలా అన్నాడు:

మ. తనుమధ్యా! యిది యేల వచ్చి తకటా ధర్మంబె శర్మంబె మున్
మనలో నుంకువలాడి కొన్ని పలుకుల్ మర్యాదలున్ దప్పెనే
నిను నేఁ బాసిన యంతనుండి తనువు న్నేలం బడంబాఱె మే
దినిపై వ్రాలకమున్న నన్నుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే!

413

తా ॥ "ఊర్వశీ! లే నడుముగల నా ఒప్పులకుప్పా! నన్ను అలా విడిచి వచ్చేశావు. ఇది నీకు ధర్మమేనా! ఇదే నీకు సంతోషమా! మనలో మనం చేసుకున్న ప్రమాణాలూ, ఒట్లూ ఏమైపోయాయి? నీవు లేక నా శరీరం నిలువక నేలమీదికి తూలిపోతోంది. ఎప్పుడో క్రూరమృగాలు నన్ను వాటి పొట్టన పెట్టుకుంటాయి. తప్పదు. నాపై కరుణ చూపవా?"

వ. అనిన నూర్వశి యిట్లనియె.

414

తా ॥ అని అనగా, ఊర్వశి ఇలా అంది:

క. మగువలకు నింత లొంగెదు; మగవాఁడవె నీకు పశువుమాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును, మృగములు గని రోయుఁగాక మేలని తినునే.

415

తా ॥ 'ఆడదాని పొందు కోసం జంతువులాగా ఇంత వెంపర్లాడిపోయేవాడివి నీవేం మగవాడివయ్యా! ఏమన్నావ్! నిన్ను మృగాలు తినేస్తాయనా? మానవరూపంలో ఉన్న పశువును మృగాలు కూడా రోతగించుకుంటాయి తప్ప, దొరికిందే చాలని నోట పెట్టవు సుమా!

వ. అదియునుం గాక.

416

తా ॥ సరే! అదలా ఉంచు! మరో మాట' అంటూ ఆమె ఇలా అంది:

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వల సుధాధారల్ విభుండైన పు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతినైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ వారి వేడబము లా వేదాంతసూక్తంబులే.

417

తా ॥ ఇదిగో! నేను వేశ్యను. వేశ్యల బుద్ధి నిప్పులాంటిది. మాటలు మాత్రం తళతళలాడే తేనెవాకలు. మన్మథుడే మగడైనా, వాణ్ణి లెక్కచేయరు. ఇతరుల వెంటపడతారు. విశ్వాసమనేది ఏ కోశానా ఉండదంటే ఉండదు. కోరిన విటునైనా చంపడానికి వెనుకాడరు. వారికొక ధర్మం లేదు. వారంత క్రూరులుండరు. చపలచిత్తులు. పడుపుకత్తెలు చెప్పే మాటలు – అవేమైనా వేదాక్షరాలటయ్యా? అంతా నీ వెఱ్ఱిగాని!

ఉ. ఇంకొక యేఁడు వోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా
లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁగాంచె దేమియున్
గొంకక పొమ్ము నావుడును గొమ్మను గర్భిణిఁ గాఁ దలంచుచున్
శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లనపోయె వీటికిన్.

418

తా ॥ సరే గాని! ఒక ఏడాది గడచిన తర్వాత రాత్రి నా కూటానికి వస్తే అప్పుడు లక్షణవంతులైన నీ కుమారులను చూద్దువు గాని. కనుక మనస్సులో మరో సంగతి విడిచి, ఇప్పటికి వెళ్ళిరా!" అంది ఊర్వశి. అంతట పురూరవుడు ఆమె మాటల్ని బట్టి ఆమె గర్భవతి అని తెలుసుకుని, మరో ఆలోచనా, మారుమాటా లేకుండా, ఆయన తన రాజధానికి తిరిగి వెళ్ళిపోయాడు.

వ. ఇట్లు మరలి చని, తన పురంబున నొక్కయేఁడుండి, పిదప నూర్వశికడ కేగి యొక్కరేయి పురూరవుం డ య్యంతికడ నున్న, నా వెలఁదియు గంధర్వుల వేఁడికొనుము. నన్నిచ్చెదరు అనవుడు నతండు గంధర్వులను బ్రార్థించిన, వారలతండు పొగడుటకు మెచ్చి, యగ్నిస్థాలి నిచ్చిన, న య్యగ్ని స్థాలి నూర్వశింగాఁ దలంచుచు, దానితో నడవిం దిరుగుచుండి, యొక్కనాఁ డగ్నిస్థాలి యని యెఱింగి, వనంబున దిగవిడిచి, యింటికిఁ జనుదెంచి, నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ, ద్రేతాయుగంబు సొచ్చిన నా రాజుచిత్తంబునం గర్మబోధంబులై, వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూ వరుండు స్థాలికడకుం జని, యందు శమీగర్భజాతంబైన యశ్వత్థంబుఁ జూచి, యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి, ముందటయరణి దానను, వెనుకటి యరణి నూర్వశియును, రెంటినడుమ నున్న కాష్ఠంబు పుత్రుండు నని, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ, జాతవేదుండను నగ్ని సంభవించె. నతఁడు విహితారాధన సంస్కారంబునం జేసి, యాహవనీయాది రూపంబుల మూఁట నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపం బడియె. ఆ యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుం బనుపం గారణం బగుటం జేసి.



తా ॥ తిరిగి సంవత్సరం తర్వాత, ఊర్వశి దగ్గరకు వెళ్ళి ఒక రాత్రి ఆమెతో ఉండగా, ఆమె అన్నది గదా, 'నీవు గంధర్వులను ప్రార్థిస్తే వారు నన్ను నీకిస్తారు' అని చెప్పగా, అతడు ఆమె చెప్పిన ప్రకారం వారిని ప్రార్థించాడు. గంధర్వులు అతని ప్రస్తుతికి మెచ్చి, అతనికొక

అగ్నిస్థాలిని ఇచ్చారు. దానినే ఊర్వశి అని భావించుకొంటూ అతడు దానితో అడవిలో పడి తిరుగుతూ, ఒకనాడు అది ఊర్వశి కాదని, అగ్నిస్థాలి అని తెలుసుకొని, దానిని అక్కడే అడవిలో వదలి ఇంటికి వచ్చేశాడు. రావటమైతే వచ్చాడు గాని, ప్రతిరాత్రి ఊర్వశినే తలచుకుంటూ ఉండేవాడు.

అలా ఉంటూ ఉండగా కొంతకాలానికి త్రేతాయుగం ప్రవేశించింది. అంతట ఆ రాజు మనస్సులో మూడు వేదాలు మూడు కర్మమార్గాలుగా పొడగట్టాయి. అప్పుడు ఆయన పూర్వం తాను వనంలో విడిచి వచ్చిన అగ్నిస్థాలి వద్దకు వెళ్ళాడు. అక్కడ జమ్మి వృక్షంలో నుండి పుట్టిన రావి చెట్టును చూశాడు. ఆ రావితో రెండు అరణులు తయారుచేశాడు. ఒక అరణిని తాను గాను, రెండవ అరణిని ఊర్వశి గాను, రెంటి మధ్యలోనున్న కొయ్యను పుత్రుడుగాను భావించి, మంత్రాన్ని పఠిస్తూ మథింపసాగాడు.

అలా మథింపగా జాతవేదుడు అనే అగ్ని సంభవించి, తగు ఆరాధన, ఇతర సంస్కారాలు చేయటం వలన ఆ అగ్ని ఆహవనీయము మున్నగు మూడు రూపాలలో వర్ధిల్లి, పురూరవ కుమారుడని కల్పింపబడింది. ఆ అగ్ని పురూరవుని పుణ్యలోకాలకు పంపడానికి కారణమైంది.

ఆహవనీయము : మూడు అగ్నుల (త్రేతాగ్నులు)లో ఒకటి. ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము అనే మూడూ త్రేతాగ్నులు. యజ్ఞవేదికకు ఇవి వరుసగా తూర్పు, దక్షిణం, పడమటి దిక్కుల్లో ఉంటాయి.

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ, డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్ శ్రీయుతుఁ గూర్చి
యజించె గు, ణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడు కొఱకై.

420

తా ॥ ఊర్వశిని కనుగొనడానికి వెళ్ళే నిమిత్తం అతడు యజ్ఞేశ్వరుడూ, అనంతుడూ, శ్రీహరీ, వేదమయుడూ అయిన శ్రీ మహావిష్ణువు కొరకు ఆ ఆహవనీయ అగ్నితో యజ్ఞం చేశాడు.

ఉ. ఒక్కడ వహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వవాఙ్మయం
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము తొల్లి త్రేతయం
దెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱిచెన్ దనబుద్ధి పెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబులౌ గతిన్.

421

తా ॥ అగ్ని ఒక్కడు. దైవమైన పురుషోత్తముడు ఒక్కడు. వాఙ్మయమంతా తానే అయిన వేదమొకటి. ప్రణవమైన ఓంకారము ఒక్కటి. ఇలా సమస్తమూ ఒక్కటే అయినదానిని పురూరవుడు త్రేతాయుగంలో, శక్తి చాలనివారికి అందివచ్చే విధంగా తన బుద్ధి సామర్థ్యం చేత మూడుగా విభజించాడు.

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబు సేసి, పురూరవుం డూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియె. అతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు విజయుం డన నార్గురు పుత్త్రులు గలిగిరి, అందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు ధ్రుతంజయుండును, రయునకు శ్రుతుండు, నేకుండు నన నిరువురును గలిగిరి, జయునకు నమితుండును, విజయునకు భీముండును జనించిరి. ఆ భీమునకుఁ గాంచనుండును, గాంచనునకు హోత్రకుండును, హోత్రకునకు గంగా ప్రవాహంబు పుక్కిటం బట్టిన జహ్నుండును, జహ్నునకుఁ బూరుండును, బూరునకు బాలకుండును, బాలకునకు నజకుండును, నజకునకుఁ గుశుండును, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుం డన నలువురును సంభవించిరి. అందుఁ గుశాంబునికి గాధి యనువాఁడు గలిగె. ఆ గాధి రాజ్యంబు సేయుచుండ.

422

తా ॥ అలా వేదవిభాగం చేసీ, యజ్ఞం చేసీ పురూరవుడు ఊర్వశి గల గంధర్వలోకానికి

వెళ్ళాడు. ఊర్వశి కడుపుపంటగా ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు అనే ఆరుగురు కుమారులు జన్మించారు. వారిలో శ్రుతాయువుకు వసుమంతుడు, సత్యాయువుకు శ్రుతంజయుడు, రయునకు శ్రుతుడు, ఏకుడు అనే ఇరువురు; జయునకు అమితుడు; విజయునకు భీముడు అనే కుమారులు కలిగారు. వీరిలో భీమునికి కాంచనుడు, కాంచనునకు హోత్రకుడు, అతనికి గంగాప్రవాహాన్ని పుక్కిట పట్టిన జహ్నుడు, జహ్నునికి పూరుడు, పూరునికి బాలకుడు, బాలకునికి అజకుడు, అతనికి కుశుడు, కుశునికి కుశాంబుడు, ధూర్తయుడు, వసువు, కుశనాభుడు అనే నలుగురు కుమారులు జన్మించారు. వీరిలో కుశాంబునికి గాధి అనేవాడు జన్మించాడు. అతడు రాజ్యపాలన చేస్తున్నాడు.

## జమదగ్ని వృత్తాంతం

సీ. సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడుకొనిన
గాధియు సుత కీడు గాఁడని తెల్లని, నవకంపు మేనులు నల్లచెవులు
గల గుఱ్ఱముల వేయు కన్యకు నీ వుంకు విచ్చిన గూఁతురు నిత్తు ననిన
వసుధామరుండును వరుణుని కడ కేగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె

ఆ. నా మహాత్ము సతియు నత్తయుఁ గొడుకులఁ, గోరి యడుగ నీయకొని యతండు
విప్రరాజ మంత్ర వితతుల వేల్పించి, చరువుసేసి గ్రుంకఁ జనియె నదికి.

423

తా ॥ గాధికి సత్యవతి అనే కుమార్తె ఉంది. ఆమెను తనకు ఇమ్మని ఋచికుడు అనే బ్రాహ్మణుడు వచ్చి గాధిని అడిగాడు. ఋచికుడు తన కుమార్తెకు ఈడుకాదని – ఇవ్వడానికి ఇష్టపడక, అలా చెప్పకుండా, 'చక్కనివీ, తెల్లని శరీరవర్ణం కలవీ, నల్లని చెవులూ గల గుఱ్ఱాలను వేయింటిని గనుక నీవు కన్యాశుల్కంగా ఇస్తే నా కూతుర్ని నీకిస్తాను' అని చెప్పాడు. అంతట ఆ బ్రాహ్మణుడు, వరుణుని వద్దకు వెళ్ళి, ఆయనను అడిగి అలాంటి గుఱ్ఱాలను తెచ్చి ఇవ్వగా, గాధి అతనికి తన కూతుర్ని ఇచ్చాడు. అప్పుడు సత్యవతి, అతని తల్లి, కుమారులు కావాలని ఋచికుని అడుగగా అతడు బ్రాహ్మ, క్షాత్రమంత్రాలతో రెండు హవ్యాలను అత్తకూ భార్యకూ వేర్వేరుగా ఏర్పాటు చేసి, స్నానం చేసి రావడానికి నదికి వెళ్ళాడు.

వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లి కిచ్చి, క్షాత్ర మంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దా నందుకొని యుండ, నా ముని సనుదెంచి, వీడ్వడుట యెఱింగి, భార్య కిట్లనియె.

424

తా ॥ అప్పుడు సత్యవతి తల్లి అడగ్గా, బ్రహ్మ మంత్రాలతో వేల్చిన చరువును ఆమెకిచ్చి,

క్షాత్రమంత్రాలతో తల్లి కొరకు వేల్చిన చరువును తాను ఉంచుకున్నది. ఆ సమయానికి వచ్చిన ఋచికుడు, చరువులు వేరుపడటం గమనించి భార్యతో ఇలా అన్నాడు:

ఆ. తల్లి చరువు నీవు దాల్చి నీ చరువేల, తల్లిపాల నిడితి తరళనేత్ర! కొమ్మ! యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ, యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు.

425

తా ॥ "ఇదేమిటి ఇలా చేశావు. నీ కొరకైనది నీ తల్లికి ఇచ్చి, ఆమె కొరకు ఏర్పాటు చేసినది నీవు గ్రహించావు? ఫలితమేమో తెలుసునా! నీకు క్రూరుడు జన్మిస్తాడు. మీ తల్లిగారికి పుణ్యాత్ముడైన బ్రహ్మవేత్త జన్మిస్తాడు సుమా!"

వ. అనిన, నయ్యింతి వెఱచి మ్రొక్కి, వినయంబు లాడినం బ్రసన్నుండై, నీ కొడుకు సాధువై, నీ మనుమండు క్రూరుం డగుంగాక యని, రుచికుం డనుగ్రహించిన నా సత్యవతికి జమదగ్ని సంభవించె, ఆ సత్యవతియునుం గౌశికీనదియై, లోకపావనియై ప్రవహించె. ఆ జమదగ్నియు రేణువుకూఁతురు రేణుకను వివాహంబై, వసుమనాది కుమారులం గనియె నందు.

426

తా ॥ అని భర్త చెప్పగా ఆమె ఎంతో భయపడి, తన అపరాధానికి వగచి, ఆయనకు మ్రొక్కి నమస్కరించింది. అతడు జాలిపడి, అయితే 'నీ కొడుకు సాధువై, నీ మనుమడు క్రూరుడవుతాడు గాక!' అని సముదాయించాడు. తరువాత సత్యవతికి జమదగ్ని జన్మించాడు. సత్యవతి కౌశికి అనే నది పేర లోకపావనిగా ప్రవహించింది. జమదగ్ని రేణువు కుమార్తె రేణుకను వివాహమాడి, వసుమనుడు మున్నగు కుమారులను పొందాడు.

క. పురుషోత్తము నంశంబున, ధర జమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం
డిరువది యొకమాఱు నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్.

427

తా ॥ పురుషోత్తముడైన విష్ణు అంశగా పరశురాముడు జమదగ్నికి పుత్రుడిగా జన్మించి, తన గొడ్డలిచే ఇరవై ఒక్క పర్యాయాలు క్షత్రియులను సంహరించాడు."

వ. అనిన విని, భూవరుండు శుకున కిట్లనియె.

428

తా ॥ అని శుకమహర్షి చెప్పగా పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు:

ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర వారియందుఁ ద
ప్పేటిది విప్రుఁడయ్యు నతఁడేటికి రాజస తామసంబులన్
వాటముఁ బొందె భూభరము వారిత మౌటది యే విధంబు నా
మాటకు మౌనిచంద్ర! మఱి మాట ప్రకాశము గాఁగఁ జెప్పవే.

429

తా ॥ 'మహానుభావా! ఆయన రాజుల్ని అలా చంపడానికి కారణమేమిటి? వారు చేసిన తప్పేమిటి? బ్రాహ్మణుడైన ఆ రాముడు రాజస తామసగుణాలను ఎందుకు అలవరచుకున్నట్లు? అలా భూభారం తగ్గిందంటారు. అదెలాగా? మునిసత్తమా! తేటతెల్లమయ్యేట్లు వివరించవా?' అని అడిగాడు.

వ. అనిన విని శుకుం డిట్లనియె.

430

తా ॥ ఆ మాటకు శుకమహర్షి ఇలా చెప్పుకొచ్చాడు:

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యదత్తాత్రేయు నారాధనము చేసి యతని వలనఁ
బరపంథి జయమును బాహుసహస్రంబు నణిమాది గుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి

తే. గాలికైవడి సకల లోకంబు లందుఁ, దనకు పోరాని రారాని తలము లేక యెట్టిచో
నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల, ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణి మాడ్కి.

431

తా ॥ హైహయవంశంలో కార్తవీర్యార్జునుడనే వాడు ఆనాటి రాజుల్లో ఎన్నదగినవాడు. ఆయన, పురుషోత్తమాంశ సంభూతుడైన దత్తాత్రేయుణ్ణి ఆరాధించి, శత్రువులను జయించాడు. వేయి చేతుల్ని పొందాడు. అణిమాదిసిద్ధులను, కీర్తి, బలం, యోగీశ్వరత్వం, ఓజస్సు, తేజస్సు, ఇంద్రియాలకు క్షీణత లేని పటుత్వం, ఐశ్వర్యం మొదలగు వాటినన్నింటినీ పొంది, వాయువు వలె సర్వలోకాలకు రాకపోకలు సాగిస్తూ, అన్ని చోట్లా తన ప్రభుత చెల్లివచ్చేటట్లు ఆకాశవీథిలో సూర్యుని వలె భూమిపై అతడు వెలుగొందాడు.

అణిమాది సిద్ధులు : ఇవి ఎనిమిది. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము ఈశిత్వము, వశిత్వము.

మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుం
డక రేవానది కేగి యందుఁ దెలినీటం జల్లుపోరాడి దీ
ర్ఘ కరాబ్జంబుల నా నదీజలములం గట్టెన్; వడిన్ నీరు మ్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్.

432

తా ॥ అలా ఉంటుండగా ఒకనాడు ఆ కార్తవీర్యార్జున మహారాజు విఱ్ఱవీగుతూ అంగనా జనంతో రేవానదికి వెళ్ళి, స్వచ్ఛమైన ఆ నదీజలాలలో క్రీడలాడసాగాడు. అలా జలక్రీడలాడుతూ తన పొడవాటి చేతులను నదీప్రవాహానికి అడ్డుగా పెట్టాడు. దానితో ప్రవాహం ఆగిపోయి, నీరు పైకుబికి, ఆ సమయానికి దండయాత్రకై బయలుదేరిన రావణాసురుని చుట్టుముట్టింది.

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజుచే కట్టం దొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటి మగనితోడి పోరాటకుం దొడరినఁ బాటింపక తన బాహుపాటవంబున.

433

తా ॥ దండ్రయాత్రకై బయలుదేరి వచ్చిన రావణుడు, అది సహింపలేక కోపంతో దానికి కారణమైన అర్జునునితో తలపడ్డాడు. అర్జునుడు కూడా ఏమీ వెనుకకు తగ్గక, తన భుజసామర్థ్యంతో రావణుని ఎదుర్కొన్నాడు.

క. వీఁకమెయి నతఁడు రావణుఁ, గూఁకటు లగలించి పట్టికొని మోఁకాళ్లం దాఁకించి కోఁతికైవడి, నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్.

434

తా ॥ ఎదుర్కొని, రావణుని జుట్టు ఊడివచ్చేట్లు ఒడిసి పట్టుకొని, మోకాళ్ళతో తన్ని, అంతటితో ఆగక తన సేవకులతో ఆయన్ని కోతిని బోనులో పెట్టినట్లు చెరపట్టించాడు.

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి.

435

తా ॥ పిదప కార్తవీర్యార్జునుడు తన రాజధాని మాహిష్మతీ పురానికి వచ్చాడు.

క. ఆ రాజేంద్రుఁడు రావణు, నోరీ! యిటమీఁద నూరకుండుము; జగతిన్ వీరుఁడ ననకుము; కాచితిఁ, బోరా; యని సిగ్గుపఱిచి పుచ్చెను మరలన్.

436

తా ॥ వచ్చి, రావణునితో 'ఓరీ! ఇక మీదట నోరు మూసుకుని పడి ఉండు. వీరుడనని ఎక్కడా చెప్పకు. పో! వెళ్ళు. నిన్ను విడిచిపెడుతున్నాను' అని హేళన చేసి, అవమానపరచి పంపాడు.

వ. అంత.

437

తా ॥ ఆ తరువాత,

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేఁటకై కాంతారవీథి కేగి
తిరిగి వేఁటల శ్రాంతదేహుఁడై జమదగ్ని ముని యాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ
నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి యా రాజునకు రాజుననుచరులకుఁ
దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింపఁ దడవఁ

తే. గుడిచి కూర్చుండు మొదవుపైఁ గోర్కిఁ జేసి, సంపద యదేల యీ యావు చాలుఁ గాక
యిట్టి గోవుల నెన్నఁడు నెఱుగఁ మనుచుఁ, బట్టి తెండని తనయొద్ది భటులఁ బనిచె.

438

తా ॥ ఒకనాడు కార్తవీర్యుడు, దైవయోగం కొద్దీ అడవులకు వేటకు వెళ్ళి, కొంత సంచారం గావించి, ఆకలితో అలసట చెంది, జమదగ్ని మహాముని ఆశ్రమానికి వెళ్ళి, ఆయనకు నమస్కరించాడు. ఆయన సాదరంగా రాజును గౌరవించి ఆయనకు, భటులకు, తన హోమధేనువును రప్పించి దానిచేత వారందరికీ మృష్టాన్నాన్ని సమకూర్చాడు. అంతట రాజు భోజనాదికాలు ముగించి, తీరికగా కూర్చుని, ఆ హోమధేనువుపై కన్నువేసి, 'ఈ ఆవు ఉంటే ఇక వేరే సంపదంటూ దేనికి? ఇలాంటి ఆవును ముందెన్నడూ చూసింది గాని విన్నదీ గాని లేదు' అని ఆలోచించి, తన చెంతనున్న భటులతో దానిని పట్టి తెమ్మని ఆజ్ఞాపించాడు.

వ. పంచిన వారలు దర్పంబునం జని.

439

తా ॥ అలా పంపించగా, వాళ్ళు పొగరుకొద్దీ దాని వద్దకు వెళ్ళారు.

క. క్రేపుం బాపకుఁ డంచును, నాపదలం బడతి ననుచు నంభా యంచున్ జూపోపరు నృపు లంచును, వాపోవన్ మొదవుఁ గొంచు వచ్చిరి పురికిన్.

440

తా ॥ అంతట ఆ ఆవు, 'నా నుండి నా దూడను వేరు చేయకండి. అయ్యో, వీరి పీడకు లోనైనానే! రాజుల దృష్టి పడనేరాదు. పడితే వారు ఓర్వలేరు. అంతా తమకే కావాలంటారు గదా' అని అంబారావాలు చేసింది. అయినా దానినేమీ పట్టించుకోక, భటులు దానిని తమ పట్టనానికి లాక్కొచ్చారు.

వ. అంత నర్జునుండు మాహిష్మతీ పురంబునకు వచ్చునెడ, రాముం డాశ్రమంబున కేతెంచి.

441

తా ॥ రాజు మాహిష్మతీ పురానికి వస్తున్న సమయంలో జమదగ్ని కుమారుడు పరశురాముడు ఆశ్రమానికి వచ్చి, జరిగిన సంగతంతా తెలుసుకొన్నాడు.

ఆ. అద్దిరయ్య యింట నశనంబుఁ గుడిచి మా, యయ్య వల దనంగ నాక్రమించి
కోరి మొదవు రాజు గొనిపోయినాఁ డఁట, యేను రాముఁడౌట యెఱుఁగఁ డొక్కొ!.

442

తా ॥ తెలుసుకొని, ఆహా! మా ఇంట అన్నం తిని, మా అయ్య కూడదంటున్నా బలవంతంగా ఆవును రాజు పట్టుకుపోయాడన్నమాట! నేను రాముణ్ణి ఒకణ్ణి ఇక్కడున్నానని తెలియదు గాబోలు!

వ. అని పలికి.

443

తా ॥ అని పలికి,

మ. ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపన్ బాఱు సింహాకృతిన్

బెలుచన్ రాముఁ డిలేశుఁ వెంట నడచెన్ బృథ్వీతలంబెల్ల నా
కులమైఁ గ్రుంగఁ గుఠారియై కవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై మృగాజిన మనోజ్ఞశ్రోణియై తూణియై.

444

తా ॥ ప్రళయాగ్ని కీలవలె, ఏనుగు విదిలిస్తే వడిగా పారే సింహం వలె, భూమండలమంతా చలించి క్రుంగిపోతోందా అన్నట్లుగా, గొడ్డలి, కవచం, ధనుస్సు, బాణాలు, అమ్ములపొదితో, జింక చర్మంతో అందంగా భాసిస్తున్న పిఱుదులు కలవాడై మోసగింపబడ్డానన్న కోపంతో, రాజు కొరకు బయలుదేరి వెళ్ళాడు.

వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున.

445

తా ॥ అలా వెళ్ళి మాహిష్మతీ పురం చేరి అక్కడ నిలిచాడు.

మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకాముం శరా
సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్చల ద్భ్రూయుగా
నన నేత్రాంచల సీము నైణపట నానా మాలికోద్దాము నూ
తన సంరంభ నరేంద్రదాన శుభసూత్రక్షామునిన్ రామునిన్,

446

తా ॥ ధనుర్బాణాలూ గండ్రగొడ్డలీ ధరించి, ముడిచిన కనుబొమలతో, కోపంతో ఎఱ్రవారిన కన్నులతో కడకంట చూస్తున్నవాడూ, మృగచర్మాన్ని ధరించి, పూమాలలు అనేకం ధరించినవాడూ, రాజుల భార్యలను మంగళసూత్రాలకు దూరం చేసేవాడూ, కోరి యుద్ధానికి వచ్చి తన యెదుట నిలిచిన పరశురాముని కార్తవీర్యార్జునుడు చూశాడు.

వ. కని కోపించి.

447

తా ॥ చూసి, పట్టరాని ఆగ్రహానికి గురైనాడు.

ఉ. బాలుఁడు వెఱ్ఱి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి నుంట మాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబుఁ దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ బాపము లేదు లెండు లెం
డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్.

448

తా ॥ 'బాలుడైన ఈ వెఱ్ఱి బాపనయ్య, బ్రాహ్మణాచారాన్ని వదిలి, నిర్భయంగా మహాబలవంతులైన రాజన్యోత్తములతో – కోరి యుద్ధానికి వచ్చాడు గనుక, మనకు ఏ పాపమూ అంటదు. ఇతన్ని మన్నించాల్సిన పనీ లేదు. కనుక అతనిని నిలదీయండి. నిలువునా నరకండి. మట్టుపెట్టండి.'

వ. అని కదలించి, దండనాయకుం బురికొల్పిన, వారును రథ గజ తురగ పదాతి సమూహంబులతో లెక్కకుం బదియే డక్షౌహిణులతో నెదురు నడచి, శర చక్ర గదా ఖడ్గ భిండివాల శూల ప్రముఖ సాధనంబుల నొప్పించిన, నవ్విప్రుండు గన్నుల కొలఁకుల నిప్పులు కుప్పలుగొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి, యజ్ఞోపవీతంబు చక్క నిడికొని, కరాళించి, బిట్టు దట్టించి, కఠోరంబగు కుఠారంబు సారించి, మూఁకలపై కుఱికి, తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచు నరఁ టికంబంబులఁ దెగనడచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచు, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకుని కైవడి శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం దుండించు సూపకారుని భంగి నవయవంబులఁ జెక్కుచు, నంతటం దనివి సనక,

విలయకాలకీలి కేళిని మంట లుమియుచు, విల్లంది యెల్లెడం బిడుగుల సోనలు గురియు బలు మొగుళ్ళ వడువున నప్రమాణంబులగు బాణంబులు పఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబు లేని యార్భాటంబులు గల బాణవర్ష ఘృతంబులచే రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచుఁ, దురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులుగా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బఱవం దోలుచు, ని వ్విధంబున సేనల నంపవానల ముంచి, రూపుమాపిన.

449

తా ॥ అని అంటూ తన దండనాయకుల్ని హెచ్చరించాడు. అంతట, వారు రథ, గజ, తురగ, పదాతి సైన్యాన్ని లెక్కసరికి పదిహేడు అక్షౌహిణులతో ఆయనను ఎదుర్కొని, బాణాలు, చక్రాయుధాలు, గదలు, ఖడ్గాలు, వడిశెలలు, శూలాలు మొదలైన ఆయుధాలతో పరశురాముని బాధించారు. చూశాడు పరశురాముడు. కన్నుల్లో నిప్పులు కురిపించాడు. కోపం కట్టలు త్రెంచుకుంది. జంధ్యాన్ని బిగించాడు. పెడబొబ్బలు పెడుతూ, గండ్రగొడ్డలిని సన్నద్ధం చేసుకొని, సైన్యపు మూకపై పడ్డాడు. తొలకరిజల్లులు పడగానే పొలంలోని తుప్పలను ఏరిపారేసినట్లుగా వారి పాదాలను వేరుచేశాడు. తోట యజమాని, అరటిగెలలు కొట్టిన తరువాత, బోదెలను మధ్యకు నరికివేసినట్లు వారి నడుములపై వ్రేటు వేసి దేహాలను రెండు ముక్కలుగా నరికేశాడు. చెట్టెక్కినవాడు తాటి పండ్లను దులిపినట్లు, వారి శిరస్సులను నరికి దొర్లించాడు. మృగమాంసాన్ని వండటం కొరకు, వంటవాడు ఎలా ముక్కలుగా ఖండిస్తాడో అలా వారి అవయవాలను ఖండించాడు. అయినా అంతటితో ఆయనకు తనివి తీరలేదు. విలయకాలంలో అగ్ని ఎలా ఎగసెగసిపడుతుందో అలా కన్నుల్లో నిప్పులు కురిపిస్తూ, మేఘాల నుండి పిడుగులు రాలిపడుతున్న విధంగా కొలతకు అందిరానంతటి పొడవైన బాణాలను కురిపించాడు. ఒక అడ్డూ ఆపూ లేకుండగా, నేతి ధారవలె బాణాలను గుప్పిస్తూ, తన కోపమనే అగ్నికి వేల్చుతూ ఆహుతి చేశాడు. గుఱ్ఱాల అవయవాలను ఖండించాడు. రథాలను, రౌతులను ముక్కలు ముక్కలు చేశాడు. ఏనుగులను రథాల పైకి పరుగులెత్తించాడు. ఈ విధంగా ఆ సేనలను బాణవర్షంతో

ముంచెత్తి రూపుమాపాడు.

అక్షౌహిణి : ఇరవై యొక్క వేల ఎనిమిది వందల డెబ్బై రథాలు, అంతే సంఖ్యలో గల ఏనుగులు, అరవై అయిదు వేల ఆరువందల పది గుఱ్ఱాలు, ఒక లక్షా తొమ్మిది వేల మూడువందల యాభై మంది గల సైనికదళం.

క. మత్తిల్లి భూతజాలము, చిత్తంబులఁ జొక్కి వేడ్క చిందులు వాఱన్ జొత్తిల్లి సమిత్తలమున, నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్.

450

తా ॥ అలా రణరంగమంతా నెత్తురు, మేధస్సు, మాంసంతో నిండిపోవడంతో, ఆనందంతో భూతగణం చిందులు వేయసాగింది.

వ. అ య్యవసరంబున.

451

తా ॥ ఆ సమయంలో,

క. మే లీ బ్రాహ్మణుఁ డొక్కఁడు, నేలం బడఁ గూల్చె సైన్యనిచయము నెల్లన్
బాలార్ప నేల యీతనిఁ, దూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్.

452

తా ॥ ఆహా! ఈ బ్రాహ్మణుడొక్కడై నిల్చి ఈ సైన్యాన్నంతటినీ పట్టిపల్లార్చి కూల్చివేశాడు. ఇక ఉపేక్షించాల్సిన అవసరం లేదు. నా భుజశక్తితో ఇతగాడిని మట్టుపెడతాను గాక!

వ. అని పలికి.

453

తా ॥ అని సైనికులతో పలికి,

మ. ఒకయేనూఱు కరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖాను పుం
ఖ కఠోరంబుగ నేసె రాజు రయరేఖా ధామునిన్ రామునిన్.

454

తా ॥ ఒక అయిదు వందల చేతులలో ధనుస్సులు ధరించి, మరో అయిదు వందల చేతుల్లో పదనైన బాణాలు ధరించి, నారులను సంధించి, గుణధ్వని చేసి, 'బాపనయ్యా! నిన్నూ, నీ గొడ్డలిని కూల్చివేస్తున్నాను చూడు' అంటూ పెడబొబ్బ పెట్టి, సూర్యతేజస్సుతో వెలిగిపోతున్న ఆ పరశురామునిపై ఎడతెగకుండా బాణాలను వేసి, ఆయన్ని బాధించాడు.

క. వడిఁదూపు లెగయ గుడుసులు, పడి కార్ముక పంచశతము పరఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషమండలి, నడుమ ఖరద్యుతుల వెలయు నళినాప్త క్రియన్.

455

తా ॥ అలా బాణాలు విజృభించి వేస్తుంటే, ఆయన అయిదువందల చేతులలోని విండ్లు చక్రాకారాన్ని దాల్చగా, గుడి కట్టగా దాని మధ్య తన కిరణాలతో వెలిగిపోతున్న సూర్యుని వలె, ఆ రాజు కానవచ్చాడు.

వ. ఇ ట్లర్జునుండు బాణవిలాసంబు సూపిన.

456

తా ॥ అలా కార్తవీర్యార్జునుడు తన బాణవిన్యాసాన్ని చూపగా,

మ. ధరణీదేవుఁడు రాముఁడాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు

ష్కరచాపం బొక టెక్కు పెట్టి శరమున్ సంధించి పెల్లేసి భూ
వరుకోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడంతటం బోక వే
తరువుల్ ఱువ్వఁ గుఠారధార నఱకెన్ దద్బాహుసందోహమున్.

457

తా ॥ ఆ బ్రాహ్మణుడు, ఆ పరశురాముడు, ఆ సమర్థుడు, ధనుర్విద్యలో మేటి అయినవాడు ఒక భయంకరమైన విల్లు నొకదాన్ని ఎక్కుపెట్టి బాణాలు అనేకం సంధించి, ఆ రాజు ధనుస్సును ఒక్క రెప్పపాటు కాలంలో విరిచేశాడు. వాడంతటితో పోక, వేయి చేతుల్తో వేయి చెట్లను పరశురాముని పైకి విసరగా తన గండ్రగొడ్డలితో చెట్లతోపాటు అతని చేతుల్నీ ఒక్క పెట్టున నరికేశాడు.

క. కరములు దునిసిన నతనికి, శిరమొక్కటి చిక్క శైలశిఖరముభంగిం బరశువున నదియుఁ
ద్రుంచెను, బరసూదనుఁడైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్.

458

తా ॥ చేతులన్నీ పోయినా, కొండ శిఖరం వలె అతని తల ఒక్కటీ మిగలగా దానినీ ఆ ఘనుడైన పరశురాముడు – ఆ శత్రుసంహారకుడు – దానిని తెగనరికాడు.

ఆ. తండ్రివడిన నతని తనయులు పదివేలు, దలఁగి పోయి రతనిఁ దాఁకలేక
పరభయంకరుండు భార్గవుం డంత నా, గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె.

459

తా ॥ అలా తండ్రి చనిపోగా, అతని కుమారులు పదివేలమందీ, ఆయన ముందు నిలువలేక యుద్ధభూమి నుండి పలాయనం చిత్తగించారు. అంతట ఆ భార్గవరాముడు, గోవునూ, దాని దూడనూ తోలుకొని ఆశ్రమానికి తీసుకొనివచ్చాడు.

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబుఁ దండ్రికిం దోబుట్టువులకుఁ దెలియఁ జెప్పిన, జమదగ్ని రాముని కిట్లనియె.

460

తా ॥ అలా హోమధేనువును తెచ్చి తండ్రికి అప్పచెప్పి, తన పరాక్రమాన్ని గూర్చి ఆయనకు తెలియజెప్పాడు. సోదరులకు జరిగినదంతా వివరించి చెప్పాడు. అంతా విని, జమదగ్ని కుమారునితో ఇలా అన్నాడు:

క. కలవేల్పు లెల్లఁ దమతమ, చెలువంబు దెచ్చి రాజుఁ జేయుదు రకటా! బలువేల్పు రాజు వానిం, జలమున నిట్లేల పోయి చంపితి పుత్త్రా!

461

తా ॥ "దేవతలందరూ తమ తమ కళలను కొంత కొంత యిచ్చి గదా రాజును చేస్తారు! అయినప్పుడు, బలపరాక్రమాలు గలవాడూ, ఇంద్రునంతటివాడూ అయిన రాజును, అంత పంతం పట్టి వెళ్ళి ఎందుకు సంహరించావు నాయనా!

క. తాలిమి మనకును ధర్మము, తాలిమి మూలంబు ధర్మతత్త్వంబునకున్; దాలిమి గల దని యీశుం, డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్.

462

తా ॥ మనకు ఓర్పే ధనం. అదే మూలం మనకు. ఒక్క తాలిమి కలిగి ఉండటం వల్లనే మనం ధన్యజీవనులమని గదా ఈశ్వరుడు మనల్ని బ్రహ్మపదంలో నిలిపాడు!

క. క్షమ గలిగిన సిరి గలుగును, క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్ క్షమ గలుగఁ దోన కలుగును, క్షమ కలిగిన మెచ్చు శౌరి సదయుఁడు తండ్రీ!

463

తా ॥ ఓర్పంటూ ఉంటే, సిరి కలుగుతుంది. పలుకుబడి కలుగుతుంది. దాని వెంటే సూర్యుని వంటి తేజస్సూ కలుగుతుంది. ఓర్పు కలిగినవాడినే, ఆ జగన్నాథుడైన విష్ణుమా మెచ్చుకుంటాడు కదా! క్షమాగుణమును అలవరచుకొనుట బ్రాహ్మణ ధర్మము.

క. పట్టపురాజును జంపుట, గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను పాపం
బట్టిట్టనకుము నీ వీ, చెట్ట సెడన్ దీర్థ సేవ సేయుము తనయా!

464

తా ॥ గద్దె నెక్కిన రాజును చంపటం, బ్రాహ్మణుని చంపినదానికంటే పాతకం సుమా! కనుక నీవు మారుమాట మాటాడక, ఈ పాపం వదలించుకోవడానికి తీర్థయాత్ర చేయుదువు గాక!” అని అన్నాడు.

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ, బనిపూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం
బున నొకయేఁడు ప్రయాణము, చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా!

465

తా ॥ రాజా! అలా తండ్రి ఆజ్ఞాపించగా, ‘మహాప్రసాద’ మంటూ తండ్రి ఆజ్ఞను శిరసావహించి, అత్యంత వేగంగా ఒక ఏడాది కాలంలో, తీర్థాలన్నింటినీ సేవించి ఆశ్రమానికి తిరిగి వచ్చాడు భార్గవ రాముడు.

ఉ. ఆ యెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజ మా
లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞఁ దలంపక కొంత ప్రేమతో.

466

తా ॥ కొంత కాలం తరువాత ఒకనాడు జమదగ్ని భార్య రేణుకా దేవి నీరు తీసుకురావటం కొరకు గంగానదికి వెళ్ళింది. ఆ సమయానికి ఆ నదీప్రవాహం నడుమ తామరపూమాలతో విలసిల్లుతూ చూడ చక్కని వాడైన చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో జలకమాడుతున్నాడు. అతడిని ఆసక్తిగా చూస్తూ భర్త త్వరగా నీరు తెమ్మన్న మాట కూడా మరచిపోయింది.

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబునఁ దడసి.

467

తా ॥ ఇలా గంధర్వరాజును చూస్తూ ఉండిన కారణాన ఆలస్యమయింది.

ఉ. అక్కట; వచ్చి పెద్దతడ వయ్యెడి; హోమమువేళ దప్పె; నే
నిక్కడ నేల యుండితి? మునీశ్వరుఁ డేమనునో యటంచుఁ దా
గ్రక్కునఁ దోయకుంభము శిరఃస్థలమం దిడి తెచ్చి యిచ్చి వే
మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్వఁ జూచుచున్.

468

తా ॥ 'అయ్యో! వచ్చి చాలాసేపయ్యింది. యజ్ఞసమయం దాటిపోయింది. నేను ఇక్కడే ఉండి పోయానేమిటి? భర్త ఏమంటాడో ఏమో' నని ఆందోళనకు గురియై, నీళ్ళకుండను తలపై పెట్టుకొని తెచ్చి, మునికి ఇచ్చి, భయపడుతూ, ఆయనకు నమస్కరించి ఒదిగి నిలిచింది.

వ. అప్పుడు.

469

తా ॥ అప్పుడు.

క. చిత్తమున భార్య దడసిన, వృత్తాంతం బెఱిఁగి తపసి వేగము సుతులన్ మత్తం దీనిం

జావఁగ, మొత్తుం దన మొత్తరైరి మునుకుచు వారల్.

470

తా ॥ భార్య ఆలస్యంగా రావడానికి గల కారణాన్ని దివ్యజ్ఞానంతో పసిగట్టి, కోపంతో కుమారులను పిలిచి, పొగరెక్కిన ఆమెను బాది చంపండని ఆజ్ఞాపించాడు. ఆ మాటకు వారు చాల దుఃఖించారు. అయితే ఆమెను చంపడానికి సాహసించలేదు.

క. కడుకొని పెండ్లముఁ జంపని, కొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁ డానతి యీ
నడుగులకు నెఱఁగి రాము, డడుగిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్.

471

తా ॥ అలా కొడుకులు, తన మాట పాటించకపోవటంతో, కొడుకుల్నీ, భార్యనీ చంపమని భార్గవ రాముని ఆదేశించాడు. అంతట రాముడు తండ్రి పాదాలకు నమస్కరించి – అన్నలూ, తల్లీ మరో అడుగు కూడా అవతలికి వేసే అవకాశమివ్వకుండా వారిని నరికి చంపేశాడు.

శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్న బెం
పెల్లన్ బోవ శపించుఁ దండ్రి; తన పంపేఁ జేయుదున్ మెచ్చి నా
తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁజేయాడునే!

472

తా ॥ అలా తండ్రి చెప్పినట్లు తల్లినీ అన్నల్నీ చంపనంటే, విపరీతమైన కోపంతో ఆయన శపిస్తాడు. అలా గాక ఆయన ఆజ్ఞను శిరసావహిస్తే, మెచ్చుకుంటాడు. తిరిగి ప్రార్థిస్తే ఆ తపశ్శాలి తల్లినీ సోదరుల్నీ తప్పక బ్రతికిస్తాడు. ఇంతవరకూ ఇది సత్యం – అని మనస్సులో నమ్మినవాడు గనుక ఆయన అలా వారిని చంపాడు తప్ప, లేకపోతే వారిని చంపడానికి ఆయనకు మాత్రం చేయాడుతుంది గనుకనా!

వ. ఇ వ్విధంబున.

473

తా ॥ ఈ విధంగా

క. అడ్డఁడు చెప్పక కడపటి, బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్ గొడ్డంటం దెగ నడచిన, జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్.

474

తా ॥ కడసారి కానుపు రాముడు, మారుమాటాడకుండా తన ఆజ్ఞను పాటించి భార్యను, కుమారులను చంపటం చూసిన జమదగ్ని, ఆహా ! అంటూ తల పంకించి, కొడుకును మనస్సులో ఎంతో మెచ్చుకున్నాడు.

క. మెచ్చిన తండ్రినిఁ గనుఁగొను, చెచ్చెర నీ పడినవారి జీవంబులు నీ
విచ్చితి నను మని మ్రొక్కిన, నిచ్చెన్ వారలును లేచి రెప్పటిభంగిన్.

475

తా ॥ అలా సంతోషిస్తున్న తండ్రిని సమీపించి, 'తండ్రీ! ఈ చనిపోయిన వారి ప్రాణాలను ఇచ్చాను సుమా అని మీరు అందురు గాక' అని పరశురాముడు ప్రార్థించి నమస్కరించగా, ఆయన అలాగే అనడంతో వారందరూ ఎప్పటి వలె లేచి నిలుచున్నారు.

ఆ. పడిన వారి మరల బ్రతికింప నోపును, జనకుఁ డనుచుఁ జంపె జామఁదగ్న్యుఁ; డతఁడు సంపె ననుచు నన్నలఁ దల్లిని, జనకునాజ్ఞ నైనఁ జంపఁదగదు.

476

తా ॥ చనిపోయిన వారిని బ్రతికించగలడు తండ్రి. దానికి ఆయన సమర్థుడు అనే నమ్మకం, భార్గవ రామునికి ఉంది గనుకనే ఆయన వారిని చంపాడు. అది ఆయనకే తగును.

అంతే తప్ప ఆయన అలా చేశాడు కదా అని, తండ్రి చెప్పినా తల్లినీ సోదరులనూ చంపటం అనేది ఎవరికీ కూడదు గాక కూడదు సుమా!

వ. అంత.

477

తా ॥ అంతట,

సీ. పరశురాముని కోడి పరుగులు పెట్టిన యర్జునపుత్రకు లాత్మయందఁ
దండ్రి ద్రుగ్గుటకు సంతప్తులై పొగులుచు నింతట నంతట నెదరు వేచి
తిరిగి యాడుచు నొక్కదివసమం దా రాముఁ డడవి కన్నలతోడ నరుగఁ బిదపఁ
బగదీర్పఁ దఱి యని పఱతెంచి హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి

తే. నిరుపమ ధ్యాన సుఖవృత్తి నిలిచియున్న, పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదివి పట్టి
కుదులకుండఁగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి, యడ్డ మే తెంచి రేణుక యడచికొనఁగ.

478

తా ॥ రాజా! అదలావుంచితే, అప్పుడు పరశురాముని ధాటికి నిలువలేక కార్తవీర్యార్జునుని కుమారులు పారిపోయారని చెప్పాను గదా! వారు, తమ తండ్రి మరణానికి ఎంతో దుఃఖించి, ప్రతీకారం కొరకు వేచి ఉన్నారు. ఒకనాడు పరశురాముడు తన అన్నలతో అడవికి వెళ్ళటం చూసి, పగ తీర్చుకోవడానికి ఇదే తగిన అదను అని భావించి, హోమసదనంలో సర్వేశ్వరుణ్ణి ఆత్మలో నిలుపుకొని, ధ్యానంలో ఉన్న జమదగ్నిని చుట్టుముట్టి ఆయనను కదలకుండా పట్టుకుని, అడ్డం వచ్చిన రేణుకా దేవిని ఆవలకు నెట్టి, శిరస్సు ఖండించి వెళ్ళారు.

వ. మఱియును.

479

తా ॥ అంతట ఆమె

మ. జనకుం జంపిన వైర మేమఱక రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ! రామ! రిపులన్ శాసింతు రమ్మంచు న
మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ ముయ్యేడుమాఱుల్ రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంతయై.

480

తా ॥ భర్త శవంపై పడి, భార్గవరాముని కలవరిస్తూ – 'నాయనా, తమ తండ్రిని చంపిన పాతపగతో, ఆ రాజు కుమారులు, నేడు మీ తండ్రిని చంపి వెళ్ళారు. ఎక్కడున్నావు తండ్రీ, శత్రువులను పరిమార్తువు గాక! త్వరగా రమ్మం' టూ రోదిస్తున్నంతలో పరశురాముడు రాగా, ఆమె భర్త తనువుపై వ్రాలి, ఇరవైయొక్కసార్లు తలను మోదుకుంది.

వ. ఇట్లప్పుడు దల్లి మొఱ విని, జమదగ్నికుమారులు వచ్చి యిట్లని విలపించిరి.

481

తా ॥ అంతట తల్లి ఆక్రందన విని, జమదగ్ని కుమారులందరూ వచ్చి, ఈ విధంగా దుఃఖించసాగారు:

క. వాకిలి వెడలవు కొడుకులు, రాకుండగ నట్టి నీవు రాజసుతులచేఁ
జీకాకు పొంది పోవఁగ, నీకా ళ్లెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్.

482

తా ॥ 'తండ్రీ! మేము తోడురాకుండా ఇల్లు కదలవే! అలాంటిది రాజకుమారులచే హింసింపబడి మమ్మల్ని విడిచి స్వర్గానికి వెళ్ళడానికి నీకు కాళ్ళు ఎలా ఆడాయి తండ్రీ!' అంటూ విలపించారు.

వ. అని విలపించుచున్న అన్నలను జూచి రాముం డిట్లనియె.

483

తా ॥ అలా దుఃఖీస్తున్న అన్నలను చూసి భార్గవ రాముడు ఇలా ఓదార్చాడు:

ఉ. ఏడువనేల తండ్రి! తను వేమఱకుండుఁడు తోడులార! నే
సూడొగిఁ దీర్తునంచుఁ బరశుద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవులున్న పురంబున కేగి వారు గో
డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్.

484

తా ॥ 'దేనికి దుఃఖీంచటం? మన తండ్రిగారి దేహాన్ని జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండండి. నేను ఇప్పుడే పగవారి పని పట్టి వస్తాను గాక!' అంటూ ఆయన కోపావేశంతో, కార్తవీర్యార్జునుని కుమారులున్న తావుకు వెళ్ళి, బ్రహ్మఘాతకులైన వారందరూ విలవిలలాడుతుండగా అందరినీ చీల్చి చెండాడి హతం గావించాడు.

క. ఖండించి రిపుల శిరములు, గొండలుగాఁ బ్రోగు లిడియె గురురక్తనదుల్ నిండికొని పాఱి
యుబ్బెను, భండనమున నృపులు రిపులు భయమంద నృపా!

485

తా ॥ అలా వారి శిరస్సులను ఖండించి, కొండలవలె ప్రోగులు పెట్టాడు. రక్తం ఏరులై ప్రవహించింది. అది చూసిన బ్రాహ్మణశత్రువులందరూ భయకంపితులైనారు.

వ. మఱియు నంతటఁ బోక.

486

తా ॥ అంతటితో ఆగక, ఆయన.

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల, నిరువదొక్కమాఱు లరసి చంపె; జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ, సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె.

487

తా ॥ తన తండ్రిని చంపిన పగ మనస్సులో సుళ్ళు తిరుగగా, ఇరవై ఒక్కసార్లు దండెత్తి అలుపూ సొలుపూ లేకుండా ఎక్కడెక్కడున్న రాజుల్నీ వెతికి వెతికి మరీ చంపి, భూమి మీద 'రాజు' అనే పదం వినరాకుండా చేశాడు. అవును మరి! తండ్రి పగను తీర్చని కొడుకు కూడా కొడుకేనా?

వ. మఱియు నా రాముఁడు శమంతక పంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు కావించి, తండ్రి శిరంబుఁ దెచ్చి, శరీరంబుతో సంధించి, సర్వదేవమయుండగు దేవుండు తాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబు చేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నధ్వర్యునకుఁ బడమటి దిక్కును, నుద్గాత కుత్తరదిశయును, నున్నవారల కవాంతరదిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు ఆర్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును గలయ నిచ్చి, బ్రహ్మనదియైన సరస్వతియం దవభృథస్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘవిముక్తుండైన సూర్యుండునుం బోలె నొప్పుచుండె. నంత.

488

తా ॥ ఆ తరువాత, భార్గవ రాముడు శమంత పంచకంలో ఆ రాజుల రక్తాన్ని తొమ్మిది మడుగులు చేసి, తన తండ్రి శిరస్సు తెచ్చి ఆయన దేహానికి కూర్చి, సర్వదేవమయుడూ తానే గనుక, తననే ఉద్దేశించుకొని యాగం చేశాడు. చేసి, హోతకు తూర్పు భాగాన్ని, బ్రహ్మకు దక్షిణ భాగాన్ని, అధ్వర్యునికి పడమటి భాగాన్ని, ఉద్గాతకు ఉత్తర దిశను, మిగిలిన యజ్ఞనిర్వాహకులకు ఆ యా దిశల సంధి ప్రదేశాలను (మూలలను), కశ్యపునికి మధ్య దేశాన్ని, ఉపద్రష్టకు ఆర్యావర్తాన్ని, సదస్యులకు తక్కిన భాగాల్ని ఇచ్చి, తాను బ్రహ్మనది అయిన సరస్వతి యందు

అవభృథస్నానం చేసి, పాపవిముక్తుడై మేఘాల చాటునుండి వెలువడిన సూర్యునివలె ప్రకాశించాడు.

అవభృథస్నానము : యజ్ఞదీక్ష విరమిస్తూ చేసే స్నానం.

క. ఆప్తుఁడగు పుత్రువలనను, బ్రాప్తతనుం డగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షిమండలంబున, సప్తముడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా!

489

తా ॥ రాజా! మనస్సుకూ మాటకూ అందివచ్చే కొడుకు వలన జమదగ్ని సశరీరుడై, తపోబలం చేత వినువీథిలోని సప్తర్షిమండలంలో సప్తమ మునియై విరాజిల్లాడు.

క. ఆ జమదగ్ని తనూజుఁడు, రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై యోజను
వేదర్షులలో, రాజిల్లెడు మీఁదిమనువు రా నవ్వేళన్.

490

తా ॥ ఆ పద్మనేత్రుడూ, ఘనుడూ అయిన జమదగ్ని కుమారుడు భార్గవరాముడు తరువాతి మన్వంతరంలో సప్తర్షులలో స్థానాన్ని అలంకరిస్తాడు.

ఆ. శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై, భవ్యుఁడై మహేంద్రపర్వతమున నున్నవాఁడు
రాముఁడోజతో గంధర్వ, సిద్ధవరులు నుతులు సేయుచుండ.

491

తా ॥ ఇప్పుడు ఆ పరశురాముడు సకల భవబంధాలనుండి విముక్తుడై, గంధర్వులు, సిద్ధులు తనను సేవింపగా మహేంద్ర పర్వతంపై శాంతచిత్తుడై ఉంటూ ఉన్నాడు.

## విశ్వామిత్రుని కథ

క. భగవంతుఁడు హరి యీ్రక్రియ, భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ, బగఁగొని పలుమాఱు చంపె బవరమున నృపా!

492

తా ॥ మహారాజా! భగవానుడై ఆ హరి, భృగువంశంలో జన్మించి భార్గవ రాముడై, భూభారాన్ని తగ్గించడానికి గాను రాజులతో వైరాన్ని పెట్టుకొని, పలుమార్లు వారిని యుద్ధంలో పరిమార్చాడు.

వ. అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి తపోబలంబున రాజధర్మంబును మాని, బ్రహ్మర్షియై, యేకశత సంఖ్యాగణితు లగు కొడుకులం గనియె; అయ్యెడ భృగుకుల జాతుండైన యజీగర్తుని కొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రుల చేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడుపడి, బ్రహ్మాదిదేవతల వినుతి సేయుచు మెప్పించి, పితృదేవతలచే బంధవిముక్తుండైన వాని యందుఁ గృప గలిగి, విశ్వామిత్రుండు పుత్త్రుల కిట్లనియె.

493

తా ॥ పిమ్మట గాధికి అగ్నితేజుడైన విశ్వామిత్రుడు జన్మించి, తపోబలం చేత, రాజధర్మాన్ని మాని బ్రహ్మర్షియై, నూరుగురు కుమారులను పొందాడు. ఆ సమయంలో, భృగువంశంలో జన్మించిన అజీగర్తుని కుమారుడు శునశ్శేఫుడనేవాడు తల్లిదండ్రులచేత యాగపశువుగా హరిశ్చంద్రునికి అమ్ముడుపోయి, బ్రహ్మాది దేవతలను స్తుతించి, మెప్పించి వారిచేత బంధ విముక్తుడైనాడు. అతనిపై జాలి వహించిన విశ్వామిత్రుడు అతనిని చేయిపట్టుకొని ఇంటికి తీసుకొని వచ్చి, తన కుమారులతో ఇలా చెప్పాడు:

క. కన్నులఁ గంటిని వీనిని, మన్నన కొమరుండు నాకు మక్కువ మీలో నన్నన్న యనుచు నతనిన్, మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై.

494

తా ॥ "నాయనలారా! వీడిని చూసింది మొదలు నాకు ఇతగాడిపై అవ్యాజమైన మమకారం కలిగింది. ఇతడిని నేను కుమారునిగానే భావిస్తున్నాను. కనుక మీరు కూడా ఇతనిని అన్నగా గ్రహింతురు గాక!" అనగా వారికి కోపం వచ్చింది.

క. ఇతఁ డన్నఁటవో మాకును, గృతకృత్యుల మైతి మనుచు గేలి యొనర్పన్ సుతులన్ మ్లేచ్ఛులు గండని, ధృతిలేక శపించి తపసి తిరుగుడువడఁగన్.

495

తా ॥ 'ఆహా! ఇతడట! మాకు అన్నగారట! మంచిమాటే! చాలా బాగుంది!' అని అతడిని గూర్చి ఎగతాళిగా మాట్లాడటంతో విశ్వామిత్రునికి కోపం వచ్చి, కొడుకులని ఏ మాత్రం జాలి చూపకుండా మ్లేచ్ఛులు కావలసిందని శపించాడు.

వ. అయ్యెడ నతని శాపంబునకు వెఱచి, యా నూర్వురయందు మధ్యముండైన మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి, తండ్రీ! నీ చెప్పిన క్రమంబున శునశ్శేపుండు మా కన్నయని నమస్కరింపం గలవార' మనవుఁడు సంతసించి, మంత్రదర్శియైన శునశ్శేపుని వారల యందుఁ బెద్దఁజేసి, మధుచ్ఛందున కిట్లనియె.

496

తా ॥ అలా ఆయన శపించేసరికి, ఆ నూర్వురిలో మధ్యవాడు మధుచ్ఛందుడనేవాడు భయపడి తన తరువాతి ఏభైమంది సోదరులతో కలిసి తండ్రికి నమస్కరించి, 'తండ్రీ! మీరు ఆనతిచ్చిన ప్రకారం మాకు శునశ్శేపుడే అన్న. అలాగే అతనిని గౌరవిస్తాము గాక' అని విన్నవించగా, విశ్వామిత్రుడు దానికి సంతోషించి, మంత్రద్రష్ట అయిన శునశ్శేపుని వారికి

జ్యేష్ఠునిగా చేసి, మధుచ్ఛందునితో మిగిలిన కొడుకులతోను ఇలా అన్నాడు:

ఆ. పాడి సెడక వీఁడె నేఁడు నీకతమునఁ, గొడుకు కలిగె నేఁడు కొడుకులార! కడుపులార మీరు గొడుకులఁ గనుఁ డింకఁ, బ్రీతితోడ దేవరాతుఁ గూడి.

497

తా ॥ 'నాయనా! మీ వలన, ధర్మానికి విఘాతం కలుగని పద్ధతిలో నాకు ఈ శునశ్శేపుడు మరో కొడుకైనాడు. ఇక మీరందరూ ఈ దేవరాతునితో ప్రేమతో నడుచుకుంటూ బిడ్డలను పొందండి.'

వ. అని పలికె, అట్లు శునశ్శేపుండు దేవతలచేత విడివడుటం జేసి, దేవరాతుండయ్యె. మధుచ్ఛందుండు మొదలైన యేఁబండ్రును దేవరాతునకుఁ దమ్ములైరి. పెద్దలైన యష్టక, హారీత, జయంత, సుమదాదు లేఁబండ్రును వేఱై చనిరి. ఈ క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండు విధంబులైనం, బ్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుం డిట్లనియె.
ఆ పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండను, క్షత్రవృద్ధుడును, రజియును, రంభుండును, ననేనస్సు ననువారు పుట్టిరి. అందు క్షత్రవృద్ధునకుఁ గుమారుండగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుండు గృత్స్నమదుండ నన ముగ్గురు గలిగిరి. ఆ కృత్స్నమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, న మ్మహాత్మునకు బహ్వృచప్రవరుండును జన్మించిరి. ఆ బహ్వృచప్రవరుండు తపోనియతుండై చనియె. కాశ్యునకుఁ గాశియుఁ, గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండు నుదయించిరి.

498

తా ॥ అని చెప్పాడు. దేవతల చేత విడిపింపబడ్డవాడు గనుక శునశ్శేపుని దేవరాతుడన్నారు. మధుచ్ఛందుడు మొదలైన యాభై మంది అతనికి తమ్ములైనారు. వారికంటే పెద్దవారైన అష్టకుడు, హారీతుడు, జయంతుడు, సుమదుడు మున్నగు యాభై మందీ వీరి నుండి

వేరైనారు. అలా విశ్వామిత్రుని కుమారులు రెండు విధాలు కావడంతో వారి ప్రవరలలో కూడా భేదం కలిగింది." అని చెప్పి, శుకమహర్షి అనంతర వృత్తాంతాన్ని ఇలా కొనసాగించాడు:

"పురూరవుని కొడుకు ఆయువని చెప్పాను గదా! అతనికి నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనసుడు అనే పుత్రులు కలిగారు. వారిలో క్షత్రవృద్ధునికి కుమారుడైన సుహోత్రునికి కాశ్యుడు, కుశుడు, గృత్స్నమదుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వారిలో గృత్స్నమదునికి శునకుడు, ఆ మహానుభావునికి శౌనకుడనే మహాత్ముడు అతనికి బహ్వృచప్రవరుడు జన్మించి, తపస్సు చేసుకోవడానికి వెళ్ళిపోయాడు. ఇక కాశ్యునికి కాశి, కాశికి రాష్ట్రుడు, రాష్ట్రునికి దీర్ఘతపుడు జన్మించారు.

క. ఆ దీర్ఘతపుని కధికుఁడు, శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యం డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి, ఖేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్.

499

తా ॥ ఆ దీర్ఘతపునికి విష్ణ్వంశలో సకల జనావళిచేత సేవింపబడే ఆయుర్వేదజ్ఞుడైన ధన్వంతరి జన్మించాడు. ధన్వంతరిని కీర్తిస్తే సకల దుఃఖాలు సమసిపోతాయి.

వ. వాసుదేవాంశ సంభూతుండగు నా ధన్వంతరి, యజ్ఞభోగంబున కర్హుండు. అతనికిఁ గేతుమంతుండు, కేతుమంతునకు భీమరథుం, డతనికి దివోదాసుం డనం బరఁగు ద్యుమంతుం డుదయించిరి. ఆ ద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించెఁ. బ్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజుం డనియుఁ జెప్పఁబడె, అతనికిఁ గువలయాశ్వుండు సంభవించె.

500

తా ॥ వాసుదేవాంశలో జన్మించిన ధన్వంతరికి హవిర్భాగార్హత ఉంది. అతనికి కేతుమంతుడు, అతనికి భీమరథుడు, అతనికి దివోదాసు జన్మించారు. ఈ దివోదాసునే

ద్యుమంతుడని కూడా అంటారు. అతనికి ప్రతర్దనుడు జన్మించాడు. అతనిని శత్రుజిత్తు అని, ఋతధ్వజుడని కూడా అనేవారు. అతనికి కువలయాశ్వుడు జన్మించాడు.

ఆ. వసుమతీశ ! విను కువలయాశ్వభూభర్త, లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె
నాతఁ డేలె నేల నఱువదియాఱు వే, లేండ్లు వానిభంగి నేలె నెవఁడు?

501

తా ॥ రాజా! విను. ఆ కువలయాశ్వుడు శుభపుణ్యమూర్తి అయిన అలర్కుని కన్నాడు. ఆ అలర్కుడు, అంతకు ముందు ఎవరూ పరిపాలించని విధంగా అరవై ఆరు వేల సంవత్సరాలు ఎంతో గొప్పగా భూమిని పాలించాడు.

వ. అ య్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు, అతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువును, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నాధృష్టకేతువునకు సుకుమారుండును, నా సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి.

502

తా ॥ ఆ అలర్కుని కుమారుడు సన్నతి. అతనికి సునీతుడు జన్మింపగా అతనికి సుకేతనుడు, అతనికి ధర్మకేతువు, అతనికి సత్యకేతువు, అతనికి ధృష్టకేతువు జన్మించారు. ధృష్టకేతుని కుమారుడు సుకుమారుడు. సుకుమారునికి వీతిహోత్రుడు, అతనికి భర్గుడు, భర్గునికి భార్గభూమి జన్మించారు.

ఆ. వాఁడు తుదయుఁ గాశ్యవసుమతీశుం డాది, యైనవారు గాశు లనఁగ నెగడి
రవనిమీఁద వార లా క్షత్రవృద్ధుని, వంశజాతు లగుచు వంశవర్య!

503

తా ॥ కాశ్యుడు మొదలుగా, ఈ భార్గభూమి వరకు గల క్షత్రవృద్ధుని వంశంలో జన్మించిన వారినందరినీ లోకం కాశులని వ్యవహరించింది.

వ. మఱియు, క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునకు హర్యధ్వనుండును, హర్యధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును. జయత్సేనునకు సంకృతియును, సంకృతికి జయుండును, జయునికి క్షత్రధర్ముండును బుట్టిరి. వీరలు క్షత్రవృద్ధుని వంశంబున గల రాజులు రంభునికి రభసుండును, రభసునకు గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును గలిగిరి. ఆ కృతునికి బ్రహ్మకులంబు పుట్టె. అ య్యనేనసునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించిరి. అతనికి శాంతరజుండు పుట్టె. నతండు విజ్ఞానవంతుండు, కృతకృత్యుండు, విరక్తుండు నయ్యె.

504

తా ॥ ఇక క్షత్రవృద్ధుని రెండవ మనుమడు కుశుడు గదా! అతనికి ప్రీతుడనేవాడు జన్మించాడు. అతనికి సంజయుడు, సంజయునికి జయుడు, అతనికి కృతుడు, కృతునికి హర్యధ్వనుడు, అతనికి సహదేవుడు, అతనికి భీముడు జన్మించారు. భీముని కుమారుడు జయత్సేనుడు. అతని కుమారుడు సంకృతి. అతనికి జయుడు, అతనికి క్షత్రధర్ముడు జన్మించారు. వీరంతా క్షత్రవృద్ధుని వంశంలోని రాజులు.

కాగా, క్షత్రవృద్ధుని తమ్ముడైన రంభునికి రభసుడు, రభసునికి గంభీరుడు. అతనికి కృతుడు జన్మించారు. ఆ కృతునికి బ్రహ్మకులం జన్మించింది.

ఇక అనేనసునికి శుద్ధుడు, శుద్ధునికి శుచి, శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తుడు, అతనికి శాంతరజుడు జన్మించారు. అతడు విజ్ఞానవంతుడు కృతకృత్యుడూ అయి విరక్తుడైనాడు.

సీ. రజియనువానికి రాజేంద్ర! యేనూఱు కొడుకులు గలిగిరి ఘోరబలులు
వేల్పులెల్లను వచ్చి వేఁడిన నా రజి, దైతులం బెక్కంద్ర ధరణిఁ గూల్చి
నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన రజికాళ్ళ కెఱఁగి సురప్రభుండు
వెండియు నతనికి విబుధదేహము నిచ్చి సంతోషబుద్ధి నర్చన మొనర్చె

ఆ. అంత నా రజి మృతుఁడైన నతని పుత్త్రు, లమరవిభుఁడు దమ్ము నడిగికొనిన నీక
యింద్రలోక మేలిరి యాగభో, గములు పుచ్చుకొనిరి గర్వమంది.

505

తా ॥ రాజా! ఇక రజి అనేవానికి, అత్యంత ఘోర బలశాలులైన అయిదు వందలమంది కొడుకులు కలిగారు. దేవతల ప్రార్థనపై ఆ రజి దైత్యుల నందర్నీ జయించి, స్వర్గలోకాన్ని దేవేంద్రునికి అప్పగించాడు. దానికి సంతోషించిన ఇంద్రుడు అతని కాళ్ళకు మ్రొక్కి, స్వర్గాన్ని ప్రసాదించి పూజించాడు. ఆ పిదప ఆయన గతించగా, ఆయన కుమారులు గర్వించి, దేవేంద్రుడు అడిగినా ఇంద్రలోకాన్ని ఇవ్వక, వారే పరిపాలిస్తూ, యాగభాగాలను కూడా పొందారు.

క. వేలుపులఱేఁడు గురుచే, వేలిమిఁ బెట్టించి బలిమి వెలయఁగ నిజ దం
భోలిని రజిసుతులను ని, ర్మూలము గావించి స్వర్గముం గై కొనియెన్.

506

తా ॥ అంతట ఇంద్రుడు, గురువైన బృహస్పతిచే హోమం చేయించి, బలవంతుడై తన వజ్రాయుధంతో ఆ రజి కుమారులనందరిని నిర్మూలించి, ఇంద్రలోకాన్ని కైవశం చేసుకున్నాడు.

వ. అది యట్లుండె నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ గృతియు నన నార్గురు కొడుకులు– దేహికి నింద్రియంబుల చందంబున సంభవించిరి. అందుఁ బెద్దకొడు కగు యతికి రాజ్యం బిచ్చిన, నతండు విరక్తుండై.

తా ॥ అది అలా ఉండగా, నహుషునికి యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి అనే ఆరుగురు కొడుకులు, శరీరధారికి ఇంద్రియాల వలె జన్మించారు. వారిలో పెద్ద కొడుకైన యతికి నహుషుడు రాజ్యం అప్పగించగా, అతడు విరక్తుడైనాడు.

క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియున్ రాజ్యమునఁ
బూజ్యు నెఱుఁగఁడు, రాజ్యము గీజ్యంబు ముక్తిరతులకు నేలా?

508

తా ॥ 'రాజ్యం అన్ని పాపాలకు మూలం. అది ఒళ్ళూ, పై తెలియనివ్వదు. రాజైనవాడు ఎంతటి బుద్ధిమంతుడైనా, పూజ్యుని గుర్తించడు. ముక్తికాంక్ష కలిగినవానికి ఈ రాజ్యం ఎందుకట?'

వ. అని పలికి, వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె.

509

తా ॥ అని అనుకుని అతడు రాజ్యాన్ని వదలి వెళ్ళిపోయాడు.

క. ఆ నహుషుడు మఖశతమును, మానుగఁ గావించి యింద్రమానినిఁ గవియం
బూని మునీంద్రులు మోచిన, యానముపై నుండి కూలె నహియై నేలన్.

510

తా ॥ ఇక ఆ నహుషుడు, నూరు యాగాలు చేసి, ఇంద్రపదవిని పొంది, ఇంద్రుని భార్య శచీదేవిని కూడటం కొరకు మునులచే పల్లకీ మోయించుకొంటూ వెళ్ళాడు. వారి శాపం వలన అతడు పల్లకీ నుంచి పడిపోయి, పామైనాడు.

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశల్
పన్నుఁగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రుని క్కూఁతురున్ సుసం
పన్న గుణాభిరామ వృషపర్వుని కూఁతురు నోలి నాండ్రుగా
నన్నయశాలి యాధరణి చక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితో.

511

తా ॥ అలా అన్న, తండ్రీ వెళ్ళిపోగా యయాతి రాజై, తమ్ములు నలుగురూ నాలుగు దిక్కులా గల భూమిని సంరక్షింపగా వారి వారికి తగిన భాగాలను ఇచ్చాడు. శుక్రుని కుమార్తె; సకల గుణశోభితయైన వృషపర్వుని కుమార్తెను వివాహమాడి, ఆ నీతిమంతుడు ఈ భూచక్రాన్నంతటినీ పాలించాడు."

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

512

తా ॥ అని శుకమహర్షి చెప్పగా, పరీక్షిన్మహారాజు విని ఇలా అన్నాడు:

# యయాతి చరిత్ర

ఆ. పార్థివుండు యయాతి బ్రహ్మర్షిభార్గవుఁ, డల్లుఁడగుట మామ యగుట యెట్లు
రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁగాక, విప్రకన్య నొంద విహిత మగునె?

513

తా ॥ "అయ్యా! మహర్షి సత్తమా! యయాతి శుక్రుని కుమార్తెనూ, వృషపర్వుని కుమార్తెను వివాహమాడాడని గదా చెప్పుకొచ్చారు. రాజైనవాడు రాచబిడ్డను వృషపర్వుని కుమార్తెను పెండ్లాడటం బాగానే ఉంది. మరి బ్రహ్మర్షి శుక్రునికి క్షత్రియుడైన యయాతి అల్లుడవటం, ఆయన ఈయనకు మామ కావటం – ఇదెలాగ పద్ధతి అవుతుంది? వివరించి చెప్పండి!" అని ప్రార్థించి అడిగాడు.

వ. అనిన శుకుం డిట్లనియె.

514

తా ॥ రాజు అలా అడుగగా, శుకమహర్షి ఇలా చెప్పుకొచ్చాడు:

సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దువోక
వేలసంఖ్యను చెలుల్ వెంటరా గురుసుత యగు దేవయానితో నాట మరగి
పూచిన యెలదోఁట పొంత జొంపము గొన్న క్రొమ్మావిచేరువ కొలఁకుఁ జేరి
యందుఁ దమ్ములతేనె లాని చొక్కుచు మ్రోయు నళుల ఝుంకృతులకు నదరిపడుచు

ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోన, బెల్లురేఁగి నీటఁ జల్లులాడ నందినెక్కి
మౌళి నిందురోచులు పర్వ, శూలి వచ్చెఁ గొండచూలితోడ.

515

తా ॥ "రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ, ఒకనాడు పట్నంలోపల పొద్దుపోక,

తన చెలికత్తెలు వేయిమందీ, గురువు గారి అమ్మాయి దేవయానీ వెంట రాగా ఉద్యానవనం సమీపంలోని లేత మామిడి చెంత గల కొలనుకు వెళ్ళారు. అక్కడ పద్మాలలోని తేనెను త్రాగి మత్తిల్లిన తుమ్మెదలను చూస్తూ గంతులు వేస్తూ, వారందరూ బట్టలు విప్పి కొలనులోనికి దిగి, ఉత్సాహంతో స్నానమాడసాగారు. ఆ సమయంలో నందివాహనంపై చంద్రమౌళి పార్వతిదేవితో అక్కడకు రావటం జరిగింది.

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభు కూఁతురు దేవయాని దు
వ్వలువ ధరించి ముందటికి వచ్చినఁ జూచి యెఱిం గెఱింగి నా
వలు విది యెట్లు గట్టుకొనవచ్చును దాసికి నంచు దెప్పుచున్.

516

తా ॥ పరమేశ్వరుని చూసిన ఆ యువతులందరూ సిగ్గుపడి తొందరతొందరగా బట్టలు చుట్టుకుంటున్న తరుణంలో రాకుమార్తె శర్మిష్ఠ, గురువుగారి బిడ్డ దేవయాని బట్టలు ధరించింది. అది చూసిన దేవయాని – 'తెలిసి తెలిసి నా బట్టలు కట్టుకున్నావు! దాసివి, ఇదేం పని!' అని తూలనాడింది.

వ. దేవయాని యిట్లనియె:

517

తా ॥ అంతటితో ఆగక, ఇంకా ఇలా అంది:

శా. ఆ లోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా;
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మిన్నంది రందున్ మహా
శీలుర్ భార్గవు; లందు శుక్రుఁడు సుధీసేవ్యుండు– నే వానికిన్
జూలన్ నా వలువెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా!

518

తా ॥ "ఏయ్! నేనెవర్ని? సాక్షాత్తూ ఆ బ్రహ్మముఖం నుండి గదా బ్రాహ్మణులు జన్మించింది. బ్రాహ్మణ్యం, బ్రహ్మము గలిగిన వారమై, ఏది వైదిక పద్ధతో లోకానికి తెలుపుతూ వచ్చామే! అలా మా కీర్తి ఆకాశాన్నంటిందే! ఆ బ్రాహ్మణుల్లో కూడా పరమపవిత్రులు భార్గవులు. వారిలో జన్మించి, వేత్తలచే సేవింపబడేవాడు గదా శుక్రుడు! ఆయన కడుపుపంటగా జన్మించిన నా బట్టలు, రాక్షసకులంలో జన్మించినదానవు నీవు ధరించటమేమిటి పనికత్తే!

క. మహిమవతులైన భూసుర, మహిళలవిత్తంబులు పెఱమగువల కగునే? మహిఁ బసిఁడి గొలుసు లిడినన్, విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్.

519

తా ॥ మహిమాన్వితులైన బ్రాహ్మణ స్త్రీల వైభవాలు, ఇతర స్త్రీలకు – అవి ఎలా అబ్బుతాయి? బంగారు ఆభరణాలు వేస్తే మాత్రం కుక్కలకు హవిర్భాగాలుంటాయా ఎక్కడైనా!

క. మీ తండ్రి మాకు శిష్యుఁడు, మా తండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి, భూతం జేయుదువె తులువపోఁడిమిఁ జెనఁటీ!

520

తా ॥ మీ అయ్య వృషపర్వుడున్నాడు గదా! ఆయన మా తండ్రికి శిష్యుడు. చేస్తే ఏదైనా మంచిపని చేసి మమ్మల్ని సంతోషపెట్టాల్సింది పోయి, దుర్మార్గురాలా! ఇలా అవమానం చేస్తావా?"

వ. అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని, కరాళించి, మ్రోఁగుచున్న భుజంగి పగిది నిట్టూర్పులు నిగుడించి, పెదవులు గొఱుకుచు, శర్మిష్ఠ యిట్లనియె.

521

తా ॥ అని తూలనాడుతున్న దేవయాని మాట విని, దెబ్బతిన్న నాగుపాము బుసలు కొడుతున్న విధంగా నిట్టూర్పులు విడుస్తూ, పెదవులు కొరుకుతూ శర్మిష్ఠ ఇలా అంది:

శా. భిక్షుండై తమ తండ్రి మా జనకునిన్ భిక్షించి యుండంగ సం
రక్షింపం దుది నింతయై మఱపుతో రాజప్రసూతాకృతిన్
రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిన్
గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే.

522

తా ॥ "అలాగేం! ఎక్కడా దిక్కులేక భిక్షగానివలె మీ అయ్య మా అయ్యను అడుక్కుంటే, మీకింత స్థితి అబ్బింది. అది మరచి, మేలిమి పూవంటి దానిని, సుగుణవతిని, రాచబిడ్డనైన నాతో ఇలా మాట్లాడుతావా! ఇంతకింత అనుభవించేట్లు – నీ డొక్క పగిలి పోయేట్లు – చెలికత్తెలు నిన్ను బావిలో త్రోయకుండా ఉంటారా!"

వ. అని పలికి.

523

తా ॥ అని నిందించి,

ఆ. బోఁటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి, రాజసమున దైత్యరాజతనయ తొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంకి నూతిలోనఁ గుదిలకొనఁగ.

524

తా ॥ చెలికత్తెలతో దేవయానిని పట్టించి, శర్మిష్ఠ మాంచి దిమ్ముతో, బట్టలు కూడా ఇవ్వకుండా నూతిలోకి త్రోయించింది.

వ. ఇట్లు సేసి, శర్మిష్ఠ వోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁటమార్గంబున నడవిం

దిరుగుచు, దైవయోగంబున నా దేవయాని యున్న నుయ్యి చేరం జనుదెంచి యందు.

525

తా ॥ అలా చేసి శర్మిష్ఠ చెలికత్తెలతో రాచనగరుకు వెళ్ళిపోయింది. ఆ పిదప, యయాతి అడవిలో వేటాడుతూ, దైవవశాత్తూ దేవయాని ఉన్న నూతి దగ్గరకు వచ్చాడు.

క. బంధువుల నెల్లఁ జీరుచు, నందు జలామగ్న నగ్నయై వగచుచు ని
ర్బంధమునఁ జిక్కి వ్రీడా, సింధువున మునింగియున్న చేడియఁ గనియెన్.

526

తా ॥ వచ్చి, బంధువులను పేర్లుపెట్టి పిలుస్తూ నీళ్ళులేని ఆ నూయి మధ్య బట్టలు లేక దుఃఖీస్తున్న దేవయానిని చూశాడు.

## దేవయాని యయాతిని వరించుట

వ. కనుంగొని.

527

తా ॥ చూసి,

శా. సప్తాంభోనిధి మేఖలావృత మహా సర్వంసహా కన్యకా
ప్రాప్తోద్యద్వరదక్ష దక్షిణకరప్రాలంబముం జేసి ప్రో
క్షిప్తం జేసె యయాతి కట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్త స్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిన్ భార్గవిన్.

528

తా ॥ సప్తసముద్రాలకు నడికట్టు వలె వ్యాపించి ఉన్న సర్వభూమండలమనే కన్యకను శాసిస్తున్న తన కుడిచేతిని ఆలంబనం చేసి, తన పై పంచెను కట్టుకోవడానికిచ్చి, భయాందోళనలతో చెమటతో తడిసిపోయి అల్లిబిల్లిగా అల్లుకున్న తామర తూడులతో, తన కూర్మి నెచ్చెలులకు సర్వస్వాన్నీ ఇవ్వగల కామధేనువును పోలిన భృగువంశ జాత భార్గవి దేవయానిని – నూతి నుండి పైకి లాగాడు.

వ. ఇట్లు నుయ్యి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె.

529

తా ॥ అలా నూయి నుండి బయటకు తీసిన ఆ రాజుతో ఆ చంద్రవదన ఇలా అంది:

మ. ననుఁ బాణిగ్రహణంబు చేసితి గదా నా భర్తవు న్నీవ దై
వ నియోగం బిది పౌరుషంబునకు నా వాక్యంబు సిద్ధంబు సౌ

ఖ్య నివాసు న్నిను మాని యొండు వరునిం గాంక్షింప నే నేర్తునే!
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే?

530

తా ॥ "నా చేయిపట్టావు కదా! కనుక నీవే నా భర్తవు. ఇది దైవసంకల్పం. తప్పదు. ఈ మాట నిజం. సౌఖ్యాలన్నింటికీ మూలమైన నిన్ను వదలి నేను వేరొకనిని ఎలా వరిస్తాను గనుక? పద్మాన్ని చేరే తేటి, ఇతర పుష్పాల ఆశ్రయాన్ని కోరదు గదా!

వ. అదియునుంగాక.

531

తా ॥ అదీ గాక,

సీ. సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర దేవయానిని దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించు వేల
నతనిఁ గామించిన నతఁడొల్ల ననవుడు నతఁడు నేర్చిన విద్య యణఁగి పోవ
నతని శపించిన నతఁడు నా భర్త బ్రాహ్మణుఁడు గాకుండెడు నని శపించె

తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు, ప్రాణనాథుఁడ వీ వని పడఁతి వలుకఁ దనదు హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ, దమక మొక యింతయును లేక తలఁచి చూచి,

532

తా ॥ సుగుణశ్రేష్ఠా! నేను శుక్రుని కుమార్తెను. దేవయాని అంటారు నన్ను. మునుపు దేవతల గురువు బృహస్పతి కుమారుడు కచుడు మా అయ్య వద్ద మృతసంజీవనీ విద్యను అభ్యసించడానికి వచ్చాడు. అప్పుడు అతన్ని నేను కాంక్షించాను. అయితే అతడు దానికి

అంగీకరించలేదు. అంతట నేను, 'నా తండ్రి దగ్గర నేర్చిన విద్య నీయందు పనిచేయకుండు గాక!' అని శపించగా అతడు, నన్ను బ్రాహ్మణుడు వివాహమాడకుండు గాక! అని ప్రతిశాప మిచ్చాడు. కనుక ఆ కారణంగా నాకు బ్రాహ్మణుడు భర్త కాబోడు. నీవే నా ప్రాణనాథుడవు!" అని ఆమె చెప్పగా, అతడు ఆమెపై మనస్సుపడి, కాముక సంబంధమైన తొందర ఏమీ లేక, ఇలా ఆలోచించాడు:

మత్త. దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నా మనం
బే విధంబు నీశ్వరాజ్ఞయు నిట్టిదంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో
భావ మొక్కటియే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్.

533

తా ॥ 'ఇది దైవఘటన కాకపోతే, నా మనస్సు బ్రాహ్మణ కన్య పైకి పోవటమేమిటి? ఎలాగైనా ఇది ఈశ్వరాజ్ఞే!' అని భావించి, యయాతి ఆమెను వరించాడు. అవును! కాని సంగతి త్రోసుకొచ్చినప్పుడు తగనిదేదో, తగినదేమిటో నిశ్చయించాలంటే తమ ఆత్మప్రమాణాన్ని పాటించటమే ధీమంతుల లక్షణం కదా!

వ. ఇట్లు వరించి, యయాతి చనిన వెనుక దేవయాని శుక్రుని కడకుం జని, శర్మిష్ఠ చెప్పిన వృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన.

534

తా ॥ అలా ఆమెను వరించి, యయాతి వెళ్ళిపోయాడు. కొంతసేపటికి దేవయాని తండ్రి శుక్రుని వద్దకు వెళ్ళి, శర్మిష్ఠ చేసిన దానిని చెప్పి, కన్నీరు మున్నీరుగా రోదించింది.

క. క్రూరాత్ముల మందిరములఁ, బౌరోహిత్యముల కుంట పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్.

535

తా ॥ అది విన్న శుక్రుడు, 'క్రూరాత్ముల ఇంట పౌరోహిత్యం చేయటం కంటే పాపం మరొకటి లేదంటే లేదు. ఈ తగులాటం కంటే, పావురాలవలె దొరకిన దానిని తినటం మేలు సుమా.'

వ. అని వృషపర్వుని కడ నుండుట నిందించుచు, శుక్రుం డాకూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన, నయ్యసురవల్లభుం డెఱింగి, శుక్రునివలన దేవతల గెలువఁ దలఁచి తెరువున కడ్డంబు వచ్చి, పాదంబులపైఁ బడి ప్రసన్నుఁ జేసిన, నా కోపంబు మాని శుక్రుండు శిష్యున కిట్లనియె.

536

తా ॥ అని అనుకుంటూ, వృషపర్వుని కొలువులో ఉండటం హీనంగా భావించి, కుమార్తెను వెంట బెట్టుకుని రాజధానిని విడిచి వెళ్ళిపోయాడు. తాను శుక్రుని దయవలన దేవతల్ని జయించాలనే ఆలోచనలో ఉన్న వృషపర్వుడు ఇదంతా తెలుసుకొని, ఆయన త్రోవకు అడ్డంవెళ్ళి, కాళ్ళపై పడి ప్రార్థించి, ఏదో విధంగా ఆయనను ప్రసన్నుని చేసుకున్నాడు. శుక్రుడు కూడా కోపాన్ని విడిచి, శిష్యుడైన వృషపర్వునితో ఇలా అన్నాడు:

తరలము.

చెలులు వేవురుఁ దాను నీ సుత చేటికైవడి నాసుతం
గొలుచు చుండినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు కూఁతు నెచ్చెలిపిండుతోన్.

537

తా ॥ 'తన చెలికత్తెలు వేయిమందితో నీ కూతురు శర్మిష్ఠ నా కుమార్తెకు చెలికత్తెగా ఉంటే తప్ప మా అమ్మాయి కోపం తీరేది కాదు. అలా చేయడానికి నీవు అంగీకరిస్తే, మా అమ్మాయితో వస్తాను!' అనగా, అలాగేనని వృషపర్వుడు చెలికత్తెలతో సహా తన కూతుర్ని దేవయానికి చెలికత్తెను చేశాడు.

మ. చల మింకేలని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నజస్రంబుఁ ద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్ భూరికోపానలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమ స్థానికిన్.

538

తా ॥ తండ్రి అలా చెప్పినప్పుడు, దేవయానితో తనకు గల విరోధ విషయమై ఇక తాను మంకుపట్టు పట్టడం మంచిది కాదని భావించి శర్మిష్ఠ తాను తన వేయిమంది చెలికత్తెలతో, బ్రాహ్మణ కన్యనన్న అహంకారంతో తనపై పగపూనిన దేవయానిలో పూర్వపు కోపం, పగ, పోయేట్లుగా సేవలు చేస్తూ వచ్చింది.

వ. అంత.

539

తా ॥ అంతట,

ఉ. ఆతతమైన వేడ్క దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిన్
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధు వినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుష్కలహకార్యభియాతికి నయ్యయాతికిన్.

540

తా ॥ శుక్రమహర్షి వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠతో కలిసివున్న కుమార్తె దేవయానిని, శత్రువులకు ఎంత మాత్రం వెరవనివాడు, సాధుగుణాల్లో మిన్నయైనవాడు, నిష్కళంక కీర్తిశాలి, శుభకార్య నిర్వహణంలో ఆసక్తి చూపేవాడు అయిన యయాతి మహారాజుకు ఇచ్చి, వేడుక మీర అత్యంత వైభవంగా వివాహం గావించాడు.

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకు మని నియమించి చనియె. పిదప న ద్దేవయానియు, న య్యయాతివలన యదు తుర్వసులను కుమారులం గనియె, ఒక్కరేయి సెఱంగు మాసి, దేవయాని వెలుపలనున్న యెడ శర్మిష్ఠ యెదరు వేచి, యేకాంతంబున యయాతి కడకుం జని, చెఱకువింటి జోదుపువ్వుటంపర కోహటించి, తన తలంపు సెప్పిన.

541

తా ॥ అలా కుమార్తెనిచ్చి పెండ్లి చేసి, ఆమెను యయాతితో పంపే వేళ, అప్పగింతలు పెడుతూ, 'శర్మిష్ఠతో సంగమం కూడదు సుమా!' అని హెచ్చరించి పంపాడు. కాలక్రమంలో దేవయానికి యదువు, తుర్వసుడు అనే కుమారులు కలిగారు. ఒకనాడు దేవయానికి చెరగుమాసిన (ఇంటి వెలుపలికి) వేళ, సమయం కొరకు వేచియున్న శర్మిష్ఠ మదనతాపపీడితయై ఒంటరిగా ఉన్న యయాతిని చేరి, తన అభీష్టాన్ని వెలిబుచ్చింది.

## శుక్రాచార్యులు యయాతిని శపించుట

ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపఁలేక మనోభవార్తుఁడై
యా జనభర్త మున్ను కవియాడిన మాట దలంచి యైనఁ జే
తోజ సుఖంబులం దనిపెఁ, ద్రోవఁగ వచ్చునె దైవ యోగముల్
రా జఁట సద్రహస్య మఁట రాజకుమారిని మాన నేర్చునే?

542

తా ॥ ఆమెను చూసిన యయాతి కూడా మన్మథపీడితుడై మనస్సును కట్టడి చేయలేక, శుక్రుడు చేసిన కట్టడి గుర్తుకొచ్చినా, దానిని ఆవలబెట్టి ఆమెను రతిపారవశ్యంలో ఓలలాడేట్లు చేశాడు. అవును మరి! దైవయోగాన్ని తప్పించటం ఎవడి వలన మాత్రం అవుతుంది గనుక! ఆయనేమో రాజు! అబ్బిన అవకాశమేమో అత్యంత రహస్యంగా! మరి ఆ రాకుమార్తెను ఆయన ఎలా నిరాకరిస్తాడేం?

వ. ఇట్లు యయాతి వలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండును, ననువును, పూరువును ననువారి మువ్వురి తనయులం గాంచె. అంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి, కోపించి, శుక్రుని కడకుం జని క్రోధమూర్ఛితయై యున్న సమయమున యయాతి వెంటం జని, యిట్లనియె.

543

తా ॥ అలా శర్మిష్ఠ యయాతి వలన గర్భవతియై క్రమంగా ద్రుహ్యువు, అనువు, పూరువు అనే ముగ్గురు కుమారులకు జన్మనిచ్చింది. ఎలాగైతేనేం, ఇదంతా దేవయానికి తెలిసింది. పట్టరాని కోపంతో తండ్రి దగ్గరకు వెళ్ళింది. కోపంతో ఆమె ఒళ్ళూ పై తెలియకుండా ఉంది. ఆ క్షణాన యయాతి కూడా ఆమె వెనుకనే వెళ్ళాడు.

ఆ. మామకేల చెప్ప మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పువడితిఁ గామినైన నన్నుఁ గరుణింపు పతిమాట, తండ్రిమాటకంటెఁ దగును నీకు.

544

తా ॥ వెళ్ళి ఆమెతో అనునయంగా, 'ఇదిగో, పద్మనేత్రీ! మామగారితో చెప్పడం దేనికి? శర్మిష్ఠతో తగులాటం పెట్టుకోవటం – తప్పయిపోయిందంటున్నాను గదా! బుద్ధి తక్కువ. నా కామాసక్తి ఇంత పని చేసింది. తప్పే! కాదనటం లేదుగా! నా మాట వినాలి మరి. పుణ్యసతులు తండ్రి మాట కంటే భర్త మాటకు విలువిస్తారు. ఇది నీకు నేనుగా చెప్పాల్సిన విషయమా! కాదు గదా!'

వ. అని పలికి పాదంబుల కెఱఁగిన న య్యింతి యొడంబడక యుండె; నంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె.

545

తా ॥ అని బుజ్జగిస్తూ ఆమె పాదాలపై పడి నమస్కరించాడు. అయినా ఆమె ఏమీ మెత్తబడలేదు. ఈలోగా ఈ సంగతంతా శుక్రునికి తెలియనే తెలిసింది. తెలిసి ఆయన అన్నాడు గదా!

క. నా మాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి ధరణి పాలక! తగవే? యేమాట యేది రూపము, కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్?

546

తా ॥ 'ఏమయ్యా! నా మాట పెడచెవిన బెట్టి దానవకాంతను కూడుతావా? ఇదేమైనా ధర్మంగా ఉందా? చెప్పిన మాటేమైంది? దానికి ఇదటయ్యా నీవు చేసే పని. అవునులే! నిన్ననాల్సిన పనేముంది. కాముకులకు, గులాములకు మాట నిలుకడలెలా ఉంటాయి గనుక?'

వ. అని పలికి, నీవు వనితాజన హేయంబైన ముదిమిం బొందెదవు అని శపియించిన, యయాతి యిట్లనియె.

547

తా ॥ అలా అని 'తరుణులు రోతగించుకునే ముదిమి నిన్ను ఆవహించును గాక!' అని శపించాడు. అప్పుడు యయాతి ఇలా అన్నాడు:

క. మామా! నాపైఁ గోపము, మామా; నీ పుత్రి యందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు, ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపన్ దాల్తున్.

548

తా ॥ 'మామగారూ! నాపై కోపం వద్దు గాక వద్దు. ఏమంటారా? నీ కుమార్తెపై నాకు ఇంకా మోజు తీరలేదు. అది తీరిన తరువాత మీరు చెప్పినట్లే ముదిమిని పొందుతాను.'

వ. అని పలికి యనుజ్ఞ గొని, దేవయానిం దోడ్కొని పురంబునకుఁ జని పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్లనియె.

549

తా ॥ అని ఆయనకు నచ్చజెప్పి, ఆయన అనుమతిని పొంది, దేవయానితో యయాతి రాజధానికి మరలి వచ్చాడు. వచ్చి, పెద్ద కొడుకు యదువును తన సమక్షానికి పిలిపించుకొని ఇలా అన్నాడు:

శా. నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁడీ జరం బొందితిన్; నాతండ్రి! యదునామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే నీ తారుణ్యము నాకు నిమ్ము తనివో నిండారఁ గొన్నేండ్లు నేఁ
జేతోజాత సుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా!

550

తా ॥ 'నాయనా! యదూ! మీ అమ్మను గన్న తండ్రి – అదేనయ్యా! నీ మాతామహుని వలన నాకు ఈ వృద్ధాప్యం సంప్రాప్తించింది. నా ఈ ముసలితనాన్ని గ్రహించి, నీ యౌవనాన్ని నాకివ్వవూ? నా బంగారు తండ్రివి కదూ? నా నాయనవు కదూ! అలాగైతే, తనివి తీరేట్లుగా కొన్నాళ్ళు మనస్సు మురిపెం తీర్చుకుంటానయ్యా!'

వ. అనిన తండ్రికి యదు విట్లనియె.

551

తా ॥ అలా అన్న తండ్రి మాటలు విన్న యదువు ఇలా అన్నాడు:

శా. కాంతాహేయము దుర్వికారము దురాకండూతి మిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదవ్రణాకంపన
శ్రాంతిస్ఫోటక యుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానా సుఖో
పాంతం బైన వయోనిధాన మిది యయ్యా! తేర యీవచ్చునే?

552

తా ॥ 'ముదిమిని వచ్చే శరీర వికారాన్ని యువతులు అసహ్యించుకుంటారే! ఎక్కడపడితే అక్కడ – శరీరమంతా దురదలు వస్తాయే! మనస్సు ఒక తీరున ఉండదు! రొంపా, జలుబు, చెమటకాయలు, గోకితే పుండ్లు, కురుపులవుతాయి. అన్ని సుఖాలు పొందడానికీ ఆస్కారమైన యౌవనాన్ని తేరగా ఇచ్చి ఎవడైనా ముసలితనాన్ని కోరితెచ్చుకుంటాడా! ఏం మాటలివి తండ్రీ' అన్నాడు.

వ. అని యదుం డొడంబడకున్న యయాతి తుర్వసు ద్రుహ్యాదుల నడిగిన వారును యదువు పలికినట్లు పలికినఁ గడగొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె.

553

తా ॥ అలా యదువు నిరాకరించటంతో యయాతి తుర్వసుని, ద్రుహ్యుని ఇతర కుమారులను అడిగి, కాదనిపించుకుని, చివరికి కడసారి కానుపైన పూరుని పిలిచి ఇలా అన్నాడు:

ఉ. 'పిన్నవుగాని నీవు కడుఁ బెద్దవు బుద్ధుల యందు రమ్ము నా
యన్న! మదాజ్ఞ దాఁటవు గదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న! నా జరన్
మన్ననఁ దాల్చి నీ తరుణిమం బొనఁగూర్పుము నాకుఁ బుత్త్రకా!'

554

తా ॥ "తండ్రీ! నీవు వయసుకు పిన్నవాడివే కాని, నీ బుద్ధి బహుదొడ్డది. నాకు తెలుసుగా! నీవు నా మాట కాదనవు. నీతిమంతుడివి. నీవు కూడా నీ అన్నలు చెప్పినట్లు చెప్పక, నీ యౌవనాన్ని నా కిచ్చి, నా ముసలితనాన్ని పొందుతావు గదూ! నా తండ్రీ!" అన్నాడు.

వ. అనిన విని, గురుభక్తి గుణాధారుండైన పూరుం డిట్లనియె.

555

తా ॥ తండ్రి అలా అనగా, తల్లిదండ్రుల యెడల, పెద్దల యెడ మన్నన గల సుగుణశాలి పూరుడు ఇలా అన్నాడు:

శా. అయ్యా! నన్నిటు వేఁడనేల? భవదీయాజ్ఞా సముల్లంఘనం
బయ్యుండన్ బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీ జర
న్నెయ్యం బొప్పఁగఁ దాల్చి నా తరుణిమ న్నీ కిచ్చెదన్ బంపినన్
గయ్యం బాడెడి పుత్త్రకుండు క్రిమిసంకాశుండుఁ గాకుండునే?

556

తా ॥ "తండ్రీ! మీరు నన్నిలా అడగడం ఏమీ బాగా లేదు. మీ మాటను పాటించకపోతే గదా మీరలా అనాలి. మీ మాటకు ఎదురాడటానికి నేనంత పాపాత్ముడినా! మీ వృద్ధాప్యాన్ని సంతోషంగా భరించి, నా యౌవనాన్ని మీకు ఇస్తాను గాక! తండ్రి ఒక మాట చెపితే, దానిని కాదన్నవాడికి పుట్టగతులుంటాయా! పురుగులు పడి చావడూ!

వ. అదియునుం గాక.

557

తా ॥ అదీ గాక,

క. మునివృత్తి డయ్య నేటికి, జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకున్
దనుఁ గన్న తండ్రి సెప్పిన, పనిచేసిన సుగతి గొంగుపసిఁడియె కాదే!

558

తా ॥ మహారాజా! పుణ్యగతులను కోరుకునే సత్పురుషులు కోరి మునివృత్తిని అవలంబించాల్సిన పనేముంది? తండ్రి చెప్పిన దానిని ఆచరిస్తే చాలదా! అలా ఆచరించిన వారికి పుణ్యగతి అనేది వారు కొంగున కట్టుకున్న బంగారమే కదా!

కొంగు పసిడి : కొంగున కట్టిన బంగారం. అవసరమైనప్పుడు ఎవరినీ అడుగవలసిన అవసరం లేకుండా ఆ క్షణాన అక్కరకు వచ్చే సొమ్ము అనే అర్థంలో స్థిరపడింది.

క. పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు పొందుపఱుతురు తండ్రుల్ పనిచెప్పి
కోరి పనిచిన, ననిశము మాఱాడు పుత్త్ర లధములు తండ్రీ!

559

తా ॥ నిజానికి ఉత్తములైనవారు, తండ్రి మనసెరిగి, ఆయన చెప్పకుండానే ఆయన అభీష్టాన్ని నెరవేరుస్తారు. చెపితే నిర్వర్తించేవారు మధ్యములు. తండ్రి నోరు తెరిచి అడిగినా,

చేయక ఎదురు చెప్పేవారు అధములు గదా తండ్రీ!"

వ. అని పలికి, పూరుండు ముదిమి చేకొని, తన లేఁత ప్రాయంబు యయాతి కిచ్చె, అ య్యయాతియుం దరుణుండై,

560

తా ॥ అని చెప్పి పూరుడు తండ్రి ముదిమిని పొంది, తన యౌవనాన్ని తండ్రికి ఇచ్చాడు. అంతట యయాతి యువకుడైనాడు.

శా. ఏడున్ దీవులు నేడు వాడలుగ సర్వేలాతలం బెల్లఁ బెన్
వీడై లోనుగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షింపుచున్
దోడం భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచున్
గ్రీడించె న్నియతేంద్రియుం డగుచు నాక్రీడా విశేషంబులన్.

561

తా ॥ అలా యౌవనాన్ని పొంది యయాతి, ఏడు ద్వీపాలతో కూడిన ఈ ప్రపంచాన్నంతటినీ ఏడు వీథులుగా చేసి ధర్మసమ్మతంగా పరిపాలించాడు. ప్రజల్ని, ఎక్కడెక్కడున్నవారినీ కన్నబిడ్డలవలె సాకాడు. దేవయానితో ఇష్టభోగాలను, ఆనందాతిరేకంతో నియమబద్ధంగా అనుభవించాడు.

క. మర్మంబుల నతిసాధ్వీ, ధర్మంబుల దేవయాని తన ప్రాణేశున్ నర్మముల మనోవాక్తను, కర్మంబుల నొండు లేక కడు మెప్పించెన్.

562

తా ॥ దేవయాని కూడా సతీ ధర్మాలతో త్రికరణశుద్ధిగా తన భర్తను సేవించి, మనోజ క్రీడల్లో తన ప్రాణనాయకుని ఆనందింపజేసింది.

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్న మై దీర్ఘమై
యేకంబై బహురూపమై యణఁగు నట్లేదేవు గర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నా
దేవు సు శ్రీకాంతున్ హరిఁ గూర్చి యాగములు సేసె న్నాహుషుం డిమ్ములన్.

563

తా ॥ వినువీథిలో మేఘాలు ఒకప్పుడు పెద్దవిగా, మరొకప్పుడు పీలగా, కడు పొడవుగా ఉంటాయి. మరొకప్పుడు అంతా ఒకటే అయి కానవస్తుంది. అనేక రూపాలు పొంది అంతలో మటుమాయమై పోతుంది. అలాగే ఆ శ్రీమహావిష్ణువు గర్భంలో లోకాలు పుడతాయి, ఉంటాయి, అంతలో మాయమై పోతాయి. ఇదంతా ఆయన లీలావినోదం. అలాంటి లీలావినోదుడైన ఆ శ్రీహరిని గూర్చి, ఆ నహుషుని కుమారుడు యయాతి, కోరి అనేక యాగాలు చేశాడు.

వ. మఱియు.

564

తా ॥ అంతే కాదు,

మ. చెలికాండ్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁ గన్న ధనాళితో సమములంగాఁ జూచుచున్, భార్యతోఁ
బలు వేలేండ్లు మనోజభోగ లహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్.

565

తా ॥ స్నేహితులు, ఏనుగుల గమి, రథాలు, సైన్యం, గుఱ్ఱాలు – వీటినీ, కలలో కన్న ధనాన్నీ ఒక్క రూపుగా భావించి, భార్యతో పదివేల సంవత్సరాలు మన్మథ సుఖ భోగ పర్యాప్తుడై తేలియాడినా, తన తృష్ణకు ఒక అంతూ దరీ కానక ఇంద్రియసుఖాలనే బంధాల్లో

చిక్కుకుపోయాడు.

వ. ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయాని కిట్లనియె.

566

తా ॥ అలా ఉంటూవుండగా, ఒకనాడు తనలో తాను చింతించి, తెలివిడి పొంది, స్త్రీ నిమిత్తమై మోసపోవటాన్ని గుర్తెరిగి, ఎంతో విచారానికి లోనై యయాతి, భార్య దేవయానితో ఇలా అన్నాడు:

కామినీకాంచన మోహం మనస్సు నుండి నిర్మూలమై నప్పుడు మిగిలేదేమిటి? కేవలం బ్రహ్మానందం.

—శ్రీరామకృష్ణ పరమహంస

## యయాతి దేవయానికి బస్తోపాఖ్యానమనే నెపంతో స్వవృత్తాంతము తెలుపుట

క. 'మనచారిత్రము వంటిది, విను మితిహాసంబు గలదు; వృద్ధజనములన్ మునులును మెత్తురు; నీవును, మనమున నంగీకరింపు మంజులవాణీ!

567

తా ॥ "దేవీ! దేవయానీ! అచ్చంగా మన చరిత్ర వంటిదే, జరిగిన వృత్తాంతం ఒకటి చెపుతాను. వృద్ధులూ మునులూ కూడా దానిని ఎంతో ఇష్టంతో చెప్పుకుంటూ ఉంటారు. నీవు కూడా బాగా విను.

వ. అది యెట్టి దనిన.

568

తా ॥ అదేమిటంటే,

సీ. అజమొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మ ఫలమున నూతిలోపలికి జాఱి
లోఁగెడి ఛాగి నాలోకించి కామియై కొమ్మున దరిఁ గొంత గూలఁ ద్రోచి
వెడలింప నచ్ఛాగి విభునిగాఁ గోరిన నగుఁగాక యని తాను నదియుఁ దిరుగ
నెన్నియేనియుఁ దన్ను నెంత కామించిన నన్నింటికిని భర్తయై తనర్చి

తే. వాని నే ప్రొద్దు రతులకు వశలఁ జేసి, సొరిదిఁ గ్రీడించి క్రీడించి చొక్కి చొక్కి కాముఁ డనియెడు దుస్సహాగ్రహముకతనఁ, జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁ జిక్కె.

569

తా ॥ అడవిలో ఒక ఆడమేక తిరుగాడుతూ, దాని అదృష్టం చాలక ఒక నూతిలో పడింది. అలా వెళ్ళుతున్న ఒక మేకపోతు దానిని చూసి కామించి, తన కొమ్ములతో ఆ నూతి ఒడ్డును

కొంత పడగొట్టి, ఎలాగైతేనేం ఆ పెంటి మేక సులభంగా బయటపడేటట్లు చేసింది. అది పైకి వచ్చి మేకపోతును భర్తగా కోరింది. అలాగేనంటూ అంగీకరించింది పోతు. అలా ఆ రెండూ కలిసి ఉంటున్నాయి. అలా ఉండగా ఎన్నో ఆడమేకలు పోతును కలిశాయి. వాటి అన్నింటితోనూ అది క్రీడించ సాగింది. అలా ఎన్నింటితో, ఎంతగా క్రీడించినా, కాముడనే దయ్యం పట్టినట్లు దానికి తనివి తీరనే లేదు.

క. వెడవింటివాని చిగురా, కడిదపు వ్రేటునకు లొంగి యతిమోహితుఁడై విడువక సతులం దగిలెడు, జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్?

570

తా ॥ చెరకు విలుకాని చిగురాకుల బాణాల దెబ్బలకు చిక్కి, వాటికి లొంగిపోయి, భార్యలను అంటిపెట్టుకుని తిరిగే మూర్ఖునికి బుద్ధిచాతుర్యాలు ఎక్కడనుండి వస్తాయి గనుక!

వ. అంత న చ్ఛాగంబు తన పిదపం దగిలిన ఛాగీనివహంబు లోపలం జూడ నొప్పెడి ఛాగియందుఁదగిలి, క్రీడింపం గని, నూతిలోపలం బడి వెలువడిన ఛాగి, తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున.

571

తా ॥ అలా ఆ మేకపోతు తన తరువాత అబ్బిన మేకల గుంపులో ఒక అందమైన మేకతో క్రీడిస్తుండగా మొదట నూతిలోనుండి వెలువడిన మేక చూసి, భర్త తనని ఆదరించకపోవడంతో, మనస్సులో ఇలా అనుకుంది:

క. పలికిన పలుకులు పలుకఁడు, కలఁచు న్నవకాంతఁ జూచి కదు సంచలుఁడై నిలిచిన చోట న్నిలుఁవడు, నిలు వెల్లను గల్ల కామి నిజమరి గలఁడే.

572

తా ॥ "కోరి మాట్లాడించినా మాట్లాడటం లేదు. ఒకవేళ ఎప్పుడైనా కలిసినా, మనస్సులోకి మరో క్రొత్త మేక వస్తే వెళ్ళిపోతాడు. నిలచిన చోట కాలు నిలవటం లేదు గదా! ఆయన నిలువెల్లా మోసమే. అవును మరి, కామియైన వాడికి నిలుకడ ఎలా ఉంటుంది. తన్ను తానే మరిచిపోతాడు గదా!"

వ. అని పలికి, విడిచి చనిన, న య్యజవల్లభుండు సురతపరతంత్రుఁడై, మిసిమిసియను శబ్దంబు సేయుచు, న చ్ఛాగి వెంటం జని, యొడంబఱుపం జాలకుండె, అంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచున్న ఛాగవృషణంబులు త్రెంచివేసిన, న చ్ఛాగంబు గ్రిందఁ బడి, వేఁడుకొనిన, బ్రయోజనంబు వొడగని, యోగవిదుండు గావున, బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ న య్యజవృషణంబులు సంధించిన.

573

తా ॥ అనుకొని, పోతును విడిచి దూరంగా పోయింది ఆడమేక. అంతట మేకపోతు కామాతిశయానికి లోనై మిసిమిసి అంటూ శబ్దంచేస్తూ ఆ ఆడమేక వెంట వెళ్ళింది. కాని దానిని సురతక్రీడకు సుముఖం చేసుకోలేకపోయింది. అప్పుడు దాని యజమానియైన బ్రాహ్మణుడు, అది రతి సమర్థకం కాకపోవడంతో కోపించి, దాని వృషణాలను కోసివేశాడు. అంతట అది నేలపడి దొర్లాడుతూ ఆయనను వాటి కొరకు ప్రార్థించింది. ఆ బ్రాహ్మణుడు యోగజ్ఞానం కలవాడు గనుక ఉపయోగం ఉంటుందని భావించి, తిరిగి వృషణాలను దానికి కూర్చాడు.

క. వృషణములు మరలఁ గలిగిన, సుషముండై ఛాగివిభుఁడు సుందరితోడన్
విషయసుఖంబులఁ బొందుచుఁ, దృష తుదిఁ గనఁ డయ్యె బెక్కు దివసము లయ్యున్.

574

తా ॥ అలా తిరిగి వృషణాలను పొంది, మనోజ్ఞమైన రూపంతో తన ఆడ మేకతో

విషయసుఖాలు పొందుతూ, ఎంతకూ ఆ విషయంలో ఒక పరితృప్తినంటూ పొందలేదు.”

వ. అని యీ విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యిట్లనియె.

575

తా ॥ అని, యయాతి ఆ విధంగా తన వృత్తాంతాన్నే కథగా మలిచి చెప్పి, ఇలా అన్నాడు:

మ. అబలా! నీ నిబిడాతి దుర్జయ సలజ్జాపాంగభల్లంబులం
బ్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుండగు కాముఁబారిఁ బడి నే నెట్లోర్చెదన్ బంది క
త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పుడకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్.

576

తా ॥ “దేవయానీ! నీ చిక్కని, చూపు తిప్పుకోవడానికి వీల్లేని నీ వాలుచూపులనే బాణాలు నా ప్రాణాల్ని తోడేస్తుంటే, నాకు గల శక్తి యుక్తులనన్నింటినీ కోల్పోయి, అతి బలవంతుడైన మన్మథుని బారినుండి తప్పుకోవడమెలాగ? నీ చెరలో బందీనైపోయి, జరిగినదానికి ఇప్పుడు దిగులుపడుతున్నాను.

క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు సర్వాంగకములు గదలుచు నున్నన్ వదలదు బిగువులు వదలినఁ, దుదిలే దీ తృష్ణ దీనిఁ ద్రుంపగా వలయున్.

577

తా ॥ ఒక బెదురంటూ లేదు! ప్రాణాలు అదురుతున్నా కదలదు. సర్వావయవాలు సడలి, పట్టుదప్పి పోతున్నా బింకం వదలదు. అది వదలినా ఈ మాయదారిది, ఎంతకూ తనివి తీరనిది, ఈ తృష్ణ. దీనికి ఓ అంతంటూ లేదు. ఏమైనా సరే! దీనిని వదలించుకోక తప్పదు.

క. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ గామసుఖములం గ్రుయ్య దొక యించుకైనన్, డయ్యదు కొన లిడియెఁ దృష్ణ నవపద్మముఖీ!

578

తా ॥ నీతో ఈ రొంపిలో దిగబడి పడి వెయ్యేళ్ళు దాటింది. అయితేనేమి? కామ సుఖాసక్తి తగ్గింది కాదు. అలిసిపోయిందీ లేదు. లేకపోగా, తృష్ణ ఎప్పటికప్పుడు క్రొత్తగా అనలూ కొనలూ వేస్తోంది గదా పద్మముఖీ!

క. ముదిసెను దంతావళియును, ముదిసెను కేశములుఁ దనువు ముదిసెం దనకున్ ముదియనివి రెండు చిక్కెను, బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్.

579

తా ॥ దంతాలు ముదిరాయి. తలవెంట్రుకలూ బిరుసెక్కాయి. శరీరమూ ముదిసింది. అయితే ముదిమి అంటూ రానివి రెండే. అవి, బ్రతుకు మీద కాంక్ష! విషయసుఖాల మీద ఆసక్తీ!

క. కడ లే దాశాలతకును, గడఁజూడఁగఁ గానరాదు కడఁ గనిరేనిన్ గడుముదమున సంసారము, గడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ!

580

తా ॥ ఆశావల్లికకు అంతులేదు. కమలనేత్రీ! దరి కానరాదు. ఒక్కసారి దాని పొడగన్నారో – తత్త్వవేత్తలు, ఇక సంసార బంధపు అంతుచూస్తారు.

క. మండన హాటక పశు వే, దండాశ్వ వధూ దుకూల ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము, ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ.

581

తా ॥ నగలు, బంగారం, పాడిగొడ్లు, ఏనుగులు, గుఱ్ఱాలు, సతులు, మేలైన వస్త్రాలు,

ధనధాన్యాలు ఎంత ఎక్కువగా ఉన్నా అవి ఆశాపాశాన్ని ఖండించలేవు. ఇంకా, ఇంకా కావాలనే అనిపిస్తుంది.

క. కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవింపుచు నున్నం గామంబు శాంతిఁ బొందదు, ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడు వడునే?

582

తా ॥ కామసుఖాలు ఎన్నిసార్లు అనుభవించనీ గాక, పురుషుడు తృప్తిపొందటమనేది కల్ల. నెయ్యి పోస్తూ ఉంటే అగ్ని చల్లారుతుందా? ఇదీ అంతే.

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన, పాను పెక్కఁ జనదు పద్మనయన! పరమయోగికైన బలిమిని నింద్రియ, గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు.

583

తా ॥ పద్మనయనా! ఇంద్రియాలు, పరమ యోగిని సైతం పట్టి పీడించక మానవు. అక్క, చెల్లి, కడకు కన్న కూతురైనా సరే – వాళ్ళు పడుకొని ఉన్న శయ్యమీద కూర్చొనరాదు.

కామినీ కాంచనాలు లోకాన్నంతా సంసారసాగరంలో, పాపపంకిలంలో ముంచి వేసేవే సుమా! స్త్రీని నువ్వు సాక్షాత్తు జగజ్జనని అనే భావంతో చూస్తే ఆమె వల్ల నీకెలాంటి ప్రమాదం ఉండదు. కామకాంచన మోహాగ్ని చల్లారితే గాని భగవద్దర్శనం కాబోదు.

—శ్రీరామకృష్ణ పరమహంస

క. వెంగలివిత్తై తిరుగక, కంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం డంగనలతోడ విడువని, సంగడముల వదలవలయు జలజాతముఖీ!

584

తా ॥ ఒక గమ్యమంటూ లేక, కంపన బద్ద కాకిలాగా తిరుగుతూ, బుద్ధిపటుత్వాన్ని కోల్పోక మోక్షాన్ని కోరేవాడు, స్త్రీల తోటి సాంగత్యాన్ని, ఇతర బంధాలను విడువక తప్పదు కమలముఖీ!

వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండనై, యహంకారంబు విడిచి, మృగంబులం గలసి, వనంబున సంచరించెద. పరబ్రహ్మంబునందుఁ జిత్తంబుఁ జేర్చెద, బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి యే నందుఁ దత్పరుండనై, యాహారనిద్రాది యోగంబులం బరిహరించెద. ఆత్మ విదుండై, సంసార నాశంబుఁ దలంచిన వాఁడె విద్వాంసుండని తలంచి పలికి, పూరుని యౌవనం బతని కిచ్చి, ముదిమి తాను గైకొని, విగతలోభుండై, నిజభుజశక్తి పాలితం బగు భూమండలంబు విభాగించి, ద్రుహ్యునకున్ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమదిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి వారల సమక్షంబున.

585

తా ॥ నేను వేయి సంవత్సరాల పాటు ఇంద్రియ సుఖాలను అనుభవించాను. అయినప్పటికీ అట్టి సుఖాన్ని అనుభవించాలన్న కోరిక ప్రతీ దినమూ పెరుగుతూనే ఉన్నది. కనుక ఈ దినం మొదలు ఆశలను త్రుంచివేసి, ఏమీ పట్టించుకోకుండా, విషయాసక్తి లేనివాడినైన నేను 'నాది, నా వలన' అనే అహంకారాన్ని విడిచి, అడవుల్లో, మృగాల్లో ఒక మృగంగా కాలం వెళ్ళబుచ్చుతాను. మనస్సును బ్రహ్మమునందు లగ్నం చేస్తాను. ఆ బ్రహ్మనిష్ఠ ఆశానివారిణి కనుక నేను దానినే విచారిస్తూ, ఆహార, నిద్రాదులను విడిచిపెడతాను. తన్ను తాను గుర్తెరిగి, ఈ జీవనవ్యాపారపు ముగింపును గూర్చి భావించినవాడే నిజమైన పండితుడు. అతడే జ్ఞాని. అని చెప్పి పూరుని యౌవనాన్ని అతనికి ఇచ్చి, తన ముసలితనాన్ని తాను పొంది, లోభాన్ని విడిచి, తన భుజబలంతో ఆర్జించుకొన్న రాజ్యాన్ని విభాగించి ద్రుహ్యునకు తూర్పు, యదువుకు

దక్షిణం, తుర్వసునకు పడమర, అనువుకు ఉత్తర దిగ్భాగాలను రక్షింపమని చెప్పి, వారి సమక్షంలో.

క. నాలుగుచెఱఁగుల నేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులకుఁ బంచెన్ భూలోక మేలు మనుచును, బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్.

586

తా ॥ నాలుగు వైపులా గల భూమిని పాలించండని ఆదేశించి, వారితో ధర్మనిర్వహణార్థం సద్బ్రాహ్మణులను పంపించాడు. ఇక భూపరిపాలనం చేయమని బాలభాను సమతేజుడైన పూరునికి పట్టం గట్టాడు.

వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కువర్షంబుల యందు ననుభూతంబులైన యింద్రియ సుఖంబులు విసర్జించి.

587

తా ॥ అలా పూరునికి రాజ్యాన్ని ఇచ్చి, ఎన్నో ఏండ్లుగా అనుభవిస్తున్న ఇంద్రియసుఖాలను విడనాడాడు.

క. మిక్కిలి విజ్ఞానంబునఁ, జక్కఁగ దిగ విడిచి వైరిషడ్వర్గంబున్ ఱెక్కలు వచ్చిన విహగము, గ్రక్కున నీడంబు విడుచుకరణి నుదితుఁడై.

588

తా ॥ మిక్కిలి సుజ్ఞానంతో, రెక్కలు వచ్చిన పక్షి ఎలా త్రుటిలో గూడును విడిచి ఎగిరిపోతుందో అలా జ్ఞానాన్ని పొందినవాడై, అరిషడ్వర్గాన్ని విడిచిపెట్టాడు.

వైరిషడ్వర్గము: కామ, క్రోధ, లోభ, మోహ మద మాత్సర్యములనే ఆరు శత్రువులు.

క. కారుణికోత్తముఁడగు హరి, కారుణ్యము కతన నతఁడు ఘనుఁడై గెలిచెన్ గ్రూరములగు విషయంబుల, నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే?

589

తా ॥ అపార కరుణాసముద్రుడైన ఆ శ్రీహరి దయ వలన ఆ ఘనుడైన యయాతి కఠోరమైన విషయ వాంఛలను వదలగలిగాడు. అలా కాకపోతే వాటిని గెలవటం సాధ్యమా? అలా గెలిచిన వాడెవడైనా ఉన్నాడా?

వ. మఱియు నిర్మూలిత సకలసంగుండై సత్త్వరజస్తమో గుణంబులం దిగనాడి నిర్మలంబై, పరమంబైన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధయైన భాగవతగతిం జెందె. నంత.

590

తా ॥ అలా అన్ని బంధాలను పారద్రోలి ఆ యయాతి మహారాజు, సత్త్వరజస్తమోగుణాలను అతిక్రమించి పరిశుద్ధమైన ఆత్మగలవాడై, ఆ యయాతి భగవద్భక్తులు పొందే ఉత్తమగతిని పొంది పరిశుద్ధము, ఉత్కృష్టమూ అయిన వాసుదేవ పరబ్రహ్మంలో లీనమయ్యాడు.

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు గాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికులై పోవుచుఁ బానీయశాలలఁ జల్లఁగా నుండెడి జనుల యట్ల
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి, యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు గా దీశమాయా ప్రకల్పితంబు

తే. దీని విడుచుట తగ వని తెగువ మెఱసి, నిద్ర సాలించి మేల్కొన్న నేర్పు చాలఁ
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి, హరిపదధ్యానయై ముక్తి కరిగె నధిప!

591

తా ॥ ఆ పిదప, దేవయాని భర్త చెప్పిన మాటల్ని, ఏదో ఉబుసుపోకకు చెప్పిన మాటలుగా తలచక మనస్సులో బాగా చక్కగా మననం చేసుకొని; బాటసారులై వెళుతూ, మధ్యలో చలివేంద్రాల వద్ద చేరి కాలక్షేపం కొరకు కొంతసేపు ముచ్చట్లాడుకున్న విధంగా పురాకృత కర్మవశాన సంసారంలో తగుల్కొని నా భార్య, నా బిడ్డలు, నా భర్త అనుకుంటూ కొంత సేపుండటం తప్ప, ఈ తగుల్కోలు శాశ్వతం కాదని, ఇది కేవలం సర్వేశ్వరునిచే కల్పితమైన మాయ అని, దీనిని వదిలిపెట్టడం తగిన పని అని, నిద్రమేల్కొన్న రీతిలో, ఒక్కసారిగా అన్నింటినీ తెగతెంపులు చేసుకొని, ఆమె ఆ శ్రీహరికి అంకితమై ముక్తిపదాన్ని చేరుకుంది."

వ. అని యిట్లు యయాతి చరితంబు చెప్పి, భగవంతుడును, సర్వభూత నివాసుండును, శాంతుండును, వేదమయుండు నైన వాసుదేవునకు నమస్కరించెద అని శుకుం డిట్లనియె.

592

తా ॥ అని ఆ విధంగా శుకమహర్షి యయాతి చరిత్రను వినిపించి, 'భగవానుడు, సర్వజీవాత్మకుడు, శాంతుడు, వేదమయుడూ అయిన వాసుదేవునికి నమస్కరిస్తున్నాను!' అని, పరీక్షిన్మహారాజుకు తిరిగి ఇలా చెప్పనారంభించాడు:

క. భారత! నీవు జనించిన, పూరునివంశంబునందుఁ బుట్టిన వారిన్ జారుయశో-
లంకారుల, ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్.

593

తా ॥ "భరతవంశ దీపకా! నీవు జన్మించిన పూరుని వంశంలోనే జన్మించి కీర్తినీ, తేజస్సునూ పొందినవారి చరిత్రను చెబుతాను, ఆలకించు!" అని చెప్పసాగాడు.

వ. పూరునకుఁ జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుఁ డతనికిఁ బ్రవిరోధనమన్యు, వతనికిఁ జారువు పుట్టె. ఆ చారునకు సుద్యువు, సుద్యువునకు

బహుగతుండును, బహుగతునకు శర్యాతి, శర్యాతికి సంయాతియు, సంయాతికి రౌద్రాశ్వుండు, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమయందు ఋతేపువు కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు అనువారు జగదాత్మ భూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు కొడుకులు జన్మించిరి. అందు ఋతేపువునకు నంతిసారుండు, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండు నను ముప్వురును బుట్టిరి. అందు నప్రతిరథునకుఁ గణ్వుం, డా కణ్వునికి మేధాతిథి, యతనికి ప్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులు జన్మించిరి. ఆ సుమతికి రైభ్యుండు, రైభ్యునకు దుష్యంతుండు పుట్టి.

594

తా ॥ ఆ పూరునికి జనమేజయుడు జన్మించాడు. ఆయనకు ప్రాచిన్వాంసుడు జన్మింపగా, అతనికి ప్రవిరోధన మన్యువు, అతనికి చారువు, అతనికి సుద్యువు, సుద్యువుకు బహుగతుడు జన్మించారు. బహుగతునకు శర్యాతి జన్మింపగా అతనికి సంయాతి, అతనికి రౌద్రాశ్వుడు జన్మించారు. రౌద్రాశ్వునికి ఘృతాచి అనే అప్సరసయందు, ఋతేపువు, కక్షేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు అనే పదిమంది కొడుకులు జగదాత్మభూతుడైన ముఖ్యప్రాణునికి ఇంద్రియాలవలె జన్మించారు. వారిలో ఋతేపువునకు అంతిసారుడు, అతనికి సుమతి, ధ్రువుడు, అప్రతిరథుడు అనే ముగ్గురు కుమారులూ జన్మించారు. వారిలో అప్రతిరథునికి కణ్వుడు, అతనికి మేధాతిథి, అతనికి ప్రస్కందుడు మొదలగు బ్రాహ్మణ సంతతివారు జన్మించారు. సుమతికి రైభ్యుడు జన్మింపగా, ఆ రైభ్యునికి దుష్యంతుడు జన్మించాడు.

## శకుంతల, దుష్యంతుల కథ

క. పారావారపరీతో, దారధరాభారదక్ష దక్షిణహస్త శ్రీ రాజిల్లఁగ నొకనాఁ, డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై.

595

తా ॥ ఆ దుష్యంతుడు సకల వైభవాలతో తేజరిల్లుతూ, సముద్రాల పర్యంతం గల భూమండలాన్ని కడు సమర్థతతో తన కుడిచేయి చాలనంతో సమర్థంగా నిర్వహిస్తూ వచ్చాడు. అంతట ఒకనాడు ఆ మహారాజుకు వేటయందు వేడుక పుట్టింది.

క. గండక కంఠీరవ భే, రుండ శశ వ్యాళ కోల రోహిష రురు వే
దండ వ్యాఘ్ర మృగాదన, చండ శరభ శల్య భల్ల చమరాటవులన్.

596

తా ॥ ఖడ్గమృగాలు, సింహాలు, గండ భేరుండాలు, కుందేళ్ళు, భయంకరమైన సర్పాలు, రాబందులు, అడవిగొఱ్ఱెలు, దుప్పులు, ఏనుగులు, పెద్దపులులు, సివంగులు, చిరుతలు, శరభమృగాలు, ఏదుపందులు, ఎలుగుబంట్లు, జడలబఱ్ఱెలు గల ఘోరారణ్యాల్లో

క. చప్పుడు సేయుచు మృగముల, రొప్పుచు నీరములయందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పఁడఁగ బోవుచుఁ, దప్పక యేయుచును వేఁటతమకం బొప్పన్.

597

తా ॥ చప్పుడు చేస్తూ, మృగాలను తరుముతూ, నీటి పట్టుల్లో వెతుకుతూ, వలలు త్రిప్పుతూ విసురుతూ మృగాలను అందులో పడేట్లు చేస్తూ, బాణాలతో గురిపెట్టికొడుతూ, వేటయందు తీరని కాంక్షతో

క. మృగయూథంబుల వెంటను, మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులు గొందఱుఁ గొలువఁగ, మృగరాజ పరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్.

598

తా ॥ మృగాల గుంపుల వెంట, ఆ దుష్యంత చంద్రముడు, ఆ సింహపరాక్రముడు వేటయందలి తమితో వేటగాండ్రు కొందరు తనను వెంటనంటి రాగా, వేటాడుతూ వచ్చాడు.

వ. ఇట్లు వచ్చి వచ్చి దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు చేరంజని.

599

తా ॥ అలా వచ్చి వచ్చి, దైవవశాత్తూ కణ్వమహాముని ఆశ్రమం చేరువలోనికి వచ్చాడు.

సీ. ఉరుతర శ్రాంతాహి యుగళంబులకుఁ బింఛముల విసరెడి కేకిముఖ్యములను గరుణతో
మదయుక్త కలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను
ఘనమృగాదనములు, గాపుగా లేళ్ళతో రతులు సాగించు సారంగములను నునుపుగా
హోమధేనువుల కంఠంబులు దువ్వుచు నాడు శార్దూలములను

తే. దార కలహించు మూషిక దంపతులకు, మైత్రి నంకించు మార్జాలమల్లములను మతిని
జాతివైరంబులు మాని కూడి, కలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు.

600

తా ॥ వచ్చి, రతి శ్రమతో డస్సిన పాములజంటకు తమ పింఛాలతో గాలి విసరుతున్న నెమళ్ళను, దయమీర గున్న ఏనుగులకు మేతలందిస్తూ ముద్దాడుతున్న సింహాలను, సివంగుల రక్షణ వలయంలో రతిక్రీడ సాగిస్తున్న లేళ్ళను, హోమధేనువుల గంగడోళ్ళను మెత్తగా దువ్వుతున్న పెద్దపులులను, తమలో తాము కలహించుకుంటున్న ఎలుక దంపతులకు సఖ్యత కుదుర్చుతున్న పిల్లులను – ఇలా పుట్టు పగను వదలి, కలసి ఆడుకుంటున్న జంతువులను చూశాడు.

క. ఇ త్తెఱంగున మృగజాతుల, పొత్తులు మే మెఱుంగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నా ముని, సత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్.

601

తా ॥ 'ఇలా జాతివైరంగల జంతువులు స్నేహంగా ఒకచోట కలిసివుండటం నేనెక్కడా చూసింది లేదే!' అని మనస్సులో అనుకుంటూ, కణ్వమహర్షి పుణ్యవర్తనకు సంతోషపడ్డాడు.

క. హల్లక బిసరుహ సరసీ, కల్లోలోత్ఫుల్ల యూథిగా గిరిమల్లీ మల్లీ మరువక కురవక,
సల్లలితానిలము వలన సంతుష్టుండై.

602

తా ॥ ఇంకా ఎఱ్ఱ కలువలతో, తామరలతో కూడిన సరస్సులోని అలల తాకిడికి కొండమల్లెలు, మల్లెలు, మరువం, ఎఱ్ఱ చేమంతుల మీద నుండి సుగంధాన్ని నింపుకొని తెరలు తెరలుగా వస్తున్న గాలికి ఆయన ఎంతో సంతోషించాడు.

వ. దుష్యంతుండు వచ్చు నవసరంబున.

603

తా ॥ అలా దుష్యంతుడు వచ్చే సమయంలో.

క. ఇందిందిరాతి సుందరి, యిందిందిరచికుర యున్న; దిందింద శుభం;
బిం దిందువంశ యను క్రియ, నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్.

604

తా ॥ 'ఓ ఇందు (చంద్ర) వంశోత్తమా! ఇందిర (లక్ష్మీదేవి) వంటి సుందరి, ఇందిందిరముల వంటి (తుమ్మెదలు) శిరోజాలు కలది ఇక్కడ ఉంది. ఇంద! ఈ శుభాలను అందుకో' అని చెబుతున్నాయా! అన్నట్లు, ఇందీవరవీథిలోని (తామరకొలను) ఇందిందిరాలు

(తుమ్మెదలు) ధ్వని చేస్తున్నాయి.

క. మా కందర్పుని శరములు, మా కందము లగుటఁజేసి మాకందంబుల్ మా కందము లను కైవడి, మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్.

605

తా ॥ 'మా వాడైన మన్మథుని (మా కందర్పుని) బాణాలు తియ్యమామిడి (మాకందములు) చిగురుటాకులు కావడంవలన తియ్యమామిళ్ళు (మాకందములు) మాకు ప్రియమైనవే (మా కందములు మాకు అందములు) సుమా!' అని అంటున్నట్లు, తియ్యమామిళ్ళ (మాకందముల) చిటారు కొమ్మలపై గల కోయిలలు కూయసాగాయి.

వ. అంత.

606

తా ॥ అప్పుడు,

క. ఇందున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం బొందుగ ననుచరులను దా, నందఱ నందంద నిలిపి యటఁ జని మ్రోలన్.

607

తా ॥ దుష్యంతుడు, ఇక్కడ ఉంటున్న కణ్వమహర్షికి నమస్కరించి వస్తాను, మీరు ఇక్కడిక్కడే ఉండండని తనతో వచ్చిన వారిని అక్కడే ఆపి, తాను ఆశ్రమంలోనికి వెళ్ళాడు.

శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంత ప్రదేశంబులన్<br>
మాకందంబులనీడఁ బుష్పలతికా మధ్యంబునన్ మంజు రం<br>
భాకాండాంచితశాలలోఁ గుసుమసంపన్నస్థలిన్ జూచె నా<br>
భూకాంతుండు శకుంతల న్నవనటత్ భ్రూపర్యటత్కుంతలన్.

608

తా ॥ వెళ్ళి, ఆ కణ్వాశ్రమంలో తామరకొలను అవలిఒడ్డున, తియ్యమామిడి చెట్ల నీడలలో చక్కగా మలచబడిన పూతీవెలమధ్య అరటి బోదెలూ ఆకులతో కప్పిన వసారాలో పూలతో శోభిస్తున్న చోట, చిన్ని ముంగురులు నొసలిపై దోబూచులాడుతున్న శకుంతలను చూశాడు దుష్యంతుడు.

క. దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూరింపంగన్.

609

తా ॥ చక్కని తలకొప్పుతో, ఎత్తుగా పైకి ఉబికి వస్తున్నట్లున్న కుచద్వయంతో, కాంతి నిండిన చుఱుకైన చూపులతో, జవుకుతున్న నడుముతో, తేనియలూరే పెదవులతో, ఆమె దుష్యంతుని మనస్సును ఊరిస్తోంది.

వ. అంత నా రాజకుమారుం డలరు టమ్ముల విలుకాని, వెడవింట ఘుణఘుణాయమానలై మ్రోయు ఘంటలకుం బబ్బరించి, తన మనంబున.

610

తా ॥ ఆమెను చూసిన క్షణాన, దుష్యంతుడు, పూవిలుకాని చెరకువింటికి కట్టిన చిరుగంటల సవ్వడికి చలించిపోయి, తన మనస్సులో ఇలా అనుకున్నాడు:

శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నే గతిం గనియెడిం గా; దీ కురంగాక్షి రా
జన్యాపత్యము గాఁగ నోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్?

తా ॥ 'అడవిలో లభించే కందమూలాలను, ఫలాలను మాత్రమే ఆరగిస్తూ జితేంద్రియుడైన ఈ కణ్వమహర్షికి ఈ కన్యారత్నమెలా జన్మించింది? ఈమె ఆయన కూతురై ఉండదు! కారణం నా మనస్సు ఆమెపైకి పోతోంది. కనుక ఈమె రాచపుట్టువే కావాలి. ముని సంతానం కాదు. అంతే అయివుండాలి. ఏమంటే పౌరవ వంశస్థుల మనస్సులెన్నడూ, అన్యాయమైన పనులు చేయడానికి ఉత్సహింపవు గదా!

క. అడిగిన నృపసుతఁ గానని, నొడివెడినో కదే మనంబు నొవ్వ నని విభుం
డుడురాజవదన నడుగక, తడుమన యొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్.

612

తా ॥ ఏమో! అడిగితే – తాను రాచబిడ్డను కానంటే – అది మానసిక క్షోభకు గురిచేస్తుంది గదా' – ఇలా సంశయించి, ఆ చంద్రముఖీని ఏమీ అడుగకుండా కొంత తాత్సారం చేశాడు.

వ. మఱియు నెట్టకేలకుఁ దన చిత్త సంచలనంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె.

613

తా ॥ కొంతసేపటికి తన మనస్సు యొక్క పోకడను బట్టి ఆ అనుమానం వట్టి అపోహేనని, ఆమె రాచకన్యేననే నిశ్చయానికి వచ్చి, ఆమెతో ఇలా అన్నాడు:

క. భూపాలక కన్యక వని, నీపై చిత్తంబు నాఁటె, నీవా రేరీ?
నీపే రెవ్వరు? నిర్జన, భూపర్యటనంబు తగవె? పూర్ణేందుముఖీ!

614

తా ॥ "నిండుచంద్రుని వంటి ముఖబింబంతో ముచ్చట గొలుపుతున్న ఓ ఒయ్యారీ! నీవు

రాజకన్యవనే నమ్మికతో నా మనస్సు నీపై నాటుకుంది. నీ వాళ్ళెవరూ కనపడరేం ఇక్కడ? నిన్నే పేరుతో పిలుస్తారు? ఇలా మానవులు చొరరాని ఈ అరణ్యాల్లో సంచరించటం నీకు తగునా?" అన్నాడు.

వ. అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్ర చంద్రికా రసంబు నేత్రచకోరంబువలనఁ ద్రావుచు, న య్యువిద విభ్రాంతయై యున్న సమయంబున.

615

తా ॥ అలా అంటున్న ఆ రాజచంద్రుని ముఖారవిందం నుండి ప్రసరిస్తున్న వెన్నెల కిరణాలను తన నేత్ర చకోరద్వయంతో గ్రోలుతూ, చేష్టలు దక్కి ఆ మనోహరి అలా కళ్ళప్పగించి ఆయనవంక చూస్తూ ఉండిపోయింది. అదే సమయంలో...

క. కంఠేకాలునిచేతన్, గుంఠితుఁడగు టెట్లు మరుఁడు? కుసుమాస్త్రంబుల్ లుంఠించి గుణనినాదము, ఠం, ఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్.

616

తా ॥ శివుని కంటిమంటకు ఆహుతైతే మాత్రం మన్మథుడు మాసిపోయాడా ఏమి? పూల బాణాలను సంధించి ఠం, ఠం అంటూ గుణధ్వని చేసి కుసుమాస్త్రాలను ప్రయోగించేసరికి శకుంతల, నిలువెల్లా ఠవ ఠవమంటూ కంపించి పోయింది.

వ. ఇట్లు వలరాజువాఁడి క్రొవ్విరికోలల వేఁడిమిఁ దాలిమి పోఁడిమి సెడి, యా వాలుఁగంటి యిట్లనియె.

617

తా ॥ అలా మన్మథుని నవవికసిత పుష్పబాణాల తాపానికి సొక్కి, సోలిపోయి, దుష్యంతునితో ఆ వాలుకన్నుల వయ్యారి ఇలా అంది:

మ. అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్తయున్
గని! రామేనక డించిపోయె నడవిన్; గణ్వుండ న న్నింతగా
మనిచెన్; సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగన్ మద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుదున్ నేఁడీ వనాంతంబునన్.

618

తా ॥ "తేజఃప్రభావశీలురైన మేనకా విశ్వామిత్ర మహీపతులు నన్ను కన్నవారు. మేనక నన్నిక్కడే అడవిలో వదలి వెళ్ళిపోయింది. కణ్వమహర్షి పెంచి నన్నింతగా చేశాడు. నా గురించి తెలిసిందంతా ఆయనకే తెలుసు. ఇదిగో ఇన్నాళ్ళకు, ఈ అడవి మధ్య, నా జన్మ ధన్యమైందా అన్నట్లు నా అదృష్టవశాన మీ కంటపడ్డాను. మిమ్మల్ని చూశాను.

క. నీవారము ప్రజ లేమును, నీవారము పూజగొనుము నిలువుము నీవున్ నావారును మాయింటను, నీవారాన్నంబుఁ గొనుఁడు నేఁడు నరేంద్రా!

619

తా ॥ మహారాజా! సర్వ ప్రజానీకమూ నీవారే గనుక మేమూ నీవారమే. కనుక ఈనాడు, మీరూ, మీతో వచ్చినవారు అందరూ మా సపర్యలను పొంది, మా ఇంట ఆతిథ్యాన్ని స్వీకరింతురు గాక!"

వ. అని పలికిన, దుష్యంతుడు మెచ్చి, మచ్చెకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె.

620

తా ॥ అలా అని ఆమె అనగా, ఆమె తలపులోని మర్మాన్ని గుర్తెరిగి, మెచ్చి ఇలా అన్నాడు:

ఆ. రాజతనయ వగుదు రాజీవదళనేత్ర!, మాట నిజము లోనిమాట లేదు. తనకు సదృశుఁడైన తరుణుని ఁ గైకొంట, రాజసుతకుఁ దగవు రాజవదన!

621

తా ॥ 'తామరపూరేకుల వంటి కన్నుల దానా! రాచబిడ్డవన్న మాట నిజం! దానికిక మరోమాట లేదు. తనకు అన్నింటా తగిన తరుణవయస్కుని చేపట్టడం రాచబిడ్డకు సహజమే కదా!'

వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుఁ బలుకుల వలన నయ్యువిద నియ్యకొలిపి.

622

తా ॥ అని, ఇంకా ఇలాంటివే మనస్సు లోగొనే మచ్చిక మాటలు మన్నికగా మాట్లాడి, ఆమెను అంగీకరింపజేసి,

క. బంధురయశుఁడు జగన్నుత, సంధుఁడు దుష్యంతుఁ డుచితసమయజ్ఞుండై
గంధగజగమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్.

623

తా ॥ ఆ వనంలో, ఆ కీర్తిశాలి, ఆ జగన్నుతశీలి దుష్యంతుడు సమయోచితంగా ఆ గజగమనను గాంధర్వ పద్ధతిలో తనదిగా చేసుకున్నాడు.

# భరతుని చరిత్ర

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుండుగు నా రాచపట్టి, తపసిరాచూలికిఁ జూలునిలిపి, మఱునాఁ డు తన వీటికిం జనియె. నయ్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం గనినం, గణ్వమునీంద్రుఁ డా రాచపట్టికి జాత కర్మాది మంగళాచారంబు లొనర్చె. నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదుగుచు.

624

తా ॥ అలా అమోఘవీర్యుడైన ఆ దుష్యంతుడు ఆమెను చూలాలిని చేసి, మరునాటికి తన రాజధానికి చేరుకున్నాడు. కొంత కాలానికి శకుంతల మగబిడ్డకు జన్మనిచ్చింది. కణ్వమహర్షి ఆ రాకుమారునికి జాతకర్మాది శుభకార్యాలను నిర్వర్తించాడు. ఆ బిడ్డ దినదిన ప్రవర్ధమానంగా బాలచంద్రుని వలె ఎదిగి రాసాగాడు.

క. కుంఠితుఁడుగాక వాఁ డు, త్కంఠం దన పిన్ననాఁడె కణ్వవనచరత్ కంఠీరవముఖ్యంబుల, కంఠములన్ బట్టి యడుచుఁ; గట్టున్; విడుచున్.

625

తా ॥ అలా పెరిగి పెద్దవాడవుతూ ఆ పిన్నవయసులోనే నిర్భీతిగా, కణ్వాశ్రమ ప్రాంతంలోని సింహాల గొంతు పట్టుకొని క్రిందికి పడవేస్తూ, కొంతసేపు కట్టివేస్తూ, విడుస్తూ, వాటితో ఆడుకుంటూ ఉండేవాడు.

వ. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె.

626

తా ॥ అలా ఉంటూవుండగా ఒకనాడు కణ్వమహాముని, ఆ రాచపట్టిని చూస్తూ శకుంతలతో ఇలా అన్నాడు:

ఉ. పట్టపురాజు నీమగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకున్, బట్టపుదేవివై గరిమ బాగుగ నుండక పాఱువారితో గట్టువనంబులో నవయఁగాఁ బనిలే దిటఁ దర్లి పోఁగదే పుట్టినయిండ్ల మాని పతిఁబొందక యిట్లనిశంబు నుందురే?

627

తా ॥ "అమ్మాయి! నిన్నేలినవాడా, ఈ దేశానికి ప్రభువు. ఇక నీ బిడ్డ అన్నింటా అతనిని మించినవాడే తప్ప తక్కువవాడు కాడు. నీవు కూడా అలా పట్టపురాణి మర్యాదకు తగినట్లు ఉండాలి తప్ప, ఇక్కడ ఈ కొండల్లో కోనల్లో బ్రాహ్మణులతో అవస్థలు పడటమేమిటి? కనుక నీవు ఇక నీ భర్త దగ్గరకు వెళ్ళడం – అది తగిన పని. అయినా వివాహితలైన మానినులు ఎల్లకాలమూ పుట్టిళ్ళలో ఉంటారా! ఉండకూడదు కూడానూ!" అన్నాడు.

వ. అనిన నియ్యకొని

628

తా ॥ ఆయన అలా అనగా, ఆమె 'అలాగే' నంది.

క. ఆ పిన్నవాని నతుల, వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల, భూపాలునికడకు వచ్చెఁ బుత్త్రుని గొనుచున్.

629

తా ॥ అని, 'బలపరాక్రమాది విషయాల్లో అసామాన్యుడూ, ఉదాత్తగుణసంపన్నుడూ, విష్ణ్వంశలో జన్మించినవాడూ అయిన ఈ కుఱ్ఱవానిని రాజుకు చూపుతాను గాక!' అని అనుకొని, అతనిని వెంటపెట్టుకుని రాజధానికి వచ్చింది.

వ. వచ్చి దుష్యంతుండున్న సభామండపంబునకుం జని నిలిచి యున్నయెడ.

630

తా ॥ వచ్చి, దుష్యంతుడు కొలువు తీర్చివున్న సభామండపంలో ప్రవేశించి నిలిచింది. అప్పుడు—

మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మ రే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండు నాఁ గాంతి న
గ్గలమై యున్న కుమారు మాసదృశాకారున్ విలోకించి తాఁ
బలుకండయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మయై వందురన్.

631

తా ॥ కుడి అరచేతిలో పెద్దదైన చక్రరేఖ, పాదాలలో పద్మరేఖలూ కలిగి, నేలకు దిగివచ్చిన శ్రీ మహావిష్ణువా అన్నట్లు కాంతిని ప్రసరింపజేస్తూ, మన్మథుని తలపిస్తూ ఉన్న కుమారుని చూసి కూడా రాజు ఉలుకూ పలుకూ లేకుండా మిన్నకుండటం చూసి శకుంతల ఆశ్చర్యానికి, ఆందోళనకు గురి అయింది.

వ. ఆ సమయంబున.

632

తా ॥ ఆ సమయంలో,

మ. అదె నీ వల్లభ, వాఁడు నీ సుతుఁడు; భార్యాపుత్త్రులన్ బాత్రులన్
వదలం గా; దలనాటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు; శకుంతలా వచనముల్ మాన్యంబులౌ భూవరేం
ద్ర! దయం జేకొను మంచు మ్రోసెను వియద్వాణీ వధూవాక్యముల్.

633

తా ॥ "రాజా! ఆమె నీ భార్య! అతడు నీ కుమారుడు. భార్యాపుత్రులను విడువటం

ఎన్నటికీ తగదు గాక తగదు సుమా! అలనాడు, కణ్వాశ్రమంలో నీ వివాహవైనాన్ని గుర్తుతెచ్చుకో! శకుంతల చెపుతున్నదానిని పాటించి, వారిని మన్నించు! దయతో చేపట్టు!" అంటూ ఆకాశవాణీ వధూ గీతికలు అప్పుడు వినిపించాయి.

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుం దేటపడ భరింపు మని పలికిన, నా కుమారుడు భరతుండయ్యె, అంత నా రాజు రాజవదన నంగీకరించి, తనూభవుం జేకొని, కొంతకాలంబు రాజ్యంబుఁ జేసి పరలోకంబునకుం జనియె. తదనంతరంబ.

634

తా ॥ అలా ఆకాశవాణి, అందరికీ తెలివిడి అయ్యేట్లుగా ఆ కుఱ్ఱవానిని గ్రహింపుమని (భరింపుమని) పలికిన కారణంగా అతడు భరతుడైనాడు. అంతట దుష్యంతుడు వారిరువురినీ చేరదీసి, కొంతకాలం రాజ్యం చేసి, పరలోకానికి చేరుకున్నాడు. ఆ తరువాత.

క. రెండవ హరిక్రియ ధరణీ, మండలభారంబు నిజసమంచితబాహా దండమున నిలిపి తనకును, భండనమున నెదురులేక భరతుం డొప్పెన్.

635

తా ॥ ఇతగాడు రెండవ మహావిష్ణువు కాబోలు నన్నట్లుగా రాజ్యభారాన్ని వహించి తన బాహుపరాక్రమ సామర్థ్యంతో, తనకు ఎవరూ ఎదురులేరన్నట్లు శత్రురాజులను జయించి పరిపాలన సాగించాడు.

వ. మఱియు నా దౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండుగా డెబ్బదియెనిమిది యును, గంగాతీరంబున నేఁబదియయిదును, నిట్లు నూటముప్పదిమూఁ డశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్రవిభవంబున నతిశయించి, పదుమూఁడువేలున్నెనుబదిన ాలుగు కదుపుధేనువులు గలయది ద్వంద్వంబనం బరఁగు. అట్టి వెయ్యిద్వంద్వంబుల పాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకార సహితలం జేసి, వేవురు

బ్రాహ్మణుల కిచ్చి, మష్కారపుణ్యతీర్థకూలంబున విప్రముఖ్యులకు రత్నభూషణ శోభితంబులై; ధవళదంతంబులు గల నల్లని యేనుంగులఁ బదునాలుగు లక్ష లొసంగె. దిగ్విజయ కాలంబున శక, శబర, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజుల పీచం బడంచి, రసాతలంబున రాక్షస కారా గృహంబులందున్న వేల్పుల గరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి, వారల వల్లభులం గూర్చె. త్రిపురదానవుల జయించి, నిర్జరుల నిజమందిరంబుల నునిచె. అతని రాజ్యంబున గగన ధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె, ఇవ్విధంబున.

636

తా ॥ అంతేకాదు, ఆ దుష్యంత కుమారుడు దీర్ఘతపుడనే సద్బ్రాహ్మణుని పౌరోహిత్యంలో యమునా నదీ తీరాన డెబ్బై ఎనిమిది; గంగా తీరాన ఏభై అయిదు, మొత్తం నూటముప్పై మూడు అశ్వమేధ యాగాలు చేసి, దక్షిణలు సమర్పించాడు. దేవేంద్రవైభవంతో అలరారాడు. పదమూడు వేల ఎనభై నాలుగు ఆవులు, ఆబోతులు గల మందను ద్వంద్వమంటారు. అలాంటి ద్వంద్వాలను వేయింటిని వాటి దూడలతో సహా అలంకరించి వేయిమంది బ్రాహ్మణులకు సమర్పించాడు. ఒక మంచిరోజున మష్కార తీర్థంలో పండిత బ్రాహ్మణులకు బంగారు అభరణాలతో మెరిసిపోతూ, తెల్లనిదంతాలు గల పధ్నాలుగు లక్షల నల్లటి ఏనుగులను ఇచ్చాడు. దిగ్విజయం చేసిన సందర్భంలో శక, శబర, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశాల రాజుల గర్వాన్ని అణచివేశాడు. పాతాళ లోకంలో, రాక్షసుల కారాగృహాల్లో బందీలుగా ఉన్న దేవకాంతలను విడిపించి తెచ్చి, వారి భర్తలకు అప్పగించాడు. త్రిపురాసురులను జయించి, దేవతలను వారి స్వగృహాలకు పంపాడు. అతడు రాజ్యం చేస్తున్న కాలంలో భూమ్యాకాశాలు రెండూ వర్షాలు కురిపిస్తూ, పంటలను సమృద్ధిగా ఇస్తూ, ప్రజల కోరికలను నెరవేర్చాయి. ఈ విధంగా.

ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు, భాగ్యమందు లోకపతులకంటె నెక్కుడైన
పేర్మి నిరువదియేడు వే, లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప!

తా ॥ రాజా! చక్కని వర్తనంతో, బలపరాక్రమాల్లో, సంపదలో, నాటి రాజులందరికంటే అధికుడై ఇరవై ఏడు వేల సంవత్సరాలు ఈ భూమిని పాలించాడు.

క. అర్థపతికంటెఁ గలిమి గృ, తార్థుండై యతుల శౌర్య మలవడియు నతం దర్థములును
బ్రాణములును, వ్యర్థము లని తలఁచి శాంతుఁడయ్యె నరేంద్రా!

638

తా ॥ అయితే, రాజా! సంపద విషయంలో ఆ కుబేరుని మించినవాడై కూడా, ఆ భరతుడు ధనమేమి, ప్రాణమేమి, వ్యర్థములని భావించి ఉపేక్ష వహించి ఉండేవాడు.

క. భరతుని భార్యలు మువ్వురు, వరుసం బుత్త్రకులఁ గాంచి వల్లభుతోడన్ సరిగారని
తోడ్తోడను, శిరముల దునుమాడి రాత్మశిశువుల నధిపా!

639

తా ॥ భరతునికి మువ్వురు భార్యలు. ముగ్గురికీ కుమారులు కలిగారు. అయితేనేమి, ఆ బిడ్డలు తండ్రి వంటివారు కారని తలచి, వారు ఆ బిడ్డల్ని చంపేశారు.

వ. ఇట్లు విదర్భరాజపుత్త్రికలు శిశువులఁ జంపిన భరతుం డపుత్త్రకుండై మరుత్స్తోమం బను
యాగంబు పుత్రార్థియై చేసి, దేవతల మెప్పించె. న య్యవసరంబున.

640

తా ॥ ఈ విధంగా విదర్భ రాకుమార్తెలైన వారు, శిశువులను చంపివేయటం కారణంగా భరతుడు సంతులేని వాడైనాడు. అప్పుడు ఆయన పుత్రుల కొరకు మరుత్స్తోమమనే యాగం చేసి దేవతలను మెప్పించాడు. అప్పుడు ఒక సంగతి జరిగింది.

సీ. అన్న యిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ
దొరఁకొని పై ఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి వలదు
తగదని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండ వగుమన్న నలిగి వాఁడు
యోనిలోపలి వీర్య మూడఁదన్నిన నేలఁ బడి బిడ్డఁడై యున్నఁ బాయలేక

ఆ. నితనిఁ బెంపు; కొడుకు లిరువురు జన్మించి, రనుచు వెలయఁజేయుమనిన మమతఁ
బెంపఁజాల; నీవు పెంపు; భరింపు మీ; ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి.

641

తా ॥ అదేమిటంటే – బృహస్పతికి ఉచథ్యుడనే అన్న ఉన్నాడు. ఆయన భార్య మమత. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు, బృహస్పతి ఆమెపై మరులుకొని ఆమెపై పడ్డాడు. ఆమె గర్భంలో శిశురూపంలో నున్న బాలుడు భయంతో 'కూడదు కూడదని' మొఱపెట్టగా, కామోద్రేకంతో ఉన్న బృహస్పతి ఆ శిశువును 'గుడ్డివాడవు క' మ్మని శపించాడు. దానితో కోపించిన శిశువు, బృహస్పతి వీర్యాన్ని తల్లి యోని నుండి బయటకు తోసేశాడు. ఆ వీర్యం నేలపై పడి బిడ్డ అయినాడు. అంతట బృహస్పతి బిడ్డపై మమకారంతో మమతతో నీకు ఇద్దరు కొడుకులు జన్మించారు. ఇద్దర్నీ పెంచి పెద్దచేయమనగా, ఆమె 'నా వల్లకాదు, నీవే భరించి పెంచు ఈ ద్వాజుడిని' అంటూ ఆమె వెళ్ళిపోయింది.

ద్వాజుడు : అన్యక్షేత్రంలో ఇతరుని వలన పుట్టినవాడు.

వ. ఇట్లుచథ్యునిభార్య యగు మమతయు, బృహస్పతియు శిశువుం గని, ద్వాజుండైన వీని నీవే భరింపుమని, వదినె మఱందులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె, గర్భస్థుండైన వాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముం డయ్యె, అంత నా బృహస్పతియు, మమతయు నుదయించిన వాని విడిచి, నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి, పుత్రార్థియైన భరతున కిచ్చిరి. భరతుండును వానిం జేకొనియె. వితథంబైన భరతవంశమునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి, వితథుండనం

బరఁగె. ఆ వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్ర జయ మహావీర్య నర గర్గులను వారేవురు సంభవించిరి. అందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు, రంతిదేవుం డన నిరువురు జన్మించిరి. అందు.

642

తా ॥ అలా వదినామరదులు పరస్పరం ద్వాజుడిని నీవు పెంచు, నీవు పెంచు అని వాదులాడుకున్న కారణంగా ఆ బిడ్డ భరద్వాజుడైనాడు. మమత గర్భంలోని శిశువు, బృహస్పతి శాపం కారణంగా దీర్ఘతముడైనాడు.

మమత, బృహస్పతి ఇరువురూ విడిచి వెళ్ళిపోవటంతో మరుత్తులు, ఆ బిడ్డను పుత్రార్థియైన భరతునకు ఇవ్వగా అతడు స్వీకరించాడు.

అలా వితథమైన (తెగిపోయిన) భరతవంశానికి ఆ భరద్వాజుడు వంశకర్త కావటం వలన అతనిని వితథుడు అన్నారు.

ఆ వితథునికి మన్యువు జన్మింపగా అతనికి బృహత్క్షత్ర, జయ, మహావీర్య, నర, గర్గులనే అయిదుగురు కుమారులు జన్మించారు. వారిలో నరునికి సంకృతి, అతనికి గురుడు, రంతిదేవుడనే ఇరువురు కుమారులు జన్మించారు.

# రంతిదేవుని చరిత్ర

సీ. రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి యేల? చెప్పఁగ విను మిందు నందు
నా రాజు దన సంచితార్థంబు లన్నియు నెడపక దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద యై కూడు నీరులే కథమవృత్తి
నెందేని నలువది యెనిమిది దివసముల్ చరియింప నొకదివసంబు రేపు

ఆ. నెయ్యి పాయసంబు నీళ్ళును గలిగిన, బహుకుటుంబ భారభయముతోడ
నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి, లొదవఁ జూచి కుడువ నుత్సహించె.

643

తా ॥ చంద్రవంశోత్తమా! పరీక్షిన్మహారాజా! ఆ రంతిదేవుని కీర్తి ప్రత్యేకంగా ఇలాంటిది, ఇంతటిది అని చెప్పటం దేనికి? ఆ చోటు ఈ చోటు అని లేదు. లోకమంతటా చెప్పుకుంటూనే వుంటారు. సంపాదించినదంతా విడుపూ విరామం లేకుండా అడిగిన వారికిచ్చి, ధనహీనుడైనాడు. అయితేనేమి! అధైర్యపడక సకుటుంబంగా ఏదో దొరికింది తింటూ నలభై ఎనిమిది దినాలపాటు ఎలాగో కాలక్షేపం చేశాడు. అలా ఉంటూ ఉండగా – కుటుంబమా చాలా పెద్దది – అయినా అందరికీ సరిపోయేట్లు ఒకనాటి ఉదయాన ఆయనకు నేయి, పాయసం, నీరు లభించాయి. ఇంకేం, ఆకలికీ దాహానికీ అందరూ వాటిని ఆరగించవచ్చును గదా అనే సంతోషంలో ఉన్నారు.

వ. అ య్యవసరంబున.

644

తా ॥ సరిగ్గా ఆ సమయంలో,

సీ. అతిథిభూసురుఁ డొక్కఁడాహార మడిగినఁ గడపక ప్రియముతో గారవించి

హరిసమర్పణ మంచు నన్నంబులో సగ మిచ్చిన భుజియించి యేగె నాతఁ;
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి పొడసూపలే దనఁబోక తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక

ఆ. కుక్క గమియుఁ దాను నొక్కఁ డేతేర నా, యన్న శేషమిచ్చి సన్నయమున
వాని మ్రొక్కి పంప వరుసతోఁ జండాలుఁ, డొక్కఁ దరుగుదెంచి చక్క నిలిచి.

645

తా ॥ ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి ఆహారమడిగాడు. రంతిదేవుడు కాదనకుండా అతనికి ఉన్న ఆహారంలో సగంపెట్టి అతనిని సంతృప్తి పరచి సాగనంపాడు. అంతలో ఒక శూద్రుడు ఆకలితో రాగా, లేదనకుండా అతనికి మిగిలిన అన్నంలో ఒక భాగం ఇవ్వగా సంతోషించి అతడు వెళ్ళిపోయాడు. వాడు అలా వెళ్ళాడో లేదో కుక్కల గుంపును వెంటేసుకొని ఒకడు రాగా మిగిలిన అన్నం అతనికి పెట్టి పంపించాడు. అంతలో చండాలుడొకడు వచ్చి యెదుట నిలిచి,

క. హీనుఁడఁ; జండాలుండను, మానవకులనాథ! దప్పి మానదు; నవలం బోనేర; నీకుఁ
జిక్కిన, పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే!

646

తా ॥ 'ఓ రాజా! హీనుణ్ణి, చండాలుణ్ణి! విపరీతమైన దాహంగా ఉంది. ప్రాణాలు కడబడుతున్నాయి. అవతలకు అడుగువేయలేను. కనుక నీ దగ్గరున్న నీరు పోసి నా ప్రాణాలు నిలుపవా!' అని దీనంగా అడిగాడు.

వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి, రాజిట్లనియె.

647

తా ॥ అతగాడి దీనాలాపాల్ని విని జాలి వహించి, రంతిదేవుడు ఇలా అన్నాడు:

ఉ. అన్నము లేదు, కొన్ని మధురాంబువు లున్నవి.; ద్రావుమన్న; రా
వన్న, శరీరధారులకు నాపద వచ్చిన వారియాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా!

648

తా ॥ 'ఓయీ! నా వద్ద అన్నమైతే లేదు. మంచినీళ్ళు మాత్రమే ఉన్నాయి. అవి ఇస్తాను. త్రాగవలసింది. ఒకరికి ఆపద కలిగినప్పుడు దానిని కడబెట్టి అతడికి మేలు చేయడం కంటే ఉత్తమమైనది మరొకటి లేదు కదా! ఇక నా సంగతెలాగంటావా! పైన పరాత్పరుడున్నాడు గదా! అతడే నాకు దిక్కు.'

వ. అని పలికి.

649

తా ॥ అని చెప్పి,

మ. బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయం దేమియు; వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముల్ వోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్.

650

తా ॥ 'బాగా దప్పికగొని ప్రాణాలు కడబట్టి ఉన్న ఇతడు ఈ నీటితో తేరుకుంటాడు' అని భావించి, తన బరువు భారాలను సర్వేశ్వరునికి వదలి, రంతిదేవుడు పాత్రలో ఉన్న నీటిని

పోశాడు.

వ. తదనంతరంబ, బ్రహ్మాదిదేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలు సేయం దలంచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి యా రాజు ధైర్య పరీక్షార్థంబు దమ చేసిన వృషలాదిరూపంబు లగు విష్ణుమాయ నెఱింగించిన, నా నరేంద్రుం దండఱికి నమస్కరించి.

651

తా ॥ అంతట బ్రహ్మాది దేవతలు ఎంతో సంతోషించి, రంతిదేవునికి మేలు చేయాలనే భావంతో ప్రత్యక్షమై, ఆయన ధైర్యాన్ని పరీక్షించాలని శూద్రాదుల రూపంలో వచ్చింది తామేనని, ఇదంతా విష్ణుమాయ అని చెప్పగా, అతడు అందరకు నమస్కరించాడు.

క. వారల నేమియు నడుగక, నారాయణభక్తి తన మనంబున వెలుఁగన్ ధీరుం డాతఁడు మాయా, పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్.

652

తా ॥ నమస్కరించాడు తప్ప వారిని 'తనకు ఇది కావా' లని ఏమీ అడుగక, సంసారమాయా చక్రాన్ని ఎరిగినవాడు గనుక నిశ్చలంగా తన మనస్సులో నారాయణ భక్తిని నిలుపుకొని ధీరుడైన ఆ రంతిదేవుడు పరమపదాన్ని చేరుకున్నాడు.

క. ఆ రాజర్షిని గొలిచిన, వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ నారాయణ చింతనులై, చేరిరి యోగీశు లగుచు సిద్ధపదంబున్.

653

తా ॥ అంతేకాదు! రాజర్షిసత్తముడైన ఆయనను కొలిచినవారందరూ, ఆయన యోగవైభవం కారణంగా, నారాయణధ్యానులై యోగీశులై సిద్ధపదాన్ని చేరుకున్నారు.

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణియగు భక్తివలన బరమ పదంబునకుం జనియె. అంత

గర్గునకు శిని జన్మించె, శినికి గార్గ్యుండు గలిగె, అతని నుండి బ్రాహ్మణకులంబయ్యె. మహావీర్యునికి నురుక్షయుండు, నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ, గవియుఁ, బుష్కరారుణియు నను మువ్వురు సంభవించిరి. వారును బ్రాహ్మణులై చనిరి. బ్రహ్మక్షత్రునికి సుహోత్రుండును, సుహోత్రునికి హస్తియు జనించిరి. అతండు దనపేర హస్తినాపురంబు నిర్మించె, ఆ హస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, పురుమీఢుండును నన ముగ్గురు జనియించిరి. అందు నజమీఢుని వంశంబునఁ బ్రియమేధాదులు గొందఱు పుట్టి బ్రాహ్మణులై చనిరి. ఆ య్యజమీఢునికి బృహదిషువు, నతనికి బృహద్ధనువు, నతనికి బృహత్కాయుండు, నతనికి జయద్రథుండు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుండు నన నలుగురు జనియించిరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు, నతనికిఁ బృథుసేనుండును, బృథుసేనునికిఁ బారుండును, వానికి నీపుండును, నీపునికి నూర్వురు కొడకులును బుట్టిరి; మఱియును.

654

తా ॥ అలా రంతిదేవుడు, విజ్ఞానానికి మూలమైన భక్తి కారణంగా ముక్తిపదానికి చేరుకున్నాడు.

అది అలా ఉండగా గర్గునికి శిని జన్మించాడు. అతనికి గార్గ్యుడు జన్మించాడు. అతని తరువాతి వారందరూ బ్రాహ్మణులైనారు.

మహావీర్యునికి ఉరుక్షయుడు; అతనికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అనే ముగ్గురు జన్మించారు. వారూ బ్రాహ్మణులైనారు.

ఇక బృహత్క్షత్రునికి సుహోత్రుడు, అతనికి హస్తి జన్మించారు. ఆయన తన పేర హస్తినాపురాన్ని నిర్మించాడు. ఆ హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు అనే ముగ్గురు

జన్మించారు. అజమీఢుని వంశంలో ప్రియమేధాదులు కొందరు పుట్టారు. వారూ బ్రాహ్మణులైనారు.

ఆ అజమీఢునికి బృహదిషుడు జన్మించాడు. అతనికి బృహద్ధనువు, అతనికి బృహత్కాయుడు, అతనికి జయద్రథుడు జన్మించారు. జయద్రథునికి విశ్వజిత్తు, అతనికి సేనజిత్తు, అతనికి రుచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనే నలుగురు కుమారులు జన్మించారు. వారిలో రుచిరాశ్వునికి ప్రాజ్ఞుడు, అతనికి పృథుసేనుడు, అతనికి పారుడు, అతనికి నీపుడు జన్మించారు. ఆ నీపునికి నూరుగురు కుమారులు పుట్టారు. అంతేకాదు,

ఆ. శుకునికూఁతు రైన సుందరి సత్కృతిఁ, బొంది వేడ్క నీపభూవిభుండు విమలయోగవిత్తు విజ్ఞానదీపితో, దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె.



తా ॥ ఆ నీపవిభుడు శుకుని కుమార్తెయైన సత్కృతి అనే సుందరిని పొంది, విమలయోగవిదుడు, విజ్ఞానదీపుడు, ఉదారుడు అయిన బ్రహ్మదత్తుడు అనే కుమారుని పొందాడు.

వ. బ్రహ్మదత్తుండు, జైగీషవ్యోపదేశంబున, యోగతంత్రంబునఁ జేసి గోదేవి యను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె. విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు. వీరలు బార్హదిషవులను రాజులైరి. ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుడు, గృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుఁడు జనించిరి. సన్నతిమంతుకొడుకు కృతి యనువాఁడు, హిరణ్య నాభునివలన యోగమార్గం బెఱింగి, శోకమోహంబులు విడిచి, తూర్పు దేశంబున సామసంహిత పఠియించె. నతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు,

క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండుఁ, బురంజయునకు బహురథుడు జన్మించిరి. హస్తికొడుకు పురుమీఢునకు సంతతి లేదయ్యె. అ య్యజమీఢునికి నళిని యని భార్యయందు నీలుండు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురుజుండు, పురుజునికి నర్కుండు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య సృంజయు లను వా రేవురు పుట్టిరి.

656

తా ॥ ఆ బ్రహ్మదత్తుడు జైగీషవ్యుడనే మహాముని ఉపదేశానుసారం యోగతంత్రాన్ని అభ్యసించి, భార్య గోదేవి వలన విష్వక్సేనుడనే కుమారుని పొందాడు. విష్వక్సేనునికి ఉదక్సేనుడు, అతనికి భల్లాదుడనే కుమారుడు కలిగారు. వీరు బార్హదీషవులనే రాజులుగా చెప్పబడ్డారు.

ద్విమీఢునకు యవీనరుడు, అతనికి కృతిమంతుడు, అతనికి సత్యధృతి, అతనికి ధృఢనేమి, ఈ ధృఢనేమికి సుపార్శ్వకృత్తు, ఇతనికి సుపార్శ్వుడు, ఇతనికి సుమతి, సుమతికి సన్నతిమంతుడు కలిగారు.

సన్నతిమంతుని కుమారుడు కృతి. ఇతడు హిరణ్యనాభుని వలన యోగమార్గాన్ని తెలుసుకొని, దుఃఖాన్ని, మోహాన్ని విడిచి తూర్పు దేశంలో సామసంహిత పఠించాడు.

కృతి కుమారుడు ఉగ్రాయుధుడు. అతనికి క్షేమ్యుడు జన్మించాడు. ఇతని కుమారుడు సువీరుడు. సువీరుని కుమారుడు పురంజయుడు. అతనికి బహురథుడు జన్మించాడు.

హస్తి కుమారుడు పురుమీఢునికి సంతు కలుగలేదు. కాగా, అజమీఢునికి నళిని అనే భార్యవలన నీలుడు, అతనికి శాంతి, అతనికి సుశాంతి, సుశాంతికి పురుజుడు, అతనికి అర్కుడు, అర్కునికి భర్మ్యాశ్వుడు జన్మించారు. ఈ భర్మ్యాశ్వునికి ముద్గలుడు, యవీనరుడు, బృహదిషుడు, కాంపిల్యుడు, సృంజయుడు అనే అయిదుగురు కుమారులు జన్మించారు.

జైగిషవ్యోపదేశము : జిగీషుడనే ముని సంప్రదాయస్థునిచే కావింపబడిన బోధ. జిగీషుడు ఒక ప్రాచీన మహర్షి. అసితుడు, దేవలులతో స్మరింపబడ్డాడు. జైగీషవ్యేశ్వర అనే పేరుతో వారణాసిలో ఈశ్వర లింగము ఉంది.

క. మించిన భర్మ్యాశ్వుఁడు సుత, పంచకమును జూచి విషయపంచకమును వ
ర్జించితి మే మని పల్కినఁ, బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్.

657

తా ॥ తనవంటి అయిదుగురు కొడుకులు కలిగినందుకు భర్మ్యాశ్వుడు ఉప్పొంగి, 'మన పాలనలోని అయిదు విషయాలను (ప్రాంతాలను) నేను, వైరాగ్యం ఉదయించినవారు శబ్దస్పర్శాది విషయాలను వదలివేసినట్లు – మీ అయిదుగురికీ వదలి వేస్తున్నాను' అని, రాజ్యాన్ని కొడుకులైదుగురికీ పంచివేశాడు. ఆనాటినుంచి వారికి పంచాలురనీ, తన్మూలంగా పాంచాలురనీ పేరువచ్చింది.

విషయ పంచకము : అయిదైన విషయాలు. విషయము ఇక్కడ ఇంద్రియార్థకము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు విషయపంచకము. అవి వరుసగా చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనే పంచేంద్రియాల వలన గ్రహింపబడతాయి గనుక ఆ పేరు.

వ. అంత ముద్గలుని నుండి, బ్రాహ్మణకులంబై ముద్గలగోత్రంబు నా నెగడె, భర్మ్యాశ్వపుత్త్రుండైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్య యను కన్యకయునుం బుట్టిరి. అహల్య యందు గౌతమునికి శతానందుండు పుట్టె; శతానందునికి ధనుర్వేదవిశారదుండైన సత్యధృతి పుట్టె, అతనికి శరద్వంతుండు పుట్టె అతం డొక్కనాఁడు వనంబున నూర్వశిం గనిన, నతనికి, రేతః పాతంబై తద్వీర్యంబు శరస్తంబంబునంబడి, మిథునంబైన సమయంబున.

658

తా ॥ ఈ అయిదుగురిలో పెద్దవాడైన ముద్గలుని తరువాత అతని సంతతివారు బ్రాహ్మణులై ముద్గల గోత్రులుగా చెప్పబడ్డారు. ఈ ముద్గలునికి దివోదాసుడనే కుమారుడు, అహల్య అనే కుమార్తె జన్మించారు. ఈ అహల్య భర్త గౌతముడు. వారి కుమారుడు శతానందుడు. శతానందుని కుమారుడు ధనుర్వేదవిశారదుడైన సత్యధృతి. అతనికి శరద్వంతుడు కలిగాడు. అతడు ఒకనాడు ఊర్వశిని చూడగా అతనికి రేతస్సు పతనమైంది. ఆ వీర్యం రెల్లుదుబ్బుపై పడి, ఇద్దరు బిడ్డలు పుట్టారు. ఆ సమయానికి –

# పాంచాలాదుల వంశం

క. చపలరతి శంతనుండను, నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం గృపతో శిశుయుగముం గని, కృపియుం గృపుఁ డనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్.

659

తా ॥ శంతనుడనే మహారాజు మనస్సు ఉండబట్టలేక అడవికి వేట నిమిత్తంగా వచ్చాడు. వచ్చి, ఇద్దరు బిడ్డల్నీ చూసి, కృపతో తెచ్చి, వారిని కృపి, కృపుదు అనే పేర్లతో పెంచి పెద్దచేశాడు.

వ. ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె. దివోదాసునకు మిత్రాయువు, మిత్రాయువునకుఁ జ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుఁడు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు కొడుకులు గలిగిరి. వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు కడచూలు పృషతుండు. పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును, ద్రౌపది యను కూఁతురుం గల్గిరి. ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె. వీరలు పాంచాలరాజు లని యెఱుంగుము. మఱియు న య్యజమీఢుని కొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుం డుదయించె. ఆ సంవరుణుఁ డు తపతి యనెడి సూర్యకన్యక యందుఁ గురువుం గనియె. ఆ కురువుపేరం గురుక్షేత్రం బయ్యె. ఆ కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుండు నను వారలు నలువురు పుట్టిరి. అందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె. సుధనువునకు సుహోత్రుండు, నతనికి చ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, కృతికి నుపరిచరవసువు, వసువునకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర చేదిషాదులు పుట్టిరి. అందు, బృహద్రథునకుఁ గుశాగ్రుండు, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు, బుష్పవంతునకు జహ్ను వనువాఁడు జనియించిరి. మఱియును.

660

తా ॥ ఆ కృపి ద్రోణునికి భార్య అయింది. ఇక దివోదాసునికి మిత్రాయువు, అతనికి చ్యవనుడు, అతనికి సుదాసుడు, సుదాసునికి సహదేవుడు, అతనికి సోమకుడు, సోమకునికి సుజన్మకృత్తు, అతనికి, జంతువు, ఇంకా నూరుగురు కుమారులు కలిగారు. వారందరిలో చివరివాడు పృషదుడు. ఇతనికి ద్రుపదుడు జన్మించాడు.

ద్రుపదునికి ధృష్టద్యుమ్నుడు మున్నగు కుమారులు, ద్రౌపది అనే కుమార్తె జన్మించారు. ధృష్టద్యుమ్ననికి ధృష్టకేతువు జన్మించాడు. పాంచాల రాజులనేది వీరినే సుమా!

ఇక అజమీఢునికి ఋక్షుడు జన్మించాడు. ఋక్షుని కుమారుడు సంవరణుడు. ఈ సంవరణునికి సూర్యుని కుమార్తె అయిన తపతి వలన కురువు జన్మించాడు. ఆ కురువు పేరు మీదుగా ఏర్పడిందే కురుక్షేత్రం.

ఆ కురువుకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుడు అనే నలుగురు కుమారులు జన్మించారు. వీరిలో పరీక్షితునికి సంతతి కలగలేదు.

సుధనువుకు సుహోత్రుడు, అతనికి చ్యవనుడు, చ్యవనునకు కృతి, అతనికి వసువు జన్మించారు. ఈ వసువుకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర, చేది మున్నగువారు జన్మించారు. వీరిలో బృహద్రథునికి కుశాగ్రుడు, అతనికి ఋషభుడు అతనికి సత్యహితుడు, సత్యహితునికి పుష్పవంతుడు, అతనికి జహ్నువు అనేవారు జన్మించారు. అంతేగాక,

సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండు తను ఖండములు జనించెఁ;
దునుకలు గని తల్లి దొలఁగంగ వైచిన సంధించె నొకటిగా జర యనంగ
నొక దైత్యకాంత; వాఁడొప్పె జరాసంధుఁ డన; గిరివ్రజపుర మాతఁ డేలె;
నతనికి సహదేవుఁ; డతనికి సోమాపి తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు

తే. జహ్నుపుత్త్రుండు సురథుండు జనవరేణ్య!, యతనికొడుకు విదూరథుఁ; డతనిపట్టి

సార్వభౌముండు; వానికి సంభవుండు, విను జయత్సేనుఁ డనువాఁడు; విమలకీర్తి.

661

తా ॥ ఆ బృహద్రథునికి మరో భార్యయందు రెండు శరీరఖండాలు జన్మించగా, ఆమె వాటిని పారవేయించింది. జర అనే రాక్షసి, ఆ రెండు ముక్కల్నీ కలిపింది. అలా వాడు జరాసంధుడయ్యాడు. అతడు గిరివ్రజమనే పట్టణాన్ని పాలించాడు. అతని కుమారుడు సహదేవుడు. అతనికి సోమాపి జన్మించగా, అతనికి శ్రుతశ్రవుడు జన్మించాడు.

రాజా! ఇక జహ్నుని కుమారుడు సురథుడు. అతని కుమారుడు విదూరథుడు. అతనికి సార్వభౌముడు, అతనికి కీర్తిసంపన్నుడైన జయత్సేనుడు జన్మించారు.

వ. ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ; గ్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికి బ్రతీపుండుఁ; బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లికు లను మువ్వురు కొడుకులు పుట్టిరి. అందు.

662

తా ॥ ఆ జయత్సేనుని కుమారుడు రథికుడు. రథికునికి అయుతాయువు, అతనికి క్రోధనుడు, క్రోధనునికి దేవాతిథి, అతనికి ఋక్షుడు, అతనికి భీమసేనుడు, అతనికి ప్రతీపుడు జన్మించారు. ప్రతీపునికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అనే మువ్వురు కుమారులు జన్మించారు. వారిలో,

సీ. దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనంబున కేగెఁ దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శంతనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల
నేలుచుఁ గరముల నేవృద్ధు ముట్టిన వాఁడెల్ల నిండుజవ్వనము నొందు;
నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నఁ దానఁ బండ్రెండేండ్లు వజ్రి వర్షింపకున్న

ఆ. వృష్టిలేని చొప్పు విప్రుల నడిగిన, "నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దారసంగ్రహంబుఁ దాల్చినఁ" బరివేత్త, యంద్రు వాని నీవ యతఁడ వైతి.

663

తా ॥ దేవాపి రాజ్యం చేయడానికి ఇష్టపడక అడవులకు వెళ్ళిపోయాడు. పూర్వజన్మలో మహాభిషుడైన వాడు, ఇప్పుడు దేవాపికి తమ్ముడైన శంతనునిగా జన్మించాడు. అతడు ఈ భూమినంతటినీ పాలించాడు. అది అలా ఉండగా అతడు చేతులతో ముట్టుకున్న వృద్ధుడు యువకుడవుతాడు. సుఖంగా రాజ్యం చేస్తున్నాడు. అయితే ఇంద్రుడు పన్నెండేళ్ళపాటు వర్షాలు కురిపించలేదు.

అప్పుడు శంతనుడు వర్షాలు కురవకపోవడానికి కారణమేమిటని పండితశ్రేష్ఠులైన బ్రాహ్మణులను అడగ్గా వారు అన్న ఉండగా అగ్నిహోత్రాన్నీ, భార్యనూ పొందితే, అతనిని పరివేత్త అంటారు. ఇప్పటి నీ స్థితి అదే గదా!

వ. అట కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు, నీవు పరివేత్తవు. మీయన్నకు రాజ్యం బిచ్చిన, ననావృష్టి దోషంబు చెడు నని బ్రాహ్మణులు వల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు చెప్పి, రాజ్యంబు చేకొమ్మని పల్కె, అంతకు మున్న వాని మంత్రి దేవాపిని రాజ్యంబున కనర్హుం జేయఁ దలంచి విప్రులం బంచిన, నా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిరి. దేవాపి వేదంబుల నిందించినఁ బాషండుండును, దేవదూషకుండును గావున వానికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు సెప్పిన, శంతనుండును మగుడి వచ్చి, రాజ్యంబుఁ జేకొనియె. వర్షంబులు గురిసె. నివ్విధంబున.

664

తా ॥ అందువలన అన్న ఉండగా తమ్మునికి రాజ్యార్హత లేదు. నీవు ఇప్పుడు పరివేత్తవు

గనుక రాజ్యాన్ని మీ అన్నకు ఇస్తే, ఈ అనావృష్టి దోషం తొలగిపోతుందని చెప్పారు వారు. అంతట శంతనుడు అడవికి వెళ్ళి, అన్నగారైన దేవాపితో ప్రియవచనాలు పలికి, రాజ్యాన్ని స్వీకరించవలసిందిగా కోరాడు. అయితే, అంతకు పూర్వం వారి తండ్రి దేవాపిని రాజు చేయదలచి, విప్రులను పిలిచి, అతనికి ఉపదేశం చేయమని చెప్పగా, వారు దేవాపికి పాషండమతాన్ని మప్పారు. అలా దేవాపి వేదాలను, దేవతలను దూషింపసాగాడు. ఆ కారణంగా అతనికి రాజ్యార్హత లేదని బ్రాహ్మణులు చెప్పడంతో, చేసేది లేక శంతనుడు తిరిగివచ్చి, రాజ్యం చేయసాగాడు. వర్షాలు కూడా పడ్డాయి.

పాషండమతము : వేద ప్రామాణ్యాన్ని అంగీకరించకపోవటం.

క. దేవాపి కలాపపురం, బావాసము గాఁగ యోగియై యున్నాఁ డు
ర్వీవర! కలినష్టంబగు, జైవాత్రుకకులము మీఁద సంస్థాపించున్.

665

తా ॥ రాజా! ఆ దేవాపి కలాపపురాన్ని నివాసంగా చేసుకొని యోగిగా ఉంటున్నాడు. కలియుగాంతం అయిన తరువాత చంద్రవంశాన్ని తిరిగి స్థాపిస్తాడు.

వ. బాహ్లికుం డనువానికి సోమదత్తుండు పుట్టె, సోమదత్తునికి భూరియు, భూరిశ్రవస్సు, శలుండను వారు ముప్వురు పుట్టిరి.

666

తా ॥ ఇక బాహ్లికునికి సోమదత్తుడు, అతనికి భూరి, భూరిశ్రవసుడు, శలుడు అనే ముగ్గురు జన్మించారు.

క. భాతిగ శంతనునకు గం, గా తటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతి నయననీలోత్పల, భీతికర గ్రీష్ముఁడైన భీష్ముఁడు పుట్టెన్.

667

తా ॥ శంతనునికి, గంగానదికి విష్ణుభక్తశ్రేష్ఠుడూ, శత్రు భయంకరుడునైన భీష్ముడు జన్మించాడు.

ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప, నన్యునొకని నెఱుఁగ మతనిఁ దక్క
వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు, వేల్పుటేటిపట్టి విమలయశుఁడు.

668

తా ॥ అతడు గొప్ప సేనానాయకుడు. ధర్మాధర్మాలు తెలిసిన వివేకి. దివ్య గంగానది కుమారుడైన అతడు దైవసమానుడంటే నమ్ము! అంతేగాదు, పరశురాముని ఎదుర్కొని జయించినవాడు అతను తప్ప లోకంలో మరొకడు లేడంటే లేదు సుమా!

వ. ఆ శంతనునకు దాశకన్యకయైన సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టిరి. అందుఁ జిత్రాంగదుండు (చిత్రాంగదుండను) గంధర్వునిచేత నిహతుండయ్యె. మఱియును.
669

తా ॥ ఆ శంతను మహారాజుకే దాశరాజు కుమార్తె సత్యవతి యందు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వీరిలో చిత్రాంగదుడు గంధర్వులచేత సంహరింపబడ్డాడు. ఇక్కడ ఇంకో విషయం చెప్పాలి.

ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లముగానినాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము చేసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముల్
సత్యములైన వేదముల సాంగములన్ విభజింప దక్షుఁడై.

670

తా ॥ అదేమంటే – సత్యవతి శంతను మహారాజును పెండ్లాడటానికి పూర్వం, ఆమెకు పరాశరమహర్షి సాంగత్యం వలన, నిత్యమై సత్యమై విరాజిల్లే వేదాన్ని సాంగంగా విభజింప సమర్థుడైన ధీశాలి, వ్యాసుడు విష్ణ్వంశలో జన్మించాడు.

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు, పరమగుహ్యమైన భాగవతము నందనుండ నైన నాకుఁ జెప్పెను శిష్య, జనుల మొఱఁగి యేను జదువుకొంటి.

671

తా ॥ ఆ బాదరాయణుడు, వ్యాసుడు సాక్షాత్తూ భగవంతుడు, పుణ్యాత్ముడు. పరమ రహస్యమైన భాగవతం ఆయన ఉపదేశింపగా ఆయన కుమారుడనైన నేను, ఆయన శిష్యులూ చదువుకున్నాము.

వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల, నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునం దెచ్చి వివాహంబు చేసిన, విచిత్ర వీర్యుండు వారలం దగిలి మనోజరాగ మత్తుండై, చిరకాలంబు నానావిధక్రీడలన్ విహరించుచు, రాజయక్ష్మ పీడితుండై, మృతుండయ్యె. నంత.

672

తా ॥ అదలా ఉంచు. విచిత్రవీర్యునికి భీష్ముడు, కాశీరాజు కుమార్తెలైన అంబిక, అంబాలికలను బలవంతంగా తెచ్చి వివాహం చేశాడు. ఇక వారి తోడిదే లోకంగా, విచిత్రవీర్యుడు వారితో ఏ ప్రొద్దూ రాసక్రీడల్లో తేలియాడి, క్షయరోగపీడితుడై కాలం చేశాడు.

క. అతనిసతుల వలన సుతుల, సుత! కను మని తల్లి వనుప సొరిదిం గనియెన్ ధృతరాష్ట్ర పాండు విదురుల, నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా!

673

తా ॥ అంతట, రాజా! విచిత్రవీర్యుని భార్యల యందు పుత్రుల్ని కలిగించుమని కుమారుడు బాదరాయణుని, తల్లి సత్యవతీ దేవి ఆజ్ఞాపించగా, ఆయన వరుసగా ధృతరాష్ట్ర, పాండురాజ, విదురులకు తండ్రి అయ్యాడు.

వ. అందు, ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును, దుశ్శలయను కన్యకయునుఁ జన్మించిరి. మృగశాపభయంబునం జేసి, భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్ర ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను మువ్వురును, మాద్రిదేవి వలన నాసత్య ప్రసాదంబున నకుల సహదేవులను వారిద్దఱునుగా నేవురు పుట్టిరి. అయ్యేవురకును, ద్రుపదరాజపుత్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండు నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపియను నాగకన్యకయందు నిలావంతుడును, మణలూరుపతి పుత్త్రికయైన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్యతేజో విభవంబుల నఖిల రాజనికరంబునఁ బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించిరి. అందుఁ బభ్రువాహనుం డర్జునుని నియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె.

674

తా ॥ వారిలో ధృతరాష్ట్రునికి గాంధారి వలన దుర్యోధనుడు మున్నగు నూరుగురు కుమారులు, దుశ్శల అనే కుమార్తె జన్మించారు. మృగమిచ్చిన శాపం కారణంగా భార్యను కూడటానికి వీలులేని కారణాన పాండురాజు కుంతీదేవి యందు యమధర్మరాజు, వాయుదేవుడు, ఇంద్రుల వరప్రసాదాన యుధిష్ఠిర, భీమ, అర్జునులనే ముగ్గురు కుమారుల్ని;

మాద్రియందు అశ్వినీ దేవతల వరప్రసాదాన నకుల సహదేవులనే ఇద్దరిని, మొత్తం అయిదుగురు కుమారుల్ని పొందాడు. ఆ అయిదుగురికీ ద్రుపద మహారాజు కుమార్తె ద్రౌపది భార్య. ఆమెయందు ధర్మరాజు ప్రతివింధ్యుడు, భీముడు శ్రుతసేనుడు, అర్జునుడు శ్రుతకీర్తి, నకులుడు శతానీకుడు, సహదేవుడు శ్రుతకర్ముడు అనే కుమారులను పొందారు. వీరు గాక యుధిష్ఠిరునికి పౌరవతి వలన దేవకుడు; భీమునికి హిడింబ యందు ఘటోత్కచుడు, కాళి యందు సర్వగతుడు; సహదేవునికి విజయ యందు సుహోత్రుడు; నకులునికి రేణుమతి యందు నిరమిత్రుడు, అర్జునునికి ఉలూపి అనే నాగకన్య యందు ఇలావంతుడు, మణలూరు రాజకుమార్తె చిత్రాంగద యందు బభ్రువాహనుడు, సుభద్ర యందు శౌర్యము, ధైర్యము, తేజస్సులందు రాజులందరిలోను ఇలాంటివాడు మరొకడు లేడన్న ఖ్యాతిని పొందిన అభిమన్యుడూ కలిగారు. వీరిలో అర్జునుని నియోగానుసారం బభ్రువాహనుడు మాతామహుని గోత్రానికి వంశకర్త అయ్యాడు.

నియోగము : ఇది ధర్మశాస్త్రంలో పెక్కు విధాల నిర్వచించబడింది. సంతులేకుండా భర్త మరణించినప్పుడు, సంతతికోసం వితంతువుకు నియోగాన్ని కల్పించటం ప్రసిద్ధం. కొడుకులు లేనప్పుడు కుమార్తెకు జన్మించే కొడుకును తనకొడుకుగా దత్తస్వీకారం చేసుకొంటానని, వివాహానికి ముందే అల్లుని సమ్మతిని పొందడానికి పుత్రికా పుత్ర నియోగమని పేరు. కొడుకు ఉన్నప్పటికీ దౌహిత్రుడిని దత్త స్వీకారం చేసుకోవటం పుత్రీపుత్ర వరణమనే నియోగం.

ఉ. అన్యసుపూజ్య! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్ర మూ
ర్ధన్యుఁడు ధన్యమార్గణ కదంబ విదారిత వైరివీర రా
జన్యుఁడు జన్యభీత కురుసైన్యుఁడు సైన్య సమూహనాథ దృ
ఙ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్తయై.



తా ॥ పరీక్షిన్మహారాజా! మహానుభావా! నీ తండ్రి అభిమన్యుడు, రాజులందరికీ

తలమానికం. శత్రురాజులను తన బాణసమూహంతో చీల్చి చెండాడ సమర్థుడైన రాజశ్రేష్ఠుడు. కురుసైన్యంలో దడ పుట్టడానికి కారణమైనవాడు. సేనానాయకుల మెచ్చుకోలు చూపులకు పాత్రమైనవాడు. ఇంతటివాడు మరొకడు లేడు అన్న కీర్తి గాంచినవాడు. ఆయన కురువంశ కర్త అయినాడు.

వ. ఆ యభిమన్యునకు నుత్తర యందు నీవు జన్మించితివి.

676

తా ॥ ఆ మహానుభావుడైన అభిమన్యునికి ఉత్తర యందు నీవు జన్మించావు.

క. ద్రోణసుతు తూపువేఁడిమిఁ, బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన సం
త్రాణంబున బ్రతికితెకా, క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వమువేళన్.

677

తా ॥ రాజా! నీవు నీ తల్లి గర్భంలో శిశువుగా ఉండగా, ద్రోణాచార్యుని కుమారుడు అశ్వత్థామ వేసిన బాణతాపం వల్ల ప్రాణాలను కోల్పోయి, ఆ శ్రీహరి దయారక్షకత్వం వలన బ్రతికి బయటపడ్డావు.

వ. నీ కుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్రసేనులను నల్వురు. వీరలయందు.

678

తా ॥ నీ కుమారులు జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే నలుగురు. వీరిలో,

ఆ. నీవు తక్షకాహి నిహతుఁడ వని విని, సకలసర్పలోక సంహృతముగ సర్పయాగ మింక
జనమేజయుఁడు సేయఁ, గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు.

679

తా ॥ జనమేజయుడు, నీవు తక్షకుని శాపం వలన మరణించనున్నావని విని, అత్యంత కుపితుడై సమస్త సర్పలోక సంహారాన్ని కోరి సర్పయాగం చేయనున్నాడు.

వ. మఱియు నతఁడు సర్వధరణీ మండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయఁగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠియించి, కృపాచార్యుని వలన విలువిద్య నేర్చి, శౌనకుని వలన నాత్మ జ్ఞానంబునుం బడయం గలవాఁడు. ఆ శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుండు, నశ్వమేధజునికి నాసీమకృష్ణుండు, నాసీమకృష్ణునకు నిచకుండు జనియింతురు. ఆ నిచకుఁ డు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు, ఆతనికి నుప్తం ప్తునికిఁ జిత్రరథుండు, చిత్రరథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సుపీతుండు, సుపీతునికి నృచక్షుస్సు, నృచక్షుస్సుకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు పుట్టుదురు. వాఁడు నిర్వంశుండై, దేవర్షి సత్కృతుండై, కలియుగంబునందుఁ జనం గలవాఁడు.

680

తా ॥ అంతే కాదు. ఆయన సర్వ భూమండలాన్ని జయించి, కావషేయుని పౌరోహిత్యంలో, అశ్వమేధ యాగం చేస్తాడు. అతనికి శతానీకుడు జన్మించి యాజ్ఞవల్క్య మహర్షి వద్ద వేదం చదువుకుంటాడు. కృపాచార్యుని వలన విలువిద్య నేర్చుకుంటాడు. శౌనకుని వలన ఆత్మజ్ఞానాన్ని పొందుతాడు. అతనికి సహస్రానీకుడు జన్మిస్తాడు. అతనికి అశ్వమేధజుడు,

అతనికి ఆసీమకృష్ణుడు, అతనికి నిచకుడు జన్మిస్తారు. అయితే అప్పుడు హస్తినాపురం యమునా నదిచే ముంపుకు గురికావడం వలన, ఆయన కౌశాంబిలో నివసిస్తాడు.

నిచకునికి ఉప్తుడు, అతనికి చిత్రరథుడు, చిత్రరథునికి శుచిరథుడు, అతనికి వృష్టిమంతుడు, అతనికి సుషేణుడు, అతనికి సుపీతుడు జన్మిస్తారు. సుపీతునికి నృచక్షువు, అతనికి సుఖానిలుడు, అతనికి పరిప్లవుడు, అతనికి మేధావి, మేధావికి సునయుడు, అతనికి నృపంజయుడు, అతనికి దూర్వుడు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుడు, అతనికి సుదాసుడు, సుదాసునికి శతానీకుడు, అతనికి దుర్దమనుడు, అతనికి వహీనరుడు, వహీనరునికి దండపాణి, అతనికి మితుడు, మితునకు క్షేమకుడు, క్షేమకునికి బ్రహ్మక్షత్రుడు జన్మిస్తారు. అతనికి సంతు కలుగదు. అయితే దేవర్షి వలన మన్నన పొంది, కలియుగంలో కూడా ఉంటాడు.

క. జగతి నిటమీఁదఁ బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్ నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార! ధీర! సుభగవిచారా!

681

తా ॥ రాజా! ఇక మీదట ఈ ప్రపంచంలో పుట్టబోయే మగధ పరిపాలకులు, ఇతర ప్రభువులు, వేదాంతవేత్తలను గూర్చి చెబుతాను. సద్గుణ భూషణుడవు, ధీరుడవు, సదసద్వివేకవంతుడవు అయిన నీవు ఆలకింతువు గాక!

వ. జరాసంధపుత్త్రుండైన సహదేవునికి మార్జాలి, మర్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండును, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, కర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు

సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెదరని చెప్పి మఱియు నిట్లనియె.

682

తా ॥ జరాసంధుని కుమారుడైన సహదేవునికి మార్జారి జన్మిస్తాడు. అతనికి శ్రుతశ్రవుడు, అతనికి అయుతాయువు, అతనికి నిరమిత్రుడు, అతనికి సునక్షత్రుడు, అతనికి బృహత్సేనుడు జన్మిస్తారు. ఆ బృహత్సేనునికి కర్మజిత్తు, అతనికి శ్రుతంజయుడు, అతనికి విప్రుడు, విప్రునికి శుచి, అతనికి క్షేముడు, అతనికి సువ్రతుడు, అతనికి ధర్మనేత్రుడు, అతనికి శ్రుతుడు, శ్రుతునికి దృఢసేనుడు, ధృఢసేనునికి సుమతి, అతనికి సుబలుడు, సుబలునికి సునీతుడు, అతనికి సత్యజిత్తు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు పురంజయుడు జన్మిస్తారు' అని చెప్పి, శుకమహర్షి ఇంకా ఇలా చెప్పాడు:

ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ, ప్రముఖధరణిపతులు ప్రబలయశులు
వీరు కలియుగమున వెయ్యేండ్ల లోపలఁ, బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర!

683

తా ॥ 'రాజా! మగధ దేశ ప్రభువులు జరాసంధుడు మున్నగు ప్రముఖ రాజులూ, మంచి కీర్తిమంతులు. వీరంతా కలియుగంలో వేయి సంవత్సరాల లోపున జన్మించి చెల్లిపోతారు.

వ. యయాతికొడు కనువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండు ననువారు ముగ్గురు పుట్టి రందు సభానరునకుఁ గాలనాథుండు, కాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుఁడు, మహామనసునకు నుశీనరుండు, తితిక్షు వన నిరువురు జన్మించిరి. అందుశీనరునకు శిబియు, వనుండును, గ్రిమియు, దర్పుండు నన నలువురు జన్మించిరి. అందు శిబికి వృషదర్ప సువీర మద్ర కేకయులు నలువురు పుట్టరి. తితిక్షునకు

రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలి పుట్టిరి. ఆ బలిక్షేత్రమున దీర్ఘతముని వలన అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్రాంధ్రులను పేళ్ళు గలవారార్వురు కుమారులు పుట్టిరి. వారలు తూర్పు దేశంబునకు రాజులై, దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి. సువీరునకు సత్యరథుఁడు, సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టిరి. ఆ చిత్రరథుండు రోమపాదుండు నా బరఁగె,

684

తా ॥ ఇక యయాతి కొడుకు అనువుకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అనే ముగ్గురు జన్మించారు. వారిలో సభానరునికి కాలనాథుడు, అతనికి సృంజయుడు, అతనికి పురంజయుడు అతనికి జనమేజయుడు, అతనికి మహాశాలుడు, అతనికి మహామనసుడు జన్మించారు.

ఈ మహామనసునికి ఉశీనరుడు, తితిక్షువు అనే ఇద్దరు జన్మించారు. వారిలో ఉశీనరునికి శిబి, వన, క్రిమి, దర్పులు అనే నలుగురు కుమారులు జన్మించారు. వారిలో శిబికి వృషదర్ప, సువీర, మద్ర, కేకయులనే నలుగురు జన్మించారు. తితిక్షునకు రుశద్రథుడు, అతనికి హేముడు, అతనికి సుతపుడు, సుతపునికి బలి జన్మించారు.

ఆ బలికి అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులనే పేర్లు గల ఆరుగురు కుమారులు జన్మించి, తూర్పు దేశాలకు ప్రభువులై, వారేలిన దేశాలకు వారి పేర్లే పెట్టారు. సువీరునకు సత్యరథుడు, అతనికి దివిరథుడు, అతనికి ధర్మరథుడు, అతనికి చిత్రరథుడు జన్మించారు.

ఈ చిత్రరథుడనే రోమపాదుడని కూడా అంటారు.

# ఋష్యశృంగుని కథ

క. సంతతి లేని కతంబునఁ, జింతింపుచు నుండ నతని చెలికాఁ డగు ధీ మంతుఁడు దశరథుఁ డతనికిఁ, సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్.

685

తా ॥ ఈయనకు స్నేహితుడు దశరథుడు. రోమపాదునికి సంతానం లేక దిగులు పడుతుండగా, దశరథుడు శాంత అనే పేరుగల తన కుమార్తెను చిత్రరథునికి కుమార్తెగా ఇచ్చాడు.

వ. అంత రోమపాదుండు, దన కూఁతురు శాంత యని కైకొని మెలఁగుచుండ, నా రాజు రాజ్యంబునం గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి, విభాండక సుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి,

686

తా ॥ అలా రోమపాదుడు శాంతను తన కుమార్తెగా స్వీకరించాడు. కాలం జరుగుతుండగా, ఆయన రాజ్యంలో అనావృష్టి ఏర్పడింది. చాలా దిగులు పడ్డాడు రోమపాదుడు. విభాండక మహర్షి కుమారుడు ఋష్యశృంగుడు కనుక వచ్చినట్లయితే వర్షం పడుతుందని పెద్దలు చెప్పగా తెలుసుకున్నాడు.

క. ఆ రాజు ఋశ్యశృంగుని, ఘోరతపోనిరతుఁ దెచ్చుకొఱకై పనిచెన్ వారసతుల నేర్పరుల ను, దార స్తనభారభీరుతర మధ్యగలన్.

687

తా ॥ తెలుసుకొని, ఆ తపోనియమనిష్ఠుడైన ఋశ్యశృంగుని తన రాజ్యానికి కొనిరావడం కొరకు నేర్పరులు, భారమైన కుచసంపదతో వీగిపోతున్న నడుములు గల వేశ్యలను పంపాడు.

వ. వారునుఁ జని.

688

తా ॥ వారు వెళ్ళి,

ఆ. కాంతలార! మెకము గన్నది మొదలుగా, నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన, గోఁచి బిగియఁ గట్టకొనిన యా వడుగని, మత్తికాని రతికి మరపవలయు,

689

తా ॥ వారిలో వారు, 'ఓ తరుణీమణులారా! అడవిలో లేడికడుపున జన్మించింది మొదలుగా ఎన్నడూ ఆడువారి మొఖం అయినా చూడని గోచిపాతరాయడైన ఆ బ్రహ్మచారిని ఎలాగైనా మనము మన్మథక్రీడకు మరల్చాలి సుమా' అనుకున్నారు.

వ. అని పలుకుచు.

690

తా ॥ అలా అనుకొని,

క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ, బాడుచు నాలోక నిశితబాణౌఘములన్ వీడుచు దగ్గఱ నోడుచుఁ, జేడియ లాతపసి కడకుఁ జేరిరి కలఁపన్.

691

తా ॥ కనులకింపుగా నాట్యమాడుతూ, వీనులకు విందుగా పాడుతూ, చూపులనే పదనుతేరిన బాణసమూహాన్ని అతని పైకి ప్రసరింపచేస్తూ, దగ్గర చేరడానికి భయపడుతూ, ఎలాగైతేనేమి మెల్లగా అతన్ని మాటల్లో దింపడానికి ఆ తాపసి దగ్గరకు చేరారు.

వ. అ య్యవసరంబున వారలం జూచి.

692

తా ॥ అప్పుడు ఋష్యశృంగుడు వారిని చూసి,

సీ. మిళితానీలధమ్మిల్ల భారంబులు చారుజటావిశేషంబు లనియు
భర్మాంచ లోజ్జ్వల ప్రభదుకూలంబులు తతచర్మ వస్త్రభేదంబు లనియు
బహు రత్నకీలిత భాసురదామంబు లధికరుద్రాక్షమాలాదు లనియు
మలయజ మృగనాభి మహిత లేపంబులు బహువిధ భూతిలేపంబు లనియు

తే. మధుర గానంబు శ్రుతియుక్త మంత్రజాతు లనియు, వీణెలు దండంబు లనియు, సతుల
మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుదతపసి, వారిఁ దాపసులని డాయ వచ్చి మ్రొక్కె.

693

తా ॥ తుమ్మెదల గుంపుతో కూడిన వారి పెద్దవైన కొప్పులను చూసి, మునుల జటాభారాలని; బంగారు కాంతులతో మెరిసిపోతున్న వారి వస్త్రాలు, జంతు చర్మ వస్త్రభేదాలని; బాగా ఎక్కువగా రత్నాలు పొదిగిన హారాలను, అధికమైన రుద్రాక్ష మాలలని; చందనము కస్తూరి మొదలైన లేపన ద్రవ్యాలు విభూతి లేపనాలని; వారు చేస్తున్న గానం, శ్రుతిపూర్వక మంత్రధ్వనులని; వీణెలు మునుల చేతులలో ఉండే దండములని ఎన్నడూ అలాంటి వారిని చూసినవాడు కాకపోవడాన వారు తాపసులేనని భావించి, ఆ అమాయకుడైన ఋశ్యశృంగుడు వారి దగ్గరకు వచ్చి, వారికి నమస్కరించాడు.

వ. ఇట్లా వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచుచు, నగుచు డగ్గఱి.

694

తా ॥ అలా తమకు నమస్కరించిన అతనిని చూసి నవ్వుతూ సమీపించి,

సీ. సేమమే యని సతుల్ చేతుల గ్రుచ్చి కర్కశకుచంబులు మోవఁ గౌఁగిలించి

చిరతపోనియతి డస్సితి గదా యని మోముఁ గంఠంబు నాభియుఁ గలయఁ బుణికి
క్రొత్తదీవన లివి కొనుమని వీనుల పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి
మా వనంబుల పండ్లు మంచివి తిను మని పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి

ఆ. నూతనాజినంబు నును పిది మేలని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి మౌని మరగఁజేసి మాపర్ణశాలకుఁ, బోద మనుచుఁ గొంచుఁ బోయి రతని.

695

తా ॥ క్షేమమేనా! అంటూ చేతులతో దగ్గరకు తీసుకొని, తమ కఠినమైన కుచాలు అతనికి బాగా హత్తుకునేట్లుగా కౌగిలించుకున్నారు. అయ్యో! చాలాకాలంగా తపస్సు చేస్తూ బాగా చిక్కిపోయావు గదా! అంటూ ఆయన ముఖాన్ని, కంఠాన్ని, నాభిని పుణికారు. ఇవి దీవెనలివ్వటంలో క్రొత్త పద్ధతి అంటూ అతని చెవుల వద్ద తమ నాలుకలతో చప్పుళ్ళు చేశారు. మా తోటల్లో పండిన పండ్లివి, బాగా రుచిగా ఉంటాయి, తినమంటూ అనేకములైన తీయని పిండి వంటలను అతనికి పెట్టారు. ఇది క్రొత్తదైన మృగచర్మమంటూ, ఆయన గోచిని తీసివేసి, మృదువైన వస్త్రాన్ని కట్టబెట్టారు. అలా ఆయన్ని మాయమాటలతో మభ్యపెట్టి, మా పర్ణశాలకు వెళదాం రమ్మని, అతన్ని తమ వెంట తీసుకువెళ్ళారు.

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్ష పాశబద్ధుండై, వారల వెంటం జని రోమపాదుకడకుం బోయిన నతండు, దన ప్రియనందనయైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె. అ మ్మునీశ్వరుండు వచ్చిన వర్ష ప్రతిబంధదోషంబు చెడి వర్షంబు గురిసె. నంత.

696

తా ॥ అలా లేడి కడుపున పుట్టిన ఋష్యశృంగుడు, ఆ కాంతాజనాల కడకంటి చూపులనే పాశాలకు కట్టుబడిపోయి, రోమపాదుని వద్దకు వెళ్ళగా – అతడు తన గారాల బిడ్డయైన శాంతను వివాహం గావించి, తన రాజధానిలోనే ఉంచుకున్నాడు. అలా అతని రాక కారణంగా,

వర్షం పడటానికి గల ఆటంకం తొలగిపోయి, వర్షం కురిసింది.

ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ, నెఱింగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి యిష్టిచేసి సుతుల నిచ్చె నాతని కృపఁ బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల.

697

తా ॥ ఆ పిదప, రాజుగారికి సంతానం లేకపోవడాన్ని గమనించి, ఋష్యశృంగుడు ఇంద్రుని గూర్చి యజ్ఞం చేసి కుమారులు కలిగేట్లు చేశాడు. అలాగే దశరథుడు కూడా అతని కృప వలన కుమారుల్ని పొందాడు.

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండును, బృహత్కర్ముండు, బృహద్భానుండు ననువారు ముువ్వురును బుట్టిరి. అందు బృహద్రథునకు బృహన్మనస్సును, బృహన్మనస్సునకు జయద్రథుండును, జయద్రథునకు విజయుండును, విజయునకు సంభూతి యను భార్యయందు ధృతియు, నాధృతికి ధృతవ్రతుండును, ధృతవ్రతునకు సత్యకర్ముండును, సత్యకర్మునకు నతిరథుండును జనించిరి.

698

తా ॥ ఇక ఆ రోమపాదునికి చతురంగుడు; అతనికి పృథులాక్షుడు; అతనికి బృహద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు అనే ముగ్గురూ జన్మించారు. వారిలో బృహద్రథునికి బృహన్మనసుడు, అతనికి జయద్రథుడు, అతనికి విజయుడు జన్మించారు. విజయునికి సంభూతి అనే భార్య యందు ధృతి జన్మింపగా, ధృతికి ధృతవ్రతుడు, అతనికి సత్యకర్ముడు, అతనికి అతిరథుడు జన్మించారు.

గీ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద, బిడ్డఁ డుదితుఁడైన బెట్టెఁ బెట్టి గంగ నీట విడువఁ గని యతిరథుఁ డంతఁ, గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె.

తా ॥ ఈ కుంతి చిన్నతనంలో సూర్యుణ్ణి కోరి, అతని వలన ఆ కన్యకు మగబిడ్డ కలిగాడు. ఆ మగబిడ్డను పెట్టెలో పెట్టి గంగా ప్రవాహంలో విడువగా అతిరథుడు, ఆ బిడ్డను తెచ్చి కర్ణుడనే పేరుతో పెంచి పెద్ద చేశాడు.

వ. ఇ ట్లతిరథునకుఁ గానీనుండైన కర్ణుండు కొడకయ్యె. కర్ణునకు వృషసేనుండు పుట్టె. అ య్యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుం, డాగాంధారునకు ఘర్మండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతస్సు జనించిరి. ప్రచేతస్సునకు నూర్గురు పుట్టి, మ్లేచ్ఛాధిపతులై, యుదీచీదిశ నాశ్రయించిరి. తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుడు, భానుమంతునకుఁ ద్రిసానువు, త్రిసానువునకుఁ గరంధముండు, కరంధమునకు నుదార చిత్తుండైన మరుత్తుండును బుట్టరి. అతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె. వినుము.

700

తా ॥ అలా, కన్యకు పుట్టడం కారణంగా కానీనుడైన కర్ణుడు అతిరథునికి కుమారుడైనాడు. కర్ణుని కుమారుడు వృషసేనుడు. ఇక, యయాతి కుమారుల్లో ద్రుహ్యుడనే వానికి బభ్రుసేతువు జన్మించాడు. అతనికి ఆరబ్ధుడు, అతనికి గాంధారుడు, గాంధారునికి ఘర్మడు, అతనికి ఘృతుడు, ఘృతునికి దుర్మదుడు అతనికి ప్రచేతసుడు జన్మించారు.

ప్రచేతసునికి నూరుగురు కుమారులు జన్మించి మ్లేచ్ఛులై ఉత్తర దిక్కుకు వెళ్ళిపోయారు. ఇక యయాతి మరో కొడుకు తుర్వసుడు గదా! అతనికి వహ్ని, అతనికి భర్గుడు, భర్గునికి భానుమంతుడు, అతనికి త్రిసానువు, త్రిసానువుకు కరంధముడు, అతనికి మరుత్తుడు జన్మించారు. యయాతి శాప కారణంగా మరుత్తుకు సంతానం కలుగలేదు. మిగిలిన సంగతి

## యదువంశ చరిత్రము

చ. అనఘ! యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశమున్
వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న
య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్
వినుము నరేంద్ర! నీకు నిది వీనుల పండువు గాఁగఁ జెప్పెదన్.

701

తా ॥ ఓ పుణ్యచరిత్రా! పరీక్షిన్మహారాజా! యయాతి పెద్ద కొడుకు యదువు కదా! అతని వంశ చరిత్ర విన్న, చదివిన నరునికి ఇక మరుజన్మమంటూ లేదయ్యా, ముక్తిని పొందుతాడు. కారణ మేమిటనుకుంటున్నావు! ఇదిగో ఇలాంటి వాడు అని మరొకరితో పోల్చి చెప్పడానికి వీలులేని ఆ శ్రీమహావిష్ణువు మానవరూపాన సాక్షాత్తూ ఈ యదువంశంలోనే గదుటయ్యా జన్మించింది! అదీ ఆ ఘనతకు కారణం. ఆ చరిత్ర వినిపిస్తాను. వీనులకు విందుగా ఆకర్ణించు! అని చెప్పనారంభించాడు.

వ. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు ననువారు నలువురు సంభవించిరి. అందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె. ఆ శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హేహయులను వారు ముచ్వురు పుట్టిరి. అందు హేహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుడు, మహిష్మంతునకు భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజుఁడను నలువురు సంభవించిరి. అందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె. అతడు మహాబుద్ధి బలంబున.

702

తా ॥ యదువుకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుదు, రిపుదు అని నలుగురు కుమారులు

జన్మించారు. వారిలో పెద్దవాడైన సహస్రజిత్తుకు శతజిత్తు కలిగాడు. అతనికి మహాహయ, వేణుహయ, హేహయులనే ముగ్గురు కుమారులు కలిగారు. వీరిలో హైహయునికి ధర్ముడు, అతనికి నేత్రుడు, నేత్రునికి కుంతి, అతనికి మహిష్మంతుడు, మహిష్మంతునికి భద్రసేనుడు. అతనికి దుర్మదుడు, దుర్మదునికి ధనికుడు, అతనికి కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ, కృతౌజులనే నలుగురు కుమారులు జన్మించారు. వారిలో కృతవీర్యునికి అర్జునుడు జన్మించాడు. అతను బుద్ధిబలాతిశయంతో.

సీ. హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది
బహు యజ్ఞ దాన తపంబులు గావించి సకల దిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరినామ సంకీర్తనము సేసి ధనముల నొంది యుదారవృత్తి
యెనుబదియైదువే లేండ్లు భూచక్రంబు ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె;

ఆ. ముదిమి లేక తరుణమూర్తియై యురుకీర్తి, నమరెఁ గార్తవీర్య దనఁగ విభుఁడు; నిజము
వానిభంగి నేల యేలిన యట్టి, రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య!

703

తా ॥ రాజేంద్రా! ఆ అర్జునుడు, శ్రీహరి అంశలో జన్మించిన దత్తాత్రేయుని సేవించి, యోగసిద్ధిని పొంది చాలా యజ్ఞాలు, దానాలు, తపస్సులు చేశాడు. దిక్కులన్నింటినీ జయించాడు. ఏ వేళా సంకీర్తన గావిస్తూ, ఎన్నో సంపదలను పొందాడు. ఎంతో ఉదారంగా ఎనభై అయిదు వేల సంవత్సరాలు ఈ భూమండలాన్ని పాలించి కీర్తికి మరో పేరైనాడు. వృద్ధాప్యమనేది ఎరుగక ఎప్పుడూ యువకునిగా ఉంటూ గొప్ప కీర్తితో, కార్తవీర్యుడు అనిపించుకున్నాడు. అతని వలె పాలించిన ప్రభువు మరొకడు లేడంటే, ఆ మాట సత్యమనుకో!

వ. ఆ యర్జుననకుం గల పుత్త్రసహస్రంబునం బరశురాముని బారికిం దప్పి జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుం దనువా రేవురుం బ్రతికిరి. జయధ్వజునుకు దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున

నూర్వురు కొడుకులుఁ గలిగిరి. అందుఁ బ్రథముండు వీతిహోత్రుండు. మధువునకు వృక్ణుండు, వృక్ణునకుఁ బుత్త్ర శతంబు వుట్టె, నందుఁ బ్రథముండు వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యా వంశంబుల వారు మాధవులు, వృష్ణులు యాదవులు ననం బరఁగిరి. యదుపుత్రుండయిన క్రోష్టువునకు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి.

704

తా ॥ అతనికి గల వేయిమంది కుమారుల్లో జయధ్వజుడు, శూరసేనుడు, ఋషభుడు, మధువు, ఊర్జితుడు అనే అయిదుగురు మాత్రం పరశురాముని బారిన పడకుండా తప్పించుకున్నారు. వారిలో జయధ్వజునికి తాళజంఘుడు జన్మించగా, అతనికి ఔర్వముని తేజస్సు కారణంగా నూరుగురు కొడుకులు కలిగారు. వారిలో మొదటివాడు వీతిహోత్రుడు.

ఇక మధువుకు వృక్ణుడు జన్మించగా, అతనికి నూరుగురు జన్మించారు. వారిలో మొదటివాడు వృష్ణి.

ఈ మధువు, వృష్ణి, యదువుల వంశం వారు మాధవులు, వృష్ణులు, యాదవులుగా పరిగణింపబడ్డారు.

యదు పుత్రుడైన క్రోష్టువుకు వృజినవంతుడు, అతనికి శ్వాహితుడు, శ్వాహితునికి భేరుశేకుడు అతనికి చిత్రరథుడు జన్మించారు. చిత్రరథుని కుమారుడు శశిబిందుడు.

మ. కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్త్రుల్ భక్తి సేయం జతు
ర్దశ రత్నుండును యోగినాఁ బరఁగి సప్తద్వీప రాజేంద్రుఁడై
శశిబిందుం డురునీతిమంతుఁ డమరెన్ సత్కాంతి పూర్ణేందుఁడై.

తా ॥ ఆ శశిబిందు మహారాజు – ఆయనకు సన్నగా నాజూకైన నడుములు గల భార్యలు పదివేలమంది. వారితో ఎంతో హాయిగా కాలం గడిపేవాడు. వారి వలన ఆయనకు పదివేల లక్షల మంది కుమారులు కలిగారు. వారంతా తండ్రిని భక్తి ప్రపత్తులతో సేవించేవారు. పధ్నాలుగు రత్నాలూ ఆయన దగ్గర ఉండేవి. అలా ఉండటం ఒక యోగం కదా! ఆ నీతిమంతుడు, ఆ రాజేంద్రుడు పూర్ణబింబపు చంద్రకాంతి వంటి కీర్తితో సప్త ద్వీపాలను పాలించాడు.

చతుర్దశరత్నుడు : పధ్నాలుగు విలువైన రత్నాలు కలిగినవాడు. ఏనుగు, గుఱ్ఱము, రథము, అస్త్రము, శస్త్రము, నిధి, మాల వస్త్రము, వృక్షము, శక్తి, పాశము, మణి, ఛత్రము, విమానములు.

సప్తద్వీపాలు : ఈ ప్రపంచం సప్త ద్వీపవిలసితం, సప్తద్వీపా వసుంధరా అని సంభావిస్తారు. అవి జంబువు, ప్లక్షము, శాల్మలీ, కుశము, క్రౌంచము, శాకము, పుష్కరము అనేవి.

వ. అతని కొడుకుల మొత్తంబునకు ముఖరులైన యార్వురలోఁ బృథుశ్రవుండును, వానికి ధర్ముండు వుట్టె. ధర్మునకు నుశనుండు వుట్టి నూ అశ్వమేధంబులు సేసె. అ య్యుశనునకు రుచకుండు వుట్టె. ఆ రుచకునకుఁ బురుజిత్తు, రుక్ముండు, రుక్మేషువు, పృథువు, జ్యామఖుండు నను వా రేవురు పుట్టిరి. అందు జ్యామఖుండు.

706

తా ॥ ఆయన కొడుకులందరిలో ముఖ్యులైన మొదటి ఆరుగురిలో పృథుశ్రవుడనే వానికి ధర్ముడు జన్మించాడు. ఆయనకు ఉశనుడనే వాడు జన్మించి, నూరు అశ్వమేధయాగాలు చేశాడు. అతనికి రుచకుడు జన్మించాడు. రుచకునికి పురుజిత్తు, రుక్ముడు, రుక్మేషువు, పృథుడు,

జ్యామఖుడు అనే అయిదుగురు కలిగారు. వారిలో జ్యామఖుడు.

సీ. తొ్రటుకొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గైకొన కొకకొంత కాలంబునకుఁ బోయి పగవారియింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ జననాథుఁ గన్యను శైబ్య చూచి
కోపించి మానవకుహక! యీ పడుచును దెచ్చియు నేనుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు వలుకంగ, నతఁడు పలికె నంత నతివతోడ నాకుఁ గోడ
లింత నమ్ము మీ లలితాంగి, సవతి గాదు వినుము సత్య మనుచు.

707

తా ॥ సంభ్రమాశ్చర్యాలను కలుగజేసే అపురూప సౌందర్యవతి అయిన భార్య శైబ్యతో ఎంతో ఆనందంగా ఉండేవాడు. కాని సంతానం కలుగలేదు. అయినా అతడు మరెవరినీ పెళ్ళి చేసుకున్నాడు కాదు. అయితే కొంతకాలం తరువాత, తన పగవారింటనున్న ఒక కన్యను బలవంతంగా తన రథంపై తీసుకొని వచ్చాడు. అంతట శైబ్య ఆయనతో, 'నీవు మోసగాడివి. కాకపోతే నేనుండగా, మరోదానిని రథంపై తెచ్చావు. ఇదేం పని?' అంటూ తూలనాడింది. అయితే జ్యామఘుడు 'ఆమెతో అలా కాదు, ఈమె నీకు సవతి కాదు, నాకు కోడలు సుమా!' అని ప్రమాణపూర్వకంగా చెప్పాడు.

వ. అ య్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి, విశ్వేదేవతలును, బితృదేవతలును సంతసించిరి. వారల ప్రసాదంబున.

708

తా ॥ అలా విశ్వేదేవతలు, పితృదేవతలు, శైబ్యకు కొడుకు జన్మిస్తాడని తెలుసుకొని ఎంతో సంతోషించారు. వారి అనుగ్రహం కారణంగా

క. తనసవతి మొఱఁగి పెనిమిటి, తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెన్ దనయుఁ గని జ్యామఖుండును, దనతెచ్చిన కన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్.

709

తా ॥ శైబ్య, విదర్భుడనే కుమారుని కన్నది. అంతట జ్యామఖుడు తాను తెచ్చిన కన్యను కుమారునికి ఇచ్చి వివాహం చేశాడు.

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును, గ్రుథుండును, రోమపాదుండునుం బుట్టిరి. రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, కృతికి నుశికుండు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు పుట్టిరి. క్రుథునకుఁ గుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు. నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, కుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, కురువశునకు ననువు, అనువునకుఁ బురుహోత్రుండు, నతనికి నంశువు, నతనికి సాత్త్వతుండు, సాత్త్వతునకు భజమానుండును, భజియు, దివ్యుండును, వృష్టియు, దేవాపృథుండును, నందకుండును, మహాభోజుండు నను నేడ్గురును బుట్టిరి. అందు భజమానునకుఁ బ్రథమభార్య యందు నిమ్రోచి కంకణ వృష్ణులు మువ్వురును, రెండవభార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు నను మువ్వురును బుట్టిరి. అందు దేవాపృథునికి బభ్రువు పుట్టె. వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియించుదురు. అట్టి శ్లోకార్థం బెట్టిదనిన.

710

తా ॥ విదర్భునికి, ఆ కాంత యందు కుశుడు, క్రుథుడు, రోమపాదుడు అనే కుమారులు కలిగారు. రోమపాదునికి బభ్రువు, అతనికి విభువు, అతనికి కృతి, అతనికి ఉశికుడు, ఉశికునికి చేది, అతని వంశంలో శిశుపాలుడు మొదలయిన చైద్యులు జన్మించారు.

క్రథునికి కుంతి, అతనికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, అతనికి దశార్హుడు, అతనికి వ్యోముడు, వ్యోమునికి జీమూతుడు, అతనికి వికృతి, వికృతికి భీమరథుడు, అతనికి నవరథుడు, అతనికి దశరథుడు, దశరథునికి శకుని, శకునికి కుంభి, అతనికి దేవరాతుడు, అతనికి దేవక్షత్రుడు, అతనికి మధువు, మధువుకు కురువశుడు, అతనికి అనువు, అనువుకు పురుహోత్రుడు, అతనికి అంశుడు, అతనికి సాత్వతుడు, సాత్వతునికి భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవావృధుడు, అంధకుడు, మహాభోజుడు అనే ఏడుగురు కుమారులు జన్మించారు.

వీరిలో భజమానునికి మొదటి భార్యయందు నిమ్రోచి, కంకణ, వృష్టులనే ముగ్గురు జన్మించగా; రెండవ భార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అనే ముగ్గురు పుట్టారు. దేవావృధునికి బభ్రువు జన్మించాడు. ఈ తండ్రీ కొడుకుల గొప్పదనాన్ని పెద్దలు శ్లోకరూపంలో పఠిస్తూ ఉంటారు. ఆ శ్లోక భావం ఏమంటే,

తే. వినుము దూరంబునం దేమి వినుచు నుందు, మదియు చూతుము దగ్గఱ నరుగుదేర
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు, యోజ దేవావృధున కెన యొరుఁడు గలఁడె?

711

తా ॥ "దూరంగా ఏది వింటూ ఉంటామో, దగ్గరకు వచ్చినప్పుడూ అదే కళ్ళెదుట కన్పిస్తూ వుంటుంది. మానవులలో బభ్రువును మించినవాడు మరొకడు లేడు. అలాగే దేవావృధు సమానమైన వాడూ లేడు సుమా!" అని.

క. పదునాలుగు వేవురు నఱు, వదియేవురు నరులు ముక్తి పడసిరి బభ్రుం
డుదితుఁడు దేవావృధుఁడును, బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతనన్.

712

తా ॥ బభ్రుడు, జ్ఞానసంపన్నుడైన దేవావృధుడు యోగక్రమాన్ని ఉపదేశించడం వల్ల పధ్నాలుగు వేల అరవై అయిదుగురు మానవులు ముక్తిపదాన్ని చేరుకున్నారు.

వ. మహాభోజుం డతిధార్మికుండు. వాని వంశంబువారు భోజులని పలుకం బడిరి. వృష్టికి సుమిత్రుండును, యుధాజిత్తును జన్మించిరి. అందు యుధాజిత్తునకు శినియు, అనమిత్రుండును జనించిరి. అనమిత్రునికి నిమ్నుండు, నిమ్నునికి సత్రాజితుండు, ప్రసేనుండు నన నిరువురు పుట్టిరి, మఱియు ననమిత్రునికి శినియను వాఁడు వేఱొకండుఁ గలఁడు, అతని పుత్త్రుండు సత్యకుండు, అతనికి యుయుధానుం డనం బరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుండును, జయునకుం గుణియు, నాగుణికి యుగంధరుండును బుట్టిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్నియను వేఱొక కొడుకుం గలఁడు. వానికి శ్వఫల్కచిత్రకులు గలిగిరి. అందు శ్వఫల్కునకు గాందిని యం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్ముండును, క్షత్రోపేక్షుండును, అరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, ప్రతిబాహువు ననువారు పన్నిద్దఱు కొడుకులును, సుచారువను కన్యకయుం జనించిరి. వారియం దక్రూరునికి దేవలుండును, అనుపదేవుండును బుట్టిరి. మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విడూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కండ్రు వృష్ణి వంశ జాతు లయిరి. భజమానుండు, కుకురుఁడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునికిఁ బుట్టిరి. కుకురునకు వృష్ణి, వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునికి కపోతలోముండు, కపోతలోమునికిం దుంబురు సఖుండైన యనువు, అనువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, ఆతనికి ఆహుకుం డను కుమారుండును, ఆహుకి యను కన్యకయుం గలిగిరి. ఆ యాహుకునికి దేవకుండు, ఉగ్రసేనుండు నన నిరువురు జన్మించిరి. అందు దేవకునికి దేవలుండు, అనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుండన నలుగురు గలిగిరి. వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, ఉపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి.

తా ॥ ఇక మహాభోజుడున్నాడే! అతడు గొప్ప ధార్మికుడు. ఆయన వంశం వారిని భోజులంటారు. వృష్ణికి సుమిత్రుడు, యుధాజిత్తు జన్మించారు. వారిలో యుధాజిత్తుకు శిని, అనమిత్రుడు పుట్టారు. అనమిత్రునికి నిమ్నుడు, అతనికి సత్రాజితుడు, ప్రసేనుడు అనే ఇరువురు పుట్టారు. అనమిత్రునికి శిని అనే మరో కుమారుడు కూడా ఉన్నాడు. అతనికి సత్యకుడనే కుమారుడు జన్మించాడు. ఈ సత్యకునికి యుయుధానుడనే సాత్యకి జన్మించాడు. అతనికి జయుడు, జయునికి కుణి, అతనికి యుగంధరుడు జన్మించారు.

అనమిత్రునికి పృశ్ని అనే మరో కొడుకున్నాడు. అతనికి శ్వఫల్కుడు, చిత్రకుడు అనే ఇరువురు కుమారులు కలిగారు. వారిలో శ్వఫల్కునికి గాందిని అనే ఆమె యందు అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదురుడు, మృదుపచ్ఛివుడు, వర్మదృక్కు, ధృష్టవర్ముడు, క్షత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదీనుడు, ప్రతిబాహువు అనే పన్నెండు మంది కొడుకులు, సుచారువు అనే కుమార్తె పుట్టారు.

వారిలో అక్రూరునికి దేవలుడు, అనుపదేవుడు అనేవారు జన్మించారు. చిత్రకునికి పృథుడు, విదూరథుడు మొదలైన కుమారులు చాలామంది కలిగారు. వీరంతా వృష్ణివంశం వారు. అంధకునికి భజమానుడు, కుకురుడు, శుచి, కంబలబర్హిషుడు అనే నలుగురు జన్మించారు. కుకురునికి వృష్ణి, అతనికి విలోమతనయుడు, అతనికి కపోతరోముడు, కపోతరోమునికి తుంబురుని స్నేహితుడైన అనువు, అతనికి దుందుభి, దుందుభికి దవిద్యోతుడు, అతనికి పునర్వసువు, అతనికి ఆహుకుడనే కుమారుడు, ఆహుకి అనే కుమార్తె కలిగారు.

ఆహుకుని కుమారులు దేవకుడు, ఉగ్రసేనుడు అనేవారు. వీరిలో దేవకునికి దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వీరికి ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనే వారు తోబుట్టువులుగా జన్మించారు.

క. అసదృశ లలితాకారలఁ, గిసలయ కరతలల దేవకీముఖ్యలు నా
బిసరుహనయనల నందఱ, వసుదేవుఁడు పెండ్లి యాడె వసుధాధీశా!

714

తా ॥ రాజా! సాటిలేని సౌందర్యమూర్తులు, తామరవంటి కన్నులు కలిగిన దేవకి మొదలైన వారినందరినీ వసుదేవుడు వివాహం చేసుకున్నాడు.

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, తుష్టిమంతుండు నను కొడుకులును; కంసయు, కంసవతియు, సురాభువు, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టిరి. వారు వసుదేవానుజ భార్యలైరి. భజమానునికి విదూరథుండును, విదూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండు, హృదికునకు దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయు నను కొడుకులు గలిగిరి. ఆ దేవమీఢుండు శూరుండు ననంబడు. శూరునికి మారిష యను భార్య యందు వసుదేవుండును, దేవభాగుండును, దేవశ్రవుండును, ఆనకుండును, సృంజయుండును, శ్యామకుండును, కంకుండును, అనీకుండును, వత్సకుండును, వృకుండు ననువారు పదుగురు కొడుకులును; పృథయు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు, రాజాధి దేవియు నను కూఁతు లేవురును బుట్టిరి. అందు—

715

తా ॥ దేవకుని తోబుట్టువైన ఉగ్రసేనునికి కంసుడు, న్యగ్రోధుడు, సునామకుడు, గహ్వుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతుడు అనే కుమారులు; కంస, కంసవతి, సురభూమి, రాష్ట్రపాలిక అనే కుమార్తెలూ కలిగారు. వీరంతా వసుదేవుని తమ్ములకు భార్యలైనారు.

భజమానునికి విదూరథుడు జన్మించగా అతనికి శిని, శినికి భోజుడు, భోజునికి హృదికుడు కలిగారు. వీరిలో హృదికునికి దేవమీఢుడు, సతధనువు, కృతవర్మ అనే కుమారులు కలిగారు. దేవమీఢుడైన శూరునికి మారిష అనే భార్య యందు వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, అనీకుడు, వత్సకుడు, వృకుడు అనే పదిమంది కుమారులు; పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, రాజాధిదేవి అనే అయిదుగురు కుమార్తెలు జన్మించారు.

# వసుదేవుని వంశక్రమానువర్ణనము

ఉ. ధీనయశాలియైన వసుదేవుఁడు పుట్టిన వెంట మింటిపై
నానక దుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై
మానుగఁ బుట్టునంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్.

716

తా ॥ పరీక్షిన్మహారాజా! వారిలో ధీమంతుడు, నీతికోవిదుడు అయిన వసుదేవుడు జన్మించినప్పుడు ఆకాశవీధిలో దేవతలందరూ సంతోషింపగా, ఈయనకు శ్రీమహావిష్ణువు కుమారునిగా జన్మిస్తాడంటూ భేరీలూ, దుందుభులూ ఒక్క పెట్టున మ్రోగాయి. ఆ కారణంగా ఆయనను 'ఆనక దుందుభి' అన్నారు.

క. తన చెలికాఁడగు కుంతికిఁ, దనయులు లేకున్నఁ జూచి తన తనయఁ బృథన్ దనయఁగ
నిమ్మన శూరుఁడు, దనయందుల మైత్రి నిచ్చె ధరణీ నాథా!

717

తా ॥ రాజా! స్నేహితుడైన కుంతిభోజుడు తనకు కుమారులు లేరు గనుక ఆయన కుమార్తెనిమ్మని కోరగా, స్నేహధర్మాన్ని పాటించి, శూరుడు తన కుమార్తె పృథను ఇచ్చాడు.

వ. అ య్యింతి కుంతిభోజుని యింటం బెరుగుచుండ, నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన న మ్మహాత్మునకుఁ గొన్ని దినంబులు పరిచర్యలు చేసి వేల్పులం జేరంజీరు విద్య వడసి, యా విద్య లావెఱుంగ నొక్క నాఁడేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి, వెఱఁగువడి యిట్లనియె.

718

తా ॥ ఆమె కుంతిభోజుని ఇంట పెరుగుతోంది. ఒకనాడు దుర్వాసమహర్షి వచ్చి ఆయన ఇంట విడిది చేసిన సందర్భంలో ఆమె ఆయనకు సపర్యలు చేసి, ఆయన వలన దేవతలను ప్రత్యక్షం కావించుకొనే విద్యను పొందింది. ఒకరోజు ఏకాంతంగా ఉన్న వేళ ఆమె ఆ విద్య ప్రభావాన్ని తెలుసుకోగోరి సూర్యుని రప్పించింది. ఆయన ప్రత్యక్షం కాగా, ఆమె చాలా ఆశ్చర్యానికి, భయానికి లోనయింది. సూర్యునితో ఇలా పలికింది:

క. మంత్ర పరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ! మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరన్, మంత్రించిన తప్పు సైచి మరలు దినేశా!

719

తా ॥ "మహాత్మా! సూర్యదేవా! మంత్ర ప్రభావాన్ని పరీక్షిద్దామని ఇలా చేశాను తప్ప, నీతో మన్మథతంత్ర సౌఖ్యాన్ని అనుభవిద్దామని కాదు. కనుక నన్ను మన్నించి మీరు వెళ్ళిపోవలసింది!" అని ప్రార్థించింది.

వ. అనిన న య్యువిదకుం బద్మినీవల్లభుం డిట్లనియె.

720

తా ॥ అప్పుడు, సూర్యభగవానుడు ఆమెతో ఇలా అన్నాడు:

మ. తెఱవా! నీ పలుకట్ల యౌ. వినుము లే దేవోత్తమాహ్వానముల్
మొఱగంబోలునె? వేల్పులం బడయుటల్ మోఘంబు లే నీకు నీ
తఱి గర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు; నీ తారుణ్యముం బూజ్యమౌ
వెఱవం గార్యము లేదు; సిగ్గు దగునే? వ్రీడావినమ్రాననా!

721

తా ॥ 'కన్యకా! నీ మాట అలా ఉంచు! దేవతలను ఆహ్వానించటం – అదేమంత

తక్కువైన పనా? పిలిచి కాదనవచ్చునా? దేవతల ప్రత్యక్షం – ప్రయోజనరహితం కావడం ఎలా? నీకు ఇప్పుడు చూలు నిలుస్తుంది. కుమారుడు కలుగుతాడు. నీ యౌవనమూ సార్థకమవుతుంది. కనుక భయపడాల్సింది లేదు. అలా సిగ్గుతో మోము దించుకోవాల్సిన పనీ లేదు సుమా!'

చ. అని తగ నీయకొల్పి లలితాంగికి గర్భము సేసి మింటికిన్
జనియె దినేశ్వరుం డపుడు చక్కని రెండవ సూర్యుఁడో యనన్
దనరెడు పుత్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీతయై
తనయుని నీటఁ బోవిడిచి తా నరిగెం బృథ దండ్రియింటికిన్.

722

తా ॥ అని ఆమెను అంగీకరింపచేసి, ఆమెకు చూలు నిలిపి సూర్యుడు వెళ్ళిపోయాడు. రెండవ సూర్యుడు కాబోలునన్నంత తేజంతో వెలిగిపోతున్న బిడ్డను ప్రసవించిందామె. కాని లోకాపవాదానికి వెరచి, దయమాలి బిడ్డను ఒక బుట్టలో ఉంచి నీటిలో విడిచి, ఆమె ఇంటికి వెళ్ళిపోయింది.

వ. అ య్యువిదను నీ ప్రపితామహుండైన పాండురాజు వివాహం బయ్యె. అ య్యంగనకుఁ బాండురాజు వలన ధర్మజ, భీమార్జునులు పుట్టిరి, అమ్మగువచెల్లెలగు శ్రుతదేవను, గారూషకుండైన వృద్ధశర్మ పెండ్లియాడె. అయ్యిద్దఱకును ముని శాపంబున దంతవక్రుండను దానవుండు జన్మించె. దాని తోడంబుట్టువగు శ్రుతకీర్తినిఁ గేకయుండు పెండ్లియాడె. ఆ దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు పుట్టిరి. దాని భగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె. ఆ మిథునమునకు విందానువిందులు సంభవించిరి. చేది దేశాధిపతియైన దమఘోషుండు శ్రుతశ్రవసను పరిగ్రహించె, వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవుని తమ్ముండైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాతయగు దేవశ్రవస్సను వానికి గంసవతి యందు వీరుండును, నిషుమంతుండును నుప్పతిల్లిరి. వాని సోదరుండైన కంకునికిఁ గంగ యను దానికి

బకుండును, సత్యజిత్తు పురుజిత్తను వారు జనించిరి. వాని సహజుండైన సృంజయునికి రాష్ట్రపాలియందు వృష, దుర్మర్షనాదులు జనించిరి. వాని యనుజాతుండైన శ్యామకునకు సురభూమియందు హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించిరి. వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరసయందు వృకాదిసుతలం గనియె. వృకుండు దూర్వాక్షి యందుఁ దక్ష పుష్కర సాళ్వాదుల నుత్పాదించె. వాని జఘన్యజుండయిన యనీకుండు సుదామని యను దాని యందు సుమిత్రానీక బాణాదు లయిన కొడుకులం బడసె, వాని యనుజుండైన యానకుండు కర్ణిక యందు ఋతధామ జయులం గాంచె. వసుదేవుని వలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృతాదులును; పౌరవియందు సుభద్రుండును, భద్రహుండును, దుర్మదుండును, భద్రుండును భూతాదులుం గూడఁ బన్నిద్దఱును; మదిరయందు నందోపనంద కృతక శ్రుత శూరాదులును; నిళయందు యదుముఖ్యులయిన యురువల్కలాదులును; ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును; శాంతిదేవాత్మజయందుఁ బ్రశమ ప్రశ్రితాదులును; నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును; శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును; సహదేవయందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును, ననువా రేడ్వురు పుట్టిరి. మఱియును.

723

తా ॥ ఆమెను నీ ముత్తాత పాండు మహారాజు వివాహమాడాడు. వారికి ధర్మరాజు, భీముడు, అర్జునుడు జన్మించారు. ఆమె చెల్లెలు శ్రుతదేవను కారూషకుడైన వృద్ధశర్మ పెండ్లాడాడు. వారికి ముని శాపకారణంగా దంతవక్త్రుడనే రాక్షసుడు జన్మించాడు.

శ్రుతదేవ తోబుట్టువైన శ్రుతకీర్తిని కేకయరాజైన ధృష్టకేతుడు వివాహమాడగా, ఆ దంపతులకు ప్రతర్దనుడు మున్నగు అయిదుగురు కుమాళ్ళు జన్మించారు. ఆమె సోదరి

రాజాధిదేవి కదా! ఆమెను జయత్సేనుడు వివాహమాడాడు. వారికి విందుడు, అనువిందుడు అనే ఇరువురు కుమారులు జన్మించారు.

శ్రుతశ్రవను చేది దేశాధిపతి దమఘోషుడు పెండ్లాడాడు. వారికి శిశుపాలుడు పుట్టాడు. వసుదేవుని తమ్ముడైన దేవభాగునికి కంస యందు చిత్రకేతుడు, బృహద్బలుడు అనే ఇరువురు జన్మించారు. దేవభాగుని తమ్ముడు దేవశ్రవుడు కంసవతిని వివాహమాడాడు. ఆ దంపతులకు వీరుడు, ఇషుమంతుడూ జన్మించారు.

కంకునికి కంక అనే ఆమె యందు బకుడు, సత్యజిత్తు, పురుజిత్తు అనేవారు జన్మించారు. సృంజయునికి రాష్ట్రపాలి వలన వృషుడు, దుర్మర్షణుడు మున్నగువారు జన్మించారు. అతని తమ్ముడు శ్యామకునికి సురభూమి యందు హరి, కేశ, హిరణ్యాక్షులు జన్మించారు. శ్యామకుని సోదరుడైన వత్సకుడు మిశ్రకేశి అనే అప్సరస యందు వృకుడు మున్నగు వారిని పొందాడు.

వత్సకుని తరువాతి వాడైన వృకుడు, దూర్వాక్షి యందు తక్ష, పుష్కర, సాలాదులను కన్నాడు. వృకుని తరువాతి వాడు అనీకుడు. అతడు సుదామని యందు సుమిత్ర, అనీక, బాణాదులను పొందాడు. ఆయన తమ్ముడు కంకుడు కర్ణిక యందు ఋతధామ, జయులను పొందాడు. వసుదేవునికి రోహిణి యందు బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు మొదలైన వారు కలిగారు. పౌరవి యందు సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మదుడు, భద్రుడు, భూతాదులు మున్నగు పన్నెండు మంది కుమారులు కలిగారు. మదిర యందు నంద, ఉపనంద, కృతక, శ్రుత, శూరులనే కుమారులను పొందాడు. కౌసల్య వలన కేశి అనువానిని; రోచన యందు హస్త హేమాంగదులను; ఇళ యందు యదుముఖ్యులైన పురువల్కాదులను; ధృతదేవయందు త్రిపృష్ఠుని; శాంతిదేవ యందు ప్రశ్రమ ప్రశ్రితులు మున్నగు వారిని; ఉపదేవయందు కల్పవర్షుడు మున్నగు పదిమందిని, శ్రీదేవ యందు వసుహంస సుధన్వాదులు ఆరుగురిని; దేవరక్షిత యందు గదాదులు తొమ్మిది మందిని; సహదేవ యందు పురూఢ శ్రుత ముఖ్యులాదిగా ఎనిమిది మందిని; దేవకి యందు కీర్తిమంతుడు,

సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమదనుడు, భద్రుడు, సంకర్షణుడు అనే ఏడుగురు కుమారులను పొందాడు. ఇంకా –

క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై
యష్టమ గర్భమున గుణో, త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్.

724

తా ॥ పాపాత్ములను అణచివేయటానికి, శిష్టజనులను రక్షించటం కొరకు, గుణములలో మిన్న అయిన విష్ణుదేవుడు దేవకికి ఎనిమిదవ కాన్పులో జన్మించాడు.

ఆ. విష్ణుఁ డుదితుఁడైన వెనుక నా దేవకి, భద్రమూర్తియగు సుభద్రఁ గనియె; నా గుణాఢ్య ముత్తవగు నీకు నర్జున, దయిత యగుటఁ జేసి ధరణినాథ!

725

తా ॥ విష్ణువు జన్మించిన తరువాత దేవకి, భద్రమూర్తి అయిన సుభద్రకు జన్మనిచ్చింది. ఆమె అర్జునుని భార్య కావటాన నీకు ముత్తవ అయింది.

క. ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీ లోకములో నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్.

726

తా ॥ ఈ లోకంలో ఎప్పుడు ధర్మానికి లోపం కలుగుతుందో, ఎప్పుడు పాపం చోటు చేసుకుంటుందో – అప్పుడు విశ్వేశ్వరుడైన ఆ శ్రీహరి తనను తానే సృష్టించుకొని ఈ లోకంలో ప్రభువై వెలుగొందుతాడు.

క. తనమాయ లేక పరునకు, ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్ జననములకుఁ గర్మములకు, మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే!

727

తా ॥ రాజా! ఆ పరాత్పరునికి, ఆ ఘనునికి, ఆ ఈశ్వరునికి, ఆత్మకర్తకు, ఆ హరికి అవతరించడం, కార్యకలాపాలు సాగించటం అన్నవన్నీ ఆయన యోగమాయా కార్యాలు. అంతే తప్ప కర్మవశమైన మరో కారణం లేదు సుమా!

క. తలపఁగ నెవ్వని మాయా, విలసనములు జనన వృద్ధి విలయంబులకుం గలిమి
కనుగ్రహ మోక్షం, బులు కను జీవులకు మూలములు నా నెగడున్.

728

తా ॥ రాజా! జీవుడు పుట్టడం, పెరగటం, గిట్టడం, సంపద, దయ, మోక్షం – వీటన్నింటికి మూలమేమిటనుకుంటున్నావు! ఇదంతా – ఈ మాయంతా ఏమిటనుకుంటున్నావు. ఇదంతా ఎవరి మాయ? ఎవరి హేల? ఇలాంటి మన ఆలోచనల తుది ఎక్కడ ఆగుతుంది? అంతా ఆ మహామహుని లీలా విలాసమనే దాని వద్దనే సుమా!

సీ. అట్టి సర్వేశుని కరయంగ జన్మాది పరతంత్రభావ మెప్పాటఁ గలదు
రాజలాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి
జనులను బాధింప శాసించు కొఱకునై సంకర్షణునితోడ జనన మంది
యమరుల మనముల కైన లెక్కింపఁగ రాకుండు నట్టి కర్మములఁ జేసి

తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల దుఃఖ శోకతమంబులఁ దొలంగఁ జేసి
నేల వ్రేఁగెల్ల వారించి నిఖిలదిశల, విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి.

729

తా ॥ రాజా! ఒకటి ఆలోచించి చూడు. ఆ సర్వేశ్వరుడు ఇలా అవతరించటం, అవతరించిన కారణంగా, ఇహలోక వాసనలతో కర్మతంత్రంలో చుట్టుకోవటం – ఇదంతా

ఆయనకు ఒక అవసరంగా ఎందుకు పరిణమిస్తుందంటావు? మరేం లేదు! రాక్షసులు ఈ లోకంలో సకల రాజలాంఛనాలతో ప్రభువులు కావటం, అపారమైన సైన్యబలగాలను సమీకరించుకోవటం, జనులను బాధించి అధికారం నెరపటం – ఈ కారణాలుగా ఆ బలరామునితో జన్మమెత్తి, దేవతల లెక్కకు సైతం కూడా అందనన్ని కార్యకలాపాలు నిర్వర్తించటం – అలా కలియుగంలో జన్మించనున్న నరుల దుఃఖాన్ని, శోకాన్ని, అజ్ఞానాంధకారాన్ని తొలగించి, భూభారాన్ని తగ్గించి, లోకం దశదిశలా తన అచ్చపు కీర్తిని, ఆ శౌరి వ్యాపింపచేశాడు.

సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ బెరిఁగి శత్రులనెల్లఁ బీఁచ మణఁచి
పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తను నాదిపురుషుఁ గూర్చి
శరణన్న వారిని గరుణించి పాండవ కౌరవులకు నంతఁ గలహమైన
నందఱ సమయించి యర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి

తే. మగధ పాండవ సంజయ మధు దశార్హ, భోజ వృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు
నుర్విభరము నివారించి, యుండ నొల్ల, కా మహామూర్తి నిజమూర్తి యందుఁ బొందె.

730

తా ॥ తండ్రి ఇంట పుట్టి, నందవ్రజంలో పెరిగి, పగవారెల్లరినీ మట్టుపెట్టి, ఎంతో మందిని మనువాడి, లెక్కకు మించిన కుమారులను పొంది, తానే అయిన ఆదిపురుషుని గూర్చి అనేక యాగాలు చేసి, పాండవులకు, కౌరవులకు కయ్యం కాగా, అందరి అంతూ చూసి, అర్జునునికి జయాన్ని ఆపాదించి, ఉద్ధవునికి తత్త్వాన్ని ఉపదేశించి, మగధ, పాండవ సృంజయ, మధు, దశార్హ, భోజ, వృష్ణి, అంధకాది జాతుల మన్ననలంది, భూభారాన్ని నివారించి, ఇక తన అవతార ప్రయోజనం నెరవేరినదని భావించి, ఆ మహానుభావుడు తిరిగి స్వస్వరూపాన్ని పొందాడు.

క. మంగళహరికీర్తి మహా, గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్ సంగతము సేసి త్రావఁ

దొ, లంగును గర్మంబు లావిలం బగుచు నృపా!

731

తా ॥ రాజా! శుభప్రదుడైన ఆ శ్రీహరి కీర్తి అనే పావన గంగామృతాన్ని కొంతైనా ఎవరు తమ చెవులనే దోసిళ్ళతో త్రాగుతారో, వారి పాపకర్మాలన్నీ చెల్లాచెదరై వారిని వీడిపోతాయి సుమా!

క. వనజాక్షుని మందస్మిత, ఘనకుండల దీప్తి గండ కలితాననమున్ వనితలుఁ బురుషులుఁ
జూచుచు, ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా!

732

తా ॥ మహారాజా! చిరునగవుతో, చెవులకు ధరించిన రత్నకుండలాల కాంతులు చెక్కిళ్ళపై ప్రతిఫలింపగా, ఆ పద్మాక్షుని ముఖచంద్రబింబాన్ని కళ్ళారా చూసే భాగ్యం ఏ పురుషులకు, ఏ స్త్రీలకు అబ్బుతుందో వారు – 'అయ్యో, కళ్ళార్పకుండా చూసే భాగ్యం దేవతల వలె మనకు లేకపోయింది గదా!' అనే చింతకు గురి అవుతారు.

చ. నగు మొగమున్ సుమధ్యమును నల్లని దేహము లచ్చి కాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండల కర్ణముల్ మదే
భ గతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁ గాతఁ గను మూసిన యప్పుడు విచ్చు నప్పుడున్.

733

తా ॥ చల్లగా నవ్వే ముఖం, చక్కని సన్నని నడుము, నల్లని శరీరం, శ్రీలక్ష్మికి నిత్యనివాసమైన రొమ్ము, బలిష్ఠములైన ఎగు భుజాలు, శోభావహమైన కుండలాలు గల చెవులు, మదపుటేనుగు నడకలు, నల్లని వేణీభరము, దయారసము చిప్పిల్లే చూపులు కలిగిన శ్రీమహావిష్ణువు కనులు మూసినా తెరిచినా ఏ వేళా కదలాడు గాక!'

వ. అని చెప్పి.

734

తా ॥ అని పరీక్షిన్మహారాజుకు చెప్పాడు శుకమహర్షి.

క. జనకసుతాహృచ్చోరా!, జనకవచోలబ్ధ విపినశైల విహారా! జనకామిత మందారా!, జనకాది మహేశ్వరాతిశయసంచారా!

735

తా ॥ జనకుని కుమార్తె హృదయాన్ని దొంగిలించినవాడా! జనకుని మాటపై ఘోరమైన పర్వతారణ్యాల్లో సంచరించినవాడా! జనుల కోరికలను తీర్చే కల్పవృక్షమా! జనకాది మహారాజుల ఖ్యాతిని మించినవాడా! శ్రీరామచంద్ర ప్రభూ!

క. జగదవనవిహారీ! శత్రులోక ప్రహారీ!, సుగుణఘనవిహారీ; సుందరీమానహారీ! విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!, స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ!

736

తా ॥ జగత్తు రక్షణకు విహరణం చేసేవాడా! శత్రులోకాన్ని పరిహరించేవాడా! సుగుణాల వనంలో విహరించేవాడా! అందగత్తెల మనసులను హరించేవాడా! పాపాలను పోగొట్టేవాడా! బహుపరాక్రమశాలీ! తండ్రికి సంతోషాన్ని కూర్చిన వాడా! ఏ వేళా సత్యమే పలికిన శ్రీరామచంద్ర ప్రభూ!

గద్యము.

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమను జన్మంబును, హైమచంద్రకథనంబును,

సుద్యుమ్నాది మనుసూనుల చరిత్రంబును; మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపఁ బడిన దుర్వాసుల కృత్య నిరర్థక యగుటయు; నిక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరిత్రంబులును; భాగీరథీ ప్రవాహవర్ణనంబును; గల్మాషపాద, ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, దదీయవంశ పరంపరా గణనంబును; నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును; విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత, రంతిదేవ, పాంచాల, బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ, ప్రముఖుల వృత్తాంతంబులును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల వృత్తాంతంబులును, శ్రీకృష్ణావతార కథాసూచనంబును నను కథలుం గల నవమస్కంధము సంపూర్ణము.

737

తా ॥ ఇది పరమేశ్వరుని కరుణచే కవిత్వవిద్య నబ్బించుకున్నవాడు, కేసనమంత్రి కుమారుడు, సహజపండితుడు అయిన పోతనామాత్యునిచే రచింపబడిన శ్రీమహాభాగవతమనే మహాపురాణంలో సూర్యవంశ ప్రారంభము; వైవస్వతమనువు పుట్టుక; హైమచంద్రుని వృత్తాంతము; సుద్యుమ్నాది మనుకుమారుల చరిత్ర; మరుత్తు, తృణబిందు, శర్యాతి కకుద్మి, సగర, నాభాగాది ప్రముఖుల చరిత్రలు; అంబరీషునిపై దుర్వాసమహర్షి ప్రయోగించిన కృత్య నిరర్థకం కావటం; ఇక్ష్వాకు, వికుక్షి, మాంధాత, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరిత్రలు; భాగీరథీ నదీ ప్రవాహవర్ణనము; కల్మాషపాద, ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతము; శ్రీరామచంద్ర కథనము; ఆయన వంశ పరంపరా పరిగణనము; నిమి కథ; చంద్రవంశ ఆరంభము; బుధ పురూరవుల కథ; జమదగ్ని పరశురాముల వృత్తాంతము; విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత, రంతిదేవ, పాంచాల, బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ ప్రముఖుల వృత్తాంతము; ఋష్యశృంగుని వ్రతభంగము;

ద్రుహ్యువు, అనువు, తుర్వసుల వంశచరిత్ర; యదువు, కార్తవీర్యుడు, శశబిందుడు, జామదగ్ని మున్నగువారి చరిత్ర; శ్రీకృష్ణావతార కథాసూచనము అనే కథలు గల నవమ స్కంధము సంపూర్ణం.

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీ మహాభాగవతము – నాలుగవ సంపుటము

దశము స్కంధము – పూర్వ భాగము


అనువాదకులు:
డాక్టర్ అపర్ణాశ్రీనివాస్



రామకృష్ణ మఠం
దోమలగూడ హైదరాబాదు – 500 029

# ముందుమాట

భక్తిజ్ఞానవైరాగ్యాలను వెంటనిడుకుని ప్రయాణిస్తే ముక్తి కరతలామలకమని ప్రబోధించే గ్రంథమే భాగవతం. అందుకే యోగ్యుడైన శ్రోతకు ఏడు రోజుల్లో ముక్తిని ప్రసాదించింది. వేద విభజన చేసి, బ్రహ్మసూత్రాలు, మహాభారతం వంటి బృహత్ గ్రంథాలను రచించిన వేదవ్యాస మహర్షి పరిపక్వమైన అనుభూతితో ఆత్మ తృప్తికోసం తన విజ్ఞానాన్ని ఒక రాశిగా పోసి భక్తి ప్రబోధకంగా, ముక్తిప్రదంగా రచించిన గ్రంథమే శ్రీమత్ భాగవతం. దీనినే పోతనామాత్యుడు తెలుగులోకి అవతరింప చేసాడు.

'జ్ఞానం అనే వెన్నతో కాచబడి భక్తి అనే మధురామృతంలో ముంచబడిందే భాగవతం' అంటారు భగవాన్ శ్రీరామకృష్ణులు. భక్తి, జ్ఞానాల సమ్మిశ్రితమైన భాగవతంలో భక్తి ద్వారా బ్రహ్మజ్ఞానం ఎలా సంపన్నమవుతుందో వివరించబడింది. కలియుగ జీవులకు భాగవతం అ లౌకికమైన మార్గాన్ని చూపింది. ఇటువంటి భాగవత నవనీతాన్ని 2007 వ సంవత్సరంలో రామకృష్ణ మఠం, తిరుమల తిరుపతి దేవస్థానం సంయుక్తంగా ముద్రించడం జరిగింది. అయితే పాఠకులు మరియు పండితుల అభ్యర్థన మేరకు రామకృష్ణ మఠం వారు కొంతమంది విద్వాంసులచే పోతన విరచిత భాగవతానికి తాత్పర్యాలను సరళభాషలో రాయించి సందర్భానుసారం వివరణను పొందుపరచడం జరిగింది. ఆ వివరణ ఏ పద్య తాత్పర్యానికి అవసరమో దాని క్రిందే పొందుపరచడం జరిగింది. పాఠకులు గమనించగలరు. ఈ మహాభాగవత యజ్ఞంలో పాల్గొన్న అనువాదకులందరికీ మా ధన్యవాదాలు.

భాగవత తత్త్వము దశమస్కంధములోనే ఇమిడి ఉంది. శ్రీకృష్ణుని లీలాగుణవిశేషాలను

చిత్రీకరించి, జ్ఞానం భక్తిరసామృతంలో మిళితమై కనిపిస్తుంది. శ్రీ మహాభాగవతం నాలుగవ భాగంలోని దశమ స్కంధం పూర్వభాగానికి డాక్టర్ అపర్ణాశ్రీనివాస్ గారు అనువాదం అందించారు. వీరికి మా కృతజ్ఞతలు. ఇక ఈ బృహత్ యజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ ఒక్కరికీ మా ధన్యవాదాలు.

పాఠకులు ఈ మహాభాగవత కథా సుధారసాన్ని గ్రోలి, భాగవత ధర్మాన్ని అనుష్ఠించి, అమృతత్వాన్ని చేరుకోవాలని మా ఆకాంక్ష, అభిలాష.

— ప్రకాశకులు

శ్రీకంఠచాప ఖండన!
పాకారి ప్రముఖ వినుత భండన!
విలస త్కాకుత్థ్సవంశమండన!
రాకేందు యశోవిశాల! రామనృపాలా!

1

తా ॥ శ్రీరామచంద్రా! శివుని విల్లు విరిచి సీతాదేవిని చేపట్టినవాడవు, ఇంద్రాది దేవతలు కీర్తించే విధంగా రావణ కుంభకర్ణాది రాక్షసులను సంహరించిన వాడవు, సూర్య వంశమునకు భూషణమైన వాడవు. పూర్ణచంద్రుని వంటి నిర్మలమైన కీర్తి గలవాడవు ప్రజలకు సదా మోదమును చేకూర్చువాడవు. అటువంటి నీకు నమస్కారం.

## 1. పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుణ్ణి అడిగిన ప్రశ్న

వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డయిన సూతుం డిట్లనియె, నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

2

తా ॥ సద్గుణ శ్రేష్ఠుడైన శౌనకాది మహామునులతో సమస్త పురాణాలను వ్యాఖ్యానం చేసి చెప్పగల సూతుడు ఇలా అన్నాడు: "ఆ విధంగా పరీక్షిన్మహారాజు శుక యోగీంద్రునితో ఇలా పలికాడు:

క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు, వారి కులము ధరిత్రీ
శుల నడవళ్ళను వింటిమి, కలరూపము లెల్ల మాకుఁ గడు వెఱఁగులుఁగన్.

3

తా ॥ "ఓ శుక మహర్షీ! నువ్వు సూర్యచంద్ర వంశములు వృద్ధిపొందిన విధానాన్ని, ఆ

వంశాలలో జన్మించిన రాజుల చరిత్రను, వారి నడవడిని, వారి ప్రవర్తనను ఉన్నది ఉన్నట్లుగా చెప్పావు. మోక్షేచ్ఛగల మాకు వారి చరిత్రలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి.

క. శీలము గల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం?
డే లీల మెలఁగె? నెయ్యే, వేళల నే మేమి సేసె? వివరింపు తగన్.

4

తా ॥ మహాత్ముడు, ఈ లోకాలను ఏలేవాడు అయిన శ్రీమన్నారాయణుడు మంచి నడవడిగల యాదవకులంలో ఏ కారణంచేత జన్మించవలసి వచ్చింది? అనంతరం ఏ విధంగా మెలిగాడు. ఏ సమయంలో ఏయే లీలలు చేశాడు? ఈ విషయాలన్ని మాకు చక్కగా వివరించవలసింది.

క. భవములకు మందు, చిత్త, శ్రవణానందము, ముముక్షుజన పదము, హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను, జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియుఁ గలఁడే.

5

తా ॥ శ్రీకరుడైన విష్ణువు యొక్క స్తోత్రము మహా సంసార వ్యాధులకు ఔషధమై, చెవులకు సార్థకత్వాన్ని, మనస్సుకు ఆనందాన్ని కలుగజేస్తుంది. మోక్షమునందు అపేక్షగలవారికి పరమానందదాయకమైనది. అట్టి భగవంతుని గుణకీర్తనాన్ని విని "ఇంక చాలు" అని అనే మూఢుడు హింసాప్రవృత్తి గల కిరాతుడు గాని అన్యుడుగాడు.

క. మా పెద్దలు మును వేల్పులు, నోపని భీష్మాది కురుకులోత్తమ సేనా
కూపారము నే కోలము, ప్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్.

6

తా ॥ మా తాతలైన పాండవులు పూర్వం భారతయుద్ధంలో దేవతలను సైతం

జయించగల భీష్మాది కురువీరులతో యుద్ధం చేసారు. సాగరం వంటి ఆ సేనావాహినిని పసివాని అడుగును దాటినంత సులభంగా ఏ నావ సహాయంతో దాటగలిగారు?

క. మా యమ్మ కుక్షి గురుసుత, సాయక పీడితుఁడ నైన జడు నన్నుం గౌం
తేయ కురుకులము నిలుపఁగ, నా యుత్తముఁ డాత్త చక్రుఁడై రక్షించెన్.

7

తా ॥ అంతేకాదు, నేను నా తల్లి గర్భంలో ఉండగా, పాండవకుల నాశనానికై గురుపుత్రుడైన అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం నన్ను పలు విధముల బాధించనారంభించింది. ఆ సమయమున ఆ మహాగ్ని జ్వాలల నుండి చక్రధారియై ఆ కృష్ణుడే రక్షించాడు కదా!

ఆ. కలిసి పురుషమూర్తి కాలరూపములను, లోకజనుల వెలిని లోన నుండి
జన్మ మృత్యువులను సంసారముక్తుల, నిచ్చు నతని చరిత మెల్లఁ జెపుమ!

8

తా ॥ ఆ విష్ణువు కేవలం నా సంరక్షణను మాత్రమే కాక, సమస్త దేహధారులను రక్షించుచునే ఉన్నాడు. అంతరంగమందు ఆత్మరూపమున, బాహ్యమున కాల రూపమున వర్తించుచూ, బాహ్యమును మాత్రం చూసేవారికి బంధమును, అంతరంగమున దృష్టి నిలిపిన వారికి మోక్షమును ప్రసాదించుచున్నాడు. అట్టి ఆ పురుషోత్తముని చరిత్రను వినవలెనని మిక్కిలి ఆసక్తిగా ఉన్నది.

సీ. ఊహించి రాముఁడు రోహిణి కొడుకంచు నప్పుడు యోగీంద్ర! చెప్పి తీవు
దేవకి కడుపున నే వెరవున నాతఁ డుండెను దేహంబు నొండు లేక?
తన తండ్రి యిలువాసి వనజాక్షుఁ డేరీతి మందకుఁ బోయె? నే మందిరమున
నుండి యెయ్యది సేయుచుండెను? దన మేన మామ కంసుని నేల నామ మణఁచె

ఆ. నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై?, యెంద ఱైరి భార్య? లెట్లు మెలఁగె?
మఱియు నేమి చేసె? మాధవు చారిత్ర, మెంత గలదు? నాకు నేర్పరింపు.

9

తా ॥ ఓ యోగీంద్రా! బలరాముడు రోహిణీదేవి పుత్రుడని చెప్పావు. మరి అతడు ఏ ఉపాయం చేత మరో శరీరం లేకుండగనే దేవకీదేవి గర్భంలో కూడా ఉన్నాడు? దేవకీదేవి పుత్రుడైన శ్రీకృష్ణుడు తన తండ్రి అయిన వసుదేవుని ఇంటి నుండి వ్రేపల్లెకు ఎలా వెళ్ళాడు? అక్కడ ఎవరి ఇంట్లో ఉన్నాడు? ఏం చేసాడు? తన మేనమామ అయిన కంసుణ్ణి ఎందుకు సంహరించవలసి వచ్చింది? ఈ భూమి మీద ఎన్ని సంవత్సరాలు జీవించి ఉన్నాడు? అతనికి భార్యలెందరు? వారితో ఎలా మెలిగాడు? అతడు చేసిన ఘనకార్యాలేమిటి? ఆ మాధవుని చరిత్ర అంతా సవిస్తరంగా నాకు చెప్పవలసింది."

వ. అని మఱియు నిట్లనియె.

10

ఆ. నీ ముఖాంబుజాత నిర్ముక్త హరికథా, మృతముఁ ద్రావఁ ద్రావ మేను వొదలె,
వంత మానె, నీరువట్టు నాఁకలియును, దూరమయ్యె, మనము దొంగలించె.

11

తా ॥ అని పరీక్షిత్తు ఇంకా ఇలా అంటున్నాడు: "ఓ మునీంద్రా! నేను అన్నపానాదులను విసర్జించినా ఆకలి దప్పులు నన్ను ఒకింతైననూ బాధించుట లేదు. పై పెచ్చు మనస్సు మరింత ఉత్సాహంగా ఉంది. దీనికి కారణం మీ ముఖపద్మం నుండి జాలువారుతున్న భగవంతుని అమృతమయ లీలాకథలను నేను తనివి తీరా పానము చేయటమే."

వ. అని పలుకుచున్న రాజు మాటలు విని, వైయాసి యిట్లనియె.

12

తా ॥ ఇలా చెప్పిన పరీక్షిత్తు మాటలు విని వ్యాసపుత్రుడైన శ్రీ శుకమహర్షి ఇలా అన్నాడు:

క. విష్ణు కథా రతుఁ డగు నరు, విష్ణుకథల్ చెప్పు నరుని వినుచుండు నరున్
విష్ణుకథా సంప్రశ్నము, విష్ణుపదీ జలము భంగి విమలులఁ జేయున్.

13

తా ॥ "ఓ రాజా! విష్ణుకథలను చెప్పమని అడిగేవాడు, విష్ణుకథలను చెప్పేవాడు, వీటిని ఆసక్తిగా వినేవాడు, ఈ ముగ్గురూ తరించిపోతారు. ఇది ఏ విధంగా అంటే, విష్ణుపాదమునుండి ఉద్భవించిన గంగాజలం ఏ విధముగా తనయందు మునిగిన వారిని పవిత్రులను గావిస్తోందో, అదే విధంగా విష్ణు కథా ప్రసంగం సర్వులను పునీతులను గావిస్తుంది.

సీ. రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్య విభులు దన్ను
నాక్రమించిన భార మాఁగఁజాలక భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁ బోయి
కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ గరుణతో భావించి కమలభవుఁడు
ధరణి నూఅడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ గదలిరా విష్ణునిఁ గాన నేఁగి

తే. పురుష సూక్తంబుఁ జదివి యద్భుత సమాధి, నుండి యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి, పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ.

14

తా ॥ ఓ రాజా! విను పూర్వం లెక్కలేనంత మంది రాక్షస రాజులు రాక్షస కృత్యములలో ప్రవర్తిస్తూ భూమి అంతటా ఆక్రమించుకుని సంచరింపగా, ఆ పాపభారమును మోయజాలక భూమి గోరూపమును ధరించి బ్రహ్మవద్దకు పోయి కన్నీరు మున్నీరుగా శోకించింది. అప్పుడు బ్రహ్మ కనికరంతో ధరణిని ఊరడించి, ఇంద్రాది దేవతలతో భూమిని వెంటపెట్టుకుని విష్ణువును సందర్శించాడు. సందర్శించి, పురుషసూక్త మంత్రములతో ధ్యానం చేయగా ఆ ధ్యానమందు ఆయనకు భగవద్వాణి వినిపించింది. దానిని విన్న బ్రహ్మదేవుడు దేవతలతో ఈ విధంగా

అన్నాడు: "నాకు వినిపించింది మీకు తెలియచేస్తాను.

క. యాదవకులమున నమరులు!, మేదినిపైఁ బుట్ట జనుఁడు మీ యంశములన్
శ్రీదయితుఁడు వసుదేవున, కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్.

15

తా ॥ భగవంతుడు యదుకులములో అవతరించనున్నాడు. అందువలన మీరు మీ అంశముల చేత యదు వంశంలో భూమిపై విష్ణుదేవుని కంటే ముందుగ జన్మించండి. ఆపైన విష్ణువు వసుదేవునకు పుత్రుడై పుట్టి భూభారాన్ని తొలగిస్తాడు.

క. హరి పూజార్థము పుట్టుఁడు, సురకన్యలు! భూమియందు సుందరతనులై
హరి కగ్రజుఁడై శేషుఁడు హరికళతోఁ బుట్టుఁ దత్ప్రియారంభుండై.

16

తా ॥ దేవతా స్త్రీలందరూ శ్రీహరికి పరిచర్యలు చేయడానికి సుందర రూపంతో పుట్టవలసింది. ఆదిశేషుడు ఆ హరి అంశతో ఆయనకు అగ్రజుడుగా పుట్టి ప్రియమైన పనులు చేస్తూంటాడు.

ఆ. ఈ ప్రపంచ మెల్ల నే మాయచే మోహి, తాత్మ మగుచు నుండు నట్టిమాయ
కమలనాభు నాజ్ఞఁ గార్యార్థమై నిజాం, శంబు తోడఁ బుట్టు జగతియందు.

17

తా ॥ ఈ ప్రపంచం అంతా ఏ మాయచే భ్రమిస్తూ ఉంటుందో అట్టి యోగమాయ ఆ విష్ణువు యొక్క ఆజ్ఞచేత తన అంశతో కార్యార్థమై భూలోకంలో పుడుతుంది."

వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి పుడమిముద్దియ నొడంబఱిచి తమ్మిచూలి తన మొదలి నెలవునకుం జనియె, నంత యదువిభుం డయిన శూరసేనుండను వాఁడు మధురాపురంబు

తనకు రాజధానిగా మాధురంబులు శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం. బూర్వకాలంబున.

18

తా ॥ అని బ్రహ్మ ఈ విధంగా చెప్పి, దేవతలను, భూదేవిని ఊరడించి సత్యలోకానికి వెళ్ళిపోయాడు. ఆ సమయమున శూరసేనుడనే యాదవరాజు మధురను రాజధానిగా చేసుకొని మధుర, శూరసేనములకు చెందిన దేశములను పరిపాలన చేస్తున్నాడు.

క. ఏ మధురయందు నిత్యము, శ్రీమన్నారాయణుండు సెలఁగుఁ బ్రియముమై
నా మధుర సకల యాదవ, భూమీశుల కెల్ల మొదలి పురి యయ్యె నృపా!

19

తా ॥ ఓ రాజా! ఏ మధుర యందు ఆ శ్రీమన్నారాయణుడు విలాసంగా విహరించాడో, అట్టి మధుర తొలుత యాదవరాజులందరికీ రాజధానిగా ఉన్నది.

సీ. ఆ శూరసేనుని కాత్మజుం డగు వసుదేవుఁ డా పురి నొక్క దినమునందు
దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడువేడ్క రథమెక్కి కదలువేళ
నుగ్రసేనుని పుత్త్రుఁ డుల్లాసి కంసుండు చెల్లెలు మఱఁదియు నుల్లసిల్లి
హరుల పగ్గములఁ జేనంది రొప్పఁ దొడంగె, ముందట భేరులు మురజములును

ఆ. శంఖ పటహములును జడిగొని మ్రోయంగఁ, గూఁతుతోడి వేడ్క కొనలు సాఁగ
దేవకుండు సుతకు దేవకీదేవికి, నరణ మీఁ దలంచి యాదరించి.

20

తా ॥ ఆ మధురాపురాన్ని పాలన చేస్తున్న శూరసేన మహారాజుకు కుమారుడైన వసుదేవుడు ఒక మంచి రోజున దేవకీదేవిని పెండ్లాడి, మిక్కిలి ఉల్లాసంతో తన ఇంటికి రథం

మీద బయలుదేరాడు. అప్పుడు ఉగ్రసేనుని కుమారుడైన కంసుడు తన చెల్లెలిపై ప్రేమతో స్వయంగా రథానికున్న గుర్రాల పగ్గాలను పట్టి తోలసాగాడు. రథం ముందుగా సకల రాజలాంఛనాలతో భేరీలు, మృదంగాలు, శంఖాలు, తప్పెటలు మొదలైనవి మ్రోగుతూ సాగుచున్నాయి. దేవకీదేవి తండ్రి అయిన దేవకుడు ఎంతో ఉల్లాసంతో కూతురుకు కానుకలు ఇవ్వాలని అనుకున్నాడు.

వ. సార్థంబు లయిన రథంబుల వేయునెనమన్నూటినిఁ, గనక దామ సముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటినిఁ బదివేల తురంగంబులను, విలాసవతు లయిన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి యనిచినం గదలి వరవధూ యుగళంబు దెరువునం జను సమయంబున.

21

తా ॥ సమస్త వస్తువుల చేత నింపబడిన పదునెనిమిది వందల రథాలను, బంగారు ఆభరణాలతో నిండిన నాలుగు వందల ఏనుగులను, పదివేల గుఱ్ఱాలను, రెండు వందల మంది విలాసవతులైన దాసీజనులను అరణముగా ఇచ్చాడు. అంతట ఆ నూతన దంపతులు రాజమార్గంలోనుంచి బయలుదేరారు.

క. పగ్గములు వదలి వేగిర, మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో
బెగ్గిలి యెగ్గని తలఁపఁగ, దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్.

22

తా ॥ గుఱ్ఱాల పగ్గాలను సడల్చి మిగుల వేగంగా, ఉత్సాహంగా రథాన్ని తోలుతున్న కంసుడు ఉలిక్కిపడే విధంగా ఇంతలోనే ఆకాశంలోనుంచి అశరీరవాణి ఇలా పలికింది:

క. "తుష్టయగు భగిని మెచ్చఁగ, నిష్టుఁడవై రథము గడపె, దెఱుఁగవు మీఁదన్
శిష్టయగు నీ తలోదరి, యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ!"

23

తా ॥ “ఓ కంసుడా! తోబుట్టువైన దేవకీదేవి మెచ్చుకునేటట్లు అతి ప్రీతితో రథాన్ని తోలుతున్నావు. కానీ ఇకమీద జరుగబోవు సంగతిని నీవు ఎరుగవు. ఈ నీ సహోదరి యొక్క ఎనిమిదవ కుమారుడు నిన్ను సంహరిస్తాడు సుమా!”

వ. అని యిట్లాకాశవాణి వలికిన నులికిపడి భోజకుల పాంసనుండైన కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ బెఱికి జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁబట్టి కప్పరపాటున నొప్పఱం దిగిచి యొడిసి పట్టి, తోఁబుట్టువని తలంపక తెంపు సేసి తెగవ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి.

24

తా ॥ అని ఆకాశవాణి పలికే సరికి కంసుడు అదిరి పడ్డాడు. భోజకులాన్ని నశింపచేసేందుకే జన్మించిన అతను భుజాలు కదులుచుండగా, కత్తిని భయకరంగా చరాలున దూసి, తోబుట్టువైన దేవకీదేవి కొప్పుపట్టుకొని, అలంకరణ చెదిరేటట్టుగా కిందికి ఈడ్చాడు. తోబుట్టువని కూడ ఎంచక తెగించి చంపడానికి సిద్ధపడే సమయంలో వసుదేవుడు అడ్డుపడ్డాడు.

క. ఆ పాపచిత్తు మత్తుం, గోపాగ్ని శిఖానువృత్తుఁ గొనకొని తన స
ల్లాపామృతధారా వి, క్షేపంబునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్.

25

తా ॥ యుక్తాయుక్త విచక్షణలేని వాడూ, పైగా ఆగ్రహావేశాలతో ఉన్నవాడూ అయిన కంసుని కోపం అనే నిప్పును, తన మంచి మాటలనెడు అమృత వర్షము చేత శాంతపరుస్తూ వసుదేవుడు మెల్లగా ఇలా పలుకసాగాడు:

ఉ. ‘అన్నవు నీవు చెల్లెలికి, నక్కట! మాడలు చీర లిచ్చుటో!

మన్నన సేయుటో? మధుర మంజులభాషల నాదరించుటో?
'మిన్నుల మ్రోఁతలే నిజము, మే' లని చంపకు మన్న మాని రా
వన్న! సహింపు మన్న! తగ దన్న! వధింపకు మన్న! వేఁడెదన్.

26

తా ॥ "బావా! అన్నవైన నీవు నీ చెల్లెలిని చంపడానికి తలపెట్టావు. ఇది సమంజసమేనా! చెల్లెలికి వరహాలివ్వాలి, విలువైన వస్త్రాలివ్వాలి. మన్నన చెయ్యాలి, మృదువైన మాటలచేత ఆదరించాలి. అయ్యో! ఇదేమిటి! ఆకాశవాణి మాటలే నిజమని చంపడమే మేలని అనుకోకు! దయతో ఈ పని విరమించు. ఇది నీకు తగదయ్యా! ఆమెను వధించకు! నిన్ను ప్రార్థిస్తున్నాను!"

వ. అదియునుం గాక.

27

మ. చెలియల్, గన్నియ, ముద్దరా లబల, నీ సేమంబు చింతించు ని
ర్మల, దీనిన్ బయలాడుమాటలకు నై మర్యాదఁ బోఁదట్టి, స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా! గోపంబు పాపంబు, నె
చ్చెలి నోహో! తెగవ్రేయఁ బాడియగునే? చింతింపు భోజేశ్వరా!

28

తా ॥ అదీగాక... చెల్లెలు వరుసకు కూతురు వంటిది, పైగా అమాయకురాలు, అబల. ఎప్పుడు నీ క్షేమాన్నే కోరుతూ ఉంటుంది. నిష్కపట స్వభావం కలది! అటువంటి ఈమెను ఏవో మాటలు వినిపించిన కారణంగా చంపడం నీకు ధర్మం కాదు. కోపం మహా పాపం సుమా! నువ్వు పవిత్రమైన భోజవంశంలో జన్మించినవాడవు. ఆలోచించి చూడు! ఇది నీకు తగిన కార్యమేనా!

సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు, నెల్లి నేఁడైనఁ నూఱేండ్ల కైనఁ

దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నందఁ గర్మానుగుండై శరీరి
మాఱుదేహము నూఁది, మఱి తొంటి దేహంబుఁ బాయును దన పూర్వ భాగమెత్తి
వేఱొంటిపైఁ బెట్టిఁ వెనుకభాగం బెత్తి గమనించు తృణజలూకయును బోలె,

ఆ. వెంటవచ్చు కర్మవిసరంబు, మును మేలు కన్నవేళ నరుఁడు గన్న విన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ, బాడితోడఁ గానఁబడిన యట్లు.

29

తా ॥ వీరుడా! ప్రాణులు పుట్టినప్పుడు, వారి శరీరంతో మృత్యువు కూడా నిర్ణయం అవుతుంది. అది వెంటనే కావచ్చు, కొద్ది సంవత్సరాలు కావచ్చు, నూరేళ్ళు కావచ్చు, కానీ మృత్యువు మాత్రం అనివార్యమైనదే కదా! మరణం అంటే శరీరం పంచ మహాభూతాలలో కలిసిపోవడమే! తన కర్మను అనుసరించి వివశుడై జీవుడు ఈ శరీరాన్ని వదిలివేస్తాడు! పచ్చికల్లో తిరుగాడే ఆకుపురుగుని చూడు! శరీరం యొక్క ముందుభాగాన్ని ఒక గడ్డిపోచ మీద పెట్టాక, పట్టు కుదిరాక, అప్పుడు మాత్రమే శరీరం వెనుక భాగాన్ని ముందుకు లాక్కుంటూ సాగుతుంది కదా! అదే విధంగా జీవుడు తన కర్మను అనుసరిస్తూ, వేరొక శరీరాన్ని ఏర్పాటు చేసుకున్నాకనే ఈ శరీరాన్ని విడిచిపెడతాడు.

మనం మెలకువలో చూసినవి, తలచినవి స్వప్నంలో వచ్చినట్లుగా, శరీరం విడిచినప్పుడు కర్మవాసనలు ఆ విధంగా జీవుని వెంట వస్తాయి.

క. తన తొంటి కర్మరాశికి, ననుచరమై బహువికారమై మనసు వడిం
జను, నింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తన కర్మంబుల్.

30

తా ॥ తన పూర్వ జన్మ కర్మలకు అనుకూలంగా మనస్సు ఇంద్రియాల వెంట పోతూ ఉంటుంది. కనుక మానవుడు ఎన్ని జన్మలెత్తినా పుణ్య, పాప మిశ్రరూప కర్మఫలాన్ని మాత్రం

అనుభవించి తీరవలసిందే.

ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు, గానఁబడుచు గాలిఁ గదలు భంగి
నాత్మకర్మ నిర్మితాంగంబులను బ్రాణి, గదలుచుండు రాగకలితుఁ డగుచు.

31

తా ॥ నీటి కుండలలోను, చెరువుల్లోను సూర్యచంద్రుల బింబాలు ప్రతిఫలించినప్పుడు, గాలికి కదలుతూ ఉన్నట్లుగా ఉంటాయి. అలాగే జీవుడు తన త్రికరణముల చేత చెయ్యబడిన పుణ్యపాప మిశ్రకర్మలవల్ల తాను ఏర్పాటు చేసుకున్న శరీరాలలో రాగద్వేషాలచేత సంచలిస్తూ ఉంటాడు.

క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు గీడు నిచ్చు, గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మ కైనను, గర్మగుఁ డై పరులఁ దడవఁగా నేమిటికిన్?

32

తా ॥ తనచేత చెయ్యబడిన పుణ్యకర్మ పాపకర్మములే, తనకు సుఖమును కానీ దుఃఖమును కానీ కలుగజేసే అధికారులు. బ్రహ్మసహితము కర్మఫలాన్ని అనుభవింపక తప్పదు. అందువలన తన కర్మఫలమైన సుఖదుఃఖాలను తాను అనుభవిస్తూ, దీనిని పరులయందు ఆరోపించడం దేనికి?

క. కావునఁ బరులకు హింసలు, గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ, బోవునె? తత్ఫలము పిదపఁ బొందక యున్నే?

33

తా ॥ కనుక పరులను హింసించటం తగదు. తన సుఖం కోసం ఇతరులను బాధిస్తే అప్పుడు కాకపోయినా, జన్మాంతరమందైనా దానికి తగిన ప్రతిఫలాన్ని అనుభవింపవలసి

వస్తుంది.

మత్త.వావిఁ జెల్లెలుగాని పుత్రికవంటి దుత్తమురాలు, సం
భావనీయచరిత్ర, భీరువు, బాల, నూత్నవివాహ సు
శ్రీవిలాసిని, దీన, కంపితచిత్త నీకిదె మ్రొక్కెదం,
గానవే! కరుణామయాత్మక! కంస! మానవవల్లభా!

34

తా ॥ కనుక ఓ కంస భూపాలా! ఈ దేవకి వరుస చేత నీకు చెల్లెలుగాని స్థితిని బట్టి నీకు కన్నబిడ్డ వంటిది. మంచి గుణములు కలది, మెచ్చతగిన నడవడిక కలది, పిన్న వయస్సు కలది. చక్కని లక్ష్మీ కళతో ఒప్పుతున్న క్రొత్త పెండ్లి కూతురు. భయంతో లోలోపల వణికి పోతోంది. నీకంటే వేరొక దిక్కులేని ఈమెను రక్షించమని నీకు చేతులెత్తి మ్రొక్కుచున్నాను."

వ. అని మఱియు సామభేదంబులగు పలుకులు పలికిన, వినియు, వాఁడు, వేఁడిచూపుల రాలు నిప్పులు గుప్పలు గొన ననుకంపలేక, తెంపుసేసి చంపకగంధిం జంపఁ జూచుట యెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియె.

35

తా ॥ అని వసుదేవుడు కొన్ని అనునయవాక్యాలు, కొన్ని భేదవాక్యాలు పలికినా, కోపం మానక కళ్ళనుండి నిప్పులు కురియుచుండగా, కంసుడు దేవకీదేవిని చంపడానికి ప్రయత్నం చేశాడు. వసుదేవుడు కంసుని మూర్ఖత్వాన్ని గమనించి తనలో తాను ఇలా ఆలోచింపసాగాడు:

క. 'ఎందును గాలము నిజ మని, పందతనంబునను బుద్ధిఁబాయక ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి, నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్.

36

తా ॥ 'బేలతనం వలన ఉపయోగం లేదు. ఆత్మబలంతో బుద్ధికి పదనుపెట్టి అది ఎంతవరకు ప్రసరిస్తుందో అంతవరకూ ఉపాయాలను యోచిస్తూ ముందుకు సాగాలి. కాలమే వాస్తవమనే వివేకాన్ని వదలరాదు.'

వ. అని నిశ్చయించి

37

తా ॥ అని నిశ్చలబుద్ధితో వసుదేవుడు ఈ విధముగా అనుకుంటున్నాడు.

సీ. ఆపన్నురాలైన యంగన రక్షించి సుతుల నిచ్చెద నంట శుభము నేఁడు,
మీఁద దెవ్వఁ డెఱుఁగును? మెలఁత ప్రాణంబుతో నిలిచిన మఱునాఁడు నేరరాదె?
సుతులు పుట్టిర యేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చెనేని
బ్రహ్మచేతను వీఁడుపా టేమియును లేక యుండునే? సదుపాయ మొకటి లేదె?

తే. పొంత ప్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని, యెగసి దవ్వులవాని దహించు భంగిఁ
గర్మవశమున భవమృతికారణములు, దూరగతిఁ బొందు, నిఁక నేల తొట్రుపడఁగ?

38

తా ॥ 'ఆపద పాలైన దేవకిని రక్షించటం కోసం పుట్టబోయే కొడుకులను వీడికి ఇస్తాననటం ఇప్పటికి మంచిది. ముందు ముందు ఏమి జరుగుతుందో ఎవరికి తెలుసు? నేటికి ఈమె ప్రాణాలతో నిలిస్తే రేపటికి ఏదో యుక్తి వెతుక్కోవచ్చు. పుత్రులు కలిగి వాళ్ళకి వెంటనే మృత్యువు వచ్చినా రానీ! అప్పటిదాకా వీడు బ్రహ్మచేత ఏ అపాయం పొందకుండా ఉంటాడా? అప్పటికి మంచి ఉపాయం లభ్యం కాకపోతుందా? అడవిలో పుట్టిన అగ్ని దాపుననున్న చెట్లను కాల్చక ఎగసి దూరంగా ఉన్న చెట్లను కాల్చినట్లు, ప్రాణుల జననం, మరణం అనే కారణాలు కర్మను అనుసరించి దూరదూరంగా పోతూ ఉంటాయి. ఇంత తెలిసి నేనెందుకు కంగారు పడాలి?

క. కొడుకుల నిచ్చెద నని సతి, విడిపించుట నీతి, వీఁడు విడిచిన మీఁదం
గొడుకులు పుట్టినఁ గార్యము, దడఁబడదే? నాఁటి కొక్క దైవము లేదే?

39

తా ॥ కొడుకులను చంపడానికి ఇస్తానని చెప్పి భార్యను విడిపించటం యుక్తమైన పని. వీడు ఇప్పుడు వదిలితే, కొడుకులు కలిగేనాటికి పరిస్థితులు మారకపోతాయా? ఆనాటికి ఏ దైవమైనా అడ్డు పడకపోతుందా?

క. ఎనిమిదవ చూలు వీనిం, దునుమాడెడి నంచు మింటఁ దోరపుఁబలుకుల్
వినఁ బడియె, నేల తప్పును?, వనితను విడిపించు టొప్పు వైళం బనుచున్.

40

తా ॥ అంతేకాక దేవకి ఎనిమిదవ గర్భంలో ఉన్నవాడు ఈ కంసుని సంహరిస్తాడని ఆకాశవాణి చెప్పింది. ఆ మాట తప్పదు కాబట్టి ఆలస్యం చెయ్యకుండా ఆమెను విడిపించటం మంచిది.'

క. తిన్నని పలుకులు పలుకుచుఁ, గ్రన్నన తగఁ బూజ చేసి కంసు నృశంసున్
మన్నించి చిత్త మెరియఁ బ్ర, సన్నాననుఁ డగుచుఁ బలికె శౌరి నయమునన్.

41

తా ॥ అని అనుకుంటూ వసుదేవుడు మర్యాదగా మాట్లాడుతూ క్రూరుడైన కంసుణ్ణి గౌరవించే విధంగా తన మనస్సులో ఎంత దుఃఖం ఉన్నా ప్రసన్నమైన ముఖంతో, అనునయంగా ఇలా అంటున్నాడు:

క. "లలనకుఁ బుట్టిన కొమరుని, వలనం దెగె దనుచు గగనవాణి వలికె నం
చలిగెద వేని మృగాక్షికిఁ, గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్".

42

తా ॥ "బావా! ఈమెకు పుట్టబోయెడి ఎనిమిదవ పుత్రుని వలన నీకు మరణం సంప్రాప్తిస్తుంది అని ఆకాశవాణి పలికిందనే కదా కోపగిస్తున్నావు! కనుక ఈమెకు పుట్టబోయెడు కొడుకులనందరిని వరుసగా నేనే తెచ్చి నీకు ఇస్తాను, నీవు సంహరింతువు గాని."

వ. అని యిట్లు పలికిన విని కంసుడు కంపితావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబు గైకొని కొందలమందు చెలియలి ముందల విడిచి చనియె, వసుదేవుండును బ్రదుకు మందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొందియుండె, నంతఁ గొంతకాలంబు సనిన సమయంబున.

43

తా ॥ ఈ మాటలు విన్న కంసుడు ఆలోచించి, సమ్మతించి సంతోషించాడు. సద్గుణాలను గ్రహించినవానివలె భయపడుతున్న చెల్లెలిని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. వసుదేవుడు బ్రతికే భాగ్యం లభించిందని భార్యతో కలిసి ఇంటికి వెళ్ళి మహోల్లాసంతో ఉన్నాడు. ఈ విధముగా కొంతకాలము గడచినది.

క. విడువక కంసుని యెగ్గులఁ, బడి దేవకి నిఖిలదేవభావము దన కే
ర్పడ నేఁట నొకని లెక్కను గొడుకుల నెనమండ్ర నొక్క కూతుం గనియెన్.

44

తా ॥ ఆ విధంగా కంసుని చేత బాధించబడిన దేవకీదేవి, సమస్త దేవతల భావమును తాను పొంది, సంవత్సరానికి ఒకని లెక్కన ఎనిమిది మంది కొడుకులను ఒక్క కూతురుని కన్నది.

వ. అందు.

45

ఆ. సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతునిఁ, బుట్టుతడవ కంసభూవరునకుఁ
దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ, డాసపడక సత్యమందు నిలిచి.

46

తా ॥ ఆ వసుదేవుడు తన మనస్సులో చాలా ధైర్యంతో, ఆడిన మాట తప్పనివాడై పుత్రులయందు ఆశపడక, దేవకీదేవి మొదటి కొడుకును కీర్తిమంతుడను వానిని కనగానే కంసునికి అప్పగించాడు.

క. పలికిన పలుకులు దిరుగక, సొలయక వంచనము లేక సుతుల రిపునకుం
గలఁగక యిచ్చిన ధీరుం, డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే?

47

తా ॥ ఈ విధంగా భూమి మీద ఆడిన మాటను తప్పక, వెనుదీయక, మోసం చేసే ఉద్దేశం లేక, మనస్సులో కలత పడక, తన శత్రువైన కంసునకు పుత్రులను చంపడం కోసం తానే తెచ్చి ఇచ్చిన ధైర్యశాలి వసుదేవుడు తప్ప అన్యుడు ఈ లోకంలో ఉంటాడా?

'సత్యం వద' అనే శాస్త్ర ఆదేశాన్ని అక్షరాలా పాటించేవాడు కనుకనే ఆ శాశ్వతునికి తండ్రి కాగలిగాడు.

ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కరమెయ్య?, దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?
దీశభక్తి రతుని కీరాని దెయ్యది?, యెఱుక లేనివాని కేది కీడు?

48

తా ॥ రాజా! సత్యసంధులైన బుద్ధిమంతులకు అశక్యం అంటూ ఏమీ లేదు. న్యాయాన్యాయములను తెలుసుకొను సామర్థ్యం కలవానికి ఇష్టమైనదంటూ ఏదీ ఉండదు.

శ్రీహరి సేవలో ఆసక్తి కలవానికి ఒకరికి ఇయ్యకూడనిది అంటూ ఏమీ లేదు. జ్ఞానం లేని వానికి ఇది కీడు కనుక తలపెట్టరాదు అని అంటూ ఏమీ ఉండదు.

వ. ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకు నిలుకడకు మెచ్చి కంసుం డిట్లనియె.

49

తా ॥ ఈ విధంగా సత్యం తప్పకుండా కొడుకును అప్పగించిన వసుదేవుని మాట నిలుకడకు మెచ్చి కంసుడు ఇట్లా అన్నాడు:

ఆ. కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ!, వెఱపు లేదు నాకు వీనివలన,
నల్గ వీనికి, భవ దష్టమపుత్రుండు, మృత్యు వఁట! వధింతు మీఁద నతని.

50

తా ॥ "బావా! కొడుకుని నీవు మళ్ళీ తీసుకుపో! వీడివల్ల నాకు మరణభయం లేదు. అందువలన వీడి మీద నాకు కోపం లేదు. నీ ఎనిమిదవ పుత్రుడే నాకు మృత్యువు కనుక వాడిని వధిస్తాను."

వ. అనిన నానకదుందుభి నందనుం గొని చనియు నానందంబు నొందక, దుష్టస్వభావుండగు బావపలుకులు వినియు నులుకు చుండె, నంత.

51

తా ॥ అని కంసుడు పలుకగా వసుదేవుడు కొడుకును తీసుకొని వెళ్ళినా పూర్తి ఆనందాన్ని పొందలేక పోయాడు. దుష్టుడైన బావ స్వభావం గుర్తుకు వచ్చినప్పుడల్లా భయపడుతూనే ఉన్నాడు.

సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున

'మందలోపల నున్న నందాదులును, వారి భార్యలుఁ బుత్రులు బాంధవులును
దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును,
సురలు గాని, నిజంబు నరులుగా రని చెప్పి 'కంసుండ! నీవు రక్కసుఁడ వనియు

ఆ. దేవమయుఁడు చక్రి దేవకీ దేవికిఁ, బుత్రుఁడై జనించి భూతలంబు
సెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ, జంపు' ననుచుఁ జెప్పి చనియె దివికి.

52

తా ॥ ఇలా ఉండగా ఒక రోజున నారద మహాముని కంసుని ఇంటికి వచ్చి ఏకాంతంగా వానితో "ఓ కంసుడా! వ్రేపల్లెలో ఉన్న నందుడు మొదలైన వారు, వారి భార్యలు, కొడుకులు, చుట్టములు, దేవకి మొదలైన స్త్రీలు, వసుదేవుడు మొదలైన యాదవులు దేవతలేగాని మానవులు కారు. నీవు కాలనేమి అనే రాక్షసుడవు. సకల దేవతా స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు దేవకీదేవికి పుత్రుడై పుట్టి ఈ లోకానికి కీడుచేయ తలపెట్టిన నిన్ను ఇంకా ఇతర రాక్షసులను చంపుతాడు" అని చెప్పి ఈ విధంగా నారదుడు దేవకార్యం పూర్తి చేసి తిరిగి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

క. నారదు మాటలు విని పె, ల్లారాటముఁ బొంది యదువు లనిమిషు లనియున్
నారాయణకరఖడ్గవి, దారితుఁ డగు కాలనేమి దా ననియు మదిన్.

53

తా ॥ నారదుని మాటలు విన్న కంసుడు ఎంతో ఆరాటాన్ని పొందసాగాడు. యాదవులు దేవతలని, నారాయణుని చేత వధించబడిన కాలనేమి తానే అని తెలుసుకున్నాడు.

మ. కలఁగంబాఱి మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁడై పట్టి బ
ద్ధులఁ గావించి హరిం దలంచి వెస తోడ్తో వారు గన్నట్టి పు
త్రులఁ జంపెన్, గురు నుగ్రసేను యదుఁ దద్భోజాంధకాధీశు ని

ర్మలు బట్టెం గడు వాలి యేలెఁ జల మారన్ శూరసేనంబులన్.

54

తా ॥ వెంటనే కలవరపడి మహాకోపంతో దేవకీవసుదేవులను పట్టి బంధించాడు. శ్రీహరిని తలచుకుంటూ వారు కన్న కొడుకులారుగురిని చంపాడు. అంతటితో ఆగక, యదు భోజ అంధక దేశాలకు ప్రభువు, తనకు తండ్రి, పవిత్రుడు అయిన ఉగ్రసేనున్ని పట్టి చెరసాలలో బంధించి, పట్టుదలతో శూరసేన దేశానికి తానే రాజై పాలించసాగాడు.

ఆ. తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల నన్నల, సఖుల నైన బంధుజనుల నైన
రాజ్యకాంక్షఁజేసి రాజులు సంపుదు, రవనిఁ దఱచు జీవితార్థు లగుచు.

55

తా ॥ రాజ్యకాంక్ష కలిగిన రాజులు, తమ జీవితాలను కాపాడుకొనుటకు ఎవ్వరినైనా చంపుతారు. అక్కడ తల్లి, తండ్రి, అన్నదమ్ములు, స్నేహితులు, బంధువులు అనే వరుసను లెక్కచెయ్యరు.

వ. మఱియును బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిధ పూతనాది సహాయసమేతుండై కంసుండు గదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి యదవలై, యదువులు పదవులు వదలి నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చి, మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం గొలిచి నిలిచి, రంత.

56

తా ॥ ఓ రాజా! ఈ విధంగా రాజ్యాన్ని ఆక్రమించిన కంసుడు రాక్షసులను అనుచరులుగా కూడగట్టుకొన్నాడు. బాణుడు, భౌముడు, మాగధుడు, అఘాసురుడు, కేశి, ధేనుకుడు, బకుడు, ప్రలంబుడు, తృణావర్తుడు, చాణూరుడు, ముష్టికుడు, అరిష్టుడు, ద్వివిదుడు,

పూతన అనే రక్కసి మొదలైన రాక్షసుల సహాయంతో యుద్ధాలు చేస్తూ యాదవులందరిని ఓడించాడు. వాళ్ళంతా తలలు వంచుకొని ఇళ్ళు వాకిళ్ళు విడిచి నిషధ, కురు, కోసల, విదేహ, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వ దేశాలలో జీవిస్తున్నారు. మరికొందరు మాత్సర్యం మాని కంసుని కొలుస్తూ మథురలోనే ఉండిపోయారు.

క. తొడితొడిఁ గంసుఁడు దేవకి, కొడుకుల నార్వుర వధింప గురుశేషాఖ్యం
దొడవగు హరిరుచి యాసతి, కడుపున నేడవదియైన గర్భం బయ్యెన్.

57

తా ॥ కంసుడు దేవకీదేవి కొడుకులను ఆరుగురిని వధించాడు. ఆదిశేషువు అనబడే విష్ణువు యొక్క అంశ ఆమెలో ఏడవ గర్భంగా ప్రవేశించింది.

వ. అ య్యవసరంబున విశ్వరూపుండగు హరి దన్ను నమ్మిన యదువులకుం గంసునివలన భయంబు గలుగు నని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె.

58

తా ॥ ఆ సమయంలో శ్రీహరి తనను నమ్ముకున్న యాదవులకు కంసుని వలన భయం కలుగుతుందని తెలుసుకొని యోగమాయాదేవితో ఇలా అన్నాడు:

సీ. 'గోపికా జనములు గోపాలకులు నున్న పసులమందకుఁ బొమ్ము భద్ర! నీవు
వసుదేవుభార్యలు వరుసఁ గంసునిచేత నాఁకలఁ బడియుండ నందుఁ జొరక
తలఁగి రోహిణియను తరళాక్షి నంద గోకుల మందు నున్నది గుణగణాఢ్య
దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నా తేజ మీ వమరఁ బుచ్చి

ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ, జొనుపు దేవకికిని సుతుఁడ నగుదు
నంశభాగయుతుఁడనై, యశోదకు నందు, పొలఁతి కందు మీఁదఁ బుట్టె దీవు.

59

తా ॥ "భద్రా! నీవు గోపికలు, గోపాలకులు కాపురం ఉన్న వ్రేపల్లెకు వెళ్ళు. వసుదేవుని భార్యలు ఎనిమిది మందిలో ఏడుగురు మథురలో కంసుని చేత చెరసాలలో ఉంచబడ్డారు. కాని రోహిణీదేవి మాత్రం చెరసాలలో పడకుండ ఆ వ్రేపల్లెలో ఉంది. నువ్వు దేవకీదేవి గర్భంలో వెలుగుతున్న శేషుడనే నా తేజస్సును నేర్పుగా తీసి రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టు. ఆ తరువాత నేను దేవకీదేవి పుత్రుడనై పుడతాను. నీవు నందుని భార్య అయిన యశోదకు కూతురువై జన్మించు.

క. నానావిధ సంపదలకుఁ దానకమై సర్వకామదాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు, కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ!

60

తా ॥ ఓ యోగమాయా! నిత్య మంగళా! నానావిధ సంపదలకు నిలయమనీ, అన్ని కోరికలను తీర్చే శక్తిగల దానివనీ మానవులు నీకు కానుకలు, బలులు ఇచ్చి భక్తితో కొలుస్తారు.

వ. మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదు రయ్యైస్థానంబుల యం' దని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన ని య్యిల కయ్యెడ వాసి వచ్చి.

61

తా ॥ జనులందరు నిన్ను కాళీక్షేత్రంలో దుర్గ అని, భద్రేశ్వర క్షేత్రంలో భద్రకాళి అని, వరాహశైల క్షేత్రంలో విజయ అని, మాతృకా క్షేత్రంలో వైష్ణవి అని, మానస క్షేత్రంలో కుముద అని, అమరకుండక క్షేత్రంలో చండిక అని, హస్తినాపుర క్షేత్రంలో కృష్ణ అని, శ్రీశైల క్షేత్రంలో

మాధవి అని, కన్యాకుబ్జ క్షేత్రంలో కన్యక అని, మాయానగర క్షేత్రంలో మాయ అని, సుపార్శ్వ క్షేత్రంలో నారాయణి అని, రుద్రకోటక్షేత్రంలో ఈశాన అని, బ్రహ్మ క్షేత్రంలో శారద అని, సిద్ధవన క్షేత్రంలో అంబిక అని పదునాలుగు పేర్లతో కొనియాడుతూ ఉంటారు. ఇక వెళ్ళిరా!” అని సర్వేశ్వరుడైన హరి ఆజ్ఞ ఇచ్చాడు. మహాప్రసాదం అని యోగమాయ అతనికి నమస్కరించి విష్ణులోకం నుంచి భూలోకానికి వచ్చింది.

తే. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు మెల్లనఁ దిగిచి యోగ నిద్ర
రోహిణికడుపున నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁ బడఁగ.

62

తా ॥ దేవకీదేవి కడుపులో దివ్యతేజంతో ఉన్న శిశువును కందకుండా వెలికితీసి రోహిణీదేవి కడుపులో ప్రవేశింపచేసింది యోగమాయ. మాయను తెలుసుకోలేని పౌరులందరు దేవకీదేవికి గర్భ స్రావం అయిందని బాధ పడ్డారు.

వ. అంత.

63

ఆ. బలము మిగులఁ గలుగ ‘బలభద్రుఁ’ డన లోక, రమణుఁ డగుటఁ జేసి ‘రాముఁ’ డనఁగ
సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున ‘సం, కర్షణుం’ డనంగ ఘనుఁడు సుతుఁడు.

64

తా ॥ అంతట కొన్ని నెలలకు రోహిణీదేవి గర్భాన ఒక కుమారుడు పుట్టాడు. మిక్కిలి బలం కలిగిన వాడు కావటం వల్ల బలభద్రుడని, అందరినీ ఆనందింపచేసేవాడు కనుక రాముడని, గర్భాన్ని బయటకు తీయడంవలన జన్మించినవాడు కనుక సంకర్షణుడని అతనికి వివిధములైన నామములు కలిగాయి. అతడు చాలా గొప్పవాడు.

వ. తదనంతరంబ.

65

తా ॥ అనంతరం,

క. ఆనకదుందుభి మనమున, శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి
నతఁడు వెలిఁగెను, గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా!

66

తా ॥ బలరాముడు పుట్టిన తరువాత శ్రీమహావిష్ణువు అంశ వసుదేవుని యందు ఆవేశింపగానే అతడు రెండవ సూర్యునిలా ప్రకాశించాడు. పంచ భూతములకు, జీవులకు ఆనందం కలిగింది.

ఉ. ఆవసుదేవుఁ డంతఁదనయం దఖిలాత్మక మాత్మభూతముం
బావనరేఖయున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల
క్ష్మీ విభుతేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పెఁ బూర్వయగు దిక్సతి చంద్రునిఁ దాల్చు కైవడిన్.

67

తా ॥ ఆ వసుదేవుడు తనలో వ్యాపించిన శ్రీమన్నారాయణుని మహా తేజస్సును దేవకీ దేవి గర్భంలో ప్రవేశపెట్టాడు. సృష్టి అంతటా నిండి ఉన్నదీ, అన్నిటికి ఆత్మ అయినదీ, పవిత్రమైనది, లోకాలకు మేలు చేసేదీ అయిన ఆ శ్రీమన్నారాయణుని తేజస్సు దేవకీదేవి గర్భంలో ప్రవేశించగానే చంద్రోదయానికి ముందుగా తూర్పు దిక్కు అనే స్త్రీ ఏ విధంగా కాంతితో శోభిల్లుతుందో ఆ విధంగా దేవకీదేవి ప్రకాశించ సాగింది.”

వ. అనిన విని తర్వాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డిట్లనియె.

68

తా ॥ ఇంతవరకు విన్న పరీక్షిన్మహారాజు తరువాత వృత్తాంతాన్ని అడుగగానే శుక యోగీంద్రుడు ఇలా చెప్పసాగాడు:

క. గురుతరముగఁ దన కడుపునఁ, సరసిజగర్భాండభాండ చయములు గల యా
హరి దేవకి కడుపున భూ, భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కక్రియన్.

69

తా ॥ "బ్రహ్మాండాలను తన కడుపులో ఉంచుకొన్న శ్రీ మహావిష్ణువు, లోకాలను రక్షించడం కోసం దేవకీదేవి గర్భంలో బాల సూర్యునిలా వృద్ధి పొందాడు.

వ. అంత.

70

సీ. విమతులమోములు వెలవెలఁ బాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె
మలయు వైరులకీర్తి మాసి నల్లన గాఁగ, నాతిచూచుకములు నల్లనయ్యె
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమ యారున రోమలేఖ మెఱసె
నరిమానసముల కాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె

తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర, జడత వాటిల్లె శత్రులు జడను వడఁగ, మన్ను
రుచియయ్యెఁ బగతురు మన్ను సొరఁగ, వెలఁది యుదరంబులో హరి వృద్ధిఁబొంద.

71

తా ॥ అంతట దేవకీదేవికి గర్భవతులైన స్త్రీలకు గల లక్షణాలు కనిపించసాగాయి.

అప్పుడు ఆమె

ముఖం తెల్లబడుతూ ఉండగా పగవారి ముఖాలు కళతప్పి వెలవెలబోవడం మొదలెట్టాయి. చనుమొనలు నలుపెక్కగా శత్రువుల కీర్తి నలుపెక్కుతూ నశించసాగింది. నూగారు మెరుస్తూ ఉండగా దుష్టులైన

శత్రువుల పట్టణాలలో ఉత్పాతాలు పుట్టాయి. దేవకీదేవికి భోజనం మీద వాంఛ తప్పేసరికి శత్రువులకు భోజనం మీద ఆశపోయింది. ఆమెకు బడలిక పుట్టేసరికి పగవారికి బడలిక పుట్టింది. బద్ధకంగా అనిపించేసరికి శత్రువుల్లో తెలియని అలసట మొదలైనది. ఆమెకు మన్నురుచి ఇష్టం కాగానే ఇక శత్రువులు మట్టిలో కలిసిపోతారన్న భావం బలపడింది. ఈ రీతిగా దేవకి గర్భమందు శ్రీహరి వృద్ధి చెందసాగాడు.

వ. మఱియును.

72

సీ. సలిల మా యెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ, జనిన కైవడి ఘర్మసలిల మొప్పె,
నొగిఁ దేజ మా యింతి యుదరడింభకుఁ గొల్వఁ గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ
బవనుఁ డా కొమ్మ గర్భస్థుని సేవింప నొలసె నా మిక్కిలి యూర్పు లమరెఁ
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని మంటి చొరవ దనరె

ఆ. గగన మిందువదనకడుపులో బాలు సే, వలకు రూపు మెఱసి వచ్చినట్లు బయలువంటి
నడుము బహుళ మయ్యెను బంచ, భూతమయుఁడు లోనఁ బొదల సతికి.

73

తా ॥ పంచ మహాభూతములే తన రూపంగా గల శ్రీహరి దేవకీదేవి గర్భంలో పెరుగుతూ ఉన్నప్పుడు జలములు ఆ చిన్నవాడిని చూసేందుకు వెళ్ళినవా అన్నట్లు ఆమెకు చెమటలు అధికమైనాయి. అగ్ని బొజ్జలోని ఆ బాలుని సేవింపబోయిందా అన్నట్లు ఆమెకు దేహకాంతి

అధికమైంది. గాలి ఆ శిశువుని ఆరాధింపబోయిందా అన్నట్లు ఆమెకు నిట్టూర్పులు ఎక్కువయ్యాయి. భూదేవి ఆ గర్భస్థ శిశువుని అర్చింపబోయిందా అన్నట్లు ఆమెకు మన్ను తినాలనే బుద్ధి పుట్టింది. ఆకాశం ఆమె కడుపులోని బుడుతను పూజింప వచ్చిందా అన్నట్లు సన్నని ఆమె నడుము విశాలమై వ్యాపించింది.

వ. తదనంతరంబ.

74

సీ. అతివకాంచీగుణం బల్లన బిగియంగ వైరివధూ గుణవ్రజము వదలె,
మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁగెక్క దుష్టాంగనాతనుద్యుతు లడంగె,
నాతి కల్లన భూషణములు పల్చలన గాఁ బరసతీభూషణపంక్తు లెడలెఁ,
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ బరిపంథిదారగర్భములు వగిలెఁ,

తే. బొలఁతి కల్లన నీళ్ళాడు ప్రొద్దు లెదుగ, నహితవల్లభ లైదువలై తనర్చు ప్రొద్దు
లన్నియుఁ గ్రమమునఁ బోవఁ దొడఁగె, నువిదకడుపున నసురారి యుంటఁజేసి.

75

తా ॥ దేవకీదేవి గర్భంలో శ్రీహరి ఉన్న కారణంగా ఆమె బంగారు మొలనూలు బిగుతుకాగా పగవారి భార్యల మంగళ సూత్రాల పురివీడినట్లయ్యింది. ఆమె దేహకాంతి హెచ్చుకాగా పగవారి భార్యల దేహకాంతి తగ్గసాగింది. ఆమెకు ఆభరణాలు బరువవుతుంటే శత్రుభార్యల ఆభరణాలు సడలిపోసాగాయి. ఆమె గర్భం వృద్ధిపొందుతుంటే శత్రురాజుల భార్యల గర్భములు దిగజారసాగాయి. ఆమెకు ప్రసవదినాలు సమీపించేకొద్దీ శత్రువుల భార్యలు సువాసినుగా ఉండే రోజులు తగ్గిపోసాగాయి.

వ. ఇవ్విధంబున.

76

ఆ. జ్ఞానఖలునిలోని శారదయును బోలె, ఘటములోని దీపకళిక వోలె
భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ, కాంత విశ్వగర్భగర్భ యగుచు.

77

తా ॥ ఈ విధంగా జ్ఞాన హీనుడైన వాని విద్యలా, కుండలోని దీపంలా, పదునాలుగు లోకాలను తన కడుపులో సంరక్షిస్తున్న శ్రీహరిని గర్భంలో మోస్తూన్న దేవకీదేవి అన్యులకు కానరాకుండా అన్నగారింట ఉండిపోయింది.

వ. అంత న క్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేని మెఱుంగును, మెలఁగెడి సొబగునుం జూచి వెఱఁగుపడి తఱచు వెఱచుచుఁ గంసుండు దనలో నిట్లనియె.

78

తా ॥ అంతకంతకూ అధికమవుతున్న దేవకీదేవి ముఖతేజస్సును, శరీరకాంతిని, అందాన్ని చూసి మనస్సులో ఆశ్చర్యాన్ని, దిగులును పొంది కంసుడు తనలో తాను ఇట్లా అనుకున్నాడు.

క. కన్నులకుఁ జూడ బరువై, యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలఁగన్
ము న్నెన్నఁడు నిట్లుండదు, వెన్నుఁడు సొరఁ బోలు గర్భవివరములోనన్.

79

తా ॥ "ఆలోచిస్తే ఈమె గర్భం నా మనస్సును కలతపెట్టడం మాత్రమే కాకుండా, చూసేందుకు కూడ భారంగా ఉంది. మునుపెన్నడూ ఇలా ఉండలేదు. విష్ణువు ఈమె గర్భంలో ప్రవేశించి ఉండాలి.

ఉ. ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁడు నాఁటికిం
గామిని చూలు పెంపెసఁగె? గర్భిణిఁ జెల్లెలి నాఁడు పేద నే

నేమని చంపువాఁడఁ? దగ వేలని చంపితినేని శ్రీయు ను
ద్దామ యశంబు నాయువును ధర్మమునుం జెడిపోవ కుండునే?

80

తా ॥ ఇంక నేనేం చెయ్యాలి? రోజు రోజుకి ఈమె యొక్క గర్భం కాంతిమంతమవుతూ ఉన్నదే! నిండు చూలాలైన చెల్లెలిని, ఒక ఆడదానిని ఇప్పుడు ఎలా చంపగలను? ఒకవేళ చంపితే నా సంపద, కీర్తి, ఆయువు, ధర్మము... ఇవన్నీ నశించవా?

క. వావి యెఱుంగని క్రూరుని, జీవన్మృతుఁ డనుచు నిందసేయుదు, రతఁడుం బోవును నరకమునకు, దు, ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?

81

తా ॥ 'వావి వరుసలు తెలియని క్రూరుడు బ్రతికి ఉన్నా చచ్చిన వానితో సమానం' అని లోకులు దూషిస్తారు. అటువంటి దుష్టుడనే పేరుతో బ్రతకడం కూడా ఒక బ్రతుకేనా? వాడు నరకానికి పోతాడు అని పరిపరి విధాలుగా ఆ కంసుని మదిలో ఆలోచనలు నిలువనీయక మెదలుతున్నాయి."

వ. అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యెగ్గని యుగ్గడించి, మాని, మౌనియుం బోలె నూరకుండియు.

82

తా ॥ చివరికి తన క్రూర స్వభావాన్ని విడిచి, ధైర్యంతో గాంభీర్యాన్ని పాటిస్తూ, శౌర్యాన్ని ప్రకటిస్తూ చెల్లెలిని చంపే ఉద్దేశాన్ని విడిచి మౌనంగా ఊరకున్నాడు.

ఆ. 'పాపరాని దొడ్డపగ పుట్టె, నిఁక నెట్టు, లిందుముఖీకిఁ జక్రి యెపుడు పుట్టుఁ?

బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ, జూతు' ననుచు నెదురు సూచుచుండె.

83

తా ॥ అయితే లోలోపల శత్రువుని తలచుకుని కంపిస్తూనే ఉన్నాడు. అణచరాని మహా విరోధం కలిగింది. ఏమి జరుగుతుందో! దేవకీదేవికి శ్రీహరి ఎప్పుడు పుడతాడు? పురిటింటిలోనే వాణ్ణి చంపుతాను... అని అనుక్షణం ఎదురు చూస్తున్నాడు కంసుడు.

వ. మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి యతండు.

84

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు, నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్
హరిఁ దలఁచి తలఁచి జగ మా, హరిమయ మని చూచెఁ గంసుఁ డాఱని యలుకన్.

85

తా ॥ ఆ కంసుడు ఎడతెగని విరోధం చేత నిరంతరం విష్ణుస్మరణం చేస్తూ, ఇతర పనుల మీద ఆసక్తిని విడిచిపెట్టేశాడు. తిరుగుతూన్నప్పుడు, భోజనం చేస్తూన్నప్పుడు, నీళ్ళు త్రాగేటప్పుడు, నడుస్తూ ఉన్నప్పుడు, కూర్చున్నప్పుడు, లేచేటప్పుడు... ఇంకా తక్కిన వేళల్లోను శ్రీమహావిష్ణువును మరచిపోకుండగా క్షణక్షణం తలుస్తూ, ప్రపంచం అంతా కూడా శ్రీహరి రూపంగానే చూడసాగాడు.

వ. వెండియు.

86

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది హరిరవ మని యాలకించు,
నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ,
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన హరికరాఘాతమో యనుచుఁ నులుకు,
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికాగంధ మనుచు నదరుఁ,

ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరి పేరు, పలుకఁ బడియె ననుచు భ్రమసి పలుకుఁ
దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు, హరితలంపు లనుచు నలుగఁ దలఁచు.

87

తా ॥ చెవులకు ఏ చిన్నపాటి శబ్దం వినబడినా శ్రీహరి మాట్లాడిన పలుకు ఏమో అని వింటున్నాడు. కనబడిన రూపాలన్ని శ్రీహరి రూపాలేమో అని చూస్తున్నాడు. తన శరీరానికి గడ్డిపోచ తాకినా అది శ్రీహరి స్పర్శ కావచ్చని కలవర పడుతున్నాడు. ఏదైనా పరిమళం సోకితే అది హరి మెడలోని వనమాలది కావచ్చునని ఉలికిపడుతున్నాడు. ఎవరేం మాట్లాడినా శ్రీహరి మాటలని భ్రమిస్తున్నాడు. ఈ విధంగా తనకు కలిగిన భావాలన్నీ శ్రీహరి భావాలుగానే భావిస్తున్నాడు. ఈ విధంగా వైరంతో ఉన్నా, చిత్తమంతా ఆ పరమాత్ముని యందే సంపూర్ణంగా నిలిపాడు.

వ. ఆయ్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాది మునులునుం గూడి నడవ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీ దేవిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి.

88

తా ॥ ఆ సమయంలో ఇంద్రాది దేవతలు, నారదాది మునులు, బ్రహ్మ, శివుడూ దేవకీదేవి ఉన్న చెరసాల వద్దకు వచ్చి ఆమె గర్భంలో ఉన్న ఆ పురుషోత్తముణ్ణి ఇలా స్తుతించారు.

## 2. బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భంలోనున్న శ్రీకృష్ణుణ్ణి స్తుతించుట

సీ. సత్యవ్రతుని నిత్యసంప్రాప్తి సాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని
భూతంబు లైదును బుట్టుచోటగు వాని నైదుభూతంబులం దమరువాని
నైదు భూతంబులు నడఁగిన పిమ్మటఁ బరఁగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడు వానిని ని న్నా శ్రయింతుము, నీ యధీన

ఆ. మాయచేత నెఱుకమాలిన వారలు, పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు,
రెఱుఁగ నేర్చు విబుధు లేకచిత్తంబున, నిఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు.

89

తా ॥ "ఓ మహానుభావా! నీవు సత్యమే వ్రతంగా కలవాడవు! జాగ్రత్, స్వప్న, సుషుప్తి.... అనెడు మూడు అవస్థలలోను ఏకాకారంలో ఉంటావు. పంచ మహా భూతాలను పుట్టించిన వాడవు నీవే! అందులో ఉన్నవాడవు నీవే! అవి నశించిన పిమ్మట ఉండేవాడివీ నీవే! సత్య భాషణం, సమదర్శనం గల నిన్ను ఆశ్రయిస్తాం! నీ మాయలో చిక్కుకున్న వాళ్ళు అనేక విధాలుగా నిన్ను పేర్కొంటారు. జ్ఞానవిజ్ఞాన మూర్తులైన మునులు... అన్ని స్వరూపాలు నీవే అనే ఎరుకలో ఉంటారు.

వ. అదియునుంగాక.

90

సీ. ప్రకృతి యొక్కటి పాదు, ఫలములు సుఖదుఃఖములు రెండు, గుణములు మూఁడు వేళ్ళు,
తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు, లెఱిఁగెడి విధము లై దింద్రియంబు,
లాఱు స్వభావంబు లా శోకమోహాదు లూర్ములు, ధాతువు లొక్కయేడు,
పైపొర లెనిమిది ప్రంగలు, భూతంబు లైదు బుద్ధియు మనో–హంకృతులును,

తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు, ప్రాణ పత్త్రదశకంబు, జీవేశ పక్షియుగముఁ

గలుగు సంసార వృక్షంబు గలుగఁజేయఁ, గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ.

91

తా ॥ అంతేగాకుండా... ఈ సృష్టిలో సంసారం అనే వృక్షం ఒకటుంది. దానికి ప్రకృతి అనేది పాదు. సుఖము, దుఃఖము అనేవి రెండు ఫలాలు. సత్వము, రజస్సు, తమస్సు అనేవి వేళ్ళు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థాలు రసాలు. ఇంద్రియాలు అయిదు అవి గ్రహించే విధానాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనేవి అయిదు ఊడలు. ఆకలి, దప్పిక, శోకము, ఆశ, ముదిమి, చావు అనే ఈ ఆరు దాని స్వభావాలు. చర్మం, మాంసం, రక్తం, మేధస్సు, క్రొవ్వు, ఎముకలు, రేతస్సు అనేవి ఆ వృక్షానికి గల ఏడు పొరలు (బెరడు). పంచ భూతములు అయిదూ బుద్ధి, మనస్సు, అహంకారం అనే మూడు కలిపి మొత్తం ఎనిమిది ఆ వృక్షానికి కొమ్మలు. కన్నులు, చెవులు, ముక్కు పుటాలు, నోరు, మలమూత్ర ద్వారాలు అనే తొమ్మిది ఆ వృక్షానికి తొఱ్ఱలు (నవరంధ్రాలు). ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే పంచ ప్రాణాలు, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయం అనే ఉపప్రాణాలు – మొత్తం పది ప్రాణాలు దానికి ఆకులు. జీవుడు – ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఆ వృక్షంపైన నివసిస్తూ ఉంటాయి. ఇటువంటి మనుష్యదేహం అనే అద్భుత వృక్షాన్ని పుట్టించడానికి, పెంచడానికి, నశింపచేయడానికి కర్తవు నీవొక్కడివే కానీ, వేరెవ్వరూ కర్తలు కార" ని బ్రహ్మాదులు పొగుడుతూ, ఇంకా ఇలా అంటున్నారు:

క. నీదెసఁ దనుచిత్తము లిడి, యే దెసలకుఁ బోక కడతు రెఱుక గలుగు వా,
రా దూడయడుగుక్రియ నీ, పాదంబను నావకతన భవసాగరమున్.

92

తా ॥ "జ్ఞానులైన వారు ఇతర మార్గాల్లోనికి వెళ్ళకుండా, నీయందే తమ అంతఃకరణాన్ని నిలిపి సంసార సముద్రాన్ని నీ పాదములనే నావచేత ఆవుదూడ అడుగుని దాటినంత సులభంగా దాటగలరు.

ఆ. మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ, గల్లరులకు మేలుగాని యట్టి
తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు, సేమ మెల్లప్రొద్దుఁ జేయు దీవు.

93

తా ॥ మంచివారికి శుభములను చేకూరుస్తూ, దుష్టులను శిక్షిస్తూ ఉండే నీవు ఎన్నో అవతారములను ధరించి లోకాలకు సర్వకాలాల్లోను క్షేమాన్ని కలిగించేవాడివి.

క. ఎఱిఁగినవారల మనుచును, గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీ పే
రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు, పఱతు రధోగతుల జాడఁ బద్మదళాక్షా!

94

తా ॥ ఓ పద్మదళాక్షా! కొంతమంది మూఢులు నీ స్వరూపానుభవం లేని అజ్ఞానుల వద్ద కొన్ని విషయాలను తెలుసుకొని మాకు అన్నీ తెలుసు అనే గర్వంతో ఉంటారు. నీ నామసంకీర్తన మహిమను తెలిసి ఉండీ వారు చేసేందుకు ప్రయత్నించరు. అలాంటివారు తప్పక నీచ జన్మములనెత్తి దుఃఖాలపాలవుతారు.

క. నీవారై నీ దెసఁ దమ, భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక, నీ వఱలెడి మేటిచోట నెగడుదు రీశా!

95

తా ॥ ఈశ్వరా! నీ యందు మాత్రమే ఆసక్తి కలవారు తమ మనస్సులను నీయందే నిలిపి ఏ భయము లేకుండా ఉన్నవారు. వారు ఎటువంటి విఘ్నములను పొందరు. నీవు ఎక్కడ ఉంటావో ఆ దివ్యలోకంలోనే వారూ నివసిస్తారు.

క. నిను నాలుగాశ్రమంబుల, జనములు సేవింప నఖిలజగముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం, బును నగు గాత్రంబు నీవు వొందుదువు హరీ!

తా ॥ ఓ హరీ! బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు నిన్ను సేవిస్తూ ఉంటారు. నీవు సత్వగుణంతో కూడినది, పరిశుద్ధమైనది, మోక్షాన్నిచ్చేది అయిన దివ్య మంగళ విగ్రహాన్ని ధరిస్తూ ఉంటావు.

సీ. నలినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు గాదేని విజ్ఞానకలిత మగుచు
నజ్ఞానభేదకం బగు టెట్టు? గుణముల యందును వెలుఁగ నీ వనుమతింపఁ
బడుదువు, సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు
వాఙ్మనసముల కవ్వలిదైన మార్గంబు గలుగు, నీ గుణజన్మకర్మరహిత

తే. మైన రూపును బేరు నత్యనఘబుద్ధు, లెఱుఁగుదురు, నిన్నుఁగొల్వ నూహించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు, భవము నొందఁడు నీ పాదభక్తుఁ డగును.

97

తా ॥ తామరలవంటి కన్నులుగల ఓ స్వామీ! నీ దివ్య మంగళ విగ్రహం సత్వస్వరూపమే! కాని పక్షంలో దివ్య జ్ఞానంతో నిండి ఉండి అది అవివేకాన్ని ఎలా నశింపచేయ గలుగుతోంది? గుణములలో కూడా ప్రకాశిస్తూ ఉంటావు. విజ్ఞాన ప్రదమైన నీ దివ్య మంగళ విగ్రహాన్ని ఆరాధింపగానే సాక్షిగా ఉన్న నీవు పరిపూర్ణ స్వరూపంతో సాక్షాత్కరిస్తావు. వాక్కునకు, మనస్సునకును అతీతమైన వాడవు. గుణాలకు, పుణ్యపాపమిశ్ర కర్మలకు అతీతమైన నీ రూపాన్ని పుణ్యాత్ములైన వివేకులు మాత్రమే గ్రహిస్తారు. నిన్ను ఆరాధిస్తూ నీ గురించి యోచన చేస్తూ, నీ గాథలను వింటూ, ధ్యానిస్తూ, పొగడుతూ ప్రకాశించే సత్పురుషుడు తిరిగి ఈ సంసారాన్ని పొందదు. నీ పాదములనే అంటిపెట్టుకుని ఉండిపోతాడు.

క. ధరణీభారము వాసెను, బురుషోత్తమ! యీశ! నీదు పుట్టువున, భవ
చ్చరణాంబుజముల ప్రాపున, ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్.

98

తా ॥ నీవు జన్మించడం వల్ల భూదేవి భారం తగ్గిపోతుంది. నీ పాద స్పర్శచేత భూలోకాన్ని, స్వర్గలోకాన్ని ఆనందంతో చూడగలం.

ఉ. పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయ కాక పుట్టుటే? యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ జుట్టుచు నుండుఁ గాని నినుఁ జుట్టినదింబలెఁ బొంత నుండియుం జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కని యెక్కటి వౌదు వీశ్వరా!

99

తా ॥ పుట్టుకలేని నీకు అవతరించడం అనేది ఒక క్రీడ. చావు, పుట్టుకలు అజ్ఞానం కారణంగా జీవులను ఆవరిస్తూ ఉంటాయి. ఆ అజ్ఞానం లేదా మాయ నిన్ను స్పృశించలేక దూరంగా ఉండి పోతుంది. మాయ యొక్క ఆటలలో నీవు చిక్కుకోనివాడవు కనుకనే నీవు ఈ జగమునకు ఈశ్వరుడవు.

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే<br>
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతాభర్త వై<br>
ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్<br>
పరిరక్షించిన నీకు మ్రొక్కెద, మిలాభారంబు వారింపవే!

100

తా ॥ నీవు ఎన్నో అవతారాలను ఎత్తి, దుష్టులను శిక్షిస్తూ లోకములను కృపతో సంరక్షించావు. మత్స్యరూపుడవై, కూర్మమూర్తివై, వరాహరూపుడవై, సంపత్కరుడైన నరసింహుడవై, వామనుడవై, హయగ్రీవుడవై, పరశు రాముడవై, శ్రీరాముడవై... పదునాలుగు లోకాలను రక్షించిన నీకు నమస్కరిస్తున్నాం. ఈ భూభారాన్ని తొలగించవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

క. ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలుఁ గంసాది ఖలులు నిర్దయు లేఁచన్,
మచ్చిగఁ గావఁగ వలయును, విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!

101

తా ॥ ముక్తిని ప్రసాదించేవాడా! ఓ ముకుందా! కఠిన చిత్తులైన కంసాదుల వలన బాధలు అనుభవిస్తూ ఈ లోకం దుఃఖంలో మునిగి ఉంది. ఈ లోకాన్ని కాపాడటానికి దేవకీదేవి గర్భంలోనుండి త్వరగా బయటకు రావయ్యా!"

వ. అని మఱియు దేవకీదేవిం గనుంగొని

102

మత్త. తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్న వాఁ
డెల్లి పుట్టెడిఁ, గంసుచే భయ మింత లేదు, నిజంబు, మా
కెల్లవారికి భద్రమయ్యెడు, నింక నీ కడు పెప్పుడుం
జల్లగావలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్.

103

తా ॥ అని బ్రహ్మాదులు శ్రీ విష్ణుదేవుని స్తుతించి, దేవకీదేవిని చూసి ఇలా అన్నారు: "తల్లీ! నీ గర్భంలో శ్రీమహావిష్ణువున్నాడు, రేపు అవతరిస్తాడు. కంసుని వలన ఇంక ఏ భయమూ లేదు. మాకందరకు మేలు జరుగుతుంది. యాదవులు సంతోషాన్ని పొందుతూ ఉండగా ఎల్లకాలం నీ కడుపు చల్లగా సుఖింతువుగాక! మా మాట నమ్ము!"

వ. అని యి వ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశానబ్రహ్మల మున్నిడుకొని చని, రంత –

104

తా ॥ అని దేవతలు ఈ విధంగా హరిని స్తోత్రం చేసి, దేవకీదేవిని ఆశీర్వదించి బ్రహ్మ ఈశ్వరులతో తమ తమ నివాసాలకు చేరుకున్నారు.

# 3. శ్రీకృష్ణావతార ఘట్టము

క. పంకజముఖి నీ ళ్ళాడను, సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్
సంకటము దోఁచె, మెల్లన, సంకటములు లేమి దోఁచె సత్పురుషులకున్.

105

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! కమలము వంటి ముఖం కలిగిన దేవకీదేవి ప్రసవం దుర్మార్గులకు అనగా కంసుడు మొదలైన వారి మనస్సుల్లో బాధను పుట్టించింది. అంతేకాక మంచివారికి క్రమంగా వేదనలు తగ్గే సూచనలు గోచరించేలా చేసింది.

సీ. స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును గలఘోషణముల మేఘంబు లుఱిమె,
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ
దాల్చెఁ గమ్మని చల్లని గాలి మెల్లన వీచె, హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ
గొలఁకులు కమలాళికులములై సిరి నొప్పెఁ, బ్రవిమలతోయలై పాఱె నదులు,

తే. వరపుర గ్రామఘోషయై వసుధ యొప్పె, విహగ రవ పుష్పఫలముల వెలసె వనము,
లలరుసోనలు గురిసి ర య్యమరవరులు దేవదేవుని దేవకీదేవి గనఁగ.

106

తా ॥ దేవకీదేవి శ్రీకృష్ణమూర్తిని ప్రసవించిన సమయంలో సృష్టి అంతా పులకించిపోయింది సప్తసముద్రాలు స్వచ్ఛమైన నీటితో ఉప్పొంగాయి. మేఘాలు చెవులకింపుగా ధ్వనించాయి. ఆకాశం శుభగ్రహాలతో, నక్షత్రాలతో ప్రకాశించింది. అష్టదిక్కులు దివ్యకాంతులతో ప్రకాశించాయి. కమ్మని వాసనలతో చల్లని గాలి మెల్లగా వీచింది. హోమాగ్నులు జాజ్వల్యమానంగా వెలగసాగాయి. కొలనులు, తామర పూలతోను వాటిలో ఝుమ్మని తిరుగు తుమ్మెదలతోను కళకళలాడాయి. నదులన్నీ నిర్మలమైన నీటితో ప్రవహించాయి. భూమి పట్టణాలలో, గ్రామాలలో, గొల్లపల్లెలలో ఉత్సవాలతో సంరంభంగా కనిపించసాగింది. వనాలన్నీ

పక్షుల కలకలారావాలతో, పుష్పాలతో, ఫలాలతో శోభించాయి. దేవతలు ఆ సమయాన పూలవాన కురిపించారు.

క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి రంభాదికాంత, లానందమునం
గూడిరి సిద్ధులు, భయముల, వీడిరి చారణులు, మొరసె వేల్పుల భేరుల్.

107

తా ॥ ఆ సమయంలో గంధర్వులు దివ్యగానం చేసారు. రంభ, ఊర్వశి మొదలైన అప్సరసలు సంతోషంతో నర్తించారు. విశ్వావసువు మొదలైన సిద్ధులు ఆనందంతో పొంగిపోసాగారు. చారణులు భయాన్ని విడిచి ఆనందించారు. ఉత్సవసంరంభంతో దేవతలు భేరీలు మ్రోగించారు.

వ. అ య్యవసరంబున.

108

క. సుతుఁ గనె దేవకి నడురే, యతి శుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్
దితిసుత నిరాకరిష్ణున్, శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

109

తా ॥ అటువంటి ఆ సమయంలో గ్రహ నక్షత్రాలు అత్యంత శుభస్థానాల్లో ఉండగా, రాక్షసులను తల్లడిల్ల జేసేవాడు, భక్తుల మనస్సులకు ఉల్లాసాన్ని కలిగించేవాడు; శత్రువులను గెల్చుటయే స్వభావంగా కలవాడు, పదునాలుగు లోకాలలో నిండియున్నవాడు అయిన కుమారుని దేవకీదేవి అర్ధరాత్రి సమయంలో కన్నది.

క. వెన్నుని నతిప్రసన్నునిఁ, గన్నన గని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం
బున్నమనాఁడు కళానిధిఁ, గన్న మహేంద్రాశ చెలువుగలిగి నరేంద్రా!

తా ॥ ఆ నిశిరాత్రి సమయమందు మేఘంలోని మెరుపుతీగవలె ప్రకాశిస్తూ ఉన్న దేవకీదేవి గర్భం నుండి, పౌర్ణమినాటి షోడశ కళామూర్తి అయిన చంద్రుని వలె ఆ దేవదేవుడు ఉద్భవించాడు.

వ. అప్పుడు.

111

సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతి భాసుఁ
గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు శ్రీవత్సలాంఛనాంచిత విహారు
నురుకుండల ప్రభాయుత కుంతలలలాటు వైదూర్యమణిగణ వరకిరీటు

తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక, పాలు సుగణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్య మంది, యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.

112

తా ॥ అప్పుడు దివ్య రూపంతో దర్శనమిచ్చిన ఆ బాలుణ్ణి చూసాడు వసుదేవుడు. ఆ పిల్లవాడు నీలమేఘాన్ని పోలిన దేహంతో దీర్ఘమైన నాలుగు చేతులను కలిగి ఉన్నాడు. అతని కన్నులు తెల్లతామర రేకులను పోలి ఉన్నాయి. గద, శంఖము, చక్రము, పద్మము ఈ నాలుగింటిని చతుర్బాహువుల యందు ధరించి ఉన్నాడు. విశాలమైన వక్షస్థలం అందంగా ఉంది. కంఠమందు కౌస్తుభమణి మెరుస్తూ ఉన్నది. రత్నస్థగితమైన మొలత్రాడు, కంకణములు, భుజకీర్తులు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ ఇవన్నీ అత్యంత మనోహరంగా ఉన్నాయి. చెవులకు గల శ్రేష్ఠములైన మకరకుండలాల యొక్క కాంతులతో, అందమైన ముంగురులతోడి లలాటము శోభాయమానంగా వెలిగిపోతూ ఉంది. విలువైన మణులతో కూడిన మేలైన కిరీటం మెరిసిపోతూ

ఉన్నది. నిండు చందురుని వలె వెలిగి పోతున్నాడు. భక్తులను కాపాడేవాడు, మంచి గుణాలు కలవాడు, మిక్కిలి కరుణ కలవాడు... అయిన ఆ బాలుణ్ణి చూసి చూపుత్రిప్పలేక, శరీరం జలదరింప ఆ తేజస్సుకు ఆశ్చర్యపడి సంతోషాతిశయం చేత మహోత్సాహాన్ని పొందాడు.

క. స్నానము సేయఁగ రామిని, నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్
ధేనువులం బదివేలను, మానసమున ధారవోసె మఱి యిచ్చుటకున్.

113

తా ॥ ఆ ఉత్సాహంతో మహానంద సాగరంలో మునకలువేస్తూ, పురిటిస్నానం చేయడానికి కుదరనప్పటికీ, వసుదేవుడు బ్రాహ్మణులకు పదివేల పాడి ఆవులను మానసికంగా దానము చేశాడు.

వ. మఱియు వసుదేవుండు.

114

క. ఈ పురిటియింటి కుద్య, ద్దీపంబును బోలి చాల దీపించి నిజం
బీ పాపఁడు నలు మొగముల, యా పావని గనిన మేటి యగు నని భక్తిన్.

115

ఆ. చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపై, గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి
పాపఁ డనక వెఱక పాపని మొదలింటి, పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె.

116

తా ॥ తరువాత వసుదేవుడు ఇలా అనుకున్నాడు – 'ఈ పురిటింటికి మంచి ప్రకాశంగల దీపంలాగ వెలుగుతున్నాడు ఈ బాలుడు. ఈతడు తప్పక చతుర్ముఖ బ్రహ్మను కన్న శ్రీమహావిష్ణువే' అని మహాభక్తితో సాష్టాంగ నమస్కారం చేశాడు. అలా సాగి మ్రొక్కి, నెత్తిమీద తామర జంటవంటి రెండు చేతులను చేర్చాడు. తన బిడ్డ అని భావించక ఆ శిశువు సాక్షాత్

పరమాత్మయే అని ఇలా స్తుతించసాగాడు:

క. ఏ నిన్ను నఖిలదర్శను, జ్ఞానానందస్వరూపు సంతతు నపరా
ధీనుని మాయాదూరుని, సూనునిఁగాఁ గంటి, నిట్టి చోద్యము గలదే?

117

తా ॥ “స్వామీ! నీవు సమస్త సృష్టిని నీయందు దర్శింపచేస్తావు. నీ స్వరూపం కేవలం ఆనందం, అనుభవంతో కూడి ఉన్నది. నీవు శాశ్వతుడవు. నీవు ప్రకృతి కంటే అతీతుడవు కనుక ఎవరికీ లొంగవలసిన పనిలేదు. మాయ నిను స్పృశించలేక దూరంగా నిలిచి ఉంటుంది. అటువంటి నిన్ను నేను కుమారునిగా పొందాను. ఇంతకన్నా విచిత్రం కలదా?

క. అచ్చుగ నీ మాయను మును, జెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం
జొచ్చినక్రియఁ జొరకుందువు, చొచ్చుటయును లేదు, లేదు చొరకుండుటయున్.

118

తా ॥ నీ మాయచేత శీఘ్రంగా త్రిగుణాత్మకంగా జగత్తులను సృష్టించి ఆ లోకాలలో నువ్వు ప్రవేశిస్తావు – అదే విధంగా మాయాతీతుడవైనందున ప్రవేశించకుండానూ ఉంటావు.

సీ. అదియు నెట్లన మహదాదులఁ బోలెడి దై వేఱువేఱయై యన్నివిధము
లగు సూక్ష్మభూతంబు లమర షోడశ వికారములతోఁ గూడి విరాట్టనంగఁ
బరమాత్మునకు నీకుఁ బఱపైన మేను సంపాదించి యందులోఁ బడియుఁ బడక
యుండు సృష్టికి మున్న యున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ,

ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ ననువైన లాగునఁ, గలుగు నింద్రియముల కడలనుండి
వాని పట్టులేక వరుస జగంబులఁ, గలసియుండి యైనఁ గలయ వెపుదు.

119

తా ॥ ఇది ఎలా అంటే నీ శక్తి అనే నీటి నుండి సృష్టిలోని సూక్ష్మశక్తులు అన్నీ కలిసి 'విరాట్' అనే స్వరూపాన్ని కలుగజేస్తాయి. ఇది మహాసముద్రం నుండి సృజించబడిన బుడగవంటిది. ఆ విరాట్ స్వరూపంతో సృష్టికార్యాన్ని నీవు నిర్వర్తించినా, దానికి ముందే ఉన్న నీవు సృష్టికి అందకనే ఉంటావు. కనుక సృష్టి మొదలైన తరువాత విరాట్‌రూపంగా ప్రకటితమైనా, సృష్టికి అతీతంగానే ఉన్నవాడివి. ఈ విధంగా నీవు ప్రవేశించడం ఉండదు, అలా అని ప్రవేశించకపోవడమూ ఉండదు.

క. సర్వము నీలోనిదిగా, సర్వాత్ముఁడ, వాత్మవస్తు సంపన్నుఁడవై
సర్వమయుఁడ వగు నీకును, సర్వేశ్వర! లేవు లోనుసంధులు వెలియున్.

120

తా ॥ సర్వేశ్వరా! సర్వప్రపంచం నీలోనిదే కనుక నువ్వు సర్వాత్ముడవు. సర్వ పరిపూర్ణుడవైన నీకు వెలుపల, లోపల అనే సంధి భేదం లేదు. ఎటువంటి మార్పులు ఎప్పుడూ లేనివాడవు, నీవు సర్వేశ్వరుడవు.

ఆ. ఆత్మవలనఁ గలిగి అమరుదేహాదుల, నాత్మకంటె వేఱు లవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ!, విశ్వ మెల్ల నీవ, వేఱు లేదు.

121

తా ॥ ఆత్మ నుండి శరీరం, మనస్సు మొదలైనవి కలుగుతాయి, అవి ఆత్మకంటే వేరు అని తలచేవాడు మూర్ఖుడు కాక మరేమిటి? విశ్వమంతా నీవే అయి ఉన్నావు, నీవు కానిది వేరుగా ఏదీ లేదు ఈశ్వరా!

వ. అదియునుం గాక.

122

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెఱి జనించుఁ,
బ్రబ్బు, లేదగు; నంచుఁ బలుకుట దప్పుగా దీశుండవై బ్రహ్మ మీవ యైన
నినుఁ గొల్చు గుణములు నీ యానతులు సేయ, భటుల శౌర్యంబులు పతికి వచ్చు
పగిది నీ గుణముల బాగులు నీ వని తోఁచును నీమాయతోడఁ గూడి

ఆ. నీవు రక్త ధవళ నీల వర్ణంబుల, జగము సేయఁ గావ సమయఁ జూడఁ
దనరు, దట్లు నేఁడు దైత్యుల దండింపఁ, బృథివిఁ గావ నవతరించి తీశ!

123

తా ॥ నీ వలన జగము సృజించబడినా, సత్వాది గుణాలు కాని, జనన మరణాది రూప వికారాలుగాని, నీకు లేవు. సృష్టి స్థితి లయములు చెయ్యాలనే కోరికగాని నీకు లేదు. లోకాలు క్రమంగా వర్ధిల్లుతున్నాయి, లయిస్తున్నాయి అని చెప్పడం పొరపాటు కాదు. ఎందుకంటే నువ్వు జననాది వికారాలు ఏమీ లేనివాడవైనా, సర్వకర్తవు కనుక నీ సంకల్పం వల్ల పుట్టిన సత్త్వాది గుణాలు నీ చేత ప్రేరేపింపబడి సృష్టి స్థితి లయాలు చేస్తున్నాయి. సేవకులు చేసిన పనులు ప్రభువులు చేసినట్లే తోచుట సహజం కనుక నీ సంకల్పము వలన పుట్టిన సత్త్వరజస్తమో గుణముల చేత చేయబడిన సృష్టిస్థితిలయాలు నీచేత చేయబడ్డట్టే తెలుస్తోంది. నువ్వు ఎర్రని రంగుతో కూడి ఉన్నప్పుడు రజోగుణ రూపుడవై సృష్టిస్తావు. తెల్లనిరంగుతో కూడి ఉన్నప్పుడు సత్త్వగుణ స్వరూపుడవై సృష్టిని రక్షిస్తావు. నల్లని రంగుతో కూడి ఉన్నప్పుడు తమోగుణ రూపుడవై సృష్టిని లయం చేస్తావు. నేడు దైత్యులైన కంసాదులను దండించడానికి ఈ భూమిమీద అవతరించావు. నీవు మాకు ప్రభువువే!

శా. మింటన్ మ్రోసిన మ్రోఁత దాలిమిని లో మేంఢ్రింప మున్ నీవు నా
యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలం,
గంటం గూరుకుఁ దేఁడు, నీ యుదయ మా కారాజనుల్
సెప్పఁగా బంటింపం, డెదురేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై.

తా ॥ కంసుడు పూర్వం ఆకాశవాణి వల్ల విన్న మాటలు తనకు దిగులు పుట్టించగా, కోపంతో నీవు నా ఇంట పుడతావని నీ మీది పగచేత నీ అన్నలందరిని సంహరించాడు. నీవు పుట్టి తనను చంపుతావనే దిగులుతో నిద్రాహారములను సైతం వదలి నీ పుట్టుకకు ఎదురుచూస్తున్నాడు. నీవు జన్మించావని ఈ కావలివారు చెప్పగానే నిన్ను సంహరించడానికి వెంటనే వస్తాడు.”

## 4. దేవకీదేవి స్వామిని స్తుతించుట

వ. అనుచుండ దేవకీదేవి మహాపురుష లక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును
నైన కుమారునిం గని, కంసునివలన వెఱపున శుచిస్మితయై యిట్లనియె.

125

తా ॥ వసుదేవుడు ఈ విధంగా శ్రీకృష్ణమూర్తిని స్తుతిస్తూ ఉండగా; దేవకీదేవి ఆ బాలుని తేరిపార చూసింది. మహాపురుష లక్షణాలు కలవాడు, జ్ఞాన స్వరూపుడు, కోమలమైన దేహం కలవాడు అయిన ఆ దేవదేవుని చూసి కంసుని వలన భయంతో ఇలా అంది:

సీ. అట్టిట్టి దనరానిదై మొదలై నిండుకొన్నదై వెలుఁగుచు గుణము లేని
దై యొక్క చందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని
దేరూపమని శ్రుతు లెప్పుడు నొడివెడి యా రూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ యర్థంబు తుదిజగంబులు నశింపఁ, గఁ బెద్దభూతగణము

ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నా భూతంబు, ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మడంగను, శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు.

126

తా ॥ "వేదములు నీ యొక్క ఏ రూపమును అవ్యక్తంగా, సర్వకారణంగా వర్ణించాయో అట్టి విష్ణువు నీవే! ఏ బ్రహ్మము జ్యోతి స్వరూపమై అన్నింటా నిండి వెలుగుతూ ఉన్నదో, గుణాలకు అతీతంగా ఏ తత్త్వమైతే ఏకమై నిలబడి ఉన్నదో, అది నీవే! ఏది అనిర్వచనీయమైనదో, నిష్క్రియమైనదో అది నీవే! ప్రళయానంతరం బ్రహ్మ ఆయువు పరిసమాప్తమైనప్పుడు, శేషుడవైన నీవు ఒక్కనివి ఏకమాత్రంగా శేషించి ఉంటావు.

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమ వైన నీకుఁ దా

శాశ్వతమైన కాలమిది సర్వము వేడబమందు, రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప నిను నెవ్వఁడు గోరి భజించు వాఁడపో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డభయుండు మాధవా!

127

తా ॥ మాధవా! ఈ విశ్వాన్ని నీ లీలచేత నడిపిస్తున్నావు, కనుక దానికి ఆధారమైన అవిద్య అనబడే మాయ నీకు దగ్గరి బంధువు. అందుకనే ఈ ప్రపంచం మాయతో నిండి ఉన్నది. శాశ్వతము అనంతము అయిన కాలస్వరూపుడవైన నిన్ను, ఎవరైతే కోరి భజిస్తారో వారు స్వస్థచిత్తులై శాశ్వతంగా లక్ష్మీకళలను, మృత్యుంజయత్వాన్ని నీ అభయప్రదానంచే పొందగలరు.

మత్త. ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
'కంటి' మందురు కాని, నిక్కమ కాన! రీ భవదాకృతిం
గంటి భద్రముఁ గంటి, మాంసపుఁ గన్నులం గనఁబోల, దీ
తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్.

128

తా ॥ ఓ తోయజేక్షణా! పురాణ యోగులు నిర్వికల్ప సమాధిచేత నిన్ను దర్శించామని అంటారు కాని వాస్తవంగా చూసి ఉండరు. ఎందుకంటే వారు తాము చూడదలచిన రూపాన్ని చూసారు కానీ, నీవు అనుగ్రహించే రూపంకాదు. కానీ నేను నీ అనుగ్రహంచేత చూసాను, కృతార్థురాలనయ్యాను. ఇక ఈ చర్మచక్షువులతో నీ దివ్యమంగళ విగ్రహాన్ని నేను చూడ శక్తురాలను గాను. సర్వానికి ఆధారమైన నీ ఈ రూపాన్ని ఇంక మరుగుపరచు స్వామీ! నీకిదే నమస్కారములు.

ఆ. విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద, కడుపులోన దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు, నేఁడు నా గర్భజుఁడ వౌట, పరమపురుష! వేడబంబు గాదె!

129

తా ॥ ప్రళయ కాలంలో అనంతమైన ఈ విశ్వాన్ని నీ కుక్షిలో దాచిపెట్టగల గొప్ప సమర్థుడవు నీవు. అటువంటి నీవు నేడు నా కడుపున పుట్టడం నీ మాయ కాకపోతే మరేమిటి!

తరలము.
నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె, దు
ర్మలినచిత్తుని నాజ్ఞసేయుము, మమ్ముఁ గావుము భీతులన్,
నులుసులేక ఫలించె నోఁచిన నోము లెల్లను నీవయై.

130

తా ॥ ఓ తామర రేకులవంటి కన్నులు కలవాడా! నీవు నాకు పుడతావని నీచుడైన కంసుడు చాలా కాలంగా మమ్మల్ని చెరసాలలో పెట్టి బంధించాడు. కనుక ఆ దుర్మార్గుణ్ణి శిక్షించి మమ్ములను రక్షించు. మేము నోచిన నోములన్నీ కొరత లేకుండా నీ రూపంలో ఈ విధంగా ఫలించాయి."

## 5. దేవకీవసుదేవల పూర్వజన్మముల వృత్తాంతము

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుండిట్లనియె, అవ్వా! నీవు దొల్లి స్వాయంభువ మన్వంతరంబునఁ బృశ్నియను పరమపతివ్రతవు, వసుదేవుండును సుతపుం డను ప్రజాపతి, మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం, బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి యేకలములయి యాకలములు దిని యే కలంకంబును లేక వేంద్రంబుగఁ బంద్రెండువేల దివ్యవర్షంబులు దపంబులు సేసిన నెపంబున మీ రూపంబులు మెరయ నోజ నాజపంబులు సేసి, డాసి, పేర్చి, యర్చింప మీకు నాకుం గల రూపుఁ జూపి యేను 'దిరంబు లగు వరంబులు వేఁడుం' డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్దమం బగు నపవర్గంబు గోరక నా యీఁడు కొడుకు నడిగిన మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను 'బృశ్నిగర్భుం' డన నర్భకుండ నయితి, మఱియును.

131

తా ॥ ఈ విధంగా దేవకీదేవి విన్నవించగా, శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు: "తల్లీ! నీవు పూర్వం స్వాయంభువ మన్వంతరంలో 'పృశ్ని' అనే పరమపతివ్రతవు! వసుదేవుడు "సుతపుడు" అనే పేరు గల ప్రజాపతి. మీ ఇద్దరు సృష్ట్యాదిలో చతుర్ముఖుని ఆజ్ఞ మేరకు నిగ్రహంతో ఇంద్రియాలకు లోబడక, వానకు, గాలికి, ఎండకు, మంచుకు సహించి మీ మనస్సు నాయందు నిలిపి ఆకులు, కూరలు తింటూ, మనస్సులో ఏమీ కల్మషం లేక, తీక్షణంగా, దేవమానంలో పంద్రెండు వేల సంవత్సరాలు తపస్సు చేశారు. అప్పుడు నేను మీ తపస్సుకు మెచ్చి మీకు ప్రత్యక్షమై మీకిష్టమైన వరాలను కోరుకొమన్నాను. మీరు నా మాయలో చిక్కినందున అందరికీ లభ్యంకాని మోక్షాన్ని కోరక, నావంటి కొడుకు కావాలని కోరారు. నేను 'అలాగే' అని వరమిచ్చి పృశ్నిగర్భుడనే పేరుతో మొదట్లో మీకు జన్మించాను.

క. అదితియుఁ గశ్యపుఁడును నన, విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే

నుదయించితి వామనుఁ డనఁ, ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్.

132

తా ॥ మీ రెండవ జన్మలో మీరు అదితి, కశ్యపుడు అనే నామధేయాలతో జన్మించారు. మీ ఇద్దరకు వామనుడు అనే పేరుతో వటువుగా జన్మించాను. అప్పుడు ఇంద్రుడు నాకు అన్నగారు.

క. ఇప్పుడు మూఁడవబామునఁ, దప్పక మీ కిరువురకును దనయుఁడ నైతిం
జెప్పితిఁ బూర్వము మీయం, దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్.

133

తా ॥ మూడవ జన్మలో నేనిచ్చిన మాట ప్రకారం మీకు పుత్రుడనై పుట్టాను. నాకు ఇంక మీయందు ఎప్పటికీ జన్మ లేదు.

క. నందనుఁ డనియుం బరమా, నందంబగు బ్రహ్మ మనియు ననుఁ దలఁచుచు నా
పెందెరువు నొందెదరు, నా, యందలి ప్రేమమున భవము నందరు మీరల్.

134

తా ॥ మీ ఇద్దరు నన్ను పుత్రునిగా భావిస్తూ ఉన్నా ఇప్పుడు అనుగ్రహించిన ఈ నిరతిశయానంద స్వరూపం వలన పరబ్రహ్మముగా కూడా తలపోస్తూ ఉంటారు. ఆ స్మరణ వల్ల పరమ పద మార్గాన్ని పొంది నా యందలి ప్రేమచేత మీరు ఇక జన్మ ఎత్తరు. మీకు ఇదే కడపటి జన్మ."

వ. అని యిట్ల పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి.

135

క. ఔప్ప లిడక తలిదండ్రులు, దప్పక తనుఁజూడ మాయఁ దనరి లలితుఁడై
యప్పుడటు గన్నపాపని, యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా!

136

తా ॥ ఓ రాజా! శ్రీమహావిష్ణువు ఇట్లా పలికి ఆ రూపాన్ని విడిచి శిశు రూపాన్ని ధరించాడు. రెప్పవేయక తల్లిదండ్రులు తనను చూస్తూండగానే తన మాయచేత కోమలమైన దేహాన్ని ధరించి అప్పుడే పుట్టిన శిశువులాగా ప్రవర్తించాడు.

వ. అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పను లీశ్వరుండైన హరివలన నెఱింగిన వాఁడు గావున.

137

తా ॥ తర్వాత వసుదేవుడు తాను చెయ్యవలసిన కర్తవ్యాన్ని ఈశ్వరుడైన హరి వలన తెలుసుకున్నాడు.

క. ఆ పురిటి యిల్లు వెలువడి, పాపనిఁ దరలించు కొనుచుఁ బఱచెద ననుచున్
రూపింప నందుభార్యకుఁ, బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా!

138

తా ॥ రాజా! వసుదేవుడు పురిటింట్లోంచి ఆ పసివానిని తీసుకొని పోదాం అని ఇక్కడ నిశ్చయించుకొనేసరికి, వ్రేపల్లెలో యశోదాదేవికి యోగమాయ కూతురుగా జన్మించింది.

వ. అ య్యవసరంబున.

139

క. బిడ్డనిఁ గరముల ఔమ్మున, నడ్డంబుగఁ బట్టి పదము లల్లన యిడుచున్
జడ్డనఁ గావలి వారల, యొడ్డు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్.

140

తా ॥ ఆ సమయంలో వసుదేవుడు బిడ్డని రెండు చేతులతో రొమ్ముకు అదుముకుని, అడుగులు చప్పుడు గాకుండా బయటకు వచ్చాడు. విష్ణు మాయతో లోపల కావలి వాళ్ళున్న చోటును దాటి పురిటి ఇంట్లోంచి మెల్లగా బయటకు వచ్చాడు.

వ. అంత నట.

141

క. నందుని సతికి యశోదకుఁ, బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా
స్పందమున నొక్క యెఱుఁగమి, క్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్.

142

తా ॥ అక్కడ వ్రేపల్లెలో నందుని భార్య అయిన యశోదకు హరి యొక్క యోగమాయ పుట్టగానే ఆ మాయ యొక్క స్పందనచేత తెలియరాని ఒక మైకం ఊళ్ళో వాళ్ళని, పురిటింటికి కాపలా ఉన్నవాళ్ళని ఆక్రమించింది.

వ. అప్పుడు చప్పుడు గాకుండఁ దప్పటడుగు లిడుచు, నినుప గొలుసుల మెలుసుల వీడినఁ దాలంబులు మహోత్తాలుండై న బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడి పడ, నరళంబులు విరళంబులైన సరళంబులగు మొగసాలలం గడచి, పాఁపతేఁడు వాకిళ్ళ మరల మూయుచుఁ, బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంట నంటి రాఁగఁ దూఁగి నడచు నెడ.

143

తా ॥ ఇక్కడ మథురలో కూడా జనులంతా మైకంతో పడియున్న ఆ సమయంలో వసుదేవుడు బాలుణ్ణి ఎత్తుకుని పురిటింటిని దాటి సందడి లేకుండ తప్పటడుగులు వేస్తూ ముందు చావడిలోనికి నడిచాడు. హరి మాయ వలన తలుపులకు వేసిన తాళాలు విడివడ్డాయి. తలుపులు బాగా తెరవబడగా ఏ ప్రతిబంధకం లేకుండ పెద్ద వాకిండ్లు దాటాడు. ఆదిశేషుడు

గృహద్వారాలను మళ్ళీ మూస్తూ తన పడగలు విప్పి బాలునికి గొడుగువలె కప్పి వెంట నడిచాడు.

క. అ శౌరికి దెరువొసఁగెఁ బ్ర, కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాశా
కాశ యగు యమున మును సీ, తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చిన భంగిన్.

144

తా ॥ అలా ముందుకు వెడుతున్న వసుదేవునికి యమునానది అడ్డం వచ్చింది. ఎగసిపడే తరంగాల ఒరవడిలో భూమి, ఆకాశం ఏకంగా ఉన్నాయా అన్నట్లుగా కనిపిస్తున్న ఆ యమునానది వసుదేవునితో కూడి ఉన్న కృష్ణుని చూడగానే, పూర్వం లంకకు వెళ్ళే శ్రీరామునికి సముద్రం త్రోవ ఇచ్చినట్లుగా దారిని ఇచ్చింది.

వ. ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని, నందుని మందంజేరి, యందమంద నిద్రం బొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుప నొల్లక, నిత్యప్రసాదయగు యశోదశయ్య నొయ్యన చిన్ని నల్లనయ్య నునిచి, చయ్యన న య్యవ్వకూఁతు నెత్తుకొని, మరల నింటికిఁ బంటింపక వచ్చి, య చ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి.

145

తా ॥ అంతట వసుదేవుడు యమునా నదిని దాటి వేగంగా నందుని వ్రేపల్లెలో ప్రవేశించాడు. అక్కడ ఒళ్ళు మరచి నిద్రిస్తూన్న గొల్లవాండ్రను నిద్రలేపకుండా, మైమరిచి నిద్రిస్తున్న యశోదాదేవి ప్రక్కలో బాలకృష్ణుణ్ణి పడుకోపెట్టి, ఆమె కుమార్తెగా జన్మించిన యోగమాయను ఎత్తుకుని తిరిగి తన గృహానికి వచ్చి ఆ పసి బిడ్డను దేవకీదేవి పక్కన పడుకో బెట్టాడు.

క. పదముల సంకెల లిడుకొని, మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్
బెదరు గలరీతి దేహము, గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్.

తా ॥ యోగమాయను భార్య పక్కన పడుకోపెట్టి, కాళ్ళకు సంకెళ్ళను తగిలించుకుని దిగులు పడుతూ ఏమీ ఎరుగని వానిలా, భయపడిన వానిలా, శరీరం వణుకుచున్నట్లుగా ముడుచుకుని కూర్చున్నాడు వసుదేవుడు.

క. వనజాక్షునిఁ దెచ్చుటయును, దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ
గిన నిద్రఁ జొక్కియుండెను, వనజాక్షి యశోద రేయి వసుధాధీశా!

147

తా ॥ యశోదాదేవికి తన దగ్గరకు వసుదేవుడు బాలకృష్ణుణ్ణి తీసుకొని రావడంగాని తన బిడ్డను గొనిపోవడంగాని ఏమీ ఎరుగనిదై, గాఢమైన నిద్రలో రాత్రి అంతా అలా ముంచుకువచ్చిన నిద్రలోనే ఉండిపోయింది.

సీ. అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు డాలించి వే కన నాఁకయింటి
కావలివారు మేల్కని చూచి తలుపుల తాళముల్ తొంటివిధమున నుండఁ
దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె రమ్మురమ్మని యాభోజరాజుతోడఁ
జెప్పిన నాతఁడు చిడిముడి పాటుతోఁ దల్పంబు పై లేచి తత్తఱమున

తే. వెండ్రుకలు వీడఁ బై చీర వ్రేలియాడఁ,
దాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ,
భూరివైరంబుతోఁ గూడ పురిటియింటి,
జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ.

148

తా ॥ అంత మధురలోని కారాగృహంలో, ఆ పసిబిడ్డ గుక్క తిప్పకుండ

ఏడవనారంభించింది. ఆ ఏడ్పును విన్న కావలివారు వెంటనే తటాలున మేల్కొని నాలుగు ప్రక్కలా చూచి, తలుపుల తాళములు మునుపటిలాగే ఉండటం చూసి తాము అప్రమత్తంగానే ఉన్నామని భావిస్తూ, సంతృప్తిని చెందుతూ కంసుని వద్దకు వెళ్ళి దేవకీదేవి ప్రసవించింది శీఘ్రంగా రమ్మని కోరారు. అతడు ఆ మాటవిని గాబరాతో పడక మీద నుండి లేచి అడుగులు తడబడ, తలవెండ్రుకలు ముడివీడి వీపుమీద వ్రేలాడ, మీది వస్త్రము జీరాడ, రోషాగ్నితో మిక్కిలి క్రూర వృత్తితో, పురుటింటి లోనికి వచ్చి ఆ బిడ్డను చంపబోయాడు.

వ. అంత దేవకి యడ్డంబు వచ్చి యిట్లనియె.

149

తా ॥ అప్పుడు దేవకీదేవి అడ్డంవచ్చి ఇలా ప్రార్థించింది:

ఉ. అన్న! శమింపు మన్న! తగ దల్లుఁడు గాఁ డిది మేనగోడ లౌ
మన్నన సేయుమన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా
దన్న, సుకీర్తివై మనఁ గ దన్న! మహాత్ములు వోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న, నినున్ శరణంబు వేఁడెదన్.

150

తా ॥ "అన్నా! ఓర్పును వహించవయ్యా! ఇది నీకు తగిన పని కాదు. పుట్టింది మేనల్లుడుకాదు, మేనకోడలు. అన్నా! మన్నించు! నా మాట విను! స్త్రీని వధించటం రాజులకు మర్యాద కాదు! మంచి కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకునే విధంగా ప్రవర్తించు! మహాత్ములు వెళ్ళే మార్గాన్ని అనుసరించు! నీకు తోడబుట్టిన దానను కనుక నన్ను దుఃఖపెట్టడం నీకు మర్యాద కాదు. నిన్ను శరణువేడుకొంటున్నాను.

క. కట్టా! యార్గురు కొడుకులఁ, బట్టి వధించితివి యాఁడుఁబడుచిది, కోడల్,
నెట్టన చంపఁగ వలెనే?, కట్టిఁడివి గదన్న! యన్న! కరుణింపఁ గదే!

151

తా ॥ అయ్యో! పసిబిడ్డలైన ఆరుగురు కొడుకులను పట్టి వధించావు. ఇది ఆడ బిడ్డ, నీకు కోడలు అయిన దీనిని కూడ చంపాలా? మహా క్రూరుడు చేసే పనా ఇది. కరుణను చూపించు అన్నా!

క. పుత్రుఁడు నీ బ్రతుకునకును, శత్రుండని వింటిగాన సమయింపఁ దగుం,
బుత్రులకు నోఁచ నైతిని, బుత్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే!

152

తా ॥ కుమారుడైతే నీ ప్రాణానికి శత్రువు అని ఆకాశవాణి చెప్పిన మాట విన్నావు. కనుక పుట్టింది పసివాడైతే చంపడంలో అర్థం ఉంది. కానీ ఇది ఆడపిల్ల కదా! పుత్రులకు ఎలాగా నోచుకోలేదు, కనీసం ఈ ఒక్క కూతురునైనా దానం చేసి పుణ్యం కట్టుకోలేవా?"

వ. అని పయ్యెదఁ జక్క సవరించుకొనుచుఁ బలవరించుచు, భ్రాంతి పడి కూఁతున్ గ్రక్కున నక్కునం జక్క హత్తించుకొని, చెక్కు చెక్కున మోపి చయ్యన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడు గాఁ గుయ్యిడ, నయ్యెడం గ్రయ్యంబడి వాఁడు పోఁడిమి సెడఁ దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి నావురని వాపోవఁ గావరంబున నడుగు లొడిసి తిగిచి వడిం బెడిసి పడం బుడమిపయిం బడవైచిన నబ్బాలయు నేలంబడక యవలీల నెగడి నవ్యదివ్యమాలికా గంధబంధుర మణిహారాంబరాద్యలంకార మనోహారిణియు, గదా శంఖ చక్ర పద్మ శరచాపాసి శూలధారిణియునై యెనిమిది కరంబులం గరం బొప్పుచు, సిద్ధ చారణ కిన్నర గరుడ గంధర్వాది వైమానిక నికాయంబు గానిక లిచ్చి పొగడ, నెగడుచు నచ్చరల యాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటువడఁ గంసున కిట్లనియె.

153

తా ॥ దేవకీదేవి ఈ విధంగా పలికి పయ్యెదకొంగు సవరించుకుంది. పుత్రికా వ్యామోహం ఆవరించగా పరితాపంచే కలవరపడుతూ కూతురైన యోగమాయను మక్కువతో రొమ్ముకు అదుముకొని, తన చెక్కిలి ఆ బిడ్డ చెక్కిలి మీద మోపి, పైట చెరగును ఆ పసికూన మీద కప్పి గొంతెత్తి ఏడవటం మొదలు పెట్టింది. ఆ ఏడుపును వింటున్న కంసుడు రెచ్చిపోతూ, విచక్షణలేక సోదరిని తిడుతూ, కన్నూ మిన్నూ గానని కావరంతో, ఆ చిన్ని పాప కాళ్ళను ఒడిసి పట్టుకొని లాగి నేలమీదకు విసరివేశాడు. అంతట ఆ బాల నేలమీద పడక రివ్వున ఆకాశానికి ఎగసింది. ఆమె దేవలోకపుష్పపరిమళాల ఘుమఘుమలతో, మణిమయహారాలతో, దివ్యాలంకారములతో శోభిల్లుతూ ఆకాశమందు విరాజమానంగా గోచరించింది. ఆమెకు గల ఎనిమిది చేతులలో ధనస్సు, బాణం, శంఖం, చక్రం, గద, డాలు, ఖడ్గం, శూలం అనే దివ్యాయుధాలను ధరించి ఉన్నది. ఆకాశంలో సిద్ధులు, చారణులు, కిన్నరులు, గరుడులు, గంధర్వులు మొదలైన వైమానికులు కానుకలిస్తూ స్తుతించసాగారు. ఆమెను సంతోషపెట్టే విధంగా అప్సరసలు నర్తిస్తుంటే వారిని అభినందన పూర్వకంగా వీక్షిస్తూ, అంతలోనే కంసుని వంక తీవ్రమైన దృక్కులతో చూపుని సారించి, అతను భయపడే విధంగా ఇలా పలికింది:

ఉ. తెంపరివై పొరిం బొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వింకనైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పింపఁగ నిస్సిరో యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరుఁ డొక్క దెస సత్కృతి నొందెడు వాఁడు దుర్మతీ!



తా ॥ "దుర్మార్గుడా! ఆవేశంతో యుక్తాయుక్త విచక్షణ లేక ఈ దేవకీదేవి ఆరుగురు కుమారులను వధించావు. అంతటితో ఆగక పసిబిడ్డను రాతి మీద కొట్టి చంపేందుకు సిద్ధపడ్డావు. ఇదేనా నీ పరాక్రమం? నిన్ను చంపే వీరుడు నాతో పాటుగా జన్మించి, ఒక చోట భద్రంగా పెరుగుచున్నాడు సుమీ!"

వ. అని పలికి.

155

క. మహనీయ గుణాస్పదయై, మహిలో నా దేవి జనము మన్నింపంగా
బహునామ నివాసంబుల, బహునామములం జరించె భద్రాత్మికయై.

156

తా ॥ అని పలికి ఆ దేవి అదృశ్యమైనది. పిదప గొప్పగుణాలకు ఉనికిపట్టు అయినదైన ఆ యోగమాయ, తన భక్తులకు శుభాలనిచ్చే విధంగా సకల జనులు మన్నింపగా అనేక స్థలాలలో, అనేక నామములతో ఆరాధ్యదేవతగా నిలిచింది.

వ. అంత నా బోటి వలికిన కలికి పలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి, జళుకు గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి, యాదరంబున సంభావించి, చేరి వారితో నిట్లనియె.

157

తా ॥ యోగమాయ పలికిన పలుకులు కంసుని చెవులకు వాడియైన బాణముల వలె సోకాయి. దానితో మిక్కిలి దిగులు చెందిన మనస్సుతో, చేష్టలు దక్కినవాడై, మొగము చిన్నపుచ్చుకొని, దేవకీ వసుదేవులను దగ్గరకు రావించి, ఆదరంతో గౌరవించి వాళ్ళతో ఇలా అన్నాడు:

ఉ. పాపుఁడ, బాల ఘాతకుఁడ, బంధు విరక్తుఁడ, దుష్ట చిత్తుఁడన్,
గోపనుఁడం, జరన్మృతుఁడఁ, గ్రూరుఁడ, బ్రాహ్మణహంత భంగి మీ
పాపలఁ జంపితిన్ బయలి పల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే!

158

తా ॥ "నేను మహా పాపిని. చంటి పిల్లలను చంపిన ఘాతకుడను. బంధువుల మనస్సులను తల్లడిల్ల చేసినవాణ్ణి! దుష్టచిత్తుణ్ణి! క్రోధం నా కళ్ళను కప్పివేసింది. బ్రతికి ఉన్నా చచ్చిన వాడినే! క్రూరుణ్ణి! బ్రహ్మహత్య చేసినదానితో సమానంగా మీ బిడ్డలనందరిని చంపాను. బయట వాళ్ళు చెప్పేమాటలు నమ్మాను! సజ్జనులారా! నేను చేసిన పాపపు పనులను లెక్కించక, కరుణతో నన్ను చూడండి! శాంతించండి!

ఉ. ఒక్కెడఁ బ్రాణు లందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా
నొక్కొక మేనితోఁ బొడమి యొక్కొక త్రోవను రాక పోకలం
జిక్కులఁ బొందుచుండుదురు, చెల్మిని సంసృతితోడఁ బాయ రే
నెక్కడి హంత? మీ శిశువు లెక్కడి హన్యులు! దూఱ నేటికిన్?

159

తా ॥ మీ పుత్రుల కొరకు శోకించకండి! ప్రాణులందరు వారి వారి ప్రారబ్ధానికి అధీనులు. అలా తమ ప్రారబ్ధకర్మలను అనుసరిస్తూ, అనుకూల శరీరంతో ఒకో చోట జన్మిస్తూ, మరణిస్తూ ఉంటారు. ఇందు చంపేవాడు ఎవరు? చనిపోయేవాడు ఎవరు? అదే విధంగా మీ బిడ్డలను, నేను చంపినవాడను కాను; వారు చంపబడినవారు కాదు, కనుక నన్ను నిందించవద్దు.

క. పగతురఁ జెఱిచితి ననియును, బగతుర చేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచున్,
బగ చెలుములు లే వాత్మకుఁ, బగచెలుముల కీలు కర్మబంధము సుండీ!

160

తా ॥ పగవారిని తాను బాధపెట్టానని, పగవారిచేత తాను బాధించబడ్డానని తెలివిలేని వాడు మాత్రమే అనుకుంటాడు. ఆత్మకు రాగద్వేషాదులు లేవు. పగ, చెలిమి అనే ఈ రెండూ తాను చేసుకున్న కర్మబంధమే సుమా!"

వ. అని పలికి, కన్నీరు నించి, వగచి, వెఱచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని,

సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుండైన కంసునిం జూచి, రోషంబును బాసిరి. అంత నా వసుదేవుండు బావ కిట్లనియె.

161

తా ॥ కంసుడు ఈ విధంగా పలికి దుఃఖించాడు. బాధపడుతూ, దేవకీవసుదేవుల పాదాలు పట్టుకున్నాడు. సంకెళ్ళను ఊడదీయించి ప్రీతిగల మాటల చేత చుట్టరికపు మాటలు పలికాడు. దానితో వాళ్ళుకూడా తాను చేసిన నేరాలను తలచుకుని పశ్చాత్తాప పడుతూన్న కంసుణ్ణి చూసి కోపాన్ని విడిచిపెట్టేశారు. వసుదేవుడు బావతో ఇలా అన్నాడు:

శా. బావా! నీవచనంబు నిక్కము సుమీ, ప్రాణుల్ గతజ్ఞానులై
నీవే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతా మోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వ రూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై.

162

తా ॥ "బావా! నీవు చెప్పిన మాటలు యథార్థాలు. ప్రాణులు తెలివిలేనివారై ఏకాకారుడు, సర్వ ప్రాణులలోను ఉన్నవాడు అయిన భగవంతుణ్ణి తెలుసుకోలేరు. 'నీవు' అనీ, 'నేను' అనీ భేదబుద్ధిని కలిగి ఉంటూ లోభం, మోహం, మదం, భయం, శత్రుత్వం, సుఖం, దుఃఖం, శోకం, ఆవేశం మొదలైన దుర్గుణాలతో కూడి ఒకరినొకరు చంపుకుంటారు. అనేక ఆకారాల్లో నిండి ఉన్న ఆ ఒక్క 'నేను' అయిన ఈశ్వరుణ్ణి చపలచిత్తం చేత తెలుసుకోలేరు."

వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీ వసుదేవుల యనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన, నపుడు

వార లతని కిట్లనిరి.

163

తా ॥ ఈ విధంగా ప్రసన్నులైన దేవకీవసుదేవుల దగ్గర అనుమతి తీసుకుని కంసుడు ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి గడిపి మరునాడు చాలా వేగంగా సూర్యోదయకాలానికి తనకు అనుకూలమైన మంత్రులను కొందరిని రప్పించాడు. యోగమాయ వల్ల తాను విన్న వృత్తాంతాన్ని ఏకాంతంగా చెప్పగా వాళ్ళు కంసునితో ఇలా అన్నారు:

క. ఇట్టయినఁ దడయ నేటికిఁ?, బట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్

బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ, బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా!

164

తా ॥ “అలా అయితే ఇక ఆలస్యం చెయ్యడం దేనికి? పట్టణాలలోను, పల్లెల్లోను, మందల్లోను పుట్టి పెరుగుతూన్న పసిపిల్లలను పట్టుకుని వధిస్తాం! అనుజ్ఞ ఇవ్వండి!

మ. భవదీయోజ్జ్వల బాహుచాప విలసద్బాణావళీ భగ్నులై

దివిజాధీశ్వరు లేక్రియం బడిరొ యే దేశంబులన్ డాఁగిరో

శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మౌని వృ

త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపం దగున్ వల్లభా!

165

తా ॥ పూర్వం నీ బాహువునందలి కోదండం చేత విడువబడిన బాణాల వలన దెబ్బలు తిన్న ఇంద్రాది దేవతలంతా ఎక్కడికి పోయారో? శివుణ్ణి ఆశ్రయించారో? లేదా బ్రహ్మనో విష్ణువునో సేవిస్తున్నారో? అదీకాకపోతే ముని వృత్తితో అరణ్యాలలో ఉన్నారో? మనం వెంటనే వెదకడం మంచిది మహారాజా!

క. నొచ్చిరి శాత్రవు లనుచును, విచ్చలవిడిఁ దిరుగవలదు వివిధాకృతులన్
ట్రుచ్చిలి వత్తురు వారలు, సచ్చిన యందాఁక మఱవఁ జన దధిపునకున్.

166

తా ॥ పగవారు దెబ్బతిన్నారనుకొని మనం విచ్చలవిడిగా తిరగకూడదు. వారు ఎన్నో రకాల వేషాలతో దొంగతనంగా రాగలరు. అందుకని వారు చనిపోయే వరకు రాజైనవాళ్ళు విశ్రమించకూడదు.

క. ఒత్తి కొనుచు రానీఁ జన, దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను
త్పత్తిసమయములఁ జెఱుపక, మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్.

167

తా ॥ విజృంభించే రోగాలను, శత్రువులను, ఇంద్రియాలను అవి మనలను ఆక్రమించే వరకు రానివ్వకూడదు. అవి పుడుతున్నప్పుడే త్రుంచెయ్యాలి. ముదిరిన తర్వాత వాటిని జయించటం సాధ్యం కాదు.

మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డాచక్రి యేధర్మమం
దమరున్, గోవులు భూమిదేవులు దితిక్షామ్నాయకారుణ్య స
త్యములున్ యాగ తపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణు దే
హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్.

168

తా ॥ సకల దేవతలలో విష్ణువే ముఖ్యుడు. ధర్మం ఎక్కడుంటే ఆ చక్రి అక్కడ ఉంటాడు. గోవులు, బ్రాహ్మణులు, యజ్ఞాలు, వ్రతాలు, దీక్షలు, వేదములు, భూతదయ, సత్యము, ఇంద్రియ నిగ్రహం, తపస్సు, దమము, శ్రద్ధ, శాంతి ఇవన్నీ విష్ణువు యొక్క దేహములే! కనుక వాటిని నాశనం చేస్తే అతడు కూడా నిలువనీడ లేక నశించిపోతాడు.

వ. కావున.

169

ఉ. చంపుదుమే నిలింపులను? జంకెల అంకెలఁ దాపసావలిం
బంపుదుమే కృతాంతకుని పాలికిఁ? గ్రేపులతోడ గోవులం
ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? నిగమంబులన్ విదా
రింపుదుమే? వసుంధర హరింపుదు మే? జననాథ! పంపుమా!

170

తా ॥ కనుక మహారాజా! దేవతలను చంపమంటావా? అదలింపులతో, అరుపులతో తపస్సు చేసుకునే ఋషులను యముని వద్దకు పంపమంటావా? దూడలతో పాటుగా ఆవులను నరికి వేయమంటావా? బ్రాహ్మణులను పశువులను తరిమినట్టు తరిమి కొట్టమంటావా? వేదాలను పఠించే వారిని బాధించమంటావా? లేదా భూమిని చుట్టగా చుట్టి నీ వశం చేయమంటావా? ఈ చెప్పిన పనులలో ఏ పనైనా చెయ్యడానికి మమ్మాజ్ఞాపించు!"

వ. అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణ నిరోధంబు నిషిద్ధంబని తలంపక కాలపాశబద్ధుండై విప్రాది సాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె, ననంతరంబ యా రక్కసులు వెక్కసంబులగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి తర్జన గర్జన భర్జనాది దౌర్జన్యంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి.

171

తా ॥ కంసుడు ఈ విధంగా బోధిస్తున్న మంత్రుల ఆలోచనలకు బద్ధుడై సమ్మతించాడు. బ్రాహ్మణులను హింసించటం తప్పు అని కూడా ఆలోచించలేదు. కాలపాశ బద్ధులై బ్రాహ్మణాది సాధుమానవులను చంపడానికి దానవులను పంపి తాను అంతఃపురానికి వెళ్ళిపోయాడు. తదుపరి ఆ రాక్షసులు సహించుటకు వీలుకాని క్రూరమైన మాటలతో సత్పురుషుల వెంటబడి

కొందరిని బెదిరించారు, కొందరిని గద్దించారు. కొందరి చెవులు దిబ్బెళ్ళు పోయేటట్లు అరిచారు. ఇలా అనేక విధాల దుర్మార్గాలతో వారిని వేధిస్తూ ఎన్నో పాపాలను మూటకట్టుకో సాగారు.

ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల, నణఁప వారి బలము లడఁగిపోయె,
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు, నార్యహింససేయ నణఁగుఁ గాదె!

172

తా ॥ సాధువులను వెతికి వెతికి బాధపెడుతూ ఉంటే ఆ రాక్షసుల బలం నానాటికి క్షీణించసాగింది. సాధు జనులను హింసిస్తే కీర్తి, సంపద, పుణ్యము, ఆయువు, క్షేమము... ఇవన్నీ కోల్పోతారు గదా!

వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలకంబు లాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడం గూడఁ గై సేసిన పాఁడి మొదవుల రెండులక్షలను, గనక కలశ మణి వసన విశాలంబులైన తిల శైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన.

173

తా ॥ ఇది ఇలా ఉండగా, అక్కడ వ్రేపల్లెలో నందుడు తనకు మగపిల్లవాడు పుట్టాడని విని మహానందాన్ని పొందాడు. బ్రహ్మానందంతో చక్కగా చదువుకొన్న వేద పండితులను పిలిపించాడు. తాను స్నానంచేసి శుచియై అలంకరించుకున్నాడు. స్వస్తి వాచకాలు, పుణ్యాహవచనాలు చెప్పించుకుని, బాలునికి పుట్టినప్పుడు చేయవలసిన శుభకర్మలన్నీ చేయించాడు. పితృదేవతలను అర్చించాడు. ఆభరణాలతో అలంకరించిన రెండు లక్షల పాడి ఆవులను దూడలతో సహా బ్రాహ్మణులకు ఇచ్చాడు. అంతే కాకుండా బంగారు పాత్రలు, మణులు, విలువైన వస్త్రాలు, నువ్వుల రాశులు ఏడింటిని బ్రాహ్మణులకు దానాలు చేశాడు.

క. ఈ యాభీరకుమారుఁడు, శ్రీయుతుఁడై వీర వైరిజేతయునై దీ
ర్ఘాయుష్మంతుం డగు నని, పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్.

174

తా ॥ ఆ బ్రాహ్మణులందరు ఈ నందగోపుని కుమారుడు ఐశ్వర్యాన్ని, శత్రుజయాన్ని, పూర్ణాయుస్సును, యశస్సును, తేజస్సును కలిగి ఉంటాడని దీవించారు.

క. దుందుభులు మొరసె, గాయక, సందోహము పాడె, సూతసముదాయముతో
వందిజనులు కీర్తించిరి, క్రందుగ వీతెంచె భద్రకాహళరవముల్.

175

తా ॥ వ్రేపల్లెలో దుందుభులు మ్రోగాయి. గాయక సందోహం పాడింది. పురాణ కథలు చెప్పి పొగడేవారితో కూడ వంది జనులు కీర్తించారు. పెద్దపెద్ద బాకాల యొక్క ధ్వనులు సందడిగా వినపించసాగాయి. ఈ విధంగా వ్రేపల్లె అంతా ఉత్సవ సంరంభంతో నిండి ఉంది.

క. పల్లవ తోరణసురుచిర, వల్లీధ్వజరాజధూపవాసనములతో
సల్లలితములై యొప్పెను, వల్లవవల్లభులయిండ్ల వాకిండ్లెల్లన్.

176

తా ॥ గొల్ల నాయకుల గృహద్వారాలు చిగురుటాకుల తోరణములతో సొగసైన తీగలతో, గొప్ప ధ్వజములతో, ధూప పరిమళాలతో అందంగా ఉన్నాయి.

క. పసుపులు నూనెలు నలఁదిన, పసఁ దనరి సువర్ణబర్హి బర్హ ప్రభతోఁ
బసిమి గలిగి వెలుఁగొందుచుఁ, బసు లన్నియు మందలందుఁ బ్రసరించె నృపా!

177

తా ॥ గోపకులు తమ పశువుల శరీరాలకు పసుపునూనె కలిపి పట్టించారు. పసుపు

కుంకుమ గంధాన్ని అలదారు. అవి బంగారు నెమళ్ళ కుంచెల కాంతితో మెరుపుని కలిగి ప్రకాశిస్తూ మందల్లో తిరుగసాగాయి.

క. క్రేళ్లుఱికి మసలె లేఁగలు, మల్లడిగొని అంకె లిడియె మదవృషభంబుల్,
పెల్లుగ మొదవుల పొదుఁగుల, జల్లించెం బాలు బాలుసంభవవేళన్.

178

తా ॥ బాలుడు పుట్టిన శుభవేళలో లేగదూడలు చెంగలించి దాటి అలసిపోయి నిలిచాయి. మదించిన ఎద్దులు ఉత్సాహముతో రంకెలు వేశాయి. ఆవులన్నీ పొదుగుల్లోంచి పుష్కలంగా పాలు కురిపించాయి.

క. ఆరఁగఁ జదివెడి పొగడెడి, వారికి విద్యలను బ్రదుకువారికి లేమిం
జేరినవారికి నెల్లను, గోరక మును నందుఁ డిచ్చె గోధనచయముల్.

179

తా ॥ నందుడు తనకు కుమారుడు కలిగాడని తన వంశావళి చదివే వారికి, స్తోత్రం చేసే వారికి, విద్వాంసులకు, పేద వారికి, ఇలా తన దగ్గరకు చేరిన వారికి వారు అడగకుండానే గోవులను, ధనాన్ని సమృద్ధిగా దానం చేయసాగాడు.

వ. ఆ సమయంబున.

180

క. కంచుకములు తలచుట్లును, గాంచన భూషాంబరములుఁ గడు మెఱయఁగ నే
తెంచిరి గోపకు లందఱు, మంచి పదార్థములు గొనుచు మాధవుఁ జూడన్.

181

తా ॥ అప్పుడు గోపకులందరూ నందుని యొక్క కుమారుణ్ణి చూసేందుకు

బయలుదేరారు. ఏ విధంగా అంటే, వారు అందమైన దుస్తులతో, విలువైన ఆభరణాలు ధరించి, తలపాగాలను చుట్టి శుభప్రదములైన వాటిని తీసుకుని నందుని ఇంటికి ప్రయాణమయ్యారు.

క. ఏతెంచి చూచి చెలఁగుచు, నేతులఁ బెరుఁగులను బాల నీళ్లను వెన్నం
బ్రీతి వసంతము లాడిరి, యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్.

182

తా ॥ అలా వచ్చి ఆ బాలుణ్ణి చూసి సంతోషంతో పొంగిపోసాగారు. సరసపు మాటలు ఆడుకుంటూ, నేయి, పెరుగు, పాలు, నీళ్ళు, వెన్న మొదలైనవి చేర్చి కలిపిన వసంతాన్ని ఒకరి మీద ఇంకొకరు పోసుకొంటూ ప్రీతితో వసంతోత్సవం జరుపుకున్నట్లుగా ఆడారు.

వ. తదనంతరంబ.

183

ఆ. ఏమినోము ఫలమొ యింత ప్రా ద్దొక వార్త, వింటి మబలలార! వీను లలర
మన యశోద చిన్ని మగవానిఁ గనె నఁట, చూచి వత్త మమ్మ! సుదతులార!

184

తా ॥ ఇంక గోపయువతులు తమలో తాము ప్రొద్దున లేవగానే విన్న శుభవార్తను ఒకరితో ఒకరు ఇలా చెప్పుకోసాగారు– 'ఏనాడు నోచిన నోముల ఫలమో, మన యశోదాదేవి చిన్ని బాబుని ప్రసవించిందట, చూసి వద్దాము, పదండి'.

వ. అని యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన – తత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి.

185

తా ॥ అని ఇట్లు చెప్పి ఇరుగు పొరుగు స్నేహితురాండ్రైన గోపికలు ఒకళ్ళ నొకళ్ళు

పిలుచుకొని మనస్సులో తమకాన్ని నిలుపుకోలేక తొందరపడుతూ, అలంకారాలు చేసుకుని తమతమ ఇండ్లలోంచి బయలు దేరారు.

క. జడగతులును బలుపిఱుఁదులుఁ, బిడికెడు నడుములును వలుఁద బిగి చనుఁగవలున్
వెడఁద నయనములు సిరి దడఁ, బడు మోములు భ్రమర చికుర భరములు నమరన్.

186

తా ॥ అలా బయలుదేరిన ఆ గోపికల నడకలు హొయలతో నెమ్మదిగా సాగుతున్నాయి. వారి కళ్ళు ఆనందంతో విచ్చుకోగా, తుమ్మెద రెక్కల వలె తల కొప్పులు ఊగుచుండగా, లక్ష్మీకళలతో ఆ గోపికలు ముందుకు సాగుచున్నారు.

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరి హారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోద యింటికిం
జేడియ లేఁగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్.

187

తా ॥ అలా వచ్చిన కొందరికి ఆ నడక వేగంలో కొప్పులు విడిపోయాయి. మెడలో ముత్యాల పేరులు చిక్కుపడ్డాయి. మరికొందరికి చెక్కిళ్ళపై బంగారు కాంతుల మెరుపు వేడుక పుట్టిస్తోంది. ఇంకా కొందరి పైట చెరగులు గాలికి నాట్యం చేయసాగాయి. ఈ విధంగా గోపకాంతలు ఒక్కసారిగా ఆ యశోద ఇంటికి చేరి ఎంతో ఆనందోత్సాహాలతో ఆ పసివాని చూసారు. అయితే అతడే దానవ భంజకుడైన విష్ణువని వారికి తెలియదు.

వ. చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి.

188

తా ॥ గోపికలు ఆ చిన్ని కృష్ణుణ్ణి చూసి చాలా సంతోషించి తెచ్చిన కానుకలిచ్చారు.

తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి, బోరుకాడించి "హరి రక్ష పొ" మ్మటంచు
జలము లొకకొన్ని చుట్టిరాఁ జల్లి తొట్ల, నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల.

189

తా ॥ ఈ విధంగా లోకాలను సంరక్షించే వానికి, తాము రక్షపెట్టారు ఆ గోపకాంతలు. ఆ తరువాత ఉయ్యాల తొట్టెలో పరుండబెట్టి దీవించుతూ, ఆ బాలుని తలకు నూనె పెట్టి, ఒంటికి నలుగు పెట్టి స్నానం చేయించారు. స్నానంలో చంటిపిల్లలకు దిష్టి తీసే విధంగా కొంత నీటిని చేతిలోనికి తీసుకుని ముమ్మార్లు ఆ బాలుని చుట్టూ తిప్పుతూ 'శ్రీహరి రక్ష' గా ఉండాలని ప్రార్థిస్తూ జారవిడిచారు. ఆ తరువాత గోపికలందరూ కలిసి ఇలా పాడసాగారు:

క. 'జోజో కమలదళేక్షణ!, జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!
జోజో పల్లవకరపద!, జోజో పూర్ణేందువదన! జోజో' యనుచున్.

190

తా ॥ "తామరరేకుల వంటి కన్నులు గలవాడా జో! జో! సింహము వంటి నడుము కలవాడా జో! జో! కృష్ణా! జో! చిగురుటాకుల వంటి కోమలమైన అరిచేతులు అరికాళ్ళు కలవాడా! జో! జో! నిండు జాబిల్లివంటి ముఖం కలవాడా! జో! జో! నువ్వు సుఖంగా నిద్రపో!" అని అంటూ విశ్వాన్ని ఊపే ఆ పరమాత్మను ఊయల నుంచి ఊపసాగారు.

వ. ఇ వ్విధంబున.

191

క. పలుతోయంబుల జగములఁ, బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా
పలుతోయగాఁడు వల్లవ, లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్.

192

తా ॥ ఈ విధంగా ప్రళయ సమయాలలో జగత్తుని క్రీడగా నీటిమయం గావించే ఆ పరబ్రహ్మము ఏమీ ఎరుగని వానివలె నటిస్తూ ఆ గోపికల చేతుల్లో జలకాలాడుతూ, కేరింతలు కొడుతూ ఆడుకోసాగాడు.

క. లోకములు నిదుర వోవఁగ, జో కొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్
జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్.

193

తా ॥ సకల ప్రాణులను జోకొట్టి నిద్దురబుచ్చుతూ తాను మాత్రం జాగ్రత్తయందు వర్తించు ఆ సుందర మూర్తి గోపికలు జోలలు పాడుతూ ఉంటే నిద్రపోయినట్లు కన్నులు తెరవకుండా కదలకుండా పడుకున్నాడు.

సీ. ఏ బాము లెఱుఁగక యేపారు మేటికిఁ బసుల కాపరియింట బాము గలిగె,
నే కర్మములు లేక యెనయు నెక్కటికిని జాతకర్మంబులు సంభవించె,
నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోడ యశోద చన్నుల పాల చొరవ నెఱిఁగె,
నే హాని వృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁజొచ్చె,

ఆ. నే తపములనైన నెలమిఁ బండనిపంట, వల్లవీజనముల వాడఁ బండె
నే చదువుల నైన నిట్టిట్టి దనరాని, యర్థ మవయవముల నంద మొందె.

194

తా ॥ పుట్టుక లేని మహాత్మునికి పశువుల కాచువారి, ఇంట్లో పుట్టుక సంభవించింది. ఏ విధమైన కర్మలు లేకుండా ప్రకాశించేవాడు జాతకర్మలు చేయించుకున్నాడు. ఏ తల్లి చనుపాలు త్రాగి ఎరుగని ప్రౌఢుడు యశోదాదేవి చనుపాలు రుచి మరిగాడు. పెరుగుట తరుగుట అనేవి

పొందని పరబ్రహ్మము యశోదాదేవి ఒడిలో వృద్ధిని పొందుతున్నాడు. ఎట్టి తపస్సుల వల్లా పండని పంట నేడు గోపకుల వ్రేపల్లెవాడలో కన్నుల పండుగగా పండింది. ఎన్ని శాస్త్రాలను అభ్యసించినా ఇలాంటిదని తెలియని ఆ తత్త్వం ఆ బాలునియందు అభివ్యక్తం కాసాగింది.

మ. చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు, సంతోష దృ
ష్టి యుతుండై నగుచున్ జనార్దనుని మాడ్కిం బొల్చు, రోషించి యు
న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును, సుఖానందంబునం బొంది త
న్మయుఁడై బ్రహ్మము భాతి బాలుఁ డమరు న్బాహుళ్య బాల్యంబునన్.

195

తా ॥ ఆ బాలకృష్ణుడు చంటి బిడ్డగా నుండి ఏదైనా చేష్టలు చేసేటప్పుడు సృష్టికర్త అయిన బ్రహ్మదేవునిలా కనిపిస్తాడు. సంతోషం ప్రకటించే చూపులతో నవ్వుతూ ఉంటే శ్రీమహావిష్ణువులా గోచరిస్తాడు. కోపం వచ్చినప్పుడు రుద్రునిలా భయాన్ని కలిగిస్తాడు. ఆనందం చేత తన్మయం చెందేటప్పుడు నిత్యానంద స్వరూపుడై పరబ్రహ్మంవలె సాక్షాత్కరిస్తాడు. చూసిన వారిదే కదా ఆ భాగ్యమంతా!

వ. అయ్యవసరంబున.

196

ఆ. కొడుకుఁ గన్న వేడ్క కొనసాగ రోహిణిఁ, జీరఁ బంచి చిత్రచేలములను
మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా, యంబుజాక్షి ప్రీతయై చరింప.

197

తా ॥ నందుడు కొడుకును కన్న వేడుకతో రోహిణీ దేవిని పిలిచి ఆభరణాలు, రంగు రంగుల చీరలు బహూకరించి ఆమెను గౌరవించాడు. ఆమె కూడా చాలా సంతోషించింది.

వ. అది మొదలు మొదవుల కదుపులు పొదువులు గలిగియుండె, నంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకుం దక్షులైన వారిని నియమించి మథురకుం జని కంసునికి నేఁటేఁటం బెట్టెడి యరిం బెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగ దర్శించిన.

198

తా ॥ ఆ బాలుడు జన్మించింది మొదలు వ్రేపల్లెలోని ఆలమందలు పాలతో నిండిన నిండు పొదుగులను కలిగి ఉన్నాయి. ఒకనాడు నందుడు ఆలమందలను, వ్రేపల్లెను రక్షించడానికి దక్షులైన గోపకులను అనేకులను నియమించి, తాను ప్రతి సంవత్సరము కట్టవలసిన పన్నును కట్టడంకోసం మథురకు బయలుదేరాడు. కప్పం కట్టి వసుదేవుని ఇంటికి వెళ్ళి, తగిన మర్యాదతో ఆయనను దర్శించాడు.

క. నందునిఁ గనుఁగొని ప్రాణము, పొందిన బొందియునుఁబోలెఁ బొలుపారుచు నా
నందాశ్రులు గడకన్నులఁ, గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్.

199

తా ॥ నందుణ్ణి చూడగానే వసుదేవుడు మహోత్సాహంతో, కన్నుల ఆనందాశ్రువులు రాలుచుండగా చేతులు సాచి కౌగిలించుకున్నాడు. అతనికి నందుణ్ణి చూడగానే ప్రాణం లేచివచ్చినట్లైనది.

వ. మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనుంజేసి, వసుదేవుండు దనకొడుకువలని మోహంబు దీపింప నందున కిట్లనియె.

200

తా ॥ నందుణ్ణి కౌగిలించుకొని సుఖాసీనుణ్ణి చేశాడు. తను కన్నకొడుకు మీది ప్రేమ పొంగుకు రాగా నందునితో ఇలా అన్నాడు:

క. సంతతి లే దని మును ఘన, చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్
సంతతి గలిగెను భాగ్యము!, సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే?

201

తా ॥ "మిత్రమా! సంతానం లేదని ఎన్నో సంవత్సరాల నుంచి చింతతో కృశించి పోయావు. ఈనాటికి బిడ్డడు కలిగాడు నీకు. అదృష్టవంతుడివి. లోకంలో బిడ్డలు లేని వానికి సౌఖ్యం లేదు కదా!

క. పొడగంటి నిన్ను బ్రదికితిఁ, గడచితి నాపదల నింకఁ గార్యంబులు నే
యెడమడుగు లేని నెచ్చెలిఁ, బొడఁగాంచుట చచ్చి మఱలఁ బుట్టుట గాదే!

202

తా ॥ ఇన్నాళ్ళకు నిన్ను చూడగలిగాను. ఇంక నాకే ఆపదలు రావు. కార్యాలలో ఏ మాత్రమూ తేడాని చూపని నీ వంటి స్నేహితులను కలుసుకోవడం ప్రాణానికి మరింతగా ఊపిరినివ్వడమే కదా!

క. పలుపాటులఁబడు జనులకు, నిల నొకచో నుండఁ గలదె? యేఱుల వెంటం
గలిగి చను ప్రాఁకు లన్నియుఁ, బలువెంటలఁ బోవుఁగాక పాయక యున్నే?

203

తా ॥ బ్రతుకు తెరువులో పలుపాట్లు పడే జనులకు ఒకే చోట ఉండటం కుదురుతుందా? నదీ ప్రవాహంలో కొట్టుకునిపోయే పుల్లలు ఒకేచోట ఏ విధంగా కలిసి ఉండవో, అదే విధంగా బంధువులు, ప్రియం చేకూర్చేవారైనా, ఒకే చోట ఉండుట సంభవించదు. ఏలననగా అందరి కర్మలు వేరు వేరుగా ఉంటాయి కదా!" అని అంటూ,

మ. పలురోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?

కొలఁకుల్ వాఁగులు వారిపూరితములే? గోష్ఠ ప్రదేశంబులం
బులులున్ దుప్పులు సంచరింపవు గదా! పొల్పారునే ఘోషముల్?
కలవే పచ్చనిపూరిజొంపములు తత్కాంతార భాగంబులన్?

204

తా ॥ "మిత్రమా! మీ ఆవులన్నీ చక్కగా పాలిస్తున్నాయా? అనారోగ్యాలు లేకుండా ఉన్నాయా? వాగులు, గుంటలు చక్కగా నీళ్ళతో నిండి ఉన్నాయి కదా! పశువులను కట్టే ప్రదేశంలోకి పులులు, దుప్పులు రావటం లేదు గదా? గొల్లపల్లెలన్ని బాగున్నాయా? మీ వ్రేపల్లెకు దగ్గరగా ఉండే అడవి ప్రదేశాలలో పచ్చికబయళ్ళు సమృద్ధిగా ఉన్నాయా?

క. తనపుత్రమిత్రముఖరులఁ, దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్
మనుచు గృహమేధియాశ్రమ, మున నుండెడువాని కొక్క మోదముఁ గలదే?

205

తా ॥ తన పుత్రమిత్రాదులను సంతోషపెట్టక వాళ్ళని కన్నెత్తి చూడక వారు నానావిధ దుఃఖములలో మునిగేలా ప్రవర్తించే గృహస్థు పోషణలో ఉన్నవారికి ఏమాత్రం సంతోషం ఉండదు కదా!

క. నీకాంతయొద్ద నీవును, నీకాంతయు గారవింప నినుఁ దండ్రిఁగ నా
లోకించుచు నీ మందను, నా కొడు కున్నాఁడె? నంద! నందాన్వితుఁడై.

206

తా ॥ ఓ నందుడా! నీవు, నీ భార్య ప్రేమగా చూస్తుంటే, నిన్ను తండ్రిగా గౌరవిస్తూ, నీ వద్ద ఉన్నది నా పుత్రుడే సుమా!" అని వసుదేవుడు అన్నాడు.

వ. అనిన నందు డిట్లనియె.

207

తా ॥ అప్పుడు నందుడు ఇలా అన్నాడు:

శా. నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము
న్నీ కంసుండు వధించె, మీసుతఁ దుది న్హింసింపఁ జేఁదప్పి తా
నాకాశంబున కేగె, బాల యది, దైవాధీనమాపద్దశన్
శోకంబందునె తద్జ్ఞుఁ? దూఱడుము నా సూనుండు నీ సూనుఁడే.

208

తా ॥ “నీకు దేవకీదేవికి జన్మించిన కొడుకుల నందరినీ ఈ కంసుడు వధించాడు. ఆ తర్వాత మీకు కుమార్తె కలుగగా ఆమెను చంపబోగా ఆ చిన్నది ఆకాశానికి ఎగిరి పోయింది. ఇలా జరగటం దైవాధీనం. తెలివైన వాడు ఆపద్దశలో దుఃఖాన్ని పొందదు. కనుక ఊరడిల్లు! నా కొడుకు నీ కొడుకే అనుకో!” అని ఓదార్చసాగాడు.

వ. అనిన వసుదేవుండు నందునకు మఱియు నిట్లనియె.

209

తా ॥ అప్పుడు వసుదేవుడు నందునితో ఇలా అన్నాడు:

క. జనపతి కరి యిడితివి, మముఁ, గనుఁగొంటివి, మేము నిన్నుఁ గంటిమి, మే ల
య్యెను, బొమ్మింకను గోకుల, మున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్.

210

తా ॥ “నీవు వచ్చినందుకు రాజుకు కప్పం కట్టావు. మమ్ములను చూసావు. మేం కూడా నిన్ను చూసి సంతోషించాం. ఇప్పుడు గోకులమందు కొన్ని ఆపదలు రాబోవు సూచనలు ఉన్నాయి. అవి రావడానికి ముందే జాగ్రత్త పడితే మంచిది, కనుక వెంటనే బయలుదేరు.”

## 6. కంసుడు పంపిన పూతన రాక్షసి వ్రేపల్లెకు వచ్చుట

వ. అని పలికి వసుదేవుండు నందాదులయిన వల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమ తమ పల్లెల త్రోవలు వట్టి చని రానందుండు ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందటఁ బొడగని శౌరి దనతోఁ బలికిన పలుకులు దప్పవనుచుఁ దలంచుచుం జనియె. నంత.

211

తా ॥ ఇలా చెప్పి వసుదేవుడు, నందునకు తక్కిన గొల్లలకు సెలవు ఇచ్చి పంపించాడు. వాళ్ళు కూడా వడిగా నడవ గలిగిన కోడెలు కట్టిన బండ్లెక్కి తమ ఊళ్ళకు బయలుదేరారు. నందుని ఎదుట కూడా స్పష్టమైన అనిష్ట సూచక చిహ్నాలు గోచరించసాగాయి. వసుదేవుడు తనతో పలికిన పలుకులు తప్పవని మనస్సులో అనుకొన్నాడు.

సీ. కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల
నిల నెల్లచో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వనిపేరు శ్రవణవీథిఁ
బడినయంతన సర్వభయనివారణ మగు నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరి యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ

తే. గామరూపిణియై చొచ్చి కానకుండ, నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసి కొనుచు
నందగృహమున బాలుని నాద మొకటి, విని ప్రమోదించి సుందరీవేష యగుచు.

212

తా ॥ ఇలా ఉండగా పూతన అనే రాక్షసి కంసుని చేత పంపబడి మథురాపురం నుండి బయలుదేరింది. అది పల్లెలు, మందలు, పట్టణాలు అన్నిచోట్ల పసిపిల్లలను సంహరిస్తూ వస్తోంది. అలా వస్తూ ఎవనిపేరు చెవిని సోకితే సకల భయాలు పోతాయో అటువంటి ఆ శ్రీమహావిష్ణువు అవతరించిన వ్రేపల్లెకు ఆకాశ మార్గాన వచ్చింది. కామరూపిణి అయిన ఆ

రాక్షసి ఆ పల్లెలో మాయా రూపంచేత ఎవరికీ తెలియకుండా ఇల్లిల్లూ పసివారిని వెతక్కుంటూ సాగుతోంది. నందగోపుడు ఇంట్లో పసిబిడ్డ ఏడ్పు వినిపిస్తే బిడ్డను చంపే అవకాశం చిక్కింది గదా అని సంతోషించి అందమైన యువతి వేషాన్ని ధరించింది.

మత్త. క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందువొందని చందురుం
బోలు మోమును గల్గు లేదన బుద్ధి దూఱని కౌను హే
రాళమైన పిఱుందుఁ బల్లవరాగ పాదకరంబులుం
జాల దొడ్డగు కొప్పు నొప్పఁగ సర్వమోహనమూర్తితోన్.

213

తా ॥ తేటగా ప్రకాశిస్తున్న కన్నులు, గుండ్రని వక్షోజాలు, కళంకం లేని చంద్రుని వంటి ముఖం, ఉన్నదా లేదా అనే సన్నని నడుము, చిగుళ్ళవలె మృదువై ఎర్రని కాలు సేతులు, ఒత్తైన కొప్పు... ఇలాజగన్మోహనరూపంతో నందుని ఇంటికి వచ్చింది ఆ పూతన.

మానిని.
కాంచనకుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱుకన్ జడపై
మించిన మల్లెల మేలిమి తావులు మెచ్చి మదాళులు మింటను రా
నంచిత కంకణహారరుచుల్ చెలువారఁగఁ బై వలు వంచల నిం
చించుక జాఱఁగ నిందునిభానన యేఁగెఁ గుమారుని యింటికినై.

214

తా ॥ ఆ పూతన చెవులకు ధరించిన బంగారు కమ్మల తళతళలు చెక్కిళ్ళపై ప్రసరిస్తున్నాయి. తల వెంట్రుకల అల్లిక మీద పెట్టుకున్న మల్లె పువ్వుల వాసనలకు గండు తుమ్మెదలు ముసురుకొని వెంట వస్తున్నాయి. చేతులకు కంకణాలు మెడలోని ముత్యాల పేరులు మొదలైన వాని కాంతులు బయటకు వ్యాపించి అందగించేటట్లు పయటకొంగు కొంచెం

జారిపోతూ ఉన్నది. చంద్రుని వంటి ముఖం గల పూతన బాలకృష్ణుడు ఉన్న నందుని ఇంటికి సమ్మోహనంగా బయలుదేరింది.

వ. ఆ సమయంబున.

215

మ. 'సిరి మమ్మున్ బ్రదుకంగఁ జూచుకొఱకై శృంగార వేషంబుతో
నరుదేనోపు' నటంచు గోపికలు జిహ్వల్ రాక మోహించి త
త్పరలై చూడ లతాంగి వోయి కనియెం బర్యంక మధ్యంబునం
బరు భస్మానలతేజు దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్.

216

తా ॥ ఆమె నందుని ఇంట ప్రవేశిస్తుంటే శృంగార వేషంతో వచ్చిన లక్ష్మీదేవేమో ఈ పుణ్యాత్మురాలు అని గోపికలందరు ఆమె అందానికి ఆశ్చర్యపోయారు. 'నీవెవరు?' అని అడగడానికి నోరు రాక దాని మాయచే భ్రాంతిని పొందారు. తదేక దృష్టితో చూస్తుండిపోయారు. అలా వారిని మోహింపజేసిన ఆ పూతన సరాసరి నందుని ఇంట్లోకి ప్రవేశించి అక్కడ పరుండి ఉన్న పరాత్పరుని చూసింది. అతడు నివురుగప్పిన నిప్పువలె ఉండటం చేత, ఆ మాయా శిశువుని తాకితే తనకు ప్రమాదం అనీ, అతను దుర్జనవధ తనతోనే ఆరంభిస్తున్నాడని ఆ రక్కసికి తెలియరాలేదు.

వ. కని కదియవచ్చు సమయంబున.

217

శా. ఆ లోకేశ్వరుఁ డాచరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని గొంటు గం టిడి వెసన్ బాలెంతచందంబునం
బాలిండ్లన్ విస మూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్

కాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టఁగన్

218

తా ॥ మెల్లగా ఆ బాలుని దగ్గరికి వస్తూవుంది పూతన. అంతట సర్వలోక నియామకుడు, కదిలే వాటికి కదలని వాటికి సమస్తానికి ప్రభువైన ఆ ఈశుడు, గోపాలబాల రూపాన్ని ధరించిన ఆ పరాత్పరుడు పసి బిడ్డలను చంపే దుష్టురాలు అయిన రాక్షసి బాలింత వేషంలో చనులకు విషం పెట్టుకొని రావడాన్ని గమనించాడు. తనలో తాను నవ్వుకొంటూ, కాళ్ళు చేతులు కదల్చకుండా కండ్లు మూసుకొని గురక పెడుతూ ఒళ్ళు మరచి నిద్రపోతూన్న వానిలా నటించసాగాడు.

క. ఆ పాపజాతిసుందరి, యా పాపని పాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్, మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్.

219

తా ॥ ఆ పాపాత్మురాలైన పూతన శ్రీకృష్ణుడు నిద్రిస్తూన్న పాన్పు దగ్గరికి వెళ్ళి ఆ బాలుని తన చేతులతో ఎత్తి రొమ్ముకు అదుముకుంది. ఆ పసివాని శిరస్సుని ముద్దిడుతూ ఇలా పలికింది:

క. "చను నీకుఁ గుడుపఁజాలెడి, చనువారలు లేరు, నీవు చనవలె," ననుచుం
జనుగుడిపి మీఁద నిలుకడఁ, జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జను గుడుపన్.

220

తా ॥ "నీకు చనుపాలు తాగించగల సమర్థులెవరూ ఇచ్చట లేరు. కనుక నీవు నా పాలను తాగాలి. నీకు పాలిచ్చిన పిమ్మటనే నేను ఇక్కడ నుండి వెళతాను" అంటూ వేడుకతో పలకసాగింది. అంతేగాక,

క. 'నా చనుఁబా లొక గ్రుక్కెఁడు, నోచిన్ని కుమార! త్రావు మొయ్యను పిదపన్

నీచెలువ మెఱుఁగ వచ్చును, నా చెలువము సఫల మగును నళినదళాక్షా!'

221

తా ॥ "నా చిన్న తండ్రీ! నువ్వు తిన్నగా నా చనుపాలు ఒక గ్రుక్కెడు తాగిచూడు. అప్పుడు నీ అందం ఏ విధంగా మారుతుందో చూడు. అప్పుడే నా అందానికి కూడా ఫలితం చేకూరుతుంది."

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి.

222

తా ॥ అని ఈ విధంగా బాలుణ్ణి ఉద్దేశించి ముద్దాడుతున్నట్లుగా మాట్లాడుతున్న పూతనను చూసారు యశోదారోహిణులు.

మ. వనితా! ముట్టకు మమ్మ! చన్ను గుడుపన్ వల్దమ్మ నీచన్ను మా
తనయుం డొల్లఁడు వాసి పొమ్మని యశోదారోహిణుల్ సీరఁ గై
కొన కీక్షించుచు మాయఁబన్ని పెలుచం గోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాట మెత్తఁదనమున్ లోవాఁడియు న్నేర్పడన్.

223

తా ॥ 'చూడమ్మా! నువ్వెవరో క్రొత్త దానివిలా ఉన్నావు! మా బిడ్డడు నీ చనుపాలు త్రాగడు! నీవు పాలియ్యనక్కరలేదు. అవతలికి వెళ్ళు!' అని పలుమార్లు చెబుతున్నా వాళ్ళ మాటలు లక్ష్యపెట్టక ఆ పూతన కృష్ణుని వైపు చూడసాగింది. ఒరలో కత్తివలె తీక్షణంగా ఆ బాలుని చూడసాగింది. ఆమె మెత్తని పలుకుల లోపల వాడితనం కనబడకుండా దాగి ఉన్నది.

వ. కదిసి కలికిపలుకులు పలుకుచు నులుకుసెడి జళుకు సొరక యెదుర నిదుర గదిరిన ఫణిని ఫణియని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ గఱటి జఱభితెఱవ

వెరవునం జనుదెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గన్ను దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరు మిగులు చిఱుత కొమరునిం దిగిచి తొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్నియన్న! చన్ను గుడువు మని చన్నిచ్చు సమయంబున.

224

తా ॥ తియ్య తియ్యగా మాట్లాడుతూ ఎక్కడా తత్తరపాటు లేకుండా, భయమన్నది అసలే లేకుండా దగ్గరికి వచ్చింది. తన ఎదుట నిద్రపోతున్న బిడ్డడు నిద్రిస్తూన్న నాగుపాము వంటివాడు అని తెలియక, గుణవంతుణ్ణి తన వైపుకు ఈడ్చుకొనే బుద్ధిహీనుని వలె, వంచకురాలైన ఆ దుష్ట స్త్రీ పానుపు మధ్యలో ఉన్న బాలుని దగ్గరకు వచ్చింది. చక్కటి కాంతులతో వెలిగి పోతున్నాడు బాలుడు! కన్నులు తెరవక, భయమంటే ఎరుగక మెరిసిపోతూన్న ఆ పసిబిడ్డను తీసుకొని ఒడిలో పడుకోపెట్టుకుంది. ఒడలు నిమురుతూ ప్రేమను కనబరుస్తూ "నా చిన్న తండ్రీ! ఆకలేస్తూందా! ఇంద! పాలు త్రాగు!" అంటూ చన్ను నోట్లో పెట్టింది.

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జాఁచి యొదిఁగిలి యాఁకొన్న యోజ నూఁది
బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్కగ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొక రెండు గ్రుక్కల నువిదప్రాణంబులు సైతము మేనిలో సత్త్వ మెల్లఁ

తే. ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ, జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలుర క్రియవాఁడ వీవు గావు, చన్ను విడువుము విడువుము చాలు, ననుచు.

225

తా ॥ కృష్ణుడు అప్పుడే లేపితే మేలుకొన్నట్టుగా మెల్లగా కన్నులు విచ్చి ఓరకంటితో చూసాడు. మెల్లిగా ఒళ్ళు విరుచుకుంటూ బద్ధకంగా ఆవులించాడు. ఆ తరువాత చేతులు ఆప్యాయంగా చాచి ఒదిగి పడుకున్నాడు. ఎంతో ఆకలితో ఉన్న పసివానివలె చన్నుని పట్టుకుని

గుటుకు గుటుకు మని శబ్దం చేస్తూ రెండు గుక్కలలో ఆమె శరీరంలోని సత్తువనంతా పీల్చివేసి చివరకు ప్రాణాలను కూడా పీల్చివేసాడు. దానితో ఆమెకు గుండెలదరగా, నాలుక ఎండిపోతుండగా, నిలువలేక తలను వాల్చుతూ ఇలా అరవసాగింది – 'అబ్బీ! నీవు అందరి బిడ్డల వంటివాడవు కాదు. తాగిన పాలు చాలును కానీ నన్ను విడిచిపెట్టు! ఇంక నన్ను వదిలిపెట్టు!' అని గిలగిలలాడసాగింది.

క. నిబ్బరపు దప్పి మంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్
గొబ్బున వివృతములుగ నా, గుబ్బగుచున్నట్టి కూఁతఁ గూలెన్ నేలన్.

226

తా ॥ ఆ సమయమున పూతనకు అధికమైన దాహముతో మంటలు శరీరమంతా వ్యాపించగా నిలువలేక పోతోంది. ఆమెకు కాళ్ళు చేతులు తేలిపోసాగాయి. కనుగుడ్లు వెలికి రాగా భయంకరమైన ధ్వనితో నేలమీద పడిపోయింది.

మ. అదరెం గొండలతోడ భూమి, గ్రహతారానీకముల్ మింటి పై
బెదరెన్, దిక్కుల మాఱు మ్రోఁత లెసఁగెన్, భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను, వజ్రభిన్న గిరిరేఖం బూర్వదేహంబుతో
ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన తద్దీర్ఘోరు ఘోషంబునన్.

227

తా ॥ ఆ భయంకర ధ్వనికి కొండలతో పాటుగా భూమి కంపించిపోయింది. ఆకాశంలో గ్రహ నక్షత్రాలు కూడా భయపడ్డాయా అన్నట్టుగా తమ స్థానాల నుండి చెదిరిపోయాయి. అష్టదిక్కులలోను ప్రతిధ్వనులు పుట్టాయి. ముల్లోకాలకూ భీతిని కలిగించే విధంగా, భయంకర పూర్వరూపంతో పర్వతం వంటి రాక్షసాకృతితో, ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు నేలకూలిన పర్వతంలా కింద పడి ఉన్నది.

క. అప్పుడు దెప్పరమగు నా, చప్పుడు హృదయములఁ జొచ్చి సందడి పెట్టన్
ముప్పిరిగొని పడి రెఱకలు, దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్.

228

తా ॥ అంతట ఆ వ్రేపల్లెలోని గొల్ల వారంతా భయంకరమైన పూతన కేకను విని, బెంబేలుపడి ఒళ్ళు తెలియక స్పృహతప్పి పడిపోయారు.

క. ఆ జఱభిరండ రక్కసి, నైజశరీరంబు నేల నలియం బడినన్
యోజనమున్నర మేర ధ, రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా!

229

తా ॥ క్రూరస్వభావం గలది, నీచురాలైన ఆ పూతన తన అసలు స్వరూపంతో నేలమీద బడి కొట్టుకుంటూ ఉంటే, ఆ పర్వతాకృతి ఘర్షణకు ఒకటిన్నర యోజనాల మేర వరకూ చెట్లు అన్నీ నుగ్గునుగ్గుగా అయిపోయాయి.

సీ. దారుణ లాంగూలదండ దంతంబులు నగ గహ్వరముఁబోలు నాసికయును
గండశై లాకృతి గల కుచయుగమును విరిసి తూలెడి పల్లవెండ్రుకలును
జీఁకటి నూతులఁ జెనయు నేత్రంబులుఁ బెనుదిబ్బఁ బోలెడి పెద్దపిఱుఁదుఁ
జాఁగు కట్టలఁబోలు చరణోరుహస్తంబు లింకినమడువుతో నెనయు కడుపుఁ

తే. గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ, భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి
గోపగోపీజనంబులు గుంపుగూడి, బెగడుచుండిరి మనముల బెదరు గదిరి.

230

తా ॥ అలా నేలకూలిన ఆ రక్కసి కోరలు నాగలి కొయ్యల్లా ఉన్నాయి. నాసికా రంధ్రాలు పర్వత గుహలవలె ఉన్నాయి. స్తనాలు పెద్ద రాతి బండల్లా ఉన్నాయి. ఎర్రని తలవెంట్రుకలు

గాలికి కదలుతున్నాయి. చీకటి నూతుల్లా కళ్ళు లోతుగా ఉన్నాయి. పెద్ద దిబ్బలవంటి పిరుదులు, పొడుగైన కాళ్ళు, తొడలు, చేతులును, నీళ్ళు ఇంకిపోయిన మడుగువంటి కడుపు కలిగి, ఆరుక్రోసుల మేర భీకరంగా విస్తరించిన ఆ పూతన దేహాన్ని చూచి గొల్లవాండ్రందరు భయపడుతూ దూరదూరంగా ఉండిపోయారు.

వ. ఇ వ్విధంబున.

231

క. ఆ తఱిఁ గుడువఁగ నడచెన్, నూతన ఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు

ద్యోతనఁ గృతముని సముదయ, యాతనఁ బూతన నెఱింగి యాతనలీలన్.

232

తా ॥ అప్పుడే విచ్చిన తామర పూరేకుల వంటి కన్నులు కల ఆ చిన్నవాడు పాలు తాగే నెపంతో ఆ పూతనను అవలీలగా సంహరించి తన లీలను మొదలుపెట్టాడు. మరి మునులను బాధించిన పాపం, పసివారిని చంపిన పాపం ఊరికే పోదు కదా!

క. విషధరరిపు గమనునికిని, విషగళసఖునికిని విమలవిషశయనునికిన్

విషభవభవ జనకునికిని, విషకుచచనువిషముఁ గొనుట విషమే తలఁపన్?

233

తా ॥ ఇంతకూ ఈ బాలుడు ఎలాంటివాడు అని పరిశీలిస్తే, విషసర్పాలను చీల్చి చెండాడగల గరుత్మంతుడు ఇతనికి వాహనం. విషాన్ని కంఠంలో నిలిపి లోకాలను ఉద్ధరించిన శివుడు ఇతనికి పరమ మిత్రుడు. విషము అనే పేరుని నామాంతరంగా గల నీటిమీద శయనించేవాడు, ఆ విషము (నీరు) నుండి పుట్టిన పద్మంలో నుండి ఉద్భవించిన బ్రహ్మకు ఇతను తండ్రి. ఇన్ని విశేషములు గల ఈ విష్ణువుకి రాక్షసి చన్నులోని విషం లాగివేయటం ఒక పెద్ద విషయమా ఏమిటి?

వ. అంత నా గోపగోపీజనంబులు తెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గఱి.
234

తా ॥ ఇంతలో గోపగోపీ జనాలకి ఒక్కసారిగా దేహస్మృతి కలిగి రోహిణీయశోదలతో కలసి భయపడకుండా ఒక్కసారి ముందుకు వచ్చారు.

శా. నేలం గూలిన దాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప నో
బాలా! రమ్మని మూఁపు జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి గోవురజమున్ గోమూత్రముం జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పంద్రెండు నామంబులన్.

235

తా ॥ నేలమీద కూలిపోయిన ఆ మాయలాడి విశాలమైన పొట్టమీద భయం లేకుండా ఆటలాడుకుంటున్న ఆ చిన్నవాడిని ఎత్తుకున్నారు. ఆ పసివాని దేహాన్ని నిమురుతూ, భుజాలపైన పడుకోబెట్టుకుని లాలించారు. పీడ తొలగాలని ఆవు తోక పట్టుకుని ఆ బాలుని చుట్టూ తిప్పారు. గోవు కాలి ధూళినీ, గోమూత్రమును వానిపై చల్లారు. కేశవ నామాలు పన్నెండు చెబుతూ అవయవాలకు గోమయాన్ని పట్టించారు.

వ. మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబు సేసి దక్షలయి, మునుపుగాఁ దమకు రక్షాకరం బగు బీజన్యాసంబు సేసికొని, 'చిన్ని యన్న! నీ యడుగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబుఁ గేశవుండును, నుర మీశుండును, గంఠంబినుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు. ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు నసిధరుండగు నజనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుండైన యురుకాయుండును,

మీఁ దుపేంద్రుండును, గ్రిందు తార్క్ష్యుండును, నంతటను హలధరుండగు పురుషుండును కాతురు. నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని పృశ్నిగర్భుండును, నహంకారంబును భగవంతుండైన పరుండును బాలనంబు సేయుదురు. నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించు తఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షకుండైన యజ్ఞభుజుండును నేమఱ కుండుదురు. నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండ డాకినీ యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరా రేవతులును, జ్యేష్ఠాపూతనలును, మాతృకాది గణంబులును నశియింతురు. నీయందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లయిన యున్మాదంబులును నపస్మారంబులును మహోత్పాతంబులును బొందకుండుం గావుతమని రక్షసేసి దీవించి రంత.

236

తా ॥ ఆ గోపకాంతలకు అంతటితో తృప్తి కలుగలేదు. ఆచమనాలు చేసి ఓంకారం మొదలుగా ద్వాదశాక్షర మంత్ర బీజాలను చెపుతూ లలాటం, మెడ, రొమ్ము మొదలుగా పన్నెండు స్థానాలు తాకి తమ దేహ సంరక్షణాన్ని చేసుకున్నారు. ఆపైన బాలునికి రక్ష కట్టడం ప్రారంభించారు.

"చిట్టి తండ్రీ! బ్రహ్మదేవుడు నీ పాదాలను రక్షించుగాక! అదే విధంగా, మోకాళ్ళు వాయుదేవుడు, తొడలను యజ్ఞమూర్తి అయిన అగ్నిదేవుడు, పిరుదులను అచ్యుతుడు, కడుపును హయగ్రీవుడు, హృదయాన్ని కేశవుడు, వక్షాన్ని ఈశానుడు, కంఠమును సూర్యుడును, భుజాలను చతుర్భుజుడును, ముఖాన్ని త్రివిక్రముడును, శిరాన్ని ఈశ్వరుడును రక్షిస్తారు గాక!

అంతే కాకుండా... నీ ముందుగా చక్రధరుడైన శ్రీహరి, వెనుక గదాధరుడైన విష్ణువు,

రెండు ప్రక్కల విల్లును ఖడ్గాన్ని ధరించిన మధుసూదనుడూ, మూలల యందు శంఖం చక్రం గద ధరించిన శేషశాయి, పై భాగం ఉపేంద్రుడు క్రింది భాగాన్ని గరుడుడు, అన్ని చోట్ల హలధరుడైన పురుషోత్తముడు రక్షించెదరు గాక!

నీ పదునాలుగు ఇంద్రియాలను హృషీకేశుడు, పంచప్రాణాలను నారాయణుడు, చిత్తాన్ని శ్వేతద్వీప పతి అయిన శ్రీహరియు, మనస్సును యోగీశ్వరుడైన కపిలుడు, బుద్ధిని పృశ్నిగర్భుడైన విష్ణువుయును, అహంకారాన్ని పరమాత్మయును రక్షిస్తారు గాక!

నువ్వు ఆడుకొంటూన్నప్పుడు గోవిందుడు, నిద్రించునప్పుడు మాధవుడు, నడిచేటప్పుడు వైకుంఠుడు, కూర్చున్నప్పుడు శ్రీపతియు, భుజిస్తూన్నప్పుడు యజ్ఞభోక్త అయిన విష్ణువు ఎప్పుడూ రక్షించెదరు గాక!

ఈ విష్ణునామస్మరణం చేత చెడ్డకలలు, వృద్ధ గ్రహాలు, బాల గ్రహాలు, కూశ్మాండ డాకినీ గ్రహాలు, బ్రహ్మ రాక్షసులు, భూతప్రేత యక్ష రాక్షస పిశాచాది గ్రహాలు, కోటరాది దుష్టశక్తులు, జ్యేష్ఠుడు మొదలైన పిశాచ రాజులు, మాతృకలు మొదలైన గణాలు నశించిపోతారు. నీ ప్రాణములకు, ఇంద్రియములకు, శరీరానికీ విరోధాన్ని కలిగించే చిత్తచాంచల్య వృత్తులు, బుద్ధిభ్రమ కలిగించు వృత్తులు నీకు కలుగకుండుగాక!" అని రక్షను చదువుతూ దీవించారు.

క. ఆ పెద్దవేడబంబుల, పాపనికినిఁ జన్నుఁ గుడిపి పానుపుపై సం
స్థాపించి కప్పి 'కూరుకు, మో పాపఁడ!' యని యశోద యొయ్యన పాడెన్.



తా ॥ గొప్ప మాయలు తెలిసిన ఆ పసివానికి అంతట యశోదాదేవి చన్నిచ్చి, పానుపుపై పరుండపెట్టి పైన ఒక వస్త్రాన్ని కప్పి, ఇక నిద్రపో నాయనా! అంటూ జోలపాడింది.

వ. అంత నందుండు మొదలయిన గోపకులు మధురనుండి వచ్చి రక్కసిమేనుఁ గని వెఱఁ

గుపడి 'మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె, నతండు మహాయోగి' యని పొగడి కఠోరంబగు పూతన యొడలు కుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబునఁ బటీరంబుల దహనంబు సంగ్రహించి దహించి రంత.

238

తా ॥ ఇంతలో నందుడు మొదలైన గోపకులు మథురనుండి వచ్చి పూతన కళేబరాన్ని చూసి నివ్వెరపోయారు. ఆ వసుదేవుడు మీ పల్లెలలో ఉత్పాతాలు కలుగుతాయి వేగంగా వెళ్ళమని చెప్పాడు. అతడు మహాయోగి అని పొగిడారు. తరువాత ఆ పూతన కళేబరాన్ని గొడ్డళ్ళతో ముక్కముక్కలుగా నరికి, తమ నివాస గృహాలకు దూరంగా దహనం చేశారు.

ఆ. పొగిలి పొగిలి కాలు మగువదేహంబున, నగురు పరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ, ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య!

239

తా ॥ ఓ రాజా! ఆ పూతన శరీరం దహించబడుతుండగా, ఆ దేహం నుండి అగరు భరితమైన సుగంధాలు వెదజల్లే పొగలు బయటకు రాసాగాయి. దీనికి కారణం ఏమిటో తెలుసా? ఆ చిన్నవాడు పాలతో, విషాన్ని మాత్రమే కాక ఆమె శరీరంలోని కల్మషాలను అన్నింటిని తొలగించివేసాడు!

క. హరి దనమీఁదం బదములుఁ, గరములు నిడి చన్నుఁ గుడిచి కదిసినమాత్రన్
హరిజననిపగిదిఁ బరగతి, కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్.

240

తా ॥ కృష్ణుడు తన మీద కాళ్ళు చేతులు వేసి దగ్గరకు వచ్చి చనుపాలు త్రాగినంత మాత్రముచేత అంతటి రాక్షసికి కూడా పాపాలు పటాపంచలై విష్ణువు తల్లి వలే పరమగతిని ప్రాప్తించుకున్నది. ఔరా! ఎంతటి చిత్రం!

క. వెన్నుని కొకమఱి విషమగు, చన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికిన్,
వెన్నునిఁ గని పెంచుచుఁ దన, చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే?

241

తా ॥ విష్ణువుకు ఒక్కసారి విషపూరితమైన చన్నిచ్చిన బాలహంతకురాలైన రాకాసి స్వర్గానికి వెళ్ళగా, అలాంటప్పుడు ఇక విష్ణువుని కనిపెంచుతూ చన్నిచ్చిన తల్లికి మళ్ళీ జన్మంటూ ఉంటుందా? ఉండనే ఉండదు!

క. హరిఁగని చన్నులు గుడిపెడి, తరుణులు ప్రాప్తించు పదము దలఁపఁగ వశమే?
హరి యారగించుటకుఁ బా, ల్గురిసిన ధేనువులు ముక్తి కొనలఁ జరించున్.

242

తా ॥ హరిని చూసి చనుపాలు త్రాగించ కలిగిన తరుణులు ఎలాంటి ఉత్తమ లోకాలు పొందుతారో ఊహించడానికి కూడా శక్యం కాదు. హరి త్రాగేందుకు పాలిచ్చిన ఆవులు కూడా అత్యున్నతమైన ముక్తి స్థానాలలో ఉంటాయి.

క. ఆపూతన మెయి గంధము, గోపాలు రెఱింగి 'యిట్టి కువనిత యొడలం
దీపాటి స్వాదుగంధము', ప్రాపించునె యనుచుఁ జనిరి పల్లెల కధిపా!

243

తా ॥ అయితే ఆ సమయాన ఆ పూతన దేహం నుండి వస్తూన్న సువాసనను గ్రహించిన గోపకులు కారణం అర్థం కాక, ఇటువంటి నీచురాలి దేహం నుండి ఇంత మంచి వాసన ఎలా కలిగింది? ఇది మిక్కిలి వింతగా ఉందే!... అనుకొంటూ తమ తమ పల్లెలకు వెళ్ళారు.

వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని వ్రేతల చేత రక్కసిచేఁత లన్నియు నెఱింగి వెఱంగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండెనని

చెప్పిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

244

తా ॥ అంత నందుడు కూడా ఎంత ప్రమాదం తప్పిందని సంతోషపడుతూ ఇంటికి వెళ్ళాడు. గోపికల ద్వారా ఆ రక్కసి చేసిన చేష్టలన్నీ విని ఆశ్చర్యపోయాడు. ఆ పసివాణ్ణి లేపి శిరస్సు నిమిరి ముద్దు పెట్టాడు."

ఈ విధంగా శుకమహర్షి చెప్పగా వింటున్న పరీక్షిన్మహారాజు, ఇలా అడిగాడు:

క. ఏ యే యవతారంబుల, నే యే కర్మములు సేసె నీశుఁడు హరి భ
ద్రాయతనము లన్నియు వినఁ, బాయదు చిత్తంబు సెవులపండువు లయ్యెన్.

245

తా ॥ "సర్వ జగన్నియామకుడైన హరి ఆ అవతారంలో ఏ యే పనులు చేశాడు? అవి అన్ని మేలును కలిగిస్తాయి. వినేకొలది మనస్సు ఆ విషయం మీద నుండి పోవటం లేదు. చెవులకు పండుగలా ఉంది.

క. ఉరుసంసారపయోనిధి, తరణంబులుఁ బాపపుంజతరణంబులు శ్రీ
కరణంబులు ముక్తి సమా, చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్.

246

తా ॥ బాలకృష్ణుని స్మరించుకొంటూ ఉంటే సంసార దుఃఖం తొలగిపోతుంది. పాపాలు పటాపంచలవుతాయి. సంసారసాగరాన్ని దాటించే నావ ఆ నామస్మరణం చేత లభ్యమవుతుంది. సకల సంపదలనే కాక ముక్తిని పొందాలన్నా అదే మార్గం.

వ. అని తరువాత బాలకృష్ణుండేమి సేసె నాయందుఁ గృప గలదేనిం జెప్పవే యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె.

తా ॥ ఆ తరువాత బాలకృష్ణుడు ఏంచేశాడు? దయతో నాకు ఆ విషయాలు చెప్పవలసింద" ని అడిగిన రాజుతో శుకమహర్షి ఇలా అన్నాడు:

## 7. బాలకృష్ణుడు శకటమును తన పాదముతో కూలదన్నుట

సీ. బాలకుం డొదిఁగిలఁ బడ నేర్చెనని జన్మ నక్షత్రమం దొకనాఁడు నందు

పొలఁతి వేడుక బోర్కుఁ బోయ వ్రేతలఁ జీరి వాదిత్రగీతారవంబు సెలఁగ

విప్రులతోఁ గూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి

వారిదీవన లొంది వారికి మొదవుల నన్నంబుఁ జీరల నడిగినట్టు

ఆ. లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపు సేర్చి, నిదురపుచ్చి గోపనివహమునకు

గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు, జనని కొడుకు మఱచె సంభ్రమమున.

248

తా ॥ “నందుని భార్య అయిన యశోద బాలుడు ఒత్తిగిలి బోర్లాపడుతున్నాడని వేడుకతో అతని పుట్టిన నక్షత్రం రోజున పొరుగున ఉన్న గోపికలను పేరంటానికి పిలిచింది. మంగళ వాద్యాలను మ్రోయిస్తుండగా, విప్రోత్తముల చేత వేద మంత్రాలతో అభిషేకం మొదలైనవి చేయించింది. వారి దీవెనలు పొందింది. ఆ బ్రాహ్మణులకు ఆవులు, ధాన్యం, వస్త్రాలు అడిగినవారికి అడిగినంత తృప్తిగా ఇచ్చింది. ఆపై చిన్ని కృష్ణుణ్ణి పానుపు మీద పడుకోపెట్టి నిదురపుచ్చింది. ఆ తరువాత గోపకుల సమూహాన్ని, గోపికలను చక్కగా ఆదరిస్తూ, ఏమరుపాటున ఆ సందడిలో యశోదాదేవి బాలకృష్ణుని విషయం మరచిపోయింది.

భగవంతుని గురించి ఏర్పాటు చేసిన సంబరాలలో ఆయనను విస్మరించడం అంటే ఇదే! జీవుల చపల చిత్తం ఇక్కడ చిత్రీకరించబడింది. పండుగ రోజులలో విందులు, వినోదాలలో కాలం వెళ్ళబుచ్చుతూ భగవంతుణ్ణి దూరం ఉంచకూడదని ఇక్కడ తెలుసుకోవాలి.

వ. ఆ సమయంబున.

249

క. నిదురించిన శిశు వాఁకొని, కిదుకుచుఁ జను గోరి కెరలి కిసలయ విలస
న్మృదుచక్రచాపరేఖా, స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్ దండిన్.

250

తా ॥ ఆ సమయంలో నిద్రపోయి లేచిన ఆ బాలునికి ఆకలివేసింది. తల్లికోసం వెతుకుతున్నాడు. కనపడనందున కోపంతో కాళ్ళను జాడించసాగాడు. ఒళ్ళు విరుచుకుంటూ, చక్రరేఖ చాపరేఖ ఇంకా ఇతరములైన శుభరేఖలుగల తన మృదువైన పాదంతో అచ్చటనున్న ఒకానొక బండిని ఒక్క తన్ను తన్నాడు.

క. శకటము హరి దన్నిన దివిఁ, బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలంబడె, నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్.

251

తా ॥ ఆ చిన్నారి తన్నే సరికి ఆ బండి ఒక్కసారిగా పైకెగిరి నేలమీదకు పడింది. దానితో దాని ఇరుసు, చక్రాలు ముక్కలు ముక్కలుగా అయిపోయాయి. దానిని చూసి గోపకులు ఆశ్చర్యపోయారు.

వ. అప్పుడందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బుసెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందు.

252

తా ॥ ఆ బండిలో ఉంచిన మధుర పదార్థాలు అన్నీ చెల్లాచెదురైనాయి. ఆ దృశ్యాన్ని చూసిన నందయశోదలు, గోపకులు, గోపికలు అంతా నివ్వెరపడి, చేస్తున్న పనులను ఆపి దిగ్భ్రాంతికి లోనైనారు. భయంతో వారి మనస్సులు బరువెక్కాయి.

క. మిన్నున కూరక యెగయదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ
చిన్ని కుమారుఁడు దేరే, విన్ననువున నెగసె దీనివిధ మెట్టిదియో.

253

వ. అని వితర్కించు సమయంబున.

254

తా ॥ 'ఈ బండి ఏ కారణం లేకుండా ఊరకే ఎలా ఎగురుతుంది? చిన్ని కుమారుడు తన్నడానికి సమర్థుడు కాడు. మరే ప్రయత్నం చేత ఈ బండి మీదికి ఎగిరింది? ఇది ఎలా సాధ్యం?' అని అనుకుంటూన్న సమయంలో...

క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ, గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే
మూలమున నెగయ దని య, బ్బాలుని కడ నాడుచుండి పలికిరి శిశువుల్.

255

తా ॥ అక్కడే ఉండి ఆడుకుంటున్న బాలురు కొందరు ఇలా అన్నారు – 'మేము చూసాము, ఈ పిల్లవాడు ఆకలితో ఏడుస్తూ కాలెత్తి తన్నగానే బండి అమాంతంగా గాలిలోకి లేచింది, ఇంతకన్నా మరేమీ జరుగలేదు'.

వ. ఇట్లు శిశువులు పలికిన పలుకు విని.

256

శా. బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం
గాలం దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీజడ్డుఁ బ
ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక యం
చాలాపించుచు వ్రేలువ్రేతలుఁ బ్రభూతాశ్చర్యులై రందఱున్.

257

తా ॥ ఆ పిల్లల మాటలు విని, 'ఈ బాలుడెంతటి వాడు? ఈ బండి ఎంతటిది? ఆకాశం మీదికి వికలమయ్యేటట్లుగా కాలితో పసివాడు తన్నడం ఏమిటి? ఆటలాడే చిన్నవాళ్ళు అబద్ధం చెబుతున్నారు. ఇంతటి తెలివిమాలిన మాటలను ఏ లోకంలోనైనా నమ్ముతారా! ఇది ఏ విధంగా కూలిందో' అని అక్కడి వారంతా ఆశ్చర్యపోయారు.

వ. అప్పు డా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి.

258

ఆ. అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న!, మంచియన్న! యేడ్పు మాను మన్న!
చన్ను గుడువు మన్న సంతసపడు మన్న, యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు.

259

తా ॥ అప్పుడా పిల్లవాని ఏడుపు విని యశోద పరుగెత్తుకుంటూ వచ్చింది. ఎత్తుకుంటూ, నా చిట్టి తండ్రి అలిసిపోయావా? ఆకలేస్తోందా? మంచివాడవు కదూ! ఏడవకమ్మా! పాలుత్రాగు! ఇదిగో, పాలు తాగి పకపకా నవ్వాలి! అంటూ పిల్లవానికి చన్నుకుడిపింది.

వ. అంత న బ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలివిధానంబులు సేసిరి. బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి. ఋగ్యజుస్సామమంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తి పుణ్యాహవాచనంబులు సదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం దలంకరించిన పాఁడి మొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె నని చెప్పి శుకుం డిట్లనియె.

260

తా ॥ ఆ పిమ్మట గోపకులందరు ఆ బిడ్డడికి బాలగ్రహం ఏదైనా సోకి ఉంటుందేమో అని అనుమానించారు. ఎవరికి తోచిన శాంతులు వారు చేసారు. బ్రాహ్మణులు పెరుగు, దర్భలు,

అక్షతలతో హోమాలు చేసి, ఋగ్వేద యజుర్వేద సామవేద మంత్రాలచేత అభిషేకాలు చేయించి, స్వస్తి పుణ్యాహ వాచనాలను జరిపించారు. పిమ్మట నందుడు ఆ చిన్నవానికి అభ్యుదయం కలగాలని అలంకరించిన పాడి ఆవులను విద్వాంసులకు దానం చేసి వారల ఆశీర్వాదాలు పరిగ్రహించి సంతోషించాడు."

ఈ విధంగా చెప్పి శుకయోగి ఇలా అన్నాడు:

## 8. రాక్షస తృణావర్తుడు సుడిగాలియై కృష్ణుణ్ణి ఎత్తుకొని పోవుట

క. కొడుకు నొకనాఁడు తొడపై, నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గడుదొడ్డ కొండ శిఖరము, వడువున వ్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా!

261

తా ॥ "ఓ రాజా! ఒకనాడు యశోద బాలకృష్ణుని తన తొడమీద పెట్టుకుని ముద్దాడి, సంతోషంతో ఒడలు నిమురుతూ ఉంది. అంతలోనే అతడు ఆమెకు గొప్ప కొండ శిఖరంలాగ ఆ శిశువు చాలా బరువుగా తోచాడు.

క. బరువైన కొడుకు మోవను, వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
ధరఁ గావఁబుట్టిన మహా, పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్.

262

తా ॥ అలా బరువెక్కిన కొడుకును మోయడం ఎలాగో తెలియక ఒడి నుండి నేలమీదకు దించింది. ఈ విచిత్రానికి భయపడుతూ, 'భూమిని కాపాడటానికి పుట్టిన మహాపురుషుడు కాబోలు ఈతడు' అని మనస్సులో అనుకున్నది.

వ. అప్పుడు.

263

క. ఖరుఁ డగు కంసునిపంపున, నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగా
సురకరువలి యై బిసబిస, నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్.

264

తా ॥ అంతలోనే తృణావర్తుడనే అసురుడు కంసుడు పంపగా అతి చోద్యంగా చల్లనిగాలి రూపంలో విచిత్ర ధ్వనితో అక్కడకు వచ్చాడు. ఇది చాలా వింతగా ఉందే, ఇటువంటి సుడిగాలి

ఇంతకు ముందెప్పుడూ వీచగా చూచి ఎరుగం అని అక్కడివారు అనుకొంటూ ఉండగానే ఆ గాలి క్రింద ఉన్న ఆ శిశువుని చుట్టుముడుతూ ఎగరేసుకు పోయింది.

క. సుడి యెఱుఁగని హరి సుడివడ, సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి గన్నుల, సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా!

265

తా ॥ ఎవరి వల్లా చలించబడటం ఎరుగని హరి ఆ గాలికి చలించినట్లుగా నటించాడు. ఆ సుడిగాలి రేపిన దుమారానికి దుమ్ము పైకెగసి గోపకుల కళ్ళను కమ్మివేసింది. దిక్కుతోచని వారు దానికి బెదిరిపోయారు.

తృణం అంటే గడ్డి, తృణావర్తుడంటే విషయానందాల పట్ల వాంఛలు కలిగించే సుడిగాలి. ఆ గాలి చుట్టుముడితే భగవంతుణ్ణి విస్మరిస్తాము. గోకులం అంతా ఆ ధూళితో నిండిపోయినందునే కళ్ళు తెరిచి చూడలేక పోయారు.

వ. మఱియు న వ్వలయపవన దనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరి మసరు గవిసి విసరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెరసి తరణికిరణములకు మఱుఁగువడిన నిబిడమగు బెడిదంపుఁ దిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులత నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబుగ భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు సెవుడు పడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువన భయంకరత్వంబు దోఁచె, నా సమయంబున.

266

తా ॥ తొలుత చల్లగా వీస్తూన్న తృణావర్తుడు, అటు పిమ్మట ప్రళయకాలంలో మహా వాయువు వలె వీచాడు. ఆ గాలికి ఎగసిన దుమ్ము, ధూళి ఆకాశం అంతా ఆవరించి

సూర్యరశ్మిని మరుగుపడిచింది. అందువల్ల చీకటి ముమ్మరంగా అంతటా కమ్ముకొంది. మందలోని జనులు ఒకరికి మరొకరు కానరాక బిడ్డలు ఏమైనారో, పాపలు ఏమైనారో అని కలత పడి నిశ్చేష్టులయి నిలబడగా రెండు గడియల కాలం లోకం అంతా భయంకరంగా తోచింది. ఆ సుడిగాలి వేగానికి, భయంకరధ్వనికి దిక్కులు దద్దరిల్లిపోయాయి.

ఉ. పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి 'యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిం
జేపడి పోయితే' యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం
దాపము నొంది నెవ్వగల దయ్యుచుఁ గ్రుయ్యుచు బిట్టుఁ గూయుచున్.

267

తా ॥ అట్టి ఆపద్దశయందు యశోదాదేవి తన కుమారుడైన బాలకృష్ణుణ్ణి గానక, 'నాయనా! బాల సూర్యునిలాగ ప్రకాశించే బాలక శ్రేష్ఠుడా! నేడు నువ్వు ఈ పాపపు గాలిలో చిక్కుపడి పోయావా! ఓ దైవమా! నన్ను నా బిడ్డను దూరం చేసావు!' అని దైవాన్ని దూషిస్తూ, మిక్కిలి పరితాపం చెందసాగింది. అధికమైన విచారం చేత, శోకంతోనూ, దిక్కుతోచని స్థితిలో కన్నీరు మున్నీరవసాగింది.

క. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల, కొడుకా! యే మంటి వనుచు ఘోరం బనుచున్.

268

తా ॥ 'సుడిగాలి వచ్చి నిన్ను చుట్టి ఎత్తుకొని ఎగరేసుకుపోతే, ఆ గాలిలో అలమటించి పోతూ ఎంత దుఃఖీస్తున్నావో కదా! నా ముద్దుల తండ్రీ! ఇదెంత ఘోరం రా!

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా
నెక్కడ నుండి వచ్చె శిశువెక్కడి మార్గము వట్టిపోయె నే

నెక్కడఁ జొత్తునంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూ స్థలి వ్రాలె దురంత చింతయై.

269

తా ॥ ఇప్పుడే కింద కూర్చోపెట్టాను. ఇప్పటి వరకూ ఇక్కడే ఆడుకొంటున్నాడు. ఎక్కడ నుండి వచ్చిందో గాలి? బిడ్డడిని ఎత్తుకొని పోయిందే! నా ముద్దుల పట్టి ఏమైపోయాడో గదా! ఇక నాకేమిటి గతి! నేనెక్కడికి పోవాలి!' అని ఈ విధంగా పరిపరివిధాలుగా యశోదాదేవి ఏడుస్తూ, దూడను ఎడబాసి అరుస్తూ నేలమీద వ్రాలి పోయిన గోవులాగా, అంతులేని దుఃఖంతో భూమిపై వ్రాలిపోయింది.

సుడిగాలి తగ్గగానే యశోదలో పరితాపం మొదలైనది. సత్యం తెలిసిరాగానే జీవుడు భగవంతునికై తప్పక విలపిస్తాడు. ఆ విలాపంలోనే భక్తి పెరుగుతుంది.

క. పాపనికై యిటు వొగిలెడి, యా పాపని తల్లిఁ జూచి యారటపడుచున్,
గోపాలసతులు బాష్పజ, లాపూరిత నయన లైరి యార్తిం బడుచున్.

270

తా ॥ ఆ విధంగా బిడ్డకోసమై దుఃఖీస్తున్న యశోదాదేవి దుఃఖాన్ని చూసి కలతనొందిన ఆ గోపస్త్రీలు కూడా కన్నులనిండా నీరు నిలవగా బాధపడసాగారు.

శా. ఆలోఁ జక్రసమీర దైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దాఁ గొనిపోయి పోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీలేమిం బరిశాంతవేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడనంచు నిట మీఁదెట్లంచుఁ జింతించుచున్.

271

తా ॥ ఈ లోపున సుడిగాలిలా వచ్చిన ఆ రాక్షసుడు మిక్కిలి గర్వంతో బాలకృష్ణుణ్ణి ఆకాశమార్గంలో బహుదూరం తీసుకొనిపోయాడు. ఆ తరువాత క్రమక్రమంగా ఆ బాలుడు బరువెక్కసాగాడు. ఆ భారం మోయడానికి శక్తి చాలక వడితగ్గిన తృణావర్తుడు 'ఇలాంటి బిడ్డను ఇంతకు ముందెప్పుడూ చూసి కూడా ఎరుగను. ఈ బరువును నేను మోయలేకుండా ఉన్నాను' అని దిక్కుతోచక కలవరపడసాగాడు.

భక్తి ఎప్పుడైతే పెరుగుతుందో వాంఛలు అంతకంతకూ శక్తి విహీనమవుతూ వస్తాయి. ఇదే పరాత్పరుడు చూపే లీలలోని అంతరార్థం.

వ. అటు దనుజుండు చింతించుచున్న సమయంబున.

272

క. బాలద్విరద కరంబులఁ, బోలెడి కరములను దనుజు బొండుగ బిగియం గీలించి వ్రేలఁ బడియెను, బాలకుఁ డొక కొండభంగి బరు వై యధిపా!

273

తా ॥ ఈ విధంగా చింతిస్తున్న ఆ తృణావర్తుడనే రాక్షసుని మెడను తన రెండు చేతులతో బిగించాడు. అది ఎలాగ ఉన్నదంటే, పిల్ల ఏనుగు తొండాల వంటి రెండు చేతులు ఆ మెడ చుట్టూ కొయ్యవలె బిగుసుకు పోగా, అంతకంతకూ బరువవుతున్న ఆ శిశువు కొండంత బరువవుతూ క్రిందకు వ్రేలాడసాగాడు.

క. మెడబిగియఁ బట్టుకొని డిగఁ, బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁజాలక వాఁ డురిఁ, బడి బెగడెడు ఖగముభంగి భయముం బొందెన్!

274

తా ॥ తన మెడను బిగువుగా పట్టుకుని వ్రేలాడుతూ కొండలా తోస్తూన్న కృష్ణున్ని

విడిపించుకోలేక వలలో చిక్కుకొని సంకటపడుతున్న పక్షివలె ఆ రాక్షసుడు గిలగిలలాడసాగాడు.

క. హరి కరతల పీడనమునఁ, బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై
సురవైరిభటుఁడు గూలెను, బురభంజను కోలఁ గూలు పురముంబోలెన్.

275

తా ॥ ఆ పసివాని చేతుల రాపిడికి తట్టుకోలేక, చివరికి శరీరం స్వాధీనం తప్పగా, ఆ రాక్షసుడు క్రింద ఉన్న రాళ్ళగుట్ట మీదకు పడిపోయాడు. శివుని పాశుపతాస్త్రంచేత నేలకూలిన త్రిపురాసురుని వలె, దేవతల శత్రువైన ఆ కంసుని అనుచరుడు నేలకూలాడు.

వ. అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదంబున విక్కవిరిసి రక్కసుని యురంబున మురువు గలిగి బరువులేక వ్రేలు బాలుం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చిరప్పుడు గోపగోపికాజనంబు లందఱుఁ దమలో నిట్లనిరి.

276

తా ॥ దానిని చూసిన గోపకాంతలు ఏడుపులు మానేసి పరుగున ముందుకు కదిలారు. ఆ రాక్షసుని రొమ్ముమీద మురిపంగా ఆడుకొంటున్న బాలుని ఎత్తుకున్నారు. దుఃఖీస్తున్న తల్లి అయిన యశోదకు అందిచ్చారు. చిత్రంగా ఆ సమయాన పసివాడు ఏమాత్రం బరువులేక తేలికగా ఉన్నాడు. గోపకులు గోపికలు ఎల్లవారు కూడ తమలో తాము ఇలా అనుకున్నారు:

క. రక్షణము లేక సాధుఁడు, రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడులందున్
రక్షణములు వెయి గలిగిన, శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్.

277

తా ॥ 'రక్షణ లేకపోయినా మంచివాడు, ఆపదలు కలిగిన సమయంలో రక్షించబడతాడు. అదే దుష్టుడైతే వేయి రక్షణలు ఉన్నా తన పాప సంకల్పముల వలన శిక్షకు గురి అవుతాడు.

మ. గతజన్మంబుల నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లే మేమి సే
సితిమో? యెవ్వరి కేమి వెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు వు
చ్చితిమో? సత్యము లేమి వల్కితిమొ? యే సిద్ధ ప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు సూడఁ గంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్.

278

తా ॥ గత జన్మలలో మనం ఏయే నోములు చేసామో? ఏ యాగాలు, యజ్ఞాలు, నోములు, వ్రతాలు చేశామో? ఎవరికి ఏం దానాలు చేశామో? ఏ సద్విషయాలను ఆసక్తిచేత మాట్లాడుకున్నామో? సత్యవాక్యములను ఏం పలికామో? సిద్ధపురుషులు నడయాడిన ప్రదేశాలను ఎన్ని దర్శించామో? వాటి ఫలితంగానే ఇప్పుడు ఇచ్చట నిర్భయుడైన ఈ బాలకృష్ణుడిని చూడగలుగుతున్నాము'.

వ. అని పలికి రంత నందుండు మున్న దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱఁ
గుపడుచుండె. మఱియును.

279

తా ॥ అని ఈ విధంగా గొల్లలందరు అనుకున్నారు. నందుడు మాత్రం తనకు వసుదేవుడు చెప్పిన మాటలు గుర్తుకు రాగా భయపడుచున్నాడు.

సీ. జననాథ! యొకనాఁడు చన్ను చేఁపినఁ దల్లి చిన్ని ముద్దుల కృష్ణుఁ జేరఁ దిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి చ న్నిచ్చి నెమ్మోము సక్క నివిరి
యల్లని నగవుతో నావులించిన బాలు వదనగహ్వరమున వారినిధులు
దిశలు భూమియు వనద్వీపశైలంబులు నేఱులు గాలియు నినుఁడు శశియు
ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు, నఖిలలోకములుఁ జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ, జూచి కన్నుమోడ్చి చోద్యపడియె.

తా ॥ ఒకనాడు యశోద ముద్దులకృష్ణున్ని చేరదీసుకుని ఒడిలో కూర్చుండ పెట్టుకుని ముద్దాడి పాలుతాగించి ప్రేమతో ముఖాన్ని నిమిరింది. ఇంతలో ఆ బాలుడు నవ్వుతూ నిద్రవస్తున్నట్లుగా ఆవులించాడు. అప్పుడా నోరు గుహద్వారంవలె తోచి అందు సముద్రాలు, దిక్కులు, నేల, అడవులు, దీవులు, కొండలు, నదులు, గాలి, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఆకాశం, నక్షత్రాలు, గ్రహాలు, లోకములు, తిరిగేవి తిరగనివి అయిన ప్రాణికోటి యొక్క కోటానుకోట్ల సమూహం కనిపించాయి. ఆమె కన్నులు అరమోడ్పులు కాగా నివ్వెరపోయింది.

సమస్త విశ్వమూ తనయందే ఉన్నది కానీ తాను విశ్వానికి పరిమితమైన వాడిని కాననే సత్యాన్ని తల్లికి చూపించాడు.

వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవ పురోహితుండైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలి యై.

281

తా ॥ ఆ పిమ్మట ఒకరోజున యాదవ పురోహితుడైన గర్గుడు వసుదేవుడు పంపగా వ్రేపల్లెకు వచ్చాడు. ఆయనను చూసి నందుడు లేచి నిల్చుని నమస్కారం చేశాడు.

క. కోరి భజించెను నందుఁడు, సారగుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి, దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్.

282

తా ॥ ఆయన మంచిగుణాలు, నడవడిక, సత్పురుష సాంగత్యం కలిగినవాడు. నిత్యము శివుణ్ణి ఆరాధిస్తూ మనస్సులో కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను లేనివాడు. దుర్జనులను దరిచేరనియ్యక వర్తించే ఆ గర్గ మహామునిని నందుడు అతిప్రీతితో సేవించాడు.

వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి యిట్లనియె.

283

క. ఊరక రారు మహాత్ములు, వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లం
గారణము మంగళములకు, నీరాక శుభంబు మాకు నిజము మహాత్మా!

284

తా ॥ తగిన సత్కారాలు చేసి ఆయనతో ఇట్లా అన్నాడు: "మహాత్ములైన మీబోటి వారు ఊరికే రారు. మావంటి వారింటికి వచ్చారంటే దానికి ఏదో కారణం ఉంటుంది. అది మాకు మేలు కలగచెయ్యటం కోసమే గాని వేరేమీ కాదు! కనుక మీ రాక మాకు నిజంగా శ్రేయోదాయకమే అవుతుంది.

శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి
ఖ్యాత స్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని
ర్ణీతుండైన గురుండు మానవులకు న్విప్రోత్తముండంద్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబు గావింపవే.

285

తా ॥ మీరు జ్యోతిష్కులందరిలోను శ్రేష్ఠులు. తేజోమూర్తులైన మీ ఖ్యాతి అన్ని దిక్కులలో నిండి ఉన్నది! బ్రహ్మజ్ఞాన సంపన్నుడవు! నా విన్నపాన్ని ఆలకించండి! వేద శాస్త్రాదుల చేత నిర్ణయింపబడిన గురువు మానవులకు బ్రాహ్మణుడే! మీరు ఈ కుమారులిద్దరికి వేదోక్త మంత్రాలచేత నామకరణం మొదలైన సంస్కారాలు చేయవలసినదిగా కోరుతున్నాను."

వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటువడి దివి కెగసిపోయిన తెఱవ సెప్పిన తెఱంగు దేట పఱిచి దేవకీదేవి కొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యంబని నందానుమతంబున

రోహిణీసుకుమారు నుద్దేశించి.

286

తా ॥ అని చెప్పి నందుడు రోహిణిదేవి కుమారున్ని, తన కుమారున్ని గర్గ మహర్షికి చూపాడు. కంసుని వ్రేటు నుండి తప్పించుకున్న యోగమాయ చెప్పిన మాటలను నందునికి తెలియచేసాడు గర్గుడు. దేవకీదేవి కొడుకు వేరొకచోట ఉన్నాడని కంసునికి తెలుసు, కనుక ఈ పసివాని సంస్కారాలు రహస్యంగా చేయడం అన్ని విధాలా మంచిదని గర్గుడు చెప్పగా నందుడు దానికి సమ్మతించాడు.

క. జనులు రమియింపఁ దిరిగెడి, యనువు కలిమి రాముఁడనియు యదు సంకర్షం
బున సంకర్షణుఁ డనియును, ఘనబలమున బలుఁడు ననియు గణుతించె నృపా!

287

తా ॥ అంతట గర్గ మహర్షి రోహిణీదేవి కుమారునికి నామకరణం ఈ విధంగా చేసాడు. జనులందరికీ ప్రీతిపాత్రంగా మెలిగేవాడు కనుక రాముడని, మహాబలవంతుడైనందున బలరామునిగా ప్రసిద్ధిని గాంచుతాడని తెలిపాడు. యాదవుల నుండి వ్రేపల్లెలోనికి సంకర్షణ చేయబడిన వాడు గావున సంకర్షణుడుగా కూడా పిలువబడతాడు.

వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణ పీతవర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుం డయ్యె, వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యె, నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటంజేసి నామంబు లనేకంబులు గలవు. ఈ శాబకుని వలన మీరు దుఃఖంబులఁ దరియింతు, రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబును నగు, నీ కుమారుండు నారాయణ సమానుండని చెప్పి తన గృహమ్మున క మ్మునీశ్వరుండు సనియె. నందుండును బరమానందంబున నుండె నంత.

తా ॥ పిమ్మట గర్గ మహాముని కృష్ణుని చూసి ఈ బిడ్డ ఇదివరలో తెలుపు, ఎరుపు, పసుపు వర్ణాల్లో ఉన్నా, ఇప్పుడు నల్లని వర్ణం కలవాడు కనుక కృష్ణుడు అని పిలవండి, వసుదేవునికి పుట్టాడు కనుక వాసుదేవుడు అయ్యాడు. ఈ పాపడికి గుణములు, రూపములు, కర్మలు అనేకంగా ఉన్నాయి కనుక నామధేయాలు కూడా అనేకంగా ఉంటాయి. ఈ బాలుని వలన మీ కష్టాలు తీరతాయి. ఈ బాలకుడు దుష్టశిక్షణం శిష్టరక్షణ చేస్తాడు. అతడు నారాయణ సమానుడని చెప్పి ఆ మునీశ్వరుడు తన గృహానికి వెళ్ళిపోయాడు. ఆ మునీశ్వరుడు తన కుమారుని గురించి మంచిమాటలు చెప్పినందుకు నందుడు చాలా ఆనందించాడు.

## 9. శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము

సీ. జానుభాగముల హస్తమ్ములు వీడ్వడ నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత
నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు రాల క్రేపుల తోఁక లలమి పట్టి
విడువ నేరక వాని వెనువెంట జరగుదు రప్పంకముల దుడు కదరఁ
జొత్తు రెత్తి చ న్నిచ్చుచో నిరుదెసం బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జేఁపుఁ గలుగ

తే. దూఁటుదురు గ్రుక్క గ్రుక్కకుఁ దోర మగుచు, నాడుదురు ముద్దు పలుకు లవ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రామకృష్ణులు శైశవరతులఁ దగిలి.

289

తా ॥ ఆ విధంగా నామకరణాన్ని పొందిన బలరామకృష్ణులిరువురు బాల్యక్రీడలు ఆరంభించారు. మోకాళ్ళకు చేతులను ఆనిస్తూ లేచి నిలబడబోతారు, అంతలోనే తూలి పడుతూ, మళ్ళీ లేచే ప్రయత్నం చేస్తారు. తమ తల్లుల పైటకొంగులను పట్టి లాగుతూ మారాము చేస్తారు. ఆవుదూడల తోక పుచ్చుకుని వాటివెంటే వెడుతూ బురద వచ్చినా వదలాలని తెలియక, ఆ బురదనంతా వంటికి అంటించుకుంటారు. ఇంతలోనే ఆకలి గుర్తుకు వచ్చి తల్లుల వద్దకు వచ్చి పాలు తాగుతారు. వచ్చీ రాని ముద్దుమాటలు పలుకుతూ ఉంటారు. నృత్యం తెలిసినట్లుగా కాళ్ళు చేతులను అందంగా కదుపుతూ ఉంటారు. ఈ విధంగా గోపకులంలో వారినందరినీ అలరించసాగారు.

క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడవాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

290

తా ॥ బలరామ కృష్ణులు ఆటలు ప్రారంభించగానే వారిని చూసి రంభాదులు ఆకాశంలో నృత్యం చేశారు. వీరి ఆటలకు శత్రువులైన కంసాదులు తెలియని భయం కలిగి కన్నులు గానక

తిరుగసాగారు. తపస్సు చేసుకొనే ఋషులందరూ సంతోషంతో ఇక మనకు మేలు కలుగుతుందని రహస్యంగా ముచ్చటలాడుకోసాగారు.

సీ. తల లెత్తి మెల్లన తడవి యాడెడు వేళఁ బన్నగాధీశుల పగిదిఁ దాల్తు.
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల నేనుఁగు గున్నల యెత్తు వత్తు,
రసమంబులైన జవాతి రేకమ్ముల సింగపుఁగొదమల సిరి వహింతు
రాననంబులఁ గాంతు లంతకంతకు నెక్కు బాలార్క చంద్రులపగిదిఁ దోఁతు,

తే. రెలమిఁ దల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి, పరమయోగోద్భవామృత పానలీల
సోలి యెఱుఁగని యోగుల సొంపు గందు, రా కుమారులు జనమనోహరు లగుచు.

291

తా ॥ ఈ విధంగా ఆ బాలకులు ఆడుతున్నారు. వారు నేలపైన పాకుతూ తలఎత్తి చూస్తే ఆదిశేషుడు పడగెత్తినట్లు కనిపిస్తారు. మట్టిని వంటికి అలదుకున్నప్పుడు గున్న ఏనుగులవలె తోస్తారు. ఎగిరి దూకుతుంటే సింహపు పిల్లల వలె అనిపిస్తారు. దిన దిన ప్రవర్ధమానులగుచూ ఉదయకాలపు సూర్యునివలె, నిండు జాబిలిలోని చందమామ వలె గోచరిస్తారు. పాలను తాగి పరవశంతో అరమోద్పు కన్నులతో ఉన్నప్పుడు అమృతత్త్వపు రుచి చూసిన యోగీశ్వరుల వలె అనిపిస్తారు. వారు ఏమి చేసినా ఇంకా చూడాలనే తన్మయ భావం చూసేవారిలో కలుగసాగింది.

క. చూడనివారల నెప్పుడుఁ, జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చిన బాలక, చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్.

292

తా ॥ భక్తితో తనను చూడని జనులను శ్రీహరి ఎప్పుడూ చూడడు. ఆయన కన్నెత్తి చూసినంత మాత్రమున లోకాలన్ని పుట్టుతూ గిట్టుతూ ఉంటాయి. అటువంటి సర్వశక్తిమంతుడైన శ్రీహరి గోపాల బాలుని రూపంలో చుట్టూ ఉన్నవారిని పరికించి చూస్తూ

గుర్తుపట్టడం నేర్చుకుంటున్నానని తెలియజేసే విధంగా నటిస్తున్నాడు.

క. నగవుల నవిద్యపోఁడిమి, నగుబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన, నగుమొగముల సతులఁ జూచి నగనేర్చె నృపా!

293

తా ॥ ఓ రాజా! ఆ పురుషోత్తముడు చిరునవ్వు నవ్వితే దట్టమైన అజ్ఞానం కూడా నవ్వుల పాలై, జ్ఞానం కలిగేలా చేస్తుంది. అటువంటి విష్ణువు అపురూప బాలకుడై, తనను చూసి నవ్వే గోపికలను చూస్తూ తాను నవ్వడం నేర్చుకుంటున్నాడు.

క. అవ్వల నెఱుఁగక ముమ్వురి, కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ, నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్.

294

తా ॥ జన్మలేని వాడగుట చేత తల్లులు లేనివాడై, త్రిమూర్తులకు అతీతంగా ప్రకాశించే సర్వోత్కృష్టుడైన పరమేశ్వరుడు, పసిబిడ్డడై తల్లులకు సంతోషం కలిగేటట్లు అమ్మా అని పిలవటం మెల్లగా నేర్చుకొన్నాడు.

క. అడుగులు వే గలిగియు రెం, డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు, లడుగులు నడుగులును వదలి యడుగవనిఁ బడన్.

295

తా ॥ సహస్రపాదునిగా వేయి అడుగులను కలిగినవానిగా కీర్తించబడిన ఆ శ్రీహరి, వామనావతారంలో రెండడుగులలో భూమ్యాకాశాలను కొలిచినవాడైన ఆ విష్ణువు, ఇప్పుడు బాలకృష్ణుని రూపంలో బుడిబుడి అడుగులు వేయడం నేర్చుకుంటున్నాడు. ఆయన తప్పటడుగులు శత్రువులు అడుగంటే విధంగా ఉన్నాయి.

వ. మఱియును.

296

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతి పూఁత గాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీల రత్నంబు కమనీయ మగు మెడకప్పుగాఁగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు.

297

తా ॥ ఆటల సమయమందు బాలకృష్ణమూర్తి పరమశివునివలె కనిపించేవాడు. ఆటల సందర్భములో వాని శరీరానికి అంటిన దుమ్ము విభూతి పూతవలె కనపడేది. ముత్యాలపేరుతో ఉంగరాల జుట్టును పైకి ముడిచి ముడివేసింది తల్లి యశోద. అది శివుని శిరస్సుపైవున్న చంద్రరేఖవలె కనపడుతున్నది. కృష్ణయ్య నుదుట దిద్దిన ఎర్రని తిలకం మన్మథుని గెలిచిన శివుని మూడవ కన్నులాగ ఉన్నది. కంఠమందున్న హారముల మధ్య భాగమందున్న పెద్దనీలపు మణి శివుని కంఠమందున్న నల్లని హాలాహలపు మచ్చవలె కనపడుతున్నది. మెడయందున్న ముత్యాల హారములు శివుని శరీరమును అలంకరించిన సర్పములవలె ఉన్నవి. శ్రీమహావిష్ణువు బాలకృష్ణుని అవతారములో ఈ లీలలు చూపించాడు. తనకు, శివునికి ఎలాంటి భేదము లేదన్నట్లు ప్రకటిస్తూ బాలకృష్ణుడు శివునివలె దర్శనమిచ్చాడు.

క. ఆపాపల విహరణములు, తీపులు వుట్టింప మరఁగి తేఁకువ లే కా
గోపాలసతులు మక్కువ, నే పనులును మఱచి యుండి రీక్షణపరలై.

298

తా ॥ బలరామకృష్ణుల బాల్యక్రీడలు గోపికలకు తన్మయత్వాన్ని కలిగిస్తునందున వారు ఆ మాధుర్యమునకు వశులై అన్ని పనులను మరచిపోయి వారినే తదేకంగా చూస్తూ ఉండిపోయేవారు.

వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోరుగోఱ కొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహన కంటకాదుల యెడ మోసపోక, బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబులైన ప్రేమంబు లభిరామంబులు గా విహరించు చుండి రంత.

299

తా ॥ పసివారైన బలరామకృష్ణులు ఎక్కడ గోళ్ళు, కోరలు, కొమ్ములుగల జంతువులతో తిరుగుతారో అని అనుక్షణం ఆ తల్లులు కాపలాకాస్తూ ఉండేవారు. ఆ పసివారికి అవి ఎక్కడ ఆపద కలిగిస్తాయో అని అప్రమత్తంగా ఉండసాగారు. అంతేకాక నీరు, నిప్పు, ముళ్ళు వంటి వాటి జోలికి పోనివ్వక జాగ్రత్తలు తీసుకుంటూ, సదా ఆ పిల్లల క్షేమాన్ని కాంక్షిస్తూ, వారిని వీక్షిస్తూ ఆనంద తరంగాలలో ఓలలాడేవారు.

క. తనయీడు గోపబాలురు, దనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం
దను గమనంబులఁ గృష్ణుఁడు, తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి మెఱసెన్.

300

తా ॥ బాలకృష్ణుడు బలరామునితో కలిసి తప్పటడుగులతో తన ఈడు గోపబాలురతో మెల్లగా ఆటలు ఆడనారంభించాడు. ఆ పిల్లలంతా చిన్నికృష్ణుణ్ణి నాయకునివలె భక్తిగా చూసేవారు. ఆతని శరీరపు నీలవర్ణశోభను చూసి ఆ గోపికలు మురిసేవారు.

వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ దక్షుండై.

301

తా ॥ ఇంతే కాకుండా ఆ బాలకృష్ణుడు నానాటికి చక్కగా నడవటం, మాట్లాడటంలో సమర్థుడైనాడు.

ఉ. చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన నల్గిపోవఁగా
నప్పుడు బార సాఁచి తనయర్మిలి విందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నెప్పటి వచ్చి చ న్గుడుచు నిం పొలయన్ మొలగంట మ్రోయఁగన్

302

తా ॥ ఇప్పుడు కృష్ణునికి అలకలు కూడా మొదలైనాయి. తల్లి తనను అల్లరి చేయవద్దని బెదిరిస్తే, వెంటనే అలకను అభినయిస్తూ దూరంగా వెళ్ళిపోతాడు. ఆ సమయాన కనబరిచిన అందాన్ని మురిపెంగా చూస్తూ ఆ తల్లి రమ్మని చేరబిలిస్తే వెంటనే పరుగున వచ్చి అల్లుకుపోతాడు. ఆ పరుగుకి మొలత్రాటికి కట్టిన మువ్వలు ఘల్లు ఘల్లుమనే వింత సవ్వడి చేస్తూంటే గారాలు పోతూ తల్లిని చేరి పాలు తాగుతాడు.

క. వల్లవగృహ నవనీతము, లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిం
దల్లిఁ గదిసి చి ట్టాడుచు, నల్లన చను బువ్వఁ బెట్టు మవ్వా! యనుచున్.

303

తా ॥ గోపికల ఇండ్లలో వెన్నంతా తిని తన ఇంటికి వచ్చి ఏమీ తెలియని వానిలా తల్లి దగ్గరకు చేరి ఇటు అటు తిరుగుతూ అమ్మా! బువ్వపెట్టుమని అడుగుతాడు.

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు :

304

సీ. “గోవల్లభుఁడ నేను, గోవులు మీ’ రని వడి ఱంకె వైచుచు వంగి యాడు,

'రాజ నే, భటులు మీరలు, రండు రం' దని ప్రాభవంబునఁ బెక్కుపనులు వనుచు,
'నేఁ దస్కరుండ, మీ రింటివా' రని నిద్ర పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు,
'నే సూత్రధారి! మీ రందఱు బహురూపు' లని చెలంగుచు నాట లాడఁ బెట్టు,

తే. మూల లుఱుకును, డాఁగిలి మూఁతలాడు, నుయ్యెలల నూఁగుఁ జేబంతు లొనరవైచు,
జారచోరుల జాడలఁ జాల నిగుడు, శౌరి బాలురతో నాడు సమయమందు.

305

తా ॥ మరియు కృష్ణుడు గోపకుమారులతో కలిసి రకరకాల ఆటలు ఆడసాగాడు. తన ఈడు బాలకులతో కూడి ఆడుకునేటప్పుడు, మీరు ఆవులు, నేను ఆబోతును అని రంకెలువేస్తూ పరుగుపెడతాడు. నేను రాజును, మీరు భటులు, నేను చెప్పిన పనులు చెయ్యాలి అంటూ వారికి పనులు చెప్పేవాడు. నేను దొంగను, మీరు ఇంటి వారు, మీరు ఇప్పుడు నిద్రపోవాలి అని చెప్పి వాళ్ళు కళ్ళు మూసుకోగానే, వాళ్ళ సొమ్ములన్నీ తీసుకొనిపోయి దాక్కుంటాడు. నేను సూత్రధారిని, మీరందరు వేషధారులు అని నానావిధాలుగా ఆడిస్తాడు. సందు గొందులలో దాగి దాగుడు మూతలాట ఆడతాడు. ఉయ్యాలలు ఊగుతాడు. బంతులాట ఆడుతాడు. జారులవలె దొంగలవలె వేషాలు వేసుకొని వివిధ చేష్టల మురిపిస్తూ, రకరకాల క్రీడా విన్యాసాలను ప్రదర్శిస్తాడు.

వ. మఱియు నా కుమారశేఖరుండు గపట శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి.

306

తా ॥ కొడుకులలో పరమోత్తముడైన ఆ కృష్ణుడు బాల్యదశను నటిస్తూ, లీలలు చేస్తూ ఉంటే, ఆ అల్లరి చేష్టలు అంతుపట్టలేని విధంగా ఉండేవి. దొంగవలె అల్లరి పెడుతున్న ఆ చిన్నకృష్ణుని ఆగడాలకు గోపకాంతల సహనం నశించిపోగా, వారంతా యశోదవద్దకు వచ్చి ఇలా చెప్పనారంభించారు:

## 10. గోపికలు శ్రీకృష్ణుని దుడుకు చేతలను యశోదాదేవితో చెప్పుట

క. బాలురకుఁ బాలు లే వని, బాలెంతలు మొఱలు వెట్టఁ బకబక నగి యీ
బాలుం డాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ!

307

తా ॥ "అమ్మా! యశోదా! మా ఇళ్ళల్లో బాలింతలు తమ బిడ్డలకు పాలు చాలటం లేదని మొరపెడుతుంటే, నీ కొడుకు నవ్వుతూ, పరిహాసం చేస్తూ ఆవుల వద్దకు దూడలను వదిలేస్తున్నాడు.

క. పడఁతీ! నీ బిడ్డఁడు మా, కడవలలో నున్న మంచి కాఁగిన పా లా
పడుచులకుఁ బోసి చిక్కిన, కడవలఁ బో నడిచె నాజ్ఞ గలదో లేదో?

308

తా ॥ ఓయమ్మా! నీ కొడుకు మా ఇంటికి వచ్చి కడవలలో ఉన్న మంచి కాగిన పాలు తన తోటి పిల్లలకు పోసి త్రాగించి, అంతటితో ఆగక మిగిలిన పాల కడవలను పగలకొట్టాడు. అసలా కుర్రాడికి అదుపూ ఆజ్ఞ అంటూ ఏమైనా ఉందా? లేదా?

క. మీ పాపఁడు మా గృహముల, నా పోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నం
గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ!

309

తా ॥ తల్లీ! మా ఇళ్ళల్లో పాలు త్రాగడానికి కనిపించకపోతే కోపంతో పసిబిడ్డలను కాళ్ళతో త్రొక్కి చిమ్ముకొంటూ వచ్చాడు. చిన్న పిల్లలు వాళ్ళు గుక్కపెట్టి ఏడుస్తున్నారు.

మత్త.పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మాయిలు సొచ్చి తా

నుట్టి యందక ఱోళ్ళుఁ బీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చే
వెట్టఁ జాలక కుండక్రిం దొక పెద్ద తూఁటొనరించి మీ
పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ!

310

తా ॥ యశోదమ్మా! నీ కొడుకులాంటి బిడ్డడు ఇంకెవరికీ పుట్టడు! ఈ చిన్నివయస్సులోనే దొంగతనాలు ఆరంభించాడు. ఈ రోజున దొంగతనం చెయ్యటం కోసం మా ఇంట్లో ప్రవేశించాడు. ఉట్టి అందలేదు వాడికి. ఒక రోలు దానిమీద కొన్ని పీటలు దొంతిగా పెట్టి దాని మీదకు ఎక్కాడు. అప్పటికీ కడవలోని పాలు అందలేదు వాడికి! ఆ కడవక్రింద పెద్దదిగా కన్నంపెట్టి అందులోంచి కారే మీగడపాలు దోసిలితో పట్టుకొని త్రాగాడు. ఇంత చిన్న పొట్టలో అలాంటి పిల్లాడిని ఎలా మోసి కన్నావమ్మా!

క. ఆడం జని వీరల పెరుఁ, గోడక నీ సుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలి మూఁతిం జరిమినఁ, గోడలు ముచ్చనుచు నత్త గొట్టె లతాంగీ!

311

తా ॥ అమ్మా! నీ కొడుకు ఆడుకోవడానికి వెళ్ళినట్లుగా వెళ్ళి, భయంలేకుండా ఇదిగో వీళ్ళింట్లోనే పెరుగు త్రాగేసి, ఒక్క పిసరు ఆ కోడలు మూతికి రాసి వెళ్ళాడు. ఆ కోడలే పెరుగు త్రాగేస్తూన్నదని అత్తగారు కోడలిని కొట్టింది.

క. వా రిల్లు సొచ్చి కడవలఁ, దోరంబగు నెయ్యి ద్రావి తుది నా కడవల్
వీరింట నీ సుతుం డిడ, వారికి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ!

312

తా ॥ చూడమ్మా! వాళ్ళింట్లో ప్రవేశించి కుండలలో నిండుగా ఉన్న నేతిని త్రాగి చివరికి ఆ కడవలు తెచ్చి వీళ్ళంట్లో పెట్టాడు. అప్పుడు వాళ్ళకీ వీళ్ళకీ ఎంత పోట్లాట అయ్యిందో తెలుసా?

ఇలాంటి తగవులు తెస్తున్నాడు.

క. వేలుపులటె! నా కంటెను, వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో, హేలావతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్.

313

తా ॥ అమ్మా! దేవతా ప్రతిమల బొమ్మలు వేసిఉన్న గోడనుచూసి నాకంటే దేవుడు ఇంకొకడు ఎక్కడున్నాడు అంటూ పకపక నవ్వి ఆ గోడను ఎంగిలి చేశాడు. ఇదిగో యశోదమ్మా! బాగానే నవ్వుతున్నావు కానీ, ఇంకొకటి విను.

క. వెన్నఁ దినఁగఁ బొడగని మా, పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియం
జ న్నొడిసి పట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు? శీతాంశుముఖీ!

314

తా ॥ మా ఇంటికి వచ్చి వెన్నను దొంగిలించి తింటూంటే మా చిన్నది మెల్లగా వెళ్ళి వాడిని పట్టుకొంది. అప్పుడు వాడు చేసిన పని ఏమిటో తెలుసా? చన్నొడిసి పట్టి గీరేసి పారిపోయాడు. ముఖం ఇంత చేసి చూస్తున్నావు కానీ ఇవి పసివాడి చేష్టలేనా, చెప్పు!

క. ఇమ్మగువ దన్ను వాకిటఁ, గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె, నమ్మా! యీ ముద్దుఁ గుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా.

315

తా ॥ అమ్మా! ఈ ఇల్లాలు తన ఇంటి వాకిట్లో తిరుగుతూ వాడిని పిలిచి, నీపేరేమిటి బాబూ అని అడిగితే, వాడు చేసిన పని ఏమిటో తెలుసా? దాని పెదవిని కరచి పరుగెత్తిపోయాడు. చూడమ్మా! నీ ముద్దుల కుర్రాడు పసివాడంటే ఎలా నమ్మేది?

క. చేబంతి దప్పి పడెనని, ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్

మాబిడ్డ జలక మాడఁగ, నీ బిడ్డఁడు వలువ దెచ్చె నెలఁతుక తగునే?

316

తా ॥ తన చేతి బంతి ఎగిరి మా ఇంట్లో పడిందని యోగ్యుడులాగా మా పెరట్లోకి వచ్చాడు. అప్పుడు మా చిన్నది ఇంటివెనుక స్నానం చేస్తూ ఉంది. మీ సుపుత్రుడు మా అమ్మాయి చీర కాస్తా తీసుకుపోయాడు. ఇది ఏమైనా బాగుందా?

క. ఇచ్చెలువఁ జూచి 'ముచ్చిలి, యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద, నాతో
వచ్చెదవా? యని' యన్నాఁ, డిచ్చిఋతఁడు, సుదతి! చిత్ర మిట్టిది గలదే?

317

తా ॥ ఓ యశోదమ్మ తల్లీ! ఈ చెలువను చూసి మీ కుర్రవాడు "నిన్ను దొంగతనంగా తీసుకు పోతాను. నాతో కూడ వచ్చేస్తావా?" అని అడిగాడట! ఇటువంటి వింత ఎక్కడైనా ఉంటుందా?

క. కొడుకులు లే రని యొక సతి, గడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గై కొనినం
గొడుకులు గలిగెద రని పైఁ, బడినాఁ డిది వినుము శిశువుపనులే తల్లీ!

318

తా ॥ ఓయమ్మా! ఈ మాట విను! కొడుకులు లేరని ఒకావిడ బాధ పడుతూంటే "నన్ను మగనిగా చేసుకుంటే నీకు కొడుకులు కలుగుతారు" అంటూ మీదకు వచ్చాడు. ఇటువంటివి పసి బిడ్డలు చేసే పనులేనా?

క. తలఁగినదానం దల మనఁ, దలఁగక యా చెలికి నాన తల యెత్తఁగ నీ
తలఁగినచో టెయ్యది? యని, తలయూఁచెన్ నీ సుతుండు దగవె మృగాక్షీ!

319

తా ॥ యశోదమ్మా! మా వాడలో ఒక యువతి నన్ను తాకరాదు, దూరంగా పో! అనగా తాను తొలగిపోక ఆ చెలికి సిగ్గు కలిగేటట్లు తాకరానిది ఎక్కడ? అంటూ నీ కొడుకు తల ఆడించాడు. ఇది బాగుందా?

క. వ్రాలఁగ వచ్చిన నీ సతి, చూలాలం దలఁగు మనుడుఁ జూ లగుటకు నే
మూలంబు సెప్పుమనె నీ, బాలుఁడు, సెప్పుదురె సతులు పర్వేందుముఖీ!

320

తా ॥ ఓ యశోదమ్మా! నీ కుమారుడు ఈ ఇల్లాలిపై పడబోగా నేను గర్భవతిని, దూరంగా ఉండమని చెప్పినందుకు నీకు చూలు ఎలా కలిగింది చెప్పమని అడిగాడు. ఎవరైనా దానికి కారణం ఇది అని చెప్తారా?

క. మగువా! నీ కొమరుఁడు మా, మగవా రటు వోవఁ జూచి మంతనమునకుం
దగఁ జీరి పొందు నడిగెను, జగముల ము న్నిట్టి శిశువు సదువంబడెనే?

321

తా ॥ నీ కొడుకు మా ఇంటి మగవారు బయటకు పోగా చూసి మా ఇంటికి వచ్చి రహస్యం చెప్తానని పిలిచి నన్ను కలయవచ్చెదవా అని అడిగాడు. మునుపు ఎప్పుడైనా ఇలాంటి శిశువు ఉన్నాడని విన్నామా?

ఆ. నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు మా, లేఁగతోఁకతోడ లీలఁ గట్టి
వీథులందుఁ దోలె వెలఁది నీ కొమరుండు, రాచబిడ్డఁ డైన ఱవ్వ మేలె?

322

తా ॥ ఓ యశోదా! నా బిడ్డ హాయిగా నిద్రిస్తోంటే, నా బిడ్డ జుట్టును మా లేగదూడ తోకతో వినోదంగా కట్టి వీథుల్లోనికి నీ కుమారుడు ఆ లేగను తోలాడు. ఎంత రాచబిడ్డడైతే

మాత్రం ఇంత అల్లరి తగునా?

క. నాపట్టిపొట్ట నిండఁగఁ, బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ,
డూపిరి వెడలదు, వానిం, జూపెద నేమైన నీవ చుమ్ము లతాంగీ!

323

తా ॥ నా కొడుకు పొట్ట నిండుగా బానెడు వెన్న పెట్టాడు మీవాడు. వాడికి ఇప్పుడు ఊపిరి ఆడటంలేదు. వాణ్ణి ఇప్పుడు నీకు చూపిస్తాను. వాడికేమైనా అయితే నువ్వే కర్తవు సుమా!

క. తెఱవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం
గఱపించి నీ కుమారుఁడు, వెఱచుచు నది పఱవ నగియె విహితమె సాధ్వీ?

324

తా ॥ అమ్మా! నీ కొడుకు ఒకావిడ నిద్రపోతూంటే విషపూరితమైన తేలును కరిపించగా ఆ అమ్మాయి భయంతో, బాధతో, కేకలు పెడుతుంటే పకపకా నవ్వాడు. ఇదేమైనా బాగుందా తల్లీ!

క. నా కొడుకును నా కోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వై వం
గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడెన్ నీసుతుండు గుణమె గుణాఢ్యా!

325

తా ॥ ఓ యశోదమ్మా! ఏకాంతంలో ఉన్న నా కొడుకు, కోడలు మీద ఒక పామును తెచ్చివేశాడు నీ కొడుకు. దానిని చూసి బెదరి వారు వీడిన కోకలుసైతం కట్టుకోకుండా పరుగెత్తగా, కేకలు పెడుతున్నాడు మీవాడు. ఇది మంచి లక్షణమేనా చెప్పు తల్లీ!

ఆ. తరుణి యొకతె పెరుఁగు ఁద్రచ్చుచోఁ దుది వంగి, వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి
మగువఁ నీ సుతుండు మగపోఁడుములు సేయ, సాగినాఁడు తగదె? చక్కఁజేయ.

326

తా ॥ అమ్మా! ఒక గోపిక పెరుగు చిలికి వెన్నతీస్తూ వంగి ఉండగా వెనుకతట్టుగా చేరి కూడని పనులు చేయసాగాడు. ఇట్టి పనులు చెయ్యకుండా వాడిని చక్కదిద్ద రాదా?

సీ. కలకంఠి! మావాడ గరితల మెల్ల నీపట్టి రాఁగలఁడని పాలు పెరుఁగు
లిండ్ల లోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ జూచుచో నెప్పుడు సొచ్చినాఁడొ?
తలుపుల ముద్రలుఁ దాళంబులును బెట్టి యున్నచందంబున నున్న వరయ
నొక యింటిలో నాడు నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నవ్వు, నొకటఁ దిట్టు,

ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ, పక్షిఘోషణములు పరఁగఁ జేయు
నిట్లుసేసి వెనుక నెక్కడఁ బోవునో?, కాన రాఁడు రిత్తకడవ లుండు.

327

తా ॥ ఓ యశోదమ్మా! మీ పిల్లవాడు వస్తాడనే మా వీధిలో ఉన్న ఆడవాళ్ళందరము గుమిగూడి ఇళ్ళకు తాళాలు వేసి వాకిళ్ళలో కనిపెట్టి ఉన్నాము. మాకెవరికీ కనుపించకుండా, ఏ సమయంలో వచ్చాడో తలుపుల తాళాలు వేసినవి వేసినట్టే ఉన్నాయి. నీ కొడుకు ఒక ఇంటిలో పాటలు పాడుతున్నాడు, ఒక ఇంటిలో ఆడుతున్నాడు. ఒక ఇంటిలో పకపక నవ్వుతున్నాడు, ఒకచోట తిడుతున్నాడు. ఇంకొక చోట వెక్కిరిస్తున్నాడు. మరో ఇంట్లోనుంచి జంతువులు అరుపులూ, పక్షుల కూతలూ కూస్తూ ఉన్నాడు. ఇలాచేసి చేసి ఆ పిమ్మట ఎక్కడనుండి వెళ్ళిపోతాడో కనబడడు. తలుపులు తీసి చూస్తే కడవలలో పాలు పెరుగు అయిపోయి ఖాళీ కడవలు మాత్రం ఉంటాయి.

క. కడు లచ్చి గలిగె నేనిం, గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ, విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ!

328

తా ॥ యశోదమ్మా! సంపద అధికంగా ఉంటే కడుపునిండా తినవచ్చు, ఒంటినిండా కట్టుకోవచ్చు, నగలు పెట్టుకోవచ్చు. అంతేకానీ తమ కొడుకులను ఇలా పేదవారి ఇళ్ళమీదికి పంపి నవ్వుతూ చూస్తారా?

క. ఓ యమ్మ! నీ కుమారుఁడు, మాయిండ్లను బాలుఁబెరుఁగు మననీఁ డమ్మా!
పోయెద మెక్కడి కైనను, మా యాన్నల సురభులాన మంజులవాణీ!

329

తా ॥ ఓ యశోదా! నీ కొడుకు మా ఇళ్ళలో పాలుగాని, పెరుగుగాని ఉండనీయటం లేదు. మా అన్నగారైన నందప్రభువుగారి ఆవుల సాక్షిగా మేం ఎక్కడికైనా పోతాము, కానీ ఇక్కడే ఉంటూ మనలేము. మాకు వేరేదారి తోచడం లేదు."

వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె.

330

తా ॥ అని ఈ విధంగా అనేక విధాల బాలకృష్ణుడు చేసే వేడుకలు తమకు చేసే మహాప్రసాదాలని తెలుసుకోలేక, అభియోగాలను మోపుతున్న గోపికలతో యశోదా దేవి ఇలా అంది:

క. చన్ను విడిచి చనఁ డిట్టటు, నెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ లెఱుఁగడు నేఁడుం
గన్నులు దెఱవని మా యీ, చిన్న కుమారకుని రవ్వసేయం దగునే?

331

తా ॥ "ఓ గోపికలారా! ఎక్కడికీ వెళ్ళకుండా నా వద్దనే కూర్చుని పాలు తాగుతూ ఉంటాడు మా కన్నయ్య! నన్ను విడిచిపోనే పోడు. పొరుగిండ్లకు పోయే మార్గమైనా ఎరుగడే!

ఇలాంటి పసిబిడ్డని పట్టుకుని అల్లరి చేయటం మీకు తగునా! ఇది ఏమైనా బాగుందా?

తే. అన్య మెఱుఁగఁడు, తనయంత నాడుచుండు, మంచివాఁడీతఁ, డెగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభి రామలార, తల్లులార, గుణవతీమతల్లులార!
332

తా ॥ మా బిడ్డడికి ఏమీ తెలియదు. ఏదో తనలో తాను ఆడుకొంటూ ఉంటాడు. మావాడెంతో మంచి వాడమ్మా! మీరంతా సద్గుణవతులు, నా బిడ్డపైన నిందలు మోపకండి! మిమ్మల్ని వేడుకుంటాను."

వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి గొడుకుం గోపింపంజాలక యుండె నిట్లు.
333

తా ॥ అని ఈ విధంగా యశోదాదేవి ఆ గోపికలను సమాధానపరచి పంపించిందే కాని కొడుకును మాత్రం మందలించలేక పోయింది.

శ్రీకృష్ణుని రమణీయ చేష్టలన్నీ ఆధ్యాత్మిక భావగర్భితాలు. వేదాంత రహస్యాలను తన క్రీడారూపంగా చూపించాడు. మానసాలను హరించేవాడైన ఆ నల్లనయ్య నవనీతచోరునిగా ప్రసిద్ధిని పొందాడు. నవనీతము శబ్దానికి అర్థం నవ అంటే కొత్తగా, నీతము అంటే తీసుకురాబడినది. కొత్తగా తీసుకురాబడిన కర్మల ఫలాన్ని ఎప్పటికప్పుడు హరించివేయడమే ఈ నవనీతచోరత్వానికి అర్థం. ఎప్పుడైతే వాసనలు అన్నీ హరించివేయబడతాయో అప్పుడే మనోబుద్ధులు తత్త్వవిచారణకు సిద్ధమవుతాయి. కర్మఫలాలను హరించి తన దివ్యప్రేమతో అలరించడమే ఈ లీలలోని అంతరార్థం. ఆ దివ్యప్రేమలో మునిగి ఉన్నందునే, ఆ బాలుని చూపులకు వశమై శిక్షించలేకపోయింది యశోదమ్మ.

## 11. మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాది అభివర్ణనము

ఉ. కాంతలు దల్లితోఁ దనవికారము లెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునం బరమసాధుని పెంపున గోలమాడ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లిక్కుచవేదికపైఁ దల మోపి యాడుచున్.

334

తా ॥ ఈ విధంగా గోపికలందరు తను చేసే చేష్టలను తల్లితో చెప్పి మొరపెట్టుతూ ఉంటే బాలకృష్ణుడు భయపడ్డాడు. మిక్కిలి అణకువ కలవానిలాగ, పరమయోగ్యుని లాగ, మంచి చెడ్డలు తెలియని పసిపాపలాగా మౌనం వహించాడు. భ్రమ చెందిన వానిలాగ, ఏమీ తెలియని అమాయకుని లాగా తెల్లబోతూ, తనయందు ఏ విధమైన కపటము కనబడనీయక తల్లి రొమ్ముకు తన తల ఆనించి ముచ్చటగా ఆడుకుంటూ ఊరకున్నాడు.

వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలునికేలు పట్టుకొని యిట్లనియె.

335

తా ॥ అలా ఉండగా ఒకరోజున బలరాముడు, ఇంకా ఇతర గొల్లపిల్లలు అంతా కలిసివచ్చి యశోదతో కృష్ణుడు మన్నుతిన్నాడని చెప్పారు. వెంటనే ఆమె బాలుని చెయ్యి పట్టుకుని ఇలా అంది:

క. మ న్నేటికి భక్షించెదు?, మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ
యన్నయు సఖులును జెప్పెద, రన్నా! మ న్నేల? మఱి పదార్థము లేదే?

336

తా ॥ "నువ్వు మన్నెందుకు తిన్నావు? చెప్పిన మాట అసలెందుకు వినడంలేదు? నీ సంగతి నీ అన్న, నీ సఖులు చెప్పారులే. తలను అలా అడ్డంగా ఊపకు. మన్ను తినడం దేనికి? తినడానికి మన ఇంట్లో వేరే మధుర పదార్థాలు లేవా?"

వ. అని పలికిన ముగుదతల్లికి నెఱదంటయైన కొడు కిట్లనియె.

337

తా ॥ అని అమాయకంగా అడిగిన తల్లితో నేర్పరి అయిన కొడుకు ఈ విధంగా పలికాడు:

శా. అమ్మా! మన్ను దినంగ నే శిశువనో? యాఁకొంటినో? వెఱ్ఱినో?
నమ్మం జూడకు వీరిమాటలు మదిన్, న న్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు. కాదేనిన్ మదీయాస్య గం
ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే!

338

తా ॥ "అమ్మా! మన్ను తినడానికి నేనేమైనా పసిబిడ్డనా? లేక మిక్కిలి ఆకలితో ఉన్నానా? లేకపోతే నేను ఏమైనా వెర్రివాడినా? వీళ్ళ మాటలు నమ్మకమ్మా! నన్ను నీ చేత కొట్టించాలని, వీళ్ళిలా నామీద లేనిపోనివి కల్పించి చెబుతున్నారు. నే చెప్పింది తప్పో, ఒప్పో నా నోరు వాసన చూడు. నేను చెప్పింది తప్పైతే అప్పుడు నన్ను దండించవచ్చు."

వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజ బాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన.

339

తా ॥ అని తనమీద ప్రేమ పుట్టేటట్లు మాట్లాడి తల్లి అయిన యశోదా దేవిని శాంతింపచేసి లీలా మానుష విగ్రహుడైన ఆ కృష్ణుడు తననోరు తెరచి చూపించాడు.

క. ఆ లలితాంగి కనుంగొనె, బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖీ తరణి శశి ది, క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.

340

తా ॥ అంతట యశోదాదేవికి ఆ బాలుని నోటిలో సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలు, భూమండలం, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, అష్టదిక్పాలకులు మొదలైన వారితో కూడి ఉన్న బ్రహ్మాండం మొత్తం కనిపించింది.

వ. కనుంగొని.

341

మ. కలయో! వైష్ణవమాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
తలఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర
స్థలమో! బాలకుఁడెంత! యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్!

342

తా ॥ చూసి విభ్రాంతురాలై ఇలా అనుకొన్నది – “నేను చూస్తున్నది కలా లేక విష్ణుమాయా? వేరే ఏదైనా అర్థం ఉన్న విషయమా? లేక ఇది వాస్తవమా? ఊహించడానికి కూడ వీలులేకుండా ఉన్నది. నేను యశోదాదేవిని కాదేమో? అసలు ఇది మా ఇల్లేనా? లేక వేరే ప్రదేశమా? చిన్న పిల్లవాడు ఏమిటి? వెలుగులు చిమ్మే బ్రహ్మాండం నోటిలో కనబడటం ఏమిటి? ఆలోచిస్తున్న కొద్దీ ఆశ్చర్యంగా తోస్తోంది.

ఆ. బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు, విశ్వమెల్ల నెట్లు వెలసి యుండు
బాలుభంగి నితఁడు భాసిల్లుఁగాని స, ర్వాత్ముఁ డాది విష్ణుఁడగుట నిజము.

343

తా ॥ బాలుడైన పక్షంలో ఇతని ముఖంలో ఈ విశ్వమంతా కనుపించనేరదు. కాబట్టి ఈతడు బాలునిలా కనిపిస్తున్నాడు కాని సర్వాత్ముడైన శ్రీమహావిష్ణువే! ఇది యథార్థం!"

వ. అని నిశ్చయించి.

344

ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు, గానఁబడిన బుద్ధికంప మయ్యె
నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు, నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు.

345

తా ॥ ఈ విధంగా మనస్సులో నిశ్చయించుకొన్నదై యశోదాదేవి ఈ విధంగా స్తుతించింది: "ఏ మహాత్ముని వలన ఈ విశ్వమంతా కనబడి నా బుద్ధి చలించిందో ఆ మహాత్ముణ్ణి, అఖిల లోకాధారుడైన విష్ణువుని నా దుఃఖాలను తొలగిపోయేందుకు ఆశ్రయిస్తున్నాను.

క. నామగఁడు నేను గోవులు, నీ మందయు గోపజనులు ని బ్బాలుని నె
మ్మోమున నున్న విధముఁ గని, యేమఱితిమి గాని యీశుఁ డీతఁడు మాకున్.

346

తా ॥ ఈ బాలుని ముఖం చూస్తూ ఇన్నాళ్ళూ నేనూ, నా భర్త, ఈ వ్రేపల్లెలోని గోప గోపీజనం అందరూ, చివరకు ఆవులు కూడా ఇతను బాలుడే అని భావిస్తూ భ్రాంతిని చెందుతున్నాం కానీ, ఈతడు ముల్లోకాలకు ప్రభువైనవాడని తెలుసుకోలేక పోయాము."

వ. అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోద యందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన.

347

తా ॥ అని ఈ విధంగా తనను పరమేశ్వరుడని భావిస్తూన్న యశోదయందు తిరిగి వైష్ణవ మాయను ఆవరింప చేశాడు కృష్ణుడు.

క. జడనుపడి యెఱుక సెడి యా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మమత గావించె నృపా!

348

తా ॥ ఓ రాజా! అంతట యశోదాదేవి మాయాప్రభావం వలన మోహంతో, తిరిగి సర్వాత్ముడనే మాట మరిచి పోయింది. ఆ కృష్ణుని తన కుమారుడని ఒడిలో కూర్చోపెట్టుకుని కదు వేదుకతో బుజ్జగించసాగింది."

వ. అనిన విని రా జిట్లనియె.

349

తా ॥ అప్పుడు పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు:

ఆ. జగదధీశ్వరునకుఁ జ న్నిచ్చు తల్లిగా, నేమి నోము నోఁచె నీ యశోద!
పుత్త్రుఁ డనుచు నవనిఁ బోషించు తండ్రిగా, నందుఁ డేమి సేసె నందితాత్మ!

350

తా ॥ "మహర్షీ! జగత్తుకు అధీశ్వరుడైన భగవంతునికి పాలిచ్చే తల్లిగా పుట్టడానికి యశోదాదేవి ఎన్ని నోములు నోచిందో? శ్రీహరిని పోషించే తండ్రిగా పుట్టడానికి ఆ నందుడు ఏ తపస్సులు ఆచరించాడో? ఆ కథామృతాన్ని పానం చేసిన మహనీయుడవు నీవు.

క. ప్రబ్బిన భక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్య శ్రీ
కబ్బుదు రఁట! హరిపోషణ, మబ్బిన తల్లిదండ్రు లెచటి కబ్బుదురొ తుదిన్.

351

తా ॥ ప్రగాఢ భక్తితో శ్రీహరిపై కావ్యాలు వ్రాసిన కవులే కైవల్యాన్ని పొందుతారట. అటువంటి పరమాత్మకు తల్లిదండ్రులై పోషించే భాగ్యాన్ని పొందిన మహనీయులు ఏ ఉత్తమ పదాన్ని పొందుతారో?"

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె.

352

తా ॥ అని అడిగిన పరీక్షిత్తుతో శుకమహర్షి ఇట్లా అన్నాడు:

## 12. యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము

సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల యందు ముఖ్యుఁడు, ధర యతని భార్య,
వారి నిద్దఱ బ్రహ్మ 'వసుధపై జన్మింపుఁ' డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
'విశ్వేశ్వరుండైన విష్ణు సేవారతి మా కిచ్చితేనిని మహి జనింతు'
మనవుడు 'నట్ల కా' కనియె వేల్పుల పెద్ద యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె

ఆ. ధర యశోద యయ్యె, దనుజేంద్ర వైరియుఁ, గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె, నధిక భక్తితోడ నలరి రిట్లు.

353

తా ॥ "ఓ రాజా! అష్టవసువులలో ద్రోణుడనే మహాపురుషుడు ఒకాయన ఉండేవాడు. అతని భార్య పేరు ధర. ఆ దంపతులు బ్రహ్మకొలువుకు పోయినప్పుడు మీరు భూలోకంలో పుట్టండి అని బ్రహ్మ ఆజ్ఞాపించాడు. మాకు విశ్వనాయకుడైన విష్ణుసేవా భాగ్యం కలిగేటట్లు అనుగ్రహిస్తే మేము భువిపై జన్మిస్తాం అని అన్నారు. బ్రహ్మ అలాగే అని అనుగ్రహించాడు. అంతట భూలోకంలో వారిరువురూ నంద యశోదలుగా అవతరించారు. విష్ణువు కూడా బ్రహ్మమాట తప్పకుండా నందయశోదలకు కుమారుడై వాళ్ళను సంతోషపెట్టాడు" అని చెప్పి తిరిగి కృష్ణ కథలోనికి శుకుడు ప్రవేశించాడు.

వ. అంత నొక్కనాఁడు దనయింటికడ పాపలందఱు నయ్యై పసులవెంటఁ బంపువడి పోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబు కడఁ గుదురున నొక్కదధి కుంభంబు వెట్టి మిసిమి గల మీఁగడ బెరుఁగు గూడఁబోసి వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలవరించి.

354

తా ॥ "అంత ఒకరోజున యశోదాదేవి తన ఇంట్లో ఉన్న పరిచారికలందర్ని ఎవరి

పనులకు వాళ్ళను పంపింది. తాను పెరుగు చిలికే స్తంభం దగ్గర కదలకుండా కడవను ఉంచి అందులో మిసిమిగల మీగడ పెరుగు పోసి త్రాడుని కవ్వానికి తగిల్చి చిలకటం మొదలు పెట్టింది.

## 13. యశోద దధిబాండ వికలనాదులు చేసిన కృష్ణుని పట్టుకొనుట

సీ. కరకమలారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు పవడంపు నునుఁదీవపగిది మెఱయఁ
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ
గుచకుంభములమీఁది కొంగు జాఱఁగఁ జిక్కు వడుచు హారావళు ల్బయలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుపై పడిన పద్మంబుఁ దెగడఁ

తే. గౌను నులియంగఁ గంగణక్వణన మెసఁగఁ, దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడెడి పాటవలనఁ, దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె.

355

తా ॥ ఆ సమయాన యశోదాదేవి అరచేతుల అరుణకాంతులు కవ్వపు త్రాటిపై ప్రసరించి లేత పగడపు తీగలాగ మెరుస్తూన్నది. కవ్వపు త్రాటిని కుడియెడమలకు క్రమంగా లాగుతూ ఉన్నప్పుడు వక్షస్థలం ఊగసాగింది. పైటకొంగు కొద్దిగా ప్రక్కకు జరుగగా మెడలోని మెలికలు పడ్డ హారాలు కనుపిస్తున్నాయి. శ్రమ వలన కలిగిన చెమటతో అందమైన ముఖం మంచులో తడిసిన పద్మసౌందర్యాన్ని అధిగమించిందా అనిపిస్తోంది. నడుము జవజవలాడగా, చేతిగాజుల ధ్వని అతిశయింపగా కొప్పు బిగువు సడలగా, చెవికమ్మల కాంతులు మెరయగా తదేక ధ్యాసతో పెరుగు చిలుకుతూన్నది. చిలుకుతూ బాలుడైన కృష్ణుణ్ణి పొగడుతూ, పాటలు పాడుతూ ఉంటే వృక్షాలు సైతం పరవశించి చిగురులు తొడుగుతున్నాయి.

వ. ఆ సమయంబున.

356

క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు, సడి గొట్టుచు నమ్మ రమ్ము! చ న్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ, గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్.

357

తా ॥ ఆ సమయంలో బాలుడైన శ్రీకృష్ణుడు ఆమె చుట్టూ తిరుగుతూ, క్రింద పడుతూ లేస్తూ, ఉహూ ఉహూ అని మూలుగుతూ, ఏడుస్తూ, 'అమ్మా! పాలు' అని మారాము చేస్తూ, కడవ దగ్గరికి వచ్చి కవ్వం పట్టుకున్నాడు.

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, న వ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె, నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

358

తా ॥ అలా కవ్వం పట్టుకుని తన పనిని ఆపుతున్న చిన్ని కుమారుని చూసి నవ్వుతూ యశోదాదేవి ఎత్తి ఒడిలో పెట్టుకుని అతని జుట్టు దువ్వుతూ పాలు ఇవ్వసాగింది.

మ. కడుపారం జనుఁబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడి పాలు డించుటకునై యేగంగఁ దద్బాలుఁ డె
క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబు వోఁగొట్టి తెం
పడరం గుంభములోని వెన్నఁదినె మిథ్యాసంకులద్బాష్పుఁడై.

359

తా ॥ బాలుడు పాలు తాగుతున్నంతలో, పొయ్యి మీద పాలు పొంగడం గమనించిన యశోద గబాలున ఒడినుండి ఆ చిన్నవాడిని దింపి లోపలికి వెళ్ళింది. తనను అలా అర్థాంతరంగా క్రిందకు దించి వెళ్ళినందుకు అలిగిన నల్లనయ్య, వాడి అయిన రాతిచేత అమ్మ చిలుకుతున్న పెరుగు కుండను బద్దలుకొట్టి, అందులోని వెన్నను కొంత తీసుకుని తింటూ, పైకి మాత్రం తల్లికి వినిపించేలా దొంగ ఏడుపు ఏడవసాగాడు.

వ. అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధికుంభ శకలంబులఁ

బొడగని తుంటకొడుకు వెన్నదింట యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చని చని.

360

తా ॥ ఇంతలో ఆ యశోద పాలు దించి వచ్చి ముక్కలై ఉన్న పెరుగు కుండను చూసింది. అంతేకాదు అందులో ఉన్న వెన్నను తిని కృష్ణుడు పరుగెత్తి పోవడాన్ని చూచింది. ఆ కుండ పెంకులను చూసి ఈ తుంటరి ఎంత పని చేశాడు అని తనలో తాను నవ్వుకొంటూ కన్నయ్య కనిపించక పోయేసరికి వెతుకుతూ బయలుదేరింది.

ఆ. వికచకమలనయన వే ఱొకయింటిలో, వెలయ ఱోలు దిరుగ వేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి, పాలు సేయు చున్న బాలుఁ గనియె.

361

తా ॥ అలా బయలుదేరిన యశోదకు వేరొక ఇంటిలో రోలు తిరగేసి ఎక్కి పైన ఉట్టిలో ఉన్న వెన్నను అందుకుని, దానినంతా ఒక కోతికి తినిపిస్తూన్న కృష్ణుణ్ణి చూచింది. ఆ విధంగా యశోద తొలిసారిగా కృష్ణుడు బయట చేసిన అల్లరిని ప్రత్యక్షంగా చూసింది.

మ. కని చేతన్ సెలగోల వట్టికొనుచుం గానిమ్ము గానిమ్ము రా
తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ నేదండంబునుం గాన నే
విని వారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీవిటు నన్నుఁ గై కొనమి నేఁడారీతి సిద్ధించునే

362

తా ॥ అలా కృష్ణుణ్ణి చూసిన యశోద ఒక బెత్తం చేత పుచ్చుకుని బెదిరించింది. "నీ పని ఇలా ఉందా? సరే! రా! ఇంతకు ముందువరకూ నీవు ఎవ్వరి చేతుల్లోను చిక్కుకోలేదు! ఏ శిక్షనూ పొందిన వాడివి కావు! నిన్ను అడ్డుకున్న వారు ఇప్పటి దాకా లేరు! ఏ భయమూ లేదని

నీ పాటికి నీవు అనుకుంటూ ఎవరిని లక్ష్యపెట్టడం లేదు. ఇట్లా తప్పించుకు పారిపోతే సరిపోతుంది అనుకుంటున్నావా? ఈ రోజు నీవు ఎలా తప్పించుకుంటావో చూస్తాను!"

వ. అని యదలించుచుఁ గొడుకునడవడిం దలంచి తనుమధ్య దన మనంబున.

363

తా ॥ అని ఈ విధంగా కొడుకును బెదిరిస్తూ అతడు చేస్తూన్న పనులను తలచుకొని యశోదాదేవి తన మనస్సులో ఇలా అనుకున్నది:

సీ. బాలుఁ డీతండని భావింతు నందునా యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ వెఱుంగుటకు నై వెఱపింతు నందునా కలిగి లేకొక్కఁడు గాని
లేఁడు వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా చొచ్చి చూడని దొకచోటు లేదు

ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి, యోజ లేదు భీతి యొకటి యెఱుఁగఁ
డెలమి నూర కుండఁ డెక్కసక్కెము లాడుఁ, బట్టి శాస్తి సేయు భంగి యెట్లు?

364

తా ॥ 'ఇతడు చిన్న పిల్లాడు అని అనుకునేందుకు వీడు చేసే పనులు పెద్ద వాళ్ళు కూడా చెయ్యరు! పోనీ కొంచెం భయపెడదామంటే లేక లేక పుట్టినవాడు వీడొక్కడే! నాలుగు మంచి మాటలు చెబుదామంటే తనంతతానే బుద్ధిగా ఉన్నట్లు ఉంటాడు. ఏమీ తెలియకుండా ఇంట్లో కూర్చుంటాడా అంటే వీడెరుగని చోటు, వెళ్ళని చోటు, చూడని చోటూ లేదు. దేనికీ భయంలేదు. ఊరుకోక ఎకసెక్కాలాడుతున్నాడు. ఇటువంటివాడిని ఏ విధంగా శిక్షించేది?'

వ. అని వితర్కించి.

365

క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును, బాలురకును దాడనంబ పథ్యం బరయన్.

366

తా ॥ అని తనలో తానిట్లు తర్కించుకొన్నది: 'చిన్న పిల్లలను గారాబం చేస్తే వాళ్ళల్లో బహు దోషాలు పుట్టుకొస్తాయి. అప్పుడప్పుడు నాలుగు దెబ్బలు వేస్తూంటేనే మేలు జరుగుతుంది. కనుక దండోపాయమే మంచిది' అని నిశ్చయించుకుంది.

వ. అని నిశ్చయించి కేల నున్న కోల జళిపించి బాలా! నిలునిలు మని బగ్గుబగ్గున నదల్చుచుఁ దల్లి దగ్గఱిన బెగ్గడిలిన చందంబున నగ్గలిక సెడి ఱోలు డిగ్గ నుఱికి.

367

తా ॥ అని నిశ్చయించి, చేతిలో ఉన్న చిన్న బెత్తం ఝళిపిస్తూ, 'అబ్బాయీ! ఆగు అక్కడ!' అంటూ బెదిరించింది. యశోద దగ్గరికి వచ్చే సరికి భయపడ్డట్లు నటిస్తూ కృష్ణుడు రోటిమీద నుండి క్రిందికి దూకాడు.

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ, నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ, బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా!

368

తా ॥ ఓ రాజా! ఆ సమయాన కాలిగజ్జెలు ఘల్లని మోగుతూ ఉంటే, చిందులు ఆపి, వేగంగా పరుగెత్తసాగాడు ఆ తుంటరివాడు. ఇది చూసి చుట్టుపక్కల ఉన్న గోపికలు నవ్వుతుంటే, యశోదాదేవి వాని వెంట పరుగెత్తసాగింది.

వ. అప్పుడు.

369

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనిత స్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడ బాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్ర మనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్.

370

తా ॥ అలా పరుగులు తీసే యశోద అలసటను పొందుతూ, చెమటతో ఒళ్ళంతా ముద్దయి పోసాగింది. తలకొప్పు ఆ పరుగు వేగానికి విడివడేలా ఉంది. జారిన పైటను బిగిస్తూ అలా ఆ తల్లి బాలకృష్ణుని వెంట పరుగిడసాగింది. గొప్ప గొప్ప యోగీంద్రుల మనస్సులు సైతం అందుకోలేని ఆ లీలాచతురుని పట్టుకోవాలనే పట్టుదలతో పరుగెత్తుతున్న యశోద అదృష్టం చెప్పనలవి కానిది కదా!

వ. ఇట్లు గూడం జని.

371

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డం బైన నిట్టట్టు సని పట్టనీని వాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ నే నని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని
నే దెస వచ్చునో యిది యని పలుమాఱు సురుఁగుచుఁ గ్రేఁగంటఁ జూచువానిఁ

ఆ. గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ, జిన్ని వెన్నదొంగ సిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి, కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి.

372

తా ॥ ఆ పరుగులు పెట్టే కృష్ణుడు స్తంభాలు అడ్డంగా వస్తుంటే వాటి చాటున దాక్కుంటూ, ఇటు వస్తే అటు, అటు వస్తే ఇటు జింకపిల్లలా పరుగులు పెడుతున్నాడు. పైకి

భయాన్ని ప్రదర్శిస్తూ ఈ ఒక్కసారికి క్షమించు, ఇక ముందు దొంగతనం చెయ్యను అని ఏడుస్తున్నాడు. ఆ కన్నీటితో కళ్ళను నులుముకోగా, కళ్ళ కాటుక ముఖం అంతా అలుముకుంది. అమ్మ ఏ వైపు నుండి వచ్చి పట్టుకుంటుందో అని ఓరకంట బిత్తర చూపులు చూస్తున్నాడు. మొత్తానికి ఆ వెన్న దొంగ కాస్తా పట్టుబడ్డాడు. దొంగ చేతికి చిక్కాడని పట్టుకున్నదే కాని బాలుని కొట్టేందుకు యశోద చేతులు ముందుకు రావడంలేదు, జాలిపడుతూ కొట్టక, కట్టివేయాలని భావించింది.

వ. ఇ ట్లనియె.

373

క. వీ రెవ్వరు? శ్రీకృష్ణులు, గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా
చోరత్వం బించుకయును, నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే,

374

తా ॥ ఆ తరువాత ఇలా అన్నది: “ఓహో ఎవరు వీరు? శ్రీకృష్ణుల వారేనా! ఎప్పుడు వెన్న ఎలా ఉంటుందో తెలీదట వీరికి! దొంగతనం అంటే ఏమిటో తెలియదట! ఈ భూమిమీద ఇలాంటి బుద్ధిమంతులు ఉన్నారా అసలు!

క. పట్టినఁ బట్టువడని నినుఁ, బట్టెద నని చలముగొనినఁ బట్టుట బెట్టే?
పట్టువడ వండ్రు పట్టీ!, పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే?

375

తా ॥ పట్టుకొందామనుకొంటే నేను ఎవరి పట్టుకు చిక్కనని నీవు అనుకొంటున్నావు. ఎలాగైనా సరే నిన్ను పట్టుకోవాలనుకొంటే అది ఒక పెద్ద విషయం ఏమీ కాదు. నీవు ఎవరికీ చిక్కవని చెబుతూ ఉన్నారు. నిన్ను పట్టుకోవడం నాకు గాక ఇతరులకు సాధ్యము కాదు!” ఈ విధంగా యశోద తెలవకనే భగవంతుని తత్త్వాన్ని వెల్లడి చేసింది.

క. ఎక్కడ నైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము కలిగి యుండవు, నియమం
బెక్కడిది నీకు? మఱచినఁ, జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా!

376

తా ॥ "అబ్బాయీ! నువ్వు ఎక్కడబడితే అక్కడ తిరుగుతావు! ఎక్కడో ఒకచోట కుదురుగా కూర్చోవు! నీకు అసలు ఒక నియమం అంటూ లేదు. నిన్ను పట్టించుకోకపోతే నీ ఇష్టం వచ్చినట్టు తిరుగుతావు.

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు, తలఁచెదు గట్టైనఁ దరల నెత్త,
మంటితో నాటలు మానవు, కోరాడె, దున్నత స్తంభంబు లూఁపఁ బోయె,
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు, రాచవేఁటలఁ జాల అవ్వదెచ్చె,
దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెదు, ముసలిపై హరివృత్తి మొనయఁ, జూచె

ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద, వింకఁ గల్కిచేఁత లేల పుత్ర!
నిన్ను వంప వ్రాల్ప నే నేర ననియొ, నీ విట్టు క్రింది మీఁదు నెఱుఁగ కునికి.

377

తా ॥ నీళ్ళలోకి వెడితే ప్రమాదం అన్న జ్ఞానం లేకుండా అందులో తిరుగుతున్నావు (మత్స్యావతారము). కొండలనైనా సరే ఎత్తడానికి ప్రయత్నం చేస్తున్నావు (కూర్మావతారము). మట్టితో ఆటలు మానెయ్యమంటే మానవు (వరాహావతారము). పెద్ద పెద్ద స్తంభాలు ఊపుతావు (నృసింహావతారము). ఇతరులను అల్పవస్తువులు అడగబోతావు (వామనావతారం). నీకు రాజసం ఎక్కువ. (పరశురామావతారము). అలసి పోకుండా నీళ్ళ ప్రవాహానికి అడ్డం కడతావు (రామావతారము). ముసలివైనా ఏరుక్రింద దున్నుకొంటున్నావు (బలరామావతారము). ఒక గుడ్డైనా మొలకు కట్టుకోవడానికి అడగవు (బుద్ధావతారము). ఇక నేర్పరితనపు పనులెందుకు (కల్క్యవతారము). నిన్ను అణచడానికి నేను సమర్థురాలను కాదనేనా నువ్వు ఈ విధంగా మంచి చెడు తెలియకుండా ప్రవర్తిస్తున్నావు?"

## 14. ఉలూఖలబంధన యమళార్జున భంజనాది అభివర్ణనము

వ. అని మర్మంబు లెత్తి పలికి.

378

క. ఆ లలన గట్టె ఱోలన్, లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియ వా
గ్జాలుం బరివిస్మిత గో, పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్.

379

క. ఱోలను గట్టువడియు న, బ్బాలుడు విలసిల్లె భక్త పరతంత్రుండై
యాలాన సన్నిబద్ధ వి, శాల మదేభేంద్ర కలభసమరుచి నధిపా!

380

తా ॥ ఇలా పలుకుతూ యశోదాదేవి స్వామి అవతార రహస్యాలను ఎత్తి చూపుతూ ఆ వెన్న దొంగని, ఇంపుగా మాట్లాడే వానిని, ముత్యాల బొట్టు నొసటి మీద వ్రేలాడుచున్న వానిని, గొల్లలందరు ఆశ్చర్యంతో చూస్తూ ఉండగానే రోటికి కట్టేసింది. ఆ విధంగా రోటికి కట్టుబడ్డా కూడా, భక్తపరతంత్రుడై కట్టుకంబానికి కట్టబడ్డ ఏనుగు గున్నలాగ ప్రకాశిస్తున్నాడు.

క. వెలిలోను మొదలు దుది నడు, ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియును లో నగు నీశ్వరు, నలవడునే కట్టఁ బ్రణతురాల్ గా కున్నన్?

381

తా ॥ ఓ రాజా! పరమాత్మకు వెలుపల, లోపల, మొదలు, తుది, మధ్యన అనేవి ఏమీ లేవు. లోకాలన్నింటికీ సర్వమూ ఆతడే, అన్నింటా నిండి ఉన్నవానిని కట్టివేయాలంటే శుద్ధభక్తి కలిగి ఉన్న యశోదకు సాధ్యమైనది కానీ అన్యులకు అది సాధ్యమా?

ఆ. పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని, గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక

వట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు వట్టు, టెఱిఁగె నేనిఁ దల్లి యేల కట్టు?

382

తా ॥ యశోదాదేవి ఇతడు చిన్న పిల్లవాడు అల్లరివాడు అని కట్టేసింది గాని ఆ కుర్రవాని కడుపులో అనేక బ్రహ్మాండములు దాగి ఉన్నాయి అని తెలిస్తే ఆ తల్లి మాత్రం ఎందుకు కడుతుంది?

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాది యోగిచిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావలిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లి చేతన్ ఱోలన్.

383

తా ॥ ఆ బాలకృష్ణుడు లక్ష్మీదేవి కౌగిటిలో చిక్కడు! సనక సనందనాది యోగుల హృదయ కమలముల యందు చిక్కడు! వేదములనే లతలకూ చిక్కడు! అటువంటి అతడు లీలను చూపుతూ తల్లి అయిన యశోదాదేవి చేతిలో రోటికి చిక్కుకున్నాడు.

వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్ట నడరుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె, మఱియు నొక్కబంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యెఁ, వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తి సూపె నిట్లు.

384

తా ॥ ఇలా పట్టుకొన్న ఆ యశోద తన ముద్దుల కొడుకుని కట్టివేయటం కోసం నేర్పుతో త్రాడు తెచ్చి అతని నడుముకి చుడితే రెండు అంగుళాలు తక్కువ వచ్చింది. ఇంకొక త్రాడు జతచేసినా అదీ అంతే కొరత అయ్యింది. మరి ఇంకో త్రాడు తెచ్చి ముడివేసి చుడితే అంతే తక్కువవుతోంది.

అహంకారం, మమకారం అనే రెండూ ఉన్నంతవరకు ఆ విశ్వాత్మున్ని బంధించలేము. ఈ రెండూ ఉన్నంతవరకు విశ్వంలోని తాళ్ళు అన్నీ కలిపి బంధించినా ఆ అనంతుడు బంధించబడడు.

క. తజ్జనని లోఁగిటం గల, రజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జ, గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే?

385

తా ॥ తల్లి అయిన యశోదా దేవి కృష్ణుణ్ణి కట్టడం కోసం ఈ విధంగా తన ఇంట్లో ఉన్న త్రాళ్ళన్ని తెచ్చి ముడివేసి నడుముకు చుట్టినా ఆ త్రాళ్ళన్నీ కట్టడానికి సరిపోవడం లేదు. సమస్త లోకాలను తన బొజ్జలో ఉంచుకున్న ఆ శ్రీమన్నారాయణుని కట్టడం ఎవరితరం?

వ. అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి, తదనంతరంబ.

386

తా ॥ ఆ వింతకు యశోద, గోపికలూ నివ్వెరపోయారు.

ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జార, వీడి యున్న తుఱుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ, గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి.

387

తా ॥ పాపం! ఈ శ్రమకు యశోదాదేవికి ఒళ్ళంతా చెమటలు పోశాయి. పైటకొంగు జారిపోసాగింది. తలలోని పువ్వులు నేలరాలాయి. కట్టరాని తనను ఎలాగైనా కట్టివేయాలనే పట్టుదలతో తంటాలు పడుతూ ఉన్న ఆ తల్లిని కరుణతో చూసాడు చిన్నికృష్ణుడు.

శ్రీకృష్ణుణ్ణి బంధించాలనే దృఢయత్నంలో యశోదకు దేహాభిమానం అంతా చెమటగా కారిపోతోంది. మమకారంతో కూడుకున్న సంకల్పాలన్నీ తలలోని పూవుల వలె జలజల

రాలుతూ నిరోధించబడ్డాయి. తనను బంధించాలనే నిరంతర ప్రయత్నం చేసేవారికి ఆ స్వామి బంధితుడవుతాడు. అందుకనే దేహాభిమానం విడిచి, మమకారంతో కూడిన సంకల్పాలను వర్జించి, ఆ స్వామిని బంధించాలన్న తీవ్ర ఆతురతను చూసిన యశోదమ్మను కరుణతో చూసాడు కృష్ణయ్య.

క. బంధవిమోచనుఁ డీశుఁడు, బంధింపఁ బెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ, బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా!

388

తా ॥ ఓ రాజా! సంసార బంధనాలను తొలగించే సర్వేశ్వరుడైన బాలకృష్ణుడు తనను బంధించటం కోసం తల్లి పడుతున్న శ్రమను చూసి, ఆప్తులకు బంధువు అయినవాడు కనుక ఆమె కట్టుకు కట్టుపడ్డాడు.

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు, నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడి పద్మజుఁడును గో, పాంగన క్రియఁ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్.

389

తా ॥ స్నేహితుడైన శివుడుగాని, తన శరీరాన్ని ఆశ్రయించుకొన్న లక్ష్మీదేవి కాని, కొడుకైన బ్రహ్మ కాని శ్రీహరి అనుగ్రహాన్ని ఆ విధంగా పొందలేక పోయారు, అంతటి కరుణను పొందింది యశోదామాత.

క. జ్ఞానులచే మౌనులచే, దాసులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్?

390

తా ॥ భక్తులకు పట్టుబడ్డట్లుగా ఆ నారాయణుడు జ్ఞానులకుగాని, మౌనులకుగాని,

దాసులకు గాని, యోగులకు గాని కట్టుబడడు. ఇదీ గ్రహించవలసిన విషయం.

వ. అంత న య్యశోద యింటికడం బనుల వెంటం దిరుగఁ గృష్ణుండు దొల్లి నారదు శాపంబున నిరుమద్దు లై యున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱం గని ఱో లీడ్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డి ట్లనియె.

391

తా ॥ ఈ విధంగా చివరికి ఆ యశోదాదేవి కృష్ణుణ్ణి కట్టేసి, తిరిగి తన ఇంటి పనుల్లో మునిగి పోయింది. ఆ బాలుడు తమ పెరటిలో ఉన్న మద్దిచెట్లవైపు చూసాడు. నారద శాపం చేత జంట మద్దిచెట్లుగా ఉన్న నలకూబర మణిగ్రీవులను చూసి, వారి వైపుకి రోలుని ఈడ్చుకుంటూ వెళ్ళాడు. ఇంతవరకు చెప్పగానే పరీక్షిత్తు ఈ విధంగా అడిగాడు:

క. 'నారదుఁ డేల శపించెను?, వా రా వృక్షత్వమునకు వచ్చిన పనికిం
గారణ మెయ్యది? యోగి కు, లారాధ్య! యెఱుంగఁ జెప్పుమయ్య! వినియెదన్.'

392

తా ॥ "లోకంలోని యోగుల చేత ఆరాధించబడే నీవు మాత్రమే నా సంశయాలను తొలగించగలవు. నారదుడు ఎందుకు శపించాడు? నలకూబర మణిగ్రీవులను నారదుడు శపించుటకు కారణం ఏమిటి? వాళ్ళెందుకు వృక్షరూపాన్ని పొందారు? ఆ వృత్తాంతాన్ని అంతా నాకు సవిస్తరంగా తెలియ చెప్పవయ్యా!"

వ. అనిన శుకుం డిట్లనియె – 'మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరుల తోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణుసంగతంబు లైన

యేనుంగులభంగి సురంగంబు లైన మందాకినీ తరంగంబులం గ్రీడింప, నారదుండు

వచ్చిన నచ్చెలువలు సెచ్చెర వలువలు ధరియించిరి, మదిరా పానపరవశులు గావున వారలిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు సూచి శపియించువాఁడై ప్రతీతంబగు గీతంబు వాడె, వినుము.

393

తా ॥ అని పరీక్షిత్తు అడుగగా, శుక మహర్షి ఇలా చెబుతున్నాడు: పూర్వం కుబేరుని కొడుకులైన నలకూబరుడు, మణిగ్రీవుడు అనే వాళ్ళిద్దరు శివుని సేవకులుగా ఉండేవారు. వారు ఒకనాడు అహంకారంతో కైలాస పర్వతం మీద పువ్వుల తోటల్లో గంధర్వస్త్రీలతో కూడి విహరిస్తున్నారు. ఆడ ఏనుగులతో కూడుకొన్న మగ ఏనుగులలాగా ఆకాశగంగా తరంగాలలో జలకాలాడుతున్నారు. ఇంతలో నారద మహాముని రాగా ఆ స్త్రీలు శీఘ్రంగా వలువలు ధరించారు. మదిరాపాన పరవశులు అయిన కారణంగా నలకూబరమణిగ్రీవులిద్దరూ దిగంబరంగా ఉండిపోయారు. నారదుడు దానిని చూసి శపించుటకు యత్నిస్తూ ప్రసిద్ధమైన ఒక గీతాన్ని పాడాడు. దాన్ని విను!

శా. 'సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపండన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించునట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్.

394

తా ॥ 'సంపన్నుడైనవాడు ఎవ్వరినీ లెక్క చెయ్యక ప్రవర్తిస్తాడు. దేహాన్ని, సంసారాన్ని నమ్ముకుని, ఇతరులను హింసించాలని చూస్తాడు. దరిద్రుడైనవాడు కష్టాలను అనుభవిస్తూ ఉన్నందున, అందరూ తన వంటి వారే కదా అని భావిస్తాడు. ఇది లోకరీతి కనుక ధనమదం కలిగిన వారికి అంజనంగా దారి చూపేది దారిద్ర్యమే అవుతుంది.'

వ. అని గీతంబు వాడి తన మనంబున.

395

క. కలవాని సుతుల మనుచును, గలకంఠులతోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను, వీరికిఁ, గల క్రొ వ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్.

396

తా ॥ అని ఒక గీతాన్ని పాడి తన మనస్సులో ఇలా అనుకొన్నాడు: 'సంపన్నుని పుత్రులం అని స్త్రీలతో కూడి ఇతరులను లక్ష్యపెట్టని విధంగా ఉన్నారు వారు. వీళ్ళకు గల ధన మదాన్ని పోగొట్టి సత్ప్రవర్తకులుగా మారేలా చేస్తాను.'

వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులం జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱుదివ్య వర్షంబు లుండుం, డట మీఁద గోవింద చరణారవింద పరిస్పందంబున.

397

క. ముక్తులరై నారాయణ, భక్తులరై పరమసాధుభావ శ్రీ సం
సక్తులరై సురలోక, వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యము కతనన్.

398

తా ॥ అని ఆలోచించి బ్రహ్మజ్ఞాని అయిన నారదుడు, నలకూబర మణిగ్రీవులను ఇలా శపించాడు: "మీకు కలిమి వలన క్రొవ్వు చేత కళ్ళు కనిపించటం లేదు. కనుక భూలోకంలో మద్దిచెట్లై నూరు దివ్య సంవత్సరాలు ఉండండి. ఆ పిమ్మట శ్రీకృష్ణ పాదారవింద స్పర్శ చేత ముక్తులవుతారు. ఆ విధంగా ముక్తులై, శ్రీమన్నారాయణుని భక్తులై, మంచితనంతో తిరిగి దేవలోకంలో ప్రవేశించి ఎన్నతగిన వారవుతారు."

వ. అని యిట్లు వలికి, నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె. వా రిరువురును

సంగడి

మద్దులైరి. పరమభాగవతుండైన నారదు మాటలు వీటింబుచ్చక పాటించి.

399

తా ॥ అని ఇట్లా శపించి నారద మహర్షి నారాయణాశ్రమానికి వెళ్ళిపోయాడు. గంధర్వులిద్దరూ అంతట జంట మద్దిచెట్లయ్యారు. కృష్ణుడు పరమ భాగవతుడైన నారదుని మాటలు పాటించ తలిచాడు.

క. ముద్దుల తక్కరి బిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక తా నా
మద్దికవ యున్న చోటికి, గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడఁకం జనియెన్.

400

తా ॥ ఆ టక్కులమారి ముద్దుల కృష్ణుడు మద్దిచెట్లను కూలద్రోయాలని ఆలస్యం చెయ్యకుండా, వెంటనే మద్దిచెట్లు ఉన్నచోటికి రోటిని లాక్కుంటూ వెళ్ళాడు.

వ. చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామ సమాకృష్యమాణ తిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాఁకుల నడుమం జొచ్చి ముందటికి నిగుడుచు.

401

తా ॥ ఆ బాలకృష్ణుడు స్థిరంగా కదులుతూ, తన నడుము చుట్టూ కట్టిన త్రాటిచేత లాగబడుతూన్న రోటితో ఆ రెండు మ్రాకులకు మధ్యగా వెళ్ళాడు.

క. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు వెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా, పాలస్యవివర్జనములు యమళార్జునముల్.

402

తా ॥ ఆ చెట్లమధ్యకు వెళ్ళి రోలు అడ్డంగా లాగే సరికి, శాపం తొలగిన ఆ రెండు

మద్దిచెట్లు వేళ్ళతో సహా పెకలించబడి, కొమ్మలు విరిగిపోగా భయంకర ధ్వనితో నేలకూలాయి. నేటికి వారి శాపం తీరిపోయింది.

వ. ఇట్లు నిర్మూలంబు లయి పడిన సాలంబులలోనుండి కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులై న సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోక పాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిచి యిట్లనిరి.

403

తా ॥ ఇలా కూలిన మద్ది మ్రాకులలో నుండి అగ్నిజ్వాలలు వచ్చినట్లుగా మహాతేజంతో ఇద్దరు సిద్ధపురుషులు బయటికొచ్చారు. బయటికొచ్చి దివ్యజ్ఞానంతో భక్తపాలకుడైన ఆ బాలకృష్ణునికి నమస్కరించి కరకమలాలు ముకుళించుకొని ఇలా అన్నారు:

క. బాలుఁడవె నీవు? పరుఁడ వ, నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము, నీ లీలారూపమండ్రు నిపుణులు కృష్ణా!

404

తా ॥ "కృష్ణా! నీవు బాలుడివా! నీవు పరబ్రహ్మవు! ఏ ఆలంబన అక్కరలేని వాడవు! మహా యోగివి! ప్రపంచ సృష్టి స్థితిలయ కారణ భూతుడవు! అత్యంత సూక్ష్మం నుండి అత్యంత స్థూలం వరకు ఉన్న ఈ విశ్వము నీ రూపమే! అని ప్రజ్ఞాశీలులు తెలియజేస్తారు.

సీ. ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి ప్రాణంబులకు నధిపతివి నీవ!
ప్రకృతియుఁ బ్రకృతి సంభవ మహత్తును నీవ, వీని కన్నిటికిని విభుఁడ వీవ,
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ సిద్ధుండ వగు నిన్నుఁ జింత సేయ
గుణవృతుం డోపునే? గుణహీన! నీ యంద, కల గుణంబుల నీవ కప్పఁబడుదు,

తే. మొదల నెవ్వని యవతారములు శరీరు, లందు సరిదొడ్డు లేని వీర్యములఁ దనువు,

లడర జన్మించి వారలయందుఁ జిక్క, వట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు.

405

తా ॥ ఓ కృష్ణా! భూమి మొదలైన పంచ మహాభూతాలకు లేక స్థావర జంగమ రూపాలైన సకల ప్రాణులకు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలకు, అంతరింద్రియాలకు, పంచ ప్రాణాలకు అధిపతివి నీవే! ప్రకృతియు దాని నుండి పుట్టిన మహత్తత్త్వమును నీవే! ఈ చెప్పబడిన వాటికన్నింటికి విభుడవు నీవే! ప్రకృతి సంబంధములైన సత్వరజస్తమోగుణముల యొక్క వికారములను పొందక ముందే ఉన్న పూర్వసిద్ధుడవు! అట్టి నిన్ను ధ్యానించుటకు రాగద్వేషాది గుణాలతో కూడుకున్న మనుష్యుడు సరిపోతాడా! ఓ నిర్గుణ స్వరూపా! నీయందు కల గుణముల చేత నీవే కప్పబడతావు! సాటిలేని ప్రభావం కలవాడవు కనుక అంతుపట్టక చరించునట్టి నీకు నమస్కారము!

క. భువనములు సేయఁ గావఁగ, నవతీర్ణుఁడ వైతి కాదె యఖిలేశ్వర! యో
గి వరేణ్య! విశ్వమంగళ!, కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ!

406

తా ॥ సర్వేశ్వరా! ఓ యోగి వరేణ్యా! ఓ విశ్వమంగళ! కవిసన్నుత! కళ్యాణనిధీ! ఓ వాసుదేవా! లోకాలను సృష్టించడానికి కాపాడటానికి అవతరించిన వాడవు నీవే! సృష్టిలోని శుభాలు నీ నుండే ఉత్పన్నమవుతూ ఉన్నాయి.

ఉపేంద్ర వజ్ర.
తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్, నెపంబునం గంటిమి నిన్నుఁ జూడం
దపంబు లొప్పెన్, మముఁ దావకీయ, ప్రపన్నులం జేయుము భక్తమిత్రా!

407

తా ॥ భక్తులకు పరమ మిత్రుడైన వాడవు నీవు! నారదుని మాటలు సత్యములే

అయ్యాయి. అతని శాపం కారణంగా నిన్ను చూసే భాగ్యం మాకు లభించింది. మేము చేసిన తపస్సులు ఫలించాయి. ఇక మమ్ములను నీ భక్తకోటిలో చేర్చుకొని మన్నించు.

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ ని న్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తి పైఁ జూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!

408

తా ॥ ప్రభూ! మా చూపులు నీ మూర్తియందే సదా లగ్నమై ఉండుగాక! మా వాక్కు నీ యొక్క మంగళమయములగు గుణములను వర్ణించుచుండు గాక! మా చెవులు నీ యొక్క రసభరితములైన కథలను వినుచుండుగాక! మా చేతులు నీ సేవయందు లగ్నములై ఉండుకాక! మా మనస్సు నీ పాదకమలములను స్తుతించుటలో నిమగ్నమై ఉండుకాక! మా శిరస్సు నీ చరణముల ముందు సాగిలపడుచుండును గాక!"

వ. అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖల బద్ధుండైన హరి యిట్లనియె.

409

తా ॥ అని ఇలా స్తుతించిన నలకూబర మణిగ్రీవులతో, రోటికి కట్టబడిన ఆ బాలకృష్ణుడు నవ్వుతూ ఇలా అన్నాడు:

క. 'తమతమ ధర్మము దప్పక, సములైనను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము నన్నుఁ జూడ విరియును, గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమము క్రియన్.

410

తా ॥ "తమ తమ ధర్మం తప్పకుండా అందరిపట్ల సమత్వాన్ని చూపుతూ నన్ను నమ్మి ఉండేవారు ఉత్తములు. అటువంటి వారికి నన్ను చూసినంతనే సూర్యోదయంతో చీకట్లు తొలగి పోయినట్లుగా అజ్ఞానం తొలగి పోతుంది.

క. కారుణ్యమానసుం డగు, నారదు వచనమునఁ జేసి ననుఁ బొడఁగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి, చేరెన్ నామీఁది తలఁపు సిద్ధము మీకున్.

411

తా ॥ నారద మహర్షి అనుగ్రహం చేత నా దర్శనం మీకు లభించింది. నేటికి మీ శాపం తీరగా మీరు గొప్ప జ్ఞానం కలవారయ్యారు. ఈనాటి నుండి మీ మనస్సు నాపైనే ఉంటుంది."

వ. అని యీశ్వరుండు 'మీరు మీ నెలవులకుం బొం' డని యానతిచ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కులిడి వీడుకొని నలకూబర మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి, రంత నందాదు లయిన గోపాలకులు నిర్మూలంబులయి పడిన సాలంబుల చప్పుడు పిడుగుచప్పు డని శంకించి వచ్చి చూచి.

412

తా ॥ అని శ్రీకృష్ణ భగవానుడు 'మీ నివాసాలకు వెళ్ళండి' అని వారికి అనుజ్ఞ ఇచ్చాడు. దానిని శిరసా వహించి ఆయనకు ప్రదక్షిణ నమస్కారాదులు చేసి, నలకూబర మణిగ్రీవులు ఉత్తర దిక్కుగా వెళ్ళారు.

ఇక్కడ నందుడు మొదలైన గొల్లలు మద్దిచెట్లుపడ్డ చప్పుడు విని పిడుగు పడిందేమో అని భయపడుతూ బయటకు వచ్చి చూసారు.

క. 'ఈ పాదపములు గూలఁగ, నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుండై
యే పగిది బ్రదికెఁ? గంటిరె!, వాపోవఁడు, వెఱవఁ, డెట్టివాఁడో యితఁడున్.

413

తా ॥ 'అయ్యయ్యో! ఈ మహావృక్షాలు ఎలా పడిపోయాయి? ఈ పసివాడు దీనికి ఎలా తట్టుకుని నిలబడ్డాడు? కనీసం భయపడ్డట్టేనా అనిపించటం లేదు. ఎలాంటి పిల్లాడమ్మా వీడు!

ఆ. పిడుగు వడదు, గాక పెనుగాలి విసరదు, ఖండితంబు లగుట గానరాదు,
బాలుఁ డితఁడు, వట్టి పడఁద్రోయఁ జాలఁడు, తరువు లేల కూలె ధరణిమీఁద?'

414

తా ॥ అసలీ మహావృక్షాలు ఎందుకు కూలాయి? పిడుగు ఏదీ పడలేదు! పోనీ సుడిగాలి వీచిందా అంటే అదీ లేదు! ఎవరూ నరకలేదు. ఈ పసివాడు వాటిని పట్టుకొని పడద్రోయలేదు! వాటంతటవే చెట్లు ఎలా కూలాయి?'

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయునని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి.

415

తా ॥ అని అనేక విధాలుగా అక్కడివారంతా యోచించసాగారు, ఇది ఏమైనా ఉత్పాతం కావచ్చు అని అనుమానిస్తూంటే అక్కడ ఉన్న బాలకులు ఇట్లా అన్నారు:

క. "నందుని కొమరుఁడు వినుఁ డీ, సందున మును దూటి ఱోలు సరి యడ్డముగా
ముందటి కీడ్చిన మద్దులు, గ్రందుకొనం గూలె, జనులఁ గంటి మిరువురన్."

416

తా ॥ "వినండి! ఈ కృష్ణుడు రెండు చెట్ల సందున దూరి రోటిని ముందుకు ఈడ్చుకు వెళితే ఆ చెట్లు కూలి పడ్డాయి. అందులోంచి ఇద్దరు మనుష్యులు బయటకు రాగా మేం చూసాము."

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందఱు మిథ్యారూపంబు లనిరి, కొందఱు నానావిధంబుల సందేహించి రంత నందుండు వికసిత వదనారవిందుం డగుచుఁ బట్టి కట్టు విడిచె, నట్టియెడఁ దనతెఱం గెవ్వరు నెఱుంగ కుండవలెనని కపటకుమారుండు.

417

తా ॥ అని ఇలా చెప్పిన గోపబాలుర మాటలు విని కొందరు అబద్ధం అన్నారు. మరికొందరు అలా జరుగగలదా అని సందేహించారు. నందుడు తన కొడుకు క్షేమంగా ఉన్నందుకు సంతోషిస్తూ కట్లు విప్పాడు. అప్పుడు బాలకృష్ణుడు తన లీలను ఎవరూ అర్థం చేసుకోని విధంగా వారి మనస్సులను మళ్ళించాడు.

శా. పాడున్ మందునిభంగి, గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా
నాడున్ జంత్రముకైవడిం, బరవశుండై హస్తముల్ ద్రిప్పుచుం,
జూడ న్నే రని వాని భంగి జనులం జూచున్, నగున్, బాలురం
గూడుం బెద్దలపంపు సేయఁజను, డాఁగున్ మట్టిఁ జిట్టాడుచున్.

418

తా ॥ ఆ నల్లనయ్య లీలలు ఎన్నెన్నో! అమాయకునిలా తనలోతాను పాడుకుంటాడు. గోపకాంతలు చప్పట్లు కొడుతూ ఉంటే లయబద్ధంగా నృత్యం చేస్తాడు. కీలుబొమ్మలాగ పారవశ్యంతో చేతులు తిప్పుతాడు. పలకరింపుగా గోపకులను గోపికలను చూస్తూ నవ్వుతాడు. పెద్దవాళ్ళు చెప్పిన పని బుద్ధిమంతునిలా చేస్తాడు. మట్టిలో ఆడుకుంటాడు. తలుపుచాటున దాగి దాగుడు మూతలు ఆడుతాడు.

క. 'చుంచెదుగుఁ బాలు ద్రావు ము, దంచితముగ' ననుడు బాలుద్రావి జననితోఁ
జుం చెదుగ దంచు లీలా, చుంచుం డై యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా!

419

తా ॥ పరీక్షిన్మహారాజా! పాలు త్రాగితే జుట్టు ఎదుగుతుంది అని యశోద మరిపించేందుకు అంటే, పాలు త్రాగి జుట్టు ఇంకా ఎదగలేదే అంటూ తన జుట్టును చూపి తల్లిని అమాయకంగా ప్రశ్నించేవాడు.

క. సెలగోల వట్టుకొని జల, కలశములో నీడఁ జూచి కలశయుతుండై
సెలగోలఁ బాపఁ డొకఁ డిదె, తలఁచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్.

420

తా ॥ ఒక రోజున చిన్న కర్రను చేత పట్టుకొని నీళ్ళకుండ దగ్గర నిలబడి తన నీడను చూచి అమ్మా! చూడు! వీడెవడో చిన్న పిల్లాడు కర్రపుచ్చుకుని నన్ను కొట్టడానికి వస్తున్నాడు అంటూ అసలైన పసివాని వలె తల్లికి చూపించాడు.

క. భిక్షులు వచ్చెద రేడ్చిన, భిక్షాపాత్రమున వైచి బెగడించి నినున్
శిక్షించెద, రని చెప్పిన, భిక్షులఁ గని, తల్లిఁ గనియు భీతిల్లు నృపా!

421

తా ॥ పేచీలు పెట్టినప్పుడు, ఏడుస్తున్నప్పుడు యశోద 'ఇదిగో భిక్షకులు వస్తున్నారు, ఏడ్చే వారిని జోలెలో వేసుకుని తీసుకుపోతారు' అని బెదిరిస్తే, ఇంటి ముంగిటికి వచ్చే బిచ్చగాళ్ళను చూసినప్పుడు భయంతో నక్కేవాడు, ఏడుపు ఠక్కున ఆపేసేవాడు. ఈ విధంగా తల్లి బెదిరింపులకు భయపడినట్లుగా నటిస్తూ ఆ తల్లిని రంజింపచేసేవాడు ఆ అల్లరివాడు.

# 15. నందాదులు బృందావనమునకు నరుగుట

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుండను వృద్ధగోపకుండు దన యెఱుక మెఱసి యిట్లనియె.

422

తా ॥ ఈ విధంగా కృష్ణుడు అనేక విధాల లీలలను ప్రదర్శిస్తూ, పిల్లలతో ఆడుకుంటూ పొద్దుపుచ్చుతున్నాడు. వ్రేపల్లెకు చేరువన బృహద్వనం పేరగల ఒక అడవిలో నందుడు మొదలైన గొల్లపెద్దలు సమావేశమయ్యారు. అక్కడ... అనేక ఉత్పాతాలు కలగటం, వాటినుండి కృష్ణుడు బయటపడటం, వీటి గురించే ఆలోచిస్తున్నారు. అప్పుడు ఉపనందుడనే ముసలి గొల్ల తను ఇలా అన్నాడు:

ఉ. 'ఇక్కడ నుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు సేయఁగా
రక్కసురాలు చ న్నొసఁగె, ఱాలపయిన్ సుడిగాలి వీచెఁ, బైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ, గేశవు సత్కృపఁ దప్పెఁ, జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే?

423

తా ॥ 'ఓ గోపకులారా! నా మాట హెచ్చరికతో వినండి! మన కృష్ణునికి చెరుపు చేయటం కోసం ఒక రాక్షసి వచ్చి చన్నిచ్చింది. సుడిగాలి వీచి రాళ్ళను త్రోసింది. రెండు మద్దిమ్రాకులు విరిగి పైని కూలాయి. నారాయణుని దయచేత ఆపదలు అన్ని తప్పిపోయాయి, ఇక ఇక్కడ ఉండకూడదు. ఇంకొక క్షేమకర ప్రదేశానికి తరలిపోదాం. వింటున్నారా?

క. కసవు గల దిరవు పసులకు, లసదద్రినదీ మహీజ లతికావలి పెం
పెసఁగును, గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు వొదఁ డచ్చటికిన్.

424

తా ॥ బృందావనం పర్వతములు, ఏరులు, వృక్షాలు, తీగలు వీటిచేత సమృద్ధిగా ఉంది. మంచి పచ్చగడ్డి కూడా పుష్కలంగా ఉంది. అది మన పశువులూ, మనమూ ఉండటానికి తగిన చోటు. అందుకని అక్కడకు వెళితే బాగుంటుంది.'

వ. అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు 'లిదియ కార్యంబు మందల' యని కొందల మందక యాల మందల నమంద గమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తనుత్రాణ తూణీర బాణధరులై విండ్లఁ బట్టు కొని నడవ, బండ్లవెనుకం గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబులు సెలంగ నార్యపురోహిత సమేతులై వేడుకలు కొనలు నిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు.

425

తా ॥ ఇలా ఉపనందుడు చెప్పిన మాటలు విని పూజ్యులైన గోపకులు కొందరు ఇదియే చేయతగిన కార్యం అని నిశ్చయించారు. ఆవుల మందలు వడిగల నడకలతో ముందు నడుస్తుంటే, వాటి వెనుక పసిబిడ్డలు, ముసలి వారు, ఆడవారు ఎక్కిన రథములు బయలుదేరాయి. దాని వెనుక ధనుస్సు, బాణములు, అమ్ముల పొదులు పూని కవచాలు ధరించి కొందరు నడిచారు. ఆ వెనుక కొమ్ములు ఊదుతూ, వాద్యములు వాయిస్తూ, పరిజనులు వెంటరాగా, పెద్దలు పురోహితులుతో కూడి పావనమైన బృందావనానికి ఆ వ్రేపల్లెవాసులు బయలుదేరారు.

తరలము.

పసుపు లాడి యురోజకుంకుమ పంకశోభితలై లస

ద్వసనలై కచభారచంపకదామలై సులలామలై పసిఁడిమాడల కాంతు లఱ్ఱులఁ బర్వఁ దేరులమీఁదఁ బెం

పెసఁగఁ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్.

426

తా ॥ ఆ సమయంలో గోపికలందరు పసుపు పూసుకొని స్నానాలుచేసి కుంకుమ పువ్వుతోడి మంచి గంధపు పూతపూసుకొని మంచి వస్త్రాలు ధరించారు. కొప్పులలో సంపెంగ పువ్వుల దండలు ధరించారు. మేలైన ఆభరణాలు పెట్టుకొని బంగారు మాడల సరములు మెడలందు వ్రేలాడ రథములెక్కి కృష్ణలీలలు ఏలపాటలుగా పాడటం మొదలుపెట్టారు.

వ. అప్పుడు రోహిణీయశోద లేక రథంబునఁ బరిపూర్ణ మనోరథలై రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుం జని, రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి యం దర్ధచంద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందల విడియించి వసియించిరి.

427

తా ॥ అప్పుడు రోహిణీదేవి యశోదలు ఒక రథం మీదనే కూర్చుండి, తమముందు బలరాముని, కృష్ణుణ్ణి కూర్చుండపెట్టుకొని వాళ్ళు చేసే వినోద చేష్టలకు సంతోషిస్తున్నారు. ఈ విధంగా గొల్లలంతా బృందావనం చేరారు. ఆ బండ్లన్నిటిని అర్ధచంద్రాకారంగా నిలిపి ఆవుల మందలను విడిది చేసి తాము నివసించారు.

క. చెందిరి బలమాధవులభి, నందించుచుఁ బరమపావనము సంచిత కా

ళిందీసంజీవనమున్, బృందావనమున్ మునీంద్రబృందావనమున్.

428

తా ॥ ఈ విధంగా బలరామకృష్ణులు ఆనందోత్సాహాలతో పరమపావనమైన బృందావనాన్ని చేరారు. ఆ బృందావనం పాపాలను ప్రక్షాళన చేయగల కాళిందీ నదితో శోభాయమానంగా ఉన్నది. అంతేకాక అది మునిశ్రేష్ఠులకు ఆలవాలంగా నిలిచి ఉన్న పవిత్ర ధామం.

వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడికొని వేడుక లూఁదుకొన దూడలఁ గాచుచు.

429

తా ॥ ఇలా బృందావనానికి చేరి రామకృష్ణులు ఉత్సాహంతో తమ ఈడు గొల్లపిల్లవాండ్రతో కలిసి దూడలను కాచుకోసాగారు.

సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున,
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని పరవృషభము లని ప్రతిభటింతు,
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జెలు మొరయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూల్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప,

తే. వన్యజంతుచయంబుల వాని వాని, పదురు పదురుచు వంచించి పట్టఁబోదు,
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు, రా కుమారులు బాల్యవిహారు లగుచు.

430

తా ॥ ఒక పక్క దూడలను కాపుకాస్తూ, మరొకపక్క వివిధములైన బాల్యక్రీడలను ఈ విధంగా చేస్తుండేవారు. వేణువులను ఊదుతూ, రకరకాల వేషాలు వేస్తూ గంతులు వేసేవారు. పెద్ద పెద్ద కంబళ్ళతో ఆబోతుల రూపాలు చేసి, అవి శత్రు వృషభాలు కనుక మనం

ప్రతిఘటించాలి అని వాటిని ఎదిరించేవారు. వస్త్రములతో బంతుల వలె చేసి, కాలి అందియలు ఘల్లుఘల్లు మని మ్రోగగా వాటిని బంతివలె తన్నుకునేవారు. పందాలు వేసుకుంటూ, వడిసెలతో పళ్ళగుత్తులను నేర్పుగా రాలకొట్టేవారు. అడవి జంతువులను అనుకరణ ధ్వనితో పిలుస్తూ, అవి రాగానే నేర్పుగా పట్టుకునేవారు. తామరలతో నిండి ఉన్న కొలనుల్లో దూకి ఒకరిపై ఒకరు నీరు చల్లుకునేవారు.

క. పోరుదురు గికురు వొడుచుచుఁ, దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్,
జాఱుదురు ఘనశిలాతటి, మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా!

431

తా ॥ ఓ రాజా! ఒకరి నొకరు వెక్కిరిస్తూ పోరాడుకుంటారు. భయం లేకుండా గొప్ప పొదరిండ్లలో దూరతారు. ఏటవాలుగా ఉన్న నాపరాళ్ళ మీదకు ఎక్కి జారుతూ ఉంటారు. మెలకువలు చూపించటంలో ఒకరినొకరు మించుతారు.

వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు క్రేపురూపున వచ్చి వారల హింసింపం దలంచి.

432

తా ॥ ఇలా కొంతకాలం సాగాక, ఒకరోజున యమునా నదీ తీరంలో ఆ బలరామకృష్ణులు దూడలను మేపుకుంటూ ఉండగా, వాళ్ళని సంహరించడం కోసం ఒక రాక్షసుడు దూడ రూపంలో అక్కడకు వచ్చి చేరాడు.

## 16. వత్సాసుర బకాసురుల వధ

క. క్రేపుల యఱ్ఱులు నాకుచుఁ, గ్రేపులతో నిదియె మంచి క్రే పనఁగఁ గడుం
జూపట్టి భక్తి సంగతిఁ, గ్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్.

433

తా ॥ దూడల మందలో కలిసి మిగిలిన దూడల మెడలు నాకుచు, దూడలలో ఇదే మంచి దూడ అన్నట్లుగా ప్రవర్తించసాగాడు. భక్తుల వెంట దూడలా తిరిగే కృష్ణుని ఎదుట, మంచి దూడ అన్నట్లుగా సంచరించాడు.

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి.

434

తా ॥ ఆ రాక్షసుణ్ణి కృష్ణుడు గుర్తించి బలరామునితో ఇలా చెప్పాడు:

చ. 'ఇది యొక మంచిలేఁగ, వినుఁ డెంతయు నొప్పెడి' నంచు దాని త
త్పదములఁ దోఁకయున్ బిగియఁబట్టి చెలంగి వెలంగ మ్రానితోఁ
జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం,
గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ నఖర్వలీలతోన్.

435

తా ॥ 'ఇది ఒక మంచి లేగ, చూడండి ఎంత చక్కగా ఉందో' అంటూ దాని కాళ్ళు, తోకను గట్టిగా పట్టుకుని పైకెత్తి, అక్కడ ఉన్న వెలగచెట్టు కేసి ఒక్కసారిగా మోదగా, ఆ దెబ్బకు ఆ రాక్షసుడు గిలగిల కొట్టుకుని చనిపోయాడు. ఈ లీలను చూసిన గోపబాలకులు ఆనందంతో కేకలు వేశారు.

వ. ఇట్లు రక్కసుండు వ్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలంగూలె, నప్పుడు.

436

తా ॥ ఇలా ఆ రాక్షసుడు నేలకూలాడు, ఆ వెలగ చెట్టు కూడా నేలకూలింది.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ, ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్.

437

తా ॥ అంతట ఆ గోపకులు కంబళ్ళు గాలిలో ఎగరవేస్తూ చెంగున దూకి వస్తూ, చప్పట్లు కొడుతూ, సంతోషంతో పొంగిపోతూ కృష్ణుణ్ణి పొగడసాగారు. చనిపోయిన రాక్షసుణ్ణి చూసి గర్వంతో గంతులు వేయసాగారు.

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి, రివ్విధంబున.

438

తా ॥ ఆ సమయంలో దేవతలు పువ్వుల వాన కురిపించారు.

క. వత్సముల పగిది జగముల, వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుంటన్
వత్సముల మేపు చుండియు, వత్సాసురుఁ జంపె భక్త వత్సలుఁ డధిపా!

439

తా ॥ ఓ రాజా! లోకములను వాత్సల్యభావంతో సంరక్షించేవాడైన ఆ శ్రీకృష్ణుడు, ఈ విధంగా లేగ దూడలను మేపుతూనే, దుర్మార్గుడైన వత్సాసుర వధను గావించాడు. భగవంతుని వాత్సల్యము సజ్జనులకు ప్రీతిపాత్రంగా, దుర్జనులకు కంటకంగా పరిణమిస్తుందనడానికి ఇదే నిదర్శనం.

వ. మఱియు నొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని యొడంబడి మెండుకొనిన దప్పిని బెండువడిన తమతమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి, తామును జలపానంబు సేసి వచ్చునెడ నందు.

440

తా ॥ ఒకనాడు గోపకుమారులు దూడలతో అడవికి వచ్చినప్పుడు, ఎండ వేడిమికి మిక్కిలి దాహం వేయగా తమ లేగల సమూహాన్ని అంతా ఒక కొలను దగ్గరకు తీసుకుని వెళ్ళారు. నిర్మలమైన ఆ నీటిని తాము త్రాగి, లేగలకు కూడా పట్టించి, కబుర్లు చెప్పుకుంటూ వెనుతిరిగి వస్తున్నారు.

క. అకలంకులు బాలురు గని, రకుటిలదంభోళిహతసితాద్రి శిఖర రూ
పకమున్ హరిహింసారం, భకమున్ బకమున్ విశాల భయదాంబకమున్.

441

తా ॥ ఇంతలో కపటం లేని ఆ గోపకుమారులకు భీతిని కొల్పే విధంగా ఒక కొంగ కనిపించింది. వజ్రాయుధం చేత కొట్టబడిన వెండికొండ శిఖరంలా మిక్కిలి పొడవుగా ఉండి, శ్రీకృష్ణుణ్ణి బాధపెట్టే ఉద్దేశంతో భయంకరమైన చూపులతో అక్కడ నిలిచి ఉన్నది.

వ. కని దానియొడలి పొడవునకు వెఱఁగుపడి చూచు చుండ.

442

తా ॥ అంతట ఆ గోపకుమారులు దాని శరీరపు పొడుగును చూచి ఆశ్చర్యపోయారు.

ఆ. ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁడై, మౌనివృత్తి నితర మమత విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ, జేర్చి బకుఁడు దపసి చెలువుఁ దాల్చె.

443

తా ॥ అన్ని పనులను మానుకుని, ఇతరములైన ఏ ఆలోచనలు లేక నిర్వికారంగా, ఏకాగ్రచిత్తంతో భగవంతుణ్ణి ధ్యానించే మునులవలె, అది కృష్ణునికై ఎదురుచూస్తోంది. కృష్ణుణ్ణి సంహరించాలనే ఉద్దేశ్యంతో అలా నిలిచినా దాని తపస్సు సిద్ధించి కృష్ణుడు అరుదెంచాడు.

వ. ఇ వ్విధంబున నొదుఁగు వెట్టికొని యుండి.

444

తా ॥ ఈ విధంగా కొలనువద్ద కొంగవలె మాటు వేసి ఉన్నాడు బకాసురుడు.

ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి, భీషణ ఘోషణ వక్త్రుఁడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్ని కృష్ణునిన్.

445

తా ॥ ఆ రాకాసి కొంగ కృష్ణుణ్ణి చూడగానే ముక్కును దీటుచూ, రెక్కలు విదిలించి ఒక్కసారిగా పాదాలను పైకి లేపి గాలిలోనికి ఎగిరింది. భయంకరమైన ధ్వనిని చేస్తూ ఎగురుతూంటే, ఆ రెక్కల వేగానికి గాలి ప్రచండమై, అక్కడ చెట్లను కూల్చసాగింది. దీనినంతటిని గమనిస్తున్న ఆ బాలకృష్ణుణ్ణి అమాంతంగా ఒడిసి పట్టి మింగివేశాడు కొంగరూపంలోని ఆ రాక్షసుడు.

క. సంగడిలోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడు, వేడుకకాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా!

446

తా ॥ లోకాలన్నిటిని తననుండి పుట్టిస్తూ, సంరక్షిస్తూ, తిరిగి లయం చేస్తూ క్రీడించే ఆ పరమ పురుషుడు ఈ విధంగా బకాసురునిచేత మ్రింగబడ్డాడు. ఇది కూడా ఒక లీలయే కదా!

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ, గనలేక బలాది బాలకప్రముఖు లచే
తనులై వెఱఁ గందిరి చ, య్యనఁ బ్రాణము లేని యింద్రియంబుల భంగిన్.

447

తా ॥ బకాసురుడు కృష్ణుణ్ణి మ్రింగడం చూసిన బలరామాది బాలక ప్రముఖులు అందరూ ఒక్కసారిగా అచేతనులై, నిశ్చేష్టంగా నిలిచి ప్రాణాలు కోల్పోయినట్లు దిగ్భ్రమను పొందారు.

వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక.

448

శా. కంఠోపాంతము దౌడలున్ మెఱముచుం గాలాగ్ని చందంబునం
గుంఠీభూతుఁడు గాక వేంద్రమగు నాగోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కన్ మ్రింగ రాదంచు
ను ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకంబశోకంబుగన్.

449

తా ॥ ఆ విధంగా మింగబడిన కృష్ణుడు పూర్తిగా లోపలికి వెళ్ళకుండా కంఠం దగ్గరే ఉన్నాడు. ఉండి బకాసురుని అంగిలిని దౌడలను కాలాగ్నిలా కాల్చేస్తున్నాడు. నిప్పువలె అధిక తాపాన్ని కలగచేస్తున్న ఆ బాలున్ని ఆపడం ఆ రాక్షసునికి తెలియలేదు. కానీ తనను గెలిచే ప్రయత్నం చేస్తున్న వానిని, సాక్షాత్ బ్రహ్మకు తండ్రి అయిన వానిని, మహా మహిమోపేతుని మ్రింగటం సాధ్యమయ్యే విషయం కాదని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. దానితో తిరస్కార పూర్వకంగా నిందిస్తూ, లోకంలో సకల ప్రాణుల దుఃఖము తొలగిపోయేటట్లు ఆ గోపాలుణ్ణి మళ్ళీ బయటకు నెట్టాడు.

క. క్రక్కి మహాఘోషముతోఁ, జక్కఁగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
సుక్కఁగఁ బట్టి తృణముక్రియ, గ్రక్కున హరి సీరె బకునిఁ గలహోత్సుకునిన్.

450

తా ॥ ఇలా బయటకు వెడలగ్రక్కి బకాసురుడు వెంటనే తన వాడియైన ముక్కుతో కృష్ణుణ్ణి చంపాలని ప్రయత్నించాడు. శ్రీకృష్ణుడు అంతట ఆ ముక్కు పుటాలు రెండూ పట్టుకుని గడ్డిపోచను చీల్చినట్టు రెండుగా చీల్చి వేశాడు.

వ. అప్పు డా నందనందనునిమీఁద వేలుపులు చాలుపులుగా నందన మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి, దేవవాద్యంబులు మొరసె, రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులునుం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితులయి లేఁగ దాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి, వారల చేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు.

451

తా ॥ ఈ విధంగా బకాసురుని వధ జరుగగానే, ఆ నందనందనుని మీద దేవతలు నందనవనంలోని మల్లెలు మొదలైన పువ్వులను వానగా కురిపించారు. ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయి. బలరామాది గోపకుమారులకు ఊపిరి తిరిగి రాగా కృష్ణుణ్ణి చేరదీసుకొని కౌగిలించుకున్నారు. పిమ్మట అందరూ కూడి దూడలగుంపులను తోలుకొని బృందావనానికి వెళ్ళిపోయారు. వెళ్ళి అక్కడి వారితో కృష్ణుడు వత్సాసుర బకాసురులను చంపిన వృత్తాంతాన్ని చెబితే వారంతా ఆశ్చర్యపోయారు, ఆశ్చర్యపడి ఇట్లా అనుకున్నారు:

క. ఆపదలమీఁద నాపద, లీ పాపనిఁ జెంది తొలఁగె, నీ యర్భకుపై
వే పడిన ఖలులు దహనుని, వైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్.

తా ॥ 'ఈ బాలకృష్ణునికి ఆపదలమీద ఆపదలు వస్తూనే ఉన్నాయి, అంతలోనే తప్పిపోతున్నాయి. పసివాడు కదా అని విజృంభిస్తున్న దుర్జనులు అగ్నిలో పడ్డ మిడతల్లాగ మాడి నేలకూలుతున్నారు.'

వ. అని పలికిరి, మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱి.

453

సీ. కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు గాలువలకు,
మునులమై తపములు మొనయుదమా యని మౌనులై యుందురు మాట లేక,
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁజొత్తు,
రప్సరోజనులమై యాడుదమా యని యాఁడు రూపులఁ దాల్చి యాడఁ జనుదు,

ఆ. రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా, యని సరోవరములయందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమయీడు కొమరు లనుసరింపఁ గొమరు మిగుల.

454

తా ॥ అని అనుకున్నారు గోపికలు. అసురవధలను గావిస్తున్నా ఆ రామకృష్ణులు దూడలను కాచే సమయంలో ఏమీ ఎరుగని చిన్న పిల్లల వలె ఆటలు ఆడుకుంటున్నారు. ఆ ఆటలు ఎలా ఉన్నాయంటే, మనం కోతుల్లాగా సముద్రానికి సేతువు కడదామా అని కాసేపు కాలువలకు అడ్డకట్టలు కడుతూ ఉంటారు. మనం మునుల్లాగ తపస్సు చేద్దామా అని మౌనాన్ని ధరించి కన్నులు మూసుకుని నిశ్చలంగా ఉండిపోతారు. మనం గంధర్వుల్లాగా గానం చేద్దామా అంటూ పాటలు పాడటం ప్రారంభిస్తారు. అప్సరసల్లాగ నాట్యం చేద్దామా అని స్త్రీ వేషం వేసుకొని నృత్యాలు చేస్తారు. దేవాసురులమై సముద్రాన్ని చిలుకుదామా అంటూ సరస్సులలో చేతులు త్రిప్పుతూ నీళ్ళను చిలుకుతూ ఉంటారు. బలరామకృష్ణులు ఇలా ఏ ఆట ఆరంభిస్తే, అది

తక్కిన వారంతా అనుసరిస్తూ, ఆనందంగా ఆటపాటలలో మునిగేవారు.

## 17. శ్రీకృష్ణుడు గోపకులతో బంతి చల్దులు కుడువనేగుట

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతారంబున బంతి చలుదులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి, గ్రద్దనం దమ యింటి లేఁగకదుపులఁ గదలించి, సురంగంబులకు శృంగంబులు పూరించిన విని, మేలుకని, సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూపుల వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టికొని, పదత్రాణవేత్రదండధరులై, లెక్కలకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ, గాననంబు సొచ్చి, కాంచనమణి పుంజగుంజాది భూషణభూషితు లయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు దొడవులుగా నిడుకొని, కొమ్ము లిమ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబుల తోడం గూడి యాడుచు, బింకంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ, బులుఁగుల నీడలం బాఱుచు సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులం జోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీవయుయ్యేలల నూఁగుచుఁ, బల్లంబులన్ డాఁగుచు, దూరంబుల కేగుచుఁ, గపుల సంగడిఁ దరువు లెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు సూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకారంబుల శరీర వికారంబులు సేయుచు మఱియును.

455

తా ॥ ఒకనాడు బలరామకృష్ణులు అడవిలో బంతిగా కూర్చుని వనభోజనాలు చేయాలని సరదా పడ్డారు. ఉదయాన్నే నిద్రలేచి లేగదూడలను తోలుకుని బయటకు వచ్చారు. అందమైన కొమ్ము బూరాలతో ఊదగా, ఆ ధ్వనికి మిగిలిన గోపబాలకులు మేల్కొని గబగబా తయారైనారు. చద్ది అన్నపు మూటలను భుజాలకు తగిలించుకున్నారు. తల్లులు సిద్ధం చేసిన పిండివంటలను కూడా తీసుకున్నారు. చేతుల్లో ఊతకర్రలను, కాళ్ళకు చెప్పులను ధరించారు. అసంఖ్యాకంగా

ఉన్న లేగ దూడలను తోలుకుంటూ, సందడిగా బయలుదేరారు. ఆయాసం వచ్చేలా పరుగులు పెడుతూ అడవిలో ప్రవేశించారు. బంగారు ఆభరణాలను ధరించి ఉన్నా, లేతచిగుళ్ళతో, పూలతో అలంకారాలు చేసుకున్నారు. కొమ్ము బూరాలు పూరిస్తూ, వేణువులను ఊదుతూ, తుమ్మెదలతో సమంగా ఝుంకారాలు చేయసాగారు. నెమళ్ళతో సమానంగా నాట్యం చేయసాగారు. కోకిలలను, రామచిలుకలను అనుకరిస్తూ ధ్వనులు చేయసాగారు. ఆకాశంలో ఎగురుతున్న పక్షుల నీడలతో తామూ పరుగెత్తసాగారు. సెలయేళ్ళు వచ్చినప్పుడు చెంగున దాటారు. హంసల నడకలను అనుకరిస్తూ, కొంగలవలె ఒంటికాలిమీద నిలబడ్డారు. తీగల ఊయలలు ఊగారు. కోతులతో పాటుగా చెట్లు ఎక్కుతూ, పండ్లను తింటూ ఆనందపడసాగారు. కుప్పించి దూకుతూ తమ నీడలను చూసుకుని మురిసిపోయారు. సరదాగా పోట్లాడుకొంటూ, ఆడుతూ, పాడుతూ, పరుగులు పెడుతూ ఇలా ఎంతో హుషారుగా ఆ అడవిలో విహరిస్తున్నారు.

క. ఒకనొకని చల్దికావడి, నొకఁ డొకఁ డడకించి దాఁచు, నొకఁ డొకఁ డది వే

ఱొకఁ డొకని మొఱఁగి కొని చన, నొకఁ డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా!

456

తా ॥ ఈ లోపున ఆ అడవిలో చేరిన వారిలో ఒకడి చల్దికావడిని మరొకడు లాక్కుని దాచివేశాడు. వాడిని మోసగించి ఇంకొకడు దానిని తీసుకొని వెళ్ళితే, వేరొకడు సంగ్రహించి మొదటి వాడికిచ్చాడు. ఇలా ఒకరిని ఒకరు ఆటపట్టించుకునేవారు.

క. ఒక్కఁడు ము న్నే మఱి చన, నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్, వే

ఱొక్కఁడు మిట్టి తటాలున, నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.

457

తా ॥ ఒకడు పరధ్యానంగా నడుస్తుంటే, వాడు ఉలికి పడేటట్లు వాడివెనకాల ఇంకొకడు బిగ్గరగా అరవసాగాడు. ఒకడు ముందుగా ఉంటే, ఇంకొకడు తటాలున వాడి వద్దకు పోయి

వాడి కన్నులు మూస్తాడు, అది చూసి ఇంకొకడు నవ్వుతాడు.

క. తీపుగల కజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం
బైపడి యది గొని యొక్కఁడు, క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా!

458

తా ॥ ఓ రాజా! ఒకడి దగ్గరనున్న తియ్యని భక్ష్యాన్ని మరొకడు ఒడిసి పట్టుకుని పారిపోతూ ఉంటే ఆ మొదటివానికి దుఃఖం వచ్చింది. వాడు దీనత్వంతో ఇమ్మని అడిగితే ఇవ్వకుండా దూడల మందలో దాక్కుని, ఆ వైపు ఈ వైపు పరుగులుపెట్టే వాడింకొకడు.

క. వనజాక్షుఁడు ము న్నరిగిన, 'మునుపడఁగా నతని నేనె ముట్టెద' ననుచుం
జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా!

459

తా ॥ రాజా! కృష్ణుడు ముందు వెళుతూ ఉంటే, ఇద్దరు బాలురు కృష్ణుణ్ణి ముందు నేను ముట్టుకుంటాను అంటే నేను ముందు ముట్టుకుంటాను అని పరుగెడతారు. ముందుగా కృష్ణుణ్ణి ముట్టుకున్నవాడు, ముట్టుకోలేని వాణ్ణి చూసి పకపకా నవ్వుతాడు.

వ. ఇ వ్విధంబున.

460

ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం
గన్నులఁ గానరట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచుం
దన్నుచుఁ గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్
మన్నన సేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే?

461

తా ॥ ఈ విధంగా ఎవరి పాదధూళి మహా యోగీశ్వరులకు సైతం దుర్లభమైనదో, అట్టి పరమాత్ముడు గోపబాలకులతో కలిసి చెట్టాపట్టాలేసుకుని ఆడుతున్నాడు. వారు అతనిని ఆలింగనం చేసుకుంటూ, తన్నుతూ, హాస్యాలాడుచున్నారు, అతనితో ఆటలాడుతున్నారు. ఆహా! వారి భాగ్యం ఏమని చెప్పేది?

క. విందులకును బ్రహ్మసుఖా, నందం బై భక్తగణమునకు దైవత మై
మందులకు బాలుఁడగు హరి, పొందుఁ గనిరి గొల్ల! లిట్టి పుణ్యులు గలరే?

462

తా ॥ యోగులకు సచ్చిదానంద స్వరూపుడూ, భక్తులకు ఆరాధ్యుడైన ఆ శ్రీహరి అజ్ఞానులకు సామాన్య బాలకుని వలె అగుపిస్తాడు. అటువంటి పరమపురుషుని సాన్నిధ్యాన్ని పొందారు గోపబాలురు. వీరి కన్నా పుణ్యాత్ములు ఇంక ఎవరు ఉంటారు?"

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె.

463

తా ॥ ఈ విధంగా చెప్పిన తరువాత శుక యోగీంద్రుడు ఇంకా ఇలా అన్నాడు:

క. అమరు లమృతపానంబున, నమరినవా రయ్యు నే నిశాటుని పంచ
త్వమునకు నెదుళ్ళు సూతురు, తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై.

464

క. బకునికిఁ దమ్ముఁడు గావున, బకమరణము దెలిసి కంసుపంపున గోపా
లక బాలురతోఁగూడను, బకవై రినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్.

465

తా ॥ "దేవతలు అమృత పానము చేసిన వారైనా కూడా, ప్రాణభయంతో ఏ రాక్షసుని

చావుకై ఎదురు చూస్తూ ఉంటారో, అటువంటివాడు అఘాసురుడు. కృష్ణుడు ఇంతకు ముందు చంపిన బకాసురునికి తమ్ముడు వీడు. తన అన్నను చంపిన వానిని, తోడుగా ఉన్న బాలురందరినీ సంహరించి వస్తానని దర్పంతో, రోషంతో బయలుదేరాడు. కంసుని ఆజ్ఞానుసారం బయలుదేరినవాడు ఆ అఘాసురుడు.

క. 'బాలురు ప్రాణంబులు గో, పాలురకు, మదగ్రజాతు ప్రాణము మా ఱీ
బాలురఁ జంపిన నంతియ, చాలును, గోపాలురెల్ల సమసినవారల్.

466

తా ॥ వాడు తనలో ఇలా అనుకున్నాడు: 'గోపాలకులకు ఈ ఇద్దరు బాలురే ప్రాణం. నా అన్నగారైన బకాసురుడి ప్రాణానికి బదులు ఈ ఇద్దరు బాలురను చంపితే, చాలు! గోపాలురంతా చచ్చినట్లే!'

వ. అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడవును, గొండతుదల మీఱిన కోఱలును, మిన్ను దన్ని పన్నిన నల్లమొగిళ్ళ పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలం బైన యిగుళ్ళ సందులును, నంధకారబంధురంబైన వదనాంతరాళంబును, దావానల జ్వాలాభీలంబైన దృష్టి జాలంబును వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాస నిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు నజగరాకారంబున.

467

తా ॥ అని నిశ్చయించుకున్న అఘాసురుడు, భయంకరమైన కొండచిలువ రూపాన్ని ధరించాడు. ఆ కొండ చిలువ ఎలా ఉంది అంటే ఆమడ పొడవున, కొండంత ఎత్తు కలిగి ఉంది. దాని కోరలు కొండ కొమ్ములను మించి ఉన్నాయి. ఆకాశమునంటి వ్యాపించిన నల్లమబ్బుల వంటి పెదవులు, పర్వత గుహలను మీరిన కోరల మధ్యనున్న సందులతో, అంధకార బంధురమైన నోటిలోపలి భాగాన్ని కలిగి ఉంది. కార్చిచ్చు మంటల వంటి కనుగ్రుడ్లు, చాలా వేడి

అయిన ఉచ్ఛ్వాసనిశ్వాసాలు కలిగి నేలపై నాలుకలు పరచుకొని ఆ కొండచిలువ ఘోరాకృతితో గోపబాలకులకై వేచి ఉన్నది.

క. జాపిరము లేక యిప్పుడు, గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్
గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపు రక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా!

468

తా ॥ ఓ రాజా! పాపాత్ముడైన ఆ రాక్షసుడు దూడలతోను, గోప బాలురతోనూ కృష్ణమూర్తిని విలవిల లాడేలా పట్టుకొని మ్రింగుతాను అని నోరు తెరచుకుని మరీ ఆ త్రోవలో ఎదురు చూస్తున్నాడు.

అఘాసురుడు అంటే మనలోని 'అహం' అనబడే వృత్తి. అది అనుక్షణం నోరు తెరుచుకుని మనలను కబళించేందుకు సిద్ధంగా ఉంటుంది.

వ. ఆ సమయంబున.

469

మ. 'ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావ పా
వక కీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతో ఘోర వ
హ్ని కరాళాతత జిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటంబై పడిసాఁగి యున్నది పురోవీథిం గనుంగొంటిరే?

470

వ. అని యొండొరులకుం జూపుచు.

471

తా ॥ ఇంతలో ఆ గోపబాలురు వస్తూ, ఆ అడవి కొండ చిలువను చూసారు. చూచి

'అదిగో! ఎదుట హిమవత్పర్వత మంత కొండచిలువ. నోటిలో అగ్ని జ్వాలలతో, బుసలు కొడుతూ, మిక్కిలి పొడవుగా ఉన్నది. భయాన్ని కలిగించే విధంగా పొడవైన నాలుకను చాచుతూ మనలను హింసించడానికి చూస్తోంది!' అని ఈ విధంగా ఒకరితో ఒకరు అనుకుంటూ దానిని చూపుతున్నారు.

మ. బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బాముంచుఁ జింతింప నే
టికి? రా పోదము దాఁటి, కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటం జనుఁ గృష్ణుచేత ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకు లై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారులై పోవఁగన్.

472

తా ॥ అయితే ఎవరూ భయపడలేదు. వాళ్ళలో వాళ్ళిలా అనుకున్నారు: 'బకాసురుణ్ణి చంపిన కృష్ణుడుండగా మనం పాములను చూసి భయపడటం దేనికి? రండర్రా దాటిపోదాం! ఒకవేళ అది కుటిలత్వంతో మ్రింగడానికి ప్రయత్నం చేస్తే, కృష్ణుని చేతిలో బకుని వలే ఇది కూడా వెళుతుంది!' అని ఇలా మాట్లాడుకుంటూ గోపబాలురు ఉత్సాహంతో ఒకరిపై ఒకరు చేతులు వేసుకొంటూ నడిచారు.

వ. వారలం జూచి హరి దన మనంబున.

473

ఉ. 'అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ, రక్కటా!
నిర్భయులై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా
విర్భవదాగ్రహత్వమున వెన్తగులం దమలేఁగ పిండుతో
దుర్భర ఘోర సర్పఘన తుండ బిలాంతముఁ జొచ్చి రందఱున్.

474

తా ॥ వారిని చూసి ఆ కృష్ణుడు ఇలా అనుకున్నాడు – 'అయ్యో! ఈ అమాయకులు అది మామూలు పాము కాదనీ, మహా క్రూరమైన రాక్షసుడని తెలియక నేనున్నాననే ధైర్యంతో దానికి ఎదురు వెళుతున్నారు' అని అనుకుంటూ ఆ రాక్షసునిపై కోపిస్తూ, కృష్ణుడు కూడా వారి వెనుకనే పాము నోటిలో ప్రవేశించాడు. ఈ విధంగా లేగదూడలతో సహా అందరూ ఆ కొండచిలువ నోటిలోనికి చేరుకున్నారు.

వ. అ య్యవసరంబున.

475

శా. వేల్పుల్ సూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమాన జిహ్వా దహనాకారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారులన్
స్వల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్.

476

తా ॥ ప్రళయకాలాగ్నితో సమానమైన జ్వాలలతో ఆ కొండచిలువ నోటిలోని వారిని మ్రింగడం చూస్తున్న దేవతలు సైతం భయపడిపోయారు. అయితే శారీరకంగా అర్భకులే అయిన ఆ గోపబాలురు కృష్ణునికి తమని తాము సర్వసమర్పణం గావించుకున్నందున, ఏ మాత్రము అధైర్యపడక ప్రశాంతంగా ఉన్నారు. ఇదే కదా స్వామి మెచ్చేదీ భక్తులకు ఉండవలసినది అయిన లక్షణము!

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు సంగడికాండ్రగమిం జూచి కృష్ణుండు.

477

చ. 'పడుచులు లేఁగలుం గలసి పై కొని వత్తురు తొల్లి కృష్ణ! మా
కొడుకు లదేల రా?' రనుచు గోపిక లెల్లను బల్కనే్రియన్

నొడివెద? నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా
నొడఁబడ నేలచేసె? విధి యోడక సేయుఁగదయ్య క్రౌర్యముల్!

478

తా ॥ ఇలా కొండచిలువ చేత మింగుడు పడ్డ స్నేహితులను చూసి కృష్ణుడు ఇలా అనుకున్నాడు: 'నేను బృందావనానికి వెళ్ళేసరికి, గోపికలంతా ఎదురు వచ్చి కృష్ణా! ఇంతకు ముందు ప్రతిరోజు మా మా బిడ్డలు దూడలూ నీతో ఆడుకొంటూ ఉత్సాహంతో వచ్చేవారే! నేడు మా కొడుకులు రాక నీవు మాత్రం ఒంటరిగా వచ్చావు! దీనికి కారణం ఏమిటి?' అని అడుగుతారు. అప్పుడు వారికి ఏమి సమాధానం చెప్పాలి? ఔరా! దైవం ఎంత క్రూర కృత్యానికి పాల్పడింది! ఇంతమంది పిల్లలను దూడలతో కూడా ఈ పాము నోట్లో పడేటట్లు చేసిందే!

వ. అని తలపోసి, నిఖీలలోచనుండును, నిజాశ్రితనిగ్రహ మోచనుండును నైన తమ్మికంటి, మింటితెరు వరులు మొఱలిడ రక్కసు లుక్కుమిగుల వెక్కసంబగు నజగరంబయి యున్న య న్నర భోజను కుత్తుకకుఁ బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్ము నందఱఁ జిందఱవందఱ సేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబు వెంచి గ్రద్దన మిద్దె సఱచి నట్లుండ.

479

తా ॥ అని ఆలోచిస్తూ, ఆకాశం నుండి దేవతలు మొరపెట్టడం, రాక్షసులు గర్వంతో మిడిసిపడటం గమనించాడు కృష్ణుడు. సర్వాన్ని చూడగలిగినవాడు, ఆశ్రయించినవారి కష్టాలను తొలగించేవాడు కదా ఆ నళినదళాక్షుడు! అందరినీ లోపలకు లాగి మ్రింగేందుకు ప్రయత్నిస్తున్న ఆ కొండచిలువ కంఠం వద్ద తన శరీరాన్ని విపరీతంగా పెంచేసాడు. దానితో ఆ కొండచిలువకు ఊపిరి అందడం లేదు.

క. ఊపిరి వెడలక కడుపున, వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం

తాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ బటు ఘోషముతోన్.

480

తా ॥ శ్వాస ఆడకపోయేసరికి పొట్ట ఉబ్బిపోయి, ప్రాణవాయువులు అధిక ధ్వనిచేస్తూ తలపక్క భాగాలను బద్దలు చేస్తూ బయటకు రాగా, భయంకర శబ్దము గావిస్తూ ఆ కొండచిలువ చనిపోయింది.

శా. క్రూరవ్యాళ విశాల కుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ
గారుణ్యామృతవృష్టిచేత బ్రదుకంగాఁ జూచి వత్సంబులున్
వారుం దాను దదాస్యవీథి మగుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై తారానీకముతోడ నొప్పెసఁగు
నా తారేశుచందంబునన్.

481

తా ॥ అలా కృష్ణుడు ఆ క్రూరసర్పం యొక్క విశాలమైన కడుపులో దూరిపోయిన గోపబాలకులను దూడలతో సహా, తన కరుణామృత వర్షంతో బ్రతికించాడు. వారంతా దాని నోట్లోంచి మబ్బుచేత విడువబడ్డ నక్షత్రాలూ, చంద్రునివలె బయటకు వచ్చారు.

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల, బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపుఁ బెనుఁబాము, గళము దూఁటుగట్ట బలియకున్నె!

482

తా ॥ దేవతల కోసం బలి చక్రవర్తిని అణచేందుకు అమాంతం బ్రహ్మాండం అంతా పెరిగాడు గదా వామనావతారంలో విష్ణువు. అటువంటివాడు, అమాయకులైన గోపబాలుర కోసం ఆ క్రూరమైన అజగరం గొంతు బద్దలయ్యే విధంగా మేనుని పెంచడంలో వింత ఏముంది?

ఉ. ఆ పెనుఁబాము మేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో
ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచుం
గ్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణునిదేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు సొచ్చి ప్రాణములఁ బాపిన యంతన శుద్ధ సత్త్వమై.

483

తా ॥ అనంతరం ఆ కొండ చిలువ దేహము నుండి ఆశ్చర్యకరమైన తేజస్సు దిక్కులను ప్రకాశింప చేస్తూ, ఆకాశంలో వెలుగుతూ వచ్చి కృష్ణుని యందు ప్రవేశించింది. ఆ దృశ్యాన్ని చూసి పిల్లలంతా బెదరిపోయారు. ఆ బాలకృష్ణుడు తన కడుపులో ప్రవేశించిన మాత్రాన అంతటి క్రూరసర్పమూ శుద్ధ సత్వమయం అయిపోయింది.

క. తన రూ పొక మా ఱైనను, మనమున నిడికొనినఁ బాపమయు నైనను లోఁ
గొని చను హరి దను మ్రింగిన, దనుజునిఁ గొనిపోవకున్నె తన లోపలికిన్?

484

తా ॥ శ్రీహరి రూపాన్ని మనస్సులో ఒకమారు నిలుపుకుంటే, వారు ఎంతటి పాపాలను చేసినా ఆ హరి తనలో ఐక్యం చేసుకుంటాడు కదా! అటువంటి కరుణాత్ముడు తనను మింగిన దనుజుని తనలోనికి స్వీకరించడం ఆశ్చర్యకరమైన విషయం ఏమీ కాదు.

వ. తదవసరంబున, సురలు గుసుమవర్షంబులు గురియించిరి, రంభాదు లాడిరి, గంధర్వాదులు పాడిరి, మేఘంబులు మృదంగంబుల భంగి ఘోషించె, సిద్ధగణంబులు 'జయజయ' భాషణంబులు భాషించి, రంత.

485

తా ॥ ఆ సమయంలో దేవతలు పుష్పవృష్టి కురిపించారు. రంభాదులు నాట్యం చేసారు. మేఘాలు మృదంగాల మాదిరి ఘోషించాయి. సిద్ధులు, గంధర్వులు జయ జయ ధ్వానాలు

చేశారు.

శా. ఆ వాద్యంబులు, నా మహాజయరవం, బా పాట లాయాటలుం
దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి నేఁ
డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం
డేవెంటన్ బ్రదికించె? మే, లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్.

486

తా ॥ దేవతలందరికీ పెద్దవాడైన చతుర్ముఖ బ్రహ్మ, దేవతలు వాయించిన వాద్య ధ్వనులను, ఆ జయ జయ ధ్వనులను, ఆ పాటలు, ఆ మాటలు అన్నీ విన్నాడు. విని అంత గొప్ప పాము చేత హింసింపబడిన ఈ దూడలను పిల్లలను ఈ బాలకృష్ణుడు ఎలా బ్రతికించాడు? ఇది చాలా మెచ్చుకోదగిన విషయం కదా! అని నివ్వెరపోయాడు.

వ. అంత న య్యజగరచర్మంబు గొన్ని దివసంబుల కెండి పెద్ద కాలంబు గోపాలబాలురకుం గేళిబిలంబై యుండె, నిట్లు కౌమార విహారంబున నైదవయేఁటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచుటయుఁ దమ్ముం గాచుటయు, నాఱవ యేఁటిదైన పౌగండవృత్తాంతం బని చిత్తంబులం గోపకుమారులు దలంచు చుందు రని చెప్పిన నప్పుడమిఱేఁడ ప్పరమయోగీంద్రున కిట్లనియె.

487

తా ॥ అటు పిమ్మట ఆ పాము తోలు చక్కగా ఎండి గొల్ల బాలురు ఆడుకొనేందుకు గుహలాగా పనికి వచ్చింది. ఈ విధంగా కృష్ణుడు అఘాసురుని తన కౌమారంలో అంటే ఐదవ ఏట సంహరించాడు. అయితే ఇది ఆరవ ఏటి వృత్తాంతమని గోపకుమారులు అనుకొంటారు" అని శుక మహర్షి చెప్పగానే పరీక్షిన్మహారాజు ఈ ప్రకారం అడిగాడు:

సీ. 'అయిదేండ్లు కౌమార, మటమీఁద నై దేండ్లు పౌగండ మనియెడు ప్రాయ మందు,

నయిదేండ్ల వాఁడైన యబ్జాక్షుచరితంబు పౌగండ మని గోపబాలు రెల్లఁ
దలఁతు రంటివె? యెట్లు దలఁతురు వారలు? నిరుడు సేసినపని నేఁటి దనఁగ
వచ్చునే? యిదినాకు వరుసతో నెఱిఁగింపు' మనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు

ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి 'వినుము రాజవర్య! వినయధుర్య!
పరమగుహ్య మనుచుఁ బల్కుదు రార్యులు, శిష్యజనుల కీవు సేయు తలఁపు.

488

తా ॥ "మొదటి అయిదు సంవత్సరాల వయస్సుని కౌమారం అనీ, దాని తరువాత వచ్చే అయిదేండ్లు పౌగండం అని అంటారు కదా! కౌమార ప్రాయంలో కృష్ణుడు చేసి కార్యాలను పౌగండంలో చేసినట్లు గొల్లవారు అనుకొంటారు అని చెప్పావు. నిరుడు చేసినపని నేటిది అని అనవచ్చా! ఈ విషయాన్ని నాకు తెలియచెప్పు" అని పరీక్షిన్మహారాజు అడుగగా, శుక మహర్షి యోగదృష్టి చేత చూసి "ఓ రాజా! విను! నీవు వేసిన ఈ ప్రశ్న శిష్యజనులకు ఎంతో శ్రేయాన్ని చేకూర్చేది. ఇది అతిరహస్యమైనదని శ్రేష్ఠులు భావిస్తారు.

క. ప్రియురాలివలని వార్తలు, ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగు భంగిన్
బ్రియుఁడగు హరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే!

489

తా ॥ ప్రియురాలిని గురించిన వార్తలు ప్రియులకు ఎప్పుడూ ఆసక్తిదాయకంగా ఉంటాయి. అదే విధంగా అత్యంత ఆత్మీయుడైన శ్రీహరి చరిత్రమూ భక్తజనులకు ఎంతో హితంగా, ప్రియంగా తోస్తుంది కదా!"

వ. అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. న ట్లఘాసురు మొగంబు వలనం గడ చనిన లేఁగల గోపకుమారులన్ బ్రదికించి వారును దానునుం జని చని.

490

తా ॥ అని చెప్పి శుక మహర్షి రాజేంద్రునితో ఇలా అన్నాడు: "ఆ విధంగా అఘాసురుని నోట్లో పడి చనిపోకుండా గొల్ల బాలకులను, దూడలను బ్రతికించి వారితో కలిసి చాలా దూరం వెళ్ళాడు.

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మ కో
కనదాస్వాద వినోద మోదమదభృంగ ద్వంద్వ ఝుంకారమున్
ఘనకల్లోల లతావితాన విహరత్కాదంబ కోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్.

491

తా ॥ అలా వెళ్ళిన కృష్ణుడు మంచి నీళ్ళు కలిగి మిక్కిలి లోతైన ఒక కొలను చూచాడు. అందులో తామరలు, ఎర్రకలువలు మొదలైన పువ్వులు వికసించి ఉన్నాయి. వాటి పూదేనెను త్రాగటం వలన మదించి తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి. శ్రేష్ఠములైన కలహంసలు ఈదులాడుతూ పరమ రమణీయంగా ఉన్నాయి. చల్లని గాలికి నీటి తుంపురుల చిందులాట రమణీయంగా కనిపిస్తోంది.

## 18. గోపాలబాలురు కృష్ణునితో కూడి చల్దు లారగించుట

వ. కని తమ్మికంటి తమ్ముల యింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్లతుంపురుల జల్లు పెల్లున నొడళ్లు గగురుపొడువఁ గొలంకుఁ గెలంకులఁ గాయపండుల గొలలప్రేఁగున వీఁగి పట్టు గల చెట్టుఁదుటుము నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పు సూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె.

492

తా ॥ శ్రీకృష్ణుడు ఆ కోనేటిని చూసి దాని అందానికి మనస్సులో చాలా మెచ్చుకున్నాడు. గాలిచేత కదలెడు అలల యందలి తుంపురుల వాన చేత శరీరం జలదరిస్తోంది. ఆ సరస్సు ఒడ్డున ఎన్నో ఫలాలతో నిండిన వృక్షాలు ఉన్నాయి. ఆ చెట్ల నీడలో గల ఇసుక తిన్నెలను చూసి ఉత్సాహంతో తన స్నేహితులతో ఇలా అన్నాడు:

శా. "ఎండన్ ద్రుగ్గితి రాఁకటం బడితి రిం కేలా విలంబింపఁగా
రం డో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిర వందం బచ్చికల్ మేయుచుం
దండం బై విహరించుచుండఁగ నమందప్రీతి భక్షింతమే!

493

తా ॥ "మిత్రులారా! మీరు ఎండవేడిమి చేత తపించి పోయారు. ఆకలిచేత బడలికను పొందారు. ఈ చోటు చాలా రమ్యమైనదిగా ఉంది. ఇక్కడ చల్ది అన్నం తిందాం! రండి! మన దూడలు ఈ సమీపంలో పచ్చికను చక్కగా మేసి ఇచటి కొలనులోని నీళ్ళు త్రాగి నెమ్మదిగా సంచరిస్తూ ఉంటాయి."

వ. అనిన "నగుఁగాక" యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబులగు జలంబులు

ద్రావించి, పచ్చికల మొల్లంబులు గల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దుల చిక్కంబులు సక్కడించి.

494

తా ॥ కృష్ణుడిలా చెప్పేసరికి అందరూ అలాగే అని దూడలను ఉత్సాహంతో మంచినీళ్ళు త్రాగించారు. త్రాగాక వాటిని దట్టంగా పచ్చిక పెరిగిన పల్లపు నేలలోకి తోలి ఆపై చల్ది చిక్కాలను ఒక్కొక్కరే బయటకు దించారు.

మ. జలజాంతస్థ్సితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న ఱే
కుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వ లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!

495

తా ॥ తామరపుష్పం మధ్యనగల కర్ణికవలె, కృష్ణుడు మధ్యలో కూర్చోగా, ఆ పుష్పం రేకులవలె గోపబాలురు చుట్టూరా వృత్తాకారంలో కూర్చుని ఉన్నారు. అందరూ మధ్యన గల కృష్ణుడినే చూస్తున్నారు. రాతి పలకలను కొందరు, లేత తామర ఆకులను కొందరూ, వెడల్పాటి గడ్డిపోచలను కొందరూ, ఇలా తమ కంచాలుగా చేసుకుని, చద్దిమూటలను విప్పారు.

సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ,
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి "చూడు లే" దని నోరు సూపు నొక్కఁ,
డేగు రార్గురు చల్దు లెలిమిఁ బన్నిద మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్ని యుండఁగఁ బంచి యిడుట నెచ్చలితన మనుచు బంతెనగుండు లాడు నొకఁడు,

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల, మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు నవ్వు
నొకఁడు, సఖుల నవ్వించు నొక్కఁడు, ముచ్చటాడు నొకఁడు, మురియు నొకఁడు.

తా ॥ అప్పుడు వారిలో ఒకడు మాటిమాటికి వ్రేలు మడిచి ఊరిస్తూ ఊరగాయను తింటున్నాడు. ఇంకొకడు ప్రక్కవాని కంచంలోని ఊరగాయను చటుక్కున మ్రింగి, నేనేమీ తినలేదు, కావాలంటే నా నోరు చూసుకో అని నోరు తెరచి చూపుతున్నాడు. మరొకడు అయిదారుగురి చల్ది తానొక్కడే తింటానని పందెము వేసుకొని అది ఎక్కువ కాగా కూచుని కూరుకొని, కూరుకొని మెక్కుతున్నాడు. మరింకొకడు అన్నం, ఊరగాయలు, భక్ష్యాలు అన్నీ కలిపి పొర్లించి పిడుచలు చేసి స్నేహమంటే ఒకరికి ఒకరు ఇచ్చుకోవాలి అని వాటితో బంతెనగుండ్లాట ఆడుతున్నాడు. ఒకడు, అదుగో కృష్ణుని చూడు, ఏం చేస్తున్నాడో అని పక్కవానితో అనగా, అతడు కృష్ణుని వైపు చూడగానే, ఏమార్చి వాని పళ్ళెములోని మంచి భక్ష్యములు అన్నిటిని పుచ్చుకొని భక్షిస్తున్నాడు. ఈ విధంగా నవ్వుతూ, నవ్విస్తూ, ముచ్చటాడుతూ వారంతా చల్దులు ఆనందంగా, వినోదంగా భుజించసాగారు.

వ. అ య్యవసరంబున.

497

సీ. కడుపున దిండుగాఁ గట్టిన వలువలో, లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్ల సందులయందు వెలయ నిఱికి

ఆ. సంగడీల నడుమఁ జక్కఁగఁ గూర్చుండి, నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద, శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

498

తా ॥ ఆ సమయంలో కృష్ణుడు ఏ విధంగా ఉన్నాడంటే, నడుముకి దిండుగా చుట్టుకొన్న

వలువలో పిల్లనగ్రోవిని దోపుకున్నాడు. కొమ్ము బూరా, చేతికర్రా ఈ రెంటిని ఎడమ చంకలో ఇరికించుకున్నాడు. మీగడ పెరుగుతో కలిపిన చల్ది అన్నపు ముద్ద ఎడమ అరచేతిలో పెట్టుకున్నాడు. ఇంట్లోంచి కొసరి కొసరి కోరి తెచ్చుకున్న ఊరగాయను కుడిచేతి వ్రేళ్ళ సందులలో ఇరికించుకొన్నాడు. సహచరులైన గొల్లపిల్లల నడుమ బాగా కూర్చుండి ముచ్చటలాడుతున్నాడు. యాగాల్లో హవిర్భాగాలు ఆరగించువాడైన కృష్ణుడు దేవతలంతా తనను చూసి ఆశ్చర్యాన్ని పొందేటట్లు, శైశవాన్ని చూపుతూ ఆ గొల్లలతో చల్దులు ఆరగించసాగాడు.

వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచు నెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి పచ్చనిగఱికి జొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబు నడుమఁ దోరంబగు దూరంబు సనిన, వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె.

499

తా ॥ ఈ విధంగా కృష్ణునితో కూడి గోపాలకులంతా చల్దులు తింటూ ఉన్నారు. దూడలన్నీ దట్టంగా పెరిగిన పచ్చిక గల ప్రదేశంలోకి పరుగెత్తిపోయి అక్కడ దొంగ మేపులు మేస్తున్నాయి. అవి కనపడక భయపడుతున్న గొల్లబాలురతో కమలాక్షుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

మ. వినుఁ డో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం
జనియెం గోమల ఘాసఖాదన రతోత్సాహంబుతో నెందుఁ బో
యెనొ యే మయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో?
కని తెత్తుం! గుడువుండు చల్దిఁ గొఱఁతల్ గా కుండ మీ రందఱున్?

500

తా ॥ "ఓ మిత్రులారా! వినండి! దూడలు ఈ అడవిలో పచ్చిక మేయుట యందు

ఆసక్తిచేత ఉత్సాహంతో చాలా దూరం వెళ్ళినట్టున్నాయి. అవి ఎక్కడకు వెళ్ళాయో, ఏమిటో చూసి వస్తాను. క్రూరమృగాల వలన ఏమైనా ఆపదలు పొందాయో ఏమిటో? నేను పోయి వెదకి తీసుకు వస్తాను. మీరు స్థిమితంగా చల్దులు తినండి, నేను వెళ్ళి వస్తాను."

# 19. బ్రహ్మ గోవత్సములను, గోపబాలకులను అంతర్ధానము చేయుట

వ. అని చెప్పి.

501

శా. కర్ణాలంబిత కాకపక్షములతో గ్రైవేయహారాళితో
స్వర్ణభ్రాజిత వేత్రదండములతో సత్పింఛదామంబుతోఁ
బూర్ణోత్సాహముతో ధృతాన్న కబళోత్ఫుల్లాబ్జ హస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేగె లేఁగలకునై దూరాటవీవీథికిన్.

502

తా ॥ అని గోపకులతో చెప్పి అడవిలోకి బయలుదేరాడు. ఆ కృష్ణునికి చెవులమీద జులపాల జుట్టు వ్రేలాడుతోంది, రత్నహారాలు మెడలో మెరుస్తున్నాయి. బంగారు వర్ణంతో మెరిసే వెదురు కర్ర చేతిలో సొగసుగా ఉంది. శిగపై నెమలి పింఛం రమణీయంగా ఉంది. పూర్ణోత్సాహంతో, అరచేతిలో చల్ది అన్నపు ముద్ద ఉంచుకొని కృష్ణుడు దూడలను వెతుకుతూ అడవిలో చాలా దూరం నడిచాడు.

వ. ఇ ట్లేగుచు.

503

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ, మేగిన విచ్చో,
నిచ్చోట మంద గొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్.

504

తా ॥ అలా వెడుతూ, ఇదుగో ఇచ్చోటనే పచ్చిక మేశాయి, ఇక్కడే నీళ్ళు త్రాగాయి; ఇక్కడ నుండి ఇటు పోయాయి; ఇక్కడే గుంపుగా చేరాయి; ఇక్కడ నుండి తొలగిపోయాయి;

ఇదుగో వాటిజాడ; ఇక్కడ నుండి మంద విడిపోయాయి అని లేగలజాడలను అనుసరించసాగాడు.

క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక లేఁగల నపార గురుతృణ వనికా
పుంజంబుల భీకర మృగ, కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్.

505

తా ॥ ఇలా కృష్ణుడు వెనుతీయకుండా, విశేషించి అధికమైన గడ్డిగల అడవిలోను, భయంకర మృగములు గల పొదరిండ్లలోను, గుహలలోను, కొండలలోను, సరస్సులలోను, నదుల్లోనూ అంతటా వెతికాడు.

వ. అంత.

506

శా. బాలుం డయ్యు నితం డఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్
ఏలీలన్ బ్రదికించెనొక్కొ? భువి నూహింపం గడుం జోద్య మం
చాలో నంబుజసంభవుండు సని మాయాబాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నాలేఁగలన్ బాలురన్

507

తా ॥ ఆ సమయంలోనే బ్రహ్మ, బాలుడైన ఈ కృష్ణుడు అఘాసురుని చంపి ఏ విధంగా దూడలను గోపకుమారులను బ్రతికించాడో అని ఆశ్చర్యపోయాడు. భూలోకంలో ఇది ఆశ్చర్యకరమైన విషయమే అని అనుకున్నాడు. ఈ లోపు లేగలను వెతుకుతున్న కృష్ణుణ్ణి చూసి ఈ మాయా బాలుని సామర్థ్యం పరీక్షించాలి అని భావించి తన... మాయచేత అటు దూడలను, ఇటు గోపబాలురను రహస్యంగా ఒకచోట దాచిపెట్టాడు.

వ. ఆ సమయంబున దూడలు వోయిన జాడ యెఱుంగక, తప్పి య ప్పద్మలోచనుం డెప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీరి, లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున నిది విరించి మొఱం గని యెఱింగి తిరిగి పోవుచు.

508

తా ॥ అప్పుడు దూడలు పోయిన జాడ తెలియక, దారి తప్పి ఆ కృష్ణుడు మునుపు తాను చల్ది తినడానికి కూర్చున్న గుంట వద్దకు వచ్చి, అక్కడ తన నెచ్చెలులను కానక ఇది మాయ అని నిశ్చయించుకున్నాడు. ఆ గోవిందుడు సర్వమూ తెలిసినవాడు కనుక ఇది బ్రహ్మదేవుడు చేసిన మోసం అని గ్రహించి వెనుతిరిగాడు.

శా. వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెం గనుఁబ్రామి, తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?
వంచింపన్ మనకేల! తెచ్చుటకునై వల్దంచు బ్రహ్మాండము
ల్వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై.

509

తా ॥ 'గోపబాలురను, లేగలను వంచింప వలసిన అవసరం బ్రహ్మకు ఏమీ లేదు. అయినా ఇచ్చట నా కన్నుమూసి దూడలను, పిల్లలను మాయం చేసాడు. ఆయనను తిరిగి వంచించటం నాకు పెద్ద ఆశ్చర్యం గాదు. అయితే నేనెందుకు వంచించాలి? ఆయన అంతట ఆయనే మరల దూడలను బాలురను తెచ్చి అప్పగిస్తే చాలు, అతనిని మోసపుచ్చటం మనకెందుకు?' అని బ్రహ్మాండాలనే తన మాయలో ఓలలాడించగల పరమాత్ముడైన శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుకొన్నాడు.

క. గోపాలసుతులు లే రని, గోపికలకుఁ జెప్పనేల? గోపాలకులున్
గోపికలు నలర బాలుర, క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్.

510

తా ॥ 'అయితే ఇంటికి తిరిగి వెళ్ళాక, గోపబాలురు లేరని గోపికలకు చెప్పడం దేనికి? వారిని కంగారుపెట్టడం దేనికి? నేనే గోపబాలుర రూపంలోనూ, లేగల రూపంలోనూ సంచరిస్తాను.'

మ. కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండ కాం
బర స్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణాఖ్యాన త త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె
విభుఁ డా వత్సార్భకాకారముల్.

511

తా ॥ అలా నిశ్చయించుకొని, ఆ లేగ దూడల ఆకారాలు, ఆ గోపబాలుర రూపాలు అన్నీ తానే ధరించాడు. చేతులు, కాళ్ళు, మెడలు, తలలు, నడుములు, ముఖములు, భుజాలు, ముక్కులు, కన్నులు, చెవులు, దంతాలు మొదలైన అవయవాలన్నీ వాళ్ళవిగానే ఉన్నాయి. అంతేకాక ఆ బాలురు ధరించిన చేతికర్రలు, వస్త్రాలు, దండలు, వేణువులు, కొమ్ముబూరాలు యథావిధిగా ఉన్నట్లుగానే ఉన్నాయి. వారి వయస్సులు, మాటలు, గుణములు మొదలైనవన్ని కూడా తేడా రాకుండా అన్ని రూపాలను తానే ధరించాడు ఆ శ్రీకృష్ణుడు.

క. రూపంబు లెల్ల నగు బహు, రూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో
నే పారు టేమి చోద్యము?, రూపింపఁగ నతని కితరరూపము గలదే?

512

తా ॥ ప్రపంచంలోని రూపాలన్నీ తన రూపంగాగల భగవంతుడు దూడల రూపాన్ని, గోపబాలుర రూపాలను పొందటం వింత ఏమీ కాదు. చక్కగా విచారిస్తే ఆ పరమాత్ముని కంటే అన్యమైన రూపం లేనే లేదు. ఇదే ఉపనిషత్సారం.

క. మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్,
పరికింప దాన యై హరి, మరలం జనె లీలతోడ మందకు నధిపా!

513

తా ॥ ఈ విధంగా ఓ రాజా! దూడలను ఇళ్ళకు మళ్ళించమనేవాడూ, మళ్ళించేవారూ, మరలించబడే దూడలూ అన్నీ తానే అయి శ్రీకృష్ణుడు తిరిగి బృందావనానికి బయలుదేరి వెళ్ళాడు.

వ. ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యై వత్సంబుల ముందటికందువల నిలిపి, తత్తద్బాలరూపంబుల నందటి గృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన,

514

తా ॥ ఈ విధంగా కృష్ణుడు బాలకుల, దూడల రూపాలతో విహరిస్తూ గోకులానికి తిరిగి వచ్చాడు. ఆ గొల్లల దొడ్లలో దూడలను మునుపటిలాగే కట్టేసి, ఆయా బాలకుల రూపాలలో అందరి ఇండ్లలో ప్రవేశించి వారి వారి వేణువులతో వేణునాదం చేశాడు, ఆ లీలా వినోదుడు.

చ. కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడివడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం
జడిగొనఁ జేఁపు వచ్చి తమచన్నులయందు సుధాసమంబు
లై వెడలెడి పాలు నింగుకొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్.

515

తా ॥ ఆ వేణు నాదానికి వారి తల్లులైన గోపికలు ఎంతో పరవశం చెందారు. ఆనందంగా కుమారులను ఎత్తుకుని, శిరస్సులు నిమిరి, అక్కున చేర్చుకున్నారు, మాతృప్రేమతో వారి స్తనముల యందు మిక్కుటంగా పాలు చేపాయి. అమృత ధారల్లాగ బయటకు స్రవిస్తూన్న ఆ

పాలను తమ కొడుకులకు ప్రేమతో తాగించారు.

వ. మఱియుఁ దల్లు లుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొను వేడుకలం దమనందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గంధంబు లలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిలకంబులు వెట్టి, సకలపదార్థ సంపన్నంబు లయిన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు సేసిరి.

516

తా ॥ ఇంతే కాకుండా తల్లులైన ఆ గోపికల హృదయాలు పారవశ్యంతో ఉన్నందున మిక్కిలి ఉత్సాహంతో తమ తమ కొడుకులకు నలుగులుపెట్టి స్నానాలు చేయించారు. చక్కగా మంచి గంధం పూసి, ఆభరణాలతో అలంకరించారు. నుదిటియందు రక్షాతిలకాలు పెట్టి, సకల పదార్థాల తోటి అన్నంపెట్టి ఎంతో ప్రేమను చూపారు.

క. ఏ తల్లుల కే బాలకు, లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి యొసఁగింతురు ము
న్నా తల్లుల కా బాలకు, లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా!

517

తా ॥ రాజా! ఏ తల్లులకు ఏ బాలకులు ఏ విధంగా మెలగి సంతోషాన్ని కలిగించేవారో అదే విధమైన సంతోషాన్ని ఇప్పుడున్న బాలకులూ కలిగించారు.

వ. ఆ సమయంబున.

518

ఉ. పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవులెల్ల నం
బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదుఁగులం దెడలేక స్రవించుచున్న పా

లాయెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజవత్సకోటికిన్.

519

తా ॥ ఆ సమయంలో గోవులన్నీ కూడా అధిక సంతోషంతో "అంబా" అని పిలుస్తూ హుంకారం చేస్తూ, దూడలను వాసన చూస్తూ మూత్రాన్ని విడిచిపెట్టాయి. అధికమైన ప్రేమతో తమ పొదుగుల నుండి సంతత ధారగా స్రవిస్తూన్న పాలను ఆ సమయంలో తమ దూడలకిచ్చాయి.

క. వ్రేతలకును గోవులకును, మాతృత్వము సాలఁ గలిగె మఱి మాధవు పై
మాత లని హరియు నిర్మల, కౌతూహల మొప్పఁదిరిగెఁ గడు బాల్యమునన్.

520

తా ॥ గోపికలకు, ఆవులకు తమ బిడ్డల రూపంలో ఉన్న కృష్ణునిమీద మాతృత్వం ఏర్పడింది. కృష్ణుడు కూడా నిర్మల ప్రేమతో పసిపిల్లవాడులా వారిమధ్య తిరుగసాగాడు.

ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క, పూఁటపూఁట కెలమిఁ బొటకరించె
నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద, వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు.

521

తా ॥ గోకులవాసులందరకీ రోజురోజుకీ తమ పిల్లల మీద ప్రేమ అతిశయంగా పెరుగసాగింది. ఏ పూటకాపూటే ఆ ప్రేమ కొత్తగా, మరింత అధికంగా ఉండేది. ఇది గతంలో విష్ణువుమీద వారికి గల భక్తిభావంలా ఉన్నది.

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున నమందమహిమంబున నొక్కయేఁడు క్రీడించె. నా యేఁటికి నై దాఱు దినంబులు కడమవడి యుండ నం దొక్కనాఁడు బలభద్రుండును, దానును వనంబునకుం జని

మందచేరువ లేఁగల మేప నతి దూరంబున గోవర్ధన శైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని.

522

తా ॥ ఈ విధంగా, కృష్ణుడు గోపకుమారులు మరియు దూడలయొక్క రూపాలను తానే ధరించి, ఇందరి రూపాలలోని తనను తానే కాపాడుకొంటూ, బృందానంలోను, అడవిలోను, కూడా ఒక సంవత్సరం పాటు లీలను చూపాడు. ఇక సంవత్సరం పూర్తవడానికీ అయిదారు రోజులు తక్కువ ఉండగా ఒకరోజున కృష్ణుడు బలరామునితో కూడా మందకు చేరువలో ఉన్న అడవిలో దూడలను మేపుతున్నారు. ఆ సమయంలో అచ్చట అతి దూరంగా ఉన్న గోవర్ధన పర్వతం మీద గోపకులు ఆవులను మేపుతున్నారు. అక్కడ నుండి ఆ ఆవులు ఈ దూడలను చూచాయి.

చ. ముదమున హుంకరించుచును, మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం
బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్
వదనములన్ విశాలతర వాలములన్ వడి నెత్తిపాఱి యా
మొదవులు సన్నులం గుడిపె మూఁతుల మ్రింగెడిభంగి నాకుచున్.

523

తా ॥ వెంటనే ఆవులు సంతోషంతో హుంకారం చేస్తూ మూపుల దాకా మెడలెత్తి చూచాయి. నాలుగు కాళ్ళు రెండు అయ్యాయా అనేటట్లు చేరబెట్టి, కుప్పించి దాటుతూ, ముఖాలను తోకలను ఎత్తి తమ దూడలున్న తావునకు పరుగెడుతూ వచ్చాయి. దూడల మూతులను మ్రింగేస్తాయా అన్నట్లుగా నాకుతూ కడుపునిండా పాలిచ్చాయి. ఈ విధంగా వాటికి కూడా తమ లేగలపై అతిశయించి ఉన్న ప్రేమను వ్యక్తం చేసాయి.

వ. అంత గోపకులు గోవుల వారింప నలవి గాక, దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ

దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని.

524

తా ॥ ఆ సమయమందు అక్కడ ఆవులను మేపుతున్న గోపకులకు వాటిని ఆపడం శక్యం కాలేదు. ఇంతవరకు ఎన్నడూ ఇలా ఆవులు ప్రవర్తించలేదు; వాటిని అదుపు చేయలేక పోయామనే సిగ్గుకి, కోపం మిళితం కాగా, ఆవుల వెనుకనే తుప్పల మీదుగా, బండల మీదుగా పరుగిడుతూ ఆ తావుకి వచ్చారు. అక్కడ లేగలను మేపుతున్న తమ పిల్లలను చూసారు.

ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం
జయ్యన డాసి యెత్తుకొని సంతస మందుచు గౌఁగిలించి తా
రయ్యెడ నౌఁదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దు సేయుచున్
దయ్య మెఱుంగు, గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్.

525

తా ॥ అలా కొడుకులను చూసిన ఆ గొల్లలు మా చిన్న తండ్రులను చూసాం అని శరీరంమీద పులకాంకురాలు వెలయగా, పిల్లలను శీఘ్రంగా ఎత్తుకున్నారు. సంతోషంతో ఆలింగనం చేసుకొని మనస్సులు తృప్తి పొందేటట్లు శిరమున ముద్దుపెట్టుకున్నారు. ఆ పిల్లలలోని భగవంతుని తెలుసుకున్నారా అన్నట్లుగా ఉన్నది వారి ప్రవర్తన.

వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్ప పూరితనయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె.

526

తా ॥ ఈ విధంగా పిల్లలను కౌగిలించుకొని ఆనంద భాష్పములు కన్నులలో నిండుకొనగా గొల్లలందరు గోవులను తిరిగి తోలుకొని వెళ్ళిపోయారు. ఆ గొల్లలను చూసి బలరాముడు తన మనస్సులో ఇలా అనుకున్నాడు:

సీ. చన్ను మానినయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోపకులకు
నిబ్భంగి వాత్సల్య మెబ్భంగి నుదయించె? హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించు చున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్లు నాకుఁ
బ్రేమమయ్యెడి, డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు

తే. మనుజదైవత దానవ మాయయొక్కొ?, కాక నా భర్త యగుచున్న కమలనయను
మాయయో కాక యితరులమాయ నన్నుఁ, గలఁప నోవదు విభుమాయ గాఁగ నోపు.

527

తా ॥ 'స్తన్య పానం మానేసిన పిల్లలమీద గోవులకూ, గోపకులకు ఇలాంటి ప్రేమ ఎలా పుట్టింది? కృష్ణుణ్ణి ఇదివరకు చూసినట్లుగా ఇప్పుడు తమ పిల్లలను చూస్తున్నారు. నాకు కూడా కృష్ణుణ్ణి చూచి కలిగినట్లే ఈ లేగలను, గోపకుమారులను చూస్తే ప్రేమ అధికంగా కలుగుతూన్నది. ఇది మహాద్భుతంగా ఉంది, తెలుసుకోవడానికి శక్యం కాకుండా ఉంది. ఇది మనుష్యుల మాయయా? దేవతల మాయయా? రాక్షసుల మాయయా? ఇవేమీకాక నా స్వామి అయిన విష్ణువు యొక్క మాయయా? ఇతరుల మాయ అయితే నన్ను కలవర పడేటట్లు చెయ్యలేదు, కనుక తప్పక ఇది నా స్వామి మాయయే అయి ఉంటుంది.'

క. అని మున్న ముగ్ధుఁ డయ్యును, దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిం
దన చెలికాండ్రను గ్రేపుల, వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా!

528

తా ॥ అని ఆలోచించిన బలరాముడు అంతకాలం ఆ లీలకు కారణం తెలియకున్నా, అప్పుడు మోహం నుండి విడివడి తన దివ్యదృష్టిచే స్నేహితులు, దూడలుగా ఉన్నది అన్నీ కృష్ణుడే అని గ్రహించాడు.

వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలంపడుచుఁ గృష్ణుం

జూచి 'మహాత్మా! తొల్లి యెల్ల క్రేపులును ఋషుల యంశం బనియును, గోపాలకులు వేల్పుల యంశం బనియును దోఁచు చుండు, నిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచుచున్న, దిదియ యేమి?' యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్ననసేసి క్రన్నన యెఱింగించె, నతండు నెరింగె నవ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికిఁ దన మానంబున నొక్క త్రుటి మాత్రంబైన, విరించి చనుదెంచి వత్సబాలకాకారుండైన కృష్ణబాలకుం జూచి వెఱంగు పడి యిట్లని వితర్కించె.

529

తా ॥ ఈ విధంగా బలరాముడు తన దివ్యదృష్టి చేత తెలుసుకొన్నా, అది సరి పెట్టుకోలేక కృష్ణుడిని చూసి, "ఓ మహాత్మా! మునుపు దూడలు ఋషుల అంశ అనీ, గొల్లలు దేవతల అంశ అని నాకు తోచేది. ఇప్పుడు ఆ దూడలు, ఆ బాలురూ, అన్నీ నీవే అని తోస్తూ ఉన్నది. దీనికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అంతట కృష్ణుడు అన్నను గౌరవించి, వాస్తవాన్ని తెలియజేశాడు, బలరాముడు దానికి సంతోషించాడు. ఈ విధంగా కృష్ణుడు బాలురుగా దూడలుగా అయి సంవత్సరకాలం వర్తించాడు. ఆ కాలం బ్రహ్మకాలమానంలో ఒక త్రుటి మాత్రం. అంతట బ్రహ్మవచ్చి, దూడలు బాలురుతో విహరించుచున్న బాలకృష్ణుణ్ణి చూసి తనలో తాను ఇలా అనుకున్నాడు:

శా. మందం గల్గిన వత్సబాలకులు నామాయా గుహాసుప్తులై
యెందుం బోవరు, లేవ రిప్పుడును వేఱే చేయ నాకన్యు లొం
డెందున్ లేరు, విధాతలుం బరులు, వీ రెవ్వార లె ట్లైరొకో!
యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్ నేఁటికిన్.

530

తా ॥ 'మందలో ఉన్న దూడలు, బాలకులు నా మాయా గుహలో నిద్రిస్తూన్నారు కాని

ఎక్కడకు పోలేదు. ఇప్పుడు కూడా నిద్రనుండి లేవనే లేదు. మరి ఇక్కడు ఉన్న వీరెవరు? ఎలా పుట్టారు? ఇదిగాక సృష్టి చేయడానికి నాకంటే అన్యులెవరూ లేరు. ఈ కృష్ణునితో కలిసి సంచరించడానికి ఎక్కడ నుండి వచ్చారు?

మత్త కోకిలము

బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్

బ్రహ్మనొక్కఁడఁగాని వేఱొకబ్రహ్మ లేఁడు సృజింపఁగా

బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే

బ్రహ్మమందు జనించె? నొక్కట బ్రహ్మ మౌనది చూడఁగాన్.

531

తా ॥ బ్రహ్మ ఆజ్ఞచేత కాని ప్రాణుల సముదాయం పుట్టనే పుట్టదు. అట్టి బ్రహ్మను నేను తప్ప వేరొక బ్రహ్మలేడు సృష్టించడానికి. బ్రహ్మనైన నేను పుట్టింపకుండానే దూడలు, బాలురు యొక్క సమూహం అంతా కనిపిస్తోంది. ఈ విషయం విచారిస్తే పరబ్రహ్మమే ఈ బాలకుల దూడల రూపంలో సంచరిస్తోంది.

వ. అని యిట్లు సకలంబును సుకరంబున నెఱింగెడి నెఱవాది ముదుక యెఱుక గల ప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు ముందల యెఱుంగక కొందలం పడుచు నాందోళనంబున.

532

తా ॥ సృష్టికర్త, సమస్తమును నేర్పుతో తెలుసుకోగల జ్ఞాన వృద్ధుడు అయిన బ్రహ్మ కూడా ఈ రహస్యాన్ని భేదించలేక నివ్వెరపోయాడు. ఎంతగా ఆలోచించినా, తను ఇక ముందు ఏమి చేయాలో తోచక సంకటంలో పడిపోయాడు.

క. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ జేయ నేర్చి మొనసిన విష్ణున్

మోహింపించెద ననియెడు, మోహమున విధాత దాన మోహితుఁ డయ్యెన్.

533

తా ॥ మోహానికి అతీతుడైనవాడు విష్ణువు. జగములను మోహింపచేయగల శక్తి ఉన్నా బ్రహ్మ విష్ణుని మోహింపచేయాలని భావించి, చివరకు తానే మోహితుడై పోయాడు.

తే. పగలు ఖద్యోతరుచి చెడుపగిది రాత్రి, మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి
విష్ణుపై నన్యమాయలు విశద మగునె?, చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁగాక.

534

తా ॥ పగటి వేళ మిణుగురు పురుగుల కాంతి అణగిపోయినట్లుగా, రాత్రివేళ మంచు చీకట్లో లీనమై నశించునట్లుగా, విష్ణుని మీద అన్యమాయలు నశిస్తాయి. అంతేకాక ఆ మాయలు పన్నిన వారి గౌరవాన్ని కూడా నశింపచేస్తాయి.'

వ. మఱియును.

535

క. పుట్టితి, బుద్ధి యెఱింగితిఁ, బుట్టించితి జగము, సగము వోయెను బ్రాయం,
బిట్టివి నూతన సృష్టులు, పుట్టుట లే, దౌర! యిట్టి బూమెలు భూమిన్.

536

తా ॥ 'నేను ఎప్పుడో పుట్టాను. నాకు జ్ఞానం కలిగాక సృష్టిని మొదలుపెట్టాను. ఇప్పటికి నా ఆయుష్కాలం సగం గడిచిపోయింది. ఇంతవరకూ నాకు తెలియకుండా మరో సృష్టి జరగడం నేను ఎరుగను. నేను సృజించిన భూమిలో ఇలా రెండవ సృష్టి నాకు తెలియకనే జరగడం ఎంత విచిత్రం. ఔరా! ఆశ్చర్యం!'

వ. అని యిట్లు దలవాకిట వాణిగల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగంబుల

తక్కరిగొంటు పెనుదంట పలువెంటలం దన మనంబున వితర్కించి, విచారించునెడ, నతండు గనుంగొను చుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాద మస్తక తులసీదళదాములును, విలస దంగుళీయకస్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, చతుర్భుజప్రశస్తులును, బీతకౌశేయవాసులును, జంద్రికాధవళహాసులును, గరుణాకటాక్ష వీక్షణవిలాసులును, రవికోటిభాసులును, ననంత సచ్చిదానంద రూపమహితులును, నణిమాదిగుణో పేతులును, విజాతీయభేద రహితులును, శ్రీ మన్నారాయణ ప్రతిమాన విగ్రహస్వరూపులును నయి తమకుఁబరతంత్రు లగుచు నృత్తగీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబులయిన బ్రహ్మాది చరా చరంబులును నణిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులైన శక్తులును, మహదాది చతుర్వింశతి తత్త్వంబులును, గుణక్షోభ కాలపరిణామ హేతుసంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానంబడిన వారలం గనుంగొని.

537

తా ॥ ఇంతవరకు చతుర్ముఖ బ్రహ్మ తన వద్ద సరస్వతి (జ్ఞానం) ఉన్నదని గర్వించేవాడు. ఇప్పుడు ఆ గర్వం తగ్గగా, ఆలోచిస్తూ ఆ బాలుర వైపు చూసాడు. ఆ గోపాల బాలకులు నీల మేఘమువలె నల్లనైన దేహం కలిగి ఉన్నారు. ముత్యాల రత్నాల హారాలు, మకర కుండలాలు, కిరీటములు, భుజకీర్తులు, అందెలు, బంగారు కడియములు, కనకపు మొలత్రాళ్ళు, రత్నాల ఉంగరాలను ధరించి ఉన్నారు. వనమాలికలను, తులసిదండలను అలంకరించుకున్నారు. శ్రీవత్సమనే పుట్టుమచ్చ మెరిసి పోతోంది. శంఖం, చక్రం, గద, కమలం నాలుగు చేతులలోను వహించి, పీతాంబరాలను ధరించి ఉన్నారు. వెన్నెలవలె తెల్లనైన చిరునవ్వులు, దయారసము చిందుచున్న క్రీగంటి చూపులు, కోటి సూర్యుల తేజస్సువంటి తేజస్సుతో మహా వైభవంగా ఉన్నారు. సత్తు, చిత్తు, ఆనందమును రూపముగా, అనంతంగా గల పరమాత్మ స్వరూపాన్ని

కలిగి ఉన్నారు. అణిమ, మహిమ ఇత్యాది అష్ట విభూతులు కలిగి, జాతి భేదం లేక శ్రీమహావిష్ణువు వంటి ఆకృతులు కలిగి మనోహరంగా ఉన్నారు. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన చరాచరాలు, అణిమాది అష్ట సిద్ధులు, పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అనే పంచ శక్తులు, మహత్తత్త్వము మొదలైన ఇరవై నాలుగు తత్త్వాలు, మూడుగుణముల కలయిక, కాలము, పరిణామం, హేతువు, సంస్కారం, కామం, కర్మ అనేవి అన్నీ స్వరూపములను ధరించి కొలుస్తూ ఉండగా, వేద వేదాంతార్థముల నెరిగిన మహనీయులు కూడా తెలుసుకోలేని విధంగా కనపడ్డారు ఆ గోపకుమారులు. వాళ్ళని చూసి బ్రహ్మ ఇలా అనుకున్నాడు:

ఉ. బాలురఁ గంటి నాచెయిదిఁ బాసినవారిని మున్నవారి నేఁ
బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళ దుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు, నున్నవార, లే
మూలమొ? మార్గ మెయ్యదియొ? మోసము వచ్చెఁగదే! విధాతకున్.

538

తా ॥ 'ఇంతకు ముందు నేనెరుగని క్రొత్త పిల్లలను చూస్తున్నాను. చక్కగా పరీక్షించి చూసేలోపు నిరాటంకముగ అంతట వ్యాపిస్తున్న ఒక మహా తేజస్సుతో వెలుగొందుతున్నారు. నా చూపులకు అందక ప్రకాశిస్తున్నారు. దీనికి కారణం ఏమిటో, నేను నడచుకోవలసిన దారి ఏమిటో తెలియటం లేదు. విధాతకే మోసం వచ్చినట్లున్నదే! ఆహా!'

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబయిన స్రుక్కి.

539

తా ॥ అని తలపోస్తూ ఉన్న బ్రహ్మదేవుని సకలేంద్రియాలకు ఆ బాలుర తేజస్సు సహించరానిదై పోయింది, ఆయన సంతాపాన్ని పొందుతూ చేష్టలుడిగి అలా ఉండిపోయాడు.

ఉ. ఏ పరమేశుతేజమున నీసచరాచరమైన లోక ము

ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపు రూపు కై వడిన్.

540

తా ॥ ఏ పరమేశ్వరుని దివ్య తేజంచేత ఈ చరాచరలోకము ప్రకాశిస్తున్నదో, ఆ పరమ పురుషుడైన శ్రీకృష్ణమూర్తి యొక్క తేజస్సు దుర్నిరీక్షంగా ఉంది. బ్రహ్మకూడా ఆ మహాతేజస్సులోని ఒకానొక భాగం మాత్రమే కనుక, దానిని అందుకోలేకపోయాడు. అలా పారవశ్యంతో చిత్తరువులాగా ఉండిపోయాడు.

వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంత విజ్ఞాన దుర్లభుండును, స్వప్రకాశానందుండును నైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱ పడిన బ్రహ్మం గని యీశ్వరుండు.

541

తా ॥ అట్టి స్థితిలోగల బ్రహ్మను మాయకు లోబడనివాడు, వేదాంతార్థ విచారం చేసినా కూడా దుర్లభుడైనవాడు, తనకు తానుగా ప్రకాశించువాడు అయిన శ్రీకృష్ణుడు చూసాడు.

శా. 'బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతిదప్పి నామహిమ యాలోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ?డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్ల దాఁచెనటఁ గేళీచాతురీధుర్యుఁడై.

542

తా ॥ చూసి, ఈ బ్రహ్మ బాలుడై తాను సృష్టికర్తననే అహంకారం చేత, అజ్ఞానం వలన నా మహిమను తెలుసుకొనవలెనని వచ్చాడు. నా మహిమను తెలుసుకోవడానికి ఇతడెంత మాత్రపువాడు? అని ఎంచి తన క్రీడా చాతుర్యం కనబరచే ఉద్దేశ్యంతో తన మాయను అణచి,

తాను ధరించియున్న దూడలు మరియు గోపకుమారుల రూపాలను మరుగు పరిచాడు. క్రీడలు జరపడంలో అతనిని మించిన వారెవరు!

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిదికన్నులు గల వేలుపుగమికాఁడు తేఁటి తెప్పిఁటి కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁ గని, వెనుకఁ జూచి, దివి విలోకించి, దిక్కులు వీక్షించి, యెల్ల యెడలం గలయ దర్శించి తన పురోభాగంబున హరి సంచరించుటంజేసి జాతి వైరంబులు లేని నరపక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాది రహితులకు జీవనంబైన బృందావనంబుం బొడగాంచి యందె.

543

తా ॥ అంతలో బ్రహ్మ ఒక్కసారిగా చలనం వచ్చినట్లుగా, చేతులు కాళ్ళు స్వాధీనం చేసుకొని, కన్నులు తెరచి, ముందు, వెనుక, మీద, చుట్టు ప్రక్కల చక్కగా విమర్శించి చూచాడు. తన ఎదురుగా శ్రీకృష్ణుడు వర్తించటం చేత తమ మధ్య జాతివైరం లేకుండా మనుష్యులు, పక్షులు, మృగాలు మొదలైన వాటికి క్రీడా స్థానంగా ఉంటున్న బృందావనాన్ని చూసాడు. ఆ బృందావనం ఇంకా ఎలా ఉంది? శ్రీకృష్ణుని లీలాభూమి అయినందున అక్కడ శాంతి సంపద కలిగి, కామక్రోధాదులు మొదలైన దుర్గుణాలు లేకుండ బ్రహ్మవేత్తలకు సుఖంగా జీవింపతగిన స్థానంగా ఉంది. అందులో.....

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూల విభుఁడయ్యుఁ గ్రేపుల వెదకువాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని
బహిరంతరాద్యంత భావశూన్యుండయ్యు నంతంత నడుగు చొప్పరయువాని
గురుగభీరుండయ్యు గురువులు వాఱుచు నట్టిట్టుఁ బాతరలాడువాని

ఆ. జాతిరహితుఁ డయ్యుఁ జతుర గోపార్భక, భావ మెల్ల నచ్చువడిన మేని
చెలువువాని హస్త శీతాన్న కబళంబు, వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు.

తా ॥ కృష్ణ పరమాత్మను చూసాడు. ఎలా ఉన్నాడు ఆ శ్రీకృష్ణుడు? తనకంటే ఇతరములు లేకుండా ప్రకాశించే పరమపురుషుడై ఉండి కూడా ఆవు దూడలు వెతుకుతున్నాడు. తాను సర్వజ్ఞుడై ఉండి కూడా, ఏమీ తెలియని వానిలా తన చెలికాండ్రైన వారిని పిలుస్తున్నాడు. ఇది బయలు, ఇది లోపల, ఇది మొదలు, ఇది తుది అనే భిన్నత్వం లేకుండా అంతటా నిండి ఉన్నాడు, మిక్కిలి గాంభీర్యం కలవాడైనా అటూ ఇటూ పరుగెడుతూ నటిస్తున్నాడు. జాతి రహితుడైనా గొల్లపిల్లవాని వలె చేత చల్ది అన్నపు ముద్ద ఉంచుకున్న ఆ గోపాల కృష్ణుణ్ణి బ్రహ్మదేవుడు చూసాడు.

వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనక దండసుకుమారంబైన శరీరంబుతోడ నేలఁ జాఁగిలంబడి మణిగణ సుప్రకాశంబులైన తన కిరీటశిఖరప్రదేశంబు లాకుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానంద బాష్పజలపూరంబుల నతని యడుగులు గడిగి మఱియును.

545

తా ॥ చూసి తొట్రుపాటుతో, తన హంస వాహనం మీద నుండి క్రిందికి దూకాడు. బంగారు శలాకవలె మిసమిసలాడుతూ ఉన్న కోమలమైన దేహంతో భూమిమీద సాగిలపడి మ్రొక్కాడు. రత్నముల సమూహం చేత ప్రకాశిస్తూన్న తన కిరీట శిఖరములు ఆ బాలకృష్ణుని పాదకమలములు సోకునట్లుగా నమస్కరించాడు. కన్నుల నుండి ఆనంద బాష్పాలు కారుతుండగా స్వామి పాదములను కడిగాడు.

క. అడుగులపైఁ బడు లేచుం, బడుఁ గ్రమ్మఱ లేచు, నిట్లు భక్తిన్ మును తాఁ
బొడగనిన పెంపుఁ దలఁచుచు, దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడు కడిచె నృపా!

546

తా ॥ ఓ రాజా! ఆ విధంగా బ్రహ్మ పలుమార్లు ఆ బాలకృష్ణుని పాదాల మీద పడుతూ, లేస్తూ, ఇంతకు ముందు తాను అతనిపట్ల చూపిన మహిమాతిశయాన్ని తలచుకొని సిగ్గుపడ్డాడు. భక్తితో ఆ లీలామానుషుడైన కృష్ణుని ప్రభావం ముందు తన ప్రభావం ఎంతమాత్రం అని అనుకున్నాడు.

వ. అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె.

547

తా ॥ పిమ్మట బ్రహ్మదేవుడు మెల్లగా లేచి నిల్చొని, కమలములను పోలిన కన్నులు తెరచి శ్రీకృష్ణ భగవానుణ్ణి సందర్శించాడు. ముఖములను వంచుకుని అంజలి ఘటించి ఏక చిత్తంతో నాలుగు ముఖాలతోను ఈ విధంగా స్తుతించాడు:

సీ. శంపాలతికతోడి జలదంబు కైవడి మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ
గమనీయ మృదులాన్న కబళ వేత్ర విషాణ వేణుచిహ్నంబులు వెలయువానిఁ
గుంజా వినిర్మిత కుండలంబులవాని శిఖిపింఛవేష్టిత శిరమువాని
వనపుష్పమాలికా వ్రాత కంఠమువాని నలినకోమల చరణములవానిఁ

ఆ. గరుణ గడలుకొనిన కడగంటివాని గో, పాలబాలుభంగిఁ బరఁగువాని
నగుమొగంబువాని ననుఁగన్న తండ్రిని, నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష!

548

తా ॥ "కృష్ణా! మెరుపు తీగతో కూడుకొన్న మేఘంలాగా, బంగారు రంగు ఉత్తరీయంతో నీ దేహం ప్రకాశిస్తోంది. మిక్కిలి మనోజ్ఞమై మృదువుగా ఉన్న చల్ది అన్నపు ముద్ద, వెదురు కర్ర, పిల్లనగ్రోవి చేతిలో అందంగా ఉన్నాయి. గురిగింజలతో చేయబడిన కర్ణాభరణమును,

శిరస్సునందు చుట్టుకోబడిన నెమలిపురి చూడముచ్చటగా ఉంది. కంఠమునకు వనము నందలి పువ్వులతో కట్టబడిన పూలసరాలు రమణీయంగా ఉన్నాయి. తామర పువ్వువలె మృదువైన పాదాలు, దయారసం పొంగి పొర్లే కడకన్నులు, చిరునవ్వుతోడి ముఖం కలిగి గోపాలుని వలెనే ఒప్పేవానివి, నన్ను కన్న తండ్రివి... అయిన నీకు నమస్కరిస్తున్నాను.

మ. నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తనురూపం బిదె నామనంబున కచింత్యం బయ్యె, నీ యుల్లస
ద్ఘ న విశ్వాకృతి నెవ్వఁడోపు? నెఱుఁగం గైవల్యమై యొప్పు నా
త్మ నివేద్యంబగు నీదు వైభవము చందం బెట్టిదో యీశ్వరా!

549

తా ॥ ఓ స్వామీ! ఈ చిన్నగా కనుపిస్తూన్న బాలకృష్ణ రూపమే సూక్ష్మంగా ఉండి, గొల్లలకు ఆనందాన్ని కలుగజేస్తున్నా, నా మనస్సుకు ఇట్టిది అట్టిదని విచారింప శక్యము కానిదిగా ఉందే! ఇక నీ విరాట్ రూపాన్ని తెలుసుకోవడానికి ఎవడు శక్తుడు? కేవల మోక్షస్వరూపమై విజ్ఞానం చేతనే తెలియ తగినదైన నీ వైభవ విశేషం ఎవరికి తెలుసు?

క. విజ్ఞాన విధము లెఱుఁగక, తద్జ్ఞులు నీ వార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్
యజ్ఞేశ! నీకు నిచ్చిన, యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుఁడ వైనన్.

550

తా ॥ యజ్ఞకర్తవై ఒప్పే ఓ స్వామీ! నీవు అజ్ఞానులు తెలుసుకోవడానికి అలవికాని వాడివి! నిన్ను తెలుసుకున్న విజ్ఞానం గల మహనీయులు నీ స్వరూపం ఇట్టిది అని బోధిస్తూంటారు. దానిని విని మూఢులు సైతం నిన్ను తెలుసుకుంటూ, మనోవాక్కాయములను నీకు సమర్పించిన బ్రహ్మానంద సముద్రంలో ఓలలాడుతూ ఉంటారు.

క. శ్రేయములు గురియు భక్తినిఁ, జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం

జేయుట విఫలము, పొల్లున, నాయము సేకుఱునె తలఁప నధికం బైనన్.

551

తా ॥ శుభములు వర్షించే భక్తి మార్గాన్ని విడిచి, జ్ఞానం లభించడానికి తపస్సు చేయడం ప్రయోజనం లేనటువంటిది. ఊకను ఎంత దంచినా బియ్యం రావుగదా? (భక్తిలేని జ్ఞానం నిష్ఫలమే కదా).

క. నిజముగ ని న్నెఱుఁగఁగ మును, నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్, సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా!

552

తా ॥ ఓ స్వామీ! నీ వాస్తవతత్త్వం తెలుసుకోగోరినవారు, ముందుగా తమ కోరికలన్నింటిని నీకు సమర్పణం చేయాలి. అటుపై నీ కథలను వింటూ ఉంటే, అప్పుడు భక్తి ఏర్పడి సజ్జనులుగా నీ స్థానాన్ని ప్రవేశించగలరు.

సీ. విక్రియాశూన్యమై విషయత్వమును లేని దగుచు నాత్మాకారమై తనర్చు
నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కార విజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకు
నెఱుఁగంగ రానిదై యే పొరి యుండుటఁ జేసి నీ నిర్గుణ శ్రీవిభూతి
బహిరంగవీథులఁ బాఱక దిరములై యమలంబులగు నింద్రియములచేత

ఆ. నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁగాని, గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు
నీగుణప్రజంబు నేర రా దెఱుఁగంగ, నొక్క మితము లేక యుంట నీశ!

553

తా ॥ సాధారణంగా నిరాకార నిరంజనుని తెలుసుకోవడం కష్టం అని తోస్తుంది కానీ, సాకార వైభవాన్ని గ్రహించడమే కష్టతరమని ఇక్కడ తెలియచేస్తున్నారు. నీ నిర్గుణ వైభవంలో ఏ

మార్పులు ఉండవు గనుక తెలియడానికి ఏమీ ఉండదు. పైగా తనకన్న వేరే లక్ష్యం అంటూ తనకు వెలుపల ఏదీ ఉండదు. దానినే 'తాను' అంటాము. అది అన్నిటిలోపలా అంతర్యామి అయిన ప్రయోజనంగా ఉంటుంది. అది ఇంద్రియాలకి కనుపించదు. ఎందువల్లననగా "విజ్ఞానం" ఉన్నప్పుడే ఇంద్రియాలు తెలుసుకోగలవు. అది నీకు తప్ప ఇతరులకు తెలియదు. ఆ విజ్ఞానం దానికి అదేగాని "రెండవది" ఉండదు. అది ఎప్పుడూ వెలుపల కనుపించదు, ఇంద్రియాలను లోపలికి త్రిప్పితే తనుకు తాను కనిపిస్తుంది. ఇలా తిప్పలుపడితే ఎలాగో అలాగ నీ నిర్గుణ తత్త్వాన్ని తెలుసుకోవచ్చు. అది కష్టం అనుకుంటారు గాని నిజానికి నీ సగుణ రూపం తెలుసుకోవడమే అసాధ్యం. నీవు ప్రదర్శించే గుణాలు ఎవరికీ అంతుపట్టవు. నీవు గుణాలతో ఉండి మాత్రమే గోచరిస్తూ ఉంటావు. నీ గుణాలకి ఒకలెక్క అంటూ లేదు కనుక నీ కనిపించే రూపాలను తెలుసుకోవడమే అసాధ్యం!

క. తారాతుషారశీకర, భూరజములకైన లెక్క బుధు లిడుదురు, భూ
భారావతీర్ణకరుఁ డగు, నీ రమ్యగుణాలి నెన్న నేర రగణ్యా!

554

తా ॥ గణించుటకు శక్యంకాని వాడా! గొప్ప పండితులగు వారు ప్రయాసపడి నక్షత్రములను మంచు చినుకులను, భూమిమీది రేణువులను లెక్కపెట్టవచ్చు. అయితే భూభారాన్ని అణచే శక్తిగలవాడవైన నీ యొక్క అనంత కళ్యాణ గుణములను లెక్కపెట్టలేరు గదా!

శా. 'ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు' నంచాఢ్యుఁడై
నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలముం జేయుచున్
నీవాఁడై తనువాఙ్మనోగతుల ని న్సేవించు విన్నాణి వో
కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా!

555

తా ॥ ఈశ్వరా! శ్రీహరి నన్ను కృపాదృష్టితో ఎప్పుడు చూస్తాడో? నేను ఎప్పుడు ఆ హరిని చూడగలనో అనే ఆర్తి ఉన్నవారు మాత్రమే నీ వెంటబడతారు. ఆ మార్గంలోనే తన పూర్వకర్మఫలాలను మొదలంటా నశింపచేసుకోగలుగుతాడు. అయితే మనోవాక్కాయ కర్మల చేత పూర్తిగా నీవాడు అయినప్పుడే, సంస్కార బీజాలు కూడా నశిస్తాయి, అటువంటి వారినే మోక్షలక్ష్మి వరించగలదు.

ఉ. మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమ మానముఁ జూచెద నంచు నేరమిం
జేయఁగ బూనితిం గరుణ సేయుము, కావుము, యోగి రాజ వా
గ్గేయ దవాగ్నిఁ దజ్జనితకీలము గెల్చి వెలుంగ నేర్చునే?

556

తా ॥ యోగీశ్వరులచేత కొనియాడబడేవాడా! మాయలు నటించే అల్పులను నీదైన మాయలో ముంచి భ్రమింపచేస్తూ ఉంటావు. అటువంటి మహిమగల నిన్ను నా మాయచేత కలవరపెట్టి నీ మహిమ యొక్క మేర తెలుసుకొనవలెనని ప్రయత్నించాను. అది నా చేత అవుతుందా! కార్చిచ్చులో జనించిన మంట దానిని మించి ప్రకాశింప నేరదు కదా! ప్రభూ! నన్ను కరుణతో రక్షించు.

సీ. సర్వేశ! నే రజోజనితుండ, మూఢుండఁ, బ్రభుఁడ నేనని వెఱ్ఱిప్రల్లదమున
గర్వించినాఁడను, గర్వాంధకారాంధ నయనుండఁ, గృపఁజూడు నను, బ్రధాన
మహదహంకృతి నభోమరుదగ్ని జలభూమి పరివేష్టితాండకుంభంబులోన
నేడు జేనలమేన నెనయునే నెక్కడ నీ దృగ్విధాండంబు లేరి కైన?

తే. సంఖ్య సేయంగ రానివి, సంతతంబు, నోలిఁ బరమాణువుల భంగి నొడలి రోమ
వివరములయందె వర్తించు విపులభాతి, నెనయుచున్న నీ వెక్కడ? నెంతకెంత?

తా ॥ ఓ సర్వేశ్వరా! నేను రజోగుణం నుండి పుట్టాను. మూఢుణ్ణి! ఈ సృష్టికి నేనే ప్రభువుననే అహంకారంతో గర్వించిన వాడిని. ఆ గర్వం చేత అంధకారం నా కళ్ళకు వ్యాపించింది. నన్ను అనుగ్రహించు! అవ్యక్తం, మహత్తు, అహంకారం, ఆకాశం, వాయువు, అగ్ని, జలము, భూమి అను అష్టావరణముల చేత ఆవరింపబడిన బ్రహ్మాండమనే భాండంలో నేనెంత? లెక్కపెట్ట శక్యంగాని ఇట్టి బ్రహ్మాండాలు ఎన్నింటినో నిత్యం నీ రోమకూపాలలో పరమాణురూపంగా ధరిస్తున్న నీవెక్కడ? పోలికకు సామ్యమే లేదు!

తరలము.

కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో

నడువఁబోలునె క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డు నై

యడఁగి కారణకార్యరూపమునైన యీ సకలంబు నీ

కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్?

558

తా ॥ స్వామీ! తల్లి తన కడుపులో ఉన్న శిశువు కాలితో తన్నినా, తల్లి ఆ శిశువు మీద కోపించి కొట్టదు కదా! స్థూలములు, సూక్ష్మములునై, కార్యకారణములు కలిగి అణగియున్న ఈ సమస్త ప్రపంచము నీ కడుపులోనిదే కదా! నేను నీ బిడ్డను గాక మరెవ్వడను? నాయందు దయ ఉంచు.

క. భూరి లయజలధి నిద్రిత, నారాయణ నాభికమల నాళమున నజుం

డారయఁ బుట్టె ననుట నిజ, మోరాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్.

559

తా ॥ ఓ కమలనయనా! మిక్కిలి గొప్పదియైన ప్రళయ సమయమందు సముద్రంలో నిద్రిస్తూన్న శ్రీమన్నారాయణుని నాభి కమలము నుండి బ్రహ్మ జన్మించాడు అని లోకులు

చెప్పుకోవటం వాస్తవమే. నా పుట్టుకతో పాటు నా ఓటమి కూడా పుట్టింది.

సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు, జలము నారము జీవచయము నార
మందు నీ వుంట నీయం దవి యుంటను నారాయణుండను నామ మయ్యె
సకలభూతములకు సాక్షి వధీశుండ, వబ్ధి నిద్రించు నారాయణుఁడవు
నీ మూర్తి యది నీకు నిజమూర్తి యనరాదు, నలిననాళముత్రోవ నడచి మున్ను

తే. కడఁగి నూఱేండ్లు వెదకి నేఁ గాననయితి, నేకదేశస్థుఁడవు గా వనేక రుచివి జగములో
నుందు, నీలోన జగములుండు, నరుఁదు, నీమాయ నెట్లైన నగుచు నుందు.

560

తా ॥ తామరరేకులవంటి కన్నులుగలవాడా! త్రిమూర్తులకు మూలమైనందున నీవు ఆది నారాయణుడవు. నారములు అనగా జీవులు; అయనమంటే ఆశ్రయం; అందువలన సమస్త జీవులకు ఆశ్రయమైన నీవు నారాయణుడువు. అయనమంటే ఇంకొక అర్థం ప్రవర్తకుడు; దీనిని తీసుకుంటే సమస్త జీవులకు అధీశ్వరుడైన నీవు నారాయణుడవు. ఈ విధంగా సమస్త జీవులకు ఆశ్రయమూ, అధీశ్వరుడవు నీవే!

అలాగే అయనమంటే ఎరుగువాడు అని అర్థంతో చూస్తే, సమస్త జీవులకు సాక్షియై ఉన్నవాడివి నీవు. నారం అంటే జలం, అయనమంటే నివాసస్థానం అనే అర్థంతో చూస్తే, జలంలో నివసించేవాడవైన నీవు నారాయణుడవు. ఈ జగద్రూపదృశ్యమంతా నీ మాయయే అయి ఉన్నది, కనుక కనిపించేదే నీ నిజరూపం అనడానికి వీలు లేదు. (ఇలా నారాయణుడు అనడంలో ఎన్నో అర్థాలను గుర్తించవచ్చు)

నేను జన్మించినప్పుడు నూరేళ్ళు వెతికినా నిన్ను కనుగొనలేకపోయాను కదా! నీవు ఒకచోటనే ఉంటావని చెప్పడానికి వీలులేదు; బహువిధములుగా ప్రకాశిస్తూ ఉండే నీలో ఈ లోకాలన్నీ ఇమిడి ఉన్నాయి, లోకంలో నీవుంటావు. నీ మాయా ప్రభావం చేత ఏ విధంగానైనా

ఉండగల సమర్థుడవు.

మ. వినుమో యీశ్వర! వెల్పలన్ వెలుఁగు నీవిశ్వంబు నీమాయ గా
క నిజంబైన యశోద యెట్లు గనియెం? గన్నార నీకుక్షిలోఁ
గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ
క్కన లోనౌ, వెలి యౌను, లోను వెలియుం గాదేఁ దదన్యం బగున్?

561

తా ॥ ఓ స్వామీ! విను! బయట కనిపించే ఈ ప్రపంచం అంతా నీ మాయ. అదే యథార్థమైన పక్షంలో, యశోదాదేవి తన కన్నులారా నీ కడుపులో సర్వప్రపంచాన్ని ఎలా చూసింది? మరల ఆ ప్రపంచాన్ని నీ యందు చూసిందా? లేదు కనుక, అదియును అనిత్యమే అనవలసి ఉన్నది. నీ కడగంటి చూపు వ్యాపించుట చేత లోపల ఉన్న ప్రపంచం బయట; బయట ఉన్న ప్రపంచం లోపల కనిపిస్తూన్నది. అట్లు కానరానప్పుడు నీ స్వరూపంగానే భాసిస్తుంది.

మ. ఒకఁడై యుంటివి, బాలవత్సములలో, నొప్పారి తీ వంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ
బ్రకట శ్రీగలవాఁడ వైతి, వటుపై బ్రహ్మాండముల్ సూపి యొ
ల్లక యిట్లొక్కఁడ వైతి నీవివిధ లీలత్వంబుఁ గంటిం గదే?

562

తా ॥ స్వామీ! మొదట నీవు ఒక్కడిగానే ఉన్నావు. తరువాత గొల్ల పిల్లల్లో, దూడల్లో వెలుగొందావు; అనంతరం చతుర్భుజులైన విష్ణువుల రూపాలలో, ప్రాణులందరి నమస్కారములను అందుకుంటున్నట్లు కనిపించావు. నీ వైభవాన్ని ప్రకటింపచేస్తూ నన్ను ఆనందపరవశుడిని చేసావు. ఆ తరువాత బ్రహ్మాండాలన్నీ చూపావు, మళ్ళీ ఒక్కడిగా కనిపిస్తున్నావు. ఆహా! నీ లీలల వైభవం గురించి ఏమని చెప్పను!

క. ఎఱుఁగని వారికిఁ దోతువు, నెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ, తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా!

563

తా ॥ సృష్టి చేసేటప్పుడు నా స్వరూపమువలె, వృద్ధి చేసేటప్పుడు నీ స్వరూపమువలె, లయం చేసేటప్పుడు రుద్రుని స్వరూపమువలె అజ్ఞానుల దృష్టికి గోచరిస్తున్నావు. వాస్తవానికి సర్వమూ నీవే అయి ఉన్నావు.

క. జలచర మృగ భూసుర నర, కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపం
జెలిమిని సుజనుల మనుపను, దలపోయఁగ రాదు నీవిధంబు లనంతా!

564

తా ॥ స్వామీ! నీవు దుష్టులను శిక్షించుటకు, సజ్జనులను కాపాడుటకు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణావతారములను ధరించావు. నీ లీలలు అనంతం. వాటిని తెలుసుకోవటం ఎవరికీ శక్యం కాదు.

ఆ. మ్రబ్బుగొలిపి యోగమాయ నిద్రించిన, యో పరాత్మభూమ! యోగిరాజ!
యే తెఱంగు లెన్ని యెప్పు డెచ్చోట నీ, హేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ!

565

తా ॥ స్వామీ! యోగమాయ చేత లోకాలను అజ్ఞానమనే ఆవరణలో ఉంచుతున్నావు. ఇలా సర్వజనులను అజ్ఞానమనే చీకటిలో నిద్రింపచేస్తూ, పైకి మాత్రం నీవు యోగనిద్రలో ఉన్నట్లు కనిపిస్తావు. ఓ పరబ్రహ్మస్వరూపా! నీ లీలలు ఏ విధంగా ఉన్నాయో, ఎన్ని ఉన్నాయో, ఎలా జరుపబడుచున్నాయో తెలుసుకోగలవారెవ్వరు!

సీ. అది గాన నిజరూప మనరాదు, కలవంటిదై బహువిధదుఃఖమై విహీన

సంజ్ఞానమై యున్నజగము సత్సుఖబోధ, తనుఁడవై తుదిలేక తనరు నీదు
మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు నున్న చందంబున, నుండుచుండు,
నొకఁడ, వాత్ముఁడ, వితరోపాధిశూన్యుండ, వాద్యుండ, వమృతుండ, వక్షరుండ,

ఆ. వద్వయుండవును, స్వయంజ్యోతి, వాపూర్ణుఁ, డవు, పురాణపురుషుఁడవు, నితాంత
సౌఖ్యనిధివి, నిత్యసత్యమూర్తివి, నిరం, జనుఁడ వీవు, దలఁపఁ జనునె నిన్ను?

566

తా ॥ స్వామీ! నీవు సచ్చిదానంద నిర్మల అఖండ స్వరూపుడవు! కనుక కలవంటిది, అనేకరకాల దుఃఖాలతో, అజ్ఞానంలో మునిగి ఉన్న ఈ జగత్తు నీ స్వరూపం అని చెప్పటం కుదరదు. నీకు ఉత్పత్తి, స్థితి, లయములు లేకపోయినా, మాయచేత అవి ఉన్నవానివలె కనిపిస్తావు. ఉన్నది నీవొక్కడివే; ఇదియే సత్యం. నీవే అంతటికీ మొదటివాడవు, నీకు అంతము లేదు; శాశ్వతుడవు, ఆత్మ స్వరూపుడవు నీవు. స్వయం ప్రకాశకుడవు నీవు. సర్వమూ నీలోనే ఉన్నవాడివి! నిత్యానంద సత్యస్వరూపుడవు నీవు! సంపూర్ణానందానికి నెలవైనవాడవు! అవ్యక్తంగా, ప్రకృతిని మీరి వెలుగొందే నిన్ను, వాక్కుతో కానీ, మనస్సుతో కాని ధ్యానించడం సాధ్యమయ్యే విషయం కాదు!

వ. దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపకుండవును, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుండవు నని యెవ్వ రెఱుఁగుదురు, వారు గదా గురువనియెడు దినకరుని వలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునంజేసి సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు, రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, న య్యెఱుంగమి నది సర్పరూపంబయి తోఁచిన పిదప నెరింగినవారి వలన రజ్జువు రజ్జువని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మ య ప్పరమాత్మయని యెవ్వరెఱుంగరు వారి కయ్యెఱుంగమివలన సకల ప్రపంచంబుఁ గలిగి తోఁచు, నాత్మ య ప్పరమాత్మయని యెవ్వరెఱుంగుదురు, వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు,

నజ్ఞానసంభావిత నామకంబులైన సంసార బంధమోక్షంబులు, జ్ఞానవిజ్ఞానంబుల లోనివి గావు! కావునఁ గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణజ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబులేమిని బంధంబును సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లే, వాత్మవైన నిన్ను దేహాదికంబని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు, వారి మూఢత్వంబుఁ జెప్ప నేల? బుద్ధిమంతులై పరతత్త్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ శరీరంబులయందు నిన్నరయుచుందు రది గావున.

567

తా ॥ ఓ స్వామీ! ఇటువంటి నీవు సమస్త జీవులలోని ఆత్మస్వరూపుడవనీ, సకల ఆత్మలకు ఆత్మ అయిన పరమాత్మ స్వరూపుడవనీ, నీ యొక్క అమృత స్వరూపాన్ని గుర్తించగలిగినవారు గురువనే సూర్యుని చేత తత్త్వజ్ఞానమనే చూపుని పొంది ఉన్నవారు. అటువంటి వారు మాత్రమే సంసారమనే మాయసాగరాన్ని దాటగలరు. ఒక తాడుని చూసినప్పుడు, దానిని తాడుగా గుర్తించలేనప్పుడు, అది పాములాగ తోస్తుంది. దానిని దగ్గరగా చూసినవారు అది తాడు మాత్రమే అని చెప్పినప్పుడు అది పాముకాదనీ, తాడేనని గురి కుదురుతుంది. అదే విధంగా తనలో ఉన్న ఆత్మయే అంతటా వెలుగొందుతూ ఉన్నదని గుర్తించనంతవరకూ, అజ్ఞానులకు నీవు కనబడవు. ప్రపంచం సత్యంగా అనిపిస్తుంది. జ్ఞానం చేత సత్యాన్ని గుర్తించినప్పుడు మాత్రమే నిన్ను సర్వత్రా గాంచగలరు. అదే విధంగా సంసారసంబంధమైన బంధం, దానినుండి విముక్తి అనే మోక్షమూ, రెండూ అజ్ఞానం చేతనే కల్పించబడినాయి. ఈ బంధం, మోక్షమూ జ్ఞాన విజ్ఞానాలలో చేరవు. పరిపూర్ణ జ్ఞానస్వరూపమైన పరమాత్మ కంటే, అవి వేరే అస్తిత్వాన్ని కలిగి లేవు. ఇది ఎలాగంటే, సూర్యుని చుట్టూ భూమి తిరుగుతోంది కాబట్టి మనకు రాత్రి, పగలు అని ఏర్పడుతున్నాయి కానీ, సూర్యునికి రాత్రి పగలు అనేవి లేవు. అదే విధంగా పరిపూర్ణుడైన జ్ఞానికి బంధం, మోక్షం అనేవి లేవు. ఆత్మస్వరూపుడవైన నిన్ను శరీరంగానూ, శరీరానికి వెలుపల ఎక్కడో ఉంటావని భావించే

వారు అజ్ఞానులు. వారి మూఢత్వం గురించి చెప్పడానికి ఏముంది? బుద్ధిమంతులైన సత్పురుషులు జడం, చైతన్యం అనే భేదం లేక నిన్ను అంతటా దర్శించగలరు, తమలోనూ చూడగలరు.

శా. దేవా! నీచరణ ప్రసాద కణలబ్ధిం గాక లేకున్న నొం
డేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీవారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమం దయిన నొం డెం దైన నోయీశ్వరా!

568

తా ॥ స్వామీ! నీ పాదసేవ చేసి దానివల్ల లభించిన ధూళి కణం యొక్క అనుగ్రహం చేత నీ మహిమ తెలుసుకోగలను. కానీ లేకపోతే నా అంతట నాకుగా సాధ్యపడదు. నాకు ఈ జన్మలోగాని, ఇంకొక జన్మలోగాని, నీ సేవకులలో ఒకడనై, నిన్ను సేవిస్తూ ఉండే అదృష్టం కలిగేటట్టు అనుగ్రహించు.

తరలము.
క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి, కాని నీ విటుక్రేపులున్ సుతులునై
చనుఁబాలు ద్రావుచుఁ జొక్కియాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ!

569

తా ॥ ఓ స్వామీ! నీవు యజ్ఞపురుషుడవు, వందలాది యజ్ఞాల హవిస్సులను అందుకునే నీవు సదా కడుపునిండిన మహాపురుషుడివే! అయితే ఈ విధంగా గోపబాలుర వలె, లేగల వలె రూపాలను ధరించి, గోపికల వద్ద, గోవులవద్ద ఆకలిగొన్నవాని వలె పాలు తాగుతూ పరవశిస్తూ

ఉన్నావు. ఈ విధంగా నీకు తృప్తిని కలిగించేలా చేసిన ఆ గోపికలు, గోవులు ఎంతటి పుణ్యం చేసుకున్నాయో వివరించడం ఎలా సాధ్యం! కృప అనే అనంతత్త్వపు నిధిని కలిగి ఉన్నవాడవు కదా నీవు!

క. పరిపూర్ణంబుఁ బురాణముఁ, బరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నందఘోష, స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్.

570

తా ॥ చక్కగా విచారించి చూస్తే, సర్వవ్యాపకమై, అనాదియై, ఆనంద స్వరూపమై ప్రకాశించే పరబ్రహ్మమే ఈ నందుని మందలోని జనులకు స్నేహితుడై వర్తిస్తోంది. ఔరా! ఈ మందలోని వారి భాగ్యాన్ని గురించి ఏమనాలి? ఊహించేందుకు శక్యంగాని విధంగా ఉన్నది.

సీ. ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదు లేను ఫాలాక్షుండు నిట్లు సూడఁ
బదుమువ్వురము నెడపడక యింద్రియపాత్రముల నీ పదాంభోజముల మరంద
మమృతంబుగాఁ ద్రావి యమర నేకైకేంద్రి యాభిమానులమయ్యు నతికృతార్థ
భావుల మైతిమి, పరఁగ సర్వేంద్రియ వ్యాప్తులు నీ మీఁద వ్రాల్చి తిరుగు

తే. గోపగోపికా జనముల గురు విశిష్ట, భాగ్య సంపదఁ దలపోసి ప్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష! భక్తవత్సల! సర్వేశ! పరమపురుష!

571

తా ॥ ఓ కృష్ణా! పదకొండు ఇంద్రియాలకు అధిదేవతలు అయిన చంద్రుడు మొదలైన వారూ, నేనూ, శివుడూ, కలిపి మొత్తంగా పదముగ్గురము అయ్యాం. మేమంతా ఎడతెగక ఇంద్రియాలనెడు పాత్రముల చేత, నీ పాద కమలముల యందలి మకరందం అనే అమృతాన్ని తాగుతున్నాము. ఒక్కొక్క ఇంద్రియానికి వేరు వేరుగా అధిపతులమై ఉన్నాము. అయినా మిక్కిలి ధన్యులమయ్యాం! అటువంటిది సర్వేంద్రియాలను నీయందే వ్యాపింపచేసి వర్తించే గోపకులు,

గోపికల యొక్క విశిష్ట భాగ్యసంపద పొగడటానికి గాని, ఆలోచించడానికి గాని ఎవరికి సాధ్యపడుతుంది! భక్తుల ఎడల వాత్సల్యాన్ని ప్రదర్శించే సర్వేశ్వరుడవు, పరమ పురుషుడవు కనుకనే వారికి అట్టి మహద్భాగ్యం కలిగింది.

శా. 'ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే?

572

తా ॥ సచ్చిదానంద స్వరూపుడవైన నిన్ను వేదాలు సైతం దర్శించలేక పోయాయి కదా! అటువంటి నిన్ను, ఈ భూలోకంలో, ఈ అడవిలో, ఈ గొల్లపల్లెలో కృష్ణా! అంటూ ముచ్చట్లు చెబుతూ, సమస్త భావాలు నీయందే సమర్పించి ఉన్నారు. ఈ గొల్లలలో ఏ ఒక్కని పాదరేణువులు శిరమున ధరించినా చాలుగదా! దాని ముందు ఈ బ్రహ్మపదవి ఏపాటిది?

మ. నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటిసంకేత మి
చ్చిన నీకుం బుర దార పుత్ర గృహ గో స్త్రీ ప్రాణ దేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో!
యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీక రక్షామణీ!

573

తా ॥ భక్తసంరక్షకుడవైన ఓ స్వామీ! నిన్ను హింసించడానికి వచ్చిన పూతనాదులకు పరమ పదాన్ని ప్రసాదించావు. అలాంటి నీవు, గృహం, భార్య, పుత్రులు, గోవులు... ఇలా తమదంటూ ఏదీ భావించక నీకు సర్వసమర్పణం గావించుకున్న ఈ గొల్లవారికి మోక్షం కన్నా మిన్న అయినది ఇంకా ఏమిస్తావో అని నాకు సందేహం కలుగుతోంది.

క. దేహము కారాగేహము, మోహము నిగళంబు, రాగముఖరములు రిపు
మ్యాహములు భక్తి తో ని, న్నూహింపని యంతదడవు నో కమలాక్షా!

574

తా ॥ ఓ కమలాక్షా! దేహమనెడు చెరసాలలో, మోహం అనే సంకెళ్ళు కాళ్ళకు తగులుకోగా, కామక్రోధ లోభ మోహాదులనెడు శత్రు సమూహం చేత చిక్కుకున్నవారికి, నిన్ను ఊహించడానికి కూడా శక్తి సరిపోదు.

ఆ. ఆశ్రయించు జనుల కానందసందోహ, మీఁ దలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు, వెలయఁజేయు దీవు విశ్వమూర్తి!

575

తా ॥ కృష్ణా! నీవు నిన్నాశ్రయించిన భక్తులకు బహువిధ సంతోషాన్ని కలగచెయ్యాలని, నీకు జన్మాదులు లేకున్నా, అది కలవాని వలె, నానావిధ విలాసములతో చరాచర వస్తురూప ప్రపంచాన్ని ప్రకాశింప చేస్తూ ప్రవర్తిస్తున్నావు.

క. ఎఱిఁగినవార లెఱుంగుదు, రెఱుఁగన్ బహుభాష లేల? యీశ్వర! నీ పెం
పెఱుఁగ మనోవాక్కులకున్, గుఱి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ!

576

తా ॥ ఓ గుణరత్ననిధీ! పలుమాటలాడుట వలన ప్రయోజనం లేదు. నీ స్వరూప స్వభావాలు ఇట్టివని నీ స్వరూపులైన బ్రహ్మజ్ఞానులు మాత్రమే తెలుసుకోగలరు. మనస్సుకు, వాక్కునకు అందని నీ తత్త్వం తెలుసుకోగలగడం అంత తేలికైన విషయం కాదు.

క. సర్వము నీవ యెఱుంగుదు, సర్వవిలోకనుఁడ వీవ, జగదధిపతివిన్,
సర్వాపరాధు నను నో, సర్వేశ! యనుగ్రహింపు, చనియెద నింకన్.

577

తా ॥ సర్వేశ్వరా! సర్వమూ నీకు తెలుసు. నీవు అన్నింటినీ చూస్తూ ఉంటావు! నీవే ఈ జగత్తుకు ప్రభుడవు! కనుక అపరాధం చేసిన నన్ను మన్నించి అనుగ్రహించు! నా లోకమునకు వెళ్ళేందుకు అనుజ్ఞనిమ్ము!

క. జిష్ణు! నిశాటవిపాటన!, వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో
వైష్ణవసాగరహిమకర!, కృష్ణా! పాషండధర్మగృహదావాగ్నీ!

578

తా ॥ కృష్ణా! నీవు జయశీలుడవు! రాక్షస సంహారకుడవు! వృష్ణివంశమనే కమలాన్ని వికసింపచేసే సూర్యుని వంటి వాడవు! బ్రాహ్మణులు, దేవతలు, గోవులు, విష్ణుభక్తులు అనే సముద్రానికి ఆనందం కలిగించే చంద్రుని వంటి వాడవు! నిరీశ్వర వాదుల నడవడిని కార్చిచ్చులాగ మొదలంట దహించువాడవు!

వ. దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద నని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దన నెలవునకుం జనియె, నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన వత్స బాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె, నిట్లు.

579

తా ॥ దేవా! ఈ కల్పం చివరవరకూ నీకు నమస్కారం చేస్తూనే ఉంటాను" అని మూడు సార్లు ప్రదక్షిణం చేసి పాదాలమీద పడి లేచి, బ్రహ్మ సెలవు పుచ్చుకొని తన నివాసమైన సత్యలోకమునకు వెళ్ళాడు. అట్లు మ్రొక్కిన బ్రహ్మను ఆదరించాడు శ్రీకృష్ణుడు. ఇంతకు ముందు మాయమై తిరిగి తన వద్దకు వచ్చిన దూడలను, గొల్లపిల్లలను ఇసుక తిన్నెల వద్దకు చేర్చాడు.

క. క్రించుఁ దనంబున విధి దము, వంచించిన యేఁడు గోపవరనందను లొ
క్కించుక కాలంబుగ నీ, క్షించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్.

580

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మ మోసం చేసి తమ్ము దాచిపెట్టిన సంవత్సర కాలం బాలకృష్ణుని మాయవలన వారంతా రెప్పపాటు కాలంగా భావించారు.

ఆ. ఏ మహాత్ము మాయ నీవిశ్వమంతయు, మోహితాత్మక మయి మునిఁగి యుండు
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్క యేఁ, డెఱుఁగ కుండి రనుట యేమి వెఱఁగు?

581

తా ॥ ఏ మహా పురుషుని మాయలో పడి ఈ విశ్వమంతా అణగి ఉంటుందో, అట్టి విష్ణుమాయ వలన తామున్న స్థితిని గొల్లపిల్లలు తెలుసుకోలేక పోవటం అనేది పెద్ద వింతకాదు.

వ. అప్పుడు.

582

మ. 'చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్? సేమంబునం గ్రేపులున్
నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునందాఁకఁ జ
ల్దులు వీ రించుక యెవ్వరుం గుడువ, రాలోకింపు, ర' మ్మంచు నా
జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్.

583

తా ॥ కృష్ణుడు ఏమీ ఎరుగనివానివలె, వారి వద్దకు రాగా, అప్పుడు వారు, 'వచ్చావా మిత్రమా! దూడలు క్షేమంగా వెనక్కి వచ్చేసాయి. నీవు వచ్చేవరకు తినకూడదని మేము కూడా తినకుండా నీకోసం చూస్తున్నాము, త్వరగా రా! తిందాము' అని పిలిచారు. ఆ మాటలకు

నవ్వుకుంటూ కృష్ణుడు వారితో గూడి చల్దులు ఆరగించాడు.

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగర చర్మంబు సూపుచు వనంబు నుండి తిరిగి.

584

తా ॥ ఈ విధంగా కృష్ణుడు గోప బాలకులతో చల్ది ఆరగించి, ఆ పిల్లలకు కొండచిలువ చర్మాన్ని చూపిస్తూ వనంనుండి తిరిగి బయలుదేరాడు.

పంచచామరము.
ప్రసూనపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం
బ్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ లోకుఁడుం
బ్రసన్న గోప బాలగీత బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేఁగె గోపకుల్ సెలంగి చూడ మందకున్.

585

తా ॥ ఆ బాలకృష్ణుని తలపై ధరించిన నెమలిపింఛం, మెడలోని వనమాల వింతకాంతితో ప్రకాశిస్తున్నాయి. పిల్లనగ్రోవిని ఊదుతూ, కొమ్ము బూరాను మ్రోగించే ఆ నల్లనయ్య చేసే సందడికి లోకమంతా బద్ధమై ఆకర్షించబడుతోంది. గోపబాలురు అతనిని పొగుడుతూ ఉండగా, తమకై వేచి ఉన్న గోపకులు అందరూ సంతోషించే విధంగా గోకులానికి చేరుకున్నాడు.

వ. ఆ సమయంబున.

586

క. పెనుఁబాము దమ్ము మ్రింగిన, మన నందసుతుండు పాము మర్దించి మమున్

మనిచె నరణ్యములోపల, నని ఘోషించిరి కుమారు లాఘోషములోన్.

587

తా ॥ గోకులానికి చేరగానే గోపబాలురు అందరికీ తెలిసేవిధంగా, తమను ఒక కొండచిలువ మింగివేసిందనీ, అంతట కృష్ణుడే దానిని చంపి వారిని కాపాడాడని గట్టిగా అరుస్తూ చెప్పసాగారు."

వ. అనిన విని నరేంద్రుం డిట్లనియె.

588

క. 'కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్ములకంటె నందతనయుం డా ఘో
ష నివాసులకు మనోరం, జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను నెఱిఁగింపన్ '

589

తా ॥ ఈ విధంగా చెప్పిన శుక యోగీంద్రునితో, పరీక్షిత్తు మహారాజు ఇట్లా అన్నాడు: 'మహర్షీ! ఆ గోకులంలోని గొల్లవాండ్రకు తాము కని పెంచి పెద్ద చేసిన కొడుకులకంటే కూడా, నందుని కొడుకైన శ్రీకృష్ణుడు ప్రీతిపాత్రుడు ఎలా అయినాడు? వివరంగా తెలియజేయండి.'

వ. అనిన శుకుం డిట్లనియె.

590

తా ॥ అనగా శుకమహర్షి ఇట్లా అన్నాడు:

సీ. అఖిల జంతువులకు నాత్మవల్లభమైన, భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు, సకలాత్మకుండైన జలజనేత్రుఁ
డఖిల జంతువులకు నాత్మ గావున ఘోష వాసుల కెల్లను వల్లభత్వ
మునను మిక్కిలి యొప్పె మూఁడులోకములకు హితము సేయఁగ జలజేక్షణుండు

ఆ. మాయతోడ మూర్తి మంతుఁడై యొప్పారుఁ, గలఁడతండు నిఖిల గణములందు
భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ, ధాతు గణమునందుఁ దనరు నట్లు.

591

తా ॥ "అన్ని జీవరాసులకు తమకు తాము ప్రియమైనట్లుగా పిల్లలు, ఇళ్ళు, బంగారం అన్నవి ప్రియంగా ఉండవు. సకల లోకాలు తన స్వరూపంగా కల శ్రీకృష్ణుడు సకల ప్రాణులకు జీవమైన వాడు, అందుకనే గొల్లలందరకును ప్రేమాస్పదుడు అయ్యాడు. శ్రీకృష్ణుడు మూడు లోకాలకు మేలు చేయటంకోసం మాయతో కూడి దేహధారియై ఉంటాడు. భవతి (ఉండుట) అనేది అన్ని క్రియలను ఎలా తెలుపుతుందో, అలా పరమేశ్వరుడు అన్నింటా, అంతటా ఉన్నాడు. (ఇదే ఉపనిషత్తుల్లో బోధించబడే తత్త్వం)

క. శ్రీపతి పదమను నావను, బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాఁటి చేరుదు, రాపత్పద రహితు లగుచు నమృతపదంబున్.

592

తా ॥ శ్రీపతి పాదములనే ఓడను పొందిన పండితులు, సంసార సముద్రాన్ని లేగదూడ అడుగుని దాటినంత తేలికగా దాటి, ఆపదలకు ఆలవాలమైన మూలప్రకృతిని మీరి నిరుపాధికమైన మోక్ష స్థానాన్ని చేరతారు.

ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులుఁ దానును, జల్ది గుడిచి జలజసంభవునకుఁ
జిద్విలాసమైన చెలువు సూపిన కథఁ, జదువ వినినఁ గోర్కి సంభవించు.

593

తా ॥ శ్రీకృష్ణుడు అఘాసురుని చంపి గోపకుమారులను కాపాడి, వారితో కూడి చల్ది తిని, బ్రహ్మకు నానావిధ లీలలను చూపినట్టి ఈ కథను ఎవరు శ్రవణం చేసి, లీలాధ్యానం చేస్తారో వారు మిక్కిలి ఆనందాన్ని పొందుతారు."

వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె.

594

తా ॥ అని చెప్పి శ్రీశుక మహర్షి ఇలా అన్నాడు:

క. రాగంబున బలకృష్ణులు, పౌగండవయస్సు లగుచుఁ బశుపాలకతా
యోగంబున బృందావన, భాగంబునఁ గాచి రంతఁ బశువుల నధిపా!

595

తా ॥ "ఓ రాజా! బలరామకృష్ణులు అయిదేండ్లకు మీరిన వయస్సు పొందినవారై, పసులకాపరులతో చేరుకొని బృందావనంలో పశువులను మేపటం ఆరంభించారు.

వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి బలభద్ర సహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు సేయ మ్రోల నాలకదుపుల నిడికొని నిరంతర ఫల కిసలయ కుసుమంబులును, గుసుమ మకరంద నిష్యంద పానానందదిందిందిర కదంబంబును, గదంబాది నానాతరు లతా గుల్మసంకులంబును, గులవిరోధరహిత మృగపక్షి భరితంబును, భరితసరస్సరోరుహ పరిమిళిత వనంబును నయిన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి వెన్నుం డన్న కిట్లనియె.

596

తా ॥ పశువులను మేపునట్టి కాలంలో కృష్ణుడు ఒకనాడు ప్రొద్దుటే నిద్రలేచాడు. లేచి బలరాముడు గోపకుమారులు తన్ను చేరుకొనగా, పిల్లంగ్రోవి ఊదుకొంటూ ఆవుల గుంపును తోలుకొంటూ బయలుదేరారు. చెట్లు, చిగుళ్ళు, పువ్వులు, కాయలు, పండ్లు మొదలైన వాటిచేత నిండి ఉన్నాయి. పూలనుండి కారుతూన్న పూతేనెను త్రాగి ఆనందించే తుమ్మెద బారులతోనూ, కడిమి చెట్లు మొదలుగా అనేక వృక్షముల చేతనూ, పొదల చేతను క్రిక్కిరిసినదియును అయిన ఆ అడవి ఎంతో మనోహరంగా ఉంది. జాతివైరం లేక మృగాలు, పక్షులు ప్రవర్తిస్తున్నాయి. తామర

పూల పరిమళంతో చల్లటి గాలి హాయిగా వీస్తోంది. అట్టి వనంలో వినోదంగా ఆటలాడ తలచి కృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు:

శా. శాఖాపుష్పఫల ప్రభార నతలై చర్చించి యో దేవ! మా
శాఖీత్వంబు హరింపు' మంచు శుకభాషన్ నీ కెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ సక్కన్ సమర్పించుచున్
శాఖిశ్రేణులు నీపదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే!

597

తా ॥ "ఈ అడవిలో ఉన్న చెట్లు, కొమ్మల నిండి ఉన్న పూలగుత్తులచే, ఫలముల బరువుచేత వంగిపోయి, ఓ స్వామీ! మా వృక్షజన్మను హరించమని చిలుక పలుకులను చెబుతున్నాయా అన్నట్లున్నాయి. పైగా కొమ్మలనే చేతుల చేత, పూలను, పండ్లను, భక్తితో ఇస్తూ ఈ వృక్షములు నీ పాదకమలాలకు నమస్కరిస్తూ ఉన్నాయి.

సీ. నిఖిలపావనమైన నీకీర్తిఁ బాడుచు నీ తుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుఁడ వని మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడ నీవు జీమూత మవని నీలకంఠంబు లాడఁ దొడఁగెఁ
బ్రియముతోఁ జూచు గోపికల చందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు

ఆ. నీవు విందవనుచు నిర్మలసూక్తులు, వలుకుచున్న విచటఁ బరభృతములు
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన, ధన్యులైరి గాదె తలఁచి చూడ.

598

తా ॥ అన్నా! నీవు ఈ వనానికి రాగా, ఇక్కడి తుమ్మెదలు అన్నీ నీ కీర్తినే పాడుతూ నీ వెనకాలే వస్తున్నాయి. ఇచ్చటి ఋషి పక్షులు నీవు మారు వేషము చేత గూఢంగా ఉన్న సర్వేశ్వరుడవని నిన్ను సేవించడానికి వస్తున్నాయి. నల్లని వస్త్రం ధరించి ఉన్న నీవు నీలమేఘమని

ఎంచి, ఇచ్చటి నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. నీ మీది అనురాగంతో నిన్ను చూసే గోపస్త్రీలవలె, ఇచ్చటి ఆడజింకల సమూహం చూస్తున్నాయి. ఇచ్చటి కోయిలలు, నీవు తమ ఇంటికి విందు ఆరగించడానికి వచ్చిన అతిథివి అని చెపుతున్నాయి. నీవు ఈ వనానికి రావడంచేత అడవిలో సంచరించే వారంతా కృతార్థులయ్యారు."

సీ. నీ పాదములు సోఁకి నేఁడు వీరుత్తృణ పుంజంబుతో భూమి పుణ్య యయ్యె
నీ నఖంబులు దాఁకి నేఁడు నానాలతా తరుసంఘములు గృతార్థంబు లయ్యె
నీ కృపాదృష్టిచే నేఁడు నదీశైల ఖగమృగంబులు దివ్యకాంతిఁ జెందె
నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనా జనముల పుట్టువు సఫల మయ్యె

ఆ. నని యరణ్యభూమి నంకించి పసులను, మిత్రజనులు దాను మేపు చుండి
నలినలోచనుండు నదులందు గిరులందు, సంతసంబు మెఱయ సంచరించె.

599

తా ॥ శ్రీకృష్ణుడు బలరామునితో ఇంకా ఇలా అన్నాడు: "అన్నా! నేడు నీ పాదములు సోకి పచ్చికలతో, పూపొదలతో ఉన్న ఈ భూమి పరిశుద్ధత్వాన్ని పొందింది. నీ గోళ్ళు సోకటం చేత నానా విధాలైన తీగలన్నీ ధన్యమయ్యాయి. నీ కటాక్షవీక్షణాల చేత నదులు, కొండలు, పక్షులు, మృగములు దివ్యకాంతిని పొందాయి. విశాలమైన నీ వక్షస్థల స్పర్శ చేత గోపస్త్రీల జన్మ సఫలమైంది" అని పొగడి తన చెలికాండ్రతో కూడి అక్కడి నదులు, కొండలు మొదలైన వాటియందు సంతోషంతో విహరించాడు.

వ. మఱియు న య్యీశ్వరుండు.

600

సీ. ఒకచోట మత్తాళియూథంబు జు మ్మని మ్రోయంగ జుమ్మని మ్రోయుచుండు
నొకచోటఁ గలహంస యూథంబు గూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు

నొకచోట మదకేకియూథంబు లాడంగ హస్తాబ్జములు ద్రిప్పి యాడఁదొడఁగు
నొకచోట వనగజయూథంబు నడవంగ నయముతో మెల్లన నడువఁజొచ్చుఁ

ఆ. గ్రౌంచచక్ర ముఖర ఖగము లొక్కొకచోటఁ, బలుక వానియట్ల పలుకుఁ గదిసి పులుల
సింహములను బొడగని యొకచోటఁ, బఱచు మృగములందుఁ దఱచుఁ గూడి.

601

తా ॥ ఆ బాలకృష్ణుడు పశువులను మేపుతూ, ఒక చోట మత్తుగొన్న తుమ్మెదలతో ఝుంకారం చేస్తుంటే, వాటిలాగే ఝుంకారం చేస్తాడు. మరో చోట క్రేంకారాలు చేసే హంసలతో కూడి క్రేంకారాలు చేస్తాడు. ఇంకొకచోట నృత్యములు చేసే నెమళ్ళతో కలసి తానూ నృత్యం చేస్తాడు. మరొకచోట ఏనుగులను చూసి వాటి వెనకాలే హొయలుగా నడుస్తాడు. క్రౌంచ పక్షులు, చక్రవాక పక్షులు, మొదలైన పక్షులు నానా విధాలుగా ధ్వని చేస్తూంటే తాను కూడా అలాగే ధ్వని చేస్తాడు. సింహాలు, పెద్దపులులు, వీటిని చూసి పరుగెత్తే జింకలతో కలసి సమంగా పరుగెడుతూ ఉంటాడు.

వ. మఱియును.

602

సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ! రమ్ము భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘబాలిక! రమ్ము చింతామణి! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్ము మందాకిని! రా శుభాంగి!

ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలు గలగోవు, లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాషఁ గడునొప్పఁ జీరు నా, భీరజనులు వొగడఁ బెంపు నెగడ.

603

తా ॥ ఇంకా ఆ అడవుల్లో ఆవులు దూరదూరంగా వెళ్ళి మేస్తూ ఉంటే, మేఘధ్వనిని పోలిన స్వరంతో వాటిని పేరుపేరునా, ఏ పూర్ణచంద్రికా! ఓ గౌతమీ గంగ! ఇలా రమ్మ భాగీరథీ! ఓ సుధాజలరాశి! ఓ మేఘ మాలిక రావమ్మా! ఓ చింతామణి! రా సురభి! మనోహారిణి! రా! సర్వ మంగళ రా! రా! భారతీ దేవి! ధరిత్రి రావమ్మా! శ్రీమహాలక్ష్మి రావమ్మా! రా మంద మారుతి! మందాకిని రావమ్మా! రావమ్మా! శుభాంగి! అని పిలుస్తూ ఉంటే, ఆ పిలుపులలోని మార్దవానికి, మాధుర్యానికి గోపకులు ఎంతగానో ఆనందాన్ని పొందసాగారు.

క. కాంతారవిహారమ్ముల, శ్రాంతుండై గోపకాంకశయుఁడగు నన్నన్
సంతుష్టిఁ బొందఁజేయు ని, రంతరకరచరణ మర్ధనాదుల నధిపా!

604

తా ॥ రాజా! బలరాముడు ఆ అడవిలో వినోదంగా తిరగటం చేత అలసినవాడై స్నేహితుల ఒడిలో తలపెట్టుకుని విశ్రాంతి తీసుకునేవాడు. అప్పుడు కృష్ణుడు అన్నగారి వద్దకు చేరి చేతులు కాళ్ళు ఒత్తి, అలసటను పోగొట్టి, ఉపచారాలచేత సంతోషింప చేసేవాడు.

క. పాడుచు నాడుచు మందట, లాడుచు నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని బి
ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ, గ్రీడింతురు నగుచు బలుఁడు గృష్ణుఁడు నొకచోన్.

605

తా ॥ బలరామకృష్ణులు ఇద్దరూ పాటలు పాడుచూ, ఆడుతూ, ముచ్చటలాడుతూ, ఒకరి నొకరి తాకుతూ, స్నేహితులను చూసి గట్టిగా అరుస్తూ, ఒకరిపై ఒకరు చేతులు వేస్తూ నవ్వుతూ ఆడుకునేవారు.

వ. ఇవ్విధంబున.

606

సీ. వేదాంతవీథుల విహరించు విన్నాణి, విహరించుఁ గాంతారవీథులందు
ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవ శయ్యలఁ బవ్వళించు
గురుయోగి మానస గుహలఁ గ్రుమ్మరు మేటి గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోనఁ
గమలతోడఁ బెనఁగి కడు డయ్యు చతురుఁ డా భీరజనులతోడఁ బెనఁగి డయ్యు

ఆ. నఖిలలోకములకు నాశ్రయుండగు ధీరుఁ, డలసి తరులనీడ నాశ్రయించు
యాగభాగచయము లాహరించు మహాత్ముఁ, డడవిలోని ఫలము లాహరించు.

607

తా ॥ ఈ విధంగా, వేదాంత వీథులలో విహరించు నేర్పరి ఈనాడు అడవిలో చెట్లనడుమ విహరిస్తూ ఉన్నాడు. ఆదిశేషుని శయ్యగా చేసుకొని పవళించే సుఖభోగి, నేడు చిగురుటాకుల శయ్యలమీద పడుకొంటున్నాడు. మూడు లోకాలకు గురువులైన యోగీశ్వరుల మానస గుహలలో సంచరించే ముఖ్యుడు, నేడు పర్వత గుహలలో విహరిస్తున్నాడు. లక్ష్మీదేవి తోడి క్రీడించి అలసేవాడు ఈనాడు గొల్లపిల్లవాండ్రతో పెనగులాడి మిక్కిలి అలసిపోతున్నాడు. సకల లోకాలకు ఆశ్రయమైనవాడు ఈనాడు వృక్షముల నీడలను ఆశ్రయిస్తూన్నాడు. యజ్ఞములలో హవిర్భాగాలను ఆరగించువాడు నేడు అడవిలో పండ్లను ప్రీతితో ఆరగిస్తున్నాడు. ఈ విధంగా ఆ శ్రీకృష్ణ పరమాత్మ గొల్లవారితో సమంగా వర్తిస్తున్నాడు.

వ. ఆ సమయంబున.

608

సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరుతల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి
ద వ్వేఁగి నిలుచుచోఁ దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున,

ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున, మాధవునకుఁ బెక్కు మార్గములను

బనులు సేసి రెల్లభవములఁ జేసిన, పాపసంచయములు భస్మములుగ.

609

తా ॥ ఆ సమయంలో శ్రీకృష్ణుడు అలసిపోతే, ఆ గోపబాలురు ఎంతో సంతోషంతో వీపులమీద ఎక్కించుకుని తీసుకొని వెళతారు. కొందరు, అతడు అలసి నిద్రపోయేటప్పుడు తమ తొడలను పరుపులుగా చేసి పడుకోపెట్టుకుంటారు. అతనికి చెమట పోసినప్పుడు, చిగురుటాకులను విసనకర్రలుగా చేసి ఉత్సాహంతో విసురుతారు. అతను కొంత దూరం నడచి నిలిచిపోతే, కాళ్ళనొప్పులు వచ్చాయని ఎంతో ప్రేమతో ఆ పాదాలను ఒత్తుతారు. ఇలా వివిధ రీతులలో, ఎన్నో సేవలను కృష్ణునియందు ప్రీతితో చేస్తారు. ఈ సేవలతో వారి పూర్వజన్మలలోని కర్మ సంచయం హరించిపోతుంది.

వీపున మోయాల్సింది అనంత స్వరూపుడైన భగవంతుడినే గానీ వ్యర్థ సంసారాన్ని కాదు అని తెలుసుకున్నందునే వారికి ఆ భాగ్యం కలిగింది.

వ. అ య్యవసరంబున శ్రీదామనామధేయుండైన గోపాలకుండు రామకేశవులం జూచి యిట్లనియె.

610

తా ॥ ఒకనాడు శ్రీదాముడనే గోపాలకుడు బలరామకృష్ణులతో ఇలా అన్నాడు:

## 20. గార్దభాకారుడైన ధేనుకాసురుణ్ణి బలభద్రుడు వధించుట

క. దూరంబునఁ దాలతరు, స్ఫారం బగు వనము గలదు, పతితానుపత
ద్భూరిఫలసహిత మది, యే, ధీరులు సొరవెఱతు రందు ధేనుకుఁ డుంటన్.

611

తా ॥ "మిత్రులారా! ఇచ్చటికి దూరముగా ఒక తాటి తోపు ఉంది. తాడి చెట్ల నుండి అక్కడ ఎన్నో తాటి పండ్లు రాసులు రాసులుగా రాలుతూ ఉంటాయి. అయితే దానిలో ధేనుకుడనే రాక్షసుడు ఉండటంచేత ఎంతో ధైర్యశాలురు కూడ అచ్చటికి పోవడానికి భయపడతారు.

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండునునై సమానసత్త్వ సమేతులైన జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు, నయ్యెడఁ బరిమళోపేతంబులైన నూతన ఫలవ్రాతంబు లసంఖ్యాకంబులు గలవు. వినుఁడు.

612

తా ॥ మహాబలవంతుడైన ఆ ధేనుకాసురుడు గాడిద రూపంలో ఉంటాడు. వాడూ, వాడితో పాటు సమానబలంకల వాడి బంధువులూ మనుష్యులు కనిపిస్తే పట్టుకొని తింటూ ఉంటారు. కాని అక్కడ తాటి పళ్ళు మాత్రం మంచి సువాసనతో, లెక్క పెట్టలేనంతగా ఉంటాయి.

క. ఫలగంధము నాసాపుట, ములఁ జొచ్చి కలంచి చిత్తములఁ గొనిపోయెన్
ఫలముల నమలింపుఁడు మము, బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే?

613

తా ॥ ఆ ఫలాల పరిమళం గాలికి వ్యాపిస్తూ, మా మనస్సులను ఆ పండ్లున్న చోటికి తీసుకొని పోతోంది. ఆ పండ్లు తినాలని మాకు కోరికగా ఉంది. మీరు బలవంతులు కనుక ఆ రాక్షసుణ్ణి చంపి, మమ్ము ఆ పండ్లను తినేటట్లు చెయ్యండి."

వ. అని పలికిన చెలికాని పలుకు లాదరించి విని నగి వారునుం దారును నుత్తాలంబగు తాల వనంబునకుం జని యందు.

614

తా ॥ అని ఇలా అడిగిన శ్రీదాముని మాటలను విని బలరామకృష్ణులు చిరునవ్వుతో అంగీకరించారు. వారితో కలిసి మిక్కిలి ఉన్నతమైన తాటితోపులోకి వెళ్ళారు.

క. తత్తఱమున బలభద్రుఁడు, తత్తాలానోకహములఁ దనభుజబల సం
పత్తిఁ గదల్చుచు గ్రక్కున, మత్తేభముభంగిఁ బండ్లు మహిపై రాల్చెన్.

615

తా ॥ బలరాముడు తొందరగా ఆ తాటి తోపులో ప్రవేశించి, మదించిన ఏనుగువలె ఆ తాటి చెట్లను కదిలిస్తూ ముగ్గిన తాటిపండ్లను భూమిమీద రాల్చసాగాడు.

వ. అప్పుడు పండ్లు రాల్చిన చప్పుడు సెవులకు దెప్పరంబయిన నదిరిపడి రిపుమర్దన కుతుకంబున గర్దభాసురుండు.

616

తా ॥ ఆ విధంగా పండ్లు రాలుతున్న చప్పుడు వినగానే ఉలిక్కిపడి, గాడిద రూపంలో ఉన్న ధేనుకాసురుడు శత్రువులను మర్దించాలనే కుతూహలంతో బయలుదేరాడు.

మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు గంపింపఁగా
రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు భీ
తిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్
బెదరన్ రాముని ఱొమ్ముఁ దన్నె వెనుకై బీరంబు దోరంబుగన్.

617

తా ॥ ధేనుకాసురుడి కాళ్ళత్రొక్కిళ్ళ చేత తాటి చెట్లతో పాటుగా అక్కడి భూమి అంతా కంపిస్తోంది. పళ్ళు పటపటా కొరుకుతూ, కత్తిరించిన చెవులను నిక్కించుకొని, తోకను భయంకరంగా ఆడిస్తూ, మిక్కిలి అహంకారంతో వచ్చాడు. వచ్చీ రాగానే గోపబాలకులంతా భయపడేటట్లు వెనక్కు తిరిగి, శౌర్యం అతిశయింపగా బలరాముని వక్షస్థలాన్ని బలంగా తన్నాడు.

క. మఱియును దనుజుఁడు రామునిఁ, గఱవఁగ గమకించి తెలిపి గానక యతనిం
జుఱుచుఱఁ జూచుచు శౌర్యము, పఱివోవఁగ నింత నంతఁ బదములఁ దన్నెన్.

618

తా ॥ ఆ రాక్షసుడు అంతటితో ఊరుకోక, బలరాముని కరవబోగా, బలరాముడు కరవడానికి అవకాశము ఇవ్వలేదు. దానితో మునుపటి వలెనే తన్నబోయి, అందులకు శక్తి చాలక నేలను తన్నసాగాడు.

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురుపదంబులు నాలుగు నొక్కకేల నంటం బట్టి బెట్టు దట్టించి త్రిప్పి విగత జీవునిం జేసి.

619

తా ॥ అప్పుడు బలరాముడు అధిక కోపముతో, ధేనుకాసురుని నాలుగు కాళ్ళను ఒక చేత్తో పట్టుకొని గిరగిరా తిప్పుతూ, మరొక చేతితో చరచి చంపేశాడు.

మ. ఒక తాలాగ్రముఁదాఁక వైవ నది కంపోద్రిక్తయై త్రుళ్ళి వే
ఱొక తాలాగ్రము పైఁబడ న్నదియు నయ్యుగ్రాహతిన్ నిల్వ కొం
డొక తాలాగ్రముపైఁ బడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాల వృ
క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁకం గూలు చందంబునన్.

620

తా ॥ పిమ్మట ఆ ధేనుకాసురుని నిర్జీవ దేహాన్ని బలరాముడు ఒక తాటిచెట్టుకేసి విసిరి వేశాడు. దాని తాకుడుకు ఆ చెట్టు విరిగి మరొక తాటిచెట్టుపై పడింది. ఇలా ఎన్నో చెట్లు చెట్టుమీద చెట్టు పడుతూ రాగా ఆ తోపులోని చెట్లన్ని గొప్పగాలి తాకుడుకు విరిగినట్లుగా కూలాయి.

ఉ. తంతువులందుఁ జేలము విధంబున నే పరమేశు మూర్తియం
దింతయుఁ బుట్టునట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని
ట్లంతము సేయు టెంతపని? యద్భుత మే వినుమంతలోన వాఁ
డంతముఁ బొందుటెల్లఁ గని యాతని బంధులు గార్దభంబులై.

621

తా ॥ నూలు నుండి వస్త్రము జనించినట్లుగా, ఏ పరమాత్మనుండి ఈ ప్రపంచమంతా పుడుతూన్నదో, అటువంటి అనంతుని చేత సామాన్యుడైన ఒక అసురుడు చావటం వింతకాదు. అయితే వాడు చావడం చూసిన వాని బంధువులందరూ గాడిదరూపాలతో బలరామకృష్ణులపై పడ్డారు.

క. బలకృష్ణులపైఁ గవిసిన, బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం
బులు వట్టి తాలశిఖరం, బుల కెగురఁగ వైచి వారు పొరిగొని రధిపా!

622

తా ॥ ఆ బలరామకృష్ణులు తమపైకి వచ్చిన బలవంతులైన ఆ రాక్షస గాడిదలను వెనుక కాళ్ళుపట్టి, తాటిచెట్ల కొనలకు తాకునట్లుగా ఎగురవేసి చంపారు.

వ. అప్పుడు.

623

క. ఆలమున నోలిఁ గూలిన, తాలద్రుమ ఖండదైత్య తనుఖండములన్
గీలితయై ధర జలధర, మాలావృతమైన మింటిమాడ్కిన్ వెలిఁగెన్.

624

తా ॥ ఆ యుద్ధంలో తునకలై పడిన తాటిచెట్ల చేతనూ, రాక్షస దేహముల చేతనూ, ఆవరింపబడినదైన ఆ భూప్రదేశమంతా, మేఘముల బారులచేత ఆవరింపబడిన ఆకాశంలా ఉంది.

క. ధేనుకవనమున నమలిరి, మానవు లావేళఁ దాటిప్రాఁకుల ఫలముల్,
ధేనువులు మెసఁగెఁ గసవులు, ధేనుకహరభక్త కామధేనువు గలుగన్.

625

తా ॥ భక్తుల పాలిటి కామధేనువైన స్వామి ఉన్నందున, ధేనుకాసురుని వనంలో సంతోషంతో గొల్లపిల్లవాండ్రు తాటి పండ్లను భక్షించారు. ఆవులు కూడా ఆ వనంలోని పచ్చికలు కడుపునిండా మేసాయి.

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందుభులు మొరయించి, రంతఁ గమలలోచనుండు గోపజన జేగీయమాన వర్తనుండై యన్నయుం దానును గోగణంబులం దోలుకొని మందకుం జనియె, నయ్యెడ.

626

తా ॥ ఆ సమయంలో దేవతలు పుష్పవృష్టి కురిపించారు. అంతట కృష్ణుడు అన్నగారితోనూ, గోపబాలురతోను, గోవులతోనూ కలిసి గోకులానికి చేరుకున్నాడు. గోపకులంతా రామకృష్ణులను కీర్తించసాగారు.

మ. గోపదరేణు సంకలిత కుంతల బద్ధమయూరపింఛు; ను

ద్దీపిత మందహాస శుభదృష్టి లసన్ముఖు నవ్యపుష్ప మా
లా పరిపూర్ణు గోపజనలాలిత వేణురవాభిరాము నా
గోప కుమారునిం గనిరి గోపసుతుల్ నయనోత్సవంబుగన్.

627

తా ॥ ఆ సమయాన, కృష్ణుడు గోధూళి కమ్మిన తలవెంట్రుకల, నెమలి పింఛాన్ని ధరించి ఉన్నాడు. చిరునవ్వుతో కూడిన చల్లని చూపులతో ముఖం ప్రకాశిస్తూ ఉన్నది. వాడని పువ్వుల దండలను ధరించి ఉన్నాడు. గొల్లవాండ్రందరు కొనియాడుతూ ఉండగా పిల్లనగ్రోవి మనోహరంగా ఊదుతున్నాడు. ఇలాంటశ్రీకృష్ణణ్ణి నేత్రానందంగా వారంతా దర్శించారు.

ఆ. కమలనయను వదనకమల మరందంబుఁ, దవిలి నయన షట్పదములవలనఁ
ద్రావి దిన వియోగతాపంబు మానిరి, గోపకాంతలెల్ల గోర్కు లలర.

628

తా ॥ గోకులంలోని గోపికలంతా కృష్ణుని ముఖమనే కమలం నుండి వెలువడుతున్న మకరందాన్ని తమ కళ్ళు అనే తుమ్మెదలతో గ్రోలుచున్నందున, పగటివేళ ఆ కృష్ణుని వియోగాన్ని సహించగలుగుతున్నారు.

వ. ఇట్లు గోపికలు సాదరంబుగం జూడ వ్రీడాహాసన వినయంబులం జూచుచుఁ గ్రీడాగరిష్ఠుం డయిన ప్రోడ గోష్ఠంబు ప్రవేశించె, నంత రోహిణీయశోదలు గుబ్బలవలని మచ్చికలు పిచ్చలింప నిచ్చకు వచ్చిన ట్లయ్యైవేళల దీవించిరి. వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి సురభి కుసుమ గంధంబులు గైకొని, రుచిరచేలంబులు గట్టికొని, రసోపపన్నంబు లయిన యన్నంబులు గుడిచి, తృప్తులై మంజుల శయ్యల సుప్తులయి యుండి, రందు.

629

తా ॥ ఈ విధంగా గోపస్త్రీలందరు ఆదరంతో తమ్ము చూడగా, వారిని చూసి సిగ్గును, నవ్వును, వినయాన్ని చూపిస్తూ, లీలాక్రీడలలో నేర్పరి అయిన ఆ కృష్ణుడు వ్రేపల్లెలో ప్రవేశించాడు. అంత రోహిణియూ, యశోదయూ తమ కొడుకులైన బలరాముని యందును, కృష్ణుని యందున్నూ, పుత్రవ్యామోహం అతిశయింపగా మనస్ఫూర్తిగా దీవించారు. ఆ బలరామకృష్ణులు అంతట తమ తల్లుల చేత నలుగు మొదలైనవి పెట్టించుకుని స్నానం చేసారు. మంచి సువాసన గల పువ్వులునూ, పరిమళ ద్రవ్యములు చేర్చిన మంచి గంధమును అలంకరించుకొన్నారు. చలువ వస్త్రములు కట్టుకుని అన్ని రుచులతో కూడిన భోజనాన్ని తృప్తిగా ఆరగించారు. ఆపైన మెత్తని పరుపులమీద హాయిగా నిద్రించారు.

## 21. శ్రీకృష్ణుడు కాళియమర్దనము గావించుట

సీ. 'ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ
డడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు నీరు వట్టనఁ గుంది డస్సి
కాళిందిలో విషకలిత తోయముఁ ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన
యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁ డీక్షణామృతధార లెలమి గురిసి

ఆ. పసుల గోపకులను బ్రదికించె మరలంగ, వారు దమకుఁ గృష్ణువలన మరల
బ్రదుకు గలిగె నంచు భావించి సంతుష్ట, మానసములఁ జనిరి మానవేంద్ర!

630

తా ॥ ఓ రాజా! ఒక రోజున బలరాముడు లేకుండా, తక్కిన గోప కుమారులు అందరూ తన వెంట రాగా కృష్ణుడు ఆవులను తోలుకొని అడవిలోకి వెళ్ళాడు. ఆ అడవిలో ఆవులూ, గోపకులు ఎండకు తాళలేక, దప్పిక చేత యమునా నది మడుగులో నీరు తాగారు. ఆ నీరు విషంతో కూడినందున వారు ప్రాణాలు కోల్పోయారు. అంతట కృష్ణుడు తన అమృతమయ చూపులను వారిమీద ప్రసరింపచేసి వారలను మరల బ్రతికించాడు. అప్పుడు కృష్ణుని కృపచేత తాము బ్రతికాము అని తెలుసుకొని వారంతా సంతోషిస్తూ తిరిగి వెళ్ళారు.

క. కాళియఫణిదూషిత యగు, గాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై
కాళిందీ జలవర్ణుఁడు, కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా!

631

తా ॥ ఓ రాజా! కాళీయుడు అనే సర్పం చేత ఆ కాళిందీ నదిలోని నీరు విషతుల్యంగా మారుతోంది. అందువలన కాళింది నదీజలం వంటి మేని రంగు కలిగిన కృష్ణుడు దానిని ఆ మడుగు నుండి వెళ్ళగొట్టాడు"

వ. అనిన 'నయ్యగాధజలంబు వలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబు దర్పంబు మాపి వెడలించె, నందుఁ బెద్దకాలం బా వ్యాళం బేలయుండె? నెఱింగింపుము.

632

తా ॥ అని శ్రీ శుకుడు చెప్పగా, పరీక్షిన్మహారాజు 'ఓ మునివర్యా! మిక్కిలి లోతుగల ఆ యమునానది యొక్క మడుగులో ఉన్న ఆ పాము యొక్క మదమును ఏ ఉపాయంచేత కృష్ణుడు అణచాడు? ఎట్లా వెడలగొట్టాడు? ఆ పాము అక్కడ ఎందుకు ఉంది? నాకు తెలియచెయ్యవలసింది' అని అడుగుతూ,

క. తొఱ్ఱులఁ గాచిన నందుని, కుఱ్ఱని చరితామృతంబు గొనకొని చెవులన్
జుఱ్ఱంగఁ దనివి గల్గునె!, వెఱ్ఱుల కయినను దలంప? విప్రవరేణ్యా!'

633

తా ॥ 'ఓ మహర్షీ! నందుని కొడుకై గోవులను కాచిన శ్రీకృష్ణమూర్తి యొక్క చరిత్రను అమృతోపమేయంగా వింటూ ఉంటే, ఎటువంటి వారికైనా ఇంకా వినాలనిపిస్తుంది కదా!' అని అన్నాడు.

వ. అనిన శుకుం డిట్లనియె.

634

తా ॥ అప్పుడు శుక మహర్షి ఇలా అన్నాడు:

సీ. మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁ గల, దది యెప్పుడుఁ గాళియాహి
విషవహ్ని శిఖలచే వేఁచు చుండును, మీఁదఁ బఱతెంచి నంతన పక్షులైనఁ
బడి మ్రగ్గు, నందుఁ దద్భంగశీకరయుక్త పవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి
యైన నప్పుడ చచ్చు? నట్టి యా మడుఁగులో నుదకంబు పొంగుచు నుడుకుచుండఁ

తే. జూచి వెఱఁగంది కుజనుల స్రుక్కఁజేయ, నవతరించిన బలువీరుఁ డాగ్రహించి
భుజగవిషవహ్ని దోషంబు వొలియఁజేసి, సుజలఁ గావించి యానదిఁ జూతు ననుచు.

635

తా ॥ "ఓ రాజా! యమునానదిలో ఒక గొప్ప మడుగు ఉన్నది. అందులో కాళియుడు అనే పాము చేరి ఎల్లప్పుడు తన విషాగ్ని జ్వాలల చేత అందలి జలములను తపింప చేస్తూ ఉంటాడు. ఆ జలాల మీదుగా పక్షులు ఎగిరినా, అవి అందులో పడి చచ్చిపోతాయి. ఆ మడుగులోని నీరు అలల మీది నుండి తుంపరులతోడి గాలి సోకినా ఎట్టి జంతువైనా వెంటనే చచ్చిపోతుంది. అది గమనించి కృష్ణుడు అటువంటమడుగును నిర్మలజలములు కలదానినిగా చేయాలని సంకల్పించుకున్నాడు. సహజంగా నిర్మలమైన ప్రకృతిని కలుషితం చేయరాదనే కృష్ణుడు ఇందుమూలంగా తెలియజేస్తున్నాడు. (ఇది నేటికీ వర్తిస్తుంది)

వ. కృతనిశ్చయుండై, పూర్వజన్మ భాగ్యంబులం దన చరణ సంస్పర్శంబునకు యోగ్యంబై, తత్సమీపంబున విశాలవిటప శాఖాకదంబంబుతో నున్న కదంబభూజంబు నెక్కి.

636

తా ॥ ఆ మడుగు ఒడ్డునే ఒక కడిమి చెట్టు ఉన్నది. దాని పూర్వజన్మ భాగ్యం చేత కృష్ణుని పాదములు సోకుటకు యోగ్యమైనదై పెద్ద పెద్ద కొమ్మలను కలిగి ఉంది ఆ చెట్టు. దానిమీదకు ఎక్కాడు కృష్ణుడు.

మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త
త్కుటశాఖాగ్రము మీఁదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభ గుభధ్వానం బనూనంబుగన్.

637

తా ॥ గోపాల కృష్ణుడు నడుముకి ఉన్న వస్త్రాన్ని గట్టిగా బిగించి కట్టుకున్నాడు. నెమలి పింఛముతో ఉన్న తల వెంట్రుకలను ముడి వేసుకున్నాడు. భుజాలు చరుస్తూ, రెండు పాదములు ఒక దగ్గరకు చేర్చి, దిక్కుల యందు ప్రతిధ్వనులు కలిగేటట్లు ఆ మడుగులోనికి దూకాడు. దానితో ఆ మడుగునుండి పెద్ద శబ్దం అన్ని దిక్కులలో ప్రతిధ్వనించింది.

ఉ. భూరిమహాప్రతాప పరిపూర్ణ భయంకర గోపబాల కం
ఠీరవ పాతవేగ వికటీకృత దుర్విషభీషణోర్మి సం
పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శత మాత్రభాగ వి
స్తారము వొంగె నమ్మడుఁగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై.

638

తా ॥ గొప్పదైన ప్రతాపంతో, ఒక్కసారిగా ఆ గోపాలబాలుడు ఆ మడుగులోనికి దూకేసరికి, ఆ వేగానికి విషతుల్యమైన ఆ నీరు వికట నృత్యం చేస్తున్నట్లుగా పైకి పొంగింది. దానితో ఎటు చూసినా కుతకుతమని కనిపిస్తూ నీటి బుడగలు బయలుదేరాయి.

శా. పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ భాసిల్లి మున్నాఢ్యుఁడై
కాఠిన్యక్రియ నీఁదు నేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్ర హృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీఁదె ను
ల్లోలోత్తుంగ తరంగమై మడుఁగు దుర్లోక్యంబుగా బాహులన్.

639

తా ॥ సముద్రమధ్యంలో అలవోకగా విహరిస్తూ, ఈదే సామర్థ్యాన్ని గతంలో మత్స్యావతారంతో పొంది ఉన్నవాడే కనుక కాళీయునికి రోషం కలిగేలా, తన చేతులతో నీటిని అల్లకల్లోలం చేస్తూ ఈదసాగాడు కృష్ణుడు. ఆ దృశ్యం చూడశక్యం కానిదిగా ఉంది. దానితో ఆ మడుగులో ఉన్న కాళీయుని హృదయంలో జ్వాలలు చెలరేగసాగాయి.

వ. ఆ సమయంబున.

640

శా. 'బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు విభ్రాంతోచ్చలత్కీర్ణ క
ల్లోలంబై కలఁగం జరించె నిట నే లో నుంటఁజూడండు, మ
త్కీలాభీల విశాలదుస్సహవిషాగ్ని జ్వాలలన్ భస్మమై
కూలంజేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపింపఁగన్.'

641

తా ॥ ఆ కాళియుడు ఇలా అనుకున్నాడు – 'వీడు ఒంటరివాడు, పైగా బాలుడు. ఇట్టివాడు నా మడుగుని కల్లోలం చేస్తూ పెద్దపెద్ద అలలు కలుగునట్లుగా చరిస్తున్నాడు. వీడికి లోపల నేను ఉన్నట్లు తెలువనట్లుగా ఉంది. సహింపరానిదై మండే నా విషం చేత వీనిని భస్మం చేసి, లోకంలోని వారందరికీ నా ప్రతాపం తెలిసేలా చేస్తాను.'

వ. అని తలంచి విజృంభించి.

642

ఉ. ఘోరవిషానల ప్రభల గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్య వి
స్ఫారుఁడు గాళియోరగుఁడు పాఱివడిం గఱచెం బయోధరా
కారుఁ బయోవిహారు భయకంప విదూరు మహాగభీరు నా
భీరకుమారు వీరు నవపీత శుభాంబరధారు ధీరునిన్.

643

తా ॥ ఈ విధంగా మనస్సులో అనుకొని విజృంభించాడు కాళియుడు. తన సైన్యంతో కూడి చెలరేగి భయంకరమైన విషాగ్ని జ్వాలల కాంతులు సర్వత్ర వ్యాపించగా వేగంగా కదిలాడు. ఆ వేగంతో నీలమేఘ వర్ణుడూ, నీటిలో విహరించు వాడూ, ఏ మాత్రం భయము

వణుకు లేనివాడూ, మిక్కిలి గాంభీర్యం కలవాడూ, ధైర్యవంతుడూ, వీరుడు అయిన ఆ గోపాలకృష్ణుణ్ణి వడిగా కాటువేసాడు.

క. కఱచి పిఱుతివక మఱియును, వెఱవక నిజవదనజనిత విషదహనశిఖల్
మెరయఁ దన నిడుద యొడలిని, నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్.

644

తా ॥ అట్లు కరచిన కాళియుడు అంతటితో ఊరుకోలేదు. తాను కరిచినా భయపడకుండా ఉన్న కృష్ణుణ్ణి చూసి, తనలోని విషాగ్ని జ్వాలలు ప్రకాశింపగా, పరాక్రమంతో తన నిడుపాటి దేహంచేత అతని దేహాన్ని చుట్టి వేశాడు.

వ. ఇట్లు భోగిభోగ పరివేష్టితుండై, చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పిత ధనదార మనోరథ మానసులు గావున.

645

తా ॥ ఈ ప్రకారం పాము దేహం చేత చుట్టుకోబడినవాడైన కృష్ణుడు చేష్టలులేని వాడిలా కనిపించాడు. ఆ స్థితిలో తమ ప్రాణ స్నేహితుణ్ణి చూసి, ఆయన మహిమలు తెలుసుకోలేక గోపబాలురు మిక్కిలి భయపడ్డారు. తమ సర్వస్వాన్ని ఆ కృష్ణునికి సమర్పించినవారు కనుక స్వామిని అలా చూడలేక పోయారు.

చ. అదె మన కృష్ణునిం గఱిచె, నంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టికొని మానక యున్నది, యింక నేమి సే
యుద? మెటఁజొత్త. మే పురుషు లోపుదు రీయహి నడ్డపెట్ట నె
య్యది సదుపాయ? మంచుఁ బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్.

646

తా ॥ అందుచేత ఆ గొల్లలందరు గుంపులుగా చేరి అదుగో, ఆ పాము మన కృష్ణుణ్ణి కరచింది. కరచి అంతటితో విడిచి పెట్టక, మిక్కిలి మదించి తన దేహంతో కృష్ణుని దేహాన్ని చుట్టుకొని విడిచిపెట్టకుండా ఉంది. ఇక ఇందుకు మనం ఏం చేద్దాం? ఎక్కడికి పోదాం? ఎవరితో మొరపెట్టుకుందాం? ఎవరు ఈ పామును అడ్డగించి కృష్ణుణ్ణి విడిపింపగలరు? దీనికి తగిన ఉపాయం ఏమిటి? అని దిక్కుతోచక ఆర్తనాదాలు చేయసాగారు.

క. గోపకుమారక శేఖరు, నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్
మేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభవత్సంబులతోన్.

647

తా ॥ కాళియసర్పం కృష్ణుణ్ణి కాటువేయడాన్ని చూసిన ఆవులు కూడా చేష్టలుడిగి, ఎద్దులతోనూ, దూడలతోనూ కూడి మేత మేయడం మానివేసి బాధగా అరవసాగాయి.

క. భూతలము వడఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో
వ్రేతలకును గోపక సం, ఘాతములకు నదరెఁ గీడుకన్ను లిలేశా!

648

తా ॥ రాజా! కృష్ణుడు ఈ విధంగా కాళియుని చేత చుట్టబడుటవలన భూమి మొదలైన పంచ భూతాలు అదిరాయి. ఆకాశం నుండి ఉల్కాపాతం రాలింది. వ్రేపల్లెలోనున్న గోపికలకు కుడికన్ను, గోపకులకు ఎడమ కన్ను అదిరాయి.

వ. అంత నా దుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరిన చిత్తంబుల నుత్తలపడుచు మందనున్న నందయశోదాదులైన గోపగోపికాజనంబులు హరి దళసరి యెఱుంగక గోపాలగోగణ పరివృతుండైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపునని పొక్కుచుం బెక్కువలయిన మక్కువలు చెక్కులొత్త నొక్క పెట్ట బాలవృద్ధ సమేతులై మహాఘోషంబున నా ఘోషంబు వెలువడి.

649

తా ॥ ఆ దుర్నిమిత్తాలు అన్నీ చూసి గోకులంలో ఉన్న నందయశోదలు, ఇతర గోపకులు, గోపికలు మనస్సులలో కీడుని శంకించారు. కృష్ణుని మీదగల ప్రేమచేత, అతడు గోపకులతోను గోవులతోను అడవిలో చిక్కుపడ్డాడేమో అని బాధపడ్డారు. ఒక్కసారిగా పసివాళ్ళు ముసలివాళ్ళు అనే వయోభేదం లేక అందరూ పెద్ద పెట్టున కేకలు వేసుకుంటూ వ్రేపల్లె నుండి కృష్ణుణ్ణి వెతుకుతూ కదిలారు.

క. వా రిబ్భంగి నెఱుంగని, వారై హరిఁ జూడఁబోవ వడిగఁగొని నగుచున్
వారింపఁ డయ్యె రాముఁడు, వారిని హరి లావెఱుంగువాఁ డయ్యు నృపా!

650

తా ॥ కృష్ణుని సామర్థ్యం ఎరుగక అతని జాడ తెలుసుకునేందుకు బయలుదేరిన ఆ గొల్లలను చూసి కృష్ణుని శక్తి ఇట్టిది అని తెలిసిన బలరాముడు మిక్కిలి నవ్వుకున్నా, వారిని వారింప పూనుకొనలేదు.

వ. అంతలోన వారునుం దానును గాంతారమార్గంబు వట్టి పోవుచు నెడనెడ గోపగోష్పదంబుల సందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటంబయిన యమునాతటంబు సేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటు వడి దర్పంబు సూపక భోగిభోగపరివృతుండైన కృష్ణునిం గృష్ణ కృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొందుచుఁ దత్కాలంబునం బ్రతికూలం బయ్యె ననుచు దైవంబు దిట్టు గోపకులను, గోపకులం గలసి మేఁత లుడిగి ఱెప్పలిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్న గోవులం గని, రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి.

651

తా ॥ అంతట యశోద మొదలయిన గోపికలూ, నందుడు మొదలైన గోపకులూ అడవి దారిని బట్టి నడిచారు. అక్కడక్కడ గోవుల అడుగుల నడుమ యవరేఖ, అంకుశరేఖ, హలరేఖ, వజ్రరేఖ, చక్రరేఖ, చాపరేఖ, ధ్వజరేఖ మొదలైన శుభలక్షణాలన్ని కనిపిస్తున్నాయి, ఆ కాలిగుర్తులు మార్గానికే ఆభరణంగా ప్రకాశిస్తున్నాయి. ఆ జాడను బట్టి యమునానదిగట్టు చేరారు. చేరి అక్కడ మడుగులో పాముచేత చుట్టుకోబడి కదలలేక మెదలలేక ఉన్న వానిలాగా కనబడుతూన్న శ్రీకృష్ణుణ్ణి చూసారు. అక్కడ గోపకులతో పాటుగా మేతలు మాని అరుస్తూ నిలుచున్న గోవులను గోపికలు చూసారు. అప్పుడు కొందరు గోపికలు యశోదను కౌగిలించుకొని కృష్ణాకృష్ణా అని పలవరిస్తూ, ఇన్నాళ్ళు దయ చూపిన దైవం నేడు ఎందుకు ప్రతికూలమైనది అని రోదిస్తూ, కృష్ణునితో ఇలా అంటున్నారు:

సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు, వెదురు వచ్చిన నేఁడదేల రావు?
చూచినఁ గృపతోడఁ జూచు చుందువు నీవు, సూచినఁ గనువిచ్చి చూడ వేల?
డాసిన నఱలేక డాయంగ వత్తువు, డాసిన నేటికి డాయ విచటఁ?
జీరిన 'నో' యని చెలరేఁగి పలుకుదు, విది యేమి సీరిన నెఱుఁగ కుంట?

ఆ. తలఁపు సేయునంతఁ దలపోయుచుందువు, తలఁపు సేయ నేఁడు దలఁప వకట!
యనుచు భక్తివివశ లాడెడి కైవడి, వ్రేత లెల్ల నాడి వివశలైరి.

652

తా ॥ "కృష్ణా! నీవు ప్రతిరోజు మాకు ఎదురు వచ్చేవాడివి. ఈ రోజున మేము వచ్చినా నీవు ఎందుకు రావడంలేదు? మేము ఒక్కసారి చూస్తే ఎంతో దయతో మమ్మల్ని చూచేవాడివి. అలాంటిది కన్నులు తెరచి చూడవేమి? నీ సమీపానికి వస్తే భేదం లేకుండా చేరవచ్చేవాడివి. అలాటిది మేము నిన్ను చేరవచ్చినా కూడా నీవు మా దగ్గరకు ఎందుకు రావడంలేదు? పిలిస్తే 'ఓ' యని పలికేవాడివి. ఇప్పుడు మేం పిలిచినా నీవు పలకకుండా ఉన్నావు. ఒక్కసారి నిన్ను

స్మరించిన మాత్రం చేత నీవెప్పుడూ మమల్నే స్మరిస్తూంటావు. కానీ ఇప్పుడు మమ్మల్ని తలుచుకోవడం లేదేమిటి?" ఈ విధంగా భక్తి పరవశులైన భక్తులు మాట్లాడినట్లుగా వారంతా సంభాషించసాగారు.

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యధికంబైన శోకంబున నిట్లనిరి.

653

తా ॥ అప్పుడు నందుడు, యశోద మొదలైన వారందరూ కృష్ణుణ్ణి చూచి అధికమైన దుఃఖంతో ఇలా అన్నారు:

క. విషకుచయుగ యగు రక్కసి, విషకుచదుగ్ధంబు ద్రావి విషవిజయుఁడవై
విషరుహలోచన! యద్భుత, విషయుండగు నీకు సర్పవిష మెక్కెఁ గదా!

654

తా ॥ "ఓ కృష్ణా! నీవు పాలిండ్లలో విషం పెట్టుకు వచ్చిన పూతన చనుపాలు త్రాగి ఆ పాలతోడ విషాన్ని కూడా జీర్ణం చేసుకొన్నావే! అటువంటి ఆశ్చర్యకరమైన శక్తిగల నీకు ఈ పాము విషం ఎక్కటం వింతగా ఉంది.

క. కట్టా! క్రూరభుజంగము, గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో?
తిట్టితివో పాపపు విధి?, పట్టీ! మముఁ దలఁచి కాఁకఁ బలవించితివో?

655

తా ॥ కృష్ణా! అయ్యో! ఈ క్రూరమైన పాము మిక్కిలి కోపంతో నిన్ను కరుస్తుంటే నీవు ఎంతగా వణకిపోయావో! ఈ పాపిష్ఠి విధిని ఎంతగా తిట్టుకున్నావో! మమ్మల్ని ఎంతగా తలచుకున్నావో! ఎంత బాధపడ్డావో!

క. పన్నగము మమ్ము గఱవక, ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మి గలిగి నీ

వున్నను మము రక్షింతువు, నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ!

656

తా ॥ కన్నయ్యా! ఆ దుష్ట సర్పం మమ్మల్ని కరవక నిన్నెందుకు కరచిందిరా నాన్నా! ఒకవేళ మమ్మల్ని కరచి నీవు క్షేమంగా ఉంటివేని, మమ్ము రక్షించి ఉండేవాడివి. కానీ నీవు ఆపదలో ఉంటే, మేము రక్షించలేకపోతున్నాము కదా!

ఉ. చూడ వ దేమి గౌరవపుఁజూపుల మమ్ము? సఖాలితోడ మా
టాడ వ దేమి? నర్మముగ నందెలు పాదములందు మ్రోయ? నేఁ
డాడ వ దేమి నర్తనము? లవ్వలమ్రోలను గోపికావళిం
గూడ వ దేమి నవ్వులకు? గోపకుమార వరేణ్య! చెప్పుమా!

657

తా ॥ కృష్ణా! నువ్వు గౌరవముతోడి చూపులతో మమ్ములను చూడటంలేదు ఎందుకు? రహస్యంగా చెలికాండ్రతో ఎందుకు మాటాడవు? కాళ్ళయందు అందెలు మ్రోగగా నీ తల్లుల ఎదుట ఏల నాట్యమాడవు? నవ్వులాటలకు గోపికా స్త్రీలతో కూడి వర్తింపవు ఎందుకు? మాకు తెలియచెప్పు తండ్రీ.

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువా రెవ్వరింకఁ?
గరచరణాదులకలిమి ధన్యత నొంద నెగిరి పైఁ బ్రాఁకువా రెవ్వరింక?
నయనయుగ్మంబు లున్నతి గృతార్థములుగా నవ్వులు సూపువా రెవ్వరింక?
జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటల యెడఁ బలికించువా రెవ్వ రింక?

ఆ. దండ్రి! నీవు సర్పదష్టుండవై యున్న, నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక?
మరగి పాయ లేము, మాకు నీ తోడిద, లోక మీవు లేని లోక మేల?

658

తా ॥ కృష్ణా! ఇకమీద మా చెవులకు ఇంపుగా ఎవరు మాట్లాడుతారు? చేతులు, కాళ్ళు మొదలైన అవయవాలు కృతార్థములు అయ్యేటట్లు మామీదకు ఎక్కుతూ ఎత్తుకోమని ప్రాకులాడువారెవరు? కళ్ళు సార్థకమయ్యేలా మాకు నవ్వులను చూపేవారెవరు? నాలుకలు ధన్యత చెందేలా పాటలు పాడించువారెవ్వరు? నీవు పాముకాటుకి గురైతే మమ్ము ఏలువారెవరు? మాకు సర్వస్వం నీవే కనుక నీవున్న చోటే మేమెల్లరమూ ఉండతగిన చోటు. నీవు లేకుండా ఈ లోకంలో ఉండలేము.”

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగు జొత్తము, చత్త' మనుచుఁ గృష్ణవిరహ వేదనానల భారతప్తులై మడుఁగుఁ జొరఁ బాఱుచున్న వారలఁ గనుంగొని భగవంతుండైన బలభద్రుండు 'మీరు మీఁదెఱుంగరు, ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు. సహించి చూడుఁ' డనుచు వారిని వారించె.

659

తా ॥ అని ఈ ప్రకారంగా ఒకరినొకరు పట్టుకొని విలపిస్తూ, కృష్ణునితో మనం కూడా మడుగులో పడి మరణిద్దాం అని అతని ఎడబాటు వలన కలిగిన తాపాన్ని సహింపలేక మడుగులో పడబోయారు. అట్టి ప్రయత్నంలో ఉన్న యశోదానందులను, ఇంకా ఇతర గోపికలను, గోపకులను చూసి, భగవంతుడైన బలరాముడు ఇలా అన్నాడు: “మీరు జరిగేదాని యోచన కొంచెం కూడా లేని వాళ్ళలా ఉన్నారు. ధైర్యం విడిచి పెట్టడం యుక్తంకాదు. కృష్ణుని చర్యలను కొంచెం నిదానించి చూడండి...” అంటూ వారిని నివారించాడు. శ్రీకృష్ణుని అంశ అయినందున బలరామునికి కృష్ణుని శక్తి తెలుసును.

క. తనుఁ గూర్చి యి వ్విధంబున, వనితలు బిడ్డలును దారు వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు, మనుజుని క్రియ నొక ముహూర్తమాత్రము జరిపెన్.

660

తా ॥ ఈ విధంగా తనను ఉద్దేశించి ఏడుస్తూన్న గోకుల నివాసులైన స్త్రీలు, బిడ్డలు మొదలైన గొల్లలను చూసి, శ్రీకృష్ణుడు సామాన్య మానవునివలె ఒక్క ముహూర్త కాలం (రెండు గడియలు) వినోదంగా గడిపాడు.

శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగుం డావృత్తులం బాసి తా
సంతప్తాయతభోగుఁ డై కఱచుటల్ సాలించి నిట్టూర్పుతో
శ్రాంతుండై తలలెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు సూచుచుం దలఁగి నిల్చెన్ ధూమకాష్ఠాకృతిన్.

661

తా ॥ ఆ తరువాత కృష్ణుడు తన దేహాన్ని పెంచాడు. దానితో కాళీయుని దేహము కమిలి, చుట్టు సడలిపోయి పడగలు ఉష్ణతాపము పొంది అవయవ పటుత్వము సన్నగిల్లింది. అలసటతో కరవటం మాని నిట్టూర్పులు విడుస్తూ ముక్కుల నుండి రక్తం కారుతుండగా నిస్సహాయముగా దీనంగా దిక్కులు చూస్తూ శ్రీకృష్ణుని వదలి చల్లారిన కట్టెవలె దూరంగా వెళ్ళి నిలబడ్డాడు.

చ. వెఱ మెఱ లేనియట్టి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దౌడలు వట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలు చుండఁగ నెత్తి లీలతో
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషిత దర్పముఁ గ్రూరసర్పమున్.

662

తా ॥ భయం, ఏమరుపాటు లేక ఎప్పుడూ జాగ్రత్తతో సంచలించువాడూ, మహాశూరుడు అయిన గోపాల కృష్ణుడు తన చేతితో కాళీయుని పడగలమీద చరచి, గరుత్మంతునివలె దౌడలను గట్టిగా పట్టి ఆ విషసర్పాన్ని గిరగిరా త్రిప్పి విసిరివేశాడు. దాని కన్నులనుండి విషం అగ్ని జ్వాలలవలె వెలువడగా దాని గర్వం పూర్తిగా నశించి పోయింది.

వ. ఇట్లు వేగంబుగ నాగంబు వీచి వైచి జగజెట్టియైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున.

663

తా ॥ ఈ విధంగా ఆ క్రూర సర్పాన్ని మహాశూరుడైన శ్రీకృష్ణుడు విసరి పారవేసి రెట్టించిన సంతోషముతో ఈ విధంగా నర్తించాడు.

సీ. ఘనయమునానదీ కల్లోల ఘోషంబు సరసమృదంగ ఘోషంబు గాఁగ
సాధుబృందావన చరచంచరీక గానంబు గాయక సుగానంబు గాఁగ
గలహంస సారస కమనీయమంజు శబ్దంబులు దాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది జనులు సుఖాసీనజనులు గాఁగఁ

తే. బద్మరాగాదిరత్న ప్రభాసమాన, మహితకాళియ ఫణిఫణామండపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు, నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్య మాడె.

664

తా ॥ ఆ యమునా నదిలో పెద్ద అలల సవ్వడులు చెవులకు ఇంపైన మద్దెల మ్రోతలలా ఉన్నాయి. బృందావనంలో సంచరించే తుమ్మెదల గానం మనోజ్ఞమైన గాయకుల పాటవలె ఉంది. హంసలు, బెగ్గురు పక్షులు మొదలైన జలపక్షుల కలకల ధ్వనులు తాళముల మ్రోతలా ఉంది. దేవతలు ఆకాశము నుండి చూస్తున్న దేవ గంధర్వాదులు, సభయందు కూర్చున్న ప్రేక్షకులవలె ఉన్నారు. అంతట రత్నప్రకాశితమైన కాళియ సర్పము యొక్క పడగ అనే విశాల నాట్యమండపంలో, శ్రీకృష్ణుడు అనే ప్రఖ్యాత నర్తకుడు ఎంతో నైపుణ్యంతో నృత్యం చేయసాగాడు.

శా. కుక్షిన్ లోకములున్న గౌరవముతో గోపాకృతి న్నున్న యా
రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగ ప్రదేశంబుపై

నక్షీణోద్ధతి నాఁడుఁ, బాడుఁ, జెలఁగున్, హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులం బ్రాణైకశేషంబుగన్.

665

తా ॥ లోకాలన్నింటిని తన కడుపులో దాచుకున్న ఆ విష్ణువు, గోపబాలుని ఆకృతితో కాళియుని పడగలనే నాట్యస్థానంలో, ఆడుతూ పాడుతూ నర్తించాడు. చిరునవ్వుతో, ఉత్సాహాన్ని చూపుతూ ఆ కాళియుని ప్రాణం పోకుండా, నేర్పుతో లయ తప్పకుండ నాట్యం చేశాడు.

క. ఘనతర సుషిరానంద, స్వనములతో సిద్ధ సాధ్య చారణ గంధ
ర్వ నిలింప మునిసతులు చ, య్యనఁ గురిసిరి విరులవాన లాడెడు హరిపై.

666

తా ॥ అలా నాట్యం చేస్తున్న ఆ చిన్నికృష్ణునిపై సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, దేవతలు, మునులు, వారి భార్యలు పూలవానలు కురిపించారు, ఆనందంతో జయజయ ధ్వానాలు చేసారు.

వ. ఇట్లు దుష్టజన దండధరావతారుండైన హరి వడి గలిగిన పడగల మీఁదఁ దాండవంబు సలుప, బెండువడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు నుక్కుసెడి చిక్కి దిక్కులు సూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తన మనంబున.

667

తా ॥ దుర్జనులను యమునివలె దండింప పుట్టిన శ్రీకృష్ణుడు, ఈ విధంగా కాళియుని పడగలమీద నాట్యం చేస్తూంటే, కాళియుడు దేహం తేలిపోవుచుండగా రక్తమాంసాలను క్రక్కటం మొదలుపెట్టాడు. కన్నుల నుండి విషం వస్తూండగా, నీరసంతో దిక్కులు చూస్తూ, ప్రాణాలు గొంతులోనికి రాగా మనస్సులో ఇలా అనుకున్నాడు:

ఉ. 'వేలుపులైన లావులుసెడి వేదనఁ బొందుచు నావిషానల
జ్వాలలు సోఁకినంతటన చత్తురు, నేఁడిది యేమి చోద్య? మా
భీలవిషాగ్ని హేతిచయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్.

668

తా ॥ 'దేవతలైనా సరే నా విషాగ్ని జ్వాలలు సోకినంత మాత్రంచేత, బలం చెడి వేదనను పొంది మరణిస్తారు. ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. నా విషాగ్ని జ్వాలలకు ఓర్చుకోవడమే కాక నా పడగల మీద విజయ నాట్యం చేస్తున్నాడు ఈ బాలుడు.'

క. ఈతఁడు సర్వచరాచర, భూతేశుండైన పరమపురుషుఁడు సేవా
ప్రీతుఁడు శ్రీహరి యగు నని, భీతిన్ శరణంబు నొందె బిట్టలసి నృపా!

669

తా ॥ ఓ రాజా! ఈ విధంగా ఆలోచించి, ఈ బాలుడు శ్రీమన్నారాయణుడు కాని పసివాడు మాత్రం కాదు. ఈ మహాపురుషుడు చరములు, అచరములలో నిలిచి ఉన్నవాడు, ఉత్తములైన మహాయోగులను కాపాడువాడు, తనను సేవించు వారియందు ప్రీతి కలవాడు అయిన శ్రీమన్నారాయణుడే! అని నిశ్చయించి అప్పటికే కలిగిన బడలిక చేతనూ, భయం చేతనూ, 'స్వామీ! నన్ను రక్షించు, రక్షించు' అని శరణువేడాడు.

## 22. కాళియుని భార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని స్తుతించుట

వ. అట్లు క్రూరంబులైన హరిచరణ ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల.

670

తా ॥ ఈ విధంగా తాండవం చేసిన కృష్ణుని కాలి మర్దనం చేత పడగలు నలిగి నొప్పిని పొంది చచ్చిన వానిలా పడి ఉన్నాడు కాళియుడు. వాడిని చూసి, వాని భార్యలు అత్యంత విచారం చేత కలిగిన దుఃఖాన్ని సహింపలేక తల్లడిల్లిపోయారు.

మ. కచబంధంబులు వీడ భూషణము లాకంపింప గొఁదీవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం జడియఁ బై కొంగుల్ వడిన్ జాఱఁగాఁ
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుదద్బాలావలిం గొంచు స్రు
క్కుచు, భక్తిం జని కాంచి రాగుణమణిన్ గోపాలచూడామణిన్.

671

తా ॥ అలా తల్లడిల్లిపోయిన కాళియుని భార్యలకు కొప్పుముళ్ళు వీడాయి, ఆభరణాలు చెదరిపోయాయి. మిక్కుటమైన తొట్రుపాటుతో వాళ్ళ మనస్సులు కలతనొందాయి. ఏడుస్తూన్న బిడ్డలను ముందు పెట్టుకొని, నొచ్చుకుంటూ, భక్తితో సకల కళ్యాణగుణ పరిపూర్ణుడైన శ్రీ గోపాల కృష్ణమూర్తిని దర్శించారు.

వ. కని దండప్రణామంబు లాచరించి నిటలతట ఘటిత కరకమలలై యిట్లనిరి.

672

తా ॥ దర్శించి కృష్ణునికి సాష్టాంగ నమస్కారం చేసి, నుదుటికి జోడించిన చేతులను

ఆనించి, ఇలా అన్నారు:

క. క్రూరాత్ముల దండింపఁగ, ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట, క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా!

673

తా ॥ "స్వామీ! లోకంలో దుష్టులను శిక్షించటం కోసం అవతారం ఎత్తిన నీవు, ఈ దుష్టుణ్ణి శిక్షించటం సమంజసమే! దుష్ట స్వభావంచేత అని తలపకూడదు. ఇది నీ మహనీయత్వమే గాని మరొకటగాదు!

క. పగవారి సుతుల యందును, బగ యించుక లేక సమతఁ బరఁగెడి నీకుం
బగ గలదె? ఖలుల నడఁచుట, జగదవనముకొఱకుఁ గాక జగదాధారా!

674

తా ॥ జగత్తులన్నింటికి ఆధారమైన ప్రభూ! నీకు శత్రువుల కుమారులయందు కూడ కొంచెమైన పగలేక, సమానత్వాన్ని అందరి ఎడల చూపుతావు. అట్టి నీకు మా మీద పగ ఏమి ఉంటుంది? లోక సంరక్షణం కోసం దుష్టులను శిక్షిస్తూ ఉంటావు. అందుకే ఈ దుష్టుణ్ణి కూడా శిక్షించావు.

క. నిగ్రహమె మము విషాస్యుల, నుగ్రుల శిక్షించు టెల్ల? నూహింప మహా
నుగ్రహము గాక మా కీ, నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్.

675

తా ॥ స్వామీ! నోట విషం పెట్టుకుని భయంకరులమై వర్తించే మమ్ములను దండించటం గొప్ప అనుగ్రహమే కాని నిగ్రహించుట కాదు. ఈ దండనము వలన మాకు విషాన్ని కలవారు అనే చెడ్డపేరు కాస్తా తొలగిపోయింది.

ఉ. ఎట్టి తపంబు సేసెనొకొ? యెట్టి సుకర్మము లాచరించెనో?
యెట్టి నిజంబు వల్కెనొకొ? యీ ఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడు ఁజేరువగాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దలలెక్కి నటించెద వీ ఫణీంద్రుపై.

676

తా ॥ ఇంతకు మునుపు ఎంతో మహిమ గల పుణ్యపురుషులకు కూడ సన్నిహితుడవు కాని నీవు నేడు ఎంతో వేడుకతో ఈ సర్పరాజు పడగలపై నాట్యం చేశావు! ఈ సర్పరాజు పూర్వ జన్మలో ఎట్టి తపస్సు చేసాడో? ఎటువంటి ధర్మకార్యాలు చేశాడో? ఎటువంటి సత్య వాక్యాలను పలికాడో? అట్లాకాని పక్షంలో నీ పాదపద్మాలు తన తలలను సోకునంతటి భాగ్యం కలుగుతుందా?

మ. బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ వాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణ సంస్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి కాంచె నిదె నేమం బేమియున్ లేక యీ
యహి నీ పాదయుగాహతిం బడసె నేఁడత్యద్భుతం బీశ్వరా!

677

తా ॥ ఈశ్వరా! పూర్వం స్త్రీరత్నమైన లక్ష్మీదేవి మిక్కిలి మహిమతో ప్రకాశించే నీ పాదాల రేణువులు తనను సోకే అధికారం కోసం ఎంత తపస్సు చేసి, ఎన్ని నోములు నియమంతో నోచిందో? ఇప్పుడు ఈ ఫణిరాజు ఏ నియమములు లేకుండా నీ రెండు పాదముల చేతను తన్నబడి నీ పాద స్పర్శకు నోచుకున్నాడు కదా! ఎంతటి అద్భుతం ఇది!

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము

న్నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్.

678

తా ॥ నీ పాద రేణువుల సాంగత్యాన్ని పొందిన మహనీయులు ఇంద్రపదవిని కూడా తృణీకరిస్తారు. బ్రహ్మపదవిని గాని, చక్రవర్తిత్వం గాని భూమండలాన్ని ఏలే ఆధిపత్యంగాని ఇష్టపడరు. ఎన్నడూ రసాతల సార్వభౌమత్వం గానీ, యోగసిద్ధులను గానీ లక్షింపరు. వీటన్నింటిని మించినది నీ పాదధూళి స్పర్శనం!

క. ఘనసంసారాహతులగు, జను లాకాంక్షింపఁ గదు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు రోషకలితుం డయ్యున్.

679

తా ॥ సర్వసంగ పరిత్యాగులైన మహాయోగులకు కూడా సాధ్యముకాని భాగ్యమును, తమోగుణ జనితములైన దుర్గుణములు కలిగి మహాపాతకియై ఉండికూడా ఈ సర్పరాజు పొందాడు.

వ. దేవా? సకలపురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యున పరిచ్ఛిన్నత్వంబు వలన మహాత్ముండ వయ్యును, నాకాశాదిభూత సమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యును, భూతమయ త్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యును, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యును, జ్ఞానవిజ్ఞానపరి పూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వ నిర్వికారత్వంబుల వలన బ్రహ్మంబ వయ్యును, బ్రకృతి ప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రాకృతుండ వయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుండ వయ్యును, గాల శక్తి సమాశ్రయత్వంబువలనఁ గాలనాభుండ వయ్యును, సృష్టి జీవనసంహారాది దర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యును నొప్పు నీకు

నమస్కరించెదము, మఱియును.

680

తా ॥ ఓ దేవా! సర్వజీవులకు అంతర్యామివై ఉన్నందున నీవు పరమపురుషుడవు! భిన్నముగా గాక అందరిలోనూ ఏకత్వరూపంగా ఉన్నందున నీవు మహాత్ముడవు! పంచభూతాలకు ఆశ్రయస్థానము నీవే కనుక భూతవాసుడవు! సమస్త భూతాలు నీయందే ఉన్నందున భూతమయుడవు! కారణంలేని ఉనికిని కలిగి ఉన్నందున నీవు పరమాత్ముడవు! పరిపూర్ణమైన జ్ఞానం, విజ్ఞానం కలిగి ఉండి నిర్గుణుడవు, నిర్వికారుడవు అయినందున బ్రహ్మము నీవే అయి ఉన్నావు! ప్రకృతిని ప్రవర్తింపచేస్తూ, దానికి అంటకనే ఉన్న నీవు అనంత శక్తి స్వరూపుడవు! కాలచక్రమును నడిపే నీవు కాలస్వరూపుడవు! కాలం యొక్క శక్తివి నీవే అయినందున కాలనాభుడవు! ఈ సృష్టిలోని జీవజాలం జనించడం, లయించడం సాక్షిగా చూస్తూ ఉన్న నీవు సర్వసాక్షివి! అట్టి నీకు మా నమస్కారములు.

సీ. విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు విశ్వమునకు
హేతువవై పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృత మగుచు నిజాంశభూత
మగు నాత్మచయమున కనుభూతి సేయుచు మూఁ డహంకృతులచే ముసుఁగువడక

తే. నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి, గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ!

681

తా ॥ ఓ నిర్మలాత్మా! సమస్త ప్రపంచము నీవే అయి ఉన్నావు. వీక్షిస్తూ, ప్రాణులను పుట్టిస్తూ వాటి వృద్ధి క్షయములకు కారణుడవై ఉన్నావు. పంచమహాభూతములు, పంచ తన్మాత్రలు, దశేంద్రియములు మనస్సు, ప్రాణము, బుద్ధి, చిత్తము మొదలైనవన్నీ నీ యొక్క ఆకృతే. త్రిగుణములయందు అభిమానంతో నీ అంశవలన పుట్టిన ప్రాణిసమూహానికి

సుఖదుఃఖానుభములను కలిగిస్తున్నావు. మూడు అహంకృతుల చేత ఆక్రమింపబడక, పరిపూర్ణత్వం చేత, అనంతుడవై ఉన్నావు. ప్రపంచము నీవే! దానిని చూసే వాడివి నీవే! సమస్తము తెలిసిన నీకు మ్రొక్కుతున్నాం! మా మనవి ఆలకించు!

వ. మఱియుఁ గలఁడు లేడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుండొ కం, డనేకుండు నను నివి మొదలుగాఁగల వాదంబులు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యును, నభిధానాభిధేయ శక్తిభేదంబువలన బహుప్రభావప్రతీతుండ వయ్యును, జక్షురాది రూపంబులవలనఁ బ్రమాణరూపకుండ వయ్యును, నిరపేక్షజ్ఞానంబు కలిమిం గవి వయ్యును, వేదమయ నిశ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యును, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యును, భక్తజనపాలకుండ వయ్యును, నంతఃకరణ ప్రకాశకత్వంబు గలిగి సేవకజన ఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాద కుండవయ్యును, జిత్తాదివర్తనంబులఁ గానం దగిన గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యును, దర్కింపరాని పెంపు వలన నవ్యాహతవిహారుండ వయ్యును, సకలకార్యహేతు వయ్యు, నంతః కరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండ వయ్యును, సాధనవశంబుగాని

యాత్మారామత్వంబువలన ముని వయ్యును, స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబు గాకయు విశ్వంబు నీవ యయ్యును, విశ్వభావాభావసందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువయిన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపుము.

682

తా ॥ దేవుడు ఉన్నాడని, లేడని వాదిస్తూ ఉంటారు. సృష్టి స్థితి లయాది కార్యములనన్నిటిని ఎరిగినవాడని కొందరంటారు, చక్కగా ఎరుగడని కొందరు అంటారు; మాయచేత కొంచెం కట్టుబడ్డవాడు, మాయను అతిక్రమించిన వాడని మరికొందరంటారు;

సర్వము నశింపగా తానొక్కడే ప్రకాశిస్తూ ఉంటాడని, చీమ మొదలు బ్రహ్మ వరకు అన్నీ తానేనని ఇంకా కొందరంటారు; ఈ ప్రకారం నానావిధ వాదాలను అనేకమంది భ్రమచేత చేస్తూంటారు. నీవు అన్ని వాదాలకు అనుకూలుడవై ఉంటావు. వస్తువుల పేర్లు, వస్తువులు, వాటి స్వభావాలు, వీటి తారతమ్యం చేత మరియు నానావిధ మహిమలచేత ప్రసిద్ధుడవు. నిశ్వాస రూపమైన వేదాలను బయలుపరచినవాడవు! సర్వశాస్త్రాలకు జన్మస్థానమైన వాడవు నీవే! అహంకారం, బుద్ధి, మనస్సు, చిత్తము ఈ నాలుగింటికి అధిదేవతలైన సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనే నాలుగు విధాలైన రూపములు కలవాడవై భక్తులను సంరక్షిస్తూ ఉంటావు. అంతఃకరణాన్ని శబ్ద స్పర్శ రూపాది వ్యాపారాల యందు ప్రవర్తింపచేసేవాడవు నీవే! బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపాలను ధరించిన వాడవు! త్రిగుణములకు సాక్షీభూతుడవు! జ్ఞానులకంటే అన్యులై ఉండి ప్రపంచ దృష్టికలవారికి నీవు కనుపించవు. ఊహింపరాని మహిమలు కలవాడవు! అవ్యక్త మహత్తత్త్వాదులకు ఉత్పత్తి స్థానం నీవే! శబ్దస్పర్శాది విషయ గ్రహణ శక్తిగలదైన మనస్సును జయించుట చేత నీవు హృషీకేశుడవు! సాధనల వలన లభించని తత్త్వంతో తనయందు తాను క్రీడించు శక్తి కలవాడవు అగుట వలన మునివయ్యావు! ఆకాశంవలె దేనినీ అంటక, ప్రపంచ స్వరూపుడవు కాక ప్రపంచ స్వరూపుడవై, అన్నిటికి సాక్షిమాత్రంగా ఉంటూ, జ్ఞాన అజ్ఞానములకు కారణభూతుడవై, సర్వానికి కర్తవై ప్రకాశించు నీకు నమస్కారం.

క. లోక జని స్థితి లయములు, గైకొని చేయుదువు త్రిగుణ కలితుఁడవై కా
లాకారమున నమోఘ, శ్రీకలితుఁడ వగుచు నిచ్చ సెందక యీశా!

683

తా ॥ ఈశ్వరా! సకలైశ్వర్య సంపన్నుడవైన నీవు త్రిగుణములను అవలంబించి, కాలస్వరూపంచేత దేనియందును అపేక్షను పొందక ఈ జగత్తులను సృష్టిస్తూ, రక్షిస్తూ, నశింప చేస్తూ ఉంటావు.

క. నీశాంతలు గాని తనువు, లీశా! యీ మూఢజాతు లీ సజ్జాతుల్

నీ శాంతతనువులందుఁ బ్ర, కాశింతువు ధర్మహితముగా సుజనులలోన్.

684

తా ॥ స్వామీ! నువ్వు ఈశ్వరుడు మొదలుగాగల జీవుల దేహములన్నిటియందు ప్రకాశిస్తున్నా ధర్మ సంరక్షణం కొరకు సజ్జనులయందు తరచుగా ప్రకాశిస్తావు.

ఉ. నేరము లెన్న నెక్కడివి? నేము దలంచు తలంపులోపలన్
నేరుపు లున్నవే? సుతుల నేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చరే?
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?
నేరము గల్గు మద్విభుని నేఁడిటఁ గావఁ గదే కృపానిధీ!

685

తా ॥ నేరములంటే ఏమిటి? వేరే ఏమీ కాదు. అవి మాకు కలిగే ఆలోచనల రూపంలోనే ఉంటాయి. నిన్ను మెప్పించేటంత ఆలోచనలు మాకుంటాయా? పిల్లలు చేసే తప్పులు తండ్రులు క్షమించరా ఏమిటి? ఎటువంటి నేరాలు చేసినవారినైనా రాజులు ఒక్కోసారి మన్నిస్తారు కదా! మా భర్త అయిన కాళియుడు నేరం చేసాడు, అయినా ఇప్పుడు నీవు క్షమించి వదలిపెట్టు! నీవు కరుణాసంపన్నుడివి కదా!

శా. బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుండౌ నవు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్య దు
ష్టాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే?
చాలున్ నీ పదతాండవంబు, పతిభిక్షం బెట్టి రక్షింపవే?

686

తా ॥ స్వామీ! ఈ కాళియుడు మూర్ఖుడు, క్రూరుడు, చెడ్డ నడవడి కలవాడు కనుక ఇతను అమాయకుడని, మంచివాడని నీతో మేము చెప్పబోవటం లేదు. అయినా ఇతడు నీ చేత

మరణించిన ఎడల మా అయిదవతనం పోయి వైధవ్యం వస్తుంది. అందులకు వెరచి నిన్ను ప్రార్థిస్తున్నాము. అనాథలమైన మా ప్రార్థనను అంగీకరించి, అతని పడగల మీద చేస్తూన్న నీ నాట్యాన్ని చాలించి మాకు పతిభిక్ష పెట్టి కాపాడు దేవా!

ఉ. ఆకులమయ్యె భోగ మిదె యొందల లన్నియు వ్రస్సెఁ బ్రాణముల్
రాకలఁ బోకలం బొలిసె రాయిడి వెట్టక మా నిజేశుపై
నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ నో
సమస్త లో కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా!

687

తా ॥ పదునాలుగు లోకాలను రక్షించే వాడవు నీవే! ఏకాంత భక్తితో నిన్ను ఆరాధించు వారికి మరణ భయం లేకుండా చేస్తావు. శ్రీలక్ష్మీదేవికి ప్రియుడవు! ఓ స్వామీ! ఇదుగో చూడు! మా పెనిమిటి యొక్క దేహమంతా నజ్జునజ్జుగా నలిగి పోయింది. పడగలన్నీ బ్రద్దలయ్యాయి. ప్రాణాలు పోయాయా, ఉన్నాయా అన్నట్లున్నాడు. కనుక ఇతని మీద నీ కృపాకటాక్షములను ప్రసరింపచేసి విడిచిపెట్టు. అభయాన్ని ప్రసాదించే వాడవు కదా!

ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మా ప్రాణవల్లభు, ప్రాణ మిచ్చి కావు భక్తవరద!
నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబుఁ, బిన్ననాఁటి పెండ్లి పెండ్లి గాదు.

688

తా ॥ స్వామీ! మా భర్తను చంపక, కాపాడి మాకు తిరిగి ఇవ్వడం వలన మాకు మళ్ళీ కళ్యాణం చేసినట్లే అవుతుంది. నీవు చేసిన ఈ పెండ్లి శాశ్వతమైనది, మేలైనది అవుతుంది. చిన్నప్పుడు మావారు మాకు చేసిన పెండ్లి అశాశ్వతమైనది కనుక అది పెండ్లికాదు.

ఇంద్రవజ్ర.
నీయాన, యెవ్వారిని నిగ్రహింపం, డా యుగ్ర పాపాకృతి నందఁ డింకన్,

నీ యాజ్ఞలో నుండెడు నేఁటఁ గోలెన్, మా యీశుప్రాణంబులు మాకు నీవే!

689

తా ॥ స్వామీ! ఇకమీద మా పెనిమిటి ఎవరినీ హింసించ లేదు. మునుపటి భయంకరమైన ఆకారాన్ని పొందడు. నేడు మొదలు నీ ఆజ్ఞమేరకు వర్తిస్తాడు. నీ సాక్షిగా ఇది వాస్తవం. ఇతని ప్రాణములను మాకిచ్చి మన్నింపు కృష్ణా!"

వ. అని యిట్లు తమ పెనిమిటి బ్రదుకుఁ గోరెడి భుజగసతుల యందు శరణాగత రక్షకుండైన పుండరీకాక్షుండు గరుణించి, చరణఘట్టనంబు సాలించి, తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మరలం బడసి, చిదిసి నలఁగిన తలలు సవరించుకొని వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి మెల్లన నిట్లనియె.

690

తా ॥ అని ఈ విధంగా తమ భర్త ప్రాణాలను కాపాడుమని ప్రార్థిస్తూన్న కాళియుని భార్యలైన నాగకాంతలను కరుణించాడు శ్రీకృష్ణుడు. పడగలమీద నాట్యం చెయ్యటం మాని, ఈవలకు వచ్చాడు. అంతట కాళియుడు అతిప్రయాసచేత ప్రాణేంద్రియముల చేష్టలు కలవాడై, పగిలి నలగిపోయిన తన పడగలను స్వాధీనానికి తెచ్చుకున్నాడు. ఆయాసంతో శ్రీకృష్ణునికి చేతులు జోడించుకొని ఈ విధంగా మ్రొక్కాడు:

చ. మలఁకలు మా ప్రచారములు, మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్,
ఖలులము, రోషజాతులము, గర్వుల, మే మొక మంచివారమే?
నళినదళాక్ష! ప్రాణులకు నైజ గుణంబులు మాన నేర్చునే?
వెలయవె? మా వికారములు వింతలె? మే లొనరించి తీశ్వరా!

691

తా ॥ "ఈశ్వరా! మేము వంకరయైన నడకను కలవారము. ముఖమునందు విషం

పెట్టుకొని వర్తించే వారం, దుర్జనులం. రోషం మా జాతి స్వభావం. అహంకారం మాకు మెండుగా ఉంది. లోకంలో ప్రాణులేవైనా తమతమ స్వభావ గుణములు మాని ఉంటాయా? ఉండనే ఉండవు. మా దుష్టచేష్టలు లోక ప్రసిద్ధములే కానీ వింతగా కలిగినవి ఏమీ కావు. నా విషయంలో నీవు ఇప్పుడు మంచిపనే చేశావు.

సీ. వివిధ భావాకార వీర్యబీజాశయ జవయోనియుతముగా జగము లెల్ల
నీవ చేసితి మున్న, నే మా జగంబులో సహజకోపనులము సర్పములము,
దుర్వారమైన నీ తోరంపు మాయ నే మెఱిఁగి దాఁటెడు పని కెంతవార?
మంతకుఁ గారణ మఖీలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన!

తే. మనిచె దేనిని మన్నించి మనుపు నన్ను నిగ్రహించెద వేనిని నిగ్రహింపు, మింక సర్వేశ!
మా యిమ్ము లెందుఁ గలవు, చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును.

692

తా ॥ స్వామీ! అనేక రకాలైన జననాది వికారాలు, భావాలు, రూపాలు మొదలైనవన్నీ ఈ జగత్తులో నీచే సృష్టించబడ్డాయి. నీ ఈ సృష్టిలో, రోష స్వభావంతో కూడిన సర్పజాతి మాది. నీ మాయను దాటేందుకు మేము ఎంతటివారం! అన్నింటికీ కారణభూతుడవైన నీవు అఖీలేశ్వరుడవు! నీవు అన్నీ తెలిసిన సర్వజ్ఞుడవు! కనుక మమ్మల్ని క్షమించాలనుకుంటే క్షమించి రక్షించు, శిక్షించ దలిస్తే శిక్షించు! మాకంటూ ఇంక కోరిక ఏదీ లేదు. నీవు ఎలా చెబితే అలా చేస్తాము.

క. నా పుణ్య మేమి సెప్పుదు? నీ, పాదరజంబుఁ గంటి నే, సనకాదుల్
నీ పాదరజము గోరుదు, రే పదమం దున్ననైన నిఁక మేలు హరీ!

693

తా ॥ ఓ హరీ! సనకాదులయిన పరమ పావనులు కూడా అపేక్షించు నీ పాదరేణువులు

నాకు లభించాయి. నా భాగ్యం ఏమని చెప్పవచ్చు. ఇట్టి భాగ్యం లభించింది కనుక నేను ఇంక ఏ స్థితిలో ఉన్నా అది నాకు క్షేమకరమే అవుతుంది."

వ. అని విన్నవించినఁ గాళియు పలుకులు విన నవధరించి కారుణ్య మానసుండయిన సర్వేశ్వరుం డతని కిట్లనియె.

694

తా ॥ ఇలా మనవి చేస్తున్న కాళియుని పలుకులు అంగీకరించి కారుణ్యంతో ఆ శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

క. 'గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీ మడుఁగు నీరు, తగ దిం దుండన్,
నీవును నీ బాంధవులును, నీ వనితలు సుతులుఁ జనుఁడు నేఁ డంబుధికిన్.

695

తా ॥ "ఓ కాళియుడా! ఈ మడుగులోని నీరు గోవులు, మనుష్యులు త్రాగుతారు, కనుక నీవు ఇక్కడ ఉండవద్దు. నీవు నీ భార్యాబిడ్డలతో, పరిజనాలను వెంట పెట్టుకొని నేడే సముద్రానికి పోయి అక్కడ నివసించు.

క. నిను నే శాసించిన కథ, మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం చిన మనుజులు
నీ భయమును, విను మెన్నఁడుఁ బొంద రెందు విషవిజయముతోన్.

696

తా ॥ ఓ కాళియుడా! నిన్ను నేను శిక్షించిన ఈ కథను ఎవరు మనస్సులో తలచి ఆహోరాత్రములు కీర్తిస్తూ ఉంటారో అట్టివారు ఎప్పుడూ పాముల వలన భయాన్ని పొందరు, విషభయమును జయిస్తారు.

చ. ఇది మొదలెవ్వరైన నరు లీ యమునాతటినీ హ్రదంబులో

వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురిత సంఘముఁ బాయుదు రాక్షణంబునన్.

697

తా ॥ నేడు మొదలు నరులెవ్వరైనా సరే ఈ మడుగులో భక్తితో స్నానం చేసి ఉపవాసం ఉండి నన్ను ధ్యానించి, సేవిస్తూ, చలింపక దేవతాదులకు ప్రీతిగా జలతర్పణాలు చేసిన పక్షంలో అట్టివారప్పుడే చిత్త చాంచల్యము మాని పాపముల నుండి విముక్తులవుతారు.

ఆ. గరుడభీతి రమణకద్వీప మొల్ల కీ, మడువుఁ జొచ్చి తీవు, మత్పదాబ్జ
లాంఛనములు నీతలను నుంటఁజూచి యా, పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక.

698

తా ॥ ఓ కాళియుడా! నీవు గరుత్మంతుని వల్ల భయంతో రమణక ద్వీపాన్ని విడిచి ఈ మడుగులో ఉంటున్నావు. ఇక నీకు ఆ భయం లేదు. నా పాదాల గుర్తులు నీ పడగల మీద ఉండటం చూసిన గరుత్మంతుడు ఇక నిన్ను విడిచిపెడతాడు."

కాళియుని వలె జీవుడు సంసారమనే మడుగులో ప్రవేశించి ఉన్నాడు. రాగద్వేషాదులనే విషం చేత ఈ సంసారమడుగు విషతుల్యమై ఉన్నది. దీనిని తొలగించుకోవాలంటే ఆ శ్రీహరి పాదపద్మాలను జీవుడు తన హృదయంలో నిలుపుకోవాలి. అట్టి జీవున్ని, ఇక ఏదీ బాధించలేదు.

వ. అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డాన తిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున న య్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణ రత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటి తండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ యిచ్చి, పుత్రమిత్రకళత్ర సమేతుండై, బహువారంబులు గైవారంబు సేసి, వలగొని, మ్రొక్కి, లేచి, వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియె, నిట్లు.

699

తా ॥ అని చెప్పి విశేషమైన వింతలను చేయగల శ్రీకృష్ణుడు ఆనతిచ్చే సరికి కాళియుడు రమణక ద్వీపానికి వెళ్ళడానికి సమ్మతించాడు. తన భార్యలును తానును కృష్ణునికి దివ్యమైన వస్త్రాలు, భూషణాలు, రత్నహారాలు, మంచి గంధపు పూతలు మొదలైనవి భక్తి పూర్వకంగా సమర్పించారు. మనోజ్ఞమైన నల్ల కలువల మాలిక ఒకటి ఇచ్చాడు. భార్య, బిడ్డలు, మిత్రులు మొదలైన వారితో కూడ గోపాలకృష్ణుని పలుమార్లు కొనియాడుతూ సముద్ర మధ్యమున ఉండే రమణక ద్వీపానికి ప్రయాణమై వెళ్ళాడు.

క. వారిజలోచనుఁ డెవ్వరు, వారింపఁగ లేని ఫణినివాసత్వంబున్
వారించిన యమున సుధా, వారిం బొలుపారె నెల్లవారికిఁ బ్రియమై.

700

తా ॥ ఆ కమలనేత్రుడు ఈ విధంగా ఎవరికీ సాధ్యంకాని కాళియుని ఉనికిని తొలగించినందుకు లోకులందరికి ప్రియాన్ని చేకూరుస్తూ అమృత తుల్యమైన ఉదకంతో యమునానది ఒప్పారింది.”

# 23. కాళియుని పూర్వకథ

వ. అనిన విని 'మునీంద్రా! యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయిన రమణకద్వీపంబు విడిచె? నతం డొక్కరుండును గరుడున కేమి తప్పు దలంచె?' నని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె.

701

తా ॥ అని శుక మహర్షి చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు: "మునీంద్రా! కాళియుడు పాములకు ఉనికిపట్టయిన రమణక ద్వీపాన్ని విడిచి ఎందుకు వచ్చాడు? అతడు ఒక్కడే గరుత్మంతునికి చేసిన అపరాధం ఏమిటి?" అప్పుడు శుక మహర్షి ఇలా చెప్పటం ప్రారంభించాడు:

సీ. 'సర్పభీరువులైన జను లెల్ల నెలనెల సరసభక్ష్యములు వృక్షముల మొదల
సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంప కుండఁ
బ్రతిమాసమును దమభాగ భక్ష్యంబు లా పక్షిరాజున కిచ్చి బ్రదుకు చుండ
విషవీర్య దుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకుని పా లపహరించి

తే. యీక తనపాలి బలిభాగ మెల్లఁ దినిన, విని ఖగేంద్రుఁడు కోపించి 'వీని' తలలు
సీరి చెండాడి భోగంబు చించి వైచి, ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి 'యనుచు.

702

తా ॥ "పూర్వం లోకంలో పాములకు భయపడ్డ జనులందరూ, నెలనెలా వాని పుట్టలు ఉండే వృక్షముల మొదళ్ళ యందు సరస భక్ష్యములను పెట్టేవారు. ఆ పాములు తమకు భయాన్ని కలిగించే గరుత్మంతునికి ఆ భక్ష్యములను విభాగించుకొని పోయి ఇస్తూ ఉండేవి. ఇలా ఉండగా ఆ సర్పాలలో ఒకడైన ఈ కాళియుడు తన విషబలం చేత గర్వించి గరుత్మంతునికి ఇవ్వాల్సిన భక్ష్యభాగాలను ఇయ్యక తానే భక్షించాడు. అది తెలిసి గరుత్మంతుడు వాని పడగలు

చీరి దేహాన్ని చీల్చి వస్తాను అని నిశ్చయించుకొన్నాడు.

క. అక్షీణ కనకసన్నిభ, పక్ష యుగోద్భూత ఘోర పవమాన మహా
విక్షేప కంపితానే, క క్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్.

703

తా ॥ నిశ్చయించుకుని, బంగారు వన్నెగల రెక్కల నుండి పుట్టిన అధికమైన గాలియొక్క వేగానికి గొప్ప గొప్ప కొండలు కదలియాడగా రమణక ద్వీపానికి గరుడుడు వచ్చాడు.

ఉ. వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్ని కణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పు లందుఁ గా
ర్చి చ్చెగయంగఁ బాఱి కఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్.

704

తా ॥ అంతట కొంచెమైన జంకులేనివాడై కాళియుడు లేచి పడగలెత్తుకొని, కనుగొలుకుల నుండి నిప్పురవ్వలు రాలగా గరుత్మంతున్ని చూసి విషం క్రక్కుతూ, తన ఊపిరి విడుచుట వల్ల దావాగ్ని రేగగా పరుగెత్తిపోయి గరుత్మంతున్ని కాటువేశాడు.

క. కఱచిన భుజగము రదములు, విఱుగఁగ వదనములు విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు, తఱిమి కనకరుచులు గలుగు తన డాఱెక్కన్.

705

తా ॥ అలా కాళియుడు తన్ను కరవగానే గరుత్మంతుడు విజృంభించాడు. ఆ పాము పళ్ళు విరిగేటట్లు, ముఖముల నుండి విషం బయటకు వచ్చేటట్లు, తలలు పగిలి బ్రద్దలు అయ్యేటట్లు తరుముకుంటూ పోయి తన కుడి రెక్కతో కొట్టాడు.

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరంబయిన మడుఁగుఁ జొచ్చె, మఱియు నొక్కవిశేషంబు గలదు.

706

తా ॥ ఈ విధంగా గరుత్మంతుని చేత కొట్టబడిన వాడై కాళియుడు, అక్కడనుండి పరుగెత్తి వచ్చి లోతైన ఈ మడుగులో ప్రవేశించాడు. ఇందులో ప్రవేశించడానికి కూడా ఒక విశేషం ఉంది.

సీ. మున్ను సౌభరి యను ముని యీ హ్రదంబునఁ దపము సేయుచు నుండ ధరణిలోన
నాఁకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు సనుదెంచి యిందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచియు మునిరాజు శోకించి కోపించి 'గరుఁడుడు నేఁడాది గాఁగ నిందుఁ

తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచెనేనిఁ, జచ్చుఁగావుత' మని యుగ్రశాప మిచ్చెఁ
గాళియుం డొక్కఁ డా శాపకథ యెఱుంగు, నితర భుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప!

707

తా ॥ రాజా! పూర్వం ఈ మడుగులో సౌభరి అనే మునిశ్రేష్ఠుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. అప్పుడు ఒకరోజున గరుత్మంతుడు మిక్కిలి ఆకలితో వచ్చి ఈ మడుగులోని చేపల రాజును పట్టుకుని చంపి తిన్నాడు. అందుకు తక్కిన చేపలు అన్నీ దుఃఖించసాగాయి. దానిని చూసి సౌభరి కూడా బాధపడి, 'ఇది మొదలు గరుత్మంతుడు ఈ మడుగుకు వచ్చి మత్స్యములను భక్షింప యత్నిస్తే మరణించుగాక' అని శపించాడు. ఆ వృత్తాంతం కాళియునికి ఒక్కనికే తెలుసు, తక్కిన పాములకు తెలియదు. కనుక కాళియుడు గరుత్మంతుని దెబ్బలకు వెరచి ఈ మడుగులో వచ్చి దాక్కున్నాడు.

వ. అది కారణంబుగాఁ గాళియుం డీ మడుఁగుఁ జొచ్చియున్న, గో మనుజ రక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె, నిట్లు దివ్య గంధాంబర సువర్ణమణిగణ మాలికాలంకృతుండై,

మడుఁగు వెడలి వచ్చిన మాధవుం గని, ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులం బోలె, యశోదారోహిణీ సమేతలయిన గోపికలును, నంద సునందాదులైన గోపకులును మూర్ఛలం బాసి, తేఱి, తెప్పిఱి, లేచి, పరమానందంబునం బొందిరి, బల భద్రుండు తమ్ముని నాలింగనంబు సేసె, నప్పుడు.

708

తా ॥ సౌభరి శపించిన హేతువు చేత కాళియుడు ఆ మడుగు చొచ్చి ఉన్నాడు. అయితే గోవులను, మనుష్యులను రక్షించువాడై శ్రీకృష్ణుడు ఆ కాళియున్ని మడుగులో నుండి వెడలిపోయేటట్లు చేశాడు. అట్లా వానిని వెడలించి, వానిచే సమర్పింపబడిన దివ్యములైన పరిమళ ద్రవ్యముల చేత, వస్త్రముల చేత, ఆభరణముల చేత, రత్నహారముల చేత అలంకరింపబడిన వాడైనాడు. అప్పుడా కృష్ణుణ్ణి చూసి చేతనత్వాన్ని పొందిన ఇంద్రియాలవలె, యశోద మొదలైన గోపికలును నందాదులు మూర్ఛల నుండి లేచారు. లేచి కృష్ణుని కౌగిలించుకొని మిక్కిలి సంతోషించారు. బలరాముడు కూడా కృష్ణుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు.

క. ఱంకెలు వై చె వృషభము ల, హంకారముతోడ, లేఁగ లట్టి ట్టుఱికెం,
బొంకముల నొప్పె ధేనువు, లంకురితము లయ్యెఁ దరువు లా హరిరాకన్.

709

తా ॥ ఇలా కృష్ణుడు బయటకు రాగానే ఆబోతులన్నీ ఉత్సాహంతో రంకెలు వేశాయి. లేగ దూడలు గర్వంతో గంతులు వేశాయి. ధేనువులు మిక్కిలి కళతో ఒప్పాయి. వృక్షాలన్నీ చిగురించాయి.

క. 'నీ సుతుఁ డహిచే విడివడె, నీ సురుచిర భాగ్యమహిమ నిశ్చల' మనుచున్
భూసురులు సతులు దారును, భాసురవచనముల నందుఁ బలికి రిలేశా!

710

తా ॥ బ్రాహ్మణులందరు తమ భార్యలతో కూడి, నందున్ని చూసి ప్రశస్తములైన వాక్కులతో 'నీ కొడుకు పాముచేత విడువబడ్డాడు... నీ భాగ్యం మంచిది. దానికి ఎదురులేదు' అని పలికి ఆశీర్వదించారు.

శా. 'ని న్నా యుగ్రభుజంగమంబు గఱవన్ నీవాపదం బొందుచున్
న న్నే మంటి తనూజ! యోడవు గదా నాకూన! నా తండ్రి! రా
వన్నా!' యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచుం
గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్.

711

తా ॥ యశోద కృష్ణుడిని సమీపించి, తన ఒడిలో కూర్చోబెట్టుకుని, శిరస్సుని ప్రేమతో నిమురుతూ, 'నా చిన్నితండ్రీ! కన్నయ్యా! నా బాబూ! ఆ భయంకరమైన పాము నిన్ను కరుస్తూ ఉంటే, నన్ను తలుచుకుని ఏమనుకున్నావో ఏమిటో! భయపడలేదుకదా నాన్నా!' అని అంటూ కన్నీరు పెట్టుకుని, కృష్ణున్ని మిక్కిలి గారాబం చేస్తూ కౌగలించుకుంది.

వ. ఇట్లు పరమసంతోషులై ఘోషజను లారేయి కాళిందీతటంబున నాఁకలి నీరువట్టుల దస్సి క్రుస్సి, గోవులం దారు నుండ, నగణ్యంబగు న య్యరణ్యంబున నొక్క దవానలంబు వుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితంబైన వ్రజంబుమీదఁ గదిసిన నదిరిపడి, లేచి, దందహ్యామానదేహులయి సకల జనులును మాయామనుజ బాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి.

712

తా ॥ ఈ విధంగా పరమ సంతోషాన్ని పొందిన ఆ వ్రేపల్లెవాసులు అప్పటికే పొద్దు గుంకినందున రాత్రికి యమునా తీరంలోనే ఉండిపోయారు. ఎవరికీ అన్న పానాదులు లేకున్నా, అలసటతో, కృష్ణుడు పెను ఆపద నుండి బయటపడ్డాడన్న సంతోషంతో, అక్కడే గోవులతో సహా

ఉండిపోయారు. ఇంతలో ఆ అడవిలో, అర్ధరాత్రి సమయములో భయంకరమైన దావాగ్ని చెలరేగి, వారిని చుట్టుముట్టింది. భయభ్రాంతులతో వారంతా ఆ వేడిమి సెగలకు తాళలేక కృష్ణుణ్ణి ఇట్లు వేడుకున్నారు:

## 24. గో గోప గోపికాసంఘమును కార్చిచ్చు చుట్టుకొనుట

మ. 'అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణ కీలాభీల దుర్వారమై
యిదె కప్పెన్ మమునెల్ల వారినిట మీఁ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబుల కాని యొండెఱుఁగ, మో పద్మాక్ష!, యో కృష్ణ! మ్రొ
క్కెద మో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే!

713

తా ॥ "ఓ పద్మాక్షా! కృష్ణా! ఓ బలరామా! మీకు నమస్కారం! మీరు తప్ప మాకు వేరే దిక్కు లేదు! ఇదుగో! నాలుగు ప్రక్కల నుండి కార్చిచ్చు వచ్చి పొగలతోను, నిప్పురవ్వలతోను, మంటలతోను చల్లార్పడానికి శక్యంకాని రీతితో మమ్ము ఆక్రమించుకుంటూ ఉన్నది. మీ పాదకమలములు తప్ప మరేమియు మాకు దిక్కులేదు. ఈ దావాగ్నిని చల్లార్చి మమ్ములను కాపాడండి!

క. నీ పాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి? జనుల కత్యుగ్ర మహా
దీపిత దావజ్వలనము, పైపడ కుండెడి విధంబు భావింపఁ గదే.'

714

తా ॥ కృష్ణా! నీ పాదాలు నమ్ముకున్న వాళ్ళకు ఆపదలు ఎక్కడుంటాయి? భయంకరంగా విజృంభిస్తున్న ఈ మంటలతోడి దావాగ్నిని మీదకు రానివ్వని మార్గాన్ని ఆలోచించలేవా?"

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతుం దన శక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన, విజయగానంబు దశదిశల నిగిడె, నంతం గృష్ణుండు గోగణజ్ఞాతి సహితుండై మందయానంబున మందకుఁ జనియె, నిట్లు రామకేశవులు గోపాలబాల వేషంబులం గ్రీడించు సమయంబున.

తా ॥ అని ఈ విధంగా ఘోషిస్తున్న గొల్లవారిని శ్రీవిష్ణుమూర్తి అయిన కృష్ణుడు చూసాడు. మహాశక్తి సంపన్నుడైన ఆ అనంతుడు, అడవి అంతా ఆక్రమించుకున్న కార్చిచ్చును అమృతం వలె పానం చేశాడు. అనంతరం జయ జయ శబ్దములతోడి పాటలు ఎల్ల దిక్కుల యందు వ్యాపించగా, రామకృష్ణులు తమ బంధువులైన గొల్లలతో ఆవుల గుంపులను తోలుకొని తమ ఇండ్లకు పోయారు.

జీవితమనే అరణ్యంలో రాగద్వేషాదులనే వడగాల్పుల వలన అశాంతి అనే కార్చిచ్చు రగులుతుంది. దానిని శమింప చేసేందుకు దయాసాగరుడైన భగవంతుణ్ణి శరణువేడటమే శరణ్యమని గ్రహించగలగాలి.

## 25. గ్రీష్మ ఋతు వర్ణనము

సీ. దినము లంతంతకు దీర్ఘంబులై యుండ దిననాథుఁ డుత్తరదిశఁ జరించె,
నాఁటి నాఁటికి నెండ నవ్యమై ఖర మయ్యె, వెచ్చని గాడ్పులు విసరఁ జొచ్చె,
మేదినీ రేణువుల్ మింట సంకుల మయ్యె, నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ,
బానీయశాలలఁ బథిక సంఘము నిల్చెఁ, జప్పరంబుల భోగిచయము డాఁగెఁ,

ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె, మిథునకోటికి రతి మెండు దోఁచె,
నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ, గీలి యడవులందుఁ గేలి సలిపె.

716

తా ॥ ఇంతలో వేసవి కాలం వచ్చింది. పగటికాలం నిడివి పెరుగగా, సూర్యుడు ఉత్తర దిక్కులో సంచరిస్తున్నాడు. ఎండ వేడిమి అధికమగుచుండగా, వెచ్చని పడమటిగాలి విసరసాగింది. సుడిగాలి చేత భూమిలోని దుమ్ము ఆకాశమంతా వ్యాపించింది. ఏరులు తటాకములు మొదలైన వాటిలో నీళ్ళు ఇంకిపోయాయి. బాటసారుల సమూహం చలిపందిరులలో నిలుచుండగా, పాములు ఎండ వేడిమిని భరింపలేక పొదలలో దూరసాగాయి. పువ్వులతోసహా, ఆకులతోను వృక్షాలు ఎండిపోతున్నాయి. దంపతులకు శృంగార క్రీడలయందు ఆధిక్యం కనపడింది. ఈ విధంగా ఎల్ల జంతువులకు భయాన్ని కలిగించే గ్రీష్మ ఋతువు వచ్చి అడవులందు వ్యాపించింది.

ఆ. వాఁడిరుచులు గలుగువాని వేఁడిమి గ్రీష్మ, కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున, నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

717

తా ॥ బ్రహ్మ అనేవాడు ప్రజల కొరకు బ్రహ్మాండమనెడు కుండలో ఉష్ణరసాన్ని తెచ్చి పెట్టాడో అన్నట్లుగా సూర్యుడు వేసవికాలంలో తన వేడి కిరణాలను భూమిమీద మిక్కిలిగా

వ్యాపింపచేశాడు.

వ. ఇట్లాభీలం బయిన నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవింద మందిరంబైన కతంబున నిదాఘకాల లక్షణంబులం బాసి, నిరంతర గిరినిపతిత నిర్ఝరశీకర పరంపరాభాసిత పల్లవిత కుసుమిత తరులతం బయ్యును, దరులతా కుసుమపరిమళ మిళిత మృదుల పవనం బయ్యును, బవనచలిత కమలకహ్లార సరోవర మహాగభీరనదీ హ్రదం బయ్యును, నదీహ్రద కల్లోల కంకణ ప్రభూత పంకం బయ్యును, బంకసంజనిత హరితాయమాన తృణనికుంజం బయ్యును, జనమనోరంజనంబైన వసంత కాల లక్షణంబులు గలిగి లలిత మృగపక్షి శోభితం బయి యొప్పుచుండె, మఱియు నందు.

718

తా ॥ ఓ రాజా! ఈ చెప్పబడిన లక్షణాలచేత ఎల్ల ప్రాణులకు భయాన్ని కలిగిస్తూన్నది వేసవికాలం. బలరామ కృష్ణులకు నివాసంగా ఉన్న కారణంగా, బృందావనంలో ఆ లక్షణాలు ఏమీ లేవు. ఎల్లప్పుడు కొండలమీదనుండి దిగువకు ప్రవహిస్తూన్న సెలయేళ్ళయందలి నీటిబొట్లు చెదిరిపడుట చేత చెమ్మకలిగి వృక్షాలన్నీ చిగిర్చి పూచి కన్నులకు మనోజ్ఞంగా ఉన్నాయి. పూలతో ఉన్న తీగలు గల వృక్షాల నుండి పరిమళంతోడి చల్లగాలి వస్తోంది. మిక్కిలి లోతైన కొలనులు మడుగులు అన్నీ కూడా గాలిచేత కదలి ఉయ్యాల లూగుతూన్న తామరలు, కలువలచే నిండి ఉన్నాయి. లోతైన మడుగుల యందు లేచిన పెద్ద పెద్ద అలలనుండి చెదరిన తుంపురుల చేత అక్కడి ప్రదేశం అంతా అదుసయి పోయింది. అదుసుగా ఉన్న నేలల యందు దట్టంగా పెరిగి పచ్చని కసవు జొంపాలతో పొదరిళ్ళు చాలా అందంగా ఉన్నాయి. జనుల మనస్సుకు ఆహ్లాదాన్ని పుట్టిస్తూ వసంతఋతు లక్షణాలను కలిగి మృగముల చేత, పక్షుల చేత మిక్కిలి మనోహరంగా ఉంది.

క. పికముల కోలాహలమును, శుకసంఘము కలకలంబు సుభగ మయూర
ప్రకరము కేకారవ, మళి, నికరము రొదయును జెలంగె నెఱి నయ్యడవిన్.

719

తా ॥ ఆ వేసవి కాలం బృందావనంలో ఎక్కడ చూసినా కోకిలల కూతలు, చిలుకల పలుకులు, నెమళ్ళ కేకలు, తుమ్మెదల ఝుంకార ధ్వనులు వీనులవిందును చేస్తున్నాయి.

క. ఆతత యమునా సరసీ, జాత తరంగాభిషిక్త జలరుహ గంధో
పేతానిల మడఁచె నిదా, ఘాతత దావాగ్ని పీడ న వ్వనమందున్.

720

తా ॥ యమునా నది సరస్సులోని అలలు తామర పూలను తడుపుతూ ఉంటే, ఆ సువాసన గాలితో, చక్కగా వనమంతా వ్యాపిస్తోంది. ఆ చల్లటి పరిమళభరితమైన వాయువు కార్చిచ్చు వేడిమిని పూర్తిగా అణచివేసింది.

వ. ఇట్లామని కందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ, దెగడుచుఁ, జెలంగుచుఁ, దలంగుచు, జిఱజిఱం దిరుగుచుఁ, దరులసందుల కరుగుచు, దాఁగిలి మూఁతలాడుచు, గీతంబులు వాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు, గతులు దప్పినక్రియ నొఱఁగుచుఁ, గుప్పల కుఱుకుచుఁ, జటలు గొట్టుచుఁ, గందుకంబులం దట్టుచు, నుప్పరం బెగసి, దర్దురంబుల చందంబున దాఁటుచు, నామలక బిల్వాది ఫలంబుల మీటుచుఁ, గుటవిటపంబులఁ గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరల రేఁపుచు, మధుమక్షికలఁ జోపుచుఁ, దేనియలు ద్రావుచు, సొమ్మలు వోవుచు, గురుశిష్య కల్పనంబులం బనులు సేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ, బన్నిదంబులు సఱచుచుఁ బులుఁగుల భంగి నఱచుచు, బహురూపంబులు వన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవక మిత్రామిత్ర భావంబులు వహించుచు నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి, రందు.

తా ॥ ఇట్లు వసంతఋతు లక్షణాలు కలిగిన అందమైన బృందావనానికి బలరామకృష్ణులు గోపకులతో కూడి, పశువులను తోలుకొని పోయారు. గోపబాలురున్నూ తామున్ను ఒకరితో ఒకరు నవ్వుకొంటూ, ఎగతాళి చేసుకొంటూ, కేకలు వేసుకుంటూ, గిరగిర తిరుగుతూ, వృక్షాల సందులలో దుముకుతూ, దాగుడు మూతలు ఆడుతూ, పాటలు పాడుతూ, పిల్లంగ్రోవులు ఊదుతూ, చిందులు త్రొక్కుతూ, ఒకరిమీద ఒకరు పడిపోతూ, కుప్పిగంతులు వేస్తూ, చప్పట్లు కొడుతూ, కప్పల వలె మీదికెగిరి దాటుతూ, ఉసిరిక కాయలు మారేడు పండ్లు మొదలైన వాటిని రాలగొట్టుతూ, చెట్ల కొమ్మలను ఆడిస్తూ, మృగములను అదలిస్తూ, తేనె తుట్టెలను రేగగొట్టి తేనెటీగలను తరుముతూ, తేనెను తాగుతూ, గురువు అనీ, శిష్యుడు అనీ కల్పించుకుని, గురువులైన వారికి శిష్యులైన వారు సేవలు చేస్తూ, జుట్లు ముందరి వైపుకి ముడివేసికొని పోట్లాడుతూ, పందెములు వేసుకొంటూ, పక్షులవలె కూస్తూ, బహువిధాలైన వేషాలు వేస్తూ, ఒకడు యజమాని మరొకడు సేవకుడుగాను, ఒకడు చెలికాడు మరొకడు పగవాడుగా ఏర్పరచుకొని కొలువు చేస్తూ కలహిస్తూ.... ఇలా మిక్కిలి ఉత్సాహంతో నానా విధాలుగా ఆటలు ఆడుకునేవారు.

క. మాపాలిక బలకృష్ణులు, భూపాలకు లంచు నెరిగి బొబ్బ లిడుచు న
గ్గోపాలురు మోతురు ప్రమ, దాపాదకు లగుచు వల్లికాందోళికలన్.

722

తా ॥ 'మాకు బలరామ కృష్ణులే రాజులు' అని ఆ గోపకులు అందరు గంతులు, కేకలు వేస్తూ ఆ రామకృష్ణులను, తీగలతో అల్లిన పల్లకిలో కూర్చుండపెట్టి మోసేవారు. ఇలా ఎంతో సంతోషంతో ఆడుకునేవారు.

క. గోపకు లందఱు నాడుచు, దీపింపఁగ రామవాసుదేవుల వెనుకం

బై పడి పాఠక గాయక, రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై.

723

తా ॥ గోపకులందరు స్థిరచిత్తంతో బలరామకృష్ణుల వెనుకచేరి, రాజులను స్తోత్రించే వారివలె బిరుదులు ఉగ్గడించి స్పష్టంగా పొగుడుతూ పాడేవారు.

క. ప్రీతిన్ గోపకు లందఱు, గీతంబులు వాడఁ దరుల క్రిందను నగుచుం
జేతులు ద్రిప్పుచు వెడవెడ, పాతర లాడును యశోదపాపం డడవిన్.

724

తా ॥ అడవిలో చెట్ల నీడలయందు చేరి గోపాలురు ఈ విధంగా పాటలు పాడుతూ ఉంటే, ఆ యశోదాతనయుడు నవ్వుతూ, చేతులు త్రిప్పుతూ, నాట్యాలు చేసేవాడు.

మ. జలజాక్షుండును రాముఁడున్ నటనముల్ సల్పంగ గోపాల మూ
ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సంతోషించి, వేణుస్వనం
బులు గావించుచు గొమ్ము లూఁదుచు శిరంబుల్ ద్రిప్పుచుం
బాడుచున్ వలనొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్.

725

తా ॥ కృష్ణబలరాములు, గోపబాలురను అనుసరిస్తూ నాట్యం చేసేవారు. వారిచుట్టూ గోపాలకులుగా ఉంటూ సేవిస్తూ ఉన్న దేవతలు సంతోషించేవారు. పిల్లనగ్రోవులు, కొమ్ముబూరలు ఊదుతూ, తలలు త్రిప్పుతూ చక్కగా పాటలు పాడేవారు. వీరంతా ఆరితేరిన నటులవలె ప్రవర్తించేవారు.

## 26. బలభద్రుడు ప్రలంబాసురున్ని వధించుట

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ, గొలంకుల సమీపంబుల, గిరులచఱుల, సెలయేఱుల పొంతల, మడుఁగుల చెంతలఁ, బొదల క్రేవలఁ, బసిమిగల కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుండను రక్కసుం డుక్కు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింససేయం దలంచుచుండ న య్యఖిల దర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున.

726

తా ॥ ఈ విధంగా రామకృష్ణులు అరణ్యాలలో నదీనదాలు, సరస్సులు, చెరువులు, మడుగులు, సెలయేళ్ళు మొదలైన వాటి సమీపంలో ఉండే చెట్ల చల్లని నీడలలో క్రీడిస్తున్నారు. పశువులు అచ్చటచ్చట పచ్చగా పచ్చిక దట్టంగా పెరిగిన చోటులలో మేస్తూ ఉన్నాయి. అప్పుడు ప్రలంబాసురుడు అనే రాక్షసుడు ఒకడు గొల్లవేషంతో వచ్చి, వీరిలో చేరి రామకృష్ణులను చంపాలని అనుకున్నాడు. ఆ సంగతి సర్వమును తెలిసిన శ్రీకృష్ణుడు తెలిసియూ తెలియని వానిలా నటించాడు.

క. ఆ రాముని సహజన్ముఁడు, రా రమ్మని వానిఁజీరి రాకం బోకన్
గారాముసేసి మెల్లన, పోరామి యొనర్చెఁ బిదపఁ బొరిగొనుకొఱకున్.

727

తా ॥ బలరాముని తోడ పుట్టిన వాడైన శ్రీకృష్ణుడు, ఆ ప్రలంబాసురుని చంప తలచినవాడై, రారమ్మని దగ్గరకు పిలిచి, అన్ని పనులలోను వానిని త్రిప్పుచు వానితో మిక్కిలి స్నేహం చేశాడు.

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమిసేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె.

తా ॥ ప్రలంబునితో స్నేహం చేస్తూ కృష్ణుడు, గోపాలకులతో ఇట్లా అన్నాడు:

ఆ. 'మనకుఁ బ్రొద్దువోదు మన మిందఱము రెండు, గములవార మగుచుఁ గందుకముల
శిలలు గుఱులు సేసి చేరి క్రీడింతము, రండు వలయు జయపరాజయములు.'

729

తా ॥ "మనకు ప్రొద్దు పోవటం లేదు. మనం అందరం రెండు పక్షాలుగా ఏర్పడి రాళ్ళను గురిచేసి బంతులతో క్రీడిద్దాం. ఈ విధంగా చేసి ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడిపోతారో చూద్దాం."

వ. అని యిట్లు పలికి, తానును బలభద్రుండును బెన్నుద్దులై యితర వల్లవులెల్ల నుద్దించుకొని చిఱ్ఱుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని, రెండుగములవారై మార్గంబులందుఁ దృణదారు శిలాకల్పి తంబులగు గుఱులొడ్డి, కందుక శిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁకవైచి, జయపరాజయ నిర్ణయంబులు గైకొని, వాహ్యవాహక లక్షణంబుల జేతలను నిర్జితులు వహించి క్రీడించుచు, బలరామునికి వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసుల వెల్బుచు భాండీరకంబను వటంబు సేరి; రా సమయంబునఁ గ్రీడయందు శ్రీదామనామధేయుండైన గోపకుండు శ్రీకృష్ణుని వహించె; భద్రసేనుండు వృషభు నెక్కించు కొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె; నప్పుడు.

730

తా ॥ ఈ విధంగా పలికిన కృష్ణుడు, తానూ, బలరాముడు చెరొక పక్షానికి నాయకునిగా నిలబడ్డారు. తక్కిన వారందరూ రెండు పక్షాలయ్యారు. గడ్డితోను, కొయ్యలతోను, రాళ్ళతోను తాము నిలబడవలసిన హద్దులను తమ చెండ్లు (పూబంతులు) తాకవలసిన గుర్తులను ఏర్పాటు చేసుకొన్నారు. చెండ్లు తాకునట్లు వేసిన జయమని, చెండ్లు గుర్తులను తాకకుంటే అపజయమని

నిర్ణయించుకున్నారు. ఆటలో గెలిచినవారు ఓడిపోయిన వారిమీద ఎక్కితే, వారు మోయాలి. ఇలా ఆడుచూ, ప్రొద్దు పుచ్చుతున్నారు. ఆట మధ్యలో కృష్ణుడు రహస్యంగా తన అన్న అయిన బలరామునికి ప్రలంబాసురుని గురించి తెలియజేసాడు. భాండీరకమను మఱ్ఱిక్రింద చేరి ఆ ఆటలోని జయాపజయములను బట్టి, శ్రీదాముడను వానిపై కృష్ణుడునూ, భద్రసేనుడను వానిపై వృషభుడును, ప్రలంబాసురునిపై బలరాముడును ఎక్కారు.

మ. 'వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు దృణావర్తుండు మున్ మింటికిం
గొనిపోఁజాలక చిక్కినాఁ డితని నాకున్ మోవరా' దంచు నా
దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొనిపోయెన్ గిరి దాఁటి రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్.

731

తా ॥ ఇంతకు మునుపు తృణావర్తుడు బలం గలవాడైనా శ్రీకృష్ణుణ్ణి ఆకాశమునకు ఎత్తుకుని పోలేక క్రిందపడి చనిపోయాడు. అందువలన అతనిని మోయుట అశక్యం అని తలచిన రాక్షసుడు ప్రలంబాసురుడు బలరామున్ని తన వీపు మీదకు ఎక్కించుకున్నాడు. అయితే ఆ బలరాముడు కూడా రాక్షససంహారకుడు అని తెలియని ప్రలంబాసురుడు ఆగవలసిన గుర్తు వద్ద బలరాముని దింపకుండా వడివడిగా ఆ ప్రదేశాన్ని దాటి ముందుకు సాగాడు.

వ. ఇట్లు క్రీడాకల్పిత వాహనుండైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు.

732

మ. గురుశైలేంద్ర సమానభారుఁడగు నా గోపాలకున్ మోవ లే
క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు సాలించి భీ
కర దైత్యాకృతి నేగె హేమకటకాకల్పంబుతో రాముతో
మురు వొప్పంగఁ దటిల్లతేందుయుత జీమూతంబు చందంబునన్.

733

తా ॥ ఈ విధంగా కేవలం ఆటలో కలగచేయబడిన వాహనమైన ప్రలంబాసురుడు బలరాముని ఎత్తుకొనిపోతూ, కొండవలె బరువుగా ఉన్న బలరాముని మొయ్యలేకపోయాడు. దానితో మనుష్యాకృతిని విడిచి, తన ఎప్పటి భయంకరమైన రాక్షసాకారాన్ని వహించాడు. బంగారు కడియములు ధరించి, తెల్లగా, అందంగా ఉన్న బలరామున్ని ఎత్తుకుని రాక్షసుడు వెళుతూ ఉంటే, చందమామను ఆన్చుకుని ఉన్న కారుమబ్బులా కనిపిస్తున్నాడు.

ఉ. మోసము లేక వాని పెనుమూఁపున నుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె హాటకరత్న కిరీటకుండలో
ద్భాసిత మస్తకున్ భ్రుకుటి భాసుర దారుణనేత్రు నుగ్ర దం
ష్ట్రాసహితుం బ్రలంబు నురుశౌర్యవిలంబు మదావలంబునిన్.

734

తా ॥ బలరాముడు ఆ ప్రలంబాసురుని మూపున కూర్చుని ఏ అపాయాన్ని పొందలేదు. ఆ రాక్షసుని వంక పరిశీలనగా చూసాడు. రత్నాలు పొదగబడిన బంగారు కిరీటాన్ని, కుండలాలను ధరించిన వాడును, బొమముడి తోడి, మిడిగ్రుడ్లచేత భయంకరమైన కన్నులు కలవాడును, మిక్కిలి భయాన్ని కలిగించే కోరలు కలవాడును, మహా శూరుడును, మదంతో నిండిన వాడును అయిన ప్రలంబాసురుని నిజాకృతిని చూసాడు బలరాముడు.

వ. కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక.

735

తా ॥ వాడు రక్కసుడని కొంచెం సంశయించినా ఏ మాత్రం భయపడలేదు.

క. కడువడిఁ దను దివికిం గొని, వడిఁ జనియెడు దనుజుశిరము వ్రయ్య హలధరుం
డదరి పటుచటులతర మగు, పిడికిట వెస విసిరి పొడిచె బిఋసున నలుకన్.

736

తా ॥ తనను వడిగా ఎత్తుకొని పోతూన్న ప్రలంబాసురుని మీద కోపించిన వాడై, అట్టె ఎగిరి వానిమీద పడి కఠినమైన తన పిడికిలితో వాని తల బ్రద్దలయ్యేటట్లు కోపంతో చాచి పొడిచాడు.

క. హలధరు బలుపిడికిటి హతిఁ, దల పగిలిన రుధిరజలము దనువివరములం
దొలఁక మొఱయిడుచు దనుజుఁడు, బలరిపుపవి నిహత నగము పగిదిం బడియెన్.

737

తా ॥ అంతట ఆ ప్రలంబాసురుడు బలరాముని యొక్క బలవంతమైన పిడికిటి పోటుకు తలపగిలి పోయింది. దేహంలోని నవరంధ్రములనుండి నెత్తురు కారగా మొర్రో అని అరుస్తూ ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బచేత నేలకూలిన పర్వతంలా కూలిపోయాడు.

మత్తకోకిలము.
'మేలు మేలు గదయ్య! రాముఁడు మేటిరక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్కపోటున నేఁడు విస్మయ' మంచు గో
పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునం
జాల దీవన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్.

738

తా ॥ అప్పుడు గొల్లలందరూ, మన బలరాముడు ఒక్కడే నేడు బలవంతుడైన ప్రలంబాసురుని ఒక్క పిడికిటి పోటుతో నేలకూల్చి చంపాడు. బలే బాగుంది! అని మెచ్చుకొంటూ, చనిపోయిన వాడు బ్రతికి రాగా చూసినట్టు చూసి, సంతోషంతో ఆ బలరాముని గౌరవించారు.

క. బలవంతుఁడగు ప్రలంబుఁడు, బలుముష్టిన్ నిహతుఁడైన బ్రదికితి మనుచున్
బలసూదనాది దివిజులు, బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్.

తా ॥ “బలవంతుడైన ప్రలంబాసురుడు బలరాముని పిడికిటిపోటు చేత చావగా మనం సురక్షితులమయ్యాం. లేని పక్షంలో వీని చేత ఇంక ఎన్నాళ్ళు మనకు బాధపడవలసి ఉండేదో!” అని ఇంద్రాది దేవతలు బలరాముని మీద పువ్వుల వాన కురిపించారు.

## 27. శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగి గో గోపకసంఘమును కాపాడుట

వ. ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింత కసవులు మెసవుచు, మేఁ తవడి నొం డడవికి దూరంబు సని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పినొప్పు సెడి ఘోషించిన.

740

తా ॥ ఇలా గోప బాలకులు క్రీడిస్తూ ఉండగా, ఆవులు అడవిలో పచ్చికలు మేస్తూ బహుదూరంగా ఉన్న ఇంకొక అడవిలోకి దూరాయి. అక్కడ చెలరేగిన కార్చిచ్చు వేడికి, మిక్కిలి దప్పికతో గాలి వేడిమిని సహింపలేక తత్తర పడుతూ 'అంబా' అంటూ అరవసాగాయి. తృణముల ఆశతో భగవంతునికి దూరంగా వెళ్ళిన జీవుల పరిస్థితి ఇదే కదా! (విషయాసక్తితో భగవంతునికి దూరంగా ఉన్న వారందరిది ఇదే పరిస్థితి కదా!)

శా. ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే
ళీగాఢత్వము మాని గోఖురరదాళిచ్ఛిన్న ఘాసంబుతో
బాగై యున్న పథంబునం జని దవాపన్నంబు గాకుండ వే
వేగన్ గోగణమున్ మరల్చి రటవీవీథిన్ జవం బొప్పఁగన్.

741

తా ॥ ఆ గోపాలకులందరు గోవుల మొరవిని తాము ఆడుకొంటూన్న ఆటలమీద ఆసక్తిని చాలించారు. ఆవులు మేస్తూ వెళ్ళిన కారణంగా వాని కాళ్ళ త్రొక్కిళ్ళ చేతను, మేయుట చేత నలిగిన పచ్చిక ఉన్న మార్గాన్ని చూసారు. దాని వెనకే వెళ్ళి ఆ ఆవుల గుంపు ఉన్న చోటును కనిపెట్టి వానికి కార్చిచ్చు వలన బాధ కలుగకుండా మళ్ళీ తోలుకొని వచ్చారు.

క. జలధర గభీర రవమున, నలినదళాక్షుండు దమ్ము నామాంకములం

బిలిచిన విని ప్రతిఘోషణ, ములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా!

742

తా ॥ ఓ రాజా! శ్రీకృష్ణుడు మేఘము ఉరుమునట్టి ధ్వనిలాంటి కంఠధ్వనితో తమపేర్లు పెట్టి పిలువగా విని ఆ గోవులన్నియు మారు గొంతుకలిచ్చుచూ సంతోషంతో మరలాయి.

వ. అంత న వ్వనంబున దైవయోగంబునం బుట్టిన కార్చిచ్చు బిట్టు విసరెడి కరువలి వలన మిన్నుముట్ట మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ జుట్టుకొని, పఱవం గని పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్ల డిల్లి సబలుండైన హరికి మృత్యుభీతుల రీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి.

743

తా ॥ అంత దైవికంగా ఆ అడవిలో పుట్టిన కార్చిచ్చు మిక్కిలి వడిగా వీచే గాలిచేత ఆకాశాన్ని తాకునట్టుగా లేచి మిక్కిలి వేగంతో మండుతోంది. ఇది కొండ, ఇది చెట్టు, అనే నియమం లేక అంతటినీ దహిస్తూ నలుదిశలా కమ్ముకోసాగింది. దానిని చూసి గొల్లలందరు భయపడ్డారు. మిక్కిలి ప్రభావము కలవాడైన శ్రీకృష్ణుని వద్దకు వచ్చి, మరణానికి భయపడ్డ వారిలా మ్రొక్కుతూ ఇట్లా అన్నారు:

క. అభ్రంకష ధూమాయిత, విభ్రాంత మహాస్ఫులింగ విసరోగ్ర శిఖా
విభ్రష్ట దగ్ధలోకా, దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా!

744

తా ॥ “ఓ గోపాలకృష్ణా! ఆకాశాన్ని ఒరయుచున్న పొగతోను, మిక్కిలి చెదిరి పడుతున్న పెద్ద నిప్పురవ్వలతోను, భయంకరమైన మంటలతోను ఈ కార్చిచ్చు ఎంత భీతిని కలిగిస్తోందో చూడు! ఈ మంటలు లోకాలను దహింపచేసేలా ఉన్నాయి.

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే! నే మెల్ల నీవార; మ
న్యాచారంబు లెఱుంగ, మీశుఁడవు మా; కాభీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము? మమ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖీవితానచ్ఛన్నులన్ ఖిన్నులన్.

745

తా ॥ ఓ కృష్ణా! నీ వారికి ఎప్పుడూ ఆపదలు రానేరావు. మేమంతా నిన్ను సేవించుట తప్ప ఇతరములైన నడవడికలు ఏమీ తెలియనివారము. మమ్ము ఏలిన వాడవు నీవే అని నమ్మి ఉన్నాము. కాబట్టి చంద్రుని వలె చల్లని దొరవైన కృష్ణా! భయంకరమైన ఈ దావాగ్నిని నువ్వు దాటింపకపోతే మేము ఏ విధంగా దాటగలం. నిప్పుల సమూహముల చేత కప్పబడినందున అలమటిస్తున్న మమ్ములను రక్షింపవయ్యా!" (శరణాగతి విధానం ఇక్కడ తెలియజేస్తున్నారు)

వ. అని విన్నవించి రంత.

746

ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో
బంధువులార! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల చేయుడున్
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్.

747

తా ॥ ఈ విధంగా ప్రార్థించారు గోపకులు. ఆ విధంగా వేడుకోగా సర్వము తన రూపమైన ఆ విశ్వరూపుడు శ్రీకృష్ణుడు, "ఓ బంధువులారా! మీరు అందరూ కళ్ళు మూసుకొనండి. వెంటనే నేను ఈ కార్చిచ్చును అణచి వేస్తాను" అని చెప్పాడు. వారు అలా చేయగా ఆ దావాగ్నిని నోటితో మింగివేసాడు.

బాహ్యంగా కనిపించే జగత్తంతా దుఃఖాగ్నితో ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది; అందుకే ఆ అచ్యుతుడు బాహ్యదృష్టిని వీడి అంతర్ముఖులవమని ఆ గోపకులకు తెలిపాడు. దృష్టి అంతర్ముఖమైతే అంతా బ్రహ్మానందమే కదా!

వ. ఇట్లు నిజయోగ వైభవంబున దావదహనంబు పానంబు సేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరక వటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసిత నయన కమలు లయి కృష్ణుని యోగమాయా ప్రభావంబున నెరగలి చిచ్చు ద్రగ్గె నని యగ్గించుచుఁ దమ మనంబులందు.

748

తా ॥ ఈ విధంగా తన యోగబలం చేత కార్చిచ్చును పానం చేసి నిమిష మాత్రంలో గోపకులను అందరినీ భాండీరకమనే మర్రిచెట్టు వద్దకు తెచ్చి విడిచిపెట్టాడు. ఆ గొల్లలందరు సంతోషంతో 'మన కృష్ణుని యోగ మహిమ చేత కార్చిచ్చు చల్లారి పోయింది' అని భావించి తమ మనస్సుల్లో ఇలా అనుకున్నారు:

క. 'కార్చి చ్చార్చు పటుత్వము, నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి మనల రక్షింపఁగ, నేర్చె! నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో!'

749

తా ॥ 'ఇంతకు ముందు ఎక్కడైనా, ఏ మానవుడైనా కార్చిచ్చును ఆర్పునట్టి సామర్థ్యాన్ని కలిగి ఉన్నాడా? – లేదు. కనుక ఇప్పుడు కార్చిచ్చును చల్లార్చి మనలను కాపాడిన ఈ కృష్ణుడిని కేవలం మానవమాత్రునిగా భావించరాదు. ఇతడు బ్రహ్మయో, విష్ణువో, శివుడో అయివుండాలి.'

వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబు పూరించుచు గోపగణ జేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు.

750

తా ॥ అంతలో సాయం సమయం అయ్యేసరికి, శ్రీకృష్ణుడు బలరామునితో కలిసి పిల్లనగ్రోవిని ఊదుతూ గొల్లలందరూ జయ జయ శబ్దములతో కొనియాడుతుంటే గోశాలలో ప్రవేశించాడు.

క. కమలాక్షునొద్ద నుండని, నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోప
ప్రమదలు సంభ్రమమున నా, కమలాక్షునిఁ జూచి ముదముఁ గనిరి మహీశా!

751

తా ॥ ఓ రాజా! ఆ వ్రేపల్లెలోని గోపస్త్రీలందరికీ కృష్ణుని ఎడబాసి ఉన్న కాలము ఒక్క క్షణమైనా నూరు యుగములుగా తోస్తుంది. కనుక ఆ కమలాక్షుని చూసి సంతోషించారు.

వ. ఆ సమయంబున గోపకు లిండ్లకడ నున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు సెప్పిన, విని వారు వారిని గార్వ్యార్థులై వచ్చిన వియచ్చరవరు లని తలంచి రంత.

752

తా ॥ అప్పుడు కృష్ణుని వెంట పశువులను మేపేందుకు వెళ్ళి వచ్చిన గొల్లలు ఇండ్లవద్దనున్న ముసలి వాళ్ళతో, స్త్రీలతో అడవిలో జరిగిన బలరామకృష్ణుల విషయాలన్నీ చెప్పారు. దానిని విన్న వారంతా బలరామకృష్ణులు దుష్ట సంహారానికై భూలోకానికి వచ్చిన దేవతలుగాని సామాన్య మానవులు కారని తలచారు.

## 28. వర్షఋతు వర్ణనము

సీ. పూర్వవాయువులు ప్రభూతంబులై వీచెఁ బడమట నింద్రచాపంబు దోఁచెఁ

బరివేషయుక్తమై భానుమండల మొప్పె మెఱపు లుత్తరదిశ మెఱవఁ దొడఁగె

దక్షిణ గాములై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించెఁ

జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ గాంతార వహ్నుల గర్వ మడఁగె

ఆ. నిజకరాళివలన నీరజబంధుండు, దొల్లి పుచ్చుకొన్న తోయ మెల్ల

మరల నిచ్చుచుండె మహి కర్షకానంద, కందమైన వాన కందువందు.

753

తా ॥ అంతలో కర్షకులకు సంతోషానికి మూలమైన వర్షాకాలం వచ్చింది. ఆ కాలంలో తూర్పుగాలి మిక్కుటంగా వీచసాగింది. పడమటి దిక్కున ఇంద్రధనుస్సు కనబడింది. సూర్యబింబం చుట్టూ పరివేషం (గాలి గుడి) వేయగా, ఉత్తర దిక్కున మెరపులు మెరిసాయి. మేఘములన్నీ దక్షిణ దిక్కునకు పోతున్నాయి. జలాల్లో సంచరించు చేపలు సంతోషించాయి. వానకోయిలల దప్పికలు తీరగా, అడవులలో కార్చిచ్చులు అన్నీ ఆరిపోయాయి. సూర్యుడు తన కిరణాలచేత ముందు ఆకర్షించుకొన్న నీటిని తిరిగి ఇస్తున్నాడో అన్నట్లుగా సంతత ధారగా వానలు కురియటం ప్రారంభించాయి.

క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో నిడిన నవ నఖాంకము లని యు

త్కర్షింప భూమిసతిపైఁ, గర్షక హలరేఖ లమరె గహనాంతమునన్.

754

తా ॥ వర్షాకాలం అనే విటపురుషుడు భూమి అనెడు స్త్రీ ఎడల ఆనందంతో చేసిన గోటి నొక్కు అన్నట్లుగా సేద్యగాండ్రు చేసిన నాగేటి చాళ్ళు ఒప్పాయి.

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించు భూమి పులకము లనఁగా
మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతి జాలువాఱె సస్యము లధిపా!

755

తా ॥ ఓ రాజా! ఆ వర్ష ఋతువు వలన కలిగిన వర్షధారలు భూదేవిని చేరరాగా, భూమి గగుర్పాటు చెందిందా అన్నట్లుగా సేద్యగాండ్రు విత్తుగా మొలిచిన పైరులు మొలకలెత్తసాగాయి.

వ. మఱియుఁ జటుల పవన చలితంబులై మిన్ను దన్ని, లెక్కకు మిక్కిలియై, ఱెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి, కాఱుకొని తెఱపిపడక, నిబిడంబులై, శిశిరకిరణ తరణి మండలంబుల చొప్పు దప్పించి, విప్పు కలిగి, చదలు గప్పుకొనిన లీలంగ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబులయి జలదసమయ విటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువునఁ బుడమిఁ బడు కరకలును, గరకానుగతంబులై యసితభోగిభోగంబుల బాగున నీలమణిమాలికా విశేషంబు విధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధర విగళిత విమల సలిలంబులం దోఁగుచు, మదజలాభిషిక్త మత్త మాతంగంబుల సొబగున నుండు కొండలును, గొండల తుదలనుండి గండ శైలంబులపైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరలఁ జొదుగులు మదుగులఁ గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును, రొంపులు గ్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబు లయి పఱచు వఱదలును, వఱదలవలన మెదలి కదలి పాఱెడి యేఱులును, నేఱుల వెంటగఱులు త్రిప్పుచు గములు గొని క్రొన్నీటి కెదురు నడుచు మీనంబులును, మీననయనల మెఱుంగు సొంపుపెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడి కరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చను క్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగున మగువలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱంగున మొరయు నుఱుములును, నుఱుముల కులికిపడక కికురు పొడుచుచుఁ బించెంబులు గొంచెంబులు

సేయక విప్పి దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూర ఘోషంబులు భీషణములై చెవులు సోఁక ననూనంబులైన మానంబుల నాసలు సెడి యొండొరులకుఁ గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మా పని నిరూపింపరాక మాలతీకుసుమ విసరవికసన విదితావసానంబు లగు దుర్దినంబులును, దినావసాన సమయంబున మినుకుమినుకుమని మెఱయుచుం దిరుగు ఖద్యోతంబులును, ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడింబడి వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూర జంబూఫల భక్షణంబుల దేహ సంరక్షణంబు లాచరించు వనచరులును, వనచరానందకారిణులయి వారరమణుల రుచి ననవరతభుజగ సమేతలగు కేతకులును, గేతకీ కదంబ యూధికా కుటజ కుసుమ పరిమళ మిళితంబు లగు విపినమార్గంబులును, మార్గ నిరోధంబు లగుచుం బెరిఁ గి రసికంబులై పసరు దొలంకుచు హరిన్మణికిరణ పుంజంబుల భంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు గొనిన కసవులును, గసవులు మెసవి మిసమిసం దనువులు మెఱవ వలుఁద పొదుఁగుల బరువునం గదలక నిలిచి నెమ రమర నిడు ధేనువులును గలిగి ధేనువ్రజంబు కైవడిఁ బయఃకణ మనోహరంబై, హరకరంబుభంగిఁ బరిపూర్ణ సారంగ భాసురంబై, సురగిరి చెలువున హరిశరాసన విభీషణంబై, విభీషణ హృదయంబు పోలికం బ్రకటిత హరిశబ్ధ వైభవంబై, భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవ జనకంబై జనక యాగంబు భాతి సీతాప్రకరణాలంకృతంబై, కృతయుగంబు సొంపున బహువర్షంబునై వర్షాగమంబు చెలువొందె నప్పుడు.

756

తా ॥ ఆ వర్షాకాలంలో ప్రచండంగా వీస్తున్న గాలికి చలించి, మబ్బులు నల్లటికొండల వలె, సందులేక దట్టంగా ఆకాశాన్నంతటినీ అలముకుని ఉన్నాయి. చంద్రసూర్యుల పొడ కూడా కానరాకుండా ఆవరించుకున్నాయి ఆ నీలమేఘాలు. ఆ నీల మేఘాలనుండి జాలువారే కర్పూరపు పలుకులో అన్నట్లుగా భూమిమీద పడుతున్నాయి వడగండ్లు. వడగండ్ల వెంట

నల్లత్రాచుల్లాగ, నీలాల దండలవలెను ఎడతెగక పడుతున్నాయి వర్షధారలు. మేఘాలనుండి జారుతున్న నిర్మలమైన నీళ్ళలో తడిసి మదజలం చేత అభిషేకింపబడిన మదపుటేనుగుల్లా ఉన్నాయి కొండలు. పర్వత శిఖరాలనుండి పెద్ద పెద్ద గుండురాళ్ళ పైబడి చెదరుతున్నాయి సెలయేళ్ళ నీటి తుంపరులు. తుంపరుల సమూహం వల్ల ఏర్పడిన నీటిబొట్లు నిలిచి చితచితలాడుతోంది బురద.

బురదల మీద వేగంగా ఉప్పొంగి పారునట్టి ప్రవాహం వలన కొంచెం కదలి పారుతున్నాయి సెలయేరులు. సెలయేరుల వెంట రెక్కలు త్రిప్పుచూ గుంపులు గుంపులుగా కొత్త నీటికి ఎదరీదుతున్నాయి చేపలు. చేపల వంటి కన్నులుగల స్త్రీల దేహకాంతిని సహింపక దాక్కుని పోతూన్న విధంగా మేఘాల నడుమ తళుక్కని తోచి ఇంచుకసేపైన నిలువక మరుగున పడిపోతున్నాయి కొత్తమెరపులు. ఆ మెరపుల వలె స్త్రీలు పురుషులయందు స్థిరంగా నిలవరని ప్రజలకు తెలియునట్లు బ్రహ్మ చాటుతున్నాడో అన్నట్లుగా ఉరుముతున్నాయి ఉరుములు. ఉరుములకు భయపడక మెడలు త్రిప్పుతూ పింఛాలు విచ్చుకొని కీకారవములు చేస్తూ నాట్యాలు చేస్తున్నాయి నెమళ్ళు. నెమళ్ళ కేకలు భయంకరంగా చెవులకు వినబడేసరికి మిక్కుటమైన గంభీరత్వం చేత తమపట్టు కొనసాగుతుందనే ఆశ లేక ఒకరికొకరు తక్కువ అవుతున్నారు విరహజనులు. ఆ మబ్బుల వలన జనులకు ఇది పగలు, ఇది రాత్రి అనే భేదం తెలియకున్నా, జాజులు విరియటం వలన సాయంకాలం అయిందని తెలుసుకొంటున్నారు.

సాయంకాలాల్లో మినుకు మినుకుమని కనబడుతూ మెలగుతున్నాయి మిణుగురులు. సూర్యుడు కనుపించకుండా కురిసే జడివానలో చిక్కుకొని వణుకుతూ అన్నం వండుకొనే ప్రయత్నం మానేసి ఈతపండ్లు, నేరేడుపండ్లు తిని ఆకలి తీర్చుకొంటున్నారు అడవి మనుష్యులు. అడవులలో సంచరించు వారికి ఆనందాన్నిచ్చే వారకాంతలవలె, ఎప్పుడూ మిడినాగులనెడి విటులతో కూడి ఉన్నాయి మొగలి డొంకలు. మొగలి పువ్వులు, కడిమి పువ్వులు, మొల్లపువ్వులు, కొడిసె పువ్వులు.... వీటి వాసనలతో ఆ అడవిలోని త్రోవలు గుబాళిస్తున్నాయి.

త్రోవలకు అడ్డంగా పెరిగి పచ్చల కాంతులు వ్యాపించినట్లు పసరు వన్నె కలిగి గుబురులుగా ఉన్నాయి పచ్చికలు. పచ్చికలు మేసి బలిసి మిసమిసలాడు తనువులతో పాలతో బరువైన పొదుగులతో కదలలేక నిలబడి నెమరు వేసుకొంటున్నాయి పాడి ఆవులు.

ఆ వానాకాలం పాలచేత సంపన్నమైన ఆవుల మందలాగా జలంతో సమృద్ధిని పొందింది. జింక చేత ప్రకాశించే శివుని చేయివలె వానకోయిలలతో ప్రకాశించింది. విష్ణురూప బాణం అధిష్ఠించడంచేత భీకరమైన మేరుశైలం వలె ఇంద్రచాపం చేత చెలువారింది. హరినామ సంకీర్తన వైభవంతో కూడిన విభీషణుని హృదయంవలె భేకముల బెకబెక ధ్వనులతో ఎసలారింది. ఇంద్రుడు, గోవిందుడు మొదలగు వారికి ఐశ్వర్యాన్నిచ్చే శివపూజవలె ఆరుద్ర పురుగులతో అలరారింది. సీతామహాదేవి వృత్తాంతంతో జనక చక్రవర్తి యాగంలాగా నాగలి చాళ్ళతో సొబగొందింది. బహు సంవత్సరాలు కలిగిన కృతయుగం వలె మెండైన వానలతో అలరారింది.

క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తన నల్ల గెఱలుకొని నవకములై
చూడఁగ భద్రము లగుచును, వీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్.

757

తా ॥ పైరులన్నీ వాడిపోక అణగిపోక, చీడలులేక, నవనవలాడుతూ కోమలములై చూడటానికి అందంగా ఉన్నాయి. దానివలన జనులకందరకు ధాన్యసంపాదన పెరిగి ఇబ్బందులు లేకుండ పోయాయి.

క. జీవనము సాలఁ గలిగియుఁ, గావరమున మిట్టిపడని ఘనునిక్రియ నదీ
జీవనములు సొర జలనిధి, ప్రావృట్కాలమున డిందుపడియుండె నృపా!

758

తా ॥ ఎంత సంపన్నుడైనా, గొప్పవాడు మూర్ఖత్వం, పొగరుతో మిడిసి పడడు. అదే

విధంగా నదుల నుండి ఎంత నీరు వచ్చి చేరుతున్నా, ఆ వర్షాకాలంలో సముద్రుడు పొంగక అణగి మణగే ఉన్నాడు.

శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ బ్రావీణ్యంబునఁ
గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్.

759

తా ॥ ఆ వానాకాలంలో శ్రీకృష్ణుడు బలరామునితో కూడి, అడవులలో ఆవులను మేపుతూ, తనవెంట వచ్చిన గోపాలురతో కందమూలాలు, ఫలాలు మొదలైన వాటిని ఆరగిస్తూ, విశాలములైన బండలమీద కూర్చుని సంతోషంతో చల్ది అన్నాన్ని భుజించాడు.

వ. ఆ సమయంబున.

760

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి లలిత సౌదామనీ లతిక గాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు ఫించపుదండ శైలభేదన శరాసనము గాఁగఁ
గరుణాకటాక్ష వీక్షణ సుధా వర్షంబు సలిలధారా ప్రవర్షంబు గాఁగ
తే. జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర, చాతకంబుల దురవస్థ సక్కఁ జేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె, విమల బృందావనాకాశవీథియందు.

761

తా ॥ ఇక్కడ కృష్ణుణ్ణి మేఘంతో పోలుస్తూ వర్ణించడం కనిపిస్తుంది. నిర్మలం అనే బృందావనపు ఆకాశవీథిలో, శ్రీకృష్ణుడనే చక్కని మేఘం విశేషంగా సంచరిస్తోంది. ఆ

నీలిమేఘం లోకాలను అన్నింటినీ సమ్మోహనపరిచే విధంగా వేణునాదంతో ఉరుముతోంది. ఆ కృష్ణమేఘం యొక్క మనోహరమైన చిరునవ్వు చక్కటి కాంతితో మెరుస్తూ ఉన్నది. ఆ నల్లనివాడు తలలో ధరించిన నెమలి పింఛం ఇంద్రధనుస్సు వలె ఒప్పారుతోంది. ఆ మేఘం (కృష్ణుడు) కరుణా కటాక్షపు వీక్షణమే అమృతవర్షంగా మారి కురుస్తోంది. ఈ విధంగా విహరిస్తూ ఉన్న ఆ కృష్ణమేఘం గోపాలకులు, ఋషులు అనబడే చాతక పక్షుల తాపాన్ని రూపుమాపుతోంది.

క. గోవుల వృషవత్సంబుల, వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను, శ్రీవల్లభుఁడయ్యు గోపశేఖరుఁ డధిపా!

762

తా ॥ రాజా! లక్ష్మీనాథుడైన శ్రీకృష్ణుడు గోవులను, కోడె దూడలను పూజించాడు. ఆపై వర్షాకాల లక్ష్మిని ఆరాధించాడు.

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు వుచ్చె నంత.

763

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు తన విహారాలతో వర్షాకాలాన్ని గడిపాడు. అంతలోనే శరదృతువు వచ్చింది.

# 29. శరదృతు వర్ణనము

క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరె; నెమిలిగములరొద లుడిగె; నదుల్
పెంపులకుఁ బాసె; నుఱుముల, శంపల సంపదలు మానె శారదవేళన్.

764

తా ॥ ఆ శరత్తులో అడవులన్నీ ఆకులు, పువ్వులు కాయలు మొదలగు వానిచేత గుబురులుగా ఉన్నాయి. అడుసులు ఇంకిపోయాయి. నెమళ్ళ కేకాధ్వనులు తగ్గిపోయాయి. నదులలోని ప్రవాహాల ఉరవడి తగ్గాయి. ఉరుములు మెరుపులు నిలిచి పోయాయి.

వ. మఱియు జీవనంబులు విడిచి, విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నున నన్ను వదలి, మిన్ను విడిచి, వాయువశంబులై, వెల్లివిరిసి చను మేఘంబులును; మేఘపటల రహితంబును గలశభవముని సహితంబునునై, విజ్ఞానదీపవిలసితం బగు యోగిహృదయంబు చందంబున శుభ్రం బయిన యభ్రంబును; నభ్రంబున నీలదుకూల వితానసంయుక్త ముక్తాఫలంబుల వడువున నెగడు నుడుగణంబులును, నుడుగణ మయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండ కరండ కర్పూర ఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, జంద్రకిరణ సంస్పర్శనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలిక కర నిశిత లవిత్ర ధారాసంరంభంబుఁ దలంచి తల్లడిల్లి వెలువెలుకం బాఱుచుఁ దల్లియగు విశ్వంభరకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబు లయిన యెన్నుల వ్రేఁగున వ్రాలి గాలిం దూలుచు మర్మర ధ్వనుల సారస్యంబులగు కలమాది సస్యంబులును; సస్యమంజరీ పుంజంబులఁ గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్ల పెంటి తండంబులం గూడి కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కలు గొని మహోత్తుంగ సమంచిత మంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నుల కెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కరాస్ఫాలనంబుల నులికిపడి యెగసి

చను శుకనికరంబుల కలకలంబులును, గలహంస కోక సారస కోలాహల మండితంబులై నిండిన నిర్మల జలంబులు గల జలాశయంబులును, జలాశయంబుల జలంబు లనుదినంబు నిగుర గృహంబుల బ్రదుకు దినంబులు సనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరంబులును, జలచరహృదయంబుల బెదరు గదుర డొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూర మండపంబుల తెఱంగున, మణికుట్టిమంబుల మాడ్కిని, సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబులగు నూతన సైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాన నిరతులగు మునులును, మునికన్యకా కరకలశ సలిలాభిషిక్త మూలంబు లగు తపోవన బాలరసాల సాలంబులును, సాలవిటపి వాసంతికా కుంజపుంజంబుల తఱచున నిముడుకొని దినకరకిరణంబులకుం గరువలికిం జొర వెరవుపడని వనమ్ములును, వనమ్ములం దరులకొనల నాకలములు నేకలములై మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ముకొనల సూటి నేటిదరులు త్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభ కనకకుంభ రుచిర కుచభార భీరుమధ్య సమంచిత లగు చెంచితలును, జెంచితల క్రూరమ్ములగు వాలమ్ముల సారమ్ములు సెడి ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగాతమ్ములం బడు వరాహ పుండరీకంబులును, బుండరీక కుముద కురంటకాది కుసుమ మకరందంబులు గ్రోలి తేలి సోలి వాలి మహాహంకృతుల ఝుంకృతులు సేయు తేఁటికదుపులును, గదుపులం గలయక యెడగలిగి మదమున నదనుపద నెఱింగి మదనమార్గణ ప్రేరితంబులై పెంటితుటుముల వెంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగవృషభ రాజంబులును గలిగి, రాజరాజ గృహంబు పగిది విలసిత కుందపద్మ సౌభాగ్యంబై, భాగ్యహీను కర్ణరేఖగతి నశ్రుత నీలకంఠ శబ్దంబై, శబ్దశాస్త్రవేది హృదయంబు బాగున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబుకైవడి బాణాసనాలంకృతంబై, కృతాంతహృదయంబు కరణి నపంకంబై, పంకజాసను గేహంబు సొంపున రాజహంస విరాజమానంబై, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనంబై, వననిధిపోలుపున సమ్మిళిత భూభృద్వాహినీ సంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరం బై ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు

వచ్చె నంత.

765

తా ॥ నిర్మలమైన తెలివితో, మోక్షాన్ని పొందే పురుష శ్రేష్ఠులలాగా, ఆకాశమునుండి గాలిచేత నలుప్రక్కలకు ఎగరగొట్ట బడినవై విచ్చలవిడిగా చెదిరిపోతున్నాయి మేఘాలు. మేఘాలచేత విడువబడి, అగస్త్య నక్షత్రంతో కూడుకొని ఉన్న ఆకాశం విజ్ఞానమనెడు దీపంచేత ప్రకాశించే యోగీశ్వరుని మనస్సులాగా నిర్మలంగా ఉంది. ఆకాశంలో నక్షత్రాలు మురికి లేకుండా ఉతికిన నీలిచీర చేత కట్టబడిన మేలిముత్యపు పూసలవలె కనుపిస్తున్నాయి. నక్షత్రాల కాంతి విజృంభణను తగ్గించే విధంగా చంద్రకిరణాలు ఈ బ్రహ్మాండమనే పేటికలో కర్పూరపు పలుకులవలె, ప్రకాశిస్తున్నాయి.

ఆ చంద్రకిరణాల స్పర్శకు వరి మొదలైన ధాన్యాలు బాగా పండి నేలకు తగిలేలా బరువైన కంకులను కలిగి ఉన్నాయి. అయితే రైతుల చేతి కొడవళ్ళ పదనుని తలుచుకుని వెన్ను భారంతో ఉన్న ఆ ధాన్యపు కంకులు వెలవెల పోతున్నాయి. అవి గాలికి ఊగుతూ సన్నని ధ్వనులను వెలువరిస్తూ ఉంటే తమ తల్లి అయిన భూమిని రక్షించమని అడుగుతున్నట్లుగా ఉంది.

చిలుకల సమూహాలు ఆ వెన్నులను సంకోచం లేకుండా త్రుంచుకుని పోతూ, తమ పిల్లలతో కడుపారా భుజిస్తూ పయనించసాగాయి. అలా వెడుతూ, ఎత్తైన మంచెల మీద పైరు కావలికి ఉన్న పడతుల పెదవులు దొండపళ్ళని భ్రమసి కరవబోగా, వారి చేతి చప్పట్లకి ఉలిక్కిపడి కలకల ధ్వనులతో ఎగిరిపోసాగాయి. జలాశయాలలోని తేట నీరులో తేలియాడుతూ కలహంసలు, చక్రవాకాలు, బెగ్గురు పక్షులు సందడి చేస్తున్నాయి.

తమ జీవితకాలపరిధి తెలియక కులాసాగా కాలక్షేపం చేసే మనుష్యుల లాగా, జలాశయాలలోని నీరు రోజురోజుకీ తగ్గిపోతున్నా మైమరిచి తిరుగుతున్నాయి చేపలు. క్రమంగా నీరు ఇంకిపోతూ ఉండగా వాటిలో భీతి జనించడం ఆరంభించింది. ఆ నదులలో మేట వేసిన

ఇసుక తిన్నెలు కర్పూరమండపాలలాగా, మణులు తాపితం చేయబడిన కట్టడాలలాగా, మేడమెట్ల దారుల లాగా కనిపిస్తున్నాయి. ఆ ఇసుక తిన్నెలలో సంధ్యావందనాది నిత్యకర్మాచరణలను జరుపుకుంటున్నారు మునులు. మునికన్యకల చేతి బిందెలతోని నీటిచేత తపోవనాలలోని లేత మొక్కలు తడుపబడి ఎదుగనారంభించాయి.

ఆ వనాలలోని మద్దిచెట్లకు తీగలు అల్లిబిల్లిగా అల్లుకోవడం చేత, దట్టంగా తయారయి సూర్యకిరణాలకు, పవనాలకు చొరబడే వీలు లేకుండా చేస్తున్నాయి. అడవిచెట్ల ఆకులు, అలములు యథేచ్ఛగా తిని మదించిన ఏనుగులు తమ దంతాలతో ఏటిగట్టున మట్టిని ఎగజిమ్ముతున్నాయి. ఏనుగు కుంభాలను పోలి చెంచితల అవయవసంపద అలరారుతోంది. ఆ చెంచువారి వాడిబాణాలు తాకిడికి కాళ్ళు తడబడగా అడవి పందులు, పులులు పెద్దపెద్ద పల్ల ప్రాంతాలలో పడిపోతున్నాయి. కమలాలు, కలువలు, గోరంటలు మొదలైన పూతేనెను త్రాగిన తుమ్మెదలు ఝుంఝుమ్మని రొద చేస్తున్నాయి. మృగాలు మదం చేత ఒకదాని నొకటి తోసుకోసాగాయి.

అలా ఆ శరత్కాలం నిధులతో నిండి ఉన్న కుబేరుని మందిరం లాగా తామరలతో, మొల్లలతో శోభిల్లుతోంది. అయితే 'శివనామం' వినలేని అదృష్టహీనుని కర్మవలె నెమళ్ళ కోలాహలం వినిపించడం లేదు. వ్యాకరణం బాగా తెలిసిన వాని మనస్సు వలె ఆ శరత్కాలం తెల్లని ప్రకాశం చేత మనోజ్ఞంగా ఉంది.

ధనస్సుతో ఉన్న రాముని యుద్ధపటిమ వలె నల్లగోరంట వేగిస చెట్లతో విరాజిల్లుతోంది. పాపరహితుడైన యముని మనస్సువలె, ఏమాత్రం బురదలేకుండా, స్వచ్ఛంగా ఉంది. రాజహంసలతో రాజిల్లే చతుర్ముఖుని సౌధం లాగా రాయంచలతో రాణిస్తోంది. మోసం ఎరుగని మానవుని నడవడిక లాగా తేటగా, నిర్మల జలంలా అనిపిస్తోంది. ఆ శరదృతువు ఈ విధంగా వివిధములైన మనోజ్ఞమైన లక్షణాలతో భూమికి ఆభరణంవలె ప్రకాశించసాగింది.

క. వాజుల నీరాజనములు, రాజుల జయగమనములును రాజిత లక్ష్మీ
పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా!

766

తా ॥ ఓ రాజా! శరత్కాలం రాగానే రాజులందరూ దిగ్విజయ యాత్ర చేయువారై తమ తమ అశ్వాలకు హారతులిచ్చి బయలుదేరసాగారు. లక్ష్మీదేవి పూజలు దేవతా మహోత్సవాలు జరగటం ప్రారంభించాయి.

క. చేగ గల చెఱకువింటను, బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబు సేసి మదనుఁడు, వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్.

767

తా ॥ మన్మథుడు తన చేవగల చెరకు ధనుస్సునందు నల్లకలువ అనే బాణాన్ని సంధించి పూనికతో వేగంగా విరహి జనులను వేటాడసాగాడు.

వ. ఇట్లు భాసురంబు లయిన శరద్వాసరంబుల గోవిందుండు గోబృంద సమేతుండై బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు.

768

తా ॥ ఈ విధంగా ప్రకాశిస్తూన్న శరత్కాలంలో శ్రీకృష్ణుడు గొల్లవారితో కూడి బృందావనంలో పశువులను మేపసాగాడు.

సీ. కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప
నపసవ్యకరమృదులాంగుళి చాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ

తే. మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ, విలసిత గ్రామముగ నొక్కవేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁ జేసెఁ, జతురనటమూర్తి గోపాలచక్రవర్తి.

769

తా ॥ నటనలో చాతుర్యాన్ని చూపే ఆ గోపాల చక్రవర్తి చేత పిల్లనగ్రోవిని ధరించి స్వర భేదాలను పలికిస్తూ బ్రహ్మానంద పరవశత్వం కలిగే విధంగా ఆలపించసాగాడు. ఆ సమయాన అతని చెవి పక్కగా పెట్టుకున్న కొండ గోగుపూల కాంతి చెక్కిళ్ళ కాంతిని వృద్ధి చేసే విధంగా ఉన్నది. విశ్వాన్ని మోహింపచేసే విధంగా కనుబొమల సోయగం అలరారుతుంటే, ఎడమపక్కగా వంచబడి ఉన్న తల ఎంతో ముచ్చటను గొల్పుతోంది. కోమలంగా ఉన్న కుడిచేతి వేళ్ళు నైపుణ్యంతో షడ్జమస్వరంలోని రహస్యాలను తెలియజేస్తున్నాయి. ఎడమకాలి మీద అడ్డంగా చాపి ఉంచిన కుడికాలి గోళ్ళ ప్రకాశం అక్కడ భూమికి వింత వన్నెను కలుగజేస్తుంది. సిగలోన నెమలిపింఛం, మెడలోని వనమాల మెరుస్తున్నాయి.

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు చాలించి మక్కువలు సెక్కులొత్త గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తరంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన.

770

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు వేణుగానం చేయగా మన్మథవికారాన్ని పుట్టించే ఆ గానానికి గొల్ల పడుచులందరూ లజ్జలు విడిచి అనురాగము లతిశయింపగా కొంచెమైనా ఓర్పు లేనివారయ్యారు. తమతమ స్నేహితురాళ్ళతో, తమలో తాము పదిమంది, అయిదుమంది, ఒక్కొక్క గుంపుగా కూడుకొని తమలో తామిట్లా జిలిబిలి ముచ్చట్లు ఆడసాగారు:

మ. శ్రవణోదంచితకర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో

నవతంసాయిత కేకిపింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచున్
ఉవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే!

771

తా ॥ "ఓ చెలీ! శ్రీకృష్ణుడు చెవియందు కొండగోగు పువ్వును చెరివికొన్నాడు. బంగారు వన్నె వస్త్రాన్ని ధరించాడు. సిగయందు నెమలిపింఛం అందగింపగా, తామర పువ్వుల దండను మెడలో వేసుకొన్నాడు. నెమ్మదిగా కమ్మని అమృతంగల పెదవియందు పిల్లనగ్రోవిని ఆనించి ఊదుతూ ఆవుల వెంట అడవిలో తిరుగుతున్నాడు చూసారా!

శా. రావే సుందరి! యేమె బోటి! వినవే! రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు మూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసము లంగుళీక్రమములుం బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మమగు తద్గాంధర్వసంగీతమున్.

772

తా ॥ ఓ సుందరీ! ఓ చెలీ! నా మాట విను! మన కృష్ణుడు బృందావనంలో పిల్లనగ్రోవిని ఒప్పిదంగా ఊదుతున్నాడట! ఎడమప్రక్కకు వంపబడిన శిరస్సుతోను, కనుబొమల కదలికతోను, వ్రేళ్ళను ఆనిక యొక్క క్రమముతోను, ఒప్పిదంగా షడ్జమ స్వరముతో వేదమయమైన గంధర్వగానాన్ని నటునిలా చేస్తున్నాడట.

క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నలినాక్షుని మధురవేణునాదము నా వీ
నులు సోఁకినంత మాత్రన, చెలియా! యిఁక నేటివెఱపు చింతింపఁ గదే!

773

తా ॥ ఓ చెలియా! మన కృష్ణుని యొక్క వేణునాదం చెవిన పడగానే నా మనస్సు చలించి

తత్తర పెడుతోంది. లోకులు చూస్తే నిందిస్తారని భయంపెట్టుకొని కృష్ణుని వద్దకు పోకుండా ఎలా ఉంటాం? చెప్పు!

క. నాతోడ వెఱవ వలదే?, నాతోడనె కొనుచుఁ బోయి నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద, నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ!

774

తా ॥ నీవు లోకుల నిందకు వెరవనక్కరలేదు. నిన్ను నావెంట పిలుచుకొనిపోయి, నీ తోటి వారందరు మెచ్చుకొనేటట్లు, నీతో ఆ కృష్ణమూర్తిని మాటాడిస్తాను. నీ మీద ఆనపెట్టి చెబుతున్నాను."

వ. అని పెక్కుభంగుల నోర్తోర్తె నుద్దేశించి పలుకుచు, గోపసుందరులు బృందావనంబునకు గోవిందుని కెదురు చని పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు సేసిన వార లగుచు, రామకృష్ణుల నుద్దేశించి.

775

తా ॥ అని ఈ విధంగా వారిలో వారు చెప్పుకుంటూ కృష్ణునికెదురుగా బృందావనానికి పోయారు. వెడుతూ మిక్కుటమైన సంతోషంతో శ్రీకృష్ణమూర్తిని మనస్సులోనే పరవశంతో ఆలింగనం చేసుకోసాగారు. వెళ్ళి రామకృష్ణులను చూసి తమలో తాము ఇట్లా అనుకున్నారు:

మ. నవగోస్థానక రంగమందుఁ బరమానందంబుతోఁ జూత ప
ల్లవ నీలోత్పల పింఛపద్మదళ మాలావస్త్ర సంపన్నులై
కవయై వేణువు లూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం
డవముల్ సేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే?

776

తా ॥ "ఓ కామినులారా! ఈ చిన్నవాళ్ళు గోవులు సభికులుగా గల నాట్యస్థానంలో అత్యంత ఆనందంతో, మనం చూసేటట్లు నాట్యం చేస్తున్నారు. నల్ల కలువల దండలను, నెమలి పింఛపు దండలను, తామర పువ్వుల దండలను, చిగురుటాకుల దండలను, నీలాంబర పీతాంబరములను ధరించి, జతగూడి పిల్లన గ్రోవులు ఊదుచు, నానా విధాలయిన నట్టువకాండ్ర వలెనే కేళితాండవాలను చేస్తున్నారు! చూసారా!

క. ఓ చెలువలార! వినుఁడీ, వాచాశతకంబులేల? వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల, మీచెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ?

777

తా ॥ ఓ చెలులారా! వినండి! నూరు మాటలెందుకు? మనకు కన్నులు కలిగి నందులకు ఫలం ఈ మనోహర నాట్యాన్ని చూడగలగడమే సుమా!"

వ. అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి.

778

మ. ఒనరన్ వ్రేతల కించుకేనియును లే కుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోయుచుం
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్
వనితా! యెట్టితపంబు సేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్.

779

తా ॥ వారిలో కొందరు గోవిందుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నారు: "వనితా! ఈ పిల్లనగ్రోవి శ్రీ గోపాలకృష్ణుని అధరామృత రసాన్ని ఆస్వాదిస్తూ వింతగా ధ్వనిచేస్తూ గర్వంతో మిడిసిపాటుగా ఉంది. ఇది ఇట్టి భాగ్యాన్ని పొందడానికి పూర్వ జన్మలో ఎటువంటి తపస్సు చేసిందో?

మ. ముదితా! యే తటినీపయః కణములన్ మున్ వేణు వింతయ్యె నా
నది సత్పుత్రునిఁ గన్నతల్లి పగిదిన్ నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వనిపాటగా వికచపద్మశ్రేణి రోమాంచమై
యొదవం దుంగతరంగ హస్తనటనోద్యోగంబు గావింపదే!

780

తా ॥ ఓ ఇంతీ! ఈ పిల్లన గ్రోవి మునుపు ఏ నది యందలి నీళ్ళచేత పెరిగి ఇంతటి భాగ్యాన్ని పొందిందో! ఆ నది సత్పుత్రుని కన్న తల్లివలె, మహానందంతో హంసధ్వని పాటలాగా, వికసించిన పద్మశ్రేణితో, ఉన్నతంగా ఎగసిన అలలనే హస్తములతో ఈనాడు నాట్యం చేయకుండా ఉంటుందా?

క. నలినోదరుభక్తునిఁ గని, కులజులు నందాశ్రుజలము గురియు పగిది భ్రూఁ
కులు పూఁదేనియ లొలికెడు, నలినాక్షుని చేతివంశనాళము మ్రోఁతన్.

781

తా ॥ ఓ చెలీ! కృష్ణుడు ఊదే పిల్లనగ్రోవి నాదానికి, విష్ణుభక్తుడైన ఒక పురుషుణ్ణి చూసి వాని బంధువులు సంతోష భాష్పాలు వర్షించు రీతిగా, ఈ బృందావనంలోని వృక్షాలన్నీ తమ పువ్వులలోని తేనెను ధారగా కారుస్తున్నాయి.

శా. నా మోసంబున కెద్దిమేర? వినవే నా పూర్వజన్మంబులన్
లేమా! నోముల నోఁచుచో నకట! కాళిందీతటిన్ వేణువై
భూమిం బుట్టెద నంచుఁగోరఁ దగదే? బోధిల్లి యట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే!

782

తా ॥ ఓ చెలీ! నేనెంతగా మోసపోయానో చూడు. పూర్వజన్మలో నేను నోములు

నోచేటప్పుడు కొంచెం హెచ్చరికతో ఈ యమునా నది గట్టుమీద వెదురుగా పుట్టేటట్లు కోరలేక పోయాను. అలా కోరితే ఈ జన్మలో కృష్ణుని అధరామృత పానం లభించి ఉండేది. (అలౌకికమైన ఆనందాన్ని అనగా అమృతత్త్వాన్ని ఇచ్చేదే అధరామృతం)

క. కాళిందీకూలంబున, నాళీ! యీ నందతనయు నధరామృతముం
గ్రోలెడి వేణువ నగు నో, మేలాగున నోఁచవచ్చు నెఱిఁగింపఁగదే!

783

తా ॥ ఓ చెలీ! నాకు ఈ యమునా నదీ తీరంలో వెదురుగా పుట్టి పిల్లంగ్రోవినై ఈ కృష్ణుని అధరామృతాన్ని పానం చెయ్యాలనే కోరిక ఉంది. అది నెరవేరే వ్రతం ఎలా ఆచరించాలో నాకు తెలియ చెప్పవే.

క. వనితా కృష్ణుఁడు నల్లని, ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు, ననవరతము నెమలితుటుము లాడెడిఁ గంటే!

784

తా ॥ ఓ కాంతా! ఇచ్చటి నెమళ్ళ గుంపులు కృష్ణుడు నల్లని మేఘం అనుకుని, ఆ వేణునాదం ఉరుము అని భావించి, పురివిప్పి నృత్యము చేస్తున్నాయి.

క. గిరిచరమిథునము లోలిం, బరికింపఁగఁ గృష్ణపాద పద్మాంకితమై
సురరాజు నగరికంటెను, దరుణీ!బృందావనంబు దద్దయు నొప్పెన్.

785

తా ॥ ఓ తరుణీ! శ్రీకృష్ణుని పాదపద్మాల స్పర్శకు నోచుకున్న బృందావనం దేవేంద్రుని అమరావతి పట్టణం కంటే అందంగా ఉంది. గిరిచరుల జంటలు ఇక్కడి శోభను అదేపనిగా పరికిస్తున్నారు.

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై.

786

తా ॥ ఓ అంగనా! విమానాలనెక్కి ఆకాశమార్గాన పోతూన్న దేవతా స్త్రీలు మనోహరమైన ఆకృతిగల శ్రీకృష్ణుణ్ణి చూసి అతనిచే పలికించబడుతున్న వేణుగానాన్ని మాటిమాటికి వింటున్నారు. వింటూ మన్మథ భ్రాంతితో పరవశత్వాన్ని పొంది భ్రమతో తమ భర్తల ఒడులలో వ్రాలిపోతున్నారు.

ఉ. కానల నుండుచున్ సరసగాన వివేకవిహీన జాతులై
వీనుల నేఁడు కృష్ణముఖ వేణురవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి మెత్తని చూడ్కి మృగీ మృగావళుల్
మానిని! చూడవమ్మ! బహుమానము సేసెఁ గృతార్థచిత్తలై.

787

తా ॥ ఓ మానవతీ! ఈ అడవిలో మృగాల జంటలు రసవంతమైన పాటవిని అందులోని సారస్యం తెలుసుకోతగిన వివేకం లేనివి. అయినాగాని, శ్రీకృష్ణుని వేణుగానం చెవుల సోకేటప్పటికి కళంకం లేని చిత్తములతో, పరవశత్వం పొందిన దేహాలతో, మేతలు మరచి, తమ మెత్తని చూపులను కృష్ణునికి బహుమానం చేస్తున్నాయా అన్నట్లు చలింపకుండా ఉన్నాయి.

ఉ. తల్లుల చన్నుఁబాలు మును ద్రావు తఱిన్ దమకర్ణవీథులన్
వల్లభమైన మాధవుని వంశరవామృతధార సొచ్చినం
ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ

గ్వల్లులు సేర్చి నిల్చె నదె! వత్సము లంగనలార! కంటిరే!

788

తా ॥ ఓ చెలులారా! అదిగో! ఆ దూడలు తొలుత తమ తల్లులచనుపాలు త్రాగాలనే అనుకున్నాయి. అయితే ఆ సమయంలో అమృతంవలె, మిక్కిలి ఇంపైన వేణుగానం వినబడేటప్పటికి, గంతులు వేస్తూ దూడలు తల్లుల నుండి పాలు త్రాగటం మానేసి, తమ చూపులను కృష్ణునిమీదనే నిలిపి నిలబడి చూస్తున్నాయి. (ఆ వేణునాద మహిమకు పశువులు కూడా నిశ్చేష్టులై చూస్తున్నాయి)

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణునిల్పి మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వదిగోఁ, బద్మాక్షి! వీక్షించితే?

789

తా ॥ ఓ పద్మాక్షి! అదుగో చూసావా! ఆవులన్ని మమతతో మోరలు పైకెత్తి నెమరు వెయ్యటం మానివేశాయి. హృదయపద్మంలో కృష్ణుడిని నిలిపి, ఆయన చేసే వేణుగానం వింటున్నాయి. ఆ ఆనందం చేత మేతనుమాని కన్నుల నుండి ఆనంద భాష్పాలు రాలుతూ ఉండగా, చిత్తరువునందు చిత్రించిన బొమ్మలవలె చలింపక కృష్ణుడినే చూస్తున్నాయి.

మ. జగతీజంబులశాఖ లెక్కి మురళీశబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి వ్రేఁగుపడి నెమ్మిం గృష్ణ రూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి, యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే! మునిజనాకారంబులం గామినీ!

790

తా ॥ ఓ కామినీ! అదిగో! ఆ చెట్లమీద ఉండే పక్షులు కూడా వేణునాదాన్ని ఆస్వాదిస్తున్నాయి. ఆ శబ్దమనెడి అమృతాన్ని త్రాగటం వలన కలిగిన తన్మయత్వంతో, తమ మనస్సులయందు నిలిచి ఉన్న కృష్ణుని రూపాన్ని బయటకు వెళ్ళనీయకుండా కళ్ళు మూసుకొని, మునులవలె సొక్కుతున్నాయి. గమనించావా! (ఆ నాదానికి పక్షులు మునులవలె ధ్యానంలో మునిగాయి)

మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథ సాయక క్షత విశాలావర్తలై హంస వా
క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోప హా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా! విలోకించితే?

791

తా ॥ ఓ రమణీ! ఇచ్చటి నదులన్నీ వేణుగానాన్ని వింటున్నాయి. ఆ మోహాతిశయము వలన మన్మథ బాణముల తాకిడిచేత అయిన గాయాలో అన్నట్లుగా పెద్దపెద్ద సుడులను కలిగి ఉన్నాయి. హంసల మాటలతో పిలుస్తూ, అలలనే చేతుల హస్తముల చేత చేరదీసి, తామరలను కానుకగా పెట్టి కృష్ణుని పాదపూజ చేస్తున్నాయా అనునట్లుగా మనోహరంగా ప్రవహిస్తున్నాయి. (వేణునాదానికి నదులు పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తున్నాయి)

ఆ. వనిత! నేఁడు కృష్ణు వంశనినాదంబు, విని పయోధరంబు విరులు గురిసి
తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ, జేసి మింట నీడఁ జేసెఁ గంటె.

792

తా ॥ వనితా! నేడు కృష్ణుని యొక్క మురళీ ధ్వని విని మేఘం ముందుగా వాన అనే పువ్వులను కురిపించింది. ఆ తరువాత తన శరీరం అంతా తెల్లగొడుగుగా చేసి ఆకాశంనుండి నీడను కల్పిస్తోంది. చూసావా! (ఆ నాదానికి మేఘాలు చలించిపోతున్నాయి)

క. మంచి ఫలంబులు హరిచే, నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ
డించెద, రంగన! చూడుము, చెంచితలం బింఛపత్రచేలాంచితలన్.

793

తా ॥ ఓ అంగనామణీ! ఇచ్చటి బోయపడుచులు నెమలి ఈకల గుత్తులనూ, ఆకుల తోడి చీరలు ధరించిన వారై శోభిల్లుతున్నారు. వారు మంచి ఫలాలు తెచ్చి కృష్ణునికిస్తూ, ఆయన చేతులకు తమ చేతులను ఆనించి పరమానందంతో క్రీడిస్తున్నారు.

క. ఉల్లసిత కుచభరంబుల, నల్లాడెడి నడుముతోడ నలరుల దండన్
భిల్లి యొకతె హరి కిచ్చెను, హల్లోహలకలిత యగుచు నంగన! కంటే!

794

తా ॥ ఓ అంగనామణీ! ఒక బోయిత నిక్కిన కుచభారము చేత, వడకుచున్న నడుముతో పువ్వుల దండను మోహంతో శ్రీకృష్ణునికి ఇచ్చింది! చూసావా!

క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె ధరణి గగన భూ
చరు లెల్లను జొక్కిరి హరి, మురళిరవామృతము సోఁక ముద్దియ! కంటే!

795

తా ॥ ఓ ముగుదా! హరి యొక్క వేణుగానమనెడి అమృతం సోకి కొండలన్నీ కరిగి జలములయ్యాయి. చెట్లన్నీ చిగిర్చాయి. భూమి మీద చరించే మనుష్యులు, ఆకాశంలో సంచరించే దేవతలు, పక్షులు మొదలైన ప్రాణులు మైమరచి దేహస్మృతిని కోల్పోతున్నారు! చూసావా! (ఆ వేణునాదానికి చెట్లు చిగురిస్తున్నాయి, అన్ని ప్రాణులు చలించిపోతున్నాయి. చరాచరసృష్టికి మూలమైనది కదా ఆ నాదము, అందువలన అన్నింటిలోనూ స్పందన కలుగుచున్నది)

మ. బలకృష్ణాంఘ్రి సరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సంభావించి మిన్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై
వెలసెం జూడఁ గదమ్మ! యీ గిరిపురోవీథిన్ సరోజాననా!

796

తా ॥ ఓ కమలముఖీ! మన ఎదుట కనుపిస్తున్న ఈ కొండను చూచావా! బలరామకృష్ణుల పాదకమలములు సోకటం చేత ప్రకాశిస్తూ కృతార్థత్వాన్ని పొందింది. పువ్వులు పండ్లు అనెడి కానుకలను సమృద్ధిగా ఇచ్చి గౌరవించి ఆ సంబరంతో మిన్నుముట్టుతూ ఉంది. నీళ్ళ చేతను, గడ్డిచేతను గోవులను తృప్తి పొందించింది. ఒప్పిదమైన వృక్షములనే గగుర్పాటుతో మనకెదురుగా ప్రకాశిస్తోంది చూడవమ్మా!"

వ. అని యిట్లు బృందావన విహారియైన గోవిందుని సందర్శించి పంచబాణభల్ల భగ్నహృదయ లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్ర లయియుండి రంత.

797

తా ॥ అని ఈ విధంగా బృందావనంలో విహరించే గోవిందుని చూసి భావావేశం కలిగిన గోపస్త్రీలు ఆ ఏకాంత ప్రదేశంలో తదేకంగా స్వామిని ధ్యానిస్తూ ఉండిపోయారు.

## 30. హేమంతఋతు వర్ణనము

క. శామంతికాస్రగంచిత, సీమంతవతీ కుచోష్ణజితశీతభయ
శ్రీమంతంబయి గొబ్బున, హేమంతము దోఁచె; మదనుఁ డేఁచె విరహులన్.

798

తా ॥ అంతలో శ్రీమంతమైన హేమంతం అవతరించింది. చేమంతి పువ్వుల దండలచేత అలంకరింప బడిన శిరోభాగములు గల స్త్రీల కుచవేడిమి చేత అణచబడిన చలిగలదై హేమంత ఋతువు వచ్చింది. జనులకు మన్మథ వేదన హెచ్చింది.

క. ఉత్తరపుగాలి విసరె వి, యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెన్
బొత్తు జరిగె మిథునములకు, నెత్తమ్ములు దఱిఁగె హిమము నెలకొనియె నృపా!

799

తా ॥ ఓ రాజా! ఉత్తరము నుండి గాలి వీచసాగింది. ఆకాశంలో చల్లగా ప్రకాశించే చంద్రుడు ఇప్పుడు బాధిస్తున్నాడు. దంపతులకు ఐకమత్యం కుదిరింది. వికసించిన తామర పువ్వులు తగ్గాయి. మంచు సర్వత్రా వ్యాపిస్తోంది.

క. అహములు సన్నము లయ్యెను, దహనము హితమయ్యె దీర్ఘ దశలయ్యె నిశల్;
బహు శీతోపేతంబయి, యుహుహూ యని వడఁకె లోక ముర్వీనాథా!

800

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! పగటి కాలం నిడివి తగ్గి, రాత్రి కాలం పెరిగింది. జనులకు అగ్ని హితమైనది. అధికమైన చలిచేత లోకమంతా గడగడ వణకసాగింది.

క. అన్నుల చన్నుల దండ వి, పన్నులు గా కెల్లవారు బ్రదికిరిగా కీ

చన్నుల మీఱిన వలి నా, పన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్.

801

తా ॥ ఆ హేమంతంలో స్త్రీల స్తనముల ప్రాపున ఆపదను పొందకుండ లోకులంతా జీవించారు కాని వాటిని అతిక్రమించిన పక్షంలో చలిచేత ఆపన్నులు కాకుండ ఉండటానికి బ్రహ్మాదులకు సైతం శక్యమా!

ఆ. పొడుపుఁ గొండమీఁదఁ బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁ జొచ్చెఁగాక మసలినఁ జలిచేతఁ, జిక్కెఁజిక్కె ననఁగఁ జిక్కకున్నె.

802

తా ॥ సూర్యుడు ఈ హేమంత ఋతువులో, ఉదయ పర్వతం మీద నుంచి ఉదయించింది మొదలు కొంచెమైనా ఆలస్యం చేయక పరుగెత్తిపోతూ అస్తమయ పర్వతము చేరుకుని దాక్కున్నాడు. అట్లా చేయక, ఇన్నాళ్ళలాగ మెల్లమెల్లగా పోవుటకు యత్నించిన పక్షంలో చలిలో చిక్కుకుని పరిహాస పాత్రుడు అవుతాడు.

క. చెంగల్వ విరుల గంధము, మంగళముగఁ గ్రోలుచున్న మధుపము లొప్పె
న్నంగజ వహ్నులపై ను, ప్పొంగి విజృంభించు పొగలపోలిక నధిపా!

803

తా ॥ ఓ రాజా! ఎర్ర కలువలపై చేరి ఆసక్తితో మకరంద పానం చేసే తుమ్మెదలు మన్మథ సంబంధమైన అగ్నులమీద పుట్టి రేగిన పొగయో అన్నట్లుగా కనిపిస్తున్నాయి.

ఆ. శంభుకంట నొకటి జలరాశి నొక్కటి, మఱియు నొకటి మనుజ మందిరముల
నొదిగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులు, చలికి నులికి భక్తి సలుపకున్నె?

804

తా ॥ ఈ హేమంత కాలంలో, చలిని పోగొట్టే గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులనే మూడగ్నులలోనూ, ఒకటి శివుని కంటిలో అంటే ఫాలనేత్రంలో అణగి పోయింది. మరొకటి బడబాగ్ని రూపంలో సముద్రంలో దాక్కొన్నది. మూడవది మనుష్యుల ఇండ్లలో ఉండిపోయింది. అలా దాగబట్టి తమ గౌరవాన్ని కాపాడుకొన్నాయి గాని లేకపోతే చలికి వెరచి సేవ చెయ్యకుండా తప్పించుకొన జాలునా!

శా. ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స
త్సాహాయ్యంబునఁగాని వీని గెలువన్ శక్యంబుగా దంచుఁ దా
రూహాపోహవిధిం డ్రిమూర్తులు సతీయుక్తాంగు లైనారు గా
కోహో! వారలదేమి సంతతవధూ యోగంబురాఁ గందురే?

805

తా ॥ త్రిమూర్తులు ఈ హేమంతం రాక చూసి రమణీమణుల సహాయం చేత గాని దీనిని జయించటం సాధ్యం కాదని ఊహించుకొన్నవారై భార్యలతో కూడిన అవయవాలు కలిగిన వారయ్యారు. అట్లాకాని పక్షంలో ఆ త్రిమూర్తులు ఎల్లప్పుడూ భార్యలతో కూడి యుందురా?

క. ఈ హేమంతము రాకకు, శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా
నోహో! వెఱవకు మని తా, మా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్.

806

తా ॥ ఈ హేమంతం యొక్క రాకకు శ్రీహరి కొంచెం వడకి విచారపడుతూంటే శ్రీమహాలక్ష్మి ఆయనకు అభయమిచ్చింది.

వ. ఇట్లు నితాంతంబగు హేమంతంబున మొదలినెల తొలిదినంబు నందు నందుని మందం గల గోప కుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులం దోఁగి; జలతీరంబున నిసుమునం గాత్యాయ నీరూపంబుఁ జేసి, సురభి కుసుమగంధంబు లిడి, ధూపదీపంబు

లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి;

807

తా ॥ ఇటువంటి హేమంత ఋతువులో మొదటిదైన మార్గశిర మాసంలో శుక్లపాద్యమి నాడు నందుని గొల్లపల్లెలోగల గొల్లపడుచులందరూ వేకువనే బయలుదేరారు. యమునా నది వద్దకు వెళ్ళి, అందులో స్నానాలు చేసి అచ్చటి నీళ్ళకు చేరువగా ఇసుకతో పార్వతీదేవి ప్రతిమారూపాన్ని చేసి పెట్టుకున్నారు. మంచి వాసనగల పువ్వులు పరిమళ ద్రవ్యాలు మొదలైన వానిచేత పూజించి, ధూప దీప నైవేద్యాలు సమర్పించారు.

క. 'ఓ కాత్యాయని! భగవతి, నీకున్ మ్రొక్కెదము నేము నేఁ డనుకంపన్
మా కిందఱకును వైళమ, శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ!

808

తా ॥ "ఓ కాత్యాయని! భగవతి! పార్వతి! నేడు మేము నీకు భక్తితో నమస్కరిస్తున్నాము. నీవు దయతో మాకు ఇంతమందికిని శీఘ్రంగా శ్రీకృష్ణుడు భర్త అయ్యేటట్లు చెయ్యి తల్లీ!

క. ఓ తల్లి! మాకుఁ గృష్ణుఁడు, చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు, జాతర సేసెదము భక్తిచాతురితోడన్.

809

తా ॥ ఓ తల్లీ! మాకు కృష్ణుడు ఎప్పుడు భర్త అవుతాడో అప్పుడే నేతితో వసంతాలాడుతూ నీకు ఉత్సవం చేస్తాం."

వ. అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు న వ్విధంబున మాసవ్రతంబు సలిపి రందొక్కనాఁడు.

810

తా ॥ అని కాత్యాయనీ దేవికి మ్రొక్కుకొని దైవప్రసాదితమైన భోజనం చేస్తూ, ఒక నెలరోజులపాటు కాత్యాయనీ వ్రతాన్ని కొనసాగించారు.

## 31. గోపికా వస్త్రాపహరణము

మ. రమణుల్ ప్రొద్దుల మేలుకాంచి సఖులన్ రం డంచు నాత్మీయ నా
మములం జీరి, కుచద్వయీ భరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ
బ్రమదోద్దామ గజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁ బోయిరి గృహీతాన్యోన్య హస్తాబ్జలై.

811

తా ॥ ఆ గోపికలందరూ తెల్లవారు ఝామునే నిద్రలేచారు. తమ చెలికత్తెలనందరిని వారి వారి పేర్లతో గ్రుచ్చిగ్రుచ్చి పిలిచారు. సంతోష మదంచేత మదించిన ఏనుగుల్లా ఒయ్యారంగా నడుస్తూ శ్రీకృష్ణున్ని స్మరిస్తూ ఒకళ్ళ చేయి మరొకరు పట్టుకొని యమునా నదీ తీరానికి బయలుదేరారు.

వ. ఇ ట్లా నదీతీరంబు సేరం జని గజగమనలు విజనస్థలంబున వలువలు విడిచి యిడి మది శంక లేక యకలంకలై క్రుంకులిడఁ జలంబుల జలంబులు సొచ్చి.

812

తా ॥ అట్లా నదీతీరానికి పోయి గజగమనలైన గోపికలు జనులెవ్వరూ లేనిచోట వస్త్రాలను విడిచారు. కొంచెమైన భయసంకోచాలు లేనివారై స్నానాలు చేద్దామనే పట్టుదలతో నీళ్ళలోకి దిగారు.

క. వారిజలోచనుఁ బాడుచు, వారిజలోచనలు వారివారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి, వారి విహారములు జగతివారికిఁ గలవే?

813

తా ॥ ఆ గోపికలు కృష్ణ సంబంధమైన పాటలు పాడుతూ తమలో తమకే వినోదము

కలిగేటట్లు జలక్రీడలు ఆడారు. అట్టి వినోదక్రీడ లోకంలో మరెవ్వరికీ లేదు.

వ. ఆ సమయంబున.

814

క. తోయజనయనలు యమునా, తోయములం దుండు టెఱిఁగి దూరగుఁ డయ్యుం
దోయజనయనుఁడు హరి తన, తోయము గోపకులు దానుఁ దోతెంచె నృపా!

815

తా ॥ ఆ సమయంలో కృష్ణుడు తాను దూరంగా ఉన్నా, గోపికల విషయం తెలుసుకొన్నవాడై తన చెలికాండ్రతో కూడా అచ్చటకు వచ్చాడు.

తరలము:
కదలకుం డని తోడివారలఁ గన్ను సన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌనియై
పొదల మాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁడై
యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్.

816

తా ॥ శ్రీకృష్ణుడు తనవెంట వచ్చిన వారిని కదలకుండా ఉండమని కనుసైగలతో ఎడంగా నిలిపి చప్పుడు కాకుండా మెల్లమెల్లగా అడుగులు వేస్తూ, నోరు మెదల్చకుండ పొదల మరుగున పొంచి పొంచి దేహమును ముడుచుకొని, సమయం చూసి దగ్గరకు వచ్చి గోపికలు గట్టుమీద ఉంచిన చీరలను దొంగిలించాడు.

వ. ఇట్లు దొంగిలి.

817

శా. ఉద్యద్గంధగజేంద్ర గౌరవముతో యోషాంబరంబుల్ విభుం
డాద్యుం దర్భకుభంగి నర్భకులతో హాసార్థియై కొంచుఁ ద
న్నద్యంభఃకణ శీతవాత జనితానందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్త దురంతపాదప జనుస్సంతాపమున్ నీపమున్.

818

తా ॥ ఈ విధంగా గోపికల చీరలను దొంగతనంగా ఎత్తుకొని పోయాడు. (ఈ ప్రకారంగా అవిద్యచేత పుట్టిన ద్వైత బుద్ధిని అపహరించాడు... అని అర్థం చేసుకోవాలి).

ప్రపంచం యొక్క ఉత్పత్తి స్థితి లయములకు కారణభూతుడైన ఆ సర్వేశ్వరుడు నవ్వులాటకు ఒక పిల్లవాని వలె గొల్లపిల్లలతో కూడి గోపికల వస్త్రాలను అపహరించాడు. అనంతరం మదపుటేనుగు నడక వంటి నడకతో, ఆ యమునా నదీజల కణములచేత చల్లగా వీస్తూన్న గాలి సోకుతుండగా గట్టుననున్న కడిమి చెట్టును ఎక్కాడు. ఆ కృష్ణ స్పర్శతో వృక్షజన్మ ఎత్తాననే పరితాపం ఆ వృక్షానికి పోయింది.

నీపము = ప్రాపణే అని ఉన్నందున ప్రాణులను బ్రహ్మానందాన్ని పొందించేది అని అర్థం. అహం బ్రహ్మాస్మి అని సచ్చిదానందాన్ని పొందుట మనుష్య జన్మమందే కాని ఇతర జన్మముల యందు పొందుట అసాధ్యము. కనుక మనుష్య జన్మమునకే నీపము అనిపేరు. దానిని పొందాడు అని భావం. అనగా సర్వోత్కృష్టమైన మనుష్య జన్మను పొందినప్పుడు అనాది మరియు అవిద్యా సంబంధమైన ద్వైత బుద్ధిని వదలి కృతకృత్యుడై మోక్షాన్ని పొందాలి. అట్లా కాకుండా పునరావృత్తికి మార్గమైన ద్వైత బుద్ధిని అవలంబించి దానిని పొందవలెనని ప్రయత్నం చెయ్యటం మనుష్య జన్మను వ్యర్థం చెయ్యటమే. కనుక దానిని సార్థకం చేయునట్టి యుక్తిని వెతుక్కొమ్మని చెప్పుటకు సూచనగా గోపికలకు మానభంగం అయ్యేటట్లు వస్త్రాపహరణము చేశాడని భావం.

వ. అప్పు డయ్యింతు లిట్లనిరి.

819

క. 'మామా వలువలు ముట్టకు, మామా! కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మాన మేల కొనియెదు?, మా మానసహరణ మేల? మానుము కృష్ణా!

820

తా ॥ అప్పుడా గోపికలు ఇట్లా పలికారు: "ఓ కృష్ణా! మా వస్త్రాలను ముట్టబోకు! వాటిని తీసుకువెళ్ళొద్దు. మమ్ము మన్నింపుము. మా అభిప్రాయాలు తెలిసినా కూడా మా మనస్సుని హరించే ప్రయత్నం ఎందుకు చేస్తున్నావు? ఇది మానుము.

సీ. బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో గోత్రంబు నిల్పుటో కూర్మితోడ?
మహి నుద్ధరించుటో? మనుజ సింహంబవై ప్రజలఁ గాచుటొ? కాక బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? రాజుల గెల్చుటో రణములందు?
గురునాజ్ఞ సేయుటో? గుణనిధి వై బల ప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల?

ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో, కలికితనము సేయ ఘనత గలదె?
వావి లేదు వారి వారు నా వా రని, నెఱుఁగ వలదె వలువ లిమ్ము కృష్ణ!

821

తా ॥ ఓ కృష్ణా! నీవిప్పుడు మా చీరలను దొంగిలించటం అనేది గొప్ప పని అని భావిస్తున్నావా? అది నీకు శోభను చేకూరుస్తుందా? అది మత్స్యావతారమెత్తి వెలుగొందుటయా? అధిక జలముగల సముద్రంలో దేవతల వలన ప్రేమాతిశయం చేత సముద్రమథన కాలంలో కూర్మావతారం ఎత్తి మందర పర్వతాన్ని సముద్రంలో మునగకుండా నిలుపుటయా?

భూమిని ఏలుటయా? వరహావతారమెత్తి హిరణ్యాక్షుని చేత సముద్రంలో అణగద్రొక్క బడిన భూమిని మీదికి లేవనెత్తుటయా అని భావం. మనుష్యులలో సింహము వంటివాడవై ప్రజలను కాపాడుటయా? నరసింహావతారమెత్తి హిరణ్యకశిపుని చంపి మూడు లోకములలోని

జనులను కాపాడుటయా అని భావం. అదికాక బలవంతుని తరిమి చిన్నవాడవై యుండియును గౌరవాన్ని పొందుటా? వామనావతారమెత్తి బలిచక్రవర్తిని అణచివేసి ఆకాశందాకా పెరిగి త్రివిక్రముడవుటయా అని భావం.

యుద్ధంలో రాజులను గెలుచుటయా? పరశురామావతారమెత్తి లోకంలోని రాజులనందరిని యుద్ధంలో జయించి వర్తించుటయా అని భావం. మంచి గుణములు కలిగి తండ్రి యొక్క ఆజ్ఞను నడపుటయా? రామావతారమెత్తి తండ్రి ఆజ్ఞ అను నెపంచేత అడవులకు పోయి రావణాది రాక్షసులను సంహరించుటయా అని భావం. భద్రంగా బలప్రఖ్యాతిని చూపుటయా? బలరామావతారమెత్తి మేలైన విలాసంతో ప్రసిద్ధి నొందుటయా అని భావం.

బుధులు మెచ్చేటట్లుగా ఈ భువిలో బుద్ధత మెరయుటో (బుద్ధావతారము) నేర్పరి తనము చూపుట చేత ఆ గౌరవము దక్కునా? కల్క్యవతారము అని భావం. నీకు వావిలేదు, ఇతరులకు సంబంధించిన వారు నావారు అని తెలుసుకో వలదా. వీరు కావలసిన వారు వీరు అన్యులు అనే భేదం లేకుండ సర్వసముడవై వర్తించువాడవు" అని అంటూ,

క. కొంటివి మా హృదయంబులు;, గొంటివి మానంబు; లజ్జఁ గొంటివి; వలువల్
గొంటి; విఁక నెట్లు సేసెదొ;, కొంటెవు గద! నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా!

822

తా ॥ "ఓ కృష్ణా! నీవు మా అభిప్రాయాలను తెలుసుకొన్నావు. మా మనస్సులను అపహరించావు. మా అభిమానాన్ని తీసుకొన్నావు. మా వలువలు దొంగిలించావు. నీవు కొంటెవాడవు. నిన్ను మేము తెలుసుకొన్నాం. ఇక నీవు ఏం చేస్తావో నీ ఇష్టం.

సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే చెలరేఁగి వింతలు సేయుచుండ?
సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే, సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ?
గురుతర శక్తియుక్తుఁడ వౌట యెఱుఁగమే తామసంబున నెగ్గు దలఁచుచుండ?

నొకభంగితో నుండకుంటఁ జింతింపమే మాయావివై మాఱుమలయుచుండ?

ఆ. నేమి జాడవాఁడ? వేపాటి గలవాఁడ, వే గుణంబు నెఱుఁగ వెల్ల యెడల

నొదిఁగి యుండనేర వోరంత ప్రొద్దును, బటము లీఁగదయ్య! పద్మనయన!

823

తా ॥ ఓ కృష్ణా! నువ్వు రాజసం గలిగి వింత వింత పనులు చేస్తున్నావు. సిరి ఉండి కూడా ఇతరుల వద్ద తీసుకుంటావు. నీవు సత్వగుణసంపన్నుదవని మాకు తెలియదా? తామసంతో దుర్మార్గులను మట్టుబెడతావు, నీ బలం మాకు తెలియదా? మాయావివై పలురీతుల తిరుగుతూ ఉంటావు, ఒక రీతిగా ఉండవు. అసలు నీ జాడలు ఏమిటి? నీవు ఏపాటి వాడవు? గుణాలు తెలియనివాడివి, కుదురు లేని వాడివి, మా వస్త్రాలు మాకివ్వు!

ఓ స్వామీ! నీవు రాజస గుణాన్ని వహించి బ్రహ్మవై వింత వింతగా లోకాలను సృష్టిస్తున్నావు. సత్వగుణాన్ని వహించి విష్ణుమూర్తివై దుష్టులను శిక్షించి శిష్టులను పాలిస్తున్నావు. తామస గుణాన్ని వహించి రుద్రుడవై సర్వప్రపంచాన్ని లయింపచేస్తున్నావు. ఒక విధంగా ఉండక, మత్స్య కూర్మాది అవతారములెత్తి లేక స్థావర జంగమ రూపాలను వహించి అంతటనున్న వానివలెనే తోచుచు వాస్తవంగా ఏ చోటను లేనివాడవై వర్తించుచున్నావు. నువ్వు ఎలా ఉంటావో ఎటువంటి ఐశ్వర్యం కలవాడవో మాకు తెలియదు. నీవు గుణాలకు అతీతంగా ఉంటావు (త్రిగుణాతీతుడు), ఒకచోట కుదురుగా ఉండవు (సర్వవ్యాపకుడు) అనే భగవంతుని తత్త్వం ఇక్కడ కనిపిస్తోంది.

ముందు పద్యంలో నిన్ను మేము తెలుసుకున్నామని గోపికలు చెప్పారు. అంటే భగవంతుని తత్త్వం వారికి అవగతమవుతుంది. అందుకనే గుణాలకు అతీతుడవైనా; నీవు గుణాలతో ఉన్నట్లుగా ప్రవర్తిస్తావు. ఒక్కచోటునే నిలవక సర్వాత్రా వ్యాపించి ఉండేవాడివి. నిన్ను మేము గుర్తించలేదనుకున్నావా అని ఇక్కడ చెబుతున్నారు.

క. రాజుల నెఱుఁగవు బలిమిని, రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్
రాజున కెఱిఁగించెద; మో రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్?

824

తా ॥ ఓ కృష్ణా! నువ్వు చెడ్డపనులు చేసిన ఎడల రాజులు దండింతురను భయం లేక బలవంతుడవై వెలుగుచున్నావు. మా చీరలిమ్మంటే ఇవ్వకుండా ఉన్నావు. నీవేమైనా ఈ భూమికి రాజువా? లేకున్న రమణులమైన మేమందరము నంద మహారాజునకు తెలియజేస్తాము."

వ. అని పలికిన కన్నియల పలుకు లాలించి మందహాససుందర వదనారవిందుండై గోపాలబాలకుల కరంబులం గరంబులు వ్రేసి య మ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డిట్లనియె.

825

తా ॥ అని ఇలా పలికిన గొల్లపడుచుల మాటలను కృష్ణుడు విన్నాడు. మందహాస సుందర వదనారవిందుడై, తనవెంట వచ్చిన గొల్ల పిల్లల చేతులలో చేతులు వేసి తట్టుచూ ఆ గోపికలతో చక్కగా మాట్లాడటంలో నేర్పరి అయిన కృష్ణుడు ఇలా అన్నాడు:

శా. రామల్ రాజులతోడ నీ పనికి నారంభింతురే మీ క్రియన్
మోమో టేమియు లేక దూఱెదరు మీ మోసంబు చింతింప; రం
భోమధ్యంబున నుండి వెల్వడి వెసం బూర్ణేందు బింబాననల్
మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడీ? మీ కిచ్చెదం జెచ్చెరన్'

826

తా ॥ "ఓ గోపికలారా! ఆడువారు రాజులతో మీలాగ ప్రవర్తిస్తారా? కొంచెమైన మొగమాటం లేకుండ నన్ను దూషిస్తున్నారు కాని మీలోని తప్పును మీరు చింతించటం లేదు. నీళ్ళలో నుండి శీఘ్రముగా వచ్చి మీరు ఎవరి వస్త్రాన్ని వారు తప్పక పుచ్చుకోండి. ఆలస్యం

లేకుండా నేను మీకు ఇస్తాను."

వ. అనిన న మ్మానవతు లొండొరుల మెగంబులు సూచి నగుచు, మర్మంబుల నాఁటు న మ్మాటలకు మగుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలంబైన చలిని వలిగొని కంఠ ప్రమాణజలంబులం దుండి డోలాయమాన మానసలై యిట్లనిరి.

827

తా ॥ అని శ్రీకృష్ణుడు మర్మముగా మాటలాడగా ఆ మానవతులు ఒకరి మొగములు ఒకరు చూసుకొన్నారు. నవ్వుకొంటూ బదులు చెప్పడానికి సిగ్గుపడ్డారు. అధికమైన చలిచేత వణకిపోతూ మెడలోతు నీళ్ళయందుండి ఈ మాట చెప్పుదమా ఊరకుందుమా అని ఊగిసలాడుతున్న మనస్సు కలవారై ఇలా ప్రత్యుత్తరం ఇచ్చారు:

క. 'మా వలువ లాగడంబున, నీ వేటికిఁ బుచ్చుకొంటి? వీ వల్పుఁడవే?
నీ వెఱుఁగని దేమున్నది, నీ వందఱిలోన ధర్మనిరతుఁడవు గదే?

828

తా ॥ "కృష్ణా! నీవు అల్లరి వాడవై మా చీరలను ఎందుకు దొంగిలించి తీసుకొని పోతివి! నీవు అల్పుడవా! నీకు తెలియనిది ఏమి ఉంది. ఇందరిలోను ధర్మనిరతుడవు నువ్వే కదా!

ఇందరిలోనన్ అంటే చతుర్దశ ఇంద్రియాలలో మనస్సయిన నీవు "మనోబ్రహ్మేతి వ్యజానాత్" అను శ్రుతి వాక్యం చేత పరబ్రహ్మ తత్త్వమైన నువ్వు అని అర్థం.

శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే? వచ్చిరా
యింతల్ సేయుదురే? కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీ తలఁబుట్టెఁ గాక! మఱి యేవీ కృష్ణ! యో చెల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే!

829

తా ॥ కృష్ణా! ఎక్కడైనా స్త్రీలు జలకాలాడుతూ ఉంటే మగవారు వస్తారా? ఒకవేళ వచ్చారనుకో, దయమాలి ఇలాంటి పని ఎవరైనా చేస్తారా? ఇలాంటి వింతలు నీ బుద్ధిలోనే పుట్టాయి. నీకు దాసురాండ్రమై ఉంటాం. మా చీరలు ఇప్పించవయ్యా.

"ఇంద్రియాణాం మనశ్చాస్మి ఇంద్రియేభ్య పరం మనః" అను గీతాప్రమాణం చొప్పున ఇంద్రియ స్వరూపములైన గోపికలు మనస్స్వరూపుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మము వద్ద దాసులని అర్థం.

క. వచ్చెదము నీవు పిలిచిన; నిచ్చెద మేమైనఁగాని; యెటఁ జొరు మనినం
జొచ్చెదము; నేఁడు వస్త్రము, లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా?

830

తా ॥ ఓ కృష్ణా! నీవు రమ్మన్న తావునకు వస్తాం. ఇమ్మన్నది ఏదైనా సంకోచింపక ఇస్తాము. నువ్వెక్కడికి పొమ్మన్నా పోతాం, ఇప్పుడు మా చీరలిచ్చి మా మానాన్ని రక్షించు."

వ. అనిన దరహసిత వదనుండై హరి యిట్లనియె.

831

క. 'ఏ తరుణుఁడు మగఁ డౌటకు, మీ తపములు సెప్పుఁడింక మీ యానలు సుం డీ తప్పిన నీ కూరిమి, మీ తలలనె పుట్టెనోటు మేదిని లేదే?.

832

తా ॥ గోపికల మాటలకు నవ్వుతూ కృష్ణుడు ఇలా అన్నాడు: "ఓ గోపికలారా! ఏ పడుచువాడు పతిగా కావాలనే కోరికతో మీరీ వ్రతం చేస్తున్నారో చెప్పండి. అట్లా చెప్పకపోతే మీ మీద ఒట్టు. ఈ ప్రేమ అనేది మీకే కాదు. లోకంలో ఈ భూమిమీద సర్వత్రా ఉన్నదే.

క. ఎవ్వనిఁ గని మోహించితి, రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్?
నివ్వటిలె మీకుఁ గూరిమి, యెవ్వనిపైఁ? బలుకరాదె? యే నన్యుఁడనే?

833

తా ॥ ఓ గోపికలారా! మీరు ఎవరిని చూసి వలచారు? ఎవరు మీ మనస్సులను ఆకర్షించాడు. ఎవని యందు మీకు స్నేహం వృద్ధి పొందుతూన్నది. నాతో చెప్పకూడదా. మీకు నేను పరాయివాడనా?"

వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనమ్ములు సేయుచు, హృదయారవిందంబులందుఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తరలయి యున్న లోకోత్తరుం డిట్లనియె.

834

తా ॥ ఆ పలుకులు విని గోపికలు ఒకరినొకరు సంతోషంతో చూసుకున్నారు. వారి మనస్సులలో మన్మథ వేదన హెచ్చగా కృష్ణున్ని చూసి నవ్వుతూ నోట మాటరాక ఊరకే ఉండిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారితో ఇలా అన్నాడు:

క. నా యింటికి దాసులరై, నా యాజ్ఞ వహించి మీరు నడిచెదరేనిన్
మీ యంబరమ్ము లిచ్చెదఁ, దోయంబులు వెడలి రండు తొయ్యలులారా!

835

తా ॥ "గోపికలారా! నా ఇంట్లో నా ఉత్తరువు ప్రకారం సేవచేస్తూ నడచుకొనే పక్షంలో, నీళ్ళనుండి బయటకు రండి. మీ వస్త్రాలు మీకు ఇస్తాను."

వ. అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువనోపక.

836

తా ॥ అంతట ఆ గోపికలు చలికి భయపడి నీళ్ళమధ్య నిలువలేక పోయారు.

క. కొందఱు వెడలుద మందురు, కొందఱు వెడలుటయు సిగ్గుగొను గోవిందుం
డందురు; కొందఱు దమలోఁ, గొందల మందుదురు వడఁకుగొని మనుజేంద్రా!

837

తా ॥ ఓ రాజా! చలికి వణికి పోతూ ఆ గోపస్త్రీలలో కొందరు నీళ్ళలోనుంచి బయటకు పోదాం అంటారు. శ్రీకృష్ణుడు మన సిగ్గుతీస్తాడు కనుక వెళ్ళకూడదంటారు. కొందరు ఏమీ తోచక తమలో ఆందోళన పడతారు.

వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయ మధ్యంబు వెలువడి.

838

తా ॥ ఆ గోపస్త్రీలు ఇలా బహు విధాల ఆలోచించి చివరకు మనస్సులు ధృఢం చేసుకుని నీళ్ళనుండి బయటకు వచ్చారు.

క. చంచత్పల్లవ కోమల, కాంచన నవరత్నఘటిత కంకణరుచిరో
దంచిత కరసంఛాదిత, పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్.

839

తా ॥ అంతట ఆ గోపికలు లేత చిగురాకువలె మృదువులై, నవరత్నాలు పొదిగిన కాంచన కంకణములచేత ప్రకాశించే చేతులతో తమ అవయవములు మాటుపరుస్తూ మడుగు నుండి వరుసగా బయటకు వచ్చారు.

వ. చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె.

840

తా ॥ తమలో గడుసువారిని ముందర పెట్టుకొని మెల్లని నడకలతోను, చిరునవ్వుతోను వచ్చి ఎదుట నిలబడ్డారు. అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

సీ. శృంగారవతులార! సిగ్గేల? మిముఁగూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాడ నేను జూడని మర్మ మెద్ది గలదు?
వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి?
కాత్యాయనీ దేవిఁ గల్లసేయుట గాక యీ రీతి నోమువా రెందుఁ గలరు?

ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ జక్కఁగ, నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు; సిగ్గువో, నాడనేల యెగ్గు లాడనేల?

841

తా ॥ "ఓ సొగసుకత్తెలారా! సిగ్గెందుకు? మీతో కలిసి చిన్ననాటినుండి పెరిగిన వాడినిగదా! మీలో నేను ఎప్పుడూ ఉన్నాను. నేను చూడని రహస్యం అంటూ ఏముంది? వ్రతంలో నిష్ఠగా ఉండి, చీరలు లేకుండా నియమాన్ని ఉల్లంఘించి నీళ్ళల్లోకి ప్రవేశించవచ్చా? కాత్యాయనీ దేవిని మోసం చెయ్యటం కాకపోతే మీవలె నోచే వారెవరున్నారు? వ్రతఫలం మీకు దక్కాలనుకుంటే చక్కగా మీరంతా చేతులెత్తి మ్రొక్కి నా దగ్గరకు వచ్చి చీరలు తీసుకోండి. సిగ్గుపోయేటట్లు చెప్పడమెందుకు? నన్ను నిందించటం దేనికి?"

సమస్త ప్రాణికోటియందు పరమాత్మయే ఉన్నాడు. నేను అనే తెలివి పుట్టినప్పటి నుండి మీలోనే పుట్టి పెరిగి ఉన్నానే. నేనుండుటే మీరుండుట. నేను లేకుండుటే మీరు లేకపోవుట. (నేను అనగా ప్రజ్ఞలేక తెలివి అని అర్థం.) నేను సర్వదా మీలోనుండుట మీరెరుగరా. నేను పురుషుడు మీరు స్త్రీలు అనే భేదం కల్పించుకొని మీరెందుకు సిగ్గుపడతారు? మీ సమస్త వ్యాపారాలకు కారణభూతుడను నేనై ఉండగా నా వద్దనా మీ సిగ్గులు. దేహాభిమానంతో మిమ్మల్ని మీరు గోపనంగా (మరుగున ఉంచుకోవాలని) ఉంచాలనే ప్రయత్నం ఎందుకు చేస్తున్నారు? ఎటువంటి ఆవరణలు (అజ్ఞానపు వలువలు) లేకుండా నా వద్దకు రండి. నేను సర్వజ్ఞుడను అనే

సంగతి మీకు తెలియదా.

ఈ వస్త్రాపహరణ ప్రకరణంలోని పరమార్థం ఏమంటే తనకంటే అన్యమైన వస్తువు కలదనే అజ్ఞానం ఉన్నప్పుడు సిగ్గు, అభిమానం, అరిషడ్వర్గాలు కలిగి ఉంటాడు. అప్పుడు వస్త్రాచ్ఛాదనం కావాలి. బహుజన్మసుకృత విశేషంచేత లభించిన సద్గురూపదేశము వలన బ్రహ్మజ్ఞానం ఉదయించినప్పుడు తనకంటే వేరుగా వస్తువు ఉంది అనే బుద్ధి నశిస్తోంది. అప్పుడు వస్త్రం అనెడి అజ్ఞానం ఉండదు. అప్పుడు స్థావర జంగమాత్మక ప్రపంచంలోని సర్వ భూతాలకు ఈశ్వరభక్తి చేత నమస్కరించాలి. గోపికలనెడు బ్రహ్మవిద్యాభ్యాసులు శ్రీకృష్ణుడు అనే మహాచార్యుని బోధచేత అజ్ఞానాన్ని వదలి చేతులు జోడించి నమస్కరించారు అని అర్థం.

వ. అనిన విని మానవతులు దమలోన.

842

మ. వ్రతముల్ సేయుచు నొక్క మాటయిన నెవ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మానునట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా
ల తటన్యస్త కరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్.

843

తా ॥ అభిమానవతులైన ఆ యువతులు ఆ పురుషోత్తముని పలుకులు విన్నారు. వ్రతాలు చేస్తూ ఒక్కసారైనా ఏ పురుషోత్తముని తలిస్తే వ్రతభంగాలు పోతాయో అట్టి వరదుణ్ణి ఆ గోపస్త్రీలు వీక్షించారు. నేడు వస్త్రాలు విడిచి స్నానం చెయ్యడం మనం నోచిన నోములో జరిగిన నియమలోపం అని అనుకొంటూ జంకుగొని అందరు ఆ కృష్ణుని ఆనతిమేరకు అందమైన తమ హస్తాలను నుదుట నుంచుకొని నమస్కరించారు.

క. బాలలకు హస్తకీలిత, ఫాలలకు నితాంతశీత పవనాగమ నా

లోలలకు నంబరములు కృ, పాలుఁడు హరి యిచ్చె భక్తపాలకుఁ డగుటన్.

844

తా ॥ శ్రీకృష్ణుడు కృపాలుడు, భక్తజన పరిపాలకుడూను. అందువల్లనే నొసళ్ళయందు చేతులు మోడ్చి మిక్కిలి అధికంగా వీచే చలిగాలి చేత వణుకుతూ ఉన్న ఆ గొల్లపడుచులకు వస్త్రాలను ఇచ్చివేశాడు.

ఆ. 'చీర లపహరించి సిగ్గులు విడిపించి, పరిహసించి యైనఁ బరఁగ మనకు
ఘనుఁడు నోము కొఱఁతగాకుండ మ్రొక్కించె, ననుచు హరి నుతించి రబల లెల్ల.

845

తా ॥ ఆ గొల్లపడుచులందరూ, గొప్పవాడైన శ్రీకృష్ణుడు మన చీరలు దొంగిలించి మన అభిమానాన్ని తొలగించి అయినా మనకు నోముభంగం కాకుండా మ్రొక్కించుకున్నాడు అని పొగిడారు.

క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు సేయు కృత్యము, వల్లభలకు నెగ్గు గాదు; వల్లభ మధిపా!

846

తా ॥ ఓ రాజా! మనస్సు నొచ్చుకునేటట్లు మాట్లాడినా, వంచనలు చేసినా, పరిహాసం చేసినా కలవరపెట్టినా ప్రియురాండ్రకు ప్రియులు చేసే పనులు ఎంతో ప్రియంగానే ఉంటాయి.

వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగ లయ్యుఁ జలింపక తెప్పలిడక తప్పక చూడ నా ప్రోడ యెఱింగి చేరి వారి కిట్లనియె.

847

తా ॥ ఈ ప్రకారంగా కృష్ణుని చేత చీరలు పుచ్చుకొని కట్టుకొన్నారు. ఆ గొల్లపడుచులు

ఏమీ పలుకక తన మీదనే దృష్టి నిలిపి చూస్తూండగా వారి అభిప్రాయం తెలుసుకొన్న కృష్ణుడు వాళ్ళతో ఇలా అన్నాడు:

సీ. లక్షణవతులార! లజ్జించి చెప్పరు గాని మీ మర్మముల్ గానఁబడియె;
ననుఁగొల్వఁ జింతించినారు నా చేతను సత్యంబు మీ నోము సఫల మగును;
గామితార్థంబుల కలిమిఁ జెప్పఁగ నేల? ననుఁ గొల్వ ముక్తికి నడవవచ్చుఁ;
గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు

అ. నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొండని హరి, పల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్, మానసించు కొనుచు మందకడకు.

848

తా ॥ "ఓ గోపికలారా! మీరు నోటితో అడుగకపోయినా మీ అంతరంగంలో ఉన్న విషయం నేను తెలుసుకొన్నాను. మీరు నన్ను కొలువవలెనని యోచించారు కనుక నావల్ల మీ వ్రతం నెరవేరింది. ఇక మీరు కోరినవన్నీ కలుగుతాయి అని నేను వేరే చెప్పాల్సిన పనిలేదు. నన్ను కొలుస్తే తప్పక మోక్షము లభిస్తుంది. మోక్షేతరములైన ధర్మార్థకామ సుఖాల కొరకు గౌరీ వ్రతములు చేశారు. ఈ పిమ్మట రాత్రులందు మీరు నన్ను పొందగలరు. ఈ మాటను నమ్మి మీరు ఇండ్లకు వెళ్ళండి." అని కృష్ణుడు చెప్పగా ఆ గోపికలందరు తమ నోము ఫలించిందని అతని పాదపద్మాలను ధ్యానిస్తూ తత్తరపాటుతో వ్రేపల్లెకు వెళ్ళిపోయారు.

# 32. మునిభార్యలు అన్నము తీసికొని వచ్చి శ్రీకృషునికి ఆరగింపు చేయుట

వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనము దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ, జండకిరణుని యెండంబడి దండిచెడి తరులదండ నండగొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి కృష్ణ బల శ్రీదామ దేవప్రస్థ విశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లిట్లనిరి.

849

తా ॥ ఈ విధంగా గోపికలను అనుగ్రహించి పంపించి ఆవులను తోలుకొని బృందావనానికి దూరంగా పోయి మేపుతూ ఉన్నాడు కృష్ణుడు. వేసవి కాలపు ఎండలో చిక్కుపడి దేహాలలో బడలిక కలిగింది. వృక్షాల నీడను ఆసరా చేసుకొని నిలుచున్నారు. గొడుగులవలె నీడలు ఇస్తూన్న వృక్షాలను చూసి శ్రీకృష్ణుడు, బలరాముడు, శ్రీదాముడు, దేవప్రస్థుడు, విశాలుడు, అర్జునుడు మొదలైన వారితో తక్కిన గోపకులు ఇలా చెప్పారు:

మ. 'అపకారంబలు సేయ వెవ్వరికి నేకాంతంబులందుండు నా
తప శీతానిల వర్ష వారణములై త్వగ్గంధ నిర్యాస భ
స్మ పలాశాగ్ర మరందమూల కుసుమచ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే?'

850

తా ॥ "ఓ మిత్రులారా! ఈ వృక్షాలు ఎవ్వరికీ అపకారాలు చేయవు. పరుల సాంగత్యం లేని స్థితిలో ఉంటాయి. ఎండ, చలి, గాలి, వాన మొదలైనవి సోకకుండా ఆశ్రయించిన వారిని కాపాడుతాయి. బెరడు, గంధం, జిగురు, బూడిద, ఆకులు, చిగురులు, పూదేనె, వేర్లు, పువ్వులు, నీడ, పండ్లు... వీనిచేత అర్థులకు ఉపకారం చేస్తాయి. చూసారా!"

పరోపకారమే జీవనంగా కలవి వృక్షాలు. తమకంటూ ఏదీ మిగుల్చుకోక, పరులకై పలు విధాలుగా(పళ్ళు, పూలు, ఆకులు........... ఇత్యాదులు) ఉపయోగపడుతున్నాయి. అందుకే నీడను ఇస్తూ సేద తీర్చే ఆ వృక్షాల యొక్క ప్రాధాన్యత ఈ పద్యంలో చెప్పబడింది. వృక్షో రక్షతి రక్షితఃఅన్నది నాటికీ, నేటికీ గుర్తు ఉంచుకోవలసిన సత్యం!

వ. అని చిగురాకు పువ్వు గాయ పండు తండంబుల వ్రేఁగున వీఁగిన తరువుల నడిమి తెరువునం బసుల దాఁటుల దాఁటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లని నీరు ద్రావించి, తత్సమీపంబున మేపుచు, వల్లవులెల్ల మూఁకలు గొని, యాఁకలి గొంటిమని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె.

851

తా ॥ అని ఇలా పలుకుతూ చిగురు, ఆకు, పువ్వు, కాయ, పండు మొదలైన వాని బరువుకు వంగిన కొమ్మలుగల వృక్షముల నడిమి దారిని ఆవుల గుంపులను ఆ వనం దాటి తోలుకొని పోయి యమునా నదికి వెళ్ళారు. అక్కడ పెద్దపెద్ద మడుగులలో చల్లని నీరు త్రాగించి ఆ నదీ తీరంలో పశువులను మేపారు. గొల్లపిల్లలందరూ గుంపుగూడి ఆకలిగా ఉందని కృష్ణబలరాములతో మనవి చేశారు. కృష్ణుడు అప్పుడు తనకు భక్తురాండ్రైన బ్రాహ్మణ భార్యలయందు అనుగ్రహంతో ఆ గొల్లలవైపు తిరిగి ఇలా అన్నాడు:

సీ. వల్లవులార! యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు
నరుగుట కాంగిరసాహ్వయ సత్త్రంబు సలుపుచునున్నారు సనుఁడు మీరు
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు వెట్టెద రనుచుఁ బలుక
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ, ధర్మవిదులార! యర్థిప్రదాతలార!
పెట్టుఁ డన్నంబు; శ్రాంతులఁ బిలిచి తెచ్చి, పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్దలెల్ల.

తా ॥ "ఓ గోపాలులారా! ఈ వనంలో వేదవేద్యులైన బ్రాహ్మణులు కొందరున్నారు. వారు స్వర్గానికి పోదలచి, ఆంగిరసము అను యజ్ఞమును చేస్తున్నారు. మీరు వారి వద్దకు పోయి మా పేర్లు చెప్పి మంచి మాటలతో అన్నం అడిగితే, వారు పెడతారు" అని చెప్పి పంపేసరికి వారు పోయి బ్రాహ్మణులను చూసి నమస్కరించారు. నమస్కరించి, "సమస్త ధర్మములను తెలిసి వారు, అర్థులు కోరివచ్చిన ఇచ్చేవారు అయిన ఓ బ్రాహ్మణులారా! బలరామకృష్ణులు ఆవులను మేపుతూ ఆకలితో అలసి, అన్నం పెట్టించుకొని రమ్మని మమ్ములను పంపారు. మీబోటి పెద్దలు ఆకలిగొన్న వారిని వెదకి పిలుచుకొని వచ్చి అన్నం పెడతారు గదా! ఇప్పుడు ఆకలితో ఉన్న మాకు అన్నం పెట్టండి" అని అడిగారు.

క. 'ఘన దీక్షితునకు నైనం, జనుఁ గుడువఁగఁ; బశువధంబు సౌత్రామణియుం
జనిన వెనుక దోషము లే, దనఘాత్మకులార! పెట్టుఁ డన్నము మాకున్.'

853

తా ॥ "ఓ బ్రాహ్మణోత్తములారా! యజ్ఞంలో పశువధ, సౌత్రామణీ హోమం కాకముందు ఎవరికైనా అన్నం పెడితే దోషం. అవి అయిన పిమ్మట ఘనదీక్షితునకైననూ భుజిస్తే దోషం లేదు. కనుక మాకు అన్నం పెట్టండి" అని అడిగారు.

వ. అని గోపకులు పలికిన.

854

మ. క్రతువున్ మంత్రము దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁడట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు
ర్మతులై యన్నము లేదు లేదనిరి సమ్మానక్రియాశూన్యులై.

855

తా ॥ అని గోపకులు పలుకగా, యజ్ఞము, మంత్రము (ఆ యజ్ఞమును నడుపునట్టి మంత్రము) తంత్రము (నడుపునట్టి రీతియు), ధనం, కాలం, దేశం, దేవత, ధర్మం మరియు తక్కినవన్నీ ఎవరియందు ఉన్నాయో ఆ సర్వేశ్వరుడే తమ్ము అన్నం పెట్టమని పంపాడని వారు ఊహించలేక పోయారు. అజ్ఞానంతో ఆ బ్రాహ్మణులు గోపబాలురకు ఇక్కడ అన్నం లేదు పొమ్మని, మన్నన లేకుండా అన్నారు.

వ. అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు 'మీరయ్యార్యుల నడుగక, వారి భార్యలకు మా రాకఁ జెప్పుం; దన్నంబు వెట్టెద' రని పంచిన వారలు సని బ్రాహ్మణ సతుల దర్శించి నమస్కరించి సంపూజితులయి యిట్లనిరి.

856

తా ॥ అంత ఆ గోపాలురు నిరాశతో తిరిగి వచ్చి కృష్ణునితో చెప్పారు. లోకధర్మానుసారి అయిన కృష్ణుడు, 'మీరు ఆ బ్రాహ్మణులను అడగకండి, వారి భార్యలకు మా రాక తెలియచెప్పి అడిగితే అన్నం పెడతారు' అని చెప్పగా వారు మళ్ళీ వెళ్ళారు. బ్రాహ్మణ సతులను దర్శించి నమస్కరించారు. వారిచేత చక్కగా ఆదరించబడినవారై ఇలా అన్నారు:

క. 'గోవుల మేపుచు నాఁకొని, గోవిందుం డన్న మడిగికొని రం డని మ
మ్మీ వేళం బుత్తెంచెను, ధీవిలసితలార! రండు; తెం డన్నంబుల్.'

857

తా ॥ "ఓ గుణాత్ములారా! కృష్ణుడు ఆవులను మేపుతూ వచ్చి ఆకలితో ఉన్నాడు. మిమ్మల్ని అన్నం అడిగి తెమ్మని మమ్ము పంపించాడు. అందుచేత మీరు తొందరగా అన్నాన్ని పెట్టండి."

వ. అనిన విని గోవింద సందర్శన కుతూహలలై ధరణీసుర సుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులు గలిగి, సంస్కార సంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడుకొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున.

858

తా ॥ అని గోపబాలకులు అడుగగానే, ఆ బ్రాహ్మణ స్త్రీలు శ్రీకృష్ణుణ్ణి చూడాలనే కుతూహలం కలవారై ఆనందాతిశయంతో తొట్రుపాటుపడ్డారు. భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయాలనే అయిదు విధాల పరిశుద్ధములైన ఆహారాన్ని పాత్రలలో నింపుకొన్నారు. మిక్కుటమైన వేగంతో, సముద్రమును చేరేందుకు తొందరపడే నదులలాగా బయలుదేరారు.

క. బిడ్డలు మగలును భ్రాతలు, నడ్డము చని వల దనంగ నటు దలఁదని మా
ఱొడ్డుచు జగదీశ్వరునకు, జడ్డన నన్నంబు గొనుచుఁ జని రా సుదతుల్.

859

తా ॥ బిడ్డలు, భర్తలు, తోడబుట్టువులు, వీరంతా కలిసి మీరిలా వెళ్ళడం తగదని దారికి అడ్డు రాగా, ఎదిరించి పలుకుతూ శీఘ్రంగా ఆ బ్రాహ్మణ స్త్రీలు ఆ సుదతులు అన్నం తీసుకొనిపోయారు.

వ. చని యమునా సమీపంబున నవపల్లవాతిరేకంబును విగత వనచర శోకంబును నైన యశోకంబు క్రింద నిర్మలస్థలంబున.

860

తా ॥ ఇట్లా వెళ్ళి యమునానదీ తీరంలో, లేతచిగుళ్ళతో నిండి, అడవిలో సంచరించే వారి ఆయాసం తీర్చే అశోక వృక్షం నీడలో, ఒక నిర్మల ప్రదేశంలో ఉన్న ఆ నందనందనుణ్ణి సందర్శించారు.

సీ. ఒక చెలికానిపై నొకచేయి సాఁచి వే ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు సెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచ చుంగులు వుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడి వన్నియ గల పటమువాని
నొఁదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన దట్టంపుఁ బింఛెపు దండవాని

తే. రాజితోత్పల కర్ణపూరములవాని, మహిత పల్లవ పుష్పదామములవాని
భువన మోహన నటవేషభూతివానిఁ, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ.

861

తా ॥ అప్పుడు ఆ శ్రీకృష్ణుడు ఎలా ఉన్నాడు అంటే, ఒక స్నేహితుని మీద ఒక చెయ్యివేసి, వేరొక చేతిలో వేడుకగా కమలాన్ని త్రిప్పుతున్నాడు. సిగముడికి అందని తలవెంట్రుకలు చెక్కిళ్ళమీద నృత్యం చేస్తున్నాయి. కొంచెం వ్రేలాడేటట్లు కుచ్చెళ్ళు విడిచి అందంగా కట్టుకున్న బంగారు వన్నెగల వస్త్రం ఎంతో రమణీయంగా ఉంది. శిరస్సు చుట్టి వచ్చేటట్లు అనువుగా చుట్టిన నెమలి పింఛపు దండ చాలా అందంగా ఉంది. ప్రకాశించు కలువలు కర్ణకుండలాలుగా మెరిసిపోతున్నాయి. మేలైన చిగురుల, పువ్వుల దండలు మెడలో అత్యంత రమణీయంగా ఉన్నాయి. ఇట్టి భువన మోహనమైన నటవేషంలో ఉన్న శ్రీకృష్ణుని బ్రాహ్మణ కాంతలు కన్నుల కరవుతీరా చూసారు.

క. కని లోచనరంధ్రంబుల, మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి, తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్.

862

తా ॥ చూసి, కన్నులనే ద్వారాలగుండా కృష్ణుని మనోహరాకృతిని లోపలికి తీసుకొని, ప్రతిష్ఠించుకున్నారు. ఆపై ఆ స్త్రీలు కొరతలేని మనస్సులతో హృదయంలో పుట్టిన త్రివిధ తాపాలు నశించేటట్లు హృదయంలో ఆలింగనం చేసుకున్నారు.

వ. ఇ వ్విధంబున.

863

క. వారిత సర్వస్పృహలై, వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు వొడగని, వారికి నిట్లనియె నగి యవారితదృష్టిన్.

864

తా ॥ ఈ విధంగా ఎల్లకోరికలు మానుకొని తనను చూడవచ్చిన ఆ బ్రాహ్మణ భార్యలందరినీ చల్లని చూపులతో చూసి నవ్వుతూ శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

శా. 'కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే! యేమి గా
వింతున్ మీ? కిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచి నా
రెంతో వేడుకతో; నెఱుంగుదురు నిర్హేతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్.

865

తా ॥ "ఓ స్త్రీరత్నములారా! మీ గృహాల్లో అందరికీ శుభమే కదా! నాయందు అనన్య భక్తిగల మీకు ప్రత్యుపకారం నేను ఏం చెయ్యగలను. ఇలా రండి. మమ్ములను చూడాలని ఎంతో వేడుకతో వచ్చారు. మీరిలా వస్తారని నాకు తెలుసు. మీ వలెనే బుద్ధిమంతులు నన్ను చేరి, నా సేవచేసి సర్వమును పొందుతారు గదా!

వ. కావున గృహస్థులైన మీ పతులు మిమ్మెం గూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేసెదరు; మీరు యాగవాటంబునకుం జనుం' డనిన విప్రభార్య లిట్లనిరి.

866

తా ॥ కనుక గృహస్థులైన మీ భర్తలు మీతో కలిసి యజ్ఞాన్ని పూర్తి చెయ్యాలి. మీరు

యజ్ఞశాలకు వెళ్ళండి" అని కృష్ణుడు చెప్పేసరికి ఆ విప్రుల యొక్క భార్యలు ఇట్లా అన్నారు:

మ. 'తగునే మాధవ! యిట్టి వాఁడి పలుకుల్? ధర్మంబులే మా యెడన్?
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీ యంఘ్రులు సేరినార; మటఁబోఁ జేకొందురే వార? లా
పగి దే మొల్లము; కింకరీజనులఁగా భావించి రక్షింపవే!'

867

తా ॥ "ఓ కృష్ణా! ఇలాంటి కఠినమైన మాటలు మాట్లాడటం నీకు తగునా? మా పట్ల ఇది ధర్మమా? భర్తలు, బిడ్డలు, సోదరులు, తల్లిదండ్రులు వీళ్ళంతా మమ్ములను అడ్డుకున్నా ఎంతో ఆసక్తితో నీ పాదాలచెంతకు చేరాము. అక్కడకు వెళితే వాళ్ళు మమ్మల్ని రానిస్తారా? ఇక ఇళ్ళకు పోవడానికి మేం అంగీకరించం. మమ్ములను నీ దాసజనులుగా భావించి రక్షించు."

వ. అనిన జగదీశ్వరుండు.

868

సీ. నా సమీపమున నున్నారంచు నలుగరు బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ము దేవతలైన మెత్తు రంగనలార! నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగ సంజనకంబు గాదు; ముక్తి ప్రదాయకము; నా కీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మ బంధ దేహంబులఁ బాసి మీరు
తే. మానసంబులు నాయందు మరగఁజేసి, నన్నుఁ జేరెద రటమీఁద; నమ్ముఁ' డనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు, లాప్తవర్గంబుతో హరి యారగించె.

869

తా ॥ దానికి శ్రీకృష్ణుడిలా అన్నాడు: "ఓ ద్విజపత్నులారా! మీ చుట్టాలు, సోదరులు, పతులు, సుతులు నా వద్దకు వచ్చారని కోపింపరు. దేవతలు కూడ మిమ్ములను

మెచ్చుకుంటారు. నా సాంగత్యము ఎల్ల మానవులకు మోక్షాన్ని ఇస్తుంది. నరుల శరీరసంగం వలె సౌఖ్యానురాగాలు ఇచ్చేది కాదు. మీరు నన్ను కొనియాడుట చేతనూ, నన్ను ధ్యానం చేయటం చేతనూ, నన్ను చూడటం వల్లనూ, నా గురించి వినటం వల్లనూ కర్మబంధకములయిన ఈ దేహాలను విడిచి నాయందు ఆసక్తమైన మానసములతో నాలో చేరగలరు. ఇది నిజం. నా మాట నమ్మండి" అని చెప్పి వారిని సమాధానపరచి వారు తెచ్చిన అన్నమును, సకల పదార్థాలను ఆప్తులైన గొల్లపిల్లలతో కూడి శ్రీకృష్ణుడు ఆరగించాడు.

క. పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునం
బరఁగెద రఁట! తుది సాక్షా, త్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో?

870

తా ॥ ఓ రాజా! పరమేశ్వరార్పణంగా పరులకు అన్నం పెట్టిన పక్షంలో సర్వోత్కృష్టమైన వైకుంఠ స్థానాన్ని పొందుతారు. ఇక ప్రత్యక్షంగా పరమేశ్వరునకే భక్తి పూర్వకంగా అన్నం పెట్టిన వారు ఎట్టి ఫలాన్ని పొందుతారో విచారించు.

వ. ఇట్లు సర్వేశ్వరుం డయిన హరికి భిక్ష యిడి తమ తమ భార్య లతని వలనం గృతార్థ లగుట యెఱింగి భూసురవరులు తమలో నిట్లనిరి.

871

తా ॥ ఈ విధంగా కృష్ణునికి అన్నం తీసుకొనిపోయి, పెట్టి కృతార్థులైన తమ భార్యల సంగతి తెలుసుకొని ఆ బ్రాహ్మణులు తమలో తామిట్లు అనుకున్నారు:

చ. 'కటకట! మోసపోయితిమి; కాంతల పాటియు బుద్ధి లేదు; నేఁ
డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ముల; మేము కల్మషో
ద్భటులము; విష్ణు దూరగుల ప్రాజ్ఞత లేల? తపంబు లేల? ప
ర్యటనము లేల? శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే?

తా ॥ "అయ్యయ్యో! మోసపోతిమే! మన ఆడవారికి వున్న బుద్ధి మనకు లేకపోయెనే! నేడు ఇక్కడకు వచ్చిన కృష్ణ దర్శనం చేద్దామనే సంకల్పం కలగకపోయెనే! మనం దుష్టచిత్తులము, పాపముల చేత గర్వించిన వారము అయ్యామే! మనవలె విష్ణు సామీప్యాన్ని పొందలేని వాని వివేకం, తపస్సు, ప్రాజ్ఞత, పర్యటనములు, శీలం, యాగాలు ఇవన్నీ వృథాయే కదా!

క. జపహోమాధ్యయనంబులు, దపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృపఁ బడసి, రన్ని గలిగియుఁ, జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా!

873

తా ॥ అయ్యో! జపం, తపం, హోమం, అధ్యయనం, వ్రతములు, ఇవేమీ లేకపోయినా స్త్రీలు హరి యొక్క కృపకు పాత్రులయ్యారు. ఇవన్నీ ఉండి కూడా భక్తిలేని కారణంగా మనం చంచలత్వాన్ని పొందాము.

క. సురగురులగు యోగీంద్రుల, నరుదుగ మోహితులఁ జేయు హరిమాయ మమున్
నరగురుల మూఢవిప్రుల, నురవడి మోహితులఁ జేయ నోపక యున్నే?

874

తా ॥ దేవతా గురువులగు యోగీంద్రులను సైతం, ఆశ్చర్యకరంగా హరిమాయ అజ్ఞానంలో ముంచెత్తుతుంది. అటువంటిది నరులకు గురువులైనా, జ్ఞానహీనులైన బ్రాహ్మణులను అతి శీఘ్రంగా మోహితులను చెయ్యడంలో ఆశ్చర్యం ఏముంది!

మ. క్రతువుల్ ధర్మము మంత్ర తంత్ర ధనముల్ గాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁడిట్టి సర్వేశుఁ డీ

క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్'.

875

తా ॥ లోకంలో యజ్ఞాలు, ధర్మములు, మంత్రములు, తంత్రములు, ధనము, కాలము, దేశము, దేవత, అగ్నులు, బ్రాహ్మణులు ఏ మహా పురుషుని స్వరూపాలో అటువంటి సర్వేశ్వరుడే ఈ భూమిని ఉద్ధరించడం కోసం ఇలా కృష్ణరూపంలో అవతరించాడు. ఈ విషయాన్ని మనం తెలుసుకొనలేక పోతిమి. అయినా ఇప్పుడు సర్వానికి కర్తయైనవాడు, భూమిని ఉద్ధరించువాడు, రాక్షసులను సంహరించేవాడు శ్రీలక్ష్మీపతియు అయిన ఆ శ్రీకృష్ణునకు మేము మ్రొక్కుతున్నాం."

# 33. ఇంద్రయాగము చేయుటకై శ్రీకృష్ణునితో నందాదుల సమాలోచన

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపుమని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులయి బలకృష్ణసందర్శనంబు సేయంజనరై; రంత నక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సేయం దలంచి తన కడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నమస్కరించి నందున కిట్లనియె.

876

తా ॥ అని ఆ విప్రులు అనేక విధాలుగా పశ్చాత్తాపపడి శ్రీకృష్ణమూర్తిని ధ్యానిస్తూ 'స్వామీ! మా అపరాధాన్ని క్షమించమ' ని మ్రొక్కినా, కంసుని భయంచేత కృష్ణ సందర్శనం చేయకుండానే వెళ్ళిపోయారు. పిమ్మట యమునా తీరంలో ఉన్న కృష్ణుడు ఇంద్రయాగం చెయ్యాలని తనతో చెప్పవచ్చిన నందాది గోపవృద్ధులను చూసి నందునితో ఇట్లా అన్నాడు:

సీ. యాగంబు సేయంగ నర్థించి వచ్చితి; రీ యాగమున ఫల మేమి గలుగు?
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి యెవ్వఁడు? సాధన మెంత వలయు?
శాస్త్రీయమో, జనాచారమో కార్యంబు? వైరుల కెఱిఁగింపవలదు గాని
యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ

ఆ. బగయుఁ జెలిమి లేక పరఁగిన మిముబోఁటి, మంచివారి కేల మంతనంబు?
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే, తాత! వాక్సుధాప్రదాత వగుచు.

877

తా ॥ "నాయనా! మీరు యాగం చేయ్యడానికి వచ్చారుగదా! ఈ యాగానికి ఫలం ఏమిటి? దీనికి అధిదేవత ఎవరు? ఉపకరణసముదాయం ఏ మాత్రం కావాలి? ఈ యాగం శాస్త్రీయమా? లోకాచారంలో వచ్చినదా? వివరాలను శత్రువులకు చెప్పకూడదు గాని మిత్రులతో

చెప్పవచ్చు. తెలిసి ఏ పని చేసినా, కోరికలన్నీ సిద్ధిస్తాయి. విరోధం, స్నేహం అనే భేదం లేని మీ వంటి యోగ్యులకు రహస్యాలంటూ ఏమీ లేవు. తండ్రీ! అమృతమయ వాక్కులతో ఈ యజ్ఞం చెయ్యడంలో మీ ఉద్దేశ్యం నాకు చెప్పవలసింది."

వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె.

878

తా ॥ అని అడిగిన, అన్ని విషయాలు తెలిసిన కృష్ణునితో తండ్రి ఇట్లా అన్నాడు:

సీ. పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తు లగుచు నున్న
మేఘబృందంబులు మేదినీతలముపై నతని పంపున భూతహర్షణముగ
జలములు గురియుఁ, దజ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబు లా పంట దమకు
ధర్మార్థకామ ప్రదాయకంబుగ లోకు లెల్లను బ్రదుకుదు; రింత యెఱిఁగి

తే. మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చుకొఱకు, నింద్రయాగము సేయుదు రెల్ల నృపులు
కామ లోభ భయ ద్వేష కలితు లగుచుఁ, జేయ కుండిన నశుభంబు సెందుఁ బుత్త్ర!

879

తా ॥ "కుమారా! వర్షానికి అధిదేవత పర్జన్యుడు. అతడు గొప్పవాడు. అతనికి భగవంతుడు అయిన ఇంద్రుడు ఈ యాగానికి అధిపతి. అతని ఆజ్ఞచేతనే అతనికి ప్రియమైన ఆకృతులను వహించిన మేఘములు భూమిమీద జలమును కురిపిస్తాయి. ఆ జలప్రవాహం చేత భూమి తడిసి అన్ని పైరులు పండుతాయి. ఆ పండిన ధాన్యములచేత లోకంలోని జనులు ధర్మార్థకామాలను పొంది బ్రతుకుతారు. ఈ సంగతి తెలిసి ఇంద్రునికి ప్రీతి కలిగించడం కోసం రాజులందరు ఇంద్రయాగములు చేస్తూంటారు. అలా చేయక కామము, లోభము, భయము, ద్వేషము వీటిచేత పరవశులై ఉండేవారికి తప్పక కీడు కలుగుతుంది.

వ. అదియునుం గాక.

880

ఆ. మఖము సేయ వజ్రి మది సంతసించును, వజ్రి సంతసింప వాన గురియు
వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుఁగును, గసవు మేసి ధేనుగణము బ్రదుకు.

881

తా ॥ అంతే గాకుండా యాగం చేస్తే ఇంద్రుడు సంతోషిస్తాడు. ఇంద్రుడు సంతోషిస్తే వాన కురుస్తుంది. వాన కురిస్తే భూమిలో కసవు పెరుగుతుంది. ఆ కసవును మేసి పశువులు జీవిస్తాయి. అందుకని యజ్ఞం చెయ్యాలి.

క. ధేనువులు బ్రదికెనేనిన్, మానదు; ఘనమైన పాఁడి మందలఁ గలుగున్
మానుగను బాఁడి గలిగిన, మానవులును సురలఁ దనిపి మనుదురు పుత్రా!

882

తా ॥ నాయనా! ఆవులు చక్కగా మేసి వర్ధిల్లితేనే పాడి సమృద్ధిగా ఉంటుంది. పాడి సమృద్ధిగా ఉన్నప్పుడే మనుష్యులు, దేవతలు తృప్తిగా పాలు పెరుగు నెయ్యి మొదలైన వాటిని సుఖంగా అనుభవిస్తారు.”

వ. అని యిట్లు నొడివిన నందుని వచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె.

883

తా ॥ అని పలికిన నందుని పలుకులు విని రాక్షస శిక్షకుడైన శ్రీకృష్ణుడు ఇంద్రునకు కోపం వచ్చేటట్లు తండ్రితో ఇట్లా అన్నాడు:

క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మముననె వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడుం

గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

884

తా ॥ “ప్రాణి ఏదైనా తన పూర్వజన్మ కర్మఫలాన్ని అనుసరించి భూమిలో పుడుతుంది. ఆ కర్మ ఫలాన్ని అనుసరించి వర్ధిల్లుతుంది, నశిస్తుంది. కనుక జనులందరకీ కర్మయే దేవత. కర్మయే సుఖదుఃఖాలకు కారణం అవుతోంది.

క. కర్మములకుఁ దగు ఫలములు, కర్ములకు నిడంగ రాజు గాని సదా ని
ష్కర్ముఁడగు నీశ్వరుండును, గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా!

885

తా ॥ ఓ మహాత్మా! లోకంలో ఎవడు ఏ కర్మ మునుపు చేశాడో అందుకు తగిన ఫలాన్ని అనుభవిస్తాడు. ఆ ఫలాన్ని అనుసరించి కర్మములు మొదలైన వాటిని చేసినప్పుడు ఈశ్వరుడు కర్త అవుతాడు కాని కర్మవిహీనునికి ఏ ఫలం ఇవ్వడానికి కర్తగాడు కదా!

వ. కావునఁ గర్మానుయాతంబు లయిన భూతంబులకుఁ బురుహూతునివలన భీతి యేటికి? పురాతనజన్మ సంస్కారంబులు గుప్పలు గొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁ, డితరులం జెప్పనేల? సురాసుర నరానీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది; సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురుతను దేహంబులం జొచ్చి వెడలు; నొజ్జ, వేలుపు, నెచ్చెలి, పగఱు, చుట్టంబులు, కర్మంబులు; జీవుండు కర్మంబు తోడన వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు. కర్మంబునం బ్రదుకుచు నితరసేవ సేయుట సతి పతిని విడిచి జారుం జేరిన చందంబగు; విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్య కృషికుసీద గోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రదుకు; సత్త్వ రజ స్తమో గుణంబు లుత్పత్తి స్థితి లయ కారణంబు; లందు రజంబున జగంబు జన్మించు;

రజోగుణ ప్రేరితంబు లయి మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజావృద్ధి యగు; నింద్రుం డేమి సేయంగల వాఁ డదియునుం గాక.

886

తా ॥ కనుక, కర్మానుసారులై ప్రవర్తించే ప్రాణులు ఇంద్రుని వల్ల భయపడవలసిన పని లేదు. పూర్వ జన్మ కృత కర్మముల వల్ల కలిగే సుఖదుఃఖాలను అనుభవింపక తప్పించుకోవడానికి ఈశ్వరుడు కూడా సమర్థుడు కాదు. ఇక ఇతరులు తప్పించుకోవాలంటే ఎంతటి వారు? దేవతలు, దానవులు మనుష్యులు మొదలుగా గల ప్రాణిసమూహంతో కూడిన ఈ ప్రపంచం తన స్వభావానికి అధీనమై ఉందనడంలో సందేహం లేదు. దేహధారి అయినవాడు మనుష్యాదులైన గొప్ప దేహాలను, చీమ మొదలైన సూక్ష్మదేహాలను పొందుతూ, విడుస్తూ ఉంటాడు. గురువు, దైవం, మిత్రుడు, పగవాడు, చుట్టము మొదలుగాగల సర్వమునకు కర్మయే ఆధారం. కనుక కర్మయందే వర్తిస్తాడు జీవుడు. కర్మయే జీవునికి దేవుడు. కర్మచేత జీవించే జీవుడు ఆ కర్మను విడిచి మరొక దానిని కొలవటం మగనిని విడిచి జారపురుషుని యందు ఆసక్త అయిన స్త్రీ విధంగానే ఉంటుంది.

బ్రాహ్మణుడు వేదవిహిత కర్మలను చేస్తూ జీవిస్తాడు; రాజు ప్రజలను పాలించుట యందును, వైశ్యుడు వర్తకము, సేద్యము, సొమ్ము వడ్డీకిచ్చుట, గోరక్షణయు వంటి పనులయందునూ, శూద్రుడు అగ్రజన్ములను సేవించుట యందును వర్తించి జీవింతురు. లోకము యొక్క సృష్టి స్థితి లయములు రజస్సు, సత్వము, తమస్సు అనే మూడుగుణముల చేత అవుతుంది. వాటిలో రజోగుణం చేత జగత్తు జన్మిస్తుంది. రజోగుణం వల్లనే మేఘాలు వర్షిస్తాయి. ఆ వాన చేత ప్రజలు వర్ధిల్లుదురు. ఇందులో ఇంద్రుడు చేసింది ఏముంది?

శా. కోపింపన్ బనిలేదు శక్రునికిఁ, దాఁ గోపించుఁగా కేమి సం
క్షేపం బయ్యెడి దేమి? పట్టణములుం గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్

గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్?

887

తా ॥ ఒకవేళ చేయకపోతే, మనమీద ఇంద్రుడు కోపించవలసిన పనిలేదు. ఒకవేళ కోపిస్తే కోపించనీ! అతని కోపం వల్ల మనకు పోయేదేముంది? మనం కొండలను, అడవులును, ఉనికిగా చేసుకొని పశువులను కాచుకుంటూ ఉన్నాము. ఇలా ఉండుట వలన పట్టణాలు, ఇండ్లు, దేశములు, వ్యాపారాలు మొదలైనవి అన్నీ చేజారుతాయనే భయం మనకు ఏమీ లేదు, కనుక మనము ఇంద్రునికి భయపడాల్సిన పనిలేదు.

సర్వత్రా పరమాత్మను గాంచగలిగిన వారికి ఇంద్రియాలకు అధిపతియైన వానిని చూసి భయపడే అవసరం ఏమి ఉండగలదు! పరిమితభావన గలవారికి భయం ఉంటుంది గానీ విశ్వభావన కలిగినవారికి దేనిగురించి అయినా జంకవలసిన అవసరం లేదు కదా!

సీ. పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచి బుద్ధి
యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు
పాయసంబులు నపూపములు సైఁదపుఁబిండి వంటలుఁ బప్పును వలయునట్టి
ఫలశాకములు వండఁబంపుండు హోమంబు సేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి

తే. బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు, నచలులై పూజ లొనరింపుఁ డచలమునకు
నధమ చండాల శునక సంహతికిఁ దగిన, భక్ష్యముల నిండు కసవులు పసుల కిండు.

888

తా ॥ దీనికి బదులుగా ఆవులకు, కొండలకు, బ్రాహ్మణులకు ప్రీతిగా యజ్ఞం చెయ్యటం మంచిది. కనుక మీరు ఇంద్రయాగం చేయుటకు ఏమేమి వస్తువులు తీసుకొని వస్తారో అవన్నీ తీసుకొని రండి. పప్పు, పరమాన్నం, అప్పాలు, గోధుమ పిండి వంటలు, కాయగూరలు మొదలైన పదార్థములను అన్నీ వండించండి. హోమము చేయించి బ్రాహ్మణులకు

గోదానములను, దక్షిణలను ఇచ్చి షడ్రసోపేతంగా భోజనములు పెట్టించండి, అచంచల భక్తితో కొండకు పూజ చెయ్యండి. కుక్కలు మొదలైన వాటికి పెట్టదగిన భక్ష్యపదార్థములను పెట్టండి, పశువులకు కసవులు వెయ్యండి.

శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్
సంధిల్లన్, గిరిగో ద్విజానల నమస్కారంబు గావింపుఁ డో
జం ధర్మంబని తోఁచెనేని జనకా! జన్మంబు ధన్యం బగున్.

889

తా ॥ తండ్రీ! నా మాట ధర్మంగా అనిపిస్తే, సుగంధ ద్రవ్యాలు, ఆభరణాలు, వస్త్రాలు అలంకారం చేసుకొని బంధువులు, మీరు సంతుష్టిగా భోజనం చేసి, వేడుకతో పర్వతానికి, గోవులకు, బ్రాహ్మణులకు, అగ్నికి నమస్కారాలు చెయ్యండి. మీ కోరికలు అన్నీ నెరవేరుతాయి. మీ జన్మలు సఫలమవుతాయి."

వ. అని మఱియు నిలింపపతి సొంపు దింపుతలంపున ని మ్మఖంబు దనకు సమ్మతంబని గోవిందుండు పలికిన, నందాదులు మేలు మే లని తద్వచన ప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసపు లొసంగి, రప్పుడు.

890

తా ॥ అని చెప్పి ఇంకను ఇంద్రుని గొప్పను తక్కువ చెయ్యాలనే తలంపుతో, ఇటువంటి యజ్ఞమే నాకు ఇష్టమైనదని చెప్పాడు. నందుడు మొదలుగా గల గొల్లలందరూ బాగుబాగు అని ఒప్పుకొన్నారు. కృష్ణుని మాట చొప్పున పుణ్యాహవాచనాలు, బ్రాహ్మణ భోజనాలు చేయించి, పశువులకు కసువులు వేశారు.

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజంబైన రూపంబుతో
నకలంకస్థితినుండి శైలమిదె మీ రర్చింప రం' డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండ పూజించి గో
పక దత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్.

891

తా ॥ గోపాలకులంతా కృష్ణుడు ఇక్కడే ఉన్నాడు అని అనుకునేలా వారితో పాటు బాలకరూపంగా, నిష్కళంకంగా ఉన్నాడు. అంతలోనే, ఇదిగో పర్వతం! దీనిని పూజిద్దాము, మీరందరూ రండి! అని వారితో ఉంటూనే, పర్వతాకృతిని దాల్చి వారితో పాటుగా తానునూ ఆ గిరికి పూజలొనర్చాడు. ఆ గిరిరూపంలోనే వారు నివేదించిన భక్ష్యాలను ఆరగించాడు.

మ. 'వినుఁ డీ శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్
మన మొప్పించిన వాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో
ననుకంపాతిశయంబు సేసె మనపై నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారు మందారుఁడై.

892

తా ॥ తనను సేవించు వారికి, కల్పవృక్షమువలె కోరినవాటిని ఇచ్చునట్టి ఆ శ్రీకృష్ణుడు గొల్లవాండ్రతో కూడి, "ఓ గొల్లలారా! విన్నారా! ఈ కొండ కామరూపిగా ఉంది. మనం నైవేద్యంగా పెట్టిన నేయి అన్నము ఆరగించి, మనలను ఆదరించి మనపై మిక్కిలి దయను చూపుతోంది. ఇది దుర్జనులను బాధించి మనలను కాపాడుతుంది" అని చెబుతూ వారితోపాటు తానుకూడా ఆ కొండకు నమస్కరించాడు.

వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాద వచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు

సేసి, రా సమయంబున.

893

క. గుఱ్ఱముల పరువు మెచ్చని, నఱ్ఱులఁ గట్టిన రథంబు నందప్రముఖుల్
గుఱ్ఱల యార్పులు సెలఁగఁగఁ, దొఱ్ఱుల గమి వెంట నంటఁ దోలి రిలేశా!

894

తా ॥ ఈ విధంగా గొల్లలందరు కృష్ణునితో కూడి ఆ గోవర్ధన గిరికి పూజానైవేద్యాలు సమర్పించారు. ఆవుల మందలను ముందు పెట్టుకొని బ్రాహ్మణులు దీవించుచుండగా ఆ గిరికి ప్రదక్షిణం చేశారు. ఓ రాజా! చిన్నవాళ్ళు ఉత్సాహంతో కేకలు పెడుతుండగా, గుఱ్ఱాల వేగాన్ని మించి పరుగులు పెడుతున్న ఎడ్ల బళ్ళలో నందుడు మొదలైన వారు ఎక్కి, వెనుక ఆవుల మందలను తోలించారు.

క. పాటించి గానవిద్యా, పాటవమునఁ దేరు లెక్కి బహుతానములం
బాటలగంధులు కృష్ణునిఁ, బాటలఁ బాడిరి విరోధిపాటనుఁ డనుచున్.

895

తా ॥ మంచి దేహ పరిమళం కలవారైన గోపస్త్రీలు ఆవుల మందల వెంట తోలబడిన రథములనెక్కి తమ గానవిద్యా పాటవంతో రాగములను ఆలపిస్తూ కృష్ణుడు శత్రు సంహారకుడు అనే అర్థం వచ్చే పాటలను పాడారు.

క. కుంద నిభాపీనంబులు, మండితవర్ణములు వివిధమహితాకృతులున్
నిండిన కడుపులు గన్నుల, పండువులుగఁ బాడి కుఱ్ఱిపదువులు నడచెన్.

896

తా ॥ కడవలను పోలిన పొదుగులు, అలంకరింపబడిన వన్నెలును, నానావిధములైన

పూజ్యములైన ఆకారాలు, నిండిన కడుపులు కల పాడి ఆవుల మందలు నేత్రానంద పర్వంగా ముందుకు సాగుతున్నాయి.

క. పొగ రెక్కిన మూఁపురములు;, దెగ గల వాలములు, శైలదేహంబులు, భూ
గగనములు నిండు అంకెలు, మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్.

897

తా ॥ ఆ పాడి ఆవుల వెనుక, మదం అతిశయించిన మూపురములు, పొడుగాటి తోకలు, కొండల్లాటి ఉన్నతమైన దేహాలు, భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్లు రంకెలు... వీటితో ప్రకాశించే ఆబోతుల గుంపులు నడవసాగాయి.

వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు నేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత మహేంద్రుం డంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తక మేఘంబులం జీరి యిట్లనియె.

898

తా ॥ ఈ విధంగా అందరూ గిరికి ప్రదక్షిణలు చేసిన తరువాత, నందుడు మొదలైన గొల్లలందరు కృష్ణునితో కూడి గోవర్ధనం నుండి వ్రేపల్లెకు చేరారు. ఇంద్రుడు దానిని తెలుసుకొన్నవాడై, మహా కోపంతో ప్రళయకాలంలో విజృంభించి వర్షించే సంవర్తకం మొదలైన నవ (తొమ్మిది) మేఘాలను పిలిచి ఇలా అన్నాడు:

మ. 'పెరుఁగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్ మదాభీరులై
గిరిసంఘాత కఠోరపత్త్రదళన క్రీడా సమారంభ దు
ర్భర దంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క
గ్గిరికిం బూజలు సేసి పోయి రదెపో కృష్ణుండు ప్రేరేపఁగన్.

899

తా ॥ “కృష్ణ ప్రేరేపణం చేత, గొల్లవాండ్రందరూ పెరుగు నేయి చక్కగా త్రాగి మత్తెక్కి, ఆ మదం చేత నేనంటే భయం కొంచెంకూడా లేకుండా, నాకై యాగం చెయ్యటం మానేశారు. పర్వత సమూహం యొక్క రెక్కలను వజ్రాయుధంతో ఖండించిన నన్ను లక్ష్యం చెయ్యక, ఇప్పుడే కొండకు పూజచేసి వెళ్ళిపోయారు.

క. గురుదేవహీను బాలుని, గిరిభూజ ప్రముఖవాసుఁ గృష్ణు ననీశుం
బరిణామశీలుఁ గులగుణ, విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్.

900

తా ॥ గురుమా, దైవము లేనివాడు, బాలుడు, అడవులలోను, కొండలలోను తిరిగేవాడు, శిక్షకుడు లేనివాడు, తారతమ్య జ్ఞానము, నడవడి, ఏ గుణములు లేనివాడు అయిన కృష్ణుని మాటలు మన్నించి గొల్లలు నన్ను వదిలేశారు.

జగత్తుకే గురువైన వానికి, జగత్తును క్రీడామాత్రంగా రూపొందించే వానికి గురువని ఎవరు ఉంటారు! ఆదిదేవుడైన వారికి వేరు దైవం అంటూ ఏమి ఉండగలదు! జననమరణాదులు లేనివాడు, శాశ్వతుడైనవాడు, నిష్కంళకుడూ అయినందునే బాలునిగా గోచరించాడు. గుణాతీతునికి ఏ గుణములు ఉండగలవు! సర్వమూ తానే అయినవానికి కులం, వర్ణం నిర్ణయించడం ఎవరి తరం! అధికార గర్వంతో ఉన్నవారు సత్యాన్ని అసత్యంగా చూస్తారు, ఇంద్రుని విషయంలో ఇదే జరిగింది.

ఆ. విమల ఘనతరాత్మ విజ్ఞానవిద్యచే, నిగుడలేక యుడుప నిభము లగుచుఁ
గర్మమయములైన క్రతువుల భవ మహా, ర్ణవముఁ గడవఁ గోరినారు వీరు.

901

తా ॥ ఈ గొల్లల మేలైనదియూ, నిర్మలమైనదియు అయిన బ్రహ్మవిద్యను పొందలేక, తెప్పల వంటివి కర్మమయములయిన ఇట్టి యాగాలతో సంసార సముద్రాన్ని దాటడానికి

ప్రయత్నిస్తున్నారు.

శా. ఉద్యత్సంపద నమ్మి నందతన యోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద ఱాల్ గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్.

902

తా ॥ ఓ సంవర్తకాది మేఘములారా! ఈ పిచ్చివారైన గొల్లలు తమ ధనసంపదను చూసుకుని కృష్ణుని మాటలను నమ్మి, వెర్రితనంచేత నా యాగాన్ని విడిచిపెట్టేశారు. కనుక మీరు మీ శౌర్యం ప్రకాశించేటట్లు మెరుపుల చేతను, ఉరుముల చేతను వారిని బాధించి, గోవులతో కూడా గొల్లలందరు మృత్యువును పొందునట్లు రాళ్ళవానను కురిపించండి.

క. మీ వెంట వత్తు నే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా
దేవగణంబులతోడను, గోవిందుని మంద లెల్ల గొందలపెట్టన్.

903

తా ॥ ఆ గోవిందుని మాటను విన్న ఆ వ్రేపల్లె జనులను బాధించటం కోసం ఐరావతాన్ని అధిరోహించి, దేవతాసమూహాలతో నేనూ మీ వెంట వస్తాను.”

వ. అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి, బింకంబున శంకింపక, కింకతోడ సంకలియ లూడ్చిన, మహానిలప్రేరితంబులయి చని, నందుని మందమీఁద నమోఘంబు లైన మేఘంబులు మహౌఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచి మండలంబుఁ గప్పి, దివినుండి, దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబుగ నిరోధించి, బలిభంజన ద్వితీయ పాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండ భాండంబు చిల్లుల జల్లించినఁ దొఱఁగు బహిస్సముద్ర సలిలనిర్ఝరంబుల

వడువున నెడతెగక తోరంబులైన నీరధారలం గురియుచు, శిలల వర్షించుచుఁ, బిడుగుల ఉువ్వుచు నుండ, మిఱ్ఱు పల్లంబులు సమతలంబులయి, యేకార్ణవంబు రూపుసూపిన, నందు దుడు కడుచుచు నీఁదుచు, విలయశిఖీ శిఖాసంరంభ విజృంభమాణ విద్యుల్లతా విలోకంబున రిమ్మలుగొని, సొమ్మలు వోవుచున్న లేఁగలును; లేఁగలమూతు లడ్డంబు లిడి ప్రళయభైరవ భేరీభాంకార భీషణంబులగు గర్జన ఘోషణంబులఁ జెవుడువడి చిందఱవందఱ లైన డెందంబులం గంది కుంది వ్రాలు ధేనువులును; ధేనువుల వెనుక నిడుకొని దురంతకల్పాంత కాలకీలి కరాళకాలకంఠ కర విశాల గదాఘాత ప్రభూతంబులైన నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి, రక్షరక్షేతి

శబ్దంబులు సేయుకైవడి విడువని జడిం బడి, సైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబున నంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాది గోరక్షణంబు సేయుచు దుర్వారఘోర శిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన మ్రానువడు గోపకులును; గోపకులం బట్టుకొని దట్టంబయిన వానకొట్టునం బెట్టువడి బడుగు నడుములు నుసులువడ వడవడ వడంకుచు గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠిన కుచ కలశ యుగళంబుల మఱుంగునం దలలు వెట్టుకొని పరవశులైన శిశువులునుం గలిగి, మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు గొందఱు దుర్జనశిక్షకుండును సజ్జనరక్షకుండును నైన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి.

904

తా ॥ అని పలికి జంభాసురుని సంహరించిన ఇంద్రుడు వజ్రాయుధాన్ని ఝళిపించి, బింకం వహించి, శంక లేకుండ కోపావేశంతో మేఘాలకు సంకెళ్ళు ఊడదీసి పంపాడు. అప్పుడు అమోఘములైన మేఘాలు, గొప్పగాలిచేత ప్రేరేపితమై పోయి నందుని పల్లెమీద మిక్కిలి దట్టంగా కమ్ముకొన్నాయి. భయంకరమైన రీతిలో సూర్యబింబాన్ని కప్పేశాయి. ఆకాశంలో నిండి దిక్కులను ఆక్రమించాయి. భూమ్యాకాశాల మధ్య ఎడం లేకుండా దట్టంగా కారు చీకటి

అంతటా అలుముకుంది. వామనుడు త్రివిక్రముడైనప్పుడు, రెండవ అడుగు తాకిడికి భేదిల్లిన బ్రహ్మాండమనే కుండలోంచి కారుతూన్న సముద్ర జలాలవలె సెలయేళ్ళలాగ లావుగా పడుతున్నాయి నీటిధారలు. దానితోపాటు వడగండ్లును, పిడుగులును పడుతూంటే భూమి అంతా జలమయమై ఇది మిట్ట, ఇదిపల్లం అని తెలుసుకోవడానికి వీలు లేకుండా ఉంది. ప్రళయ కాలములో వ్యాపించిన మహా సముద్రం రీతిగా భూమి నీటితో నిండసాగింది.

ఆ నీటి వెల్లువలో దూడలు ఈదుతూ, ప్రళయాగ్ని వలె మెరుస్తూ ఉరుముతున్న ఉరుములను చూసి మూర్ఛపోతున్నాయి. ఆ లేగలకు అడ్డంగా మోరలు చాచి నిలబడిన ఆవులకు ఆ భయంకర శబ్దాలతో చెవులు చిల్లులు పడుతుంటే నేలకు ఒరిగిపోతున్నాయి. ప్రళయకాలంలో అన్నింటినీ లయం చేసే రుద్రుని గదనుండి రాలుతున్నాయా అన్నట్లుగా పిడుగులు పడుతూ ఉంటే, ఆ పిడుగుపాట్లకు భీతిని పొందుచూ, రక్షించమని అడుగుతున్నట్లుగా ఆవుల వెనుక ఉన్న ఆబోతులు అంబారావాలు చేస్తున్నాయి.

మిక్కుటమైన వానచేత బలాన్ని కోల్పోయి, నడుములు వ్రేలాడేటట్లు గడగడ వణకుచు కృష్ణా! కృష్ణా! అని అంగలారుస్తూ ఉన్నారు గోపికలు. తల్లులైన గొల్ల ఇల్లాండ్రను అతుక్కునిపోతూ, ఆ తల్లుల ఎదచాటున దాక్కుంటున్నారు శిశువులు. ఈ విధంగా అనుకోని రీతిగా వచ్చిన ఈ ప్రళయాన్ని చూస్తూ కొందరు బుద్ధిమంతులైన ముసలి గొల్లలు శ్రీకృష్ణునికి నమస్కరించి ఇట్లా మనవి చేశారు:

ఉ. అక్కట! వానఁ దోఁగి వ్రజ మాకుల మయ్యెఁ గదయ్య! కృష్ణ! నీ
వెక్కడ నుంటి? వింత తడవేల సహించితి? నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారివై
గ్రక్కునఁ గావ కిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే!

తా ॥ "ఓ కృష్ణా! అయ్యో! వానలో తడిసి గోకులవాసులందరూ పీడింప బడుతున్నారు గదా! ఇంతసేపూ నీవు ఎక్కడ ఉన్నావు. దీనిని ఎలా సహిస్తున్నావు? నీ పాదములే గతి అని నమ్మియున్న గోపకులను దయతో కాపాడక, వీరంతా ఈ విధంగా దీనులై అల్లాడుచుండగా ఏ ప్రయత్నం చేయక ఈ విధంగా ఉపేక్షించటం నీకు తగునా? దయాళువులగు వారిలోకెల్ల నువ్వు మిగుల ఉత్తముడవే!

క. ఈ యుఱుములు నీ మెఱుములు, నీ యశనుల ఘోషములును నీ జలధారల్
నీ యాన తొల్లి యెఱుఁగము, కూయాలింపం గదయ్య! గుణరత్ననిధీ!

906

తా ॥ మంచి గుణములు గల ఓ చిన్ని కృష్ణా! మునుపు ఎన్నడును ఇటువంటి ఉరుములు, మెరుపులు, పిడుగుల, చప్పుళ్ళు, జలధారలు నీ సాక్షిగా మేము ఎరుగం. మమ్మల్ని కాపాడవయ్యా!

క. వారి బరు వయ్యె మందల, వారికి; నిదె పరులు లేరు వారింపంగా;
వారిద పటల భయంబును, వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే!

907

తా ॥ ఓ కృష్ణా! గోకులవాసులందరూ ఈ వర్షాన్ని చూసి భయపడుతున్నారు. ఈ మేఘముల వలన కలిగిన భయాన్ని పోగొట్టడానికి, నీకంటే మాకు ఎవరూ లేరు. కనుక నీవు దయచేసి ఈ భయాన్ని పోగొట్టవలసింది."

వ. అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుం డంతయు నెఱింగి.

908

తా ॥ అని ప్రార్థించగా సర్వజ్ఞుడైన కృష్ణుడు ఇది దేవేంద్రుని పని అని గ్రహించి,

ఉ. తన్నొక యింత గైకొనరు; తప్పిరి; యాగము సేసి' రంచుఁ దా
మిన్నుననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్న వాఁ
డున్నత నిర్జరేంద్ర విభవోత్థిత గర్వనగాధిరూఢుఁడై
కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు; గర్వపరుం డొరుఁ గాన నేర్చునే?

909

తా ॥ 'ఇంద్రుడు తాను దేవరాజై అతి వైభవంతో ఉండటం చేత గర్వాన్ని పొంది ఉన్నాడు. అధికారముతో అహంకరించి కన్నుగానక ఉన్నవానికి ఇతరులు కనిపించరు. గొల్లలు తనను అలక్ష్యం చేసి యాగం నడిపారు అని కోపంతో రాళ్ళవర్షం కురిపిస్తున్నాడు. ఐశ్వర్యం చేత గర్వించేవాడు ఇతరులు ఎట్టివారనేది తెలుసుకోగలడా?

క. దేవత లందఱు నన్నును, సేవింతురు; రాజ్యమదముఁ జెందరు, చెఱుపం
గా వలదు; మానభంగము, గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై.

910

తా ॥ దేవతలందరూ నన్నే కొలుస్తూ ఉంటారు. దొరతనపు గర్వం వారికి లేదు. కాబట్టి ఇప్పుడు ఇంద్రుని గర్వం అణచవలసినదే కాని హాని కలుగచెయ్యకూడదు'

వ. అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగ వని, సకలలోక రక్షకుం డయిన విచక్షణుండు.

911

తా ॥ అని యోచించి, సకలలోక రక్షకుండైన శ్రీకృష్ణ భగవానుడు రాళ్ళవాన చేత బాధించబడుతూ తనను శరణు జొచ్చిన గొల్లవాండ్రను కాపాడుట ధర్మమని నిశ్చయించాడు.

చ. కలఁగకుఁడీ వధూజనులు! కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్!

తలఁగకుఁడీ కుమారకులు! తక్కినవారలు ఱాలవానచే
నలఁగకుఁడీ! పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ!
మెలపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై.

912

తా ॥ "ఓ నెలతలారా! కలత చెందకండి! ఓ దోప నాయకులారా! మీరు భయపడకండి! పిల్లలూ మీరు పారిపోకండి! రాళ్ళవానచేత సంకట పడకండి! పశువులను ఇటు అటు తొలగిపోనివ్వకండి. అందరినీ ఒక్క చోటుకి చేర్చండి. కరుణార్ద్ర హృదయుడైన ఆ ఈశ్వరుడు మీకు మేలు కలుగ జేస్తాడు."

# 34. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమును ఎత్తుట

వ. అని పలికి.

913

క. కిరియై ధర యెత్తిన హరి, కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం
కరకరుఁడై గోవర్ధన, గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్.

914

తా ॥ అని పలికి ఇదివరలో ఆదివరాహ మూర్తియై అవనీ భారాన్ని వహించిన అచ్యుతుడు, ఇప్పుడు త్రిభువనాలను ఆనందపరిచే విధంగా ఏనుగు తామర మొగ్గను పైకెత్తునట్లు విలాసంగా ఒక చేతితో అవలీలగా ఆ గోవర్ధన పర్వతాన్ని ఎత్తాడు.

క. దండిని బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట, కొండొక పనిగాక యొక్క కొండా తలఁపన్?

915

తా ॥ బ్రహ్మాండాలను అన్నింటినీ పూబంతులవలె ఎగురవేయగల ఆ కృష్ణమూర్తికి ఈ కొండను పెళ్ళగించి ఎత్తటం చిన్న విషయమే కానీ గొప్పకార్యం ఏమీ కాదు.

వ. ఇట్లు గిరి యెత్తి.

916

శా. బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలం దాల్చిన లీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీగోపగోపంక్తికిన్.

917

తా ॥ శ్రీకృష్ణుడు ఒక పసిబిడ్డ పువ్వుగుత్తిని గొడుగని వేడుకగా ఎత్తిపట్టుకొన్నట్లు, ఒక్క చేతితో గోవర్ధన పర్వతాన్ని అవలీలగా ఎత్తి గొడుగువలె పట్టుకున్నాడు. పట్టుకుని, రాళ్ళవానకు చెదరి చిక్కుల్లో పడుచున్న గోపికలు, గోపకులు, గోవులు మొదలైనవారందరినీ ఆ గొడుగు క్రిందికి రమ్మని పిలిచాడు.

వ. ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె.

918

తా ॥ ఇలా కొండను గొడుగుగా పట్టుకొని గోపకులతో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

క. రా తల్లి! రమ్ము తండ్రీ!, వ్రేతలు గోపకులు రండు! వినుఁడీ గర్త
క్ష్మాతలమున నుండుఁడు గో, వ్రాతముతో మీరు మీకు వలసినయెడలన్.

919

తా ॥ "ఓ తల్లీ! ఓ తండ్రీ! ఓ గోపికలారా! ఓ గోపకులారా! మీరందరు మనస్సులలో సంకోచ పడక ఈ కొండక్రిందికి రండి. వచ్చి ఈ కొండ అడుగున మీరు మీ ఆవుల గుంపులతో మీకు నచ్చిన చోట నిలవండి.

శా. బాలుం డీతఁడు, కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో? యని దీని క్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల; దీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు పైఁ బడ్డ నా
కే లల్లాడదు; బంధులార! నిలుఁ డీ క్రిందం బ్రమోదంబునన్.

920

తా ॥ ఓ బంధువులైన గోపకులారా! వీడు పసివాడు. ఈ కొండ చూస్తే చాలాపెద్దది.

ఇంత మహాభారాన్ని ఈ చిన్నవాడు మొయ్యలేడేమో అని మీరు ఏ విధంగానూ సందేహించకండి. కొండలతోనూ, సముద్రములతోనూ అనేక ప్రాణులతోను నిండిన ఈ భూమండలం అంతా మీద పడ్డా నా చేయి అటు, ఇటు చలించదు. కనుక, మీరంతా వచ్చి సంతోషంతో ఈ కొండ క్రింద నిలవండి."

వ. అని పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండ యడుగునం దమ తమ యిమ్ములం బుత్త్ర మిత్ర కళత్త్రాది సమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దన కరుణా విలోకనామృత వర్షంబున నాఁకలి నీరువట్టుల చొప్పెఱుంగక కృష్ణకథా వినోదంబుల నుండి; రి వ్విధంబున.

921

తా ॥ అని ఈ ప్రకారం పలుకుచున్న కృష్ణుని మాటలు విని నమ్మి, వారు అందరు తమ భార్యాబిడ్డలూ, బంధువులు, స్నేహితులు, గోవులతో ఆ కొండ క్రింద చేరారు. శ్రీకృష్ణుని దయతోడి చూపులనెడు అమృత వర్షానికి ఆకలిదప్పికలు తెలియక కృష్ణ కథావినోదాలను చెప్పుకొంటూ వినోదంగా ఉన్నారు.

మ. హరిదోర్దండము గాను; గుబ్బశిఖరం; బాలంబిముక్తావళుల్  
పరఁగన్ జాఱెడు తోయబిందువులు; గోపాలాంగనాపాంగ హా  
స రుచుల్ రత్నచయంబు గాఁగ, నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ  
ద ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్న ప్రజారంజియై.

922

తా ॥ ఆ సమయమందు గోవర్ధనగిరి అనే గొడుగుకి, కృష్ణుని చేయి గొడుగు కర్రగానూ, ఆ శిఖరం గుబ్బగానూ కనిపిస్తోంది. వర్షం వలన ఆ శిఖరం నుండి చుట్టూరా జారి పడుతున్న జలబిందువులు ముత్యాలసరాలుగా తోస్తున్నాయి. ఆనందంతో ఉన్న గోపికల కడగంటి చూపుల

నవ్వుల కాంతులు రత్నాల సమూహాల వలె ప్రకాశిస్తున్నాయి. ఆ గోవర్ధనగిరి అనే గొడుగు పర్వతాలను భేదించగల శక్తివంతుడైన ఇంద్రుని దురహంకారానికి భంగపాటుని కలిగించింది. అంతేకాక జలధారలచే చాలా బాధను పొందిన జనులకు సంతోషాన్ని కలుగజేసేదిగా శోభిల్లింది.

క. రాజీవాక్షునిచే నొక, రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;
రాజేంద్ర! మీఁద మధుకర, రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్.

923

తా ॥ ఆ గొడుగైన గోవర్ధన పర్వతం, కృష్ణుని చేతిలో ఒక తామర పువ్వు వలెనే మెరయగా దానిమీద తుమ్మెదలబారు వలె మేఘపంక్తి ప్రకాశించింది.

క. వడిగొని బలరిపు పనుపున, నుడుగక జడి గురిసె నే డహోరాత్రము; ల
య్యెడ గోపజనులు బ్రదికిరి, జడిఁ దడియక కొండగొడుగు చాటున నధిపా!

924

తా ॥ ఓ రాజా! ఇంద్రుని చేత ఆజ్ఞాపింపబడిన మేఘాలు అలా ఏడు పగళ్ళు ఏడు రాత్రుళ్ళు ఎడతెగని వర్షాన్ని కురిపించాయి. ఆ వానలో ఏమాత్రం తడవక గోవర్ధన పర్వతం అనే గొడుగు చాటున ఆ గొల్లలంతా హాయిగా ఉన్నారు.

వ. ఇట్లు హరి యే డహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి వేసరి కృష్ణ చరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని చనియె; నంత నభోమండలంబు విద్యోతమాన ఖద్యోతమండలం బగుట విని గోవర్ధన ధరుండు గోపాలకుల కిట్లనియె.

925

తా ॥ ఈ విధంగా ఏడు పగళ్ళు ఏడురాత్రుళ్ళు కృష్ణుడు పర్వతాన్ని ధరించాడు. ఇంద్రుడు విసిగి వేసారి కృష్ణుని చరిత్రను విని ఆశ్చర్యపడ్డాడు. నెరవేరని కోరిక గలవాడై మేఘములన్నింటిని త్రిప్పుకొని తన లోకమునకు వెళ్ళాడు. అప్పుడు ఆకాశంలో సూర్యుడు విశదంగా ప్రకాశించాడు. అది తెలిసి గోపాలుడు ఆ కొండ అడుగున ఉన్న వారినందరిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు:

క. 'ఉడిగెను వానయు గాలియు, వడిసెడి నదులెల్లఁ బొలిచె; వఱద లిగిరెఁ, గొం
డడుగున నుండక వెడలుఁడు, కొడుకులుఁ గోడండ్రు సతులు గోవులు మీరున్'.

926

తా ॥ "ఓ గోపకులారా! వాన, గాలి నిలిచిపోయాయి. నదులన్నీ వడిగా ప్రవహించటం మానాయి. ప్రవాహాలన్ని ఇంకిపోయాయి. ఇక మీరు మీ కొడుకులతోను, కోడళ్ళతోను, భార్యలతోను గోవులతోను కొండ క్రింద నుండి బయటకు రండి."

వ. అనిన విని సకల గోపజనులు శకటాద్యుపకరణ సమేతులయి గోవులుం దారును గొండ యడుగు విడిచి వచ్చి; రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజస్థానంబున గిరి నిలిపె; నంత వల్లవు లెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి; గోపికలు సేసలిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నంద బలభద్ర రోహిణీ యశోద లాలింగనంబు సేసి భద్రవాక్యంబులు పలికిరి; సిద్ధ సాధ్య గంధర్వవరులు విరులు గురియించిరి; సురలు శంఖదుందుభులు మ్రోయించిరి; తుంబురు ప్రముఖు లయిన గంధర్వులు పాడి; రప్పుడు.

927

తా ॥ అని శ్రీకృష్ణుడు చెప్పగానే వారంతా బండ్లతోను, గోవులతోను కొండ దిగువ నుండి ఈవలికి వచ్చారు. అంతట కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎప్పటివలెనే దాని స్వస్థానంలో

ఉంచాడు. అటు పిమ్మట గోపకులు అతనిని ఆలింగనము చేసుకొని నానా విధాలుగా దీవించారు. గోపికలు శుభాక్షతలు చల్లుచూ కృష్ణునికి పెరుగన్నపు ముద్దలు పెడుతూ దీవించారు. నందుడు, బలరాముడు, యశోద, రోహిణి కృష్ణుడిని హత్తుకుని దీవించారు. సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు పూలవాన కురిపించారు. దేవతలు శంఖారావాలు, దుందుభి వాయిద్యాలతో సందడిచేసారు. తుంబురుడు మొదలైన గంధర్వులు గానం చేసారు.

క. వల్లవకాంతలు దన కథ, లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్
వల్లవబలసంయుతుఁడై, యొల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా?

928

తా ॥ ఓ రాజా! అంత గోపస్త్రీలు తన కథలన్నియు పాడుచుండగా గోపకులతోను, బలరామునితోను కలిసి శ్రీకృష్ణుడు వ్రేపల్లెకు చేరుకున్నాడు.

వ. అ య్యవసరంబునఁ గృష్ణు చరిత్రంబులు దలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి.

929

తా ॥ అప్పుడు గొల్లలందరు శ్రీకృష్ణుని చరిత్రను తలచుకొని ఆశ్చర్యాన్ని పొంది నందునితో ఇలా అన్నారు:

సీ. కన్నులు దెఱవని కడుఁజిన్ని పాపఁడై దానవిఁ జనుఁబాలు ద్రాగి చంపె
మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁడై కోపించి శకటంబుఁ గూలఁ దన్నె
నేఁడాది కుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁజేసెఁ
దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టినఁ గొమరుఁడై మద్దులఁ గూల నీడ్చెఁ;
తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె, వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె

సబలుఁడై ఖరదైత్యుని సంహరించె, నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ!

930

తా ॥ "కన్నులు తెరవని చంటి బిడ్డగా ఉన్నప్పుడే రాక్షసి పూతన యొక్క చనుపాలు త్రాగి చంపాడు. మూడవ నెలలో ముద్దులు మూటకట్టే బిడ్డగా ఉంటూ కోపంతో శకటాసురుని కూల్చి చంపాడు. సంవత్సరపు బిడ్డగా ఉంటూ సుడిగాలియై వచ్చిన తృణావర్తుని మెడపట్టి క్రిందకు త్రోసి చంపాడు. తల్లి అయిన యశోద వెన్నదొంగిలించాడని రోటికి కట్టేస్తే, బాలుడై ఉండి రెండు మద్రి చెట్ల మధ్యనుంచి ఆ రోటిని ఈడ్చి ఆ చెట్లను కూల్చేశాడు. ఆవు దూడలను మేపుతూ బకాసురుని చంపాడు. వత్సుడు అనే దైత్యుణ్ణి వెలగ మ్రానితో వేసి కొట్టి చంపాడు. బలరామునితో కూడవెళ్ళి ధేనుకాసురుని చంపాడు. చిన్నప్పటి నుండి ఇలాంటి పనులు చేస్తున్న ఈ బాలకృష్ణుడు కేవలం మానవమాత్రుడు కాదు!

క. తెంపరియై రామునిచేఁ, జంపించెఁ బ్రలంబు; మ్రింగెఁ జటులదవాగ్నిన్;
సొంపు సెడఁ ద్రొక్కి కాళియుఁ, ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్.

931

తా ॥ ఈ కృష్ణుడు బలరాముణ్ణి ప్రేరేపించి ప్రలంబాసురుని చంపేటట్లు చేసాడు. విజృంభించి మండుతూన్న కార్చిచ్చును మ్రింగాడు. కాళియ సర్పాన్ని విలాసంగా దాని పొగరు అణగునట్లు కాళ్ళతో త్రొక్కి ఆ మడుగులోనుండి వెడలగొట్టాడు.

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ?, క్రీడం గరి తమ్మియెత్తు క్రియ నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ?, వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌఁ గాదే.

932

తా ॥ ఏడేండ్ల బాలుడెక్కడ? ఏనుగు తామర పువ్వును ఎత్తిన చందంగా, మనందరము చూస్తూండగా ఇప్పుడు వినోదంగా ఒక చేతితో కొండ ఎత్తడం వింతే కదా!

క. ఓ నంద! గోపవల్లభ, నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె? మానవమాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ!

933

తా ॥ ఓ నందుడా! నీ కొడుకు చేసే పనులు మానవులకు చేయశక్యం కావు. గోపవల్లభా! నీ కొడుకు సామాన్య మానవుడు కాదు తండ్రీ!" అని పొగడసాగారు.

వ. అనిన విని నందుండు వారలం జూచి మున్నుతనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబుఁ దెలిసిఁ శంక లేదు; కృష్ణుండు లోకరక్షకుం డయిన పుండరీకాక్షుని నిజాంశ యనుచు నంతరంగంబునం జింతింతు' నని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం డనంతుం డని పూజించి; రంత.

934

తా ॥ ఆ మాటలు విని నందుడు వాళ్ళని చూసి ఇంతకు ముందు గర్గ మహర్షి చెప్పిన రహస్యాన్ని స్మృతికి తెచ్చుకుంటూ వాళ్ళకి తెలియచేసి, 'నా మనస్సులో కృష్ణుడు లోక రక్షకుడైన శ్రీమహావిష్ణువు యొక్క అంశగా అనుకుంటాను' అని చెప్పేసరికి ఆశ్చర్యంతో గోపకులు కృష్ణుడిని అనంతుడు అని పూజించారు.

మ. హరి కేలన్ గిరి యెత్తి వర్షజలఖిన్నాభీర గోరాజికిన్
శరణంబై నఁ ద్రిలోక రాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై
సురభిం గూడి బలారి వచ్చి కనియెన్ సొంపేది దుష్టప్రజే
శ్వర దుర్మాన నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్.

935

తా ॥ కృష్ణుడు చేతితో కొండ ఎత్తి వానచేత బాధ పడుతూన్న గొల్లవాళ్ళను, గోవులను రక్షించడం చూసిన ఇంద్రుడు తన అహంకారాన్ని విడనాడాడు. తరువాత కామధేనువును వెంట

తీసుకొని, తాను మూడు లోకాలను ఏలువాడను అనే గర్వమును విడిచి తన వైభవం ఏమీ కనబడనీయకుండా వచ్చాడు. దుర్మార్గులైన రాజుల దురహంకారాన్ని అణచేవాడు, అపార దయను చూపించేవాడు అయిన శ్రీకృష్ణుడిని సందర్శించాడు.

క. కని యింద్రుఁడు పూజించెను, దినకరనిభ నిజకిరీట దీధితిచేతన్
ముని హృదలంకరణంబులు, సునతోద్ధరణములు నందసుతు చరణంబుల్.

936

తా ॥ మునుల హృదయములను అలంకరించేవి, వినయంతో తమ్ము సేవించే వారిని ఉద్ధరించునవి అయిన కృష్ణ పాదములయందు, సూర్య తేజస్సు వంటి తేజస్సుగల తన కిరీట కాంతులు ప్రసరించేటట్లుగా సాష్టాంగపడ్డాడు ఇంద్రుడు.

వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె.

937

సీ. పరమ! నీ ధామంబు భాసురసత్త్వంబు; శాంతంబు; హతరజస్తమము; నిత్య
మధికతపోమయ; మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు
గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర
వైన దుర్జన నిగ్రహము శిష్ట రక్షయుఁ దగిలి సేయఁగ దండధారి వగుచు

తే. జగముభర్తవు; గురుఁడవు; జనకుఁడవును, జగదధీశుల మను మూఢజనులు దలఁక
నిచ్చ పుట్టిన రూపంబు లీవు దాల్చి, హితము సేయుదు గాదె లోకేశ్వరేశ!

938

తా ॥ ఇలా నమస్కరించి, చేతులు జోడించి ఇంద్రుడిలా అన్నాడు: సర్వలోకాలకు నాయకులైన బ్రహ్మాదులకు నాయకుడవైన శ్రీకృష్ణా! శుద్ధ సత్వమయమైన స్వరూపం గలవాడవు. శాంతమైనది, రజస్తమో గుణ విరహితమైనది, శాశ్వతమైనది, తపోదీప్తిచే నిండినది నీ

స్వరూపం. అందుచేత మాయవల్ల వచ్చే గుణాలు నీకులేవు. నువ్వు గుణహీనుడవు కనుక తమోగుణం మొదలైన గుణములచేత వచ్చే లోభ, శోక, మోహ, నిద్ర, భయం మొదలైనవి నీయందు చేరవు. అయినా గాని దుర్జన నిగ్రహం, శిష్టరక్షణ చెయ్యడం కోసం దండాన్ని ధరిస్తావు. నువ్వు లోకాలకు భర్తవు, గురుడవు, తండ్రివి. మేము ఈ లోకాలను పాలిస్తున్నాం అని భావించే మూఢులు భయపడేటట్లుగా నీవు రూపాలను ధరిస్తూ లోకాలకు మేలు చేస్తావు.

క. నావంటి వెఱ్ఱివారిని, శ్రీవల్లభ! నీవు శాస్తి చేసితి వేనిం
గావరము మాని పెద్దల, త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా!

939

తా ॥ శ్రీవల్లభా! నాబోటి మూఢులను నీవు శిక్షిస్తే తక్కినవారు గర్వాన్ని వదలి, బుద్ధిగా పెద్దలు నడచిన మార్గంలో వర్తిస్తారు.

క. ఒక్కొక లోకముఁ గాఁచుచు, నెక్కుడు గర్వమున 'నేమె యీశుల' మనుచుం
జొక్కి ననుబోఁటి వెఱ్ఱులు, నిక్కము నీ మహిమఁ దెలియనేర రనంతా!

940

తా ॥ అనంతా! ఒక్కొక్క లోకాన్ని ఏలుతూ, అధికమైన అహంకారంతో మేమే సర్వలోకాలకు ఈశ్వరులం అనే గర్వంతో ఉన్నవారు నీ ప్రభావాన్ని తెలుసుకొనలేరు.

ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి, జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ!, నీకు వందనంబు నిష్కలంక!

941

తా ॥ ఓ వాసుదేవా! కృష్ణా! వరదా! నీవు స్వతంత్రుడవు! విజ్ఞాన మూర్తివి! మహాత్ముడవు! సకల పుణ్యపురుషా! నిఖిల బీజ భూతాత్మకుడవైన పరబ్రహ్మవు! నిష్కళంకుడవు!

నీకు నమస్కారం.

శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ! భవన్మహత్త్వమున నాయుద్యోగ మిట్లయ్యె నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా!

942

తా ॥ మాధవా! నేను నీ శక్తి తెలిసిన వాడను కాను. నాకోసం గొల్లలు యాగం చెయ్యలేదే అనే కోపం చేత మేఘాలను పంపి భయంకరమైన వాన కురిపించి నీదైన మందను ముంచాను. నీ మహిమ చేత నా ప్రయత్నం నెరవేరలేదు. నీ విషయంలో తప్పు చేసినా, నీ సేవకుడనైన నన్ను కరుణతో వీక్షించు!

మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు; జడతా నిష్ఠుండ లోకత్రయా
వన దుర్మాన గరిష్ఠుఁడన్ విపుల దుర్వైదుష్య భూయిష్ఠుఁడన్
వినయత్యాగ వరిష్ఠుఁడన్; గుజనగర్వి శ్రేష్ఠుఁడన్ దేవ! నీ
ఘనలీలా విభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా!

943

తా ॥ దేవా! నిన్ను బ్రహ్మాదులే తెలుసుకోలేరు. నేను మూఢత్వంలో మునిగిన వాణ్ణి! మూడు లోకాలు ఏలుతున్నాననే గర్వం కలవాడిని. దుష్పాండిత్యం చేత నిండిన వాడిని. వినయము, త్యాగము లేనివాడిని. నీచ జనునివలె గర్వం కలవాడిని. నీ యొక్క మహిమగల లీలా విభూతి తెలుసుకోవడానికి నేనెంతటి వాడిని!"

వ. అనిని విని నగుచు జలధర గంభీర రవంబుల శక్రునకుం జక్రి యి ట్లనియె.

944

తా ॥ ఆ మాటలు విన్న కృష్ణుడు ఇంద్రునితో ఇలా అన్నాడు:

మ. 'అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యి ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ జన్నంబుఁ దప్పించితిం;
బ్రమదశ్రీకులు దండధారి నగు నన్ భావింప; రెవ్వాని ని
క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా?

945

తా ॥ "జంభాసురుని సంహరించిన ఓ ఇంద్రుడా! నీవు ఐశ్వర్య మదంచేత కన్నుగానక ఉన్నందున నీ గర్వాతిశయాన్ని పోగొట్ట తలచి నీ యాగాన్ని తప్పించాను. ఐశ్వర్య మదంతో ఉన్నవారు నన్ను తలవరు. నేను రక్షించదలచిన వానిని ధనహీనుణ్ణి చేస్తాను.

క. నా యాజ్ఞ సేయుచుండుము, నీ యధికారంబునందు నిలుపు; సురేంద్రా!
శ్రీయుతుఁడవై మదింపకు, శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము సితకరిగమనా!

946

తా ॥ ఐరావతం ఎక్కి తిరిగేవాడా! నీవు నా ఆజ్ఞ ప్రకారం నడుస్తూ నీ కర్తవ్యాన్ని నిర్వహించు. ఆ అధికారపు సంపద చేత గర్వించవద్దు. నీకు మేలు జరుగుతుంది."

వ. అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యయిన కామధేనువు భక్తజన కామధేను వయిన యీశ్వరున కిట్లనియె.

947

తా ॥ అని ఇట్లా ఇంద్రునకు బుద్ధులు చెపుతూన్న కృష్ణునికి, గోగణంతో కూడిన కామధేనువు మ్రొక్కి, భక్త జనులకు కామధేనువైన ఆ ఈశ్వరునితో ఇలా చెబుతోంది:

క. 'విశ్వేశ! విశ్వభావన!, విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్

శాశ్వతుల మైతి మిప్పుడు, శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ!

948

తా ॥ "ఓ విశ్వేశ్వరా! ప్రణవ రూప ప్రపంచానికి ఈశ్వరుడవు. ప్రణవరూపం చేత ధ్యానింప తగిన వాడవు. ప్రపంచ స్వరూపుడవు. దివ్యజ్ఞానం గల యోగులు స్తోత్రం చెయ్యడానికి తగినవాడవు. గోవిందా! ఇప్పుడు నీ అనుగ్రహం చేత మేము నిలకడను పొందాము, స్థిరమైన సుఖాన్ని పొందాము.

వ. దేవా! మాకుం బరమదైవతంబ; వింద్రుండవు; భూసుర గో సుర సాధు సౌఖ్యంబుల కొఱకు నిన్నింద్రుని జేసి పట్టంబు గట్టు మని విరించి నియమించి పుత్తెంచె; నీవు భూతలభూరి భారనివారణంబు సేయ నవతరించిన హరి' వని పలికి యంత.

949

తా ॥ ఓ స్వామీ! నీవు మాకు ముఖ్య దైవం. నీవే మా ప్రభువు. పరమ ఐశ్వర్య సంపన్నుడవు. బ్రాహ్మణులు, గోవులు, దేవతలు, సత్పురుషులు వీళ్ళయొక్క సౌఖ్యం కొరకు, సర్వకర్తవైన నిన్ను ఇంద్రునిగా జేసి పట్టము కట్టుమని బ్రహ్మ పంపాడు. ఈ భూభారాన్ని నివారణ చెయ్యడం కోసం అవతరించిన విష్ణుమూర్తివి నీవు."

మ. సురభిక్షీరములన్ సురద్విపమహా శుండా లతానీత ని
ర్జర గంగాంబువులన్ నిలింపజననీ సన్మౌనిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్.

950

తా ॥ అప్పుడు దేవేంద్రుడు కామధేనువుతోను, మునిశ్రేష్ఠులతోను కూడుకొని, కామధేనువు పాలతో, ఐరావతం యొక్క తొండమనెడి లత నుండి తేబడిన దేవగంగ యందలి

నీళ్ళచేతను అభిషేకం చేసాడు. శత్రువులను శిక్షించేవాడు, సాధుసంరక్షణుడు, కమలాలవంటి కన్నులు కలవాడు అయిన కృష్ణునికి అభిషేకం చేసి "గోవిందుడు" అని పేరు పెట్టాడు. ఆ విధంగా ఇంద్రుడు తను చేసిన తప్పిదానికి ప్రాయశ్చిత్తంగా కృష్ణునికి 'గోవింద' పట్టాభిషేకం గావించాడు.

సీ. తుంబురు నారదాదులు సిద్ధచారణ గంధర్వులును హరికథలు వాడి;
రమరకాంతలు మింట నాడిరి; వేల్పులు గురియించి రంచిత కుసుమవృష్టి;
జగములు మూఁడును సంతోషమును బొందెఁ; గుఱ్ఱుల చన్నులఁ గురిసెఁ బాలు;
నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె; నిఖిల వృక్షములుఁ దేనియలు వడిసె;

తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ; బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ;
బ్రాణులకు నెల్లఁదమలోని పగలు మానె; వాసుదేవుని యభిషేక వాసరమున.

951

తా ॥ ఆ సమయంలో వేడుకతో తుంబురు నారదాదులు హరి యొక్క కథలు గానం చేసారు. అప్సరసలు ఆకాశంలో నాట్యం చేసారు. దేవతలు పూలవాన కురిపించారు. స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలు మూడూ సంతోషించాయి. ఆవులు ఎవరూ పిండకుండానే తమ పొదుగుల నుండి పాలను వర్షించాయి. ఏరులన్నీ క్రొత్త నీళ్ళతో పొంగాయి. వృక్షములన్నీ పూతేనెలను చిందించాయి. తీగలన్నీ పూలతోను, పండ్లతోను బరువెక్కాయి. పర్వతాలన్నీ రత్నకాంతులతో ప్రకాశించాయి. ప్రాణులకు తమలో వైరం పోయింది.

వ. ఇట్లు గోప గోగణ పతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి వీడ్కొని పురందరుండు, దేవగణంబులతో దివంబున కరిగె నంత.

952

తా ॥ ఈ విధంగా ఇంద్రుడు గోపాలకులకు, గోవులకు అధిపతిగా కృష్ణునికి అభిషేకం

చేసి, దేవతా సమూహంతో స్వర్గానికి వెళ్ళాడు.

## 35. శ్రీకృష్ణమూర్తి నందున్ని వరుణనగరమునుండి కొనితెచ్చుట

సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ
వేళ యెఱుంగక వేగక ముందర ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర నప్డు వరుణుదూత నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ, గృష్ణుఁ డీశుండు తమ తండ్రిఁ గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు, టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప!

953

తా ॥ ఓ రాజా! ఒక ఏకాదశి నాడు నందుడు ఉపవాసం ఉండి శ్రీహరికి పూజచేసాడు. రాక్షసులు మెలిగే సమయమని తెలియక అర్ధరాత్రి ద్వాదశి పారణకోసం స్నానం చెయ్యడానికి యమునా నదికి వెళ్ళాడు. నీళ్ళలో దిగగానే అందులో ఉన్న వరుణుని దూత నందున్ని పట్టి తీసుకొనిపోయి వరుణ పట్టణానికి చేర్చాడు. అంత గోపకులందరూ నందుని జాడ తెలియక విలపిస్తూ రామకృష్ణుల వద్దకు వచ్చి నందుని విషయం చెప్పారు. సర్వము తెలిసిన శ్రీకృష్ణుడు వెంటనే బయలుదేరి వరుణ లోకానికి వెళ్ళాడు.

వ. అప్పుడు.

954

క. వచ్చిన మాధవుఁ గనుఁగొని, చెచ్చెర వరుణుండు పూజ సేసి వినతుఁడై
యచ్చుగ నిట్లని పలికెను, విచ్చేసితి దేవ! నా నివేశంబునకున్.

955

తా ॥ అప్పుడు వరుణుడు తన ఇంటికి వచ్చిన మాధవుణ్ణి చూసి శీఘ్రముగా పూజించి,

మ్రొక్కి, 'స్వామీ! మీరు నా ఇంటికి దయతో వచ్చారు కదా!' అని ఎంతో ఆప్యాయంగా పలికాడు.

ఉ. ఏ విభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక! నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము; గృతార్థత నొందె మనోరథంబు; నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా!

956

తా ॥ "మాధవా! ఏ దేవుని పాదసేవయందు ఆసక్తులైన సత్పురుషులు ఎవ్వరూ పొందలేని మోక్ష మార్గాన్ని చరిస్తారో, అట్టి నీవు రావడం చేత నా మనస్సు సంతోషాన్ని పొందింది. నా కోరికలు నెరవేరాయి. నీ సేవతో నా శరీరం పరిశుద్ధమైంది.

ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపిత భద్రమూర్తికి సుధీజన రక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదార తపోధన చక్రవర్తికిన్.

957

తా ॥ స్వామీ! లోకములన్నింటినీ ఆవరించే మాయ, పరమేశ్వరుడివైన నిన్ను కప్పలేక, నీ అధీనంలో ఉంటుంది. నీవు సద్బుద్ధి గలవారిని సంరక్షించే మంగళకర మూర్తివి. మహాతపస్సుని సంపదగా గల సాధుజనులకు నీవు సార్వభౌమునివి. అట్టి నీకు నా దేహతాపాలు తొలగేలా నమస్కరిస్తున్నాను.

చ. ఎఱుఁగఁడు వీఁడు నాభటుఁ డొకించుక యైన మనంబులోపలం
దెఱకువ లేక నీజనకుఁ దెచ్చె; దయం గొని పొమ్ము; ద్రోహమున్

మఱవుము; నన్ను నీభటుని మన్నన సేయుము; నీదు సైరణన్
వఱలుదుఁ గాదె యో జనకవత్సల! నిర్మల భక్తవత్సలా!

958

తా ॥ ఓ భక్తవత్సలా! నా భటుడు మీ తండ్రి అని తెలియక అజ్ఞానం చేత నందున్ని పట్టి ఇచ్చటికి తీసుకొని వచ్చాడు. ఈ అపరాధాన్ని సహించు. నీ సేవకుడనైన నన్ను మన్నించు. నీ క్షమాగుణం చేతనే కదా నేనిట్లు వర్తించు చున్నాను. తండ్రియందు మక్కువ కలవాడవు, నిర్మలుడవు అయిన నీవు నా యందు దయతో మీ తండ్రిని తీసుకొని వెళ్ళు."

వ. అని యిట్లు వలుకుచున్న వరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి దిరిగివచ్చె; నంత నందుండు దన్ను వెన్నుండు వరుణ నగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన వారలు కృష్ణుం డీశ్వరుండని తలంచి; రఖిలదర్శనుం డయిన యీశ్వరుండును వారల తలం పెఱింగి వారికోరిక సఫలము సేయుదునని వారి నందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి.

959

తా ॥ ఇట్లు మనవి చేయుచున్న వరుణుని యందు కరుణించినవాడై శ్రీకృష్ణుడు నందున్ని వరుణ నగరం నుండి తీసుకొని వ్రేపల్లెకు వచ్చాడు. అప్పుడు నందుడు తనను వరుణ భటుడు వరుణ పట్టణానికి తీసుకుని వెళ్ళడమూ, కృష్ణుడు విడిపించుకొని రావడమూ అంతా సవిస్తరంగా తన బంధువులకు తెలియచేశాడు. అప్పుడు వారందరూ కృష్ణుడు సర్వాత్ముడు అయిన భగవంతుడే అని గ్రహించారు. అది తెలిసి కృష్ణుడు వారిని యమునా నదిలో బ్రహ్మజ్ఞాన ప్రదమైన బ్రహ్మహ్రదము అనే మడుగులో ముంచాడు.

బ్రహ్మహ్రద మనగా బ్రహ్మవిద్య కనుక నిస్సందేహంగా "అహం బ్రహ్మాస్మి" అను పరోక్ష జ్ఞానాన్ని కలిగించాడు అని తాత్పర్యము.

ఆ. ప్రకృతి కామకర్మ పరవశమై యుచ్చ, నీచగతులఁ బొంది నెఱయ భ్రమసి
తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ, గతివిశేష మీ జగంబునందు'.

960

తా ॥ 'ప్రకృతి సంబంధమైన బహువిధమైన కోరికలకు అధీనమై, ఉత్తమ అధమ స్థితులను పొంది భ్రాంతిలో తిరుగుతున్న జనం నా నిజగతి విశేషాలను తెలుసుకోలేరు'.

మ. అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యోతియై
యనిరూప్యం బయి సత్యమై, యెఱుకయై, యానందమై, బ్రహ్మమై
యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయ లోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలక శ్రేణికిన్.

961

తా ॥ అని కృష్ణుడు భావించి, దయా స్వభావం కలవాడైనందున మాయకు లోబడనిది, తేజోరూపమైనది, నిర్దిష్టమైన రూపం లేనిదై, సత్యమై, జ్ఞాన స్వరూపమైనది, ఆనందమయ మైనది, పరిపూర్ణమైనదైన తన పరమపద లోకాన్ని పాపచిత్తులు కాని వారూ, ఆ గోపకుల సమూహానికి అప్పుడే కనబరచాడు.

వ. ఇట్లు హరి ము న్నక్రూరుండు వొందిన లోక మంతయుఁ జూపి బ్రహ్మలోకంబు సూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన, కృష్ణునిఁ బొడగని పొగడి పూజించి రంత.

962

తా ॥ ఇలా కృష్ణుడు ముందు అక్రూరుడు పొందిన పుణ్యలోకంచూపి, బ్రహ్మలోకాన్ని కూడా చూపించాడు. నందాదులు చూసి ఆనందించి ఆశ్చర్యపడుతూ పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణణ్ణి స్తోత్రం చేసి పూజించారు.

చ. కలువల మేలికందువలు, కాముని కయ్యపుఁ బాళెముల్, వియో
గులఁ దలఁకించు వేళలు, చకోరకపంక్తుల భోగకాలముల్,
సెలువలు సైరణల్ విడిచి చిక్కు తఱుల్, ఘనచంద్ర చంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు జారక దుర్దశలయ్యె నయ్యెడన్.

963

తా ॥ శరత్కాలం కలువలకు మేలు కలుగు సమయం. మన్మథునికి కదన సమయం. చకోర పక్షులకు భోగానుభవ కాలం. స్త్రీలు నిబ్బరమును విడిచి విషయానుభూతియందు చిక్కుకొనే సమయం. దట్టమైన వెన్నెలల చేత స్వచ్ఛంగా ప్రకాశించే కాలం. శరత్కాలపు రాత్రులు జారులకు దురవస్థను కలుగచేస్తోంది.

ఆ. కామతంత్రటీక, కలువల జోక, కం, దర్పు డాక, విటులతాల్మి పోక,
చకితచక్రవాక, సంప్రీత జనలోక, రాక వచ్చె మేలు రాక యగుచు.

964

తా ॥ మదన శాస్త్రమునకు వ్యాఖ్యానము వంటిది, కలువలను వికసింప చేయునట్టిది, మన్మథ విజృంభణము కలది, విటజనుల ధైర్యాన్ని పోగొట్టేది, చక్రవాక పక్షులకు బెదరు పుట్టించునదియు, జనులకు సంతోషాన్నిచ్చేదియున్ను అయిన శారదపూర్ణిమ (శరత్ పూర్ణిమ) మేలును కలుగచేస్తూ వచ్చింది.

క. పతి దన కరములఁ గుంకుమ, సతి మొగమున నలఁదుభంగి సముదయ వేళాం
చిత కరరాగమున నిశా, పతి రంజించెన్ నరేంద్ర! ప్రాక్సతి మొగమున్.

965

తా ॥ ఓ రాజా! భర్త తన చేతులయందలి కుంకుమను తన భార్య మొగానికి పూత పూసిన విధంగా చంద్రుడు ఉదయించే సమయాన తన కిరణములచేత తూర్పు దిక్కు అనెడు స్త్రీ

వదనాన్ని రంజింపజేసాడు.

సీ. విటసేనపై దండు వెడలెడు వలతేని గొల్లెనపై హేమకుంభ మనఁగఁ
గాముకధృతి వల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకుచేతి చక్ర మనఁగ
మారుండు పాంథుల మానాటవుల గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ
విరహిమృగమ్ముల వేఁటాడ మదనుండు దెచ్చిన మోహనదీప మనఁగ

ఆ. వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై, కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడువుఁగొండ చక్కిఁ బొడిచె రాకాచంద్ర, మండలంబు గగనమండలమున.

966

తా ॥ మనోహరమైన రూపంతో గుండ్రనై ఎర్రని కాంతితో, చకోర పక్షుల గుంపులు ఉప్పొంగగా పున్నమి చంద్రుడు గగన మండలంలో ఉదయ పర్వతంమీద ఉదయించాడు. అప్పుడు చంద్రుడు జారుల మీద దండెత్తటం కోసం మన్మథుడు పన్నిన శిబిరం మీది బంగారు కలశమో అన్నట్లున్నాడు. మరులుగొన్నవారి ధైర్యం అనే తీగను తెగనరకటం కోసం ఎత్తిన చక్రమో అన్నట్లున్నాడు. ఆ మన్మథుడు ప్రియురాండ్రను ఎడబాసిన వారి ప్రణయ కోపములనెడు అడవులను కాల్చడం కోసం ప్రోగుచేసిన నిప్పుల కుప్పలా ఉన్నాడు. విరహులనే మృగాలను వేటాడేందుకు ఆ చెరకువిలుకాడు తెచ్చిన మోహదీపంగా ప్రకాశిస్తున్నాడు.

## 36. శరద్రాత్రి గాన మొనర్చు కృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చుట

వ. ఇట్లు పొడమిన నవకుంకుమాంకిత రమాముఖ మండలంబునుం బోలె నఖండంబైన చంద్రమండలంబుం బొడగని పుండరీక నయనుండు యమునా తటవనంబున జగన్మోహనంబుగ నొక్కగీతంబుఁ బాడిన విని, తదాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేత లే పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచియీడకయు, నీడి యీడికా నీడిన పాలు కాఁపకయు, గాఁచి కాఁచియుఁ, గాఁగినపాలు డింపకయు, డించి డించియు, డించినపాలు బాలురకుం బోయకయుఁ, బోసి పోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబుల పట్టుల నుండకయుఁ, బాయసంబులు నెఱయ వండకయు, నయ్యెయెడల నిలువంబడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ, గురులు సక్కనొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱందులు, బిడ్డలు నడ్డంబు చని నివారింపం దలారింపకయు, సంచలించి పంచభల్లుని భల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి; యుల్లసిల్లు తటిల్లతల పొందున మందగమనల మందగమనంబుల మందవెలువడి గోవింద సందర్శనంబునకుం జని రప్పుడు.

967

తా ॥ ఈ విధంగా చంద్రోదయమైంది. క్రొత్తగా కుంకుమబొట్టు పెట్టుకొన్న తూర్పుదిక్కు అనెడు లక్ష్మీదేవి యొక్క ముఖమో అనునట్లు ప్రకాశిస్తున్నాడు చంద్రుడు. చంద్రుణ్ణి చూసి శ్రీకృష్ణుడు యమునానదీ తీరంలో లోకానికి మోహం పుట్టేటట్లుగా మురళితో ఒక మోహన గీతాన్ని ఆలపించాడు. అది విన్న గోపికలు పరవశులై తత్తరపాటు కలుగగా తమతమ

పనులయందు చేతులాడలేదు. ఆవులకు దూడలను విడిచి పాలు పిండలేదు, పిదికిన పాలు కాచలేదు, కాచిన పాలు దించలేదు, దించిన పాలు బిడ్డలకు పట్టలేదు. బిడ్డలకు పాలు పట్టినవారు మరచి మరల పట్టించసాగారు. భర్తలకు ఉపచారములు చేయకయు, చేసి మరచి మరల చేయసాగారు. అన్నములు తినకయు, తిన్నవారు మరచి మరల తినబోయారు. పువ్వులు ముడుచు కొనకయు, ముడుచుకొన్నవారు మరచి ముడుచుకో సాగారు. సొమ్ములు పెట్టుకొనకయు, పెట్టుకొని మరచి మరల పెట్టుకోబోయి.... ఈ విధంగా పనులయందు ధ్యాస లేకుండా, మైమరచి ఉన్నారు గోపికలు. ఇంకా కొట్టములలో ఉండలేకపోయారు, పరమాన్నములు చక్కగా వండలేదు. నిలిచిన చోట నిలువలేక పోతున్నారు. కాటుకలు చక్కగా తీర్చుకొనక, వెంట్రుకల చిక్కు తీసుకొనక, తొలగిన పైటలు సవరించు కొనక, తమ చెలికత్తెలతో సైతం చెప్పబోక, తోబుట్టువులు, మగలు, మామలు, మరదులు, కొడుకులు, కుమార్తెలు, తమకడ్డము వచ్చి పోవలదని నిలువరించినా వెనుకకు వెళ్ళేలా లేరు. మేఘసముదాయం నుండి బయటకు వచ్చే మెరుపుతీగల వలె మందనుండి బయటకు వచ్చి, మెల్లగా నడిచే స్వభావం కలవారైనా వడిగల నడకలతో కృష్ణుణ్ణి చూడబోయారు.

> మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
> ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
> బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
> దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై.

968

తా ॥ కొందరు గోపికలు ఇంటినుండి బయటకు వచ్చేందుకు ధైర్యం చాలక, బయటకు రాలేక పోయారు. కృష్ణుని ఎడబాటువల్ల సంతాపంచేత తపించుచు మనస్సులలోనే కృష్ణుణ్ణి ఆలింగనం చేసుకుని ఆ ధ్యానంలో పరవశించిపోయారు. ఆ భావనా తీవ్రతచే త్రిగుణాలకు అతీతమై నిలిచి, బంధవిముక్తులై, శరీరాలను వదలి ముక్తిని పొందారు.”

వ. అనిన నరేంద్రుం డిట్లనియె.

969

క. జారుఁడని కాని కృష్ణుఁడు, భూరిపరబ్రహ్మ మనియు బుద్ధిఁ దలంపన్
నేరరు; గుణమయదేహము, లే రీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా!

970

తా ॥ అప్పుడు పరీక్షిత్తు ఇట్లా అన్నాడు: "ఓ శుకమహర్షీ! గోపికలు శ్రీకృష్ణుని జారుడని అనుకొన్నారే గాని లోకోత్తరుడైన పరబ్రహ్మమని భావించిన వారు కారు. అటువంటి వారు త్రిగుణ వికారములైన దేహాలను ఎలా విడిచి పెట్టారు? నాకు తెలియ చెయ్యవలసింది."

వ. అనిన శుకుం డిట్లనియె.

971

తా ॥ అని రాజు ప్రశ్నించగా శుకుడు ఇట్లా అన్నాడు:

మ. 'మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందెఁ; బ్రియలై పొందంగ రాకున్నదే?
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుండై నట్టి గోవిందు మూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ! తెల్లంబు భూవల్లభా!

972

తా ॥ "ఓ రాజా! 'శిశుపాలుడు శ్రీకృష్ణునితో విరోధించి కూడా మోక్షాన్ని పొందాడు' అని నీకు ముందు చెప్పాను. అటువంటప్పుడు ప్రేమించిన గోపికలు ముక్తిని పొందడం ఏమి వింత? పాపము లేనివాడు, నాశము లేనివాడు, ఏ గుణములు లేనివాడు అయిన కృష్ణుడు ఏ విధంగానైనా మోక్షాన్ని ఇచ్చేవాడే కాని ఇతరుడు కాడు.

ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ, బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు, జనులు మోక్షమునకుఁ జనుదు రధిప!

973

తా ॥ ఓ రాజా! లోకంలోని జనులు చుట్టరికంచే గాని, శత్రుత్వంచే గాని, చింతచే గాని, ప్రేమచేత గాని, ప్రాణభీతిచే గాని, భక్తిచే గాని విష్ణువును స్మరిస్తూ ఉండేవారు తప్పక మోక్షాన్ని పొందుతారు.

వ. అటు గావునఁ బరమపురుషుండును, నజుండును, యోగీశ్వరేశ్వరుండును నైన హరిని సోఁ కిన స్థావరం బయిన ముక్తం బగు; వెఱఁగుపడ వలవ, దివ్విధంబున.

974

తా ॥ పరమ పురుషుడు, పుట్టుకలేనివాడు, యోగీశ్వరేశ్వరుండైన హరిని స్పృశించినంతనే వృక్షాదులు సైతం మోక్షం పొందుతాయి, కనుక గోపికలు ముక్తిని పొందారు అంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

క. ఘన మధురగీత నినదము, విని వచ్చిన గోపికలను వీక్షించి నయం
బున మేటి సుగుణి నేర్పరి, తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్.

975

తా ॥ తన మధుర గీతాన్ని విని వచ్చిన గోపికలను చూసి, మేటి అయినవాడు, సుగుణములు కలవాడు, నేర్పరి అయిన శ్రీకృష్ణుడు తన వాగ్వైభవం వెల్లడి అయ్యేటట్లు ఇలా అన్నాడు:

శా. మేలా మీకు? భయంబు పుట్టదు గదా మీమందకున్? సింహ శా
ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్ దూరంబు లేతెంతురే?

యేలా వచ్చితి రీ నిశాసమయమం? దిచ్చోట వర్తింతురే?
చాలుంజాలు లతాంగులార! చనుఁడీ సంప్రీతితో మందకున్.

976

తా ॥ “ఓ గోపికా స్త్రీలారా! మీరు కుశలమా! పల్లెలో ఏ విధమైన భయము లేదు గదా! సింహములు పెద్దపులులు ఏనుగులు మొదలైన మృగాలు ఈ వేళలో తిరుగుతూ ఉంటాయి. ఇట్టి దూర ప్రదేశాలకు ఈ రాత్రి వేళలో ఇలా ఒంటరిగా ఎవరైనా వస్తారా! మీరెందుకు వచ్చారు? జరిగింది చాలుగాని ఇక సంతోషంతో మీ ఇండ్లకు మీరు వెళ్ళండి.

శా. మీ రేతెంచిన జాడఁ గానక వగన్ మీతల్లులుం దండ్రులున్
మీ రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ మీ సోదరుల్ బంధువుల్
'మేరల్ మీఱిరి లేరు పోయి' రనుచున్ మీ ఘోషభూభాగమం
దేరీతిం బరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్?

977

తా ॥ మీరు వచ్చిన జాడ తెలియక మీ తల్లిదండ్రులు, మగలు, మరదులు, కొడుకులు, మీ గురువులు, సోదరులు, బంధువులు, వీరంతా మీరు హద్దుమీరి పోయారని వ్రేపల్లెలో ఎక్కడెక్కడ వెతుకుతున్నారో? ఇలాంటి తెగువతో కూడిన పనులు మీకు తగవు.

చ. ఇలువడి సున్నసేసి హృదయేశుల సిగ్గులు వుచ్చి యత్త మా
మల నెరియించి సోదరుల మానము సూఱలు వుచ్చి తల్లి దం
డ్రుల రుచి మాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్
వలనఱి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే?

978

తా ॥ ఓ గోపికలారా! మీవలె ఇల్లాలి ధర్మాన్ని విడిచి, భర్తలను సిగ్గుచేత కృశించేటట్లు

చేసి, అత్తమామలను తపింపజేసి, సోదరుల గౌరవాన్ని పోగొట్టి, తల్లితండ్రుల ఆసక్తిని పోగొట్టి, బంధువులకు రోత కలుగజేస్తూ, జారవాంఛ చేత ఇలా ఇండ్లు విడిచి రావచ్చా? లోకులు మిమ్ములను ఏమనుకుంటారు?

సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన బ్రాణంబునకుఁ దెగు దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ దగులు సేయుఁ
దలిదండ్రు లెఱిఁగిన దల లెత్తకుందురు రేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి బంధువు లెఱిఁగిన బహి యొనర్తు

ఆ. రితరు లెఱిఁగిరేని నెంతయుఁ జుల్కగాఁ, జూతు; రిందు నందు సుఖము లేదు;
యశము లేదు నిర్భయానందమును లేదు, జారుఁ జేరఁ జనదు చారుముఖీకి.

979

తా ॥ ఇల్లాలు జారత్వం చేస్తూన్నదన్న వర్తమానం పెనిమిటికి తెలిస్తే చంపడానికి తెగిస్తాడు. రాజు అయితే దండిస్తాడు. మామకు తెలిస్తే బ్రతుకంతా చెడిపోతుంది. తలారికి తెలిస్తే తంటా వస్తుంది. తల్లితండ్రులకు తెలిస్తే ఇక వాళ్ళు తల ఎత్తుకోలేరు. తోడికోడలకు తెలిస్తే ఎత్తిపొడుస్తుంది. కొడుకులకు తెలిస్తే ఆదరించరు. బంధువులకు తెలిస్తే వెలివేస్తారు. ఇతరులకు తెలిస్తే చులకనగా చూస్తారు. దీని వలన ఇహంలో గాని, పరంలోగాని సుఖం లేదు. కీర్తి లేదు. భయంలేని సంతోషం లేదు.

క. నడవడి గొఱ గాకున్నను, బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్
జడుఁడైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు విభు నంగనకున్.

980

తా ॥ మంచి నడవడి లేనివాడైనా, పేదవాడైనా, చక్కదనం లేకపోయినా, పామరుడైనా, చొరవలేని వాడైనా, రోగి అయినా భర్తను విడిచిపెట్టడం ఇల్లాలికి మర్యాదకాదు.

స్వయం ప్రకాశమాన విజ్ఞానమనే శ్రీకృష్ణుడు అంతర హృదయాకాశమనే బృందావనంలో, కర్మకాండ జ్ఞానకాండలనెడి హస్తములచేత, సుషుమ్న అనే వేణువును పూని, మూలాధారాది కమలములనే కోయిలలు ఆనందించి కూస్తూ ఉంటే, ఊర్ధ్వ కుండలి అనే సర్పరాజు ఆనందతాండవం చేస్తున్నాడు. గంధర్వ గానం చేయగా విని చొక్కి ఇంద్రియాలనే గోపికలు తమ వ్యాపకాలను మాని భర్తలైన బ్రహ్మాది దేవతల ఆజ్ఞలను మీరి పూర్ణానంద స్వరూపుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మమందు ఐక్యమవడంకోసం రాగానే అతడు తన స్వరూపములైన ఇంద్రియాలనే గోపికలతో సంభాషించాడు.

చ. ఇది యమునానదీజల సమేధిత పాదపపల్లవ ప్రసూ
న దళవిరాజితంబగు వనంబు; మనంబులు మేర దప్పెనో?
పొదఁడటు నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్
మొదవులకున్; నిజేశ్వరుల ముద్దియలార! భజింపుఁ డొప్పుగన్.

981

తా ॥ ఓ గోపికలారా! మీరిప్పుడు ఇచ్చటికి రావడం చూస్తూంటే మీ మనస్సులలో కలవరం కలిగినట్లు నాకు అనిపిస్తూన్నది. ఇది యమునా నదీ జలాలచేత పెరిగి చిగిర్చి పూచి అందంగా ఉన్న వృక్షములు గల అడవి, కానీ వ్రేపల్లె కాదు. కనుక మీ మనస్సులలోని కలవరాన్ని పోగొట్టుకొని మీ ఇండ్లకుపోయి ఆకలితో ఏడ్చే బిడ్డలకు పాలు పట్టండి! ఆవులకు దూడలను విడవండి! మీ మగలను గౌరవంతో సేవించండి! వెళ్ళండి!

చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి, రింతఁ గొఱంత లేదు; మే
లొనరె; సమస్త జంతువులు నోలిఁ బ్రియంబులు గావె? నాకు; నై
నను నిలువంగఁ బోలదు, సనాతన ధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు; పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్.

982

తా ॥ ఓ గోపికలారా! మీరు నన్నుకోరి ఇచ్చటికి వచ్చారు. ఇంత మాత్రానికి లోపంలేదు. నాకు సమస్త ప్రాణులు ప్రియములే కనుక మీరున్ను ప్రియములే. మీకు మేలు కలుగుతుంది. స్త్రీలకు ఎన్నడు తొలగరాని ధర్మం ఏమిటంటే భర్తను కొలవడమే అని పెద్దలు చెబుతారు. కనుక మీరు ఇప్పుడు ఇక్కడ నిలువక మీ ఇండ్లకు పోయి మీ భర్తలను సేవించండి.

క. ధ్యానాకర్ణన దర్శన, గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము, మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్.

983

తా ॥ నా ధ్యానం, నా గురించి వినటం, నన్ను దర్శించటం, నా గురించి గానం చేయటం, నాయందు ఆసక్తి కలిగి ఉండటం, ఇవి ఉంటేచాలు కృతార్థులు అవుతారు. ఓ మానవతులారా! కనుక మీ ఇండ్లకు తిరిగి వెళ్ళండి."

వ. అని పలికిన విని.

984

సీ. 'విరహాగ్నిశిఖలతో వెడలు నిట్టూర్పుల ముమ్మరంబులఁ దాఁకి మోవు లెండఁ
గన్నుల వెడలెడి కజ్జలధారలు కుచకుంకుమంబుల గ్రొచ్చి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ముల మేలి మురువు డిందఁ బొరిఁ
బొరిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు మదను కోలల ధైర్యమహిమ సెదర

తే. దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ, బ్రియము లాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి
చరణముల నేల వ్రాయుచు సంభ్రమమునఁ, గాంత లెల్లను వగల నా క్రాంత లగుచు.

985

తా ॥ అని కృష్ణుడు చెప్పగా విని... విరహమనే అగ్ని శిఖలతో వెడలిన నిట్టూర్పుల చేత పెదవులు కంది ముఖాలు ఎండిపోయాయి. కన్నులనుండి కారుతున్న కాటుక కన్నీళ్ళ చేత

కుచములకు పూసుకొన్న కుంకుమ తోడి గంధము కరిగి ప్రవహిస్తోంది. విచారం చేత చెక్కిళ్ళకు చేర్చుకున్న చేతుల వేడిమికి ముఖాలు వాడిపోయాయి. పరంపరగా వచ్చే మన్మథ బాణాలకి ధైర్యం చెదిరి పోయింది. మిక్కుటమైన దుఃఖంచేత మాటలు తొట్రుపడుతున్నాయి. తమకు ప్రియములుగాని కృష్ణుని యొక్క మాటలు విని భయపడ్డారు. మరలిపోవడానికి కాళ్ళు రాక పాదాలు నేలకు రాస్తూ తడబాటుతో గోపికలందరూ విచారగ్రస్తులై కృష్ణునితో ఇలా అన్నారు:

వ. ఇట్లనిరి.

986

మ. 'అకటా! నమ్మితి మేము; క్రూరుఁడన ని న్నర్థంబె? మా యిండ్లలో
సకల వ్యాప్తుల డించి నీ పదసరోజాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి, మీశుఁ, డాఢ్యుఁడవు; మోక్షాసక్తులం గాచు పో
లికఁ గావందగుఁ గావవే? విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్.

987

తా ॥ "అయ్యో! మేము నిన్ను నమ్మి మా ఇండ్లలో గల పనులన్నీ విడిచి నీ పాదపద్మాలు సేవించాలని మావారికి చిక్కక ఇక్కడకు వచ్చామే. సర్వానికి నీవు ఈశ్వరుడవు, పరిపూర్ణుడవు. నీ వలన భ్రాంతితో వచ్చిన మమ్ము ముముక్షువులను ఏలినట్లు ఏలుట తగదా? మావంటి వారిని విడుచుట నీకు మంచిదా?

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మ ప
ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;
పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే?

988

తా ॥ కృష్ణా! నువ్వు ఆడవారికి భర్తను, బిడ్డలను, చుట్టములను ఆదరించటమే ధర్మం అని చెప్పావు. దేహధారిణులైన వారికి ఆ నియమాలు చెల్లుతాయి కానీ నీవు తప్ప ఇతరములు ఏవీ వద్దు అనుకునే మాబోటి వారికి ఈ విధంగా చెప్పడం న్యాయమేనా? మాకు సర్వమూ నీవే.

మత్తకోకిలము:
నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్, సతతప్రియో
ద్దీపకుండవు; గాన నెవ్వగఁ దెచ్చు నాథసుతాదులం
జూప నేటికి? మన్మహాశలు సుట్టి నీకడ నుండఁగాఁ
బాప నేల? మదీయతాపముఁ బాపఁ బోలు కృపానిధీ!

989

తా ॥ దయకు ఉనికిపట్టు అయిన ఓ కృష్ణా! నేర్పరులైనవారు (యోగులు) సకల ప్రాణులకును ఆత్మభూతుడవై ప్రకాశించేవాడవు కనుక నీవంటే అపేక్షపడుతూ ఉంటారు. మా యొక్క ఆశలన్నీ నీయందే ఉన్నాయి. విచారాన్ని కలుగజేసే లౌకిక బంధాలైన పెనిమిటి కొడుకులు మొదలైన వారిని మాకు ఎందుకు చూపుతున్నావు? మాకు గల తాపమును తొలగించు.

సీ. నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని తరలి పోవంగఁ బాదములు రావు;
నీ కరాబ్జంబులు నెఱి నంటి తివఁ గాని తక్కిన పనికి హస్తములు సొరవు;
నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలు సేరి వినవు;
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కి కవలు;

ఆ. నిన్నె కాని పలుకనేరవు మా జిహ్వ, లొల్ల ననుచుఁ బలుకనోడ వీవు
మా మనంబు లెల్ల మరపించి దొంగిలి, తేమి సేయువార మింకఁ? గృష్ణ!

990

తా ॥ ఓ కృష్ణా! నీ పాదపద్మాలను సేవించడానికే కాని మరలి పోడానికి కాళ్ళురావు. నీ హస్త పద్మాలను పట్టుకునేందుకేగాని మరి ఏ పనికీ చేతులు రావు. నీ మాటలనెడి అమృత ధారను పూర్ణంగా వినుటకేకాని మా చెవులు ఇతరములైన మాటలు వినడానికి అంగీకరింపవు. నీ సుందరమైన రూపాన్నే కాని ఇతరములను మా రెండు కన్నులు చూడవు. మా నాలుకలు నిన్నేగాని ఇతర నామాములు ఉచ్చరింపనేరవు. మరి నీవో మమ్ములను అపేక్షించటంలేదని చెప్పేందుకు వెనుకాడటంలేదు. మా మనస్సులను దొంగిలించావు. ఇంక మేమేమి చేయగలం!

చ. సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర! మా తపముసంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగ లేము మా మగల మాటల నొల్లము; పద్మగంధముల్
మరఁగిన తేఁటు లన్యకుసుమంబుల చెంతను జేరనేర్చునే?

991

తా ॥ ఓ కృష్ణా! లక్ష్మీదేవికి సంతోష చిహ్నములను కలుగజేసే నీ పాదకమలాలను మా పూర్వ జన్మమునందలి తపఃఫలం చేత పొందాము. ఇక అటువంటి నీ పాదముల సేవను చేయక ఎట్లు తొలగిపోగలము? మా భర్తల సంగతి చెప్పవద్దు. తామరపూల పరిమళాన్ని గ్రహించడానికి అలవాటు పడిన తుమ్మెదలు అన్యకుసుమాల చెంతకు వెళతాయా?

ఆ. సవతు లేక నీ విశాలవక్షస్థ్సలిఁ, దులసితోడఁ గూడఁ దోయజాక్ష!
మనుపు మనుచు నెపుడు మాకాంత నీపాద, కమలరజముఁ గోరుఁ గాదె కృష్ణ!

992

తా ॥ ఓ కృష్ణా! లక్ష్మీదేవి ఎల్లప్పుడు నీ విశాలమైన వక్షస్థలంపై తులసీదేవితో పాటు కలసి మెలసి ఉండేటట్లు అనుగ్రహించమని నీ పాదకమలాల యొక్క రేణువులను కోరుతూ ఉంటుంది గదా!

ఉ. అత్తలు మామలున్ వగవ నాఱడి కోడక నాథులన్ శుగా
యత్తులఁ జేసి యిల్వరుస లాఱడి వోవఁగ నీదు నవ్వులన్
మెత్తని మాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార; మే
పొత్తుల నొల్లమో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే!

993

తా ॥ ఓ పురుషశ్రేష్ఠా! అత్తమామలు దుఃఖింపగా, భర్తలకు శోకం కలుగచేసి, గృహధర్మాలు చెడిపోగా నీ నవ్వులూ మృదువైన మాటలూ గుర్తుకు వచ్చి నీ విరహంతో వచ్చాము. ఏ పొత్తులూ మాకు వద్దు. నీ దాస్యం చెయ్యడానికి అంగీకరించవయ్యా.

మ. మగువల్ సిక్కరె తొల్లివల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు దలంపరే? తగులముల్ మాపాలనే పుట్టెనే?
మగవా రాడెడు మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగులం జాలము; కౌఁగిలింపుము మముం; బుణ్యంబు పుణ్యాత్మకా!

994

తా ॥ ఓ పుణ్యపురుషా! పూర్వం స్త్రీలు వల్లభులను వలచినవారు కాదా? వారిని ఆదరించి ఏలుకోలేదా? మోహములు మా యందే పుట్టెనా? నీ మాటలు పురుషులు చెప్పేమాటలు కావు. మన్మథ తాపంచేత తాళలేకున్నాము. మమ్ము ఆలింగనం చేసుకో. నీకు పుణ్యం ఉంటుంది.

ఉ. కుండలదీప్త గండమును గుంచితకుంతల ఫాలమున్ సుధా
మండిత పల్లవాధరము మంజులహాస విలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని యుండఁగ వచ్చునె? మన్మథేక్షు కో
దండ విముక్త బాణముల దాసుల మయ్యెద; మాదరింపవే.

995

తా ॥ కుండలముల చేత ప్రకాశించే చెక్కిళ్ళు, ముంగురుల చేత ఆవరింపబడిన నొసలు, అమృతం చిందించు అధరము, మనోజ్ఞమైన చిరునవ్వుతోడి చూపులును కలిగిన నీ ముఖాన్ని చూసి, మన్మథుని చెరకు వింటి నుండి వెడలునట్టి బాణములకు చిక్కి నీకు దాసులమైనాము. మమ్ము ఆదరించి ఏలుకోవయ్యా!

సీ. నీ యధరామృత నిర్ఝరంబుల నేఁడు సేరి వాతెఱలపైఁ జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మలవక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న
నీ రమ్యతర హస్త నీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న
నీ కృపాలోకన నివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న

ఆ. నీ నవీన మాననీయ సల్లాపంబు, కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న
నెట్లు బ్రదుకువార? మెందుఁ జేరెదువార? మధిప! వినఁగఁ దగదె యాఁడుకుయిలు.

996

తా ॥ ఓ గోకుల వల్లభా! నీ మోవి సుధారసం నేడు మా అధరాలమీద చిలకరించు. విశాలమైన నీ వక్షస్థలం మా వక్షానికి చేర్చు. రమ్యమైన నీ హస్త కమలములను మా కొప్పులయందు చేర్చు. నీ దయతోడి చూపులను మెల్లగా మా నెమ్మోములపై ఉంచు. నీ తేనెపలుకులు మా కర్ణరంధ్రముల నిండా ఒలికించు! లేకపోతే మేము ఎలా బ్రతకాలి? ఎక్కడికి వెళ్ళగలం? మా మొరలాలకించు.

మ. భవదాలోకన హాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్ల వామృతముచేఁ బాపం దగుం, బాప వే
ని వియోగానల హేతిసంహతులచే నీఱై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ పాదంబులానం బ్రియా!

997

తా ॥ ఓ ప్రాణేశ్వరా! నీ పాదాలమీద ఆన! నీ తేట చూపుల వల్ల, నవ్వుల వల్ల, పాటల వల్ల మాకు మోహం పుట్టించావు. కనుక ఆ మోహం వల్ల కలిగిన తాపాన్ని నీ అధరపల్లవామృతం చేత చల్లార్చు. నువ్వు చల్లార్చని పక్షంలో విరహానల జ్వాలలతో భస్మమై నీ సంబంధమైన విచారంచేత నీ పాదపద్మాలనే పొందుతాము. అనగా ధ్యానంతో యోగులబాట ననుసరించి నిన్ను పొందుతాము.

క. తరుమృగఖగ గోగణములు, కర మొప్పెడు నిన్నుఁ గన్న గానము విన్నం
గరఁగి పులకించు; నబలలు, గరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్?

998

తా ॥ కృష్ణా! మనోహరమైన నీ రూపాన్ని చూసినా, నీ గానాన్ని ఆలకించినా వృక్షాలు, విషయ పరిజ్ఞానంలేని పశుపక్ష్యాదులు కరిగి పులకించిపోతాయి. మరి అటువంటప్పుడు స్త్రీలు ద్రవించిపోరా? ఇందులో ఆశ్చర్యం ఏముంది?

సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము నీ మంజువాగ్వృష్టి నెగడదేని?
నీ మన్మథాంభోధి నే త్రోవఁ గడతుము నీ దృష్టి నావయై నిలువదేని?
నీ చిత్తజధ్వాంత మే జాడఁ జెఱుతుము నీ హాసచంద్రిక నిగుడదేని?
నీ దర్పకజ్వర మే భంగి నడఁతుము నీ నవాధరసుధ నింపవేని?

ఆ. నెట్లు నిర్వహింతు? మే లాగు మాలాగు;, కరుణ సేయ వేనిఁ గదియ వేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే? యశో, దా కుమార! యువతి ధైర్యహార!

999

తా ॥ ఓ యశోదా కుమారా! నీ చల్లని ఇంపైన పలుకులనే వాన కురియకపోతే మేము ఎలా తాళగలం? నీ దయతోడి చూపు అనే ఓడ మాకు లభించకపోతే ఈ వ్యథ అనే సముద్రాన్ని (సంసారసాగరం) దాటలేము. నీ చిరునవ్వు వెన్నెలలు కాయకపోతే ఈ వేదన అనే చీకటి

తొలగదు. నీ అధరామృతం అనే సుధను పుచ్చుకోకపోతే ఈ తాపం ఎలా తీరుతుంది. నువ్వు కరుణ చూపకపోతే మేము ఎలా బ్రతుకుతాము. నువ్వు మమ్మలను చేరనివ్వకపోతే మా గతి ఏమిటి? మరుడు నిర్దయుడు మమ్మల్ని బ్రతుకనిస్తాడా?

ఆ. అమరులఁ గాచిన హరిక్రియఁ, గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయ హ
స్తము మా యురముల శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్.

1000

తా ॥ కృష్ణా! శ్రీ మహావిష్ణువు దేవతలను రక్షించిన విధంగా ఇప్పుడు నువ్వు నీ అభయహస్తాన్ని మా మీద ఉంచి మేము మూర్ఛిల్లకుండా కాపాడు.

క. కట్టా! తలమునుకలునై, దట్టపు విరహాగ్ని శిఖలు తరుణుల నేఁచన్
నెట్టన్ బలుకవు చూడవు, కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా!

1001

తా ॥ దయామయా! నీవెంత క్రూరుడవయ్యా! గాఢ వియోగజ్వాలలు నిన్ను నమ్మిన తరుణులను తపింప చేస్తూంటే ఒక్కమాట కూడా మాట్లాడవు. ఇటు తిరిగి చూడనైన చూడవు గదయ్యా! ఎంత కఠినంగా ఉన్నావు?"

వ. అని యిట్లు కుసుమశరుని శరపరంపరా పరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి యోగీశ్వరుం డయిన కృష్ణుం డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు.

1002

తా ॥ అని ఈ విధంగా దర్పకుని శరపరంపరల చేత బాధింపబడుతూ ఓపికలు లేని గోపికల దుఃఖవచనాలు విని నవ్వి, కృష్ణ పరమాత్మ ఆత్మారాముడై వారితో క్రీడించాడు. ఆ

స్వామి ఇతరులకు ఆనందాన్ని చేకూర్చే వాడే కానీ ఇతరుల ద్వారా ఆనందం పొందేవాడు కాదు.

మ. కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్, నర్మ వా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులం గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్.

1003

తా ॥ శ్రీకృష్ణుడు తన దయగల చూపులతోనూ, స్పర్శనం చేతనూ, ఆలింగనం చేతనూ, మేలములాడుతూ, ఆ పుష్పబాణుని గర్వము అణచే విధంగా ఆ గోపస్త్రీలతో సంగమ క్రీడను సాగించాడు.

క. మక్కువ వికసిత వదనలు, సక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు, చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్.

1004

తా ॥ వికసించిన మోములు కల గోపికలు తనను సేవింపగా కృష్ణుడు నవ్వులనెడు వెన్నెలలో నక్షత్ర సమూహం నడుమ ప్రకాశించు నిండు చంద్రుని వలె ప్రకాశించాడు.

ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు, నఱుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె, యువతిజన శతంబు లోలిఁ గొలువ.

1005

తా ॥ తరుణులు అనేక మంది తనను సేవిస్తూండగా మెడలో వైజయంతిమాల వ్రేలాడుతూ ఉండగా నాట్యం చేస్తూ ఆ బృందావనానికి అలంకారమై కృష్ణుడు ప్రకాశించాడు.

ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిం

జిక్కి కృతార్థలై మరుని చిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నా విభుండు గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్.

1006

తా ॥ అందరినీ తన మాయలో పెట్టి, ఎవ్వరికీ తాను చిక్కని ఆ పరమేశ్వరుడు ధన్యాంగనలైన ఆ గోపికా స్త్రీలకు చిక్కాడు. అంతలోనే వారికి శాంతిని కలిగించే విధంగా ప్రసన్నుడయ్యేందుకు ఆ గుణశీలి అదృశ్యమైనాడు.

వ. ఇట్లు హరి గను మొఱంగి చనిన కరిం గానక తిరుగు కరేణుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమన హాసవిలాస వీక్షణ విహార వచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధచేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు.

1007

తా ॥ హఠాత్తుగా కృష్ణుడు కనపడకపోయేసరికి, మగ ఏనుగును కానక అల్లాడు ఆడ ఏనుగులవలె గోపికల మనస్సులు తల్లడిల్లి పోయాయి. వారంతా అతని నడకలు, నవ్వులు, నటనలు, చూపులు, విలాసాలు, విహారాలు, మాటలు మొదలైన వానిచేత మనస్సులు అతనియందే లయమైపోగా, తన్మయత్వం చేత నేనే కృష్ణుడను, నేనే కృష్ణుడను అని అతని గుణస్మరణ చేత ఒళ్ళు తెలియని స్థితిలో ఉండిపోయారు.

క. భూతములలోనఁ వెలిఁ బ్ర, ఖ్యాతుం డగు నట్టివాని; గాంతలు కాళిం
దీ తీరవనాంతరముల, బ్రాఁతిన్ వెదుకంగఁ జనిరి పాడుచు నధిపా!

1008

తా ॥ ఓ రాజా! ఎల్ల ప్రాణులలోపలా, వెలుపలా పరిపూర్ణంగా నిండియున్న

శ్రీకృష్ణమూర్తిని యమునానది ఒడ్డున ఉన్న అడవులలో పాటలు పాడుచూ, ఆ గోపికలు తన్మయభావనలో జడచైతన్య భావన విడనాడగా వెదుకసాగారు.

సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ; దిలకంబ! కానవే తిలకనిటలు;
ఘనసార! కానవే ఘనసారశోభితు; బంధూక! కానవే బంధుమిత్రు;
మన్మథ! కానవే మన్మథాకారుని; వంశంబ! కానవే వంశధరునిఁ
జందన! కానవే చందనశీతలుఁ గుందంబ! కానవే కుందరదను;

తే. నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ, గువలవృక్షమ! కానవే కువలయేశుఁ;
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు; ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.

1009

తా ॥ "ఓ పున్నాగ (పొన్న) వృక్షమా! పురుష పుంగవులచే స్తోత్రం చేయబడిన వానిని నీవు చూడలేదా? ఓ బొట్టుగుచెట్టా! నొసట కస్తూరి బొట్టు గలవానిని చూడలేదా! ఓ కర్పూరపు అరటి చెట్టా! నీలమేఘచ్ఛాయచే ప్రకాశించు వానిని చూడలేదా? ఓ మంకెన చెట్టా! అందరికీ బంధువైన వానిని చూడలేదా? ఓ వెలగచెట్టా! మన్మథునివంటి అందగాడిని నువ్వు చూడలేదా? ఓ వెదురు తరువా! పిల్లన గ్రోవిని ధరించిన వానిని నువ్వు చూడలేదా? ఓ గంధపుమ్రానా! మంచిగంధము వలె చల్లని వానిని నీవు చూడలేదా? మొల్ల చెట్టా! మొల్ల మొగ్గల వంటి పలు వరుస గలవానిని చూడలేదా? ఓ ఏరుమద్ది చెట్టా! ఇంద్రభోగం వంటి భోగం కలవానిని నువ్వు చూడలేదా? ఓ కువలమనే వృక్షమా! భూమికి ఏలిక అయిన శ్రీకృష్ణమూర్తిని నీవు చూడలేదా? ఓ కడపచెట్టా! మాకు ప్రియమైన విహారంగల వానిని చూడలేదా?" అంటూ శ్రీకృష్ణుని కోసం ప్రతీ చెట్టునూ, పుట్టనూ ప్రశ్నిస్తూ వెదుకసాగారు.

వ. మఱియును.

1010

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే?

1011

తా ॥ ఇంకా ఆ కృష్ణుని రూపురేఖలను తెలియచేస్తూ ఇలా అడుగుతున్నారు – "నల్లనివాడు, కమలముల వంటి కన్నులు కలవాడు, కరుణారసం చిందించేవాడు, సిగయందు చుట్టుకోబడిన నెమలిపింఛము కలవాడు, నవ్వు ముఖము కల అందగాడొకడు మా మానము అనెడి ధనాన్ని దోచుకొని వచ్చాడు. మీ పొదలమాటున లేడు కదా! ఉంటే కొంచెం చెప్పరా?

ఉ. అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించు వాఁడు శ్రీ
రంగదురంబు వాఁడు మధురంబగు వేణురవంబు వాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గము సేసి లవంగ లుంగ నా
రంగములార! మీకడకు రాఁడు గదా! కృప నున్నఁ జూపరే!

1012

తా ॥ ఓ లవంగ వృక్షములారా! మాదీఫల వృక్షములారా! నారింజ తరువులారా! మన్మథునికి కూడా మోహం పుట్టించే అందమైన పురుషుడు. వినేవారికి ఇంపు కలిగేటట్లు పిల్లన గ్రోవిని ఊదుచూ మమ్ము అంగజుని పూబాణాలకు స్వాధీనం చేసిపోయాడు. వాడు మీ వద్దకు వచ్చి దాగి లేడు కదా! ఉంటే మాకు దయతో చూపండి!

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదార వత్సకములార!
సలలితోదార వత్సక వైరిఁ గానరే సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నత లతార్జునభంజుఁ గానరే ఘనతర లసదశోకంబులార!

ఘనతర లసదశోకస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిర కాంచనంబులార!

ఆ. నవ్య రుచిర కాంచన కిరీటుఁ గానరే, గహనపదవి కురవకంబులార!
గహనపదవి కురవక నివాసిఁ గానరే, గణికలార! చారుగణికలార!

1013

తా ॥ మనోజ్ఞములు, ఉన్నతములు అయిన ఓ కొడిసె వృక్షములారా! స్త్రీలకు మన్మథుని వంటి మాధవున్ని చూడలేదా? తీగల చేత అల్లుకోబడి అందంగా కనిపించే మద్దిచెట్టులారా! సరళమైన గాంభీర్యగుణంతో అలరారుతూ ఆ వత్సాసురుని సంహరించినవాడైన ఉదారున్ని చూడలేదా? ఉన్నతములైన అశోక వృక్షములారా! అందమైన మద్దిచెట్లను విరుగ త్రోసిన వానిని చూడలేదా? సుందర సంపెంగి చెట్టులారా! శోకములేని స్థితిని ప్రకాశింప చేసే కృష్ణున్ని చూడలేదా? ఎర్రగోరింట చెట్టులారా! బంగారు కిరీటముగల శ్రీకృష్ణున్ని మీరు చూడలేదా? మనోజ్ఞతగల అడవి మొల్లలార! మీరు కృష్ణున్ని చూడలేదా?" అని గోపికలు చింతా పరవశత్వం చేత అడవిలోని చెట్లన్నిటిని అడుగుతూ తిరుగసాగారు.

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని యైలేయ లతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా! చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ. జాతిసతులఁ బాయ నీతియే హరి కని, జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ, జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ!

1014

తా ॥ "అదుగో నందనుడు ఇక్కడే ఎక్కడో దాక్కున్నాడు. ఓ కలిగొట్టు చెట్టులారా! పట్టుకోండి. ఓ ఏలకి తీగలారా! విలాసవతులైన గోపికలను, కృష్ణా! ఎందుకు ఎడబాశావు అని

అడగండి! వనజాక్షుడు ఇచటికి వచ్చి దాక్కోలేదు గదా! ఓ మామిడి గున్నలారా ఒకసారి చూడండి! ఓ బండి గురివింద తీగలారా! మగువలపాలి మన్మథుడైన కృష్ణునకు మా రాక ఎరిగించి పుణ్యం కట్టుకోండి! ఓ జాజిపొదలారా! కులస్త్రీలను ఎడబాయటం కృష్ణునికి నీతి గాదని మీరు అన్ని దిక్కుల్లోనూ చాటండి! ఓ అరటి చెట్లులారా! మీరైనా వెళ్ళి నెమలిపింఛాన్ని తలలో ధరించిన ఆ నల్లనయ్యని తీసుకుని వచ్చి మాకు చూపండి.

క. హరిచరణములకుఁ బ్రియవై, హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా, హరి చొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే!

1015

తా ॥ ఓ తులసీ! నీవు శ్రీహరి చరణాలకు ప్రియమైన దానవు గదా! ఆ విష్ణువు ఆదరిస్తూంటే నీవు సర్వ శుభములను పొందుతున్నావు కదా! ఆ హరి నీ చెంతకు చేరలేదు కదా! కృష్ణుడు ఎక్కడ ఉన్నాడో చెప్పి కాస్త పుణ్యం కట్టుకో!

తే. పొగడఁ దగువానిఁ గానరె పొగడలార!, యీ డెఱుంగని విభుఁ జూపుఁ డీడలార!
మొల్లమగు కీర్తివాఁ డే డి మొల్లలార!, శుకనిగదితునిఁ జెపుఁడు కింశుకములార!

1016

తా ॥ ఓ పొగడ చెట్లులారా! పొగడ తగిన వానిని మీరు చూడలేదా! ఓ తియ్య నిమ్మ చెట్లులారా! సర్వాన్ని మించిన ఈశ్వరుణ్ణి మాకు చూపించండి. ఓ మొల్ల పొదలారా! వెల్లివిరిసే కీర్తిగల కృష్ణుడు ఎక్కడ ఉన్నాడు? ఓ మోదుగు వృక్షములారా! శుక మహర్షి చేత సర్వోత్కృష్టుడని చెప్పబడిన ఆ వనమాలి ఎక్కడ ఉన్నాడో మాకు కొంచెం చెప్పండి.

క. తరుణీకుచ కుంకుమయుత, హరికంధర దామగంధ మడరెడుఁ జూడ్కుల్
హరిఁ గనిన పగిదిఁ దనరెడి, హరిణీ! హరిజాడఁ బుణ్య మయ్యెడిఁ జెపుమా!

1017

తా ॥ ఓ హరిణీ! ఆ హరి ధరించిన కుంకుమ మిశ్రిత మొల్ల మొగ్గల వాసన వ్యాపించే విధంగా ఉన్న నీ వీక్షణములు నీవు చూస్తుంటే మా కృష్ణుణ్ణి చూసినట్లే ఉంది. అతను పోయిన జాడ తెలియచెప్పి పుణ్యం కట్టుకో!

క. కిటియై కౌఁగిటఁ జేర్చెను, వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై
యిటఁ బద చిహ్నము లిడెఁ గ్రిం, దటి బామున నేమి నోఁచి తమ్మ ధరిత్రీ!

1018

తా ॥ ఓ భూదేవి! నీకు మా కృష్ణుడు ముందు నుండి తెలుసును, వరాహావతారం ధరించినప్పుడు నిన్ను కౌగిట్లోకి చేర్చుకున్నాడు. వామనావతారం ఎత్తి నిన్ను కొలిచాడు. కృష్ణుడై ఇప్పుడు తన పాద చిహ్నములను నీపై ఉంచుతూ నడయాడసాగాడు. క్రిందటి జన్మలో నీవు ఏమి నోములు నోచావో కదా! నీవైనా మా కృష్ణుని జాడ చెప్పమ్మా!"

వ. అనుచు మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబున కృష్ణలీలల ననుకరించుచు.

1019

తా ॥ అంటూ గోపికలు భావోద్రేకం చేత అతనియందే నిమగ్నమైన మనస్సులతో కృష్ణలీలలను అనుకరించసాగారు. తన్మయత్వం నుండి వారు తదాకార స్థితిని పొందారు.

సీ. పూతనయై యొక్క పొలఁతి చరింపంగ శౌరియై యొక కాంత చన్నుఁ గుడుచు;
బాలుఁడై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే నను లేమఁ బాఱఁ దన్ను;
సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ; హరి నని వర్తించు నబ్జముఖీయు
బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు

ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ, గోపవత్సగణము గొంద ఱగుదు;
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ, బసుల మనెడి సతుల భరతముఖ్య!

1020

తా ॥ ఓ రాజా! నేను పూతనను అంటూ ఒక గోపిక మెలగగా నేను కృష్ణుడను అని ఇంకొక గోపిక స్తన్యపానం చేసినట్లు అభినయిస్తోంది. ఇంకొక గోపిక తాను బాలకృష్ణుడను అంటూ పాలకు ఏడుస్తున్నట్లుగా ఉండగానే, నేను శకటాసురుణ్ణి అన్న గోపికను వెంటనే పరుగెత్తిపోయేటట్లు తన్నుతోంది. ఇంకొక గోపిక నేను తృణావర్తుడను అని ఎత్తుకొని పోతూంటే, నేను కృష్ణుడను అని ఇంకొక గోపిక అతనిని చంపినట్టు అభినయం చేస్తోంది. ఇంకొక గోపిక నేను బకాసురుణ్ణి అంటే నేను కృష్ణుణ్ణి అంటూ వేరే గోపిక పరాభవిస్తోంది. కొందరు గోపికలు గొల్లబాలకులవలె, దూడలవలె అభినయిస్తుంటే, ఇద్దరు గోపికలు తాము రామకృష్ణులమని అనసాగారు. కొందరు గోవులమని అంటూ ఉంటే ఒకతె కృష్ణుడనని వారిని పిలుస్తోంది.

ఆ. లోకమెల్లఁ గుక్షిలోపల నున్నది, మాధవుండ నేను మాత వీవు
చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు, ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత!

1021

తా ॥ ఓ రాజా! లోకాలన్నీ కుక్షిలో ఉంచుకొన్న మాధవుడను నేను అని ఒక గోపిక అంటూ ఇంకొక గోపికతో, నీవు యశోదవు! కనుక నా ముఖంలో అన్ని లోకాలను చూడు అంటూ నోరు తెరచి చూపిస్తోంది.

క. వెన్నలు దొంగిలి తినియెడి, వెన్నుఁడ నని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమముల దండఁ గట్టు నిలేశా!

1022

తా ॥ ఓ రాజా! ఒక గోపిక వెన్న దొంగిలించి తినే కృష్ణుణ్ణి నేను అంటూ ఉంటే, ఇంకొకతె చేతి సైగలచేత నేను యశోదను అని వెంటనే పూలదండలతో బంధించసాగింది.

క. 'కాళియఫణి యిది వీరలు, కాళియఫణిసతులు మ్రొక్కఁ గడఁగిరి నే గో
పాల కుమారుఁడ' ననుచును, లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా!

1023

తా ॥ ఓ రాజా! నేను కృష్ణుడను, ఇది కాళియుడు, తక్కిన వారందరు వీని భార్యలు. వీరంతా తమ పెనిమిటిని మర్దింప వలదని నాకు మ్రొక్కుచున్నారు అని అంటూ వేడుకగా నృత్యం చేయ ఆరంభించింది ఒక గోపిక.

క. తరుణులు గోపకు లందఱు, హరిహయుఁ డిదె వానఁ గురిసె హరి నే' నని భా
సుర చేలాంచల మొక్కతె, గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా?

1024

తా ॥ ఓ రాజా! ఒక గోపిక నేను కృష్ణుడిని, మీరంతా గొల్లలు, ఈమె ఇంద్రుడు, అతను ఇప్పుడు రాళ్ళ వర్షం కురిపిస్తున్నాడు కనుక నేను గోవర్ధనగిరిని ఇదే ఎత్తుతున్నాను, చూడండి అంటూ తన చీరచెంగుని గొడుగువలె పైకి ఎత్తి, ఆ కృష్ణున్ని తానే అని తాదాత్మ్యత చెందసాగింది.

క. 'మీరలు గోపకు లే నసు, రారిని దావాగ్ని వచ్చె నటు సూడకుఁడీ
వారించెద' నని యొక్కతె, సేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా!'

1025

తా ॥ రాజా! ఇంకొక గోపిక, నేను కృష్ణుడను, మీరందరు గొల్లలు. ఇదిగో కార్చిచ్చు వస్తోంది; మీరందరూ ఈ ప్రక్కకు చూడక కన్నులు మూసుకోండి. నేను ఆ దావాగ్నిని మ్రింగి వేస్తాను అని తన తోటి గోపికలతో చెప్పుచు వట్టి బయలును మ్రింగుతోంది. ఈ విధంగా వారు తామే కృష్ణుడనే భావనలో మునిగి తేలారు.

వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరి నడుగుచు, దుర్గమంబు లయిన విపినమార్గంబుల సరోజాత కేతన హల కులిశ కలశాంకుశాది శుభలక్షణ లక్షితంబు లయి మనోహరంబు లయిన హరిచరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి.

1026

తా ॥ ఆ తరువాత గోపికలందరు తన్మయత్వం చేత తరువులను, లతలను మొదలైన వానిని చూసి మీరు శ్రీకృష్ణున్ని చూచారా అని అడుగసాగారు. తిరిగి తిరిగి ఆ అడవిలో పద్మరేఖ, ధ్వజరేఖ, వజ్రరేఖ, అంకుశరేఖ మొదలైన రేఖల చేత అందగించుచున్న కృష్ణుని అడుగుజాడలను కనిపెట్టి, ఇవిగో కృష్ణుని అడుగులు అని ఒకరితో ఒకరు చెప్పుకొనుచు తమలో తాము ఇలా అనుకొన్నారు:

సీ. కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాడు
సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపదు తెఱవజాడ
ప్రియకు ధమ్మిల్లంబు వెట్టినాఁ; డిక్కడఁ గూర్చున్న చోటిదె కొమరు మిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కిన గతి విశదమయ్యె

ఆ. సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ, జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ, ననఁగి పెనఁగియున్న యంద మొప్పె.

1027

తా ॥ ‘ఇక్కడ మగువకు పూలు కోసినాడు కాబోలు, పాదాగ్రం ఒక్కటే కనిపిస్తోంది. ఇక్కడ చెలిని ఎత్తుకొని నడచి ఉండాలి, అందుకే గడ్డిలో దాని అడుగుజాడ కానరావటంలేదు. ఇక్కడ కూర్చుండి లేచిన అందము తోస్తోంది కనుక తలను సవరించినాడు కాబోలు, ఇక్కడ నేల నిక్కిన జాడ కనబడుతోంది కనుక పడతితో నీట ప్రవేశించినాడు కాబోలు. ఇక్కడ నీళ్ళలో నుండి ఇద్దరును బయటికి వచ్చిన జాడ కనబడుతోంది.’ ఈ విధంగా వారు తమలోతాము

రకరకాలుగా ఆ కృష్ణభావనలో మునిగి తేలసాగారు.

వ. మఱియును.

1028

సీ. ఒక యెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గుచరణములును
నొక నీలవేణితో నొదిఁగినా డిక్కడ మగజాడలో నిదె మగువజాడ
యొక లేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె

ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేగినాఁ, డడుగుమీఁదఁ దరుణి యడుగు లమరె
నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ, డాఱుపదము లున్నవమ్మ! యిచట.

1029

తా ॥ 'ఇంతేకాదు. ఇక్కడ కృష్ణుడు ఒక మగువ చేతులు పట్టుకొని నడిచాడు, అందుకనే వెంబడి వెంబడిగా నాలుగు అడుగుల జాడ కనపడుతోంది. ఇక్కడ ఆ నీలవేణితో చేరి ఒత్తిగిలి ఉండాలి, ఇదిగో ఆ జాడలు కనబడుతున్నాయి. ఇక్కడ జవరాలు మ్రొక్కగా దానిని లేపి పట్టుకున్నట్లుంది, ఆ రమణి మ్రొక్కిన జాడ ఇదిగో అందగిస్తోంది. ఇక్కడ ఎదురెదురుగా నిలిచారు. అందుకే ఇద్దరి అడుగులు ఒకదానికొకటి ఎదురెదురుగా ఉన్నాయి. ఇక్కడ ఒకతె వెంబడిస్తోంటే నిలువక ముందుకు వెడుతున్నాడు, అతని అడుగు మీద అతివ అడుగు జాడ కనుపిస్తోంది. ఇక్కడ ఇరుప్రక్కలా ఇరువురిని పెట్టుకుని సంచరించాడు, అందుకే ఆరు అడుగులు కనబడుతున్నాయి' అని ఊహాగానాలు చేయసాగారు.

సీ. ఈ చరణంబులే యిందునిభావన! సనకాది మునియోగసరణి నొప్పు;
నీ పాదతలములే యెలనాఁగ! శ్రుతివధూ సీమంతవీథులఁ జెన్ను మిగులు;
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! పాలేటిరాచూలిపట్టుఁ గొమ్మ;

లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ముక్తికాంతా మనోమోహనంబు;

ఆ. లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది, దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు

రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేగిన, క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

1030

తా ॥ 'ఓ ఇందుముఖీ! సనకసనందాది మునీశ్వరుల యోగ మార్గంలో ప్రకాశించేవి ఈ పాదముద్రలేనమ్మా! ఓ సుదతీ! వేదములనే వధువు పాపిటపై భాసిల్లేవి ఈ చరణాలే, తెలుసా! ఓ గజగామినీ! పద్మములవంటి ఈ పాదములే క్షీరసాగర పుత్రి అయిన శ్రీలక్ష్మికి ఆలంబములు! ఓ ఇందీవరేక్షణా! మోక్షకాంతను మోహింపజేయగలిగినవి ఈ పాదములే! ఈ పాదముల యొక్క ధూళినే బ్రహ్మాది దేవతలందరూ శిరములపై ధరిస్తారు' అంటూ పారవశ్యంతో అడుగుజాడలను గుర్తించి కొంత దూరం నడిచినా, ఆపైన కానలేకపోయారు.

వ. అప్పుడు.

1031

సీ. పతుల దైన్యంబును భామల క్రౌర్యంబుఁ జూపుచు విభుఁ డొక్క సుదతితోడ

విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి నాయొద్ద నున్నాఁడు నాథుఁ'

డనుచు గర్వించి రాఁ జాలఁ గమలాక్ష! మూఁపున నిడుకొను మనుఁడు న య్యీశ్వరుండు

మొఱఁగిపోయినఁ దాపమును బొంది 'యో కృష్ణ! యెక్కడఁ జనితి? ప్రాణేశ! రమణ!

తే. నీకు వరవుడ నయ్యెద నిలువు' మనుచు, వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి

వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర, చిక్కె నేఁడని వెఱఁగును జెంది రపుడు.

1032

తా ॥ కృష్ణుడు ఒక గోపికతో పెనిమిటి దీనత్వాన్ని, అతని ఎడల భార్యయొక్క క్రూరత్వాన్ని తెలియ చేయునట్టి రీతిగా విహరించాడు. ఆ గోపిక ప్రియుడైన కృష్ణుడు తన వద్దే

ఉన్నాడని గర్వించింది. గర్వించి నేను నీతో నడచి రాజాలను కమలాక్ష! మూపునపెట్టుకో నన్ను అన్నది. కృష్ణుడు ఆ అహంకారాన్ని గమనించి, ఆమెకు కనబడకుండా అంతర్ధానమయ్యాడు. అంతట ఆమె, నా ప్రాణ నాయకా! నేను నీకు దాసురాలను! నన్ను వదలి ఎక్కడకు వెళ్ళావు! అంటూ విచారపడుతూ ఉండగా తక్కిన గోపికలు మగని మన్ననచే గర్వించి, ఇప్పుడు చిక్కుల్లో పడింది అని ఆమె అవస్థకు ఆశ్చర్యపడ్డారు.

వ. మఱియును.

1033

సీ. 'ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె
నియ్యేల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజము నీడ నిందాఁక సుభగుండు చిట్టంటు చేఁతల సిగ్గుగొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె

ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు, గుసుమదామములను గొప్పుఁ దీర్చె
ననుచుఁ గొంద అతివ లంభోజనయనుని, పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప!

1034

తా ॥ ఓ రాజా! మరి కొందరు గోపికలు కృష్ణుడు తమతో క్రీడిస్తూ కానరాకపోయే సరికి, అంతకు ముందు అతడు చేసిన విలాస చేష్టలను తలచుకొని ఇలా అనుకున్నారు. ఇంతసేపటి దాక కృష్ణుడు ఈ పొదరింటిలో నాతోకూడి క్రీడించాడు. ఇంతకు ముందు ఈ మరుగుచోట నన్ను గట్టిగా పట్టుకున్నాడు. ఇప్పటి వరకు ఈ చెట్టునీడలో వింత చేష్టలు చేసాడు. ఇంతసేపు ఈ పువ్వు తీగ వెంబడి నన్ను చేరి అధరపానం చేశాడు. ఇందాక ఈ పూల తిన్నెపై పూదండలతో నాకు కొప్పు పెట్టాడు. ఈ ప్రకారంగా కృష్ణుని పూర్వ లీలలను తలచుకొని పొగడసాగారు.

మ. అని యిబ్భంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్

వనజాక్షుం బరికించి కానక విభున్ వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు న మ్మానాథుపైఁ జేర్చి వే
చని ర య్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్త గేహేచ్ఛలై.

1035

తా ॥ అని ఈ విధంగా ఆ లతాంగులందరూ బృందావనంలో పరమాత్ముడైన ఆ కృష్ణుని కోసం వెదకి చూచారు కాని కానలేకపోయారు. ఆయనను వర్ణిస్తూ పాడుతూ, మనస్సులను, మాటలను, చేష్టలను, ప్రవర్తనములను, ఆ లక్ష్మీపతియైన శ్రీకృష్ణునియందే చేర్చారు. ఇల్లు మొదలగువాని యందలి ఆసక్తిని విడిచి, యమునానదిలోని ఇసుక తిన్నెల మీదికి శీఘ్రంగా పోయి చేరారు. వారికి ఇంటి ధ్యాస లేదు. (లౌకికమైన వాటిని మరిచారు)

వ. చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి.

1036

తా ॥ అలా వెళ్ళి ఆ గోపికలు హరిని ఉద్దేశించి ఇలా అన్నారు:

# 37. గోపికా గీతలు

క. నీవు జనించిన కతమున, నో వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై
నీ వెంటనె ప్రాణము లిడి, నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్.

1037

తా ॥ "ఓ ప్రియుడా! నీవు పుట్టినందువల్ల వ్రేపల్లెలో సంపద హెచ్చింది. నీ మీదనే ప్రాణాలు పెట్టుకొని వెదుకుచున్నాము. దయచేసి నీ రూపాన్ని నీ వారందరికి చూపించు.

క. శారదకమలోదరరుచి, చోరకమగు చూపువలన సుందర! మిమ్ముం
గోరి వెల యీని దాసుల, ధీరత నొప్పించు టిది వధించుట గాదే?

1038

తా ॥ ఓ అందగాడా! శరత్కాలంలో వికసించిన తామర యొక్క కాంతిని అణచి వేయునట్టి చల్లని చూపుల చేత మమ్ము వలపించావు! జీతం బత్తెంలేక దాసురాండ్రమై నిన్ను కొలువవచ్చిన మా మీద కొంచెంకూడా జాలిలేక ఇలా నొప్పించడం వధించడమే అవుతుంది గదా!

ఆ. విషజలంబువలన విషధరదానవు, వలన ఱాలవానవలన వహ్ని
వలన నున్న వానివలనను రక్షించి, కుసుమశరునిబారిఁ గూల్పఁ దగునె?

1039

తా ॥ ఓ కృష్ణా! మమ్ములను విషజలంబు నుండి, విషాన్ని ధరించిన దానవుని నుండి (అఘాసురుడు), రాళ్ళవాన నుండి, కార్చిచ్చు నుండి మరియు తక్కిన ఆపదల నుండియు రక్షించిన నీవు ఇప్పుడు ఆ కుసుమశరునికి అప్పచెప్పటం తగునా?

ఉ. నీవు యశోదబిడ్డఁడవె? నీరజనేత్ర! సమస్తజంతు చే
తో విదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షా విధ మాచరింపు మని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁ గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్.

1040

తా ॥ ఓ నీరజనేత్రా! నువ్వు కేవలం ఒక్క యశోద కుమారునివే కాదయ్యా! సకలమైన ప్రాణుల యొక్క మనస్సులలోను నిలిచి ఉన్న పరబ్రహ్మావు. సర్వ జగన్నియామకుడవు. పూర్వం బ్రహ్మ నిన్ను ధ్యానించి, లోకాన్ని కాపాడునట్టి మార్గాన్ని చెయ్యవలసిందని వినతి చేయగా మంచి వంశంలో భూమండలాన్ని రక్షించటం కోసం ఈ రీతిగా మనోజ్ఞమైన ఆకారంలో జన్మించావు.

ఆ. చరణసేవకులకు సంసారభయమును, బాపి శ్రీకరంబు పట్టు గలిగి
కామదాయియైన కరసరోజంబు మా, మస్తకముల నునిచి మనుపు మీశ!

1041

తా ॥ ఓ స్వామీ! నీ పాదాలను సేవించు వారికి సంసార భయాన్ని పోగొట్టి మేలు కలుగ చేయుట యందు పట్టుదల కలిగినవాడవు. నీ హస్తంతో లక్ష్మీదేవిని చేపట్టినవాడవు, అట్టి నీ చేయి మా శిరముల యందు ఉంచి మమ్ము రక్షించు.

ఉ. గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీఁ దనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజ పుష్పభల్ల భవబాధ హరింపు వరింపు మాధవా!

1042

తా ॥ ఓ మాధవా! ఆవుల వెంట తిరుగుతూ నిన్ను కొల్చిన వారి పాపాల్ని పోగొట్టుటకు

నువ్వు సమర్థుడవు. కాళియుడను క్రూర సర్పం యొక్క పడగలనే తీగ మీద గౌరవింపబడిన నీ పాదపద్మాలను, మా స్తనముల మీదనుంచి మన్మథుని బాణముల వలన కలిగే తాపాన్ని హరించి మమ్ములను ఆదరించు.

క. బుధరంజనియును సూక్తయు, మధురయు నగు నీదు వాణి మరఁగించెను నీ
యధరామృతసంసేవన, విధి నంగజతాపమెల్ల విడిపింపఁగదే!

1043

తా ॥ ఓ కృష్ణా! పండితులను సంతోషపెట్టేది, మంచి పలుకుబడి కలది, మధురమైనది అయిన నీ వాణి మమ్ములను మరులు కొల్పింది. కనుక నీ అధరామృతాన్ని సేవింపజేసి మాకు కలిగిన తాపాన్ని పోగొట్టవయ్యా!

క. మగువలయెడ నీ క్రౌర్యము, దగునే? నిజభక్తభీతి దమనుఁడ వకటా!
తగదు భవద్దాసులకును, నగు మొగముం జూపి కావు నళినదళాక్షా!

1044

తా ॥ ఓ కృష్ణా! మగువల ఎడల ఇంత క్రూరత్వాన్ని అవలంబించటం నీకు తగునా? నీవు నీ భక్తుల భయములను అణచివేసేవాడవే! ఇటువంటి నీకు ఇట్లు చేయటం తగదు. నీ దాసీలమైన మాకు చిరునవ్వుతో కూడిన నీ ముఖాన్ని చూపి, మా మనస్తాపాన్ని తొలగించు.

మ. ఘనలక్ష్మీ యుతమై వినన్ శుభదమై కామాది విధ్వంసియై
సనకాది స్తుతమై నిరంతరతప స్సంత ప్తపున్నాగ జీ
వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరి దా
న నిరూఢత్వము లేనివారలకు మానారీమనోహారకా!

1045

తా ॥ ఓ లక్ష్మీప్రియా! మోక్ష సంపదతో కూడుకొన్నది, విన్నంతనే శుభాలనిచ్చేది, కామక్రోధాదులను నశింప చేసేది, సనకాది మహాయోగుల చేత కొనియాడబడునది, నిరంతరము తపస్సు చేత తపించిపోతున్న పురుషశ్రేష్ఠులకు బ్రతుకుతెరువై ఒప్పేది, అయిన నీ కథామృతాన్ని పానం చేసిన వారికి ఏమీ లేకున్నా దానం చెయ్యాలనే బుద్ధి పుడుతుంది. అలాంటిది సర్వకాల సర్వావస్థలయందు, జ్ఞప్తిని నీయందే ఉంచునట్టి మాకు ప్రాణదానము చేయుట యందు నీకు తలపు పుట్టకుండట మంచిదా?

క. నీ నగవులు నీ చూడ్కులు, నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా!

1046

తా ॥ ఓ కృష్ణా! నీ యొక్క నవ్వులు, చూపులు నానావిధాల విహారాలు, ధ్యానములు, ప్రియ వాక్యములు చెప్పుటలు మా మనస్సులలో నాటుకొని నేటికీ మరపుకు రాకుండా ఉన్నాయి.

ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ, నీరజాభమైన నీ పదములు
గసవు శిలలుఁ దాఁకి కడునొచ్చునో యని, కలఁగు మా మనములు కమలనయన!

1047

తా ॥ కృష్ణా! నువ్వు మంద నుండి ఆవులను తోలుకొని అడవికి మేపడానికి వెళ్ళునప్పుడు, ఆ అడవిలోని కసవు పుల్లలు, రాళ్ళు సోకి తామరలవలె మృదువుగా ఉన్న నీ పాదాలు ఎంత నొచ్చుకుంటాయో అని మేము మా మనస్సులలో విచారపడుతూ ఉంటాము.

ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపిత ధూళిధూసరిత భాసిత కుంతలమై సరోరుహో
ద్దీపిత మైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ జూపి
మనంబులన్ మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్.

1048

తా ॥ ఓ ధీరపుంగవా! నువ్వు సాయంకాలం అడవినుండి ఆవులను తోలుకొని వచ్చి, ఆ ఆవుల కాలి ధూళి క్రమ్ముకొనగా, ప్రకాశిస్తూన్న ముంగురులతో తామర పువ్వువలె వెలుగుతూన్న నీ ముఖాన్ని చూపి మా మనస్సులలో అంతకంతకు మరులు గొలుపుదువు కదా!

ఆ. భక్తకామదంబు బ్రహ్మ సేవిత మిలా, మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరమునైన భవదంఘ్రియుగము మా, యురములందు రమణ! యునుపఁ దగదె?

1049

తా ॥ కృష్ణా! భక్తుల కోరికలను తీర్చేది, బ్రహ్మచేత సేవింపబడేది, దుఃఖములను పోగొట్టేది, భూమికి అలంకారమైనది అయిన నీ అడుగుల జంటను మా హృదయమందు చేర్చి మన్నింపరాదా!

ఆ. సురతవర్ధనంబు శోకాపహరణంబు, స్వరిత వంశనాళ సంగతంబు
నన్యరాగ జయమునైన నీ మధురాధ, రామృతమునఁ దాప మార్పు మీశ!

1050

తా ॥ ఈశ్వరా! ఆనందాన్ని పెంపొందించేదీ, శోకాన్ని పోగొట్టునదియు అయి, ఊదబడుచున్న పిల్లనగ్రోవితో కూడి, ఇతరమైన అనురాగాన్ని జయించేది అయిన నీ మధురమైన అధరామృతం చేత మా సంతాపాన్ని పోగొట్టు.

ఉ. నీ వడవిం బవల్ దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల? విధాత క్రూరుఁడై.

1051

తా ॥ కృష్ణా! పగటి వేళలయందు నీవు అడవిలో తిరుగుచుండగా, నుదిటి మీద అస్తవ్యస్తంగా ఉన్న ముంగురుల తోడి, అందంగా ఉండే నీ ముద్దు ముఖాన్ని తనివితీర చూడటానికి కుదరడం లేదు. అందువల్ల మాకు క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి. పోనీ రాత్రివేళయందైన ఎడతెగకుండా కన్నుల నిండా నిన్ను కనుగొందామనుకుంటే క్రూరుడైన బ్రహ్మ కళ్ళకు ఈ రెప్పలను అడ్డంగా సృష్టించాడు గదా! ఔరా!

ఉ. అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
నెక్కొని రాత్రిఁ బోకుఁడన నీ మృదుగీతరవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ! నీ
వెక్కడఁ బోయితో? యెఱుఁగ మీక్రియ నిర్దయుఁ డెందుఁ గల్గనే?

1052

తా ॥ ఓ కృష్ణా! బంధువులు, మగలు, అన్నలు, తమ్ములు, పుత్రులు మొదలగు వారందరును దారికి అడ్డం నిలిచి, ఈ రాత్రివేళలో ఎక్కడికి వెడతారు వెళ్ళకండి అని నిర్బంధించారు. వారిని లక్ష్యం చేయక మృదువైన నీ గీతాన్ని విని, నిలువ సహింపక, అధికమైన మోహావేశం చేత ఇక్కడికి వచ్చాము. ఇక్కడ నీవెక్కడ ఉన్నావో మాకు కానరావటం లేదు. నీవంటి దయమాలినవాడు ఎక్కడైనా ఉంటాడా?

తే. మదనుఁ దార్వంగ నీవాడు మంతనములు, నవరసాలోకనంబగు నగు మొగంబు
కమల కిరవైన మహితవక్షస్థ్సలంబు, మా మనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ!"

1053

తా ॥ ఓ కృష్ణా! ఏకాంతమందు నీవు పలికే మాటలు, నవరసములకూ ఉనికిపట్టయిన నీ చూపులూ, మనోజ్ఞమైన చిరునవ్వుతో వెలుగొందే నీ ముఖం, లక్ష్మీదేవికి నివాస స్థానమైన నీ

విశాల వక్షస్థలం మా మనస్సులను వశం చేసుకొని నీయందు మాలిమి కలుగచేసింది.

మ. అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవఁగా
నెరియంబోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్య భూ
పరి సంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే!

1054

తా ॥ కృష్ణా! అరవిందాల కంటే కోమలంగా అందంగా ఉన్న నీ చరణాలు కఠినంగా ఉన్న మా కుచముల ఒత్తిడికి కందిపోతాయని మేం భయపడతాము. అటువంటి సుకుమారమైన పాదాలతో కఠినమైన అరణ్య భూములలో నువ్వు సంచరించడం చెలులమైన మాకు ప్రాణాంతకమైన వ్యథను కలిగిస్తూ ఉంది.

క. కట్టా! మన్మథు కోలలు, నెట్టన నో నాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము, నట్టడవిని డించి పోవ న్యాయమె? కృష్ణా!

1055

తా ॥ కృష్ణా! అయ్యో! మన్మథుని శరపరంపర మా హృదయాలలో గాఢంగా నాటుకుని మిక్కుటమైన బాధను కలుగచేస్తున్నాయి. నీ పాదాలను ఆశ్రయించి ఆ బాధను పోగొట్టుకో తలచి వచ్చిన మమ్ము ఈ అడవిలో విడిచి పోవటం నీకు న్యాయమా?

క. హృదయేశ్వర! మా హృదయము, మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి; కడ నీ
హృదయము కఠినము చేసెను, మదీయ సౌభాగ్య మిట్టి మందము గలదే?

1056

తా ॥ ప్రాణేశ్వరా! మా హృదయాలను మిక్కిలి మృదుతరంగా చేసి, నీ మనస్సును

ఎంతో కఠినం గావించిన మా మందభాగ్యాన్ని ఏమనాలి?

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి వీఁక వా
లమ్ముల తెట్టెముల్ వఱప నడ్డము వచ్చి జయింతు వండ్రు; ని
న్నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండు మూఁ
డమ్ముల యేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే కృపానిధీ!

1057

తా ॥ కరుణానిధీ! నువ్వు మునుపు దేవతలను ఆక్రమించి బాధించే రాక్షసులను అడ్డగించి, జయించి దేవతలను రక్షించావు అని కొందరు చెప్పగా విన్నాం. అటువంటి వాడవైన నిన్ను నమ్ముకున్నాం. ఇప్పుడు మరి రెండు, మూడు బాణములు కల అల్పుడైన మన్మథుని చేజిక్కి బాధపడుతున్న పడతులను రక్షించటం కోసం అడ్డుపడవేమి?

క. తియ్యవిలుకాఁడు డీకొని, వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్
వియ్యాన నింక నయినం, గు య్యాలింపం గదయ్య గోవింద! హరీ!

1058

తా ॥ గోవిందా! హరీ! మన్మథుడు మా మీద తలపడి మా మనస్సులు బద్దలయ్యే విధంగా వీపున దూసి పోయేటట్లు బాణాలు ప్రయోగించి బాధిస్తున్నాడు. మా మొరను ఆలకించి రక్షించు, మేము చెప్పేది అబద్ధము కాదు, నీ మీద ఆన."

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దను 'రావే' యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుఁడై మన్మథ మన్మథుం డయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబరిధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్.

1059

తా ॥ అని ఈ విధంగా గోపికలందరు మధురమైన కంఠంతో పొగడుతూ పాడుతూ, 'రావయ్యా, దర్శనమియ్యవయ్యా' అని కృష్ణుణ్ణి తలచి తలచి రోదించసాగారు. దానితో, లోకరక్షకుడైన కృష్ణుడు, మూడు లోకాలకు మోహాన్ని పుట్టించే మనోహరమైన ఆకారంతో, మన్మథునికి మన్మథుడయి వెలలేని పచ్చని పట్టు వస్త్రాన్ని ధరించి ఆ గోపికలముందు సాక్షాత్కరించాడు.

క. వచ్చిన వల్లభుఁ గనుఁగొని, విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ ప్రాణము లొడలికి, వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్.

1060

తా ॥ అలా వచ్చిన ఆ వల్లభున్ని చూడగానే, గోపికలు సంతోషంతో ముఖాలు వికసించగా, పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లు లేచి నిలబడ్డారు.

సీ. అబల యొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు మూఁపున నిడికొని ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల చర్విత మాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్ని తప్తకుచంబులఁ దాపుకొనియె

ఆ. భామ యొకతె భ్రుకుటిబంధంబు గావించి, ప్రణయభంగ రోషభాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి, వాఁడి చూడ్కిగముల వరునిఁ జూచె.

1061

తా ॥ అంతట ఆ గోపికలలో ఒకతె భక్తి పూర్వకంగా నమస్కరించి కృష్ణుని చేయి పట్టుకొన్నది. మరి యొకతె అతని బాహువుని తన మూపుపై చేర్చుకొని సంతోషించింది. ఇంకొక గోపిక కృష్ణుని తాంబూల చర్వితాన్ని తన చేతితో అందుకుంది. మరొక పడతి ఆ కృష్ణ చరణాలను తన హృదయంపై నిలుపుకుంది, తన కోప స్వభావంగల ఇంకొక గోపిక బొమముడి

పెట్టుకుని ప్రణయ భంగం కావించటం వల్ల కలిగిన కోపంతో, కినుకతో దండిస్తూన్న దాని వలెనే చురుకు చూపులతో అతడిని చూడసాగింది.

క. హరిముఖకమలముఁ జూచుచుఁ, దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్
హరిపదకమలముఁ జూచుచు, మరగి తనివి లేని సుజను మాడ్కి నరేంద్రా!

1062

తా ॥ విష్ణుభక్తుడైన సత్పురుషుడు ఆ విష్ణువు యొక్క పాదకమలముల యందు చూపులు నిలిపి తృప్తి పొందక చూచుచుండునట్లుగా కృష్ణుని ముఖ కమలమునందు చూపులు నిలిపి ఒక గోపిక తనివి తీరక అలాగే చూస్తూ ఉండిపోయింది.

ఉ. ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము సూడ్కితీవలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
జొక్కములైన లోచవులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్.

1063

తా ॥ ఇంకొక లతాంగి మాధవుని ఉజ్జ్వల రూపాన్ని చూపులనే తీగలచే తన హృదయంలో బంధించింది. మళ్ళీ ఆ రూపం బయటకు వెళ్ళకుండా కన్నులు మూసుకొని, శరీరం గగుర్పొడువగా, ఆలింగనం చేసుకుంటూ కళంకంలేని నిరతిశయానందం పొందే యోగివలె పరవశత్వాన్ని పొందింది.

సీ. ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని తోరంపు టలుకతో దూఱె నొకతె
జలజాక్ష! ననుఁ బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడెనని వగ నెయిదె నొకతె;
నాథ! నీ వరిగిన నాప్రాణ మున్నది కూర్మియే యిది యని కుందె నొకతె
యీశ్వర! నను నిన్ను నిందాఁకఁ బాపెనే పాపపు విధియని పలికె నొకతె

ఆ. తలఁగి పోవునట్టి తప్పేమి సేసితి?, నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమినోము ఫలమొ హృదయేశ! నీమోము, మరలఁగంటి ననుచు మసలె నొకతె.

1064

తా ॥ ప్రాణేశ్వరా! నన్ను వదలి ఎక్కడకు పోయావు అని ఒక గోపిక అధికమైన కోపంతో నిందించింది. జలజాక్ష! నన్ను విడిచి వెళ్ళటానికి నీ పాదాలు ఎలా ఆడినాయి అని ఒక సుందరి వాపోయింది. నాథా! నీవు వెళ్ళినా నా ప్రాణం పోకుండానే ఉంది. స్నేహమంటే ఇదేనా అని ఒకామె చింతించింది. ఈశ్వరా! ఇంతసేపు నిన్ను నన్ను ఎడబాపిన దురదృష్టాన్ని ఏమనాలి అని ఒకామె బాధపడింది. ఒకామె స్వామీ! నన్ను విడిచిపోవునంతటి తప్పు నీ ఎడ నేనేమి చేసానో న్యాయంగా చెప్పు అని తగవడిగింది. ఇంకొకరు, నా మనోనాయకా! ఏ నోము నోచిన ఫలమో నీ ముద్దు మోముని మళ్ళీ చూసాను అంటూ పరవశించింది.

క. 'పలికినఁ బ్రతిజ్ఞఁ దప్పెడిఁ, బలికించినఁ గాని రమణుఁ బలుక' నటంచుం
గలకంఠి యొకతె చెలితోఁ, బలుకుల నమృతములు గురియు పగిదిం బలికెన్.

1065

తా ॥ కలకంఠి అయిన ఒక గోపిక, తన చెలికత్తెతో నేను ముందుగా తనతో మాట్లాడితే నా ప్రతిజ్ఞ తప్పుతుంది. కృష్ణుడు పలకరిస్తేగాని పలుకను అంటూ తన పలుకుల్లో అమృతం కురియగా అన్నది.

క. పట్టినఁ గాని మనోవిభుఁ బట్టఁ గదా? యంచు నొక్క బాలిక సఖీ చే
పట్టుకొని చెప్పె ధైర్యము, పట్టెల్లను మరుని టెంకిపట్టుగ నధిపా!

1066

తా ॥ ఒక చెలువ, 'నా ప్రాణవిభుడు నన్ను తాకనిచో, నేను అతడిని తాకను' అని ప్రతిన చేసినా, చివరికి ఆమె ధైర్యాన్ని పుష్పబాణుడు ఎగురకొట్టివేశాడు.

క. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొకముగ్ధ మున్ను చూడ ననుచు నౌ
దల వంచి యుండఁ జాలక, తల యెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా!

1067

తా ॥ ఓ రాజా! ఒక ముగ్ధ, ప్రియుడు తనను చూడమని చెప్పకపోయిన పక్షంలో నే వానిని చూడను అని ప్రతిజ్ఞ చేసి ఒయ్యారంగా తలవంచుకొని, మరుడు బాధిస్తూంటే సహింపలేక తటాలున తలయెత్తి ఒయ్యారంగా కృష్ణుణ్ణి చూసింది.

వ. ఇవ్విధంబున.

1068

క. హరిసురుచిర లలితాకృతిఁ, దరుణులు గని ముక్తవిరహ తాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి, పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్.

1069

తా ॥ ఈ రీతిగా ఆ గోప స్త్రీలందరూ కృష్ణుని అందమైన మోహనాకారాన్ని చూడగానే విరహతాపం అణగిపోగా, పరబ్రహ్మ సందర్శనం చేత సంసార బంధాన్ని తొలగించుకున్న మహాయోగులవలె పరమోత్సవం చేసుకున్నారు.

వ. అంత న క్కాంతుండు గాంతాజనపరిక్రాంతుడై వనాంతరంబున శక్తినికర సంయుక్తుండైన పరమ పురుషుండునుంబోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమ పరిమళ మిళిత పవమాన మానిత మధుకర నికర ఝుంకార సుకుమారంబును, శరత్కాల చంద్రకిరణ సందోహ సందళితాంధకారంబును, యమునా తరంగసంగత కోమల వాలుకాస్ఫారంబునునై యమలినంబైన వులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథలై.

1070

తా ॥ అంతట శ్రీకృష్ణుడు గోపికా స్త్రీలు తనను చుట్టుకొని వెంటరాగా ఆ అడవి మధ్యమున సర్వజ్ఞ, సర్వ స్వతంత్రాది, శక్తులతో కూడిన పరబ్రహ్మమువలె ప్రకాశించాడు. మందార మొల్ల పువ్వుల సువాసనతో కూడిన చల్లని గాలి వీస్తూ, చెవులకింపైన ఝుమ్మను తుమ్మెదల రొదలును కలిగిన శరత్కాలపు తేట వెన్నెల చేత చీకట్లు అన్నీ తొలగి పోయినవి. కృష్ణుడు ఆ గోపికలతో యమునా నది అందలి అలల తాకిడి చేత మెత్తనైన ఇసుక యందు పోయి చేరాడు. అప్పుడు గోపికలును జ్ఞానకాండంచేత పరబ్రహ్మను పొంది, అలా శ్రీకృష్ణున్ని పొందుట చేత కోరికలు లేనివారైనారు.

క. పాఠీన నయన లెల్ల న, కాఠిన్య పటాంచలములఁ గౌతుకములు హృ
త్పీఠముల సందడింపఁగఁ, బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా!

1071

తా ॥ అప్పుడు గోపికలందరును తమ మనస్సులలో వేడుకలు అతిశయింపగా ఆ ఇసుక తిన్నెమీద మృదువులైన తమ కోకల చెరగులు పరచి కృష్ణునికి పీఠంగా చేశారు.

ఆ. పరమయోగిహృదయ భద్రపీఠంబుల, నుండు మేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన, దేవి లక్ష్మి మేనఁ దేజరిల్ల.

1072

తా ॥ సర్వోత్కృష్టులయిన యోగీశ్వరుల హృదయకమల పీఠములయందు ఉండే మేటి అయిన శ్రీకృష్ణుడు, మూడు లోకాల సంపద ఒక్కటిగా కూడి ఇలా ఏర్పడిందేమో అన తగిన దివ్య తేజస్సుగల ఆకారంతో ప్రకాశిస్తున్నాడు. గోపికా స్త్రీల యొక్క పైట కొంగులచే ఏర్పడబడిన పీఠంలో కూర్చుండి వెలుగొందాడు.

మ. మదనోద్దీపకుఁడైన నాథునికి సమ్మానంబు గావించుచున్
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి త

త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం బైముట్టుచున్ దూఱుచుం
జదురుల్ వల్కుచుఁ గూర్మి నిట్లనిరి యీషత్కోపదీప్తాస్యలై.

1073

తా ॥ అంతట ఆ గోపికాస్త్రీలు అందరును మన్మథోద్దీపనాన్ని కలుగచేయునట్టి వాడైన శ్రీకృష్ణమూర్తికి అనేక విధాల మర్యాదలు చేశారు. నవ్వుల వల్లనూ, చూపుల వల్లనూ, విలాసములను కనబరచి సంతోషంతో అతనికి దగ్గరగా చేరి చరణాలను, హస్తములను స్పృశిస్తూ చతురంగా మాట్లాడుతూ, స్నేహం చేత కొంచెం, కోపం చేత కొంచెం వేడిమిని చూపుచున్న మొగములు కలవారై ఇలా అన్నారు:

క. 'కొలిచినఁ గొలుతురు కొందఱు, గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం
గొలిచినను గొలువకున్నను, గొలువరు మరికొంద ఱెలమి గోపకుమారా!'

1074

తా ॥ "ఓ గోపకుమారా! కొందరు తమను కొలిచినవారినే కొలుస్తారు. మరి కొందరు తమను కొలవకున్నా కొలుస్తారు. ఇంకొందరు కొలిచినా, కొలవకున్నా ఎవరినీ కొలవరు. ఇందు నీవు ఏ కోవకు చెందుతావు" అనే సంకేతాన్ని ఇక్కడ వెలిబుచ్చారు.

వ. అని త న్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరుల పలుకులు విని గోపాల సుందరుం డిట్లనియె.

1075

తా ॥ ఈ విధంగా తనను గూర్చి పలికిన నర్మగర్భితమైన గోపికా స్త్రీల పలుకులు విని శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

సీ. 'కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల భజనము భంగిని ఫలము కొఱకు

నై; సఖ్యధర్మములందుఁ సిద్ధింపవు కొందఱు తండ్రుల గుణముఁ దాల్చి
దయ గలవారలు తగిన సుహృత్తులు గొలువని వారలఁ గొల్తు రెపుడు
ధర్మకామంబులు దనరంగఁ గొందఱు కొలువని వారిని గొలుచువారిఁ

ఆ. గొలుచు తలఁపులేమిఁ గొలువ రాత్మారాము, లాప్తకాము లజ్ఞు లతికఠినులు
వారియందుఁ బిదపవానిఁగాఁ జింతించి, యే లతాంగులార! యిట్టు లనుట.

1076

తా ॥ "ఓ లతాంగులారా! పాడిని కోరినందున పశువులకు మేతవేసి కాపాడినట్లుగా కొందరు ఫలాన్ని కోరి తమ్ము కొలిచిన వారిని కొలుస్తారు. అట్టివారి యందు స్నేహధర్మం సిద్ధింపదు. కొందరు తండ్రులు బిడ్డలను కాపాడునట్లు దయాపరులై తమ్ము కొలువని వారినైననూ కొలుస్తారు. మరి కొందరు ధర్మము నందును కామమునందును అపేక్షలేక ఎల్లకోరికలను నెరవేర్చుకొన్న వారగుచూ, ఆత్మయందే రమిస్తూ ఉంటారు. ఒకరిని కొలువవలెననే తలపు లేకుండా ఉండటం చేత అట్టివారిని చూసి తెలివిలేని జనులు వీరు కఠినులు అని నిందిస్తూ ఉంటారు.

క. ఏ నిం దెవ్వఁడ నయినం, గా నంగనలార! పరమకారుణికుండన్
మానసబంధుఁడ నిత్య, ధ్యానము మీ కొసఁగవలసి తలఁగితిఁ జుండీ!

1077

తా ॥ ఓ గోపికలారా! నేనీ చెప్పిన వారిలో ఎవరినీ కాను. మిక్కిలి దయగలవాడను. మీ మనస్సులకు ప్రియమైన బంధువుని. మీరు ఎన్నటికీ నన్ను మరవక, ధ్యానించటం కోసం కనుమరుగయ్యాను.

మ. నను సేవించుచునున్న వారలకు నే నా రూపముం జూపఁ; జూ
చినఁ జాలించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు; ని

ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చిన భంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్.

1078

తా ॥ ఓ గోపికలారా! నాయందు ప్రీతితో నన్ను సేవించునట్టివారు నన్ను దర్శించినప్పుడు గర్విస్తే, వారికి నా రూపాన్ని మరి చూపను. ధనాన్ని పోగొట్టు కొన్నవాడు ఆ ధనం మరల లభించునంత పర్యంతం, అదే చింతగా ఉండునట్లుగా, నన్ను ఎడబాసినవారు నన్ను కోరుతూ ధ్యానిస్తూ ఉంటారు.

తరలము:

తగవు ధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసివచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు; పాసితిఁ దప్పు సైపుఁడు; తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్.

1079

తా ॥ ఓ గోపికలారా! నాయందే మనస్సు నిలిపి, తల్లితండ్రి, చుట్టం, భర్తలు, బిడ్డలు అనువారినందరిని విడిచి నన్ను సేవింపవచ్చిన మిమ్ము ఎడబాసిపోవుట నాయందు తప్పే. నా తప్పును మన్నించండి. మీరు విరహతాపంచేత బాధపడుతూ ఆడిన మాటలన్నీ నేను వింటూనే ఉన్నాను.

ఉ. పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతిసేయ యుగంబులనైన నేర; నన్
బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుటఁ దప్పుగాఁ గొనక భామినులార! కృపన్ శమింపరే!'

1080

తా ॥ ఓ గోపికలారా! తొలగింపరాని సంసార బంధాలను తొలగించుకొని, ఎల్లప్పుడూ నన్ను సేవించాలనే ఆసక్తితో ఉండే మీకు తగిన ఉపకారం చేయడానికి యుగములు పర్యంతం పాటుపడ్డా నేను శక్తుణ్ణికాను. ఎల్లప్పుడూ మరవక నన్ను ఆరాధించునట్టి మనస్సును మీకివ్వటమే నేను మీకు చేసిన మేలుగా తలచి నా ఎడబాటును తప్పుగా గ్రహింపక దయతో శమించండి."

క. చక్కగ హరి యిటు పలికిన, చక్కని వాక్యముల నతని సంగమమున లో
నిక్కిన వియోగతాపము, లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా!

1081

తా ॥ ఓ రాజా! ఆ గోపికలు క్రమంగా ఇట్లు పలికిన మంచి పలుకుల చేత అతని కూడిక చేత తమ మనస్సులలో మిక్కుటంగా కలిగి ఉన్న విరహతాపాన్ని ఒక్కసారిగా విడిచిపెట్టారు.

# 38. రాసక్రీడాభివర్ణనము

ఉ. ఆ సమయంబునన్ విభు డనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహు కాం
తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్త పాద వి
న్యాసము రాసముం గృతవియచ్చరనేత్ర మనో వికాసమున్.

1082

తా ॥ ఆ సమయంలో కృష్ణుడు నానావిధ మూర్తులను ధరించి వలయాకారంగా చరించే స్వభావం కలిగి, చిత్రాకారుడై రమణీమణులతో రాసక్రీడకు ఉపక్రమించాడు. గోపికలు గోవిందుని చుట్టూ వలయాకారంగా ఒకరిచేతులు మరొకరు పట్టుకొని భ్రమణం చేశారు. బహువిధాలుగా తోచే ముఖ విన్యాసాలతో హస్తపాద విన్యాసాలతో రాసలీల భాసిల్లింది. ఆకాశంలో సంచరించే దేవతల మనోనేత్రాలకు ఆనందాన్ని కలుగజేసింది.

వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్పించి తన యిరుగెలంకుల నలంకృతలయి కళంక రహిత చంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్దిగొని వీణ లందుకొని వీణలం బ్రవీణలై, సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీ నిధానం బగు గానంబు సేయ నవిరళంబై తరళంబుగాని వేడుక సరళంబగు మురళంబు లీలం గేల నందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజన కబరికా సౌగంధిక గంధ బంధుర కరాంగుళీ కిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద ఱందఱకు నందఱయి సుందరుల కవలి యెడలం దానును దన కవలియెడల సుందరులును దేజరిల్ల, నృత్తవిద్యా మహార్ణవ వేలావలయ వలయితంబై, విస్మితాఖండలంబైన రాసమండలంబుఁ గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూన మంజరీ

సహచరంబులైన చంచరీకంబుల మించు ప్రకటించుచు సువర్ణమణి మధ్యగంబులైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహార బంధురంబులైన సింధురంబుల చెలువుఁ గైకొనుచుఁ బల్లవిత కుసుమిత లతానుకూలంబులైన తమాలంబుల సొబగు నెగడించుచు మెఱపుఁదీవల నెడ నెడం బెడం గడరు నల్ల మొగిళ్ళ పెల్లు సూపుచు, తరంగిణీ సంగతంబు లయిన రోహణాచల శృంగంబుల బాగు లాలించుచు, జగన్మోహనుండై యుండి రక్తకమలారుణంబులును, జంద్రశకల నిర్మల నఖర సంస్ఫురణంబులును, శ్రుతినితంబినీ సీమంత వీథికాలంకరణంబులును, సనక సనందనాది యోగీంద్రమానసాభరణం బులును నయిన చరణంబులు గదియ నిడి సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలిత కమలప్రశస్తంబు లయిన హస్తంబులు వల్లవీజనుల కంఠంబులపై నిడి, తాను గీతానుసారంబగు విచిత్ర పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల వర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ ఖురరీబంధ ప్రముఖంబు లయిన విశేష రాసబంధంబులకుం జొచ్చి యేకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖ మండల త్రిభంగి ప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ, గనకకింకిణీ మంజులమంజీర శింజనంబులు జగజ్జనకర్ణ రంజనంబులై చెలంగ; ఘటిత మర్దిత పార్శ్వగ ప్రముఖంబులైన పాదకర్మభేదంబులు సేయుచు, సమపాద శకటవదన మతల్లీశుక్తి ప్రముఖంబులైన పార్థివచారి విశేషంబులును నపక్రాంత డోలాపాద సూచీ ప్రముఖంబులైన వ్యోమచారి విశేషంబులనుం జూపుచు, సురేంద్రశాఖీ శాఖామనోహరంబులును, నపహసిత దిక్కరీంద్ర కరంబులును, ద్రిలోక క్షేమంకరంబులును నగు కరంబులం దిరంబులగు రత్న కటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబులైన స్వస్వభావ సూచక నానావిధకరభావంబు లాచరించుచుఁ గటినిబద్ధ సువర్ణ చేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనా ముఖంబులకు హరిద్రాలేపన ముద్రాలంకారంబు లొసంగుచు,

నాస్కందిత భ్రమర శకటాసన ప్రముఖంబులైన జానుమండల భేదంబులును, నలాత దండలాత లలిత విచిత్ర ప్రముఖంబులైన దైవమండలంబులు నొనర్చుచుఁ గమనీయ కంబుకంఠాభిరామంబులు నుద్దామతేజ స్తోమంబులునైన నీలమౌక్తిక వజ్రవైదూర్య దామంబుల రుచు లిందిరాసుందరీ మందిరంబు లయి సుందరంబులైన యురంబులం దిరుగుడువడి కలయంబడ నగాంతర వాహ్యలగ్నచ్ఛత్ర ప్రముఖంబులైన భ్రమణవిశేషంబుల విలసించుచు, నిద్దంబులగు చెక్కుటద్దంబుల నుద్దవిడిం దదయుం బ్రభాసిత చంద్రమండలంబులందు కుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంత దండరచిత లలాట తిలక మయూర లలిత చక్రమండల నికుంచిత గంగావతరణ ప్రముఖంబులైన కరణంబు లెఱింగించుచు, వెలిదమ్మివిరుల సిరులఁ జెన్ను మిగులు కన్నుల వలన దీనజనదైన్య కర్కశంబులై తనరు కటాక్షదర్శన జాలంబులు జాలంబులై కామినీజన నయనమీనంబుల నావరింప లలితకుంచిత వికాసముకుళ ప్రముఖంబు లయిన చూడ్కులం దేజరిల్లుచు, ననేక పరిపూర్ణ చంద్రసౌభాగ్య సదనంబులగు వదనంబులఁ బ్రసన్న రాగంబులు ప్రకటించుచు, నుదంచిత పింఛ మాలికా మయూఖంబు లకాలశక్రచాపంబుల సొంపు సంపాదింప, నికుంచి తాకుంచిత కంపి తాకంపిత పరివాహిత పరావృత్త ప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు, మృగనాభితిలకంబులు గల నిటలఫలకంబులఁ జికురంబుల నికరంబులు గప్ప, నపరాజిత సూచికావిద్ధ పరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబులగు నంగహారంబుల విలసిల్లుచుఁ, జరణకటికర కంఠరేచకంబు లాచరించుచు నొప్పె; నప్పు డా రాసంబు సంజనితసకల జన మానసోల్లాసకరంబై సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వల రసాభిరామంబై, రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణంబై, పూర్ణచంద్ర మండలంబునుంబోలెఁ గువలయానందంబై, నందనవనంబునుం బోలె భ్రమరీవిరాజమానంబై, మానధను చిత్తంబునుంబోలెఁ బ్రధానవృత్తి సమర్థంబై, సమర్థ కవివిలసనంబునుంబోలె బహుప్రబంధ భాసురంబై, సురలోకంబు నుంబోలె వసుదేవనందన విశిష్టంబై, శిష్టచరితంబునుంబోలె

ధరణీగగన మండలసుందరంబై, సుందరీ రత్నంబునుంబోలె నంగహార మనోహరంబై, హరవధూ నిలయంబునుంబోలె ననేకచారి సుకుమారంబై, సుకుమార వృత్తంబునుంబోలె నుద్దీపితవంశంబై యుండె; నందు.

1083

తా ॥ ఈ విధంగా అనేక విధాలుగా సంచరించటంలో నేర్పరి అయిన శ్రీహరి విజృంభించి రాసక్రీడకు ఉపక్రమించాడు. తన రెండు పార్శ్వముల యందును అలంకరింపబడిన వారై, కళంకం లేని చంద్రుని వంటి ముఖం కలిగిన ఇద్దరు పడుచులు వీణలను అందుకొన్నారు. నేర్పుతో అందాన్ని మెరయించి ఇంపుగా వాయిస్తున్నారు. సంతోష రసప్రవాహానికి నిధి అగునట్టి పాటను పాడసాగారు. అంతట కృష్ణుడు నిశ్చలంగా వినేవారికి ఇంపు పుట్టించే పిల్లనగ్రోవిని విలాసంగా చేతులతో పుచ్చుకొన్నాడు. దానిని పెదవియందు చేర్చి, గోపికాస్త్రీల కొప్పులలో ఎర్రతామరల వాసనచేత ఉన్నతిని వహించిన చేతివ్రేళ్ళతో, శృతిలయలతో కూడి వివరంగా పిల్లనగ్రోవి రంధ్రములందు సారించి పూరిస్తున్నాడు.

తనకు సాటిలేని రీతిగా త్రిభంగియై, తామర రేకులమధ్య దుద్దు విధంగా తాను గోపాంగనల నడుమ నిలిచాడు. గోపికలు ఎందరో అందరకునూ, అందరి కృష్ణులుగా తానేర్పడి, ఆ రాస మండలాన్ని ఏర్పాటు చేసాడు. అది ఆట అనే విద్యా రూపమైన గొప్ప సముద్రానికి చెలియలి కట్టలా చుట్టుకోబడి ఆశ్చర్యకరమైన రీతిలో ఉన్నది. దేవతలు సంతోషంతో పువ్వులవాన కురిపించారు. ఆ రాసమండలంలో పూగుత్తులలో తిరిగే తుమ్మెదలలాగ, బంగారు పూసల నడుమ ఇంద్రనీల మణులవలె వెలిగి పోతున్నాడు. చిగిర్చి పూచిన తీగలతో ఆవరింపబడిన తమాల వృక్షాల అందాన్ని వ్యాపింపచేస్తున్నారు. మెరుపు తీగల నడుమ అందగిల్లుతూన్న నల్లమబ్బుల అతిశయాన్ని వారు చూపుతున్నారు. ఏరులతో కూడిన రోహిణాచల శిఖరాల లాగా ఆకర్షిస్తున్నారు.

జగన్మోహనుడై, ఎర్రతామరల వలె అరుణములైనవి, చంద్రరేఖలవలె నిర్మలమైన

గోళ్ళచేత ప్రకాశించేవి, వేదములనే ఉత్తమ స్త్రీల యొక్క పాపటలకు అలంకారమైనవి, సనక సనందనాది యోగీంద్రుల మనస్సులకు ఆభరణములైనవి అయిన తన చరణాలను దగ్గరకు చేర్చాడు. సమస్థితిలో నిల్చొని, అంజలి పుటాల్లో పుష్పాలు చల్లాడు. సుకుమారమైన కమలాల వంటి హస్తాలను గోపికా జనుల కంఠముపైన ఉంచాడు. పాటను అనుసరిస్తూ విచిత్ర పాద సంచారాలు చేస్తున్నాడు. గుండ్రని ఆకృతిలో రాసక్రీడ అనే ఆటలో ప్రవేశించారు.

ఆ గోపకాంతలతో కలిసి మొదట ఒకరు, ఆవల ఇద్దరు, వారి కవతల ముగ్గురు, రెండు ప్రక్కల నిలబడి నడుమనుండు వారికి హస్త విన్యాసాదులను చూపే శంఖమున్ను, తామర రేకుల పేర్పువలె వలయాకారంగా నిలిచి పరస్పరము హస్త విన్యాసాదులను చూపే పద్మమున్ను, వజ్రాయుధం యొక్క అంచులవలె ఎదురెదురుగా నిలిచి పరస్పరము హస్త విన్యాసాదులను కనబరచు వజ్రమున్ను, పుట్ట చెండ్లెగయు నట్లు ఎగురుచు హస్త విన్యాసాదులను కాన్పించు కందుకమున్ను, నాలుగు ప్రక్కలకు ముఖములు త్రిప్పి లయబద్ధముగ తిరుగుచు హస్తవిన్యాసములు కాన్పించు చతుర్ముఖమున్ను, తాళమాత్ర కాలంలోపల నృత్య మండలాన్ని చుట్టివచ్చి హస్త విన్యాసాదాలను చూపే చక్రవాళమున్ను, నాలుగు మూలలందును వెనుక మొగముగా నిలిచి హస్త విన్యాసాదులను చూపే చతుర్భద్రమున్ను, తమకు అనువైన చొప్పున హస్తవిన్యాసములను చూపే సౌభద్రమున్ను, పాములవలె పెనవేసుకొని నర్తించుచు లయ తప్పక అంగవిన్యాసాదులను చూపునట్టి నాగమున్ను, అరువది నాలుగు అక్షరముల కాలముగల తాళ మానమునకు సరిపడ నృత్య మండలాన్ని చుట్టివచ్చి హస్తవిన్యాసాన్ని చూపే నంద్యావర్తమున్ను, ఒంటి కాలితో నిలిచి చక్రాకారంగా గిరుక్కున తిరుగుచు హస్త విన్యాసాన్ని కనబరిచే కుండలీ కరణమున్ను, జెట్టీ పట్టు పట్టినట్లు పరస్పరము చేతులు కూర్చుకొని గిరిగిర తిరిగే ఖురరీ బంధమున్ను మొదలైన విశేష రాసబంధాలలో ఆడుతూ సొక్కిపోయారు.

వారందరు ఒంటికాలితో అడుగులు వేసే ఏకపాదమున్ను, రెండు కాళ్ళు సమముగా ఉంచి నటించే సమపాదమున్ను, పాదాన్ని వెలిప్రక్కకు అడ్డంగా త్రిప్పి మడమలు పిరుదులు సోక

నిలిచి నర్తించే వినివర్తితమున్ను, తాళకాలం మారక రాకపోకలు చేస్తూ నటించే గతాగతమున్ను, ఇరు పార్శ్వములకు మొగ్గవాలినట్లు దేహాన్ని వాల్చుచూ నటించే వలితమున్ను, క్రింది మీదుగా శాఖలవలె చాచి వ్రేళ్ళు తాడించుకొంటూ నటించే వైశాఖమున్ను, నటిస్తూ నృత్యమండలాన్ని చుట్టి వచ్చే మండలమున్ను, మూడు వంపులుగా దేహాన్ని వంచి నటించే త్రిభంగియున్ను, మొదలైన భంగిమలలో నిలిచారు. బంగారు గజ్జెల మరియు అందెల మ్రోతలు లోకంలోని జనుల చెవులకు చాలా ఇంపుగా ఉన్నాయి.

ఆ రాసక్రీడలో రెండు అడుగులను చేర్చిపెట్టుకోవడం ఘటితం అనేదానిని, బంకమన్ను కలియ త్రొక్కునట్లు అడుగులు ఎత్తి ఎత్తి పెట్టడం మర్దితం అనే దానిని, పార్శ్వముల యందు పొందునట్లు బొటన వ్రేలితో నేలను రాస్తూ అడుగులుంచటం పార్శ్వగం మొదలైన పాద విన్యాసాలను ప్రదర్శించారు. సరిగా అడుగులుంచుచు పోవటం సమపాదం అనే దానిని, ముందరి తట్టు బండి చక్రములవలె కనిపించేటట్లు పాదములను త్రిప్పిత్రిప్పి పెట్టడం శకటవదనం అనే దానిని, కాళ్ళు ముందు వెనుకలుగా ఎత్తిపెట్టుచు పోవటం మతల్లి అనే దానిని అడుగులను వంపుగా బోరగిల చేర్చి పెట్టుచు పోవటం శుక్తి అనే దానిని మొదలైన పార్థివచారి విశేషాలను ప్రదర్శించారు. కాలు మీదుగా ముందరికి చాచి మరల యథాస్థానంలో అడుగులుంచే అపక్రాంతం అనే దానిని, కాలు మీదుగా ఎత్తి ఊచి ఊచి అడుగులు పెట్టే డోలాపాదం అనేదానిని, మొనవ్రేళ్ళు నేలమీద మోవమెలగే సూచీ అనే దానిని మొదలైన వ్యోమచారి విశేషాలను ప్రదర్శించారు. దేవేంద్రుని కల్పవృక్షము యొక్క కొమ్మలవలె మనోహరమైనవి, దిగ్గజముల తొండములను ఎగతాళి చేసేవి, మూడు లోకాలకు మేలు చేసే చేతుల రత్నకటకంబుల కాంతులు ఆకాశమంతా వ్యాపించాయి.

వారు అర్ధచంద్రము, కర్తరీముఖము, కపిత్థము, కటకాముఖము, శుకతుండము, లాంగూలము, పద్మకోశము, పతాకము మొదలైన తమతమ అభిప్రాయాలను కనబరచునట్టి బహువిధాల హస్తాభినయములను ప్రదర్శించారు. వారు మొలకు కట్టుకొన్న బంగారు వన్నెగల

వస్త్రాల కాంతులు దిక్కులనే స్త్రీల యొక్క ముఖములకు పసుపు పూతలను పూసాయి. మోకాళ్ళను రెండూ సమముగా నేలమీద మోపి నటించే ఆస్కందితం అనే దానిని, రెండు మోకాళ్ళు ఒక్కసారిగా ఎత్తి ఎత్తి పెట్టుచు నటించే భ్రమరం అనేదానిని, బండి నిలిచినట్టు ఒక కాలువంచి ఆ కాలిలో మరియొక కాలిని చొప్పించి నిలిచి నటించటం శకటాసనం అనే దానిని మొదలైన మోకాలితో నిలిచి చేసే మండలాకార నృత్య విశేషాలను ప్రదర్శించారు. కొరవి త్రిప్పినట్టు రెండు చేతులను పైకెత్తి ఒకదానికొకటి తగలకుండ క్రింది మీదుగా త్రిప్పటం అలాతం అనే దానిని, బాణాకర్ర తిప్పినట్లు రెండు చేతులను చేరికగా మీదికెత్తి గిరగిర త్రిప్పటం దండలాతం అనే దానిని, చేతులు మీదికి చాచి ఒప్పిదంగా త్రిప్పటం లలితం అనే దానిని, మీదికి చాచిన చేతులు నానావిధాలుగా త్రిప్పటం విచిత్రం అనే దానిని మొదలైన దైవమండలాలను వారు ప్రదర్శించారు.

మనోజ్ఞములైన శంఖముల వంటి మెడలకు ఒప్పిదమైనవి, అధికమైన తేజస్సు కలిగినది, నీలములు, ముత్యములు, వజ్రములు, వైడూర్యముల హారాల కాంతులు లక్ష్మీదేవికి నివాస స్థానాలుగా అందంగా ఉన్న రొమ్ముల మీద క్రింది మీదై చిక్కుపడగా అంగ ప్రత్యంగములను వహించే గోపికలకు గొడుగులు మొదలైన విలాస విశేషములచేత విలసిల్లారు. మెరుగులు తీరుచున్న చెకుటద్దముల యందు అధికమైన తేజస్సు వలన మిక్కిలి కాంతిచేత చంద్రబింబాలు ప్రతిఫలిస్తూన్న చెవిపోగుల కాంతి సమూహాలు తళతళ మంటూ నృత్యం చేస్తున్నాయి.

వారు నడుము మాత్రం కదిలించటం అనే కటిభ్రాంతమును, దేహమును కదలింపక కేవలం దండంవలె నిక్కుకొని ఉండునట్లు చేసే దండరచితమును, మొగమును చిట్లించుటచేత కనుబొమల వెంట్రుకలను బొట్టువలె కాన్పించే లలాట తిలకమును, నెమలివలె ఒయ్యారంగా మెడను నిక్కించి కదిలించటం అనే మయూర లలితమును, పాదములను కుడి ఎడమ ఎడమ కుడిగా మార్చి ఉంచుకొని రెండు చేతులతో మోకాళ్ళను కౌగిలించుకునే చక్రమండలమును, అవయవాలను ముడుచుకునే నికుంచితమును, ముఖభావముచేత ప్రవాహాది సూచకమైన

అభినయాలను చూపే గంగావతరణ మనే... మొదలైన కరణాలను ప్రదర్శించారు. తెల్ల తామర పూల సౌందర్యాన్ని మీరు చూపులు, దీనజనుల దైన్యాన్ని పారద్రోలగా తనయందలి కోరికగల గోపికల యొక్క కన్నులనే చేపలను క్రమ్ముకొనగా మనోహర భ్రూవిలాసాలు గల లలితమును, సగం మూయబడిన కుంచితమును, తేటదనము కల వికాసమును, మూసుకోబడిన ముకుళమును మొదలైన చూడ్కులతో వెలుగొందారు.

అనేక పరిపూర్ణ చంద్రమండలాల మనోహరత్వానికి మందిరాలుగా ఉన్న వదనాలలో ప్రసన్నమైన అనురాగాన్ని వారు ప్రకటించారు. ఒప్పుచున్న నెమలి కుంచెల యొక్క కిరణాలు అకాల శక్రచాపముల అందాన్ని వెలువరింపగా వారు వంపబడినదియు అనగా నికుంచితమును, నిక్కించినదియు అనగా ఆకుంచితమును, క్రింది మీదుగా కదిలించినదియు అనగా కంపితమును, సమముగా నిలిపినదియు అనగా ఆకంపితమును, ఇరుప్రక్కలకు చామరాలు వేసినట్లు వంచినదియు అనగా పరివాహితమును, వెనుకకు త్రిప్పబడినదియు అనగా పరావృత్తమును... మొదలైన శిరోభావాలను వారు చూపారు. కస్తూరిబొట్లు కలిగిన నొసటి ప్రదేశాలలో ముంగురులు ఆవరింపగా ఉత్సాహ వర్ధన సూచకమును అనగా అపరాజితమును, అభిప్రాయ సూచకమును అనగా సూచికయును, మనసునందు నాటుటను సూచించునదియు ఆవిద్ధమును, భిన్నవాన్ని సూచించు పరిచ్ఛిన్నమును, విషయాన్ని సూచించే విష్కంభమును వ్రేళ్ళ కదలికను సూచించు రేచితమును.... మొదలైన అంగహారాలను పాదాలను, పిరుదులను, చేతులను, మెడలను కదిలిస్తూ రేచకాలను ప్రదర్శించేరు.

ఒప్పిదమైన ఆ సమయంలో ఆ రాసక్రీడ సకల జనుల మనస్సులకు ఉల్లాసాన్ని కలుగచేసింది. పాలసముద్రంవలె ప్రకాశించునట్టి శృంగారాది రసములచేత మనోజ్ఞమై, రామరాజ్యంవలె రాగపరిపూర్ణమై, పూర్ణచంద్రమండలంవలె కువలయానందంబై, ఇంద్రుని ఉద్యానవనం వలె ముంగురులచేత ప్రకాశించుచున్నదై, మానధనుని చిత్రంవలె ముఖ్యమైన వృత్తి యందలి నిపుణత కలిగి, సమర్థుడైన కవి యొక్క సామర్థ్య ప్రకటనం వలె అనేక కావ్యములచేత

ప్రకాశించునదియై, దేవలోకమువలె వసుదేవుని కొడుకైన కృష్ణుని చేత విశేషించినదై, పెద్దల నడవడివలె భూమికిని ఆకాశానికిని ఆభరణమో అనునట్లు అందమైనదై, స్త్రీ రత్నంవలె అవయవముల కదలికలచేత మనోజ్ఞమై, పార్వతీదేవి యొక్క ఇంటివలె పెక్కులైన సంచారములచేత మృదువై, మంచి కుమారుని నడవడికవలె మిక్కిలి ప్రకాశింప చేయబడిన వంశము కలదై ఉన్నది.

చ. నడుములు వీఁగి యాడఁ, జిఱునవ్వులు నివ్వటిలంగ, హారముల్
సుడివడ, మేఖలల్ వదలఁ, జూడ్కి మెఱుంగులు పర్వ, ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప, శ్రుతిభూషణముల్ మెఱయన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్.

1084

తా ॥ నడుములు అసియాడగా, చిరునవ్వులు హెచ్చగా, హారములు చెదరి చిక్కుపడగా, మొలనూళ్ళు సడలగా, చూపుల కాంతులు నలుప్రక్కల వ్యాపింపగా, చెమటలు పొడమగా, తలవెంట్రుకలు చలింపగా, చెవులయందలి ఆభరణాలు ప్రకాశింపగా ఆ గోపికా స్త్రీలందరు ఒక్కొక్కరు ఒక్కొక్క కృష్ణునితో కూడుకొన్నవారై మేఘములలోని మెరుపు తీగలలాగ ఆడుతూ ఉత్సాహంతో పాడారు.

క. అంకరహితేందు వదనలు, పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవమై.

1085

తా ॥ కళంకం లేని చంద్రుని వంటి ముఖములు కలవారైన గోపికలు కమలములవంటి కన్నులు కలవాడైన కృష్ణునితో కలిసి ఆడునపుడు వారి మొలనూళ్ళలోని చిరుగంటల ధ్వనులు, కాళ్ళ అందెల ధ్వనులు, చేతిగాజుల ధ్వనులు చెవులకు ఆనందంగా ధ్వనించాయి.

క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ నంబరవీథిన్
సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా!

1086

తా ॥ ఓ రాజా! లేడికన్నులవంటి కన్నులు గల గోపికలతో రాసక్రీడ చేస్తూండగా అంబర వీథిలో దేవతాప్రభువులు వరుసగా నిలిచి వీక్షించారు.

క. కురిసెం బువ్వుల వానలు, మొరసెన్ దుందుభులు మింట ముదితలుఁ దారున్
సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా!

1087

తా ॥ ఓ రాజా! ఆ సమయంలో ఆకాశంనుండి దుందుభులు మ్రోగాయి. గంధర్వపతులు ముదితలును చేరి వరుసగా పాడారు.

క. రామలతోడను రాసము, రామానుజుఁ డాడఁ జూచి రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చర, రామలు మూర్ఛిల్లి పడిరి రాజకులేంద్రా!

1088

తా ॥ ఓ రాజకులోత్తమా! శ్రీకృష్ణుడు గోపికలతో కూడి రాసక్రీడ చేయగా చూసి ఆనంద పారవశ్యం చేత దేవతాస్త్రీలందరు తమ భర్తలమీద సోలి వాలి పోయారు.

క. తారాధిప నిభ వదనలు, తారాధిప వంశ్యుఁ గూడి తారు నటింపం
దారలతోడ సుధాంశుఁడు, దారును వీక్షింప రేయి దడవుగ జరిగెన్.

1089

తా ॥ చంద్రునివంటి ముఖముగల గోపికలు చంద్రవంశంలో జన్మించిన కృష్ణునితో కూడి ఆడగా, దానిని చంద్రునితో కూడి తారలు చూస్తూ ఉండటం చేత ఆ రాత్రి మెల్లగా

గడిచింది.

మ. యమునా కంకణ చారియై వనజ పుష్పామోద సంచారియై
రమణీఘర్మ నివారియై మదవతీ రాసశ్రమోత్తారియై
ప్రమదామానస నవ్యభవ్యసుఖ సంపత్కారియై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం గళ్యాణభావంబునన్.

1090

తా ॥ అప్పుడు యమునా నది అందలి నీటి తుంపురులలో చరిస్తూ అడవి యందు పుట్టిన పువ్వుల పరిమళంతో చల్లని గాలి వీచింది. రాసక్రీడ చేయటం వలన గోపికా స్త్రీల దేహానికి పట్టిన స్వేదాన్ని పోగొట్టింది. వారి మనస్సులకు కొత్తది, మేలైనది అయిన ఆ మలయానిలం శ్రీకృష్ణుడు సంతోషించేటట్లు కళ్యాణ భావంతో వీచింది.

వ. అప్పుడు.

1091

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ ఠాయము సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱు వేఱు కా
నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనన దారువు లంకురింపఁగన్.

1092

తా ॥ అప్పుడు ఒక గోపిక కృష్ణుడు పాడుతూ ఉండగా తాను కూడా వీణను మీటుతూ అతని పాటతో మేళనమయ్యేటట్లు పాడింది. పిమ్మట వేరొక రాగాన్ని ఆలపించి స్వరాలను వేరు వేరుగా ఉచ్చరిస్తూ ఎండిన మ్రాకులు కూడా రక్తి పుట్టి చిగురించునట్లుగా, కృష్ణుడు శ్లాఘిస్తూ ఉండగా పాట పాడింది.

క. ఆడుచుఁ బాడుచు నందొక, చేడియ మంజీర మంజు శింజిత మమరం
గూడి హరికరము సనుఁగవ, పై డాయఁగ దిగిచె జఘనభారాలసయై.

1093

తా ॥ అప్పుడా గోపికలలో ఒకరు ఆడుతూ పాడుతూ కాలి అందెల చప్పుళ్ళు చెవులకు ఇంపు పుట్టింపగా నర్తిస్తూ, బడలినదియై కృష్ణుని చేతిని తన వక్షం మీద చేర్చుకొంది.

క. చందనలిప్తంబై యర, విందామోదమున నొప్పు విపులభుజము గో
విందుఁ డొక తరుణిమూఁపునఁ, బొందించిన నది దెమల్చి పులకించె నృపా!

1094

తా ॥ ఓ రాజా! శ్రీకృష్ణుడు గంధము పూయబడిన, తామర పువ్వుల వాసనతోడి అలరారుచున్న తన గొప్ప బాహువులను ఒక గోపిక యొక్క భుజముమీద ఉంచగా, ఆ చిన్నది ఉలికిపడి గగుర్పాటును పొందింది.

సీ. చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన విభుఁడు దాంబూలచర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ డున్నతదోఃస్తంభ మూఁత సేసెఁ
జెమరించి యొకబాల సేరినఁ గొనగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె
నలకంబు లొక యింతి కలికచిత్రకరేఖ నంటినఁ బ్రియుఁడు వాయంగ దువ్వెఁ

ఆ. బడఁతి యొకతె పాటపాడి డస్సిన నధ, రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్క సతికి నంసావృతంబైనఁ, గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె.

1095

తా ॥ అప్పుడు ఒక చక్కని చుక్క తన చెక్కిలిని కృష్ణుని చెక్కిలితో ఆనింపగా, తన పుక్కిటి విడియం ఆమెకు పెట్టాడు. వేరొక గోపిక ఆడుతూ అలసిపోగా తన చేతిని ఆసరాగా ఇచ్చాడు.

ఇంకొక గోపిక తన దేహమునందు చెమటతో దరిచేరగా, ఆ చెమటను కొనగోటితో ఎగమీటాడు. ఒక ఇంతికి ముంగురులు నొసటి బొట్టును అంటుకోగా దానిని ఎగదువ్వాడు. మరొక ముగుద పాటపాడి అలసిపోతే దానికి మోవిపానకాన్ని ఇచ్చి ఆదరించాడు. మరొక్క చెలి మెడలోని ముత్యాల పేరు మూపున చుట్టుకొనగా కృష్ణుడు ఆ హారాన్ని చక్కదిద్ది ఆలింగనం చేసుకొన్నాడు.

క. హాసంబులఁ గరతల వి, న్యాసంబుల దర్శనముల నాలాపములన్
రాసశ్రాంతల నా హరి, సేసెన్ మన్ననలు కరుణసేసి నరేంద్రా!

1096

తా ॥ ఓ రాజా! ఆ విధంగా రాసక్రీడయందు అలసిన ఆ గోపికలను చిరునవ్వుల చేతను, తన మృదువైన చేతితో స్పృశించుట చేతను, అనురాగం తోడి చూపులతో, ముచ్చటైన మాటల చేత ఆ హరి మన్నించాడు.

క. హరితనుసంగ సుఖంబునఁ, బరవశలై వ్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె?, సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్.

1097

తా ॥ అతని స్పర్శకు పరవశించిన ఆ గోపికలకు పారవశ్యంచేత పయ్యెదలు తొలగుటగానీ, కట్టువస్త్రాలు జారుట గాని తెలుసుకోలేకపోవటం ఒక వింత కాదు. ఎందుకంటే ఆకాశమునందుండి రాసక్రీడయందు నటిస్తూన్న కృష్ణున్ని చూసిన దేవతాస్త్రీలే అనురక్తిని పొంది పరవశలు అయ్యారు. (ఇక్కడ వారు శరీర స్పృహను వదలి అలౌకిక స్థితిలో ఉన్నారని గ్రహించాలి)

వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెంద ఱందఱకు నందఱై నిజప్రతి బింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేలి సలిపిన.

1098

తా ॥ ఇలా భగవంతుడైన శ్రీకృష్ణుడు తాను ఆత్మారాముడైనప్పటికీ, ఎందరు గోపికా స్త్రీలో అందరు కృష్ణులుగా ఏర్పడి, బాలుడు తన ప్రతిబింబాలతో ఆడిన విధంగా, గోపికలతో రాసక్రీడ సలిపాడు.

క. తగఁ గూడి యాడి మనముల, నగెఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్.

1099

తా ॥ అంతట ఆ గోపికా స్త్రీలు అందరూ కూడి, ఆడి, కృష్ణుడు తమతో పాటుగా నవ్వాడు, తమ్ము చూసాడు, తమతో వేడుకగా మాట్లాడాడు అని మనస్సులలో అనుకొని తాము పూర్వ జన్మములో చేసుకొన్న పుణ్యం మంచిదని శ్లాఘించుకొన్నారు.

# 39. జలక్రీడాభివర్ణనము

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, కరకాంచితలగు తటిల్లతల చెలువున ఘర్మసలిల కణాక్రాంతలగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునా జలంబులు సొర, నందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచుం గుచ నయన నాభివివరకుంతలంబులు చక్రవాక జలచరావర్త శైవాలంబుల చందంబున నందంబుగ నీడు వొందిన, యేఱులని కళిందనందన గరంబులు సాఁచి పరిరంభంబులకు నారంభించు కైవడి నెదురు చనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు సాఁచుచు, మరాళంబులం జోపుచుఁ, జెన్ను మిగిలిన యన్నుల చన్నుల యెత్తువత్తు మను నెపంబులం దపంబులు నీటఁ గావించు మాడ్కిని సంచరించు చక్రవాకంబులం దోలుచు, నితాంతకాంతి సదనంబులగు వదనంబులకు నోడి వ్రీడం జెంది కంది చందురుండు సలం బుడిగి జలంబునం బడి కంపించుకరణి, నిజకర చలిత జలప్రతిబింబితుండై కదలు చంద్రునిం గని మెచ్చి సోలుచు, సలిలావగాహ సమయ సముచ్చలిత వారిశీకర పరంపరలవలన మకరంద పానమత్త మధుకర పక్ష విక్షేపణ సంజాత వాత సముద్ధూత కుముదాది పరాగపటలంబులం జెఱుచు, మోముఁ దమ్ముల కమ్మఁదనంబునకు మూఁగి, జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱచుచు, నీలనీరద నిపతిత పయోబిందు సందోహంబులం దడియు పువ్వుఁ దీవియల బాగునఁ గృష్ణకరద్వయ తోయంబులం బెక్కుతోయంబులం దడియుచుఁ, గ్రందుకొని సుడియుచు, నసమబాణుని పులుగడిగిన కుసుమబాణంబుల పగిది మేనులు మెఱయ సలిలావగాహన పరాయత్తచిత్త లగుచు, మొత్తంబులై సరసభాషణములం ద్రుళ్లుచుఁ, గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ, జల్లునెడం దడఁబడన్ దాఁటుచు, దాఁటి చనక నిలువరించుచు వినోదింప, హరియుం గరేణుకర వికీర్ణ నీరధారాభిషిక్తంబగు శుండాలంబు లీల నాభీరకామినీ కరసముజ్ఝిత జలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజన హస్తప్రయుక్త కల్హార కైరవ

పరాగపటలంబు వలన భూతిభూషణు సిరి వహించుచు, గోపికాజన పాణికిసలయ సమున్ముక్త కమలదళంబుల వలన సహస్రనయనుని రూపుఁ జూపుచు గోపాలబాలికా కుచకలశ కుంకుమ పంకంబు వలనఁ బ్రభాతబాల భానునిభంగి భాసిల్లుచు, ఘోషయోషా కటాక్ష విక్షేపణంబువలన మధుపపరివృత హరిచందన సౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచుల వలనఁ జంద్రికా ప్రభా భాసిత నీలశైలంబు క్రియ నమరె; నంత.

1100

తా ॥ ఈ విధంగా శ్రీహరి రాసకేళి చేసి, వడగండ్లతో ఒప్పు మెరపు తీగల వలె నిలచి చెమట బొట్లచేత ఆవరింపబడిన దేహములు గల గోపికలను కూడి జలక్రీడలయందు కుతూహలంతో యమునా నదిలో ప్రవేశించాడు. ముందు గోపికలు ప్రవేశించి అడుగులోతు, మోకాలిలోతు, నడుములలోతు, అని చెప్పుకుంటూ జలాల్లోకి ప్రవేశించారు. యమునానది ఎదురు వచ్చి కౌగిలించుకొంటున్నదో అన్నట్లుగా తరంగాలు వచ్చి వారిని తాకసాగాయి.

తామర పువ్వులకు చేతులు చాచుతున్నారు. హంసలను ఎగయ తోలుతున్నారు. కళంకం లేని తమ ముఖాలను చూసి భయపడి గడగడ వడకుచున్నట్లు నీళ్ళయందు ప్రతిఫలించి కనిపిస్తూన్న చంద్రబింబాన్ని చూసి మెచ్చుకుంటున్నారు. నీళ్ళలో స్నానములు చేసేటప్పుడు మీదికెగిరిన తుంపురుల సమూహము వలన పూదేనెలు త్రాగి మత్తుగొన్న తుమ్మెదలు రేగుతున్నాయి. వాని రెక్కల కదలికల వలన పుట్టిన గాలిచేత ఎగజిమ్మబడిన తెల్ల కలువలు మొదలైన వానియందలి పుప్పొడి రాసులయందు చేరుతున్నాయి... తుమ్మెదలు. కమలముల వంటి ముఖముల వాసనకు ముసురుకొని ఝుంకారం చేసే తుమ్మెదలకు భయపడుతున్నారు. అరచేతులతో నీళ్ళు పైకి ఎగిరేటట్లు నీటిని ఎగజిమ్మారు. నల్లమబ్బుల నుండి పడుతూన్న వాన చినుకుల సమూహములచేత తడియునట్టి పువ్వుతీగెలవలె కృష్ణుని చేతులనుండి చల్లుతూన్న నీళ్ళలో తడిసిపోతున్నారు.

సందడిలో సోలి పడుతున్నారు. మాలిన్యం పోయేటట్లు కడిగిన మన్మథుని పువ్వు

బాణాల్లా దేహాలు మెరుస్తున్నాయి. నీళ్ళయందు మునుగుటలో ఆసక్తిగల మనస్సులతో గుంపులు గూడి సరసపు మాటలతో త్రుళ్ళుతున్నారు. చేతుల నిండా నీళ్ళెత్తి కృష్ణునిమీద చల్లుతున్నారు. చల్లేటప్పుడు తత్తరపడుతున్నారు. ఈ విధంగా వారు వినోదిస్తున్నారు. ఆడు ఏనుగుల తొండముల నుండి చల్లబడిన నీళ్ళచేత తడిసే మగ ఏనుగువలె గోపికా స్త్రీల చేతుల నుండి చల్లబడిన జలాలకు తడిసి పోతున్నాడు శ్రీకృష్ణుడు. గోపికలు చల్లిన ఎర్రకలువలు, తెల్ల కలువలు మొదలైనవాటి పుప్పొడి చేత తెల్లబడి విబూది పూసుకొన్న శివునిలా ఉన్నాడు శ్రీకృష్ణుడు. గోపికల చేత వేయబడిన తామర రేకులు దేహమంతా క్రమ్ముకోగా వేయి కన్నులు కల ఇంద్రునిలా కనిపిస్తున్నాడు. గోపికల చూపులు తనమీద వ్యాపించడం చేత తుమ్మెదలు క్రమ్ముకొన్న కల్పవృక్షములాగా అందంగా ఉన్నాడు. గోపాంగనల నవ్వుల కాంతులు మీద ప్రసరింపగా కృష్ణుడు వెన్నెల చేత ఆవరింపబడిన నల్లని కొండలా ఉన్నాడు.

మ. సతులుం దానును వీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం
కృతుఁడై కుంభికరేణు యూథములతోఁ గ్రీడించు చందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్.

1101

తా ॥ అంతట కృష్ణుడు గోపికలతో కూడా నీళ్ళయందుండి బయటకు వచ్చి వస్త్రములు, ఆభరణములు మొదలైన వానిచే అలంకరించుకొన్నాడు. పరిమళం తోడి గంధము పూసుకొన్నాడు. వారందరి అభీష్టములు సిద్ధించునట్లుగా వారిని తృప్తిపరిచాడు.

వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె.

1102

తా ॥ ఈ విధంగా హరి శరత్కాలంలో గోపికా స్త్రీలతో అస్ఖలితేంద్రియుడై క్రీడించాడు” అని చెప్పగా శుక మహామునితో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు:

మత్తకోకిలము
ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడ ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మ మంచుఁ దలంచి చేసె? నుదాత్తమానస! చెప్పుమా!

1103

తా ॥ “ఓ శుక యోగీంద్రా! ధర్మమును చెడకుండా, చక్కపెట్టుటకు, రక్షించుటకు కర్తయు, భర్తయునై ధర్మస్వరూపంతో భూమిమీద అవతరించిన సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు పరస్త్రీలతో కూడుట ఏమి ధర్మమని తలచి కూడెనో నాకు చెప్పండి.”

వ. అనిన శుకుం డిట్లనియె.

1104

తా ॥ దానికి శుకమహర్షి ఇలా సమాధానం చెప్పాడు:

ఆ. సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి, దోషి గాని పగిది దోష మైనఁ
జేసి దోషపదముఁ జెందరు తేజస్వు, లగుటఁ జంద్రవాసవాదు లధిప!

1105

తా ॥ “ఓ రాజా! సర్వభక్షకుడైన అగ్ని సర్వాన్ని భక్షించి కూడా దోషికాదు. అలాగే చంద్రుడు, ఇంద్రుడు మొదలైన తేజోవంతులు దోషఫలాన్ని పొందరు.

క. ఈశ్వరుఁడు గానివాఁడు న, రేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గౌ

రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయదవిషము మ్రింగి వెలయం గలఁడే?

1106

తా ॥ ఈశ్వరుడు అన్నింటికీ అతీతుడైనవాడు. ఈశ్వర కృత్యాలను లౌకిక ధోరణితో పరిగణించరాదు. విశ్వానికి భయం వాటిల్లగా గౌరీపతి అయిన శివుడు కాలకూట విషమును పానము చేసినట్లుగా సామాన్యులు, కర్మబంధితులైన వారు చేయగలరా! అలాగే మానవ మాత్రుడు అందరి పరకాంతలను స్పృశిస్తూ ఎలా జీవించగలడు?

గుణాలకు, కర్మలకు అతీతుడైనవాడు ఈశ్వరుడు. ఈశ్వరుడు చేసే లీలలు సాధారణ జ్ఞానంతో గుర్తించలేము. మనస్సుకి, బుద్ధికి అందనివాని లీలల గురించి పరిమిత బుద్ధితో అంచనా వేయరాదు. బ్రహ్మవిద్యా ప్రాప్తిలో లింగభేద ప్రస్తావన ఉండదు, ఇదీ గుర్తించవలసిన అంశం.

క. సత్యము ప్రభువుల వచనము, నిత్యముఁ దద్వచనవీథి నిలుతురు పెద్దల్;
సత్యాసత్యము గావున, సత్య మనుచుఁ జనరు వారిచరితమున నృపా!

1107

తా ॥ ఓ రాజా! ఈశ్వరుల వచనమే సత్యం, అదే ప్రమాణం. కానీ వారు చేసే పనులు కాదు. వారి మాటలనే ఆర్యులు అనవరతం అనుసరిస్తారు గాని వారు అనుష్ఠించిన పనులను మాత్రము కాదు. ఆ స్వతంత్రుల నడవళ్ళు మాత్రం పామరులకు సత్యములుగా తోచినా, పండితులకు అసత్యములుగా తోస్తుంది. కనుక స్వతంత్రుల అనుష్ఠితాలను ప్రమాణములుగా గ్రహింపక పండితులు అగు పెద్దలు ఎలా నడుస్తారో అలాగే పామరులు కూడా నడచుకోవలసి ఉంటుంది.

మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగ ధ్యానసంప్రాప్త యో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం

ధ నిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు, రా దివ్య శో
భనుఁ డెట్లుండిన నుండెఁగాక! కలవే బంధంబు లుర్వీశ్వరా!

1108

తా ॥ ఓ రాజేంద్రా! ఎవరి పాదపద్మాల యందు ధ్యాననిమగ్నమై ఉన్నందున మునీంద్రులు కర్మబంధాలను విడనాడి యథేచ్ఛగా మెలగుతూ ఉంటారో, అట్టి దివ్యమంగళాకారునికి ఏమి కట్టుబాట్లు ఉండగలవు? బంధాలకు అతీతుడైన వాడిని ఏ కర్మలు స్పృశించగలవు?

ఆ. గోపజనములందు గోపికలందును, సకలజంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?, సర్వమయుఁడు లీల సలిపెఁ గాక?

1109

తా ॥ గొల్లవాండ్రయందు, గొల్లపడుచుల యందు, సకల జీవుల యందు సంచరించే ఆ మహాత్మునికి, అనగా సర్వమును తానే అయిన వానికి, పరాంగనలెవ్వరు? అన్నియు తానే కనుక తనయందు తానే క్రీడించాడు." (సర్వం విష్ణుమయం జగత్ అన్నది ఇక్కడ తెలియచేస్తున్నారు)

వ. అని చెప్పి శుకుం డిట్లనియె నంత బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్ఛ లేకయు నిండ్లకడ కేఁగినంఁ గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరై రివ్విధంబున.

1110

తా ॥ శుక యోగీంద్రుడు తిరిగి ఇట్లా అన్నాడు: "అంతట వేకువజాములో గోపికలు కృష్ణునితో క్రీడలు చాలించి అతని వలన సెలవు పుచ్చుకొన్న వారై, అక్కడ నుండి కదలిపోవుటకు మనస్సు రాకపోయినా, విధిలేక తమ తమ ఇండ్లకు చేరారు. ఆ గోపికల భర్తలు కృష్ణుని వలన మోహింపబడినవారు అగుట చేత వారిని కోపింపలేదు.

ఇంద్ర వజ్ర

గోపాలకృష్ణుండును గోపకాంతల్, ప్రాపించి క్రీడించిన భంగు లెల్లన్
రూపించి వర్ణించి నరుండు హృత్సం, తాపంబులన్ బాయును దత్ప్రసక్తిన్.

1111

తా ॥ ఈ విధంగా గోపాల కృష్ణుడు గోపికలు రాసక్రీడలో క్రీడించిన విధములన్నింటిని తెలుసుకొని, తత్త్వార్థ విచారణతో ఆ రాసలీలలోని అంతరార్థాన్ని ఎవడు కొనియాడతాడో ఆ మనుష్యుడు రాసలీలా ప్రసంగం వల్ల సమస్త మనస్తాపాల నుండి విముక్తుడవుతాడు.

## 40. సర్పరూపియగు సుదర్శనుడను గంధర్వుని శాపవిమోచనము

వ. అంత నొక్కనాఁడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి, జాతరకుం జని సరస్వతీనదీ జలంబుల స్నానంబులు సేసి, యుమామహేశ్వరుల నర్చించి కానిక లిచ్చి, బ్రాహ్మణులకు గో హిరణ్య వస్త్రాన్నదానంబు లొసంగి, జలప్రాశనంబు సేసి, నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిదురవోయిన నందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు 'కృష్ణ కృష్ణే' తి వచనంబులం దన్ను విడిపింపు మని మొఱ యిడిన విని.

1112

తా ॥ అటు పిమ్మట ఒక రోజున నందుడు మొదలైన గొల్లలందరూ అంబికావనం అనే అడవికి బండ్లెక్కి జాతర చేయటం కోసం వెళ్ళారు. ఆ అడవిలో ప్రవహించే సరస్వతీ నదిలో స్నానాలు చేసి పార్వతీ పరమేశ్వరులను పూజించారు. తాము కొనిపోయిన కానుకలు ఆ దేవతలకు సమర్పించి, బ్రాహ్మణులకు గోదానం, హిరణ్యదానం, వస్త్రదానం, అన్నదానం మొదలైన దానాలను చేశారు. జలం ఆహారంగా చేసుకొని వ్రతనిష్ఠతో ఉండగా దైవవశం చేత ఒక మహాసర్పం వచ్చి నిద్రపోవుచున్న నందున్ని మ్రింగడానికి ప్రయత్నించింది. అప్పుడు నందుడు 'కృష్ణా! రక్షింపు' మని మొరపెట్టాడు.

నందుడనగా బ్రహ్మవేత్త అని అర్థం. అట్టివాడు నిదురపోవుట అనగా బ్రహ్మవిచార విస్మృతిని పొందాడు. ఉరగం (సర్పం) అంటే అజ్ఞానం అని అర్థం. అది ఇతనిని కమ్ముకొని సంసార కూపంలోకి త్రోయ యత్నింపగా, అతడు భగవన్నామ స్మరణ చేసి ఆత్మానుసంధానపరుడు కాగానే అజ్ఞానం నశించింది. కాబట్టి బుద్ధిమంతుడైన వాడు సర్వావస్థల యందు బ్రహ్మావలోకన పరుడై ఉండాలి. బ్రహ్మ విద్యను సదా స్మృతికి తెచ్చుకుంటూ దానికి విచారణ అనే పదను పెడుతూ ఉండాలి.

క. గోపకు లందఱు మేల్కొని, కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్
దాపము నొందియు వదలక, పాపపుఁ బెనుబాము నందుఁ బట్టె నృపాలా!

1113

తా ॥ రాజా! గొల్లలందరు మేల్కొని కోపంతో పెద్దపెద్ద దుడ్డు కర్రలతోను, కొరవి కట్టెలతోను బాదగా తాపమును పొందినా, క్రూరమైన ఆ పెద్దపాము వదలక నందున్ని పట్టుకునే ఉంది.

వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్ర రూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె.

1114

తా ॥ అప్పుడు కృష్ణుడు ఆ పామును కాలితో తన్ని త్రొక్కాడు. వెంటనే అది సర్ప రూపాన్ని విడిచి విద్యాధర రూపాన్ని వహించి శ్రీహరికి మ్రొక్కి నిలిచింది. అప్పుడు శ్రీహరి వానితో ఇట్లా అన్నాడు:

ఉ. మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండవై
యుండెడు నీకుఁ గష్టపు మహోరగ దేహ మిదేల వచ్చె? నె
వ్వండవు? నామ మెయ్యది? భవంబున కెద్ది మిషంబు? నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీ పని చోద్య మయ్యెడిన్.

1115

తా ॥ "అలంకరింపబడిన ఆకారంతో, బంగారు పువ్వుల దండతో శుభ లక్షణాలతో ఉండెడు నీకు క్రూరమైన పాము యొక్క దేహం ఎలా వచ్చింది. నీ పేరేమిటి? ఈ సర్ప జన్మమునకు కారణం ఏమిటి? నాకు క్రమంగా తెలియచెప్పు. నీ చర్య మిక్కిలి వింతగా ఉంది."

వ. అనిన వాఁడిట్లనియె: 'దేవా! యేను సుదర్శనుండను విద్యాధరుండ; విమానారూఢుండనై రూపసంపద్గ ర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైన వారలం గని నగిన వారును నీవు రూపదర్పంబున మమ్ము నగితివి; గావున మహాసర్పంబవై యుండు' మని శపించి పిదప నే వేఁడుకొనిన నిట్లనిరి.

1116

తా ॥ అని కృష్ణుడు అడుగగా ఆ విద్యాధరుడు ఇలా అంటున్నాడు: "నేను సుదర్శనుడు అను పేరుగల విద్యాధరుడను. విమానం ఎక్కి రూప సంపద్గర్వముతో, ఒళ్ళు తెలియని వాడనై పరవశంతో ఎల్లదిక్కులలోను తిరుగుతూ, ఒక సమయంలో ఆంగిరస్సంబంధులైన ఋషులను కురూపులైన వాళ్ళని చూసి నవ్వాను. ఆ ఋషులు కోపంతో నువ్వు చక్కదనపు గర్వం చేత మమ్ము చూసి నవ్వావు. కనుక మహాసర్పంగా పడిఉండు అని శపించి పిమ్మట నేను ప్రార్థించగా ఇలా అన్నారు:

చ. యదుకులమందు భక్తుల భయంబు హరించుటకున్ జనార్దనుం
డుదయము నొంది యీ యడవి కొక్కదినంబున రాఁగలండు త
త్పదమున నీవు తన్నఁబడి పన్నగదేహము తోడఁ బాసి నీ
మొదలిటి మేను గాంచెదవు మూఢుఁడ! పొమ్మని రా దయానిధుల్.

1117

తా ॥ 'యదు కులంలో భక్తుల భయాన్ని తొలగించటం కొరకు జనార్దనుడు పుట్టి, ఈ అడవికి ఒకరోజున వస్తాడు. అతని పాదం చేత నీవు తన్నబడి వెంటనే సర్పదేహాన్ని వదలి, నీ మునుపటి దేహాన్ని పొందుతావు' అని ఆ దయామూర్తులు చెప్పారు.

మ. నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌ నఁట! భవత్పాదంబు నామీఁదఁ బె

ట్టినఁ దద్బ్రాహ్మణశాప సంజనిత కౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ? నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్.

1118

తా ॥ ఓ పుండరీకాక్షుడా! నిన్ను తలచిననూ, నీ కథలను విన్ననూ, నీ నామములను ఉచ్చరించిననూ పాప సమూహం అంతా నశిస్తుంది. అలాంటిది నీ పాదస్పర్శ చేత నాకు బ్రాహ్మణ శాపం వలన వచ్చిన వికార రూపం విడిపోదా? నేడు నా పాపం పోయి ఎప్పటిలాగా విద్యాధరత్వాన్ని పొందాను, నేను ఇక సెలవు తీసుకుంటాను."

వ. అని విన్నవించి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె, సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యెఁ; దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తి నొందించి కృష్ణకీర్తనంబు సేయుచు మరల మందకుం జని రంత.

1119

తా ॥ అని విన్నవించి శ్రీహరికి ప్రదక్షిణం చేసి సుదర్శనుడు స్వర్గానికి వెళ్ళాడు. నందుడు పామువల్ల విడువబడ్డాడు. ఈ సమాచారమంతా తక్కిన గొల్లలు విని ఆశ్చర్యపడుతూ ఆ జాతరను పూర్తి చేసి కృష్ణుణ్ణి పొగడుచూ వ్రేపల్లెకు పోయిరి.

## 41. శ్రీకృష్ణుడు కుబేరభటుడగు శంఖచూడుడను గుహ్యకున్ని సంహరించుట

చ. మఱి యొకనాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణ ధారులునై చని మల్లికాది పు
ష్ప రసనిమగ్న మత్తమధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబిను లుండఁగఁ బాడి రింపుగన్.

1120

తా ॥ ఇంకొక రోజు వెన్నెల రాత్రి కృష్ణబలరాములిద్దరూ నిర్మలమైన వస్త్రములను, ఆభరణములను ధరించి, మంచి సువాసన కల గంధమును పూసుకొని, పుష్పహారములను ధరించారు. ధరించి అడవికి పోయి ఆ అడవినడుమ మల్లెలు మొదలైన వాటి విరితేనెలు త్రాగి మత్తులో ఝంకారం చేస్తూన్న తుమ్మెదల గానాన్ని వింటూ గోపసుందరులు తమ చుట్టూ కూర్చుని ఉండగా ఇంపుగా ఒక గీతాన్ని పాడారు.

క. ఆ పాట సెవుల సోఁకిన, నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వ్యా
చా పాటవములు సెడి పడి, రా పాటలగంధులెల్ల నటవీవీథిన్.

1121

తా ॥ ఆ పాట చెవిన పడగానే, గోపస్త్రీలందరూ ఇంద్రియవ్యాపారాలు అన్నీ కట్టుబడగా, పారవశ్యం చేత దేహస్మృతిని కోల్పోయి ఆ వనమందు ఆనందపారవశ్యంలో మునిగిపోయారు.

వ. ఇట్లు సకలభూత సమ్మోహనంబగు గానంబు సేయుచు, నిచ్ఛావర్త నంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణ రక్షితలగు గోపికలం దన యోగబలంబున నుత్తరవు దిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జనంబులు 'రామకృష్ణే' తి భాషణంబులం జీరి పులికి నగపడిన మొదవుల క్రియ

మొఱయిడిన విని.

1122

తా ॥ ఈ ప్రకారము రామకృష్ణులు సకల ప్రాణులకు సమ్మోహం కలిగేలా పాటలు పాడుతూ, యథేచ్ఛగా ప్రవర్తిస్తూ ఉన్నారు. అప్పుడు శంఖచూడుడు అను పేరుగల కుబేరుని భటుడొకడు రామకృష్ణుల చేత రక్షింపబడుచున్న గోపికలను తన యోగబలంచేత ఉత్తర దిక్కుగా తీసుకొని పోయాడు. అప్పుడు ఆ గోపికలు పులిచేత చిక్కుకొన్న ఆవులవలె అంగలారుస్తూ ఓ కృష్ణా! ఓ రామా! మమ్ము రక్షించండి అని మొరపెట్టుతూ పోతూ ఉంటే ఆ మొర విన్నాడు శ్రీకృష్ణుడు.

బ్రహ్మవిద్య రుచి ఎరిగిన వారికి అది మిక్కిలి మనోహరంగా ఉండునని భావం. బ్రహ్మవేత్తల నడతలు వారి సంభాషణలు అది తెలియని వారి బుద్ధికి విరోధముగా తోచుట సాధారణం. కుబేరుడు అంటే కుత్సిత ప్రవర్తనం చేత ధనార్జనం చేసే ధనికుడు అని అర్థం. భటుడనగా వాని దగ్గర ద్రవ్య గ్రహణార్థం కాచుకొని ఉన్న దొంగ వేదాంతి. రామకృష్ణ రక్షితలగు గోపికలు అనగా బ్రహ్మవిద్యచేత రక్షింపబడునట్టి శ్రోతలు అని అర్థం. (ఉత్తరపు దిక్కునకు గొనిపోవన్ అనగా ఉత్తర దిక్కు అనగా జ్ఞానకాండము) వారికి జ్ఞానోపదేశము చేసెదనని మాయచేసి తీసుకొనిపోగా అనగా లోకంలో యాగ యోగాది క్రియలు లోకులు గొప్పగా భావిస్తారు. కానీ అవి కేవలం బ్రహ్మతత్త్వాన్ని చేరుకోవడానికి సహకారి సాధనాలు మాత్రమే. అయితే గోపికలు బ్రహ్మవేత్తలు కావడం చేత ఇష్టం లేక ఆక్రందనలు చేసారు.

ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱుఁ గాలమృత్యువుల యేపున వే చని 'యోడకుండుఁ డో
ముద్దియలార' యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవిడిం దగం బఱచె నుత్తర మింతుల డించి భీతుఁడై.

1123

తా ॥ మిగుల బలవంతులగు అన్నదమ్ములునైన ఆ రామకృష్ణులిద్దరును వెంటనే మద్ది చెట్లను పెకలించి చేత పట్టుకొన్నారు. ఓ గోపికలారా! భయపడకండి అంటూ యముడు మృత్యుదేవతను వెంబడించినట్లు వెంబడింపగా, ఆ గుహ్యకుడు భయంచేత కలతనొంది ఆ గోపికలను దిగవిడిచి అతివేగంగా ఉత్తర దిక్కుకు పరుగెత్తాడు.

వ. ఇట్లు గుహ్యకుని చేత విడివడిన గోపికల 'రక్షించుకొని యుందు' మని బలభద్రునిం బలికి.

1124

తా ॥ అప్పుడు గోపాలకృష్ణుడు గుహ్యకుని చేత విడువబడిన గోపికలను రక్షిస్తూ ఉండమని బలభద్రునితో చెప్పాడు.

శా. 'ఓరీ! గుహ్యక! పోకుపోకు మని రోషోక్తిన్ బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నెటఁ బోయెం దోడఁ దా నేఁగి దు
ర్వారోదంచిత ముష్టి వానితల ద్రెవ్వం బట్టి తద్వీరు కో
టీర భ్రాజితరత్నముం గొనియె దండిన్ గోపికల్ సూడఁగన్.

1125

తా ॥ అని చెప్పి, బకాసురుణ్ణి భంజించిన ఆ పరమాత్ముడైన శ్రీకృష్ణుడు ఓరి! గుహ్యకా! పోవద్దు, పారిపోవద్దు అని కోపంతో పలుకుతూ వాడు ఏ రూపంతో ఎక్కడ ప్రవేశించాడో, ఆ రూపంతో తాను అక్కడకు పోతూ విడిచిపెట్టలేదు. పట్టుకొని దృఢమైన తన పిడికిటితో వాని తల పగులకొట్టి చంపాడు. చంపి వాని కిరీటంలో ప్రకాశిస్తూన్న దివ్యమైన రత్నాన్ని మిగుల గౌరవంతో గోపికలు చూస్తూ ఉండగా తీసుకొన్నాడు.

వ. ఇట్లు శంఖచూడునిం జంపి వాని శిరోరత్నంబు దెచ్చి బలభద్రుని కిచ్చి మెప్పించె; మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబులకుం జనిన నతని లీలలు వాడుచు

నిండ్లకడఁ దద్విరహ వేదనానల భరంబు సహింపక గోపికలు దమలో నిట్లనిరి.

1126

తా ॥ ఈ విధంగా శంఖచూడుని చంపి వాని కిరీటమందలి మాణిక్యాన్ని తెచ్చి బలరామునికిచ్చి అతనిని మెప్పించాడు. అటుపిమ్మట ఒకనాడు కృష్ణుడు అడవికి పోగా గోపికలు అతని ఎడబాటు వలన వేదన చేత తపిస్తూ అతని లీలలను తెలిపే పాటలు పాడుచూ తమలో తాము ఇట్లా అనుకొన్నారు:

శా. భ్రూవిక్షేపముతోడ దాపలి భుజంబుం జెక్కుఁగీలించి కె
మ్మోవిన్ వేణువుఁగూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడఁ బొక్కుదురువో నింగిన్ నిలింపాంగనల్.

1127

తా ॥ 'నవనీత చోరుడు కనుబొమలెగురవేస్తూ ఎడమ బుజం మీద చెక్కిలి చేర్చుకొని ఎర్రని పెదవి తోడ పిల్లన గ్రోవిని చేర్చి వ్రేళ్ళను స్వరానుకూలంగా గానం చేస్తూంటాడే! అప్పుడు దేవతా స్త్రీలు ఆకాశంలో తమ భర్తలతో కూడి ఉండికూడా తమ పోకముళ్ళు వీడగా మోహపరవశంతో ఉంటారు గదా!

మ. నవమాధుర్యము గల్గు కృష్ణ మురళీ నాదామృత స్యందముల్
సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లో వదలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్.

1128

తా ॥ ఓ చెలీ! నవ మాధుర్యం కల కృష్ణుని మురళీనాదం నుండి జారుతూన్న అమృత

ధారలు చెవులలో చొచ్చి మనస్సులలో వ్యాపింప, దూడలతో కూడుకున్న ఈ ఆవులు మృగాలు గుంపులుగా మోరలుపైకెత్తి దేహేంద్రియ వ్యాపారాలు అన్నీ మరచి నిలబడి ఉన్నాయి! చూసావా!

శా. ఓ కంజేక్షణ; కృష్ణుఁ డుజ్జ్వలిత హారోద్దాముఁడై గాన వి
ద్యా కౌతూహలితన్ మనోజ్ఞమురళీ ధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి సశంపమై మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో కేకీంద్రసంఘాతముల్.

1129

తా ॥ ఓ ఇంతీ! తళతళ మెరుస్తూన్న ముత్యాలపేరులు ధరించి సంగీతాసక్తి చేత మనోజ్ఞంగా పిల్లనగ్రోవి ఊదుతున్న శ్రీకృష్ణుణ్ణి చూసి మెరుపుతో ఉరుముతున్న నీలమేఘం అనుకొని ఈ నెమళ్ళ గుంపులు కేకారవములు చేస్తూ మురిపాన్ని చూపిస్తున్నాయి! చూసావా!

మ. లలనా! యేటికిఁ దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ?
గలకాలంబు నహంబు గాక నిసిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలఱేఁడుం గృప లేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లో కదే!
కలదే మాపటివేళయుం గలుగునే కంజాక్షు సంభోగముల్.

1130

తా ॥ లలనా! అసలు ఎందుకు తెల్లవారింది? సూర్యుడు తూర్పుకొండ మీద ఎందుకు ఉదయించాడు! ఆ బ్రహ్మ ఎల్లకాలము పగలు లేకుండా రాత్రిగానే ఎందుకు సృష్టించలేదో! మన్మథుడు దయమాలిన వాడై ఉన్నాడు గదా! చిలుకలను వారించే వారే లేరు! మనకు రాత్రి కాలమందైనను ఈ పైన కృష్ణుని తోడి కలయిక లభిస్తుందంటావా!

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు? నా

కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు? నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ? దుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిం
జెప్పఁగదమ్మ! బోఁటి! మరుచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్.

1131

తా ॥ ఓ చెలియా! ఎప్పుడు ప్రొద్దుగ్రుంకుతుంది? గోవులను మేపి ఆ శ్రీహరి ఎప్పుడు వస్తాడు? నాకెప్పుడు అతని ముఖకమలాన్ని చూసే అదృష్టం కలుగుతుంది? నన్నెప్పుడు ఆదరిస్తాడు? నా విరహ తాపం ఎప్పుడు చల్లారుతుందో చెప్పవమ్మా! మన్మథుడు పెట్టే ఈ బాధలకు నా మనస్సు తల్లడిల్లిపోతూన్నది.

మ. చెలియా! కృష్ణుఁడు నన్ను ఁబాసి వనముం జేరంగ నయ్యా క్షణం
బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాఁగి లో
పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.

1132

తా ॥ ఓ చెలియా! కృష్ణుడు నన్నెడబాసి పోయిన ప్రతిక్షణం ఉండగా ఉండగా అట్టె పెరిగి, తొలుత జాములుగా తోచి, ఆపై క్రమంగా దినాలు, పక్షములు, నెలలు, సంవత్సరాలు, యుగములు, మహాయుగాలై ప్రళయ పర్యంతమైన కాలంగా తోస్తూన్నది, దీనికేమి చేయగలను?'

వ. అని మఱియుఁ గృష్ణవిరహ దుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపిక లోపికలు లేక యెట్టకేలకు దినంబు గడపి దినాంత సమయంబునందు.

1133

తా ॥ అని ఈ విధంగా కృష్ణుని ఎడబాటు వలన దుఃఖంతో అనేక విధాల ప్రొద్దు

పుచ్చుచు ఓర్పు చాలక అతి కష్టంమీద పగటికాలం గడపి సాయంకాలమందు ఈ ప్రకారం వర్తించారు.

మ. 'అదె భానుం డపరాద్రిఁ జేరె? నిదె సాయంకాల మేతెంచె; న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె, బృందారణ్యమార్గంబు నం
దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం దేతెంచె రం డంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి న య్యింతుల్ పరిభ్రాంతలై.

1134

తా ॥ అదుగో ప్రొద్దు గ్రుక్కింది! సాయంకాలం అయింది. బృందావనపు త్రోవయందు గోవుల కాలిదుమ్ము అదిగో కనిపిస్తూన్నది! ఆబోతుల రంకెలు వినబడుతున్నాయి. మన ప్రాణనాయకుడైన శ్రీకృష్ణుడు వస్తున్నాడు, రండమ్మా రండి! అంటూ ఆ గోపస్త్రీలు మాపటివేళ కృష్ణునికి ఎదురేగుతారు.

వ. ఇట్లు తన కెదురు వచ్చిన మచ్చిక న చ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె నంత నొక్కనాఁడు.

1135

తా ॥ ఈ ప్రకారం తనకు ఎదురుగా వచ్చిన ఆ గోపస్త్రీల యొక్క ఇష్టాన్ని అనుసరించి కృష్ణుడు వారలను ఆదరిస్తాడు. ఇంతలో ఒకనాడు ఒక సంఘటన జరిగింది.

## 42. వృషభాసుర సంహారము

సీ. ఎవ్వని మూఁపుర మీక్షించి మేఘంబు లద్రిశృంగం బని యాశ్రయించు?

నెవ్వని ఱంకె కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతంబగు గర్భిణులకు

నెవ్వని పదహతి నెగయు పరాగంబు లంధకారారాతి నావరించు

నెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మినఁ బృథ్వీధరంబులు పెల్ల గిల్లు

తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి, వాలలత యెత్తి పెనుఱంకె వైచి నేలఁ

గాలు ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి, మంద బెగడంగఁ గవిసె నమందగతిని.

1136

తా ॥ ఎవని మూపురాన్ని చూసి మేఘాలు పర్వత శిఖరమని తలచి ఆశ్రయిస్తాయో; ఎవని రంకె వినగానే గర్భిణులకు గర్భపాతమవుతుందో; ఎవని కాళ్ళ త్రొక్కిడి చేత రేగునట్టి దుమ్ము సూర్య మండలాన్ని ఆచ్ఛాదిస్తుందో, ఎవడు తన కొమ్ములతో కొండలను పెల్లగించి చిమ్ముతాడో, అటువంటి వృషభ రూపంలో ఉన్న అసురుడు అహంకారంతో తోకను ఎత్తి పెద్ద రంకె పెట్టి, నేలను కాలుతో త్రవ్వుచూ వాడి అయిన కొమ్ములను సాచి, తనను చూడగానే బెదరుచున్న ఆవులమంద వద్దకు వచ్చాడు.

వ. అట్లు వృషభాకారంబున నరిష్టుఁడు హరికి నరిష్టంబు సేయం దలంచి పై కుఱికిన.

1137

తా ॥ అలా ఎద్దు రూపం ధరించిన అరిష్టుడు అనే అసురుడు శ్రీహరికి కీడు చెయ్యాలనే ఉద్దేశ్యంతో వాటిపైకి ఉరికాడు.

ఉ. క్రేపులు వాఱె గోవులకుఁ, గ్రేపులు గోవులు గోవృషంబులం

బైపడె; వత్స ధేను వృషభంబులు గోపకులందుఁ జొచ్చె; నా

గోపకు లా వృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా
గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్.

1138

తా ॥ వెంటనే భయంతో దూడలు ఆవులను చేరగా, ఆవులు, దూడలు, ఆబోతులను చేరాయి. ఆ తరువాత అవి అన్ని గొల్లవాండ్రను చేరగా వారు కూడా చెల్లాచెదురై పోసాగారు. ఈ విధంగా గొల్లలతో కూడా ఆవుల మందను అంతటను వెంబడించి తరుముచున్న వృషభాసురున్ని శ్రీకృష్ణుడు చూసాడు.

వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును గృష్ణ; కృష్ణ! రక్షింపు రక్షింపు మనియెడు గోపకులకు
నడ్డంబు వచ్చి దీనజన రక్షకుండైన పుండరీకాక్షుం డిట్లనియె.

1139

తా ॥ ఈ విధంగా అరిష్టాసురునికి వెరచి తత్తరపడుతూ ఓ కృష్ణా! రక్షింపవయ్యా! అని తనను వేడుకొంటున్న గొల్లలను, వారి భార్యలను చూసి కరుణతో వారికి అడ్డం వచ్చి శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు:

ఉ. 'బాలుర నింతులం బసులఁ బాఱఁగఁ దోలుట బంటుపంతమే
చాలు, వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటి గో
పాలురమంద గాదు; చను పై ఁబడితేనిఁ బ్రచండ కృష్ణ శా
ర్దూలము నేఁడు నీగళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే?

1140

తా ॥ "ఓరీ వృషభాసురా! పసిపిల్లలను, స్త్రీలను, పశువులను తరమటం పౌరుషం కాదు. నీ శూరత్వం ఇక చాలు. నీ బలాన్ని చూపుటకు న్యాయంగా విచారిస్తే మందకూడా తావుకాదు.

పైబడితే ఈ కృష్ణుడనే పెద్దపులి నీ మెడ నులిమి చంపక విడిచి పెడుతుందేమో చూడు."

ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ, జప్పుడించి నగుచుఁ జలము మీఱఁ
బన్నగేంద్ర భయద బాహుదండము సాఁచి, దండి మెఱసి దనుజు దండ నిలిచె.

1141

తా ॥ అంటూ ధిక్కరించి పలుకుతూ కృష్ణుడు అరచేతితో చరచి నవ్వుతూ సర్పరాజం వలె భీతిని కొలిపే తన చేతిని చాచి, తన శూరత్వాన్ని ప్రకాశింపచేస్తూ ఆ రాక్షసుని దగ్గరగా పోయి నిలిచాడు.

వ. అప్పుడు.

1142

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాల సమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు విప్వ విషాణము లొడ్డికొంచు దు
స్తర తరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా
దురదుర వచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్.

1143

తా ॥ అంతట వృషభాసురుడు గిట్టలతో నేలను త్రవ్వుచూ, కన్నుల నిప్పులు రాల్చుచూ, తోకను ఆడించుట వలన గాలి చేత మేఘాలన్నీ చెల్లా చెదరై పోతూవుంటే భయంకరమైన ఆకారంతో కొమ్ములను ముందుకు వంచి, బిరబిర వచ్చి పగవారి అహంకారమును అణచే మహానుభావుడైన శ్రీకృష్ణున్ని ఎదుర్కొన్నాడు.

ఉ. యాదవకుంజరుండు వృషభాసురు కొమ్ములు రెండుఁ బట్టి య
ష్టాదశ పాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బు కైవడిన్

భేదిల ద్రొబ్బ న య్యసుర బిమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దు
ర్మాదముతోడ డీ కొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్.

1144

తా ॥ యదువంశ శ్రేష్ఠుడైన ఆ శ్రీకృష్ణుడు వృషభాసురుని రెండు కొమ్ములను పట్టుకొన్నాడు. ఒక ఏనుగు మరొక ఏనుగును వెనుకకు నెట్టినట్లుగా, పదునెనిమిది అడుగుల దూరం వెనుకకు పోయేటట్లు నెట్టాడు. వాడు దేహ సంధులన్నీ వదలి చెమటలు పోయగా రొప్పుచూ, ముందరికి మ్రొగ్గినవాడై క్రోధావేశం చేత దుష్టులను నశింప చేయువాడైన శ్రీకృష్ణున్ని ఢీకొన్నాడు.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు వట్టి, ధరణి ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల
కొమ్ము వీఁగ సురలకొమ్ము వర్ధిల వాని, కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప!

1145

తా ॥ ఓ రాజా! అంతట కృష్ణుడు ఆ రాక్షసుని కొమ్ములు పట్టి భూమిమీద పడద్రోసాడు. అంతట రాక్షస భటులు వెను తిరిగి పారిపోగా, దేవతల ఉల్లాసం వర్ధిల్లగా, వాని కొమ్ము ఊడ పెరికి దానితోనే కొట్టి వానిని కూల్చాడు.

క. ఉక్కు సెడి రోఁజి నెత్తురు, ముక్కున వాతను స్రవింప మూత్రశకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరపు, రక్కసుఁ దని సమసెఁ బ్రజకు రాగం బమరన్.

1146

తా ॥ వృషభాసురున్ని ఇట్లు కృష్ణుడు పడగొట్టగా, బలం చెడి ఎగ ఊపిరి విడుస్తూ ముక్కులోంచి, నోట్లోంచి నెత్తురు కారుతూ ఉండగా, మలమూత్రాలు విశేషంగా విడుస్తూ ప్రజలకందరికీ ఆనందం కలిగేటట్లు యుద్ధరంగంలో ప్రాణాలు విడిచి పెట్టాడు.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులు గొని విరులు వర్షింప, గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున మందకుం జనియె నంత.

1147

తా ॥ ఈ విధంగా కృష్ణుడు అరిష్టాసురుని సంహరించగానే దేవతలు సంతోషించి కుసుమ వర్షాన్ని కురిపించారు. గొల్లలు హర్షించారు. గొల్ల ఇల్లాండ్రందరు కృష్ణున్ని శ్లాఘించారు. అంత కృష్ణుడు, బలరాముడు, గోపకులు, గోపికలు వెంటరాగా పరమానందంతో వ్రేపల్లెకు చేరారు.

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు గంసునితోడ యశోద గూఁతుఁ దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును దద్విభు లిద్దఱు మంద నున్న వా
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుతమంచుఁ జలించి కిన్కతోన్.

1148

తా ॥ ఒకనాడు మహానుభావుడైన నారద మహాముని మధురకు వచ్చాడు. వచ్చి కంసునితో, యశోదకి కూతురుని జన్మించింది, ఆ సమయంలోనే దేవకీదేవి కొడుకును ప్రసవించగా, ఆ కొడుకును వసుదేవుడు తీసుకొని పోయి నందుని ఇంట విడిచిపెట్టి, అక్కడున్న ఆడ శిశువును ఎత్తుకొని రావడం గురించి చెప్పాడు. అంతకు ముందే బలరాముడు రోహిణీదేవికి కొడుకై పుట్టడం, ఆ ఇద్దరు వ్రేపల్లెలో పెరగటం విశదంగా తెలియ చెప్పాడు. కంసుడు విని మనస్సులో కలవరం హెచ్చగా ఈ సమాచారం ఆశ్చర్యకరంగా ఉందే అని కోపంతో భగ్గుమని మండిపడ్డాడు.

చ. కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ

బడుగును బట్టి చంపు టిది భావ్య మటంచుఁ గృపాణపాణియై
వడి వసుదేవునిం దునుమ వచ్చిన కంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁ బోల దని యోడక మానిచి పోయె మింటికిన్.

1149

తా ॥ ఈ బడుగు వసుదేవుడు తన కొడుకులను మందలో దాచిపెట్టి నన్ను వంచించాడు. వీనిని ఇక చంపక మానరాదని కత్తిచేత పట్టి వసుదేవుని చంపబోగా నారదుడు ఇది సరికాదు ఇతనిని చంపుట వలన ప్రయోజనం లేదని చెప్పి ఆ ప్రయత్నాన్ని మానిపించి తాను దేవలోకానికి వెళ్ళిపోయాడు.

వ. మఱియు నలుకదీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశ బద్ధులంజేసి కేశి యనువానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి, మంత్రి భటగజారోహక చాణూర ముష్టిక సాల్వకోసల ప్రముఖుల రావించి యిట్లనియె.

1150

తా ॥ కంసుడు అంతటితో కోపం మానక, దేవకిని వసుదేవుని సంకెళ్ళ చేత బంధించి, కేశి అనే రాక్షసుని పిలిచి నీవు పోయి బలరామకృష్ణులను చంపి రమ్మని ఆజ్ఞాపించాడు. తన మంత్రులను, సేవకులను, మావటివాండ్రను, చాణూరుడు ముష్టికుడు అనే మల్లురను, సాల్వుడు, కోసలుడు మొదలైన వారిని కొలువు కూటానికి రప్పించి వారితో ఇట్లా అన్నాడు:

శా. ఎందున్ నన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామ గో
విందుల్ వర్ధిలుచున్న వారఁట రణోర్విం గంసునిం ద్రుంతు' మం
చుం దర్పంబులు పల్కు చుందురఁట; యీ చోద్యంబులన్ వింటిరే?

1151

తా ॥ “ఓ నా ఆప్తులారా! ఎన్నడునూ యుద్ధంలో నన్ను ఎదిరించటానికి దేవేంద్రాది దిక్పాలకులు కూడా భయపడతారు. అలాంటిది ఈ సమీపంలో అడవి అయిన బృందావనంలో రాముడు కృష్ణుడు అను గొల్లపిల్లలు ఇద్దరు ‘మేము కంసున్ని యుద్ధ భూమిలో చంపుతాము’ అని గర్వపు మాటలు ఆడుతున్నారట! ఈ చోద్యము మీరు విన్నారా?

క. పట్టణజనములు సూతురు, దట్టంబుగ మల్లరంగతల పార్శ్వములం
బెట్టింపుఁడు తమకంబులు, పుట్టింపుఁడు వీట మల్లుపో రనుమాటన్.

1152

తా ॥ పట్టణంలోని ప్రజలు చూసేలాగా, మల్లరంగానికి ఇరుప్రక్కల మంచెలు ఎడం లేకుండా ఏర్పాటు చెయ్యండి. మల్లుల పోరు అనే మాటను నగరంలో బాగా ప్రచారం చెయ్యండి.

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటి మల్లుగములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి మత్ప్రీతి కా
సన్నుల్ గండు పురీజనుల్ వొగడ నో చాణూర! యో ముష్టికా!

1153

తా ॥ ఓ చాణూరుడా! ఓ ముష్టికుడా! మీరు మల్ల విజ్ఞానంతో యుద్ధం చేయ సమర్థులు. అధికమయిన శూరత్వము, పరాక్రమము మొదలైనవి కలవారు. గొప్ప శూరులతోడి సహవాసం కలవారు, ప్రసిద్ధులూను. కనుక పట్టణంలోని జనులందరు చూసి పొగడ ఆ బలరామకృష్ణులతో మల్ల యుద్ధము జరిపి నాకు ప్రియాన్ని పుట్టించి నా వలన మన్ననలను పొందండి.

శా. రా రా హస్తిపకేంద్ర! గండమద ధారాగంధ లోభాంధ గం
భీరాళి వ్రజమైన మత్కువలయాపీడ ద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచిత దేహళీ పరిసర స్తంభంబు డాయంగ నా

భీరుల్ రా నదలించి డీకొలుపు నీ బీరంబు తోరంబుగన్.

1154

తా ॥ ఓరి మావటివాడా! ఇటురా! నువ్వు ఆ గొల్ల పిల్లలు నా భవన ద్వార సమీపంలో ఉన్న స్తంభము దగ్గరికి వచ్చేసరికి నీ ప్రతాపం ప్రదర్శించు. చెక్కిళ్ళ యందలి మదజల ధారల సౌరభం చేత కన్నుగానని గండు తుమ్మెదల పిండును ఆకర్షించే కువలయాపీడ అనే నా పట్టణపు గజరాజాన్ని అదిలించి, వారి మీదికి ఢీకొలుపు.

క. పశు విశసనములు సేయుఁడు, పశుపతికిం బ్రియము గాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము, విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్.

1155

తా ॥ మీరందరు శివునికి ప్రీతిగా భావించి పశువులను బలులు ఇవ్వండి. మనకు జయం కలగటం కోసం చతుర్దశి నాటికి ధనుర్యాగాన్ని చెయ్యాలి.”

వ. అని తనవారి నందఱ నయ్యై పనులకు నియమించి యదుశ్రేష్ఠుండగు నక్రూరునిం బిలిపించి చెట్ట వట్టికొని యిట్లనియె.

1156

తా ॥ ఈ విధంగా తనకు కావలసిన వారినందరను ఆ యా పనులయందు నియమించి యాదవవంశ శ్రేష్ఠుడయిన అక్రూరుణ్ణి పిలిచి అతని చేయి పట్టుకొని ఇట్లా అన్నాడు:

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శ క్రీడారతులై చరింతు రఁట యోజం దెచ్చి యొప్పింపవే?

1157

తా ॥ "నీవు క్రూర స్వభావం లేనివాడవై ప్రవర్తించటం చేత నీకు అక్రూరుడనే పేరు కలిగినది. కనుక నీతో స్నేహం చేయవచ్చు. నువ్వు కోపం లేనివాడవు. వ్రేపల్లెలో బలుడు, కృష్ణుడు అను గొల్ల పిల్లలు నన్ను సంహరించాలని ఆసక్తులై ఉన్నారట, వారిని అనువుగా తెచ్చి నాకు అప్పచెప్పు.

ఆ. నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడి, కొనిన నతఁడు వచ్చి గోపకులము
నందుఁ గృష్ణమూర్తి నానకదుందుభి, కుదితుఁ డయ్యె ననఁగ నొకటి వింటి!

1158

తా ॥ దేవతలందరూ నాకు భయపడి నారాయణుణ్ణి ప్రార్థింపగా, ఆయన గొల్లవారి ఇంటిలో కృష్ణుడు అనే పేరుతో వసుదేవునికి కొడుకుగా పుట్టాడని నేనొక మాట విన్నాను.

వ. కావున నీవు గోపకులచేత నరులు గొని ధనుర్యాగంబుఁ జూడ రండని వారలం దోడ్కొని రమ్ము. వచ్చిన.

1159

తా ॥ కాబట్టి నీవు పోయి నందాదులైన గొల్లవారిని ఒప్పించి, కట్టవలసిన పన్నులు తీసుకొని, బలరామ కృష్ణులను ధనుర్యాగము చూడటానికి రండని పిలుచుకొని రమ్ము.

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు గొమ్ముల తుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొకవేదండంబు నాయింట బ్ర
హ్మాండం బైనఁ గదల్ప నోపు బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ వెంత దాని? కదియుం గాదేని నక్రూరకా!

1160

తా ॥ అక్రూరుడా! కొండలనైననూ పెల్లగించి పడద్రోయ జాలిన దంతముల కొనలతో నేలను త్రవ్వి మట్టిని వెదజల్లగలది, యమున్ని కూడ లక్ష్యము చేయక, వర్తించునట్టి ఏనుగు ఒకటి నా ఇంటిలో ఉంది. అది ఈ బ్రహ్మాండాన్నంతా కదలించమంటే కదలిస్తుంది. అట్టి ఆ ఏనుగునకు బలరామకృష్ణులను చంపుట ఒక పనికాదు. నిముషమాత్రంలో వారినిద్దరిని చంపేస్తుంది. అట్లు దానిచేత వారు చావని పక్షంలో ఇంకొక పథకం ఉంది, విను.

శా. చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్ జగ
త్ప్రాణున్ మెచ్చరు సత్త్వసంపదల బాహాబాహి సంగ్రామ పా
రీణుల్ వారలు రామకృష్ణుల బలోద్రేకంబు సైరింతురే?
క్షీణప్రాణులఁ జేసి చంపుదురు సూ సిద్ధంబు యుద్ధంబునన్.

1161

తా ॥ చాణూరుడు ముష్టికుడు అని ఎల్ల సభలలోను వన్నెకెక్కిన మల్లులు ఇద్దరున్నారు. బలాతిశయంలో వాయుదేవుడు కూడా వారికి సరికాడు. భుజములతో పెనగులాడునట్టి యుద్ధంలో అతి సమర్థులు. అట్టి శూరులు బలరామకృష్ణుల బలాతిశయాన్ని సహింతురా? సహింపలేరు. యుద్ధంలో తప్పక ఆ ఇద్దరిని చంపి నాకు చూపిస్తారు.

సీ. ఆ రామకేశవు లంతరించిన వసుదేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్ణి భోజ దశార్హ వీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మా యయ్యఁ గీటడఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి
మఱియు వైరుల నెల్ల మర్దించి నే జరాసంధ నరక బాణ శంబరాది

ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ బొమ్ము, తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖము పేరు సెప్పి మంత్రభేదము సేయ, వలయుఁ బెంపఁజనదు వైరిజనుల.

1162

తా ॥ ఓ అక్రూరా! నీవు ఎట్లయిన ఆ పిల్లలను పిలుచుకొని వచ్చితివా, వారిని ముందుగా చంపించెదను. వారు చావగానే వసుదేవుడు మొదలైన వారిని హతమారుస్తాను. ఆపైన వృష్ణి వంశస్థులును, భోజ వంశస్థులును, దశార్హ వంశస్థులును అయిన వీరులను పరిమారుస్తాను. దొరతనమునందలి కోరిక హెచ్చగా దుర్జనుడై వర్తించునట్టి ముసలివాడైన మా తండ్రి ఉగ్రసేనుణ్ణి నిర్మూలిస్తాను. అతని తమ్ముడైన దేవకుణ్ణి ఇంకను నాకు గల వైరులందరిని పరిమారుస్తాను. అందరినీ చంపి జరాసంధుడు, నరకుడు, బాణుడు, శంబరుడు మొదలైన నా మిత్రులతో కూడి ఈ భూమండలమంతా పరిపాలిస్తాను. శత్రువులను వృద్ధిపొందకముందే నశింప చెయ్యటం మంచిది. నువ్వు శీఘ్రంగా పోయిరమ్మ" ని

వ. అనిన నక్రూరుం డిట్లనియె.

1163

ఉ. పంపినఁ బోని వాఁడనె నృపాలక! మానవు లెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది గాదన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీపగతు బిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్.

1164

తా ॥ కంసుని మాటలు విన్న అక్రూరుడు ఇలా అన్నాదు: "ఓ కంస భూపాలా! నీ అంతటివాడు ఆజ్ఞాపిస్తే నేను వెళ్ళకుండా ఉంటానా? యథార్థం ఆలోచిస్తే, మనుష్యులు తమ స్థితిని ఊహించరు. దైవికంగా వచ్చే మేలు గురించి కానీ కీడు గురించి గాని కొంచెం కూడా తెలుసుకోలేరు. తమకు తోచినట్లు వర్తిస్తారు. మనం కాదనలేము. అలాగని ఈశ్వరేచ్ఛను తప్పింపలేము. కాబట్టి నీ పగవాని కొడుకులను తీసుకొని వస్తాను."

# 43. శ్రీకృష్ణుడు కేశివ్యోమాసురుల సంహరించుట

వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనుల వీడుకొలిపి కంసుం డంతిపురంబునకుం జనియె; నంతఁ గంసప్రేరితుండై.

1165

తా ॥ అని పలికి అక్రూరుడు రథం ఎక్కి బయలుదేరాడు. అంతట తక్కినవారికి కూడా సెలవిచ్చి కంసుడు అంతఃపురానికి వెళ్ళాడు. ఈలోగా కేశి అను రాక్షసుడు కంసుడు ప్రేరేపిస్తే వ్రేపల్లెకు అశ్వరూపంలో బయలు దేరాడు.

సీ. ఖురపుటాహతిఁ దూలి కుంభినీచక్రంబు ఫణిరాజఫణులకు బరువుసేయ
భీషణహేషా విభీషితులై మింట నమృతాంధు లొండొరు నండ గొనఁగఁ
జటుల చంచల సటాచ్ఛటల గాడ్పుల మేఘములు విమానములపై ముసుఁగు వడఁగ
వివృతాస్యగహ్వర విపులదంతంబులు ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ
తే. గాలపాశలీలగా వాల మే పార, వాహ మగుచు గంధవాహగతుల
విజితశక్రపాశి వీర్యపయోరాశి, కేశి వచ్చె మంద క్లేశ మంద.

1166

తా ॥ అతని దిట్టమైన గిట్టల తాకిడికి భూమండలం అంతా చలిస్తూ, సర్పరాజైన ఆదిశేషుని పడగలకు భారాన్ని కలుగజేస్తున్నది. అతని భయంకరమైన సకిలింతల చేత భయపడి ఆకాశంలో దేవతలు ఒకరినొకరు అండగా చేసుకొన్నారు. బిరుసై చలించుచున్న వెంట్రుకల సమూహం యొక్క వాయువు వలన మబ్బులు దేవతల విమానముల మీద కమ్ముకుంటున్నాయి. తెరవబడిన నోరు అనెడు బిలమునందలి పెద్దవైన దంతములు ప్రళయాగ్ని కీలల వలె ప్రకాశిస్తున్నాయి. తోక యమపాశంలాగా అతిశయిస్తోంది. ఇంద్రుణ్ణి, వరుణుడిని గెలిచిన వాడు, శూరత్వానికి సముద్రంవంటి వాడు అయిన కేశి అనే అసురుడు ఈ విధంగా గుర్రమై

వాయువేగంతో వ్రేపల్లెకు వచ్చాడు.

క. భీషణ ఘోటక దానవ, హేషానిర్ఘోషభిన్న హృదయ నిఖిల గో
యోషా పురుషార్భకమై, ఘోషము హరి సూడ దైన్యఘోషం బయ్యెన్.

1167

తా ॥ భీకర గుర్రపు రూపును పొంది వచ్చిన అసురుని యొక్క సకిలింతల వలన భయంకరమైన ధ్వని వెలువడగా, మందలోని గోవులు, ఆడవారు, మగవారు, పసిబిడ్డలు మొదలగువారి హృదయాలు దద్దరిల్లాయి. వారంతా దీనంగా మొరలిడసాగారు.

వ. అ య్యవసరంబున.

1168

ఉ. పేదల ఘోషగోపకుల బిట్టదలించుట వీరధర్మమా?
కాదు; వ్రజంబులో దనుజ ఘస్మరుఁ డేఁ దని తన్ను రోయు క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డము వచ్చి నిశాట! యింకఁ బో
రా దని శౌరి చీరె మృగరాజు క్రియ న్నెదిరించె దైత్యుఁడున్.

1169

తా ॥ అప్పుడు దీనులైన మందలోని గొల్లలను గట్టిగా అదలించుట నా వంటి వీరుడైన వానికి న్యాయం కాదని కేశి ఆలోచిస్తూ, ఆ మందలో రాక్షస సంహారకుడైన కృష్ణుడు ఎక్కడ ఉన్నాడా అని వెతుకుతున్నాడు. అతడిని చూసిన కృష్ణుడు, గొల్లలకు అడ్డం వచ్చి 'ఓ రాక్షసుడా! ఇంక పోలేవు' అని మృగరాజులా యుద్ధమునకు పిలిచాడు.

ఆ. నిష్ఠురోగ్రసింహ నినదంబుతో నింగి, మ్రింగుభంగి నోరు మిగులఁ దెఱచి
కఱవరాఁగ నతఁడు గాటు దప్పించినఁ, దన్నె నెగసి తురగదానవుండు.

1170

తా ॥ గుఱ్ఱపు రూపు ధరించిన రాక్షసుడు కఠినముగా, భయంకరముగా సకిలిస్తూ ఆకాశాన్ని మ్రింగువాని వలెనే నోరు అంతా తెరచి, కరచుటకు రాగా, కృష్ణుడు దానిని నేర్పుతో తప్పించుకున్నాడు. అంత వాడు కృష్ణుణ్ణి ఎగిరి ఒక్క తన్ను తన్నాలని ప్రయత్నించాడు.

ఉ. తన్నిన తన్నునం బడక దానహంత సమీకరంత యై
కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోట నిశాటు పాదముల్
వన్నె సెడంగఁ బట్టి వడి వైచె ధనుశ్శతమాత్ర దూరముం
బన్నగడింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్.

1171

తా ॥ కృష్ణుడు దానిని కూడా తప్పించుకున్నాడు. వానిని యుద్ధంలో బాధింప తలచినవాడై కన్నులు ఎర్రచేసుకొని, తటాలున వాడు ఒకటే దెబ్బకు చచ్చేటట్లు వాడి నాలుగు కాళ్ళు చేర్చి పట్టుకొని గరుత్మంతుడు పిల్లపామును పారవేసినట్లు నాలుగు వందల మూరల దూరంలో పడేశాడు కృష్ణుడు.

ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైఁబడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్ర శుం
డా చటుల ప్రభాబల విడంబకమైన భుజార్గళంబు దో
షా చరు నోటిలో నిడియెఁ జండఫణిన్ గుహ నుంచు కైవడిన్.

1172

తా ॥ అలా విసరివేయగా, ఆ రాక్షసుడు పడి లేచి జంకులేకుండా హుంకారం చేస్తూ, కృష్ణుని మీదికి వచ్చాడు. అప్పుడు కృష్ణుడు ఐరావతం యొక్క తొండం వంటి తన పొడుగైన హస్తాన్ని, కొండ గుహలోకి భయంకర సర్పాన్ని చొప్పించినట్లుగా వాని నోట్లోకి చొప్పించాడు.

శా. దంభోళి ప్రతిమాన కర్కశ మహోద్యద్వామ దోఃస్తంభమున్
శుంభల్లీల నఘారి వాని రదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధిఁ బొందింపుచున్
గుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా!

1173

తా ॥ పరీక్షిన్మహారాజా! కృష్ణుడు వజ్రాయుధం వలె కఠినమైన తన నిడుపాటి ఎడమ చేతిని వాని నోటిలోకి విలాసంగా చొప్పించాడు. వాని పండ్లన్ని పొడి పొడియై రాలేటట్లు చేసి ఆ చేతిని వాని కడుపులోనికి చొప్పించి కడుపు ఉబ్బునట్లు ఆ చేతిని పెంచి గాలి లోపల నిండుకొనునట్లు చేశాడు.

క. వాయువు వెడలక నిలిచినఁ, గాయంబు సెమర్పఁ గన్నుగవ వెలి కుఱుకన్
మాయ సెడి తన్నుకొనుచును, గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్.

1174

తా ॥ గాలి బయటకు పోక కడుపులోనే నిండుకొనగా శరీరం చలువలు కమ్ముకొంది. కనుగ్రుడ్లు పైకి ఉబుకగా తన మాయా రూపము చెడి, తన్నుకొంటూ అరుస్తూ ఆ అశ్వాసురుడు నేలకూలాడు.

ఆ. ఘోటకాసురేంద్రు కుక్షిలోఁ గృష్ణుని, బాహు వధిక మైనఁ బట్టలేమిఁ
బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు, వసుమతీశ! రెండు వ్రయ్య లయ్యె.

1175

తా ॥ ఓ రాజా! శ్రీకృష్ణుని యొక్క చేయి వాని కడుపులో పెరుగుతూ రాగా లోపల పెరిగిన ఆ చేతికి చోటు సరిపోనందున ఆ దేహం దోసపండులాగ పగిలి రెండుగా చీలిపోయింది.

క. నలినాక్షుఁడు లీలాగతి, విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్
బలలాశిన్ జగదభినవ, బలరాశిన్ విజితశక్రపాశిం గేశిన్.

1176

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు లీలగా... శూరత్వం చేత ఒళ్ళు తెలియని వాడును, మాంస భక్షకుడును, అధికమైన బలం కలవాడును, ఇంద్రవరుణులను గెలిచిన వాడును అయిన కేశి అనే రాక్షసుని సంహరించాడు.

వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరిభక్తి విశారదుండైన నారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున నిట్లనియె.

1177

తా ॥ ఆ సమయంలో దేవతలు సంతోషించి పూల వాన కురిపించి శ్రీకృష్ణుణ్ణి పొగిడారు. అటు పిమ్మట నారదుడు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంగా ఇలా అన్నాడు:

సీ. 'జగదీశ! యోగీశ! సర్వభూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!
కాష్ఠగతజ్యోతి కైవడి నిఖీల భూతములందు నొకఁడవై తనరు దీవు
సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు సాక్షివి నీయంతవాఁడవై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణముల; వానిచేఁ బుట్టించి రక్షించి పొలియఁ జేయు

ఆ. దీ ప్రపంచమెల్ల నిట్టి నీ విప్పుడు, రాజమూర్తు లయిన రాక్షసులను
సంహరించి భూమిచక్రంబు రక్షింప, నవతరించినాఁడ వయ్య! కృష్ణ!

1178

తా ॥ "కృష్ణా! జగదీశ్వరా! యోగీశ్వరా! సర్వభూతములకు ఆధారమైనవాడా! పూర్ణ స్వరూపా! ఈశ్వరా! మహాత్మా! కట్టెలలో అగ్ని ఉన్న చందంగా, అఖీల భూతములయందు

ఏకరూపుడవై ఉంటావు. సత్పురుషుల యందు దాగి ఉంటావు. సకల ప్రాణుల హృదయములనెడు గుహలలో గూఢంగా ఉండేవాడవు. సర్వసాక్షివి! నీకు సమానులు లేరు. మూల ప్రకృతితో కూడి సత్వరజస్తమో గుణాలను కల్పిస్తావు. వానిచే ఈ ప్రపంచాన్ని పుట్టించి, రక్షించి నశింపచేస్తూ ఉంటావు. ప్రస్తుతము రాక్షస రాజులును సంహరించి భూభారమును తగ్గించడానికి నీవు అవతరించావు శ్రీకృష్ణా!

వ. దేవా! నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వ ప్రముఖులు మడిసెదరు; పారిజాతం బపహృతం బయ్యెడిని; నృగుండు శాపవిముక్తుం డగు; శమంతకమణి సంగ్రహంబగు; మృత బ్రాహ్మణపుత్ర ప్రదానంబు సిద్ధించు; నర్జున సారథివై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించెదవు; మఱియును.

1179

తా ॥ ఓ స్వామీ! ఇక నీచేత చాణూరుడు, ముష్టికుడు, కువలయాపీడమనే ఏనుగు, కంసుడు, శంఖుడు, కాలయవనుడు, మురాసురుడు, నరకాసురుడు, పౌండ్రక వాసుదేవుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, సాల్వుడు మొదలైన వారు మరణాన్ని పొందుతారు. నీచేత పారిజాత వృక్షం అపహరింప బడుతుంది. నృగ మహారాజు శాపవిముక్తిని పొందుతాడు. చనిపోయిన బ్రాహ్మణ కుమారుని నువ్వు తెచ్చి ఇస్తావు. అర్జునునికి సారథివై అనేక అక్షౌహిణీల సంఖ్యగల సేనలను చంపుతావు. ఇంతేకాదు,

శా. కృష్ణా! నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె? వ<br>
ర్ధిష్ణుండైన విధాత మూఁడు గుణముల్ దీపించు లోపించు రో<br>
చిష్ణుత్వంబున నుండు నీవలన; నిస్సీమంబు నీరూపు నిన్<br>
విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్.

1180

తా ॥ ఓ కృష్ణా! నీవు చేయగల పనులు లెక్కపెట్టుటకు, వృద్ధిపొందు స్వభావం కల బ్రహ్మ అయినా శక్తుడు కాదు. సత్వరజస్తమో గుణములు మూడు కూడా నీయందే పుడతాయి, నీయందే లయమవుతాయి. మిక్కిలి ప్రకాశించే స్వభావంతో ఉండే నీ స్వరూపం మేరలేనిది. ఎల్లెడల వ్యాపించు స్వభావం కలవాడవు, జయించు స్వభావం కలవాడవు, ఓర్చునట్టి స్వభావం కలవాడవు, సర్వము ఏలువాడవు, ప్రమాణాతీతుడవు, ప్రణవ రూప ప్రపంచమునకు నియామకుడవు అయిన నీకు నమస్కరించెదను."

వ. అని వినుతించి వీడుకొని నారదుం డరిగె; నంత నొక్కనాఁడు కృష్ణసహితు లయి గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్క కొండదండ నిలాయనక్రీడ సేసి రందు.

1181

తా ॥ అని స్తోత్రము చేసి సెలవు పుచ్చుకొని నారదుడు వెళ్ళిపోయాడు. పిమ్మట ఒకనాడు గోపబాలురు అందరూ కృష్ణునితో కూడ అడవికి పోయి పశులను మేపుతూ ఒక కొండవద్ద దాగుడుమూతలు ఆడటం ప్రారంభించారు.

క. కొందఱు గొఱియల మంచును, గొందఱు పాలకుల మంచుఁ గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును, జెంది కుమారకులు క్రీడసేసిరి తమలోన్.

1182

తా ॥ అందులో గొర్రెలమని కొందరు, కొందరు మేపే వారమని, కొందరు దొంగలమని తమలో తాము వేషాంతరములను పొంది పిల్లలు వేడుకగా విహరించసాగారు.

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో
పాలుండై చని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త
ద్బాల వ్రాతము నెల్ల మెల్లన చతుఃపంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని చనెం జౌర్యం బవార్యంబుగన్.

1183

తా ॥ అంతలో మయుడనే రాక్షసుని పెద్దకొడుకు వ్యోముడు అనేవాడు, తానొక గొల్లపిల్లవాడై వచ్చి వారిలో కలిశాడు. తన దొంగతనం ఎవరికీ తెలియకుండునట్లు దొంగలు అను వారిలో ఒకడుగా వేషకల్పనతో ఉంటూ, ఆ పిల్లలను నలుగురైదుగురు తప్ప, తక్కిన వారిని అందరినీ కొండగుహలోకి తీసుకొని పోయాడు.

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి, యొక్క పెనుఱాతఁ దద్ద్వారంబుఁ గప్పి యెప్పటియట్ల వచ్చిన.

1184

తా ॥ ఇలా గొల్లపిల్లలను క్రమక్రమంగా గుహలో ఉంచి ఒక పెద్ద బండతో ఆ ద్వారాన్ని కప్పివేసి, ఎప్పటి లాగానే వచ్చాడు.

కోరిక అనేది జీవుడి మనస్సులో ఉదయించిన వెంటనే జీవునిలోని సుగుణాలన్నీ రాక్షసుడు, గొల్లపిల్లలను గుహలో దాచిన రీతిన; మనస్సు ఆ సుగుణాలను దాచివేసి, మంచితనాన్ని నటిస్తూ తన కార్యం నెరవేర్చుకోవాలని భావిస్తుంది. ఇదే వ్యోమాసురుని దాగుడుమూతల కథ. అయితే భగవంతుణ్ణి నమ్మినవారిని ఎట్టి మాయలూ వంచించలేవు కదా!

ఉ. వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో
'నౌర! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు; వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి చిక్కినవారిఁ బెట్టరా! రార యటంచుఁ బట్టె మృగరాజు వృకాఖ్యముఁ బట్టు కైవడిన్.

1185

తా ॥ అప్పుడు శూరుడు, సర్వము తెలిసిన వాడు, రాక్షసులను హింసించు వాడు అయిన

శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ, 'ఓరీ! రాక్షసుడా! నీ దొంగతనము మెచ్చుకోవచ్చు! నీవు మంచి దొంగవు! గొల్లపిల్లలనందరిని తీసుకొనిపోయి కొండ గుహలో ఉంచి వచ్చావు గదా! ఇంకా మిగిలి ఉన్నవారిని కూడ తీసుకొనిపోయి గుహలో ఉంచుదువు గాని, వేగంగా రారా' అంటూ సింహం తోడేలుని పట్టుకొన్న రీతిగా ఆ రాక్షసుణ్ణి ఒడిసి పట్టాడు.

ఉ. పంకజలోచనుం డొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన యా రణభీము వ్యోమునిం
గొంకకఁ గూల్చె న వ్విభుఁడు గోయని మింట సుపర్వు లార్వఁగన్.

1186

తా ॥ కృష్ణుడు ఒడిసి పట్టగా, వాడు కొండను పోలిన ఆకృతితో బింకముతో పొంగినా, విడిపించు కొనుటకు బలం లేకపోయింది. మనస్సులో జంకుపుట్టి గిజగిజ తన్నుకొనగా ఆ కృష్ణుడు వ్యోమాసురుని అతి శీఘ్రంగా చంపాడు. అప్పుడు ఆకాశం నుండి పగవాడు మరణించాడని సంతోషంతో దేవతలు జయ జయ ధ్వానములు చేసారు.

ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహా, వాత నున్న ఱాయి వ్రయ్యఁ దన్ని
గుహ చరించుచున్న గోపాలకులఁ గొంచు, బల్లిదుండు గొల్లపల్లె కరిగె.

1187

తా ॥ అనంతరం బలవంతుడైన శ్రీకృష్ణుడు పర్వత గుహ వాకిటనున్న బండను పగులతన్ని, గుహలో సంచరించుచున్న గొల్లవాండ్రనందరను పిలుచుకొని వ్రేపల్లెకు వెళ్ళాడు.

వ. అంత నారాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి నియతుండయి మఱునాఁడు రేపకడ లేచి, నిత్యకృత్యంబు లాచరించి, రథంబెక్కి కదలి నందగోకులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె.

తా ॥ ఆ రాత్రి అక్రూరుడు మధురా నగరంలో ఉండి, తెల్లవారి ఉదయాన్నే లేచి రథం ఎక్కి గోకులానికి పోతూ తనలో తానిట్లు ఆలోచించుకున్నాడు:

## 44. కంసుదు పంపగా అక్రూరుడు బృందావనమునకు వచ్చుట

ఉ. ఎట్టి తపంబు సేయఁబడె? నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో?
యెట్టిధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు! నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁగల్గెడిన్.

1189

తా ॥ 'పూర్వ జన్మలో నేను ఏం తపస్సు చేశానో? ఎటువంటి నడవడి కలిగి మెలిగానో? ఎటువంటదానములు చేశానో! మునీంద్రులు యోగదృష్టిలో కూడా చూడలేని ఈశ్వరుడు బ్రహ్మస్వరూపుడు అయిన శ్రీకృష్ణుణ్ణి, వివేకహీనుడనైన నేను చూడబోతున్నాను.

ఉ. సూరులు దొల్లి యే విభుని శోభిత పాదనఖ ప్రభావళిం
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్
వైరముతోడనైన గెలువన్ ననుఁ బంచి శుభంబు సేసె ని
ష్కారణమైన ప్రేమ; నిదె; కంసునిఁ బోలు సఖుండు గల్గునే?

1190

తా ॥ తొల్లి విద్వాంసులు ఏ విభుని ప్రకాశించే పాదముల యొక్క గోటి కాంతులను సమీపించినంతనే జన్మ దుఃఖములనే చీకట్లలో చిక్కుకొనక దాటారో, అట్టి దేవుణ్ణి విరోధముచే అయినను పిలుచుకు రమ్మని కంసుదు నన్ను పంపించాడు. నా మీద నిష్కారణ ప్రేమతో ఎంతో మేలు చేశాడు. కంసునితో సమానమైన స్నేహితుడు వేరొకడు నాకు లభించదు.

మ. 'ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచి నాఁ
డతిదుష్టుం' డని చూచునో సకలభూతాంతర్బహిర్మధ్య సం

గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు
న్నతి గావించునొ యే క్రియం బలుకునో? నాభాగ్య మె ట్లున్నదో?

1191

తా ॥ శ్రీకృష్ణమూర్తి నన్ను చూసి, వీడు ఆ దుష్టుడైన కంసుడు పంపగా నన్ను బాధపెట్టడం కోసం వచ్చాడు, మిక్కిలి చెడ్డవాడు అని అనుకొంటాడేమో! సర్వ ప్రాణుల హృదయాలలోనూ, అంతటా నిండి ఉన్న పరమ పురుషుడు కనుక, నా మనోగతాన్ని ఎరిగి వీడు మంచివాడు అని తలుస్తాడో తెలియదు. ఎటువంటి గౌరవాన్ని చేస్తాడో, ఏ విధంగా పలుకుతాడో, నా అదృష్టం ఎట్లా ఉందో?'

వ. అని మఱియును.

1192

మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై
జలజాక్షంబయి కర్ణకుండల విరాజద్గండమై యున్న యా
జలజాతాక్షు ముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా
వల దిక్కేఁగుచు నున్న నీ వనమృగ వ్రాతంబు లీక్రోవలన్.

1193

తా ॥ అని ఇంకా ఇలా అనుకున్నాడు: 'ముంగురుల చేత అందగించేది, చంద్రబింబాన్ని పోలినది, నవ్వుల కాంతుల చేత ప్రకాశించేది, తామరల వంటి కన్నులు గలది, కర్ణకుండలాల చేత విరాజమానమైన చెక్కిళ్ళు గలది అయిన శ్రీకృష్ణమూర్తి యొక్క ముఖాన్ని దర్శించబోతున్నాను. ఈ దారిలో ఈ అడవి యందలి మృగముల గుంపులు అన్నీ నాకు ప్రదక్షిణగా వెళుతూ శుభాన్ని సూచిస్తున్నాయి.

ఉ. మాపటివేళ నేను జని మాధవు పాదసమీపమందు దం

డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగ వేగ సం
తాపిత భక్తలోక భయ దారణమైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే?

1194

తా ॥ సాయంకాలం నేను మందకుపోయి మాధవుని దర్శనం చేసి ఆయన పాదపద్మాలకు భక్తితో సాగిలపడతాను. వేగంగా కదలిపోయే కాలసర్పపు భయాన్ని భక్తులకు తొలగించే హస్తకమలాన్ని నా శిరస్సున చేర్చి ఆ కృష్ణుడు నాకు అభయమిచ్చి నన్ను మన్నింప కుండునా?'

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవింద సందర్శనంబుఁ గోరుచు నమంద గమనంబున సుందర స్యందనారూఢుండై చని చని.

1195

తా ॥ అని అక్రూరుడు ఇలా నానా విధాలుగా ఆలోచిస్తూ, కృష్ణుని దర్శనాన్ని కోరుకొంటూ వేగంగా పోతూన్న రథంమీద కూర్చుని ప్రయాణించసాగాడు.

క. ముందటఁ గనె ఘనచందన, కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందితబల గో, విందన్ వికచారుణారవిందన్ బృందన్.

1196

తా ॥ అలా వెళుతూ, గొప్పవైన చందన వృక్షాలు, మొల్లచెట్లు, కొడిసె చెట్లు, తాటి చెట్లు, సాల

వృక్షాలు, ఎర్ర గోరింట చెట్లు, మర్రి చెట్లు, తియ్య మామిడి చెట్లు మొదలైన వృక్షముల చేతను వికసించిన

ఎర్ర తామరల చేతనూ కృష్ణ బలరాములను సంతోషింప చేస్తూన్న ఆ బృందావనాన్ని చూసాడు.

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేఁతల వెంబడిం దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱ కోడె పడ్డ తండంబులం గానక; పొద, యిఱుము, మిఱ్ఱు పల్లం బనక తూఱి, పాఱి, వెదకి కానక చీరెడు గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణింపుచుఁ గోమల ఘాసఖాదన కుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక, తమకంబులం దమతమయంత నంభారవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును, ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు తర్ణకంబుల వహించి, నవసూతికలు వెనుదగులుటవలన దామహస్తులై చను వల్లవుల మెల్లన విలోకించుచు, మంద యిరుగెలంకులం గలంకరహితులై పులి సివంగి వేఁగి లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి కుఠార కుంత శరాసన ప్రముఖాయుధంబులు ధరియించి, కావలి తిరుగు వ్రేలం గడచి, నానావిధ సరసతృణకబళ ఖాదన గరిష్ఠలై గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలై యున్న ధేనువులును, జన్నులు గుడిచి తల్లుల మ్రోలఁ బెల్లురేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును, వెదలైన మొదవులం బైకొని పరస్పర విరుద్ధంబులై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపు వృషభంబులును, నకుంఠితబలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని, పొద లుఱికి, దాఁటి తల్లులం దూఁటి, కుడుచు తఱిపి దూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలం జీరు గోపకుమారులును, గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచాయుధభల్ల భగ్నహృదయలై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమన తత్పరలై యున్న గోపకామినులును, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి యొద్దుచు, మరలం గట్టుచు, నీడ్చుచుం, గ్రీడించు గోపకులును, గోఖుర సముద్ధూత కరీష పరాగ పటలంబుల వలన నుల్లారి దులదులనైన ధేనుదోహనవేళా వికీర్ణ పయోబిందు సందోహ పరంపరా సంపాదిత పంకంబులును, దోహనసమయ గోపకరాకృష్ట గోస్తన నిర్గతంబు

లయి కలశంబులందుఁ బడియెడు క్షీరధారల చప్పుళ్లును, మహోక్షకంఠ సంస్పర్శన స్నిగ్ధంబులైన మందిరద్వార దారుస్తంభంబుల పొంతలనుండి, యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజన విలోకన కుపితంబులై కరాళించు సారమేయంబులుం గలిగి, బలరామకృష్ణ బాహుదండ ప్రాకారరక్షా విశేషభూషంబైన ఘోషంబుఁబ్రవేశించి యందు.

1197

తా ॥ అక్రూరుడు బృందావనంలో ప్రవేశించాడు. ఆ సాయంకాల సమయంలో, మేత సమృద్ధిగాగల అడవి ప్రదేశాలలో ప్రవేశించి మేస్తూ, అందలి ఆసక్తి చేత ఇంటికి మరలిరాకుండా నిలిచిపోయాయి పశువులు. అవి కనపడక పొదల సందులలోను, కొండల సందుల్లోను, మిట్ట భూముల్లోను, పల్లపు నేలల్లోను ప్రవేశించి, పరుగెత్తుతూ పిలిచి పిలిచి వెదకు గొల్లవారు గోవులను పిలిచే శబ్దాలను వినసాగాడు.

లేత పచ్చిక మేయుట యందలి కుతూహలం చేత నిలిచి ఉన్నా, తమ తమ దూడలను తలచుకొని నిలువలేక, తమంతట తాము తమకంతో అంబా అని అరుస్తూ పంచితాన్ని విడుస్తూ పరుగెత్తుతున్నాయి పశువులు. లేగ దూడలను ఎత్తుకొని, ఈనిన ఆవులు వెంబడింపగా, వాని పలుపులను చేత పుచ్చుకొని వచ్చే గొల్లవారిని మెల్లమెల్లగా చూస్తున్నాడు. ఆ మందకు ఇరు ప్రక్కల నిర్భయంగా పులి, శివంగి, వేగి, వాలము మొదలైన క్రూర మృగాలను చేరనియ్యక గొడ్డలి, ఈటె, విల్లు మొదలైన ఆయుధాలను పూని కాపలా ఉన్నవారిని దాటి ఇంకా ముందుకు సాగాడు.

బహు విధాలుగా సరసమైన పచ్చిక పోచలను మేసి తృప్తితో కొట్టాలకు వచ్చి చేరి, నెమరువేస్తూ మత్తుగొన్న వానివలె ఉన్నాయి ఆవులు. ఆ ఆవుల చనుకుడుస్తూ, విజృంభించి గంతులు వేస్తున్నాయి దూడలు. ఎదకువచ్చిన ఆవులను వెంబడించి, పరస్పరం విరోధించి ఢీకొని కొమ్ములతో పోట్లాడుకుంటున్నాయి ఆబోతులు. బలం చేత మెడ పలుపులు త్రెంచుకొని పొదలెగిరి దాటిపోయి తల్లుల పొదుగులు పొడిచి పాలు పీలుస్తున్నాయి తరిపి దూడలు. దానిని

వెనుకకు ఈడ్చి నిలబెట్టడానికి శక్తి చాలక తమ పెద్ద వారిని పిలుస్తున్నారు గోపబాలురు. కృష్ణధ్యానంలో ఉన్న మనస్సులు కలవారై, ఇంటిపనులు సైతం మరచి భయపడక కొడుకులు, మగలు, మామలు, మరదులు మొదలగు వారికి తెలియకుండా సంకేత ప్రదేశాలకు చేరి కృష్ణుని రాకకు ఎదురు చూస్తున్నారు గోపికా స్త్రీలు.

కొట్టాలలో ఉన్న ఆవులకు దూడలను విడిచి వానిని కనిపెట్టి ఉండి, మరల కట్టుచూ పాలు పితుకసాగారు గొల్లలు. ఆవుల కాలిగిట్టల నుండి ఎగజిమ్మబడిన ఎండిన పేడ, దుమ్ము వలన క్రమ్మబడి వర్ణం మారి నలుపెక్కి ఆవుల పాలను పితికేటప్పుడు పాలబొట్లు చిందగా తడిసి అడుసు ఏర్పడింది. పాలు పితికేటప్పుడు వెడలునట్టి పాలధారలు దుత్తలలో పడుతూ చప్పుడు చేస్తున్నాయి. ఆబోతుల మెడల రాపిడికి నునుపారిన ద్వారసీమలలోని స్తంభాల వెనుక చేరి, కొత్తవాళ్ళను చూసి కోపంతో మొరుగుతున్నాయి కుక్కలు. ఈ విధంగా బలరామకృష్ణుల బాహువులనే ప్రాకారంతో రక్షింపబడుతూన్న వ్రేపల్లెలోకి అక్రూరుడు ప్రవేశించాడు.

క. జలజాంకుశాదిరేఖలు, గల హరిపాదముల చొప్పు గని మోదముతోఁ
బులకించి రథము డిగి యు, త్కలికన్ సంతోషబాష్ప కలితాక్షుండై.

1198

తా ॥ పద్మము, అంకుశము మొదలైన శుభరేఖలు గల కృష్ణుని అడుగుల జాడను చూసి సంతోషించిన అక్రూరుడు పులకించి రథం దిగి, కృష్ణుణ్ణి చూడాలనే తహతహతో ఉండి, కన్నుల నుండి ఆనంద బాష్పములను విడువ సాగాడు.

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేను దో
హన వాటీగతుల న్నలంకృతుల నుద్యద్భాసులం బీత నీ
ల నవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్.

1199

తా ॥ కమలములవంటి కన్నులు కలవారు, తళతళలాడునట్టి దేహములు కలవారు, ఆవుల పాలు పితికే వాడలలో ఉండేవారు, భూషణముల చేత అలంకరింపబడిన వారు, పచ్చనిది, నల్లనిది అయిన వస్త్రములు కలవారు, పూలదండలు ధరించినవారు, ధీరులు, స్త్రీలకు మన్మథ స్వరూపులు, లోకములు కొనియాడ తగిన మర్యాదచేత అధికులైనవారు అయిన శ్రీకృష్ణ బలరాములను చూసాడు అక్రూరుడు.

క. కని వారల పాదములకు, వినయంబున మ్రొక్కె భక్తివివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్.

1200

తా ॥ చూసి వారిమీద ఉన్న భక్తి పారవశ్యం చేత పులకితగాత్రుడై కన్నులనుండి ఆనంద బాష్పములు ధారగా కురియుచుండగా వారి పాదాలకు వినయంతో మ్రొక్కాడు.

వ. తదనంతరంబ.

1201

క. అక్రూరులైన జనుల న, వక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకిత హస్తతలముఁ జాఁచి నరేంద్రా!

1202

తా ॥ ఓ రాజా! అప్పుడు క్రూరత్వం లేని మనుష్యులను సన్మార్గంలో కాపాడేవాడు, భక్తులయందలి ప్రేమగల కృష్ణుడు చక్రాంకితమైన హస్తం సాచి ఆ అక్రూరుణ్ణి కౌగిలించుకున్నాడు.

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు గౌఁగిలించి చెట్ట వట్టుకొని

కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మే లడిగి గద్దియ యిడి పాదప్రక్షాళనంబు సేసి మధుపర్కంబు సమర్పించి, గోవు నిచ్చి, యాదరంబున రసవదన్నంబు పెట్టించి తాంబూల గంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున నందుం డుపవిష్టుండైన యక్రూరుని సత్కరించి యిట్లనియె.

1203

తా ॥ పిమ్మట అక్రూరుడు బలరామునికి నమస్కారం చేశాడు. అతడు కౌగిలించుకుని, చేయిపట్టి పిలుచుకొని కృష్ణునితో కూడ తమ ఇంటికి తీసుకొని పోయాడు. కుశలం అడిగి పీఠం మీద కూర్చుండపెట్టి మధుపర్కాన్నిచ్చి, గోవునిచ్చి, ఆదరంగా షడ్రసములతో కూడిన భోజనం పెట్టించి తాంబూలాన్ని, గంధమును పూలదండలును ఇచ్చాడు. అప్పుడు నందుడు కూర్చుని ఉన్న అక్రూరునితో ఇట్లా అన్నాడు:

క. చెలియలు మొఱయిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రదుకం
గలదే మనికి దశార్హుల, కిలపై? మీసేమ మింక నే మని యడుగన్?

1204

తా ॥ "అక్రూరా! తన చెల్లెలు మొర్రోయని మొరపెడుతూ ఉంటే మేనల్లుంద్రను చంపిన దుర్జనుడైన కంసుడు జీవించి ఉండగా, దశార్హ వంశంలో పుట్టిన మీ క్షేమం గురించి ఏమని అడిగేది?"

వ. అని పలికె నంత నక్రూరుం డొక పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె.

1205

తా ॥ అక్రూరుడు ఒక మంచము మీద సుఖాసీనుడై ఉండగా, అప్పుడు కృష్ణుడు ఇలా అన్నాడు:

మ. శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ సేమమే?
యభయంబే ప్రజకెల్ల? గోత్రజుల కాత్మానందమే? మామ ము
క్త భయుండే? వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవ వ్యాజ నిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై?

1206

తా ॥ "ఓ అక్రూరుడా! నీకు, మన స్నేహితులకు, చుట్టములకు, తక్కిన ప్రజలకు, దాయాదులకును భయం లేకుండా మేలు కలిగి ఉన్నదా? మా మామ అయిన కంసుడు భయంలేక నెమ్మదిగా ఉన్నాడా? నేను వారికి కొడుకునై పుట్టాననే నెపంచేత కారాగారంలో సంకెళ్ళతో కట్టుపడి ఉన్న దేవకీ వసుదేవులు ఎలా ఉన్నారు?

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా
కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరు గదా యేమందు?రా వార్త యే
తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో
వెఱతో నాతలిదండ్రు లెట్లుపడిరో? విన్పింపు మక్రూరకా!

1207

తా ॥ ఓ అక్రూరా! ఆ దేవకీవసుదేవులు నీవు ఈరోజు ఇక్కడకు వస్తూంటే, వారు ఏమైనా సమాచారాన్ని నాతో చెప్పమని అన్నారా? కారాగృహంలో నిర్బంధంలో ఉన్నవారి విషయం గురించి లోకులు ఏమి అనుకొంటున్నారు? నా తల్లిదండ్రులు కంసుని వలన భయంతో ఏ విధంగా కృశించిపోయారో? ఎలా విచార పడ్డారో? దైన్యాన్ని పొందారో? ఏ విధమైన బాధలు పడ్డారో తెలియ చెప్పవయ్యా.

వ. మఱియు నీవేమి కారణంబున వచ్చి? తని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల

వధియింపం గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి రంత తమ్ముం బరివేష్టించిన నందాది గోపకులం జూచి కృష్ణుం డిట్లనియె.

1208

తా ॥ అదీకాక నీవు ఇక్కడకి ఎందుకు వచ్చావో చెప్పు" అని అడిగేసరికి, కృష్ణునితో అక్రూరుడు ఇలా అన్నాడు: "నారదుడు కంసునికి విరోధం పెరిగిపోయే మాటలు చెప్పి వెళ్ళిపోయాడు. అంతట అతడు దేవకీవసుదేవులను చంప యత్నించి పిమ్మట ఆ యత్నాన్ని మానుకుని, ధనుర్యాగం పేరు చెప్పి తనను వ్రేపల్లెకు పంపడందాకా అన్ని విషయాలు వివరంగా చెప్పాడు. బలరామకృష్ణులు ఆ వృత్తాంతాన్ని విని నవ్వుకున్నారు. చుట్టూ చేరిన నందుడు మొదలైన గోపకులను చూసి కృష్ణుడు ఇలా అన్నాడు:

శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ; డవ్విభుం
గానం బోవలెఁ; బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానుకల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీమీ నివాసంబులన్;
యానంబుల్ గొని రండు పొండు మథురా యాత్రాభిముఖ్యంబుగన్.

1209

వ. అని నియమించె; నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలంగి.

1210

తా ॥ "ఓ గోపకులారా! రాజు అయిన కంసుడు మనలను యాగం చూడటానికి పిలిచాడు. కనుక మనం అవశ్యము వెళ్ళాలి. అందులకు అనుకూలంగా పాలు నెయ్యి పెరుగు మొదలైన వానితో కట్నములు కానుకలు చేర్చిపెట్టుకొని తగిన వాహనాలను తీసుకొని బయలుదేరండి!" అని వారికి చెప్పాడు. అక్రూరుడు మథురకు కృష్ణుని తీసుకొని పోతున్నాడనే

విషయాన్ని తెలుసుకొన్న గోపికలు ఎంతో కలత చెందారు.

మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబనాహ్వానముల్
హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో యంచు లో
నెరియన్ ముచ్చటలాడి రంత గములై యేకాంత గేహంబులన్.

1211

తా ॥ అంతట గోపికలందరు గుంపులుగా గూడి, తమ ఏకాంత గృహాల్లో చేరి కృష్ణుని నవ్వులు, ఇంపైన మాటలు, విలాస చేష్టలు, వినోద విహారాలు, ప్రేమతోడి మన్ననలు, చేయిపట్టుకొని పిలవటాలు, మొదలైన చర్యలను తలచుకొని మనస్సులు తపింపగా, కృష్ణుడు వెళ్ళకుండా నిలిచే ఉపాయం ఏమిటా అని వారంతా ఆలోచించసాగారు.

వ. మఱియుఁ దమలో నిట్లనిరి.

1212

ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి మమ్మ! చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు ని
చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్న బి
డ్డాటలు చేసె నీదుడుకు లక్కట! భారతికైనఁ జెప్పరే!

1213

తా ॥ ఇంకా వారు తమలో ఇట్లా అనుకున్నారు: 'మనం ఇన్నాళ్ళదాకా బ్రహ్మదేవుడు మంచి గృహస్థు అని చాలా నమ్మాము, ఆలోచించి చూస్తే ఏపాటి ధర్మం లేదు. మనకు పరిపాలకుడైన సరోజనేత్రుణ్ణి ఇక్కడ ఉండనీయక, ఇంకొక తావుకు పోయేటట్లు చేసి చిన్న పిల్లల ఆటలుగా చేశాడు. ఇతడు చేసిన ఈ దుడుకు పనులు భారతీదేవితో అయినా చెప్పరమ్మా!'

వ. అని విధి దూఱుచు మదనతాపాయత్తచిత్తలై.

1214

తా ॥ అని బ్రహ్మను నిందిస్తూ మన్మథ వేదన తోడి మనసులు కలవారై ఇలా అనుకుంటున్నారు:

ఉ. రమ్మని చీరినంతనె పురంబున కేఁగెడుఁ గాన నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరుకోలల కగ్గము సేసి పోవఁగా
ముమ్మరమైన తాపముల మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రయాణము వల్దనరైరి చెల్లరే!

1215

తా ॥ 'కృష్ణుడు తనను మథురా పట్టణమునకు రమ్మని అక్రూరుడు పిలువగానే పోవుటకు యత్నిస్తున్నాడు. అంతేగాని ఈ గొల్లపడతులు మనలను నమ్మారే, వీరిని ఎలా వదలి వెళ్ళేది? వీరిని ఎడబాసిన పక్షమున వీరు మన్మథ సంతాపం చేత కృశింతురో ఏమో అనే యోచన చేసిన వాడుకాడు. తల్లులైన యశోదా రోహిణులు, పెద్ద వారైన నందుడు మొదలైన గోపకులైననూ ప్రయాణము మానుకొమ్మని చెప్పకపోయిరే!

శా. అక్రూరుండని పేరువెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచి నాఁ
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే?

1216

తా ॥ అక్రూరుడను పేరు పెట్టుకొని వచ్చి ఈ క్రూరుడు మా ప్రియుడైన శ్రీకృష్ణుని మా వద్ద నుండి పిలుచుకొని పోవ యత్నిస్తున్నాడు. ఇతడు క్రూరుడు గాక అక్రూరుడే అయిన

పక్షంలో, వంకర చేష్టలు ఏమీ చేయక కృష్ణుణ్ణి ఇక్కడనే ఉంచి తన దారిని తాను పోవుటకు ఆలోచింపడా!

ఉ. ఫుల్లసరోజ లోచనలు పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
సల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁ దలంచుఁ గాక వ్రే
పల్లె వసించు ముద్దియలపైఁ బడ నేల తలంచు నక్కటా!

1217

తా ॥ అయ్యో! ఇతను కృష్ణుణ్ణి మథురా పట్టణానికి పిలుచుకొని పోతున్నాడే! అక్కడి స్త్రీలు చాలా అందకత్తెలట! వికసించిన తామర పువ్వులవంటి కన్నులు, నిండు చందమామను పోలిన ముఖములు కలవారట. వారు మేడలపైనుండి బంగారపు వలపులు విసిరితే, వారిని చూసిన కృష్ణుడు వారితో స్నేహం చెయ్యడానికి ఇష్టపడతాడు గాని వ్రేపల్లెలో ఉండే ముద్దియలపై ఇక ఆసక్తి ఎందుకుంటుంది?

క. పురసతుల విలోకనములు, సరసాలాపములు నర్మసంభోగములున్
మరగి హరి మనల నొల్లఁడు, నరవరు లోయమ్మ! నూతన ప్రియులు గదే.

1218

తా ॥ రాజులు నూతన ప్రియులు కాదా! కృష్ణుడు పట్టణ స్త్రీల చూపులను, సరసాలాపములను, పరిహాసముల తోడి కూడికలను పరిచయం చేసుకొని ఇక మనలను అపేక్షింపడు.

క. పుట్టిన్నఁడు హరి నెఱుఁగని, పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును, గట్టిఁడి దైవంబు ఘోషకాంతల వెదకెన్.

1219

తా ॥ కఠిన వృత్తిగల దైవం పుట్టిన నాటినుండి కృష్ణుణ్ణి చూసి అయినా ఎరుగని పట్టణంలోని సుందరులకు పతిగా చేశాడు. చిన్నప్పటి నుండి కలసి మెలసి వర్తిస్తూన్న మనలను అతని విరహం వలన తపించునట్లుగా చేశాడు.'

మ. 'హరి నేలా కొనిపోయె' దంచు మన మా యక్రూరుఁ బ్రార్థింతమా?
'హరిఁ బోనీకుఁడు నిల్పరే' యనుచు నేఁ దర్చింతమా' వేల్పులన్?
హరిపాదంబుల కడ్డముల్ పడుదమా; 'హా దైవమా' ! యంచు నా
తరుణుల్ కొప్పులుఁ జీరలున్ మఱచి కందర్పజ్వర భ్రాంతలై.

1220

తా ॥ అలా చింతిస్తూ ఆ గోపికా స్త్రీలు విరహతాపంచేత భ్రాంతిని పొంది తమ కొప్పులు సవరించుకోవటం, వీడిన చీరలు చక్కగా కట్టుకోవటం మరచిపోయారు. ఆ అక్రూరుని మా కృష్ణుణ్ణి ఎందుకు తీసుకువెడుతున్నావు, వద్దని ప్రార్థిద్దామా? పోనివ్వక మా యొద్దనే ఉండేటట్లు చెయ్యండి అని దేవతలను అర్చిద్దామా? అయ్యో! దైవమా, వెళ్ళవద్దు అంటూ ఆ శ్రీహరి పాదాలకు అడ్డు పడదామా? అని అనుకోసాగారు.

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీ రొండొండ వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతట సంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై 'మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ! దామోదర' యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్.

1221

తా ॥ కొందరు గోపికలు సిగ్గు విడిచి, కన్నులనుండి సంతతధారగా కన్నీరు కారుచుండగా, దేహములు మరచి, చెక్కిళ్ళమీద చేతులు చేర్చుకొని గాలిచేత ఎగజిమ్మబడిన తీగలవలె చలించుచూ ఓ గోవిందా! దామోదరా! మాధవా! అంటూ స్వరబద్ధంగా పాటలు

పాడుతూ విలపించసాగారు.

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దన తోడఁ బయనంబునకు గమకించి నడచు గోపికలను 'మఱలివత్తు' నని దూతికా ముఖంబున నివర్తించి, కృష్ణుఁడు శకటంబులందుఁ గానికలు గోరసంబులు నిడుకొని నందాదు లయిన గోపకులు వెను తగుల నక్రూర చోదితం బయిన రథం బెక్కి మథురాభిముఖుండై చను సమయంబున.

1222

తా ॥ ఆ మరునాడు సూర్యోదయ కాలంలో తనతో కూడ ప్రయాణమై వచ్చుటకు సిద్ధపడి నడవ ఆరంభించిన గోపికలను నేను మరలి వస్తానని దూతికల చేత చెప్పించి వారి ప్రయాణం నిలిపి వేశాడు. నందుడు మొదలుగా గల గోపాలురంతా తన వెంటరాగా అక్రూరుని చేత నడపబడుచున్న రథాన్ని ఎక్కి మథురా పట్టణ మార్గాన బయలుదేరాడు కృష్ణుడు.

చ. 'అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథ ఘోటకాంఘ్రిరజ మాదెస మార్గము చూడుఁ డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
గదలక నిల్చిచూచి రటు గన్నుల కబ్బిన యంత దూరమున్.

1223

తా ॥ గోపస్త్రీలందరు మన ప్రియుడు అదే పోతున్నాడు. అదే రథము! అదిగో కృష్ణుని కంఠహారం వైజయంతిక! ఆ త్రోవయందు గుర్రాల కాలి దుమ్ము! చూడండి, అంటూ తమ మనస్సులలో పుట్టుచున్న ప్రేమ చేత కృష్ణుడు వెళ్ళు దిక్కునకు ముఖములు కలవారై కనబడినంత దూరం కదలక, అలానే నిల్చుని చూస్తూ ఉన్నారు.

వ. ఇట్లు బలభద్రాక్రూరసహితుండై చని.

1224

క. అవలోకించెను గృష్ణుఁడు, ప్రవిమల కల్లోల పవనభాసిత జన్య
న్న వసన్న పాపసైన్యన్, గవిజనమాన్యన్ గళిందకన్యన్ ధన్యన్.

1225

తా ॥ ఈ విధంగా బలరాముడు, శ్రీకృష్ణమూర్తి, అక్రూరుడు చాలా దూరం వెళ్ళారు. మిక్కిలి స్వచ్ఛమైన అలల నుండి పుట్టుచున్న చల్లని గాలి కలదియు, పాపములను పోగొట్టునదియు, కవీశ్వరుల చేత సన్మానింప తగినది అయిన యమునా నదిని చూసారు.

వ. కని తత్కాళిందియందుఁ బరిక్షుణ్ణ మణిగణ సముజ్జ్వలంబు లగు జలంబులు ద్రావి, తరుసమూహ సమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు సొచ్చి విధిపూర్వకంబుగ వేదమంత్రంబులఁ జపించుచు.

1226

తా ॥ కాళిందిని చూసి నిర్మలమైన నీళ్ళు త్రావి గట్టున ఉన్న చెట్ల నీడలో రథము మీద బలరామునితో కూడ కృష్ణుడు కూర్చున్నాడు. అప్పుడు అక్రూరుడు వారిద్దరికి నమస్కరించి అనుజ్ఞ తీసుకొని నదిలో దిగి విధిపూర్వకంగా వేదమంత్రాలు జపిస్తూ స్నానం చేశాడు.

## 45. అక్రూరుడు యమునలో రామకృష్ణుల దర్శించి నుతించుట

ఉ. స్నానము సేసి చేసి నది చల్లని నీటను రామకృష్ణులన్
మానుగఁ జూచి వీరు రథమధ్యమునన్ వసియించి యున్న వా
రీ నది నీటిలోపలికి నెప్పుడు వచ్చి? రటంచు లేచి మే
ధానిధి సూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్.

1227

తా ॥ బుద్ధిమంతుడైన అక్రూరుడు ఆ చల్లని నీటిలో స్నానం చేస్తూ ఉండగా బలరామకృష్ణులు ఆ నీళ్ళలో రథమునందు కూర్చున్నట్లుగానే కనిపించారు. వారు ఈ నీళ్ళలోకి ఎలా వచ్చారు అని నీళ్ళలో నుండి లేచి చూడగా, భక్తుల కోరికలను నెరవేర్చునట్టి వారు బయట చెట్టుక్రింద మునుపటివలెనే రథము మీద కూర్చున్న వారిగా మరల చూసాడు.

వ. చూచి వెఱఁగుపడి.

1228

శా. 'కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్ దుదిం; గ్రమ్మఱం
గంటిం దొంటి రథంబుమీఁద; నిదె యీ కల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండు దిక్కుల; మనోవిభ్రాంతియో? నీటిలో
నుం టాశ్చర్యము; చూతు నంచు మఱియు న్నూహించి మగ్నాంగుఁడై.

1229

తా ॥ అలా చూసి ఆశ్చర్యపడి, 'ఈ రామకృష్ణులను తొలుత రథంమీద చూసాను. పిమ్మట నీళ్ళలో చూసాను. ఇప్పుడు తిరిగి మునుపటి రథం మీదనే చూస్తున్నాను. ఈ మహాపురుషులు రెండు చోట్ల ఎలా కనపడుతున్నారు? ఇది నా చిత్తభ్రమచేత అలా కనిపిస్తోందా? జలమునందు ఉండటం ఆశ్చర్యమే కదా! అయినా ఇంకొకసారి జలాల్లో

చూస్తాను' అని నిశ్చయించి నీళ్ళలో మునిగాడు.

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డాజలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీర చమూ విజిగీషు నిత్య సం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్.

1230

తా ॥ బంధువులను పోషించేవాడు, యాదవులలో గొప్పవాడు అయిన అక్రూరుడు ఆ నదీ జలాల్లో ఈసారి ఆదిశేషుణ్ణి చూచాడు. ఆ ఆదిశేషువు వ్యాకరణయుక్తంగా మాట్లాడేవాడు, వేయి తలలు కలిగి వెలిగేవాడు, పన్నగాలకు ప్రభువు, దయయందు అభిలాష కలవాడు. శత్రువీరులను జయింప ఇచ్ఛగలవాడు. నిత్యము సంతోషించేవాడు, రోషము, దోషము లేనివాడు, అనేక విశేషములు కలవాడు.

నిద్ర గడచినది మొదలు మరల నిద్రపోవువరకు ఏది ప్రకాశించుచున్నదో, చతుర్దశ భువనములు పంచమహాభూతములు నష్టమై పోయిన సుషుప్తియందు నష్టం కాక శేషించి ఏది ఉందో, అదే "అహం" అని పలుకబడే ప్రజ్ఞ. దానికే శేషుడని పేరు.

వ. మఱియు నీలాంబర సంయుతుండును, సిద్ధోరగాది సన్నుతుండునునై యొప్పు నప్పాఁ పఱేనిం దప్పక కనుంగొని.

1231

తా ॥ నీలవర్ణమైన వస్త్రంతో కూడుకొన్నవాడు, సిద్ధుల చేతను, నాగుల చేతను స్తోత్రము చేయబడువాడు అయిన ఆ సర్పరాజును రెప్పవాల్చకుండ చూచాడు.

నీలం అనంతత్వాన్ని సూచిస్తుంది. ఇక్కడ ఆ అనంతుని ప్రస్తావన జరిగింది.

సీ. ఆ భోగి భోగపర్యంక మధ్యంబున వలనొప్పు పచ్చని వలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగు చందంబున నురమున శ్రీదేవి యొప్పువాని
ముసురు తేఁటులు విప్ప ముఖచతుష్కము గల తనయుఁ డాడెడి బొడ్డుఁదమ్మివానిఁ
గదలిన బహుపదక్రమవిశేషంబుల రవము సూపెడి నూపురముల వాని

ఆ. జలజగర్భ రుద్ర సనక సనందన, సద్ద్విజామర ప్రశస్యమాన
చరితుఁడైన వాని సౌందర్యఖనియైన, వాని నొక్క పురుషవర్యుఁ గాంచె.

1232

తా ॥ ఆ ఆదిశేషువును పాన్పుగా చేసుకొని మధ్యభాగంలో శయనించి ఉన్న సౌందర్యఖని అయిన పురుషోత్తముణ్ణి చూసాడు అక్రూరుడు. ఆ పురుషోత్తముడు అందమైన పసుపువన్నె పచ్చదనాన్ని ధరించి ఉన్నాడు. మేఘంలో మెరిసే మెరుపు చందంగా వక్షస్థలంలో శ్రీదేవి ఒప్పుతూ ఉన్నది. మకరంద పరిమళానికై ఆవరించుకొన్న తుమ్మెదలు విచ్చిపోగా, నాభి కమలమందు నాలుగు ముఖములతో బ్రహ్మ ఆడుకుంటున్నాడు. ఆ పురుషోత్తముని కాలి అందెలు వేదనాదాలను ధ్వనిస్తున్నాయి. బ్రహ్మ, రుద్రుడు, సనకుడు, సనందనుడు, సద్బ్రాహ్మణ శ్రేష్ఠులు, దేవతలు మొదలైన వారిచేత కొనియాడ బడుతున్నాడు.

వ. మఱియును జారు లక్షణ లక్షిత నఖ పాద గుల్ఫ జాను జంఘోరు కటి నాభి మధ్యోదరుండును, సాదరుండును; శ్రీవత్సకౌస్తుభ వనమాలికా విరాజిత విశాల వక్షుండును, బుండరీకాక్షుండును; శంఖ చక్ర గదా పద్మ హస్తుండును, సత్త్వగుణ ప్రశస్తుండును; బ్రహ్మసూత్ర కటిసూత్ర హార కేయూర కటక కంకణ మకర కుండల కిరీటాది విభూషణుండును, భక్తజనపోషణుండును; సుందర కపోల ఫాల నాసాధర వదన కర్ణుండును, నీలనీరద వర్ణుండును; గంబుకంధరుండును, గరుణాగుణ బంధురుండును; బ్రహ్లాద నారద సునంద నందప్రముఖ సంభావితుండును, శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జా విద్యా–విద్యా శక్తి మాయాది సేవితుండునునై యొప్పు న ప్పరమేశ్వరునకు మ్రొక్కి

భక్తిసంభ్రమంబు లగ్గలంబు లుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె.

1233

తా ॥ ఇంకా ఆ పురుషోత్తముడు ఎలా ఉన్నాడంటే, రమ్యములైన చిహ్నములచేత ఒప్పుతూన్న పాదములు, చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు, తొడలు, కటిప్రదేశం, నాభి, నడుము, మొదలైన అవయవములతో ఉన్నాడు. ఆదరముతో చూస్తూ ఉన్నాడు. శ్రీవత్సం, కౌస్తుభం, వనమాల వీనిచేత ప్రకాశిస్తూన్న విశాలమైన వక్షాన్ని కలిగి ఉన్నాడు. తెల్ల తామరలను పోలిన కన్నులు కలిగి ఉన్నాడు. శంఖచక్రాదులైన ఆయుధాలను చేత ధరించి ఉన్నాడు. సత్వగుణం చేత ప్రకాశిస్తున్నాడు. జందెం, కటిసూత్రము, ముత్యాల సరాలు, భుజకీర్తులు, అందెలు, కడియాలు, మకరకుండలాలు, కిరీటం మొదలైన ఆభరణాలను కలిగి ఉన్నాడు, భక్తజనులను పోషిస్తున్నాడు. అందమైన శిరోభాగాన్ని కలిగి ఉన్నాడు, నీలమేఘచ్ఛాయతో ఒప్పారుతున్నాడు, శంఖము వంటి కంఠాన్ని కలిగి ఉన్నాడు. దయాగుణం చేత నిండి ఉన్నాడు. ప్రహ్లాద, నారదాదుల చేత కొనియాడబడుతున్నాడు. శ్రీ, పుష్టి, తుష్టి, కీర్తి, కాంతి ఇలా (భూమి), ఊర్జ (ఋజువు), విద్యాశక్తి, మాయాశక్తి మొదలైన శక్తులచే సేవింపబడుతున్నాడు. అట్టి పరమేశ్వరునికి నమస్కరించి భక్తియు తొట్రుపాటును హెచ్చుచుండగా డగ్గుత్తికతో ఈ ప్రకారం స్తుతించాడు:

దండకము:

వ. శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబు నస్తంగతంబై మహాలోల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా, బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీ నాభి కంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెం గదా! పావ కాకాశ వాతావనీ వార్యహంకార మాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్

నిత్యసందోహమై నీ మహాదేహమం దుల్లసించున్; వసించున్, నశించున్, జడత్వంబు లేకాత్మయై యొప్పు నీయొప్పిదం బెల్ల నోచెల్ల; చెల్లన్ విచారింపఁదా రెంతవా? రెంతవారైన మాయాదు లా మాయతోఁగూడి క్రీడించు లోకానుసంధాత యీధాత నిర్ణేతయే? నీ కళారాశికిం గొంద ఱంభోజగర్భాదు లధ్యాత్మలందున్న శేషాధిభూతంబులందు న్ననేకాధిదైవంబులందున్ సదా సాక్షివై యుందు వంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం, ద్రయీపద్ధతిం గొంద ఱింద్రాది దేవాభిధానంబులన్, నిక్క మొక్కండ వంచున్ మఱిం గొంద రారూఢకర్మంబులం ద్రుంచి, సంసారముం ద్రెంచి, సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ దన్మయత్వంబుతోఁ గొంద ఱీ వాత్మ వంచున్, మఱిం గొంద ఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్; మఱిన్ నీవు నారాయణాఖ్యుండ వంచున్ శివాఖ్యుండ వంచున్, మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు; రగ్గేమి? యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్ల న్నశేషంబులై డింది నీయం దనూనంబు లీనంబులౌ; నేకరాకేందు బింబంబు కుంభాంత రాళంబులం బింబితంబైన వేఱున్నదే? యెన్న నేలా? ఘటాంతర్గతాకాశముల్ తద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీఁక నే పోకలం బోక; యేకాకివై యుందు; దీశా! కృశానుండు నెమ్మోము, సోముండు భానుండు కన్నుల్, దిశల్ కర్ణముల్, భూమి పాదంబు, లంభోనిధుల్ గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ కచంబుల్, నభోవీథి నాభిప్రదేశంబు, రేలుంబగళ్లున్ నిమేషంబు, లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబుగా నేకమై యున్న నీ మేనిదండం బయోజాత గర్భాండముల్ మండి తోదుంబరానోకహానేకశాఖా ఫలాపూరి తానంతజంతు ప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిస్థ జంతుప్రకారంబుగా నిండి యుండున్; మహారూప! నీ రూపముల్ వెగ్గలం బుగ్గడింపన్; లయాం భోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే? త్రుంపవే కైటభ శ్రీ మధుం జక్రివై మొత్తవే! యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా పరిష్పందివై పందివై మేదినిన్ మీఁదికిం ద్రోచి దోషాచరుం

గొమ్ములన్ నెమ్ములన్ జిమ్ముచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై, దండివై దండి వైరోచనిం జూచి యాచింపవే? పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ, బాఱుండవై రాజకోటిన్ విపాటింపవే, రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే, నొంపవే క్రూరులన్ వాసుదేవాది రూపంబులన్, శుద్ధబుద్ధుండవై వైరి దారాంతరంగంబుల న్నంతరంగంబులుంగా గరంగింపవే? పెంపు దీపింపవే? కల్కి మూర్తిం బ్రవర్తించి, నిన్నెన్న నే నెవ్వఁడన్, నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రసన్నుం డవై ఖిన్నతం బాపి మన్నింపవే! పన్నగాధీశతల్పా! కృపాకల్ప!, వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః.

1234

తా ॥ "శ్రీ లక్ష్మీదేవి యొక్క మనస్సును అపహరించినవాడా! మంగళకరమైన స్వరూపం కలవాడా! ఓ వీరా! లోక సృష్టికి కారణమైనవాడా! ఓ స్వామీ! ప్రళయసమయంలో సమస్త లోకాలు నశించి సముద్రంలో కలియగా, ఆ సముద్రంలో ఆడుకొనే పసి బిడ్డవలె, వటపత్రం మీద తేలియాడుచు నారాయణుడు అనే నామాన్ని వహించావు. అప్పుడు నీ నాభి కమలము నుండి సృష్టికర్తయైన బ్రహ్మ మొట్టమొదట ఉద్భవించాడు. పంచ మహాభూతములు, మూల ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారం మొదలైన చతుర్దశేంద్రియములు, వాని వృత్తులయిన శబ్దస్పర్శరూపరస గంధాదులును, లోకములు, దానికి కారణ భూతులైన బ్రహ్మాది మూర్తులు సచ్చిదానంద నిర్మల పరిపూర్ణమైన నీ విరాట్ దేహమునందే పుట్టి, వృద్ధిపొందుతూ, లయిస్తూ ఉంటాయి. నీవు జడభావం లేక పరమాత్మ స్వరూపుడవై ఉంటావు. ఇట్టి నీ స్వరూపాన్ని లెస్సగా విచారించి తెలుసుకొనుటకు ఎంతటి బ్రహ్మవేత్తలకైనా సాధ్యము కాదు, అలాంటప్పుడు మాయా సంబంధముచేత ప్రపంచ సృష్టిరూపమైన వినోదమును చేయునట్టి బ్రహ్మ కూడా నీ చిద్విలాస మిట్టిదని నిర్ణయించుటకు కర్త కానే కాదు.

విజ్ఞులైన నీ కళాంశజులు నిన్ను దేహేంద్రియాధి దేవతలకు సాక్షిగా, అంతర్యామిగా గుర్తిస్తారు. సృష్ట్యాది కార్యములయందు బ్రహ్మాదులను నియమించువాడవు నీవే. వేద మార్గాన్ని

అనుసరించి నీవు ఇంద్రాది దేవతా ప్రభువుల నామములు వహించి ప్రకాశించినా నిజానికి ఒక్కడివే అయి ఉన్నావు. జ్ఞాన నిష్ఠులయిన కొందరు, ఆగామి, సంచిత, ప్రారబ్ధకర్మములను విడిచి అంతర బాహ్యజ్ఞాన దృష్టిచేత అపరోక్షంగా తెలుసుకో తగినవాడవని అంటారు. మరికొందరు పాంచరాత్ర ఆగమమును అనుసరించి భగవత్స్వరూపాన్ని వహించి ప్రకాశించు ప్రత్యగాత్మవని అంటారు. కొందరు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనెడి చతర్వ్యూహ సంగతిచేత నలుగురై ప్రకాశించునట్టి వాడవు అని అంటారు. ఇదిగాక నిన్ను నారాయణుడనీ, శివుడనీ ఇలా బహువిధాలుగా తలుస్తూ ఉంటారు.

సర్వస్వరూపివగుట చేత అలా భావించడంలో లోపం ఏమీ లేదు. లోకమునందలి నదులన్నియు ఏ వైపుకు పారినా, కడపటికి సముద్రమునందే వచ్చి కలసినట్లుగా, ఈ విశేష నామరూపాదులన్నియు చివరికి నీయందే లయించిపోతాయి. ఒక చంద్రబింబం నీరు నిండిన ఘటములలో ప్రతిఫలించి అనేకములుగా తోచినా, విచారిస్తే ఆ బింబ ప్రతిబింబాలకు భేదం లేనట్లుగా, నీవు బహురూపాలలో కనబడినా, ప్రళయ కాలంలో నశింపని రూపంలో, ఒంటరివాడవై ఉంటావు. ఓ స్వామీ! నీకు అగ్ని ముఖంగానూ, చంద్రుడు, సూర్యుడు రెండు కన్నులుగాను ఉంటారు. నీకు దిక్కులు చెవులు, భూమి అడుగులు, సముద్రములు కుక్షి, కొండలు నీ ఎముకలు, తీగలు, వృక్షములు నీ రోమములు, గాలియే ప్రాణము, చేతులు ఇంద్రాదులు, మేఘములు తలవెంట్రుకలు, ఆకాశము బొడ్డు, రేయింబవళ్ళు, నిమేషములు, బ్రహ్మ గుహ్యము, రేతస్సు వాన, సర్గము నడితల. ఈ విధంగా అన్నీ ఒక్కటిగా కూడగా ఏర్పడిన నీ విరాట్ దేహమునందు ఫలించిన అత్తి చెట్టునందు కానవచ్చే అత్తిపండ్లలోని పురుగులవలె సకల జీవసంఘాతముతో కూడిన బ్రహ్మాండములు నిండుకొని ఉంటాయి. నీ రూపము ఇట్టిది అని చెప్పుటకు శక్యము కాదు, పొగడ్తలకు అందనిది.

నీవు మత్స్యావతారం ఎత్తి, సోమకాసురుణ్ణి సంహరించి బ్రహ్మకు వేదాలు తెచ్చి ఇచ్చావు. మధుకైటభులను చక్రధారివై చంపావు. కూర్మావతారం ఎత్తి మందర పర్వతాన్ని మోసావు.

వరాహావతారం ఎత్తి హిరణ్యాక్షుణ్ణి చంపి కోరకొమ్ములతో భూమిని నిలబెట్టావు. నరసింహావతారాన్ని ఎత్తి భయంకరుడైన హిరణ్యకశిపుణ్ణి చంపి దేవతల భయాన్ని పోగొట్టావు. వామనావతారాన్ని ఎత్తి బలిని యాచించి బ్రహ్మాండమంతా నిండేటట్లు దేహాన్ని పెంచావు. పరశురామావతారాన్ని ఎత్తి లోకంలోని రాజులందరినీ పలుమార్లు వెతికి సంహరించావు. శ్రీరామావతారం ఎత్తి సీతకై రావణుణ్ణి సంహరించావు. శ్రీకృష్ణ, బలరామ రూపాలను ధరించి క్రూరులైన రాక్షసులను సంహరించావు. బుద్ధావతారమెత్తి శత్రుభార్యల మనస్సులను కరిగించినావు. కల్క్యవతారమెత్తి గౌరవాన్ని సంపాదించగలవు. ఇట్టి నిన్ను శ్లాఘింప నేను ఏపాటివాడిని! కలవరం పొందిన మనస్సు కలవాడిని. నేను దుఃఖమును పొందకుండ కాపాడు. ఓ శేషశయనా! ఓ దయాభరణా! ఓ భక్తజన కల్పవృక్షమా! నీకు పలుమార్లు నమస్కరించెదను! చిత్తగింపుము.

ম. కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం
దలఁతున్ సత్యము లంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు
నీ విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!

1235

తా ॥ ఓ లక్ష్మీ నారాయణా! కలలవలె నిత్యములుగాని కొడుకులు, స్నేహితులు, భార్యలు మొదలైన వారి సంయోగములను దాహంచేత నీళ్ళను కోరువాడు ఎండమావులను చూసి నీళ్ళని భ్రమసినట్లు, నిత్యములని తలుస్తూ భ్రమిస్తున్నాను. మూఢుడను! వృథా తత్త్వజ్ఞుడను! ఇటువంటి నాకు నీ పాదపద్మస్థానాన్ని దయతో కటాక్షించు.”

వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునా జలంబుల లోనన తన మొదలి మేను సూపి చాలించి నటునికైవడిం దిరోహితుండైన నక్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యిట్లనియె.

1236

తా ॥ అని తనను స్తోత్రం చేస్తూన్న అక్రూరునికి యమునా నదీ జలాల్లో చతుర్భుజ శంఖచక్రాది చిహ్నములతోడి తన స్వస్వరూపాన్ని చూపాడు. అంతలోనే తన పాత్రను పోషించే నటునివలె అంతర్ధానమయ్యాడు. అక్రూరుడు నీళ్ళలో నుండి బయటకు వచ్చి ఆశ్చర్యపడుతూ రథాన్ని అధిరోహించాడు. అప్పుడు కృష్ణుడు ఇట్లా అన్నాడు:

క. జలములు చేరువ నున్నవి, తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె! నదీ
జలముల నభమున ధరణిం, గలుగని చోద్యములు నీకుఁ గానం బడెనే?

1237

తా ॥ “చూడగా ఇక్కడికి నీళ్ళు దగ్గరలోనే ఉన్నాయి. నీవు వెళ్ళి చాలా సేపయ్యింది. భూమి యందు, ఆకాశమందు లేని వింతలు నదీ జలాలలో నీకేమైనా కాన వచ్చాయా?”

వ. అనిన నతం డిట్లనియె.

1238

క. ‘నీలోన లేని చోద్యము, లేలోకములందుఁ జెప్ప; రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె?, నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!’

1239

తా ॥ దానికి అక్రూరుడు ఇట్లా అన్నాడు: “ఓ స్వామీ! ఈశ్వరుడవైన నీయందు లేని వింతలు ఏ లోకాల్లోనైనా ఉన్నాయని ఎవరూ చెప్పలేరు. ఇక నీళ్ళయందు, నేలయందు, ఆకాశమందు ఉన్నాయని అనగలమా? ఓ మహాత్మా! విచిత్రాలన్నీ నీలోనే ఉన్నాయి.”

వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మధురానగరంబు సేర రథంబు, గడపె; నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలం గూడికొని

కృష్ణు డక్రూరునిం జూచి రథంబు గొనుచు నగరంబునకుం జనుము; మేము వెనుక వచ్చెద' మనిన నతం డిట్లనియె.

1240

తా ॥ అని పలికి, సాయంసమయానికి మథురా పట్టణానికి చేరుకొనేటట్లుగా రథాన్ని తోలాడు. అంతకు ముందే నందాదులు పట్టణంలోని ఉద్యానవనంలో దిగి ఉన్నారు. వారిని కలుసుకుని అక్రూరునితో, 'నీవు రథాన్ని తీసుకుని పట్టణంలోనికి వెళ్ళు. మేము వెనుక వస్తాము' అనేసరికి అతడు ఇట్లా అన్నాడు:

క. 'నా యింటికి విచ్చేయుము, నీ యంఘ్రి సరోజరేణునికరము సోఁకన్
నా యిల్లు పవిత్రం బగు శ్రీ యుత! నీ భటునిఁ బెద్ద సేయం దగదే?

1241

వ. అని మఱియుఁ బ్రార్థించిన హరి యిట్లనియె.

1242

తా ॥ "లక్ష్మీ సంపన్నుడవైన కృష్ణా! నీవు నా ఇంటికి రావాలి. నీవు రాగా నీ కాలి ధూళి సోకి నా గృహం పావనమవుతుంది. నీ సేవకుడనైన నన్ను ఇంత మాత్రము అనుగ్రహించి మన్నింపరాదా!" అంటూ మరీ మరీ వేడుకొంటూన్న అక్రూరునితో కృష్ణుడు ఇలా అన్నాడు:

## 46. శ్రీకృష్ణమూర్తి మధురానగరానికి వచ్చుట

క. యదుకుల విద్వేషణుఁడై, మదమున వర్తించు కంసు మర్దించి భవ
త్సదనంబుఁ జూడ వచ్చెదఁ, బొద యీ స్యందనము గొనుచుఁ బురమున కనఘా!.

1243

తా ॥ “అక్రూరా! నువ్వు ఈ రథాన్ని తీసుకుని పట్టణానికి వెళ్ళు! నేను యాదవ వంశానికి శత్రువై, మదం చేత వర్తిస్తున్న కంసుణ్ణి వధించిన పిమ్మట, పాపరహితుడవైన నీ ఇంటికి వస్తాను”

వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చి రని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె; నంత నపరాహ్ణంబున బలభద్రగోపాల సహితుండై కృష్ణుండు.

1244

తా ॥ అని కృష్ణుడు చెప్పగా, అక్రూరుడు పట్టణానికి వెళ్ళి కంసునితో రామకృష్ణులు వచ్చారని చెప్పి తన ఇంటికి వెళ్ళాడు. అంతట పగలు మూడు జాముల వేళప్పుడు బలరామునితోను, గొల్లవారితోనూ కూడుకొని కృష్ణుడు మధురా పట్టణంలో ప్రవేశించాడు.

మ. పరిఖల్ గోటలుఁ గొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్.

1245

తా ॥ అగడ్తలు, కోటలు, బురుజులు, పతాకలు, ప్రాసాదములు, వీథులు, గుఱ్ఱాలు,

రథాలు, వీరులు, ఏనుగులు, మేడలు, శూరభటులు, యువతులు, వాద్యములు, ధాన్యములు, ధనములు, గొప్ప ఉద్యాన వనాలు, నడబావులు మొదలుగా గల వాని చేత మిక్కిలి ఆశ్చర్యకరమైన శోభతో ఉన్న మథురా పట్టణాన్ని శ్రీకృష్ణుడు చూచాడు.

వ. కని య ప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున.

1246

ఉ. 'నంద తపఃఫలంబు, సుగుణంబుల పుంజము, గోపకామినీ
బృందము నోముపంట; సిరి విందు; దయాంబుధి; యోగి బృందముల్
డెందములందుఁ గోరెడు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీఱఁగన్.

1247

తా ॥ ఆ పురంలో ప్రవేశించి వస్తూన్న సమయంలో, పురస్త్రీలు తమ స్నేహితురాండ్రను పిలుస్తూ, 'నందుని తపస్సునకు ఫలమును, మంచి గుణములు కలవాడు, గోపికా స్త్రీలు నోచిన నోములకు ఫలమును, శ్రీలక్ష్మీ ప్రియుడును, దయాసముద్రుడును, యోగీశ్వరులు తమ మనస్సులలో చూడగోరునట్టి శ్రీకృష్ణమూర్తి మన దగ్గరకు వస్తున్నాడు. ఓ చెలియలారా! కన్నులార చూతము రారే!'

వ. అని మఱియు గోవిందసందర్శన కుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు గురుజన శిక్ష్యమాణలై యోడకయు, గృహకార్య ప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజన బిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి.

1248

తా ॥ అని ఈ విధంగా ఒకరినొకరు పిలుచుకుంటూ, శ్రీకృష్ణుణ్ణి సందర్శించేందుకు కుతూహలంతో పురస్త్రీలందరు బయలుదేరారు. వారి స్థితి ఎలా ఉందంటే, కొందరు భోజనాలు చేస్తూ చేస్తూ లేచారు, నిద్రిస్తూ ఉన్నా దిగ్గున లేచారు. మరికొందరు తలంటుకొని స్నానం పూర్తిగా చెయ్యలేదు. ఇంకొందరు ఎక్కడకు పోయెదరని పెద్దలు దండించినా అందుకు భయపడలేదు. మరి కొంతమంది బిడ్డలను ఎత్తుకొని ఉండి, ఆ బిడ్డలను దిగవిడిచారు. కొందరు అలంకరించు కొనుచూ పూర్ణంగా అలంకరించుకోలేదు. ఒకరి చీరలనొకరు, ఒకరి సొమ్ములను ఇంకొకరు ఇంకొకరి పూలదండలను మరి యొకరునుగా వస్త్రాభరణాదులు తారుమారుగా ధరించి వెళ్ళారు.

క. వీటఁ గల చేడె లెల్లను, హాటకమణిఘటిత తుంగహర్మ్యాగ్రములం
గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్.

1249

తా ॥ అప్పుడు పట్టణంలో ఉండే స్త్రీలందరూ బంగారము చేత, రత్నముల చేత పొదిగి ఉండునట్టి ఎత్తైన మేడలమీద గుంపులుగా కూడుకొని, విశాలమైన వక్షము కలవాడు, తామర రేకుల వంటి కన్నులు కలవాడైన ఆ మనోహరుణ్ణి, శ్రీకృష్ణుణ్ణి మక్కువతో చూసారు.

సీ. వీఁడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁబాలు ద్రావిన మేటిబాలకుండు!
వీఁడటే నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు!
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు!
వీఁడటే యెలయించి వ్రేతల మానంబు సూఱలాడిన లోకసుందరుండు!

తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగ రుతము, వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు.

1250

తా ॥ 'పసిబిడ్డగా ఉండి రాక్షసస్త్రీ అయిన పూతన చనుపాలు పీల్చి విగత జీవిగా చేసినవాడు వీడేనటే? యశోదకు తన ముఖమునందు సమస్త లోకములను చూపిన ముద్దుల పాపడు వీడేనా? మందలో ఉన్న గొల్లల ఇండ్లలోని వెన్నలు దొంగిలించి తిన్న దొంగ వీడేనటే? గోపికా స్త్రీల మానములను అపహరించిన సొగసుకాడు ఇతడేనా? వీడు ఏ పట్టణంలో ఉండడో, ఆ పట్టణము అడవితో సమానం. ఇతడిని కలవని జన్మము నిష్ఫలం. వీని నామస్మరణ చేయని మాటలు పక్షికూతల వంటివి. ఈ అందగానిని చూడని చూపులు మిక్కిలి వ్యర్థములు' అని ఒకరితో ఒకరు అనుకొంటూ చూడసాగారు.

మ. చెలియా! గోపిక లీ కుమార తిలకుం జింతించుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్త గా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్?

1251

తా ॥ ఓ చెలియా! ఈ బాలకృష్ణమూర్తిని స్మరించుచు, పాడుచు, కూడియాడుచు కలగలుపుగా మాట్లాడుచూ, నవ్వుతూ, చేపట్టి లాగుచూ గోపికాస్త్రీలు నిత్యమూ ఆనందిస్తున్నారు. అరచేతిలో ఉసిరిక కాయలాగ ఎల్లప్పుడూ అతనిచేత మన్నింపబడుటకు పూర్వ జన్మములందు వారు ఎట్టి అరణ్యప్రాంతాలలో ఎటువంటి వ్రతములు చేశారో కదా!

క. అని మఱియుఁ బౌరకాంతలు, మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ
గొని తాల్చిరి హృదయములను, జనిత ప్రమదమున విరులు సల్లుచు నధిపా!

1252

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! ఆ విధంగా పురస్త్రీలు కృష్ణుని రూపాన్ని కన్నులార చూస్తూ, హృదయ కమలములలో నిలుపుకొని, ఆనందంతో పూలజల్లులు జల్లారు.

వ. మఱియును.

1253

క. నానావిధగంధములుఁ బ్ర, సూనఫలాదులును హరిత శుభ లాజములుం
గానిక లిచ్చుచు విప్రులు, మానుగఁ బూజించి రా కుమారోత్తములన్.

1254

తా ॥ అప్పుడు ఆ పట్టణంలోని బ్రాహ్మణులు బహువిధములయిన సువాసనా ద్రవ్యములు, పువ్వులు పండ్లు మొదలగునవి, పచ్చని శుభాక్షతలను కానుకలిచ్చి ఆ కుమారశ్రేష్ఠులైన రామకృష్ణులను పూజించారు.

వ. ఆ సమయంబున నగరద్వారంబు నుండి వచ్చు రాగకారుండగు నొక్క రజకుం గని హరి యిట్లనియె.

1255

తా ॥ పిమ్మట పట్టణ ద్వారం నుండి వస్తూన్న ధూర్తుడైన ఒక చాకలి వానిని చూసి హరి ఇట్లా అన్నాడు:

## 47. శ్రీకృష్టుడు రజకుని చంపి వాయక సుదాము లొసగిన పూజల నంగీకరించి అనుగ్రహించుట

ఉ. విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు; నీ ముడిన్
సుందరధౌత చేలములు శోభిలు చున్నవి; తెమ్ము; నిన్ను మే
లందెదు; నిమ్ము; రాజుదెస నల్లుర; మో రజకాన్వయాగ్రణీ!

1256

తా ॥ "ఓ రజక శ్రేష్టా! మేము మీ రాజు యొక్క అతిథులము. అందుకనే ఈ పట్టణానికి ఇప్పుడు వచ్చాము. మాకు మా గొల్లపల్లెలలో మంచి వస్త్రములు లేవు. కనుక నీ చేతి మూటలో మంచి చలువ వస్త్రాలు మాకియ్యి, శుభాన్ని పొందుతావు."

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె.

1257

శా. ఎట్టెట్రా! మనుజేంద్రు చేలములు మీ కీఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయో ఘృత దధి గ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁగాక గొల్లలకు మీ కెబ్బంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా!

1258

తా ॥ ఆ మాటలకు ఆ రజకుడు కోపించి ఇలా అన్నాడు: "ఓరీ బాలకా! ఎట్లాగా! రాజుగారి వస్త్రాలు మీకు ఇచ్చుట ధర్మమా! ఈ వస్త్రాలు కట్టుకోవడానికి మీరు తగుదురా! పాలు, నేయి, పెరుగు, అన్నములు తినుట చేత మత్తులై ఇలా మాట్లాడటం సరిపోయింది. గొల్లవాండ్రైన మీకు ఇటువంటి మాటలు ఆడటానికి నోరెట్లా వస్తోంది? అయ్యో! కంసుని కోపం చేత ప్రాణాలు

పోగొట్టుకుంటావు.

క. మా రాజుసొమ్ముఁ గైకొన, నే రాజులు వెఱతు; రింత యెల్లిదమే నీ;
కీ రాజరాజగృహమున, నీ రాజసమేల? గొల్ల! యేఁగుము తలఁగన్.

1259

తా ॥ గొల్లపిల్లవాడా! మా రాజుగారి సొమ్మును ఇతర రాజులు ఎవరూ తీసుకోవడానికి భయపడతారు. అంత ఎగతాళిగా ఉందా నీకు? రాజులకు రాజైన ఈ కంసుని ఇంటిలో నీ రాజసం ఎందుకు చూపుతావు? తొలగిపో!"

వ. అనిన విని రోషించి.

1260

క. ఘోరకరాగ్రతలంబున, ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం
బౌరుల గుండెలు వగులఁగ, వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్.

1261

తా ॥ ఆ విధంగా అన్న రజకుడి మాటలకు గోపాలునికి కోపం వచ్చింది. ధీరుడైన కృష్ణుడు పురజనుల హృదయాలు అదిరేలా, వీరరసంతో, పొగరుబోతు, మదం వలన అవివేకి అయిన ఆ చాకలి వానిని తన ముంజేతితో తల తెగి క్రిందపడేటట్లు కొట్టాడు.

వ. ఇట్లు భగ్నుండైన రజకుని జూచి వానివారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ.

1262

తా ॥ ఇలా తల తెగి పడిన చాకలి వానిని చూసి, వాడి చుట్టాలు భయంతో వస్త్రములను విడిచిపెట్టి పరుగెత్తారు. అంతట రామకృష్ణులు వారికి కావలసిన వస్త్రములను ధరించి కొన్ని

వస్త్రాలను తమ వెంట వచ్చిన గొల్లలకు ఇచ్చి బయలుదేరారు.

క. అంతట నొక వాయకుఁ డా, క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా
త్యంత మృదుపటాభరణము, లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్.

1263

తా ॥ అటు పిమ్మట ఒక సాలెవాడు ఆ దారిలో వస్తున్న రామకృష్ణులను చూసి పలు వన్నెలు కలిగి కంటికి ఇంపుగా ఉండే వస్త్రాభరణాలను వారు మెచ్చే విధంగా మిక్కిలి సంతోషంతో ఇచ్చాడు.

శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం
గారోదంచిత దిగ్గజేంద్ర కలభాకారంబులం బొల్చి రా
శూరుల్, మాధవుఁ డంత వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుఁడై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాది సంధాయియై.

1264

తా ॥ శూరులైన ఆ రామకృష్ణులు దయతో ఆ వస్త్రాలను గైకొని అలంకరించుకొన్నారు. ఆ అలంకారం చేత దిగ్గజశ్రేష్ఠములైన ఏనుగుగున్నల ఆకారంతో ఒప్పారు. అంతట మాధవుడు సాలెవాడు చేసిన శుశ్రూష చేత మిక్కిలి ప్రీతిని పొంది తన సారూప్యాన్ని, సంపదని, ఐశ్వర్యాన్ని అనుగ్రహించాడు.

వ. అంత నా రామకృష్ణులు సుదాముండను మాలాకారు గృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరు లయిన వారలకుఁ దాంబూల కుసుమగంధంబు లొసంగి యిట్లనియె.

1265

తా ॥ అటుపిమ్మట రామకృష్ణులు పూలదండలు కట్టే సుదాముడు అనే మాలాకారుని ఇంటికి వెళ్ళారు. అతడు వెంటనే లేచి మ్రొక్కి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చాడు. అనుచరులతో కూడిన ఆ రామకృష్ణులకు తాంబూలము, పువ్వులు, గంధము ఇచ్చి ఇలా అన్నాడు:

ఉ. పావన మయ్యె నా కులము; పండెఁ దపంబు; గృహంబు లక్ష్మికిన్
సేవిత మయ్యెఁ; నిష్టములు సేకుఱె: విశ్వనిదానమూర్తులై
భూవలయంబు గావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే
నే విధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగఁ జెప్పరే!

1266

తా ॥ “ఓ మహాపురుషులారా! లోకములకు ఆదికారణ మూర్తులై ఈ భూమిని ఏలుటకుగాను ఇట్లు మనుష్యాకృతులతో ఉదయించిన మీరు వచ్చినందుకు నా వంశం పావనమైంది. నా తపస్సు ఫలించింది. నా ఇల్లు లక్ష్మీదేవికి ఆశ్రయమైంది. నా కోరికలన్నీ సిద్ధించాయి. నేను మీ సేవకుడను. ఏ పనులు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? సెలవిచ్చి నన్ను మన్నించండి.”

వ. అని పలికి.

1267

క. దామోదరరాముల కు, ద్దామ యశోహసిత తుహినధాములకు వధూ
కాములకుఁ దెచ్చియిచ్చె సు, దాముఁడు ఘనసురభి కుసుమదామము లధిపా!

1268

తా ॥ అని పలికి... చంద్రుని పరిహసించే స్వచ్ఛమైన కీర్తిగలవారు, మగువల పాలిటి మన్మథులు అయిన బలరామకృష్ణులకు సుదాముడు మంచి పరిమళముకల పూలదండలను తెచ్చి ఇచ్చాడు.

క. వారును మాలికుఁ డిచ్చిన, భూరి కుసుమ దామములను భూషితులై 'నీ
కోరిన వర మిచ్చెద' మని కారుణ్యము సేయ నతఁడు గని యిట్లనియెన్.

1269

తా ॥ వారు సుదాముడు ఇచ్చిన విశేషములైన పూలదండల చేత అలంకరింపబడిన వారై వాని యందలి దయచేత, "నీకేం వరం కావాలో కోరుకో! దానిని ఇస్తాం!" అడుగుమనే సరికి వాడిట్లా విన్నవించాడు:

క. 'నీ పాదకమల సేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును, దాపసమందార! నాకు దయసేయఁ గదే!

1270

తా ॥ "తపస్వులకు కల్పవృక్షం వంటివాడా! కృష్ణా! నీ పాదపద్మములయందలి భక్తియు, నీ పాదాలను అర్చించు వారితోడి స్నేహమును, ప్రాణులయందు మిక్కుటమైన దయయును కలిగి ఉండునట్లుగా నన్ను అనుగ్రహించు."

వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుం దమ్మాలికునకు బలాయుఃకీర్తిసంపద లొసంగి వాని గృహంబు వెడలి రాజవీథిం జనిచని.

1271

తా ॥ అని సుదాముడు ప్రార్థించేసరికి, అవి అన్నీ ఇచ్చి ఇంకా కృష్ణుడు వానికి బలము, ఆయువు, కీర్తి సంపదలు, సమృద్ధిగా కలుగునట్లు వరమిచ్చి వాని ఇంటి నుండి బయలుదేరి రాజవీథిలో సాగిపోయారు.

క. ఆ నలినాక్షుఁడు గాంచెను, నానాలేపముల భాజనము సేకొనుచుం
బూని చనుదెంచు దానిని, నానన రుచి నిచయ వినమితాబ్జం గుబ్జన్.

1272

తా ॥ ఆ కృష్ణుడు రాచబాటలో బహువిధములైన లేపనముల పాత్రను చేతపట్టుకుని తనకు ఎదురుగా వస్తున్న కుబ్జను చూసాడు. ముఖకాంతుల చేత కమలములను అణగత్రొక్కునదైనా కుబ్జది వంకర కలిగిన మరుగుజ్జు ఆకారం.

వ. కని యిట్లనియె.

1273

తా ॥ ఆమెను చూసి ఇట్లా అన్నాడు:

క. 'ఎవ్వరిదానవు? లేపము, లెవ్వరికిం గోరికొనుచు నేఁగెదు? నీ పే
రెవ్వతె' మా కి మ్మిన్నియు, నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా!'

1274

తా ॥ "ఓ పద్మాక్షీ! నువ్వు ఎవరిదానవు? నీ పేరేమిటి? ఎవరికి ఇవ్వవలెనని ఈ పరిమళ ద్రవ్యాలను తీసుకొని పోతున్నావు? ఇవన్నీ మాకు ఇచ్చితివా, నీవు చక్కగా ప్రకాశిస్తావు."

వ. అనిన న య్యబల యిట్లనియె.

1275

ఉ. చక్కని వాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిన్
జక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర! త్రివక్ర యండ్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మల లేపన విద్యదాన; నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే?

1276

తా ॥ ముకుందుని పలుకులకు ఆ ముగుద ఇలా అన్నది: "ఓ సుందరాంగా! నువ్వు అందగాడవు అయితే కావచ్చు. నన్ను నీ సరసపు మాటలచేత నొప్పించకు. లోకంలో ఉండేవారికందరికి నీవంటి చక్కదనము ఎక్కడనుండి వస్తుంది? నేను కంసుని పరిచారికను. నన్ను త్రివక్ర అని అంటారు. పరిశుద్ధమైన లేపనములను కూర్చునట్టి విద్యగలదానను. నన్ను మహారాజు చాలా మెచ్చుకుంటాడు. కావలసిన పక్షంలో మీరు కూడా ఈ విలేపనాలను ఒప్పిదంగా పూసుకోండి."

క. అని పలికి యా కుమారుల, తనువులు నగవులును, వీక్షితమ్ములు మాటల్
తన చిత్తముఁ గరఁగించిన, ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్.

1277

తా ॥ ఆ త్రివక్ర అట్లు పలికినదై, ఆ బలరామకృష్ణుల రూపములు, నవ్వులు, చూపులు, మాటలు తన మనస్సును కరిగింపగా వారికి మైపూతలను ప్రీతితో ఇచ్చింది.

సీ. ఇ వ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు, లన్నియు, దాను దేహమున నలఁది
కొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకల, యొడలు సక్కఁగ నొత్తి యనుపఁ దలఁచి
తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి హస్తాంగుళ ద్వయ మబల గౌద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి, నెత్తిన వక్రత లెల్ల మాని

ఆ. చక్కనైన చిత్తజన్మబాణము క్రియఁ, గొమరు మిగిలి పిఱుఁదు గుచయుగంబు
సొంపు సేయఁ దరుణి సుందరమూర్తియై, కమలనయనుఁ జూచి కాంక్షతోడ.

1278

తా ॥ ఈ విధంగా కృష్ణుడు ఆమెనుండి కలాపములను పుచ్చుకొని, తాను తన అన్న అయిన బలరాముడును పూసుకొని ఆమె ఎడల ప్రసన్నమైనాడు. ఆమె కురూపమును పోగొట్టదలచి ఆ కుబ్జ యొక్క అడుగులమీద తన అడుగులు ఉంచి త్రొక్కిపట్టి, ఆమె

నడుముక్రింద రెండు చేతుల బొటన వ్రేళ్ళను విరివిగా చాచి దేహమును పైకి ఎత్తాడు. దానితో దేహం నందలి వంకరలన్ని తీరగా మన్మథ బాణములా మిక్కిలి కోమలమైన దేహంతో చక్కని రూపముకలదై, కోరికలు అతిశయింపగా కృష్ణునితో ఇలా అన్నది:

క. 'వేంచేయుము నా యింటికిఁ, బంచశరాకార!' యనుచుఁ బై కొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని, పంచాశుగ బాణజాల భగ్నహృదయయై.

1279

తా ॥ "మన్మథాకృతి కల శ్రీకృష్ణా! నీవు నా ఇంటికి రా!" అని మన్మథ బాణములచేత పీడింపబడిన మనస్సుగలదై కృష్ణుని పై ఉత్తరీయాన్ని పట్టి లాగింది.

క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు, రాముని వీక్షించి నగుచు రాజానన! మ
త్కామితముఁ దీర్చి పిదపన్, నీ మందిరమునకు వత్తు నేఁ దలుగకుమీ!

1280

తా ॥ తనను త్రివక్ర కామించినదై, తన వస్త్రపు కొంగును పట్టి లాగగా, కృష్ణుడు బలరాముని చూసి నవ్వుతూ, "ఓ చంద్రముఖీ! నేను నేడు నీ ఇంటికి రాకపోతినని కోపింపకుము. నా పని పూర్తి అయిన పిమ్మట నీ ఇంటికి వస్తాను. ఇప్పుడు అలుక చెందకు" అని పలికాడు.

వ. అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జని చని తాంబూల మాలికా గంధంబులును బహువిధంబు లయిన కానికలును బౌరు లిచ్చినం బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు.

1281

తా ॥ ఈ విధంగా త్రివక్రను వీడుకొలిపి, కృష్ణుడు అంగళ్ళవీథిని వెళుతూ ప్రజలు ఇచ్చే

తమలపాకులు, పూవులు, గంధములు, కానుకలు పుచ్చుకొనుచు ధనుశ్శాలకు వెళ్ళారు.

క. సురరాజు వింటికైవడి, గురుతరమై భూరి వీరగుప్తంబయి దు
స్తరమైన విల్లు పొడగని, నరులు వల దనంగ బిట్టు నగి వికసితుఁడై.

1282

తా ॥ ఇంద్రుని విల్లువలెనే మిక్కిలి గొప్పదిగా, మహావీరులచే రక్షింపబడుతున్న అసాధ్యమగు వింటిని చూసి అచ్చటి కావలివారు దానిని తాకవద్దని కృష్ణునికి చెబుతూంటే, మహోల్లాసంతో గట్టిగా నవ్వాడు.

శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁదెగన్ శబ్దించుచున్ ధీరతా
సింధుం డాహరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్
చూడఁగా గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించు చందంబునన్.

1283

తా ॥ అట్లు ఉల్లాసంతో, ధైర్యసముద్రుడైన శ్రీకృష్ణుడు తన వారందరు మేలు మేలు అని శ్లాఘింపగా, ఎడమ చేతితో ఆ వింటిని ఎత్తి అల్లెత్రాడు ఎక్కించి కొంచెం మ్రోగునట్టుగా లాగి, విడిచి జనులందరు చూచుచుండగనే మదపుటేనుగు చెరకుగడను విరిచినట్లు అలక్ష్యంగా విరిచి వేశాడు.

క. కోదండ భంగనిర్గత, నాదము వీనులకు భీషణం బయి యాశా
రోదోంతరములు నిండుచు, భేదించెన్ భోజవిభుని బింకము నధిపా!

1284

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! ఆ విల్లు విరుగుట వలన కలిగిన ధ్వని అష్టదిక్కులందును

భూమ్యాకాశ మధ్యప్రదేశముల యందు నిండి భయంకరమై కంసుని యొక్క శౌర్యమును భేదించింది.

వ. అప్పుడు.

1285

ఉ. 'అద్ధిర! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంక లేక నేఁ
డుద్దవిడిన్ సహింపఁ దగ దుగ్రతఁ బట్టుద' మంచుఁ గ్రుద్ధులై
గ్రద్దన లేచి తద్ధనువు కావలివా రరుదేర వారి న
య్యిద్దఱుఁ గూడి పట్టి మడియించిరి కార్ముకఖండ హస్తులై.

1286

తా ॥ అంతట ఆ వింటికి కావలి ఉన్నవారు, "ఔరా! ఈ పిల్లవాడు కొంచెమైనా భయంలేక మహా శౌర్యంతో రాజధనుస్సును విరిచాడు. ఇక ఈ దుర్మార్గాన్ని సహించకూడదు. పోనివ్వకుండా పట్టుకొందాము" అని కోపంతో వారు పైకి రాగా, వారిని రామకృష్ణులిద్దరు ఆ విరిగిన ధనస్సు శకలాలతో కొట్టి చంపారు.

వ. అట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి వెడలి విడిదలకుం జని రంత.

1287

తా ॥ ఈ విధంగా రామకృష్ణులు మధురాపురంలో విహరించి తమ విడిదింటికి వెళ్ళిపోయారు.

## 48. సూర్యాస్తమయ చంద్రోదయముల వర్ణనము

మ. గగనారణ్య చరాంధకార గజముం గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టన్ గమకించి మ చ్చిదుటకై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకంబనఁగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడ పశ్చిమమహా ధాత్రీధరేంద్రంబునన్.

1288

తా ॥ ఆకాశమంతా అడవి అనుకుంటే, ఆ అడవిలో చీకటి అనే ఏనుగును పట్టేందుకు కాలం అనే బోయవాడు వచ్చాడు. వస్తూ, ఆ చీకటి ఏనుగుకి మచ్చు పెట్టడం కోసం మామిడి చిగుళ్ళతో కూర్చిన చెండు తెచ్చాడా అన్నట్లుగా, మందగించిన కాంతితో, పడమటి పర్వతం మీద సూర్యుడు కానవస్తున్నాడు.

క. తరుణుఁడగు శీతకరునిన్, మరగి వియల్లక్ష్మి దన్ను మాని ముదుకఁడున్
ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన, కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా!

1289

తా ॥ ఓ రాజా! అప్పుడు ఆకాశలక్ష్మి అనే స్త్రీ, వయసులో ఉన్నవాడు, చల్లని కిరణములు అనే చేతులు కలవాడు అయిన చంద్రుని యందు మక్కువపడి, ముసలివాడు, వేడి అయిన కిరణములనే హస్తములు కలవాడు అయిన తనను విడిచి పడద్రోసిన విధంగా సూర్యుడు పడమటి కొండల్లో అస్తమిస్తున్నాడు. ఆ సమయంలో సూర్యాస్తమయం ఎలా ఉందో వర్ణిస్తూ వస్తున్నారు.

క. కళలు కలుగుఁగాక కమల తోడగుఁగాక!, శివుని మౌళిమీఁదఁ జేరుఁగాక!
నన్యు నొల్లఁ దపనుఁడైన మత్పతి యని, సాధ్విభంగిఁ గమలజాతి మొగిడె.

1290

తా ॥ 'షోడశ కళలనెడు విద్యలు ఉంటే ఉండు గాక! లక్ష్మీదేవికి తోడపుట్టిన వాడు అయితే అగుగాక! శివుని మౌళియందు చేరుగాక! అన్యుడైన చంద్రుని మేము ఒల్లము. తపింపచేయువాడైనను, మా భర్త సూర్యుడే' అని పతివ్రతవలె కమలముల సమూహం ముకుళించసాగాయి.

క. సుందరసాయంసంధ్యా, వందన విప్రార్ఘ్యతోయ వజ్రహతోద్య
న్మందేహాసుర రక్త, స్యందము క్రియఁ గెంపుసొం పెసఁగె నపరదిశన్.

1291

తా ॥ మనోహరంగా ఉన్న సాయం సమయంలో, సంధ్యావందనము చేయునట్టి బ్రాహ్మణుల అర్ఘ్యప్రదాన జలములనెడు వజ్రాయుధములచేత నరకబడిన మందేహ రాక్షసుల దేహములందుండి పుట్టి ప్రవహించుచున్న నెత్తురో అన్నట్లుగా సంధ్యారాగం పడమటి దిక్కునందు వ్యాపించింది.

ఆ. భూమి నుండి మింటఁ బూర్ణమై కర్కట, మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధియందుల తుంపురు, లనఁగ జుక్క లొప్పె నాకసమున.

1292

తా ॥ శ్రీ విష్ణుదేవుని యొక్క కీర్తి అనెడు పాలసముద్రము భూమి అంతా నిండి, ఆకాశమందు కుడా వ్యాపింపగా, కర్కటము, మకరము, మీనము అయిన రాసులనెడు వీని సమూహముల చేత మహిమ నొందినది కాగా అందలి తుంపురులో అనునట్లుగా నక్షత్ర సమూహాలు ఆకాశంలో ప్రకాశిస్తున్నాయి.

క. ఎల్లదిశలు నిండిన శ్రీ, వల్లభు గుణమహిమ బ్రహ్మ వాసించుటకై

చల్లిన మృగమద మనఁగా, వెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్.

1293

తా ॥ ఎల్ల దిక్కుల యందు నిండిన శ్రీ విష్ణుమూర్తి యొక్క గుణగౌరవము పరిమళించునట్లుగా బ్రహ్మ కస్తూరిని అంతటా వెదచల్లాడు కాబోలు అన్నట్లు భూమ్యాకాశ మధ్యప్రదేశమంతా చీకటి దట్టముగా వ్యాపించింది.

క. ఆ చీఁకటి వెనుతగిలినఁ, బ్రాచీదిశనుండి గంతుఁ బరువున రవి భ

ర్మాచలము మలఁక త్రోవను, వే చనియెంగాక నిలిచి విఱుగక యున్నే?

1294

తా ॥ చీకటి తనను వెంబడించి తరుమగా భయపడి, సూర్యుడు తూర్పుదిక్కునందుండి దాటుచు పరుగెత్తుట చేత మేరుపర్వతము యొక్క వంకర దారిని బట్టి వేగంగా వెళ్ళాడు. అట్లుకాక ఎదిరించి నిలిస్తే అపజయాన్ని పొందక పోవునా!

ఉ. మీకును వైరి; యెప్పుడును మిక్కిలి మాకును వైరి; రాజు దో

షాకరుఁ; డింక వచ్చు జలజాతములార! మదీయ బాలురం

జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్కి రా

రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహ కుట్మలంబులన్.

1295

తా ॥ ఓ కమలములారా! దోషములకు తావైన చంద్రుడు ఎల్లప్పుడు మాకు, మీకూ పగవాడే! అతడు దోషాకరుడు (దోష అనేపేరు గల రాత్రిని చేయువాడు) కనుక ఆ చంద్రుడు ఇక తప్పక రాగలడు. అప్పుడు మాకు మా బిడ్డలను కాపాడుకోవటం కష్టతరంగా ఉంటుంది. కనుక మీలో చేర్చుకొని ఉండండి అని తమ బిడ్డలను దాచి యుంచిందో అనునట్లుగా తామరమొగ్గలలో చిక్కుకొన్న తుమ్మెదలు తప్పించుకొని బయటకు రాలేక రాత్రికాలమంతా

ముకుళించిన కమలములలోనే ఉన్నాయి.

సీ. ప్రాచీదిశాంగనా ఫాలతలంబున, దీపించు సిందూరతిలక మనఁగ
దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప, దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ
గగనతమాల వృక్షము తూర్పుకొమ్మను, లలితమై మెఱయు పల్లవ మనంగఁ
ఆ. దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ, గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక, ప్రీతికరుఁడు జారభీతికరుఁడు.

1296

తా ॥ ఇప్పుడు చంద్రోదయాన్ని వర్ణిస్తున్నారు. చకోరాలు సంతోషించేటట్లు, విటులకు, దొంగలకు భయం కలిగేటట్లు చంద్రుడు ఉదయించాడు. తూర్పుదిక్కు అనే అంగన నొసట పెట్టుకున్న సిందూరపు బొట్టులా ఉన్నాడు. వియోగుల ధైర్యమనే తీగను తెగకోయడానికి మన్మథుడు చేత ధరించిన కొడవలిలా ఉన్నాడు. కాలమనే బోయవాడు చీకటి అనే మృగంపై కోపించి, నరకడానికై ఎత్తిన కత్తిలా ఉన్నాడు. ఆకాశమనే చీకటి మ్రాను యొక్క తూర్పు కొమ్మను లలితంగా ప్రకాశిస్తున్న చిగురులా ఉన్నాడు. అతడిని చూసి కలువలు వికసించాయి, సముద్రం ఉప్పొంగింది, దొంగలు భయపడసాగారు.

క. దర్పితతారాధిప పరి, సర్పిత కిరణౌఘమిళిత సకలదివంబై
యేర్పడి కమలభవాండము, గర్పూరపుఁ గ్రోవి భంగిఁ గనుపట్టె నృపా!

1297

తా ॥ ఓ రాజా! చంద్రుడు చక్కగా ప్రకాశింపగా, వెన్నెల ఎల్లదిక్కుల యందును వ్యాపింపగా బ్రహ్మాండమంతయు కర్పూరముచేత నిండిన భరిణవలె ప్రకాశించింది.

క. ఆ రేయి గోపయుతులై, క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి యిష్ట వి, హారంబుల నప్రమత్తులై యుండి రిటన్.

1298

తా ॥ ఆ రాత్రి బలరామకృష్ణులు గొల్లవారితో కూడి పాలబువ్వతో భోజనం చేసి, మనస్సులో కంసుని ప్రయత్నాలన్నీ తెలిసిన వారు కాబట్టి ఇష్ట విహారాలతో అప్రమత్తులై అక్కడ గడిపారు.

క. తన పురికి రామకృష్ణులు, సనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా
ధనువు గదిసి విఱుచుటయును, విని కంసుఁడు నిదుర లేక విహ్వలమతియై.

1299

తా ॥ రామకృష్ణులు తన పట్టణానికి వచ్చి తన సేవకులను చంపి, మహాధనువును విరిచారన్న వృత్తాంతాన్ని కంసుడు విన్నాడు. దానితో కంటికి నిద్ర పట్టక కలవర పాటుతో ఉన్నాడు.

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి ప్రాణఘోషము వినఁబడక డిందెఁ
దోయాదికములందుఁ దొంగిచూచిన యంతఁ దల గానరా దయ్యెఁ దనువుమీఁదఁ
గరశాఖ నాసికాగ్రంబుపై నిడి చూడ గ్రహతారకలు రెండుగా నగపడె
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని నీడ సరంధ్రమై నేలఁ దోఁచె

ఆ. నడుగుజాడ దృష్టమౌట లే దయ్యెను, దరువులెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు దగ్గఱ, బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి.

1300

తా ॥ కంసునికి చావు సమీపించినందున, చెవి రంధ్రములు మూసినప్పుడు లోపలి

ప్రాణవాయువుల సంచార ధ్వని వినపడలేదు. నీళ్ళు మొదలైన వాటిలో తన ప్రతిబింబాన్ని చూచునప్పుడు ఆ ప్రతిబింబము యొక్క తల కనబడలేదు. ముక్కుమొనను వ్రేలుంచి పైకి చూడగా, గ్రహనక్షత్రములు రెండేసిగా కనబడసాగాయి. వెలుతురులో తన నీడను చూడగా ఆ నీడనడుమ రంధ్రాలు కనపడ్డాయి. తాను నడిచిన అడుగుల జాడ చూడగా కనుపించలేదు. కనిపించే వృక్షాలన్నీ బంగారు వృక్షాలుగా తోచాయి. కాలమృత్యువు సమీపించినందున బుద్ధి కలత చెందింది.

క. గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ, బరిరంభించుటయు నగ్నభావుఁ డవుటయున్
శిరమునఁ దైలము వడుటయు, ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్.

1301

తా ॥ మరియు ఆ కంసుడు విషం తిన్నట్టుగా, శవమును కౌగిలించుకొన్నట్లుగా, దిగంబరుడైనట్లు, తలపై నూనె అంటుకున్నట్లుగా, గాడిదపై ఎక్కినట్లుగా కలగన్నాడు.

వ. మఱియు రక్త కుసుమ మాలికాధరుండై యొక్కరుండును నెక్కడ దేనియుం జనుచున్న వాఁ డ నని కలగాంచి మరణహేతుక భ్రాంతిఁ జింతాక్రాంతుండై నిద్రఁ జెందక వేగించుచున్న సమయంబున.

1302

తా ॥ అంతేగాక అతడు ఎర్రపువ్వుల దండను ధరించి ఒంటరిగా ఎక్కడికో వెళుతున్నట్లుగా కలగని ఇవన్నీ మరణసూచకాలు అని భయపడి మిక్కిలి విచారముతో కలత చెందుతూ నిద్రపట్టక ఎప్పుడు తెల్లవారుతుందా అని గడియలు లెక్కపెట్టసాగాడు.

## 49. సూర్యోదయ వర్ణనము

క. అరుణ హరినఖర విదళిత, గురుతిమిరేభేంద్రకుంభకూట వినిర్ము
క్త రుధిరమౌక్తికముల క్రియ, సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్.

1303

తా ॥ సూర్యుడు అనెడు సింహం, కిరణములనెడు గోళ్ళచేత పగులగొట్టగా గొప్ప చీకటి అనెడు ఏనుగు యొక్క కుంభస్థలముల నుండి రాలుచున్న నెత్తుటితో కూడుకొన్న ముత్యాలో అనునట్లు తూర్పు దిక్కున ఉదయ రాగంతో కూడిన నక్షత్రాలు మెరిసాయి.

సీ. పౌలోమి దన బాలు పాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపు బంతి యనఁగ
నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటు కాలజాంఘికుచేతి ఘంట యనఁగ
ఘనజంతు జీవిత కాలరాసుల విధి కొలువ నెత్తిన హేమకుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచో ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ

తే. గోక తాపోపశమ దివ్యఘుటిక యనఁగఁ, బద్మినీకాంత నోములఫల మనంగ
మూఁడుమూర్తుల సారంపు ముద్ద యనఁగ, మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె.

1304

తా ॥ సూర్యబింబం ఉదయపర్వతం మీద కానవచ్చింది. ఆ బింబం ఇంద్రుని భార్య అయిన శచీదేవి తన కుమారుని పాన్పుమీద ఏర్పరచిన పగడపు బంతివలె ఉంది. ప్రాణుల యొక్క ఆయువు అనే ధనం కరిగించి వేసే కాలం అనే శంఖపు పని వాని చేతిలో ఉండే గంటలా ఉంది. విశేషమైన ప్రాణులయొక్క ఆయుష్యలనెడి ధాన్యపు రాసులను కొలుచుటకై బ్రహ్మ ఎత్తిన బంగారు కుండలా ఉంది. పడమటి దిక్కు అనెడి స్త్రీ అలంకరించుకొనునప్పుడు చూసుకొనుటకై ఎదుట ఉంచుకొన్న అద్దంలా ఉంది. చక్రవాక పక్షుల తాపాన్ని పోగొట్టే సిద్ధఘుటికయో అన్నట్లుంది. త్రిమూర్తుల యొక్క సారమైన ముద్దయా అన్నట్లుంది.

క. వచ్చెం జల్లని గాడ్పులు, విచ్చెం గమలములు; దమము విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము, మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్.

1305

తా ॥ అలా సూర్యుడు ఉదయించే సరికి చల్లని గాలి వీచింది. తామరలు వికసించాయి. చీకటి తొలగి బిలాలలో ప్రవేశించింది. తుమ్మెదలు తామరల యందలి మకరందాన్ని పానం చేసి ఆనందించాయి.

క. సంకాశితోదయాచల, పంకజసఖ కిరణరాగ పరిపూర్ణంబై
పంకేరుహ గర్భాండము, కుంకుమ సలిలంపుఁ గ్రోవి కొమరున నొప్పెన్.

1306

తా ॥ చక్కగా వెలిగే ఉదయ పర్వత మందలి సూర్యుని కిరణముల ఎర్రని కాంతిచేత నిండుకొన్న బ్రహ్మాండము వసంతం పోసి నిండించిన బుడ్డివలె అందగించింది.

వ. తదనంతరంబ.

1307

సీ. పాషాణ వల్మీక పంకాదిరహితంబు మృదుల కాంచననిభ మృణ్మయంబు
గమనీయ కస్తూరికా జలసిక్తంబు బద్ధచందనదారు పరివృతంబు
మహనీయ కుసుమదామ ధ్వజతోరణ మండితోన్నత మంచమధ్యమంబు
బ్రాహ్మణ క్షత్త్రాది పౌరకోలాహలం బశ్రాంత తూర్యత్రయాంచితంబు

ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబునై, పుణ్యపురుషు మనముఁ బోలి కంస
సైన్య తుంగ మగుచు సంతుష్ట లోకాంత, రంగమైన మల్లరంగ మొప్పె.

1308

తా ॥ మహారాజైన కంసుడు మల్లయుద్ధానికి సిద్ధం చేయించిన రంగము రాళ్ళు, పుట్టలు అడుసు మొదలైనవి లేకుండా ఉంది. బంగారు వన్నెగల మెత్తని మట్టిచేత పూయబడి ఉంది. మనోజ్ఞమైన కస్తూరి నీళ్ళచేత తడుపబడి ఉంది. మంచి గంధపు కర్రల చేత కట్టబడిన కంచె ఉంది. గొప్ప గొప్ప పూల దండలు, ధ్వజస్తంభాలు, తోరణాలచేత అలంకరింపబడి ఉంది. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలయిన పురజనుల కలకల ధ్వనులతో కోలాహలంగా ఉంది. ఎడతెగక మ్రోగుతూన్న నృత్యగీత వాద్య ధ్వనులతో రమణీయంగా ఉంది. నిర్మలమై మిట్టపల్లములు లేక ముండ్లు లేక చక్కబరుపబడి పుణ్యపురుషుని యొక్క మనస్సువలె మాలిన్యం లేనిదై, సమమై లోకులందరికీ సంతోషం కలుగచేయునట్టిదై శోభిల్లింది. కంసుని సేనలచేత ఘనత వహించి ప్రకాశించునట్టిదై జనుల హృదయాలకు సంతోషం సమకూరుస్తున్నది.

క. ఆ మల్లరంగపరిసర, భూమిస్థిత మంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై, భూమీశులు గొలువ నుండెఁ బొక్కుచు నధిపా!

1309

తా ॥ ఓ రాజా! ఆ మల్లరంగ సమీపంలో ఉన్నతాసనముపైన కంసుడు కూర్చుని తనకు పూజ్యులయిన మంత్రులతో కూడి సామంతులు సేవిస్తూ ఉండగా, శ్రీకృష్ణుడు ఎప్పుడు వచ్చునో, ఎక్కడ చంపునో అనే సంతాపం చేత లోపల తపిస్తూ కూర్చున్నాడు.

మ. సకలాంభోనిధి మేఖలావహనముం జాలించి యేతెంచు నా
గ కులాగంబుల భంగి నొప్పుచుఁ దగం గైసేసి చాణూర ము
ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులన్ సేవించుచున్ రంగ ధా
త్రికి నేతెంచిరి తూర్య ఘోషముల నుద్రేకం బనేకంబుగన్.

1310

తా ॥ అప్పుడు చాణూరుడు, ముష్టికుడు, కూటుడు అనే మల్లులు, శలుడు, కోసలుడు

అనే తమ ఆచార్యులను సేవిస్తూ వాద్యధ్వనులచేత తమ ఆధిక్యత హెచ్చుగా వచ్చారు. సమస్తమైన సముద్రములు మొలనూలుగా గల భూమిని మొయ్యటం మానేసి వస్తూన్న దిగ్గజాలలాగ కుల పర్వతాలలాగ ఉన్నారు వారు.

క. నందాదులైన గోపకు, లందఱుఁ జని కానుకలు సమర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ, జెంది మహామంచముల వసించిరి వరుసన్.

1311

తా ॥ అప్పుడు నందుడు మొదలైన గొల్లలందరూ తాము తెచ్చిన కానుకలను రాజైన కంసుని వద్దకు గొనిపోయి ఇచ్చి, అతని ఉత్తరువుల ప్రకారం తమ తమ ఆసనాలపై వరుసగా కూర్చున్నారు.

వ. అంత రామకృష్ణులు నలంకృతులై మల్ల దుందుభి నినదంబు విని సందర్శన కుతూహలంబున.

1312

తా ॥ అంతట బలరామకృష్ణులు కూడా అలంకరించుకొన్నవారై, మల్లరంగము నందలి పెద్ద నగారా మ్రోత వినబడగానే, దానిని చూడాలని ఉబలాటపడ్డారు.

క. ఓడక రంగద్వారము, జాడం జని వారు కనిరి సమద కువలయా
పీడంబున్ భిన్నపరా, క్రీడంబుం బ్రమదకంటకిత చూడంబున్.

1313

తా ॥ ఆ రామకృష్ణులు కొంచెమైనా భయంలేకుండా మల్లరంగ స్థల ద్వారము దగ్గరకు ప్రవేశించారు. అక్కడ శత్రువులను ఛేదించుటయే క్రీడగా ఉన్నదీ, లోకులందరినీ ముల్లులా వేధించే కుంభస్థలములు కలది అయిన కువలయాపీడము అనే మదపుటేనుగును చూసారు.

వ. కని తత్కరిపాలశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాద గంభీర భాషణంబుల రిపుభీషణుండగు హరి యిట్లనియె.

1314

తా ॥ దానిని పాలించు మావటీవారిలో శ్రేష్ఠుడయిన అంబష్ఠుడు అనే వానితో, శత్రువులకు భయం కలిగించే వాడయిన శ్రీకృష్ణుడు ఉరుమువలె గంభీరమైన మాటలతో ఇట్లా అన్నాడు:

## 50. శ్రీకృష్ణుడు కువలయాపీడం అనే ఏనుగును వధించుట

శా. ఓరీ! కుంజరపాల! మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు; త్రిప్పు; మరలం బ్రేరేఁచినన్ నిన్ను గం
భీరోగ్రాశని తుల్యముష్టి హతులన్ భేదించి నేఁ దంతకుం
జేరం బుత్తు మహత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్.

1315

తా ॥ "ఓరి! మావటివాడా! నీవు నీ మదపుటేనుగును మా వైపుకు ప్రేరేపించవలదు. వెనుకకు త్రిప్పు. ఒకవేళ ప్రేరేపిస్తే నేడు నిన్ను, నీ ఏనుగును, పిడుగుతో సమానములైన నా పిడికిటి పోట్ల చేత తల పగులగొట్టి యముని పట్టణానికి పంపిస్తాను."

వ. అని పలికి.

1316

ఉ. మించిన కొప్పుఁ జక్కనిడి మేలనఁ బచ్చని చీర కాసె బం
ధించి లలాటకుంతలతతిన్ మరలించుచు సంగరక్రియా
చుంచుతఁ బేర్చి బాలకుఁడు చూచు జనంబులు దన్ను 'బాపురే' ?
యంచు నుతింప డగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్.

1317

తా ॥ అని ఇలా పలికి శ్రీకృష్ణుడు కొప్పు సవరించుకున్నాడు. తన వారందరూ మెచ్చుకొనగా పీతాంబరాన్ని దట్టితో బిగియగట్టాడు. నొసట వ్రేలాడుతున్న వెంద్రుకలను మరలించుచూ, యుద్ధమునందలి పూనికతో విజృంభించి చూసేవారు భళీ అని శ్లాఘింపగా తొండముచేత కొండలను చలింప చేసే కువలయాపీడమును సమీపించాడు.

క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి రాజకుంజర! యంతం
గుంజరమును డీ కొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్.

1318

తా ॥ ఓ రాజా! అంతటు మావటివాడు వెనుదీయక పసివాడను జాలి అయినా లేక, దయలేని వాడగుచు శ్రీకృష్ణుని మీదికి ఏనుగును పురికొల్పాడు.

వ. మఱియు న య్యనేకపం బనేకపపాలక ప్రేరితం బయి, మహావాత సంఘాత సముద్ధూతంబగు విలయకాల కీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవత యెత్తునం, గాలుపోలిక, శమనుని గమనిక, నెదిరి మదసలిల పరిమళ లుబ్ధ పరిభ్రమద్భ్రమర గాయక ఝుంకృతు లహంకృతి సంపాదింపం, గులకుంభినీధర గుహాకుంభ గుంభనంబుగ ఘీంకరించి, రోషభీషణ శేషభోగిభోగ భయంకరంబగు కరంబున శౌరిం జీరి, చీరికిం గొనక, పట్టిన నట్టిట్టు గెంటి, విధుంతుద వదన గహ్వరంబువలన విడివడి యుఱుకు తరణికరణి దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుండై దూఁటి మాటుపడినం గ్రోధబంధురంబై సింధురంబు మహార్ణవమధ్య మంథాయమాన మంథర మహీధరంబు కైవడి జిఱజిఱం దిరిగి, కానక భయానకంబై గాలివెరవునం గని పొంగి చెంగటం బ్రళయదండిదండ ప్రశస్తంబగు హస్తంబు వంచి వంచించి చుట్టిపట్టి పడవేయం గమకించినం జలింపక తెంపున హరి కరి పిఱింది కుఱికి మహారాహువాల వల్లికా కర్షణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి శుండాలంబు వాలంబు లీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతి బాణాసన ప్రమాణదూరంబు బీరంబునం ద్రిప్పివైవ, న వ్వారణంబు దుర్నివారణంబై రణంబున కోహటింపక సవ్యాపసవ్య పరిక్రమణంబుల నవక్రంబై కవిసిన, నపసవ్య సవ్యక్రమంబులఁ దప్పించి, రొప్పి కుప్పించి యెదుర్కొనినఁ గర్కశుం డయి, మేచకాచల తుంగ శృంగ నిభంబగు కుంభికుంభంబు చక్కటివ్రక్కలై చెక్కలెగయ దురంతకల్పాంత జీమూత ప్రభూత నిర్ఘాత నిష్ఠురంబగు ముష్టి సారించి యూఁచి పొడిచినం

దద్వికీర్ణపూర్ణ రక్త సిక్త మౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగ రక్తతారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నులవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి, మ్రొగ్గక దిగ్గన న గ్గజంబు లేచి, చూచి, త్రోచి, నడచి, సంహారసమయ సముద్రసంఘాత సంభూత సముత్తుంగ భంగ సంఘట్టితం బగు కులాచలంబు క్రియఁ గ్రమ్మఱ న మ్మహాభుజుని భుజాదండంబులవలన ఘట్టితంబై, కట్టలుక ముట్టి నెట్టి, డీకొని ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన, న మ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తి సంగరంబునఁ గరంబొప్పి దప్పింబడక నొప్పించిన, నకుంఠిత కాలకంఠ కఠోర భల్లభగ్నం బగు పురంబు పగిది, జలధిం జటుల ఝంఝానిల వికలంబగు కలంబు కైవడి న మ్మదకలంబు బలంబు దక్కిచిక్కి స్రుక్కువడి లోభికరంబునుం బోలె దానసలిలధారా విరహితంబై, విరహి తలంపునుం బోలె నిరంతర చిత్త జాతవిగ్రహంబై, గ్రహణకాలంబునుం బోలెఁ బరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుం బోలె, భిన్నపుష్కరంబై, పుష్కరవైరి విలసనంబునుం బోలె నభాసిత పద్మకంబై యున్న సమయంబున.

1319

తా ॥ అటు పిమ్మట పలువురు మావటివారు ఆ కువలయాపీడమును పురికొల్పారు. గొప్పగాలి వలన పైకి ఎగసిన ప్రళయకాల జ్వాలలవలె ఆ మత్తగజం త్రుళ్ళి పడుతూ, మృత్యుదేవతవలె, ప్రళయకాల రుద్రుని విధంగా, యముని రీతిగా భయంకర రూపంతో ఎదిరించింది. మదజలం యొక్క పరిమళము నందలి ఆసక్తిచేత తిరుగుచున్న తుమ్మెదల యొక్క ఝంకారములనెడి హుంకారములు అతిశయింపగా, కులపర్వతముల గుహలు ప్రతిధ్వనులిచ్చేటట్లు ఘీంకరించింది. ఆగ్రహావేశాలతో ఉన్న ఆదిశేషుని దేహమువలె భయాన్ని కలుగజేయునట్టి, నిడుపైన తొండముతో, కృష్ణుణ్ణి ఎదిరించి పట్టుకొంది. అతడు అటూ ఇటూ త్రోసి, ఏనుగు పట్టు తప్పించుకొని రాహువు నోటినుండి విడువబడి మీదికి ఎగసే సూర్యుని విధంగా దర్పించి, ఆ ఏనుగు కాళ్ళసందున దూరాడు. కృష్ణుడు కనుపించకపోయే సరికి ఆ ఏనుగు కోపము చేత సముద్రము నడుమ కవ్వముగా చేయబడిన మందర పర్వతము తిరిగినట్లు

గిరగిర తిరిగింది. కృష్ణుణ్ణి చూడ నేరక భయానకంబై ఉంటూ కాలిసైగచేత కనిపెట్టింది. అప్పుడు ఉప్పొంగి, ప్రళయ కాలమందలి యమదండములాగ భయాన్ని పుట్టించే తొండమును వంచింది. కృష్ణుడు సాహసంతో ఏనుగు వెనుక వైపుకు దాటి గొప్పదైన రాహువును పట్టుకున్న గరుత్మంతునివలె ఎగిరాడు. ఏనుగు యొక్క తోకను పట్టుకొని విలాసంగా జాడించి వంద మూరల దూరంలో పడేటట్లుగా గిరగిర త్రిప్పి విసరి వేశాడు.

ఆ ఏనుగు నివారింపరానిదై, యుద్ధమునకు వెనుదీయక, కుడి ఎడమలకు తిరిగి బలహీనత అనెడు లోపము లేనిదై, మళ్ళీ మాధవుడి మీదకు ఉరికింది. కృష్ణుడు కూడా కుడి ఎడమలకు దాటుటచేత దాని దెబ్బ తప్పించుకొని, అదలించి, కుప్పించి, దాటి ఎదుర్కొని కఠినత్వాన్ని అవలంబించాడు. నల్లని కొండ యొక్క పొడుగైన శిఖరాన్ని తలపించే ఆ ఏనుగు కుంభస్థలం బ్రద్దలయ్యేటట్లు, ప్రళయ కాలమందలి మేఘముల వలన పుట్టు పిడుగువలె కఠినమైన పిడికిలితో గ్రుద్దాడు. ఆ ఏనుగు కుంభస్థలం నుండి రాలిన ముత్యాలు నెత్తురుతో కూడి, సంధ్యాకాలమందలి ఎర్రని కాంతి తోడి నక్షత్రములు ప్రకాశించునట్టి ఆకాశంవలె ఆ యుద్ధభూమిని అందగింప చేసింది. అంత భయంకరమైన దెబ్బ తగిలినా ఆ మదగజం అంతటితో నిలువక, ముందరికి మ్రొగ్గి మోకాళ్ళు నేలకు మోవలేచి నాలుగు వైపుల చూసింది. కృష్ణుణ్ణి నెట్టుకొని వచ్చి ప్రళయ కాలసముద్రము నందలి పొడవైన పెద్ద అలల తాకిడికి పడిన కులపర్వతం వలె అతని పిడికిటి పోటుకి గురి అయింది.

మహా కోపముతో కృష్ణుణ్ణి త్రోసుకొని పోయి, ఢీకొని దంతాలతో పొడిచింది. శూరుడైన శ్రీకృష్ణుడు తన చేతిగురి తప్పకుండా తొండముతో పెనవేసుకొని, ఏనుగును అలసిపోయేటట్లు బాధపెట్టాడు. దానితో అది శివుని బాణం చేత చెడిన త్రిపురాసురుల పట్టణం వలె, గొప్ప గాలివానలో చిక్కుకొని ఒడ్డుకు తాకి పగిలిపోయిన ఓడవలె స్మృతి తప్పిపోయింది. మదజలం ఇంకిపోగా కృష్ణునిచేత బాధింపబడినదై, తొండము తన శత్రువు అయిన కృష్ణునిచేత చిక్కుకొంది. దానోదక ధారలులేని లోభి హస్తంవలె మదజలధారలు లేనిది అయింది. తొండము

చివర పగిలి ముఖము నందలి పొడలన్నియు నెత్తురుచేత తడిసి ఎఱ్ఱబారగా కదలలేక మెదలలేక ఉంది.

శా. కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమౌళిమణియై ప్రాణంబులం బాపె నా శైలేంద్రాభముఁ బ్రాణలోభము
నుదంచత్సారగంధేభమున్.

1320

తా ॥ అంతట శ్రీకృష్ణమూర్తి పర్వతముతో సమానమైనది, ప్రాణాసక్తి కలది, ఒప్పిదమైన బలం కలది అయిన ఆ మదపుటేనుగును కాలితో త్రొక్కి, విలాసంగా నవ్వుతూ, సింహాకృతితో భయంకరమైన దంతములను చేతితో పెరికి, శూరశ్రేష్ఠుడై దాని ప్రాణాలను తీసివేశాడు.

వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళపాలకులం గాలుద్రోలి కనిపి తత్ప్రదేశంబు వాసి.

1321

తా ॥ తరువాత ఆ ఏనుగు దంతాలతోనే, మావటి వారిని చంపి ఆ చోటును విడిచి పెట్టాడు.

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్
నెరయం గోపకులంత నంత మలయన్ నిత్యాహవస్థేము లా
హరిరాముల్ సనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా
మర మర్త్యాది జనాంతరంగము లసన్మల్లావనీరంగమున్.

1322

తా ॥ యుద్ధంలో నిలుకడను కలిగి ఉన్న ఆ బలరామకృష్ణులు ఏనుగు దంతాలను మూపుల మీద పెట్టుకొని బయలుదేరారు. ముఖంపై స్వేదబిందువులతో, సమీప ప్రదేశములందు నిలిచి గొల్లలందరూ ఆ వేడుకను చూస్తూ ఉన్నారు. అంతట రామకృష్ణులు మిక్కిలి భయంకరమైన సందడిచేత మల్లుల సింహనాదం మొదలైన ధ్వనుల చేత నిండిన ఆ సామకూటాన్ని చూసారు.

సీ. మహితరౌద్రంబున మల్లుర కశనియై నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై తండ్రికి దయరాఁగఁ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబుగా దండియై గోపకులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై, శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో, మాధవుండు రంగమధ్యమందు.

1323

తా ॥ ఆ మల్లరంగంలో, శ్రీకృష్ణుడు బలరామునితో కూడి మల్లురకు భయాన్ని పుట్టించటం చేత రౌద్రరసాన్ని కనబరుస్తున్నాడు. చూడవచ్చిన జనులకందరికీ ప్రభువై వినోదాన్ని పుట్టించటంచేత ఆశ్చర్యరసాన్ని కనబరుస్తున్నాడు. పురస్త్రీలకందరికీ మోహాన్ని పుట్టించటంచేత శృంగార రసాన్ని కనబరుస్తున్నాడు. కంసునికి మృత్యుదేవతవలె భయాన్ని పుట్టించటం చేత భయానక రసాన్ని కనబరుస్తున్నాడు. మూర్ఖులకు భీభత్స రసాన్ని కనబరుస్తున్నాడు. తండ్రి అయిన వసుదేవునికి కరుణ పుట్టించటంచేత దయారసాన్ని కనబరుస్తున్నాడు. దుర్జనులైన వారిని దండించటం చేత వీరరసాన్ని కనబరుస్తున్నాడు. తన తోడి గొల్లలకు తమ కులములో పుట్టినాడని తోచటము చేత హాస్యరసాన్ని కనబరుస్తున్నాడు. చుట్టాలకు ప్రేమరసాన్ని కనబరుస్తున్నాడు. యోగి జనులకందరకు పరతత్త్వమై శాంతరసాన్ని కనబరుస్తున్నాడు. ఈ ప్రకారం మాధవుడు నవరసాలను ఏకకాలంలో ప్రదర్శించినట్లుగా ఆ రంగమధ్యంలో

కనిపించాడు.

వ. అప్పుడు.

1324

క. చచ్చిన కుంభీంద్రంబును, వచ్చిన బలమాధవులను వరుసం గని తా
నొచ్చిన చిత్తముతోడుతఁ, జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా!

1325

తా ॥ ఓ రాజా! ఆ సమయంలో, చచ్చిన కువలయాపీడాన్ని, వచ్చిన బలమాధవులను చూసి దుఃఖంతో నిండిన మనస్సుతో కంసుడు చాల భయపడసాగాడు.

ఉ. ధీరుల వస్త్రమాల్య మణిదీప్త విభూషణధారులన్ మహా
కారుల సర్వలోక శుభకారుల మానవ మానినీ మనో
హారుల రంగభూతల విహారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచి చూచి తనివిం దుదిముట్టక లోకు లందఱున్.

1326

తా ॥ ఆ సమయంలో జనులందరి దృష్టి ధైర్యవంతులు, మంచి వస్త్రములు, పుష్పహారాలు, రత్నములు చెక్కిన ఆభరణాలు ధరించిన వారు, నటుల వేషంలో ఉన్నవారు, సర్వలోకాలకు శుభాన్ని కలిగించే వారు, అందరి మనస్సులను ఆకర్షించేవారు, మల్లరంగంలో విహరించువారునూ, వీరులు అయిన గోపకుమారులై ఉండునట్టి రామకృష్ణులపై నిలిచి, తనివితీరక మాటి మాటికి చూడసాగారు.

ఉ. సన్నుత రామకృష్ణ ముఖచంద్రమయూఖ సుధారసంబులం
గన్నులఁ ద్రావు చందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ

ల న్నుతి సేయుచుం గరములం బరిరంభము సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచుం దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్.

1327

తా ॥ స్తుతించబడిన రామకృష్ణుల ముఖ చంద్రబింబముల నుండి ప్రసరించే అమృత రసాన్ని కన్నులనెడి నోళ్ళతో పానము చేయు రీతిగా చూస్తూ, నాలుకలతో ఆ అమృతాన్ని రుచి చూసే విధంగా స్తోత్రము చేస్తూ, చేతులతో ఆలింగనము చేసుకొను రీతి చాచి చాచి చూపుతూ, మిగుల ఆసక్తితో ఒకరితో ఒకరు రహస్యపు మాటలతో ఇలా మాట్లాడుకోసాగారు:

క. వసుదేవు నివాసంబున, వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో
ల్లసనమునఁ బుట్టినారఁట, పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్.

1328

తా ॥ "వీరు, వసుదేవుని నివాసంలో ఈ వసుధను రక్షించటం కోసం విష్ణువుయొక్క తేజస్సుచేత జన్మించారట. పరబ్రహ్మ స్వరూపులైన వీరిని పసిబిడ్డలని అనుకోరాదు.

సీ. చంపెఁ రక్కసిఁ బట్టి; చక్రవాకునిఁ గూల్చెఁ బడద్రొబ్బె మద్దుల; బకుని జీరె;
నఘదైత్యుఁ బొరిగొనె; నదరి వత్సకుఁ ద్రుంచె; గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందు పఱిచెఁ
గాళియు మర్దించె! గహనానలముఁ ద్రావెఁ; గేశి నంతకుపురిక్రేవ కనిచె;
మయుపుత్రుఁ బరిమార్చె; మఱియును దానవ భటుల మర్దించి గోపకులఁ గాచె;

తే. గోపకాంతల మనములఁ గోర్కిఁ దీర్చె, నీ సరోరుహలోచనుం డీ శుభాంగుఁ
డీ మహామహుఁ డీ దిగ్గజేంద్రనిభుఁడు, మనుజమాత్రుండె తలపోయ మాధవుండు?

1329

తా ॥ కమలముల వంటి కన్నులు కలవాడు, అందమైన దేహం కలవాడు, గొప్ప తేజస్సు

కలవాడు అయిన ఈ శ్రీకృష్ణుడు రక్కసి అయిన పూతనను సంహరించాడు. సుడిగాలిగా వచ్చిన తృణావర్తుని చంపాడు. జంట మద్ది చెట్లను విరుగద్రోసాడు. బకాసురుడు, అఘాసురుడు, వత్సాసురుడు మొదలైన రాక్షసులను చంపాడు. గోవర్ధన పర్వతాన్ని ఎత్తి దేవేంద్రుణ్ణి లోబరచుకున్నాడు. కాళియ సర్పాన్ని మర్దించాడు, కార్చిచ్చును మ్రింగాడు. కేశి అనే దానవుణ్ణి యముని పట్టణానికి పంపాడు. మయుని కొడుకైన వ్యోమాసురుణ్ణి పరిమార్చాడు. ఇంకా అనేక మంది రాక్షస కింకరులను చంపి గోపకులాన్ని కాపాడాడు. గోపికాస్త్రీల యొక్క మనస్సులలోని కోరికను తీర్చాడు. ఇప్పుడు దిగ్గజాన్ని పోలిన ఈ గొప్ప ఏనుగును చంపాడు. ఆలోచించేందుకు ఈతడు సామాన్యుడా!"

## 51. శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికులను వధించుట

వ. అని పలుకుచుఁ బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె.

1330

తా ॥ అని ఈ విధంగా ఒకరితో ఒకరు అనుకొంటూ పౌరజనులు రామకృష్ణులను చూస్తున్నారు. అప్పుడు చాణూరుడు రామకృష్ణులతో ఇలా అన్నాడు:

మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం;
జనదే కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్.

1331

తా ॥ "మీరు అడవులలో గొల్లపిల్లలతో కూడి దూడలను మేపుచూ, యుద్ధం చేయటం నేర్చుకున్నారని లోకులు చెప్పగా విని, మారాజు మిమ్ములను మల్లయుద్ధానికి రమ్మని పిలిచాడు. కనుక మనం ఈ సభవారు అందరూ చూస్తూండగా కొంచం పరాక్రమాన్ని చూపిద్దాం.

మ.జవసత్త్వంబులు మేలె? సాము గలదే? సత్రాణమే మేను? భూ
ప్రవరుం బోసన మి మ్మనంగ వలెనే? పాళీ లభీష్టంబులే?
పవివో? కాక కృతాంత దండకమవో? ఫాలాక్షు నేత్రాగ్నివో?
నవనీతంబుల ముద్దగాదు; మెసఁగన్ నా ముష్టి గోపార్భకా!

1332

తా ॥ ఓ గోపబాలుడా! నీకు వేగము, బలము చక్కగా ఉన్నాయా? సామేమైనా నేర్చుకున్నావా? నీ దేహం తగిన శక్తికలదై ఉందా? మల్లులు చేత పట్టుకుని త్రిప్పే మంచం

కోళ్ళవంటి సాధనములు, పాళీలు కావాలా? ఇన్ని ఉండినా నా ఎదుట దృఢంగా నిలవడానికి నీవు వజ్రాయధమో, యముని దండాయుధమో, శివుని నేత్రాగ్నివో కాదు. అదీగాక ఇక్కడ ఉండేది నా పిడికిటి పోటుగాని వెన్నముద్దకాదు దిగమింగడానికి.

క. జనములు నేర్చిన విద్యలు జననాథునికొఱకుఁ గాదె? జననాథుఁడు నీ
జనములు మెచ్చగ యుద్ధం, బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె? కృష్ణా!

1333

తా ॥ కృష్ణా! జనులు నేర్చిన విద్యలు రాజును సంతోషపెట్టడానికే కదా! కనుక ఇప్పుడు మనం రాజుగారు, తక్కిన ప్రజలు మెచ్చుకునేటట్లుగా యుద్ధంలో కొంతసేపు గడుపుదామా!"

వ. అనిన విని హరి యిట్లనియె.

1334

ఉ. సాములు లేవు; పిన్నలము; సత్త్వము గల్దన రాదు; మల్ల సం
గ్రామవిశారదుల్ గులిశ కర్కశ దేహులు మీరు! మీకడ
న్నేము చరించు టెట్లు? ధరణీపతి వేడ్కలు సేయువారముం
గాము; వినోదముల్ సలుపఁ గాదన వచ్చునె యొక్కమాటికిన్.

1335

తా ॥ అప్పుడు శ్రీకృష్ణుడిట్లా అన్నాడు: "ఓ చాణూరా! మేము సాములు నేర్చిన వారము కాము. మేము చిన్నవాళ్ళం. మా దేహాల్లో పటుత్వం కలదు అని చెప్పలేము. మీరు మల్లయుద్ధంలో ఆరితేరినవారు. వజ్రాయుధం వలె కఠినమైన దేహములు కలవారు. మీతో సరిగా పోట్లాడటం మావల్ల ఔతుందా? రాజుగారికి వినోదం కలిగించే వారము కాము. మీరు ఆహ్వానిస్తే కాదనలేక వచ్చాము.

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ, బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁ డు
గ్రాతత మల్లాహవమున, భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్.

1336

తా ॥ ఓ చాణూరా! నీతో నేను పోట్లాడుతాను. ముష్టికునితో మా అన్న పోట్లాడతాడు. భయంకరమైన మల్లయుద్ధంలో ప్రభువైన కంసుడు మెచ్చుకొనేటట్లు చేస్తాను."

వ. అనిన విని చాణూరుం డిట్లనియె.

1337

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో నా పాటియే నీవు? వి
ఖ్యాతుండం; గులజుండ; సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ! నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీ వీటఁ బోరాడుటల్
వ్రేతల్ సూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా!

1338

తా ॥ వారి మాటలకు చాణూరుడు ఇలా అన్నాడు: "ఓ గోపాలబాలా! నీవు నాతో పోరాడుటకు ఎంత మాత్రపువాడివి? నాకు సమానుడవా? నేను లోక ప్రసిద్ధుడను. మంచి కులంలో పుట్టిన వాడిని. మంచి గుణములు కలవాడను. మంచి పనులు చేసే స్వభావం కలవాడిని. ఈ గుణములు అన్ని నీయందు ఉన్నాయా? ఈ పట్టణంలో ఇక్కడ నాతో పోరాడటం అంటే గోపాలురతో ఎగరటం వంటిది కాదు. ఆలోచించుకో!

శా. స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁ డని; మహాబాహాబలప్రౌఢి న
క్షీణుం; డాజికి నెల్లి నేఁ డనఁడు! వైచిత్రిన్ వినోదించు ని
చ్చాణూరుం డొక గోపబాలు ననికిన్ శక్తుండు గాకుండునే?

1339

తా ॥ ఈ చాణూరుడు ఈశ్వరుణ్ణి మెచ్చుకోడు, బ్రహ్మదేవుణ్ణి లెక్కపెట్టడు, విష్ణువుని ఎగతాళి చేస్తాడు. వాయుదేవుని తనకు ఈడుకాదని రమ్మన్నాడు. భుజబలంలో చాలా గొప్పవాడు. యుద్ధానికి రేపూమాపు అనడు. విచిత్ర స్వభావంతో క్రీడించే చాణూరుడు ఒక గోప బాలకుని పని పట్టడానికి శక్తుడు కాడా?

క. ప్రల్లద మేటికి గోపక!, బల్లిదుఁడను; లోకమందుఁ బ్రఖ్యాతుఁడ; నా
చల్లడముక్రింద దూఱని, మల్లురు లే రెందు ధరణిమండలమందున్.

1340

తా ॥ ఓ గొల్లవాడా! ఊరకే లేనిపోని బింకానికి పోకు. నేను మహా బలవంతుడను. లోకంలో ప్రసిద్ధుడను. భూమండలంలో ఎక్కడైనా సరే నాతో ఓడిపోయి, నా చల్లడము క్రింద దూరని మల్లురులేరు.

సీ. చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు నిగిడి గోత్రముదండ నిలువ రాదు
కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు; మనుజసింహుఁడ నని మలయ రాదు;
చేరినఁ బడవైతుఁ జెయిసాఁపగా రాదు; బెరసి నాముందటఁ బెరుఁగరాదు
భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి; శోధింతుఁ గానలఁ జొరఁగ రాదు

ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు, ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁప రాదు
కల్కితనము చూపి గర్వింపఁగా రాదు, తరము గాదు; కృష్ణ! తలఁగు తలఁగు.

1341

తా ॥ ఓ శ్రీకృష్ణా! పట్టుదలతో నన్ను సమీపించిన తరువాత సముద్రంలో ప్రవేశింపలేవు (మత్స్యావతారమెత్తి సముద్రంలో ప్రవేశించినా నిన్ను విడువనని అర్థం). కొండకు ఆధారంగా

నిలువలేవు (కూర్మావతారమెత్తినా నిన్ను వదలను అని అర్థం). మారుమెగము పెట్టు భూమి క్రిందికి పోరాదు (వరాహావతారం ఎత్తినా నిన్ను విడువను అని అర్థం). మనుష్యులలో సింహమువంటి వాడను అని గర్వపడకూడదు (నరసింహావతారం ఎత్తినా నిన్ను విడువను అని అర్థం). దగ్గరకు వస్తే పడవేస్తాను. చెయ్యిచాపకూడదు (వామనావతారం). నా ఎదుట వృద్ధిపొందకూడదు (త్రివిక్రముడవై పెరగవలెనన్నను నా ఎదుట సరిపడదు అనుట). నన్ను మించి రాజును హింసించటం కూడదు (పరశురామావతారం). శోధిస్తాను కనుక అడవులలో ప్రవేశింపరాదు (రామావతారం). గొప్ప దేహం కలవాడిని అని ప్రకాశింప రాదు (బలరామావతారం). ఈ భూమిలో నేను ప్రబుద్ధుడను అని అనుకొనరాదు (బుద్ధావతారం). చాతుర్యాన్ని కనపరచి గర్వించటం కుదరదు (కల్క్యావతారం). ఏ ప్రయత్నం చేసినా నన్ను జయించటం శక్యం కాదు. కనుక దూరంగా తొలగిపో.

వ. అదిగాక నీవు శ్రీహరి నంటేని.

1342

తా ॥ అదీ గాక నేను శ్రీహరిని అంటావా?

సీ. మహిమతో నుండంగ మథురాపురము గాని పొలుపార వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని, సంసార రహితుల సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని నారదు వీణాస్వనంబు గాదు
చదురు లాడఁగ మల్లజన నిగ్రహము గాని, రమతోడి ప్రణయవిగ్రహము గాదు

తే. వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు, మొఱఁగిపో మునిమనముల మూల గాదు
సాఁగి నడవంగ భక్తుల జాడ గాదు, శౌరి! నా మ్రోల నీ వెందుఁ జనియె దింక?

1343

తా ॥ ఓ కృష్ణా! నువ్వు విష్ణువు అనుకొనే పక్షంలో, నీ మహిమ చూపేందుకు ఇది

మధురా పట్టణమే కాని వైకుంఠం కాదు. గర్వంతో ఉండటానికి ఇది కంసుని సభయే కాని, జంజాటం లేని యోగేశ్వరుల సభ కాదు. శ్లాఘించి వినడానికి నా భుజాస్ఫాలనమే కాని నారదుని వీణాగానం కాదు. నేర్పుగా మాట్లాడటానికి మల్లులతో పోరాటమే కాని లక్ష్మీదేవితోడి ప్రేమ కలహం కాదు. ప్రసిద్ధి వహించి తిరుగటానికి, ఇది వేదాంత వీధికాదు. వచించి పోవడానికి ఇది సాముకూటం గాని మునీశ్వరుల మనస్సులు కాదు. ముందుకు వెళ్ళటానికి నీ భక్తుల దారికాదు, నా ఎదుట చిక్కుకొన్న నువ్వు ఎక్కడికి వెళ్ళగలవు?"

వ. అని పలికి.

1344

సీ. రోషాగ్ని ధూమప్రరోహంబు కైవడి శిరమున సన్నపుశిఖ వెలుంగ
నాశామదేభేంద్రహస్త సన్నిభములై బాహుదండంబులు భయదములుగ
లయసమయాంతకోల్లసిత దంష్ట్రలభంగిఁ జాఁగిన కోఱమీసములు మెఱయ
నల్లని తెగ గల నడగొండ చాడ్పున నాభీలనీలదేహంబు మెఱయఁ

ఆ. జరణహతుల ధరణి సంచలింపఁగ నభో, మండలంబు నిండ మల్ల సఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు, పౌరలోకహృదయభల్లుఁ డగుచు.

1345

తా ॥ అని పలికి చాణూరుడను మల్లుడు పురజనుల సమూహం గుండెలదరగా, గగన మండలం నిండేటట్లుగా భుజములను చరుస్తూ కృష్ణునివైపుకు నడిచాడు. కోపపు నిప్పువలన కలిగిన పొగ మాదిరిగా అతని తలయందు చిన్న పిలక ప్రకాశిస్తోంది. ఏనుగు తొండములను పోలిన కర్రలవంటి నిడుపాటి చేతులు భయంకరంగా కనుపిస్తున్నాయి. ప్రళయ కాలపు యముని కోరలవలె పొడవైన మీసాలు ప్రకాశిస్తున్నాయి. నల్లగా ఎత్తైన నడచునట్టి కొండలా పొడవై భయంకరమైన నల్లని దేహం ఒప్పుతోంది. కాలి తాకిడి చేత భూమి అదురుతోంది. ఈ దృశ్యం పట్టణ ప్రజల హృదయాలకు బల్లెమైంది.

వ. ఇ ట్లగ్గలంబగు నగ్గలిక దగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవవల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించి కవిసె; ని ట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబులగు ఠాణ లిడి, కరి కరియును, హరి హరియును, గిరి గిరియునుం దాఁకు వీఁకం దలపడి, యితరేతర హేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ బరస్పర దీర్ఘనిర్ఘాత ఘట్టితంబులగు మహాభ్రంబుల విభ్రమంబున, నన్యోన్య తుంగ తరంగ తాడితంబులగు కల్పాంతకాల సముద్రంబుల రౌద్రంబున నొండొరుల ముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరులై దద్దరిలక డగ్గఱి, గ్రద్దన న య్యిద్దఱుం దిరుగునెడ హరి సొచ్చి పేర్చి యార్చి జెట్టిం బట్టి పడం దిగిచి పాదంబుల జాడించి సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన మెచ్చి, నొచ్చి య చ్చపలుండు మీఱి మోర సారించి, తెరలక, పొరలం ద్రొబ్బిన న బ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబున నుండి జానువుల నొత్తుచు, నురవడిం గరవడంబున నున్న నా దుర్నయుండును 'బాల! మేలు మే' లని లీలం గాలు సొర నిచ్చి, త్రోచినం జూచి యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప న గ్గోపకుమారుండు పాటవంబున రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు మదజలరేఖా బంధురంబగు గంధసింధురంబు చందంబునఁ బదంబునుఁ బదంబునం, గరంబును గరంబునన్ గ్రహించి, సహించి, వహించి నైపుణంబున లోపలం దిరిగి యట్టిట్టు దట్టించిన దిట్టతనంబునం దిటవు దప్పక య ప్పద్మలోచనుండు కేడించి, యేచి సమతలంబున వైచి ప్రచండంబగు వాని పిచండంబు వాగించి కాలం గాలు గీలించి డొక్కరంబు గొనిన న య్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి జడ్డనం గా లడ్డగించి, రక్షించుకొనిన నా రక్షోవైరి వాని కటిచేలంబు వట్టి యెత్తి యొత్తి నడుమ రాగె యిడి, సందువెట్టి నవ్విన నవ్విరోధికాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి తిరిగి వసుదేవుపట్టి పట్టిసంబుగొని దట్టించిన నుబ్బరిక చేసి చాణూరుండు హరికరంబు వట్టి హుమ్మని నెమ్మొగంబునం గా లిడి మీఁదైనం గేళిబాలకుండు కాలిం గాల నివారించి మీఁ దై నెగడి యుండనీక దుర్వారబలంబున విదలించి లేచి గృహీత పరిపంథిచరణుండై విపక్షుని వక్షంబు వజ్రివజ్ర సన్నిభంబగు పిడికిటం బొడిచిన వాఁడు వాఁడి చెడక విజృంభించి

యంభోరాశి మధ్యంబునం దిరుగు శైలంబుపోలిక నేల జిఱ జిఱం దిరిగి తన్నిన వెన్నుండు కుప్పించి యుప్పరం బెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాద సంధి పరిక్షిప్త పాదుండై యెగసి లేచి సముద్ధతుం డయ్యె నయ్యెడ.

1346

తా ॥ ఈ ప్రకారం మిక్కిలి ఉత్సాహంతో దగ్గరికి వచ్చిన చాణూరుణ్ణి కృష్ణుడు చూసాడు. అధికమైన శూరత్వం వెల్లడి అగునట్లు తిన్నగా కృష్ణుడు ఉత్సాహం వహించి ఎదుర్కొన్నాడు. భుజములు తట్టునట్టి చప్పుడు భూమి ఆకాశము వీని నడుమనున్న బయలంతయు నిండి ప్రతిధ్వని పుట్టునట్లు చేయబడింది. ఆ విధంగా ఇద్దరూ మిక్కిలి ప్రతాపంతో హెచ్చు తగ్గైన స్థానాలలో నిలుస్తూ, ఏనుగుతో ఏనుగును, సింహముతో సింహమును కొండతో కొండయును తలపడినట్లు పోరాడారు. ఒక దానితో ఒకటి తారసిల్లునట్టి కార్చిచ్చులలాగ, ఒకదానితో ఒకటి గొప్ప పిడుగులతో దెబ్బలాడుకుంటూన్న మేఘాలలాగ, ప్రళయ కాలంలో రెండు సముద్రాలు తమ యందలి సముత్తుంగ తరంగాలతో దెబ్బలాడుకుంటున్నట్లుగా వారిద్దరు ఒకరి పిడికిటి పోట్లచేత ఒకరిని నొప్పించుకోవటం మొదలు పెట్టారు.

కొంచెమైనను చలింపక వారిద్దరును పోరాడునప్పుడు, కృష్ణుడు చొరవగలవాడై విజృంభించాడు. బొబ్బరిస్తూ చాణూరుణ్ణి పట్టుకుని కాళ్ళతో తన్ని పోరాడగా, వాడు అతని సాహసానికి మెచ్చుకున్నాడు. తాను నొచ్చుకున్నా చలింపక కృష్ణుణ్ణి పడద్రోశాడు. అంతట కృష్ణుడు లేచి అట్టే దేహాన్ని పెంచి 'అర్ధాంగకము' అను మల్ల స్థానకంలో నిలిచి మోకాళ్ళతో వానిని అదుముచూ 'కరవడ' అనే స్థానానికి తిరిగాడు. అంతట చాణూరుడు కూడా, 'ఓరి బాలుడా! సెహబాసు! నిన్ను మెచ్చవచ్చు' అనుచూ, అలక్ష్యముగా తనకాలు అతని క్రింద చొప్పించి పడద్రోశాడు. అప్పుడు ఆకాశమునందున్న దేవతలందరూ శ్లాఘించునట్లు కృష్ణుడు నేర్పుతో తప్పించుకొన్నాడు. 'రాటవము' అను మల్ల స్థానకానికి పోయి వాని వీపు మీద ఎక్కి నిక్కి నిలుచున్నాడు. ఆ చాణూరుడు మదించిన ఏనుగువలె ఉన్నతమైన తన కాలు కృష్ణుని

కాలివెంట చాచి చేతితో అతని చేయి పట్టుకొని అతడు చేయు బాధలకు ఓర్చుచూ మెలగి అటూ ఇటూ అదిమి నొప్పించాడు.

కృష్ణుడు అందులకు చలింపక, రెచ్చినవాడై, నేలమీద వాణ్ణి పడద్రోసి గడుసైన వాని పొట్టను తట్టి వాగించి కాలితో తన్ని 'డొక్కరము' అనే మల్లవిజ్ఞానాన్ని చూపించాడు. అంతట నేర్పరి అయిన ఆ చాణూరుడు చూచే సభికులంతా తనను శ్లాఘించునట్లు, తటాలున కాలు అడ్డం పెట్టి తనకు అపాయం రాకుండా కాపాడుకున్నాడు. అంతట కృష్ణుడు వాని నడికట్టు పట్టి పైకెత్తి కుదిలించి నేలమీద పడవేసి 'రాగె' అను మల్లవిజ్ఞానాన్ని చూపి నవ్వాడు. అందులకు చాణూరుడు జంకక కాళ్ళలో కాలు చొప్పించి, నిలిచి తన నిర్బంధమును తొలగించుకొని, వెనుకకు తిరిగాడు. కృష్ణుడు ఇనుప గుదియనొక దానిని ఎత్తుకొని అదలించగా వాడు మరల పైకెగిరి తన చేయి పట్టుకొని హుం అనుచు మొగం మీదికి కాలు చాచాడు. వెంటనే తన కాలితో వానికాలు తొలగద్రోసి, వానికి మీదుగా లేచినా, అలా ఉండక కొండలను ఛేదించే వజ్రాయుధం వలె కఠినమైన తన పిడికిటితో వాని రొమ్ము మీద ఒక పోటు పొడిచాడు. వాడు అందులకు జంకక సముద్ర మథనం చేసేటప్పుడు మందర పర్వతం తిరిగిన విధంగా గిరగిర తిరిగి కృష్ణుణ్ణి తన్నాడు. అప్పుడు కృష్ణుడు కుప్పించి దుమికి వాని కాళ్ళకీళ్ళు చచ్చుబడేటట్లు త్రొక్కగా వాడు మరల మెల్లగా లేచి నిలిచాడు.

క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేసి బాహాబాహిం
ప్రలయాగ్నుల క్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధములైన విన్నాణములన్.

1347

తా ॥ అదే సమయంలో బలరాముడు, ముష్టికుడు ఈ ఇద్దరూ తమ బలములు ప్రకాశింపగా, ప్రళయకాలపు అగ్నులవలె వెలుగుచూ, నానా విధములైన మల్ల విజ్ఞానములను చూపుతూ ప్రశస్తంగా పోరాడసాగారు.

వ. ఇ వ్విధంబున.

1348

క. వల్లవులు పెనఁగి రున్నత, గల్లులతో భిన్న దిగిభకరవల్లులతో
మల్లులతో రిపుమానస, భల్లులతో భీతగోపవల్లులతోడన్.

1349

తా ॥ దిగ్గజముల తొండముల వంటి చేతులు కలవారును, శత్రువుల మనసులను బల్లెములవలె ఛేదించు వారును, గొల్లలకు భయము కలిగించిన వారూ అయిన చాణూరముష్టికులనే మల్లులతో గోపబాలురైన బలరామకృష్ణులు ఈ విధంగా పోరాడసాగారు.

వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలు గట్టి వెచ్చనూర్చుచు ముచ్చటలకుం జొచ్చి
తమలో నిట్లనిరి.

1350

తా ॥ ఆ సమయంలో పట్టణస్త్రీలు గుంపులు కూడి, వెచ్చని ఊర్పులు విడుస్తూ, ముచ్చటలాడటం ఆరంభించి తమలో తాము ఇట్లా అనుకున్నారు:

ఉ. మంచి కొమారులం గుసుమమంజు శరీరులఁ దెచ్చి చెల్లరే!
యంచిత వజ్రసారులు మహాద్రి కఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే
లించుక లేదు; మాను మనఁ; డిట్టి దురాత్మునిని మున్ను వింటిమే?

1351

తా ॥ 'అయ్యో! దుష్ట చిత్తుడైన కంసుడు మంచి వారు, పువ్వుల వలె మనోజ్ఞములై, కోమలములై ఉండు దేహములు కలవారు అయిన రామకృష్ణులను పిలుచుకు వచ్చి యుద్ధము

చేయిస్తున్నాడు. ఇంద్రుని వజ్రాయుధము వలె బహు యుద్ధములందు సమర్థులైన వారు, కొండలవంటి కఠినమైన దేహములు కలవారు, క్రూరులు అయిన మల్లుర ముందర నిలిపి పోట్లాడిస్తున్నాడు. అయ్యో! ఇటువంటి కఠిన చిత్తుడు ముందెన్నడైనా ఉన్నాడని విన్నామా? పోరు మానండి అని పలుకడే!

క. చూచెదరు గాని సభికులు, నీ చిన్న కుమారకులకు నీ మల్లురకున్
ఓ చెల్ల! యీడు గాదని, సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే?

1352

తా ॥ ఈ సభలో ఉన్న పెద్దలు ఊరకే చూస్తున్నారు కాని ఈ చిన్ని కుమారులకు, ఈ మల్లురకు జోడు కుదరదని రాజుకు సూచించటం లేదు. వీరి పోరాటము చూడటం దుఃఖకరము కాదా!

సీ. వేణునాళముల మై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామములమై పెరిఁగిన వెన్నుండు మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ
బీతాంబరములమై బెరసిన గోవిందుఁ డంసభాగమునఁ బాయక ధరించు
వైజయంతికలమై వ్రాలినఁ గమలాక్షుఁ డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ;
తే. దనరు బృందావనంబునఁ దరులమైనఁ, గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు
నెట్టి నోముల నయిన ము న్నిట్టివిధము, లేల కామైతి మోయమ్మ! యింక నెట్లు?

1353

తా ॥ మనం పిల్లనగ్రోవులమై పుట్టి ఉంటే, కృష్ణుడు తన అధరామృతాన్ని ఇచ్చి మన్నించి ఉండేవాడు. నెమలి పింఛాలమై పుట్టి ఉంటే, తలలో పెట్టుకొని గౌరవించి ఉండేవాడు. పీతాంబరములమై పుట్టి ఉంటే, భుజాలపై వ్రేల వేసికొని, తప్పక ధరించి ఉండేవాడు. వైజయంతీ మాలికలమై పుట్టి ఉంటే మిక్కిలి కుతూహలంతో కంఠాన ధరించి ఉండేవాడు. బృందావనంలో

వృక్షములమై పుట్టి ఉంటే, సంతోషంతో క్రీడించి ఉండేవాడు. ఏ నోములైనా నోచి, ఇప్పుడు అనుకొన్న వాటిలో ఏ ఒక్కటిగానైనా పుట్టలేక పోయామే! ఇప్పుడు చింతించి ఏం ప్రయోజనం?

ఉ. పాపపు బ్రహ్మ! గోపికల పల్లెలలోన సృజింపరాదె ము
న్నీపురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలున్
జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు నీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో!

1354

తా ॥ ఓ చెలియా! మనలను ఆ బ్రహ్మ గొల్లపల్లెలలో పుట్టించి ఉండకూడదా? ఈ మథురలో ఎందుకు పుట్టించాడో! గొల్ల పల్లెలలోనే పుట్టించి ఉన్న పక్షంలో, ఈ చిన్ని గొల్లవాణ్ణి ఎడతెగక కూడియుండే అదృష్టం కలిగి ఉండేది కదా! ఈ గోపకుమారుడిని పొందడానికి మునుపు ఆ గొల్లపడుచులు ఏమి నోములు నోచారో?

క. గోపాలకృష్ణుతోడను, గోపాలన వేళలందుఁ గూడి తిరుగు నా
గోపాలు రెంత ధన్యులొ, గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే?

1355

తా ॥ ఈ గోపాల కృష్ణులతో కూడి ఆడుచూ, పశువులను మేపుచూ, సంచరించు గోపాలురు ఎంత పుణ్యాత్ములో! ఆ గొల్లలయందుగల మేలైన తేజస్సు దేవతలకు కూడా ఉందో లేదో?

క. శ్రమజల కణసిక్తంబై, కమలదళేక్షుని వదనకమలము మెఱసెన్
హిమజల కణసిక్తంబై, కమనీయం బగుచు నున్న కమలము భంగిన్.

1356

తా ॥ శ్రీకృష్ణుని కమలము వంటి ముఖము చెమట బొట్లతో కూడి ఉండి, మంచు బిందువులతో కూడిన మనోహర తామర పుష్పంలాగా ప్రకాశిస్తోంది.

ఆ. సభకుఁ బోవ రాదు; సభవారి దోషంబు, నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండియైన నిట్టట్టు వలికినఁ, బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము.

1357

తా ॥ సభకు వెళ్ళరాదు. వెడితే, సభలో ఉండువారి తప్పును ఎరిగి ఏమీ చెప్పకపోయినా, తప్పును తెలుసుకొనకున్నా, తెలిసుకొని ఉన్నా కూడా పక్షపాతం చేత తప్పు అని చెప్పక పోయినా, ఎంతటి బుద్ధిమంతుడైనా ఆ పాపఫలాన్ని పొందుతాడు'

వ. అని పెక్కండ్రు పెక్కు విధంబులం బలుకుచుండఁ దద్బాహు యుద్ధంబున.

1358

క. ధృతి సెడి లోఁబడె మల్లుం, దతులిత భవజలధితరికి హతరిపు పురికిన్
జితకరికిన్ ధృతగిరికిం, దత హరిరవభరిత శిఖరిదరికిన్ హరికిన్.

1359

తా ॥ అని ఈ విధంగా మాట్లాడుకుంటున్నారు. చాణూరుడు ధైర్యం చెడి, సరిపోల్చరాని జన్మములనెడు సముద్రానికి ఓడ అయిన వాడును, తనను విరోధించినవారి పట్టణాలను పాడు చేయువాడు, గజేంద్రునికి మకరము వలన కలిగిన బాధనుండి విడిపించినవాడు, సముద్ర మథన కాలమునందు కవ్వపు కొండను ధరించిన వాడు, అధికమైన సింహనాద ధ్వని చేత నిండింపబడిన పర్వత గుహలు కలవాడు అయిన శ్రీకృష్ణమూర్తికి లోబడ్డాడు.

క. హరికిని లోఁబడి బెగడక, హరియురము మహోగ్రముష్టి నహితుఁడు పొడువన్
హరి కుసుమమాలికాహత, కరిభంగిఁ బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై.

తా ॥ పగవాడైన చాణూరుడు కృష్ణునకు లోబడినప్పటికీ, భయపడక కృష్ణుని రొమ్ము మీద భయంకరమైన తన పిడికిటితో పొడిచాడు. కృష్ణుడు యుద్ధంలో విజృంభించి పూలదండచేత కొట్టబడిన ఏనుగులా తన పరాక్రమాన్ని చూపించాడు.

క. శౌరి నెఱిఁజొచ్చి కరములు, క్రూరగతిన్ బట్టి త్రిప్పి కుంభిని వైచెన్
శూరుం గలహ గభీరున్, వీరుం జాణూరు ఘోరు వితతాకారున్.

1361

తా ॥ శ్రీకృష్ణుడు పరాక్రమంతో ఆ యుద్ధంలో శూరత్వాన్ని, కలహంలో గాంభీర్యాన్ని, వీరుడిని, భయంకరమైన వానిని, గొప్ప ఆకారము కలవానిని అయిన చాణూరున్ని చేతులతో క్రూరమైన రీతితో పట్టుకొని, త్రిప్పి త్రిప్పి భూమిమీద పడవేశాడు.

క. శోణితము నోర నొలుకఁగ, జాణూరుం డట్లు కృష్ణసంభ్రామణ సం
క్షీణుండై క్షోణిం బడి, ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్.

1362

తా ॥ ఆ విధంగా కృష్ణుని ఆటోపం చేత బలహీనతను పొందినవాడై, నోట నెత్తురు క్రక్కుచు చాణూరుడు నేలమీద పడి ప్రాణాలు విడిచాడు. అతని ప్రాణాలు పోయేసరికి కంసుని మనస్సు బాగా కలత చెందింది.

క. బలభద్రుండును లోకులు, బలభద్రుం డనఁగఁ బెనఁగి పటుబాహుగతిన్
బలభేది మెచ్చఁ ద్రిప్పెను, బలవన్ముష్టికునిఁ గంసు బలములు బెగడన్.

1363

తా ॥ జనులంతా బలరాముడు బలంలో అధికుడు అని పొగుడుచుండగా, దృఢమయిన

తన బాహువులను చాచి, ఇంద్రాదులు మెచ్చుకొనేటట్లు, కంసుని సేనలు భయపడేటట్లు బలవంతుడైన ముష్టికుడిని గిరగిర త్రిప్పాడు.

ఆ. త్రిప్పి నేల వైవ దిగ్గన రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ
ముష్టికుండు ఘోరముష్టి సత్త్వము సెడి, కూలె గాలిఁ దరువు గూలినట్లు.

1364

తా ॥ అలా త్రిప్పి, నేలమీద పడవేసేసరికి, ముష్టికుడు తన భుజబలం అంతా అణగిపోగా గుహలాంటనోట్లోంచి నెత్తురు క్రక్కుకుంటూ, గాలిచేత వృక్షం పెల్లగిలి నేలమీద పడ్డట్లు పడ్డాడు.

వ. మఱియును.

1365

క. పాటవమునఁ బలుపిడికిట, నూటిం బడఁబొడిచె బలుఁడు శోషిత ఘన బా
హాటోప నృపతి కీటుం, గూటున్ వాచాటు నధిక ఘోర లలాటున్.

1366

తా ॥ అనంతరం బలరాముడు, రాజైన కంసునికి కిరీటము వంటివాడు, మాటలమారి, భయంకరమైన నొసలు కలవాడు అయిన కూటుడు అనే మల్లున్ని సమర్ధతతో బలమైన పిడికిటితో సూటిగా నేలమీద పడేటట్లు పొడిచాడు.

వ. అంత న ద్దనుజాంతకుండు చరణప్రహరణంబుల భిన్నమస్తకులం జేసి వాని చెలులం గూట తోసల శలుల నంతకాంతికంబున కనిచిన.

1367

తా ॥ అటు పిమ్మట రాక్షసులకు యముని వంటి వాడైన కృష్ణుడు చాణూరుని స్నేహితులైన కూటుడు, తోసలుడు, శలుడు అనువారిని తన కాళ్ళతో మోది, తలలు పగులగొట్టి

చంపాడు.

క. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్
బల్లిదులు; తలఁడు తలఁడని, చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్.

1368

తా ॥ కేవలం గోపబాలురు అనుకుని పోట్లాడి మన మల్లశ్రేష్ఠులు ఈ దినం మరణించారు. వీళ్ళు చాలా బలవంతులు, దూరంగా తొలగిపొండు అంటూ తక్కిన మల్లులంతా పరుగెత్తి చెల్లాచెదురయ్యారు.

ఉ. మల్లురఁ జంపి గోపక సమాజములో మృగరాజు రేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవ రాజనందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్.

1369

తా ॥ బలరామకృష్ణులు అలా మల్లులను చంపి గొల్లల గుంపులో సింహాలవలె శోభిల్లగా అడుగులతో పాదపద్మముల అందెలు అధికంగా మ్రోగుతుండగా వస్తున్న, ఆ రాజనందనులను చూసి కంసుడు తప్ప, తక్కిన బ్రాహ్మణులు మొదలైన వారు మెల్లమెల్లగా స్తుతించారు.

## 52. శ్రీకృష్ణుడు కంసుణ్ణి వధించుట

వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం డిట్లనియె.

1370

తా ॥ అంతట సభాజనుల కలకలాన్ని నివారించి మంత్రులతో కంసుడు ఇలా అన్నాడు:

ఉ. వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ; డీ
గొల్లల ముట్టికోల్ గొనుఁడు; క్రూరుని నందునిఁ గట్టుఁ; డుర్వికిం
దెల్లము గాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు; తండ్రి గాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్.

1371

తా ॥ "ఈ గోపబాలురను నగరి నుండి బయటకు వెడలగొట్టండి. తక్కిన ఈ గొల్లలనందరిని ముట్టడించండి. క్రూరుడైన నందున్ని పట్టి కట్టివేయండి, వసుదేవున్ని చంపివెయ్యండి. ఉగ్రసేనున్ని నా తండ్రి అని ఎంచి విడిచిపెట్టకండి. ఏ విధంగా చూసినా ఆయన మన పగవారికే ఆప్తుడు."

వ. అని పలుకు సమయంబున.

1372

శా. జంఘాలత్వముతో నగోపరి చరత్సారంగ హింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్.

1373

తా ॥ అని ఈ విధంగా కంసుడు పలుకుతుంటే, కొండ మీద నుండే ఏనుగును చంపాలనే కోరికతో వడిగల నడకతో మీదికెగరడానికి ఉత్సహించునట్టి సింహమువలె, పురజనుల సమూహము తనను చూసి భయంతో వణుకుచుండగా, కృష్ణుడు యుద్ధమందలి కుతూహలం చేత కంసుణ్ణి చంపదలచినవాడై, అతడు ఉన్న మంచె మీదికి ఎగిరాడు.

క. తమగమున కెగురు యదు స, త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెం
దమ గమివారలు వీరో, త్తమగణవిభుఁ డనఁగ గంసధరణీపతియున్.

1374

తా ॥ తాను ఉండు మంచె మీదికి సింహంలా దూకుతున్న శ్రీకృష్ణుణ్ణి చూసి కంసుడు ఖడ్గాన్ని చేతపట్టాడు. అంతట ఆ కంసుని పక్షం ఉన్న వారంతా మహాశూరుడు అని శ్లాఘించునట్లుగా ఎదిరించాడు.

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టు విధ మొప్పన్ గేశబంధంబు లో
క క్షోభంబుగఁ బట్టి మౌళిమణు లాకల్పాంత వేళాపత
న్నక్షత్రంబులభంగి రాల రణసన్నాహంబు డిందించి రం
గ క్షోణిం బడఁద్రోచెఁ గృష్ణుఁడు వెసన్ గంసున్ నృపోత్తంసునిన్.

1375

తా ॥ గరుత్మంతుడు పామును పట్టినట్లు, శ్రీకృష్ణుడు రాజశ్రేష్ఠుడైన కంసుని జుట్టుముడిని పట్టుకొన్నాడు. లోకులందరూ కలవరపడి చూచుచుండగా, కంసుని కిరీటము నందలి రత్నములు ప్రళయకాలము నందు ఆకాశము నుండి చుక్కలు రాలునట్లు జలజల రాలాయి. కంసుడి యుద్ధ ప్రయత్నమును మాన్పి, అతి శీఘ్రముగా రంగ భూమిలోనికి పడద్రోసాడు.

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీ మధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగాఁ

బంచత్వంబును బొందియున్న విమతున్ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
పంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై.

1376

తా ॥ మంచె మీద నుండి రంగ భూమిలో పడి, చేష్టలు లేక, ఏ ప్రతిఘటనా లేకనే మరణించాడు ఆ కంసుడు. మహాశూరుడైన కంసుడు ఇంత సులభంగా ఈతని చేత మరణించాడే అని జనులంతా ఆశ్చర్యపడతూ ఉండగా, తన భుజబలంచేత ఉల్లాసాన్ని వహించి సింహము ఏనుగును ఈడ్చుకొని పోవు రీతిన వేగంగా ఈడ్చాడు.

క. రోష ప్రమోద నిద్రా, భాషాశన పానగతులఁ బాయక చక్రిన్
దోషగతిఁ జూచి యైన వి, శేషగతిన్ గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా!

1377

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! కంసుడు విరోధము చేతనైనా, సర్వకాల, సర్వావస్థల యందు ఆ శ్రీకృష్ణమూర్తినే స్మరించుచుండినందున, అంత్యకాలంలో మహా తేజోరూపంతో కృష్ణుని యందే లయించాడు.

వ. అ సమయంబున.

1378

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర!, భూపాలకుఁ జంపె వీనిఁబొదువుం డేత
ద్రూపాలస్యము లేలని, తాపాలఘురోషు లగుచు దర్పోద్ధతులై.

1379

తా ॥ ఆ సమయంలో 'ఔరా! ఒక గొల్లవాడు మన మహారాజును చంపాడు. వేగంగా ఈ గొల్ల వానిని చుట్టు ముట్టండి!' అని సంతాపం వలన అధిక రోషాన్ని పొందారు కంసుని

సోదరులు.

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీక సా
మగ్రిన్ గంసుని సోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁడై యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండ చెండాడి కా లాగ్రక్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్.

1380

తా ॥ న్యగ్రోధుడు, గహ్వుడు మొదలగు కంసుని సోదరులు అనేక విధాలయిన ఆయుధాలతో కృష్ణుణ్ణి క్రమ్ముకున్నారు. బలరాముడు చూసి కోపించి భయంకరుడై, మదపుటేనుగువలె ఒళ్ళు తెలియని వాడై, శత్రువులకు భయం పుట్టిస్తూ, ఆ కంస సోదరులను ఒక్కొక్కన్ని ఇనుపకట్ల గుదియతో నేలమీద పడేసి యముని దగ్గరకు పంపించాడు.

వ. అ య్యవసరంబున.

1381

క. చేతులఁ దాళము లొత్తుచు, జేతోమోదంబుతోడ సిగముడి వీడన్
బాతర లాడుచు మింటను, గీతము నారదుఁడు పాడెఁ గృష్ణా! యనుచున్.

1382

తా ॥ ఆ సమయంలో చేతులతో తాళాన్ని వాయిస్తూ మనోల్లాసంతో సిగముడి వీడగా నాట్యం చేస్తూ, నారదుడు ఆకాశంలో కృష్ణా అని గీతం ఆలపించసాగాడు.

క. వారిజభవ రుద్రాదులు, భూరికుసుమవృష్టి గురిసి పొగడిరి కృష్ణున్ భేరులు మ్రోసెను నిర్జర, నారులు దివి నాడి రధిక నటనముల నృపా!

1383

తా ॥ ఓ రాజా! బ్రహ్మ, రుద్రుడు మొదలగు వారందరు కుసుమవృష్టి కురిపించి కృష్ణుణ్ణి పొగిడారు. దేవ దుందుభులు మ్రోగాయి. దేవతా స్త్రీలంతా బహువిధములైన నృత్యవిశేషాలతో నర్తించారు.

వ. అంతం గంసాదుల కాంతలు భర్తృమరణ దుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుధారా పరిషిక్తవదనలై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితు లయిన విభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించిరి. అందుఁ గంసభార్య లిట్లనిరి.
1384

తా ॥ అంతట కంసుడు మొదలైన వారి భార్యలు, తమ భర్తలు చనిపోయినందుకు దుఃఖాన్ని పొందారు. శోకంతో, కన్నీటి ధారలతో తడిసిన ముఖాలతో బయటకు వచ్చారు. రంగభూమికి వచ్చి వీరశయ్యలందు దీర్ఘనిద్రలో ఉన్న భర్తలను కౌగలించుకొని ఏడువసాగారు. కంసుని భార్యలు ఇట్లా అన్నారు:

సీ. గోపాలసింహంబు కోపించి వెల్వడి నిను గజేంద్రుని భంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవముల నిను మహీజముమాడ్కి నేల వ్రాల్చె వాసుదేవాంభోధి వారి యుద్వేలమై నిను దీవి కైవడి నేఁడు ముంచె దేవకీసుతవజ్రి దేవత లలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ!, హా మహారాజ! నీ విట్లు హతుఁడ వయిన మనుచు నున్నార మక్కట! మమ్ముఁబోలు, కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు?
1385

తా ॥ "ఓ ప్రాణనాయకా! అయ్యో! నేటి దినము కృష్ణుడు నిన్ను, సింహము కోపించి మదపుటేనుగును చంపినట్లు చంపాడే! కృష్ణుడను గాలి భయంకరమైన వడితో వచ్చే నిన్ను, వృక్షంలా నేలవ్రాల్చాడే! వాసుదేవుడనే సముద్రం పొంగి ద్వీపాన్ని ముంచినట్లు నిన్ను

ముంచేసింది కదా! ఇంద్రుడు వజ్రాయుధంతో కొండలను పడగొట్టు విధంగా చేశాడు కదా! దేవతలకు ఆనందాన్ని చేకూర్చేలా నిన్ను చంపాడు. నీవు మరణించిన పిమ్మట కూడా మేము ప్రాణాలతో ఉన్నాము. ఈ లోకంలో మాకంటే కఠినమైన మనస్సు కలవారు ఇంక ఎవరు ఉన్నారు? అయ్యో!

క. భూతముల కెగ్గుసేసిన, భూతంబులు నీకు నెగ్గుఁ బుట్టించె వృథా
భూత మగు మనికి యెల్లను, భూతద్రోహికిని శుభముఁ బొంద దధీశా!

1386

తా ॥ ఓ ప్రాణనాయకా! నువ్వు లోకంలోని ప్రాణులకెల్లను కీడు చేసినందుకు, నీ జీవితమంతా వ్యర్థమైపోయేటట్లు ఆ ప్రాణులే కీడు కలిగించాయి. భూతద్రోహికి మేలు కలుగనేరదు.

క. గోపాలకృష్ణుతోడను, భూపాలక! మున్ను దొడరి పొలసినవారిన్
నీ పాల బుధులు సెప్పరె, కోపాలస్యములు విడిచి కొలువం దగదే.

1387

తా ॥ మహారాజా! ఇంతకు ముందు శ్రీకృష్ణుణ్ణి ఎదిరించి మరణించిన వారి వృత్తాంతాన్ని పెద్దలు అనేకులు నీకు చెప్పలేదా? నువ్వు అతని విషయంలో కోపాన్ని, జడత్వాన్ని విడిచి అతన్ని సేవించి ఉంటే బాగుండేది."

వ. అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి, జగద్వల్లభుం డయిన హరి కంసాదులకుఁ బరలోక సంస్కారంబులు సేయం బనిచి దేవకీవసుదేవుల బంధనంబు విడిపించి, బలభద్ర సహితుం డయి, వారలకుఁ బ్రణామంబులు సేసిన.

1388

తా ॥ అని ఈ విధంగా ఏడుస్తూ ఉన్న కంసుని భార్యలను ఊరడించి, కృష్ణుడు చనిపోయిన వారికి ఉత్తర క్రియలు చేయించాడు. తమ తల్లిదండ్రులయిన దేవకిని, వసుదేవుణ్ణి చెరలో నుండి విడిపించి బలభద్రునితో కూడి వారికి నమస్కరించాడు.

# 53. శ్రీకృష్ణుడు దేవకీవసుదేవుల చెఱవిడిపించి ఉగ్రసేనునికి పట్టము కట్టుట

మ. కని లోకేశులుగాని వీరు కొడుకుల్ గారంచుఁ జిత్తంబులన్
జనయిత్రీ జనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జన సమ్మోహినియైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానందసంధాయియై.

1389

తా ॥ తల్లిదండ్రులైన దేవకీవసుదేవులు కొడుకులను చూసి, 'వీరు లోకాలకు ప్రభువులైన భగవంతులు గాని మానవులు కారు' అని సంశయిస్తున్నారు. అప్పుడు కృష్ణుడు తన మాయచేత వారికి కలిగిన తత్త్వజ్ఞానాన్ని పోగొట్టి, మిక్కిలి అణకువతో వారికి సంతోషాన్ని కలుగ చేస్తూ ఇలా అన్నారు:

సీ. మమ్ముఁ గంటిరి గాని మా బాల్య పౌగండ కైశోర వయసులఁ గదిసి మీర
లెత్తుచు దింపుచు నెలమి మన్నింపుచు నుండు సౌభాగ్యంబు లొంద రైతి;
రా కాంక్ష గలిగియు న్నది దైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి
యే యవసరమున నెబ్బంగి లాలితు లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ

తే. మాకు నిన్నాళ్ళు లేదయ్యె మఱియు వినుఁడు, నిఖిలపురుషార్థ హేతువై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు మీర కారె, యా ఋణముఁ దీర్ప నూఱేండ్ల కైనఁ జనదు.

1390

తా ॥ "ఓ తల్లిదండ్రులారా! మీరు మమ్ములను కన్నారే గాని మా బాల్యము మొదలైన దశలలో మా దగ్గర చేరి, ఎత్తుకొంటూ, దింపుతూ సంతోషంతో గారాబంగా పెంచే అదృష్టాన్ని పొందలేదు. మీకు అటువంటి వేడుకలయందు అపేక్ష ఉన్నా అది దైవాధీనం అగుట చేత

అనుకూలించలేదు. కొడుకులైన వారు, తల్లిదండ్రుల వద్ద ఉంటూ, వారిచేత లాలింపబడునట్టి భాగ్యం మాకు కూడా నేటివరకు లేకపోయింది. అంతేగాక, ఎల్ల పురుషార్థములకు హేతుభూతమైన మా దేహములకు జన్మస్థానం మీరేకదా. ఇటువంటి మీ ఋణం తీర్చడానికి శక్యం కాదు.

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
సెల్లింపఁ డట్టి కష్టుఁడు, ప్రల్లదుఁ డా మీఁద నాత్మపలలాశి యగున్.

1391

తా ॥ ఎవడు జరుగుబాటు ఉండి కూడా, తల్లిదండ్రుల విషయంలో దేహంతోనూ, ధనంతోనూ ఉపచారాలను చెయ్యడో, అటువంటి దుష్టుడైన లోభి పరలోకంలో తన మాంసం తానే తింటాడు.

క. జననీజనకుల వృద్ధులఁ, దనయుల గురు విప్ర సాధు దారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్.

1392

తా ॥ ఏ మానవుడు తల్లిదండ్రులు, తాతలు మొదలైన వృద్ధులు, బిడ్డలూ, ఆచార్యుడు, బ్రాహ్మణులు, సాధువులు, భార్య మొదలైన వారిని పోషింప సామర్థ్యం కలిగి ఉండి పోషించడో, అట్టివాడు భూమి మీద బ్రతికి ఉన్నా చనిపోయినవానితో సమానమే!

వ. అదియుం గాక.

1393

శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా రాక ని

ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్య సంచారులన్
సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి రక్షింపరే!

1394

తా ॥ మా నిమిత్తం కంసుడు మిమ్ములను చెరసాలలో పెట్టి బాధిస్తూ ఉంటే, తొలగింప సామర్థ్యం కలవారమై ఉండికూడా తొలగింపక ఊరకున్నాం. మేము అతి కఠినులం. దయలేని మనస్సు కలవారం, క్రూరులం, కుటిలత్వం కలవారం. మా తప్పులను క్షమించి మన్నించండి."

వ. అని యిట్లు మాయామనుష్యం డయిన హరి పలికిన పలుకులకు మోహితులై, వారల నంకపీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశబద్ధులయి, దేవకీవసుదేవు లూరకుండిరి. అంత వాసుదేవుండు మాతామహుం డయిన యుగ్రసేనునిఁ జూచి.

1395

తా ॥ అని ఈ విధంగా మాయా మానుష విగ్రహుడైన కృష్ణుడు పలికాడు. దేవకీవసుదేవులు అతని మాటలకు మోహితులై, దగ్గరకు చేరదీసి వారిని తమ ఒడిలో కూర్చుండపెట్టుకున్నారు. కౌగిలించుకొని కన్నుల నుండి వచ్చే ఆనంద బాష్పధారల చేత, వారి దేహాలను తడుపుతూ ప్రేమపాశ బద్ధులై ఊరకనే అలా ఉండిపోయారు. కృష్ణుడు తమ తాతగారైన ఉగ్రసేనుణ్ణి చూసి ఇలా అన్నాడు:

చ. అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము భూమికిన్;
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరివెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత! రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్.

1396

తా ॥ "పుణ్యపురుషుడవైన ఓ ఉగ్రసేన మహారాజా! యయాతి శాపం చేత యాదవ వీరులకు రాజసింహాసనం ఎక్కడానికి అర్హత లేదు, కనుక నువ్వే రాజువు. నీకు దేవతలు కూడా కప్పము కడతారు. ఇక మనుష్యులైన రాజులను ఆజ్ఞాపించటం ఒకలెక్కా! వేడుకతో ప్రజాపాలనకు కర్తవ్యోన్ముఖుడవు కమ్ము."

వ. అని పలికి.

1397

క. మన్నించి రాజుఁ జేసెను, వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్
సన్నుతమానున్ గదన, చ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్.

1398

తా ॥ అని పలికి, కృష్ణుడు సత్యమును నడపుటయందు పట్టుదల కలవాడు, ప్రసిద్ధమైన దాన గుణము గలవాడు, పొగడ్త వహించిన గౌరవము కలవాడు, యుద్ధరంగమునందు శత్రుసేనలనెల్ల ఖండించిన వాడు, కొడుకు మరణించినందుకు దుఃఖమును వహించి ఉన్నవాడూ అయిన ఉగ్రసేనున్ని మన్నించి మథురానగరానికి రాజుగా చేసాడు.

వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించు చున్న యదు వృష్ణి భోజ మరు దశార్హ కుకురాంధక ప్రముఖులగు సకల జ్ఞాతి సంబంధులను రావించి, చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారి వారి నివాసంబుల నుండ నియోగించె; న వ్విధంబున.

1399

తా ॥ పిమ్మట కంసునికి భయపడి అన్య దేశములకు వలసలు పోయి ఉండిన యదువులు, వృష్ణులు, భోజులు, మరువులు, దశార్హులు, కుకురులు, అంధకులు మొదలగు అతని దాయాదులను, బంధువులను అందరినీ రప్పించాడు. వారి మనస్సులకు తృప్తి కలిగేటట్లు ధనములిచ్చాడు. వారి వారి నివాస స్థానాల్లో ఉండేటట్లుగా నియమించాడు.

క. మధుసూదన సత్కరుణా, మధురాలోకన విముక్త మానస భయులై
మధురవచనములఁ దారును, మధురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా!

1400

తా ॥ ఓ రాజా! కృష్ణుని దయతోడి, చల్లని చూపులచేత, కంసుని వలన తమకు కలిగి ఉండిన భయములు విడిచినవారై మధురా పట్టణంలోని జనులంతా, సుఖంగా జీవించసాగారు.

వ. అంత నొక్కనాఁడు సంకర్షణ సహితుండై నందునిం జీరి గోవిందుం డిట్లనియె.

1401

తా ॥ పిమ్మట ఒకనాడు బలరామునితో కూడి కృష్ణుడు నందునితో ఇలా అన్నాడు:

శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు వెంచిరి? భవత్సౌజన్య భావంబులన్
దండ్రీ! యింతటివార మైతిమి గదా! తత్తద్వయోలీలలన్.

1402

తా ॥ “జనకా! మేము తండ్రిని చూడలేదు. తల్లినీ చూడలేదు. యశోదా దేవి, నీవు మా తల్లితండ్రులనే భావిస్తూ వచ్చాము. మంచి స్వభావంగల మీవలే ఇంతవరకూ ఏ తల్లిదండ్రులూ బిడ్డలను పెంచలేదు. మీ మంచితనం చేతనే తండ్రీ మేము ఇంతవారమయ్యాము!

ఉ. ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే
మక్కడికిన్; మదీయులకు నందఅకున్ వినిపింపు మయ్య నే
మెక్కడనున్న మాకు మది నెన్నఁడు బాయవు మీ వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్.

1403

తా ॥ ఇక్కడ ఉన్న బాంధవులకందరకు సుఖాన్ని కలుగచేసి, మేము వ్రేపల్లెకు వస్తాం. ఈ వృత్తాంతాన్ని నాకు ఆప్తులయిన వారందరికి తెలియచెయ్యండి. మేము ఎక్కడ ఉన్నా మీరు ఎంతో మక్కువతో, ప్రేమతో మాకు చేసిన ఉపచారాలు మేము ఎప్పుడూ మరచిపోలేము.”

వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబుగం గౌఁగిలించు కొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయ విహ్వలుండై బాష్పజల పూరిత లోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుం జనియె; నంత.

1404

తా ॥ కృష్ణుడు ఈ విధంగా ప్రియము చెప్పి వస్త్రములు, ఆభరణములు మొదలైనవి ఇచ్చి సన్మానించి కౌగిలించుకొని నందాదులను సాగనంపాడు. నందుడు ప్రేమాతిశయం చేత మనస్సులో కలతనొంది కన్నుల నిండా నీళ్ళు పెట్టుకొని తన వెంట వచ్చిన గొల్లలతో కలసి వ్రేపల్లెకు వెళ్ళిపోయాడు.

క. గర్గాదిభూసురోత్తమ, వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను, నిర్గర్వ చరిత్రులకును నిజపుత్రులకున్.

1405

తా ॥ అనంతరం వసుదేవుడు గర్వంలేని నడవడిక కల తన కొడుకులకు, గర్గుడు మొదలైన బ్రాహ్మణులచేత ఉపనయనాన్ని పద్ధతి ప్రకారంగా చేయించాడు.

క. ద్విజరాజ వంశవర్యులు, ద్విజరాజ ముఖాంబుజోపదిష్ట వ్రతులై
ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్.

1406

తా ॥ బ్రాహ్మణ క్షత్రియాదులైన జనులు అందరూ దీవించుచుండగా, చంద్రవంశ శ్రేష్ఠులయిన రామకృష్ణులు బ్రాహ్మణ శ్రేష్ఠుల యొక్క ముఖకమలముల నుండి ఉపదేశింపబడిన వ్రతములు కలవారై ద్విజరాజత్వాన్ని పొందారు.

వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోహిరణ్యాది దానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబులందు నిజమనోదత్తలైన గోవుల నుచ్చరించి యిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె; నిట్లు బ్రహ్మచారులై.

1407

తా ॥ వడుగు అయిన పిమ్మట వసుదేవుడు బ్రాహ్మణులకు దక్షిణతోడి గోదానములు, హిరణ్యదానములు చేశాడు. మునుపు రామకృష్ణులు పుట్టినప్పుడు తన మనస్సులో దానమిద్దామనుకొన్న గోవులను అన్నింటినీ దానమిచ్చాడు. పిమ్మట యాచకులకు కోరిన పదార్థాలిచ్చి తృప్తి పొందించాడు. ఆపైన ఆ ఇద్దరూ బ్రహ్మచారులై ఆచార్యుణ్ణి అన్వేషిస్తూ బయలు దేరారు.

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయఁ జని; రా గోవిందుఁడున్ రాముఁడున్.

1408

తా ॥ శ్రీ బలరామకృష్ణులు సర్వము తెలిసిన వారు; లోకులకు పూజ్యులై ఉండి కూడా 'లోకంలో ఎవరైనా సరే గురువు వలన ఉపదేశాన్ని పొందక ఏ విద్యనూ అభ్యసింపకూడదు' అని తెలియజేయడం కోసమే గురువును అన్వేషిస్తూ బయలుదేరారు.

వ.చని మహావైభవరాశియైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపుర నివాసియు, సకలవిద్యా విలాసియు నైన సాందీపని యను బుధవర్యుం గని యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తిసేయుచుండ, వారలవలన సంతుష్టుండై.

1409

తా ॥ అలా బయలుదేరి అధిక వైభవానికి ఉనికిపట్టు అయిన కాశీ పట్టణానికి చేరుకున్నారు. అక్కడ ఉంటున్న అవంతీపుర నివాసి, సకల విద్యలు తెలిసిన సాందీపుడు అనే విద్వాంసుడిని గురువుగా చేసుకొన్నారు. అప్పటి తమ స్థితికి తగినట్లుగా కానుకలు ఇచ్చి భక్తితో సేవిస్తూండగా ఆయన కూడా వీరి ప్రవర్తనకు సంతోషించాడు.

శా. వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృత ధర్మశాస్త్రములు నుద్యన్న్యాయముం దర్క వి
ద్యా దక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబునన్.

1410

తా ॥ బ్రాహ్మణశ్రేష్ఠుడైన ఆ సాందీపుడు నాలుగు వేదములు, ఆరువేదాంగాలు, ధనుర్విద్య, సిద్ధాంత విషయమైన గ్రంథాలు, మన్వాది ధర్మశాస్త్రాలు, నీతి శాస్త్రం, తర్కశాస్త్రము, రాజనీతి, శబ్దలక్షణ ప్రకారము మొదలైన సకల విద్యలు బలరామకృష్ణులకు బోధించాడు.

క. అఱువది నాలుగు విద్యలు, నఱువది నాలుగు దినంబు లంతన వారల్
నెఱవాదులైన కతమున, నెఱి నొక్కొకనాఁటి వినికి నేర్చి రిలేశా?

1411

తా ॥ పరీక్షిన్మహారాజా! ఆ రామకృష్ణులు మిక్కిలి సమర్థులగుట చేత, ఒక్కొక్కరోజుకి ఒక్కొక్క విద్య చొప్పున, అరువది నాలుగు దినములలో అరవైనాలుగు విద్యలను అభ్యసించారు.

క. గురువులకు నెల్ల గురులై, గురులఘుభావములులేక కొమరారు జగ
ద్గురులు త్రిలోకహితార్థము, గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్.

1412

తా ॥ గురువులకు గురువైనవారు, ఎక్కువ తక్కువ భావములు లేక సమస్థితిలో ప్రకాశించువారు, జగద్గురువులైన ఆ బలరామకృష్ణులు త్రిలోక హితార్థం, గురుశిష్య న్యాయ ప్రకారం, సాందీపుని వద్ద విద్యాభ్యాసం చేశారు.

వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుండైన సాందీపని యిట్లనియె.

1413

తా ॥ ఈ విధంగా కృతార్థులైన రామకృష్ణులను చూసి, వారి మహిమకు ఆశ్చర్యపడి, సాందీపుడు భార్యాసహితుడై వారితో ఇట్లా అన్నాడు:

శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున ము న్నస్మత్తనూసంభవుం
డంభోగాహముసేయుచున్ మునిఁగి లేఁ డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే!

1414

తా ॥ “ఓ రామకృష్ణులారా! సముద్రంలోని ప్రభాస తీర్థంలో మా కుమారుడు స్నానము చేస్తూ, ఆ నీళ్ళలో మునిగి తిరిగి రాలేదు. దయాసముద్రులు, అధిక పరాక్రమం కలవారు, కనుక మీరు మీ ఆచార్యునికి గురుదక్షిణగా అందరినీ ఆశ్చర్యపరిచేలా, మా కుమారుణ్ణి తెచ్చి ఇవ్వండి.

క. శిష్యులు బలాఢ్యులైన వి, శేషస్థితి నొంది గురువు జీవించును; ని

ర్ద్వాష్యగుణ బలగరిష్ఠులు, శిష్యులరై గురుని కోర్కి సేయం దగదే?

1415

తా ॥ లోకంలో శిష్యులు బలవంతులైతే, గురువులు గొప్పగా జీవిస్తారు. మీరు మంచి గుణముల చేతనూ, శరీర బలము చేతనూ మిగుల గొప్పవారు. మీవంటి వారు శిష్యులై గురువైనవాడు కోరిన దానిని నెరవేర్చడం న్యాయమే కదా!"

వ. అనిన విని రామకృష్ణులు గుర్వర్థంబుగా దుర్వార రథారూఢులై రయంబునం జని రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి.

1416

తా ॥ అనగా విని బలరామకృష్ణులు తమ ఆచార్యుని కార్యముకోసం ఎదురులేని రథములెక్కి, వడిగా సముద్ర సమీపానికి పోయి రౌద్రంగా ఇట్లా అన్నారు:

క. 'సాగర! సుబుద్ధితోడను, మా గురుపుత్రకునిఁ దెమ్ము మా ఱాడిన నీ
వాగడ మగుదువు; దుస్సహ, వేగరణాభీల నిశిత విశిఖాగ్నులకున్'.

1417

తా ॥ "ఓ సముద్రుడా! నీయందు మా గురుకుమారుడు ఉన్నాడట. మంచి బుద్ధితో వానిని తీసికొనిరా! మారు మాట మాట్లాడితే సహింపరాని వేగం గల భయం పుట్టించే నిశిత బాణాగ్నుల వలన నీవు నశిస్తావు."

వ. అనిన వారలకు జలరాశి యిట్లనియె.

1418

ఉ. 'వంచన యింత లేదు యదువల్లభులార! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డార్యుఁడు తోయము లాడుచుండ ను

త్సంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్.

1419

వ. అని వాని వసియించు చో టెఱింగించిన.

1420

తా ॥ అన్న రామకృష్ణుల పలుకులకు సముద్రుడు ఇట్లా అన్నాడు: “మీ విషయంలో కొంచెం కూడా నేను వంచన చేయను. మునుపు మనోజ్ఞమైన ఆకృతిగల ఆ బ్రాహ్మణ కుమారుడు ప్రభాస తీర్థంలో స్నానము చేయవచ్చాడు. స్నానం చేస్తూండగా ఒక పెద్ద అల వచ్చి వానిని లోపలికి ఈడ్చుకుపోయింది. అంత అక్కడ ఉన్న పంచజనుడు అనే రాక్షసుడు ఆ చిన్నవానిని మ్రింగేశాడు” అని చెప్పి వాడు నివసించే చోటు చూపించాడు.

శా. శంఖారావముతోడ బంచజనుఁడున్ శంకించి చిత్తంబులో
సంఖిన్నుండుగ వార్ధిఁ జొచ్చి దహనజ్వాలాభ హేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వాని జఠరంబున్ వ్రచ్చి గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై.

1421

తా ॥ అంతట శ్రీకృష్ణుడు శంఖం పూరించాడు. దానిని విన్న పంచజనుడు మిక్కిలి భయపడి, మనస్సు తపింపగా, కంపించిపోయాడు. శ్రీకృష్ణుడు సముద్రంలోనికి ప్రవేశించి, అగ్నిజ్వాలతో సమానమైన బాణం చేత వాన్ని చంపి, పొట్ట చీల్చివేశాడు. అందులో బాలుని కానక, ఎలా అయినా గురువుకు సంతోషాన్ని కలిగించాలనే ఉద్దేశ్యంతో కార్యతత్పరుడైనాడు.

క. దానవుని దేహజంబగు, మానితశంఖంబు గొనుచు మసలక బలుఁడుం
దో నేతేరఁగ రథియై, దానవరిపుఁ డరిగె దండధరపురికి నృపా!

1422

తా ॥ ఓ రాజా! రాక్షస విరోధి అయిన శ్రీకృష్ణుడు ఆ పంచజనుడనే రాక్షసుని దేహమునందు పుట్టిన పాంచజన్యం అనే గొప్ప శంఖాన్ని తీసుకున్నాడు. బలరాముడు వెంటరాగా రథమెక్కి యముని పట్టణానికి పోయాడు.

వ. చని సంయమనీనామ నగరంబుఁ జేరి తద్ద్వారంబునఁ బ్రళయకాల మేఘగంభీర నినదభీషణం బగు శంఖంబు పూరించిన విని వెఱఁగుపడి.

1423

తా ॥ అలా సంయమని అనే యముని పట్టణం చేరి, ప్రళయకాల మేఘము ఉరిమిన రీతిగా ధ్వనించేటట్లు తన శంఖమును ఊదగా యముడు విని చాలా ఆశ్చర్యపడ్డాడు.

శా. అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావమున్ మాన సా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగర ప్రాంతంబునం జేసె? మ
ద్విస్మేరావహ రోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై.

1424

తా ॥ నా భుజబలాన్ని లక్ష్యంచేయక, మనస్సు కలతపడునట్లుగా, నా పట్టణ ద్వారంలో ఎవరో శంఖధ్వని చేశాడు. ఇక నాయొక్క కోపాగ్ని చేత ధ్వంసము చేయబడినవాడై, భస్మమై వాడు నశిస్తాడు అంటూ కోపం చేత మండి పడుతూన్న ఆకృతి గలవాడై వచ్చాడు.

వ. వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్య లయిన విష్ణుమూర్తులని యెఱింగి; భక్తితోడం బూజ చేసి సర్వభూతమయుండగు కృష్ణునకు నమస్కరించి 'యేమి సేయుదు నాన' ති మ్మనిన న మ్మహాత్ముం డిట్లనియె.

తా ॥ బయటకు వచ్చి రామకృష్ణులను చూసాడు. వెంటనే వారు లీలామానుష విగ్రహులైన శ్రీమహావిష్ణువే అని గ్రహించాడు. భక్తితో శుశ్రూష చేసి, సర్వభూతములయందు నివసించువాడైన కృష్ణునకు నమస్కరించి, నేను చెయ్యవలసిన పని సెలవియ్యండి అని అడిగేసరికి ఆ మహాత్ముడు ఇట్లా అన్నాడు:

క. 'చెప్పెద మా గురునందనుఁ, దప్పు గలుగఁ జూచి నీవు దండనమునకున్
దెప్పించినాఁడ వాతని, నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా!'

1426

తా ॥ "మంచి నడవడి గల ఓ యమధర్మరాజా! మేము మా గురునందనుని నిమిత్తం వచ్చాము. నువ్వు అతనియందేమో తప్పు కలిగి ఉండగా, దండించుటకై రప్పించుకున్నావు. కనుక అతనిని తీసుకొని వచ్చి మాకు ఒప్పగించు."

క. అనిన విని 'వీఁడె వీనిం, గొని పొం' డని భక్తితోడ గురునందను ని
చ్చినఁ గృష్ణుడు వీడ్కొనియెను, ఘనదుర్జనదమను మహిషగమనున్ శమనున్.

1427

తా ॥ అనిన విని, ఇదుగో ఇతడే మీ గురుపుత్రుడు, మీరు తీసుకు వెళ్ళవచ్చును అని భక్తితో గురుపుత్రుణ్ణి అప్పగించాడు. కృష్ణుడు మిక్కిలి చెడ్డవారిని శిక్షించువాడూ, దున్నపోతును ఎక్కి తిరుగువాడు అయిన యమునికి వీడ్కోలు పలికి, గురుపుత్రుణ్ణి తీసుకొని బయలుదేరాడు.

వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్రుని సమర్పించి 'యింక నేమి సేయవలయు? నానతిం' డనిన నతం డిట్లనియె.

1428

తా ॥ ఈ విధంగా బలరామకృష్ణులు యముడి వద్ద నుండి వచ్చి, సాందీపునికి గురుదక్షిణగా పుత్రుణ్ణి సమర్పించి, ఇంకా ఏం చెయ్యాలో సెలవియ్యవలసిందని అడుగగా ఆ మహాత్ముడు ఇట్లా అన్నాడు:

క. 'గురునకుఁ గోరిన దక్షిణఁ, గరుణన్ము న్నెవ్వఁ డిచ్చె? ఘనులార! భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణఁ, దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై.

1429

తా ॥ "ఓ ఘనులారా! గురువునకు కోరిన దక్షిణ కరుణతో తెచ్చి ఇచ్చారు. ఇటువంటి పని ఇంతకు ముందు ఎవ్వరూ చేయలేదు. ఇప్పుడు మీరు ఈ విధంగా దక్షిణ చెల్లించి శాశ్వతముగా కీర్తిని వహించారు.

క. కాలుని వీటికిఁ జని మృత, బాలకుఁ దే నొరుల వశమె? భవదీయ కృపన్
మేలు దొరకొనియె మాకు; వి, శాల మగుంగాత మీ యశము లోకములన్.

1430

తా ॥ యముని పట్టణానికి పోయి చనిపోయిన పిల్లవానిని తెచ్చి ఇవ్వడం మీకు తప్ప, ఇతరులకు సాధ్యమా? మీ వల్ల మేము ఎంతో మేలుని పొందాము. మీ కీర్తి ఎల్లలోకములందు వ్యాపించును గాక!"

వ. మహాత్ములారా! 'యేను గృతార్థుండ నైతి' నని దీవించిన సాందీపని వీడ్కొని కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు చేసి మథురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరించినఁ గని నష్టధనంబులు గనినవారి భంగిం బ్రజలు ప్రమోదించి; రంత నొక్క నాఁ డేకాంతంబున.

1431

తా ॥ అని సాందీపుడు, 'మహాత్ములారా! నేను కృతార్థుడనయ్యాను' అని వారిని దీవించాడు. ఆయన వద్ద సెలవు తీసుకుని రామకృష్ణులు రథాన్ని ఎక్కి మథురకు వచ్చారు, వచ్చి పాంచజన్యాన్ని పూరించారు. ఆ ధ్వనిని విని పట్టణంలోని ప్రజలంతా, పోగొట్టుకున్న ధనాన్ని తిరిగి పొందినవారివలె సంతోషించారు. పిమ్మట ఒకనాడు ఏకాంతంలో కృష్ణుడు ఇలా ఆలోచించాడు:

## 54. శ్రీకృష్ణుడు గోపకాంతల చెంతకు ఉద్ధవున్ని పంపుట

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షించుచున్

నాపే రాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్

గోపాలాంగన లెంత జాలిఁపడిరో? కోపించిరో? దూఱిరో?

వ్రేపల్లెన్ నిజనర్మ గేహములలో విభ్రాంతచైతన్యలై.

1432

తా ॥ 'వ్రేపల్లెలో ఉండే గోపికలు నా మీదనే వాళ్ళ మనసులు నిలుపుతారు. నా రాకనే కోరుతూ నా నామం మనస్సునందు తలుస్తూ నానా ప్రకారాలుగా వ్యథ చెందుతూ ఉంటారు. భ్రమనొందిన మనస్సులు కలవారలై, ఎంత దుఃఖాన్ని పొందుతున్నారో? నన్ను ఎంతగా కోపగిస్తున్నారో?'

వ. అని చింతించి.

1433

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్

బుద్ధినిధి నమరగురుసము, నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్.

1434

తా ॥ అని ఆలోచించి, మంచి ఆలోచన కలవాడు, నిశ్చిత భావాలు కలవాడు, పెద్దలు కొనియాడుటకు తగిన నడవడిక కలవాడు, బుద్ధియందు బృహస్పతిని పోలిన వాడు, వృష్ణివంశశ్రేష్ఠుడు అయిన ఉద్ధవునితో శ్రీకృష్ణుడు మెల్లగా ఇలా అన్నాడు:

కా. రమ్మా యుద్ధవ! గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్

సమ్మోహంబున నన్నియున్ మఱచి యే చందంబునం గుందిరో

తమ్ముఁ నమ్మినవారి డిగ్గ విడువన్ ధర్మంబు గాదండ్రు; వే
పొమ్మా! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్.

1435

తా ॥ "ఓ ఉద్ధవా! ఇటురా! వ్రేపల్లెలో గోపికా స్త్రీలు నా రాకకై ఎదురు చూస్తూ అధికమైన మోహం చేత అన్నీ మరచి ఏ విధంగా దుఃఖిస్తున్నారో? నా ఎడబాటు వలన కలిగిన తాపం చేత ప్రాణాలు ఎలా నిలుపుకొన్నారో తెలియదు. తమ్ము నమ్మిన వారిని దిగవిడుచుట ధర్మం కాదని పెద్దలు అంటారు. కనుక నువ్వు శీఘ్రంగా అక్కడికి పోయిరావయ్యా!

క. లౌకిక మొల్లక న న్నా, లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్.

1436

తా ॥ లోక ధర్మాన్ని విడిచి, నాయందు దృష్టి నిలిపి, నన్నాలోకించు ప్రపత్తి కలవారికి నేను స్వాధీనుడనై ఉంటాను. దయామయ చూపులతో వారిని పోషిస్తాను. ఆశ్రయించిన వారిని రక్షించటం నా ధర్మం.

క. 'సందేహము మానుం డర, విందాననలార! మిమ్ము విడువను వత్తున్
బృందావనమున' కని హరి, సందేశము పంపె ననుము సంకేతములన్.

1437

తా ॥ నీవు అక్కడకు వెళ్ళి, పద్మముఖులారా! సందేహాన్ని విడిచిపెట్టండి. మిమ్ములను విడువను. బృందావనానికి వస్తాను అని కృష్ణుడు సందేశాన్ని పంపాడ" ని వారికి ఏకాంతంలో చెప్పు.

వ. అని మందహాస సుందర వదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి,

సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయ సమయంబునకు నందవ్రజంబుసేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులం బ్రచ్ఛన్నరథుండై మెచ్చి నందుమందిరంబు ప్రవేశించిన.

1438

తా ॥ అలా చెప్పి కృష్ణుడు చిరునవ్వుచేత వికాసము నొందిన ముఖం కలవాడై, తన చేతితో ఉద్ధవుని చేయి పట్టుకొని, సరసవచనాలు పలుకుచూ సెలవిచ్చి పంపాడు. ఉద్ధవుడు రథం ఎక్కి బయలుదేరి సూర్యాస్తమయ సమయానికి నందుని మందకుపోయి, అడవుల నుండి వచ్చే ఆవుల కాళ్ళధూళి అతని రథాన్ని కప్పేస్తుండగా, నందుని మందిరంలోకి ప్రవేశించాడు.

శా. ఆ పుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ డానందియై
'మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ' డనుచున్ మన్నించి పూజించి వాం
ఛా పూర్ణంబుగ మంజులాన్న మిడి మార్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్.

1439

తా ॥ నందుడు సంతోషించి పుణ్యాత్ముడైన ఆ ఉద్ధవుణ్ణి మనసారా కౌగిలించుకున్నాడు. మా పాలిటికి ఇతడే కృష్ణుడు అని మిక్కిలి మర్యాదతో పూజించాడు. కోరిక తీరేటట్లు కమ్మని భోజనం పెట్టాడు. దారి బడలికను పోగొట్టి ముచ్చటలాడు వేడుకతో అతనిని చూసి సంతోషంతో ఇలా అన్నాడు:

క. నా మిత్రుఁడు వసుదేవుఁడు, సేమంబున నున్నవాఁడె? చెలువుగఁ బుత్రుల్
సేమంబున సేవింప మ, హోమత్తుండైన కంసుఁ డడఁగిన పిదపన్.

1440

తా ॥ "ఉద్ధవా! నా మిత్రుడైన వసుదేవుడు క్షేమంగా ఉన్నాడా! గర్వాంధుడైన కంసుడు

మరణించిన పిమ్మట తన పుత్రుల సేవలు పొందుతూ ఆనందంతో ఉన్నాడా!

శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల మిత్రవ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే? వన నదీ భూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య! యిట మాౖవ్రేపల్లెకు న్నుద్ధవా!

1441

తా ॥ అన్నా! ఉద్ధవా! మీరందరూ కుశలమా! కృష్ణుడు తల్లిదండ్రులమైన మమ్మల్ని సంతోషంతో తలుస్తాడా! తనను ఎడబాసిన గోపకులను, గోపికలను, స్నేహితులను, గోగణాన్ని ప్రతిదినము తలుస్తూ ఉంటాడా! ఇక్కడి అడవుల గురించి, నదుల గురించిన సంగతులన్నీ ఎప్పుడైనా చెబుతాడా! ఎప్పుడు వస్తాడు మా వ్రేపల్లెకు?

క. అంకిలి కలుగక మా కక, లంకేందుని పగిదిఁ గాంతిలసితంబగు త
త్పంకజ నయనుని నెమ్మొగ, మింక విలోకింపఁ గలనె యీ జన్మమునన్?

1442

తా ॥ ఓ ఉద్ధవా! ఇక ఈ జన్మలో కళంకం లేని చంద్రుని వలె తేటగా ప్రకాశించే శ్రీకృష్ణుని ముఖం స్వేచ్ఛగా చూసేటంతటి అదృష్టం మాకు లభిస్తుందంటావా?"

క. అని హరి మున్నొనరించిన, పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకుల లో
చనుఁడై డగ్గుత్తికతో, వినయంబున నుండె గోపవీరుం డంతన్.

1443

తా ॥ అని ఈ విధంగా కృష్ణుడు మునుపు చేసిన పనులు అన్నీ చెబుతూ కన్నీళ్ళు నిండిన చూపులతో ఉండి, గొంతు జీరబోగా మరి ఏమీ చెప్పలేక మౌనంగా ఉండిపోయాడు.

క. పెనిమిటి బిడ్డని గుణములు, వినుతింప యశోద ప్రేమవిహ్వలమతియై
చను మొనలఁ బాలు గురియఁగ, గనుఁగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్.

1444

తా ॥ అప్పుడు యశోదాదేవి తన భర్త కుమారుని యొక్క గుణములన్నీ ఉద్ధవునితో చెబుతూంటే, విని ప్రేమాతిశయం చేత మనసు స్వాధీనం తప్పి, మాతృప్రేమచే తల్లడిల్లుతూ కన్నుల నుండి నీళ్ళు ధారగా కారగా చలించిపోయింది.

వ. ఇట్లు గోవింద సందర్శనాభావ విహ్వలులైన యశోదానందులకు నుద్ధవుం డిట్లనియె.

1445

తా ॥ ఈ విధంగా కృష్ణున్ని చూడకపోవటం చేత కలతనొందిన యశోదానందులతో ఉద్ధవుడు ఇలా అన్నాడు:

క. జననీజనకుల మిమ్ముం, గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును, మనమున వగవకుఁడు ధైర్యమండనులారా!

1446

తా ॥ "తల్లిదండ్రులయిన మిమ్ములను చూడటానికి శ్రీకృష్ణుడు శీఘ్రంగానే వస్తాడు, మీకు మేలు జరుగుతుంది. బాధపడకండి, ధైర్యంగా ఉండండి.

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీ భారంబు వారింప వా
రల రూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణప్రభుం; డెవ్వఁ డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించు, వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యర్కాభుఁడై నిత్యుఁడై.

1447

తా ॥ బలరామకృష్ణులు సామాన్య మానవులా ఏమిటి? భూభారాన్ని నివారింప మోక్షమునిచ్చువాడైన శ్రీహరి వారి రూపాలలో అవతరించాడు. ఏ మానవుడైనా విజ్ఞానం చేత ప్రకాశించుచున్నవాడై, మరణ కాలంలో తలచిన పక్షంలో అతడు పరబ్రహ్మ స్వరూపుడై సూర్యునివలె వెలుగుచూ, శాశ్వతుడై పరమ మోక్ష స్థితిని పొందుతాడు.

సీ. అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణ మానవాకారుఁడైనఁ
జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి రతికృతార్థుల రైతి; రనవరతము
శోభిల్లు నింధనజ్యోతి చందంబున నఖిలభూతములందు నతఁ;
డతనికి జననీ జనక దార సఖీ పుత్ర బాంధవ శత్రు ప్రియాప్రియజనులు లేరు;

ఆ. జన్మకర్మములును జన్మంబులును లేవు;, శిష్టరక్షణంబు సేయుకొఱకు
గుణవిరహితుఁ డయ్యు గుణి యయి సర్వ ర, క్షణ వినాశకేళి సలుపుచుండు.

1448

తా ॥ అట్టి నారాయణుడు సకల జీవస్వరూపుడు. ఏదో ఒక కారణాన్ని బట్టి మనుష్య రూపాన్ని పొందాడు. ఆయనపై మీరు మనస్సు చేర్చి సేవించారు, అందువల్ల మీరు కృతార్థులయ్యారు. ఆయన ఎల్లప్పుడూ కట్టెలో అణగి ఉండే నిప్పువలె, సకల ప్రాణులయందూ వెలుగుచున్నాడు. అతనికి తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ఆలుబిడ్డలు, శత్రుమిత్రులు, చుట్టాలు, కావలసినవారు, అక్కరలేనివారు ఎవ్వరూ లేరు. పుట్టుకలు, దానికి హేతువులైన కర్మలు లేవు. అయినా మంచి వారిని కాపాడటం కోసం గుణరహితుడైనా, గుణములు కలవానివలె కనబడుతూ, సర్వాన్ని రక్షించటం, నశింప చేయటం అనే కార్యాలను చేస్తూ ఉంటాడు."

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావము లుపన్యసించుచు నా రేయి గడపి మఱునాఁ డు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క రహస్య ప్రదేశంబున నున్న సమయంబున.

1449

తా ॥ అని చెప్పి ఇంకా అనేక విధాల హరి యొక్క మహిమలు చెబుతూ ఆ రాత్రి గడిపాడు. మరునాటి తెల్లవారి పెరుగు చిలుకుచప్పుళ్ళు వింటూ నిద్రలేచి, ఉద్ధవుడు అనుష్ఠానాలు పూర్తి చేసుకొని ఒక ఏకాంత ప్రదేశంలో ఉన్నాడు.

శా. 'రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ డంబురుహ మాలాలంకృతుం దుల్లస
ద్రాజ త్కుండలుఁ డొక్క వీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు; మా
రాజీవాక్షుని భంగి' నంచుఁ గని రా రాజాన్వయున్ గోపికల్.

1450

తా ॥ ఆ సమయంలో గోపికలు అక్కడికి వచ్చారు. వారు కమలములవంటి కన్నులతో, అందమైన ముఖము, విశాలమైన వక్షంతో, పీతాంబరాన్ని ధరించి, మోకాళ్ళను ఆనునట్టి పొడుగాటి చేతులు కలవాడై, కమలముల హారముచేత అలంకరింపబడిన వాడు, వికాసము కలిగి ప్రకాశించుచున్న కుండలములు కలవాడు అయిన ఒక గొప్పవాడు మన గోపాలమూర్తి వలెనే ప్రకాశిస్తున్నాడు, చూడండని వారిలో వారు అనుకుంటూ చంద్రవంశంలో పుట్టిన ఉద్ధవుణ్ణి చూశారు.

వ. కని లజ్జాసహిత హాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ నిట్లనిరి.

1451

తా ॥ చూసి సిగ్గుతో కూడిన చిరునవ్వుతోడి, చూపులు వారి ముఖాలకు సొగసులు కలుగ చేయగా ఇలా అన్నారు:

## 55. భ్రమర గీతలు

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణ మిత్రుఁడ వీవు; కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడు భక్తి వచ్చితివి; వారల నైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు; మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్.

1452

తా ॥ "ఓ పుణ్యాత్ముడా! మేము నిన్నెరుగుదుము. నీవు మా కృష్ణునికి స్నేహితుడవు. స్నేహాన్ని మరవక తల్లిదండ్రులకు తన క్షేమాన్ని తెలియచేయమని పంపగా నువ్వు వచ్చావు. ఇక్కడ ఆయనకు అంతకంటే మన్నింపదగినవారు ఎవరున్నారు? ఆయన వారినైన మరువక నిన్ను పంపాడు, అంత మాత్రము చాలు.

క. మునివరు లైనను బంధుల, ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
సనిమిత్తసఖ్య మాఁకటి, పని దీఱిన నళులు విరులఁ బాయునొ లేదో?

1453

తా ॥ సర్వసంగ పరిత్యాగులైన మునీశ్వరులైనా తమ బంధువులతో సఖ్యాన్ని విడువలేరు. అందువలన శ్రీకృష్ణుడు తన తల్లిదండ్రులకు కబురు పంపడంలో ఆశ్చర్యం లేదు. కాని నిమిత్తం లేని స్నేహాన్ని విడిచి పెట్టేస్తారు. లోకంలో పువ్వులయందు వాలిన తుమ్మెదలు అందలి తేనెను పీల్చుకొన్న తర్వాత ఆ పువ్వులను విడిచిపెట్టడం లేదా!"

చ. అని యిటు గోపికల్ పలుక నం దొక గోపిక కృష్ణపాద చిం
తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశిత సద్వివేకముఁ బ్రసూన మరంద మదాతిరేకమున్

ఘన మృదు నాదసంచలిత కాముక లోకముఁ జంచరీకమున్.

1454

తా ॥ అని ఈ విధంగా గోపికలందరూ మాట్లాడుతూ ఉండగానే, వారిలో ఒక గోపిక కృష్ణ చరణ ధ్యానంలో పరవశురాలైంది. ఆమె దైవికంగా తన సమీపంలో మిక్కిలి ప్రకాశిస్తూన్నది, తెలివికలది, పూతేనెలు త్రాగటం చేత మిక్కిలి మదించినదియు, మనోజ్ఞమైన తన ఝుంకారం చేత కాముకుల సమూహాన్ని చలింప చేసేది అయిన ఒక తుమ్మెదను చూసింది.

వ. కని హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూత యని కల్పించుకొని, యుద్ధవునికి నన్యాపదేశంబై యెఱుకపడ న య్యళికిం దొయ్యలి యిట్లనియె.

1455

తా ॥ చూసి, కృష్ణుడు తనను ప్రార్థింప పంపిన దూతగా కల్పించుకొని, ఉద్ధవునికి అన్యాపదేశంగా తెలిసేటట్లుగా ఆ తుమ్మెదతో గోపిక ఇట్లా అంది:

మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీ కుచకుంకుమాంకిత లసత్ప్రాణేశ దామప్రసూ
న మరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించుఁ గా
క మము న్నేపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్.

1456

తా ॥ "దుర్జనులకు మిత్రుడవైన ఓ తుమ్మెదా! మా పాదకమలాలను ముట్టకు. నీవు పురస్త్రీల స్పర్శనం చేత ఎర్రబారిన ప్రాణనాథుని కంఠమాలిక యందలి పువ్వులలోని తేనెను పానం చేయడం చేత ఎర్రబడ్డ ముఖం కలవాడవు గదా! పురస్త్రీల ఇండ్లలో ఉంటూ ప్రతిదినము నిన్ను మా ప్రాణనాథుడు మన్నిస్తాడేమో కానీ మేము మన్నింపలేము.

మ. ఒకపువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడు భంగి మ మ్మధరపీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబుఁ గొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం;
డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి నమ్మెం జుమీ!

1457

తా ॥ ఓ మధుపాయీ! నువ్వు మధుపానం చేత మత్తులో, ఒక పువ్వునందలి తేనెను త్రాగి, అందు నిలువక, మరియొక పువ్వును కోరుతున్నావు. అలాగే అధరామృతం చేత చొక్కించి మా ప్రాణనాథుడు అన్య స్త్రీలయందు ఆసక్తుడై ఉన్నాడు. ఇటువంటి వానికి లక్ష్మి ఎలా దక్కిందో తెలియదు.

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె; దీ
సంగీతంబున నేము సొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?
యంగీకారము గావు మాకుఁ; బురకాంతాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు వా రిడుదు రోజ న్నీకు నిష్టార్థముల్.

1458

తా ॥ ఓ భృంగా! నీవేమో కృష్ణుడు మంచివాడంటూ మా ఎదుట ఎంతో ప్రీతితో ప్రశంసిస్తున్నావు. నీ సంగీతానికి మేము పరవశులం అవుతామా? ఆయన చరిత్ర మాకు వింతలు ఏమీ కావు! మాకు అంగీకారమూ కాదు. నువ్వు మథురా పురంలో స్త్రీల ముందర పాడితే నువ్వు కోరినవి ఆ పుర స్త్రీలు ఇస్తారు.

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాస భ్రూవిజృంభంబులన్
రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?
బ్రమదారత్నము లక్ష్మి యాతని పదాబ్జాతంబు సేవించు; ని

క్కము మే మెవ్వర మా కృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్.

1459

తా ॥ ఓ గండు తుమ్మెదల రాజా! నీవే యోచించి చూడు. ప్రకాశించే చిరునవ్వుల చేత, కనుబొమ్మలను చలింప చేయుట చేత మనోహరుడైన శ్రీకృష్ణమూర్తికి కరగని స్త్రీలు మూడు లోకాల్లోను కలరా? ప్రమదారత్నమైన లక్ష్మీదేవి అతని పాదకమలాలను నిత్యమూ కొలుస్తూ ఉంటుంది. నిజం చూస్తే, ఆ దయాసముద్రునికి మమ్ములను అనుగ్రహించడానికి, మేము ఏపాటి వారం?

శా. రోలంబేశ్వర! నీకు దౌత్యము మహారూఢంబు; నీ నేరుపుల్
చాలున్; మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథపుత్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ లీనత్వముం బొందు మ
మ్మేలా వాసె విభుండు? ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే?

1460

తా ॥ ఓ తుమ్మెదల రాజా! నీకు రాయబారం చేయుటలో చాలా నేర్పు ఉంది... కాని ఆ నేర్పులు మావద్ద పనికిరావు. ఇక మా పాదకమలాలను విడిచిపెట్టు! మేము మా భర్తలను, బిడ్డలను, తక్కిన బంధువులను అలక్ష్యంగా విడిచి, సద్గతి మాట తలపెట్టక తనతో లీనమవగా ఆ విభుడు మమ్ము ఎందుకు ఎడబాశాడు? ధార్మికులైన వారు ఇట్లా చేయడాన్ని మెచ్చుకుంటారా?

శా. వాలిం జంపెను వేఁటకాని పగిదిన్ వంచించి; దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను; బలిన్ లోభంబుతోఁ గట్టి యా
త్రైలోక్యంబు మెఱంగి పుచ్చుకొనియెన్; ధర్మజ్ఞుఁడే మాధవుం?
డేలా షట్పద! యెగ్గు మావలన నీ కెగ్గింపఁగా నేటికిన్?

1461

తా ॥ ఓ షట్పదమా! మీ కృష్ణుడు వేటగాని వలె పొంచి వాలిని చంపాడు. తనయందు ఆసక్తురాలై వచ్చిన రావణుని చెల్లెలైన శూర్పణఖను వంచించి ముక్కు చెవులు కోసి కురూపిగా చేశాడు. లోభంతో అన్యాయంగా బలిచక్రవర్తిని బంధించి, ఈ మూడు లోకాలను వంచనచే తీసుకొన్నాడు. ఇట్టి పనులు చేసిన అతడు ధర్మాత్ముడేనా? అతనిని వలచిన తప్పు మాదే! అతనిని మా ఎదుట శ్లాఘించటం దేనికి?

ఉ. పన్నుగ మింటిపై కెగసి పాఱు విహంగములైన వీనులం
ద న్నొకమాటు విన్న గృహదార సుతాదులఁ బాపి విత్త సం
పన్నత డించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్య కాం
క్ష న్నెఱి నున్న మాబ్రదుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా!

1462

తా ॥ ఓ రమణీయమైన తుమ్మెదా! సాధారణంగా ఆకాశంలో ఎగిరే పక్షులైనా అతని పేరు ఒకసారి వింటే చాలు. ఆ విన్న పక్షులకు ఇల్లు, వాకిలి, భార్యాబిడ్డలు మొదలైన సంబంధాలన్నీ తొలగించి పునర్జన్మ లేకుండా చేస్తాడు మీ కృష్ణుడు. అటువంటి వాడు ఎడతెగని అపేక్షతో ఉన్న మా బ్రతుకులను చూసి సహిస్తాడా?

మ. కమనీయం బగు వేఁటకానిపలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణ నిర్భిన్నలై
యమితోగ్రవ్యథనొందు భంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి నిందిందిరా!

1463

తా ॥ ఓ తుమ్మెదా! వేటగాని యొక్క ఇంపైన పలుకులు విని, తమ మనస్సులందు తమకు మేలే కలుగుతుంది అని నమ్మి వానిని చేరి, వాడు ప్రయోగించు బాణముల చేత

ఆడజింకల దేహములు ఛేదింపబడతాయి. మితిలేని భయంకరమైన బాధను పడే ఆ ఆడ జింకల వలె మేము కృష్ణుని తియ్యని మోసపు మాటలను నమ్మి, మారుని బాణాల వలన బాధచేత మిక్కిలిగా తపిస్తున్నాము.

ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు చేరక పోవుట పాడి గాదు; పు
ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములంఁ బడి యొత్తి చెప్పవే!

1464

తా ॥ ఓ తుమ్మెదా! చుట్టములను, బిడ్డలను, భర్తలను, తోబుట్టువులను, తల్లిదండ్రులను విడిచి అతనినే శరణుజొచ్చాము. ఇట్టి మమ్ము విరహసముద్రంలో ముంచి ఇట్లు ఎడముగా ఉండుట ధర్మం కాదని మీ ఏలినవాడైన కృష్ణుని అడుగుల పైబడి నొక్కి చెప్పు.

సీ. కాంచనరత్న సంఘటిత సౌధంబులే మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్రసేవిత రాజధానియే మా పల్లె యదువంశ మండనునకు?
సురభి పాదప లతాశోభితారామమే మా యరణ్యము సింహమధ్యమునకుఁ
గమనీయ లక్షణ గజతురంగంబులే మా ధేనువులు కంసమర్దనునకు?

తే. రూప విభ్రమ నైపుణ రూఢలైన,
మగువలమె మేము మన్మథమన్మథునకు?
నేల చింతించు మముఁ గృష్ణుఁ డేల తలఁచుఁ?,
బృథివి నధిపులు నూతనప్రియులు గారె!

1465

తా ॥ లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణునికి మా ఉనికిపట్లు అయిన పూరి గుడిసెలు బంగారము,

రత్నములు కూర్చి కట్టిన మేడా ఏమిటి? మేము ఉండే పల్లె ఏమైనా అనేకులైన రాజుల చేత సేవింపబడే పట్టణమా? మా దగ్గరనే గల సామాన్యమైన అడవి, ఆయన ఉండే మంచి పువ్వుల వాసనల తోడి మ్రాకులు, తీగలుగల ఉద్యాన వనమా ఏమి? మా పల్లెలో ఉండే ఆవులు కృష్ణుడుండే చోట ఉండే మంచి లక్షణాలు గల ఏనుగులు, గుర్రాలా ఏమి? మన్మథునికి మన్మథుడైన కృష్ణునికి చక్కదనం చేతనూ విలాస చేష్టల చేతను నేర్పరితనం చేతను ప్రసిద్ధి వహించిన స్త్రీలమా మేము? మా గురించి ఎందుకు విచారపడతాడు? అసలు మమ్ములను ఎందుకు తలచుకొంటాడు? లోకంలో రాజులు క్రొత్తవాటియందు ప్రియము కలవారు కదా!"

వ. అని మఱియు నిట్లనేక విధంబులఁ గృష్ణసందర్శన లాలస లయి పలుకుచున్న గోపికల వచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె.

1466

తా ॥ అని ఈ రీతిగా కృష్ణుని చూచుట యందలి అత్యంత ఆసక్తి చేత మాటలాడుచున్న గోపికల మాటలు విని ఉద్ధవుడు వారికి ప్రియములైన మంచి మాటలతో ఊరడిస్తూ ఇట్లా అన్నాడు:

మ. జప దాన వ్రత హోమ సంయమ తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనముల న్నిల్పంగలే రట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్.

1467

తా ॥ "జపములు, దానములు, వ్రతములు, హోమములు, సంయమములు, తపస్సులు, వేదాధ్యయనము మొదలగు వాటిచే నేర్పరులైన వారు కూడ పరమేశ్వరుణ్ణి తమ మనస్సుల్లో నిలుపుకోలేరు. అట్టి గొప్ప మహిమ కలవాని మీద, విశ్వేశ్వరుని మీద ఎల్లప్పుడూ దృఢమైన

ధ్యానం ఈ విధంగా నిలుస్తుందా? మీ చరిత్ర చాలా చిత్రంగా ఉంది.

క. నను మీ కడకుం గృష్ణుఁడు, పని పంపెడు వేళఁ బిలిచి పలికిన పలుకుల్
వినుఁ; డన్నియు వివరించెద, వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్.

1468

తా ॥ ఓ గోపికలారా! శ్రీకృష్ణుడు నన్ను మీ వద్దకు పొమ్మని ఆజ్ఞాపించునప్పుడు నాతో చెప్పిన మాటలు చాలా ఉన్నాయి. వాటిని విశదంగా చెబుతాను. మీరు విచారం మాని వినండి."

వ. అని హరివచనంబులుగా నిట్లనియె.

1469

తా ॥ అని కృష్ణుడు చెప్పిన మాటలుగా ఉద్ధవుడు వారికిట్లా వినిపించాడు:

సీ. ఎల్లకార్యములకు నేను బ్రధాన కారణము గావున మీరు రమణులార!
కలుగదు మద్వియోగము చరాచర రూపములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడనై నే మనః ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుండ
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు హృషీకభూత

తే. గుణగణాకార మాత్మలోఁ గొమరు మిగులు, నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ మాత్మ
విజ్ఞానమయమునై యమరు గుణముఁ, బ్రకృతికార్య మనోవృత్తిఁ బట్టి పొందు.

1470

తా ॥ " 'ఓ గోపికలారా! సృష్ట్యాది సకల కార్యములకు కారణభూతుడను నేనే కనుక మీకు నా ఎడబాటు కలుగదు. స్థావరములు, జంగమములు అయిన ప్రాణుల లోపల పంచ భూతములు అణగి ఉన్నట్లుగా, నేను సర్వములోను ఉంటాను. మనస్సుకు, పంచప్రాణములకు, బుద్ధికి, ప్రకృతికి, ఇంద్రియములకు నేను ఆశ్రయమైన వాడను. నా సంకల్పం చేత నాలోనే ఉన్న

చరాచర ప్రపంచాన్ని పుట్టిస్తాను, రక్షిస్తాను, నశింప చేస్తాను. పదునాలుగు ఇంద్రియములు, పంచ మహా భూతములు త్రిగుణాలు, వీని సమూహం యొక్క రూపమే నాయందు పుట్టి ప్రకాశిస్తోంది. మాయానుభవం చేత నిత్యుడను, పరిశుద్ధుడను, విజ్ఞాన స్వరూపుడను అయిన నేను వేరు అనిపిస్తాను కానీ, విచారణ చేస్తే అది మిథ్య అని తెలుస్తుంది.

క. కలఁగని లేచి మున్ను గలఁగన్న సమస్తవిధంబుఁ గల్లఁగాఁ
దలఁచిన భంగి మానస పదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుడున్ బుధుల కవ్వల నొండొక భేద మున్నదే?

1471

తా ॥ కలగన్న మనుష్యుడు మేలుకొన్న పిమ్మట కలలో కనపడినదంతా అసత్యమని భావిస్తాడు. అలాగే తత్త్వవేత్త మనస్సనే పదార్థంచేత ఇంద్రియార్థములనన్నిటినీ జ్ఞాన శక్తి చేత అణచి తనకంటే ఇతరముగ ప్రపంచము లేదు అని నిశ్చయిస్తాడు. మనస్సును ఏ వికారములు పొందకుండా నియంత్రించగా ఇక బేధభావము కలుగదు.

ఆ. సాంఖ్య యోగ నిగమ సత్య తపో దమ, ములు మనోనిరోధములు గడపలఁ
గాఁగ నుండు జలధి కడపలగాఁ గల, నదులభంగి నళిననయనలార!

1472

తా ॥ కమలముల వంటి కన్నులుగల గోపికలారా! నదులన్నియు చివరగా సముద్రమునందే చేరునట్లు, సాంఖ్యము, యోగము, వేదములు, సత్యము, తపస్సు, ఇంద్రియ నిగ్రహము మొదలైన నిష్ఠలన్నీ నన్ను చేరుటకే, కనుక మీరు చేయు నిరంతరధ్యానం వల్ల నేను మీయందే ఉన్నాను.

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు

త్కలికం జేరువ వారికంటె నదియుం గాకెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచు నుండఁగోరి యిటు దూరస్థత్వముం బొందితిన్
దలఁకం బోలదు నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణలై.

1473

తా ॥ స్త్రీలు దగ్గరనున్న వారి కన్నా దూరంగా ఉన్న ప్రియుల మీద మనస్సులో మిక్కిలి ప్రేమకల వారై ఉంటారు. ఇంతేకాక మీరు ఎల్లప్పుడూ నన్ను తలుస్తూ ఉండాలనే కోరికచేత నేను ఈ విధంగా మీకు దూరంగా ఉన్నాను. కనుక మీరు ఎడతెగని ధ్యానం చేత నన్ను పొందగలరు.'

వ. అని మీకుం జెప్పుమని కృష్ణుండు సెప్పె ననవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యిట్లనిరి.

1474

తా ॥ అని మీకు చెప్పమని కృష్ణుడు చెప్పాడు". ఆ మాటలకు గోపికలు సంతోషంతో ఇట్లా అన్నారు:

ఉ. ఇమ్ముల నున్నవాఁడె హరి? యిక్కడి కెన్నఁడు వచ్చు? వచ్చి మా
యుమ్మలికంబు వాపునె? ప్రియుం డిట వచ్చెద నన్న సైఁతురే
య మ్మథురాపురీరమణు లడ్డము వత్తురుగాక చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే!

1475

తా ॥ "కృష్ణుడు బాగా ఉన్నాడా? ఇక్కడకి ఎప్పుడు వస్తాడు? మా దుఃఖాన్ని ఎప్పుడు తీరుస్తాడు? మా ప్రాణేశ్వరుడు ఇక్కడకు వస్తానంటే మధురాపుర స్త్రీలు సహిస్తారా? అడ్డంవచ్చి నిలుపుకోరూ? అయ్యో! దయమాలిన బ్రహ్మ మమ్ములను ఎంతో వేదనకు గురి చేశాడు గదా!

క. మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునం
దఱచుగ దివ్యసౌరభ లతా గృహసీమల నేము డాఁగఁగా
మఱువులనుండి నీడలకు మ మ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చు చందముల్.

1476

తా ॥ శ్రీకృష్ణుడు మునుపు యమునా నదీ తీరంలో దివ్యపరిమళాలు గల పువ్వులతోడి, తీగల చేత అల్లుకోబడిన పొదరిండ్లయందు మాతో చేరి ఉండేవాడు. మమ్ము దగ్గరకు తీసి, కలతపెట్టి, సంతోషింప చేసిన విషయాలన్నీ మరచి పోతాడేమో?

శా. నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీత భ్రాంతలమై కళిందతనయా తీరంబునం జేరినం
జేతోజాత సుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ చూడ లీ
లా తంత్రజ్ఞత డాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్.

1477

తా ॥ మేమంతా తన వేణునాదాన్ని విని పరవశులమై యమునా నదీ తీరానికి చేరుకున్నాం. అలా చేరగా మా మనస్సులు తెలుసుకోగోరి వినోదంగా మాకు కానరాక ఎక్కడో ఉండి, మా మాటలు విన్న వృత్తాంతాన్ని ఎప్పుడైనా శ్రీకృష్ణుడు ఏకాంత గృహములందు నీతో చెప్తాడా?

క. ముచ్చట వేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోము నప్పుడు జలముల్
సొచ్చిన మా చేలంబులు, ముచ్చిలి యిచ్చిన విధంబు మూలం బెల్లన్.

1478

తా ॥ మేము మునుపు గౌరీవ్రతం చేస్తూ యమునలో స్నానం చేసేటప్పుడు నీళ్ళలో

దిగినప్పుడు, మా చీరలను దొంగిలించి, మరల ఇచ్చిన వృత్తాంతాన్ని ముచ్చట వేళల్లో నీతో చెబుతాడా?

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా నేమేని భాషించుచో
మా కాంతుండు వచించునే రవిసుతా మధ్యప్రదేశంబునన్
రాకాచంద్ర మయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్.

1479

తా ॥ మా ప్రియుడైన కృష్ణుడు మునుపు యమునా నది నడుమ శరత్కాల పూర్ణిమలో మాతో రాసక్రీడను జరిపాడు. ఆ బంధముల యొక్క నేర్పులు ఏకాంతంగా నీతో ముచ్చటలాడేటప్పుడు ఎప్పుడైనా చెబుతాడా?

సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద నేలపై మేనులు నిలువ మనుము
నేలపై మేనులు నిలువక యట మున్న ధైర్యంబు లొక్కటఁ దలఁగు నను ము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ బ్రాణంబు లుండక పాయు ననుము

తే. ప్రాణములు వోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు, ప్రాణిరక్షకుఁ డగు తన్నుఁ బ్రాణు లెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు, వేగ విన్నప మొనరింపవే మహాత్మ!

1480

తా ॥ ఓ గొప్ప మనస్సుగల ఉద్ధవా! నీవు శీఘ్రంగా పోయి మా ప్రాణనాయకునితో, మేము పడే అవస్థను చెప్పు. నువ్వు ఆలస్యం చేసిన పక్షంలో, శ్రీకృష్ణుణ్ణి ఎడబాసిన మా దేహములు భూమిమీద నిలువవు. ముందుగా ధైర్యం తొలగిపోతుంది. ధైర్యం పోయిన పిమ్మట మనస్సు నిలువక సంతాపం హెచ్చుతుంది. ఎప్పుడు మనస్సున సంతాపం పుడుతుందో మా

ప్రాణాలు అప్పుడే పోతాయి. ప్రాణాలు పోయిన పిమ్మట ఎల్ల ప్రాణులకు రక్షకుడుగా ఉన్నవాడు గోపికల ప్రాణాలు పోగొట్టాడని నిందలపాలు కావలసినదే! ఆ తరువాత వచ్చి ఆ మహానుభావుడు చేయబోయేది మాత్రం ఏముంటుంది? కనుక ఈ విషయాన్ని వెంటనే అతనికి మనవి చెయ్యి.

క. తగులరె మగలను మగువలు?, దగులదె తను మున్ను కమల! తగవు విడిచియుం
దగిలిన మగువల విడుచుట, దగదని తనుఁ దగవు వలుకఁ దగుదువు హరికిన్.

1481

తా ॥ లోకంలో ఎవ్వరూ మోహింపరా? మున్ను లక్ష్మీదేవి తనను మోహింప లేదా? న్యాయం వీడి మోహించిన ఇంతులను విడిచి పెట్టడం తగునో తగదో విచారించి కృష్ణునికి న్యాయం చెప్పతగిన వాడవు నువ్వే.

సీ. విభుఁడు మా వ్రేపల్లె వీథుల నేతేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ
బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప విందుమే యొకనాఁడు వీను లలరఁ
దనువులు పులకింప దయితుండు డాసినఁ గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ?
బ్రాణేశ! మమ్మేల పాసితి వని దూఱ దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?

తే. వచ్చునే హరి మే మున్నవనముఁ జూడఁ?, దలఁచునే భర్త మాతోడితగులు తెలఁగుఁ?
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక, యెఱుఁగఁ బలుకు మహాత్మ! నీ కెఱుఁగ వచ్చు.

1482

తా ॥ ఓ ఉద్ధవా! ఇక ఎన్నటికైనా మా వ్రేపల్లె వీథుల్లో శ్రీకృష్ణమూర్తి తిరుగగా కన్నులారా చూడగలమా? ప్రియములైన మాటలు భాషించగా చెవులార వినగల్గుదుమా? దగ్గర చేరగా దేహములు గగుర్పాటు నొందగా కౌగిలించుకోగలమా? ఓ ప్రాణనాథా! మమ్ము ఎడబాయుటకు కారణం ఏమిటి అని తొందర పెట్టి అడగటానికి మాకు సమయం అనుకూలించునా? మేము

ఉండే ఈ వనానికి ఆయన ఇకమీద వస్తాడా? మాకు తనకుగల సంబంధాన్ని ఎప్పుడైన తలచుకొంటాడా? మా చేత తిట్లు తినకుండా ఆ బ్రహ్మ మా నాథుణ్ణి మా వద్దకు చేరుస్తాడా? ఈ విషయాలన్నీ నీకు తెలిసి ఉంటాయి కనుక మాకు తెలియ చెప్పు.

వ. అని 'దుఃఖార్ణవ మగ్నంబైన గోకులంబు నుద్ధరింపుము రమానాథ' యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవ నిగదితం బయిన కృష్ణసందేశంబులవలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్నినెల లుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చని చని.

1483

తా ॥ ఓ కృష్ణా! దుఃఖ సముద్రంలో మునిగి శుష్కిస్తున్న ఈ గోకులాన్ని ఉద్ధరించు అని ఆ గోపికలు దుఃఖించారు. అటు పిమ్మట ఉద్ధవుడు, కృష్ణుడు చెప్పి పంపిన మరికొన్ని మాటలు చెప్పగా, కొంచెం మనసులు కుదురుపరచుకుని అతన్ని పూజించారు. ఇలా కృష్ణ లీలా వర్ణనలు చేస్తూ వ్రేపల్లెలో ఉద్ధవుడు కొన్ని నెలలుండి, ఆపైన నందాదులను వీడ్కొని రథారూఢుడై బయలుదేరాడు.

క. సారమతిఁ బ్రణుతి సేయుచు, నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్
హారిన్ మథురానగర వి, హారిన్ రిపుజన మదాపహారిన్ శౌరిన్.

1484

తా ॥ నిండైన మనస్సుతో స్తోత్రము చేస్తూ, పాపములను తొలగించు వాడును, మనోజ్ఞుడైన వాడును, మథురాపట్టణము నందు విహరించు వాడును, శత్రువులయిన వారి మదమును అణచువాడును అయిన శ్రీకృష్ణుణ్ణి ఉద్ధవుడు చూసాడు.

వ. కని యథోచితంబుగా భాషించుచుఁ దనచేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱు వేఱ యిచ్చెనని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున

కిట్లనియె.

1485

తా ॥ చూసి చెప్పవలసిన మాటలను చెప్పి, బలరామకృష్ణులకు, ఉగ్రసేనునికి నందాదులు ఇచ్చి పంపిన కానుకలను వారి వారికి వేరువేరుగా సమర్పించాడు" అని పలికి శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో తిరిగి ఇలా అన్నాడు:

## 56. శ్రీకృష్ణుడు ఉద్ధవునితో చేరి కుబ్జాగృహంబునకు నరుగుట

మ. తను మున్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం
దనుపం గోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణమాల్యాను లే
పన భూషాంబర ధూపదీప పరిదీప్తంబై మనోజ ప్రదీ
పనమై యున్న తదీయ గేహమునకుం బంచేషుపంచేషుఁడై.

1486

తా ॥ అటు పిమ్మట శ్రీకృష్ణమూర్తి తనను మున్ను కలయగోరి ఉన్న కుబ్జను తృప్తిని పొందింప ఆ లతాంగి ఇంటికి వెళ్ళాడు. ఆ సుందరీదేవి మందిరం రత్నములు కూర్చిన బంగారు సరములచేత, నానా విధములయిన పరిమళములు చేర్చిన చందన ద్రవ్యముల చేత, ఆభరణముల చేత, వస్త్రముల చేత, ధూప ద్రవ్యముల చేత, దీపముల చేత మన్మథుణ్ణి కూడా మోహపెట్టేటట్లుగా ఉంది. అట్టి మందిరానికి మన్మథునికి సైతం మోహం పుట్టించునట్టి అలంకారంతో వెళ్ళాడు.

వ. ఇ ట్లరిగి తద్గేహమధ్యంబున.

1487

ఆ. కాముశరమువోలెఁ గమలారి కళవోలెఁ, మెలఁగి యాడనేర్చు మెఱపుఁ బోలె
నిఖిలభువన మోహినీ దేవతయుఁ బోలెఁ, జెలువు మెఱసియున్న చెలువఁ గనియె.

1488

తా ॥ ఈ విధంగా వెళ్ళిన ఆ కృష్ణుడు, మన్మథుని బాణంలాగా, చంద్రకళలాగా, సంచరించే మెరుపులాగా, సమస్త లోకాలను మోహింపచేసే దేవతలాగా సౌందర్యంతో ప్రకాశించే కుబ్జను చూచాడు.

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీసమూహంబుచే
సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణ సుం
దర తల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా
సుర పీఠంబున నుండు మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్.

1489

తా ॥ కృష్ణుడు వచ్చాడనే సంభ్రమంతో దిగ్గున లేచి, చెలికత్తెలను అర్ఘ్యము పాద్యము మొదలైనవి తెమ్మని త్వరపరచి, తన సంపద వెలుగొందునట్లుగా తగిన ఉపచారములతో అర్చించింది. ఆయనను బంగారుమయమైన పానుపునందు చేర్చి, ఉద్ధవుణ్ణి కూడా అధిక ప్రీతితో పూజించి తగిన పీఠం మీద కూర్చోపెట్టింది. ఆమె మనస్సు ఉత్సాహంతో ఉవ్విళ్ళూరుతున్నది.

క. ఆళీనివహ నివేదిత, మాలా మృగనాభిపంక మణిమయ భూషా
చేలాలంకృత యగుచును, హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్.

1490

తా ॥ విలాసవంతురాలైన ఆ కుబ్జ చెలికత్తెల సమూహం చేత ఇయ్యబడిన పూలదండలు, కస్తూరి కలిపిన చందనం, రత్నములచే అలంకరింపబడిన ఆభరణాలు అందమైన వస్త్రాలు వీనిచేత అలంకరింపబడి పుండరీకాక్షుడైన శ్రీకృష్ణమూర్తిని కలయకోరింది.

క. లీలావతీకృతోల్లస, దేలా కర్పూరమిళిత హిత మధుర మహా
హాలారసపాన మద, శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్.

1491

తా ॥ ఏలకులు పచ్చకర్పూరం మొదలైన పరిమళ ద్రవ్యములు చేర్చిన తియ్యదైనదియు, ఇంపైనదియు అయిన మద్యమును పానం చేసి ఉత్సాహము హెచ్చగా కృష్ణుణ్ణి సమీపించింది.

మ. సరసాలోకనవృష్టి పై ఁగురియుచున్ సమ్యగ్వచో వైఖరిం
గరఁగంజేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రి కేల్
కరపద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి
గంభీరతం బరిరంభాదుల నాన పుచ్చి మరుసంభావించుచున్ వేడుకన్.

1492

తా ॥ కుబ్జను సరసపు చూపులతో చూసి మంచి మాటలచే ఆమె హృదయాన్ని కరిగించాడు. పద్మాల వంటి తన చేతులతో ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం
బ్రీతివిశేషముం దెలిసి పెక్కు విధంబులఁ దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై.

1493

తా ॥ శ్రీకృష్ణుడు కుబ్జ యొక్క జాతిని, కాలమును, కళను, సత్త్వమును, దేశమును, భావ చేష్టలను, ధాతువును, ప్రాయమును, గుణమును, దశను, మనసును, చూపులను, ప్రీతిని విశేషముగా తెలుసుకొని సర్వవిధముల చేత ఆమె మనస్సు కరిగించి రమించాడు.

క. కరపద్మంబుల మాధవుఁ, గరమొప్పం గౌఁగిలించి కామానలముం
గరభోరువు వర్జించెను, గర మరు దని తోడిశీతకరముఖు లలరన్.

1494

తా ॥ తనతోటి వారందరు ఇది మిగుల దుర్లభము అని శ్లాఘించే విధంగా కుబ్జ తన మదన తాపాన్ని పోగొట్టుకుంది.

మ. సనకాదుల్ తలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్
మును దా నిచ్చిన యంగరాగ సుకృతామోదంబునం గూడియున్
ఘననిర్వాణవిభూతి యిమ్మనక యా కంజాక్షి 'యేఁ బాయఁ జా
ల ననుం గొన్నిదినంబు లంగభవలీలం దేల్పవే? నావుడున్.

1495

తా ॥ సనకాదులయిన దివ్య మునులకైనను పొందరాని వాడైన శ్రీకృష్ణమూర్తిని కుబ్జ మునుపు తాను చందనమిచ్చిన ఫల విశేషం చేత పొందింది. అయితే మేలైన మోక్ష పదవిని ఇమ్మని ప్రార్థింపలేక "కృష్ణా నిన్ను ఎడబాయలేను, కొన్నాళ్ళు నా ఇంట్లోనే ఉండి మన్మథ క్రీడయందు ఆనందింప చెయ్యి" అని ప్రార్థించింది.

ఆ. వనిత గోరుకొనిన వర మిచ్చి శౌరి యా, యుద్ధవుండుఁ దాను నువిదయిల్లు
వెడలె నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ, దీఁగెయిల్లు వెడలు తెఱఁగు మెఱయ.

1496

తా ॥ కృష్ణుడు ఆ విధంగా కుబ్జ కోరుకొన్న వరాన్ని ఇచ్చి ఆమె ఇంటి నుండి ఉద్ధవుడు, తాను పొదరింటిలో నుండి వసంతునితో వెడలి వస్తూన్న మదనునివలె బయటకు వచ్చాడు.

క. ఏ వేదంబులుఁ గానని, దేవోత్తముఁ గాంచి ముక్తితెరు వడుగక రా
జీవేక్షణ రతి యడిగెను, భావింపఁ దదీయకర్మఫల మెట్టిదియో!

1497

తా ॥ ఆమె యొక్క పూర్వ కర్మఫలం ఎటువంటిదో! వేదములు కూడా కానరాని శ్రీకృష్ణమూర్తిని మోక్షం ఇమ్మని కోరక విషయ సుఖాలను ఇమ్మని కోరింది. (సంకల్పములకు అనుగుణంగానే ఫలితాలు ఉంటాయి కదా!)

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు, తారుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ
లారణ్యవీథి దేల్చెను, సైరంధ్రిన్ విభవవిజిత శక్రపురంధ్రిన్.

1498

తా ॥ అందుకే శ్రీకృష్ణమూర్తి వైభవంతో శచీదేవిని జయించిన కుబ్జను, తన యౌవనాన్ని ప్రకాశింపచేసి తృప్తిని పొందించాడు.

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవ రామ సహితుండై హస్తినాపురమునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకుఁ జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱను యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె.

1499

తా ॥ అటు పిమ్మట శ్రీకృష్ణుడు ఉద్ధవ, బలరామ సహితుడై హస్తినా పట్టణానికి అక్రూరుణ్ణి పంపదలచి అతని ఇంటికి వెళ్ళాడు. అతడు వీరిని చూసి లేచి బలరామకృష్ణులకు నమస్కరించి, ఉద్ధవుణ్ణి కౌగిలించుకొని, యథావిధిగా ముగ్గురినీ అర్చించి కృష్ణుని పాదములు తన ఒడిలో ఉంచుకొని ఇలా అన్నాడు:

క. అనుచరులుఁ దాను గంసుఁడు, సనియెన్ నీచేత జముని సదనంబునకున్
ఘనులార! మీ బలంబున నొనరఁగ యాదవులవంశ ముద్ధృత మయ్యెన్.

1500

తా ॥ "ఓ మహాత్ములారా! మీ శౌర్యం వలన కంసుడు తన పరిజనులతో కూడి మరణించాడు. మీ సామర్థ్యంచేత యాదవ వంశం ఉద్ధరింపబడింది.

వ. మహాత్ములారా! విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరగు మీకుం

గార్యకారణంబులు లే; వవధరింపుము. పరమేశ్వరా! నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి, కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై శ్రుతదృష్టకార్యరూప ప్రపంచాకారంబున దీపించుచుందువు. కార్యరూప చరాచర దేహంబులకుం గారణంబు లయిన భూప్రముఖంబు లనుగతంబులును, గార్యరూప దేహంబులు నయి ప్రకాశించు చందంబున నొక్కండవు, కారణరహితుండవు, నాత్మతంత్రుండవు నై యుండియు విశ్వాకారంబునం బెక్కగుదువు. సృష్టి స్థితి లయంబులం జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవుని భంగి గుణకర్మ బద్ధుండవు కావు. కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువును సిద్ధింపదు.

1501

తా ॥ మహాత్ములారా! మీరు ఈ సృష్టికి పూర్వమే ఉన్న పరబ్రహ్మ స్వరూపులు; ఈ విశ్వ రచనకు కారణభూతులు, విశ్వమంతా నిండి ఉన్నవారు కనుక మీకు కార్యకారణాలు లేవు. ఓ దేవా! ఈ సమస్త ప్రపంచాన్ని రజోగుణముచే సృష్టించి, కారణ రూపంతో అందు ప్రవేశిస్తావు, కార్యరూపంగా దీపిస్తుంటావు. చరాచర సృష్టికి మూలమైన పంచభూతాల్లో అనుగతమై తేజరిల్లు నీవు కారణ రహితుడవు. ఏకాత్మ స్వరూపుడవైన నీవు విశ్వరూపంలో అనేకంగా గోచరిస్తావు. సృష్టి, స్థితి, లయములను నిర్వహిస్తున్నా, విజ్ఞానమూర్తివైన నీకు జీవుని వలె గుణకర్మలు అంటవు. అందువలన నిన్ను బంధించేది ఏదీ ఉండదు, నీవు బంధరహితుడవు.

సీ. పరఁగ జీవునికైన బంధమోక్షము లంట వంటునే పరతత్త్వమైన నిన్ను
నంటునే యీశ! దేహాద్యుపాధులు ననిర్వచనీయములు గాన వరుస నీకు
జన్మంబు జన్మసంశ్రయభేదములు లేవు కావున బంధమోక్షములు లేవు
గణుతింప ని న్నులూఖల బద్ధుఁ డనుటయు నహిముక్తుఁ డనుటయు నస్మదీయ

ఆ. బాలబుద్ధిఁ గాదె? పాషండ ముఖర మా, ర్గములచేత నీ జగద్ధితార్థ
మైన వేదమార్గ మడఁగిపో వచ్చిన, నవతరించి నిలుపు దంబుజాక్ష!

1502

తా ॥ జీవుడు నిన్ను తలచిన మాత్రం చేతనే బంధమోక్షముల వలన ముక్తుడగుచున్నాడు. అట్టిచో సచ్చిదానంద పరబ్రహ్మమైన నీకు బంధమోక్షములు కలుగనేరవు. దేహాదులైన ఉపాధులు నిర్వచించలేనివి కనుక, నీకు జన్మముగాని దానికి కారణమైన అవిద్య కాని లేవు. కనుక బంధమోక్షాలు లేవు. అట్టి నిన్ను రోటికి కట్టబడిన వాడవనీ, కాళియ విముక్తుడవని అనడం అవివేకం వల్లనే సుమా! నీవు నాస్తిక మతముల వారిచేత వేద శాస్త్రోక్తములైన వర్ణాశ్రమాచారములు నశించినప్పుడు, లోకక్షేమానికి తగిన అవతారమెత్తి ఆ ధర్మాలు నశించకుండా నిలుపుతావు.

క. ఆ నీవు ధరణిభారము, మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై
యానకదుందుభియింటను, మానుగ జన్మించితివి సమంచితకీర్తిన్.

1503

తా ॥ ఓ శ్రీకృష్ణా! రాక్షసులను అందరినీ చంపి భూభారాన్ని పోగొట్టుటకై, మిక్కిలి శ్లాఘ్యమైన కీర్తితో వసుదేవుని ఇంట పుట్టావు.

మ. త్రిజగత్పావనపాద తోయములచే దీపించి వేదామర
ద్విజముఖ్యాకృతివైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి మా
నిజగేహంబులు ధన్యతం దనరెఁబో! ని న్నార్యు లర్చింపఁగా
నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్త చిత్తుండవై.

1504

తా ॥ మూడు లోకాలను పరిశుద్ధములుగా చేయునట్టి పాదజలముచే దీపిస్తూ, దేవబ్రాహ్మణ వేదాది స్వరూపుడవైన నీవు దయతో ఇక్కడకు విచ్చేయుట చేత మా గృహములు పావనములయ్యాయి. నీ పాదములను అర్చించునట్టి వారికి నీవు దయగలవాడవై ఇంద్రియ

జయమును అనుగ్రహిస్తావు.

శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్
నీ పాదంబులఁ గంటి ని న్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండవై
నాపై నర్మిలిఁ జేసి మాన్పఁ గదవే నానాధనాగార కాం
తా పుత్రాదులతోడి బంధనము భక్తవ్రాత చింతామణీ!

1505

తా ॥ భక్తుల పాలిటి చింతామణివైన శ్రీకృష్ణా! ఏ పుణ్య మహిమవల్లనో ఈ జన్మలో నీ పాదములను దర్శించే భాగ్యాన్ని పొందాను. నిన్ను గుర్తించగలిగాను. నీవు నాయందు కృపగల వాడవై ధనములు, గృహములు, భార్య, కొడుకులు మొదలైన వారి ఎడల గల మోహాన్ని పోగొట్టి, నా బంధములను తొలగించి రక్షించు"

వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారసంబంధం బగు మోహంబును గీలుకొలుపుచు హరి యిట్లనియె.

1506

తా ॥ అని ఈ విధంగా తనను ప్రార్థించి పలుకుచున్న అక్రూరుని మాటలకు నవ్వుచూ, అతనికి సంసార సంబంధమైన మోహం తొలగేలా చేస్తూ ఇట్లా అన్నాడు:

# 57. శ్రీకృష్ణుడు అక్రూరున్ని హస్తినాపురమునకు పంపుట

క. బంధుండవు సద్యోహిత, సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా
సింధుండ వెల్లగుణముల, నంధుండవు గావు ప్రోవ నర్హుఁడ వెందున్.

1507

తా ॥ “ఓ అక్రూరుడా! నీవు మాకు బాంధవుడివి. వరుసకు తండ్రివి. మాకు మేలుకోరేవాడివి. విశేషించి మాయందు దయగలవాడవు. మంచి గుణాల విషయంలో అంధుడవు కావు. ఏ విధంగా చూసినా సమర్థుడైనవాడవు.

చ. కొలుతురు మర్త్య లిష్టములు గోరి శిలామయ దేవసంఘమున్
జలమయతీర్థ సంఘమును సంతతము న్న టు వారు గొల్వఁగా
వల దనరాదు గాక భగవత్పద భక్తులరైన మీ క్రియన్
సొలయక దేవతీర్థములు చూచిన యంతనె కోర్కు లిచ్చునే?

1508

తా ॥ ఓ అక్రూరా! లోకంలోని మానవులు శిలారూపములైన దేవతలను, జలరూపములైన గంగాది నదులను తమ కోరికలు నెరవేరటం కోసం సేవిస్తారు. అలా చేసేవారికి అది సరికాదు అని చెప్పకూడదు. కానీ నిజానికి, భగవత్ చరణాలను అంటిపెట్టుకునే ఉన్న మీ వంటి భక్తులకు అవి సాటిరావు.

వ. మహాత్మా! పరమభాగవతుండవైన నీవు మా కభీష్టంబుల నొనరింప నర్హుండవు; వినుము. పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితు లయిన పాండవులు ధృతరాష్ట్ర శాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవారఁట. నిజపుత్రమోహితుం డగు న య్యంధ నృపతి వారియందు సమత్వంబునం జరింపం డటు గావున.

తా ॥ మహాత్మా! నీవు భగవద్భక్తులలో శ్రేష్ఠుడవు. మా అభీష్టాన్ని సక్రమంగా నిర్వహించువాడవు, విను! పాండురాజు మృతి చెందగా, ఆయన భార్య అయిన కుంతీదేవి, పుత్రులైన ధర్మరాజాదులు ధృతరాష్ట్రుని ఆజ్ఞ చొప్పున హస్తినాపురానికి వచ్చి ఉన్నారట. తన కొడుకుల మీది వ్యామోహంతో ఆ అంధ రాజు, పాండవుల పట్ల ప్రేమను కనబరచటం లేదు, సమబుద్ధితో వ్యవహరించుట లేదు.

క. వారలు బంధులు గావున, వారలకును మే లొనర్చి వా రలరంగా
వారింప వలయు దుస్థితి, వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్.

1510

తా ॥ చంద్రవంశస్థుడవైన ఓ అక్రూరా! మనకు ఆ కుంతియు, ఆమె కొడుకులు బంధువులు. కాబట్టి వారికి మేలు చేసి ఆనందించేటట్లు వారి దుర్దశను పోగొట్టాలి. కనుక నీవు పోయి వారిని చూసి ఆదరించి రావాలి."

వ. అని పలికి సంకర్షణోద్ధవ సహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బంధువులనుం గని యథోచిత సత్కారంబుల నొంది తత్తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ గొన్ని దినంబు లుండ నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిఁ గుంతి యిట్లనియె.
1511

తా ॥ అని చెప్పి కృష్ణుడు ఉద్ధవ బలరాములతో కూడి తన గృహానికి వెళ్ళాడు. అక్రూరుడు వెంటనే బయలుదేరి కౌరవుల పట్టణమైన హస్తినాపురికి వెళ్ళాడు. అక్కడ ఉన్న ధృతరాష్ట్రుడు మొదలైన వారిని, పాండవులను, కుంతీ దేవిని, తక్కిన బంధువులను చూసి

వారివలన తగిన మర్యాదలను పొందాడు. వారి ప్రవర్తన తెలుసుకోవాలని కొన్ని దినాలు అక్కడనే ఉన్నాడు. ఒకనాడు ఏకాంతంలో విదురుడు వినేటట్లు అక్రూరునితో కుంతీదేవి ఇలా అన్నది:

శా. అన్నా! తల్లులు దండ్రులున్ భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మనువేళ నే మనిరి? మా నెవ్వల్ విచారింతురే?
యున్నారా సుఖయుక్తులై? మృగి వృకవ్యూహంబులో నున్న రే
ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనః కౌరవ్యమధ్యంబునన్.

1512

తా ॥ "అన్నా! మా తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, అల్లురు మొదలైన వారు నిన్ను ఇక్కడికి పంపేటప్పుడు ఏం చెప్పి పంపారు? మా దుఃఖాలు ఎప్పుడైనా తలచుకొంటున్నారా? వారంతా సుఖంగా ఉన్నారా? నేను ఇక్కడ కుత్సిత బుద్ధిగల కౌరవుల నడుమ తోడేళ్ళ గుంపులో ఆడలేడి లాగ చిక్కుకొని ఉన్నాను.

మ. కఱపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్
నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే
మఱి యుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం దేమియుం
గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు గార్యంబులన్.

1513

తా ॥ అయ్యా! ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడు, నా కొడుకుల విషయంలో కొంచెమైనా సరిపడినవాడుగా ఉండటం లేదు. వాడు మిక్కిలి క్రూరుడు. క్రూరత్వం చేత నా కొడుకులను పాములచేత కరిపించాడు. తీగలతో మూటకట్టి గంగానదిలో పడత్రోయించాడు, విషం కలిపిన అన్నం పెట్టించాడు. ఒళ్ళు తెలియక నిద్రపోతుంటే ఆయుధాలతో పొడిపించాడు.

మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నడైనఁ దమలో భాషించి మేనత్త బి
డ్డలకున్ మేలు దలంతురే? వగపులన్ డయ్యంగఁ బాలై రయో!
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి యి
మ్ముల నిప్పించునె నాకుమారకులకున్ ముఖ్యప్రకారంబులన్.

1514

తా ॥ బలరామకృష్ణులు ఎప్పుడైనా తమలో తాము మాటలాడుకొనేటప్పుడు, తమ మేనత్త బిడ్డలకు మేలు కలగాలని అనుకొంటారా? దుఃఖాలను పొందుటకు పాలుపడ్డారే అని వారికి క్షేమం కలగచేసే ఆలోచనలు ఏమైనా చేస్తున్నారా? భక్తులయందు అనుగ్రహం కలవాడైన శ్రీకృష్ణుడు నా కొడుకులకు ప్రధానమైన రీతితో భూమండలంలో వారికిగల భాగాన్ని సరిగా పంచి ఇప్పించునా?"

వ. అని పలికి, కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు చేసి, 'సర్వాత్మక! సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగత నైన నన్ను రక్షింపు మని' వగచుచున్న కుంతికి నక్రూరుండు విదుర సమేతుండై ప్రియ వచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్ర మధ్యంబున సుఖోపవిష్టుండై యున్న ధృతరాష్ట్రున కిట్లనియె.

1515

తా ॥ అని అంటూ, తన మనసులో శ్రీకృష్ణుని నిలిపి ధ్యానించి మ్రొక్కి ఈ విధంగా స్తోత్రం చేసింది: "ఓ పుండరీకాక్షా! సర్వమూ నీవే! సర్వాన్ని రక్షించే వాడవు నీవే! నీ శరణు పొందిన దాననైన నన్ను ముమ్మాటికి రక్షించు!" అని దుఃఖ పడుతూన్న కుంతీదేవికి, అక్రూరుడు విదురునితో కూడుకొని ప్రియవచనాలతో దుఃఖోపశమనం చేశాడు. ఆమెవద్ద సెలవు పుచ్చుకొని, బంధువులు, స్నేహితుల నడుమ కూర్చొని సుఖంగా కొలువుతీరి ఉన్న ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు:

## 58. అక్రూరుడు ధృతరాష్ట్రునితో హితోపదేశముగా సంభాషించుట

ఉ. నీ యనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమభావన చేసితి వేనిఁ గీర్తియున్
శ్రేయము గల్గు; వే ఱొకటి చేసిన దుర్గతి గల్గు భూవరా!

1516

తా ॥ "ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ తమ్ముడైన పాండు మహారాజు మరణించిన పిమ్మట, నువ్వు ధర్మంచేత విశాలమైన బుద్ధితో పాలిస్తూ గౌరవం వహించి ఉన్నావు కదా. ప్రజలయందు సమభావంతో నీవు పాలన చేస్తే కీర్తి, మేలు కలుగుతుంది. భేదభావం చూపితే దుర్గతి కలుగుతుంది.

సీ. అవనీశ! పాండవులందు నీ నందను లందు సమానుండ వగుట బుద్ధి
యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగార పుత్రాదికముల
వలన నయ్యెడి దేమి? వసుమతి నొకజంతు వుదయింప నొకజంతు వుక్కడంగు
నొకఁడు పుణ్యముఁ జెందు నొకఁడు పాపము నొందు మీనజీవనభూత మిళిత జలము

ఆ. తత్తనూజు లెట్లు ద్రావుదు రట్లు మూ, ఢాత్ము విత్తమెల్ల నపహరింతు
రహితులైన కొడుకు లటమీఁద మనియైనఁ, జచ్చియైనఁ దండ్రిజాడఁ జనరు.

1517

తా ॥ ఓ రాజా! నువ్వు పాండురాజు కుమారులయందునూ, నీ కొడుకులందునూ సమానమైన అభిప్రాయం కలిగి ఉండటం మంచిది. ఈ లోకంలో ఒకనితో మరొకడు కూడి ఉండే స్థితి ఎవరికీ శాశ్వతం కాదు. భార్య, బిడ్డలు, ఇండ్లు, వాకిళ్ళు వీటి వలన కలుగబోవు సుఖం ఏదియు కానము. ఒక జంతువు పుడుతుంటే మరియొకటి గిడుతోంది. ఒకడు

పుణ్యమును అనుభవింపగా, ఇంకొకడు పాపాన్ని అనుభవించడం ఈ భూమిమీద సహజంగా ఉంది. చేపకు జీవనంగా ఉన్న నీటిని ఆ చేప పిల్లలే త్రాగుచుండునట్లుగా మూఢ బుద్ధిచేత కూడపెట్టిన వాని ధనాన్ని వాని కొడుకులే పగవారై అపహరిస్తారు. ఆపైన తండ్రి బ్రతికినా, చనిపోయినా, అతన్ని కన్నెత్తి అయినా చూడరు.

క. కావున మూఢాత్ముఁడవై, నీ వార్జించిన ధనంబు నీ పుత్రులు దు
ర్భావులు పుచ్చుకొనంగా, భూవర! నిందితుఁడ వగుదు భూనాకములన్.

1518

తా ॥ కావున ఓ రాజా! నీవు అధర్మంతో సంపాదించిన ద్రవ్యాన్ని, దుఃఖాన్ని కలిగించే విధంగా నీ కొడుకులు కలహపడి పంచుకొంటారు. నీకు ఇహపరలోకాలు రెంటియందును అపకీర్తి కలుగుతుంది.

శా. నిందం బొందకు మయ్య! యీ తనువు దా నిద్రాకళా దృష్టమౌ
సందోహంబు విధంబు నిల్వదు సుమీ! జాత్యంధతం బొందియున్
మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్ జ్ఞానచక్షుండవై
సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వంసహాభాగమున్.

1519

తా ॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా! క్షణభంగురమైన ఈ దేహాన్ని నమ్మి నిందను పొందకు. ఈ దేహం కలలో కనిపించే వస్తు సముదాయం వలె స్థిరంగా ఉండదు. నీవు పుట్టు గ్రుడ్డివైననూ, మంద బుద్ధితో మెలగకు. విచక్షణతో కళ్ళు తెరిచి పాండవులకు భూభాగాన్ని సందేహింపక న్యాయంగా పంచి ఇవ్వు" అని అన్నాడు.

వ. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె.

1520

తా ॥ దానికి ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు:

సీ. నీమాట మంచిది నిశ్చయ; మగునైన నస్థిరంబయిన నాయంతరంగ
మందు నిల్వదు సుదామాచలస్ఫటిక శిలాతలోద్యత తటిల్లతిక భంగి;
నమృతంబు నొందియు నానందితుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద;
నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింపనోపు విజ్ఞానియై యుండియైన

ఆ. విశ్వమెల్లఁ జేసి విభజించి గుణముల, నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని
భారమెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి, కెవ్వఁ డాత్మతంత్రుఁ డీశ్వరుండు.

1521

వ. అట్టి కృష్ణునకు నమస్కరించెద; ఆ నందనందనుని దివ్యచిత్తమునం గల తెఱంగునం బ్రతుకం గలవార మని వీడ్కొలిపిన, నక్రూరుం డతని తలం పెఱింగి యిట్లనియె. నీ తలంపు గనుంగొంటి. నీ కిష్టం బగునట్లు వర్తింపుమని పలికి, మరల మథురకుం జనుదెంచి, తదీయవృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె.

1522

తా ॥ “ఓ అక్రూరా! నీవు అన్నమాటలు నిజమైనవీ, శ్రేయస్కరమైనవీ, అయినా చంచలమైన నా మనస్సులో ఆ మాటలు చలింపక నిలువవు. ఇది సుదామమనే పర్వతమందలి స్ఫటిక శిల విస్తారమైన కాంతితో కలసి మెరుస్తూ ఉన్నా, మెరపు తీగలాగ నిలుకడ కలిగి ఉండని విధంగా ఉంటుంది. అమృతం లభించినా సంతోషింపని నరునివలె, నేను ఆనందాన్ని పొందలేను. ఈశ్వరాజ్ఞను ఎవడు తప్పింపగలడు? ఎంత తెలివిపరుడైనా మానవుడు దైవయత్నాన్ని తప్పింపలేడు. ఎవడు ఈ ప్రపంచమంతా సృజించాడో, ఎవడు సత్వరజస్తమో గుణాలను విభజించాడో, అవనిభారం తొలగించటం కోసం ఎవడు దేవకీదేవికి పుట్టాడో, ఎవడు స్వతంత్రుడో, ఎవడు సర్వజ్ఞత్వాది సంపదలు కలవాడో అట్టి కృష్ణునకు నమస్కరిస్తున్నాను. ఆయన మనస్సులో ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఆయన తలపును అనుసరించి మేము

బ్రతుకవలసిన వారము" అని చెప్పి పోయి రమ్మనగా, అక్రూరుడు అతని అభిప్రాయం తెలుసుకొని, "నీ తలపు నాకు తెలిసినది, నీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించు" అని పలికాడు. తిరిగి మథురకు వచ్చి ఆ వృత్తాంతం అంతా రామకృష్ణులకు చెప్పాడు.

వ. అంతఁ గంసభార్య లగు నస్తియుం బ్రాస్తియు, విధవలయి, దుఃఖింపుచుం దమదండ్రి యయిన జరాసంధుని కడకుం జని.

1523

తా ॥ కంసుని భార్యలైన అస్తి, ప్రాస్తి అనువారు, తమ భర్త మరణించినందుకు దుఃఖీస్తూ తండ్రి అయిన జరాసంధుని వద్దకు వచ్చారు.

## 59. జరాసంధుడు మథురాపట్టణము మీద దండెత్తివచ్చి కృషునితో యుద్ధము చేయుట

శా. వాంఛ్రుస్ వీంధ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్
వేంద్రంబైన బలంబుతో మథురకున్ వే వచ్చి నిష్కారణం
బాంధ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాది క్షమానాథులన్
దండ్రీ! చంపిరి కృష్ణచేత నిటు వైధవ్యంబు వచ్చెన్ జుమీ!

1524

తా ॥ వచ్చి, తండ్రితో ఇలా అన్నారు: "యాదవులైన బలరామకృష్ణులు ప్రతాపంతో, బలిమితో మథురా పట్టణానికి వచ్చారు. రాజులయిన వారెవరో వచ్చి మాతో పోరాడండి. అని అహంకారంతో మా భర్తను, ఇతర రాజులనందరినీ, వారి భార్యలు, బిడ్డలు, చుట్టాలు ఆక్రందిస్తుండగా చంపారు. మాకు ఈ విధంగా కృష్ణుని వలన వైధవ్యం వచ్చింది."

వ. అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె.

1525

తా ॥ అనగా విని, ప్రళయ కాలపు అగ్నివలె మండిపడి, దుఃఖము, కోపము అధికము కాగా జరాసంధుడు ఇట్లా అన్నాడు:

శా. ఏమీ! కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నోచెల్ల! నా
సామర్థ్యంబుఁ దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో ద్దామార్చుల్
వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీ వాటికన్
భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్.

1526

తా ॥ "ఏమీ! కంసుడిని యుద్ధంలో కృష్ణుడు చంపాడా! ఔరా! అతను కొంచెం కూడా నా సామర్థ్యాన్ని తలచినవాడు కాదు. వాడు భూమిలో క్రుంగినా, ఆకాశంలో ఎగిరినా, అంతరిక్షంలో ప్రవేశించినా, నా పరాక్రమం అనే అగ్నిచేత ఆ యదువంశము అనే అడవిని నేడే దహించి వేస్తాను.

క. యాదవ విరహిత యగుఁ బో, మేదిని నాచేత నేఁడు మీఁదు మిగిలి సం
పాదితబలులై హరి రు, ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్.

1527

తా ॥ నేడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఒక్కటిగా కూడి సేనలను కూర్చుకొని అడ్డుపడినను నాచేత యాదవులు చంపబడుట నిశ్చయము. ఇందులో సందేహం లేదు."

వ. అని పలికి, సమరసన్నాహ సంకులచిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వేయించి కదలి.

1528

తా ॥ అని పలికి తన మనస్సులో యుద్ధానికి సిద్ధపడుతూ, తొందర అతిశయింపగా అధికమైన కోపంతో, యుద్ధభేరి మ్రోగించి మధుర పైకి దండు వెళ్ళాడు.

క. దక్షుండై యిరువది మూఁ, డక్షౌహిణులైన బలము లనుగతములుగా
నా క్షణమ జరాసంధుఁడు, ప్రక్షోభముతోడ మధురపైఁ జనియె నృపా!

1529

తా ॥ ఓ రాజా! జరాసంధుడు దక్షుడై, ఇరవై మూడు అక్షౌహిణుల సైన్యంతో అధికమైన ఆటోపంతో మధురా పట్టణం మీదికి దండయాత్రకు బయలు దేరాడు.

క. గంధేభ తురగ రథ భట, బంధుర చరణోత్థితోగ్ర పాంసుపటల యో

గాంధీభూతములై దివి, మంథరగతి నడచె నపుడు మార్తాండహరుల్.

1530

తా ॥ ఆ సమయమందు దండులోని మదపుటేనుగులు, గుఱ్ఱములు, రథాలు, భటుల అడుగుల నుండి మీదికి ఎగసిన దుమ్ము వలన సూర్యుని గుఱ్ఱాలు కన్నులు కానక, ఆకాశంలో మెల్లగా నడిచాయి.

వ. ఇట్లు చని నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫలభార వినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, ఉద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్రలతానిబద్ధ కలశ విముక్త సలిలధారాశీకర పరంపరా సంపాదిత వర్షాకాలంబును, కాలకింకర సదృశ వీరభట రథతురగ సామజానీక సంకులంబును, గులాచార ధర్మప్రవీర పౌరజన భాసురంబును, సురాభేద్యమాన మహోన్నతాట్టాలక యంత్ర భయంకర ప్రాకారచక్రంబును, జక్ర సారస హంసాది కలకలరవ కలిత సరోవరంబును, సరోవర సంఫుల్ల హల్లక కమల పరిమళమిళిత పవన విరాజితంబును, జితానేక మండలేశ్వరభూషణ మణిగణ రజోనివారిత మదగజేంద్ర దానజలప్రభూత పంకంబును, బంకరహిత యాదవేంద్రదత్త సువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దిత విద్వజ్జన నికేతనంబును, గేతన సన్నిబద్ధ చామరమయూర చాప శింజినీనినద పరిపూరితాభ్రంబును, నభ్రంలిహ మహాప్రాసాద సౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘనసార ధూపధూమపటల విలోకన సంజనిత జలధరభ్రాంతి విభ్రాంత శిఖండితాండవ రుచిరంబును, జిరతరానేక దేవాలయ జోఘుష్యమాణ తూర్యనినద పరిభావిత పారావారకల్లోల ఘోషంబును, ఘోషకామినీ ప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబునునై, పరులకు నలక్షితంబైన మథురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగున పట్టణంబునకు ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలౌఘంబు గని, వేళావిదుండగు హరి తన మనంబున.

1531

తా ॥ ఈ విధంగా జరాసంధుని సైన్యం మధురాపురం చేరింది. ఆ మధుర ఎల్లప్పుడూ చిగుళ్ళు, ఆకులు, మొగ్గలు, పువ్వులు, కాయలు, పండ్లు మొదలైనవాటి బరువు చేత వంగి ఉన్న వృక్షాలుగల ఉద్యానవనాలతో సుందరంగా ఉంటుంది. ఉద్యాన వనములయందు గల దారుయంత్రాలు గిర్రున తిరుగుతూ తుంపురులను రేపడం చేత వర్షాకాలాన్ని తోపింప చేస్తోంది. యమకింకరులను పోలిన శూరులైన భటులతో, రథములు, గుర్రములు, ఏనుగులు వీటి యొక్క కోలాహల ధ్వనులతో నిండి ఉంది. తమ తమ కులాచారం తప్పక ధర్మమార్గం అనుసరించి వర్తించే జనులచేత వన్నెకెక్కి ఉంది. దేవతలకు కూడా ఛేదింపరాని మిగుల పొడవైన కోటకొమ్మల మీది మేడలచేతను, నానా విధములైన కీలుగల సాధనముల చేతను ఒప్పుతూ ఉంది. చక్రవాకములు, హంసలు మొదలైన జలపక్షుల కోలాహల ధ్వనుల చేత అక్కడి సరస్సులు అలరారుతూ ఉన్నాయి. సరస్సుల యందలి చక్కగా వికసించిన ఎర్ర కలువలు, తామరలు మొదలైన పువ్వుల వాసన చేత రమణీయంగా ఉంది. జయింపబడిన అనేక రాజుల కిరీటముల యందలి మణుల పొడివలన ఏనుగుల మద జలముతో ఏర్పడిన పంకములు అణిగి పోయాయి. పరిశుద్ధులైన యదువంశశ్రేష్ఠుల వలన ఇయ్యబడిన బంగారం మొదలైన వాని వలన, అక్కడ విద్వాంసుల గృహాలు శోభాయమానంగా ప్రకాశిస్తున్నాయి. వింజామరలు, నెమళ్ళు, విండ్లు మొదలైన చిహ్నముల చేత కలిగిన ధ్వనులు ఆకాశమంతా వ్యాపిస్తుండగా జండాలు ఎగురుతున్నాయి. నింగిని తాకేలా ఉన్న మహాప్రాసాదముల నుండి, మేడల నుండి, గవాక్షముల నుండి వెడలుచున్న కర్పూర ధూప ద్రవ్యముల యొక్క ధూమమును చూసి మేఘాలని భ్రమించి నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి.

ఎల్లప్పుడూ వాయింపబడుచున్న దేవాలయాలలోని వాద్యధ్వనుల చేత, సముద్రమందలి అలల చప్పుళ్ళు తిరస్కరింపబడుతున్నాయి. గోపికా స్త్రీలకు ప్రియుడైన శ్రీకృష్ణుని యొక్క దండము వంటి బాహువు చేత ఆ మధురానగరం కాపాడబడతూ ఉన్నది. శత్రువులకు తలయెత్తి చూడటానికి కూడా వీలు లేకుండా ఉన్నది. అట్టి మధురా పట్టణానికి వచ్చి, పట్టణము చుట్టూ చెలియలి కట్ట దాటి ప్రవహింప వచ్చిన సముద్రమో అనునట్లుగా సేనను విడియించి, ఆ

పట్టణాన్ని జరాసంధుడు ముట్టడించాడు. సర్వము తెలిసిన శ్రీకృష్ణమూర్తి తన మనస్సులో తానిట్లు ఆలోచించాడు:

మ. ఐదున్నాలుగు నాఱు రెండు నిరు మూఁడక్షౌహిణుల్ సుట్టి సం
ఛాదించెన్ బురమెల్ల మాగధు నెడన్ సామంబు దానంబు సం
భేదంబున్ బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ
భూదేవీ తనుభార మెల్ల నుడుపన్ బోలున్ జయోద్భాసినై.

1532

తా ॥ 'ఇప్పుడు జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల సేనతో వచ్చి మన పట్టణాన్ని ఆక్రమించాడు. వీడి విషయంలో సామదాన భేదాలు అనే మూడు ఉపాయాలు అవసరం లేదు. కనుక దండోపాయంతో వీడిని జయించి భూభారాన్ని తగ్గిస్తాను.

క. ఏ నవతరించు టెల్లను, మానుగఁ జతురంతధరణి మండలభరమున్
మానుపుకొఱకుం గాదే, పూనెద నిది మొదలు దగిలి భూభర మణఁపన్.

1533

తా ॥ నేను భూమియందు అవతరించడానికి కారణం భూభారం తగ్గించుట కొరకే కాబట్టి దీనిని మొదలుకుని ప్రయత్న పూర్వకంగా భూభారాన్ని అణచడానికి మొదలుపెడతాను.

ఆ. మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు, మడియకున్న వీఁడు మరలి మరలి
బలము గూర్చికొంచుఁ బఱతెంచుఁ బఱతేరఁ, ద్రుంపవచ్చు నేల దొసఁగు దొఱఁగ

1534

తా ॥ ఈ జరాసంధుణ్ణి నేడే యుద్ధమునందు చంపకూడదు. వీడు బతికుంటే, మాటిమాటికి సేనను కూర్చుకొని మనపైకి వస్తూంటాడు. భూభారం బాగా తగ్గాక, అప్పుడు

వీడిని చంపవచ్చు'

వ. అని యిట్లు చింతించుచున్న సమయంబున నభోభాగంబుననుండి మహాప్రభా సమేతంబులును, సపరిచ్ఛద సూతంబులును, ననేక బాణ బాణాసన చక్రాది వివిధాయుధోపేతంబులు నైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునం జేరవచ్చినం జూచి హరి సంకర్షణున కిట్లనియె.

1535

తా ॥ అని ఈ విధంగా కృష్ణుడు ఆలోచిస్తున్నాడు. అప్పుడు ఆకాశమునుండి మిక్కిలి ప్రకాశము గలవి సారథులతో, ధ్వజకవచాదులతో కూడినవి, బాణములు, విండ్లు, చక్రములు మొదలైన ఆయుధాలు కల రెండు రథాలు తమ కోరికలు నెరవేరేటట్లు దైవయోగం చేత వచ్చి చేరాయి. వానిని చూసి శ్రీకృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు:

శా. కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను; వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము; ధరాభారంబు వారింపు; మీ
వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ; వేవేగ లె మ్మాజికిన్.

1536

తా ॥ "అన్నా! బలరామా! చూశావా! ఆకాశము నుండి ఆయుధాలతో రథాలు వచ్చాయి. ఇక మనం సంకోచించవలసిన పనిలేదు. దేవతలు మెచ్చేటట్లుగా, శత్రుసమూహాలను చంపి భూభారాన్ని తొలగించు. ఈ నిమిత్తము చేత నీ అవతారం సఫలమౌతుంది. శీఘ్రంగా యుద్ధానికి సిద్ధం కమ్ము."

వ. అని పలికి.

1537

తా ॥ అని కృష్ణుడు పలికాడు.

క. ఖరులై దృఢకవచ ధను, శ్శరులై యధిగత రథానుచరులై మదవత్
కరులై ఘనహరులై బల, హరు లయ్యెడ నాజి కేగి రరిభీకరులై.

1538

తా ॥ అప్పుడు బలరామకృష్ణులు, ఆ సమయంలో తీక్షణ స్వభావంకలవారై, దృఢమైన కవచాలు, విండ్లు, బాణములు కలవారై, రథానుచరులై, మదించిన ఏనుగులు గుఱ్ఱములు మొదలైన వానితో వీరభటులు తోడ్పడగా మిక్కిలి భయంకరులై యుద్ధానికి బయలుదేరారు.

వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి.

1539

ఉ. అన్యులు దల్లడిల్ల దనుజాంతకుఁ డొత్తె గభీరఘోష కా
ఠిన్య మహాప్రభావ వికటీకృత పద్మభవాండ జంతు చై
తన్యము ధన్యమున్ దివిజ తాపస మాన్యముఁ బ్రీత భక్త రా
జన్యము భీత దుశ్చరిత శాత్రవ సైన్యముఁ బాంచజన్యమున్.

1540

తా ॥ ఈ విధంగా యుద్ధానికి సిద్ధపడి పట్టణం నుండి బయలుదేరారు. శ్రీకృష్ణుడు తన శంఖమును ఏ విధంగా పూరించాడో ఇక్కడ తెలుపుచున్నారు. గంభీరమైన ధ్వనిచేత కఠినత్వమనెడు మహిమచేత, బ్రహ్మాండమందలి ప్రాణులయొక్క మనస్సులను కలత పెట్టేదిగా కృతార్థమైనది, దేవతలచేత మునులచేత గౌరవింప తగినది, భక్తులైన రాజులను సంతోషపెట్టేదీ, చెడ్డనడవడిగల రాజులకు దుఃఖాన్ని కలుగచేయునది అయిన పాంచజన్యము అనబడే శంఖాన్ని, శత్రువులు భయపడి చలించునట్లుగా పూరించాడు.

క. సింధుర భంజన పూరిత, బంధురతర శంఖనినద భారమున జరా
సంధునికిని గల సైన్యము, లంధములై సంచరించె నాహవభూమిన్.

1541

తా ॥ ఏనుగులను కూడా భయపెట్టగలిగిన గంభీరమైన కృష్ణుని శంఖధ్వనిని విని, యుద్ధభూమి యందున్న జరాసంధుని సైన్యమంతయు దిగులుతో మిక్కిలి చలించింది.

వ. అ య్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె.

1542

తా ॥ అప్పుడు జరాసంధుడు కృష్ణునితో ఇలా అన్నాడు:

సీ. అదలించి రొప్పంగ నాలమందలు గావు గంధగజేంద్రసంఘములు గాని
పరికించి వినఁగ నంభారవంబులు గావు వాజీంద్ర హేషారవములు గాని
పదహతిఁ గూల్పంగఁ బ్రాఁతబండ్లును గావు నగ సమాన స్యందనములు గాని
ప్రియము లాడంగ నాభీరలోకము గాదు కాలాభ వైరివర్గంబు గాని

తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని, మరియు బృందావనము గాదు మొనలు గాని
యమున గాదు నటింప ఘోరాజిగాని, పోరు నీకేల గోపాల! పొమ్ము పొమ్ము.

1543

తా ॥ "ఓ గోపాలా! ఇవి మత్త గజములు, బెదిరించి తరిమేందుకు ఆలమందలు కావు. ఇవి శ్రేష్ఠములైన గుఱ్ఱాల సకిలింతలు, అంతే కానీ చెవులు నిక్కించుకుని వినేందుకు ఆవుల అంబారావాలు కాదు. ఇక్కడున్నవి ఉన్నతమైన రథాలు కానీ కాలి చేత తన్నబడే పాత బర్డ్లు కావు. ఈ రణరంగమున ఉన్నది యమునితో సమానమైన శత్రుసమూహమే కానీ కాలక్షేప కబుర్లు చెప్పుకునే గొల్లవారి గుంపు కాదు. తేలికగా చల్లార్చే కార్చిచ్చు ఇక్కడ ఉండదు, తీవ్రమైన

బాణాగ్నియే ఉంటుంది. మురిసిపోతూ తిరగడానికి ఇది బృందావనం కాదు, ఇది సేనావాహినితో కూడిన కదనరంగం. నర్తించేందుకు ఇది దారుణయుద్ధ భూమి, యమునాతీరం కాదు. గొల్లవాడివి నీకెందుకు ఈ యుద్ధం? చాలించి పొమ్ము!

మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిరోధించుటో
గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్నిస్ఫార దుర్వార దు
ర్భర బాణాహతి నెట్లు నిల్పెదవు సప్రాణుండవై గోపకా!

1544

తా ॥ ఓ గోపకుమారా! ఒక ఆడుదానిని, ఒక కొంగను, ఒక గాడిదను చంపి, రెండు మద్ది చెట్లను విరుగద్రోసి, కొండనొక దానిని చేతపట్టి, గాలిని బంధించానని చెప్పడం కాదు. ఇప్పుడు ఇక్కడ నిన్ను ఎదిరించేది ప్రళయాగ్నివలె ఆర్పరానిదై నీకు భరింపశక్యం కానిదై వచ్చే నా బాణాల దెబ్బలే కాని వేరు కాదు. నా దుర్భర బాణాహతికి నువ్వెట్లా తట్టుకొని ప్రాణాలతో ఉండగలవు.

వ. అదియునుం గాక.

1545

తా ॥ అంతే కాదు.

సీ. గోపికావల్లకీ ఘోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱచు
వల్లవీకరముక్త వారిధారలు గావు శరవృష్టిధారలు చక్కుసేయు
ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు నిశితాసి నిహతులు నిగ్రహించు
నాభీరకామినీ హస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు;

తే. నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ, మకరసంఘాత సంపూర్ణ మగధరాజ
వాహినీ సాగరం బిది వనజనేత్ర!, నెఱసి నిను దీవి కైవడి నేఁడు ముంచు.

1546

తా ॥ ఓ కృష్ణా! నీవు ఇంపుగా వినేందుకు ఇవి గొల్ల పడుచుల వీణానాదాలు కావు. నీ చెవులను చిల్లులు పరిచే అల్లెత్రాటి మోతలు. ఆనందంగా తడిసేందుకు గోపస్త్రీలు చల్లే నీటి ధారలు కావు, బాణాల వాన. ఇక్కడ ఉండేది వాడి అయిన కత్తి వేటులే కానీ గోపాంగనల క్రీగంటి చూపులు కావు. వ్రజాంగనల తామరల వంటి చేతి స్పర్శలు ఉండవు, పిడికిటి పోట్లు మాత్రమే ఉంటాయి. ఇది వ్రేపల్లె వలె ఉంటుందని అనుకుంటున్నావేమో! ఇది రాజులనే కరకు మొసళ్ళతో నిండిన సేనాసముద్రం. నేడు ఈ మహా సముద్రం పెల్లుబికి నిన్ను దీవిని ముంచివేసినట్లుగా ముంచెత్తుతుంది."

వ. అనిన శ్రీహరి యిట్లనియె.

1547

ఉ. పంతము లేల? తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం
ద్రంతియ చాలదే? బిరుదు లాడుట బంటుతనంబు త్రోవయే?
యింతటఁ దీఱెనే? మగధ! యేటికిఁ బ్రేలెదు? నీవ యేల క
ల్పాంత మహోగ్రపావకునినైన హరింతు వరింతు సంపదన్.

1548

తా ॥ ఇలా పలుకుతున్న జరాసంధునితో శ్రీకృష్ణుడిలా అన్నాడు: "ఓ మాగధుడా! లేనిపోని పంతపు మాటలు ఎందుకు? నీవు మునుపు కొందరు రాజులను జయించావని చెబుతున్నారు, అది చాలదా? ఇంకా డంబాలు పలకడం శూరత్వం అవుతుందా? వట్టి మాటలతోనే నీకు జయం కలుగదు. ఊరకే మాట్లాడకు, నిన్నే కాదు ప్రళయకాలంలోని భయంకరమైన అగ్నిని కూడా హరిస్తాను. విజయాన్ని వరిస్తాను.

క. గోపాలుఁడ వని పలికితి, భూపాలక! దీన నేమి? పోరాడంగా
గోపాలమహీపాల, వ్యాపారాంతరము దెలియవచ్చుం బిదపన్.

1549

తా ॥ ఓ రాజా! నన్ను గోపాలుడవని అన్నావు! దీని వలన నాకు వచ్చే లోటు ఏమీ లేదు! గోపాలుడా, మహీపాలుడా అనే తేడా నీకే తెలిసి వస్తుంది"

వ. అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె.

1550

తా ॥ అని కృష్ణుడు అన్నందుకు అధిక రోషంతో, జరాసంధుడిట్లా అన్నాడు:

ఉ. బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు సేయ; గో
పాలక బాలుతోడ జనపాల శిఖామణియైన మాగధుం
డాలము సేసె నంచు జను లాడెడి మాటకు సిగ్గు పుట్టెడిం
జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింప వచ్చునే?

1551

తా ॥ "కృష్ణా! నీవు పసివాడవు. నాతో పోరాడేందుకు మీ అన్న అయిన బలరాముణ్ణి పంపించు. గోపబాలుడితో మగధ రాజ్యాధిపతి యుద్ధం చేశాడని లోకులు మాట్లాడుకుంటే, మేము సిగ్గుతో తల దించుకోవలసి వస్తుంది. దివ్యమైన బాణాలు గల మాతో పోరాడి గెలవడం నీవల్ల కాదు, చాలు చాలు, అవతలికి వెళ్ళు!"

వ. అనిన నగి నగధరుం డిట్లనియె.

1552

తా ॥ అనగా కృష్ణుడిట్లా అన్నాడు:

క. పొగడుకొనుదురే శూరులు?, మగఁటిమిఁ జూపుదురు గాక! మాగధ! నీకున్
మగతనము గలిగెనేనిం, దగు మెఱయ వికత్థనములు దగ వీ పోరన్.

1553

తా ॥ "ఓ జరాసంధా! శూరులగు వారు తమ పరాక్రమాన్ని చూపుతారు కాని నీలాగ ఊరికే పొగడుకోరు. నీకు పౌరుషం ఉంటే ప్రదర్శించు. పనికి మాలిన మాటలు చెప్పకు."

వ. అని రోషించి.

1554

చ. పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పు కైవడిన్
వివిధబలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ
మ్యవన చరిష్ణులం గువిమతావనినాథ నిరాకరిష్ణులన్
దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్.

1555

తా ॥ ఆ మాటలకు జరాసంధుడికి ఆగ్రహం వచ్చింది. మబ్బుచేత సూర్యుణ్ణి, దుమ్ముచేత అగ్నిని వాయువు కప్పే విధంగా ఆ రాక్షసుడు, భూమిని కాపాడుటకై సంచరించు స్వభావం కలవారు, శత్రువులైన రాజులను భంగపెట్టు వారు, దేవతలకు అలంకారమైన వారు, మిక్కిలి నిలుకడ అయిన గెలుపును పొందునట్టి స్వభావం కలవారు అయిన రామకృష్ణులను సేనాసమూహము చేత చుట్టుముట్టాడు.

మ. హయహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ శింజినీ
చయ టంకారములున్ వివర్ధిత గదాచక్రాస్త్ర నాదంబులున్
జయశబ్దంబులు భేరిభాంకృతులు నిస్సాణాది ఘోషంబులున్
భయద ప్రక్రియ నొక్కపెఁక నెగసెన్ బ్రహ్మాండభేదంబుగన్.

తా ॥ ఆ సమయంలో గుర్రముల సకిలింతలు, గజముల ఘీంకారాలు, రథచక్ర ధ్వనులు, వింటి నారి చప్పుళ్ళు, అంతకంతకూ పెరుగుతున్న గదల, చక్రముల, అస్త్రముల ధ్వనులు, జయ జయ ధ్వనులు, భేరి మొదలైన యుద్ధవాద్యధ్వనులను ఒక్కసారిగా బ్రహ్మాండం భేదిస్తుందో ఏమో అని జనులు భయపడేటట్లుగా నాలుగు దిక్కులందు వ్యాపించాయి.

వ. మఱియు నయ్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం దాఁకి రౌద్రంబున సంవర్త సమయ సముద్రంబుల భంగి నింగికిం బొంగి చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరు కవిసి మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబుల మాడ్కిని, మహోత్కంఠంబులగు కంఠీరవంబుల తెఱంగున, దుర్లభంబులగు శరభంబుల చాడ్పునం, బ్రచండంబులగు గండభేరుండంబుల గమనికం, దమతమ మొనలకుం దలకడచి వీరరసంబులు వివిధరూపంబులైన విధంబునం బదుగురు, నూర్వురు, వేవురు గములై కులకుధర గుహాంతరంబులు నిండ సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచుఁ, బటహ కాహళ భేరీ శంఖ శబ్దంబులకు నుబ్బుచు, గర్వంబునం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ, గాండంబుల నేయుచు, ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచు, గుంతంబులం గ్రుచ్చి యెత్తుచుఁ, గరవాలంబులం ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, శస్త్రంబులం దఱుఁగుచుఁ, జిత్రంబుగఁ దిరుగుచుఁ, బరిఘంబులఁ ద్రిప్పికొట్టుచు, బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియలం గ్రుమ్ముచు, బహుభంగులఁ బరాక్రమించు వీరభటులును, నిబిడ నీరంధ్ర నేమినిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళచక్ర మార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులు దోలి, వివిధాయుధ ప్రయోగంబుల వైరుల వ్రచ్చి, చిందఱవందఱ లాడు రథికులును, రథిక శరపరంపరలఁ గంపింపక మహామోఘ మేఘధారలకుం జలింపని ధరణీధరంబుల చాడ్పున రథంబులకుం గవిసి, కల్పాంతకాల దండిదండ ప్రచండంబులగు

శుండాదండంబులు సాఁ చి పూఁచి కడనొగ లొడిసి తిగిచి కుదిచి విఱిచి, కూబరములు నుఱుములుగఁ జిఅజిఅఁ ద్రిప్పివైచియు, భటులం జటులగతి బంతులక్రియ నెగురవైచి దంతంబుల గ్రుచ్చియు, ఘోటకంబుల వ్రచ్చియు విచ్చలవిడిం దిరుగు కరులును, వజ్రి వజ్రధారలకుం దప్పి కకుప్పులకు నెగయు ఱెక్కలు గల గిరుల సిరులం బక్కెరల తోడ హేషారవ భీషణంబులై మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగ పద పాంసుపటల ప్రభూత బహుళాంధకారంబులు గరకలిత కఠోర ఖడ్గ మరీచిజాలంబుల నివారించుచు నానాప్రకారంబులం బ్రతిమ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి సంగ్రామంబు భీమం బయ్యె నందు.

1557

తా ॥ అప్పుడు కృష్ణజరాసంధుల సేనలు ఒకదానిని ఒకటి ఎదిరించి ప్రళయ కాలంలో సముద్రాలు ఉప్పొంగినట్లు పొంగుతూ, పట్టుదలతో పోరాడసాగాయి. మదించిన ఏనుగులు మహారణ్యం నుండి బయలు వెడలి వచ్చి ఒకదానితో ఒకటి పోరాడునట్లుగా, మిక్కిలి వేగంతో పోరాడే సింహాలవలె, ఇతరులు దగ్గరకు చేరరాని శరభ మృగములు పోరాడునట్లుగా, మిక్కిలి కోపంగల గండభేరుండములు పోరాడునట్లుగా సైన్యం పరస్పరం ఢీ కొన్నది. తమ తమ దండుల నుండి బయటకు వచ్చి నానావిధ రూపములు వహించిన వీర రసముతో అన్నట్లుగా చూసే వారికి అనిపిస్తోంది. అయిదుగురు, పదుగురు, నూరుగురు ఒక్కొక్కటిగా కూడుకొని, కులపర్వత గుహలు ప్రతిధ్వనులిచ్చేటట్లు సింహనాదాలు చేస్తూ, గట్టిగా నవ్వుతూ, శంఖాలు ఊదుతూ, వికారపు అరుపులు అరుస్తూ, అట్టే పొంగుతూ, తమ్ము తామే పొగడుకుంటున్నారు, శత్రువీరులను సంహరిస్తున్నారు. పటహ, కాహళ, భేరీ, శంఖధ్వనులకు ఉప్పొంగుతున్నారు. అహంకారముల చేత తమ్ము తామె మెచ్చుకొంటున్నారు. గదలతో మోదుతూ, బాణాలను ప్రయోగిస్తూ, ఇనుప గుదియలతో అణచి పెడుతూ, రోకళ్ళతో మొత్తుతూ, ఈటెలతో పొడిచి పైకెత్తుతూ, కత్తులతో తెగనరుకుతూ, చక్రాలతో త్రుంచుతూ, నానా విధాలుగా తిరుగుతూ, శూలాలచేత ఎగరకొట్టుతూ, చురకత్తులచేత క్రుమ్ముతూ, ఈ విధంగా అనేక రీతుల

పరాక్రమాన్ని చూపుతున్నారు. కాగా తిరుగులేని చక్రబాణాల చేత కాల్బలం నేలకు ఒరుగుతున్నారు. రథాలు విరిగి పడుతున్నాయి. వివిధాయుధ ప్రయోగాల చేత రథికులు శత్రువులను చిందర వందర చేస్తున్నారు. రథికుల యొక్క బాణసమూహం చేత కంపింపక, అమోఘ మేఘధారలకు చలింపని పర్వతాలవలె, మదగజాలు రథాలమీదికి వచ్చి ప్రళయ కాలమందలి యమదండంవలె బెదరు పుట్టించే తొండములను చాచి, ఊగులాడించి నొగల కొనలను లాఘవంగా త్రిప్పి తీసి, కుదించి విరగతీసి పొడి పొడి అయ్యేటట్లు త్రిప్పి నేలమీద పడవేయసాగాయి. భటులను భయంకరమైన రీతిలో బంతులలాగా ఎగురవేసి, దంతాలతో కుమ్మేశాయి, గుర్రాలను చీల్చి వేశాయి. ఇంద్రుని వజ్రాయుధపు వ్రేటులకు తప్పించుకొని దిక్కులకు ఎగిరిపోయే రెక్కలున్న కొండలవలె, కవచాలతో భయంకరమైన సకిలింతల చేత మనోవేగం గల గుర్రాలు విజృంభించాయి. ఆ గుర్రాల అడుగుల నుండి రేగిన దుమ్ముచే అధికమైన అంధకారం వ్యాపించింది. ఆ కటిక చీకటిని కఠోరమైన కత్తులయొక్క కాంతుల సమూహం చేత నివారిస్తూ, నానా ప్రకారాలుగా శత్రుసేనలను గుర్రపు రౌతులు చీల్చి చెండాడుతున్నారు. ఈ విధంగా యుద్ధం భయంకరంగా సాగుతోంది.

క. చెదురథములుఁ దెగు హరులును, బడు కరులును మడియు భటులుఁ బఱచు రుధిరమున్ మడియు తల లొఱగు తనువులుఁ, బొడి యగు తొడవులును మధురిపుని దెసఁ గలిగెన్.

1558

తా ॥ శ్రీకృష్ణుని పక్షంలో, తెగిపడ్డ గుర్రాలు, పడిన ఏనుగులు, మరణించిన భటులు, ప్రవహించే నెత్తురు, తెగిన తలలు, ఒరిగిపోయిన దేహాలు, పొడి పొడి అయిన భూషణాలు వీటితో భయంకరంగా ఉంది యుద్ధభూమి.

క. భీతంబై హత సుభట, వ్రాతంబై భగ్న తురగ వారణ రథ సం
ఘాతంబై విజయశ్రీ, వీతంబై యదుబలంబు విఱిగె నరేంద్రా!

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! యాదవుల సైన్యం అంతా భయపడి పోయింది. చంపబడిన ఏనుగులు, గుఱ్ఱాలు, కాలిబంట్లు అనే చతురంగ బలములు కలదైనా గెలుపు పొందలేక, చెదరి నాలుగు దిక్కులకు పారిపోయింది.

శా. 'యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు లోకోత్కృష్ట బాహాబల
శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ డిట్టి ఘనులం జిత్రంబు; నేఁ డిట్లు సం
రోధించెన్; బలముం దెరల్చెఁ; మగధేంద్రుం' డంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్.

1560

తా ॥ బలరాముడు యోధాగ్రేసరుడు, లోకోన్నత బాహుబల సంపన్నుడు శ్రీకృష్ణుడు. ఇట్టి ఘనులను చిత్రంగా నిరోధించాడు జరాసంధుడు... అని సౌధాగ్రంమీద నుండి పురస్త్రీలు మిక్కిలి పరితాపాన్ని పొందసాగారు.

వ. ఇట్లు తన మొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండ తుండాభంబులగు బాహుదండంబులు వెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహర కుంభ పరిస్ఫోటనం బగు పాంచజన్య నినదంబు నిబిడ నిర్ఘాత శబ్దంబుగా, నుదంచిత పింఛదామంబు సంక్రందన చాపంబుగాఁ, బ్రశస్తహస్త లాఘవంబున శరాకర్షణ సంధాన మోక్షణంబు లేర్పడక, నిర్వక్ర చక్రాకారంబుతోడ మార్తాండమండల ప్రభా ప్రచండంబగు శార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగులుగా, దిగ్గజేంద్ర కర్ణభీషణంబులగు గుణఘోషణంబులు ఘుమఘుమారావ దుస్సహంబు లయిన గర్జనంబులుగా, రథ తురంగను రింఖా సముద్ధూత పరాగపటల పరంపరా సంపాదిత పుంజీభూతంబగు పెంజీఁకటి యిరులుగా, నసమసమర సన్నాహ చాతురీ విశేషంబులకుం

జొక్కి, నిక్కి కరంబు లెత్తి నర్తనంబులం బ్రవర్తించు నారద హస్తవిన్యాసంబులు లీలాతాండవ మండిత మహోత్కంఠంబు లగు నీల కంఠంబులుగా, సుందర స్యందననేమి నిర్ఘోషభీతులయి కుంభి కుంభములపై వ్రాలు వీరులు మత్తమయూర కేకారవ చకితులై యువతీకుచ కుంభంబులమీఁద వ్రాలెడు కాముకులుగా, నానానరేంద్ర రక్తపిపాసా పరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతి నిస్వనంబు లొసంగు చాతకంబులుగా, నభంగ సంగర ప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణం బుగా, ననల్పకల్పాంతకాల నీలవలాహకంబు భాతిం బరగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతి చతురంగ దేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ నసంఖ్యాత బహువిధ దివ్యబాణవర్షంబు గురియునెడ శస్త్రాస్త్రపరంపరా సంఘట్టన జనితంబులగు మిడుఁ గుఱులు వర్షాకాల విహిత విద్యోత మాన ఖద్యోతంబులుగ, విశిఖ వికీర్ణ వీరకోటీర ఘటిత పద్మరాగ శకలంబు లింద్రగోపంబులును, మహిత మార్గణ విదళిత మత్తమాతంగ కుంభ మౌక్తికంబులు వడగండ్లుగఁ, జటులార్ధచంద్ర శరచ్ఛిన్న చరణంబు లయి 'కృష్ణ! కృష్ణ! నిలు నిలు' మని పలుకుచుం గూలెడు మేనులు కృషీవల కర పరశుధారా విదళిత మూల విశాలసాలంబులుగ, భాసుర భల్ల భగ్నంబు లయిన వదన గహ్వరంబుల వలన దుల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమ మంజరులుగ, నవ్యనారాచభిన్న దేహంబు లయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యంద సందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేఱులతోడి కొండలుగఁ, గఠోరకాండ ఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడిన వజ్రమయ కంఠికాభరణంబులు భోగిభోగసమేత కేతకీకుసుమంబులుగఁ, బ్రళయార్ణవ కల్లోల శబ్ద సన్నిభంబు లయిన భేరీరవంబులు భీకర భేకీ నికరారవంబులుగ, దారుణేషు విలూన వాహ వారణ మనుజ మస్తిష్కంబు రొంపిగ, సొంపు మెఱయ నాభీల కీలాల ప్రవాహంబులు ప్రవహించె; నందు భుజములు భుజంగంబులుగఁ గపాలంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ,

ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు గలహంసంబులుగ, భూషణరత్నరేణురాసులు పులినంబులుగ నొప్పె; నప్పుడు.

1561

తా ॥ శ్రీకృష్ణుడు ఈ విధంగా తన సేనలు చెదరి పారిపోగా చూసి, సమర సంరంభంచేత భూభారాన్ని మోయగల ఏనుగు తుండాలను పోలిన బాహుదండముల చేత రేగి, బ్రహ్మాండమనే గుహను భేదించేలా పాంచజన్య శంఖాన్ని నినదించాడు. అది పిడుగుపాటు ధ్వని వలె ఉన్నది. శిఖలో మిక్కిలి ఒప్పిదమైన నెమలిపింఛం ఇంద్రధనుస్సువలె చూపట్టింది. శ్లాఘ్యమైన చేతుల యొక్క లాఘవం చేత, బాణములను తీయుట, కూర్చుట, విడుచుట, తెలియరాకుండా చక్రాకారంతో సూర్యమండల ప్రభను పోలి అతని శార్ఙ్గమనే కోదండం యొక్క క్రొత్తకాంతులు తేజరిల్లింది. ఆ కాంతులు మెరుపులుగా, దిగ్గజముల చెవులకు భీషణమై బెదరు పుట్టించే అల్లెత్రాటి ధ్వని ఉరుమువలె ఉన్నది. రథపు గుర్రముల త్రొక్కుడువలన ఎగయు దుమ్ముచేత క్రమ్ముకొన్న చీకటి అంధకార బంధురంగా భాసించింది.

సాటిలేని ఆ యుద్ధాన్ని చూసి నారదుడు మొదలగు వారు పరవశించి మేఘోదయానికి హర్షించి ఆడే నెమళ్ళ లాగా నాట్యం చేస్తున్నారు. రథచక్రాల చప్పుళ్ళకు భయపడి ఏనుగుల కుంభస్థలాలపై ఒరిగిపోతున్నారు యోధులు. యుద్ధ విషయంలో ఆ బలరాముడు, వానకు అనుకూలమైన చల్లని గాలిలా ఉన్నాడు. ప్రళయ కాలములో నల్లనైన వానమబ్బువలె, శత్రువుల దేహములనే సాగుబడి భూములయందు బాణములనే వానను కురిపిస్తున్నాడు. ఆయుధాల ఒరిపిడి వలన కలుగు నిప్పురవ్వలు వానాకాలంలో వచ్చే మిణుగురు పురుగులే అయ్యాయి. బాణములచేత చెదరగొట్ట బడిన శత్రురాజుల కిరీటములయందలి కెంపులు పట్టుపురుగులవలే ఉన్నాయి.

వాడియైన అర్ధచంద్ర బాణములు చేత నరకబడినవై కృష్ణా, కృష్ణా, నిలు, నిలు అంటూ నేలమీద పడే వీరుల దేహాలు రైతులు సాగుబడి కాలంలో వేళ్ళు నరకగా పడిపోతూన్న వృక్షాల్లా

ఉన్నాయి. తీక్షణములయిన బాణములు తగిలి నోళ్ళ నుండి రాలుతున్న దంతాలు జాజిపూగుత్తుల్లా ఉన్నాయి. వాడి అయిన బాణాలచే నరకబడి పొడవైన చేతులతో కూలిన కంఠాభరణాలు సర్పదేహాలతో కూడిన మొగలి పువ్వుల్లా ఉన్నాయి. భయంకరమైన నెత్తురనే నీరు వెల్లువయి పారింది. ఆ ప్రవాహంలో చేతులు పాములుగాను, తలపుర్రెలు తాబేళ్ళుగాను, తల వెంట్రుకలు నాచుగాను, ముంజేతులు చేపలుగాను, తెల్లగొడుగులు నురుగులుగాను, వింజామరములు హంసలు గాను, భూషణముల పొడి రాలిన రాసులు ఇసుక దిబ్బలుగాను ఒప్పాయి.

లయవిభాతి.

హసిత హరినీలనిభ వసనము విశాలకటి నసమనయనాద్రి పరిలసిత మేఘో ల్లసనము వహింపఁ గరకిసలయము హేమనుణి విసర వలయ ద్యుతులు దెసల తుదలందున్ బసలు గురియంగ సరభసమున బలుండు దరహసితము ముఖాబ్జమున నెసఁగ ఘనకాలా యస మయ మహోగ్రతర ముసలము వడిన్ విసరి కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్.

1562

తా ॥ బలరాముడు ధరించిన ఇంద్రనీలమణితో సమానంగా ఉన్న నీలిరంగు వస్త్రము కైలాస పర్వతాన్ని ఆవరించిన నల్లమబ్బువలె అతని నడుముచుట్టూ ప్రకాశిస్తోంది. చిగురుటాకుల వంటి మెత్తని చేతులందు గల రత్నములు పొదిగిన బంగారు కడియములు కాంతులీనుతూ దిక్కులను ప్రకాశింప చేస్తున్నాయి. చిరునవ్వు ముఖానికి వికాసాన్ని కలుగచేస్తోంది. కోపావేశము నొందిన వాడై, మిక్కిలి భయంకరమైన ఇనుప రోకలిని వేగంగా త్రిప్పుచూ, ఎదిరించిన విరోధులనందరి ప్రాణాలు హరించ సాగాడు..

లయవిభాతి.

ప్రలయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల నలఘు చటులాగ్ని కణములు సెదరఁ గోలా హలముగ సువర్ణ మణివలయ నిచయోజ్జ్వలిత హలము వడిఁ జాచి శిరములు

నురములు న్ని ర్దలితములుగన్ శకలములుగ నొనరింపఁ గని బెలుకుఱి జరాసుతుని బలము రణవీథిన్ జలితదనుజావలికి బలికి భయభీత సుర ఫలికిఁ ద్రిజగచ్ఛలికి హలికిఁ దల డించెన్.

1563

తా ॥ ప్రళయకాలపు యముని వలె ఆ బలరాముని కన్నుల నుండి అగ్ని కణాలు రాలుతున్నాయి. రత్నఖచితంగా వెలుగుచున్న హలాయుధంతో, శత్రువుల తలలు, రొమ్ములు పగులగొట్టి తునకలు తునకలుగా చేయగా జరాసంధుని దండంతయు స్వాధీనము తప్పిపోయింది. ఆ యుద్ధ ప్రదేశంలో ఈ విధంగా రాక్షసులను తరుమగొట్టేలా బలవంతుడైనట్టి, బలరాముడు వీరవిహారం చేయసాగాడు.

శా. రోషోద్రేక కళాభయంకర మహారూపంబుతో నొక్కచే
నీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్
భూషల్ రాలఁ దగిల్చి రాఁదిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్
వేషంబుల్ సెడ మొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్.

1564

తా ॥ అతిశయించిన కోపంతో, భయంకర రూపంతో కనబడసాగాడు ఆ బలరాముడు. ఒకచేత నాగలి ఏడికోల చాచి దూరంగా ఉన్న రాజుల మెడలకు తగిలించాడు. దగ్గరికి ఈడ్చి మరియొక చేతితో రోకలి ఎత్తి, వారి ఆభరణములు రాలునట్లుగా ఈడ్చి మోదగా, నెత్తురు పారుతుండగా ఆ యుద్ధభూమిలో శత్రువులు మృతి నొందసాగారు.

క. హలిహలహృత కరికుంభ, స్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషిక లాం
గల మార్గ కీర్ణ బీజా, వలి కైవడి నద్భుతాహవక్షేత్రమునన్.

1565

తా ॥ అద్భుతమగు ఆ యుద్ధ భూమియందు, బలరాముని నాగలి చేత మొత్తబడిన ఏనుగుల కుంభస్థలమందలి ముత్యాల పూసలు, వ్యవసాయదారుల నాగేటి చాలుతో చల్లబడిన విత్తనాల వలె కాన వస్తున్నాయి.

క. తఱిమి హలి హలము విసరుచు, నెఱిఁ గదిసిన బెగడి విమత నికరము లెడలై
వెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మరలుం దెరలున్.

1566

తా ॥ బలరాముడు తన నాగలిని త్రిప్పుచూ, తరుముతూ పోయి, కలియబడుతుంటే శత్రువులు అందరూ భయపడసాగారు. ఎడంగా పోయి ఆశ్చర్యపడేవారు కొందరైతే, ముడుచుకొనేవారు కొందరు; అణగి ఉండేవారు కొందరు, దాక్కొనేవారు కొందరు, అంగవిహీనతను పొందేవారు కొందరైతే, చనిపోయినవారు కొందరు, నేలమీద పడి పొర్లేవారు కొందరైతే, పారిపోవువారు కొందరు... ఈ విధంగా సైన్యం అంతా వివిధ రీతులుగా కలత చెందినది.

క. హరి తిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పు నాకృతిఁ గడిమిన్
హరితిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై.

1567

తా ॥ సూర్యుడు తీక్షణములైన కిరణములను అన్ని దిక్కులా విరజిమ్మినట్లుగా రణరంగమున ఆ కృష్ణుడు తన తీక్షణమైన బాణసమూహములచేత అతి భీకరుడై, దిగంతాలను కప్పివేశాడు.

సీ. పదుగు రేగురు దీర్ఘబాణముల్ గాఁడిన గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారు
దలలు ద్రెవ్విన మున్ను దారు వీక్షించిన వారల నొప్పించి వ్రాలువారు
పదములు దెగిపడ్డ బాహులఁ బోరి నిర్మూలితబాహులై మ్రొగ్గువారు

క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝరయుత శైలములభంగి నుండువారు

ఆ. భ్రాతృ పుత్ర మిత్ర బంధువుల్ వీఁగిన, నడ్డ మరుగుదెంచి యణఁగువారు

వాహనములు దెగిన వడి నన్యవాహనా, ధిష్ఠ లగుచు నెదిరి త్రెళ్ళువారు.

1568

తా ॥ నిడుపాటి బాణములు నాటుకొనగా, అయిదుగురు పదిమంది సూది దారంతో గ్రుచ్చినట్లుగా కూలుతున్నారు. తలలు తెగిపడుతూ ఉండగా, అంతకు ముందు తాము చూచియున్న వారిని నొప్పిస్తూ ప్రాణాలు విడిచేవారు కొందరు. కాళ్ళు తెగిపోగా, చేతులతో పోరాడుతూ, ఆ చేతులు కూడా మొదలంట తెగిపడగా ముందరికి పడి మరణించువారు కొందరు. గాయములనుండి నెత్తురు కారుచుండగా, సెలయేళ్ళతోడి కూడి ఉన్న కొండలవలె ఉన్నారు కొందరు. అన్నదమ్ములు, కొడుకులు, చెలికాండ్రు, చుట్టములు వెనుదీయగా అడ్డము పోయి ప్రతి వీరులను ఎదిరించి మరణించేవారు కొందరు. తమ వాహనములు భంగపడగా, ఇతరుల వాహనాలను ఎక్కి ఎదిరించి పోరాడుతూ చనిపోయేవారు కొందరు. ఈ విధంగా జరాసంధుని సైన్యం నాశనం అవసాగింది.

వ. మఱియును.

1569

శా. ఈ కాయంబులఁ బాసినంతటనె మా కెగ్గేమి? జేతృత్వమున్

నీకుం జెల్లదు కృష్ణ! నిర్జరులమై నిన్నోర్తు మామీఁదటన్

వైకుంఠంబున నంచుఁ బల్కుక్రియ దుర్వారాస్త్ర భిన్నాంగులై

యాకంపింపక కొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్.

1570

తా ॥ ఓ కృష్ణా! మేము ఈ దేహాలను విడిచిన మాత్రం చేత మాకు వచ్చిన లోపం ఏమీ

లేదు. నీకు విజయం చేకూరదు. మేము మరణించిన పిదప అమరులమై వైకుంఠంలో నిన్ను గెలువగలము అని శ్రీకృష్ణుని బాణముల ధాటికి భేదింపబడిన అవయవములు గల కొందరు శూరులు గర్వోక్తులు పలుకసాగారు.

వ. ఇ వ్విధంబున.

1571

క. జగదీశ! యేమి సెప్పుదు?, నగణిత లయవార్ధి భయదమై మూఁగిన య
మ్మగధేశుబలము నెల్లను, దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్.

1572

తా ॥ ఈ విధంగా, ఓ పరీక్షిన్మహారాజా! ఆ బలరామకృష్ణుల సామర్థ్యము ఏమి చెప్పను? ప్రళయకాలపు మహా సముద్రంవలె పొంగి వస్తూన్న జరాసంధుని సైన్యాన్ని విశేష క్రీడగా వారు తుదముట్టించారు.

క భువన భవస్థితివిలయము, లవలీలం జేయు హరికి నరినాశన మెం
త విషయమైన మనుజుఁడై, భవ మొందుటఁ జేసి పొగడఁబడియెం గృతులన్.

1573

తా ॥ లోకముల యొక్క సృష్టి, స్థితి సంహారాలను వినోదంగా చేసే శ్రీకృష్ణునికి శత్రుసంహారం అనేది ఎంతమాత్రపు పని? అయినా మానవునిగా అవతరించాడు కనుక కావ్యముల యందు కవీశ్వరుల చేత కొనియాడబడుతున్నాడు. (అంటే ఈ శత్రుసంహారం ఆ పరమాత్మునికి బాల్యక్రీడ వంటిది, అయితే సాధారణ మానవులకు అది అసాధ్యకార్యమే అని ఇక్కడ అర్థం.)

వ. ఆ సమయంబున.

1574

శా. అంహఃకర్ములు తల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దో
రంహం బొప్ప హలాహతిన్ రథ ధనూరథ్యంబులం గూల్చి త
త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్.

1575

తా ॥ ఆ సమయంలో, పాపకర్ములు భయపడి చలించేటట్లు బలరాముడు వారు తల్లడిల్లేలా భుజవేగంతో నాగలి పోటు చేత జరాసంధుని రథాన్ని, ధనుస్సును, గుర్రాలను పడగొట్టాడు. మదం చేత అంధుడైన ఆ జరాసంధుణ్ణి సంహరించాలనే కాంక్షతో, ఒక మహాసింహం మరియొక సింహాన్ని పట్టుకున్నట్లు, ముందుకు ఉరికి నేర్పుతో ఆ అసురుణ్ణి పట్టుకున్నాడు.

వ. ఇట్లు పట్టుకొని.

1576

ఉ. కుంఠితులై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని సో
ల్లుంఠము లాడుచున్ దిగిచి లోకభయంకరమైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభర క్షయో
త్కంఠుఁడు చక్రి మీఁదెఱిఁగి కార్యము గల్దని మాన్పి యిట్లనున్.

1577

తా ॥ అలా పట్టుకొని, లోకోత్తర బలశాలి అయిన బలరాముడు, శత్రువులందరూ బెదిరి పారిపోగా, ఆ జరాసంధునితో ఎగతాళిగా మాటలాడటం మొదలుపెట్టాడు. లోకాలు విస్తుపోయేలా భయంకరమైన పిడికిటి పోటు చేత ప్రాణాలు కంఠంలోనికి తెప్పించాడు. అంతట

భూభారాన్ని అణచేవాడైన శ్రీకృష్ణుడు భావి కార్యాన్ని తలచి, అన్నా! వీనివల్ల ఇంకా కొంత పని ఉంది. విడిచిపెట్టు! అని బలరాముని ప్రయత్నాన్ని మాన్పి, జరాసంధునితో ఇలా అన్నాడు:

శా. దుఃఖింపం బనిలేదు; పొమ్ము; బలసందోహంబులం దెమ్ము; చే
తఃఖేదం బెడలంగ రమ్ము; రిపులం దండింపు; కాదేని భూ
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప! నీ శౌర్యోన్నతుల్ సూపి మే
దఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్.

1578

తా ॥ “ఓ జరాసంధా! నువ్వు దుఃఖింప వలసిన నిమిత్తం లేదు. మరల సేనలను కూర్చుకొని, నీ మనోవ్యాకులత పోయేటట్లు మరల రమ్ము. వచ్చి నీ శత్రువులను దండించు. అది నీవు చేయలేని పక్షంలో, భూమియందు, స్వర్గమందు ఉండే జనసమూహం అందరు మెచ్చుకొనేలా నీ పరాక్రమాన్ని చూపించి, నీ దేహాన్ని త్యజించి భూతాలకు త్యాగం చేయి”

వ. అని నగుచు విడిపించిన, చిడిముడికి నగ్గలం బయిన సిగ్గున మ్రగ్గి నెమ్మొగంబు సూపక, కోప కపట భావంబులు మనంబునం బెనంగొనఁ దపంబు చేసియైన వీరలం జయించెద నని, పలాయితులైన రాజులం గూడుకొనుచు జరాసంధుఁడు విఱిగి చనియె; సురలు గుసుమ వర్షంబులు గురియ హలియు హరియును మథురానగర జనవంది మాగధ జేగీయమానులై వీణా వేణు మృదంగ శంఖ దుందుభి నినదంబు లాకర్ణించుచు, మృగమద జలసిక్త విమలవీథికా శతంబును, వివిధ విచిత్ర కేతనాద్య లంకృతంబును, సువర్ణమణిమయ జయస్తంభ నిబద్ధతోరణ సంయుతంబును, వేదనాద నినాదితంబును, సంతుష్టజన సంకుల గోపురంబును నైన పురంబును బ్రవేశించి రందు.

1579

తా ॥ అని పలికి నవ్వుతూ, వాడిని విడిచిపెట్టాడు. దానికి అతడు పరాభవించబడినవాడై,

కోపం కంటే హెచ్చిన సిగ్గుచేత తల వంచుకొని, కుటిలత్వం మనస్సులో మెలివడగా, తపస్సు చేసి అయినా వీళ్ళను జయించాలి అని అనుకున్నాడు. అనంతరం ఓడిన రాజులందరిని కూడుకొని జరాసంధుడు మరలిపోయాడు. దేవతలు కుసుమ వర్షం కురిపించారు. జయమును పొంది వస్తున్న రామకృష్ణులను చూసి మథురా పట్టణంలోని జనులు అనేక విధాల కొనియాడారు. వీణ వేణువు మృదంగం శంఖం దుందుభి మొదలైన మంగళతూర్య రావాలు పలికిస్తుండగా, వాటిని వింటూ రామకృష్ణులు నగర ప్రవేశం చేశారు. కస్తూరితో కలిపిన నీళ్ళు చల్లడంచేత తడిసిన వీథులు, నానా వర్ణములుగల జండాలచేత అలంకరింపబడి గెలుపును తెలుపునట్టి ధ్వజస్తంభములు, రత్నమయములయిన తోరణములు వేదనాదం చేత నిండుకొన్నది, సంతోషం చేత కలకల ధ్వనులు చేస్తూన్న ప్రజాసమూహం గల ఆ మథురా పట్టణమును బలరామకృష్ణులు ప్రవేశించారు.

ఉ. వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్
బల్లిదులైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్న వారు రం;
డుల్లములారఁ జూత మని యున్నత సౌధము లెక్కి వారిపైఁ
బల్లవ పుష్ప లాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్.

1580

తా ॥ “వెల్లువలా వచ్చిన శత్రురాజుల నందరినీ జయించి పట్టణానికి విజయులై కృష్ణ బలభద్రులు వస్తున్నారు. మనసారా చూద్దాం రండి!” —అని పురస్త్రీలందరు చిగుళ్ళను, పువ్వులను, అక్షతలను స్వాగత చిహ్నంగా అంతటా చల్లసాగారు.

## 60. కాల యవనుడు శ్రీకృష్ణుని మీద దండెత్తి మథురాపురమును ముట్టడి చేయుట

వ. ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె; మఱియు నెక్కువ మత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునం గల దుష్టమహీపతుల నెల్లం గూడికొని సప్తదశవారంబులు సప్తదశాక్షౌహిణీబల సమేతుండై మథురానగరంబుపై విడిసి, మాధవభుజా ప్రకారరక్షితు లగు యాదవులతోడ నాలంబు సేసి, నిర్మూలిత బలుండై పోయి క్రమ్మఱ నష్టాదశ యుద్ధంబునకు వచ్చునెడం గలహవిద్యా విశారదుం డగు నారదుండు కాలయవను కడకుం జని యిట్లనియె.

1581

తా ॥ ఈ విధంగా బలరామకృష్ణులు పట్టణంలో ప్రవేశించారు. యుద్ధ విశేషాలు అన్నీ ఉగ్రసేనునకు తెలియచేసాడు కృష్ణుడు. కొంతకాలానికి జరాసంధుడు మాత్సర్యంతో రగిలిపోతూ, భూమిపైగల దుష్ట బుద్ధిగల రాజులందరినీ కూర్చుకొని, పదిహేడు అక్షౌహిణుల సేనలతో కూడి మథురాపట్టణం మీదకు దండెత్తి వచ్చాడు. ఈ విధంగా పదిహేడు సార్లు దండెత్తి రావడం, పరాజయం పాలవడం జరిగింది. శ్రీకృష్ణుని బాహువులనే కోటచేత రక్షింపబడుతూన్న యాదవ సేనలతో పోరాడి ప్రతీసారి తన బలం అంతా నశించి పోగా, మరల పద్దెనిమిదో సారి యుద్ధానికి రావడానికి ప్రయత్నించాడు. అప్పుడు కలహ విద్యయందు సమర్థుడైన నారద మహాముని కాలయవనుని వద్దకు పోయి ఇట్లా అన్నాడు:

మ. యవనా! నీవు సమస్త భూపతుల బాహాఖర్వ గర్వోన్నతిం
బవనుం డభ్రములన్ హరించు పగిదిన్ భంజించియు న్నేల యా
దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో? దర్పంబు లేకుండియో?
యవివేకస్థితి నొందియో? వెఱచియో? హైన్యంబునుం జెందియో?

1582

తా ॥ "ఓ కాలయవనా! నీవు లోకంలోని భూపతులనందరినీ అధికమైన భుజబలం చేత, వాయువు మేఘాలను చెదరగొట్టునట్లు భంగపెట్టినవాడవు. అయితే ఏమి లాభం? యాదవులను మాత్రం గెలవలేకుండా ఉన్నావు. వాళ్ళను మరచి పోయావా లేక పరాక్రమం లేక ఊరుకున్నావా? భయమా లేక అల్పత్వమా?

క. యాదవులలోన నొక్కఁడు, మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలన్ దోలెన్, దాదృశుఁ డిల లేఁడు వినవె తత్కర్మంబుల్.

1583

తా ॥ యాదవులలో ఒకడు, భూమిమీద తన బలాతిశయాన్ని ప్రకాశింప చేసి జరాసంధుడు మొదలైన వారిని యుద్ధంలో జయించి తరిమాడు. వానికి సమానుడు ఈ భూలోకంలో ఎక్కడా లేడు. వాని వృత్తాంతాన్ని నీవు వినలేదా?"

వ. అనిన విని, కాలయవనుం డిట్లనియె.

1584

తా ॥ ఆ మాటలు విన్న కాలయవనుడు ఇట్లా అన్నాడు:

శా. ఏమీ! నారద! నీవుచెప్పిన నరుం డే రూపువాఁ? డెంతవాఁ?
డే మేరన్ విహరించు? నెవ్వఁడు సఖుం? డెందుండు? నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు? నన్మద్బాహుశౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా!

1585

తా ॥ "ఓ నారదా! నీవు చెప్పిన అతను ఎటువంటి రూపం కలవాడు? ఏ విధంగా

వ్యవహరిస్తూ ఉంటాడు? అతని స్నేహితులు ఎవరు? అతను ఎక్కడ ఉంటాడు? ఏపాటి భుజబలంతో యుద్ధము చేస్తుంటాడు? నా భుజబలానికి ఓర్చి నిలువజాలిన వాడేనా? వాడికి గర్వం ఉందా? అతని వివరాలు అన్నీ నాకు వివరంగా చెప్పు"

వ. అనిన విని, దేవముని యిట్లనియె.

1586

తా ॥ ఆ మాటలకు దేవర్షి అయిన నారదుడు ఇట్లా అన్నాడు:

సీ. నీలజీమూత సన్నిభ శరీరమువాఁడు తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నత దీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచిత మహోరమువాఁడు కౌస్తుభమణి పదకంబువాఁడు
శ్రీకర పీతకౌశేయ చేలమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు

తే. రాజ! యింతంతవాఁ డనరాని వాఁడు, మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యే వేళ లందైన నఁ దిరుగువాఁడు, పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు.

1587

తా ॥ "ఓ యవనేశ్వరా! విను. అతడు కారు నీల మేఘం వంటి నల్లని శరీరం కలవాడు. తామరపూల కళ్ళతో, పూర్ణచంద్రబింబం వంటి ముఖంతో ఉంటాడు. ఉన్నతము, దీర్ఘము అయిన బాహువులు కలవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ రొమ్మున కలవాడు. కౌస్తుభం అనే మణి పతకంగా కలవాడు. సంపత్కరమైన పసుపు పచ్చని వస్త్రాన్ని ధరిస్తాడు. చెవులకు గల మకర కుండలాల కాంతిచేత ప్రకాశించేవాడు. ఇంతవాడు–అంతవాడు అని మాటలలో వివరించేందుకు వీలుకానివాడు. అన్ని దిక్కులలోను ప్రకాశించేవాడు. అంతటా సర్వకాలాల్లో ఉండేవాడు. పట్టుకోవడం చేతనైతేతప్ప లోబడనివాడు."

వ. అని మఱియు నతని లక్షణంబులు చెప్పిన విని, సరకుసేయక యవనుం డిట్లనియె.

1588

తా ॥ ఆ మాటలు వినిన కాలయవనుడు ఇట్లా అన్నాడు:

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చె నేనియున్
గాదనఁ బోర మత్కలహ కర్కశ బాహుధనుర్విముక్త నా
నా దృఢ హేమపుంఖ కఠిన జ్వలదస్త్ర పరంపరా సము
త్పాదిత వహ్నికీలముల భస్మముఁ జేసెదఁ దాపసోత్తమా!

1589

తా ॥ "ఓ తాపసోత్తమా! యాదవుడు నాకు ఎంతటివాడు? ప్రళయకాల యమధర్మరాజైనా నన్నెదిరిస్తే కాదని చెప్పను. యుద్ధంలో, నా ధనుస్సు నుండి విడువబడిన బంగారు పింజల వంటి కఠోరములైన బాణముల నుండి పుట్టిన అగ్ని జ్వాలల చేత అతనిని కాల్చి బూడిద చేస్తాను."

వ. అని పలికి కాలయవనుండు మూఁడుకోట్ల మ్లేచ్ఛవీరులం గూడుకొని, శీఘ్రగమనంబున దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్రసహితుం డయి కృష్ణుం డిట్లని వితర్కించె.

1590

తా ॥ కాలయవనుడు ఇట్లు నారదునితో పలికి, మూడుకోట్ల మ్లేచ్ఛ వీరులతో వేగంగా యుద్ధానికి బయలుదేరి, మథురా పట్టణం మీద సైన్యాన్ని దించగా బలరామునితో కూడుకొని కృష్ణుడు ఇలా ఆలోచించాడు:

# 61. విశ్వకర్మ కృష్ణ నియోగంబున సముద్రములో ద్వారకా నగరమును నిర్మించుట

సీ. యవనుండు పురమెల్ల నావరించెను నేఁటి యెల్లింటిలోపల నీ నడుమను

మాగధుండును వచ్చి మనమీఁద విడియును యవన మాగధులు మహాప్రబలులు

పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో నోపినభంగి నొక్కొక్కచోట

మనము యుద్ధము సేయ మఱియొక్కఁ డెడసొచ్చి బంధుల నందఱఁ బట్టి చంపు

తే. నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ, డైన మాగధుఁ; దదిగాన నరివరులకు

విడియఁ బోరాడఁగా రాని విషమభూమి, నొక్కదుర్గంబు సేసి యం దునుపవలయు.

1591

తా ॥ 'ఇప్పుడు కాలయవనుడు పట్టణాన్ని ముట్టడించాడు. నేడో, రేపో జరాసంధుడు కూడా దండెత్తి వస్తాడు. వీళ్ళిద్దరూ మిక్కిలి క్రూరులైన ప్రబల శత్రువులు. మనం ఒక ప్రక్క ఒకనితో యుద్ధంలో పోరాడుతూ ఉంటే, మరొకడు మరొక వైపు నుండి పట్టణంలో ప్రవేశించి మన బంధువులనందరిని పట్టి చంపవచ్చు లేదా... జరాసంధుడు క్రూరుడు కనుక మనవారిని అందరినీ కొనిపోయి చెరలో పెడతాడు. కాబట్టి శత్రువులైన ఈ ఇద్దరూ ప్రవేశించేందుకు అనువుకాని ఒక దుర్గాన్ని ఏర్పరచి అందులో మనవారినందరిని ఉంచాలి'

మధుర జీవితాన్ని గడిపేవారికి రెండు ప్రమాదాలు ఎప్పుడూ పొంచి ఉంటాయి. ఒకటి దేహం క్షీణిస్తుంది, రెండవది నశించడం. సుఖభోగాలలో మునిగితేలుతూ ఈ జ (వార్ధక్యం), మరణాలను జీవుడు విస్మరిస్తాడు. వీరే జరాసంధుడు, కావయవనుడు. భగవంతుణ్ణి శరణుజొచ్చిన వారికి వీటి వలన ప్రమాదం ఎంతమాత్రమూ లేదు. రాత్రికి రాత్రే ఆయన సాగర మధ్యమంలో ద్వారక నిర్మించి తన వారిని అక్కడకు చేర్చగలడు. అల్పమైన కోరికలను కోరకుండా భగవంతుని సన్నిధిని ఆశ్రయిస్తే హృదయంలోని చైతన్యమూర్తియే ద్వారకాధీశుడై

నిలిచి జరామరణాల బాధను తొలగిస్తాడు.

వ. అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబునఁ బంద్రెండు యోజనంబుల నిడుపు, నంతియ వెడల్పుం గల దుర్గమప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన.

1592

తా ॥ అని యోచించి, సముద్రుణ్ణి అడిగి సముద్ర మధ్యంలో పంద్రెండు యోజనాల నిడివి, అంతే వెడల్పు కల దుర్గమ ప్రదేశాన్ని సంపాదించాడు. సర్వులకు ఆశ్చర్యం కలిగేటట్లుగా ఒక నగరాన్ని నియమించవలసిందని దేవశిల్పి అయిన విశ్వకర్మకు పురమాయించాడు.

ఆ. వరుణపురముకంటె వాసవు పురికంటె, ధనదువీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర, స్ఫుటముగాఁగ నొక్క పురముఁ జేసె.

1593

తా ॥ వరుణపురము, ఇంద్రనగరం, కుబేరపురి, యదుపురి, బ్రహ్మలోకాల పట్టణముల కంటే మిక్కిలి ప్రకాశించునట్లుగా విశ్వకర్మ ఒక పట్టణాన్ని నిర్మించాడు.

వ. అందు.

1594

క. ఆకసము తోడిచూ లనఁ, బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁతెం, తో కల దా పరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్.

1595

తా ॥ ఆ పట్టణ ప్రాకారం ఆకాశానికి తోబుట్టువు ఏమో అన్నట్లుగా మిక్కిలి పొడవుగా ఉంది. అగడ్త పాతాళం కంటే ఎంతో లోతు కలిగి ఉంది, దాని లోతు తెలుసుకోవటం ఎవరికీ

శక్యం కాదు.

క. కోటయు మిన్నును దమలోఁ, బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా
చాటుల రుచిఁ దారకములు, కూటువలై కోటతుదలఁ గొమరారుఁ బురిన్.

1596

తా ॥ ఎత్తు విషయమై ఆ పట్టణంలోని కోట ఆకాశంతో సరిసమానమని జగడమాడగా, అడ్డంగా నిల్చిన తీర్పరులవలె నక్షత్రాలు గుంపులై ప్రాకారము మీది భాగములయందు ప్రకాశిస్తున్నాయి.

శా. సాధుద్వార కవాట కుడ్య వలభి స్తంభార్గళా గేహళీ
వీథీవేది గవాక్ష చత్వర సభావేశ్మ ప్రఘాణ ప్రపా
సౌధాట్టాలక సాల హర్మ్య విశిఖా సౌపాన సంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి స్నిగ్ధంబులై య ప్పురిన్.

1597

తా ॥ ఆ పట్టణమందు చక్కని ద్వారబంధములు, తలుపులు, గోడలు, ఇంటి చూరు కప్పులు, స్తంభములు, గడియలు, గడపలు, వీథులు, అరుగులు, కిటికీలు, ముంగిళ్ళు, కూటములు, ఇండ్లు, చలి పందిళ్ళు, సౌధములు, కోటలు, రచ్చపట్లు, మిద్దె ఇండ్లు, రాజమార్గాలు – ఇవన్నీ బంగారము చేతను, మణులచేతను అలంకరింపబడి కాంతులీనుతూ శోభావహంగా ఉన్నాయి.

క. కూడి గ్రహంబులు దిరుగఁగ, మేడలతుది నిలువులందు మెలఁగెడి బాలల్
క్రీడింపరు పురుషులతో, వ్రీడం దద్వేళలందు విను మా వీటన్.

1598

తా ॥ ఆ పట్టణంలోని మేడల చివర అంతుస్తులందు సూర్యచంద్రాది గ్రహాలు తిరుగుచుండగా మేడల మీది ప్రదేశాలలో తిరిగే బాలికలు ఆ వేళల్లో సంచరించేందుకు, పురుషులతో విహరించేందుకు సిగ్గు పడుతారు.

ఉ. ఆయతవజ్ర నీలమణి హాటకనిర్మిత హర్మ్యసౌధ వా
తాయనరంధ్ర నిర్యదసితాభ మహాగరు ధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహ రమ్యశాఖలం
జేయుచు నుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకిసంఘముల్.

1599

తా ॥ విస్తారమైన రవలు, నీలములు, బంగారము – వీటిచేత నిర్మితమైన మేడలు మరియు రాజ గృహముల కిటికీల సందుల నుండి అగరు ధూప ధూమాలు వెలువడుతూ ఉంటాయి. అవి మేఘముల వరుసల భ్రమను కలిగిస్తాయి. వాటిని అలా చూసి ఎత్తైన చెట్ల కొమ్మల నుండి ఆ నెమళ్ళు గుంపులుగా చేరి నర్తిస్తూ ఉంటాయి.

ఆ. సరస నడచుచుండి సౌధాగ్రహేమ కుం, భములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పరింపలేక యినులు పెక్కం డ్రంచుఁ, బ్రజలు సూచి చోద్యపడుదు రందు.

1600

తా ॥ ఆ పట్టణ సమీపంలో నడుస్తూ ఆ సౌధముల ఉపరితలమందు గల బంగారు కలశాలలో ప్రతిఫలించే సూర్యుణ్ణి చూచి, బింబమిది, ప్రతిబింబమిది అని తెలుసుకొనలేక సూర్యులు చాలామంది ఉన్నారని ప్రజలు ఆశ్చర్యపోతూ ఉంటారు.

ఉ. శ్రీరమణీయ గంధములఁ జెన్ను వహించుఁ బురీవనంబులం
గోరక జాలక స్తబక కుట్మల పుష్పమరందపూర వి
స్ఫార లతాప్రకాండ విటపచ్ఛద పల్లవ వల్లరీ శిఫా

సార పరాగమూల ఫలసంభృత వృక్షలతా విశేషముల్.

1601

తా ॥ ఆ పట్టణంలోని ఉద్యానవనాలు నానావిధ వృక్ష సమూహములతో, లతలతో, పరువంలో ఉన్న మొగ్గలు, పువ్వులు, పూతేనె ప్రవాహములతో ప్రకాశిస్తూ ఉంటాయి. చిగుళ్ళ చేతను, పూగుత్తుల తోడి రెమ్మల చేతను, ఊడల చేతను, రసవంతమయిన పుప్పొడి చేతను, వేళ్ళ చేతను, పండ్ల చేతను నిండుకొన్న వృక్షాలు, తీగలూ, వీటి శోభా సంపద చేత ఆ నగరం మనోజ్ఞంగా, పరిమళభరితంగా ఉంది.

క. శ్రీకరములు జనహృదయ వ, శీకరములు మందపవన శీర్ణమహాంభ

శ్శీకరములు హంస విహం, గాకరములు నగరి కువలయాబ్జాకరముల్.

1602

తా ॥ ఆ పట్టణం కలువలతో, తామరలతో నిండి ఉన్న సరస్సులను కలిగి, జనుల మనస్సులను వశపరచుకొనేదిగా ఉంది. ఆ సరస్సులోని నీరు పిల్లగాలులచే ఎగురగొట్టబడి నీటి తుంపరలతో రమణీయంగా శోభిల్లుతోంది. అట్టి రమణీయ సరస్సులను తమ నివాసంగా చేసుకుని హంసలు మొదలైన జలపక్షులు విహరించసాగాయి.

క. నవకుసుమామోద భరా, జవనము రతిఖిన్న దేహజ స్వేదాంభో

లవనము సమధిగతవనము, పవనము విహరించుఁ బౌరభవనములందున్.

1603

తా ॥ ఆ పట్టణంలోని గృహములయందు పూచిన పువ్వుల యొక్క సువాసన తమ సౌరభాలను విరజిమ్ముతూ, సురత శ్రమ చేత దేహములందు పుట్టిన చెమటను తొలగించే విధంగా మలయ మారుతంతో కలిసి విహరిస్తూ ఉంటుంది.

క. బ్రహ్మత్వము లఘువగు నని, బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడుగా కా
బ్రహ్మాదికళలఁ దత్పురి, బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కుపఱుపరె చర్చన్.

1604

తా ॥ బ్రహ్మత్వం చులకనై పోతుందని బ్రహ్మదేవుడు పంతానికి పోయి రాడుగానీ, వస్తే ఆ పట్టణంలోని బ్రాహ్మణ జనులు ప్రసిద్ధములయిన వేదాది విద్యలయందు విచారణలో ఆ చతుర్ముఖుని కలతపెట్టే సమర్థులు.

క. నగరీభూసుర కృత లస, దగణిత మఖధూమ పిహితమై కాక మహా
గగనము నీలం బగునే?, మిగులఁగ బెడఁగగునె గ్రహసమృద్ధం బయ్యున్.

1605

తా ॥ ఆ పట్టణంలోని బ్రాహ్మణులు చేసే లెక్క లేని యజ్ఞములయందు హోమ గుండముల నుండి వచ్చే పొగచేత కప్పబడి నల్లపడింది. కాని పక్షంలో నిర్మలమైన ఆకాశం నీలవర్ణంగా ఉండే అవకాశమే లేదు.

క. తిరుగరు పలు కర్థులకును, సురుఁగరు ధన మిత్తు రితరసుదతీమణులన్
మరగరు రణమునఁ బిఱిఁదికి, నరుగరు రాజన్యతనయు లా నగరమునన్.

1606

తా ॥ ఆ పట్టణంలో రాజకుమారులు ఆడినమాట తప్పరు. అర్థులకు ధనాన్ని లేదనకుండా ఇస్తారు. పరస్త్రీలను కోరరు. యుద్ధంలో వెనుదీయక పోరాడుతారు.

క. రత్నాకరమై జలనిధి, రత్నము లీ నేర దేటి రత్నాకరమో?
రత్నములఁ గొనుదు రిత్తురు, రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్.

1607

తా ॥ రత్నాకరము అను పేరు ఉన్నా సముద్రము రత్నములను ఎవరికీ ఇయ్యజాలదు. మరి అటువంటప్పుడు సముద్రాన్ని రత్నాకరము అనవచ్చునా? అయితే ఆ రత్నాకరమును గెలుచునట్టి వారుగా, ఆ పట్టణమందలి వైశ్యులు రత్నములను కొంటూ, అమ్ముతూ రత్నాకరులుగానే భాసిస్తున్నారు.

క. తుంగంబులు కరహత గిరి, శృంగంబులు దానజల వశీకృత భంగీ
భృంగంబులు పటుశైల స, మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్.

1608

తా ॥ పట్టణములోని మదపుటేనుగులు ఉన్నతములు. తొండముల చేత పర్వత శిఖరాలనైనా కొట్టగల సమర్థతతో ఉన్నాయి. మదజలం చేత లోపరచుకోబడిన తుమ్మెదలు కలవై, కొండలవంటి దేహములతో ప్రకాశిస్తూ ఉన్నాయి.

క. ప్రియములు జితపవన మనో, రయములు కృతజయము లధికరమణీయ గుణా
న్వయములు సవినయములు ని, ర్భయములు హతరిపు చయములు పట్టణహయముల్.

1609

తా ॥ ఇంకా ఆ పట్టణములోని గుర్రములు, అందరికీ ప్రియమైనవై, వాయువు కంటే, మనస్సు కంటే వేగంగా పరుగెత్తగలవు. గెలుపును పొందునవీ, మిక్కిలి మనోజ్ఞములయిన గుణములు ఉత్తమ జాతికి చెందినవి, వినయముతో కూడుకొన్నవి, భయము లేనివి, శత్రుసమూహమును చంపేవిగా ఉంటాయి.

క. పులుల పగిదిఁ గంఠీరవ, ముల క్రియ శరభముల మాడ్కి ముదిత మదేభం
బుల తెఱఁగున నానావిధ, కలహమహోద్భటులు భటులు గల రా వీటన్.

1610

తా ॥ ఆ పట్టణంలో పెద్దపులుల వలె, సింహముల వలె, శరభ మృగముల వలె, మత్తుగొన్న ఏనుగుల వలె బహువిధాల దిట్టతనంతో పోరాడగలిగిన భటులున్నారు.

క. ఆ వీట నుండువారికి, భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవింద కృపావశమున, దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్.

1611

తా ॥ ఆ పట్టణంలోని జనులు ఆకలి, దప్పిక మొదలైనవి లేక, శ్రీకృష్ణుని కృపావశం చేత దేవతలను పోలినవారై భూమియందు తేజరిల్లుతున్నారు.

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద హరిపాదసేవనమంద చింత
వెఱపు నారాయణ విముఖకార్యములంద పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పనిర్గతి చక్రిపద్య సంస్తుతులంద పక్షపాతము శార్ఙ్గిభక్తులంద
లేమి గోవిందాన్య లీలాచరణమంద శ్రమము గోవిందపూజనములంద

తే. బంధ మచ్యుతేతర దుష్టపథములంద, జ్వరము మాధవ విరహిత క్షణములంద
మచ్చరము లీశకైంకర్య మతములంద, నరవరోత్తమ! వినుము తన్నాగరులకు.

1612

తా ॥ ఓ రాజా! అటువంటి పురంలో నివసించే ప్రజలకు, ఆ కృష్ణుని వదనాన్ని దర్శించ గలగడంయందే ఆసక్తి ఉంటుంది. ఆ గోపాలుని పాదాలను సేవించాలనే వారు సదా యోచిస్తూ ఉంటారు. ఆయన ఎడల భక్తితో పారవశ్యాన్ని చెందుతూ ఉంటారు. ఆ చక్రధరునిపై స్తుతులను రచిస్తూ, పఠిస్తూ ఆనందభాష్పాలను విడుస్తారు. ఆ గోవిందుని కంటే అన్యములైనవేవీ వారికి ఎక్కవు. భగవద్విరుద్ధ కార్యములంటే వారికి భయము, కనుక ఆచరించరు. ఆ పురుషోత్తముణ్ణి పూజించి సేవించుటయందే శ్రమపడతారు. ఆయన వద్దకు చేర్చని ఇతర మార్గాలన్నీ వారికి చెరవలె తోస్తాయి. క్షణకాలమైనా ఆ మాధవుణ్ణి వదలి ఉండలేరు. ఆ శంఖధారికి భక్తులంటే

వల్లమాలిన అభిమానం. ఆ ఈశ్వర కైంకర్యమందే వారి శ్రద్ధ అంతా నిలిచి ఉంటుంది.

వ. మఱియు న ప్పురవరంబున హరికిం బారిజాతమహీజంబును సుధర్మ యనియెడి దేవసభయును దేవేంద్రుం డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును, శుక్లవర్ణంబులు నైన తురంగం బుల వరుణుం డొసంగె. మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబులను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె. నిజాధికార సిద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణా కటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున.

1613

తా ॥ శ్రేష్ఠమైన ఆ నగరంలో నివసించే హరికి, పారిజాతవృక్షమూ, సుధర్మ అనే పేరుగల దేవతల సభాగృహాన్ని దేవేంద్రుడు ఇచ్చాడు. ఒక చెవియందు మాత్రం నలుపు రంగుని కలిగి ఉండి, మనోవేగంతో సమానమైన వడిగలిగిన శుక్లవర్ణంగల గుర్రాలను వరుణుడు ఇచ్చాడు. కుబేరుడు మత్స్య, కూర్మ, పద్మ, మహాపద్మ, శంఖ, ముకుంద, కుంద, నీలములు అనే ఎనిమిది నిధులను సమర్పించాడు. తక్కిన లోక పాలకులు తమతమ అధికార సిద్ధి కొరకు, మునుపు భగవంతుని దయా విశేషము చేత తమకు లభించిన సంపదలను అతి భక్తితో సమర్పించారు.

క. దర్పించి చేసి పురము స, మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం
తర్పిత గహ్వరికిన్ గురు, దర్పితదుఃఖప్రవాహతరికిన్ హరికిన్.

1614

తా ॥ ఈ విధంగా మంచి గుణముల చేత భూదేవిని సంతోషపెట్టిన వాడు, సంసారమనే దుఃఖముల ప్రవాహమును దాటించుటకు ఓడవంటి వాడును అయిన హరికి, విశ్వకర్మ తన నేర్పు వెల్లడి అయ్యే విధంగా పట్టణాన్ని నిర్మించి సమర్పించాడు.

వ. ఇట్లు విశ్వకర్మ నిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున

మథురాపురజనుల నందఱఁ జేర్చి, బలభద్రున కెఱింగించి తదనుమతంబున నందనవనము నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరి గహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున, హరిహయ దిగంతరాళంబున నుదయించు నంధకార పరిపంథికైవడి మథురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురు వచ్చుచున్న హరిం గని.

1615

తా ॥ ఈ విధంగా విశ్వకర్మచే నిర్మితమైన ఆ ద్వారకా పట్టణానికి, మథురాపురంలోని జనులందరిని తన యోగ ప్రభావం చేత చేర్చాడు. ఆ వృత్తాంతాన్ని బలరామునికి తెలియచేసి, అతని వద్ద సెలవు తీసుకున్నాడు. నందనవనం నుండి బయటకు వచ్చు ఐరావతం లాగా, మేరు పర్వతపు గుహలోంచి బయలుదేరు సింహంవలె, తూర్పు దిక్కుయందు ఉదయించుచున్న సూర్యుని వలె శ్రీకృష్ణుడు మథురా పట్టణం వెలుపలికి వచ్చాడు. నిరాయుధుడై వస్తున్న ఆ కృష్ణుణ్ణి కాలయవనుడు చూసాడు.

# 62. శ్రీకృష్ణుడు నిరాయుధుడై కాలయవనుడు వెంటపడగా పరుగెత్తుట

మ. కరిసంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్
పరిసర్పింపవు; రారు శూరులు; ధనుర్బాణాసి ముఖ్యాయుధో
త్కరముం బట్టఁడు; శక్రచాపయుత మేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే?

1616

తా ॥ చూసి, "ఏనుగులు లేవు, గుర్రముల గుంపులు రావు. రథసమూహాలు కనబడటం లేదు. భటులు కూడా లేరు. ఇంద్రధనుస్సుతోడ కూడుకొన్న మేఘముల వంటి ప్రకాశంతో మాలికా ధరుడొకడు పట్టణపు ద్వారం నుండి బయటకు వచ్చాడు. విల్లు ఖడ్గము మొదలైన ఆయుధములు కూడా చేతపట్టలేదు. చూశారా!" అని తన సైనికులతో కాలయవనుడు పలికాడు.

శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై నేతెంచి పోరాటకున్
మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేగు దెం
చె న్న న్నోర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీఁ గోరియో చూడుఁ డం
చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్.

1617

తా ॥ తరువాత తన సైనికులను చూసి, "నేను ఈ పట్టణమును చుట్టుముట్టి ఎన్నో దినములయింది. ఇన్నాళ్ళనుండి నాతో యుద్ధమునకు వచ్చిన వాడు ఒక్కడైనా లేడు. ఈనాడు ఏ ఆయుధమును చేబట్టక, వట్టి చేతులతో వీడు మన ఎదుటికి వచ్చాడు. నన్ను గెలువ తలచి వస్తున్నాడా లేక మంచి మాటలాడి తప్పించు కొనుటకో లేదా సంపదను కోరియో... ఎందుకో తెలియకుండా ఉంది, చూడండి" అని పలికాడు.

క. విభులగు బ్రహ్మప్రముఖుల, కభిముఖుఁడై నడవకుండునట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ, నభిముఖుఁడై నడచెఁ గాలయవనున కధిపా!

1618

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! లోకములను ఏలువారైన బ్రహ్మ మొదలగు వారికి సైతము అలా ఎదురుగా వస్తూ కనబడని ఆ సుగుణాల కృష్ణుడు, మదపుటేనుగు నడక వంటి నడకతో కాలయవనునికి అభిముఖంగా నడిచాడు.

వ. ఆ సమయంబున న య్యాదవేంద్రు నేర్పడం జూచి.

1619

తా ॥ ఆ సమయంలో శ్రీకృష్ణుణ్ణి నిదానించి చూసాడు కాలయవనుడు.

మ. 'వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచద్దీర్ఘబాహుండు స
ద్వనమాలాంగద హారకంకణ సముద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁడౌ' ననుచు న మ్మూఢుండు గాఢోద్ధతిన్.

1620

తా ॥ 'కమలముల వంటి కన్నులు, సింహము వంటి సన్నని నడుము, లక్ష్మీ స్థానమైన వక్షస్థలము, శ్రీవత్స మనెడి పుట్టుమచ్చ, నీలమేఘం వంటి దేహం, చంద్రుని వంటి ముఖం, నిడుపాటి భుజములు, వనమాల, భుజకీర్తులు, ముత్యాల సరులు, కంకణములు, ప్రకాశించునట్టి చెవిపోగులును కలవాడైన ఈతడు ఆ నారద మహాముని చెప్పిన వీరుడే కావచ్చు' అని అనుకొంటూ ఆ మూఢుడు అధికమైన అహంకారంతో, మిడిసిపాటుతో ఉన్నాడు.

సీ. చటులవాలాభీల సైంహికేయునిభంగి లాలితేతర జటాలతిక దూలఁ

ప్రళయావసర బృహద్భాను హేతిద్యుతిఁ బరుషారుణ శ్మశ్రుపటలి వ్రేలఁ
గాదంబినీఛన్న కాంచనగిరిభాతిఁ గవచ సంవృత దీర్ఘకాయ మమర
వల్మీక సుప్త దుర్వారాహి క్రైవడిఁ గోశంబులో వాలు కొమరు మిగుల

ఆ. నార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి, గమలసంభవాది ఘనులకైన నఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ, దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప!

1621

తా ॥ ఓ రాజా! బ్రహ్మాదిదేవతలు సహితం పట్టుకోలేని ఘనుడు ఆ గోవిందుడు. అటువంటి వానిని, లోక రక్షకున్ని పట్టుకోవాలని భావించి ఆ కాలయవనుడు తన అశ్వాన్ని అధిరోహించి, గర్జిస్తూ కృష్ణుణ్ణి సమీపించాడు. ఆ సమయాన భీతి కొలిపే విధంగా రాహువు తోకవలె కాలయవనుని శిఖ కదులుతూ ఉంది. ప్రళయకాలపు అగ్ని శిఖల వలె ఎర్రగా ఉన్న అతని మీసాలు వేలాడుతున్నాయి. మేఘాల చేత కప్పబడిన బంగారు కొండవలె అతని శరీరం కవచం చేత కప్పబడి ఉంది. పుట్టలో నిద్రిస్తున్న సర్పం వలె అతని ఒరలో కత్తి అందగిస్తోంది.

క. ఇటు దన్నుఁ బట్టవచ్చినఁ, బటుతర జవరేఖ మెఱసి పట్టువడక ది
క్తటము లదర హరి వాఱెం, జటులగతిన్ వాఁడు దోడఁ జనుదేరంగన్.

1622

తా ॥ ఈ విధంగా తనను పట్టుకోవడానికి కాలయవనుడు రాగా, మిక్కిలి వేగంగా వానికి చిక్కక, దిక్ప్రదేశములు చలించునట్లుగా కృష్ణుడు పరుగెత్తసాగాడు.

వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె.

1623

తా ॥ అప్పుడు కాలయవనుడు ఇట్లా అన్నాడు:

మ. యదువంశోత్తమ! పోకు పోకు రణ మీ నర్హంబు; గంసాదులన్
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;
విదితఖ్యాతులు వీటిఁబోవ నరికిన్ వెన్నిచ్చి యి బ్భంగి నే
గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ!

1624

తా ॥ "ఓ యదువంశ శ్రేష్ఠుడా! పోకు! నిలువుము! నాతో యుద్ధం చెయ్యటం నీకు తగినదే. కంసుడు వంటి శూరులనేకులను యుద్ధంలో గెలిచావని విని, నీతో యుద్ధం చెయ్యాలనే కోరికతో వచ్చాను. ప్రసిద్ధమైన కీర్తి అంతా వ్యర్థమయ్యేలా, శత్రువుకు వెన్నిచ్చి ఈ విధంగా పరుగెత్తి పోతారా? అందునా నీవు సామాన్యులయిన రాజుల వంటి వాడవా? నీకు అపకీర్తి వస్తుంది సుమా!

మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలముల్ సొచ్చిన, భూమిక్రిందఁ జనినన్, శైలంబుపై నెక్కినన్
బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్
జలధిన్ దాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్.

1625

తా ॥ మాధవా! నీవు నీళ్ళలో మునిగిననూ (మత్స్యావతారం), భూమికింద దూరినా (కూర్మావతారం), కొండపై ఎక్కినా (వరాహావతారం), బలవంతుని సహాయం పొంది వచ్చినా (వామనావతారం), వికారరూపంతో మారు వేషంలో ఉన్నా (నృసింహావతారం), సముద్రమును దాటి పోయినా (రామావతారం) బ్రాహ్మణుని వలెనూ, సేద్యపు కాపువలెనూ, గుర్రపు రౌతు వలె వర్తించినా (పరశురామ, బలరామ, కల్క్యవతారములు) లోకంలో నా కీర్తి వ్యాపించేటట్లుగా బలముతో నిన్ను పట్టుకుంటాను.

వ. అదియునుం గాక.

1626

మ. శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేరఁ వా
హరిరింఖోద్ధతధూళి గప్ప; దకటా! హాస్యుండవై పాఱె; దు
ర్వరపై నే క్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్.

1627

తా ॥ ఓ కృష్ణా! నేను నీ మీద ఇంతవరకూ బాణాలు ప్రయోగించనే లేదు. ధనుష్టంకారమైన చేసినవాడను కాను. నా గుర్రము కూడా వడిగా నడవలేదు. ఏమీ లేకుండానే నలుగురూ ఎగతాళి చేసేటట్లు పారిపోతున్నావే! ఇటువంటి నీవు మునుపు అఘాసురుడు, కేశి అనే రాక్షసులతో, కువలయాపీడమనే ఏనుగు, చాణూర ముష్టికులు అనే మల్లయోధులతో, జరాసంధుడు, కంసుడు మొదలైన వారితో ఏ విధంగా ఎదిరించి పోరాడితివో!"

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకుసేయక మందహాసంబు ముఖారవిందం బునకు సౌందర్యంబు నొసంగ 'వేగిరపడకు; రమ్ము ర' మ్మనుచు హరియును.

1628

తా ॥ అని అంటూ కాలయవనుడు వెంబడిస్తూ రాగా, కృష్ణుడు వానిని లక్ష్యపెట్టక చిరునవ్వుతో, 'త్వరపడకు రమ్ము, రమ్మం' టూ పలికాడు.

సీ. 'అదె యిదె లోఁబడె' నని పట్టవచ్చినఁ గుప్పించి లంఘించుఁ గొంతతడవు
పట్టరా; దీతని పరు వగ్గలం' బని భావింపఁగా సమీపమున నిలుచు
నడరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టట్టు గికురువెట్టు

వల్మీకతరు సరోవరము లడ్డంబైన సవ్యాపసవ్య సంచరతఁ జూపుఁ

తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును, నీడలకుఁ బోవు నిఱుముల నిగిడి తాఱు
నన్నుఁబట్టిన నీవు మానవుఁడ' వనుచు, యవనుఁ డెగువంగ బహుజగదవనుఁ డపుడు!

1629

తా ॥ ఓ రాజా! ఆ సమయమున ఆ మాధవుని క్రీడ చూడాలి. ఇదిగో దొరికాడు కృష్ణుడు, ఇంక పట్టుకోవచ్చునని ఆ కాలయవనుడు భావించి దగ్గరకు రాగానే, కుప్పించి ముందుకు దూకుతాడు. ఈతని పరుగు వేగం అధికం, నేను ఇక పట్టలేను అని కాలయవనుడు భావించగానే, సమీపానికి వచ్చి నిలబడతాడు. పక్కకు అడ్డం వస్తే ఏమార్చి ముందుకు పోతాడు. పుట్టలు, గుట్టలు, సరస్సులు అడ్డం వస్తే కాసేపు కుడివైపుకి, కాసేపు ఎడమవైపుకి పరుగులు పెడతాడు. పల్లంలో దాక్కుని, మిట్టలెక్కి బయటకు వస్తాడు. చెట్ల నీడల్లోనికి వెళ్ళి అనువుగా నిలుస్తాడు. నన్ను పట్టుకుంటే నీవు మానవుడివే అని ఎగతాళి చేస్తూ, ఆ కాలయవనున్ని ముప్పుతిప్పలు పెట్టసాగాడు ఆ లోకరక్షకుడు.

వ. మఱియును.

1630

సీ. సకలభూతవ్రాత సంవాసుఁ డయ్యును వనములు నగములు వరుస దాఁటు
లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ
బక్ష విపక్ష సంబంధ శూన్యుం డయ్యుఁ, దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు
విజయాపజయభావ విరహితుం డయ్యుఁ దా నపజయంబును జెందినట్లు తోఁచు

ఆ. నభయ భయ విహీనుఁ డయ్యు భీతునిమాడ్కిఁ, గానఁబడును సర్వకాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁడైన కైవడి వన, మాలి పఱచు వెఱపుమాలి యధిప!

1631

తా ॥ ఓ రాజా! సమస్తమైన స్థావర జంగమ ప్రాణి సమూహానికి ఉనికిపట్టయిన ఆ పరమాత్ముడు అడవులు, కొండలు దాటిపోయాడు. విశ్వానికి అతీతుడు, విశ్వానికి సాక్షిగా ఉన్నవాడైనా పలుమార్లు నిక్కినిక్కి వెనక్కి తిరిగి చూస్తాడు. వీడు తనవాడు, వీడు ఇతరుడు అనే స్వపర భేదం లేని వాడైనా తనను శత్రువుగా భావించే వానిని చూసి, వెంబడించే విధంగా పరుగు తీస్తాడు. జయాపజయాలు లేనివాడైనా, అపజయం పొందినట్లుగా నటిస్తాడు. భయంలేని వాడైనా, భీతుని వలె కనపడతాడు. సర్వకాల స్వరూపుడైనా, ఆ కాలయవనున్ని చూసి కాలానికి వెరచినవాని లాగా కనిపిస్తున్నాడు.

వ. ఇ వ్విధంబున.

1632

క. దారిత శాత్రవ భవను న, పార మహావేగ విజిత పవనున్ యవనున్
దూరము గొని చని కృష్ణుఁడు, ఘోరంబగు నొక్క శైలగుహ వడిఁ జొచ్చెన్.

1633

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు, శత్రువులను హింసించు వాడూ, వాయువు కంటే వేగంగా వెళ్ళగలిగిన కాలయవనుని బహుదూరం తీసుకొని పోయి, భయంకరమైన ఒక కొండగుహలో ప్రవేశించాడు.

క. అదె లోఁబడె నిదె లోఁబడె, నదె యిదె పట్టెద నటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి, వదలక గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్.

1634

తా ॥ ఇంక దొరికాడు, ఇదిగో దొరికాడు, ఇక పట్టుకొంటాను, ఇదిగో పట్టుకొంటున్నాను అనే ఆశతో కాలయవనుడు కృష్ణుని అడుగు జాడలను గమనించి, తాను కూడా ఆ పర్వత గుహలో ప్రవేశించాడు.

వ. ఇట్లు సొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణంబయిన గుహాంతరాళంబున దీర్ఘతల్ప నిద్రితుండై గుఱకపెట్టుచున్న ఒక మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచి.

1635

తా ॥ ఈ విధంగా ప్రవేశించిన కాలయవనుడు, అజ్ఞానం చేత నిండి ఉన్న మూఢుని మనస్సువలె చీకటిగా ఉన్న ఆ గుహలో, విశాలమైన పాన్పుమీద పవ్వళించి గురకలు పెట్టి నిద్రపోతూన్న ఒక మహాపురుషుణ్ణి చూసి అతడే శ్రీకృష్ణుడు అనుకొన్నాడు.

ఉ. ఆలము సేయలేక పురుషాధమ! దుర్లభ కంటకద్రుమా
భీల మహాశిలా సహిత భీకరకుంజర ఖడ్గసింహ శా
ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబునఁ బాఱుతెంచి యీ
శైలగుహన్ సనిద్రుక్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే?

1636

తా ॥ దానితో ఆ కాలయవనుడు, "ఓ పురుషాధమా! యుద్ధం చెయ్యలేక, ముళ్ళచెట్లు, పెద్ద పెద్ద రాళ్ళు, ఏనుగులు, సింహాలు, ఖడ్గ మృగాలు, పెద్దపులులు, సివంగులు మొదలైన క్రూర మృగాలతో కూడుకుని, భయాన్ని కలిగించే దారిగాని దారిని పరుగెత్తుకు వచ్చి, ఈ కొండ గుహలో నిద్రలో ఉన్నట్లుగా నటించినంత మాత్రం చేత నిన్ను విడిచిపెట్టను.

క. ఎక్కడ నెవ్వారలకును, జిక్క వనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడఁ బోయెదు?, నిక్కముగా నిద్రపుత్తు ని న్నీకొండన్.

1637

తా ॥ కృష్ణా! నీవు ఎక్కడా, ఎవరికీ చిక్కవని నాతో నారదుడు చెప్పాడు. నాకు ఇప్పుడు చిక్కావు. ఇక ఎక్కడికి పోతావు? ఈ కొండలో నిన్ను నిజంగానే దీర్ఘనిద్రకు పంపుతాను."

ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి, చటుల కఠిన కులిశ సదృశమైన
పాదమెత్తి తన్నెఁ బాఱి తద్దేహంబు, నగగుహం బ్రతిస్వనంబు నిగుడ.

1638

తా ॥ అంటూ ఆ యవనుడు అట్టహాసం చేస్తూ పరుగెడుతూ వెళ్ళి కర్కశంగా, వజ్రాయుధంతో సమానంగా ఉన్న తన పాదంతో, పవళించి ఉన్న ఆ పురుషున్ని కొండగుహలో ప్రతిధ్వని కలిగేలా తన్నాడు.

ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁ గిన్క వర్ధిల దిశల్ గని దృష్టి సమిద్ధ విగ్రహో
త్పన్నమహాగ్ని కీలముల భస్మముసేసె నతండు సాయక
ఛ్ఛిన్న విరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్.

1639

తా ॥ అలా కాలయవనుడు తన్నగా, పవళించి ఉన్న ఆ మహా పురుషుడు మేలుకొన్నాడు. మెల్లగా తామరల వంటి తన కనులను విప్పి, కోపం వర్ధిల్లగా, నాలుగు దిక్కులు చూసాడు. ఆ చూపుల్లో తేజరిల్లుతున్న అధికమైన అగ్నికీలలచేత, ఎల్ల శత్రువుల తలలు నరికి, సంపన్నుడై విర్రవీగుచున్న ఆ కాలయవనున్ని అనాయాసంగా కాల్చి బూడిద చేశాడు.

వ. ఇట్లేక క్షణమాత్రంబున యవనుండు 'నీఱయ్యె' ననిన విని రా జిట్లనియె.

1640

తా ॥ ఈ విధంగా ఒక్క క్షణంలో కాలయవనుడు భస్మం అయ్యాడు'' అని శుకమహర్షి చెప్పగా విని పరీక్షిత్తు ఇట్లా అన్నాడు:

# 63. ముచుకుందుని పూర్వకథాభివర్ణనము

ఆ. 'ఎవ్వఁడాతఁ? డితని కెవ్వండు దండ్రి ఘో, రాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి
నిద్రవోయె? యవను నిటు గాల్ప నెట్లోపెఁ?, దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య!'

1641

తా ॥ "ఓ శుకమహర్షీ! పవ్వళించియున్న ఆ పురుషుడు ఎవరు? అతని తండ్రి ఎవరు? అతడు అట్టి భయంకరమైన గుహలోనికి వచ్చి పండుకొని నిద్రపోవడానికి కారణం ఏమిటి? అతనికి కాలయవనున్ని భస్మం చెయ్యగల శక్తి ఎలా వచ్చింది? వివరంగా తెలియజేయండి"

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె; నిక్ష్వాకుకుల సంభవుండు మాంధాత కొడుకు ముచుకుందుండను రాజు రాక్షసభీతులైన వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన మెచ్చి, వా రమరలోక రక్షకుండైన యా రాజకుమారునికడం జేరి వరంబు వేఁడు మనిన వారలం గనుంగొని, మోక్షపదం బడిగిన వారలతని కిట్లనిరి.

1642

తా ॥ అని అడిగిన పరీక్షిన్మహారాజుతో శుక మహర్షి ఉత్సాహంగా ఇలా చెప్పాడు: "ఇక్ష్వాకు వంశంలో పుట్టిన మాంధాత కొడుకు ముచుకుందుడు అనే రాజు ఉన్నాడు. ఆ రాజు రాక్షసులకు వెరచి, బాధ పడుచున్న దేవతలను బహుకాలం కాపాడగా వారు మెచ్చి లోకరక్షకుడైన ఆ రాజు వద్దకు వచ్చి వరం కోరుకోమన్నారు. అంతట మోక్షాన్ని ప్రసాదించమని కోరాడు.

మ. జగతి న్నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ
ర గణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించితీ; లోన నీ

మగువల్ మిత్రులు బంధులున్ సుతులు సంబంధుల్ భువిన్ లేరు, కా
ల గతిం జెందిరి; కాల మెవ్వరికి దుర్లంఘ్యంబు దా నారయన్.

1643

తా ॥ "ఓ శూరాగ్రేసరా! భూలోకంలో శత్రుబాధలేవీ లేని రాజ్యాన్ని విడిచి, చిరకాలం మమ్మల్ని రక్షిస్తూ ఉండిపోయావు. ఈ లోపల నీ భార్యలు, బంధువులు, కొడుకులు, వియ్యమందిన వారు అంతా కాలగతిని (మరణాన్ని) పొందారు. నీ వారు ఎవరూ భూమిలో ఇప్పుడు లేరు. ఎవ్వరికైనా కాలం దాటరానిదే కదా!

క. కాలము ప్రబలులకును బలి, కాలాత్మం డీశ్వరుం డగణ్యుఁడు జనులం
గాలవశులుగాఁ జేయును, గాలము గడవంగలేరు ఘను లెవ్వారున్.

1644

తా ॥ కాలము లోకంలోని బలవంతులు అందరికంటే బలము కలది. ఆ కాలం భగవత్స్వరూపం. ఆ భగవంతుడు ప్రజలను కాలాధీనులుగా చేస్తాడు. ఎంతటి గొప్పవారైనా కాలాన్ని మీరలేరు.

క. వర మిచ్చెద మర్థింపుము, ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె
వ్వరమును విభులము గా మీ, శ్వరుఁడగు హరిదక్క మోక్షసంగతిఁ జేయన్.

1645

తా ॥ ఓ రాజా! నీవు మోక్షం తప్ప తక్కినవి ఏమి అడిగినా వరంగా ఇస్తాము. మోక్షం ఇవ్వడానికి ఈశ్వరుడైన హరి తప్ప మేము శక్తులము కాము"

వ. అని పలికిన దేవతలకు నమస్కరించి, ముచుకుందుండు నిద్రం గోరి దేవదత్త నిద్రావశుండై పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె; యవనుండు నీతైన పిమ్మట,

హరి ముచుకుందుని ముందట నిల్చిన.

1646

తా ॥ అని పలికిన దేవతలకు నమస్కరించి, ముచుకుందుడు నిద్రను కోరుకున్నాడు. అంతే కాక తనకు నిద్రా భంగం కానిచ్చిన వారిని భస్మం చేయగల శక్తిని కూడా పొందాడు. అలా దేవతల వలన వరంగా ఇవ్వబడిన నిద్రకు వశమై, పర్వత గుహలో శయనించి ఉన్నాడు. నిద్రాభంగం చేసిన కాలయవనుడు భస్మమైన పిమ్మట, ముచుకుందుని ముందర ఆ హరి నిలిచాడు.

సీ. వనరుహలోచను వైజయంతీదామ శోభితు రాకేందు సుందరాస్యు
మకరకుండల కాంతి మహిత గండస్థలుఁ గౌస్తుభాలంకృతు ఘనశరీరు
శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ మధ్యుఁ జతుర్బాహు మందహాసు
గాంచన సన్నిభ కౌశేయవాసు గాంభీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను

ఆ. న మ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది, తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ
నలవిగాక చకితుఁడై యెట్టకేలకుఁ, బలికెఁ బ్రీతి నవనిపాలకుండు.

1647

తా ॥ కమలములవంటి నేత్రములతో, వైజయంతి అను వనమాలతో, నిండు పున్నమి నాటి చంద్రుని వంటి ముఖమును కలిగి మకర కుండలాల కాంతిచేత వెలిగి పోతూన్న చెక్కిళ్ళు, కౌస్తుభ, మణితోడి అలంకృతమైన కంఠహారము, శ్రీవత్సమనే పుట్టుమచ్చ కలిగి ఉన్నవాడూ, సింహం నడుము వంటి నడుముతో, నాలుగు చేతులతో, బంగారు వన్నె పీతాంబరముతో, గంభీరత్వమును, చక్కదనమును, చిరునవ్వును, ప్రసన్నతను కలిగి ఉన్న కృష్ణమూర్తిని ముచుకుందుడు చూసాడు. చూసి మిక్కిలి ఆశ్చర్యమును పొంది, అతి మనోహరమైన ఆయన తేజస్సును చూడశక్యంగాక సంభ్రమంతో ఇట్లా అన్నాడు:

మ. శశివో? యింద్రుఁడవో? విభావసుఁడవో?చండప్రభారాశివో?
శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో?
దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీతేజంబుఁ జూడంగ దు
ర్వశమై; యెవ్వఁడ? వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై?

1648

తా ॥ “ఓ మహానుభావా! నీవు చంద్రుడవో, ఇంద్రుడవో, సూర్యుడవో, అగ్ని దేవుడవో, శివుడవో, బ్రహ్మవో, చక్రపాణివో తెలియడం లేదు. నీ తేజస్సు అన్ని దిక్కులయందూ, భూమ్యాకాశముల యందూ నిండుకొని చూడటానికి శక్యం కాకుండా ఉంది. నీవు ఎవ్వరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఇక్కడ ఏకాకివై ఎందుకు ఉన్నావు?

క. ఈ యడవి విషమకంటక, భూయిష్ఠము ఘోరసత్త్వ పుంజాలభ్యం
బో యయ్య? యెట్లు వచ్చితి? నీ యడుగులు కమలపత్త్ర నిభములు సూడన్.

1649

తా ॥ ఓ స్వామీ! ఈ అడవి మిట్ట పల్లాలతో, ముళ్ళతో నిండి ఉంది. క్రూరమైన జంతువుల యొక్క సమూహములతో దుర్గమంగా ఉంది. నీ పాదాలు తామర రేకులను పోలి మృదువుగా ఉన్నాయి. ఇక్కడకు ఎలా వచ్చావు?

వ. మహాత్మా! యేను నీకు శుశ్రూషణంబు సేయం గోరెద; నీ జన్మగోత్రంబు లే నెఱుంగ నర్హుండనేని నెఱిఁగింపుము; నే నిక్ష్వాకు వంశసంభవుండ; మాంధాతృ నందనుండ; ముచుకుందుం డనువాఁడ; దేవహితార్థంబు చిరకాల జాగర శ్రాంతుండ నయి నిద్ర నొంది యింద్రియ సంచారంబులు మఱచి.

1650

తా ॥ మహాత్మా! నేను నీకు సేవ చేయగోరుచున్నాను. నీ కులగోత్ర నామాలు వినడానికి

నేను అర్హుడనైతే, నాకు తెలియ చెయ్యండి. నేను ఇక్ష్వాకు వంశంలో జన్మించిన వాడిని, మాంధాత చక్రవర్తి కుమారుడను. నా పేరు ముచుకుందుడు. దేవతల మేలు కొరకు చాలాకాలం మేలుకొనియుండి నిద్రను పొందాను. ఇంద్రియ వ్యాపారాలైన వినుట, చూచుట, మొదలైనవి లేని వాడనై ఉన్నాను.

శా. ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం డేతెంచి దుష్కర్ముఁడై
తా నీక్షై చెడె నాత్మకిల్బిషమునన్ దర్పోగ్రుఁడై; యంతటన్
శ్రీనాథాకృతివైన నిన్నుఁ గని వీక్షింప న్నశక్తుండనై
దీనత్వంబును జెందితిన్; ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే.

1651

తా ॥ నేను నిద్రిస్తూండగా ఒక దుష్టుడు వచ్చి గర్వంతో ప్రవర్తించి, తన పాపమనెడు కార్చిచ్చుచేత భస్మమై నశించాడు. అంతట శ్రీనాథాకృతివైన నిన్ను చూసి వీక్షింప అశక్తుడనై దైన్యాన్ని పొందుతూ ఉన్న నన్ను కృపతో చూడు.”

వ. అనిన విని మేఘగంభీర భాషణంబుల హరి యిట్లనియె.

1652

తా ॥ ముచుకుందుని పలుకులు విన్న హరి మేఘ గంభీరమైన కంఠంతో ఇట్లా అన్నాడు:

సీ. భూరజంబులనైన భూనాథ! యెన్నంగఁ జనుఁగాని; నా గుణజన్మ కర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల రది యేల? నాకును నలవిగాదు
నేలకు వ్రేఁగైన నిఖిల రాక్షసులను నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసుదేవు నింటను వాసుదేవుఁ డనఁగఁ

ఆ. గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న, కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ

ద్రుంచుచున్నవాఁడఁ దొడరి నీ చూడ్కి నీ, ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ!

1653

తా ॥ "ఓ రాజేంద్రా! భూరేణువులనైనా ఎంచుటకు శక్యమే, కాని నా గుణములు, జన్మములు, కర్మములు, నామములు అన్నిటినీ ఎంచడానికి ఎవరూ శక్తులు కారు. ఒకరిని అనడం ఎందుకు, చెప్పడానికి నాకు కూడ శక్యం కాదు. దుష్టులైన అసురులను అందరినీ చంపి భూభారాన్ని తగ్గించమని బ్రహ్మదేవుడు నన్ను ప్రార్థించాడు. అందుకు నేను వసుదేవుని ఇంటిలో వాసుదేవుడు అనే పేరుతో పుట్టాను. దుష్టుడైన కంసుడనే పేరు కలిగిన కాలనేమి అనే రాక్షసుణ్ణి చంపి, ఇంకా భూమియందు గల దుర్జనులను చంపుతూ వస్తున్నాను. ఇప్పుడు నీ చూపు చేత భస్మమై పోయినవాడు కాలయవనుడు అనే రాక్షసుడు.

వ. వినుము; తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున ని న్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి; నభీష్టంబు లయిన వరంబు లడుగు మిచ్చెద. మద్భక్తులగు జనులు క్రమ్మఱ శోకంబున కర్హులు గా రనిన హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, యిరువది యెనిమిదవ మహాయుగంబు నందు నారాయణుం డవతరించునని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి.

1654

తా ॥ విను. పూర్వ జన్మములయందు నీవు నన్ను సేవించిన కారణంగా నిన్ను అనుగ్రహించడం కొరకు ఇక్కడకు వచ్చాను. నీకు ఇష్టమైన వరాలు ఇస్తాను! అడుగు! నా భక్తులైన వారు మరల శోకాన్ని ఎన్నడూ పొందరు అని ఆ హరి తెలిపాడు. దానితో ముచుకుందుడు అతడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడని గ్రహించి, నమస్కరించి ఇదివరలో గర్గుడు ఇరువది ఎనిమిదవ మహాయుగంలో శ్రీమన్నారాయణుడు కృష్ణుడుగా పుడతాడని చెప్పిన మాట గుర్తుకు తెచ్చుకున్నాడు.

## 64. ముచుకుందుడు శ్రీకృష్ణుణ్ణి స్తోత్రము చేయుట

క. నీ మాయఁ జిక్కి పురుష, స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు; వి
త్తామయ గృహగతమై సుఖ, తామసమై కామవంచితం బయి యీశా!

1655

తా ॥ "ఈశ్వరా! స్త్రీ పురుషులు నీ మాయలో చిక్కి నిన్ను సేవింపరు. ధనమునందు, గృహాదులందును గల తామస సుఖమునందు ఆసక్తి కలిగి, వారు వంచితులు అవుతున్నారు.

ఉ. పూని యనేకజన్మములఁ బొంది తుదిం దన పుణ్యకర్మ సం
తానముపేర్మిఁ గర్మ వసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁబడు మందుఁ డజంబు తృణాభిలాషియై
కానకపోయి నూతఁబడు కైవడి నీ పదభక్తిహీనుఁడై.

1656

తా ॥ ఓ స్వామీ! గొర్రె చక్కగా పెరిగిన గడ్డిని చూసి అపేక్షపడి, దాని వలన జరిగే హానిని తెలుసుకోలేక తినాలని భావించి, వెళ్ళి నూతిలో పడుతుంది. అదే విధంగా అనేక జన్మలలో తిరుగాడుచూ తన పుణ్యకర్మల చేత కర్మభూమి యందు మానవుడై పుట్టి కూడా, మూఢుడై – నీ చరణాలయందు భక్తి కుదరక, సంసార వాంఛలలో పడుతున్నాడు.

క. తరుణీపుత్రధనాదుల, మరగి మహారాజ్యవిభవ మదమత్తుఁడనై
నరతను లుబ్ధుఁడ నగు నా, కరయఁగ బహుకాల మీశ! యాఱడిఁబోయెన్.

1657

తా ॥ స్వామీ! భార్యలు, బిడ్డలు, ధనములు, వీటియందు అపేక్షతో ఉండి, రాజభోగాలలో మదమత్తుడనై, మానవ దేహమునందు ఆసక్తి కలవాడనై ఉండి, వ్యర్థంగా చాలాకాలాన్ని

గడిపివేశాను.

క. ఘట కుడ్య సన్నిభం బగు, చటుల కళేబరముఁ జొచ్చి జనపతి నంచుం
బటు చతురంగంబులతో, నిటు నటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా!

1658

తా ॥ స్వామీ! జడమైన కుండతోనూ, గోడతోనూ పోల్చతగిన ఈ దేహంలో ప్రవేశించి, నేను రాజును అని రథ, గజ, తురగ, పదాది బలములను చూసి విఱ్రవీగుతూ నిన్ను తెలుసుకోని కారణంగా భోగాలలో తిరుగులాడుతూ ఉండిపోయాను.

ఆ. వివిధకామభోగ విషయలాలసు మత్తు, నప్రమత్తవృత్తి నంతకుండ
వైన నీవు వేళ యరసి త్రుంతువు సర్ప, మొదిఁగి మూషికంబు నొడియు నట్లు.

1659

తా ॥ ఓ కృష్ణా! పాము పొంచియుండి ఎలుకను మెలకువతో పట్టునట్లుగా, నానావిధ వస్తువుల యందలి వాంఛచేతనూ, లోభగుణం చేతనూ అధికమైన ఇచ్ఛగల వానిని, యముని ఆకృతిలో నీవు అప్రమత్తతతో సమయం రాగానే హరిస్తావు.

క. నరవర సంజ్ఞితమై రథ, కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ
కర మృగ భక్షితమై దు, స్తర విట్క్రిమి భస్మసంజ్ఞితం బగు నీశా!

1660

తా ॥ ఈశ్వరా! రాజు అను పేరును వహించి, ఏనుగులు రథములు మొదలైన వానిచేత సేవింపబడిన దేహం, కాలగతిలో భయంకరమైన మృగములచేత భక్షించబడేదిగా, పురుగుల చేత కుళ్ళిపోయేదిగాను ఉండి, భస్మమైనప్పుడు చివరకు బూడిదగా మిగులుతోంది.

ఆ. సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగఁ, జారుపీఠ మెక్కి సార్వభౌముఁ

డైన సతుల గృహములందుఁ గ్రీడాభోగ, వృత్తినుండు; నిన్ను వెదకలేఁడు.

1661

తా ॥ సకల దిక్కులను జయించినా, తనతోడి వారందరు శ్లాఘించుచుండగా మనోజ్ఞమైన సింహాసనం ఎక్కి చక్రవర్తిత్వం వహించిన సార్వభౌముడు అయినప్పటికీ కామవాంఛలయందు ఆసక్తిని చూపుతాడు గానీ నిన్ను అన్వేషించేందుకు ఆసక్తి చూపడు.

ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు, మాని యింద్రియముల మదము లడఁచి
తపము సేసి యింద్రతయుఁ గోరుఁ గాని నీ, యమృతపదము గోరఁ డజ్ఞుఁ డీశ!

1662

తా ॥ ఈశ్వరా! మానవుడు మనస్సును స్వాధీనం చేసుకొని భోగాలను కాదనుకుని, ఇంద్రియ మదములను అడచి, జితేంద్రియుడై తపస్సు చేసి కూడా అజ్ఞానంతో ఇంద్రపదవిని కోరతాడు కాని నీ అమృత పదమును కోరడు.

సీ. సంసారియై యున్న జనునకు నీశ్వర! నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు; బంధమోక్షంబైనఁ బ్రాప్త మగును
సత్సంగమంబు; సత్సంగమంబున నీదు భక్తి సిద్ధించు; నీ భక్తివలన
సన్ముక్తి యగు; నాకు సత్సంగమునకంటె మును రాజ్యబంధ నిర్మూలనంబు

తే. గలిగినది దేవ! నీ యనుగ్రహము గాదె?, కృష్ణ! నీ సేవ గాని తక్కినవి వలదు
ముక్తిసంధాయి వగు నిన్నుఁ ముట్టఁ గొలిచి, యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు?

1663

తా ॥ శ్రీకృష్ణా! సంసారంలో వర్తించు మానవునకు నీ అనుగ్రహం ఎప్పుడు కలుగుతుందో, అప్పుడే సంసార బంధాలు సడలుతాయి. బంధములు వీడిన మాత్రం చేతనే

సత్పురుషుల సాంగత్యం కలుగుతుంది. సత్పురుషుల సాంగత్యం వల్ల నీయందు భక్తి కుదురుతుంది. తద్వారా నీ సేవావిశేషం వల్ల ముక్తి కలుగుతుంది. నాకు సత్పురుష సాంగత్యం కలగడానికి మునుపే రాజ్యబంధం నిర్మూలనం అయిపోయినది. అది నీ అనుగ్రహమే కదా! ఇక నీ సేవ తప్ప మరింకేమీ నాకు అక్కరలేదు. విజ్ఞుడు ముక్తినిచ్చే నిన్ను కొలిచి, తిరిగి ప్రతిబంధకాలైన విషయాలను కోరడు కదా!

వ. కావున రజస్సత్త్వ తమోగుణంబుల యనుబంధంబు లగు నైశ్వర్య శత్రు మరణ ధర్మాది విశేషంబులు విడిచి, యాశ్వరుండును విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన పరమ పురుషుని నిన్నాశ్రయించెదఁ; జిరకాలంబు గర్మఫలంబులచేత నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణం బాయక శత్రువులైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి 'రక్షింపు' మనిన ముచుకుందునికి హరి యిట్లనియె.

1664

తా ॥ కాబట్టి రజస్సు తమస్సు సత్వము అనే గుణముల సంబంధం వలన కలిగే సంపద, శత్రుమరణం, ధర్మాది విశేషాలన్నింటినీ విడిచిపెట్టి, ఈశ్వరుడు, విజ్ఞాన ఘనుడు, నిరంజనుడు, నిర్గుణుడు, అద్వయుడు, పరమ పురుషుడవైన నిన్ను ఆశ్రయిస్తున్నాను. బహుకాలం కర్మఫలాలను కోరుతూ ఉన్నందున వానియందలి అపేక్షచేత సంతోషిస్తూ ఆశను ఎడబాయకున్నాను. విరోధులైన శత్రువులారింటిని (ఇంద్రియాలు) జయింపలేని నాకు శాంతి ఎక్కడిది? తాపత్రయాగ్ని చేత విపత్తును పొందిన వాడను, ఇట్టి నన్ను నిర్భయునిగా జేసి కాపాడు" అని వేడుకొనుచున్న ముచుకుందునితో శ్రీకృష్ణుడు ఇట్లా పలికాడు:

ఉ. మంచిది నీదు బుద్ధి నృపమండన! నీవు పరార్థ మెట్లు వ<br>ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు; నిర్మలో<br>దంచితవృత్తి నన్ గొలుచు ధన్యు లబద్ధులు నెట్లు నీకు ని

శ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మాననేటికిన్.

1665

తా ॥ "ఓ రాజశ్రేష్ఠుడా! నీవు మంచి బుద్ధికలవాడవు. పూర్వం కూడా నీ ప్రవర్తనలో కోరికలకు చిక్కక ఉన్నావు, అందువలన అది నీకు శుభాన్నే చేకూరుస్తుంది. నిర్మలమైన మనస్సుతో నన్ను సేవించు వారికి సంసార బంధములు కలుగవు. కనుక నీకు నాపై అచంచల భక్తి కలుగుతుంది. కనుక నీవు రాజ్యపాలనము చేయుము, మానవలసిన పని లేదు.

వ. 'నరేంద్రా! నీవు తొల్లి క్షత్త్రధర్మంబున నిలిచి, మృగయా వినోదంబుల జంతువుల వధియించినాఁ డవు; తపంబునఁ దత్కర్మవిముక్తుండవై తర్వాతిజన్మంబున సర్వభూత సఖీత్వంబు గలిగి, బ్రాహ్మణ శ్రేష్ఠుండవై నన్నుం జేరెద' వని వీడ్కొలిపిన హరికిం బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణ దేహంబులతో నున్న మనుష్య పశు వృక్ష లతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగు నని తలంచి, యుత్తరాభిముఖుండై తపోనిష్ఠుం డగుచు, సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁజిత్తంబుఁ జేర్చి గంధమాదనంబు ప్రవేశించి, మఱియు నరనారాయణ నివాసంబైన బదరికాశ్రమంబు చేరి, శాంతుండై హరి నారాధించుచుండె. నిట్లు ముచుకుందుని వీడ్కొని.

1666

తా ॥ ఓ రాజా! పూర్వం నీవు రాజధర్మంలో ప్రవర్తిస్తూ, వేటాడుటయందు వేడుకతో అనేక మృగములను వధించావు, కనుక తపస్సు చేసి ఆ పాపకర్మవలన దోషాన్ని ముందుగా పోగొట్టుకో; తదుపరి జన్మయందు సర్వ ప్రాణుల యందును సమభావం కల బ్రాహ్మణ శ్రేష్ఠుడవై పుట్టగలవు, అప్పుడు నన్ను చేరగలవు" అని సెలవిచ్చి పంపగా, హరికి ప్రదక్షిణంచేసి నమస్కరించి గుహ నుండి ముచుకుందుడు బయటకు వచ్చాడు. అల్ప పరిమాణంతో ఉన్న మనుష్యులు, పశువులు, వృక్షములు, లతలు, వీటిని చూసి కలియుగం రాబోతోందని

అనుకొన్నాడు. ఉత్తరపు దిక్కుకు తిరిగి తపస్సునందు బుద్ధిని నిలిపి సంశయాలు విడిచిపెట్టి, ఎవరితోటి సాంగత్యం లేనివాడై శ్రీమహావిష్ణువునందు బుద్ధిని నిలిపి గంధమాదన పర్వత ప్రాంతానికి వచ్చాడు. అక్కడ నుండి నరనారాయణ నివాసమైన బదరికాశ్రమానికి పోయి శాంతిని వహించి హరిని ఆరాధించసాగాడు. ఈ విధంగా ముచుకుందుడు శాంతచిత్తుడై హరిని ప్రార్థించసాగాడు. ఇలా ఆ ముచుకుందుని వీడ్కొలిపి,

శా. అచ్ఛిద్రప్రకట ప్రతాపరవిచే నాశాంతరాళంబులం
బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మథురకుం బద్మాక్షుఁ డేతెంచి వీ
డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్.

1667

తా ॥ అరవిందముల వంటి నేత్రములు గల ఆ కృష్ణుడు దిగంతరాలన్నీ అవిచ్ఛిన్నంగా వెలుగొందే తేజంతో తిరిగి మథురా పట్టణానికి వచ్చాడు. అక్కడ మథురా పట్టణాన్ని చక్రాకారంలో చుట్టుముట్టి ఉన్న కాలయవనుని సైన్యాన్ని తన కీర్తి పెంపొందే విధంగా సంహరించాడు.

# 65. జరాసంధుడు ప్రవర్షణగిరిని దహించుట

వ. ఇట్లు మ్లేచ్ఛులం బొరిగొని మఱియు న మ్మథురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన, మనుష్యులు గొనిపోవు నెడ.

1668

తా ॥ ఇలా మ్లేచ్ఛులను సంహరించి మథురా నగరంలో గల గోధాన్య వాహనాది రూపమైన ధనాన్ని ద్వారకా పట్టణానికి పంపే ఏర్పాటు చేసాడు. వాటిని తీసుకొని వెడుతూన్న సమయంలో....

సీ. ఘోటకసంఘాత ఖుర సమున్నిర్గత ధూళి జీమూతసందోహముగను
మహనీయ మదకల మాతంగ కటదాన ధారలు కీలాలధారలుగను
నిరుపమ స్యందన నేమి నిర్ఘోషంబు దారుణ గర్జిత ధ్వానముగను
నిశిత శస్త్రాస్త్ర మానిత దీర్ఘరోచులు లలితసౌదామనీ లతికలుగను

తే. శత్రురాజ ప్రతాపాగ్ని శాంతముగను, వృష్టికాలము వచ్చు న వ్విధము దోఁచ నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును, మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ.

1669

తా ॥ ఇరవైమూడు అక్షౌహిణుల సేనలతో జరాసంధుడు మథురానగరం మీదికి తిరిగి దండెత్తి వచ్చాడు. అతని యొక్క గుర్రాల సమూహం యొక్క గిట్టల వల్ల రేగునట్టి ధూళి మేఘ సమూహంలా ఉంది. మదంచేత మనోజ్ఞములైన ఏనుగుల చెక్కిళ్ళ మదపుధారలు జలధారలువలె ఉన్నాయి. కదులుతున్న ఆ రథచక్రాల ధ్వని ఉరుముల శబ్దంవలె భయంకరంగా వినవస్తున్నాయి. నిశితమైన శస్త్రాస్త్రముల కాంతులు మెరుపు తీగలవలె ఉన్నాయి. అతని సైన్యం శత్రురాజుల ప్రతాపమనెడి అగ్నిని చల్లార్చడానికి వచ్చిన వానాకాలములా కనిపిస్తోంది.

చ. ఇటు చనుదెంచియున్న మగధేశ్వర వాహినిఁ జూచి యుద్ధ సం
ఘటనము మాని మానవులకైవడి భీరుల భంగి నోడి ముం
దటి ధనమెల్ల డించి మృదుతామరసాభ పదద్వయుల్ క్రియా
పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్.

1670

తా ॥ ఇలా విడిది చేసి ఉన్న జరాసంధుని సేనను చూసి బలరామకృష్ణులు యుద్ధ ప్రయత్నం మాని సామాన్య మానవులు భయపడినట్లుగా నటిస్తూ, తమ ముందర ఉన్న ధనమంతా వదలివేశారు. కార్యశూరులైన వారిరువురూ మెత్తని తామరలవంటి పాదాలతో భయంకరమైన అడవులలోకి పరుగెత్తసాగారు.

వ. ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబు లెఱుంగక పరిహసించి.

1671

తా ॥ ఇలా పరుగెడుతున్న కృష్ణ బలరాములను చూసి వారి నిజప్రభావాన్ని ఎరుగక పరిహసించసాగాడు జరాసంధుడు:

ఉ. 'ఓ యదువీరులార! రభసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం
బోయెడువాఁడఁ గాను; మిము భూమి నడంగిన మిన్ను బ్రాఁకినం
దోయధిఁ జొచ్చినం దగిలి త్రుంచెద' నంచు సమస్తసేనతోఁ
బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్.

1672

తా ॥ "ఓ యాదవవంశ వీరులారా! ఎందుకు తొందరపడి పారిపోతారు? ఇలా పారిపోయినంత మాత్రం చేత నేను మిమ్ములను విడిచిపెట్టిపోను. భూమిలో దాగినా, ఆకాశానికి ఎగిరినా, సముద్రంలో మునిగినా, (వరాహ వామన మత్స్యావతారములు) మిమ్మల్ని వెంబడించి

తప్పక చంపుతాను" అని పలుకుతూ బాహుబల సంపన్నుడైన ఆ మగధ భూపతి, తన సేనలతో కూడి రామకృష్ణుల వెంట తరుముతూ, వెళ్ళసాగాడు.

వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు సని విశ్రాంతులై దనకు డాఁగ నెల వగునని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదునొకండు యోజనంబుల పొడవును నంతియ వెడలుపును గల గిరి యెక్కి రంత.

1673

తా ॥ చాలా దూరం పరుగెత్తిన రామకృష్ణులు సేద తీర్చుకునేందుకు ఒక గిరిని అధిరోహించారు. ఆ గిరి, అధికంగా వానలు కురిపించిన ఇంద్రుని విశేష కృపచే, పదకొండు ఆమడల పొడవుతో, అంతే వెడల్పుతో ఉండి, ప్రవర్షణమనే పేరుని కలిగి ఉంది.

కా. ఆ శైలేంద్రముఁ జుట్టిరా విడిసి రోషావిష్టుఁడై మాగధో
ర్వీశుం డా వసుదేవ నందనులఁ దా వీక్షింపఁగా లేక త
న్నాశేచ్ఛన్ బిలసాను శృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్
రాసుల్ గా నిడి చిచ్చువెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్.

1674

తా ॥ అంతట జరాసంధుడు, ఆ కొండ చుట్టూ తన సేనను ఆవరించుకొనునట్లు చేసి కోపం అతిశయించుచుండగా బలరామకృష్ణులను పట్టుకొనేందుకు ప్రయత్నించాడు, అయినా వారు కనబడలేదు. దానితో విచక్షణ లేని పూర్ణ కోపంతో ఆ కొండ గుహలలో, చరియల్లో, శిఖరములలో ఎండుకట్టెలు పేర్చి నిప్పుని రగిలించవలసిందిగా సేవకులను ఆజ్ఞాపించాడు.

వ. ఇట్లు జరాసంధపరిజన ప్రదీపితంబైన మహానలంబు దరికొనియె నందు.

1675

తా ॥ ఇలా జరాసంధుని అనుచరుల చేత రగిలింపబడిన నిప్పు కార్చిచ్చుగా పరిణమించింది.

క. పొగ లెగసెఁ బొగల తుదలను, మిగులుచు మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుగమి ము న్నుగ బ్రహ్మాండము నిండెను, భగ భగమని మంట లొదవె భయదము లగుచున్.

1676

తా ॥ పొగలు పైకి ఎగుస్తుంటే, దానివెంటే నిప్పురవ్వలు బయలుదేరాయి. దానితో మిణుగురుల గుంపువలే ఆరంభమైన మంటలు భగభగమనుచూ బ్రహ్మాండాన్ని నింపి వేస్తున్నట్లుగా కనపడసాగాయి.

వ. మఱియు న మ్మహానలంబు బిల సాను శృంగ వృక్ష లతా కుంజపుంజంబుల దరికొని, శిఖలు కిసలయంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూత ధూమపటలంబులు బంధురస్కంధ శాఖావిసరంబులుగ, ననోకహంబు కైవడి నభ్రంకషంబై ప్రబ్బి కఠోరసమీరణ సమున్నత మహోల్కాజాల తిరోహిత వియచ్చర విమానంబును, వివిధ విధూమ విస్ఫులింగ విలోకనప్రభూత నూతనతారకాభ్రాంతి విభ్రాంత గగనచరంబును, సంతప్యమాన సరోవర సలిలంబును, విశాలజ్వాలాజాల జాజ్వల్యమాన తక్కోలచందనాగరు కర్పూరధూమ వాసనావాసిత గగనకుహరంబును, గరాళకీలాజాల దందహ్యమాన కీచకనికుంజ పుంజసంజనిత చిటపటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకర బహుళతర శాఖాభిద్యమాన పాషాణఘోషణ పరిమూర్ఛిత ప్రాణిలోకంబును, సంతప్యమాన శాఖీశాఖాంతర నిబిడ నీడనిహిత శాబకవియోగ దుఃఖడోలాయమాన విహంగకులంబును, మహాహేతి సందీప్యమాన కటిసూత్ర సంఘటిత మయూరపింఛ కుచకలశ యుగళ భారాలస శబరకామినీ సమాశ్రిత నిర్ఝరంబును, దగ్ధానేకమృగ మిథునంబు నై యేర్చునెడ.

1677

తా ॥ ఆ మహాగ్ని గుహలయందు, చరియలయందు, శిఖరములయందు, వృక్షాలను, తీగలను, పొదలను అంటుకొని జ్వలించసాగింది. ఆ మంటలు చిగురుల వలెనూ, నిప్పురవ్వలు పువ్వులుగానూ పొగలసమూహం పెద్ద పెద్ద కొమ్మలుగానూ కనిపిస్తుంటే ఆ అగ్ని మహావృక్షంలాగా ఆకాశాన్ని అంటుతూ వ్యాపించింది. దురుసైన వాయువు చేత, పొడవైన కొరవి కట్టెల ప్రోగులచేత దేవతా విమానాలు కనిపించడం లేదు. ఆకాశ సంచారులు నానావిధాలుగా ఉన్న నిప్పురవ్వలను చూసి నక్షత్రములేమో అని భ్రమిస్తున్నారు. సరస్సులలోని నీరు కాగ సాగింది. అధికములైన మంటల చేత మండుతున్న తక్కోలపు చెట్లు, చందనపు చెట్లు, అగరు చెట్లు, కర్పూరపు చెట్ల యొక్క వాసనల చేత ఆకాశ మండలం అంతా పరిమళ భరితంగా ఉంది. భయంకరమైన మంటల సమూహంతో కాలిపోతూన్న వెదురు పొదల నుండి పుట్టిన చిట చిట ధ్వనులు అన్ని దిక్కులలో వ్యాపించాయి. భయాన్ని పుట్టించే విధంగా రాళ్ళు దొర్లి పడుటవల్ల పుట్టిన మహాధ్వని చేత ప్రాణి సమూహాలు మూర్ఛిల్లుతున్నాయి. దగ్ధం అవుతున్న చెట్ల కొమ్మలలో పెట్టిన గూళ్ళలో ఉండి తపిస్తూన్న పిల్లల ఎడబాటు వలన, దుఃఖము చేత ఉండలేక, వెళ్ళలేక పక్షిసమూహం కలత చెందసాగింది. తాము ధరించిన నెమలి ఈకలకు మంటలు తగులగా అడవిజాతికి చెందిన స్త్రీలు సెలయేళ్ళను ఆశ్రయించారు. ఆ అగ్ని అనేక మృగముల జంటలను దహించివేసింది.

క. ఇల నేకాదశయోజన, ముల పొడవగు శైలశిఖరమున నుండి వడిన్
బలకృష్ణులు రిపుబలముల, వెలి కులికిరి కానఁబడక విలసితలీలన్.

1678

తా ॥ ఆ సమయంలో ఏకాదశ యోజనముల పొడవుగల శైల శిఖరము నుండి బలరామకృష్ణులిరువురూ వేగంతో, తమ లీల చేత ఎవరికీ కనబడకుండా శత్రుసేనల వెలుపలికి దూకారు.

వ. ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్రపరిఖంబైన ద్వారకా నగరంబునకుం

జనిరి. జరాసంధుడు వారలు దగ్ధు లైరని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె; నంత.

1679

తా ॥ ఈ విధంగా బలరామకృష్ణులు శత్రువులను మోసపుచ్చి, సముద్రము అగడ్తగాగల ద్వారకా పట్టణానికి చేరుకున్నారు. జరాసంధుడు వారు దగ్ధమయ్యారని ఎంచి, తన సేనలతో మగధ దేశానికి వెళ్ళిపోయాడు" అని చెప్పి శుక మహర్షి ఇంకా ఇట్లా అన్నాడు:

## 66. రుక్మిణీ కళ్యాణ కథాప్రారంభము

క. ఆ వనజగర్భు పంపున, రైవతుఁడను రాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను, భూవర! మును వింటి కాదె బుద్ధిం దెలియన్.

1680

తా ॥ "ఓ పరీక్షిన్మహారాజా! మునుపు బ్రహ్మదేవుని ఆజ్ఞచొప్పున రైవతుడను రాజు తన కూతురైన రేవతి అను కన్యకను బలరామునికి ఇచ్చి వివాహం చేసాడు అనే వృత్తాంతాన్ని వివరంగా విన్నావు కదా!

వ. తదనంతరంబ.

1681

మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్
జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్.

1682

తా ॥ ఆ తరువాత, గరుత్మంతుడు ఇంద్రుణ్ణి గెలిచి అమృతాన్ని తెచ్చినట్లు శ్రీకృష్ణుడు ఛేది దేశాధిపతియైన శిశుపాలుని, వాని పక్షానగల సాల్వుడు మొదలైన రాజులను ఓడించి, భీష్మకుని కుమార్తె, పద్మం వంటి దేహపరిమళంతో శ్రీ లక్ష్మీదేవి అంశమున పుట్టినదీ, శ్రేష్ఠములైన సద్గుణములు కలదీ, కన్యలలో శ్రేష్ఠురాలు అయిన శ్రీ రుక్మిణీదేవిని వివాహం చేసుకొన్నాడు."

వ. అనిన రాజిట్లనియె. మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చి హరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి. కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదుల జయించి

తన పురంబునకుం జనియె; నదియునుం గాక.

1683

తా ॥ పరీక్షిన్మహారాజు ఇట్లా అన్నాడు: "ఓ మహాత్మా! రాక్షస వివాహమునందు శ్రీ రుక్మిణీ దేవిని హరి తీసుకొని వెళ్ళాడని చెప్పావు కదా! కృష్ణుడు ఒక్కడే, ఏ విధంగా సాళ్వాదులను జయించి తన పురానికి తీసుకొని వెళ్ళాడు?

శా. కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్త వై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁ డౌ; నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే! రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.

1684

తా ॥ ఓ బ్రాహ్మణోత్తమా! కల్యాణాత్మకమైన శ్రీ విష్ణుమూర్తి యొక్క కథలను వింటూ ఉంటే ముక్తిని పొందగోరేవారెవ్వరూ తృప్తిని పొందరు. ఎంత విన్నా ఆ కథలు, సరిక్రొత్తగానే ఉంటాయి. కాబట్టి ఇప్పుడు రుక్మిణీ కళ్యాణ గాథను విశదంగా తెలియచెప్పు. నాకు వినాలని మనస్సులో చాలా కుతూహలంగా ఉంది.

క. భూషణములు సెవులకు బుధ, తోషణము లనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమను గుణభాషణముల్.

1685

తా ॥ శ్రీ విష్ణుదేవుని దివ్య గుణములను తెలుపునట్టి మాటలు, వినేవారి చెవులకు ఆభరణాల వంటివి. వాటిని విన్నవారికి అనేక జన్మముల నుండి పొందబడిన పాపసమూహాలను నశింపచేస్తాయి; మిక్కిలి శుభకరములైన ఆ పలుకులు విజ్ఞులకు ఆనందదాయకములు"

వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె.

1686

తా ॥ అని రాజు అనగా శుక మహర్షి ఇట్లా అన్నాడు:

చ. వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గల; డాతని కేవురు పుత్రు లగ్రజుం
డనయుఁడు రుక్మి నాఁ బరఁగు; నందఱకున్ గడగొట్టు చెల్లెలై
మనుజవరేణ్య! పుట్టె నొక మానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధయై.

1687

తా ॥ "ఓ పరీక్షిన్మహారాజా! విను! విదర్భ దేశంలో భీష్మకుడనే మహారాజు వీరుడు. అతడు కుండిన నగరాన్ని రాజధానిగా చేసుకొని పాలిస్తున్నాడు. అతనికి అయిదుగురు పుత్రులు, ఒక పుత్రిక సంతానంగా కలరు. వారిలో పెద్దవాడైన రుక్మి అనే పేరుకలవాడు నీతి లేనివాడు. ఆ అన్నదమ్ములు అందరికీ కడపటిదై, చెల్లెలైన మానిని రుక్మిణి అనే పేరుతో ప్రసిద్ధిని పొందింది.

క. బాలేందురేఖ దోఁచిన, లాలిత యగు నపరదిక్కులాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను, బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్.

1688

తా ॥ బాల చంద్రరేఖ ఉదయింపగానే ప్రకాశించునట్టి విధంగా, రుక్మిణీదేవి పుట్టి పెరుగుచుండగా భీష్మక మహారాజు యొక్క ఇల్లు దేదీప్యమానంగా ప్రకాశించసాగింది.

వ. మఱియు దినదినప్రవర్ధమానయై.

1689

సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబు లందు

గుజ్జెనగూళ్ళను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి
రమణీయ మందిరారామదేశంబులఁ బువ్వుఁ దీఁగెలకును బ్రోదివెట్టు
సదమల మణిమయ సౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేగి బంతులాడు, శారికా కీరపం క్తికిఁ జదువు సెప్పు
బర్హిసంఘంబులకు మురిపములు గఱపు, మదమరాళంబులకుఁ జూపు మందగతులు.

1690

తా ॥ ఆమె దినదిన ప్రవర్ధమానురాలు అవుతూ ఉన్నది. బాలామణి అయిన రుక్మిణీదేవి తన తోటి బాలికలను కూర్చుకొని పేరులు పెట్టి బొమ్మల పెండ్లిండ్లు చేస్తూ, వియ్యాలను నెరుపుతోంది. గుజ్జన గూళ్ళు అనే బొమ్మ వంటకాలను బాగుగా వండించి తన స్నేహితురాళ్ళకు పెట్టిస్తుంది. మనోహరంగా ఉన్న ఉద్యాన వనాలలోని పువ్వుతీగల సంరక్షణను చేస్తుంది. స్వచ్ఛంగా ఉన్న రత్నములచేత నిర్మితమైన మేడలయందు బంగారు ఉయ్యాలలో విలాసంగా ఊగుతుంది. తన ఈడు పడుచులతో కూడుకొని బంతులాడుతుంది. గోరువంకలకు, చిలుకలకు చదువు చెబుతుంది. నెమళ్ళకు నాట్యాలు నేర్పుతుంది. హంసలకు వయ్యారపు నడకలు నేర్పుతుంది.

వ. అంత.

1691

సీ. దేవకీసుతు కోర్కి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొడఁగెఁ;
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె;
మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ బొలఁతికి చనుదోయి పొడవు సూఁపె;
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె;

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ కేశ, బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార, నెలఁత యౌవనంబు నిండి యుండె.

1692

తా ॥ శ్రీకృష్ణునికి రుక్మిణీదేవిని వివాహం చేసుకోవాలనే కోరిక పెరుగునట్లుగా రుక్మిణి దేహం పెరుగసాగింది. కృష్ణుని మనః కమలము వికాసం పొందునట్లుగా రుక్మిణి ముఖకమలం కాంతిని పొందసాగింది. కృష్ణునికి ప్రేమానుబంధము హెచ్చునట్లుగా రుక్మిణికి తల వెంట్రుకల ముడి అధికమైంది. ఈ విధంగా కృష్ణుని కొరకే రుక్మిణి అను చందమున రుక్మిణీదేవి పెరిగి యౌవనవతి అయింది.

వ. ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి తన యెలప్రాయంబున.

1693

క. తన తండ్రి గేహమునకుం, జనుదెంచుచు నున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణుని రూపబల గుణాదులు, విని కృష్ణుఁడు దనకుఁ దగినఁ విభుఁడని తలఁచెన్.

1694

తా ॥ రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులనే పేరుకల అయిదుగురికీ చెల్లెలైన రుక్మిణీదేవి, తమ ఇంటికి వచ్చే అతిథులైన వారు చెప్పగా శ్రీకృష్ణుని యొక్క రూప బలగుణాదులు విని, అతడే తనకు తగిన వరుడని మనసులో నిశ్చయించుకున్నది.

క. ఆ లలన రూపు బుద్ధియు, శీలము లక్షణము గుణముఁ జింతించి దగన్
బాలారత్నముఁ దన కి, ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్.

1695

తా ॥ ఆమె సౌందర్యం, బుద్ధి, శీలం, లక్షణము, గుణము అన్నీ గ్రహించి ఆమెనే తనకు భార్యగా నిశ్చయించుకొన్నాడు ఆ కృష్ణుడు.

వ. అంత.

1696

ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ
సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డుపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్త పు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై.

1697

తా ॥ బంధువులందరూ రుక్మిణి దేవిని శ్రీకృష్ణునకు ఇయ్యవలెనని బుద్ధిమంతులతో ఆలోచించసాగారు. అయితే మూర్ఖపు పట్టుదల కలవాడైన రుక్మి, కృష్ణుని విషయంలో విరోధ భావన కలిగి ఉన్నాడు. గండు తుమ్మెదల బారువంటి నల్లని జడగల రుక్మిణిని శిశుపాలునికి ఇయ్యవలెనని తలిచాడు.

ఉ. అన్నతలంపు దా నెఱిఁగి య న్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది, యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వ సం
ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్న వాఁ
డెన్ని విధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే!

1698

తా ॥ క్రొత్త తామరల పరిమళము వంటి దేహపరిమళంకల రుక్మిణీదేవి, తన అన్నగారి యొక్క అభిప్రాయం తెలుసుకొని ఎంతగానో దుఃఖించింది. తనకు ఆప్తుడైన ఒక బ్రాహ్మణుని పిలిచి, “ఓ పండితోత్తమా! మిక్కిలి గర్వంతో మా అన్న ఇప్పుడు ఏ విధంగానైనా నన్ను శిశుపాలునికి ఇయ్యాలని నిశ్చయించుకున్నాడు, ఈ సంగతి నువ్వు ద్వారకా పట్టణానికి పోయి ఆ చక్రధారికి విన్నవించు.

క. అయ్యా! కొడుకు విచారము, లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్
నెయ్య మెఱిఁగించి చీరుము, చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.

1699

తా ॥ ఓ బ్రాహ్మణోత్తమా! మా తండ్రి కూడా రుక్మి యొక్క ప్రయత్నాన్ని మాన్పలేకున్నాడు. కాబట్టి వారి ప్రయత్నం నెరవేరకుండా, నా మనస్సును తెలియ చేసి, తన భక్తులను అనుగ్రహించువాడైన ఆ శ్రీకృష్ణుణ్ణి శీఘ్రంగా తోడ్కొని రమ్ము"

వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకా నగరంబునకుం జని, ప్రతీహారుల వలనఁ దనరాక యెఱింగించి య న్నగధరుం డున్న నగరుఁ బ్రవేశించి, యందుఁ గనకాసనాసీనుండై యున్న పురుషోత్తముం గాంచి 'పెండ్లికొడుకవు గ' మ్మని దీవించిన ముసిముసి నగవులు నగుచు బ్రహ్మణ్యదేవుండైన హరి తన గద్దియ దిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయు చందంబునం బూజలు సేసి, సరసపదార్థ సంపన్నంబైన యన్నంబు పెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుం జేరి లోకరక్షణ ప్రశస్తంబయిన హస్తంబున నతని యడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె.

1700

తా ॥ అని మరి కొన్ని రహస్య వచనాలు చెప్పి, ఆ బ్రాహ్మణున్ని ద్వారకా నగరానికి పంపింది. ఆ బ్రాహ్మణుడు అక్కడ ద్వారపాలకుల ద్వారా తన రాకను శ్రీకృష్ణునికి తెలియ చేశాడు. కృష్ణుడు ఉండే రాజగృహంలోకి ప్రవేశించాడు. అందులో కనకాసనాసీనుడై ఉన్న శ్రీకృష్ణుణ్ణి చూసి 'పెండ్లికొడుకు కావలసిందని' దీవించాడు. అంతట ముసిముసినవ్వులు నవ్వుతూ హరి తన గద్దె దిగి, బ్రాహ్మణున్ని కూర్చుండమని చెప్పి, అతనిని దేవతలను పూజించినట్లే పూజించాడు. పిదప షడ్రుచులతో కూడిన కమ్మని భోజనం పెట్టించి, ప్రియంతో నయంతో లోకరక్షణ ప్రశస్తంబయిన హస్తంతో అతని అడుగులను ఒత్తుతూ ఇలా అన్నాడు:

సీ. జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ వై యున్న నీధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
తనధర్మమున నుండుఁ దరలఁ డా ధర్మంబు గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషి గాఁ డేని శక్రుఁడైన నశించు నిర్ధనుం డైనను నింద్రుఁ బోలు

ఆ. సంతసించెనేని, సర్వభూతసుహృత్త, ములకుఁ బ్రాప్తలాభ ముదిత మాన
సులకు శాంతులకును సుజనులకును గర్వ, హీనులకును వినతు లే నొనర్తు.

1701

తా ॥ “ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఆనంద మనస్కుడవై ఉన్నావు. నీకీ ధర్మం అనాయాసంగా లభించింది. ఈ ధర్మం పెద్దలకు సమ్మతమైనది. బ్రాహ్మణుడగు వాడు ఏ కొద్ది పాటి ధనం లభించినా సంతోషిస్తాడు. తన ధర్మంలోనే ఉంటాడు. స్వకీయ ధర్మంనుండి తొలగడు. కోరిన పదార్థాలు వాటంతట అవే వస్తూంటాయి. తృప్తి లేకపోతే ఇంద్రుడైనా నశిస్తాడు. తృప్తిని పొందిన పక్షంలో నిర్ధనుడైనా సుఖంగా నిద్రపోతాడు. ఎల్ల ప్రాణుల యందును మైత్రి కలవారు, ప్రాప్తమైన దానితో సంతోషించువారు, ఓర్పుకలవారు, శాంత స్వభావులు, సుజనులు, గర్వహీనులు... వీరికి నేను నమస్కరిస్తాను.

ఉ. ఎవ్వని దేశమం దునికి; యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ;
కెవ్వని రాజ్యమందుఁ బ్రజలెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం
‘డివ్వనరాశి దుర్గమున కె ట్లరుదెంచితి వయ్య! నీవు? లే
నవ్వులు గావు; నీ తలఁపునం గల మే లొనరింతు ధీమణీ!

1702

తా ॥ పండితోత్తమా! మీది ఏ దేశం? ఏ రాజు పాలనలో మీరు ఉంటున్నారు? ఎవరి రాజ్యంలో ప్రజలందరూ సుఖంగా ఉంటారో ఆ రాజు నాకు ఇష్టుడు. మీరు సముద్ర మధ్యంలో ఉన్న ఈ పట్టణానికి ఎలా వచ్చారు? నేను చెప్పినవి హాస్యపు మాటలు కావు, చెప్పండి. మీ

మనస్సులోగల కోరిక నెరవేరుస్తాను"

వ. అని యిట్లు లీలాగృహీత శరీరుండైన యప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె. దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుండను రాజు గలం; డా రాజుకూఁతురు రుక్మిణి యను కన్యకామణి గల; ద య్యిందువదన నీకుఁ గైంకర్యంబు సేయంగోరి వివాహమంగళ ప్రశస్తంబయిన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము.

1703

తా ॥ అని ఈ విధంగా లీలామానుష విగ్రహుడైన కృష్ణుని మాటలు విన్న బ్రాహ్మణశ్రేష్ఠుడు ఇలా అంటున్నాడు: "ఓ స్వామీ! విదర్భ దేశానికి ప్రభువైన భీష్మకుడనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు రుక్మిణి అనే పేరుగల కన్యకామణి ఉంది. ఆ ఇందువదన నీకు సేవ చెయ్యాలనే అపేక్షతో మంగళకరమైన వివాహశుభవార్త మనవి చెయ్యమని, ఒక సందేశం విన్నవించమని నన్ను పంపింది. వినుము.

సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ లేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబు బొందఁ గలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీ యందు నాచిత్త మనవరతము, నచ్చి యున్నది నీ యాన నాన లేదు,
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!, శ్రీయుతాకార! మానినీ చిత్త చోర!

1704

తా ॥ 'ఓ కంసాంతకా! కళ్యాణ స్వరూపా! మంగళకరమైన నీ స్వరూప దర్శనం చేత నేత్రాలకు సర్వప్రయోజనమూ చేకూరుతుంది. దుర్జన శిక్షకా! నీ గుణములను విన్నంతనే, సమస్త

తాపాలు తొలగిపోతాయి. నీ పాదసేవ చేత మహోన్నత పదము లభిస్తుంది. నీ దివ్యనామాన్ని స్మరిస్తే చాలు, సంసార బంధాలన్నీ విడిపోతాయి. మానవతుల చిత్తాన్ని హరించే కృష్ణా! ఇటువంటి నీ యందు నా మనస్సు లగ్నమై ఉన్నది. నీ సాక్షిగా నిజము చెబుతున్నాను, నన్ను కరుణించుము.

శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీబలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతా లలామంబు రా
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్?

1705

తా ॥ శత్రు రాజులనే ఏనుగులను సంహరించే సింహము వంటి కృష్ణా! లోకుల మనస్సులను రంజింప చేసేవాడవు! నీవు ధన్యుడవు! వంశము, విద్య, రూపము, వయస్సు, సౌజన్యము, సంపద, బలము, దానము, శౌర్యము, కరుణ మొదలైన సద్గుణముల చేత అలరారుతూ ఉన్న వాడవు! నిన్ను ఏ కన్యలు వరించకుండా ఉండగలరు? పూర్వం నిన్ను శ్రేష్ఠురాలైన లక్ష్మీదేవి కోరలేదా? నీపై వలపు నాతోనే మొదలైనదా ఏమి?

ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్న వాఁ
డా యధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపముల్.

1706

తా ॥ వక్షస్థలమునందు శ్రీలక్ష్మిని వహించిన ఓ పురుష శ్రేష్ఠుడా! సింహమునకు అర్హమైన సొత్తును నక్క కోరునట్లుగా, నీ పాదములను ధ్యానించు దాననైన నన్ను తీసుకొని పోవాలని

శిశుపాలుడు వాంఛిస్తున్నాడు. అల్పుడైన ఆ రాజు ఆశ్చర్యకరమైన నీ ప్రతాపాన్ని ఎరుగడు.

మ. వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధ సేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితి నేనిన్ వసుదేవ నందనుఁడు నా చిత్తేశుఁ డౌఁగాక ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ జేదీశ ముఖ్యాధముల్.

1707

తా ॥ గత జన్మలలో, దేవతలు, గురువులు, బ్రాహ్మణులు, విద్వాంసుల సేవలు, దానధర్మాలు, వ్రతములు శ్రీమహా విష్ణువుకు ప్రీతిగా చేసి ఉండిన పక్షంలో, ఇప్పుడు శిశుపాలుడు మొదలైన అధములైన రాజులనందరినీ యుద్ధంలో ఓడించి, ఆ శ్రీకృష్ణుడు నన్ను పరిగ్రహించును గాక!

ఉ. అంకిలి సెప్పలేదు; చతురంగబలంబులతోడ నెల్లి యో
పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్.

1708

తా ॥ ఓ పద్మనాభా! నీకు ఇక్కడ అడ్డులేదు. రేపే చతురంగ బలాలతో వచ్చి, శిశుపాలుని, జరాసంధుని ఓడించుము. పురుషోత్తమా! నా వద్దకు వచ్చి నీ శౌర్యమే ఓలిగా (శుల్కంగా) చేసి, రాక్షస వివాహంలో నన్ను చేకొని తీసుకొని పోవలసింది. నేను నీ వెంట రావడానికి సిద్ధంగా ఉన్నాను.

సీ. లోపలి సౌధంబులోన వర్తింపంగఁ దేవచ్చునే నిన్నుఁ దెత్తునేనిఁ
గావలివారలఁ గల బంధువులఁ జంపి కాని తేరా దని కమలనయన!

భావించితేని నుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతు

తే. నెలమి మావారు పంపుదు రేను నట్లు, పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమందు, వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత!

1709

తా ॥ కృష్ణా! అంతఃపురంలో ఉండే నిన్ను నేను ఎట్లా తీసుకొనిపోతాను, నిన్ను తీసుకు వెళ్ళాలంటే కావలి వారిని, బంధుజనులను చంపాలి కదా అని భావిస్తావేమో! అలా అయితే దానికొక ఉపాయం ఉంది, దానిని చెబుతాను విను. మావారు పెళ్ళికి ముందు, ఇలవేల్పులకు జాతరలు చేసి మ్రొక్కించుటకై పట్టణము వెలుపల ఉండే పార్వతీదేవి ఆలయానికి నన్ను పంపుతారు. మావారి చేత అలా పంపబడి, పట్టణము వెలుపలికి వచ్చి పార్వతీదేవికి నేను మ్రొక్కునప్పుడు, నీవు నన్ను తీసుకొని పోవచ్చు.

మ. ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱుజన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!

1710

తా ॥ ప్రాణేశ్వరా! మహనీయులైన వారు అజ్ఞాన నివృత్తికై శివుణ్ణి ఏ విధంగా ప్రార్థిస్తారో, అలాగే తత్సమానుడైన ఏ పరమపురుషుని పాదాల నుండి ఉద్భవించిన గంగాజలాలలో ఓలలాడాలని భావిస్తారో, అటువంటి నీ యొక్క అనుగ్రహము నాపై ప్రసరించకపోతే, వ్రతనిష్ఠను పూని, నూరు జన్మలకైనా నీవే పతి కావాలని ధ్యానిస్తూ, నా ప్రాణాలను నీకే అర్పిస్తాను. ఇది ముమ్మాటికీ నిజము.

సీ. ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని తనులతవలని సౌందర్య మేల?
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియముల సత్త్వమేల?
దయిత! నీ యధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల?

ఆ. నీరజాతనయన! నీ వనమాలికా, గంధ మబ్బలేని ఘ్రాణ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని, జన్మ మేల? యెన్ని జన్మములకు?

1711

తా ॥ ప్రాణేశ్వరా! నీ మంజులభాషణములు వినలేనప్పుడు చెవుల వలన ప్రయోజనం లేదు. ఓ పురుషోత్తమా! నీ మంగళ స్వరూపాన్ని చూడని కన్నులు నిష్ప్రయోజకాలు. నీ నామము స్మరించని జిహ్వ వృథా! నీవు ధరించిన వనమాలికా సౌరభం ఆఘ్రాణించలేని నాసిక ఎందుకు? నీ పాదసేవకు ఉపకరించని జన్మము ఎందుకు? ఓ ధన్యచరితా! ఇన్ని మాటలు ఏల? నీతో కలిసి జీవించలేని జీవితము వృథా! ఇది నా నిశ్చితాభిప్రాయము'"

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి 'కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు' మని సవర్ణనంబుగా మఱియు నిట్లనియె.

1712

తా ॥ అని ఈ విధంగా రుక్మిణీదేవి పంపిన సందేశాన్ని తెలుపుతూ, ఆమె యొక్క రూప సౌందర్యాది విశేషాలను బ్రాహ్మణుడు శ్రీహరికి విన్నవించాడు. కర్తవ్యాన్ని ఏలిన వారే ఆలోచించాలి అంటూ తిరిగి ఆ రుక్మిణీ దేవిని వర్ణిస్తూ ఇలా అన్నాడు:

సీ. పల్లవవైభవాస్పదములు పదములు గనకరంభా తిరస్కారు లూరు;
లరుణప్రభా మనోహరములు గరములు గంబు సౌందర్య మంగళము గళము

మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు జితమత్త మధుకరశ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ప్రాపులు చూపు లు, కుసుమశరుని వింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు, జలజనయన ముఖము చంద్రసఖము.

1713

తా ॥ "కృష్ణా! ఆ రుక్మిణీదేవి యొక్క పాదముల యొక్క కాంతులు చిగురుటాకులను మించుతాయి. చేతులు ఇంచుక ఎర్రనైన కాంతిచేత మనోజ్ఞమైనవి. కంఠము శంఖమువలె మంగళ ప్రదంగా అందంగా ఉంటుంది. నడుము సన్నగా ఉన్నదా లేదా అనిపిస్తుంది. నొసలు అర్ధచంద్రుణ్ణి ఎగతాళి చేస్తుంది. వేణీ సౌందర్యం తుమ్మెదల బారును జయిస్తుంది. చూపులు మన్మథ బాణములకు ఆశ్రయములు. కనుబొమలు కుసుమ శరుని వింటి కొనలు. ఆమె మాటలు మనస్సుకు ఆనందకరములు. ఆమె ముఖం చంద్ర బింబమే! ఆమె సర్వమంగళకర సౌభాగ్య స్వరూపం కలది.

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు; మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగుఁ; దప్పదు; జాడ్యము లేల? నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్ఛేయుము; శత్రులన్ నుఱుముసేయుము; సేయుము శోభనం బిలన్.

1714

తా ॥ కృష్ణా! మా గురువుల సాక్షిగా చెబుతున్నాను! ఆ చిన్నది నీకు, నీవు ఆ చిన్నదానికి సరిగ్గా సరిపోతారు. తప్పక ఆమెతో నీకు వివాహం కాగలదు. ఇక ఆలస్యం ఎందుకు? నీవు నీకు కావలసిన వారిని అందరిని వెంటపెట్టుకుని, ఆ రుక్మిణీ దేవిని తీసుకొని వచ్చేందుకు బయలుదేరి రా! శత్రువులను జయించి, లోకులకు మేలు చేసి కీర్తిని బడయుము."

## 67. శ్రీకృష్ణుడు కుండిన నగరానికి రథారూఢుడై వెళ్ళుట

వ. అని యిట్లు పలికి, బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాది విశేషంబులును విని, యవధరించి, నిజకరంబున నతని కరంబుఁబట్టి నగుచు న య్యాదవేంద్రుం డిట్లనియె.

1715

తా ॥ అని ఈ విధంగా పలికిన బ్రాహ్మణుని వలన, విదర్భరాజ తనయ పంపిన సందేశాన్ని, ఆమె రూప సౌందర్యాది విశేషాలను విన్నాడు. తన చేతితో అతని చేతిని పట్టుకొని నవ్వుతూ, కృష్ణుడు ఇట్లా అన్నాడు:

ఉ. కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు; నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే
మున్నె యెఱుంగుదున్; బరులమూఁక లడంచి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! మాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చు కైవడిన్.

1716

తా ॥ "విద్వాంసుల చేత కొనియాడబడే వాడా! రుక్మిణియందు నాకు తలపు పూర్ణంగా ఉంది. అందువల్లనే నాకు సర్వదా రాత్రులయందు నిద్ర పట్టడం లేదు. నా వివాహానికి రుక్మి భంగము చేస్తాడని నాకు ముందే తెలుసు. కాబట్టి మ్రానును తరిచి, అగ్నిని వెలికి తెచ్చిన విధంగా, శత్రుసేనను జయించి ఆమెను నేను తీసుకొని వస్తాను.

క. వచ్చెద విదర్భభూమికిఁ; జొచ్చెద భీష్మకుని పురము; సురుచిరలీలన్
దెచ్చెద బాలన్; వ్రేల్మిడి, వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్.

1717

తా ॥ నేను ఇప్పుడే విదర్భ దేశానికి వచ్చి భీష్మకుని పట్టణంలో ప్రవేశించి రుక్మిణీదేవిని తీసుకొని వస్తాను. శత్రువులు అడ్డంవస్తే యుద్ధంలో హతమారుస్తాను.”

వ. అని పలికి, రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసి, తన పంపున రథసారథియైన దారుకుండు శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను తురగంబులం గట్టి, రథ మాయత్తంబు చేసి తెచ్చిన, నమోఘ మనోరథుండైన హరి తానును, బ్రాహ్మణుండును రథారోహణంబు సేసి యేకరాత్రంబున నానర్తక దేశంబులు గడచి, విదర్భదేశంబునకుం జనియె; నందుఁ గుండిన పురీశ్వరుండైన భీష్మకుండు కొడుకు నకు వశుండై, కూఁతు శిశుపాలున కిత్తునని తలంచి, శోభనోద్యోగంబు సేయించె; నప్పుడు.

1718

తా ॥ అని పలికి, రుక్మిణీదేవి పెండ్లి ముహూర్తం ఎప్పుడో ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుణ్ణి అడిగి తెలుసుకొన్నాడు. తన ఉత్తరువు ప్రకారం సారథియైన దారుకుడు సుగ్రీవము, మేఘ పుష్పకము, శైబ్యం, వలాహకం అనే నాలుగు గుర్రాలను కట్టి సిద్ధపరచుకొని వచ్చిన రథం మీద శ్రీకృష్ణుడు బ్రాహ్మణునితో కూడి ఎక్కాడు. ఒక్క రాత్రిలో నర్తక దేశాలన్నీ దాటి విదర్భ దేశానికి చేరుకున్నాడు. అక్కడ కుండిన పట్టణానికి అధిపతి అయిన భీష్మకుడు, తన కూతురును శిశుపాలునకే ఇస్తాను అని నిశ్చయించి ఆ శుభకార్యానికి తగిన ప్రయత్నాలను చేయిస్తున్నాడు.

సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ
జేసిరి; చందనసిక్త తోయంబులు గలయంగఁ జల్లిరి; కలువడములు
రమణీయ వివిధతోరణములు గట్టిరి సకలగృహంబులఁ జక్క సేసి;
కర్పూర కుంకుమాగరు ధూపములు వెట్టి రతివలుఁ బురుషులు నన్నియెడల

ఆ. వివిధవస్త్రములను వివిధమాల్యాభర, ణానులేపనముల నమరియుండి
రఖిలవాద్యములు మహాప్రీతి మ్రోయించి, రుత్సవమున నగర మొప్పి యుండె.

1719

తా ॥ అందువలన ఆ నగరాన్ని ఏ విధంగా అలంకరించారో ఇక్కడ తెలుపుచున్నారు. ఆ పట్టణములోని పెద్ద వీథులు, సందు వీథులు, రాజ మార్గములు, అంగళ్ళ వీథులు అన్నీ నిర్మలంగా చేశారు. అంతటా మంచి గంధపు జలాన్ని చిలుకరించి, కలువపూదండలతో, నానావిధాలుగా తోరణాలు కట్టి ఇళ్ళను అలంకరించారు. కర్పూరం, కుంకుమ పువ్వు, అగరు మొదలైన సువాసన ద్రవ్యములతో ధూపం వేశారు. అన్ని చోట్ల, స్త్రీ పురుషులు బహువిధాల వస్త్రముల చేతనూ, పూల దండల చేతనూ, ఆభరణములచేతనూ, లేపనములచేతనూ ఒప్పి ఉన్నారు. మంగళ వాద్యములను మహా ప్రీతితో వాయించసాగారు. ఈ విధమైన వేడుకల చేత కుండిన నగరమంతా పరిఢవిల్లింది.

వ. అంత నా భీష్మకుండు విహిత ప్రకారంబునం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళభూషితం గావించి, రత్నభూషణంబు లిడం జేసె; ఋగ్యజుస్సామాథర్వణ మంత్రంబుల మంగళాచరణంబు లొనరించి, భూసురులు రక్షాకరణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమ నిగదిత న్యాయంబున హోమంబుఁ గావించె; మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకుఁ దిల ధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీదేవతల కొసంగె నయ్యవసరంబున.

1720

తా ॥ అంతట భీష్మక మహారాజు యథోచిత రీతిని పితృదేవతలను తొలుతగా అర్చించాడు. బ్రాహ్మణులకు భోజనాలు పెట్టించాడు. మంగళాశీర్వచనాలు చదివించాడు. రుక్మిణీదేవికి స్నానం చేయించి వస్త్రభూషణాదులచేత అలంకరింప చేశారు. ఋగ్యజుస్సామ, అధర్వణ వేద మంత్రములతో పుణ్యాహవచనములు పారాయణ చేయించాడు. బ్రాహ్మణులు రక్షాకరణ మంత్రములను జపించసాగారు. నూతన దంపతుల క్షేమం కొరకు నవగ్రహముల శాంతికై తిలదానం, రజతదానం, స్వర్ణదానం, వస్త్రదానం మొదలయిన దానాలను

చేయిస్తున్నారు.

మ. భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతోఁ
బటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ విశం
కట వృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి య వ్వీటికిన్.

1721

తా ॥ ఆ సమయంలో శిశుపాలుడు మిక్కిలి గర్వించినవాడై చతురంగ బలాలతోను, చుట్టాలతోను, స్నేహితులతోను కూడుకొని, మిక్కిలి అధికమైన పటాలంతో, రుక్మిణీదేవిని వివాహం చేసుకుంటున్నాననే గర్వంతో విజృంభించినవాడై, కుండిన నగరానికి వచ్చాడు.

ఉ. బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి ని
ర్మంథరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస
త్సింధుర వీరరథ్య రథసేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వవిదూరకపౌండ్రకాదులున్.

1722

తా ॥ శ్రీకృష్ణబలరాములు తమ చుట్టాలతో కూడి వచ్చినా సరే, వారిని తరిమికొట్టి నిరభ్యంతరంగా రుక్మిణీ దేవిని శిశుపాలునికి ఇచ్చి వివాహం జరిగేలా చేస్తాము అని జరాసంధుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరకుడు, పౌండ్రక వాసుదేవుడు మొదలైన రాజులందరూ వచ్చారు.

వ. మఱియు నానాదేశంబుల రాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొక్క నివేశంబున నతని విడియించె; నంత నా వృత్తాంతంబు విని.

1723

తా ॥ ఇంకా అనేక దేశాల నుండి రాజులు అనేకమంది వచ్చారు. శిశుపాలునికి భీష్మకుడు ఎదురుగా వెళ్ళి, అర్చించి అతనిని తగిన విడిదియందు దించాడు. అంతట ఈ వర్తమానం అంతా బలరాముడు విన్నాడు.

చ. హరి యొకఁ డేగినాఁడు మగధాదులు చైద్యహితానుసారులై
నరపతు లెందఱేనిఁ జనినారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ; దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు గమలాక్షుని జాడ ననేక సేనతోన్.

1724

తా ॥ కృష్ణుడు ఒక్కడే వెళ్ళాడు. శిశుపాలునికి సహాయం చెయ్యాలని జరాసంధుడు మొదలైన రాజులు అనేకమంది వెళ్ళారు. కన్యకను తెచ్చేటప్పుడు తప్పక యుద్ధం జరుగుతుంది. అప్పుడు కృష్ణునికి సహాయం కావలసి ఉంటుంది అనే ఉద్దేశంతో బలరాముడు అపరిమిత సేనను వెంటపెట్టుకొని కృష్ణుడు వెళ్ళిన జాడను బట్టి తానుకూడా వెళ్ళాడు.

క. ఆ లోపల నేకతమున, నాలోల విశాల నయన యగు రుక్మిణి త
న్నా లోకలోచనుఁడు హరి, యాలోకము చేసి కదియఁడని శంకితయై.

1725

తా ॥ ఈలోపల, ఏకాంతంలో ఉండి విశాలనయనాలు కలిగిన ఆ రుక్మిణి, లోకాలను వీక్షించే ఆ శ్రీకృష్ణుడు తన సందేశం చూసి, తన వద్దకు ఇంకా రాలేదేమిటి, అని మనసులో సంశయించసాగింది.

శా. లగ్నం బెల్లి; వివాహముం గదిసె; నేలా రాఁడు గోవిందు? దు
ద్విగ్నం బయ్యెడి మానసంబు; వినెనో వృత్తాంతమున్; బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో

భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో?

1726

తా ॥ రేపే ముహూర్తము, పెళ్ళిరోజు సమీపించింది. శ్రీకృష్ణుడు ఇంకను రాని కారణము తెలియక నా మనస్సు కలవర పడుతూన్నది. అసలు నా వృత్తాంతాన్ని విన్నాడో, లేదో? బ్రాహ్మణుడైన అగ్నిద్యోతనుడు ఎందుకు ఆలస్యం చేశాడు? నా ప్రయత్నం సిద్ధిస్తుందో లేక భగ్నమవుతుందో? ఇంతకీ దైవ సంకల్పం ఎలా ఉందో?

మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో? యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నా భాగ్య మెట్లున్నదో?

1727

వ. అని వితర్కించుచు.

1728

తా ॥ అసలు ఆ బ్రాహ్మణోత్తముడు కృష్ణుని వద్దకు వెళ్ళాడో, వెళ్ళలేదో? మార్గమధ్యంలో అలసిపోయి ఎక్కడైనా చిక్కుపడ్డాడో, ఏమో? కృష్ణుడు నా సందేశం విని తప్పుగా అనుకున్నాడా? లేక ఇక్కడకు వచ్చాడా? ఈశ్వరుని యొక్క అనుగ్రహం ఉందో లేదో? నా ఇష్టదైవమైన పార్వతీదేవి నన్ను రక్షిస్తుందో, రక్షించదో? నా అదృష్టం ఎలా ఉందో? అని రుక్మిణి పరి పరి విధాలుగా కలత చెందసాగింది.

ఉ. పోఁ దను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి; వాసుదేవుఁడున్
రాఁడను; నింకఁబోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్
లేఁడను; రుక్మికిం దగవు లేదిటఁ జైద్యున కిత్తు నంచు మ

న్నాఁడను; గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁడనున్.

1729

తా ॥ ఆ బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని పట్టణమైన ద్వారకా నగరానికి వెళ్ళి ఉండడు. అందుకనే వాసుదేవుడు రాలేదు. ఈ సమయమునైనా హరిని తీసుకు రమ్మని పంపుదామంటే కావలసిన వారెవరూ లేరు. మా అన్నగారైన రుక్మికి న్యాయం అనేది లేనే లేదు. శిశుపాలునికి నన్ను ఇవ్వాలనే తలంపుతో ఉన్నాడు. పరమైశ్వర్య సంపన్నురాలైన ఆ పార్వతీదేవికి నాయందు నేడు దయతప్పినట్లున్నది అని పలువిధాలుగా చింతించసాగింది.

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ జిక్కు; దిశల్ దరహాసచంద్రికం
గప్పదు; వక్త్రతామరసగంధ సమాగత భృంగసంఘమున్
రొప్పదు; నిద్రఁ గైకొన దురోజపరస్పర సక్తహారముల్
విప్పదు; కృష్ణమార్గగత వీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.

1730

తా ॥ ఆ రుక్మిణి తన తల్లితో అయినా తన మనసులోని విచారం చెప్పుకోదు. దిక్కులలో దరహాస చంద్రికలను చిందించదు. కమలమనే భ్రమచేత తన ముఖాన్ని ఆవరింపవచ్చిన తుమ్మెదలను గుర్తించి అదలించదు. కంఠంలో ఉన్న ముత్యాల హారాల చిక్కులు సరిచేయదు. క్షణాకాలమైనా కృష్ణుడు వచ్చే మార్గంవైపు నిలిపిన చూపులను మళ్ళించదు.

చ. తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు; కొప్పుఁ జక్కగా
ముడువదు; నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన; దన్న మేమియుం
గుడువదు; నీరముం గొనదు; కూరిమి కీరముఁ జేరి పద్యమున్
నొడువదు; వల్లకీగుణ వినోదము సేయదు; డాయ దన్యులన్.

1731

తా ॥ అంతేకాదు, కళ్ళనుండి జారుచున్న నీటి బొట్లను తుడవదు. వీడిన కొప్పుని చక్కగా ముడుచుకోదు. ఇష్టురాలైన చెలికత్తెలతో సైతం మాటలాడదు. అన్నం, నీరు అపేక్షింపదు. తాను ప్రేమతో పెంచుకుంటూన్న చిలుకకు పద్యాన్నైనా చెప్పదు. వీణను మీటుతూ వినోదించదు. చెలికత్తెలతో చేరదు.

సీ. మృగనాభి యలఁదదు మృగరాజ మధ్యమ జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖీ పువ్వులు దుఱుమదు పువ్వుఁబోణి
వనకేళిఁ గోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికా లలిత దేహ తొడవులు దొడవదు తొడవు తొడవు

ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీ తిలకంబు, కమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన, మాలి రాఁడు తగవుమాలి యనుచు.

1732

తా ॥ ఆ వనమాలి తన మాటయందు గౌరవముంచి, తనను వివాహం చేసుకునేందుకు రాలేదని ఆ రుక్మిణీదేవి బెంగతో అలంకరించుకోవడం మానివేసింది. కస్తూరిని అలుముకోదు, అద్దంలాంటి ముఖం గల ఆ పూబోణి అద్దం వంక చూడదు, పూలు పెట్టుకోదు, తామర వంటి కళ్ళు గలిగిన ఆమె వనవిహారాన్ని అపేక్షించడం లేదు. సహజపరిమళ భరితమైన శరీరం గల నాజూకుగా ఉన్న ఆమె లతలను పెంచడంలేదు. అలంకారానికే అలంకారంగా భాసిల్లే ఆమె ఆభరణాలు ధరించదు; మహిళా మణులందరికీ తిలకమైన ఆమె, తన నుదుట తిలకాన్ని పెట్టుకోవడం లేదు.

వ. మఱియును.

1733

మ. మలఁగున్ మెల్లని గాలికిం; బటురటన్మత్త ద్విరేఫాళికిం

దలఁగుం; గోయిల మ్రోఁతకై యలఁగు; నుద్యత్కీర సంభాషలం
గలఁగున్; వెన్నెల వేడిమి న్నలఁగు; మాకందాంకుర చ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ మనోభవానల శిఖాదోదూయ మానాంగియై.

1734

తా ॥ ఇలా విచారిస్తూ, విరహాగ్ని చేత తాళలేని దేహం కలదై, చల్లని గాలికి వణకిపోతుంది. మిక్కిలి మదించిన తుమ్మెదల రొదలకు భయపడి దూరంగా వెళ్ళి పోతోంది. కోయిల కూతలకు జంకుతుంది. చిలుకల పలుకులకు కలవరపడుతుంది, వెన్నెల తాపానికి సంతాపిస్తుంది. తియ్యమామిడి చెట్టు నీడకు తొలగి పోతుంది.

వ. ఇట్లు హరిరాక కెదురు సూచుచు సకల ప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పు విచందంబున వామలోచనభుజంబు లదరె నంతఁ గృష్ణు నియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన, నతని ముఖలక్షణం బుపలక్షించి యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురు సని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె.

1735

తా ॥ ఈ విధంగా హరి ఎప్పుడు వస్తాడో అని ఎదురు చూస్తూ సకల ప్రయోజనాలలోను విరక్తయై, తపించుచున్న రుక్మిణీదేవికి శుభం సూచించే రీతిలో ఎడమ కన్ను, ఎడమ భుజము అదిరాయి. అంతట కృష్ణుడు పంపగా బ్రాహ్మణుడు రాగా, ఆ మగువ అతని ముఖలక్షణాలను చూసి, ఎంతో తహతహతో, చిరునవ్వు నవ్వుతూ అతని ఎదురుగా వెళ్ళి నిలిచింది. అంత బ్రాహ్మణుడు ఇట్లా అన్నాడు:

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి; కమేయ ధనావళు లిచ్చె నాకుఁ; దా

వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!

1736

తా ॥ "ఓ కన్యకామణీ! ఆ సుదర్శన చక్రధారి నీ ఉన్నతమైన గుణాలకు మెచ్చుకున్నాడు, నాకు మేరలేని ధనమిచ్చాడు. శ్రీకృష్ణుడు వచ్చాడు. సురాసురులు అడ్డమై నిల్చినా సరే, రాక్షస వివాహము నుంచి నిన్ను తీసుకొనిపోతాడు. నీ మంచి నడవడి, నీ భాగ్యం సర్వమూ నేడు ఫలించాయి.

వ. అనిన వైదర్భి యిట్లనియె.

1737

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి; నన్
నిలువం బెట్టితి; నీ కృపన్ బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్
గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం
జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!

1738

తా ॥ బ్రాహ్మణుని పలుకులు ఆలకించి రుక్మిణీదేవి ఇలా అన్నది: "చింతామణివలె కోరిన కోరికలను నెరవేర్చునట్టి ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! కృష్ణునితో నా సందేశాన్ని చెప్పి నన్ను రక్షించావు. నీ కృపావిశేషం చేత ప్రాణాలతో నిలిచాను. నీ వంటి పుణ్యాత్ములు లోకంలో ఎక్కడా ఉండరు. దీనికి తగిన ప్రత్యుపకారం నేను ఏమీ చేయాలో తెలియని దానిని, నీకు తల ఒగ్గి నమస్కరిస్తున్నాను"

వ. అని నమస్కరించె; నంత రామకృష్ణులు తమ కూఁతు వివాహంబునకు వచ్చుట విని,

తూర్యఘోషంబు లతో నెదుర్కొని, విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనా సమేతులైన వారలకుం దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు కల్పించి విడియించె; నిట్లు కూడిన రాజుల కెల్లను వయోవీర్య బలవిత్తంబు లెట్లట్ల కోరిన పదార్థంబు లెల్ల నిప్పించి పూజించె; నంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయ వదనకమల మధుపానంబు సేయుచు.

1739

తా ॥ అని నమస్కరించింది. బలరామకృష్ణులు తన కూతురు వివాహానికి తరలి వచ్చారన్న విషయం విన్న భీష్మకుడు తూర్య ఘోషలతో ఎదుర్కొన్నాడు. ధర్మ ప్రకారంగా పూజించి, మధుపర్కాలను ఇచ్చి నానావిధ వస్త్రభూషణాదులు ఇంకా ఇతరమైన కానుకలు ఇచ్చాడు. వారునూ, వారి బంధువులునూ, వారి సేనలునూ విడియుటకు తగిన విడుదులు చూపించాడు. ఇలా వచ్చిన రాజులందరికీ వారివారి వైభవములకు తగిన విడుదులు, కావలసిన పదార్థములు ఇప్పించి పూజించాడు. ఆ పట్టణంలోని ప్రజలందరూ హరి వచ్చాడన్న వర్తమానం విని తమ కళ్ళతో ఆ గోవిందుని సుందర వదనాన్ని చూసి తమలో తాము ఇట్లా అనుకున్నారు:

మ. తగు నీచక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి; నింతమంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా! దర్పాహతారాతియై
మగఁడౌ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్.

1740

తా ॥ 'ఈ కృష్ణుడు విదర్భరాజ కుమారికి సరిగ్గా సరిపోతాడు. మన రుక్మిణి కూడా ఈ చక్రికి సరిగ్గా సరిపోతుంది. దాంపత్యం అంటే ఇలా ఉండాలి. వీరిద్దరికి దాంపత్యాన్ని ఏర్పాటు చేసిన బ్రహ్మ చాలా నేర్పరి కదా! మా పుణ్య వశం చేత అడ్డువచ్చిన శత్రువులనందరినీ జయించి

ఈ రమణీమణికి కృష్ణుడు భర్త అగునుగాక!'

వ. అని పలికి రా సమయంబున.

1741

సీ. సన్నద్ధులై బహుశస్త్ర సమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ
ముందట నుపహారములు గానుకలుఁ గొంచు వర్గంబులై వారవనిత లేఁగఁ
బుష్ప గంధాంబర భూషణ కలితలై పాడుచు భూసురభార్య లరుగఁ
బణవ మర్దల శంఖ పటహ కాహళ వేణు భేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ

ఆ. దగిలి సఖులు గొలువఁ దల్లులు బాంధవ, సతులుఁ దోడ రాఁగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క, బాల చికుర పిహిత ఫాల యగుచు.

1742

తా ॥ పౌర కాంతలు ఇలా అనుకుంటూన్న సమయంలో, రుక్మిణీదేవి ముంగురుల చేత ఆవరింపబడిన నొసలు కలదగుచూ, అంతఃపురం నుండి పార్వతీదేవిని పూజించటంకోసం బయలు దేరింది. ఆ సమయంలో సర్వాయుధములు ధరించి చుట్టూ వీరభటులు నడిచారు. వారకాంతలు నైవేద్య పదార్థములు, కానుకలు చేతులలో పట్టుకొని ముందు నడిచారు. పువ్వులు గంధము వస్త్రములు సొమ్ములు ధరించినవారై బ్రాహ్మణ ముత్తైదువులు పాటలు పాడుతూ ఆమెను అనుసరించారు. ఉడుక, మద్దెల, శంఖము, పటహం (తప్పెట), బాకా, వేణువు, భేరీ ధ్వనులచేత ఆకాశము పిక్కటిల్లుతోంది. చెలికత్తెలు సేవింప, ముత్తైదువలు వెంటరాగా రుక్మిణీదేవి సవినయంగా బయలు దేరింది.

వ. మఱియు సూత మాగధ వంది గాయక పాఠకజను లంతంత నభినందించుచుం జనుదేర మందగమనంబున, ముకుంద చరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీ మందిరంబు సేరి సలిలధారా ధౌత కరచరణారవిందయై వార్చి శుచియై,

గౌరీసమీపంబునకుం జనియె; నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి, వస్త్రమాల్య భూషణాదుల నలంకరించి, ధూపదీపంబు లొసంగి, నానావిధోపహారంబులు సమర్పించి, కానుక లిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి రప్పుడు.

1743

తా ॥ సూత మాగధులు, స్తుతిపాఠకులు, సంగీతమును పాడువారు, వంశావళి పఠించువారునూ అందరూ చేరి కొనియాడుతూ రాగా, శ్రీకృష్ణుణ్ణి మనస్సులో తలుస్తూ రుక్మిణి గౌరీదేవి ఆలయానికి వచ్చింది. కాళ్ళు చేతులు ప్రక్షాళనం చేసుకొని ఆచమనం చేసి పరిశుద్ధురాలై గౌరీదేవి దగ్గరకు వెళ్ళింది. అప్పుడు ముత్తైదువులగు భూసురోత్తముల భార్యలు శివునితో కూడికొన్న గౌరీదేవికి అభిషేకం చేసి గంధము అక్షతలు సమర్పించారు. వస్త్రమాల్యాది భూషణాలతో అమ్మవారిని అలంకరించారు. బహు విధాలైన నైవేద్యములను సమర్పించి, కానుకలను ఇచ్చి దీపమాలికల చేత ఆరతి ఇచ్చారు. పిమ్మట రుక్మిణీదేవిచేత మ్రొక్కించారు.

ఉ. నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి సేయు మమ్మ నిన్
నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ!

1744

తా ॥ అప్పుడు రుక్మిణీదేవి ఇలా ప్రార్థించింది – “అమ్మా! నా మనస్సున శాశ్వతులూ, ఆది దంపతులైన మీ జంటనే నమ్ముకొన్నాను. ఉమామహేశ్వరులుగా పురాణ దంపతులైన మిమ్ములను శుభాన్ని కోరి భజిస్తాను. అమ్మలలో నీవు మేటివి, దయానిధివి. నాకు హరిని భర్తగా చెయ్యి తల్లీ! నిన్ను నమ్ముకొన్న వారికి చెరుపులేదు కదమ్మా! ఈశ్వరీ!”

వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును, దాంబూల కంఠసూత్రంబులును, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన.

1745

తా ॥ అని ఈ విధంగా రుక్మిణీదేవి నమస్కరించి భర్తలతో కూడిన బ్రాహ్మణ ముత్తైదువులకు ఉప్పుతో చేసిన అప్పములు, తాంబూలములు, మంగళసూత్రములు, ఫలములు, చెరుకుగడలు ఇచ్చి పూజించింది.

ఆ. వార లుత్సహించి వలనొప్ప దీవించి, సేస లిడిరి యువతిశిరమునందు; సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి, మౌననియతి మాని మగువ వెడలె.

1746

తా ॥ ఆ ముత్తైదువులు పూజలచేత సంతోషించి, చక్కగా దీవించి రుక్మిణీదేవి తలయందు శుభాక్షతలను ఉంచారు. ఆ మంగళాక్షతలను వహించి, గౌరీదేవికి మ్రొక్కి, మౌనవ్రతాన్ని వహించి గౌరిదేవి ఆలయం నుండి రుక్మిణి బయలు దేరింది.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, మృగధర మండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబునఁ, గమలభవ నర్తకుం డెత్తిన జవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి, దేవ దానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మందరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబున నుండి చనుదెంచు నిందిరాసుందరీ వైభవంబున, బహువిధ ప్రభా భాసమానయై, యిందుధర సుందరీమందిరంబు వెడలి మానస కాసార హేమకమల కానన విహరమాణ మత్తమరాళంబు భంగి, మందగమనంబునఁ గనక కలశ యుగళ సంకాశ కర్కశ పయోధరభార పరికంప్యమాన మధ్యయై, రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్క

సఖీలలామంబు కైదండ గొని, రత్ననివహ సముదంచిత కాంచన కర్ణపత్త్ర మయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవింద పరిమళ కుతూహలావతీర్ణ మత్తమధుకరంబుల మాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొన, సుందర మందహాస రోచులు దిశలందు బాలచంద్రికా సౌందర్యంబు నావహింప, నధరబింబఫలారుణ మరీచిమాలికలు రదనకుంద కుట్మలంబుల కనురాగంబు సంపాదింప, మనోజాత కేతన సన్నిభంబైన పయ్యెదకొంగు దూఁగ, సువర్ణమేఖలాఘటిత మణికిరణ పటలంబు లకాల శక్రచాప జనకంబులై మెఱయఁ, జెఱకువిలుతుం డొఱవెఱికి వాఁడి యిడి జళిపించిన ధగద్ధగాయమానంబు లగు బాణంబుల పగిది, సురుచిర విలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజాన మంజు మంజీర నినదంబులు చెవుల పండువులు సేయఁ, బాదసంచారంబున హరిరాక కెదురుచూచుచు, వీరమోహినియై చనుదెంచుసమయంబున.

1747

తా ॥ అలా వచ్చిన రుక్మిణీదేవి మేఘముల నడుమ నుండి బయటికి వచ్చి ప్రకాశించే వర్షాకాలపు మెరుపులా ఉంది. చంద్రమండలం నుండి బయటకు వచ్చి తిరుగునట్టి లేడివలె ఉంది. బ్రహ్మ అనే నర్తకుడు తెర ఎత్తగా, ఆ తెరమరుగున నుండి వెలుపలికి వచ్చి కనపడిన మోహినీ దేవతలా ఉంది. దేవ దానవులు వాసుకి అనే కవ్వపు త్రాడును చుట్టి, కుడి ఎడమలకు త్రిప్పగా తిరుగుచున్న మందర పర్వతం అనెడు కవ్వముచే చిలికేవేళ, తిరుగుడు పడుచున్న ఘుమ ఘుమ అనెడు ధ్వనిగల మహా సాగరంలో నుండి వెడలి వచ్చునట్టి లక్ష్మీదేవి వలె ఉంది. ఈ విధంగా నానా విధములైన కాంతుల చేత వెలుగుచూ గౌరీదేవి ఆలయం నుండి బయలు దేరింది. మానస సరస్సునందలి బంగారు తామరలలో విహరించే హంసలా ఆమె మెల్లగా నడుస్తూన్నది. రత్నములు చెక్కిన ఉంగరముల చేత అలంకరింప బడిన తన చేతితో చెలికత్తె చేయి ఆసరా చేసుకొన్నది. మణులచే పొదగబడిన బంగారు తాటంకముల కాంతులు చెక్కిళ్ళయందు ప్రసరిస్తోంది. కమలము యొక్క పరిమళము నందలి వేడుకచేత మత్తుగొన్న

తుమ్మెదలవలె గుండ్రనైన ముఖాన్ని ఆవరించుకొన్న ముంగురులతో, అందమైన చిరునవ్వు కాంతులతో బాలచంద్రుని వలె శోభిల్లుతోంది. దొండపండువలె ఎర్రనైన పెదవి యొక్క కాంతి మల్లెమొగ్గలను పోలిన తెల్లని పండ్ల వరసకు అరుణకాంతిని కలుగచేస్తోంది. మన్మథుని పతాకం వలె పైట చెరగు వ్రేలాడుతోంది. ఆమె బంగారు మొలనూలునందు చెక్కబడిన రత్నాల కాంతులు కాలం గాని కాలంలో కలిగిన ఇంద్ర ధనుస్సు వలె వెలుగుతూ ఉన్నది. మన్మథుడు ఒరనుండి వెలికి తీయగా, ధగధగ వెలుగునట్టి, బాణముల వలె వెలుగునట్టి మనోజ్ఞములయిన చూపుల కాంతి సమూహములు వీరులైన రాజుల యొక్క హృదయాలను భేదిస్తున్నాయి. గలగల మ్రోగుచున్న కాలి అందెల ధ్వనులు చెవులకు ఆనందాన్ని కలుగ చేస్తూన్నాయి. కాలి నడకతో హరి రాకకు ఎదురు చూస్తూ, రాజవీరులను మోహింపచేస్తూ వీరమోహినియై రుక్మిణీదేవి నడచి వస్తూ ఉన్నది.

మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖీ నేణాక్షిం బ్రవాళాధరం
గలకంఠిన్ నవపల్ల వాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిం
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పల గంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్.

1748

తా ॥ తుమ్మెదల వంటి నల్లనైన ముంగురులు, నిండు చంద్రుని పోలిన ముఖం, లేడికన్నులను పోలిన కన్నులు, పగడము వంటి పెదవి, కోకిల కంఠ స్వరం వంటి కంఠ స్వరం, లేత చిగురులు వంటి పాదములు, ఎర్రతామరలను పోలిన చేతులు, కమలముల పరిమళము వంటి దేహ పరిమళము, సింహపు నడుమును పోలిన సన్నని నడుము కలిగిన ఆ రుక్మిణీ దేవిని చూసి రాజులంతా మోహాన్ని పొందారు.

వ. మఱియు న య్యింతి దరహాస లజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుక లుడిగి,

యాయుధంబులు దిగవైచి గజతురగ రథారోహణంబులు సేయనేరక, రాజులెల్ల నేలకు వ్రాలి; రా యేణీలోచన తన వామకరనఖంబుల నలకంబులు దలఁగం ద్రోయుచు నుత్తరీయంబు సక్కనొత్తుచుఁ గడగంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకింపుచు.

1749

తా ॥ ఇదిగాక ఆ రుక్మిణీదేవి యొక్క చిరునవ్వుతోడి లజ్జను తెలుపునట్టి చూపుల చేత, రాజులందరి మనస్సులలో కలవరం కలిగింది. వారంతా ధైర్యమును, గాంభీర్యమును, గొప్పతనమును విడిచిపెట్టారు. చేష్టలు లేనివారై జ్ఞానాన్ని ఉడిగి, ఆయుధాలను జారవిడిచి, ఏనుగులు, గుర్రములు, రథములు మొదలైన వాహనాలను ఎక్కజాలక పరవశులై పోయారు. ఆ రుక్మిణీదేవి తన ఎడమ చేతి గోళ్ళతో ముఖాన్ని ఆవరించుకొన్న ముంగురులను ఎగత్రోసికొంటూ, కడకంటి చూపులతో వరుసగా రాజసమూహాన్ని చూస్తూ నడువసాగింది.

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావ ల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్ర హస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్.

1750

తా ॥ అంతలో, చంద్రమండలం వంటి ముఖం, సింహపు నడుము వంటి నడుము, క్రొత్త తామర రేకుల వంటి కన్నులు, మిక్కిలి సుందరమైన వక్షము, నీలమేఘం వంటి దేహవర్ణం, ఐరావత తొండమును పోలిన బాహువులు, పీతాంబరుడు, మేలైన ఆభరణాలు కలవాడు, చక్రాయుధం కలవాడూ, విజయం కంఠాభరణంగా ఉన్నవాడు, జగములను మోహింప చేసేవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి రుక్మిణీదేవి దర్శించింది.

# 68. శ్రీకృష్ణుడు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట

వ. కని తదీయ రూపవయోలావణ్య వైభవ గాంభీర్య చాతుర్యతేజో విశేషంబులకు సంతసించి, మనోభవ శరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న వరారోహం జూచి, పరిపంథి రాజలోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి ఫేరవంబుల నడిమి భాగంబు గొనిచను కంఠీరవంబు కైవడి నిఖిల భూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తన రథంబుమీఁద నిడికొని భూనభోతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ. యాదవవాహినీ పరివృతుండై ద్వారకానగర మార్గంబు వట్టి చనియె; నంత జరాసంధవశు లయిన రాజు లందరు హరిపరాక్రమంబు విని సహింప నోపక.

1751

తా ॥ అలా చూసి శ్రీకృష్ణుని రూపము, లావణ్యము, వైభవము, గాంభీర్యము, చాతుర్యము, తేజస్సుకి సంతోషించింది. మన్మథవేదనను పొంది త్వరగా రథం ఎక్కడానికి కుతూహలంతో ఉన్నది. ఆమెను కూడా పుండరీకాక్షుడు చూసి, శత్రురాజులు చూస్తూ ఉండగా మదించిన ఏనుగువలె తిన్నగా నడచి వచ్చి, నక్కల నడుమ నుండు మాంస ఖండమును తీసుకొని పోయే సింహమువలె, నిఖిల భూపాల గణమును లక్ష్యపెట్టక తృణప్రాయంగా తలచి, రుక్మిణీదేవిని తీసుకొని వచ్చి తన రథంమీద కూర్చోపెట్టుకున్నాడు. భూమ్యాకాశ మధ్యభాగం అంతా నిండునట్లుగా శంఖమును పూరిస్తూ, బలరాముడు తక్కిన యాదవులూ సేనలతో వెంబడించి రాగా, ద్వారకా పట్టణ మార్గంలో వెళ్ళాడు. అప్పుడు జరాసంధునికి వశులైన రాజులు హరి పరాక్రమాన్ని విని సహింపలేక పోయారు.

మ. ఘనసింహంబుల కీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్
మన కీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్

సనుచున్నా రదె? శౌర్య మెన్నటికి? మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే?
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ క్రంతలన్.

1752

తా ॥ గొప్పవైన సింహముల యొక్క కీర్తిని నీచమృగాలు హరించిన విధంగా రుక్మిణిని తోడ్కొని మదంతో గోపకులు వెళ్ళిపోతున్నారు. 'ఆ బాలతోపాటు మన కీర్తులు కూడా పోయాయి. కొరగాని పనికిరాని పరాక్రమం ఇక ఎప్పటికి? మన శస్త్రాస్త్రాలు ఎందుకు? ఈ కన్యకామణిని విడిపించ లేకపోతే జనులు మనలను చూసి నవ్వరా?'

వ. అని యొండొరులం దెలుపుకొని, రోషంబులు హృదయంబుల నిలుపుకొని, సంరంభించి, తనుత్రాణంబుల వహించి, ధనురాది సాధనంబులు ధరియించి, పంతంబు లాడి, తమ తమ చతురంగబలంబులం గూడికొని, జరాసంధాదులు యదువీరుల వెంటనంటి, తాఁకి నిలు నిలుండని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి, మహీధరంబుల మీఁద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలువంబడి రప్పుడు.

1753

తా ॥ అని ఈ విధంగా ఒకరినొకరు ప్రోత్సాహ పరచుకొని రోషావేశంతో కవచాలు తొడుగుకొని ధనుస్సు మొదలైన యుద్ధసాధనాలను ధరించారు. వీరరసాతిరేకంతో మాట్లాడుకొంటూ తమ తమ చతురంగ బలాలతో, జరాసంధాది యోధులు యదువీరులను అడ్డుకున్నారు. నిలువరించి, పర్వతాలమీద జలధారలు కురిసే మేఘములవలె బాణవర్షాలను కురిపించారు. అప్పుడు యాదవ సేనల దండ నాయకులు కూడా ధనుష్టంకారం చేస్తూ నిలబడ్డారు.

క. అరిబల భట సాయకముల, హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్
హరిమధ్య సిగ్గుతోడను, హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై.

1754

తా ॥ శత్రువులు వాన కురిసినట్లు బాణాలను ప్రయోగిస్తూ హరి యొక్క సేనలను కప్పేశారు. మిక్కిలి భయంతో, సిగ్గుతో, రుక్మిణీదేవి బెదిరిన జింక చూపులవంటి చూపులతో శ్రీకృష్ణుని ముఖం వైపు చూసింది.

వ. ఇట్లు చూచిన.

1755

క. చొచ్చెద రదె యదువీరులు, ప్రచ్చెద రరిసేన నెల్ల వైరులు పెలుచున్
నొచ్చెదరును విచ్చెదరును, జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ!

1756

తా ॥ అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు: "ఓ కమలాక్షీ! అదుగో మన యాదవ వీరులు! శత్రుసైనికులను చీల్చి చెండాడుతారు. విరోధులు కొందరు నొచ్చుకుంటారు, కొందరు పారిపోతారు. కొందరు ప్రాణాలు కోల్పోతారు. చూస్తూ ఉండూ!"

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె; నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళల మిన్నునం బన్ని బలుపిడుగు లడరించు పెనుమొగిళుల వడువున జరాసంధాది పరిపంథిరాజ చక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖీ శిఖా సంకాశ నిశిత శిలీముఖ నారాచ భల్ల ప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలు గురియ, నదియును విదళిత మత్తమాతంగంబును, విచ్ఛిన్నతురంగంబును, విభిన్న రథవరూథంబును, వినిహత పదాతియూథంబును, విఖండిత వాహ వారణ రథారోహణ మస్తకంబును, విశకలిత వక్షో మధ్య కర్ణ కంఠ కపోల హస్తంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటిత చరణ

జానుజంఘంబును, విదళిత దంతసంఘంబును, విఘటిత నీరమంజీర కేయూరంబును, విభ్రష్ట కుండల కిరీట హారంబును, విస్మృత వీరాలాపంబును, విదార్యమాణ గదా కుంత తోమర పరశు పట్టిస ప్రాస కరవాల శూల చక్ర చాపంబును, వినిపాతిత కేతన చామరచ్ఛత్రంబును, విలూన తనుత్రాణంబును, వికీర్యమాణ ఘోటకసంఘ రింఖా సముద్ధూత ధరణీపరాగంబును, వినష్ట రథవేగంబును, వినివారిత సూత మాగధ వంది వాదంబును, వికుంఠిత హయ హేషా పటహ భాంకార, కరటిఘటా ఘీంకార, రథనేమి ఘటాత్కార, తురగనాభిఘంటా ఘణఘణాత్కార, వీర హుంకార, భూషణ ఝణఝణాత్కార, నిస్సాణ ధణధణాత్కార, మణినూపుర క్రేంకార, కింకిణీగణ కిణాత్కార, శింజినీ టంకార, భట పరస్పర ధిక్కారనాదంబును, వినిర్భిద్యమాన రాజసమూహంబును, విద్యమాన రక్తప్రవాహంబును, విశ్రూయమాణ భూతబేతాళ కలకలంబును, విజృంభమాణ ఫేరవ కాక కంకాది సంకులంబును, బ్రచలిత కబంధంబును, బ్రభూత పలల గంధంబును, ప్రదీపిత మేదో మాంస రుధిర ఖాదంబును, బ్రవర్తిత డాకినీ ప్రమోదంబునునై యుండె; నప్పుడు.

1757

తా ॥ అని ఈ విధంగా పలుకుతూ కృష్ణుడు రుక్మిణీదేవిని ఊరడించాడు. అంతట బలరామాది యాదవ వీరులు ప్రళయ కాలంలో ఆకాశంలో భయంకరమైన పిడుగులను రాలుస్తూన్న మేఘముల వలె జరాసంధాది శత్రురాజుల మీద పరాక్రమించారు. అగ్నిజ్వాలలను పోలిన వాడి అయిన బాణపరంపరలను వానగా కురిపించారు. ఆ ధాటికి శత్రుసేన నరకబడిన ఏనుగులు, గుర్రములు, రథములు, కాల్బలము కలదిగా, తలలు తెగిన మావటీండ్రు, రౌతులు రథికులు కలదిగా ఉన్నది. ఆ రణభూమి అశ్వ రథాలను ఆరోహించిన వారి కాళ్ళు, చేతులు మొదలైన అవయవాలు తునకలతో, పగుల గొట్టబడిన తల, పుర్రెలతో పరచబడిన తల వెంట్రుకలతో, విరుగ కొట్టబడిన పాదములు, మోకాళ్ళు, పిక్కలతో, భేదింపబడిన కాలి అందెలు మొదలైన శూర భూషణములతో, భ్రష్టమైన కుండలాలు, కిరీటాలు, హారాలతో

వీరాలాపములతో భయంకరంగా ఉంది. అంతేకాక ఖండములుగా చేయబడిన ఈటెలు, చిల్లకోలలు, గండ్రగొడ్డళ్ళు, పట్టాకత్తులు, బల్లెములు, కత్తులు, త్రిశూలములు, చక్రములు, విండ్లతో కూడిఉంది. కూలద్రోయబడిన టెక్కెములు, వింజామరములు గొడుగులతో, భేదింపబడిన కవచములతో చెల్లాచెదరు అవుతున్న గుర్రాల సమూహముల యొక్క గిట్టల చేత రేగగొట్టబడిన దుమ్ముతో చాలా భయంకరంగా ఉంది. వాద్యధ్వనుల భాంకారము, ఏనుగుల గుంపుల యొక్క ఘీంకారము, రథచక్రముల కడకమ్ముల పట పటాత్కారము, గుర్రముల నడుముకు వ్రేలాడుచున్న ఘంటల యొక్క ఘణఘణాత్కారము, వీరుల యొక్క హూంకారము, భూషణముల యొక్క ఝణఝణాత్కారము, ఢంకా యొక్క ధణధణాత్కారము, మణి నూపురముల క్రీంకారము, చిరు గంటల యొక్క కిణ, కిణాత్కారము, వింటి నారుల యొక్క టంకారము, భటుల యొక్క పరస్పర ధిక్కారము.... ఈ రొదలన్నీ అణగిపోయాయి. మిక్కిలి భేదింపబడిన రాజసమూహము చెదిరిపోయింది. రణరంగ భూమి చాలా భీభత్సంగా ఉంది.

చ. మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడినవాని క్రియన్ గడు వెచ్చనూర్చుచున్
మొగమున దప్పిదేరఁ దమ ముందటఁ బొక్కుచు నున్న చైద్యుతోఁ
బగతుర చేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే.

1758

తా ॥ జరాసంధుడు మొదలైన కృష్ణవిరోధులైన రాజులందరూ ఆ బాణధాటికి తాళలేక వెనుకకు తిరిగి పరుగెత్తిపోవుచూ, ఒక తావున చేరారు. భార్యను పోగొట్టుకొన్న వానివలె దుఃఖీస్తూ, వేడి నిట్టూర్పులు విడుస్తూ, తపిస్తూన్న శిశుపాలుణ్ణి చూసి ఊరడించుచున్న వారై 'ఓ శిశుపాలా! నువ్వు పగవారిచేత చిక్కుకొని ప్రాణములు పోగొట్టుకొనక క్షేమంగా ఉన్నావు కదా?' అని ఓదార్చారు.

వ. అని మఱియును.

1759

ఆ. బ్రతుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన, బ్రతుకు గలిగెనేని భార్య గలదు;
బ్రతికి తీవు; భార్యపట్టు దైవ మెఱుంగు, వగవ వలదు చైద్య! వలదు వలదు.

1760

తా ॥ 'ఓ శిశుపాలా! దేహంలో ప్రాణముంటే ఏ విధంగానైనా జీవింపవచ్చు. జీవించి ఉన్న పక్షంలో భార్య లభించకపోదు. నీవు బ్రతికావు! కనుక ఇక భార్య ఎక్కడైనా చిక్కకపోదు. దీనికోసం ముమ్మాటికి విచారపడకు.'

వ. వినుము. దేహధారి స్వతంత్రుఁడు గాఁడు. జంత్రగానిచేతి జంత్రపు బొమ్మకైవడి నీశ్వరతంత్ర పరాధీనుండై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు. తొల్లి నేను మధురాపురంబుమీఁ దఁ బదియేడు మాఱులు పరాక్రమంబునన్ విడిసి, చక్రిచేత నిర్మూలిత బలచక్రుండనై, కామపాలుచేతం బట్టువడి, యీ కృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి, క్రమ్మఱ నిరువదిమూఁ డక్షౌహిణులం గూడికొని, పదునెనిమిదవ మాఱు దాడిచేసి, శత్రువులం దోలి, విజయంబు చేకొంటిని. జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండును జెంద; నేఁటిదినంబున నీ కృష్ణుని కెదిరి పోర మన రాజలోకంబు లెల్ల నుగ్రాక్షుం గూడుకొని, యెదిరి పోరిన నోడు. ఇంతియ కాక దైవయుక్తంబైన కాలంబునం జేసి, లోకంబులు పరిభ్రమించుచు నుండు; నదియునుం గాక.

1761

తా ॥ అప్పుడు జరాసంధుడు ఇలా అన్నాడు: "శిశుపాలా! విను మానవుడు స్వతంత్రుడు కాడు. సూత్రధారి చేతిలో కీలుబొమ్మ వలె ఈశ్వర మాయకు లోబడి సుఖదుఃఖములందు నటిస్తాడు. పూర్వం నేను మధురాపురం మీద పదిహేడుసార్లు పరాక్రమంతో దండెత్తాను. ఈ కృష్ణుని చేత నా సేనాసమూహమంతా నిర్మూలనం చేయబడింది. నేను బలరాముని చేతిలో పట్టుబడ్డాను. కృష్ణుడు కరుణచేత నన్ను విడిచి పెట్టి పంపగా వచ్చి, మరల ఇరవైమూడు

అక్షౌహిణుల సేనను కూర్చుకొని పదునెనిమిదవసారి దండెత్తాను. శత్రువులైన బలరామ కృష్ణులను తరిమి జయాన్ని పొందాను. జయాపజయములలో ఎప్పుడూ నేను సంతోషాన్ని కాని విచారాన్ని కాని పొందిన వాడిని కాను. నేటి స్థితినిబట్టి విచారింపగా, మనము ఈ రాజసమూహంతో అగ్నినేత్రుడైన శివునితో కలిసి పోరాడినా ఈ కృష్ణుణ్ణి ఎదిరించి యుద్ధములో జయము పొందనేరము. ఇంతే కాదు, లోకాలన్నీ దైవయుక్తమైన కాలం చేత త్రిప్పబడుతూ నడుస్తాయి.

మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్య విఖ్యాత వి
క్రములం గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు; కా
లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్
సమరక్షోణి జయింత మింతపనికై శంకింప నీ కేటికిన్.

1762

తా ॥ నేడు యాదవులకు కలిసి వచ్చింది. మూడు లోకాల్లోను ప్రసిద్ధికెక్కిన పరాక్రమం కలవారమైన మనలను కృష్ణుని భుజబలముచేత వారు జయించారు. మనకు మంచి కాలము వస్తే, మనం కూడా సమయం చూసి, శత్రువులను యుద్ధంలో జయిస్తాము. ఈపాటి దానికి విచారమెందుకు?"

వ. అని యిట్లు జరాసంధుండును, నతని యొద్దిరాజులును, శిశుపాలుని పరితాపంబు నివారించి, తమ తమ భూములకుం జనిరి. శిశుపాలుండు ననుచర సేనాసమేతుం డయి తన నగరంబునకుం జనియె; నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీబలంబు తోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ, దన సారథితో నిట్లనియె.

1763

తా ॥ అని ఈ విధంగా జరాసంధాది రాజులు తగిన మాటలు చెప్పి శిశుపాలుని పరితాపాన్ని పోగొట్టి తమతమ దేశాలకు వెళ్ళిపోయారు. శిశుపాలుడు తన సేనల తోడ తన పట్టణానికి వెళ్ళాడు. అనంతరం రుక్మిణీదేవి అన్నయైన రుక్మి అనువాడు తన చెల్లెలిని రాక్షస వివాహం చేత శ్రీకృష్ణుడు తీసుకొనిపోవడం సహింపక ఒక అక్షౌహిణి సేనతో వారిని వెన్నాడిపోతూ తన సారథితో ఇలా అన్నాడు:

ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాల కుమారునిఁ జిన్నఁజేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపు బంటువోలె నీ
గొల్లఁడు వోయెడిన్; రథముఁ గూడఁగఁ దోలుము; తేజితోల్లస
ద్భల్ల పరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్.

1764

తా ॥ "నేను భీష్మక బలవంతుడను. మహారాజు కుమారుడను. ఇట్టి నన్ను గణింపక, చిన్నబుచ్చి, నా చెల్లెలైన రుక్మిణిని ఎత్తుకొని, మహాశూరుని వలె ఈ గోపాలుడు పోతున్నాడు. నీవు రథాన్ని వేగంగా నడుపు. వాడిగల ప్రకాశిస్తూన్న బల్లెముల వంటి బాణసమూహం చేత వాడి పొగరుని పోగొట్టి, నా పరాక్రమాన్ని చూపుతాను."

వ. అని యిట్లు రుక్మి హరి కొలంది యెఱుంగక సారథి నదలించి రథముఁ గూడ దోలించి 'గోపాలకా! వెన్నమ్రుచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలు, మని తిరస్కరించి, బలువింట నారి సారించి మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె.

1765

తా ॥ అని ఈ విధంగా రుక్మి, కృష్ణుని సామర్థ్యం ఎరుగక సారథిని అదలించి రథాన్ని కృష్ణుని సమీపానికి తోలించాడు. "ఓరీ వెన్న దొంగవైన గోపాలా! కొంచెము సేపు నిలు!" అని ధిక్కరించి, ధనుస్సునందు అల్లె త్రాటిని ఎక్కించి మూడు వాడి అయిన బాణములు ప్రయోగించి

హరిని నొప్పించాడు.

సీ. మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ? నేపాటి గలవాఁడ? వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడఁ బెరిఁగితి? వెయ్యది నడవడి? యెవ్వఁ డెఱుఁగు?
మానహీనుఁడ వీవు? మర్యాద లెఱుఁగవు; మాయఁ గైకొని కాని మలయ రావు;
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు; వసుధేశుఁడవు గావు వావి లేదు;

ఆ. కొమ్మ నిమ్ము; నీవు గుణరహితుండవు, విడువు; విడువ వేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల, గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు.

1766

తా ॥ "ఓరీ గోపాలా! నీవు మా చెల్లెలిని గొనిపోవుటకు మాతో సమానుడవు కావు. నీ ధర్మమేది? నీ వంశమేది? ఎక్కడ పుట్టావు? ఎక్కడ పెరిగావు? ఏ వృత్తిలో ఉన్నావు? నీ కులగోత్రములు ఎవరికి తెలుసు? చక్కగా విచారించి చూడగా నీకు మానం లేదు! మర్యాద లేదు! ఎక్కడికి వచ్చినా మాయావేషముతో వస్తావుగాని స్వస్వరూపంతో రావు. శత్రువుల మీదికి నిజరూపంతో పోవు. ఇదీ గాక నీవు రాజువి కూడా కాదు. నీకు వావి వరుసలు లేవు. మా చెల్లెలిని విడిచిపెట్టిపోతివా, పో! అట్లు విడువక పోదలచితివా! ప్రళయ కాలమందలి అగ్నివలె తపింప చేయునట్టి బాణములను ప్రయోగించి యుద్ధంలో నీ అహంకారాన్ని అణచి వేస్తాను."

పరమాత్ముని ఎదుట నిలిచిన వారి సంస్కారంలో లోపాలు ఉన్నా, భాషణములు సత్యములుగానే భాసిస్తాయి. అందుకని రుక్మి ఆవేశంతో నిందించినా, భావంలో మాత్రం కృష్ణుని గుణాలను మాత్రమే వర్ణించాడు. అతడు అప్రమేయుడు, గుణాలు లేనివాడు, కులగోత్రాలు లేనివాడు, సంబంధ బాంధవ్యాలు లేనివాడు, కొలతలకు అందనివాడు అని అంటూ ఆ పరబ్రహ్మ లక్షణాలనే రుక్మి గుర్తు చేశాడు.

వ. అని పలికిన నగధరుండు నగి, యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి, యాఱు

శరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులం గేతనంబు ద్రుంచి, మఱియు నొక్క విల్లందినం ద్రుంచి, వెండియు నొక్క ధనువు వట్టిన విదళించి, క్రమంబున పరిఘ పట్టిస శూల చర్మాసి శక్తి తోమరంబులు ధరియించినం దునుకలు సేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె. నంతటం దనివి సనక వాఁడు రథంబు డిగ్గి, ఖడ్గ హస్తుండై, దవానలంబుపైఁ బడు మిడుతచందంబునం గదిసిన, ఖడ్గ కవచంబులు చూర్ణంబులు సేసి, మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి ఝళిపించి వాని శిరంబుఁ దెగవ్రేయుదు నని గమకించి, నడచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె.

1767

తా ॥ అని ఈ విధంగా రుక్మి ధిక్కరించి పలుకగా శ్రీకృష్ణుడు నవ్వి, ఒక బాణం చేత వాని ధనుస్సును నరికాడు. ఆరు బాణాలచే వాని శరీరం తూట్లుపడేటట్లుగా చేసాడు. ఎనిమిది బాణాలచే గుర్రాలను చంపాడు. రెండు బాణముల చేత సారథిని సంహరించాడు. వాడి అయిన మూడు బాణములచేత, వాని రథపు జండాను నరికాడు. అతడు ఇంకొక విల్లు పుచ్చుకోగా, దానిని సైతం ఖండించాడు. వరుసగా అతడు పరిఘ, పట్టిసము, శూలము, డాలు, ఖడ్గము, శక్తి, తోమరము అనే ఆయుధములు ధరించినా, వాటిని కూడా ముక్కలు చేశాడు. ఎన్ని ఆయుధములు ఎత్తినా, అన్నిటినీ పడద్రోసాడు. ఇంత జరిగినా ఆగక, రుక్మి రథము నుండి దిగి, కత్తి చేత ధరించి కృష్ణుని మీదికి ఉరికాడు. అంతట కృష్ణుడు వాని కత్తిని, కవచాన్ని పొడిపొడిగా నరికి, ఆ దౌష్ట్యమును సహింపక ఒరలో ఉన్న కత్తిని దూసి, అతడి శిరస్సుని ఖండించాలని వెడుతుంటే, రుక్మిణీ దేవి అడ్డం వచ్చి ఆయన పాదకమలములను పట్టుకొని ఇట్లా అన్నది:

మ.కో.

నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో

సన్నుతామరకీర్తి శోభిత! సర్వలోక శరణ్య! మా
యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీ యెడన్
నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ!

1768

తా ॥ "అనాథ నాథ! ఓ దయానిధీ! నిన్ను ఈశ్వరుడవనీ, దేవదేవుడవనీ మా అన్న గుర్తించలేక పోయాడు. సత్పురుషులు శ్లాఘించే యశస్సు కలవాడా! సర్వలోకాలకు ఆధారమైన వాడా! మా అన్న నీ విషయంలో మహాపరాధము చేశాడు. నా యందు దయ ఉంచి ఇతడిని కాపాడు.

మ.కో.

కల్ల లేదని విన్న వించుట గాదు వల్లభ! యీతనిన్
బ్రల్లదుం దెగఁజూచితేనియు భాగ్యవంతుల మైతి మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితు లైన మా
తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా!

1769

తా ॥ ఓ స్వామీ! ఇతని యందు మోసము లేదని నేను మీకు మనవి చెయ్యటంలేదు. ఇతడు నిజంగా దుష్టుడే. కానీ ఇతనిని చంపితే, ముకుందుడంతటి వాడు మాకు అల్లుడయ్యాడు, మేము భాగ్యవంతులము అని సంతోషించే మా తల్లిదండ్రులు పుత్రశోకం చేత కుమిలిపోతారు."

మ. అని డగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో
వినత శ్రాంత ముఖంబుతో శ్రుతిచలద్వేణీ కలాపంబుతోఁ
గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు
ద్రొ క్కిన రుక్మిం దెగవ్రేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై.

తా ॥ అని ఈ విధంగా రుక్మిణీదేవి గద్గద కంఠంతో, మహాభయంతో, వణుకుతున్న శరీరంతో, బడలిన ముఖంతో, చెవుల మీదికి జారి చలించుచున్న జడ అలంకారంతో, రెండు కన్నులలోను కన్నీరు నిండగా కృష్ణునకు నమస్కరించింది. దానితో చంపుటకు ప్రయత్నింపక హరి తగ్గాడు.

వ. ఇట్లు చంపక బావా! రమ్మని చిఱునగవు నగుచు, వానింబట్టి బంధించి గడ్డంబును మీసంబును దలయును నొక కత్తి వాతి యమ్మున రేవులు వాఱఁ గొఱిగి విరూపిం జేసె; నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి, తత్సమీపంబునకు వచ్చి; రప్పుడు హతప్రాయుండై కట్టువడి యున్న రుక్మిం జూచి కరుణచేసి, బలభద్రుండు బంధంబులు విడిచి హరిని డగ్గఱి యిట్లనియె.

1771

తా ॥ అయితే చంపక చిరునవ్వుతో పట్టుకొని, బంధించి, గడ్డం మీసం తల గొరిగి కురూపిని చేశాడు. అంతలో, యాదవ సైనికులందరూ శత్రుసేనలను తరిమి అతని సమీపానికి వచ్చారు. అప్పుడు బలరాముడు చచ్చిన వానిలా కట్టుపడి ఉన్న రుక్మిని కరుణతో చూసి, వానికట్లు విప్పి కృష్ణుని దగ్గర చేరి ఇలా అన్నాడు:

క. తల మనక భీష్మనందను, తలయును మూతియును గొఱుగఁ దగవే! బంధుం
దలయును మూతియు గొఱుగుట, తల దఱుగుటకంటె దుచ్ఛతరము మహాత్మా!

1772

తా ॥ "కృష్ణా! నీవు బంధువైన రుక్మి యొక్క తల, మూతి గొరిగావు. ఇది న్యాయమా? బంధువైనవాడు తెలిసిగాని, తెలియకగాని, కలహానికి వచ్చినా, వాడికి తెలియచెప్పి తొలగిపొమ్మనక ఇలా చేయటం తల నరకటం కంటే అవమానం.

క. కొందఱు రిపు లని కీడును; గొందఱు హితు లంచు మేలు గూర్పవు; నిజ మీ
వందఱియందును సముఁడవు, పొందఁగ నేలయ్య! విషమబుద్ధి ననంతా!

1773

తా ॥ అనంతుడవైన కృష్ణా! నువ్వు శత్రువులని కొందరికి కీడును, మిత్రులని కొందరికి మేలును చేసే వాడివి కావు. నీకు అందరూ ఒకటే, అలాంటప్పుడు ఇతడు శత్రుడనే భేదబుద్ధిని ఎందుకు కల్పించుకున్నావు?"

## 69. సహోదరుని గర్వభంగమునకు ఖిన్నురాలైన రుక్మిణిని బలరాముడు ఓదార్చుట

వ. అని వితర్కించి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె.

1774

తా ॥ అని పలికి రుక్మిణీదేవితో ఇలా అన్నాడు:

శా. తోడంబుట్టిన వాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ! పూర్వభవ కర్మాధీనమై ప్రాణులన్
గీడున్ మేలును జెందు; లేఁడొకఁడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మ శేష పరిభూతుం డయ్యె నేఁ డియ్యెడన్.

1775

తా ॥ "ఓ రుక్మిణీ! నీవు నీ అన్నను అవమానపరచాడు అని మా కృష్ణుణ్ణి నిందించవద్దు. తమ పూర్వ జన్మలలో చేసికొన్న కర్మములే మేలు, కీడులను కలిగిస్తాయి. శిక్షించేవాడు, రక్షించేవాడు అనే కర్త ఎవరూ లేరు. నేడు నీ సోదరుడు పూర్వ జన్మలో చేసిన పాపకర్మము యొక్క మిగులు చేతనే అవమానింపబడ్డాడు.

క. చంపెడి దోషము గలిగినఁ, జంపఁ జనదు బంధుజనులఁ జను విడువంగాఁ
జంపిన దోషము సిద్ధము, చంపను మఱి యేల మున్న చచ్చినవానిన్.

1776

తా ॥ బంధువైన వానిని చంపదగిన నేరం చేసినా విడిచిపెట్టాలే కాని చంపరాదు. అవమానం చేత ముందే చచ్చిన వానిని మళ్ళీ చంపాల్సిన అవసరం ఏముంది?

ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు, కల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి
తోడిచూలు నైనఁ దోడఁబుట్టిన వాఁడు, చంపుచుండుఁ గ్రూరచరితుఁ డగుచు.

1777

తా ॥ పూర్వం బ్రహ్మచేత రాజులకు ఈ ఆచారం కలగచేయబడినది. ఎందుకంటే రాజ్యకాంక్షచేత తన తోడపుట్టిన వానినైనను క్రూరచరితుడై చంపుతుంటాడు.

క. భూమికి ధన ధాన్యములకు, భామలకును మానములకుఁ బ్రాభవమునకుం
గామించి మీఁదు గానరు, శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్.

1778

తా ॥ రాజ్యం కోసం, ధనధాన్యాలకోసం, భామలకోసం, గౌరవం కోసం, అపేక్షను కలిగి, రాగల నరకాది బాధలను విచారింపక, ఐశ్వర్యమదం చేత ఇతరులను కలహానికి రేపి పోరాడుతూ ఉంటారు కొందరు.

వ. వినుము. దైవమాయం జేసి దేహాభిమానులైన మానవులకున్ బగవాఁడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబు సిద్ధంబై యుండు; జలాదులయందుఁ జంద్ర సూర్యాదులును, ఘటాదులయందు గగనంబును బెక్కై కానంబడు భంగి, దేహధారుల కందఱికి నాత్మ యొక్కం డయ్యును బెక్కండ్రై తోఁచు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబై, యాత్మయందు నవిద్యచేతఁ గల్పితంబై, దేహిని సంసారంబు నం ద్రిప్పు. సూర్యుండు తటస్థుండై యుండఁ బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుంబోలె నాత్మ తటస్థుండైయుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగు; నాత్మకు వేఱొక్కటితోడ సంయోగ వియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని చంద్రునికి లేని కైవడి, జన్మనాశంబులు దేహంబునకుఁ గాని, యాత్మకుఁ గలుగనేరవు. నిద్ర వోయినవాఁ డాత్మను విషయఫలానుభవంబులు సేయించు

తెఱంగున, నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థమునందు ననుభవము నొందుచుండుఁ గావున.

1779

తా ॥ ఓ రుక్మిణీ! విను! దైవ మాయ వలన దేహాభిమానంతో మానవులు వీడు పగవాడు, వీడు బంధువు, వీడు తటస్థుడు అనే భేదంతో మెలుగుతారు. నీటి యందు గల సూర్యచంద్రాదులు భిన్నంగా ఉన్నట్లు, నీళ్ళతో నిండిన కుండల యందు ఆకాశము అనేక విధాలుగా కనిపించినట్లుగా దేహధారులకందరిలోనూ ఉన్న ఆత్మ ఒక్కటే అయినప్పటికీ పెక్కు విధాలుగా కనపడుతుంది. చావు పుట్టుకలు కల ఈ దేహం పంచ మహాభూతములు, పంచ ప్రాణములు, శబ్ద స్పర్శాదులనెడి గుణములు స్వరూపంగా కలిగి ఉండి అజ్ఞానం చేత వాటిని ఆత్మయందు ఆరోపిస్తోంది. అవిద్య దేహిని సంసార చక్రంలో త్రిప్పుతోంది. సూర్యుడు సాక్షియై ఉండగా గోచరమయ్యే ప్రపంచంవలె ఆత్మ తటస్థుడై ఉండగా దేహము, ఇంద్రియాలు వాటి పని అవి చేసుకుంటూ పోతాయి. ఆత్మకు ఇంకొక దానితో సంయోగ వియోగాలు లేవు. వృద్ధి క్షయాలు చంద్రకళలకే గాని చంద్రునికి లేనట్లుగా, చావు పుట్టుకలు దేహానికే గాని ఆత్మకు లేవు. నిద్రించేవాడు స్వప్నమందలి విషయాల సుఖదుఃఖాలను ఆత్మను అనుభవింపజేసినట్లు, ఆత్మజ్ఞానం లేనివాడు నిజంకాని సంసార సుఖాలలో ఆసక్తి కలిగిన వాడగుచున్నాడు.

క. అజ్ఞానజ మగు శోకము, విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే, యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ!

1780

తా ॥ రుక్మిణీ! అజ్ఞానం వలన కలిగిన దుఃఖాన్ని విజ్ఞానంచేత విడిచిపెట్టు. ప్రజ్ఞావతివి అయిన నీవు అజ్ఞానులవలె దుఃఖీంప తగదు.”

వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి, రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె; నట రుక్మి

యను వాఁడు ప్రాణావశిష్టుండై, విడువఁబడి తన విరూపభావంబునకు నెరియుచు, హరిం గెల్చికాని కుండిన పురంబుఁ జూడ నని ప్రతిజ్ఞ సేసి, తత్సమీపంబున నుండె నివ్విధంబున.

1781

తా ॥ ఈ ప్రకారంగా బలభద్రుడు జ్ఞానబోధ చేయగా రుక్మిణీదేవి దుఃఖాన్ని విడిచిపెట్టింది. రుక్మి కేవలం ప్రాణములు మిగుల్చుకొని తన వికార రూపానికి పరితపించసాగాడు. హరిని జయిస్తే తప్ప కుండిన నగరానికి వెళ్ళనని ప్రతిజ్ఞ చేసి పట్టణ సమీపంలోనే ఉండిపోయాడు.

క. రాజీవలోచనుఁడు హరి, రాజసమూహముల గెల్చి రాజస మొప్పన్
రాజిత యగు తన పురికిని, రాజాననఁ దెచ్చె బంధురాజి నుతింపన్.

1782

తా ॥ ఈ విధంగా ఆ రాజీవలోచనుడు రాజసమూహాలను గెల్చి, రాజసంతో రుక్మిణీ దేవిని తన పట్టణానికి బంధువులంతా స్తుతిస్తూండగా తీసుకొని వచ్చాడు.

# 70. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని పెండ్లియాడుట

వ. అంత న య్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబును, బ్రవర్తమాన గీతవాద్య నృత్యంబును, బ్రతిగృహాలంకృత విలసితాశేష నర నారీవర్గంబును, బరిణయ మహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండమండల దానసలిల ధారాసిక్త మార్గంబును, బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక కదళికా కర్పూర కుంకుమాగరు ధూపదీప పరిపూర్ణ కుంభంబును, విభూషిత సకల గృహవేదికా కవాట దేహళీ స్తంభంబును, విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును, సముద్ధూత కేతన విభ్రాజితంబును నై యుండె; న య్యవసరంబున.

1783

తా ॥ అంతట శ్రీకృష్ణుని పట్టణంలో పెళ్ళిపనులు ఆరంభించబడ్డాయి. గీతములు, వాద్యములు, నృత్యములు జరుగసాగాయి. పట్టణంలోని స్త్రీ పురుషులందరూ మనోహరంగా అలంకరించుకొన్నారు. వివాహానికై ఆహ్వానించబడిన రాజుల యొక్క గజముల చెక్కిళ్ళ నుండి జారుచున్న మదజలం యొక్క ధారలచేత రాజమార్గం అంతా తడిసిపోయింది. ప్రతి ఇంటి వాకిట్లోనూ శుభసూచకంగా పోకమ్రొక్కలు, అరటి బోదెలు కట్టి ఉంచారు. కర్పూరము, కుంకుమ పువ్వు, అగరు పొడి వీటి ధూపముల చేతనూ, దీపముల చేతనూ, పూర్ణకుంభాలు నిండుకున్నాయి. అన్ని ఇళ్ళు, తలుపులు, అరుగులు, స్తంభములు అలంకరింపబడ్డాయి. పువ్వుల చేతనూ, రత్నాలతో ఉన్న వస్త్రాల చేతనూ తోరణాలు కట్టబడ్డాయి. ఎల్ల దిక్కులా జెండాలు ఎగురసాగాయి.

శా. ధ్రువకీర్తిన్ హరి పెండ్లి యాడె నిజ చేతోహారిణిన్ మాన వై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణిఁ మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.

తా ॥ ఆ శుభ సమయంలో హరి తన మనస్సుకు ప్రియమైనదియై, మానము, వైభవము గాంభీర్యము అనే గుణాలతో మెలిగేదీ, అష్ట ఐశ్వర్యములు కలిగించేదీ, మంచి వారైన బంధువుల చేత గౌరవింపబడేది, మంచి నడవడి కలిగినదీ, మంచి ఆభరణాలు వస్త్రములను ధరించినదీ, సకల సుగుణములకు శిరోమణి అయిన రుక్మిణీ దేవిని వివాహం చేసుకున్నాడు. ఆయన కీర్తి నలుదెసలా వ్యాపించింది.

క. సతులుం దారును బౌరులు, హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో
న్నత వర్ధిష్ణులకును మా, నిత రోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్.

1785

తా ॥ అనంతంగా దయను కలిగినవారు, అఖండ తేజోవిరాజితులూ అయిన ఆ రుక్మిణీ శ్రీకృష్ణులకు, పురజనులందరూ మేలుకోరుతూ, సకుటుంబంగా వచ్చి కానుకలు సమర్పించారు.

క. హరి పెండ్లికిఁ గైకేయక, కురు సృంజయ యదు విదర్భ కుంతినరేంద్రుల్
పరమానందముఁ బొందిరి, ధరణీశులలోన గాఢతాత్పర్యములన్.

1786

తా ॥ హరి యొక్క పెండ్లి వేడుకను చూసి కేకయ రాజులు, కురువంశపు రాజులు, సృంజయులు, యాదవులు, విదర్భులును, కుంతీభోజ వంశస్థులు అగు రాజులందరు మిక్కిలి సంతోషించారు.

క. హరి యీ తెఱఁగున రుక్మిణి, నరుదుగఁ గొనితెచ్చి పెండ్లి యాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱఁగం, దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్.

1787

తా ॥ ఈ ప్రకారం రుక్మిణీదేవిని తీసుకొని వచ్చి హరి పెండ్లాడిన వృత్తాంతాన్ని విని, ఇది దుష్కర కృత్యమని ఎల్ల దిక్కులందు గల రాజులు, రాజకుమారులు ఆశ్చర్యపడ్డారు.

ఆ. అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణతోడఁ, గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి
పట్టణంబులోని ప్రజ లుల్లసిల్లిరి, ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు.

1788

వ. అని చెప్పి.

1789

తా ॥ పాపరహితుడవైన పరీక్షిన్మహారాజా! ఆదిలక్ష్మి అయిన శ్రీరుక్మిణీదేవితో శ్రీకృష్ణుడు కూడి ఉంటే, పట్టణంలో ఉండే ప్రజలు అన్ని భయాలు విడిచి, ప్రీతిని పొంది మహానందాన్ని పొందారు" అని శుక యోగీంద్రుడు పరీక్షిన్మహారాజునకు రుక్మిణీ కళ్యాణ గాథను వినిపించాడు.

క. కువలయరక్షాతత్పర, కువలయదళ నీలవర్ణ కోమలదేహా!
కువలయనాథ శిరోమణి!, కువలయజన వినుత విమలగుణ సంఘాతా!

1790

తా ॥ భూమిని పాలించుట యందు ఆసక్తి కలవాడా! కలువరేకులవలె నల్లని కాంతితో మనోజ్ఞంగా ఉన్న దేహం కలవాడా! రాజశ్రేష్ఠుడా! భూమండలములోని జనులచేత కొనియాడబడిన వాడా!

మాలిని.
సరసిజనిభహస్తా! సర్వలోకప్రశస్తా!, నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!
పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!, గురు బుధజన పోషీ! ఘోర దైతేయ శోషీ!

1791

తా ॥ ఓ కమలముల వంటి హస్తములు కలవాడా! సర్వలోకముల యందును శ్లాఘింపబడిన వాడా! సాటిలేని మంగళ స్వరూపాన్ని కలిగి ఉన్నవాడా! నిర్మలమైన కీర్తికలవాడా! శత్రు హృదయాలను భేదించు వాడా! భక్తుల సమూహాలకు మేలు చేయువాడా! శిష్యుల అజ్ఞానమును నశింపచేసే ఆచార్యులను పోషించు వాడా! క్రూరులైన రాక్షసులను నశింపచేయువాడా!

గద్యము

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణమునందు దేవకీదేవి వివాహంబును, గగనవాణీశ్రవణంబును, కంసోద్రేకంబును, వసుదేవ ప్రార్థనంబును, యోగమాయాప్రభావంబును, బలభద్రుని జన్మంబును, బ్రహ్మాది సురస్తోత్రంబును, నందపుత్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకట భంజనంబును, తృణావర్తు మరణంబును, గర్గాగమనంబును, నారాయణాది నామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవ వదన, గహ్వర విలోక్యమా నాఖిల లోకాలోకనంబును, నవనీత చౌర్యంబును, యశోదా రోషంబును, ఉలూఖల బంధనంబును, అర్జునతరు యుగళ నిపాతనంబును, నలకూబర మణిగ్రీవుల శాపమోక్షణంబును, బృందావన గమనంబును, వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, అఘాసుర మరణంబును, వత్సాపహరణంబును, నూతన వత్స బాలక కల్పనంబును, బ్రహ్మ వినుతియును, గోపాలనంబును, గార్దభాసుర దమనంబును, కాళియఫణి మర్దనంబును, గరుడ కాళియనాగ విరోధ కథనంబును, ప్రలంబాసుర హింసనంబును, దవానల పానంబును, వర్షర్తు వర్ణనంబును, శరత్కాల లక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయ సమాగమంబును, గోపకన్యాచరిత హవిష్యవ్రతంబును, కాత్యాయనీ సేవనంబును, వల్లనీ వస్త్రావహరణంబును, విప్రవనితా దత్తాన్నభోజనంబును, ఇంద్రయాగ నివారణంబును, నందముకుంద సంవాదంబును, పర్వతభంజనంబును, పాషాణసలిల

వర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయిన హరి దెచ్చుటయు, వేణు పూరణంబును, గోపికాజన ఘోషనిర్గమంబును, యమునాతీర వనవిహారణంబును, కృష్ణాంతర్ధా నంబును, ఘోష కామినీ గణ పరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్న తయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుం డయిన సుదర్శన విద్యాధరుండు హరిచరణ తాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుండను గుహ్యకుని వధించుటయును, వృషభాసుర విదళనంబును, నారదోపదేశంబున హరికథ నెఱిఁగి కంసుండు దేవకీ వసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధించుటయును, నారద స్తుతియును, వ్యోమదానవ మరణంబును, అక్రూరాగమనంబును, అక్రూర రామకృష్ణుల సల్లాపంబును, ఘోషనిర్గమంబును, యమునా జలాంతరాళంబున నక్రూరుండు హరి విశ్వరూపమును గాంచుటయును, అక్రూరస్తవంబును, మథురానగర ప్రవేశంబును, రజక వధయును, వాయక మాలికులచే సమ్మాన మొందుటయును, కుబ్జా ప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసుదుస్స్వప్నంబును, కువలయాపీడ పీడనంబును, రంగస్థలప్రవేశంబును, చాణూరముష్టికుల వధయును, కంస వధయును, వసుదేవ దేవకీ బంధమోక్షణంబును, ఉగ్రసేను రాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుటయును, సంయమనీ నగర గమనంబును, గురుపుత్రదానంబును, ఉద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, కుబ్జావాస గమనంబును, కరినగరంబునకు నక్రూరుండు సని కుంతీదేవి నూరార్చుటయు, కంస భార్యలగు నస్తి ప్రాస్తులు జరాసంధునకుఁ గంసుమరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మథురానగర నిరోధనంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుం డగుటయు నారదప్రేరితుండై కాలయవనుండు మథురపై దాడి వెడలుటయును, ద్వారకానగర నిర్మాణంబును, మథురాపుర నివాసులం దనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుఁ దెచ్చుటయు, కాలయవనుండు హరివెంటం జని గిరిగుహయందు నిద్రితుండైన ముచుకుందుని

కోపదృష్టివలన నీఱగుటయును, ముచుకుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకుం జనుటయును, జరాసంధుఁడు గ్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణ పర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గ నుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయు, రుక్మిణీ జన్మంబును, రుక్మిణీ సందేశంబును, వాసుదేవాగమనంబును, రుక్మిణీగ్రహణంబును, రాజలోక పలాయనంబును, రుక్మి యనువాని భంగంబును, రుక్మిణీ కల్యాణంబును ననుకథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగంబు సంపూర్ణము.

తా ॥ శ్రీ మహాభాగవతం అనే ఈ మహాపురాణం పరమేశ్వరదయాలబ్ద కవితావైచిత్రి కలవాడూ, కేసన మంత్రి పుత్రుడూ, సహజ పాండిత్యుడూ అయిన బమ్మెరపోతనామాత్యులవారు రచించారు. దేవకీదేవి వివాహము, ఆకాశవాణిని కంసుడు ఆలకించుట, అతడు ఉద్రేకపడుట, వసుదేవుని ప్రార్థన, యోగమాయ యొక్క మహిమ, బలరాముని పుట్టుక, బ్రహ్మ మొదలగు దేవతలయొక్క స్తుతి, శ్రీకృష్ణ భగవానుడు అవతరించుట, నందవ్రజములో ప్రవేశించుట, యోగనిద్ర కథ, నందుడు గావించిన పుత్రోత్సవం, కృష్ణుడు పూతనను చంపుట, శకటాసురుని కూల్చుట, తృణావర్తుని మృతి, యాదవ పురోహితుడైన గర్గాచార్యులవారు మందకు ఏతెంచుట, నారాయణాదినామ నిర్వచనము, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, అతడు మన్ను తినుట, యశోదాదేవి గోవిందుని ముఖ ద్వారంలో సకల చరాచర ప్రపంచమును చూచుట, శ్రీకృష్ణుడు వెన్నలు దొంగిలించుట, యశోదాదేవి శ్రీకృష్ణుని కోపించుట, ఆమె బాలకృష్ణున్ని రోటికి బంధించుట, కృష్ణుడు మద్దిచెట్లను పడగూల్చుట, అర్జునవృక్షములై యున్న నలకూబరుడు, మణిగ్రీవుడు అనే గంధర్వుల శాపవిముక్తి, నందాదులు బృందావనమునకు అరుగుట, శ్రీకృష్ణుడు లేగలను మేపుట, వత్సాసురుని సంహరించుట, బకరూపము దాల్చిన దైత్యున్ని చీల్చిచంపుట, బకుని తమ్ముడూ, సర్పరూపధారీ అయిన అఘాసురుణ్ణి శ్రీకృష్ణుడు రూపుమాపుట, బ్రహ్మదేవుడు ఆవుదూడలను అంతర్ధానము చేయుట, శ్రీకృష్ణుడు క్రొత్తగా గోవత్సములను, గోపాలబాలకులను సృజించుట, బ్రహ్మ శ్రీకృష్ణుణ్ణి స్తుతించుట, కృష్ణుడు గోవులను పాలించుట, గార్ధబాకారంతో ఉన్న ధేనుకాసురున్ని నిర్మూలించుట, కాళియ మర్దనము గావించుట, గరుత్మంతునకు

కాళియునకు వైరమేర్పడిన వైనము చెప్పుట, బలరాముడు ప్రలంబాసురుని చంపుట, శ్రీకృష్ణుడు దావాగ్నిని మింగుట, వర్షఋతువర్ణనం, శరదృతులక్షణం, వేణుగానవినోదం, హేమంత ఋతువు రాక, గోపకన్యలు గావించిన వ్రతం, గోపికలు కాత్యాయనిని భజించుట, గొల్లెతల కోకలు కృష్ణుడు అపహరించుట, బ్రాహ్మణపత్నులు తెచ్చి ఇచ్చిన అన్నములు స్వామి ఆరగించుట, ఇంద్రయాగము మాన్పించుట, నందముకుందుల సంభాషణ, ఇంద్రుడు రాళ్ళవాన కురిపించుట, కృష్ణమూర్తి గోవర్ధనపర్వతమునెత్తుట, వరుణుని భటుడు వరుణ పట్టణమునకు నందుని గొనిపోగా శ్రీకృష్ణుడు మరల తెచ్చుట, గోవిందుడు పిల్లనగ్రోవి నూదుట, గోపికలు మందనుండి వెడలి కృష్ణుని సన్నిధికి వచ్చుట, యమునానదీ తీరమందలి వనములో శ్రీకృష్ణుడు విహరించుట, కృష్ణుడు అదృశ్యమగుట, గొల్లచేడియలు కృష్ణుణ్ణి గానక విలపించుట, గోపికలు కృష్ణుణ్ణి వెదకుట, గోపికాగీతలు, శ్రీకృష్ణుడు ప్రసన్నుడగుట, రాసక్రీడాభివర్ణనము, జలక్రీడాభి వర్ణనము, సర్పరూపియగు సుదర్శనుడను విద్యాధరుడు శ్రీకృష్ణుని కాలితాపుతో స్వస్వరూపమును పొందుట, కృష్ణుడు కుబేరభటుడైన శంఖచూడుడను గుహ్యకుని చంపుట, వృషభాసుర సంహారము, నారదుని మాటల వల్ల కృష్ణుని జన్మవృత్తాంత మెరిగి కంసుడు దేవకీవసుదేవులను బంధించుట, అశ్వరూపధరుడైన కేశియను దనుజుని శ్రీహరి వధించుట, నారదుడు గోవిందుని సంస్తుతించుట, వ్యోమాసురుణ్ణి శౌరి సంహరించుట, అక్రూరుడు నందగోకులమునకు వచ్చుట, అక్రూర బలరామకృష్ణులు ముచ్చటించు కొనుట, అక్రూరుడు నందవ్రజమునుంచి కృష్ణబలభద్రులతో మధురకు బయలుదేరుట, అక్రూరుడు యమునా నదీజలాలలో శ్రీహరి విశ్వరూపమును దర్శించుట, అతడు శ్రీకృష్ణపరమాత్మను సంస్తుతించుట, కృష్ణుడు మధురలో ప్రవేశించుట, అక్కడ చాకలివానిని సంహరించుట, సాలెవాడొసగిన వస్త్రములు, సుదాముడను మాలాకారుడు సమర్పించిన పూలదండలు రామకృష్ణులు స్వీకరించుట, శ్రీకృష్ణుడు కుబ్జయెడ ప్రసన్నుడగుట, అతడు ధనుశ్శాల కరిగి వింటిని విరచుట, కంసుడు చెడుకల గాంచుట, కువలయాపీడమనే ఏనుగును కృష్ణుడు చంపుట, కృష్ణుడు మల్లరంగములో ప్రవేశించుట, శ్రీకృష్ణబలరాములు చాణూరుడు, ముష్టికుడు అను మల్లులను తుదముట్టించి, కంసుని సంహరించుట, శ్రీకృష్ణుడు దేవకీవసుదేవుల చెర మాన్పుట,

ఉగ్రసేనునకు రాజ్యపట్టము కట్టబెట్టుట, రామకృష్ణులు సాందీపని వల్ల చతుష్షష్టి విద్యలు నేర్చుట, శ్రీకృష్ణుడు గుర్వర్థమై యమపట్టణమైన సంయమనీ నగరమునకు పోవుట, యముణ్ణి అడిగి రామకృష్ణులు సాందీపనికి అతని కుమారునొసగుట, ఉద్ధవుడు గోకులమునకు వచ్చుట, భృంగోపదేశము, శ్రీకృష్ణుడు కుబ్జ ఇంటికరుగుట, హస్తినాపురమునకు అక్రూరుడు వెళ్ళి కుంతీదేవి నోదార్చుట, కంసుని పత్నులగు అస్తి, ప్రాస్తి అనువారు తమ జనకుడగు జరాసంధునకు భర్తృమరణము దెల్పుట, జరాసంధుడు కృష్ణుని పైకి దాడి వెడలుట, జరాసంధుడు మథురాపురమును ముట్టడించుట, జరాసంధుడు సంగ్రామములో పదునేడు సారులు పరాజితుడై పారిపోవుట, నారదుని ప్రేరణచే కాలయవనుడు మథురానగరిపై దండయాత్ర సల్పుట, హరి ఆదేశముచే విశ్వకర్మ సముద్రములో ద్వారకానగరమును నిర్మించుట, కృష్ణుడు తన యోగమహిమచే మథురా పట్టణ ప్రజలను ద్వారకాపురికి జేర్చుట, కాలయవనుడు మాధవుని వెంట నరిగి ఒక కొండగుహలో నిద్రిస్తున్న ముచుకుందుడను రాజు యొక్క కోపదృష్టి వలన భస్మమగుట, ముచుకుందుడు నారాయణుని స్తోత్ర మొనర్చి తపము సల్పుటకు వెళ్ళుట, జరాసంధుడు మరల రామకృష్ణులపైకి దాడి వెడలుట, బలరామాచ్యుతులు ప్రవర్షణగిరి నెక్కుట, జరాసంధుడు ప్రవర్షణశైలమును దహించుట, రామకృష్ణులు పర్వతము నుండి దుమికి ద్వారకాపురికి వచ్చుట, రుక్మిణీదేవి పుట్టుక, ఆమె కృష్ణునికి పంపిన సందేశము, మాధవుడు కుండిన నగరమునకు ఏతెంచుట, రుక్మిణి నెత్తుకపోవుట, రాజసమూహము యుద్ధమందు ఓడి పారిపోవుట, రుక్మిణి అన్న యగు రుక్మి భంగపాటు, రుక్మిణీదేవి వివాహము అను కథలు గలిగిన ఈ దశమస్కంధ పూర్వభాగము సమాప్తం.

# 71. గోపికా తత్త్వం – రాసలీల

శరత్కాలపు పౌర్ణమినాడు రాసలీల జరుపబడింది. శరత్కాలంలో వర్షఋతువులో కురిసిన వర్షాల వలన ఏర్పడిన బురద అంతా ఎండిపోయి, నింగి, నేల తేటదనాన్ని సంతరించుకున్నాయి. పౌర్ణమి చంద్రుడు నిండుగా, ప్రసన్నంగా, ఆహ్లాదంగా ఉన్నాడు. చంద్రుడు మనస్సుకి సంకేతం. ఆ చంద్రునిలా మనస్సు స్వచ్ఛంగా, ప్రసన్నంగా ఉండాలి. పైన చెప్పిన తేటదనము, మనస్సు స్వచ్ఛంగా మాలిన్యరహితంగా ఉన్నప్పుడే భగవదనుభవం సంప్రాప్తిస్తుంది. భగవంతుణ్ణి పొందాలంటే ఎటువంటి లౌకిక అలజడులులేని నిశ్చల స్థితి, ప్రసన్నతా భావం ఉండాలి. ఈ లక్షణాలు ఆ గోపికలయందు పుష్కలంగా ఉన్నాయి. అందువల్లనే వ్రేపల్లెలో ఉన్న జనులందరికీ వినిపించని శ్రీకృష్ణుని వేణునాదం గోపికలకు మాత్రమే వినిపించింది. విన్న వెంటనే వారిలో మైమరుపు కలిగింది. ఆ పరవశ్యం ఎటువంటిదంటే ఎలా ఉన్నవారు అలాగే క్షణంకూడా ఆలసించకుండా ఆ నాదం మూలాన్ని చూద్దామని బయలుదేరాడు. ఆ సమయాన లౌకిక పాశాలు ఏవీ వారి తలపులలో లేవు. అందుకనే భగవంతుని పిలుపుని విన్న గోపికలు ఆ ఆత్మబంధువుని వెతుక్కుంటూ బయలుదేరారు.

అయితే ఈ పిలుపు వినిపించిన వారిలో కొందరు రాలేక ఇంటి వద్దనే ఆగిపోవలసి వచ్చింది. ఆయన సన్నిధికి వెళ్ళలేకపోయినా, ఆ అచ్యుతుణ్ణి మనస్సులోనే గాఢాలింగనం గావించుకుని ధ్యానంతో పరవశించిపోయారు. ఆ పారవశ్యంతోనే త్రిగుణాత్మకమైన దేహాన్ని త్యజించి, కైవల్యాన్ని పొందగలిగారు. ధ్యానంతో పరమాత్మణ్ణి చేరారు అంటే వీరి స్థితి వేయించిన గింజల వలె, తిరిగి మొలకెత్తని గుణాతీత స్థితియే కదా! (968)

ఇక్కడ, పరీక్షిత్ మహరాజుకి సందేహం కలిగింది. జారబుద్ధి కలిగి ఉన్న గోపికలకు మోక్షం ఎలా లభించింది అని. దీనికి సమాధానంగా శుకయోగి ఇలా వివరిస్తున్నారు –

జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుని సౌందర్యానికి గోపికలు తొలుతగా వశులైనా, మోహించబడినవాడు పరమాత్ముడు కనుక వారిలోని కామబీజం దగ్ధమైంది. పరుసవేదిని తాకగలిగిన ఏ లోహమైనా సువర్ణంగా మారుతుంది కదా! ఇక్కడ గొప్పదనం అంతా పరుసవేది మాహాత్మ్యమే! పుట్టుకలేనివాడు, యోగీశ్వరుడైన నారాయణుని చెంతకు ఏ భావంతో వెళ్ళినా తరించిపోతారు. ద్వేషంతో ఎదిరించిన కంసుడు, శిశుపాలుడు వంటి రాక్షసులే ముక్తిని పొందగా ప్రేమించిన గోపికలు తరించడంలో వింత ఏముంది?

వేణువుని ఆలాపిస్తున్న ఆ కృష్ణుణ్ణి సమీపించగా, ఆ పరమాత్ముడు వారికి లౌకిక ధర్మాలను గుర్తు చేసి, వెనుతిరగమని చెబుతాడు. దానికి గోపికలు, ఈ నియమాలు దేహధారిణులైన వారికి వర్తిస్తాయి తప్ప, నీ యందు మాత్రమే ఆసక్తి గల మాకు తగవు. నేర్పరులైన యోగులు నీ యందే మనస్సు నిలుపుకుంటారు కదా, మాకు ఎందుకు ఈ కపట బాంధవ్యాలను గుర్తు చేస్తున్నావు అని ప్రశ్నిస్తున్నారు. (988 – 89) వారు యోగినులు అని దీనితో తెలుస్తుంది. ఎవరి సర్వస్వమూ, సకల భావములు శ్రీకృష్ణునిలో లగ్నమైయున్నవో ఆమెయే గోపిక. నారద మహర్షి కూడా తన భక్తిసూత్రాలలో పరాకాష్ఠకు చెందిన భక్తికి నిదర్శనంగా గోపికల భక్తిని ఉదహరించారు. ఆ త్రివిక్రముణ్ణి తమ హృదయరథంగా చేసుకొని పాలు పితుకుతున్నప్పుడు, పెరుగు చిలికి వెన్నతీయునప్పుడు, చిమ్ముతున్నప్పుడు, పిల్లలను ఊయల ఊపుసమయాన, ఏడిచే పిల్లలను నిద్రపుచ్చుతున్నప్పుడు, నీటిని మోసుకుని వస్తున్నప్పుడు, మరియు పాత్రలను శుభ్రం చేస్తున్నప్పుడు – ఇలా ఏ కర్మలు చేస్తున్నా మనస్సు శ్రీకృష్ణుని మీద లగ్నంచేసి ఆనందంతో, గద్గదస్వరంతో శ్రీకృష్ణుని గూర్చి పాటలు పాడే ఆ వ్రజగోపికలు ధన్యులు కదా! అందుచేత నారద మహర్షి తన భక్తి సూత్రాలలో పరాకాష్ఠ చెందిన భక్తికి నిదర్శనంగా గోపికల భక్తిని ఉదహరించారు (యథా వ్రజ గోపికానామ్ సూత్రం 21). గోపికల నిష్ఠకు సంతసించిన కృష్ణుడు, తాను ఆత్మారాముడై లీలామాత్రంగా గోపికలను సంతోష పెట్టాలనుకున్నాడు. యోగులకే ఈశ్వరుడైన ఆ నారాయణుడు, సమస్త జీవుల హృదయాలలో సాక్షిగా నివసించే ఆ గోవిందుడు ఇతరులను ఆనందపరిచాడే కానీ తాను

ఆనందించేవాడు కాడు. ఆయనకు వేరెవరు ఆనందాన్ని ఇవ్వలేరు.

అన్ని బంధాలను తెంచుకుని వచ్చిన గోపికలలో కొంత జీవ భావం ఉంది (నేను అనే భావన). సర్వజ్ఞుడైన ఆ శ్రీహరి వారి యందు దయతో దానిని తొలగించాలనుకుని, అంతర్ధానమయ్యాడు. వెంటనే ఆ గోపికల హృదయాలలో వ్యాకులత మొదలైంది. అమిత దుఃఖాన్ని పొందసాగారు. దీనినే నారద మహర్షి భక్తి సూత్రాలలో (తదర్పితాఖిలాచారతా, తద్విస్మరణే పరమవ్యాకులతేతి సూత్రం 19) ప్రస్తావించారు. రెప్పపాటు కాలం కూడా భగవద్వియోగాన్ని సహించలేకపోవడమే భక్తి యొక్క పరిపూర్ణ లక్షణం. కృష్ణునియందు అనురక్తితో, తీవ్ర వియోగంతో అతనిని వెదుకసాగారు. ఆ వెదుకులాటలో అపరోక్షంగా ఆయన అనుభూతిని పొందసాగారు. వారిలో ఇది జడము, ఇది చైతన్యము అనే భావన తొలగిపోయింది (1008).

కనిపించిన ప్రతీ చెట్టునీ, పుట్టనీ కృష్ణుని గురించి అడుగసాగారు. కృష్ణుని వేణునాదం వినగానే చెట్టు, పుట్ట, మృగము, పక్షి అనే భేదం లేక, ప్రకృతిలోని చరాచరాలన్నీ పులకించి పరవశించడం వారు చూశారు (787 – 795). ఒక ప్రక్క ప్రశాంతంగా నిలబడి ఉన్న హరిణి(లేడి) కళ్ళను చూస్తూ, ఇది నిశ్చలంగా చూస్తోంది, కనుక కృష్ణుణ్ణి తప్పక చూసి ఉంటుందని భావించసాగారు (1017). ఈ వెతుకులాటలో ఎంతో ఆర్తి, ఆర్ద్రత నిండి ఉంది. ఆ అన్వేషణలో కృష్ణ స్పృహ తప్ప మరొకటి లేదు. ఇలా అన్వేషిస్తూ, అన్వేషిస్తూ తాదాత్మ్య స్థితి నుండి తదాకారవృత్తిలోనికి మారారు (ఉపనిషత్తులు దీనినే బ్రహ్మాకార వృత్తి అని వివరించాయి). ఇందులో తమస్థితిని తాము మరచి, తమని తాము కృష్ణునిగా భావించి, తదనుగుణంగా ప్రవర్తించడం కనిపిస్తుంది (1020 – 1025).

నిజమైన భక్తులు మనసా, వాచా, కర్మణా సమస్త కర్మలను భగవదర్పణం గావించాలి. గోపికలు ఈ త్రికరణాలను పూర్తిగా కృష్ణునికి సమర్పించారు. తమ ఇంద్రియాలనే పాత్రలలో భగవత్ రసాపానాన్ని చేయసాగారు (990), ఇదే పరాభక్తి లక్షణం. అందుకే వీరికి ఆయన

వల్లభుడైనాడు. వీరికి కృష్ణుని మాహాత్మ్యజ్ఞానం మరియు ఆయన పరమాత్ముడు అనే జ్ఞానం కూడా ఉంది(తత్రాపి న మాహాత్మ్య జ్ఞాన విస్మృత్య పవాదః నారద భక్తి సూత్రం 22). అందుచేతనే, 'నీవు యశోద బిడ్డవా ఏమిటి? సకల ప్రాణులయందు గల పరబ్రహ్మవు గానీ' అని అంటారు (1040), ఆ కృష్ణుణ్ణి ఇలా ప్రార్థిస్తారు. నీ చేతిని మా శిరస్సుపై ఉంచు, ఇది సకల జగత్తుకి అభయాన్నిచ్చే హస్తం (1041). నీ అందమైన చిరునవ్వుని చిందించు, అది భక్తుల అహంకారాన్ని నశింపచేస్తుంది (1046). నీ పాదాలను మా హృదయంపై ఉంచు (1049), ఎందుకంటే అవి హృదయంలో గల అజ్ఞానగ్రంథులను ఛేదిస్తాయి. వాటిని సేవించేవారికి సంసార భయాన్ని పోగొడతాయి (1041). నీ సుతిమెత్తని పాదాలను గరుకు గడ్డి పరకలపైన పెడతావు (1047), అలాగే విషసర్పమైన కాళీయుని తలపై ఉంచుతావు (1042). మరి మా హృదయంలో పెట్టేందుకు ఎందుకు ఆలసిస్తున్నావు, మా బాధను ఎందుకు తొలగించవు (1057) అని నిలదీస్తారు. మేము నీకు వెల ఇవ్వని దాసీలం అని సంపూర్ణ శరణాగతిని ప్రకటిస్తారు (1038). నీ కథామృతాన్ని ఋషులు గానం చేస్తారు. దానిని పానం చేసినవారికి సర్వమునూ దానం ఇవ్వాలనే సంకల్పం కలుగుతుంది. అటువంటిది నీకు మాకు ప్రాణదానం చేయాలని ఎందుకు తోచడం లేదు (1045) అని వ్యాకులపడతారు. వీరు కృష్ణుని అధరామృతాన్ని కూడా అపేక్షించారు. ఈ అధరామృతాన్ని మూడు విధాలుగా చెప్పవచ్చును. మొదటిది, ఆయన పెదవుల నుండి ఒలికే చిరునవ్వు (999), రెండవది, ఆయన పెదవులనుండి వెలువడే మాటలు, అవి పండితులనే సంతోషింపచేయగలవి (1043). మూడవది, ఆయన పెదవులు ఆలాపించే వేణుగాన సుధారసం. ఆ వేణువు నుండి వెలువడే రాగాలు ఇతర రాగాలను(కోరికలను) అన్నింటినీ నశింపచేస్తాయి (1012). ఈ విధంగా వ్యాకులతను చెందుతూ, ఎడతెగకుండా కృష్ణుణ్ణి కళ్ళ నిండా దర్శించాలనుకుని భావిస్తే, క్రూరుడైన విధాత కంటికి రెప్పలను ఎందుకు సృజించాడో (1051) అని దుఃఖీస్తూ ప్రాణాలన్నీ ఆ పరమాత్ముని యందే నిలపి ఉంచిన గోపికలముందు, మన్మథునికే మన్మథుండైన శ్రీహరి సాక్షాత్కరించాడు (1059). గోపికలు శుద్ధ జీవులు. బాహ్యములైన విషయాలను వదిలి భగవంతుని వైపు పరుగెత్తారు. హృషీకాలతో (అంటే ఇంద్రియాలతో) హృషీకేశుడిని పూజించడం అంటే

ఇంద్రియాలతో ఇంద్రియాధీశ్వరుణ్ణి కైంకర్యం చేయుటే భక్తి అనబడుతుంది. ఈ భక్తి గోపికల భక్తి. 'గో' అంటే ఇంద్రియాలు, ప్రతీ ఇంద్రియంతో ఇంద్రియాధీశ్వరుని ప్రేమ రసాన్ని పానం చేసే వారు గోపికలు('ప' అంటే పానం చేయడమని కూడా అర్థం ఉంది). అందుచేత ఈ రాసలీల ప్రేమలీల అనే చెబుతారు. గోపికలంటే స్త్రీలని, కృష్ణుడంటే పురుషుడని కాదు. భక్తి భాషలో జీవులంతా స్త్రీలే.

అలా ప్రత్యక్షమైన కృష్ణుణ్ణి చూడగానే తాపాలన్నీ నశించగా, పరబ్రహ్మ సందర్శనం చేత సంసారబంధాన్ని తొలగించుకున్న మహాయోగుల వలె పరమోత్సవం చేసుకున్నారు. వారితో కృష్ణుడు సర్వజ్ఞ, సర్వస్వతంత్రాది శక్తులతో కూడిన పరబ్రహ్మ వలె ప్రకాశించాడు (1069 – 70). ఆ తరువాత రాసక్రీడ ఆరంభమైనది. రాసము అనగా భగవదనుభవమే. ఈ విశ్వం అంతా లయాత్మకమైన నాదనర్తనం. ఆ నాదానికి మూలమైన పరమాత్మను తెలుసుకోగలగడమే ఇందులోని మర్మం. అనేక నృత్యభంగిమలతో ఉంటూ, ఈ విశ్వచలనపు రహస్యాలను ఈ లీల తెలియపరుస్తుంది. ఆ రాసలీలలో కృష్ణుడు అనేక కృష్ణమూర్తులుగా మారి, వలయాకారంగా గోపికలతో కలిసి ఉంటూ, ఆ మండల కేంద్రంలో తాను నిలిచాడు. ఈ వలయంలో ప్రతీ ఇద్దరి గోపికల మధ్యన ఒక కృష్ణుడు, ప్రతీ ఇద్దరి కృష్ణుల మధ్యన ఒక గోపిక ఉన్నారు. ఈ విధంగా వృత్తంలో చుట్టూ ఎందరో ఉంటారు. కేంద్రంలో ఒక్కరే భాసిస్తారు. చూడటానికి ముందుగా వృత్తమే కనిపిస్తుంది, తరువాతే కేంద్రం కానవస్తుంది, కానీ దాని నిర్మాణంలో మాత్రం, ముందు కేంద్రంతో ఆరంభమై తదుపరి వృత్తం నిర్మితమవుతుంది. ఈ విశ్వమే ఆ వృత్తం, పరమాత్ముడే ఆ కేంద్రం. వృత్తం అనేకత్వానికి నిదర్శనమై ఉన్నా, అందరితోనూ కృష్ణుడు ఉన్నాడు, ఇది గుర్తించవలసిన విషయం. ఈ విశ్వచక్ర చలనం అంతా ఏకం, అద్వితీయం అయిన ఆ కేంద్రం మీద ఆధారపడి నడుస్తోంది. ఉపాధులు ఎన్ని ఉన్నా, అంతటా ఉన్నది పరబ్రహ్మమేనని రాసలీల మనకు తెలియజేస్తుంది. అనేకత్వాన్ని దర్శించిన ప్రతీసారి దాని వెనుక ఉన్న ఏకత్వం స్ఫురణకు రావాలి. ఇదే రాసలీలా సారాంశం.

- భగవంతుణ్ణి ప్రేమించటమే మానవ జీవిత ఉద్దేశ్యం; బృందావనంలోని గోపగోపికలు, ఆల కాపరులు శ్రీకృష్ణుని కోసం వ్యక్తబరచిన ప్రేమలాంటిది. శ్రీకృష్ణుడు మథురానగరానికి వెళ్ళిపోయినప్పుడు గోపబృందం శ్రీకృష్ణుని ఎడబాటుకు విలపిస్తూ సంచరించారు.
- భగవంతుడి పట్ల ప్రగాఢ ప్రేమ కలిగిన వ్యక్తి ప్రేమపూరితుడవుతాడు. ఆ వ్యక్తి సమస్తాన్నీ భగవన్మయంగా చూస్తాడు. పచ్చకామెర్లు ముదిరిన రోగికి వస్తువులన్నీ పసుపు పచ్చగా కనబడతాయి. అలాంటి స్థితిలో 'అతడే నేను' అని అవగాహనమౌతుంది. తాగుబోతు అధికంగా తాగి ఒళ్ళు తెలియని స్థితిలో 'నేనే కాళిని' అంటూ కేకలు వేస్తాడు. గోపికలు ప్రేమోన్మత్తులై, 'నేనే కృష్ణుణ్ణి' అంటూ ప్రకటించుకున్నారు. అహోరాత్రాలు భగవంతుణ్ణే స్మరిస్తూ సర్వత్రా ఆయన్నే చూడగలం. వెలుగుతున్న దీపారాధన వత్తిని ఏకాగ్రంగా చాలాసేపు చూస్తూవుంటే నాలుగువైపుల దీపశిఖలను చూస్తాం గదా!
- పులి జంతువులను ఆవురావుమంటూ కబళించివేసే రీతిలో భగవత్ ప్రేమ అనే పులి కామక్రోధాదులనే శత్రువులను కబళించి వేస్తుంది. ఒకసారి హృదయంలో భగవత్ ప్రేమ కలిగితే కామక్రోధాదులు అంతర్ధానమౌతాయి. కృష్ణుని పట్ల అంతటి అనురాగం ఉండబట్టే బృందావన గోపికలకు అటువంటి స్థితి కలిగింది; శ్రీకృష్ణుని పట్ల ప్రేమ జనించింది.

– శ్రీరామకృష్ణ పరమహంస

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీ మహాభాగవతము – ఐదవ సంపుటము

దశమ స్కంధము – ఉత్తర భాగము, ఏకాదశ, ద్వాదశ స్కంధములు


అనువాదకులు:
డాక్టర్ పులిగడ్డ విజయలక్ష్మి
డాక్టర్ ఏల్చూరి మురళీధరరావు



రామకృష్ణ మఠం

దోమలగూడ, హైదరాబాద్ – 500 029

# ముందుమాట

సనాతన ధార్మిక స్పృహను ఈ జాతికి ఊపిరిగా అందించిన అద్భుత ప్రక్రియ 'పురాణం'. సనాతన ధర్మాన్ని సామాన్యులకు అందించే అసామాన్య గ్రంథం, మహాపురాణం 'శ్రీ మహాభాగవతం'. భగవంతుని ద్వారా చెప్పబడినది భగవద్గీత అయితే భగవంతుడి గురించి చెప్పబడింది భాగవతం. ఈ మహాగ్రంథాన్ని సమకాలీన సమాజానికి అన్వయిస్తే యుగధర్మం ఆవిష్కృతమవుతుంది. భాగవత దివ్యగ్రంథంలో అంతటా అంతర్యామిగా వెలుగుతున్నవాడు నారాయణుడైన శ్రీకృష్ణుడు. భాగవత మహాపురాణానికి అక్షర రూపాన్నీ, అక్షరమైన రూపాన్నీ అందించిన వాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవానుడు. భాగవత పురాణాన్ని తెలుగువారికి తేనెల విందుగా చేసినవాడు సహజకవి బమ్మెర పోతనామాత్యుడు. 'పలికెడిది భాగవతమట! పలికించెడి వాడు రామభద్రుండట!...' అనే భాగవతంలోని పద్య పాదం తెలుగువారి లోగిళ్ళలో వీనసొంపుగా వినిపిస్తుంది. సాక్షాత్తూ శ్రీరామచంద్రుడే తెలుగులోకి అనువదించమని ఆనతిని ఇవ్వడం ద్వారా ఈ మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీ మహాభాగవతం ఈశ్వర ప్రేరితమై, తెలుగువారి అభిమాన కావ్యమై తరతరాలుగా తెలుగు హృదయాలను రంజింపచేస్తున్నది.

శ్రీ మహాభాగవతం అయిదవ భాగంలో దశమ స్కంధం ఉత్తర భాగం, ఏకాదశ, ద్వాదశ స్కంధాలు పొందుపరచబడ్డాయి. మానవ జీవితం ఉద్ధరింపబడేందుకు భాగవతము అలౌకికమైన మార్గాన్ని చూపింది. కలియుగంలో జనులు అర్థ ప్రధానులు, విలాస ప్రియులు. వీరిని ఉద్ధరించడానికి క్రమక్రమంగా త్యాగ భావన అలవరచుకోవడానికి దోహదపడే నూతన మార్గాన్ని నిర్మాణం చేయడం జరిగింది. కామక్రోధలోభాలకు సైతం భగవంతుడు ఆధారమైతే భగవత్ప్రాప్తి

లభిస్తుందని భాగవతం తెలియజేస్తుంది. శ్రీకృష్ణుడు తన లీలలతోనే జగత్తును సృష్టించడం, రక్షించడం, ఉపసంహరించడం చేసి కించిత్తుకూడా ఆసక్తి లేకుండా ఉండటం ఆయన అద్భుతలీల. దశమ స్కంధంలోని ఉత్తర భాగంలో శ్రీకృష్ణుని గుణగణాలు వెల్లడయ్యే కథనాలతో పాటు, కుచేలోపాఖ్యానం సఖ్య భక్తికి అపూర్వమైన ఉదాహరణ. ఇకపోతే ఏకాదశ స్కంధంలోని అవధూత కథ అతను తన ఇరవై నాలుగు గురువుల ద్వారా నేర్చుకున్న పాఠాలను స్పష్టం చేస్తుంది. గ్రద్ద నోటన ఉన్న చేప కోసం వెంటబడిన కాకుల వృత్తాంతాన్ని శ్రీరామకృష్ణులు తరచూ చెబుతూండేవారు. విషయవాసన అనే చేప మనతో ఉన్నంత వరకు కాకులనే కర్మలు ఉండనే ఉంటాయి. దాని ద్వారా ఎదురయ్యే చింత, విచారం, అశాంతి వెన్నంటే ఉంటాయి. వాసనలను త్యజిస్తే, తక్షణమే కర్మలు మననుండి వైదొలగుతాయి, ప్రశాంతత లభిస్తుంది. ద్వాదశ స్కంధములో కలియుగ లక్షణం, మార్కండేయోపాఖ్యానం, శ్రీమద్భాగవత మహత్త్వం వివరించ బడ్డాయి. ఏకాదశ, ద్వాదశ స్కంధాలు పోతన గారి ప్రియ శిష్యుడు వెలిగందల నారయ రచించాడు.

దశమ స్కంధ ఉత్తర భాగానికి తెలుగు అనువాదం అందించినవారు డాక్టర్ పులిగడ్డ విజయలక్ష్మి గారు. ఏకాదశ, ద్వాదశ స్కంధాలను డాక్టర్ ఏల్చూరి మురళీధరరావు గారు అనువదించారు. వీరిరువురికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇక ఈ బృహత్ యజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ ఒక్కరికీ మా ధన్యవాదాలు.

పాఠకులు ఈ మహాభాగవత కథా సుధారసాన్ని గ్రోలి, భాగవత ధర్మాన్ని అనుష్ఠించి, అమృతత్త్వాన్ని చేరుకోవాలని మా ఆకాంక్ష, అభిలాష.

— ప్రకాశకులు

ముఖ-చిత్రవర్ణన:

భగవంతుడే భక్తుని రూపంలో దర్శనమిస్తాడు. ఆయన మరో రూపమే భాగవతం.

భగవంతుడు, భక్తుడు, భాగవతం – ఈ మూడు ఒక్కటే, ఆ ఒక్కటే ఈ మూడు.

శ్రీకర ! పరిశోషిత ర, త్నాకర !
కమనీయగుణగణాకర !
కారుణ్యాకర ! భీకరశర ధా, రా కంపిత దానవేంద్ర !
రామనరేంద్రా !

1

తా ॥ శ్రీరామచంద్రా! సకల శుభాలను ప్రసాదించే వాడా! మనోహరమైన సమస్త సద్గుణాలకు నిలయమైనవాడా! కరుణాసాగరా! రత్నాలకు నిలయుడైన సముద్రుణ్ణి కృశింప చేసిన వాడా! భయంకరమైన బాణ ప్రయోగం చేత రాక్షసేంద్రులను వణికింపచేసిన వాడా! మహానుభావా! తరువాతి కథను వినండి.

వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె, నట్లుప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణ యానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

2

తా ॥ గొప్పవైన సకల సద్గుణాలతో ప్రకాశిస్తున్న శౌనకాది మహామునులను చూసి పద్దెనిమిది పురాణాలకు చక్కని వ్యాఖ్యానం చెప్పే సూతమహర్షి దశమ స్కంధంలోని ఉత్తరభాగ కథను చెప్పసాగాడు. ఆ విధంగా నిరశన దీక్షనవలంబించి భగవంతుని సాన్నిధ్యాన్ని కోరుకుంటున్న పరీక్షిన్మహారాజు – శుక మహర్షిని రుక్మిణీదేవి వివాహానంతరం జరిగిన కథను తెలుపవలసిందని కోరుకున్నాడు. దానికి సమ్మతించిన శుకయోగి ప్రద్యుమ్నుని కథను చెప్పటం మొదలు పెట్టాడు.

# ప్రద్యుమ్న కుమార చరిత్ర

ఉ. తామరసాక్షునంశమున దర్పకుఁ డీశ్వరు కంటిమంటలం
దా మును దగ్ధుఁడై పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధికై
వేమఱు నిష్ఠఁ జేసి హరివీర్యమునం బ్రభవించె రుక్మిణీ
కామిని గర్భమం దసురఖండను మారట మూర్తియో యనన్.

3

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! విష్ణుమూర్తి అంశతో శ్రీ లక్ష్మీనారాయణుల పుత్రుడిగా జన్మించిన మన్మథుడు పరమశివుని కంటి మంటలకు ఆహుతైనాడు. శరీరాన్ని కోల్పోయాడు. శంకరుని కరుణకోసం అనేక పర్యాయాలు స్తోత్రపాఠాలతో ఆ పరమేశ్వరుణ్ణి కొలిచాడు. తనకు, తిరిగి దేహమివ్వమని ప్రార్థించాడు. పరమేశ్వరుని కృపాకటాక్షంతో రుక్మిణీ శ్రీకృష్ణులకు కుమారుడిగా జన్మించాడు. ఆ విధంగా శ్రీకృష్ణపరమాత్మకు తనయుడైన మన్మథుడు మరో విష్ణుమూర్తా! అనేటట్లు అతిలోక సుందరుడిగా వెలుగొందాడు.

వ. అంత నా డింభకుండు ప్రద్యుమ్నుండను పేర విఖ్యాతుండయ్యె, నా శిశువు సూతికాగృహంబునఁ దల్లి పొదిఁగిట నుండం దనకు శత్రుండని యెఱింగి శంబరుండను రాక్షసుండు దనమాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తన గృహంబునకుం జనియె, నంత నా శాబకుండు జలధి జలంబునం దిగఁబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె, నందు.

4

తా ॥ ఆ బాలుడికి ప్రద్యుమ్నుడనే పేరు పెట్టారు. ఆ శిశువు పురిటిగదిలో తల్లి అయిన రుక్మిణీదేవి పొత్తిళ్ళలో ఉన్నవేళ శంబరుడనే రాక్షసుడు వచ్చి తన మాయాబలంతో శిశువును అపహరించి తీసుకొనిపోయి సముద్రంలో పారవేసాడు. నీళ్ళల్లో దిగబడిపోతున్న ఆ శిశువును

ఒక పెద్ద చేప మింగివేసింది.

క. జాలిఁ బడి పాఱు జలచర, జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని జ్వాలలు నిగుడఁగ నూరక, జాలంబులు వైచి పట్టు జాలరు లంతన్

5

తా ॥ రోజూ చేపలు పట్టే జాలరులు ఆ రోజు కూడా సముద్రం దగ్గరకు వెళ్ళి అటూ ఇటూ వేగంగా తిరుగుతున్న చేపలతో పాటు ప్రద్యుమ్నుని మింగిన పెద్ద చేపను కూడా వలవేసి పట్టుకొన్నారు.

వ. సముద్రంబులోన నా మీనంబును దత్సహచరంబులైన మీనంబులనుం బట్టికొని తెచ్చి శంబరునకుం గానుకఁగా నిచ్చిన నతండు వండి తెండని మహానస గృహంబునకుం బంచిన.

6

తా ॥ ఆ పెద్ద చేపను, దానితో పాటు మిగిలిన చేపలను తీసుకొని వచ్చి రాక్షస రాజైన శంబరాసురుడికి కానుకగా సమర్పించారు. జాలరులను పంపివేసి ఆ చేపలను వండి తీసుకురమ్మని శంబరుడు వాటిని వంటశాలకు పంపాడు.

క. రాజునగరి యడబాలలు, రాజీవముకడుపు వ్రచ్చి రాజనిభాస్యున్ రాజశిశువుఁ గని చెప్పిరి, రాజీవదళాక్షియైన రతికి నరేంద్రా!

7

తా ॥ రాజుగారి వంటశాలలోని వంటలవాళ్ళు పెద్ద చేపను కోసి చూసేటప్పటికి అందులో నుంచి చంద్రబింబం వంటి ముఖకాంతితో మెరిసిపోతున్న రాచబిడ్డ కనిపించింది. శిశువు రూపంలో ఉన్న ప్రద్యుమ్నుని చూసి వంటలవాళ్ళు ఆశ్చర్యపోయారు. వెంటనే ఆ

విషయం రతీదేవికి చెప్పారు.

వ. అంత నారదుండు వచ్చి బాలకుని జన్మంబును శంబరోద్యోగంబును మీనోదరప్రవేశంబునుం జెప్పిన విని యా రతి మాయావతి యను పేర శంబరునియింట, బాతివ్రత్యంబు సలుపుచు దహనదగ్ధుం డయిన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురు చూచుచున్న యది గావున, న య్యర్భకుండు దర్పకుం డని తెలిసి మెల్లన పుత్రార్థినియైన తెఱంగున శంబరుని యనుమతి వడసి సూపకారుల యొద్ద నున్న పాపనిం దెచ్చి పోషించుచుండె, నా కుమారుండును శీఘ్రకాలంబున నారూఢ యౌవనుండై.

8

తా ॥ పరీక్షిన్మహారాజా! శిశువు గురించిన విషయం రతీదేవికి కూడా అర్థంకాలేదు. అప్పుడామె వద్దకు నారదమహర్షి వచ్చాడు. జరిగిన విషయమంతా రతికి వివరించి చెప్పాడు. మన్మథుడే ప్రద్యుమ్నుడిగా జన్మించాడని, శంబరుని వలన సముద్రంలో పడవేయబడ్డాడని, చేపచేత మ్రింగి వేయబడ్డాడని తెలుసుకొన్న రతీదేవి – ఆ శిశువును (తన భర్తను) పెంచి పెద్దచేయటానికి శంబరాసురుని అనుమతి తీసుకొని పెంచసాగింది.

మన్మథుడు ఎప్పుడు సశరీరుడుగా తన కళ్ళముందు నిలబడతాడా అని ఎదురు చూస్తున్న రతీదేవి – మాయావతి అనే పేరుతో శంబరుని ఇంటిలోనే ఉండి పుత్రులులేని కారణంగా ఈ శిశువును పెంచుకొంటాననే నెపంతో శిశువును తన వద్దకు తెచ్చి లాలనాపాలనా చూస్తుండటంతో శత్రువైనా ప్రద్యుమ్నుడి గురించి శంబరుడికి ఏ అనుమానమూ రాలేదు.

రతి చేత పెంచబడుతున్న ప్రద్యుమ్నుడు శీఘ్రకాలంలోనే పెరిగి పెద్దవాడైనాడు. యౌవనవంతుడై మన్మథుడా అన్నట్లు ప్రకాశించాడు.

క. సుందర మగు తన రూపము సుందరు లొకమాఱు దేఱి చూచినఁ జాలున్ సౌందర్య మేమి చెప్పను?, బొందెద మని డాయుబుద్ధిఁ బుట్టించు నృపా!

తా ॥ ప్రద్యుమ్నుని సౌందర్యము వర్ణనాతీతము. అంత అందమైన ప్రద్యుమ్నుని రూపాన్ని సుందరీమణులు ఒక్కసారి చూస్తేచాలు! అతనినే వివాహమాడాలని కోరుకొంటారు. వేరెవ్వరి పొందూ వద్దని అనుకొంటారు.

సీ. చక్కని వారలు చక్కఁదనంబున కుపమింప నెవ్వఁడు యోగ్యుఁడయ్యె మిక్కిలి తపమున మెఱయు నంబికకునై శంకరు నెవ్వఁడు సగము సేసె! బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను వాణికై యెవ్వఁడు వాఁడి చెఱిచె! వేయిడాఁగులతోడి విబుధలోకేశుని మూర్తికి నెవ్వఁడు మూల మయ్యె!

తే. మునుల తాలిమి కెవ్వఁడు ముల్లుసూపు, మగల మగువల నెవ్వఁడు మరులుగొలుపు! గుసుమధనువున నెవ్వండు కొను విజయము, చిగురువాలున నెవ్వండు చిక్కువఱుచు?

10

తా ॥ 'సుందరాంగులు తమ అందచందాలను పోల్చుకోవడానికి ఎవరు సరైనవారని భావిస్తారో వారెవరోకాదు, ఒక్క మన్మథుడే. శివుణ్ణి పతిగా పొందడానికి అఖండ తపస్సు చేస్తున్న పార్వతీదేవి కోరిక ఫలించడానికి శంకరుని అర్ధనారీశ్వరుని చేసిన ఘనుడు – మన్మథుడే. సృష్టికర్తగా బ్రహ్మజ్ఞానాన్ని పొంది ప్రకాశించిన బ్రహ్మదేవుణ్ణి సరస్వతీదేవిపై కలిగిన మోహంచేత చలింపచేసిన కుసుమబాణుడు మన్మథుడే. ముల్లోకాలను పరిపాలించే దేవేంద్రుడు వేయిమచ్చలతో నిండిన శరీరం కలవానిగా రూపొందడానికి మూలకర్త – మన్మథుడే.

మునిసత్తముల నిగ్రహశక్తిని పోగొట్టగలవాడు, స్త్రీలకు పురుషులపట్ల, పురుషులకు స్త్రీలపట్ల కోరికలు కలిగించేవాడు, చెఱకు విల్లునుండి పూలబాణాలను వదలి జయలక్ష్మిని స్వీకరించేవాడు, వారు వీరనకుండా తన చిగురు కత్తితో అందరినీ వేధించి మరులుకొలిపేవాడు – మన్మథుడే కదా!'

వ. అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి పద్మదళలోచనుండును, ప్రలంబబాహుండును, జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని లజ్జాహాస గర్భితంబులైన చూపులం జూచుచు మాయావతి సురతభ్రాంతిఁ జేసినం జూచి ప్రద్యుమ్నుం డిట్లనియె.

11

తా ॥ అని సమస్త లోకవాసులు తనను స్తుతిస్తుంటే, అసాధారణ ప్రభావంతో, జగన్మోహనాకారంతో కాంతులీనుతున్న ప్రద్యుమ్నున్ని రతీదేవి చూసి మరులుకొంది. అయిదు బాణాలతో శృంగార వీరుడిగా వెలుగొందుతున్న ఆ కమలాక్షున్ని, ఆ ఆజానుబాహున్ని చూసి మాయావతి పేరుతో మెలగుతున్న రతి చిరునవ్వులు చిందించింది. తన కోరికను చూపులతో ప్రకటించింది.

మత్త. 'నా తనూభవుఁ డీతఁ డంచును నాన యించుక లేక యో
మాత నీ విదియేమి? నేఁ డిటు మాతృభావము మాని సం
ప్రీతిఁ గాముకిభంగిఁ జేసెదు పెక్కు విభ్రమముల్మహా
ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్.'

12

తా ॥ రతీదేవి భావాన్ని గమనించిన ప్రద్యుమ్నుడు ఆమెను మోహదృష్టి నుండి మరల్చడానికి ప్రయత్నించాడు.

తల్లీ! నీ ప్రవర్తన కొత్తగాఉంది. వీడు నా కొడుకుగదా అనే ఆలోచనకూడా లేకుండా, ఏమాత్రం బిడియపడకుండా ఒక కాముకురాలిలాగా నాయందు విలాసవిభ్రమాలు చూపిస్తున్నావు. తల్లిని అనే భావాన్ని మరచిపోయావు. నేనంటే ఇష్టపడుతున్నావు. చూడమ్మా! నన్ను మోహించటం నీకు ధర్మమూ కాదు, కీర్తీ కాదు.

వ. అనిన రతి యిట్లనియె: "నీవు నారాయణ నందనుండవైన కందర్పుండవు, పూర్వకాలంబున నేను నీకు భార్యనైన రతిని. నీవు శిశువై యుండునెడ నిర్దయుండై దొంగిలి తల్లిం దొఱంగఁ జేసి శంబరుండు కొనివచ్చి నిన్ను నీరధిలో వైచిన నొక్కమీనంబు మ్రింగె; మీనోదరంబు వెడలితీవు, మీఁదటి కార్య మాకర్ణింపుము.

13

తా ॥ ప్రద్యుమ్నుడి మాటలకు రతీదేవి జరిగిన విషయమంతా తెలియజెబుతుంది. "ప్రద్యుమ్నా! నీవు పూర్వం విష్ణుమూర్తి కుమారుడవైన మన్మథుడివి. నేను నీ భార్యనైన రతిని. ముక్కంటి మంటల వలన, శరీరం కోల్పోయిన నీవు రుక్మిణీ కృష్ణులకు పుత్రుడిగా ఉదయించావు. నీవు పసిప్రాయంలో ఉన్నప్పుడు శంబరాసురుడు నిన్ను దొంగిలించి, తల్లికి దూరం చేసాడు. అంతేకాదు నిన్ను శిశువనికూడా చూడకుండా శత్రుభావంతో సముద్రంలో పడవేసాడు. సముద్రంలో మునిగిపోతున్న నిన్ను ఒక పెద్ద చేప మింగింది. ఆ చేపను వంటకోసం తరగగా నీవు బయటపడ్డావు. అప్పటినుంచి నిన్ను పెంచాను. నేను, నిజానికి నీ భార్యనేగాని, తల్లిని గాను. ఇకముందు నీవు చేయవలసిన పని గురించి చెబుతాను, విను."

క. మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్ మాయికరణమున వీనిన్, మాయింపుము మోహనాది మాయలచేతన్.

14

తా ॥ "శంబరాసురుడు మహామాయావి. రాక్షస మాయలన్నీ తెలిసినవాడు. తన మాయలతో దేవతలను గెలుస్తాడు. మాయలకు ప్రసిద్ధుడైన ఈ శంబరుని సమ్మోహనం మొదలైన, ఇంకా గొప్పవైన మాయలను ప్రయోగించి వధించు."

మ.త్త. పాపకర్ముఁడు వీఁడు ని న్నిఁట బట్టి తెచ్చిన లేచి 'నా
పాపఁ డెక్కడఁ బోయెనో? సుతుఁ బాపితే విధి 'యంచుఁ దా

గ్రేపుఁ బాసిన గోవుభంగిని ఖీన్నయై పడి గాఢ సం
తాపయై నిను నోఁచి కాంచిన తల్లి కుయ్యిడ కుండునే?

15

తా ॥ "ప్రద్యుమ్నా! ఈ శంబరుడు ఘోరాతి ఘోరమైన పాపాలను చేసినవాడు. శిశుప్రాయంలో ఉన్న నిన్ను తన మయాబలంతో పట్టుకొని తెచ్చాడు. నిద్రనుంచి లేచిన నీ తల్లి తన పక్కలో నీవు కనపడకపోతే – నా కొడుకు ఏమైపోయాడా, ఎక్కడకు పోయాడా అని ఎంతగా బాధపడిందో కదా! నీ తల్లి ఎన్ని నోములునోచి నిన్ను కన్నదో కదా! అటువంటి ఆ మహా ఇల్లాలు దూడను పోగొట్టుకొన్న ఆవులాగా "ఓ భగవంతుడా! నా కొడుకును నాకు ఎందుకిలా దూరం చేశావు? నేనేపాపం చేశాను" అని ఎలా తల్లడిల్లిపోయిందో!"

వ. అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయావినాశి యయిన మహామాయవిద్య నుపదేశించె: ని వ్విధంబున.

16

తా ॥ అని రతీదేవి మహానుభావుడైన ప్రద్యుమ్నునికి సమస్త విషయాలు కూలంకషంగా బోధపరచి శత్రువుల యొక్క అన్ని మాయలను నశింపచేసేటటువంటి 'మహామాయా విద్యను' ఉపదేశించింది.

మ. గురుమాయారణవేదియై, కవచియై, కోదండియై, బాణియై
హరిజుం డోరి నిశాట! వైచితివి నాఁ డంభోనిధి న్నీన్ను ఘో
ర రణాంభోనిధి వైతు నిన్ను నిదె వే రమ్మంచుఁ జీరెన్మనో
హర దివ్యాంబరు నుల్లస ద్దనుజ సేనాడంబరున్ శంబరున్.

17

తా ॥ కృష్ణపుత్రుడైన ప్రద్యుమ్నుడు మహాబలపరాక్రమ సంపన్నుడు. రతీదేవి ఉపదేశంతో

మాయాయుద్ధరహస్యాలనన్నీ ఆకళింపు చేసుకొని, కవచధారియై, ధనుర్బాణాలు తీసుకొని శత్రువైన శంబరుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. శంబరుణ్ణి సమీపించి "ఓరీ రాక్షసాధమా! ఆనాడు నన్ను సముద్రంలో పారవేస్తావా? ఈనాడు నిన్ను ఘోరరణమనే సముద్రంలో పైకి లేవకుండా పడవేస్తాను. వెంటనే నాతో యుద్ధానికి రా!" అని పిలిచాడు. ఉత్సాహంతో, ఉద్రేకంతో ఉన్న రాక్షససైన్యాలతో కూడి ఉన్నాడు శంబరుడు. మనోహరమైన సుందర వస్త్రాలను ధరించి సంతోషంతో ఉన్న శంబరుడు ప్రద్యుమ్నున్ని చూసాడు.

చ. అదలిచి యిట్టు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠుర భాషణంబులన్
బదహతమై వడిం గవయు పన్నగరాజముఁ బోలి శంబరుం
డదరుచు లేచి వచ్చి గద నచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల
ద్భిదురకఠోరఘోష సమభీషణనాదము చేసి యార్చుచున్.

18

తా ॥ శంబరుడు ఈ విధంగా తనను భయపెడుతూ, బెదిరిస్తూ ప్రద్యుమ్నుడన్న మాటలకు తోక త్రొక్కిన త్రాచు పాములాగా ఒక్క ఉదుటనలేచి గదను గైకొని ప్రద్యుమ్నునిపై విసిరాడు. పెద్దగా, భయంకరంగా, పిడుగుపడ్డట్లు అరిచాడు, ఆ అరుపుతో శత్రువెవరైనా సరే భయపడవలసిందే.

క. దనుజేంద్రుఁడు వ్రేసిన గదఁ, దన గదచేఁ బాయ నడిచి దనుజులు బెదరన్
దనుజాంతకుని కుమారుఁడు, దనుజేశుని మీఁద నార్చి తన గద వైచెన్.

19

తా ॥ కాని, ప్రద్యుమ్నుడంతకన్న పెద్దగా అరుస్తూ, రాక్షసుని గదను తునాతునకలుచేసి, అక్కడ ఉన్న రాక్షసవీరులందరూ హడలి పోయేటట్లు తన గదతో శంబరుని మోదాడు.

వ. అంత నారక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకు దొల్లి మయుం డెఱింగించిన

దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన నమ్మహారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వమాయా వినాశిని యైన సాత్త్విక మాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె. మఱియు వాఁడు భుజగ గుహ్యక పిశాచ మాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి.

20

తా ॥ దానితో శంబరాసురుడికి రోషం పెరిగింది. పూర్వం మయాసురుడు తనకు నేర్పించిన రాక్షసమాయలను ఆశ్రయించాడు. ఒక్కసారిగా ఆకాశం మీదకు ఎగిరి ప్రద్యుమ్నుడిపై బాణవర్షం కురిపించాడు. మహావీరుడైన కృష్ణపుత్రుడు ఆ బాణపరంపరకు బాధపడ్డప్పటికీ, ఏమాత్రం చలించలేదు. యుద్ధమాత్సర్యంతో శంబరుని సర్వమాయలను హరించివేసే సాత్త్విక మాయను ప్రయోగించి రాక్షసుడు కురిపించిన బాణవర్షాన్ని నిమిషంలో ఆపివేసాడు. శంబరుడు కూడా ఊరుకోలేదు. మళ్ళీ అనేక మాయలు పన్ని ప్రద్యుమ్నున్ని నొప్పించాడు. శంబరుడు ప్రయోగించిన భుజగగుహ్యక పిశాచ మాయలన్నీ తొలగిపోయేటట్లు ప్రద్యుమ్నుడు మాయారణకౌశలాన్ని ప్రదర్శించాడు.

క. దండధరమూర్తిఁ గై కొని, యొండాడక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్ ఖండించె శంబరుని తలఁ, గుండల కోటీరమణులు గుంభిని రాలన్.

21

తా ॥ కృష్ణపుత్రుడైన ప్రద్యుమ్నుడు మారుమాట మాటాడకుండా, యమధర్మరాజు రూపాన్ని తీసుకొన్నాడా, అనేటట్లు భయంకరాకారంతో మహోగ్రమైన శక్తిని తీసుకొని శంబరాసురుని తలను ఒక్కవేటుతో నరికివేసాడు. ఆ రాక్షసరాజు కుండలాల నుంచి, కిరీటంనుంచి మణులు జలజలరాలి నేలమీద పడ్డాయి.

క. చిగురాకడిదపు ధారను, జగములఁ బరవశము సేయు చలపాదికి దొ

డ్డగు నుక్కడిదంబునఁ దన, పగతుం దెగవ్రేయు టెంత పని చింతింపన్?

22

తా ॥ కేవలం చిగురాకు కత్తివేటుతోనే సమస్తలోకాలను పరవశింపచేసే శక్తిమంతునికి, మహోగ్రమైన కత్తిని ప్రయోగించి శత్రువును తెగటార్చడం ఎంతపని?

క. బెగడుచు నుండఁగ శంబరుఁ, దెగడుచుఁ బూవింటిజోదు ధీర గుణంబుల్ పొగడుచు గురిసిరి ముదమున, నెగడుచుఁ గుసుమముల ముసురు నిర్జరు లధిపా!

23

తా ॥ ఇంతకాలం తమను కష్టాలపాలు చేసిన శంబరాసురుని నిందిస్తూ, మన్మథుని ధీరవీర గుణాలను ప్రశంసిస్తూ నింగినున్న దేవతలు ప్రద్యుమ్నునిపై పూలవర్షం కురిపించారు. వారి సంతోషానికి అంతులేదు.

వ. ఇట్లు శంబరుని వధియించి విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు నాకాశచారిణియైన యా రతీదేవి గగనపథంబుఁ బట్టి ద్వారకానగరోపరిభాగమునకుం జనుదెంచిన.

24

తా ॥ ఈ విధంగా శంబరాసురున్ని సంహరించి మహోత్సాహంతో పొంగిపోతున్న ప్రద్యుమ్నున్ని సమీపించింది రతీదేవి. తన నాథుడైన ప్రద్యుమ్నునితో పాటు ఆకాశ మార్గంలో ప్రయాణించి ద్వారకానగరం పైభాగం వద్దకు వచ్చింది.

ఆ. మెఱుఁగుఁదీగెతోడి మేఘంబుకై వడి, యువిదతోడ మింటి నుండి కదలి
యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు, మెలఁగుచున్న లోని మేడకడకు.

25

తా ॥ ద్వారకానగరం పైభాగాన నిల్చిన రతీప్రద్యుమ్నులు మెరుపు తీగతో కూడిన మేఘంలా ఉన్నారు. స్త్రీజనం మెలగుతున్న అంతఃపురం వద్దకు వారిద్దరూ ఆకాశం నుంచి కదిలి క్రిందకు దిగివచ్చారు.

మ. జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం జంద్రాననున్ నీల సం
కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహ మధ్యున్ మహో
త్పల పత్రేక్షణు మందహాసలలితుం బంచాయుధున్ నీరజా
క్షులు దా రేమఱుపాటఁ జూచి హరి యంచుం డాఁగి రయ్యై యెడన్.

26

తా ॥ నీలమేఘశ్యామల వర్ణం కలవానిని, ఆజానుబాహువులతో ఒప్పుతున్నవానిని, చంద్రబింబంవంటి ముఖం కలవానిని, నల్లని ముంగురులతో శోభిల్లుతున్నవానిని, పసుపుపచ్చని పట్టు వస్త్రాన్ని ధరించినవానిని, ఘనమైన వక్షస్థలం గలవానిని, సింహం నడుమువంటి సన్నని నడుముగలవానిని, నల్లకలువరేకులవంటి కన్నులు గలవానిని, చిరునవ్వులు చిందిస్తూ జగదేక సుందరుడిగా ప్రకాశిస్తున్న మన్మథుని మారురూపుడైన ప్రద్యుమ్నున్ని చూశారు అంతఃపురకాంతలు. ఒక్కసారిగా చూడటంతో ఆ కాంతలందరూ ఏమరుపాటుచెంది ప్రద్యుమ్నున్ని శ్రీకృష్ణుడే అనుకొని మూలమూలలకు వెళ్ళి దాక్కొన్నారు.

క. కొందఱు హరి యగు నందురు, కొందఱు చిహ్నములు కొన్ని కొన్ని హరికి లే
వందురు మెల్లన తెలియుద, మందురు మఱుఁ జూచి కొంద ఱబలలు గుములై.

27

తా ॥ మన్మథుని చూసిన మగువలలో కొంతమంది ఇతడు కృష్ణుడే సుమా అని అన్నారు. మరికొంతమంది ఆ సుందరాకారుని తేరిపార చూసి ఇతనిలో ఉన్న చిహ్నాలు కొన్ని కృష్ణుడిలో లేవని తీర్మానించారు. ఇంకొంతమంది మెల్లగా తెలుసుకొందాంలే అన్నారు. ఆ విధంగా అక్కడ

ఉన్న అబలలందరూ గుంపులు గుంపులుగా చేరి ప్రద్యుమ్నున్ని గురించి తలో విధంగా తలపోయసాగారు.

క. హరి యని వెనుచని పిదపన్, హరిఁ బోలెడువాఁడు గాని హరి గాఁ డనుచున్ హరిమధ్య లల్లనల్లన, హరినందను డాయ వచ్చి రాశ్చర్యమునన్.

28

తా ॥ ఇతగాడు కృష్ణుడే అని ప్రద్యుమ్నుని వెనకగా వెళ్ళి, చక్కగా పరిశీలించి కృష్ణుడిలాగా ఉన్నాడు గాని కృష్ణుడు కాడని నిర్ణయించారు. సింహపు నడుమువంటి నడుములుగల ఆ సుందరీమణులందరూ హరినందనుడైన ప్రద్యుమ్నుడిని చూడాలనే ఆసక్తితో అతనిని సమీపించి ఆ మన్మథాకారుణ్ణి ఆశ్చర్యంతో చూడసాగారు.

ఉ. 'అన్నులు సేర వచ్చి మరు నందఱుఁ జూడఁగఁ దాను వచ్చి సం
పన్నగుణాభిరామ హరిపట్టపుదేవి విదర్భపుత్రి క్రే
గన్నుల నా కుమారకుని కై వడి నేర్పడఁ జూచి బోటితోఁ
జన్నులు సేఁప నిట్లనియె సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్.

29

తా ॥ అంతఃపురంలో ఉన్న స్త్రీ జనమంతా ప్రద్యుమ్నుడిని చూడటానికి వెళుతున్నారన్న విషయం పట్టపుదేవేరి అయిన రుక్మిణీదేవికి తెలిసింది. విదర్భరాజ పుత్రి, సకల సద్గుణ సంపన్నురాలు అయిన రుక్మిణీదేవి కూడా ఆ సుందరుణ్ణి చూడటానికి వెళ్ళింది. ఆ కుమారుని తీరుతెన్నులను, పోలికలను, అందచందాలను క్రీగంటితో చూసింది. రుక్మిణీదేవి ప్రద్యుమ్నుడిని చూడగానే తన పాలిండ్లు పాలను స్రవించడాన్ని అర్థంచేసుకొని ఒక నిముషం తొట్రుపాటును, మరో నిముషం దైన్యాన్ని పొంది ప్రక్కనే ఉన్న చెలికత్తెతో తన మనోభావాన్ని తెలియజేసింది.

శా. 'ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం

డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో
యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నేనోములన్ నోఁచెనో
యే కాంతామణియందు వీని కనెనో యేకాంతుఁ డీకాంతునిన్.

30

తా ॥ సఖీ! తామరరేకులవంటి కన్నులుగల ఈ సుకుమార కుమారుడు, చంద్రబింబంవంటి ముఖ సౌందర్యంకలవాడు, సింహం నడుము వంటి నడుముగల అందగాడు ఎక్కడ నుంచి ఇక్కడకు వచ్చాడో గదా! శుభాకారుడైన ఈ కుమారుణ్ణి కన్న అదృష్టవంతురాలు మునుపు ఏ ఏ నోములు నోచి ఉందో కదా! ఏ కాంతుడు ఈ మనోహరాకారుణ్ణి ఏ కాంతయందు పుత్రునిగా కన్నాడో కదా!

శా. ఆళీ! నా తొలుచూలి పాపనికి బోర్కాడించి నే సూతికా
శాలా మధ్యవిశాల తల్పగతనై చన్నిచ్చి నిద్రింప నా
బాలున్ నా చనుఁబాలకుఁం జెఱిచి యే పాపాత్ము లే త్రోవ ము
న్నే లీలం గొనిపోయిరో? శిశువుఁ దా నే తల్లి రక్షించెనో!

31

తా ॥ సఖీ! నా తొలి చూలు బిడ్డడికి చక్కగా స్నానం చేయించి, పాలిచ్చి నిద్రపుచ్చాను. ప్రసూతిశాల మధ్య భాగంలోని సువిశాలమైన పాన్పుమీద కొడుకుతోసహా నేను కూడా నిద్రపోయాను. ఆ సమయంలో నా పాలుత్రాగే శిశువైన నా కుమారుణ్ణి ఏ పాపాత్ములో నా నుంచి వేరుచేసి ఎక్కడికో ఎత్తుకుపోయారు. వాళ్ళు ఏ విధంగా నా పసికూనను తీసుకుపోయారో తెలియదు. ఆ పసివాడిని ఏ తల్లి రక్షించిందో!

క. కొడుకఁడు నా పొదిగిఁటిలోఁ, జెడిపోయిన నాఁట నుండి చెలియా! తెలియం
బడ దే వార్తయు నతఁ డే, వడువున నె చ్చోట నిలిచి వర్తించెడినో!

32

తా ॥ చెలీ! నా కొడుకు పాలు త్రాగే ప్రాయంలోనే నానుంచి దూరమయ్యాడు గదా! అప్పటినుంచి ఇప్పటి దాకా బాలుడి వార్త ఏమీ తెలియలేదు. ఎక్కడున్నాడో! ఏ విధంగా ఉన్నాడో! ఏం చేస్తున్నాడో!

క. ఇందాకఁ వాఁడు బ్రదికిన, సందేహము లేదు దేహచాతుర్యవయ స్సౌందర్యంబుల లోకులు, వందింపఁగ నితనియంతవాఁ డగుఁ జుమ్మీ!

33

తా ॥ చెలియా! ఇప్పటిదాకా నా కొడుకు బ్రతికి ఉన్నట్లయితే ఈ మోహనాకారుడంతవాడయ్యేవాడు. సందేహమే లేదు. ఎందుకంటే వయస్సులోగాని, అందంలోగాని, నేర్పరితనంలోగాని, శరీర దారుఢ్యంలోగాని ఇంతటి వాడే అయి ఉంటాడు.

మ. అతివా! సిద్ధము నాఁటి బాలకున కీయాకార మీ వర్ణ మీ
గతి యీ హాసవిలోకనస్వరము లీ గాంభీర్య మీ కాంతి వీఁ
డతఁడే కాఁదగు నున్నవారలకు నా యాత్మేశు సారూప్య సం
గతి సిద్ధింపదు, వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్.

34

తా ॥ సఖీ! నేనన్నది నిజం. ఆనాడు నాకు ఉదయించిన బాలునిలో ఇదే రూపం, ఇదే రంగు, ఈ రకమైన చూపులు, ఇదే స్వరం, ఇదే విధమైన చిరునవ్వు, ఈ గాంభీర్యగుణం, ఈ ముఖకాంతి – అన్నీ ఇతనిలో ఉన్నట్లే ఉండేవి. ఈ పురుషుడు నా కుమారుడే అయి ఉంటాడు. కాకపోతే నా భర్తయొక్క రూపురేఖలు, సారూప్యలక్షణాలు ఈ యువకునిలో ఎందుకు కానవస్తాయి? వేరే వారిలో ఈ పోలికలుండవు కదా! ఇతని చరిత్ర తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉంది.

క. పొదలెడి ముదమునఁ జిత్తము, గదలెడి నాయెడమమూఁపు, గన్నుల వెంటం బొదలెడి నానందాశ్రులు, మెదలెడిఁ బాలిండ్లఁ బాలు, మేలయ్యెడినో!

35

తా ॥ చెలీ! ఈ యువకుడిని చూస్తున్నకొద్దీ నా మనస్సులో ఎక్కడలేని సంతోషం పుట్టుకొస్తోంది. పైగా శుభసూచకంగా ఎడమ భుజం అదురుతోంది. అంతేకాదు, నా కన్నులనుండి ఆనందాశ్రువులు జాలువారుతున్నాయి. పాలిండ్ల నుంచి పాలు స్రవిస్తున్నాయి.

వ. అని డోలాయమాన మానసయై వితర్కించుచు.

36

తా ॥ ఆ విధంగా ఆలోచించి ఆలోచించి మనస్సు ఊగిసలాడుతుండగా రుక్మిణీదేవి ఇతడు తన కుమారుడౌనా కాదా అని తర్కించడం మొదలు పెట్టింది.

క. తనయుఁ డని నొడువఁ దలఁచును, దనయుఁడు గాకున్న మిగులఁ దతిగొని సవతుల్ తను నగియెద రని తలఁచు న, తను సంశయ మలముకొనఁగఁ దనుమధ్య మదిన్.

37

తా ॥ రుక్మిణీదేవి ఆ వచ్చినవాడు తన కుమారుడే అని అందరిముందు చెప్పాలని అనుకొంది. ఒకవేళ అతడు తన పుత్రుడు కాకపోతే తన మాటలు విన్న సవతులు సమయం దొరికిందిగదా అని తనను హేళన చేస్తారేమో! అనుకొంది. అలవి మాలిన సంశయంతో రుక్మిణీదేవి ఏం చేయాలో తోచక చాలాసేపు కొట్టుమిట్టాడింది.

వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలి నగరి కావలి వారి వలన విని కృష్ణుండు దేవకీ వసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియు వివరింపక యూరకుండె, నంత నారదుండు చనుదెంచి శంబరుఁడు గుమారునిం గొనిపోవుట

మొదలైన వార్త లెఱింగించిన,

38

తా ॥ శ్రీకృష్ణుడు అంతఃపుర రక్షకులవల్ల విషయమంతా విని, తల్లిదండ్రులైన దేవకీవసుదేవులను వెంటబెట్టుకొని ప్రద్యుమ్నుడున్న నగరానికి వేంచేసాడు. కృష్ణుడు సమస్త విషయాలూ తెలిసిన భగవంతుడైనా ప్రద్యుమ్నున్ని గురించి ఏమీ చెప్పకుండా మిన్నకున్నాడు. ఆ సమయంలో నారదమహర్షి వచ్చి అక్కడ ఉన్నవారందరికీ శంబరుడు శిశువునెత్తుకొని పోయిన నాటినుంచి జరిగిన సమస్త విషయాలు తెలియజెప్పాడు.

క. "చచ్చిన బాలుఁడు గ్రమ్మఱ, వచ్చినక్రియ వచ్చెఁ బెక్కువర్షములకు నీ సచ్చరితు నేఁడు గంటిమి, చెచ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో?"

39

తా ॥ "చచ్చినవాడు మళ్ళీ తిరిగి బ్రతికి వచ్చినట్లుగా ప్రద్యుమ్నకుమారుడు మన దగ్గరకు వచ్చాడు. ఎన్ని సంవత్సరాల తరువాత ఈ పుణ్యాత్మున్ని చూడగలిగాము? పూర్వం ఎంత తపస్సు చేసామో గదా రాకుమారున్ని మళ్ళీ చూడగలగడానికి!"

వ. అని యంతఃపురకాంతలును, దేవకీ వసుదేవ రామకృష్ణులును యథోచిత క్రమంబున నా దంపతుల దివ్యాంబరాభర ణాలంకృతుల సత్కరించి సంతోషించిరి, రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించుకొని.

40

తా ॥ అని అంతఃపుర కాంతలందరూ సంతోషించారు. రతీప్రద్యుమ్నులను సముచితంగా అలంకరించారు. బలరామ కృష్ణులు, దేవకీవసుదేవులు ఆ దంపతులను చక్కని వస్త్రాలతో, సువర్ణాభరణాలతో సత్కరించి తృప్తి చెందారు. రుక్మిణీదేవి కుమారుణ్ణి కౌగిలించుకొని పరమానందం చెందింది.

శా. 'అన్నా? నా చనుఁబాపి నిన్ను దనుజుండంభోనిధిన్ వైచెనే
యెన్నే వర్షము లయ్యెఁ బాసి సుత! నీ వేరీతి జీవించి యే
సన్నాహంబున శత్రు గెల్చితివొ? యాశ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతం జెందితిన్.

41

తా ॥ రుక్మిణీదేవి కుమారుణ్ణి చూసి "తండ్రీ! రాక్షసుడు నిన్ను నా పాలు త్రాగనివ్వకుండా తీసుకుపోయి సముద్రంలో పారవేసాడా? బాబూ! నిన్ను దూరం చేసుకొని ఎన్ని సంవత్సరాలయిందిరా? ఇంతకాలం నువ్వు ఎలా జీవించావో! ఏమో! శత్రువును ఏ విధంగా గెలవగలిగావు? అంతా ఆశ్చర్యంగా ఉంది. ఇప్పటికైనా నిన్ను చూడగలిగాను. నేను ధన్యురాలినయ్యాన" ని ఆనందాశ్రువులు రాల్చింది.

వ. అని కొడుకుం జూచి సంతోషించి కోడలి గుణంబులు కైవారంబు సేసి, వినోదించుచుండె, నంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించి, రందు.

42

తా ॥ కొడుకు దొరికినందుకు ఎనలేని సంతోషాన్ని పొందిన రుక్మిణీదేవి కోడలైన రతీదేవి సుగుణాలను పొగిడి, వారిద్దరితో ఆనంద సాగరంలో ఓలలాడింది. ద్వారకానగరంలోని ప్రజలందరూ ప్రద్యుమ్నుని రాక విని ఉప్పొంగిపోయారు.

క. సిరిపెనిమిటి పుత్రకుఁ డగు, మరుఁ గని హరిఁ జూచినట్ల మాతలు దమలోఁ గరఁగుదు రఁట, పరకాంతలు, మరుఁగని మోహాంధకారమగ్నులు గారే!

43

తా ॥ ప్రద్యుమ్నుని మాతలందరూ విష్ణుదేవుని పుత్రుడైన మన్మథుని అవతారరూపుడైన ప్రద్యుమ్నున్ని చూసి శ్రీకృష్ణుణ్ణి చూసినట్లుగానే భావించి తమ మనస్సులలో కరిగిపోతుంటారట!

అటువంటిది ఆ మన్మథుని చూసి పరకాంతలు మోహంతో అంధకాంతలై పోవడంలో ఆశ్చర్యమేముంది?"

వ. అని చెప్పి శుకుం డిట్లనియె

44

తా ॥ ఆ విధంగా ప్రద్యుమ్న కుమారుని చరిత్ర చెప్పిన శుకమహర్షి మళ్ళీ ఇలా చెప్పసాగాడు:

క. సత్రాజిత్తు నిశాచర, శత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ బుత్రి స్యమంతకమణియును, మైత్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా!

45

తా ॥ "పరీక్షిన్మహారాజా! సత్రాజిత్తు రాక్షసవైరి అయిన శ్రీకృష్ణ పరమాత్మకు అపకారం చేసాడు. తన అపరాధాన్ని తెలుసుకొన్న తరవాత, స్నేహం పాటించి, వినయవంతుడై శ్యమంతకమణిని, తన కుమార్తె అయిన సత్యభామను తీసుకొని వచ్చి యదువల్లభుడైన కృష్ణునికి కానుకలుగా ఇచ్చాడు."

వ. అనిన విని రా జట్లనియె.

46

తా ॥ అని శుక యోగి చెప్పగానే పరీక్షిత్తు ఈ విధంగా అన్నాడు:

ఆ. శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసెఁ?, గూఁతు మణిని నేల కోరి యిచ్చె? నతని కెట్లు కలిగె నా శ్యమంతకమణి, విప్రముఖ్య! నాకు విస్తరింపు.

47

తా ॥ "మహాత్మా! సత్రాజిత్తు కృష్ణుడి పట్ల ఏం తప్పు చేశాడు? కోరి కోరి తన పుత్రికను, ఆ శ్యమంతకమణిని హరికెందుకిచ్చాడు? అసలు సత్రాజిత్తుకు ఆ శ్యమంతకమణి ఏ విధంగా లభించింది? విప్రోత్తమా! ఈ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పండి."

వ. అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె. సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుడు శ్యమంతకమణి నిచ్చె, నా మణి కంఠమున ధరియించి సత్రాజిత్తు భాస్కరుని భంగి భాసమానుండై ద్వారకా నగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటల తిరోహితదృష్టు లయి సూర్యుం డని శంకించి వచ్చి హరి కిట్లనిరి.

48

తా ॥ పరీక్షిత్తు అడిగిన ప్రశ్నను విన్నవాడై శుకయోగి ఈ విధంగా చెప్పసాగాడు: "సత్రాజిత్తనేవాడు సూర్యభగవానుడికి భక్తుడై ఆ పరమాత్మతో స్నేహం చేసాడు. సత్రాజిత్తు భక్తికి, మైత్రీభావానికి సూర్యదేవుడు సంతోషించి శ్యమంతకమణి అనే గొప్పమణిని అతనికి వరంగా ప్రసాదించాడు. శ్యమంతకమణిని మెడలో ధరించి ద్వారకానగరానికి వచ్చిన సత్రాజిత్తు అపరసూర్యుడిలాగా ప్రకాశించడంతో ద్వారకావాసులందరూ అతడే సూర్యుడని భ్రమించారు. కృష్ణుని వద్దకు వెళ్ళి తాము చూసిన వ్యక్తి గురించి ఇలా చెప్పారు:

క. నారాయణ! దామోదర!, నీరజదళనేత్ర? చక్రి! నిఖిలేశ! గదా
ధారణ! గోవింద! నమ, స్కారము యదుపుత్ర! నిత్యకల్యాణనిధీ!

49

తా ॥ "నారాయణా! దామోదరా! పద్మపత్రాక్షా! చక్రీ! జగన్నాథా! గదాయుధ ధరా! గోవిందా! యదువంశోద్భవా! నిత్యకల్యాణ ప్రదా! దేవా! నీకు నమస్కారం.

మ. దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ! నిన్ జూడ యా

దవ వంశంబున గూఢమూర్తివి జగత్ప్రాణుండవై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేఁడిదె రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో, నీరజగర్భుఁడో యొకఁడు చేరన్వచ్చె మార్గంబునన్.

50

తా ॥ యాదవ వంశంలో జన్మించి గూఢమూర్తిగా ఉన్న దేవదేవుడవు నీవు. సమస్త జగత్తులను రక్షించే నిన్ను దర్శించాలని దిక్పాలకులే కోరుకుంటుంటారు. అటువంటి పరమాత్ముడవైన నిన్ను ఒకానొక తేజోమూర్తి చూడటానికి వస్తున్నాడు. దిగంతాల వరకు వ్యాపించిన ఆతని తేజస్సు చూస్తుంటే సూర్యభగవానుడో, లేక బ్రహ్మదేవుడో ఇక్కడకు వస్తున్నాడనిపించింది.

వ. అని యిట్లు పలికిన మూఢజనులఁ జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజితుండు గాని సూర్యుండు గాఁ డని పలికె, నంత సత్రాజితుండు శ్రీయుతంబయి మంగళాచారంబైన తన గృహంబునకుం జని, మహీసురులచేత నిజదేవతా మందిరంబున న మ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె, నదియును బ్రతిదినంబు నెనిమిది బారువుల సువర్ణంబు గలిగించుచుండు.

51

తా ॥ సాధారణులైన ద్వారకావాసుల అమాయకత్వానికి, వారి మాటలకు శ్రీకృష్ణుడు ఒక నవ్వు నవ్వి అతడు సూర్యదేవుడు కాడు, మణిధరించి వస్తున్న సత్రాజిత్తని తెలియజెప్పాడు. సత్రాజిత్తు, శుభకరమైన, మంగళయుక్తమైన, సంపదలకు నిలయమైన తన ఇల్లు చేరాడు. ఆగమ విదులైన బ్రాహ్మణోత్తములను రావించి తాను తెచ్చిన శ్యమంతకమణిని వారి చేత శాస్త్రోక్త విధంగా దేవతాగృహంలో ప్రవేశింపచేసాడు. అనర్ఘమైన ఆ శ్యమంతకమణి ప్రతిదినము ఎనిమిది బారువుల సువర్ణాన్ని ప్రసాదిస్తుంటుంది.

క. ఏ రా జేలెడు వసుమతి, నా రత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్వమాయిక, మారీ దుర్భిక్షభయము మాను నరేంద్రా!

52

తా ॥ ఏ మహారాజు పరిపాలించే రాజ్యంలో ఆ మణి భక్తిశ్రద్ధలతో పూజింపబడుతుంటుందో ఆ రాజ్యంలో రోగాలుగాని, ఉపద్రవాలుగాని, ఆపదలుగాని, అగ్ని ప్రమాదాలుగాని, జన నష్టంగాని, కరువుకాటకాలుగాని ఏవీ ఉండవు.

క. అ మ్మణి యాదవవిభునకు, ని మ్మని హరి యడుగ నాతఁ డీక ధనేచ్ఛన్ బొమ్మని
పలికెను జక్రికి, ని మ్మణి యీకున్న మీఁద నేమౌ ననుచున్.

53

తా ॥ ఆ విషయం తెలిసిన కృష్ణుడు శ్యమంతకమణిని యాదవ ప్రభువుకిమ్మని చెప్పాడు. అయినా సత్రాజిత్తు ధనంమీద ఉన్న అపేక్షతో మణిని ఎవరికీ ఇవ్వనని కృష్ణుని మాటను తిరస్కరించాడు. కృష్ణుడికిగాని, యాదవరాజుకుగాని ఈ మణిని ఇవ్వకపోతే ఏమౌతుందిలే, ఏమీకాదని, సత్రాజిత్తు మణి ఇవ్వకుండా పట్టుపట్టి కూర్చున్నాడు.

వ. అంత.

54

తా ॥ అప్పుడు,

క. అదరెడు వేడ్కఁ గంఠమున న మ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోరవన్యమృగయారతి నేగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్క హరి పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁ గను జాంబవంతుఁడు ప్రభాత్తదిగంతము నాశ్యమంతమున్.

55

తా ॥ సత్రాజిత్తు తమ్ముడైన ప్రసేనుడు ఆ శ్యమంతకమణిని తన మెడలో ధరించాలనే కుతూహలంతో ఒకరోజున ఆ మణిహారాన్ని ధరించి క్రూర జంతువులను వధించాలని వేటకు వెళ్ళాడు. మహారణ్యంలో ఒక సింహం వచ్చి ప్రసేనుడిపై పడి అతనిని చంపి అతని మెడలో ఉన్న మణిని తీసుకొని పరుగెత్తింది. ఆ వనంలో తిరుగుతున్న భల్లూకరాజైన జాంబవంతుడు సింహాన్ని వధించి దానిని సమీపించాడు. దిగంతాల వరకు కాంతులీనుతున్న శ్యమంతకమణిని సింహం దగ్గర చూసాడు.

క. కని జాంబవంతుఁ డా మణిఁ, గొనిపోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమిసుతకును, ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా!

56

తా ॥ చూసినదే తడవుగా జాంబవంతుడు ఆ మణిని తీసుకొనిపోయి దగ్గరలోనే ఉన్న కొండగుహలో ప్రవేశించి అక్కడ ఉన్న తన ముద్దుల కూతురునకు ఆడుకోవడానికి బంతిలాగా ఆ మణిని ఇచ్చాడు.

వ. అంత సత్రాజిత్తుండు తన సహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు.

57

తా ॥ ద్వారకలో ఉన్న సత్రాజిత్తు తన తమ్ముడైన ప్రసేనుడు కనబడకపోవటంతో దిగులు చెందాడు. దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు.

మ. ‘మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మరాద్య లే’ దంచు దూ
షణముం జేయఁగ వానిదూషణముఁ గంసధ్వంసి యాలించి యే

త్రవణమున్ నా యెడ లేదు, నింద గలిగెన్ వారించు టే రీతియో?'

58

తా ॥ కృష్ణుడే మణిని అపహరించి ఉంటాడని అనుకొన్నాడు. అనుకోవటడమే కాదు. కృష్ణుణ్ణి దూషించాడు. అందరితో చెప్పాడు. 'నా తమ్ముడైన ప్రసేనుడు మణిని కంఠంలో ధరించి వేటకోసం అడవికి వెళ్ళినప్పుడు మణికోసం కృష్ణుడు నా సహోదరుణ్ణి చంపి ఆ మణిని గ్రహించి దాచి ఉంటాడు. కృష్ణుడికి అసలు మర్యాదనేది లేదు. ఎవరైనా ఇలా చేస్తారా?" అని నలుగురితో సత్రాజిత్తన్న మాటలు కంసుణ్ణి వధించిన శ్రీకృష్ణుని చెవిని పడ్డాయి. కృష్ణుడు "నేనే దోషం చేయలేదు. అకారణంగా నా మీద నింద పడింది. ఆ నిందను ఏ విధంగా పోగొట్టుకోవాలో గదా!"

వ. అని వితర్కించి.

59

తా ॥ అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

మ. తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహాశ్వంబుం బ్రసేనుం బ్రసే
నుని హింసించిన సింహమున్ మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ
గిన భల్లూకము చొచ్చి యున్న గుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై.

60

తా ॥ కాంతిమంతుడైన శ్రీకృష్ణుడు తనవారినందరినీ ప్రసేనుడు ఎటువైపు వెళ్ళాడో అడిగి తెలుసుకొన్నాడు. ఆ విధంగా అందరినీ అడుగుతూ వచ్చివచ్చి అడవిలో ఒక చోట కూలిపోయిపడి ఉన్న ప్రసేనుడి గుఱ్ఱాన్ని చూశాడు. తరవాత చనిపోయిపడి ఉన్న ప్రసేనుడి కళేబరాన్ని చూశాడు. మరికొంత దూరం వెళ్ళి ప్రసేనుని వధించిన సింహాన్ని చూశాడు. ఆ

తరువాత సింహాన్ని సంహరించి గుహలోకి వెళ్ళి ఉన్న ఎలుగుబంటి నివాసాన్ని చూశాడు.

వ. కని తనవెంట వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుండైన హరి నిరంతర నిబిడాంధకార బంధురంబయి, భయంకరంబై, విశాలంబయిన గుహాంతరాళంబు సొచ్చి, చని యక్కడ నొక్క బాలిక కెదుర దర్శనీయ కేళీకందుకంబుగా వ్రేలం గట్టఁబడిన యమ్మణి శ్రేష్ఠంబుఁ గని హరింప నిశ్చయించి.

61

తా ॥ కృష్ణుడు తన వెంట వచ్చిన యాదవ వీరులనందరినీ గుహముఖ ద్వారం దగ్గరే ఉంచి సాహసోపేతుడై గుహలోకి ప్రవేశించాడు. ఆ గుహ దట్టమైన చీకటితో నిండి ఉంది. మహా భయంకరంగా ఉంది. గుహ యొక్క లోపలి భాగమంతా ఎంతో విశాలంగా ఉంది. మహానుభావుడైన కృష్ణుడు మణికోసం ఇంకా లోపలి భాగానికి వెళ్ళాడు. అక్కడ ఆ శ్యమంతకమణి ఒక బాలికకు ఎదురుగా ఆటబంతిగా వేలాడకట్టబడి ఉంది. మణిని చూసిన కృష్ణుడు దానిని తీసుకొని పోదామని అనుకొన్నాడు.

క. మెల్లన పదము లిడుచు యదు, వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన గుండెల్ జల్లనఁగఁ జూచి కంపము, మొల్లంబుగ దానిదాది మొఱవెట్టె నృపా!

62

తా ॥ మెల్లమెల్లగా అడుగులు వేస్తూ కృష్ణుడు ఆ బిడ్డ ఉన్న చోటికి వెళ్ళాడు. కృష్ణుణ్ణి చూసిన ఆ బాలిక దాదికి గుండెలు గుభిల్లుమన్నాయి, శరీరమంతా వణక సాగింది. దిక్కుతోచక పెద్దగా అరిచింది.

వ. అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుఁడు వచ్చి తన స్వామి యని కృష్ణు నెఱుంగక ప్రాకృత పురుషుం డని తలంచి కృష్ణునితో రణంబుచేసె నందు.

63

తా ॥ దాది అరిచిన అరుపు విని మహాబలశాలి అయిన జాంబవంతుడు ఏమైందా అని బాలిక వద్దకు వచ్చాడు. కృష్ణుణ్ణి చూసి 'కృష్ణుడు—తన ప్రభువైన శ్రీరామచంద్రుడే' అని తెలుసుకోలేక కృష్ణునితో యుద్ధానికి తలపడ్డాడు. కృష్ణుడు సాధారణ మానవుడు, వీనిని ఎంతలోకి మట్టుపెడతానులే అని భావించాడు.

క. పలలమునకుఁ బోరెడు డే, గలక్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువదియెనిమిది దిన, ములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్.

64

తా ॥ జాంబవంతుడు, కృష్ణుడు ఘోరాతి ఘోరంగా యుద్ధం చేయడం మొదలుపెట్టారు. మాంసం కోసం కొట్టుకునే డేగల పోరులాగా ఉంది వారి యుద్ధం. ఒకరిపైన మరొకరు విజయం సాధించాలనే కోరికతో బాణాలతో యుద్ధం చేశారు. ఒకరినొకరు చెట్లతో కొట్టుకున్నారు. చేతులతో ముష్టియుద్ధం చేశారు. ఇరవై ఎనిమిది రోజుల పాటు విశ్రాంతి అనేది లేకుండా రకరకాలుగా యుద్ధం చేశారు.

క. అడిదములుఁ దరులు విఱిగిన, బెడిదము లగు మగతనములు బిఱుతివక వడిం
బిడుగుల వడువునఁ బడియెడి, పిడికిటి పోటులను గలన బెరసి రిరువురున్.

65

తా ॥ వారిమధ్య కత్తులు తునాతునకలైనాయి. చెట్లు విరిగిపోయాయి. ఏమాత్రం తరిగిపోని పౌరుషంతో ఒకరిమీద ఒకరు విరుచుకుపడ్డారు. వెంటవెంటనే పడే పిడుగులా అనేటటువంటి పిడికిలి పోట్లతో పోరాడారు.

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి నహర్నిశంబు జయసమ్మోహంబులం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుంద ముష్టిహతులన్ బూర్ణశ్రమోపేతుఁడై

పిష్టాంసోరు శరీరుఁడై యతఁడు దా భీతాత్ముఁడై యిట్లనెన్.

66

తా ॥ శ్రీకృష్ణుడు, జాంబవంతుడు ఒకరినొకరు గెలవాలనే ఉల్లాసంతో రాత్రింబగళ్ళు బాహాబాహి, ముష్టాముష్టి యుద్ధాలు చేస్తూనే ఉన్నారు. కోపోద్రిక్తులై గర్వోక్తులు పలుకుతూనే ఉన్నారు. అలా కొంతకాలం జరిగింది. కృష్ణుడి పిడికిలి దెబ్బలకు జాంబవంతుడు శక్తిని కోల్పోయాడు. పూర్తిగా అలసిపోయాడు. ఇక యుద్ధం చేయలేని స్థితికి వచ్చాడు. శరీరమంతా పిండి పిండైపోయింది. కృష్ణణ్ణి చూసి ఒక్కసారిగా భయపడిపోయాడు. కృష్ణుడే రాముడని నిర్ధారించుకొన్నాడు.

వ. 'దేవా! నిన్నుఁ బురాణపురుషు నధీశ్వరు విష్ణుం బ్రభవిష్ణు నెఱుంగుదు! సర్వభూతంబులకుం బ్రాణప్రతాప ధైర్యబలంబులు నీవే, విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వ రాచరింతురు, వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ, యాత్మకుంబరమాత్మవు నీ దయని మరియును.

67

తా ॥ జాంబవంతుడు కృష్ణణ్ణి పరమాత్మగా గుర్తించి "దేవా! నీవు పురాణపురుషుడు, జగన్నాథుడు, దివ్యతేజస్వరూపుడు అయిన విష్ణుమూర్తివని తెలుసుకొన్నాను. సమస్త జీవరాశులకు ప్రాణం నీవే. ప్రతాపం నీవే. బలం నీవే. విశ్వమంతటినీ ఎవరు సృష్టిస్తారో, ఎవరు రక్షిస్తారో, ఎవరు నశింపచేస్తారో వారందరి పుట్టుకకు, పోషణకు, నాశనానికి కారకుడవైన ప్రభుడవు నీవే. ఆత్మ రూపానివీ నీవే" అని స్తోత్రం చేసి, మళ్ళీ ఇలా అంటున్నాడు:

సీ. బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి, నింకించి బంధించి యేపు సూపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాప ప్రభారాశిచే దానవగర్వాంధతమస మడఁచెఁ
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠు కంఠబృందములు ద్రుంచె

నాచంద్రసూర్యమై యమరు లంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె

తే. నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ, డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వఁ

డాతఁడవు నీవ కావె, మహాత్మ! నేఁడు, మాఱుపడి యెగ్గు సేసితి మఱవవలయు.

68

తా ॥ "మహాత్మా! నిన్ను గుర్తించనేరక నీ పట్ల అపరాధం చేశాను. నన్ను మన్నించు స్వామీ! ఎవడు బాణాగ్నిని కురిపించి, సముద్రాన్ని ఇంకింపచేసి, బంధించి సేతువు నిర్మించాడో, ఎవడు తన ప్రతాపకాంతితో రాక్షసుల గర్వమనే చీకటిని అంతరింపచేశాడో, ఎవడు తామర తూడులు త్రెంచే గజరాజులాగా దశకంఠుడైన రావణుని పది కంఠాలను త్రుంచివేసాడో, ఎవడు సూర్యచంద్రులుండే వరకు లంకారాజ్యానికి విభీషణున్ని చక్రవర్తిని చేసాడో, నన్ను పాలించిన సకలలోకనాయకుడెవడో, కరుణా సాగరుడెవడో, ఆ రామచంద్రుడివి నీవే కదా!"

వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతని శరీర నిగ్రహ నివారణంబుగా భక్తవత్సలుండైన హరి దన కరంబున నతని మేను నిమిరి గంభీరభాషణంబుల నిట్లనియె.

69

తా ॥ పరమ భక్తుడైన జాంబవంతుడీ విధంగా స్తుతించగా భక్తులయందు వాత్సల్యాతిశయంగల కృష్ణ పరమాత్మ తన చేతితో జాంబవంతుని శరీరాన్ని నిమిరి, అతని గాయాలను పోగొట్టాడు. జాంబవంతుని చూసి తన మనోభావాన్ని గంభీరమైన వాక్కులతో తెలియజేసాడు:

క. 'ఈ మణి మాచేఁబడె నని, తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై

నీ మందిర మగు బిలమున, కే మరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే!'

70

తా ॥ "జాంబవంతా! కొంతమంది మూర్ఖులు ఈ మణిని మేము అపహరించామని మాపై నిందవేసారు. ఆ నింద నుంచి తప్పించుకోవడానికే నీ నివాస స్థలమైన ఈ బిలానికి మేము వచ్చాము."

వ. అనిన విని సంతసించి జాంబవంతుఁడు మణియునుం, దన కూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిం గానుకఁగా సమర్పించె, నట మున్న హరివెంట వచ్చినవారలు బిలంబు వాకిటం బండ్రెండు దినంబులు హరిరాక కెదురుచూచి వేసఱి వగచి తమ పురంబునకుం జని, రంత దేవకీవసుదేవులు రుక్మిణియును మిత్ర బంధు జ్ఞాతి జనులును గుహ సొచ్చి కృష్ణుండు రాడు చిక్కెనని శోకించి.

71

తా ॥ కృష్ణుడి రాకకు గల కారణాన్ని విని, జాంబవంతుడు పరమానందభరితుడై మణితోపాటు తన కుమారీ మణి అయిన జాంబవతిని కూడా కృష్ణుడికి కానుకగా సమర్పించాడు. కృష్ణుడితో పాటు వచ్చిన యాదవులు గుహముందు పన్నెండు రోజులవరకు ఎదురు చూసి, ఎంతకూ కృష్ణుడు తిరిగి రాకపోయేసరికి విసిగి, వేసారి, బాధపడి ఏమీ చేయజాలక ద్వారకానగరం వెళ్ళారు. వారితో కృష్ణుడు రాకపోవడంతో కృష్ణుడు గుహలోనే చిక్కుకుపోయాడని భావించి దేవకీవసుదేవులు, రుక్మిణీదేవి, మిత్రులు, బంధువులు, జ్ఞాతులు అందరూ దుఃఖించసాగారు.

క. దుర్గమ మగు బిలమున హరి, నిర్గతుఁడై చేరవలయు నేఁ డని పౌరుల్ వర్గములై సేవించిరి, దుర్గం గృతకుశలమార్గఁ తోషితభర్గన్.

72

తా ॥ మార్గాన్ని క్షేమంకరంగా చేసే దుర్గా భవానిని కఠినమైన బిలం నుంచి కృష్ణుడు బయటపడి ద్వారకకు నేడు చేరాలని ఆ పురప్రజలందరు గుంపులు గుంపులుగా కూడి

సేవించారు.

క. డోలాయిత మానసులై, జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్ బాలామణితో మణితో, హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ' డనుచున్.

73

తా ॥ కృష్ణుడు తిరిగి క్షేమంగా వస్తాడా, రాడా అని ఊగిసలాడుతున్న మనస్సులతో ప్రజలంతా దిగులుపడి మనోవాక్కాయ కర్మలతో జగన్మాతను కొలుస్తుంటే కరుణామయి అయిన చండికాదేవి శ్యమంతకమణితోను, కన్యాకామణితోను కలిసి కృష్ణుడు ద్వారకకు శీఘ్రంగానే వస్తాడని చెప్పింది.

క. యత్నము సఫలం బయిన స, పత్న సమూహములు బెగడఁ బద్మాక్షుం డా
రత్నముతోఁ గన్యాజన, రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్.

74

తా ॥ తనను నిందించిన శత్రుసమూహం భయపడేటట్లు యత్నాన్ని సఫలం చేసుకొని శ్రీకృష్ణుడు మణిని, కన్యాకామణిని తీసుకొని శీఘ్రగమనంతో ద్వారకకు వచ్చాడు.

క. మృతుఁ డైనవాఁడు పునరా, గతుఁడైన క్రియం దలంచి కన్యామణి సం
యుతుఁడై వచ్చిన హరిఁ గని, వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్.

75

తా ॥ కృష్ణుణ్ణి చూసి పౌరులందరూ చనిపోయినవాడు తిరిగి బ్రతికి వచ్చినట్లుగా భావించి ఆనందించారు. జాంబవతీదేవితో వచ్చిన కృష్ణుణ్ణి చూడటమే తడవుగా వారంతా మహోత్సాహంతో వేడుకలు చేసుకొన్నారు.

వ. ఇట్లు హరి దన పరాక్రమంబున జాంబవతీ దేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుం

బిలిపించి తద్వృత్తాంతం బంతయు నెఱిగించి సత్రాజిత్తునకు మణి నిచ్చె, నతండును సిగ్గువడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిఁ జని.

76

తా ॥ కృష్ణుడు ఈవిధంగా తన శౌర్యప్రతాపాలతో జాంబవతీ దేవిని తెచ్చి పత్నిగా స్వీకరించాడు. తరువాత సత్రాజిత్తును రాజసభకు పిలిపించి మణివృత్తాంతమంతా అందరికీ తెలియజెప్పి, శ్యమంతక మణిని సత్రాజిత్తుకి ఇచ్చివేయడంతో సత్రాజిత్తు తానన్న మాటలకు సిగ్గుపడి మణిని తీసుకొన్నాడు. కాని కృష్ణుడితో విరోధం ఏర్పడినందుకు భయపడి, తాను చేసిన తప్పుకు పశ్చాత్తాపపడ్డాడు.

క. పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గల దని నొడివిన, పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే?

77

తా ॥ 'పాపుల యొక్క పాపాలన్నింటినీ పోగొట్టే పరమాత్ముడైన శ్రీకృష్ణుడు పాపం చేశాడని నిందించాను. పాపాత్ముడనైన నా యొక్క పాపానికి హద్దంటూలేదు.

మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు సే
సితిఁ? బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చి తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహముఁ గాల్పనే? దురిత మే మార్గంబునం బాయు? నే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్ గారుణ్య భావంబునన్?

78

తా ॥ మితంగా మాట్లాడటం మానివేసి హరిమీద అసత్యపు నేరాన్ని మోపాను. నిజంగా నేను పాపాత్ముడను. ధనాశకల వాడిని. నాలో ఉంది చెడుమనస్తత్వం. పైగా దుర్మదంతో

ఒళ్ళూపై తెలియకుండా ఉన్నాను. నా బుద్ధి పెడదారి పట్టింది. ఈ శరీరం ఎందుకు? కాల్చడానికా! ఎందుకిలా చేశాను? నే చేసిన పాపం ఏం చేస్తే పోతుంది? కృష్ణుడు ప్రసన్నుడై, నేనేం చేస్తే కరుణతో నన్ను కాపాడుతాడు?

ఆ. మణిని గూఁతు నిచ్చి మాధవుపదములు, పట్టుకొంటినేని బ్రదుకు గలదు సంతసించు
నతఁడు సదుపాయమగు నిది, సత్య మితరవృత్తిఁ జక్కఁబడదు.

79

తా ॥ శ్యమంతకమణిని, గారాబు కూతురైన సత్యభామను కృష్ణునకిచ్చి, అతని పాదాలు పట్టుకొంటే తప్ప నాకు బ్రతుకులేదు. నా వినయం చూసి కృష్ణుడు తప్పక సంతోషిస్తాడు. ఇదే చక్కని మార్గం. ఇక ఏ ఇతర మార్గంలోనూ మా వైరం చక్కబడదు. నా ఆలోచన సత్యం.'

మ. అని యిబ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతి గని సత్రాజిత్తు సంప్రాప్త శో
భనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్.

80

తా ॥ అని సత్రాజిత్తు ఇంటిలో ఒంటరిగా కూర్చొని అనేక విధాలుగా ఆలోచించాడు. చివరకు ఈ మార్గమే నీతియుతమని నిశ్చయించాడు. సత్రాజిత్తు శుభాలకు నిలయుదు, ఆపత్సముద్రాన్ని దాటించేవాడు, సుందరీమణుల మనస్సులను హరించేవాడు, రాక్షసరాజులను వధించే వాడు, జగద్రక్షకుడు అయిన శ్రీకృష్ణుడికి సత్యభామను శ్యమంతకమణితో పాటు సమర్పించాడు.

ఉ. తామర సాక్షుఁ డచ్యుతుఁ డుదార యశోనిధి పెండ్లి యాడె నా
నా మనుజేంద్రనందిత గుణస్థితిలక్షణ సత్యభామ ను

ద్దామ పతివ్రతాత్వ నయ ధర్మవిచక్షణతా దయా యశః
కామను సత్యభామను ముఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్.

81

తా ॥ అచ్యుతుడు, కమలాక్షుడు, కీర్తిమంతుడు అయిన శ్రీకృష్ణుడు రాజాధిరాజుల చేత సద్గుణవతిగా కీర్తింపబడిన సల్లక్షణాలు గల, ధర్మగుణమన్నా, పాతివ్రత్యమన్నా, దయావిషయమన్నా, కీర్తి అన్నా అభిలాష గల; సత్యభామను భామలలోకెల్ల సత్యమైనభామ అయిన సత్రాజిత్తు పుత్రికను వివాహమాడాడు.

క. 'మణి యిచ్చినాఁడు వాసర, మణి, నీకును మాకుఁ గలవు మణులు, కుమారీ మణి చాలు' నంచుఁ గృష్ణుఁడు, మణి సత్రాజిత్తునకు మరలఁగ నిచ్చెన్.

82

తా ॥ 'సత్రాజిత్తూ! సూర్యుడు నీకీ శ్యమంతకమణిని ఇచ్చాడు కదా! మణులంటావా! నీ దగ్గరా ఉన్నాయి. మా దగ్గరా ఉన్నాయి. నీ కుమారీమణి అయిన సత్యభామ చాలు. శ్యమంతకంతో నాకు పని లేదు. ఈ మణిని నీవే తీసుకోమని కృష్ణుడు మణిని తిరిగి సత్రాజిత్తుకు ఇచ్చివేశాడు.

వ. అంత నక్కడఁ గుంతీసహితు లయిన పాండవులు లాక్షాగారంబున దగ్ధులైరని విని నిఖిలార్థదర్శ నుండయ్యును, గృష్ణుండు బలభద్ర సహితుండై కరినగరంబునకుం జని కృప విదుర గాంధారీ భీష్మద్రోణులం గని దుఃఖోపశమనాలాపంబు లాడుచుండె! నయ్యెడ.

83

తా ॥ పరీక్షిత్తూ! ఇక్కడ ఇలా జరిగితే, అక్కడ ఇంద్రప్రస్థ నగరంలో పాండవులు తల్లితో సహా లక్క ఇంట్లో దగ్ధమైపోయారన్న వార్త కృష్ణుడికి వినవచ్చింది. సమస్త విషయాలు తెలిసిన భగవంతుడైనప్పటికీ, ఏమీ తెలియనట్లు శ్రీకృష్ణుడు బలరాముడితో కలిసి హస్తినాపురానికి

వెళ్ళాడు. అక్కడ గాంధారిదేవిని, భీష్మద్రోణులను, కృప విదురులను చూసి వారిని స్వాంతన వాక్యాలతో ఊరడించాడు. ఆ సమయంలో—

## శతధన్వుడు సత్రాజిత్తుని చంపి మణిని అపహరించుట

సీ. జగతీశ! వినవయ్య శతధన్వుఁ బొడగని యక్రూరకృతవర్మ లాప్తవృత్తి
'మనకిత్తు' ననుచు సమ్మతిఁ జేసి తన కూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడి దప్పె
ఖలుఁడు సత్రాజిత్తుఁ, గడగియే క్రియనైన మణిపుచ్చుకొనుము నీ మతము మెఱసి'
యని తన్నుఁ బ్రేరేఁప నా శతధన్వుఁడు పశువుఁ గటికివాఁడు పట్టి చంపు

అ. కరణి నిదురవోవఁ గడఁగి సత్రాజిత్తుఁ, బట్టి చంపి, వాని భామలెల్ల
మొఱలువెట్ట లోభమునఁ జేసి మణిగొంచుఁ, జనియె నొక్కనాఁడు జనవరేణ్య!

84

తా ॥ అక్రూరుడు, కృతవర్మ అనే యాదవ ప్రముఖులు శతధన్వుడి దగ్గరకు వెళ్ళారు. 'శతధన్వా! మనికిస్తాన' ని ఎంతో మైత్రీభావంతో చెప్పి చివరకు సత్రాజిత్తు తన కుమార్తెను కృష్ణుడికిచ్చి పెళ్ళిచేసి అధర్మప్రవర్తకుడైనాడు. సత్రాజిత్తు నిజానికి దుర్మార్గుడు. లేకపోతే ఇలా చేస్తాడా? ఏదో ఒక ఉపాయంతో సత్రాజిత్తువద్ద ఉన్న మణిని సంగ్రహించు. నీ పద్ధతిలో నీవు చేయి' అని శతధన్వుని ప్రేరేపించారు.

వారి మాటలతో ఉడుకెక్కిన శతధన్వుడు – ఒకనాడు కటికవాడు పశువునెంత క్రూరంగా చంపుతాడో అంత క్రూరంగా నిద్రపోతున్న సత్రాజిత్తును చంపివేశాడు. సత్రాజిత్తు భార్యలందరు గొల్లున ఏడ్చి మొఱలుపెట్టినా వినిపించుకోకుండా లోభగుణంతో శ్యమంతకమణిని తీసుకొని పారిపోయాడు.

వ. ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరు లయ్యును మనుష్య భావంబుల విలపించి, రంత బలభద్ర సత్యభామా సమేతుండై హరి ద్వారకానగరంబునకు మరలి వచ్చి శతధన్వుం జంపెదనని

తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ యింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె.

85

తా ॥ తండ్రి చంపబడ్డాడని తెలుసుకొని సత్యభామ కట్టలు తెగిన దుఃఖంతో నిస్సహాయురాలై సత్రాజిత్తు దేహాన్ని తైలద్రోణిలో పెట్టించి కృష్ణుడికి ఈ విషయం చెప్పడానికి హస్తినాపురానికి వెళ్ళింది. సర్వజ్ఞుడైన కృష్ణుడికి సత్రాజిత్తు మరణవార్త సవిస్తరంగా విన్నవించింది. విషయం విన్న శ్రీకృష్ణుడు, బలరాముడు దేవదేవులే అయినా సాధారణ మనుషుల మాదిరి దుఃఖించారు. కొంత ఊరటచెంది, శ్రీకృష్ణుడు–బలరామునితోను, సత్యభామతోను కలిసి ద్వారకకు వచ్చి దుష్టుడైన శతధన్వుణ్ణి చంపి తీరుతానని నిశ్చయించాడు. ఆ వార్త విన్న శతధన్వుడు ప్రాణభయంతో విలవిల్లాడిపోయాడు. మిత్రుడైన కృతవర్మ ఇంటికి వెళ్ళి తనకు సహాయం చేయమని అర్థించాడు.

ఉ. 'అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గు సేయఁగా
నిక్కడ నెవ్వఁ డోపు? విను మేర్పడఁ గంసుఁడు బంధు యుక్తుఁడై
చిక్కఁడె? మున్ను మాగధుఁడు సేనలతోఁ బదియేడు తోయముల్
దిక్కులఁ బాఱఁడే! మనకు దృష్టము, వారల లావు వింతయే?

86

తా ॥ దానికి కృతవర్మ "చూడు శతధన్వా! బలరామ కృష్ణులంటే ఎవరనుకొన్నావు? వాళ్ళు మహాత్ములు. ఎవరు వాళ్ళకు అపకారం తలపెట్టగలరు? కంసుడు బంధువులతో సహా కృష్ణుడి చేతిలో చిక్కలేదా? మగధ దేశాధిపతి అయిన జరాసంధుడు పూర్వం పదిహేడుసార్లు సైన్యంతో సహా దిగంతాలవరకు పారిపోలేదా? బలరామకృష్ణుల పరాక్రమం మనం చూసిందే కదా!"

వ. అని యుత్తరంబు సెప్పిన విని శతధన్వుం డక్రూరుని యింటికిం జని హరితోడ పగకుం దోడు రమ్మని చీరిన నక్రూరుండు హరిబల పరాక్రమ ధైర్య స్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె.

87

తా ॥ అని కృతవర్మ అనేసరికి గత్యంతరంలేక శతధన్వుడు అక్రూరుడి గృహానికి వెళ్ళి 'కృష్ణుడితో నాకు వైరం కలిగింది. నాకు తోడుగా నీవు రావలసినద' ని ప్రాథేయపడ్డాడు. దానికి అక్రూరుడు కృష్ణుడి యొక్క బలపరాక్రమాలను, ధైర్యస్థైర్యాలను ప్రశంసించి కృష్ణుడి మహిమను వర్ణించ సాగాడు.

సీ. 'ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁడై పుట్టించు రక్షించుఁ బొలియఁజేయు, నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు, లెవ్వనిమాయ మోహించు భువన, మే డేండ్లపాపఁడై యే విభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె, నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డద్భుత కర్ముఁ డనంతుండు కర్మసాక్షి,

తే. యట్టి ఘనునకు శౌరికి ననవరతము, మ్రొక్కెదము గాక! విద్వేషమునకు నేము వెఱతు మొల్లము నీ పొందు వేగబొమ్ము, చాలు పదివేలు వచ్చె నీ సఖ్యమునను.

88

తా ॥ "శ్రీకృష్ణుడు విశ్వాన్ని అంతటిని లీలాప్రాయంగా పుట్టిస్తాడు, రక్షిస్తాడు, నశింప చేస్తాడు. బ్రహ్మదేవుడు మొదలైన వారే కృష్ణుడు చూపే మహిమలను తెలుసుకోలేరు. ఆ విష్ణుమాయ లోకలోకాలను మోహింప చేస్తుంటుంది. ఏడేళ్ళ బాలుడిగా ఉన్నప్పుడే గోగణాన్ని రక్షించడానికి ఒంటిచేత్తో గోవర్ధనగిరిని ఎత్తాడే! కృష్ణుడు భగవంతుడయ్యా! ఆయనే జగన్నాథుడు. అద్భుత కర్మలు చేసేవాడు. అనంతుడు. కర్మసాక్షి.

అటువంటి పరమపురుషుడైన శ్రీకృష్ణుడికి ఎల్లప్పుడూ మ్రొక్కుతాము గాని అతనితో

శత్రుత్వం పెట్టుకొంటామా? మా వల్ల కాదు. కృష్ణుడితో వైరమంటేనే భయం కలుగుతోంది. కాబట్టి శతధన్వా! నీ స్నేహము మాకు వద్దు. చాలు నీ స్నేహంవల్ల మాకు ఏ కీడూ కలగకుండా ఉంటే అదే పదివేలు."

వ. అని యిట్లక్రూరుం డుత్తరంబు పలికిన న మ్మహామణి యక్రూరునియొద్ద నునిచి, వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు చనియె, నంత గరుడ కేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెనుచని, రంత నతండును మిథిలా నగరంబుఁ జేరి తత్సమీపంబునందు.

89

తా ॥ అక్రూరుడు ఆ విధంగా సమాధానం చెప్పేసరికి శతధన్వుడు ఏమీ చేయలేక మణిని అక్రూరుడివద్దే ఉంచి, మహాభయంతో గుఱ్ఱమెక్కి నూరుయోజనాల దూరం పారిపోయాడు. బలరామకృష్ణులు విషయం తెలుసుకొన్నవారై గరుడధ్వజంతో అలరారుతున్న రథం అధిరోహించి శతధన్వున్ని పట్టుకోవడానికి అతని వెనకనే వెళ్ళారు. ఈలోగా శతధన్వుడు ద్వారక నుంచి మిథిలానగరం చేరుకొన్నాడు.

చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై
పరువిడఁ 'బోకు పోకు' మని పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ
కరగతి వాని మస్తకము ఖండితమై పడ నేసెఁ జక్రముం
బరిహతదైత్యచక్రముఁ బ్రభాచయ మోదితదేవశక్రమున్.

90

తా ॥ బలరామకృష్ణులను అల్లంత దూరంలో చూసి శతధన్వుడు గుఱ్ఱందిగి కాలినడకతో పరుగెత్తాడు. అతని వెంటబడ్డ కృష్ణుడు 'శతధన్వా! పోకుపోకు పారిపోకుమ' ని పలుకుతూ వానిపైన మహాభయంకరమైన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. దశదిశలూ వెలిగింపచేసే

దివ్యకాంతులతో దేవతాసమూహాన్ని సంతోషింపచేసేది, రాక్షస సమూహాన్ని సంహరించేది అయిన సుదర్శన చక్రం వెళ్ళి శతధన్వుని శిరస్సును భీకరంగా ఖండించి నేలపై పడవేసింది.

వ. ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లేకుండటఁ దెలిసి బలభద్రునికడకు వచ్చి శతధన్వుం డూరక హతుం డయ్యె, మణిలే' దనిన బలభద్రుం డిట్లనియె.

91

తా ॥ కృష్ణుడు ఈ విధంగా శతధన్వుని సంహరించి అతని వస్త్రంలో మణి ఉందేమోనని వెదికాడు, మణి దొరకలేదు. 'ఎక్కడా మణి కనపడలేదు. శతధన్వుడు ఊరకనే చచ్చాడు.' అని బలరాముడితో చెప్పాడు. అప్పుడు బలరాముడిలా అన్నాడు:

సీ. 'ఆ మణి శతధన్వుఁ డపహరించుట నిక్క, మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ?
వేగమె నీ వేఁగి వెదకుము పురిలోన, వైదేహు దర్శింప వాంఛ గలదు,
పోయి వచ్చెద, నీవు పొ' మ్మని వీడ్కొల్పి మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు పొడగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురు వచ్చి

తే. యర్ఘ్యపాద్యాది కృత్యంబు లాచరించి, యిచ్చవచ్చిన వస్తువు లెల్ల నిచ్చి 'యుండు' మని
భక్తిజేసిన నుండె ముసలి, కువలయేశ్వర, మిథిలలోఁ గొన్ని యేండ్లు.

92

తా ॥ "కృష్ణా! ఆ మణిని శతధన్వుడు అపహరించిన మాట నిజం. ఎవరిదగ్గర దాచిపెట్టాడో! వెంటనే నీవు ద్వారకకు వెళ్ళి మణి ఎవరి దగ్గర ఉందో వెదుకు. విదేహదేశాధిపతిని చూడాలని ఉంది. నేను ఆ రాజు వద్దకు వెళ్ళి వస్తాను. నీవు ద్వారకానగరానికి వెళ్ళు" అని చెప్పి మిథిలా నగరానికి వెళ్ళాడు. బలరాముని రాక విన్న జనకమహారాజు ఎదురువచ్చి, ఎంతో ప్రేమతో అర్ఘ్యపాద్యాదులతో బలదేవుణ్ణి సత్కరించి, కోరిన

వస్తువులన్నీ ఇచ్చి, ఇక్కడే మా రాజ్యంలో కొంతకాలం ఉండవలసిందని ప్రార్థించాడు. పరీక్షిన్మహారాజా! మిథిల చేరిన బలరాముడు కొన్ని సంవత్సరాలపాటు జనకమహారాజు సాంగత్యంతో అక్కడే ఉండిపోయాడు.

వ. అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై.

93

తా ॥ ఆ సమయంలో దుర్యోధనుడు మిథిలకు వచ్చి జనక మహారాజుచేత సన్మానింపబడి –

క. చలమున గాంధారేయుఁడు, లలిత గదాయుద్ధకౌశలము నేర్చెఁ దగన్ హలిచే నాశ్రితనిర్జర, ఫలిచేఁ ద్రైలోక్య వీరభటగణబలిచేన్.

94

తా ॥ ఆశ్రితులకు కల్పవృక్షం వంటివాడైన బలరాముడి వద్ద గాంధారీ పుత్రుడైన దుర్యోధనుడు శిష్యరికం చేసాడు. ముల్లోకాలలోను వీరాధి వీరుడైన బలరాముని చెంత గదాయుద్ధ పద్ధతిని, అందులోని మెలకువలను మిక్కిలి పట్టుదలతో నేర్చుకొన్నాడు దుర్యోధనుడు.

వ. అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి, సత్యభామా ప్రియకరుండు గావున సత్రాజిత్తునకుఁ బరలోక క్రియలు సేయించె, నక్రూరకృతవర్మలు శతధన్వు మరణంబు విని వెఱచి ద్వారకా నగరంబు వెడలి బహుయోజన దూర భూమికిం జని, రక్రూరుండు లేమింజేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీరమానస తాపంబులును ద్వారకావాసులకు సంభవించిన నందుల వృద్ధజనులు బెగడి హరి కిట్లనిరి.

95

తా ॥ అక్కడ కృష్ణుడు ద్వారకకు వెళ్ళి సత్యభామతో జరిగిన అన్ని విషయాలు చెప్పాడు. కృష్ణుడు సత్యభామకు ఎల్లప్పుడు ప్రియము చేసేవాడు కావడంతో సత్రాజిత్తుకు పరలోక క్రియలన్నీ చేయించాడు. అక్రూరుడు, కృతవర్మ శతధన్వుడు మరణించాడన్నవార్త విని భయపడిపోయారు. కృష్ణుడు తమను కూడా ఏం చేస్తాడో అని భయపడి ద్వారకానగరానికి అనేక యోజనాల దూరంలో ఉన్న ప్రదేశానికి వెళ్ళిపోయారు.

అక్రూరుడు లేకపోవడంతో ద్వారకానగరంలో వానలు లేక ఘోర విపత్తులు సంభవించాయి. ప్రజలందరూ శరీర బాధలతో, మానసిక వ్యథలతో తల్లడిల్లిపోయారు. ఆ నగరంలోని అనుభవజ్ఞులయిన వృద్ధజనులు అందుకు భయపడి కృష్ణుడితో ఇలా చెప్పారు:

సీ. 'కమలాక్ష వినవయ్య! కాశీశుఁ డేలెడి కుంభిని వానలు గురియకున్నఁ
గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికిఁ గాందిని యనియెడు కన్య నిచ్చి
కాశీవిభుండు సత్కారంబు చేసిన వానలు గురిసె నా వసుధమీఁద,
నాతని పుత్రకుఁ డైన యక్రూరుండు నంతటివాఁడె, మహాతపస్వి

ఆ. మరలి వచ్చెనేని మాను నుత్పాతంబు, లెల్ల, వాన గురియు నీ స్థలమున,
దేవ! యతనిఁ దోడి తెప్పింపు, మన్నింపు, మానవలయుఁ పీడ మానవులకు.

96

తా ॥ "కృష్ణా! ఒక విషయం చెబుతాం వినవలసింది. ఒకసారి కాశీరాజు పరిపాలిస్తున్న దేశంలో వానలు కురవలేదు. ఎన్నో ఉత్పాతాలు సంభవించాయి. అదిచూసి ఆ రాజు శ్వఫల్కుడు అనే మహాత్ముణ్ణి తన రాజ్యానికి తీసుకొనిపోయి కాందిని అనే తన కుమార్తెను ఇచ్చి వివాహం చేసి ఘనంగా సత్కరించాడు. శ్వఫల్కుని రాకతో కాశీరాజ్యంలో చక్కగా వానలు కురిసాయి.

దేవా! అక్రూరుడు ఆ శ్వఫల్కుని కుమారుడు. తండ్రి ఎంత గొప్పవాడో అక్రూరుడూ అంత గొప్పవాడే. పైగా మహర్షి, మహనీయుడు. అక్రూరుడు కనుక మళ్ళీ ద్వారకా నగరానికి తిరిగి వస్తే ఈ కష్టాలన్నీ తొలగిపోయి ప్రజలు సుఖంగా ఉంటారు. అక్రూరుడు ఈ నేలపై అడుగుపెడితే వర్షాలు వెంటనే కురుస్తాయి. కాబట్టి కృష్ణా! ద్వారకా వాసులకు కష్టాలు పోవాలంటే, నీవు అక్రూరుణ్ణి క్షమించి ఇక్కడికి రప్పించు."

వ. అని పలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతలం బంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని సెప్పి సకల లోకజ్ఞుండు గావున మృదుమధుర భాషణంబుల నతని కిట్లనియె.

97

తా ॥ అని చెప్పిన పెద్దలమాట ప్రకారం కృష్ణుడు దూతలను పంపి అక్రూరుణ్ణి ద్వారకకు పిలిపించాడు. గౌరవించాడు. పూజించాడు. అక్రూరుడికి ఇష్టమైన కొన్ని కథలు చెప్పాడు. కృష్ణుడు సర్వజ్ఞుడు, లోకజ్ఞుడు కావడంతో అక్రూరుడితో సున్నితంగా వ్యవహరించాడు. మధురమైన వాక్కులతో ఇలా అన్నాడు:

సీ. 'తా నేగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి నీ యింటఁ బెట్టుట నిజము తెలిసి
నాఁడ, సత్రాజిత్తునకుఁ బుత్రకులు లేమి నతనికిఁ గార్యంబు లాచరించి
విత్తంబు ఋణమును విభజించుకొనియెద రతని పుత్త్రికలెల్ల, నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ జెందినాఁ, డతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు,

ఆ. మణి గ్రహింపు మీవ, మా యన్న నను నమ్మఁ, డెలమి బంధుజనుల కెల్లఁ జూపు
మయ్య! నీ గృహమున హాటక వేదికా, సహితమఖము లమరు సంతతమును'.

98

తా ॥ "అక్రూరా! శతధన్వుడు ద్వారక వదలి వెళ్ళే సమయంలో మణిని నీ ఇంటిలో పెట్టి

వెళ్ళాడన్న విషయం తెలుసుకొన్నాను. సత్రాజిత్తు పరులచేత దుర్మరణం పొందాడు గదా! ఆయనకు కొడుకులు లేరు. అతనికి అంత్యక్రియలు చేసి, ఆయనకున్న ధనాన్ని, ఋణాన్ని కుమార్తెలు పంచుకొంటారు. సత్రాజిత్తు గురించి ముందు ముందు సత్కర్మలు చేయవలసి ఉంది.

శ్యమంతకమణిని నీవే తీసుకో. మణి నీ వద్ద ఉన్నదని నేను చెబితే మా అన్న బలరాముడు నా మాట నమ్మడు. ఒక మాట చెబుతాను, విను. బంధువులకు, ద్వారకావాసులకు మణిని ఒక్కసారి చూపించు. నీ గృహంలో ఇక ముందు బంగారువేదికపైన సమస్త యజ్ఞాలు నిర్వహింపబడతాయి."

వ. అని యిట్లు సామవచనంబు హరి పలికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిం దెచ్చి హరి కిచ్చిన.

99

తా ॥ కృష్ణుడు ఈ విధంగా మంచిమాటలు చెప్పేసరికి అక్రూరుడు తన వస్త్రంలోదాచి ఉంచిన శ్యమంతకాన్ని తెచ్చి కృష్ణుడి చేతిలో పెట్టాడు.

ఉ. సంతసమంది బంధుజనసన్నిధికిన్ హరి దెచ్చి చూపె న
శ్రాంతవిభాసమాన ఘృణిజాలపలాయిత భూనభోంతర
ధ్వాంతము హేమభారచయ వర్షణవిస్మిత దేవ మానవ
స్వాంతముఁ గీర్తి పూరితదిశా వలయాంతము నాశ్యమంతమున్.

100

తా ॥ మణిని చూసి సంతోషించిన శ్రీకృష్ణుడు ఎడతెగని ప్రకాశంతో తన కిరణజాలం చేత భూనభోంతరాళంలో ఉన్న చీకటిని పారద్రోలేటటు వంటిది, బారువులకొద్దీ బంగారాన్ని వర్షిస్తూ దేవతలను మానవులను ఆశ్చర్యచకితుల్ని చేసేది, ఘనకీర్తిచేత దిక్కులంతటా పేరుపొందిందీ అయిన శ్యమంతక మణిని తెచ్చి బంధువులందరికీ చూపించాడు.

క. చక్రాయుధుఁ డీ క్రియఁ దన, యక్రూరత్వంబు జనుల కందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ, నక్రూరుని కిచ్చె మణిఁ గృపాకలితుండై.

101

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు మణిని తాను అపహరించలేదన్న నిజాన్ని బంధుజనానికి, పౌరులకు స్పష్టంచేసి ఆ శ్యమంతకాన్ని తిరిగి కరుణాసాగరుడై అక్రూరుడికే ఇచ్చాడు. దానితో కృష్ణుడి మంచితనం వెల్లడయింది.

క. ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ, డనఘుఁడు మణి దెచ్చి యిచ్చినట్టి కథనమున్ వినినఁ
బఠించినఁ దలఁచిన, జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్.

102

తా ॥ మహామహిమాన్వితుడు, గొప్పవాడు, జగత్ప్రభువు, పాపరహితుడు, భగవంతుడు అయిన శ్రీకృష్ణుడు – శతధన్వుడు దొంగిలించి తీసుకువెళ్ళిన శ్యమంతకమణిని తెచ్చి మరల అక్రూరుడికి ఇచ్చినటువంటి ఈ కథను విన్నా, చదివినా, భావించినా అటువంటివారికి అపకీర్తి తొలగిపోతుంది, పాపాలు పటాపంచలవుతాయి.

## శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థపురానికి వచ్చుట

వ. అంత నొక్కనాఁడు పాండవులం జూడ నిశ్చయించి సాత్యకి ప్రముఖ యాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థ పురంబునకుం జనినం బ్రాణంబులం గనిన యింద్రియంబుల భంగి వా రఖిలేశ్వరుం డైన హరిం గని కౌఁగిలించుకొని కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూతకల్మషులై యనురాగ హాస విభాసితంబైన ముకుందు ముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి, గోవిందుండును యుధిష్ఠిర భీమసేనుల చరణంబులకు నభివందనంబు చేసి యర్జును నాలింగనంబున సత్కరించి, నకుల సహదేవులు మ్రొక్కిన గ్రుచ్చి యెత్తి, యుత్తమపీఠంబున నాసీనుండై యుండ; నప్పుడు.

103

తా ॥ కొంతకాలం గడిచిన తరువాత ఒకనాడు పాండవులను చూడాలనే కోరికతో శ్రీకృష్ణుడు సాత్యకి మొదలైన యాదవులు తనను కొలిచి వస్తుండగా ఇంద్రప్రస్థ పురానికి వెళ్ళాడు. కృష్ణుణ్ణి చూసేసరికి పాండవులకు ప్రాణాలులేచి వచ్చాయా అనిపించింది. ఆ పరమాత్ముణ్ణి కౌగిలించుకొని, కృష్ణస్పర్శచేత పాపాలన్నీ నిర్మూలించుకొన్నవారైనారు. ప్రేమతో చిరునవ్వులు చిందిస్తున్న ఆ దేవదేవుని ముఖపద్మాన్ని దర్శించి సంతోషంతో పొంగిపోయారు. శ్రీకృష్ణుడు తనకన్న పెద్దవారైన ధర్మరాజుకు, భీమసేనుడికి పాదాభివందనం చేసాడు. తనతోటివాడు కావడంతో అర్జునుణ్ణి ఆలింగనం చేసి సత్కరించాడు. చిన్నవారైన నకుల సహదేవులు తనకు నమస్కరిస్తే వారిని లేపి కౌగిలించుకొని ప్రేమ కురిపించాడు. ఉన్నత సింహాసనం మీద కూర్చున్నాడు. అప్పుడు–

క. చంచద్ఘనకుచభారా, కుంచితయై క్రొత్త పెండ్లికూఁతు రగుట నిం
చించుక సిగ్గు జనింపఁగఁ, బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్.

104

తా ॥ పాంచాలరాజు పుత్రిక అయిన ద్రౌపదీదేవి వచ్చి క్రొత్త పెళ్ళికూతురు కావడంతో కొంచెం సిగ్గుతో తలవంచి, కుచభారంతో మరింత వంగి శ్రీకృష్ణుడికి నమస్కరించింది.

వ. అంత సాత్యకి పాండవులచేతం బూజితుండై యొక్క పీఠంబున నాసీనుండై యుండెఁ, దక్కిన యనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచి యుండిరి, హరియుం గుంతీదేవి కడకుం జని నమస్కరించి యిట్లనియె.

105

తా ॥ పాండవులు కృష్ణ సోదరుడైన సాత్యకిని గౌరవించి, సత్కరించి ఒక సింహాసనం మీద ఆసీనుణ్ణి చేసారు. వచ్చిన బంధువులను, సేవకులను తగిన విధంగా గౌరవించి ఆయా స్థానాలలో వారిని కూర్చుండ చేసారు పాండవులు. కృష్ణుడు మేనత్త అయిన కుంతీదేవి వద్దకు వెళ్ళి ఆమె పాదాలకు నమస్కరించాడు.

క. 'అత్తా! కొడుకులుఁ గోడలుఁ, జిత్తానందముగఁ బనులు సేయఁగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా, సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్?

106

తా ॥ "అత్తా! నీ మనస్సుకు ఆనందకరంగా కొడుకులు, కోడలు పనులు చేస్తుంటే నీ ఇష్టప్రకారంగా వారికి ఆజ్ఞలుజారీ చేస్తూ సుఖంగా, సంతోషంగా ఉంటున్నావు గదా!"

చ. అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబులన్
గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు చే
సిన యపచారముం దలఁచి చెందిన దుఃఖము లెల్లఁ జెప్పి యా
దనుజవిరోధి కి ట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్.

107

తా ॥ అని శ్రీకృష్ణుడు అనగానే కుంతీదేవి మేనల్లుడికి తన పట్ల ఉన్న ప్రేమకు చలించి పోయింది. గొంతు గద్గదమయ్యి దుర్యోధనుడు చేసిన అపకారానికి కళ్ళవెంబడి నీళ్ళు కారాయి. అంతవరకు తాము పడ్డ కష్టాలన్నీ చెప్పుకొంది. కృష్ణుడు చిన్నవాడైనా అతనికి కుంతి పెద్దరికమిస్తూ ఇలా అంది:

సీ. 'అన్న! నీ చుట్టాల నరయుదు! మఱవవు, నీవు పుత్తెంచిన నెమ్మితోడ
మా యన్న యేతెంచి మముఁ జూచి పోయెను, నిల్చి యున్నారము నీ బలమున,
నా పిన్నవాంగ్రకు నాకు దిక్కెవ్వరు నేఁ డాదిగా నింక నీవె కాక?
యఖిల జంతువుల కీ వాత్మవు గావునఁ బరులు నా వారని భ్రాంతి సేయ.

తే. వయ్య! నా భాగ్యమెట్టిదో? యనవరతముఁ జిత్తమున నుండి కరుణ మా చిక్కులెల్లఁ
బాపుచుందువు గాదె! యో పరమపుణ్య!, యదుకుమారవరేణ్య! బుధాగ్రగణ్య!.

108

తా ॥ "కృష్ణా! నీ బంధువులైన మమ్మల్ని ఎప్పుడూ మరిచిపోవు. మా యోగక్షేమాలు చూస్తూనే ఉంటావు. మా అన్న అయిన అక్రూరుడు వచ్చి మమ్మల్ని చూసి వెళ్ళాడు. నీ బలంవల్లే ఇంతకాలం మేము నిలిచి ఉన్నాం. నాకు, నా కుమారులకు నీవు తప్ప ఇంక దిక్కెవ్వరున్నారు? సమస్త జీవులకు నీవే ఆత్మవు. భగవంతుడవైన నీకు నా వారు, పరాయివారు అన్న భేదభావం ఉండదు.

కృష్ణా! యదుకుమారా! బుధశ్రేష్ఠా! పరమపుణ్యస్వరూపా! నేను ఎంత అదృష్టవంతురాలినో కదా! అనుక్షణం మమ్మల్ని తలుస్తూ మా కష్టాలన్నీ పోగొడుతున్నావు. నీ దయ అపారం.

వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె.

109

తా ॥ ధర్మరాజు కృష్ణుణ్ణి చూసి ఇలా అన్నాడు:

మ. 'పట్టఁగ లేరు నిన్నుఁ దమభావములందు సనందనాదు లే
పట్టుననైన, నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవు, నేఁడు మా
చుట్టమ వంచు వచ్చెదవు, చూచెద వల్లులమైన మమ్ముఁ; నే
మెట్టి తపంబు చేసితి మధీశ్వర! పూర్వశరీర వేళలన్?'

110

తా ॥ "కృష్ణా! సనకసనందనాదులైన మహర్షులే నిన్ను పట్టుకొని తమ మనస్సులలో నిల్పుకోలేక పోతున్నారు. వారికే ఏ విధంగానూ చిక్కని నీవు బంధువునంటూ మా దగ్గరకు వస్తున్నావు. అల్పులమైన మమ్మల్ని పరిరక్షిస్తున్నావు. సకల సద్గుణాలకు నిలయమైన శుభచరిత్ర గల కృష్ణా! నిజంగా పూర్వజన్మలలో మేం ఎంత గొప్ప తపస్సు చేశామో కదా! నీ కరుణ మాకు లభించింది."

వ. అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన నింద్రప్రస్థపురంబువారలకు నయనానందంబు సేయుచు హరి గొన్ని నెలలు వసియించి యుండె, నం దొక్కనాఁడు.

111

తా ॥ అని స్తుతించి ధర్మరాజు ప్రార్థించడంతో కృష్ణుడు ఇంద్రప్రస్థ పురవాసులకు కన్నులపండుగగా కొన్ని నెలలపాటు పాండవుల దగ్గర ఉన్నాడు.

మ. తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై
హరితోడన్ వనభూమి కేగి విజయుం డాసక్తుఁడై చంపె శం
బర శార్దూల తరక్షు శల్య చమరీ భల్లూక గంధర్వ కా
సర కంఠీరవ ఖడ్గ కోల హరిణీ సారంగముఖ్యంబులన్.

112

తా ॥ ఒకనాడు అర్జునుడు కృష్ణుడితో కలిసి వేటకని కవచాన్ని ధరించి, ధనుస్సును, అమ్ములపొదిని, బాణాలను తీసుకొని అశ్వశ్రేష్ఠాన్ని ఎక్కి అడవికి వెళ్ళాడు. అడవిలో ఉన్న క్రూరమృగాలైన పెద్దపులులను, సింహాలను, ఎలుగుబంట్లను, ఏదు పందులను, సివంగులను, చమరీమృగాలను, ఖడ్గమృగాలను, అడవిపందులను, గంధర్వ మృగాలను, అడవి దున్నలను వెదకి వెదకి చంపాడు. లేళ్ళను, ఏనుగులను తరిమితరిమి వేటాడాడు.

క. అచ్చోటఁ బవిత్రములై, చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం దెచ్చిరి పర్వము వచ్చిన, జెచ్చెర నరుఁ గొల్చియున్న సేవకు లధిపా!

113

తా ॥ అర్జునుని వెంట వచ్చిన సేవకులు వేటలో చనిపోయిన ఆహార యోగ్యమైన మృగాలను మహారాజైన ధర్మరాజుకు మెచ్చుకోలుగా తెచ్చి ఇచ్చారు.

వ. అంత నర్జునుండు నీరుపట్టున డస్సిన యమునకుం జని యమ్మహారథులైన నరనరాయణు లందు వార్చి జలంబులు ద్రావి యొక పులినప్రదేశంబున నుండి.

114

తా ॥ వేటలో అలసిపోయిన అర్జునుడికి దాహం వేసింది. మహావీరులైన కృష్ణార్జునులిద్దరూ దప్పిక తీర్చుకోవడానికి యమునా నది వద్దకు వెళ్ళారు. యమునానదీజలంతో ఆచమనం చేసి తృప్తిగా నీళ్ళు తాగారు. తరువాత ప్రక్కనే ఉన్న ఇసుకతిన్నె మీద కూర్చున్నారు.

ఉ. ఉపగతులైన యట్టి పురుషోత్తమ పార్థులు గాంచి రాపగా
విపుల విలోల నీలతర వీచికలందు శిరోజభార రు
చ్యపహసితాళిమాలిక నుదంచిత బాలశశిప్రభాలికం
దపనుని బాలికన్ మదనదర్పణతుల్య కపోలపాలికన్.

తా ॥ వారికి యమునానది చెంతనే ఉన్న ఒక సుందరీమణి కనిపించింది. ఆమె యమునానదిలోని నల్లని అలలపైన కదలాడే తుమ్మెదల నిగనిగనికాంతులను అపహసించే శిరోజ సౌందర్యంతో శోభాయమానంగా ఉంది. బాలచంద్రుని కాంతివంటి కాంతితో వెలిగిపోతున్న ఫాలప్రదేశంతో ప్రకాశిస్తోంది. అద్దాలవంటి స్వచ్ఛమైన చెక్కిళ్ళతో అపురూపంగా ఉంది. సూర్యభగవానుని పుత్రికయిన ఆ సుందరీమణిని శ్రీకృష్ణుడు చూసినదే తడవుగా ఆమె వివరాలు తెలుసుకోవాలనుకొన్నాడు.

వ. కని యచ్యుతుండు పంచిన వివ్వచ్చుండు చని యా కన్యకిట్లనియె.

116

తా ॥ కృష్ణుడు పంపగా అర్జునుడు ఆ కన్యక వద్దకు వెళ్ళి ఆమెను గురించి అడిగాడు:

మ. 'సుదతీ! యెవ్వరిదాన? వేమికొఱ కిచ్చోటం బ్రవర్తించె? దె
య్యది నీ నామము? కోర్కి యెట్టిది? వివాహాకాంక్షతోఁగూడి యీ
నదికిన్ వచ్చిన జాడ గానఁబడె? ధన్యం బయ్యె నీ రాక, నీ
యుదయాదిస్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్యత్కురంగేక్షణా!

117

తా ॥ "సుందరీ! మెరిసిపోతున్న లేడి కన్నులవంటి కన్నులుగల అబలామణీ! నీవు ఎవరి పుత్రికవు? ఎందుకోసం ఇక్కడ ఉంటున్నావు...? నీ పేరేమిటి? నీ కోరిక ఏమిటో చెప్పు. వివాహకాంక్షతో ఈ నది చెంతకు వచ్చినట్లు కనిపిస్తోంది. నీవు ఎక్కడ పుట్టావు? నీ పుట్టుక వివరాలు చెప్పు. ఇక్కడకు రావటంతో నీ రాక ధన్యమైందనుకో! అదృష్టవంతురాలివి సుమా!"

వ. అనిన నర్జుననకుఁ గాళింది యి ట్లనియె.

118

తా ॥ అని అర్జునుడు ప్రశ్నించేసరికి సుందరి ఈ విధంగా చెప్పింది:

మ. 'నరవీరోత్తమ! యేను సూర్యుని సుతన్, నాపేరు కాళింది, భా
స్కర సంకల్పితగేహమందు నదిలోఁ గంజాక్షు విష్ణుం బ్రభున్
వరుగాఁ గోరి తపంబు సేయుదు, నొరున్ వాంఛింపఁ, గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచుఁ బలికెన్ నా తండ్రి నాతోడుతన్.'

119

తా ॥ "ఓ మహావీరా! నేను సూర్యదేవుని పుత్రికను. నా పేరు కాళింది. ఈ యమునానదిలో నా కోసం నా తండ్రి చక్కని గృహాన్ని నిర్మించాడు. ఈ మందిరంలో నిలబడి పద్మపత్రాయతాక్షుడు, జగత్ ప్రభువు అయిన విష్ణువును గూర్చి తపస్సు చేస్తున్నాను. విష్ణువును తప్ప వేరెవ్వరినీ వరునిగా ఇష్టపడను. నా తండ్రి—విష్ణురూపుడైన శ్రీకృష్ణుడు వేటనిమిత్తం ఇక్కడకు వచ్చి నన్ను వరిస్తాడని నాతో చెప్పాడు. అందుకే ఇక్కడ తపస్సు చేస్తున్నాను."

వ. అనిన విన ధనంజయుఁ డా నీలవేణి పలుకులు హరికిం జెప్పిన విని సర్వజ్ఞుండైన హరియు హరి మధ్యను రథంబుమీఁద నిడుకొని ధర్మరాజు కడకుం జని వారలు గోరిన విశ్వకర్మను రావించి వారి పురం బతివిచిత్రంబు సేయించె.

120

తా ॥ కాళింది చెప్పిన మాటలు అర్జునుడు శ్రీకృష్ణుడికి వివరంగా చెప్పాడు. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు కావడంతో కాళింది మనోభావాన్ని గ్రహించి ఆమెను రథంమీద ఎక్కించుకొని ధర్మరాజువద్దకు వెళ్ళాడు. పాండవుల కోరిక మన్నించి విశ్వకర్మను పిలిపించి శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ పట్టణాన్ని బహు సుందరంగా అలంకరింపచేసాడు.

క. దేవేంద్రుని ఖాండవ మ, ప్పావకునకు నీఁ దలంచి పార్థుని రథికుం
గావించి సూతుఁ డయ్యెను, గోవిందుఁడు మఱఁదితోడఁ గూరిమి వెలయన్.

121

తా ॥ కృష్ణుడు దేవేంద్రుని అధీనంలో ఉన్న ఖాండవ వనాన్ని అగ్నిహోత్రుడికి వ్యాధి నివారణార్థం ఇవ్వాలనుకొన్నాడు. ఆ కారణంతో శ్రీకృష్ణుడు తన ప్రియమరిది అయిన అర్జునుణ్ణి రథికుని చేసి తాను రథసారధిగా ఖాండవవనాన్ని చేరుకొన్నాడు.

వ. ఇట్లు నరనారాయణులు సహాయులుగా దహనుండు ఖాండవ వనంబు దహించిన సంతసించి విజయునకు నక్షయతూణీరంబులు, నభేద్యకవచంబును, గాండీవ మనియెడి బాణాసనంబును, దివ్యరథంబును, ధవళరథ్యంబులను నిచ్చె నందు.

122

తా ॥ కృష్ణార్జునుల సహాయంతో అగ్నిదేవుడు ఖాండవవనాన్ని దహించి తన ఆకలిబాధను, రోగబాధను నివారించుకొన్నాడు. అగ్నిదేవుడు సంతోషించిన వాడై అర్జునుడికి అక్షయతూణీరమనే అమ్ములపొదిని, అభేద్యమైన కవచాన్ని, గాండీవమనే ధనుస్సును, దివ్యరథాన్ని, తెల్లని గుఱ్ఱాలను ప్రసాదించాడు.

ఉ. వాసవసూనుచేఁ దనకు వహ్నిశిఖాజనితోగ్రవేదనన్
వాసినఁ జేసి యొక్క సభ పార్థున కిచ్చె మయుండు ప్రీతుఁడై
యా సభలోనఁ గాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁ బాసి యుండు జలస్థలనిర్ణయ బుద్ధిహీనుఁడై.

123

తా ॥ ఖాండవ వన దహన సమయంలో అర్జునుడు మయుణ్ణి మంటల బారి పడకుండా రక్షించాడు. అర్జునుడు చేసిన ఉపకారానికి ప్రీతి చెందిన మయుడు ఒక వినూత్నమైన,

విచిత్రమైన సభను నిర్మించి అతనికి కానుకగా ఇస్తాడు. ఆ సభలోనే దుర్యోధనుడు ఎటువెళ్ళాలో, ఎటు రావాలో తెలియక; ఏది స్థలమో, ఏది జలమో నిర్ణయించుకోలేక ఉత్సాహాన్ని కోల్పోయి అవమానం పాలైనాడు.

## శ్రీకృష్ణుడితో కాళింది మిత్రవింద నాగ్నజితి భద్ర లక్షణల వివాహం

వ. అంతం గృష్ణుండు ధర్మరాజ ప్రముఖుల వీడుకొని సాత్యకి ప్రముఖ సహచరులు గొలువ, మరలి తన పురంబునకుం జని బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్య దివసంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లి యయ్యె, మఱియు నవంతిదేశాధీశ్వరు లయిన విందానువిందులు దుర్యోధనునకు వశులై హరికి మేనత్తయైన రాజాదేవి కూఁతురైన తమ చెలియలిని వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబుఁ జాటించిన.

124

తా ॥ శ్రీకృష్ణుడు అర్జునుడికి అగ్నిదేవుని చేత దివ్యమైన ఆయుధాలు ఇప్పించి, ధర్మరాజు మొదలైన ముఖ్యులను వీడ్కొని, సాత్యకి మొదలైన సన్నిహిత యాదవులు కొలిచి వస్తుండగా ద్వారకానగరం చేరాడు. బంధుమిత్రులకు సంతోషాన్ని సమకూర్చాడు. ఒక పుణ్యదినాన శుభలగ్నంలో సూర్యపుత్రి అయిన కాళిందిని పెండ్లాడాడు. అనంతరం విందానువిందులు అవంతీ దేశపు ప్రభువులు. వారి తల్లి అయిన రాజాధిదేవి శ్రీకృష్ణునికి మేనత్త. రాజు దుర్యోధనుడు చెప్పినట్లు విని చెల్లెలు మిత్రవింద వివాహాన్ని సంకల్పించి స్వయంవరం చాటించాడు.

క. భూ రమణులు నూడఁగ హరి, వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా
పూరిత సుజనానందం, జారు చికురకాంతి విజిత షట్పదబృందన్.

125

తా ॥ మేనత్త కూతురైన మిత్రవిందను, సుజనులకు నిత్యం ఆనందం చేకూర్చేదానిని, నల్లనైన తుమ్మెద రెక్కల కాంతిని జయించిన ముంగురుల కాంతితో ఒప్పుతున్న దానిని స్వయంవర మంటపంలో రాజాధిరాజులు చూస్తుండగా కృష్ణుడు తన శౌర్యప్రతాపాలతో

గెల్చుకొన్నాడు.

సీ. జననాథ! వినుము కోసలదేశ మేలెడి నగ్నజిత్తను నరనాథుఁ డొకడు
సుమతి ధార్మికుఁడు దత్సుత నాగ్నజితి యను కన్యక గుణవతి గలదు దానిఁ
బెండ్లియాడుటకునై పృథివీశు లేతెంచి వాఁడికొమ్ముల గల వాని, వీర
గంధంబు సోఁకినఁ గాలు ద్రవ్వెడివాని, నతిమదమత్తంబులైన వాని

తే. గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిగిచి, బాహుబలమున నెవ్వఁడు పట్టి కట్టు
నతఁడు కన్యకుఁ వల్లభుం డనిన వానిఁ, బట్టఁజాలక పోదురు ప్రజలు బెగడి.

126

తా ॥ నగ్నజిత్తనే రాజు కోసలదేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఆ మహారాజు బుద్ధిమంతుడు. ధర్మగుణం కలవాడు. ఆయన కుమార్తె అయిన నాగ్నజితి – సుగుణవతి. ఆ మహారాజు వాడి కొమ్ములతో, వీరగంధం సోకితేనే కాలుత్రవ్వే, బాగా మదించిన ఏడు ఆబోతులను ఎవడైతే తన బాహుబలంతో పట్టికట్టగలడో ఆతనే తన కుమార్తెకు భర్త కాగలడని నియమం విధించాడు. ఎందరెందరో రాజకుమారులు వచ్చి ప్రయత్నం చేశారు. కాని ఎవరూ ఆ ఏడింటినీ కూర్చిలాగి కట్టలేక పోయారు. రాకుమార్తెకు ఎప్పటికి పెండ్లవుతుందో అని ప్రజలు భయపడసాగారు.

వ. ఇట్లు గోవృషంబుల జయించినవాఁడక్కన్యకు వరుండనిన భగవంతుండైన హరి విని సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినం గోసలాధీశ్వరుండును హరి నెదుర్కొని యర్ఘ్య పాద్యాది విధులం బూజించి పీఠంబు సమర్పించి ప్రతినందితుండై యున్నయెడ.

127

తా ॥ ఆబోతులను కట్టిపడవేసి గెల్చినవాడే నాగ్నజితికి భర్త కాగలడన్న వార్త విన్నాడు కృష్ణుడు. వెంటనే సైన్యసమేతుడై కోసలపురానికి వెళ్ళాడు. నగ్నజిత్తు కృష్ణుడికి ఎదురేగి అతిథి సత్కారాలు చేసి సింహాసనం మీద కూర్చుండజేసాడు. కృష్ణుడు నగ్నజిత్తుకు నమస్కరించాడు.

క. ఆ రాజకన్య ప్రియమున, నా రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో
కారాధితు మాధవుఁ దన, కారాధ్యుండైన నాథుఁడని కోరె నృపా!

128

తా ॥ స్వయంవరానికి వచ్చిన కృష్ణుని మోహనాకారాన్ని చూసింది నాగ్నజితి. కమలాక్షుడు, మాధవుడు, త్రిలోకవాసులచేత పూజింపబడేవాడు అయిన కృష్ణుడే తనకు ఆరాధింపదగిన నాథుడని భావించింది.

వ. మఱియు న క్కన్యకారత్నంబు తన మనంబున.

129

తా ॥ నాగ్నజితి తన మనస్సులో ఇంకా ఇలా ఆలోచించింది:

ఆ. విష్ణుఁ డవ్యయుండు విభుఁడు గావలె నని, నోఁచినట్టి తొంటి నోముఫలము సిద్ధ
మయ్యెనేనిఁ జేకొనుఁబో నన్నుఁ, జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు.

130

తా ॥ 'వైరిసమూహాన్ని సంహరించే చక్రధారి అయిన కృష్ణుడే నన్ను భార్యగా స్వీకరిస్తే నా నోములు ఫలించాయనే అనుకొంటాను. అవ్యయుడైన విష్ణువే నాకు భర్త కావాలని పూర్వ జన్మలలో నోచి ఉన్నాను కదా! నా కోరిక ఫలిస్తుందా?

మ. సిరియుం బద్మభవేశ దిక్పతులు మున్ సేవించి యెవ్వాని శ్రీ
చరణాంభోజపరాగముల్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తుఁ రీ
ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా
పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి యెబ్భంగిం బ్రవర్తించునో!

131

తా ॥ లక్ష్మీదేవి, బ్రహ్మదేవుడు, శివుడు, దిక్పాలకులు మొదలైన దేవతలందరు సేవించి ఏ దేవదేవుని పాదపద్మధూళిని శిరస్సులందు ధరించి పునీతులౌతారో ఆ పరమాత్ముడే కదా ఈ కృష్ణుడు. భూభారాన్ని తొలగించడానికి ప్రకాశవంతమైన లీలావతారాలను కృపాళువై ఏ దేవుడు ధరిస్తాడో ఆ దేవుడే గదా శ్రీహరి! మరి ఇప్పుడు నా విషయంలో ఆ కృష్ణుడు ఏ విధంగా ప్రవర్తిస్తాడో గదా!'

వ. అని యిట్లు నాగ్నజితి విచారించు నెడఁ గృష్ణుం డా రాజుం జూచి మేఘగంభీర నినదంబున నిట్లనియె.

132

తా ॥ ఈ విధంగా నాగ్నజితి ఆలోచిస్తుంటే కృష్ణుడు మహారాజును చూసి మేఘగంభీర స్వరంతో ఇలా అన్నాడు:

క. అన్యుల యాచింపరు రా, జన్యులు సౌజన్యకాంక్షఁ జనుదెంచితి నీ
కన్యన్ వేఁడెద నిమ్మా!, కన్యాశుల్కాదుల మేము గాము నరేంద్రా!

133

తా ॥ "మహారాజా! వీరులైన రాజులు అన్యులను దేనికీ యాచింపరు. నీ కన్యను వివాహమాడవలెననే తలంపుతో స్నేహభావంతో నిన్ను కోరడానికి వచ్చాను. మేము కన్యాశుల్కం చెల్లించి కన్యను భార్యగా స్వీకరించేవాళ్ళం కాదు సుమా!"

వ. అనిన రాజట్లనియె.

134

తా ॥ ఎప్పుడైతే కృష్ణుడలా అన్నాడో రాజు దానికి ఇలా సమాధానం చెప్పాడు:

శా. కన్యం జేకొన నిన్నిలోకముల నీకన్నన్ ఘనుండైన రా

జన్యుం డెవ్వఁడు? నీ గుణంబులకు నాశ్చర్యంబునుం బొంది తా
నన్యారంభము మాని లక్ష్మి భవదీయాంగంబునన్ నిత్యయై
ధన్యత్వంబునుఁ జెంది యున్నది గదా తాత్పర్యసంయుక్తయై.

135

తా ॥ "లోకాలన్నిటిలో నా కుమారీ రత్నాన్ని స్వీకరించడానికి నీకన్న యోగ్యుడు, వీరుడు, ఘనుడు అయిన రాజు ఇంకొకడున్నాడా? లక్ష్మీదేవి నీ సకల సద్గుణాలకు మోహపరవశురాలై, వేరెవ్వరినీ కోరక నీ శరీరంలోనే స్థానాన్ని కల్పించుకొని, నిత్యం నీలోనే ఉండి ధన్యురాలు కాలేదా!

శా. చంచద్గోవృషసప్తకంబుఁ గడిమిన్ సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూఁతు నిత్తునని యేఁ జీరించినన్ వైభవో
దంచ ద్గర్వులు వచ్చి రాజతనయుల్ తత్పాద శృంగాహతిం
గించిత్కాలము నోర్వ కేగుదు రనిం గేడించి భిన్నాంగులై.

136

తా ॥ కృష్ణా! సంచరిస్తున్న ఏడు ఆబోతులను బలముతో, ఓర్పుతో ఎవడైతే కట్టిపడవేస్తాడో ఆ మహావీరుడికి నా కుమారినిచ్చి వివాహం చేస్తానని కబురు పంపాను. అది తెలుసుకొన్న వైభవోపేతులు, వీరులు, గర్వాంధులు అయిన రాజకుమారులెందరో వచ్చారు. కాని ఆ ఆబోతుల కాలిగిట్టల దెబ్బలకు క్షణకాలం కూడా ఓర్చుకోలేక, గాయపడినవారై భయపడి పారిపోయారు.

శా. ఉష్ణాంశుండు తమంబుఁ దోలు క్రియ నీవుగ్రాహవక్షోణిలోఁ
గృష్ణా! వైరులఁ దోలినాఁడవు, రణక్రీడా విశేషంబులన్
నిష్ణాతుండవు, సప్తగోవృషములన్ నేఁ డాజి భంజించి రో

చిష్ణుత్వంబున వచ్చి చేకొనుము మా శీతాంశుబింబాననన్.

137

తా ॥ మహావీరా! కృష్ణా! సూర్యభగవానుడు తన కిరణజాలంచేత చీకటిని పోగొట్టే విధంగా భయంకరమైన యుద్ధభూమి నుండి ఎంతోమంది శత్రువులను పారద్రోలినావు. సంగ్రామ విద్యలో ఎన్నో రహస్యాలు, మరెన్నో మెలకువలు, ఇంకెన్నో విశేషాలు తెలిసిన యుద్ధనీతి కుశలుడవు. ఆబోతులతోటి యుద్ధంలో నేడు ఏడింటినీ నీ శౌర్య ప్రతాపాలతో భంజించు. తేజోమూర్తివై చంద్రముఖీ అయిన మా నాగ్నజితిని వివాహమాడు."

వ. అని నగ్నజిత్తు తన కూఁతు వివాహంబునకుం జేసిన సమయంబు సెప్పిన విని.

138

తా ॥ అని నాగ్నజితి వివాహానికి నగ్నజిత్తు ఏర్పాటుచేసిన నియమాన్ని కృష్ణుడికి వివరించి చెప్పాడు.

చ. కనియె నఘారి వత్స బక కంస విదారి ఖలప్రహారి దా
ఘనతర కిల్బిషంబుల నగణ్య భయంకర పౌరుషంబులన్
సునిశిత శృంగ నిర్దళితశూరసమూహ ముఖామిషంబులన్
హనన గుణోన్మిషంబుల మహాపరుషంబుల గోవృషంబులన్.

139

తా ॥ అఘుడు, వత్సుడు, బకుడు, కంసుడు మొదలైన రాక్షసులను అంతమొందించినవాడు, దుష్ట సంహారి అయిన శ్రీకృష్ణుడు—మహా పాపాలకు నిలయమైనవి, భయంకరమైన పౌరుషంతో కానవచ్చేవి, వాడిగల కొమ్ములతో వీరులను మర్దించి వారిని ఆహారంగా స్వీకరించేవి, సంహారక్రియలో మహోత్సాహాన్ని ప్రకటించేవి అయిన క్రూరవృషభాలను ఒకసారి చూశాడు.

ఉ. చేలము చక్కఁ గట్టుకొని చిత్రగతిన్ వడి నేడు మూర్తులై
బాలుఁడు దారురూపములఁ బట్టెడు కైవడిఁ బట్టి వీర శా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడఁద్రోచి మహోద్ధతిఁ గట్టి యీడ్చె భూ
పాలకు లెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వతసన్నిభంబులన్.

140

తా ॥ పై వస్త్రమైన ఉత్తరీయాన్ని నడుముకు గట్టిగా కట్టుకున్నాడు. విచిత్ర రీతిగా ఏడు రూపాలు తాల్చాడు. బాలుడు కొయ్యబొమ్మలను పట్టుకొనేటట్లు ఆ వృషభాలను అవలీలగా పట్టుకొన్నాడు. వీరులలో పెద్దపులిలాంటి కృష్ణుడు ఆబోతులను పిడికిలిపోట్లతో గట్టిగా గ్రుద్ది, క్రింద పడత్రోసి, బలోన్నతుడై వాటిని త్రాళ్ళతో కట్టి ఈడ్చి పడవేశాడు. పర్వతాలవంటి ఆబోతులను శ్రీకృష్ణుడు కూల్చటం చూసిన రాజులందరు ఆ మహావీరుని రకరకాలుగా ప్రశంసించారు.

వ. ఇట్లు వృషభంబుల నన్నింటినిం గట్టి యీడ్చినం జూచి హరికి నగ్నజిత్తు నాగ్నజితి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె, నా రాజసుందరు లానందంబును బొంది, రా సమయంబున బ్రాహ్మ ణాశీర్వాదంబులును, గీత పటహ శంఖ కాహళ భేరీ మృదంగ నినదంబులును జెలంగె, నంత నా కోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సేయించి పదివేల ధేనువులును, విచిత్రాంబరాభరణ భూషితలైన యువతులు మూఁడువేలును, దొమ్మిదివేల గజంబులును, గజంబులకు శతగుణంబులైన రథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన భటసమూహంబును నిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు.

141

తా ॥ ఏడు వృషభాలను కట్టకట్టి నేలకీడ్చిన శ్రీకృష్ణుని పరాక్రమంచూసి సంతోషించిన నగ్నజిత్తు తాను పెట్టిన నియమాన్ని నెరవేర్చిన ఆ యదువల్లభుడికి తన కుమార్తె అయిన

నాగ్నజితిని ఇచ్చి శాస్త్రోక్తంగా వివాహం చేశాడు. వివాహ వేళలో మంగళగీతాలు పాడారు. శంఖధ్వనులు, తప్పెటల మ్రోతలు, మద్దెల చప్పుళ్ళు, బాకాల ధ్వనులు, భేరీ మొదలైన వాద్య విశేషాల నాదాలు శుభప్రదంగా మ్రోగాయి. బ్రాహ్మణుల ఆశీర్వచనాలు కల్యాణాత్మకంగా వినవచ్చాయి. కోసలేశ్వరుడైన నగ్నజిత్తు కుమార్తెకు అరణంగా–పదివేల గోవులను, నూతన వస్త్రాలతో, నగలతో అలంకృతులైన మూడు వేలమంది చెలికత్తెలను, తొమ్మిదివేల ఏనుగులను, ఏనుగులకు వందరెట్లయిన రథాలను, రథాలకు వంద రెట్లయిన గుఱ్ఱాలను, గుఱ్ఱాలకు వంద రెట్లయిన భటులను ఇచ్చాడు. నూతన దంపతులను రథమెక్కించి ఆనందంతో ద్వారకకు సాగనంపాడు.

ఉ. భూతి యెలర్పఁ గోసలుని పుత్రికకై చనుదెంచి తొల్లి యాఁ
బోతులచేత నోటువడి పోయిన భూపతులెల్ల మాధువుం
డా తరుణిన్ వరించుట చరావలిచే విని త్రోవ సైన్య సం
ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్.

142

తా ॥ పూర్వం ఆ ఆబోతుల చేత దెబ్బతిని ఓటమి పాలయిన రాజులకీ వార్త అందింది. మాధవుడు వచ్చి ఆబోతులను గెల్చి నాగ్నజితిని పెండ్లాడి వెళ్ళిపోతున్నాడని గూఢచారులు వచ్చి చెప్పడంతో ఈర్ష్యాళువులైన రాజులందరు – శత్రువుల గర్వాలను నిజపరాక్రమంచేత అణచివేసే శ్రీకృష్ణుణ్ణి దారికాచి చుట్టుముట్టారు.

ఉ. దండి నరాతు లెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతో
భండనభూమియందుఁ దన బాంధవులెల్లను సన్నుతింపఁగా
గాండివచాపముక్త విశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా
ఖండల నందనుండు శశకంబుల సింహము చంపుకైవడిన్.

143

తా ॥ సైన్యసమేతులైన ఆ రాజులందరు శౌర్యప్రతాపాలు ఇనుమడించేటట్లు కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డారు. శత్రువులధాటి చూసిన అర్జునుడు శౌర్యోన్నతితో విజృంభించి, గాండీవధారియై కృష్ణుడికి అడ్డం వచ్చి అప్రతిహతమైన బాణాలతో వైరులనందరిని ఒక్క పెట్టున వధించాడు. కుందేళ్ళను చంపే సింహంలాగా శత్రువులను సంహరిస్తున్న అర్జునుణ్ణి చూసి బంధువులందరు విశేషంగా ప్రశంసించారు.

వ. ఇట్లు హరి నాగ్నజితిం బెండ్లియై యరణంబులు పుచ్చుకొని, ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోడం గ్రీడించుచుండె; మఱియును.

144

తా ॥ శ్రీకృష్ణుడు నాగ్నజితిని వివాహం చేసుకొని, మామగారిచ్చిన అరణాలన్నీ పుచ్చుకొని సతీసమేతంగా ద్వారకానగరానికి వచ్చి నాగ్నజితీదేవితో సుఖసంతోషాలలో ఓలలాడాడు.

మ. జనవంద్యన్ శ్రుతకీర్తి నంద్యఁ దరుణిన్ సందర్శనక్షోణి పా

ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గై కేయి ని

ర్ధ నయోన్నిద్రఁ బ్రపూర్ణసద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా

వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్.

145

తా ॥ శ్రీకృష్ణుని మేనత్త శ్రుతకీర్తి. శ్రుతకీర్తికి, కేకయరాజైన ధృతకేతునకు జన్మించిన 'భద్ర' సద్గుణవతి. సందర్శన క్షోణిపాదుల చెల్లెలు. అందరిచేత గౌరవింపబడే సౌజన్య మూర్తి. క్రీగంటి చూపులతో అందాలు చిందించే యౌవనవతి. ఉత్తమురాలు, నీతిమంతురాలు, మేనమరదలు అయిన భద్రను శత్రు సమూహం భీతిల్లేటట్లు కృష్ణుడు పెండ్లాడాడు.

వ. మఱియును.

146

తా ॥ తరవాత—

చ. అమరులఁ బాఱఁదోలి భుజగాంతకుఁడైన ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్ర కన్యకన్
సమదమృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్.

147

తా ॥ మద్రదేశపు రాజైన బృహత్సేనుని పుత్రిక లక్షణ. ఆమె నీతికోవిదురాలు. మంచి లక్షణాలతో ఒప్పే సుందరీమణి. లేడికన్నులవంటి కన్నులుగల కళ్యాణి. పూర్వం మదాంధులైన రాజులను ఓడించి దేవతలను పారద్రోలి గరుత్మంతుడు అమృతాన్ని ఏ విధంగా తీసుకొని వచ్చాడో ఆ విధంగా శ్రీకృష్ణుడు బలపరాక్రమాలు ప్రదర్శించి శత్రురాజులను జయించి లక్షణను ద్వారకకు తెచ్చి వివాహమాడాడు.

వ. ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియుఁ, మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు ననంగ నెనమండ్రు భార్యలైరి, మఱియు నరకాసురుని వధియించి తన్నిరుద్ధకన్యల షోడశసహస్రకన్యల రోహిణి మొదలైన వారిం బరిగ్రహించెనని విని.

148

తా ॥ పరీక్షిన్మహారాజా! ఈ విధంగా రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే సద్గుణ సౌశీల్యవతులు శ్రీకృష్ణుడికి అష్టభార్యలుగా ప్రసిద్ధి చెందారు. అంతేకాక కృష్ణుడు నరకాసురున్ని సంహరించి, నరకునిచే బంధింపబడిన రోహిణి మొదలైన పదహారు వేలమంది కన్యలను పరిణయమాడాడు.”

క. ధరకుం బ్రియనందనుఁడగు, నరకుని శూరి యేల చంపె? నరకాసురుఁ డా
వరకుంతల లగు చామీ, కర కుంభస్తనుల నేల కారం బెట్టెన్?

149

తా ॥ శుకమహర్షిని చూసి "భూదేవికి ప్రియపుత్రుడైన నరకాసురుణ్ణి కృష్ణుడెందుకు చంపాడు? నరకాసురుడు పదహారువేలమంది కన్యలను, ఆ అందగత్తెలను ఎందుకు కష్టపెట్టి చెరసాలలో నిర్బంధించాడు?" అని అడిగాడు పరీక్షిత్తు.

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె, నరకాసురుని చేత నదితి కర్ణకుండలంబులును, వరుణచ్ఛత్రంబును, మణి పర్వత మనియెడు నమరాద్రి స్థానంబును గోలుపడుటయు నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసుర వధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె.

150

తా ॥ దానికి సమాధానంగా శుకయోగి ఇలా అన్నాడు: "నరకాసురుడు స్వర్గలోకంవెళ్ళి అమరుల స్థానమైన మణిపర్వతాన్ని స్వాధీనపరచుకొన్నాడు. వరుణ ఛత్రాన్ని, అదితిదేవి కుండలాలను తీసుకుపోయాడు. ఇంద్రుడు నరకుని దురాగతాన్ని కృష్ణుడికి విన్నవించాడు. అప్పుడు కృష్ణుడు గరుడుని అధిరోహించి నరకాసురుణ్ణి సంహరించడానికి బయలుదేరాడు. ఆ సమయములో సత్యభామాదేవి శ్రీకృష్ణుని చూసి ఈ విధంగా అంది:

## శ్రీకృష్ణుడు సత్యభామతో కలిసి నరకాసురుణ్ణి చంపుట

శా. 'దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడఁగోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించి న
న్నీ వెంటం గొనిపొమ్ము, నేఁడు కరుణన్ నేఁజూచి యేతెంచి నీ
దేవీ సంహతి కెల్లఁ జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్,'

151

తా ॥ "ప్రాణేశా! నీవు ప్రతాపవంతుడవై రాక్షస సమూహాన్ని చీల్చి చెండాడుతుంటే నీ రణకౌశలాన్ని వీక్షించాలని ఎంతో కుతూహలంగా ఉంది. దేవా! కరుణామూర్తివై నన్ను కూడా నీవెంట తీసుకొనిపో. నీ శౌర్యప్రతాపాలను, తేజోమూర్తిని కళ్ళారాచూసి, ద్వారకకు వచ్చి, నీ సతీమణులకందరికీ దానిని చక్కగా వివరించి చెబుతాను."

వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె.

152

తా ॥ కృష్ణుడు ప్రాణప్రియ అయిన సత్యను చూసి, ఆమె మాటలు విన్నవాడై ఆమెతో ఈ విధంగా అన్నాడు:

సీ. 'సమద పుష్పంధయ ఝుంకారములు గావు, భీషణకుంభీంద్ర బృంహితములు వాయునిర్గత పద్మవనరేణువులు గావు, తురగ రింఖాముఖోద్ధూతరజము లాకీర్ణజలతరం గాసారములు గావు, శత్రుధనుర్ముక్త సాయకములు గలహంససారస కాసారములు గావు, దనుజేంద్రసైన్య కదంబకములు

తే. కమలకల్హార కుసుమసంఘములు గావు, చటుల రిపు శూల ఖడ్గాది సాధనములు కన్య! నీ వేద? రణరంగ గమన మేద?, వత్తు, వేగమ నిలువుము, వలదు వలదు.'

153

తా ॥ "ఓ కన్యామణీ! సుందర సుకుమార గాత్రవైన నీవెక్కడ? రణరంగానికి రావడమేమిటి? రణరంగమంటే ఏమనుకొన్నావు? యుద్ధభూమిలో ఉండేవి మత్తిల్లి ఝుంకారములు చేసే తుమ్మెదల కావు సుమా! ఏనుగుల మహాభయంకరమైన ఘీంకార నినాదాలు. కమలవనాలనుండి పిల్లవాయువులచేత ఎగరగొట్టబడిన పుప్పొడిరేణువులు కాదు, గుఱ్ఱాలు గిట్టలతో ఎగరగొట్టబడే పెనుధూళి. జలాశయాలలోని అలల అలజడివల్ల రేగి మీదపడే నీటి తుంపరలు కావు, శత్రువుల ధనుస్సుల నుండి విడువబడే బాణపరంపరలు. కలహంసలతో, కమలాలతో శోభాయమానంగా ఉండే సరస్సులు కావు, రాక్షసరాజ సైన్య సమూహాలు. పరిమళాలు వెదజల్లే ఎఱ్ఱ తామరలగుంపులు, తెల్ల కలువల గుత్తులు అక్కడ కనపడవు. భయంకరమైన శత్రువుల ఆయుధాలైన శూలాలు, ఖడ్గాలు మాత్రమే కనిపిస్తాయి. ఇంత భయంకరమైన రణభూమికి నీవెందుకు? నేను వెంటనే వస్తాను. నీవిక్కడే ఉండు. నాతో రావద్దు."

వ. అనినఁ బ్రియునకుం బ్రియంబు జనియింప దగ్గఱి.

154

తా ॥ శ్రీకృష్ణుడు ఆ విధంగా చెప్పగానే సత్యభామ కృష్ణుడికి అనురాగం కలిగేటట్లు ప్రేమగా అతనిని సమీపించింది.

ఉ. 'దానవులైన నేమి? మఱి దైత్యసమూహము లైన నేమి? నీ
మానితబాహు దుర్గముల మాటున నుండగఁ నేమి శంక? నీ
తో నరుదెంతు' నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె న
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టిఁ జూడఁగన్.

155

తా ॥ సత్యభామ దగ్గరగావెళ్ళి తన కరకమలాలు రెండూ జోడించి కృష్ణునికి మ్రొక్కింది. మ్రొక్కి "దానవులైతే ఏమి, రాక్షస సమూహాలైతేనేమి? మహావీరుడవైన నీ యొక్క బాహువుల చాటున ఉండగా నాకే భయమూ కలుగదు. నాకు లేని శంక నీకెందుకు. నీతో వస్తాను" అని ప్రార్థించింది. ప్రియ సతి మాటలకు ప్రశంసాపూర్వకంగా చూసాడు కృష్ణుడు.

వ. ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁ గ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరి గగనమార్గంబునం జని, గిరి శస్త్ర సలిల దహన పవన దుర్గమంబై మురాసురపాశ పరివృతం బయిన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి.

156

తా ॥ శ్రీకృష్ణుడు తనకు నమస్కరించిన సత్యను ప్రేమగా లేవనెత్తాడు. సత్యభామతో పాటు గరుడవాహనాన్ని ఎక్కాడు. ఆకాశమార్గంలో ప్రయాణం చేసి నరకాసురుని రాజధాని అయిన ప్రాగ్జ్యోతిషపురం చేరాడు. ప్రాగ్జ్యోతిషపురం చుట్టూ అయిదు దుర్గాలు నిర్మింపబడి ఉన్నాయి. గిరిదుర్గం, శస్త్రదుర్గం, సలిలదుర్గం, అగ్నిదుర్గం, వాయుదుర్గం అనే దుర్గాలతో ఆ పట్టణం ఒకదాని తరవాత ఒకదానితో ఆవరించబడి ఉంది. అంతేకాక మురాసురుడు కంటికి కనపడని విధంగా ప్రాగ్జ్యోతిషపురాన్ని ప్రవేశించడానికి వీలులేకుండా చుట్టూ పాశాలు కట్టి మరో కొత్త దుర్గం నిర్మించాడు.

మ. గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత
ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయమున్ భంజించి చక్రాహతిం
జెదరన్ వాయుజలాగ్ని దుర్గముల నిశ్శేషంబులం జేసి భీ
ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు ముర ప్రచ్ఛన్నపాశంబులన్.

157

తా ॥ ఆ దుర్గాలను చూసిన శ్రీకృష్ణుడు గద తీసుకొని గిరిదుర్గాలను ముక్కముక్కలు

చేసాడు. మిక్కిలి వాడిగల బాణాలను పరంపరగా కురిపించి శస్త్రదుర్గాలను విడగొట్టాడు. సుదర్శన చక్రప్రయోగంతో వాయుదుర్గాలను, జలదుర్గాలను, అగ్నిదుర్గాలను ఒక్కటి కూడా మిగలకుండా నేలమట్టం చేశాడు. మురుడు ఏర్పాటు చేసిన ప్రచ్ఛన్న పాశాలను మహాభయంకరుడై ఖడ్గంతో త్రుంచివేశాడు.

వ. మఱియును.

158

తా ॥ ఇంకా—

శా. ప్రాకారంబు గదాప్రహారముల నుత్పాటించి యంత్రంబులున్
నాకారాతుల మానసంబులును భిన్నత్వంబు నొందించి య
స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్ర నిర్ఘాత రే
ఖా కాఠిన్యముఁ బాంచజన్యము విముక్తప్రాణి చైతన్యమున్.

159

తా ॥ శ్రీకృష్ణుడు నరకాసురుని కోటగోడను గదాయుధంతో పగలగొట్టాడు. రాక్షసులు నిర్మించిన యంత్రాలతో పాటు వారి మనస్సులు కూడా ఛిన్నాభిన్నమయ్యేటట్లు అచ్యుతుడు, అనంతుడు అయిన శౌరి పాంచజన్యమనే తన శంఖాన్ని గట్టిగా పూరించాడు. ఆ ధ్వని ప్రళయకాలంలోని మేఘగర్జనలాగా అతి కఠినంగా ఉంది. జీవులు తమ ప్రాణశక్తిని పోగొట్టుకొనే విధంగా, భరించరానిదిగా ఉంది.

వ. అంత లయకాల కాలాభ్రగర్జనంబు పగిది నొప్పు న మ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలి వచ్చి హరిం గని ప్రళయకాల కీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుం దన పంచముఖంబులం పంచభూతమయం బయిన లోకంబుల మ్రింగ నప్పళించు చందంబునం గదిసి యాభీల

కీలాజటాలం బగు శూలంబున గరుడుని వైచి భూనభో-ంతరంబులు నిండ నార్చుచు.

160

తా ॥ అయిదు తలలున్న మురాసురుడు ప్రళయకాలంలో వినవచ్చే నల్లని దట్టమైన మేఘాల అనంతమైన గర్జనవలె ఉన్న ఆ శంఖధ్వనిని విన్నాడు. నిద్ర చాలించి ఆవులించాడు. నిక్కి, నీల్గి, నీటి నుండి లేచివచ్చి శ్రీకృష్ణుణ్ణి చూశాడు. ప్రళయాగ్ని లాగా మండిపడ్డాడు. చూడశక్యం కాని విధంగా పెద్దగా బొబ్బలు పెడుతూ, తూలనాడుతూ, పంచభూతాలతో నిండిఉండే లోకాలను తన అయిదు నోళ్ళతో మ్రింగడానికి అప్పళిస్తున్న విధంగా కృష్ణున్ని సమీపించాడు. మహా భీకరమైన అగ్నికీలల వంటి జడలున్న శూలాన్ని తీసుకొని గరుడునిపై ప్రయోగించి భూమ్యాకాశాలు నిండేటట్లు పెడబొబ్బలు పెట్టాడు.

క. దురదురఁ బరువిడి బిరుసున, 'హరి హరి! నిలునిలువు' మనుచు నసురయుఁ గదిసెన్
మురముర దివిజుల హృదయము, మెరమెర యిదె యడఁగు ననుచు మెఱసెన్ హరియున్.

161

తా ॥ మురాసురుడు గబగబా పరుగెత్తుకువస్తూ, దర్పోద్ధతుడై కఠినంగా "హరీ! హరీ! నిలు! పోకు" అని కృష్ణుడికి దగ్గరగా వచ్చాడు. బాధాతప్తులైన దేవతల కష్టాలు ఇకతీరుతాయిలే అనుకొన్నాడు కృష్ణుడు.

వ. అప్పుడు.

162

తా ॥ ఆ సమయంలో—

క. గరుడునిపైఁ బడి వచ్చిన, మురశూలము నడుచు నొడిసి ముత్తునియలుగాఁ గరముల విఱిచి ముకుందుఁడు, మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొనిపెన్.

163

తా ॥ మురాసురుడు ప్రయోగించిన శూలం గరుడుడిపై పడపోతుంటే మధ్యలోనే కృష్ణుడు ఆ శూలన్ని ఒడిసిపట్టుకొని చేతులతో మూడుముక్కలయ్యేటట్లు విరిచి పారేశాడు. మురుని అయిదు ముఖాలను తాకేటట్లు అతివేగంగా వాడిగల బాణాలను అతనిపై ప్రయోగించాడు.

మ. గద వ్రేసెన్ మురదానవుండు హరిపైఁ, గంసారియుం దద్గదన్
గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె, నాలోన వాఁ
డెదురై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసమ
గ్ర దశన్ వాని శిరంబు లైదును వడిన్ ఖండించెఁ జక్రాహతిన్.

164

తా ॥ మురాసురుడు వెంటనే శ్రీకృష్ణుడిపై గదను ప్రయోగించాడు. శ్రీకృష్ణుడా గదను వెయ్యిముక్కలయ్యేటట్లు తన గదతో ఖండించి విజృంభించాడు. ఆలోపల రాక్షసుడు చేతులు పైకెత్తి వడివడిగా తనకు ఎదురురావటం చూశాడు కృష్ణుడు. వెంటనే చక్రాయుధాన్ని ప్రయోగించి, లీలగా, మురాసురుడి అయిదు తలలు నరికివేశాడు.

వ. ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబు లయిన వజ్రివజ్ర ధారాదళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన, వాని సూనులు జనకవధజనిత శోకాతురులై జనార్దను మర్దింతు మని రణకుర్దనంబునం దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు నన నేడ్వురు యోధులు సక్రోధులై కాలాంతక చోదితంబైన ప్రళయపవన సప్తకంబు భంగి నరకాసుర ప్రేరితులై రయంబునఁ బీఠుం డనియెడు దండనాథుం బురస్కరించుకొని, పఱతెంచి హరిం దాఁకి శర శక్తి గదా ఖడ్గ కరవాల శూలాది సాధనంబులు ప్రయోగించిన.

తా ॥ దేవేంద్రుడి వజ్రాయుధపు దెబ్బలకు శిఖరాలు పడిపోతే కూలిపోయే పర్వతంలాగా శ్రీకృష్ణుడి చక్రాయుధపు ధారలకు అయిదు తలలు తెగిపోగా మురాసురుడు నీటిలో పడిపోయాడు. మురాసురుడికి వీరులైన ఏడుగురు కొడుకులున్నారు. తండ్రిని శ్రీకృష్ణుడు వధించినందుకు శోకించి జనార్దనుని సంహరించి తీరుతామని దీక్షపూనారు. తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడూ, అరుణుడు అనే ఆ ఏడుగురు దానవులు రణక్రీడలో క్రోధోన్మత్తులై శ్రీకృష్ణుణ్ణి తాకడానికి నిశ్చయించారు. రుద్రునిచే నియమింపబడే ప్రళయకాలంనాటి సప్తవాయువుల లాగా నరకాసురుడిచేత ప్రేరేపితులైనారు మురుని ఏడుగురు కొడుకులు. పీఠుడనే సైన్యాధిపతిని ముందుంచుకొని అతివేగంగా వచ్చి కృష్ణుడితో తలపడ్డారు. శక్తి ఆయుధాన్ని, బాణాలను, గదలను, కత్తులను, శూలాలను, ఇంకా ఎన్నో ఆయుధాలను హరిపై ప్రయోగించారు.

ఉ. ఆ దనుజేంద్రయోధ వివిధాయుధసంఘము నెల్ల నుగ్రతన్
మేదినిఁ గూలనేయుచు సమిద్ధనిరర్గళ మార్గణాళిఁ గ్ర
వ్యాద కులాంతకుం దసురహస్త భుజానన కంఠ జాను జం
ఘాదులఁ ద్రుంచి వైచెఁ దిలలంతల ఖండములై యిలం బడన్.

166

తా ॥ మురాసురుని పుత్రులైన తామ్రాది రాక్షసవీరులు ప్రయోగించిన సమస్త ఆయుధాలను నేలకూల్చి శ్రీకృష్ణుడు ఉగ్రస్వరూపుడైనాడు. రాక్షసాంతకుడైన శ్రీకృష్ణుడు అడ్డులేని, కాంతులు వెదజల్లే బాణపరంపరచే ఆ రాక్షసుల చేతులను, భుజాలను, ముఖాలను, కంఠములను, మోకాళ్ళను, పిక్కలను నువ్వుగింజలంత అయ్యేటట్లు ముక్కలుముక్కలుగా త్రుంచి నేలపై రాలేటట్లు చేసాడు.

వ. మఱియు హరి శరజాలచక్రనిహతులయి తనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్ను భూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండల ప్రముఖా భరణభూషితుం డయి దానసలిల ధారాసిక్త గండంబులును, మహోద్దండశుండాదండంబులు నైన వేదండంబులు తండంబులై నడువ వెడలి భండనంబునకుం జని.

167

తా ॥ నరకాసురుడు తన పక్షమైన వీరాధి వీరులందరూ కృష్ణుని బాణసమూహంచేత, చక్రధారలచేత మరణించడం తెలుసుకొని ఆశ్చర్యపడి, రోషించి, కృష్ణుణ్ణి దూషించి తనను భూషించుకొని, కృష్ణుణ్ణి ఏమాత్రం లెక్కచేయక యుద్ధరంగానికి బయలుదేరాడు. సువర్ణకుండలాలను, రత్నకిరీటాన్ని, భుజకీర్తులు మొదలైన సకలాభరణాలను ధరించి, మదజలం స్రవిస్తున్న చెక్కిళ్ళతో పెద్దపెద్ద తొండాలు కలిగి రణానికి సిద్ధమైన గజరాజులు గుంపులు గుంపులుగా ముందు నడుస్తుండగా నరకుడు యుద్ధభూమికి తరలి వచ్చాడు.

మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజ బింబోపరి
స్థల శంపాన్విత మేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయు ను
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనాచంగున్ రణాభంగునిన్.

168

తా ॥ మహాబలవంతుడైన భూపుత్రుడు, గరుత్మంతుని భుజస్కంధం మీద వెలుగులీనుతున్న చంద్రబింబంపైన ఉన్న మెఱుపు తీగతో కూడిన మేఘమో అనే విధంగా సత్యభామాదేవితో కూడి కూర్చున్నవాడై సంగ్రామ కథలను ముచ్చటిస్తున్న శ్రీకృష్ణుణ్ణి చూసాడు. సంగ్రామ రంగంలో ఓటమి ఎఱుగనివాడు; అమ్ములపొదితో, ఖడ్గాది ఆయుధాలతో వీరాధివీరుడిగా ప్రకాశిస్తున్నవాడు; సుందరాంగుడు, నిగనిగ నీలవర్ణంతో మెరిసిపోతున్నవాడు

అయిన శ్రీకృష్ణుణ్ణి మరోమారు తేరిపార చూసాడు.

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున.

169

తా ॥ నరకాసురుడు వెంటనే కృష్ణుడితో యుద్ధానికి దిగాడు. ఆ వీరున్ని చూసిన సత్యభామ ఏమాత్రం చలించకుండా శౌర్యశాలినిగా కృష్ణుడి ముందు నిలబడింది.

శా. వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్.

170

తా ॥ వీరనారీ మూర్తి లాగా సత్యభామ కూర్చున్నదల్లా లేచి జడముడి వేసుకొని వడ్డాణం సర్దుకొని, పైటకొంగు నడుముకు బిగించింది. నగలు సరిచేసుకొంది. పయ్యెదను చక్కగా జారకుండా వేసుకొంది. చంద్రబింబం వంటి ఆమె ముఖకాంతులు నలుదిశలా ప్రసరిస్తుండగా ఆ హరిణాక్షి వీరరసం ఉట్టిపడగా కృష్ణుడికి ఎదురుగా వచ్చి ఆయనవైపు చూసింది.

# సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుట

క. జన్యంబున దనుజుల దౌ, ర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా, జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్.

171

తా ॥ యుద్ధభూమిలో రాక్షసుల దౌర్జన్యాన్ని అణచివేయాలని నిశ్చయించి లేచి నిలబడ్డ శౌర్యఖని, సౌజన్యమూర్తి అయిన సత్యభామనుచూసి శ్రీకృష్ణుడు ఆనందోత్సాహాలతో సరసవచనాలు పలికాడు:

క. లేమాఁ దనుజుల గెలువఁగ, లేమా? నీ వేల కడఁగి లేచితి? విటు రా
లే మాను మాన వేనిన్, లేమా విల్లందికొనుము లీలం గేలన్.

172

తా ॥ "సత్యా! రాక్షసులను గెలవడానికి వీరాధివీరులమైన మేము లేమా? సుకుమారివైన నీవు యుద్ధం చేయడానికెందుకు పూనుకొన్నావు? చాలుగాని ఇటురా. ఇక్కడకు వచ్చి కూర్చో. నీ రణప్రయత్నం మాను, మానవా? అయితే లేచి వచ్చి మా చేతిలో ఉన్న విల్లును విలాసంగా గ్రహించి చేతిలో ధరించు."

వ. అని పలికి.

173

తా ॥ అని అంటూ—

క. హరిణాక్షికి హరి యిచ్చెను, సురనికరోల్లాసనమును శూరకఠోరా
సురసైన్యత్రాసనమును, బలగర్వనిరాసనమును బాణాసనమున్.

తా ॥ దేవతాసమూహానికి ఉత్సాహాన్ని కలిగించేది, దుష్టులు, భయంకర వీరులు అయిన రాక్షస యోధులకు భయం కలిగించేది, బలగర్వంతో అహంకరించే వైరుల గర్వాన్ని అపహరించేది అయిన తన ధనుస్సును శ్రీకృష్ణుడు సత్యభామ చేతికిచ్చాడు.

శా. ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై
తా వేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడా మహోత్కంఠతోన్.

175

తా ॥ శ్రీకృష్ణుడిచ్చిన విల్లు అందుకొన్నది సత్యభామ. విల్లుతో పాటు అనంతమైన, లెక్కించడానికి శక్యముకానంత తేజస్సు ఆమెలో ప్రవేశించింది. తేజస్సు నుండి జనించిన శౌర్యంతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వీరలోకానికే చూడశక్యం కాకుండా శోభిల్లింది. ఆమెలో రణోత్సాహంపెల్లుబికింది. వెంటనే విల్లుకున్న అల్లెత్రాడు సవరించి ధనుష్ టంకారం చేసింది. ఆ ధ్వని రాక్షసుల సతీమణుల మెడలలోని సూత్రాలు తెగిపోయాయా అనిపించునట్లున్నది.

క. నారి మొరయించె రిపు సే, నా రింఖణ హేతువైన నాదము నిగుడన్ నారీమణి బలసంప,
న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా!

176

తా ॥ శత్రుసేనల ధైర్యం సడలిపోయేటటువంటి మహాధ్వని కలిగే విధంగా సత్యభామ నారి మ్రోగించింది. బలవంతులైన శత్రువుల ఏనుగులు మొదలైన వారి బలగమంతా మూర్ఛపోయిందా అన్నట్లుంది ఆ ధ్వని.

సీ. సౌవర్ణ కంకణ ఝుణఝుణ నినదంబు శింజినీరవముతోఁ జెలిమిసేయఁ
దాటంక మణిగణ ధగధగ దీప్తులు గండమండల రుచిఁ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ధళధళరోచులు బాణజాల ప్రభాపటలి నడఁప
శరఘాత ఘుమఘుమశబ్దంబు పరిపంథి సైనిక కలకలస్వనము నుడుప

తే. వీరశృంగార భయరౌద్ర విస్మయములు, గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట యేయు టెల్ల, నెఱుఁగ రాకుండ నని సేసె నిందువదన.

177

తా ॥ సత్యభామ ధనుష్టంకారం చేయగానే ఆమె చేతి సువర్ణకంకణాల చప్పుళ్ళు నారి చేసే ధ్వనితో కలిసిపోయి, స్నేహం చేస్తున్నాయా అన్నట్లున్నాయి. ఆమె చెవుల దుద్దుల మణులకాంతులు చెక్కిళ్ళకాంతులను కప్పివేస్తున్నాయి. కడగంటి చూపుల ధళధళకాంతులు బాణకాంతులతో సయ్యాటలాడుతున్నాయి. బాణప్రయోగంవల్ల ఉద్భవించే ధ్వనులు శత్రుసేనలు చేసే కలకల శబ్దాలను అణచివేస్తున్నాయి. సత్యభామ చేస్తున్న యుద్ధం చూస్తుంటే వీరగుణము, శృంగారభావము, భయవిశేషము, రౌద్రలక్షణము, విస్మయ పద్ధతి అన్నీ కలిసి ఒక్కటిగా ఈ వీరనారి రూపంలో సాక్షాత్కరించాయా అన్నట్లు అద్భుతంగా ఉంది. కాకపోతే, వింటిలో బాణాన్ని ఎక్కుపెట్టడంగాని, లాగడంగాని, శత్రువుమీద వేయటంగాని ఎప్పుడు జరిగాయో కూడా తెలియరానట్లు అంత వేగంగా యుద్ధం చేసిన సత్యభామ లోకైకవీరనారి కాక మరేమౌతుంది?

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్, రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్, గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

178

తా ॥ సత్యభామ యుద్ధం చూడముచ్చటగా ఉంది. వీర, శృంగార రసాలను రెండింటినీ ఒకే సమయంలో ప్రదర్శిస్తూ అతి విలాసంగా, ఒక ఆటగా యుద్ధం చేయసాగింది. శత్రువును చూసేటప్పుడు అతనిని బాధపెట్టి వధించేటట్లు చూస్తుంది. నాథుడైన కృష్ణుణ్ణి చూసేటప్పుడు అతనిని అలరించేటట్లు చూస్తుంది. నరకుని పట్ల కోపంగా, పెనిమిటి పట్ల అనురాగంతో కనబడుతుంది. భ్రుకుటిని ముడిచి తీక్షణంగా నరకున్ని, మందహాసాలు పరిపి శ్రీకృష్ణుణ్ణి వీక్షిస్తుంది. కళ్ళల్లో ఎఱుపు జీరలు నిండేటట్లు తీవ్రాతి తీవ్రమైన శస్త్రాస్త్రాలు ప్రయోగించి నరకున్ని నొప్పిస్తూ, కళ్ళల్లో ఇంపుసొంపులు కురిపిస్తూ ప్రియపతిని సరసమైన చూపులతో ఆనందింపచేస్తూ చంద్రముఖీ అయిన సత్యభామ చిత్రవిచిత్రంగా యుద్ధం చేస్తున్నది.

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢ పాదంబుతో
నలికస్వేద వికీర్ణకాలకలతో నాకర్ణికానీత స
ల్లలిత జ్యానఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖవ్రాతాహతారాతియై.

179

తా ॥ నల్లని తుమ్మెద రెక్కల వంటి ముంగురులుగల ఆ సత్యభామాదేవి ఎడమపాదం ముందుకు పెట్టి కుడికాలు కొద్దిగా వంచి నిలబడి ఉంది. స్వేదంవల్ల నుదుటి యందు చెల్లాచెదరై ఉన్న ముంగురులతో, చెవిదాకా నారిని లాగటంవల్ల ప్రకాశిస్తున్న చేతి గోళ్ళకాంతులతో, లక్ష్యంవైపే దృష్టి సారించి, వలయాకారంగా ఏర్పడ్డ ధనుస్సు నుండి వెలువడుతున్న బాణసమూహంతో శత్రువులను హతమారుస్తూ చూడముచ్చటగా యుద్ధం చేస్తోంది.

సీ. 'బొమ్మ పెండిండ్లకుఁ బోనొల్ల' నను బాల రణరంగమున కెట్లు రాఁ దలంచె?
మగవారిఁ గనినఁ దా మఱుఁగు జేరెడు నింతి పగవారి గెల్వ నే పగిదిఁ జూచెఁ?
బసిఁడియుయ్యేల లెక్క భయ మందు భీరువు ఖగపతి స్కంధ మే కడిఁది నెక్కె?
సఖుల కోలాహల స్వనము లోర్వనికన్య పటాహభాంకృతుల కెబ్బంగి నోర్చె?

ఆ. నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచుఁ, నలసి తలఁగిపోవు నలరుఁ బోఁడి
యే విధమున నుండె నెలమి నాలీఢాది, మానములను రిపులమాన మడఁప?

180

తా ॥ బొమ్మల పెళ్ళిళ్ళకు నేనుపోను అనే బాలామణి అయిన సత్య యుద్ధభూమికి పోవాలని ఎలా అనుకొంది? పురుషులను చూడగానే చాటుకుపోయి నిలబడే ఆ కన్యామణి శత్రువీరులను ఎలా చూడగలిగింది? బంగారు ఉయ్యాల ఎక్కడానికి భయపడే ఆ పిరికి పిల్ల గరుత్మంతుని భుజాలమీదకెలా ఎక్కింది? చెలికత్తెలు చేసే కోలాహలధ్వనులనే ఓర్వలేని ఆముగ్ధమోహనాంగి రణరంగంలోని తప్పెటమ్రోతలెలా వినగలిగింది? నెమళ్ళకు నాట్యం నేర్పుతూ అలసిసొలసి తొలగిపోయే ఆ స్నిగ్ధసుకుమారి శత్రువుల గర్వమణచడానికి ఆలీఢాది విధానాలలో ఎలా యుద్ధం చేయగలిగింది?

సీ. వీణెఁ జక్కఁగఁ బట్ట వెర వెఱుంగని కొమ్మ బాణాసనం బెట్లు పట్ట నేర్చె?
ప్రాఁకునఁ దీగెఁ గూర్పంగ నేరని లేమ గుణము నే క్రియ ధనుఃకోటిఁ గూర్చె?
సరస ముత్యము గ్రువ్వఁ జాలని యబల యే నిపుణత సంధించె నిశితశరముఁ?
జిలుకకుఁ బద్యంబు సెప్పనేరని తన్వి యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ?

ఆ. బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే, గతి నొనర్చె సింహగర్జనములు?
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ, చారుసత్యభామ సత్యభామ.

181

తా ॥ "వీణ చక్కగా ఎలా పట్టుకోవాలో కూడా తెలియని అబల ధనుస్సును ఏవిధంగా పట్టుకోవాలో అనేది ఎలా నేర్చుకొంది? చెట్టుకు తీగెను అల్లుకొనేటట్లు కూర్చలేని భామ ధనుస్సుకు అల్లెత్రాడు నేవిధంగా అమర్చి పట్టుకొంది? ముత్యాలు హారంలో నేర్పుగా గుచ్చలేని తన్వి వాడి బాణాన్ని ఏ విధంగా సంధించిందో గదా! చిలుకకు దగ్గర కూర్చొని పద్యమే చెప్పలేని సుకుమారి అస్త్ర మంత్రాలన్నీ ఎన్నడభ్యసించిందో? మాట్లాడు చెలీ అని చెలికత్తెలెంత

బ్రతిమలాడినా అమితంగా భాషించని కోమలి ఎలా సింహ గర్జనలు చేసిందో?" అని చూపరులు ఆశ్చర్యపడేటట్లు త్రిలోక సుందరి, సకల సద్గుణ నిలయ, త్రిలోక వాసులచే మెచ్చుకోబడే లలితాంగి అయిన సత్యభామ రణకౌశలం అతి రమ్యంగా భాసించింది.

శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ, సురల్ సారంగ యూథంబుగా, నా విల్లింద్రశరాసనంబుగ, సరోజాక్షుండు మేఘంబుగాఁ, దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్.

182

తా ॥ అల్లెత్రాడు లాగడంవల్ల ఏర్పడే ధ్వనులు ఉరుములుకాగా, దేవతలు వాననీటి బిందువులు త్రాగే చాతక పక్షులు కాగా, చేతిలోని విల్లు ఇంద్రధనుస్సు కాగా, శ్రీకృష్ణుడు మేఘంగా, తాను మబ్బు ప్రక్కనే ఉండే మెఱుపు తీగెగా, బాణసమూహం ఎడతెరపిలేని వానధారలుగా, రాక్షసులనే దావాగ్నిని ముంచివేసే బాణవర్షాన్ని కురిపిస్తూ సత్యభామాదేవి ఇది వర్షాకాలమా? అనే విధంగా సంగ్రామ రంగంలో తన యుద్ధకౌశలాన్ని ప్రదర్శించింది.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు, కందర్పకేతువై ఘనధూమ కేతువై యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు, భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై మెఱయు నాకృష్టమై మెలఁత చాప, మమృత ప్రవాహమై యనలసందోహమై తనరారు నింతిసందర్శనంబు,

తే.హర్షదాయియై మహారోషదాయియై, పరఁగు ముద్దరాలి బాణవృష్టి, హరికి నరికిఁ జూడ నందంద శృంగార, వీరరసము లోలి విస్తరిల్ల.

183

తా ॥ సత్యభామ చేస్తున్న యుద్ధంలో ఆమె హావభావాలు శ్రీకృష్ణునికి శృంగారరసాన్ని, నరకాసురుడికి వీరరసాన్ని కనిపింప చేస్తున్నాయి. సత్యాదేవి వదనం శ్రీకృష్ణునికి

చంద్రబింబంలా కనిపిస్తే నరకుడికి తీక్షణమైన సూర్యబింబంలా కనిపిస్తోంది. ఆమె చీరకొంగు కృష్ణుడికి మన్మథ పతాకంగా తోస్తే నరకుడికి తోకచుక్కలాగా తోస్తోంది. బాణం ఎక్కుపెట్టి వదిలేటప్పుడుండే ఆమె ధనుస్సు కృష్ణుడికి మన్మథుని చుట్టి ఉన్న పరిధిగాను నరకుడికి ప్రచండభానుని చుట్టి ఉన్న పరిధిగా గోచరిస్తోంది. సత్యను చూడగానే కృష్ణుడికి ఆమె అమృత మూర్తా అని అనిపిస్తోంది. నరకుడికి అగ్నిగుండమా అని అనిపిస్తోంది. ముగ్ధమనోహరరూపిణి అయిన సత్యభామ కురిపిస్తున్న బాణవర్షం కృష్ణుడికి ఎనలేని సంతోషాన్ని కలిగిస్తే, నరకుడికి మహారోషాన్ని కలిగిస్తోంది.

వ. ఇ వ్విధంబున.

184

తా ॥ ఈ విధంగా సత్యభామాదేవి—

క. శంపాలతాభ బెడిదపు, టంపఱచే ఘోరదానవానీకంబుల్ పెంపఱి సన్నాహంబుల, సొంపఱి భూసుతుని వెనుకఁ జొచ్చెన్ విచ్చెన్.

185

తా ॥ మెఱుపుతీగా అన్నట్లు ప్రకాశిస్తూ కఠినాతి కఠినములైన బాణపరంపరలను కురిపించడంతో రణరంగంలో ఉన్న రాక్షసవీరులందరు పెంపు కోల్పోయి యుద్ధ విధానం తెలియక నరకాసురుని మాటున దాగారు. సైన్యమంతా కకావికలై విచ్చిపోయింది.

వ. అ య్యవసరంబునం గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం, గరుణారసావలోకన ప్రసారియు, మధుర వచన సుధారసవిసారియుం, దదీయ సమరసన్నాహ నివారియునై యిట్లనియె.

186

తా ॥ అప్పుడు కృష్ణుడు మనోహారిణి అయిన సత్య శౌర్యప్రతాపాలు చూసి సంతోషించాడు. కరుణాదృష్టితో ఆమెనిక యుద్ధం నుండి విరమింపచేయాలని నిశ్చయించి, మధురాతిమధురమైన వాక్కులతో ఇలా పలికాడు:

క. 'కొమ్మా! దానవనాథుని, కొమ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై
కొమ్మా! మెచ్చితి నిచ్చెదఁ, గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్.'

187

తా ॥ "సత్యాదేవీ! నరకాసురుని బలగమంతా యుద్ధం చేయకుండా వైదొలగిపోయింది. నీ ప్రతాపమే ప్రతాపము!! ఘన విజయాన్ని స్వీకరించు. నీ శౌర్యాన్ని ఎంతగానో మెచ్చుకొంటున్నాను. నీవు ఏఏ ఆభరణాలు కోరుకొంటావో అవన్నీ ఇస్తాను.

వ. అని పలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృతచిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దటికంబు సేసి, తత్కరకిసలయోల్లసిత బాణాసనంబు మరల నందుకొనియె, నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె.

188

తా ॥ అంతవరకూ కలిగిన మనోవ్యథను దూరంచేస్తూ, ఆనందోత్సాహాలను కలిగించే ప్రశంసాపూర్వకమైన సరస సల్లాపాలతో కృష్ణుడు సత్యభామను ఎంతగానో గౌరవించి, ఆమె చిగురువంటసుతిమెత్తనైన చేతి నుండి ధనుస్సును తిరిగి తీసుకొన్నాడు. నరకాసురుడు మురారి అయిన కృష్ణుణ్ణి చూసి ఈ విధంగా అన్నాడు:

క. మగువ మగవారి ముందఱ, మగతనములు నూప రణము మానుట నీకున్ మగతనము గాదు; దనుజులు, మగువల దెసఁ జనరు మగలమగ లగుట హరీ!

189

తా ॥ కృష్ణా! మగవారిముందర ఒక మగువ వచ్చి శౌర్యం చూపిస్తుంటే యుద్ధం మాని ఊరుకోవటం నీకది పౌరుషమౌతుందా? ప్రతాపమనిపించుకుంటుందా? రాక్షసులు స్త్రీల జోలికి పోరు సుమా! ఎందుకంటే దానవులు మగవారికే మగవారు కాబట్టి.

వ. అనిన హరి యిట్లనియె.

190

తా ॥ నరకాసురుడి మాటలకు కృష్ణుడు కోపించి ఇట్లా అన్నాడు:

క. 'నరకా! ఖండించెద మ, త్కరకాండాసనవిముక్త ఘనశరముల భీ
కరకాయు నిన్ను సుర కి, న్నరకాంతలు సూచి నేఁడు నందిం పంగన్.'

191

తా ॥ "నరకా! ప్రలాపాలు పలుకకు. మహాభయంకరమైన శరీరముగల నిన్ను ఇప్పుడే నా ధనుస్సునుండి వదిలే కఠినమైన బాణాలతో సంహరిస్తాను. నీ వధను చూసి కిన్నరకాంతలు మొదలైన దేవతా స్త్రీలందరు ఎంతో సంతోషిస్తారు.

వ. అని పలికి హరి నరకాసుర యోధులమీఁద శతఘ్ని యను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్క వరుసను వార లందఱు మహావ్యథం జెందిరి, మరియును.

192

తా ॥ శ్రీకృష్ణుడు నరకాసురుని యోధులమీద శతఘ్ని అనే దివ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. దానితో ఆ వీరులందరూ చెప్పరానంత బాధకు గురయ్యారు.

మ. వర విచ్ఛిన్న తురంగమై పటుగదాసంభిన్న మాతంగమై, యురుచక్రాహతవీరమధ్య పదబాహుస్కంధ ముఖ్యాంగమై, నురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో హరి మ్రోలన్ నిలువంగ లేక పఱచెన్ హాహానినాదంబులన్.

193

తా ॥ శ్రీకృష్ణుడు రోషించి బాణప్రయోగంతో గుఱ్ఱాలను నేలకూల్చాడు. ఏనుగులను గదతో కొట్టి క్రింద పడవేసాడు. మహా ప్రతాపవంతమైన చక్రాయుధపు దెబ్బలతో నరకుని సైనికుల నడుములను, కాళ్ళను, భుజాలను, చేతులను, శిరస్సులను ఖండించాడు. శ్రీకృష్ణుడి ధాటికి ఆగలేక ఆ సైన్యమంతా దిగులుచెంది, కృశించిపోయి, హైన్యానికి దిగజారి హాహాకారాలు చేసాయి. కృష్ణుడి ముందు నిలువలేక యోధులందరూ పారిపోయారు.

వ. అప్పుడు.

194

తా ॥ అప్పుడు—

ఆ. మొనసి దనుజయోధముఖ్యులు నిగుడించు, శస్త్రసముదయముల జనవరేణ్య! మురహరుండు వరుస మూఁడేసి కోలలం, ఖండితంబు సేసె గగనమందు.

195

తా ॥ నరకాసురుని సైన్యాధిపతులు యుద్ధరంగంలో ముందుకు దూకారు. వారు ప్రయోగించిన బాణాలనన్నిటినీ ముకుందుడు మూడేసిబాణాల చొప్పున ప్రయోగించి ఖండించాడు.

క. వెన్నుని సత్యను మోచుచుఁ, బన్నుగఁ బదనఖర చంచుపక్షాహతులన్ భిన్నములు సేసె గరుడుఁడు, పన్నిన గజసముదయములఁ బౌరవముఖ్యా!

196

తా ॥ రణరంగంలో విజృంభిస్తున్న గజబలాన్నంతటినీ, సత్యాకృష్ణులనిద్దరినీ తన భుజస్కంధం మీద మోస్తూనే గరుత్మంతుడు తన కాళ్ళ గోళ్ళతో, ముక్కుతో, రెక్కలతో

రూపుమాపాడు.

వ. మఱియును విహగరాజపక్ష విక్షేపణసంజాతవాతంబు సైరింపం జాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటం జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించిన తనచేతి శక్తిం గొని గరుడుని వైచె, నతండును విరుల దండవ్రేటునఁ జలింపని మదోద్దండ వేదండంబునుంబోలె విలసిల్లె, న య్యవసరంబున గజారూఢుండై కలహరంగంబున.

197

తా ॥ గరుత్మంతుడు తన రెక్కలను విదళించి పెనుగాలిని పుట్టించాడు. ఆ ఈదురుగాలిని సహింపలేక చావగా, పారిపోగా మిగిలిన సైనికులందరు ప్రాగ్జ్యోతిషపురంలోకి వెళ్ళిపోయారు. వజ్రాయుధాన్ని నిరోధించిన తన చేతిలోని శక్తి ఆయుధాన్ని గరుడునిపై ప్రయోగించాడు నరకుడు. పూలదండతో కొడితే ఏవిధంగా మదగజం చలించదో ఆ విధంగా తనమీదకు వచ్చిన శక్తి ఆయుధాన్ని సునాయాసంగా తీసిపారవేసి గరుత్మంతుడు ప్రకాశించాడు. నరకాసురుడు పట్టపుటేనుగునెక్కి వచ్చి కృష్ణుడితో యుద్ధం చేయడానికి సిద్ధపడ్డాడు.

మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁ డా చక్రాయుధున్ వైవ శూ
లము చేఁబట్టిన నంతలోన రుచిమాలాభిన్న ఘోరాసురో
త్తమ చక్రంబగు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్ర వినూత్నకుండల సమేతంబైన తన్మూర్ధమున్.

198

తా ॥ నరకాసురుడు ఆవిధంగా మదగజంమీద వచ్చి శ్రీకృష్ణుడిపై శూలాయుధాన్ని ప్రయోగించబోయాడు. అంతలోనే ఘోరపరాక్రమోపేతులైన రాక్షస నాయకుల ప్రతాప తేజాన్ని హరించిన తన సుదర్శన చక్రంతో, చిత్రవిచిత్ర రత్నాలతో పొదగబడిన వినూత్నమైన

కుండలాలతో కూడి ఉన్న నరకాసురుని శిరస్సును శ్రీకృష్ణుడు తృటిమాత్రంలో ఖండించి వేసాడు.

శా. 'ఇల్లాలం గిటియైన కాలమున మున్నే నంచు ఘోషింతు వో
తల్లీ! నిన్నుఁ దలంచి యైన నిచటన్ నన్నుం గృపం గావఁకే!
చెల్లంబో! తలఁ ద్రుంచె 'నంచు నిల నాక్షేపించు చందంబునం
ద్రెళ్లెం జప్పుడు గాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై.

199

తా ॥ "విష్ణుమూర్తి ధరించిన వరాహావతారంలో నేనాయన సతినని మునుపెప్పుడూ గొప్పగా చెబుతుండేదానివి గదమ్మా! నిన్ను గుర్తుచేసుకొని అయినా శ్రీకృష్ణుడు నన్ను కృపతో రక్షించలేదే! సరిపోయింది. ఇదిగో! నా తల ఖండించివేసాడు. చూడు." అని భూదేవిని ఆక్షేపిస్తున్న విధంగా చప్పుడు చేస్తూ నరకాసురుడు యుద్ధభూమిపై దభేలుమని పడిపోయాడు.

క. కంటిమి నరకుడు వడఁగా, మంటిమి నేఁ' డనుచు వెస నమర్త్యులు మునులున్ మింటం
బువ్వులు గురియుచుఁ, బంటింపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్.

200

తా ॥ ఆ విధంగా శ్రీకృష్ణుని చేత నరకాసురుడు సంహరింపబడగా "ఇప్పటికి బ్రతికాం. నరకుడి వధ కళ్ళారా చూశాం గదా" అని పరమసంతోషంతో దేవతలు, మహర్షులు పొంగిపోతూ ఆకాశంమీద నుండి కృష్ణ పరమాత్మను రకరకాలుగా పొగడుతూ, ఆ దేవదేవునిపై పూలవర్షం కురిపించి తృప్తి చెందారు.

వ. అంత భూదేవి వాసుదేవుని డగ్గఱ నేతెంచి జాంబూనదరత్న మండితంబైన కుండలంబులును, వైజయంతియును, వనమాలయును, వరుణదత్తంబైన సితచ్ఛత్రంబును, నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబుల తోడం గరకమలంబులు

ముకుళించి, విబుధవందితుండును, విశ్వేశ్వరుండును నైన దేవదేవుని నిట్లని వినుతించె.

201

తా ॥ శ్రీకృష్ణుని విజయవార్త విన్న భూదేవి తన పతిని సమీపించి రత్నాలతో పొదిగిన సువర్ణమయమైన కుండలాలను, వైజయంతిమాలను, వరుణుడిచ్చిన తెల్లని గొడుగును, ఒక అనర్ఘమైన మహారత్నాన్ని ఆ వాసుదేవుడికి సమర్పించి భక్తిప్రపత్తులతో నమస్కరించింది. దేవతలచేత స్తుతింపబడేవాడు, జగన్నాథుడు అయిన శ్రీకృష్ణుని చూసి, రెండు చేతులు జోడించి ఈ విధంగా స్తోత్రం చేయసాగింది:

సీ. 'అంభోజనాభున కంభోజనేత్రున కంభోజమాలా సమన్వితునకు నంభోజపదున కనంతశక్తికి వాసుదేవునకును దేవదేవునకును భక్తులు గోరిన భంగి నే రూపైనఁ బొందువానికి నాదిపురుషునకును నఖిల నిదానమై యా పూర్ణవిజ్ఞానుఁ డైన వానికిఁ బరమాత్మునకును

ఆ. ధాతఁ గన్న మేటితండ్రికి నజునికి, నీకు వందనంబు నే నొనర్తు నిఖిలభూతరూప! నిరుపమ! యీశ! ప, రాపరాత్మ మహిత! యమితచరిత!

202

తా ॥ "జగన్నాథా! నాథా! పరాపరా! పరమాత్మా! అనంతమైన, మహిమాన్వితమైన చరిత్రగలవాడా! నిరుపమాకారా! సమస్త జీవరాశుల రూపాలు నీవే అయినవాడా! పుట్టుకలేనివాడా! బ్రహ్మజనకా! సంపూర్ణ జ్ఞానస్వరూపా! సకల సృష్టికి మూలకారకుడవైన ఆదిపురుషా! దేవ దేవా! వాసుదేవా! అనంత శక్తి నీవే అయి అలరారేవాడా! పద్మనాభా! కమలనేత్రా! అంబుజమాలాధరా! తామరల వంటి సుకుమార చరణాలతో శోభిల్లే శ్రీకృష్ణా! ఇదే నీకు నమస్కరిస్తున్నాను. నా మ్రొక్కులు స్వీకరించు దేవా!

వ. దేవా! నీవు లోకంబుల సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు

సత్త్వగుణంబును, సంహరించుటకుఁ దమో గుణంబును ధరియింతువు; కాలమూర్తివి. ప్రధానపూరుషుండవు పరుండవు, నీవ! నేనును, వారియు, ననిలుండు, వహ్నియు నాకాశంబుఁ, భూతతన్మాత్రలును, నింద్రియంబులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్త్వంబును, జరాచరంబైన విశ్వంబును, నద్వితీయుండవైన నీయందు సంభవింతుము.

203

తా ॥ దేవా! పరమాత్మా! కాలమూర్తీ! ప్రధానపురుషా! పరాత్పరా! ఈ సమస్త లోకాలను సృష్టించే సమయంలో రజోగుణాన్ని, పోషించే సమయంలో సత్త్వగుణాన్ని, లయం చేసే సమయంలో తమోగుణాన్ని ధరిస్తావు. త్రిమూర్త్యాత్మకుడవునీవే! పంచభూతాలమైన నేను, నీరు, నిప్పు, గాలి మిన్ను; పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు; కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు; దేవతలు, మనస్సు, కర్త; మహత్తత్త్వం; చరాచరమైన సమస్త విశ్వము అందరమూ నీ నుండి పుట్టినవారమే. నీవు అద్వితీయుడవు. నీతో సమానమైన వారు మరొకరు బ్రహ్మాండంలోనే లేరు.

చ. దయ నిటు సూడుమా! నరకదైత్యుని బిడ్డఁడు వీఁడు, నీ దెసన్
భయమున నున్న వాఁడు, గడు బాలుఁ, డనన్యశరణ్యుఁ, డార్తుఁ, డా
శ్రయరహితుండు, దండ్రిక్రియ శౌర్యము నేరఁడు, నీ పదాంబుజ
ద్వయిఁ బొడఁ గాంచె భక్తపరతంత్ర సువీక్షణ! దీనరక్షణా!

204

తా ॥ భక్తులను కరుణాకటాక్షాలతో వీక్షించే భక్తపరతంత్రా! దీనజన రక్షకా! స్వామీ! ధరణీప్రియా! ఒక్కసారి దయతో ఇటు చూడు. ఈ బాలుడు–నరకాసురుని పుత్రుడు. తండ్రిని చంపిన నిన్ను చూడటానికి భయభ్రాంతుడై ఉన్నాడు. వీడు మరీ పసివాడు. వీడికి వేరెవరూ శరణిచ్చేవారులేరు. బాధతో ఉన్నాడు. ఆశ్రయమిచ్చేవారెవరూలేరు. తండ్రిలాగా

పరాక్రమశాలికాడు. నీ పాదపద్మాలను చూసి శరణుకోరాడు. ఈ దీనబాలుని రక్షించు స్వామీ!"

వ. అని యిట్లు భూదేవి భక్తితోడ హరికిం బ్రణమిల్లి వాక్కుసుమంబులం బూజించిన నర్చితుండై భక్తవత్సలుం డయిన పరమేశ్వరుండు నరకపుత్రుం డయిన భగదత్తున కభయం బిచ్చి, సర్వసంపద లొసంగి నరకాసురగృహంబు ప్రవేశించి యందు.

205

తా ॥ అని భూదేవి శ్రీకృష్ణుడికి భక్తితో మ్రొక్కి, స్తోత్రాలనే పూలతో పూజించింది. భక్తవత్సలుడైన కృష్ణపరమాత్మ భూదేవి పలుకులకు ప్రీతిచెంది నరకాసురుని కుమారుడైన భగదత్తుడికి అభయప్రదానం చేసాడు. కృష్ణుడు ఆ బాలుడికి సర్వసంపదలు ప్రసాదించి, ఆ తరువాత నరకాసురుడి గృహంలోకి ప్రవేశించాడు.

# శ్రీకృషుడు పదహారువేల కన్యలను వరించి దేవలోకము నుండి పారిజాతం తెచ్చుట

ఉ. రాజకులావతంసుఁడు పరాజిత కంసుఁడు సొచ్చి కాంచె ఘో

రాజుల రాజులం బటుశరాహతి నొంచి ధరాతనూజుఁ డు

త్తేజితశక్తిఁ దొల్లిఁ జెఱదెచ్చినవారిఁ బదాఱు వేల ధా

త్రీజన మాన్యలన్ గుణవతీ వ్రతధన్యల రాజకన్యలన్.

206

తా ॥ రాజకులాభరణమైన శ్రీకృష్ణుడు నరకుని అంతఃపురంలోకి ప్రవేశించాడు. ఆ కంసాంతకుడు, ఘోర యుద్ధాలలో నరకాసురుడు తన భుజబలంతో ఎందరో రాజులను బాణప్రయోగంతో నొప్పించి, గెల్చి వారినుండి చెరపట్టితెచ్చిన పదహారువేలమంది రాజకన్యలను చూసాడు. ఆ కన్యలు సద్గుణవతులేకాక సర్వజనులచేత సన్నుతి పొందినవారు.

మ. కని రా రాజకుమారికల్ పరిమళత్కౌతూహలాక్రాంతలై

దనుజాధీశ చమూవిదారు నతమందారున్ శుభాకారు నూ

తన శృంగారు వికారదూరు సుగుణాధారున్ మృగీలోచనా

జన చేతోధనచోరు రత్నమకుటస్ఫారున్ మనోహారునిన్.

207

తా ॥ శుభాకారుడు, శృంగారస్వరూపుడు, సుగుణధాముడు, వికారదూరుడు, రాక్షసాంతకుడు, శిష్టజనమందారుడు, అతిలోక సుందరుడు, కాంతామానసచోరుడు, రత్నస్థగిత కిరీటకుండలధారి అయిన శ్రీకృష్ణుని దివ్యమంగళ రూపాన్ని ఆ రాచకన్యలు చూశారు.

వ. కని యతని సౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణంబులకు మోహించి, తమకంబులు జనియింప, ధైర్యంబులు సాలించి, సిగ్గులు వర్జించి, పంచశరసంచలిత హృదయలై,

దైవయోగంబునం బరాయత్తంబులైన చిత్తంబుల నమ్మత్త కాశినులు దత్తరంబున మనోజుం డుత్తల పెట్ట నతండు దమకుఁ బ్రాణ వల్లభుం డని వరియించి.

208

తా ॥ తమ మానసాలను హరించిన శ్రీకృష్ణుణ్ణి కుతూహలాత్మలై చూసి ఆ మన్మథాకారుని సౌందర్యానికి గాంభీర్య గుణానికి, చాతుర్య లక్షణానికి మెచ్చి, మోహించి తమకానికి గురైనారు. వారు ధైర్యం కోల్పోయారు. సిగ్గు వదలివేసారు. దైవయోగం కారణంగా చలించిన హృదయాలతో మదనుడు తొందరపెట్టగా, వలపును తట్టుకోలేక శ్రీకృష్ణుడిపై మనస్సు లగ్నంకాగా ఆ సుందరాంగులందరూ శ్రీకృష్ణుడే తమ ప్రాణనాథుడని తలపోశారు.

ఉ. పాపపు రక్కసుండు సెఱపట్టె నటంచుఁ దలంతుఁ మెప్పుడుం
బాపుఁడె? వాని ధర్మువునఁ బద్మదళాక్షునిఁ గంటి మమ్మ! ము
న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు సేసినారమో?
యా పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ! హరిన్ మముఁ గూర్చె నిచ్చటన్.

209

తా ॥ సఖులారా! పాపాత్ముడైన నరకాసురుడు మనల్ని చెఱపట్టాడని ఇన్నాళ్ళూ ఎంతో బాధపడ్డాము. నిజంగా నరకుడు పాపాత్ముడా! కాదు. ఈ రాక్షసుడివల్లే కదా మనం కమలనేత్రుడైన కృష్ణుణ్ణి కళ్ళారా చూడగలిగాం. ఈ పురుషోత్తముణ్ణి చేరుకోవడానికి పూర్వం ఎన్నెన్ని వ్రతాలు చేశామో గదా! శ్రీకృష్ణుణ్ణీ, మనల్నీ ఒకటిగా కల్పిన విధాత ఎంత పుణ్యుడో కదా!

క. ఉన్నతి నీతఁడు గౌఁగిట, మన్నింపఁగ నింక బ్రదుకు మానిని మనలో ము న్నేమి నోము నోఁచెనొ, సన్నుతమార్గముల విపిన జల దుర్గములన్.

210

తా ॥ మనలో ఏ మానవతిని శ్రీకృష్ణుడు మన్నించి తన కౌగిటిలోకి చేర్చుకొంటాడో! శ్రీకృష్ణుడి ఆదరాభిమానాలతో ఉన్నతంగా జీవించ గల మానిని మునుపు ఏమేమి నోములు నోచిందో? అడవులలో, జలదుర్గాలలో శాస్త్రాలలో చెప్పబడిన విధంగా ఎంత ఘోరతపస్సు చేసిందో!

క. విన్నారమె యీ చెలువముఁ?, గన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్? మన్నార మింతగాలముఁ, గొన్నారమె యెన్నఁ డయినఁ గూరిమి చిక్కన్.

211

తా ॥ చెలులారా! ఎప్పుడయినా ఇంత గొప్ప అందచందాలను గురించి విన్నామా? ఇటువంటి పరాక్రమాన్నిగాని, గాంభీర్యాన్నిగాని ఎవరిలోనైనా చూసామా? ఇంత కాలం ఇక్కడ బ్రతికే ఉన్నాంగాని ఎప్పుడైనా ఇంతటి ప్రేమను చవిచూసామా?

సీ. వనజాక్షి! నేఁ గన్క వైజయంతిక నైన గదిసి వ్రేలుదు గదా కంఠమందు
బింబోష్ఠి! నేఁ గన్క బీతాంబరము నైన మెఱసి యుండుదు గదా మేను నిండఁ
గన్నియఁ నేఁ గన్క గౌస్తుభమణి నైన నొప్పు సూపుదుఁ గదా యురమునందు
బాలిక! నేఁ గన్కఁ బాంచజన్యము నైన మొనసి చొక్కుదుఁ గదా మోవిఁ గ్రోలి

ఆ. పద్మగంధి! నేను బర్హ దామము నైనఁ, జిత్రరుచుల నుందు శిరమునందు ననుచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు, గములు గట్టి గరుడగమనుఁ జూచి.

212

తా ॥ ఆ రాజకన్యలందరూ గుంపులు గుంపులుగా చేరి శ్రీకృష్ణుణ్ణి చూసి తమలో తాము రకరకాలుగా అభివర్ణించుకోసాగారు: “కమలాక్షీ! నేను కనుక వైజయంతీమాలనై ఉంటే హాయిగా ఈ కృష్ణుని కంఠాన్ని అలంకరించి వ్రేలాడుతూ ఉండేదానిని గదా!” అని ఒక సుందరి అంటే మరో సుందరిలేచి “బింబోష్ఠీ! నేనే కనుక కృష్ణుడు ధరించిన పీతాంబరాన్ని అయిఉంటే

ఆ మనోజాకారుని శరీరమంతా నిండి ప్రకాశిస్తాను కదా!" అని అంది. మరోపూబోడిలేచి "ఓ కన్యామణీ! నా మాటవిను. నేను కనుక కౌస్తుభమణినై ఉంటే కృష్ణుని వక్షస్థలంలో ఉండి మెరిసిపోయెడి దానిని గదా!" వెంటనే మరో ఇంతిలేచి "ఓ బాలా! నేనే కనుక పాంచజన్యాన్ని అయితే – ఆహా! కృష్ణుడి మోవిని క్రోలి చొక్కిపోయే దానిని కదా!" ఇంకోమగువ అందుకొని "పద్మగంధీ! నేను కనుక నెమలిపింఛాన్ని అయి ఉంటే చిత్రవిచిత్రమైన కాంతులు విరజిమ్ముతూ కృష్ణుడి శిరస్సుపైన అందాలు కురిపించేదానిని కదా!"

శా. భూనాథోత్తమ! కన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న
న్నే నవ్వెం దగఁ జూచె డగ్గఱియె వర్ణించెన్ వివేకించె స
మ్మానించెం గరుణించెఁ బే రడిగె సన్మార్గంబుతోఁ బెండ్లి యౌ
నేనే చక్రికి దేవి నంచుఁ దమలో నిర్ణీతలై రందఱున్.

213

తా ॥ ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధంగా ఆ రాజకన్యలందరూ ఎవరిపాటికి వారు శ్రీకృష్ణుడు తనవాడే అని మురిసిపోసాగారు. శ్రీకృష్ణుడు నన్నే చూసి నవ్వాడని ఒకరు, నన్ను ప్రేమగా చూశాడని మరొకరు, నాకు దగ్గరగా వచ్చాడని ఇంకొకరు నన్ను వర్ణించి చెప్పాడని వేరొకరూ ఆనందించారు. నన్నే వేరుచేసి అనురాగంతో చూసాడని, నన్నే అభిమానించాడని, నావైపే దయతో చూశాడని, నన్నే పేరడిగాడని, తప్పక మంచిగా మాపెళ్ళవుతుందని, చక్రికి నేనే దేవేరినని ప్రతి ఒక్కరూ తమలో శ్రీకృష్ణుని పతిగా నిర్ణయించుకొని సంతోషోత్సాహాలతో తన్మయత్వం చెందారు.

వ. ఇట్లు బహువిధంబులం దమ తమ మన్ననలకు నువ్విళ్ళూరు కన్నియలం బదాఱువేల ధవళాంబరాభరణ మాల్యానులేపనంబు లొసంగి, యందలంబుల నిడి, వారలను నరకాసుర భాండాగారంబులం గల నానావిధంబు లయిన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను; ధవళంబులై, వేగవంతంబులై, యైరావత

కులసంభవంబులైన చతుర్దంత దంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి, దేవేంద్రుని పురంబునకుం జని యదితిదేవి మందిరంబు సొచ్చి, యా పెద్దమ్మకు ముద్దు సూపి, మణికిరణపటల పరిభావిత భాను మండలంబులైన కుండలంబు లొసంగి, శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై, పిదప సత్యభామ కోరిన నందనవనంబు సొచ్చి.

214

తా ॥ ఈ విధంగా తన అనురాగానికి, మన్ననకు అర్రులు చాస్తున్న పదహారువేల రాజకన్యలకు శ్రీకృష్ణుడు తెల్లని పట్టుచీరలను, వివిధాభరణాలను, వినూత్నమైన మైపూతలను, చిత్రవిచిత్రమైన పుష్పమాలికలను కానుకలుగా పంపి, వారందరినీ అందలాలపై నెక్కించి ద్వారకానగరానికి సగౌరవంగా పంపించాడు. నరకాసురుని అధీనంలో ఉన్న మహాధనాలను, రథాలను, గుఱ్ఱాలను, ఐరావతవంశంలో జన్మించిన నాలుగు దంతాలు గలిగి తెల్లగా, వేగవంతంగా ఉన్న గజసముదాయాన్ని కూడా శ్రీకృష్ణుడు ద్వారకకు తరలించాడు.

భూదేవి ఇచ్చిన కుండలాదులు తీసుకొని స్వర్గలోకానికి ప్రయాణమైనాడు సత్యాసమేతుడైన శ్రీకృష్ణుడు. అమరావతీ నగరం చేరగానే ముందుగా మాతృమూర్తి అయిన అదితీదేవి మందిరానికి వెళ్ళి, ఆమెకు ఆనందం కలిగించాడు. సూర్యబింబకిరణ కాంతులను తిరస్కరించే కాంతిమంతమైన మణులతో పొదగబడిన రత్నకుండలాలను తల్లి చేతిలో పెట్టాడు.

దేవేంద్రుడు శచీదేవితో కలిసి శ్రీకృష్ణ సత్యలను గౌరవించి, సత్కరించాడు. సత్యభామాదేవి కోరగా శ్రీకృష్ణుడు ఆమెతో కూడి ఇంద్రుని సుందరోద్యానవనమైన నందన వనంలోని అందచందాలు చూడటానికి ఉల్లాసంగా ప్రవేశించాడు.

మ. హరి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుం
దరగంధానుగత భ్రమద్భ్రమర నాదవ్రాతముం బల్లవాం

కురశాఖాఫల పర్ణ పుష్పకలికా గుచ్ఛాది కోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్.

215

తా ॥ కమ్మని తావులవెంట తిరుగుతూ ఝుంకారనాదం చేస్తున్న తుమ్మెదల గుంపుతో కూడినది; చిగుళ్ళతో, కొమ్మలతో, పండ్లతో, మెత్తని ఆకులతో, పుష్పగుచ్ఛాలతో బహుసుందరంగా శోభిల్లుతున్నది; ముల్లోకాలలోని అర్థుల కోరికలను తీర్చి ఖ్యాతికెక్కినది; దేవేంద్రుని చేత సర్వత్రా సంరక్షింపబడేది, కల్పవృక్షజాతిలో ఒకటిగా ప్రసిద్ధి చెందిన పారిజాతవృక్షాన్ని సత్యభామకు ప్రియము కలిగించే విధంగా శ్రీకృష్ణుడు తన చేతితో పెల్లగించి తెచ్చి గరుత్మంతునిపై పెట్టాడు.

వ. ఇట్లు పారిజాతంబును హరించి యదువల్లభుండు వల్లభయుం, దానును విహగవల్ల భారూఢుండయి చనుచున్న సమయంబున.'

216

తా ॥ ఈ విధంగా కృష్ణుడు పారిజాతవృక్షాన్ని అపహరించి సత్యాదేవితో కూడి గరుడవాహనాన్ని అధిరోహించి వెళుతున్న సమయంలో—

సీ. నరకాసురుని బాధ నలఁగి గోవిందుని కడ కేగి తత్పాదకమలములకుఁ
దన కిరీటము సోఁక దండప్రణామముల్ గావింప నా చక్రి కరుణ సేసి
చనుదెంచి భూసుతు సమయించి తనవారిఁ దన్ను రక్షించుటఁ దలఁప మఱచి
యింద్రుండు బృందారకేంద్రత్వ మదమునఁ బద్మలోచన! పోకు పారిజాత

ఆ. తరువు విడువు' మనుచుఁ దాఁకె నడ్డము వచ్చి, తఱిమి సురలు నట్లు దాఁకి రకట!
యెఱుక వలదె నిర్జరేంద్రత కాల్పనే?, సురల తామసమును జూడ నరిది.

217

తా ॥ పూర్వం నరకాసురుడు పెట్టిన బాధలతో దేవేంద్రుడు కృశించిపోయి కృష్ణుడి దగ్గరకు వెళ్ళి ఆయన పాదపద్మాలకు తన కిరీటము తాకేటట్లు సాష్టాంగ నమస్కారంచేసి తన కష్టాలు పోగొట్టమని ప్రార్థించాడు. కరుణా సముద్రుడైన కృష్ణుడు ఇంద్రుని ప్రార్థన ఆలకించి, నరకాసురుని వధించి ఇంద్రుని, దేవతలను రక్షించాడు. ఈ విషయమంతా త్రిలోకాధిపత్యం వల్ల కలిగిన మదం చేత ఇంద్రుడు మరచిపోయాడు. తనను రాక్షసుల బారినుండి రక్షించిన శ్రీకృష్ణుడి దారికి అడ్డంపడ్డాడు. "ఇంద్రలోకంలో ఉండవలసిన పారిజాతాన్ని విడిచిపెట్టు. లేకపోతే యుద్ధంలో నన్ను గెలిచి తీసుకుపో" అని ఇంద్రుడు శ్రీకృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు. అదే విధంగా దేవతలు కూడా శ్రీకృష్ణుణ్ణి ఎదిరించి యుద్ధానికి సిద్ధపడ్డారు. సురలకు, సురాధిపతికి ఆమాత్రం జ్ఞానం ఉండనక్కరలేదా? సురాధిపత్యం ఎందుకు? కాల్చడానికా? దేవతల తామసగుణం అర్థరహితం. అది వారి అజ్ఞానమనుకోవాలో! లేక అహంకారమనుకోవాలో!

వ. ఇట్లు దనకు నొడ్డారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తన పురంబునకుం జని, నిరంతర సురభి కుసుమ మకరంద మాధురీ విశేషంబులకుఁ జొక్కి చిక్కక నాకలోకంబున నుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మి దలంచు చున్న పారిజాతమ్ము నాశ్రితపారిజాతుం డయిన హరి మహా ప్రేమాభిరామ యగు సత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి, నరకాసురుని యింటం దెచ్చిన రాజకన్యక లెందఱందఱకు నన్ని నివాసంబులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి.

218

తా ॥ ఈ విధంగా తనతో పగబూని అడ్డం వచ్చిన దేవతలను, దేవేంద్రుణ్ణి ఓడించి శ్రీకృష్ణుడు పారిజాతంతో సత్యభామా సహితుడై ద్వారకకు వెళ్ళాడు. చక్కని పరిమళాలు వెదజల్లే పుష్పాలలోని మకరంద మాధుర్యానికి చొక్కి స్వర్గలోకంలో ఉండక తుమ్మెదలు పారిజాతం వెంటనంటి భూలోకానికి వచ్చాయి. ఆశ్రితులకు కల్పవృక్షం వంటి శ్రీకృష్ణుడు తనకు అత్యంత ప్రేమపాత్రురాలయిన సత్యభామతో విహరించే సుందరోద్యానవనంలో ఆ పారిజాతవృక్షాన్ని

నాటించాడు.

నరకాసురుని గృహం నుండి తెచ్చిన పదహారువేలమంది రాకుమార్తెలకు పదహారువేల మేడలను నిర్మింపచేసి శ్రీకృష్ణుడు వారికి కావలసిన సమస్త వస్తుసముదాయాన్ని ఏర్పాటు చేసాడు.

చ. అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొకనాఁడు మంచి ల
గ్నమునఁ బదాఱు వేల భవనంబులలోనఁ బదాఱువేల రూ
పములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా!

219

తా ॥ లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు ఒక మంచి ముహూర్తవేళలో పదహారువేల రూపాలు ధరించి, పదహారువేల గృహాలలో, పదహారువేల పద్ధతులలో ప్రకాశిస్తూ పదహారువేలమంది రాజకన్యలను ప్రేమాభిమానాలతో, శాస్త్రోక్తంగా వివాహమాడాడు. శ్రీకృష్ణుడు అనంతుడైన పరమాత్ముడు, జగన్నాథుడు.

ఉ. దానములందు సమ్మదవిధానములం దవలోక భాషణా
హ్వానములందు నొక్కక్రియ నా లలితాంగుల కన్నిమూర్తులై
తా ననిశంబు గానఁబడి తక్కువ యెక్కువ లేక యుత్తమ
జ్ఞాన గృహస్థధర్మమునఁ జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁడై.

220

తా ॥ శ్రీకృష్ణపరమాత్మ ఆ సుందరీమణులకు అన్నిరూపాలు ధరించి ప్రతి నిముషం వారికంటి ముందే ఉండేవాడు. సంతోష సన్నివేశాలలో, చూపులలో, మాటలలో, ఆహ్వాన సమయాలలో, దానక్రియలలో పదహారువేలమంది సతీమణులకు ఏమాత్రం ఎక్కువ తక్కువ

చూపకుండా ఒక్క సమంగా ప్రవర్తిస్తూ, ఉత్తమగృహస్థుగా తన ధర్మాన్ని నిర్వహిస్తూ ఆ పరమాత్ముడు తాను రమిస్తూ వారిని రమింపచేశాడు.

క. తరుణులు బెక్కం డ్రయినను, బురుషుఁడు మనలేఁడు సవతి పోరాటమునన్ హరి యా పదాఱువేవురు, తరుణులతో సమత మనియె దక్షత్వమునన్.

221

తా ॥ ఎక్కువమంది భార్యలతో జీవించే పురుషుడు భార్యలమధ్య సవతిపోరాటం అధికం కావడంతో సంతోషంతో బ్రతకలేడు. కానీ శ్రీకృష్ణుడు తన నైపుణ్యంతో పదహారువేలమంది భార్యలతోను సమభావంతో వ్యవహరించి కృతకృత్యుడైనాడు.

శా. ఎన్నోభంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్
ము న్నేదేవునిఁ జూడఁ గానక తుదిన్ మోహింతు, రా మేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర
చ్చిన్నాలోకన హాస భాషణ రతిశ్లేషానురాగంబులన్.

222

తా ॥ బ్రహ్మదేవుడు, ఇంద్రుడు మొదలైన దేవతలందరూ పూర్వం ఎన్నోరకాలైన యోగమార్గాలతో పరాత్పరుడైన విష్ణుమూర్తిని దర్శించాలని శతవిధాలా ప్రయత్నించారు. కాని ఆ దేవదేవుని దర్శించలేక మాయలో మునిగిపోయారు. అటువంటి సర్వదేవతలకు అధీశుడైన జగన్నాథునికి ప్రత్యక్షంగా తమ సేవాతత్పరతతో పదహారువేలమంది పడతులు పత్నులై, తమ హావభావాలతోను, అనురాగ దృక్కులతోను, మందహాస మధురిమలతోను, సంభాషణాచాతుర్యంతోను, ఆలింగన సౌఖ్యంతోను, సంగమకౌతుకంతోను తరించారంటే వారందరూ పూర్వజన్మలలో ఎంతెంత తపస్సుచేసి ఉన్నారో!!

సీ. ఇంటికి వచ్చిన నెదురేగుదెంచుచు నానీత వస్తువు లందుకొనుచు

సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచు భక్తితోడ
సంవాసిత స్నానజలము లందించుచు సద్గంధవస్త్రభూషణము లొసఁగి
యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదు లొసఁగుచు విసరుచు నోజ మెఱసి

తే. శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువు మిగుల, నడుగు లొత్తుచు దాసీసహస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై హరి నుదారుఁ, దారకాధిప వదనలు దారు దగిలి.

223

తా ॥ నాథుడైన శ్రీకృష్ణుడు ఇంటికి రాగానే ఎదురేగి వెళ్ళి భర్త తెచ్చిన వస్తువులన్నీ అందుకొంటారు. మణులతో కాంతిమంతంగా పొదగబడిన సువర్ణమయమైన ఆసనం వేసి కూర్చోబెడతారు. కూర్చోగానే భక్తిభావంతో పతిపాదాలు కడుగుతారు. సువాసనభరితమైన పన్నీటి జలాలు స్నానానికందిస్తారు. పరిమళాలు విరజిమ్మే నూతన వస్త్రాలను, వినూత్న భూషణాలను ఇస్తారు. ప్రీతికరమైన పదార్థాలు పెట్టి తాంబూలాది సుగంధ ద్రవ్యాలందిస్తారు. అలసట తీరడానికి విసురుతారు. చక్కగా తలదువ్వుతారు. పడకమీద కూర్చొని నాథునిపాదాలు ఒత్తుతారు. వేలాది మంది దాసీజనం ఉన్నాకూడా ఆ రాజకన్యలందరూ దాస్య భక్తితో ప్రాణనాథుడైన శ్రీకృష్ణుణ్ణి తనివితీరా, భక్తిమీరా కొలిచారు. గృహిణీ ధర్మాన్ని నిర్వహిస్తూ పతిసేవలో నిమగ్నమైపోయారు.

శా. 'నన్నే పాయఁడు, రాత్రులన్ దివములన్ నన్నే కృపం జెందెడిన్,
నన్నే దొడ్డగఁ జూచు వల్లభలలో, నాథుండు నా యింటనే
యున్నా' డంచుఁ బదాఱు వేలుఁ దమలో నూహించి సేవించి రా
యన్నుల్ గాఢపతివ్రతాత్వ పరిచర్యా భక్తి యోగంబులన్.

224

తా ॥ పదహారువేల భార్యలు శ్రీకృష్ణుణ్ణి అత్యంత భక్తిభావంతో, పాతివ్రత్య పరతంత్రలై సేవించారు. అనురాగాతిశయంతో అహర్నిశలూ కృష్ణభావనతోనే గడిపారు. అంతమందిలో

ఎవరిపాటికి వారు శ్రీకృష్ణుడు నన్ను వదలిపెట్టి ఎక్కడికీ, ఎవరి దగ్గరకూ వెళ్ళడని తలపోయసాగారు. రాత్రింబగళ్ళు ప్రేమతో నా వద్దనే ఉంటాడని భావించారు. భార్యలందరిలోనూ నన్నే ఎక్కువ ఇష్టంతో, అభిమానంతో నాథుడు చూస్తున్నాడని గర్వించారు. కృష్ణుడు నా ఇంట్లోనే ఉన్నాడు, ఇంకెక్కడా ఉండడని పరవశించిపోయారు. ప్రతి ఒక్కరూ ఆ విధంగా ఆనందంగా ఉండటానికి కారణం పూర్వజన్మలోవారు చేసిన తపస్సుకు ఫలితంగా పరమాత్ముడు చూపిన వాత్సల్యం, లీలామనుషత్వంతో భగవంతుడు తాల్చిన అనంతరూప ధారణం.

క. ఆ రామలతో నెప్పుడుఁ, బోరాములు సాల నెఱపి పురుషోత్తముఁడున్ గారామునఁ
దిరిగెను సౌ, ధారామ లతాసరోవిహారముల నృపా!

225

తా ॥ శ్రీకృష్ణుడు ఆ రాజకన్యలతో ఎంతో ఆత్మీయంగా, అనురాగంతో బంగారుసౌధాలలో, సుందరోద్యానవనాలలో, విశాలసరోవరాలలో విలాసంగా విహరించాడు.

క. ఏ దేవుఁడు జగముల, ను త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున మ
ర్యాదా రక్షణమునకై, యా దేవుం డట్లు మెఱసె యాదవులందున్.

226

తా ॥ సృష్టి స్థితి లయ కారకుడైన ఆ పురుషోత్తముడు, శ్రీకృష్ణుడిగా అవతరించిన విష్ణువు, మానవుడిగా యాదవులలో ఆ విధంగా గృహస్థ ధర్మాన్ని నిర్వహిస్తూ లీలామానుష విగ్రహుడై ప్రకాశించాడు.

## శ్రీకృషుడు కేళీగృహమందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట్ట

వ. అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్రనీల మరకతాది మణిస్తంభ వలభి విటంకపటల దేహళీకవాట విరాజమానంబును, శాంతకుంభ కుడ్య గవాక్ష వేదికా సోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్ర కౌశేయవితానంబును, వివిధ మణిదీపికా విసర విభ్రాజమానంబును, మధుకర కులకలిత మల్లికాకుసుమ మాలికాభిరామంబును, జాలకరంధ్ర వినిర్గత కర్పూరాగరుధూప ధూమంబును, వాతాయన విప్రకీర్ణ శిశిరకర కిరణస్తోమంబును, బారిజాతప్రసవామోద పరిమిళిత పవన సుందరంబు నయిన లోపలి మందిరంబున శరచ్చంద్రచంద్రికా ధవళపర్యంక మధ్యంబున, జగదీశ్వరుం డయిన హరి సుఖాసీనుండై యుండ, సఖీజనంబులుం దానును దగ్గఱి కొలిచి యుండి.

227

తా ॥ అక్కడ అలా జరుగుతుండగా ఒక రోజున శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి అంతఃపురంలోపల ఉన్న శరత్కాలంలో వెలుగులు చిందించే చంద్రుని వెన్నెలవలె తెల్లగా మెరుస్తున్న పాన్పు మధ్యభాగంలో కూర్చుని ఉన్నాడు. ఆ పట్టపుదేవేరి అంతఃపురం మరకత మాణిక్యాది నవరత్నాలతో కూర్చిన బంగారు స్తంభాలతో అలరారుతోంది. చంద్రశాలలోని ఇంద్రనీలపు మణుల నిగనిగలు చూపరులనాకర్షిస్తున్నాయి. వాకిలి చూరులలోని గూళ్ళతో, చిత్రవిచిత్ర శోభితమైన పై కప్పులతో, అలంకరించిన గడపలతో, అందమైన తలుపులతో ఆ అంతఃపుర మందిరాలు విరాజిల్లుతున్నాయి. గోడలు, మందిరాల గోడలపై నిలిపే కలశాలు, కిటికీలు, అరుగులు, మెట్లు అన్నీ బంగారుకాంతితో మెరిసిపోతున్నాయి. వ్రేలాడుతున్న ముత్యాలదండలతో, రకరకాల పట్టువస్త్రాలతో కూర్చిన మేలుకట్లతో శోభాయమానంగా ఉంది ఆ అంతఃపురం.

అంతఃపురమంతటా చిత్రవిచిత్ర కాంతులు విరజిమ్ముతున్న మణిదీపాలు జిగ్‌జిగేలు మనిపిస్తున్నాయి. తుమ్మెదలు గుంపులు గుంపులుగా వచ్చి వాలుతున్న పరిమళభరితమైన

మల్లెలమాలలతో అంతఃపురంలోని మందిరాలు సుగంధాలు నిండి రారమ్మని పిలుస్తున్నాయి. కిటికీల సందులలో నుండి కర్పూరపు వాసనలు, సాంబ్రాణి పొగలు బయటకు వెళుతున్నాయి. చంద్రుని శీతల కిరణాలు కిటికీలలో నుండి చొచ్చుకొని వచ్చి అంతఃపురంలో చల్లదనాన్ని నింపుతున్నాయి. పారిజాత పుష్ప పరిమళాలను మోసుకొని వస్తున్న పిల్లవాయువులతో అంతఃపురమంతా ఆహ్లాదకరంగా ఉంది.

రుక్మిణీదేవి తన అంతఃపురానికి వేంచేసిన శ్రీకృష్ణుణ్ణి సమీపించింది. చెలులు ఆమెను వెంబడించారు.

సీ. కుచకుంభములమీఁది కుంకుమతో రాయు హారంబు లరుణంబు లగుచు మెఱయఁ గరపల్లవము సాఁచి కదలింప నంగుళీయక కంకణప్రభ లావరింపఁ గదలిన బహురత్న కలిత నూపురముల గంభీర నినదంబు గడలు కొనఁగఁ గాంచన మణికర్ణికా మయూఖంబులు గండపాలికలపై గంతు లిడఁగ

తే. గురులు నర్తింపఁ బయ్యెదకొంగు దూఁగ, బోలి చేనున్న చామరఁ బుచ్చుకొనుచు జీవితేశ్వరు రుక్మిణి సేర నరిగి, వేడ్క లిగురొత్త మెల్లన వీవఁదొడఁగె.

228

తా ॥ వక్షస్థలంపై అలదిన కుంకుమ తగలడంతో మెడలోని హారాలు అరుణకాంతితో మెరుస్తుండగా, మెత్తని చేతిని చాచి కదిలించగా, వ్రేళ్ళకున్న ఉంగరాలు, చేతికున్న గాజులు మిలమిలా తళుకులీనుతుండగా, అడుగు తీస్తూ అడుగు వేస్తూ కదలడంతో వివిధ రత్నాలతో ప్రకాశిస్తున్న కాలి అందెల ధ్వనులు వీనులవిందు చేస్తుండగా, మణిమయమైన బంగారు చెవిదుద్దుల తళతళలు చెక్కిళ్ళపై వ్యాపించగా, ముంగురులు ముఖంపైన కదులుతుండగా, పైటకొంగు చలిస్తుండగా రుక్మిణీదేవి, చెలికత్తె చేతిలో ఉన్న వింజామరను గ్రహించి జీవితేశ్వరుడైన శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి మెల్లగా విసరసాగింది.

వ. అప్పుడు.

229

తా ॥ అప్పుడు—

మ. పతి యే రూపము దాల్చినం దదనురూపంబైన రూపంబుతో
సతి దా నుండెడు నట్టి రూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యిట్లనియెఁ జంచన్మందహాసంబుతోన్.

230

తా ॥ ప్రాణనాథుడైన శ్రీకృష్ణుడు ఎప్పుడు ఏ రూపంతో ఉంటే అప్పుడు రుక్మిణీదేవి దానికి అనుగుణమైన రూపంతో ప్రకాశించేది. అటువంటి సౌందర్యశాలి, చంద్రముఖీ, తన్వంగి, నిర్మల హృదయ, లక్ష్మీ రూపిణి, మహాపతివ్రత అయిన రుక్మిణిని చూసి కృష్ణుడు మందహాసం చేస్తూ, చతురభాషణుడై ఈ విధంగా అన్నాడు:

మ. బలశౌర్యంబుల భోగమూర్తి కుల రూప త్యాగ సంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్, వారికిన్
నెలఁతా! తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ ని న్నిచ్చినం బోక యీ
బలవద్భీరుల వార్ధిలీనుల మముం బాటింప నీ కేటికిన్?

231

తా ॥ “బలంలోగాని, ప్రతాపంలోగాని, కులంలోగాని, భోగంలోగాని, సౌందర్యంలోగాని, త్యాగంలోగాని, సిరిసంపదలలోగాని, గుణాలలోగాని శిశుపాలుడు మొదలైన సుక్షత్రియ రాజనందనులు, ఇంద్రుడు మొదలైన అష్టదిక్పాలకులకన్న ఎంతో గొప్పవాళ్ళు. అన్నీ ఉన్నవాళ్ళు. రుక్మిణీ! నీ తల్లి, తండ్రి, అన్న అందరూ నిన్ను శిశుపాలుడికిచ్చి కట్టబెట్టాలనుకుంటే

ఒప్పుకొని, శిశుపాలుని పెండ్లి చేసుకొని పోక, బలహీనుణ్ణి, పిరికివాణ్ణి, సముద్రగర్భంలో నివసిస్తున్నవాణ్ణి అయిన నన్ను నీవెందుకు వరించావు?

సీ. లోకుల నడవడిలోని వారము గాము, పరులకు మా జాడ బయలు పడదు, బలమదోపేతులు పగగొంద్రు మా తోడ, రాజపీఠములకు రాము తఱచు, శరణంబు మాకు నీ జలరాశి సతతంబు నిష్కించనుల మేము, నిధులు లేవు, కలవారు చుట్టాలు గారు, నిష్కించన జనబంధులము ముక్తసంగ్రహులము,

ఆ. గూఢవర్తనులము, గుణహీనులము, భిక్షు, లైన వారిఁ గాని నాశ్రయింప, మిందుముఖులు దగుల, రిటువంటి మముబోఁటి, వారి నేల దగుల వారిజాక్షి!

232

తా ॥ రుక్మిణీ! సామాన్యజనులవలె ప్రవర్తించే వారముకాము. మా జాడ వేరెవరికీ తెలియదు. బలవంతులు, మదోన్మత్తులు అయినవారు మాతో పగబడతారు. సింహాసనం అధిరోహించి రాజ్యాధికారం చేబట్టాలని మేమెక్కడికీ రాము. మేము ఎప్పుడూ ఈ సముద్రంలోనే ఉంటుంటాము. మాకు నిధినిక్షేపాలు లేవు. మా బంధువులు కూడా ఎవరూ బాగా ఉన్నవారు కారు. రహస్యంగా జీవించే వాళ్ళం. గుణంలేని వాళ్ళం. యాచకులైన సన్న్యాసులను మాత్రమే ఆశ్రయిస్తాం. సంసారబంధాలు కాదని, ముక్తిని కోరేవాళ్ళం. పద్మాక్షీ! ఇటువంటి మావంటి వాళ్ళను సుందరీమణులు కోరనేకోరరు. మరి నీవెందుకు నన్ను కోరావు?"

పరమాత్ముడైన శ్రీకృష్ణుడు సామాన్య మానవుడు కాడు. భగవంతుని రూపుగాని, జాడగాని తెలుసుకోవడం ఎవరికీ సాధ్యంకాదు. దుష్టులు దేవుడితో శత్రుత్వం వహిస్తారు. యాదవులకు రాజ్యార్హత లేదుకనుక యదువంశోద్భవుడైన శ్రీకృష్ణుడు చక్రవర్తిత్వాన్ని చేపట్టడు. కృష్ణుడు శ్రీమన్నారాయణుని అవతారపురుషుడు కావడంతో ఎల్లప్పుడూ జలరాశిలోనే ఉంటాడు. సమస్త జీవకోటికీ ఆయనే పెన్నిధి. ఆయనకు నిధుల అవసరం లేదు. దామోదరుడిగా పిలవబడే పురుషోత్తముడు దీనజన బంధువు గదా! మోక్షప్రదాత అయిన పురాణపురుషుడికి సంపన్నుల

బంధుత్వమెందుకు? కృష్ణుడు నిర్గుణుడు. ఎవరికీ కనబడదు. యోగుల మనస్సులలోనే ఉంటాడు. భక్తవత్సలుడు. భక్తి లోపించినా, అతిశయం ఆవహించినా వారిని దూరం చేసేవాడు వాసుదేవుడు.

క. సిరియును వంశము రూపును సరియైన వివాహసంఖ్య సంబంధంబుల్ జరుగును, సరి గాకున్నను, జరగవు, లోలాక్షి! యెట్టి సంసారులకున్.

233

తా ॥ "దేవీ! కులం, ధనం, రూపం సరిసమానంగా ఉన్నప్పుడే నెయ్యం కుదురుతుంది. వివాహబంధానికి కూడా వధూవరులిద్దరిలో అన్ని లక్షణాలు సమానంగా ఉండాలి. ఆ గుణాలు సరిగ్గా లేకపోతే వియ్యం కూడా పొసగదు.

క. తగ దని యెఱుఁగవు మమ్ముం, దగిలితివి మృగాక్షి! దీనఁ ద ప్పగు, నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ, దగులుము, గుణహీనజనులఁ దగునే తగులన్?

234

తా ॥ నీకు నేను సరితూగనని తెలుసుకోలేకపోయావు. నన్ను కోరావు. నన్ను పెండ్లాడావు. తప్పు జరిగిపోయింది. నీకు తగిన రాజును ఎన్నుకొని వివాహమాడు. గుణరహితుడనైన నన్ను పొందడం యుక్తమేనా?

సీ. సాల్వ జరాసంధ చైద్యాది రాజులు చెలఁగి నన్ వీక్షించి మలయుచుండ
నది గాక రుక్మి నీ యన్నయు గర్వించి వీర్యమదాంధుఁడై వెలయుచున్న
వారి గర్వంబులు వారింపఁగాఁ గోరి చెలువఁ నిన్నొడిచి తెచ్చితిమి, గాని
కాంతా తనూజార్థ కాముకులము గాము, కామమోహాదులఁ గ్రందుకొనము.

తే. విను, ముదాసీనులము, క్రియావిరహితులము, పూర్ణులము మేము, నిత్యాత్మ బుద్ధితోడ

వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి, నవలతాతన్వి! మాతోడ నవయ వలదు.

235

తా ॥ లతాంగీ! సాల్వుడు, జరాసంధుడు, శిశుపాలుడు మొదలైన రాజులు విజృంభించి నన్ను కోపంగా చూస్తూ తిరుగుతుండటం చూశాను. అదీగాక, నీ అన్న అయిన రుక్మి గర్వంతో, వీరుడననే మదంతో నాకు ఎదురు తిరిగాడు. వారందరి గర్వం అణచివేయడానికే రాక్షస పద్ధతిలో నిన్ను ఎత్తుకొని వచ్చి వివాహమాడాను. అంతేగాని, స్త్రీలపట్ల వ్యామోహంగాని, సంతానం కావాలనే వాంఛగాని, ధనం సంపాదించాలనే ఆసక్తిగాని నాకు లేవు. కామమోహాలలో కొట్టుకుపోయేవాణ్ణి కాదు. దేనిపట్ల ఉపేక్షగాని అపేక్షలేనివాడిని. ఈ పని చేయాలి, ఆ పని చేయకూడదు అనే తత్త్వం లేనివాడిని. పూర్ణమనస్తత్వం గలవాడిని. బాహ్యప్రదేశంలో కాక గృహంలో వెలిగే దీపంలాగా నిత్యం ఆత్మజ్ఞానంతో మెలగుతుంటాను. అటువంటి నిష్కాముడనైన నన్ను పతిగా ఎంచి కష్టాలపాలు కావద్దు.”

వ. అని యిట్లు భగవంతుడైన హరి దన్నుఁబాయక సేవించుటం బ్రియురాలను, పట్టంపుదేవి ననియెడి రుక్మిణి దర్పంబు నేర్పున నుపసంహరించి యూరకుండిన నమ్మానవతి యప్రియంబులు నపూర్వంబులునైన మనోవల్లభు మాటలు విని దురంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు.

236

తా ॥ అని భగవంతుడైన శ్రీకృష్ణుడు – ఒక్క క్షణం కూడా వదలకుండా పతిని సేవిస్తున్నందువల్ల ‘నేనే పతికి ప్రియురాలిని, పైగా పట్టపు దేవేరిని’ అని గర్విస్తున్న రుక్మిణీదేవి అహంకారాన్ని క్షణంలో మటుమాయం చేసి మౌనం వహించాడు. అభిమానవతి, సద్గుణవతి అయిన రుక్మిణీదేవి ఇంతవరకూ పతి నోటివెంట ఎప్పుడూ వినని మాటలు వింది. అప్రియాలైన ఆ పలుకులతో భరించరాని దుఃఖంతో నలిగిపోయింది.

సీ. కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై కుచకుంభయుగళ కుంకుమము దడియ
విడువక వెడలెడు వేఁడినిట్టూర్పుల, లాలితాధర కిసలయము గందఁ
జెలువంబు నెఱిదప్పి చిన్నవోవుచు నున్న వదనారవిందంబు వాడు దోఁప
మారుతాహతిఁ దూలు మహిత కల్పకవల్లి వడువున మేన్ వడవడ వడంకఁ

తే. జిత్త మెఱియంగఁ జెక్కిటఁ జెయ్యి సేర్చి, కౌతుకం బేది పదతలాగ్రమున నేల
వ్రాసి కొనుచును మోమరవాంచి వగలఁ, బొందె మవ్వంబు గందిన పువ్వుఁబోలె.

237

తా ॥ ఒక్క క్షణంలో రుక్మిణీదేవి మృదుత్వం పోయిన పుష్పంలాగా వాడిపోయింది. కాటుకతో కలిసి జారుతున్న కన్నీళ్ళు వరదలై వక్షస్థలంపై అలదిన కుంకుమను పూర్తిగా తడిపివేశాయి. వేడివేడి నిట్టూర్పులు చిగురువంటి ఎఱ్ఱని మెత్తని అధరాన్ని కందిపోయేటట్లు చేశాయి. ముఖపద్మం అందాన్ని కోల్పోయి చిన్నబోయింది. గాలిదెబ్బకు తూలిపడిపోతున్న కల్పలత విధంగా తనువు వణికిపోతూ తూలిపోతోంది. మనస్సు కాలిపోతూ ఉంటే, ఉత్సాహం నశించి, చెక్కిలిమీద చేయిపెట్టుకొని, ఏమీ చేయలేక, కాలివ్రేళ్ళతో నేలరాస్తూ రుక్మిణీదేవి తలదించుకొని శోకమూర్తిలా నిలబడిపోయింది.

చ. అలికుల వేణి తన్నుఁ బ్రియుఁ డాడిన యప్రియభాష లిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు చొచ్చిన రీతిగాఁగ బె
బ్బులి రొద విన్న లేడి క్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వలనఱి వ్రాలెఁ గీ లెడలి వ్రాలిన పుత్తడిబొమ్మ కైవడిన్.

238

తా ॥ ప్రియాతి ప్రియుడు, ప్రాణనాథుడు అయిన శ్రీకృష్ణుడు పలికిన అయిష్టమైన మాటలు రుక్మిణీదేవి చెవిలో సూదులు గుచ్చినట్లు కాగా, పెద్దపులి గాండ్రింపు విన్న లేడికూనలాగా, కీలు ఊడిపోతే క్రిందపడిపోయే బంగారు బొమ్మలాగా కాంతి హీన అయి,

చేష్టలు కోల్పోయి ఆమె నేలపై పడిపోయింది.

వ. ఇట్లు వ్రాలిన.

239

తా ॥ ఈ విధంగా పడిపోతే–

మ. ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్త వినూత్నభూషణ దురుక్త క్రూర నారాచ శో
షణ నాలింగితధారుణిన్ నిజకులాచారైక సద్ధర్మ చా
రిణి విశ్లేషిణి వీతతోషిణిఁ బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్.

240

తా ॥ కన్నీటితో అడ్డగింపబడిన, అరుణవర్ణంతో నిండిన కన్నులు కలది, జారిపోయిన ఆభరణాలు కలది, క్రూరమైన బాణాలవంటి నిందావాక్యాలతో శోషిల్లినది, అయిన రుక్మిణీదేవి దగ్గరకు వేదాలచేత స్తుతింపబడే శ్రీకృష్ణుడు వచ్చాడు. కులాచారాలను, సద్ధర్మాన్ని సదా ఆచరించే పతివ్రతా శిరోమణి, సంతోషాన్ని పూర్తిగా మరచిపోయినది, నేలనతుక్కుపోయి ఉన్నది అయిన రుక్మిణిని మెల్లగా ప్రణయస్వరూపుడైన కృష్ణుడు లేవనెత్తాడు.

సీ. కని సంభ్రమంబునఁ దనువునం దనువుగా ననువునఁ జందనం బల్ల నలఁది
కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁ బలుకులు సెవులలోఁ బార నూఁది
కరమొప్ప ముత్యాలసరుల చిక్కెడలించి యురమునఁ బొందుగా నిరవు కొలిపి
తిలకంబు నునుఫాల ఫలకంబుపైఁ దీర్చి వదలిన భూషణావళులఁ దొడిగి

తే. కమలదళ చారు తాలవృంతమున విసరి, పొలుచు పయ్యెదఁ గుచములఁ బొందు పఱిచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదఁదీర్చి బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నిమిరి.

తా ॥ తన మాటలతో వాడి వత్తైపోయిన రుక్మిణిని చూశాడు. శ్రీకృష్ణుడు వెంటనే రుక్మిణీదేవి శరీరమంతా చల్లని చందనం పూసి సేదదీర్చాడు. పన్నీటి జలంతో కళ్ళు కడిగాడు. కర్పూరపు పలుకుల ఘాటును చెవులలో ఊదాడు. చిక్కుపడిపోయిన ముత్యాలదండల చిక్కుతీసి మెడలో చక్కగా అమర్చాడు. నుదుటి మీద చెదరిన బొట్టును సరిదిద్దాడు. జారిపోయి క్రిందపడిన నగలన్నీ తీసి మెడలో అలంకరించాడు. పద్మపత్రాలతో కూర్చిన అందమైన విసనకఱ్ఱతో సున్నితంగా విసిరాడు. గాలికి చెదిరిన పైటను చక్కదిద్దాడు. రుక్మిణీదేవి దుఃఖమంతా క్షణంలో పోయి ఆనందించేటట్లు బిగి కౌగిలిలో చేర్చుకొని, ముఖం నిమిరి, శ్రీకృష్ణుడు ఆ సాధ్వీమణి మనస్సును చిగురింపచేశాడు.

తే. నెరులు గల మరునీలంపు టురుల సిరుల, నరులుగొనఁ జాలి నరులను మరులు
కొలుపు యిరులు గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు, కురుల నులిదీర్చి విరు లిడి కొప్పువెట్టి.

242

తా ॥ రుక్మిణీదేవి కేశసంపద చాలా పెద్దగా, ఒత్తుగా ఉంది. చీకట్ల నల్లని కాంతులను గెలిచే తుమ్మెదరెక్కలను కూడా అపహసించేది ఆమె కేశసౌందర్యం. నరులకు మరులుకొలిపే వినీల కాంతితో మెరిసిపోతోంది ఆమె జుత్తు. మనస్సుకు మోహం కలిగించే ఆ నల్లని, ఒత్తైన కురులను చిక్కుతీసి అందమైన కొప్పుగా అమర్చాడు కృష్ణపరమాత్మ. ఆ కొప్పులో పూలు తురిమాడు.

క. మురసంహరుఁ డిందిందిర, గరుదనిలచలత్ప్రసూన కలికాంచిత సుం
దరశయ్యఁ జేర్చె భీష్మక, వరపుత్రిన్ నుతచరిత్ర వారిజనేత్రన్.

243

తా ॥ శ్రీకృష్ణుడు పవిత్ర చరిత్రగల, తామరరేకులవంటి సుందరమైన నేత్రములుగల,

భీష్మక మహారాజు పుత్రిక అయిన రుక్మిణీదేవిని తుమ్మెద రెక్కలవల్ల వచ్చిన గాలికి కదులుతున్న పూలమొగ్గలతో అందాలు చిందిస్తున్న పాన్పుమీద పవళింపచేశాడు.

వ. ఇట్లు పానుపునం జేర్చి మృదుమధుర భాషణంబుల ననునయించిన.

244

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని పానుపుమీద చేర్చి తియ్యని మాటలతో మృదువుగా అనునయించాడు.

క. పురుషోత్తము ముఖకోమల, సరసిజ మ య్యిందువదన సవ్రీడా హా
స రుచి స్నిగ్ధాపాంగ, స్ఫుర దవలోకనము లొలయఁ జూ చిట్లనియెన్.

245

తా ॥ లజ్జతో కూడిన చిరునవ్వుతో, మనోహరమైన కడకంటి చూపులతో, రుక్మిణీదేవి, అతికోమలమైన శ్రీకృష్ణుని ముఖారవిందాన్ని చూస్తూ ఇలా అంది:

# రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి స్తుతించుట

క. మురహర! దివసాగమ వర, దరవిందదళాక్ష! తలఁప నది యట్టిదగున్ నిరవధిక విమలతేజో, వరమూర్తివి, భక్తలోకవత్సల! యెందున్.

246

తా ॥ "శ్రీకృష్ణా! కమలదళాక్షా! నిర్మలతేజోమూర్తీ! భక్తపాలకా! నీవు నాతో పల్కినది సత్యమే సుమా!

తే. సంచిత జ్ఞాన సుఖ బలైశ్వర్య శక్తు, లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు, నేను దగుదునె? సర్వలోకేశ్వరేశ!, లీలమై సచ్చిదానందశాలి వనఘ!

247

తా ॥ అనఘా! లోకాధిపతులకందరికీ ఈశుడవైన లీలామూర్తీ! సచ్చిదానంద స్వరూపా! జ్ఞానము, సుఖము, బలము, ఐశ్వర్యము, శక్తి మొదలైన సకల సద్గుణాలతో ప్రకాశించే నీకు నేను తగినదాననా? కానే!

సీ. రూఢిమైఁ బ్రకృతి పూరుష కాలములకు నీశ్వరుఁడవై భవదీయ చారుదివ్య
లలితకళా కౌశలమున నభిరతుఁడై కడఁగు నీ రూప మెక్కడ మహాత్మ!
సత్త్వాది గుణ సముచ్చయయుక్త మూఢాత్మ నయిన నే నెక్కడ? ననఘచరిత!
కోరి నీ మంగళ గుణభూతి దానంబు సేయంగఁబడు నని చెందు భీతి

తే. నంబునిధి మధ్యభాగమం దమృతఫేన పటల పాండుర నిభమూర్తి! పన్నగేంద్ర భోగశయ్యను బవ్వళింపుచును దనరు, నట్టి యున్నతలీల దివ్యంబు దలఁప.

248

తా ॥ మహానుభావా! పాపరహితమైన చరిత్రతో ప్రకాశించే పరమాత్మా! నీవు ప్రకృతి

పురుషులకు, కాలానికి అధిపతివి. నీయొక్క దివ్యసుందర కళామయమైన, ప్రీతికరమైన రూపసౌందర్యమెక్కడ? సత్త్వరజస్తమోగుణాలతో నిండిఉన్న మూఢురాలనైన నేనెక్కడ? కల్యాణప్రదమైన నీ సద్గుణ సంపత్తిని ప్రదానం చేయవలసి వస్తుందని భావించావా? ఆ భయంతోనే సముద్రమధ్య భాగంలో అమృతంతో సమానమైన నురుగువలె తెల్లని కాంతితో వెలిగే ఆదిశేషునిపై పవ్వళించావా! నీ లీలలు దివ్యమైనవి, అద్భుతమైనవి సుమా!

వ. శబ్ద స్పర్శ రూప రస గంధంబు లనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁబడిన మంగళ సుందర విగ్రహుండవై, యజ్ఞానాంధకార నివారకంబైన రూపంబుఁ గైకొని, భవదీయులైన సేవకులకు ననుభావ్యుండ వైతి, భవత్పాదారవింద మకరంద రసాస్వాద లోలాత్ములైన యోగీంద్రులకైనను భవన్మార్గంబు స్ఫుటంబు గా, ద ట్లగుటం జేసి యీ మనుజ పశువులకు దుర్విభావ్యం బగుట యేమి సెప్ప? నిట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబు గావున నదియును నా కభిమతంబు గావున నిన్ను నే ననుసరింతు, దేవా! నీ వకించనుఁడ వైతేని బలిభోక్త లయిన బ్రహ్మేంద్రాదు లెవ్వని కొఱకు బలి సమర్పణంబు సేసిరి? నీవు సమస్త పురుషార్థమయుండ వనియును, ఫలస్వరూపి వనియును నీ యందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబున నిరస్త సమస్త దోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి సుమతులు భవదీయదాన సంగంబు గోరుచుందురు; రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులైన వారు భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతు రదియునుం గాక.

249

తా ॥ దేవా! పంచభూతగుణాలైన శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనే గుణాలతో ఒప్పే శుభ సుందరాకారుడవు నీవు. అజ్ఞానాన్ని పోగొట్టే భగవత్ రూపాన్నిపొంది నీ భక్త జనులందరి చేత కొలవబడుతున్నావు. నీ యొక్క పాదపద్మ మకరంద రసాన్ని త్రాగే యోగివరులకు కూడా నీ సన్నిధానం చేరేమార్గం బోధపడదు. అటువంటిది పశుప్రాయులైన ఈ

మానవులకు ఏ విధంగా బోధపడుతుంది? జగత్తుకంతటికీ ప్రభుడవైన నీవు స్వతంత్రుడవు. నీ మార్గం చేరడమే నా కోరిక. అందుచేత ఎప్పుడూ నిన్ను నేననుసరిస్తాను. స్వామీ! నీవే కనుక లేమిగలవాడవైతే భక్తుల పూజావిశేషాలను స్వీకరించే బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన సురాధిపులు ఎవరికోసం పూజలు చేస్తున్నారు? ఎవరి గురించి తపస్సులు చేస్తున్నారు? పరంధామా! బుద్ధిమంతులైన భక్తశిఖామణులు సమస్త పురుషార్థాలూ నీలోనే ఉన్నాయని తెలుసుకొని, నీవు ఫలస్వరూపుడవని గ్రహించి, నీ మీద ఉన్న ప్రేమతో, తమలోని విజ్ఞాన దీపంతో సర్వ దోషాలను పరిహరించి, ఇహలోక సౌఖ్యాలను కాదని, నీ పాద సన్నిధిని మాత్రమే కోరుతున్నారు. వారు కోరేది దాస్యభక్తి, భక్తుల సాహచర్యం.

అధికారమనే అంధకారంలో కూరుకుపోయేవారు సద్భక్తుల దారిలో ప్రయాణించక, నిన్ను చేరుకోలేరు. నీ తత్త్వాన్ని అర్థం చేసుకోలేరు. మూఢాత్ములై, నీ సేవలు మరచి, నిన్ను కొలవక సంసార చక్రంలో అనుక్షణం తిరుగుతూనే ఉంటారు. అంతేకాదు.

ఆ. వరమునీంద్ర యోగివర సురకోటిచే, వర్ణిత ప్రభావ వైభవంబు గలిగి యఖిల చేతనులకు విజ్ఞాన ప్ర, దుండ వగుదు వభవ! దురితదూర!

250

తా ॥ పుట్టుక లేనివాడా! దురితదూరా! నీవు మహర్షిశ్రేష్ఠులచేత, యోగిపుంగవులచేత, దేవతా సమూహంచేత స్తుతింపబడే మహామహిమాన్వితుడవు. సమస్త ప్రాణులకు విజ్ఞానాన్ని ప్రసాదించేవాడివి.

వ. దేవా! భవదీయ కుటిలభ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్త మంగళులగు కమలభవ భవ పాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయ చిత్తంబున.

251

తా ॥ దేవదేవా! నీ కనుబొమ్మలను కోపంతో ముడిచినంత మాత్రం చేతనే

బ్రహ్మరుద్రాదులుగాని, దేవేంద్రాది దేవతలుగాని తమ సమస్త భోగభాగ్యాలను, పదవులను కోల్పోతారు. అటువంటి బ్రహ్మరుద్రాదులను నా మనస్సు తిరస్కరించింది.

చ. నిను వరియించినం బెలుచు నీరజలోచన! శార్ఙ్గసాయ కా
సన నినదంబులన్ సకల శత్రుధరాపతులన్ జయించి బో
రన పశుకోటిఁదోలు మృగరాజు నిజాంశము భూరిశక్తిఁ గై
కొనిన విధంబునన్ నను నకుంఠిత శూరతఁ దెచ్చి తీశ్వరా!

252

తా ॥ శ్రీకృష్ణా! నేను నిన్నే వరించాను. జంతుకోటిని పారద్రోలి సింహం తనకు చెందవలసిన మాంసభాగాన్ని మహాబలంతో సంపాదించే విధంగా, నీదాననైన నన్ను వీరాధివీరుడవై శత్రురాజులనందరినీ శార్ఙ్గమనే నీ ధనుష్టంకార మాత్రంచేతనే జయించి పరాక్రమ ప్రదర్శనతో తీసుకువచ్చావు.

ఉ. అట్టి నృపాల కీటముల నాజి నెదుర్పఁగ లేనివాని య
ట్లొట్టిన భీతిమై నిటు పయోధిశరణ్యుఁడ వైతి వింతయున్
నెట్టన మాయ గాక యివి నిక్కములే? భవదీయ భక్తులై
నట్టి నరేంద్రమౌళిమణు లంచిత రాజ ఋషుల్ ముదంబునన్.

253

తా ॥ అటువంటి రాజకీటకాలను యుద్ధరంగంలో ఎదిరించలేవా? ఎదిరించలేక భయపడినట్లు శ్రీకృష్ణా! నీవీ సముద్ర మధ్యంలో నగరం కట్టుకొని నివసిస్తున్నావనేది నీ మాయ కాక మరేమవుతుంది? నీవు రాజులకు భయపడి ఇక్కడ ఉంటున్నావనేది నిజమా! కాదే! నీ భక్తులైన రాజశేఖరులందరూ రాజ ఋషులే.

ఆ. వితత రాజ్యగరిమ విడిచి కాననముల, నాత్మలందు మీ పదాబ్జయుగము వలఁతి గాఁగ

నిలిపి వాతాంబు పర్ణాశ, నోగ్రనియతు లగుచు నుందు రభవ!

254

తా ॥ నీ భక్తులైన ఆ రాజర్షులందరూ ఇష్టపూర్వకంగా, సంతోషంతో రాజ్యాధికారాన్ని వదలి, సమస్త భోగాలను కాదనుకొని అడవులకువెళ్ళి తమ మనస్సులలో నీ పాదపద్మాలను మాత్రమే నిలుపుకొని గాలిని, నీటిని, ఆకులను మాత్రమే ఆహారంగా తీసుకొంటూ నియమ నిష్ఠలతో మహోగ్రమైన తపస్సును చేస్తుంటారు.

మ. విమలజ్ఞాననిరూఢులైన జనముల్ వీక్షింప మీ పాద కం
జ మరంద స్ఫుట దివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుష వాగుదీరితము శోభాశ్రీనివాసంబు నౌ
మిము సేవింపక మానవాధముని దుర్మేధాత్ము సేవింతునే?

255

తా ॥ ప్రజ్ఞాన నిధులైన సత్పురుషులు చూస్తుండగా, మీ పాదపద్మాలలోని మకరందాన్ని ఆస్వాదిస్తూ, ఆ దివ్యసౌరభాన్ని ఆఘ్రాణిస్తూ; మోక్ష స్వరూపము, మంగళప్రదము, మహాత్ముల చేత స్తుతిపాత్రమైనది అయిన మీ పాదపద్మ ద్వయాన్ని సేవించకుండా నేను దుష్టచిత్తులను సేవిస్తానా?

వ. మఱియును దేవా! భూలోకంబునందును, నిత్యనివాసంబునందును, సకలప్రదేశంబులందును జగదీశ్వరుండ వయిన నిన్ను నభిమతంబు లయిన కామరూపంబులు గైకొని వరియింతు, భవదీయ చరణారవింద మకరందాస్వాదన చాతుర్య ధుర్యభృంగియైన కామిని యతిహేయంబైన త్వక్ శ్మశ్రు రోమ నఖ కేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతం బయిన మాంసాస్థి రక్త క్రిమి విట్కఫ పిత్త వాతంబు గల జీవచ్ఛవంబయిన నరాధముని మూఢాత్మయై కామించునే? యదియునుం గాక.

తా ॥ భగవత్స్వరూపా! దేవదేవా! ఈ భూలోకంలోను, నీ నిత్య నివాస స్థలమైన వైకుంఠంలోను, సమస్త ప్రదేశాలలోను లోకేశ్వరుడవైన నిన్ను, నీకిష్టమైన రూపం గ్రహించి నిన్ను అనుసరిస్తాను. స్వామీ! నీ పాదపద్మమకరందాన్ని ఆస్వాదించగల నేర్పున్న ఆడ తుమ్మెదవంటి సుందరీమణి మిక్కిలి అసహ్యకరమైన చర్మం, వెంట్రుకలు, గోళ్ళు, జుట్టు, గడ్డము, మీసము మొదలైనవాటితో కప్పబడి, శరీరం లోపల మాంసము, ఎముకలు, రక్తము, క్రిములు, కఫము, పిత్తము, వాతము మొదలైన వాటిని కలిగి జీవచ్ఛవంలాగా బ్రతికే నీచ మానవుణ్ణి ఎలా వరిస్తుంది? మూర్ఖురాలైతేనే నరుల వెంటబడుతుంది.

పరమాత్ముడైన శ్రీకృష్ణుడు లక్ష్మీస్వరూపిణి అయిన రుక్మిణిచేత భగవత్తత్త్వాన్ని నిరూపిస్తున్నాడు. హేయమైన మానవజన్మలోని నీచ లక్షణాలను వెలికిచూపి నిర్గుణుడైన పరాత్పరుని సేవవల్ల కలిగే అనిర్వచనీయమైన ఆత్మానందం ప్రసాదించే పరమానందాన్ని స్పష్టపరిచాడు. మూఢజనులు సంసారచక్రంలో పరిభ్రమిస్తూనే ఉంటారని, సత్పురుషులు తమ నిష్కామసేవ వల్ల పరంజ్యోతిని చేరుకొంటారని బోధపరిచాడు.

సీ. నీరదాగమమేఘనిర్యత్పయః పాన చాతకం బేగునే చౌటి పడెకుఁ?
బరిపక్వ మాకంద ఫలరసంబులు గ్రోలు కీరంబు సనునె దుత్తూరములకు?
ఘనరవాకర్ణనోత్కలిక మయూరము గోరునే కఠిన ఝిల్లీవరంబుఁ?
గరికుంభ పిశిత సద్గ్రాస మోదిత సింహ మరుగునే శునక మాంసాభిలాషఁ

తే. బ్రవిమలాకార! భవదీయ పాదపద్మ, యుగ సమాశ్రయ నైపుణోద్యోగచిత్త మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁక? భక్తమందార! దుర్భర భవవిదూర!

257

తా ॥ వర్షాకాలంలో వచ్చే మేఘం యొక్క నీటిబొట్లు త్రాగే చాతక పక్షి చవిటి నేలలో

నిలవ ఉండే నీటి కొరకు అఱ్ఱులు చాస్తుందా? మగ్గిన మామిడిపండు రసాన్ని ఆస్వాదించే చిలుక ఉమ్మెత్తల దగ్గరకు పరుగెడుతుందా? మేఘ గర్జన విని పురివిప్పి ఆడే నెమలి ఈల పరుగుల కూతలు వినడానికి వెడుతుందా? ఏనుగు యొక్క కుంభస్థలంలో ఉండే రుచికరమైన మాంసాన్ని తిని ఆనందించే సింహం కుక్కమాంసం తినాలని కోరుతుందా?

జగదేక సుందరుడవైన శ్రీకృష్ణా! నీ పాదపద్మాలను ఆశ్రయించాలనే ప్రయత్నంలో ఆరాటపడే మనస్సు మరొకరిని సేవించాలని కోరి చేరుతుందా? దుర్భరమైన సంసారసాగరం నుంచి దూరంచేసే ఓ భక్తమందారా! నిన్ను తప్ప నేను వేరెవ్వరినీ చేరను.

క. వాసవవందిత ! భవ కమ, లాసన దివ్యప్రభా సభావలి కెపుడున్ నీ సమధిక చారిత్ర క,
థా సురుచిరగాన మవితథం బయి చెల్లున్.

258

తా ॥ త్రిలోకాధిపతి అయిన దేవేంద్రుడి చేత స్తుతింపబడే జగన్నాథా! శ్రీకృష్ణా! కైలాసంలోని శంకరుని దివ్యసభలో, బ్రహ్మదేవుని సత్యలోక సభలో, ఎప్పుడూ మహిమాన్వితములైన నీ దివ్య కథలే గానం చేయబడి వీనులవిందు చేస్తుంటాయి.

క. ధరణీనాథులు దమతమ, వరవనితామందిరముల వసియించుచు గో
ఖర మార్జాలంబుల గతి, స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ దెలియని కతనన్.

259

తా ॥ పరమాత్ముడవైన నిన్ను చూడలేని, నీ తత్త్వం గ్రహింపలేని మూఢులైన రాజులు గోవులలాగా, పిల్లులులాగా, గాడిదలలాగా పశుప్రాయులై ప్రియవనితల మందిరాలలో శాశ్వతంగా బంధింపబడతారు.

ఆ. జలజనాభ! సకల జగదంతరాత్మవై, నట్టి దేవ! నీ పదారవింద యుగళి

సానురాగయుక్తమై నా మదిఁ, గలుగునట్లు గాఁగఁ దలఁపు మనఘ!

260

తా ॥ పద్మనాభా! విష్ణురూపా! నీవు సకల చరాచర జగత్తుయొక్క అంతరాత్మవు. భక్తియుక్తమైన, ప్రేమమయమైన నా మనస్సు ఎల్లవేళలా నీ పాదపద్మాలయందు లగ్నమయ్యేటట్లు వరం ప్రసాదించు.

ఆ. పృథు రజోగుణ ప్రవృద్ధ మైనట్టి నీ, దృష్టిచేత నన్నుఁ దేరకొనఁగఁ
జూచు టెల్ల పద్మలోచన! నా మీఁద, ఘనదయార్ద్ర దృష్టిగాఁ దలంతు.

261

తా ॥ కమలాక్షా! గొప్పదైన నీ రాజసదృష్టితో నన్ను చూసి అవమానభారం నుండి నేను తేరుకొనేటట్లు చేశావు. అది నీకు నాపైనగల అపారమైన కరుణతో నిండిన చల్లని చూపుగా భావిస్తాను.

వ. అదియునుం గాక, మధుసూదనా! నీ వాక్యంబులు మిథ్యలు గావు, తల్లి వచనంబు కూఁతున కభిమతంబు గాదె? యౌవనారూఢ మదంబున స్వైరిణి యగు కామిని పురుషాంత రాసక్త యగుట విచారించి పరిజ్ఞాని యైనవాఁడు విడుచు, నవివేకి యయిన పురుషుం డింద్రియలోలుండై రతిం దగిలి దాని విడువనేరక పరిగ్రహించి యుభయ లోకచ్యుతుండగు, నట్లు గావున నీ యెఱుంగని యర్థంబు గలదే? యని విన్నవించిన రుక్మిణీదేవి వచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యిట్లనియె.

262

తా ॥ "మాధవా! అదీగాక నీవన్న మాటలలో అసత్యం లేదు. తల్లి చెప్పేమాట కుమార్తెకు ప్రియంగానే ఉంటుంది కదా! స్వేచ్ఛాప్రవృత్తిగల స్త్రీ యౌవన మదంతో పరపురుషుని అభిలషిస్తే, విషయం తెలుసుకొన్న జ్ఞాని ఆమెను వదలివెళ్ళిపోతాడు. ఇంద్రియలోలుడైన పురుషుడు

అవివేకంతో కామాసక్తుడై ప్రియురాలిని వదలలేక ఆమెతోనే జీవించి ఇహపరలోకాలు రెండింటికీ ఎందుకూ పనికిరాకుండా పోతాడు. దేవా! నీకు తెలియనిది ఏమైనా ఉందా? సాక్షాత్తూ ధర్మస్వరూపుడవు.” అని రుక్మిణీదేవి పలుకగా శ్రీకృష్ణుడు ఎంతగానో సంతోషించి ఆ పట్టపుదేవేరితో ఈ విధంగా అన్నాడు:

## శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని ఊరడించుట

చ. 'అలికులవేణి! నవ్వులకు నాడిన మాటల కింత నీ మదిం
గలఁగఁగ నేల? వేఁటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికిన మాట లెగ్గు లని పట్టుదురే? భవదీయ చిత్తముం
దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ మదిలో నిటు గుంద నేఁటికిన్?

263

తా ॥ "తుమ్మెద రెక్కలవంటి నిగనిగలాడే కేశపాశంగల సుందరీ! రుక్మిణీ! చూడు. నేను నవ్వులాటగా అన్నమాటలకు మనస్సులో ఇంతగా కలత చెందావా? వేటలోగాని, యుద్ధంలోగాని, కలహంలోగాని, రతివేళగాని బాధ కలిగేటట్లు మాటలన్నా, వాటిని దూషణ వాక్యాలుగా తీసుకోకూడదు. నీ మనస్సు ఎలాంటిదో తెలుసుకోవాలని అలా అన్నాను. ఇంతమాత్రానికే మనస్సులో పెట్టుకుని బాధపడాలా?

వ. అదియునుం గాక.

264

తా ॥ అంతేకాకుండా,

ఉ. కింకలు ముద్దుబల్కులును గెంపుఁగనుంగవ తియ్యమోవియున్
జంకెలు తేఱిచూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలుం
గొంకక వీడనాడుటలుఁ గూరిమియుం గల కాంతఁ గూడుటల్
అంకిలిలేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా!'

265

తా ॥ లేడికన్నులవంటి బెదరుచూపులుగల కన్నులున్న కోమలాంగీ! ప్రణయకలహాలు,

ముద్దులొలికే పలుకులు, కనుకొసల మెరిసే ఎఱ్ఱందనాలు, తీయనైన మోవి, జంకించే చూపులు, పరిహాస వాక్యాలు, నెలవంకలా తిరిగే కనుబొమలు, భయపడక చూపే విదిలించి కొట్టడాలు, ప్రేమలొలికే భంగిమలు గల సతితో సాహచర్యం కలిగితే జన్మ ధన్యమైనట్లే. అరమరికలు లేని దాంపత్యమే గదా కోరదగినది!"

వ. అని మఱియు నిట్లనియె.

266

తా ॥ అని రుక్మిణీదేవిని ఆదరించి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు:

ఉ. 'నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మవివేక శీల స
ద్భావవు నీ మనోగతులఁ బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయ కాని యన్యము భజింపవు, పుట్టిన నాఁట నుండి నీ
భావ మెఱింగి యుండియును బల్కిన తప్పు సహింపు మానినీ!'

267

తా ॥ "రుక్మిణీ! నీవు పతివ్రతామణివి. సచ్ఛీలం గల దానివి. వివేకవతివి. నిర్మల స్వభావం గలదానివి. ధర్మనిరతవు. నీ మనస్సులో ఎప్పుడూ నా సేవల గురించిన ఆలోచనే తప్ప ఇంక ఏ ఇతర విషయాల గురించిన ఆలోచనా ఉండనే ఉండదు. పుట్టినప్పటి నుంచి నాకు నీ స్వభావం తెలిసినా కూడా నిన్ను నిందించినందుకు నన్ను క్షమించు.

వ. అని వెండియు నిట్లనియె, 'నీ వాక్యంబులు శ్రవణసుఖంబు గావించె, నీవు వివిధంబులైన కామంబులు గోరితివేని, నవియన్నియు నా యంద యుండుటం జేసి యేకాంతసేవా చతురవైన నీకు నవి యన్నియు నిత్యంబులై యుండు. నీ పాతివ్రత్యంబును, నా యందలిస్నేహంబు నతివిశదంబు లయ్యె, నా వాక్యములచేత భవదీయ చిత్తంబు చంచలంబు గాక నా యందలి బుద్ధి దృఢం బగుం గావున సకల సంపద్విలసింతబైన

ద్వారకానగర దివ్యమందిరంబులందు నీదు భాగ్యంబునం జేసి సంసారి కైవడి నీ యందు బద్ధానురాగుండనై వర్తింతుఁ, దక్కిన ప్రాణేంద్రియ పరవశత్వంబున వికృత శరీరధారిణియైన సతి నన్నుం జెందుట దుష్కరం;, బదియునుం గాక మోక్షప్రదుండనైన నన్నుఁ గామాతురలైన యల్పమతులు వ్రత తపోమహిమలచేత దాంపత్య యోగంబుకై సేవింతు, రదియంతయు నా మాయావిజృంభితంబు, దానంజేసి వారు మందభాగ్యలై నిరయంబు నొందుదు; రట్లు గావున నీ సమానయైన కాంత యే కాంతలందైనఁ గలదె? నీ వివాహకాలంబు ననేక రాజన్యవర్యులఁ గైకొనక భవదీయ మధురాలాప శ్రవణాత్మకుండ నయిన నా సన్నిధికి నా శరీరం బితర యోగ్యంబు గాదు, నీకు శేషంబునయి యున్నదాన' నని యేకాంతంబునం బ్రాహ్మణుం బుత్తెంచిన నేనును జనుదెంచి నీ పరిణయ సమయంబున భవత్సహోదరుం బట్టి విరూపుం గావించిన నది గనుంగొనియును నా యందలి విప్రయోగ భయంబున నూరకుండితి; వది గావున బహు ప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు! నని యి వ్విధంబున దేవకీసుతుండు నరలోక విడంబనంబుగ గృహస్థుని భంగి నిజగృహకృత్యంబు లాచరించు చుండెనని శుకుండు మఱియు ని ట్లనియె.

268

తా ॥ నీ మాటలు నా చెవికింపుగా ఉన్నాయి. నీవు ఎన్ని రకాల కోరికలు కోరినా, అవన్నీ నాలోనే ఉండటంవల్ల, ఎప్పుడూ ఏకాంతసేవలో నిమగ్నురాలివైన నీకు ఆ ప్రయోజనాలన్నీ నిత్యం సమకూరుతూనే ఉంటాయి. నీ పాతివ్రత్యం తేటతెల్లమయింది. నాపైన నీకున్న ప్రేమాభిమానాలు సుస్పష్టమైనాయి. నేనన్న మాటలకు నీ మనస్సు చంచలం కాలేదు. నా మీద నీ అనురాగం ఇంకా బలపడింది. కనుక సకల సంపదలతో విలసిల్లుతున్న ద్వారకానగరంలోని దివ్యమందిరాలలో, నీ మీది అనురాగాతిశయంతో నీ నాథుడిగా నిన్ను సంతోషపరుస్తాను. నీ భక్తే నిన్ను భాగ్యశాలిని చేసింది. ఇంద్రియలోలాత్మయై, ఎంత అలంకారం చేసుకొని వచ్చినప్పటికీ ఆ సతి నన్ను చేరలేదు. అంతేకాదు రుక్మిణీ! మోక్షదాతనైన నన్ను, కామగుణంతో

అల్పులైనవారు వ్రతాలు, తపస్సులు చేసి నా దయకు పాత్రులై, నా తోడి దాంపత్య యోగానికి అర్హులౌతారు. అదంతా నా మాయావిలసితము. నా మాయకు వశులైనవారు అదృష్టహీనులై నరకలోకం పాలవుతారు. అందువల్ల నీతో సమానమైన సతీమణి ఏ స్త్రీలలోను కనబడదు. నీ వివాహకాలంలో, బ్రాహ్మణునికి, ఏకాంతంగా నీ సందేశాన్ని వివరించి చెప్పి నా వద్దకు పంపావు. ఎంతోమంది రాకుమారులున్నా వారెవ్వరినీ నీవు అంగీకరించలేదు. నీ యొక్క మధురాతిమధురములైన వాక్కులు వినడంలో ప్రీతి కనబరిచే నా సన్నిధికి వర్తమానం పంపావు.

"స్వామీ! నా శరీరం ఇతరులకు చెందవలసింది కాదు. నీ కొఱకే వేచిఉంది. నన్ను స్వీకరించు" అన్న నీ పలుకులకు ముగ్ధుడనై నేను మీ నగరానికి వచ్చాను. నీ పరిణయ కాలంలో నీ అన్న అయిన రుక్మిని పట్టుకొని తల, మీసం, గడ్డం గొరిగినా, బాధపడినప్పటికీ నాతో ఎక్కడ వియోగం సంభవిస్తుందో అని బాధపడి, ఏమీ మాట్లాడలేక మౌనం వహించావు. నీ సత్ప్రవర్తనకు మిక్కిలి సంతోషించాను" అని కృష్ణుడు ఈ విధంగా సహధర్మచారిణి అయిన రుక్మిణితో పలికి మానవలోక మర్యాదననుసరించి గృహస్థు మాదిరిగా నిత్యం తన గృహకృత్యాలను, ధర్మబద్ధంగా నిర్వహించాడు." శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విషయమంతా చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

క. అని యిట్లు కృష్ణుఁ డాడి, న వినయ వివేకానులాప వితతామృత సే
చన, ముదితహృదయయై య, వ్వనితామణి వికచ వదన వనరుహ యగుచున్.



తా ॥ "కృష్ణుడు ఈ విధంగా అనునయవాక్యాలు పలుకగా, నాథుని వివేకవినయ ప్రణయ సంభాషణమనే అమృతంతో రుక్మిణి తడిసిముద్దయింది. సంతోషంతో ఉప్పొంగి పోయినదై వికసించిన ముఖపద్మంతో విలసిల్లింది.

క. నగ వామతించు చూపులు, నగధరు మోమునను నిలిపి నయమునఁ గరముల్ మొగిచి

వినుతించెఁ గృష్ణున్, ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్.

270

తా ॥ ఆనందోత్సాహాలతో చిరునవ్వులు చిందిస్తూ, రుక్మిణీదేవి ప్రణయపూర్వకమైన చూపులను శ్రీకృష్ణునిపై నిలిపింది. వినమ్రంగా రెండు చేతులూ జోడించి, పరమోత్సాహభరితుడు, సుందరగాత్రుడు, గరుడవాహనుడు అయిన కృష్ణుణ్ణి స్తుతించింది.

చ. అతుల విరాజమానముఖుఁడై వివిధాంబర చారుభూషణ
ప్రతతులతోఁడ గోరిన వరంబులు దద్దయు నిచ్చె గృష్ణుఁ డు
న్నతశుభమూర్తి దేవగణ నందితకీర్తి దయానువర్తియై
యతిమృదువాణికిం గిసలయారుణపాణికి నీల వేణికిన్.

271

తా ॥ చక్కని మధురమైన పలుకులు పలికే రుక్మిణికి, చిగురులవలె ఎఱ్ఱగా మెత్తగా ఉండే అరచేతులు గలదానికి, ఆ నీలవేణికి శుభాకారుడు, దేవతలచే స్తుతింపబడేవాడు, ప్రకాశవంతమైన ముఖశోభగలవాడు, కరుణామూర్తి అయిన శ్రీకృష్ణుడు నూతనములైన అనేకానేక వస్త్రాలను, సుందరమైన ఆభరణాలను ఇచ్చి ఆమె కోరిన వరాలన్నీ ప్రసాదించాడు.

వ. ఇట్లు సమ్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ.

272

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు ఆమెను గౌరవాదరాలతో సన్మానించాడు. ఆ తరవాత వారిద్దరూ—

చ. ఎలమి ఘటింపఁగాఁ గలసి యాడెల నీడల మల్లికా లతా
వలిఁ గరవీరజాతి విరవాదుల వీథులఁ గమ్మ దెమ్మెరల్

వొలయు నవీనవాసములఁ బొన్నలఁ దిన్నెలఁ బచ్చరచ్చలఁ
గొలఁకుల లేఁగెలంకులను గోరిక లీరిక లొత్తఁ గ్రొత్తలై.

273

తా ॥ వయోరూపాలకు తగినట్లు మల్లెతీగెల మాటున, గన్నేరు చెట్లనీడలలో, విరజాజుల వీథులలో, కమ్మని మలయమారుతాలు సోకే నూతనమందిరాలలో, పొన్నచెట్ల తిన్నెలలో, పచ్చని తీగలతో అల్లుకొన్న మండపాలలో, నిర్మలమైన సరోవర జలాలలో, జలాశయాల ప్రక్కన సుందరంగా ఉండే ఇసుకతిన్నెలపైనా కోరికలు తీరే విధంగా పరస్పర ప్రేమాతిశయంతో విహరించారు.

క. ఆరామభూములందు వి, హారామల సౌఖ్యలీల నతిమోదముతో నా రామానుజుఁ డుండెను, నా రామామణియుఁ దాను నభిరామముగన్.

274

తా ॥ శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితో కూడి పరమానందభరితుడై, సుందరోద్యాన వనాలలో ఆమె, తాను మనోహరమైన విహారలీలలలో మునిగి తేలుతూ సుఖానుభూతి చెందాడు.

వ. మఱియు ననేకవిధ మణివితానాభిశోభిత ప్రాసాదోపరిభాగంబులను, లాలిత నీలకంఠ కలకంఠ కలవింక శుక కలాపకలిత తీరంబులను, మకరందపాన మదవదిందిందిర ఝుంకార సంకుల కమల కహ్లార సుధాసార నీహారపూరిత కాసారంబులను, ధాతునిర్ఝర రంజిత సానుదేశగిరి కుంజ పుంజంబులను, గృతకశైలంబులను, గ్రీడాగృహంబులనుం జెలంగి నందనందనుండు విదర్భరాజనందనం దగిలి కందర్పకేళీ లోలాత్ముండయ్యె, ననంతరం బా సుందరీలలామంబు వలనఁ బ్రద్యుమ్నుండు, చారుధేష్ణుండు, చారుదేవుండు, సుధేష్ణుండు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, చారుభద్రుండు, విచారువు, చారువు ననియెడు పదుగురు తనయులం బడసె, నట్లు సత్యభామాజాంబవతీ నాగ్నజితీ

కాళిందీ మాద్రి మిత్రవిందా భద్రలకు వేఱు వేఱ పదుగురేసి భద్రమూర్తులైన కుమారు లుదయించి రవ్విధంబున మఱియును.

275

తా ॥ రకరకాల వర్ణాలతో ఒప్పే మణులతో కూర్చబడిన చాందినీలతో అందమొదవే మందిరాల పై భాగాలయందు; పెంపుడు నెమళ్ళతో, కోకిలలతో, గోరువంకలతో, చిలుకలతో అందాలు చిందించే ఉద్యానవన తీరప్రదేశాలలో; పూలలోని మకరందాన్ని ఆస్వాదించి మత్తిల్లిన తుమ్మెదల ఝుంకార నాద సంకుల మయమై; కమలాలతో, కలువలతో నిండి అమృత సమమైన చల్లని తియ్యని జలాలు వెల్లివిరిసే సరోవరాలలో; ధాతుప్రవాహాలతో ఎఱుపెక్కిన కొండచరియలమీద ఉండే పొదరిళ్ళలో; కల్పిత గిరిశిఖరాలపై; క్రీడామందిరాలలో – శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితో కూడి మన్మథ క్రీడలలో తేలియాడాడు. శ్రీకృష్ణుడికి, పట్టమహిషి అయిన రుక్మిణీదేవికి ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు, చారుదేవుడు, సుధేష్ణుడు, సుచారువు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుభద్రుడు, విచారువు, చారువు అనే పేర్లతో ఒప్పే పదిమంది పుత్రులు జన్మించారు.

చ. అనఘ! పదాఱువేల సతులందు జనించిరి వేఱు వేఱ నం
దన దశకంబు తత్సుతవితానము గాంచి రనేక సూనుల
న్నె నయఁగ నిట్లు పిల్లచెఱ కీనిన కైవడిఁ బుత్త్రపౌత్త్ర వ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునఁ దామరతంపరై భువిన్.

276

తా ॥ ఆ విధంగానే సత్యభామకు, జాంబవతికి, నాగ్నజితికి, కాళిందికి, మద్రరాజపుత్రి అయిన లక్షణకు, మిత్రవిందకు, భద్రకు ఒక్కొక్కరికి పదిమంది చొప్పున పుత్రులు ఉదయించారు. పదహారువేల మంది భార్యలందు ఒక్కొక్కరికి పదిమంది నందనుల చొప్పున ప్రభవించటంతో పిల్లచెరకుల తంపరల లాగా శ్రీకృష్ణుడి వంశం అభివృద్ధి చెందింది.

పుత్రపౌత్రుల దినదినాభివృద్ధితో శ్రీకృష్ణుడు మహదానందభరితుడైనాడు.

తే. అట్లు యదు వృష్ణి భోజాంధకాది వివిధ, నామధేయాంతరముల నెన్నంగ నూట యొక్కటై చాల వర్ధిల్లె న క్కులంబు, నృపకుమారులఁ జదివించు నేర్పు గలుగు.

277

తా ॥ ఆ విధంగా యాదవవంశం యదు, వృష్ణి, భోజ, అంధక మొదలైన పేర్లతో నూట ఒక్క శాఖలుగా విస్తరిల్లి వర్ధిల్లింది. అంతమంది రాజకుమారులను గురువులు చక్కగా బోధించి వృద్ధిలోకి తెచ్చారు.

తే. గురుజనంబులు విను మూఁడు కోట్లమీఁద, నెనుబ దెనిమిదివేలపై నెసఁగ నూర్వు రన్నఁ దద్బాలకావలి నెన్న ఁదరమె, శూలికైనను దామరచూలికైన?

278

తా ॥ మూడుకోట్ల ఎనభై ఎనిమిదివేల మంది గురువులు ఆ యదుకుమారులకు విద్యనేర్పారంటే ఆ బాలుర విద్యావివేకాలను, వైభోగాన్ని వర్ణించడానికి బ్రహ్మకుగాని, శంకరునికిగాని ఏమాత్రం సాధ్యం కాదనే చెప్పాలి.

వ. అందు గోవిందనందనుండైన ప్రద్యుమ్నునకు రుక్మి కూఁతువలన ననిరుద్ధుండు సంభవించె ననిన మునివరునకు భూవరుం డిట్లనియె.

279

తా ॥ ఆ రాజకుమారులలో రుక్మిణీ కృష్ణుల పుత్రుడైన ప్రద్యుమ్నుడు రుక్మి కుమార్తె అయిన రుక్మవతిని వివాహమాడాడు. ప్రద్యుమ్నుడికి, రుక్మవతికి అనిరుద్ధుడనే కుమారుడు కలిగాడు" అని చెప్పిన శుకమహర్షితో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు:

# అనిరుద్ధుని వివాహ సమయంలో బలరాముడు రుక్మి మొదలగు వారిని చంపుట

క. బవరమునఁ గృష్ణుచే ము, న్నవమానము నొంది రుక్మి యచ్యుతు గెలువం దివురుచుఁ దన సుత నరిసం, భవునకు నెట్లిచ్చె? నెఱుఁగఁ బలుకు మునీంద్రా!

280

తా ॥ "మునీంద్రా! పూర్వం శ్రీకృష్ణునితో జరిగిన యుద్ధంలో రుక్మిణీదేవి సోదరుడైన రుక్మి, కృష్ణుని చేతిలో అవమానంపాలయ్యాడు కదా! ఆ అవమానంతో ఎప్పటికైనా కృష్ణుణ్ణి గెలిచి తీరాలనే సంకల్పంతో రుక్మి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. అటువంటి రుక్మి తన కూతురును శత్రుకుమారునికి ఎలా ఇచ్చాడు? వివరంగా చెప్పండి."

సీ. నావుడు శుకయోగి 'నరనాయకోత్తమ! నీవు చెప్పిన యట్ల నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచేఁ బడిన బన్నమునకుఁ గనలుచు నుండియు ననుజతోడి
నెయ్యంబునను భాగినేయున కిచ్చెను గూఁతు నంచితపుష్ప కోమలాంగిఁ
దనపూన్కి దప్పినఁ దగ విదర్భేశుండు విను మెఱింగింతు న వ్విధము దెలియఁ

తే. బరఁగ 'రుక్మవతీ స్వయంవరమున కొగి, నరుగుదెండని భీష్మభూవరసుతుండు వరుస రప్పించె రాజన్యవర కుమార, వరుల ననువార్త కలరి యా హరిసుతుండు.

281

తా ॥ అని అడిగిన పరీక్షిత్తుతో శుకయోగి, "ఏం జరిగిందో చెబుతాను విను నాయనా! నీవు చెప్పినట్లే రుక్మికి కృష్ణుడిపైన చాలా కోపం ఉండిపోయింది. కృష్ణుడి చేత అవమానం పొందినా చెల్లెలి మీది ప్రేమతో, తన ప్రయత్నం విఫలమైనా, లెక్కచేయక, కుసుమకోమలాంగి అయిన తన కుమార్తెను మేనల్లుడైన ప్రద్యుమ్నునికిచ్చాడు. ఆ కథంతా చెబుతాను విను. భీష్మక మహారాజు జ్యేష్ఠ పుత్రుడైన రుక్మి – తన కుమార్తె రుక్మవతికి స్వయంవరం చాటాడు. వివిధ

దేశపు రాజకుమారులు కుండిన నగరానికి వచ్చారన్న వార్త ప్రద్యుమ్నుడికి తెలిసింది.

చ. వరమణిభూషణ ప్రభలవర్గ మనర్గళభంగిఁ బర్వఁ బ్ర
స్ఫురిత రథాధిరోహణవిభూతి దలిర్ప మనోహరైక సు
స్థిరశుభలీల నేగె యదుసింహకిశోరము రాజకన్యకా
పరిణయవైభవాగత నృపాలక కోటికి రుక్మివీటికిన్.

282

తా ॥ శ్రేష్ఠమైన మణిభూషణ కాంతులు దిక్కుల నిండా వ్యాపిస్తుండగా, మనోజ్ఞ మనోహరాకారంతో యదువంశంలోని సింహకిశోరంలాంటి ప్రద్యుమ్నుడు చక్కగా అలంకరింపబడిన రథాన్ని ఎక్కినవాడై విదర్భదేశపు రాకుమారియైన రుక్మవతి స్వయంవరానికి వచ్చి విడిసిన రాజసమూహంతో నిండి ఉన్న రుక్మి యొక్క రాజధానీ నగరమైన కుండినపురానికి వెళ్ళాడు.

చ. చని పురిఁ జొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మూఁగియున్న య
మ్మనుజవరేణ్యనందనుల మానము దూలి భయాకులాత్ములై
చనఁగ ననేక చండతర సాయకసంపదఁ జూపి రుక్మి నం
దనఁ గొనివచ్చి వేడ్క నిజధామము సొచ్చె నవార్యశౌర్యుఁడై.

283

తా ॥ నగరప్రవేశంచేసి అక్కడ చేరి ఉన్న రాజకుమారులందరి శౌర్యం వీగిపోయి, భయపడి వారు పారిపోయేవిధంగా వేలాది కఠినమైన బాణాలను ప్రయోగించి ప్రద్యుమ్నుడు వారినందరినీ తరిమిగొట్టాడు. పరాక్రమవంతుడై రుక్మవతిని తీసుకొని తన నగరమైన ద్వారకకు తిరిగి వచ్చాడు.

వ. ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరినయనం బరిణయంబంది నిఖిల సుఖంబు

లనుభవింపుచుండె. ననంతరంబ.

284

తా ॥ ప్రద్యుమ్నుడు రుక్మికుమార్తె మీది అనురాగంతో ద్వారకలో ఆమెను వివాహమాడి సుఖసంతోషాలలో మునిగిపోయాడు. ఆ పిదప,

క. ధీరుఁడు కృతవర్మని సుకు, మారుఁడు వరియించె రుచిరమండనయుత నం
భోరుహముఖీ రుక్మిసుతం, జారుమతీకన్యఁ బ్రకట సజ్జనమాన్యన్.

285

తా ॥ సుందరాంగి, మాననీయురాలు అయిన చారుమతి అనే పద్మముఖీని కృతవర్మ కుమారుడు వివాహమాడాడు. చారుమతి ఎవరోకాదు. రుక్మి మరో కుమార్తె.

తే. ప్రకటచరితుండు భీష్మభూపాలసుతుఁడు, మనము మోదింపఁ దన కూర్మిమనుమరాలి
రుక్మలోచన నసమాన రుక్మకాంతిఁ, జెలిమి ననిరుద్ధునకు బెండ్లి సేయు నపుడు.

286

తా ॥ రుక్మి సంతోషమానసంతో సువర్ణకాంతులతో వెలిగిపోతున్న తన మనుమరాలైన రుక్మలోచనను ప్రద్యుమ్నకుమారుడైన అనిరుద్ధుడికిచ్చి వివాహం చేశాడు.

క. పొలుపుగ రత్నవిభూషో, జ్జ్వలుఁడయి శుభవేళ న వ్వివాహార్థము ని
ర్మల బహువైభవ శోభన, కలితవిదర్భావనీశ కటకంబునకున్.

287

తా ॥ ఆ వివాహ శుభవేళలో రత్నములతో కూర్చిన అనేకానేక భూషణాలతో వెలిగిపోతూ, వైభవోపేతంగా అలంకరించబడిన విదర్భదేశ రాజధానీ నగరానికి—

చ. హరియును రుక్మిణీసతియు నా బలభద్రుఁడు శంబరారియున్
నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం
ధుర రథవాజి సద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా
చరిత వివాహయుక్త దివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్.

288

తా ॥ శ్రీకృష్ణుడు, రుక్మిణీదేవి వేంచేశారు. వారితోపాటు బలరామదేవుడు, ప్రద్యుమ్నుడు, శత్రువులమదాన్ని అణచివేసే సాంబుడు మొదలైన రాజకుమారులందరు రథగజతురగభట సమూహంతో కదలివెళ్ళారు. మహావైభవంగా జరిగిన వివాహకాలమంతా అందరూ ఆనందోత్సాహాలతో గడిపారు.

క. ఒకనాఁడు యదుకుమారకు, లకలంక సమగ్ర వైభవాటోప మహో
త్సుకులై యుండఁగఁ జూపో, పక యెకసెక్కెమున నవని పాలురు వరుసన్.

289

తా ॥ యదుకుమారులందరు ఆ విధంగా వైభవాలన్నీ అనుభవిస్తూ ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉండటం చూసి పెళ్లికి వచ్చిన రాజులు కొందరు ఓర్వలేక వారిని ఎగతాళి చేయసాగారు.

ఉ. ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మిమొగంబు సూచి నీ
యొచ్చెముఁ దీర్చుకో నిదియు యొప్పగు వేళ బలుండు జూదమం
దిచ్చ గలండు, గాని పొల పెక్కిన నేర్పరి గాఁడు, గాన నీ
కిచ్చు నవశ్యమున్ జయము నీఁగుము తొల్లిటఁబడ్డ బన్నమున్.

290

తా ॥ వారిలో కళింగ దేశాధిపతి రుక్మి ముఖం చూసి “నీకిప్పుడు అదను దొరికింది,

గుర్తు చేసుకోమని హెచ్చరించాడు. నీకు జరిగిన అవమానాన్ని తీర్చుకోవడానికి ఇదే సరైన సమయం. బలరాముడికి జూదమాడటమంటే చాలా ఇష్టం. కాని నేర్పరి కాదు. అందువల్ల నీకు జయం చేకూరడం తథ్యం. అలా గెల్చి పూర్వం నీవు పొందిన అవమానాలన్నీ తీర్చుకో."

క. అని పురికొల్పిన రుక్మియుఁ, దన చేటు దలంపలేక తాలాంకుని తో
డన జూదమాడఁ దివిరెను, వనజాసను కృతము గడచు వా రెవ్వ రిలన్?

291

తా ॥ అని కళింగరాజు పురిగొల్పగా, తనకు రాబోయే కీడు ఆలోచించకుండా రుక్మి–బలరాముడితో జూదమాడటానికి సిద్ధపడ్డాడు. విధివ్రాత తప్పించుకోవడం ఎవరి తరమూ కాదు సుమా!

వ. అప్పుడు.

292

తా ॥ అప్పుడు–

క. కోరి విదర్భుఁడు కుటిల వి, హారుండై పిలిచె జూదమాడ జితారిన్ హారిన్ సన్నుతసూరిన్,
సీరిన్ రైవతసుతార్ద్ర చిత్తవిహారిన్.

293

తా ॥ శత్రువులను జయించినవాడు, సజ్జనులచేత పొగడబడేవాడు, నాగలిని ఆయుధంగా గలవాడు, భూషణాలతో శోభిస్తున్నవాడు, రేవతీ మనోహరుడు అయిన బలరాముణ్ణి విదర్భరాజైన రుక్మి కుటిల బుద్ధితో జూదమాడటానికి పిలిచాడు.

ఆ. 'పూని మనము గొంత ప్రొద్దువోకకు రామ!, నెత్త మాడ నీవు నేర్తు వనఁగ
విందు, మిపుడు గొంత వెల యొడ్డి యాడుద' మనిన బలుఁడు లెస్స యని చెలంగె.

తా ॥ "బలరామా! నీవు జూదం చాలా బాగా ఆడుతావని విన్నాను. కాలక్షేపానికి ఇప్పుడు కొంత ధనం పణంగాపెట్టి మనం జూదమాడుదామా?" అని రుక్మి బలరాముణ్ణి పిలవగానే వెంటనే ఒప్పుకొన్నాడు బలరాముడు.

క. మదిలోని చలము డింపక, పది యిరువది నూఱు వేయి పదివే లిదె ప
న్నిద మని యొడ్డుచు నాడిరి, మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్.

295

తా ॥ ఇద్దరిలోనూ దురభిమానం పెరిగి పోయింది. ఒకరినొకరు గెలవాలనే దీక్షతో ఆడసాగారు. పది, ఇరవైలతో ప్రారంభమైనవారి పందెం నూరు, వేయి, పదివేల ధనందాకా ఒడ్డటంలోకి ఎదిగి పోయింది.

ఉ. ఆడిన యాటలెల్లను హలాయుధుఁ డోడిన రుక్మి గెల్చుడున్
దోడి నృపాలకోటి పరితోషముఁ జెందఁ గళింగభూవిభుం
'డోడె బలుం' డటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా
నాడెను దంతపంక్తి వెలి యై కనుపట్టఁగఁ జాల నవ్వుచున్.

296

తా ॥ ప్రతి ఆటలోను బలరాముడు ఓడిపోవటం, రుక్మి గెలవటం జరగడంతో అక్కడ చేరిన రాజులందరూ బలుడికి బాగా జరిగిందని సంతోషించారు. కళింగరాజు పగలబడి నవ్వుతూ 'బలుడు ఓడిపోయాడు, బలుడు ఓడిపోయాడ' ని పళ్ళన్నీ బయటపెట్టి బలరాముణ్ణి చులకన చేయటమే కాక ఎగతాళిమాటలతో హింసించాడు.

తే. బలుఁడు కోపించి యొక లక్ష పణము సేసి, యాడి ప్రకటంబుగా జూద మపుడు గెల్చె,

గెల్చినను రుక్మి 'యిది యేను గెల్చియుండ, గెలుపు నీ దని కికురింప నలవి యగునె?

297

తా ॥ దానితో బలరాముడికి చాలా కోపం వచ్చింది. కోపం పట్టలేక ఒక లక్ష పణంగా పెట్టి చక్కగా ఆడి రుక్మిని గెలిచాడు. బలరాముడు గెల్చినాకూడా రుక్మి "ఈ ఆట నేను గెలిస్తే, నీవు గెలిచానని వంచిస్తావా?" అని వాదించసాగాడు.

తే. అనవుడు హలధరుఁ డచ్చటి, జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం

డని యడిగిన వారలు రు, క్మని హితులై పలుకరైరి మొగమోటమునన్.

298

తా ॥ రుక్మిమాటలకు నొచ్చుకొన్న వాడై అక్కడి రాజకుమారులనందరినీ చూసి బలరాముడు 'సత్యం చెప్పండి. నేను గెల్చానా? రుక్మి గెల్చాడా?' అని అడిగాడు. కాని వాళ్ళంతా రుక్మికి హితులు కావడంతో మొహమాటపడిపోయి నిజం చెప్పలేకపోయారు.

ఉ. అప్పటి యట్ల యొడ్డి ముసలాయుధుఁ డేపున నాడి జూదముం

జొప్పడ గెల్చి యీ గెలుపు సూడగ నాదియొ వాని దో జనుల్

దప్పక చెప్పుఁ డన్న విదితధ్వనితో నశరీరవాణి తా

నిప్పటియాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడె నావుడున్.

299

తా ॥ అంతకుముందులాగానే బలరాముడు మళ్ళీ లక్ష పణం పెట్టి ఆడాడు. ఇందులో కూడా చక్కని నైపుణ్యం ప్రదర్శించి ఆడి, గెల్చి 'ఈ గెలుపు నాదో, రుక్మిదో సరిగా చెప్పండ' ని రాజులను ప్రశ్నించాడు. అందుకు అశరీరవాణి అందరికీ వినపడే ధ్వనితో "ఈ ఆటలో బలరాముడే విజయం సాధించాడు. విదర్భేశ్వరుడైన రుక్మి పరాజయంపాలైనాడ" ని తీర్పు చెప్పింది.

వ. అనిన విని సకలజనంబులు నద్భుతానంద నిమగ్న మానసులైరి. కుటిల స్వభావు లయిన భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు తన తొల్లింటి పరాభవము దలంచి యెదిరిం దన్ను నెఱుంగక బలాబల వివేకంబు సేయనేరక విధివశానుగతుండై చలంబున బలునిం గని "యిప్పటి యాటయు నేన గెల్చియుండ వృథా జల్పకల్పనుండవయి 'గెల్చితి" నని పల్కెద, వక్షవిద్యానైపుణ్యంబు గల భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే" యని క్రొవ్వున నవ్వుచుం బలికిన న ప్పలుకులు సెవులకు ములుకుల క్రియం దాఁకినఁ గోపోద్దీపిత మానసుండై పెట పెటం బండ్లు గొఱకుచుం గన్నుల నిప్పు లుప్పతిల్లం గినుకం దోఁకత్రొక్కిన మహోరగంబు నోజ రోఁజుచు దండతాడితం బయిన పుండరీకంబు లీల హుమ్మని మ్రోయుచుఁ బ్రచండ బాహుదండంబులు సాఁచి పరిఘం బందుకొని పరిపంథియైన రుక్మిని నతని కనుకూలం బయిన రాజలోకంబును బడలుపడ నడిచె, న య్యవసరంబున.

300

తా ॥ ఆకాశవాణి పలుకులతో ప్రజలందరూ అద్భుతానందాన్ని పొందారు. కాని దుర్మార్గులైన రాజులు కొంతమంది రుక్మిని నీవే గెలిచావని వాదించమని పురిగొల్పారు. రుక్మిణీ కళ్యాణ సందర్భంలో తనకు జరిగిన అవమానాన్ని గుర్తుచేసుకొన్న రుక్మి – తన గురించి, బలరాముడి గురించి ఆలోచించక, బలాబలాలను బేరీజు వేసుకోక విధి తరుముకొస్తుంటే మొండి పట్టుదలతో, అహంకరించి బలరాముణ్ణి ఆక్షేపించాడు. "చూడు బలరామా! ఈ ఆట కూడా నేనే గెల్చాను. కాని, పనికి మాలిన వృథా ప్రలాపాలతో నీవు గెల్చావని వదరుతున్నావు. ద్యూతక్రీడలో అత్యంత నైపుణ్యం గల సుక్షత్రియ రాజకుమారులతో పశువులు కాచుకొనే మీ వంటి వారు సరిసమానులు కాగలుగుతారా?" అని నవ్వుతూ పరిహాసం చేశాడు. రుక్మి అన్న మాటలు బలరాముని చెవులలో ములుకుల్లా గుచ్చుకొన్నాయి. కోపం కట్టలు తెంచుకొంది. పళ్ళు పటపట కొరుకుతు, కళ్ళనుండి నిప్పులు రాలుతున్నాయా అన్నంత కినుకతో తోక తొక్కిన మహా సర్పంలాగా రోజుతూ, కర్రదెబ్బకు హుమ్మని గాండ్రించే పెద్దపులి వలె ధ్వని చేస్తూ, బలిష్ఠములైన

తన రెండు చేతులూ చాచి అక్కడ ఉన్న ఒక ఇనుపగుదియను తీసుకొని శత్రువైన రుక్మిని, రుక్మి అనుచరులైన రాజసమూహాన్ని ఒక్కపెట్టున చితకబాది, మరి లేవకుండా చేశాడు.

క. మును దంతపంక్తి వెలిగాఁ, దను నవ్విన య క్కళింగుఁ దల వట్టి రయం
బునఁ బడఁదిగిచి వదన మే, పునఁ బెడచే వ్రేసి దంతములు వెస డులిచెన్.

301

తా ॥ ఆ సమయంలో బలరాముడు, అంతకుముందు పళ్ళన్నీ బయటపెట్టి తనను చూసి పకపక నవ్విన ఆ కళింగరాజు తలను పట్టుకొని గిరగిరా త్రిప్పి క్రిందపడవేసి, అతని ముఖం మీద ఎడం చేత్తో కొట్టి, పళ్ళు రాలగొట్టాడు.

క. అంతం బోవక రుక్మిని, దంతంబులు మున్ను డులిచి తను వగలింపన్ అంతకుపురి కేగెను వాఁ, డెంతయు భయ మంది రాజు లెల్లం గలఁగన్.

302

తా ॥ బలరాముడు అంతటితో ఊరుకోలేదు. ప్రబల శత్రువైన రుక్మిని పట్టుకొని అతని పళ్ళు రాలగొట్టాడు. క్రోధావేశంతో శరీరాన్ని ముక్కలుముక్కలుగా చితక్కొట్టాడు. బలరాముడి వీర విక్రమానికి అక్కడున్న రాజులు భయగ్రస్తులైనారు. బలరాముడి ధాటికి రుక్మి యమలోకానికి చేరుకొన్నాడు.

వ. అట్లుచేసి య య్యాదవసింహం బసహ్యవిక్రమంబునం జెలంగె నంత.

303

తా ॥ ఆ విధంగా బలరాముడు రుక్మిని సంహరించి తేరిపార చూడరాని బలపరాక్రమాలతో వీర విజృంభణ చేశాడు.

క. భూవర పద్మాక్షుఁడు దన, బావ హతుం డగుట గనియుఁ బలుకక యుండెన్ భావమును

రుక్మిణీ బల, దేవుల కే మనఁగ నెగ్గు దేరునొ? యనుచున్.

304

తా ॥ పరీక్షిన్మహారాజా! బావ అయిన రుక్మి శరీరం చాలించడం కళ్ళతో తాను చూసినా శ్రీకృష్ణుడు ఏమీ మాట్లాడకుండా మౌనం వహించాడు. ఏమంటే రుక్మిణి ఏమనుకుంటుందో, మరి ఇంకేమైనా అంటే బలదేవుడేమనుకొంటాడో అనుకొని ఎవరికీ ఏ బాధకలిగించకూడదని శ్రీకృష్ణుడు మౌనాన్నే పాటించాడు.

వ. అంత నా విదర్భానగరంబు నిర్గమించి.

305

తా ॥ ఆ తరువాత యాదవవీరులందరూ విదర్భ నగరాన్ని వదలి ద్వారకకు ప్రయాణమయ్యారు.

క. పరమానురాగరస సం, భరితాంతఃకరణు లగుచుఁ బాటించి వధూ
వరులను రథమం దిడి హల, ధర హరి రుక్మిణులఁ గొల్చి తగ యదువీరుల్.

306

తా ॥ యాదవులు బలరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి, రుక్మిణీదేవిని సేవిస్తూ మహదానందంతో కూడినవారై నూతన వధూవరులను రథమెక్కించిన వారై తిరుగు ప్రయాణం కట్టారు.

ఉ. మంగళతూర్యఘోషము లమందగతిం జెలఁగంగ మత్త మా
తంగ తురంగ సద్భట కదంబముతోఁ జని కాంచి రంత నా
రంగ లవంగ లుంగ విచరన్మదభృంగ సురంగనాద స
త్సంగ తరంగిణీకలిత సంతతనిర్మల నా కుశస్థలిన్.

307

తా ॥ మంగళ వాద్యధ్వనులు మిన్నంటి మ్రోగుతుండగా గజబలం, అశ్విక దళం, రథసమూహం, సేనావాహిని నడుస్తుండగా యాదవవీరులు ద్వారకను సమీపించారు. ఆ కుశస్థలీపురమంతా నారింజ, లవంగ, మాదీఫలాది అనేక వృక్షాలతో నిండి ఉంది. పుష్పమకరందాన్ని ఆస్వాదించడానికి సంచరిస్తున్న తుమ్మెదల గుంపులతో, చక్కని అలల సవ్వడులతో కూడిన నిర్మల నదీ ప్రవాహాలతో, శోభాయమానంగా ఉంది.

వ. ఇట్లు పురోప వనోపకంఠంబునకుం జని.

308

తా ॥ ద్వారకానగరానికి ముందున్న సుందరోద్యాన వనంలోకి యాదవులందరూ ప్రవేశించారు.

క. అందు వసించిరి నందిత, చందన మందార కుంద చంద్ర లస న్మా
క.దముల నీడ హృదయా, నందము సంధిల్ల నందనందనముఖ్యుల్.

309

తా ॥ శ్రీకృష్ణుడు మొదలైన యదువీరులందరూ చందన వృక్షాలతో, మందార చెట్లతో, మొల్ల తరువులతో, ఏలకీ తీగెలతో, కాయలతో, పండ్లతో నిండుగా ఉన్న మామిడి వృక్షాలతో మంచి ఉల్లాసాన్ని కలిగించే ఆ ఉద్యానవనంలోని ఆయా చెట్ల నీడలలో విశ్రాంతి తీసుకొంటూ పరమానందంతో సుఖంగా కాలం గడిపారు.

వ. తదనంతరంబ పురప్రవేశంబు సేసి రని చెప్పి శుక యోగీంద్రుండు పరీక్షి న్నరేంద్రున కిట్లనియె.

310

తా ॥ తరువాత బలరాముడు కృష్ణుడు మొదలైన యదువీరులందరూ

ద్వారకానగరంలోకి వెళ్ళారు'' అని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విధంగా అన్నాడు:

## బాణాసురుడు ఈశ్వర ప్రసాదాన్ని పొందుట

తే. అనఘ! బలినందనులు నూర్వు రందులోన, నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి
చిర యశోహారి విహితపూజిత పురారి, యహిత తిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు.

311

తా ॥ "పరీక్షిన్మహారాజా! పుణ్య చరితా! బలిచక్రవర్తికి నూర్గురు కొడుకులున్నారు. అందరిలో మొదటవాడు బాణుడు. ఉగ్రరూపం కలవాడు. చిరకీర్తిని పొందాడు. శత్రువులనే అంధకారాన్ని మటుమాయం చేసే తీక్షణభానుడు. వేయి చేతులు గలవాడు. అన్నిటినీ మించి అఖండ శివ భక్తుడు.

క. బాణుఁడు విక్రమజిత గీ, ర్వాణుఁడు సని కాంచె భక్తివశుఁడై నగణ
స్థాయిన్ నిర్దళితా సమ, బాణుం దాండవధురీణు భక్త త్రాణున్.

312

తా ॥ సకల దేవతలను జయించిన, మహాపరాక్రమవంతుడైన బాణుడు – భక్తులను రక్షించేవాడు, భక్తికి వశుడైనవాడు, ప్రమథగణాలతో కూడి ఉన్నవాడు, మన్మథుని జయించినవాడు, తాండవమూర్తి అయిన పరమేశ్వరుని వద్దకువెళ్ళి ఆ కారుణ్యమూర్తిని దర్శించాడు.

క. కని యనురాగ వికాసము, దన మనమునఁ గడలుకొనఁగ ధరఁ జాఁగిలి వం
దన మాచరించి మోదము, దనరఁగఁ దాండవము నలుపు తఱి న య్యభవున్.

313

తా ॥ ఆ సమయంలో పరమశివుడు తాండవ నృత్యం చేస్తున్నాడు. అటువంటి నటరాజును చూడగానే బాణుడి మనస్సులో ఎనలేని భక్తిచోటు చేసుకొంది. సంతోషంతో

ఉప్పొంగి పోయాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు.

ఉ. సంచిత భూరిబాహుబలసంపద పెంపున నారజంబు వా
యించి యనేకభంగుల సుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె
ప్పించి ప్రమోదియై నిజవశీకృత నిశ్చలితాంతరంగుఁ గా
వించి తదాననాంబురుహ వీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్.

314

తా ॥ శివుడు నృత్యం చేస్తున్న సమయంలో తన బాహుబలాన్ని అంతా ఉపయోగించి వివిధ రకాలుగా మద్దెల వాయించి బాణుడు ముల్లోకవాసులకు శరణు ఇచ్చే పరమేశ్వరుణ్ణి మెప్పించాడు. భక్తవత్సలుడైన శంకరుడు బాణుని భక్తికి మెచ్చి, సంతోషించి, ఆ రాక్షసరాజుకు వశమైనాడు. బాణుడు మహేశ్వరుణ్ణి తన భక్తితో వాత్సల్యపూరితుణ్ణి చేసి, ఆ పార్వతీనాథుని ముఖపద్మాన్ని వీక్షిస్తూ నమస్కరించి, స్తుతించాడు:

ఉ. శంకర ! భక్తమానసవశంకర! దుష్టమదాసురేంద్ర నా
శంకర! పాండునీలరుచి శంకరవర్ణ నిజాంగ! భోగి రా
ట్కంకణ! పార్వతీహృదయ కైరవ కైరవమిత్ర! యోగి హృ
త్పంకజ పంకజాప్త! నిజతాండవఖేలన! భక్త పాలనా!

315

తా ॥ "శంకరా! భక్తుల మనస్సులను వశం చేసుకొనే పరంధామా! మదోన్మత్తులైన దుష్టరాక్షసులను నాశనం చేసే పరాక్రమశాలీ! తెల్లని కాంతితో శుభాలనిచ్చే శరీరశోభగల దేవా! సర్పరాజులను చేతులకు భూషణములుగా గల భక్తపోషా! పార్వతీదేవి హృదయమనే తెల్లకలువను వికసింపచేసే చంద్రరూపా! యోగుల హృదయ పద్మాలకు సూర్యునివంటి వాడా! తాండవ ప్రియా!"

వ. అని వినుతించి.

316

తా ॥ అని మనసారా స్తోత్రం చేసి–

ఉ. దేవ! మదీయ వాంఛితము తేటపడ న్నిటు విన్నవించెదన్
నీవును నద్రినందనయు నెమ్మిని నా పురి కోటవాకిటన్
గావలియుండి నన్నుఁ గృపఁ గావుము భక్తఫలప్రదాత! యో
భావభవారి! నీ చరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్.

317

తా ॥ బాణాసురుడు శివుణ్ణి చూసి "భక్తులు కోరిన కోరికలు తీర్చే దేవదేవా! మన్మథుని హతమొనర్చిన అగ్నినేత్రా! ఎప్పుడూ నీ పాదపద్మాలను ఆశ్రయించుకొని ఉండే నేను నా కోరికను నీకు విన్నవిస్తాను. శంకరా! నీవు, జగన్మాత అయిన పార్వతీ దేవి, నా మీద గల ప్రేమతో వచ్చి నా పురము కోటవాకిటి యందు కావలిగా ఉండి, దయతో నన్ను రక్షించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. వరప్రదాతా! నాకీ వరమిచ్చి నన్ను ధన్యుణ్ణి చేయుము తండ్రీ!"

వ. అని యభ్యర్థించినం బ్రసన్నుం డై భక్తవత్సలుం డగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాంతక గజాననాది భూతగణంబులతో బాణనివాసం బగు శోణపురంబు వాకిటం గాఁ పుండెఁ, బదంపడి యొక్కనాఁ డబ్బలినందనుండు.

318

తా ॥ అని ప్రార్థించాడు. మహేశ్వరుడు భక్తవత్సలుడు కావడంతో భక్తుడైన బాణుని కోరిక మన్నించి ప్రసన్నుడైనాడు. పార్వతీదేవితో కూడి, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి వెంటరాగా, ప్రమథ గణాలను తీసుకొని బాణుడి నివాస స్థలమైన శోణపురం యొక్క

కోటవాకిటిలో నగర రక్షకుడిగా పరమశివుడు నివాసమేర్పరచుకొన్నాడు. తరువాత బలినందనుడైన బాణాసురుడు ఒక రోజున—

తే. దర్పమునఁ బొంగి రుచిర మార్తాండ దీప, మండలముతోడ మార్పడు మహితశోణ
మణికిరీటము త్రిపుర సంహరుని పాద, వనజములు సోఁక మ్రొక్కి యిట్లని నుతించె.

319

తా ॥ తన శౌర్యసంపద చూసుకొని మిక్కిలి గర్వించి త్రిపురాసుర సంహారకుడు, తనదైవమూ అయిన పరమేశ్వరుని చెంతకు వెళ్ళాడు. దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యబింబంతో సరితూగి వచ్చే అరుణకాంతితో శోభాయమానంగా ఉన్న తన మణికిరీటాన్ని శంకరుని పాదపద్మాలకు సోకేటట్లు చేసి, భక్తితో మ్రొక్కి ఈ విధంగా స్తుతించాడు:

సీ. 'దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత! వితతచారిత్ర! సంతత పవిత్ర! హాలాహాలాహార! యహిరాజకేయూర! బాలేందుభూష! సద్భక్తపోష! సర్వలోకాతీత! సద్గుణసంఘాత! పార్వతీహృదయేశ ! భవవినాశ! రజతాచలస్థాన! గజచర్మపరిధాన! సురవైరివిధ్వస్త! శూలహస్త!

తే. లోకనాయక! సద్భక్తలోకవరద!, సురుచిరాకార! మునిజనస్తుతివిహార! భక్త జనమందిరాంగణ పారిజాత!, నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ!

320

తా ॥ "దేవాదిదేవదేవా! శంకరా! నీవు సమస్తలోకాలకు అధినాథుడవు. త్రిలోకాధిపతి అయిన దేవేంద్రుడి చేత వినుతింపబడే వాడివి. సర్వులకు విదితమయిన చరిత్రగలవాడవు. పరమపవిత్రుడవు. హాలాహలమే నీ ఆహారము. భుజగరాజమే నీ భుజకీర్తి. చంద్రవంక నీ శిరోభూషణం. భక్తపోషణ నీ సహజ లక్షణం. సమస్తలోకాలకు అతీతుడవు. సకల సద్గుణాలకు సన్నిహితుడవు. పార్వతీనాథా! సంసారతారకా! మంచుకొండ నీ ఇల్లు. గజచర్మం నీ కట్టువస్త్రం.

రాక్షస సంహారా! త్రిశూలధారీ! సుందరాకారా! ముని మానసవిహారా! లోకనాయకా! భక్తపాలకా! భక్తజనుల వాకిట వెలసిన పారిజాతమా! భక్తుల సమస్త కామితాలను నెరవేర్చే పరమేశ్వరా! నిన్ను ఎవరు నుతించగలరు దేవా!"

వ. అని స్తుతియించి.

321

తా ॥ అని స్తోత్రం చేసి–

మ. అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్యస్ఫూర్తిఁ బోరాడఁ జా
లిన వీరుం డొకఁడైన బందెమునకున్ లేఁడయ్యె, భూమండలి
న్ననయంబున్ భవదగ్ర్యదత్తకరసాహస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేదె యీ భరము నెట్లోర్తు న్నుమానాయకా!

322

తా ॥ "ఉమానాథా! పరమశివా! యుద్ధరంగంలో నన్ను ఎదిరించి భుజబల స్ఫూర్తితో నాతో యుద్ధం చేయగల వీరుడు లోకంలో ఒక్కడు కూడా లేడు. పందెం వేసి గెలవాలని కోరుకున్నా కాని నాతో సరిజోడుగా నిలబడగలిగే శూరుడు ఒక్కడు కూడా కనబడటంలేదు. నీవు ప్రసాదించిన వెయ్యి చేతులు ఎప్పుడు యుద్ధం చేద్దామా అని ఎదురుతెన్నులు చూస్తున్నాయి. నా చేతులకు కలిగిన ఈ దురదను, ఈ యుద్ధ కండూతిని ఎలా పోగొట్టుకోగలను? ఉపాయమే దొరకడం లేదు. ఈ బాధను భరించలేకుండా ఉన్నాను.

సీ. హుంకార కంకణ క్రేంకార శింజినీ టంకార నిర్ఘోషసంకులంబు
చండ దోర్దండ భాస్వన్మండలాగ్ర ప్రకాండ ఖండిత రాజమండలంబు
శూలాహత క్షతోద్వేల కీలాల కల్లోలకేళీ సమాలోకనంబు
శుంభ దున్మద కుంభి కుంభస్థలధ్వంస సంభూత శౌర్య విజృంభణంబు

తే. గలుగు నుద్దామ భీమ సంగ్రామ కేళి, ఘన పరాక్రమ విక్రమక్రమము గాఁగ
జరపలేనట్టి కరములు కరము దుఃఖ, కరము లగుఁగాక సంతోషకరము లగునె?

323

తా ॥ రుద్రా! యుద్ధభూమిలో చేసే హుంకార ధ్వనులు, చేతులలో ఉండే బాణాలు, కంకణాలు పరస్పరఘట్టనతో చేసే శబ్దాలు, ధనుష్టంకార నినాదాలు మిన్నుముట్టుతుంటే కలిగే ఆనందం అనిర్వచనీయమైనది గదా! ప్రచండ భుజబలంతో ఖండించిన శత్రు భూపతుల శిరస్సులతో, శూలపు దెబ్బలకు చీల్చబడి ధారాప్రవాహంగా ప్రవహిస్తున్న శత్రువీరుల నెత్తురుటేళ్ళతో భయంకరంగా కనిపించేది; మదపుటేనుగుల కుంభస్థలాలను క్షణంలో ధ్వంసం చేసే శౌర్యప్రతాపాల విజృంభణతో మహాభీకరంగా దర్శనమిచ్చేది అయిన యుద్ధక్రీడలో ప్రదర్శించే శౌర్యమే శౌర్యమౌతుంది. అంతేగాని, అటువంటి యుద్ధం చేయలేని చేతులు దుఃఖాన్ని కలిగిస్తాయిగాని ఆనంద ప్రదాలవుతాయా?

ఉ. కాన మదీయ చండభుజగర్వ పరాక్రమ కేళికిన్ సముం
డీ నిఖిలావనిం గలఁడె యిందుకళాధర! నీవు దక్కనా;
నా నిటలాంబకుండు దనుజాధిపు మాటకుఁ జాల రోసి లో
నూనిన రోషవార్ధి గడ లొత్తఁగ నిట్లని పల్కె భూవరా!

324

తా ॥ చంద్రశేఖరా! ఒక మాట చెబుతా విను. నా యొక్క చండప్రచండమైన భుజబలానికి గాని, శౌర్య పరాక్రమ విహారానికి గాని సమస్త భూమండలంలోను నీవు తప్ప వేరొక్క వీరుడెవడైనా సరిదీటు కాగలవాడున్నాడా?” అని పలికిన బాణుడి గర్వోక్తులకు ఫాలనేత్రుడైన శివుడు ఆగ్రహించాడు. భక్తవత్సలుడైనా శంకరుని మనస్సులో రోషవార్ధి పొంగి ప్రవహించింది. బాణున్ని చూసి ఇలా అన్నాడు:

క. 'విను మూఢహృదయ! నీ కేతన మెప్పు డకారణంబ ధారుణిపైఁ గూ
లును నపుడు నీ భుజావళి, దునియఁగ నా యంతవానితో నని గల్గున్.

325

తా ॥ "ఓ మూఢుడా! విను. నీ జెండా ఎప్పుడైతే అకారణంగా నేలపై కూలుతుందో, అప్పుడు నా అంతటి వాడితో నీకు యుద్ధం సంభవిస్తుంది. ఆ వీరుడి చేతిలో నీ వేయి చేతులూ నరకబడతాయి. దానితో నీ కోరికా తీరుతుంది, గర్వమూ అణగారుతుంది."

వ. అని పలికిన నట్లు సంప్రాప్త మనోరథుండై నిజభుజవినాశ కార్య ధురీణుండగు బాణుండు సంతుష్టాంతరంగుం డగుచు నిజనివాసంబునకుం జని, తన ప్రాణవల్లభల యుల్లంబులు పల్లవింపఁ జేయుచు నిజధ్వజ నిపాతంబు నిరీక్షించుచుండె, తదనంతరంబ.

326

తా ॥ పరమేశ్వరుని మాటలతో తన కోరిక ఫలిస్తుందని, సమాన వీరునితో యుద్ధం చేసే అవకాశం లభిస్తుందని పొంగిపోయాడు బాణుడు. తన భుజాలు పోయినా, యుద్ధం చేసి రణకండూతి తీర్చుకోవచ్చు గదా అని మురిసిపోయి రాజభవనం చేరి భార్యలతో సుఖసంతోషాలలో మునిగి పోయాడు. రథంపైన కట్టే ధ్వజం ఎప్పుడు కూలిపోతుందా, ఎప్పుడు యుద్ధం సంభవిస్తుందా అని ఎదురు చూస్తున్నాడు.

సీ. ఆ దానవేశ్వరు ననుఁగుఁ గుమారి యుషాకన్య విమల సౌజన్యధన్య
రూపవిభ్రమ కళారుచిర కోమలదేహ యతను నాఅవబాణ మనఁగఁ నొప్పు
సుందరీరత్నంబు నిందునిభానన యలినీలవేణి పద్మాయతాక్షి
యొకనాఁడు రుచిర సౌధోపరి వేదికా స్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి

తే. మున్ను దన చౌల నెన్నఁడు విన్న యతఁడుఁ, గన్నులారంగఁ దాఁ బొడగన్న యతఁడుఁ
గాని యసమాన రూపరేఖావిలాస, కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవసినటులు.

327

తా ॥ బాణాసురుడి ప్రియ పుత్రిక పేరు ఉషాకన్య. ఆ కన్య ఎంతో సౌజన్యమూర్తి. అతిలోక సౌందర్యవతి. సకల కళలు నేర్చిన తేజస్విని. సుకుమారగాత్రి. మన్మథుని ఆరో బాణమా అని అనుకొనేటంత లావణ్యవతి. చంద్రవదన. తుమ్మెద రెక్కలవంటి నిగనిగలాడే కేశకాంతి గల సుందరి. కమలాక్షి. సుగుణశీల. బాణుని గారాలపట్టి ఒకరోజు తన బంగారు భవనంపైభాగాన ఉన్న వేదికమీద మెత్తని పాన్పుపైన శయనించింది. ఆ రాచకన్నెకు మెల్లగా నిద్రపట్టింది. ఆ నిద్రలో ఒక మంచి కలకంది. అంతకుముందెప్పుడూ, ఎవరి వల్లా విననటువంటి, తానెన్నడూ చూడనటువంటి అసమాన సౌందర్యశాలి అయిన అనిరుద్ధునితో కలిసి సుఖించినట్లు కలలో అనుభూతి చెందింది.

చ. కల గని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయరూపము ముఖంబున వ్రేలిన యట్ల దోఁచినం
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్

328

తా ॥ కలనుంచి మేలుకొన్న ఉషాకన్య కన్నులనుండి బాష్పకణాలు జారి చెక్కిలి మీదపడుతున్నాయి. అది కలకాదు, నిజమే అనుకొంది. మనోహరమైన అనిరుద్ధుని రూపురేఖా విలాసాలు తన కళ్ళముందు నిల్చి ఉన్నట్లే అనిపించింది ఉషాకన్యకు. ఒక్కసారిగా ఆమె కలవరపాటు చెందింది. ఆ సంతోషంలో బయలు ప్రదేశాన్ని గట్టిగా కౌగిలించుకొంది.

వ. మఱియును.

329

తా ॥ అంతేకాకుండా,

చ. సరసమృదూక్తులుం గసుమసాయక కేళియు శాటికా కచా
కరషణముల్ నఖక్రియలుఁ గ్రమ్మకపోల లలాట మేఖలా
కర కుచ బాహుమూలములుఁ గైకొని యుండుట లాదిగాఁ దలో
దరి మది గాఢమై తగిలె దర్పకుఁ డచ్చున నొత్తినట్లయై.

330

తా ॥ ఉషాకన్యకు కలలో జరిగిన సంగతులు ఒక్కొక్కటీ కళ్ళముందు కదలాడుతున్నట్లు అనిపించింది. తనను కలలో గట్టిగా కౌగిలించుకొన్న సుందరాంగుడు సాక్షాత్తు మన్మథుడే అయి ఉంటాడని భావించింది. ఆ సరససల్లాపాలు; మన్మథ క్రీడలు; వస్త్రకేశాకర్షణలు; చెక్కిళ్ళపై, నుదుటిపై, నడుముపై, కుచాలపై, బాహుమూలాలపై ఏర్పడిన గోళ్ళచిహ్నాలు మొదలైనవన్నీ ఆమె మనస్సులో మెదులుతూ చెరగని ముద్రవేశాయి.

సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియుమీఁది కూరిమి బయలుపఱుపఁ
బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చినఁ జెలి మేనఁ బులకలు చెక్కు లొత్త
మదనాగ్ని సంతప్తమానస యగుటకు గురుకుచహారవల్లరులు గందఁ
జిత్తంబు నాయకాయత్తమై యుంటకు మఱుమాట లాడంగ మఱపు గదుర

తే. నతివ మనమున సిగ్గు మోహంబు భయముఁ, బొదమ నునుమంచు నెత్తమ్మిఁ బొదుపు
మాడ్కిఁ బ్రథమచింతాభరంబునఁ బద్మనయన, కోరి తలచీర వాటింప నేరదయ్యె.

331

తా ॥ ఉషాకన్య తన మనోభావాలను ఎంత అణచుకొందామనుకున్నా, ప్రియుడి మీద ఆమెకుగల ప్రేమ బయటపడుతూనే ఉంది. ఆమె తనలో కలుగుతున్న లజ్జను ఎవరికీ కనపడకుండా ఎంత దాచుకొందామనుకున్నా శరీరం మీద ఏర్పడుతున్న పులకలు దాచనివ్వడం లేదు. మన్మథాగ్నితో వేగిపోతోందనడానికి వక్షస్థలంపై మెరుస్తున్న పెద్దపెద్ద హారాలన్నీ కందిపోవటమే రుజువుగా కనిపిస్తోంది. ఆమె మనస్సు ఎప్పుడూ నాయకుడైన అనిరుద్ధుడిపైనే

లగ్నమైందనడానికి చెలికత్తెలు మాట్లాడినప్పుడు మారుమాట చెప్పడం మరచిపోయి మౌనం వహించడమే నిదర్శనం.

ఉషాకన్య మనస్సులో సిగ్గు, మోహము, భయము ఒకేసారి కలగడంతో మంచుకప్పిన పద్మంలా గోచరిస్తోంది. ఈ శృంగార నాయిక మొదటి లక్షణమైన చింతలో కూరుకుపోయి మేలిముసుగు వేసుకోవటం కూడా విస్మరించింది.

వ. ఇట్లు విరహవేదనా దూయమాన మానసయై యుండె, నంత నెచ్చెలులు డాయం జనుదెంచినం దన మనంబునం బొడము మనోజవికారంబు మఱు వెట్టుచు నప్పుడు.

332

తా ॥ ఈ విధంగా ఆమె విరహవేదనలో కొట్టుకుపోతున్న మనస్సుతో, చెలులు చెంత చేరినప్పుడు తన మనోభావాన్ని వ్యక్తం కాకుండా మరుగుపరిచింది.

చ. పొరిఁబొరిఁ బుచ్చు నూర్పుగమిఁ బుక్కిటనుంచి కుచాగ్రసీమపై
బెరసిన సన్న లేఁజెమట బిందువు లొయ్యన నార్చుఁ గన్నులం
దొరఁగెడు బాష్పపూరములు దొంగలిఱెప్పల నాని చుక్కలం
దరుణులు రండు చూత మని తా మొగ మెత్తును గూఢరాగయై.

333

తా ॥ ఉషాకన్య తనలో కనబడుతున్న అనురాగ చిహ్నాలను చెలులకు కనబడకుండా దాచుకుంది. మాటిమాటికి వస్తున్న నిట్టూర్పులను లోలోపలే ఉంచుకొని బయటపడకుండా జాగ్రత్తపడింది. కుచముల మీద ఏర్పడిన చెమటబిందువులను ఎవరూ చూడకుండా మెల్లగా తుడిచి వేసుకొనేది. చెక్కిలిపై జారిపోతున్న కన్నీటి బిందువులను రెప్పల మధ్యలో ఇముడ్చుకునేది. చెలులు గ్రహించకుండా ఉండేటందుకు ముఖమెత్తి వాళ్ళను చూస్తూ 'రండి, రండి, ఆకాశంలోకి ఎన్నిచుక్కలు వచ్చాయో చూద్దాం' అని పిలుచుకు వెళ్ళేది.

వ. ఇ వ్విధంబునం జరియించుచుండె నట్టియెడ.

334

తా ॥ ఈ విధంగా ఉషాకన్య తన అనురాగ విషయం ఎవరికీ తెలియకుండా ప్రవర్తిస్తున్న సమయంలో.

తే. అంతకంతకు సంతాప మతిశయించి, వలుఁద చన్నులు గన్నీటి వఱదఁ దడియఁ జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము, వాంచి పలుకక యుండె న వ్వనరుహాక్షి.

335

తా ॥ అంతకంతకు ఆమె విరహతాపం ఎక్కువై కన్నీరు వరదలుగా జాలువారింది. ఆమె వక్షస్థలం ఆ కన్నీటితో పూర్తిగా తడిసిపోయింది. అలా ఉన్న తనను చెలులెక్కడ చూస్తారో అన్న సిగ్గుతో వారివైపు చూడలేక తలదించుకొని ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయింది.

వ. అంత.

336

తా ॥ అప్పుడు,

తే. బలితనూభవుమంత్రి కుంభాండుతనయ, తన బహిఃప్రాణ మిది యనఁ దనరునట్టి కామినీమణి ముఖపద్మకాంతి విజిత, శిశిరకర చారు రుచిరేఖ చిత్రరేఖ.

337

తా ॥ బాణసార్వభౌముని మహామంత్రి అయిన కుంభాండుని కూతురుపేరు చిత్రరేఖ. ఆ చిత్రరేఖ ఉషాకన్యకు ప్రాణస్నేహితురాలు. సుందరాంగి, చంద్రరేఖను చిన్నపరిచే ముఖకాంతితో విరాజిల్లే పూబోడి.

వ. కదియవచ్చి య బ్బాల నుపలక్షించి.

338

తా ॥ చిత్రరేఖ, ప్రాణసఖీ అయిన ఉషాకన్య దగ్గరకు వచ్చి ఆమెను పరిశీలనగా చూసింది.

తే. భామినీమణి సొబగుని బయల వెదకు, విధమునను నాత్మవిభుఁ బాసి విహ్వలించు
నగను జేతికి లోనైనవానిఁ బాసి, భ్రాంతిఁ బొందిన భావంబు ప్రకట మయ్యె.

339

తా ॥ "సఖీ! ఉషా! నీ వైనం చూస్తే ఎవరి కోసమో, బహుశా నీ ప్రియుడి కోసమై ఉంటుంది, బయటంతా వెదుకుతున్నట్లు కనిపిస్తోంది. ప్రాణనాథునికి దూరమై దుఃఖభారంతో చంచలిస్తున్నావనిపిస్తోంది. చేతికందిన సఖుని పోగొట్టుకొని భ్రమలో కొట్టుకు పోతున్నావనీ తెలుస్తోంది."

తే. వనిత నాకన్న నెనరైనవారు నీకుఁ గలుగ నేర్తురె! నీ కోర్కెఁ దెలియఁ జెప్ప
కున్న మీ యన్నతో డన్నఁ గన్నుఁగవను, నలరు నునుసిగ్గుతో నగ వామతింప.

340

తా ॥ "చెలీ! నా కన్న నీకు ఎక్కువ ప్రియమైన వారు లేరు కదా! నీ మనస్సులో ఏముందో నాతో చెప్పకపోతే మీ అన్నగారి మీద ఒట్టు. నీ బాధ నాతో కాకపోతే ఎవరితో పంచుకొంటావు? చెప్పు" అని చిత్రరేఖ అనడంతో ఉషాకన్య కళ్ళల్లో లేతదైన సిగ్గు కదలాడింది. పెదవులపై చిరునవ్వు తొంగిచూసింది.

వ. ఇ వ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె.

341

తా ॥ చిత్రరేఖను చూసి ఇలా చెప్పింది:

చ. 'చెలి కలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు రత్నహార కుం
డల కటకాంగుళీయక రణ న్మణినూపురభూషణుండు ని
ర్మల కనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్.

342

తా ॥ "చెలీ! చిత్రరేఖా! కలలో నేనొక నవమన్మథాకారుణ్ణి చూసాను. అతనెంత అందగాడంటే నీలమేఘ శ్యామలాకారంతో వెలిగిపోతున్నాడనుకో! ఉన్నతమైన వక్షస్థలం; తామరరేకుల వంటి కన్నులు; పసుపు పచ్చని పట్టువస్త్రం, సౌకుమార్యంతో నిండిన శరీర సౌభాగ్యం; రత్నాలతో పొదిగిన కర్ణకుండలాలు, భుజకీర్తులు, అంగుళీయకాలు, రకరకాల హారాలు, వినసొంపైన సవ్వడులు చేసే మణి నూపురాలు – ఒకటేమిటి? ప్రతి ఒక్కటీ ఆ యువకుని అందచందాలను ఇనుమడింప చేశాయి.

చ. నను బిగియారఁ గౌఁగిట మనం బలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచితాధర సుధారస మిచ్చి మనోజ కేళికిం
బనుపడఁ జేసి మంజుమృదుభాషలఁ దేలిచి యంతలోననే
చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా!

343

తా ॥ పద్మాననా! చిత్రరేఖా! ఆ అందగాడు నన్ను తన బిగికౌగిలిలో చేర్చి, అధరామృతాన్ని ప్రసాదించి, తియ్యటి మాటలతో అలరించి మన్మథకేళిలో ఆనందింపచేసాడు. కాని, అదేమిటో! నన్ను దుఃఖసముద్రంలో ముంచి వెంటనే వెళ్ళిపోయాడు."

వ. అనుచు న మ్మత్తకాశిని చిత్తంబు చిత్తజాయత్తం బయి తత్తఱంబున విరహానలం

బుత్తలపెట్టఁ గన్నీరు మున్నీరుగా వగచుచు విన్ననయిన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ దన మనంబున నయ్యింతి సంతాపంబు చింతించి యిట్లనియె.

344

తా ॥ అని చెప్పి ఉషాకన్య తన మనస్సు మన్మథ తాపానికి గురికాగా విరహాగ్నికి తట్టుకోలేక కన్నీరు మున్నీరుగా విలపించింది. దుఃఖంతో పూడుకుపోయిన ముఖం వంచుకొని ఇక మాట్లాడలేక మౌనంగా ఉండిపోయింది. అప్పుడు చిత్రరేఖ తన చెలి బాధను అర్థం చేసుకొని ఈ విధంగా పలికింది:

చ. 'సరసిజనేత్ర! యేటికి విచారము? నా కుశలత్వ మేర్పడన్
నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య కి
న్నరవర ముఖ్యులం బటమునన్ లిఖీయించినఁ జూచి నీ మనో
హరుఁ గని' వీడె పొ 'మ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్.'

345

తా ॥ "సఖీ! ఉషా! నేనుండగా నీవెందుకు బాధపడతావు? నా నేర్పరితనం నీకు తెలియదా? యక్షకింపురుషాది దేవతల యొక్క, ఆకాశ చారులైన సిద్ధసాధ్యకిన్నర శ్రేష్ఠుల యొక్క, నాగరాజులయొక్క, మానవోత్తములయొక్క రూపురేఖలను పటంలో చిత్రించి తెచ్చి నీకు చూపిస్తాను. వారిలో నీ మనస్సును హరించిన సుందరాంగుడెవ్వడో నీవు చెబితే వెంటనే వెళ్ళి ఆ మన్మథాకారుణ్ణి తెచ్చి నీ ముందుంచుతాను."

వ. అని యొడంబఱిచి మిలమిలని మంచుతోడం బురుడించు ధళ ధళ మను మెఱుంగులు దుఱంగలిగొను పటంబు నావటంబుసేసి, వజ్రంబున మేదించి, పంచవన్నియలు వేఱు వేఱ కనక రజతపాత్రంబుల నించి కేలం దూలిక ధరించి యొక్క విజన స్థలంబునకుం జని ముల్లోకంబులం బేరు గలిగి వయో రూప సంపన్ను లయిన పురుష ముఖ్యుల నన్వయ

గోత్రనామధేయంబులతోడ వ్రాసి, యాయితంబయిన య ప్పటంబు దన ముందటఁ దెచ్చి పెట్టి య ప్పటంబునం దగులని వారు లేరు, వారిం జెప్పెద, సావధానంబుగ నాకర్ణింపు' మని యిట్లనియె.

346

తా ॥ అని చెప్పి ఉషా కన్యను ఒప్పించి చిత్రపటాలను సిద్ధం చేయడానికి చిత్రరేఖ ఉపక్రమించింది. మంచులాంటి మిలమిలల కాంతులను ధిక్కరించే తళతళమని మెరిసే తెల్లని వస్త్రాన్ని చిత్రాలు వ్రాయడానికి పొందుపరచుకొంది. వజ్రపు పొడిలో కలిపిన అయిదురంగులను వేరువేరు బంగారు, వెండి పాత్రలలో పదిలపరిచింది. రంగులు వ్రాసే కుంచెను చేతిలో ధరించింది. ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళింది.

ముల్లోకాలలో పేరుప్రతిష్ఠలు గల, గొప్ప అందగాళ్ళైన యౌవనవంతులను గురించి తెలుసుకొంది. ఆ సుందరాంగుల చిత్రాలను పటంమీద చిత్రించింది. ఆ నవయువకుల పేర్లను, వారి కులగోత్రాలను చిత్రం క్రింద వ్రాసింది. సర్వసమగ్రంగా తయారు చేసిన రాజకుమారుల చిత్రపటాలను తెచ్చి ఉషాకన్య ముందు పెట్టి, "ఈ పెద్ద వస్త్రంలో నేను చిత్రించని వీరశృంగార పురుషుడు లేడు. సఖీ! వారందరి వివరాలు ఒక్కొక్కటిగా చెబుతాను. శ్రద్ధగా విను. జాగ్రత్తగా చూసి నీ నాయకుడెవరో చెప్పు. నీ కోరిక తీరుస్తాను.

సీ. కమనీయ సంగీత కలిత కోవిదులు కింపురుష గంధర్వ కిన్నరులు వీరె
సతత యౌవన యదృచ్ఛావిహారులు సిద్ధ సాధ్య చారణ నభశ్చరులు వీరె
ప్రవిమల సాంఖ్య సంపద్వైభవులు సుధాశనమరుద్యక్ష రాక్షసులు వీరె
నిరుపమ రుచికళాన్విత కామరూపులై పొగడొందునట్టి పన్నగులు వీరె

తే. చూడు' మని నేర్పుఁ దీపింపఁ జూపుటయును, జిత్తము నిజమనోరథసిద్ధి వడయఁ జాలకుండిన మధ్యమ క్ష్మాతలాధి, పతులఁ జూపుచు వచ్చె నప్పద్మనయన.

347

తా ॥ సఖీ! ఉషా! ఈ పటాలలో ఉన్నారు చూడు. వీరంతా కిన్నరులు, కింపురుషులు, గంధర్వులు. మనోహరమైన సంగీత కళలో నిష్ణాతులు. గానకోవిదులు. వీరున్నారే! వీరు ఆకాశంలో సంచరించే సిద్ధులు, సాధ్యులు, చారణులు. యథేచ్ఛగా విహరించేవారు. ఎప్పుడూ యౌవనంలోనే ఉంటారు. ఇటువైపున్నారు చూడు. వీరు భోగభాగ్యాలలో తులతూగుతూ ఉండే దేవతలు, మరుత్తులు, యక్షులు, రాక్షసులు. అటుచూడు నాగరాజులు నిరుపమానమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నారు. కామరూపం ధరించగల శక్తి సంపన్నులు వారు. వీరినందరినీ పరిశీలనగా చూడు చెలీ" అన్న చిత్రరేఖ మాటలతో ఆమె చూపిన అన్ని చిత్రాలూ చూసి ఒక నిట్టూర్పు పుచ్చింది రాజకుమారి. వారిలో తాను వలచిన పురుషుడు కనపడక పోవటంతో మౌనం వహించింది. అప్పుడు చిత్రరేఖ మానవజాతికి చెందిన రాజవరుల చిత్రపటాలు చూపసాగింది.

ఉ. మాళవ కొంకణ ద్రవిడ మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు బర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశ టేంకణ త్రిగర్త సుధేష్ణ మరాట లాట పాం
చాల నిషాద ఘూర్జరక సాళ్వ మహీశులు వీరె కోమలీ!



తా ॥ కోమలీ! ఇప్పుడు నేను చూపిస్తున్న చిత్రపటాలు భూలోకంలోని రాజులవీ, రాజకుమారులవీ. అందరినీ చూడు. నీ ప్రియుడెవరో, ఏ దేశపువాడో తెలియజెప్పు. వాళ్ళపేర్లు, ఊర్లు కూడా చిత్రం కింద రాసి ఉంచాను. మాళవ, కొంకణ, ద్రవిడ, మత్స్య, పుళింద, కళింగ, భోజ, నేపాళ, విదేహ, పాండ్య, కురు, బర్బర, సింధు, యుగంధర, ఆంధ్ర, బంగాళ, కరూశ, టేంకణ, త్రిగర్త, సుధేష్ణ, మరాట, లాట, పాంచాల, నిషాద, ఘూర్జరక, సాళ్వ రాజులందరి చిత్రాలు వ్రాసి తెచ్చాను. వీరిలో నీ ప్రియుడు లేడు కదా!

ఉ. సింధురవైరి విక్రముఁడు శీతమయూఖ మరాళికా పయ

స్సింధు పటీర నిర్మలవిశేష యశోవిభవుండు శౌర్య ద
ర్పాంధ రిపుక్షితీశ నికరాంధతమః పుటలార్కుఁ డీ జరా
సంధునిఁ జూడు మాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ!

349

తా ॥ ఈ మహారాజు మగధదేశాధిపతి. బృహదశ్వుని కుమారుడు పేరు జరాసంధుడు. సింహవిక్రముడు. మహాశౌర్యశాలి. చంద్రకిరణాలవంటి, క్షీరసాగరంలాంటి, హంసవంటి తెల్లని, స్వచ్ఛమైన కీర్తిగలవాడు. శత్రుంజయుడు.

మ. సకలోర్వీతలనాథ సన్నుతుఁడు శశ్వద్భూరి బాహాబలా
ధికుం డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాత చారిత్రకుం
డకలం కోజ్జ్వల దివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుండైన భీ
ష్మక భూపాలకుమారుఁ జూడు మితనిన్ మత్తద్విరేఫాలకా!

350

తా ॥ ఇతడు విదర్భదేశాధిపతి అయిన రుక్మి. భీష్మక మహారాజు పుత్రుడు. మహాబలశాలి. రాజులందరి చేత ప్రశంసింపబడేవాడు. సంగ్రామ నిపుణుడు. ముల్లోకాలలోను ప్రసిద్ధిచెందిన చరిత్రగలవాడు. మణిమయ భూషణాలతో ప్రకాశిస్తున్నాడు. ఇతని రూపం చూశావు గదా!

ఉ. సంగరరంగ నిర్దళిత చండవిరోధి వరూధినీశ మా
తుంగ తురంగ సద్భట రథప్రకరైక భుజావిజృంభణా
భంగ పరాక్రమ ప్రకట భవ్యయశోమహనీయమూర్తి కా
ళింగుఁడు వీఁడె చూడు తరళీకృత చారుకురంగలోచనా!

351

తా ॥ ఓ హరిణాక్షీ! ఇతగాడు కళింగదేశాధిపతి. శత్రువీరుల చతురంగబలాలను నుగ్గునుగ్గు చేయగల మహాపరాక్రమశాలి. అరివీర భయంకరుడు. యశోవిశాలుడు.

మ. సుగుణాంభోనిధి ఫాలలోచను నుమేశు న్నాత్మ మెప్పించి శ
క్తి గరిష్ఠంబగు శూలముం బడసె నక్షీణప్రతాపోన్నతిన్
జగతిన్ మిక్కిలి మేటివీరుఁడు రణోత్సాహుండు భూపౌత్త్రుఁ డీ
భగదత్తుం గనుఁగొంటె! పంకజముఖీ! ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్.

352

తా ॥ పద్మముఖీ! ఈ భగదత్తుణ్ణి చూశావా! ఇతడెంత గొప్పవాడంటే త్రినేత్రుడైన పరమేశ్వరుని మెప్పించి వరంగా శంకరుని చేతినుండి శూలాయుధాన్ని పొందిన భక్తాగ్రగణ్యుడు, మహాబలశాలి. సద్గుణ ఖని. రణోత్సాహం గలవాడు. శూరాగ్రగణ్యుడిగా పేరు పొందినవాడు. ఇంకో విషయం. భగదత్తుడెవరనుకొన్నావు? ప్రాగ్జ్యోతిషపురాధీశ్వరుడు. నరకాసురుని పుత్రుడు. భూదేవి పౌత్రుడు.

మ. వికచాంభోరుహ పత్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూను నం
దక చక్రాబ్జ గదాదిచిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను
త్సుకుఁడై యెప్పుడు మచ్చరించు మదిఁ గృష్ణుం డన్న నేమేటి పౌం
డ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము వేడ్కం జంద్రబింబాననా!

353

తా ॥ చంద్రముఖీ! ఇతడు కాశీరాజు స్నేహితుడైన పౌండ్రకుడు. నేనే వాసుదేవుణ్ణి, నా పేరు పౌండ్రకవాసుదేవుడని చెప్పుకుంటూ ఎప్పుడూ కృష్ణుడి పట్ల మాత్సర్యాన్ని వహిస్తూ తిరిగే వీరుడు. కమలాక్షుడైన గోవిందుడు ధరించే నందకమనే ఖడ్గాన్ని, సుదర్శన చక్రాన్ని, పాంచజన్య శంఖాన్ని, కౌమోదకి పేరుగల గదను నాలుగు చేతులలో ధరిస్తూ నేనే వాసుదేవుడనని

ప్రగల్భాలు పలికే వీరుడితడే సుమా!

మ. ద్విజశుశ్రూషయు సూనృతవ్రతము నుద్వృత్తిన్ భుజాగర్వమున్
విజయాటోపముఁ జాప నైపుణియు ధీవిస్ఫూర్తియుం గల్గు నీ
రజనీనాథకుల ప్రదీపకులఁ బాఱం జూడు పద్మాక్షి! ధ
ర్మజ భీమార్జున మాద్రినందనుల సంగ్రామైకపారీణులన్.

354

తా ॥ ఓ కమలాక్షీ! చంద్రవంశాన్ని వెలిగింపచేసిన పాండవులు వీరే. ఒక్కసారి ఇటుచూడు. వీరు సత్యసంధులు. మహానుభావులైన బ్రాహ్మణోత్తములను సేవించేవారు. ఎప్పుడూ విజయాన్ని పొందే బాహుబలసంపన్నులు. ధనుర్విద్యానైపుణ్యం గలవారు. వివేకశీలురు. వీరాధివీరుడిగా, జగదేక వీరుడుగా ఒక్కొక్కరు ఖ్యాతి గడించినవారు. సంగ్రామ విద్యలో పరిణతి చెందినవారైన, ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు వీరే ఆ పంచపాండవులు. జాగ్రత్తగా పరిశీలించావా?

మ. బలిమిన్ సర్వనృపాలుర న్నదిమి కప్పంబుల్ దగం గొంచు ను
జ్జ్వల తేజో విభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బొలుపొందం దను రాజరా జన మహాభూరి ప్రతాపంబులుం
గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్త్రేక్షణా!

355

తా ॥ తామరరేకులవంటి కన్నులు కలిగిన రాకుమారీ! ఇది చూడు. రారాజని పిలవబడే దుర్యోధనుడి చిత్రం. దుర్యోధనుడు కురుసార్వభౌముడు. తన శౌర్యప్రతాపాలచేత రాజులనందరినీ ఓడించి, వారినుంచి కప్పాలు పరిగ్రహించే చక్రవర్తి. ఉజ్జ్వల తేజస్సుతో విరాజిల్లుతున్నాడు. అతని యశస్సు విశ్వమంతటా వ్యాపించింది. తొంభైతొమ్మిది మంది

సోదరులతో అగ్రజుడిగా ఎలా భాసిస్తున్నాడో చూడు."

వ. అని యిట్లు సకలదేశాధీశ్వరులగు రాజవరుల నెల్లఁ జూపుచు యదువంశ సంభవులైన శూరసేన వసుదేవోద్ధవాదులం జూపి మఱియును.

356

తా ॥ అని చెబుతూ వివిధ దేశాధిపతులైన రాజశ్రేష్ఠుల చిత్రపటాలను చూపించింది. తరువాత యదువంశంలో జన్మించిన శూరసేనుణ్ణి, వసుదేవుణ్ణి, ఉద్ధవుణ్ణి చూపించింది. చిత్రరేఖ ఇంకా యాదవవీరులను ఎంతమందినో చూపించింది.

ఉ. శారద నీరదాబ్జ ఘనసార సుధాకర కాశ చంద్రికా
సార పటీరవర్ణు యదుసత్తము నుత్తమనాయకుం బ్రమ
త్తారి నృపాల కానన హుతాశనమూర్తిఁ బ్రలంబదైత్య సం
హారునిఁ గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా!

357

తా ॥ "బాణాసురుని గారాల పుత్రీ! ఈ పటం నాగలిని ఆయుధంగా ధరించే కామపాలుడిది. అతడే బలరాముడు. శరత్కాలంలో కనబడే మేఘంలాగా, శంఖంవంటి, కర్పూరంలాంటి, చంద్రుని వెన్నెలవలె, రెల్లుపూలలాగా, చందనం వంటి నిర్మలమైన ధవళ వర్ణ శరీరంతో ప్రకాశిస్తున్న ఈ వీరుడు ప్రలంబాసుర సంహారి. ఉత్తమ నాయకుడుగా ప్రసిద్ధి చెందిన ఈతడు యదుకుల శ్రేష్ఠుడు. గర్వోన్మత్తులైన భూపతులనే అరణ్యాలను దహించివేసే అగ్నిదేవుడు. మహాపరాక్రమశాలి.

సీ. కమనీయ శుభగాత్రుఁ గంజాత దళనేత్రుఁ వసుధాకళత్రుఁ బావనచరిత్రు
నత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నంచితవిశేషు

నీలనీరదకాయు నిర్జితదైతేయు, ధృతపీతకౌశేయు నతవిధేయు

తే. నఘమహాగదవైద్యు వేదాంత వేద్యు, దివ్యముని సన్నుతామోదుఁ దీర్ఘపాదు

జిష్ణు వర సద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ, జూడు దైతేయకులబాల! సుభగలీల!

358

తా ॥ ఈ పక్కనే ఉన్న చిత్రం చూశావా ఉషా! సకల శుభ లక్షణాలతో ఒప్పారే దైత్యరాజ తనయా! ఈ చిత్రంలోని వ్యక్తి ఎవరనుకొన్నావు? పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు. చూడసొగసైన, కల్యాణకాంతులు విరజిమ్ముతున్న శరీర శోభతో వెలిగిపోతున్నాడు చూడు. తామరరేకులవంటి కన్నులు కలవాడు. పవిత్రచరిత్రకు నిలయమైనవాడు. ధరణీదేవి ప్రాణనాథుడు. సత్యగుణాన్ని పాటించేవాడు. క్రూరరాక్షస సంహారి. కాళియుని పడగలను వంచినవాడు. శేషతల్పశాయి. కౌస్తుభమణిని భూషణంగా ధరించినవాడు. గంభీరంగాను, మృదువుగాను సంభాషించేవాడు. ఆశ్రితులను పోషించేవాడు. విశేషలక్షణాలతో ప్రకాశించేవాడు. నీలమేఘ శ్యామలాకారుడు. రాక్షసవీరులను జయించినవాడు. పీతాంబరధారి. పాపపరిహారి. సజ్జన విధేయుడు. వేదాంతాలలో తెలియబడేవాడు. దేవర్షుల సంస్తుతులకు ప్రీతి చెందేవాడు. పరమ పవిత్రురాలైన గంగాదేవిని పాదములనుండి ప్రభవింపజేసిన వాడు. విశ్వవిజేత. సకల సద్గుణ శోభితుడు. కృష్ణనామధేయుడు.

చ. స్ఫుర దళి శింజినీరవ విభూషిత పుష్పధనుర్విముక్త భా

స్వర నవచూతకోరక నిశాత శిలీముఖ పాతభీత పం

క రుహభవాది చేతన నికాయు మనోజనిజాంశు రుక్మిణీ

వరసుతు రాజకీరపరివారుని మారునిఁ జూడు కోమలీ!

359

తా ॥ సఖీ! ఈ చిత్రం చూడు. ఇతడు రుక్మిణీదేవి తనయుడు. మన్మథుని నిజాంశతో జన్మించినవాడు. అపరమన్మథుడే. తుమ్మెదల బారుతో కూర్చిన అల్లెత్రాడు గల చెఱకు

వింటినుంచి వదిలిన మామిడి పూలబాణాలతో బ్రహ్మదేవుడు మొదలైన వారి మనస్సులనే చంచలింపచేసిన మహాయోధుడు. శృంగారాధి దేవుడు. ప్రద్యుమ్నుడనే పేరుతో ప్రసిద్ధికెక్కినవాడు."

వ. ఇ వ్విధంబునం జూపిన.

360

తా ॥ చిత్రరేఖ, ఉషాకన్యకు ఈ విధంగా ఎందరెందరి చిత్రాలనో చూపించింది.

మ. వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ్ర
ద్దనఁ ద న్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబ కా నాత్మలో
ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచు న్నిట్లనున్.

361

తా ॥ ఉషాకన్య ప్రద్యుమ్నుడి రూపురేఖలను, భావ వైలక్షణ్యాన్ని పరామర్శగా చూసింది. వెంటనే తనను వరించి, కలలో సాక్షాత్కరించిన సుగుణశీలుడు, సుందరాంగుడు ఇతడే కాబోలని అనుమానించింది. తరువాత ప్రక్కనే ఉన్న మరోపటం చూసింది. అది అనిరుద్ధుని చిత్రపటం. నవమన్మథాకారుడు, కమలాక్షుడు అయిన అనిరుద్ధుని చూసి ఒక్క క్షణం సంతోషించింది. మరోక్షణం ఎక్కడున్నాడో అని బాధపడింది. చిత్రరేఖను చూసి ఇలా అంది:

ఉ. ఇంతి మదీయ మానధన మెల్ల హరించిన మ్రుచ్చు ని మ్మెయిం
బంత మెలర్ప వ్రాసి పటభాగనిరూపితుఁ జేసినట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొని యాడఁగ నేర్తునె? నీ చరిత్రముల్
వింతలె నాకు? నీ మహిత వీరుకులంబు బలంబుఁ జెప్పుమా!

362

తా ॥ "చెలీ! చిత్రరేఖా! ఇతడే నా మానధనాన్ని అంతా దోచుకొన్న దొంగ. ఈ విధంగా నా మనోహరుని రూపాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రం గీసి నాకు ఈ చిత్రపటాన్ని కాన్కగా ఇచ్చావు. నీవంటి పుణ్యశీల ఎక్కడైనా ఉంటుందా! అసలు నిన్ను నేను పొగడగలనా? నీ ప్రతిభ నాకు తెలియనిదా? నీవు నా ప్రాణసఖీవి గదా! సరేగాని. ఈ మహావీరుని కులగోత్రాల గురించి, శౌర్యప్రతాపాల గురించి వినాలని కుతూహలంగా ఉంది. చెప్పు. చెప్పు."

చ. అనవుడుఁ జిత్రరేఖ జలజాక్షికి నిట్లను 'నీ కుమారకుం
డనఘుఁడు యాదవాన్వయ సుధాంబుధి పూర్ణసుధాకరుండు నాఁ
దనరిన కృష్ణపౌత్రకుఁ డుదారచరిత్రుఁడు భూరిసింహ సం
హననుఁ డరాతిసైన్య తిమిరార్కుఁడు, పే రనిరుద్ధుఁ డంగనా!

363

తా ॥ అప్పుడు చిత్రరేఖ ఈ విధంగా చెప్పింది: "ఈ కుమారుడు యాదవ వంశమనే సముద్రాన్ని సంతోషంతో ఉప్పొంగచేసే చంద్రుడు సుమా! పాపరహితుడు. గొప్పచరిత్ర గలవాడు. శత్రుసైన్యమనే అంధకారాన్ని పోగొట్టే సూర్యతేజోసదృశుడు. సింహాలనే హతం చేయగల పరాక్రమవంతుడు. శ్రీకృష్ణుని మనుమడు. ప్రద్యుమ్నుని కుమారుడు. పేరు అనిరుద్ధుడు."

వ. అని చెప్పి యే నతిత్వరితగతిం జని య క్కుమారరత్నంబుఁ దొడ్కొనివచ్చు నంతకు సంతాపింపకుండు మని యా క్షణంబ వియద్గమనంబునం జని చని ముందట.

364

తా ॥ ఉషకు సంతోషం కలిగే విధంగా చిత్రరేఖ అనిరుద్ధుని వివరాలు చెప్పింది. "చెలీ! నేను త్వరగా వెళ్ళి అనిరుద్ధ కుమారుణ్ణి నీ వద్దకు తీసుకువస్తాను. అంతవరకూ నీవు ఏ విధంగానూ బాధపడకుండా ఉండు" మని చెప్పి చిత్రరేఖ శ్రీకృష్ణుని పట్టణానికి

ఆకాశగమనంలో వెళ్ళింది.

క. సరసిజముఖీ గనుఁగొనె శుభ, భరిత విలోకన విధూత భవ వేదనమున్ బరసాధనమును సుకృత, స్ఫురణాపాదనముఁ గృష్ణు పుటభేదనమున్.

365

తా ॥ సమస్త శుభాలకు నిలయమైనది, సంసార బాధలను పోగొట్టేది, పరమ పద ప్రాప్తిని కలిగించేది, పుణ్యాన్ని కలుగజేసేది అయిన శ్రీకృష్ణుని నగరాన్ని చూసింది చిత్రరేఖ.

వ. కని డాయం జని, తదీయ సుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ మణినూపుర ఝణంఝణధ్వనిత మణిగోపురంబును, నతి విభవ విజిత గోపురంబును నగు ద్వారకాపురంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్న వేషంబునం జొచ్చి కనక కుంభ కలిత సౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జందక్రాంత శిలాభవనంబున సుధాధామ రుచిరరుచిని చయంబు నపహసించు హంసతూలికాతల్పంబున నిజాంగనా రతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి తన యోగవిద్యా మహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని, బాణాసురనందన యగు నుషాసుందరీ తల్పంబునం దునిచి యిట్లనియె.

366

తా ॥ ఆ నగరాన్ని సమీపించి శోభాయమానమైన అక్కడి అందచందాలు చూసి చిత్రరేఖ ఎంతగానో సంతోషించింది. మారువేషంలో రాత్రివేళ ద్వారకానగరంలో ప్రవేశించింది. కాంతల కాలి అందెల ఝణఝణ ధ్వనులను ప్రతిధ్వనింపచేస్తున్న సౌధాలను, సౌధాలపై ఉన్న మణిగోపురాలను చూసింది. ద్వారకానగర గోపురమే మహోన్నతంగా, అతివైభవంగా ఉండటాన్ని తిలకించింది. బంగారు కుంభాలతో మేడల పైభాగాలు మెరిసిపోతున్నాయి. ఒక మేడపైన మణి దీపాల వరుసపేర్చబడి దేదీప్యమానంగా వెలిగిపోతుండటం గమనించింది.

చంద్రకాంత శిలలతో నిర్మితమైన భవనంలో చంద్రుని చల్లని, తెల్లని కాంతి సమూహాన్ని అపహసించే హంసతూలికాతల్పం మీద భార్యాసంగమంతో అలసిపోయి నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ణి చూసి అతనిని సమీపించింది. చిత్రరేఖ వెంటనే తన యోగ విద్యామహిమతో అనిరుద్ధుణ్ణి ఎత్తుకొని మనోవేగంతో ఉషాకన్య నివసించే శోణపురం చేరుకొంది. ప్రాణసఖీ మందిరంలోకి అనిరుద్ధుణ్ణి తీసుకొని వెళ్ళి ఆమె పాన్పుపైన అతనిని పవళింపచేసింది. అప్పుడు ఉషాసుందరిని చూసి చిత్రరేఖ ఇలా అంది:

క. 'వనజాక్షి! చూడు నీ విభు, ననిమిషనగధీరు శూరు నభినవమారున్ వనధి గభీరు నుదారుని, ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్.

367

తా ॥ "సఖీ! ఉషా! నీ నాథున్ని చూడు. నీవు వలచిన ఈ అనిరుద్ధ కుమారుడు మేరుపర్వతమంత ధైర్యగుణం గలవాడు. శూరాధిశూరుడు, సముద్రమంత గాంభీర్యం గలవాడు. మహోదాత్తగుణసంపన్నుడు. శత్రువులను ఛేదించేవాడు. అన్నిటినీ మించి నవమన్మథుడనుకో!"

క. అనిన నుషాసతి దన మన, మున ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్ మొనయఁగ నానందాశ్రులు, గనుఁగవ జడి గురియ ముఖవికాస మెలర్పన్.

368

తా ॥ చిత్రరేఖ మాటలతో ఉషకు సంతోషం పెల్లుబికింది. అనిరుద్ధుడిపై ఏర్పడిన అనురాగంతో శరీరమంతా పులకించి పోయింది. కళ్ళవెంబడి ఆనందాశ్రువులు జడివానలాగా కారసాగాయి. ముఖంలో ఎక్కడలేని కాంతీ వెల్లివిరిసింది.

వ. ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని య య్యింతి యిట్లనియె.

369

తా ॥ అనిరుద్ధున్ని కనులారా చూసిన ఉషలో మహోత్సాహం చోటుచేసుకుంది. చిత్రరేఖను చూసి ఇలా అంది:

సీ. 'అతివ! వీ సాంగత్య మను భానురుచి నాకుఁ గలుగుటఁ గామాంధకార మడఁగెఁ
దరలాక్షి! నీ సఖీత్వం బను నావచేఁ గడిఁది వియోగాబ్ధిఁ గడవఁ గంటి
నబల! నీ యనుబంధ మను సుధావృష్టిచే నంగజ సంతాప మార్పఁ గంటి
వనిత! నీ చెలితనం బను రసాంజనముచే నా మనోహర నిధానంబుఁ గంటిఁ

తే. గలలఁ దోఁచిన రూపు గ్రక్కన లిఖించు, వారు 'నౌ' నన్నఁ దోడ్తెచ్చు వారు గలరె? నీటిలో జాడఁ బుట్టించు నేర్పు నీక, కాక గల్గునె మూఁడు లోకములయందు?

370

తా ॥ "ప్రాణసఖీ! చిత్రరేఖా! నీతోడి స్నేహమనే సూర్యకాంతి నాకు కలగడం వల్ల నా కామాంధకారం అణగిపోయింది. నీతోడి సఖ్యమనే నావ వల్ల వియోగమనే సముద్రాన్ని దాటగలిగాను. నీ బాంధవ్యమనే అమృతవర్షం చేత మదనతాపాన్ని చల్లార్చగలిగాను. నీ చెలిమి అనే అంజనంతో నా ప్రియుడనే నిధిని కనుక్కోగలిగాను. కలలో చూసిన రూపాన్ని వెంటనే చిత్రించగలిగేవారు ఎక్కడైనా ఉన్నారా? అదీ, నేను చూసిన రూపాన్ని నీవు చిత్రించడం! ఔను ఈ రూపమే, ఇతడే నాకు కలలో దర్శనమిచ్చినవాడని అనగానే క్షణాలమీద తీసుకురాగలిగేవారు నీవు తప్ప ఎవరైనా ఉన్నారా? ఉంటారా? నీటిలో జాడలు పుట్టించే నైపుణ్యం ముల్లోకాలలో నీకు తప్ప ఇంకెవరికైనా ఉంటుందా? ఉండదే!!"

తే. అని వినుతించి, చిత్రరేఖను నిజమందిరంబునరుంబోవం బనిచినంజనియె, అనంతరంబ వింతజనులకెవ్వరికిం బ్రవేశింపణని యంతఃపుర సౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని, య య్యింతిం గనుంగొని, యప్పుదు?

371

తా ॥ ఆ విధంగా పొగడి ఉషాకన్య చిత్రరేఖను ఇక ఇంటికి వెళ్ళమని చెప్పడంతో ఆమె వెళ్ళిపోయింది. తరువాత కొంతసమయానికి ఇతరులెవరూ ప్రవేశించడానికి శక్యంకాని అంతఃపురంలో, భవనంలోపల ఉన్న అనిరుద్ధుడు నిద్రనుంచి మేల్కొన్నాడు. కళ్ళు తెరవగానే అతనికి ఉషాకన్య దర్శనమిచ్చింది.

క. సురుచిర మృదుతల్పంబునఁ, బరిరంభణ సరసవచన భావకళా చా
తురి మెఱయ రాకుమారుఁడు, తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై.

372

తా ॥ అనిరుద్ధుడు అందమైన మెత్తని ఆ పాన్పుపైన ఉషాసుందరిని కౌగిలించుకొని, సరసమైన మాటలతో వినోదపరిచి, శృంగారభావ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ మదనక్రీడలో ఆమెతో సుఖించాడు.

వ. ఇ వ్విధంబున నతిమనోహర విభవాభిరామంబులగు దివ్యాంబరాభరణ మాల్యానులేపనంబులను, గర్పూర తాంబూలంబులను, వివిధాన్నపానంబులను, సురుచిర మణిదీప నీరాజనంబులను, సుగంధ బంధురాగరు ధూపంబులను, నాటపాటల వీణా వినోదంబులను, బరితుష్టిం బొంది కన్యాకుమారకు లానంద సాగరాంతర్నిమగ్న మానసులై యుదయాస్తమయ నిరూపణంబు సేయనేరక, ప్రాణంబు లొక్కటియైన తలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖీయించుచుండి, రంత.

373

తా ॥ ఈ విధంగా వారిద్దరు వైభవాన్ని సూచించే మిక్కిలి మనోహరమైనటువంటి, దివ్యములైన వస్త్రాలను, ఆభరణాలను ధరించారు. మైపూతలు పూసుకొన్నారు. పూలమాలలతో అలంకరించుకొన్నారు. పచ్చకర్పూరంతో కూడిన తాంబూలాలు సేవించారు. రుచికరమైన అన్నపానాలు స్వీకరించారు.

కర్పూర నీరాజనాలతో, సువాసనలు వెదజల్లే అగరుధూపాలతో, కాంతులీనే మణిదీపాలతో, ఆటపాటలతో, వీణ మొదలైన గానమధురిమలతో తృప్తిచెందుతూ ఉషాఅనిరుద్ధులిద్దరూ ఆనంద సాగరంలో మునిగిపోయారు. వారికి సూర్యుడెప్పుడుదయిస్తున్నాడో, ఎప్పుడస్తమిస్తున్నాడో కూడా తెలియటంలేదు. ఆ పారవశ్యంలో ఇద్దరి ప్రాణాలు ఒక్కటే వేరుకావు అన్నట్లు మనస్సులు కలిసిమెలగసాగారు. రాత్రింబగళ్ళనేవి తెలియకుండా వారు భోగలాలసులై సుఖీస్తుండగా కొంతకాలం గడిచింది. అప్పుడు—

క. ఆలోనన యతిచర మగు, కాలము సుఖలీల జరుగఁగా వరుస నుషా
బాలాలలామ కొయ్యనఁ, జూ లేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్.

374

తా ॥ వారి సుఖసంతోషాలకు చిహ్నంగా ఉషాసుందరి గర్భం ధరించింది.

క. ఆ చిన్నె లంగజాలలు, సూచి భయాకులత నొంది స్రుక్కుచుఁ దమలో 'నో చెల్ల! యెట్టులో? యీా, రా చూలికిఁ జూలు నిలిచెరా! యి బ్బంగిన్'

375

తా ॥ యువరాణి గర్భం ధరించిన విషయం అంతఃపురం కావలివారికి తెలిసిపోయింది. ఉషాకన్యలో కనిపిస్తున్న గర్భచిహ్నాలు వారిని భయాందోళితుల్ని చేసాయి. తమలో తాము ఆమె గురించి మాట్లాడుకోసాగారు. "ఈమెకు వివాహం కాలేదు కదా గర్భం ఎలా ధరించిందని" గుసగుసలు పోయారు. ఇప్పుడు మనం ఏం చేయాలని మథనపడ్డారు.

క. అని గుజగుజ వోవుచు 'ని, ప్పని దప్పక దనుజలోక పాలునితోడన్ వినిపింపవలయు' నని వే, చని బాణునిఁ జేరి మ్రొక్కి సద్వినయమునన్.

376

తా ॥ ఈ సంగతిని రహస్యంగా ఉంచరాదని కావలివారు నిర్ణయించారు. వెంటనే మహారాజుకు తెలియజేయాలనుకొని బాణాసురుడి వద్దకు వెళ్ళారు. చక్రవర్తికి నమస్కరించారు. వినయంతో ఆయనవైపు చూశారు.

క. మంతనమున దేవర! క, న్యాంతఃపుర మేము గాచి యరయుచు నుండన్
వింతజనములకుఁ జొరఁగ దు, రంతము విను పోతుటీఁగకైన సురారీ!

377

తా ॥ "సురారీ! బాణాసురా! ప్రభూ! ఒక రహస్య విషయం మీకు చెప్పడానికి వచ్చాము. నీ సేవకులమైన మేము అంతఃపురాన్ని కావలి కాస్తున్నాము. మా పర్యవేక్షణలో పరపురుషులుగాని, చివరకు ఒక పోతుటీగ కాని అంతఃపురంలోకి ప్రవేశించడానికి వీలులేదు. అంత జాగ్రత్తగా కాపలా కాస్తున్నాము.

తే. ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును, నేమి కనుమాయయో కాని యెఱుఁగ మధిప! నీ
కుమారిక గర్భంబు నివ్వటిల్ల, యున్నదన్నను విని రోషయుక్తుఁ డగుచు.

378

తా ॥ దేవరా! అంతగట్టిగా మేము కావలి కాస్తున్నా, అదేం మాయోగాని రాకుమారి గర్భం ధరించడం మమ్మల్ని అయోమయంలో పడేసింది. మాకెవరికీ తెలియరాకుండా, మా కన్నుగప్పి ఎవరు అంతఃపురంలోకి ప్రవేశించారో మాకర్థం కావడంలేదు. మమ్మల్ని మన్నించండి ప్రభూ! మాకు తెలిసిన విషయం మీకు మనవి చేశాం" అని కావలి వారు చెప్పారు.

వ. అట్టియెడ దానవేంద్రుండు రోషభీషణాకారుండై, కటము లదర, బొమలు ముడివడం, గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల, సటలు వెఱికినం జటుల గతి నెగయు సింగంబు విధంబున లంఘించుచు, భీకర కరవాలంబు గేలం దాల్చి సముద్దండ గతిం గన్యాసౌధాంతరంబునకుం జని.

తా ॥ అది విన్న బాణాసురుడు రోషంతో మండిపడ్డాడు. భయంకరుడైనాడు. కనుబొమలు ముడిపడ్డాయి. కళ్ళనుండి నిప్పులు కురిసాయి. కణతలు అదిరాయి. జూలు లాగితే విజృంభించే మృగరాజులాగా ఒక్క దూకు దూకాడు. భయంకరమైన కత్తి చేతపట్టుకొన్నాడు. ఒక్క ఉదుటున అంతఃపురానికి వెళ్ళాడు.

## బాణాసురుడు అనిరుద్ధున్ని నాగపాశబద్ధునిగా చేయుట

సీ. కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు మానితదేహు నాజానుబాహు
మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణుఁ జిరయశోల్లాసుఁ గౌశేయవాసుఁ
గస్తూరికాలిప్తు ఘనకాంతికుముదాప్తు హారశోభితవక్షు నంబుజాక్షు
యదువంశతిలకు మత్తాలినీలాలకు నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు

తే. నభినవాకారు నక్షవిద్యావిహారు, మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ
గలితపరిశుద్ధు నఖిలలోక ప్రసిద్ధు, జతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు.

380

తా ॥ కోపోద్రిక్తుడై వెళ్ళిన బాణాసురుడు సుందరీమణులను ఆకట్టుకొనే చాతుర్యము, సౌందర్యముగల అనిరుద్ధున్ని చూశాడు. ఆ అనిరుద్ధుడు శుభలక్షణాలతో వెలిగిపోతున్నాడు. మన్మథుని కుమారుడైన అతడు నవమన్మథునిలాగే ఉన్నాడు. ఆజానుబాహువులతో, మకరకుండలాలతో, శరీర సౌష్ఠవంతో, పట్టుపీతాంబరంతో, కస్తూరి మైపూతతో, రత్నాభరణాలతో, తామర రేకులవంటి కన్నులతో, వినీల కుంతలాలతో, చంద్రకాంతితో ప్రకాశిస్తున్నాడు ఆ యదువంశ ప్రదీపకుడు. అతడు అక్షవిద్యలో ఆరితేరినవాడు. సకల సద్గుణాలతో అలరారుతున్నవాడు. శౌర్యప్రతాపాలు మూర్తి కట్టినవాడు. చిరకీర్తిని ఆర్జించినవాడు. నిర్మల స్వభావి. లోకప్రసిద్ధుడు. శృంగార శాస్త్రకోవిదుడు.

చ. కని కన లగ్గలింప సురకంటకుఁ దుద్ధతి సద్భటావళిం
గనుఁగొని 'యీ నరాధమునిఁ గట్టుఁడు, పట్టుఁడు, కొట్టుఁ' డన్న వా
రనుపమ హేతిదీధితు లహర్పతితేజము మాయఁ జేయ డా
సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్.

381

తా ॥ అటువంటి అభినవ మన్మథాకారంలో ప్రకాశిస్తున్న అనిరుద్ధుని చూడగానే బాణాసురుడికి కోపం మరింత పెరిగింది. సురవిరోధి అయిన ఆ రాక్షసాధిపతి భటులను చూసి "ఈ నరాధముణ్ణి వెంటనే బంధించండి. పట్టుకొని కొట్టండి" అని ఆజ్ఞాపించాడు. బాణాసురుని ఆజ్ఞను తలదాల్చిన సైనికులు సూర్యకాంతిని మించిన కాంతితో తళతళమెరుస్తున్న కత్తులు తీసుకొని అనిరుద్ధుడి మీదకు వచ్చారు. వారిని చూసిన అనిరుద్ధుడు శౌర్యప్రతాపాలతో, రణకౌశలంతో యుద్ధానికి సిద్ధపడ్డాడు.

చ. కలిగి మహోగ్రవృత్తిఁ బరిఘంబు గరంబున లీలఁ దాల్చి దో
ర్బల ఘనవిక్రమప్రళయభైరవు విజృంభణక్రియా
కలన నెదిర్చె దానవ నికాయముతోఁ దలపాటుఁ బోటునుం
జలము బలంబు ధైర్యమును శౌర్యము ప్రేటును వాటుఁ జూపుచున్.

382

తా ॥ ఉగ్రరూపం దాల్చాడు. ఇనుపకట్ల గుదియ చేతిలో పట్టుకొన్నాడు. ప్రళయకాలంలో విజృంభించే కాలభైరవుడిలాగా వీర విజృంభణ చేశాడు. భుజబలాన్ని ప్రదర్శిస్తూ రాక్షస సమూహంపైన విరుచుకు పడ్డాడు. అనిరుద్ధుని తీవ్రప్రతాపానికి, శౌర్యధైర్యాలకు, రణవిధానానికి భయపడిపోయారు రాక్షసవీరులందరూ.

చ. పదములు బాహులుం దలలు ప్రక్కలు చెక్కులు జానుయుగ్మముల్
రదములు గర్ణముల్ మెడ లురంబులు మూఁపులు వీఁపు లూరువుల్
చిదురుపలై ధరం దొఱఁగఁ జిందఱవందఱ సేయ సైనికుల్
కదన పరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై.

383

తా ॥ అనిరుద్ధుడి ధాటికి రాక్షసవీరుల పాదాలు, చేతులు, తలలు, చెక్కిళ్ళు, మోకాళ్ళు,

పళ్ళు, చెవులు, మెడలు, రొమ్ములు, తొడలు, వీపులు, మూపులు – ఒకటేమిటి? వారి అవయవాలన్నీ తునాతునకలై భూమిపై చిందరవందరగా పడ్డాయి. ఆ పరిస్థితిలో బాణాసురుని సైన్యం యుద్ధం చేయలేక, అనిరుద్ధున్ని బంధించలేక, గాయపడినవారై తలోదిక్కుకు పారిపోయారు.

వ. ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొంది వెఱచియుం, బఱచియు; విచ్చియుం, జచ్చియుఁ; గలంగియు, నలంగియు; విఱిగియు, సురిఁగియుఁ; జెదరియు, బెదరియుఁ; జేవదఱిఁగి నుఱుములైన తన మఱుఁగు సొచ్చిన బాణుండు శౌర్యధురీణుఁడును, గోపోద్దీపిత మానసుండునై కదిసి యేసియు, వ్రేసియుఁ; బొడిచియు, నడిచియుఁ బెనంగి.

384

తా ॥ ఈ విధంగా రాక్షససైన్యం యుద్ధం చేయలేక, అనిరుద్ధుడి పరాక్రమానికి భయపడి చెల్లా చెదరైపోయింది. కొంతమంది పారిపోయారు. కొంతమంది చచ్చిపోయారు. మిగిలినవారు బెదరి చెదరిపోయారు. శక్తి క్షీణించడంతో కలతచెందినవారు, నలిగిపోయినవారు, అవయవాలు విరిగిపోయినవారు, గాయాలతో స్రుక్కిపోయినవారు తమ నాయకుడైన బాణాసురుని రక్షణకోరి ఆయన వెనక నక్కి ఉన్నారు. ఓడిపోయి వచ్చిన తన బలగాన్ని చూసిన బాణుడికి కోపావేశం కట్టలు తెంచుకొంది. పరాక్రమవంతుడై అనిరుద్ధున్ని ఢీకొన్నాడు. అతనిపై బాణాలు వేసాడు. గదలతో క్రుమ్మాడు. కత్తులతో పొడిచాడు. అనిరుద్ధున్ని అణచివేయడానికి అతనితో భీకరంగా తలపడ్డాడు.

క. క్రుద్ధుండై యహిపాశ ని, బద్ధుం గావించె నసురపాలుఁడు రణ స
న్నద్ధున్ శరవిద్ధు న్నని, రుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్.

385

తా ॥ కోపోద్రిక్తుడైన బాణాసురుడు సంగ్రామ కుశలుడైన, బాణప్రయోగం చేస్తున్న,

రూపసి, మహావివేకశాలి అయిన అనిరుద్ధున్ని నాగపాశంతో బంధించాడు.

వ. ఇట్లు కట్టి త్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత.

386

తా ॥ ఈ విధంగా బాణాసురుడు అనిరుద్ధున్ని కట్టివైచి కారాగారంలోకి త్రోసివేయడం ఉషాసుందరికి చెప్పలేనంత బాధను కలిగించింది. దుఃఖంతో ఆమె మనస్సు వికలమైంది.

క. నీలపటాంచితమై సువి, శాలంబై వాయునిహతిఁ జండధ్వని నా
భీలమగు నతని కేతన, మాలోన నకారణంబ యవనిం గూలెన్.

387

తా ॥ బాణాసురుడు అనిరుద్ధున్ని కట్టివేసిన క్షణంలోనే అకారణంగా పెద్ద సుడిగాలి వీచింది. మహాభయంకరమైన ఆ సుడిగాలి ధ్వనికి, వేగానికి, తాకిడికి బాణుని, నీలవస్త్రంతో మెరిసిపోతున్న విశాలమైన ధ్వజం కూలి నేలపై పడింది.

క. అది చూచి దనుజపాలుఁడు, మదనాంతకుఁ డాడినట్టి మాట నిజముగాఁ గదనంబు గలుగు ననుచును, నెదురెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్.

388

తా ॥ తన కోటపైన మెరుస్తున్న జెండా పడిపోవడంతో బాణాసురుడికి ఒక్కసారిగా తనకు వరాలిచ్చిన శివుడి మాట గుర్తుకు వచ్చింది. సాటివీరుడితో తనకు యుద్ధం సంభవిస్తుంది గదా అని మురిసిపోయాడు. పరమేశ్వరుడి పలుకు సత్యమై తన కోరిక తీరే విధంగా మహావీరుడితో తాను యుద్ధం చేయగల అవకాశం కోసం ఎదురుతెన్నులు చూడసాగాడు.

వ. అంత నక్కడ.

389

తా ॥ అక్కడ ద్వారకలో—

క. ద్వారకలో ననిరుద్ధ కు, మారుని పోకకును యదుసమాజము వగలం
గూరుచు నొకవార్తయు విన, నేరక చింతింప నాల్గునెల లరిగె నృపా!

390

తా ॥ అనిరుద్ధుడు మాయమవడంతో యాదవులందరూ బాధపడ్డారు. అనిరుద్ధుడు ఏమయ్యాడో, ఎక్కడకు వెళ్ళాడో, ఎప్పుడు తిరిగి వస్తాడో తెలియక తికమక పడ్డారు యాదవులు. నాలుగు నెలలు గడిచినా వారికి అనిరుద్ధుడి గురించి ఏమీ తెలియలేదు.

## నారదుని వలన వృత్తాంతమును విని కృష్ణుడు బాణాసురునిపై దండెత్తుట

వ. అ య్యవసరంబున.

391

తా ॥ ఆ సమయంలో–

క. శారద నిర్మల నీరద, పారద రుచిదేహుఁ డతుల భాగ్యోదయుఁ డా
నారదముని యేతెంచె న, పార దయామతి మురారిభజన ప్రీతిన్.

392

తా ॥ నిర్మలమైనటువంటి శరత్కాలపు మేఘంవలె ప్రకాశిస్తున్న శరీర శోభగల దేవర్షి నారదుడు కరుణామూర్తి అయిన శ్రీకృష్ణ పరమాత్మను సేవించడానికి ద్వారకా నగరానికి వచ్చాడు.

వ. ఇట్లు చనుదెంచిన య ద్దివ్యమునికి నిర్మల మణివినిర్మిత సుధర్మాభ్యంతరంబున యదు వృష్టి భోజాంధకవీరులు గొలువం గొలువున్న గమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి, యర్ఘ్య పాద్యాదివిధులం బూజించి, సముచిత కనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్తతేజోనిధిం బొగడి, యనిరుద్ధు వృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి, యప్పుండరీకాక్షునిచేత నామంత్రణంబు వడసి, యంతర్ధానంబు నొందెఁ, దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి, బలంబుల వెడలింప బ్రద్దలవారిం బనిచి, తానును గట్టాయితం బయ్యె, నంత.

393

తా ॥ మణులతో పొదగబడిన బంగారు మేడలో యాదవులు, వృష్ణి కులంవారు,

భోజవంశంవారు, అంధకజాతివారు కొలుస్తుండగా కొలువుతీరి ఉన్న శ్రీకృష్ణుడు తన దర్శనానికి వచ్చిన దేవర్షిని చూసాడు. వెంటనే లేచి ఎదురువెళ్ళి అర్ఘ్యపాద్యాదులతో నారదమహర్షిని పూజించి, సువర్ణసింహాసనం మీద కూర్చోబెట్టాడు. నారదమహర్షి శ్రీకృష్ణుని ఔదార్యాన్ని, సౌజన్యాన్ని, కారుణ్యాన్ని, తేజోనిధిత్వాన్ని పొగడి అనిరుద్ధుని విషయమంతా స్పష్టంగా తెలియజెప్పాడు. ఆ తరువాత శ్రీకృష్ణుని అనుమతితో అంతర్ధానమై తన నివాసానికి వెళ్ళిపోయాడు. అనిరుద్ధుని విషయం తెలుసుకొన్న కృష్ణుడు ఒక శుభముహూర్తం నిర్ణయించుకొని బాణాసురునిపై దండయాత్రకు బయలుదేరి ప్రయాణ భేరి మ్రోగించాడు. సైన్యాన్ని సమాయత్తం చేయించాడు. సమస్త బలగాలను తీసుకొని తానుకూడా ప్రయాణమైనాడు.

సీ. హర కిరీట కేయూర కంకణ కట కాంగు ళీయక నూపురాది వివిధ
భూషణప్రతతిచేఁ బొలుపారి కరముల ఘనగదా శంఖ చక్రములు దనర
సురభి చందన లిప్త సురుచి రోరస్థ్సలిఁ బ్రవిమల కౌస్తుభ ప్రభలు నిగుడఁ
జెలువారు పీత కౌశేయచేలము కాసె వలనుగా రింగులు వాఱఁ గట్టి

తే.శైబ్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ, కములఁ బూన్చిన తే రాయితముగఁ జేసి
దారుకుఁడు తేర నెక్కె మోదం బుతోడ, భానుఁ డుదయాచలం బెక్కు పగిది మెఱసి.



తా ॥ రథసారథి అయిన దారుకుడు రథానికి శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పకము, వలాహకము అనే పేర్లుగల గుఱ్ఱాలను కట్టి తేరును తీసుకొని వచ్చి కృష్ణుడి ముందు పెట్టాడు. సువర్ణమయమైన హారాలను, కిరీటాన్ని, భుజకీర్తులను, కంకణాలను, కడియాలను, ఉంగరాలను, అందెలను ధరించి ఇనుమడించిన సౌందర్యంతో వెలిగిపోతున్న శ్రీకృష్ణుడు చేతులలో శంఖచక్ర గదాది ఆయుధాలను ధరించాడు. పరిమళభరితమైన చందనంతో కూడి ఉన్న వక్షస్థలంపైన కౌస్తుభ మణికాంతులు ప్రతిఫలిస్తుండగా పట్టుపీతాంబరాన్ని రింగులు

వచ్చేటట్లు కట్టాడు. ఎదుట ఉన్న రథాన్ని సూర్యుడు ఉదయాద్రి ఎక్కే విధంగా ప్రకాశమానుడై అధిరోహించాడు. శ్రీకృష్ణుడి ముఖంలో సంతోషం వెల్లివిరుస్తోంది.

వ. ఇట్లు రథారోహణంబు సేసి, భూసురాశీర్వచనపూతుండును, మహితదుర్వాంకు రాలంకృతుండును, లలితపుణ్యాంగనా కరకిసలయ కలిత శుభాక్షత విన్యాసభాసుర మస్తకుండును, మాగధ మంజుల గానానుమోదితుండును, వందిజనసంకీర్తనా నందితుండును, బాఠక పఠనరవ వికాసిత హృదయుండును నయి వెడలు నవసరంబున.

395

తా ॥ రథమెక్కిన కృష్ణుణ్ణి బ్రాహ్మణోత్తములు దీవెనలతో అలరించారు. శ్రీకృష్ణుని శిరస్సుపైన ముత్తైదువలు చిగురుల వంటి సుతిమెత్తని చేతులతో శుభాక్షతలు చల్లారు. వందిమాగధులు శ్రీకృష్ణుని మహిమలను పొగడసాగారు. స్తోత్రపాఠకుల స్తుతిగీతాలతో ఆనందిస్తూ వెళుతుండగా—

సీ. బలభద్ర సాత్యకి ప్రద్యుమ్న ముఖ యదు వృష్ణి భోజాంధక వీరవరులు
దుర్వార పరిపంథి గర్వభేదన కళా చతురబాహాబలోత్సాహలీల
వారణ స్యందన వాజి సందోహంబు సవరణ సేయించి సంభ్రమమున
సముచిత ప్రస్థాన చటుల భేరి భూరి, ఘోష మంభోనిధి ఘోష మఁడఁప

తే. ద్వాదశాక్షౌహిణి బలోత్కరము లోలి, నడచెఁ గృష్ణుని రథము వెన్నంటి చెలఁగి
పృథులగతి మున్ భగీరథు రథము వెనుక, ననుగమించు వియన్నది ననుకరించి.

396

తా ॥ శ్రీకృష్ణుని రథం వెంట యాదవసైన్యం భగీరథుని వెనక ఆకాశగంగానది భూమిపైకి తరలివచ్చిన విధంగా కదిలింది. రథగజతురగ బలాలను ఒకదాని వెనుక ఒకదానిని నడిపిస్తూ; అడ్డగించడానికి శక్యం కానటువంటి శత్రువీరుల బలగర్వాన్ని ఛేదించివేసే

భుజబలంతో, మహోత్సాహంతో పన్నెండు అక్షౌహిణీల సైన్యం తీసుకొని బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు మొదలైన యదువృష్టి భోజాంధక మహావీరులందరూ శ్రీకృష్ణునివెంట నడిచారు. వారు మ్రోగించిన యుద్ధభేరీ భాంకృతులు సముద్రఘోషను మించిపోయాయి.

వ. ఇ వ్విధంబునం గదలి కతిపయ ప్రయాణంబుల శోణపురంబు చేరం జని వేలాలంఘనంబు చేసి యదువీరు లంత.

397

తా ॥ ఈ విధంగా యదువీరులందరూ ద్వారకనుంచి బాణుడి పురమైన శోణపురాన్ని చేరారు.

మ. సరి దారామ సరోవరోపవన యజ్ఞస్థానముల్ మాపి వే
పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి గో
పురముల్ గూలఁగఁద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్
ధరణిం గూల్చి కవాటముల్ విఱిచి రుద్దండక్రియాలోలు రై.

398

తా ॥ చేరడమే తడవుగా అక్కడ ఉన్న నదులను, ఉద్యాన వనాలను, సరస్సులను చెల్లాచెదరు చేశారు. యజ్ఞవాటికలను పాడు చేశారు. అగడ్తలు పూడ్చివేశారు. గోడలపై ఏర్పాటు చేసిన యంత్రాలను విరుగగొట్టారు. కోట గోడలను నాశనం చేశారు. గోపురాలను కూల్చివేశారు. సౌధాలను, భవనాలను పడగొట్టారు. ప్రాకారాలను ధ్వంసం చేశారు. తలుపులు పగలగొట్టారు. యాదవవీరుల వీరవిజృంభణకు శోణపురం ఛిన్నాభిన్నమైంది.

వ. ఇ ట్లనేకప్రకారంబులు గాసి చేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి యాగ్రహ సమగ్రోగ్రమూర్తియై బాణుండు సమర సన్నాహ సంరంభ విజృంభమాణుండై సంగరభేరి వ్రేయించిన.

తా ॥ ఈ విధంగా అనేక రకాలుగా తన నగరాన్ని యాదవులు విధ్వంసం చేసి సమరధ్వనులు చేయడంతో బాణుడికి ఆగ్రహం అంచులు దాటింది. ఉగ్రమూర్తి అయ్యాడు. యుద్ధానికి సైన్యాన్ని సిద్ధం చేయించాడు. తానూ సన్నద్ధుడై యుద్ధభేరీ మ్రోగింపచేశాడు.

సీ. ఆచక్రవాళాచలాచక్ర మంతయు బలసి కుమ్మరిసారె పగిదిఁ దిరిగె
ఘన ఘోణి ఖుర కోటిఘట్టిత నదముల కరణి నంభోనిధుల్ గలఁగి పొరలెఁ
గాలరుద్రాభీల కర శూలహతి రాలు పిడుగుల గతి రాలె నుడుగణంబు
చటులానిలోద్ధూత శాల్మలీతూలంబు చాడ్పున మేఘముల్ చదలఁ దూలె

తే. గిరులు వడఁకాడె దివి పెల్లగిల్లె సురల, గుండె లవిసె రసాతలక్షోభ మొదవె దిక్కు లదరె విమానముల్ తెరలి చెదరెఁ, గలఁగి గ్రహరాజ చంద్రుల గతులు దప్పె.

400

తా ॥ ఆ యుద్ధ భేరీధ్వనికి లోకాలోక పర్వతంతో చుట్టబడి ఉన్న భూచక్రం కుమ్మరి సారెమాదిరి గిరగిరా తిరిగింది. వరాహమూర్తి గిట్టల త్రొక్కిడికి అల్లకల్లోలమైన నదాలవలె సముద్రాలు కలతచెంది పొంగిపొరలాయి. ప్రళయకాల రుద్రుని చేతిలోని భయంకరమైన త్రిశూలపు దెబ్బలకు రాలి క్రిందపడే పిడుగుల లాగా ఆకాశంలోని నక్షత్రగణమంతా జలజలా రాలి నేలమీద పడింది. తీవ్రమైన ఈదురుగాలికి ఎగిరిపడే బూరుగుదూది పింజలవలె మబ్బుల తునకలు మింటి నుంచి తూలి క్రిందపడ్డాయి. పర్వతాలు గజగజ వణికాయి. ఆకాశం పెళ్ళగింపబడింది. దేవతల గుండెలు ఝల్లుమన్నాయి. పాతాళం వికలమైపోయింది. దిక్కులు అదిరాయి. విమానాలు చెదిరిపోయాయి. ఈ కల్లోలానికి కలతచెంది సూర్యచంద్రులు గతులు తప్పారు.

వ. అట్టి సమర సన్నాహంబునకుఁ గట్టాయితంబై, మణిఖచితభర్మ వర్మ నిర్మలాంశు

జాలంబులును, శిరస్త్రాణ కిరీట కోటి ఘటిత వినూత్నరత్న ప్రభాపటలంబులును, గనక కుండల గ్రైవేయ హార కంకణ తులాకోటి వివిధ భూషణవ్రాత రుచినిచయంబులును, బ్రచండ బాహుదండ సహస్రంబున వెలుంగుచు శరశరాసన శక్తి ప్రాస తోమర గదా కుంత ముసల ముద్గర భిందిపాల కరవాల పట్టిస శూల క్షురికా పరశు పరిఘాది నిశాత హేతివ్రాత దీధితులును, వియచ్చరకోటి నేత్రంబులకు మిఱుమిట్లు గొలుపం గనకాచల శృంగ సముత్తుంగం బగు రథం బెక్కి యరాతివాహినీ సందోహంబునకుం దుల్యంబైన నిజ సేనాసమూహంబు లిరుగడల నడవ బాణుం డక్షీణప్రతాపంబు దీపింప ననికి వెడలె, న య్యవసరంబున.

401

తా ॥ అఖండ ప్రతాపవంతుడైన బాణాసురుడు యుద్ధభూమికి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. అక్కడక్కడ మణులు పొదిగిన బంగారు కవచాన్ని, శిరస్త్రాణాన్ని, రత్నకాంతులను విరజిమ్ముతున్న కిరీటాన్ని, స్వర్ణకుండలాలను, మనోహర హారాలను, కంకణాలను ధరించాడు. ఇంకా వివిధ భూషణాలను అలంకరించుకొన్నాడు. ఆభరణాల చిత్రవిచిత్ర కాంతులతో ప్రకాశించాడు. బలిష్ఠములయిన వేయి చేతులతో వెలుగులీనాడు. ధనుర్బాణాలను, శక్తి, ప్రాస, తోమర, గదా, కుంత, ముసల, ముద్గర, భిందివాల, కరవాల, పట్టిస, శూల, క్షురిక, పరశు, పరిఘ మొదలైన ఆయుధాలను తీసుకొన్నాడు. అతని చేతులలోని ఖడ్గాది ఆయుధాల కాంతులు దేవతల కళ్ళకు మిఱుమిట్లు గొల్పుతున్నాయి. బంగారు కొండ అయిన మేరుపర్వతం శిఖరంలాగా ఎంతో ఎత్తుగా ఉన్న రథాన్ని అధిరోహించాడు. శత్రుసైన్య సమూహానికి సమానమైన తనసేనలు తనకు అటూఇటూ నడుస్తుండగా వీరాధివీరుడైన బాణాసురుడు యుద్ధరంగానికి తరలివెళ్ళాడు. ఆ సమయంలో.

# బాణాసురునికి సహాయభూతుడైన శివుడు కృష్ణునితో యుద్ధం చేయుట

చ. వరదుఁ డుదార భక్తజనవత్సలుఁడైన హరుండు బాణునిం
గర మనురక్తి నాత్మజులకంటె దయామతిఁ జూచుఁ గానఁ దా
దుర మొనరించు వేడ్క బ్రమథుల్ గుహుఁడున్ నిజభూతకోటియున్
సరవి భజింప నుజ్జ్వల నిశాతభయంకరశూలహస్తుఁడై.

402

తా ॥ భక్తులంటే మిక్కిలి వాత్సల్యంతో వరాలు క్రుమ్మరించే పరమశివుడు బాణుడు యుద్ధానికి వెళ్ళడం చూశాడు. ఆ పరమేశ్వరుడికి బాణుడంటే చాలా ఇష్టం. తన కుమారులైన విఘ్నేశ్వరునికన్న, కుమారస్వామికన్న బాణాసురుణ్ణి ఎక్కువ ప్రేమతో, ఆదరంతో చూసేవాడు. అటువంటి పరమ దయాళువైన శంకరుడు బాణుడికి సహాయంగా రణోత్సాహంతో తాను కూడా రణరంగానికి తరలివెళ్ళాడు. శివునివెంట కుమారస్వామి, ప్రమథులు, భూతగణాలు కొలిచిరాగా మహాభయంకరమై, వాడిగా ఉన్న శూలాన్ని చేత ధరించి—

సీ. ఖరపుటాహతి రేఁగు ధరణీపరాగంబు పంకేరుహాప్త బింబంబుఁ బొదువ
విపులవాలాటోప విక్షేపజాత వాతాహతి వారివాహములు విరయఁ
గుఱుచ తిన్నన వాఁడికొమ్ములఁ జిమ్మిన బ్రహ్మాండభాండ కర్పరము వగుల
నలవోక ఖణి ఖణిల్లని ఱంకె వైచిన రోదసీకుహరంబు భేదిలంగ

తే. గళ చలద్ఘర్మగంటికా ఘణఘణ ప్ర, ఘోషమున దిక్తటంబు లాకులత నొంద
లీల నడతెంచు కలధౌతశైల మనఁగ, నుక్కు మిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె.

403

తా ॥ నందీశ్వరుణ్ణి చూశాడు. నడచి వస్తున్న కైలాసపర్వతమా అన్నట్లు తెల్లని

కాంతులతో మెరిసిపోతూ, దృఢశక్తితో తేరిపారచూడశక్యం కానట్లున్న ఆ వృషభరాజు నధిరోహించాడు పరమేశ్వరుడు. నందీశ్వరుడు కదలగానే ఆయన గిట్టల నొక్కులకు పైకిరేగిన ధూళి సూర్యబింబాన్ని కప్పివేసింది. పెద్దదైన తోకను విదిలించడం వల్ల కలిగిన గాలి తాకిడికి మబ్బులు విచ్చిపోయాయి. పొట్టిగా, వాడిగా ఉన్న కొమ్ములను అటూ ఇటూ చిమ్మటంతో బ్రహ్మాండభాండమనే పాత్ర పగిలిపోయింది. అలవోకగా ఖణిల్ ఖణిల్ అని రంకెవేయగానే ఆకాశమంతా చిల్లులు పడిపోయింది. మెడలో ఉన్న బంగారు ఘంట కదులుతూ ఘణఘణమనేధ్వని చేస్తుండటంతో దిక్కులన్నీ చెదరిపోయాయి.

వ. ఇట్లు వెడలి సమరసన్నాహ సముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం బ్రతిపక్షబలంబులతోడం దలపడిన ద్వంద్వయుద్ధం బయ్యె, నప్పు డ ప్పురాతన యోధుల యా యోధనంబుఁజూచు వేడ్కం జనుదెంచిన, సరసిజసంభవ శక్ర సుర యక్ష సిద్ధ సాధ్య చారణ గంధర్వ కిన్నర కింపురుష గరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబున నిలిచి రట్టి యెడం గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూప కర్ణ కుంభాండులును, గామపాలుండును బాణుపుత్రుండగు బలుండును, సాంబుండును; సాత్యకియును బాణుండును, రథికులు రథికులును, నాశ్వికులు నాశ్వికులును, గజారోహకులు గజారోహకులును, బదాతులు పదాతులునుం దలపడి యితరేతర హేతిసంఘట్టనంబుల మిణుఁగుఱులు సెదరం బరస్పరాహ్వాన బిరుదాంకిత సింహనాద హుంకార శింజినీటంకార వారణఘీంకార వాజిహేషారవంబులను, బటహ కాహళ భేరీ మృదంగ శంఖ తూర్యఘోషంబులను బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితంబయ్యె, న య్యవసరంబున.



తా ॥ పరమేశ్వరుడు ఈవిధంగా సమరోత్సాహంతో రణరంగానికి వెళ్ళాడు. శివుణ్ణి చూడగానే వీరుల ముఖాలలో వీరోత్సాహం పెల్లుబికింది. బాణుని పక్షం వారందరూ

యాదవులతో ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. ఒకవైపు శంకరుడు. మరోవైపు శ్రీహరి. ఆ ఆదివీరుల యుద్ధక్రీడ చూడటానికి బ్రహ్మదేవుడు, దేవేంద్రుడు, దిక్పాలకులు, దేవతలు, యక్షులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, గరుడులు, నాగులు మొదలైన వారంతా ఆకాశంలో విమానాలెక్కి కూర్చొని నిరీక్షించసాగారు. అప్పుడు రథికులు రథికులతో; ఆశ్వికులు ఆశ్వికులతో; గజారోహకులు గజారోహకులతో, పదాతులు పదాతులతో యుద్ధం చేసారు. శివుడు, కృష్ణుడు ఒకరితో ఒకరు తలపడ్డారు. అదే విధంగా ప్రద్యుమ్నుడు– కుమారస్వామితో, కూపవర్ణ కుంభాండులు – బలరాముడితో; బాణాసురుని కుమారుడైన బలుడు – సాంబునితో; సాత్యకి–బాణాసురుడితో యుద్ధం చేయసాగారు. ఆ మహా సంగ్రామంలో పరస్పర విజయోత్సాహంతో ప్రయోగింపబడిన ఖడ్గాది ఆయుధాల ఘట్టనతో నిప్పురవ్వలు ఎగసిపడుతున్నాయి. ఒక వీరున్ని మరొక వీరుడు యుద్ధానికి ఆహ్వానించడంతో ఎవరి ఘనత వారు మహోన్నతంగా చెప్పుకోవడంతో, యుద్ధసమయంలో వినవచ్చే సింహనాదాలతో, హుంకార ధ్వనులతో, ధనుష్టంకారాలతో, ఏనుగుల ఘీంకారాలతో, గుఱ్ఱాల హేషారవాలతో నిండిన సంగ్రామ రంగం బ్రహ్మాది దేవతలకు ఒక ప్రక్క ఆశ్చర్యాన్ని, మరో ప్రక్క భయాన్ని కలిగిస్తూ బీభత్సంగా తయారయింది. పటహకాహళభేరీ మృదంగ శంఖధ్వనులతో బ్రహ్మాండభాండం బద్దలైపోయింది. అప్పుడు–

చ. జలరుహనాభుఁ డార్చి నిజ శార్ఙ్గ శరాసన ముక్త సాయ కా
వలి నిగుడించి నొంచెఁ బురవైరి పురోగములన్ రణక్రియా
కలితుల గుహ్యక ప్రమథ కర్బుర భూత పిశాచ డాకినీ
బలవ దరాతియోధులను బ్రమ్మెరపోయి కలంగి పాఱఁగన్.



తా ॥ శ్రీకృష్ణుడు శంఖం పూరించి, శార్ఙ్గమనే తన వింటి నుండి వేలకు వేల బాణాలు గుప్పించి యుద్ధం చేస్తున్న యక్షరాక్షస ప్రమథ వీరులను భయాందోళితులను చేశాడు.

బలవంతులైన శత్రువీరులను, శంకరుని ముందు నిలబడి ఉన్నవారిని పారిపోయేటట్లు చేశాడు. భూతపిశాచడాకినీ గణాలను అణచివేశాడు. దానితో శివుని పరివారమంతా దిగ్భ్రమ చెందింది.

వ. ఇ ట్లేసి యార్చిన కుంభినీధరు భుజావిజృంభణ సంరంభంబునకు సహింపక, నిటలాంబకుం దనలకణంబు లుమియు నిశితాంబకంబులం బీతాంబరుని నేసిన, వాని నన్నింటి నడుమన ప్రతిబాణంబు లేసి చూర్ణంబు సేసినం గనుంగొని మఱియును.

406

తా ॥ ఈ విధంగా వీర విజృంభణం చేస్తున్న కృష్ణుని శౌర్యప్రతాపాలను సహించలేకపోయాడు త్రినేత్రుడు. వెంటనే అగ్నికణాలను విరజిమ్మే వాడిబాణాలతో కృష్ణుణ్ణి నొప్పించబోయాడు. మహేశ్వరుడు ప్రయోగించిన బాణాలనన్నింటికీ కృష్ణుడు ప్రతిబాణాలు వేసి మధ్యలోనే వాటిని పొడిపొడి చేశాడు. అది చూసిన శివుడు—

మ. అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్రహ్మాస్త్రం బరింబోసి యా
వనజాతేక్షణు మీఁదఁ గ్రోధమహిమవ్యాకీర్ణుఁడై యేసి, నే
సినఁ దద్దివ్యశరంబుచేతనె మఱల్చెం గృష్ణుఁ డత్యుద్ధతిన్
జనితాశ్చర్య రసాబ్ధిమగ్ను లగుచున్ శక్రాదు లగ్గింపఁగన్.

407

తా ॥ పరమశివుడు క్రోధోద్దీప్తుడై ముల్లోకవాసుల చేత పూజింపబడే బ్రహ్మాస్త్రాన్ని శ్రీకృష్ణుని మీద ప్రయోగించాడు. ఆ మహాస్త్రాన్ని చేతితో పట్టుకొని శ్రీకృష్ణుడు తిరిగి వెనుకకు మరలిపోయేటట్లు అత్యద్భుతంగా దానిని ఉపశమింపచేశాడు. ఇంద్రాది దేవతలు ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యభరితులై శ్రీకృష్ణున్ని వేనోళ్ళ పొగిడారు.

శా. వాయవ్యాస్త్ర ముపేంద్రుపై నలిగి దుర్వారోద్ధతి న్నేయ దై
తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ ద్రెంచెం, గ్రతుధ్వంసి యా

గ్నేయాస్త్రం బడరించె నుగ్రగతి లక్ష్మీనాథుపై, దాని వే
మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్.

408

తా ॥ ఈశ్వరుడు వెంటనే కృష్ణుడిపై అలిగినవాడై వారించ శక్యముకాని పరాక్రమంతో వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు ఆ వాయవ్యాస్త్రాన్ని పర్వతాస్త్రంతో త్రుంచి వేశాడు. దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసిన రుద్రుడు కోపోద్రిక్తుడై కృష్ణుడిపైన ఆగ్నేయాస్త్రాన్ని సంధించాడు. దానిని కృష్ణుడు వెంటనే ఐంద్రబాణంతో మాపివేశాడు.

వ. మఱియును.

409

తా ॥ అంతేకాకుండా—

ఉ. పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినన్
దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్ర నా
రాయణబాణరాజము రయంబున నేసి మరల్చె దానిఁ జ
క్రాయుధుఁ డిత్తెఱంగునఁ బురారి శరావలి రూపుమాపినన్.

410

తా ॥ మహేశ్వరుడు కోపాన్ని అణచలేక శ్రీకృష్ణుడిపైన పాశుపతాస్త్రాన్ని వింటిలో సంధించి ప్రయోగించాడు. కమలాక్షుడైన కృష్ణుడు తక్షణం లోకభయంకరము, మహోగ్రము అయిన నారాయణాస్త్రాన్ని వేసి పాశుపతాస్త్రాన్ని వెనుకకు మరలించాడు. ఈ విధంగా చక్రాయుధుడైన కృష్ణుడు శివుడు వేసిన శస్త్రాస్త్రాలను రూపుమాపాడు.

క. ఊహ కలంగియు విగతో, త్సాహుండగు హరునిమీఁద జలజాక్షుడు స

మ్మోహన శిలీముఖం బ, వ్యాహత జయశాలి యగుచు నడరించె నృపా!

411

తా ॥ శివుడు తన ఆలోచనలన్నీ నిష్ఫలం కావడంతో కలతచెంది ఉత్సాహాన్ని కోల్పోయాడు. అది చూసిన కృష్ణుడు మంచి సమయమనుకొని శివుడి మీద సమ్మోహనాస్త్రాన్ని వదిలాడు. దానితో కృష్ణుడు జయశీలి అయినాడు.

వ. అట్లేసి.

412

తా ॥ ఆ విధంగా కృష్ణుడు శివుడిపైన సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించగా—

క. జృంభణశరపాతముచే, శంభుఁడు నిజతనువు పరవశం బయి సోలన్ జృంభితుఁడై ఘననిద్రా, రంభత వృషభేంద్రు మూఁపురముపై వ్రాలెన్.

413

తా ॥ సమ్మోహనాస్త్రం మీద పడగా, శివుడు తన శరీరం వశం తప్పిపోవడంతో సోలిపోయాడు. మంచి నిద్ర ముంచుకొని రాగా నందీశ్వరుని మూపురంమీద వాలిపోయాడు.

వ. ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణ పరంపరలం దునిమియు, నొక్కయెడం గృపాణంబులం గణికలు సేసియు, నొక్కచో గదాహతులం దుత్తుమురుగా మొత్తియు ని వ్విధంబునఁ బీనుంగు పెంటలఁ గావించె, నంత.

414

తా ॥ ఎప్పుడైతే శివుడు అవశుడై నందిమీద వాలిపోయాడో శ్రీకృష్ణుడు అప్పుడు మరింత విజృంభించాడు. శత్రుసైన్యాన్ని వాడివాడి బాణాలతో తునాతునకలు చేశాడు. కొందరు వీరులను కత్తులతో నరికి ముక్కలు ముక్కలు చేశాడు. మరికొంత మందిని గదలతో మొత్తి

పొడిపొడి చేశాడు. ఈ విధంగా శ్రీకృష్ణుడు బాణాసురుని సమస్త సైన్యాన్ని పరిమార్చాడు. అప్పుడు—

చ. తఱిమి మురాంతకాత్మజుఁ డుదాత్తబలంబున బాహులేయుపైఁ
గఱకరిఁ దాఁకి తీవ్రశితకాండ పరంపర లేసి నొంపఁగా
నెఱఁకులు గాఁడి పైఁదొరఁగు నెత్తుట జొత్తిలి వైరు లార్వఁ గాఁ
బఱచె మయూరవాహనముఁ బైకొని తోలుచు నాజిభీతుఁడై.

415

తా ॥ శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు బలాధిక్యంతో కుమార స్వామి మీద విరుచుకుపడ్డాడు. తీవ్రమైన బాణాలు వేసి శివకుమారుణ్ణి ఎంతగానో బాధపెట్టాడు. ప్రద్యుమ్నుడు ప్రయోగించిన బాణాలు కుమారస్వామి ఆయువు పట్టులలో నాటుకొని నెత్తురు ప్రవహింపసాగింది. శ్రీకృష్ణుని పక్షంవారైన యాదవ వీరులందరూ అది చూసి విజయోత్సాహంతో జయజయధ్వనులు చేసారు. చేసేది లేక యుద్ధభీతితో కుమారస్వామి నెమలివాహనంపై ఎక్కి వెడలిపోయాడు.

ఉ. పంబి రణక్షితిన్ శరవిపాటిత శాత్రవవీరుఁడైన యా
సాంబుఁడు హేమపుంఖశిత సాయకజాలము లేర్చి భూరి కో
పంబున నేసినన్ బెదరి బాణతనూభవుఁ డోడి పాఱె శౌ
ర్యంబును బీరముం దగవు నాఱడివోవ బలంబు లార్వఁగన్.

416

తా ॥ యుద్ధ విద్యలో ఆరితేరిన సాంబుడు అతిశయించిన పరాక్రమంతో మహోగ్రుడై శత్రువీరులపైన బాణవర్షం కురిపించాడు. అంతటితో ఆగక బాణపుత్రుడైన బలుని మీదికి దూకాడు. సాంబుడి శౌర్యప్రతాపాలకు బలుడు బెదరిపోయాడు. బలపరాక్రమాలు క్షీణించగా

బలుడు సాంబుని చేతిలో ఓడిపోయి యాదవులు పరిహసిస్తున్నా రణభూమిలో నిలవలేక పారిపోయాడు.

మ. వరబాహాబలశాలి యా హలి రణావష్టంభ సంరంభ వి
స్ఫురదుగ్రాశనితుల్యమైన ముసలంబుం బూన్చి వ్రేసెన్ బొరిం
బొరిఁ గుంభాండక కూపకర్ణులు శిరంబుల్ వ్రస్సి మేదంబు నె
త్తురు గర్ణంబుల వాతనుం దొరఁగ సంధుల్ వ్రీలి వే చావఁగన్.

417

తా ॥ బలసంపన్నుడైన బలరాముడు యుద్ధ క్రీడలో విహరిస్తూ వజ్రాయుధంతో సరిసమానమైన తన ముసలాయుధంతో కుంభాండక, కూపకర్ణులను ఎదుర్కొన్నాడు. బలరాముడి రోకలి దెబ్బలకు కుంభాండక, కూపకర్ణులు నుగ్గునుగ్గయ్యారు. వారి తలలు పగిలిపోయాయి. చెవుల నుండి నెత్తురు ప్రవహించి శరీరమంతా నిండిపోయింది. ఆయువుపట్లు తెగి ఇద్దరూ మరణించారు.

వ. అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొంది యనాథం బయి చెడి, విఱిగి పాఱినం గని బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుం బోలె విజృంభించి చెయి వీచి బలంబుల మరలం బురిగొల్పి తానును ముంగలియై నడచె, నప్పు డుభయ సైన్యంబు లన్యోన్యజయకాంక్షం దలపడు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబున వీఁకం దాఁకినం బోరు ఘోరంబయ్యె, నట్టియెడ గదల నడిచియుఁ, గుఠారంబులఁ బొడిచియు; సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు; శక్తుల నొంచియుఁ, జక్రంబులం ద్రుంచియు; ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ; గుంతంబుల గ్రుచ్చియుఁ, బంతంబు లిచ్చియుఁ; బరిఘంబుల నొంచియుఁ, బట్టిసంబులం ద్రుంచియు; శరంబుల నేసియుఁ, గరవాలంబుల వ్రేసియు; సత్రాసులై పాసియు, విత్రాసులై డాసియుఁ బెనఁగినం దునిసిన శిరంబులును, దునుకలైన కరంబులును, దెగిన కాళ్ళును, ద్రెస్సిన వ్రేళ్ళును; దుమురులైన

యెముకలును, బ్రోవులైన ప్రేవులును; నులిసిన మేనులును, నలిసిన జానువులును; నొగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబు లయిన సకలావయవంబులును, వికీర్ణంబు లయిన కర్ణంబులును; విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలు రుధిరంబులును; బడలుపడు బలంబులును, గొండలవడువునం బడు మాంసఖండంబులును; వాచఱచు కొఱప్రాణంబులును, వ్రాలిన తేరులును; గూలిన కరులును, నొఱగిన గుఱ్ఱంబులును; దెరలిన కాలుబలంబులును గలిగి, పలలఖాదన కుతూహలజనిత మదాంధీభూత పిశాచ డాకినీ భూత బేతాళ సమాలోల కోలాహల భయంకరారావ బధిరీకృత సకలదిశావకాశంబయి సంగరాంగణంబు భీషణం బయ్యె, న య్యవసరంబున.

418

తా ॥ ఆ సమయంలో రాక్షస సైన్యం దైన్యానికి గురయింది. అనాథలాగా చెదిరిపోయి, విచ్చుకుపోయి పారిపోతున్న తన సైన్యాన్ని చూసిన బాణాసురుడు సాత్యకితో చేస్తున్న యుద్ధాన్ని ఆపి ప్రళయాగ్నిలాగా విజృంభించాడు. వీరులనందరినీ చేయిచాచి వెనుకకు పిలిచాడు. వారందరిలో సమరోత్సాహాన్ని నింపాడు. యుద్ధం చేయమని ప్రోత్సహించాడు. పారిపోవద్దని హితవు పలికాడు. సైన్యానికి తాను ముందుగా ఉండి నడిచాడు. ఇరువైపులవారు ఎవరిపాటికి వారు విజయలక్ష్మిని చేపట్టాలనే కాంక్షతో యుద్ధం చేసారు. వారి యుద్ధం దక్షిణ సముద్రం, ఉత్తర సముద్రం ఒకదానితో ఒకటి ఘోరంగా పోరాడినట్లుంది. ఒకరినొకరు గదలతో క్రుమ్ముకున్నారు. శూలాలతో కొట్టుకున్నారు. శక్తి ఆయుధాలతో చంపారు. చక్రాలతో త్రుంచారు. రోకళ్ళతో బాదారు. కుంతాలతో గుచ్చారు. పౌరుషాలు పలికారు. ప్రతిజ్ఞలు చేశారు. ఇనుపకట్ల గుదియలతో బాధించారు. అడ్డకత్తులతో నరికారు. బాణాలు ప్రయోగించారు. ఖడ్గాలతో చీల్చారు. భయంతో పారిపోయారు. భయం వీడి సమీపించారు. ఈ విధంగా వారి పోరు మహాభయంకరంగా జరిగింది.

యాదవ రాక్షస మహా సంగ్రామంలో తలలు తెగి నేలపై ఒరిగాయి. చేతులు తునాతునకలైనాయి. కాళ్ళు విరిగిపోయాయి. వేళ్ళు తెగిపోయాయి. ఎముకలు పొడిపొడి అయ్యాయి. ప్రేగులు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. శరీరాలు కండలు బయటికి వచ్చి పడిపోయాయి. మోకాళ్ళు చచ్చుబడిపోయాయి. కవచాలు చిరిగిపోయాయి. చర్మాలు పగిలిపోయాయి. అవయవాలు మొత్తం వికలమైపోయి చెల్లాచెదరైనాయి. చెవులు తెగిపోయాయి. కళ్ళు ఊడిపోయాయి. నెత్తురు ధారాప్రవాహాలుగా ప్రవహిస్తోంది. బలగాలు అలసిపోయాయి. మాంసఖండాలు కొండల్లాగా పడిపోతున్నాయి. కొనప్రాణంతో అరుస్తున్న అరుపులు బీభత్సాన్ని కలిగిస్తున్నాయి. రథాలు పడిపోయాయి. ఏనుగులు కూలిపోయాయి. గుఱ్ఱాలు ఒరిగి పడిపోయాయి. కాల్బలము జీవరహితంగా పడి ఉంది. అటువంటి యుద్ధ భూమిలో మాంసభక్షణకోసం వచ్చిన పిశాచడాకినీ భూత బేతాళ గణాల కోలాహలంతో ఏర్పడిన భయంకర ధ్వనులచే దిక్కులన్నీ చెవుడుతో నిండిపోయాయి. సంగర రంగం మహాభయంకరంగా చూడశక్యంకాకుండా ఉంది.

చ. శరకుముదంబు లుల్లసితచామర ఫేనము లాతపత్ర భా
సుర నవపుండరీకములు శోణితతోయము లస్థి సైకతో
త్కరము భుజాభుజంగమనికాయము కేశకలాప శైవల
స్ఫురణ రణాంగణం బమరెఁ బూరిత శోణనదంబు పోలికన్.



తా ॥ ఆ రణరంగం ఒక రక్తపుటేరుగా అరుణకాంతులతో శోభించింది. అందులో బాణాలు ఎఱ్ఱతామరలుగా, చామరాలు నీటిలో తేలే నురుగులుగా, గొడుగులు పద్మాలుగా, రక్తము నీరుగా, ఎముకలు ఇసుక దిబ్బలుగా, భుజాలు పాములుగా, కేశసంపద నాచుగా కనబడి చూపరులకు వింతగొలుపుతున్నాయి.

వ. అట్టి యెడ బాణుండు గట్టలుకం గృష్ణునిపైఁ దన రథంబుఁ బఱపించి, యఖర్వబాహా

సహస్ర దుర్వారగర్వాటోప ప్రదీప్తుండై కదిసి.

420

తా ॥ ఆ సమయములో బాణాసురుడు క్రోధావేశంతో తన రథాన్ని కృష్ణుడి మీదికి తోలాడు. తనకు అత్యద్భుతమైన బలపరాక్రమాలు గలిగిన వెయ్యి చేతులున్నాయని గర్వించి బాణుడు కృష్ణుడితో తలపడ్డాడు.

మ. ఒక యే నూఱు కరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిం దాల్చి త
క్కక యొక్కొక్కట సాయకద్వయము వీఁకం బూన్చు నాలోన నం
దకహస్తుండు తదుగ్రచాపచయ విధ్వంసంబు గావించి కొం
జక తత్సారథిఁ గూల నేసి రథముం జక్కాడి శౌర్యోద్ధతిన్.

421

తా ॥ బాణాసురుడు అయిదువందల చేతులలో ధనుస్సులను ధరించాడు. మిగిలిన అయిదువందల చేతులలో ఒక్కొక్క దానిలో రెండేసి బాణాల చొప్పున గ్రహించి కృష్ణుడిపైన బాణాలు వేసేలోపుగానే నందక ఖడ్గధారి అయిన శ్రీకృష్ణుడు బాణుని ధనుస్సులన్నింటినీ విధ్వంసం చేశాడు. ఏమాత్రం సంకోచించకుండా, క్షణంకూడా ఆగకుండా బాణుని రథసారథిని నేలకూల్చాడు. వెంటనే బాణుడెక్కిన రథాన్ని మహా పరాక్రమంతో ముక్కలు ముక్కలుగా ఖండించాడు.

తే. ప్రళయ జీమూత సంఘాత భయద భూరి, భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య
మఖిలజనులు భయభ్రాంతులయి చలింపఁ, గడఁగి నిర్భిన్న రాక్షసీగర్భముగను.

422

తా ॥ శ్రీకృష్ణుడు, ప్రళయకాలంలో వినవచ్చే మేఘగర్జన లాగా మహాభయాన్ని కలిగించే విధంగా తన పాంచజన్య శంఖాన్ని పూరించి జనులనందరినీ భయభ్రాంతుల్ని చేశాడు. ఆ

మహాధ్వనికి రాక్షసకాంతల గర్భాలు విచ్ఛిన్నమయ్యాయి.

వ. అట్టి యవక్ర విక్రమ పరాక్రమంబునకు నెగడుపడి బాణుండు లేటమొగంబు వడి చేయునది లేక విన్ననయి యున్నయెడ.

423

తా ॥ శ్రీకృష్ణుని అఖండ పరాక్రమానికి బాణాసురుడు భయపడిపోయాడు. ఆశ్చర్యపోయాడు. విముఖుడైనాడు. ఏమీ చేయలేక ఖిన్నుడైనాడు. నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

సీ. అత్తఱిఁ గోటర యను బాణజనయిత్రి సుతుఁ గాచు మతము సన్మతిఁ దలంచి
వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్త పరిధానయై మురాసురవిభేది
యెదురు నిల్చినఁ జూడ మదిఁ జాల రోసి పరాఙ్ముఖుఁడై యున్న ననువు వేచి
తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలగంగఁ దలచీర వీడ యాదవులు నవ్వ

తే. నవ్యకాంచనమణి భూషణములు రాలఁ, బాదహతి నేలఁ గంపింపఁ బాఱి యాత్మ
పురము వడిఁ జొచ్చె నప్పుడు భూతగణము, లాకులతతోడ నెక్కడే నరుగుటయును.

424

తా ॥ ఆ సన్నివేశం చూసి భరించలేక బాణుని తల్లి అయిన కోటర అనే ఆమె కుమారున్ని రక్షించుకోవాలనుకొని కృష్ణుని ముందుకు వచ్చి నిలబడింది. అప్పుడామె జుట్టు విరబోసుకుని నగ్నంగా ఉంది. కోటరను చూడలేక అసహ్యించుకొని కృష్ణుడు తనముఖాన్ని మరోవైపుకు త్రిప్పుకొన్నాడు. ఆ అదను చూసుకొని బాణుడు బాధతో, మనస్సు క్షోభిస్తుంటే, తలపాగ ఊడిపోతుంటే, యాదవులు నవ్వుతుంటే, రత్నకాంచన భూషణాలు రాలి క్రిందపడుతుంటే, తన అవమానానికి సంకోచించకుండా కాళ్ళ తొక్కిడికి నేల కంపిస్తుండగా, తొందరతొందరగా తన రాచనగరులోకి పారిపోయాడు. రణరంగంలో ఉన్న భూతగణాలు కూడా కలవరపాటు చెంది ఎక్కడికో వెళ్ళిపోయాయి.

క. శిరములు మూఁడును ఘన భీ, కరపదములు మూఁడుఁ గలిగి కనలి మహేశ
జ్వర మురు ఘోరాకృతితో, నరుదేరఁగఁ జూచి కృష్ణుఁ డల్లన నగుచున్.

425

తా ॥ ఆ సమయంలో భయంకరమైన మూడు తలలతో, మూడుపాదాలతో భయంకరాకారంతో, కోపావేశంతో శివజ్వరం కృష్ణుడి దగ్గరకు వచ్చింది. కృష్ణుడు శివజ్వరాన్ని చూసి ఒక నవ్వు నవ్వాడు.

చ. పరువడి వైష్ణవజ్వరముఁ బంచిన న య్యుభయజ్వరంబులున్
వెరవును లావుఁ జేవయును వీరము బీరము గల్గి ఘోర సం
గర మొనరింప నందు గరకంఠకృతజ్వర ముగ్రవైష్ణవ
జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవి వెంట నంటఁగన్.

426

తా ॥ వెంటనే వైష్ణవ జ్వరాన్ని శివజ్వరం మీదికి ప్రయోగించాడు. శివవైష్ణవ జ్వరాలు రెండూ తమ బలాన్ని, శక్తినీ, శౌర్యాన్ని, ప్రతాపాన్ని ప్రదర్శిస్తూ ఘోరంగా యుద్ధం చేశాయి. భయంకరమైన వైష్ణవజ్వరం ముందు శైవజ్వరం ఓడిపోయి పారిపోయింది. వైష్ణవజ్వరం ఊరుకోక శైవజ్వరం వెంటనంటి తరిమిగొట్టింది.

తే. పాఱి యే దిక్కుఁ గానక ప్రాణభీతి, నెనసి యేడ్చుచు నా హృషీకేశు పాద కంజములఁ
బడి 'ననుఁ గావు కావు' మనుచు, నిటలతట ఘటితాంజలిపుటయు నగుచు.

427

తా ॥ వైష్ణవజ్వరం వెంటబడి తరిమివస్తుంటే శివజ్వరానికి పారిపోవడానికి ఏ దిక్కూ కనబడటంలేదు. ఎటువెళ్ళినా వైష్ణవజ్వరం వెంటబడి వస్తూనే ఉంది. దానితో శివజ్వరానికి ప్రాణభీతి పట్టుకొంది. ఏడుస్తూ కృష్ణుడి పాదాలమీద పడింది. నుదుటిపై చేతులుపెట్టుకొని

నమస్కరిస్తూ 'నన్ను కాపాడుమ' ని వేడుకొంది.

వ. ఇట్లు వినుతించె.

428

తా ॥ శైవజ్వరం కృష్ణుణ్ణి ఈ విధంగా స్తుతించింది:

సీ. అవ్యయు ననఘు ననంతశక్తిని బరు లై నట్టి బ్రహ్మ రుద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁ డైనవాని సర్వాత్మకు జ్ఞానస్వరూప సమానరహితు
వరదుని జగదుద్భవ స్థితి సంహార హేతుభూతుని హృషీకేశు నభవు
బ్రహ్మచిహ్నంబులై పరఁగు సుజ్ఞాన శ క్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు

ఆ. నజు షడూర్మిరహితు నిజయోగమాయా వి, మోహితాఖీలాత్మ ముఖ్యచరితు
మహితతేజు నాదిమధ్యాంతహీనునిఁ, జిన్మయాత్మ నిను భజింతుఁ గృష్ణ!

429

తా ॥ "కృష్ణా! నీవు అవ్యయుడవు. పాపరహితుడవు. అనంత శక్తిరూపుడవు. దేవతా స్వరూపులైన బ్రహ్మ, శివుడు, దేవేంద్రుడు మొదలైనవారందరికీ నీవు ఈశ్వరుడవు. జ్ఞానమే స్వరూపంగా కలవాడివి. నీకు సరిసమానులైనవారు విశ్వంలో ఎవరూ లేరు. వరప్రదాతవు. సృష్టి స్థితిలయకారుడవు. హృషీకేశుడవు. పుట్టుకలేని వాడవు. పరమాత్మ చిహ్నలైన సుజ్ఞాన శక్త్యాదులతో ఒప్పే పరబ్రహ్మ స్వరూపుడవు. లోకేశుడవు. సర్వులను నీ యోగమాయతో సమ్మోహపరచే వాడివి. ఆకలి, దప్పిక, శోకము, మోహము, వార్ధక్యము, మరణము అనే ఆరు ఊర్మలు లేనివాడవు. పవిత్ర చరిత్రతో శోభిల్లేవాడివి. తేజస్వరూపుడవు, ఆదిమధ్యాంతరహితుడవు. జ్ఞానమే ఆత్మగా గలవాడవు. అటువంటి నిన్ను ఎల్లప్పుడూ సేవిస్తాను.

వ. అదియునుం గాక లోకంబున దైవం బనేక ప్రకారంబులై యుండు, నది యెట్టి దనినం

గలాకాష్ఠాముహూర్తంబులనం గల కాలంబును, సుకృత దుష్కృతానుభవ రూపంబులైన జీవకర్మంబులును; స్వభావంబును, సత్త్వ రజ స్తమోగుణాత్మకంబైన ప్రకృతియును, సుఖదుః ఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతు నిర్వాహకంబైన ప్రాణంబును, సకలపదార్థ పరిజ్ఞాన కారణంబైన యంతఃకరణంబును, మహదహంకార శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్ర తత్కార్యభూత గగన పవనానలసలిల ధరాది పంచభూతంబు లాదిగాఁ గల ప్రకృతి వికారంబులును, నన్నింటి సంఘాతంబును, బీజాంకుర న్యాయంబునం గార్యకారణ రూప ప్రవాహంబునునై, జగత్కారణశంకితంబై యుండు, నది యంతయు భవదీయ మాయా విడంబనంబుగాని యున్నయది కాదు, తదీయ మాయానివర్తకుండవైన నీవు నానావిధ దివ్యావతారాది లీలలం జేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసా ప్రవర్తకులైన దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచుందువు, విశ్వ విశ్వంభరాభార నివారణంబు సేయుటకుఁ గదా భవదీయ దివ్యావతార ప్రయోజనంబు, గావున నిన్ను శరణంబు వేఁడెద.

430

తా ॥ ప్రభూ! అంతేకాక లోకంలో దైవం అనేక విధాలుగా ఉంటుంది. కలాకాష్ఠా ముహూర్తాలతో ఒప్పే కాలము; మంచి, చెడుల అనుభవరూపాలైన జీవకర్మలు; సత్త్వరజస్తమోగుణాలతో నిండి ఉండే ప్రకృతి; సుఖదుఃఖాలకు నిలయమైన శరీరము; ప్రాణము; అంతఃకరణము, తన్మాత్రలు, పంచభూతాలు మొదలైన ప్రకృతి వికారాల సముదాయము – బీజాంకుర న్యాయంతో కార్యకారణరూపంగా – జగత్ సృష్టికి కారణమై ఉంటుందేమో అన్న సందేహాన్ని కలిగిస్తుంది. ఇదంతా నీ మాయేగాని నిజం కాదు. ఆ మాయను పోగొట్టగల నీవు అనేకములైన దివ్యావతారాలు ధరించావు. దేవతలను, సజ్జనులను, సృష్టినిర్మాతలైన బ్రహ్మాదులను నీవే రక్షిస్తుంటావు. క్రూరులు, దుష్టులు, హింసా ప్రవర్తకులు అయిన వారిని శిక్షిస్తున్నావు. నీ లీలలుగాని, మహిమలుగాని, అవతారాలుగాని భూభారాన్ని పోగొట్టేవే కదా! పరమాత్ముడవైన నిన్ను శరణు వేడుకొంటున్నాను.

సీ. శాంతమై మహితతీక్ష్ణ సుదుస్సహంబై యుదారమై వెలుగొందు తావకీన
భూరిభాస్వత్తేజమునఁ దాప మొందితిఁ, గడుఁ గృశించితి, నన్ను గరుణఁ జూడుఁ
మితరదేవోపాస్తిరతి మాని మీ పాద కమలముల్ సేవించు విమలబుద్ధి
యెందాక మది దోఁప దందాఁకనే కదా ప్రాణులు నిఖిలతాపములఁ బడుట?

తే. యవిరళానన్యగతికుల నరసి ప్రోచు, బిరుదు గల నీకు నను఼ గాచు టరుదె? దేవ!
ప్రవిమలాకారా! సంసారభయవిదూర! భక్త జనపోషపరితోష! పరమపురుష!

431

తా ॥ భక్తులను రక్షించడంలో సంతోషాన్ని పొందే ఓ పరమపురుషా! సంసార భయాలను దూరం చేసే ఓ పరమాత్మా! దేవదేవా! సుందరాకారా! శాంతంగా, తీక్షణంగా సహించడానికి శక్యంకాకుండా ప్రకాశించే మహిమోపేతమైన నీ తేజస్సు తగిలి క్రాగిపోయాను. చాలా కృశించిపోయాను. నన్ను దయజూడు స్వామీ! ఇతర దేవతలను పూజించడం మాని మీ పాదపద్మాలు సేవించే నిర్మలబుద్ధి ఎప్పటిదాకా మనస్సులో తోచదో, అప్పటిదాకానే కదా జీవులు రకరకాల తాపాలతో నలిగిపోయేది? "నీవే శరణు నాకు" అని నమ్మి కొలిచే భక్తులను రక్షించి తీరుతావన్న బిరుదున్న నీకు నన్ను రక్షించడం ఎంత పని కనుక!

చ. అనినఁ బ్రసన్నుఁడై హరి యనంతుఁడు దైత్యవిభేది దాని కి
ట్లనియె 'మదీయ సాధన మనన్యనివారణమౌట నీ మదిం
గని నను నార్తిఁ జొచ్చితివి గావున మజ్జ్వర తీవ్రదాహ వే
దన నినుఁ బొంద దింకఁ బరితాపము దక్కుము నీ మనంబునన్.

432

తా ॥ శివజ్వరం చేసిన స్తోత్రానికి అనంతుడు, రాక్షసాంతకుడు అయిన శ్రీహరి ప్రసన్నుడైనాడు! "నా కరుణ, భక్తితో, ఆర్తితో తప్పమరి ఏ ఇతరమైన దానితోను పొందటం అసాధ్యమన్న విషయం గ్రహించి నన్ను శరణుజొచ్చావు గనుక నా జ్వరం నిన్ను బాధించదు.

ఇక నీ మనస్సులో వైష్ణవజ్వరం గురించిన బాధ, భయం వదిలేయి." అని కృష్ణుడు చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

వ. అని మఱియు న ప్పుండరీకాక్షుం డిట్లను, 'నెవ్వరేనియు నీ యుభయజ్వర వివాదంబును, నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయునుఁ జిత్తంబులం దలంతు రట్టిపుణ్యాత్ములు శీతోష్ణజ్వరాది తాపంబులఁ బొరయ' రని యానతిచ్చిన న మ్మహేశ్వర జ్వరంబు పరమానందభరిత హృదయంబై యా రథాంగ పాణికి సాష్టాంగ దండప్రణామం బాచరించి నిజేచ్ఛం జనియె, నంత బాణాసురుండు నక్కడ.

433

తా ॥ "ఎవరైనా ఈ శైవవైష్ణవజ్వర వివాదాన్ని, నీవు నన్ను శరణు కోరడాన్ని మనస్సులో తలిస్తే వారికి చలిజ్వరంగాని, ఉష్ణజ్వరంగాని రావు" అని శ్రీకృష్ణుడు ఆనతివ్వగానే ఆ శివజ్వరం పరమానందంతో పరమాత్ముడికి సాష్టాంగ నమస్కారం చేసి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళిపోయిన బాణాసురుడు అప్పుడు–

ఇక్కడ శివకేశవ భేదాలు చూపించారని అనుకోవడం తప్పు. 'శివాయ విష్ణురూపాయ' అనే మాట యజుర్వేదంలో కనిపిస్తుంది. ఇది శివకేశవుల అభేదాన్ని తెలియజేస్తుంది. 'శివ' శబ్దానికి త్రిగుణాతీతుడు, శుభస్వరూపుడు అనే అర్థాలు ఉన్నాయి. 'విష్ణు' అంటే వ్యాపించినవాడు. త్రిగుణాతీతమైన, మంగళకరమైన ఈశ్వర చైతన్యం 'శివుడు' విశ్వమంతా వ్యాపించితే 'విష్ణువు' – అదే శివాయ విష్ణురూపాయ. శివకేశవులకు, శివపురాణం, విష్ణుపురాణమని ప్రత్యేక పురాణాలు ఉన్నప్పటికీ వారిరువురి అర్థం తెలిస్తే భేదభావం ఉండదు. భగవంతుడు కలహించడు. కలహం మతవాదుల మధ్యనే. 'చేతులారంగ శివుని పూజింపడేని' నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని' – చేతులారా శివుని పూజించి, నోటితో హరికీర్తన చేయమంటూ పోతన పద్యకవితలో అంతరార్థం కూడా ఇదే. శ్రీకృష్ణుడు ఉపమన్యువు వద్ద శివదీక్షను స్వీకరించినట్లు మహాభారతంలో అనుశాసనిక పర్వంలో వ్రాయబడింది. శివుడు

శ్రీరామనామరసికుడు, విష్ణువల్లభుడు. ఒకరినొకరు గౌరవించుకున్నారంటే అర్థం – ఒకరికంటే ఒకరు తక్కువ అనికాదు. ఇద్దరూ సమానమని ఉపాలకుల కోసం, లోకనిర్వహణ కోసం రెండుగా వ్యక్తమైన ఒకే తత్త్వమని బోధ.

## బాణాసురుడు రెండవసారి యుద్ధానికి వచ్చుట

సీ. కమనీయ కింకిణీఘంటికా సాహస్ర ఘణఘణధ్వనిచేత గగన మ గల
నన్యజనాలోక నాభీలతరళోగ్ర కాంచనధ్వజపతాకలు వెలుంగఁ
బృథునేమి ఘట్టనఁ బృథివి కంపింపంగ వలనొప్పు పటుజవాశ్వములఁ బూన్చి
నట్టి యున్నత రథం బత్యుగ్రగతి నెక్కి కరసహస్రమున భీకరతరాసి

తే. శర శరాననముఖ దివ్యసాధనములు, దనరఁ జలమును బలము నుత్కటము గాఁగ హర్ష
మిగురొత్తఁ గయ్యంపు టాయితమునఁ, బురము వెలువడె బలిపుత్రుఁ డురుజవమున.

434

తా ॥ సుందరమైన చిరుగంటల ఘణ ఘణ ధ్వనితో ఆకాశం బ్రద్దలవుతుండగా, శత్రువులకు భయాన్ని కలిగిస్తూ బంగారు జెండాలు తళతళమని మెరుస్తుండగా, రథచక్రాల ఘట్టనతో భూమి కంపిస్తుండగా, మిక్కిలి వేగవంతమైన అశ్వాలు కట్టి ఉన్న ఎత్తైన రథాన్ని ఒక్క ఉదుటన ఎక్కి, తన వేయి చేతులలోను మహాభీకరమైన ఖడ్గాలను, బాణాలను, ధనుస్సులను, ఇతరమైన దివ్యాయుధాలను ధరించి పట్టుదలతో, మిక్కిలి బలాఢ్యుడై యుద్ధం చేయాలనే ఉత్సాహంతో మనస్సులో సంతోషం ఉప్పొంగుతుండగా బలిచక్రవర్తి కుమారుడైన బాణాసురుడు శోణపురాన్ని వదిలి యుద్ధరంగానికి వచ్చాడు.

క. చని రణభూమిని మధ్యం, దిన మార్తాండ ప్రచండ దీప్తాకృతితోఁ దనరుచుఁ
బరిపంథిబలేం, ధన దవశిఖీయైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్.

435

తా ॥ వచ్చిన బాణుడు మిట్టమధ్యాహ్న సమయంలో మండిపడే సూర్యతేజస్సుతో ప్రకాశిస్తూ, శత్రువుల బలగాలనే కట్టెలను కాల్చే అగ్నిజ్వాలా అనే విధంగా వెలిగిపోతున్న

కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు.

ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొ
క్కూఁకున వేయిచేతుల మహోగ్రశరావళి పింజ పింజతోఁ
దాఁకఁగ నేసినన్ మురవిదారుఁడు తోడన తచ్ఛరావళి
న్నాఁక గొనంగఁ ద్రుంచె నిశితార్ధశశాంక శిలీముఖంబులన్.

436

తా ॥ బాణాసురుడు తన శౌర్యప్రతాపాలు ఉట్టిపడేటట్లు ఒక్కసారిగా వేయి చేతులనుండి బాణవర్షాన్ని కురిపించాడు. భయంకరమైన ఆ బాణాలు గుట్టలు గుట్టలుగా కృష్ణుడిపైకి వస్తుంటే వాటినన్నింటినీ తనను తాకకముందే మధ్యలో అర్ధచంద్రాకృతిలో ఉన్న బాణాలతో కృష్ణుడు త్రుంచివేశాడు.

వ. అంత.

437

తా ॥ అప్పుడు—

చ. నుతనవ పుండరీకనయనుం డన నొప్పు మురారి రోష ఘూ
ర్ణిత మహితారుణాబ్జదళ నేత్రుఁడు దా నటు పంచె దైత్యుపై
దితిసుత కాననప్రవర దీపితశుక్రము రక్షితాంచితా
శ్రితజన చక్రమున్ సతతసేవితశక్రము దివ్యచక్రమున్.

438

తా ॥ పుండరీకాక్షుడని స్తుతింపబడే శ్రీకృష్ణుని తెల్లని నేత్రాలు బాణుడి మీది కోపంతో ఎఱ్ఱబడి పోయాయి. అప్పుడాయన అరుణకమలాక్షుడా అన్నట్లున్నాడు. దితీ దేవి పుత్రులైన

రాక్షసులనే అరణ్య సమూహాన్ని దగ్ధంచేసే అగ్నిజ్వాల వంటిది, భక్తజనసంతతిని రక్షించేది, దేవేంద్రాది దేవతలచేత ఎల్లప్పుడూ పూజింపబడేది, దివ్యమైనది అయిన తన సుదర్శన చక్రాన్ని శ్రీకృష్ణుడు విరోధి అయిన బాణాసురుడి మీద ప్రయోగించాడు.

వ. అదియునుం బ్రచండమార్తాండమండల ప్రభావిడంబితంబును, భీషణ శతసహస్రకోటి దంభోళి నిష్ఠుర నిబిడ నిశిత ధారాసహస్ర ప్రభూత జ్వలన జ్వాలికాపాస్త సమస్తకుటిల పరిపంథి దుర్వార బాహాఖర్వ గర్వాంధకారంబును, సకల దిక్పాల దేవతాగణ జేగీయమానంబును, సమదదానవజన శోకకారణ భయంకర దర్శనంబును, సమంచిత సజ్జనలోక ప్రియంకర స్పర్శనంబును నగు సుదర్శనం బసురాంతక ప్రేరితంబై చని, యారామకారుండు కదళికా కాండంబుల నేర్చు చందంబునం బేర్చి సమద వేదండశుండా దండంబుల విడంబించుచుఁ గనకమణివలయ కేయూరకంకణాలంకృతంబు నగు తదీయ బాహాసహస్రంబుఁ గరచతుష్టయావశిష్టంబుగాఁ దునుము నవసరంబున.

439

తా ॥ తీక్ష్ణమైన సూర్యబింబ ప్రభలకన్న ఎక్కువైన తేజస్సుతో కూడినది; మహాభయంకరమైన లక్షకోట్ల వజ్రాయుధ ధారలనుండి పుట్టిన అగ్నిజ్వాలలవంటి మంటలతో దుష్టులు, దుర్మార్గులు, దుర్వారులు అయిన శత్రువుల భుజబలగర్వమనే చీకటిని పారద్రోలేది; సర్వదిక్పాలకులచేత, సమస్త దేవతా గణం చేత స్తోత్రం చేయబడేది; మదోన్మత్తులైన రాక్షసులకు భయంకరంగా దర్శనమిస్తూ వారికి దుఃఖాన్ని కలిగించేది; సద్భక్తజనానికి స్పర్శమాత్రం చేత ప్రియాన్ని కలిగించేది; అయిన సుదర్శనమనే పేరుగల చక్రాయుధం శ్రీకృష్ణునిచేత ప్రయోగింపబడి బాణాసురుడి మీదకు పరుగుపరుగున వెళ్ళింది. మదపుటేనుగుల తొండాలను ధిక్కరిస్తూ; మణులతో పొదిగిన బంగారు కంకణాలతో, భుజకీర్తులతో శోభాయమానంగా అలంకరింపబడిన బాణుని వేయి చేతులలో నాలుగు చేతులు మాత్రం మిగిల్చి మిగిలిన వాటినన్నింటిని తోటమాలి అరటిచెట్లను నరికివేసే విధంగా ఖండించివేసింది.

## శివుడు బాణున్ని రక్షింప శ్రీకృష్ణణ్ణి స్తుతించుట

తే. కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ గలఁడు, గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ గదియ వచ్చి
పురుషసూక్తంబు జదివి సంపుటకరాబ్జుఁ, డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని స్తుతించె.

440

తా ॥ సుదర్శన చక్రం ఆ విధంగా బాణుడి చేతులు నరికివేయగానే, బాణుని మీద ఉన్న వాత్సల్యాతిశయంతో పరమేశ్వరుడు కృష్ణుని వద్దకు వచ్చాడు. వచ్చి శ్రీకృష్ణుణ్ణి, ఆ మహావిష్ణువును పురుషసూక్తంతో స్తోత్రం చేశాడు. రెండు చేతులూ జోడించి శ్రీకృష్ణుణ్ణి ఇంకా ఈ విధంగా స్తుతించాడు:

వ. 'దేవా! నీవు బ్రహ్మరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిల వేద వేదాంత నిగూఢుండవు, నిర్మలుండవు, సమానాధిక రహితుండవు, సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైనవార లాకాశంబు పగిది నవలోకింతు, రదియునుం గాక పంచోపనిషన్మయం బయిన భవదీయ దివ్యమంగళ మహావిగ్రహ పరిగ్రహంబు సేయు నెడ నాభియం దాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబునఁ జంద్రుఁడును, బాదంబుల వసుంధరయు, నాత్మయం దహంకారంబును, జఠరంబున జలధులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మహీరుహౌషధీవ్రాతంబును, శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు నవాంతర ప్రజాపతులును, హృదయంబున ధర్మంబును గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబు కొఱకు నీ యకుంఠిత తేజంబు గుప్తంబు సేసి జగదుద్భవంబు కొఱకుఁ గైకొన్న భవదీయ దివ్యావతారవైభవం బెఱింగి నుతింప నెంతవారము; నీవు సకల చేతనాచేతన నిచయంబులకు నాద్యుండవు, అద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టి హేతుభూతుండవు, ఈశ్వరుండవు, దినకరుండు కాదంబినీ కదంబావృతుం డగుచు

భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచు విధంబున నీ యఘటితఘటనా నిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండ వయ్యును సత్త్వాదిగుణ వ్యవధానంబుల ననేక రూపుండవై గుణవంతులైన సత్పురుషులకుఁ దమోనివారకంబైన దీపంబు రూపంబునం బ్రకాశించుచుందువు, భవదీయమాయా విమోహితు లయిన జీవులు పుత్ర దార గృహ క్షేత్రాది సంసారరూపకంబైన పాప పారావారమహావర్త గర్తంబుల మునుంగుచుం దేలుచుందురు, దేవా! భవదీయ దివ్యరూపానుభవంబు సేయంజాలక యింద్రియపరతంత్రుండై భవత్పాద సరసీరుహంబులఁ జేర నెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుం డనంబడు, విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైన నిన్ను నొల్లక యింద్రియార్థానుభవంబు సేయుట యమృతంబు మాని హాలాహలంబు సేవించుట గాదె? జగదుదయపాలన లయ లీలాహేతుండవై శాంతుండవయి సుహృజ్జన భాగధేయుండవై సమానాధిక వస్తుశూన్యుండవైన నిన్ను నేనును బ్రహ్మయుం బరిణతాంతః కరణులైన మునిగణంబులును భజియించుచుందుము, మఱియును.

441

తా ॥ "దేవా! నీవు పరబ్రహ్మస్వరూపుడవైన జ్యోతిర్మయుడవు. సకలవేదాలు, సర్వవేదాంతాలు నిగూఢంగా కలిగి ఉన్నవాడవు. నిర్మలమైనవాడివి. నీతో సరిసమానులైన వారు నీకన్న అధికులైనవారు లేనివాడివి. సర్వమునందు వ్యాపించి ఉన్నావు. అటువంటి నిన్ను నిర్మలమైన మనస్సు గలవారు ఆకాశాన్ని దర్శించినట్లు దర్శిస్తారు. అంతేకాక నీవు అయిదు ఉపనిషత్తులతో కూడి ఉన్న నీ యొక్క దివ్యమంగళ మహారూపాన్ని స్వీకరించినప్పుడు నీ నాభిలో ఆకాశాన్ని, ముఖంలో అగ్నిని, శిరస్సులో స్వర్గాన్ని, చెవులలో దిక్కుల్ని, కళ్ళలో సూర్యుణ్ణి, మనస్సులో చంద్రున్ని, పాదములలో భూమిని, ఆత్మలో అహంకారాన్ని, కడుపులో సముద్రాలను, రేతస్సులో నీటిని, బాహువులలో ఇంద్రున్ని, రోమములలో చెట్లను, ఔషధులను; తలవెంట్రుకలలో బ్రహ్మలను; జ్ఞానంలో సృష్టిని, ప్రజాపతులను; హృదయంలో ధర్మాన్ని కలిగి విశ్వరూపుడుగా కొలవబడతావు. లోకాన్ని సృష్టించడం కోసం అకుంఠితమైన నీ దివ్యతేజస్సును

గుప్తంగా ఉంచుతావు. ఈ విశ్వమేర్పడటానికి నీవు ధరించిన అవతారాల వైభవాన్ని తెలుసుకోవడానికిగాని, వర్ణించడానికిగాని, వినుతించడానికిగాని మేమెంతవాళ్ళం? నీవు సమస్తప్రాణులకు, అప్రాణులకు ఆదిపురుషుడవు. అద్వితీయుడవు. పురాణపురుషుడవు. సకల సృష్టికి కారణభూతుడవు. అందరికీ, అన్నిటికీ ప్రభుడవు.

సూర్యభగవానుడు మేఘసమూహంచేత కప్పబడి, అనేక రూపాలలో, అనేక కాంతులలో కనబడే విధంగా సంకల్పమాత్రం చేతనే త్రిగుణాలకు అతీతుడవై ఉండి కూడా సత్త్వరజస్తమోగుణాలను కలిగి అనేక రూపాలలో ద్యోతకమౌతుంటావు. గుణశీలురైన సజ్జనుల అజ్ఞానాంధకారాన్ని తొలగించే దీపంలా ప్రకాశిస్తుంటావు. నీ యొక్క మాయలో మునిగిపోయిన జీవులు – పుత్రులతో, భార్యతో, గృహంతో, పొలాలతో నిండి ఉండే సంసారమనే పాపసముద్రపు సుడులలో మునిగి తేలుతుంటారు. దేవా! నీ యొక్క దివ్యమంగళరూప దర్శనం చేయలేక ఇంద్రియ సుఖాలలో తేలియాడే మూఢజనుడు నీ పాదపద్మాలను చేరుకోలేని ఆత్మవంచకుడు. భక్తప్రియుడవైన నిన్ను సేవించకుండా, విపరీతమైన బుద్ధితో ఇంద్రియ సుఖాలకోసం వెదకులాడటం అమృతపానం మాని హాలాహలాన్ని భక్షించడమే అవుతుంది గదా! సృష్టి స్థితి లయకారుడవై, శాంతమూర్తివై, సజ్జన సద్భక్తులకు భాగ్యరూపుడవై, సమానాధిక రహితుడవై వెలుగొందుతున్న నిన్ను; నేను, బ్రహ్మదేవుడు, నిష్కాములైన మహర్షులు ఎల్లవేళలా కొలుస్తుంటాం.

తే. అవ్యయుండ, వనంతుండ, వచ్యుతుండ, వాదిమధ్యాంత శూన్యుండ, వఖీలధృతివి
నిఖీలమం దెల్ల వర్తింతు వీవు దగిలి, నిఖీలమెల్లను నీయంద నెగడుఁ గృష్ణ!

442

తా ॥ దేవా! నీవు అవ్యయుడవు. అనంతుడవు. అచ్యుతుడవు. మొదలు, నడిమి, తుద అనేవి లేనివాడివి. స్థిరమైనవాడివి. విశ్వమంతటా నీవుంటావు. నీలోనే విశ్వమంతా ఉంటుంది.

సీ. అని సన్నుతించిన హరి యాత్మ మోదించి మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
లలిత బాలేందు కళామౌళి కిట్లను శంకర! నీ మాట సత్య మరయ
నేది నీకిష్టమై యెసఁగెడు దానిన వేఁడుము, నీ కిత్తు వీఁ డవధ్యుఁ,
డిది యెట్టి దనినఁ బ్రహ్లాదుండు మద్భక్తుఁ, డతనికి వరము నీ యన్వయమున

తే. జనన మందిన వారలఁ జంప' ననుచుఁ, గడఁక మన్నించితిని యది కారణమున
విశ్వవిశ్వంభరాభార విపులభూరి, బలభుజాగర్వ మడఁపంగ వలయుఁ గాన.

443

తా ॥ మహేశ్వరుడు శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా స్తుతించగా, ఆ శ్రీహరి మనస్సులో ఆనందించాడు. చిరునవ్వులు చిందిస్తూ శివుణ్ణి చూసి "శంకరా! నీవన్నది నిజం సుమా! నీకేది ఇష్టమైతే అది అడుగు. నీ కోరిక తప్పక తీరుస్తాను. నీ ప్రియ భక్తుడైన బాణుదున్నాడే! వీడు వధింపదగినవాడు కాదు. ఎందుకంటావేమో! విను. నా భక్తుడైన ప్రహ్లాదుడికి ఒక వరమిచ్చాను. అదేమంటే "నీ వంశంలో పుట్టిన వారినెవరినీ చంపను" అని. అందుచేత బాణాసురుణ్ణి మన్నించి వదిలివేశాను. అయినా, భూభారాన్ని అంతటినీ, తన భుజాలమీద మోస్తున్నాని, నీవిచ్చిన బలోపేతమైన సహస్రభుజాలున్నాయన్న గర్వంతో అహంకరించిన ఈ అసురుని మదమణచి తీరాలి.

క. కరములు నాలుగు సిక్కం, బరిమార్చితి, వీఁడు నీదు భక్తుల కగ్రే
సరుఁడై పొగడొంది జరా, మరణాది భయంబు దక్కి మను నిట మీఁదన్.

444

తా ॥ ఆ కారణంచేత బాణుడికి నాలుగు చేతులే మిగిలేటట్లు చేసి మిగిలిన చేతులన్నింటినీ నరికివేశాను. భవిష్యత్తులో ఈ బాణాసురుడు వార్ధక్యభయం, మరణభయం లేకుండా సురక్షితంగా ఉంటాడు. అంతేకాక నీ భక్తులందరిలోను ప్రథముడిగా, ప్రధానుడిగా కీర్తికెక్కుతాడు."

వ. అని యాన తిచ్చిన నంబికావరుండు సంతుష్టాంతరంగుం డయ్యె, న బ్బలినందనుం డట్లు రణరంగ వేదిం గృష్ణదేవతా సన్నిధిం బ్రజ్వలిత చక్రకృశాను శిఖాజాలంబులందు నిజబాహాసహస్ర శాఖాసమిత్ప్రచయంబును, దత్క్షతోద్వేలకీలాల మహితాజ్యధారాశతంబును, బరభయంకర వీరహుంకార మంత్రంబులతోడ వేల్చి పరిశుద్ధిం బొంది విజ్ఞానదీపాంకురంబున భుజాఖర్వ గర్వాంధకారంబు నివారించినవాఁడై యనవరత పూజిత స్థాణుండగు న బ్బాణుండు భుజవన విచ్ఛేదజనిత విరూపితస్థాణుం డయ్యును దదీయవరదాన కలితానంద హృదయారవిందుం డగుచు గోవింద చరణారవిందంబులకుఁ బ్రణామంబు లాచరించి యనంతరంబ.

445

తా ॥ శ్రీకృష్ణుడు ఈ విధంగా వరమివ్వడంతో శంకరుడు ఆనందభరితుడయ్యాడు. బాణుడు రణరంగమనే యజ్ఞవాటికలో కృష్ణుడనే దేవతా సన్నిధియందు జాజ్వల్యమానంగా వెలుగుతున్న చక్రాగ్ని శిఖలలో తన బాహువులనే సమిధలను, ఖండింపబడిన చేతులనుండి కారుతున్న రక్తధారలనే ఆజ్యధారలను, శత్రుభయంకరమైన హుంకార ధ్వనులనే మంత్రాలతో వేల్చి పవిత్రుడైనాడు. విజ్ఞానమనే దీపంతో భుజబలంవల్ల ఏర్పడిన గర్వాంధకారం నుంచి బయటపడ్డాడు. శివపూజా ధురంధరుడైన బాణసార్వభౌముడు భుజాలు విచ్ఛేదమైనా, విరూపి అయినా పరమేశ్వరుని వరంతో సంతృప్తుడై శ్రీకృష్ణుని పాదపద్మాలకు నమస్కరించాడు.

## ఉష, అనిరుద్ధులతో కృష్ణుడు ద్వారకాపురి చేరుట

క. పురమున కేగి యుషా సుం, దరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం
బర దాసదాసికాజన, వరవస్తువితాన మొసఁగి వారని భక్తిన్.

446

క. కనకరథంబున నిడుకొని, ఘనవైభవ మొప్పఁ గన్యకా యుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం, డనుమోదింపఁ దెచ్చి యర్పించె నృపా!

447

తా ॥ అప్పుడు బాణాసురుడు శోణపురానికి వెళ్ళి పరమానందంతో తన కుమార్తె అయిన ఉషాసుందరికి, ప్రద్యుమ్న పుత్రుడైన అనిరుద్ధునికి అనేకానేక భూషణాలను, నూతన వస్త్రాలను, దాసదాసీజనాన్ని, మంచి మంచి వస్తువులను అరణంగా ఇచ్చి బంగారు రథంమీద వారిని ఎక్కించి మిక్కిలి వైభవోపేతంగా కృష్ణుడి దగ్గరకు తీసుకొని వచ్చి ఉషానిరుద్ధులనిద్దరినీ ఆ దేవదేవుడికి అప్పగించాడు. దానితో శ్రీకృష్ణుడు ఎంతగానో సంతోషించాడు.

ఉ. అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణు నిల్పి య
త్యంత విభూతిమై నిజబలావళితోఁ జనుదేర నా యుషా
కాంతుఁడు మున్నుగాఁ బటహ కాహళ తూర్యనినాద పూరితా
శాంతరుఁడై వెసం జనియె నాత్మపురీముఖుఁడై ముదంబునన్.

448

తా ॥ ఆ తరువాత శ్రీకృష్ణుడు ద్వారకానగరానికి బయలుదేరాడు. శంకరునికి ఇక తాను వెళ్ళివస్తానని చెప్పాడు. శోణపురాధిపతిగా బాణాసురుణ్ణి అక్కడే సుఖంగా ఉండమని ఆనతిచ్చాడు. మహావైభవోపేతంగా పటహకాహళతూర్య మంగళధ్వనులు మారుమ్రోగుతుండగా, యాదవవీరులందరూ వెంటనంటి కొలిచి వస్తుండగా, అనిరుద్ధున్ని

ముందు పెట్టుకొని శీఘ్రమే ద్వారకకు చేరుకొన్నాడు.

మ. కనియెన్ గోపకుమారశేఖరుఁడు రంగత్ఫుల్లరాజీవ కో
కనదోత్తుంగ తరంగసంగత లసత్కాసారకన్ భూరి శో
భన నిత్యోన్నత సౌఖ్యభారక నుదంచద్వైభవోదారకన్
జనసంతాప నివారకన్ సుజనభాన్వత్తారకన్ ద్వారకన్.

449

తా ॥ యాదవ కులాన్ని ప్రకాశింపచేసిన శ్రీకృష్ణుడు చక్కగా విచ్చుకొని ఉన్న పద్మాలతో, కలువపూలతో నిండి ఉండి, ఉత్తుంగతరంగాలతో చూడముచ్చటగా ఉన్నటువంటి సరోవరాలతో వెలుగొందుతున్నది; సుఖసంతోషాలకు, భోగభాగ్యాలకు నిత్యం పెట్టింది పేరుగా శోభాయమానంగా విలసిల్లుతున్నటువంటిది; జనుల సమస్త బాధలను నివారించేది, సజ్జనులతో ప్రకాశిస్తున్నది అయిన ద్వారకా నగరాన్ని చూశాడు.

వ. కని డాయం జనఁ బురలక్ష్మి కృష్ణసందర్శన కుతూహలయై చేసన్నలం జీరు చందంబున నందంబు నొందు నుద్ధూతతరళ విచిత్ర కేతుపతాకాభిశోభితంబును, మహనీయ మరకత తోరణ మండితంబును, గనకమణి వినిర్మిత గోపురసౌధప్రాసాద వీథికావిలసితంబును, మౌక్తిక వితాన విరచిత మంగళ రంగవల్లీ విరాజితంబును, శోభనాకలిత విన్యస్త కదళికాస్తంభ సురభి కుసుమమాలి కాక్షతాలంకృతంబును, గుంకుమ సలిల సిక్త విపణిమార్గంబును, శంఖ దుందుభి భేరీ మృదంగ పటహకాహళ మృదంగాది మంగళారావకలితంబును, వందిమాగధ సంగీత ప్రసంగంబునునై యతిమనోహర విభవాభిరామంబైన య పురవరంబు సచివ పురోహిత సుహృద్బాంధవ ముఖ్యులెదురుకొన భూసురాశీర్వాదంబులను బుణ్యాంగనా కరకలిత లలితాక్షతలను గైకొనుచుం గామినీమణులు గర్పూరనీరాజనంబులు నివాళింప నిజమందిరంబుం బ్రవేశించి య పుండరీకాక్షుండు పరమానందంబున సుఖం బుండె, నంత.

తా ॥ చూసి ద్వారకను సమీపించాడు. నగరంలోని భవనాలమీద ఉంచిన జెండాలతో పురలక్ష్మి శ్రీకృష్ణుణ్ణి చూడాలనే కుతూహలంతో రారమ్మని ఆహ్వానిస్తోంది. ఎక్కడ చూసినా ఆ నగరంలో మరకతమణులతో కట్టిన తోరణాలే. మణులతో కూర్చి నిర్మించిన బంగారు గోపురాలు, సువర్ణసౌధాలు ఆ నగరానికి మరింత శోభనిస్తున్నాయి. ఇరువైపులా బంగారు మేడలతో విలసిల్లుతున్న వీథులనిండా రంగురంగుల ముత్యాలతో ఏర్చికూర్చి వేసిన మంగళప్రదమైన ముగ్గులు మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తున్నాయి. నగరంలో అక్కడక్కడ కట్టిన అరటి స్తంభాలు, పూల మాలల సువాసనలతో, శుభప్రదమైన అక్షతలతో నిండి చూపరులను ఆకర్షిస్తున్నాయి. మంగళద్రవ్యమైన కుంకుమతో తడిసి విపణివీథులు స్వాగతాన్ని పలుకుతున్నాయి. ఎటుచూసినా మంగళ వాద్యాలే. శంఖదుందుభి భేరీ మృదంగపటహకాహళ ధ్వనులు మిన్నుముట్టుతున్నాయి. వందిమాగధులు శ్రీకృష్ణునికి ఎదురువచ్చి కైవారాలు చేసి, గానం చేశారు. అత్యంత వైభవంతో ఎంతో మనోహరంగా ఉన్న ఆ ద్వారకానగరంలోకి ప్రవేశించగానే మంత్రులు, మిత్రులు, బంధువులు, పురోహితులు మొదలైనవారంతా కృష్ణుడికి భక్తిప్రేమలతో సుస్వాగతం చెప్పారు. బ్రాహ్మణోత్తములు శుభాశీస్సులు అందించారు. ముత్తైదువులు మంగళాక్షతలు చల్లారు. సుందరీమణులు కర్పూర హారతులిచ్చారు. ఆనందంతో అన్నింటినీ స్వీకరించి శ్రీకృష్ణుడు నిజనివాసంలో సుఖంగా కాలంగడిపాడు.

క. శ్రీకృష్ణుని విజయం బగు, నీ కథఁ బఠియించువార లెప్పుడు జయముం
గై కొని యిహపరసౌఖ్యము, లాకల్పోన్నతి వహింతు రవనీనాథా!

451

తా ॥ శ్రీకృష్ణుని విజయవైభవాన్ని తెలియజెప్పే ఈ కథను చదివినవారికి ఎప్పుడూ జయం కలుగుతుంది. కల్పాంతం వరకూ ఇహలోక సౌఖ్యాలు, పరలోకసౌఖ్యాలు అన్నీ లభిస్తాయి.

క. అని చెప్పిన శుకయోగికి, జననాయకుఁ డనియెఁ 'గృష్ణచరితము విన నా
మన మెపుడుఁ దనియ దింకను, విన వలతుం గరుణఁ జెప్పవే మునినాథా!'

452

తా ॥ శుకయోగి పరీక్షిన్మహారాజుకు కృష్ణ విజయగాథను ఈ విధంగా వివరించి చెప్పాడు: అప్పుడు పరీక్షిత్తు శుకుణ్ణి చూసి "మహాత్మా! శ్రీకృష్ణుని చరిత్ర వింటుంటే నా మనస్సు ఎప్పుడూ తృప్తిచెందదు. ఇంకా, ఇంకా వినాలనే ఉంటుంది. నా మీద దయదలచి శ్రీకృష్ణుని మహిమల గురించి ఇంకా చెప్పండి స్వామీ!" అని ప్రార్థించాడు.

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

453

తా ॥ వినయత్తముడైన పరీక్షిత్తు శుకమహర్షిని ఆ విధంగా అడిగేసరికి ఆ మహానుభావుడు ఈ విధంగా చెప్పసాగాడు:

# నృగమహారాజు చరిత్ర

సీ. ధరణీశ! యొకనాఁడు హరితనూజులు రతీశ్వర సాంబ సారణ చారుభాను
లాదిగా యదుకుమారావలి యుద్యాన వనమున కతివైభవమున నేగి
వల నొప్ప నిచ్ఛానువర్తులై సుఖలీలఁ జరియించి ఘనపిపాసలను జెంది
నెఱి దప్పి సలిల మన్వేషించుచును వేగ వచ్చుచో నొకచోట వారిరహిత

తే. కూపమును నందులో నొక కొండవోలె, విపుల మగుమేని యూసరవెల్లిఁ గాంచి
చిత్తముల విస్మయం బంది తత్తఱమున, దాని వెడలించు వేడుక దగులుటయును.

454

తా ॥ "ఓ పరీక్షిన్మహారాజా! ఒకరోజున ఏం జరిగిందంటే ప్రద్యుమ్నుడు, సాంబుడు, సారణుడు, చారుభానుడు మొదలైన యాదవకుమారులు విహరించాలనే కుతూహలంతో ఉద్యానవనానికి వెళ్ళారు. అతివైభవంతో, ఉత్సాహంతో సంతోషంతో ఆ ఉద్యానవనంలో ఇచ్ఛ వచ్చినట్లుగా సుఖంగా కాలం గడిపారు. కొంతసేపు గడిచిన తరువాత వారందరికీ బాగా దాహం వేసింది. నీటికోసం వనమంతా వెదికారు. తిరగగా తిరగగా ఒక చోట వాళ్ళకు నీళ్ళులేని బావి కనబడింది. ఆ పాడుబడ్డ బావిలో కొండలాగా పెద్ద శరీరంతో ఉన్న ఊసరవెల్లి కనిపించింది. ఊసరవెల్లిని చూడగానే విస్మయం కలిగింది. దానిని బావినుంచి బయటకు తీద్దామనుకొన్నారు.

చ. పరువిడి పోయి తెచ్చి ఘనపాశచయంబుల నంటఁగట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి కోయని యార్చుచు దాని నెమ్మెయిం
దరలఁగఁ దీయలేక దగ దట్టముగా మది దుట్టగిల్ల నొం
డొరు గడవంగ వే చని పయోరుహనాభున కంతఁ జెప్పినన్.

455

తా ॥ అంతే. పరుగుపరుగున వెళ్ళి పెద్దపెద్ద త్రాళ్ళు తెచ్చారు. బలశాలులైన ప్రద్యుమ్నుడు మొదలైన వారంతా "కో" అని అరుస్తూ, తమ భుజబలాన్నంతటినీ పెట్టి ఆ త్రాళ్ళతో ఊసరవెళ్ళిని కట్టి బావిలోనుంచి బయటకు తీయడానికి విశ్వప్రయత్నం చేశారు. ఎంత కష్టపడ్డా దానిని లాగలేకపోయారు. తీయలేకపోయినందుకు మనస్సులో చాలా బాధపడ్డారు. ఇక లాభం లేదనుకొని ఒకరినొకరు తోసుకుంటూ తొందరతొందరగా శ్రీకృష్ణుడి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పారు.

ఉ. విని సరసీరుహాక్షుఁ డతివిస్మితుఁడై జలశూన్యకూప మ
ల్లన కదియంగ నేఁగి కృకలాసము నొక్కతృణంబుఁ బోలె గొ
బ్బున వెడలించె వామకర పద్మమున న్నది యంతలోనఁ గాం
చనరుచి మేనఁ గల్గు పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్.

456

తా ॥ యదుకుమారులు చెప్పినదంతా విని శ్రీకృష్ణుడు ఆశ్చర్యపోయి, ఆ నీళ్ళులేని బావిదగ్గరకు వెళ్ళాడు. ముదిరి ఊసరవెల్లిగా మారిన ఆ తొండను కృష్ణుడు తన ఎడమచేతితో ఒక గడ్డిపరకను లాగితీసినట్లు క్షణంలో బయటకు తీశాడు. బయటకు లాగబడిన మరుక్షణంలో ఊసరవెల్లి కాస్తా పచ్చని బంగారు కాంతితో మెరిసిపోతూ పురుషరూపాన్ని ధరించి నిల్చుంది.

వ. చూచి కృష్ణుం డతని వృత్తాంతం బంతయు నెఱింగియు నక్కడి జనంబులుం గుమారవర్గంబును దెలియుకొఱకు నతని చేతఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగించువాఁడై యిట్లనియె.

457

తా ॥ ఊసరవెల్లి కథంతా తెలిసి కూడా అక్కడ గుమికూడిన జనులు, యాదవకుమారులు దానిని తెలుసుకొనేటందుకు ప్రత్యక్షమైన పురుషుడి చేతనే ఆ

వృత్తాంతమంతా చెప్పించాలనుకొని శ్రీకృష్ణుడు అతనితో ఈ విధంగా అన్నాడు:

చ. కనదురు రత్నభూషణ నికాయుఁడవై మహనీయ మూర్తివై
యనుపమకీర్తి శోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిన నీకు నేమి గతి నూసరవెల్లితనంబు చొప్పడెన్
విన నిది చోద్యమయ్యె సువివేకచరిత్ర! యెఱుంగఁ జెప్పుమా!'

458

తా ॥ "రత్నములతో చేయబడిన బంగారు భూషణాలతో వెలిగిపోతూ, సాటిలేని కీర్తితో విలసిల్లిన మహనీయుడవైన నీకు, ఈ ఊసరవెల్లి తనం ఎందుకు వచ్చింది? చక్కని వివేకవంతమైన చరిత్రతో శోభిల్లిన నీవు, ధరణి మీద నీ అంతవాడు లేడని పేరుతెచ్చుకొన్న నీవు ఇలా మారడం ఆశ్చర్యంగా ఉంది. అసలు ఏం జరిగిందో, ఎందుకిలా ఉన్నావో తెలియజెప్పు" అని శ్రీకృష్ణుడు అడిగాడు.

క. అని యడిగిన మురరిపు పద, వనజంబులఁ దన కిరీటవరమణు లొరయన్ వినయమున
మ్రొక్కి యిట్లను, ఘనమోదముతోడ నిటల ఘటితాంజలియై.

459

తా ॥ ఆ విధంగా శ్రీకృష్ణుడు అడగగానే ఆ పురుషుడు మురారి పాదపద్మాలకు తన కిరీటంలోని మణిమాణిక్యాలు సోకేటట్లుగా వినయవంతుడై నమస్కరించి పరమానందభరితుడై రెండు చేతులూ ఫాలతలం పైన జోడించి ఆ పరమాత్ముడితో ఈ విధంగా అన్నాడు:

తే. విశ్వసంవేద్య! మహిత! యీ విశ్వమందుఁ, బ్రకటముగ నీ వెఱుంగని దొకటి గలదె
యైన నాచేత విన నిష్ట మయ్యెనేని, నవధరింపుము వినిపింతు నంబుజాక్ష!

460

తా ॥ "మహిత ప్రభావా! విశ్వంలో జరిగే విషయాలన్నీ తెలిసిన వాడా! ప్రభూ! ఈ సమస్త విశ్వంలో నీకు తెలియని విషయమంటూ ఒకటి ఉంటుందా? నా నోటి నుండి వినాలని నీకు ఇష్టమైతే నా కథంతా చెబుతాను. వినవలసింది దేవా!" అని చెప్పడం మొదలుపెట్టాడు—

శా. ఏ నిక్ష్వాకుతనూజుఁడన్ నృగుఁడు నా నేపారు భూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ గొల్చి స
మ్మానింపం జతురంత భూభరణసామర్థ్యుండనై సంతత
శ్రీ నిండారిన వాఁడ నుల్లసిత కీర్తిస్ఫూర్తి శోభిల్లఁగన్.

461

తా ॥ "శ్రీకృష్ణా! నేను ఇక్ష్వాకు మహారాజు పుత్రుడను. నన్ను 'నృగుడు' అని అంటారు. దీనజనులను ఎంతో ప్రేమతో కాపాడుతూ, సామంతరాజులు కొలుస్తుండగా నాలుగుదిక్కులా నిండి ఉన్న భూమినంతటినీ పరిపాలించాను. సమస్త సిరిసంపదలతో వర్ధిల్లాను. కీర్తిమంతుడనై విరాజిల్లాను.

చ. పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతకమందు ర టుండెఁ దారకా
వలి సికతావ్రజంబు హిమవారికణంబులు లెక్క పెట్టఁగా
నలవడుఁ గాని యేను వసుధామర కోటికి దాన మిచ్చు గో
వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ! యేమి సెప్పుదున్?

462

తా ॥ తనను తాను పొగడుకుంటూ మాట్లాడితే అది మహాపాపమని విజ్ఞులు చెబుతారు. కృష్ణా! నేను చెప్పుకోకూడదుగాని, నిజానికి, చుక్కలనైనా లెక్కపెట్టవచ్చును, ఇసుక రేణువులను లెక్కపెట్టవచ్చు, ఇంకా మాట్లాడితే మంచుబిందువులనైనా లెక్కపెట్టవచ్చు కాని, నేను బ్రాహ్మణోత్తములకు దానమిచ్చిన గోవుల సంఖ్య లెక్కపెట్టడం చివరకు బ్రహ్మకైన సాధ్యం

కాదన్నది అతిశయోక్తికాదు.

వ. అదియునుం గాక

463

తా ॥ అంతేకాకుండా—

చ. పొలుచు సువర్ణశృంగఖురముల్ దనరం దొలిచూలులై సువ
త్సలు గల పాఁడియావుల నుదాత్త తపోవ్రత వేదపాఠముల్
గలిగి కుటుంబులై విహితకర్మములం జరియించు వేద వి
ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా!

464

తా ॥ అచ్యుతా! మహాతపోనిష్ఠులై, వేదవిద్యలో ఆరితేరినావారై, శాస్త్రోక్త విధులను నిర్వహించే, కుటుంబీకులైన బ్రాహ్మణ వరులకు బంగారు కొమ్ములు, బంగారు గిట్టలతో ఒప్పుచు, తొలిచూలు జరగగానే దూడలతోడి ఉన్న పాడియావులను భక్తిపూర్వకంగా దానమిచ్చేవాడిని. నా వైభవానికి తగినట్లు దక్షిణలిచ్చి వారిని సంతృప్తి పరచేవాడిని.

వ. మఱియును న్యాయసముపార్జిత విత్తమ్ములగు గో భూ హిరణ్య రత్న నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజత శయ్యాది బహువిధ దానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితిఁ, బంచమహాయజ్ఞంబు లొనరించితి, వాపీ కూప తటాక వన నిర్మాణంబులు సేయించితి, ని వ్విధంబునం జేయుచో నొక్కనాఁడు.

465

తా ॥ మరొక విషయం. న్యాయమార్గంలో నేను సంపాదించిన గోవులను, భూమిని, సువర్ణమును, రత్నాలను, గృహాలను, రథాలను, ఏనుగులను, గుఱ్ఱాలను, కన్యలను, సరస్వతిని

(విద్యా), వస్త్రాలను, తిలలను, వెండిని మొదలైన అనేక దానాలు అనంతంగా చేశాను. పంచమహాయజ్ఞాలు చేసాను. ఇంకా బావులు, నూతులు, చెరువులు, తోటలు ఎన్నో నిర్మింపచేశాను. ఈ విధంగా ధర్మబద్ధంగా ప్రవర్తిస్తున్న సమయంలో ఒకనాడు—

క. అనఘా! మునుపడఁ గశ్యపుఁ, డను విప్రున కే నకల్మషాత్ముఁడనై యి
చ్చిన గోవు దప్పి నా మం, దను గలసినఁ దెలియలేక తగ నా గోవున్.

466

తా ॥ ఒక పొరపాటు జరిగిపోయింది. అదేమంటే పూర్వం కశ్యపుడనే ఒక బ్రాహ్మణోత్తముడికి నేను ఒక గోవును దానం చేశాను. నిర్మలమైన మనస్సుతోనే ఆ దానం చేశాను. కాని ఏం జరిగిందంటే నేను కశ్యపుడికిచ్చిన ఆవు తప్పిపోయి మళ్ళీ వచ్చి నా గోవులమందలో కలిసిపోయింది. ఆ విషయం నేను గ్రహించలేదు. గ్రహించక అదే గోవును వేరొక బ్రాహ్మణుడికి దానమిచ్చాను.

క. ఒండొక భూమీసుర కుల, మండనునకు దాన మీయ మసలక యా వి
ప్రుం డా గోవుం గొని చను, చుండన్ మును ధారగొన్న యుర్వీసురుఁడున్.

467

తా ॥ నేను రెండోసారి దానమిచ్చిన ఆ బ్రాహ్మణుడు గోవును తీసుకొని వెళుతుండగా, మొదట్లో దానధార పట్టిన బ్రాహ్మణుడికి చాలా కోపం వచ్చింది.

క. మది రోష మొదవ దోవతి, వదలిన బిగియించుకొనుచు వడిఁ గది 'సిది నా
మొదవు, నడివీధి దొంగిలి, వదలక కొనిపోయె, దిట్టివారుం గలరే?'

468

తా ॥ మొదటి బ్రాహ్మణుడు పట్టరానంత కోపముతో వదులుగా ఉన్న దోవతిని బిగించి

కట్టుకొంటూ తొందరతొందరగా రెండో బ్రాహ్మణుడి వద్దకు వెళ్ళి "ఇది రాజుగారు నాకిచ్చిన గోవు. నడివీథిలో తోలుకుపోతున్నావే! దొంగిలించావా? నీకు ఈ ఆవు ఎక్కడిది? చెప్పు. నీలాంటి వారు కూడా లోకంలో ఉంటారా?" అని అతనిని ఆపాడు.

ఛ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో 'నిపు దేను దీని నీ
జనపతిచేత ధారగొని సాధుగతిం జన నీది యంట యె?'
ట్లనిన నతండు 'నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా'
వని వినిపింప నిద్దఱకు నయ్యె నపార వివాద మచ్చటన్.

469

తా ॥ కశ్యపుడలా అనగానే "చూడు బ్రాహ్మణోత్తమా! నేను దేనినీ దొంగిలించలేదు. ఈ మహారాజుగారు ఈ ఆవును నాకు దానమిస్తే ఆ దానాన్ని పుచ్చుకొని నా దారిని నేను పోతున్నాను. ఈ ఆవును పట్టుకొని నా ఆవంటావేమిటి?" అని రెండవ బ్రాహ్మణుడు ఎదురుప్రశ్నవేసి తన తప్పేమీలేదని నిక్కచ్చిగా చెప్పాడు. దానితో కశ్యపుడు రెచ్చిపోయి "ఈ ఆవు నీదికాదయ్యా! రాజుగారు ఎప్పుడో నాకీ ఆవును దానమిచ్చారు. కాబట్టి ఈ గోవు నాదికాని, నీదికాదు." అని నిష్కర్షగా చెప్పడంతో ఆ ఇద్దరి బ్రాహ్మణుల మధ్య వాగ్వివాదం పెరిగిపోయింది.

వ. ఇట్లు విప్రు లిద్దఱుం దమలో నంతకంతకు మచ్చరంబు పెచ్చు పెరిఁగి కలహించి నా యున్న యెడకుం జనుదెంచిరి, మున్ను నాచేత గోదానంబు గొన్న బ్రాహ్మణుం డిట్లనియె.

470

తా ॥ వారిద్దరూ ఆ విధంగా క్రోధంతో, మాత్సర్యంతో "ఈ గోవునాది, నాది" అని కలహించారు. ఆ కలహం మితిమీరి పోయింది. ఒకరినొకరు గెలవలేక తీర్పుకోసం ఇద్దరూ కలిసి నా వద్దకు వచ్చారు. మొదటగా గోవును దానంగా గ్రహించిన కశ్యపుడిలా అన్నాడు:

సీ. 'మనుజేంద్ర! ప్రజ లధర్మ ప్రవర్తనముల నడవకుండఁగ నాజ్ఞ నడపు నీవు

మనమున నే ధర్మ మని యాచరించితి? మును నాకు నిచ్చిన మొదవు దప్పి
వచ్చి నీ మందలోఁ జొచ్చిన నిప్పు డీ భూసురునకు ధార వోసి యిచ్చి
తగవు మాలితివి, దాతవు నపహర్తవు నైన నిన్నేమందు? నవనినాథ!

తే. యనిన మాటలు సెవులు సోఁకినఁ గలంగి, భూసురోత్తమ! యజ్ఞానపూర్వకముగ
నిట్టి పాపంబు దొరసె నే నెఱిఁగి సేయఁ, గొనుము నీ కిత్తు నొక లక్ష గోధనంబు.'

471

తా ॥ "ఓ మహారాజా! ప్రజలనందరినీ ధర్మమార్గంలో నడిచే విధంగా రాజ్యమేలే నీవు ఈ విధంగా ఎందుకు చేశావు? నీవు నాకు దానం చేసిన ఆవు నా నుంచి తప్పించుకొని వచ్చి నీ మందలో చేరింది. న్యాయం తప్పి, నాకిచ్చిన ఆవును ఈ భూసురుడికి మళ్ళీ దానం చేశావు. ఇది అధర్మంకాదా? నీవు దాతవే! కాని, నా గోవును అపహరించావు. నిన్నేమనాలి రాజా? తీర్పు చెప్పే నీవే తగవుమాలితే ఏం చేయాలి?" అని కశ్యపుడన్న మాటలు నా చెవులలో ములుకులు లాగా గుచ్చుకొన్నాయి. చాలా బాధపడ్డాను.

ఆ బ్రాహ్మణున్ని చూసి "తెలియక తప్పు చేశాను. నా అజ్ఞానం వల్లనే ఈ పాపకార్యం జరిగింది. తెలిసి ఉంటే నీకిచ్చిన గోవును ఆ బ్రాహ్మణుడికిచ్చి ఉండేవాడిని కాను. ఇప్పుడు నీకు ఒక లక్షగోవులను ఇస్తాను. నా తప్పు మన్నించి ఈ లక్షగోవులను స్వీకరించు."

క. అని మఱియును న వ్విప్రుని, సునయోక్తుల ననునయింపుచును నిట్లంటిన్
ననుఁ గావు, నరకకూపం, బునఁ బడఁగా జాలఁ విప్రపుంగవ!' యనుచున్.

472

తా ॥ కశ్యపుడికి ఆ విధంగా చెప్పి ఎన్నో మంచిమాటలతో ఆయనను అనునయించాను. ఎంతగానో ప్రార్థించాను. "బ్రాహ్మణోత్తమా! నన్ను కాపాడు. నరకకూపంలోపడి ఆ యాతనను భరించలేను."

తే. ఎంత వేఁడిన మచ్చరం బంత పెరిఁగి, 'మొదల నా కిచ్చినట్టి యీ మొదవె కాని
యెనయ నీ రాజ్యమంతయు నిచ్చితేని, నొల్ల' నని విప్రుఁ డచ్చట నుండ కరిగె.

473

తా ॥ అని నేను ఎంతగా ప్రాధేయపడినా ఆ విప్రుడు నా మాట వినలేదు. ఆయనలో క్రోధం పెరిగిపోయింది. మాత్సర్యం అతిశయించింది. "మొదట్లో నీవు నాకిచ్చిన గోవునిస్తేనే తీసుకొంటాను. ఇక వేరేమీ తీసుకోను. చూడు రాజా! నీ రాజ్యమంతా నాకు ధారపోసినా నేను ఒప్పుకోను. నాకు నా గోవే కావాలి" అని చెప్పి క్షణం కూడా నా దగ్గర ఉండకుండా కశ్యపుడు వెళ్ళిపోయాడు.

వ. అ ట్లతం డరిగిన నా రెండవ బ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివే లేఁటి కోరిన పాఁడి మొదవుల నిచ్చిన నైనను 'దీనిన కాని యొల్ల' నని నిలువక చనియె, నంతఁ గాలపరిపక్వంబైన నన్ను దండధర కింకరులు గొనిపోయి వైవస్వతు ముందటం బెట్టిన నతండు నన్ను నుద్దేశించి యిట్లనియె.

474

తా ॥ కశ్యపుడు ఆ విధంగా వెళ్ళిపోగానే నేను రెండో బ్రాహ్మణున్ని ప్రార్థించాను. ఆయనకూడా పట్టువదలలేదు. "రాజా! మంచిగా ఉండే పాడియావులను ఏరి, పదివేల గోవులను నాకిచ్చినా నేను స్వీకరించను. ఈ ఆవునే తప్ప ఇంకవేటినీ నేను తీసుకోను" అని కోపంగా ఒక్క నిముషం కూడా నా వద్ద నిలవకుండా చకచకా వెళ్ళిపోయాడు. నాకేం చేయాలో పాలుపోలేదు. కొంతకాలం గడిచింది. నాకు చివరి దశ ప్రాప్తించింది. నన్ను యమభటులు తీసుకుపోయి యమధర్మరాజు ముందు నిలబెట్టారు. అప్పుడు యమధర్మరాజు నాతో ఇలా అన్నాడు:

మ. మనుజేంద్రోత్తమ! వంశపావన! జగన్మాన్యక్రియాచార! నీ

ఘనదాన క్రతుధర్మముల్ త్రిభువన ఖ్యాతంబులై చెల్లెడిన్,
మును దుష్కర్మఫలంబు నొంది పిదపం బుణ్యానుబంధంబులై
చను సౌఖ్యంబులఁ బొందు, పద్మజుని యాజ్ఞం ద్రోవఁగా వచ్చునే?

475

తా ॥ "ఓ నృగమహారాజా! నీవు వంశపావనుడవు. జనులచేత పొగడబడే సత్కార్యాచరణ పరుడవు. నీవు చేసిన మహత్తరమైన దానాలు, యజ్ఞయాగాది ధర్మకార్యాలు ముల్లోకాలలోను ప్రఖ్యాతి వహించాయి. బ్రహ్మదేవుని ఆనతిని దాటలేము గదా! అందుచేత ముందుగా పాపకర్మఫలాన్ని అనుభవించి, ఆ తరువాత పుణ్యకార్యాలవల్ల లభించే సకల సుఖాలు అనుభవిస్తావు."

వ. అని వేగంబున ద్రొబ్బించిన నేను బుడమిం బడునపుడ యీ నికృష్టంబయిన యూసరవెల్లి రూపంబుఁ గైకొంటి. నింత కాలంబు దద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ, బ్రాణులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యంబులు గాని యూరక పోనేరవు, నేఁడు సమస్త దురితనిస్తారకం బయిన భవదీయ పాదారవింద సందర్శనంబునం జేసి యీ ఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మకుండ నైతి నని పునఃపునః ప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె.

476

తా ॥ అని చెప్పి కింకరుల చేత వెంటనే నన్ను భూమిపై పడవేయించాడు. శ్రీకృష్ణా! నేను భూమిపై పడుతున్నప్పుడు నికృష్టమైన ఈ ఊసరవెల్లి రూపం నాకు కలిగింది. ఇంతకాలమూ నే చేసిన దోషానికి తగినట్లు ఈ ఊసరవెల్లి జన్మను అనుభవించవలసి వచ్చింది. జీవులకు పాపంగాని, పుణ్యంగాని అనుభవించక తప్పదు. అందుచేతనే నాకీ దురవస్థ సంభవించింది.

ఈ రోజు సమస్త పాపాలను నివారించే నీ పాదపద్మ సందర్శనం నాకు లభించింది.

ఘోరాతిఘోరమైన ఈ దుర్దశపోయి నిర్మలమైన మనస్సును పొందగలిగాను" అని చెప్పిన నృగమహారాజు శ్రీకృష్ణుడికి అనేకపర్యాయాలు నమస్కరించి, ఈ విధంగా స్తుతించాడు:

క. 'కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!, యప్రమేయ! వరద! హరి! ముకుంద! నిన్నుఁ జూడఁ గంటి, నీ కృపం గనుగొంటి, నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి'.

477

తా ॥ "కృష్ణా! వాసుదేవా! కేశవా! పరమాత్మా! అప్రమేయా! హరీ! ముకుందా! వరప్రదాతా! నేను ఎంత ధన్యుణ్ణో! నిన్ను దర్శించగలిగాను. నీ దయకు పాత్రుడనైనాను. సమస్త సౌఖ్యాలను, నిఖిలపదవులను పొందగలిగాను."

వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందుని పదంబులు దన కిరీటంబు సోఁకం బ్రణమిల్లి 'దేవా! భవదీయ పాదారవిందంబులు నా హృదయారవిందంబును బాయకుండునట్లుగాఁ బ్రసాదింపవే?' యని తదనుజ్ఞాతుండై యచ్చటి జనంబులు సూచి యద్భుతానందంబులం బొంద నతుల తేజోవిరాజిత దివ్యవిమానారూఢుండై దివంబున కరిగె, నంత న మ్మాధవుండు నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె.

478

తా ॥ అని శ్రీకృష్ణుణ్ణి అనేక విధాలుగా స్తుతించి, నృగమహారాజు తన కిరీటం ఆ దేవదేవుని పాదాలు తాకేటట్లు నమస్కరించాడు. "దేవా! నీ పాదపద్మాలు నా హృదయంలో స్థిరంగా ఉండేటట్లు వరం ప్రసాదించమ" ని ప్రార్థించి భగవంతుని అనుజ్ఞతో, అఖండ తేజస్సుతో విరాజిల్లుతున్న దివ్యవిమానం ఎక్కి స్వర్గలోకానికి వెళ్ళాడు. అక్కడ ఉన్న యదుకుమారులందరూ ఆ దృశ్యాన్ని చూసి, నృగమహారాజు చెప్పిన కథ విని అద్భుతానందాలు పొందారు. తరువాత శ్రీకృష్ణుడు అక్కడ ఉన్న రాజులను చూసి ఈ విధంగా ధర్మవిషయాలు చెప్పాడు:

సీ. నరనాథకుల కాననము దహించుటకును నవనీసురుల విత్త మగ్ని కీల, జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు, పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప భూసురధనము దంభోళిధార, జగతీవరుల కీర్తి చంద్రిక మాప విప్రోత్తము ధనము సూర్యోదయంబు,

తే. విప్రతతి సొమ్ముకంటెను విషము మేలు, గరళమునకును బ్రతికృతి గలదు గాని
దాని మాన్పంగ భువి నౌషధములు లేవు, గాన బ్రహ్మస్వములు గొంట గాదు పతికి.

479

తా ॥ బ్రాహ్మణుల ధనాన్ని తీసుకొంటే అది అగ్నిజ్వాలలాగా రాజకులమనే అడవిని కాల్చివేస్తుంది. బ్రాహ్మణుల భూమిని స్వాధీనం చేసుకొంటే అది రాజుల ఐశ్వర్యమనే సముద్రాన్ని ఇంకింపచేసే బడబాగ్ని అవుతుంది. భూసురుల ధనాన్ని కైవసం చేసుకొంటే అది రాజాధిరాజుల సంపదలనే పర్వతాలను కూల్చివేసే వజ్రధార అవుతుంది. విప్రోత్తముల ధనాన్ని సొంతం చేసుకొంటే అది భూపతుల కీర్తి అనే వెన్నెలను పోగొట్టే సూర్యకాంతి అవుతుంది. బ్రాహ్మణుల సొమ్ము అపహరించడం కన్న విషం త్రాగడం ఎంతో మంచిది. విషానికన్నా విరుగుడుంది గాని బ్రాహ్మణ ధనాన్ని తింటే దానిని పోగొట్టే మందు లోకంలోనే లేదు. కాబట్టి బ్రాహ్మణుల సొత్తును అనుభవించడం రాజవరులకు ఎంతమాత్రం మంచిదికాదు.

క. ఎఱుఁగమి నైనను భూసుర, వరుల ధనం బపహరింప వలవదు పతికిన్. మఱపున ననలము ముట్టిన, దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్?

480

తా ॥ రాజైనవాడు తెలియక భూసుర ధనాన్ని తనదిగా భావించినా, తెలుసుకోక దానిని అనుభవించినా అది అతనికి చెరుపే కలుగజేస్తుంది గాని మంచినివ్వదు. చూసి తాకినా, చూడక తాకినా నిప్పు శరీరాన్ని అంటుకొని దహింపచేస్తుంది గాని చల్లబరచదుగదా! అందుచేత రాజులు ఎప్పుడూ బ్రాహ్మణ ధనాన్ని ఆశించకూడదు, అపహరించకూడదు.

వ. మఱియును దన ధనంబు పరులచేతఁ గోల్పడిన విప్రుండు దుఃఖమున రోదనంబుసేయ రాలిన యశ్రుకణంబుల నవని రేణువు లెన్ని తడియు నన్ని వేలేండ్లు తదుపేక్షాపరుండైన పతి దారుణవేదనలు గల కుంభీపాక నరకంబు నొందు, మఱియు నతనితోడఁ గ్రిందటఁ బదితరంబుల వారును, ముందటఁ బదితరంబులవారును మహానరక వేదనలం బొందుదురు. స్వదత్తంబైన నర్థలోభంబునం జేసి దుశ్శీలుండై యెవ్వఁడు బ్రాహ్మణక్షేత్ర సంభూత ధాన్యధనాదికంబు భుజించు నప్పాపాత్ముం డఱువదివేల సంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు, నట్లగుట యెఱింగి విప్రు డెంత తప్పు చేసిన నెన్ని గొట్టిన, నెన్ని దిట్టిన నతని కెదురు పలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదు పాలింటివా, రదియునుం గాక యేనును బ్రతిదినంబును భూసురుల నతి వినయంబునఁ బూజింతు, నిట్లు సేయక విపరీత వర్తనులైన తామసుల నేను వెదకి దండింతు, నది గావున మీరలును బ్రాహ్మణ జనంబుల వలనం బరమభక్తి గలిగి మెలంగుం డని యానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోక శరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజ నివాసంబునకుం జనియె' నని చెప్పి శుకుం డిట్లనియె.

481

తా ॥ బ్రాహ్మణుడు తన ధనాన్ని పరులు అపహరించినప్పుడు దుఃఖాన్ని ఆపుకోలేక శోకిస్తాడు. అప్పుడాతని కనుల నుండి రాలిపడిన అశ్రుబిందువులు భూమిని తడుపుతాయి. ఆ పాపాన్ని శిక్షించకుండా ఉపేక్షచేసిన రాజులు–బ్రాహ్మణుల కన్నీటి బిందువులు ఎన్ని రాలిపడతాయో అన్ని వేల సంవత్సరాలపాటు దారుణమైన వేదననతో నిండిన కుంభీపాక నరకాన్ని పొందుతారు. అంతే కాక అతనికి పూర్వం పది తరాలవాళ్ళు, అతని తరవాతి పదితరాల వాళ్ళు నరకబాధలతో గిలగిల కొట్టుకొంటారు. తాను ఇచ్చినదే అయినా ధనలోభం చేత చెడునడత గలవాడై ఎవడు బ్రాహ్మణుని పొలం నుండి వచ్చే ధాన్యాదులనుగాని, వాటిద్వారా వచ్చే ధనాదులనుగాని అనుభవిస్తే అటువంటి పాపి అరవై వేల సంవత్సరాలు క్రిమిరూపంలో మలకూపంలో పడి వేదన పాలౌతాడు. అది తెలుసుకొని ఉత్తముడైన విప్రుడు ఎంత తప్పు

చేసినా, ఎన్ని కొట్టినా, ఎన్ని తిట్టినా, అతనికి ఎదురుచెప్పకూడదు. వినయంతో నమస్కరించాలి. ఆ విధంగా చేసే పుణ్యాత్ములు నా వాళ్లౌతారు. నేను కూడా ప్రతిరోజూ భూసురులను ఎంతో వినయంతో పూజిస్తుంటాను. ఆ విధంగా కాక బ్రాహ్మణులపట్ల చెడుచేసే తామసులను నేను వెదికి శిక్షిస్తాను. కాబట్టి మీరు కూడా ధర్మం తెలుసుకొని బ్రాహ్మణులపట్ల పరమ భక్తితో మెలగండి" అని శ్రీకృష్ణుడు రాజులందరికీ ధర్మబోధ చేశాడు. ఆ తరువాత యాదవవీరులందరూ కొలిచి వస్తుండగా అఖీలలోక శరణ్యుడైన కృష్ణ భగవానుడు తన మందిరానికి వెళ్ళాడు" అని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విధంగా అన్నాడు:

క. ఈ కథఁ జదివిన వారలుఁ, గైకొని వినువారు విగత కలుషాత్మకులై
లౌకికసౌఖ్యము నొందుదు, రా కైవల్యంబుఁ గరతలామలక మగున్.

482

తా ॥ "పరీక్షిన్మహారాజా! ఈ కథను చదివిన వాళ్ళూ, విన్నవాళ్లూ పాపాలు పోయినవారై ఇహలోక సౌఖ్యాలన్నీ అనుభవిస్తారు. ఆ తరువాత మోక్షాన్ని పొంది జన్మరాహిత్యం చేసుకొంటారు.

శ్రీకృష్ణుడు చేసిన ధర్మబోధను ఆచరించినవారు సద్గుణసంపన్నులుగా విరాజిల్లుతారు.

## బలరాముడు వ్రేపల్లెకు వచ్చుట

సీ. నరనాథ! విను మొకనాఁడు తాలాంకుండు చుట్టాల బంధులఁ జూచు వేడ్క
సుందర కాంచన స్యందనారూఢుఁడై భాసిల్లుచున్న వ్రేపల్లె కరిగి
చిరకాల సంగత స్నేహులై గోప గోపాంగనా నికర మాలింగనములు
సముచిత సత్కృతుల్ సలుపఁ గైకొని మహోత్సుకలీల నందయశోదలకును

తే. వందనం బాచరించిన వారు మోద, మంది బిగియారఁ గౌఁగిళ్ల నొందఁ జేర్చి సమత
దీవించి యంకపీఠమునఁ జేర్చి, శిరము మూర్కొని చుబుకంబుఁ గరము పుణికి.

483

తా ॥ పరీక్షిన్మహారాజా! ఒకనాడు బలరాముడు బంధువులనందరినీ చూసిరావాలనే కోరికతో అందమైన బంగారు రథాన్ని ఎక్కి వ్రేపల్లెకు వెళ్ళాడు. చిన్నప్పటినుంచి ఆడిపాడుకొన్న గోపాలురను, గోపకాంతలను చూశాడు. వారందరూ ఎంతో స్నేహంగా వచ్చి కౌగిలించుకొని, సకల సత్కారాలూ చేశారు. వారందరినీ ఆదరించి యశోదానందులకు నమస్కరించాడు. యశోదానందులు ఎంతో సంతోషించి, బలరామున్ని కౌగిలించుకొని, దీవించి, తొడమీద కూర్చోబెట్టుకొని, తలవాసన చూసి, గడ్డం పట్టుకొని మురిపెంగా దగ్గరకు తీసుకొన్నారు.

వ. మఱియు నానందబాష్పధారాసిక్త కపోలయుగళంబులతోడం గుశల ప్రశ్నంబుగా నిట్లని' రన్నా! నీవును నీ చిన్నతమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె? మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు, మాకు నేడుగడయ మీరు కాక యొరులు గలరే?' అని సముచిత సంభాషణంబులం బ్రొద్దుపుచ్చు చుండి రంత.

484

తా ॥ యశోదానందులు ఆనందబాష్పాలతో తడిసిన చెక్కిళ్ళుకలవారై బలరామున్ని కుశల ప్రశ్నలు చేశారు. “నాయనా! నీమా, నీ తమ్ముడైన కృష్ణుడూ క్షేమంగా ఉన్నారా?

మమ్మల్ని ఎప్పుడూ రక్షిస్తూ ఉండాలి సుమా! మమ్మల్ని కాపాడటానికి మీరుకాక ఇంకెవరున్నారు చెప్పు" అని ఎన్నెన్నో సంభాషణలతో కాలం గడపసాగారు.

క. గోపాలవరులు ప్రమదం, బాపోవని మది నివర్తి తాఖీల గేహ
వ్యాపారు లగుచు హలధరు, శ్రీపాదంబులకు నతులు సేసిరి వరుసన్.

485

తా ॥ బలరామున్ని చూసిన ఆనందంతో ఇంటి పనులన్నీ మరచిపోయిన గోపాలురందరూ పరుగుపరుగునవచ్చి ఆతని పాదాలకు నమస్కరించారు.

క. సిరియు వారికిఁ గరుణో, దారుండై నడపె సముచితక్రియ లంతం
గోరి తనయీడు గోప కు, మారులఁ జే చఱచి బలుఁడు మందస్మితుఁడై.

486

తా ॥ బలరాముడు కూడా వారందరినీ చక్కగా సత్కరించాడు. అందరితో నవ్వుతూ మాట్లాడాడు. తన ఈడువారైన గోపాలురతో భుజం చరచి స్నేహంగా చమత్కారభాషణలు చేశాడు.

క. నిజసుందర దేహద్యుతి, రజతాచలరుచులఁ దెగడ రాముఁడు వారల్ భజియింప నేగి యొకచో, విజనస్థలమున వసించి విలసిల్లు నెడన్.

487

తా ॥ గోపాలురందరూ తనను సేవిస్తూ వస్తుండగా, వెండికొండ వంటి తెల్లని దేహకాంతితో ప్రకాశిస్తున్న బలరాముడు ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి ఉత్సాహంతో వారితో కలిసి సంతోషంగా కాలం గడుపుతుండగా—

కవిరాజ విరాజితము :

చరణములం గనక స్ఫుటనూపురజాలము గల్లనుచుం జెలఁగం
గరములఁ గంకణముల్ మొరయున్ నలికౌ నసియాడఁ గుచాగ్రములన్
 సరులు నటింపఁ గురుల్ గునియన్ విలసన్మణి కుండలకాంతులు వి
స్ఫురిత కపోలములన్ బెరయన్ వ్రజసుందరు లంద అమందగతిన్.

488

తా ॥ అక్కడకు కాళ్ల అందెలు ఘల్లుఘల్లుమని మ్రోగుతుండగా, చేతులకున్న కంకణాలు ఒరుసుకుంటూ చిరుగంటల ధ్వనులు చేస్తుండగా, సన్నని నడుము అటూ ఇటూ ఊగుతుండగా, మెడలోని హారాలు అందాలు చిందిస్తుండగా, ముంగురులు ముఖంమీద నర్తిస్తుండగా, మణికుండలాల కాంతులు చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తుండగా గోపకాంతలందరూ గబగబా వచ్చి చేరారు.

కవిరాజ విరాజితము :

చని బలభద్రుని శౌర్య సముద్రుని సంచితపుణ్యు నగణ్యునిఁ జం
దన ఘనసార పటీర తుషార సుధారుచికాయు విధేయు సుధా
శనరిపుఖండను సన్మణిమండను సారవివేకు నశోకు మహా
త్మునిఁ గని గోపిక లోపిక లేక యదుప్రభు ని ట్లని రుత్కలికన్.

489

తా ॥ మహా శౌర్యవంతుడు, పుణ్యమూర్తి, లెక్కపెట్టజాలని సకల సద్గుణాలతో ఒప్పుతున్నవాడు, రాక్షసమర్దనుడు, వివిధ భూషణాలంకృతుడు, వివేకశాలి, దుఃఖరహితుడు, మహాత్ముడు; కర్పూరంలాగా, మంచులాగా, చందనంలాగా, అమృతంలాగా తెల్లని కాంతులతో ప్రకాశిస్తున్న వాడు, సజ్జన విధేయుడు అయిన బలరామున్ని చూసి గోపికలు సంతోషపడ్డారు. ఎన్నాళ్ళ తరువాతో కనబడిన యదుప్రభుని చూసి తమలో కలిగిన ఉత్కంఠను ఆపుకోలేక ఈ

విధంగా అన్నారు:

చ. 'హలధర! నీ సహోదరుఁ డుదంచితకంజ విలోచనుండు స
ల్లలిత పురాంగనా జనవిలాస విహార సమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖించునే? మము నొకానొక వేళన యేని బుద్ధిలోఁ
దలఁచునొ? నూతన ప్రియలఁ దార్కొని యేమియుఁ బల్కకుండునో?

490

తా ॥ ఓ బలరామా! నీ తమ్ముడైన శ్రీకృష్ణుడు అదే ఆ కమలాక్షుడు, ద్వారకానగరంలో ప్రియభామినులతో కలిసి విహరిస్తూ చక్కగా సుఖంగా ఉన్నాడా? ఎప్పుడో ఒకప్పుడైనా మమ్మల్ని తలచుకొంటున్నాడా? లేక క్రొత్తగా వచ్చిన ప్రియురాండ్రతో కూడి మా గురించి పలకడమే మానివేశాడా?

క. జననీ జనకుల ననుజులఁ, దనుజుల బంధువుల మిత్రతతుల విడిచె నె
మ్మనమున నొండు దలంపక, తను నమ్మినవారి విడువఁదగునే హరికిన్?

491

తా ॥ వ్రేపల్లెలో ఉన్న తల్లిదండ్రులను, అన్నదమ్ములను, పుత్రప్రాయులను, బంధువులను, స్నేహితులను అందరినీ వదిలిపెట్టి వెళ్ళిపోయాడే! వీళ్ళందరేమైపోతారో అని కూడా ఆలోచించకుండా తననే నమ్ముకున్న మా అందరినీ విడిచి వెళ్ళిపోవడం కృష్ణుడికి ఏమైనా న్యాయంగా ఉందా చెప్పు.

సీ. సలలిత యామునసైకత స్థలమున నుండ మ మ్మేమని యూఱడించె
విమల బృందావనవీథి మా చుబుకముల్ పుణుకుచే నే మని బుజ్జగించెఁ
బుష్పవాటికలలోఁ బొలుచు మా కుచయుగ్మ మంటుచు నే మని యాదరించెఁ
గాసారముల పొంతఁ గౌఁగిట మముఁ జేర్చి నయమొప్ప నే మని నమ్మఁ బలికె

తే. నన్నియు మఱచెఁ గాఁబోలు వెన్నుఁ డాత్మ, గోరి తాఁ జాయలున్నైన వారి విడుచు నట్టి కృష్ణుఁడు తము రట్టు వెట్టు ననక, యేల నమ్మిరి పురసతుల్ బేల లగుచు.'

492

తా ॥ సుందరమైన యమునానది ఇసుక తిన్నెలపైన ఉన్న మమ్మల్ని కృష్ణుడు ఎలా ఊరడించాడో తెలుసా? బృందావనంలో చక్కగా తీర్చిదిద్ది ఉన్న వీథులలో మా గడ్డాలు పుణుకుచు ఎలా బుజ్జగించాడో! పూదోటలలో ఎంత ఆదరంతో ప్రేమ కురిపించాడో! సరస్సుల చెంత మమ్మల్ని కౌగిలిలో చేర్చుకొని, వీడిపోనని ఎంతగా నమ్మపలికాడో! ఇప్పుడు కృష్ణుడు అవన్నీ మరచిపోయాడు కాబోలు! భార్యలనైనా వదలిపెట్టగల కృష్ణుణ్ణి, తమను అల్లరిపాలు చేస్తాడని అనుకోక ఆ పురకాంతలు ఆ మోసగాణ్ణి అమాయకంగా ఎందుకు నమ్మారో అర్థం కావడం లేదు."

మ. అని యిబ్భంగి సరోజలోచనుని నర్మాలాపముల్ నవ్వులున్
ననుబంధుల్ పరిరంభణంబులు రతి వ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యువ్విళ్ళూరు చిత్తంబులన్
జనితానంగశరాగ్ని చేత దురవస్థం బొంది శోకించినన్.

493

తా ॥ గోపికలు ఈ విధంగా బలరాముడితో కృష్ణుడు తమతో పలికిన పరిహాసపు పలుకులు, ఆతని దరహాసాలు, ఆత్మీయతలు, కౌగిలింతలు, శృంగార చేష్టలు, సరసాలు, ప్రేమ సంభాషణలు, వినయ లక్షణాలు – ఒక్కొక్కటీ తలచుకొంటూ చెబుతూ, ఉప్పొంగిపోతూ; మరుక్షణం వియోగబాధతో కుమిలిపోయారు.

వ. అంత బలభద్రుండు వారల మనంబుల సంతాపంబులు వారింప నుపాయంబు లగు సరస చతుర వచనంబులఁ గృష్ణుని సందేశంబులు సెప్పి విగతఖేదలం జేసి యచ్చట

మాసద్వయంబు నిలిచి వసంతవాసరంబులు గడపుచుఁ గాళిందీ తీరంబున.

494

తా ॥ ఆ విధంగా వియోగబాధతో దుఃఖీస్తున్న గోపికలను చూసి బలరాముడు వారిని అనునయిస్తూ ఓదార్చాడు. సరసవచనాలు పలికాడు. కృష్ణుడు చెప్పి పంపిన సందేశాన్ని చక్కగా వినిపించి వారికి దుఃఖోపశమనం కలగజేసి, వారిని సంతోషపరిచాడు. రెండు నెలల పాటు అక్కడే వ్రేపల్లెలోనే ఉన్నాడు. వసంత ఋతువైభవాన్ని తిలకిస్తూ యమునానది తీరంలో ఉన్న ప్రకృతి సౌందర్యానికి పులకితుడైనాడు.

సీ. మాకంద జంబీర మందార ఖర్జూర ఘనసార శోభిత వనములందు
నేలాలతా లోల మాలతీ మల్లికా వల్లీమతల్లికా వాటికలను
దరళ తరంగ శీకర సాధు శీతల సైకతవేదికా స్థలములందు
మకరంద రసపాన మదవ దిందిందిర పుంజ రంజిత మంజుకుంజములను

తే. విమలరుచి గల్గు సానుదేశములయందు, లలిత శశికాంత ఘనశిలాతలములందు లీల
నిచ్ఛావిహారవిలోలుఁ డగుచు, సుందరీజనములు గొల్వఁ జూడ నొప్పె.

495

తా ॥ మామిడి చెట్లతో, నిమ్మచెట్లతో, మందార వృక్షాలతో, ఖర్జూర చెట్లతో, కర్పూర అరటి చెట్లతో నిండి ఉన్న సుందర వనాలలో; ఏలకీ, మాలతీ, మల్లికా లతలతో సువాసనలు వెదజల్లుతున్న పూదోటలలో; అలల నీటి తుంపురులతో చల్లగా, చక్కగా ఉన్న ఇసుక తిన్నెలమీద, పూలలోని మకరందాన్ని తాగి మత్తెక్కిన తుమ్మెదల గుంపుతో అందాలు చిందిస్తున్న పొదరిళ్ళలో; సూర్యకాంతితో ప్రకాశిస్తున్న కొండచరియల మీద; చంద్రకాంత శిలలతో నిర్మించిన అరుగులపైన, బలరాముడు సుందరీ మణులందరూ తనను కొలుస్తూ పరివేష్టించి ఉండగా స్వేచ్ఛగా విహరిస్తూ ఆనందడోలికలలో ఊగులాడాడు.

తే. అట్లు విహరింప వరుణుని యాజ్ఞఁ జేసి, వారుణీదేవి మద్యభావంబు నొంది నిఖిల
తరుకోటరములందు నిర్గమించి, మించు వాసనచేత వాసించె వనము.

496

తా ॥ బలరాముడు ఆ విధంగా ఆనందోత్సాహాలతో విహరిస్తున్నప్పుడు వరుణదేవుని ఆజ్ఞతో వారుణీదేవి మద్యరూపాన్ని పొంది చెట్ల తొఱ్ఱలలోకి కూడా ప్రవేశించి ఆ వనాన్ని అంతటినీ తన వాసనతో నింపివేసింది.

వ. అట్టియెడ.

497

తా ॥ అప్పుడు,

మ. కర మొప్పారు నవీనవాసనల నాఘ్రాణించి గోపాల సుం
దరులుం దానును డాయనేగి యతిమోదం బొప్ప సేవించి యా
తరళాక్షుల్ మణిహేమ కంకణఝుణత్కారానుకారంబులై
కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్కన్నాడుచున్ సోలుచున్.

498

తా ॥ క్రొత్త క్రొత్త వాసనలను వాసన చూస్తూ గోపికా రమణులతో కూడి ఆ మద్యాన్ని సేవించి ఆనంద తన్మయుడైనాడు. ఆ గోపికలు తమ చేతులకున్న మణిమయ స్వర్ణకంకణాల ఝుణ ఝుణ నాదాలను అనుకరిస్తూ తాళంవేస్తూ, పాటలు పాడారు. సందర్భానుసారంగా కుతూహల మనస్కలై నృత్యం చేసారు. కొంతసేపటికి అలసిపోయి సోలిపోయారు.

సీ. తనమీఁది బిరుదాంకితములైన గీతముల్ వాడుచు రా బలభద్రుఁ డంత
మహిత కాదంబరీ మధుపానమదవిహ్వ లాక్షుండు లలితనీలాలకుండు

నాలోల నవపుష్పమాలికోరస్థ్సలుఁ డనుపమ మణికుండలాంచితుండు

ప్రాలేయ సంయుక్త పద్మంబుగతి నొప్పు సలలితానన ఘర్మజలకణుండు

తే. నగుచు వనమధ్యమున సలిలావగాహ, శీలుఁడై జలకేళికిఁ జేరి యమున నిందు రమ్మని పిలువఁ గాళింది యతని, మత్తుఁడని సడ్డసేయక మసలుటయును.

499

తా ॥ మధువు త్రాగడం వల్ల విహ్వలమై ఎర్రబడిన నేత్రాలతో, నల్లని ముంగురులతో, అప్పటికప్పుడు విచ్చుకొన్న పూలతో అల్లిన పుష్పమాలికలు మెడలో ధరించినవాడై, ధగధగమని మెరిసిపోతున్న మణికుండలాలతో ప్రకాశిస్తూ, మంచు బిందువులు మీదపడగా వినూత్న కాంతితో వెలిగిపోయే పద్మంలాగా, అక్కడక్కడ చెమట బిందువులు నిలిచి ఉండగా బహుసుందరంగా ఒప్పుతున్న ముఖంతో విరాజిల్లుతున్న బలరాముడు జలక్రీడతో ఆనందించాలనే కోరికతో యమునానదిని తన వద్దకు రమ్మని పిలిచాడు. కాని యమునా నది బలరాముడు మద్యం మత్తులో ఉన్నాడని ఆతని మాటలను నిర్లక్ష్యం చేసి, ఆతని ఆజ్ఞను లెక్క చేయలేదు.

చ. ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని రాముఁడు పల్కెఁ డాయఁ జీ

రినఁ జనుదేక తక్కితి పురే! విను నిందఱుఁ జూడ మద్భుజా

సునిశిత లాంగలాగ్రమున సొంపఱ నిప్పుడు నూఱు త్రోవలై

చన వెసనఁ జించివైతు నని చండపరాక్రమ మొప్ప నుగ్రుఁడై.

500

తా ॥ యమునా నది నిర్లక్ష్య వైఖరికి ఉగ్రుడైనాడు బలరాముడు. ఆ యాదవ వీరుని కోపం కట్టలు తెంచుకొంది. “నేను నా దగ్గరకు రమ్మని పిలిస్తే, నీవు రాలేదు. అరే! ఎంత ధైర్యం నీకు? ఇక్కడ వారంతా చూస్తుండగా నిన్నేం చేస్తానో చూడు. నా భుజబలం చూద్దువు గాని. సునిశితమైన నా హలాయుధంతో నీ అందచందాలన్నీ నీరు కారిస్తాను. నా నాగలితో ఒక్క దెబ్బకొట్టి నిన్ను నూరు చీలికలు చేస్తాను” అని యమునతో అని—

వ. అట్లు కట్టలుక రాము దుద్దామంబగు బాహుబలంబున హలంబు సాఁచి య మ్మహా వాహినిం దగిల్చి పెకలిరాఁ దిగిచిన న న్నది భయభ్రాంతయై సుందరీరూపంబు గైకొని యతిరయంబునం జనుదెంచి, య య్యదువంశ తిలకుండగు హలధరుని పాదారవిందంబులకు వందనం బాచరించి యి ట్లనియె.

501

తా ॥ పట్టరాని కోపంతో బలరాముడు తన నాగలిని ఎత్తి మహా ప్రవాహంతో ఉరకలు వేస్తున్న ఆ యమునా నదిని మూలంతో సహా వచ్చేటట్లు ఒక్కలాగు లాగాడు. దానితో యమునా నది భయభ్రాంతురాలయింది. సుందరీ రూపాన్ని ధరించి అతివేగంగా బలరాముడి వద్దకు వచ్చింది. యాదవ వీరుడి పాదపద్మాలకు నమస్కరించి ఇలా స్తుతించింది:

మ. 'బలరామా! ఘనబాహా! నీ యతుల శుంభద్విక్రమం బంగనల్
దెలియం జాలెడివారె? యీ యఖిలధాత్రీభారధౌరేయ ని
శ్చల సత్త్వుండగు కుండలీశ్వరుఁడునుం జర్చింప నీ సత్కళా
కలితాంశ ప్రభవుండు! నీ గురుభుజా గర్వంబు సామాన్యమే?'

502

తా ॥ "బలరామదేవా! మహావీరా! సాటిలేని నీ భుజ పరాక్రమాన్ని తెలుసుకోవడం సామాన్య స్త్రీలకు సాధ్యమౌతుందా? ఈ సమస్త భూభారాన్నీ మహాబలంతో వహిస్తూ దైవంగా కొలువబడుతున్న ఆదిశేషుడు నీ అంశలో జన్మించిన వాడే గదా! అనంతమైన నీ భుజబలం సామాన్యమైనదా? అనంతా! నీకు నమస్కారం."

చ. అని వినుతించి 'యేను భవదంఘ్రి సరోజము లాశ్రయించెదన్
ననుఁ గరుణింపు' మన్న యదునందనుఁ డన్నదిఁ 'బూర్వమార్గవై
చను' మని కామినీనికర సంగతుఁడై జలకేళి సల్పె నిం

పెనయఁ గరేణుకాయుత మదేభము చాడ్పున న మ్మహానదిన్.

503

తా ॥ అని బలరామున్ని అనేక విధాలుగా స్తోత్రం చేసి "నేను నీ పాదపద్మాలను ఆశ్రయించిన దానిని. నన్ను దయతో రక్షించు" అని వేడుకొన్న యమునతో బలరాముడు కటాక్షించి "నీవు పూర్వమార్గంలోనే ప్రవహించు. నేను నిన్నిక హింసించనులే" అని చెప్పి గోపకామినులతో కలిసి ఆడ ఏనుగులతో కూడి విహరించే మత్తగజంలాగా సంతోష తరంగాలతో యమునా నదిలో యథేచ్ఛగా జలక్రీడలాడాడు.

తే. అంత జలకేళి సాలించి సంతసంబు, నందుచుండ వినీలవస్త్రాదిరత్న మండనంబులుఁ
గాంచనమాలికయును, దెచ్చి హరి కిచ్చి చనె నా నదీలలామ.

504

తా ॥ జలకేళి ముగించి ఆనందిస్తున్న బలరామునికి యమునానది నీలవర్ణము గల వస్త్రములను రత్నాభరణములను, బంగారు హారాన్ని తెచ్చి ఆయనకు బహుమానంగా ఇచ్చింది.

క. అవి యెల్లఁ దాల్చి హలధరుఁ, డవిరళగతి నొప్పి వల్లవాంగనలును దా
దివిజేంద్రుఁ బోలి మహితో, త్సవమున వర్తించుచుండె సౌఖ్యోన్నతుఁడై.

505

తా ॥ యమునానది భక్తిపూర్వకంగా సమర్పించిన నగలను, నీలాంబరాన్ని ధరించి బలరాముడు తేజోమూర్తిగా ప్రకాశించాడు. గోపకాంతలతో సకల సౌఖ్యాలు అనుభవిస్తూ దేవేంద్రుడిలా మహోన్నతంగా వెలిగిపోయాడు.

క. అవనీశ! యిట్లు హలమునఁ, దివిచినఁ గాళింది ప్రయ్య దెలియఁగ నేఁడున్
భువి నుతి కెక్కెను రాముని, ప్రవిమలతరమైన బాహుబలసూచకమై.

తా ॥ పరీక్షిన్మహారాజా! ఈ విధంగా బలరాముడు నాగలితో యమునను తన వద్దకు లాగినపుడు ఏర్పడిన చీలిక ఇప్పటికి కూడా కనిపిస్తూ, ఆ యాదవవీరుని బాహుబలానికి సూచనగా భూమిపై ప్రఖ్యాతి వహించింది.

## కృష్ణుడు పౌండ్రకవాసుదేవున్ని చంపుట

వ. అంత బలభద్రుండు వ్రజసుందరీ సమేతుండై నందఘోషంబునం బరితోషంబు నొందుచుండె, నంత నక్కడఁ గరూశాధిపతియైన పౌండ్రకుండు తన దూతం బిలిచి యిట్లనియె.

507

తా ॥ బలరాముడు గోపకాంతలతో కూడి నందమహారాజు రాజ్యమైన వ్రేపల్లెలో ఎంతో సంతోషంతో కాలం గడుపుతున్నాడు. ఆ సమయంలో కరూశ దేశపు రాజైన పౌండ్రకుడు తన దూతను పిలిచి ఈ విధంగా చెప్పాడు:

సీ. మనుజేశ! బలగర్వమున మదోన్మత్తుఁడై 'యవనిపై వాసుదేవాఖ్యుఁ డనఁగ
నే నొక్కరుఁడ గాక యితరుల కీ నామ మలవడునే?' యని యదటు మిగిలి
తెగి 'హరి దా వాసుదేవుఁడ ననుకొను నఁట! పోయి వల' దను మనుచు దూతఁ
బద్మాయతాక్షుని పాలికిఁ బొమ్మన్న నరిగి వాఁ డంబుజోదరుఁడు పెద్ద

తే. కొలువుఁ గైకొని యుండ సంకోచపడక, 'వినుము మా రాజుమాటగా వనజనాభ!
యవని రక్షింప వాసుదేవాఖ్య నొంది, నట్టి యే నుండ సిగ్గు వో ఁదట్టి నీవు.

508

తా ॥ "పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని శౌర్యప్రతాపాల గురించి చెబుతాను విను. పౌండ్రక వాసుదేవుడనే కరూశ దేశాధిపతి శ్రీకృష్ణుని మీద అకారణంగా ద్వేషం పెంచుకొన్నాడు. ఆ ద్వేషం పగగా మారింది. శ్రీకృష్ణుణ్ణి జయించాలనే కోరిక కలిగింది. బలగర్వంతో 'నాకొక్కడికే భూమిపైన వాసుదేవుడనే పేరు ఉండాలిగాని మరొకరెవ్వరూ వాసుదేవుడనే పేరుతో పిలవబడకూడద' ని మదించి తన దూతను కృష్ణుడి వద్దకు పంపాడు. పౌండ్రకుడు గర్వాతిశయంతో "కృష్ణుడు తానే వాసుదేవుడనని అనుకొంటున్నాడట అది తప్పు. ఆ విధంగా

అనుకోవద్దని నామాటగా చెప్పు" అని చెప్పిన మాటలను దూత ఏమాత్రం మరచిపోకుండా గుర్తుపెట్టుకొని శ్రీకృష్ణుని ద్వారకానగరానికి వెళ్ళాడు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు పెద్ద సభను ఏర్పాటుచేసి, అందులో కొలువుతీరి కూర్చొని ఉన్నాడు. అయినా పౌండ్రకుని దూత సంకోచించలేదు. భయపడలేదు. సభలోకి వెళ్ళి శ్రీకృష్ణుడితో "శ్రీకృష్ణా! నీకు ఒక విషయం చెప్పమని మా రాజుగారు నన్ను నీ వద్దకు పంపారు. శ్రద్ధగా వినవలసినది. ఈ భూమిని సురక్షితంగా పరిపాలించడానికి పౌండ్రక వాసుదేవుడనైన నేనుండగా, సిగ్గులేకుండా నీవు నా పేరు పెట్టుకొని ఎలా వ్యవహరిస్తున్నావు?

క. నా పేరును నా చిహ్నము, లేపున ధరియించి తిరిగె దిది పంతమె? యిం
తే పో! మదిఁ బరికించిన, నే పంత మెఱుంగు గొల్లఁ డే మిట నైనన్?

509

తా ॥ నా పైన పంతం పెట్టుకున్నావా? లేకపోతే నేను ధరించే శంఖ చక్రాది ఆయుధాలు ధరించి తిరుగుతున్నావేమిటి? అయినా గోవులను మేపుకొనే గోపాలుడివి నీవు. అటువంటి నీకు పంతమంటే ఏమిటో తెలుసా? పైగా నాపైనా నీ పంతం?

ఆ. ఇంతనుండి యైన నెదిరిఁ ద న్నెఱింగి నా, చిన్నె లెల్ల విడిచి చేరి కొలిచి బ్రదుకు మనుము కాక పంతంబు లాడెనా, యెదురు మనుము ఘోరకదనమునను.

510

తా ॥ ఇకనుంచైనా, నీవెవరివో, ఏమిటో తెలుసుకో. నీకూ, నాకూ మధ్య ఉన్న తారతమ్యాన్ని గ్రహించు. నీ శక్తి ఎంతటిదో, నా శక్తి ఎంతటిదో అర్థం చేసుకొని, నాతో సరిసమానంగా ధరిస్తున్న ఆ శంఖచక్రాలను వదిలిపెట్టు. నా ఘనతను తెలుసుకొని, నన్ను సేవించి బ్రతుకు. అలా నీవు నన్ను కొలిస్తే నేను నీ జోలికిరాను. ఆ విధంగా చేయక వాదులాడావనుకో, యుద్ధరంగంలో నన్ను ఎదుర్కోవలసివస్తుంది. అప్పుడు నా ప్రతాపమేమిటో

తెలిసివస్తుంది" అని దూత దుర్భాషలు పలికాడు.

క. అను దుర్భాషలు సభ్యులు, విని యొండొరు మొగము సూచి విస్మితు లగుచున్
'జనులార! యెట్టి క్రొత్తలు, వినఁబడియెడు నిచట? లెస్స వింటిరె?' యనఁగన్.

511

తా ॥ పౌండ్రక వాసుదేవుని దూత పలికిన పలుకులు విన్న సభ్యులందరూ ఆశ్చర్యపోయి ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. "ఈనాడు ఎటువంటి క్రొత్త క్రొత్త వింత మాటలు విన్నాము. మీరందరూ ఆ దూత చెప్పిన మాటలు బాగా విన్నారా?" అని ఒకరితో ఒకరు చెప్పుకోసాగారు. "ఈనాటికి కృష్ణుణ్ణి ఎదిరించి మాట్లాడగల ధీరుడు ఒకడు పుట్టుకొచ్చాడన్నమాట! పైగా వాడు మన కృష్ణభగవానుడు ధరించే ఆయుధాలు ధరిస్తున్నాడట! ఎంత వింతగా ఉంది. వానిని కృష్ణుడు ఉపేక్షిస్తాడా? ఉపేక్షించడు" అని గుసగుసలు పోయారు.

వ. అట్టియెడ కృష్ణుండు వాని కిట్లనియె.

512

తా ॥ దూత పలికిన దుర్భాషలను విన్న వాడై శ్రీకృష్ణుడు వాడితో ఇలా అన్నాడు:

మ. 'వినరా! మీ నృపుఁ డన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలో
దనమీఁదన్ వెస వైవఁ గంకముఖగృధ్రవ్రాతముల్ మూఁగఁగా,
ననిలో దర్పము దూలి కూలి వికలంబై సారమేయాళికి
న్ననయంబున్ న్నశనంబ వయ్యె 'దను మే నన్నట్లుగా వానితోన్.

513

తా ॥ "నీవు చెప్పింది నేను విన్నాను. ఇక నేను చెప్పేది వినరా! మీ రాజుగారు చెప్పిన శంఖచక్రాది చిహ్నాలను అన్నింటినీ ధరించి వెంటనే యుద్ధానికి వస్తున్నానని చెప్పు. అంతే కాదు

ఆ ఆయుధాలను మీ పౌండ్రకుని మీద ప్రయోగిస్తాను. ఘోర రణంలో వాడి గర్వమంతా హరించుకుపోయి నా రణకౌశలానికి బలై కూలిపోతాడని చెప్పు. అశక్తుడై నేలకూలిన పౌండ్రకుణ్ణి గ్రద్దలు, రాబందులు మూగి పీక్కుతింటాయి. కుక్కలు గుంపులు గుంపులుగా వచ్చి వాడి శవాన్ని ఆహారంగా భుజిస్తాయని నేను చెప్పినట్లుగా మీ రాజుతో చెప్పు, వెళ్ళు."

క. అని యుద్రేకముగా నా, డిన మాటల కులికి వాఁడు డెందము గలఁగం జని తన యేలిక కంతయు, వినిపించెను నతని మదికి విరసము గదురన్.

514

తా ॥ అని శ్రీకృష్ణుడు ఉద్రేకంతో చెప్పిన సమాధానానికి పౌండ్రకుడు పంపిన దూత ఉలిక్కిపడ్డాడు. భయపడ్డాడు. అదురుతో గుండె కొట్టుకుంటుండగా పౌండ్రకుణ్ణి చేరి జరిగిన విషయమంతా చెప్పాడు. దానితో పౌండ్రుకునికి కృష్ణుడిపట్ల పగ మరింత పెరిగింది.

వ. అంతఁ గృష్ణుండు దండయాత్రోత్సుకుఁడై వివిధాయుధ కలితంబును, విచిత్రకాంచన పతాకాకేతు విలసితంబునగు సుందరస్యందనంబుఁ బటు జవతురంగంబులం బూన్చి దారుకుండు తెచ్చిన నెక్కి యతిత్వరితగతిం గాశికానగరంబున కరిగినం బౌండ్రకుండును రణోత్సాహంబు దీపింప నక్షౌహిణీద్వయంబుతోడం బురంబు వెడలె, నప్పు డతని మిత్రుండైన కాశికాధిపతియును మూఁ డక్షౌహిణులతోడం దోడుపడువాఁడై వెడలె, ని ట్లాప్తయుతుండై వచ్చువాని.

515

తా ॥ కృష్ణుడు పౌండ్రక వాసుదేవుడిపైకి దండయాత్రకు వెళ్ళాలని పరమోత్సాహంతో బయలుదేరాడు. రకరకాల ఆయుధాలతో నిండి, స్వర్ణకాంతులను విరజిమ్ముతున్న జెండాతో కూర్చబడ్డ సుందర రథానికి, మిక్కిలి వేగవంతములైన గుఱ్ఱాలను కట్టి సారథి అయిన దారుకుడు యుద్ధానికి సిద్ధమైన రథాన్నితెచ్చి కృష్ణుడి ముందు నిలబెట్టాడు. శ్రీకృష్ణుడు రథాన్ని అధిరోహించి

అతి త్వరగా కాశీ పట్టణాన్ని చేరుకొన్నాడు.

ప్రౌండ్రకుడు కూడా రణోత్సాహంతో రెండు అక్షౌహిణీల సైన్యాన్ని తీసుకొని రాచనగరు వదలి యుద్ధరంగానికి వచ్చాడు. పౌండ్రకుని మిత్రుడైన కాశీరాజు మూడు అక్షౌహిణీల సైన్యాన్ని తీసుకొని పౌండ్రకునికి సహాయం చేయాలనే కోరికతో యుద్ధరంగానికి బయలుదేరాడు. ఆప్తమిత్రుడితో కలిసి రణరంగానికి వస్తున్న పౌండ్రక వాసుదేవుణ్ణి – శ్రీకృష్ణుడు చూశాడు.

సీ. చక్ర గదా శంఖ శారాఙ్గది సాధనుఁ గృత్రిమ గౌస్తుభ శ్రీవిలాసు
మకరకుండల హార మంజీర కంకణ మణిముద్రికా వనమాలికాంకుఁ
దరళ విచిత్ర పతంగ పుంగవకేతుఁ జెలువొందు పీతకౌశేయవాసు
జవనాశ్వకలిత కాంచన రథారూఢుని రణకుతూహలుని సన్మణికిరీటు
తే. నాత్మసమవేషు రంగవిహారకలిత, నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ గాంచి హర్ష
మిగురొత్త నవ్వెఁ బద్మాయతాక్షుఁ, దంత వాఁడును నుద్వృత్తుఁ డగుచు నడరి.

516

తా ॥ పౌండ్రక వాసుదేవుడు శంఖం, చక్రం, గద, శార్ఙ్గం మొదలైన ఆయుధాలను ధరించి ఉన్నాడు. కృత్రిమమైన కౌస్తుభమణితో ఒప్పుతున్నాడు. మకర కుండలాలతో, వివిధ హారాలతో, కంకణాలతో, కాలి అందెలతో, మణి కిరీటంతో, ఉంగరాలతో, పీతాంబరంతో, వనమాలతో తనవలె ఉన్న ఆ పౌండ్రకుణ్ణి శ్రీకృష్ణుడు తేరిపార చూశాడు. జవనాశ్వములతో కట్టబడిన బంగారు రథంపైన మెరుస్తున్న గరుడకేతనాన్ని చూశాడు. ఆ రథంపై ఎక్కి తనతో యుద్ధం చేయాలనే కుతూహలంతో మిడిసిపడుతున్న, రంగస్థల కృష్ణవేషధారిగా ఉన్న పౌండ్రకుణ్ణి చూసి కృష్ణుడు ఆపుకోలేక పెద్దగా నవ్వాడు. తనవేషం చూసి కృష్ణుడు నవ్వడంతో పౌండ్రకుడు కోపంతో విజృంభించాడు.

క. పరిఘ శరాసన పట్టిస, శర ముద్గర ముసల కుంత చక్ర గదా తో

మర భిందిపాల శక్తి, క్షురికాసి ప్రాస పరశు శూలముల వెసన్.

517

తా ॥ పౌండ్రకుడు ధనుర్బాణాలు ధరించి కృష్ణుడిపై బాణవర్షం కురిపించాడు. ఇనుపకట్ల గుదియను, అడ్డకత్తిని, ముద్గరాన్ని, ముసలాన్ని, కుంతాయుధాన్ని, గదను, చక్రాన్ని, తోమరాన్ని, బాకును, చురకత్తిని, శక్తిని, గండ్రగొడ్డలిని, శూలాన్ని వెంటవెంటనే కృష్ణుడిపై ప్రయోగించాడు.

చ. పరువడి వైచినన్ దనుజభంజనుఁ డంత యుగాంత కాల భీ
కరమహితోగ్ర పావకుని కైవడి నేచి విరోధి సాధనో
త్కరముల నొక్కటన్ శరనికాయములన్ నిగిడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్.

518

తా ॥ వేగంగా వస్తున్న ఆ ఆయుధాలను చూసి కృష్ణుడు వెంటనే ప్రళయకాలంలో మహాభయంకరంగా దహించివేసే అగ్నిహోత్రుడిలాగా వీరవిజృంభణతో శత్రువు ప్రయోగించిన ఆయుధాలనన్నిటినీ బాణవర్షాన్ని కురిపించి ఒక్కపెట్టున త్రుంచివేశాడు. ఆ తరవాత శత్రుసైన్యాన్ని సంచలింపచేసే ధ్వనితో తన పాంచజన్య శంఖాన్ని పెద్దపెట్టున పూరించాడు.

ఉ. వారని యల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారి సైన్యముల్
మారి మసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుఁబెంటలై వెసం
దేరులు వ్రాలె, నశ్వములు ద్రెళ్ళె, గజంబులు మ్రొగ్గె, నద్భటుల్
ధారుణిఁ గూలి, రిట్లు నెఱి దప్పి చనెన్ హతశేషసైన్యముల్.

519

తా ॥ ఆపశక్యంకాని కోపంతో కృష్ణుడు విజృంభించి యుద్ధభూమిలో ఉన్న సమస్త శత్రుసైన్యాన్ని హతం చేశాడు. రణరంగం పీనుగుపెంటలతో నిండిపోయింది. వెంటవెంటనే

రథాలు విరిగి క్రిందపడిపోయాయి. గుఱ్ఱాలు కూలాయి. ఏనుగులు నేలను కరచుకొన్నాయి. కాల్బలం అసువులు విడిచింది. ఈ విధంగా సైన్యమంతా కూలిపోవడంతో మిగిలిన కొద్దిమంది సైనికులు న్యాయం తప్పి యుద్ధం చేయలేక పారిపోయారు.

వ. అట్టియెడ రుధిర ప్రవాహంబులును, మేదోమాంసపంకంబులు నై సంగరాంగణంబు ఘోరరౌ బయ్యె, న య్యవసరంబునం గయ్యంబునకుం గాలు ద్రవ్వు న ప్పౌండ్రకునిం గనుంగొని హరి సంబోధించి యి ట్లనియె.

520

తా ॥ శ్రీకృష్ణ పౌండ్రకుల ఘోర సంగ్రామంలో రక్తం ప్రవాహం కట్టింది. మృతసైనికుల మాంసం బురదబురదగా మారి నడవడానికి అశక్యంగా ఏర్పడింది. ఆ సమయంలో ఇంకా యుద్ధానికి కాలుదువ్వుతున్న పౌండ్రకుణ్ణి చూసి కృష్ణుడిలా అన్నాడు:

మ. 'మనుజేంద్రాధమ! పౌండ్రభూపసుత! నీ మానంబు బీరంబు నేఁ
డనిలో మాపుదు, నెద్దు క్రొవ్వి పెలుచ న్నాఁబోతుపై అంకె వై
చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వల్దన్న పే
రును జిహ్వంబులు నీ పయిన్ విడుతు నర్చుల్ పర్వ నేఁ డాజిలోన్.

521

తా ॥ "ఓ నీచరాజా! పౌండ్రకా! ఈ రోజు నీ దురభిమానాన్ని, గర్వాన్ని మటుమాయం చేస్తాను. యుద్ధంలో నన్ను ఎదిరించి పోరాడగలమొనగాడివా నీవు? ఎద్దు–ఆబోతుపై రంకెవేసి పోరుకు దిగినట్లు ఆ రోజు దూతను పంపి నన్నాక్షేపించావు. వాసుదేవుడనే పేరును నన్ను పెట్టుకోవద్దని చెప్పావు. శంఖచక్రాది ఆయుధాలు ధరించవద్దన్నావు. ఇప్పుడా ఆయుధాలనే – అగ్నిజ్వాలలు విరజిమ్ముతూ నీపైకి వచ్చేటట్లు ప్రయోగిస్తాను. కాచుకో!

క. అది గాక నీదు శరణము, పదపడి యేఁ జొత్తు నీవు బలవిక్రమ సం

పద గల పోటరి వేనిం, గదలక నిలు 'మనుచు నిశితకాండము లంతన్.

522

తా ॥ నిన్నా విధంగా సంహరించలేకపోతే, అప్పుడు నీ శరణుకోరుతాను. నీవే కనుక శౌర్యప్రతాపాలు గల వీరుడవైతే రణరంగంలో నాతో యుద్ధం చేయడానికి కదలకుండా నిలబడు. పారిపోవడానికి ప్రయత్నించకు."

మ. చల మొప్పన్ నిగుడించి వాని రథముం జక్కాడి తత్సారథిం
దల వే త్రుంచి హయంబులన్ నరికి యుద్దండప్రతాపక్రియం
బ్రలయార్కప్రతిమాన చక్రమున నప్పౌండ్రుున్ వెసం ద్రుంప వాఁ
డిలఁ గూలెం గులిశాహతి న్నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా!

523

తా ॥ అని అంటూ శ్రీకృష్ణుడు వదలని పట్టుదలతో వాడి వాడి బాణాలువేసి పౌండ్రకుని రథాన్ని విరగకొట్టాడు. సారథిని కూల్చివేశాడు. గుఱ్ఱాలను నరికివేశాడు. మహాతీవ్రమైన ప్రతాపంతో ప్రళయకాల సూర్యునివలె నిప్పులు కురిపిస్తూ శత్రునాశనం చేసే సుదర్శన చక్రంతో పౌండ్రకుణ్ణి సంహరించాడు. ఆ దెబ్బతో, వజ్రాయుధపు దెబ్బతో కూలి పడిపోయే పర్వతం లాగా పౌండ్రకుడు ప్రాణాలు కోల్పోయి భూమిపై పడిపోయాడు.

చ. మడవక కాశికావిభుని మస్తక ముద్ధతిఁ ద్రుంచి బంతి కై
వడి నది పింజ పింజ గఱవన్ విశిఖాళి నిగుడ్చి వాని యే
లెడి పురిలోన వైచె నవలీల మురాంతకుఁ డిట్లు వైరులన్
గడఁగి జయించి చిత్తమునఁ గౌతుకముం జిగురొత్త న త్తఱిన్.

524

తా ॥ శ్రీకృష్ణుడంతటితో ఆగక కాశీరాజు తలనుకూడా త్రుంచి, బాణాలతో ఆ తలనుపైకి

ఎగురకొడుతూ వాడి నివాసమైన కాశీ పట్టణంలో పడేటట్లు తన శౌర్యాన్ని ప్రదర్శించాడు. శ్రీకృష్ణుడు ఈ విధంగా శత్రువులు అందరినీ పైలోకాలకు పంపి పరాక్రమోపేతుడై ఆనందోత్సాహాలతో విలసిల్లాడు.

క. సుర గంధర్వ నభశ్చర, గరుడోరగ సిద్ధ సాధ్యగణము నుతింపన్ మరలి చనుదెంచి హరి నిజ, పురమున సుఖముండె నతివిభూతి దలిర్పన్.

525

తా ॥ శ్రీకృష్ణుని విజయాన్ని దేవతలు, గంధర్వులు, గరుడులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు మొదలైన ఆకాశచరులందరూ ప్రశంసించారు. సర్వజనులు చేస్తున్న స్తోత్రాలు వింటూ శ్రీకృష్ణుడు మహావైభవంతో ద్వారకానగరానికి తిరిగివచ్చి సుఖసంతోషాలతో విరాజిల్లాడు.

క. వనజోదరు చిహ్నంబులు, గొనకొని ధరియించి పౌండ్రకుఁడు మచ్చరియై
యనవరతము హరి దన తలఁ, పునఁ దగులుటఁ జేసి ముక్తిఁ బొందె నరేంద్రా!

526

తా ॥ పౌండ్రకుడు శ్రీకృష్ణ పరమాత్ముడు ధరించే శంఖచక్రాది చిహ్నాలు ధరించి, కృష్ణుడితో మాత్సర్యాన్ని వహించి ప్రతిక్షణం కృష్ణుడినే తలుస్తూ ఉండటం చేత మోక్షసామ్రాజ్యాన్ని పొందగలిగాడు.

సీ. అక్కడఁ గాశిలో నా రాజు మందిరాంగణమునఁ గుండల కలిత మగుచుఁ
బడి యున్న తలఁ జూచి పౌరజనంబులు దమ రాజు తలయనిఁ దగ నెఱింగి
చెప్పిన నా నృపు జీవితేశ్వరులును సుతులు బంధువులును హితులు గూడి
మొనసి హాహాకారముల నేడ్చి, రత్తఱిఁ దత్తనూభవుఁడు సుదక్షిణుండు

తే. వెలయఁ దండ్రికిఁ బరలోకవిధు లొనర్చి జనకు ననిలో వధించిన చక్రపాణి నదరి

మర్దింపఁ దగు నుపాయంబు దలఁచి, చతురుఁ డగునట్టి తన పురోహితునిఁ బిలిచి.

527

తా ॥ పరీక్షిత్తూ! ఇక్కడ ఇలా జరిగితే అక్కడ కాశీనగరంలో రాజుగారి మందిరంలో కుండలాలతో కూడి ఉన్న తల పడటం చూసి ప్రజలంతా ఆ తల తమరాజుగారి తలే అని గుర్తించి అంతఃపురకాంతలకు ఆ విషయం తెలియజేశారు.

పతిమరణాన్ని తెలుసుకొన్న కాశీపతి పత్నులందరూ తమ పుత్రులతో, బంధువులతో, హితులతో కలిసి సభాప్రాంగణానికి వచ్చి హాహాకారాలు చేస్తూ దుఃఖించారు. కాశీరాజు కుమారుడైన సుదక్షిణుడు తండ్రికి పరలోకక్రియలు యథావిధిగా చేసి, దుఃఖాన్ని ఆపుకోలేక యుద్ధభూమిలో తనతండ్రిని వధించిన శ్రీకృష్ణుని ఏ విధంగా సంహరించాలా, అని ఆలోచించాడు. తమ పురోహితుణ్ణి పిలిచి, అతనితో కలిసి దీనికి ఉపాయమేమిటా అని తెగ మథన పడ్డాడు.

క. అతడుం దానును జని పశు, పతిపద సరసిజములకును బ్రమదముతో నా
నతుఁడై య ద్దేవుని బహు, గతులం బూజింప నతఁడు కరుణాన్వితుఁడై.

528

తా ॥ సుదక్షిణుడు, పురోహితునితో కలిసి శివుడి దగ్గరకువెళ్ళి, ఆ పరమేశ్వరుని పాదపద్మాలకు అనేకసార్లు ప్రణమిల్లి, ఆ దేవదేవుని బహుగతులతో పూజించాడు. సుదక్షిణుని పూజలకు మెచ్చిన శంకరుడు అతని పట్ల కరుణ వహించాడు.

క. 'మెచ్చితి నే వర మైనను నిచ్చెద నను వేఁడు' మనిన 'నీశ్వర ! నన్నున్ మచ్చిక రక్షింతువు పొర, పొచ్చెము సేయక మహేశ! పురహర! యభవా!

529

తా ॥ "ఓ సుదక్షిణా! నీ భక్తికి మెచ్చాను. ఏ వరం కోరితే ఆ వరం ప్రసాదిస్తాన" ని పరమేశ్వరుడు ప్రసన్నుడైనాడు. దానికి సుదక్షిణుడు శివుణ్ణి అనేక విధాలుగా స్తుతించాడు.

"మహేశ్వరా! త్రిపురాసురసంహారా! అభవా! ఈశ్వరా! శంకరా! నీవు కృపాళుడవు. నన్ను వాత్సల్యంతో తప్పక రక్షిస్తావు. భక్తులయెడ నీకు ఏ పొరపొచ్చాలూ లేవు.

క. దేవా! మ జ్జనకుని వసు, దేవాత్మజుఁ డాజిలో వధించెను, నే నా
గోవిందుని ననిలోపల, నే విధమున గెలుతు నానతీవె పురారీ!'

530

తా ॥ దేవాది దేవా! నా కోరిక విను. నా తండ్రిని వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడు యుద్ధంలో సంహరించాడు. ఆ కృష్ణుణ్ణి యుద్ధంలో నేను ఏ విధంగా గెలవగలుగుతానో ఆనతియ్యి ప్రభూ!" అని వేడుకొన్నాడు.

తే. అనిన శంకరుఁ డతనికి ననియె ననఘ!, నీవు ఋత్విజులును భూసురావళియును బ్రీతి
నభిచార మొనరింప భూతయుక్తుఁ, డగుచు ననలుండు దీర్చు నీ యభిమతంబు'.

531

తా ॥ సుదక్షిణుడు ఆవిధంగా ప్రార్థించగానే "చూడు భక్తా! నీమా, ఋత్విజులూ, బ్రాహ్మణోత్తములూ కలిసి అభిచార హోమం చేస్తే – ప్రీతుడైన అగ్నిహోత్రుడు నీ కోరిక నెరవేరుస్తాడ" ని శివుడు చెప్పి అంతర్ధానమయినాడు.

తే. అనిన నా చంద్రమౌళి వాక్యముల భంగి, భూరినియమముతో నభిచారహోమ
మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ, జెలఁగ దక్షిణవలమాన శిఖల వెలిఁగె.

532

తా ॥ శంకరుడు చెప్పిన విధంగా సుదక్షిణుడు తీవ్రమైన నియమాలతో అభిచార హోమం

చేశాడు. అగ్నిదేవుడు యథోచితంగా దక్షిణదిశను చుడుతూ జాజ్వల్యమానమైన జ్వాలలతో ప్రజ్వరిల్లాడు.

వ. అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబును, నశనిసంకాశంబు లైన నిడుదకోఱలును, నిప్పులుప్పతిల్లు చూడ్కులును, ముడివడిన బొమలును, జేవురించిన మొగంబును గలిగి కృత్య యతి రౌద్రాకారంబునఁ బ్రజ్వరిల్లుచుఁ గుండంబు వెలువడి యనుదిన నిహన్యమాన ప్రాణిరక్తారుణ మృత్యుకరవాలంబు లీలం జూపట్టు నాలుకను సెలవుల నాకికొనుచు నగ్ని కీలాభీలంబగు శూలంబు గేలం దాల్చి భువనకోలాహలంబుగా నార్చుచు, నుత్తాల తాలప్రమాణ పాదద్వయహతులం దూలు పెంధూళి నింగి మ్రింగ, భూతంబులు సేవింప, నగ్నవేషయై, నిజవిలోచన సంజాత సముద్ధూత నిఖిల భయంకరజ్వాలికా జాలంబున దిశాజాలంబు నోలిం బ్రేల్చుచు, నుద్వేగగమనంబున నగధరు నగరంబున కరుగుదేరఁ, బౌరజనంబులు భయాకులమానసులై దావదహనునిం గని పఱచు వనమృగంబుల చాడ్పునం బఱచి, సుధర్మాభ్యంతరంబున జూదంబాడు దామోదరునిం గని 'రక్షర' క్షేతి రవంబుల నార్తులయి 'కృష్ణ! కృష్ణ! పెనుమంటల బురంబు గాల్పం బ్రళయాగ్ని సనుదెంచె' నన వారిం జూచి 'యోడకోడకుఁ' డని భయంబు నివారించి, సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునం దద్వృత్తాంతం బంతయుఁ దన దివ్యచిత్తంబున నెఱింగి కాశీరాజపుత్త్ర ప్రేరితయైన య మ్మహాకృత్యను నిగ్రహింపం దలంచి నిజపార్శ్వవర్తియై యున్న య ద్దివ్య సాధనంబు గనుంగొని యప్పుడు.

533

తా ॥ ఆ అగ్నికుండం నుంచి ఒక కృత్య ఆవిర్భవించింది. ఆ కృత్య ఎఱ్ఱని గడ్డంతో, వెంట్రుకలతో ఉంది. పిడుగులవంటి కఠినమైన పొడవాటి కోరలతో, కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ, ముడిపడిన కనుబొమ్మలతో, జేవురించిన ముఖంతో అతిభయంకరమైన ఆకారంతో కృత్య బయలుదేరింది. ప్రతిదినం ప్రాణులను సంహరించిన రక్తంతో ఎఱ్ఱబడిన మృత్యుదేవత చేతిలోని

కత్తిలాగా కనిపిస్తున్న నాలుకతో పెదవుల అంచులను తడుపుతూ, అగ్నిజ్వాలలాగా మహాభయంకరంగా ఉన్న శూలాన్ని చేతిలో పట్టుకొని, లోకాలు దద్దరిల్లేటట్లు పెద్దగా అరుస్తూ, తాడిచెట్టంత పాదాల ఒత్తిడితో పైకి ఎగురుతున్న దుమ్ముధూళీ ఆకాశాన్ని మింగుతున్నాయా అన్నట్లు నడుస్తూ, భూతగణాలు సేవిస్తుండగా, కళ్ళ నుంచి వెలువడుతున్న భయంకర జ్వాలలతో దిక్కులను మండిస్తూ, నగ్నవేషధారియై కృత్య అతివేగంగా కృష్ణుని నగరానికి వచ్చింది.

అగ్నిలా మండుతూ, భయంకరంగా వస్తున్న కృత్యను చూసి ద్వారకా వాసులందరూ భీతులై దావాగ్నిని చూసి భయపడి పారిపోయే అడవిజంతువులులాగా పరుగెత్తి అభ్యంతర మందిరంలో జూదమాడుతున్న శ్రీకృష్ణుని చెంతకు వచ్చారు. "రక్షించు, రక్షించు" అని మొరపెడుతూ "మన నగరాన్ని దహించడానికి పెద్దపెద్ద మంటలతో ప్రళయాగ్ని వచ్చింది కృష్ణా! నీవే మమ్మల్ని కాపాడాలి" అని ప్రార్థించారు. ఆర్తితో వచ్చిన పురప్రజల భయాన్ని పోగొడుతూ కృష్ణుడు "మీరేమీ భయపడకండి. నేనున్నాను గదా!" అని ధైర్యం చెప్పి దివ్యదృష్టితో జరిగిన విషయమంతా తెలుసుకొన్నాడు. సుదక్షిణుడు పంపిన ఆ మహాకృత్యను వధించాలని నిశ్చయించాడు. వెంటనే తన ప్రక్కనే ఉన్న దివ్యాయుధమైన చక్రాన్ని చూసాడు.

సీ. భీమమై బహుతీవ్రధామమై హతరిపు స్తోమమై సుమహితోద్దామ మగుచుఁ
జండమై విజితమార్తాండమై పాలితాజాండమై విజయప్రకాండ మగుచు
దివ్యమై నిఖిలగంతవ్యమై సుజన సంభావ్యమై సద్భక్త సేవ్య మగుచు
నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితాదిత్యమై నిర్జితదైత్య మగుచు

తే. విలయసమయ సముద్భూత విపులభాస్వ, దళికలోచన లోచనానల సహస్ర
ఘటిత పటుసటాజ్వాలికా చటుల సత్త్వ, భయదచక్రంబు కృత్యపైఁ బంపె శౌరి.



తా ॥ సుదర్శన నామచక్రం మహాభయంకరంగా తీవ్రమైన అంచులతో శత్రుసమూహాన్ని

చీల్చి చెండాడేదిగా మహామహిమాన్వితంగా ప్రకాశిస్తోంది. చండప్రచండమైన కాంతితో సూర్యమండలాన్ని జయించిందా అన్నట్లుగా ఉంది. బ్రహ్మాండాన్ని పాలిస్తూ, విజయపరంపరలతో దివ్యాతి దివ్యంగా శోభిస్తోంది. సమస్త దిగంతాలవరకు ప్రయాణించగలిగి, సజ్జనులచేత గౌరవింపబడుతూ, భక్తాగ్రగణ్యులచేత స్తోత్రం చేయబడుతూ, వేదవేదాంగాలచేత స్తుతింపబడుతూ, దేవతలచేత నమస్కరింపబడుతూ, రాక్షసులను జయిస్తూ, శాశ్వతమైన కీర్తితో విరాజిల్లుతోంది. శ్రీకృష్ణుడు అటువంటి, ప్రళయ వేళలో త్రినేత్రుడి అగ్నినేత్రం నుంచి బహిర్గతమయ్యే సహస్ర జ్వాలల సమాహారంతో శక్తిమంతమై సర్వులకు భయాన్ని కలిగించే సుదర్శన చక్రాన్ని సుదక్షిణుడు ప్రయోగించిన కృత్య మీదకు పంపాడు.

వ. ఆదియును బ్రళయ వేళాసంభూత జీమూతసంఘాతప్రభూత ఘుమఘుమాటోప నినదాధరీకృత మహాదుస్సహ కహకహ నిబిడనిస్వన నిర్ఘోషపరిపూరిత బ్రహ్మాండకుహరంబును, నభ్రంలిహ కీలాసముత్కట పటు చిటపట స్ఫుట ద్విస్ఫులింగచ్ఛటాభీలంబును, సకలదేవతాగణ జయ జయ శబ్దకలితంబును, ననంతతేజో విరాజితంబును నగుచుం గదిసినం బంటింపక కంటగించు కృత్యను గెంటి వెంట నంటిన నది తన తొంటి రౌద్రంబు విడిచి మరలి కాశీపురంబు సొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ, రోషభీషణాకారంబుతో నప్పుడు ఋత్విఙ్నికాయ యుతంబుగ సుదక్షిణుని దహించె, నత్తఱిఁ జక్రంబును దన్నగరంబు సౌధప్రాకార గోపురాట్టాలకాది వివిధవస్తువాహన నికరంబుతో భస్మంబు గావించి మరలి యమరులు వెఱఁగందఁ గమలలోచన పార్శ్వవర్తియై నిజప్రభాపుంజంబు వెలుఁ గొందఁ గొల్చియుండె నని చెప్పి మఱియు నిట్లనియె.



తా ॥ అప్పుడు ప్రళయకాలంలో నినదించే మేఘసమూహం యొక్క ఉరుముల ధ్వనులను ధిక్కరిస్తూ, వినడానికి మహా కష్టంగా, చెవులు చిల్లులుపడేటట్లు చాలా పెద్దదైన కహకహధ్వనిని

చేస్తూ, బ్రహ్మాండభాండాన్ని అంతటినీ దుస్సహమైన తన ధ్వనితో నింపివేస్తూ సుదర్శన చక్రం బయలుదేరింది. తననుండి వెలువడుతున్న అగ్నిజ్వాలలు మింటినంటి వెలుగులు చిమ్ముతూ, చిటపటధ్వనులతో నిప్పురవ్వలు కురిపిస్తూ బీభత్సంగా నడుస్తున్న చక్రాన్ని చూసి సమస్తదేవతా సమూహం జయజయధ్వానాలు చేశారు. చూడశక్యం కానటువంటి అనంతమైన తేజస్సుతో చక్రం ఆ కృత్యను సమీపించింది.

చక్రాన్ని చూసి భయపడక, జాగు చేయకుండా కంటగిస్తూ చక్రంపైన పడబోయింది కృత్య. అప్పుడు సుదర్శనాయుధం ఆ కృత్యను ద్వారకానగరం నుంచి గెంటివేస్తూ వెంటబడి అగ్నిజ్వాలలు కురిపించింది. ఆ మంటలవేడికి తట్టుకోలేక కృత్య తన రౌద్రాన్ని విడిచిపెట్టి తిరుగుముఖం పట్టింది. కాశీపట్టణంలోకి ప్రవేశించి అక్కడ ఉన్న పౌరులందరూ హడలిపోయేటట్లు రోషభీషణాకారంతో సుదక్షిణున్ని సమీపించి, అతనిని, అతని చేత అభిచార హోమం చేయిస్తున్న ఋత్విక్కులను దగ్ధం చేసి పారేసింది. అంతటితో ఊరుకోక, కాశీపురిలోని గోపురాలను, వివిధ వస్తువులను, వాహనాలను, మేడలను, ప్రాకారాలను, కోట బురుజులను – ఒకటేమిటి అన్నింటినీ భస్మం చేసింది. కాశీనగరమే భస్మమైపోయిందా అనేటట్లు చక్రం తన రౌద్రాకారంతో వీరవిజృంభణ చేసింది. కొంతసేపటికి తృప్తి పొంది, తన వీరవిహారానికి దేవతలందరూ ఆశ్చర్యపోతూ ఉండగా, దివ్యకాంతులతో పరిసరప్రాంతమంతా ప్రకాశింపచేస్తూ తిరిగివచ్చి శ్రీకృష్ణుని ప్రక్కనే నిల్చి ఆ పరమాత్ముణ్ణి సేవిస్తూ ఉండిపోయింది.

క. మురరిపు విజయాంకితమగు, చరితము సద్భక్తిఁ దగిలి చదివిన వినినన్ దురితములఁ
బాసి జను లిహ పర సౌఖ్యము లతనిచేతఁ బడయుదు రధిపా!

536

తా ॥ “పరీక్షిత్తూ! కోపము, క్రోధంతో విర్రవీగే వాళ్ళ దుస్థితిని తెలిపే ఈ గాథను ఆకళింపచేసుకుని, వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఈ విధమైన ప్రబోధను తెలియజేసే శ్రీకృష్ణుని విజయగాథను ఎవరైతే భక్తితో చదువుతారో, వింటారో వారందరికీ ఇహలోక

సౌఖ్యాలు, పరలోక సౌఖ్యాలు లభిస్తాయి. ఆ భక్తులు పరమాత్ముని కృపకు పాత్రులౌతారు."

వ. అనిన శుకయోగికి రాజయోగి యిట్లనియె.

537

తా ॥ అని శుకయోగి చెప్పిన మాటలు విని రాజయోగి అయిన పరీక్షిత్తు ఈ విధంగా అడిగాడు:

## బలరాముడు ద్వివిదుడనే వానరుడిని సంహరించుట

క. బలభద్రుఁ డప్రమేయుం, డలఘుఁ డనంతుండు నతని యద్భుతకర్మం బులు వినియు,
దనియ దింకను, దెలియఁగ నా కానతిమ్ము దివ్యమునీంద్రా!

538

తా ॥ "మునీంద్రా! అనంతుడు, అప్రమేయుడు, మహాత్ముడు అయిన బలరామదేవుడు చేసిన అద్భుత కార్యాలు కొన్ని మీరు చెప్పగా విన్నాను. అయినా ఇంకా తృప్తి కలగలేదు. మరికొన్ని విషయాలు, ఆయన మహిమలు చెప్పవలసిందిగా కోరుతున్నాను."

వ. అనిన రాజునకు శుకుం డిట్లనియె.

539

తా ॥ ఆ మాటలకు శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విధంగా అన్నాడు:

క. జననాయక! విను సుగ్రీ, వుని సచివుఁడు మైందునకు సహోదరుఁ డనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం, డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ డతిదర్పితుఁడై.

540

తా ॥ "మహారాజా! సుగ్రీవుడికి ఒక మంత్రి ఉన్నాడు. ఆ మంత్రిపేరు మైందుడు. మైందుని తమ్ముడు ద్వివిదుడు. ద్వివిదుడు పేరెన్నికగన్న వానర నాయకుడు. బలపరాక్రమాలతో గర్వించి ఉన్నవాడు. పైగా నరకాసురునికి ఆప్తమిత్రుడు.

సీ. చెలికానిపగఁ దీర్పఁ దలఁచి కృష్ణుం డేలు పురములు జనపదంబులు దహించి
సరి దుపవన సరోవరములు గోరాడి మందలఁ గొందలమందఁ జేసి
ప్రాసాదములు ద్రొబ్బి పరిఖలు మాయించి చతురంగ బలముల సమయఁ జేసి

పురుషుల సతులను భూధరగుహలలోఁ బెట్టి వాకిలి గట్టి బిట్టు నొంచి

తే. ఫలిత తరువులఁ ద్రుంచి సాధుల నలంచి, కోట లగలించి పడుచుల నీట ముంచి ధరణి నిబ్బంగిఁ బెక్కుబాధలఁ జలంబు, పఱఁగఁజేయుచు నొకనాఁడు ప్లవగవరుఁడు.

541

తా ॥ ద్వివిదుడు తన మిత్రుడైన నరకాసురుని పగను తీర్చదలచుకొని కృష్ణుడు పరిపాలిస్తున్న నగరాలను, పల్లెలను దహించివేశాడు. ఉద్యానవనాలను, సరస్సులను ధ్వంసం చేశాడు. ఆవుల మందలను భయపెట్టి చెల్లాచెదరు చేసేవాడు. మేడలను పడగొట్టడం, అగడ్తలను మూయించటం, చతురంగ బలాలను వధించటం, పండ్లతో నిండుగా ఉన్న చెట్లను నరకటం, సజ్జనులను ఏడిపించటం, కోటలను కూలదోయటం, స్త్రీ పురుషులను కొండగుహల్లో నిర్బంధించి గుహవాకిలి మూసివేయటం, యువతులను నీళ్ళల్లో ముంచి ఉంచటం వంటి అనేక దుష్టకార్యాలు చేశాడు. రోషంతో, పట్టుదలతో జనులను నిలువనీడలేకుండా చేసి బాధలు పెట్టాడు. ఆ విధంగా కృష్ణ పాలితప్రాంతాలను ధ్వంసం చేస్తున్న ద్వివిదుడు ఒకనాడు రైవత పర్వతం చెంతకు వెళ్ళాడు.

క. చతుర మృదు గీతరవము, న్నతి వీతెంచినఁ జెలంగి నగచరుఁ డా రై

వతగిరి కందరమున కా, యతిగతిఁ జని యందు నెత్త మాడెడు వానిన్.

542

తా ॥ ఆ పర్వతం మీదనుంచి మృదుమధురమైన గానం చెవిని బడింది. గానమాధుర్యానికి వశుడై అది వినవచ్చిన వైపుకు వెళ్ళి ఆ కొండగుహలో జూదమాడుతున్న బలరాముణ్ణి చూశాడు.

చ. లలితవినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జంద్రచంద్రికా

కలిత మహోన్నతాంగు మణికాంచన దివ్యవిభూషణోన్నతున్

విలసితవారుణీ సమదవిహ్వల లోచనుఁ గాంచె సీర ని
ర్దళిత రిపుక్షితీశ నిజధాముని రాముని కామపాలునిన్.

543

తా ॥ నీలవస్త్రం ధరించి, సుందరీమణుల మధ్యలో పున్నమినాటి వెన్నెలకాంతితో వెలిగిపోతున్న ఆజానుబాహున్ని, మణులతో కూర్చిన బంగారు ఆభరణాలతో మెరిసిపోతున్నవానిని, మద్యపానం చేత చలిస్తున్న ఎఱ్ఱని నేత్రాలు గలవానిని, నాగలిచేత శత్రురాజుల పురాలను నాశనం చేసిన వానిని, కామపాలుడనే పేరుతో విలసిల్లుతున్న బలరాముణ్ణి ద్వివిదుడు చూశాడు.

సీ. కనుఁగొని తత్పురోగమ భూమిరుహశాఖ, లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించుఁ;
గికురించుచును బండ్లిగిల్చి చూపుచు వెసఁ గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చుఁ; దోఁక
నూరక మేను సోఁకఁగ నులివెట్టు; వెడవెడ నాలుగ వెడలఁ బెట్టు; బరుల నఖంబుల గిరగిర
గోఁకుచుఁ బొరిఁ బొరి ఫలములు గఱచివైచు;

తే. గోళ్ళు తెగ గొర్కి యుమియును; గుదము సూపు;, బలసి మర్కటజాతి యి ప్పగిదిఁ
జేయఁ గోపమున హలధరుం డొక గుండు వైవ, దానిఁ దప్పించుకొని ప్రల్లదమున నతని.

544

తా ॥ బలరాముణ్ణి చూసిన వానరవీరుడైన ద్వివిదుడు వివిధరకాలైన వానరచేష్టలు చేయడం మొదలుపెట్టాడు. బలరాముడికి ముందువైపున్న చెట్లను ఎక్కి, ఆ చెట్లకొమ్మలను రకరకాలుగా ఊపుతూ యాదవవీరుడి ఆనందానికి విఘ్నం కలిగించాడు. కొమ్మమీదనుంచి మరో కొమ్మమీదకు ఎగురుతూ బలరాముణ్ణి చూసి వెక్కిరించాడు. కనిపించినట్లే కనిపించి కొమ్మల గుబురులలో దాక్కునేవాడు. పళ్ళుబైటపెట్టి నవ్వాడు. తోకను బలునికి తగిలిస్తూ మెలికపెట్టి వినోదించాడు. మాటిమాటికి నాలుక జాపుతూ వెకిలితనం చేశాడు. యాదవులను గోళ్ళతో గోకి, మరుక్షణం చెట్టుపైకెక్కి పండిన పండ్లను నోటితో కొరికి క్రిందపడేశాడు. ఇలాంటి

వెకిలి చేష్టలు ఇంకా ఎన్నో చేసాడు.

ద్వివిదుడు చేస్తున్న పిచ్చిపనులన్నీ చూశాడు బలరాముడు. కోపంతో ఒక పెద్ద రాయితీసుకొని ఆ వానరుడికి తగిలేటట్లు, అక్కడ నుంచి పారిపోయేటట్లు బలంగా కొట్టాడు. కాని, ద్వివిదుడు దానిని తప్పించుకొని మరింత విజృంభించాడు.

క. నగి యాసవకలశముఁ గొని, జగతీరుహశాఖ యెక్కి చాపలమున న
జ్జగతిపయి వైచెఁ దద్ఘట, మగలగఁ; నది చూచి కోప మగ్గల మొదవన్.

545

తా ॥ బలరాముణ్ణి చూసి పకపకా నవ్వుతూ ఆ యాదవవీరుని ప్రక్కనే ఉన్న మద్యపాత్రను తీసుకొనిపోయి చెట్టెక్కి కూర్చున్నాడు. వెంటనే ఆ పాత్రను బలరాముడి మీదకు విసిరి కొట్టాడు. అది క్రిందపడి పగిలిపోయింది. వానరుని చర్యలకు యాదవవీరుడు క్రోధాతిశయంతో మండిపడ్డాడు.

వ. మఱియును.

546

తా ॥ బలరాముని ముఖం చూసిన వానరవీరుడు అతనిని ఇంకా వేధించదలచాడు.

క. సీరినిఁ దన మనమున నొక, చీరికిఁ గైకొనక కదిసి చీరలు చింపన్
వారకతడు భువిజనములఁ, గారించుట మాన్పఁ దలఁచి ఘనకుపితుండై.

547

తా ॥ బలరాముని శౌర్యాన్ని లక్ష్యపెట్టక ద్వివిదుడు అతనిని సమీపించి అక్కడ ఉన్న యాదవుల వస్త్రాలను చీలికలు చీలికలుగా చించాడు. వీడినిక ఉపేక్షిస్తే లాభం లేదనుకొన్నాడు బలరాముడు. ప్రజల బాధలు నివారించ దలచి తానూ యుద్ధరంగంలోకి దిగాడు.

వ. ఇట్లు కోపోద్దీపిత మానసుండై కనుంగొని హలాయుధుం డప్పుడు.

548

తా ॥ బలరాముడప్పుడు క్రోధావేశంతో నిండిన మనస్సుతో వానరనాయకున్ని చూశాడు.

చ. ముసలముఁ దీవ్రశాతహలమున్ ధరియించి సమస్తచేతన
గ్రసనమునాఁడు పొంగు లయకాలునిభంగి నదల్చి నిల్వ; వా
డసదృశవిక్రమక్రమ విహార మెలర్ప సమీపభూజమున్
వెసఁ బెకలించి మస్తకము వ్రేసెఁ జలంబు బలంబు చొప్పడన్.

549

తా ॥ ఒక చేత రోకలిని మరో చేత నాగలిని ధరించాడు. సకల జీవరాశులను నశింపచేసే ప్రళయకాలంలోని యమధర్మరాజులాగా వానరున్ని గద్దించి నిలబడ్డాడు. ద్వివిదుడు కూడా అసమానమైన బలపరాక్రమాలతో విజృంభించి ప్రక్కనే ఉన్న ఒక మహావృక్షాన్ని క్షణంలో పెళ్ళగించి బలరాముని తలపైన గట్టిగా కొట్టాడు.

వ. ఇట్లు వ్రేయ బలుం డప్పుడు.

550

తా ॥ ఈ విధంగా నరకాసురుని మిత్రుడైన ద్వివిదుడు బలరామునిపై వృక్షాన్ని ఉద్దండబలంతో విసిరి కొట్టగానే–

చ. ఉరవడి దండతాడిత మహోరగుభంగిఁ గడంగి వీర సా
గరమన నేఁచి హేమకటకంబుల నొప్పు సునందనామ భీ
కర ముసలంబునన్ ద్వివిదుకంతము వ్రేసినఁ బొల్చె వాఁడు జే
గురు గల కొండచందమునఁ గోయని యార్చి సురల్ నుతింపఁగన్.

551

తా ॥ దండతాడిత భుజంగంలాగా లేచాడు బలరాముడు. ప్రళయకాలంలో ఉప్పొంగుతూ వీరవిహారం చేసే సముద్రంలాగా వీరవిజృంభణ చేసాడు. బంగారు కట్లతో ప్రకాశిస్తున్న 'సునందము' అనే పేరుగల తన ముసలాయుధంతో మహాభీకరంగా ద్వివిదుని కంఠంపై కొట్టాడు. ఆ దెబ్బతో రక్తంచిమ్మి వానరుడు 'కో' అని బాధతో పెద్దగా అరిచాడు. ఆ సమయంలో ద్వివిదుని శరీరమంతా రక్తంతో తడిసిపోవడంతో ఆ వానరుడు ఒక పెద్ద ఎఱ్ఱకొండలాగా కనిపించాడు. బలరాముని శౌర్యానికి దేవతలంతా స్తుతించారు.

మత్త. అంత వాఁడొకయింత మూర్ఛిలి యంతలోఁ దెలివొంది దు
ర్దాంతభూరి భుజావిజృంభణుఁడై మహీజము పూన్చి దై
త్యాంతకాగ్రజు వ్రేసె; వ్రేసిన నాగ్రహంబున దాని నిం
తింతలై ధర రాలఁ జేసె నహీనవిక్రమశాలియై.

552

తా ॥ బలరాముడు కొట్టిన రోకటిదెబ్బకు ద్వివిదుడు ఒక్క క్షణం మూర్ఛబోయాడు. వెంటనే తేరుకొని, మళ్ళీ తన భుజబలాన్ని ప్రదర్శిస్తూ, ఒక పెద్ద చెట్టును పెకలించి రాక్షసాంతకుడైన శ్రీకృష్ణుని అన్నగారైన బలరాముడి మీద వేసి కొట్టాడు. బలరాముడు కూడా కోపించి ఆ చెట్టును చిన్నచిన్న ముక్కలుగా నేలపై పడగొట్టాడు.

క. మఱియును జల ముడుగక వెసఁ, దరుచరుఁ డొకతరువు వ్రేయఁ దాలాంకుఁ డనా
దరమునఁ దునిమిన వెండియుఁ, దొరఁగించెఁ గుజంబు లతఁడు దోర్ద్పోఁ దునుమన్

553

తా ॥ బలరాముడు అంతటితో ఊరుకోక మహాపరాక్రమవంతుడై వానరుడు తనపై వేస్తున్న ఒక్కొక్క చెట్టునూ నేలపై కూల్చివేసాడు.

క. ఆ చందంబున వనచరుఁ, దేచి మహీరుహచయంబు లెల్లను హలిపై
వైచి యవి శూన్య మగుటయుఁ, జూచి శిలావృష్టిఁ గురిసె సుర లగ్గింపన్.

554

తా ॥ ఆ విధంగా అక్కడ ఉన్న చెట్లనన్నింటినీ పెళ్ళగించి బలరాముడిపై వేయగా ఆ చెట్లన్నీ నరకబడి క్రిందపడిపోవడంతో ఆపుకోలేని కోపంతో ద్వివిదుడు బలరాముడిపై రాళ్ళ వర్షం కురిపించాడు.

క. బలుఁ డపుడు ఱాలు తుమురై, యిల రాలఁగఁ జేసి యార్వ నే పుడుగక యా
వలిముఖుఁడు తాలసన్నిభ, ము లయిన నిజబాహుదండముల నుగ్రుండై.

555

తా ॥ బలరాముడు ఆ రాళ్ళ నన్నింటినీ పొడిపొడిగా నేలపై రాలేటట్లు తన ముసలాయుధంతో కొట్టేటప్పటికి వానరుడు తాడిచెట్లంత పొడవైన తన బాహువులతో యాదవవీరునితో ముష్టియుద్ధం చేయడం మొదలుపెట్టాడు.

క. వడిఁ బిడుగుఁ బోలు పిడికిటఁ, బొడిచిన వడి సెడక బలుఁడు ముసలము హలమున్
విడిచి ప్లవంగుని మెడఁ గడు, వెడవెడ బిగియించె గ్రుడ్లు వెలి కుఱుకంగన్.

556

తా ॥ ఉగ్రుడై ద్వివిదుడు వేగంగా పిడుగులాంటి తన పిడికిలి దెబ్బతో బలరాముణ్ణి కొట్టాడు. వానరుడి ధాటిచూసిన బలరాముడు తన చేతులలోని ఆయుధాలైన ముసలాన్ని, హలాన్ని క్రిందపడవేసి ద్వివిదుని మెడను గట్టిగా నొక్కి పట్టి అతడు కదలడానికి లేకుండా చేశాడు. దానితో వానరుని కనుగ్రుడ్లు రెండూ బయటకు వచ్చాయి.

క. వదనమునఁ జెవుల రుధిరము, మెదడును దొరఁగంగ వాఁడు మేదిని మీఁదం జదికిలఁ

బడి యొక యింతయు, మెదలక మిడుకంగలేక మృతిఁ బొందె నృపా!

557

తా ॥ బలరాముడు ఆ విధంగా ద్వివిదుని కంఠాన్ని అదిమిపట్టి నొక్కగా ద్వివిదుడి ముఖంలో నుంచి, చెవులలో నుంచి రక్తం ధారలు కట్టింది. మెదడు, తలలో నుంచి ఊడింది. ఏమీ చేయలేక వానరాధిపుడు నేలమీద చతికిల బడిపోయాడు. కొంచెం కూడా కదలలేకపోయాడు. ఊపిరి పీల్చలేక మరణించాడు.

తే. వానిపాటున కప్పుడు వనసమేత, మగుచు నా శైలరాజ మల్లల్ల నాడె; సురగణంబులు రాముపై సురభి కుసుమ, వృష్టి గురియించి రతుల సంతుష్టి మెఱసి.

558

తా ॥ ఎప్పుడైతే ద్వివిదుడు ప్రాణాలు విడిచి శరీరం నేలపై పడిపోయిందో అప్పుడు ఒక్కసారిగా రైవత పర్వతం ఊగిపోయింది. ద్వివిదుని మరణంతో సంతుష్టి చెందిన దేవతలందరు బలరాముడిపైన పరిమళభరితమైన పుష్పవర్షం కురిపించారు.

వ. ఇ వ్విధంబున భువనకంటకుండైన దుష్టశాఖామృగేంద్రుని వసుంధరకుం బలిచేసి సకల జనంబులుఁ బరమానంద కందళిత హృదయారవిందులై తన్ను నందింప న య్యదునందనుండు నిజనగరంబున కరుదెంచె; నని శుకుండు వెండియు న మ్మనుజపతి కిట్లనియె.

559

తా ॥ “పరీక్షిన్మహారాజా! ఈ విధంగా లోకకంటకుడైన, వానరనాయకుడైన ద్వివిదుణ్ణి బలరాముడు భూమికి బలి చేశాడు. జనులందరూ పరమానందంతో తనను స్తుతిస్తుండగా ఆ యాదవవీరుడు ద్వారకానగరం వెళ్ళాడు” అని శుకమహర్షి చెప్పి ఇంకా ఇలా అన్నాడు.

## బలరాముడు హస్తినాపురమును గంగలో త్రోయ యత్నించుట

సీ. కోరి సుయోధను కూఁతురు సర్వలక్షణములు గల్గి లక్షణ యనంగ
మహినొప్పు కన్యకామణి వివాహంబునఁ జక్రహస్తుని తనూజాతుఁడైన
సాంబుఁడు బలసాహసమున నెత్తుక పోవఁ గౌరవు లీక్షించి కడఁగి క్రొవ్వి
'పడచువాఁ డొకఁ డదె బాలికఁ గొనిపోవు చున్నాఁడు గై కొన కుక్కు మిగిలి

తే. యిట్టి దుర్మదుఁ గయిముట్టి పట్టి తెచ్చి, జనుల వెఱఁ గందఁ జెఱపట్టి యుంతుమేని యదువులు మనల నేమి సేయంగఁ గలరొ, యనుచుఁ గురువృద్ధజనముల యనుమవమున.

560

తా ॥ "మహారాజా! సమస్త సల్లక్షణాలతో ఒప్పుచున్న 'లక్షణ' అనే కన్యామణి దుర్యోధనుని కుమార్తె. ఆమె వివాహవేళలో శ్రీకృష్ణుని కుమారుడైన సాంబుడు బలోపేతుడై సాహసంతో ఆమెను ఎత్తుకుపోయాడు. అది చూసిన కౌరవులు "ఒక పడుచువాడు మన అమ్మాయిని క్రొవ్వెక్కి తీసుకుపోతున్నాడు. మనం ఉపేక్షించరాదు. మన బలప్రతాపాలు చూపి ఆ దుర్మార్గున్ని చుట్టుముట్టి పట్టితేవాలి. ప్రజలందరూ ఆశ్చర్యపడేటట్లు వాడిని చెఱసాలలో బంధించి ఉంచితే అతిసామాన్యులైన యాదవులు మనల్ని ఏం చేయగలుగుతారు?" అని అనుకొని కురువృద్ధుల అనుమతి తీసుకొని సాంబునితో యుద్ధానికి సిద్ధమయ్యారు.

వ. ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బలశౌర్యోపేతులగు కర్ణ శల్య భూరిశ్రవో యజ్ఞకేతు సుయోధనాదులు సమున్నతరథారూఢులై కూడ నరిగిన వారలఁ గనుంగొని జాంబవతీనందనుండు మందస్మిత వద నారవిందుం డగుచు సింగంబు భంగి గర్జించుచు మణిదీప్తం బైన చాపంబుఁ బూని నిల్చిన వారును సాంబు నదల్చి నిలునిలు మని పలికి.

561

తా ॥ శౌర్యప్రతాపాలలో ఉద్దండులైన కర్ణుడు, శల్యుడు, భూరిశ్రవుడు, యజ్ఞకేతుడు, దుర్యోధనుడు మొదలైన కౌరవ వీరులందరూ ఉన్నతోన్నతమైన రథాలను అధిరోహించి సాంబుని వెంట తరుముకుంటూ వెళ్ళారు. ఆ మహావీరులను చూసిన జాంబవతీ పుత్రుడైన సాంబుడు చిరునవ్వులు చిందించాడు. సింహంలా గర్జించాడు. మణులకాంతులవంటి కాంతులతో ప్రకాశిస్తున్న ధనుస్సు చేతబూని యుద్ధానికి సిద్ధమై నిల్చున్నాడు. కౌరవులు సాంబున్ని నిలునిలుమని చెబుతూ బెదిరించారు.

తే. చండకోదండ ముక్త నిశాత విశిఖ, జాల మందంద వఱప యాభీలముగను నందనందన
నందన స్యందనంబు, ముంచి రచలేంద్రమును ముంచు మంచు పగిది.

562

తా ॥ సాంబుని మీది కోపంతో కౌరవులు చండప్రచండములైన ధనుస్సులనుండి వదలిన వాడివాడి బాణాలతో అతని రథాన్ని ముంచెత్తారు. అప్పుడు బాణాలతో కప్పబడిన కృష్ణపుత్రుని రథము మంచుతో ముంచివేయబడ్డ మహాపర్వతంలా ఉంది.

వ. మఱియును.

563

తా ॥ అప్పుడు—

శా. శౌర్యాటోప విజృంభణంబుల సరోజాతాక్షసూనున్ సురా
హార్యస్థైర్యుని మీఁఱ నేయ నతఁడుద్యద్భూరి బాహాబలా
వార్యుండై శితసాయకాలి నవి మాయం జేసినన్ దేవతా
తూర్యంబుల్ దివి మ్రోసెఁ; నంత నతఁ డస్తోకప్రతాపోన్నతిన్.

564

తా ॥ మేరుపర్వతమంత ధైర్యంగల ప్రతాపవంతుడైన సాంబునిపైన కౌరవ వీరులు విజృంభించి బాణాలు పరంపరగా ప్రయోగించారు. సాంబుడా బాణాలనన్నిటినీ తన శౌర్యంతో క్షణంలో మాయం చేశాడు. సాంబుని భుజబలానికి హర్షించిన దేవతలు ఆకాశంలో మంగళవాయిద్యాలు మ్రోగించారు.

వ. ఇట్లు గడంగి బాణజాలంబులు పరఁగించి యందఱ కన్నిరూపులై రథ సూత ధ్వజ పతాకాతపత్రంబులు చూర్ణంబులు గావించి విరథులం జేసి వారల మెయిమఱవు లఱువుళ్ళు గావించి యొక్కొక్కనిఁ బెక్కుబాణంబుల నుచ్చిపో నేసిన వారలు శోణిత దిగ్ధాంగులై కుసుమిత కింశుకంబులం బోలియుండిరంత.

565

తా ॥ సాంబుడు అత్యద్భుతమైన పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ, శత్రువీరులపైన బాణవర్షాన్ని కురిపిస్తూ, అందరిదగ్గరా తానేకనబడుతూ, వారిరథాలను, రథసారథులను, జెండాలను, గొడుగులను కూల్చివేసి కౌరవులను రథంలేని వారినిచేసి, వారి ఒంటిమీది కవచాలను చించివేసి వారిని నిరాయుధులను చేశాడు. సాంబుడు వేసిన బాణాలు కౌరవుల శరీరాలలోకి గుచ్చుకుపోయి రక్తంబయటకు చిమ్మడంతో వారందరూ ఎఱ్ఱనిపూలతో నిండిన మోదుగు చెట్లలాగా కనబడ్డారు.

ఉ. వార లనేకులయ్యు బలవంతులు నయ్యు మహోగ్రసంగ రో
దార పరాక్రమ ప్రకటదర్పకులయ్యుఁ గుమారకున్ జగ
ద్వీరుని నొక్కనిం జెనకి వ్రేలును వంపఁగలేక సిగ్గునం
గూరిన చింత నొండొరులఁ గూడుచు విచ్చుచు వెచ్చనూర్పుచున్.

566

తా ॥ కౌరవులు అధికసంఖ్యలో ఉన్నా, బలవంతులైనా, రణరంగ దక్షులైనా

వీరాధివీరుడైన ఒక్క సాంబున్ని ఎదిరించలేక పోయారు. కుమారుడైన సాంబుని వేలు కూడా వంచలేకపోయారు. ఓడిపోయినందుకు సిగ్గుతో తలలు వంచుకొని ఒకరితో ఒకరు కలుసుకొంటూ, విడిపోతూ, నిట్టూర్పులు విడుస్తూ బాధపడసాగారు.

వ. మగిడి సమరసన్నద్ధులై సంరంభించి.

567

తా ॥ కొంతసేపటికి ధైర్యం తెచ్చుకొని తిరిగి యుద్ధం చేయడానికి సిద్ధమై రణోత్సాహంతో సాంబుడి మీదకు వచ్చారు.

ఉ. అందఱు నొక్కపెట్ట దనుజాంతకనందనుఁ జుట్టు ముట్టి యం
దంద నిశాత సాయక చయంబుల ముంచి రథంబు నుగ్ర లీ
లం దునుమాడి చాపము చలంబునఁ ద్రుంచి హయాలిఁ జంపి సూ
తుం దెగటార్చి యంత విరథుం డగుటన్ వెసఁ జొచ్చి పట్టినన్.

568

తా ॥ ఒక్కసారిగా కౌరవవీరులందరూ కలిసి సాంబున్ని చుట్టుముట్టారు. ఎవరిపాటికి వారు సాంబుని మీద బాణవర్షం కురిపించి ఆ మహావీరుని రథాన్ని విరగగొట్టారు. చేతిలోని విల్లును విరిచేశారు. గుఱ్ఱాలను వధించారు. రథసారథిని సంహరించారు. ఒక్క క్షణంలో పదిమందీ చుట్టుముట్టేసరికి సాంబుడు విరథుడైనాడు. సమయం దొరకడంతో అందరూ ఒక్కుమ్మడిగా సాంబుని సమీపించి బంధించారు.

తే. బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ, గౌరవులు దమ మనములఁ గౌతుకంబు లొలయఁ సాంబునిఁ గన్యకాయుక్తముగను, బురమునకుఁ దెచ్చి రతులవిభూతి మెఱసి.

569

తా ॥ చేసేది ఏమీలేక బాలకుడైన సాంబుడు ఒంటరిపోరాటంలో కౌరవులచేత బందీ అయినాడు. ఆ విధంగా చిక్కిన సాంబున్ని చూసి మహోత్సాహంతో, విజయం చేకూరిందన్న సంతోషంతో చక్రవర్తి కుమార్తె అయిన లక్షణను, కృష్ణపుత్రుడైన సాంబున్ని హస్తినాపురానికి తీసుకొచ్చారు కౌరవులు.

వ. అంత ద్వారకానగరంబున.

570

తా ॥ అక్కడ ద్వారకా నగరంలో—

ఉ. జాంబవతేయు వార్త యదుజాతులు నారదయోగిచే సమ
స్తంబును విన్నవా రగుచు సంగరకౌతుక ముప్పతిల్లఁ జి
త్తంబులఁ గౌరవాన్వయకదంబము నొక్కట నుక్కడంచు కో
పంబున నుగ్రసేనజనపాలు ననుజ్ఞ ననూన సైన్యముల్.

571

తా ॥ నారదమహర్షి వచ్చి జాంబవతీ పుత్రుడైన సాంబున్ని కౌరవులు బంధించిన వైనం మొత్తం యాదవులకు తెలియజెప్పాడు. అది విని, కౌరవవంశాన్ని సమూలంగా నాశనం చేయాలనుకొన్న యాదవవీరులు, రణోత్సాహంతో ఉగ్రసేనమహారాజు అనుమతి తీసుకొని, కోపావేశంతో, సమస్తసైన్యాన్ని వెంటతీసుకొని యుద్ధభేరిమ్రోగిస్తూ బయలుదేరారు.

తే. కూడి నడవంగఁ గని వారితోడ బలుఁడు, ధార్తరాష్ట్రులు మనకు నెంతయును డాసి నట్టి బంధులు; వారిపై నిట్టి యలుక, నెత్తి చనుచుంట యిది నీతియే తలంప?

572

తా ॥ యాదవసైన్యం హస్తినకు తరలడం బలరాముడు చూశాడు. చూసి

"యదువీరులారా! కౌరవులు మనకు ఎంతో దగ్గర బంధువులు గదా! అటువంటిది వారి మీదకు ఆగ్రహావేశంతో యుద్ధానికి తరలివెళ్ళడం మంచిదేనా? అది నీతితో కూడిన పనికాదు కదా!" అని వారందరినీ యుద్ధవిముఖుల్ని చేసి, పురానికి మళ్ళించాడు.

వ. అని వారల వారించి తత్క్షణంబ బంధు ప్రియుండైన బలరాముం డనలార్క సంకాశంబగు కాంచనరథం బెక్కి యనురక్తులైన భూసురులును, యుద్ధవాదులగు కులవృద్ధులును సేవింపం గరిపురంబునకుం జని తత్పురోపకంఠవనంబున సురభికుసుమ ఫలభరిత తరుచ్ఛాయా విరచిత చంద్రకాంత శిలాతలంబునందు వసియించి, మహితగ్రహ మధ్యగతుండైన పూర్ణచంద్రు ననుకరించి యుండె; నంతఁ గార్యబోధనంబు సేయుటకై కౌరవులకడకుఁ బ్రబుద్ధుండైన యుద్ధవునిం బనిచినం జని యతం డాంబికేయునకు ధనురాచార్యాపగాతనూభవ సుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె.

573

తా ॥ ఆ విధంగా యాదవ వీరుల్ని వారించి బలరాముడు, బంధువులమీద ప్రీతిగలవాడై, సూర్యాగ్నుల తేజస్సుతో సమానమైన స్వర్ణరథాన్ని అధిరోహించి, ఇష్టులైన బ్రాహ్మణోత్తములను, యదుకుల వృద్ధులైన ఉద్ధవుడు మొదలైన వారిని వెంటతీసుకొని, హస్తినాపురానికి వెళ్ళాడు. హస్తినాపురానికి ముందున్న ఉద్యానవనంలో సువాసనలు విరజిమ్ముతున్న కుసుమాలతో, చక్కగా పండిన పండ్లతో నిండిన చెట్ల నీడలలో నిర్మించబడిన చంద్రకాంతశిలా వేదికపైన విశ్రమించాడు. బలరాముడప్పుడు గ్రహాలమధ్య వెలుగులీనుతున్న పున్నమినాటి చంద్రుడిలాగా ప్రకాశించాడు. తాను వచ్చిన పనిని తెలియజేయడానికి జ్ఞాని అయిన ఉద్ధవున్ని కౌరవుల వద్దకు పంపించాడు.

ఉద్ధవుడు కౌరవసభకువెళ్ళి ధృతరాష్ట్రుడికి, భీష్మాచార్యుడికి, ద్రోణాచార్యుడికి, దుర్యోధనుడికి నమస్కరించాడు. కౌరవనాయకులు తమవద్దకు వచ్చిన ఉద్ధవున్ని సత్కరించి,

సమాదరించారు. అప్పుడు ఉద్ధవుడు వారిని చూసి ఈ విధంగా చెప్పాడు:

సీ. 'భూరియశోధనులార! తాలాంకుండు చనుదెంచి నగరోపవనమునందు
నున్నవాఁ' డనిన వా రుత్సాహమున బలుఁ బొడగను వేడుక బుద్ధిఁ దోఁపఁ
దనరారు గానుకల్ గొని చని యర్ఘ్యపాద్యాది సత్కృతులు నెయ్యమునఁ జేసి
ధేనువు నిచ్చి సమ్మానించి యందఱు నందంద వందనం బాచరించి

తే. యుచితభంగిని నచటఁ గూర్చున్న యెడను, 'గుశలమే మీకు? మాకును గుశల' మనుచుఁ బలికి రాముఁడు కురునరపాలుఁ జూచి, యచటి జనములు వినఁగ నిట్లనియెఁ దెలియ.

574

తా ॥ "ఘనకీర్తి పొందిన కౌరవాధిపులారా! బలరామదేవుడు మీ నగరానికి వచ్చి నగరం ముందున్న ఉద్యానవనంలో విశ్రమించి ఉన్నాడు" అని ఉద్ధవుడు చెప్పగానే కౌరవవీరులందరు ఉత్సాహవంతులై బలరాముని చూడాలనే కోరికతో రకరకాల కానుకలు తీసుకొని బలరాముని వద్దకు వెళ్ళారు. అర్ఘ్యపాద్యాలు సమర్పించి, సకల మర్యాదలు చేసి, ధేనువుతో పాటు ఎన్నెన్నో కానుకలిచ్చి బలరామున్ని గౌరవించారు. ఒకరి తరువాత ఒకరుగా వచ్చి అందరూ బలరాముడికి నమస్కరించారు.

కౌరవులందరూ ఎవరికి తగిన విధంగా వారు ఉచిత ప్రదేశాలలో బలరాముడి చుట్టూ కూర్చున్నారు. అప్పుడు బలరాముడు "మీకందరికీ క్షేమమే కదా! మేం కూడా క్షేమంగానే ఉన్నాం" అని చెప్పి అక్కడ ఉన్నవారందరూ వినేటట్లు దుర్యోధన సార్వభౌమున్ని చూసి ఇలా అన్నాడు:

ఉ. 'మా నరనాథునాజ్ఞ నిజమస్తములన్ ధరియించి కౌరవుల్
మానుగఁ జేయు టొప్పుగుఁ; గుమారకు నొక్కనిఁ బెక్కు యూథముల్

పూనిన లావుమై నెదిరి పోర జయించుట మీఁది తప్పు; త
ప్పైనను గాచె బాంధవహితాత్మకుఁడై మనుజాధినాథుఁడున్.

తా ॥ "కురుసార్వభౌమా! దుర్యోధనా! మా రాజుగారైన ఉగ్రసేన మహారాజుగారి ఆజ్ఞను కౌరవులందరూ ఔదల దాల్చి చేయడం తప్పనిసరి. ఒక్క బాలకుడైన సాంబున్ని అనేకమంది వీరులు కలిసి తమ బలప్రభావాన్ని ప్రదర్శించి యుద్ధంలో జయించడం గొప్పకాదు. నిజానికి అలా చేయటం మీ తప్పు. ఇంతపెద్ద తప్పు చేసినా మిమ్మల్నందరినీ క్షమించి మా ఉగ్రసేనమహారాజు మీతో బంధుత్వాన్నే పాటించాడు."

క. అను మాటలు విని కౌరవ, జననాయకుఁడాత్మ నలిగి 'చాలుఁ బురే? యే మనఁ గలదు కాలగతి? చ, క్కనఁ గాలం దొడుగు పాదుకలు దల కెక్కెన్.

576

తా ॥ అని బలరాముదు చెప్పగానే దుర్యోధనుడికి విపరీతమైన కోపం వచ్చింది. బలరామాదులు, రాజ్యాధిపత్యానికి అనర్హులైన యాదవులు. అందుకని "ఆహా! కాలం ఎలా మారిపోయింది? సామంత పదవికి కూడా తగని యాదవులు ఎన్నేసి మాటలంటున్నారు! చూడగా చూడగా కాళ్ళకు తొడిగే చెప్పులు తలమీదకు ఎక్కినట్లు కనిపిస్తోంది.

ఆ. మనము బంధువరుస మన్నించు మన్ననఁ, గాదె రాజ్యభోగగరిమఁ బొదలి వసుధఁ బేరు గలిగి వాసికి నెక్కుటఁ, దమకు ననుభవింపఁ దగని యట్టి.

577

తా ॥ యాదవులను బంధువులని మనం గౌరవించడం వల్లనే కదా వారు రాజ్యభోగాలను అనుభవిస్తున్నారు. అర్హత లేకపోయినా భూమిపై పేరు ప్రఖ్యాతులతో రాజులుగా చలామణీ అవుతున్నారు.

వ. సితచ్ఛత్ర చామర శంఖ కిరీట చిత్రశయ్యాసౌధ సింహాసనంబులు గైకొనుట మన మందెమేలంబునం గాదె? యిట్టిచో సరివారునుం బోలె నూరక గర్వించు యదుకులులతోడి సంబంధసఖ్యంబులు చాలుఁ; బాములకుఁ బాలు వోసి పెంచిన విషంబు దప్పునే? మమ్ముం దమ పంపుసేయ మనుట సిగ్గులేకుంటఁ గాదె! యదియునుంగాక దివ్యాస్త్ర కోవిదులైన గంగానందన గురు కృపాశ్వత్థామ కర్ణాది యోధవీరులకున్ లోఁబడ్డవానిని మహేంద్రునకైనను విడిపింపఁ వచ్చునే? యహహా! వృథాజల్పంబుల కేమిపని?' యని దుర్భాష లాడుచు దిగ్గన లేచి నిజమందిరంబునకుం జనియె; నప్పుడు హలాయుధుం డమ్మాటల కదిరిపడి.

578

తా ॥ మన స్నేహంవల్ల కదా యాదవులకు ఛత్రచామరాలు, శంఖం, కిరీటం, సుందరమైన శయ్యలు, సింహాసనాలు, భవనాలు కలిగింది. మనం ఉపేక్షచేసి ఊరుకోకపోతే ఈ భోగభాగ్యాలు వారికి దక్కేవా? అటువంటిది వారు మనతో, చక్రవర్తులతో సరిసమానులౌతారా? గర్విష్ఠులైన యాదవులతోడి చుట్టరికమూ ఇక చాలు. స్నేహమూ అవసరములేదు. పాములకు పాలుపోస్తే విషం కక్కకుండా ఉంటాయా? మనల్ని, సార్వభౌముల్ని వారి ఆజ్ఞ ప్రకారం నడవమని చెప్పటం కన్న సిగ్గుచేటు ఇంకోటి ఉంటుందా! అదీగాక గొప్పశక్తి సామర్థ్యాలు గలిగి శస్త్రాస్త్రకోవిదులైన భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణాది మహావీరుల అధీనంలో ఉన్న వాడిని మహేంద్రుడైనా విడిపించగలడా? అసంభవం. వ్యర్థప్రలాపాలతో ప్రయోజనం ఏమిటి?" అని నిందావాక్యాలు పలుకుతూ, కురుసార్వభౌముడు అక్కడ నుండి దిగ్గునలేచి తనసౌధానికి పరివారంతో సహా వెళ్ళిపోయాడు. దుర్యోధనుడు ఆ విధంగా పలికి, చటుక్కున వెళ్ళిపోయినందుకు బలరాముడు ఒక్కసారిగా అదిరి పడ్డాడు. ఆగ్రహంతో ఊగిపోయాడు.

ఉ. కౌరవుఁ డాడి పోయిన యగౌరవభాషల కాత్మఁ గిన్క యే

పారఁగ నుల్ల సత్ప్రళయభానుని కై వడి మండి చండ రో

షారుణితాంబకుం డగుచు యాదవవృద్ధులఁ జూచి పల్కెఁ 'బెం
పారిన రాజ్యవైభవ మదాంధుల మాటలు మీరు వింటిరే?

579

తా ॥ ప్రళయకాలంలో మండిపడే ప్రచండభానునిలా బలరాముడు మండిపడ్డాడు. ఎఱ్ఱబడిన కళ్ళతో యదువృద్ధులవైపు చూశాడు. "మహాత్ములారా! రాజ్యవైభవంతో మదించి అంధుడైన దుర్యోధనుడి మాటలు మీరందరూ విన్నారు గదా!

తే. శ్రీమదాంధులు సామంబుచేతఁ జక్కఁ, బడుదురే యెందు? బోయఁడు బసులఁ దోలు
పగిది నుగ్రభుజా విజృంభణ సమగ్ర, సుమహితాటోప మనిలోనఁ జూపకున్న.

580

తా ॥ సంపదతో గ్రుడ్డివారైన మనుషులు ఎక్కడైనా మంచి మాటలతో చక్కబడతారా? చక్కబడరు కదా! బోయవాడు పశువులను తోలే విధంగా బాహుబలాన్ని, శౌర్యసంపదను యుద్ధ భూమిలో చూపిస్తే తప్ప వీరు దారికి రారు.

క. కౌరవుల సమయఁజేయ ను, దారత యదువీరవరుల దామోదరుఁడున్ రా రా వల దని
యచ్చట, వారించితిఁ గాదె బంధువత్సల యుక్తిన్.

581

తా ॥ కౌరవులను సంహరించి సాంబున్ని విడిపించుకురావడానికి యాదవ వీరులు, శ్రీకృష్ణుడు యుద్ధానికి సిద్ధమై బయలుదేరితే కౌరవులు బంధువులు గదా అనే ఉద్దేశంతో మన వీరులనందరినీ హస్తినకు పోవద్దని వారించి, నేను ఇక్కడకు వచ్చాను కదా! కౌరవులు మంచి మాటలతో సాంబునికి కల్యాణం జరిపిస్తారని భావించాను. కౌరవులు దుష్టులని ఇప్పుడు తెలిసింది.

వ. అదియునుం గాక.

582

తా ॥ అంతేకాక, శ్రీకృష్ణుడి మహిమ వారికి తెలియలేదు.

సీ. ఏ దేవు భృత్యులై యింద్రాది దిక్పాల వరులు భజింతురు వరుసతోడ
నే దేవు మందిరం బేపారు దేవతా తరుసభావిభవసుందరతఁ జెందు
నే దేవు పదయుగం బేప్రొద్దు సేవించు నఖిల జగన్మాతయైన లక్ష్మి
యే దేవు చారుసమిద్ధకళాంశ సంభవులము పద్మజభవులు నేను
తే. నట్టి దేవుండు దుష్టసంహారకుండు, హరి ముకుందుండు పంపుసేయంగ నొప్పు
నుగ్రసేనుని రాజ్యసమగ్రగరిమ, యంతయును దార యిచ్చిన దంట! తలంప.

583

తా ॥ ఇంద్రాది దిక్పాలురు భృత్యులై ఏ దేవున్ని పూజిస్తారో; కల్పవృక్షవైభవంతో ఏ దేవుని మందిరం బహుసుందరంగా అలంకరింపబడుతుందో; జగన్మాత లక్ష్మీదేవి ఏ దేవుని పాదపద్మాలు నిరంతరం సేవిస్తుంటుందో, బ్రహ్మ, శివుడు, నేను ఏ దేవదేవుని కళాంశాలుగా జన్మించామో, అటువంటి దుష్టసంహారకుడైన ఆ దేవుడే శ్రీకృష్ణుడు కదా! శ్రీకృష్ణుడి ఆజ్ఞమేరకు ఉగ్రసేనుని రాజ్యం కీర్తిప్రతిష్ఠలతో విలసిల్లుతోంది గాని దుర్యోధనుడి దయాభిక్షవల్ల కాదు. చూడండి. మనకు రాజ్యాన్ని తానే ఇచ్చానని గర్వంతో పలుకుతున్నాడు దుర్యోధనుడు.

చ. అదియును గాక యెవ్వని పదాంబుజ చారురజోవితాన మా
త్రిదివ నరాది దిక్పతి కిరీటములందు నలంకరించు; భూ
విదితపుఁ దీర్థముం గడు బవిత్రము సేయును; నట్టి కృష్ణుచేఁ
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగ రా దఁట యేమిచోద్యమో!

584

తా ॥ ఉద్ధవాది యాదవ వృద్ధులారా! ఏ మహానుభావుని పాదపద్మరజాన్ని దేవతలు, మానవులు, దిక్పతులు తమతమ కిరీటాలలో అలంకారంగా ధరిస్తారో, పరమ పవిత్ర తీర్థాలను ఎవరి పాదధూళి మరింత పునీతం చేస్తుందో ఆ పరమపావనుడే శ్రీకృష్ణుడు. కృష్ణపరమాత్మ చేత ప్రసాదింపబడిన రాజ్యచిహ్నాలైన కిరీటాదులను మేము ధరించకూడదట! అవి కౌరవులు ప్రసాదించినవట! ఇది ఎంత చోద్యంగా ఉంది!

క. తామఁట తలఁపం దల లఁట, యేమఁట పాదుకల మఁటఁ గణింపఁగ రాజ్య
శ్రీమదమున ని ట్లాడిన, యీ మనుజాధముని మాట కేమన వచ్చున్?

585

తా ॥ యాదవ వీరులారా! ఈ విషయం విన్నారా! కౌరవులున్నారే! వారు తలలట! మేమేమో వారు తొడిగే పాదుకలమట! రాజ్యసంపదమదంతో ఈ విధంగా గర్వించి మాట్లాడిన నరాధముణ్ణి గురించి ఏమనాలి?"

వ. అని సక్రోధమానుసుండై యప్పుడు.

586

తా ॥ అని పలుకుతూ బలరాముడు క్రోధావేశపూరితుడై—

క. ధారుణి నిటమీఁదట ని, ష్కౌరవముగఁ జేయకున్నఁ గా దని యుగ్రా
కారుండై బలభద్రుఁడు, సీరము వెసఁబూన్చి లావుఁ జేవయు నెసఁగన్.

587

తా ॥ "ధారుణి మీద ఇక కౌరవవంశమనేదే లేకుండా చేయాలి" అని అనుకొని ఉగ్రాకారుడై తన శక్తిసామర్థ్యాలను ప్రదర్శిస్తూ నాగలిని ఎత్తి పట్టుకొన్నాడు.

వ. ఇట్లు పూని కౌరవరాజధానియైన కరినగరంబు కడతల హలాగ్రంబును జొనిపి య

పుటభేదన విస్తారంబగు గడ్డ భుజాగర్వ దుర్వారుండై పెకలించి తిగిచి గంగాప్రవాహంబునం బడఁ ద్రోయ గమకించిన నప్పుడు మహాజలమధ్య విలోలంబగు నావ చందంబున నన్నగరంబు వడవడ వడంకుచు గోపుర వప్ర ప్రాకార సౌధాట్టాలక తోరణ ధ్వజ ద్వార కవాట కుడ్య వీథీ యుతంబుగా నొడ్డగెడవైనఁ బౌరజనంబులు పుడమి నడుగు లిడంగ రాక తడంబడుచు, నార్తులై కుయ్యిడుచుండి; రట్టియెడ న మ్మహోత్పాతంబులు గనుంగొని తాలాంకుండు గినుక వొడమి కావించిన యుపద్రవంబుగా నెఱింగి దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకుల మానసులై పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్య పౌరజన సమేతంబుగా భీష్మదుర్యోధనాది కౌరవులు వేగంబున నతని చరణంబుల శరణంబులుగాఁ దలంచి, సాంబునిఁ గన్యకాయుక్తంబుగా ననేక మణిమయ భూషణాంబర జాలంబుతోఁ గొనివచ్చి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మోడ్చి యిట్లనిరి.
588

తా ॥ కౌరవుల రాజధానీ నగరమైన హస్తినాపురం అవతలివైపుకు తన నాగలిని చొప్పించి మహాబలశాలి అయిన బలరాముడు హస్తినాపురం ఉన్నంత మొత్తం గడ్డను క్షణంలో పెకలించి ప్రక్కనే ఉన్న గంగానదిలో పడవేయబోయాడు. అప్పుడు బలరాముని బలానికి సముద్రమధ్యంలో అల్లల్లాడే నావలాగా హస్తినాపురం వడవడ వణికింది. గోపురాలు, ప్రాకారాలు, కోటలు సౌధాలు, బురుజులు, తోరణాలు, కేతనాలు, తలుపులు, గోడలు, వీథులు అన్నీ తల్లక్రిందులై పట్టణం ఒరిగిపోయింది. హస్తినలోని ప్రజలు భూమిపైన అడుగు మోపలేక తడబడుతూ కుయ్యో, మొర్రో అని ఆర్తిచెందారు.

కీడును సూచిస్తున్న ఆ మహోత్పాతాలు చూసి కౌరవ నాథులు – ఈ ఉపద్రవమంతా కోపోద్రిక్తుడైన బలరాముడు చేసిన పనిగా గుర్తించారు. బలరామున్ని ఆపటంగాని, ఆతని వల్ల ఏర్పడిన ఉపద్రవాన్ని మాన్పడంగాని అసాధ్యమని తెలుసుకొని కలవరపాటు చెందారు. భయపడ్డారు. గత్యంతరంలేదని గ్రహించి, భీష్ముడు, దుర్యోధనుడు మొదలైన కౌరవేశ్వరులు

పుత్రులతో, మిత్రులతో, భార్యలతో, బంధువులతో, సేవకులతో, పౌరులతో కూడివచ్చి బలరామున్ని శరణుకోరాలని నిశ్చయించారు. సాంబలక్షణలను, మణిమయ భూషణాలతో, పట్టువస్త్రాలతో అలంకరింపచేసి; బలరాముని వద్దకు తీసుకొని వచ్చి తమతప్పు దిద్దుకొన్నారు దుర్యోధనాదులు. బలరాముడికి సాష్టాంగప్రణామం చేసి, రెండు చేతులూ జోడించి, ఈ విధంగా ఆ మహావీరుణ్ణి, దైవాంశ సంభూతుని స్తుతించారు:

క. 'రామ! సమంచితముక్తా, దామ! యశఃకామ! ఘనసుధాధామ!రుచి
స్తోమ! జయసీమ! జగదభి, రామ! గుణోద్దామ! నిఖిలరాజలలామా!

589

తా ॥ "బలరామా! యశస్వంతా! దివ్య తేజస్సుతో ప్రకాశిస్తున్న వాడా! రాజోత్తమా! సుగుణాభిరామా! ముత్యాల హారాన్ని ధరించి వెలిగిపోతున్నవాడా! అమృత హృదయంగలవాడా! విజయ శీలీ! లోకాలను చల్లగా చూసే వాడా!

క. నీ మహిమ యెఱిఁగి పొగడఁగఁ, నే మెంతటివార? మఖిలనేతవు; త్రిజగత్
క్షేమంకరుఁడవు; సుమతివి, తామసులము మమ్ముఁ గావఁ దగు హలపాణీ!

590

తా ॥ దేవా! బలరామదేవా! నీ మహిమ తెలుసుకొని వర్ణించడానికి మేమెంతటివారము ప్రభూ! విశ్వాన్ని పరిపాలించేవాడివి. త్రిలోక వాసులకూ క్షేమాన్ని కలిగించే వాడివి. చక్కని బుద్ధిగలవాడివి. ఓ హలాయుధా! మేము అజ్ఞానాంధకారంలో కొట్టుకుపోతున్న వాళ్ళం. పైగా అహంకారపూరితులం. మమ్మల్ని నీవే రక్షించాలి.

క. భూచక్ర మెల్లఁ దాల్చిన, యా చక్రీశ్వరుఁడు దావకాంశుఁడు బలదే
వా! చక్రికి నగ్రజుఁడవు, నీచక్రియ లుడుపఁ జెల్లు నీకు జితారీ!

591

తా ॥ ధరణీ చక్రాన్ని గర్భంలో ధరించిన విష్ణువే శ్రీకృష్ణుడు. అతడిలో నీ అంశ ఉంది. ఆ చక్రధారికి నీవు అన్నవు. శత్రువులను నిమిషమాత్రంలో జయించగల వీరాధివీరుడవు. నీచపు పనులు చేసే వారిని హతమార్చడం నీకే చెల్లుతుంది.

క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక నమిత నిఖిలబృందారక! ఘో
ర క్షణదాచరవిషనిట, లాక్ష! భయాతురుల మమ్ము నరయు మనంతా!

592

తా ॥ దేవతల చేత స్తోత్రం చేయబడే బలరామదేవా! రక్షించు రక్షించు. ఉపేక్షచేయకు దేవా! భయంతో వణకిపోతున్న మమ్మల్ని దయతో చూడు. అనంతా! క్రూరరాక్షసులను పరిమార్చే పరాక్రమశాలివి. శివుడు హాలాహలవిషాన్ని భక్షించే విధంగా నీచజనుల మదాన్ని మ్రింగివేసే మొనగాడివి. నీ శరణు కోరుతున్నాము. మమ్మల్ని కాపాడు.

వ. మఱియును దేవా! యీ సచరాచరంబు జగంబుల నీ లీలావినోదంబులం జేసి దుష్టజన మర్దనంబును, శిష్టజన రక్షణంబునుం జేయుచు, జగదుత్పత్తి స్థితి లయహేతువైన నీకు సమస్కరింతు' మని వెండియు నిట్లనిరి.

593

తా ॥ అనంతా! ఈ సమస్త చరాచరజగత్తు నీ లీలావిశేషం వల్లనే నడుస్తోంది. నీవు దుష్టజనులను సంహరించి సజ్జనులను రక్షించే పరమాత్ముడవు. సృష్టి స్థితి లయకారుడవైన నీకు నమస్కరిస్తున్నాము. శరణార్థులమైన మమ్మల్ని రక్షించు.

తే. 'అవ్యయుండువు; సర్వభూతాత్మకుఁడవు;, సర్వశక్తి ధరుండవు; శాశ్వతుఁడవు
విశ్వకరుఁడవు గురుఁడవు విమలమూర్తి, వైన నిన్ను నుతింప బ్రహ్మకును దరమె?'

594

తా ॥ బలరామదేవా! నీవు అవ్యయుడవు. సమస్త జీవరాశులలోను విరాజిల్లేవాడవు. సర్వశక్తులను ధరించే వాడివి. శాశ్వతుడవు. విశ్వాన్ని సృష్టించేవాడివి. లోక గురుడవు. నిర్మల మనస్కుడవు. అంతటి మహిమోపేతుడవైన నిన్ను స్తుతించడం బ్రహ్మదేవుడికి కూడా అలవికాదు."

ච. అని వినుతించినం బ్రముదితాత్మకుఁడై హలపాణి వారలం
గనుఁగొని 'యోడ కోడకుఁడు కార్యగతిం దగి లిట్లు మీరు సే
సిన యవినీతిచేత నిటు చేసితి; నింక భయంబు దక్కి పొం'
డనిన సుయోధనుండు వినయంబున నల్లునిఁ గూఁతునుం దగన్.

595

తా ॥ అని కౌరవనాథులు భక్తిప్రపత్తులతో బలరాముణ్ణి స్తుతించగా వాళ్ళను చూసి బలుడు సంతోషంతో ప్రసన్నుడైనాడు. "మీరేమీ భయపడకండి. హస్తినాపురాన్ని గంగలో ముంచను. మీరు చేసిన అవినీతి కార్యం వల్ల తప్పనిసరై ఈ విధంగా చేశానుగాని మీ పట్ల కోపంతో కాదు. మీ మీ నివాసాలకు నిశ్చింతగా వెళ్ళండి" అని బలరాముడు అభయమిచ్చాడు. అప్పుడు దుర్యోధనుడు వినయవంతుడై కుమార్తె లక్షణను, అల్లుడు సాంబుణ్ణి బలరాముని కప్పగించాడు.

క. అనుపుచు నరణము దాసీ, జనముల వేయింటి లక్షసైంధవములఁ దా
నినుమడి యేనుంగు గాం, చన రథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్.

596

తా ॥ దుర్యోధన చక్రవర్తి తనకూతురు లక్షణను అత్తవారింటికి పంపుతూ వేయిమంది దాసీలను, లక్ష గుఱ్ఱాలను, రెండు లక్షల ఏనుగులను, ఆరువేల బంగారు రథాలను అరణంగా ఇచ్చి సంతోషపూర్వకంగా బలరాముడికి నమస్కరించి యాదవులను సాగనంపాడు.

వ. ఇట్లిచ్చి యనిచిన బలభద్రుండు గొడుకునుం గోడలిం దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు, నక్కడక్కడి జనంబులు పది వేల విధంబులం బొగడ, నిజపురంబున కరిగి యచ్చట యాదవులతోడఁ దాఁ గరిపురంబునకుం బోయిన విధంబును, వారలాడిన దురాలాపంబులును, దా నందులకై యొనర్చిన ప్రతీకారంబును నెఱింగించి సుఖంబుండె; వారణపురంబు నేఁడును దక్షిణం బెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రుని మాహాత్మ్యంబుఁ దెలుపుచున్న' దని య మ్మహాతుని భుజవీర్యం బవార్యంబని చెప్పి శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

597

తా ॥ బలరాముడు పరమానందంతో కొడుకును, కోడలిని తనతో తీసుకొని దారిపొడుగునా ప్రజలు తన బలపరాక్రమాలను పదివేల విధాలుగా పొగడుతూ ఉంటే ద్వారకానగరం వెళ్ళాడు. ద్వారకానగరంలోని యాదవులందరికీ తాను హస్తినాపురానికి వెళ్ళిన విషయాన్ని, కౌరవులు అన్న దుష్టవాక్యాలను, తాను దానికి చేసిన ప్రతీకారాన్ని సవిస్తరంగా చెప్పి సుఖంగా ఉన్నాడు. ఇప్పటికి కూడా హస్తినాపురం దక్షిణంవైపు కొంచెంపైకి లేచి, ఉత్తరం భాగం గంగానదివైపు కొంచెం క్రుంగి ఉన్నట్లుగా బలరాముడి పౌరుషప్రతాపాలకు నిదర్శనంగా నిలబడి ఆ కృష్ణాగ్రజుని మహిమను తెలియజేస్తోంది" అని శుకమహర్షి బలరాముని భుజబలాన్ని, శౌర్యప్రతాపాలను ఎవరూ అడ్డుకోలేరని పరీక్షిత్తునకు స్పష్టపరచి ఇంకా ఈ విధంగా అన్నాడు:

## శ్రీకృష్ణుని మహిమ నారదుడు తెలుసుకొనుట

చ. 'నరవర! యొక్కనాఁడు విని నారదసంయమి మాధవుండు దా
నరకునిఁ ద్రుంచి వాని భవనంబున నున్న పదాఱువేల సుం
దరులను నొక్కమాటు ప్రమదంబున నందఱ కన్ని రూపులై
పరిణయ మయ్యె' నా విని శుభస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్.

598

తా ॥ "పరీక్షిత్తూ! శ్రీకృష్ణుడు నరకాసురున్ని సంహరించి ఆ దానవేంద్రుని భవనంలో ఉన్న పదహారువేలమంది కన్యలను వివాహమాడాడన్న శుభవార్తను నారదమహర్షి విన్నాడు. అంతమంది కన్యలకు ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపంలో దర్శనమిచ్చి సంతోషపరిచాడన్న విషయం విని శ్రీకృష్ణుని వైభవోన్నతిని స్వయంగా దర్శించాలని కుతూహలపడి ఒకనాడు నారదుడు బయలుదేరాడు.

వ. ఇట్లు దలంచి కృష్ణపాలితం బయిన ద్వారకానగరంబు డాయంజని ముందట.

599

తా ॥ ఆ విధంగా అనుకొన్న నారదుడు కృష్ణుడు పరిపాలిస్తున్న ద్వారకానగరాన్ని సమీపించి, ఆ నగరానికి ముందున్న సుందరదృశ్యాలు చూశాడు.

సీ. శుక శారికా శిఖీ పిక కూజితప్రసవాంచితోద్యాన వనౌఘములను గలహంస సారస కైరవ కమల కల్హార శోభిత కమలాకరములఁ గలమాది సస్య సంకులవరేక్షుక్షేత్ర భూరి లసన్నదీ తీరములను గిరిసాను పతిత నిర్ఝరకణ సందోహ సంతత హేమంత సమయములను

తే. గమలసంభవకాంచనకార రచిత, చిరతరైశ్వర్య నగరలక్ష్మీకరాబ్జ ఘటిత నవరత్నమయ

హేమకటక మనఁగ, సొబగు మీఱిన కోటయుఁ జూచె మౌని.

600

తా ॥ ద్వారకానగరంలో ఒకవైపు చిలుకల, గోరువంకల, నెమళ్ళ, కోయిలల వినసొంపైన రకరకాల ధ్వనులతో, సువాసనలు విరజిమ్ముతున్న వివిధ పుష్పజాతులతో ఒప్పుతున్న ఎన్నో ఉద్యానవనాలు చూశాడు. నారదుడు మరోవైపు తిరిగేసరికి కలహంసలతో, బెగ్గురు పక్షులతో తెల్లకమలాలతో, ఎఱ్ఱపద్మాలతో, కలువపూలతో బహుసుందరంగా ఉన్న సరస్సులు కనిపించాయి. కొంచెం ముందుకు పోయేసరికి వరిపంటలతో శోభాయమానంగా ఉన్న పొలాలు, చెఱకుతోటలు ఇరుప్రక్కలా ఉన్న నదులు దర్శనమిచ్చాయి. ఆ దృశ్యాలను తిలకిస్తూ మరికొంచెం నడిచేసరికి కొండల చరియలనుండి జాలువారుతున్న జలపాతాల నీటి తుంపరలు ఎల్లప్పుడూ ద్వారకలో హేమంత ఋతువే అందాలని అందిస్తున్నదా అన్నట్లు హాయిని గొల్పుతున్నాయి. సృష్టికర్తతో సమానంగా నిర్మించగల స్వర్ణకారుల చేత నిర్మించబడిన నగరమనే లక్ష్మీదేవి చేతికి ధరించిన, నవతర్నాలతో కూర్పబడిన బంగారు కంకణమా అన్నట్లు దేదీప్యమానంగా ప్రకాశించిపోతున్న అద్భుతమైన కోటను వీక్షించాడు.

వ. మఱియును సముత్తుంగ మణిసౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘన సార చందనాగరు ధూపధూమపటల విలోకన సంజనితపయోధరాభి శంకాం గీకృత తాండవకేళీవిలోల పురకామినీ జనోపలాలిత నీలకంఠ సముదయంబులును, జంద్రకాంత మణిస్ఫటికస్తంభ సంభృతమరకత పద్మరాగఘటిత నవరత్న కాంచన ప్రాసాదశిఖరాగ్ర విన్యస్త బహుసూర్య విభ్రమకృదంచిత శాతకుంభ కుంభనిచయంబును, సమస్త వస్తు విస్తార సమర్పిత వైశ్యాగారవీథీ వేదికాకలితంబును, మహితాతప నివారణ తరళవిచిత్ర కేతనాబద్ధ మయూరశింజినీ నినదపూరితాశాంతరిక్షంబును, సరోజనాభ పూతనా చేతనాపహారాది నూతన విజయసందేశలిఖీత స్వర్ణవర్ణావళీ విభాసిత గోపురమణి విటంకప్రదేశంబును, యాదవేంద్ర దర్శనోత్సవాహూయమాన సమాగత నానాదేశాధీశ భూరివారణదానజల

ప్రభూతపంక నిరసనైకగతాగత జనసమ్మర్ద కరకంకణకషణ వికీర్యమాణరజః పుంజంబును; వినూత్న రత్నమయ మంగళ రత్నవల్లీ విరాజిత ప్రతిగృహప్రాంగణంబును, గుంకుమసలిలసిక్త విపణిమార్గంబును, వంది మాగధసంగీత మంగళారావ విలసితంబును, భేరీమృదంగకాహళ శంఖతూర్య రవాధరీకృత సాగర ఘోషంబునునై, యమరావతీ పురంబునుం బోలె వసుదేవనందననివాసంబై, యనల పుటభేదనంబునుం బోలెఁ గృష్ణమార్గ సంచారభూతంబై, సంయమనీనామ నగరంబునుం బోలె హరి తనూభవాభిరామంబై, నైరృతినిలంబునుం బోలెఁ బుణ్యజనాకీర్ణంబై, వరుణనివాసంబునుఁ బోలె మహాబలసమృద్ధంబై, యలకాపురంబునుం బోలె ముకుంద వర శంఖమకరాంక కలితంబయి, రజతాచలంబునుం బోలె నుగ్రసేనాధిపార్యాలంకృతంబయి, నిగమంబునుం బోలె వివిధవర్ణ క్రమవిధ్యుక్త సంచారంబయి, గ్రహమండలంబునుం బోలె గురుబుధ కవిరాజమిత్ర విరాజితంబయి, సంతత కల్యాణ వేదియుం బోలె వైవాహికోపేతంబయి, బలిదానవ కరతలంబునుంబోలె సంతతదానవారియుక్తంబయి, యొప్పు నప్పురంబు ప్రవేశించి, యందు విశ్వకర్మ నిర్మితంబైన యంతఃపురంబున నుండు షోడశసహస్ర హర్మ్యంబులందు.

601

తా ॥ నారదుడు అలా నగరంలో వెళుతూ ఉండగా మణులతో పొదగబడిన ఉన్నతోన్నతమైన మేడలు కనిపించాయి. ఆ మేడల కిటికీల రంధ్రాలలో నుంచి దట్టమైన కర్పూర, చందన, అగరు ధూపాల పొగల సమూహం బయటకు రావటంతో ఆ నల్లని పొగలే మేఘాలని భ్రమించి నృత్యం చేస్తున్న నెమళ్ళను పౌరభామినులు లాలించడం చూశాడు నారదుడు. చంద్రకాంత మణులతో పొదగబడిన స్ఫటిక స్తంభాలతో చుట్టబడి ఉన్న మేడలు మరకత పద్మరాగాది నవరత్నాలతో కూడిన శిఖరాలతో చూపరులను ఆకర్షిస్తున్నాయి. ఆ శిఖరాలపైన బంగారు కలశాలు నిలబెట్టబడి ఉన్నాయి. ఆ కలశాలపై సూర్యకిరణాలు ప్రసరించటంతో అనేకానేక సూర్యబింబాలు దర్శనమిస్తున్నాయి.

సమస్త వస్తువులతో నిండి ఉన్న అంగళ్ళతో వ్యాపారవేదికలు, మండుటెండను నివారించే జెండాల చిత్రమైన రంగులతో, ఆకాశాన్నంటుతూ రెపరెపలాడే వస్త్రాలు, నెమళ్ళ శింజినీరవాలతో నిండిపోయిన సమస్త దిశలూ నగర శోభను ఇనుమడింప చేస్తున్నాయి. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, విజయ పరంపరలు సూచించే పూతన వధ మొదలైన అనేక గాథలు లిఖించిన బంగారు అక్షరాలతో మిలమిలమెరిసిపోతున్న మణిఫలకాలతో కనులకు విందు చేస్తున్న గోపురాలు పురకాంతిని ప్రస్ఫుటీకరిస్తున్నాయి. యాదవేంద్రుడైన శ్రీకృష్ణుని దర్శనంకోసం నానాదేశాధిపతులు ద్వారకకు రావడంతో వారు అధిరోహించిన మదగజాల చెక్కిళ్ళ నుండి స్రవిస్తున్న మద జలంతో నేలంతా బురదగామారింది. పురంలో వచ్చేపోయే జనసమ్మర్దనం ఎక్కువైంది. దానితో, వారి చేతులకున్న కంకణాల ఒరపిడితో జారిక్రిందపడుతున్న బంగారు పొడితో బురదలోని తడి పోయి నేల పొడిగా మారుతోంది.

ప్రతి ఇంటి ముంగిలి శుభకరమైన క్రొత్త క్రొత్త ముగ్గులతో వెలిగిపోతోంది. ఆ ముగ్గులమీద రత్నాలు పొదగడంతో ముగ్గులు మరింత కాంతితో ప్రతిఫలిస్తున్నాయి. విపణి వీథులన్నీ కుంకుమనీటితో చల్లబడి కల్యాణకాంతుల్ని విరజిమ్ముతున్నాయి. మంగళప్రదమైన వందిమాగధుల గానమాధుర్యంతో, సముద్రఘోషనే తలదన్నే భేరీ మృదంగ నాదాలతో, కాహళశంఖధ్వనులతో శ్రీకృష్ణుని నివాసయోగ్యం కావడంతో ఇంద్రుని అమరావతీ నగరంలా శోభాయమానమై, స్వర్గాన్నే మించిన ద్వారకను చూశాడు నారదుడు.

కేవలం తూర్పు దిశకు పాలకుడైన ఇంద్రుని అమరావతి లాగానే కాక తక్కిన ఏడుగురు దిక్పాలకుల రాజధానీ నగరాల శోభను కూడా అధిగమించి అలరారుతోంది ద్వారకానగరం. అగ్నిదేవుని పట్టణంలా కృష్ణ సంచారంతో కూడి ఉంది. యమధర్మరాజు నగరంలా కృష్ణ పుత్రులతో మనోహరంగా ఉంది. నైరుతి నివాసస్థానమైన దానిలాగా పుణ్యజనులతో నిండి ఉంది. వరుణుని నిలయం లాగా కొండలతో లోకప్రసిద్ధి చెందిన పురంలా ఉంది. వాయుదేవుని ప్రధానవాసం లాగా మహాబలంతో సమృద్ధమై ఉంది. కుబేరుని అలకాపురి లాగా

ముకుందునికుండే శంఖచక్ర మకరచిహ్నాలతో మహావైభవంగా ఉంది. వెండి కొండలాగా ఉగ్రసేనుని ఆధిపత్యంతో మహోన్నతంగా ఉంది. గ్రహమండలంలాగా గురు, బుధ, మిత్రులతో ప్రకాశిస్తోంది. కల్యాణవేదికలాగా ఎప్పుడూ జరుగుతుండే వివాహాది శుభకార్యాలతో నిండి ఉంది. బలిచక్రవర్తి చేతినుండి కారే దానజలధార లాగా ఎప్పుడూ దానజలంతో పరిపుష్టమై ఉంది. అటువంటి మహాద్భుతమైన ద్వారకానగరాన్ని ప్రవేశించి, నారదమహర్షి, ఆ నగరంలో దేవశిల్పి అయిన విశ్వకర్మ చేత నిర్మింపబడిన అంతఃపురంలో ఉన్న పదహారువేల మేడలను చూశాడు.

సీ. పడికంపుఁ గంబముల్ పవడంపుఁ బట్టెలు మరకతరచితముల్ మదురు లమర
వై దూర్యమణిగణవలభులఁ బద్మరాగంబుల మొగడుల కాంతు లొలయ
సజ్జాతివజ్ర లసజ్జాల రుచులతో భాసిల్లు నీలసోపానములను
గరుడపచ్చల విటంకములును ఘనరుచి వెలసిన శశికాంత వేదికలును

తే. వఱలు మౌక్తికఘటిత కవాటములను, బ్రవిమల స్వర్ణమయ సాలభంజికలును మించు
కలరవ మెసంగఁ గ్రీడించు మిథున, లీల నొప్పు కపోతపాలికలుఁ గలిగి.

602

తా ॥ ఆ సౌధాలన్నీ స్ఫటికపు స్తంభాలతో కట్టబడినాయి. పగడాల పలకలు, మరకత మణులు కూర్చిన పై కప్పులు, వైడూర్యాల చంద్రశాలలు, పద్మరాగాల ఇంటి నడికొప్పులు, వజ్రాల కిటికీలు, ఇంద్రనీలపుమెట్లు, గరుడపచ్చల గూళ్ళు, చంద్రకాంత వేదికలు, ముత్యాల తలుపులు, బంగారు బొమ్మలు, మనోహరమైన ధ్వనులు చేస్తూ క్రీడిస్తున్న పావురాళ్ళ జంటలు ఒకటేమిటి? ఏది చూసినా, మళ్ళీమళ్ళీ చూడాలనిపించే విధంగా బహుసుందరంగా ఉన్న ఆ సౌధాలను తనివి తీరా నారదుడు చూశాడు.

తే. చేటికానీకపద తులాకోటిమధుర, నినదభరితమై రుచిరమాణిక్య దీప
మాలికయుఁ గల్గి చూపట్టఁ గ్రాలు నొక్క, జలజలోచన నిజసౌధతలమునందు.

603

తా ॥ ఒకానొక సౌధంలో పరిచారికల సమూహం యొక్క కాలి అందెల ఝణఝణ ధ్వనులతో మధురాతి మధురంగా వినవస్తున్న సవ్వడులు విన్నాడు. మనోజ్ఞమైన కాంతులీనుతూ ఉన్న మణి దీపాల వరుసలు చూశాడు.

తే. కనక కంకణ ఝణఝణత్కార కలిత, చంద్రబింబాననా హస్తజలక ఘటిత
చామరోద్ధూత మారుత చలిత చికుర, పల్లవునిఁ గృష్ణు వల్లవీ పల్లవునిని.

604

తా ॥ ఆ పద్మాక్షి సౌధంలో సకల సపర్యలూ పొందుతూ, ఆనందడోలికలలో ఊగుతున్న గోపికా వల్లభున్ని నారదుడు కనులారా చూశాడు. ఆ సమయంలో చంద్రబింబం వంటి ముఖాలు కలిగిన చెలికత్తెలు చేతులలో వింజామరలు పట్టుకొని కంకణాలు ఘల్లుఘల్లుమంటుండగా వీస్తున్నప్పుడు వచ్చిన చిరుగాలికి శ్రీకృష్ణుని ముంగురులు అల్లనల్లన కదలాడుతున్నాయి.

వ. మఱియు హాటకనిష్కంబు లఱ్ఱులందు వెలుగొందఁ గంచుకంబులు శిరోవేష్టనంబులుఁ గనక కుండలంబులు ధరించి, సంచరించు కంచుకులును, సమాన వయోరూపగుణ విలాసవిభ్రమ కలితలంబులయిన విలాసినీ సహస్రంబులును గొలువం గొలువున్న య ప్పద్మలోచనుం గాంచన సింహాసనాసీనుం గాంచె; న పుండరీకాక్షుండును నారదుం జూచి ప్రత్యుత్థానంబు సేసి యప్పుడు.

605

తా ॥ కవచాలు, తలపాగాలు, బంగారుకుండలాలు ధరించి, మెడయందు స్వర్ణపతకం మెరుస్తుండగా అటూఇటూ తిరుగుతున్న కంచుకీ జనం; సమానమైన వయస్సు, అందం, సుగుణం కలిగిన వేలాది సుందరీమణులు కొలుస్తుండగా స్వర్ణసింహాసనం మీద కూర్చొని

కొలువున్న కమలాక్షుడైన శ్రీకృష్ణున్ని నారదుడు చూడగానే శ్రీకృష్ణుడు కూడా నారదమహర్షిని చూసి వెంటనే సింహాసనంమీద నుంచి లేచి ఎదురువెళ్ళాడు.

క. మునివరు పాదాంబుజములు, దన చారుకిరీటమణి వితానము సోఁకన్ వినమితుఁడై నిజసింహా, సనమునఁ గూర్చుండఁబెట్టి సద్వినయమునన్.

606

తా ॥ నారదమహర్షి పాదపద్మాలకు సుందరమైన తన కిరీటంలోని మణులు సోకేటట్లుగా శ్రీకృష్ణుడు ఆ దేవర్షికి నమస్కరించి, తన సింహాసనంమీద ఆ మహాత్మున్ని కూర్చుండ బెట్టాడు.

క. తన పాదకమలతీర్థం, బున లోకములం బవిత్రముగఁ జేయు పురా
తనమౌని లోకగురుఁ డ, మ్ముని పదతీర్థంబు మస్తమున ధరియించెన్.

607

తా ॥ తన పాదతీర్థం చేత సమస్త లోకాలను పవిత్రం చేసే ఆదిముని, లోకగురుడు అయిన శ్రీకృష్ణ పరమాత్ముడు – నారదమహర్షి పాద తీర్థాన్ని తన శిరస్సుపైన ధరించాడు.

వ. ఇట్లు బ్రహ్మణ్యదేవుండును నరసఖుండు నై న నారాయణుం డశేష తీర్థోపమానంబయిన మునీంద్రపాద తీర్థంబు ధరించిన వాఁ డయి' సుధాసారంబులైన మితభాషణంబుల నారదున కిట్లనియె.

608

తా ॥ ఈ విధంగా పరమాత్ముడు, నర సఖుడు అయిన నారాయణుడు – విశ్వంలోని సమస్త తీర్థజలాలకు సమానమైన నారదమహర్షి పాదతీర్థాన్ని తన తలపై ధరించాడు. అమృతం వంటి మధుర వాక్కులతో శ్రీకృష్ణుడు నారదుడితో ఈ విధంగా అన్నాడు:

క. 'ఏ పని పంచినఁ జేయుదుఁ, దాపసవర!' యనుడు నతఁడు 'దామోదర! చిద్రూపక!

భవదవతార, వ్యాపారము దుష్టనిగ్రహార్థము గాదే!

609

తా ॥ "ఓ తాపస వరా! నీవు ఏది చేయమని ఆనతిస్తే ఆపని చేస్తాను" అని అన్న శ్రీకృష్ణుడి మాటలువిన్న నారదుడు భక్తితో "దామోదరా! జ్ఞానస్వరూపా! దుష్టశిక్షణ కోసమే కదా నీవు ఈ అవతారాలన్నీ ఎత్తేది!

తే. అఖిలలోకైకపతివి దయార్ద్రమతివి, విశ్వసంరక్షకుండవు శాశ్వతుఁడవు వెలయ నే పనియైనఁ గావింతు ననుట, యార్తబంధుండ విది నీకు నద్భుతంబె!

610

తా ॥ సమస్తలోకాలకు అధిపతివి, దయార్ద్ర హృదయుడివి, విశ్వాన్ని అనునిత్యం రక్షించేవాడివి, ఎల్లప్పుడూ నిలిచి ఉండే భగవంతుడివి. నేనే పని చెబితే ఆ పని చేస్తానని నీవు అనడం ఆర్తులకు నీవు బంధుడవన్న విషయాన్ని చెప్పక చెబుతోంది. ఈ విధంగా నీవు నాతో అనడంగాని, నీవు పనిని చేయడంగాని ఏమైనా అద్భుతమైన విషయమా? కాదే!

తే. అబ్జసంభవ హరదేవతార్చనీయ, భూరిసంసార సాగరోత్తారణంబు
నవ్య యానంద మోక్షదాయకము నైన, నీ పదధ్యాన మాత్మలో నిలువ నీవె'

611

తా ॥ సృష్టికర్త అయిన బ్రహ్మ, లయకారుడైన రుద్రుడు మొదలైన సమస్త దేవతలచేత అర్చించబడే శ్రీకృష్ణా! భవసాగరాన్ని దాటించేది; నూతనమైన, ఆనందప్రదమైన మోక్షాన్ని ప్రసాదించేది అయిన నీ యొక్క పాదములయందు నిలిపే ధ్యానాన్ని, సదా నా ఆత్మలో నిలిచే విధంగా వరమియ్యి తండ్రీ!"

వ. అని యభ్యర్థించి య ద్దేవునివలనం బ్రసన్నత వడసి, తన్మందిరంబు వెడలి మునివరుం

డ మ్మహాత్ముని యోగమాయాప్రభావంబు దెలియంగోరి, వేఱొక చంద్రబింబాననా గేహంబునకుం జని యందు నెత్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవయుతుం గని యద్భుతంబు నొందుచు నతనిచేత సత్కృతుండై యచ్చోటు వాసి చని.

612

తా ॥ అని నారదుడు ప్రార్థించేసరికి పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు ప్రసన్నుడైనాడు. తరవాత నారదుడు ఆ మందిరాన్ని వదలి శ్రీకృష్ణుని యోగమాయా ప్రభావాన్ని తెలుసుకోవాలని కోరుకున్నవాడై మరొక కృష్ణ సతి ఇంటికి వెళ్ళాడు. ఆ గృహంలో శ్రీకృష్ణుడు – ఉద్ధవునితో జూదమాడుతూ ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. అక్కడ కూడా శ్రీకృష్ణుని చేత సత్కారాలు పొంది నారదుడు వేరొక భార్యామణి మందిరానికి వెళ్ళాడు.

క. మునివరుఁడు కాంచె నొండొక, వనజాయతనేత్ర నిజనివాసంబున నం
దనయుతు జిష్ణు సహిష్ణున్, వినుత గుణాలంకరిష్ణు విష్ణున్ గృష్ణున్.

613

తా ॥ అక్కడ శ్రీకృష్ణుడు తన పుత్రులతో కలిసి ఆనందిస్తూ కనిపించాడు. సకల సద్గుణాలతో అలంకరింపబడిన వానిని, స్నేహశీలిని, జయశీలుని, సజ్జనహితం కోరే విష్ణువు యొక్క అవతారరూపుడైన కృష్ణుణ్ణి చూసి ఆశ్చర్యపోవడం నారదుని వంతైంది.

క. నారదుఁడట చని కనె నొక, వారిజముఖీయింట నున్న వాని మురారిన్ హారిన్
దానవకుల సం, హారిన్ గమలామనోవిహారిన్ శౌరిన్.

614

తా ॥ మరొక సుందరి గృహానికి వెళ్ళాడు నారదుడు. అక్కడ కూడా కాంచన హారశోభితుడు, రాక్షసాంతకుడు, లక్ష్మీదేవి మనోవిహారి, శౌరి, మురారి అయిన కృష్ణున్ని అత్యద్భుతంగా చూశాడు నారదుడు.

వ. ఇట్లు కనుంగొనుచుం జనుచుండ నొక్క యెడ న మ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు చేసి 'మునీంద్రా! సంపూర్ణకాము లయిన మిమ్ము నపూర్ణకాములమైన మే మేమిటఁ బరితృప్తి నొందఁ జేయంగలవారము? భవదీయదర్శనంబున నిఖిలశోభనంబుల నందెదమని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నా నందనందను మాటలకు నానందకందళిత హృదయారవిందుండును, మందస్మిత సుందర వదనారవిందుండును నగుచు నారదుండు వెండియుఁ జని చని.

615

తా ॥ ఈ విధంగా నారదుడు శ్రీకృష్ణుని పదహారువేల మంది సతీమణుల ఒక్కొక్క మందిరానికీ వెళ్ళి కృష్ణుని మహిమలు చూడాలనే అపేక్షతో వెళుతూ ఉండగా ఒక గృహంలో కృష్ణుడు ఆసనం మీదనుంచి లేచి మునీంద్రుడికి ఎదురువెళ్ళి స్వాగతం పలికి "మహర్షి సత్తమా! కోరికలతో నిండిఉన్న మేము ఏ కోరికా లేకుండా ఉండే మిమ్మల్ని ఏమిచ్చి సంతృప్తి పరచగలము? మీ దర్శనభాగ్యం చేతనే మాకు సకల శుభాలూ చేకూరుతాయి గదా!" అని ఎంతో అభినందన పూర్వకంగా పలికేసరికి కృష్ణుడి మాటలకు సంతోషంతో పొంగిపోతూ, శ్రీకృష్ణుణ్ణి వీడ్కొని, చిరునవ్వుతో కృష్ణుడినే తలచుకొంటూ, వెళ్ళివెళ్ళి మరో కృష్ణ పత్ని ఇంటికి వెళ్ళాడు నారదుడు.

క. అనఘాత్ముఁడు గనుఁగొనె నొక వనితామణి మందిరమున వనకేళీ సం
జనితానందుని ననిమిష, వినమిత చరణారుణారవిందు ముకుందున్.

616

తా ॥ ఆ నారీమణి గృహంలో నారదుడు ఉద్యానవన విహారంలో పత్నీసమేతుడై, పరమానంద హృదయుడై, ఉల్లాసంగా ఉన్న ముకుందుని, మోహనగాత్రుని, సురవందితుని చూశాడు.

క. పరమేష్ఠిసుతుఁడు గనె నొక, తరుణీభవనంబునందుఁ దను దాన మనో–ం
బురుహమునఁ దలఁచుచుండెడి, నరకాసుర దమనశూరు నందకుమారున్.

617

తా ॥ బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు మరో తరుణి ఇంటికి వెళ్ళాడు. అక్కడ నందనందనుడైన కృష్ణభగవానుడు తనలో తాను ఆత్మ దర్శనం చేసుకుంటూ ధ్యాననిష్ఠలో ఉండటం చూశాడు.

వ. మఱియుం జని చని.

618

తా ॥ ఆ విధంగా నారదుడు ఒక్కొక్క ఇంటినీ సందర్శిస్తూ వెళుతున్నాడు.

సీ. ఒకచోట నుచితసంధ్యోపాపనాసక్తు నొకచోటఁ బౌరాణికోక్తి కలితు
నొకచోటఁ బంచయజ్ఞోచితకర్ముని నొకచోట నమృతోపయోగలోలు
నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు
నొకచోట ధేనుదానోత్క లితాత్ముని నొకచోట నిజసుత ప్రకరయుక్తు

తే. నొక్క చోటను గొనవినోద చిత్తు, నొక్కచోటను జలకేళియుతవిహారు
నొక్కచోటను సన్మంచకోపయుక్తు నొక్కచోటను బలభద్రయుక్తచరితు.

619

తా ॥ ఒకచోట కృష్ణుడు సంధ్యావందనం చేస్తున్నాడు. మరోచోట పురాణం చదువుకొంటూ కనిపించాడు. ఇంకో చోట పంచయజ్ఞాలు చేస్తున్నాడు. వేరొకచోట మోక్షకాంక్షియై పరబ్రహ్మను గూర్చిన ధ్యాన నిష్ఠలో ఉన్నాడు. ఒకచోట స్నానం చేయడానికి బయలుదేరుతున్నాడు. మరోచోట దివ్యమైన రకరకాల ఆభరణాలు ధరిస్తూ ప్రకాశమానుడై

ఉన్నాడు. ఇంకో చోట గోదానాలు చేస్తున్నాడు. వేరేచోట కొడుకులతో నవ్వుతూ ఆనందిస్తూ ఉన్నాడు. ఒక ఇంట్లో సంగీత సాధనలో ఉన్నాడు. ఒక గృహంలో జలక్రీడ సలుపుతున్నాడు. ఒక స్థలంలో మంచంమీద కూర్చొని కథలు చెబుతున్నాడు. ఇంకో ప్రియురాలి ఇంట్లో అన్నగారైన బలరాముడితో సమాలోచిస్తూ దర్శనమిచ్చాడు.

వ. మఱియును.

620

తా ॥ నారదుడు ఇంకా తిరుగుతూనే ఉన్నాడు. వెళ్ళిన చోటుకు వెళ్ళకుండా వెళుతూనే ఉన్నాడు. అప్పుడు—

సీ. సకలార్థసంవేది యొక యింటిలోపలఁ జెలితోడ ముచ్చటల్ సెప్పుచుండు
విపులయశోనిధి వేఱొకయింటిలో సరసిజాననఁ గూడి సరసమాడుఁ
బుండరీకదళాక్షుఁడొండొకయింటిలోఁ దరుణికి హారవల్లరులు గ్రుచ్చుఁ
గరుణాపయోనిధి మఱియొక యింటిలోఁ జెలిఁ గూడి విడియము సేయుచుండు

ఆ. వికచకమలనయనుఁ డొకయింటిలో నవ్వు, బ్రవిమలాత్ముఁడొకటఁ బాడుచుండు
యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి సలుపు ననఘుఁడొకటఁ జెలఁగుచుండు.

621

తా ॥ ఒక ఇంట్లో సర్వవిషయాలూ తెలిసిన కృష్ణ పరమాత్ముడు సతీమణితో ముచ్చట్లు చెబుతున్నాడు. కీర్తిమంతుడు మరో ఇంట్లో పద్మముఖీ అయిన ప్రియురాలితో సరసాలాడుతున్నాడు. కమలాక్షుడు వేరే ఇంట్లో భార్యకు మణిహారాలు గ్రుచ్చుతున్నాడు. కరుణాసముద్రుడు ఇంకో ఇంట్లో ఇల్లాలితో కలిసి తాంబూల సేవనం చేస్తున్నాడు. శ్రీకృష్ణుడు సర్వ జనసంతోషకారి కావడంతో ఒక ఇంట్లో అందరినీ సంతోషింపచేస్తూ నవ్వుతూ ఉన్నాడు, ఇంకో చోట పాటలు పాడుతున్నాడు, మరో ఇంట్లో సుఖగోష్ఠి సలుపుతున్నాడు, వేరొక ఇంట్లో

ఉత్సాహంతో చర్చలు చేస్తున్నాడు.

వ. ఇట్లు సూచుచుం జని చని.

622

తా ॥ ఈ విధంగా ఉన్న కృష్ణపరమాత్ముని లీలా విశేషాలు చూస్తూ వెళ్ళి వెళ్ళి ఒక ఇంట్లో

–

క. చతురానన నందనుఁ డం, చితమతిఁ జని కాంచె నొక్క చెలిగేహమునన్
క్రతుకర్మాచరణుని నా, శ్రితభయహరణున్ సురేంద్రసేవితచరణున్.

623

తా ॥ భార్యతోకూడి యజ్ఞకార్యాలు చేస్తున్న, ఆశ్రితుల భయాన్ని పోగొట్టే, దేవేంద్రునిచే పూజింపబడే చరణకమలాలుగల శ్రీకృష్ణున్ని నారదుడు చూశాడు.

క. వృత్రారినుతునిఁ బరమ, పవిత్రుని నారదుఁడు గాంచె వేఱొక యింటం బుత్రక పౌత్రక దుహితృ క, ళత్రసమేతుని ననంతు లక్షణవంతున్.

624

తా ॥ అనంతుడు, సకల సల్లక్షణాలతో ఒప్పేవాడు, ఇంద్రునిచే నుతింపబడేవాడు, పరమ పవిత్రుడు అయిన శ్రీకృష్ణుడు కొడుకులతో, కుమార్తెలతో, మనుమలతో, భార్యతో వినోదిస్తూ కాలం గడుపుతూ ఉండటం నారదుడు మరోభామ ఇంట్లో కనులారా చూశాడు.

క. సుందరమగు నొకసుందరి, మందిరమునఁ బద్మభవకుమారుఁడు గాంచెన్
నందితనందున్ సుజనా, నందున్ గోవిందు నతసనందు ముకుందున్.

625

తా ॥ మరో సుందరిమందిరంలో సుజనులకు ఆనందం కలిగించేవాడు, సనక సనందనాది మహర్షులచేత స్తుతులు అందుకొనేవాడు అయిన గోవిందుడు తండ్రి అయిన నందున్ని ఆనందింపచేస్తూ ఉండటం నారదుడు చూశాడు.

క. జలజభవసుతుఁడు గనె నొక, నలినాక్షినివాసమందు నతభద్రేభున్ జలదాభున్ గతలోభు, న్నలకాళిజితద్విరేఫు నంబుజనాభున్.

626

తా ॥ మరొక కమలాక్షి ఇంట్లో నీలమేఘశ్యాముడు, 'కువలయాపీడమ' నే ఏనుగును మర్దించినవాడు, తుమ్మెద రెక్కల కాంతిని తిరస్కరించే నల్లని ముంగురులు కలవాడు, లోభగుణంలేనివాడు అయిన శ్రీకృష్ణున్ని నారదమహర్షి చూసాడు.

మ. ఒకయింటం గజవాజిరోహకుఁడునై యొక్కింట భుంజానుఁడై
సకలాత్ముండు పరుండు షోడశసహస్ర స్త్రీనివాసంబులం
దొక బోటింటను దప్పకుండ నిజమాయోత్సాహుఁడై యుండ న
య్యకలంకున్ వరదున్ మహాపురుషు బ్రహ్మణ్యున్ నతాబ్జాసనున్.

627

తా ॥ సమస్త జీవరాశుల ఆత్మలందుండే పరాత్పరుడు, శ్రీకృష్ణుడు ఒక సుందరి ఇంట్లో ఏనుగులపై, గుఱ్ఱాలపై ఎక్కి విహరిస్తున్నాడు. మరొకరి గృహంలో భోజనం చేస్తున్నాడు. ఈ విధంగా పదహారువేలమంది భార్యల మందిరాలలోను ఒక్కరిని కూడా మరవకుండా తన మాయావిశేషంతో ఆనందోత్సాహాలతో కాలం గడుపుతున్నాడట శ్రీకృష్ణుడు! అటువంటి నిర్మల స్వభావుడు, వరప్రదాత, పురుషోత్తముడు, బ్రహ్మచేత నుతులందుకొనే వాడు, వేదస్వరూపుడు, సాక్షాత్తు పరమాత్ముడు అయిన శ్రీకృష్ణుని మహిమలకు నారదుడు అచ్చెరువుపొందాడు.

క. అస్తోకచరితు నమిత స, మస్తసుధాహారు వేదమస్తకతల వి

న్యస్తపదాంబుజయుగళు న, పాస్తశ్రితనిఖిల పాపుఁ బరము ననంతున్.

628

తా ॥ మహిమాన్విత చరిత్ర గలవాడు, దేవతలచేత పూజింపబడే పాదపద్మాలుగలవాడు, వేదాలపైన నిల్పిన చరణయుగం కలవాడు, అకలంకులైన ఆశ్రితుల పాపాలు ధ్వంసం చేసేవాడు, అనంతుడు, పరాత్పరుడు అయిన శ్రీకృష్ణుణ్ణి చూసి నారదుడు పరమానందభరితుడైనాడు.

ఆ. పరమభాగవతుఁడు పరమేష్ఠి తనయుండు, మనుజలీలఁ జెంది మహితసౌఖ్య చిత్తుఁడైన యా హృషీకేశు యోగ మా, యాప్రభావమునకు నాత్మ నలరి.

629

తా ॥ భక్తాగ్రగణ్యుడు, బ్రహ్మతనయుడు అయిన ఆ మహాతపస్వి నారదుడు మానుషలీలలలో వెలుగొందుతున్న కృష్ణుని, సకలసౌఖ్యాలు అనుభవిస్తున్న హృషీకేశుని యోగమాయా ప్రభావానికి ఆశ్చర్యపడి ఆత్మలో ఎంతగానో సంతోషించాడు.

క. మాయురె? హరిహరి వరద! య, మేయగుణా! యనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం డాయదు నాయకు సుజన వి, ధేయుని కిట్లనియె 'దేవ! త్రిజగములందున్.

630

తా ॥ "అరరే! హరి హరీ! శ్రీహరీ! సద్గుణ సంపన్నా! నీ లీలలు చిత్రవిచిత్రాలు గదా" అని నారదుడు కృష్ణున్ని మనసులో మెచ్చుకొన్నాడు. సుజనులకు విధేయుడిగా వర్తించే శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు:

క. నీ మాయఁ దెలియువారలె, తామరసాసన సురేంద్రతాపసు లైనన్ ధీమంతులు నీభక్తిసు, ధా మాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్.

తా ॥ “దేవదేవా! నీ మాయ తెలుసుకోగలవారు ముల్లోకాలలోను లేరుకదా! బ్రహ్మదేవుడుగాని, దేవేంద్రుడుగాని, మహర్షులుగాని ఎవరూ నీ లీలలుగాని, మహిమలుగాని తెలుసుకోగలరా! లేదే! పరమాత్మా! నీమీది భక్తి అనే అమృతాన్ని పానం చేసే ధన్యులు తప్ప వేరెవ్వరూ నీ మాయను గ్రహించలేరు సుమా!”

క. అని హర్షింపుచు ‘నింక నేఁ, బనివినియెద నిఖిలలోక పావనమును స
జ్జనహితమునైన నీకీ, ర్తన మఖిలజగంబులందుఁ దగ నెఱిఁగింతున్.

632

తా ॥ అని భక్త్యావేశంతో, పరమానందంతో “స్వామీ! ఇక నేను వెళ్ళివస్తాను. సకల లోకాలలోను తిరిగి పరమ పవిత్రమైనది, సజ్జన హితమైనది అయిన నీ దివ్యచరిత్రను కీర్తిస్తూ అందరికీ తెలియపరుస్తాను” అని నారదుడు శ్రీకృష్ణునికి విన్నవించాడు.

క. అని తద్వచనసుధాసే, చనమున ముదితాత్ముఁ డగుచు సంయమి చిత్తం
బునఁ దన్మూర్తిం దగ నిడు, కొని చనియెను హరినుతైక కోవిదుఁ డగుచున్.

633

తా ॥ అమృతమయమైన శ్రీకృష్ణపరమాత్మ పలుకులు విని సంతోషించినవాడై నారదమహర్షి, తన మనస్సులో శ్రీహరి రూపాన్ని స్థిరంగా నిల్పుకొని నారాయణ నామస్మరణ చేసుకొంటూ వెళ్ళిపోయాడు.

క. ఈ పగిది లోకహితమతి, నా పరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగ
ద్దీపిత చారిత్రుఁడు బహు, రూపములం బొందె సుందరుల నరనాథా!

634

తా ॥ “మహారాజా! ఈ విధంగా లోకహితం కోసం పరమాత్ముడైన నారాయణుడు మానవాకృతి ధరించాడు. ఆతని అవతారమైన శ్రీకృష్ణుడు మహిమాన్వితమైన చరిత్రతో ప్రకాశించాడు. ఆ భగవంతుడు అనేకానేక రూపాలు ధరించి అంతమంది కాంతలను అలరింపచేశాడు” అని శుకమహర్షి చెప్పి ఇంకా ఇలా అన్నాడు:

చ. అని హరి యిట్లు షోడశసహస్ర వధూమణులం బ్రియంబునన్
మనసిజకేళిఁ దేల్చిన యమానుషలీల సమగ్రలీల సమగ్ర భక్తితో
వినినఁ బఠించినం గలుగు విష్ణుపదాంబుజ భక్తియున్ మహా
ధన పశు పుత్రమిత్ర వనితాముఖ సౌఖ్యములున్ నరేశ్వరా!’

తా ॥ “పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడీ విధంగా పదహారువేల మంది భార్యలను పవిత్ర మనస్సుతో, ప్రేమాతిశయంతో, శృంగార క్రీడలలో ఆనందింపజేశాడు. మానవాతీతమైన శ్రీకృష్ణుని లీలాగాథను సంపూర్ణమైన భక్తితో విన్నా, చదివినా అటువంటి వారికి విష్ణుభక్తితోపాటు ఎనలేని ధనము, పశువులు, పుత్రులు, మిత్రులు, భార్యమొదలైన సమస్త సౌఖ్యాలు లభిస్తాయి.”

వ. అని చెప్పి య ప్పారాశర్యనందనుం డభిమన్యు నందనున కిట్లనియె. ‘నా నిశావసానంబునఁ బద్మబాంధవాగమనంబును గమలినీ లోకంబునకు మునుకలుగ నెఱింగించు చందంబునం గలహంస సారసరథాంగముఖ జలవిహంగంబుల రవంబులు సెలంగ నరుణోదయంబున మంగళపాఠకసంగీత మృదుమధుర గాన నినదంబును లలితమృదంగ వీణావేణునినాదంబును ఏతేర మేలుకని తనచిత్తంబునఁ జిదానందమయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాద్యు నాద్యంత విహీనుఁ బరమబ్రహ్మంబు నైన తన్నుం దా నొక్కింత చింతించి యనంతరంబ విరోధిరాజన్య నయన కల్హారంబులు ముకుళింప భక్తజన నయన కమలంబులు వికసింప నిరస్త నిఖిలదోషాంధకారుం డైన గోవిందుండు మొగిచిన లోచన సరోజంబులు వికసింపఁ

జేయుచుఁ దల్పంబు డిగ్గి చనుదెంచి యంత.

636

తా ॥ అని శుకమహర్షి చెప్పి ఇంకా ఇలా చెప్పాడు: "ఆ రాత్రి గడిచింది. సూర్యోదయ సమయాన్ని పద్మాలకు తెలియజేసే విధంగా కలహంసలు, బెగ్గురు పక్షులు, చక్రవాకాలు చేస్తున్న మనోహర ధ్వనులు ఒప్పుతుండగా; అరుణోదయ సూచనగా మంగళకరమైన మృదుమధుర గీతాలు వినవస్తుండగా; మృదంగ వీణావేణు రవాలు ఇంపు కలిగిస్తుండగా శ్రీకృష్ణుడికి మెలకువ వచ్చింది. పరమాత్ముడు, సచ్చిదానంద మయుడు, అవ్యయుడు, అనంతుడు, అచ్యుతుడు, ఆద్యంతరహితుడు అయిన తననుతాను ఒకింత సేపు ధ్యానించి శ్రీకృష్ణుడు మెల్లగా కన్నులు తెరచి పాన్పు దిగాడు. కృష్ణుడు మేల్కొనగానే శత్రురాజుల కళ్ళు అనే కలువలు ముకుళించుకుపోయాయి. భక్తజన నేత్రాలు వికసించాయి. సమస్త పాపాలను పరిహరించే గోవిందుడు అందరికీ ఆనందకరుడైనాడు.

సీ. మలయజ కర్పూర మహిత వాసితహేమ కలశోదకంబుల జలకమాడి
నవ్యలసన్మృదు దివ్యవస్త్రంబులు వలనొప్ప రింగులు వాఱఁ గట్టి
మకరకుండలహార మంజీర కేయూర వలయాది భూషణావలులు దాల్చి
ఘనసార కస్తూరికా హరిచందన మిళితపంకము మేన నలర నలఁది

తే. మహితసౌరభ నవకుసుమములు దుఱిమి, పొసంగ రూపైన శృంగార రస మనంగ
మూర్తిఁ గైకొన్న కరుణాసముద్ర మనఁగ, రమణ నొప్పుచు లలితదర్పణము చూచి.

637

తా ॥ నిద్రనుంచి మేల్కొనిన తరవాత శ్రీకృష్ణుడు బంగారు కలశాలలో చందన కర్పూరాది పరిమళ ద్రవ్యాలతో కూడిన జలాలతో స్నానం చేశాడు. నూతన మృదువస్త్రాలను రింగులు వారేటట్లు ధరించాడు. మకరకుండలాలను, హారాలను, భుజకీర్తులను, కంకణాలను, కాలి అందెలను అలంకరించుకొన్నాడు. కర్పూరం, కస్తూరి, హరిచందనాలను మిళితం చేసి

సువాసనలు వెదజల్లేటట్లు శరీరానికి అలదుకొన్నాడు. పరిమళభరితమైన పూలమాలలు సిగలో, మెడలో ధరించి మూర్తీభవించిన శృంగార రసమా అనే విధంగా, రూపుకట్టిన కరుణాసముద్రమా అనేటట్లు ప్రకాశిస్తున్న కృష్ణుడు తన సౌందర్యాన్ని అద్దంలో చూసుకొన్నాడు.

తే. కడఁగి సారథి తెచ్చిన కనకరథము, సాత్యకి హితప్రియోద్ధవ సహితుఁ డగుచు నెక్కి
నిజకాంతిఁ దిక్కులఁ బిక్కటిల్లఁ, బూర్వగిరిఁ దోఁచు భానునిఁ బోలి వెలిఁగె.

638

తా ॥ తమ్ముడైన సాత్యకితోను, ప్రియమిత్రుడైన ఉద్ధవుడితోను కలిసి దారుకుడు తెచ్చిన బంగారు రథాన్ని ఎక్కి తన కాంతులు దశదిశలా ప్రసరిస్తూ ఉండగా కృష్ణుడు తూర్పుకొండపై ఉదయించిన సూర్యుడిలా ప్రకాశించాడు.

సీ. అభినవనిజమూర్తి యంతఃపురాంగనా నయనాబ్జములకు నానంద మెసఁగ
సలలిత ముఖచంద్ర చంద్రికాతతి పౌరజనచకోరముల కుత్సవము సేయ
మహనీయకాంచన మణిమయభూషణ దీప్తులు దిక్కులఁ దేజరిల్ల
నల్ల నల్లన వచ్చి యరదంబు వెస డిగ్గి హల కులిశాంకుశ జలజ కలశ

తే. లలిత రేఖలు ధరణి నలంకరింప, నుద్ధవుని కరతల మూని యొయ్య నడచి మహితగతి
దేవతాసభామధ్యమునను, రుచిర సింహాసనమునఁ గూర్చుండె నెలమి.

639

తా ॥ అతిలోక సుందరుడైన శ్రీకృష్ణుడు తన సౌందర్యంతో అంతఃపురకాంతల కన్నులకు ఆనందాన్ని కలిగిస్తూ, తన ముఖచంద్రుని శీతలకాంతులు పౌరజనానికి పండుగ చేస్తుండగా, మహత్తరమైన మణులతో నిండిన బంగారు భూషణాల ధగధగలు దిక్కులను వెలిగిస్తుండగా, మెల్లగావచ్చి, రథం దిగినవాడై, ఉద్ధవుని చేతిని ఆసరాగా పట్టుకొని, పాదాలకున్న హలకులిశ పద్మాది రేఖలు భూమిపై చిహ్నాలుగా ఏర్పడుతుండగా నడచివచ్చి సభామధ్య ప్రదేశంలో ఉన్న

సింహాసనం మీద కూర్చున్నాడు.

చ. అతివిభవంబునం దనరి యాత్మతనుద్యుతి తేజరిల్లఁగా
హితులు పురోహితుల్ వసుమతీశులు మిత్రులు బాంధవుల్ బుధుల్
సుతులును మాగధుల్ కవులు సూతులు మంత్రులు భృత్యులున్ శుభ
స్థితిఁ గొలువంగఁ నొప్పె నుడుసేవితుఁడైన సుధాంశుఁడో యనన్.

640

తా ॥ మిక్కిలి వైభవంతో ఒప్పుతున్న శ్రీకృష్ణుడు శరీరకాంతులు మిఱుమిట్లు గొల్పుతుండగా, హితులు, స్నేహితులు, పురోహితులు, సామంతులు, బంధువులు, విద్వాంసులు, వందిమాగధులు, రథసారథులు, మంత్రులు, సేవకులు, పుత్రులు వినయవంతులై కొలుస్తుండగా; నక్షత్ర గణంచేత సేవింపబడే శాంతిమంతుడైన చంద్రునిలాగా శోభిల్లాడు.

క. కరుణార్ద్రదృష్టిఁ బ్రజలం, బరిరక్షించుచు వివేకభావకళా చా
తురి మెఱసి యిష్టగోష్ఠిం, బరమానందమున రాజ్యభారకుఁ డగుచున్.

641

తా ॥ శ్రీకృష్ణుడు ప్రజలనందరినీ కరుణాదృష్టితో రక్షిస్తూ; విద్యావివేకాలతో, భావచాతుర్యంతో, కళానైపుణ్యంతో సన్నిహితులతో ఇష్టాగోష్ఠి సలుపుతూ రాజ్యభారాన్ని అతిసమర్థతతో నిర్వహించాడు.

## జరాసంధ భీతులైన రాజులు పంపగా విప్రుడు శ్రీకృషుని సన్నిధికి వచ్చుట

వ. ఇ వ్విధంబునం బ్రతిదివసంబును నుండ నవసరంబున నొక్క నా డపూర్వ దర్శనుండైన భూసురుం డొక్కరుండు చనుదెంచి సభా మధ్యంబునం గొలువున్న ముకుందునిం బొడగని దండప్రణామం బాచరించి వినయంబునఁ గరములు మొగిచి యిట్లనియె.

642

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు ప్రతిరోజూ రాజకార్యాలను నిర్వహిస్తూ ఉన్నాడు. ఒకనాడు, అంతకుముందెన్నడూ చూడనటువంటి ఒక బ్రాహ్మణుడు సభామధ్యమందు కొలువుతీరి ఉన్న శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చాడు. సాష్టాంగప్రణామం చేసి వినయవంతుడై రెండు చేతులూ జోడించి శ్రీకృష్ణుడితో ఇలా అన్నాడు:

క. కంజవిలోచన! దానవ, భంజన! యోగీంద్రవిమల భావలసద్భో
ధాంజన! దీప్తి నిదర్శన!, రంజితశుభమూర్తి! కృష్ణ! రాజీవాక్షా!

643

తా ॥ "కమలాక్షా! రాక్షసాంతకా! యోగీంద్రుల నిర్మల భావాలను ప్రకాశింపచేసే దేవా! తేజోమూర్తీ! శుభాకారా! కృష్ణా! నా విన్నపం వినవలసింది.

తే. అవధరింపు జరాసంధుఁ డతులబలుఁడు, దనకు మ్రొక్కని ధారుణీధవుల నెల్ల
వెదకి తెప్పించి యిరువదివేల నాఁకఁ, బెట్టినాఁడు గిరివ్రజపట్టణమున.

644

తా ॥ జరాసంధుడనే మహారాజు మహాబలసంపన్నుడు. ఆయన రాజధాని గిరివ్రజపురం. తనకు అధీనులై నమస్కరించని రాజులందరినీ వెదకివెదకి, జయించి తెచ్చి తన రాజధానీ

నగరంలో బంధించాడు. ఆ విధంగా బంధింపబడ్డ రాజులు ఇరవైవేల మంది వరకు ఉన్నారు.

తే. వారు పుత్తేర వచ్చినవాఁడ నేను, నరవరోత్తమ! నృపుల విన్నపము గాఁగ
విన్నవించెద నామాట వినిన మీఁద, ననఘ! నీ దయ! వీరి భాగ్యంబు కొలఁది.

645

తా ॥ శ్రీకృష్ణ సార్వభౌమా! ఆ రాజులందరూ నన్ను నీ వద్దకు పంపారు. వారి విన్నపం వినిపిస్తాను. నా మాటలు విన్న తరువాత నీ దయవచ్చినట్లు చేయి. ఆ పైన వారి భాగ్యం ఎలా ఉంటే అలా జరుగుతుంది."

వ. అని ధరాధిపుల విన్నపంబుగా నిట్లనియె.

646

తా ॥ అని రాజులు చెప్పి పంపిన విషయాన్ని ఈ విధంగా విన్నవించాడు:

ఉ. వారిజనాభ! భక్త జనవత్సల! దుష్టమదాసురేంద్ర సం
హార! సరోరుహాసనపురారి ముఖామరవంద్య పాద పం
కేరుహ! సర్వలోకపరికీర్తిత దివ్యమహాప్రభావ! సం
సారవిదూర! నందతనుజాత! రమాహృదయేశ! మాధవా!

647

తా ॥ "మాధవా! కమలనాభా! భక్తులపట్ల వాత్సల్యం కలవాడివి. దుష్టులైన రాక్షసులనందరినీ సంహరించే దయామూర్తివి. బ్రహ్మ, మహేశ్వరుడు మొదలైన దేవతలచేత పూజింపబడే పాదపద్మాలుగల మహానుభావా! సమస్తలోకవాసులచేత కీర్తింపబడే దివ్యప్రభావం గల పరంతపా! సంసార సాగరానికి సుదూరంగా ఉండేవాడా! నందకుమారా! శ్రీకృష్ణా!

ఆ. ఆర్తజనుల మమ్ము నరసి రక్షింపు మ, హాత్మ! భక్త జనభయాపహరణ! నిన్ను మది

నుతించి నీకు మ్రొక్కెదము నీ, చరణయుగము మాకు శరణ మనఘ!

648

తా ॥ ప్రభూ! మేము ఆర్తిపొంది ఉన్నాము. మమ్మల్ని రక్షించు. భక్తుల భయాలను తొలగించే మహాత్ముడవు. మనస్సులలో నిన్నే తలచి, స్తుతించే మమ్మల్ని కాపాడు. నీ పాదపద్మాలే మాకు శరణ్యం తండ్రీ! మా మ్రొక్కులు స్వీకరించి మమ్మల్ని అనుగ్రహించు.

క. బలియుర దండింపఁగ దు, ర్బలులను రక్షింప జగతిపై నిజలీలా
కలితుఁడవై యుగయుగమున, నలవడ నుదయింతు కాదె? యభవ!యనంతా!

649

తా ॥ అభవా! అనంతా! బలంతో మదించిన దుష్టులను దండించడానికి, దుర్బలులను రక్షించడానికి ప్రతి యుగంలోను మహిమాన్వితుడవై, లీలలతో కూడి అవతరిస్తావు గదా!

క. నీమదిఁ దోఁపని యర్థం, బీ మేదిని యందుఁ గలదె యీశ్వర! భక్త
స్తోమసురభూజ! త్రిజగత్, క్షేమంకర ! దీనరక్షసేయు మురారీ!

650

తా ॥ దేవా! జగదీశ్వరా! ఈ విశ్వంలో నీకు తెలియని అర్థమంటూ ఉందా? భక్తుల పాలిటి కల్పవృక్షానివి. ముల్లోకాల వాసులకు ఎల్లప్పుడూ క్షేమాన్ని కలిగించే వాడివి. ఓ మురారీ! దీనులమైన మమ్ము రక్షించు.

క. నీ పంపు సేయకుండఁగ, నా పద్మభవాదిసురులకైనను వశమే?
శ్రీపతి శరణాగతులం, జేపట్టి నిరోధ ముడుగఁ జేయుము కృష్ణా!

651

తా ॥ స్వామీ! బ్రహ్మదేవుడు మొదలైన దేవతలకైనా నీ ఆజ్ఞను అనుసరించకుండా

ఉండటం చేతకాని పని. మేము నీ శరణు కోరిన వారము. మమ్మల్ని ఆదుకొని ఈ నిర్బంధం నుంచి మమ్మల్ని రక్షించు.

క. అభవుఁడ వయ్యును జగతిం, బ్రభవించుట లీల గాక భవమందుటయే
ప్రభువులకుం బ్రభుఁడవు మము, సభయాత్ముల నరసి కావఁ జను నార్తిహరా!

652

తా ॥ కృష్ణా! నీవే విష్ణుడవు. పుట్టుకలేని భగవంతుడివి. నీకు పుట్టుక అనేది లేకపోయినా ఈ ప్రపంచంలో నీవు పుట్టడమనేది నీ లీలకాక నిజంగా మానవుడిగా జన్మించటమంటావా? మేము భయంతో కూడి ఉన్నాం. నీవా ప్రభువులకు ప్రభుడవైన జగత్ప్రభుడవు. మా కష్టాలను పరిశీలించి మమ్మల్ని కాపాడు దేవా!

క. కదనమున నీ భుజావలి, కెదిరింపఁగ లేక పాఱఁ డే విక్రమ సం
పద సెడఁగ జరాసంధుఁడు, పదునెనిమిదిసార్లు ధరణిపాలురు నవ్వన్.

653

తా ॥ శ్రీకృష్ణా! ఇంతకు పూర్వం యుద్ధరంగంలో నీ భుజబలానికి జరాసంధుడు ఎదురునిలిచి నీతో యుద్ధం చేయలేకపోయాడు. తన శౌర్యం తగ్గిపోగా రాజులందరూ నవ్వుతుంటే ఆ జరాసంధుడు పిరికిపందలాగా పద్దెనిమిది సార్లు ఓడిపోయి రణరంగం నుంచి పారిపోలేదా?

వ. అట్లు తనపడిన బన్నములం దలంపక సింహంబు సమద దంతావళంబుల నరికట్టి కావరించు చందంబున మమ్ముం జెఱపట్టి బాధించుచున్న య ప్పాపాత్ముని మర్దించి కారాగృహబద్ధుల మగు మా నిర్బంధంబులు వాపి, సుతదారమిత్ర వర్గంబులం గూర్చి యనన్య శరణ్యులమైన మమ్ము రక్షింపు’ మని విన్నవించి రని బ్రాహ్మణుండు విన్నపంబు సేయు సమయంబున.

తా ॥ చూడు కృష్ణా! జరాసంధుడు నీ దగ్గర తాను పడ్డ కష్టాలన్నీ మరచిపోయినట్లున్నాడు. వాటి గురించే ఆలోచించటం లేదు. మృగరాజైన సింహం మదపుటేనుగులను అడ్డగించి వీరవిజృంభణ చేసే విధంగా మమ్మల్ని ఓడించి చెఱసాలలోపెట్టి అమితంగా బాధిస్తున్నాడు. ఆ పాపాత్ముని నిర్జించి, కారాగారాలలో నిర్బంధింపబడిఉన్న మమ్మల్ని బంధవిముక్తుల్ని చేయి. మా భార్యాపుత్రులను, మిత్రులను, ప్రజలను మేము చేరుకొనేటట్లు చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాము. నీవు తప్ప మాకు వేరెవ్వరూ దిక్కులేరు. మమ్మల్ని రక్షించుదేవా!" అని జరాసంధుని చెఱలో మ్రగ్గుతున్న రాజులు విన్నవించారని బ్రాహ్మణుడు శ్రీకృష్ణునికి విన్నవిస్తున్న సమయంలో నారదమహర్షి శ్రీకృష్ణ సభలోకి ప్రవేశించాడు.

## ధర్మజునిచేత రాజసూయము నెరవేర్పమని చెప్పుట

సీ. శారదచంద్రికా సారంగరుచితోడ జడముడికెంపు చేఁజఱచి నవ్వ
శరదంబుదావృత సౌదామనీలతా శోభఁ గాంచనకటి సూత్ర మలర
లలితపూర్ణేందుమండల కలంకము గతి మృదుమృగాజినరుచి మించుఁ జూపఁ
గల్పశాఖాగ్రసంగత పుష్పగుచ్ఛంబు లీలఁ గేలను నక్షమాల యమర

తే. భూరిపుణ్యనదీతోయపూరణమునఁ, దగు కమండలు వొక్క హస్తమునఁ దనర
వెల్ల జన్నిద మఱుత శోభిల్ల వచ్చె, నారదుండు వివేక విశారదుండు.

655

తా ॥ శరత్కాలమునాటి చంద్రుని వెన్నెలల కాంతులలో ఉన్న లేడి ఎరుపువర్ణాన్ని తన జడముడిలోని కెంపువర్ణం పరిహసిస్తుండగా; శరత్కాలమేఘం చేత ఆవరింపబడిన మెరుపు తీగెలాగా బంగారు కటిసూత్రం ఒప్పుతుండగా, పూర్ణచంద్రునిలోని మచ్చలాగా జింకచర్మం శరీరంపై అలరారుతుండగా, కల్పవృక్షం కొమ్మచివరలో ఉన్న పూలగుత్తి లాగా ఉన్న జపమాలను ఒక చేతిలో ధరించి, పుణ్యనదీ జలంతో నిండి ఉన్న కమండలాన్ని మరో చేతిలో పట్టుకొని కంఠమందు తెల్లని జందెం రజత కాంతులు విరజిమ్ముతుండగా; తెల్లని దేహకాంతులతో వెలిగిపోతూ, వివేకంలో విశారదుడైన నారదమహర్షి శ్రీకృష్ణదర్శనార్థం సభకు విచ్చేశాడు.

క. చనుదెంచె నట్లు ముని నిజ, తనుకాంతుల నఖీలదిగ్వితానము వెలుఁగన్ వనజాప్తుఁబోలి
య య్యదు, జనములు గృష్ణుండు లేచి సంప్రీతిమెయిన్.

656

తా ॥ ఆ విధంగా తన శరీరకాంతులు దిక్కులను వెలిగిస్తుండగా సూర్యభగవానుడిలాగా దిగి వచ్చాడు నారదమహర్షి. వెంటనే మహర్షి వచ్చిన సంభ్రమంతో సభలోని యాదవులు,

సభాధిపతి అయిన శ్రీకృష్ణుడు మన్నన పూర్వకంగా లేచి నిలబడ్డారు.

క. వినయమున మ్రొక్కి కనకా, సనమునఁ గూర్చుండఁబెట్టి సముచిత వివిధా
ర్చనములఁ దనిపి మురాంతకుఁ, డనియెన్ వినయంబు దోఁప న మ్మునితోడన్.

657

తా ॥ వినయంతో దివ్యర్షికి నమస్కరించి, బంగారు ఆసనంపై కూర్చుండ బెట్టారు. నారదమహర్షికి చేయవలసిన సకల సత్కారాలు చేశారు, పూజించారు. అప్పుడు శ్రీకృష్ణుడు వినయవంతుడై మహర్షితో ఈ విధంగా అన్నాడు:

తే. ఇప్పుడెందుండి వచ్చితి విందులకును?, నఖిలలోకైక సంచారి వగుటఁ జేసి నీ
యెఱుంగని యర్థంబు నిఖిలమందు, నరయ లేదండ్రు; మి మ్మొకఁ డడుగవలయు.

658

తా ॥ “స్వామీ! మీరు సకల లోకాలలోను సంచరించే మహానుభావులు. ఇప్పుడు ఎక్కడ నుంచి ఇక్కడకు వచ్చారు? విశ్వం మొత్తంలో మీకు తెలియని విషయమంటూ ఏదీ ఉండదు. మిమ్మల్ని ఒక విషయం గురించి అడగాలని ఉంది.

తే. పాండునందను లిప్పు డేపగిది నెచట, నున్నవారలొ యెఱిఁగింపు మన్న మౌని
కరసరోజాతములు మోడ్చి కడఁకతోడఁ, బలికెఁ గమలాక్షుఁ జూచి సద్భక్తి మెఱసి.

659

తా ॥ మహర్షీ! పాండవులిప్పుడెక్కడ ఉన్నారు? ఎలా ఉన్నారు? తెల్పండి స్వామీ” అని అడగగానే నారదుడు రెండు చేతులూ జోడించి, భక్తితో కృష్ణుణ్ణి చూసి ఇలా అన్నాడు:

వ. దేవా! విశ్వనిర్మాణకర్తవై మాయవై సకల కార్యోత్పాదనాదిశక్తి యుక్తుండవై పావకుండు దారువులందు నంతర్హిత ప్రకాశుండై యున్న చందంబున వర్తించుచున్న నీదు

దురత్యయంబయిన మాయాశతంబులఁ బెక్కు మాఱులు పొడగంటి నిదియు నాకు నద్భుతంబుగా; దదియునుం గాక నీ సంకల్పంబున జగంబుద్భవంబై భవత్పరతంత్రంబు నగు; నట్టి నీ కిష్టంబైన వస్తువు సాధుతరంబుగాఁ దెలియ నెవ్వండు సుమర్థుం? డే పదార్థంబు ప్రమాణ మూలంబునం దోఁచు నదియును లోకవిచక్షణుండవైన నీదు రూపంబు; మఱియును ముక్తి మార్గంబు నెఱుంగక సంసారపరవశులైన జీవుల మాయాంధకారంబు నివర్తింపఁ జేయ సమర్థంబగు; నీ దివ్యలీలావతారంబులం గలుగు కీర్తి యను ప్రదీపంబు ప్రజ్వలింపఁ జేసి కృపసేయు దట్టి నీకు నమస్కరించెద; నది గావున నీ ప్రపంచంబున నీ యెఱుంగని యర్థంబు గలదె? యని కృష్ణునకు నారదుం డిట్లనియె.

660

తా ॥ "దేవా! విశ్వాన్ని సృష్టించేది నీవు. మాయతో కూడి సర్వకార్యాలను నిర్వహించే శక్తిమంతుడమా నీవే. దారువులలో అగ్ని ఎలా నిక్షిప్తమై ఉంటుందో, ఆ విధంగా చేటుకలిగించని మాయ నీలో నిబిడీకృతమై ఉంటుంది. నీలోని వందల మాయలను ఎన్నో సార్లు చూశాను. నీ మాయాశక్తి నాకు అద్భుతమైనదికాదు. అదీగాక, కేవలం నీ సంకల్పమాత్రం చేతనే జగత్తు ఉద్భవిస్తుంది. నీ అధీనంలో ఉంటుంది. నీకిష్టమైన వస్తువేదో తెలుసుకోవటం ఎవరికి చేతనౌతుంది? ప్రమాణంగా కనబడే ఏ పదార్థామైనా అది నీ రూపమే. మోక్షమార్గాన్ని తెలుసుకోలేక సంసారంలో కొట్టుకుపోయే జీవుల మాయాంధకారాన్ని పోగొట్టడానికి సమర్థమైనది నీ రూపమే! నీ దివ్యమైన లీలావతారాలలో కలిగే కీర్తి అనే దీపాన్ని ప్రజ్వలింపచేసి మమ్మల్ని కరుణిస్తావు. అటువంటి పరమాత్ముడవైన నీకు నమస్కరిస్తాను. కనుక దేవా! ఈ ప్రపంచంలో నీకు తెలియని విషయమంటూ ఉంటుందా?

సీ. 'అయినను వినిపింతు నవధరింపుము దేవ! పాండుతనూజుండు పారమేష్ఠ్య
కామానుమోదియై కావింప నున్నాఁడు రాజసూయమహాధ్వరంబు నిష్ఠ
రవణింప లోక విడంబనార్థము గాక, పరికింపఁ దన కాత్మబంధువుఁడవు

భక్తవత్సలుఁడవు పరమపూరుషుఁడవు యజ్ఞరక్షకుఁడవు యజ్ఞభోక్త

తే. వగు భగవత్సేవ చాలదే సుగతి వడయ?, నైన నీ మేనబావ ధర్మాత్మజుండు అతని యజ్ఞంబు రక్షింప నంబుజాక్ష! వలయు విచ్చేయు మచటికి వలను మెఱసి.

661

తా ॥ కృష్ణా! అయినా నీవు నన్ను అడిగావు కనుక చెబుతాను విను. ధర్మరాజు ధర్మచింతన గలవాడై రాజసూయ యజ్ఞం చేయాలని సంకల్పించాడు. లోకరీతిలో నిష్ఠతో యజ్ఞాన్ని చేయాలని కాకపోతే ఆలోచించి చూస్తే ధర్మజునికి ఆత్మబంధుడవు, భక్తవత్సలుడవు, పరమపురుషుడవు, యజ్ఞరక్షకుడవు, యజ్ఞభోక్తవు అయిన నీ సేవ చేస్తే చాలదా సద్గతి పొందడానికి! ఏది ఏమైనా, నీ మేనత్త కొడుకైన ధర్మరాజు యజ్ఞం చేయబోతున్నాడు. కాబట్టి కృష్ణా! అతని యజ్ఞాన్ని నీవు రక్షించాలి. వీలు చూసుకొని నీవక్కడకు వచ్చి ధర్మరాజుకు విజయం చేకూర్చాలి.

క. నీ పేరు వినిన నొడివినఁ, బాపంబులు దూలిపోవు పద్మాక్ష; జగ
ద్దీపక! నీ దర్శనమున, నేపారవె భక్తజనుల కిహపరసుఖముల్.

662

తా ॥ కృష్ణా! నీ పేరు వింటే చాలు, పలికితే చాలు సమస్త పాపాలు దూదిపింజలా ఎగిరిపోతాయి. జగత్తును ప్రకాశింపచేసే పరమాత్మా! నీ దర్శనభాగ్యం చేత భక్తులకు ఇహలోక సుఖాలు, పరలోక సుఖాలూ లభిస్తాయి గదా!

మ. భవదీయోజ్జ్వలకీర్తి దిగ్వితతులన్ భాసిల్లు యుష్మత్పదో
ద్భవ నైర్మల్యజలంబు లుత్కలికఁ బాతాళంబునం బాఱు భో
గవతీ నామమునం దనర్చి ధరణిం గంగానదీపూరమై
దివి మందాకినియై జగత్త్రయమునం దీపించుఁ గాదే? హరీ!

663

తా ॥ నీ యొక్క దేదీప్యమానమైన కీర్తి సమస్త దిక్కులలోను ప్రకాశిస్తోంది. పవిత్రమైన నీ పాదపద్మాల నుండి ప్రభవించిన నిర్మల జలాలు పెద్దపెద్ద అలలతో పాతాళలోకంలో 'భోగవతి' అనే పేరుతో, భూలోకంలో 'గంగా' నదిగా, స్వర్గలోకంలో 'మందాకినీ' నామంతో ప్రవహించి మూడు లోకాలను పవిత్రం చేస్తూ ఖ్యాతి వహించాయి.

క. ఆ మఖవేళ సమస్త ధ, రామండలిఁ గల్గు మేటిరాజులు మౌని
స్తోమంబును భవదీయ మ, హామహిమముఁ జూచి సత్కృతార్థతఁ బొందన్.

664

తా ॥ ధర్మరాజు చేసే రాజసూయ యాగ వేళలో ధరణీ మండలంలోని గొప్పగొప్పరాజులు, మహర్షి బృందం, నీ మహామహిమను చూసి పుణ్యులౌతారు. వారు యాగానికి వచ్చినందుకు సఫలీకృతులై సంతోషమనస్కులౌతారు."

క. కల' రని చెప్పిన న మ్మ్మని, పలుకులకు ముదంబు నొంది పంకజనాభుం
డెలనవ్వు మొగమునకుఁ జెలు, వొలయఁగఁ బాటించి యుద్ధవున కిట్లనియెన్.

665

తా ॥ అని నారదుడు చెప్పిన మాటలకు పద్మనాభుడు సంతోషించి, చిరునవ్వులు చిందిస్తూ ఉద్ధవుడివైపు చూసి ఇలా అన్నాడు.

## శ్రీకృష్ణుడు ఉద్ధవుని ఆలోచనలను అంగీకరించుట

క. ‘ఉద్ధవ! మహిత వివేక స, మిద్ధవచోవిభవ! కార్య మేగతి నడచున్
వృద్ధవరానుమతంబుగ, బోద్ధవ్యము గాఁగఁ జెప్పు పురుషనిధానా!

666

తా ॥ “వివేకవంతా! ఉద్ధవా! వాక్నైపుణ్యం నీ సొంత సొత్తు. పురుషశ్రేష్ఠుడవు. ఇప్పుడు, ఈ విషయంలో యాదవ పెద్దలందరూ అంగీకరించే విధంగా మనం ఏ విధంగా నడచుకొంటే బాగుంటుందో చెప్పు. ప్రస్తుత కర్తవ్య బోధకు నీవే తగినవాడివి.

తే. అనఘచారిత్ర ! నీవు మా యక్షియుగము, వంటివాఁడవు మనకు నవశ్య మగుచుఁ
జేయఁ దగినట్టి కార్యంబుఁ జెప్పు నీవు, ఏమి పంచినఁ గావింతు నిద్ధచరిత!’

667

తా ॥ పుణ్యాత్మా! ఉత్తమచరిత్రగల ఉద్ధవా! మాకు నీవు రెండు కళ్ళవంటివాడివి. మనం వెంటనే తప్పనిసరిగా చేయవలసిన కార్యాన్ని బోధించు. నీవు ఏది ఆదేశిస్తే అదే ఆచరిస్తాను.”

వ. అని సర్వజ్ఞుండైన హరి యజ్ఞుండుపోలెఁ దన్ను నడిగినఁ బురుషోత్తముని భాషణంబులకు మనంబున సంతసిల్లి, యతని పాదంబులు దన మనంబున నిడికొని, ‘వృద్ధానుమతంబుగా నా యెఱింగిన తెఱంగు విన్నవించెద నవధరింపుము; దేవా! దేవముని చెప్పినట్లు భవదీయ భక్తుండైన యుధిష్ఠిరు యాగపాలనంబు సేయం గైకొనుట కార్యం; బదియునుం గాక నిఖిల దిగ్విజయ మూలంబగు రాజసూయ కృత్యంబునందు జరాసంధమర్ధనంబును, నతనిచే బద్ధులైన రాజులం గారాగృహ విముక్తులం గావించుటయుం జేకూరు; నదియునుం గాక నాగాయుత సత్త్వుండును, శతాక్షౌహిణీ బలాన్వితుండును నగు మాగధుని వధియింప మన ప్రభంజననందనుండు గాని

యొండొరులు సమర్థులుగా; రట్లగుట నతండు భూసురులేమి గోరిన, నయ్యర్థంబు వృథసేయక యిచ్చుం; గపట విప్రవేషంబునం జని యాజరాసంధుని నాహవభిక్ష వేఁడి, భవత్సన్నిధానంబున న ప్పవమానతనయుం డతని వధియించునట్టి కార్యంబు సేఁత బహుళార్థసాధనం బగు' నని పలికిన నారదుండును యాదవ జనంబులును సభ్యులునుం బొగడి; రంత.

668

తా ॥ అని శ్రీకృష్ణుడు సర్వం తెలిసినవాడైనా ఏమీ తెలియని వాడి వలె ఉద్ధవుణ్ణి కర్తవ్య బోధ చేయమని అడిగాడు. పురుషోత్తముడు తనతో పలికిన పలుకులకు ఉద్ధవుడు మనస్సులో ఎంతో సంతోషించి, శ్రీహరి పాదపద్మాలను తన మనస్సులో నిల్పుకొని "పెద్దలు చెప్పే విధంగా నాకు తెలిసినంత మేరకు విన్నవిస్తాను" అని శ్రీకృష్ణుడితో ఈ విధంగా చెప్పాడు: "దేవా! శ్రీకృష్ణా! దేవర్షి అయిన నారదమహర్షి చెప్పినట్లు నీ భక్తుడైన ధర్మరాజు యజ్ఞం చేయడానికి పూనుకోవటం ఎంతో హర్షించదగిన విషయం. అదీకాక, సమస్త విశ్వాన్ని జయించడానికి మూలకందమైన రాజసూయ యజ్ఞ నిర్వహణానికి జరాసంధుణ్ణి వధించటం, ఆ మగధరాజు చేత బంధింపబడిన రాజులను కారాగారం నుంచి విడిపించటం చేయవచ్చు. అంతే కాదు కృష్ణా! పదివేల ఏనుగులకున్నంత బలం గలవాడు, వంద అక్షౌహిణీల సైన్యం గలవాడు అయిన వీరాధివీరుడు మగధ దేశాధిపతి అయిన జరాసంధుడు. అంతటి వీరున్ని చంపడానికి మన భీమసేనుడు తప్ప వేరెవ్వరూ సమర్థులుగారు. అంతేకాక, జరాసంధుడు బ్రాహ్మణోత్తములు ఏది కోరితే అది వెంటనే ఇస్తాడు. ఏమాత్రం సంకోచించడు. అందుచేత నీవు భీమునితో కలిసి కపట విప్రవేషంలో జరాసంధుణ్ణి వద్దకు వెళ్ళి అతనిని యుద్ధభిక్ష వేడటం ఎంతో మంచిది. ధర్మరాజు చేయబోయే రాజసూయ యజ్ఞం నిర్విఘ్నంగా జరిగేటట్లు రక్షించ వలసిన బాధ్యత నీపైనే ఉంది. కాబట్టి దేవా! భీమసేనుడు జరాసంధుని నీ సన్నిధానంలో వధించే విధంగా చేస్తే సమస్త కార్యాలూ చక్కబడతాయి" అని ఉద్ధవుడు చెప్పగానే అక్కడ సమావేశమైన యాదవులు, నారదుడు అందరూ ఉద్ధవుని మాటలను ప్రశంసించారు.

సీ. తరల విచిత్రక స్థగిత ప్రభావలిఁ దనరారు గరుడకేతనము వెలుఁగఁ
గాంచన చక్ర సంఘటిత ఘంటా ఘణ ఘణ నినాదముల దిక్కరులు బెదర
సలలిత మేఘపుష్పక వలాహక శైబ్య సుగ్రీవ తురగవిస్ఫురణ దనర
బాలసూర్యప్రభా భాసమానద్యుతి దిగ్వితానం బెల్ల దీటుకొనఁగఁ

తే. బ్రకటరుచి నొప్పు తేరు దారకుఁడు దేర, నెక్కి వెడలెదు నపుడు పెంపెనయఁ జెలఁగె
శంఖ కాహళ పటహ నిస్సాణ డిండి, మాది రవములు భరితదిగంతములుగ.

669

తా ॥ ఉద్ధవుడి మాటలకు, నారదుడి వచనాలకు అంగీకరించిన శ్రీకృష్ణుడు రాజుల ప్రార్థనను మన్నించి ఇంద్రప్రస్థ నగరానికి బయలుదేరాడు. వజ్రాలతో పొదగబడి చిత్ర విచిత్ర కాంతులతో మెరిసిపోతున్న గరుడధ్వజం ప్రకాశిస్తుండగా, బంగారు చక్రాలకు కూర్చిన గంటలు చేస్తున్న ఘణఘణ ధ్వనులవల్ల దిక్కులు బెదరిపోతుండగా, అందమైన 'మేఘపుష్పకం, వలాహకం, శైబ్యం, సుగ్రీవం' అనే నాలుగు గుఱ్ఱాల విజృంభణ అతిశయిస్తుండగా, బాలసూర్యుని కిరణకాంతితో సమానమైన కాంతితో దిగంతాలు ప్రతిఫలిస్తుండగా, మహత్తరమైన తేజస్సుతో విరాజిల్లుతున్న రథాన్ని దారుకుడు తెచ్చాడు. శంఖకాహళ పటహాదిధ్వనులు దిక్కుల చివరల వరకూ వ్యాప్తిస్తుండగా, శుభసూచకమైన ఆ ముహూర్తంలో, కృష్ణుడు రథమెక్కి ప్రయాణమైనాడు.

క. మను జేశ్వరునకుఁ దాలాం, కునకును గురువృద్ధజనులకును జెప్పి ప్రియం
బున ననుపఁ గాంచన స్యం, దన సామజ వాజి భటకదంబము గొలువన్.

670

తా ॥ యాదవ నాథుడైన ఉగ్రసేనుడికి, అన్నగారైన బలరాముడికి, గురువులకు, వసుదేవాది జనకులకు వెళ్ళి వస్తానని చెప్పి, వారంతా అభిమానంతో, ఆదరంతో సాగనంపగా, రథగజ తురగభటాది చతురంగ బలాలు వెంటనంటి రాగా, బంగారు రథాన్ని అధిరోహించి

ముందుకు సాగాడు.

తే. వంది మాగధ సూత కైవారరవము, వసుమతీ సురకోటి దీవనల మ్రోఁత
లనుగమింపంగ సతులు సౌధాగ్రశిఖర, సీమలందుండి ముత్యాల సేస లొలుక.

671

తా ॥ వంది మాగధుల కైవారాలు చెలరేగుతున్నాయి. బ్రాహ్మణకోటి దీవెనలు మారుమ్రోగుతున్నాయి. పురకాంతలు సౌధాగ్రాల మీద నిలబడి ముత్యాల అక్షతలు మీద చల్లుతున్నారు. ఆ విధమైన మంగళప్రదమైన సన్నివేశంలో లీలావిలాసంగా శ్రీకృష్ణుడు ద్వారకను దాటాడు.

క. లీలం జని కృష్ణుఁడు వా, హ్యాలిన్ నవకుసుమ ఫలభరానత శాఖా
లోల ఘనసారసాల ర, సాల వనస్థలములందుఁ జతురత విడిసెన్.

672

తా ॥ అలా సాగిపోయి అప్పటికప్పుడు విచ్చుకుంటున్న పూలతో, పండ్లబరువుచేత వంగిన కొమ్మలతో, కర్పూరపరటి చెట్లతో, మద్దిచెట్లతో, మామిడి చెట్లతో చూడముచ్చటగా, మనోహరంగా ఉన్న ఉద్యానవనాలలో శ్రీకృష్ణుడు విహరించి, అక్కడే విడిది చేశాడు.

వ. అట్టి యెడ సరోజనాభు శుద్ధాంతంబున.

673

తా ॥ శ్రీకృష్ణుడు ఉద్యానవనంలో విడిదిచేసి ఉన్న సమయంలో ఆ కమలాక్షుని అంతఃపురంలో—

సీ. వికచమరంద నవీన సౌరభ లస న్మందార కుసుమదామములు దుఱిమి
వారు సుగంధ కస్తూరికా ఘనసార మిళిత చందనపంక మెలిమి నలఁది

కనక కుండల రణత్కంకణ నూపుర ముద్రికా భూషణంబులు ధరించి
యంచిత ముక్తాఫలాంచల మృదుల దివ్యాంబరమ్ములు సెలువారఁ గట్టి

తే. యర్ధచంద్రుని నెకసక్కె మాడునట్టి, యలికఫలకలఁ దిలకము లలరఁ దీర్చి
పెంపు దీపింప నుదురాజ బింబముఖులు, నవచతుర్విధ శృంగార మవధరించి.

674

తే. జలజలోచను కడకు నుత్కలికతోడఁ, దనరు శిబికల నెక్కి నందనులుఁ దాముఁ
గనఁగ నేతేరఁ బ్రతిహారజనులు వేత్ర, కలితులై పౌరులను నెడగలుగ జడియ.

675

తా ॥ క్రొత్త క్రొత్త వాసనలు వెదజల్లుతున్న మందారపూల మాలలు తలలో తుఱుముకొని, సుగంధభరితమైన కర్పూరంతో కలిపిన గంధాన్ని మైపూతగా అలదుకొని, బంగారు కుండలాలలను, గలగలలాడే కంకణాలను, ఘల్లుఘల్లుమనే కాలి అందెలను, ఉంగరాలను, హారములు మొదలైన అనేక ఆభరణాలు ధరించి, చీర అంచులలో ముత్యాలుకుట్టిన మెత్తని పట్టు చీరెలను కుచ్చెళ్ళు పోసి కట్టుకొని, అర్ధచంద్రుని వంటి నుదుటిపైన అందంగా తిలకం తీర్చిదిద్ది, వివిధాలైన అలంకారాలతో శృంగార నాయికలుగా చెలువొందిన చంద్రముఖులు, కృష్ణుని సతీమణులు, మహోత్సాహంతో, తమ కుమారులతో సహా బంగారు పల్లకీలనెక్కి పతి చెంతకు విలాసంగా వచ్చారు. వారు శ్రీకృష్ణుడు విడిసిన ఉద్యానవనానికి తరలివస్తుండగా ఆ దృశ్యాన్ని చూడటానికి క్రిక్కిరిసి వచ్చిన పౌరజనులను భటులు తమ చేతిబెత్తములతో ప్రక్కకు జరిపారు.

క. అసమాస్త్రుఁడు పులు గడిగిన, కుసుమాస్త్రములను హసించు కోమలతనువుల్
మిసమిస మెఱవఁగ వేశ్యా, విసరము దాసీజనంబు విభవ మెలర్పన్.

676

తా ॥ మన్మథుని పూల బాణాలను పరిహసించే మృదువైన శరీరశోభతో

మిసమిసలాడుతున్న వేశ్యాగణం, దాసీజనాలు ఎంతో వైభవంతో అలంకరించుకొని అంతఃపురకాంతల వెంట బయలుదేరారు.

ఆ. హరుల వేసడములఁ గరులను నెక్కి తో, నరుగుదేర బహువిధాయుధములు దాల్చి
సుభటకోటి దగిలి రా నంతఃపు, రాంగనలు సితాంబుజాక్షు కడకు.

677

తా ॥ నర్తకీమణులు, దాసీ గణాలు గుఱ్ఱాలను, ఏనుగులను ఎక్కిరాగా, భటులు వివిధాయుధాలు ధరించి ముందు నడుస్తుండగా అంతఃపుర కాంతలందరూ కృష్ణుడి దగ్గరకు వచ్చారు.

వ. వచ్చి రంత.

678

తా ॥ కృష్ణుని కాంతలందరూ పతిచెంతకు రాగానే—

క. నారదుని, మాధవుఁడు స, త్కారంబున వీడుకొలుప నతఁడును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును, వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్.

679

తా ॥ వారిని చూసిన శ్రీకృష్ణుడు నారదమహర్షిని గౌరవమర్యాదలతో సత్కరించి సాగనంపాడు. నారదుడు శ్రీకృష్ణుని సత్కారానికి సంతోషించి, మనస్సులోనే శ్రీకృష్ణునికి పదేపదే నమస్కరిస్తూ స్వర్గలోకానికి వెళ్ళాడు.

క. నరవరుల దూతయును ముర, హరుచే నభయ ప్రదాన మంది ధరిత్రీ
వరుల కడకేగి పద్మో, దరు వచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్.

680

తా ॥ జరాసంధుని చెఱసాలలో ఉన్న రాజులు పంపిన దూతకు, వారిని నేను తప్పక కాపాడుతానని శ్రీకృష్ణుడు అభయమివ్వగానే, ఆ బ్రాహ్మణుడు మగధకు వెళ్ళి శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు ఆ రాజులకు చెప్పి వారిని సంతోషపరిచాడు.

వ. అంతఁ గృష్ణుండు నిజకాంతాతనయ బంధు సుహృజ్జన సమేతుండై కదలి చనునెడ.

681

తా ॥ ఆ తరువాత శ్రీకృష్ణుడు తన భార్యలతో, పుత్రులతో, బంధువులతో, మిత్రులతో కలసి ధర్మరాజు వద్దకు బయలుదేరాడు.

చ. కటపటరత్న కంబళ నికాయ కుటీరము లుల్లసిల్ల ను
త్కట పటుచామరధ్వజ పతాక కిరీట సితాతపత్ర వి
స్ఫుట ఘనహేతిదీధితి నభోమణిఁ గప్పఁగఁ దూర్యఘోషముల్
చటుల తిమింగి లోర్మిరవ సాగరఘోషము నాక్రమింపఁగన్.

682

తా ॥ మార్గమధ్యంలో అక్కడక్కడ దేరాలతో కూడిన కుటీరాలు ఏర్పడ్డాయి. వింజామరలు, జెండాలు, కిరీటాలు, తెల్లగొడుగులు ప్రభలను విరియజేసాయి. ఖడ్గాలు మొదలైన ఆయుధాల మహోజ్జ్వల కాంతులు సూర్యబింబాన్ని కప్పివేస్తున్నాయి. విజయ సూచక మంగళవాయిద్యాల ధ్వనులు, తిమింగిలాల చలనశబ్దాలతో ఎగిసి పడే అలల సవ్వడులతో ఘోషించే సముద్రఘోషను అతిక్రమించాయి.

క. కరిహరిరథసుభట సము, త్కరములు సేవింప మురవిదారుఁడు గడచెన్ సరి దుపవన దుర్గ సరో, వర జనపద పురపుళింద వన గోష్ఠములన్.

683

తా ॥ మురాసుర సంహారి అయిన శ్రీకృష్ణుడు చతురంగ బలాలు వెంటనంటి సేవిస్తుండగా నదులను దాటాడు. ఉద్యాన వనాలు దాటాడు. దుర్గాలు దాటాడు. సరస్సులు, పల్లెలు, నగరాలు, బోయపల్లెలు, అడవులు, గోశాలలు – అన్నీ ఒకదాని తరువాత ఒకటి దాటుకుంటూ వెళ్ళాడు.

వ. ఇట్లు గడచి చనుచు నానర్తక సౌవీర మరుదేశంబులు దాటి ఇందుమతిని దర్శించి, దృషద్వతి నుత్తరించి, సరస్వతీనది దాఁటి మత్స్యవిషయంబులు లోనుగాఁ గడచి యింద్రప్రస్థ నగరంబు డాయం జని, తత్పురోపకంఠవనంబున విడిసిన.

684

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుడు ప్రయాణం సాగిస్తూ ఆనర్తక, సౌవీర, మరుదేశాలు దాటి వెళ్ళాడు. తరువాత ఇందుమతీ నదిని దర్శించాడు. ఆ తరువాత "దృషద్వతి" నదిని దాటాడు. మరికొంచెం ముందుకుపోయి సరస్వతీ నదిని దాటాడు. మత్స్యదేశం మొదలైన కొన్ని దేశాలు దాటి ఇంద్రప్రస్థపురాన్ని చేరుకొన్నాడు. ఇంద్రప్రస్థ నగరానికి సమీపంలో ముందున్న ఉద్యానవనంలో బసచేశాడు.

## పాండవులు శ్రీకృష్ణణ్ణి స్వాగతించుట

క. హరిరాక యెఱిఁగి ధర్మజు, డఱలేని ముదంబుతోడ ననుజులు బంధుల్ గురుజన సచివ పురోహిత, పరిచారక కరి రథాశ్వ భటయుతుఁ డగుచున్.

685

తా ॥ శ్రీకృష్ణుడు విచ్చేశాడన్న వార్త ధర్మరాజుకు తెలిసింది. పరమానందభరితుడై తమ్ములతో, బంధుజనంతో, గురువులతో, మంత్రులతో, పురోహితులతో, పరిచారకులతో, కూడి చతురంగ బలాలు వెంటనడిచి వస్తుండగా కృష్ణణ్ణి ఎదుర్కొని స్వాగతం పలకడానికి ధర్మరాజు బయలుదేరాడు.

క. చిందములు మొరయ గాయక, బృందంబుల నుతులు సెవుల బెరయఁగ భక్తిన్ డెందము దగులఁగఁ బరమా, నందంబున హరి నెదుర్కొనం జనుదెంచెన్.

686

తా ॥ కొంతమంది శంఖాలు పూరిస్తుండగా, గాయక సమూహం స్తోత్రగీతాలు పాడుతుండగా, భక్తిభావంతో హృదయం ఉప్పొంగి పోతుండగా ధర్మరాజు శ్రీకృష్ణుడి దగ్గరకు వచ్చాడు.

వ. ఇట్లు చనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబు చేసి రోమాంచకంచుకిత శరీరుండై యానందబాష్పధారాసిక్త కపోలుండై నిర్భరానంద కందళిత హృదయుండై బాహ్యంబు మఱచియుండె; నప్పుడు హరిని వాయునందన వాసవతనూభవులు గౌఁగిటం జేర్చి సమ్మదంబు నొందిరి; మాద్రేయులు దండప్రణామంబు లాచరించి; రంతఁ బుండరీకాక్షుఁడు విప్రవృద్ధజనంబులకు నమస్కారంబు చేసి, వారలు గావించు వివిధార్చనలం బరితుష్టుండై కేకయ సృంజయాది

భూవిభుల మన్నించి సూత మాగధాదుల కనేక పదార్థంబు లొసంగి, చతురంగ బలసమేతుండై వివిధ మణితోరణాది విచిత్రాలంకృతంబు నతివైభవోతంబునైన పురంబు ప్రవేశించి రాజమార్గంబునం జనుచుండఁ బౌరకామిను లట్టి యెడ.

687

తా ॥ తన పురానికి, తనకు రక్షకుడిగా వచ్చిన శ్రీకృష్ణుణ్ణి ధర్మజుడు గాఢాలింగనం చేసుకొన్నాడు. శరీరమంతా పులకించిపోగా, ఆనంద బాష్పాలు జాలువారుతుండగా, పట్టరాని ఆనందంతో మైమరచి చాలాసేపు పరమాత్ముని కౌగిలిలోనే ఉండిపోయాడు. శ్రీకృష్ణుణ్ణి రాకతో ధర్మరాజుకు కృష్ణుడు తప్ప బాహ్యప్రపంచమేదీ కనబడలేదు. తరువాత భీమార్జునులు శ్రీకృష్ణుణ్ణి ఆలింగనం చేసుకొని అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందారు. నకుల సహదేవులు నమస్కరించారు. శ్రీకృష్ణుడు తన చెంతకువచ్చిన బ్రాహ్మణులకు, వృద్ధులకు నమస్కరించాడు. వాళ్ళందరూ చేసిన గౌరవసత్కార పూజలకు సంతుష్టి చెంది శ్రీకృష్ణుడు కేకయరాజు, సృంజయ నృపతి మొదలైన భూపతులను సమాదరించాడు. రథసారథులకు, వంది మాగధులకు అనేక కానుకలు ఇచ్చాడు. చతురంగ బలాలతో కూడి రకరకాల మణితోరణాలతో చక్కగా అలంకరింపబడి, అత్యంత వైభవంగా దర్శనమిస్తున్న ఇంద్రప్రస్థ పురంలోకి ప్రవేశించాడు. రాజమార్గంలో వెళుతున్న శ్రీకృష్ణుణ్ణి చూడటానికి పౌరకాంతలు గమిగూడారు.

సీ. కొఱనెలపైఁ దోచు నిరులునాఁ జెలువొంది నొసలి పైఁ గురులు తుంపెసలు గునియ
హాటకమణిమయ తాటంకరోచులు గండభాగంబుల గంతులిడఁగ
స్ఫురిత విద్రునిబాధ బింబరుచితోడ దరహాసచంద్రిక సరసమాడ
నొండొంటితో రాయు నుత్తంగ కుచకుంభములు మొగంబులకును బుటము లెగయ

తే. బడుగునడుములు వడఁకంగ నడుగు లిడఁగ, రవళిమెట్టెలు మణినూపురములు మొరయఁ
బొలుచు కచబంధములు భుజంబుల నటింపఁ, బయ్యెదలు వీడి యాడ సంభ్రమముతోడ.

688

తా ॥ కృష్ణణ్ణి చూడాలనే తత్తరపాటుతో ఇంద్రప్రస్థ పురంలోని స్త్రీలు—అర్ధచంద్రుని పైకి ప్రాకిన చీకట్లా అన్నట్లు ఫాలతలంపైన చెదరిన ముంగురులతో, మణులతో పొదిగిన బంగారు దుద్దులకాంతులు చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తుండగా, పగడాల వంటి పెదవుల అరుణకాంతులతో చిరునవ్వుల వెన్నెలలు కలిసి వింతసొబగును ఆపాదింపగా, ఉన్నతమైన స్తనాలసోయగంతో సన్నని నడుములు అల్లల్లాడుతుండగా, అడుగుతీసి అడుగు వేసేటప్పుడు కాలిమట్టెలు, అందెలు చిరుసవ్వడులు చేస్తుండగా, కొప్పుముడి వీడివెంట్రుకలు భుజాలమీద పడుతుండగా, పైటచెరగులు జారి ఊగుతుండగా సర్దుకుంటూ, గబగబా ఇళ్ళ పైభాగాలు చేరుకొన్నారు.

వ. ఇట్లు కృష్ణసందర్శన కుతూహల పరస్పరాహూయమానలై గురుపతి సుత బంధు జనంబులు వారింప నతిక్రమించి సమున్నత భర్మ హర్మ్య శిఖాగ్రంబు లెక్కి కృష్ణుం జూచి తమలో నిట్లనిరి.

689

తా ॥ ఈ విధంగా శ్రీకృష్ణుని చూడాలనే కుతూహలంతో, ఒకరినొకరు పిలుచుకొంటూ, భర్త, కొడుకులు, బంధువులు, ఇంటి పెద్దలు ఆపుతున్నా ఆగకుండా, చాలా ఎత్తుగా ఉన్న బంగారుమేడల పైభాగానికి ఎక్కి శ్రీకృష్ణుని చూసి ఆ పరమాత్ముని మహిమలు తమలో తాము ముచ్చటించుకొన్నారు.

సీ. విశ్వగర్భుండునా వెలయు వే ల్పిల యశోదానందులకుఁ బ్రియసూనుఁడయ్యె; బ్రహ్మాది సురులకు భావింపఁగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁ డయ్యె; వేదశాస్త్రంబులు వెదకి కానఁగలేని గట్టి వ్రేతల ఱోలఁ గట్టుపడియె; దివిజుల కమృతంబు దవిలి యిచ్చిన భక్త సులభుండు నవనీత చోరుఁడయ్యె

తే. నెనయఁ గమలాపతికిఁ జిత్తమీని వేల్పు, గొల్లయిల్లాండ్ర యుల్లముల్ పల్లవింపఁ

జేసె నని కామినులు సౌధశిఖరములను, గూడి తమలోన ముచ్చటలాడి రధిప!

690

వ. మఱియును.

691

తా ॥ "విశ్వమంతటినీ తన గర్భంలో నిలుపుకొన్న ఆదిదేవుడు ఈ రోజు యశోదానందులకు కుమారుడయ్యాడు గదా! బ్రహ్మదేవుడు మొదలైన దేవతలకే భావించశక్యంకాని పరబ్రహ్మ ఈనాడు గోపాలబాలుడయ్యాడు గదా! వేదాలు, శాస్త్రాలు ఎంతగా వెదకినా కనబడని మహానుభావుడు చివరకు గొల్లభామ చేత రోటికి కట్టివేయబడ్డాడు గదా! ఎంత ఆశ్చర్యమంటే దేవతలకు అమృతాన్ని పంచి ఇచ్చిన భక్తవత్సలుడు ఈ వేళ వెన్నదొంగగా ప్రసిద్ధుడైనాడు గదా! లక్ష్మీదేవికే తన మనస్సును పరిపూర్ణంగా ఇవ్వనటువంటి ఆ విష్ణువు గొల్లపడుచులకు అనురక్తుడై వారి హృదయాలను వికసింప చేశాడే! ఆ మహావిష్ణువే ఈ శ్రీకృష్ణుడు గదా" అని సౌధాగ్రాలపై చేరి తనివితీరా శ్రీకృష్ణుణ్ణి చూస్తూ పౌరకాంతలు ఇంకా ఇలా అనుకొన్నారు.

సీ. గోపాలబాలురఁ గూడి యాడెడి వాఁడు వ్రేపల్లె లోపల నేపు రేఁగి
చల్ల లమ్మగఁ బోయెడు సతుల కొంగులు బట్టి మెఱుఁగుఁ బెక్కిళ్ళను మీటి మీటి
కలికియై ముద్దాడిఁ గౌఁగిటఁ జేర్చిన పూఁబోఁణి కుచములు పుడికి పుడికి
పాయని యనురక్తి డాయఁ జీరిన యింతి యధరసుధారసం బాని యాని

తే. యురుసమాధిపరాష్టాంగ యోగయుక్తు, లైన యోగీశ్వరులు గాననట్టి జెట్టి
వల్లవీజన వన కల్పవల్లి యయ్యె, ననుచుఁ బొగడిరి కృష్ణు న య్యబ్జముఖులు.

692

తా ॥ కృష్ణుని లీలావిశేషాలు చెప్పుకొంటూ ఒక్కసారి యోగులను తలచుకొన్నారు ఆ

పౌరకాంతలు. "మహాసమాధి నిష్ఠలో ఉండే, అష్టాంగ యోగంలో పరమాత్మ ధ్యానంలో నిమగ్నులై ఉండే యోగీశ్వరులకు కూడా దర్శనమివ్వని ఆ దేవదేవుడు రేపల్లె భామలకు కల్పవృక్షమై వారు కోరిన కోరికలన్నీ ప్రియంగా తీర్చాడే! దానికి వారెంత పుణ్యం చేసుకొన్నారో కదా! ఎన్ని జన్మలనుంచీ ఆ భగవంతుణ్ణి కొల్చి ఉన్నారో కదా! గోపకాంతలకే కాక గోపాలురకు కూడా కృష్ణుడు ఆత్మీయుడే. రేపల్లెలో గోపబాలురతో కలిసి రకరకాల ఆటలు ఆడాడు. గొల్లభామలు చల్లలమ్మడానికి మధురకు పోతుంటే వారి కొంగులు పట్టిలాగి చెక్కిళ్ళమీద మీటాడట! కొందరిని ముద్దాడి కౌగిటిలో చేర్చుకొని వారికి ఆనందపారవశ్యం కలిగించేవాడట! ప్రేమతో 'కృష్ణా! రా!' అని పిలిచిన గోపకాంత అధరాన్ని పానం చేసి ఆమెను సంతోష సాగరంలో ముంచివేసేవాడు. భగవానుడైన శ్రీకృష్ణుడు శృంగార నాయకుడిగా గోపకాంతలను లాలించి పాలించి వారికి ముక్తినే ప్రసాదించి ఉంటాడు."

మ. అని యబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబులందుండి య
వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమభావం బందుఁ గీలించి సం
జనితానంద రసాబ్ధిమగ్న లగుచున్ సంప్రీతిఁ దద్భవ్య కీ
ర్తనలై చల్లిరి నవ్యలాజములు మందార ప్రసూనావలుల్.

693

తా ॥ ఈ విధంగా ఇంద్రప్రస్థపుర సుందరీమణులందరూ తమతమ మేడలపై నిలబడి శ్రీకృష్ణుని దివ్యమూర్తిని తమ మనస్సులలో నిలుపుకొని ఆనందంతో మైమరచి కృష్ణ లీలలను గీతాలుగా పాడుతూ ఆయనపైన క్రొత్త లాజలు, మందార పుష్పాలు గౌరవసూచకంగా చల్లారు.

వ. తదనంతరంబ శోభనపదార్థంబులు కొనివచ్చి ధరామర ధరావర వణి క్పుంగవులు దామోదరునకు కానుక లిచ్చిరి. పుణ్యాంగనా జనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూర నీరాజనంబులు నివాళింప నంతఃపురంబు సొత్తెంచె; నంతం గుంతిభోజ నందనయుం గృష్ణునిం గని పర్యంకంబు డిగ్గి కౌఁగిలింప నా యదువల్లభుఁడు మేనత్తకుం బ్రణామం

బాచరించెఁ; బాంచాలియు ముకుందునకు నభివందనం బొనరించి కుంతిపంపున గోవిందు భామినులగు రుక్మిణి మొదలగువారికి గంధాక్షత కుసుమ తాంబూలంబు లిడి లలిత దుకూల మణిభూషణంబులం బూజించె; యుధిష్ఠిరుండును గమల నయనుని వధూజనుల ననుగత బంధు మిత్ర పుత్ర సచివ పురోహిత పరిచారక సముదయంబుల నుచితంబులగు స్థలంబుల విడియింప నియమించి దినదినంబును నభినవంబులగు వివిధోపచారంబులు గావించుచుండె.

694

తా ॥ బ్రాహ్మణులు కృష్ణుడి దగ్గరకు వచ్చి మంగళద్రవ్యాలను కానుకలుగా సమర్పించారు. రాజులు, వ్యాపారవేత్తలు వచ్చి అనేక బహుమానాలిచ్చారు. బంగారు పళ్ళాలలో కర్పూరం పెట్టి ముత్తైదువలు కృష్ణునికి హారతులిస్తుండగా, పాండవులు అనుసరించి వస్తుండగా, శ్రీకృష్ణుడు అంతఃపురంలోకి ప్రవేశించాడు. కుంతీదేవి కృష్ణుణ్ణి చూడగానే పాన్పుదిగి వచ్చి కౌగిలించుకొని ఆనందబాష్పాలు రాల్చింది. శ్రీకృష్ణుడు మేనత్తకు నమస్కరించాడు. ద్రౌపదీదేవి కృష్ణునికి నమస్కరించి, అత్తగారి ఆనతితో రుక్మిణి మొదలైన శ్రీకృష్ణుని దేవేరులకు గంధాక్షతలు, పూలు, తాంబూలం ఇచ్చి, పట్టువస్త్రాలతో మణిభూషణాలతో సత్కరించింది. ధర్మరాజు, శ్రీకృష్ణునితో వచ్చిన వారందరినీ సముచితంగా గౌరవించి, వారందరికీ వారి వారి స్థాయిని బట్టి విడుదులు ఏర్పాటు చేసి ప్రతిరోజూ క్రొత్తక్రొత్తవైన పదార్థాలు, వస్తువులు అందిస్తూ సకల మర్యాదలూ చేశాడు.

క. హరియు యుధిష్ఠిరు సముచిత, పరిచర్యల కాత్మ నలరి పార్థుఁడు దానున్ సరస విహారక్రియలను, సురుచిరగతిఁ గొన్ని నెలలు సుఖముండె నృపా!

695

తా ॥ ధర్మరాజు చూపించిన గౌరవానికి, చేసిన సపర్యలకు శ్రీకృష్ణుడు చాలా ఆనందపడ్డాడు. అర్జునుడితో కలిసి విహరిస్తూ, రకరకాల సరససల్లాపాలు చేస్తూ

బంధుబలగంతో సహా ఇంద్రప్రస్థపురంలో కృష్ణుడు కొన్ని నెలలపాటు ఉన్నాడు.

వ. అంత

696

తా ॥ ఆ తరువాత–

## ధర్మరాజు శ్రీకృష్ణుని అనుమతితో భీమాదులను దిగ్విజయానికి పంపుట

సీ. ధరణీశ! యొకనాఁడు ధర్మతనూజుండు ప్రవిమల నిజసభాభవనమందు
హితులు మంత్రులు పురోహితులును సుతులును మిత్రులు బంధువుల్ క్షత్రవరులుఁ
బరిచారకులు సూత పాఠక కవి బుధ వరులును మునులును వరుసఁ గొలువఁ
జిరలీల నవరత్న సింహాసనస్థుఁడై గొలువుండి వినతుఁడై నలిననాభు

తే. భువనరక్షణదక్షు నద్భుతచరిత్రు, యదుకులేశ్వరు మురదైత్యమదవిభేది
నాప్తు నయవేదిఁ జతురుపాయప్రవీణుఁ, జూచి యిట్లని పలికె నస్తోకచరిత!

697

తా ॥ పరీక్షిన్మహారాజా! ధర్మరాజు ఒక రోజున నిండుకొలుపు తీర్చి సభా భవనంలో నవరత్న సింహాసనం మీద ఆసీనుడై ఉన్నాడు. ఆ సభలో హితులు, పురోహితులు, సుతులు, మిత్రులు, మంత్రులు, బంధువులు, సామంతరాజులు, సారథులు, స్తోత్రపాఠకులు, కవులు, పండితవరులు, మహర్షులు అందరూ ఉన్నారు. అప్పుడు లోకరక్షకుడు, అద్భుతమైన చరిత్రకలవాడు, యాదవనాథుడు, మురాసురుని మదాన్ని అణచివేసినవాడు, నీతిశాలి, సామదానభేదదండోపాయాలలో ప్రవీణుడైనవాడు, అన్నింటినీ మించి ఆప్తుడు అయిన శ్రీకృష్ణుని చూసి ధర్మరాజు ఇలా అన్నాడు:

తే. అనఘచారిత్ర! రాజసూయాధ్వరంబుఁ, నెమ్మిఁ గావించు వేడుక నెమ్మనమున
నెనయుచున్నది యది నిర్వహింప నీవ, కాక నా కాత్మబంధువుల్ గలరె యొరులు?

698

తా ॥ “ఓ పుణ్యచారిత్రా! యాదవేంద్రా! శ్రీకృష్ణా! నా మనస్సులో రాజసూయ యజ్ఞం చేయాలనే కోరిక ప్రగాఢంగా నాటుకుంది. ఆ మహాయజ్ఞాన్ని నిర్వహించడానికి నీవు కాకపోతే

నాకు ఆత్మబంధువులు ఇంకెవరున్నారు చెప్పు.

ఉ. ఎవ్వరు నీ పదాంబుజము లెప్పుడుఁ గొల్తురు భక్తి నిష్ఠలై
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలురై
య వ్విమలాత్ము లందు రుదంచితశోభన నిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ! నిను నేర్చి భజించిన రిత్తవోవునే!

699

తా ॥ ఎవరైతే నీ పాదపద్మాలను ఎప్పుడూ భక్తితో కొలుస్తుంటారో, ఎవరైతే వివేకవంతులై ఎప్పుడూ నిన్ను ప్రేమతో స్తుతిస్తుంటారో ఆ నిర్మలాత్ములందరూ శుభాలతో కూడిన సకల సౌఖ్యాలను నిత్యం అనుభవిస్తారు. కృష్ణా! నిన్ను తెలుసుకొని, భక్తితో పూజిస్తే అది వృథా అవుతుందా? ఎన్నటికీ కాదు."

వ. అనినఁ గృష్ణుండు ధర్మనందనున కిట్లనియె

700

తా ॥ అని ధర్మరాజు పలుకగానే శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు:

చ. నయగుణశాలి! పాండునృపనందన! నీ తలఁ పొప్పు నీ క్రతు
క్రియ మునిదేవతాపితృ సుకృత్యమునై నిఖిలోగ్రశాత్రవ
క్షయమును బాంధవ ప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియున్
జయము నొసంగు దీనిఁ గురుసత్తమ! వేగ యుపక్రమింపుమా?

701

తా ॥ "పాండునందనా! నీవు నీతిమంతుడవు. నీ ఆలోచన చాలా చక్కగా ఉంది. రాజసూయయజ్ఞం చేయటమనేది మునులను, దేవతలను, పితృదేవతలను తృప్తి పరిచే

సత్కార్యం వంటిది. సమస్త శత్రునాశనానికి ఇది కారణమౌతుంది. బంధుజనాలు సంతోషిస్తారు. పుణ్యప్రదం, శాశ్వతకీర్తిని ప్రసాదిస్తుంది. విజయాన్ని లభింపచేస్తుంది. కాబట్టి ఓ కురువంశోత్తమా! ఈ యజ్ఞాన్ని త్వరగా ప్రారంభించు.

క. మనుచరిత! నీ సహోదరు, లనుపమ దివ్యాస్త్రవేదు లాహనభూమిం
జెనకిన వై రినృపాలురఁ, దునుమఁగఁ జాలుదురు శౌర్యదుర్దమ భంగిన్.

702

తా ॥ ఉత్తమ చరిత్రగల ధర్మనందనా! ఒకమాట విను. నీ సోదరులున్నారే, నలుగురూ కూడా సాటిలేని దివ్యాస్త్రాల పరిజ్ఞానం అనంతంగా ఉన్నవారు. యుద్ధభూమిలో తమకు తారసపడ్డ శత్రువీరులను అఖండ శౌర్యసంపదతో సంహరించగల వీరాధివీరులు.

క. గెలువుము విమతనృపాలుర, వెలయుము బుధవినుతమైన విశ్రుతకీర్తిన్ నిలుపుము నిఖిలధరా మం, డలిని భవచ్ఛాసనము దృఢంబుగఁ జెల్లన్.

703

తా ॥ ధర్మరాజా! శత్రురాజులపై విజయం సాధించు. కవిపండితులచేత స్తుతింపబడే ఘనకీర్తిని సంపాదించు. అప్రతిహతమైన నీ శాసనం క్రింద సమస్త భూచక్రాన్ని నిలిపి ఉంచు.

క. నీ పంచుకార్య మొరులం, జూపక యేఁ జేయ నిన్ను జుట్టన వ్రేలం
జూపఁగ వచ్చునె! సకల ధ, రాపతులకు నీకుఁ జేయరానిది గలదే!.

704

తా ॥ కుంతీపుత్రా! ధర్మనందనా! నీవు ఆజ్ఞాపించిన కార్యం ఏదైనా సరే, ఇతరులకు చేయమని చెప్పకుండా, నేనే చేస్తాను. నేనే నీ ఆజ్ఞను పాటిస్తుంటే, వేరెవ్వరైనా వేలెత్తి నీలో లోపం ఎంచగలరా? రాజులందరూ నీ ఆజ్ఞలో నడవవలసిందే! నిన్ను ధిక్కరించి నిలవగలరా? నీవు

చేయలేని పని అంటూ ఏదీ లేదు.

వ. కావున.

705

తా ॥ కాబట్టి ధర్మరాజా!

క. విమలమతి నిట్టి మఖ రా, జమునకుఁ దెప్పింపవలయు సంభారంబుల్ సమకూర్పుము; నీ యనుజుల, సమదగతిం బంపు నిఖిలశత్రుల గెల్వన్.

706

తా ॥ రాజసూయయజ్ఞం చాలా గొప్ప యజ్ఞం. ఈ యజ్ఞం చేయడానికి కావలసిన వస్తుసామగ్రి నంతటినీ తెప్పించు. సమస్త శత్రువులను గెలిచిరావడానికి మహాశూరులైన నీ తమ్ములను పంపించు."

క. అను మాటలు విని కుంతీ, తనయుఁడు మోదమునఁ బొంగి తామరసాక్షున్ వినుతించి శౌర్యకలితుల, ననుజుల దెసఁ జూచి పలికె హర్షముతోడన్.

707

తా ॥ అని శ్రీకృష్ణుడు చెప్పగానే, ఆ మాటలు విన్న ధర్మరాజు ఎంతో సంతోషంతో పొంగిపోయాడు. శ్రీకృష్ణుణ్ణి ఎన్నో విధాలుగా స్తుతించాడు. వీరాధివీరులైన తమ్ములవైపు చూసి ఇలా అన్నాడు:

క. సృంజయభూపాలకులును, గుంజర రథ వాజి సుభటకోటులు నినుఁ గొ
ల్వం జను మని సహదేవుని, నంజక పొమ్మనియె దక్షిణాశ జయింపన్.

708

తా ॥ "పిన్నతమ్ముడైన సహదేవుణ్ణి చూసి "సహదేవా! చతురంగ బలాలను నీ వెంట తీసుకువెళ్ళు. సృంజయ భూపాలురు కూడా నీతోనే వస్తారు. సంకోచించకుండా దక్షిణ దిక్కువైపువెళ్ళు. ఆ దిశలో ఉన్న రాజులనందరినీ జయించి వారిని మనకు సామంతుల్ని చేసి రా" అని చెప్పాడు.

క. ప్రకటచతుర్విధ సేనా, ప్రకరంబులు గొలువఁ బంచెఁ బడమటిదిశకున్ నకులున్ విదళిత
రిపు భూ, ప కులున్ శౌర్యంబు మెఱసి పార్థివముఖ్యా!

709

తా ॥ ధర్మరాజు, శత్రువీరులను మట్టిగరిపించగల నకులున్ని, చతురంగబలాలు ఇచ్చి పడమటి దిశలోగల రాజులందరినీ జయించి రమ్మని పంపాడు.

క. దుర్జనభంజను శౌర్యో, పార్జితవిజయప్రకాండు నాహవనిపుణు
న్నర్జునమహితయశోనిధి, నర్జును నుత్తరపు దిశకు ననిపె నరేంద్రా!

710

తా ॥ దుష్టులను వధించేవాడు, నిజశౌర్యసంపదతో సర్వవేళలా విజయం సాధించేవాడు, యుద్ధవిద్యలో ఆరితేరినవాడు, కీర్తిమంతుడు అయిన అర్జునున్ని ఉత్తరదిశలో ఉన్న రాజులను గెలిచి రమ్మని ఆనతిచ్చాడు.

ఆ. మహితశౌర్యనిధులు మత్స్యకేకయ మద్ర, భూతలేంద్ర బలసమేతముగను
దర్పమొప్ప బంచెఁ దూర్పుదిక్కునకు ను, ద్దామనిహిత వైరిధాము భీము.

711

తా ॥ మహావీరులైన మత్స్యదేశపురాజు, కేకయ భూపతి, మద్ర నరేంద్రుడు తమతమ సైన్యాలు తీసుకొని భీమునికి తోడు రావాలని ఆ యా రాజులను ఆదేశించాడు. భీకరశత్రువులను

సంహరించే మహాబలశాలి అయిన భీమసేనున్ని తూర్పుదిక్కులో ఉన్న రాజులందరినీ జయించి రమ్మన్ని ఆజ్ఞాపించాడు.

ఛ. పనిచిన వారలేగి ఘనబాహుపరాక్రమ విక్రమంబుల
న్ననుపమశౌర్యులైన చతురంతమహీశుల నోర్చి కప్పముల్
కనక వినూత్న రత్న తురగ ప్రముఖాఖీలవస్తు జాతముల్
గొని చనుదెంచి ధర్మజునకుం బ్రణమిల్లి యుదాత్త చిత్తులై.,

712

తా ॥ ఆ విధంగా ధర్మరాజు ఆజ్ఞాపించగా నలుగురు తమ్ములు నాలుగు దిక్కులకూ వెళ్ళి సముద్రపర్యంతం ఉన్న వీరాధి వీరులైన రాజులనందరినీ జయించి, వారినుంచి వివిధములైన "కప్పాలు" స్వీకరించి ఇంద్రప్రస్థానికి తిరిగివచ్చారు. బంగారు వస్తువులు, నూతన రత్నమాణిక్యాలు, గజతురగాలు మొదలైన ప్రముఖ వస్తువులనన్నిటినీ కప్పాలుగా తెచ్చి భీమాదులు ధర్మరాజుకిచ్చి ఆ మహారాజుకు నమస్కరించి జరిగిన విషయాలు విన్నవించారు.

ఛ. తమతమ పోయి వచ్చిన విధంబుల భూపతులన్ జయించుటల్
క్రమముగఁ జెప్ప నందుల జరాతనయుం డరివెట్టఁ డయ్యె నం
చమరవరేణ్య నందనుఁ డహంకృతి దక్కఁగ విన్నవించినన్
యమసుతుఁ డూరకుండె వికళాత్మకుఁడై విని యంత గృష్ణుఁడున్.

713

తా ॥ తాము ఏఏ దేశాలమీదకు యుద్ధానికి వెళ్ళారో, ఆ యా రాజులను ఏ విధంగా జయించారో క్రమం తప్పకుండా వివరించారు ధర్మరాజుకు. వెంటనే అర్జునుడందుకొని "మహారాజా! మగధదేశాధిపతి అయిన జరాసంధుడొక్కడే కప్పం కట్టలేదు. మిగిలిన రాజులందరూ నీ అధికారాన్ని ఆమోదించి కప్పం కట్టారు." అని కొంచెం దిగులుతో కూడిన

ముఖంతో చెప్పాడు. ఆ మాటలు విన్న ధర్మరాజు మనస్సులో కలత చెందాడు.

తే. ధర్మనందనుఁ జూచి యుత్కలికతోడఁ, బలికె మాగధుఁ బోరఁ జంపఁగ నుపాయ
మొకటి గల దది దెలిపెద నుద్ధవుండు, నాకుఁ జెప్పిన చందంబు నయచరిత్ర!

714

తా ॥ అప్పుడు కృష్ణుడు ధర్మరాజును చూసి “ఓ నీతిమంతా! జరాసంధున్ని యుద్ధంలో చంపడానికి ఒక ఉపాయం ఉంది. ఆ ఉపాయాన్ని నాకు ఉద్ధవుడు చెప్పాడు. అదేమంటే చెబుతాను విను.

చ. విను మగధేశ్వరుం డెపుడు విప్రజనావళియందు భక్తియున్
వినయముఁ గల్గి యెద్దియును వేఁడినచో వృథసేయ కిచ్చుఁ గా
వున విజయుండునుం బవనపుత్రుఁడు నేనును బ్రాహ్మణాకృతిం
జని రణభిక్ష వేఁడిన వశంవదుఁడై యతఁడిచ్చుఁ గోరికల్.

715

తా ॥ జరాసంధుడికి జ్ఞానసంపన్నులైన బ్రాహ్మణులంటే చాలా భక్తి. వారిపట్ల వినయవిధేయతలతో వారు కోరాలేగాని, ఏది కోరితే అది కాదనకుండా వెంటనే ఇస్తాడట! ఆ కారణంవల్ల నేను, భీముడు, అర్జునుడు ముగ్గురం బ్రాహ్మణవేషాలతో ఆ మగధరాజు దగ్గరకు వెళ్ళి ‘యుద్ధభిక్ష’ ప్రసాదించమని వేడుకొంటాం. సరేనా? మా కోరిక మన్నించి జరాసంధుడు యుద్ధానికి వస్తాడు.

వ. అట్టియెడ.

716

తా ॥ ఆ సమయంలో—

## శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధింపబోవుట

తే. తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ, బిలుకుమార్పింప వచ్చును భీముచేత!' ననిన
ధర్మజుఁ 'డదిలెస్స' యనిన విప్ర, వేషములు దాల్చి యరిగిరి విశదయశులు.

717

తా ॥ భీముడు జరాసంధుడితో మల్లయుద్ధం చేస్తాడు. ఆ మల్లయుద్ధంలో జరాసంధుడు మరణించటం ఖాయం." అని కృష్ణుడు చెప్పగానే ధర్మరాజు 'ఇది చాలా బాగుంది' అని తన అంగీకారాన్ని తెలియజేశాడు.

వ. ఇట్లు కృష్ణభీమార్జునులు బ్రాహ్మణ వేషంబులు దాల్చి త్రేతాగ్నులుం బోలెఁ దమ శరీరతేజో విశేషంబులు వెలుంగ, నతిత్వరితగతిం జని గిరివ్రజంబు సొచ్చి యందు యతిథిపూజలు శ్రద్ధాగరిష్ఠ చిత్తుండై కావించుచున్న జరాసంధునిం గనుంగొని యిట్లనిరి.

718

తా ॥ అప్పుడు శ్రీకృష్ణ భీమార్జునులు బ్రాహ్మణుల వేషాలు ధరించి ముగ్గురూ మూడగ్నులులాగా (ఆ హవనీయాగ్ని, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని) తమ శరీర తేజస్సులతో వెలిగిపోతూ జరాసంధుని రాజధాని అయిన గిరివ్రజ పురంలోకి ప్రవేశించారు. వారిని చూసిన జరాసంధుడు భక్తిశ్రద్ధలతో వారికి అతిథిపూజలు చేసి వినయవంతుడై నిలబడ్డాడు.

క. 'ధరణీశ! యతిథిపూజా, పరుఁడవు నీ వనుచు దిశలఁ బలుకఁగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత, మఱ సేయక యిమ్ము సువ్రతాచారనిధీ!

719

తా ॥ అప్పుడు శ్రీకృష్ణాదులు "జరాసంధ మహారాజా! నీవు అతిథి సేవాతత్పరుడవని అందరూ అంటుంటే విని నీ దగ్గరకు వచ్చాము. నీ దాతృత్వ కీర్తి దశదిశలా వ్యాపించింది. నీవు

సదాచార పరాయణుడవు. మా కోరిక తప్పక తీర్చి, మమ్మల్ని తృప్తి పరచు.

క. అతిథిజనంబుల భక్తిన్, సతతముఁ బూజించి యుచితసత్కారము లు
న్నతి నడపు సజ్జనులు శా, శ్వతకీర్తులు ధరణిఁ బడయఁజాలుదు రనఘా!

720

తా ॥ పుణ్యాత్మా! భక్తితో గనుక అతిథులను నిత్యం పూజించి, తగిన సత్కారాలు మహోన్నతంగా నడిపే సజ్జనులకు శాశ్వతమైన సత్కీర్తి లభిస్తుంది.

క. పరికింపఁగ దేహం బ, స్థిర మని నిజబుద్ధిఁ దలఁచి చిరతరకీర్తి
స్ఫురణం బ్రస్తుతి కెక్కని, పురుషుఁడు జీవన్మృతుండు భూరివివేకా!

721

తా ॥ ఈ దేహం శాశ్వతం కాదని తెలుసుకొని శాశ్వతమైన సత్కీర్తిని పొందలేని మానవుడు బ్రతికి ఉన్నా, చచ్చినవాడితో సమానమౌతాడు.

క. ధారుణిలోన వదాన్యుల, కీ రాని పదార్థ మొక్కటేనిం గలదే
కోరినఁ దన మేనెముకలు, ధీరుండై యిచ్చె నని దధీచిని వినమే?

722

తా ॥ వివేకశాలీ! యాచకులు వచ్చి అడిగితే, దాతకు ఇవ్వలేని పదార్థమంటూ ఉండదు. ఏది అడిగినా ఇవ్వడమే దాత లక్షణం గదా! దధీచి మహర్షి తన శరీరంలోని ఎముకలివ్వమని కోరినా కూడా ఏమాత్రం సంశయించకుండా, వెనుకాడకుండా ఇచ్చాడని మనం వినలేదా?

క. అడిగిన వృథసేయక తన, యొడ లాఁకలిగొన్న యెఱుకు కోగిరముగ నే
ర్పడ నిచ్చి కీర్తిఁ గనె నని, పుడమిన్ మును వినమె యల కపోతము ననఘా!

723

తా ॥ పుణ్యాత్మా! ఆకలితో వచ్చి దానమడిగిన ఎరుకులవానికి ఒక్క క్షణమైనా ఆలస్యం చేయకుండా తన శరీరాన్ని వానికి ఆహారంగా సమర్పించిన పావురం ఎంత గొప్ప కీర్తిని పొందిందో వినలేదా?

క. ఆ యింద్రాగ్నులు శ్యేనక, వాయస రూపములఁ దన్ను వలఁతిగ వేఁడన్
ధీయుతుఁడై మును శిబి తన, కాయము గోసిచ్చె నన జగంబుల వినమే!

724

తా ॥ మహానుభావా! మరో విషయం. ఇంద్రుడు, అగ్నిదేవుడు డేగగా, కాకిగా రూపాలు ధరించి శిబి చక్రవర్తిని పరీక్షించడానికి వచ్చి ఆహారమివ్వమని కోరగా మహాదాత అయిన శిబి తన శరీరాన్ని స్వయంగా కోసి ఇచ్చాడు గదా! గుర్తులేదా? దాతలు ఎప్పుడూ ధైర్యంగానే ఉంటారు.

ఆ. ధీరమతులు రంతిదేవ హరిశ్చంద్ర, బలులు నుంఛవృత్తి బ్రాహ్మణునిని మున్ను సెప్ప వినమె? సన్నుతచరితులు, సన్న నైన నేఁడు నున్నవారు.

725

తా ॥ పొగడదగిన ప్రవర్తనగల, ధైర్యస్థులైన దాతలు ఇంకా చాలామంది ఉన్నారు. రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బలిచక్రవర్తి, పొలాల దగ్గర పడిఉండే ధాన్యపు గింజలు ఏరుకొని జీవితాన్ని గడిపే ఉంఛవృత్తిలో జీవించిన బ్రాహ్మణుల దానగుణం గురించి పూర్వీకులు చెప్పగా వినలేదా? ఆ బ్రాహ్మణుడే సక్తుప్రస్థుడు. వారి మాట నిలకడ, దాననిరతి వారికి అంత కీర్తిప్రతిష్ఠలు తెచ్చి పెట్టాయి. ఆ మహాదాతలు మృతజీవులు."

వ. అనిన విని జరాసంధుండు వారల రూపంబులును, మేఘ గంభీర భాషణంబులును, గుణకిణాంకంబులును మహాప్రభావంబులును జూచి తన మనంబున 'వీరలు బ్రాహ్మణ వేషధారులైన రాజేంద్రులు గానోపుదు; రని తలంచి 'యిమ్మహాత్ములు గోరిన పదార్థంబ

కాదు; ప్రాణంబు లేనియు నిత్తు; నదియునుం గాక తొల్లి బలీంద్రుండు విప్రవ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మ పదభ్రష్టత్వం బెఱింగియు విచారింపక జగత్త్రయంబు నిచ్చి కీర్తిపరుండయ్యె; క్షత్రబంధుం డనువాఁడు బ్రాహ్మణార్థంబు నిజప్రాణపరిత్యాగంబు సేసి నిర్మలంబగు యశంబు వడసె; నది గావున ననిత్యంబైన కాయంబు విచారణీయంబు గాదు; కీర్తి వడయుట లెస్స' యని తలంచి యుదారుండై కృష్ణార్జునభీములం గని యిట్లనియె.

726

తా ॥ అని కృష్ణాదులు చెప్పగా విని వారిని ఆశ్చర్యంగా చూశాడు జరాసంధుడు. వారి రూపురేఖలు, మేఘ గంభీరమైన వాక్కులు, భుజాలమీద కనిపిస్తున్న వీర చిహ్నాలు, ముఖాలలో కనిపిస్తున్న ధీరలక్షణాలు చూసి వీళ్ళు బ్రాహ్మణులు కారు. బ్రాహ్మణ వేషంలో వచ్చిన రాజులై ఉంటారు. ఈ మహాత్ములు కోరితే కోరిన వస్తువేకాదు, నా ప్రాణాలనైనా ఇచ్చి తీరుతాను. పూర్వం విష్ణుమూర్తి వటురూపంలో వచ్చి బలిని దానమడిగినప్పుడు తన రాజపదవి భ్రష్టమౌతుందని తెలిసికూడా, ఏమాత్రం ఆలోచించకుండా వామనుడికి ముల్లోకాలను దానమిచ్చి బలి అఖండకీర్తిని పొందాడు. 'క్షత్ర బంధు' డనే వాడు బ్రాహ్మణులకోసం తన ప్రాణాలను పరిత్యజించి నిర్మలమైన కీర్తి నార్జించాడు. అశాశ్వతమైన శరీరం కోసం చింతించకూడదు. కీర్తి పొందడమే లక్ష్యంగా పెట్టుకోవాలి" అని నిశ్చయించి, ఉదారగుణంతో, కృష్ణభీమార్జునులను చూసి జరాసంధుడిలా అన్నాడు:

క. "భూరిగుణులార! మీ మది, కోరిక యెఱిఁగింపుఁ డేమి కోరిన నైనన్ ధీరత నొసఁగుటయే కా, దారయ నా శిరము ద్రుంచి యైనను నిత్తున్.

727

తా ॥ "ఉత్తమగుణసంపన్నులారా! మీ మనస్సులో ఏ కోరిక ఉందో చెప్పండి. మీరేది కోరినా ఇస్తాను. చివరకు నా తల నరికి అయినా ఇస్తాను. నా ధైర్యాన్ని పరీక్షిస్తారా? అక్కరలేదు.

నేను ధీరశౌర్య దాన గుణ సంపన్నుణ్ణి".

ఉ. నావుడుఁ గృష్ణుఁ డమ్మగధనాథున కిట్లను 'భూవరేణ్య! నీ
భావము సూనృతవ్రతశుభస్థితిఁ జెందు టెఱుంగవచ్చె మా
కీవలె నాజిభిక్ష! యితఁడింద్ర తనూభవుఁ డే నుపేంద్రుఁడం
బావని యీతఁ' డిం దొకనిఁ బైకొని యెక్కటి పోరఁగాఁ దగున్

728

తా ॥ జరాసంధుడి మాటలతో శ్రీకృష్ణుడాతని వైపుకు తిరిగి "మహారాజా! నీవు సత్యసంధుడవన్న విషయం నీ మాటలవల్ల స్పష్టంగా తెలుస్తోంది. మాకు యుద్ధభిక్షను ప్రసాదించు. ఇతడు అర్జునుడు. నేను శ్రీకృష్ణుడను. ఈతడు భీమసేనుడు. మా ముగ్గురిలో ఏ ఒక్కరితోనైనా సరే నీవు ద్వంద్వ యుద్ధం చేయటం మా అభిమతం" అని చెప్పాడు.

చ. అన విని వాఁడు నవ్వి 'యహహా! విన వింతలు పుట్టె మున్ను న
న్ననిమొన నోర్వఁజాలక భయంబునఁ బాఱితి పెక్కుమార్లు; వం
చన మథురాపురిన్ విడిచి సాగరమధ్యమునందు డాఁగవే?
వనరుహనాభ! నీ బిరుదు వాఁడితనంబును నాకు వింతయే?

729

తా ॥ దానితో జరాసంధుడు నవ్వి "అహహా! వింత వింత మాటలు వింటున్నాను. పూర్వం, కృష్ణా! నీవు యుద్ధభూమిలో నాతో పోరాడలేక భయంతో ఎన్నిసార్లు పారిపోయావో? వంచనతో మథురానగరాన్ని వదలిపెట్టి సముద్రమధ్యంలో దాక్కోలేదా? నీ శౌర్యం, పౌరుషం నాకు క్రొత్తా?

క. ఇన్నేల సెప్ప? మాయలఁ, బన్నినఁబో విడువ గోపబాలక! బల సం
పన్నుని మాగధభూవరు, న న్నెఱుఁగవె తొల్లి నందనందన! పోరన్?

730

తా ॥ గోపాలా! ఇన్ని మాటలు చెప్పటమెందుకులే! నువ్వు నామీద ఎన్ని మాయలు పన్నినా నిన్ను నేను విడువను కదా! మగధరాజు మహాబలసంపన్నుడు. కృష్ణా! నా సంగతి నీకు తెలియదా? ఎన్నిసార్లు నన్ను యుద్ధంలో నీవు ఎదుర్కొనలేదు కనుక!!

ఉ. కాన రణోర్వి న న్నెదురఁ గష్టము గాన తలంగు; గోత్ర భి
త్సూనుఁడు భూరిబాహు బలమర్దనుఁ డయ్యును బిన్న; యీ మరు
త్సూనుఁడు మామకప్రకట దోర్బలశక్తికిఁ జూడఁ దుల్యుఁడౌ;
వీని నెదుర్తు నంచుఁ జెయివీచె జరాసుతుఁ డుగ్రమూర్తియై.

731

తా ॥ కాబట్టి యుద్ధంలో నన్ను ఎదిరించి నీవు పోరాడలేవు. కృష్ణా! నీవు తొలగిపోవటమే మంచిది. ఇంద్రపుత్రుడైన అర్జునుడు మహా పరాక్రమశాలి అయినా, నా కన్నా చిన్నవాడు. వాయుపుత్రుడున్నాడే అతడొక్కడే నాతో సరిసమానంగా యుద్ధం చేయగల బలశాలి. ఈ భీమసేనుడితో యుద్ధం చేస్తానంటూ" జరాసంధుడు ఉగ్రరూపంతో భీమున్ని తనతో యుద్ధానికి రమ్మంటూ చేయెత్తి పిలిచాడు.

క. కరువలిసుతునకు నొక భీ, కరగద నిప్పించి యొక్కగదఁ దనకేలన్ ధరియించి నలువురును గ్ర, చ్చఱఁ బురివెలి కేగి యచట సమతలభూమిన్.

732

తా ॥ జరాసంధుడు ఒక భయంకరమైన గదను తెప్పించి భీముడి చేతికి ఇచ్చాడు. తానొక గదను చేత ధరించాడు. వెంటనే నలుగురూ పురం బయటకు వెళ్ళారు. ఆ బాహ్యప్రదేశంలో ఒక సమతల భూమిని ఎంచుకొని భీమజరాసంధులిద్దరూ యుద్ధానికి సిద్ధమయ్యారు.

## శ్రీకృష్ణుని సహాయంతో భీముడు జరాసంధునితో యుద్ధం చేయుట

సీ. పర్వతద్వంద్వంబు పాథోధియుగళంబు మృగపతిద్వితయంబు వృషభయుగము
పావకద్వయము దంతావళయుగళంబు దలపడు వీఁక నుద్దండలీలఁ
గదిసి యన్యోన్య భీకర గదాహతుల నుగ్రంబుగ విస్ఫులింగములు సెదరఁ
గెరలుచు సవ్యదక్షిణ మండల భ్రమణములను సింహచంక్రమణములను

తే. గదిసి పాయుచు డాసి డగ్గఱచు మింటి, కెగసి క్రుంగుచుఁ గ్రుంగి వే యెగసి భూమి
పగుల నార్చి ఛటచ్ఛటోద్భటమహోగ్ర, ఘనగదా ఘట్టనధ్వని గగన మగల.

733

తా ॥ భీమజరాసంధుల యుద్ధం మహా భయంకరంగా సాగి, వారిరువురి గదలు ఒకదానినొకటి కొట్టుకోగా ఏర్పడిన ఛటచ్ఛట ధ్వనులు ఆకాశాన్ని బ్రద్దలు చేస్తున్నాయా అన్నట్లు చూపరులను ఆశ్చర్యంలో ముంచెత్తింది. వారి ద్వంద్వ యుద్ధం ఉగ్రరూపాన్ని వహించి అగ్ని కణాలను దశదిశలా విరజిమ్ముతోంది. రెండు పర్వతాలు, రెండు సముద్రాలు, రెండు సింహాలు, రెండు వృషభాలు, రెండు మదగజాలు, రెండు భీకరాగ్నులు ఒకదానితో మరొకటి ఢీ కొనేటట్లు ఆ ఇద్దరు మహావీరులు ఒకరిమీద ఒకరు దూకుతూ, కొంతసేపు దగ్గరగా వస్తూ, మరికొంతసేపు దూరంగా పోతూ, కుడి ఎడమలవైపు గుండ్రంగా తిరుగుతూ, సింహంలాగా ఒకరిపై నుంచి మరొకరు దాటుతూ, ఆకాశంపైకెగురుతూ, క్రిందకు దిగుతూ, క్రిందకు క్రుంగి మళ్ళీ పైకెగురుతూ, అనేక విధాలుగా వీరవిజృంభణతో బొబ్బలుపెడుతూ, గదలతో ఒకరినొకరు కొట్టుకొంటూ, గదల రాపిడిధ్వనులకు భూమి పగిలిపోయేటట్లు ఘోరాతిఘోరంగా యుద్ధం చేశారు.

వ. పోరునంత.

734

తా ॥ ఆ విధంగా భీమజరాసంధులిద్దరూ పోరాడుతుండగా—

మ. గద సారించి జరాతనూభవుఁడు హుంకార ప్రఘోషంబులం
జద లల్లాడఁగఁ బాదఘట్టనములన్ సర్వంసహా భాగముం
గదలన్ వాయుజు వ్రేసె; వ్రేయ నతఁ డుగ్రక్రోధ దీప్తాస్యుఁడై
యది తప్పించి విరోధిమస్తకము వ్రేయన్ వాఁడు పోఁదట్టుచున్.

735

తా ॥ హుంకార ధ్వనులతో ఆకాశం అల్లల్లాడేటట్లు, కాళ్ళత్రొక్కిడితో భూమిమొత్తం అతలాకుతలమై పోయేటట్లు జరాసంధుడు తన గదను తీసుకొని భీముడి మీదకు విసరివేశాడు. అత్యంత క్రోధంతో ముఖం జేవురించగా భీముడు, జరాసంధుడు వేసిన గదాదండం దెబ్బను తప్పించి, విరోధి తలమీద బలంగా కొట్టాడు. జరాసంధుడా దెబ్బను మెల్లగా తట్టుకొంటూ మళ్ళీ యుద్ధానికి దిగాడు.

చ. మడవక భీమసేనుఁడును మాగధరాజు గడంగి బెబ్బులుల్
విడివడు లీల నొండొరుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్
నడితల లూరు జాను జఘన ప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ
బిడుగులఁబోలు పెన్గదల బెట్టుగ వ్రేయుచుఁ బాయుచున్ వెసన్.

736

తా ॥ భీమసేనుడు, జరాసంధుడు ఒకరికన్న ఒకరు వీరవిజృంభణ చేస్తూ, ఏమాత్రం మడమ త్రిప్పకుండా, రెండు పెద్ద పులులు ఒకదానిమీద ఒకటి పడి వధించడానికి ప్రయత్నించే విధంగా, తమతమ గదాఘట్టనలతో వీపులను, మూపులను, ముంజేతులను, తలలను, తొడలను, మోకాళ్ళను, జఘనములను విరగగొడుతూ యుద్ధం చేశారు. ఆ దెబ్బలు పిడుగుపాట్లు లాగా మహాబలంగా, బాధాకరంగా తాకుతుంటే కొట్టిన వెంటనే వెనుకకు

జరుగుతూ, మళ్ళీ ముందుకు వస్తూ ఆగకుండా పోరాడుతూనే ఉన్నారు.

లయవిభాతి!

బెడ గడరు పెన్గదలు పొడిపొడిగఁ దాఁకఁ బెను పిడుగు లవనిం దొరఁగ నుడుగణము రాలన్ చెదర మిడుఁగుఱులు నభమడల హరిదంతములు వడఁక జడధుల్ గలఁగ బుడమి చలియింపన్ వెడచఱువ మొత్తియును దడఁబడఁగ నొత్తియును నెడమగుడి లాఁచి తిరుగుడు పడఁచు వ్రేయన్ వడవడ వడంకుచును సుడివడక డాసి చల ముడుగ కపు డొండొరుల వడి చెడక పోరన్.

737

తా ॥ భీమజరాసంధులు తమ గదల అందం అతిశయించే విధంగా యుద్ధం చేస్తుంటే ఆ గదల తాకిడికి పెచ్చులూడి రజను క్రిందపడుతోంది. రణంలో వారు ప్రదర్శిస్తున్న బీభత్సానికి పిడుగులు నేలపై పడిపోతున్నాయి. నక్షత్రాలు రాలిపడుతున్నాయి. అగ్నికణాలు ఆకాశాన్నంటుతున్నాయి. దిక్కులు వణికిపోతున్నాయి. సముద్రాలు అల్లకల్లోలమౌతున్నాయి. భూమి చలించిపోతోంది. వారిద్దరూ ఒకరిని చూసి ఒకరు భయపడే విధంగా గదలతో మొత్తుకొంటున్నారు. తడబడుతూ ఒకరినొకరు సమీపిస్తూ నిందించుకొంటున్నారు. గదను గిరగిరా త్రిప్పి ప్రయోగిస్తున్నారు. ఒకరి ధాటికి మరొకరు వణికిపోతున్నారు. అయినా బెదరకుండా, పట్టుదలతో, వేగం తగ్గకుండా, ఎవరికెవరూ తీసిపోకుండా యుద్ధం చేస్తూనే ఉన్నారు.

వ. ఇ వ్విధంబునం బోరుచుండ నొండొరుల గదా దండంబులు దుమురులైనన్ బెండు వడక సమద దిగ్వేదండ శుండాదండ మండిత ప్రచండంబు లగు బాహు దండంబు లప్పళించి ముష్టియుద్ధంబునకు డగ్గఱి.

738

తా ॥ ఈ విధంగా భీమజరాసంధులు ఘోరాతి ఘోరంగా యుద్ధం చేస్తుంటే ఇద్దరి గదాయుధాలు ముక్కలు ముక్కలుగా విరిగి పోయాయి. అయినా భయపడక, వారిద్దరూ మదపుటేనుగుల తొండాలవలె బలిష్ఠములైన తమ బాహువులతో ముష్టియుద్ధానికి ముందుకు దూకారు.

లయగ్రాహి!

కాల వెస డాచియును గే లెడలఁ ద్రోచియును దాలుములు దూలఁ బెడకేల వడి వ్రేయన్
ఫాలములు గక్షములఁ దాలువులు వక్షములు లీల నెముకల్ మెదడు నేలఁ దుమురై వే రాల
విపులక్షతవిలోలమగు నెత్తురులు జాలుకొని యోలిఁ బెనుఁగాలువలుగర్ బే
తాలమదభూతములు ఖేలనలఁ జేతులను దాళములు తట్టుచు సలీలగతి నాడన్.

739

తా ॥ కాళ్ళతో పెనగులాడుతూ, కీలు ఊడేటట్లు ఒకరినొకరు తోసుకుంటూ, చేతులు వెనుకకు త్రిప్పి గట్టిగా బాదుతూ యుద్ధం చేస్తూ సహనాన్ని కోల్పోతున్నారు. వెంటనే మళ్ళీ విజృంభించి, నుదురును, చెక్కిళ్ళను, వక్షస్థలం ప్రక్కభాగాలను, వక్షస్థలాన్ని పిడికిళ్ళతో కొడుతూ అవి చీలిపోయేటట్లు పోరాడారు. ఎముకలు విరిగి పొడిపొడిగా నేలరాలేటట్లు, మెదడు చితికి పోయేటట్లు కుమ్ములాడారు. భీమజరాసంధుల ద్వంద్వ యుద్ధంలో జాలువారిన నెత్తురు కాలువలై ప్రవహించింది. బాహాబాహి, ముష్టాముష్టి, కచాకచిగా సాగిన వారి యుద్ధం చూసి భేతాళ భూతములు పరమానందంతో చప్పట్లు కొడుతూ విహరించసాగాయి.

ఉ. ప్రక్కలుఁ జెక్కలున్ మెడలుఁ బాణితలంబులచేఁ బగుల్చుచున్
ముక్కులు నక్కులుం జెవులు ముష్టిహతిన్ నలియంగ గ్రుద్దుచున్
డొక్కలుఁ బిక్కలున్ ఘనకఠోర పదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరులఁ దార్కొని బేర్కొని పోరి రుగ్రతన్.

తా ॥ భీమజరాసంధుల ముష్టియుద్ధం ఉగ్రస్థాయికి చేరుకొంది. ఒకరిని మించి మరొకరు చేతులతో ప్రక్కలను, దవడలను, మెడలను పగల కొడుతున్నారు. పిడిగుద్దులతో ముక్కులు, వక్షస్థలం నలిగిపోయేటట్లు కొట్టుకొంటున్నారు. కాళ్ళతో డొక్కల్లో, పిక్కల్లో గట్టిగా పొడుచుకుంటున్నారు. వెంట్రుకలు ఊడేటట్లు పెనగులాడుతూ, ఏమాత్రం తగ్గకుండా, భయపడకుండా ఒకరితోఒకరు పోరాడారు.

ఉ. హుమ్మని మ్రోఁగుచుం బెలుచ హుంకృతు లిచ్చుచుఁ బాసి డాసి కో<br>
కొమ్మనుచు న్నొడళ్ళగల గుల్లల తిత్తులుగాఁ బదంబులం<br>
గ్రుమ్మచు ముష్ఠి ఘట్టనల స్రుక్కుచు నూర్పుల సందండింపఁగా<br>
సొమ్మల వోవుచుం దెలియుచున్ మది ఁ జేవయుఁ లావుఁ జూపుచున్.

741

తా ॥ భీమజరాసంధులిద్దరూ బలప్రతాపాలు, శక్తిసామర్థ్యాలు ప్రదర్శిస్తూ, హుంకారధ్వనులు చేస్తూ, ఒకరినొకరు సమీపిస్తూ, వెంటనే దూరంగా జరుగుతూ ఇదిగో, ఈ నా దెబ్బకు కాచుకోమని గర్జిస్తూ, కాళ్ళతో క్రుమ్ముతూ, పిడికిలి పోట్లతో బాధిస్తూ, నిట్టూర్పులు ఎక్కువై సోలిపోతూ, మళ్ళీ తెలివి తెచ్చుకొని యుద్ధానికి ఉపక్రమిస్తూ ఎడతెరపి లేకుండా యుద్ధం చేస్తున్నారు.

వ. ఇవ్విధంబున వజ్రివజ్రసన్నిభంబగు నితరేతర ముష్టిఘట్టనంబుల భిన్నాంగులై, రక్తసిక్త శరీరంబులతోడం బుష్పితాశోకంబుల వీఁకను, జేగుఱుఁ గొండల చందంబునను జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమరణప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవున కలయికలేక లావును జేవయుఁ గలుగు నట్లుగాఁ దద్గాత్రంబునందు దన దివ్యతేజంబు నిలిపి యరినిరస నోపాయం బూహించి సమీరనందనుండు సూచుచుండ

నొక్కశాఖాగ్రంబు రెండుగాఁ జీరివైచి వాని నట్ల చీరి చంపుమని సంజ్ఞగాఁ జూపిన నతండు నాకీలు దెలిసి యవక్రపరాక్రముండై మాగధుఁ బడఁద్రోచి వానిపదంబు పదంబునం ద్రొక్కి బాహు యుగళంబున రెండవపదంబుఁ గదలకుండం బట్టి మస్తకపర్యంతంబుఁ బెళ బెళమని చప్పు ళ్ళుప్పతిల్ల మత్తదంతావళంబు దాళవృక్షంబు సీరుచందంబునఁ బాదజాను జంఘోరుకటమధ్యోదరాంస కర్ణనయనంబులు వేఱువేఱు భాగంబులుగా వ్రయ్యలు వాపి యార్చినఁ బౌర జనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసిరంత.

742

తా ॥ ఈ విధంగా భీమజరాసంధులు దేవేంద్రుని వజ్రాయుధంతో సమానమైన, అతి కఠినమైన పిడికిటి దెబ్బలతో వికలమైన అవయవాలతో, నెత్తురుతో తడిసిన శరీరాలతో ఎర్రని పూలతో వికసించిన అశోక వృక్షాలలాగా, జేగుఱువర్ణంతో ప్రకాశిస్తున్న కొండలవలె శోభిస్తూ యుద్ధం చేస్తున్నారు.

శ్రీకృష్ణుడు జరాసంధుని జన్మ గురించి, మరణం గురించి తెలిసిన పరమాత్ముడు కావడంతో భీముని శరీరంలో తన దివ్య తేజస్సును నిలిపి అతనికి అలసట లేకుండా చేసి, అత్యంత బలాన్ని ప్రసాదించాడు. శత్రువును జయించే ఉపాయాన్ని ఆలోచించిన కృష్ణుడు భీముడు చూస్తుండగా ఒక కొమ్మ చివరను పట్టుకొని దానిని రెండుగా చీల్చివేశాడు. జరాసంధుని కూడా ఆ విధంగా చీల్చి చంపవలసిందని కృష్ణుడు భీముడికి సంజ్ఞ చేసి చెప్పాడు. భీముడు కృష్ణుడిచ్చిన సంకేతాన్ని తెలుసుకొని తన పరాక్రమంతో వెంటనే జరాసంధుని క్రింద పడవేశాడు. జరాసంధుడి కాలును తనకాలితో త్రొక్కి, తన రెండు చేతులతోను అతడి రెండోకాలు కదలకుండా గట్టిగా పట్టుకొని, ఫెళఫెళమనే ధ్వని పుడుతుండగా తలవరకూ వాడి శరీరాన్ని రెండుగా భీముడు చీల్చి చెండాడాడు. మదపుటేనుగు తాడి చెట్టును ఏ విధంగా మధ్యగా చీల్చివేస్తుందో, భీమసేనుడు ఆ విధంగా జరాసంధుని పాదాలు, మోకాల్లు, పిక్కలు, తొడలు, నడుము, ఉదరము, భుజాలు, చెవులు కళ్ళు వేరువేరుగా, ఈ భాగంవేరు, ఆ భాగంవేరు

అన్నట్లుగా శరీరం మొత్తాన్ని రెండు సమభాగాలుగా చీల్చి, వధించి, వీరోద్రిక్తుడై పెద్దగా అరిచాడు. ఆ దృశ్యం చూసిన గిరివ్రజపుర ప్రజలందరూ భయంతో బెంబేలు పడి హాహాకారాలు చేశారు.

## కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణణ్ణి స్తుతించుట

క. అనిలజుని దేవపతి నం, దనుఁడును బద్మాక్షుఁడును నుదారత నాలిం
గనములు సేసి పరాక్రమ, మున కద్భుతమంది మోదమునఁ బొగడి రొగిన్.

743

తా ॥ ఆ విధంగా భీమసేనుడు జరాసంధున్ని బీభత్సంగా వధించటం చూసిన శ్రీకృష్ణుడు, అర్జునుడు ఆతని అద్భుత పరాక్రమానికి సంతోషించి, భీముని ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసుకొని, ఆతని శౌర్యాన్ని అమితంగా ప్రశంసించారు.

క. వనజాక్షుఁ డంత గరుణా, వననిధియును భక్త లోక వత్సలుఁడును గా
వున మాగధసుతు సహదే, వునిఁ బట్టము గట్టెఁ దన్నవోన్నతపదవిన్.

744

తా ॥ శ్రీకృష్ణుడు కరుణామయుడు, భక్తులయందు వాత్సల్యంకలవాడూ కావడంవల్ల జరాసంధుని పుత్రుడైన 'సహదేవునికి' రాజ్యాధికారాన్ని ప్రసాదించి, మగధరాజ సింహాసనంపైన కూర్చుండబెట్టి, రాజ్యాభిషిక్తున్ని చేసి, అతనిని ఆదరించాడు.

క. మగధాధినాథునకు ము, న్నగపడి చెఱసాలలను మహాదుఃఖములన్
నొగులుచుఁ దన పాదాంబుజ, యుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్.

745

తా ॥ జరాసంధుడి వశంలో మగ్గిపోతూ, చెఱసాలలో బంధింపబడి ఆర్తితో అలమటిస్తూ, తన పాదపద్మాలనే ధ్యానిస్తూ ఉన్న రాజులనందరినీ శ్రీకృష్ణుడు బంధవిముక్తులను చేశాడు.

వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు దన దివ్యచిత్తంబున మఱవ నవధరింపక చెఱలు

విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులం బెక్కుబాధలం బడి కృశీభూత శరీరు లగుటం జేసి రక్త మాంసశూన్యంబులై త్వగస్థిమాత్రావశిష్టంబులును, ధూళిధూసరంబులు నైన దేహంబులు గలిగి కేశపాశంబులు మాసి జటాబంధంబులైన శిరోజంబులును, మలిన వస్త్రంబులునుం గలిగి, చనుదెంచిరి. అప్పుడు.

746

తా ॥ బంధవిముక్తులైన రాజులందరూ ఎంతోకాలంగా కారాగారంలో అనేక బాధలను భరించి, చిక్కి శల్యమై ఉన్నారు. వారి శరీరాలలో రక్తం, మాంసం ఏకోశానా కనబడటంలేదు. ఎముకలగూడుతో, దుమ్ము కొట్టుకుపోయిన శరీరంతో, మాసిపోయిన వస్త్రాలతో, జుట్టంతా మాసిపోయి జడలు కట్టిన తలతో వారంతా మెల్లగా కృష్ణుని దగ్గరకు వచ్చారు.

సీ. నవపద్మలోచను భవబంధమోచను భరితశుభాకారు దురిత దూరుఁ
గంగణకేయూరుఁ గాంచనమంజీరు వివిధశోభితభూషు విగత దోషుఁ
బన్నగాంతవాహు భక్త మహోత్సాహు నతచంద్రజూటు నున్నతకిరీటు
హరినీలనిభకాయు వరపీతకౌశేయుఁ గటిసూత్రధారు జగద్విహారు

తే. హారవనమాలికా మహితోరువక్షు, శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తు
లలిత శ్రీవత్సశోభితలక్షణాంగు, సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి.

747

తా ॥ సంసార బంధాల నుంచి విడుదల చేసేవాడు, శుభమైన ఆకారంతో శోభిస్తున్నవాడు, కమలాక్షుడు, కంకణాలతో, భుజకీర్తులతో, బంగారు కాలి అందెలతో ప్రకాశిస్తున్నవాడు; దోష రహితుడు, గరుడవాహనుడు, భక్త ప్రియుడు, శివుని చేత స్తుతింపబడేవాడు, ఇంద్రనీలపు మణివంటి నిగనిగ మేని ఛాయతో విరాజిల్లుతున్నవాడు; పీతాంబరధారి, వజ్రములతో పొదగబడిన కిరీటకాంతితో వెలిగి పోతున్నవాడు, వనమాలను కంఠమందు కలిగినవాడు, శ్రీవత్స చిహ్నంతో మెరిసిపోతున్న వక్షస్థలం గలవాడు, శంఖచక్ర

గదా పద్మ శారఙ్గములను చేతులలో ధరించినవాడు, కళ్యాణ ప్రదమైన చరిత్ర గలవాడు, లోకమంతటా విహరించేవాడు, దేవకీపుత్రుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మను ఆ రాజులందరూ భక్తిపూర్వకంగా దర్శించారు.

చ. భరితముదాత్ములై విగతబంధనులై నిజమస్తముల్ మురా
సురరిపు పాదపద్మములు సోఁకఁగ జాఁగిలి మ్రొక్కి నమ్రులై
కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ! సజ్జనార్తి సం
హరణ వివేకశీల! మహితాశ్రితపోషణ! పాపశోషణా!

748

తా ॥ కారాగారం నుంచి విడుదల అయిన రాజులందరూ పరమానందంతో తమ శిరస్సులు శ్రీకృష్ణుని పాదపద్మాలు సోకేటట్లుగా ఆ పరంధాముడికి సాష్టాంగ నమస్కారం చేశారు. వినయంతో రెండు చేతులు జోడించి స్తుతించారు:

ఆ. వరద! పద్మనాభ! హరి! కృష్ణ! గోవింద, దాసదుఃఖనాశ! వాసుదేవ!
యవ్యయాప్రమేయ! యనిశంబుఁ గావింతు, మిందిరేశ! నీకు వందనములు

749

తా ॥ "శ్రీకృష్ణా! దయామయా! సజ్జనుల బాధలను పోగొట్టే భక్తవత్సలా! ఆశ్రయించిన వారిని రక్షించేవాడా! దాసుల దుఃఖాలను నశింపచేసేవాడా! పాపాలు త్రుంచివేసే వాడా! వరప్రదాతా! పద్మనాభా! శ్రీహరీ! గోవిందా! వాసుదేవా! అవ్యయా! అప్రమేయా! లక్ష్మీనాథా! ఎల్లప్పుడూ నిన్ను కొలుస్తుంటాము. నీకు నమస్కారం తండ్రీ!

ఉ. ధీరవిచార! మమ్ము భవదీయ పదాశ్రయులన్ జరాసుతో
దారనిబంధనోగ్ర పరితాపము నీ కరుణావలోకనా
సారముచేత నార్చితివి; సజ్జనరక్షయు దుష్టశిక్షయు

న్నారయ నీకుఁ గార్యములు యాదవవంశ పయోధిచంద్రమా!

750

తా ॥ యాదవ వంశమనే సముద్రాన్ని సంతోషపరచే చంద్రదేవా! దుష్టశిక్షణ, శిష్టరక్షణ అనేవి విధులుగా కలిగినవాడివి. మేము నీ పాదపద్మాలు ఆశ్రయించుకొని ఉన్న నీ భక్తులము. మాకు జరాసంధుని వల్ల కలిగిన మహోగ్ర బాధను నీ కృపా కటాక్ష వీక్షణాలనే జడివానతో చల్లార్చిన మహానుభావుడివి. నీవు ధీర విచారుడవు. మేము ఆర్త జనులము. క్రూరుడైన జరాసంధుని బారి నుండి మమ్మల్ని కాపాడావు.

సీ. అవధరింపుము మాగధాధీశ్వరుఁడు మాకు బరమబంధుఁడు గాని పగఱకాఁడు
ప్రకటిత రాజ్యవైభవ మదాంధీభూత చేతస్కులము మమ్ముఁ జెప్ప నేల
కమనీయ జలతరంగముల కైవడి దీప శిఖవోలెఁ జూడ నస్థిరములైన
గురుసంపదలు నమ్మి పరసాధనక్రియాగమ మేది తద్బాధకంబు లగుచుఁ

తే. బరగు నన్యోన్య వైరానుబంధములను, బ్రజలఁ గారించుచును దుష్టభావచిత్తు లగుచు
నాసన్న మృత్యుభయంబు దక్కి, మత్తులై తిరుగుదురు దుర్మనుజు లంత.

751

తా ॥ కృష్ణా! మా మనవి వినవలసినది. జరాసంధుడు నిజానికి మాకు బంధువే అయినా శత్రువే. మేమందరం రాజ్య సంపదవల్ల కలిగిన మదోద్రేకంతో గ్రుడ్డివారమై పోయాం. అటువంటి మా గురించి చెప్పటం అనవసరం. నీటి అలలు వస్తుంటాయి, పోతుంటాయి. అలాగే దీపశిఖలు వెలుగుతుంటాయి, ఆరిపోతుంటాయి. సంపదలు కూడా స్థిరమైనవి కావు. చంచలాలు. అటువంటి సంపదలను నమ్ముకొని పరసాధనాలైన పనులు చేయటంమాని దుర్జనులైనవారు ఇహలోక సౌఖ్యాలకు, పదవులకు ప్రాకులాడుతుంటారు. ఒకరితో ఒకరు వైరం పెంచుకొంటూ, ప్రజలను రకరకాలుగా బాధిస్తూ, చెడునడతతో ప్రవర్తిస్తూ, దగ్గరలో ఉన్న మృత్యువును గమనించకుండా, మదోన్మత్తులై దుష్టులు తిరుగుతుంటారు. వారి మనసెప్పుడూ

దుష్టకార్యాలు చేయడంలోనే నిమగ్నమై ఉంటుంది.

చ. కడపటిచేఁత నైహికసుఖంబులఁ గోల్పడి రిత్త కోర్కి వెం
బడిఁ బడి యెండమావులఁ బిపాసువులై సలిలాశ డాయుచుం
జెడు మనుజుల్ భవాబ్ధిదరిఁ జేరఁగలేక నశింతు; రట్టి యా
యిడుమలఁ బొందఁజాలము రమేశ! త్రిలోకశరణ్య! మాధవా!

752

తా ॥ శ్రీకృష్ణా! లక్ష్మీనాథా! త్రిలోక శరణ్యా! దుష్ట మానవులు వారి అంతంవారే చూసుకుంటూ ఐహిక సుఖాలే తియ్యనివనే వృథా కోర్కెతో సంసార సాగరపు ఆవలి ఒడ్డు కానలేక ఎండమావుల వెంట తిరిగే దాహార్తులవలె భ్రాంతికి లోనై నశిస్తూ ఉంటారు. అటువంటి దారుణ కష్టాలు మేము పడలేము తండ్రీ!

ఉ. వేదవధూశిరో మహితవీథులఁ జాల నలంకరించు మీ
పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని
త్యోదితభక్తిమైఁ దగిలియుండు నుపాయ మెఱుంగఁ బల్కు దా
మోదర! భక్త దుర్భరపయోనిధితారణ! సృష్టికారణా!

753

తా ॥ ఈ సమస్త సృష్టికీ కారణభూతుడవైన ఆదిదేవా! శ్రీకృష్ణా! దాటశక్యం కాని సంసార సాగరం నుంచి భక్తులను దాటజేసే కరుణామూర్తీ! వేదవీథులను అలంకరించే నీ పాదపద్మాలు మా హృదయ పీఠాలపైన చక్కగా నిలుపుకోగల భక్తిప్రపత్తులను మాకు ప్రసాదించు స్వామీ!"

క. అని తను శరణము వేఁడిన, జననాథుల వలను సూచి సదమలభక్తా
వన చరితుఁడు పంకజ లో, చనుఁ డిట్లను వారితోడ సదయామతియై.

754

తా ॥ అని రాజులందరూ తనను శరణువేడగా, శ్రీకృష్ణుడు, భక్త రక్షణా పరతంత్రుడై, మిక్కిలి దయతో నిండిన చూపులతో వారిని చూసి, ఈ విధంగా అన్నాడు:

చ. 'జనపతులార! మీ పలుకు సత్యము; రాజ్యమదాంధచిత్తులై
ఘనముగ విప్రులం బ్రజలఁ గాఱియఁ బెట్టుటఁ జేసి కాదె వే
న నహుష రావణార్జునులు నాశము నొందిరి; కాన ధర్మ పా
లనమునఁ గాక నిల్చునె? కులంబు బలంబుఁ జిరాయురున్నతుల్.

755

తా ॥ "ఓ జనపతులారా! మీరింతవరకూ చెప్పిన మాటలన్నీ నిజమైన మాటలు. రాజ్యాధికారంతో, ఐశ్వర్యమదంతో అంధులైపోయి, వేనుడు, నహుషుడు, రావణాసురుడు, కార్తవీర్యార్జునుడు – ప్రజలను, వేదవిదులైన విప్రులను అనేక విధాలుగా బాధపెట్టడం వల్లనే కదా నాశనమైపోయారు. ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తేనే కదా కులం, బలం, ఉన్నతి, ఆయుష్షు నిలిచేది!

వ. అది గావున మీ మనంబుల దేహం బనిత్యంబుగాఁ దెలిసి.

756

తా ॥ కాబట్టి రాజులారా! మీ మనస్సులలో ఈ దేహం శాశ్వతం కాదని తెలుసుకోండి.

ఉ. మీరలు ధర్మముం దగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం
పారుచు సౌఖ్యసంపదల నందఁగఁ బ్రోచుచు భూరియజ్ఞముల్
గౌరవవృత్తి మత్పరముగా నొనరింపుచు మామకాంఘ్రి పం
కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్.

757

తా ॥ ధర్మాన్ని, న్యాయాన్ని పాటిస్తూ, ప్రజలు సుఖసంపదలతో వర్ధిల్లేటట్లు రాజ్యపాలన చేయండి. గొప్ప గొప్ప యజ్ఞాలు చేసి యజ్ఞఫలాన్ని నాకు సమర్పించండి. నా పాదపద్మాలు కొలుస్తూ, పాపకార్యాలు చేయకుండా సుఖంగా జీవించండి.

వ. అట్లయిన మీరలు బ్రహ్మసాయుజ్య ప్రాప్తు లయ్యెదురు; మదీయ పాదారవిందంబులందుఁ జలింపని భక్తియుఁ గలుగునని యానతిచ్చి యా రాజవరుల మంగళస్నానంబులు సేయించి వివిధమణి భూషణ మృదులాంబర మాల్యానులేపనంబు లొసంగి, భోజనతాంబూలాదులం బరితృప్తులం జేసి యున్నత రథాశ్వసామజాధిరూఢులం గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులం చేసి యనిచిన.

758

తా ॥ ఆ విధంగా మీరు ధర్మబద్ధంగా ప్రవర్తిస్తే మీకు తప్పక మోక్షం లభిస్తుంది. నా పాదపద్మాలమీద మీకు అచంచలమైన భక్తిభావం కుదురుతుంది.” అని చెప్పి శ్రీకృష్ణుడు వారికి మంగళస్నానాలు చేయించి, మణిభూషణాలను, సౌందర్యలేపనాలను, మృదువైన వస్త్రాలను, పూలమాలలను వారికి ఇప్పించి అలంకరింప చేశాడు. ఆ రాజులందరికీ భోజన తాంబూలాదులిప్పించి సంతృప్తిపరిచాడు. కొందరిని రథాలమీద, ఇంకొందరిని గుఱ్ఱాలమీద, మరికొందరిని ఏనుగులమీద అధిరోహింపచేసి, గౌరవంగా రాజులనందరినీ వారివారి రాజ్యాలకు పంపించాడు.

క. నరవరు లీ చందంబున, మురసంహరుచేత బంధమోక్షణులై సు
స్థిరహర్షంబులతో నిజ, పురములకుం జనిరి శుభవిభూతి తలిర్పన్.

759

తా ॥ నళినాక్షుడైన శ్రీకృష్ణునిచేత చెఱ విడిపింపబడి, జరాసంధుడు పెట్టే బాధలు ఇక

ఉండవని సంతోషిస్తూ రాజులంతా వైభవంగా తమతమ పురాలకు బయలుదేరారు.

క. హరిమంగళగుణకీర్తన, నిరతముఁ గావించుచును వినిర్మల మతులై
గురుబంధుపుత్త్రజాయా, పరిజన మలరంగఁ గృష్ణుఁ బద్మదళాక్షున్.

760

తా ॥ ప్రతిక్షణం శ్రీకృష్ణుని మంగళకరమైన సద్గుణాలను కీర్తిస్తూ, నిర్మలమైన హృదయాలతో అనేక విధాలుగా ఆ దేవదేవుణ్ణి స్తుతిస్తూ తమ నగరాలు చేరుకొన్న ఆ రాజులను చూసి గురువులు, బంధువులు, పుత్రులు, భార్యలు, సేవకులు, పౌరులు మహదానందభరితులైనారు.

వ. బహుప్రకారంబులం బొగడుచుఁ దమ తమ దేశంబులకుం జని.

761

తా ॥ జరాసంధుని చెఱనుండి తమకు విముక్తి ప్రసాదించిన శ్రీకృష్ణుని వీరగాథలను తలచుకొంటూ, పొగుడుతూ తమ దేశాలకు వెళ్ళారు.

క. నళినదళలోచనుఁడు దముఁ, దెలిపిన సద్ధర్మపద్ధతినిఁ దగవరులై
యిలఁ బరిపాలించుచు సుఖ, ముల నుండిరి మహితనిజ విభుత్వము లలరన్.

762

తా ॥ వాసుదేవుడు ఆదేశించిన విధంగా ధర్మపద్ధతిలో రాజ్యపాలన చేస్తూ, న్యాయాన్ని విడువకుండా ఆ రాజులందరూ వైభవోపేతులై సుఖంగా జీవించారు.

వ. ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును, రాజలోకంబునకు బంధ మోక్షణంబును గావించి, వాయునందన వాసవనందనులుం దానును జరాసంధతనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని, యతని నుండ నియమించి,

యచ్చోటు గదలి కతిపయ ప్రయాణంబుల నింద్రప్రస్థ పురంబునకుం జనుదెంచి, తద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించినఁ బ్రతిపక్ష భయదంబును, బాంధవ ప్రమోదంబును నగు న మ్మహాఘోషంబు విని, పౌరజనంబులు జరాతనయు మరణంబు నిశ్చయించి సంతసిల్లిరి. వారిజాక్షుండును భీమసేన పార్థులతోఁ బురంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనం బాచరించి, తామ పోయిన తెఱంగును, నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు విస్మయ వికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ, న మ్మాధవు మాహాత్మ్యంబునకుఁ దమయందలి భక్తి స్నేహ దయాది గుణంబులకుం బరితోషంబు నొందుచుఁ గృష్ణునిం జూచి యిట్లనియె.

763

తా ॥ ఈ విధంగా జరాసంధున్ని వధించి, రాజులను బంధవిముక్తులను చేసి, శ్రీకృష్ణుడు భీమార్జునులతో కూడి, జరాసంధుడి పుత్రుడైన సహదేవుని చేత గౌరవ సత్కారాలు పొంది, సహదేవున్ని మగధయందే ఉండమని ఆదేశించి, గిరివ్రజపురం నుంచి కొన్ని ప్రయాణాలు చేసి ఇంద్రప్రస్థపురం చేరుకొన్నాడు. కోటద్వారం వద్దనే ఉండి భీమార్జున కృష్ణులు శంఖాలు పూరించారు. ఆ శంఖాల ధ్వని శత్రువులకు భయాన్ని కలిగిస్తూ, బంధుమిత్రులకు సంతోషాన్ని కలిగించింది. శంఖధ్వని విన్న ఇంద్రప్రస్థ నగర పౌరులందరూ జరాసంధుడు మరణించాడని నిశ్చయించి ఆనందించారు.

కృష్ణుడు భీమార్జునులతో నగరంలోకి ప్రవేశించి ధర్మరాజు వద్దకు వచ్చి నమస్కరించాడు. తాము గిరివ్రజపురానికి వెళ్ళిన విధానాన్ని, అక్కడ జరాసంధున్ని వధించిన విషయాన్ని సవిస్తరంగా ధర్మజుడికి వినిపించాడు. విషయమంతా విన్న ధర్మరాజు ఆశ్చర్యపోయాడు. ఆయన కళ్ళవెంబడి ఆనంద బాష్పాలు జాలువారాయి. కృష్ణుని మహత్తుకు, తమపైన ఉన్న స్నేహదయాగుణాలకు పరవశించి పోయాడు. శ్రీకృష్ణుని ఈ విధంగా

స్తుతించాడు:

సీ. 'కమలాక్ష! సర్వలోకములకు గురుఁడవై తేజరిల్లెడు భవదీయమూర్తి
యంశాంశసంభవు లగు లోకపాలురు నీ యాజ్ఞఁ దలమోచి నిఖిలభువన
పరిపాల నిపుణులై భాసిల్లుచున్న వా రట్టి నీ కొక నృపునాజ్ఞ సేయు
టరయ నీమాయ గాకది నిక్కమే? యేక మై యద్వితీయమై యవ్యయంబు

తే. నైన నీ తేజమున కొక హాని గలదె?, చిన్మయాకార! నీ పాదసేవకులకు
నాత్మపరభేదబుద్ధి యెందైన నఁ గలదె? పుండరీకాక్ష! గోవింద! భువనరక్ష!

764

తా ॥ "కృష్ణా! పుండరీకాక్షా! గోవిందా! లోకరక్షకా! సాటిలేనిది, అవ్యయమైనది అయిన తేజస్సుకు ఎక్కడైనా లోటు ఉంటుందా? సమస్త లోకాలకు నీవు ఆది గురుడవు. నీ తేజస్సులోని ఒక అంశ భాగంగా జన్మించినవారు అష్టదిక్పాలకులు. వారంతా కూడా నీ ఆజ్ఞను తలదాల్చి లోకాలన్నింటినీ సమర్థవంతంగా పరిపాలిస్తూ ప్రకాశిస్తున్నారు. వారినే ఆజ్ఞాపించే దేవదేవుడవైన నీకు ఒక సామాన్య భూపతిని శాసించడం చాలా స్వల్పవిషయం. ఇదంతా నీ మాయగాక నిజమా ప్రభూ! ఓ జ్ఞాన స్వరూపా! నీ పాదపద్మాలు సేవించేవారికి తాను వేరూ, ఇతరులు వేరు అనే భేదబుద్ధి ఎక్కడైనా ఉంటుందా? కమలాక్షా! సర్వతేజోమయరూపుడవైన నీకు మోకరిల్లుతున్నాను."

## రాజసూయ యాగం – శిశుపాలుని వధ

వ. అని గోవిందునిం బొగడి య ద్దేవు ననుమతంబునం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వ విజ్ఞానులైన ధరణీసురులను ఋత్విజులంగా వరియించి.

765

తా ॥ అని ధర్మరాజు శ్రీకృష్ణునికి నమస్కరించి, ఆ పరమాత్ముని అంగీకారంతో రాజసూయ యాగం చేయడానికి వేదవేదాంగ విదులైన బ్రాహ్మణోత్తములను ఋత్విజులుగా ఆహ్వానించాడు.

సీ. సాత్యవతేయ కశ్యప భరద్వాజోపహూతి విశ్వామిత్ర వీతిహోత్ర
మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద గౌతమ సుమతి భార్గవ వసిష్ఠ
వాసుదేవాకృతవ్రణ కణ్వ జైమిని ధౌమ్య పరాశరాథర్వకవషు
లసిత వైశంపాయ నాసురి భార్గవ క్రతు వీరసేన గర్గ త్రికవ్య

ఆ. ముఖ్యులైన పరమమునులను గృపుని గాం, గేయ కుంభ జాంబికేయ విదుర కురుకుమార బంధు కులవృద్ధధారుణీ, సుర నరేంద్ర వైశ్య శూద్రనరుల.

766

తా ॥ ధర్మరాజు– వ్యాసుడు, కశ్యపుడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వీతిహోత్రుడు, ఉపహూతి, మైత్రేయుడు, పైలుడు, సుమంతుడు, గౌతముడు, భార్గవుడు, వసిష్ఠుడు, కణ్వుడు, జైమిని, సుమతి, వైశంపాయనుడు, పరాశరుడు, ధౌమ్యుడు, గర్గుడు మొదలైన మహామునులనెందరినో యజ్ఞానికి సభక్తికంగా ఆహ్వానించాడు. ఆ కుంతీ పుత్రుడు–భీష్ముడు, విదురుడు, ధృతరాష్ట్రుడు మొదలైన కురుకుల వృద్ధులను సగౌరవంగా ఆహ్వానించాడు. కృపుడు, ద్రోణుడు మొదలైన గురూత్తములను పిలిచాడు. కురుకుమారులైన దుర్యోధనాదులను సకలబంధు జనాన్ని ముందే రమ్మనమని చెప్పిపంపాడు. బ్రాహ్మణులను, రాజులను,

వణిగ్వరులను, శూద్రముఖ్యులను రాజసూయ యాగానికి రప్పించాడు.

క. రప్పింప వారు హర్షము, లుప్పతిలఁగ నేఁగుదెంచి యుచితక్రియలం
దప్పక కనుఁగొనుచుండఁగ, నప్పుడు విధ్యుక్త నియతులై భూమిసురుల్.

767

తా ॥ ఎప్పుడైతే ధర్మరాజు ఆహ్వానం అందిందో అప్పుడే అందరూ ఆనందంతో ఉప్పొంగిపోతూ ఇంద్రప్రస్థపురం చేరుకున్నారు. కొంతమంది తమకు తగిన పనులు చేస్తుంటే, మరికొంత మంది జరుగుతున్న కార్యక్రమాలను పర్యవేక్షిస్తున్నారు. ఋత్విజులుగా నియమితులైన బ్రాహ్మణోత్తములు యజ్ఞకార్యాన్ని శాస్త్రోక్తంగా నిర్వహించసాగారు.

ఆ. కడఁగి సవనభూమిఁ గనకలాంగలముల, నర్థి దున్ని పాండవాగ్రజునకు
నచట దీక్షచేసి యంచితస్వర్ణ మ, యోపకరణముల నలోపముగను,

768

తా ॥ ఆ విధంగా యజ్ఞం చేయించడానికి పూనుకొన్న బ్రాహ్మణులు యజ్ఞభూమిని అంతటినీ బంగారు నాగళ్ళతో చక్కగా దున్నించారు. ధర్మరాజుకు బంగారు ఛత్రాది చిహ్నాలను, బంగారు పాత్రలను ఇచ్చి ఆ మహారాజును యజ్ఞ దీక్షలో నిమగ్నున్ని చేశారు. ఏ లోపం లేకుండా ధర్మరాజు యజ్ఞదీక్షను స్వీకరించాడు.

వ. ఇట్లు నియమంబున సముచిత క్రియాకలాపంబులు నడపుచుండి రప్పుడు.

769

తా ॥ ఈ విధంగా యజ్ఞవిధి నియమాలతో సముచితమైన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

క. సకలావనీశు లిచ్చిన, యకలంక సువర్ణరత్న హయధనవస్త్ర

ప్రకరంబులు మొదలగు కా, నుక లందుకొనన్ సుయోధనుని నియమించెన్.

770

తా ॥ యజ్ఞదీక్షలో ఉన్న ధర్మరాజు ఒక్కొక్క పనిలో ఒక్కొక్కరిని తగు రీతిలో నియమించాడు. ప్రపంచంలోని రాజులందరూ తెచ్చి ఇచ్చిన బంగారు కానుకలను, రత్నాభరణాలను, అమూల్యమైన వస్త్రాలను, అశ్వాది వాహనాలను, అమితమైన ధనాన్ని, ఇతరాలైన ప్రశస్త వస్తువులను స్వీకరించి, జాగ్రత్త పరచడానికి ధర్మరాజు కురుసార్వభౌముడైన దుర్యోధనున్ని నియమించాడు.

సీ. అర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచి యిడఁగఁ రాధాతనూజు
సరసాన్న పానాది సకలపదార్థముల్ పాకముల్ సేయింపఁ బవనతనయుఁ
బంకజోదరు నొద్దఁ బాయక పరిచర్య దవిలి కావింప వాసవతనూజు
సవననిమిత్తంబు సంచితద్రవ్యంబు పెంపుతో వేగఁ దెప్పింప నకులు

తే. దేవగురు వృద్ధధాత్రీసురావలులను, నరసి పూజింప సహదేవు నఖిలజనులఁ బొలుచు
మృష్టాన్న తతులఁ దృప్తులను జేయ, ద్రౌపదిని నియమించెను ధర్మసుతుఁడు.

771

తా ॥ కర్ణున్ని, యాచకులు కోరే వస్తువులను పంచి ఇవ్వడానికి నియమించాడు. ఆహ్వానితులందరికీ రుచికరమైన భోజన పదార్థాలు చేయించడానికి భీమసేనున్ని నియోగించాడు. శ్రీకృష్ణుని వద్ద వదలకుండా పరిచర్యలు చేయడానికి అర్జునున్ని పెట్టాడు. యజ్ఞ నిర్వహణకు కావలసిన సమస్త ద్రవ్యాలను వెంటవెంటనే తెప్పించడానికి నకులున్ని నిర్దేశించాడు. దేవతలను, గురువులను, వృద్ధజనాన్ని, బ్రాహ్మణులు మొదలైన ఆహ్వానిత జనులనందరినీ గౌరవించి సత్కరించడానికి సహదేవున్ని ఆదేశించాడు. యజ్ఞానికి వచ్చిన వారందరినీ మృష్టభోజనాలతో సంతృప్తి పరచడానికి ద్రౌపదీదేవిని నియోగించాడు.

వ. అ య్యవసరంబున.

772

తా ॥ ఆ సమయంలో—

చ. హరి శిఖీ దండపాణి నికషాత్మజ పాశి సమీర గుహ్య కే
శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్య కి
న్నర గరుడోరగామరగణంబులు వచ్చి మఖంబుఁ జూచి య
చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింత యొప్పునే?

773

తా ॥ దేవేంద్రుడు, అగ్నిదేవుడు, యమధర్మరాజు, నిరృతి, వరుణుడు, వాయుదేవుడు, కుబేరుడు, శివుడు మొదలైనవారు ధర్మరాజు చేసే యజ్ఞం చూడాలనే ఉత్కంఠతో అక్కడకు విచ్చేశారు. బ్రహ్మదేవాది దేవతలు, చారణులు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, గరుడులు, నాగులు – అందరూ తమతమ లోకాలనుండి దిగివచ్చారు. ఇంద్రప్రస్థ పురానికి వేంచేసిన బ్రహ్మ రుద్రాది దేవతలందరు ధర్మరాజు చేస్తున్న యజ్ఞవిధానాన్ని చూసి ఇంతకు పూర్వం ఎవరూ కూడా ఇంత గొప్పగా, ఇంత చక్కగా యజ్ఞం చేయలేదు కదా అని ఆశ్చర్యపోయారు.

క. అదిగాక యిందిరావిభు, పదములు సేవించునట్టి భాగ్యము గలుగం
దుదిఁ బడయరాని బహు సం, పద లెవ్వియుఁ గలవె? యనుచుఁ బ్రస్తుతి సేయన్.

774

తా ॥ అదీగాక లక్ష్మీనాథుడైన శ్రీకృష్ణ పరమాత్ముని పాదపద్మాలు స్వయంగా సేవించే భాగ్యం ఈ యజ్ఞకర్త అయిన ధర్మరాజుకు దక్కింది. అందుచేత యజ్ఞాంతంలో ఆయనకు లభించని సంపదలుగాని, ఇహపరలోక సుఖాలుగాని ఏముంటాయి? అన్నీ ధర్మరాజుకు సొంతమౌతాయని, దేవతలందరూ, ఆతని వినయసంపదకు తెగమెచ్చుకున్నారు.

వ. అప్పుడు.

775

తా ॥ ఆ సందర్భంలో –

చ. అమరసమానులై తనరు యాజకవర్గము లోలి రాజ సూ
య మఖవిధాన మంత్రముల నగ్ని ముఖంబుగఁ జేసి ధర్మజుం
గ్రమమున వేలిపింపఁ గ్రతురాజసమాప్తి దినంబునన్ నృపో
త్తముఁడు గడంగి యాజక సదస్యగురుద్విజకోటిఁ బెంపునన్.

776

తా ॥ దేవతలతో సరిసమానులైన, యజ్ఞం చేయించిన ఋత్విక్కులు – రాజసూయ యజ్ఞం ఏ ఏ మంత్రాలతో ఏ ఏ విధంగా చేయించాలో ఆ విధంగా చేయిస్తూ, హోమ ద్రవ్యాలను ధర్మరాజు చేత హోమగుండంలో వేల్పించారు. హవిస్సులను ఆయా దేవతలకు అందజేశారు. యజ్ఞం పరిసమాప్తి అయ్యే చివరిరోజున ధర్మరాజు – ఋత్విజులను, సదస్యులను, గురువులను, బ్రాహ్మణులను పూజించాడు.

వ. పూజించునప్పు డం దగ్రపూజార్హు లెవ్వ రని యడిగిన సదస్యులు దమకుఁ దోఁచిన విధంబులం బలుక వారి భాషణంబులు వారించి వివేకశీలుండును, జతుర వచనకోవిదుండును నగు సహదేవుండు భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణునిం జూపి 'యి మ్మహాత్ముని సంతుష్టం జేసిన భువనంబు లన్నియుం బరితుష్టిం బొందు' నని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె.

777

తా ॥ ధర్మరాజు పూజార్హులైన వారందరినీ పూజించే వేళలో – వీరందరిలో "అగ్రపూజకు" ఎవరు అర్హులని ప్రశ్నించాడు. దానికి సభాసదులందరూ ఎవరిపాటికి వారు

తమకు తోచిన విధంగా సమాధానం చెప్పారు. వారందరి మాటలువిని, సహదేవుడు వారిని వారించి వివేకంతో కూడిన సమాధానం చెప్పాడు. చతురభాషణలో కోవిదుడైన సహదేవుడు అందరినీ చూసి "యాదవకులంలో జన్మించిన భగవంతుడైన శ్రీకృష్ణుడు సంతుష్టుడైతే లోకాలన్నీ సంతృప్తి చెందుతాయి" అని పలికి, ధర్మరాజుని చూసి ఇంకా ఈ విధంగా చెప్పాడు:

ఉ. కాలము దేశమున్ గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ
జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము నగ్ని యాహుతుల్
వేళలు విప్రులున్ జననవృద్ధిలయంబుల హేతుభూతముల్
లీలలఁ దానయై తగ వెలింగెడు నెక్కటితేజ మీశుఁడున్.

778

తా ॥ "మహారాజా! కాలము, దేశము, యజ్ఞయాగాలు, కర్త, కర్మ భోక్తా, విశ్వము, దైవము, గురువు, అగ్ని, హవ్యాలు, మంత్రాలు, విప్రులు, సృష్టి స్థితిలయాలు, కార్యకారణాలు – అన్నీ తానే అయి ప్రకాశించే ఏకైక తేజోరూపుడు, పరమాత్ముడు – శ్రీకృష్ణుడే.

చ. ఇతఁడె యితండు గన్ను లొకయించుక మోడ్చిన నీ చరాచర
స్థితభువనంబు లన్నియు నశించు నితం డవి విచ్చిచూచినన్
వితతములై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు నైన యట్టి యీ
క్రతుఫలదుండుగా కొరుఁ డొకం డెటు లర్హుఁడు శిష్టపూజకున్?

779

తా ॥ ఈ మహానుభావుడు కొద్దిగా కళ్ళుమూస్తే చాలు చరాచర ప్రపంచాలతో నిండి ఉండే లోకాలన్నీ క్షణకాలంలో నశించిపోతాయి. అదే గనుక, ఆ పరాత్పరుడు కళ్ళు తెరచి చూశాడనుకో లోకాలన్నీ తిరిగి ఆవిర్భవిస్తాయి. సర్వవ్యాపి, అనంత తేజోమూర్తి, యజ్ఞఫలప్రదాత అయిన శ్రీకృష్ణదేవుడిక్కడ ఉండగా వేరే వ్యక్తి "అగ్రపూజ" కు ఏ విధంగా

అర్హుడౌతాడు?

ఉ. ఈ పురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తుఁ జి
ద్రూపకు నగ్రపూజఁ బరితోషితుఁ జేయ సమస్త లోకముల్
వే పరితుష్టిఁ బొందుఁ బృథివీవర! కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడసేయక మాటలు వేయు నేటికిన్?

780

తా ॥ ఓ మహారాజా! సర్వశక్తిమయుడు, జ్ఞాన స్వరూపుడు, అనంతుడు, జగత్పతి, పురుషోత్తముడు, పురాణ పురుషుడు అయిన శ్రీకృష్ణుని అగ్రపూజతో సంతృప్తి పరిస్తే సమస్తలోకాలు తృప్తి చెందినట్లే. కాబట్టి ధర్మరాజా! లక్ష్మీనాథుడయిన శ్రీకృష్ణున్ని పూజించు. వేరేగా ఆలోచించకుండా అగ్రపీఠంపైన ఆ మహాత్ముణ్ణి కూర్చుండచేయి. ఇక, వేయి మాటలెందుకన్నా? అగ్రపూజకు శ్రీకృష్ణుడొక్కడే అర్హుడు."

క. అని సహదేవుఁడు పలికిన, విని యచ్చటి జనులు మనుజవిభులను ఋషులున్
మునుకొని మనములు మోదము, దనుకఁగ 'నిది లెస్స' యనిరి ధర్మజుఁడంతన్.

781

తా ॥ అని సహదేవుడు ధర్మబద్ధంగా పలికే సరికి అక్కడ యజ్ఞమంటపంలో ఉన్న రాజులు, ఋషులు, ప్రజలు అందరూ సంతోషించి ఒక్కుమ్మడిగా సహదేవుడు చెప్పింది లెస్సగా ఉందని, ఆ విధంగా చేయమని ధర్మజునికి తమ ఆమోదాన్ని తెలిపారు.

క. మునిజన మానస మధుకర, వనజాతములైన యట్టి వారిజదళ లో
చను పదయుగళప్రక్షా, ళన మొగిఁ గావించి తజ్జలంబులు భక్తిన్.

782

తా ॥ అందరి ఆమోదాన్ని పొందిన ధర్మరాజు మహర్షుల మనస్సులనే తుమ్మెదలకు నివాస స్థానమైన పద్మాలవలె ఉన్న శ్రీకృష్ణుని పాదపద్మాలను అత్యంత భక్తి భావంతో కడిగాడు.

క. తానును గుంతియు ననుజులు, మానుగ ద్రుపదాత్మజయును మస్తకములఁ బెం
పూనిన నియతి ధరించి మ, హానందము బొంది రతిశయప్రీతిమెయిన్.

783

తా ॥ శ్రీకృష్ణ పరమాత్ముని పాదపద్మాలు కడిగిన పవిత్ర జలాలను ధర్మరాజు తమ శిరస్సుపై చల్లుకొన్నాడు. ఆ మహారాజుతో పాటు కుంతీదేవి, భీమార్జున నకులసహదేవులు, ద్రౌపదీ దేవి ఆ పవిత్ర జలాన్ని తమతమ శిరస్సులపై చల్లుకొని పరమానంద భరితులైనారు.

క. చంచత్కాంచన రుచిరో, దంచితవస్త్రముల నూతనార్క ప్రభలన్
మించిన రత్నములం బూ, జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్.

784

తా ॥ జయశీలుడు, జగత్తుకు మేలు చేసేవాడు, విష్ణు స్వరూపుడు అయిన శ్రీకృష్ణుణ్ణి, ధర్మరాజు మెరిసిపోతున్న బంగారు వస్త్రాలిచ్చి సత్కరించాడు. ఉదయభానుని కాంతులకన్నా అధికమైన కాంతులతో ప్రకాశిస్తున్న రత్న సముదాయంతో ఆ పరమాత్ముడిని పూజించాడు. మణిమాణిక్యాది కానుకలెన్నో ఇచ్చి గౌరవించాడు.

వ. ఇట్లు పూజించి యానందబాష్పజల బిందు సందోహకందళిత నయనారవిందంబులం గోవిందుని సుందరాకారంబు దర్శింపఁ జాలకుండె; నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షు నిరీక్షించి హస్తంబులు నిజమస్తకంబుల ధరించి వినుతుల సేయుచు, నఖిలజనంబులు జయజయ శబ్దంబు లిచ్చిరి; దేవతలు వివిధతూర్య ఘోషంబులతోడం బుష్పవర్షంబులు గురియించి; రయ్యవసరంబున.

785

తా ॥ ధర్మరాజు భక్తిప్రపత్తులతో శ్రీకృష్ణుణ్ణి పూజిస్తున్న సమయంలో ఆయన కళ్ళవెంబడి ఆనందబాష్పాలు ఎడతెరిపి లేకుండా జాలువారుతుండటంతో శ్రీకృష్ణుని దివ్యమంగళ సుందర రూపాన్ని కనులారా చూడలేకపోయాడు. ఆ విధంగా ధర్మరాజు చేత ఏకాగ్రచిత్తంతో పూజింపబడుతున్న శ్రీకృష్ణపరమాత్ముని దివ్యతేజస్సును చూసి సకలజనులు తమ తలలపై చేతులు జోడించి ఆ దేవదేవుణ్ణి స్తుతిస్తూ పరవశించిపోయారు. వారు చేసిన జయజయధ్వనులతో సభామంటపం నిండిపోయింది. దేవతలు మంగళవాద్యాలు మ్రోగిస్తూ శ్రీకృష్ణుడిపై పుష్పవర్షం కురిపించారు. ఆ సమయంలో –

క. దమఘోషసుతుఁడు దద్విభ, వము సూచి సహింప కలుక వ్రట్రిలఁగా బీ
రము డిగ్గి నిలిచి నిజ హ, స్తము లెత్తి మనోభయంబు దక్కినవాఁడై.

786

తా ॥ దమఘోషుని కుమారుడైన శిశుపాలుడు శ్రీకృష్ణుడికి జరుగుతున్న వైభవంతో కూడిన ఆ సన్మానాన్ని చూసి సహించలేక, ఆగ్రహంతో ఊగిపోయాడు. సింహాసనం దిగి నిలబడ్డాడు. మనస్సులో తనకేం జరుగుతుంతో అన్న భయం ఈషన్మాత్రం కూడా లేకుండా రెండు చేతులూ పైకెత్తి అందరి వైపూ చూశాడు.

వ. అప్పు డప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులం జూచి యిట్లనియె.

787

తా ॥ అలా చూసి, శ్రీకృష్ణుడు వినేటట్లు, సభాసదుల వైపు తిరిగి ఈ విధంగా అన్నాడు:

క. 'చాలుఁ బురే యహహా! యీ, కాలము గడపంగ దురవగాహం బగు నీ
తేలా తప్పెను నేఁడీ, బాలకు వచనములచేతఁ బ్రాజ్ఞుల బుద్ధుల్?

788

తా ॥ "ఆహా! చాలు, చాలు. ఇక్కడున్న ఇంతమంది విజ్ఞుల బుద్ధులేమైపోయాయి? బాలుడైన సహదేవుని మాటలతో జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు నీతి తప్పి అతని మాటలకు "లెస్స, లెస్స" అని ఎంతో పొగిడారే! ఇటువంటి కాలం గడపటం చాలా కష్టం.

వ. ఇట్లు దప్పిన తెఱం గెట్టనినఁ బాత్రా పాత్ర వివేకంబు సేయనేర్చిన విజ్ఞాననిపుణులు, నున్నతసత్త్వ గరిష్ఠులు, బహువిధ తపోవ్రత నియమశీలురు, నశీల్పతేజులు, మహైశ్వర్యశక్తిధరులుఁ, బరతత్త్వవేదులు, నఖిలలోకపాలపూజితులు, విగతపాపులుఁ బరమయోగీంద్రులు నుండ వీరిం గై కొనక వివేకరహితులై గోపాలబాలునిం బూజ సేయుటకు నెట్లు సమ్మతించిరి; పురోడాశంబు సృగాలంబున కర్హంబగునే? యదియునుంగాక.

789

తా ॥ ఏ విధంగా నీతి తప్పారంటే ఈ సభలో అర్హత, అనర్హత ఎలా ఉంటుందో తెలుసుకోగల విజ్ఞాన ఖనులున్నారు. సత్త్వగుణ ప్రధానులున్నారు. మహర్షి సత్తములున్నారు. తేజస్సంపన్నులున్నారు. శక్తిమంతులున్నారు. మహదైశ్వర్యవంతులున్నారు. పరమాత్మను తెలుసుకొన్న భక్తాగ్రగణ్యులున్నారు. అఖిల లోకపాలకులచేత పూజలందుకొన్నవారున్నారు, పాపరహితులున్నారు, పుణ్యాత్ములున్నారు, యోగీశ్వరులున్నారు. ఇంతమంది మహాత్ములుండగా ఒక్కరిని కూడా పరిగ్రహించకుండా గోపాలబాలున్ని పూజిస్తుంటే వారంతా వివేకం లేనివారై ఏ విధంగా చూస్తూ ఊరుకొన్నారు? కృష్ణుడికి అగ్రపూజ చేయడాన్ని ఎందుకు సమ్మతించారు? యజ్ఞంలో సమర్పించే పవిత్రమైన పురోడాశమనే భక్ష్యం నక్కకు ఏ విధంగా పెడతాం? అంతే కాదు.

సీ. గురుదేవ శూన్యుండు కులగోత్ర రహితుండు దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన
మప్పులఁ బొరలెడు నాదిమధ్యావసానంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కుభంగుల వర్తించు వావి వర్తనములు వరుసలేవు

పరికింప విగతసంబంధుండు తలపోయ మా నిమిత్తంబున మాని సయ్యెఁ

తే. బరఁగ మున్ను యయాతిశాపమునఁ జేసి, వాసి కెక్కద యీ యాదవవంశమెల్ల బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు, బ్రహ్మఋషి సేవ్యుఁ డగునె గోపాలకుండు?

790

తా ॥ కృష్ణుడికి గురువులు లేరు. దేవుళ్ళూ లేరు. కులగోత్రాలూ లేనివాడే! ఈతని తల్లిదండ్రులెవరో తెలియడం లేదే! నీళ్ళల్లో పొర్లుతూ అక్కడే పడుకొంటాడే! పైగా మొదలు, నడిమి, చివర అనేవి లేనివాడు. గౌరవశూన్యుడు. అనేక రూపాలతో, అనేక విధాలుగా, అనేక ప్రదేశాలలో తిరుగుతుంటాడు. వావివరుసలు లేనివాడు. ఎవరితోటి సంబంధంలేనివాడు. ఆలోచించి చూస్తే మావల్ల కృష్ణుడు ఈ స్థితికి వచ్చి, గౌరవింపబడుతున్నాడు. అందరిలోనూ తిరగగలుగుతున్నాడు. అంతేగాని అతనిది స్వీయప్రతిభ ఏమీకాదు.

ఇంకో విషయం. అసలు, పూర్వం యయాతి శాపంచేత యాదవవంశానికి కీర్తిప్రతిష్ఠలు మాసిపోయాయి. క్షత్రియత్వాన్ని, రాజ్యాధికారాన్ని, బ్రహ్మతేజాన్ని కోల్పోయిన కృష్ణుడు బ్రహ్మర్షులచేత సేవింపబడటానికి అర్హతలేనివాడే! అగ్రపూజకు ఎలా పనికి వస్తాడు?

శ్రీకృష్ణున్ని శిశుపాలుడు ఒకవంక నిందిస్తూనే ఆ పరమాత్మను మరో వంక తనకు తెలియకుండానే స్తుతించాడు. ఆదిమధ్యాంతరహితుడు, గురుదేవులు లేనివాడు, కులగోత్రాలనేవి అంటనివాడు, పుట్టుకలేనివాడు, సముద్రజలాలపై పవళించేవాడు, దశావతారరూపుడు, ఎవరితోనూ, దేనితోనూ బంధనాలు లేనివాడు, బ్రహ్మతేజస్సుతో విరాజిల్లేవాడు – శ్రీకృష్ణుడని చెప్పడంలో సాక్షాత్తూ భగవంతుడైన విష్ణువే శ్రీకృష్ణుడని చెప్పక చెప్పడం జరిగింది.

క. జారుఁడు జన్మావధియును, జోరుఁడు ముప్పోకలాఁడు సుమహితపూజా
చారక్రియలకు నర్హుఁడె, వారక యితఁ డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్.

791

తా ॥ 'శ్రీకృష్ణుడు జారుడు. జన్మాంతందాకా చోరుడు. మూడు మార్గాలలో సంచరించేవాడు. అటువంటివాడు ఉత్తమమైన, పవిత్రమైన అగ్రపూజకు ఎలా అర్హుడౌతాడు?" అని అంటూ అశుభాలైన వాక్యాలతో నిందిస్తున్న శిశుపాలుడి మాటలలో అజ్ఞాతంగా భగవత్ స్తుతి గోచరించింది.

భగవంతుడైన కృష్ణుడు భక్తుల హృదయాలను దొంగలించే చోరుడు. సత్త్వరజస్తమోగుణాలతో కూడిన త్రిమూర్తుల త్రోవలలో నడచేవాడు. తనను నమ్ముకొన్నవారికి సకలసౌఖ్యాలను ప్రసాదించేవాడు. వైరభక్తులలో శిశుపాలుడు ముఖ్యుడు.

చ. అని తను దూఱనాడిన మురాంతకుఁ డా శిశుపాలు వాక్యముల్
విని మదిఁ జీరికిం గొనఁడు విశ్రుతఫేరవ రావ మాత్మఁ గై
కొనని మృగేంద్రురీతి మునికోటియు రాజులుఁ బద్మనాభు నా
డిన యవినీతి భాషలకు డెందమునం గడు వంత నొందుచున్.

792

తా ॥ ఈ విధంగా శిశుపాలుడు తనను ఎంతగా నిందిస్తున్నా, శ్రీకృష్ణుడు వినికూడా – నక్క అరపులను మృగరాజైన సింహం ఎలా లక్ష్యపెట్టదో – ఆ విధంగా పట్టించుకోలేదు. మనస్సుకు తీసుకోలేదు. కానీ తపోధనులైన మునులు, రాజులు శిశుపాలుడు అకారణంగా, అసహ్యకరంగా శ్రీకృష్ణుణ్ణి తూలనాడినందుకు ఎంతగానో విచారించారు.

ఉ. వీనులు మూసికొంచు విన విస్మయ మంచు 'ముకుంద! మాధవా!
శ్రీనిధి! వీని నేగతికిఁ జేర్చెదొ' యంచు దురాత్ముఁ దిట్టుచు
న్నా నరనాథులున్ మునులు నచ్చట నిల్వక పోవఁ బాండు సం
తానము లప్రమేయ బలదర్ప మహోద్ధత రోషచిత్తులై.

793

తా ॥ సభాసదులందరూ శ్రీకృష్ణనిందను భరించలేక, చెవులు మూసుకొంటూ శిశుపాలుని మాటలకు ఆశ్చర్యచకితులైనారు. వెంటనే "హే కృష్ణా! ముకుందా! మాధవా! ఈ నీచున్ని ఏ గతికి తీసుకువెళతావో గదా!" అని శిశుపాలున్ని తిట్టుకొంటూ క్షణం కూడా అక్కడ నిలవకుండా రాజులు, మహర్షులూ సభను వీడి వెళ్ళిపోయారు. శిశుపాలుని విజృంభణకు పాండవులు ఆగ్రహంతో మండిపడ్డారు. బలపరాక్రమాలతో శిశుపాల వధకు ఉద్యుక్తులైనారు.

వ. అప్పుడు కేకయ సృంజయభూపతులుం దామును వివిధాయుధపాణులై యదల్చి నిల్చిన వాఁడును బిఱుతివక యదల్చి పలుకయు వాలునుం గైకొని భుజాగర్వదుర్వారుండై గోవిందునిఁ దదనువర్తులైన వారలం గుపితుండై నిందింప న మ్ముకుందుం డాగ్రహంబున లేచి తన కట్టెదుర నెదిర్చియున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల వీక్షించుచు, నా క్షణంబ తన్మస్తకంబు నిశితధారా కరాళంబైన చక్రంబున నవక్రపరాక్రముండై రుధిరంబు దొరఁగం దునుమ, న మ్మహాకలకలం బాకర్ణించి చైద్యబలంబులు దదీయపక్షచరులైన భూపతులును భీతులై పఱచి; ర య్యవసరంబున.

794

తా ॥ పాండవులు కేకయ సృంజయ భూపతులతో సహా ఆయుధాలు ధరించి శిశుపాలున్ని బెదిరించి ఎదుర్కొన్నారు. శిశుపాలుడు కూడా వెనుకకు తగ్గక పాండవులతో యుద్ధానికి తలపడ్డాడు. బలగర్వంతో చేదినాథుడు కత్తీ, డాలూ తీసుకొని, గోవిందున్ని, గోవిందుని అనుచరులను ఆగ్రహోదగ్రుడై నిందించాడు. అంతవరకూ ఆగిన శ్రీకృష్ణుడు తన ఎదుట నిలిచి ఆక్షేపిస్తున్న శిశుపాలున్ని కోపంగా చూశాడు. ఆతని దుశ్చర్యకు ఆగ్రహించి, వాడి అయిన సుదర్శనచక్ర ధారలతో శిశుపాలుని శిరస్సును క్షణకాలంలో ఖండించాడు. శిశుపాలుని శరీరం నుంచి నెత్తురు ధారలు కట్టింది. శ్రీకృష్ణుని పరాక్రమానికి అక్కడి జనులు కలకలధ్వనులు చేశారు. శిశుపాలుని పక్షీయులైన రాజులూ, ఆతని సైన్యం, ఆ మహా కలకలధ్వనిని విని, భయంకర దృశ్యాన్ని చూసి భయపడి పారిపోయారు. అప్పుడు –

క. మునివరులును జనపతులును, గనుఁగొని వెఱఁ గందఁ జైద్యు గాత్రమునందుం
డనుపమ తేజము వెలువడి, వనజోదరు దేహమందు వడిఁ జొచ్చె నృపా!'

795

తా ॥ శిశుపాలుని శరీరమునుండి మహత్తరమైన తేజస్సు వెలువడి శ్రీకృష్ణుని శరీరంలో కలిసిపోయింది. ఆ దృశ్యాన్ని చూసిన మహర్షులు, రాజులు అత్యాశ్చర్యంతో నిలబడిపోయారు".

వ. అనిన మునివరునకు భూవరుం డిట్లనియె.

796

తా ॥ అని శుకమహర్షి చెప్పిన విషయం విన్న పరీక్షిన్మహారాజు ఈ విధంగా అన్నాడు:

క. 'కమలాక్షుని నిందించిన, దమఘోషతనూభవుండు దారుణ మల కూ
పమునుం బొందక యే క్రియ, సుమహితమతిఁ గృష్ణునందుఁ జొచ్చె మునీంద్రా!

797

తా ॥ "యోగీంద్రా! శిశుపాలుడు శ్రీకృష్ణుణ్ణి అంతగా నిందించాడే! అటువంటి పాపాత్ముడు దారుణమైన నరకకూపంలో పడిపోక పరమాత్ముడైన శ్రీకృష్ణునిలో ఎలా చేరగలిగాడు? వింతగా ఉంది. వివరించండి మహాత్మా."

వ. అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె.

798

తా ॥ అని అడిగిన రాజయోగి అయిన పరీక్షిత్తుతో శుకయోగి ఇలా చెప్పాడు:

మ. మధుదైత్యాంతకుమీఁది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వదినే ప్రొద్దుఁ దదీయ రూపగుణ దివ్యధ్యానపారీణ ధీ

నిధి యౌటన్ శిశుపాల భూవిభుఁడు తా నిర్ధూత సర్వాఘుఁడై
విధిరుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె నుర్వీశ్వరా!

799

తా ॥ "విష్ణుమూర్తి మీది మాత్సర్యంతో మదించి వైరం తెచ్చుకొన్న శాపగ్రస్తుడు శిశుపాలుడు. మూడు జన్మల నుంచి శత్రుత్వాన్ని వహించిన విష్ణుద్వారపాలకుడైన విజయుడే శిశుపాలుడు. ఈ జన్మ చివరిజన్మ. వైరభక్తితో స్వామి సన్నిధి చేరుకోవాలని కోరుకున్న విజయుడు శిశుపాలుడిగా జన్మించి ప్రతి క్షణమూ విష్ణువుయొక్క రూపగుణాలను ధ్యానిస్తూ ఉండటంచేత; అతడు పరమాత్మున్ని నిందించినా, శ్రీకృష్ణుని పట్ల వీరశత్రుత్వాన్ని పెంచుకొన్నా, సమస్త పాపాలను పోగొట్టుకొన్నవాడై విష్ణువులో ఐక్యం కాగలిగాడు. శిశుపాలుడు అనుక్షణం శ్రీకృష్ణణ్ణి కోపంగానైనా సరే తలుస్తూ ఉన్న కారణంగా, చివరకు బ్రహ్మరుద్రాదులకే పొందరాని వైకుంఠ ధామాన్ని పొందాడు.

వ. అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులను బహు దక్షిణలం దనిపి వివిధార్చనలం బూజించి యవభృథస్నానక్రియా పరితోషంబున.

800

తా ॥ పరీక్షిన్మహారాజా! ఆ తరువాత ధర్మరాజు యజ్ఞం చేయించిన ఋత్విక్కులకు, సదస్యులకు అనేక దక్షిణలిచ్చి, అర్చనలతో పూజించి, వారందరినీ సర్వ విధాలా సంతృప్తిపరిచాడు. యజ్ఞాంతంలో చేయవలసిన అవబృథస్నానం చేయడానికి సంకల్పించాడు.

సీ. మురజ మృదంగ గోముఖ శంఖ డిండిమ పణవాదిరవము లంబరము నిండఁ
గవి సూత మాగధ గాయక వంది వై తాళిక వినుతు లందంద బెరయ
వితతమర్దల వేణు వీణారవంబుల గతులకు నర్తకీగతులు సెలఁగఁ
దరళ విచిత్రక ధ్వజపతాకాంకిత స్యందన గజ వాజిచయము లెక్కి

తే. సుత సహోదర హిత పురోహితజనంబు, గటక కేయూర హార కంకణ కిరీట
వస్త్ర మాల్యానులేపనవ్రాతములను, విభవ మొప్పారఁ గై సేసి వెడల నంత.

801

తా ॥ మంగళకరములైన మృదంగ ధ్వనులు, శంఖారావాలు, తప్పెటమ్రోతలు, గోముఖడిండిమాది వాద్యరవాలు ఆకాశాన్ని అంటుతుండగా; వందిమాగధ కవి గాయక స్తోత్రపాఠాలు వీనులవిందుగా వినిపిస్తుండగా; వేణువీణానాదాలకు అనుగుణంగా నర్తకీమణులు నాట్యం చేస్తుండగా; చిత్ర విచిత్రమైన రంగులతో మెరిసిపోతున్న జెండాలు కట్టిన రథాలను, ఏనుగులను, గుఱ్ఱాలను అధిరోహించి, స్వర్ణమయమైన మణిహారాలను, భుజకీర్తులను, కడియాలను అలంకరించుకొని మేలిమి వస్త్రాలు ధరించి; మైపూతలతో, పూలమాలలతో విరాజిల్లుతూ ధర్మరాజు వెంట ఆయన కుమారులు, సోదరులు, హితులు, పురోహితులు అవబృథ స్నానానికి బయలుదేరారు.

వ. మఱియు యదు సృంజయ కాంభోజ కురు కేకయ కోసల భూపాల ముఖ్యులు చతుర్విధ సేనాసమేతులై ధరణి గంపింప వెన్నడి నడతేర ఋత్విఙ్నికాయంబును సదస్యులునుం బ్రహ్మఘోషంబు లొలయ మున్నిడికొని శోభమానానూన ప్రభా భాసమాన సువర్ణమయ మాలికాదివ్య మణిహారంబులు గంఠంబునం దేజరిల్ల నున్నత జవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు గళత్రసమేతుండై యెక్కి యతిమనోహర విభవాభిరాముండై చనుదెంచు చుండె; నప్పుడు వారాంగనా జనంబులు దమ తమ వారలం గూడికొని.

802

తా ॥ వారి వెనుక యదుసృంజయకాంభోజ కురు, కేకయ, కోసల భూపతులందరూ చతురంగ బలాలతో భూమి కంపించునట్లు నడిచారు. ఋత్విజుల సముదాయము, సభకు విచ్చేసిన సదస్యులు వేదమంత్రాలు పఠిస్తుండగా, వారిని తనకు ముందు నడవమని చెప్పి, బంగారు నగలను మెడలో ధరించి, వేగవంతమైన గుఱ్ఱాలతో పూన్చిన పుష్పరథాన్ని ధర్మరాజు

మహావైభవంగా భార్యతో సహా ఎక్కినవాడై ప్రయాణమైనాడు.

సీ. కనకాద్రిసానుసంగత కేకినుల భాతిఁ గ్రొమ్ముళ్ళు వీఁపుల గునిపి యాడఁ
దరళ తాటంక ముక్తా ఫలాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమిసేయఁ
బొలసి యదృశ్యమై పోని క్రొమ్మెఱుఁగుల గతులఁ గటాక్షదీధితులు దనర
మంచుపై నెగయ నుంకించు జక్కవ లనఁ జన్నులు జిలుఁగు కంచలల నఱుమ

తే. మహితకుచభార కంపితమధ్య లగుచు, నర్థి మొలనూళ్ళు మెఱయఁ బయ్యదలు జారఁ
గరసరోజాత కంకణ క్వణనములును, జరణనూపురఘోషముల్ సందడింప.

803

తా ॥ మేరుపర్వతం చఱియలపైన ఉండే నెమళ్ళ వంటి నల్లని కొప్పుముడులు వీడి వీపులపైన కదలాడుతుండగా; ముత్యాల లోలకుల కాంతులు చెక్కిళ్ళ కాంతులతో చెలిమి చేస్తుండగా; కడగంటి చూపులు మెఱుపుల కాంతులను ధిక్కరిస్తుండగా; ఊగిసలాడుతున్న నడుములతో, జారిపోతున్న పైట కొంగులతో; చేతుల గాజుల గలగల ధ్వనులు, కాలి అందెల ఝణఝణ రవాలు అతిశయిస్తుండగా వారకాంతలు ధర్మరాజు పరివారం వెనుక నడిచారు.

వ. మఱియు నయ్యిందువదన లందంద మందగమనంబునం జెందు ఘర్మజల బిందు సందోహ కందళిత మందహాస చంద్రికాసుందర వదనారవిందంబుల నిందిందిర రుచిర చికురబృందంబులు చిందఱ వందఱలై సందడిగొన, నమందానందహృదయలై, సువర్ణశృంగ సంగతంబులైన సంకుమద మలయజ ముఖ సురభితోయంబులు సముదాయంబులై తమతోయంబుల వారి పయిం జల్లుచుఁ జెందొవలఁ కెందమ్మి విరుల రచియించిన చిమ్మనగ్రోవులఁ దావులు గల పూఁదేనియలు నించి, వావులు దెలిపి, తేవలు మీఱఁ, గ్రేవలనుండి యిమ్ములం గవిసి చిమ్ముచుఁ, మృగమదకర్దమంబును కుంకుమ పంకంబును గొంకక బింకములం జంకె లొలయం బంకజ సన్నిభంబులగు మొగంబుల నేమఱించి చమురుచు నుల్లంబులు పల్లవింపఁ బెల్లదరి యందియలు ఘల్లుఘల్లని

మొరయఁ గ్రేళ్లు దాఁటుచుం బాఱుచు జారు చంద్రికా ధవళఘనసారధూళి మిళిత రజనీపరాగంబు రంజిల్లం గరంబులం బుచ్చికొని శిరంబులం జల్లుచుఁ జిత్తంబుల నమ్మత్త కాశినుల వృత్తంబులగు కుచంబుల కెత్తు వత్తురేయని బిత్తరించి పువ్వు గుత్తులం దత్తఱంబున వ్రేయుచుఁ బరిహసింపుచు నన్యోన్యకర కిసలయ కనకకరండ భరితంబగు పన్నీటం జెంగావిజిలుఁగుఁ బుట్టంబులు దట్టంబులుగాఁ దోఁగిన మర్మంబులు బయలు పడిన నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబులగు తమకనుఱెప్ప లకడ్డంబు సేయుచుఁ బురుషులుం దాము నా రామ లభిరామలీలారసోక్తు లెనయ నంతరంగంబుల సంతసంబునం బంతంబు లిచ్చుచు వసంతంబు లాడిరి. అవ్వేళ నతుల విమానారూఢులైన యింద్రపురంధ్రీ జనంబులం బోలె హాటకశిబిక లెక్కి, నిజచేటికా జనంబులు సేవింపఁ జనుదెంచు భూకాంతకాంతాజనంబులు దమకు సరసంబులగు నర్మంబులైన ధరణీపాల వధూలలామంబు లాదరించు చెలులపైఁ దమ సఖీజనంబులం బురికొల్పి చల్లింపుచు భావగర్భితంబు లగువారి చతురసరసోక్తుల మందహాసచంద్రికలు ముఖకమల లీలావిలోకనలక్ష్మిం బ్రోదిసేయం జెలువరం జనిరి, ఇవ్విధంబున నిజసామ్రాజ్య విభవంబు పూజ్యంబుగా నజాతశత్రుండు గంగా ప్రవాహంబున కరిగి యందు నిజ వధూయుక్తుండై శాస్త్రోక్త ప్రకారంబున నవభృథస్నానం బాచరించె; నా సమయంబున.

804

తా ॥ ఆ వారాంగనలు మెల్లమెల్లగా నడుస్తూ, చిరునవ్వులు చిందిస్తున్న ముఖారవిందాలతో, ముఖాల పైన ముసురుకొంటున్న ముంగురులతో, ప్రక్కనున్న వారిపైన పన్నీటి జల్లులు కురిపిస్తూ, కస్తూరితో కలిపిన కుంకుమపంకాన్ని ఇతరుల ముఖాలకు పట్టిస్తూ, కర్పూరంతో కూడిన పసుపు కుంకుమలు ఒకరి శిరస్సుపై మరొకరు చల్లుతూ, పూలగుత్తులను పరస్పరం విసరివేసుకొంటూ, పురుషులతో పరిహాసోక్తులు పలుకుతూ, ఆనందంతో ఉప్పొంగిపోతూ వసంతాలాడుకొన్నారు.

అంతఃపుర రాణివాసంవారు బంగారు పల్లకీలనెక్కి చెలికత్తెలు సేవిస్తుండగా మహారాణి వెంట నడిచారు. సాటి రాజకాంతల చెలికత్తెలతో తమ చెలికత్తెలను పురికొల్పి వసంతాలాడించారు. చమత్కార భరితమైన చెలుల సరసోక్తులు వింటూ, వారి చతురతకు నవ్వులు పండిస్తూ, పాండవరాజకాంతలందరూ ఉత్సాహంగా వెళ్ళారు. ఆ విధంగా మహా వైభవంగా బయలుదేరిన ధర్మరాజు, ద్రౌపదీ దేవితో సహా గంగానదిని చేరుకొన్నాడు. శాస్త్రంలో చెప్పబడిన విధంగా దంపతులిద్దరూ యజ్ఞం పరిసమాప్తమయిన తరువాత చేయవలసిన అవబృథస్నానం చేసి పరమ పవిత్రులైనారు.

క. అనిమిషదుందుభీ ఘన ని, స్వనములు వీతెంచెఁ బుష్పవర్షము గురిసెన్
మునిదేవపితృమహీసుర, వినుతుల రవ మెసఁగె నపుడు విమల చరిత్రా!

805

తా ॥ ధర్మజద్రౌపదులు అవబృథస్నానం చేసిన సమయంలో దేవతలు మంగళకరములైన దుందుభి మొదలైన వాద్యాలు మ్రోగించారు. వారిపైన పుష్పవర్షం కురిపించారు. మహర్షులు, దేవతలు, పితృదేవతలు, బ్రాహ్మణోత్తములు ధర్మరాజును ప్రస్తుతిస్తూ ఆశీర్వదించారు.

క. నరు లెట్టి పాపులైనను, గర మర్థిని నెద్ది సేసి గతకల్మషులై
చరియింతు రట్టి యవభృథ, మరుదుగఁ గావించి రెలమి నఖిలజనంబుల్.

806

తా ॥ పరీక్షిన్మహారాజా! మానవులు ఎటువంటి ఘోర పాపాలు చేసినా, ఆ పాపాలన్నింటి నుంచీ విముక్తులు కావడానికి అవబృథ స్నానం చేయాలి. అటువంటి మహాపవిత్రమైన అవబృథస్నానాన్ని ధర్మరాజుతో గంగానదికి వెళ్ళినవారందరూ చేసి పుణ్యులైనారు.

ఆ. అంత ధర్మతనయుఁ డభినవమృదుల దు, కూల సురభికుసుమమాలికాను

లేపనములు రత్న దీపిత భూషణా, వళులు దాల్చి వైభవమున నొప్పె.

807

తా ॥ ధర్మరాజు క్రొత్తవైన సన్నని వస్త్రాలు ధరించాడు. సువాసనలు విరజిమ్మే పూలమాలలను, లేపనాలను, మణిమయ భూషణాలను ధరించి మహావైభవంగా వెలిగిపోయాడు.

వ. అంత నవభృథస్నానానంతరంబున మరలి చనుదెంచి,

808

తా ॥ అవబృథస్నానం చేసిన తరవాత అందరూ తిరిగి ఇంద్రప్రస్థ పురానికి వచ్చారు.

ఉ. పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి భాసమాన మా
ర్తాండనిభుండు యాజక సదస్య మహీసుర మిత్ర బంధు రా
ణ్మండలిఁ బూజ సేసి బుధ మాన్య చరిత్రుడు వారి కిచ్చె నొం
డొండ దుకూలరత్న కనకోజ్జ్వల భూషణ ముఖ్యవస్తువుల్.

809

తా ॥ సూర్యతేజోనిధి, మహనీయుల చేత గౌరవింపబడే చరిత్రగలవాడు, దిగంతాలవరకూ వ్యాపించిన కీర్తిగలవాడు అయిన ధర్మరాజు ఇంద్రప్రస్థ పురానికి తిరిగి వచ్చిన తరువాత యజ్ఞం చేయించినవారిని, యజ్ఞాన్ని చూసిన వారిని, బ్రాహ్మణులను, మిత్రులను, బంధువులను, రాజులను సగౌరవంగా పూజించాడు. వారందరికీ మేలివస్త్రాలను, రత్నాలతో పొదగబడిన స్వర్ణాభరణాలను, అనేకమైన మంచి మంచి వస్తువులను కానుకలుగా సమర్పించాడు.

వ. అట్లు నారాయణ పరాయణులై దేవసమాన ప్రకాశ ప్రభావంబుల సకలనరనారీలోకంబు

లనర్ఘ్యరత్నమయ భూషణ మాల్యానులేపనంబులు ధరించి పరమానంద భరితాత్ములై యెప్పియుండి; రంత.

810

తా ॥ ఇంద్రప్రస్థపురంలోని పౌరులందరూ ధర్మరాజు ఇచ్చిన మణిమయ భూషణాలను, పూలమాలలను, మైపూతలను ధరించి దేవతలలాగా వెలిగిపోతూ, శ్రీమన్నారాయణ పూజా ధురంధరులై సంతోషంతో విలసిల్లారు.

చ. సునిశితభక్తిఁ దన్మఖముఁ జూడఁగ వచ్చిన యట్టి దేవతా
ముని ధరణీ సుర ప్రకరభూవర విడ్జన శూద్రకోటి య
జ్ఞనవరచంద్రుచే నుచితసత్కృతులం బరితోషచిత్తులై
వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్.

811

తా ॥ రాజసూయ యజ్ఞాన్ని భక్తిభావంతో చూడటానికి వచ్చిన దేవతలు, మహర్షులు, చాతుర్వర్ణ్య ప్రజలు ధర్మరాజు చేత సకలసత్కారాలు పొంది, సంతృప్తి పొందినవారై ఆ మహారాజు అంగీకారాన్ని తీసుకొని వెళ్ళిపోయారు.

చ. హరిచరణాంబుజాత యుగళార్చకుఁడై పెనుపొందు పాండు భూ
వరసుత రాజసూయ మఖవైభవమున్ నుతియించుచున్ సమా
దరమున నాత్మభూముల కుదారత నేఁగిరి ధర్మసూనుఁడున్
సరసిజనేత్రుఁ దా ననుపఁజాలక యుండు మటంచు వేఁడినన్.

812

తా ॥ శ్రీకృష్ణుని పాదపద్మాలను పూజించి, మహోన్నతుడై వెలుగొందుతున్న ధర్మరాజు చేసిన యజ్ఞవైభవాన్ని వేనోళ్ళ పొగడుతూ ఋత్విక్కులు, సదస్యులు, రాజులు, తక్కినవారూ

అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ధర్మరాజు, శ్రీకృష్ణుణ్ణి అప్పుడే పంపలేక, ఇంద్రప్రస్థపురంలోనే మరికొంతకాలం ఉండవలసిందని వేడుకొన్నాడు.

వ. ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని దామోదరుండు సమస్త యాదవులను గుశస్థలికిఁ బోవం బనిచి కతిపయ పరిజనంబులుం దానును నతనికిఁ బ్రియంబుగాఁ దన్నగరంబునఁ బ్రమోదంబున నుండె' నని చెప్పి మఱియు నిట్లనియె.

813

తా ॥ ధర్మరాజు ప్రార్థనను మన్నించిన శ్రీకృష్ణుడు యాదవులనందరినీ ద్వారకకు పంపి, కొద్దిమంది సేవకులను మాత్రం తన వద్ద ఉంచుకొని, ధర్మరాజుకు ప్రియం కలిగేటట్లు ఇంద్రప్రస్థపురంలోనే పాండవులతో కలిసి ఆనందంగా ఉన్నాడు" అని చెప్పి, శుకమహర్షి మళ్ళీ ఈ విధంగా అన్నాడు:

చ. 'జనవర! పాండుభూప తనుజాతుఁడు దుస్తరమౌ మనోరథా<br>బ్ధిని సరసీరుహాక్షుఁడను తెప్పకతంబున దాఁటి భూరి శో<br>భనయుతుఁడై మనోరుజలఁ బాసి ముదాత్మకుఁడై వెలింగె న<br>వ్వనరుహనాభు దాసజన వర్యులకుం గలవే యసాధ్యముల్?

814

తా ॥ "పరీక్షిన్మహారాజా! ధర్మరాజు దాటశక్యంకాని 'రాజసూయ యజ్ఞం చేయాలనే' తన కోరిక అనే సముద్రాన్ని శ్రీకృష్ణుడనే నావ ద్వారా దాటి, తన మనస్సులోని బాధను పోగొట్టుకొని, వైభవోపేతుడై ఆనందంతో ప్రకాశించాడు. రాజా! విష్ణుమూర్తి దాసులకు అసాధ్యమైనదేదీ ఉండదు కదా!

వ. అట్టియెడ.

815

తా ॥ ఆ సమయంలో –

ఆ. రాజసూయ మఖవర ప్రభావమునకు, నఖిలజనులు మోదమంది రపుడు
కలుషమానసుండు కులపాంసనుఁడు సుయో, ధనుఁ డొకండు దక్క ధరణినాథ!'

816

తా ॥ రాజసూయ యజ్ఞప్రభావానికి సర్వులూ సంతోషించారు. తీరిన కోరికలతో శ్రీకృష్ణణ్ణి వినుతించారు. ధర్మరాజును మెచ్చుకున్నారు. పాపాత్ముడు, కులనాశకుడు అయిన దుర్యోధనుడు ఒక్కడు మాత్రము సంతోషించక, అసూయ చెందాడు."

వ. అనిన విని శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

817

తా ॥ అని శుకమహర్షి చెప్పగా విన్నవాడై పరీక్షిత్తు ఆ మునితో ఇలా అన్నాడు:

ఆ. 'అఖిల జనులకెల్ల నానంద జనకమై, యెనయు మఖము కురుకులేశ్వరునకుఁ
గర మసహ్యమైన కారణ మెయ్యది, యెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత!'

818

తా ॥ "ఓ మహానుభావా! సమస్త జనులకు ఆనందదాయకమైన రాజసూయ యజ్ఞం కురుసార్వభౌముడైన దుర్యోధనుడికి ఎందుకు అయిష్టమైనదో వివరించి చెప్పండి. తెలుసుకోవాలని ఉంది."

చ. అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండు నం
దనులదెస న్ననేక దురితంబులు నిచ్చలుఁ జేయుచుండు నై
నను నొకనాఁడు పంకరుహనాభ దయాపరిలబ్ధభూరి శో
భన జిత దేవదైత్య నరపాలక రాజ్యరమామహత్త్వమై.

819

తా ॥ అని పరీక్షిత్తు అడుగగా శుకయోగి ఇలా చెప్పాడు: “దుర్యోధనుడు పాండవులపట్ల ఎప్పుడూ పాపకార్యాలు చేస్తూనే ఉన్నాడు. వాళ్ళకు అనేక ద్రోహాలు తలపెడుతూనే ఉన్నాడు. అయినా శ్రీకృష్ణుణ్ణి దయతో దేవతలను, రాక్షసులను, రాజులను జయించి రాజ్యలక్ష్మితో, సకల శుభాలతో వాళ్ళు వర్ధిల్లుతూనే ఉన్నారు.

చ. వెలయు ననూనసంపదల విశ్రుతకీర్తుల మిన్ను ముట్టఁ బెం
పలరిన పాండుభూవరసుతాగ్రజుఁ డంతిపురంబులోన ను
జ్జ్వలమణి భూషణాంశు రుచిజాలము బర్వఁ బయోజనాభు ను
త్కలిక భజించుచున్ ఘనసుఖస్థితి భూరిమనోహరాకృతిన్.

820

తా ॥ ఆ విధంగా అత్యధికమైన సంపదలతో, దిగంతాలవరకూ వ్యాపించిన కీర్తితో, వైభవోపేతంగా అలరారుతున్న ధర్మరాజు మహోత్కంఠతో కృష్ణపరమాత్ముని సేవిస్తూ, రాజలాంఛనాలైన మణిభూషణాదులతో ప్రకాశిస్తూ సుఖంగా ఉన్నాడు.

వ. ఉండం గనుంగొని యదియునుంగాక యొక్కనాఁడు లలితాష్టమీ శశాంకబింబంబులం విడంబించుచు నింద్రనీలరుచి నిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబు సలుపం దనరు నిటల ఫలకంబులును, బుష్పచాప చాప ప్రచారంబుల యేపుచూపు భ్రూయుగోపాంతములై సౌదామనీదామ రుచిస్తోమంబులై, కర్ణాంతసీమంబులై యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికా ముకుళ విభాసిత దంతమరీచికా నిచయోద్దీపిత మందహాస చంద్రికాధవళితంబులును ముకురోపమితంబులునునై కర్ణకుండల మణిమరీచి జాలంబులు బెరసి బహుప్రకారంబులఁ బర్వం బొలుచు కపోల పాలికలును, విలసిత గ్రైవేయక ముక్తాఫలహార నిచయంబుల కిమ్ము

చూపక, మిసమిసని పసగల మెఱుంగులు గిరికొన మీటినం బగులు ననం బొగడం దగి మొగంబులకుం బుటంబు లెగయు నుత్తుంగపీన కుచభారంబుల వ్రేఁగు లాఁగ లేక తూఁగాడుచుం గరతల పరిమేయంబు లగు మధ్యభాగంబులును, ఘనజఘన మండలావతీర్ణకాంచన కాంచీకలాప కింకిణీకలకల నినదోల్లసితంబులగు కటిప్రదేశంబులును, సల్లలితహల్లక పల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలు గొని యభిరామంబులై శోభిల్లు పదపాణితలంబులును, నలసగతులం బదంబులం దనరు మణినూపురంబులు గోపురంబులం బ్రతిస్వనంబు లొలయ మొరదు నలరు చరణారవిందంబులను, రత్నవలయ కంకణాంగుళీయకాది వివిధ భూషణద్యుతి నిచయంబు లుష్ణమరీచి కరనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును, మృగమదఘనసార హరిచందనాగరు కుంకుమ పంకంబుల భాసురంబులగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై సొలయు సౌభాగ్యంబులు గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపు బొమ్మల విధంబున గగనమండలంబు నిర్గమించి, వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున శృంగార రసంబు మూర్తీభవించి జగంబుల మోహపఱచు మోహినీ దేవతల చందంబున, విలసించు మాధవ వధూసహస్రంబుల సంగతిని సౌదామనీలతయునుం బోలె నొప్పుచుండెడు ద్రుపదరాజనందన విభవంబును రాజసూయ మహాధ్వరోత్సవంబునుం జూచి చిత్తంబుత్తలపడ సుయోధనుండు సంతాపానలంబునం గ్రాఁగుచుండె; నంత నొక్క నాఁడు ధర్మనందనుఁడు నిర్మలం బగు సభాభవనంబునకుం జని.

821

తా ॥ ఏ విధమైన కష్టం లేకుండా వైభోగాన్ని అనుభవిస్తున్న ధర్మజుని చూసి ఈర్ష్యాళువైనాడు సుయోధనుడు. అంతేకాదు. సుందరమైన అష్టమినాటి చంద్రబింబాన్ని తిరస్కరించే అందంతో ఒప్పారుతున్న ఫాలభాగాలతో; వాటిపై శోభాయమానంగా ముసురుతున్న నల్లని ముంగురులతో; చెఱకువింటివంటి కనుబొమలతో, చెవుల వరకు

వ్యాపించిన కాటుక తీర్చిదిద్దిన కళ్ళతో; మల్లెమొగ్గల తెల్లని కాంతివంటి కాంతితో మెరిసిపోతున్న దంతాలతో, చిరునవ్వుల వెన్నెలలతో; అద్దాలవంటి చెక్కిళ్ళ మెఱుపులతో; చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తున్న చెవిదుద్దుల ఎఱ్ఱని కాంతులతో, ముత్యాల హారములకు కూడా చోటివ్వని ఎత్తైన, కఠినమైన స్తనసంపదతో; పిడికిలంత సన్నని నడుములతో, బంగారు వడ్డాణాల చిరు గజ్జెల చిరుచిరు ధ్వనులతో ఒప్పుతున్న కటిప్రదేశాలతో; ఎఱ్ఱ కలువలకాంతుల వంటి కాంతులతో మనోహరంగా కనిపిస్తున్న అరచేతులతో; చిగుళ్ళ కాంతిని తిరస్కరిస్తూ ఎఱ్ఱగా దేదీప్యమానంగా వెలుగొందుతున్న అరిపాదాలతో; మణులతో పొదగబడిన కాలి అందెల ఘలఘలతో విందులు చేస్తున్న పాదపద్మాలతో; రత్నాల గాజులతో, బంగారు కంకణాలతో, వజ్రాల ఉంగరాలతో వెలిగిపోతున్న చేతులతో; సుగంధభరితమైన కర్పూరాది నానావిధ ద్రవ్యముల మైపూతలతో, దివినుండి భూలోకానికి వచ్చిన చంద్రరేఖయా అన్నట్లు; చలనంతో కూడిన బంగారు బొమ్మలా అన్నట్లు; శృంగారరసం మూర్తీభవించిన మోహినీ దేవతలా అన్నట్లు; వేయివెలుగులతో వెలిగిపోతున్న శ్రీకృష్ణుని వేలాది సతీమణుల మధ్య మెరపుతీగెలా మెరిసిపోతూ సౌందర్యాధి దేవతవలె విరాజిల్లుతున్న ద్రౌపదీ దేవిని చూసి దుర్యోధనుడు మదమాత్సర్యాలకు లోనైనాడు. రాజసూయ యజ్ఞ ఫలాన్ని అనుభవిస్తున్న ద్రౌపదీ ధర్మజుల సమస్త విభవాలకు మనస్సులో కుతకుతలాడిపోయాడు. సంతాపాగ్నిలో క్రాగిపోయాడు. ఆ విధంగా దుర్యోధనుడు – పాండవులు పత్నీసమేతంగా పొందుతున్న సకల సుఖాలను చూసి ఓర్వలేకుండా ఉన్న కాలంలో, ఒకనాడు ధర్మరాజు ప్రశస్తమైన తన సభాభవనానికి వెళ్ళాడు.

సీ. సుత సహోదర పురోహిత బాంధవామాత్య పరిచార భటకోటి బలసి కొలువఁ
గలిత మాగధ మంజు గానంబుఁ బాఠక పఠన రవంబును బ్రమద మొసఁగఁ
గంకణ ఝణఝణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరము లిడఁగ
మయ వినిర్మిత సభామధ్యంబునను భాసమాన సింహాసనాసీనుఁ డగుచు

తే. నమర గణములు గొలువఁ బెంపారు ననిమి, షేంద్రు కైవడి మెఱసి యుపేంద్రుఁ డలర
వరుసఁ గొలువున్న య త్తఱి దురభిమాని, క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు.

822

తా ॥ సోదరులు, పుత్రులు, పురోహితులు, బంధువులు, మంత్రులు, పరిచారకులు, భటులు ధర్మరాజును పరివేష్టించి కొలుస్తున్నారు. వందిమాగధులు కైవారాలు చేస్తున్నారు. గాయకులు గానం చేస్తున్నారు. చేతి కంకణాల ఝణఝణ నాదాలు మధురంగా వినిపిస్తుండగా చేటికలు వింజామరలు వీస్తున్నారు. ఆ విధంగా, శోభాయమానంగా, దేవతలచేత కొలువబడే దేవేంద్రుని మాదిరి ధర్మరాజు మయుడిచేత నిర్మితమైన సభామధ్యంలో మణిమాణిక్యాలతో ప్రకాశిస్తున్న సింహాసనం మీద ఆసీనుడై ఉన్నాడు. ఇంద్రవైభోగంతో వెలిగిపోతున్న ధర్మరాజును చూసి శ్రీకృష్ణుడు ఆనందించాడు. కానీ దురభిమాని, మహాక్రోధి, మాత్సర్యమే ధనముగా గలవాడు, అయిన సుయోధనుడు హర్షించలేకపోయాడు.

ఉ. కాంచనరత్నభూషణ నికాయముఁ దాల్చి సముజ్జ్వల ప్రభో
దంచితమూర్తి నొప్పి ఫణిహారులు ముందటఁ గ్రందు వాయ వా
రించి సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప నే
తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్.

823

తా ॥ పాండవులకు తన వైభవాన్ని చూపించాలనే ఉద్దేశంతో దుర్యోధనుడు రత్నాభరణాలను, సువర్ణ భూషణాలను ధరించి మహోజ్జ్వలంగా ప్రకాశిస్తూ, ఫణిహారులు ముందర ఉన్న జనాన్ని ప్రక్కలకు జరుపుతుండగా, సోదరులు, సామంత రాజులు ఇరువైపులా కొలిచిరాగా, మహారాజసంతో యుధిష్ఠిరుడి దగ్గరకు వచ్చాడు.

వ. అట్లు సనుదెంచి మయమాయా మోహితంబైన సభాస్థలంబునందు.

824

తా ॥ ఆ విధంగా వచ్చి మయుని చేత నిర్మింపబడిన మాయతోకూడిన మయసభలో–

క. సలిలములు లేని తావున, వలువలు వెస నెగయఁ దిగిచి వారక తోయం
బులు గల చోటను జేలం, బులు దడియఁగఁ బడియె నిజవిభుత్వము దఱుఁగన్

825

తా ॥ నీరులేని చోట నీళ్ళున్నాయనుకొని దుర్యోధనుడు తన బట్టలను పైకిపట్టుకొని నడిచాడు. నీళ్ళున్న చోట బట్టలు క్రిందకు దించి, దిగి, వస్త్రాలు తడిసిపోవడంతో సిగ్గుపడి, రాజసాన్ని కోల్పోయాడు; మయసభ యొక్క మాయలకు భ్రమసిపోయాడు.

క. ఆ విధమంతయుఁ గనుఁగొని, పావని నవ్వుటయు నచటి పార్థివులును గాం
తావలియును యమతనయుఁడు, వావిరిఁ జేసన్నఁ దమ్ము వారింపంగన్.

826

తా ॥ దుర్యోధనుడు ఈ విధంగా భ్రమపడి ప్రవర్తించడాన్ని చూసిన భీమసేనుడు నవ్వాడు. ధర్మరాజు చేతి సంజ్ఞతో వారిస్తున్నా కూడా, కృష్ణుడు ఆమోదించడంతో అక్కడ చేరిన రాజులు, స్త్రీ జనం దుర్యోధనున్ని చూసి పెద్దగా నవ్వుతూ పరిహసించారు.

వ. దామోదరానుమోదితులయి మహారవంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు లజ్జావనత వదనుండై కుపితమానసుం డగుచు నయ్యెడ నిలువక వెలువడి నిజపురంబున కరిగె; నయ్యవసరంబున ధీవిశాలురైన సభాసదులగు నచ్చటి జనంబుల కోలాహలంబు సంకులంబైన నజాతశత్రుండు చిత్తంబున విన్న నైయుండె; న పుండరీకాక్షుండు భూభార నివారకారణుం డగుటం జేసి దుర్యోధను నపహాసంబునకుం గా దాన దయ్యె; నంత.

827

తా ॥ ధర్మరాజు కాక మిగిలిన పాండవులు, స్త్రీ జనం తనను చూసి పకపకా పగలబడి నవ్వడంతో అసలే దురభిమాని అయిన దుర్యోధనుడు లజ్జతో కుంగిపోయాడు. తల దించుకొని, కోపంతో అక్కడ క్షణం కూడా నిలవలేక బయటకు వచ్చి హస్తినాపురానికి వెళ్ళాడు. ఆ

సందర్భంలో మయసభలో ఉన్న జనుల కోలాహలం చెలరేగి పోయింది. ఆ సన్నివేశానికి ధర్మరాజు మనస్సు చిన్నబోయింది. భూభారాన్ని నివారించడానికి, దుష్టజన సంహారానికి కారణజన్ముడైన శ్రీకృష్ణుడు దుర్యోధనునికి జరిగిన అవమానాన్ని ఆపలేదు. ఎవరినీ మందలించలేదు. ఉపేక్షాభావంతో ఊరుకొన్నాడు.

క. హరి ధర్మసుతుని వీడ్కొని, తరుణీ హిత బంధుజన కదంబము గొలువం
బరితోషమునఁ గుశస్థల, పురమునకుం జనియె మోదమున నరనాథా!

828

తా ॥ తరువాత శ్రీకృష్ణుడు ధర్మరాజును వీడ్కొని, భార్యలతో, హితులతో, బంధుజనంతో కలిసి సంతోషంగా ద్వారకా నగరానికి వెళ్ళాడు.

చ. జనవరబంధమోక్షణముఁ జైద్యవధంబును బాండురాజ నం
దన మఖరక్షణంబును నుదారతఁ జేసిన యట్టి దేవకీ
తనయు చరిత్ర భాసుర కథా పఠనాత్ములు గాంతు రిష్ట శో
భన బహుపుత్త్ర కీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్.

829

తా ॥ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని శౌర్యాన్ని ప్రకటించే జరాసంధుని చేత బంధింపబడిన రాజుల విమోచనము, శిశుపాలవధ, రాజసూయయాగ సంరక్షణము అనే ప్రఖ్యాత కథలను ఎవరైతే శ్రద్ధగా పఠిస్తారో, వారికి వారు కోరిన కోరికలన్నీ ఫలిస్తాయి. సంతానం కలుగుతుంది. సత్కీర్తి లభిస్తుంది. జ్ఞానసంపద చేకూరుతుంది. విష్ణుపదం అందుతుంది.”

క. అని శుకయోగీంద్రుం డ, మ్మనుజేంద్రునిఁ జూచి పలికె మఱియును శ్రీకృ
ష్ణుని యద్భుత కర్మంబులు, వినిపింతున్ జిత్తగింపు విమలచరిత్రా!

830

తా ॥ అని శుక యోగి పరీక్షిత్తుకు తెల్పి, “రాజా! ఇవే కాకుండా శ్రీకృష్ణుని మహిమోపేతమైన మరిన్ని అద్భుత కార్యాలను చెబుతాను, విను” అని ఇలా ప్రారంభించాడు:

## సాల్వుడు ద్వారకాపురిపై దండెత్తుట

సీ. వసుధేశ! విను; మును వైదర్భి పరిణయ వేళ దుర్మద శిశుపాలభూమి
వరునకుఁ దోడ్పడ నరుదెంచి సైనికావలితోడఁ దొడరి దోర్బలము దూలి
హరిచేత నిర్జితులైన రాజులలోనఁ జైద్యుని చెలికాఁడు సాల్వధరణి
పతి జరాసంధాది పార్థివప్రకరంబు విన మత్సరానల విపులశిఖల

తే. ధాత్రి నిటమీఁద వీతయాదవము గాఁగఁ, గడఁగి సేయుదు నని దురాగ్రహముతోడఁ
బంతములు పల్కి యటఁ జని భరితనిష్ఠఁ, దపము కావింపఁ బూని సుస్థలమునందు.

831

తా ॥ “మహారాజా! శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని పరిణయమాడిన వేళలో బలగర్వంతో శిశుపాలుడికి సహాయభూతులుగా వచ్చిన రాజులలో సాల్వుడు కూడా ఒకడు. సైన్యసమేతుడై కృష్ణుణ్ణి ఎదిరించడానికి వచ్చిన సాల్వమహీపాలుడు శ్రీకృష్ణుడి చేత ఓడింపబడి పగబూనాడు. ఈర్ష్యాగ్నితో దురాగ్రహానికి పాల్పడ్డాడు. భూమిపైన యాదవుడనేవాడు లేకుండా చేస్తానని జరాసంధుడు మొదలైనరాజులందరూ వినేటట్లు భీషణ ప్రతిజ్ఞ చేశాడు. తన ప్రతిజ్ఞను నెరవేర్చుకోవడానికి ఒక చక్కని ప్రదేశాన్ని ఎంచుకొని నిష్ఠతో శివుని గురించి తపస్సు చేయసాగాడు.

క. ధృతి వదలక యుగ్రస్థితిఁ, బ్రతిదినమును బిడికెఁ డవనిరజ మశనముగా
నతినియమముతో నా పశు, పతి శంకరు ఫాలనయను భర్గు నుమేశున్.

832

తా ॥ సాల్వుడు ధైర్యాన్ని ఏమాత్రం వదలకుండా, మహోగ్రంగా తపస్సు చేశాడు. ప్రతిరోజూ భూమిపైన ఉన్న పిడికెడు ధూళిని ఆహారంగా తీసుకొంటూ పార్వతీ నాథుడు, భర్గుడు, త్రినేత్రుడు, పశుపతి అయిన శంకరుణ్ణి గూర్చి అత్యంత నియమ నిష్ఠలతో తపస్సు

చేస్తున్నాడు.

క. చెదరని నిజభక్తిని ద, త్పదపద్మము లాత్మ నిలిపి పాయక యొక యేఁ
దుదితక్రియ భజియించిన, మదనారియు వాని భక్తి మహిమకు వశుఁడై.

833

తా ॥ చెక్కుచెదరని నిజభక్తితో, ఆ పరమేశ్వరుని పాదపద్మాలను మనస్సులో నిలుపుకొని ఒక్కరోజు కూడా వదలకుండా, యేడాదిపాటు సాల్వుడు ఘోరతపస్సు చేశాడు. సాల్వుడి తపస్సుకు, అచంచలమైన అతని భక్తికి శంకరుడు వశమైపోయాడు.

క. బోరనఁ బ్రత్యక్షంబై, కోరినవర మేమి యైనఁ గొసరక యిత్తున్
వారక వేఁడు మ టన్నను, నా రాజతపోధనుండు హరునకుఁ బ్రీతిన్.

834

తా ॥ భక్తవశంకరుడైన శంకరుడు సాల్వుడికి ప్రత్యక్షమై "నీవు ఏ వరం కోరినా ఆ వరం ఇస్తాను. భయం లేకుండా, అనుమానించకుండా వరం కోరుకో" అని ప్రసన్నుడైనాడు.

తే. వందనం బాచరించి యానందవికచ, వదనుఁడై నొస లంజలిఁ గదియఁ జేర్చి
శ్రితదయాకార! నన్ను రక్షించెదేని, నెఱుఁగ వినిపింతు వినుము మదీప్సితంబు.

835

తా ॥ శంకరుణ్ణి చూసి సాల్వుడు ఉప్పొంగిపోయి, నమస్కరించి, నుదుటిపైన రెండు చేతులు జోడించి స్తుతించాడు: "శంకరా! ఆశ్రితులను రక్షించే దయామూర్తీ! నన్ను రక్షించాలని నీవనుకొంటే – నా కోరిక తెలియజేస్తాను. విను. నన్ను అనుగ్రహించు.

తే. గరుడ గంధర్వ యక్ష రాక్షస సురేంద్ర, వరులచే సాధ్యపడక నా వలయు నెడల
నభ్రపథమునఁ దిరిగెడు నట్టి మహిత, వాహనము నాకు దయసేయు వరద! యీశ!

836

తా ॥ ఈశ్వరా! శంకరా! వరప్రదాతా! గరుడుల చేత, గంధర్వులచేత, యక్షులచేత, రాక్షసులచేత, దేవతల చేత అడ్డుపడకుండా ఆకాశమార్గంలో నేను కోరిన చోటికి, నేను కోరినప్పుడు తిరగగలగడానికి నాకొక గొప్ప వాహనాన్ని ప్రసాదించు." అని సాల్వుడు కోరాడు.

వ. అని అభ్యర్థించినం బ్రసన్నుండై హరుండు వాని కోర్కి కనురూపంబైన పురంబు నిర్మింప మయుని నియోగించిన నతండును 'నట్ల చేసెద' దని కామగమనంబును నతి విస్తృతంబునుగా లోహంబున నిర్మించి సౌభకం బను నామం బిడి సాల్వున కిచ్చిన వాఁడును బరమానందంబునుం బొంది తద్విమానారూఢుండై యాదవుల వలని పూర్వవైరంబుఁ దలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁ జని నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు నిరోధించి.

837

తా ॥ అని సాల్వుడు ప్రార్థించగానే వరదుడైన హరుడు మయుణ్ణి పిలిచి సాల్వుని కోర్కెకు తగిన విమానాన్ని నిర్మించి ఇమ్మని చెప్పాడు. దానికి మయుడు "దేవా! నీవు చెప్పిన విధంగానే చేస్తా" నని చెప్పి ఎక్కడికి వెళ్ళాలని కోరుకుంటే అక్కడకు వెళ్ళగలిగే, చాలా పెద్దదైన, పురమంత వైశాల్యంగలిగిన, లోహంతో ఒక విమానాన్ని నిర్మించి సాల్వుడికిచ్చాడు. దానికి "సౌభక" మనే పేరుకూడా మయుడే పెట్టి ఇచ్చాడు. సాల్వుడు పరమానందంతో ఆ విమానాన్ని ఎక్కి శ్రీకృష్ణుని మీద ఏర్పడిన పగను గుర్తుచేసుకొన్నాడు. సౌభక విమానం తనదే కదా, తనకింక ఎదురులేదని నిశ్చయించి, గర్వాంధుడై సైన్యసమేతంగా ద్వారకానగరం చేరి, ఆ పురవాసులను నిర్బంధించసాగాడు.

సీ. సరిదుపవన సరోవరములు మాయించి బావులు గలఁచి కూపములు చెఱిచి
కోటలు వెస విటతాటముల్ గావించి పరిఘలు పూడ్చి వప్రములు ద్రొబ్బి

యట్టళ్లు ధరఁ గూల్చి యంత్రముల్ దునుమాడి కాంచనధ్వజ పతాకములు నఱకి
భాసుర గోపుర ప్రాసాదహర్మ్యందు శాలాంగణములు భస్మములు చేసి

తే. విమల కాంచనరత్నాది వివిధవస్తు, కోటినెల్లను నందంద గొల్లపుచ్చి
ప్రజలఁ జెఱపట్టి దొరలను భంగపెట్టి, తఱిమి యి బ్బంగిఁ బెక్కుబాధల నలంచి.

838

తా ॥ సాల్వుడు ద్వారకానగరం లోపలా, బయటా ఉన్న నదులను, ఉద్యానవనాలను అల్లకల్లోలం చేశాడు. బావులు పూడ్చించాడు. కూపములను చెడగొట్టాడు. కోటలను ఛిన్నాభిన్నం చేశాడు. అగడ్తలను నాశనం చేశాడు. కోట స్తంభాలను క్రిందపడేటట్లు చేశాడు. బురుజులు కూల్చేశాడు. యంత్రాలు పగులకొట్టాడు. బంగారు పతాకాలను ఖండించాడు. గోపురాలను, భవనాలను, చంద్రశాలలను బూడిదపాలు చేశాడు. ద్వారకానగరంలో ఉన్న, బంగారాన్ని, మణిమాణిక్యాలను, రత్నాలను, వివిధ వస్తుసముదాయాన్ని ఎక్కడికక్కడ కొల్లగొట్టాడు. ప్రజలను నిర్బంధించాడు. ప్రభువులను అవమానించాడు. ఈ విధంగా అందరినీ తరిమితరిమి కొట్టి చెప్పలేనన్ని బాధలతో కష్టపెట్టాడు.

చ. మదమున నంతఁ బోవక విమానయుతంబుగ నభ్రవీథికిన్
గొదకొని యేపుమై నెగసి కొంకక శక్తి శిలామహీరుహ
ప్రదరము లోలిమైఁ గురిసి బంధురభూమిపరాగ శర్కరల్
వదలక చల్లుచున్ వలయవాయువుచే దిశ లావరింపుచున్.

839

తా ॥ సాల్వుడు ద్వారకావాసులను అంతటితో వదలలేదు. అతనిలో అంతకంతకు గర్వం పెరగసాగింది. మదం హెచ్చసాగింది. విమానంతో సహా ఒక్కసారిగా ఆకాశంపైకి ఎగిరి జంకూగొంకూ లేకుండా చెట్లను, రాళ్ళను యాదవులపై కురిపించేవాడు. ప్రజలందరిపై మట్టినీ, దుమ్మునూ చల్లేవాడు. నాలుగు దిక్కులా సుడిగాలులు వ్యాపించేటట్లు చేసి అందరినీ

బాధించేవాడు.

వ. అట్టియెడ.

840

తా ॥ ఆ సమయంలో—

క. చటులపురత్రయదనుజో, త్కటదుష్కర బాధ్యమానధారుణి గతి న
ప్పుటభేదన మెంతయు వి, స్ఫుటపీడం జెంది వగల సుడివడుచుండన్.

841

తా ॥ త్రిపురాసురుల చేతిలో వారి దుష్టచర్యలతో పీడింపబడిన భూమండలం లాగా సాల్వుని చేతిలో ద్వారకా పురమంతా నాశనం కావింపబడి దుఃఖంతో సుళ్ళుతిరిగింది. ఆ పీడనకు తట్టుకోలేక చింతాక్రాంత అయిన ద్వారకను, ద్వారకా ప్రజలను ప్రద్యుమ్నుడు చూశాడు.

చ. కని భగవంతుఁడన్ రథిశిఖామణియున్నగు రౌక్మిణేయుఁ డ
జ్జనముల 'నోడ కుండుఁ' డని సంగరకౌతుక మొప్ప దివ్య సా
ధనములుఁ బూని సైనిక కదంబము గొల్వ ననూన మీన కే
తన రుచి గ్రాల నున్నతరథస్థితుఁడై వెడలెన్ రణోర్వికిన్.

842

తా ॥ రథికులలో మహోన్నతుడు, భగవంతుడే అని చెప్పదగినవాడు, ప్రతాపవంతుడు అయిన రుక్మిణీదేవి పుత్రుడైన ప్రద్యుమ్నుడు ప్రజలను భయపడవద్దని ధైర్యం చెబుతూ, రణోత్సాహంతో ఆయుధాలను ధరించి, సైన్యసమూహం తనను కొలిచి వస్తుండగా, సాటిలేని మీనకేతనం యొక్క కాంతులు నాలుగువైపులా ప్రసరిస్తుండగా, రథారూఢుడై సాల్వుడితో

యుద్ధానికి వెళ్ళాడు.

వ. అ య్యవసరంబున.

843

తా ॥ ఆ సమయంలో—

ච. సమధిక బాహుశౌర్య జితచండ విరోధులు వెళ్లి రున్నత
క్షమ గద భానువింద శుక సాత్యకి సారణ చారుదేష్ణ సాం
బ మకరకేతనాత్మజ శ్వఫల్కతనూభవ తత్సహోదర
ప్రముఖ యదూత్తముల్ విమతభంజనులై కృతవర్మ మున్నుగన్.

844

తా ॥ ప్రద్యుమ్నుడితో సరిసమానమైన శౌర్యప్రతాపాలతో ప్రకాశించేవారూ, బలసంపన్నులై శత్రువులను క్షణంలో జయించేవారూ అయిన యాదవశ్రేష్ఠులు రణరంగానికి ప్రద్యుమ్నుని వెంట నడిచారు. అతిరథుడైన కృతవర్మను ముందుపెట్టుకొని, శత్రుసంహారం చేయాలనే ఉత్కంఠతో గదుడు, భానువిందుడు, శుకుడు, సాత్యకి, సారణుడు, చారుదేష్ణుడు, సాంబుడు, అనిరుద్ధుడు, అక్రూరుడు, వారి సహోదరులు అందరూ యుద్ధానికి వెళ్ళారు.

క. వారణ వాజి స్యందన, వీరభటుల్ వేగచనిరి విశ్వము వణకన్ ఘోరాకృతి వివిధాయుధ,
భూరిద్యుతు లర్కబింబమున్ గబళింపన్.

845

తా ॥ యాదవవీరులందరూ, చతురంగబలాలతో, భూమి కంపించేటట్లు, విశ్వం మొత్తం వణికి పోయేటట్లు, రకరకాల ఆయుధాలను ధరించి, మహాభయంకరంగా కనబడుతూ ఆయుధకాంతులు, వారి ముఖకాంతులు సూర్యబింబాన్ని క్రమ్మివేశాయా అనే విధంగా

యుద్ధరంగానికి చేరారు.

వ. చని యా గోవిందనందన స్యందనంబుం బలసందోహంబునుం దలకడచి, యదు సైన్యంబులు సాల్వబలంబులతోడం దార్కొని బెరయునప్పుడు దేవదానవ సంకుల సనురవిధంబునం దుములంబయ్యె; న య్యెడ.

846

తా ॥ యుద్ధభూమిని చేరిన యాదవవీరులు తమ తమ సైన్యాలతో ప్రద్యుమ్నుని రథాన్ని అతిక్రమించి, సాల్వుని సైన్యంతో తలపడ్డారు. యాదవ సాల్వసైన్యాల సమరం దేవదానవయుద్ధాన్ని తలపింప చేసింది.

మ. వితత జ్యాచయటంకృతుల్ మదజలావిర్భూతశుండాల ఘీం
కృతు లుద్యద్భటహుంకృతుల్ మహితభేరీభాంకృతుల్ భీషణో
ద్ధతనిస్సాణధణంకృతుల్ ప్రకటయోధవ్రాత సాహంకృతుల్
కుతలంబున్ దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా!

847

తా ॥ పరీక్షిన్మహారాజా! ఆ యుద్ధం ఎంత ఘోరంగా జరిగిందంటే వింటి అల్లె త్రాళ్ళ టంకారధ్వనులు, మదపుటేనుగుల ఘీంకారాలు, వీరసైనికుల హుంకారాలు, యుద్ధభేరీల మహాధ్వనులు, భీకరమైన దప్పుల ధణధణ నినాదాలు, వీరాధి వీరుల వీరోచితప్రగల్భ వాక్యాలు నేలానింగీ నిండేటట్లు వ్యాపించి శత్రు భయంకరంగా ఇరుపక్షాల విజయ కాంక్షలతో అనంతంగా సాగింది.

మ. హరిరింఖారథనేమి సద్భటపద వ్యాఘట్టనోద్ధూత దు
స్తరధూళీపటల ప్రభూత నిబిడధ్వాంత ప్రవిధ్వంస కృ
త్కర శాతాసి గదాది హేతిరుచు లాకాశంబు నిండన్ వియ

చ్చర దృక్కుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లఁగన్.

848

తా ॥ ఆ మహా సంగ్రామంలో రథ గజహయభట సముదాయం యొక్క ఘట్టనల వల్లలేచిన ధరాపరాగం ఆకాశాన్నంతటినీ చీకటి మయం చేసింది. వీరాధివీరుల చేతులలోని యుద్ధరంగమంతటా తిరుగుతున్న కత్తుల, గదల, కుంతాయుధాల దేదీప్యమానమైన కాంతులు ఆ చీకటిని తృటిలో మటుమాయం చేస్తున్నాయి. ఈ వింత దృశ్యం ఆకాశంలో సంచరించే దేవతల చూపులకు మిఱుమిట్లు గొల్పుతుంది.

చ. తలకొని సైనికుల్ గవిసి తార్కొని పేర్కొని పాసి డాసి యం
కిలి గొన కెమ్ము లమ్ములఁ బగిల్చి నొగిల్చితరేతరుల్ తలల్
నలియఁగ మొత్తి యొత్తి నయనంబులు నిప్పులు రాల లీల నొఁ
దలలు లలాటముల్ ఘనగదాహతి నొంచి కలంచి పోరఁగన్.

849

తా ॥ ఆ యుద్ధరంగంలోని ఇరుపక్షాల సైనికులు ఒకరినొకరు ఢీ కొని బాణాలు ప్రయోగిస్తూ, దూరంగా జరుగుతూ, మళ్ళీ దగ్గరకు వస్తూ, ఎముకలు విరగకొడుతూ, తలలు బద్దలయ్యేటట్లు గదలతో మొత్తుతూ, క్రోధావేశంతో కళ్ళల్లో నిప్పులు రాలుస్తూ, ఫాలభాగాలు పగిలిపోయేటట్లు కొట్టుకుంటూ మహాభీకరంగా యుద్ధంచేశారు.

వ. అ య్యవసరంబునం బ్రద్యుమ్నుండు గనుంగొని.

850

తా ॥ యాదవ సాల్వవీరులు చేస్తున్న ఘోరయుద్ధాన్ని ప్రద్యుమ్నుడు చూశాడు.

మ. అనయంబుం గలుషించి సౌభపతి మాయాకోట్లు చంచచ్చరా

సన నిర్ముక్త నిశాత దివ్యమహితాస్త్రశ్రేణిచేఁ దత్క్షణం
బున లీలాగతి నభ్రగల్ మనములన్ భూషించ మాయించె న
వ్యనజాతాప్తుఁడు భూరి సంతమసమున్ వారించు చందంబునన్.

851

తా ॥ చూసి కోపం తెచ్చుకొన్నవాడై ప్రద్యుమ్నుడు వీరవిజృంభణతో ముందుకు దుకాడు. సాల్వుడు పన్నిన కోట్లాది మాయలను, దివ్యమైన తన ధనస్సునుండి వెలువడిన నిశితమైన శస్త్రాస్త్రాలతో ప్రద్యుమ్నుడు, క్షణకాలంలో, సూర్యుడు చీకటి ఎలా పోగొడుతాడో, ఆ విధంగా తొలగజేశాడు. ప్రద్యుమ్నుడి యుద్ధకౌశలాన్ని చూసి గగనచారులందరు మహోత్సాహంతో కృష్ణనందనుడిని కీర్తించారు.

వ. మఱియును.

852

తా ॥ ఇంతే కాకుండా,

చ. అతిరథికోత్తముం డన నుదంచిత కాంచనపుంఖ పంచ విం
శతి విశిఖంబుల న్నతని సైనికపాలుని నొంచి యుగ్రుఁడై
శత శతకోటికోటినిభసాయకముల్ పరఁగించి సాల్వభూ
పతి కకుదంబు నొంచి లయభైరవుకైవడిఁ బేర్చి వెండియున్.

853

తా ॥ అతిరథ శ్రేష్ఠుడైన ప్రద్యుమ్నుడు పుంఖాను పుంఖాలుగా ఇరవై అయిదు బాణాలు ప్రయోగించి సాల్వుని సైన్యాధిపతిని క్రింద పడవేశాడు. తరువాత మహోగ్రుడై వజ్రాయుధంతో సమానమైన నూరుకోట్ల బాణాలు ఒకదాని వెంట ఒకటిగా ప్రయోగించి సాల్వుని మదమణచి, వీపు విఱిచి ప్రళయకాలంలోని రుద్రుడిలాగా విఱుచుకుపడ్డాడు.

చ. పదిపది యమ్ములన్ మనుజపాలవరేణ్యుల నొంచి రోషముం
గదురఁగ మూఁడుమూఁడు శితకాండములన్ రథదంతి వాజులం
జదియఁగ నేసి యొక్కొక నిశాతశరంబున సైనికావలిన్
మదము లడించి యిట్లతఁ డమానుషలీలఁ బరాక్రమించినన్.

854

తా ॥ పదిపది బాణాలు వేసి రాజులనందరినీ బాధతో గిలగిల కొట్టుకునేటట్లు చేశాడు. రోషంతో మూడేసి బాణాల చొప్పున రథాలు, గజాలు, అశ్వాలు చతికిలపడేటట్లు చేశాడు. ఒక్కొక్క వాడి బాణంతో సైనికులను కూలవేశాడు. ప్రద్యుమ్నుడు ఈ విధంగా మానవులకు అశక్యమైన రీతిలో తన శౌర్యాన్ని ప్రదర్శించాడు.

క. దుర్మానవహరు నద్భుత, కర్మమునకు నుభయ సైనిక ప్రకరంబుల్ నిర్మలమతి నుతియించిరి, ధర్మాచలధైర్యు విగతభయుఁ బ్రద్యుమ్నున్.

855

తా ॥ దుష్టమానవ సంహారకుడు, మేరుపర్వతమంత ధైర్యంగలవాడు, భయరహితుడు, ప్రతాపవంతుడు అయిన రుక్మిణీ కుమారుణ్ణి, ఉభయసైన్యాలలోని వీరులందరూ అతని పరాక్రమసంపదను వేనోళ్ళ వినుతించారు.

వ. అ య్యవసరంబున.

856

తా ॥ ఆ సమయమందు—

ఉ. సాంబుని సాల్వవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్
జాంబవతీ తనూభవుఁడు చాపము సజ్యము సేసి డాసి సా

ల్వుం బదియేను తూపుల నవోన్నతవక్షము గాఁడ నేసి తీ
క్ష్ణాంబకవింశతి న్నతని సౌభక మల్లలనాడ నేసినన్.

857

తా ॥ సాల్వుడు వచ్చి సాంబున్ని తన బాణపరంపరతో బాగా నొప్పించాడు. సాంబుడు మహాక్రోధంతో విల్లెక్కుపెట్టి సాల్వుడికి దగ్గరగా వచ్చి అతని వక్షస్థలాన్ని పదిహేను బాణాలతో గట్టిగా గుచ్చుకొనేటట్లు చేశాడు. అంతటితో ఆగక సాంబుడు, సాల్వుని సౌభక విమానం అల్లల్లాడేటట్లు ఇరవై బాణాలు ప్రయోగించి సాల్వునికి భయం పుట్టించాడు.

చ. గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముక నిర్గతవిస్ఫురద్విధుం
తుద వదనాభబాణవితతుల్ పరఁగించి విరోధిమస్తముల్
గుదులుగ గ్రుచ్చి యెత్తుచు నకుంఠిత విక్రమకేళి లోలుఁడై
చదల సురల్ నుతింప రథిస త్తముఁ డొప్పె నరేంద్రచంద్రమా!

858

తా ॥ రథికాగ్రగణ్యుడైన గదుడు – రాహు ముఖంవంటి క్రూర నిశిత బాణాలు విల్లునందు ఎక్కుపెట్టి వదిలి శత్రువుల శిరస్సులను ఆ బాణాలతో గ్రుచ్చి, పైకెత్తుచు మహా పరాక్రమవంతుడై యుద్ధం చేశాడు. గదుని వీరవిజృంభణను ఆకాశంలో నిలబడి చూస్తున్న దేవతలు 'అహహా' అని పొగిడారు.

ఉ. సాత్యకి చండరోషమున సాల్వమహీవరు భూరిసౌధ సాం
గత్య చతుర్విధోగ్రబల గాఢతమఃపటలంబు భాను రా
దిత్య మయూఖ పుంజరుచితీవ్రశరంబులఁ మాపి సైనిక
స్తుత్య పరాక్రమప్రకట దోర్బలుఁడై విలసిల్లె భూవరా!

859

తా ॥ వీరాధి వీరులందరూ తన పరాక్రమాతిశయాన్ని స్తుతిస్తుండగా, సాత్యకి తీవ్రమైన రోషంతో చతురంగబలాలతో ఒప్పియున్న సాల్వుని సౌభక విమానమనే అంధకారాన్ని – మండిపడుతున్న సూర్యుని కాంతి కిరణాలనే బాణాలతో చీల్చి చెండాడాడు.

ఉత్సాహము!

భానువిందుఁడుద్ధతిన్ విపక్షపక్షసైన్యదు
ర్మాన కాననానలోపమాన చండ సం
తాన మూన నేసి చూర్ణితంబు చేసెఁ జావ వి
ద్యా నిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగాన్.

860

తా ॥ భానువిందుడనే యాదవవీరుడు ఔద్ధత్యంతో విజృంభించి శత్రుసైన్యమనే కారడవిని తీవ్రమైన బాణసమూహమనే కార్చిచ్చుతో దగ్ధంచేసి దేవతల ప్రశంసలందుకొన్నాడు.

ఉత్సాహము!

చారుధేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్ర దో
స్సారదర్ప మేర్పడన్ నిశాత బాణకోటిచే
దారుణ ప్రతాపసాల్వదండనాథ మండలిన్
మారి రేఁగినట్లు పిల్కుమార్చి పేర్చి యార్చినన్.

861

తా ॥ మరోప్రక్క చారుదేష్ణుడు కోపోద్రిక్తుడై శత్రు భయంకరమైన భుజబలంతో వాడి వాడి బాణాలతో వీరులైన సాల్వుని దండనాథులను, 'మారి' అనే వ్యాధి వ్యాపించి ప్రజలను నాశనం చేసే విధంగా, వధించి, విజృంభించి విజయధ్వానం చేశాడు.

క. శుకుఁడాయోధన విజయోత్సుకమతి బాహాబలంబు సొప్పడ విశిఖ
ప్రకరంబులఁ దను శౌర్యా, ధికుఁ డన విద్వేషిబలతతిం బరిమార్చెన్.

862

తా ॥ శుకుడనే వీరుడు విజయోత్సాహంతో యుద్ధంచేయడానికి ముందుకు దూకి భుజబలంతో అనేకానేక బాణాలు ప్రయోగించి 'ఈతడింతటి మహావీరుడా?' అని అందరూ ఆశ్చర్యపోయేటట్లు శత్రుసైన్యాన్ని విధ్వంసం చేశాడు.

ఉ. సారణుఁ డేపుమైఁ గదిసి శాత్రవవీరులు సంచలింప దో
స్సార మెలర్పఁ గుంతశరశక్తి గదాక్షురికాది హేతులన్
వారక వాజిదంతి రథవర్గములం దునుమాడి కాల్వురన్
వీరముతోడఁ బంపె జమువీటికిఁ గాఁపుర ముగ్రమూర్తియై.

863

తా ॥ ఇంకోవైపు సారణుడు ఉగ్రమూర్తిగా నిలబడ్డాడు. శత్రువీరులు అదలిపోయేటట్లు ఆ మహావీరుడు ఒక్కసారిగా విజృంభించాడు. కుంతాయుధాలను, బాణాలను, శక్త్యాయుధాలను, ఖడ్గాలను ప్రయోగించి సాల్వుని గుఱ్ఱాలను, ఏనుగులను, సంహరించాడు. రథాలను పొడిపొడి చేసాడు. కాల్బలాన్ని యమపురికి పంపాడు.

క. అక్రూరుఁడు దదనుజులు న, వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా
విక్రమమున వధియించిరి, చక్ర ప్రాసాది వివిధ సాధనములచేన్.

864

తా ॥ అక్రూరుడు, అతని తమ్ముళ్ళు తమతమ శౌర్య ప్రతాపాలు ప్రదర్శించి శత్రువీరులను చక్రము, ప్రాసము మొదలైన వివిధాయుధాలతో సంహరించారు.

మ. కృతవర్మ క్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి
శ్రిత వర్మంబులఁ జించి మేనులు శతచ్ఛిద్రంబులం జేయ న
ద్భుతకర్మం బని సైనికుల్ వొగడ శత్రుల్ దూలుచో సంగర
క్షితి ధర్మంబుఁ దలంచి కాచె రథిక శ్రేష్ఠుండు భూమీశ్వరా!

865

తా ॥ రథికశ్రేష్ఠుడైన కృతవర్మ బాణసమూహంతో రక్షణగా నిల్చిన శత్రువుల కవచాలను చీల్చివేశాడు. వారి శరీరాలను నూరేసిముక్కలుగా నరికాడు. కృతవర్మ పరాక్రమాన్ని చూసి సైనికులందరూ 'ఇది అత్యాశ్చర్యకరమైన విషయమని పొగిడారు. శత్రువులు కొంతమంది భయపడి యుద్ధం చేయకుండా తొలగిపోతుంటే, వారిని చంపడం పాడికాదని తలచి, యుద్ధనీతి కోవిదుడైన కృతవర్మ వారి జోలికి పోలేదు.

వ. అ య్యవసరంబున సాల్వుండు గోపోద్దీపిత మానసుండై యుండ మాయావిడంబకంబైన సౌభకం బప్పుడు.

866

తా ॥ యదువీరుల వీరవిజృంభణ చూసి సాల్వుడు కోపోద్దీపిత మానసుడైనాడు. అది గ్రహించిన సౌభక విమానం తన అమోఘమైన మాయలను చూప సాగింది.

సీ. ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు, నొకమాటు ధరణిపై నొనర నిలుచు
నొకమాటు శైల మస్తకమున వర్తించు నొకపరిఁ జరియించు నుదధినడుమ
నొక్క తోయంబున నొక్కటియై యుండు నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కు లగును
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు నొకతోయ మన్నియు నుడిగి తోఁచు

ఆ. నొక్కతేప కొఱవి యుడుగక త్రిప్పిన, గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు
మఱియుఁ బెక్కు గతుల నరివరుల్ గలఁగంగఁ, దిరిగె సౌభకంబు ధీవరేణ్య!

867

తా ॥ శివప్రసాదితమైన సౌభక విమానం ఒకసారి ఆకాశంలో ఉన్నట్లు సుస్పష్టంగా కనిపిస్తుంది. క్షణంలో నేలమీద నిలబడి ఉందా అన్నట్లు భూమిపైకి దిగుతుంది. ఇంకోసారి పర్వతశిఖర సానుప్రదేశం మీద ఉంటుంది. వెంటనే సముద్రం మధ్యలో సముద్రంపైన తిరుగుతున్నట్లుంటుంది. మరొకసారి ఇది ఒక్కటేగా అనేటట్లు ఉంటుంది. అంతలోనే మరో చోట అనేక సౌభకవిమానాలున్నాయా అన్నట్లు దర్శనమిస్తుంది. వేరొకసారి ప్రాకారంతో చుట్టబడి ఉందా ఈ విమానం అనిపిస్తుంది. తక్షణం ఏమీ లేకుండా అది ఒక్కటే ఉన్నట్లు గోచరిస్తుంది. ఒకసారి సౌభకం – కొఱవితీసుకొని ఆపకుండా గిరగిరా త్రిప్పుతుంటే ఎంతభయంకరంగా ఉంటుందో అంత బీభత్సంగా కనిపిస్తుంది. ఇంకా ఎన్నో విధాలుగా తన మాయలన్నీ ప్రదర్శిస్తూ శత్రువుల గుండెలు కలతచెందేటట్లు సౌభకం వీర విజృంభణ చేసింది.

వ. ఇ వ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదుసైన్యంబులచే దైన్యంబు నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి సాల్వుం డప్పుడు.

868

తా ॥ సౌభక విమానం ఈ విధంగా పరాక్రమాన్ని, వివిధ మాయలను ప్రదర్శించడంతో సాల్వుడికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. అంతవరకు యదువీరులచేత నానా బాధలు పడి దీనులై ఉన్న తన సైనికులను యుద్ధానికి పురికొల్పాడు.

క. స్ఫురదనలాభశరంబులు, పొరిఁ బొరి బుంఖానుపుంఖములుగా నేయన్ దెరలియు మరలియు మురిసియు, విరిసియుఁ బిఱుతివక పోరె వెస యదుబలమున్.

869

తా ॥ సాల్వుడు ఉత్సాహంతో అగ్నిజ్వాలలను కురిపించే నిశిత బాణాలను మాటిమాటికి శత్రుసేనల మీద పుంఖాను పుంఖాలుగా ప్రయోగించాడు. అయినా యాదవసైన్యం ఏమాత్రం

భయపడక, తొలగిపోక, వెనుకకు మరలక, పారిపోక, వీరోత్సాహంతో యుద్ధం చేసింది.

క. అయ్యెడ మానము వదలక, డయ్యక మగపాడితో దృఢంబుగఁ బోరన్ దయ్యె
మెఱుంగును? నెక్కటి, కయ్యం బపుడయ్యెఁ బేరుగల యోధులకున్.

870

తా ॥ యదువీరులు, సాల్వుని పక్షంలోని వీరులు ఎవరికెవరూ తీసిపోకుండా అభిమానంతో, పౌరుషంతో, దృఢంగా పోరు సలిపారు. ఆ సందర్భంలో మహాశౌర్యవంతులైన వారి మధ్య ద్వంద్వ యుద్ధం నెలకొంది.

క. మును ప్రద్యుమ్న కుమారుని, ఘననిశితాస్త్రముచేతఁ గడు నొచ్చిన సా
ల్వుని మంతిరి ద్యుమనాముఁడు, సునిశిత గదచే నమర్చి సుమహితశక్తిన్.

871

తా ॥ ప్రద్యుమ్నుని వాడి అయిన అస్త్రాలచేత బాగా దెబ్బతిని ఉన్న ద్యుముడనే సాల్వుని మంత్రి మరలా గదపట్టుకుని ప్రద్యుమ్నుని మీదకు యుద్ధానికి వచ్చాడు.

చ. వెరవును లావుఁ జేవయును వీరముఁ బీరము గల్గి డాసి యా
సరసిజనాభనందను విశాలభుజాంతరమున్ బగిల్చినన్
విరవిరవోయి మేను నిడువెంద్రుక వెట్టఁగఁ జేతిఁ సాధనో
త్కరములు దేరిపై వదలి కన్నులు మూయుచు మూర్ఛనొందినన్.

872

తా ॥ ద్యుముడు బలము, శక్తి, శౌర్యం, ఉపాయం అన్నిటితో విజృంభించి ప్రద్యుమ్నుని వక్షస్థలాన్ని గదతో మోదాడు. అ దెబ్బకు ప్రద్యుమ్నుని శరీరం విలవిల్లాడి, వెంద్రుకలు నిక్కపొడిచాయి. చేతిలో ఉన్న ఆయుధాలను రథం మీద వదిలి, కన్నులు మూసుకుపోగా

కృష్ణనందనుడు మూర్ఛపోయాడు.

ఆ. సమరధర్మ వేది సమధిక నయవాది, దారుకుని సుతుండు ధైర్యయుతుఁడు రథముఁ
దోలికొనుచు రణభూమి వెడలి వే, చనియె మూర్ఛదేఱి శంబరారి.

873

తా ॥ యుద్ధధర్మాన్ని తెలిసినవాడు, నీతికోవిదుడు, ధైర్యస్థుడు అయిన దారుకుని కుమారుడు, ప్రద్యుమ్నుడు మూర్ఛిల్లగానే యుద్ధభూమి నుండి రథాన్ని దూరంగా తోలుకొనిపోయాడు. మూర్ఛనుంచి తేరుకొన్న ప్రద్యుమ్నుడు తన రథసారథిని చూశాడు.

ఉ. సారిథిఁ జూచి యిట్లనియె శాత్రవవీరులు సూచి నవ్వఁగాఁ
దేరు రణక్షితిన్ వెడలఁ దెచ్చితి తెచ్చితి దుర్యశంబు పం
కేరుహ నాభుఁడున్ హలియు గేలికొనన్ యదువంశసంభవుల్
బీరము దప్పి యిప్పగిదిఁ బెల్కుఱి పోవుదురే రణంబునన్.

874

తా ॥ చూసి ఇలా అన్నాడు: "చూడు సారథీ! శత్రువీరులు నవ్వేటట్లు రణభూమి నుండి రథాన్ని బయటకు తీసుకు వస్తావా? నాకు అపకీర్తి తెచ్చిపెట్టావు గదయ్యా! యదువంశంలో జన్మించిన వీరులు ఈ విధంగా పౌరుషం కోల్పోయి పిరికివారిలా పారిపోతారా? ఇది వింటే శ్రీకృష్ణుడూ, బలరాముడూ నన్ను ఎగతాళి చేయరా!"

వ. అనిన నతం డతని కిట్లనియె.

875

తా ॥ ప్రద్యుమ్నుడు ఆ విధంగా సారధిని కోప్పడటంతో, రథికునితో సారథి ఇలా అన్నాడు:

క. 'రథి రిపుచే నొచ్చిన సా, రథియును సారథియు నొవ్వ రథియును గావం
బృథుసమర ధర్మ; మిఁక న, వ్యథచిత్తుఁడ వగుచుఁ గడఁగు వై రుల గెలువన్'.

876

తా ॥ "ప్రద్యుమ్న కుమారా! రథికుడు శత్రువుచేత నొచ్చినపుడు సారథీ, సారథి శత్రువుచేత దెబ్బతిన్నప్పుడు రథికుడు ఒకరినొకరు రక్షించుకోవటం యుద్ధధర్మం కదా! అందుకే నేనా విధంగా ప్రవర్తించాను. బాధా తప్త హృదయుడవు కాకుండా, శత్రువులను జయించడానికి యుద్ధసన్నద్ధుడవు కావలసినది."

వ. అనిన విని.

877

తా ॥ సారథి అయిన దారుకుని పుత్రుడు ఆ విధంగా సమర ధర్మాన్ని తెలుపగా వినినవాడై–

ఉ. సంచితభూరిబాహుబల శౌర్యుఁడు సారథిమాట కాత్మ మో
దించి యుదాత్త కాండ రుచిదీపితచాపముఁ దాల్చి మౌర్వి సా
రించి గుణధ్వనిన్ మహదరిప్రకరంబుల భీతి ముంచి తో
లించె రథంబు మేదిని చలింపఁగ నా ద్యుముమీఁద నేర్పుగన్.

878

తా ॥ ప్రద్యుమ్నుడు ఎంతగానో సంతోషించి, ధనుర్బాణాలను ధరించి శత్రువుల హృదయాలను ఛేదించే విధంగా ధనుష్టంకారం చేశాడు. ఆ మహావీరుడు వెనువెంటనే భూమి కంపించేటట్లు తన రథాన్ని ద్యుముని మీదకు తోలించాడు.

వ. అట్లు డగ్గఱి.

879

తా ॥ ఆ విధంగా రథాన్ని తీసుకొని ద్యుమునికి దగ్గరగా వెళ్ళి—

చ. అరితను వష్టబాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చి నాల్గిటం
దురగములన్ వధించి యొకతూపున సారథిఁ ద్రుంచి రెంటని
ష్ఠురతర కేతుచాపములు చూర్ణముచేసి యొకమ్మునన్ భయం
కరముగఁ ద్రుంచె నా ద్యుమునికంఠ మకుంఠిత విక్రమోద్ధతిన్.

880

తా ॥ ప్రద్యుమ్నుడు ఆగ్రహావేశంతో ద్యుముని శరీరాన్ని ఎనిమిది బాణాలతో పగిలేటట్లు చేశాడు. నాలుగు బాణాలు వేసి అతని రథానికున్న గుఱ్ఱాలను నేలకూల్చాడు. ఒకే ఒక్క బాణంతో సారథిని చంపాడు. రెండు బాణాలు వేసి ద్యుముని పతాకాన్ని, ధనుస్సును విరగకొట్టాడు. మొక్కపోని శౌర్యంతో మరొక్కబాణాన్ని ప్రయోగించి అతిభయంకరంగా ఆ ద్యుముని కంఠాన్ని ఖండించాడు.

మ. కని సాంబ ప్రముఖాది యోధవరు లుత్కంఠాత్ములై మీన కే
తను నగ్గించి సువర్ణపుంఖ నిశితాస్త్ర శ్రేణి సంధించి సా
ల్వుని సైన్యావళి మస్తముల్ వెరవు లావున్ మీఱఁగా నొక్క యె
త్తున వే త్రుంచిరి తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్.

881

తా ॥ ప్రద్యుమ్నుడు ద్యుముని సంహరించిన తీరుచూసి సాంబుడు మొదలైన ప్రముఖవీరులు రుక్మిణీ తనయుని శౌర్యప్రతాపాలను ఉత్కంఠతో కీర్తించారు. ఆరణోత్సాహంతో సాంబాదులు తాటిపండ్లను నేల రాల్చినవిధంగా శత్రుసైనికుల శిరస్సులను ఖండించి తమ పరాక్రమాన్ని ప్రకటించారు.

వ. అట్టి యెడ.

882

తా ॥ ఆ సమయంలో—

స్రగ్ధర. కూలున్ గుఱ్ఱంబు! లేనుంగులు ధరఁ గెడయున్ గుప్పమై; నుగ్గునూచై
వ్రాలున్ దేరుల్; హతంబై పడిఁబడు సుభటవ్రాతముల్; శోణితంబుల్
గ్రోలున్, మాంసంబు నంజుల్ గొఱకు, నెముకలన్ గుంపులై సోలుచున్ బే
తాళక్రవ్యాదభూతోత్కరములు; జతలై తాళముల్ దట్టి యాడున్.

883

తా ॥ యుద్ధరంగమంతా బీభత్సంగా తయారయింది. ఇరుసైన్యాలలోను గుఱ్ఱాలు పడిపోతున్నాయి. మద గజాలు కుప్పలు కుప్పలుగా నేలరాలుతున్నాయి. రథాలు నుగ్గునుగ్గయ్యాయి. భటులు ప్రాణాలు కోల్పోయి క్రిందపడిపోతున్నారు. భూతాలు, బేతాళాలు ఇదే సమయమని కాలువలు గట్టిన రక్తాన్ని త్రాగుతూ, అందులో మాంసం నంజుకొంటూ, ఎముకలు మెడలో వేసుకొంటూ, మహదానందంతో జట్లు కట్టి, చేతులతో చఱుస్తూ, పాటలు పాడుతూ, నృత్యం చేస్తున్నాయి.

వ. మఱియు నొక్కయెడ.

884

తా ॥ అంతేకాదు. ఇంకా ఎలా ఉందంటే—

సీ. ఖండిత శుండాల గండముల్ చక్రముల్; భూరితుండంబులు భుజగ సమితి;
పదతలంబులు గచ్ఛపంబులు; దంతముల్ శక్తులు; గుంభనిర్ముక్తమౌక్తి
కములు రత్నములు; వాలములు జలూకముల్; మెదలు భేకంబులు; మెదడు రొంపి;

ప్రేవులు పవడంపుఁ దీవలు; నరములు నాఁచు; మజ్జంబు ఫేనంబు; లస్థి

ఆ. సైకతములు; రక్తచయము తోయంబులు;, నొరగు నెడల నొరలు మొఱలు ఘన త
రంగరవముగా మతంగజాయోధన, స్థలము జలధిఁ బోల్పఁదగె నరేంద్ర!

885

తా ॥ పరీక్షిన్మహారాజా! ఆ రణరంగం మహాసముద్రంలా మారింది. యుద్ధంలో ఖండింపబడిన ఏనుగుల గండభాగాలు సముద్రంలో కనిపించే మొసళ్ళలా ఉన్నాయి. పెద్దవైన, పొడవైనవాటి తొండాలు సముద్రంలో సంచరించే మహా నాగులుగా ఉన్నాయి. వాటి పాదాలు తాబేళ్ళుగా, దంతాలు ముత్యపు చిప్పలుగా, వాటి కుంభస్థలం నుండి రాలిపడే ముత్యాలు సముద్రంలో ఉండే రత్నాలుగా, తోకలు జలగలుగా, మెడలు కప్పలుగా, మెదడు బురదగా, పేగులు పగడాలుగా, నరాలు నాచుగా, కొవ్వు నురగగా, ఎముకల గుట్టలు ఇసుక తిన్నెలుగా, రక్తం సముద్రజలంగా, ప్రాణంపోయేటప్పుడు పెట్టే మొఱలు అలల ధ్వనులుగా – మదగజాలు కుప్పలు కుప్పలుగా కూలి పడిపోయి ఉన్న యుద్ధభూమి మహాసాగరంగా దర్శనమిచ్చింది.

వ. ఇ వ్విధంబున యదు సాల్వబలంబులు చలంబునఁ బరస్పర జయ కాంక్షలం దలపడి పోరు పూర్వ పశ్చిమ సముద్రంబుల వడువున నిరువది యేడు దినంబు లతిఘోరంబుగాఁ బోరునెడ నింద్రప్రస్థ పురంబునుండి ద్వారకానగరంబునకు నగధరుండు చనుదేర ముందటం గానవచ్చు దుర్నిమిత్తంబులు కనుంగొని కృష్ణుండు దారుకునిం జూచి యిట్లనియె.

886

తా ॥ ఈ విధంగా యాదవ సాల్వసైన్యాలు పట్టుదలతో, పరస్పర విజయ కాంక్షతో, మహాభయంకరంగా యుద్ధం చేస్తుంటే – ఆ యుద్ధం తూర్పు సముద్రం, పడమటి సముద్రం ఒకదానితో ఒకటి యుద్ధం చేస్తున్నట్లుగా కనిపించింది. ఎవరూ తగ్గిపోకుండా ఇరవై ఏడు రోజులపాటు ఆ రెండు సైన్యాలూ యుద్ధం చేశాయి.

ఇంద్రప్రస్థపురంలో ఉన్న శ్రీకృష్ణుడు, ద్వారకకు ప్రయాణమై వస్తుండగా, అపశకునాలు ఎదురుకావటంతో, సారథి అయిన దారుకుడిని చూసి ఇలా అన్నాడు:

శా. కంటే దారుక! దుర్నిమిత్తము లనేకంబుల్ మహాభీలముల్
మింటన్ మేదినిఁ దోఁచుచున్న యవి; నెమ్మిన్ ఖాండవప్రస్థ మే
నుంటం జైద్యహిత క్షితీశ్వరులు మాయోపాయులై మత్పురి
న్గెంటింపం జనుదేరఁ బోలుదురు; పోనీ తేరు వేగంబునన్.

887

తా ॥ “దారుకా! చూశావా? మహాభయంకరమైన, చెడుశకునాలు భూమిమీద ఆకాశంలోను ఎన్నెన్నో కనిపిస్తున్నాయి. నేను ఇంద్రప్రస్థంలో పాండవుల వద్ద ఉండటం చూసి శిశుపాలుని మిత్రరాజులు మాయోపాయంతో ద్వారకానగరం మీదికి దండెత్తి వచ్చి ఉంటారు. వారి ముట్టడిని సూచిస్తూ ఇన్ని అపశకునాలు కలుగుతున్నాయి కాబోలు. కాబట్టి రథాన్ని చాలా వేగంగా నడుపు. త్వరగా ద్వారక చేరాలి.”

వ. అని యతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహాబల పరాక్రమంబులం బ్రతిపక్ష బలంబులతోడం దలపడి పోరు యదు బలంబులును నభోవీథి నభేద్యమాయా విడంబనంబులనం బ్రతివీరు లెంతకాలంబునకు నే యుపాయంబునను సాధింప నలవిగాని సౌభకవిమానంబునం దున్న సాల్వునిం గని తద్విమానంబు డాయం దన తేరు దోల సారథిని నియమించి కదియం జను మురాంతకుని వీక్షించి యదుసైనిక ప్రకరంబులు పరమానందంబునుం బొందిరి; మృతప్రాయంబులై యున్న సైన్యంబు గనుగొని సౌభకపతి విక్రమ క్రియాకలాపుం దగుచు నురవణించి.

888

తా ॥ కృష్ణుడి ఆజ్ఞానుసారం దారుకుడు రథాన్ని అతి త్వరగా నడిపి ద్వారకానగరం

చేరాడు. ధైర్యసాహసాలతో శౌర్యప్రతాపాలతో శత్రువులతో యుద్ధం చేస్తున్న యాదవ వీరులందరినీ చూశాడు శ్రీకృష్ణుడు. ఆకాశవీథిలో ఉన్న సౌభక విమానాన్ని, అందులో ఉన్న సాల్వున్ని చూశాడు. మాయలతో నడుస్తూ, శత్రువులకు భేదించడానికి శక్యంకాని శక్తిని ప్రదర్శిస్తున్న సౌభకం దగ్గరకు రథాన్ని పోనిమ్మన్నాడు. సాల్వునితో తలపడబోతున్న కృష్ణుని చూసి యాదవులందరూ పరమానందంతో పొంగిపోయారు. మరణించినవారిలా కనపడుతున్న తనసైనికులను చూసి, మరోవైపు కృష్ణుణ్ణి చూసి సాల్వుడు పరాక్రమంతో వేగంగా ముందుకు ఒక్కదూకు దూకాడు.

ච. మిడుఁగుఱు లెల్లెడం జెదర; మింటను మంటలు వర్వ; ఘంటికా
ఘణఘణ భూరినిస్వన నికాయమునన్ హరిదంతరాళముల్
వణఁక; మహోగ్రశక్తిఁ గొని వారక దారుకుమీఁద వైవ దా
రుణగతి నింగి నుండి నిజరోచులతోఁ బడు చుక్కకైవడిన్.

889

తా ॥ అగ్ని కణాలు అన్ని దిక్కులా చెదరిపడుతుండగా, ఆకాశమంతటా మంటలు ఎగజిమ్మగా, ఆయుధానికున్న ఘంటల ఘణఘణ ధ్వనులు దిగంతాల వరకు వ్యాపించి దిక్కులను వణికింప చేయగా, సాల్వుడు మహోగ్రమైన శక్తి ఆయుధాన్ని తీసుకొని శ్రీకృష్ణుని సారథి అయిన దారుకుడి మీద ప్రయోగించాడు. అప్పుడా శక్తి – ఆయుధం విద్యుత్కాంతులతో ఆకాశంమీద నుంచి రాలిపడే చుక్కలాగా దారుణంగా దారుకుడి మీదకు రావడానికి బయలుదేరింది.

క. వడిఁ జనుదేరఁగఁ గని య, ప్పుడు నగధరుఁ డలతి లీల వోలెన్ దానిం
బొడిపొడియై ధరఁ దొరఁగఁగఁ, నడుమన వెసఁ ద్రుంచె నొక్క నారాచమునన్.

890

తా ॥ వడివడిగా వస్తున్న ఆ శక్తి ఆయుధాన్ని శ్రీకృష్ణుడు ఒక్క బాణంతో లీలావిలాసంగా పొడిపొడి చేసి నేలకూల్చాడు.

చ. గురుభుజుఁ డంతఁ బోవక యకుంఠిత శూరత శత్రుసైన్యముల్
దెరలఁగ నుగ్రతం గొఱవిఁ ద్రిప్పిన కైవడి మింట దిర్దిరన్
దిరుగుచు దుర్నిరీక్ష్యమగు దీపితసౌభము సాల్వుఁ జండ భా
స్కర కిరణాభషోడశ నిశాతశరంబులఁ గాఁడ నేసినన్.

891

తా ॥ శక్తి ఆయుధాన్ని మార్గమధ్యంలోనే త్రుంచి, మహాబలపరాక్రమశాలి అయిన శ్రీకృష్ణుడు అంతటితో ఊరుకోక మిక్కిలి వాడిగా ఉన్న, చండప్రతాపుడైన సూర్యభగవానుని కిరణాలవలె భగ్గుమంటున్న పదహారు బాణాలు ప్రయోగించి, శత్రుసైన్యాలన్నీ తొలగిపోయేటట్లు కొఱవిని గిరగిరా త్రిప్పితే ఎలా ఉంటుందో అలా ఆకాశంలో మహాభయంకరంగా గిరగిరా తిరుగుతూ, చూడశక్యంకాకుండా ఉన్న సౌభకవిమానాన్ని, దానిలో ఉన్న సాల్వున్ని అత్యంత బాధాకరంగా నొప్పించాడు.

చ. కడు వడి నల్గి వాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబు కై
వడి మొరయించుచున్ వెడఁదవాతి శరంబులఁ బద్మలోచను
న్నెడమభుజంబు గాఁడ వడి నేసినఁ దెంపఱి చేతిశార్‌ఙ్గమున్
విడిచె రథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్.

892

తా ॥ ఎప్పుడైతే శ్రీకృష్ణుడు సాల్వున్ని తనబాణాలతో విపరీతంగా నొప్పించాడో సాల్వుడు వెంటనే మహాక్రోధంతో అలిగినవాడై తన ధనుస్సును ఒక్కసారిగా, గర్జించినట్లు గట్టిగా మ్రోగించాడు. ఆ ధనుష్టంకార ధ్వనికి వీరులందరూ భయపడి ఇది మేఘ గర్జనా అని

చెప్పుకోసాగారు. సాల్వుడు బాగా పదనైన బాణాలను శ్రీకృష్ణుడి ఎడమ భుజంలోకి దూసుకుపోయేటట్లు వడివడిగా వేశాడు. ఆ దెబ్బకు చేతిలో ఉన్న 'శార్ఙ్గ' మనే ధనుస్సును కృష్ణుడు రథంపై విడిచాడు. ఆ సన్నివేశం చూసిన దేవతలు భయపడిపోయారు.

క. హాహా యని భూతావళి, హాహాకారములు సేయ నంతట దేఱ
న్నాహరిఁ గనుఁగొని యతఁ డు, త్సాహంబునఁ బలికె బాహు శౌర్యస్ఫూర్తిన్.

893

తా ॥ భూతపిశాచాలు హాహాకారాలు చేశాయి. జీవులందరూ దిగులు చెందారు. కృష్ణుడు మెల్లగా తేరుకొన్నాడు. స్పృహలోకి వచ్చిన శ్రీకృష్ణుణ్ణి చూసి సాల్వుడు శౌర్య స్ఫూర్తితో ఇలా పలికాడు:

చ. 'నళినదళాక్ష! మత్సఖుఁడు నాఁదగు చైద్యుఁడు గోరినట్టి కో
మలి నవినీతిమైఁ దగవుమాలి వరించితి; వంతఁ బోక దో
ర్బలమున ధర్మనందును సభాస్థలి నేమఱి యున్న వాని న
చ్ఛలమునఁ జంపి తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్.

894

తా ॥ "కృష్ణా! నా మిత్రుడైన చేదిదేశాధిపతి కోరిన రుక్మిణిని ధర్మం తప్పి నీవు వరించావు. ఇది అవినీతి కాదా! అంతటితో ఊరుకొన్నావా అంటే అదీ లేదు. నీకు భుజబలమున్నదనే గర్వంతో ధర్మరాజు సభలో ఏమరుపాటుగా ఉన్న ఆ శిశుపాలుడిని మాత్సర్యంతో వధించావు. నీవు పాపాత్ముడవు.

క. తల చెడి పాఱక బాహా, బల మొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో
నిలిచిన నిష్ఠుర విశిఖా, ర్చుల ముంచి మదీయసఖుని సూడి డిటు దీర్తున్.

895

తా ॥ ఈనాడు నీవు యుద్ధభూమిలో పారిపోకుండా నాతో యుద్ధంచేయి. నా ఎదురుగా, ధైర్యంతో నిలిచి నీ శౌర్యం చూపించు. కఠినమైన నా బాణాగ్నితో నిన్ను ముంచి, నీపై ఏర్పడిన నా పగను తీర్చుకుంటాను. నా మిత్రుడి ఋణమూ తీర్చుకొంటాను."

చ. అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప సా
ల్వునిఁ గని 'యోరి! లావు బలుపుం గల పోటరివోలెఁ బ్రేలె దే
మనినను బాటు సన్నిహిత మౌట యెఱుంగవు మూఢచిత్త! పొ'
మ్మని గదఁ గేలఁ ద్రిప్పి యభియాతృని శత్రుని వ్రేసె నుద్ధతిన్.

896

తా ॥ సాల్వుడు ఆ విధంగా కఠినంగా మాట్లాడినందుకు శ్రీకృష్ణుని పెదవులపై దరహాసం తొణికిసలాడింది. "సాల్వా! నీమా ఒక బలశాలివేనా? గొప్ప శూరునివలె మాట్లాడుతున్నావు. ఓరీ మూఢుడా! నీకు కాలం దగ్గర పడిందని తెలుసుకోలేక పోతున్నావు. సరే యుద్ధానికి రా!" అని కృష్ణుడు తన చేతిలోని గదను గిరగిరా త్రిప్పి, ఔద్ధ్యంతో, తమపైకి దండెత్తి వచ్చిన శత్రువైన సాల్వుని మీద విసరికొట్టాడు.

వ. అట్లు వ్రేసిన.

897

తా ॥ ఆ విధంగా గదతో కొట్టేసరికి—

క. పెనుమూర్ఛ నొంది వెస ము, క్కున వాతను నెత్తురొల్కఁ గొంతవడికి నొ
య్యన తెలిసి నిలువరింపక, చనె వాఁడు నదృశ్యుఁ డగుచు సౌభముఁ దానున్.

898

తా ॥ సాల్వుడి ముక్కునుంచి, నోటినుంచి, శరీరంనుంచి రక్తం ధారాప్రవాహంగా

కారుతుండగా, సాల్వుడు మూర్ఛపోయాడు. చాలాసేపటికి అంత పెద్ద మూర్ఛనుంచి తేరుకొన్న సాల్వుడికి కృష్ణుడితో యుద్ధం చేయలేక సౌభక విమానంతో సహా మాయమైపోయాడు.

వ. అ య్యవసరంబున.

889

తా ॥ ఆ సమయంలో—

తే. గగనమందుండి యొకఁ డార్తుఁ డగుచు వచ్చి, నందనందను పాదారవిందములకు
వందనము సేసి యానకదుందుభిని మ, హోగ్రుఁడై పట్టితెచ్చె సాల్వుండు గడఁగి.

900

తా ॥ బాధలో మునిగినట్లున్న ఒక వ్యక్తి ఆకాశం నుంచి ఆర్తనాదం చేస్తూ వచ్చి శ్రీకృష్ణుడి పాదపద్మాలకు నమస్కరించాడు. "ప్రభూ! సాల్వుడు మీ తండ్రిగారైన వసుదేవుణ్ణి పట్టి బంధించి తీసుకుపోయాడు. ఉగ్రమూర్తిగా వచ్చిన సాల్వుని ఎవరూ ఎదిరించలేకపోయారు.

తే. దేవ! మీ కెఱిఁగింపఁగాఁ దివిరి యిటకు, దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె' ననఁగ
విని సరోరుహనాభుఁడు ఘన విషాద, మగ్నుఁ డయ్యెను గురుమీఁది మమతఁ జేసి.

901

తా ॥ ఈ విషయం మీకు తెలియజేయవలసిందిగా దేవకీదేవి నన్ను మీ వద్దకు పంపారు." అని ఆ ఆగంతకుడు చెప్పాడు. ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు తండ్రిమీది భక్తి ప్రేమలకారణంగా ఎంతో బాధపడ్డాడు.

క. 'నర గంధర్వ సురాసుర, వరులకు నిర్జింపరాని వాఁడు బలుం డే
మఱ కరయ హీనబలుచేఁ, బరికింపఁగ నెట్లు పట్టువడు నొకొ, యనుచున్

902

తా ॥ "మానవుల చేత, గంధర్వుల చేత, దేవతల చేత, రాక్షసుల చేత, ఎవరి చేత ఓడింపబడని బలరాముడు జాగరూకతతో వసుదేవుణ్ణి పరిరక్షిస్తుండగా హీనబలుడైన సాల్వుడిచేత ఆ మహానుభావుడు ఎలా పట్టుబడ్డాడ" ని కొంతసేపు శ్రీకృష్ణుడు చింతించాడు.

వ. మఱియును.

903

తా ॥ ఇంకా ఇలా అనుకొన్నాడు:

క. భావంబు గలఁగ 'నాహా!, దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా
దే విధినైనను నని శో, కావిలమతిఁ బలుకుచున్న న త్తఱి వాఁడున్.

904

తా ॥ "ఏ విధంగా కూడా విధిని తప్పించడం ఎవరికీ సాధ్యంకాదు. దైవం ఇలా నిర్ణయిస్తే నేనుమాత్రం ఏం చేయగలను" అని శ్రీకృష్ణుడు చింతాక్రాంతుడైనాడు.

వ. అప్పుడు తన మాయాబలంబునఁ గ్రమ్మఱం దోఁచి కృతక వసుదేవునిం గల్పించి యతనిం బంధించి కొనితెచ్చి 'పుండరీకాక్ష! నిరీక్షింపు భవజ్జనకుండు వీఁడె; యిప్పుడు నీవు గనుంగొన వీని తలఁ ద్రుంతు నింక నెవ్వనికింగా మనియెదు! కావం గల శక్తి గల దేనియుం గావు' మని దురాలాపంబు లాడుచు మృత్యుజిహ్వాకరాళంబైన కరవాలంబు గేలం బూని ఝళిపించుచు న మ్మాయావసుదేవుని శిరంబు దునిమి తన్మస్తకంబు గొని వియద్వర్తియై చరియించు సౌభక విమానంబు సొచ్చె; నంత గోవిందుండు గొంతతడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందుచుండి యాత్మసైనికులు దెలుపం దెలివొంది యది మయోద్దీతంబైన సాల్వుని మాయోపాయంబని యెఱింగి యుండె; అంతం దనకు వసుదేవుండు పట్టువడె నని చెప్పిన దూతయు న మ్మాయాకళేబరంబును నా క్షణంబ విచిత్రంబుగా మాయంబై పోయె; ననంతరంబ.

తా ॥ సాల్వుడు మళ్ళీ తన మాయాబలంతో కృష్ణుడి ముందుకు వచ్చాడు. మాయా వసుదేవుణ్ణి బంధించి తెచ్చి కృష్ణుడితో సాల్వుడిలా అన్నాడు: "కృష్ణా! చూడు. ఈతడే నీ తండ్రి, వసుదేవుడు. నీవు చూసేటట్లు నీముందే నీ తండ్రి శిరస్సు ఖండిస్తాను. ఇంక నీవెవరి కోసమని జీవిస్తావు? నీ తండ్రిని రక్షించుకోగల శక్తి నీకుంటే రక్షించుకో!" అని అనకూడని మాటలతో కృష్ణుణ్ణి గాయపరిచాడు. మృత్యుదేవత నాలుకవలె భయంకరంగా ఉన్న కత్తిని చేత పట్టుకొని ఝుళిపిస్తూ మాయావసుదేవుని తలనరికి, ఆ తలను తీసుకొని ఆకాశంలో తిరుగుతున్న సౌభక విమానంలోకి వెళ్ళిపోయాడు. నిజంగానే తన తండ్రి హతుడైనాడని భావించి, శ్రీకృష్ణుడు కొంతసేపు మనస్సులో చాలా బాధపడ్డాడు. యాదవనాథుడైన శ్రీకృష్ణుని దుఃఖాన్ని చూసి జరిగినదంతా మిథ్య అని యాదవవీరులు తెలుపడంతో, అది మయుడి చేత కల్పింపబడిన, సాల్వుడు చేసిన మాయ అని గ్రహించి శ్రీకృష్ణుడు కొంత ఊరట చెందాడు. అప్పుడు వసుదేవుడు బంధింపబడ్డాడని చెప్పిన దూత, మాయావసుదేవుని కళేబరము క్షణకాలంలో విచిత్రంగా మాయం కావడంతో అందరూ ఆశ్చర్యచకితులైనారు.

క. మును లపుడు గొంద ఱచటికిఁ, జనుదెంచి విమోహియైన జలజదళాక్షుం
గనుఁగొని సమధికభక్తిన్, వినయంబునఁ బలికి రంత విష్ణున్ జిష్ణున్.

906

తా ॥ మయుడు పన్నిన మాయలో మోహితుడై దుఃఖించిన శ్రీకృష్ణుని దగ్గరకు కొంతమంది మునులు వచ్చి ఆ పరమాత్మణ్ణి చూసి భక్తితో, వినయవంతులై ఇలా పలికారు:

సీ. కమలాక్ష! సర్వలోకములందు సర్వ మానవులు సంసార నానావిధైక
దుఃఖాబ్ధిమగ్నులై తుదిఁ జేర నేరక వికలత్వమునఁ బొందు వేళ నిన్నుఁ
దలఁచి దుఃఖంబులఁ దరియింతు రట్టి సద్గుణ నిధివై దేవకోటికెల్లఁ

బట్టుగొమ్మయి పరబ్రహ్మాఖ్యఁ బొగడొంది పరమయోగీశ్వర ప్రకరగూఢ

తే. పరచిదానంద దివ్యరూపమున వెలుఁగు, దనఘ! నీ వేడ? నీచ జన్మాత్మ జనిత

ఘనభయ స్నేహ మోహ శోకంబు లేడ?, ననుచు సంస్తుతి సేసి వా రరిగి రంత.

907

తా ॥ "ఓ మహాత్మా! శ్రీకృష్ణా! ఓ కమలాక్షా! సమస్త లోకాలలో మానవులందరు సంసారమనే దుఃఖాబ్ధిలో నానావిధ కష్టాలతో మునిగిపోయి ఒడ్డు చేరలేక మిక్కిలి కలత చెందే సమయంలో నిన్ను తలచుకొని దుఃఖ సముద్రాన్ని దాటగలుగుతారు. అటువంటిది, నీవా! సద్గుణ నిధివి. సకల దేవతలకు అధినాథుడవు. రక్షకుడవు. పరబ్రహ్మావు. పరమయోగీశ్వరులకు కూడా కనిపించని నిగూఢ మూర్తివి. పాపరహితుడవైన నీవు చిదానంద దివ్యరూపుడవే! పరమాత్ముడవైన నీ వెక్కడ? సాధారణ జన్మలో కలిగే భయం, స్నేహం, మోహం శోకం అనుభవించే మానవ జన్మ ఎక్కడ? సామాన్యులవలె నీవు దుఃఖించటం తగదు" అని శ్రీకృష్ణుణ్ణి అనేక విధాలుగా స్తుతించి ఋషులు నిజస్థావరాలకు వెళ్ళిపోయారు.

చ. హరి దనమీఁద ఘోరానిశితాశుగజాలము లేయు సాల్వభూ

వరు వధియింపఁ గోరి బహువారిద నిర్గతభూరివృష్టి వి

స్ఫురణ ననూనతీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి క్ర

చ్చఱ రిపుమౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్.

908

తా ॥ ఆ తరువాత శ్రీకృష్ణుడు – సాల్వుడు తనమీద ప్రయోగిస్తున్న క్రూరమైన బాణాలను చూసి, సాల్వున్ని సంహరించి తీరాలని నిశ్చయించాడు. వెంటనే మేఘాలు వర్షించే ఎడతెఱపిలేని వర్షమా అన్నట్లున్న తీవ్ర బాణవర్షంతో ఆకాశమంతా కప్పివేశాడు. మరుక్షణం సాల్వుడి కిరీటాన్ని, ధనుస్సును, కవచాన్ని ముక్కలు ముక్కలు చేశాడు.

మ. వితత క్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతశౌర్యక్రియో
ద్ధత శక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వ ను
గ్రతఁ జంచద్గద వైచి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్ రాల నా
యత భూరిత్రిపురాభమున్ మహిత మాయాశోభమున్ సౌభమున్.

909

తా ॥ శ్రీకృష్ణుడు పట్టరానంత క్రోధంతో గదను తీసుకొని గిరిగిరా త్రిప్పి ఆకాశంలో మెఱుపులు సృష్టించాడు. మహాశౌర్యవంతుడై త్రిపురాలతో సమానమైనదీ, వివిధమాయలతో శోభిస్తున్నదీ అయిన సౌభక విమానం మీద గద తీసి విసిరికొట్టాడు. భయంకరమైన ఆ గద యొక్క తాకిడికి విమానం పొడిపొడిగా నేలకూలింది.

వ. అట్లు కృష్ణుం డమ్మయనిర్మిత మాయావిమానంబు నిజగదాహతి నింతింతలు తునియలై సముద్రమధ్యంబునం దొరంగం జేసిన సాల్వుండు గోఱలు వెఱికిన భుజంగంబు భంగి గండడంగి విన్ననై విగతమాయాబలుం డయ్యును పొలివోవని బీరంబున వసుధా తలంబునకు డిగ్గి యాగ్రహంబున.

910

తా ॥ ఆ విధంగా సౌభకాన్ని భయంకరమైన తన గదతో చిన్నచిన్న ముక్కలుగా ఖండించి కృష్ణుడు సముద్ర మధ్యంలో పడేటట్లు చేశాడు. ఎప్పుడైతే సౌభకం తునాతునకలైందో సాల్వుడప్పుడే కోఱలు తీసిన పాములా శక్తికోల్పోయి పౌరుషహీనుడైనాడు. మాయాబలం పోయినా తెచ్చుకున్న పౌరుష పరాక్రమాలతో క్రిందకు దిగాడు.

క. కరమునఁ బవినిభ మగు భీ, కర గద ధరియించి కదియఁగాఁ జనుదేరన్ మురహరుఁ డుద్ధతి సాల్వుని, కరము గదాయుక్తముగను ఖండించె నృపా!

911

తా ॥ సాల్వుడు కోపోద్రిక్తుడై, వజ్రాయుధం వంటి మహా భీకరమైన గదను ధరించి శ్రీకృష్ణుని మీదకు వచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు గదను పట్టుకొని ఉన్న సాల్వుడి చేతిని ఒక్క వేటుతో ఖండించాడు.

క. అంతం బోవని కినుక న, నంతుఁడు విలయార్క మండలాయతరుచి దు
ర్దాంతంబగు చక్రంబు ని, తాంతంబుగఁ బూన్చి సాల్వధరిణిపు మీఁదన్.

912

తా ॥ సాల్వుడిమీదే ఉన్న క్రోధాతిశయంతో, శ్రీకృష్ణుడంతటితో ఊరుకోక, ప్రళయకాల సూర్యకాంతితో నిప్పులు చెఱగే సుదర్శన చక్రాన్ని అతనిమీద ప్రయోగించాడు.

క. గురుశక్తి వైచి వెస భా, సురకుండల మకుటరత్న శోభితమగు త
చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు, వరకులిశముచేత వృత్రు వధియించుక్రియన్.

913

తా ॥ దేవేంద్రుడు వజ్రాయుధంతో వృత్రాసురుని సంహరించిన విధంగా రత్న కిరీటంతో, మణిమయ కుండలాలతో ప్రకాశిస్తున్న సాల్వమహీపాలుని శిరస్సును శ్రీకృష్ణుడు తృటిలో ఖండించాడు.

## శ్రీకృష్ణుడు దంతవక్త్రున్ని వధించుట

వ. ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబును గృష్ణుచేతం బొలియుటఁ గొని నిజసఖులగు సాల్వ పౌండ్రక శిశుపాలురకుఁ బారలౌకికక్రియలు మైత్రిం గావించి దంతవక్త్రుం డతిభీషణాకారంబుతో నప్పుడు.

914

తా ॥ శ్రీకృష్ణుడు ఈ విధంగా సౌభక విమానాన్ని, సాల్వున్ని కూల్చటం చూశాడు దంతవక్త్రుడు. అన్న అయిన శిశుపాలుడికి మిత్రులైన సాల్వుడికి, పౌండ్రక వాసుదేవుడికి అంత్యక్రియలు సల్పి, దంతవక్త్రుడు శ్రీకృష్ణుని మీద పగతో రగిలిపోయాడు.

చ. పెట పెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ మోయుచుఁ గన్ను గ్రేవలం
జిటచిట విస్ఫులింగములు చింద మహోద్ధతపాదఘట్టనన్
నటనిటనై ధరిత్రి వడఁకాడ వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్
మిటమిట మండు వేసవిని మించు దివాకరుఁ బోలి యుగ్రతన్.

915

తా ॥ పటపట పళ్ళు కొరికాడు. పెద్దగా బొబ్బలు పెట్టాడు. శత్రువులమీద ఘీంకరించాడు. కనుకొసల నుండి నిప్పు రవ్వలు చిందించాడు. పాదఘట్టనతో భూమి వణికిపోయేటట్లు భయంకరాకారంతో నడుస్తూ గదను గిరగిరా త్రిప్పాడు. ఆ విధంగా, మండువేసవిలో మండిపడే సూర్యుడిలా ఉగ్రరూపంతో దంతవక్త్రుడు – శ్రీకృష్ణుడి వద్దకు వచ్చాడు.

చ. వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింప న
ప్పుడు గదఁ గేలఁబూని రథమున్ రయమొప్పఁగ డిగ్గి యుగ్రతన్

గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన వాఁ డతినీచవర్తియై
యదరుచు నట్టహాసముఖుడై వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్.

916

తా ॥ అతివేగంగా తన మీదకు వస్తున్న దంతవక్త్రున్ని చూసి కృష్ణుడు కూడా ఉత్సాహంతో యుద్ధోన్ముఖుడై వెంటనే రథం దిగాడు. ఉగ్రాకారుడై, గద చేతిలో పట్టుకొని శత్రువైన దంతవక్త్రుడికి ఎదురుగా వెళ్ళాడు. దంతవక్త్రుడు విజృంభించి, అట్టహాసం చేస్తూ, చేతిలోని గదను భయంకరంగా త్రిప్పుతూ కృష్ణుడి వైపు చూసి అవహేళనగా ఇలా అన్నాడు:

వ. కనుంగొని పరిహాసోక్తులుగా నిట్లనియె. 'నీవు మదీయభాగ్యంబునం జేసి నేఁడు నా దృష్టి పథంబునకు గోచరుండ వైతివి. మిత్ర ద్రోహివైన నిన్ను మాతులేయుండవని మన్నింపక దేహంబు నందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాదిక్రియల నివర్తింపఁ జేయు చికిత్సకుని చందంబున బంధురూపశాత్రవుండవు గావున నిన్ను దంభోళి సంరంభ గంభీరంబైన మదీయ గదాదండహతిం బరేతనివాసంబున కనిచి మున్ను నీచేత నిహతులైన నాదుసఖుల ఋణంబుఁ దీర్తు' నని దుర్భాష లాడుచు డగ్గఱి.

917

తా ॥ "ఆహా! కృష్ణా! ఈనాడు నా అదృష్టవశాత్తు నీవు నా కంటపడ్డావు. నీవు నా మిత్రులనందరినీ వధించి నాకు ద్రోహం చేశావు. నిన్ను మేనమామ కొడుకువని కూడా మన్నించను. బంధువురూపంలో ఉన్న పగవాడివి. మాకు ద్రోహివైన నిన్ను, శరీరంలో పేరుకు పోయిన భయంకర వ్యాధిని ఔషధంతో పోగొట్టే వైద్యునిలాగా నా గదాదండంతో వధించి యమపురికి పంపిస్తాను. నా మిత్రుల ఋణం తీరుస్తాను" అని దంతవక్త్రుడు కృష్ణుణ్ణి నిందించాడు.

చ. పెనుగదఁ బూన్చి కృష్ణుతల బెట్టుగ మొత్తిన నంకుశాహతిన్

గనలెడి గంధసింధురముకై వడి సింధురభంజనుఁడు పెం
పున పవిభాసమానగదఁ బూని బలంబున ద్రిప్పి దంత వ
క్త్రుని యురముం బగిల్చినఁ గుదుల్కొనుచున్ రుధిరంబు గ్రక్కుచున్.

918

తా ॥ మాటలంటూనే దంతవక్త్రుడు శ్రీకృష్ణుణ్ణి సమీపించి, పెద్దగద తీసుకొని కృష్ణుడి తలమీద గట్టిగా కొట్టాడు. 'కువలయాపీడమ' నే కంసుని మదపుటేనుగును వధించిన శ్రీకృష్ణుడు దంతవక్త్రుడు కొట్టిన దెబ్బకు – అంకుశంతో పొడిస్తే కోపించే మదగజంలాగా ఆగ్రహంతో ఎదురుదెబ్బ తీశాడు. వజ్రాయుధంతో సరిసమానమైన గదాయుధాన్ని భయంకరంగా త్రిప్పుతూ దంతవక్త్రుని వక్షస్థలంపై వేసికొట్టాడు. ఆ గదాఘాతానికి దంతవక్త్రుడు అదిరి పడ్డాడు.

వ. తత్క్షణం పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు నేలం గూలి కేశపాశంబులు సిక్కువడఁ దన్నుకొనుచుఁ బ్రాణంబు విడిచె; నప్పుడు నిఖిల భూతంబులు నాశ్చర్యంబు వొందఁ దద్గాత్రంబున నుండి యొక్క సూక్ష్మ తేజంబు వెలువడి గోవిందుని దేహంబుఁ బ్రవేశించె! నయ్యవసరంబున నగ్రజుమరణంబు గనుంగొని కుపితుండై కనుఁగవల నిప్పు లుప్పతిల్ల విదూరథుండు గాలానల జ్వాలాభీలకరాళంబైన కరవాలంబును బలకయుం గేలం దాల్చి దామోదరు దెసకుఁ గవియుటం గనుంగొని.

919

తా ॥ దంతవక్త్రుడు శరీరమంతా అతలాకుతలమైపోగా నెత్తురు క్రక్కుతూ, పర్వతాకారం వంటి దేహంతో దొర్లుకుంటూ నేలమీద పడ్డాడు. జుట్టంతా చిక్కుపడేటట్లు తన్నుకొంటూ చివరకు ప్రాణాలు విడిచాడు. అప్పుడు దంతవక్త్రుని శరీరం నుంచి ఒక సూక్ష్మ తేజము బయటకు వచ్చి శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. అది చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఆ సమయంలో అన్న అయిన దంతవక్త్రుని మరణం చూసిన విదూరథుడు కోపావేశంతో కళ్ళనుండి నిప్పులు రాలుస్తూ, ప్రళయకాలంలోని అగ్నిజ్వాలలాగా మహా భయంకరంగా ఉన్న కత్తినీ,

డాలునూ ధరించి శ్రీకృష్ణుని మీదకు వచ్చాడు.

చ. జలరుహలోచనుండు నిజసాధనమై తనరారు చక్రమున్
వలనుగఁ బూన్చి వైవ నది వారక వాని శిరంబు ద్రుంచె న
బ్బలియుఁడు సౌభ సాల్వ శిశుపాల సహోదర తత్సహోద రా
వలుల వధించి తత్కులమువారి ననేకులఁ ద్రుంచె నీ గతిన్.

920

తా ॥ విదూరథుని విజృంభణ చూసిన శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రాన్ని వాడిపై ప్రయోగించాడు. సుదర్శనం విదూరథుని తలను త్రుంచి మరల కృష్ణుడి చేతిలోకి వచ్చి చేరింది. మహాబలశాలి, శౌర్యవంతుడు అయిన కృష్ణుడు సౌభక సాల్వున్ని, శిశుపాలుడిన్ని, దంతవక్త్రున్ని, విదూరథున్ని, వారి సోదర సమూహాన్ని వధించి శత్రుశేషం లేకుండా చేశాడు.

వ. అ య్యవసరంబున.

921

తా ॥ అప్పుడు—

క. నరమునియోగి సురాసుర, గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు, హరిమహిమ నుతించి రద్భుతానందములన్.

922

తా ॥ మహదాశ్చర్యం పొందినవారై మానవులు, మహర్షులు, యోగులు, దేవతలు, రాక్షసులు, గరుడులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, ఆకాశ చారులైన కిన్నరులు, కింపురుషులు — శ్రీకృష్ణుని అద్భుతమైన మహిమను స్తోత్రం చేశారు.

వ. మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప, వేల్పులు కుసుమవర్షంబులు గురియ,

దేవతూర్యంబు లవార్యంబులై మొరయ, యదువృష్ణిప్రవరులు సేవింపఁ, బరమానందంబును బొంది నిజవిజయాంకితంబులైన గీతంబుల వందిజనంబులు సంకీర్తనంబులు సేయ, నతి మనోహర విభవాభిరామంబును, నూతనాలంకారయుక్తంబును నైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ.

923

తా ॥ శ్రీకృష్ణుని విజయాన్ని చూసి ఆనందంతో అప్సరసలు నృత్యం చేశారు. దేవతలు పుష్పవర్షం కురిపించారు. మంగళవాద్యాలు ఆగకుండా మ్రోగాయి. వందిమాగధులు శ్రీకృష్ణ విజయగాథలతో నిండిన పాటలతో ఆయనను కీర్తించారు. యాదవులు, వృష్ణిభోజులు వెంటనంటి సేవిస్తుండగా – వైభవోపేతంగా అలంకరింపబడి, మనోహరంగా దర్శనమిస్తున్న ద్వారకానగరంలోకి శ్రీకృష్ణుడు ఒక శుభముహూర్తాన ప్రవేశించాడు.

క. పురసతులు విరులు లాజలు, గురుసౌధాగ్రములనుండి కురియఁగ వికచాం
బురుహాక్షుం డంతఃపుర, వర మర్థిం జొచ్చె వైభవం బలరారన్.

924

తా ॥ అప్పుడు ఆ నగరంలోని స్త్రీలు పెద్దపెద్ద మేడలెక్కి పైనుంచి కృష్ణునిమీద పరిమళభరితమైన పుష్పాలను, మంగళకరమైన అక్షతలను చల్లారు. శుభసూచనలతో కృష్ణుడు అంతఃపురంలోకి వెళ్ళాడు.

వ. అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్య సంపన్నుండును, నిఖిల జగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబుండె నంత.

925

తా ॥ ఆ విధంగా, యోగీశ్వరులకే ప్రభువైనవాడు, సమస్త లోకాలకు నాథుడైనవాడు అయిన శ్రీకృష్ణుడు సుఖంగా కాలం గడిపాడు.

క. కౌరవ పాండవ పృథు సమ, రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా
సీరాంకుఁ డుభయకులులకు, నారయ సముఁడగుటఁ జేసి యరిగె నరేంద్రా!

926

తా ॥ "పరీక్షిత్తూ! నీకు మరో విషయం చెబుతాను విను" అని మొదలుపెట్టాడు శుకమహర్షి. "కౌరవులకు, పాండవులకు మధ్య ఘోర సంగ్రామం ప్రారంభం కాబోతోందన్న విషయాన్ని విన్న బలరాముడు తీర్థయాత్రకు బయలుదేరాడు. బలరాముడి దృష్టిలో కౌరవ పాండవులిరువురు ఆయనకు సమానబంధువులే.

## బలరాముడు తీర్థయాత్రకు వెళ్ళుట

వ. అట్లు సని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహంబు సేసి, యందు దేవర్షి పితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమలతేజోధనులగు భూసురప్రవరులు దనతో నరుగుదేరం గదలి చని క్రమంబున సరస్వతియు బిందుసరోవరంబును వజ్రతీర్థంబును విశాలానదియు సరయువును యమునయు జాహ్నవియును గనుంగొనుచు నచట నచట నవగాహనంబులును, దేవర్షి పితృతర్పణం బులును, బ్రాహ్మణ సంతర్పణంబులను భూసురయుక్తుండై నడపుచుం జని సకలలోక స్తుత్యంబును నిఖిలముని శరణ్యంబు నగు నైమిశారణ్యంబు సొచ్చి యందు దీర్ఘసత్త్రంబు నడపుచున్న మునిజనంబులం గనుంగొనిన వారును ప్రత్యుత్థానంబు చేసి రామునకు వినతులై యాసనార్ఘ్యాది పూజావిధానంబులు గావించిన నతండును బ్రముదిత మానసుం డగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ.

927

తా ॥ యుద్ధంలో ఇరుపక్షాల వారికెవ్వరికీ సహాయం చేయకూడదని నిశ్చయించుకొన్న బలరాముడు ముందుగా ప్రభాస తీర్థం చేరుకొన్నాడు. ఆ పవిత్ర జలంలో స్నానమాడి దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు భక్తితో తర్పణలిచ్చాడు. తరువాత తపోమహిమతో అలరారుతున్న భూసురశ్రేష్ఠులు తనతో కదలి వస్తుండగా, వరుసగా, సరస్వతి, బిందుసరోవరము, వజ్రతీర్థము, విశాల, సరయూ, యమున, గంగా మొదలైన పుణ్యతీర్థాలు దర్శించాడు. ఆ యా నదులలో పవిత్ర స్నానమాచరించాడు. ప్రతీ తీర్థంలోను, ప్రతీ నదిలోను దేవతలకు, ఋషులకు, పితృదేవుళ్ళకు యథావిధిగా తర్పణలిచ్చాడు. బ్రాహ్మణులకు సంతర్పణలతో సహా దక్షిణతాంబూలాదులిచ్చి తృప్తి చెందాడు. శాస్త్రవిదులైన బ్రాహ్మణులు తోడై పుణ్యకార్యాలు చేయిస్తుండగా మరికొంత దూరం వెళ్ళి నైమిశారణ్యం చేరాడు. సర్వలోకవాసుల చేత స్తుతింపబడే ఆ పవిత్ర భూమిలో అడుగుపెట్టాడు. మునిజనులకందరకు నివాసస్థానమైన నైమిశారణ్యంలో కొందరు మునులు "దీర్ఘసత్త్రమ" నే యజ్ఞాన్ని చేస్తుండటం చూసిన

బలరాముడు వారి దగ్గరకు వెళ్ళాడు. బలరాముణ్ణి చూసిన ఆ మహర్షులందరు వెంటనే లేచి, నమస్కరించి, గౌరవపూర్వకంగా ఆసనం చూపించారు. మహర్షులు చేసిన మర్యాదకు సంతోషించిన బలరాముడు సపరివారంగా ఆసీనుడై నలుదిక్కులా చూశాడు.

క. ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యు, త్థాన నమస్కారవిధులు దగ నడపక పెం
పూనిన పీఠముపై నా, సీనుండగు సూతు శేముషీవిఖ్యాతున్.

928

తా ॥ ఆ సమయంలో తనను చూసి, లేచి, నమస్కరించి, పూజావిధులు చేయక, నిర్లక్ష్యంగా కూర్చొని ఉన్న, ప్రజ్ఞావంతుడైన సూతున్ని బలరాముడు చూశాడు.

వ. కనుంగొని యతని సమీపంబున నున్న విప్రవరులం జూచి రాముండు రోషించి 'వీఁడు నన్నుఁ గని లేవకుండుటకు హేతు వెయ్యదియొకో? ఈ ప్రతిలోమజాతుండు మునిగణ సభాస్థలంబునఁ దానొక్క ముఖ్యుండువోలె దురభిమానంబున శక్తి మనుమని వలనం గొన్ని కథలు గాథలు గఱచి విద్వద్గణ్యుని విధంబున విఱ్ఱ వీఁగెడును; నీచాత్ముం డభ్యసించు విద్య లెల్లను మనంబున విచారించి చూచిన మదకారణంబులు గాని సత్త్వగుణ గరిష్ఠంబులు గావు, ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యంబు, అని తలఁచి హస్తంబున ధరించిన కుశాగ్రంబున నా సూతుని వధించిన నక్కడి మునీంద్రు లెల్ల హాహాకారంబుల తోడం దాలాంకునిఁ జూచి యిట్లనిరి.

929

తా ॥ సూతుని చర్య బలదేవుడికి ఆగ్రహం తెప్పించింది. ప్రక్కనే ఉన్న మునులను చూశాడు. "ఈ సూతుడు నన్ను చూసి లేచి నిలబడకపోవటానికి కారణమేమిటి? ఇంతమంది మహర్షులున్న ఈ యజ్ఞవేదికలో తానొక్కడే గొప్పవాడి ననుకొన్నాడా? ఇతనిలో దురభిమానం చాలా ఎక్కువగా కనిపిస్తోంది. వ్యాసమహర్షి వల్ల కొన్ని పురాణ గాథలు నేర్చుకొన్నంత

మాత్రంచేత మహావిద్వాంసుడై పోతాడా? ఈతని గర్వం చూస్తుంటే – నీచుడు విద్యలభ్యసిస్తే ఆ విద్యలాతనికి 'మద' కారకాలౌతాయిగాని, శాంతగుణాన్ని ప్రసాదించవని స్పష్టమౌతోంది. మేము ధర్మరక్షణ కోసం జన్మించాము. అందుచేత ఇటువంటి దుష్టుడిని వధించటం మా కర్తవ్యం." అని బలరాముడు పలికి, తన చేతిలో ఉన్న దర్భతో పొడిచి సూతుని చంపాడు. అది చూసిన మహర్షులందరూ హాహాకారాలు చేస్తూ, బాధతో బలరాముని చూసి ఇలా చెప్పారు:

క. అనఘా! యితనికి బ్రహ్మా, సన మే మిచ్చుటను నీవు సనుదే నితఁ డా
సనము దిగఁడయ్యె నింతయు, మును నీమది నెఱుఁగ నర్థముం గలదె? హలీ!

930

తా ॥ "మహానుభావా! బలదేవా! ఒక్కమాట. ఈ దీర్ఘ సత్త్రయాగంలో మేము సూతునికి 'బ్రహ్మాసనం' ఇచ్చి సత్కరించాం. ఆ కారణంచేత నీవు వచ్చినప్పటికీ సూతుడు ఉన్నతాసనం దిగలేదు. ఇది నీకు తెలియని విషయమా? సర్వం తెలిసిన భగవత్స్వరూపుడివి.

క. ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీమనంబు దూకొనెఁ బాపో
త్తరణ ప్రాయశ్చిత్తము, దొరఁకొని కావింపు మయ్య దుర్జనహరణా!

931

తా ॥ బలరామదేవా! దుష్టులను సంహరించే మహాత్ముడవు నీవు. తెలిసితెలిసీ ఇటువంటి బ్రహ్మహత్యా పాతకానికి పూనుకొన్నావు. పాపం జరిగిపోయింది. ఆ పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవటం కర్తవ్యంగా భావించు.

వ. అదియునుం గాక పరమపావనుండవైన నీవు ధర్మంబు దప్పిన నెవ్వరు మాన్పంగలరు? కావునఁ బ్రాయశ్చిత్తంబు గైకొని నడపకున్న ధర్మంబు నిలువ; దట్లు గావున దీనికిఁ బ్రతీకారంబు పుట్టింపు' మనిన నతండు వారలం గనుంగొని 'తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె. దీనికి ముఖ్యపక్షంబునఁ బ్రతికృతి యెఱింగింపుండు, వీనికి నాయువును

బహుసత్త్వంబును నొసంగిన మీ కిష్టం బగునే? నట్లు నాయోగమాయచేఁ గావింతు' నన నమ్మునులు నీ యస్త్ర మాహాత్మ్యంబునకు మృత్యువునకు మాకు నెవ్విధంబున వైకల్యంబు నొందకుండునట్లు గావింపు మనిన నతం డందఱం జూచి యప్పుడు.

932

తా ॥ అదీగాక, పరమపావనుడవు, పుణ్యమూర్తివి, ధర్మపరుడవు అయిన నీవే ధర్మం తప్పి ప్రవర్తిస్తే, ఇక అధర్మాన్ని ఎవరు మాన్పగలుగుతారు? కాబట్టి నీవు ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ధర్మం నిలవదయ్యా! కనుక దీనికి తగిన ప్రతిచర్య నీవే చేసి పాపవిముక్తుడివి కావాలి." అని చెబుతున్న మునులను బలరాముడు చూసి "నా అజ్ఞానం వల్ల ఈ పాపం జరిగింది. దీనికి ప్రత్యామ్నాయం మీరే సెలవివ్వండి. నా యోగమాయా ప్రభావంచేత సూతుణ్ణి మళ్ళీ బ్రతికించి శక్తి సంపన్నుణ్ణి చేస్తాను. ఇది మీకిష్టమేనా?" అని అడిగాడు. బలరాముడి మాటలు విన్న మునులు "నీయొక్క అస్త్ర మహత్మ్యం మరియు మృత్యువు వలన మాకు ఎటువంటి హాని కలుగకుండా చేయుము" అని చెప్పారు.

క. ధాత్రీవర సమధిక చా, రిత్రుఁడు హలపాణి పలికె ధృతి 'నాత్మా వై
పుత్త్రక నామాసి' యను ప, విత్ర శ్రుతి వాక్యసరణి విశదం బగుటన్.

933

తా ॥ "ఆత్మావై పుత్రనామాసి" అనే వేదవాక్యం చెప్పినట్లు తానే తనయుని రూపంలో తిరిగి జన్మిస్తాడు గదా" అని బలరాముడు చెబుతూ—

క. ఈ సూతసూనుఁడిపుడు మ, హాసత్త్వము నాయువును ననామయమును వి
ద్యా సామర్థ్యము గలిగి సు, ధీసత్తములార! యీక్షితిన్ విలసిల్లున్.

934

తా ॥ "ఈ సూతుడు శక్తిసంపన్నతతో, చిరాయువుతో, రోగరహితుడుగా, విద్యాకోవిదుడై

కలకాలం ఈ భూమిపైన వర్ధిల్లుతాడు."

వ. అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి మునులం జూచి యిట్లనియె.

935

తా ॥ అని సూతున్ని బ్రతికిస్తాడు. మహర్షులను చూసి ఈ విధంగా అన్నాడు:

తే. 'ఏ నెఱుంగక చేసిన యీ యవజ్ఞ, శాంతి వొంద నేయది యభీష్టంబు మీకు
దానిఁ గావింతు ననిన మోదంబు నొంది, పలికి ర త్తాపసులు హలపాణిఁ జూచి.

936

తా ॥ "తెలుసుకోకుండా నేను చేసిన ఈ అవమానాన్ని మీరు మరచిపోవడానికి, శాంతియుతులు కావడానికి మీకేది ఇష్టమైతే అది నేను చేస్తాను. చెప్పండి."

చ. 'హలధర! యిల్వలుండను సురారితనూజుఁడు పల్వలుండు నాఁ
గలఁ డొక దానవుండు బలగర్వమునం బ్రతిపర్వమందు న
చ్చలమున వచ్చి మా సవనశాలల మూత్ర సురాస్రపూయ వి
ట్పలలము లోలిమైఁ గురిసి పాడఱఁ జేయును యజ్ఞవాటముల్.

937

తా ॥ బలదేవా! నీ మాటలు మాకు ఆనందాన్ని కలిగించాయి. నీవు కోరమన్నావు గనుక చెబుతున్నాం. పల్వలుడు – ఇల్వలుడు అనే రాక్షసుని కుమారుడు. వాడు బలగర్వంతో ఏ పుణ్యకార్యం మేం చేస్తున్నా పట్టుదలతో దుష్టుడై వచ్చి మా యజ్ఞశాలల యందు మలమూత్రాలను, మద్యమాంసాలను, చీమునెత్తురులను కురిపిస్తున్నాడు. ఆ విధంగా యజ్ఞవాటికలను పాడుచేసి యజ్ఞయాగాలను ధ్వంసం చేస్తున్నాడు.

వ. కావున దుష్టదానవుం ద్రుంచుటయు మాకుం గరంబు సంతసంబగు; నంత మీఁద నీవు

విమలచిత్తుండవై భారతవర్షంబునం గల తీర్థంబుల ద్వాదశమాసంబు లవగాహనంబు సేయు; మట్లయిన సర్వపాపనిష్కృతి యగునని పలుకునంతఁ బర్వసమాగమంబైన.

938

తా ॥ బలరామదేవా! దుష్టుడు, నీచుడు అయిన పల్వలున్ని సంహరించడం మాకెంతో సంతోషాన్ని కలిగిస్తుంది. పల్వలాసురుని వధించి, పవిత్రుడవైన నీవు సంవత్సరం పాటు భారతదేశంలో గల సకల పుణ్యతీర్థాలలో స్నానం చేస్తే సమస్త పాపాలు వైదొలగిపోతాయి" అని మునులు పలికిన కొద్దికాలంలోనే పర్వదినం వచ్చింది.

సీ. మునులు యజ్ఞక్రియోన్ముఖు లౌటఁ గనుఁగొని పఱతెంచి యసుర తద్భవనములను
రక్త విణ్మూత్ర సుర మాంసజాలంబు నించి హేయంబు గావించి పెలుచఁ
బెంధూళి ఱాలును బెల్లలు నురలెడు చక్రానిలము వీఁచి చదల నపుడు
గాటుకకొండసంగతిఁ బొల్చు మేను తామ్ర శ్మశ్రు కేశ సమాజములును

తే. నవ్యచర్మాంబరము భూరినాసికయును, గఱకు మిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి
వ్రేలు పెదవులు దీర్ఘకరాళ జిహ్వ, కయును ముడివడ్డబొమలును గలుగువాని.

939

తా ॥ మహర్షులందరూ యజ్ఞం చేద్దామని నిర్ణయించారు. యజ్ఞకార్యకలాపాలను వారు ప్రారంభించినదే తడవుగా అదను చూసి రాక్షసుడు విజృంభించాడు. యజ్ఞవాటికలందు రక్తమాంసాలను, మలమూత్రాలను కురిపించాడు. యజ్ఞం చూసి అందరూ అసహ్యించుకొనేటట్లు చేసి, ఆకాశంపై నుంచి సుడిగాలులు వీచేటట్లు చేశాడు. ఆ సుడిగాలుల ద్వారా భూమ్యాకాశాలు నిండేటట్లు ధూళిని కల్పించాడు. పెద్దపెద్ద రాళ్ళను, మట్టిముద్దలను పడవేశాడు. ఆ బీభత్సంతో పాటు నల్లని పర్వతమా అన్నట్లు ఆకాశంలో అటూ ఇటూ తిరుగుతూ జనులకు విభ్రాంతిని కలుగజేశాడు. రాగిరంగులో ఉన్న గడ్డంతో, మీసాలతో, పెద్దముక్కుతో, మిడిగ్రుడ్లతో, నిప్పులు క్రక్కుతున్న చూపులతో, వ్రేలాడుతున్న పెదవులతో,

పొడవైన వికృతంగా ఉన్న నాలుకతో, ముడుచుకుపోయిన కనుబొమ్మలతో, చర్మాన్ని వస్త్రంగా ధరించి భయంకరంగా కనిపిస్తున్న పల్వలాసురుణ్ణి బలరాముడు చూసాడు.

మహాస్రగ్ధర.

కనియెం దాలాంకుఁ డుద్యత్కట చటుల నట త్కాలదండాభ శూలున్
జనరక్తాసిక్తతాలున్ సమధిక సమరోత్సాహలోలుం గఠో రా
శని తుల్యోదగ్ర దంష్ట్రా జనిత శిఖికణాచ్ఛాది తాశాంతరాలున్
హననవ్యాపార శీలు న్నతి దృఢఘనమస్తాస్థిమాలుం గరాళున్.

940

తా ॥ పల్వలుడు తీవ్రమైన కాలదండంలాంటి శూలాన్ని చేతిలో ధరించి ఉన్నాడు. అతని నాలుక దవడలు ప్రజల రక్తంతో తడిసి జుగుప్సావహంగా ఉన్నాయి. యుద్ధం చేసి ఎందరిని హతమారుద్దామా అని ఉత్సాహంతో గంతులు పెడుతున్నాడు. దంష్ట్రలు గట్టిగా కొరకడం వల్ల పుట్టిన అగ్ని కణాలచేత దిగంతాలు కప్పబడి ఉన్నాయి. ఎముకలను, తలలను మాలలుగా చేసి మెడలో ధరించి మహాభయంకరంగా కనిపిస్తున్నాడు.

ఉ. వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడువీథి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు నుదారత రా బలభద్రుఁ డాసురో
ద్దండ విఘాతులౌ ముసలదారుణలాంగలముల్ దలంప మా
ర్తాండనిభంబులై యెదురఁ దత్క్షణమాత్రన తోఁచినన్ వెసన్.

941

తా ॥ ఆకాశంలో తళతళమని మెఱుపులు పుట్టేటట్లు తనచేతిలోని గదను మహోత్సాహంతో గిరగిరా త్రిప్పుతూ బలరాముడి మీదికి వచ్చాడు. వెంటనే రాక్షసులను చంపగలిగిన హలాయుధాన్ని, దారుణమైన రోకలిని తన వద్దకు రమ్మనమని బలరాముడు

మనస్సులో తలచాడు. సూర్యతేజస్సుతో ప్రకాశిస్తూ ఆ ఆయుధాలు బలరాముని ముందు తక్షణమే నిలిచాయి.

వ. అట్లు సన్నిహితంబులైన తన కార్యసాధనంబు లగు నిజసాధనంబులు
ధరియించి యప్పుడు.

942

తా ॥ ఆ విధంగా చెంతకు వచ్చిన తన ఆయుధాలను బలరాముడు ధరించి, ప్రకాశించాడు.

చ. గగనమునం జరించు సురకంటకు కంఠము చేఁతినాగటం
దగిలిచి రోఁక లెత్తి బెడిదం బదరన్ నడునెత్తి మొత్తినన్
బుగబుగ నెత్తు రొల్క నిల బోరగిలం బడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరి జగతీధరముం బురుణింప బెట్టుగాన్.

943

తా ॥ బలరాముడు చేతిలోని నాగలితో ఆకాశంలో తిరుగాడుతున్న పల్వలుని కంఠాన్ని బిగించి, రోకలి తీసి వాడి నడినెత్తిమీద కఠినంగా మోదాడు. ఆ దెబ్బతో క్షణంలో వజ్రాయుధపు దెబ్బకు రెక్కలు తెగి క్రింద నేలకూలే మహాపర్వతంలా నెత్తురు క్రక్కుకుంటూ పల్వలుడు నేలమీద బోర్లగిలా పడిపోయాడు.

వ. అట్లు పల్వలుండు మడిసిన.

944

క. మునివరులు గామపాలుని, వినుతించిరి వేయువేల విధముల వృత్రుం
దునిమిన యింద్రుని నమరులు, వినుతించిన రీతి నపుడు విమలచరిత్రా!

945

తా ॥ ఆ విధంగా పల్వలాసురుడు మరణించగానే మునులందరూ వృత్రాసురుణ్ణి చంపిన దేవేంద్రుణ్ణి దేవతలు స్తుతించినట్లు బలరాముణ్ణి రకరకాలుగా స్తుతించారు.

తే. అంత నభిషిక్తుఁ జేసి యత్యంత సురభి, మంజులామ్లాన కంజాత మాలికయును
నంచితాభరణములు దివ్యాంబరములు, నర్థి నిచ్చినఁ దాల్చి యా హలధరుండు.

946

తా ॥ బలరాముని ఘనవిజయానికి పొంగిపోతూ మహర్షులందరూ ఆ మహానుభావుణ్ణి పవిత్ర నదీజలాలతో అభిషేకించారు. పరిమళాలు వెదజల్లుతున్న పద్మాల మాలలతో అలంకరించారు. వివిధములైన ఆభరణాలను, చక్కని వస్త్రాలను బహూకరించారు. వాటినన్నిటినీ బలరాముడు ఎంతో ప్రేమతో స్వీకరించాడు.

క. దేవేంద్రుఁ బోలి యొప్పెను, ధీవిలసితుఁ డగుచు మునితతిన్ వీడ్కొని తన్
సేవించుచుఁ గతిపయ వి, ప్రావలి సనుదేరఁ గౌశికాఖ్యంబునకున్.

947

తా ॥ మహర్షులిచ్చిన ఆభరణాదులను ధరించి బలరాముడు దేవేంద్రుడిలా వెలిగిపోయాడు. ఆనందంతో మునులనందరినీ వీడ్కొని కొంతదూరం నడిచి 'కౌశికి' అనే నది చెంతకు చేరాడు. కొద్దిమంది విప్రులు బలరాముడితో పాటు తీర్థయాత్రలకు బయలుదేరారు.

వ. చని యమ్మహానదిం గృతస్నానుండై యచ్చోటు వాసి సరయువునందుఁ గ్రుంకులిడి ప్రయాగ నవగాహనంబు చేసి, దేవర్షి పితృతర్పణంబు లాచరించి పులస్త్యాశ్రమంబు సొచ్చి గోమతిం దర్శించి గండకీనది నుత్తరించి విదళితభవపాశ యగు విపాశయందుఁ దోఁగి శోణనదంబున నాప్లావితుండై గయ నాడి గంగాసాగర సంగమంబు దర్శించి మహేంద్ర

నగంబున కరిగి.

948

తా ॥ బలరాముడు కౌశికీ నదిలో స్నానమాచరించి, మరికొంత దూరం ప్రయాణించి సరయూనదిని చేరాడు. అందులో స్నానమాడి, ప్రయాగకు వెళ్ళాడు. త్రివేణీసంగమంలో మునిగి, అక్కడ దేవర్షులకు, పితృదేవతలకు తర్పణలిచ్చాడు. తరువాత పులస్త్యుని యొక్క ఆశ్రమానికి వెళ్ళాడు. గోమతీ నదిని చూసి, గండకీనదిని దాటి, సంసారపాశాలన్నిటినీ త్రెంపివేసే విపాశ నదిలో స్నానమాడాడు. ఆ తరువాత శోణా నదిలో స్నానం చేసి, అటు పిమ్మట గయకు వెళ్ళాడు. గయలోని ఫల్గుణీ నదిలో స్నానమాడి, మరికొంతదూరం వెళ్ళి గంగాసాగర సంగమాన్ని దర్శించాడు. తరువాత మహేంద్రగిరికి చేరుకొన్నాడు.

క. రాముఁడు గనుఁగొనె భార్గవ, రామున్ రజనీశ కుల ధరావరనగ సు
త్రామున్ సన్నుత సుగణ, స్తోముం గారుణ్యసీము సుజనలలామున్.

949

తా ॥ బలరాముడు మహేంద్రగిరిపైన చంద్రవంశరాజులనే పర్వతాలను విచ్ఛేదం చేసిన దేవేంద్రుని వంటి వాడైన పరశురాముడిని సందర్శించాడు. సజ్జన శ్రేష్ఠుడు, సుగుణ శోభితుడు, కరుణాకారుడు అయిన ఆ భార్గవ రాముడికి భక్తిపూర్వకంగా నమస్కరించాడు.

ఆ. కని నమస్కరించి కౌతుకం బలరార, నతని వీడుకొని హలాయుధుండు
గొమరు మిగిలి సప్తగోదావరికి నేఁగి, యందుఁ దీర్థమాడి యచటు గదలి.

950

తా ॥ పరశురామునితో కొంతసేపు ప్రసంగించి, బలరాముడు ఆయనను వీడ్కోని, అందమైన సప్తగోదావరిని చేరి అందులో స్నానం చేసి, అక్కడనుంచి మళ్ళీ బయలుదేరాడు.

వ. వేణీ పంపా సరస్సులం జూచి భీమనది కేఁగి యందుఁ గుమార స్వామిని దర్శించి, శ్రీశైలంబునకుఁ జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటి శక్తిని నిరీక్షించి, కాంచీపురంబుం గాంచి, కావేరికిం జని యమ్మహావాహిని నవగాహనంబు సేసి.

951

తా ॥ కృష్ణానదిని, పంపాసరస్సును సందర్శించాడు. తరువాత భీమానదికి వెళ్ళి, అక్కడ కుమార స్వామికి మ్రొక్కాడు. ఆ తరువాత శ్రీశైలం వెళ్ళాడు. వేంకటాచలమైన తిరుమలను దర్శించాడు. కామకోటశక్తి రూపిణి అయిన కామాక్షీదేవిని సందర్శించాడు. కాంచీపురమంతా చూశాడు. తరువాత కావేరీ నది దగ్గరకు వెళ్ళాడు. అక్కడ పవిత్ర స్నానం చేశాడు.

స్రగ్ధర.

సేవించెన్ రంగధామున్ శ్రితనివహ పయస్సింధు సంపూర్ణసోముం
గావేరీ మధ్యసీమున్ ఘనకలుష మహాకాళకూటోగ్ర భీమున్
దేవారి శ్రీవిరామున్ దివిజవినుత సందీపితానంత నామున్
ధీవిజ్ఞానాభిరాముం ద్రిభువన విలసద్దేవతా సార్వభౌమున్.

952

తా ॥ బలరాముడు కావేరీ నదికి మధ్యలో వేంచేసి ఉన్న సర్వదేవతలకు సార్వభౌముడైన ప్రజ్ఞాన సంపన్నుడైన దేవతలచే వినుతింపబడే అనంత నామాలతో ప్రకాశించే వాడైన, రాక్షసులవైభవాలను అణగార్చే వాడైన, పాపమనే కాలకూట విషాన్నిమ్రింగివేసే శంకరుని వంటి వాడైన, భక్తసమూహమనే పాలసముద్రాన్ని ఉప్పొంగజేసే పూర్ణచంద్రుని వంటి వాడైన శ్రీరంగనాథుణ్ణి అత్యంత భక్తి భావంతో సేవించాడు.

వ. అచ్చోటు వాసి వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కరిగి, సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేల పాఁడి మొదవుల భూసురుల కిచ్చి, రామేశ్వరుం

దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలం బెక్కి, యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణ సముద్రంబు దర్శించి, కన్యకొఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరంబను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందు మౌళిని దర్శించి, ద్వీపవతి యైన కామదేవిని వీక్షించి, తాపిం బయోష్ణిని దర్శించి, నిర్వింధ్యంబు గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీ పురంబున వసియించి, మనుతీర్థం బాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణ జనంబుల వలనం బాండవధార్తరాష్ట్రుల భండనంబునందు సకలరాజలోకంబు పరలోక గతు లగుటయు, వాయునందన సుయోధనులు గదాయుద్ధ సన్నద్ధులై యుండుటయు నెఱింగి వారల వారించు తలంపున నచటికిం జని.

953

తా ॥ బలరాముడు శ్రీరంగం వదిలినవాడై వృషభాద్రినెక్కి విష్ణుసందర్శనం చేశాడు. తరువాత మధురకు వెళ్ళాడు. ఆ తరువాత సేతుబంధనమనబడే రామేశ్వరం చేరాడు. అక్కడ బ్రాహ్మణోత్తములకు పదివేల పాడి ఆవులను దానమిచ్చాడు. రామేశ్వరుణ్ణి పూజించి తామ్రపర్ణీ నదికి వెళ్ళాడు. మలయాచలమెక్కి అక్కడ అగస్త్యమహర్షిని చూసి ఆ బ్రహ్మర్షికి నమస్కరించాడు. అక్కడ నుండి దక్షిణసముద్రం దాకా వెళ్ళి సముద్రవైభవాన్ని కనులారా చూశాడు. తరువాత కన్యాకుమారికి వెళ్ళి అక్కడ వెలసిన, "కన్య" అనే పేరుతో పూజలందుకొంటున్న దుర్గాదేవిని అర్చించాడు. పుణ్యప్రదమైన "పంచాప్సర" తీర్థంలో స్నానమాచరించాడు. గోకర్ణంలోని మహేశ్వరుణ్ణి దర్శించాడు. ద్వీపవతిలో కామదేవిని, తాపిలో ఉన్న పయోష్ణిని సందర్శించాడు. తర్వాత వింధ్యపర్వతం దాటాడు. దండకావనంలో తిరిగాడు. మాహిష్మతీ పురంలో కొంతకాలం గడిపాడు. తరువాత 'మను' తీర్థంలో స్నానం చేశాడు. మళ్ళీ తిరిగి ప్రభాసతీర్థానికి వచ్చాడు. ప్రభాసతీర్థం వద్ద ఉన్న విప్రులు బలరాముడితో కురుపాండవ సంగ్రామంలో సకలరాజన్యులు పరలోకగతులయ్యారని తెలియజెప్పారు. ఆ సమయంలో భీమ దుర్యోధనుల గదాయుద్ధం జరగబోతోందని వివరించారు. ఆ విషయం తెలుసుకొన్న బలరాముడు భీమదుర్యోధనులనిద్దరినీ యుద్ధవిముఖుల్ని చేయాలని సంకల్పించి అక్కడకు వెళ్ళాడు.

తే. ధర్మనందనుఁ దనకు వందనము సేయు, కృష్ణు నరు మాద్రిసుతుల వీక్షించి యేమి
పలుక కుగ్ర గదా దండపాణు లగుచుఁ, గ్రోధమునఁ బోరు భీమ దుర్యోధనులను.

954

తా ॥ తమచెంతకు బలరాముడు రాగానే ధర్మరాజులేచి ఆ యాదవనాథుడికి నమస్కరించాడు. తనకు నమస్కరిస్తున్న కృష్ణుణ్ణి చూసి ఏమీ పలుకలేదు. అర్జునున్ని, నకులసహదేవులను చూసి మారు మాట్లాడక భీమదుర్యోధనులవైపు తిరిగాడు. వాళ్ళిద్దరూ మహాభయంకరమైన గదలను చేతబట్టుకొని పరస్పర విజయకాంక్షతో, ఘోరంగా, క్రోధోన్మత్తులై యుద్ధం చేస్తున్నారు.

వ. చూచి వారల డాయంజని యిట్లనియె.

955

తా ॥ గదాయుద్ధ నిపుణులైన భీమదుర్యోధనులను పరికించి, వారిని సమీపించి, వారితో ఈ విధంగా అన్నాడు:

సీ. వీరపుంగవులారా! వినుఁడు; మీలోపల భూరిభుజాసత్త్వమున నొకండు
ప్రకటితాభ్యాస సంపద్విశేషంబున నొక్కండు యధికుఁడై యుంటఁజేసి
సమబలు; లటు గాన చర్చింపఁగా నిందు, జయమొక్కనికి లేదు సమరమందుఁ;
గాన యూరక పోరఁగా నేల మీ కని వారింప నన్యోన్య వైరములను

తే. నడరి తొల్లింటి దుర్భాష లాత్మలందుఁ, దలఁచి తద్భాషణము లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర నా ముష్టికా సు, రారి వీక్షించి వీరి శుభాశుభములు,

956

తా ॥ "ఓ మహావీరులారా! నా మాట ఒక్కసారి వినండి. మీరిద్దరూ సమానమైన బలం

గలవాళ్ళు. ఎవరికెవరూ తీసిపోరు. మీరు యుద్ధం చేస్తే ఏ ఒకడికీ రెండో వాడిమీద విజయం లభించదు. ఎందుకంటే మీ ఇద్దరిలో ఒకరు భుజబలంలో గొప్పవారు. మరొకరు అభ్యాసంలో గొప్పవారు. అందుచేత మీ ఇద్దరూ ఊరికే పోరాడటం ఎందుకు? ఎంతపోరినా చివరకు ఇద్దరూ సమంగానే నిలుస్తారు. కనుక యుద్ధం ఆపటం మీ ఉభయులకు శ్రేయస్కరం." అని బలరాముడు ఎంతగానో చెప్పిచూశాడు.

బలరాముడెంత వారించినా భీమ దుర్యోధనులు యుద్ధం చేయటం మానలేదు. ఇద్దరూ అన్యోన్యవైరాలతో విజృంభించారు. పూర్వం ఒకరినొకరు నిందించుకొన్న మాటలన్నీ వారికి మనస్సులలో మెదిలాయి. దానితో బలరాముడు సూచించిన సంధి వారికి రుచించలేదు. మళ్ళీ వీర విక్రమంతో ఒకరితో ఒకరు తలపడ్డారు. భీమదుర్యోధనుల సంగ్రామ దీక్షను చూసి బలరాముడు ఇలా అనుకొన్నాడు.

వ. ఎట్లు గావలయు నట్ల యయ్యెడుం గాక యని యచ్చోట నిలువక యుగ్రసేనాది బంధు ప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు సొచ్చి యందుండి మగిడి నైమిశారణ్యంబునకుం జని యందుల మునిపుంగవు లనుమతింప నచ్చట నొక మఖంబు గావించి బహుదక్షిణ లొసంగి యంచితజ్ఞాన పరిపూర్ణు లగునట్లుగా వరం బిచ్చి రేవతియునుం దానును బంధుజ్ఞాతి యుతంబుగా నవభృథ స్నానం బాచరించి యనంతరంబ.

957

తా ॥ "వీరికి మంచిగాని, చెడుగాని ఏది ఎలా జరగాల్సి ఉంటే అది అలా జరుగుతుందిలే. విధి నిర్ణయం ఎవరు మార్చగలరు?" అని ఇక అక్కడ ఉండటం అనవసరమనుకొని ద్వారకానగరానికి ప్రయాణమైనాడు బలరాముడు. ఉగ్రసేనుడు మొదలైన యాదవనాథులు, బంధుజనం సంతోషంతో ఎదురువచ్చి బలరాముడికి స్వాగతం పలికారు. వారందరి ప్రేమాభిమానాలను చూరగొంటూ బలరాముడు కొంతకాలంపాటు ద్వారకానగరంలో

ఉన్నాడు.

బలరాముడు తిరిగి నైమిశారణ్యానికి వెళ్ళాడు. అక్కడి మహర్షులందరి అంగీకారంతో అతడు చక్కని యజ్ఞం చేశాడు. విప్రులకు, ఋత్విక్కులకు, సభాసదులకు అనేకమైన దక్షిణలిచ్చాడు. వారందరికీ సుజ్ఞానం లభిస్తుందని వరమిచ్చాడు. పట్టమహిషి అయిన రేవతీదేవితో కూడి, (యజ్ఞానంతరం) బలరాముడు అవబృథ స్నానం చేసి పవిత్రుడైనాడు. బలరాముడితో పాటు ఆతని బంధువులు జ్ఞాతిజనులు అవబృథ స్నానం చేసి పుణ్యులైనారు.

చ. విలసిత మాల్యచందన నవీన విభూషణ రత్న వస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచిత విభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలిత సుధాంశురేఖ యెసకం బెసఁగన్ నిజబంధు లోచనో
త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండుర చారు యశోవిలాసుఁడై.

958

తా ॥ చందనం మొదలైన మైపూతలను పూసుకొని, క్రొత్త క్రొత్త ఆభరణాలను, వస్త్రాలను ధరించి, పూలమాలలతో కైసేసుకొని వినూత్న కాంతితో ఒప్పుతున్న బలరాముడు, పున్నమినాడు పండువెన్నెలలు కురిపించే చంద్రుడా! అన్నట్లు బంధువుల కలువలవంటి కన్నులను వికసింప చేస్తూ, ధవళమైన యశస్సుతో విరాజిల్లాడు.

వ. ఇ వ్విధంబున ననంతుండును నప్రమేయుండును మాయామానుష విగ్రహుండు ననంతబలశాలియునైన బలదేవుండతి వైభంబున నిజపురంబు ప్రవేశించి సుఖం బుండె' నని చెప్పి వెండియు యిట్లనియె.

959

తా ॥ "పరీక్షిన్మహారాజా! ఈ విధంగా అనంతుడు, అప్రమేయుడు, మాయామానుష విగ్రహుడు, అమేయబలశాలి అయిన బలరామదేవుడు అత్యంత వైభవంతో ద్వారకానగరానికి

వెళ్ళి అక్కడ సుఖంగా ఉన్నాడు” అని చెప్పి శుకయోగి మళ్ళీ ఈ విధంగా అన్నాడు:

# కుచేలోపాఖ్యానము

క. హలధరుఁ డమర్త్య చరితుం, డలఘు భుజాబలుఁ డొనర్చు నద్భుత కర్మం
బులు పెక్కు నాల్గు మోములు, గల మేటియు లెక్క పెట్టఁ గలఁడె నరేంద్రా!

960

తా ॥ "భగవత్స్వరూపుడు, హలాయుధుడు, భుజబలసంపన్నుడు అయిన బలరామదేవుడు చేసిన అత్యద్భుత కార్యాలెన్నో ఉన్నాయి. వాటిని చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడైనా లెక్కపెట్టగలడా? లెక్కించ జాలడు."

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁడిట్లను పద్మపత్ర లో
చనుని యనంత వీర్యగుణ సంపద వేమఱు విన్న నైననున్
దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనులన్
వినిన మనోజపుష్ప శరవిద్ధుఁడు నైన విరామ మొందునే?

961

తా ॥ పరీక్షిత్తు శుకమహర్షిని చూసి ఈ విధంగా అన్నాడు: "మహాత్మా! కమలాక్షుడైన శ్రీ మహావిష్ణువు యొక్క అనంతమైన సద్గుణాల గురించి, మహిమల గురించి, శౌర్యప్రతాపాల గురించి ఎన్నిసార్లు విన్నా మనస్సు తృప్తి చెందడంలేదు. ఒక్కసారి అచ్యుతుడైన శ్రీకృష్ణుని కథ వింటే చాలు మన్మథుని పూలబాణాలతో వేధింపబడ్డ కామాతురుడైనా సరే, ఆ కథలను మళ్ళీ మళ్ళీ వినకుండా జాగుసేయలేదు.

వ. అదియునుంగాక.

962

తా ॥ అంతేకాకుండా.

చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త; మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి; మురవైరి నుతించిన వాణి వాణి; య
క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్.

963

తా ॥ లోకంలో, మహానుభావా! శ్రీ మహావిష్ణువును పూజచేసే చేతులే నిజమైన చేతులు. అచ్యుతునికి మ్రొక్కే శిరమే శిరము. చక్రధారిని చేరుకొన్న చిత్తమే – చిత్తము. లక్ష్మీనాథున్ని చూసే చూపే – చూపు. శ్రీహరిని స్తోత్రం చేసే వాక్కే – వాక్కు. నారాయణుని కథలు వినే వీనులే – అసలైన వీనులు.

క. హరిపాదతీర్థ సేవా, పరుఁడై విలసిల్లునట్టి భాగవతుని వి
స్ఫురితాంగము లంగము; లా, పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా!

964

తా ॥ ఓ మునీంద్రా! ఆ జగన్నాథుని పాదోదకాన్ని సేవించి పునీతులయ్యే భగవద్భక్తుల అంగములే అంగములు. కనుక ఆ పరమాత్ముని తత్త్వాన్ని నాకు తెలియచెప్పవలసిందిగా కోరుతున్నాను.”

సీ. అనుడు వేదవ్యాసతనయుఁ డా యభిమన్యు తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర! గోవింద సఖుఁడు కుచేలుండు, నా నొప్పు విప్రుండు మానధనుఁడు
విజ్ఞాని రాగాది విరహితస్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి

తే. నడుగఁ బోవక తనకుఁ దా నబ్బినట్టి, కాసు పదివేల నిష్కముల్గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష, యొక విధంబున నడుపుచు నుండు నంత

తా ॥ ఎప్పుడైతే అభిమన్యుని పుత్రుడైన పరీక్షిత్తు ఆ విధంగా అడిగాడో అప్పుడు వ్యాసమహర్షి తనయుడైన శుకయోగి ఎంతో ప్రీతిచెంది ఆ మహారాజును చూసి ఈ విధంగా చెప్పసాగాడు:

"నాయనా! శ్రీకృష్ణుడికి ఒక ప్రియమిత్రుడుండేవాడు. ఆతని పేరు కుచేలుడు. ఆతడు వేదవేదాంగాలు చదివిన విప్రోత్తముడు. అభిమానమే ధనముగా గలవాడు. మహావిజ్ఞాని. కోరికలు లేనివాడు. శాంత గుణమే ప్రధానంగా భాసించేవాడు. ధర్మతత్పరుడు. ఇంద్రియాలను జయించినవాడు. ఆధ్యాత్మిక తత్త్వవేత్త. పరమాత్మను ఆత్మలో దర్శించగల భక్తాగ్రగణ్యుడు.

ఆ మహాభక్తుణ్ణి దారిద్ర్యం పట్టిపీడించసాగింది. అయినా, ఎవరినీ, ఏదీ అడిగేవాడు కాదు. ఎంత దీనావస్థ కలిగినా, తనకు తనంతటగా ఒక్కకాసు లభించినా, ఆ కాసునే పదివేలుగా భావించి సంతోషించేవాడు. భార్యాబిడ్డలను ఏదో రకంగా పోషిస్తూ జీవనయాత్ర సాగిస్తున్నాడు.

సీ. లలితపతివ్రతా తిలకంబు వంశాభిజాత్య తద్భార్య దుస్సహ దరిద్ర
పీడచేఁ గడు నొచ్చి పెదవులు దడుపుచు శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి
మల మల మాఁడుచు మానసం బెరియంగఁ 'బట్టెఁడోరెము మాకుఁబెట్టు' మనుచుఁ
బత్రభాజన ధృతపాణులై తనుఁ జేరి వేఁడిన వీనులు సూఁడినట్ల

ఆ. యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ, జేరి యిట్లని పలికె' నో జీవితేశ!
తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు, నొంప దీని కుపాయ మూహింప వైతి.

966

తా ॥ కుచేలుని భార్య ఉత్తమవంశంలో జన్మించిన సద్గుణ సంపన్నురాలు, మహాపతివ్రత.

భరించ శక్యముకాని దరిద్రంతో ఆ కుటుంబం నలిగిపోతోంది. ఆకలి బాధకు తట్టుకోలేక, గిలగిల్లాడిపోతూ, పెదవులు తడుపుకొంటూ, చిక్కిశల్యమై, మలమలమాడిపోతూ పిల్లలందరూ తల్లి చుట్టూ చేరారు. 'అమ్మా! పట్టెడన్నం పెట్టమని' చేతిలో ఆకులు పట్టుకొని ప్రాధేయపడుతున్న బిడ్డలను చూసిన ఆ తల్లిహృదయం తల్లడిల్లిపోయింది. ఆమెకు వారి మాటలు చెవిలో సూదులు పెట్టి గుచ్చినట్లైంది. రోజూ ఇదే పరిస్థితి. ఆమె తట్టుకోలేకపోయింది. ఒకరోజున ధైర్యం చేసి భర్త దగ్గరకు వెళ్ళింది. "నాథా! మనల్నీ, మన బిడ్డలనీ పేదరికం ఇంతగా వేధిస్తున్నదే! ఈ దారిద్ర్యాన్ని నిర్మూలించడానికి మీరు ఏ ఉపాయమూ ఆలోచించటం లేదు. ఏ ప్రయత్నమూ చేయటంలేదు. మా దుఃఖం మీకు అర్థం కావడంలేదు."

వ. అని మఱియు నిట్లనియె.

967

తా ॥ అని చెప్పి, ఇంకా ఇలా అంది:

తే. బాలసఖుండైన యప్పద్మపత్ర నేత్రుఁ, గాన నేఁగి దారిద్ర్యాంధకార మగ్ను
లైన మము నుద్ధరింపుము; హరికృపా క, టాక్ష రవిదీప్తి వడసి మహాత్మ ! నీవు.

968

తా ॥ "స్వామీ! ఇంకో విషయం చెబుతాను వినండి. శ్రీకృష్ణుడు మీకు చిన్నప్పటి నుంచి ప్రియమిత్రుడు కదా! ద్వారకావాసుడి వద్దకు వెళ్ళండి. మన అవస్థల గురించి ఆయనకు విన్నవించండి. శ్రీహరియొక్క కృపాకటాక్షమనే సూర్యతేజస్సుతో మన దారిద్ర్యమనే అంధకారాన్ని పోగొట్టండి.

వ. మఱియును.

969

తా ॥ అంతేకాదు.

చ. వరదుఁడు సాధుభక్తజన వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ గుశస్థలీ
పురమున యాదవ ప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు; నీ
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూన సంపదల్.

970

తా ॥ ప్రాణనాథా! శ్రీకృష్ణుడు సజ్జనుల పట్లా, భక్తుల పట్లా వాత్సల్యం కురిపించేవాడు. దీనులను ఆదుకొనేవాడు. వరప్రదాత. దయాసముద్రుడు. శ్రీకృష్ణుడు ఎవరోకాదు, లక్ష్మీనాథుడైన భగవంతుడు. యాదవులందరూ కొలుస్తుండగా ద్వారకానాథుడై విలసిల్లుతున్నాడు. ఆ స్వామిని మీరు దర్శిస్తేచాలు కృపాళుడౌతాడు. మిమ్మల్ని చూసీ చూడగానే శ్రీకృష్ణుడు సాటిలేని సంపదలు ప్రసాదిస్తాడు.

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముడై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్; సుని
శ్చలభక్తిన్ భజియించు వారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్?

971

తా ॥ కలలో కూడా భగవంతుడంటే ఎవరో తెలుసుకోలేని కష్టాత్ముడు, దుర్బలుడు, దుష్టుడు – తనకు సంభవించిన ఆపత్కాలంలో ఒక్కసారి ఆ పరమాత్ముని పాదపద్మాలను మనస్సులో తలచుకొని ప్రార్థిస్తే చాలు, వెంటనే భగవంతుడు వచ్చి, ఆతని ప్రార్థనను మన్నించి ఆర్తిని పోగొట్టడమే కాదు తననైనాసరే ఇచ్చి సంతృప్తి పరుస్తాడు. అటువంటిది నిశ్చలమైన భక్తితో కొలిచే వారికి సకలసంపత్తులే కాక ఏదికోరితే అది ప్రసాదించడా?"

క. అని చెప్పిన న మ్మానిని, సునయోక్తుల కలరి భూమిసురుఁ డా కృష్ణుం
గన నేఁగుట యిహపర సా, ధన మగు నని మదిఁ దలంచి తన సతితోడన్.

972

తా ॥ అని తన సహధర్మచారిణి చెప్పగానే కుచేలుడు ఆమె ధర్మప్రసంగానికి మెచ్చి, ఎంతో సంతోషించాడు. శ్రీకృష్ణ పరమాత్మను దర్శించటం ఇహపర సాధనమౌతుందని నిశ్చయించుకొని సతీమణితో ఈ విధంగా అన్నాడు:

తే. నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రు, పాదపద్మంబు లాశ్రయిపంగఁ జనుట
పరమశోభన మా చక్రపాణి కిపుడు, గాను కేమైనఁ గొంపోవఁ గలదె మనకు?

973

తా ॥ "సాధ్వీమణీ! నీవు చెప్పింది నిజం. శ్రీకృష్ణుని పాదపద్మాలను ఆశ్రయించడానికి వెళితే సకల సుఖాలూ కలుగుతాయి. సరేకానీ ఆ భగవంతుడి దగ్గరకు వెళ్ళేటప్పుడు ఏదైనా కానుక తీసుకుపోవద్దా?"

తే. అనిన న య్యింతి యౌఁగాక యనుచు విభుని, శిథిల వస్త్రంబు కొంగునఁ బృథుక తండు
లముల నొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ, జనియె గోవింద దర్శనోత్సాహి యగుచు.

974

తా ॥ భర్తమాటలు విన్న ఆమె 'అవునౌను. ఏదైనా తీసుకువెళ్ళాల్సిందే' అని కుచేలుని చినిగిన వస్త్రం కొంగులో కొన్ని అటుకులు మూటకట్టి కృష్ణుడికి కానుకగా ఇమ్మని చెప్పి భర్తను అనునయంతో ద్వారకకు సాగనంపింది. కుచేలుడు ఎప్పుడు కృష్ణుణ్ణి చూద్దామా అన్న ఉత్సాహంతో త్వరత్వరగా నడక సాగించాడు.

వ. అట్లు చనుచుం దన మనంబున.

975

తా ॥ ఆ విధంగా కుచేలుడు ప్రయాణం చేస్తూ తన మనస్సులో ఇలా అనుకోసాగాడు:

సీ. ద్వారకానగరంబు నే రీతిఁ జొత్తును? భాసురాంతఃపురవాసి యైన
య పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగిఁ దర్శింపఁ గలనొ? తద్ద్వారపాలు
రెక్కడి విప్రుఁడ? విం దేల వచ్చెద?వని యడ్డ పెట్టిరే నపుడు వారి
కే మైనఁ బరిదాన మిచ్చి చొచ్చెద నన్న నూహింప నర్థశూన్యుండ నేను;

తే. నయిన నా భాగ్య; మతని దయార్ద్రదృష్టి, గాక తలపోయఁగా నొండు గలదె? యాతఁ
డేల నన్ను నుపేక్షించు? నేటిమాట?, లనుచు నా ద్వారకాపుర మతఁడు సొచ్చి.

976

తా ॥ 'నేను ద్వారకా నగరాన్ని చూడటం ఎలా? ఆ నగరంలోకి ప్రవేశించటం ఎలా? ఒకవేళ వెళ్ళినా జగన్నాథుడైన ఆ పుండరీకాక్షున్ని, ఆ శ్రీకృష్ణుణ్ణి, ఆ అంతఃపురవాసిని ఏవిధంగా దర్శించ గలుగుతాను? అంతఃపురం కావలివారు 'నీవు ఎక్కడి బ్రాహ్మణుడివయ్యా? ఇక్కడికి ఎందుకు వచ్చావ' ని ప్రశ్నించి అడ్డుతగిలితే నేనేమని సమాధానం చెప్పగలను? వాళ్ళకు ఏమైనా కానుక ఇచ్చి లోపలికి వెళ్ళాలనుకొన్నా నేను ధన హీనుణ్ణే! ఏమిటో! నా అదృష్టం ఎంత గొప్పదో! ఎలా ఉంటుందో? పరమాత్ముని దయకాకపోతే వేరేది ఏమైనా ఉంటుందా? ఆ శ్రీకృష్ణుడు నన్నెందుకు వదలిపెడతాడు! ఏమాలోచనలో ఏమిటో! ఒక్కటీ పాలుపోవడంలేదు." అని అనుకొంటూ ద్వారకలోకి ప్రవేశించాడు.

వ. ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జని చని కక్ష్యాంతరంబులు గడచి చని ముందట.

977

తా ॥ ద్వారకలో అడుగుపెట్టిన తరువాత రాజమార్గంలో నడవసాగాడు. ఆ విధంగా

వెళ్ళి, వెళ్ళి కొన్ని ఇళ్ళు దాటి ముందర—

సీ. విశదమై యొప్పు షోడశసహస్రాంగనా కలితవిలాస సంగతిఁ దనర్చి
మహనీయ తపనీయ మణిమయగోపుర ప్రాసాద సౌధ హర్మ్యములు జూచి,
మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి సంతోషబాష్పముల్ జడిగొనంగఁ
బ్రకటమై విలసిల్లు నొక వధూమణి మందిరమున నింతులు చామరములు వీవఁ

తే. దనరు మృదుహంసతూలికా తల్పమందుఁ, దానుఁబ్రియయును బహు వినోదములఁ
దనరి మహితలావణ్య మన్మథమన్మథుండు, ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు.

978

తా ॥ పదహారువేలమంది సుందరాంగుల రమణీయమైన బంగారు మేడల సోయగాన్ని చూసి కుచేలుడు పరమానందాన్ని పొందాడు. ఆతని కన్నుల నుంచి ఆనంద బాష్పాలు జాలువారాయి. నడుస్తూ, నడుస్తూ ఉండగా ఒక భార్యామణి మందిరంలో మన్మథుడికే మన్మథుడా అన్నట్లు ఎనలేని సౌందర్యంతో మెరిసిపోతున్న శ్రీకృష్ణుడు కనిపించాడు. ఆ ద్వారకా నాథుడికి చెరోప్రక్క నిలబడి మగువలు వింజామరలు వీస్తున్నారు. హంసతూలికా తల్పం మీద కూర్చొని ప్రియభామినితో ముచ్చటిస్తూ వినోదిస్తూ ఆనందంగా ఉన్న మిత్రుణ్ణి చూశాడు కుచేలుడు.

సీ. ఇందీవర శ్యాము, వందితసుత్రాముఁ గరుణాలవాలు, భాసుర కపోలుఁ
గౌస్తుభాలంకారుఁ, గామితమందారు సురచిరలావణ్యు, సుర శరణ్యు
హర్యక్షనిభమధ్యు, నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తు, జగత్ప్రశస్తు,
ఖగకులాధిపయానుఁ, గౌశేయపరిధానుఁ బన్నగశయను, నబ్జాతనయును,

తే. మకరకుండల సద్భూషు, మంజుభాషు, నిరుపమాకారు, దుగ్ధసాగరవిహారు,
భూరిగుణసాంద్రు, యదుకులాంభోధి చంద్రు, విష్ణు, రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు.

తా ॥ శ్రీకృష్ణుని రూపసౌందర్యాన్ని తనివితీరా చూశాడు ఆ మహాభక్తుడు కుచేలుడు. నల్ల కలువల శ్యామల వర్ణంతో నిగనిగలాడుతున్న శరీరఛాయ కలవాడు, దేవేంద్రుని చేత స్తుతింపబడేవాడు, దయకు ఆలవాలమైనవాడు, మెరిసిపోతున్న చెక్కిళ్ళు కలవాడు, కౌస్తుభమణిని ధరించినవాడు, కోరిన కోర్కెలు తీర్చే కల్పవృక్షం వంటివాడు, చక్కని లావణ్యంతో ప్రకాశిస్తున్నవాడు, దేవతలకు శరణు ప్రసాదించేవాడు; సింహం నడుమువంటి చక్కని సన్నని నడుము గలవాడు, సమస్తలోకవాసుల చేత పూజింప బడేవాడు, సుదర్శన చక్రాన్ని చేతియందు ధరించినవాడు, జగత్తులో ప్రఖ్యాతి చెందినవాడు, గరుడవాహనుడు, పీతాంబరమును ధరించినవాడు, కమలాక్షుడు, మకరకుండలాలతో శోభిస్తున్నవాడు, మృదుమధురంగా సంభాషించేవాడు, సాటిలేని సౌందర్యంతో విరాజిల్లుతున్నవాడు, పాలసముద్రంపై విహారాలు సల్పేవాడు, సకలసద్గుణోపేతుడు, యదువంశమనే సముద్రాన్ని సంతోషంతో ఉప్పొంగచేసే చంద్రుని వంటివాడు, దేదీప్యమైన తేజస్సుతో వెలిగిపోతున్నవాడు, జయశీలి, స్నేహశీలి, శేషతల్పశాయి, సర్వవ్యాపి అయిన శ్రీకృష్ణపరమాత్మణ్ణి తన్మయత్వంతో చూస్తూ కుచేలుడు ఆ దేవదేవుణ్ణి సమీపిస్తుండగా—

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డ ప్పేద వి
ప్రుని నశ్రాంత దరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమ విలోలుండై దిగెం దల్పమున్.

980

తా ॥ దారిద్ర్యంతో పీడింపబడి, కృశించి పోయిన శరీరముకల; చినిగిన వస్త్రము ధరించిన; భగవంతుణ్ణి దర్శించాలనే తృష్ణతో ఆత్రుత చెందిన; ముక్కగా మిగిలిన ఉత్తరీయం వేసుకొన్న, చూసేవారికి హాస్యం కలిగే విధంగా ఉన్న ఆ పేద బ్రాహ్మణుణ్ణి—పద్మపత్రాల వంటి

నేత్రాలు గల శ్రీకృష్ణుడు అల్లంత దూరంలో చూసి, వెంటనే ఆశ్చర్యంతో తల్పం దిగాడు.

క. కరమర్థి నెదురుగాఁ జని, పరిరంభణ మాచరించి, బందుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి, సమా, దరమునఁ గూర్చుండఁ బెట్టెఁదన తల్పమునన్.

981

తా ॥ బాల్యమిత్రుణ్ణి చూడగానే శ్రీకృష్ణుడు ఎంతోప్రేమతో ఎదురువెళ్ళాడు. కుచేలున్ని గట్టిగా కౌగిలించుకొన్నాడు. బంధుదృష్టితో, మిత్రభావంతో తోడ్కొని వచ్చి అభిమానంగా తన తల్పంమీద కూర్చోబెట్టాడు.

తే. అట్లు గూర్చుండఁబెట్టి నెయ్యమునఁ గనక, కలశ సలిలంబుచేఁ గాళ్ళు గడిగి భక్తిఁ దజ్జలంబులు దనదు మస్తమునఁ దాల్చి, లలిత మృగమద ఘనసార మిళిత మైన.

982

తా ॥ ఆ విధంగా కుచేలున్ని తన పాన్పుమీద కూర్చోబెట్టి, కృష్ణుడు బంగారు కలశంలోని నీళ్ళతో మిత్రుడైన విప్రుని కాళ్ళు కడిగాడు. కాళ్ళు కడిగిన జలాన్ని తన తలపై చల్లుకొన్నాడు. పరిమళద్రవ్యాలైన కస్తూరితో, కర్పూరంతో కలిసిన—

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత, శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి బంధురామోదకలిత ధూపంబు లొసఁగి, మించు మణిదీపముల నివాళించి మఱియు.

983

తా ॥ చందనాన్ని కుచేలుని శరీరమంతా అలది, ఆ మిత్రుని అలసట పోయేవిధంగా విసన కర్రతో విసిరాడు. సువాసనతో నిండిన అగరుధూపం వేసి, మణిదీపాలతో హారతులిచ్చాడు.

వ. సురభికుసుమ మాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళిత తాంబూలంబు నిడి,

ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప నానందబాష్ప జలబిందు సందోహం దయ్యె; నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణ రవంబు లొలయం జామరలు వీవం దజ్జాత వాతంబున ఘర్మ సలిలంబు నివారించుచుండఁ జూచి శుద్ధాంత కాంతా నివహంబులు దమ మనంబుల నద్భుతం బంది యిట్లనిరి.

984

తా ॥ కృష్ణుడు, ఘుమఘుమలాడుతున్న పూలమాలలు తెచ్చి కుచేలుని సిగముడిలో తురిమాడు. కర్పూరంతో కూడిన తాంబూలమిచ్చాడు. తరువాత గోవును దానంగా ఇచ్చాడు. ప్రేమాభిమానాలతో స్వాగతం పలికాడు. శ్రీకృష్ణుని ఆదరాభిమానాలకు ఆ పేద విప్రుడు పులకించిపోయాడు. ఆనందబాష్పాలు చెక్కిళ్ళపై జారుతుండగా కుచేలుడు మిత్రునివైపు చూశాడు. ఈలోగా శ్రీకృష్ణుని ప్రియపత్ని అయిన రుక్మిణీదేవి, చేతికంకణాలు చిరుసవ్వడులు చేస్తుండగా కుచేలుడికి వింజామరతో విసరసాగింది. ఆ చల్లని గాలితో కుచేలుడి శరీరంపైని స్వేదబిందువులు ఆరిపోయి అతనికి ప్రశాంతతనిచ్చాయి. ఈ సన్నివేశమంతా చూసిన అంతఃపురకాంతలు అబ్బురపడి తమలో తాము ఈ విధంగా అనుకోసాగారు:

ఉ. ఏమి తపంబు సేసెనొకొ! యీ ధరణీదివిజోత్తముండు తొల్
బామున ! యోగివిస్ఫుర దుపాస్యకుఁడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ;
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్?

985

తా ॥ "ఆహా! ఈ బ్రాహ్మణోత్తముడు పూర్వజన్మలో ఎంత గొప్ప తపస్సు చేశాడోకదా! మహాయోగులచేత ధ్యానింపబడే, లక్ష్మీనాథుడైన, జగత్ప్రభువు, శ్రీకృష్ణుని పాన్పుపైన కూర్చొని ఉన్నాడు! ఈ మహాత్మునికి ఎంత గొప్ప తపస్సు చేసిన మహర్షులైనా సాటిరాగలుగుతారా!

వ. అదియునుంగాక.

986

తా ॥ అంతేకాక—

చ. తన మృదుతల్పమందు వనితామణి యైన రమాలలామ పొం
దును నెడఁగాఁ దలంపక యదుప్రవరుం డెదురేఁగి మోదముం
దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె; ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుడో ?

987

తా ॥ ఎంత ఆశ్చర్యం? సుతిమెత్తని తన తల్పంమీద ఉన్న రుక్మిణీదేవి పొందువదలి వెళ్ళవలసి వచ్చిందే అని తలపోయకుండా, శ్రీకృష్ణుడు తటాలున పాన్పుదిగి ఆ పేద విప్రుడికి ఎదురువెళ్ళి ఆహ్వానించి, సంతోషంతో కౌగిలించుకొని తెచ్చి తన తల్పంమీద కూర్చుండబెట్టి సకలోపచారాలు చేసి పరితుష్టుణ్ణి చేశాడు. శ్రీకృష్ణుడి వినయం చూస్తుంటే ఆ మిత్రుడెవరోగాని ఎంతటి అదృష్టవంతుడై ఉండాలి?"

వ. అను న య్యవసరంబున

988

తా ॥ అని కాంతలందరూ సంభాషించుకొంటున్న సమయంలో—

క. మురసంహరుఁడు కుచేలుని, కరము గరంబునఁ దెమల్చి కడఁకన్ మన మా
గురుగృహమున వర్తించిన, చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్.

989

తా ॥ శ్రీకృష్ణుడు కుచేలుని చేతిని తన చేతిలోనికి తీసుకొని నిమురుతూ 'మిత్రమా!

గురుకులంలో విద్యను అభ్యసించినప్పుడు మనం ఎన్నెన్ని పనులు చేశాం, ఎంత చక్కగా చదువుకొన్నాం' అని ఆనాటి విషయాలు కొన్ని గుర్తుచేసి, ఇంకా ఇలా అన్నాడు:

సీ. బ్రాహ్మణోత్తమ ! వేదపాఠనలబ్ధదక్షత గల చారువంశంబు వలనఁ
బరిణయం బైనట్టి భార్య సుశీలవర్తనములఁ దగ భవత్సదృశ యగునె?
తలఁప గృహ క్షేత్రధనదారపుత్త్రాదు లందు నీ చిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది; యేను దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి, మనంబులఁ గామమోహితులు గాక, యర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధములు వాసి భవ్యనిష్ఠ, దవిలి యుందురు కొంద ఱుత్తములు భువిని.

990

తా ॥ "విప్రోత్తమా! వేదాధ్యయన సంపన్నులైన సద్వంశీకుల గృహంలో జన్మించిన సుగుణవతిని పెండ్లాడావు గదా! ఆమె తన సత్ప్రవర్తనతో నీకు సరి సమానురాలిగా మెలగుతోంది గదా! నిన్ను చూస్తుంటే నీ మనస్సు ఇంటిమీదగాని, భూములపైన గాని, ధనంమీదగాని, కడకు భార్యాపుత్రులపైన గాని నిలిచినట్లు కనిపించటం లేదు. నేను లోకులకోసం కర్మాచరణం చేస్తున్నట్లు గృహస్థువు కాబట్టి గృహధర్మం పాటిస్తున్నావా? ఉత్తమజ్ఞాన సంపన్నులు తమ మనస్సులలో కామమోహాది గుణాలకు లోనుకాకుండా చేయవలసినంత వరకే కర్మాచరణ చేస్తుంటారు. వారు ఇహలోక సంబంధాలను మనస్సులో పెట్టుకోక ఆత్మనిష్ఠలో పరమాత్మను దర్శించుకొంటూ ఉంటారులే.

వ. అని మఱియు నిట్లనియె.

991

తా ॥ ఇంకో విషయం కుచేలా!

క. ఎఱుఁగుదువె ? మనము గురు మం, దిరమున వసియించి యతఁడు దెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసిన యర్థము, లెఱిఁగి పరిజ్ఞానమహిమ నెఱుఁగుట లెల్లన్.

992

తా ॥ గురువుగారి మందిరంలో మనం నివసించినప్పుడు ఆయన చెప్పిన సమస్త విషయాలు నేర్చుకొని ప్రజ్ఞగల విద్యావంతులమయ్యాం. ఆ విషయాలన్నీ గుర్తున్నాయా? లేక అప్పుడే మరచిపోయావా?"

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె.

993

తా ॥ అంతటితో ఊరుకోక కృష్ణుడు గురువైన సాందీపమహర్షి గొప్పదనాన్ని, వైదుష్యాన్ని, వాత్సల్యాన్ని ప్రసంగించదలచి ఇలా అన్నాడు:

తే. తివిరి యజ్ఞానతిమిర ప్రదీప మగుచు, నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుల, భూసురశ్రేష్ఠుఁ డలఘుండు బుధనుతుండు.

994

తా ॥ కుచేలా! పండితోత్తములచేతనే వినుతింపబడే అసామాన్య విద్యావంతుడు మన గురువు, సాందీపుడు బ్రాహ్మణులలో ఉత్తమోత్తముడు. ఎప్పుడూ సత్కర్మలు చేయడంలోనే నిమగ్నుడైనవాడు. బ్రహ్మానందాన్ని అనుభవించే భక్తాగ్రేసరుడు. అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టే దేదీప్యమానమైన దీపం వంటివాడు. గురువంటే అర్థం అదే కదా!

వ. అ మ్మహాత్మునివలన సకల వర్ణాశ్రమంబుల వారికి నేను విజ్ఞాన ప్రదుండ నగు
గురుండనై యుండియు గురుభజనంబు పరమ ధర్మం బని యాచరించితి; నది గావున.

995

తా ॥ సర్వజనులకు విజ్ఞానాన్ని ప్రసాదించే లోకగురుడనై ఉండికూడా నేను, గురుసేవలోని మాహాత్మ్యాన్ని లోకులకు తెలియచెప్పడానికే పరమ శ్రద్ధాభక్తులతో గురువును సేవించాను. అందుచేత—

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ, నై సకల కులాశ్రమంబులందును నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁడన, దేశికుఁడన నొప్పుచుందు ధృతి నెల్లెడలన్.

996

తా ॥ నేనే బ్రాహ్మణులందరిలోనూ ముఖ్యుడిగా, సమస్త జ్ఞాన విషయాలు సర్వకులాల వారికి, సకల ఆశ్రమవాసులకు బోధించి, గురువుగా, పరమజ్ఞానిగా ప్రకాశిస్తుంటాను.

తే. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ, కుశలు లగువారు నిఖిలైక గురుఁడ నైన
నాదు వాక్యంబుచే భవార్ణవము పెలుచ, దాఁటుదురు మత్పదాంబుజ ధ్యానపరులు.

997

తా ॥ సర్వవర్ణాశ్రమాలలోను పరమార్థం గ్రహించిన జనులు జగద్గురువునైన నా బోధలు ఆలకించి, వాటిని ఆచరించి, ఎల్లవేళలా నా పాదపద్మాలనే ధ్యానిస్తూ సంసారసాగరాన్ని అతిసులభంగా దాటుతారు.

వ. అదియునుం గాక సకల భూతాత్మకుండనైన యేను దపో వ్రత యజ్ఞ దాన శమ దమాదులచేత సంతసింపను; గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతునని చెప్పి మఱియు మనము గురుమందిరమున నున్నయెడ నొక్కనాఁడు గురుపత్నీ నియుక్తులమై యింధనార్థం బడవికిం జనిన న య్యవసరంబున.

998

తా ॥ మిత్రమా! అదీగాక, సమస్త జీవరాశుల్లోనూ ఉండే నేను, జనులు చేసే తపస్సు,

వ్రతము, యజ్ఞము, దానము, శమము, దమము మొదలైనవాటి వల్ల ఆనందించను. గురువులను పరమభక్తితో కొలిచే వారికి ప్రసన్నుడనౌతాను. అది సరే కుచేలా! మనం గురుకులంలో ఉన్నప్పుడు, ఒకరోజు మనల్ని కట్టెలు తెమ్మనమని గురుపత్ని అడవికి పంపింది. అప్పుడేం జరిగిందో గుర్తుందా?

సీ. ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత పటల సంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటుల ఝంఝానిలోత్కట సముద్ధూత నానావిధ జంతుసంతాన మగుచుఁ
జండ దిగ్వేదండ తుండ నిభాఖండ వారిధారాపూర్ణ వసుధ యగుచు
విద్యోతమానోగ్ర ఖద్యోత కిరణజి ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు

తే. నదరి జడి గురియఁగ నినుఁ డస్త మింప, భూరినీరంధ్ర నిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు గాని, యట్లుండ మనము న వ్వానఁ దడిసి.

999

తా ॥ ఆకాశమంతా నల్లని మేఘాలతో ఆవరించుకుని పోయింది. పెద్దపెద్ద ధ్వనులతో ఉరుములు ఉరిమాయి. ఈదురుగాలికి అడవిలోని జంతువులన్నీ పరుగెత్తి మూలమూలలకు పారిపోయాయి. దిగ్గజాల తొండాలంతగా వర్షధారలు కురిసాయి. మెరుపులు మిలమిలా మెఱవసాగాయి. తొండమంత పరిమాణంతో కురిసిన వాన ఎడతెరపి లేకుండా జడివానగా మారింది. సాయంకాలమయింది. సూర్యుడు అస్తమించాడు. దట్టమైన చీకటి నలుమూలలా వ్యాపించింది. సూదిపెట్టి పొడిచినా ఏమీ కనబడటంలేదు. అంతపెద్దవానలో ఏమీ చేయలేక మనం పూర్తిగా తడిసి పోయాము.

తే. బయలు గొందియుఁ బెను మిఱ్ఱుపల్లములును, రహిత సహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరుల చేతు, లూతఁగాఁ గొని నడచుచు నుండునంత.

1000

తా ॥ బయలుప్రదేశమనేది ఏదీ కనబడటంలేదు. దారులు నీటితో కప్పబడ్డాయి. సందులూ గొందులూ తెలియడం లేదు. ఎక్కడ భూమి ఎత్తుగా ఉందీ, ఎక్కడ పల్లంగా ఉందీ అసలు కంటికానడంలేదు. అడవి అంతా చీకటిమయం. పైగా తలపైన జడివాన. ఏం చేయాలో తోచక, ఎలా బయటపడాలో అర్థంకాక మనం ఒకరిచేతిని మరొకరం గట్టిగా ఊతగా పట్టుకొని అడుగులో అడుగువేసుకుంటూ మెల్లగా నడుస్తున్నాం. అప్పుడు.

క. బిసబిస నెప్పుడు నుడుగక, విసరెడి వలిచేత వడఁకు విడువక మనముం
బస చెడి మార్గముఁ గానక, మసలితి మంతటను నంశుమంతుఁడు పొడిచెన్.

1001

తా ॥ ఒక్కక్షణం కూడా విడువకుండా చలిగాలులు పెద్దగా వీస్తున్నాయి. ఆ చలికి మన శరీరాలు గజగజ వణికిపోయాయి. మనసుకున్న శక్తి తగ్గిపోయింది. దారి సరిగా కనబడటంలేదు. అడవిమొత్తం తిరిగాం. ఎటుపోతే ఏదొస్తుందో తెలియలేదు. ఊరిమార్గం అసలే దొరకలేదు. ఆ విధంగా తెల్లవార్లూ భయంభయంగా గడిపాం. ఏమైతేనేం చివరకు తెల్లవారింది. సూర్యుడు కనిపించాడు.

క. తెలతెలవాఱెడి వేళం, గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్ మిలమిలని
ప్రొద్దుపొడుపున, ధళ ధళ మను మెఱుఁగు దిగ్వితానము నిండెన్.

1002

తా ॥ సూర్యోదయవేళలో పక్షులన్నీ కలకలారావాలు చేస్తూ అన్నివైపులా ఎగురుతున్నాయి. ప్రొద్దుపొడవగానే మిలమిలని కాంతులు దశదిశలా అల్లుకున్నాయి. దిక్కులన్నీ తెల్లని సూర్యకాంతితో నిండిపోయి, చక్కని వెలుగును ప్రసాదించాయి.

క. అప్పుడు సాందీపని మన, చొ ప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం
దెప్పిటిలుటఁగని ఖేదం, బుప్పతిలం బలికె నకట ! యో వటులారా !

1003

తా ॥ మనం ఆ రాత్రి వానలో, చీకటిలో ఏమైపోయామో అని భయంతో గురువైన సాందీపముని ఆ అడవిలో మనల్ని వెతుక్కుంటూ వచ్చారు. వానలో తడిసిపోయి, చలికి వణికిపోతూ, అప్పుడే కొంచెం ధైర్యం కూడగట్టుకొంటున్న మనల్ని చూసి దుఃఖంతో – 'ఓ వటులారా!' అని పిలుస్తూ దగ్గరకు వచ్చారు.

చ. కటకట! యిట్లు మా కొఱకుఁగాఁ జనుదెంచి మహాటవిన్ సము
త్కటపరిపీడ నొందితిరి; గావున శిష్యులు ! మీ ఋణంబు నీఁ
గుట కిది కారణంబు సమకూరెడిఁ బో; యిట మీఁద మీకు వి
స్ఫుట ధన బంధు దార బహుపుత్ర విభూతి జయాయురున్నతుల్.

1004

తా ॥ "అయ్యయ్యో! మా కోసం వచ్చి ఈ మహారణ్యంలో మీరు చిక్కుకుపోయారా? రాత్రంతా ఎంత బాధపడ్డారో గదా! గురుపత్ని మాటతో ఇక్కడకు కట్టెలకోసం వచ్చి ఈ అంధకారంలో, ఈ జడివానలో తెల్లవార్లూ గడిపి మీ ఋణం తీర్చుకొన్నారు. శిష్యులారా! ఇంత గురుభక్తి చూపినందుకు మీకు ధనం, బంధువులు, దారాపుత్రులు, ఐశ్వర్యం, విజయం, ఆయుర్దాయం, ఔన్నత్యం అన్నీ లభిస్తాయి." అని గురువు మనల్ని ఆశీర్వదించాడు.

క. కని గారవించి యాయన, మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం జనుదెంచుట
లెల్లను నీ, మనమునఁ దలఁతే' యటంచు మఱియుం బలికెన్.

1005

తా ॥ "కుచేలా! సాందీపముని ప్రేమతో మనల్ని తీసుకొని వారి గృహానికి తీసుకొని వెళ్ళి ఎంతో ఆదరించారు. ఇదంతా నీకు గుర్తుందా మిత్రమా!" అని కృష్ణుడు మళ్ళీ ఇలా అన్నాడు:

వ. 'అనఘ ! మన మధ్యయనంబు సేయుచు నన్యోన్య స్నేహ వాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా !' యని యవి యెల్లం దలంచి యాడు మాధవు మధురాలాపంబులు విని యతనిం గనుంగొని కుచేలుం డిల్లునియె:

1006

తా ॥ "మహాత్మా! కుచేలా! మనం చదువుకొనే రోజులలో ఒకరిపట్ల ఒకరం అమితమైన స్నేహాన్ని, వాత్సల్యాన్ని కలిగి ఉన్నాం కదూ! స్నేహాభిమానాలతో మనం చేసిన పనులేవీ నీవు మరచిపోలేదు గదా!" అని ఆనాటి సంఘటనలన్నీ ఒకదాని తరువాత మరొకటి గుర్తు చేసుకొంటూ చెబుతున్న కృష్ణుని మధురవాక్కులు విని కుచేలుడు కృష్ణుణ్ణి చూస్తూ ఈ విధంగా అన్నాడు:

క. వనజోదర ! గురుమందిర, మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం
పని పను లెవ్వియుఁ గలవే ?, విను మవి యట్లుండ నిమ్ము విమలచరిత్రా !

1007

తా ॥ "పవిత్ర చరిత్రగల కృష్ణా! గురువుగారి మందిరంలో మనము విద్యాభ్యాసం చేసిన సమయంలో ఆనందోత్సాహాలతో మనం చేయని పనంటూ ఒకటైనా ఉందా? లేదు గదా! సరే. అది అట్లా ఉండనీ, నే చెప్పేది విను.

క. గురుమతిఁ దలఁపఁగఁ ద్రిజగ, ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వ? డింతయును నీ, కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ!'

1008

తా ॥ మహానుభావా! శ్రీకృష్ణ పరమాత్మా! త్రిలోకాలకు నీవే గురుడివి. అటువంటిది నీకు వేరొకరు గురువా? ఇదంతా నీ లీలావిలాసం కాక మరేమిటి ప్రభూ!

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్త భావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మిత వదనారవిందుం డగుచు నతనిం జూచి 'నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తింజేసి నాకు నుపాయనంబుగ నేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు లేశమాత్రంబైనఁ బదివేలుగా నంగీకరింతు; నట్లు గాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నా మనంబునకు సమ్మతంబు గాదు; కావున.

1009

తా ॥ కుచేలుడు అప్పుడు అభిప్రాయపూర్వకంగా పలికిన పలుకులు విని శ్రీకృష్ణుడు అందులోని అంతరార్థాన్ని గ్రహించి, చిరునవ్వులు చిందిస్తూ "మిత్రమా! నేనంటే నీకు అమితమైన భక్తి కదా! ఇక్కడకు వచ్చేటప్పుడు నాకు కానుకగా ఏం తెచ్చావయ్యా! నీవు తెచ్చింది కొంచెమైనా దానిని పదివేలుగా పరిగ్రహిస్తాను. నీచుడై, నాయందు భక్తిలేని దుష్టుడు మేరుపర్వతంతో సమానమైన పదార్థాన్ని కానుకగా ఇచ్చినా అది నేను స్వీకరించను. ఎందుకంటే నా మనస్సు ఆ కానుకను ఒప్పుకోదు. మిత్రమా! మరోవిషయం.

క. దళమైనఁ బుష్పమైనను, ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

1010

తా ॥ నన్ను అనవరతం కొలిచే భక్తులు భక్తితో ఒక ఆకుగాని, పువ్వుగాని, పండుగాని, ఉద్ధరిణెడు నీళ్ళుగాని – ఏది సమర్పించినా దానిని నేను ఎంతో ప్రీతితో రుచికరమైన అన్నంగా భుజిస్తాను."

క. అని పద్మోదరుఁ డాడిన, వినియోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె
చ్చిన యటుకులు దగ నర్పిం, పను నేరక మోము వాంచి పలుకక యున్నన్.

1011

తా ॥ అని శ్రీకృష్ణుడు వినయంతో పలికిన మాటలకు కుచేలుడు మనస్సులో ఎంతో సంతోషించాడు. తాను తెచ్చిన 'అటుకుల' కానుకను శ్రీకృష్ణునికి ఇవ్వడానికి సంకోచించి, తలదించుకొని, ఏమీ మాట్లాడలేక ఊరకుండిపోయాడు.

వ. అ వ్విప్రుండు సనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి 'యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైన నిక్కుచేలుండు నిజకాంతా ముఖోల్లాసంబు కొఱకు నా యొద్దకుఁ జనుదెంచినవాఁ; డితనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీ క్షణంబ యొదఁ గూర్పవలయు' నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొంగున ముడిచి తెచ్చిన యటుకుల ముడియఁ గని 'యిది యేమి' యని యొయ్యన నమ్ముడియఁ దన కరకములంబుల విడిచి యయ్యటుకులు కొన్ని పుచ్చుకొని 'యివియ సకల లోకంబులను, నన్నును బరితృప్తిం బొందింపఁజాలు' నని యప్పుడు.

1012

తా ॥ కుచేలుడి మనోభిప్రాయాన్ని సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుడు దివ్యదృష్టితో గ్రహించాడు. "ఈ విప్రుడు క్రిందటి జన్మలో ధనతృష్ణతో నన్ను పూజించలేదు. అయినా భార్యాబిడ్డలను సంతోషపరచడానికి నా చెంతకు వచ్చాడు. ఈ కుచేలుడికి ఈ క్షణంలోనే, దేవేంద్రుడు మొదలైన దేవతలు కూడా పొందలేని అఖండ సంపదలు ప్రసాదించాలి" అని నిశ్చయించి అతడు చిరిగిపోయిన ధోవతికొంగున ముడివేసి తెచ్చిన అటుకుల మూటను చూసి "ఇదేమిటి మిత్రమా? నాకు చూపనేలేద" ని అంటూ కృష్ణుడు ఆ మూటను విప్పాడు. అందులోని కొన్ని అటుకులు చేతిలోకి తీసుకొని 'కుచేలా! ఈ అటుకులు చాలు. ఇవే నన్నూ, సమస్తలోకాలనూ సంతృప్తి పరుస్తాయి" అని చెబుతూ—

క. మురహరుఁడు పిడికెఁ డడుకులు, గర మొప్పఁగ నారగించి కౌతూహలియై
మఱియును బిడికెఁడు గొనఁ ద, త్కర మప్పుడు పట్టెఁ గమల కరకమలములన్.

1013

తా ॥ శ్రీకృష్ణుడు ఒక పిడికెడు అటుకులను ఎంతో ఇష్టంగా తిన్నాడు. కుతూహలంతో మరో పిడికెడు అటుకులు తిందామని అటుకులను చేతిలోకి తీసుకొన్నాడు. అది చూసిన రుక్మిణీదేవి శ్రీకృష్ణుని చేతిని గట్టిగా పట్టుకొని వారించింది.

క. 'సొం పారఁగ నతనికి బహు, సంపద లందింప నివియ చాలును నిఁక భ
క్షింపఁగ వలవదు త్రిజగ, త్సంపత్కర ! దేవ దేవ ! సర్వాత్మ ! హరీ !'

1014

తా ॥ "దేవదేవా! సర్వాత్మా! హరీ! ముల్లోకాలకు స్థితికారుడవై సంపదలు ప్రసాదించే శ్రీకృష్ణా! నీ మిత్రుడికి సకల సంపదలను అందించడానికి నీవు తినిన అటుకులే చాలు. ఇక తినకండి ప్రభూ!" అని రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి మరిన్ని అటుకులు తినకుండా వారించింది.

వ. అని యిట్లు వారించె; న క్కుచేలుండును నా రాత్రి గోవిందు మందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధ పదార్థంబు లనుభవించి, మృదుల శయ్యాతలంబున నిద్రించి తన మనంబునం దన్ను సమధిక స్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచిత కృత్యంబులు దీర్చి, యిందిరారమణుండు దన్నుఁ గొంత దవ్వనిపి యామంత్రితులం జేయఁ జనుచు నందనందన సందర్శనానంద లోలాత్ముండై తన మనంబున నిట్లనియె.

1015

తా ॥ కుచేలుడు ఆ రాత్రి శ్రీకృష్ణ మందిరంలోనే గడిపాడు. వివిధ పదార్థాలు భుజించాడు. మెత్తని పాన్పుపైన నిద్రించాడు. స్వర్గలోక సుఖాలను అనుభవించిన అనుభూతి

పొందాడు. మరునాడు ప్రొద్దునే నిద్రలేచి కాలోచిత కృత్యాల అనంతరం తన ఊరికి బయలుదేరాడు. కృష్ణుడు కుచేలుడితో కొంతదూరం వచ్చి మిత్రుణ్ణి సాగనంపాడు. కృష్ణుడు వెనుకకు తిరిగి వెళ్ళిన తరువాత కుచేలుడు ప్రయాణం సాగిస్తూ కృష్ణుణ్ణి దర్శించుకొన్నందువల్ల కలిగిన పరవశత్వంతో మనస్సులో ఈ విధంగా అనుకొన్నాడు:

క. 'నా పుణ్య మరయ నెట్టిదొ, యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి, ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్.

1016

తా ॥ "ఆహా! నా పుణ్యం ఎంత గొప్పదో కదా! పుణ్యానికి నిధి అయిన అచ్యుతుణ్ణి, శాంతాకారుణ్ణి, సర్వవ్యాపకుణ్ణి, పరబ్రహ్మను, జ్ఞానస్వరూపుని, పురుషోత్తముడిని, పరాత్పరుణ్ణి, శ్రీకృష్ణపరమాత్ముణ్ణి దర్శించాను.

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నై నట్టి యే నేడ? నిఖిలావనీశ్వరి యగు
నిందిరాదేవికి నెనయంగ నిత్య నివాసుఁడై యొప్పు నవ్వాసుదేవుఁ
డేడ? న న్నర్థిమైఁ దోడఁబుట్టిన వాని కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నుంచి సత్క్రియల్ పూని నడపి
తే. చారు నిజవధూకర సరోజాత కలిత, చామరానిలమున గతశ్రమునిఁజేసి
శ్రీకుచాలిప్త చందనాంచితకరాబ్జ, తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి.

1017

తా ॥ ఒక్క క్షణం ఆలోచించి చూస్తే పేదరికంలో కొట్టుకుపోతున్న నేనెక్కడ? లోకాధినేత్రి అయిన లక్ష్మీదేవికి నిత్యనివాసుడై ప్రకాశించే శ్రీకృష్ణుడెక్కడ? అటువంటిది నన్ను శ్రీకృష్ణ పరమాత్ముడు సొంత అన్నలాగా కౌగిలించుకొని ఆదరించటం ఎంత ఆశ్చర్యకరమైన విషయం! పైగా నన్ను దైవంగా భావించి తన పాన్పుమీద కూర్చుండజేసి, సకల సత్కారాలూ చేయడమా!

అంతేకాక, తన పట్టపుదేవేరి అయిన రుక్మిణీదేవి చేత వింజామరతో విసరజేసి నాౖశమనంతటినీ పోగొట్టటమా! ఇదంతా చాలదన్నట్లు లక్ష్మీదేవిని ఉపలాలించే చందనమయమైన తన సుకుమార హస్తాలతో నా పాదాలు ఒత్తడమా! ఆ శ్రీహరికి నామీదున్న వాత్సల్యం కాకపోతే ఇంత ప్రేమతో నన్నాదరిస్తాడా?

వ. కావున.

1018

తా ॥ కాబట్టి—

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్త మేమియు
న్నీని తెఱంగు గానఁబడె; నెన్న 'దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁ' డని కాక శ్రితార్తి హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే ?

1019

తా ॥ ఇదంతా చూస్తే శ్రీకృష్ణుడు నాకు సేవలు చేసి, నన్ను ప్రేమతో సత్కరించి; నాకు పెద్ద మొత్తంలో ధనమేమీ ఇవ్వకుండా పంపినట్లు తెలుస్తోంది. బహుశః వాసుదేవుడు దరిద్రుడు విభవోన్నతుడైతే సంపద కలిగించే అంధకారంలో కొట్టుకుపోయి తనను చూడడని, తనను చేరడని అనుకొని ఉంటాడు. కాకపోతే తనను ఆశ్రయించుకొని ఉండే భక్తులను దయచూసి వరాలు వర్షించే శ్రీకృష్ణుడు నా బాధలు పోగొట్టి నాకు సకల సిరిసంపదలు ప్రసాదించడా?"

వ. అని తన మనంబున వితర్కించుచు నిజపురంబునకుఁ జని చని ముందట.

1020

తా ॥ కుచేలుడు ఈ విధంగా తన మనస్సులో కృష్ణుని గూర్చి తలపోస్తూ తన పురం

చేరుకొన్నాడు. కొంతదూరం వెళ్ళి తనముందర—

సీ. భానుచంద్ర ప్రభా భాసమాన స్వర్ణ చంద్రకాంతోపల సౌధములును
గలకంఠ శుక నీలకంఠ సముత్కంఠ మానిత కూజితోద్యానములును
ఫుల్లసితాంభోజ హల్లక కహ్లార కైరవోల్లసిత కాసారములును
మణిమయ కనక కంకణ ముఖాభరణ విభ్రాజిత దాసదాసీజనములుఁ

తే. గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మ, యమును బొందుచు నెట్టి పుణ్యాత్ముఁ
డుండు నిలయ మొక్కొ ! యపూర్వమై నెగడె మహిత, వైభవోన్నత లక్ష్మీనివాస మగుచు.

1021

తా ॥ సూర్యచంద్రుల కాంతులతో సమానమైన కాంతులతో ప్రకాశిస్తున్న, చంద్రకాంత శిలలతో నిర్మింపబడిన బంగారు భవనాలను చూశాడు. కోకిలల కుహూకుహూ రాగాలతో, చిలుకల మధురాతి మధురమైన పలుకులతో, నెమళ్ళ షడ్జమస్వరాలాపనలతో ఉత్కంఠను కలిగిస్తున్న సుందరోద్యాన వనాలను చూశాడు. చక్కగా వికసించిన ఎఱ్ఱ కలువలతో, సౌగంధిక పుష్పాలతో, తెల్ల కలువలతో, ఎఱ్ఱతామరలతో, తెల్లపద్మాలతో అందాలు చిందిస్తున్న సరోవరాలను చూశాడు. మణులు పొదిగిన బంగారు కంకణాలను, రకరకాల ఆభరణాలను ధరించి మిఱుమిట్లు కొల్పుతున్న దాసదాసీ జనాలతో నిండి కనువిందు చేస్తున్న సౌధాన్ని చూశాడు. ఆశ్చర్యంతో – ఆహా ఇది ఏ పుణ్యాత్ముడు నివసిస్తున్న భవనమో కదా! ఇంతకు ముందెప్పుడూ ఇటువంటి సౌధాన్ని చూడలేదు. వైభవోపేతంగా కనపడుతున్న ఈ సదనం లక్ష్మీ నివాసంలాగానే, సకల సిరిసంపదలతో బహు సుందరంగా, శోభాయమానంగా దర్శనమిస్తోంది."

వ. అని తలపోయుచున్న యవసరంబున.

1022

తా ॥ అని కుచేలుడు ఆలోచిస్తున్న సమయంలో –

తే. దివిజ వనితలఁ బోలెడు తెఱవ లపుడు, డాయ నేతెంచి 'యిందువిచ్చేయుఁ' డనుచు
వ.మలసంగీత నృత్యవాద్యములు సెలఁగ, గరిమఁ దోడ్కొని చని రంతిపురమునకును.

1023

తా ॥ దేవతాకాంతల వలె ఉన్న స్త్రీలు కుచేలుణ్ణి సమీపించి సంగీత నృత్యవాద్యాలతో "ఇలా రండి. లోపలికి విచ్చేయండి" అని గౌరవపూర్వకంగా, వినయవతులై అంతఃపురంలోకి తీసుకువెళ్ళారు.

వ. ఇట్లు చనుదేర నతని భార్యయైన సతీలలామంబు దన మనంబున నానందరసమగ్న యగుచు.

1024

తా ॥ కుచేలుడు ఆ విధంగా అంతఃపురంలోకి ప్రవేశించే సరికి ఆయన ధర్మపత్ని, భర్తను చూసి పరమానందభరితురాలైంది.

సీ. తన విభురాక ముందటఁ గని మనమున హర్షించి వైభవం బలర మనుజ
కామినీరూపంబు గైకొన్న యిందిరా వనిత చందంబునఁ దనరుచున్న
కలకంఠి తన వాలుఁగన్నుల క్రేవల నానందబాష్పంబు లంకురింప
నతని పాదంబుల కాత్మలో మ్రొక్కి భావంబున నాలింగనంబు సేసె

తే. నా ధరాదేవుఁ డతుల దివ్యాంబరాభ, రణ విభూషితలై రతిరాజు సాయ
కముల గరి నొప్పు పరిచారికలు భజింప, లలిత సౌభాగ్య యగు నిజ లలనఁ జూచి.

1025

తా ॥ సాక్షాత్తూ లక్ష్మీదేవిలా వెలిగిపోతున్న కుచేలుని భార్యారత్నం మనస్సులోనే ఆయన

పాదాలకు మ్రొక్కింది. భావంలో కౌగిలించుకొంది. ఆమె కనుకొనల నుండి ఆనందబాష్పాలు రాలుతున్నాయి. వివిధ భూషణలతో అలంకరింపబడి, మన్మథుని బాణాలా అన్నట్లున్న సుందరాంగులైన పరిచారికలు సేవిస్తుండగా భాగ్యసౌభాగ్యాలతో అలరారుతున్న భార్యను కుచేలుడు చూశాడు.

క. ఆ నారీరత్నంబును, దానును ననురాగరసము దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం, పూనిన హరిలబ్ధవైభవోన్నతి మెఱయన్.

1026

తా ॥ శ్రీకృష్ణుడు ప్రసాదించిన సిరిసంపదలతో ఆ దంపతులిద్దరూ పరస్పరానురాగంతో ఆనందాబ్ధిలో ఓలలాడారు.

సీ. కమనీయ పద్మరాగ స్తంభకంబులుఁ గొమరారు పటికంపుఁ గుడ్యములును
మరకత నవరత్నమయ కవాటంబులుఁ గీలిత హరి నీల జాలకములు
దీపిత చంద్రకాంతోపల వేదులు నంచిత వివిధ పదార్థములును
దగు హంసతూలికా తల్పంబులును హేమ లాలిత శయనస్థలములుఁ దనరు

తే. సమధికోత్తుంగ భద్రపీఠముల సిరులు, మానితోన్నత చతురంతయానములును వలయు
సద్వస్తు పరిపూర్ణ వాటికలును, గలిగి చెలువొందు మందిరం బెలమిఁ జొచ్చి.

1027

తా ॥ మనోహరమైన పద్మరాగపు మణులతో కాంతులు విరజిమ్ముతున్న స్తంభాలతో, స్ఫటిక శిలలతో నిర్మించిన అందమైన గోడలతో, మరకతమణులతో చేసిన తలుపులతో, ఇంద్రనీల మణులతో కూర్చిన కిటికీలతో, చంద్రకాంత శిలలతో చల్లగా ఉన్న వేదికలతో, అనేక రకాలైన ఇష్టపదార్థాలతో, హంసతూలికా తల్పాలతో, బంగారంతో మెరుస్తున్న శయన గృహాలతో, ఎత్తైన భద్ర పీఠాలతో, బంగారు పల్లకీలతో, కావలసిన సమస్త వస్తువులతో నిండిన

అంగళ్ళతో, మహోన్నతంగా దర్శనమిస్తున్న సౌధంలోకి కుచేలుడు, పత్నీ సమేతంగా అడుగుపెట్టాడు.

వ. సుఖంబున నుండు నట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు, నిర్మలంబగు తన మనంబున నిట్లను; నింత కాలం బత్యంత దురంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి యున్న నాకుం గడపటఁ గలిగిన విభవంబున నిప్పుడు.

1028

తా ॥ మహావైభవంగా ఉన్న ఆ భవనంలో కుచేలుడు భార్యతో, పుత్రులతో సుఖంగా కాలం గడిపాడు. అంత వైభవం ఉన్నా, దేనికీ లోటులేకున్నా కుచేలుడు తన మనస్సులోకి ఏ విధమైన అహంకారాది వికారాలు రానివ్వకుండా, మదమాత్సర్యాది దుర్గుణాలు ప్రవేశించకుండా నిర్మలమైన ప్రవర్తనతో సజ్జనుడిగా మెలగసాగాడు. ఒకనాడు కుచేలుడు మనస్సులో ఈ విధంగా అనుకొన్నాడు: “ఇంతకాలం భరించరాని దరిద్ర సముద్రంలో మునిగిపోయాను. చివరకు నాకు కలిగిన వైభవం అంతా క్రొత్తది గదా!

ఆ. ఎన్నఁ గ్రొత్తలైన యిట్టి సంపదలు నా, కబ్బుటెల్ల హరిదయావలోక
నమునఁ జేసి కాదె ! నళినాక్షుసన్నిధి, కర్థి నగుచు నేను నరుగుటయును.

1029

తా ॥ ఇన్ని రకరకాల సంపదలు నాకు శ్రీకృష్ణుని దయాదృష్టివల్ల లభించినవే కదా! దారిద్ర్యాన్ని పోగొట్టమనే కోరికతో నేను కృష్ణుడి దగ్గరకు వెళ్ళాను.

క. నను నా వృత్తాంతంబును, దన మనమునఁ గనియు నేమి దడవక నన్నుఁ బొ
మ్మని యీ సంపద లెల్లను, నొనరఁగ నడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్.

1030

తా ॥ నా గురించి, నా కుటుంబం గురించి, నా స్థితి గతుల గురించి మనస్సులో తెలుసుకొని కూడా కృష్ణుడు నన్నేమీ అడుగలేదు. నీకేం కావాలని కూడా ప్రశ్నించలేదు. వెళ్ళిరా కుచేలా! అని నన్ను సాగనంపి, కృష్ణుడు ఇన్ని సంపదలు నాకు ప్రసాదించి, నన్ను ఒక ప్రభువును చేశాడు.

వ. అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తి పూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె! మలిన దేహుండును, జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నా చేనున్న యటుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యతని నిర్హేతుక దయయ కాదె! యట్టి కారుణ్య సాగరుండైన గోవిందుని చరణారవిందంబుల యందు భక్తి ప్రాభవంబుఁ గలుగుం గాక! యని యప్పుండరీకాక్షుని యందుల భక్తి తాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిల భోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును నిర్వికారుండునునై యఖిలక్రియలందు ననంతుని యనంతధ్యాన సుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె; మఱియును.

1031

తా ॥ భగవంతుడైన శ్రీకృష్ణుడు, భక్తినిష్ఠతో ఉండే సజ్జనులు ఆ పురుషోత్తముడు చెప్పినట్లు ఏ కొంచెం పదార్థమైనా భక్తితో తనకు సమర్పిస్తే – ఆ కొంచెం పదార్థాన్నే కోటిరెట్లుగా భావించి స్వీకరిస్తాడనటానికి నా విషయమే ఒక నిదర్శనం గదా! మాసిపోయిన శరీరంతో, చిరిగిన వస్త్రంతో ఉన్న నన్ను మనస్సులో ఏమాత్రం అసహ్యించుకోకుండా, నా వస్త్రంలోని అటుకులను ఎంతోప్రేమతో కృష్ణుడు ఆరగించాడంటే – దానికి ఏ కారణంలేని ఆ పరమాత్ముని కృపా విశేషమే కారణం. నన్ను మన్నించి, సకల సిరిసంపదలు ప్రసాదించాడంటే ఆయన వాత్సల్యం కాక మరేమౌతుంది? నా మనస్సులోని కోరికతీర్చి, నా దారిద్ర్య బాధను

తొలగించాడంటే – కృష్ణుడు భక్తవరదుడు కాక మరేమిటి? అటువంటి కరుణాసాగరుడైన కృష్ణపరమాత్ముని పాదపద్మాలయందు నాకు ప్రతి జన్మలోను అచంచలమైన భక్తి కలుగుగాక!" అని భావించాడు కుచేలుడు.

కుచేలుడు నిశ్చలమైన భక్తితో; భార్యాసమేతుడై భోగభాగ్యాలపట్ల ఏ విధమైన ఆసక్తి చూపక; దేనిమీద అనురాగం గాని, ద్వేషం గాని కలిగి ఉండక; నిర్వికారుడిగా జీవించాడు. తానుచేసే ప్రతిపనిలోనూ భగవంతుని పట్ల ఎడతెగని ధ్యానంతో, ఆ ధ్యానామృతాన్ని పానం చేస్తూ, సంసార బంధాలనుంచి విముక్తిపొంది, మోక్షసామ్రాజ్యాన్ని చేరుకొన్నాడు.

ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత, వరదుఁ డైన హరికి ధరణి సురులు
దైవతములు గాన ధారుణీదివిజుల, కంటె దైవ మొకఁడు గలడె భువిని?

1032

తా ॥ దేవదేవుడైన శ్రీకృష్ణుడు సర్వజీవరాశుల మనస్సులలోని భావాలు తెలిసిన ఆశ్రితవరదుడు. అటువంటి శ్రీహరికి భక్తశిఖామణులైన బ్రాహ్మణోత్తములు దైవస్వరూపులు. రాజా! ఈ భూలోకంలో తపస్సంపన్నులైన బ్రాహ్మణులను మించిన వేరే దైవం ఎవరూలేరు.

క. మురహరుఁ డిట్లు కుచేలుని, చరితార్థునిఁ జేసినట్టి చరితము విను స
త్పురుషుల కిహపరసుఖములు, హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా!

1033

తా ॥ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు కుచేలున్ని ఈ విధంగా చరితార్థున్ని చేసిన కథను వినే సజ్జనులకు ఇహలోక సుఖాలు, పరలోక సుఖాలూ అన్నీ లభిస్తాయి. కీర్తి కలుగుతుంది. అన్నిటినీ మించి విశేషమైన హరిభక్తి ఏర్పడుతుంది." అని శుకమహర్షి చెప్పాడు.

## శ్రీకృష్ణుడు సకుటుంబముగా గ్రహణ స్నానమునకు పోవుట

వ. అనిన మఱియుం బరాశరపౌత్రున కర్జునపౌత్రుం డిట్లనియె.

1034

తా ॥ అప్పుడు శుకయోగిని చూసి పరీక్షిత్తిలా అన్నాడు:

ఆ. దుష్ట శిక్షణంబు దురితసంహరణంబు, శిష్టరక్షణంబుఁ జేయఁ దలఁచి
భువిని మనుజుఁ డగుచుఁ బుట్టిన శ్రీ కృష్ణ, విమలచరిత మెల్ల విస్తరింపు.

1035

తా ॥ "మహాత్మా! దుష్టులను శిక్షించడానికి, పాపాలను పరిహరించడానికి, శిష్టులను సంరక్షించడానికి పరమాత్ముడు శ్రీకృష్ణుడిగా మానవావతారం ధరించాడు. భువిని నిష్కంటకం చేయడానికి జన్మించిన శ్రీకృష్ణుని పవిత్ర చరిత్రను ఇంకా ఇంకా వినాలని ఉంది. చెప్పండి స్వామీ!"

వ. అనిన శుకుం డిట్లనియె.

1036

తా ॥ అని పరీక్షిత్తు అడుగగా శుకమహర్షి ఈ విధంగా మళ్ళీ చెప్పసాగాడు:

సీ. ధరణీశ! బలుండును సరసిజోదరుఁడు నవోన్నతసుఖలీల నుండునంతఁ
జటులోగ్రకల్పాంత సమయమందును బోలె దృగసహ్యమై సముద్దీప్త మగుచు
రాజిల్లు సూర్యోపరాగంబు సనుదెంచు టెఱిఁగి భూజను లెల్ల వరుసఁ గదలి
మును జమదగ్ని రాముఁడు పూని ముయ్యేడు మాఱులు ఘనబలోదారుఁ డగుచు

తే. నిజభుజాదండ మండిత నిబిడ నిశిత, చటుల దంభోళిరుచిర భాస్వత్కుఠార

మహితధారా వినిర్భిన్న మనుజపాల, దేహనిర్ముక్త రుధిర ప్రవాహములను.

1037

తా ॥ “ఓ మహారాజా! బలరాముడు, శ్రీకృష్ణుడు ద్వారకా నగరంలో సుఖంగా కాలం గడుపుతున్న సమయంలో – మహాభయంకరమైన కల్పాంత వేళలో లాగా చూడశక్యం కాని విధంగా సూర్యగ్రహణం రానున్నదని తెలుసుకొని యాదవులందరూ గ్రహణస్నానానికి బయలుదేరారు. పూర్వం పరశురాముడు ఇరవై ఒక్క సార్లు రాజలోకం మీద యుద్ధానికి వెళ్ళి తన మహాబలాన్ని ప్రదర్శించి, వజ్రాయుధం లాగా ప్రకాశిస్తున్న తన గండ్రగొడ్డలితో రాజులనందరినీ నరికి పారేశాడు. ఆ క్షత్రియవీరుల దేహాలనుంచి కారిన రక్తం ప్రవాహం కట్టింది.

తే. ఏను మడువులు గావించె నెచటనేని, నట్టి పావనసుక్షేత్రమగు స్యమంత పంచకంబున
కపుడు సంభ్రమముతోడఁ, జనిరి రామకృష్ణులును సంతసం బెలర్ప.

1038

తా ॥ ఆ రక్త ప్రవాహాన్ని పరశురాముడు అయిదు మడుగులుగా చేశాడు. ఎక్కడైతే ఆ రక్తప్రవాహాన్ని అయిదు మడుగులుగా చేశాడో – ఆ ప్రదేశం పరమ పవిత్రమైన “శ్యమంత పంచకమ” నే పేరుతో సుక్షేత్రంగా విరాజిల్లింది. ఆ పరమపవిత్ర శ్యమంతపంచక తీరానికి బలరామకృష్ణులు ఆనందోత్సాహాలతో గ్రహణ స్నానానికని బయలు దేరారు.

వ. ఇట్లు నిష్కర్ములైన రామకృష్ణులు లోక ధర్మానుపాలన ప్రవర్తనులై ద్వారకా నగర రక్షణంబునకుం బ్రద్యుమ్న గద సాంబ సుచంద్ర శుక సారణానిరుద్ధ కృతవర్మాది యోధవరుల నియమించి తాము నక్రూర వసుదేవోగ్రసేనాది సకల యాదవులుం గాంతా సమేతులై స్రక్చంద నాభరణ వస్త్రాదులు ధరియించి, శోభనాకారంబులతోడం బుష్పక విమానంబు లనం బొలుచు నరదంబులను, మేఘంబుల ననుకరించు గజంబులను,

మనోవేగంబులైన తురగంబుల నెక్కి వియచ్చరులం బురుడించు పురుషులు దమ్ము
సేవింపం జని యప్పుణ్య తీర్థంబుల నవగాహనంబు సేసి యుపవసించి యనంతరంబ.

1039

తా ॥ కర్మ అనేది అంటని బలరామకృష్ణులు లోకంలో ధర్మపాలనను అనుసరింప చేయడానికి గ్రహణ స్నానానికి బయలుదేరుతూ ద్వారకానగర సంరక్షణ బాధ్యతను ప్రద్యుమ్న గద సాంబసుచంద్ర శుకసారణ అనిరుద్ధ కృతవర్మాది యాదవవీరులపై ఉంచారు. అక్రూరుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలైన యాదవులు రామకృష్ణులతో స్యమంత పంచకానికి బయలుదేరారు. వారంతా చందనాది మైపూతలు పూసుకొని, పుష్పమాలలంకరించుకొని, నూతన వస్త్రాలు, రత్నాభరణాలు ధరించి – పుష్పకవిమానాలా అన్నట్లున్న రథాలను, మేఘాలవంటి ఏనుగులను, మనోవేగంతో పరుగెత్తే గుఱ్ఱాలను అధిరోహించి, దేవతల అందాలను తిరస్కరించే సుందరాంగులైన పురుషులు తమను కొలుస్తుండగా స్యమంత హ్రాదాన్ని చేరారు. ఆ పుణ్య తీర్థాలలో అందరూ స్నానాలు చేసి, ఉపవాసం చేశారు.

క. భూసురవరులకు ననుపమ, వాసో–లంకార ధేను వసురత్నధరి
త్రీ సుమహిత వస్తువు లు, ల్లాసంబున దాన మిచ్చి లాలితు లగుచున్.

1040

తా ॥ ఆ తరువాత గ్రహణ సమయంలో జపధ్యానాలను చేసారు. బ్రాహ్మణోత్తములకు గృహదానాన్ని, గోదానాన్ని, భూదానాన్ని, రత్నాలను, సువర్ణదానాన్ని, అలంకారద్రవ్యాలను, మంచిమంచి వస్తువులను ఇచ్చి వారిని సంతుష్టులను చేశారు.

క. పునరవగాహనములు పెం, పొనరం గావించి బంధుయుక్తముగా భో
జన కృత్యంబులు దీర్చి స, దనురాగము లుల్లసిల్ల నచ్చోటఁ దగన్.

1041

తా ॥ బలరామకృష్ణులు, తక్కిన యాదవులు గ్రహణానంతరం మళ్ళీ విడుపు స్నానాలు చేశారు. బంధువులందరూ కలిసి ఉల్లాసంగా భోజనాలు చేశారు. సంతోషంతో, ప్రేమాభిమానాలతో అందరూ ఉత్సాహంగా సంభాషించుకొంటూ కాలం గడిపారు.

క. ఘనశాఖాకీర్ణములై, యినరశ్ములు దూఱనీక యెసకం బెసఁగన్ ననిచిన పొన్నల నీడల,
ననిచిన వేడుకల నందనందన ముఖ్యుల్.

1042

తా ॥ మహారాజా! పెద్ద పెద్ద కొమ్మలతో పొన్నచెట్లు దట్టంగా పెరిగి ఒకదానితో ఒకటి కలిసిపోయాయా అన్నట్లు ఉండటంతో సూర్యకిరణాలు ఆకులమధ్యలో నుంచి దూరలేకపోతున్నాయి. శ్రీకృష్ణుడు, బలరాముడు మొదలైన యాదవులు పొన్నచెట్ల నీడలలోకి వచ్చిచేరారు.

క. తనరిన పల్లవ రుచిరా, సనముల నాసీను లగుచు సత్సుఖగోష్ఠిం
బెనుపొందఁగ నట వసియిం, చిరచోఁ దత్పుణ్యతీర్థ సేవారతులై.

1043

తా ॥ పొన్నచెట్ల నీడలలో మెత్తని చిగుళ్ళతో పరచిన ఆసనాలమీద కూర్చొని సుఖగోష్ఠి సల్పుతూ, చమత్కారాలు విసురుతూ ఉల్లాసంగా వినోదించారు బలరామాది యాదవులందరూ.

వ. మున్న చనుదెంచి యున్న మత్స్యోశీనర కోసల విదర్భ కురు సృంజయ కాంభోజ కేకయ మద్రకుంత్యారట్ట కేరలాది భూపతులును, మఱియుం దక్కిన రాజవరులును, హితులును, నందగోపాది గోపాలురును, గోపికాజనంబులును, ధర్మరాజానుగతులై వచ్చిన భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గంధారీ కుంతీ పాండవ తద్దార నివహ సంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజిద్ద్రుపద శైబ్య ధృష్టకేతు కాశిరాజ దమఘోష విశాలాక్ష మైథిల యుధామన్యు సుశర్మలును, సపుత్రకుండైన బాహ్లికుండును మొదలుగా ననేకులు నుగ్రసేనాది యాదవ

ప్రకరంబులం బూజలం దృప్తులం జేసిన వారునుం బ్రముదితాత్ములై; రయ్యెడ.

1044

తా ॥ ఆ విధంగా యాదవులు సుఖసంతోషాలలో తేలియాడుతుండగా, శ్యమంత పంచక పుణ్యతీర్థాన్ని సేవించాలనే కుతూహలంతో ఎందరో రాజులు ముందే అక్కడికి వచ్చి ఉన్నారు. మత్స్య, ఔశీనర, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ, కేకయ, మద్ర, కేరళదేశాధిపతులందరూ వచ్చారు. నందుడు మొదలైన గోపాలురు, గోపికా జనము వచ్చారు. ధర్మరాజుతోపాటు భీష్ముడు, ద్రోణుడు, ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతి వచ్చారు. పాండవులు భార్యలతో సహా వచ్చారు. సంజయుడు, విదురుడు, కృపుడు, కుంతి భోజుడు, విరాటుడు, భీష్మకుడు, నగ్నజిత్తు, ద్రుపదుడు, శైబ్యుడు, ధృష్టకేతు, కాశీరాజు, దమఘోషుడు, విశాలాక్షుడు, మైథిలుడైన జనకుడు, యుధామన్యుడు, సుశర్మ మొదలైన వారంతా వచ్చారు. బాహ్లికుడు పుత్రులతో కూడి వచ్చాడు. ఒకరేమిటి, ఎందరెందరో రాజులు గ్రహణ స్నాననిమిత్తం ఆ పుణ్యతీర్థానికి వచ్చి ఉన్నారు. వచ్చిన రాజులందరూ ఉగ్రసేనుడు మొదలైన యాదవశ్రేష్ఠులను పూజించి, గౌరవించారు. ఉగ్రసేనాదులు కూడా రాజులు చేసిన మర్యాదలకు సంతృప్తి చెంది సంతోషించారు.

క. ఆ రాజులు గాంచిరి నిజ, నారీయుతు లగుచు నంగనాపరివారున్ ధీరున్ దానవకుల సం, హారున్ గోపీమనోవిహారు నుదారున్.

1045

తా ॥ పుణ్యతీర్థ సేవనానికి వచ్చిన రాజులందరూ తమ తమ సతీజనంతో కలిసి ధీరోదాత్తుడు, రాక్షస సంహారి, గోపీజనప్రియుడు, దయాసముద్రుడు, పత్నీ సమేతుడు అయిన శ్రీకృష్ణుణ్ణి దర్శించారు.

వ. కని య మ్మాధవ బలదేవులు సేయు సముచిత పూజావిధానంబులం బరితృప్తులై, య

మ్ముకుంద సాన్నిధ్యంబు గలిగి, తదీయసంపద్విభవాభిరాములై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదు వృష్ణి పుంగవులం జూచి, వారలతోడ నా రాజవరులు మాధవుండు విన నిట్లనిరి.

1046

తా ॥ అప్పుడు శ్రీకృష్ణుడు, బలరాముడు ఆ రాజులందరినీ తగిన విధంగా పూజించి సత్కరించారు. బలరామకృష్ణుల ఆతిథ్య సత్కారాలకు తృప్తిచెందిన రాజులు కృష్ణుని దగ్గరే కూర్చొన్నారు. శ్రీకృష్ణుడు ప్రసాదించిన విభవాలతో అత్యున్నతంగా విలసిల్లుతున్న ఉగ్రసేనుడు మొదలైన యదువృష్ణి కులాలకు చెందిన పెద్దలను చూసి శ్రీకృష్ణుడు వినేటట్లుగా ఆ రాజులు ఇలా మాట్లాడారు:

మ. మన శాస్త్రంబులు వాక్కులున్ మనములున్ మాంగల్యముం బొంది పా
వనమై యొప్పెడి నే రమా విభుని భాస్వత్పాదపంకేజ సే
చన తోయంబుల నే మహాత్ముని పదాబ్జాతంబు లెందేని సోఁ
కినచో టెల్లను ముక్తి హేతు వగు, నీ కృష్ణుండె పో! చూడఁగన్.

1047

తా ॥ "మన శాస్త్రాలు, వేదవాక్కులు, మనస్సులు – ఏ మహాత్ముని పాదపద్మాల తీర్థం వల్ల శుభ స్థితిని పొంది, అతి పవిత్రమౌతున్నాయో; ఏ పురుషోత్తముని పాదపద్మాలు సోకిన కారణంగా ఆ పుణ్యభూమి మోక్షదాయకమౌతుందో, ఆ లక్ష్మీనాథుడే ఈ శ్రీకృష్ణుడు.

చ. సనక సనందనాది మునిసత్తము లంచిత యోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచరమైన మూర్తి యి
ట్లనవరతంబు మాంస నయనాంచల గోచరుఁ డయ్యనట్టె! యే
మన నగు? వీరిపుణ్యమున కాదట నెట్టితపంబు సేసిరో?

1048

తా ॥ ఈ శ్రీకృష్ణ పరమాత్మ సనకసనందనాది మహర్షుల యోగదృష్టికే కనపడడు. ఆ మహాతపస్సంపన్నులు ఎంత శోధించినా వారి ఆత్మలలో పట్టుబడడు. అటువంటి లోకేశ్వరుడైన శ్రీకృష్ణుడు ప్రతిక్షణం మీ అందరి కళ్ళముందు మసలుతున్నాడంటే – యాదవులైన మీరు ఎంతపుణ్యం చేసి పుట్టారో! ఎంత ఘోరతపస్సు చేసి జన్మించారో!!

మ. నిరయస్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణమూర్తైన యీ
హరిఁజూడన్, హరితోడఁబల్క, హరిమే నంటన్, హరిం బాడఁగా
హరితో నేఁగ, సహాసనాస్తరణ శయ్యావాసులై యుండఁగన్
హరి బంధుత్వసఖీత్వముల్ గలుగు భాగ్యం బెట్లు సిద్ధించెనో?

1049

తా ॥ యాదవశ్రేష్ఠులైన ఉగ్రసేనాదులు నరకం గురించిగాని, స్వర్గం గురించిగాని ఏ మాత్రం ఆలోచించకుండా, ఎప్పుడూ మోక్షప్రదాత అయిన ఈ కృష్ణుని గురించే ఆలోచిస్తుంటారు. వారందరికీ శ్రీకృష్ణుణ్ణి చూసే భాగ్యం, శ్రీకృష్ణుడితో మాట్లాడటం, శ్రీకృష్ణస్పర్శ పొందటం, శ్రీకృష్ణుణ్ణి కీర్తించటం, శ్రీకృష్ణుడితో కలిసి వెళ్ళటం, శ్రీకృష్ణుడితో కలిసి కూర్చోవటం, శ్రీకృష్ణుడితో కూడి ఒకే పాన్పుపైన పడుకోవడం, శ్రీకృష్ణుడికి బంధువుకావటం, శ్రీకృష్ణుడితో మైత్రి కలగటం – ఒకటేమిటి? సర్వం శ్రీకృష్ణమయంగా జరగటం – వారి పుణ్యవిశేషం కాక మరేమిటి? అటువంటి అదృష్టం వారికెలా కలిగిందో కదా!"

తే. అనుచు యాదవ వృష్ణి భోజాంధకులును, హరిదయాలబ్ధ నిఖిలార్థు లగుచు నున్న మనికిఁ దమ చిత్తములఁ బలుమాఱుఁ బొగడి, పరిణమించిరి; యంత న ప్పాండుమహిషి.

1050

తా ॥ యాదవులు, వృష్ణివంశీయులు, భోజాన్వయులు, అంధక కులంవారు – శ్రీకృష్ణుని

దయవల్ల సకల సంపదలను, సమస్త కామితాలను పొంది సుఖజీవనం సాగిస్తున్నారు, వారు ఎంత పుణ్యులోకదా!" అని తమ మనస్సులలో రాజులు పొగడుతూ అక్కడ నుండి మెల్లగా వెళ్ళిపోయారు.

వ. అప్పుడు.

1051

తా ॥ అప్పుడు పాండుమహారాజు పత్ని అయిన కుంతీదేవి–

క. తన సుతులకు గాంధారీ, తనయులు గావించు సపకృతంబుల కాత్మన్ ఘనముగ నెరియుచు నచ్చటఁ, గనుఁగొనె వసుదేవు విగతకల్మషభావున్.

1052

తా ॥ గాంధారీదేవి కొడుకులైన దుర్యోధనాదులు, తన పుత్రులైన పాండవులపట్ల చేస్తున్న అపకారాలకు మనస్సులో ఎంతగానో కుమిలిపోయి, పాపరహితుడైన వసుదేవుని వైపు చూసింది.

వ. అట్లు గనుంగొని యతనితో నిట్లనియె.

1053

తా ॥ దీనురాలైన కుంతీదేవి అన్న అయిన వసుదేవునితో ఈ విధంగా అన్నది:

క. ఓ యన్న ! పాండుతనయులు, నీ యల్లుం డ్రడవులందు నెఱి మృగములతోఁ బాయని యిడుమలఁ బడఁ గరు, ణాయత్తుల రగుచు మీర లరయఁగ వలదే ?

1054

తా ॥ "అన్నా! పాండురాజ పుత్రులు – నీకు మేనల్లుళ్ళు కదా! ధర్మరాజాదులు

అడవులలో క్రూరమృగాల మధ్య అనేక కష్టాలు పడుతుంటే వారి బాగోగులు మీరు చూసుకోవద్దా? దయార్ద్ర చిత్తంతో వారిని కాపాడాలి కదా!"

వ. అని బహుప్రకారంబుల సంతాపించుచు మఱియు నిట్లనియె.

1055

తా ॥ అని అనేక విధాలుగా కొడుకుల బాధలు చెప్పుకొంటూ దుఃఖాతిశయంతో ఇంకా ఇలా అంది:

క. అతిబలవంతపు విధి దాఁ, 'బ్రతికూలంబైనఁ గలరె బంధువు?' లనుచున్ ధృతి గలఁగ బాష్పజలపూ, రితలోచన యగు సహోదరిం జూచి యనెన్.

1056

తా ॥ "అన్నా! విధి మాకు ప్రతికూలమై కష్టాలపాలు చేసినప్పుడు, బంధువులేం చేస్తారులే, అయినా బంధువులెవరున్నారు కనుక?" అని కుంతీదేవి ధైర్యం కోల్పోయి, శోకించడంతో చెల్లెలిని చూసి వసుదేవుడు ఇలా అన్నాడు:

సీ. తల్లి! నీ కేల సంతాపింప మనమునఁ దలవఁక విధి నేల సొలసె? దింత
యఖీల నియామకుండగు నీశ్వరుఁడు మాయ యవనికాంతరుఁడైన యట్టి సూత్ర
ధారుని కై వడిఁ దగిలి నటింపఁగ మనుజులు కీలుబొమ్మలు దలంపఁ;
గావున విధిసేఁతఁ గడిచి వర్తింపంగ, దేవతలకునై నఁ దీఱ; దట్లు

తే. క్రోధచిత్తుండు కంసుఁడు బాధపఱుప, నిలయములు దప్పి నే నడవులఁ జరింప
ఘనకృపానిధి యీ హరి గలుగఁబట్టి, కోరి మా కిండ్లు గ్రమ్మఱఁ జేరఁ గలిగె'.

1057

తా ॥ "తల్లీ! ఎందుకింత బాధపడతావు చెప్పు. విధినెందుకు నిందిస్తావు? కష్టసుఖాలను

నియమించేవాడు భగవంతుడు. ఆ పరమాత్ముడు 'మాయ' అనే తెరవెనక ఉండి సూత్రధారుడిలాగా జగత్తును నడిపిస్తుంటాడు. ఆయన చేతిలో మానవులు కేవలం కీలుబొమ్మల వంటివారు. ఆయన కీలు ఎటుతిప్పితే అటు తిరగటమే మనవిధి. మన శక్తి అంటూ ఏదీ ఉండదు గదా! అందుచేత విధిని ఎదిరించి నడవడం దేవతలకే చేతకానప్పుడు మనమెంత?

క్రోధచిత్తుడైన కంసుడు మమ్మల్ని విపరీతంగా బాధించాడు. అప్పుడు మా, మా, నివాసాలు వదిలి అడవుల పాలయ్యాము. దయాసముద్రుడైన ఈ కృష్ణుడు ఉండబట్టి మళ్ళీ మా ఇళ్లను మేము చేరగలిగాము. కాబట్టి సోదరీ! బాధపడకు. విధి కలిసి వస్తే – ఆ రోజున మీరంతా కష్టాలు తొలగి సుఖపడతారు."

వ. అని యూరడిలం బలుకు నవసరంబున.

1058

తా ॥ అని వసుదేవుడు కుంతీదేవిని ఓదార్చాడు.

క. నందయశోదలు గోపక, బృందంబులు గోపికలును బిరిగొని పరమా
నందంబునఁ జనుదెంచిరి, మందరధరుఁ జూచువేడ్క మనములఁ బొడమన్.

1059

తా ॥ ఆ సమయంలో నందుడు, యశోద, గోపాలకులతో కలిసి గోపికలను తీసుకొని కృష్ణుణ్ణి చూడాలనే కోరికతో పరమానందంతో కృష్ణుడి దగ్గరకు వచ్చారు.

వ. అట్లు చనుదెంచిన.

1060

తా ॥ ఈ విధంగా చాలా కాలం తరువాత కృష్ణుణ్ణి చూడాలనే కాంక్షతో వచ్చిన నందాదులను యాదవులు చూశారు.

క. అతిచిరకాల సమాగతు, నతని నిరీక్షించి వృష్ణి యాదవ భోజ
ప్రతతులు నెదురేఁగి సము, న్నతితో నాలింగనములు నడపిరి వరుసన్.

1061

తా ॥ వెంటనే యదువృష్ణిభోజకాంధక ప్రముఖులందరూ సగౌరవంగా లేచి, ఎదురువెళ్ళి, కౌగిలించుకొని, క్షేమసమాచారాలు అడిగి తెలుసుకొని, ప్రేమతో గోకుల వాసుల్ని ఆహ్వానించి, వసుదేవుడి వద్దకు తీసుకువచ్చారు.

క. వసుదేవుఁడు వారికి సం, తనమునఁ గావించె సముచితక్రియ లంతన్ ముసలియు హరియును మ్రొక్కిరి, వెస నందయశోదలకును వినయం బెసఁగన్.

1062

తా ॥ వసుదేవుడు వారందరినీ చూసి, ఎంతో సంతోషపడి, సకలసత్కారాలు చేసి, పూజించాడు. వెంటనే నందయశోదలకు, బలరాముడు, శ్రీకృష్ణుడు వినయంతో సాష్టాంగ నమస్కారం చేశారు.

వ. అట్లు నమస్కృతులు సేసి, యాలింగనంబులు గావించి, నయనారవిందంబుల నానందబాష్పంబుల దొరఁగ నఱ లేని స్నేహంబులు చిత్తంబుల సత్తమిల్ల నేమియుం బలుకకుండి; రంత న య్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి యక్కునం గదియం దిగిచి, చెక్కిలి ముద్దుగొని, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుడుకుచుఁ, బునఃపునరాలింగనంబులు గావించి, పరమానందంబునుం బొందుచు నున్నంతఁ బదంవడి.

1063

తా ॥ ఆ విధంగా బలరామకృష్ణులిద్దరూ తల్లిదండ్రులకు నమస్కారాలు చేసి, వారిని భక్తిమీర కౌగిలించుకొని, కళ్ళవెంబడి ఆనంద బాష్పాలు జాలువారుతుండగా, ఎనలేని ప్రేమ

మనస్సులో పూడుకుపోగా ఏమీ పలుకలేక మౌనంగా ఉండిపోయారు. అప్పుడు యశోదాదేవి తనయులిద్దరినీ తన తొడలమీద కూర్చోపెట్టుకొని, గుండెలకు వారిని హత్తుకొని, చెక్కిళ్ళ మీద ముద్దులు పెట్టుకొంది. వారి శిరస్సులను వాత్సల్యంతో వాసన చూసింది. గడ్డం నిమురుతూ మళ్ళీమళ్ళీ ప్రేమాతిశయంతో ఇద్దరినీ కౌగిలించుకొంది. పరమానందంతో ఉప్పొంగి పోయింది.

చ. స్థిరమతితోడ రోహిణియు దేవకియుం దగ నందగోప సుం
దరిఁ గని కౌఁగిలించికొని తత్కృతులెల్లఁ దలంచి యింతి! నీ
వరుఁడును నీవు బంధుజన వత్సలతన్ మును చేయు సత్కృతుల్
మఱవఁగ వచ్చునే ? తలఁప మా కిఁక నెన్నఁటికిం దలోదరీ!

1064

తా ॥ ఆ తరువాత బలరాముని తల్లి అయిన రోహిణీదేవి, శ్రీకృష్ణుని తల్లి అయిన దేవకీదేవి వచ్చి యశోదాదేవిని ప్రేమతో కౌగిలించుకొన్నారు. యశోదాదేవి రామకృష్ణులను ఎంతప్రేమతో పెంచిందో, ఎంత మమకారంతో చూపిందో – ఆ విషయాలన్నీ గుర్తుచేసుకొన్నారు. "యశోదా! నీమా, నీ భర్త – మాయందున్న బంధుప్రేమతో ఎన్నెన్ని మంచి పనులు చేశారో, ఎంతెంత సహాయం చేశారో మేం మరచిపోగలమా! మిమ్మల్ని ఎప్పటికీ మరచిపోలేం తల్లీ!

క. జననం బందుట మొదలుగ, ఘనమోహముతోడఁ బెంచుకతమునఁ దమకున్ జననీ జనకులు వీరని, మనమునఁ దలపోయలేరు మము నీ తనయుల్.

1065

తా ॥ అమ్మా! యశోదాదేవీ! రామకృష్ణులు పుట్టిన దగ్గర నుంచి, వారిని నీవు అపారమైన ప్రేమతో పెంచినందువల్ల నీ కుమారులు మమ్మల్ని తల్లిదండ్రులుగా అసలు భావించటంలేదు.

క. అంటిన ప్రేమను వీరిం, గంటికి ఱెప్పడ్డమైన గతిఁ బెంపఁగ మా

కంటెన్ నెన రౌటను మీ, యింటన్ వసియించి యుండి రిన్నిదినంబుల్.

1066

తా ॥ మీ ప్రేమ ఎంత గొప్పదో చెప్పలేము. మాకంటే మీరే ఎక్కువ ప్రేమతో రామకృష్ణులను కంటికి రెప్పలా పెంచారు. వాళ్ళకు కూడా మామీదకంటే మీమీదే ఎక్కువ ప్రేమ. అందుకే మీ ఇంట్లో ఇన్ని రోజులుగా ఉన్నారు."

వ. అని యిట్లు ప్రియాలాపంబులు పలుకుచుండు నవసరంబున గోపాలసుందరు లమందానంద కందళితహృదయ లయి హృదయేశ్వరుండైన గోవిందుఁడు చిరకాల సమాగతుం డగుటం జేసి, యతనిం జూచు తలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి.

1067

తా ॥ అని ఈ విధంగా దేవకీదేవి మొదలైనవారు పలుకుతుండగా – తమ హృదయేశ్వరుడైన శ్రీకృష్ణుడు చాలా కాలం తరవాత వచ్చి ఉన్నాడని తెలుసుకొని సుందరీమణులైన గోపికలు అపరిమితానందంలో మునిగి తేలుతూ ఎప్పుడెప్పుడు కృష్ణుణ్ణి చూద్దామా అనే ఉత్కంఠతో అక్కడికి వచ్చి చేరారు.

చ. నళినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్వఁగఁ జాల కాత్మలన్
వలచి తదీయమూర్తి విభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం
బులకలు మేన జాదుకొనఁ బొల్తులు సొక్కిరి బ్రహ్మమున్ మనం
బునఁ గని చొక్కు యోగిజనముం బురుణింపఁగ మానవేశ్వరా!

1068

తా ॥ గోపకాంతలందరూ శ్రీకృష్ణుని సన్నిధానానికి వచ్చి శ్రీకృష్ణుణ్ణి చూస్తూ కనురెప్పలు వాల్చలేకపోయారు. రెప్పలార్పకుండా ఆ శృంగార మూర్తిని చూస్తూ తమ హృదయాలలో అనురాగం అతిశయిస్తుండగా భావనలోనే ఆ ముగ్ధమోహనాకారున్ని కౌగిలించుకొన్నారు. వారి

శరీరమంతటా పులకలు ఏర్పడి తన్మయులైనారు. పరీక్షిన్మహారాజా! అప్పటి గోపికల స్థితి ఎలా ఉందంటే – పరమాత్ముడైన భగవంతుణ్ణి మనస్సులో దర్శించి యోగీశ్వరులు ఏ విధంగా చొక్కి పరవశిస్తారో – వారు కూడా కృష్ణ భావనతో అలాగే కృష్ణుణ్ణి దర్శించీ దర్శించగానే పారవశ్యంలోకి జారుకొన్నారు.

చ. పొలఁతుల భావ మాత్మఁ గని ఫుల్ల సరోరుహలోచనుండు వా
రల నపు డేకతంబునకు రమ్మని తోకొని పోయి యందు న
ర్మిలిఁ బరిరంభణంబు లొనరించి లసద్దరహాసచంద్రికా
కలిత కపోలుఁడై పలికెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్.

1069

తా ॥ శ్రీకృష్ణుడు గోపికారమణుల అంతర్భావాన్ని గ్రహించాడు. వారినందరినీ ఏకాంత ప్రదేశానికి రమ్మని, తోడ్కొని పోయాడు. ఆ ఏకాంత ప్రదేశంలో ప్రేమతో వారిని కౌగిలించుకొని ఆనందపరవశులను చేశాడు. ఆ తరువాత నిశ్చలభక్తియుక్తలైన గోపకాంతలతో చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నాడు:

చ. 'వనజదళాక్షులార! బలవద్రిపు వర్గములన్ జయింపఁగాఁ
జని తడ వయ్యెఁ; దీనికి భృశంబుగ మీ మది నల్గకుండుఁడీ!
యనయము దైవ మిట్లు సచరాచరజాలము నొక్కవేళఁ గూ
ర్చును నొకవేళఁ బాపును మరుద్ధతిదూలతృణంబులం బలెన్.

1070

తా ॥ "ఓ సుందరీమణులారా! నేను బలవంతులైన శత్రువులనెందరినో జయించడానికి వెళ్ళవలసి వచ్చింది. ఆ పని ముగించుకొని వచ్చేసరికి చాలా ఆలస్యమైంది. అందువల్ల నామీద మీరు అలగవద్దు. విధి ఒక్కొక్కసారి ప్రాణులను, అప్రాణులను కూడా కలుపుతూ ఉంటుంది,

విడదీస్తూనూ ఉంటుంది. గాలి—దూది పింజలను, గడ్డిపరకలను ఎలా ఎగురకొడుతుంటుందో విధి కూడా అంతే.

సీ. తరలాక్షులార! మద్భక్తి చేతనులకుఁ దనరు మోక్షానందదాయకంబు
జప తపో వ్రత దాన సత్కర్మముల ముక్తి కలుగంగ నేరదు కానఁ దలఁప
విధి శివ సనకాది విమలచిత్తంబులఁ బొడమిన భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వ సంచిత సౌభాగ్య మెట్టిదో యది తుదముట్టె నింక

తే. నటమటము గాదు మీకు నెన్నఁటికి నైనఁ, గలుగనేరవు నిరయసంగతములైనఁ
జన్మకర్మము లిటమీఁద మన్మనీష, సుమహిత ధ్యానలార! యో రమణులార!

1071

తా ॥ నాయందు నిశ్చలమైన భక్తిగలవారికి తప్పక మోక్షం లభిస్తుంది. అంతేగాని జపం, తపం, వ్రతం, దానం చేసినంత మాత్రాన ముక్తి కలుగదు. మీలో నా పట్ల అపారమైన భక్తి ఉంది. శంకరుడి యొక్క, బ్రహ్మదేవుడి యొక్క, సనకసనందనాది మహర్షులయొక్క మనస్సులలో ఏర్పడినంత భక్తి మీ మనస్సులలో నాపై కలిగింది. పూర్వజన్మలనుంచి సంపాదించి తెచ్చుకొన్న మీ పుణ్యవిశేషం ఎంత గొప్పదోకాని, నేటికది ఫలించింది. ఇక మీకెప్పటికీ ఏ కష్టం కలుగదు. నరకయాతనలపాలవ్వరు. మీకు పునర్జన్మంటూ ఉండదు. మీ ధ్యాన పటిమే మిమ్మల్ని దరికి జేర్చి ముక్తిని ప్రసాదించింది.

సీ. అఖిలభూతములకు ననయంబు నాది మధ్యాంతరాంతర్బహిర్వ్యాప్తి నైన
ఘటపటాదిక భూతకార్యంబులకును ప్రధానకారణములై తనరునట్టి
గగనానిలానలకక్షోణులను భూత పంచకం బైక్యత వడయుఁగాదె
లోకంబులందుఁ బంచీకరణవ్యవస్థలచేత నట్టి భూతముల రీతి

తే. గగనముఖభూత తత్కార్యకారణములఁ, దగిలి యాధార హేతుభూతంబ నైన

నాకుఁ బర మన్య మొక్కఁడెన్నంగ లేదు, విమలమతులార! మాటలు వేయు నేల ?

1072

తా ॥ నిర్మల మనస్వినులైన గోపకాంతలారా! నేను ఎప్పుడూ సర్వజీవరాశుల లోపలా, బయటా ఉంటాను. జగత్తుయొక్క ఆదిమధ్యాంతాలలోను ఉంటాను. సర్వప్రాణుల శరీర రక్షణాది సమస్త కార్యకలాపాలకు పంచభూతాలైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనువాటి కలయికే కారణం. పంచభూతాల కార్యకారణాలకు, ప్రయోజనాలకు నేనే ఆధారభూతుడను. విశ్వనిర్వహణకు, సృష్టి విధానానికి, చరాచరజంతుజాల విలయానికి సర్వానికి నేనే కర్తను. అటువంటి నాకు – నేను వేరు, ఇతరులు వేరు అనే భేద భావం లేదు."

తే. అనినఁ దెలివొంది వారు దేహాభిమాన, ములు సమస్తంబు విడిచి 'యో నలిననాభ!
నిఖిలజగదంతరాత్మ! మానిత చరిత్ర !, భక్తజన మందిరాంగణ పారిజాత!

1073

తా ॥ ఎప్పుడైతే శ్రీకృష్ణుడావిధంగా పరమాత్మ తత్త్వాన్ని బోధించాడో గోపకాంతలప్పుడు ఆత్మజ్ఞానాన్ని పొంది శరీరాభిమానాన్ని, కోరికలు తెచ్చే బంధాలను వదిలివేశారు. భగవంతుణ్ణి శరణు పొందడమే జీవుల ధ్యేయమని భావించారు. కృష్ణుణ్ణి చూసి "సమస్త జీవరాశుల అంతరాత్మలలో వెలుగొందే పద్మనాభా! పవిత్రమైన చరిత్రతో శోభిల్లే కమలాక్షా! భక్తుల హృదయాల ప్రాంగణాలలో విరాజిల్లుతున్న కామిత ప్రదాయి అయిన కల్పవృక్షము వంటివాడా!" అని స్తుతించారు.

తే. ఘోరసంసార సాగరోత్తారణంబు, ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందు నీ చరణాంబుజాత, యుగళమును మా మనంబులఁ దగుల నీవె'

1074

తా ॥ "ఘోరమైన సంసార సాగరాన్ని దాటించేవి, మహాయోగుల హృదయాలలో

ధ్యానరూపాలుగా ప్రకాశించేవి అయిన నీ పాదపద్మాలను మా మనస్సులలో స్థిరంగా నిలిచే వరమియ్యి స్వామీ!" అని గోపకాంతలు కృష్ణ పరమాత్మను ప్రార్థించారు.

క. అని వేడినఁ గృష్ణుఁడు ముని, వినతుఁడు కరుణించి వల్లవీజనములు గో
రిన యట్ల యిచ్చెఁ గరుణా, వననిధి సద్భక్త లోకవత్సలుఁ డంతన్.

1075

తా ॥ భక్తవత్సలుడు, కరుణాసాగరుడు అయిన శ్రీకృష్ణుడు – ఏకాగ్రచిత్తంతో తనను ప్రార్థించిన గోపికల కోరికను తీర్చి, వారికి మోక్షప్రదాత అయ్యాడు. మహర్షులచేత పూజింపబడే ఆ పరమాత్ముడు మధుర భక్తితో కొలిచిన గోపికలను తరింప చేశాడు.

ఉ. ధర్మతనూభవుం గని పదంబులకున్ నతుఁడై సపర్యలన్
నిర్మలభక్తిమై నడపి 'నీవును దమ్ములు బంధుకోటి స
త్కర్మ చరిత్రులై తగు సుఖంబుల నొప్పుచు నున్న వారె' నా
నర్మిలిఁ బాండవాగ్రజుఁడు న మ్మధుసూదనుతోడ నిట్లనున్.

1076

తా ॥ భక్తపరాధీనుడైన శ్రీకృష్ణుడు తరువాత ధర్మరాజును చూసి ఆయన పాదాలకు నమస్కరించాడు. నిర్మలమైన భక్తితో, పెద్దవాడనే గౌరవంతో ధర్మజుడికి సకల సపర్యలు చేశాడు. "ధర్మరాజా! నీమా, నీ తమ్ముళ్ళూ, నీ బంధువులూ సత్కర్మలు నిర్వహిస్తూ చక్కగా సుఖంగా ఉన్నారా" అని కుశలప్రశ్నలు వేశాడు. కృష్ణుడి పరామర్శతో ప్రేమ ముప్పిరికొనగా ధర్మరాజు కృష్ణుణ్ణి చూసి ఇలా అన్నాడు:

క. సరసిజనాభ ! భవత్పద, సరసీరుహ మాశ్రయించు జను లతిసౌఖ్య స్ఫురణం
బొలుపారుచు భువిఁ, జరియింపరె! భక్త పారిజాత ! మురారీ !

1077

తా ॥ "కృష్ణా! మురాసుర సంహారీ! భక్తులపాలిటి కల్పవృక్షమా! పద్మనాభా! కమలాక్షా! నీ పాదపద్మాలను ఆశ్రయించుకొని ఉండే భక్తులెప్పుడూ సకల సౌఖ్యాలతో విలసిల్లుతుంటారు గదా!

వ. అదియునుం గాక

1078

తా ॥ అదీగాక, కృష్ణా! దయాసాగరా! వికార దూరా! జగన్నాథా! అంబుజాక్షా!

సీ. సుమహిత స్వప్న సుషుప్తి జాగరములన్ మూఁడవస్థలఁ బాసి వాఁడి మిగిలి
వెలి నుందు లో నుందు; విశ్వమై యుందువు;, విశ్వంబు నీయందు వెలుఁగుచుండు;
భవదీయ మహిమచేఁ బొటిల్లు భువనంబు, లుదయించు నొక వేళ నుడిగి మఁడుగు;
సచ్చిదానందసుజ్ఞానివై యొప్పుచు నవిహత యోగమాయాత్మఁ దనరి

తే. దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద, నలవియై పెంపు దీపింతు వంబుజాక్ష !
ఘనకృపాకర ! నఖిల వికారదూర!, నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ !

1079

తా ॥ మహితాత్మా! మానవమాత్రులకుండే స్వప్న, జాగృత్, సుషుప్తి (కలలో, మెలకువలో, నిద్రలో) అనే మూడవస్థలు నీకుండవు. బయటా నీవే ఉంటావు. లోపలా నీవే ఉంటావు. నీవే విశ్వమై ఉంటావు. ఈ సమస్త విశ్వం నీలోనే ప్రకాశిస్తుంటుంది. నీ మహిమవల్లే లోకాలన్నీ నడుస్తున్నాయి. నీ శక్తివల్లే సృష్టిస్థితి లయాలు జరుగుతున్నాయి. నీవు అఖండ జ్ఞానమూర్తివి. యోగమాయ ఎప్పుడూ నీ అధీనంలోనే ఉంటుంది. పాపరహితులు, నిత్యముక్తులు అయిన యోగీశ్వరులకు ఎప్పుడూ నీవు సులభసాధ్యుడవై, నీ దర్శనభాగ్యాన్ని ప్రసాదించి అలరారుతుంటావు. యోగీశ్వరేశ్వరుడవైన నీకు నమస్కరిస్తున్నాను."

క. అని వినుతించిన నచ్చటి, జనపాలక బంధుమిత్ర సకలజనములున్ విని యనురాగిల్లిరి నె, మ్మనముల నానంద జలధిమగ్నులు నగుచున్.

1080

తా ॥ అని ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి స్తుతించగా అక్కడ ఉన్న రాజులు, బంధువులు, మిత్రులు – అందరూ విని మనసులు ఆనందవార్ధిలో మునిగిపోతుండగా పరమానందభరితులైనారు.

తే. అట్టి యొప్పగువేళ నెయ్యంబు మెఱసి, యొక్కచోటను సంతోషయుక్తు లగుచు దానవాంతక సతులును ద్రౌపదియును, గూడి తమలోన ముచ్చట లాడుచుండి.

1081

తా ॥ అటువంటి మంచి సమయంలో శ్రీకృష్ణుని సతీమణులూ, ద్రౌపదీదేవి స్నేహంతో కలిసి మెలిసి ఒకచోట కూర్చొని సంతోషంతో కబుర్లాడుకొన్నారు.

## శ్రీకృష్ణుని అష్టమ భార్య లక్షణ ద్రౌపదీ దేవికి తన వివాహ వృత్తాంతము తెలుపుట

వ. అట్టియెడఁ గృష్ణ కథావిశేషంబులు పరితోషంబున నుగ్గడించుచుఁ బ్రసంగ వశంబున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణు భార్యలం గనుంగొని పాంచాలి యిట్లనియె. 'మిమ్ముఁ బుండరీకాక్షుండు వివాహం బయిన తెఱంగులు వినిపింపుఁడన వారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం జెప్పిన విధంబున వినిపించి; రందు సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజకన్యకా వృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పిన విధంబు విను మని శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

1082

తా ॥ ఆ సమయంలో ద్రౌపదీదేవి శ్రీకృష్ణుని లీలలు, మహిమల గురించి చెబుతూ, మాటలమధ్యలో రుక్మిణీదేవి మొదలైన కృష్ణపత్నులను చూసి "మిమ్మల్ని శ్రీకృష్ణుడు ఏయే విధంగా వివాహం చేసుకొన్నాడో చెప్పండి" అని అడిగింది. పరీక్షిత్తూ! మునుపు నీకు నేను చెప్పిన విధంగా, రుక్మిణీ మొదలైన కృష్ణకాంతలు వారివారి పరిణయ వృత్తాంతాలు ద్రౌపదికి సవిస్తరంగా వినిపించారు. ఒక్క లక్షణాదేవి వివాహవృత్తాంతం నేను సవిస్తరంగా నీకు చెప్పలేదు. మద్రరాజ పుత్రికయిన లక్షణ వివాహ కథ ద్రౌపదికి లక్షణ చెప్పిన విషయాన్ని ఇప్పుడు చెబుతాను విను" అని శుకమహర్షి పరీక్షిత్తుతో ఈ విధంగా చెప్పసాగాడు:

సీ. పాంచాలితో మద్రపతిసుత యిట్లను సంగీతవిద్యా విశారదుండు
నారదుచేతి వీణాస్వనకలిత మై నట్టి గోవింద కథామృతంబు
దవిలి యేఁగ్రోలి చిత్తము దన్మయత్వంబు నొంది మోదించుచు నుండునంత
దహితృవత్సలుఁడు మద్గురుఁడు దా నది విని సదుపాయ మొక్కటి మదిఁ దలంచి

తే. చదల నె బ్భంగి నైన గోచరము గాక, వారి మధ్యములో నభివ్యాప్తి దోఁచు

మత్స్యయంత్రంబు కల్పించి మనుజు లెంత, వారి కైనను దివ్వ మోవంగరాని.

1083

తా ॥ "లక్షణ ద్రౌపదిని చూసి "ద్రౌపదీ! నా వివాహ విషయం అడిగావు గదా! చెబుతాను విను. నారదమహర్షి విష్ణుకథలను తన వీణాగానం ద్వారా అమృతాన్ని చిందిస్తూ అందరికీ అందిస్తుండేవాడు. ఆ కృష్ణ కథామృతాన్ని పానం చేసి నేను తన్మయురాలినౌతుండేదానిని. శ్రీకృష్ణ లీలలు వింటే కలిగే నా సంతోషానికి అవధులుండేవికావు. నామీద అమితమైన వాత్సల్యంగల నా తండ్రి నా మనస్సును అర్థం చేసుకొన్నాడు. శ్రీకృష్ణుణ్ణి రప్పించడానికి ఒక ఉపాయం ఆలోచించాడు.

దానికి తగినట్లు ఆకాశంలో ఎవరికీ కనపడని విధంగా మత్స్యయంత్రాన్ని సృష్టించిపెట్టాడు. ఆ మత్స్యం క్రింద ఉన్న నీటిలో కనబడే విధంగా అమర్చాడు. మత్స్యంయొక్క ప్రతిబింబాన్ని చూస్తూ ఆకాశంలో ఉన్న మత్స్యాన్ని కొట్టి క్రిందపడవేయాలి. అదీ మద్రదేశాధిపతి ఏర్పాటు చేసిన వివాహపద్ధతి.

తే. ధనువుఁ బవిచండ నిష్ఠురాస్త్రంబు నచట, సంచితంబై న గంధపుష్పాక్షతలను బూజ గావించి యునిచి యే పురుషుఁడేని, నిద్ధబలమున నీ చాప మెక్కు వెట్టి.

1084

తా ॥ ఎంతటి మహావీరుడికైనా ఎక్కుపెట్టి పడగొట్టడానికి చేతగాని ధనుస్సును, వజ్రాయుధంలాగా బలిష్ఠమైన బాణాన్ని అక్కడ పెట్టి ఆ రెండింటినీ గంధంతో, పూలతో, అక్షతలతో పూజించి, నా తండ్రి అందరూ వినేటట్లు ఈ విధంగా చెప్పాడు:

క. ఈ సాయకంబు నారిం, బోసి వెసన్ మత్స్యయంత్రమున్ ధరఁగూలన్ వేసిన శౌర్యధురీణుఁడు, నాసుత వరియించు నని జనంబులు వినఁగన్.

1085

తా ॥ "ఏ మహావీరుడైతే తన బలశౌర్యాలు ప్రకటించి ఈ బాణాన్ని తీసుకొని ఆ వింటిలో ఎక్కుపెట్టి, వెంటనే, మత్స్య యంత్రాన్ని నేలమీద పడేటట్లు వేయగలుగుతాడో – ఆ మహావీరుడినే నా కుమార్తె వరిస్తుంది." అని కఠిన పరీక్ష పెట్టాడు.

క. చాటించిన న వ్వార్తకుఁ, బాటించి సంభ్రమములు బాణాసన మౌ
ర్వీ టంకార మహారవ, పాటితశాత్రవులు బాహుబల సామగ్రులై.

1086

తా ॥ నా తండ్రి వేయించిన చాటింపు విని వీరాధివీరులు, ధనుర్విద్యాకుశలురు, బాహుబలసంపన్నులు అయిన రాజకుమారులు ఎంతమందో మా నగరానికి బయలుదేరారు.

క. సుందరతనులు దదుత్సవ, సందర్శనకుతుకు లమిత సైన్యులు భూభృ
న్నందను లేతెంచిరి జన, నందితయశు లగుచు మద్రనగరంబునకున్.

1087

తా ॥ సౌందర్యోపేతులైన ఆ రాజకుమారులు స్వయంవరోత్సవాన్ని దర్శించాలనే కుతూహలంతో సైన్యసమేతులై, తమ యశస్సు దిగంతాలవరకు వ్యాపిస్తుండగా మద్రనగరాన్ని చేరుకొన్నారు.

క. చనుదెంచిన వారికి మ, జ్జనకుఁడు వివిధార్చనములు సమ్మతిఁ గావిం
చిన నా బాహుబలాఢ్యులు, ధనువుం జేరంగ నరిగి ధైర్యస్ఫూర్తిన్.

1088

తా ॥ ఆ విధంగా విజయకాముకులై, ఉత్సాహంగా వచ్చిన రాజకుమారులనందరినీ మా తండ్రి గౌరవ సత్కారాలతో పూజించి సకల సౌకర్యాలను ఏర్పాటు చేశాడు. బాహుబలంలో అధికులైన ఆ రాకుమారులు ధైర్యంతో ధనుస్సు దగ్గరకు నడిచారు.

వ. ఇట్లు డగ్గఱి యద్ధనువుం గనుంగొని.

1089

తా ॥ ఈ విధంగా ధనుస్సు దగ్గరకువెళ్ళి ఆ వింటిని తేరిపార చూశారు.

ఉ. కొందఱు పూనలేక చనఁ, గొందఱు పూని కదల్పలేక పోఁ, గొంద ఱొకింత యెత్త, నొక కొందఱు మోపిడలేక దక్కఁగాఁ, గొంద ఱొకింత యెక్కిడుచుఁ, గోరి నృపాలకు లిట్లు సిగ్గునుం జెంది తలంగి పోవుచును 'నీ యిట కేఁగుట నీతి త' ప్పనన్.

1090

తా ॥ అప్పుడా వీరులలో కొంత మంది ధనుస్సు ఎత్తడానికే ప్రయత్నించలేదు. అంత శక్తిమంతంగా ఉన్న ధనుస్సును మరికొంత మంది ఎత్తడానికి ప్రయత్నించి, కొంచెం కూడా దానిని కదిలించలేకపోయారు. ఇంకొంతమంది విల్లును కొద్దిగా పైకెత్తగలిగారు. వేరేకొంత మంది వీరులు విల్లు ఎత్తారేగాని ఎక్కుపెట్టలేకపోయారు. మరికొంతమంది విల్లు కొద్దిగా ఎక్కుపెట్టి బాణం సంధించలేకపోయారు. ఇంకొంతమంది విల్లును కొద్దిగా పైకెత్తగలిగారు. "అసలు ఇక్కడకురావటమే తప్పయింది. వచ్చి అపజయం పాలైనామ" ని సిగ్గుపడి అక్కడనుంచి తొలగి ఇళ్ళకు వెళ్ళిపోయారు.

వ. అట్టియెడ.

1091

తా ॥ ఆ విధంగా వివిధదేశాల రాజకుమారులు ఏమీచేయలేక తిరిగివెళ్ళిపోవడంతో—

క. భీముఁడు రాధేయుఁడు ను, ద్దామగతి న్నెక్కు డ్రోఁచి తగ నమ్మీనం బేమఱక దిరుగుచుంటయుఁ, దా మేమియు నెఱుఁగలేక తలఁగిన పిదపన్.

1092

తా ॥ భీముడు ధనుస్సు చెంతకు వచ్చి తన బలంతో ఆ వింటిని చక్కగా ఎక్కుపెట్టాడు. కాని క్షణం ఆగకుండా గిరగిరాతిరుగుతున్న మత్స్యాన్ని గుర్తించి కొట్టలేక యథాస్థానానికి వెళ్ళి కూర్చున్నాడు. కర్ణుడు కూడా అదే విధంగా మత్స్యయంత్రాన్ని పడగొడతానని భావించి, ధనుస్సు ఎక్కుపెట్టికూడా మత్స్యం క్రింద పడేటట్లు కొట్టలేక వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

క. అమరేంద్ర తనయుఁడ మ్మ, త్స్యము నేయ నుపాయ మెఱిఁగి తగ నేసియు మీ
నము ద్రుంపలేక సిగ్గున, విముఖుండై చనియె నంత వికలుం డగుచున్.

1093

తా ॥ అప్పుడు అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించటానికి విల్లు దగ్గరకు వెళ్ళాడు. ఆ వీరుడు మత్స్యయంత్రాన్ని పడగొట్టగల ఉపాయం తెలిసిన సమర్థుడే. ద్రౌపదీ! ఎందుకో తెలియదుగాని, ఆ మత్స్యాన్ని త్రుంచలేక సిగ్గుతో, బాధతో తలదించుకొని వెళ్ళిపోయాడు.

వ. ఇట్లు సకల రాజకుమారులుం దమతమ ప్రయత్నంబులు విఫలంబులైన ముఖారవిందంబులు ముకుళించి దైన్యంబున విన్ననై చూచుచున్న యెడ.

1094

తా ॥ ఈ విధంగా రాజకుమారులందరూ తమతమ ప్రయత్నాలు విఫలం కావడంతో దీనులై, తలలు దించుకొని, ఏం జరుగుతుందో చూద్దామని కూర్చుండిపోయారు.

చ. సరసిజ పత్త్రలోచనుఁడు చాపము సజ్యము సేసి యుల్లస
చ్ఛర మరిఁబోసి కార్ముకవిశారదుఁడై యలవోక వోలె ఖే
చర మగు మీనముం దునిమె సత్వరతన్ సురసిద్ధ సాధ్య ఖే
చరజయశబ్ద మొప్పఁ బెలుచం గురిసెం దివిఁ బుష్పవర్షముల్.

1095

తా ॥ అప్పుడు శ్రీకృష్ణుడు లేచి ధనుస్సు దగ్గరకు వెళ్ళాడు. ఉత్సాహంతో ధనుస్సును ఎక్కుపెట్టి తన ధనుర్విద్యానైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ, సునాయాసంగా, ఆకాశంలో ఉన్న మీనాన్ని నీటిలో చూస్తూ బాణాన్ని సంధించాడు. శ్రీకృష్ణుడు ప్రయోగించిన బాణం ధాటికి మత్స్యయంత్రంలోని మీనం క్రింద పడిపోయింది. మత్స్యయంత్రాన్ని ఛేదించిన శ్రీకృష్ణుణ్ణి చూసి దేవతలు, సిద్ధులు, సాధ్యులు జయజయధ్వానాలు చేశారు. శ్రీకృష్ణుని విజయానికి అతనిపై దివినుండి పుష్పవర్షం కురిసింది.

వ. అ య్యవసరంబున నేనుం బరితుష్టాంతరంగనై పరమానందవికచ వదనారవింద నగుచు, నిందిందిర సన్నిభంబులగు చికురబృందంబులు విలసదలిక ఫలకంబునం దళుకు లొలుకు ఘర్మజల కణంబులం గరంగు మృగమద తిలకంపు టసలున మసలుకొనినం గరకిసలయంబున నోసరించుచు మిసమిస మను మెరుంగుగములు గిఱికొన నెఱిగౌను వడవడ వడంక నప్పుడు మందగమనంబున.

1096

తా ॥ ద్రౌపదీ! అది చూసి నేను కూడా పరమానంద భరితురాలినయ్యాను. తుమ్మెదల రెక్కలవలె నిగనిగలాడుతున్న నా ముంగురులు, నుదుటిపై మెరుస్తున్న స్వేదబిందువుల వల్ల కరిగిపోయిన కస్తూరీ తిలకంలో చిక్కుకుపోయాయి. చిగుళ్ళవంటి సుకుమారమైన చేతులతో ముంగురులను ప్రక్కకుతోస్తూ, సన్నని నడుము వడవడ వణుకుతుండగా మెల్లగా నడుస్తూ శ్రీకృష్ణుణ్ణి సమీపించాను.

చ. లలితపదాబ్జ నూపురకలధ్వనితో దరహాస చంద్రికా
కలిత కపోలపాలికలఁ గప్పు సువర్ణవినూత్న రత్న కుం
డల రుచు లొప్పఁ గంకణఝుణంకృతు లింపెనలార రంగ భూ
తలమున కేగుదెంచి ముఖతామరసం బపుడెత్తి చూచుచున్.

1097

తా ॥ కాలి అందెల మనోహరమైన చిరుసవ్వడులతో, చిరునవ్వుల వెన్నెలలు చిందులాడుతుండగా, రత్నాలు పొదిగిన బంగారు చెవి కుండలాల కాంతి చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తుండగా, చేతికంకణాల ఝణఝణ నాదాలు వీనులవిందు చేస్తుండగా, వేదికపై నుంచి క్రిందకు దిగి ముఖమెత్తి స్వయంవర మంటపమంతా కలయచూశాను.

చ. నరపతులం గనుంగొని మనంబున వారిఁ దృణీకరించి మ
త్కరజలజాత దివ్యమణి కాంచనమాలిక న మ్మురారి కం
ధరమున లీలమై నిడి పదంపడి నవ్య మధూకదామ మా
హరికబరిం దగిల్చితి నయంబునఁ గన్నుల లజ్జ దేఱఁగన్.

1098

తా ॥ అక్కడ ఎందరో రాకుమారులున్నారు. వారందరినీ తృణీకరించి, నా చేతిలో ఉన్న మణిమయ సువర్ణపద్మమాలను విలాసంగా శ్రీకృష్ణుని మెడలో వేశాను. ఆ తరువాత ఇప్పపూలమాలను కృష్ణుడి కేశపాశంలో తురిమాను. ఆ సమయంలో నన్ను సిగ్గు ఆవహించి, కనురెప్పలు వాలిపోయాయి.

వ. అప్పుడు.

1099

తా ॥ ఆ శుభవేళలో—

చ. కొలఁదికి మీఱఁగా దమరు గోముఖ డిండిమ మడ్డు శంఖ కా
హళ మురళీ మృదంగ పణ వానక దుందుభిఢక్క కాంస్య మ
ర్దళ మురజారవాది వివిధధ్వను లేపున భూనభోంతరం
బులఁ జెలఁగెన్ నటీనటనముల్ దనరారె మనోహరాకృతిన్.

1100

తా ॥ శంఖకాహళ మురళీ మృదంగాది అనేక మంగళవాద్యాల ధ్వనులు నింగీనేలా అంతా నిండిపోయాయి. నర్తకీ మణుల మనోహర నృత్యాలు అందరికీ కనువిందు చేశాయి.

వ. అంత.

1101

తా ॥ అప్పుడు—

చ. అమరగణంబుఁ దోలి యురగారి సుధాకలశంబుఁ గొన్న చం
దమున సమస్తశత్రువసుధావర కోటిఁ దృణీకరించి య
క్కమల విలోచనుండు ననుఁ గౌఁగిట నొప్పుఁగ జేర్చి సింహ చం
క్రమణ మెలర్పఁ జనెఁ గాంచనచారు రథంబుమీఁదికిన్.

1102

తా ॥ కమలాక్షుడైన శ్రీకృష్ణుడు — దేవతలనందరినీ పారద్రోలి గరుత్మంతుడు అమృతభాండాన్ని తెచ్చిన విధంగా — సమస్త రాజసమూహాన్ని తృణీకరించినవాడై నా చెంతకు వచ్చి నన్ను కౌగిలిలో చేర్చుకొని, సింహం నడిచే విధంగా నడుస్తూ నన్ను తీసుకొని తన బంగారు రథం దగ్గరకు తీసుకువెళ్ళాడు.

వ. అట్లు రథారోహణంబు సేసిన.

1103

తా ॥ నన్ను రథమెక్కించి, తానూ రథమెక్కాడు.

చ. తురగచతుష్కమున్ విమతదుర్దమశూరతఁ బూన్చి దారుకుం
డరదము రొప్ప శత్రునికరాంధతమః పటల ప్రచండ భా
స్కరరుచి నొప్పునట్టి నిజకార్ముక యుక్తగుణ ప్రఘోష సం

భరిత దిగంతరుం డగుచుఁ బద్మదళాక్షుడు వోవుచుండఁగన్ !

1104

తా ॥ శత్రుసంహారం చేయగల నాలుగు గుఱ్ఱాలతో కట్టబడి ఉన్న రథాన్ని సారథి అయిన దారుకుడు వెంటనే ముందుకు తోలాడు. శత్రుసమూహమనే అంధకారాన్ని పారద్రోలే ప్రచండ సూర్యకాంతిలా ఒప్పారుతూ తన ధనుష్టంకారంతో శ్రీకృష్ణుడు రథంమీద ప్రయాణం సాగించాడు.

వ. అట్టియెడ సకలరాజ లోకంబును గృష్ణుని విభవంబునకుం జూపోపక యసంఖ్యంబులగు మూఁకలు గట్టి య మ్మహాత్ముని మాహాత్మ్యంబు దెలియక దర్పాంధులై కడంగి

1105

తా ॥ కృష్ణుడు ఆ విధంగా తన నగరానికి వెళ్ళిపోతుంటే స్వయంవరానికి వచ్చిన రాజులందరూ ఈర్ష్యాగ్రస్తులై, అసంఖ్యాకమైన సైన్యాలను సమకూర్చుకొని గుంపులు గుంపులుగా శ్రీకృష్ణుడిపైకి యుద్ధానికి సిద్ధమయ్యారు. పరమాత్ముడైన శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్ని తెలుసుకోలేక గర్వంతో ముందుకు దూకారు.

ఉ. భావభవ ప్రసూన శరబాధిత మానసులై సమస్త ధా<br>
త్రీవరనందనుల్ బలువుఁ దెంపును బెంపును సొంపు నేర్పడన్<br>
దేవకిరీటరత్న రుచిదీపిత పాదసరోజుఁడైన రా<br>
జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖల వృత్తి నతిప్రయత్నులై.

1106

తా ॥ మన్మథుని పుష్పబాణాల తాకిడితో రాజకుమారులందరు బాధా తప్త హృదయులైనారు. తమను వరించవలసిన లక్షణ శ్రీకృష్ణుణ్ణి వరించిందని కోపోద్రిక్తులైనారు.

దేవతల కిరీటాలలో ఉన్న రత్నకాంతులతో ప్రకాశించే పాదపద్మాలుగల శ్రీకృష్ణుణ్ణి, శౌర్యప్రతాపాలతో, ధైర్యసాహసాలతో గర్వించి ఆ రాకుమారులు ఎదిరించి పోరుకు దిగారు.

వ. అంత.

1107

తా ॥ అప్పుడు—

చ. సరసిజలోచనుండు నిజశార్ఙ్గశరాసనముక్త హేమ పుం
ఖ రుచిర శాతసాయక నికాయమునన్ రిపుకోటి నేసి సిం
ధురరిపు విక్రమ ప్రకట దోర్బలుఁడై విలసిల్లి యొత్తె దు
స్తర చలితాన్యసైన్యమును సజ్జనమాన్యముఁ బాంచజన్యమున్.

1108

తా ॥ కృష్ణుడు తన శార ్గ మనే ధనుస్సు నుండి పుంఖాను పుంఖాలుగా శత్రువులమీద వాడి బాణాలు ప్రయోగించాడు. సింహపరాక్రమంతో విజృంభించి శత్రుసైన్యాన్ని భయపెట్టేది, సజ్జనులచేత స్తుతించబడేది అయిన తన పాంచజన్య శంఖాన్ని గట్టిగా పూరించాడు.

ఉ. ఆ తఱి భూరిబాహుబలులైన విరోధి నరేశ్వరుల్ మృగ
వ్రాతము లొక్కపెట్ట మృగరాజ కిశోరముపై నెదిర్చి న
ట్లాతురులై చతుర్విధ సమగ్ర బలంబులతోడఁ గూడి ని
ర్ధూత కళంకుఁడైన నవతోయజనేత్రునిఁ జుట్టు ముట్టినన్.

1109

తా ॥ ఆ సమయంలో బలశాలురైన శత్రురాజులు చతురంగబలాలను సమకూర్చుకొని; జంతుసమూహం ఒక్కసారిగా సింహంపైకి ఉరికే విధంగా శ్రీకృష్ణుణ్ణి చుట్టుముట్టారు.

చ. అలిగి మురాంతకుండు కులిశాభశరంబుల నూత్నరత్న కుం
డలములతో శిరంబులు, రణన్మణినూపురరాజితోఁ బదం
బులుఁ, గటకాంగులీయక విభూషణచాప శరాలితోడఁ జే
తులు, నిలఁగూలఁగా విజయదోహలియై తునుమాడె వెండియున్.

1110

తా ॥ తనను చుట్టుముట్టిన రాజులను చూసి శ్రీకృష్ణుడు ఆగ్రహోదగ్రుడైనాడు. వెంటనే వజ్రాయుధ సమానాలైన, తీవ్రబాణాలతో వారిని వధించాడు. శ్రీకృష్ణుని పరాక్రమానికి రత్నకుండలాలతో ప్రకాశిస్తున్న శత్రురాజుల శిరస్సులు; మణినూపురాలతో సవ్వడి చేస్తున్న వారిపాదాలు; కంకణాలు, ఉంగరాలు, ధనుర్బాణాలతో నిండుగా ఉన్నవారి చేతులు ఒక్కదెబ్బతో నేలకూలిపోయినాయి. శ్రీకృష్ణుడు విజయోత్సాహంతో ఇంకా శత్రుసంహారం చేస్తూనే ఉన్నాడు.

క. హతశేషులు సొక్కాకుల, గతిఁ దూల నిశాతపవనకాండముల సము
ద్ధతి నేసి తోలి విజయో, న్నతుఁడై నిజనగరి కేగె నగధరుఁ డంతన్.

1111

తా ॥ చనిపోగా, మిగిలిన యోధులు పెనుగాలిగి ఎగిరి దూరంగా పడిపోయే ఆకులలాగా శ్రీకృష్ణుడు ప్రయోగించిన వాయవ్యాస్త్రానికి అక్కడ నిలవలేక దూరదూరంగా పారిపోయారు. ద్రౌపదీ! శ్రీకృష్ణుడు ఈ విధంగా విజయాన్ని చేపట్టి, నన్ను తీసుకొని ద్వారకా నగరం చేరాడు.

వ. అట్లు మహిత మంగళాలకృతంబును, నతిమనోహర విభవాభిరామంబు నగు ద్వారకా నగరంబున కరుగుదెంచిన మజ్జనకుండును బ్రియంబునఁ దోడన చనుదెంచి.

1112

తా ॥ ఆ విధంగా – శుభచిహ్నాలతో అలంకరింపబడినది, మహావైభవంతో

మనోహరంగా అలరారుతున్నది అయిన ద్వారకా నగరంలోకి ప్రవేశించాం. మా తండ్రి అయిన మద్రదేశాధిపతి కూడా మా మీది ప్రేమతో మాతో పాటు మా వెంట ద్వారకకు వచ్చాడు.

ౘ. రణిత వినూత్న రత్న రుచిరస్ఫుట నూపుర హార కర్ణ భూ
షణ కటకాంగుళీయక లసత్పరిధాన కిరీట తల్ప వా
రణ రథవాజి హేతినికరంబులనుం బరిచారికాతతిన్
బ్రణుతగుణోత్తరుం డునవ పద్మదళాక్షున కిచ్చె నెమ్మితోన్.

1113

తా ॥ మా తండ్రి అయిన బృహత్సేనుడు, ద్వారకానగరానికి వచ్చి, రత్నాలతో పొదగబడి కాంతులను వెదజల్లుతున్న కాలి అందెలను, వివిధ మణిమయహారాలను, కర్ణభూషణాలను, కంకణాలను, ఉంగరాలను, నూతన వస్త్రాలను, కిరీటాన్ని, పాన్పును, రథగజతురగాలను, ఖడ్గాది ఆయుధాలను, సహస్ర సంఖ్యలో ఉన్న పరిచారికా సమూహాన్ని, సద్గుణ ఖని అయిన అల్లుడికి కానుకలుగా సమర్పించాడు.

వ. ఇట్లు మహనీయతేజోనిధియైన మాధవు దయాపరిలబ్ధనిఖీల వస్తు విస్తారుం డయ్యును, నిజాధికార శుద్ధికొరకు మరలఁ గన్యారత్నంబును, వినూత్న రత్నవ్రాతంబును సమర్పించె; నని భూసుర విసరంబులు వినుతింప మా తండ్రియైన బృహత్సేనుండు నన్నును సమస్త వస్తువులను గృష్ణునకు సమర్పించి, క్రమంబున సకల యాదవులనుం బూజించి మరలి నిజపురంబునకుం జనియె' నని చెప్పినఁ గుంతియు గాంధారియుఁ గృష్ణయు, నఖీల నృపాల కాంతాజనంబులును, గోపికలుం దమతమ మనంబుల సర్వభూతాంతర్యామియు, లీలామానుష విగ్రహుండును నైన పుండరీకాక్షు చరణారవింద స్మరణానంద పరవశలై కృష్ణుం బ్రశంసించి రంత.

1114

తా ॥ మా తండ్రికి సమస్త సంపదలు తేజోనిధి అయిన శ్రీకృష్ణుని కరుణ వల్లనే లభించాయి. అయినా మామగారిగా, సంప్రదాయానుసారిగా తన పుత్రికారత్నాన్ని మణిమయ భూషణాదులను అల్లుడికి ప్రేమతో ఇచ్చాడు. యాదవనాథులనందరినీ సత్కరించి తన నగరానికి వెళ్ళిపోయాడు" అని లక్షణ చెప్పిన విషయాలన్నీ విని కుంతీదేవి, గాంధారి, ద్రౌపది, సమస్తరాజకాంతలు, గోపికలు వారివారి మనస్సులలో లీలామానుష విగ్రహుడు, సర్వభూతాంతర్యామి అయిన శ్రీకృష్ణుని పాదపద్మాలను తలచుకొని సంతోషపారవశ్యంలో మునిగి ఆ పరమాత్మ్ముణ్ణి ప్రశంసించి తరించారు.

## నారదాది ఋషులు శ్రీకృష్ణ దర్శనము చేసుకొని వసుదేవునిచే క్రతువు చేయించుట

చ. బలవదరాతిమర్దనులఁ బాండురనీలనిభ ప్రభాంగులన్
గలిత నిజాననాంబుజ వికాస జితాంచిత పూర్ణచంద్ర మం
డలులఁ బరేశులన్ నరవిడంబనులన్ గరుణాపయోధులన్
విలసదలంకరిష్ణుల నవీనసహిష్ణుల రామకృష్ణులన్.

1115

తా ॥ బలవంతులైన శత్రువులను సంహరించేవారు, ధవళ వర్ణంతో ఒకరు, నీలవర్ణంతో మరొకరు ప్రకాశిస్తున్నవారు, పున్నమినాటి చంద్రమండలం అందచందాలను జయించే ముఖకాంతితో వెలిగిపోతున్నవారు, పరమాత్ములైనవారు, మానవరూపంలో మహిమలు వెలార్చేవారు, కరుణాసముద్రులు, నిత్యనూతనాలంకార ప్రియులు, సహనమూర్తులు అయిన బలరామ శ్రీకృష్ణులను—

వ. సందర్శించు తలంపుల నందఱుఁ దమ హృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిగొన నప్పుడు.

1116

తా ॥ సందర్శించాలనే ఉద్దేశంతో మహర్షి సత్తములందరూ తమ హృదయాలలో ప్రేమ నింపుకొని—

ఉ. ధీరమతిన్ ద్వితత్రితక దేవల సాత్యవతేయ కణ్వులున్
నారద గౌతమ చ్యవన నాకుజ గార్గ్య వసిష్ఠ గాల వాం
గీరస కశ్య పాసిత సుకీర్తి మృకండుజ కుంభసంభ వాం
గీరులు యాజ్ఞవల్క్య మృగశృంగముఖాఖిల తాపసోత్తముల్.

1117

తా ॥ దేవలుడు, ద్వితుడు, త్రితుడు, వ్యాసుడు, కణ్వుడు, నారదుడు, గౌతముడు, చ్యవనుడు, గార్గ్యుడు, వసిష్ఠుడు, కాలవుడు, అంగీరసుడు, కశ్యపుడు, అసితుడు, సుకీర్తి, మార్కండేయుడు, అగస్త్యుడు, అంగీరుడు, యాజ్ఞవల్క్యుడు, ఋష్యశృంగుడు మొదలైన తాపసోత్తములందరూ ద్వారకా నగరానికి వచ్చారు.

వ. చనుదెంచినం గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి వందనంబు లాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె.

1118

తా ॥ తన సందర్శనార్థం వచ్చిన మహర్షులనందరినీ చూసి లేచి, ఎదురేగి, నమస్కరించి, శ్రీకృష్ణుడు వారికి సకల సపర్యలు చేసాడు. పూజించి, వారినందరిని చూస్తూ ఈ విధంగా అన్నాడు:

సీ. 'సన్మునీశ్వరులార! జన్మభాక్కులమైన మాకు నిచ్చోట సమ్మతిని దేవ
నికరదృష్టాత్ములు నిరుపమ యోగీంద్రు లైన మీ దర్శనం బబ్బెఁ గాదె
ధృతి మందభాగ్యు లింద్రియ పరతంత్రులు నైన మూఢాత్ముల కనఘులార !
భవదీయ దర్శన స్పర్శన చింతన పాదార్చనలు దుర్లభంబు లయ్యు

తే. నేఁడు మాకిట సులభమై నెగడెఁ గాదె !, జగతిపైఁ దీర్ఘభూతులు సాధుమతులు మిమ్ము
దర్శించుటయు చాలు నెమ్మితోడ, వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల ?

1119

తా ॥ "మహామునులారా! జన్మజన్మలెత్తవలసిన మానవులం మేము. దేవతలకే లభించరాని మహాత్ములైన మీ దర్శనం మాకు లభించింది. మీరు యోగీంద్రులు.

అదృష్టహీనులకు, ఇంద్రియ సుఖాల కోసం అర్రులు చాచేవారికి, పరమ మూర్ఖులకు మహానుభావులైన మీ దర్శనం, స్పర్శనం, ఆలోచనం, పాదసేవ ఎన్ని జన్మలెత్తినా లభించవు. అటువంటిది, మా పుణ్యమేమోగాని మీ దర్శనభాగ్యం అయాచితంగా, సులభంగా, మాకు దక్కింది. మీ వంటి సాధుపుంగవులు పుణ్యతీర్థాల వంటి పవిత్రమూర్తులు. మీ వంటి మహనీయుల్ని దర్శిస్తేనే చాలు వేరే పుణ్యతీర్థాలు ఎక్కడ ఉన్నాయో అని వెదకటం ఎందుకు?

వ. అదియునుం గాక యుదక మయంబులైన తీర్థంబులును మృచ్ఛి లామయంబులైన దేవగణంబులును, దీర్ఘదేవతారూపంబులు గాకుండుట లే; దయిన నని చిరకాల సేవనార్చనలం గాని పావనంబు సేయవు; సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబుసేయుదురని వెండియు.

1120

తా ॥ అంతేకాదు మునీంద్రులారా! నీటితో కూడిన పవిత్ర తీర్థాలుగాని; రాతితో, మట్టితో నిర్మించబడిన దేవతా మూర్తులుగాని ఎంతోకాలం పూజిస్తేగాని, మరెంతో కాలం సేవిస్తేగాని మమ్మల్ని పవిత్రం చేయవు. పుణ్యరూపులైన సత్పురుషులు తమ దర్శనం చేతనే మానవుల్ని పవిత్రుల్ని చేస్తారు. పాపరహితుల్ని చేస్తారు.

సీ. ఆదిత్య చంద్రాగ్ని మేదినీ తారాంబు మారుతాకాశ వాఙ్మనము లోలిఁ
బరికింపఁ దత్త దుపాసనంబులఁ బూనితపముల సేయఁగ సమర్థములు గావు;
సకలార్థగోచరజ్ఞానంబు గల మహాత్మకులు దారు ముహూర్త మాత్రసేవఁ
జేసి పావనములు సేయుదు; రదియు న ట్లుండె ధాతుత్రయ యుక్తమైన

తే. కాయమం దాత్మబుద్ధియుఁ గామినీ కు, మారులందు స్వకీయాభిమానములును దివిరి
జలమునఁ దీర్థబుద్ధియును జేయు, నట్టి మూఢుండు పశుమార్గుఁ డనంగఁ బరఁగు.

1121

తా ॥ పరమపావనులారా! సూర్యచంద్రులు, నక్షత్రాలు, పంచభూతాలు మున్నగునవి – ఎంత సేవించినా పవిత్రులను చేయడానికి అవి సమర్థవంతాలు కావు. సమస్తాన్ని దర్శించగల ప్రజ్ఞానవంతులైన మీ వంటి మహాత్ములు ఒక ముహూర్తకాలంలోనే మానవులను పవిత్రులుగా చేయగలరు. ధాతుత్రయమైన వాతము, పిత్తము, శ్లేష్మములతో నిండి ఉండే శరీరాన్ని ఆత్మగా భావించేవారు; భార్యాబిడ్డలే తమ సర్వస్వమని తలపోసేవారు; మామూలు నీళ్ళను తీర్థజలంగా, పవిత్రంగా ఎంచుకొనేవారు మూర్ఖులుగా చెప్పబడతారు. ఆత్మజ్ఞానాన్ని తెలుసుకోలేనివాడు, పరమాత్మ మీద దృష్టి నిలుపనివాడు పశువుతో సమానమనే భావించాలి.”

వ. అని యి వ్విధంబునం గృష్ణుం డాడిన సాభిప్రాయంబులగు వాక్యంబులు విని. య మ్మునీంద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి, ముహూర్తమాత్రంబున కమ్మహాత్మ ననుగ్రహంబు వడసి, మందస్మితముఖులై, య ప్పుండరీకాక్షున కి ట్లనిరి; ‘దేవా! నేమును దత్త్వవిదుత్తము లయిన బ్రహ్మరుద్రాదులును, భవదీయ మాయావిమోహితులమై యుందుము; నిగూఢంబయిన నీ యిచ్ఛచేత మమ్ము ననుగ్రహించితివి. భవదీయ చరిత్రంబులు విచిత్రంబు; లి మ్మేదిని యొక్కటి యయ్యును బహురూపంబులఁ గానంబడు విధంబున నీవును మొదలఁ గారణరూపంబున నేకం బయ్యును ననేక రూపంబులు గైకొని, జగదుత్పత్తి స్థితి లయంబులకు హేతుభూతంబునా నద్భుతకర్మంబులం దగిలి, లీలావతారంబులు గైకొని, దుష్టజన నిగ్రహంబును, శిష్టజన రక్షణంబును గావించుచుందు; వదియునుం గాక వర్ణాశ్రమధర్మంబు లంగీకరించి, పురుషరూపంబున వేదమార్గంబు విదితంబు సేసిన బ్రహ్మరూపివి; తపస్స్వాధ్యాయ నియమంబులచేత నీ హృదయంబు పరిశుద్ధంబు; గావున బ్రహ్మస్వరూపంబులైన వేదంబులందు వ్యక్తావ్యక్త స్వరూపంబు లేర్పడఁగా నుందువు; కావున బ్రాహ్మణ కులంబునెల్ల బ్రహ్మకులాగ్రణివై రక్షించిన మహానుభావుండవు; మాయాజవనికాంతరితుండవైన నిన్నును నీ భూపాలవర్గంబును, నేమును దర్శింపంగంటిమి; మా జన్మ విద్యా తపో మహిమలు సఫలంబు లయ్యె; నీకు నమస్కరించెద’ మని బహువిధంబులఁ గృష్ణు నభినందించి, యమ్మురాంతకుచేత

నామంత్రణంబులు వడసి తమ తమ నివాసంబులకుం బోవం దలంచు నవసరంబున.

1122

తా ॥ అభిప్రాయపూర్వకంగా, భావగర్భితంగా, అర్థయుక్తంగా శ్రీకృష్ణుడు పలికిన మాటలు విని ఆ మహర్షి సత్తములంతా భ్రాంతితో మౌనం వహించారు. కృష్ణపరమాత్మ అనుగ్రహంతో, క్షణకాలంలో తేరుకొని, వికసించిన ముఖాలతో ఆ కమలాక్షుణ్ణి చూసి ఈ విధంగా అన్నారు: "దేవ దేవా! మేము, భగవత్ తత్త్వాన్ని తెలుసుకొన్న బ్రహ్మరుద్రాదులు నీ మాయకు అధీనులమై ఉన్నాము. మమ్మల్నందరినీ అతి నిగూఢమైన నీ వాత్సల్యంతో కూడిన ఇచ్ఛచేత కరుణించావు. పరమాత్మా! నీ చరిత్రలు చాలా విచిత్రంగా ఉంటాయి. ఈ భూమి ఉందే – అది ఒక్కటే అయినప్పటికీ అనేకచోట్ల అనేక విధాలుగా కనిపిస్తుంది. అదే విధంగా నీవు కూడా మొట్టమొదట ఏకస్వరూపుడవైనా, తరవాత తరవాత అనేక రూపాలతో దర్శనమిస్తున్నావు. ఈ సమస్త విశ్వం యొక్క సృష్టికి, స్థితికి, లయానికి నీవే హేతువై అద్భుతకర్మలు చేస్తుంటావు. విశ్వవ్యవహారమంతా నీ లీల. రకరకాల అవతారాలుగా ఉద్భవిస్తావు. దుష్టులను శిక్షించి సజ్జనులను సంరక్షిస్తావు. అంతేకాదు, వర్ణాశ్రమ ధర్మాలను అంగీకరించి వేదవిధానాన్ని అందరికీ తెలియజేసిన బ్రహ్మస్వరూపుడివి. జపతపాల విధానాలచేత, వేదాధ్యయనంచేత – వాటిలోని నియమ నిష్ఠలను పాటించటం చేత నీ హృదయం పరిశుద్ధంగా శోభిస్తోంది. పరబ్రహ్మ స్వరూపాలైన వేదాలలో వ్యక్తమయ్యేరూపంలోనూ, అవ్యక్తంగా ఉండే రూపంలోనూ – రెండింటి యందు ప్రకాశిస్తుంటావు. బ్రహ్మకులానికి అగ్రేసరుడవై బ్రాహ్మణకులాన్ని – వేదాధ్యయన సంపన్నులను రక్షించిన మహానుభావుడవు నీవు. 'మాయ' అనే తెరవెనుక ఉండే నిన్ను మేము, ఈ రాజులు చూడగలిగాం. మా యొక్క పుట్టుక, చదువు, తపస్సు అన్నీ సఫలమైనాయి. దేవా! శ్రీకృష్ణా! నీకు మా నమస్కారాలు." అని మహర్షులందరూ శ్రీకృష్ణుణ్ణి స్తుతించి, అభినందించి ఆ మహాత్ముని చేత అనుమతి పొందినవారై తమ తమ నివాసాలకు వెళ్ళడానికి బయలుదేరారు. అప్పుడు–

సీ. అ మ్మునీశ్వరులకు నానకదుందుభి యతిభక్తి వందనం బాచరించి
'తాపసోత్తమూలార ! ధర్మతత్త్వజ్ఞులు మన్నించి వినుఁడు మా విన్నపంబు
సత్కర్మ వితతిచే సంచితకర్మచయంబు వాపెడు నుపాయంబు నాకు
ఘన దయామతిఁ జెప్పుఁ' డనిన నమ్మునివరుల్ భూవరుల్ విన వసుదేవుఁ జూచి

తే. యెలమిఁ బలికిరి నిఖిల యజ్ఞేశుఁడైన, కమలలోచనుఁ గూర్చి యాగములు సేయు;
కర్మమునఁ బాయు నెట్టి దుష్కర్మమైన; నిదియె ధర్మంబు గాఁగ నీ మదిఁ దలంపు.

1123

తా ॥ వసుదేవుడు ఆ మునీశ్వరులకు పరమ భక్తితో నమస్కరించి ఈ విధంగా విన్నవించాడు: "ఓ మహర్షులారా! మీరందరూ సమస్త ధర్మాలను తెలిసినవారు, కృపామతులు. గతజన్మల నుండి వచ్చిన పాపకర్మలను పోగొట్టగలిగే సత్కర్మలేవో ఆనతీయండి. వాటిని ఆచరించి తరిస్తాను." దానికి మునీశ్వరులు అక్కడ ఉన్న రాజులందరూ వినేటట్లు వసుదేవుణ్ణి చూసి ఇలా అన్నారు: "వసుదేవా! విష్ణుమూర్తిని గూర్చి యజ్ఞాలు కనుక చేస్తే సమస్త పాపాలు నశిస్తాయి. నీవు ఆచరించవలసిన ధర్మం ఇదే సుమా! శ్రీకృష్ణుడు యజ్ఞాలకన్నింటికీ అధీశ్వరుడు. కాబట్టి ఆ పని చేయి.

వ. అదియునుం గాక.

1124

తా ॥ అంతేకాదు.

క. దేవర్షి పితృఋణంబులు, భూవర ! మఖవేదపారపుత్రులచేతన్ వావిరి నీఁగని పురుషుఁడు, పోవు నధోలోకమునకుఁ బుణ్యచ్యుతుఁడై.

1125

తా ॥ యజ్ఞాలు చేసి దేవతల ఋణాన్ని తీర్చాలి. వేదాలు చదివి ఋషి ఋణాన్ని తీర్చాలి. అలాగే పుత్రుల వలన పితృఋణం తీర్చాలి. ఆ మూడు ఋణాలు తీర్చకపోతే మానవుడు అధోలోకానికి వెళ్ళవలసి ఉంటుంది. అంతవరకు చేసుకొన్న పుణ్యం కూడా హరించుకుపోతుంది.

వ. అట్లగుటం జేసి నీవును.

1126

తా ॥ అందుచేత—

క. వరతనయాధ్యయనంబులఁ, దరియించితి ఋణయుగంబు; దడయక ధరణీ వరదేవ ఋణము సవనా, చరణుఁడవై యీఁగు టొప్పు సమ్మతితోడన్!

1127

తా ॥ వసుదేవా! నీ పుత్రుడైన శ్రీకృష్ణుని మూలంగా పితృఋణం తీరిపోయింది. ఇక వేదాధ్యయనం వల్ల ఋషి ఋణం కూడా తీరిపోయింది. ఇక మిగిలిపోయింది దేవ ఋణం ఒక్కటే. కాబట్టి నీవేం చేస్తావంటే మంచి యజ్ఞం చేసి దేవఋణం తీర్చుకో. ఆ సత్కర్మవల్ల పాపాలన్నీ పటాపంచలై పుణ్యుడవౌతావు."

క. అనవుడు న వ్వసుదేవుఁడు, మునివరులకు ననియె వినయమున మీరలు సె
ప్పిన యట్లు మఖము సేసెద, దినకరనిభులార! మీరు దీర్పఁగ వలయున్ !

1128

తా ॥ అని మునీశ్వరులు చెప్పిన మాటలు విని వసుదేవుడు "మహాత్ములారా! మీరు ఆదేశించినట్లే యజ్ఞం చేస్తాను. అయితే ఆ యజ్ఞనిర్వహణను ఋత్విక్కులై మీరే చేపట్టాలి" అని వినయవంతుడై సూర్య తేజస్సుతో వెలిగిపోతున్న వారిని వేడుకొన్నాడు.

వ. అని యభ్యర్థించి యమ్మునీంద్రుల యాజకులం గా వరించి, యప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామిత వైభవంబున, నష్టాదశ భార్యాసమేతుండై, దీక్షఁ గైకొని య మ్మహాధ్వరంబు వేదోపదిష్ట విధిం బరిసమాప్తించి ఋత్విఙ్నికాయంబుల బహుదక్షిణలం దనిపి, భార్యాసమేతుండై యవభృథస్నానం బాచరించి, వివిధరత్నమణి మయభూషణ విచిత్రాంబర సురభి సుమానులేపనంబులు ధరించి, నిఖిలభూదేవ మునిబంధు రాజలోకంబుల నుచిత సత్కారంబులఁ బ్రీతులం గావించిన వారును గృష్ణానుమతి నాత్మనివాసంబులకుం జని; రందు.

1129

తా ॥ పుణ్యతీర్థమైన స్యమంత పంచక సమీపంలో వసుదేవుడు పద్దెనిమిదిమంది భార్యలతో కూడినవాడై యజ్ఞ దీక్షను స్వీకరించాడు. పుణ్యమూర్తులైన ఆ మహర్షి సత్తములు యజ్ఞం చేయించగా వేదాలలో చెప్పబడిన విధంగా వసుదేవుడు ఆ మహాయజ్ఞాన్ని సక్రమంగా పూర్తిచేసి, ఋత్విక్కులనందరినీ దక్షిణలతో సత్కరించి సంతృప్తి పరిచాడు. ఆ తరువాత భార్యలతో కలిసి పరమపవిత్రమైన అవబృథస్నానం చేశాడు. వసుదేవుడు రత్నాభరణాలను, మణిభూషణాలను, వినూత్న వస్త్రాలను, పరిమళభరితమైన మైపూతలను, పుష్పమాలికలను ధరించి ఋత్విక్కుల ఆశీర్వచనాలను స్వీకరించాడు. ఆ తరువాత యజ్ఞాన్ని చూడటానికి వచ్చిన మునులను, బంధువులను, రాజులను తగిన విధంగా సన్మానించి, అందరినీ సంతుష్టులను చేశాడు. కృష్ణ సందర్శనార్థం వచ్చిన మహర్షులు, రాజులు శ్రీకృష్ణుని అనుమతి తీసుకొన్నవారై, వారివారి నివాసాలకు వెళ్ళిపోయారు.

ఉ. ఆ తఱి నుగ్రసేన వసుధాధిప పంకజనాభ ముష్టికా
రాతులు దమ్ము నర్థి మధురప్రియభాషల నిల్వ వేఁడినం
గౌతుక మాత్మ లన్ వెలయగా వసియించిరి గోపగోపికా
వ్రాతముతోడ నచ్చట ధరావర ! నందయశోద లిమ్ములన్.

1130

తా ॥ అప్పుడు ఉగ్రసేన మహారాజు, వసుదేవుడు, బలరామకృష్ణులు, నందుడు మొదలైన వారిని తమతోనే మరికొంతకాలం ఆనందంగా గడపమని ప్రార్థించారు. వారి ప్రార్థన మన్నించినవారై నందుడు, యశోద, గోపాలురు, గోపికా జనం ప్రేమానురాగాలతో స్యమంత పంచకం వద్ద విడిది ఉన్న కృష్ణాదులవద్ద కొంతకాలం ఉండిపోయారు.

క. హరినయముల హరిప్రియముల, హరిమధురాలాపములను హరికథల మనో
హరలీలఁ దగిలి నందుఁడు, నిరుపమగతి నచట మూఁడునెల లుండె నృపా!

1131

తా ॥ శ్రీకృష్ణుని గౌరవ సత్కారాలకు, ప్రేమానురాగాలకు, మధురమైన సంభాషణాచాతుర్యానికి, మహిమలు వెలార్చే కథలకు కట్టుబడి, ఆ ఆనందంలో మునకలువేస్తూ ప్రేమాతిశయంతో, భక్తిభావనతో కృష్ణ సన్నిధిలో నందుడు మొదలైనవారంతా మూడు నెలలపాటు ఉండిపోయారు.

చ. జలరుహలోచనాది యదుసత్తము లందఱు నన్నిభంగులం
గలితవిభూషణాంబర నికాయము లిచ్చి బహూకరించి వీ
డ్కొలిపిన నందముఖ్యులు ముకుందపదాబ్జ మరందపాన స
ల్లలిత నిజాత్మ షట్పదములన్ మరలించుచు నెట్టకేలకున్.

1132

తా ॥ శ్రీకృష్ణుడు మొదలైన యాదవనాథులందరూ సమస్తమైన కానుకలను, మణిమయ భూషణాలను, వినూత్న వస్త్రాలను ఇచ్చి సంతోషంతో వీడ్కొల్పగా నందాదులు తమ నివాసాలకు బయలుదేరారు. బయలుదేరారేగాని, వారిదృష్టి అంతా శ్రీకృష్ణుని చరణాలమీదే ఉంది. కృష్ణుని పాదపద్మాల మకరందాన్ని పానం చేస్తున్న తమ హృదయాలనే తుమ్మెదలను చిట్టచివరకు

మెల్లమెల్లగా మరల్చుకొంటూ నడకసాగించారు.

వ. చని చని.

1133

తా ॥ ఆ విధంగా వెళ్ళి, వెళ్ళి—

ఆ. మరలి మరలి 'కృష్ణ ! మాధవ ! గోవింద !, పద్మనాభ ! భక్త పారిజాత ! దేవదేవ !
యనుచుఁ దివిరి చూచుచు మధు, రాభిముఖులు నగుచు నరిగి రంత.

1134

తా ॥ మాటిమాటికి వెనుకకు తిరిగి కృష్ణుణ్ణి చూస్తూ నందుడు మొదలైన వారంతా "కృష్ణా! మాధవా! గోవిందా! పద్మనాభా! భక్తులపాలిటి కల్పవృక్షమా! దేవదేవా! పరమాత్మా!" అని ఆ భగవంతుణ్ణి స్మరిస్తూ, పిలుస్తూ, ఆయనను వదలలేక మథురానగరం వైపు వెళ్ళిపోయారు.

క. క్రమమున నచ్చటఁబ్రావృ, ట్సమయం బగుటయును బంధుజన యాదవ వ
ర్గము లోలిఁ గొలువ సురగణ, నమితులు బలకృష్ణు లాత్మనగరంబునకున్.

1135

తా ॥ అప్పుడు వర్షాకాలం ప్రారంభం కావటంతో ఆ తీరప్రదేశాన్ని వదిలి, బంధువులు కొలుస్తుండగా దేవతల చేత స్తుతింపబడే బలరామకృష్ణులు ద్వారకా నగరానికి వెళ్ళారు.

వ. వచ్చి సుఖంబుండు నంత.

1136

తా ॥ రామకృష్ణులు ద్వారకలో సుఖంగా ఉన్నారు. కొంతకాలం గడిచాక—

# శ్రీకృష్ణ బలభద్రులు మృతులైన తమ సహోదరులను తెచ్చి దేవకీదేవికి కనబరచుట

సీ. అవనీశ ! యొక్కనాఁ డానకదుందుభీ భార్య పద్మాక్షుండు బలుఁడుఁ దొల్లి
శరధిలోఁ జొచ్చిన గురుతనూభవునిని మరలంగఁ దెచ్చిన మహిమ లెల్ల
జనములు దమలోన సన్నుతుల్ సేయంగ విని తన సుతులు దుర్వృత్తుఁడైన
కంసుచే నిహతులై కాలుని పురి నున్న వారి నందఱఁ జూడఁ గోరి కృష్ణ

తే. బలులకడ కేగి కన్నుల బాష్పకణము, లొలుక నో రామ ! రామ ! నిత్యోన్నతాత్మ !
పరమపావనమూర్తి ! యో మురవిభేది !, యిందిరానాథ ! యోగీశ్వరేశ ! కృష్ణ !

1137

తా ॥ పరీక్షిన్మహారాజా! సముద్రంపాలైన గురువుగారి కుమారుణ్ణి బలరామకృష్ణులు తీసుకొనివచ్చి గురువుగారికి అప్పగించిన విషయాన్ని ద్వారకావాసులు కథలు కథలుగా చెప్పుకొంటూ వారి మహిమలను కీర్తిస్తుండటం దేవకీదేవి విన్నది. ఆ వార్తలన్నీ విన్న ఆమె ఒకరోజున బలరామకృష్ణుల దగ్గరకు వెళ్ళింది. దుష్టుడైన కంసుడు తన పుత్రులను వధించిన విధానాన్ని గుర్తుచేసుకొని, యమధర్మరాజు నగరంలో ఉన్న తన కొడుకులను చూడాలనే కోరికతో దేవకీదేవి కళ్ళవెంబడి కన్నీరు కారుతుండగా బలరామకృష్ణుల్ని చూసింది. చూసి, 'ఓ బలరామా! పావనమూర్తీ! ఉన్నతోన్నతమైన ఆత్మగలవాడా! బలసంపన్నా!' అని బలరాముణ్ణి వినుతించింది. రామకృష్ణులు పుత్రులే అయినా ఆమె దృష్టిలో విష్ణురూపులే. కృష్ణునివైపు తిరిగి – 'ఓ కృష్ణా! యోగీశ్వరేశ్వరా! లక్ష్మీనాథా! మురాసుర సంహారీ! కరుణాసాగరా!' అని స్తుతించింది.

క. మురు కంస చైద్య పౌండ్రక, నరక జరాతనయ యవన నరనాయకులన్ దురితాత్ములఁ
బొరిగొని భూ, భర ముడిపిన యట్టి మేటిబలులు దలంపన్.

1138

తా ॥ "నాయనలారా! మీరిద్దరూ మహాబలసంపన్నులు. మురాసురుని, కంసుని, శిశుపాలుని, పౌండ్రకుని, నరకాసురుని, జరాసంధుని, కాలయవనుని, దుష్టభూపతులను సంహరించిన వీరాధివీరులు మీరే కదా! దుష్టశిక్షణచేసి భూభారాన్ని పోగొట్టిన మహాత్ములు మీరు.

ఆ. జనన వృద్ధి విలయ సంగతి నిఖిలంబుఁ, బొందఁ జేయు పరమపురుషులార ! మీకు లీల లౌట మీ రని నమ్మిన, దాన నేను వినుఁ డుదారులార!'

1139

తా ॥ ఉదారపురుషులారా! సృష్టి స్థితి లయాలను మూడింటినీ చేయగల పరమపురుషులు మీరు. ఇవన్నీ మీ లీలావిలాసాలనే నేను నమ్ముతున్నాను."

వ. అని యనేక విధంబుల వినుతించుచు నిట్లనియె; 'మీరలు మహానుభావులరు; మీరు తొల్లి యనేకకాలంబు సనినక్రిందట మృతుండై, దండధరు మందిరంబున నున్న గురుకుమారుని మీ మహాప్రభావంబులు లోకంబులఁ బరిపూర్ణంబులై ప్రకాశింప; న క్కాలునిచెంత నుండి మగుడం దెచ్చి గురుదక్షిణగా నొసంగితి; రి వ్విధంబునం గంసునిచేత హతులైన మత్పుత్త్రుల నందఱ మరలం దెచ్చి నా మనంబున నున్న దుఃఖంబు నివారింపవలయు' నని దేవకీదేవి ప్రార్థించినం దమతల్లి యాడిన మృదుమధురవాక్యంబు లత్యాదరంబున నాదరించి, యప్పుడు బలకృష్ణులు దమ యోగమాయా మహత్త్వంబున సుతలంబునకుం జని; రట్టి యెడ.

1140

తా ॥ అని దేవకీదేవి రామకృష్ణులను అనేకవిధాలుగా స్తుతించింది. "పుత్రులారా! మీరు మహానుభావులు. పూర్వం చాలాకాలం క్రిందట మరణించి యమపురిలో ఉన్న గురుకుమారుణ్ణి

బ్రతికించి యమధర్మరాజు దగ్గర నుండి తీసుకొని వచ్చి గురువుగారికి గురుదక్షిణగా సమర్పించి మీ శౌర్యప్రతాపాలను, మహత్త్వాన్ని లోకానికి వెల్లడించారు. తండ్రులారా! అదే విధంగా కంసునిచేత వధింపబడిన నా పుత్రులను తెచ్చి నాకు చూపండి. నా మనస్సులో పేరుకుపోయిన దుఃఖాన్ని పోగొట్టండి" అని ప్రార్థించిన తమ తల్లిని చూశారు రామకృష్ణులు. ఆమె చెప్పిన మాటలన్నీ శ్రద్ధగా విని, అత్యంత ఆదరభావంతో, ఆమె కోరికతీర్చి ఆనందింప చేయాలని భావించి బలరామకృష్ణులు తమ యోగమాయా ప్రభావంతో సుతల లోకానికి వెళ్ళారు.

మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు దళత్కంజాక్షులన్ దక్షులన్
ఘనసారాంబుదవర్ణులన్ నిఖిలలోకైక ప్రభాపూర్ణులన్
దనరారన్ హలచక్రపాణులను భక్తత్రాణులన్ నిత్య శో
భన వర్ధిష్ణుల రామకృష్ణుల జయభ్రాజిష్ణులన్ జిష్ణులన్.

1141

తా ॥ 'సుతల' లోక ప్రభువైన బలిచక్రవర్తి – పద్మపత్రాక్షులను, మహీదక్షులను, సమస్త లోకాలలో దివ్యదేజస్సుతో ప్రకాశించే నిరుపమాన మూర్తులను, భక్తత్రాణపరాయణులను, విజయలక్ష్మితో వెలుగొందే వీరాధివీరులను, జయశీలురను, కళ్యాణకారులను, ధవళ వర్ణంతో, నీల వర్ణంతో ఒప్పారుతూ హలాయుధాన్ని, చక్రాయుధాన్ని చేతులలో ధరించిన బలరామకృష్ణులను చూశాడు.

చ. కని హితకోటితో నెదురుగాఁ జనుదెంచి మనోనురాగ సం
జనిత కుతూహలుం డగుచుఁ జాఁగిలి మ్రొక్కి సమగ్ర కాంచనా
సనముల నుంచి తచ్చరణసారససేచన సర్వలోక పా
వన సలిలంబు లౌదల ధ్రువంబుగఁ దాల్చి సుభక్తి యుక్తుఁడై.

1142

తా ॥ వెంటనే బలిచక్రవర్తి, తన హితులతో, పరివారంతో రామకృష్ణులకు ఎదురుగావెళ్ళి, మనస్సులో అనురాగం, ఉత్సాహం ఉప్పొంగుతుండగా వారికి సాష్టాంగ నమస్కారం చేశాడు. బంగారు సింహాసనాలపైన వారిని కూర్చుండబెట్టాడు. వారి పాదాలు కడిగి, ఆ పరమపవిత్రమైన జలాలను తన తలపై ధరించాడు. భక్తి భావంతో పరవశించిపోతూ–

సీ. సురభి కాలాగరు హరిచందనై లాది ధూపంబు లా విశ్వరూపకులకుఁ
గాంచనపాత్ర సంగతరత్న కర్పూర దీపంబు లా జగద్దీపకులకుఁ
బాయసాపూపాన్న పక్వఫలాది నై వేద్యంబు లా వేదవేద్యులకును
దనరు వినూత్నరత్న ప్రభాభాసి తాభరణంబు లా దైత్యహరణులకును

తే. మిలమిలని మంచుతోఁ బొలుపలరు బహు వి, ధాంబరంబులు నీలపీతాంబరులకు
సలలిత కుసుమమాలికా మలయజాను, లేపనంబులు భూరినిర్లేపులకును.

1143

తా ॥ విశ్వమే రూపంగాగల ఆ బలరామకృష్ణులకు సువాసనలు వెదజల్లుతున్న సాంబ్రాణి, హరిచందన, ఏలాది ధూపాలువేసి పూజించాడు. లోకలోకాలను ప్రకాశింపచేసే ఆ తేజోమూర్తులకు బంగారు పళ్ళెరంలో కర్పూరహారతులిచ్చి ఆనందించాడు. వేదవేదాంగ విదులైన ఆ వేదమూర్తులకు పాయసము, పిండివంటలు, అన్నము, ముగ్గపండిన ఫలాలు మొదలైన పదార్థాలను నైవేద్యాలుగా సమర్పించాడు. దుష్టదానవ సంహారకులైన ఆ దేవతారూపులకు నూతనమైన రత్నాలతో పొదగబడిన, కాంతులు విరజిమ్ముతున్న అనేకానేక భూషణాలను అలంకరించాడు. నీల పీతాంబరులైన శ్రీకృష్ణబలరాములకు మంచులాగా అందాలు చిందుతున్న తెల్లని దివ్య వస్త్రాలను ఇచ్చి సంబరపడ్డాడు. నిగర్వులైన ఆ జగత్ప్రసిద్ధులకు సుకుమారమైన పుష్పాలతో అల్లిన పూలమాలలను, చందనాది మైపూతలను అందించాడు.

వ. సమర్పించి య ప్పుండరీకాక్షుని చరణారవిందంబు లొత్తుచు నానందబాష్పపూరంబు

తోరంబుగా రోమాంచ కంచుకిత శరీరుం డగుచుం దన గరకమలంబులు ఫాలభాగంబునం గదియించి యిట్లని స్తుతియించె.

1144

తా ॥ ఆ విధంగా తన్మయత్వంతో బలిచక్రవర్తి రామకృష్ణులకు సకలోపచారాలు చేసి, శ్రీకృష్ణుని పాదపద్మాలు ఒత్తుతూ, ఆనంద బాష్పాలు జాలువారుతుండగా, శరీరమంతా గగుర్పొడుస్తుండగా, తన రెండుచేతులను ఫాలభాగంపైన జోడించి నమస్కరిస్తూ, ఈ విధంగా స్తుతించాడు:

ఉ. ధీయుతుఁడై 'నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం
దాయ సమస్తభక్తవరదాయ నమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్రవంద్యచరణాయ సురారిహరాయ సాంఖ్యయో
గాయ వినీల భాస్వదలకాయ రథాంగధరాయ వేధసే,'.

1145

తా ॥ "శ్రీహరీ! పరమాత్మా! దైవలలామా! ముకుందా! సమస్త భక్తవరదా! పురుషోత్తమా! మునీంద్రుల చేత పూజింపబడే పాదపద్మాలుగల దేవా! దైత్యాంతకా! సాంఖ్యయోగం చేత తెలియబడే మహాత్మా! నీలినీలి ముంగురులతో ఒప్పే సుందరాంగా! చక్రధారీ! ఓ విష్ణుమూర్తీ!"

వ. అని యభినందించి యిట్లనియె.

1146

తా ॥ అని ప్రార్థించి బలిచక్రవర్తి శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు:

ఉ. రాజస తామసాత్ములకు రాదుగదా నినుఁ గాన నవ్య పం

కేజ దళాయతాక్ష ! మునిగేయ పవిత్రచరిత్ర ! విస్ఫుర
ద్రాజకళాధరాజ సురరాజ ముఖామర మౌళిరత్న వి
భ్రాజితపాదపీఠ ! భవబంధ విమోచన ! పద్మలోచనా !

1147

తా ॥ "శ్రీకృష్ణా! మహర్షిశ్రేష్ఠులచే వినుతింపబడే పవిత్రచరిత్ర గలవాడా! అప్పటికప్పుడు వికసించిన తామరరేకులవంటి అందమైన నేత్రములతో శోభిల్లేవాడా! చంద్రశేఖరుడైన శివుని యొక్క, బ్రహ్మదేవుని యొక్క, దేవేంద్రుడు మొదలైన సమస్త దేవతలయొక్క శిరస్సులయందు ప్రకాశించే రత్నకాంతులతో మెరిసిపోతున్న పాదపద్మాలు గలవాడా! వారందరూ నీకు మ్రొక్కగానే ఆ రత్నకాంతులన్నీ నీ పాద పద్మాలపై ప్రతిఫలిస్తాయికదా! సంసార బంధాలను త్రెంచివేసే వాడా! సత్త్వగుణ ప్రధానా! రాజస గుణంతో, తామసగుణంతో కొట్టుకుపోయేవారికి నీ దర్శన భాగ్యం లభించదు గదా!

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయా లతాబద్ధులై
యిద మిత్థ' మ్మన లేరు తామసధృతిన్నేపారు మాబోఁటి దు
ర్మదు లేరీతి నెఱుంగఁజాలుదురు ? సమ్యగ్జ్ఞానధీయుక్తి నీ
పదముల్ సేరెడి త్రోవఁ జూపి భవకూపంబుం దరింపింపవే !

1148

తా ॥ పరమాత్మా! మహాయోగులైనా సరే నీ మాయకు బద్ధులై నీ తత్త్వాన్ని సమంగా గ్రహించలేరు. అటువంటిది తామసగుణంలో చిక్కుకుపోయిన మాబోటి దుర్మదాంధులు నిన్ను ఏ విధంగా తెలుసుకోగలుగుతారు? సంపూర్ణమైన జ్ఞానాన్ని ప్రసాదించి, నేను నీ పాదపద్మాలు చేరుకోగలిగే మార్గాన్ని చూపించు. ఈ సంసారమనే బావిలో పడిపోకుండా మమ్మల్ని పైకి లేవనెత్తు ప్రభూ!

ఉ. వైరముచేతఁ జేదినృపవర్గముఁ, గామముచేత గోపికల్,
మీఱినభక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశమున్ మనంబులం
దారఁగనీక రూపగుణతత్పరులై మిముఁ బొందు కై వడిన్
భూరివివేక సత్త్వగుణముల్ గల దేవత లంద నేర్తురే !

1149

తా ॥ దేవా! శత్రుభావంతో శిశుపాలాది రాజులు, కామాధిక్యతతో గోపికలు, అనంతమైన భక్తితో మిమ్మల్ని ఆశ్రయించుకొని ఉన్నవారు తమ మనస్సులలో రాత్రింబగళ్ళు మీ రూపాన్ని, గుణాలను జారిపోకుండా స్థిరపరచుకొని మీ సన్నిధానాన్ని చేరుకొనే విధంగా విద్యా వివేకజ్ఞానవంతులైన దేవతలు కూడా మిమ్మల్ని చేరుకోలేరనటం సత్యదూరంకాదు.

క. కాన భవత్పద పద్మ, ధ్యానంబునఁ గాని శాస్త్రతత్త్వంబులచేఁ
గానరు శ్రుతిసంవేద్యం, బైన భవత్పదముఁ జిన్మయాకార ! హరీ !

1150

తా ॥ శ్రీహరీ! జ్ఞాన స్వరూపా! వేదాలలో తెలియబడే మోక్షపదాన్ని శాస్త్రజ్ఞానం చేతగాని, తత్త్వదృష్టితోగాని ఎవరూ చూడలేరు. ఒక్క నీ పాదపద్మాలపైన దృష్టి నిలిపి ధ్యానించినప్పుడు మాత్రమే నీ సన్నిధికి చేరగలుగుతాము.

వ. దేవా ! యే నరుండైన నేమి శ్రద్ధాగరిష్ఠచిత్తుండై మిమ్ముసేవించు నట్టి మహాత్ముండు విధిచోదితంబయిన ప్రమాణంబువలన విముక్తుండై వర్తించు; నట్లు గావున యోగీశ్వరుండవైన నీ వీశితవ్యు లమైన మమ్ము నిష్పాపులం జేయు మని నుతించి మఱియు నిట్లనియె.

1151

తా ॥ దేవదేవా! శ్రద్ధతో నిండిన మనస్సుతో ఏ నరుడైనా సరే, మిమ్మల్ని సేవిస్తే, ఆ

మహాత్ముడు సమస్త ఐహిక బంధాల నుండి విముక్తి పొందుతాడు. యోగీశ్వరులకే ప్రభుడవైన నీవు నీ అధీనంలో ఉన్న మమ్మల్ని పాపరహితుల్ని చేయి.” అని ప్రార్థించి, బలి ఇంకా ఇలా అన్నాడు:

మ.కో.

‘కంటి గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి ముక్తినిధానమున్
గంటి నీ కరుణావలోకముఁ గంటి రూపము వీడ ము
క్కంటి తామరచూలియుం బొడఁ గాన నట్టి మహాత్మ ! నా
యింటికిం జనుదెంచి తీశ్వర ! యేఁ గృతార్థతఁ బొందితిన్.

1152

తా ॥ “స్వామీ! శ్రీకృష్ణా! నా అదృష్టమే అదృష్టం. నిన్ను కళ్ళారా చూశానయ్యా! ఈ సంసార సముద్రాన్ని దాటగలిగాను. ముక్తినిధిని దరిచేరాను. నీ దయాదృష్టి నాపై పడింది గదా! పాపాలన్నీ పటాపంచలయ్యాయి. బ్రహ్మదేవుడు, శంకరుడు చూడజాలని మహాత్ముడవైన నీవు నా ఇంటికి రావటమా? పరంధామా! నా జన్మ చరితార్థమైంది. నేను కృతార్థుడనైనాను.

వ. దేవా ! యేను భవద్దాసుండ ! నేది పంచినం జేయుదు; నిచ్చటికి మీరలు విజయంబు చేసిన కార్యం బానతీయ వలయు’ నని కరంబులు మొగిచి, విన్నవించినం బుండరీకాక్షం డతని వాక్యంబులకు సంతసిల్లి యిట్లనియె.

1153

తా ॥ పరాత్పరా! వాసుదేవా! నేను నీ దాసుణ్ణి. మీరేది ఆజ్ఞాపిస్తే అది చేస్తాను. ఇక్కడకు మీరు వచ్చిన పని ఏమిటో ఆనతీయవలసింది” అని రెండు చేతులూ జోడించి బలిచక్రవర్తి వినయంగా విన్నవించాడు. బలి పలికిన పలుకులకు సంతోషించి శ్రీకృష్ణుడీవిధంగా అన్నాడు:

సీ. 'బలిదైత్య ! విను మున్ను ప్రథమయుగంబున నా మరీచికి భార్యయైన వర్ష
యను నింతివలన నందను లార్వు రుద్భవ మైరి వా రొక్కనాఁ డబ్జభవుఁడు
తనపుత్త్రిపై మోహమునఁ గూడి రతికేళి యొనరింప మీఁటి నవ్వుటయుఁ గ్రోధ
మంది 'యాసురయోనియందుఁ బుట్టుం' డని ఘనశాప మిచ్చె న వ్వనజజుండు.

తే. త న్నిమిత్తమునను వారు దగిలి హేమ, కశిపునకుఁ బుట్టి రంత నాకౌకసులకు
నొదవ వీరలఁ దెచ్చి య య్యోగమాయ, యడరి దేవకిగర్భమునందుఁ జొనుప.

1154

తా ॥ "బలి సార్వభౌమా! పూర్వం కృతయుగంలో మరీచికి, వర్షకు ఆరుగురు పుత్రులుదయించారు. ఒకనాడు సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు తాను సృష్టించిన సరస్వతీదేవిపై కుమార్తె అని కూడా చూడకుండా వలపుగొన్నాడు. మోహం అతిశయించగా ఆమెతో రతిక్రీడలో పరవశించిపోయాడు. అది చూసిన 'వర్ష' పుత్రులు ఆరుగురు నవ్వి బ్రహ్మను అపహసించారు. మరీచి పుత్రులపైన విధాతకు పట్టరాని ఆగ్రహం కలిగింది. వెంటనే వారిని చూసి "రాక్షస యోనిలో పుట్టమ' ని శాపమిచ్చాడు. ఆ కారణం చేత వారందరూ హిరణ్యకశిపుడికి పుత్రులుగా జన్మించారు. ఆ రాక్షస కుమారులు దేవతలకు ఎక్కడ అపకారం చేస్తారో అని – యోగమాయ ఆ ఆరుగురుని తెచ్చి దేవకీదేవి గర్భంలో నిక్షిప్తపరచింది.

క. దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ, బొరిగొనెఁ దత్పుత్రశోకమునఁ దన చిత్తం బెరియఁగ దేవకి
వారల, దరిసింపఁగఁ గోరి పనుపఁ దగ నసురేంద్రా !

1155

తా ॥ దేవకీదేవికి వెంట వెంటనే పుట్టిన ఆ ఆరుగురు కొడుకులను దుష్టచిత్తుడైన కంసుడు తెగటార్చాడు. ఆ పుత్రశోకంతో ఇంతకాలం మనస్సు దహించివేస్తుండగా ఎవరికీ చెప్పుకోలేక మా అమ్మ విపరీతమైన బాధకు గురైంది. తన పుత్రులను చూడాలనే కోరికతో వారిని తెచ్చి ఇమ్మని మమ్మల్ని దీనంగా ప్రార్థించింది.

క. వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ దెచ్చెద మని తల్లి కోర్కిఁ దీర్పఁగ నిపు డే
మిచ్చటికిని నీకడఁ బొర, పొచ్చెము లేకున్నవారె పో వీ రనఘా !

1156

తా ॥ రాక్షసేంద్రా! బలిచక్రవర్తీ! ఆ కారణంగా మాతృమూర్తి కోరిక తీర్చాలనే ఆశయంతో మా సోదరులను తెచ్చి ఇస్తామని మా అమ్మకు మాట ఇచ్చి ఇక్కడకు వచ్చాము. ఏ కష్టం లేకుండా నీ దగ్గర ఉన్న వీరే దేవకీదేవి ఆరుగురు తనయులూను.

క. వీరలఁ దోకొని యిపుడే, ధారుణికి న్నేగి జనని తాపము వాపన్ వీరలు నంతట శాపముఁ, దీఱి మదీయ ప్రసాదధీయుతు లగుచున్.

1157

తా ॥ దానవ సార్వభౌమా! నీ వద్ద ఉన్న మా అన్నలను తీసుకొని భూలోకానికి వెళ్ళి మా తల్లికి వారిని చూపించి ఆమె బాధ పోగొడతాను. అప్పుడు వారి శాపం కూడా తీరిపోతుంది.

క. పొలుపుగ సుగతిం బొందఁగఁ, గల' రని హరి యానతిచ్చి కరుణాన్వితుఁడై బలిచే ననుమతిఁ గొని వా, రలఁ దోకొని వచ్చె ని ద్ధరామండలికిన్.

1158

తా ॥ నా వరప్రసాదం వల్ల వారికి సద్గతి ప్రాప్తిస్తుంది." అని శ్రీకృష్ణుడు బలిచక్రవర్తికి తెలియచెప్పి, ఆ సుతల లోకాధిపతి అనుమతితో దేవకీదేవి పుత్రులను తనతో తీసుకొని భూలోకానికి వచ్చాడు.

వ. అట్లు వారలం దోడితెచ్చి తల్లి కిట్లనియె.

1159

తా ॥ దయామయుడైన శ్రీకృష్ణుడు తన అగ్రజన్ములను సుతలలోకం నుంచి తోడ్కొని

వచ్చి తల్లితో ఈ విధంగా అన్నాడు:

క. 'కనుఁగొనుము వీరె నీ నం, దను' లని జనయిత్రికడ ముదంబున వారి
న్నునిచిన న ద్దేవకియును, ఘనపుత్ర స్నేహ మోహకలితాత్మకయై.

1160

తా ॥ శ్రీకృష్ణుడు దేవకీదేవిని చూసి "చూడమ్మా! నీవు పోగొట్టుకొన్న నీ కుమారులు వీరే. సంతోషంగా చూసుకో" అని ఆమెవద్ద వారిని కూర్చోబెట్టారు. అప్పుడు దేవకీదేవి పుత్రులను చూసి వారిపట్ల కలిగిన వాత్సల్యంతో, ప్రేమతో, ఇష్టంతో ఉండటం వల్ల –

క. చన్నులు దిగ్గనఁ జేపఁగఁ, గన్నుల నానందబాష్పకణములు దొరఁగఁ గ్రన్నన కౌఁగిట నిడి ననుఁ, గన్నన్నలు వచ్చి రనుచుఁ గౌతుక మొప్పన్.

1161

తా ॥ ఆ మాతృమూర్తికి వెంటనే చన్నులనుండి పాలు, కన్నులనుండి ఆనందబాష్పాలు దొర్లాయి. దిగ్గనలేచి ఆ తనయులను కౌగిలించుకొంది. నే కన్నబిడ్డలు, నా కన్నబిడ్డలు నన్ను చూడటానికి, నా దగ్గరకు వచ్చారా అని మురిసిపోయింది.

వ. అట్లు కౌఁగిటం జేర్చి నిజాంకపీఠంబున నునిచి, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుణుకుచుం బ్రేమాతిశయమున మేనం బులక లొలయం జన్నిచ్చిన, వారును వైష్ణవ మాయామోహితులై స్తన్యపానంబు సేయుచు భగవంతుడయిన రథాంగపాణి యంగసంగంబున విగతకల్మషులై విధిశాపసాగరంబు హరిదయాకటాక్షంబను నావచేతం దరియించి నిజస్వరూపంబులు ధరించి, కృష్ణునకుఁ దలిదండ్రులకు వందనం బాచరించి గగనపథంబున నిజస్థానంబున కరిగి రంత దేవకీదేవి తన మనంబున.

1162

తా ॥ కొడుకులను తొడలపై కూర్చోబెట్టుకొని, వారి శిరస్సులను ప్రేమతో వాసన చూసింది. దేవకీదేవి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. గడ్డాలు పట్టుకొని లాలించింది. శరీరమంతా గగుర్పొడుస్తుండగా ఒడిలోకి తీసుకొని చనుబాలిచ్చింది. ఆ బిడ్డలు కూడా వైష్ణవమాయకు వశులై తల్లిపాలు త్రాగారు. భగవంతుడైన శ్రీకృష్ణుని శరీరస్పర్శతో పాపరహితులైనారు. కృష్ణుని కరుణాకటాక్షమనే నావచేత బ్రహ్మదేవుని శాపమనే సాగరాన్ని అవలీలగా దాటగలిగారు. శాపవిముక్తులైన మరీచిపుత్రులు నిజస్వరూపాలు ధరించి శ్రీకృష్ణుడికి, తల్లిదండ్రులైన దేవకీవసుదేవులకు భక్తితో నమస్కరించి, ఆకాశమార్గంలో తమతమ నివాస స్థానాలకు వెళ్ళిపోయారు. అప్పుడు దేవకీదేవి తన మనస్సులో—

క. చచ్చిన బాలురఁ గ్రమ్మఱఁ, దెచ్చుట గడుఁ జిత్ర మనుచు దేవకి మదిలో నచ్చెరువడి 'యిది యంతయు, నచ్చపు హరిమాయ గాక !' యని తలఁచె నృపా !

1163

తా ॥ "మరణించిన బాలురను తిరిగి తీసుకొని రావటం ఎంత చిత్రం?" అని ఆశ్చర్యపడి – "ఇదంతా విష్ణుమాయ కాకపోతే మరేమౌతుంది?" అని అనుకొంది.

క. పరమాత్ముఁ డఖిల జగదీ, శ్వరుఁ డగు కృష్ణుండు సేయు సత్కృత్యంబుల్ పరికింప నెన్నఁ బెక్కులు, ధరణీవర !' యనిన రాజు తా ముని కనియెన్.

1164

తా ॥ పరీక్షిన్మహారాజా! పరమాత్ముడు, జగన్నాథుడు అయిన శ్రీకృష్ణుడు చేసే మహిమాన్వితమైన కార్యాలు ఒకటి, రెండు కావు. ఎన్నెన్నో ఉన్నాయి." అని శుకమహర్షి చెప్పాడు. దానికి పరీక్షిత్తు ఆ శుకయోగిని ఈ విధంగా అడిగాడు:

## సుభద్రా పరిణయము

సీ. మునినాథ! పార్థుండు వనజనాభుని సహోదరి సుభద్రను నే విధమునఁ బెండ్లి
యయ్యెను నా విధం బంతయు నాకును దెలియంగ నెఱిఁగింపు ధీవిశాల !
యనవుడు నా వ్యాసతనయుఁ డాతనిఁ జూచి 'వినవయ్య ! నృప ! దేవవిభుని సుతుఁడు
మును తీర్థయాత్రా సముత్సుకుండై చని రమణఁ బ్రభాసతీర్థమున నుండి

తే. యా తలోదరితోడి నెయ్యంబు కలిమిఁ, జూడఁ గోరుచు రాముఁడు సుందరాంగిఁ
గౌరవేంద్రున కీ సమకట్టె ననుచుఁ, దనకు నెఱుఁగ రా నా పురందరసుతుండు.

1165

తా ॥ "మహానుభావా! అర్జునుడు – శ్రీకృష్ణుని సహోదరి అయిన సుభద్రను ఏ విధంగా వివాహం చేసుకొన్నాడో తెలియచెప్పండి". ఆ మాటలు విని వ్యాసమహర్షి పుత్రుడైన శుకుడు పరీక్షిత్తును చూసి – "మహారాజా! ఇంద్రసుతుడైన అర్జునుడు పూర్వం తీర్థయాత్రలు సేవిద్దామనే తలంపుతో మహోత్సాహంతో తిరుగుతూ తిరుగుతూ ఒకనాడు ప్రభాస తీర్థాన్ని చేరుకొన్నాడు.

ప్రభాస తీర్థం దగ్గర అర్జునుడు కొంతకాలం ఉండి ప్రశాంతంగా కాలం గడిపాడు. అప్పుడు సుభద్ర మీది అనురాగంతో ఆ కన్యను చూడాలని అనుకొన్నాడు. కొందరు యాత్రికులవల్ల బలరాముడు సుభద్రను కౌరవేశ్వరుడైన దుర్యోధనునికి కట్టబెట్టాలని నిశ్చయించినట్లు తెలుసుకొన్నాడు. దానికి తట్టుకోలేక అర్జునుడు ద్వారకకు వెళ్ళి ఎలాగైనాసరే సుభద్రను చూడాలని తొందర పడ్డాడు.

వ. అట్లు సుభద్రా దర్శనోత్సాహంబు దన మనంబున సందడిగొనం, ద్రిదండివేషంబు ధరియించి, ద్వారకాపురంబునకుం జనుదెంచి, య ప్పౌరజనంబులు భక్తిస్నేహంబుల ననిశంబుఁ బూజింపం దన మనోరథసిద్ధి యగు నంతకుం గనిపెట్టుకొని, వానకాలంబు చనునంతకు న ప్పట్టణంబున నుండు సమయంబున.

తా ॥ సుభద్రను చూడాలనే ఉత్కంఠతో, బలరామునికి తెలియకూడదనే ఉద్దేశంతో, సన్న్యాసి వేషంలో ద్వారకా నగరం చేరుకొన్నాడు అర్జునుడు. త్రిదండి రూపంలో ఉన్న అర్జునిని చూసి ద్వారకా వాసులందరూ నిజమైన పరివ్రాజకుడే అనుకొని భక్తితో ప్రతిరోజూ శ్రద్ధగా పూజించేవారు. తన మనస్సులోని కోరిక నెరవేరాలనే ఉద్దేశంతో అర్జునుడు ద్వారకలో, వర్షాకాలం ముగిసేవరకు, త్రిదండిగానే రోజులు గడిపాడు.

క. రాముఁడు తత్కపటాకృతిఁ, దా మదిఁ దెలియంగలేక దగ నొకనాఁ డా
భూమీవర తాపసుఁ బో, రామిఁ గని యాత్మమందిరమునకుఁ దెచ్చెన్.

1167

తా ॥ అర్జునుని కపటరూపాన్ని గుర్తించలేక ఒకనాడు బలరాముడు ఆ సన్న్యాసిని నిజమైన సన్న్యాసిగా భావించి, పూజించడానికి తన గృహానికి తీసుకువచ్చాడు.

ఆ. తెచ్చి భిక్షసేయ దేవేంద్ర తనయుండు, గుడుచుచుండి యచటఁ గోరి మెలఁగు
నసమబాణు మోహనాస్త్రంబు కై వడి, వీరమోహి నన విహారలీల.

1168

తా ॥ బలరాముడు కపట సన్న్యాసి వేషంలో ఉన్న అర్జునుని తన మందిరానికి తీసుకువచ్చి భిక్ష చేయమని ప్రార్థించాడు. తనకోరిక నెరవేరబోతోందన్న కుతూహలంతో అర్జునుడు బలరాముడింట్లో భిక్షను ఆరగిస్తూ సుభద్రకోసం అటూ ఇటూ చూడసాగాడు. అక్కడ మన్మథుని మోహనాస్త్రంలాగా, వీరమోహినా! అనే విధంగా మసలుతున్న –

వ. అట్లు సుభద్ర విహరించుచున్న సమయంబున.

1169

తా ॥ సుభద్ర కనబడటంతో అర్జునుని ప్రేమైక దృష్టి ఆమెపై పడింది.

చ. జలరుహపత్రనేత్రు ననుసంభవ చారువధూలలామ స
ల్లలిత విహార విభ్రమ విలాసము లాత్మకు విందు సేయ న
బ్బలరిపు నందనుండు గని భావజ సాయక బాధ్యమాన వి
హ్వలహృదయాబ్జుఁడై నిలిపె నత్తరుణీమణియందుఁ జిత్తమున్.

1170

తా ॥ శ్రీకృష్ణుని తరువాత జన్మించిన సుభద్ర అతిలోక సుందరి. ఆ సుందరీమణి సుందరవిలాస విభ్రమాలు అర్జునున్ని ఆకట్టుకొన్నాయి. ఆమె రూపురేఖలు మనస్సును ఉల్లాసపరుస్తుండగా అర్జునుడు మన్మథబాధకు గురైనాడు. మన్మథుడు ప్రయోగిస్తున్న బాణాలకు తట్టుకోలేక ఇంద్రసూనుడు సుభద్రపైన తన మనస్సును లగ్నం చేశాడు.

ఉ. ఆ తరుణీశిరోమణియు నర్జును నర్జునచారుకీర్తి వి
ఖ్యాతుని నింద్రనందను నకల్మషమానసుఁ గామినీ మనో
జాతునిఁ జూచి పుష్పశర సాయక జర్జరితాంతరంగయై
భీతిలి యుండె సిగ్గు మురిపెంబును మోహముఁ దేఱు చూపులన్.

1171

తా ॥ నిర్మలాత్ముడు, సువిశాలకీర్తిమంతుడు, సుప్రసిద్ధుడు, కాంతా జనమదన రూపుడు, ఇంద్రపుత్రుడు అయిన అర్జునున్ని తరుణీ లలామ అయిన సుభద్ర చూసీ చూడగానే మన్మథ బాణాలకు గురైంది. సిగ్గుతో, మోహముతో కూడిన చూపులతో సుభద్ర, మన్మథుని ధాటికి తట్టుకోలేక భీతిల్లింది.

వ. అట్లా నృపసత్తమ మత్తకాశిను లొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తరింపం దాల్మిలు వీడి సిగ్గునం జిట్టు ముట్టాడుచున్నయంత నొక్కనాఁడు దేవతా

మహోత్సవ నిమిత్తం నత్తలోదరి పురంబు వెలుపలికి నరుగుదెంచిన నర్జునుండు గృష్ణ దేవకీ వసుదేవుల యనుమతంబు వడసి తోడనం దానును చని యప్పుడు.

1172

తా ॥ సుభద్రార్జునులా విధంగా ఒకరిమీద ఒకరు వలపుగొని, మనస్సులో కోరికలు తత్తరపాటు చెందిస్తుంటే సహనం కోల్పోయారు. సిగ్గు ఇద్దరినీ వెన్నంటుతుండగా మాటలు రాక మౌనంగా వ్యవహరిస్తున్నారు. అలా ఉండగా ఒకరోజున దేవతామహోత్సవం తిలకించడానికి సుభద్ర అంతఃపురం నుంచి నగరుబయటికి రావటం తటస్థించింది. అది చూసిన అర్జునుడు శ్రీకృష్ణుడి యొక్క, దేవకీవసుదేవుల యొక్క అనుమతిపొంది సుభద్రను సమీపించాడు.

సీ. సాంద్రశరచ్చంద్ర చంద్రికా స్ఫూర్తిచే రాజిల్లు పూర్ణిమారజనివోలెఁ
బూర్ణేందు బింబావతీర్ణమై యిలమీఁద, భాసిల్లు హరిణ డింభంబుఁబోలె
సులలిత మేఘమండలమును నెడఁబాసి వసుధఁ గ్రుమ్మరు తటిద్వల్లి వోలె
మాణిక్య రచిత సన్మహిత చైతన్యంబు వొందిన పుత్తడిబొమ్మవోలె

తే. లలిత విభ్రమ రుచి కళాలక్షణములఁ, బొసఁగ రూపైన శృంగారరసముఁబోలె
నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ, బ్రకటసద్గుణభద్ర సుభద్రఁ జూచి.

1173

తా ॥ శరత్కాలంలో పండువెన్నెలలు కురిపించే పౌర్ణమినాటి రాత్రిలాగా, పూర్ణచంద్రబింబంలోని లేడికూన భూమి పైకి దిగివచ్చి మెరుపు లీనుతోందా అన్నట్లు, మబ్బుల గుంపునుండి విడివడి భూమిపై తిరుగుతున్న మెరుపు తీగవలె, ప్రాణవంతమైన బంగారు బొమ్మరీతి, సుందర సుకుమార విలాసాలతో, సకలసత్కళలు తనలో రూపుదిద్దుకొన్నాయా అన్నట్లు శృంగార రసదేవత లాగా సంచరిస్తున్న సద్గుణరాశి అయిన సుభద్రను అర్జునుడు అనురాగపూర్వకంగా చూశాడు.

వ. అప్పుడు డాయం జని యరదంబుపై నిడుకొని పోవుచుండం గనుంగొని యదుబలంబులు మదంబున నంటం దాఁకిన, నప్పు డయ్యాఖండల నందనుండు ప్రచండగాండీవ కోదండ నిర్ముక్త కాండంబులం దూలించి, యఖండ బాహుదండ విజయప్రకాండుండై ఖాండవప్రస్థ పురంబున కరిగె; నట బలభద్రుం డవ్వార్త విని విలయ సమయ సమీర సఖునికైవడిం బటురోష భీషణాకారుండై క్రోధించినం గని కృష్ణుం డాదిగాఁ గల బంధుజనంబు లతని చరణంబులకుం బ్రణమిల్లి మృదుమధుర భాషణంబుల ననునయించి యొడంబడునట్లుగా నాడిన నతండును సంతుష్టుం డయి మనంబునఁ గలంకదేఱి యప్పుడు.

1174

తా ॥ సుభద్రకు దగ్గరగా వెళ్ళి అర్జునుడు ఆమెను తన రథంపైన పెట్టుకొని పోతుండగా యాదవ సైనికులు చూసి వెంటనే అర్జునుడితో పోరాడారు. అప్పుడు అర్జునుడు తన పరాక్రమ వైభవాన్ని చూపుతూ గాండీవం నుంచి అనేక బాణాలు గుప్పించి, యాదవులను నిర్వీర్యులను చేసి, విజయలక్ష్మిని చేపట్టి, సుభద్రతో సహా ఖాండవప్రస్థ పురానికి వెళ్ళాడు. ఆ వార్త బలరాముడి చెవిన పడింది. ప్రళయకాలంలో విజృంభించే అగ్నిహోత్రునిలాగా క్రోధంతో మహోగ్రుడై, భీషణాకారంతో అర్జునుడిపై మండిపడ్డాడు. బలరాముని రోషభయంకరాకారాన్ని చూసి కృష్ణుడు మొదలైన బంధువులందరు ఆతని పాదపద్మాలకు ప్రణమిల్లారు. మెత్తని మాటలతో బలరాముణ్ణి చల్లబరిచారు. తీయనివాక్కులతో ఆయన కోపాన్ని తగ్గించి అనునయించారు. సుభద్రార్జునుల వివాహానికి బలరాముణ్ణి సుముఖుణ్ణి చేశారు. వారి మాటలతో బలరాముడు కూడా సంతృప్తి చెంది క్రోధాన్ని దిగవిడిచాడు. చెల్లెలి పట్ల ప్రేమను కనబరిచాడు.

క. కరులం దేరుల నుత్తమ, హరులన్ మణి హేమభూషణాంబరభృత్యో
త్కర దాసికాజనంబుల, నరణంబుగ నిచ్చి పంపె ననుజకుఁ బ్రీతిన్.

1175

తా ॥ బలరాముడప్పుడు సుభద్ర మీది వాత్సల్యంతో ఆమెకు – రథాలను, ఏనుగులను, ఉత్తమ జాతికి చెందిన గుఱ్ఱాలను, మణిమయ స్వర్ణాభరణాలను, చీని చీనాంబరాలను, సేవక సమూహాన్ని, దాసదాసీజనాన్ని అరణంగా పంపాడు.

వ. ఇట్లు కృష్ణున కభిమతంబుగా నర్జున సుభద్రల కరణం బిచ్చి పంపెనని చెప్పి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె.

1176

తా ॥ మహారాజా! బలరాముడు – కృష్ణుడికి ఇష్టమయ్యే విధంగా సుభద్రార్జునులకు సమస్త వస్తు సముదాయాన్ని అరణంగా ఇచ్చి పంపాడు.” అని శుకుడు చెప్పి, ఇంకా ఈ విధంగా అన్నాడు.

## శ్రీకృష్ణుడు ఋషిసమేతుడై మిథిలా నగరమునకు పోవుట

సీ. నరనాథ ! విను భువన ప్రసిద్ధంబుగ దీపించునట్టి విదేహదేశ
మందు భూకాంతకు నాననదర్పణం బనఁ దనర్చిన మిథి లను పురమునఁ
గలఁడు శ్రీహరిపాదకంజాత భక్తుండు గళితరాగాది వికారుఁ డమల
చరితుఁ డక్రోధుండు శాంతుండు నిగమార్థ కోవిదుం డగు శ్రుతదేవుఁ డనెడి

తే. భూసురోత్తముఁ డన యదృచ్ఛా సమాగ, తంబు తృణమైన హేమ శైలంబు గాఁగఁ
దలఁచి పరితోష మందుచుఁ దగ గృహస్థ, ధర్మమున నుండె సముచితకర్ముఁ డగుచు.

1177

తా ॥ “పరీక్షిత్తూ! విదేహదేశం లోకప్రసిద్ధి చెందిన దేశం. ఆ దేశంలో భూకాంత, ముఖసౌందర్యం చూసుకొనే అద్దమా అనేటట్లు ప్రకాశించే నగరం – మిథిలాపురం. ఆ నగరంలో శ్రుతదేవుడనే ఒక భూసురోత్తముడు కాపురముండేవాడు. శ్రుతదేవుడు అఖండ విష్ణుభక్తుడు. కామక్రోధాదులు లేనివాడు. నిర్మలమైన చరిత్రగలవాడు. రాగాదులను విసర్జించినవాడు. పరమశాంత స్వభావి. వేదవేదాంగాలు తెలిసినవాడు. అయాచితంగా దొరికింది ఎంత కొంచెమైనప్పటికీ దానిని మేరుపర్వతమంతగా భావించి సంతృప్తి చెందేవాడు. గృహస్థుగా ఆచరించవలసిన సర్వధర్మాలను సముచితంగా ఆచరించే నియమపరుడు.

ఉ. ఆ పురి నేలువాఁడు బహుళాశ్వుఁడు నా నుతి కెక్కినట్టి ధా
త్రీపతి యా ధరామరునిరీతిని నిష్కలుషాంతరంగుఁడై
యే పనులందు ధర్మగతి నేమఱఁ కర్థిఁ జరించుచుండె ల
క్ష్మీపతి వారిపైఁ గరుణఁ జేసి ప్రసన్న ముఖాంబుజాతుఁడై.

1178

తా ॥ బహుళాశ్వుడనే పేరుగల రాజు మిథిలాపురాన్ని ఆ రోజులలో పరిపాలిస్తుండేవాడు.

బహుళాశ్వుడు కూడా శ్రుతదేవునిలాగా నిర్మలమైన అంతఃకరణంతో ధర్మమార్గంలో ప్రవర్తించేవాడు. ఏ పని చేసినా ధర్మవిషయం మాత్రం మరచిపోయేవాడు కాదు. ఆ ఇద్దరిమీద భగవానుడైన శ్రీకృష్ణునికి అపారమైన కరుణ కలిగింది.

వ. అట్లు కృష్ణుండు వారల జూచువేడ్క నిజ స్యందనారూఢుండై, నారద వామదేవాత్రి కృష్ణరా మాసి తారుణ దివిజగురు కణ్వ మైత్రేయచ్యవనులును, నేనును మొదలైన మును లనుగమింపం జనుచుఁ దత్తద్దేశ నివాసులగు నానర్తక ధన్వ కురు జాంగల వంగ మత్స్య పాంచాల కుంతి మధు కేకయ కోసలాది భూవరులు, వివిధ వస్తుప్రచయంబులు గానుక లిచ్చి సేవింప, గ్రహమధ్యగతుండై దీపించు సూర్యునిం బోలి, య ప్పుండరీకాక్షుండు మందస్మిత సుందరవదనారవిందుం డగుచు వారలం గురుణార్ద్రదృష్టిం జూచి, యోగక్షేమంబు లరసి, సాదర భాషణంబుల నాదరించుచుఁ, గతిపయ ప్రయాణంబులం జని చని విదేహనగరంబు డాయం జనుటయు, నా బహుళాశ్వుండు న మ్మాధవు రాక విని మనంబున హర్షించుచు వివిధ పదార్థంబులు గానుకలుగాఁ గొని, తానును శ్రుతదేవుండును నెదురుగాఁ జనుదెంచి యప్పుడు.

1179

తా ॥ ప్రసన్నుడైన కృష్ణపరమాత్మ వారిని చూడాలనే వేడుకతో తన రథాన్ని అధిరోహించి బయలుదేరాడు. ఆ పరమాత్ముని వెంట నారదుడు, వామదేవుడు, అత్రి, అసితుడు, అరుణుడు, బృహస్పతి, కణ్వుడు, మైత్రేయుడు, చ్యవనుడు మొదలైన మహర్షులందరూ మిథిలకు బయలుదేరారు. నేను కూడా వారితో పాటు బయలుదేరాను. దారిలో ఆ యా దేశపు రాజులందరూ కృష్ణుణ్ణి చూడటానికి వచ్చారు. వారిలో ఆనర్తక, ధన్వ, కురు జాంగల, వంగ మత్స్య, పాంచాల, కుంతి, మధు, కేకయ, కోసల దేశాధిపతులు రకరకాల వస్తువులను శ్రీకృష్ణునికి కానుకలుగా సమర్పించి, సేవించారు. గ్రహాల మధ్యవెలిగే సూర్యుడిలాగా ప్రకాశిస్తూ, శ్రీకృష్ణుడు, చిరునవ్వులతో కూడిన సుందరవదనంతో రాజులందరి యోగక్షేమాలు

కనుక్కొన్నాడు. కరుణతో సాదరంగా సంభాషించాడు. ఆ విధంగా ఒక్కొక్క దేశం దాటుకొంటూ విదేహ నగరాన్ని చేరుకొన్నాడు. శ్రీకృష్ణుని రాకవిన్న బహుళాశ్వుడు పరమానంద భరితుడై వివిధ పదార్థాలు తీసుకువచ్చి శ్రీకృష్ణునికి కానుకలుగా సమర్పింపదలచి, శ్రుతదేవుని వెంట తీసుకొని, ఆ పరమాత్మునికి ఎదురువెళ్ళాడు.

ఉ. ఆ మునికోటికిన్ వినయ మారఁగ వందన మాచరించి, యా
తామరసాభలోచనుఁ దుదారచరిత్రుఁడు పాపగోత్ర సు
త్రాముఁడు భక్తలోకశుభదాయకుఁడైన రమేశు సద్గుణ
స్తోముని పాదపద్మములు సోఁకఁగ మ్రొక్కి వినమ్రులై తగన్.

1180

తా ॥ శ్రీకృష్ణునితో వచ్చిన మునులందరికీ బహుళాశ్వుడు, శ్రుతదేవుడు వినయవంతులై నమస్కరించారు. పవిత్ర చరిత్రగలవాడు, ఉదారస్వభావి, పాపాలనే పర్వతాలను ఛేదించే ఇంద్రునివంటివాడు, భక్తులకు శుభాలనిచ్చేవాడు, సద్గుణ గరిష్ఠుడు, కమలాక్షుడు, లక్ష్మీనాథుడు అయిన శ్రీకృష్ణుని పాదపద్మాలకు వినమ్రతతో వారిద్దరూ సాష్టాంగ నమస్కారాలు చేశారు.

చ. కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ! నీవు నీ మునీ
శ్వరులును మద్గృహంబునకు వచ్చి మముం గృప సేసి యిచ్చటం
గర మనురక్తిఁ బూజనలు గైకొనుఁడంచు నుతించి వేఁడ నా
హరి మనమందు వారి ప్రియంబుల కెంత బ్రమోదమందుచున్.

1181

తా ॥ బహుళాశ్వ శ్రుతదేవులిద్దరూ చేతులు జోడించి ఆ పరాత్పరుణ్ణి ప్రార్థించసాగారు. “జగన్నాథా! శ్రీకృష్ణపరమాత్మా! కరుణాసాగరా! నీమూ, నీతో వచ్చిన మునీశ్వరులూ అందరు దయతో మా ఇంటికి వచ్చి మా గృహాలను పావనం చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాం. మేము

చేసే పూజలను స్వీకరించవలసిందిగా వేడుకొంటున్నాం" అని చెప్పిన వారి వినయభాషణకు శ్రీకృష్ణుడు ఆనందించాడు.

ච. తిరముగ వారియిష్టములు దీర్పఁదలంచి మురాసురారి యొం
డొరుల కెఱుంగకుండ మునియూథముఁ దానును నేఁగె వారి మం
దిరముల కేకకాలమున ధీరత నా ధరణీవరుండు వా
రిరుహ దళాయతాక్షు మునిబృందములం గనకాసనంబులన్.

1182

తా ॥ కృష్ణుడు వారి కోరికలు తీర్చాలని నిశ్చయించాడు. కాకపోతే బహుళాశ్వ శ్రుతదేవులకు ఒకరి విషయం మరొకరికి తెలియకుండా, ఏకకాలంలోనే మహర్షులనందరినీ తీసుకొని వారిద్దరి మందిరాలకు శ్రీకృష్ణుడు వెళ్ళాడు. శ్రీకృష్ణుణ్ణి, ఋషులను చూసిన బహుళాశ్వుడు వారందరినీ బంగారు ఆసనాలపై కూర్చుండ చేసి గౌరవించాడు.

సీ. కూర్చుండ నియమించి కొమరారు కాంచన కలధౌత కలశోదకములచేతఁ
బాదముల్ గడిగి తత్పావన జలములు దానును సతియు బాంధవజనంబుఁ
గర మర్థి నిజమస్తకంబుల ధరియించి వివిధార్చనములు సద్విధి నొనర్చి
మణిభూషణాంబర మాల్యానులేపన రాజిత ధూప నీరాజనములు

తే. భక్తిఁ గావించి పరిమృష్ట బహు విధాన్న పాయసాపూప పరిక్వఫలము లోలి
నారగింపఁగఁ జేసి కర్పూరమిళిత లలిత తాంబూలములు నెయ్య మలర నొసఁగె.

1183

తా ॥ ఆ మహారాజు అందమైన బంగారు కలశాలలోని, వెండి కలశాలలోని జలాలతో వారందరి పాదపద్మాలు కడిగి ఆ పవిత్రజలాన్ని తన శిరస్సుపై చల్లుకొన్నాడు. పట్టపు దేవేరి తలపైన, బంధుజనుల శిరస్సులపైన ఆ పవిత్ర జలాన్ని చల్లి శాస్త్రోక్తంగా పూజనీయులనందరినీ

అర్చించాడు. మణిభూషణాలను, నూతన వస్త్రాలను, పుష్పమాలికలను, మైపూతలను సమర్పించాడు. భక్తితో ధూపదీపాలిచ్చి, నీరాజనాలతో కొలిచాడు. పంచభక్ష్య పరమాన్నాలతో భుజింపచేశాడు. చక్కగా మగ్గిన పండ్లనిచ్చాడు. పచ్చకర్పూరంతో ఘుమఘుమలాడు తాంబూలాలను సేవింపచేశాడు.

వ. ఇట్లు సమర్పించి యనంతరంబ య మ్మిథిలేశ్వరుండైన జనకుండు వరమానందంబును బొంది.

1184

తా ॥ ఈ విధంగా సమర్పించి శ్రీకృష్ణునికి, మునీంద్రులకు సకల సపర్యలు చేయసాగాడు మిథిలేశ్వరుడైన జనక మహారాజు. జనకరాజైన బహుళాశ్వుడి ఆనందానికి అవధులులేవు.

చ. హరిపదపద్మ యుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం
బురుషవరేణ్య ! యీ నిఖిలభూతగణావళి యాత్మలందు సు
స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర! నీ పదభక్తికోటితో
నరయ నుమాధినాథ చతురాస్యులుఁ బోల రటందు రెప్పుడున్.

1185

తా ॥ శ్రీకృష్ణపరమాత్మను గౌరవించి బహుళాశ్వుడు ఎనలేని భక్తితో ఆ స్వామి పాదాలను తన ఒడిలో పెట్టుకొని మెత్తగా, మెల్లగా ఒత్తుతూ ఇలా అన్నాడు: "పురుషోత్తమా! నీవు సమస్త జీవుల హృదయాలలో ఉండి, వారు చేయు పనులకు అన్నింటికీ సాక్షివై ఉంటావు. నీ భక్తులకు బ్రహ్మరుద్రాదులు సైతం సాటిరారని నీవంటూ ఉంటావు కదా!"

వ. అట్టి లోకవిదితం బయిన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయ పాదారవిందంబులందు నొకానొకవేళ లేశమాత్రధ్యానంబు గల నా గృహంబున కకించనుండని చిత్తంబునం దలంపక భక్తవత్సలుండ వగుటంజేసి విజయం చేసితివి; భవత్పాదపంకేరుహ

ధ్యానసేవారతిం దగిలిన మహాత్ములు త్వద్ధ్యానంబు వదలం జాలుదురే? నిరంతరంబును శాంతచిత్తులై నిష్కించనులై యోగీంద్రులై నీ వలనం గోరిక గలవారలకు నిన్నైన నిత్తువు గదా! యని వెండియు నిట్లనియె.

1186

తా ॥ అలా నీవు చెప్పిన మాటలు లోకవిదితాలు. అది నిజం చేయటానికే – ఎప్పుడో ఒక సమయమున నీ పాదపద్మాలమీద ఏదో రవ్వంత భక్తిగల నాపై దయచేసి ప్రేమగలవాడవు అగుట చేత నన్ను అల్పుడు, దరిద్రుడని అనుకోకుండా నా గృహమునకు వేంచేశావు. నీ భక్తవాత్సల్యానికి ఇదే నిదర్శనం. నీ పాదసేవలో ఆనందించే మహాత్ములు నీ ధ్యానమును వదలలేరు. ఎల్లప్పుడూ శాంతస్వభావులై, ఏ కోరికా లేకుండా నిన్నే ధ్యానిస్తూ, నిన్నే కొలుస్తూ, నిన్నే తలుస్తూ యోగీంద్రులైనవారు నిన్ను తప్ప ఇంక దేనినీ కోరరు. వారి కోరిక ప్రకారంగా వారికి నిన్నే వరంగా ప్రసాదిస్తావు. అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు.

తే. కృష్ణ ! పరమాత్మ ! యదుకుల క్షీరవార్ధి, పూర్ణచంద్రమ ! దేవకీపుత్త్ర! సుజన వినుత !
నారాయణాచ్యుత ! వేద వేద్య !, భక్తజనపోషపరితోష ! పరమపురుష !

1187

తా ॥ "శ్రీకృష్ణా! పరమాత్మా! యదువంశమనే పాలసముద్రాన్ని ఉప్పొంగజేసే పూర్ణచంద్రుడా! దేవకీ తనయా! సజ్జనుల చేత స్తుతింపబడేవాడా! నారాయణా! అచ్యుతా! పరమపురుషా! వేదాలలో తెలియబడేవాడా! భక్తులను రక్షించడంలోనే సంతుష్టిచెందే మహానుభావా!

ఉ. శ్రీ పురుషోత్తమాఖ్య ! యదుసింహకిశోరక ! భక్తలోక ర
క్షా పరతంత్ర ! నీవు మునిసంఘముఁ గొన్నిదినంబు లుండవే
నీ పదపద్మ రేణువులు నెమ్మి మదీయగృహంబు సోఁకినం

దాపసవంద్య ! యే నిపుడ ధన్యుఁడ నయ్యెదఁ గాదె మాధవా !

1188

తా ॥ మాధవా! పురుషోత్తమా! యదుసింహా! భక్తరక్షకా! తాపస సంస్తుత్యా! శ్రీకృష్ణా! నా ప్రార్థన ఆలకించి నీవు, మహర్షులు నా ఇంటిలో కొన్ని రోజులు ఉండవలసింది. నీ పాదధూళి గనుక నా ఇంట సోకితే, నేను పుణ్యాత్ముడను, ధన్యుడను అవుతాను.”

వ. అని యభ్యర్థించినం బ్రసన్నుండై య పుండరీకాక్షుండు నిమికుల ప్రదీపకుండైన జనక చక్రవర్తిం గరుణించి, య మ్మిథిలా నగరంబునం బౌరజనంబులకు నున్నత శోభనంబులు గావించుచుం గొన్నిదినంబు లుండె నంత.

1189

తా ॥ అని బహుళాశ్వుడు అర్థించేసరికి, కమలాక్షుడైన శ్రీకృష్ణుడు ‘నిమి’ కులాన్ని వెలిగింపచేసే ఆ జనక చక్రవర్తి అయిన బహుళాశ్వున్ని కరుణించాడు. పురప్రజలందరికీ సకల శుభాలూ ప్రసాదిస్తూ మిథిలానగరంలో కృష్ణుడు కొన్ని దినాలు గడిపాడు.

మ. శ్రుతదేవుండును మోదియై మునిజనస్తోమంబుతో నిందిరా
పతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్ప న్నేగి యచ్చోట స
మ్మతి దర్భాస్తరణంబుల న్నునిచి సమ్యగ్జ్ఞానపారీణుఁడై
సతియుం దానుఁ బదాబ్జముల్ గడిగి చంచద్భక్తిఁ దత్తోయముల్.

1190

తా ॥ మరోవైపు శ్రుతదేవుడు కూడా ఎంతో సంతోషంతో ఋషిపుంగవులను, శ్రీకృష్ణుణ్ణి తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. తన గృహంలో దర్భలతో చేసిన ఆసనాలను పఱచి వారినందరినీ కూర్చుండ జేశాడు. పరమాత్మ జ్ఞాన సంపన్నుడైన శ్రుతదేవుడు, తాను తన భార్యా కృష్ణపరమాత్మ యొక్క, మహర్షుల యొక్క పాదపద్మాలను కడిగారు. ఆ పవిత్ర జలాన్ని—

చ. శిరములఁ దాల్చి నవ్యతులసీదళ దామ కుశ ప్రసూన వి
స్ఫుర దరవింద మాలికలఁ బూజ లొనర్చి గృహాంధకూప సం
చరణుఁడ నైన నాకడకుఁ జక్రి దనంతనె వచ్చునట్టి సు
స్థిరమతి నే తపంబు ముని సేసితినో ? యని సంతసించుచున్.

1191

తా ॥ తమ శిరస్సులపై ధరించారు. తరువాత తులసీ మాలలతో, పద్మమాలికలతో, దర్భలపుష్పాలతో ఆ మహనీయులను పూజించారు. శ్రుతదేవుడు ఇలా అనుకొన్నాడు. “ఇల్లనే చీకటితో నిండిన బావిలోపడి కన్ను కనపడక సంచరిస్తున్న నా దగ్గరకు శ్రీమహావిష్ణువు తనంతట తాను వచ్చేటందుకు పూర్వజన్మలలో ఎంత గొప్ప తపస్సు చేసి ఉన్నానోకదా” అని శ్రీకృష్ణుని రాకకు మహదానంద పడిపోయాడు.

తే. మఱియుఁ దత్పాదతీర్థంబు మందిరమునఁ, గలయఁ జిలికించి సంప్రీతి గడలు కొనఁగఁ
బత్ర ఫలపుష్పతోయముల్ భక్తి నొసగి, హరిమురాంతకమూర్తి నిజాత్మ నిలిపి.

1192

తా ॥ అతి పావనమైన శ్రీకృష్ణుని పాదతీర్థాన్ని ఇల్లంతా కలయజల్లాడు. చెప్పలేనంత సంతోషంతో ఆ పరమాత్మను పూజించాడు. ఆకులతో, పండ్లతో, పూలతో, నీటితో, తన భక్తిని కలిపి భగవంతుణ్ణి సేవించాడు. శ్రీహరిని తన హృదయంలో పదిలపరచుకొన్నాడు.

తే. మానితంబుగ విశ్వనిదానమూర్తి, యైన కృష్ణుండు దనయింట నారగించెఁ
దన మనోరథసిద్ధియుఁ దనకు నబ్బె, నను చుఁ బైపుట్ట మల్లార్చి యాడుచుండె.

1193

తా ॥ విశ్వానికి మూలపూరుషుడైన శ్రీకృష్ణుడు తన ఇంటికి వచ్చి భోజనం చేశాడని శ్రుతదేవుడు పరమానందాన్ని అనుభవించాడు. తన మనోరథం నెరవేరిందని ఎంతగానో

పొంగిపోయి పైనవేసుకొన్న ఉత్తరీయాన్ని తీసి గిరగిరా త్రిప్పుతూ నృత్యం చేయసాగాడు.

చ. తరుణియుఁ దానుఁ బుత్రులుఁ బదంపడి కృష్ణు భజించుచుండ త
చ్చరణము లంకపీఠమునఁ జాఁచిన మెల్లన యొత్తుచున్ రమా
వరుఁ గని పల్కె భక్తజనవత్సల! మామకభాగ్య మెట్టిదో
హర చతురాస్యులు న్నెఱుఁగ నట్టి నినుం గనుగొంటి నెమ్మితోన్.

1194

తా ॥ శ్రుతదేవుడు, ఆయన సతీరత్నం, పుత్రులు అందరూ కలిసి కృష్ణుణ్ణి సేవిస్తున్నారు. శ్రుతదేవుడు భగవంతుని పాదపద్మాలను తన ఒడిలోకి చాచి పెట్టుకొని మెల్లగా ఒత్తుతున్నాడు. కొంతసేపటి తర్వాత ఆ భక్తుడు పరమాత్మణ్ణి చూసి "దేవా! భక్తవత్సలా! నా అదృష్టమేమిటోగాని, శివుడు, బ్రహ్మదేవుడు కూడా తెలుసుకోలేనటువంటి నిన్ను దర్శించగలిగాను.

క. ముని యోగిమానస స్ఫుట, వనజంబుల నెల్లప్రొద్దు వర్తించు భవ
ద్ఘనదివ్యమూర్తి నా లో, చనగోచర మయ్యెఁగాదె ! సర్వాత్మ ! హరీ !

1195

తా ॥ స్వామీ! సర్వాత్మా! శ్రీహరీ! మహానుభావులైన మహర్షుల మనఃపద్మాలలో ఎప్పుడూ నివసించే నీ యొక్క మహత్తరమైన దివ్య రూపాన్ని కనులారా చూడగలిగాను గదా!

వ. దేవా! నీ సచ్చరితంబులు గర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు, నీకుం బూజ లొనర్చుచు, నీ చరణారవిందంబులకు వందనంబులు సేయుచు, నీ దివ్యనామ సంకీర్తనంబులు సేయుచుం దమ శరీరంబులు భవదధీనంబులుగా మెలంగు నిర్మలబోధాత్మ లగువారి చిత్తంబు లను దర్పణంబులం గానంబడుచుందువు; కర్మవిక్షిప్త చిత్తులైన వారి హృదయంబుల నుండియు, దూరగుండ వగుదు; వని మఱియు నిట్లనియె.

1196

తా ॥ దేవదేవా! నీ యొక్క పరమ పావనమైన చరిత్రను వీనులవిందుగా వింటూ, నీకు పూజలు చేస్తూ, నీ పాదపద్మాలకు నమస్కరిస్తూ, దివ్యమైన నీ సహస్రాధిక నామాలను సంకీర్తన చేస్తూ, తమ శరీరాలను నీ అధీనం చేస్తూ, ఆత్మజ్ఞానాన్ని పొందిన మహాభక్తుల మనస్సులనే అద్దాలలో కనబడుతుంటావు. కర్మలయందే నిమగ్నులైన వారి హృదయాల నుండి దూరంగా జరుగుతావు.

సీ. నీకు మ్రొక్కెదఁ గృష్ణ ! నిగమాంత సంవేద్య ! లోకరక్షక ! భక్తలోక వరద !
నీపాదసేవనానిరతుని నన్ను నే పనిఁ బంపె దాన తిమ్మనినఁ గృష్ణుఁ
డెలనవ్వు మోమునఁ జెలువొంద నా విప్రు కర మాత్మకరమునఁ గదియఁ జేర్చి
పాటించి యతనితోఁ బలికెఁ దపశ్శక్తి వఱలిన య మ్మునివర్యు లెపుడు

తే. దమ పదాంబుజరేణు వితానములను, దవిలి లోకంబులను బవిత్రంబు సేయు
వారు ననుఁగూడి యెప్పుడు వలయునెడల, కరుగుదెంతురు నీ భాగ్య గరిమ నిటకు.

1197

తా ॥ తండ్రీ! శ్రీకృష్ణా! జగద్రక్షకా! భక్తవరదా! వేదాలలో, వేదాంతాలలో తెలియబడే పురాణపురుషా! నీకివే నా మ్రొక్కులు. ఎల్లవేళలా నీ పాదసేవలో మునిగి ఉండే నన్ను నీవు ఏ పనికి ఆజ్ఞాపించినా, దానిని శిరోధార్యంగా భావించి చేస్తాను. దేవా! ఆనతివ్వు." అని వేడుకొంటున్న శ్రుతదేవుణ్ణి చూసి ప్రేమతో శ్రీకృష్ణుడు చిరునవ్వులు చిందించాడు. ఆ విప్రుని చేతిని తన చేతిలోనికి తీసుకొని నిమురుతూ శ్రీకృష్ణుడిలా అన్నాడు: "శ్రుతదేవా! తపశ్శక్తితో మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్న ఈ మహర్షిశ్రేష్ఠులు తమ పాదాలు తాకటంచేత ఆ పాదధూళితో సమస్త లోకాలను పవిత్రం చేసే మహానుభావులు. అటువంటి మహాత్ములు నాతో కలిసి ఎప్పుడెక్కడకు వెళ్ళాలని అనుకొంటే అప్పుడక్కడికి వెళుతుంటారు. ఈ రోజు నీ అదృష్టంకొద్దీ, నీవు చేసిన పుణ్యఫలానుసారంగా నీ ఇంటికి నాతోపాటు వచ్చారు.

వ. చనుదెంచిరి; పుణ్యస్థలంబులును విప్రులును దేవతలును సంస్పర్శన దర్శనార్చనంబులం బ్రాణులను సమస్త కిల్బిషంబులం బాయం జేయుదు; రదియునుం గాక బ్రాహ్మణుండు జనన మాత్రంబున జీవకోటియందు ఘనుండై యుండు, జపతపోధ్యానాధ్యయనాధ్యాత్మములం జతురుండై మత్కలాశ్రయుం డయ్యేనేని నతందుత్తముండై వెలుంగు; నతనిం జెప్ప నేల? యని వెండియు నిట్లనియె.

1198

తా ॥ చూడు భూసురోత్తమా! పవిత్రమైన పుణ్యక్షేత్రాలు, విప్రోత్తములు, దేవతలు – స్పర్శ చేతగాని, దర్శనం వల్లగాని అర్చనాదులవల్లగాని మానవులను సమస్త పాపాలనుండి విముక్తుల్ని చేస్తారు. అంతేకాక, బ్రాహ్మణుడు పుట్టుక చేతనే సమస్త జీవరాశుల్లోనూ ఉత్తమోత్తముడుగా ప్రకాశిస్తాడు. జపం చేత, తపస్సు చేత, ధ్యానం చేత, వేదాదులను అధ్యయనం చేయటంవల్ల మహాత్ముడై, నా దైవశక్తిని ఆశ్రయించుకొని ఉంటే నిజంగా ఆ పురుషుడు ఉత్తమోత్తముడుగానే పరిగణింపబడతాడు. అంతటి మహానుభావుణ్ణి గురించి వివరంగా చెప్పవలసిన పనిలేదు." అని శ్రీకృష్ణుడింకా ఇలా చెప్పాడు:

క. నా మది విప్రులపైఁ గల, ప్రేమము నా తనువునందుఁ బెట్టని కతనవ్
భూమీసురు లర్హులు; నీ, వీ మునులం బూజ సేయు మిద్ధచరిత్రా!

1199

తా ॥ "శ్రుతదేవా! నాకు భూసురోత్తములమీద ఉన్న ప్రేమ, వాత్సల్యం ఎవరి మీదా లేవు. చివరకు నా శరీరం మీదకూడా నాకంత ప్రేమలేదు. అందుచేత నీవు చేసే సేవలకు ఈ భూసురులు అర్హులైనవారు. వారినందరిని పూజించి తరించు.

క. ఇదియే నా కిష్టము ననుఁ, బదివేలవిధంబు లొలయ భజియించుటగా
మది కిం పగు నటు గావున, వదలని భక్తిన్ భజింపు వసుధామరులన్!

1200

తా ॥ ఇదే నాకిష్టం. నాతో వచ్చిన బ్రాహ్మణులను శ్రద్ధాభక్తులతో నీవు పూజిస్తే నన్ను దానికి పదివేలరెట్లుగా పూజించినట్లు భావిస్తాను. నా మనస్సుకు కూడా ఆనందం కలుగుతుంది. కాబట్టి నీవు ఈ మహర్షులనందరినీ అపరిమితమైన భక్తితో పూజించు."

క. అని సర్వలోక విభుఁ డగు, వనజోదరుఁ డానతిచ్చు వాక్యంబుల జా
డన భూమీసురుఁ డమ్మని, జనులకు సద్భక్తిఁ బూజ సలిపెన్ వరుసన్.

1201

తా ॥ అని జగన్నాథుడైన శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చిన విధంగా శ్రుతదేవుడు వరుసగా, మహర్షులందరినీ సద్భక్తితో పూజించాడు.

చ. ఎనయఁగఁ గృష్ణుఁడంత మిథిలేశ్వరభూసురులం గృపావలో
కన మొలయ న్ననూనసుభగస్థితిఁ బొందఁగఁ జేసి వారి వీ
డ్కొని రథ మెక్కి దివ్యమునికోటియుఁ దానును వచ్చెఁ గ్రమ్మఱన్
జనవర! మోక్షదం బగు కుశస్థలికిం బ్రమదాంతరంగుఁడై!

1202

తా ॥ ఆ విధంగా మహాభక్తులైన మిథిలానాథుని చేత, శ్రుతదేవుడి చేత పూజలందుకొన్న శ్రీకృష్ణుడు వారిద్దరిని కరుణామృత దృక్కులతో వీక్షించి, వారికి సకల సిరిసంపదలు, శుభాలు, అత్యంత భక్తి ప్రసాదించి; బహుళాశ్వుణ్ణి, శ్రుతదేవుణ్ణి వీడ్కొని నిజపురానికి బయలుదేరాడు. పరీక్షిత్తూ! దేవమునులందరూ వెంటరాగా, శ్రీకృష్ణుడు రథారోహణ చేసి, మిథిలనుంచి తిరిగి మోక్షదాయకమైన ద్వారకానగరానికి, సంతోషమనస్కుడై వెళ్ళాడు."

# శ్రుతిగీత

వ. అని చెప్పిన బాదరాయణికి నభిమన్యు నందనుం డిట్లనియె; మునీంద్రా! ఘటపటాదివస్తు జాతంబు భంగి నిర్దేశింప నర్హంబు గాక, సత్త్వాదిగుణ శూన్యంబైన బ్రహ్మంబునందు సత్త్వాది గుణగోచరంబులైన వేదంబు లేక్రమంబునం బ్రవర్తించు, నట్టి చందంబు నా కెఱిఁగింపు మనిన భూవరునకు మునివరుం డిట్లనియె; 'సకల చేతనా చేతనాంతర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్ద వాచ్యుండు గావున సకల జంతు నివహంబులందు బుద్ధీంద్రియ మనః ప్రాణ శరీరంబులను సృజియించి; చేతనవర్గంబునకు జ్ఞాన ప్రదుండగుం గావున సకల నిగమసమూహంబులును దత్స్వరూపగుణ వైభవ ప్రతిపాదకంబులు గావున ముఖ్యంబై ప్రవర్తించు; శ్రుతిస్తోత్రం బుపనిషత్తుల్యంబు; ననేక పూర్వఋషి పరంపరా యాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వం డనుసంధించు, నతనికి మోక్షంబు సులభంబు; దీనికి నారాయణాఖ్యాతంబగు నొక్క యుపాఖ్యానంబు గలదు; వినిపింతు, వినుము; భగవత్ప్రియుండైన నారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషి గణసమేతుండైన నారాయణఋషిం గనుంగొని నీవు న న్నడిగినట్ల యమ్మహాత్ముని నడిగిన నతండు ము న్నీ యర్థంబు శ్వేతద్వీప వాసులైన సనకసనందనాది దివ్యయోగీంద్రులు ప్రశ్న సలిపిన, వారలకు సనందనుండు చెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెద' నని చెప్పం దొడంగె; శయానుండైన రాజశ్రేష్ఠునిఁ దత్పరాక్రమ దక్షతాది చిహ్నంబులను నుతియించు వందిజనంబుల చందంబున జగదవసాన సమయంబున ననేక శక్తియుతుండై యోగనిద్రా వశుండైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు సేయు విధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగు విను మని యిట్లనియె.

1203

తా ॥ అని చెప్పిన శుకమహర్షితో పరీక్షిత్తు ఈ విధంగా అన్నాడు: "మునీంద్రా! ఇది

కుండ, ఇది వస్త్రము అని వేరుచేసి వస్తువులమాదిరి స్పష్టంగా చెప్పడానికి వీలులేకుండా; సత్త్వగుణము మొదలైన గుణాలేవీ లేనటువంటి 'పరబ్రహ్మ' లో సత్త్వాది గుణాలు స్పష్టంగా గోచరించే వేదాలు ఏ విధంగా ఉంటాయో, ఆ విషయం నాకు వివరంగా తెలియజేయవలసింది".

అప్పుడు పరీక్షిత్తుతో శుకయోగి ఇలా చెప్పాడు: "రాజా! చేతనములైన జీవరాశుల్లోనూ, అచేతనాలైన సమస్త వస్తుజాలంలోను – సర్వానికీ అధిపతి అయిన పరమాత్మ సర్వశబ్దవాచ్యుడై అందరిలోనూ, అన్నింటిలోను ఉంటాడు. కనుక సకల జీవులలోను బుద్ధిని, ఇంద్రియ జ్ఞానాన్ని, మనస్సును, ప్రాణాలను, శరీరాలను సృష్టించి, ఆ జీవరాశి అంతటికీ జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. అందుచేత వేదాలన్నీ భగవత్స్వరూపాన్ని, గుణాలను ప్రతిపాదిస్తూ ముఖ్యమైనవిగా ఉంటాయి. శ్రుతులు చేసే స్తోత్రం ఉపనిషత్తులతో సమానమైనది. పూర్వ ఋషులనుండి పరంపరగా వచ్చిన శ్రుతి స్తోత్రాన్ని ఎవరైతే శ్రద్ధగా అనుసంధిస్తారో – వారికి మోక్షం సులభమౌతుంది. ఈ స్తోత్రాన్ని 'నారాయణ' మహర్షి చెప్పినట్లుగా ఒక కథ ఉంది, చెబుతాను, శ్రద్ధగా విను.

భగవంతునికి ప్రియభక్తుడైన నారదమహర్షి ఒకనాడు నారాయణమహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. నారదుడు ఋషిసమూహం చేతపరివేష్టింపబడి ఉన్న నారాయణమహర్షిని చూసి నీవు నన్నేదైతే అడిగావో అదే విషయాన్ని అడిగాడు. అప్పుడు నారాయణ ఋషి – "పూర్వం ఈ పరమార్థాన్ని సనందన మహర్షి శ్వేత ద్వీపంలో నివసిస్తున్న దివ్యమునులు అడగగా చెప్పాడని – ఆయన వారికి చెప్పిన విషయం నీకు చెబుతాన" ని నారదుణ్ణి చూసి చెప్పసాగాడు. "శయనించి ఉన్న మహారాజుయొక్క పరాక్రమవైభవాన్ని, పరిపాలనాదక్షతను ఏ విధంగా వంది మాగధులు స్తుతిస్తారో, ఆ విధంగా జగత్తు అంతమయ్యే వేళలో – అనేక శక్తులను కలిగి ఉండి యోగనిద్రలో పరవశుడై ఉండే సర్వేశ్వరుణ్ణి వేదాలు వివిధ రకాలుగా ప్రస్తుతిస్తాయి." ఆ శ్రుతి స్తోత్రం ఏ విధంగా ఉంటుందో నారదుడికి నారాయణ మహర్షి వివరించి చెప్పాడు. దానిని నీకు వివరిస్తాను. వినమని శుకుడు పరీక్షిత్తుతో ఇలా చెప్పాడు:

సీ. 'జయ జయ హరి ! దేవ ! సకలజంతువులకు జ్ఞానప్రదుండవు గాన వారి
వలన దోషంబులు గలిగిన సుగుణ సంతానంబుగాఁ గొని జ్ఞానశక్తి
ముఖ్యషడ్గుణ పరిపూర్ణతఁ జేసి మా యాత్మవిశిష్టుండ వగుచుఁ గార్య
కారణాత్మకుఁడవై కడఁగి చరించుచు నున్న నీయందుఁ బయోరుహాక్ష !

తే. తివిరి యామ్నాయములు ప్రవర్తించుఁ గాన ప్రకట త్రిగుణాత్మకంబైన ప్రకృతితోడి
యోగ మింతయు మాన్పవే ! యోగిమాన, సాంబుజాత మధువ్రత !' యని నుతించి.

1204

తా ॥ "కమలాక్షా! శ్రీహరీ! యోగుల మానసాలనే పద్మాలయందు చరించు తుమ్మెదవంటి పరాత్పరా! దేవా! నీకు జయము కలుగుగాక! సమస్త జీవులలో జ్ఞానాన్ని కలిగించేవాడివి నీవు. వారిలో దోషాలు ఏర్పడినా, వాటిని సుగుణాలుగానే పరిగణించి, జ్ఞానశక్తి మొదలైన ఆరు గుణాలతో వారిని పరిపూర్ణులను చేస్తావు. కార్యకారణ రూపకుడిగా చరిస్తుంటావు. సమస్త ప్రాణులలో నీవే ఆత్మరూపుడివై ప్రకాశిస్తుంటావు. అటువంటి నీలోనే వేదాలన్నీ ప్రవర్తిస్తుంటాయి. కాబట్టి ఓ పరమ పురుషా! త్రిగుణాలైన సత్త్వరజస్తమో గుణాలతో మిళితమై ఉండే ప్రకృతితో మాకు ఏర్పడిన బంధాన్ని తొలగించు.

వ. అదియునుం గాక.

1205

తా ॥ అంతేకాక—

సీ. పరమవిజ్ఞాన సంపన్నులైనట్టి యోగీంద్రులు మహితనిస్తంద్రలీలఁ
బరిదృశ్యమానమై భాసిల్లు ని మ్మహీపర్వత ముఖర ప్రపంచ మెల్ల
బరఁగ బ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు రెలమి నీవును జగద్విలయవేళ
నవశిష్టుఁడవు గాన ననఘ ! నీయందు నీ విపుల విశ్వోదయవిలయము లగు

తే. ఘట శరావాదు లగు మృద్వికారములు మృ, దాత్మకంబైన యట్లు పద్మాయతాక్ష !
తవిలి కారణరూపంబుఁ దాల్చి లీలఁ, గడఁగు నీయందు బుద్ధి వాక్కర్మములను.

1206

తా ॥ కంటికి కనిపిస్తూ ప్రకాశించే ఈ భూమీ, పర్వతాలు మొదలైన వాటితో నిండి ఉన్న విశ్వమంతటినీ తత్త్వజ్ఞాన సంపన్నులైన మహాయోగులు పరబ్రహ్మస్వరూపంగానే దర్శిస్తారు. ప్రళయకాలంలో నీవు ఒక్కడివే మిగిలి ఉంటావు. కమలాక్షా! పురుషోత్తమా! కుండలు, వాటి మూతలైన మూకుళ్ళూ మట్టితో తయారు చేయబడి మట్టిరూపాలుగా ఉన్నట్లే విశ్వానికి కారణభూతుడవైన నీలోనే విశాలమైన ఈ విశ్వం యొక్క పుట్టుక, నాశనం రెండూ అంతర్లీనమౌతాయి. విశ్వాన్ని నీవే పుట్టిస్తావు. మళ్ళీ నీవే అంతం చేస్తావు.

క. అలవడఁ జేయుచు నందరు, బలకొని యిలఁ బెట్టఁబడిన పదవిన్యాసం
బులు పతనకారణముగా, నలవున సేవించుచును గృతార్థులు నగుచున్.

1207

తా ॥ ప్రాజ్ఞులైన మహాపురుషులు సృష్టి స్థితిలయకారకుడైన నీ యందు తమ బుద్ధిని, వాక్కును, ప్రతి కర్మను లగ్నం చేస్తారు. భూమిమీద అడుగు మోపడాన్ని మరోజన్మకు నాందిగా భావించి, అది తమ పతనానికి కారణమని భావించి ఎల్లవేళలా నిన్నే సేవిస్తుంటారు. పునర్జన్మ లేకుండా నీ సన్నిధి చేరాలనే తమకోరిక నెరవేరాలని నిన్నే ధ్యానిస్తుంటారు.

క. లీలం బ్రాకృతపూరుష, కాలాదిక నిఖిలమగు జగంబుల కెల్లన్ మాలిన్య నివారక మగు,
నీ లలితకథాసుధాబ్ధినిం గ్రుంకి తగన్.

1208

తా ॥ పామరులతో, నీచులతో నిండి ఉండి, కాలస్వరూపమైన ఈ సమస్త విశ్వంలో గోచరించే మలినాలను, దుష్టత్వాన్ని, పాపాలను నివారించి నీ మధురాతి మధురమైన కథలనే

అమృతవారధిలో స్నానమాడి జ్ఞానులు పునీతులౌతుంటారు.

చ. భరిత నిదాఘ తప్తుఁడగు పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కరమగు తాపముం దొఱగు కైవడి సంసరణోగ్రతాపమున్
వెరవునఁ బాయుచుండుదురు నిన్ను భజించు మహాత్మకుల్ జరా
మరణ మనోగుణంబులఁ గ్రమంబునఁ బాయుట సెప్ప నేటికిన్ ?

1209

తా ॥ మండు వేసవిలో ఎండ బాధకు తట్టుకోలేక చల్లని నీళ్ళలో స్నానం చేసి భరించ శక్యంకాని ఆ బాధను పోగొట్టుకొనే బాటసారిలాగా నిన్ను సేవించే మహాత్ములు మహోగ్రమైన సంసారతాపం నుంచి తప్పించుకొంటుంటారు. సంసార బాధనే వారు తప్పించుకోగలిగినప్పుడు ఇక వార్ధక్యం నుంచి, మరణం నుంచి తప్పించుకోవటం ఎంతపని కనుక!

వ. అదియునుం గాక.

1210

తా ॥ అంతేకాదు.

సీ. అనయంబు దేహి నిత్యానిత్య సద్విలక్షణమునఁ బంచకోశ వ్యవస్థ
నభివృద్ధిఁ బొరయుచు నందులోపల నున్న ప్రాణాన్నబుద్ధివిజ్ఞానమయము
లను చతుష్కోశంబు లవ్వల వెలుఁగొందు నానందమయుఁ డీవు గాన దేవ !
సురుచిర స్వప్రకాశుండవు నీ పరిగ్రహము గల్గుటం జేసి కాదె ప్రకృతి

తే. మహదహంకార పంచతన్మాత్ర గగన, పవన తేజోంబు భూతపంచకాది కలిత
తత్త్వముల్ బ్రహ్మండకార్య కరణ, మందు నెపుదు సమర్థంబు లగుటఁ జేసి.

1211

తా ॥ దుర్లభమైన మనుష్యదేహము ధరించిన ప్రాణులు శాశ్వతమూ, అశాశ్వతమూ అనే ఈ రెండు లక్షణాలకంటే విలక్షణమైన పరబ్రహ్మ స్వరూపముచేతను కూడి అన్న, ప్రాణ, మనోబుద్ధి, విజ్ఞాన మయాలనే నాలుగు కోశాలకు అవతల ఉన్న ఆనందమయకోశంలో స్వయంప్రకాశుడవై వెలుగొందుతుంటావు. దేవా! నీవు నీ శక్తిని ప్రసాదించటం చేతనే ఈ ప్రకృతిగాని, మహత్తుగాని, అహంకారంగాని, పంచతన్మాత్రలైన శబ్ద స్పర్శ రూప రస గంధాలుగాని, పంచభూతాలైన ఆకాశం, వాయువు, అగ్ని, జలము, భూమిగాని వాటివాటి తత్త్వాల చేత బ్రహ్మాండ నిర్వహణలో సృష్టి స్థితిలయాలను సమగ్రంగా చేయగలుగుతున్నాయి.

క. కోరి శరీరులు భవదను, సారంబున నిహపరైక సౌఖ్యంబులఁ బెం
పారఁగ నందుచు నుందురు, ధీరజనోత్తము లనంగ దివిజారిహరా !

1212

తా ॥ దుష్టదానవసంహారీ! నిన్ను ఎల్లప్పుడూ కోరి సేవిస్తుండటం వల్లనే భక్తజనులు ఇహపరసౌఖ్యాలనన్నిటినీ కలిగి ఉండి ధీరోదాత్తులుగా చెప్పబడుతుంటారు.

ఆ. నిన్ను ననుసరింప నేరని కుజనులు, పవనపూర్ణ చర్మభస్త్రి సమితి
యోజఁ జేయుచుందు రుచ్ఛ్వసనంబులు, బలసి యాత్మదేహభజను లగుచు.

1213

తా ॥ నిన్ను కొలవనివాళ్ళు దుష్టులు. వాళ్ళు ఎప్పుడూ స్వార్థంతో శరీర సౌఖ్యాలపైననే ఆసక్తి కలిగి ఉంటారు. గాలి కొట్టిన తోలుతిత్తివంటి శరీరంపైని ప్రేమతో ప్రాణాలు నిలుపుకొంటూ, ఆ శరీరమే జీవాత్మగా భావించి శరీరాన్నే కొలుస్తుంటారు.

సీ. దేవ! కొందఱు సూక్ష్మదృక్కులై నట్టి మహాత్మకు లుదరస్థుఁడైన వహ్ని
గా మదిఁ దలఁతురు కైకొని మఱికొంద, ఱారుణు లనుపేర నమరు ఋషులు
లీల సుషుమ్నానాడీ మార్గగతుఁడవై, హృత్ప్రదేశమునఁ జరించుచున్న

రుచి దహరాకాశ రూపిగా భావింతు, రట్టి హృత్పద్మంబునందు వెడలి

తే. వితతమూర్ధన్య నాడికాగతుల నోలి, బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి పరమపురుష ! సుమహితానందమయ పరంజ్యోతియైన, ఈశు నినుఁ బొంది మఱి పుట్ట రవనియందు.

1214

తా ॥ దేవదేవా! పరంజ్యోతిరూపా! సూక్ష్మదృష్టిగల మహాత్ములు కొంతమంది నిన్ను తమ ఉదరంలో ఉండే అగ్నిగా భావించి కొలుస్తారు. అరుణులనే పేరుతో పిలవబడే మరికొంతమంది ఋషులు—నిన్ను—సుషుమ్నా నాడీ మార్గంలో ఉండి హృదయంలో చరిస్తుండే ప్రకాశమానుడవైన సూక్ష్మరూపుడిగా గుర్తిస్తారు. ఆ హృదయపద్మం నుంచి బయటకు వచ్చి మూర్ధన్యనాడిని క్రమంగాదాటి బ్రహ్మరంధ్రాన్ని చేరుకొంటారు. అక్కడ పరమానందమయమైన నీ యొక్క పరంజ్యోతి రూపాన్ని దర్శించి పరవశించి పోతారు. పరమపురుషా! మహామునులు ఆ విధంగా మోక్షపదవిని పొందుతారు. వారికి ఇక పునర్జన్మంటూ ఉండదు.

వ. మఱియు వివిధకాష్ఠాంతర్గతుం డయిన వాయుసఖుండు తద్గత దోషంబునం బొరయక నిత్యశుద్ధుఁడై తరతమభావంబున వర్తించు చందంబున స్వసంకల్పకృతంబు లయిన విచిత్రశరీరంబులయందు నంతర్యామియై ప్రవేశించి తత్తద్విచిత్రయోనిగతంబైన హేయంబులం బొరయక సకలాత్మసమంబై బ్రహ్మంబయిన నిన్ను నైహికాముష్మిక ఫలసంగమంబు లేక విగతరజో గుణంబులం దగిలి కొందఱు భజియించుచుందురు; రదియునుం గాక దేవా! భవదీయ సంకల్పాధీనంబు లయిన శరీరంబులం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతం బని తెలిసి కొందఱు భవనివారకంబయిన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థు లగుదురు; మఱియును.

1215

తా ॥ రకరకాల కట్టెలలో, కర్రలలో అంతర్లీనంగా అగ్నిదేవుడున్నప్పటికీ వాటిలోని

దోషము అగ్నికి అంటదు. నిత్యం పరిశుద్ధుడై, పవిత్రంగా అగ్నిదేవుడున్నట్లే నీ సంకల్పమాత్రంచేత పుట్టించిన వివిధములైన శరీరాలయందు నీవు అంతర్యామిగా ఉంటావు. అయినా, ఆ యా విచిత్రములైన శరీరములందలి దోషాలు నీకు అంటవు. సకల జీవుల ఆత్మలందూ ఒక్క సమంగా ప్రవర్తించే పరబ్రహ్మమైన నిన్ను – ఏ కోరికలూ లేకుండా, రజోగుణ విరహితులై కొందరు భక్తులు నిన్ను సేవించడంలోనే తరిస్తుంటారు. దేవా! నీ అధీనంలో జన్మించిన జీవులందరూ నీలోనే ఐక్యమౌతారన్న విషయం తెలుసుకొన్న కొందరు జన్మరాహిత్యాన్ని కలిగించే మంగళకరమైన నీ పాదపద్మాలు సేవించి కృతార్థులౌతుంటారు.

సీ. 'అనఘ ! దుర్గమమైన యాత్మతత్త్వంబు ప్రవర్తించుకొఱకు దివ్యంబులైన
యంచిత రామకృష్ణాద్యవతారముల్ భజియించియున్న నీ భవ్యచరిత
మను సుధాంభోనిధి నవగాహనము సేసి విశ్రాంతచిత్తులై వెలయుచుండి
మోక్షంబు బుద్ధి నపేక్షింప నొల్లరు మఱియుఁ గొందఱు భవచ్చరణపంక

ఆ. జములఁ దగిలి పుణ్యతము లైన హంసల, వదువు నొంది భాగవతజనముల
నొనరువారు ప్రకట యోగిజనప్రాప్య, మైన ముక్తిఁ గోర రాత్మలందు.

1216

తా ॥ మహాత్మా! పామరులు ఆత్మతత్త్వాన్ని సులభంగా గ్రహించలేరు. పరమాత్మ తత్త్వాన్ని తెలియజేయడానికే దివ్యంగా ప్రకాశించే రామావతారాన్ని, కృష్ణావతారాన్ని ఎత్తి మానవుడిగా జీవించి మానవులకు తత్త్వబోధ చేశావు. తక్కిన అవతారాల ప్రబోధాలుకూడా ఆత్మతత్త్వాన్ని తెలియచేస్తున్నాయి. ఉత్తమమైన నీ చరిత్ర అనే అమృత వారధిలో స్నానంచేసి పవిత్రులైన వారు మోక్షం కూడా కోరరు. మరికొంతమంది నీ పాదపద్మములయందే మనస్సు నిలిపి పుణ్యపురుషులైన పరమహంసలవలె, భగవద్భక్తులుగా కొనియాడబడే వారుకూడా తమ తమ హృదయాలలో యోగిపుంగవులకు లభించే మోక్షం తమకు లభించాలని కోరుకోరు.

ఉ. కొందఱు నీ శరీరము లకుంఠితభక్తి భవద్వశంబులై

చెందఁగ నీ పదాబ్జములు సేరి భజించుచుఁ దత్సుఖాత్ములై
యుందురు కొంద ఱీ తనువు లోలి ధరించి భవత్పదాబ్జముల్
పొందుగఁ గొల్వలేక నిలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందు రవ్యయా!

1217

తా ॥ నారాయణా! ఈ శరీరాలను నీ వశం చేసి అఖండమైన భక్తితో కొంతమంది నీ పాదపద్మాలను ఎల్లవేళలా పూజిస్తూ పరమానందంలో మునిగి తేలుతుంటారు. అయితే మరికొందరు ఏం చేస్తారంటే ఈ శరీరసుఖాలే శాశ్వతమని భ్రమించి నీ పాదపద్మాలను సేవించలేక ఈ భూమిపై పుడుతూ చస్తూ అధోగతి పాలవుతుంటారు.

చ. యమ నియమాది యోగమహితాత్మకులైన మునీంద్రులున్ విరో
ధమునఁ దలంచు చైద్యవసుధావర ముఖ్యనృపుల్ ఫణీంద్ర భో
గము లన నొప్పు బాహువులు గల్గిన నిన్ను భజించు గోపికల్
క్రమమున నేమునున్ సరియ కామె భవత్కృప కంబుజోదరా!

1218

తా ॥ పద్మనాభా! యమనియమాలు కలిగి యోగనిష్ఠలో మునిగి నిన్నే అనవరతం ధ్యానించే మునీంద్రులు, శత్రుభావంతో అనుక్షణం నిన్నే తలచుకొనే శిశుపాలాది రాజులు, మధురభావనతో అనునిత్యం నిన్నే భజించే గోపికలు, మేమూ నీ కృపకు సమానులమేకదా!

మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ బ్రత్యక్షంబునం గాన నె
వ్వరికిం బోలదు శాస్త్రగోచరుఁడవై వర్తింతు వీ సృష్టి ముం
దర సద్రూపుఁడవైన నీ వలననే ధాత్ర్యాద్యమర్త్యుల్ జనిం
చిరి ని న్నంతకు మున్నెఱుంగఁగలమే చింతింప నే మచ్యుతా!

1219

తా ॥ అచ్యుతా! అరవిందాక్షా! నీ రూపాన్ని ఈ భువిలో ఎవరూ కూడా చూడలేరు. శాస్త్రాలలో గోచరుడువవుతావే గాని ప్రత్యక్షంగా కనబడవు. ఈ సమస్త సృష్టికి పూర్వం సత్యరూపుడవైన నీ వల్లనే భూమి మొదలైన పంచభూతాలు, బ్రహ్మాదిదేవతలు ఉద్భవించారు. సృష్టికి ముందున్న నీ చిత్స్వరూపాన్ని మేం చూడగలమా?

వ. అట్టి నిన్నుం బరమాణు కారణవాదులైన కణ్వ గౌతమాదులును, బ్రకృతికారణవాదు లయిన సాంఖ్యులును, దేహాత్మవాదు లయిన బౌద్ధులును, వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబులైన మతంబులు దమ తమ కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు; మహాభాగ్యవంతు లయిన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షంబైన నివి యన్నియు నసత్యంబులని కానవచ్చు. వెండియుఁ గొందఱు సచరాచర వస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవ యగుటం దెలియలేక నిత్యం బనియు, ననిత్యం బనియు విపరీతబుద్ధిం దెలియుదురు. గాని భవదీయ దివ్య తత్త్వంబు నిక్కంబుగఁ దెలియజాలరు; కొందఱు జగచ్ఛరీరుండవు గాన జగద్రూపకుండవైన నిన్నుం గటక మకుట కర్ణికాది వివిధ భూషణభేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండ వయ్యును నిఖిల హేయప్రత్యనీక కల్యాణ గుణాత్మకుండవై యుందువని యాత్మవిదులయిన వారు దెలియుదు; రదియునుం గాక.

1220

తా ॥ అటువంటి ఆదిపురుషుడవైన నిన్ను తెలుసుకోవటం మహాత్ములకే చేతకాలేదు. సృష్టిమొత్తానికి పరమాణువులే కారణమని వాదించిన కణ్వ గౌతమ మునీంద్రులు, కాదు ప్రకృతే కారణమని సాంఖ్యులు, దేహాత్మవాదులైన బౌద్ధులు రకరకాల కుతర్కాలచేత వారివారి వాదాలను సమర్థించుకొంటూ పరమాత్ముడవైన నిన్ను తెలుసుకోలేకపోయారు. పుణ్యాత్ములైన యోగీశ్వరులకు నీవు ప్రత్యక్షమైతే, నీవు తప్ప తక్కిన వాదాలు, వస్తుజాలం, జీవకోటి – సర్వం అసత్యమని తెలిసిపోతుంది. ప్రాణం ఉన్న, ప్రాణం లేని సమస్త వస్తు సమూహంలో నీవు

అంతర్యామివై ఉంటావని, సర్వం నీవే అని కొందరు వ్యక్తులు తెలుసుకోలేక ఇది నిత్యం అనీ, అది అనిత్యం అని విపరీతపు ఆలోచనలు చేస్తుంటారు. సత్యమైన, నిత్యమైన, భవ్యమైన నీ దివ్య తత్త్వాన్ని అసలు తెలుసుకోలేరు. నీవు జగత్తునే శరీరంగా ధరించే వాడివి. జగద్రూపమే నీ రూపం. బంగారం కడియాలుగా, కిరీటాలుగా, కంకణాలుగా, హారాలుగా ఏ విధంగా రూపభేదం పొందినా, ఆ ఆభరణాలన్నీ కనకంతో చేయబడినట్లే ఈ సమస్త విశ్వం నీ నుండి ఏర్పడినదే. సమస్తంలో నీవుంటావు. నీలో సమస్తం ఉంటుంది. విశ్వమంతా నీవే అయినా సర్వ వికారాలు నీకు దూరంగానే ఉంటాయి. మంగళకరమైన గుణాలతో ఒప్పే నిన్ను ఆత్మజ్ఞానాన్ని తెలుసుకొన్నవారు మాత్రమే తెలుసుకోగలరు.

ఆత్మ అసంగమని వేదాంతులు చెబుతారు. పుణ్యపాపాలు గాని, సుఖదుఃఖాలు గాని ఆత్మను అంటజాలవు; కాని దేహాభిమానులను అవి బాధిస్తాయి. పొగ గోడలను మాపివేస్తుంది గాని ఆకాశాన్ని ఏమీ చెయ్యలేదు కదా!

—శ్రీరామకృష్ణ పరమహంస

మ. వనజాతాక్ష ! భవత్పదాబ్జయుగ సేవాసక్తులై నట్టి య
జ్జనముల్ మృత్యుశిరంబుఁ దన్ని ఘనసంసారాంబుధిన్ దాఁటి పా
వనులై లోకములుం బవిత్రములుగా వర్తించుచున్ నిత్య శో
భనమై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతులై.

1221

తా ॥ కమలాక్షా! నీ పాదపద్మాలను సేవించడంలో నిరంతరమైన ఆసక్తిగల భక్తజనులు మృత్యువుయొక్క శిరస్సునే తన్నగల సమర్థులౌతారు. దాటశక్యంగాని సంసార సముద్రాన్ని దాటి పవిత్రులౌతారు. లోకాలను పవిత్రం చేయగల మహాత్ములౌతారు. భక్తివైభవంతో అలరారుతూ శుభప్రదమైన ముక్తిని పొందుతారు.

మ. మిము సద్భక్తి భజింపనొల్ల కిల దుర్మేధం బ్రవర్తించు నీ
చ మతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించు చం
దమునం బెక్కగు నామరూపములచేతన్ వారి బంధించి దు
ర్గమ సంసారపయోధిఁ ద్రోతువు దళత్కంజాత పత్రేక్షణా!

1222

తా ॥ పద్మపత్రాక్షా! సద్భక్తితో నిన్ను భజించకుండా కొంతమంది దుష్టాత్ములు నీచ మార్గంలో నడుస్తుంటారు. వారికి నిన్ను పూజించటం ఇష్టం ఉండదు కూడా. అటువంటివారిని అనేక నామరూపాలు ధరించి పశువులను త్రాళ్ళతో కట్టిపడవేసే విధంగా బంధించి దాట శక్యంకాని సంసారసముద్రంలో పడవేస్తుంటావు.

వ. దేవా! కర్మమూలంబులయిన పాణిపాదంబులు లేనివాఁడ వయ్యును స్వతంత్రుఁడవు గావున బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు; స్థిర చర రూపంబులు గల చేతనకోటికి నీవు సర్వవిధ నియంతవు; గావున నీ కృపావలోకనంబుగల వారికి మోక్షంబు కరస్థితం బై యుండు; భవత్కృపావ లోకనంబు లేని దుష్టాత్ములు దుర్గతిం గూలుదు; రట్టి జీవులు దేవ తిర్మ ఙ్మనుష్య స్థావరాది శరీరంబులు సొచ్చి యణురూపులై యుందు; రందును నీ వంతరాత్మ వగుచు నుందువు; మఱియును.

1223

తా ॥ దేవా! కర్మమూలంగా జన్మఎత్తవలసిన వాడవు కావు. స్వతంత్రుడవు. ఏ పాపపంకిలము నిన్ను అంటదు. బ్రహ్మాదులే నీ అధీనంలో ఉంటారు. స్థిరరూపం, చరరూపం గల ఈ జీవకోటికి నీవు నియంతవు. నీ దయాదృష్టి పడితే వారికి మోక్షం చేతికందినట్లే! నీ కృప కలగకపోతే వారు దుష్టాత్ములే. వారికి దుర్గతి తప్ప సద్గతి కలగదు. అటువంటి వారు అనేక జన్మలెత్తవలసి ఉంటుంది. దేవతలుగానో, పశుపక్ష్యాదులుగానో, మనుష్యులుగానో శరీర ధారణచేస్తారు. ఆ శరీరంలో కూడా అణురూపంగానే ఉంటారు. ఆ అణురూపుల్లోనూ, నీవు

అంతరాత్మవై ప్రకాశిస్తుంటావు.

క. మదిఁ దలపోయఁగ జల బు, ద్బుదములు ధరఁ బుట్టి పొలియు పోలిక గల యీ
త్రిదశాది దేహములలో, వదలక వర్తించు నాత్మవర్గము నోలిన్.

1224

తా ॥ నీళ్ళల్లో బుడగలు పుట్టి అణగిపోయేవిధంగా దేవతలు మొదలైన వారి దేహాలలో ఆత్మ ఉంటూ ఉంటుంది.

ఆ. ప్రళయవేళ నీవు భరియింతు వంతకుఁ, గారణంబ వగుటఁ గమలనాభ ! భక్తపారిజాత ! భవ భూరి తిమిర ది, నేశ ! దుష్టదైత్యనాశ ! కృష్ణ !

1225

తా ॥ శరీరాన్ని విడువగానే ఆత్మ మరో దేహంలో ప్రవేశిస్తూ ఉంటుంది. ప్రళయకాలంలో జీవాత్మలనన్నిటినీ నీలో కలుపుకుంటావు. ఎందుకంటే సృష్టి స్థితిలయ కారకుడవు నీవే కదా! కమలనాభా! దైత్యసంహారా! సంసారమనే అంధకారాన్ని పోగొట్టి వెలుగునిచ్చే సూర్యభగవానుడివి నీవు. శిష్ట రక్షకా! భక్తులపాలిటి కల్పవృక్షమా!

చ. అనఘ ! జితేంద్రియస్ఫురణు లయ్యును జంచలమైన మానసం
బను తురగంబు బోధమహితాత్మ వివేకపు నూలిత్రాట న
ల్లనఁ గుదియంగఁ బట్టను దలంపుచు ముక్తి కుపాయలాభ మే
యనువున లేమికిన్ వగల నందెదు నాత్మలువో తలంపఁగన్.

1226

తా ॥ ఓ పాపరహితా! ఇంద్రియ వాంఛలను జయించిన వారుకూడా మనస్సును అరికట్టుకోలేరు. చంచలమైన మనస్సు అనే గుఱ్ఱాన్ని వివేకమనే నూలిత్రాటితో కట్టివేయాలని

భావిస్తారు. మనస్సు స్వాధీనం కాక, మోక్షము పొందుటకు మార్గము ఏదీ కనిపించక నీ పాదారవింద భజనలేని జీవులు విచారము పొందుతారు.

చ. గురు పదపంకజాతములు గొల్వని వారలువో మహాబ్ధి ని
స్తరణకుఁ గర్ణధారరహితంబగు నావను సంగ్రహించు బే
హరి గతి భూరి దుస్తర భవాంబుధిలోన మునుంగుచుందు రం
బురుహదళాక్ష ! నీవు పరిపూర్ణుఁడవై తనరారఁగా వొగిన్.

1227

తా ॥ పద్మపత్రాక్షా! గురువుయొక్క పాదపద్మాలను భక్తితో కొలవనివారు సంసారమనే సముద్రంలో మునిగిపోతారు. గురుబోధ స్వీకరించని వ్యక్తి చేసే ముక్తి సాధనాయత్నం. నావను నడిపే నావికుడు లేని నావను తీసుకొని వర్తకుడు మహాసముద్రాన్ని దాటడానికి ప్రయత్నించిన విధంగా ఉంటుంది.

తే. పుత్ర దార గృహ క్షేత్ర భూరివిషయ, ఘన సుఖాసక్తుఁ డగుచు నే మనుజుఁ డేని
నర్థిఁ జరియించు వాఁడు భవాబ్ధిలోనఁ, జెంది యె న్నాళ్ళకును దరిఁజేర లేఁడు.

1228

తా ॥ ఏ మానవుడైతే సుఖాసక్తుడై భార్యాపుత్రులపట్ల, ఇంటిమీద, పొలం విషయంలోను, ఇతర ధనార్జనన్నా అనురాగాన్ని, ఆత్మీయతను పెంచుకొంటాడో, అటువంటి మానవుడు ఎంతకాలానికీ సంసార సముద్రంలో మునిగిపోతాడే తప్ప, ఒడ్డుకు చేరలేడు.

కామకాంచనాలను త్యజిస్తేనే గాని బ్రహ్మజ్ఞానం కలుగదు. త్యాగోదయం అవగానే అవిద్యాంధకారం పటాపంచలవుతుంది. కటకాన్ని సూర్యకిరణాలకు ఎదురుగా పట్టుకొని దాని ద్వారా అనేక వస్తువులను తగులబెట్టవచ్చును. కాని నీడనున్న గదిలో దానినలా వినియోగించలేం. మనస్సు విషయం కూడా ఇలాంటిదే. మనస్సనే కటకాన్ని సంసారమనే

అంధకారం నుంచి బయటకులాగి, స్వయంజ్యోతి అయిన పరమేశ్వరుడి దివ్యతేజాన్ని దానిమీద పడచెయ్యాలి. అప్పుడు త్యాగవైరాగ్యాలు ఉదయిస్తాయి. అజ్ఞానం అంతరిస్తుంది.

—శ్రీరామకృష్ణ పరమహంస

సీ. జగతిపై బహుతీర్థ సదనంబు లనఁ గల్గి పుణ్యానువర్తన స్ఫురితు లగుచుఁ
బాటించి నీ యందు బద్ధమత్సరములు లేక భక్తామరానోకహంబ
వగు భవత్పాదాబ్జయుగళంబు సేవించి భవపాశముల నెల్లఁ బాఱఁదోలి
సమమతులై యదృచ్ఛాలాభ తుష మేరు సమముగాఁ గై కొని సాధు లగుచుఁ

తే. బాదతీర్థంబు గల మహాభాగవత జ, నోత్తమోత్తము లైనట్టి యోగివరుల
వార కెప్పుడు సేవించువాఁడు వొందుఁ, బ్రవిమలానందమయ మోక్షపదము మఱియు.

1229

తా ॥ అనునిత్యం పుణ్యవర్తనతో ప్రకాశించే ఉత్తమోత్తములైన మహాభాగవత జనులు — పరమపవిత్రమైన పుణ్యతీర్థాలతో సమానులైనవారు. ఆ మహాయోగులకు నీ యందు క్రోధంగాని, మాత్సర్యంగాని, పగగాని ఉండవు. భక్తజనులకు అమరలోకంలోని కల్పవృక్షంవంటి నీ యొక్క పాదపద్మాలను ధ్యానించటమే వారి నిత్యకృత్యం. నీ మీద వారికేర్పడిన అచంచల భక్తిభావన చేతనే వారు భవపాశాలను త్రెంచుకోగలుగుతున్నారు. వారి మనస్సులకు ఎవరి పట్ల హెచ్చుతగ్గులు లేవు. అందరూ సములే. దాని పాటికది లభించినది అణుమాత్రమైనా సరే దానిని మేరుపర్వతంతో సమానంగా భావించి సంతృప్తిచెందే భాగవతోత్తములను ఎప్పుడూ సేవించేవాడు ఆ సాధుజనుల కృపాతిశయం వల్ల పరమానందంతో నిండి ఉండే మోక్షాన్నే పొందుతాడు.

వ. సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తు గావలయు; నది యెట్లనినం గనకోత్పన్నంబులైన భూషణంబులు కనకమయంబు లయి కానంబడు చందంబున నని

సాంఖ్యుండు వలికిన విని యద్వైతవాది యిట్లను; నెయ్యది యుత్పన్నంబుగా దది సత్తును గా; దను వ్యతిరేకవ్యాప్తి నియమంబు నిత్యసత్యం బైన బ్రహ్మంబునందుఁ దర్కహతం బగుం గావునం బ్రపంచంబు మిథ్యయని నిరూపించిన నా ప్రపంచంబు బ్రహ్మవిశేషణంబై కార్య కారణావస్థలు గలిగియున్న యంతమాత్రంబున మిథ్య గా నేర; దా ప్రపంచంబునకుఁ గార్యకారణావస్థలు నిత్యంబులు గావున నవస్థాద్వయ యుక్తంబయిన ప్రపంచంబు నిత్యం బనిన వెండియు నద్వైతి యిట్లను; బహుగ్రంథ ప్రతిపాదితం బయిన జగన్మిథ్యాత్వంబు లేమి యెట్లనిన నదియునుం గర్మవశులైన జడుల న విద్యా ప్రతిపాదకంబైన కుతర్కసమేతంబైన భారతి యంధపరంపరా వ్యవహారంబునం జేసి భ్రమియింపఁ జేయుఁ; గారణావస్థలయందును బ్రహ్మ విశేషణంబైన సూక్ష్మరూపంబునం బ్రపంచంబు సత్తై యుండు; అసత్యంబు బాధాయోగ్యంబు గావున నీకు శేషంబయి యుండుఁ గావున నీవు దేహగతుండైన దేహియందు నంతర్యామి వయ్యుం గర్మఫలంబులం బొరయక గర్మఫలభోక్తయైన జీవునకు సాక్షిభూతంబవై యుందు; వట్టి నిన్ను నజ్ఞులైన మానవులు నిజ కంఠలగ్నంబయిన కంఠికామణి నిత్యసన్నిహితంబై వెలుంగుచుండినను గానక వర్తించు తెఱంగునఁ దమ హృదయపద్మ మధ్యంబున ననంతతేజో విరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు. సకల బ్రహ్మాండ నాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించునని శ్రుత్యధిదేవతలు నారాయణు నభినందించిన తెఱంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారం బని నారాయణర్షి నారదునకుం జెప్పిన న మ్మహాత్ముండు మజ్జనకుండైన వేదవ్యాస మునీంద్రునకు నుపన్యసించె; న య్యర్థంబు నతండు నాకుం జెప్పిన విధంబున నీకుం జెప్పితి. నీ యుపాఖ్యానంబు సకల వేదశాస్త్ర పురాణేతిహాససారం; బుపనిషత్తుల్యంబు; దీనిం బఠించువారును వినువారును విగతకల్మషు' లై యిహపరసౌఖ్యంబుల నొంది వర్తింతు; రని చెప్పిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె.

తా ॥ "సత్యమైన ప్రకృతివల్ల పుట్టిన ఈ జగత్తు సత్పదార్థమే అయి ఉండాలి. బంగారం నుంచి చేయబడిన ఆభరణాలన్నీ బంగారంతో కూడి ఉండేవిగానే కనబడతాయి గదా!" అని సాంఖ్యుడు చెప్పగా విని అద్వైతవాది ఈ విధంగా అన్నాడు: "దేనికి పుట్టుకలేదో అది సత్తు కాలేదనే వ్యతిరేకవాదం వల్ల 'నిత్యసత్యమైన బ్రహ్మమందు' తర్కమనేది నిలువలేదు. ప్రపంచం మిథ్య అని నిరూపించినా – ఆ ప్రపంచం బ్రహ్మవిశేషణమై కార్యకారణావస్థలు కలిగి ఉన్నంత మాత్రం చేతనే మిథ్యగా చెప్పబడలేదు. ప్రపంచానికి కార్యకారణావస్థలు రెండూ నిత్యం కాబట్టి ఆ రెండింటితో కూడి ఉన్న ప్రపంచం నిత్యమైనదే. అనేక గ్రంథాలలో ప్రతిపాదింపబడిన 'జగన్మిథ్య' అనే తత్త్వం అసత్యం కావచ్చు. అది ఎలాగంటే కర్మబద్ధులైన జడాత్ములు భావించే అవిద్యతో నిండిన, కుతర్కంతో కూడి ఉండే వాగ్వ్యవహారం వల్ల మిథ్యా వస్తువే సత్యరూపంగా వారికి కానరావచ్చు. కారణావస్థలలో కూడా ప్రపంచము బ్రహ్మవిశేషణమైన సూక్ష్మరూపంతో సత్తుగానే ఉంటుంది. అసత్యము బాధాయోగ్యం కాబట్టి నీలోనే ఉంటుంది.

దేవా! నీవు దేహం ధరించిన వారిలో అంతర్యామిగా ఉన్నప్పటికీ, నిన్ను కర్మఫలాలు ఏమీ చేయవు. కర్మఫలాన్ని అనుభవించే జీవులకు సాక్షిగా ఉంటావు. అటువంటి నిన్ను, జ్ఞానంలేని మానవులు తమ కంఠాన్ని అలంకరించిన మణిని, నిత్యం తమతోనే ఉన్నప్పటికీ చూడలేని విధంగా – తమ హృదయపద్మాల మధ్య అనంత తేజస్సుతో ప్రకాశిస్తూ ఉండే నిన్ను తెలుసుకోలేరు. సమస్త బ్రహ్మాండాలకు అధినాయకుడవైన నీలో వేదాలన్నీ ప్రముఖమైన కార్యాన్ని నిర్వహిస్తున్నాయని" శృతులకు అధిదేవతలైన వారు నారాయణున్ని స్తుతించిన విధానాన్ని సనందనుడు శ్వేతద్వీప నివాసులకు తెలియచెప్పాడు. సనందనుడు మహర్షులుకు చెప్పిన విషయాన్ని నారాయణ మహర్షి నారదుడికి విశదీకరించి చెప్పాడు. దానిని నారదుడు మా తండ్రి అయిన వ్యాసమునీంద్రులకు చెప్పాడు. శ్రుతిగీతల అర్థాన్ని వ్యాసమహర్షి నాకు చెప్పిన విధంగా నీకు నేను చెప్పాను. ఈ కథ – వేదశాస్త్ర విషయాల, పురాణాల, ఇతిహాసాల సారం. ఉపనిషత్తులతో సమానమైనది. దీనిని పఠించేవారుగాని, వినేవారుగాని – సమస్త పాపాలు తొలగినవారై, ఇహలోక సౌఖ్యాలను, పరలోక సౌఖ్యాలను పొందుతారు." అని శుక

యోగీంద్రుడు చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఈ విధంగా అడిగాడు:

## పరీక్షిత్తునకు శుకయోగి విష్ణు సేవా ప్రాశస్త్యము చెప్పుట

మ. మునినాథోత్తమ! దేవమానవులలో ముక్కంటి సేవించు వా
రనయంబున్ బహువస్తుసంపదల సౌఖ్యానందులై యుండ న
వ్వనజాతాక్షు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించు స
ద్ఘనపుణ్యుల్ గడుఁ బేద లౌకతను జక్కన్ నా కెఱింగింపవే.

1231

తా ॥ "ముని సత్తమా! త్రినేత్రుడైన పరమశివుణ్ణి కొలిచే దేవతలలో, మానవులలో ఎవరైనా సరే అనేక వస్తువాహనాలతో, సకల సిరిసంపదలతో ఎల్లప్పుడూ సుఖసంతోషాలతో ఉంటారు గదా! లక్ష్మీనాథుడైన విష్ణుమూర్తిని అత్యంత భక్తితో సేవించే పుణ్యాత్ములైన మునీంద్రులు ఎప్పుడూ పేదవారిగానే ఉంటారు. దీనికిగల కారణం తెలియజెప్పండి మహాత్మా!"

సీ. నావుడు శుకయోగి నరనాథుఁ గనుఁగొని విను మెఱింగింతుఁ దద్విధము దెలియ
ఘనశ క్తిసహితుండు కాలకంధరుఁడు దా వినుతగుణ క్రియాన్వితుఁడు గాన
రాగాదియుక్తమై రాజిల్లుసంపద లాతనిఁ గొలుచువా రందుచుందు;
రచ్యుతుఁ బరము ననంతు గుణాతీతుఁ బురుషోత్తముని నాదిపురుషు ననఘు

తే. నర్థి భజియించువారు రాగాది రహితు, లగుచు దీపింతు రెంతయు ననఘచరిత!
ధర్మనందనుఁ డశ్వమేధంబు సేసి, పిదప సాత్త్విక కథనముల్ ప్రీతితోడ.

1232

తా ॥ అని పరీక్షిత్తు ప్రశ్నించగా ఆ మహారాజును చూసి శుకయోగి ఈ విధంగా చెప్పసాగాడు: "నీలకంఠుడైన పరమేశ్వరుడు మహాశక్తిమంతుడు. క్రియాగుణంలో ప్రసిద్ధుడు. అందుచేత శంకరుణ్ణి కొలిచేవారికి అఖండమైన సిరిసంపదలు లభిస్తాయి. వారు కోరిన కోరికలన్నీ నెరవేరుతాయి. విష్ణువు సత్త్వరజస్తమోగుణాలకు అతీతమైనవాడు, అనంతుడు,

పరమ పురుషుడు. అచ్యుతుడు – పురుషోత్తముడు, ఆది పురుషుడు, పాపరహితుడు. శ్రీహరిని కొలిచే వారు కూడా రాగాదులు లేనివారే. హరిభక్తులు నిష్కాములై ప్రకాశిస్తుంటారు. వారికి ఏ భోగభాగ్యాలమీద ఆసక్తి కలగదు. పరమును కూడా కోరరు. పరీక్షిన్మహారాజా! ధర్మరాజు అశ్వమేధ యాగం చేసిన తరువాత, మహిమాన్వితమైన సాత్త్విక కథలు తెలుసుకొందామనుకొన్నాడు.

ఉ. నారదసంయమీంద్రు వలనన్ వినుచుండి యనంతరంబ పం
కేరుహనాభుఁ జూచి యడిగెం దగ నిప్పుడు నీవు నన్ను నిం
డారిన భక్తిమై నడిగినట్ల యతండును మందహాస వి
స్ఫార కపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్.

తా ॥ అనుకొన్నట్లే నారద మహర్షినడిగి అనేక పుణ్య గాథలు విన్నాడు. తరువాత ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి చూసి, ఇప్పుడు నీవు నన్నడిగినట్లే, భక్తితో తన సందేహాన్ని తీర్చమని అడిగాడు. దానికి శ్రీకృష్ణుడు చిరునవ్వులు చిందిస్తూ ధర్మరాజుతో ఈ విధంగా చెప్పసాగాడు:

సీ. వసుమతీనాథ! యెవ్వనిమీఁద నా కను గ్రహ బుద్ధి వొడము నా ఘనుని విత్త
మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁడగు సంతాప మంద
విడుతురు బంధు వ వ్విధమున నొందిలి యై చేయునది లేక యఖిలకార్య
భారంబు లుడిగి మద్భక్తులతో మైత్రి నెఱపుచు విజ్ఞాననిరతుఁ డగుచు

తే. బిదప వాఁడవ్యయానందపదము నాత్మ, నెఱిఁగి సారూప్యసంప్రాప్తి నెలమి నొందుఁ
గాన మత్సేవ మిగుల దుష్కర మటంచు, వదలి భజియింతు రితరదేవతల నెపుదు.



తా ॥ "ధర్మరాజా! నా అనుగ్రహం ఎవరిమీద పడుతుందో, ఆ ఉత్తమ భక్తుని సమస్త సంపదలూ, క్రమక్రమంగా నేను లేకుండా చేస్తాను. అతడప్పుడు ధనహీనుడై బాధలకు

గురవుతాడు. సిరిసంపదలు హరించుకుపోయిన కారణంగా బంధువులందరూ అతనిని వదిలివేస్తారు. ఆ విధంగా అతడు ఆపదకు లోనై, ఏమీ చేయలేక, నిత్యం చేసే గృహకార్యాలన్నీ వదిలి, నా భక్తులతో సఖ్యం చేస్తాడు. క్రమంగా ఆత్మజ్ఞానాన్ని పొంది నాకు చేరువౌతాడు. తరువాత కొంతకాలానికి అవ్యయమైన మోక్షపదమంటే ఏమిటో తెలుసుకొంటాడు. చివరకు సారూప్య ముక్తిని పొందుతాడు. విష్ణుభక్తుడు విష్ణురూపుడై విష్ణు సన్నిధానంలో పరమానందాన్ని అనుభవిస్తాడు. అందుచేత రాజా! జనులు నా సేవ మిక్కిలి కఠినమైనదని భావించి, ఆ విధానాన్ని వదిలి, ఇతర దేవతలను కొలుస్తుంటారు.

క. సేవింప వారు దమకుం, గావించిన శోభనములు గని నిజములుగా భావించి వారి మఱతురు, భావములఁ గృతఘ్నవృత్తిపని తమ పనిగన్.

1235

తా ॥ ఆ జనులు అన్యదేవతలను సేవించి వారిచ్చిన వరాలు, సిరిసంపదలు, అధికారాలు శాశ్వతాలని తలపోస్తారు. భోగభాగ్యాలను అనుభవిస్తూ, కృతఘ్నులై, తమకు వరాలిచ్చి, తమను ఉన్నత స్థాయికి తెచ్చిన ఆ దేవతలనే చివరకు మరచిపోతారు.

క. మెలఁగుచు నుందురు దీనికిఁ, గలదొక యితిహాస మిపుడు గై కొని నీకుం దెలియఁగఁ జెప్పెద దానన, యలవడు నీ వడుగు ప్రశ్న కగు నుత్తరమున్.

1236

తా ॥ "ధర్మరాజా! నీవడిగిన ప్రశ్నకు సమాధానంగా ఒక కథ చెబుతాను. అది వింటే నీ సందేహం తీరిపోతుంది." అని కృష్ణుడు చెప్పసాగాడు.

## శివద్రోహము చేయబూనిన వృకాసురుడు విష్ణుమాయచే నశించుట

క. శుకుడను దైత్యుని తనయుఁడు, వృకుఁడనువాఁ డొకఁడు దుర్వివేకుఁడు సుజన
ప్రకరముల నలఁపఁ దెరువున, నొకనాఁ డొదిగుండి దివ్యయోగిం గనుచున్.

1237

తా ॥ పూర్వం శుకుడు అనే ఒక దైత్యుడుండేవాడు. అతని పుత్రుడు వృకుడు. ఆ వృకాసురుడు పరమ దుర్మార్గుడు. సజ్జనులను ఎప్పుడూ బాధిస్తుండేవాడు. అతడొక రోజున దేవముని వద్దకు వెళ్ళాలని అనుకొన్నాడు.

వ. కనుంగొని.

1238

తా ॥ అలా అనుకొని వెళ్ళి నారదమహర్షిని చూశాడు.

క. కరములు ముకుళించి 'మునీ, శ్వర ! నారద ! లలితధీవిశారద ! నన్నున్ గరుణించి
యాన తీ శుభ, కరు లగు హరిహరహిరణ్య గర్భులలోనన్

1239

తా ॥ రెండు చేతులూ జోడించి నారదమహర్షికి నమస్కరించాడు. "మునీంద్రా! ధీవిశాలా! నారదమహర్షీ! నన్ను కరుణించి నా ప్రశ్నకు సమాధానం చెప్పండి. శుభాలు ఇచ్చే బ్రహ్మ విష్ణుమహేశ్వరులలో ఎవరు ఎక్కువ దయామయులు?

ఆ. కడఁగి కొలువ శీఘ్రకాలంబులోనన, యిష్టమైన వరము లిచ్చునట్టి దైవ మెవ్వఁ డనిన
దానవుఁ గనుఁగొని, మునివరుండు పలికె ముదముతోడ.

1240

తా ॥ త్రిమూర్తులలో తమను కొలిచే భక్తులకు ఎవరు శీఘ్రకాలంలో వారికి ఇష్టమైన వరాలను ప్రసాదిస్తారు? చెప్పండి. అని అడిగిన వృకాసురుణ్ణి చూసి నారదుడు ఇలా చెప్పాడు:

వ. వినుము; దుర్గుణసుగుణంబులలో నొక్కటి యెచ్చటం గలుగు నచ్చట నా క్షణంబ కోప ప్రసాదఫలంబులు సూపువాఁ డమ్మువ్వుర యందు ఫాలలోచనుఁ డివ్విధంబుఁ దెలిసినవారై బాణాసుర దశకంధరులు సమగ్ర భక్తియుక్తులై సేవించి యసమానసామ్రాజ్య వైభవంబుల నొంది ప్రసిద్ధులై; రట్లుగాన నీవు న మ్మహాత్ముని సేవింపు; మతనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తం బయ్యెడి' నని చెప్పిన నతం డా క్షణంబ.

1241

తా ॥ "వృకాసురా! విను. దుష్టులపట్ల కోపాన్ని, సద్గుణ శీలురపట్ల దయను వెనువెంటనే చూపే దేవుడు త్రిమూర్తులలో శివుడు ఒక్కడే. ఈ సంగతి గ్రహించిన బాణాసురుడు, రావణాసురుడు మొదలైన రాక్షస రాజులు శంకరుణ్ణి అత్యంత భక్తితో కొలిచి సాటిలేని సంపదలను, చక్రవర్తిత్వాన్ని పొంది ప్రసిద్ధి చెందారు. నీవు కూడా ఆ పరమేశ్వరుణ్ణి సేవించు. ఆ పార్వతీనాథుని కరుణవల్ల నీవు కోరిన కోరికలన్నీ వెంటనే ఫలిస్తాయి." అని నారదుడు చెప్పగానే వృకాసురుడు తక్షణమే శంకరుణ్ణి గూర్చి తపస్సు చేయడానికి బయలు దేరాడు.

సీ. దీపించు కేదార తీర్థంబునకు నేగి యతిసాహసాత్మకుం డగుచు నియతి
లోకముల్ వెఱఁగంద నా కాలకంధరు వరదుని నంబికావరునిఁ గూర్చి
తన మేనికండ లుద్దండుఁడై ఖండించి యగ్ని కాహుతులుగా నలర వేల్చి
దర్పకారాతి ప్రత్యక్షంబు గాకున్న జడియక సప్తవాసరమునందుఁ

తే. బూని తత్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు, వెడలి మృత్యువుకోఁబనా వెలయునట్టి
గండ్రగొడ్డంటఁ దన మస్తకంబు దునుము, కొనఁగఁ బూనిన న య్యగ్నికుండమునను.

1242

తా ॥ వృకుడు కేదార తీర్థానికి వెళ్ళి ఉగ్రమైన నియతితో శివుణ్ణి గూర్చి తపస్సు చేయటం మొదలుపెట్టాడు. మహాసాహసంతో సమస్త లోకాలు ఆశ్చర్యపడేలా ఘోరతపస్సులో లీనమయ్యాడు. దయామయుడు, వరదుడు, నీలకంధరుడు, పార్వతీనాథుడు అయిన శివుణ్ణి గూర్చి వృకుడు చేస్తున్న తపస్సు శిఖరాగ్రాన్ని చేరుకుంది. శంకరుడు ప్రత్యక్షం కావడానికి వృకుడు వీరావేశంతో తన శరీరంలోని మాంసాన్ని తునియలు తునియలుగా ఖండించి అగ్నికి ఆహుతి చేశాడు. వృకుడు ఎంతఘోరతపస్సు చేసినా ఆ త్రినేత్రుడు ప్రత్యక్షం కాలేదు. అందుకు భయపడకుండా, బాధపడకుండా, తన తపస్సును ఇంకా ఉగ్రతరం చేశాడు. ఏడు రోజులపాటు ఆ విధంగా తపస్సుచేసి, ఏడవరోజున కేదారతీర్థంలో పవిత్ర స్నానం చేసి వృకాసురుడు మృత్యుదేవతయొక్క కోరలాగా అతిభయంకరంగా ఉన్న గండ్రగొడ్డలి తీసుకొని తన తలనరికి అగ్నికుండంలో వేయబోయాడు.

క. అరుదుగా వెలువడి రుద్రుఁడు, గరుణ దలిర్పంగ వానికర మాత్మకరాం
బురుహమునఁ బట్టి 'తెగువకుఁ, జొరవలవదు; మెచ్చు వచ్చె సుమహిత చరితా!

1243

తా ॥ వృకుని సాహసం చూసి రుద్రుడు ఆ అగ్నికుండంలో నుంచి వెలువడి ప్రత్యక్షమయ్యాడు. వృకాసురునిపై కరుణతో శివుడు ఆ దానవుని చేతిని తన చేతితో పట్టుకొని "భక్తా! ఇంత సాహసానికి పూనుకోవద్దు. నీ తపస్సుకు మెచ్చాను." అని వరదుడైనాడు.

క. నీమదిఁ బొడమిన కోరిక, లేమైనను వేఁడు మిపుడ యిచ్చెద' ననినం
దా మనమున సంతసపడి, యా మనుజాశనుఁడు హరుపదాంబుజములకున్.

1244

తా ॥ "వృకాసురా! నీవు ఏ కోరిక కోరినా తక్షణం ప్రసాదిస్తాను కోరుకో" అని మహేశ్వరుడు కరుణించగానే ఆ దానవేశ్వరుడు ఎంతగానో ఆనందించి శివుని పాదపద్మాలకు

ప్రణమిల్లాడు.

తే. వందనం బాచరించి 'యో యిందుమకుట!, ఫాలలోచన! వరద! మత్పాణితలము నేను నెవ్వని తలమీఁద నిడిన వాఁని, మస్తకము నూఱువ్రయ్యలై మడియ నీవె!'

1245

తా ॥ "చంద్రశేఖరా! ఫాలలోచనా! వరప్రదాతా! నీవు కృపాళుడవైతే – నేను ఎవరి తలపైన చేయిపెడితే వాడి తలవెంటనే నూరు వక్కలై వాడు మరణించే వరం నాకు ప్రసాదించుదేవా!" అని వృకుడు ప్రార్థించాడు.

క. అని వేఁడిన న మ్మాటలు, విని మదనారాతి నవ్వి విబుధాహితు కో
రిన వరముఁ దడయ కిచ్చిన, దనుజుఁడు తద్వర పరీక్షఁ దాఁ జేయుటకున్.

1246

తా ॥ వృకాసురుని కోరిక విన్న శంకరుడు ఒక నవ్వునవ్వి వెంటనే వాడు కోరిన వరాన్ని ప్రసాదించాడు. శంకరుడు ఇచ్చిన వరం ఫలిస్తుందో లేదో అని వృకుడు ఆ వరాన్ని పరీక్షించాలని నిశ్చయించాడు.

వ. ఆ క్షణంబు వరదాన గర్వంబున నుద్వృత్తుండై కడంగి.

1247

తా ॥ వృకాసురుడు తాను కోరిన వరం లభించిందనే గర్వంతో ఉద్ధతుడైనాడు. తక్షణం శంకరుని మీదికి వెళ్ళాడు.

క. ఆ హరుమస్తకమునఁ గడు, సాహసమునఁ జేయి వెట్ట జడియక కదియ
'న్నోహో! తన మెచ్చులు దన, కాహా! పై వచ్చె' ననుచు నభవుఁడు భీతిన్.

1248

తా ॥ పరమశివుని శిరస్సుపైనే తన చేయి పెట్టాలని అతిసాహసంతో ఏ మాత్రం జంకకుండా శివుడి దగ్గరకు వెళ్ళి తలపై చేయి పెట్టబోయాడు వృకుడు. వృకుని శీఘ్ర గమనం చూసిన శంకరుడు "వాడి తపస్సు చూసి మెచ్చుకొని తాను వాడికి వరమివ్వడం తనకే ముప్పు తెచ్చిందని" అనుకొంటూ వృకాసురుని బారినుండి తప్పించుకొంటూ భయం భయంగా పరుగెత్తాడు.

క. దనుజుఁడు దన వెనువెంటం, జనుదే ముల్లోకములను సంత్రాసముఁ గై
కొని పాఱ, సురలు మనములఁ, దనికిరి దానికిని బ్రతివిధానము లేమిన్.

1249

తా ॥ వృకుడు వెంటబడి తరుముకొస్తుంటే శివుడు భయపడిపోయాడు. శివుడు ముందు, శివునివెంట వృకుడు పరుగెత్తుతూ ముల్లోకాలూ చుట్టబెట్టారు. శివుడిచ్చిన వరానికి ప్రతి విధానం లేకపోవడంతో దేవతలు, మహర్షులు అందరూ భయంతో వణకిపోయారు.

వ. అట్లు చని చని.

1250

తా ॥ ఆ విధంగా శివుడు, వృకుడు వెళ్ళి, వెళ్ళి వైకుంఠపుర సమీపం చేరారు.

సీ. నిరుపమానందమై నిఖిల లోకములకు నవలమై యమృతపదాఖ్యఁ దనరి
దినకర చంద్ర దీధితులకుఁ జొరరాక సలలిత సహజ తేజమున వెలుఁగు
సమధికంబగు శుద్ధసత్త్వ గరిష్ఠమై కరమొప్ప యోగీంద్రగమ్య మగుచు
హరిపదధ్యాన పరాయణులైన తద్దాసుల కలరు నివాస మగుచుఁ

తే. బ్రవిమలానంత తేజోవిరాజమాన, దివ్యమణి హేమకలిత సందీప్త భవ్య
సౌధమండపతోరణ స్తంభవిపుల, గోపురాది భాసురము వైకుంఠపురము.

1251

తా ॥ నిరుపమానమైన ఆనందానికి నిలయంగా ఉన్న వైకుంఠం సమస్త లోకాలకు ఆవలగా ఉంది. 'అమృత పదమ' నే పేరుతో అలరారుతోంది. సూర్యచంద్రుల కాంతులు కూడా ప్రవేశించడానికి శక్యంకాకుండా సుందరమైన సహజ తేజస్సుతో ప్రకాశిస్తోంది. శుద్ధ సత్త్వగుణంతో అలరారుతోంది. యోగీంద్రులు మాత్రమే ప్రవేశించగలిగిన పుణ్యస్థలమై ఒప్పారుతోంది. విష్ణుభక్తులైన విష్ణుదాసులకు నివాసస్థానమై వెలుగొందుతోంది. దివ్యమణులతో పొదగబడిన బంగారు సౌధాలతో, మంటపాలతో, తోరణాలతో, స్తంభాలతో, గోపురాలతో ధగధగ మెరిసిపోతూ తేజోవిరాజితమై ఒప్పుతోంది.

వ. కనుంగొని యమ్మహాస్థానంబు డాయం జనుటయు, నప్పుండరీకాక్షుం డఖండవైభవంబునం గుండలీశ్వర భోగతల్పంబునం బరమానంద కందళిత హృదయారవిందుండై యిందిరానయన చకోరకంబుల నిజమందహాస సాంద్ర చంద్రికావితతిం దేల్చుచు, నార్తభక్త జనరక్షణంబు పనిగా మెలంగుచు, వివిధ వినోదంబులం దగిలి యుండియు, ఫాలలోచనుం డద్దనుజ పాలునకుం దలంపక యిచ్చిన వరంబు దన తలమీఁద వచ్చినం గలంగి చనుదెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి, య క్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి య య్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి యప్పుడు.

1252

తా ॥ పరమశివుడు విష్ణుస్థానాన్ని సమీపించాడు. ఆ సమయంలో కమలాక్షుడైన విష్ణుమూర్తి అఖండవైభవంతో అలరారుతూ శేషతల్పంపైన పరమానంద భరితమైన హృదయంతో లక్ష్మీదేవిని చిరునవ్వుల వెన్నెలలతో తేలుస్తూ, ఆర్తితో ఉన్న భక్తజనులను రక్షించటమే కర్తవ్యంగా మెలగుతూ, సంతోషసాగరంలో మునిగి ఉన్నాడు. అయినప్పటికీ శివుని పరిస్థితిని తన దివ్య దృష్టితో తెలుసుకొన్నాడు. శివుడు – వృకాసురుడికి అనాలోచితంగా ఇచ్చిన

వరమే తన తలమీదికి వచ్చి తనను ఆపదలపాలు చేసినదని కలతచెంది వైకుంఠానికి వచ్చాడని గ్రహించాడు. పరమేశ్వరునికి కలిగిన కష్టాన్ని నివారించాలని అనుకొని, అంతవరకూ లక్ష్మీదేవితో గడుపుతున్న వినోదకార్యకలాపాలను ఆపి, వృకుని మదమణచడానికి విష్ణువు పూనుకొన్నాడు.

సీ. తాపింఛరుచితోడఁ బ్రస్తరించెడు మేనుఁ బసిఁడిముంజియుఁ దగు పట్టుగొడుగు
ధవళాంశురుచి జన్నిదంబును దిన్నని దండంబుఁ జేతఁ గమండలువును
బసుపుగోఁచియుఁ జిన్ని పెట్టెవర్ధనమును రాజితంబైన మృగాజినంబుఁ
దూలాడు సిగయును వ్రేలుమాఱుట గోఁచి వేలిమి బొట్టును వ్రేళ్ళ దర్భ

తే. దనర సందీప్త హవ్య వాహన సమాన, కాంతిఁ జెలువొంది యద్భుత క్రమ మెలర్పఁ
జతురగతి నప్డు వటుక వేషంబు దాల్చి, వచ్చి యా నీచ దానవ వరునిఁ జేరి.

1253

తా ॥ నిగనిగని మేనికాంతితో, బంగారు మొలత్రాడుతో, పట్టుగొడుగుతో, తెల్లని జందెంతో, తిన్నగా ఉన్న దండంతో, పసుపురంగు గోచీతో, చిన్న పట్టె వర్ధనంతో, కాంతివంతమైన జింకచర్మంతో, చేతిలో కమండలాన్ని ధరించి, సిగ వ్రేలాడుతుండగా, వ్రేళ్ళకు దర్భలతో చేసిన ఉంగరాలు పెట్టుకొని, కొన్ని దర్భలు చేతపట్టుకొని, దేదీప్యమానమైన అగ్నిదేవుని తేజస్సుతో సమానమైన తేజస్సుతో వటువేషధారిగా విష్ణుమూర్తి ఆ నీచరాక్షసుని వద్దకు వెళ్ళాడు.

వ. కైతవంబున నతనికి నమస్కరించి మృదుమధుర భాషణంబుల ననునయించుచు న య్యసురాధమున కిట్లను; ని వ్విధంబున మార్గ పరిశ్రాంతుండవై యింత దూరంబేల చనుదెంచితి? సకల సౌఖ్యకారణంబైన యీ శరీరంబు నిరర్థకంబు సేసి వృథాయాసంబున దుఃఖపఱుపం దగునే? యి య్యెడం గొంత తడవు విశ్రమింపు; మీ ప్రయాసంబునకుఁ గతం బెయ్యది? కపటహృదయుండవు గాక నీ యధ్యవసాయం బెఱింగింపం దగునేని

నెఱింగింపు' మని మృదుమధురంబుగాఁ బలికిన న మ్మహాత్ముని సుధారసతుల్యంబు లయిన వాక్యంబులు విని సంతసిల్లి, య ప్పిశితాశనుండు దన పూనినకార్యం బతని కెఱింగించిన.

1254

తా ॥ విష్ణువు వృకాసురునికి కపట నమస్కారం చేసి, ఆతనితో మృదుమధురభాషణలతో ప్రసంగిస్తూ మచ్చిక చేసుకొన్నాడు. రాక్షసనాథుణ్ణి అనునయిస్తూ విష్ణువు ఈ విధంగా అన్నాడు: "అసురరాజా! ఈ విధంగా మార్గాయాసంతో ఇంత దూరం ప్రయాణించి ఇక్కడకు ఎందుకు వచ్చావయ్యా! సకల సౌఖ్యాలకు నిలయమైన నీ శరీరాన్ని ఎందుకు కష్టపెట్టావు? ఇంతగా ఆయాసపడుతున్నావే! ఎంత నీదైతే మాత్రం, శరీరాన్ని ఇంత దుఃఖపెట్టవచ్చా? అయిందేదో అయింది. ఇక్కడ కొంతసేపు ఆగి అలసట తీర్చుకో. అసలు నీవింత కష్టపడటానికి కారణమేమిటి చెప్పు. మనస్సులో ఒకటి, బయటకొకటీ కాకుండా, నీ పట్టుదలకుగల కారణమేమిటో చెప్పవచ్చునుకొంటే చెప్పు." అని ఎంతో ప్రేమగా, మధురంగా అంటున్న విష్ణుమూర్తి యొక్క అమృతతుల్యమైన మాటలు విని వృకుడు ఎంతగానో సంతోషించాడు. వెంటనే తానక్కడకు ఎందుకు వచ్చాడో, ఏం చేయాలని అనుకున్నాడో అంతా సవిస్తరంగా ఆ వటువుకు తెలియజెప్పాడు.

చ. హరి దరహాస మొప్పఁ బిశితాశనుఁ గన్గొని పల్కె దానవే
శ్వర! మును దక్షుశాపమునఁ జాలఁ బిశాచిప తౌట సూనృత
స్ఫురణము మాని సంతతము బొంకుచు నుండు పురారిమాట నీ
వరయక వెంట నేఁగఁ దగ దాతని చేఁతలు మాకు వింతలే?

1255

తా ॥ వృకుడు చెప్పినదంతా విని దరహాసంతో విష్ణువు ఆ రాక్షసుణ్ణి చూసి ఇలా పలికాడు: "దానవనాథా! పూర్వం శివుడికి దక్షుడు శాపమిచ్చాడు గదా! శివుడు సతతం ఏదో

బొంకుతూ ఉంటాడు. అతని చేతలు మాకు తెలియనివికావు. శివుడు ఇచ్చిన వరం నిజమనుకొని అతని వెంట పరుగెత్తడం మంచిది కాదు.

సజ్జనులను బాధించే వృకాసురునికి గుణపాఠం నేర్పడానికే విష్ణువు పలికిన మాటలుగా గుర్తించాలి తప్ప విపరీత అర్థాన్ని ఎంతమాత్రం తీసుకోరాదు. అందుచేత శివుడు ఇచ్చిన వరంతో మదం ఎక్కి వృకునకు శివుని మాటలు అసత్యాలని చెప్పడం ద్వారా వృకునిలో మదాన్ని తగ్గించడమే శ్రీహరి ప్రయత్నం.

ఆ. నిజము పలికెనేని నెఱిఁ దన తలమీఁద, నీ కరంబు మోపనీక తలఁగి
వచ్చునోటు! నితనివలనఁ బ్రత్యయమునఁ, దగుల నేమి గలదు దనుజవర్య!

1256

తా ॥ ఒకవేళ శివుడు నీతో నిజమే చెప్పాడనుకో! అలా చెప్పి ఉంటే తన తలమీద నీ చేయి మోపనివ్వకుండా ఎందుకు తొలగిపోతున్నాడనుకొన్నావు? నిలబడి తనమాట నిజం చేయవచ్చుకదా! దనుజవర్యా! శివుని మాటలు ఎప్పుడూ నమ్మకూడదు. నీ చేయి తగిలితే అతనికి ఏమౌతుందని? ఏమీకాదు. అతని మాట అసత్యమని నీకు తెలిసిపోతుంది. అంతే.

ఆ. అశుచి యగుచు నతని నంటఁగఁ బని గాదు, కాలుఁ జేయిఁ గడిగి కడఁక వార్చి
యతనివెంట వేడ్క నరుగుదువే నీవు, నవల నంటఁ దగును నసురనాథ!

1257

తా ॥ అసురేశ్వరా! అశుచిగా నీవు వెళ్ళి శివుణ్ణి తాకితే శివుడిచ్చిన వరం ఫలించదు. కాబట్టి నా మాట విని, నీవు శుభ్రంగా కాళ్ళూ చేతులు కడుగుకొని, నీరు నోటిలో పోసుకొని పుక్కిలించి, పరిశుభ్రతతో శివుడి వెంట వెళ్ళు. ఆ విధంగా చేస్తే, అప్పుడు నీవు శివుణ్ణి తాకి నీ కోరిక నెరవేర్చుకోవచ్చు. శివుడి వరమూ ఫలిస్తుంది.

వరమిచ్చిన వరప్రధాతపైనే వరాన్ని ప్రయోగించాలనుకోవడం వృకునికి గర్వం ఏపాటిదో తెలియనే తెలుస్తుంది.

మ. అతి దుశ్శంకలు మాని పొమ్మనిన దై త్యారాతి మాయా విమో
హితుఁడై విస్మృతి నొంది తామసముచే నేపారి వాఁ డాత్మ పా
ణి తలంబున్ దననెత్తి మోపికొని తా నేలన్ వెసన్ గూలె వి
శ్రుతదంభోళిహతిన్ వడిం బడు మహా క్షోణీధరంబో యనన్.

1258

తా ॥ వృకాసురా! 'శివుడెందుకు పారిపోతున్నాడు? శివుణ్ణి అందుకోలేకపోతున్నానే!' అని అనవసరంగా ఆలోచించకు. లేనిపోని అనుమానాలు పెట్టుకోక నేను చెప్పినట్లు చేయి" అని వటుడు నమ్మబలకడంతో వృకుడు విష్ణుమాయకు లోబడిపోయి, సర్వం విస్మరించినవాడై అజ్ఞానానికి లోనయ్యాడు. వృకుడిలో తామసగుణం అధికంకాగా వటుడు చెప్పినట్లు చేస్తూ ఆ రాక్షసాధముడు తన చేతిని తానే తన తలపై పెట్టుకొని నేల కూలాడు. వృకుడితల శివుని వాక్కు ప్రకారం నూరుముక్కలై, వజ్రాయుధం దెబ్బకు క్రిందపడిపోయే మహాపర్వతంలాగా అతడు హతమైపోయాడు.

దీని అర్థము శంకరుడు అమాయకుడు, విష్ణువు చతురుడు అని చెప్పడం కాదు. ఇదంతా ఒక వినోదలీల అంతేకానీ ఇరువురూ ఒక్కటే.

వ. అట్లు దన తల నూఱువ్రయ్యలై నేలం గూలిన యసురుం గని యప్పుడు.

1259

తా ॥ ఆ విధంగా తల నూరుముక్కలై నేలకూలిన వృకాసురుణ్ణి చూసి దేవతలందరూ—

క. సుర లసురాంతకు మీఁదన్, వరమందార ప్రసూనవర్షము లోలిం

గురిసిరి తుములంబై దివి, మొరసెన్ సురదుందుభి ప్రముఖతూర్యంబుల్.

1260

తా ॥ రాక్షసాంతకుడైన వటురూపంలో ఉన్న విష్ణుమూర్తిపై మందారపుష్ప వర్షాన్ని కురిపించారు. స్వర్గలోకంలో దేవదుందుభులు ఒక్కుమ్మడిగా మారుమ్రోగాయి.

క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి దివి నప్సరసలు నన్యోన్యములై
కూడిరి గ్రహములు భయముల, వీడిరి మునికోటు లంత విమలచరిత్రా!

1261

తా ॥ గంధర్వులు విజయగీతాలు ఆలపించారు. అప్సరసలందరూ ఆకాశంలో నృత్యం చేశారు. గ్రహాలన్నీ చక్కగా కూడి ఉన్నాయి. మునీంద్రులు భయం వదలి సుఖంగా ఉన్నారు.

క. మురహరుఁ డెల నవ్వొలయఁగఁ, బురహరుఁ దగఁ జూచి పలికె భూతేశ్వర! యీ
నరభోజనుండు నీ కి, త్తఱి నెగ్గొనరింపఁ దలఁచి తానే పొలిసెన్.

1262

తా ॥ వృకాసురుని మరణంతో సకల లోకాలు హర్షిస్తుండగా విష్ణుమూర్తి శివుణ్ణి చూసి చిరునవ్వులు చిందిస్తూ ఇలా పలికాడు. "భూతనాథా! నరభోజనుడైన ఈ వృకాసురుడు నీకు అపాయం తలపెట్టి తానే అపాయం కొనితెచ్చుకొని ప్రాణాలు విడిచాడు.

వ. అది యట్టిద కాదె! యిజ్జగంబున నధికుండయిన వానికి నపకారంబు గావించిన మానవునకు శుభంబు గలుగునే? యదియునుంగాక జగద్గురుండ వగు నీ కవజ్ఞ దలంచు కష్టాత్ముండు వొలియుటం జెప్పనేల? యిట్టి దుష్టచిత్తుల కిట్టి వరంబు లిచ్చుట కర్జంబు గాదని య ప్పురాంతకు వీడ్కొలిపిన, నతండు మురాంతకు ననేక విధంబుల నభినందించి నిజమందిరంబునకుం జనియె నని చెప్పి యిట్లనియె.

1263

తా ॥ అది అంతే కదా శంకరా! ఈ లోకంలో అధికుడయిన వానికి అపకారం చేసిన మానవుడికి శుభం కలుగుతుందా? అదీగాక, జగద్గురుడవైన నీకు కీడు తలపెట్టిన దుష్టుడు నశించి తీరుతాడు. ఇటువంటి దుర్మార్గులకు ఇలాంటి వరాలివ్వటం భావ్యం కాదు."

అని విష్ణుమూర్తి చెప్పిన మాటలు విన్నవాడై ఆయనను శివుడు అనేక విధాలుగా అభినందిస్తూ, స్తుతిస్తూ తన మందిరానికి వెళ్ళిపోయాడు" అని చెప్పి శుకమహర్షి ఇంకా ఇలా అన్నాడు:

క. మానవనాయక! యీ యా, ఖ్యానముఁ జదివినను వినిన ఘనపుణ్యులు ని
త్యానంద సౌఖ్యములఁ బెం, పూనుదు రటమీఁద ముక్తి నొందుదు రెలమిన్!

1264

తా ॥ 'పరీక్షిన్మహారాజా! గర్వాన్ని విడిచి, వరప్రదాతను భక్తి జ్ఞాన వైరాగ్యాలను కోరుకోవాలే తప్ప తనకు వినాశం తెచ్చేవి కోరుకొని తన వినాశనానికే దారి తీసుకోకూడదని తెలియజేస్తుంది. దీన్ని ఆచరణలో పెట్టిన వారు మాత్రమే సుఖసంతోషాలతో జీవిస్తారు. మోక్షాన్ని పొందుతారు.'

వ. అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

1265

తా ॥ అని చెప్పి, మళ్ళీ ఈ విధంగా వివరించాడు:

క. జననాయక! యింకఁ బురా, తనవృత్తం బొకటి నీకుఁ దగ నెఱిఁగింతున్.
వ.నుము తపోమహిమలఁ జెం, దిన మునిజనములు సరస్వతీనది పొంతన్.

1266

తా ॥ “ఓ మహారాజా! ఇప్పుడు నీకింకో పురాతన కథను చెబుతాను విను. మహాతపస్సంపన్నులైన మునీశ్వరులు సరస్వతీనది ఒడ్డున—

## భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యమును శోధించుటకు పోవుట

క. వితతక్రియ లొప్పఁగ స, త్క్రతువుల నొనరింప నచటఁ గైగొని లక్ష్మీ
పతిభవ పితామహులలో, నతులితముగ నెవ్వ దధికు డని తమలోనన్.

1267

తా ॥ శాస్త్రోక్తంగా అనేక యజ్ఞయాగాలు చేయసాగారు. ఒకనాడు వారి మధ్య "త్రిమూర్తులలో ఎవరు అధికులైనవారు" అనే చర్చ నడిచింది.

వ. ఇట్లు దలపోసి తన్మమహత్త్వం బంతయుం తెలిసి రమ్మని భృగుమహాముని న మ్మువ్వురు వేల్పులకడకుం బంపిన న త్తాపసోత్తముండు సని చని ముందట.

1268

తా ॥ ఈ విధంగా వాదోపవాదాలు చేసి ముగ్గురి యొక్క మహిమను సాకల్యంగా తెలుసుకొని రమ్మని భృగుమహర్షిని నియోగించారు. మునులందరిచేత నిర్దేశింపబడ్డ భృగువు త్రిమూర్తుల సందర్శనార్థం బయలుదేరాడు.

క. జలరుహసంజాత సభా, స్థలమున కొగి నేఁగి యతని సత్త్వగుణంబుం
దెలియుటకై నుతివందన, ములు సేయకయున్న నజుఁడు ముసముస యనుచున్.

1269

తా ॥ భృగుమహర్షి మొదటగా బ్రహ్మదేవుడి సభాస్థలికి వెళ్ళాడు. ఆ మహర్షి వెళ్ళింది త్రిమూర్తుల గుణాలు పరీక్షించి వారిలో ఎవరు ఉన్నతుడో తనను పంపిన మునులకు తెలియజెప్పడానికి. అందుకని సృష్టికర్తయొక్క సత్త్వగుణం ఎంతటిదో తెలుసుకొందామని ఏమీ మాట్లాడకుండా, విధాతకు నమస్కరించకుండా, ఆయనను నుతించకుండా ఆయనముందు నిలబడి ఉన్నాడు భృగువు. బ్రహ్మదేవుడికి భృగుని ప్రవర్తన అర్థంకాలేదు. కోపంతో

చిఱచిఱలాడాడు.

క. మనమునఁ గలఁగుచు భృగుఁ దన, తనుజాతుం డగుట బుద్ధిఁ దలఁచినవాఁడై
ఘనరోషస్ఫురితాగ్నిని, ననయము శాంతోదకముల నల్లన నార్చెన్.

1270

తా ॥ భృగువు నమస్కరించకపోవడంతో బ్రహ్మదేవుడు మనస్సులో బాధపడడు. అయినా భృగువు తన కుమారుడని తలచి, తనలో రేగుతున్న రోషాగ్నిని చల్లబరచి శాంతమనస్కుడైనాడు.

చ. మహిత తపోధనుండు మునిమండనుఁ డెయ్యెడఁ బాసి వెండియు
న్నహిపతి భూషుఁ గాన రజతాద్రికి నేగిన న గ్గిరీంద్రుపైఁ
దుహినమయూఖ శేఖరుఁడు దుర్గయుఁ దాను విశ్రమించుచున్
ద్రుహిణ తనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రమోద మందుచున్.

1271

తా ॥ తపస్సే ధనంగాగల ఆ భృగుమహర్షి, మునులకే అలంకారప్రాయుడైన ఆ భృగుమహర్షి సత్యలోకాన్ని వీడి నాగభూషణుడైన శంకరుణ్ణి దర్శించాలని వెండికొండకు వెళ్ళాడు. ఆ సమయంలో చంద్రశేఖరుడైన శివుడు, దుర్గాదేవితో కలిసి విశ్రమించి ఉన్నాడు. బ్రహ్మపుత్రుడైన భృగువు తన మందిరానికి వచ్చినందుకు సంతోషించాడు.

క. కనుఁగొని భ్రాతృ స్నేహం, బునఁ గౌఁగిటఁ జేర్చు ననుచు ముక్కంటి రయం
బున నెదురేగిన ముని రు, ద్రుని యందలి సత్త్వగుణ మెఱుంగుట కొఱకై.

1272

తా ॥ భ్రాతృస్నేహంతో భృగువు తనను కౌగిలించుకొంటాడు గదా అని అత్యంతాభిమానంతో శివుడు గబగబా భృగువుకు ఎదురువెళ్ళాడు. కానీ రుద్రునిలోని

సత్త్వగుణం ఎంతటిదో తెలుసుకొందామనుకొన్నాడు భృగువు.

వ. అతనిం గైకొనక యూరకుండిన.

1273

తా ॥ ఎదురు వచ్చిన శివుణ్ణి ఆలింగనంతో గౌరవించక, భృగువు మౌనం వహించి నిలబడ్డాడు.

ఉ. ఆ నిటలాంబకుండు గమలాసన నందనుఁ జూచి భూరి కా
లానల రోషవేష భయదాకృతిఁ దాల్చి పటుస్ఫులింగ సం
తానము లొల్క శూలమునఁ దాపసముఖ్యు నురంబు వ్రేయఁగాఁ
బూనినఁ బార్వతీరమణి బోరన నడ్డము వచ్చి చెచ్చెరన్;

1274

తా ॥ ఫాలనేత్రుడైన రుద్రుడు బ్రహ్మపుత్రుణ్ణి, ఆతని ప్రవర్తనను చూసి ప్రళయకాలరుద్రుడై, మహాభయంకరాకారాన్ని ధరించాడు. క్రోధాన్ని విస్ఫులింగాలు వెదజల్లుతుండగా భృగుని వక్షస్థలాన్ని త్రిశూలంతో పొడవబోయాడు త్రినేత్రుడు. ఆ పరిస్థితిలో పార్వతీదేవి పరుగుపరుగున వచ్చి భృగునికి అడ్డుగా నిలబడింది.

క. తన విభుపాదములకు వం, దనముం గావించి సముచిత ప్రియముల న
య్యనలాక్షుని కోపము మా, న్చి నమ్మునినాథుఁ డచట నిలువక చనియెన్.

1275

తా ॥ పార్వతీదేవి వెంటనే పతివైపు చూసి, అతని పాదపద్మాలకు నమస్కరించింది. యుక్తమైన ప్రియవచనాలతో నాథున్ని శాంతపరిచింది. భృగువు ఇక అక్కడ నిలవక వెళ్ళిపోయాడు.

సీ. పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ జని యందు సమధికైశ్వర్య మొప్పఁ
గమలాంక పర్యంకగతుఁడై సుఖించు న క్కౌస్తుభ భూషు వక్షస్థ్సలంబుఁ
దన పాదమున బిట్టు దన్నెఁ దన్నినఁ బాన్పు డిగి వచ్చి మునిఁ జూచి నగధరుండు
పదముల కెఱఁగి యో పరమ తపోధన! యీగతి నీ వచ్చు టెఱుఁగ లేక

తే. యున్న నా తప్పు మన్నించి నన్నుఁ గరుణఁ, జూచి యీ దివ్య మణిమయస్ఫూర్తిఁ దనరు
రుచిర సింహాసనమునఁ గూర్చుండు దివ్య, తాపసోత్తమ! యభయ ప్రదాననిపుణ!

1276

తా ॥ భృగుమహర్షి తరువాత బహు సుందరంగా విరాజిల్లుతున్న వైకుంఠ పురంలో ప్రవేశించాడు. వైకుంఠంలో సమస్త భోగభాగ్యాలతో అలరారుతున్న విష్ణుమూర్తిని చూశాడు. ఆ సమయంలో శ్రీహరి కౌస్తుభాది మణిభూషణాలు అలంకరించుకొని లక్ష్మీదేవి అంకస్థలంపై పవళించి సుఖసంతోషాలలో మునిగితేలుతున్నాడు. వెనకాముందూ చూడకుండా లక్ష్మీమాతకు నివాసస్థానమైన విష్ణుమూర్తి వక్షస్థలాన్ని భృగువు తన కాలితో గట్టిగా ఒక్క తన్ను తన్నాడు. ఎప్పుడైతే భృగువు తనను తన్నాడో, దానికి ఏ మాత్రం కోపంతెచ్చుకోకుండా విష్ణుమూర్తి వెంటనే పాన్పుదిగివచ్చి ఆ మహర్షి పాదాలకు నమస్కరించాడు. భృగువును చూసి “పరమ తపోధనా! నీవు ఇప్పుడు ఇక్కడకు వస్తావన్న విషయం నాకు తెలియదు. అజ్ఞానంతో చేసిన నా తప్పును మన్నించు. నన్ను కరుణించి, దివ్యమణులతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఈ సుందర సింహాసనం మీద కూర్చోండి. మీరు దేవర్షులు. అభయప్రదాతలు.

క. అలఘుపవిత్ర! భవత్పద, జలములు నను నస్మదీయ జఠరస్థ జగం
బుల లోకపాలురను బోలు, పలరఁగఁ బుణ్యులను జేయు ననఘ చరిత్రా!

1277

తా ॥ పవిత్రమూర్తీ! భృగుమహర్షీ! నీ పాదజలం నన్నూ, నాతోపాటు నా కుక్షిలో ఉన్న సమస్త జగాలను, దిక్పాలకులను, సర్వులనూ పుణ్యులను చేయగల అతి పవిత్రమైన జలం.

వ. మునీంద్రా! భవదీయ పాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణం బయ్యె; భవదాగమనంబు మాఁబోటివారికి శుభావహం బగుం గాదె; యేను ధన్యుండ నైతి నని మృదుమధురాలాపంబుల ననునయించిన న మ్మునివరుండు లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబు నొంది, య మ్ముకుందు ననంత కల్యాణ గుణనిధి నభినందించి యానందబాష్పధారాసిక్త కపోలుం డగుచుఁ దద్భక్తి పారవశ్యంబున నొండు పలుకనేరక యతని చేత నామంత్రణంబు వడసి మరలి సరస్వతీ తీరంబున నున్న మునుల సన్నిధికిం జనుదెంచి వారలం గనుంగొని.

1278

తా ॥ పాపరహితా! మహర్షి సత్తమా! నీ పాదహతి నా వక్షస్థలానికి ఆభరణంగా ప్రకాశించింది. మా వంటి వారికి మీ రాక శుభప్రదం కదా! నిజంగా మీ వల్ల నేను ధన్యుణ్ణి అయ్యాను." అని విష్ణుమూర్తి మధురమైన మంచి మాటలతో ఆయనను అనునయించాడు. లక్ష్మీనాథుడు అనిన మాటలకు భృగువు పరమానందభరితుడైనాడు. అనంత కల్యాణ గుణాలకు నిధి అయిన పురుషోత్తముణ్ణి మరీమరీ అభినందించాడు. విష్ణుమూర్తి చూపిన ఆదరణకు వచ్చిన ఆనంద బాష్పాలతో మహర్షి చెక్కిళ్ళు తడిసిపోయాయి. భక్తిపారవశ్యంలో విష్ణువునే ధ్యానిస్తూ, మాట్లాడలేకపోయాడు. శ్రీహరి చేత వీడ్కోలు పొందినవాడై భృగువు వైకుంఠం నుంచి తిరిగి సరస్వతీ నదీతీరంలో ఉన్న ఋషుల వద్దకు వెళ్ళాడు.

సీ. మునినాయకులతోడఁ దన పోయి వచ్చిన తెఱఁగును దనమది దృష్టమైన
మూఁడుమూర్తుల విధంబును నెఱింగించిన వినివారు మనముల విస్మయంబు
నంది చిత్తంబున సందేహమును బాసి చిన్మయాకారు లక్షీసతీశుఁ
డనుపముఁ డనవద్యుఁ డఖిల కల్యాణగుణాకరుఁ డాదిమధ్యాంతరహితుఁ

తే. డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడ, కాక గణుతింప దైవ మొక్కరుఁడు వేఱె
కలఁడె యనుబుద్ధి విజ్ఞాన కలితు లగుచు, హరిపదాబ్జాతయుగళంబు నర్థిఁ గొలిచి.

1279

తా ॥ భృగువు ఆ విధంగా తనను పరీక్షించి రమ్మని పంపిన మునులందరినీ చూసి తాను త్రిమూర్తుల దగ్గరకు వెళ్ళి వచ్చిన విషయమంతా వివరంగా తెలియజేశాడు. తన మనస్సుకు అర్థమైన బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ముగ్గురి ప్రవర్తనా విధానాలను, వారి గుణాలను విడమరచి చెప్పాడు. భృగుమహర్షి చెప్పినదంతా విని అక్కడ ఉన్న మునీశ్వరులందరూ ఆశ్చర్యచకితులైనారు. తమకు కలిగిన సందేహాన్ని నివృత్తి చేసుకొన్నారు. జ్ఞానరూపుడైన లక్ష్మీనాథుడు సాటిలేని దైవమని నిశ్చయించారు. "అనవద్యుడు, అఖీల కళ్యాణ గుణాకరుడు, ఆదిమధ్యాంత రహితుడుగా ప్రకాశిస్తున్న పుండరీకాక్షుడు తప్ప వేరే దేవుడు, సత్త్వగుణ ప్రధానుడు ఇంకొకడు ఎక్కడైనా ఉన్నాడా" అని ఆలోచించి విజ్ఞాన హృదయులైనారు. ఆ విష్ణుమూర్తి యొక్క పాదపద్మాలను మనస్సులోనే కొలిచారు.

స బ్రహ్మ స శివః స హరిః సేన్ద్రః – అని వేదం ప్రస్తావించింది. సృష్టి కారకుడుగా ఆ బ్రహ్మ, స్థితి కారకుడుగా హరి, లయకారకుడుగా శివుడు. ఈ మూడింటి తత్త్వం విడదీయరానిది. అందుచేత వీరిలో ఎవరిని కొలిచినా చివరికి చేరేది ఆ నామరూపాలు లేని పరబ్రహ్మనే అన్న విషయం గుర్తుంచుకోవాలి.

వ. అట్లు సేవించి యవ్యయానందం బయిన వైకుంఠధామంబు నొంది; రని చెప్పి వెండియు నిట్లనియె.

1280

తా ॥ ఆ విధంగా సరస్వతీ నదీ తీరంలో యజ్ఞయాగాలు చేసి, తపస్సంపన్నులైన మహర్షులందరూ నిత్యం విష్ణువును సేవించి అవ్యయమైన ఆనందాన్నిచ్చే వైకుంఠాన్ని పొందారు." అని శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పి, ఇంకా ఈ విధంగా అన్నాడు:

# శ్రీకృషుడు మృతులయిన విప్రసుతులను తెచ్చుట

సీ. నరనాథ! యొకనాఁడు నలినాయతాక్షుండు పొలుచు కుశస్థలీపురమునందు
సుఖముండ నొక్క భూసురవర్యు భార్యకుఁ బుత్రుండు జన్మించి పుట్టినపుడ
మృతుఁడైన ఘనశోకవితతిచేఁ గ్రాఁగుచు, నా డింభకునిఁ గొంచు నవనిసురుఁడు
చనుదెంచి పెలుచ రాజద్వారమునఁ బెట్టి కన్నుల బాష్పాంబుకణము లొలుక

తే. బాపురే! విధి నను దుఃఖ పఱుపఁ దగునె?, యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టుకొనుచు
వగల డెంద మందంద యెరియ నాక్రందనంబు, సేయుచును వచ్చి యా విప్రశేఖరుండు.

1281

తా ॥ "పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు నివసిస్తున్న ద్వారకాపురంలో, ఆ కమలాక్షుడు సుఖజీవనం సాగిస్తుండగా ఒకనాడు ఒక భూసురుడు పుత్రశోకంతో కాగిపోతూ ద్వారకానగర రాజద్వారం వద్దకు వచ్చి భోరుమని దుఃఖించాడు. ఆయన కుమారుడు పుట్టీ పుట్టగానే మరణించడంతో ఆ మృతశిశువును తెచ్చి రాజద్వారం వద్ద పడుకోబెట్టి ఆర్తిచెందుతూ "విధి నన్ను ఈ విధంగా బాధపెట్టవచ్చా! నేనేం పాపం చేసానని భగవంతుడు నన్నిట్లా క్రూరంగా శిక్షిస్తున్నాడ' ని విధిని తిడుతూ తనను తాను తిట్టుకొంటూ పెద్దగా ఏడువసాగాడు.

సీ. అధికశోకంబున నలమటఁ బొందుచు నచ్చటి జనులతో ననియెఁ బెలుచ
బ్రాహ్మణ విద్వేషపరుఁ డయి తగ శాస్త్ర పద్ధతి నడవక పాపవర్తి
యై క్షత్రబంధువుఁ దగు వాని దురితంబు చేత మత్పుత్రుండు జాతమైన
యప్పుడ మృతుఁ డయ్యె నక్కట! హింసకు రోయక యెప్పు డన్యాయకారి

తే. యగుచు విషయానుగతచిత్తుఁడైన యట్టి, రాజు దేశంబు ప్రజలు నిరాశు లగుచు
దుఃఖములఁ జాల నొందుచుందురు నటంచు నేడ్చుచును నట నిల్వక యేగె నపుడు.

1282

తా ॥ ఆ విప్రుడు అత్యంత దుఃఖంతో అలమటించిపోతూ అక్కడ గుమికూడిన జనులతో ఇలా అన్నాడు: "వేదవిదులైన బ్రాహ్మణోత్తముల పట్ల విద్వేషంతో శాస్త్రానుసారంగా ప్రవర్తించక, పాపాత్ముడైన రాజు పాలనలో, ఆ నరపతి చేసిన పాపాలవల్లనే నా పుత్రుడు పుట్టగానే చనిపోయాడు. హింసాత్ములను అసహ్యించుకోక, అన్యాయకృత్యాలనే సమర్థిస్తూ, ఆచరిస్తూ విషయలోలుడైన రాజుయొక్క రాజ్యంలోని ప్రజలు ఎల్లప్పుడూ నిరాశతో దుఃఖాలపాలవుతుంటారు" అని అంటూ ఏడుస్తూ అక్కడ ఇక నిలబడలేక వెళ్ళిపోయాడు.

వ. ఇవ్విధంబున మఱియు దన సుతులు మృతు లయినపుడెల్ల వారలం గొనివచ్చి యవ్విప్రుండు రాజు మొగసాలంబెట్టి రోదనంబు సేయుచు, నెప్పటియట్ల కొన్ని గాథలు సదివి పోవుచుండె; నివ్విధంబున నెనమండ్రు సుతులు మృతులైన పిదపం దొమ్మిదవ సుతుండును మృతుండైన వాని నెత్తికొని వచ్చి యెప్పటి విధంబునఁ బలవరించుచున్న యా బ్రాహ్మణునిం గని యర్జునుం డిట్లనియె.

1283

తా ॥ ఈ విధంగా ఆ బ్రాహ్మణుని పుత్రులు ఎంతమందో పుట్టగానే చనిపోతూ ఉండటంతో – ఆ శిశువులనందరినీ తీసుకొని వచ్చి ఆ విప్రుడు రాజుగారి మొగసాలలో పెట్టి దుఃఖీస్తూ ప్రతిసారీ కొన్ని మాటలు అంటూ, విధిని తిడుతూ, తనను తిట్టుకొంటూ వెళ్ళిపోయేవాడు. అలా ఎనిమిది మంది కొడుకులు మృతిచెందిన తరువాత తొమ్మిదో కొడుకు కూడా చనిపోవడంతో, ఆ శిశువును ఎప్పటిలాగానే రాజద్వారం దగ్గర పెట్టి ఆ బ్రాహ్మణుడు పెద్దగా రోదించసాగాడు. అర్జునుడు ఆ బ్రాహ్మణున్ని చూసి ఈ విధంగా అన్నాడు.

క. ఈ పగిది నీవు వగలన్, వాపోవఁగఁ జూచి యకట! వారింపంగా
నోపిన విలుకాఁ డొక్కం, డీ పురి లేఁడయ్యె నయ్య! యిది పాప మగున్.

1284

తా ॥ "ఈ రకంగా నీవు భరించరాని శోకంతో కుమిలిపోతుంటే, నీ బాధను నివారించి నీ పుత్రుని నీకు దక్కేటట్లు చేయగల వీరుడు ఈ నగరంలో ఒక్కడు కూడా లేడా? నిన్నిలా వదిలివేయటం మహాపాపం సుమా!

సీ. పుత్త్రులఁ గోల్పోయి భూరిశోకంబున వనటఁ బొందుచు విప్రవరులు చాల
నే రాజురాజ్యమందేని వసించుదు రారాజుఁ దలపోయ నవనిమీఁద
నటునిఁగా నాత్మ నెన్నం దగు; నీపుత్రు నే బ్రతికించెద నిపుడ పూని
యటు సేయనైతినే, ననలంబు సొచ్చెద నని భూసురుఁడు వెఱఁగందఁ బలుక

తే. నతఁడు కదు వ్రేగుమాట విట్లాడ దగునె?, భూరివిక్రమశాలి రాముండు మేటి బలుఁడు
హరియును శౌర్యసంపన్ను లనఁగఁ, దనరు ప్రద్యుమ్నుఁ దతని నందనుఁడు మఱియు.

1285

తా ॥ పుత్రులను కోల్పోయి అధికశోకంతో కూరుకుపోయిన విప్రులు ఎక్కువ సంఖ్యలో ఎవరిరాజ్యంలో ఉంటారో ఆ రాజు నటుడు తప్ప మనిషికాడు. బ్రాహ్మణోత్తమా! నీ పుత్రుణ్ణి నేనిప్పుడే బ్రతికిస్తాను. ఆ విధంగా నేను కనుక చేయలేకపోతే వెంటనే అగ్నిలో దూకి దేహత్యాగం చేస్తాను" అని విప్రుడు ఆశ్చర్యపడేటట్లు అర్జునుడు పలికేసరికి ఆ బ్రాహ్మణుడు అతనిని చూసి "ఈ వెఱ్ఱిమాటలు ఎందుకయ్యా! మహాపరాక్రమోపేతులైన బలరాముడు, శ్రీకృష్ణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు ఉన్నారు కదా!

తే. వినుతబలు లైన యాదవ వీరవరులుఁ, గలుగ వారలచేఁ గాని కార్యమీవు
చక్కఁబెట్టుట యెట్లు? నీచనెడు త్రోవఁ, బొమ్ము నావుదు న య్యింద్రపుత్రుఁ డపుడు.

1286

తా ॥ మహాబలశాలురైన ఇంతమంది, ఇంకా ఎంతోమంది యాదవ వీరులిక్కడ ఉన్నారు. వాళ్ళు చేయలేని పని నీవు చేయగలుగుతావా? నీ దారిన నీవు వెళ్ళవయ్యా!" అని

అనగానే అర్జునుడు అప్పుడు తీవ్రంగా స్పందించాడు.

క. మనమున దురహంకారము, ఘనముగఁ బొడముటయు, నపుడు కవ్వడి విప్రుం
గనుఁగొని యచ్చటిజనములు, వినఁగా నిట్లనియె రోషవిహ్వలమతియై.

1287

తా ॥ మనస్సునిండా దురహంకారం నిండిపోగా అర్జునుడు ఆ బ్రాహ్మణున్ని చూసి అక్కడ ఉన్న జనాలందరు వినేటట్లు రోషావేశుడై ఇలా పలికాడు:

మ. బలుఁడం గాను; మురాసురాంతకుఁడఁ గాఁ; బ్రద్యుమ్నుఁడం గాను; నేఁ
తలపం దత్తనయుండఁగా నని విరుద్ధవ్రాతమున్ భీషణో
జ్జ్వల గాండీవ ధనుర్విముక్త నిశితాస్త్ర శ్రేణిచేఁ బీన్గు పెం
టలు గావించు పరాక్రమ ప్రకటచండ స్ఫూర్తి నేఁ బార్థుఁడన్.

1288

తా ॥ "ఓ జనులారా! బ్రాహ్మణోత్తమా! నేను బలరాముణ్ణిగాను. శ్రీకృష్ణుణ్ణి అంతకంటే కాను. ప్రద్యుమ్నుణ్ణి కూడా కాను. అనిరుద్ధుణ్ణి అసలే కాను. శత్రుసమూహాన్ని అంతటినీ, మహాభయంకరంగా ప్రకాశిస్తున్న, గాండీవమనే ధనుస్సు నుండి వదిలిన శస్త్రాస్త్ర పరంపరతో పీనుగు పెంటలుగా చేసే ప్రచండ పరాక్రమంతో విరాజిల్లే అర్జునుణ్ణి.

వ. అదియునుంగాక.

1289

తా ॥ అంతేకాక—

చ. బలిమిఁ బురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిం
దలపడి పోరినట్టి రణధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా!

బెలుకుఱ మృత్యుదేవతను బింక మడంచి భవత్తనూజుల
న్నలవుఁ చలంబుఁ జూపి కొనియాడఁగ నిప్పుడె తెచ్చి యిచ్చెదన్.

1290

తా ॥ విప్రోత్తమా! సాక్షాత్తు పరమేశ్వరుడినే నా శౌర్యసంపదతో జయించిన మేటి వీరుణ్ణి. రణమంటే పారిపోయే పిరికి వాణ్ణి కాదు. మహాధైర్య సంపన్నుణ్ణి. ఒంటరిగా పోరాడి రుద్రుడినే మెప్పించిన ఈ అర్జునున్ని నీవెరుగవా? మృత్యుదేవత యొక్క గర్వాన్ని అణచి, ఆమెను భయపడేటట్లు చేసి, నా పంతాన్ని, శౌర్యాన్ని చూపి నీ పుత్రులనందరినీ తెచ్చి నీకిస్తాను. అప్పుడు నీవే మెచ్చుకొంటావు."

వ. అని నమ్మం బలికిన యర్జును ప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూరడిల్లి యతని నభినందించుచు నిజమందిరంబునకు జని కొన్ని దినంబు లుండునంత భార్యకుం బ్రసూతివేదనా సమయం బయినం జనుదెంచి వివ్వచ్చుం గని తద్విధం బెఱింగించిన న య్యింద్రనందనుం డప్పుడు.

1291

తా ॥ అని అర్జునుడు ఆ బ్రాహ్మణున్ని విశ్వసింపచేశాడు. ఆ విప్రుడు అర్జునుడు చేసిన ప్రతిజ్ఞకు మనస్సులో కొంత ఊరట చెందాడు. ఆ మహావీరున్ని అభినందిస్తూ తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ తరువాత కొన్నిరోజులు జరిగిన తదనంతరం ఆ విప్రుని భార్య ప్రసవవేదన పడుతుండగా ఆయన అర్జునుని వద్దకు వెళ్ళి విషయమంతా తెలియజేశాడు.

చ. లలిత విశిష్ట సంచిత జలంబుల నాచమనంబు సేసి, సు
స్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్రవేది ని
ర్మల శుభమంత్ర దేవతల మానసమందుఁ దలంచి గాండివం
బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగ యుగ్మమున్.

1292

తా ॥ అదివిన్న అర్జునుడు పవిత్రమైన జలాలతో ఆచమనం చేశాడు. పవిత్రమైన, పరిశుభ్రంగా ఉన్న స్థలంలో నిలబడి శివుడికి భక్తితో నమస్కరించాడు. గొప్పవైన వివిధాస్త్రాలను తెలిసిన ఆ మహావీరుడు నిర్మలమైన మనస్సులో శుభప్రదులైన మంత్రదేవతలను ఆరాధించాడు. గాండీవాన్ని ఎక్కుపెట్టాడు. బాణాలతో పరిపూర్ణంగా నిండిన రెండు అమ్ములపొదులను రెండు భుజాలకు కట్టుకొన్నాడు ఆ సవ్యసాచి.

వ. ఇ వ్విధంబునఁ గట్టాయితంబై యప్పుడు.

1293

తా ॥ అర్జునుడు ఆ విధంగా యుద్ధానికి సిద్ధపడ్డాడు.

సీ. భూసురు వెంట నిమ్ముల నేగి సూతికా భవనంబు చుట్టును బాణవితతి
నరికట్టి దిక్కులు నాకాశపథము ధ రాతలం బెల్ల నీరంధ్రముగను
శరపంజరముఁ గట్టి శౌర్యంబు దీపింపఁ గడు నప్రమత్తుఁడై కాచియున్న
యెడ న మ్మహీసురు నింతికిఁ బుత్రుండు జనియించె; నప్పుడచ్చటి జనంబు

తే. పోయెఁ బోయెఁ గదే యని బొబ్బ లిడఁగ, బొంది తోడన యాకాశమునకు మాయఁ
జెందె నప్పుడు దుఃఖంబు నొంది భూమి, సురుఁడు విలపింపుచును మురహరుని కడకు.

1294

తా ॥ వెంటనే ఆ బ్రాహ్మణుని వెంటవెళ్ళి ప్రసూతికా గృహం చుట్టూ బాణాలతో గోడలు కట్టి ఎవరు లోపనికి ప్రవేశించడానికి వీలులేకుండా అరికట్టాడు. అర్జునుడు తన బాణ విద్యాకౌశలంతో దిక్కులను, ఆకాశాన్ని, భూమిని ఎవరూ చొరబడటానికి వీలు లేకుండా దట్టంగా బాణపర్జరంతో కట్టివేశాడు. మహాశౌర్యవంతుడై, అప్రమత్తతతో మృత్యుదేవత

ప్రవేశించడానికి చోటివ్వకుండా కాపలాకాశాడు. ఆ సమయంలో విప్రుని భార్యకు పుత్రుడు జన్మించాడు. పిల్లవాడు పుట్టడమే తడవుగా అక్కడ ఉన్న జనులు శిశువు చనిపోయాడని దుఃఖంతో పెద్దగా కేకలు పెట్టారు. వింతగా పుట్టిన శిశువు శరీరంతో సహా ఆకాశంలోకి వెళ్ళి మాయమైపోయాడు. ఆ పరిస్థితికి బ్రాహ్మణుడు తట్టుకోలేక శోకిస్తూ శ్రీకృష్ణుడి వద్దకు—

వ. అప్పుడు సని.

1295

తా ॥ వెళ్ళి, ఆయన ముందు భక్తితో నిలబడ్డాడు.

క. ముందట నిల్చి ముకుంద! స, నందన మునివినుత; నందనందన! పరమా
నంద? శరదిందు చందన, కుంద యశస్సాంద్ర! గోవింద! హరీ!

1296

తా ॥ "ఓ ముకుందా! సనందనాది మహర్షుల చేత సంస్తుతింపబడే పరమాత్మా! నందనందనా! పరమానంద స్వరూపా! శరత్కాలం నాటి తెల్లని చంద్రకాంతి వంటి, చందనంలాంటి, మొల్లమొగ్గరీతి ప్రకాశిస్తున్న యశస్సుతో శోభిస్తున్నవాడా! గోవిందా! శ్రీహరీ! కృష్ణా!" అని పలువిధాల స్తోత్రం చేసి అతనికి ఈ విధంగా విన్నవించాడు:

వ. అవధరింపుము. దేవా! యర్జునుం డనెడి పౌరుషవిహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలువడి బేలనైన నన్ను నేమందు? నిఖిల విశ్వోత్పత్తి స్థితి లయంబులకుఁ బ్రధాన హేతుభూతుండ వయిన నీవు సమర్థుండ వయ్యు, వారింపం జాలక చూచుచుండ, నొక్క మనుష్యమాత్రుండు దీర్పం జాలెడువాఁడు గలఁడె? యని వెండియు.

1297

తా ॥ "దేవా! అర్జునుడనే పౌరుషహీనుడు పలికిన వృథా ప్రలాపాలు నమ్మి పుత్రుణ్ణి

పోగొట్టుకొన్న మూర్ఖుణ్ణి. నా అంత అమాయకుడీ భూలోకంలోనే ఉండడు. ఈ సమస్త విశ్వంయొక్క ఉత్పత్తికి గాని, మనుగడకుగాని, నాశనానికి గాని ప్రధానకారకుడవైన నీవు – నా ఆపదను ఆపలేక మౌనం వహించి చూస్తూ ఉంటే – ఒక మానవమాత్రుడు నన్ను రక్షించగలడా?

క. ఎక్కడి పాండుతనూభవుఁ?, డెక్కడి విలుకాఁడు? వీని కెక్కడి సత్త్వం? బెక్కడి గాండీవము? దన, కెక్కడి దివ్యాస్త్ర సమితి? యే మనవచ్చున్?

1298

తా ॥ ఎక్కడి పాండురాజ తనయుడు? ఆతడొక విల్లు ధరించిన విలుకాడా! ఇతగాడికి బలముందా? అతని చేతిలోనిది గాండీవమా? ఆ వీరుడికి దివ్యాస్త్రాలు కూడా తెలుసా? ఆతని పౌరుషాన్ని ఏమనాలి కృష్ణా?"

క. అని తను నోడక నిందిం, చిన విని య య్యర్జునుండు చిడిముడిపడుచుం
దనదివ్యమహిమ పెంపునఁ, జనియెన్ వెస దండపాణి సదనంబునకున్.

1299

తా ॥ ఆ భూసురుడు అర్జునున్ని చూసి ఏమాత్రం భయపడకుండా నిందించాడు. అర్జునుడు ఆ మాటలన్నీ విని భరించలేక విసుగుతో, కోపంతో తన దివ్యమహిమ వల్ల యమధర్మరాజు నివాసానికి వెళ్ళాడు.

క. చని యందు ధారుణీసుర, తనయులు లేకుంటఁ దెలిసి తడయక యింద్రా
గ్ని నిరృతి వరుణ సమీరణ, ధనదేశానాలయములు దగఁ బరికిం చెన్.

1300

తా ॥ యమలోకానికి వెళ్ళిన అర్జునుడికి అక్కడ ఆ విప్రుని పుత్రులు లేరని తెలిసింది.

వెంటవెంటనే ఇంద్రలోకానికి, అగ్నిలోకానికి, నిరృతిలోకానికి, వరుణలోకానికి, వాయులోకానికి, కుబేరలోకానికి, ఈశానుని లోకానికి వెళ్ళి ఆ యా లోకాలన్నీ వెదికాడు. ఆ లోకనాయకుల భవనాలను పరిశీలనగా చూశాడు. కాని ఎక్కడా ఆ బ్రాహ్మణుని పుత్రులు కనిపించలేదు.

వ. వెండియు.

1301

తా ॥ ఆ తరువాత—

చ. నర సుర యక్ష కింపురుష నాగ నిశాచర సిద్ధ సాధ్య ఖే
చ. విహగేంద్ర గుహ్యక పిశాచ నివాసములందు రోసి భూ
సురసుత లేగినట్టి గతి సొప్పడకుండుటఁ జూచి క్రమ్మఱన్
ధరణికి నేగుదెంచి బెడిదంబుగ నగ్ని సొరంగఁ బూనినన్.

1302

తా ॥ మానవలోకంలో వెదికాడు. మృతశిశువులు కనబడక పోవటంతో దేవ, యక్ష, కింపురుష, నాగ, రాక్షస, సిద్ధ, సాధ్య, గరుడ, గుహ్యక, పిశాచ లోకాలన్నీ వెళ్ళి అందరి నివాసాలలోను పరికించి మరీ చూశాడు. ఆ విప్రపుత్రులు ఎక్కడికి వెళ్ళారో, ఏ లోకంలో ఉన్నారో తెలుసుకోలేక పోయాడు అర్జునుడు. తాను చేయవలసిన ప్రయత్నం అంతా చేసినా కూడా లాభంలేకపోవడంతో, అర్జునుడు తిరిగి భూలోకానికి వచ్చి, తన శపథం నెరవేరని కారణంవల్ల అగ్నిప్రవేశం చేయడానికి పూనుకొన్నాడు.

వ. అ వ్విధంబంతయు నెఱింగి య మ్మురాంతకుండు 'విప్రనందనులు నీకుం జూపెద' నని యనలంబు సొరకుండ నతని నివారించి యప్పుడు.

1303

తా ॥ ఆ విషయమంతా తెలుసుకొన్న శ్రీకృష్ణుడు అర్జునున్ని అగ్ని ప్రవేశం చేయకుండా ఆపి "ఆ విప్రపుత్రులను నీకు చూపిస్తాను. నాతో రమ్మ" న్నాడు.

ఉ. సుందరదివ్యరత్నరుచి శోభితమై తనరారు కాంచన
స్యందన మంబుజాప్తుఁ డుదయాచల మెక్కు విధంబు దోఁపఁ బౌ
రందరి దాను నెక్కి తను రశ్మలు దిగ్వితతిన్ వెలుంగ గో
విందుఁ డుదారలీలఁ జనె విప్రతనూజ గవేషణార్థియై.

1304

తా ॥ రత్నకాంతులతో బహుసుందరంగా ప్రకాశిస్తున్న బంగారు రథాన్ని, సూర్యభగవానుడు ఉదయ పర్వతాన్ని ఎక్కుతున్నాడా అన్నట్లు శరీరకాంతులు దిగంతాలవరకు వ్యాపించి తేజరిల్లే విధంగా ఉన్న శ్రీకృష్ణుడు అధిరోహించాడు. బ్రాహ్మణపుత్రులను వెదకి తీసుకురావాలనే ఆలోచనతో కృష్ణుని ఆదేశానుసారం అర్జునుడు కూడా రథం ఎక్కాడు.

చ. చని పురగోష్ఠ దుర్గ వన జానపదాచల పక్కణ ప్రభూ
త నదనదీ సరోవర యుతక్షితి నంతయు దాఁటి సప్త వా
రినిధుల దీవులం గులగిరి ప్రకరంబుల నుత్తరించి మే
రు నగము నాక్రమించుచు మరుద్గతితో రథ మేగ న త్తఱిన్.

1305

తా ॥ ఆ విధంగా బయలుదేరిన కృష్ణార్జునులిద్దరూ నగరాలతో, దుర్గాలతో, అడవులతో, పల్లెసీమలతో, పర్వతాలతో, పట్టణాలతో, నదులతో, సరస్సులతో, నిండిఉన్న భూమినంతటినీ దాటారు. సముద్రాలు ఏడూ దాటేశారు. ద్వీపాలు, కులపర్వతాలు దాటారు. మేరుపర్వతాన్ని కూడా దాటి రథం వాయువేగంతో వెళుతున్న సమయంలో—

చ. మసలక భూరిసంతమస మండలముం దరియంగఁ జొచ్చి సా

హసమునఁ బోవఁ బోవఁగ భయంకరమైన మది గోచరింపమిన్
వసమఱి మోఁకరిల్లి రథవాజులు మార్గము దప్పి నిల్చినన్
బిసరుహపత్రలోచనుఁ డభేద్యతమః పటలంబు వాపఁగన్.

1306

తా ॥ మహాంధకారంతో నిండి ఉన్న ప్రదేశాన్ని సమీపించారు కృష్ణార్జునులు. సాహసోపేతులై ముందుకు ప్రయాణించారు. అలా పోగా పోగా ఇంకా దట్టమైన, చీకటి అలముకొని ఉన్న ప్రదేశం తగిలింది. ఆ స్థలం మహాభయంకరంగా ఉండటంతో కన్నుపొడుచుకున్నా కానరావటం లేదు. శక్తి కోల్పోయిన గుఱ్ఱాలు దారితప్పి నడవలేక నిలబడిపోయాయి. ఆ సమయంలో ఛేదించలేని ఆ చీకటిని ఛేదించడానికి కృష్ణుడు పూనుకొన్నాడు.

సీ. బాలభాను ప్రభా భాసమానద్యుతిఁ గరమొప్ప నిజ రథాంగంబుఁ బనుప
న మ్మహాస్త్రం బేగి చిమ్మచీఁకటి నెల్ల నఱిముఱి నందంద నఱికి వైచి
యగ్రభాగంబున నతులిత గతి నేగ నా మార్గమున నిజస్యందనంబు
గడువడిఁ దోయి యా కడిఁది తమోభూమిఁ గడవ ముందఱకడఁ గాన రాక

తే. మిక్కుటం దృష్టులను మిఱిమిట్లు గొలిపి జదల వెలుఁగొందు దివ్యతేజంబుఁ జూచి
మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు, నాత్మ భయమంది కొంతద వ్వరిగి యరిగి.

1307

తా ॥ బాలభానుని కాంతితో సమానమైన కాంతితో ప్రకాశిస్తున్న తన చక్రాయుధాన్ని శ్రీకృష్ణుడు, ఆ చీకటిని పారద్రోలడానికి పంపాడు. సుదర్శనాయుధం వెళ్ళి ఆ చిమ్మచీకటినంతా నరికివేస్తూ, చిందరవందరచేసి ఇరుప్రక్కలకు నెట్టివేస్తూ అప్రతిమానమైన తన తేజస్సుతో ముందరికి అతివేగంగా దారి చూపిస్తూ వెళుతుండగా ఆ మార్గంలో నుంచి తమ రథాన్ని వేగంగా నడిపించుకుంటూ వెళ్ళి శ్రీకృష్ణార్జునులు ఆ చిమ్మచీకటిని దాటారు. వారిముందు

దివ్యతేజస్సు, మిఱుమిట్లు గొలిపేటట్లు సాక్షాత్కరించింది. భూమ్యాకాశాలు నిండిపోతూ కోటిసూర్య ప్రభలతో వెలిగిపోతున్న ఆ కాంతిని చూసి భయపడి అర్జునుడు కళ్ళుమూసుకొన్నాడు. మరికొంత దూరం భయం భయంగానే వెళ్ళారు.

తే. కడcగి దుర్వార మారుతోత్కట విధూత, చటుల సర్వంకషోర్మి భీషణ గభీర
వారిపూరంబు సొచ్చి తన్నీరమధ్య, భాగమునc గోటిసూర్యప్రభలు వెలుంగ.

1308

తా ॥ తరువాత వారు గాలి విపరీతంగా వీస్తున్న కారణంచేత అలలు తీవ్రంగా అటూఇటూ కొట్టుకుంటూ ఉన్న మహాగంభీరమైన జలంలోకి ప్రవేశించారు. ఆ నీటి యొక్క మధ్య భాగంలో కోటి సూర్యకాంతులతో తేజరిల్లుతున్న ఒక దివ్యభవనం కృష్ణార్జునులకు గోచరించింది.

వ. అది మఱియును జారు దివ్యమణి సహస్రస్తంభాభిరామంబును, నాలంబిత కమనీయ నూత్న రత్న మాలికాలంకృతంబును, భాను శశిమయూఖాగమ్యంబును, ననంత తేజోవిరాజితంబును, బునరావృత్తి రహిత మార్గంబును, నిత్యైశ్వర్య దాయకంబును, నవ్యయంబును, నత్యున్నతంబును, ననూనవిభవంబును, బరమ యోగీంద్రగమ్యంబును, బరమభాగవత నివాసంబునునై యొప్పు దివ్య ధామంబునందు.

1309

తా ॥ ఆ మహాభవనం సుందరమైన దివ్యమణులతో, చిత్రితమైన వేలాది బంగారు స్తంభాలతో, వ్రేలాడుతున్న అందమైన రత్నమాలికలతో, సూర్యచంద్ర కిరణాలకు ప్రవేశయోగ్యం కాని అనంతమైన తేజస్సుతో, ఎల్లప్పుడూ సకల సంపదలను ప్రసాదిస్తూ, మోక్షమార్గాన్ని నిర్దేశిస్తూ, సాటిలేని వైభవంతో అత్యున్నతంగా భాసిస్తూ, అవ్యయమై, యోగీశ్వరులకు ప్రవేశాన్ని కల్పిస్తూ, పరమ భక్తులకు నివాస స్థానమై, అత్యద్భుతంగా దర్శనమిచ్చింది.

సీ. సాంద్రశరచ్చంద్ర చంద్రికా కర్పూర నీహార హారాభ దేహ మమర
నిందింది రేందీవ రేంద్ర నీలద్యుతిఁ గర మొప్పు మేచక కంఠ సమితి
నరుణాంశుబింబ భాసుర పద్మరాగ వి న్యస్త సహస్రోరు మస్తకములు
వివృతాననోద్గత విషధూమరేఖల లీలఁ జూపట్టిన నాలుకలును

తే. కలిత సాయంతన జ్వల జ్జ్వలన కుండ, ముల విడంబించు వేఁడి చూపులును గలిగి
భూరి కలధౌత గిరినిభాకార మమరఁ, బరఁగు భోగీంద్రభోగతల్పంబునందు.

1310

తా ॥ శరత్కాల చంద్రుని వెన్నెలవలె, కర్పూరంలాగా, మంచు మాదిరి, ముత్యంవంటి తెల్లని దేహకాంతితో మెరిసిపోతున్న ఆదిశేషున్ని చూశారు కృష్ణార్జునులు. ఆ దివ్యభవనంలో ఆదిశేషుడు తుమ్మెదలవంటి, నల్లకలువలలాంటి, ఇంద్రనీలమణులవలె నిగనిగని కాంతులతో మెరిసిపోతున్న అనేక కంఠాలతో ఒప్పుతున్నాడు. సూర్యదేవుని అరుణకాంతి వంటి కాంతితో ప్రకాశిస్తున్న పద్మరాగమణులను పడగలపై కలిగి, విషధూమాన్ని వెళ్ళగక్కే నాలుకలతో, అగ్నిజ్వాలలకన్నా మిక్కుటమైన వేడివేడి చూపులతో, పెద్ద వెండి కొండలాగా వెలిగిపోతున్న ఆ సహస్రఫణీంద్రున్ని తనివితీరా చూశారు.

వ. సుఖాసీనుండై యున్నవాని డాయం జని యప్పుడు.

1311

తా ॥ ఆ శేషతల్పంపైన చక్కగా కూర్చొని ఉన్న పుండరీకాక్షుని దర్శిస్తూ ఆ దేవదేవుణ్ణి సన్నిధానం చేరారు కృష్ణార్జునులు.

సీ. సజల నీలాంబుద శ్యామాయమానాంగు నాశ్రితావన ముదితాంతరంగు
సనకాది యోగిహృద్వనజ మదాళీంద్రు ముఖపద్మ రుచిజిత పూర్ణ చంద్రుఁ
గమనీయ నిఖిల జగద్ధితచారిత్రుఁ బ్రత్యూషసంఫుల్ల పద్మ నేత్రు

నిందిర హృదయార విందారుణోల్లాసు శ్రీకర పీత కౌశేయవాసు

తే. హార కుండల కటక కేయూర మకుట, కంక ణాంగద మణిముద్రికా వినూత్న

రత్ననూపుర కాంచీ విరాజమాను, భవమహార్ణవశోషు సద్భక్తపోషు.

1312

తా ॥ ఆ శ్రీమన్నారాయణుడు నీలమేఘం వంటి శ్యామల వర్ణంతో శోభాయమానంగా ఉన్నాడు. తనను ఆశ్రయించి ఉన్న భక్తజనులను సంరక్షిస్తూ సంతుష్టాంతరంగుడై వెలిగిపోతున్నాడు. సనకసనందనాది మహర్షుల హృదయపద్మాలలో నిలిచిపోయే తుమ్మెదలాగా విరాజిల్లుతున్నాడు. చంద్రవదనుడుగా; సకలలోక సుప్రసిద్ధ చారిత్రకుడుగా; లక్ష్మీదేవి హృదయ పద్మాన్ని వికసింపచేసేవాడుగా; సంపత్కరుడుగా, పీతాంబర ధారిగా, వివిధములైన ఆభరణాలతో, కుండలాలతో, భుజకీర్తులతో, మణిమకుటంతో, రత్నాలతో కూర్చిన కాలి అందెలతో, వజ్రపుటుంగరాలతో కమలాక్షుడు దేదీప్యమానంగా దివ్యతేజస్సుతో ప్రకాశిస్తుండటం వారిద్దరూ కనులారా చూశారు. ఆ శ్రీహరి సంసారసాగరాన్ని ఇంకింపచేసేవాడు. భక్తాగ్రగణ్యులను పోషించడమే కర్తవ్యంగా పెట్టుకొన్నవాడు.

వ. మఱియు సనందనాది మునిజన సంతత సేవితు, నానందకందళిత హృదయారవిందు, నరవిందవాసినీ వసుంధరాసుందరీ సమేతు, నారదయోగీంద్ర సంకీర్తనానందితు, నవ్యయు, ననఘు, ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాదిమాధ్యాంత రహితు, భవలయాతీతుఁ, గరుణాసుధాసముద్రు, నచ్యుతు, మహానుభావుఁ బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిలజగదుత్పత్తి స్థితిలయకారణుఁ, జిదచిదీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభశ్రీవత్సవక్షు, శంఖచక్ర గదా పద్మ శార్ఙ్గాది దివ్యసాధను, సర్వశక్తిసేవితుఁ బరమేష్ఠిజనకు నారాయణుం గనుంగొని దండ ప్రణామంబులు సేసి కరకమలంబులు మొగిచి భక్తి పూర్వకంబుగా నభినందించిన, న య్యాది దేవుండును వారలం గరుణావలోకనంబులు నిగుడ నవలోకించి, దరహాసపూరంబు దోరంబుగా సాదరంబుగ

నిట్లనియె.

1313

తా ॥ సనందనుడు మొదలైన మునుల చేత సేవింపబడుతున్నవాడు; సంతోషంతో నిండిన హృదయకమలం గలవాడు; భూదేవీ శ్రీదేవులతో కూడి ఉన్నవాడు, నారదమహర్షి గానామృతంచేత సంతుష్టి చెందిన మనస్సుగలవాడు, అవ్యయుడు, పాపరహితుడు, అనంతుడు, అప్రమేయుడు, ఎవరిచేత జయింపబడనివాడు, అవికారుడు, ఆదిమధ్యాంతాలు లేనివాడు, భవదూరుడు, కరుణా సముద్రుడు, అచ్యుతుడు, మహానుభావుడు, పరమ పురుషుడు, పురుషోత్తముడు, సృష్టి స్థితి లయకారుడు, జ్ఞానరూపుడు, అష్టభుజుడు, శ్రీవత్సలాంఛనుడు, కౌస్తుభమణి విరాజితుడు, శంఖచక్రాది ఆయుధాలతో ప్రకాశిస్తున్నవాడు, సమస్త శక్తులచేత కొలువబడుతున్నవాడు, బ్రహ్మదేవుని జనకుడు అయిన విష్ణుమూర్తిని చూసి కృష్ణార్జునులు సాష్టాంగ నమస్కారం చేశారు. రెండు చేతులూ జోడించి సద్భక్తితో ఆ పరంధాముణ్ణి స్తుతించారు. ఆ విధంగా స్తోత్రం చేస్తున్న శ్రీకృష్ణార్జునులను ఆదిదేవుడైన శ్రీమహావిష్ణువు కరుణతో చూశాడు. చిరునవ్వులు చిందిస్తూ ఆ పురాణ పురుషుడు ఆదరంగా వారితో ఇలా అన్నాడు:

క. ధరణికి వ్రేఁ గగు దైత్యులఁ, బొరిబొరి వధియించి ధర్మమున్ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు, నరనారాయణు లనంగ నా యంశమునన్.

1314

తా ॥ "భూమాతకు భారంగా నిలిచిన దుష్టదానవులను సంహరించడానికే మీరిద్దరూ నా అంశతో భూమిపైన నరనారాయణులుగా అవతరించారు.

క. ఆరాధనియతితోఁ బెం, పారిన మిము ని మ్మునీంద్రు లందరు జూడం
గోరిన మీ వచ్చుటకై, ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దేవలసెన్.

1315

తా ॥ ధర్మాన్ని ప్రతిష్ఠించడానికి మహానిష్ఠతో కార్యోన్ముఖులైన మిమ్మల్ని చూడాలని ఇక్కడ ఉన్న ఈ మహర్షులందరూ కోరారు. వారి కోరిక తీర్చడానికే బ్రాహ్మణవరుని పుత్రులను ఇక్కడకు రప్పించాం. ఆ పుత్రులను తీసుకొని వెళ్ళడానికి మీరిక్కడకు రావాలని ఈ పని చేశాం."

క. అని యా డింభకులను దో, కొని పొండని యిచ్చి వీడుకొలిపిన వారల్
వినతు లయి పెక్కు విధముల, వినుతించుచు నచటు వాసి విప్రుని సుతులన్.

1316

తా ॥ అని శ్రీమన్నారాయణుడు కృష్ణార్జునులతో చెప్పి "ఇదిగో వీరే ఆ బాలురు. మీతో తీసుకుపొండి" అని బ్రాహ్మణ పుత్రులను వారికిచ్చి వారిని సాగనంపాడు. విష్ణుమూర్తి ఆదరానికి సంతోషించిన కృష్ణార్జునులు వినయవంతులై ఆ పరమపురుషుణ్ణి పలువిధాల ప్రస్తుతించి బాలురను తీసుకొని బయలుదేరారు.

వ. తోడ్కొని సంప్రాప్త మనోరథు లయి య బ్బాలకులఁ దత్తద్వయో రూపంబులతోడఁ దెచ్చి యాబ్రాహ్మణునకు సమర్పించిన నతండు సంతుష్టాంతరంగుం డయ్యె; న య్యవసరంబున.

1317

తా ॥ శ్రీకృష్ణార్జునులు తమ మనోరథం తీరడంతో ఆ బ్రాహ్మణబాలురను ద్వారకకు తీసుకొని వచ్చి వారివారి వయస్సుకు, రూపానికి తగినట్లుగా రూపొందించి వారి తండ్రికి అప్పగించారు. దానితో ఆ విప్రోత్తముడు పరమానందభరితుడైనాడు. ఆ సమయంలో—

చ. అనిమిషనాథనందనుఁ డహర్పతితేజుఁడు గృష్ణుతోడఁ దాఁ
జని యచటం గనుంగొనిన సర్వశరణ్యునిఁ బుండరీక నే

త్రుని నిజధామవైభవసదున్నత దన్మహనీయమూర్తికిన్
మనమున మోదమంది పలుమాఱును సన్నుతిఁ జేసె భూవరా!

1318

తా ॥ పరీక్షిన్మహారాజా! సూర్యప్రతాపుడైన అర్జునుడు శ్రీకృష్ణునితో కలిసివెళ్ళి సర్వశరణ్యుడు, పుండరీకాక్షుడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి దర్శించి, ఆ పరాత్పరుని దివ్యభవన వైభవానికి, రమణీయమూర్తి మహత్త్వానికి మనస్సులో ఎంతగానో సంతోషపడ్డాడు. పదే పదే ఆ మహనీయపరంతపుడిని స్తోత్రం చేసి ఆనందించాడు.

తే. వారిజాక్షుని భక్తమందారు ననఘుఁ, గృష్ణు నఖిలేశుఁ గేశవు జిష్ణుఁ బరము
వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు, వందనము లాచరించి యానంద మొందె.

1319

తా ॥ అంతేకాక విష్ణురూపుడైన కృష్ణుణ్ణి, ఆ భక్తవత్సలుని, అనఘుని, జగదీశ్వరుని, జయశీలుని, కేశవుని, పరమాత్ముని అనేక విధాలుగా స్తుతిస్తూ ఆ భగవంతుని పాదపద్మాలకు నమస్కరించి సంతృప్తి చెందాడు.

వ. అంత.

1320

తా ॥ ఆ సమయంలో—

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేది భూ
సుర ముఖ్యప్రజలన్ సమస్త ధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ
బరిరక్షించుచు ధర్మమున్ నిలుపుచుం బాపాత్ములం ద్రుంచుచుం
బరమోత్సాహ మెలర్ప భూరిశుభ విభ్రాజిష్ణుఁడై ద్వారకన్.

1321

తా ॥ శ్రీహరి రూపుడైన శ్రీకృష్ణపరమాత్ముడు, ఆ అనంతుడు, ఆద్యుడు, సర్వేశ్వరుడు, అభవుడు, వేదాలలో తెలియబడేవాడు, భూసురులు మొదలైన సమస్త ప్రజలను రక్షిస్తూ, వారందరికీ ఏ లోటూ లేకుండా సకల ధనవస్తు వాహనాదులను సమకూర్చి ధర్మాన్ని ప్రతిష్ఠించాడు. పాపులు, దుష్టులు అయిన వారిని సంహరిస్తూ పరమోత్సాహంతో, మహోల్లాసంతో సర్వులకూ సకల శుభాలనూ ప్రసాదిస్తూ తేజోవిరాజమానుడై ద్వారకానగరంలో వర్ధిల్లాడు.

క. జనవినుతముగాఁ బెక్కు స, వనములు దనుఁదాన కూర్చి వైదిక యుక్తిం
బొనరించుచు ననురాగము, మనమునఁ దళుకొత్త దైత్యమర్దనుఁ డెలమిన్.

1322

తా ॥ ప్రజలు ప్రస్తుతించే విధంగా శ్రీకృష్ణుడు వైదిక మార్గానుసారంగా తానే అనేక యజ్ఞాలు చేశాడు. ఇతరుల చేతకూడా యజ్ఞయాగాలు చేయించాడు. దానవాంతకుడైన శ్రీకృష్ణుడు ఆనందానురాగాలతో, సకల శుభాలతో ప్రకాశించాడు.

వ. అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ బురందర విభవంబున నిరవొంది కనక మణిమయ విమాన మండప గోపుర ప్రాసాద సౌధ చంద్రశాలాంగణాది వివిధ భవనంబులందును రంగ దుత్తుంగ తరంగ డోలా విలోల కలహంస చక్రవాక కారండవ సారస క్రౌంచముఖ జలవిహంగ విలస దుచ్చలిత గరుదనిల దరదమల కమల కుముద కల్హార సందోహ నిష్యంద మకరంద రసపాన మదవ దిందిందిరకుల కల గాయక ఝంకార నినదంబులును, నిరంతర వసంతసమయ సముచిత పల్లవిత కోరకిత బాలరసాలజాల లాలిత కిసలయ విసర ఖాదన జాత కుతూహలాయమాన కషాయకంఠ కలకంఠ కలరవ మృదంగ ఘోషంబులును, నిశిత నిజచంచూపుట నిర్దళిత

సకలజన నయనానంద సుందరనందిత మాకంద పరిపక్వ ఫలరంధ్ర విగళిత మధుర రసాస్వాదన ముదిత రాజకీర శారికా నికర మృదు మధురవచన రచనా వశ కృత్యంబులును నమరఁ, బురపురంధ్రీ జన పీన పయోధర మండల విలిప్త లలిత కుంకుమపంక సంకుల సౌగంధ్యానుబంధ బంధురగంధానుమోదితుండును, జందనాచల సానుదేశ సంజాత మంజుల మాధవీలతానికుంజ మంజుల కింజల్క రంజిత నివాసవిసర విహరమాణ శబరికా కబరికా పరిపూర్ణ సురభి కుసుమ మాలికా పరిమళ వహుండును, గళిందకన్యకా కల్లోల సందోహ పరిస్పంద కందళిత మందగమ నుండును నగు మందానిల విదూషకునిచేఁ బోషితాభ్యాసిత లాలిత లగు నేలాలతా వితాన నటుల నటనంబుల విరాజితంబులగు కాసారతీర భాసురోద్యానంబులందును, జారు ఘనసార పటీర బాలరసాల సాల నీప తాపించ జంబూ జంబీర నింబ కదంబ ప్రముఖ ముఖ్యశాఖీ శాఖాకీర్ణ శీతలచ్ఛాయా విరచిత విమల చంద్రకాంతోపల వేదికాస్థలంబు లందును, నుదంచిత పింఛవిభాసిత బాలనీలకంఠ కేకారవాకులీకృతకృతక మహీధరంబులందును, లలితమణివాలుకానేక పులిన తలంబులందును, గప్పురంపుం దిప్పలను, గురువేరు చప్పరంబులను, విరచిత దారు యంత్ర నిబద్ధ కలశ నిర్యత్పయోధారాశీకర పరంపరా సంపాదిత నిరంతర హేమంతసమయ ప్రదేశంబు లందును, నిందిరారమణుండు షోడశ సహస్ర వధూయుక్తుండై యందఱ కన్ని రూపులై లలితసౌదామినీ లతాసమేత నీలనీరదంబుల విడంబించుచుఁ గరేణుకా కలిత దిగ్గజంబునోజ రాజిల్లుచు, సలిలకేళీవిహారంబులు మొదలుగా ననేక లీలావినోదంబులు సలుపుచు, నంతః పురంబునఁ గొలువున్న యవసరంబున వివిధ వేణు వీణాది వాద్య వినోదంబులను, మంజుల గానంబులను, గవి గాయక సూత వందిమాగధ జనసంకీర్తనంబులను, నటనటీజన నాట్యంబులను, విదూషకపరిహాసోక్తులను, సరససల్లాప మృదుమధుర భాషణంబులను బ్రొద్దుపుచ్చుచు నానందరసాబ్ధి నోలలాడుచుండె; నంత.

తా ॥ ఆ విధంగా శ్రీకృష్ణుడు రాజ్యపాలన చేస్తూ ద్వారకానగరంలో దేవేంద్రవైభవంతో అలరారుతున్నాడు. మణులు కూర్చిన, స్వర్ణమయమైన మండపాలు; గోపురాలు, చంద్రశాలలు, సౌధాలు ఆ నగరంలో వినూత్న ఆకర్షణను కలుగజేస్తున్నాయి. ఉత్తుంగ తరంగాలపైన ఉయ్యాలలూగుతున్న జలపక్షులైన కలహంసలు, చక్రవాకాలు, క్రౌంచ పక్షులు, బెగ్గురు పక్షులు మొదలైన అనేక పక్షుల రెక్కల వల్ల వీచిన వాయువులచేత నిర్మలములైన నదీజలాలలో ఉత్పన్నమైన పద్మాలు, కలువలు మొదలైన కుసుమాలు కదలాడటం వల్ల జాలువారుతున్న మకరందాన్ని త్రాగి మదించిన తుమ్మెదల మనోహరమైన ఝుంకార నాదాలు వీనుల విందుగా వినవస్తున్నాయి. ఎప్పుడు చూసినా ద్వారకలో వసంత సమయమే ఆసన్నమైందా అన్నట్లు, గున్నమామిడి చెట్ల చిగుళ్ళను ప్రీతికరంగా తిని కషాయ కంఠములతో ముగ్ధమనోహరంగా ఆలపిస్తున్న కోయిలల కూజితాలు జనాలనక్కడ కట్టి పడవేస్తున్నాయి. వాడిగా ఉన్న తమ ముక్కుపుటాలతో మామిడి పండ్లను చీల్చి ఆ రసాన్ని ఆస్వాదించి, ఆనందంతో పలుకుతున్న చిలుకల, గోరువంకల మధురాతిమధురమైన పలుకులు విని జనులు పారవశ్యం చెందుతున్నారు. అత్యంత మనోహరమైన ద్వారకానగరంలో పౌరకాంతలు అలదుకొన్న వక్షోజకుంకుమ పరిమళాన్ని మోసుకువస్తున్న, శ్రీగంధ వృక్షాలు విరివిగా ఉన్న పర్వతంపైన విరిసిన మాధవీలతలతో అల్లుకొన్న పూపొదల నుంచి రాలుతున్న పుప్పొడితో నిండిన ప్రదేశాలలో విహరిస్తున్న శబరకాంతల కొప్పుల యందున్న పుష్పమాలికల సుగంధాన్ని మోసుకువస్తున్న, నదీజలాల కల్లోలంతో మెల్లగా వస్తున్న పిల్లతెమ్మె అనే విదూషకుని చేత ప్రవృద్ధమానమవుతున్న ఏలకీతీగెల నటనలతో విరాజిల్లుతున్న సుందరోద్యాన వనాలలో శ్రీకృష్ణుడు తన ప్రియసతులతో విహరిస్తున్నాడు. అందమైన చందన, కర్పూర, గున్నమామిడి, మద్ది, కడిమి, తమాల, నేరేడు, నిమ్మ, వేప, మొదలైన అనేక వృక్షశాఖల చల్లని నీడలలో నిర్మింపబడిన చంద్రకాంత శిలావేదికలతో కూడిన స్థలాలలో; పురివిప్పుకొని 'కేకా' రావాలతో నృత్యం చేస్తున్న పిల్ల నెమళ్ళతో నిండిన కృతక పర్వతాల సానుప్రదేశాలలో; ఎఱ్ఱని కాంతులతో మెరుస్తున్న ఇసుక తిన్నెలపైన, కర్పూరపు దిబ్బలయందు; కురువేరు పందిళ్ళలో, దారుయంత్రంతో చేయబడిన కలశములనుండి ఎల్లప్పుడూ జాలువారే నీటి ధారలు విరజిమ్మే

తుంపరల వెల్లువలతో, నిరంతర హేమంతకాలాన్ని స్ఫురింపచేసే ప్రదేశాలలో శ్రీకృష్ణుడు తన పదహారువేల మంది సతీమణులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపం ధరించి వారినందరినీ అలరింపచేస్తూ మనోజ్ఞంగా విహరిస్తున్నాడు. ఒక్కొక్క మెరుపు తీగ ప్రక్కన కాంతులీనే ఒక్కొక్క నీలమేఘంలాగా, ఆడ ఏనుగుల మధ్య విలసిల్లే దిగ్గజంలాగా మెరిసిపోతున్నాడు. ప్రియసతులందరితో కలిసి జలక్రీడ మొదలైన అనేక క్రీడలలలో ఆనందిస్తూ, ఆనందింపచేస్తూ శ్రీకృష్ణుడు శృంగార నాయకుడిగా తేజరిల్లాడు. అంతఃపురంలో ఆ పరమాత్ముడు కొలువుదీరి ఉండే సమయంలో – వేణువీణాది అనేకవాద్య విశేషాలు వింటూ వినోదించేవాడు. మంజుల గీతాలను; కవులు, గాయకులు, వందిమాగధులు గౌరవప్రపత్తులతో చేసే సంకీర్తనలను విని మనసారా అభినందించేవాడు. నటులయొక్క, నటీమణులయొక్క నాట్యాలతో, విదూషకుల హాస్యోక్తులతో, సరససల్లాపాలతో, మృదుమధుర సంభాషణలతో పొద్దుపుచ్చుతూ, శ్రీకృష్ణుడు ఆనంద సాగరంలో ఓలలాడుతున్నాడు.

మ. అరవిందాక్ష పదాంబుజాత యుగళ ధ్యానానురాగక్రియా
సరసాలాప విలోకనానుగత చంచత్సౌఖ్య కేళీరతిన్
దరుణుల్ నూఱుఁబదాఱువేలు మహితోత్సాహంబునం జొక్కి త
త్పరలై యొండు దలంప కుండిరి సవిభ్రాంతాత్మలై భూవరా!

1324

తా ॥ కృష్ణపరమాత్ముని పదహారువేల నూటఎనిమిది మంది సతీమణులు – ఆ జగన్నాథుని పాదపద్మాలను ధ్యానిస్తూ, అనురాగంతో నిండిన సరససల్లాపాలతో, దర్శనభాగ్యంతో, రతిక్రీడలతో, సుఖానుభూతిని పొంది, పరమోత్సాహంతో తన్మయులై పోయి, మరి ఏ ఇతర విషయం గురించి ఆలోచించటం మానివేశారు. కృష్ణుడే తమ సర్వస్వంగా భావించి కృష్ణసన్నిధానంలోనే నిలిచిపోయారు.

వ. అదియునుం గాక.

1325

తా ॥ అంతేకాదు.

మ. హరినామాంకితమైన గీత మొకమా టాలించి మూఢాత్ములున్
వ.రతిం బొందఁగఁజాల కుందురఁట? యా విశ్వాత్ము నీక్షించుచున్
బరిరంభించుచు, నంటుచున్, నగుచు సంభాషింపుచు న్నుందు సుం
దరు లానందనిమగ్న లౌట కిలఁ జోద్యం బేమి? భూవల్లభా!

1326

తా ॥ పరీక్షిన్మహారాజా! ఒక్కసారి హరినామంతో కూడిన గీతం కనుక వింటే మూఢుడైనాసరే నిష్కాముడై ముక్తిని పొందగలుగుతాడు. అటువంటిది విశ్వమే ఆత్మగాగల ఆ పురుషోత్తముణ్ణి చూస్తూ, ఆలింగన సౌఖ్యంలో తేలియాడుతూ, స్పర్శలోగల అనుభూతిని పొందుతూ, నవ్వుతూ, సంభాషిస్తూ, సర్వవేళలా పరమాత్ముని చెంతనే ఉండే ఆ సుందరీమణులు ఆనంద పారవశ్యంలో మునిగిపోవడంలో ఆశ్చర్యమేముంది చెప్పు!"

వ. అని చెప్పి మఱియు నిట్లనియె.

1327

తా ॥ అని అంటూ శుకమహర్షి మళ్ళీ ఇలా చెప్పాడు:

ఉ. వారక కృష్ణుఁ డిప్పగిది వైదికవృత్తి గృహస్థ ధర్మ మే
పారఁగ బూని ధర్మమును నర్థముఁ గామము నందఁ జూపుచుం
గోరిక మీఱ సజ్జనులకుం గతి దాన యనంగ నొప్పి సం
సారిగతిన్ మెలంగె నృపసత్తమ! లోకవిడంబనార్థమై.

1328

తా ॥ "మహారాజా! శ్రీకృష్ణుడు ఈ విధంగా వేదాలలో చెప్పబడినట్లు గృహస్థాశ్రమధర్మాన్ని సక్రమంగా నిర్వహించాడు. ధర్మార్థకామాలనే మూడుపురుషార్థాలను ఏ విధంగా ప్రజలు నిర్వహించాలో – తానే స్వయంగా నిర్వర్తించి చూపించాడు. సజ్జనులైన గృహస్థులకు తానే దిక్కుగా నిల్చి, తానే మార్గదర్శిగా వర్తించి సంసారిలాగా జీవితాన్ని గడిపాడు.

సీ. హరి యిట్లు గృహమేధి యగుచు శతోత్తర షోడశసాహస్ర సుందరులను
మును నీకు నెఱుఁగ జెప్పినరీతి నందఱ కన్ని రూపములు దా నర్థిఁ దాల్చి,
కైకొని యొక్కొక్క కామినీ మణియందు రమణ నమోఘ వీర్యమునఁ జేసి
పదురేసి కొడుకులం బడసె రుక్మిణ్యాది పట్టమహిషుల కుద్భవులు నైన

తే. నందనులలోన ధరణి నెన్నంగ బాహు, బలపరాక్రమ విజయ సంపద్విశేష
మానితాత్ములు పదునెనమండ్రు; వారి నెఱిఁగ వినిపింతు వినుము రాజేంద్ర చంద్ర!

1329

తా ॥ శ్రీకృష్ణుడు ఈ విధంగా పదహారువేల నూట ఎనిమిది మంది భార్యలకు మునుపు నేను నీకు చెప్పినట్లు అన్ని రూపాలు ధరించి గృహస్థుగా వారినందరినీ సంతోషపరిచాడు. ఒక్కొక్క భార్యయందు పదిమంది పుత్రులను కన్నాడు. అంతమంది పుత్రులలోను రుక్మిణీదేవి మొదలైన పట్టమహిషులకు జన్మించిన పద్దెనిమిది మంది కుమారులు బలపరాక్రమాలలోను, విజయసంపదలోను గొప్పవారుగా ప్రసిద్ధిచెందారు. రాజా! వారి గురించి తెలియచెబుతాను, వినుము.

వ. అని మఱియు నిట్లను; వారలు ప్రద్యుమ్నానిరుద్ధ దీప్తిమద్భాను సాంబ మిత్ర బృహద్భాను మిత్రవింద వృకారుణ పుష్కర దేవబాహు శ్రుతదేవ సునందన చిత్రభాను వరూథ కవి న్యగ్రోధ నామంబులం బ్రసిద్ధులైరి; వెండియుఁ ద్రివక్రయందు సంభవించిన యువశ్లోకుం డనువాఁ డు దన జనకుండైన కృష్ణ పాదారవింద సేవారతుం డగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్మకుం డగుచు, స్త్రీ శూద్ర

దాసజన సంస్కారకంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్త్వత తంత్రం బను వైష్ణవస్మృతిం గల్పించె; నిట్లు మధుసూదననందనులు బహుప్రజలును, నధికాయురున్నతులును, ననల్ప వీర్యవంతులును, బ్రహ్మణ్యులునై విఖ్యాతిం బొందిరి. వారిని లెక్కవెట్టఁ బదివేల వత్సరంబులకైనం దీఱదు, మున్ను నీ కెఱింగించినట్లు తత్కుమారులకు విద్యా విశేషంబుల నియమించు గురుజనంబులు మూఁడు కోట్లు నెనుబదెనిమిది వేల నూర్గు రనం గల్గియుండు; ర క్కుమారుల లెక్కింప నెవ్వరికి శక్యం? బదియునుం గాక యొక్క విశేషంబు సెప్పెద విను మని యిట్లనియె.

1330

తా ॥ ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మిత్రుడు, బృహద్భానుడు, మిత్రవిందుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, దేవబాహుడు, శ్రుతదేవుడు, సునందనుడు, చిత్రభానుడు వరూధుడు, కవి, న్యగ్రోధుడు – అనే వారే ఆ పద్దెనిమిదిమంది కృష్ణతనయులు. సుప్రసిద్ధులుగా కీర్తింపబడిన ప్రద్యుమ్నాదులే కాక శ్రీకృష్ణునికి – త్రివక్రవలన జన్మించిన 'ఉపశ్లోకు' డనే పుత్రుడు – పితృభక్తి పరాయణుడై, నారదమహర్షి శిష్యుడై అఖండమైన దివ్యజ్ఞానాన్ని సముపార్జించాడు. శ్రీకృష్ణుని పాదపద్మసేవలో ఉత్తమోత్తముడై, ఉపశ్లోకుడు 'సాత్త్వతతంత్రమ' నే వైష్ణవ స్మృతిని స్త్రీలకు, శూద్రులకు, దాసులకు బోధించి కేవలం స్మరణమాత్రం చేతనే మోక్షం లభించే మార్గాన్ని తెలియజెప్పాడు. ఈ విధంగా శ్రీకృష్ణుని పుత్రులు మహావీరులై, చిరంజీవులై, బ్రహ్మజ్ఞాన సంపన్నులై కీర్తికెక్కారు. శ్రీకృష్ణపుత్రుల సంఖ్య లెక్కపెట్టడానికి పదివేల సంవత్సరాల కాలమైనా చాలదు. వారికి విద్యాబుద్ధులు నేర్పించడానికి నియమితులైన గురువులే – మూడుకోట్ల ఎనభై ఎనిమిదివేల నూరుగురైతే – ఆ కుమారులెంతమందో అని లెక్కపెట్టడం ఎవరికి సాధ్యమౌతుంది? అంతేకాదు మహారాజా! మరోవిశేషం చెబుతాను విను.

క. నరవర! దేవాసుర సం, గరమును మును నిహతు లైన క్రవ్యాద సము

త్కరమును నరేశ్వరులై ద్వా, పరమున జనియించి ప్రజల బాధలఁ బఱుపన్.

1331

తా ॥ దేవాసుర యుద్ధంలో హతులైన రాక్షసులు ద్వాపరయుగంలో రాజులుగా జన్మించి ప్రజలను అనేక విధాలుగా బాధలకు గురిచేశారు.

క. హరి తద్వధార్థమై ని, ర్జరులను యదుకులమునందు జనియింపింపం
ధర నూటొక్కకులంబై, పరఁగిరి; వారిని గణింప బ్రహ్మకు వశమే?

1332

తా ॥ శ్రీమహావిష్ణువు ఆ దుష్ట నృపతులను సంహరించడానికి దేవతలను యదుకులంలో జన్మింపచేశాడు. యాదవకులంలో జన్మించిన దేవతలందరూ మొత్తం నూటొక్క కులాలవారిగా పరిగణింపబడ్డారు. యాదవులందరినీ లెక్కపెట్టి చెప్పడం విధాతకు కూడా చేతకాదు.

వ. అట్టి యన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవి యందుఁ బితృసముండును, సమగ్ర భుజావిజృంభణుండునునై ప్రద్యుమ్నుండు జనియించె; నతనికి రుక్మికూఁతురగు శుభాంగి వలన ననిరుద్ధం డుదయించె; నతనికి మౌసలావశిష్టుండైన ప్రజుండు సంభవించె; నతనికిఁ బ్రతిబాహుండు పుట్టె; వానికి సుబాహుండు జన్మించె; నతనికి నుగ్రసేనుండు ప్రభవించె; నతనికి శ్రుతసేనుండు గలిగె; నిట్లు యదువృష్టిభోజాంధక వంశంబులు పరమ పవిత్రంబులై పుండరీకాక్షు ని రీక్షణ శయ్యాసనానుగత సరసాలాపస్నానాశన క్రీడావినోదంబుల ననిశంబునుం జెందుచు, సర్వదేవతార్థంబు సమస్తంబైన క్రతువు లొనరింపుచుఁ బరమానంద కందళిత చిత్తులై యుండి రని చెప్పి వెండియు.

1333

తా ॥ అటువంటి యాదవ వంశంలో శ్రీకృష్ణునికి రుక్మిణీదేవికి, శ్రీకృష్ణునితో సమానుడైన ప్రద్యుమ్న కుమారుడు ఉదయించాడు. బలపరాక్రమాలలో అఖండుడైన ప్రద్యుమ్నునికి, రుక్మి

కూతురైన శుభాంగి వల్ల అనిరుద్ధుడు జన్మించాడు. అనిరుద్ధుని కుమారుడు వ్రజుడు. వ్రజుని పుత్రుడు ప్రతిబాహుడు. ప్రతిబాహుని కొడుకు సుబాహుడు. సుబాహుని తనయుడు ఉగ్రసేనుడు. ఉగ్రసేనుని సుతుడు – శ్రుతసేనుడు. పరీక్షిత్తూ! ఈ విధంగా యదు వృష్ణి భోజ అంధక వంశాలు పరమ పవిత్రంగా వర్ధిల్లాయి. వారంతా శ్రీకృష్ణుణ్ణి దర్శిస్తూ, కృష్ణుని వద్ద కూర్చొంటూ, ఆతని ప్రక్కనే పడుకొంటూ, ఆతనితో సరసల్లాపాలాడుతూ, ఆతనితో కలిసి స్నానభోజనాదులు చేస్తూ, ఆటపాటలలో సహజీవనం సాగిస్తూ, ఆ కృష్ణపరమాత్మునితోనే సర్వవేళలా కాలంగడుపుతూ పునీతులైనారు. సకల దేవతాప్రీత్యర్థం యజ్ఞయాగాదులన్నీ చేస్తూ యాదవులందరూ సంతృప్తితో పరమానందభరితులైనారు.

 మ. పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభల్లీలఁ బూరించు న
మ్మురళీగానము వీనులం జిలికినన్ మోదించి గోపాల సుం
దరు లేలెంతు రరణ్యభూములకుఁ; దద్దాస్యంబు గావించి య
క్కరుణావార్ధి భజింపకుందురె బుధుల్ కౌరవ్యవంశాగ్రణీ!

1334

తా ॥ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని మురళీగానం చెవులలో అమృతాన్ని చిలికిస్తే, గోపకాంతలందరూ పరమోత్సాహంతో, మహదానందంతో కృష్ణుడున్న బృందావన పుణ్యభూమికి, ఆ పరమాత్ముని దర్శనార్థం పరుగుపరుగున వెళతారు. ప్రజ్ఞానవంతులైనవారు ఆ కరుణాసముద్రుణ్ణి దర్శించి, భజించి, దాస్యం చేయకుండా ఉంటారా?

వ. మతి నెవ్వాని యమంగళఘ్న మగు నామం బర్థిఁ జింతించినన్
 నుతి గావించిన విన్న మానవులు ధన్యుల్; భూరిసంసార దు
ష్కృతులం ద్రోతురు; కాలచక్ర మహితాస్త్రం దట్టి యా కృష్ణుఁ డీ
క్షితిభారం బుడుగంగఁ జేయు టిది యే చిత్రంబు? భూవల్లభా!

1335

తా ॥ మహారాజా! అమంగళాలు పోగొట్టి శుభాలు ప్రసాదించే శ్రీకృష్ణ పరమాత్ముని నామాన్ని మానవులు చింతించినా, స్తుతించినా, విన్నా వారు ధన్యులౌతారు. సంసారం వల్ల కలిగే పాపాలను పారద్రోలుతారు. కాలచక్రమనే గొప్ప అస్త్రాన్ని ధరించిన శ్రీకృష్ణుడు భూభారాన్ని తొలగించటం వింత విషయం కాదు.

వ. ఇ వ్విధంబున గోపికాజన మనోజాతుండైన కృష్ణుండు లీలామానుష విగ్రహుండై నిజరాజధాని యైన ద్వారకాపురంబున నమానుష విభవంబు లగు సౌఖ్యంబులం బొదలుచుండె నని చెప్పి మఱియు నిట్లనియె.

1336

తా ॥ గోపకాంతలకు మన్మథుని వంటి వాడైన శ్రీకృష్ణుడు లీలగా మానుషాకారాన్ని ధరించి ద్వారకానగరంలో దేవవైభవాలను, అసాధారణ సౌఖ్యాలను అనుభవిస్తున్నాడ" ని చెప్పి, శుకమహర్షి ఇంకా ఇలా అన్నాడు:

మ. మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె
ప్పిన యీ కృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్; నిర్ధూతసర్వాఘులై
యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్.

1337

తా ॥ "పరీక్షిన్మహారాజా! స్వర్గలోక, భూలోక, పాతాళలోక వాసులందరికీ సకల శుభాలను ప్రసాదించే శ్రీకృష్ణ కథ అనే అమృత రసాన్ని అత్యంత భక్తితో పానం చేసిన పుణ్యాత్ములు ఇహలోకంలో సకల సౌఖ్యాలను పొందుతారు. సమస్త పాపాలను పోగొట్టుకొన్నవారై, చిట్టచివరకు విష్ణుపదమైన మోక్షసామ్రాజ్యాన్ని చేరుకొంటారు."

క. అని యిట్లు బాదరాయణి, మనమున రాగిల్ల నాభిమన్యునకుం జె

ప్పిన విధమున సూతుఁడు ముని, జనుల కెఱింగింప వారు సమ్మతితోడన్.

1338

తా ॥ ఈ విధంగా శుకమహర్షి వాత్సల్యంతో పరీక్షిత్తుకు చెప్పిన శ్రీకృష్ణుని మహిమాన్విత చరిత్రను సూతమహర్షి శౌనకాది మహామునులకు వివరించి తెలియజెప్పాడు.

క. సూతుని బహువిధముల సం, ప్రీతునిఁ గావించి మహిమఁ బెంపారుచు వి

ఖ్యాతికి నెక్కిన కృష్ణక, థాతత్పరులైరి బుద్ధిఁ దఱుఁగని భక్తిన్.

1339

తా ॥ శౌనకాది మహామునులు పరమానందభరితులై సూతమహర్షిని అనేక విధాలుగా సన్మానించి సంప్రీతుణ్ణి చేశారు. అనంతమైన భక్తితో వారంతా మహిమోపేతమైన శ్రీకృష్ణుని కథలను చెప్పడంలో, వినటంలో, మననం చేసుకోవడంలో నిమగ్నులైనారు.

చ. సరసి జపత్రనేత్ర! రఘుసత్తమ! దుష్టమదాసురేంద్ర సం

హరణ! దయాపయోధి! జనకాత్మభవానన పద్మమిత్ర! భా

స్కర కులవార్ధిచంద్ర! మిహికావసుధాధరజేశసన్నుత

స్ఫురితచరిత్ర! భక్త జనపోషణ భూషణ! పాపశోషణా!

1340

తా ॥ కమల పత్రాక్షా! రఘువంశ దీపకా! దుష్టదానవ సంహారా! కరుణాసాగరా! సీతాదేవి ముఖపద్మాన్ని వికసింపచేసే సూర్యతేజా! సూర్యవంశమనే సముద్రాన్ని సంతోషంతో ఉప్పొంగింపజేసే చంద్రరూపా! హైమవతి అయిన పార్వతీదేవి చేత ప్రస్తుతింపబడే సచ్చరిత్రగల దేవా! భక్తజనపోషణమే భూషణంగా గల రామచంద్రా! పాపాలను ఇంకింపచేసే పుణ్య పురుషా!

క. మారీచభూరిమాయా, నీరంధ్రమహాంధకార నీరేజహితా! క్ష్మారమణవినుత పాదాం,

భోరుహ! మహితావతార! పుణ్యవిచారా!

1341

తా ॥ మారీచుడు కల్పించిన మాయాంధకారాన్ని చీల్చివేసే సూర్యప్రకాశా రామా! భూపతులచే పూజింపబడే పాదపద్మాలు కలవాడా! అవతారమూర్తీ! పుణ్యనిధీ!

మాలిని. శరధి మదవిరామా! సర్వలోకాభిరామా!
సురరిపువిషభీమా! సుందరీలోకకామా!
ధరణివరలలామా! తాపసస్తోత్రసీమా!
సురచిరగుణధామా! సూర్యవంశాబ్ధిసోమా!

1342

తా ॥ సముద్రుని గర్వాన్ని అణచివేసినవాడా! మనోజ్ఞ మోహనరూపా! రాక్షసులకు భీతిగొలిపే అతిలోక పరాక్రమశాలీ! సుందరీమణులకు మన్మథుని వంటి వాడా! భూపాలోత్తమా! తపోధనులచేత స్తోత్రం చేయబడేవాడా! సకల సద్గుణ నిలయా! సూర్యవంశమనే సముద్రానికి సంతోషం చేకూర్చే చంద్రుని వంటి శ్రీరామ చంద్రా!!

గద్యము. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్న జన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శ్యమంతకమణి నిచ్చుటయుఁ దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధియించుటయు, దాని జాంబవంతుండు దునిమి మాణిక్యంబు గొనిపోవుటయు. గోవిందుండు ప్రసేనుని దునిమి మణిఁ గొనిపోయె నని సత్త్రాజిత్తు కృష్ణునందు నింద నారోపించుటయుఁ, గృష్ణుండు దన్నిమిత్తంబున జాంబవంతునిం దొడరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహం బగుటయు, సత్త్రాజిత్తునకు మణి నిచ్చుటయు, సత్యభామా పరిణయంబును,

బాండవులు లాక్షా గృహంబున దగ్ధు లైరని విని వాసుదేవుండు బలభద్ర సహితుండయి హస్తినాపురంబున కరుగుటయు, నక్రూరకృతవర్మల యనుమతంబున శతధన్వుండు సత్త్రాజిత్తుఁ జంపి మణిఁ గొనిపోవుటయుఁ, దదర్థం బా సత్యభామ కరినగరంబున కేగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వుం ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రాముని వలన గదావిద్య నభ్యసించుటయుఁ, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోక క్రియలు నడపుటయు, శ్యమంతకమణిం దాఁచినవాఁడయి యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచి పోయిన నతని లేమి ననావృష్టి యైనం గృష్ణుం డక్రూరుని మరల రప్పించుటయు, దామోదరుం డింద్ర ప్రస్థపురంబున కరుగుటయు, నందర్జున సమేతుండయి మృగయా వినోదార్థం బరణ్యంబునకుం జని, కాళిందిం గొనివచ్చుటయు, ఖాండవ దహనంబును, నగ్నిపురుషుం దర్జునునకు నక్షయతూణీర గాండీవ కవచరథరథ్యంబుల నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయు, నగధరుండు మరలి నిజ నగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహం బగుటయు, మిత్రవిందా నాగ్నజితీ భద్రా మద్రరాజకన్యలం గ్రమంబునఁ గరగ్రహణం బగుటయు, నరకాసుర యుద్ధంబును, దద్గృహంబున నున్న రాజకన్యకలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గ గమనంబును, నదితికిం గుండలంబు లిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజకన్యలం బరిణయం బగుటయు, రుక్మిణీదేవి విప్రలంభంబును, రుక్మిణీస్తోత్రంబును, గృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజనసంఖ్యయుఁ, బ్రద్యుమ్ను వివాహంబును, ననిరుద్ధు జన్మంబును, దద్వివాహార్థంబు కుండిన నగరంబునకుం జనుటయు, రుక్మిబలభద్రుల జూదంబును, రుక్మి వధయు, నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయుఁ, దన్నిమిత్తంబునఁ, జిత్రరేఖ సకలదేశ రాజులఁ బటంబున లిఖించిచూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు, బాణాసుర యుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయుఁ, గాళింది భేదనంబును, గృష్ణుండు పౌండ్రకవాసుదేవ కాశీరాజుల వధించుటయుఁ, గాశీరాజ పుత్రుండయిన సుదక్షిణుం డభిచారహోమంబు గావించి కృత్యం

బడసి కృష్ణుపాలికిం బుత్తెంచిన సుదర్శనంబుచేతఁ గృత్యను సుదక్షిణ సహితంబుగాఁ గాశీపురంబును భస్మంబు సేయుటయు, బలరాముండు రైవత నగంబునందు ద్వివిదుండను వనచరుని వధియించుటయు, సాంబుండు దుర్యోధను కూఁతురగు లక్షణ నెత్తి కొని వచ్చినఁ గౌరవు లతనిం గొనిపోయి చెఱఁబెట్టుటయుఁ, దద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలభద్రుండు నాగ నగరంబునకుఁ జనుటయుఁ, గౌరవులాడిన యగౌరవ వచనంబులకు బలరాముండు కోపించి హస్తినాపురంబును గంగం బడఁద్రోయ గమకించుటయుఁ, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబుని దెచ్చి యిచ్చుటయు, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు, నారదుండు హరి పదాఱువేల కన్యకల నొకముహూర్తంబున నందఱ కన్ని రూపులై వివాహం బయ్యెనని విని తత్ప్రభావంబు దెలియంగోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబు సూచి మరలి చనుటయు, జరాసంధునిచేత బద్ధులైన రాజులు కృష్ణుపాలికి దూతం బుత్తెంచుటయు, నారదాగమనంబును, బాండవుల ప్రశంసయును, నుద్ధవ కార్యబోధంబును, నింద్రప్రస్థాగమనంబును, ధర్మరాజు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధ వధయును, రాజ బంధమోక్షణంబును, రాజసూయంబు నెఱవేర్చుటయును, శిశుపాలవధయును, నవభృథంబును, రాజసూయ వైభవదర్శనా సహమాన మానసుండయి సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబునం గట్టిన పుట్టంబులు దడియం ద్రెళ్ళుటయుఁ, దన్నిమిత్తపరిభవంబు నొంది రారాజు నిజపురి కరుగుటయుఁ, గృష్ణుండు ధర్మరాజు ప్రార్థితుం డయి యాదవుల నిలిపి కొన్ని నెలలు ఖాండవప్రస్థంబున వసియించుటయు, సాళ్వుండు దపంబు సేసి హరుని మెప్పించి సౌంభకాఖ్యంబగు విమానంబు వడసి నిజసైన్య సమేతుండై ద్వారకానగరంబు నిరోధించుటయు, యాదవసాళ్వయుద్ధంబును, గృష్ణుండు మరలి చనుదెంచి సాల్వుం బరిమార్చుటయును, దంతవక్త్రవధయును, విదూరథ మరణంబును, గృష్ణుండు యాదవబల సమేతుండై క్రమ్మఱ నిజపురంబునకుం జనుటయును, గౌరవ పాండవులకు యుద్ధం బగునని బలదేవుండు తీర్థయాత్ర సనుటయు, నందు జాహ్నవీ ప్రముఖనదులం గృతస్నానుం డయి

నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింపం బూజితుండయి తత్సమీపంబున నున్నతాసనంబున నుండి సూతుండు దన్నుం గని లేవకున్న నలిగి రాముండు గుశాగ్రంబున నతని వధించుటయు, బ్రహ్మహత్యా దోషంబు గలిగెనని మునులు వలికిన సూతుం బునర్జీవితుం జేయుటయు, న మ్మునులకుం బ్రియంబుగాఁ గామపాలుం డిల్వల సుతుండగు పల్వలుం బరిమార్పుటయు, వారిచేత ననుమతుండయి హలధరుండు దత్సమీపతీర్థంబుల స్నాతుండయి గంగాసాగర సంగమంబునకుం జనుటయు, మహేంద్ర నగప్రవేశంబును, బరశురామ దర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయు, మఱియు మధ్యదేశంబునం గల తీర్థంబు లాడి శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రి హరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరములం గని తామ్రపర్ణీతీర్థంబు లాడుటయు, గోదానంబు లొనరించి మలయగిరియందు నగస్త్యునిం గనుటయు, సముద్ర కన్యా దుర్గాదేవుల నుపాసించుటయు, నందు బ్రాహ్మణజనంబు వలనం బాండవ ధార్తరాష్ట్ర భండనంబున సకల రాజలోకంబును మృతి నొందిరని వినుటయు, వాయునందన సుయోధనులు గదా యుద్ధసన్నద్ధు లగుట విని వారిని వారించుటకై, రౌహిణేయుం డందుల కరుగుటయు, నచట వారిచేతం బూజితుండయి వారి నివారింపలేక మగిడి ద్వారక కరుగుటయుఁ, గొన్ని వాసరంబులకు మరల నైమిశారణ్యంబునకుం బోయి యచట యజ్ఞంబు సేసి రేవతియుం దానును నవభృథం బాడి నిజపురంబున కేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునం గృష్ణుఁడు రామునితోఁజేరి పురరక్షణంబునకుఁ బ్రద్యుమ్నాది కుమారుల నిలిపి షోడశ సహస్రాంగనా పరివృతుండయి యక్రూర వసుదేవోగ్ర సేనాది యాదవ వీరులు దోడరా స్యమంతపంచక తీర్థంబున కరిగి కృతస్నానుండయి వసియించి యుండుటయుఁ, బాండవకౌరవాది సకల రాజలోకంబును దత్తీర్థంబునకు వచ్చుటయుఁ, గుంతీదేవి దుః ఖంబును, నందయశోదా సహితులైన గోపగోపికా జనంబులు చనుదెంచుటయుఁ, గుశలప్రశ్నాది సంభాషణంబులును, మద్ర కన్యా ద్రౌపదీ సంభాషణంబును, దదనంతరంబ సకల రాజలోకంబును స్యమంతపంచకతీర్థంబున స్నాతులై రామకృష్ణాదియాదవ వీరుల నామంత్రణంబు చేసి నిజదేశంబులకుఁ

బోవుటయుం, గృష్ణుని దర్శించుటకు మునీంద్రు లేతెంచుటయు, వారి యనుమతిని వసుదేవుండు యాగంబు నెరవేర్చుటయు, నందయశోదాది గోపికానివహంబుల నిజపురంబున కనిచి యుగ్రసేనాది యాదవ వీరులుం దానును మాధవుండు నిజపురప్రవేశంబు సేయుటయుఁ, దొల్లి కంసునిచేత హతులై బలిపురంబున నున్న దేవకీదేవి సుతుల రామకృష్ణులు యోగమాయా బలంబునఁ దెచ్చి యామె కిచ్చుటయు, నర్జునుండు సుభద్రను వివాహం బగుటయుఁ, గృష్ణుండు మిథిలానగరంబున కరుగుటయు, శ్రుతదేవజనకుల చరిత్రంబును, వారలతో బ్రాహ్మణప్రశంస సేయుటయు, శ్రుతిగీతలును, గృష్ణుండు మఱలి తన పురంబున కరుగుదెంచుటయు హరి హర బ్రహ్మల తారతమ్య చరిత్రంబును, గుశస్థలినుండు బ్రాహ్మణుని చరిత్రంబును, నతనితనయులు పరలోకంబునకుం బోయినఁ గృష్ణార్జునులు తమ యోగబలంబున వారిం దెచ్చి య వ్విప్రున కిచ్చుటయుఁ గృష్ణుం డర్జునుని వీడ్కొని ద్వారక కరుగుటయు, నందు మాధవుండయ్యై ప్రదేశంబుల సకల భార్యా పరివృతుండయి విహరించుటయు, యాదవ వృష్ణి భోజాంధకవంశ చరిత్రంబును నను కథలు గల దశమస్కంధంబు నందు నుత్తరభాగము.

1343

తా ॥ సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు ప్రద్యుమ్న జన్మంబు మొదలుకొని యాదవ వృష్ణి భోజాంధకవంశ చరిత్రము వరకుగల కథలతో నిండిన దశమస్కంధం ఉత్తరభాగం సంపూర్ణం.

శ్రీసీతాపతి! లంకే
శాసురసంహారచతుర! శాశ్వత! నుత వా
ణీసత్యధిభూభవవృ
త్రాసురరిపుదేవజాల! రామనృపాలా!

1

తా ॥ లక్ష్మీస్వరూపురాలైన జానకీదేవికి ప్రాణేశ్వరుడవైన దేవా! లంకాధిపతి అయిన రావణాసురుని సంహరించడంలో సర్వసమర్థుడవైన స్వామీ! అంతులేని కాలప్రవాహంలో విశ్వ సృష్టిస్థితిలయాలను అనవరతం అవిచ్ఛిన్నంగా నడిపించే పరమపురుషా! వాగ్దేవికి అధినాయకుడైన బ్రహ్మదేవుడు, చరాచరసమస్తం తానే అయిన పరమేశ్వరుడు, వృత్రాసురుని చంపిన ఇంద్రుడు, నిఖిల దేవతాగణాలూ నమస్కరించే పురాణ పురుషోత్తమా! శ్రీరామచంద్రప్రభూ! అవధరించు.

వ. మహనీయగుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుం గని శుకయోగీంద్రుం 'డయ్యా! జన్మ కర్మవ్యాధి విమోచనంబునకుఁ గారణంబగు దివ్యౌషధంబు గావున శ్రీమన్నారాయణ కథామృతంబుఁ గ్రోలు' మని యిట్లనియె.

2

తా ॥ శాంతమూ, శమదమాది సద్గుణాల వలన పరిశుద్ధ అంతరంగమును కలిగిన శ్రేష్ఠతములూ (మహనీయ గుణగరిష్ఠులు), భగవత్ప్రసాదితంగా లభించిన దివ్య జ్ఞానభక్తి వైరాగ్యాలను కలిగి ఉన్న పూజనీయులూ అయిన శౌనకాది మునులతో, అన్ని పురాణాలనూ వివరంగా మనస్సులోనికి చొచ్చుకునిపోయే విధంగా (వ్యాఖ్యానవైఖరి) చెప్పగల నేర్పరి అయిన సూతమహాముని ఈ విధంగా అన్నాడు:

“మునిశాపం వలన రానున్న మరణానికై నిరీక్షిస్తూ, మనస్సునందు ఆ పరమాత్ముని నిలిపి, కోరికలన్నింటిని త్యజించి, అన్నపానాదులను కూడా వదిలివేసి, కృష్ణ కథను వింటున్న ఆ పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు ఈ విధంగా అన్నాడు–

‘అయ్యా! జన్మపరంపరల నుంచి విముక్తిని ప్రసాదించి, కర్మదోషాలను దూరంచేసి, ఆధివ్యాధుల భయాన్ని తొలగించే లోకోత్తరమైన ఔషధం శ్రీమన్నారాయణుని లీలామృతం ఒక్కటే. ఆ అమృతాన్ని, ఆస్వాదించు!

అంటూ, ఆ తర్వాతి కథను వినిపించాడు.

## ఋషి శాపమువలన ముసలము పుట్టుట

మ. బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహా బలోపేతుఁడై
కలనన్ రాక్షసవీరవర్యుల వడిన్ ఖండించి, భూభార ము
జ్జ్వలమై యుండఁగ ద్యూత కేళికతనం జావంగఁ గౌరవ్య స
ద్బలముం బాండవ సైన్యము న్నడఁచె భూభాగంబు గంపింపఁగన్.

3

తా ॥ ‘అన్నగారైన బలరాముడితోపాటు సేనాసముదాయాన్ని వెంటబెట్టుకొని శ్రీకృష్ణుడు అసాధారణ బాహుబల సంపన్నుడై యుద్ధంలో అనేక మంది రాక్షసులను, వీరవరేణ్యులను మహాపరాక్రమంతో సంహరించి, అది చాలక – భూభారం మరీ ఎక్కువగా ఉన్నదని – పాచికలాటను నిమిత్తంగా చేసి – దుర్యోధనుణ్ణీ కౌరవుల బలాన్నీ, పాండవుల బలగాన్నీ, పుడమి దద్దరిల్లేట్లు జరిగిన సంగ్రామంలో అంతరింపజేశాడు.

వ. అంత.

4

తా ॥ అప్పుడు.

క. మునివరులు సంతసిల్లిరి, యనయము నందాదులకును హర్షం బయ్యెం; దన నిజభక్తులు యాదవ, ఘనవీరసమూహ మపుడు గడు నొప్పెసఁగెన్.

5

తా ॥ మునులకు ఆనందం కలిగింది. గోకులంలో నందుడు మొదలైన వారు (పూర్వజన్మలో విష్ణుసేవారతులై భగవంతుని ఉపాసించి – ఆయనను కొడుకుగా, బంధువుగా, చిన్ననాటి నెచ్చెలిగా, తమ సన్నిధానవర్తిగా నోచుకొన్న పుణ్యాత్ములు కనుక, ఆ దుష్టసంహార లీలలను విని) ఎంతో సంతోషపడ్డారు. ఆయననే ఆశ్రయించుకొని ఉన్న భక్తులూ, యదువంశం లోని గొప్ప గొప్ప వీరులూ మరింతగా అతిశయాన్ని పొందసాగారు.

మ. విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్పి, దు
ర్మద సంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి, కంసాదులం
దుదిముట్టన్ వధియించి, కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యం బయ్యె నత్యుగ్రమై.

6

తా ॥ శ్రీకృష్ణుని మహిమ ముల్లోకాలలో వెల్లడయింది. దేవతలందరూ ప్రార్థింపగా ధర్మసంస్థాపన కోసం అవతరించినవాడు, భూమికి కలిగిన భారాన్ని తొలగించాడు. మదోన్మత్తులైన దుష్టరాజులను మట్టుపెట్టాడు. కంసాదులను సపరివారంగా అంతమొందించాడు. సాధుసంరక్షణం జరిగి, తన అవతార కార్యం నెరవేరినదని అమితానందంగా ఉన్నాడు.

అంతలోనే యాదవబలాలు వృద్ధిచెంది, ఉన్నతిని పొంది, పుడమి బరువు మోయలేని స్థితికి వచ్చింది.

సీ. ఈ రీతి శ్రీకృష్ణుఁ డేపారఁ బూతనా శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక దైత్యాఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి యటమీఁదఁ గురుబలం బణఁచి మఱియు
ధర్మజు నభిషిక్తుఁ దనరఁగాఁ జేసిన నతఁడు భూపాలనం బమరఁజూచి

తే. భక్తులగు యాదవేంద్రులఁ బరఁగఁజూచి, యన్యపరిభవ మెఱుఁగ రీ యదువు లనుచు
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వేఱొకండు, దైవ మిఁక లేదు త్రిభువనాంతరమునందు.

7

తా ॥ ఈ తీరున శ్రీకృష్ణుడు అజేయ పరాక్రమంతో తన చిన్నప్పుడే పూతన, శకటాసురుడు, తృణావర్తుడు, వత్సాసురుడు, అఘాసురుడు మొదలుగా గల కంసుడు పంపించిన రాక్షసులనూ; చాణూర మల్లుడినీ సంహరించాడు. (తన బలరామాంశతో) ముష్టికుని, ప్రలంబాసుర ధేనుకాసురులనూ వధించాడు. చేదిరాజు శిశుపాలుని, అతని సహచరుడు దంతవక్త్రుని, వారి స్నేహితుడు సౌభదేశపు రాజు సాళ్వుడినీ పరిమార్చాడు. కంస పౌండ్రకాది దుష్టభూపతులను కడతేర్చాడు. ఆ తర్వాత కౌరవ బలాన్ని రూపుమాపి, ధర్మరాజును చక్రవర్తిగా అభిషేకించాడు. అతను తన రాజ్యాన్ని ధర్మసమ్మతంగా పరిపాలించుకొంటున్నాడు.

అప్పుడు శ్రీకృష్ణుని దృష్టి యదుముఖ్యుల వైపుకు మళ్ళింది. 'ఈ యాదవులు నా భక్తులు. ఏనాడూ ఎవరికీ అపకారం చేసి యెరుగరు. అందువల్ల, శిక్షార్హులు కారు. వీరి ప్రారబ్ధాన్ని ఫలోన్ముఖం చేసి, వీరందరినీ అంతమొందించే శక్తి స్వర్గ మర్త్య పాతాళ లోకాలు మూడింటిలోనూ నాకు తప్ప వేరొకరికి లేదు.'

వ. అని వితర్కించి జగదీశ్వరుం 'డత్యున్నత వేణుకావనంబు వాయు వశంబున నొరసికొన ననలం బుద్భవంబయి దహించు చందంబున యదుబలంబుల కన్యోన్య వైరానుబంధంబులు గల్పించి హతం బొన ర్చెద' నని విప్రశాపంబు మూలకారణంబుగాఁ దలంచి యదుబలంబుల నడంచెనని పలికిన మునివరునకు రాజేంద్రుం డిట్లనియె.

8

తా ॥ అని ఈ విధంగా తర్కించి, సమస్తప్రాణికోటికీ ప్రభువైన శ్రీకృష్ణ పరమాత్మ, 'ఎంతో ఎత్తైన చెట్లున్న వెదురువనాన్ని గాలికి ఒరుసుకొని పుట్టిన ఒక్క నిప్పురవ్వ దహించి వేసేట్లు నేనిక యాదవ బలాలకు పరస్పరం విరోధాలను కల్పించి, వారివారికి కర్మపరిణామాలను కలుగజేసి, అందరినీ అంతమొందిస్తాను గాక!' అని సంకల్పించాడు. 'బ్రాహ్మణశాపం దీనికంతటికీ మూలం కాగలదు' అని నిశ్చయించాడు. యదుకులాన్ని తుదముట్టించాడు.'

అనే సరికి, శుకయోగిని పరీక్షిత్తు అడిగాడు...

క. 'హరిపాదకమల సేవా, పరులగు యాదవుల కెట్లు బ్రాహ్మణశాప
స్ఫురణంబు సంభవించెనొ, యరయఁగ సంయమివరేణ్య! యానతి యీవే !

9

తా ॥ 'అన్యపరిభవ మెఱుఁగ రీ యదువులు' అనగానే పరీక్షిత్తుకు తృతీయ స్కంధంలో బ్రహ్మదేవుడు కృష్ణ భక్తులకు "ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బైన... పరిభవంబు" కలుగదని చెప్పిన సంగతి గుర్తుకు రావడం సహజమే. తన అభయ చరణారవిందాల ఆశ్రయాన్ని పొందిన యదువంశీయుల నిర్మూలనకు శ్రీహరి విప్రవాక్యాన్ని ఎందుకు నిమిత్తంగా చేశాడు? అని అతనికి అనుమానం వచ్చింది. తనకు కలిగినదీ బ్రాహ్మణశాపమే కనుక ఆ కార్యకారణజిజ్ఞాస మరింత బలపడింది.

'మహాత్మా! యాదవులు శ్రీహరి పాదపద్మాలను నమ్ముకొని, ఆయననే సంసేవించినవారు. వారికి బ్రాహ్మణశాపం ఏ విధంగా కలిగిందో? ఆనతీయండి' అని అర్థించాడు.

క. అనిన జనపాలునకు ని, ట్లని సంయమికులవరేణ్యుఁ డతి మోదముతో విను మని

చెప్పఁగఁ దొడఁగెను, ఘనతర గంభీర వాక్ప్రకాశస్ఫురణన్.

10

తా ॥ 'బ్రాహ్మణశాపం' అనగానే పరీక్షిత్తు మనస్సులో చెలరేగిన ఆందోళనను శుకయోగి అర్థం చేసుకొన్నాడు. అతనడిగిన ప్రశ్న మూలమున భగవంతుని దివ్యవర్తననూ, అతిమానుషతత్త్వాన్నీ వర్ణించేందుకు అవకాశం వచ్చిందని ఆయనకు అమితోత్సాహం కలిగింది. మెరుపుతో విలసిల్లే మేఘం వలె నిండుతనం ఉట్టిపడే తన గంభీరమైన వాక్కుతో జ్ఞానప్రకాశాన్ని వెల్లిగొలుపుతూ, 'విను ! అంటూ అతనికి సమాధానం చెప్పటం మొదలుపెట్టాడు.

# విశ్వామిత్రుడు, వసిషుడు, నారదుడు మొదలగువారు శ్రీకృష్ణుణ్ణి దర్శించుట

వ. నిరుపమసుందరం బయిన శరీరంబు ధరియించి సమస్తకర్మ తత్పరుండై పరమేశ్వరుండు యదువుల నడంగింపఁ దలఁచు సమయంబున జటావల్కల కమండలుధారులును, రుద్రాక్షభూతిభూషణ ముద్రా ముద్రితులును, గృష్ణాజినాంబరులును నగు విశ్వామిత్రాసిత దుర్వాసోభృగ్వంగిరఃకశ్యప వామదేవవాలఖీల్యాత్రి వసిష్ఠ నారదాది మునివరులు స్వేచ్ఛావిహారంబున ద్వారకానగరంబున కరుదెంచి యందు.

11

తా ॥ 'సాటిలేని రూపలావణ్యంతో అందాలు విరజిమ్ముతున్న లీలామానుషశరీరాన్ని ధరించిన సకలజనులకూ కల్యాణసంపత్సమృద్ధులను ప్రసాదించే సత్కర్మలను ఆచరించాలని దీక్షవహించిన శ్రీకృష్ణ పరమాత్మ, ఇంకా మిగిలి ఉన్న భూమి భారాన్ని హరించేందుకు యదువంశాన్ని కూడా అంతరింపజేయాలని అనుకొంటున్న సమయంలో ఆయన వద్దకు – జటాధారులై, నారచీరలు కట్టి, నల్లజింకతోలు చుట్టి, కమండలువు చేతబట్టి, రుద్రాక్షమాలికా విభూతిరేఖాలంకరణలతో విరాజిల్లుతున్న విశ్వామిత్రుడు – అసితుడు – దుర్వాసుడు – భృగువు – అంగిరసుడు – కాశ్యపుడు (కశ్యపుడు అని మూలం) – వామదేవుడు – వాలఖీల్యులు – అత్రి – వశిష్ఠుడు – నారదుడు మొదలైనవారు యథేచ్ఛగా విహరిస్తూ, ద్వారకా నగరానికి విచ్చేశారు.

సీ. ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణునిఁ గర్ణకుండలయుగ్మ ఘనకపోలుఁ
బుండరీకాక్షు నంభోధరశ్యామునిఁ గలితనానారత్న ఘన కిరీటు
నాజానుబాహు నిరర్గళాయుధహస్తు శ్రీకరపీతకౌశేయవాసు
రుక్మిణీనయన సరోజ దివాకరు బ్రహ్మాదిసుర సేవ్యపాదపద్ము

తే. దుష్టనిగ్రహ శిష్టసంతోషకరణుఁ, గోటిమన్మథలావణ్యకోమలాంగు
నార్తజన రక్షణైక విఖ్యాత చరితుఁ, గనిరి కరుణా సముద్రుని ఘనులు మునులు.

12

తా ॥ మహానందమే రూపుదాల్చిన దివ్యతేజోమయవిగ్రహుడూ (ఆనందఘనుడు), కౌస్తుభ రత్నాలంకారుడూ, చెవులకు వ్రేలాడుతున్న కుండపోగుల జంటవెలుగులతో నిగనిగలాడుతున్న చెక్కిళ్ళు కలవాడూ, తెల్లతామరల వలె నిడుపుదేరి విప్పారిన అందమైన కన్నులు కలవాడూ, నీలిమబ్బును పోలిన మేనికాంతుల వాడూ, అనేక దివ్య జాతిరత్నాలు పొదిగిన సుదృఢమైన కిరీటాన్ని ధరించినవాడూ, మోకాళ్ళను తాకుతున్న పొడవైన చేతులు గలవాడూ, తిరుగులేని పాంచజన్య సుదర్శన కౌమోదకీ నందకాలనే దివ్యాయుధాలను నాల్గు హస్తాలలో ధరించినవాడూ, శ్రీదేవికి విహారస్థానమైన వక్షఃస్థలం కలవాడూ, పచ్చని పట్టువస్త్రాలను కట్టుకొన్నవాడూ, రుక్మిణీదేవి నయనకమల దివాకరుడైనవాడూ, బ్రహ్మాదులైన దేవతలు సేవించతగిన పవిత్ర పాదారవిందాలు కలవాడూ, దుర్జనులను శిక్షించి సదాచారసంపన్నులకు సంతోషాన్ని కలుగజేసేవాడూ, కోటిమంది మన్మథుల మేనితళుకును పుణికిపుచ్చుకొన్న సుకుమారమైన తనువు గలవాడూ, శరణాగతులను రక్షించటమొక్కటే తన అవతారకార్యమని ప్రసిద్ధి గాంచినవాడూ, తన భక్తుల దుఃఖాన్ని చూసి ఏ మాత్రం సహింపలేని ఆర్ద్రస్వభావం వల్ల అంతులేని సముద్రమంత దయ గలవాడూ అయిన శ్రీకృష్ణుని, పరమాత్మజ్ఞాన పరిపూర్ణులైన ఆ మహర్షులు సందర్శించుకొన్నారు.

క. వచ్చిన మునిసంఘములకు, విచ్చలవిడి నర్ఘ్యపాద్యవిధు లొనరింపన్ మెచ్చగు కనకాసనముల నచ్చుగఁ గూర్చుండి వనరుహాక్షునితోడన్.

13

తా ॥ వచ్చిన మునిబృందాలకు ఎదురేగి, శ్రీకృష్ణుడు వారికి స్వయంగా తానే అర్ఘ్యం, పాద్యం సమర్పించగా, సర్వోపచార పూజావిధులతో సత్కరించబడిన తర్వాత వారందరూ

అపరంజి గద్దెల మీద హాయిగా కూర్చుండి, పద్మనేత్రుడైన శ్రీకృష్ణునితో ఇలా అన్నారు:

క. జనములు నిను సేవింపని, దినములు వ్యర్థంబు లగుచుఁ దిరుగుచు నుండుం
దనువులు నిలుకడ గావఁట, వనములలో నున్ననైన వనరుహనాభా!

14

తా ॥ 'బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన వనరుహము (పద్మము)ను నాభియందు కలిగి, సృష్టికర్తకే సృష్టికర్తవైన పరమపురుషా! జనులు మిథ్యాభోగాల పట్ల ఆసక్తివహించి నీ మహిమను గుర్తింపలేక, నీ సేవకు నోచుకోలేని రోజులు ఏ పరమార్థసాధనకూ పనికి రాక, నిష్ప్రయోజకంగా దొర్లిపోతుంటాయి. ఏ శరీరసౌఖ్యాన్ని కోరి వారు దుఃఖాలను కొనితెచ్చుకొంటున్నారో – ఆ శరీరాలు (వనములలో = అడవులలో, జలములలో అని రెండర్థాలు) వానప్రస్థాన్ని, స్వీకరించి తపస్సులో మునిగినా, నీళ్ళలో మునిగి ముక్కు మూసుకొని తపస్సులు చేసినా – ఏదో ఒకనాటికి కృశించేవే గాని, ఎల్లకాలం నిలకడగా ఉండేవి కావు.

తనువు (శరీరం) అంటేనే 'కృశించేది' అని అర్థం. క్షణికమైన శరీరసౌఖ్యం కోసం చేసే ప్రయత్నాలన్నీ ఆ అనుభవానంతరం చిత్తశాంతిని కలిగింపకపోగా మరింత దురంత దుఃఖాలుగానే పరిణమిస్తాయి. అదీగాక, అశాశ్వతమైన సాధనాలతో చేసే ఏ యత్నంవల్లా శాశ్వతమైన సుఖస్వరూపం తెలిసిరాదు.

క. తరణంబులు భవజలధికి, హరణంబులు దురిత లతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు, శరణంబులు, నీదు దివ్యచరణంబు లిలన్.

15

తా ॥ ఆ శరీరాభిమానం వల్ల దేహాత్మబుద్ధి ఉదయించి, 'దీనికి కర్తను నేను', 'ఈ సుఖానికి భోక్తను నేను' అన్న విపరీతజ్ఞానానికి లోనై, ఐహిక భోగలాలసులైనవారికి నీ దివ్యచరణాలు జననమరణ రూప సంసారమనే సముద్రాన్ని దాటించే నావల వంటివి. పాపాలనే

లతలను పెకలించి వేసేవి. ధర్మమూలములైన వేదాలకు సొగసుకూర్చేవి. ఆధివ్యాధులచే బాధితులైనవారికి శరణాగతిని ప్రసాదించేవి.

మ.కో.ఒక్క వేళను సూక్ష్మరూపము నొందు దీ వణుమాత్రమై
యొక్క వేళను స్థూలరూపము నొందు దంతయు నీవయై
పెక్కురూపులు దాల్తు నీ దగుపెంపు మాకు నుతింపఁగా
నక్కజం బగుచున్న దేమన? నంబుజాక్ష! రమాపతీ!

16

తా ॥ పద్మముల వంటి కన్నుల చల్లని చూపులతో శరణాగతులపై కరుణారసాన్ని ప్రసరింపజేసి, ఐహికాముష్మిక తాపాలను అణగార్చే ఓ నీరజాక్షా! పరమైశ్వర్యయుక్తురాలయిన రమాదేవిచే వరింపబడి, ఆమెపై ప్రేమరసాన్ని ప్రవర్షించి పరవశింపజేసి ఆమెకు స్వాధీనుడవై ఉంటూనే నీ రక్షకత్వ శక్తిని, పోషణను, విభుత్వాన్నిలోకాలకు ఆదర్శంగా వెల్లడించిన స్వామీ! రమాదేవికి పతియైనవాడా!

అణుమాత్రుడవై నీవు ఒక్కొక్కప్పుడు నీ సూక్ష్మరూపాన్ని ఆవిష్కరిస్తావు. 'అణోరణీయాన్' అని శ్రుతి చెప్పినట్లు, సృష్టి సమస్తంలో చిన్నదైన అణువు కంటె మరీ చిన్నదయిన పరమాణువు లాగా భాసించే నీ రూపు నీకు మాత్రమే తెలుసు. మరొక్కప్పుడు నీవు విశ్వమంతటా వ్యాపించి, విశ్వాత్ముడవై, సర్వసర్వాత్మకుడవై నీ ఐశ్వర్యవిభూతిని ప్రకటిస్తావు.

ఎంతటి చిన్నవాడవో, అంతటి విశ్వరూపధారివి నీవు. నీ భక్తులను అనుగ్రహింపగోరి (స్వరూప – రూప – గుణ – విభూతులతో) పెక్కు రూపాలను ధరిస్తావు. నీ పెంపును (సర్వవ్యాపకత్వాన్ని), సమగ్ర గుణసంపన్నతను సన్నుతింపగలగటం అల్పవాక్కులమైన మాకు సాధ్యమేనా? అని సంకోచం కలుగుతున్నది. ఏమనబోయి ఏమంటున్నామో! అని ఆశ్చర్యపోతున్నాము.

క. శ్రీనాయక! నీ నామము, నానాభవరోగకర్మనాశమునకు వి
న్నాణం బగు నౌషధ మిది, కానరు దుష్టాత్ము లకట కంజదళాక్షా!

17

తా ॥ లక్ష్మిని ధర్మపత్నిగా స్వీకరించి, పరిపూర్ణుడవైన ఓ ప్రభూ!

అనాది అయిన ఈ సృష్టిలో జీవుడు పొందిన జన్మపరంపరకు; ధాతువైషమ్యం వల్ల కలిగే రోగాలనే అధివ్యాధులూ మనోవ్యథలూ యోగవిఘ్నాలకు; మనోవాక్కాయముల ప్రవృత్తి వల్ల ఆచరించే దుష్కర్మల ఫలమైన దుఃఖానికీ వినాశకమైన విజ్ఞానౌషధం నీ దివ్యనామం.

'మిథ్యాజ్ఞానం వల్ల కలిగిన వాసనలచే రాగ ద్వేష మోహాదులను పొందినవారు (దుష్టాత్ములు) నీ నామసంకీర్తన మహిమను తెలుసుకోలేరు.'

అని, పరిశుద్ధాంతరంగులై అనన్యభక్తితో మునులు కావించిన స్తోత్రానికి శ్రీకృష్ణ పరమాత్మ ప్రసన్నుడయ్యాడు. తన గుణాలను సంకీర్తించేవారంటే గల అభిమానం వల్ల వారి మాటలను వింటున్న కొద్దీ ఆయన కన్నులు తామరరేకుల వలె వికసించాయి.

కరుణారసం ఉట్టిపడే ఆ విశాల నేత్రాలను మనసారా తిలకించి, ముగ్ధులైన మహర్షులు తమ పారవశ్యాన్ని 'కంజదళాక్షా!' అన్న సంబోధనతో వినయపూర్వకంగా స్వామికి విన్నవించుకొన్నారు.

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించిన మునివరులం గరుణాకటాక్ష వీక్షణంబుల నిరీక్షించి, పుండరీకాక్షుం డిట్లనియె; 'మదీయధ్యాన నామస్మరణంబులు భవరోగ హరణంబులును, బ్రహ్మరుద్రాదిక శరణంబులును, మంగళకరణంబులును నగు' ననియును, 'నా రూపంబులైన మేదినీసురుల పరితాపంబులఁ బరిహరించు పురుషుల నైశ్వర్యసమేతులంగాఁ జేయుదు' ననియును, యోగీశ్వరేశ్వరుం డయిన యీశ్వరుం

డానతిచ్చి యనంతరంబ 'మీర లిచ్చటికి వచ్చిన ప్రయోజనం బేమి?' యనిన వారలు 'భవదీయ పాదారవింద సందర్శనార్థంబు కంటె మిక్కిలి విశేషం బొండెద్ది?' యని వాసుదేవ వదన చంద్రామృతంబు నిజనేత్ర చకోరంబులం గ్రోలి యథేచ్ఛా విహారులై ద్వారకానగరంబున కనతిదూరంబున నుండు పిండారకంబను నొక్క పుణ్యతీర్థంబున కరిగి; రంత.

18

తా ॥ ఆ విధంగా పరిపరివిధాల తనను సన్నుతించిన మునులను (భగవద్రూప నామ వైభవాలను నిరంతరం మననం చేసే సంయమీంద్రులను) దయారసం వెల్లివిరిసే క్రీగంటి చూపులతో కనిపెట్టుకొని చూచిన పుండరీకాక్షుడైన శ్రీకృష్ణ పరమాత్మ ఇలా అన్నాడు :

'నన్ను ధ్యేయమూర్తిగా మనస్సులో నిలుపుకొని ధ్యానించడం, నా నామాలను స్మరించడం అన్నవి 'పుట్టుక' అనే రుగ్మత వల్ల కలిగే వికారాలన్నింటినీ హరింపజేస్తాయి. బ్రహ్మ రుద్రాదులకు సైతం రక్షణను కల్పిస్తాయి. దోషాలను మట్టుపెట్టి, సమస్త సన్మంగళాలను కలుగజేస్తాయి.

అంతేకాదు. బ్రహ్మతత్త్వాన్ని ఉపాసించే లోకకల్యాణతత్పరులైన భూసురులందరూ నా యొక్క ప్రతిరూపాలు. వారికి కలిగిన దుఃఖాలను, భయాలను, శోకాలను, తొలగించేవారికి నేను సర్వైశ్వర్యాలనూ ప్రసాదిస్తాను.'

అని, ఆత్మయోగులందరికీ ఆరాధ్యదైవతమైన యోగేశ్వరుడు శ్రీ పరమేశ్వరుడు మాటయిచ్చి, ఆ తర్వాత, 'మీరందరూ ఇక్కడికి ఏ లోకకల్యాణాన్ని కోరి మా ఇంటిని పావనం చేశారు?' అని కుశలప్రశ్న లడిగాడు.

మునులు, 'నీ దివ్యచరణారవిందాలను సందర్శించుకోవటం కంటే వేరే వ్యాప్యమైన ధర్మం మాకేముంటుంది?' అని పలికి; ప్రపంచమంతటా వ్యాపించి, ఈ ప్రపంచాన్ని తనలో

వసింపజేసుకొన్న దివ్యతేజోమయమూర్తి శ్రీ వాసుదేవుని ముఖమనే చంద్రుని యొక్క వెన్నెల కిరణాల అమృతరసాన్ని తమ కన్నులతో చకోరపక్షుల వలె ఆస్వాదించి, అక్కడి నుంచి బయలుదేరి, ద్వారకా నగరానికి దరిదాపుననే పితృదేవతలకు తర్పణక్రియల నిమిత్తం 'పిండతారక' మని ప్రసిద్ధికెక్కిన పిండారక పుణ్యతీర్థానికి తరలివెళ్ళారు.

అప్పుడేమయిందంటే –

క. దర్పించి యాదవులు తమ, నేర్పునఁ గొమరారు సాంబు నెలఁతుకరూపం
బేర్పడ శృంగారించియుఁ, గర్పూర సుగంధిపోల్కిఁ గావించి యొగిన్.

19

తా ॥ యాదవులు కొందరు దుడుకుతనం కొద్దీ, శ్రీకృష్ణునికి జాంబవతి యందు కలిగిన సాంబకుమారునికి పడుచుదనపు అందాలొలుకుతున్న జవరాలి వేషం వేసి, నెత్తావులు పరిమళించే కర్పూరకళిక లాగా ఎంతో నేర్పుతో అతనిని సింగారించారు.

ఉ. మూఁకలు గూడి యాదవులు ముందటఁ బెట్టుక యార్చి నవ్వుచుం
బోకలఁ బోవుచున్ మునిసమూహము కొయ్యన సాఁగి మ్రొక్కుచుం
'బ్రాకటమైన యీ సుదతిభారపు గర్భమునందుఁ బుత్రుఁడో
యేకతమందు బాలికయొ యేర్పడఁజెప్పు' డటన్న నుగ్రులై.

20

తా ॥ అంతటితో ఊరుకోక ఆ స్త్రీవేషధారిని ముందుంచుకొని, నలుగురూ గుంపుగూడి కేకలు వేస్తూ – ఎకసక్కెపు నవ్వులు నవ్వుతూ – పిండారక క్షేత్రానికి వెళ్తున్న మునిగణానికి ఎదురేగి, ఎక్కడా లేని వినయాన్నీ ప్రదర్శిస్తూ, వంగి వంగి దణ్ణాలు పెడుతూ, 'నెలలు నిండి పురిటికి సిద్ధంగా ఉన్న ఈవిడగారి కడుపున గాచేది కొడుకో? కూతురో? ఏ సంగతీ చెప్పండయ్యా!' అనే సరికి, ఋషులు కోపగించుకున్నారు.

క. యదుడింభకులను గనుఁగొని, 'మదయుతులై వచ్చి' రనుచు మదిలో రోషం
బొదవఁ గనుఁగొనల నిప్పులు, సెదరఁగ 'హాస్యంబు సనునె చేయఁగ' ననుచున్.

21

తా ॥ ఆ యాదవార్భకులను చూసి, 'దుర్మదం నెత్తికెక్కి కాదూ? వీళ్ళిక్కడికి వచ్చింది' అని మనస్సులో క్రోధాగ్నిజ్వాలలు రగులుతుండగా, కళ్ళకొనల నుంచి నిప్పులు చెరిగారు. 'ఈ వేళాకోళం మా వంటివారితో చేయవచ్చునా?' అంటూ –

క. 'వాలాయము యదుకుల ని, ర్మూలకరం బైనయట్టి ముసలం బొక టీ
బాలిక కుదయించును బొం, డాలస్యము లే' దటంచు నటఁ బల్కుటయున్.

22

తా ॥ 'అవశ్యం యదువంశాన్ని తుదముట్టించే రోకలి ఒకటి ఈ పిల్లకు పుడుతుంది, పోపొండి! ఆలస్యం లేదు, కాన్పుకు వేళయినట్లే' అని శపించివేశారు.

వ. మదోద్రేకులైన యాదవబాలకులు మునిశాపభీతులై వడవడ వడంకుచు సాంబకుక్షినిబద్ధ చేల గ్రంథివిమోచనంబు సేయు సమయంబున ముసలం బొక్కటి భూతలపతితం బయిన విస్మయంబు నొంది దానిం గొని చని దేవకీనందను సన్నిధానంబునం బెట్టి యెఱింగించిన నతం డాత్మకల్పిత మాయారూపం బగుట యెఱింగియు, నెఱుంగని తెఱంగున వారలం జూచి యిట్లనియె.

23

తా ॥ తాగిన మైకంలో అదుపు తప్పిన యాదవబాలకులు ఆ బ్రహ్మదండానికి భయంతో వణికిపోతూ – సాంబకుమారుని పొత్తికడుపుకు కట్టిన గుడ్డల మూట ముడి విప్పేసరికి, ముసలం ఒకటి నేలకు జారిపడింది. అదిచూసి వారందరూ నివ్వెరపోయి, దానిని తీసుకొని వెళ్ళి దేవకీనందనుడు శ్రీకృష్ణుని యెదుట ఉంచి, జరిగిన సంగతంతా వివరించి చెప్పారు.

శ్రీకృష్ణుడు ఆ ఘటన సమస్తం తాను కల్పించిన మాయా ప్రభావ ఫలితమేనని తెలిసినప్పటికీ, ఏమీ తెలియనివాని వలె వారిని చూచి, ఇలా అన్నాడు:

ర. 'మది సెడి కన్నులు గానక, మదయుతులై మునులఁ గల్లమాటలఁ జెనయం
గదిసి కులక్షయకారణ, విదితం బగు శాప మొందు వెఱ్ఱులుఁ గలరే?

24

తా ॥ 'మనస్సు వక్రమార్గం పట్టి, కన్నూ మిన్నూ పై గానక, మదోన్మత్తులై మహామునులను ఎదుర్కొని, కల్లమాటలతో వారిని అల్లరి పట్టించి, కులనాశనానికి గురికాగల శాపాన్ని పొందే మీ వంటి మందభాగ్యులు వేరొకరుంటారా?

క. ధరణీసురశాపమునకు, హరిహరబ్రహ్మాదులైన నడ్డము గలరే? నరు లనఁగ నెంత వారలు, గర మరుదుగఁ బూర్వజన్మకర్మముఁ ద్రోవన్?

25

తా ॥ భూసురుల శాపానికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులైనా ఎదురొడ్డి నిలువగలరా? మానవమాత్రులనగా ఎంత? మునుపటి జన్మలలో చేసిన కర్మల యొక్క ఫలాన్నుంచి తప్పించుకోవాలంటే సాధ్యమవుతుందా? ప్రారబ్ధాన్ని అనుభవించి తీరవలసిందే.

వ. అది గావున యతి నిందాపరత్వంబున యదువంశనాశం బగు; సందియంబు లే' దని పరమేశ్వరుండు వారలం జూచి 'సముద్రతీరంబున నొక్క మహాపర్వతం బున్నది; యందు నుండు నత్యుచ్ఛ్రయ విశాలభీషణం బగు పాషాణంబున మీ భుజాబలంబుచేత నీ ముసలంబు దివిచి దీని చూర్ణంబు సింధు కబంధంబులఁ గలిపి రండు; పొండ' ని జగద్విభుండైన కృష్ణుం డాన తిచ్చిన, వారు నట్లచేసి తత్కీలితం బయిన లోహఖండంబును సరకుగొనక సాగరంబునఁ బడవైచిన నొక్క ఝషంబు గ్రసించిన, దాని నొక్క లుబ్ధకుండు జాలమార్గంబునఁ బట్టికొని, తదుదర గతంబయిన లోహఖండంబు దెచ్చి బాణాగ్రంబున

ముల్కిగా నొనర్చె' నని తత్కథా వృత్తాంతంబు సెప్పిన బాదరాయణిం గనుంగొని రాజేంద్రుం డిట్లనియె.

26

తా ॥ కనుక, సర్వజ్ఞులైన మునీంద్రులను ఆటపట్టించిన నేరానికి యదువంశం నాశనం కావలసిందే. అందుకు సందేహం లేదు.

అని, సర్వేశ్వరుడైన శ్రీకృష్ణ పరమాత్మ వారి దురవస్థను చూసి, 'సముద్రం ఒడ్డున ఒక పెద్ద పర్వతం ఉన్నది. అక్కడ అన్నింటి కంటే పై యెత్తున కనుపించే ఒక బండమీద మీ భుజబలం కొద్దీ యీ ఇనుప రోకలిని రాచి పొడిచేసి, ఆ పొడిని సముద్రపు నీళ్ళలో కలిపి రండి. వెళ్ళండి!' అన్నాడు.

ఆ విధంగా సర్వజగత్తులకు వల్లభుడైన శ్రీకృష్ణుడు ఆజ్ఞాపింపగా, వారందరూ ఆ ప్రకారమే ఆ ముసలాన్ని అరగదీసి, చివరికి మిగిలిన ఒక చిన్న ముక్కను – ఇంకెందుకని సముద్రంలోకి విసిరేశారు.

యాదవులు విసిరి పారవేసిన ఇనుప ముక్కను నీళ్ళలో ఒక చేప మ్రింగింది. దానిని ఒక జాలరివాడు వలవేసి పట్టుకొని, దాని కడుపులో దొరికిన ఇనుప ముక్కను తన బాణం చివర ములికిగా అమర్చుకొన్నాడు.'

అని, జరిగిన కథను చెప్పి ముగించిన తర్వాత, బాదరాయణ మహర్షి కొడుకైన శుకయోగిని పరీక్షిత్తు ఇంకా ఇలా అడిగాడు.

క. చిత్తం బే క్రియ నిలుచుం?, జిత్తజగురు పాదపద్మ సేవ సదా య
త్యుత్తమ మని వసుదేవుఁడు, చిత్తముఁ దగ నిల్పి యెట్లు సెందె మునీంద్రా!

27

తా ॥ 'మునీంద్రా! ఇంద్రియసుఖాల వెంటతగిలి నిత్యమూ పరితపిస్తుండే మనస్సుకు – ఆ మనస్సును మథించే మన్మథుని కన్నతండ్రి అయిన శ్రీమన్నారాయణుని పాదపద్మాల సేవలో ఏకాగ్రత సిద్ధించాలంటే ఏం చెయ్యాలి? వసుదేవుడు ఏ విధంగా చిత్తాన్ని భగవదాయత్తం చేసి, సుస్థితిని పొందాడు?'

వ. అని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె.

28

తా ॥ అని ప్రశ్నింపగా, రాజుతో శుకయోగి ఇలా అన్నాడు:

(యాదవ వంశ వినాశనాన్ని గురించిన కథను వినగానే పరీక్షిత్తు మనస్సు వికలమైపోయింది. శ్రీకృష్ణావతారం ముగియబోతున్నదని గ్రహించాడు. భగవంతుడంతటివానికే తప్పని జననమరణాల స్వరూపాన్ని గురించి చింతాక్రాంతుడయ్యాడు. మోక్షాన్ని కోరుకొనేవారు ఎంత వదిలించుకొందామన్నా వీలుకాని ఈ సంసారం నుంచి విముక్తిని పొందాలంటే ఏం చెయ్యాలి? అని ఆలోచనలో పడ్డాడు. మనస్సు యొక్క వృత్తులను నిరోధించి, దానిని శ్రీ వాసుదేవుని చరణాలపై ఏ విధంగా లగ్నం చేయాలి? అని – ఎన్నో సార్లు అడిగిన ప్రశ్ననే, మళ్ళీ ఒకసారి అడిగాడు.

శుకయోగికి, తాను పంచమ స్కంధాన్ని వినిపించే ముందు పరీక్షిత్తు ఇదే ప్రశ్నను ఇవే మాటలలో అడిగాడని గుర్తున్నది. 'ఉత్తమశ్లోకుఁ డైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృత్తచిత్తు లైన మహాత్ములు కుటుంబంబు నందు నిస్పృహత సేయుదురు... దారాగారసురాదు లందుఁ దగులంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరి యం దస్థిలితమతి యెట్లు గలుగు ? ఈ సంశయంబుఁ దేటపఱుపుము (5–4)' అని – అప్పుడతను ప్రియవ్రతుని గురించి వింటూ, అడిగాడు. శుకయోగి అందుకు సమాధానంగా మనుపుత్రుడైన ప్రియవ్రతుని ఉపాఖ్యానాన్నీ, నారాయణుని ఋషభావతార కథనూ రాజుకు వినిపించాడు. ఋషభునికి తొమ్మిదిమంది

కొడుకులుండేవారని, వారు భాగవతధర్మాన్ని లోకంలో ప్రకాశింపజేశారనీ ఆ సందర్భంలో చెబుతూ – 'భగవన్మహిమోపబృంహితంబు లగు వారల కథల ముందు నెఱింగించెద (5–64)' అని, ఆ కథను తర్వాత చెబుతానని అన్నాడు. సంస్కృతంలో అయితే మరీ స్పష్టంగా – 'ఇతి భాగవతధర్మదర్శనా నవ మహాభాగవతా స్తేషాం సుచరితం భగవన్మహిమో బృంహితం వసుదేవ – నారదసంవాద ముపశమాయనముపరిష్టా ద్వర్ణయిష్యామః (5–4–11)' అని, 'ఆ కథను వసుదేవ నారదుల సంభాషణ రూపంలో నీకు తర్వాత వినిపిస్తానులే!' అని మాటయిచ్చాడు.

ఆ మాటే పరీక్షిత్తుకు ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. 'చిత్తం బే క్రియ నిలుచున్' అని అడిగిన వెంటనే, 'వసుదేవుఁడు చిత్తముఁ దగ నిల్పి యెట్లు సెందె?' అని, ఆ విషయాన్ని శుకయోగికి మనవి చేశాడు.

పరీక్షిత్తు 'వసుదేవుడు' అనగానే శుకయోగి ఆ సంగతిని గ్రహించి, వెంటనే అందుకొన్నాడు.

## నారదుడు పురాతనమైన విదేహర్షభ సంవాదమును తెలుపుట

క. వినుము నృపాలక! సెప్పెద, ఘనమై విలసిల్లు పూర్వకథ గల దదియున్ మును ద్వారక కేతెంచియు, నొనరఁగ నారదుఁడు గృష్ణు నొయ్యనఁ గాంచెన్.

29

తా ॥ 'రాజేంద్రా! చెబుతాను, విను. నీవడిగిన ప్రశ్నకు సమాధానంగా (ఘనమై విలసిల్లు) గంభీరమైన అంతరార్థం కలిగిన, పూర్వం జరిగిన కథ ఒకటున్నది. మునుపొకప్పుడు నారదముని ద్వారకా నగరానికి వచ్చి, శ్రీకృష్ణ పరమాత్మను సందర్శించుకొన్నాడు.

వ. అట్లు దేవముని కృష్ణసందర్శనార్థం బరుగుదెంచి తద్గృహాభ్యంతరమున కరిగిన, వసుదేవుం డ మ్మునీంద్రుని నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి, కనకాసనాసీనుం గావించి, యుచిత కథావినోదంబులం బ్రొద్దు పుచ్చుచు నిట్లనియె; 'ఏ నరుండు నారాయణ సరసీరుహ భజనపరాయణత్వంబు నిరంతరంబు నొందం; దట్టివానికి మృత్యువు సన్నిహితంబై యుండు; నీ దర్శనంబునం గృతార్థుండ నైతి; నచ్యుతానంత గోవింద నామస్మరణైకాగ్ర చిత్తులైన మీవంటి పుణ్యపురుషుల సమాగమంబున లోకులు సుఖాశ్రయులయి యుండుదురు; దేవతాభజనంబు సేయువారిని గీర్వాణులు ననుగ్రహింతు; రట్లు సజ్జనులును దీనవత్సలులు నగువారలు పూజనాది క్రియలచే నా దేవతలను భక్తి సేయుదురు; కావున శ్రీ మహాభాగవత కథాసమూహంబులఁ గల ధర్మంబు లడిగెద; నే యే ధర్మంబులు శ్రవణ సుఖంబులుగా వినిన దండధర కింకర తాడనంబులం బడక, ముకుంద చరణారవింద వందనాభిలాషులయి పరమపదప్రాప్తు లగుదు; రా ధర్మంబు లానతిమ్ము; తొల్లి గోవిందునిం బుత్రుఁగాఁ గోరి ముక్తి మార్గం బెఱుంగలేక దేవతామాయం జేసి చిక్కి చిత్తవ్యసనాంధకారంబగు సంసారంబునం దగులువడి యున్నవాఁడ; హరికథామృతంబు వెల్లిగొల్పు; మట్లయిన సుఖంబు గలుగు ననిన వసుదేవ కృతప్రశ్నుండైన నారదుండు వాసుదేవకథా ప్రసంగ సల్లాపహర్ష సమేతుండై సంతసం బంద

నిట్లనియె.

30

తా ॥ అలా, దేవముని నారదుడు శ్రీకృష్ణుని సందర్శించుకోవడానికి వచ్చి, ఆ ఇంటిలోపలికి వెళ్ళినప్పుడు వసుదేవుడు ఆ మునిచంద్రుణ్ణి అర్ఘ్యం, పాద్యం మొదలైన పూజోపచార విధులతో గౌరవించి, బంగారపు ఆసనం పైన కూర్చుండబెట్టి, కర్మ జ్ఞాన భక్తి యోగాల సారాన్ని తగురీతిని ప్రస్తావించి, భగవంతుని రూపాలైన సత్పురుషుల కథలను జ్ఞాపకం చేసుకొంటూ, సరససల్లాపాలతో కొంతసేపయ్యాక ఇలా అన్నాడు :

'మునీంద్రా! ఏ మానవుడు శ్రీమన్నారాయణుని పాదపద్మాల ఆరాధనమే ఉత్తమాశ్రయణమని నమ్మి, అత్యంతాసక్తితో సేవాతత్పరుడై ఎల్లవేళలా భక్తిగలిగి ఉండడో, అతడిని మృత్యుభయం వెన్నంటే ఉంటుంది. నిన్ను దర్శించే భాగ్యం సమకూడినందువల్ల నేను ధన్యుణ్ణయ్యాను. అచ్యుతుడు (శరణాగతులైనవారికి మధ్యలో ఎల్లవేళల తప్పుకోక తోడునిలిచే స్వామి), అనంతుడు (దేశము కాలము వస్తువు అనే పరిమితులు లేని ప్రభువు), గోవిందుడు (వేదాంతవేద్యుడయిన రక్షకుడు) అయిన భగవానుని నామాలను ఏకాగ్రచిత్తంతో నిరంతరమూ ధ్యానించే మీవంటి పుణ్యధనుల రాక వల్ల జనులు సర్వశుభాలనూ పొందగలుగుతారు. ఏ మానవులు ఏ భావంతో దేవతలను భజిస్తారో, ఆయా కర్మఫలాలను దేవతలు వారికి ప్రసాదిస్తారు. మీవంటి సత్పురుషులు దీనుల యెడ వాత్సల్యాన్ని చూపి కాపాడుతారు. నిష్కామచిత్తులై పూజాది సత్కర్మలతో ఆ దేవతలకు భక్తి కావిస్తారు. కనుక, ఏ ధర్మాలను ఆచరించి మానవులు సర్వవిధభయాల నుంచీ విముక్తులు కాగలరో – ఆ శ్రీ మహాభాగవతుల జీవిత కథలలోని ధర్మాలను చెప్పవలసినదిగా కోరుతున్నాను. ఏయే ధర్మాలను వీనులవిందుగా విన్నట్లయితే యమభటుల వ్రేటున బడక, మోక్షప్రదాత అయిన శ్రీ ముకుందుని పాదారవిందాలకు వందనం చేయాలనే కోరిక కలిగి, బ్రహ్మానందనిలయమైన పరమపదాన్ని పొందగలుగుతారో – ఆ భాగవత ధర్మాలను వినిపించు.

పూర్వజన్మలో నేను శ్రీ మహావిష్ణువును కొడుకుగా పొందగోరానే కాని, ముక్తిని పొందే ఉపాయమేమిటో అడిగి తెలుసుకోవాలని అనుకోలేదు. ఆ భగవానుని మాయ వల్ల మోహాన్ని పొంది, అన్ని మనోవ్యథలకూ ఆలవాలమై, అజ్ఞానమనే అంధకారంతో నిండిన సంసార బంధంలో చిక్కుకొన్నాను.

శ్రీహరి కథామృతాన్ని నాపై ప్రవహింపజెయ్యి. అలాగైనా శ్రేయస్సు కలుగుతుందేమో!'

అని వసుదేవుడు కోరే సరికి, శ్రీ వాసుదేవుని లీలలను నోరారా చెప్పుకొనే అవకాశం వచ్చిందని నారద మహర్షికి అమితానందం కలిగింది.

తన సంతోషాన్ని వసుదేవునికీ పంచిపెట్టాలన్న ఉత్సాహంతో ఇలా అన్నాడు:

క. 'నను నీవు సేయు ప్రశ్నము, జనసన్నుత! వేదశాస్త్రసారాంశంబై
ఘనమగు హరిగుణ కథనము, విను మని, వినిపింపఁదొడంగె వేడ్క దలిర్పన్.

31

తా ॥ 'జనులందరూ మెచ్చుకొనే ఓ వసుదేవా! నీవడిగినది వేదశాస్త్రాల నిగ్గు తేల్చే ఒక గొప్ప ప్రశ్న. శ్రీహరి యొక్క గుణాలను గురించి వివరించి చెప్పటం ఒక్కటే అందుకు సమాధానం. నువ్వు తప్పక వినాలి!'

అంటూ, ఉత్సాహం ఉప్పొంగగా చెప్పడం మొదలుపెట్టాడు.

క. అతిపాపకర్ము లైనను, సతతము నారాయణాఖ్యశబ్దము మదిలో
వితతంబుగఁ బఠియించిన, చతురులఁ గొనియాడఁ గమలసంభవు వశమే?

32

తా ॥ ఎంతటి ఘోరపాపం చేసుకొన్నా, మనస్సులో నిరంతరం 'నారాయణ'

నామమంత్రాన్ని పునఃపునరావృత్తిగా (వితతము = పెక్కుమార్లు) జపించినవారు ధన్యులు. అటువంటివారిని మెచ్చుకోవాలని, ఎంత మెచ్చుకొన్నా, ఆ ముచ్చట వారిని సృష్టించిన బ్రహ్మకైనా తీరుతుందా?

స్వధర్మానికి విరుద్ధమైన చర్య అధర్మం. తప్పు చేసిన వారిని ఆ తప్పు మూలాననే నశింపజేసేది కాబట్టి (పిబతి పాపిష్ఠం), దీని నుంచి జనులు తమను తాము రక్షించుకోవాలి (పాతి రక్షతి అస్మాత్) కాబట్టి – ఆ అకృత్యాన్ని 'పాపము' అని పెద్దలన్నారు. చెడు సంబంధాల వల్ల మరింత విస్తరించేది కాబట్టి అదే 'పంకము' అయింది. దీనివల్ల నరకకూపంలో పడతారు కనుక 'పాప్మము'. లోకాన్ని శిథిలంగా మార్చివేసేది 'కిల్బిషము'. చేసిన మంచిపనులను సైతం చెడుగా చూపగలిగేది కాబట్టి 'కలుషము'. శిష్టులచే వర్జింపబడేది కనుక 'వృజినము'. నరకాన్ని పొందించేది కాబట్టి 'ఏనము'. తప్పు చేసినవారిని పట్టి కుడిపేది కాబట్టి 'అంహము'. చెడునడతకు దారితీసేది కాబట్టి 'దురితము', చెడుమనస్సుతో చేసిన చేత కాబట్టి 'దుష్కృతము' అని కూడా అంటారు. అందువల్ల ధర్మపరులు పాపవర్తనకు, పాప చింతనకు దూరంగా ఉండాలి.

భగవన్నామజపం తపోనుష్ఠానాదుల వల్ల, పశ్చాత్తాప విధుల మూలాన కలిగే దోషవిముక్తి కంటే భగవంతుని నామజపం వల్ల కలిగే ఫలం అమోఘమైనది. 'కృతే పాపేనుతాపో వై యస్య పుంసః ప్రజాయతే, ప్రాయశ్చిత్తం తు తస్యైకం హరి సంస్మరణం పరమ్' అని విష్ణుపురాణం హరినామ సంస్మరణ మాహాత్మ్యాన్ని ఉగ్గడించింది. అన్ని పాపాలకూ పరిహారం ఆ గోవింద నారాయణ వాసుదేవ హరి నామ సంకీర్తనమే. ఈశ్వర సాక్షాత్కారానికి నామజపమే సర్వోపరిసాధనం. 'ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపః కర్మాత్మకాని వై, యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్' అని పెద్దలంటారు. తక్కిన ప్రాయశ్చిత్తాల వల్ల నరకనివాస పునర్జన్మాది శిక్షల కాలపరిధి కొంత తగ్గవచ్చునేమో గాని, నామజపం వల్ల మాత్రం సద్యఃఫలం కలిగి, పాపక్షయం జరిగి తీరుతుంది. 'ప్రాత ర్నిశి తథా సంధ్యామధ్యాహ్నాదిషు

సంస్మరన్, నారాయణ మవాప్నోతి సద్యః పాపక్షయం నరః' అని ప్రాయశ్చిత్తవివేకం లో ఉన్నది.

ఇన్ని కారణాల వల్ల నారయ కవి పద్యంలో గంభీరమైన అర్థశక్తి కనిపిస్తుంది. పాపకర్ములు శ్రీమన్నారాయణ నామమంత్రాన్ని ఎల్లవేళల పునఃపునరావృత్తిగా జపిస్తుండాలని (వితతము = విరివిగా) దీని తాత్పర్యం.

భగవన్నామం వల్ల పాపక్షయం కలగటమే గాక, జప మాహాత్మ్యం వల్ల పాపసంకల్పాలు సైతం దరికి రావు.

నలుసంత నిప్పు పడగానే కొండంత దూది తగులబడి బూడిద అయిపోయే విధంగా పావన భగవన్నామాన్ని భక్తితో కీర్తించి నంత మాత్రాన నీ పాపరాసులన్నీ పటాపంచలైపోతాయి.

—శ్రీరామకృష్ణ పరమహంస

వ. అట్లు గావునఁ బరమేశ్వరభక్తి జనకంబై, కైవల్యపద ప్రాప్తికరంబయి యొప్పుచున్న విదేహార్షభ సంవాదంబు నాఁ బరఁగు నొక్క పురాతన పుణ్యకథావిశేషం బెఱింగించెద, సావధాన మనస్కుండవై యాకర్ణింపు' మని యిట్లనియె.

33

తా ॥ కనుక, పరమాత్మస్వరూపుడైన శ్రీ వాసుదేవునియందు భక్తిని కలిగించేదీ; అవిద్య మూలాన మనము కల్పించుకొన్న నామరూపాది ప్రపంచాన్ని ఉపశమింపజేసి, అద్వితీయమైన పరబ్రహ్మపదాన్ని సంప్రాప్తింపజేసేదీ అయిన 'విదేహార్షభ సంవాదము' అనే పేరిట విదేహ నగరపు రాజు జనకునికీ, ఋషభదేవుని కొడుకులైన ఆర్షభులనే తొమ్మిదిమంది యోగులకూ భాగవతధర్మాలను గురించి జరిగిన సంభాషణను నీకు వినిపిస్తాను.

పరమేశ్వరునికి సర్వం సమర్పించి, ఆ ప్రభువుతో స్వస్వరూపానుసంధానం చేసుకోవాలనే దివ్యమైన భక్తిభావాన్ని కలిగించేదీ, అఖండ అద్వితీయ సచ్చిదానంద బ్రహ్మైకస్థితి అయిన

కైవల్యమోక్షాన్ని ప్రసాదించేదీ, విదేహ రాజుకూ ఋషభుని సుతులైన (ఆర్షభులనే) నవయోగులకూ ప్రసంగరూపంలో పూర్వం ఒకప్పుడు జరిగిన పురాతన పుణ్యకథావిశేషాన్ని వినిపిస్తాను. ఏకాగ్రచిత్తుడవై ఆలకించు. అని చెబుతూ, నారదుడు వసుదేవునితో ఇలా అన్నాడు.

తే. 'వినుము స్వాయంభువుండను మనువునకును, రమణ నుదయించెనఁట ప్రియవ్రతుఁ డనంగఁ దనయు; డాతని కాగ్నీధ్రుఁ డనఁగ సుతుఁడు, జాతుఁ డయ్యెను భువనవిఖ్యాతుఁ డగుచు.

34

తా ॥ "విను. స్వాయంభువ మనువుకు ప్రియవ్రతుడని, ఎంతో గొప్ప కొడుకు జన్మించాడు కదా, ఆ ప్రియవ్రతునికి ఈరేడు లోకాలలోనూ పేరెన్నికగన్న ఆగ్నీధ్రుడనే కుమారుడు ఉదయించాడు.

వ. ఆ యాగ్నీధ్రునకు నాభి యను ప్రాజ్ఞుండగు తనూభవుం డుదయించి బలిచక్రవర్తితో మైత్రింజేసి ధారుణీభారంబు పూని యాజ్ఞాపరిపాలనంబున నహితరాజన్య రాజ్యంబులు స్వవశంబులు గావించుకొని యుండె; నంతట నాభికి సత్పుత్రుం డయిన ఋషభుండు పుట్టె; నతండు హరిదాసుండై సుతశతకంబుఁ బడసె; నందగ్రజుం డయిన భరతుం డను మహానుభావుండు నారాయణ పరాయణుండై యిహలోకసుఖంబులం బరిహరించి, ఘోర తపం బాచరించి జన్మత్రితయంబున నిర్వాణసుఖ పారవశ్యంబున సకలబంధ విముక్తుండై వాసుదేవపదంబు నొందె; నాతనిపేర నతం డేలిన భూఖండంబు భారతవర్షం బను వ్యవహారంబున నెగడి జగంబులఁ బ్రసిద్ధం బయ్యె; మఱియు నందుఁ దొమ్మండ్రు కుమారులు బలపరాక్రమ ప్రభావరూప సంపన్నులయి నవఖండంబులకు నధిష్ఠాత లైరి; వెండియు వారలలో నెనుబది యొక్కండ్రు కుమారులు నిత్య కర్మానుష్ఠాన పరతంత్రులై విప్రత్వం బంగీకరించి; రందుఁ గొందఱు శేషించిన వారులు కవిహర్యంతరిక్ష ప్రబుద్ధపిప్పలాయ నావిర్హోత్ర ద్రమిళ చమస కరభాజను లనం బరఁగు తొమ్మం

ద్రూర్ధ్వరేతస్కులయి బ్రహ్మవిద్యావిశారదు లగుచు, జగత్త్రయంబును బరమాత్మ స్వరూపంబుగాఁ దెలియుచు ముక్తులై యవ్యాహతగమను లగుచు, సురసిద్ధసాధ్య యక్షగంధర్వ కిన్నరకింపురుష నాగలోకంబు లందు స్వేచ్ఛావిహారంబు సేయుచు నొక్కనాఁడు.

35

తా ॥ ఆ ఆగ్నీధ్రునికి నాభి అని విశేష బుద్ధిమంతుడైన తనయుడు ఉదయించి, రాజై, తన గొప్పదనానికి తగినట్లుగా తన కాలపు రాజులందరిలో సర్వసమర్థుడైన బలి చక్రవర్తితో చెలిమి చేశాడు. ఆ చెలిమి తోడై సమస్త భూమండలాన్నీ పరిపాలించటం మొదలుపెట్టాడు. శత్రురాజులను జయించి, వారి రాజ్యాలను వశపరచుకొని ప్రాబల్యం వహించి ఉన్నాడు.

ఆ నాభి చక్రవర్తికి ఋషభుడని సద్గుణవంతుడైన కొడుకు పుట్టాడు. శ్రీహరి పాదపద్మసేవాతత్పరుడై నూరుమంది కొడుకులను కన్నాడు. వారిలో పెద్దవాడైన మహానుభావుడు భరతుడు నారాయణుడే లోకంగా ఉంటూ తదేకధ్యానంతో ఇంద్రియసుఖాలన్నింటినీ కాదనుకొని, ఘోరమైన తపస్సుచేసి, మూడు జన్మల కాలం ఆ విధంగా ఆచరించి, నిరంతరం అఖండమైన బ్రహ్మానందపదవి పైనే మనసునిల్పి, మనస్సును సంసారబంధాల నుంచి మళ్ళించి, తుదకు శ్రీ వాసుదేవుని చేరుకొన్నాడు. ఆ పుణ్యాత్ముడు ఏలిన భూమండలానికి అతని పేరిట భారత వర్షం అని వ్యవహారం ఏర్పడి, క్రమేణ జగత్ప్రసిద్ధం అయింది.

ఋషభుని కొడుకులలో తొమ్మిదిమంది మహాబలము, మహాపరాక్రమం, గొప్ప ప్రభావం, చూడచక్కని రూపసంపద కలిగి, తొమ్మిది భూఖండాలకు అధినేతలయ్యారు. తక్కినవారిలో ఎనభై ఒక్కమంది కొడుకులు నిత్యకర్మలను శ్రద్ధగా అనుష్ఠించటం మొదలుపెట్టి, ఆ అనుష్ఠానపరత వల్ల బ్రాహ్మణ్యాన్ని స్వీకరించారు. ఇక మిగిలినవారు కవి, హర్యక్షుడు, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమీళుడు, చమసుడు, కరభాజనుడు అనేవారు తొమ్మిదిమందీ యోగవిద్యను నేర్చుకొని, బ్రహ్మచర్యం పాటించి, ఊర్ధ్వరేతస్కులై

బ్రహ్మవిద్యలో నిష్ణాతులయ్యారు. లోకాలన్నీ పరమాత్మ స్వరూపాలే అని గుర్తించి, మహాజ్ఞానులై జీవన్ముక్తులయ్యారు. ముల్లోకాల వారూ వారి రాకకోసం ఎప్పుడెప్పుడని ఎదురుచూస్తుండేవారు. సురల లోకం, సిద్ధుల లోకం, సాధ్యుల లోకం, గంధర్వులు కిన్నరులు కింపురుషులు నాగుల లోకాలన్నింటిలో యథేచ్ఛగా విహరించసాగారు.

క. జగదేకనాథు గుణములు, మిగులఁగ సంస్మరణతోడ మీఱిన భక్తిం
బగలును రాత్రియు సంధ్యలుఁ, దగిలి జితేంద్రియులు నైన తపసులు ధాత్రిన్.

36

తా ॥ వారొక రోజున సమస్త లోకాలకు అధినాయకుడైన వాసుదేవుని లీలలను, మహిమలను పగలనీ, రాత్రనీ లేక ముప్పొద్దులా మాటిమాటికీ నిండైన భక్తికొద్దీ నెమరువేసుకొంటూ, ఇంద్రియజయాన్ని సాధించిన ఆ తాపసవరేణ్యులు భూలోకానికి వచ్చారు.

క. ఊహింపఁ బుణ్యుఁ డైన వి, దేహుని యజ్ఞాంతమందు నేతెంచినచో
గేహము వెడలి యెదుర్కొని, మోహవివర్జితులఁ బుణ్యమునిసంఘములన్.

37

తా ॥ విదేహ నగరపు రాజు నిమి చక్రవర్తి చేస్తున్న యజ్ఞం పూర్తి కావస్తున్న వేళకు వారు అక్కడికి చేరుకొన్నారు. నిమి చక్రవర్తి ఆ వార్త విని, ఇంటినుండి బయటికి వచ్చి, మోహపాశాన్ని అవలీలగా విడిచివేసిన ఆ మహాత్ములకు ఎదురేగి వెళ్ళారు.

తే. అర్ఘ్యపాద్యాదివిధులను నర్థితోడఁ, బూజ గావించి వారలఁ బొలుపు మిగుల
నుచితపీఠంబులందును నునిచి యెలమి, నవమునిశ్రేష్ఠులను భూమినాయకుండు.

38

తా ॥ పెద్దలైనవారిని సందర్శించుకొనేవారు యథావిధిగా చేయవలసిన అర్ఘ్యము,

పాద్యము మొదలైనవన్నీ సమర్పించి, ఎంతో భక్తితో తగిన మర్యాదలన్నీ చేసి, వారిని పూజించిన తర్వాత సాదరంగా సముచితాసనాలపై అధివసింపజేసి, ఆ తొమ్మిదిమంది మునీంద్రులను ఉద్దేశించి నిమి చక్రవర్తి ఇలా అన్నాడు:

క. వారల కిట్లను 'మీరలు, గారవమున విష్ణుమూర్తిఁ గైకొనిన మహా
భూరి తపోధనవర్యులు, సారవిహీనంబు లైన సంసారములన్.

39

తా ॥ "మీరు ఈ సంసారం నిస్సారమని గ్రహించి, జ్ఞానయోగంతో శ్రీమహావిష్ణువును ఆరాధించి, ఆయన కృపకు పాత్రులైన మహాతపస్సంపన్నులు.

క. ఏ రీతిఁ గడప నేర్తురు?, క్రూరులు బహుదుఃఖరోగకుత్సిత బుద్ధుల్
నీరసులు నరులు గావున, నారయ సుజ్ఞానబుద్ధి నానతి యీరే?

40

తా ॥ ఈద శక్యంకాని సంసారసముద్రాన్ని ఈదాలంటే కల్మషస్వభావులు, నానావిధాలైన దుఃఖాలతో, రోగాలతో కటకటలాడుతున్న దుష్టాత్ములు, ఈదలేక అలసిపోయిన నీరసులు అయిన మానవులు ఏం చెయ్యాలో సుజ్ఞానవంతులైన మీరే మాకు ఆదేశించండి.

## ఋషభ కుమారుడగు కవి విదేహునకు పరమార్థము బోధించుట

వ. మఱియు సకలజంతుసంతానంబుకంటె మానుషాకారంబు నొందుట దుర్లభం; బంతకంటె నారాయణ చరణ యుగళ స్మరణ పరాయణు లగుట దుష్కరంబు; కావున నాత్యంతికంబగు క్షేమం బడుగ వలసెఁ; బరమేశ్వరుండు ప్రపత్తి నిష్ఠులకు సారూప్యం బెట్లొసంగు నత్తెఱం గానతిం' డనిన విని విదేహభూపాలునకు హరికథామృత పానాతిపరవశులైన మునిసమాజంబునందుఁ గవి యను మహానుభావుం డిట్లని చెప్పం దొడంగె; 'నరిషడ్వర్గంబునందు నీషణత్రయంబుచేతం దగులువడి మాత్సర్యయుక్త చిత్తుం డగునట్టివాని కెవ్విధంబున నచ్యుత పాదారవింద భజనంబు సంభవించు? విశ్వంబును నాత్మయు వేఱుగా భావించు వానికి భీరుత్వం బెట్లులే?దవిద్యాంధకార మగ్నులకు హరిచింతనం బెట్లు సిద్ధించు? నట్టి నరుండు తొంటికళేబరంబు విడిచి పరతత్త్వం బెబ్భంగిం జేరు? ముకుళీకృత నేత్రుండయిన నరుండు మార్గభ్రమణంబునఁ దొట్రుపాటు వడి చను చందంబున విజ్ఞానవిమల హృదయభక్తి భావనావశంబు లేకున్నఁ బరమపదంబు వీరి కెవ్విధంబునం గలుగు? నని యడిగితివి; గావునఁ జెప్పెద; సావధానుండవై యాకర్ణింపుము.

41

తా ॥ పైగా, నానావిధజీవరాశిలో మానవజన్మను పొందాలంటే చాలా కష్టం. శ్రీమన్నారాయణుని పాదపద్మాలపైని అచంచలమైన భక్తిభావం కుదురుకోవటం అంతకంటే కష్టం. అందువల్ల మిమ్మల్ని క్షేమాలన్నింటిలోకీ క్షేమకరమైన మోక్షమార్గాన్ని గురించి అడగవలసి వచ్చింది. పరమేశ్వరుడు తనకు శరణాగతులైన ప్రపన్నులకు సారూప్యముక్తిని ఏ విధంగా అనుగ్రహిస్తాడు? భగవంతుని ఆరాధించే ఆ తీరేమిటో చెప్పండి" అని ప్రార్థింపగా, హరికథామృతాన్ని పానం చేసి, చేసి పరవశులై ఉన్న ఆ మునీంద్రులలో కవి అనే మహానుభావుడు విదేహ రాజుకు ఈ విధంగా సమాధానం చెప్పాడు:

"కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనే మన మనస్సులలోని ఆరు అంతశ్శత్రువుల వర్గానికీ; ఈషణత్రయమనే (ధనం, భార్య, లోకం) మూడు బంధాలకూ చిక్కుకొని మలినచిత్తుడైన వాడికి తిరుగులేని అచ్యుతపాదారవిందభజనం లభించాలంటే లభిస్తుందా? ఈ విశ్వమూ, ఆత్మ ఒకటి కావు. రెండూ వేర్వేరు అని భావించేవారికి భగవంతుని అభయదానం కలుగదు కదా, సంసారభయం లేకుండా ఎట్లా ఉంటుంది? అవిద్య అనే చీకటి కమ్ముకొన్నాక ఆ చీకటిలో మగ్గుతున్నవారికి శ్రీహరిని చింతించాలనే సద్బుద్ధి ఎలా కలుగుతుంది? అటువంటి మనిషి దేహాన్ని విడిచి పరతత్త్వాన్ని చేరుకోవటం ఉంటుందా? కన్నులు మూసుకొని నడక మొదలుపెట్టినవాడు నడుస్తూ నడూస్తూ మధ్యదారిలో తొట్రుపడి కింద పడుతూ, పైకి లేస్తూ ప్రయాణం కొనసాగించలేకపోయినట్లు విశిష్టమైన జ్ఞానం వల్ల మాలిన్యాలన్నీ తొలగి, మనస్సు భక్తిభావనకు లొంగని నాడు పరమపదం వీరికి ఏ ప్రయత్నం చేస్తే చేకూరుతుంది? అని అడిగావు కాబట్టి చెబుతాను. సావధానంగా విను."

క. కరణత్రయంబు చేతను, నరుఁ డే కర్మంబు సేయు నయ్యైవేళన్
హరి కర్పణ మని పలుకుట, పరువడి సుజ్ఞాన మండ్రు పరమమునీంద్రుల్.

42

తా ॥ మనస్సు, వాక్కు, కాయములకు కరణములు అని పేరు. కాలవశాన, విధివశాన లేదా స్వభావప్రేరణ వశాన ఈ మూడింటితో ఏ కర్మమును ఆచరించినా, వెంటనే దానిని "సకలం పరస్మై నారాయణాయ" అనుకొంటూ ఆ హరికి సమర్పించాలి. మహామునులు దానినే సుజ్ఞానము అంటారు.

వ. జ్ఞానాజ్ఞానంబులందు సంకలితుండైన స్మృతివిపర్యయంబు నొందు; నట్లు గావున గురుదేవతాత్మకుం డయి, బుద్ధిమంతుండైన మర్త్యుండు శ్రీ వల్లభు నుత్తమోత్తమునిఁగాఁ జిత్తంబునఁ జేర్చి సేవింపవలయు; స్వప్న మనోరథేచ్ఛాద్యవస్థలయందు సర్వసంకల్పనాశం

బగుటంజేసి, వానిఁ గుదియం బట్టి నిరంతర హరిధ్యానపరుండైన వానికిఁ గైవల్యంబు సులభముగఁ గరతలామలకంబై యుండు.

43

తా ॥ భగవంతుని యందు దృఢమైన విశ్వాసం కలిగి ఉన్నా మనోవాక్కాయకర్మలను భగవంతునికి సమర్పించని అజ్ఞానిని భగవన్మాయ ఆవరించి, అతనికి స్వరూపజ్ఞానం లేకుండా చేస్తుంది. అందువల్ల అతనికి "దేహమూ నేనూ ఒకటే" అన్న భ్రాంతి కలుగుతుంది. (ఈ స్మృతివిపర్యయం మూలాన దేహం, ఇంద్రియాలు మొదలైనవాటిపై అహంకారం ఏర్పడుతుంది. ఆ అహంకారమే భయాలన్నింటికీ కారణం.) అందువల్ల యుక్తాయుక్తవివేకం గల బుద్ధిమంతుడు తన గురుదేవుని ఆరాధ్యదేవతగా మనసులో భావించుకొని, శ్రీమన్నారాయణుడు ఉత్తములకు ఉత్తముడని సేవించుకోవాలి. కలలో కనిపించే వస్తువులూ, మనస్సులో పుట్టే కోరికలూ తదేకంగా వాటిని గురించే ఆలోచించినప్పుడు అవి సత్యమనే అనిపిస్తాయి. ఈ సంకల్ప వికల్పాలన్నీ మనస్సులో పుట్టేవే కనుక మొదట మనస్సును నిగ్రహించటం నేర్చుకోవాలి. నిరంతరం హరిధ్యానపరుడైన భక్తునికి అరచేతిలోని ఉసిరికలా కైవల్యం కైవసమవుతుంది.

సీ. సంతతంబును గృష్ణ సంకీర్తనంబులు వీనుల కింపుగ వినఁగవలయు
హర్షంబుతోడుత హరినామకథనంబు పాటలఁ నాటలఁ బరఁగ వలయు
నారాయణుని దివ్యనామాక్షరంబులు హృద్వీథి సతతంబు నెన్న వలయుఁ
గంజాక్షులీలలు కాంతారముల నైన భక్తి యుక్తంబుగాఁ బాడ వలయు

తే. వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని, నొడువుచును లోక బాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయ మని యెఱుఁగ వలయు, భేద మొనరింప వలవదు మేదినీశ!

44

తా ॥ ఓ రాజా! కర్మఫలత్యాగం చేసి నిరాసక్తుడై ఉన్న దశలో భక్తునికి ఐహికబంధాలుండవు. ఎల్లవేళల అతను శ్రీహరి నామసంకీర్తనం చేసుకొంటూ, ఆ కీర్తనలు

వింటూ కాలం గడపాలి. పట్టలేని ఆనందంతో శ్రీహరి పేరిట కథలను పాడుకొంటూ, మైమరచి ఆడుతుండాలి. హృదయవీథిలో నారాయణుని దివ్యనామాక్షరాలే తప్ప వేరొక భావానికి ప్రవేశం ఉండకూడదు. అడవిలో ఉన్నా ఆ అడవి, ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి, చంద్రుడు సూర్యుడు మొదలైన జ్యోతిస్సులు, సమస్త జీవజాలం, దిక్కులు, ఆ అడవిలో ఉన్న వృక్షాదులు, చరాచరాత్మక పదార్థాలన్నీ భగవంతుని శరీరమే అని భావించి, ఆ భగవంతుని లీలలను భక్తిపూర్వకంగా గానం చేయాలి. విశ్వాత్మకుడైన హరిని గూర్చి వెర్రివానివలె నవ్వుతూ, ఏడుస్తూ, గొంతెత్తి అరుస్తూ పదేపదే కీర్తించాలి. లోకమంటే పట్టనట్లు వ్యవహరించాలి. కంటికి కనిపించేదీ, కనిపించనిదీ సమస్తం విష్ణుమయమేనని గ్రహించాలి. జీవాత్మభేదం తగదు.

## హరి ముని, అంతరిక్షుడు చేసిన భాగవత స్వరూప ఉపదేశం

వ. అనిన విదేహభూపాలుడు 'భాగవతధర్మం బెద్ది? యే ప్రకారంబునం బ్రవర్తించు? వారల చిహ్నంబు లెవ్వి? యంతయు నెఱింగింప మీర యర్హుండ' లరిన నందు హరి యను మహాత్ముం డిట్లనియె.

45

తా ॥ అన్నంతనే ఆ విదేహ భూపాలుడు, "భగవద్భక్తుల ధర్మం ఏమిటి? వారి ప్రవర్తన ఏ ప్రకారంగా ఉంటుంది? వారిని గుర్తుపట్టే లక్షణాలేవి? సమస్తం ఎరిగింపగల సమర్థులు మీరే కదా!" అని పలికాడు. అప్పుడు నవయోగులలో హరి, రాజుకు భాగవత ధర్మాలను వివరించాడు.

తే. సర్వభూతమయుండైన సరసిజాక్షుఁ డతండె తన యాత్మయం దుండు ననెడువాఁడు శంఖచక్రధరుం డంచుఁ జనెడువాఁడు, భక్తిభావాభిరతుఁడు నో భాగవతుఁడు.

46

తా ॥ భగవానుడైన పుండరీకాక్షుడు శంఖచక్రధరుడై సర్వభూతముల యందు, తనయందు ఉన్నాడని నమ్మి, భక్తిభావంతో పులకించేవాడే భాగవతుడు.

క. 'వర్ణాశ్రమధర్మంబుల, నిర్ణయకర్మములఁ జెడక నిఖిలజగత్సం
పూర్ణుఁడు హరి' యను నాతఁడె, వర్ణింపఁగ భాగవతుఁడు వసుధాధీశా!

47

తా ॥ రాజేంద్రా! జన్మ, కర్మ భేదాలకు లోనై చతుర్వర్ణాలూ, చతురాశ్రమాలు, వాటి ధర్మాలు, కర్మలలో మునిగి అహంకరించక, సకల జగత్తులలోను అంతర్యామి రూపంలో ఉన్నవాడు శ్రీహరి ఒక్కడే అని వర్తించేవాడే నిజమైన భాగవతుడు.

వ. ఇట్లు సర్వసంగపరిత్యక్తుండై నిఖిలాంతరాత్ముండై పరమేశ్వరు డరుణగభస్తి కిరణ సహస్రంబుల లోకత్రయంబుం బావనంబు సేయు చందంబునం దన చరణారవింద రజఃపుంజంబుచేతం బవిత్రంబు సేయుచు, సురాసుర జేగీయమాన సేవ్యంబైన జనార్దన పాదారవిందంబులకు వందనాభిలాషుఁడై భక్తియు లవమాత్రంబునుం జలింపనీక సుధాకరోదయంబున దివాకరజనిత తాపనివారణం బయిన భంగి నారాయణాంఘ్రి నఖమణిచంద్రికా నిరస్త హృదయతాపుండై యాత్మీయభక్తి రశనానుబంధ బంధురంబైన వాసుదేవ చరణసరోరుహ ధ్యానానంద పరవశుం డగు నతండు భాగవతప్రధానుం' డని యెఱింగించిన విని విదేహుం డిట్లనియె.

48

తా ॥ ఈ విధంగా సంసారబంధాలన్నింటినీ విడిచిపెట్టి (దేహం, ఇంద్రియాలు, ప్రాణము, అంతఃకరణం, బుద్ధి మొదలైనవాటి స్థితిలయాదులు, ఆకలి, దప్పిక, దుఃఖం, భయం మొదలైన సంసారధర్మాల మూలాన మోహవశుడు కాక), సకల జీవరాశిలోను అంతర్యామిరూపంలో ఉన్న పరమేశ్వరుడు శ్రీహరి ఈ విశ్వమంతటినీ, సూర్యుడు తన వేలవేల కిరణాలతో కాంతులను విరజిమ్మి ముల్లోకాలను పవిత్రీకరిస్తున్న చందాన తన పవిత్ర చరణ ధూళిచే పావనం చేస్తున్న ఆ జనార్దనుని పాదపద్మాలకు నిరంతరం నమస్కరించాలనే గాఢమైన కోరికను కలిగి ఉండాలి. ఎట్టి పరిస్థితిలోనూ ఆయన ఉన్నాడో లేడో అన్న ఊగిసలాటతో భక్తిభావం చెక్కుచెదరకూడదు. చంద్రుడు ఉదయింపగానే పగటి వేడిమి వల్ల కలిగిన తాపమంతా చల్లారినట్లు నారాయణుని పాదాల కొనగోళ్ళ కాంతి వెన్నెలలు సోకినంతనే జన్మజన్మల హృదయతాపం ఉపశమించినట్లుగా భావించాలి. పరమేశ్వరార్పితమైన హృదయంలో భక్తి అనే పాశంతో ఆ భగవానుని బంధించివేయాలి. భగవానుడైన వాసుదేవుని పాదపద్మాలను ధ్యానించిన ఆనందాతిశయంతో మైమరచిపోవాలి. అట్టివారు కదా! భాగవతోత్తములంటే."

అని తెలియజేయగా, విని, విదేహ రాజు ఇలా అన్నాడు.

క. గజరాజవరదు గుణములు, త్రిజగత్పావనము లగుటఁ దేటపడంగా
సుజనమనోరంజకముగ, విజితేంద్రియ! వినఁగ నాకు వేడుక పుట్టెన్.

49

తా ॥ "ఆ గజరాజవరదుని మాయాగుణాలు ఎంతటి శక్తిమంతులనైనా సమ్మోహింపజేస్తాయి. ఆ మాయామహిమ త్రిలోకపావనం కదా! మీరు ఇంద్రియజయాన్ని సాధించి, భగవత్తత్త్వాన్ని తెలుసుకొన్న మహాత్ములు. మంచివారి మనస్సులను రంజింపజేసే ఆ గుణగణాలను వినాలని నాకు వేడుకగా ఉంది."

వ. అనిన విని యంతరిక్షుం డను ఋషి శ్రేష్ఠుం డిట్లనియె.

50

తా ॥ అని ప్రార్థింపగా విని, అంతరిక్షుడనే ఋషిశ్రేష్ఠుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు:

క. పరమబ్రహ్మ మనంగాఁ, బరతత్త్వ మనంగఁ బరమపద మనఁగను నీ
శ్వరుఁ డనఁ గృష్ణుఁ డన జగ, ద్భరితుఁడు నారాయణుండు దా వెలుఁగొందున్.

51

తా ॥ "పరబ్రహ్మమంటేనూ, పరతత్త్వమంటేనూ, పరమపదమంటేనూ, ఈశ్వరుడంటేనూ, కృష్ణుడంటేనూ స్వప్రకాశరూపంలో ఈ విశ్వమంతటా నిండివున్నవాడు నారాయణుడొక్కడే.

పరబ్రహ్మము = నిర్గుణము, నిరుపాధికము అయిన బ్రహ్మము; కార్యకారణ (క్షరాక్షర)ముల కంటే విలక్షణము, స్వాభావికముగా నిత్యము, సత్యము, శుద్ధము, బుద్ధము,

ముక్తము, కేవలము, అఖండము అయిన సద్వస్తువు.

పరతత్త్వము = ప్రధానము లేక ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పృథివ్యప్తేజోవాయ్వాకాశములనే పంచభూతములు, జ్ఞానేంద్రియపంచకం, కర్మేంద్రియపంచకం, పంచప్రాణములు, అంతఃకరణము, పురుషుడు అనే పంచవింశతి తత్త్వాలకు అధిష్ఠాత.

పరమపదము = సర్వశ్రేష్ఠమైన స్థానం.

ఈశ్వరుడు = మాయచే ఉపహితమైన చైతన్యం.

వ. అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మంబునందుఁ దనకు విపర్యయంబుగా జననం బయిన జ్ఞానంబె విష్ణుమాయ యనంబడుఁ; బరమేశ్వరుఁ డట్టి మాయచేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు; నింద్రియార్థ భ్రమణంబు సేసెడు దుర్మతులకు సుషుప్త్యాద్యవస్థలు వరుసన కలుగుటంజేసి పరమేశ్వరునిం బొందరామియను నాలుగవ యవస్థయుఁ గలుగు; స్వప్నంబునందు గ్రాహ్యగ్రాహక గ్రహణంబులను త్రివిధభేదంబు గలిగియుండు, నీ చందంబున నవిద్యాంధకార సంవృతం బై మూఁడు విధంబులఁ బర్యవసించు మనోరథంబు స్వప్నావస్థయం దణంగిన క్రియఁ ద్రివిధం బగు మాయయు నాత్మయందు లీనంబగుఁ; బరమేశ్వరుండు మొదలం బృథివ్యాది మహాభూతమయం బయిన సృష్టిని గలుగఁజేసి యందుఁ బంచభూతాత్మకం బయిన యాత్మ కేకాదశేంద్రియంబులచేత భేదంబు పుట్టించుచు, గుణంబుల చేత గుణంబు లంగీకరించుచు, నాత్మ యందుఁ బ్రద్యోతితగుణంబుల వలన గుణానుభవంబుఁ జేయుచు నున్నవాఁడై, సృష్టి నాత్మీయంబుగాఁ భావించు; దేహి కర్మమూలంబున నైమిత్తిక కర్మంబుల నాచరించుచుఁ దత్ఫలం బంగీకరించి దుఃఖైకవశుండై వర్తించుఁ; బెక్కు దుః ఖంబులం బడిన యా దేహి కర్మఫలప్రాప్తుం డగుచు భూత సంప్లవపర్యంతంబు పరవశుండై జన్మమరణంబులం

బొరలుచుండు; నంత్యకాలం బాసన్నం బయిన ద్రవ్యగుణస్వరూపం బగు జగంబు ననాదినిధనం బగు కాలంబు ప్రకృతిం బొందించు; నటమీఁద శతవర్షంబులు వర్షంబు లేమిచేత నత్యుగ్రహలోక లోచనుతేజంబున సకలలోకంబులు దహింపఁ బడు; నంత నధోలోకంబుననుండి సంకర్షణ ముఖజనితానలం బూర్ధ్వ శిఖాజాలంబుల వాయు సహాయంబై దిక్కులయం దెల్లఁ బ్రవర్తించు; నటమీఁద సంవర్తక వలాహక గణంబులు నూఱు హాయనంబులు సలిలధారాపాతంబుగా వర్షంబు గురియు; నందు విరాడ్రూపంబు లీనం బగు; నంత నీశ్వరుం డింధనాగ్ని చందంబున నవ్యక్తంబుఁ బ్రవేశించు; తదనంతరంబ ధరణీమండలంబు వాయుహృతగంధంబై కబంధరూపంబుఁ దాల్చు; నా జలంబు హృతరసంబై తేజో రూపంబు నొందు; నా తేజంబు తమోనిరస్తంబై వాయువం దడంగు; నా గంధవహుండు స్పర్శవిరహితుండయి యాకాశంబునందు సంక్రమించు; నా విష్ణుపదంబును విగత శబ్దగుణంబు గలదియై యాత్మయం దడంగు; నింద్రియంబులును మనంబును బుద్ధియు వికారంబులతోడ నహంకారంబుఁ బ్రవేశించు; నా యహంకారంబును స్వగుణయుక్తంబై పరమాత్మునిం జేరు; నిట్లు త్రివర్ణాత్మకయై సర్గస్థితి లయకారిణి యగు మాయ యిట్టిది యని తత్స్వరూప మాహాత్మ్యంబులు వివరించిన నరపాలుం డిట్లనియె.

52

తా ॥ ఆ నారాయణుడు శుద్ధసత్త్వస్వరూపుడై మనోబుద్ధ్యాదులకు అగోచరుడై ప్రత్యగాత్మగా ఉన్నప్పుడు, శబ్దప్రవృత్తికి హేతువులైన జాతి గుణ క్రియాదులకు వ్యక్తావస్థ ఉండదు. ఆ అవ్యక్తావస్థలో త్రిగుణాలకు ప్రమేయం ఉండదు. అందుచేత ఆయనను నిర్గుణుడని అంటారు. అవ్యక్తనిర్గుణము యొక్క ఏ శక్తిచేత ఆ పరబ్రహ్మాత్మకుడు సర్వభూతములకు కారణమాత్రుడై, తన అంశవల్ల తనయందే కలిగిన జీవులు చరాచర విషయభోగాలను, ఆ విషయభోగాలకు అతీతమైన మోక్షావస్థను అనుభవించడానికి పృథివ్యాదిమహాభూతముల ద్వారా ప్రజాపతులు, దేవతలు మొదలైన శరీరాలను సృష్టించాడో, ఆ పరమేశ్వరునికి

విపర్యయంగా దేహాదులయందు ఆత్మాభిమానరూపమైన జ్ఞానానికే "మాయ" అని పేరు. అదే విష్ణుమాయ.

స్థూలము సూక్ష్మము కారణము అని దేహము మూడు విధాలు. స్థూలదేహమంటే ఇరవైఅయిదు తత్త్వాలు స్వరూపంగా కలిగినది అని అర్థం. అందులో మనోబుద్ధులు రెండు. సూక్ష్మ జ్ఞానేంద్రియాలు అయిదు, సూక్ష్మ కర్మేంద్రియాలు అయిదు, ప్రాణవాయువులు అయిదు – మొత్తం పదిహేడు తత్త్వాలకు సూక్ష్మశరీరం అనిపేరు. ఈ సూక్ష్మశరీరం అపంచీకృతమైనది. సూక్ష్మశరీరం కంటికి కనబడదు. దీనికే లింగశరీరమనిపేరు. జీవునికి అనాదిగా కలిగివున్న జ్ఞానమే కారణశరీరం. స్థూల సూక్ష్మ శరీరాలు కలగడానికి కారణం ఇదే.

ఈ దేహత్రయానికి అతీతమైనది ఆత్మ. ఆత్మానుభవం పొందటమే ముక్తి అని వేదాంతుల సిద్ధాంతం.

శరీరానికి ఆది లేదు. మూలమూ లేదు. కర్మలకు సాధనం అదే.

దేహమున్నంతవరకే కర్మలుంటాయి. కర్మ మిగిలినంతవరకే దేహం ఉంటుంది. గాఢనిద్ర (సుషుప్తి)లో ఉన్నప్పుడు స్థూల సూక్ష్మ భోగప్రదాలను గుర్తించే తెలివి లయించిపోవటం వల్ల కర్మలు లేవు. కర్మలను గ్రహించే ఎఱుక లీనమైనప్పుడు దేహం లేదు. "సుషుప్తికాలే సకలే విలీనే" అని పౌరాణికులంటారు. సుషుప్తికాలంలో సకలం లయించిపోతుందని భావం. నిద్రావస్థలో ఉన్నప్పుడు ఈశ్వరరూపి అయిన ఆత్మే నామరూపరహితంగా ఉండటం జరుగుతున్నది. ఆ ఈశ్వరుని యందే సకలమూ సంభవించి, లయమవుతున్నది. సుషుప్తిలో తెలివి లేకపోవటమూ, మెలకువ వచ్చినపుడు తిరిగి రావటమూ మన అనుభవంలోని సంగతే.

ఆ విధంగా పరమేశ్వరుడు తన మాయచేత పంచీకృతమైన పృథివ్యాది (స్థూల) భూతములతో చరాచర జగత్తును నిర్మించి, ఆ దేహాది శరీరాలలోనికి అంతర్యామి రూపంతో ప్రవేశించి, (తనను ఏకవిధంగానూ – అంటే అంతఃకరణాభిమాని రూపంతో ఏకవిధంగానూ,

జ్ఞానేంద్రియ కర్మేంద్రియాభిమానిరూపంతో దశవిధంగానూ విభజించి, విషయసమూహాలను అనుభవిస్తూ) తాను సాక్షిమాత్రుడై, ఆ దేహధారుల సుఖదుఃఖానుభవాల పట్ల ఎటువంటి ఆసక్తీ లేక నిశ్చింతగా ఉంటాడు.

దేహాభిమానం పొందిన జీవుడు అంతర్యామిపురుషుని చైతన్యబలం మూలాన అనుప్రాణితాలైన ఇంద్రియాల ద్వారా విషయముల యందు భోగానుభవాన్ని పొంది, ఆ ఇంద్రియార్థాలలోనే పరిభ్రమిస్తూ ఉంటాడు. సంకల్పవికల్పాత్మకమైన అతని మనస్సు స్వప్నసుషుప్త్యాద్యవస్థలకు లోనవుతుంది. ఆ అవస్థలకే సవికల్పసమాధి, నిర్వికల్పసమాధి అని పేర్లు. జీవాత్మ పరమాత్మల సమతావస్థ సిద్ధింపని స్థితి అజ్ఞానావరణం వల్ల కలుగుతుంది. మనోధర్మాలు కారణంగా సమాధిభంగం ఏర్పడి జీవుడు పరమేశ్వరుని పొందలేక అవస్థలకు లోనౌతాడు.

మనోధర్మం వల్లనే కర్త – కర్మ – క్రియ; గ్రాహకుడు – గ్రాహ్యము – గ్రహణము; భోక్త – భోగ్యము – భోగము; జ్ఞాత – జ్ఞేయము – జ్ఞానము మొదలైన త్రిపుటి ఏర్పడుతున్నది. మనోజయం సిద్ధించినపుడు త్రిపుటిభావం కూడా లయించిపోతుంది. అంతవరకు మనస్సు అవిద్య అనే చీకటితో కప్పబడి ఉంటుంది. మనోజయం సిద్ధించినపుడు మాయ స్వస్థత లేనిదై ఆత్మమునందు లీనమవుతుంది.

ఆదిపురుషుడు పృథివ్యాది మహాభూతమయమైన సృష్టిని కలుగజేసి పంచధాతువులతో కూడిన ఉపాధులలోనికి అంతర్యామి రూపంలో ప్రవేశించి, అంతఃకరణము, దశేంద్రియాలు అనే పదకొండింటితో విభాగించి, సత్త్వాది తన గుణాలతో గుణాత్మకుడై విషయసమూహాన్ని అనుభవిస్తుంటాడు.

ఆ విధంగా దేహాభిమానం వహించిన జీవుడు కర్మేంద్రియాల మూలకంగా భావికాలంలో దేహాలను ధరించేందుకు తగిన వాసనలతో కూడిన కర్మలను ఆచరిస్తూ, ఆ కర్మఫలాలను

అనుభవిస్తూ, దుఃఖమయమైన జీవితాన్ని గడుపుతూ, భౌతికప్రళయం వచ్చేంత వరకు జన్మమరణాలను పొందుతూ సంసారసముద్రంలో ఈదులాడక తప్పదు.

అప్పుడు భూతసృష్టికి అంత్యకాలం సమీపిస్తుంది. పృథివి, జలములు, తేజస్సు, వాయువు, ఆకాశము ప్రళయాన్ని పొందే తరుణం అది. ఆద్యంతాలు లేని మహాకాలం స్థూలసూక్ష్మాత్మకమైన కార్యజాతాన్ని ప్రకృతి నుంచి తనలోనికి ఆకర్షిస్తుంది. భూతసంప్లవం జరుగుతుంది. నూరేండ్లపాటు వర్షాలు లేకుండాపోయేసరికి సూర్యుని మహోగ్రమైన తాపం మరింత తీవ్రమవుతుంది. లోకాలన్నీ వేడెక్కిపోతాయి. మంటలు రగుల్కొని లోకాలను దహించివేస్తుంటాయి. పధ్నాలుగు భువనాలకు అట్టడుగున ఉన్న పాతాళంలో సంకర్షణుడైన ఆదిశేషుని వేయి ముఖాల నుంచి ఘోరమైన అగ్నిజ్వాలలుదయించి వాయువు తోడ్పాటు వల్ల ఆ అగ్ని శిఖలు పైపైకి వ్యాపిస్తాయి.

అప్పుడు సంవర్తకములనే పేరుగల మేఘగణాలు నూరు సంవత్సరాల కాలం ధారాపాతంగా నీటిని వర్షిస్తాయి. ఆ జలరాశిలో బ్రహ్మాండం మునిగిపోతుంది.

ఆ విధంగా బ్రహ్మాండమనే తన శరీరం లయమయేసరికి ఈశ్వరుడు (విరాట్పురుషుడైన హిరణ్యగర్భుడు) జ్వలించేందుకు ఇంధనం లేని అగ్ని చందాన అవ్యక్తము (అంటే తన కారణశరీరం) లోనికి ప్రవేశిస్తాడు.

ఆ తర్వాత వాయువు పృథివి నుంచి గంధగుణాన్ని హరించివేస్తుంది. పృథివి జలరాశిలో లయమైపోతుంది. అప్పుడు వాయువు జలములలోని రసగుణాన్ని హరించివేయగా జలము తేజోరూపాన్ని పొందుతుంది. ఆ తేజస్సు యొక్క రూపాన్ని అంధకారం హరించివేస్తుంది. తేజస్సు వాయువులో అణగిపోతుంది.

అప్పుడు ఆకాశం వాయువు యొక్క స్పర్శగుణాన్ని తనలోకి ఆకర్షించుకొంటుంది. వాయువు ఆ ఆకాశంలో విలీనమైపోతుంది. ఆకాశం శబ్దగుణం లేనందువల్ల

తామసాహంకారం లోనికి అణగిపోతుంది. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వైకారికులైన దేవతలతో కలిసి తమకు కారణరూపమైన రాజస సాత్త్వికాహంకారంలోకి ప్రవేశిస్తాయి. ఆ అహంకారం తన కార్యత్రయంతోపాటు మహత్తత్త్వంలోకి చేరుకొంటుంది. మహత్తత్త్వం ప్రకృతిలోనికి, ప్రకృతి బ్రహ్మములోకీ లీనమైపోతాయి. ఈ విధంగా సమస్తం పరమాత్మలో అంతర్భవిస్తుంది.

ఇదీ భగవానుని మాయ అంటే!

అని అంతరిక్షుడు విదేహ రాజు నిమికి లోహితవర్ణ (కెంపు వన్నె), శుక్ల (తెలుపు) కృష్ణ (నలుపు) వర్ణాలతోనూ, సృష్టిస్థితిలయకారకం అయిన తన శక్తితోనూ విరాజిల్లే భగవానుని మాయ ఎంత గొప్పదో, ఎంత శక్తి కలిగినదో వివరించి చెప్పాడు.

ఉ. 'జ్ఞానవిహీనులైన నరసంఘముఁ గానఁగరాని మాయఁ దా
లోన నడంచి యెట్లు హరిలోకముఁ జెందుదు రంతయుం దగన్
భూనుత! సత్యవాక్యగుణభూషణ! యిక్కథ వేడ్కతోడుతన్
బూనికఁ జెప్పు మన్నను బ్రబుద్ధుఁడు నిట్లను గారవంబునన్.

తా ॥ అప్పుడు రాజు, "ఆత్మ స్వరూపానుభవం కలుగనంత వరకు జ్ఞానోదయం కాదు. జ్ఞానవిహీనులైన మానవులు దాటశక్యం కాని మాయను అణచి, భగవంతుని సన్నిధికి చేరుకోవాలంటే సాధ్యమేనా? జగమంతా మెచ్చుకొనే బ్రహ్మవేత్తలు మీరు. మీ వాక్కు అమోఘం. దయతో నా సందేహాన్ని తీర్చండి" అని కోరాడు.

స్థూలదేహాన్ని ఆత్మవస్తువని భ్రమించే మానవులకు, మోహబద్ధులై ఉన్నవాళ్ళకు ఈశ్వరచైతన్యం కలుగదని, ఆ చైతన్యం కలిగితే విష్ణుమాయను దాటవచ్చునని, అయితే ఆ చైతన్యం ఎలా కలుగుతుందని రాజు ప్రశ్న. ఆ సంగతి గ్రహించి, నవయోగులలో ప్రబుద్ధుడు ఈ విధంగా అన్నాడు.

## ప్రబుద్ధ, పిప్పలాయనులు చేసిన పరమార్థ ఉపదేశము

వ. సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు క్షీణంబు నొంద, దేహకళత్రమిత్ర భ్రాతృమమత్వ పాశబద్ధులై విడివడు నుపాయంబు గానక సంసారాంధకారమగ్ను లయి గతాగత కాలంబుల నెఱుంగక దివాంధంబులగు జంతు జాలంబుల భంగి జన్మజరారోగ విపత్తి మరణంబు లందియు, శరీరంబ మే లనుచుఁ బ్రమోద మోహమదిరాపానమత్తులై విషయాసక్తతం జిక్కి తమ్ముఁ దా మెఱుంగక యుండి విరక్తి మార్గంబు దెలియక వర్తించు మూఢులగు జనంబుల పొంతలఁ బోవక కేవలనారాయణ భక్తి భావంబు గల సద్గురుం బ్రతిదినంబును భజియించి; సాత్త్వికంబు, భూత దయయును, హరికథామృతపానంబును, బ్రహ్మచర్యవ్రతంబును, విషయంబుల మనంబు సేరకుండుటయు, సాధు సంగంబును, సజ్జన మైత్రియు, వినయసంపత్తియు, శుచిత్వంబును, తపంబును, క్షమము, మౌన వ్రతంబును, వేదశాస్త్రాధ్యయన తదర్థానుష్ఠానంబులును, నహింసయు, సుఖదుఃఖాది ద్వంద్వ సహిష్ణుతయు, నీశ్వరుని సర్వగతునింగా భావించుటయు, ముముక్షుత్వంబును, జనసంగ వర్జనంబును, వల్కలాది ధారణంబును, యదృచ్ఛాలాభ సంతుష్టియు, వేదాంతశాస్త్రార్థ జిజ్ఞాసయును, దేవతాంతర నిందావర్జనంబును, గరణత్రయశిక్షణంబును, సత్యవాక్యతయు, శమదమాది గుణవిశిష్టత్వంబును, గృహారామక్షేత్ర కళత్ర పుత్త్ర విత్తాదుల హరి కర్పణంబు సేయుటయు, నితర దర్శన వర్జనంబు సేయుటయును భాగవతోత్తమధర్మంబు, లని చెప్పి యిట్లనియె.

54

తా ॥ "ఆయువు శాశ్వతం కాదు. రోజురోజుకూ క్షీణించటమే దాని ప్రవృత్తి. మాయలో చిక్కుకున్నవారు స్థూలదేహమే ఆత్మ అని భ్రమించి, ఆ దేహాభిమానం వల్ల మమకారమనే పాశానికి కట్టువడి, దేహసంబంధులై ఏర్పడిన భార్య, స్నేహితులు, అన్నదమ్ములు తనవారు; దేహసంబంధమైనవన్నీ తనవి అని వ్యామోహాన్ని పొందుతారు. ఆ వ్యామోహంలో నుంచి

బయటపడే దారీతెన్నూ కనబడదు. సంసారమనే ఆ చీకటిలో మునిగి, జరిగినదంతా మరచిపోయి, జరుగనున్నదేమిటో తెలియరాక పగటి వెలుగుకు తట్టుకోలేని గుడ్లగూబలలా కొట్టుమిట్టుకులాడుతారు. చావుపుట్టుకలు, ఆధివ్యాధులు ఎన్ని కలిగినా ఈ శరీరం వల్లనే కలుగుతున్నవని గ్రహింపలేకపోగా ఇంకా ఇంకా మరిన్ని జన్మలలో మరింత సుఖాన్ని పొందాలని తహతహలాడుతుంటారు. క్షణికసుఖాలకోసం వెంపరలాడతారు. ఆ సుఖాలకోసం పడరానిపాట్లు పడతారు. సంతోషమనే ఆ మత్తులో పడి, మళ్ళీ మళ్ళీ విషయవాసనలలో తగులుకొంటారు. తమను తాము తెలుసుకొనలేక, వైరాగ్యాన్ని సాధించటమెలాగో ఏమిటో అర్థంకాక కర్తవ్యమూఢులై ఉంటారు.

నారాయణ స్వరూపజ్ఞానాన్ని పొందగోరినవారు అటువంటి అజ్ఞానులకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. నారాయణ భక్తిపరుడై ఎటువంటి విషయవిమోహాలు లేని సద్గురువును ఆశ్రయించి, ఆయన సన్నిధిలో ఉంటూ భజించుకొంటూ మనస్సును సన్మార్గానికి మళ్ళించుకోవాలి. సత్త్వగుణాన్ని అలవరచుకోవాలి. సకల భూతములయందు దయగలిగి మెలగటం నేర్చుకోవాలి. శ్రీహరియొక్క కథలను వింటూ ఉంటే క్రమంగా అందులోని తీయదనం అనుభవంలోకి వస్తుంది. ఆ కథామృతాన్ని ఆస్వాదించటం వల్ల మేలు కలుగుతుంది.

బ్రహ్మచర్యాన్ని వ్రతంగా పాటించాలి. ఇంద్రియవిషయాల పట్ల మనస్సు ఆకర్షింపబడుతున్నదని గ్రహించి, ప్రయత్న పూర్వకంగా దానిని అదుపులోకి తెచ్చుకోవాలి.

సాధువుల దగ్గరుంటే వారి ప్రభావం వల్ల మంచి సంగతులు తెలుస్తాయి. మంచివారితో మైత్రి చేయాలి. గర్వగంధం అంటనీయక వినయంగా ఉండాలి. శుచిగా ఉండాలి. అంటే అంతశ్శౌచాన్ని, బాహ్యశౌచాన్ని పాటించాలి. క్షమాగుణం అవసరం. మౌనవ్రతం వలన వాక్కును నియంత్రించాలి. సకలధర్మాలకు మూలకందాలైన వేదాలను, శాస్త్రాలను అభ్యసించి ఆ అభ్యసించినవాటి అర్థాలను సమగ్రంగా తెలుసుకొని, ఆ తెలుసుకొన్నదానిని ఆచరణలో పెట్టాలి. అహింసను అలవరచుకొంటే మనస్సు పరిశుద్ధమవుతుంది. శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలను

సహించటం నేర్చుకొంటే స్థితప్రజ్ఞత కలుగుతుంది. ఇంద్రియప్రకోపం అణగారిపోతుంది. సచ్చిత్స్వరూపంతో ఈశ్వరుడు ఎల్లెడల ఉన్నాడని గుర్తుంచుకొంటే పాపసంకల్పాలన్నీ పటాపంచలవుతాయి.

ముముక్షువు మోక్షాన్ని పొందితీరాలి అన్న ప్రబలమైన కోరికను కలిగి, క్రమంగా అందుకు ఆవశ్యకమైన సాధనసంపత్తిని అలవరచుకోవాలి. నెమ్మది నెమ్మదిగా జనుల సాంగత్యాన్ని విడిచి ఏకాంతవాసం చేయాలి. ఆడంబరాలను త్యజించి, నారచీరలు ధరించాలి. లేనివాటికోసం ఎగబడటం మాని, ఎప్పటికి ఏది దొరికితే దానితో సంతోషించటం అవసరం. వేదసారములైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, గీతాశాస్త్రముల యందు అర్థజిజ్ఞాస కలిగి, ఆ నేర్చుకొన్న అర్థాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి. తాను ఆరాధిస్తున్న భగవన్మార్గమే ఉపాదేయమనీ, ఇతరులు కొలిచే దేవతల వల్ల ప్రయోజనం ఉండదనీ అన్యదేవతా నిందనూ, అన్యభక్తుల ఆరాధనాపద్ధతులను విమర్శించడాన్నీ మానుకోవాలి. క్రమశిక్షణ కలిగి, మనస్సు వాక్కు కర్మము అనే త్రికరణాలను పవిత్రంగా ఉంచుకోవాలి. ఎల్లవేళల సత్యనిష్ఠను పాటించి, సత్ప్రవర్తనను అలవాటు చేసుకోవాలి. శాంతగుణాన్ని లక్ష్యంగా కలిగి ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించుకోవాలి.

ఇల్లూవాకిలి, పాడిపంటలు, పైరుపొలాలు, భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు ఏవీ తనవి కావని, తన వెంట రావని గ్రహించి, సర్వం శ్రీహరికి సమర్పించి, విషయముల పట్ల అనాసక్తులై భగవన్మయంగా జీవించాలి. స్వధర్మాన్ని పాటించాలి. ఇతర ధర్మములు ఎంత ఆకర్షణీయంగా అనిపించినా పారమార్థికాలు కావని గ్రహించి, అందుకు దూరంగా ఉండాలి.

ఇవన్నీ సంసారమునందు వ్యామోహాన్ని విడిచి మోక్షమార్గాన్ని అవలంబించిన భాగవతోత్తములకు వేదవిహితములైన ధర్మాలు."

అని చెప్పి, ఆయన ఇంకా ఇలా అన్నాడు.

మనశ్చాంచల్యాన్ని ప్రాణాయామం చేత, వాక్చాంచల్యాన్ని మౌనం చేత, కర్మచాంచల్యాన్ని వాంఛానియతి చేత నియమించటం, సత్యసంధత, అంతఃకరణ నిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం, భగవంతుని అవతారాలను, గుణకర్మలను వినటం, సంకీర్తించటం, ధ్యానించటం, అన్ని కర్మలను భగవత్ప్రీతికై ఆచరించటం, యజ్ఞ దాన జప తపః కర్మములను ఎన్నడు స్వార్థానికై తలపెట్టక ఈశ్వరార్పణబుద్ధితో చేయటం అన్నవి ముఖ్యం. అంతే కాదు. ఏదేది తనకు ప్రియమవుతుందో దానినల్లా భగవదర్పణ చేయాలి. చరాచర భూతకోటికి భాగవత సౌహృదంతో పరిచర్యచేయాలి. పెద్దల సేవ అత్యంత ముఖ్యం. భగవంతుని లీలలను ఒకరికొకరు చెప్పుకోవటం అలవాటు కావాలి. ఈ విధంగా చేస్తూ త్రికరణశుద్ధిగా భగవంతుణ్ణి స్మరిస్తూ ఉంటే భగవదనుగ్రహం కలుగుతుంది. ఎప్పుడయితే భగవదనుగ్రహం కలిగిందో అప్పుడే మాయ తనంతట తానే తొలగిపోతుంది.

క. 'హరిదాసుల మిత్రత్వము, మురరిపుకథ లెన్నికొనుచు మోదముతోడన్
భరితాశ్రు పులకితుండై, పురుషుఁడు హరిమాయ గెల్చు భూపవరేణ్యా!'



తా ॥ రాజేంద్రా! భగవద్భక్తులు ఎక్కడున్నారో తెలిసికొని, వారి వద్దకు వెళ్ళి, వారితో చెలిమి చేయాలి. వారితో కలిసి భగవంతుని మాహాత్మ్యాన్ని తెలిపే కథల అంతరార్థాలను చర్చిస్తూ, ఆ కథలను చెప్పుకొంటున్నపుడు అమితసంతోషాన్ని పొందాలి. అట్టివారు భగవంతుని లీలలను వింటున్నప్పుడు పులకితగాత్రులై, బాష్పధారాపూర్ణనేత్రులై తమ అనన్యభక్తి ఫలంగా దురత్యయమైన విష్ణుమాయను అవలీలగా జయింపగలుగుతారు."

భగవన్నామం చెవిని సోకగానే ఎవరికి పులకింత కలుగుతుందో, ఎవరి కళ్ళ నుండి ఆనందబాష్పాలు ప్రవహిస్తాయో – అలాంటి వ్యక్తికి అదే తుదిజన్మ.

–శ్రీరామకృష్ణ పరమహంస

వ. అనిన రాజేంద్రుండు వారల కిట్లనియె. 'భాగవతులారా! సకల లోకనాయకుం డగు నారాయణుం డనంబరఁగిన పరమాత్ముని ప్రభావంబు వినవలతు; నానతిం డనినఁ బిప్పలాయనుం డిట్లనియె.

56

తా ॥ అనగానే నిమి చక్రవర్తి ఆ నవయోగులను "భాగవతోత్తములారా! సకలలోకాలకు అధినాయకుడైన నారాయణుడన్న పరమాత్మ తత్త్వాన్ని, ప్రభావాన్ని వినాలని నాకెంతో కుతూహలంగా ఉంది, చెప్పరూ?" అని అడిగాడు.

భగవన్మాహాత్మ్యాన్ని వివరించాలంటే భగవంతుని పుణ్యచరిత్రను వినిపించటమొక్కటే పరమోపాయమని తెలిసిన పిప్పలాయనుడిలా అన్నాడు:

సీ. నరవర! విను జగన్నాథుని చారిత్ర మెఱిఁగింతు నీమది కింపు మిగుల
లసదుద్భవస్థితిలయకారణం బయి దేహేంద్రియాదులఁ దిరము గాఁగఁ
జొనుపు నెప్పుడు పరం జ్యోతిస్స్వరూపంబు జ్వాలల ననలుండుఁ జనని పగిది
నింద్రియంబులు నాత్మ నెనయవు శబ్దంబు పొరయక సుషిరంబుఁ బొందు సత్య

తే. మనఁగ సత్త్వరజస్త మోమయగుణంబు, మహదహంకారరూపమై మహిమ వెలయు
చేతనత్వంబు గలదేని జీవ మందు, రిదియ సదసత్స్వరూపమై యెన్నఁబడును.

57

తా ॥ "రాజేంద్రా! నీ మనస్సుకు ఇంపు కలిగే శ్రీ జగన్నాథుని పుణ్యకథను వినిపిస్తాను, విను. నారాయణుడు ఈ జగత్తు యొక్క సృష్టిస్థితిలయాలకు కారణస్వరూపుడు. మరి ఆయనకో? ఆయనకంటూ కారణముంటుందా? ఆయనే బ్రహ్మస్వరూపుడైన పరమాత్మ తత్త్వం. ఈ దేహాలు, ఈ ఇంద్రియాలు, ప్రాణములు, హృదయం ఎవరిచే శక్తిని పొంది చైతన్యవంతములైనవో ఆ శక్తికి పరమాత్ముడని పేరు.

తననుంచి పుట్టిన నిప్పురవ్వలు అగ్నిని ప్రకాశింపజేయనూ లేవు, అగ్నిని దహింపనూ లేవు. అలాగే పరమాత్మ వస్తువు నుంచి పుట్టిన మనస్సు, వాక్కు, కళ్ళు, బుద్ధి, ప్రాణములు, ఇంద్రియాలు ఆ పరమాత్మతత్త్వాన్ని వెల్లడి చేయలేవు. ఆత్మవస్తుజ్ఞానానికి ప్రమాణమైన శబ్దము అంటే వేదము (బోధకత్వధర్మాన్ని కలిగి ఉన్నప్పటికీ) కూడా ఆ పరమాత్మ తత్త్వాన్ని తానై ప్రకాశింపజేయలేదు.

ఆ బ్రహ్మవస్తువు సత్య జ్ఞానాత్మకమైనది. అది మొదట తాను తప్ప వేరొకటి లేని (అద్వితీయమైన) సద్వస్తువు. సృష్టిని బోధపరిచేందుకు దానిని మూడు గుణాలతో కూడిన ప్రకృతి అన్నారు. (ఈ త్రిగుణావస్థలో ఉన్నప్పుడు దానిని ప్రధానము అని; క్రియాశక్తితో కలిసి ఉన్నప్పుడు సూత్రము అని) జీవునికి ఉపాధిరూపంలో చైతన్యావస్థను పొంది ఉన్నప్పుడు అహంకారము అని అంటారు. ఆ బ్రహ్మముయొక్క శక్తి "ఇంత" అని చెప్పలేనంత గొప్పది. కనుపించేవీ, కనుపించనివీ, కార్యములైనవీ, కారణమైనవీ, సత్యమైనవీ, సత్యము కానివీ అన్నీ బ్రహ్మమే కనుక అది సదసత్స్వరూపం.

వ. దీనికిం బెక్కైనది పరమాత్మగా నెఱింగి కమలసంభవాదులు నుతియింతు; రిట్టి పరమాత్మ స్థావరజంగమంబుల నధిష్ఠించి వృద్ధి క్షయంబులం బొందక నిమిత్తమాత్రంబునం దరులతాదులందు జీవంబు లేక తదంతరస్థుండై వర్తించు; నంత సర్వేంద్రియావృతం బైన యాకారంబు నష్టంబైన మనంబునుం బాసి శ్రుతివిరహితుండై తిరుగుచుండు; నిర్మల జ్ఞానదృష్టి గలవానికి భానుప్రభాజాలంబు దోఁచిన క్రియను, సుజ్ఞానవంతుడు హరిభక్తి చేత గుణకర్మార్థంబులైన చిత్తదోషంబులు భంజించి భగవత్పదనంబు సేరు' ననిన విని రా జిట్లనియె.



తా ॥ బ్రహ్మము సదసత్తులే కాక, ఈ సదసత్తులన్నింటికీ పరమైనది. పరమైన ఈ బ్రహ్మమునే పరమాత్మగా భావించి, కమలసంభవాదులు దీని మహామహిమను

సన్నుతిస్తుంటారు.

ఇట్టి పరమాత్మ స్థావరములు, జంగమములు (జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు అని నాలుగు విధాల కదలిక గలవీ, కదలిక లేనివీ) అయిన ప్రాణుల యొక్క శరీరాలలో ప్రాణస్వరూపుడై, నిర్వికారుడై అంతర్యామిరూపుడై ఉంటాడు. వికారములకు (అంటే పరిణామములకు) హేతువైన శరీరమనే ఉపాధి లేనందువల్ల ఆత్మకు వృద్ధి, క్షయములు రెండూ ఉండవు. నిమిత్తమాత్రుడైన పరమాత్మ ప్రాణరూపంలో అంతర్యామిగా ఉన్నప్పుడు తరులతాదులు చైతన్యవంతముల వలె భాసిస్తాయి. ఉపాధి లేనప్పుడు ఇంద్రియాలు, అహంకారము లీనమైపోగా పరమాత్మ నిర్వకారుడై ఉంటాడు.

స్వచ్ఛమైన దృష్టి కలవారికి కన్నులకు సూర్యుని ప్రకాశం కానవచ్చినట్లు పరిశుద్ధమైన అంతః కరణలో జ్ఞానవంతులకు పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. శ్రీహరి యందు అనన్యమైన భక్తి గలవారు సత్త్వరజస్తమోగుణాల మూలాన, సుకృత దుష్కృతాల మూలాన ఏర్పడిన మాలిన్యాలన్నింటినీ క్షాళన చేసుకొని, పాపరహితులై భగవంతుని మందిరాన్ని చేరుకొంటారు.

క. 'పురుషుం డేయే కర్మము, పరువడిఁ గావించి పుణ్యపరుఁడై మనుఁ? దా
దురితములుఁ దొరఁగి మురరిపు, చరణయుగం బెట్లు సేరు? సన్మునివర్యా!'

59

తా ॥ దానికి విదేహరాజు ఇలా అన్నాడు – "ఓ మునివరేణ్యా! జీవుడు ఏయే కర్మలను చేసినట్లయితే పుణ్యవంతుడై ధన్యుడు కాగలుగుతాడు? చేసుకొన్న పాపాలన్నీ పటాపంచలై శ్రీమన్నారాయణుని పాదపద్మాలను చేరుకోగల భాగ్యం ఎన్నటికి కలుగుతుంది?"

## ఆవిర్హోత్ర, ద్రమీళుల భాషణ – నారాయణ ఋషి కథ

వ. అనిన విని యం దావిర్హోత్రుం డి ట్లనియెఁ; 'గర్మాకర్మ వికర్మ ప్రతిపాదకంబు లగు శ్రుతివాదంబులు లౌకికవర్జితంబు; లట్టి యామ్నాయంబులు సర్వేశ్వర స్వరూపంబులు గాన విద్వాంసులు నెఱుంగ లే; రవి కర్మాచారంబు లనంబడు; మోక్షంబు కొఱకు నారాయణ భజనంబు పరమపావనంబు; వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు వాంఛ సేయువార లనేక జన్మాంతరంబులం బడయుదురు; మోక్షంబు నపేక్షించువాఁడు విధి చోదిత మార్గంబున హరిం బూజింపవలయు; నట్టి పూజాప్రకారం బెట్లనినఁ, బవిత్రగాత్రుం డయి జనార్దను సన్నిధిం బూతచిత్తుండై, షోడశోపచారంబులఁ జక్రధరు నారాధించి, గంధపుష్ప ధూపదీప నైవేద్యంబులు సమర్పించి, సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, భక్తిభావనా విశేషుండగు నతండు హరిం జేరు' నని చెప్పిన విని విదేహుం డిట్లనియె; 'నీశ్వరుం డే యే కర్మంబుల నాచరించె, నంతయు నెఱిగింపు' మనినఁ ద్రమిళుం డిట్లనియె.

60

తా ॥ నైష్కర్మ్యానికి దారితీసే కర్మయోగాన్ని గురించి అడిగిన ప్రశ్నకు ఆవిర్హోత్రుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు:

"కర్మము (అంటే విహితకర్మను విధించిన విధంగా ఆచరించటం); అకర్మము (అంటే తనకు విహితమైన కర్మను విధ్యనుసారం అనుష్ఠించకపోవటం); వికర్మము (అంటే ఎట్టి పరిస్థితిలోనూ చేయరాదని నిషేధింపబడిన కర్మ) – అని కర్మములు మూడు విధాలు. ఈ మూడు విధాలైన కర్మములను ప్రతిపాదించేది ఒక్క వేదమే.

ఈ కర్మముల స్వరూపస్వభావాలను శ్రుతులలో చెప్పబడినదానిని బట్టి గ్రహించుకోవాలి. లౌకికములైన నిర్ణయాలను బట్టి శ్రుతిబోధను తిరస్కరించకూడదు. ఎందుకంటే వేదాలు అపౌరుషేయాలు. పరమేశ్వరుని యొక్క నిశ్వాసరూపాలు. విద్వాంసులు సైతం వాటి తత్త్వాన్ని

పూర్తిగా తెలుసుకొనలేక అవిద్యామోహాన్ని పొందుతారు. అటువంటివారికి కర్మనివృత్తి కోసం కర్మలను బోధించడాన్ని కర్మాచారములు అంటారు. అటువంటి కర్మాచారములను ఆచరించటం అవసరమే.

ఇంద్రియజయాన్ని సాధించినా వేదవిహితములైన కర్మలను ఆచరింపనివారు ఆ అధర్మాచరణం వల్ల మళ్ళీ సంసారచక్రంలో ప్రవేశించి జన్మమృత్యుపరంపరలో కొట్టుమిట్టుకలాడుతుంటారు. కర్మారంభాన్ని విడిచిపెట్టడం, కర్మఫలత్యాగం అన్నవి రెండూ తెలియక నైష్కర్మ్యసిద్ధిని సాధించలేనివారు అహంకార బంధనాలను విడగొట్టుకోవాలంటే శ్రీమన్నారాయణ భజన మొక్కటే శరణ్యం. వేదోక్తమార్గాన్నీ అనుష్ఠింపలేక, ఫలత్యాగాన్నీ అలవరచుకొనలేక కర్మాసక్తులైనవారు మోక్షాన్ని పొందలేరు. వారికి జన్మమృత్యుపరంపర తప్పదు.

అందువల్ల మోక్షాన్ని అపేక్షించేవారు విధిచోదితమైన మార్గాన్ని అనుసరించి భగవానుడైన హరిని పూజించాలి. ఆ పూజావిధానం ఏమిటి? అని అడుగుతావేమో, విను చెబుతాను.

ముందుగా కులాచారవిహితసంస్కారాలతో, స్నానసంధ్యాదులతో శరీరాన్ని పవిత్రీకరించుకోవాలి. అప్పుడు భగవంతుని విగ్రహం ముందు కూర్చొని, నిష్కల్మషచిత్తుడై మనస్సును ఎటువంటి వికారాలకు లోనుగానీయక ఏకాగ్రంగా నిలపాలి. పూజానైవేద్యాలకు తగిన ద్రవ్యాలను సమకూర్చుకొని భక్తిపూర్వకంగా (అంగన్యాస కరన్యాసాదుల ద్వారా రక్షాబంధనాదులను నిర్వహించి) ఆవాహనము, ఆసనము, పాద్యము అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము అనే పదహారు ఉపచారాలతో శ్రీహరిని ఆరాధించి, పూజాంతంలో మళ్ళీ గంధపుష్పధూపదీపనైవేద్యాలను సమర్పించి, సాష్టాంగ దండప్రణామాల నర్పించి, తదేక భక్తిభావనను మనస్సులో నింపుకొన్నవాడు ఆ పూజాఫలం వల్ల కర్మశేషం తీరిన

తర్వాత హరిని చేరుకొంటాడు." అని చెప్పాడు.

ఆ మాట విన్నంతనే విదేహ రాజుకు భగవానుని యొక్క కర్మల మాటేమిటి? అని సందేహం కలిగింది. ఆయన స్వచ్ఛందంగా ఎన్నో అవతారాలను ధరించాడు కదా! ఆ అవతారవేళలలో ఎన్ని కార్యాలనో ఆచరించాడు కదా! మరెన్నో చేయనున్నాడు కదా! అవన్నీ కర్మఫలసంబంధులు కావా? అని అడగదలిచాడు.

"పరమేశ్వరుని కర్మ కలాపాలను గురించి నాకు చెప్పండి" అన్నాడు.

ఆ ప్రశ్నకు ద్రమిళుడు సమాధానం చెప్పాడు.

క. తారల నెన్నఁగ వచ్చును; భూరేణుల లెక్కవెట్టఁ బోలును ధాత్రిన్; నారాయణగుణకథనము, లారయ వర్ణింపలేరు హరబ్రహ్మాదుల్.

61

తా ॥ "ఆకాశంలో నక్షత్రాలు ఎన్ని ఉన్నాయో ఎన్నవచ్చునేమో! నేలమీది ఇసుకరేణువులెన్నో లెక్కవేయటం సాధ్యమేమో! కాని, హరుడూ పరమేష్ఠీ మరెవరైనా సరే నారాయణుని లీలాగుణాలు పట్టుమని ఇన్నీ! అని ఎంత పరిశోధించినా వివరించి చెప్పలేరు.

వ. అట్లు గావున నాత్మసృష్టంబైన పంచభూతనికరంబును పురంబొనరించి, యందు నిజాంశంబునం బ్రవేశించి, సగుణనిష్ఠుండై నారాయణాభిధానంబు గల ఋషీశ్వరుండగు పరమేశ్వరుండు వెలుఁగొందె; నతని దశేంద్రియంబులచేఁ బాలితంబులైన దేహంబులు ధరించి, జగద్రక్షకత్వ సంహారకత్వాది గుణంబులు గలుగుటం జేసి గుణనిష్ఠుండయి రజస్సత్త్వ తమో గుణంబుల బ్రహ్మవిష్ణురుద్రమూర్తు లనంబరఁగి, త్రిగుణాత్మకుం డనంబడు నారాయణాఖ్యుని చరిత్రం బెఱింగించెద; నాకర్ణింపుము.

62

తా ॥ ఆదిదేవుడైన నారాయణుడు తన మాయచే సృష్టింపబడిన పంచభూతాలతో ఈ బ్రహ్మాండకోశమనే పురాన్ని నిర్మించి, అంతర్యామి రూపంలో అందులోకి సత్త్వరజస్తమస్సులనే గుణాలతో ప్రవేశించాడు. నరనారాయణులుగా అవతరించాడు. ఆ విరాట్‌స్వరూపుని పది ఇంద్రియాల నుంచి దేహధారులకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు పదీ కలిగాయి. జగత్కర్తృత్వం, జగద్రక్షకత్వం, జగత్సంహారం అనే శక్తులను కలిగిన ఆయన గుణనిష్ఠుడైనప్పుడు మొట్టమొదట తన రజోగుణం ద్వారా బ్రహ్మరూపాన్ని, తన సత్త్వగుణం ద్వారా విష్ణురూపాన్ని, తమోగుణం ద్వారా రుద్రరూపాన్ని ధరించాడు.

ఆ విధంగా త్రిగుణాత్మకుడైన నారాయాణాఖ్య ఋషి కథ చెబుతాను; విను.

క. ధర్మండు దక్షపుత్త్రిక, నిర్మలమతిఁ బెండ్లియాడి నెఱిఁ బుత్రుని స
త్కర్ముని నారాయణ ఋషి, నర్మిలిఁ గనె నతఁడు బదరికాశ్రమమందున్.

63

తా ॥ దక్ష ప్రజాపతి కుమార్తె మూర్తి. ఆమెను నిర్మలస్వభావుడైన ధర్ముడు పెండ్లిచేసుకొన్నాడు. ఆ దంపతులు బదరికాశ్రమంలో ఉండగా వారి ప్రేమఫలంగా నరనారాయణాంశలతో నారాయణుడు వారింట జన్మించాడు.

తే. అట్టి నారాయణాహ్వయుండైన మౌని, బదరికాశ్రమమందు నపారనిష్ఠఁ
దపముఁ గావింప బలభేది దలఁకి మదిని, మీనకేతను దివిజకామినులఁ జనిచె.

64

తా ॥ తన నరాంశతో కూడి ఆ నారాయణ ఋషి బదరికాశ్రమంలో గొప్ప నియమనిష్ఠలతో తపస్సుకు కూర్చున్నాడు. అది తన ఇంద్రపదవికి ముప్పు కాగలదని లోలోపలే భయపడి దేవేంద్రుడు దేవకాంతలను వెంటయిచ్చి తపోభంగం చేయండని మన్మథుణ్ణి పంపించాడు.

వ. వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయ వచ్చు నప్పు డవ్వనంబు సాల రసాల బిల్వ కదళీ ఖర్జూర జంబు జంబీర చందన పున్నాగ మందారాది వివిధ వృక్ష నిబిడంబును, పుష్పఫల భరిత శాఖావనమ్ర తరులతా బృందంబును, మాధవీ కుంజమంజరీ పుంజ మకరంద పానమత్త మధుకర నికర ఝుంకారరవ ముఖరిత హరిదంతరంబును, గనక కమల కహ్లార విలసత్సరో విహరమాణ చక్రవాక బక క్రౌంచ మరాళదంపతీ మండల మండితంబును, మృణాళ భోజనాసక్త సారసచయ చంచూపుట విపాటిత కమలముకుళ కేసర విసర వితత ప్రశస్త సరోవరంబునునై వెలయు నవ్వనంబున నిందువదన లందంద మందగమనంబులం జెందు ఘర్మజలబిందు బృందంబులు నఖాంతంబుల నోసరింపుచు డాయం జను నప్పుడు.

65

తా ॥ వారు ఋషుల తపస్సును భంగం చేయాలని నారాయణవనానికి బయలుదేరి వచ్చి చేరేసరికి ఆ చోటు చెప్పలేనంత అందంగా ఉన్నది. ఎక్కడికక్కడ దట్టంగా బారులు తీరి మద్దిచెట్లేమిటి, తియ్యమామిడి తోటలేమిటి, మారేడు, ఖర్జూరం, గజనిమ్మ, చందనవృక్షాలు, సురపొన్నలు, మందార తరువులు కానవచ్చాయి. పూలతీగెలకు విరబూసిన పువ్వులతో, నిండారిన పండ్లబరువుతో వంగిన చెట్లకొమ్మలతో ప్రకృతి రమణీయంగా ఉంది. గురివెంద పొదల పూలగుత్తుల మీదికి మకరందపానం కోసం వచ్చిన గండుతుమ్మెదల ఝుమ్మన్న నాదం నలుదిక్కుల మారుమ్రోగుతున్నది. సరోవరాలలో బంగారు తామరలూ, లేత యెఱుపు తెలుపుల వింత వన్నెలొలికే కలువ పూల చుట్టూ జక్కవలు, కొంగలు, క్రౌంచపక్షులు, హంసలు జంటలు జంటలుగా విహరిస్తున్నాయి. తామరతూళ్ళను తినవలెననే మక్కువతో సారసపక్షులు ముక్కుకొనలతో మొగ్గలను త్రుంచినపుడు పుప్పొడి చిమ్మి చెఱువునీరంతా రంగుమీరి ఉన్నది. దేవరాజు పంపిన అందగత్తెలు మందమందగమనాలతో ముందుకు సాగుతూ, అలసట వల్ల మోములకు పట్టిన చిరుచెమటలను కొనగోళ్ళతో తుడుచుకొంటూ ఋషులున్న చోటికి వచ్చారు.

చ. మదనుని బాణజాలముల మగ్నతఁ బొందక ధైర్యవంతుఁ డై
ముదితల వాఁడిచూపులకు మోహము నొందక నిశ్చలాత్ముఁడై
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసునిన్
వదలక భక్తి నిల్పుకొని వారికి నిట్లనె మౌని పెంపునన్.

66

తా ॥ ఆ సమయంలో నారాయణ ఋషి మన్మథుడు తనపైకి ఎక్కుపెట్టి విడిచిన విరితూపులకు మనస్సు ఏమాత్రం లోనుగాక, ఆ నెఱజాణల వాడిచూపులకు చలింపలేదు. అచంచలమైన భక్తివిశ్వాసాలతో ఆర్తులకు అభయదానం చేసిన తరువాత ఎటువంటి క్లిష్టపరిస్థితిలోనూ చ్యుతిలేక ఇచ్చిన మాట నిలుపుకొనే అచ్యుతదేవుడు, శ్రీ రమావల్లభుడైన, అనంత మహిమోపేతుడు, వాసుదేవుని తన మనోమందిరంలో ప్రతిష్ఠించుకొని, ధీరగంభీరోక్తులతో వారితో ఈ విధంగా ప్రసంగించాడు:

క. 'జంభారిపంపునను మీ, రంభోరుహవదనలార! యరుదెంచితి; రా
శుంభ ద్విహారవాంఛా, రంభంబునఁ దిరుగుఁ' దనిన లజ్జించి వెసన్.

67

"జంభాసుర సంహారకర్త దేవేంద్రుని ఆజ్ఞగొని విచ్చేసిన పద్మవదనలు మీరు వచ్చారుగా! ఇక ఈ వనంలో మీ ఇచ్చవచ్చినట్లు విహరించండి. చూడగోరినవన్నీ చూడండి" అనేసరికి వారంతా సిగ్గుమొగ్గలై తలవంచుకొన్నారు.

సీ. 'దేవమునీంద్ర! నీ దివ్యచారిత్రంబు నెఱిఁగి సన్నుతిసేయ నెవ్వఁ డోపుఁ?
బుత్ర మిత్ర కళత్ర భోగాదులను మాని తపము గావించు సద్ధర్ములకును
విఘ్నముల్ సెందునే? విశ్వేశుఁ గొల్చిన యతనికి నంతరాయంబు గలదె?
కామంబుఁ గ్రోధంబుఁ గల తపస్వితపంబు పల్వలోదకములభంగిఁ గాదె?

తే. నిన్ను వర్ణింప నలవియే? నిర్మలాత్మ!, రమణ లోఁగొను మా యపరాధ' మనుచు
సన్నుతించిన నతఁడు ప్రసన్నుఁ డగుచుఁ, దనదు సామర్థ్య మెఱిఁగింపఁ దలఁచి యపుడు.

68

తా ॥ "ఓ దేవమునీంద్రా! నీ దివ్యచరిత్రమంతా తెలుసుకొని ఎవరు మాత్రం సన్నుతి చేయగలరు? భార్యాపిల్లలు, చుట్టాలు, స్నేహితులు అందరినీ కాదనుకొని, తృప్తినివ్వని ఆ భోగాలను మానుకొని, ధర్మపరుడివై తపస్సు చేసుకొంటున్న నీకు విఘ్నాలంటూ ఉంటాయా?

కోరికలు తీరనివారు, కోపాన్ని అణచుకోలేనివారు తపస్సు చేయటమంటే బురదనీటిని చల్లుకొన్నట్లే. నీవు ఆ రెండింటిని ఎప్పుడో జయించావు. సర్వేశ్వరుణ్ణి నమ్ముకొన్నావు. నీవంటి వారికి అంతరాయాలు కలుగుతాయా? నీ మహిమను వర్ణించటం మావంటివారికి సాధ్యమవుతుందా? మా తప్పిదాన్ని మనస్సులో ఉంచుకోకు. మమ్మల్ని క్షమించు" అని వేడుకొన్నారు.

ఋషి వారికి ఇంకా తన శక్తిసామర్థ్యాలెటువంటివో చూపదలిచాడు.

వ. అ మ్మునీశ్వరుండు పరమాశ్చర్యనిధానంబుగా నిజతనూరుహంబుల వలనం ద్రికోటి కన్యకా నివహంబుల నుద్భవింపం జేసిన, గంధర్వ విబుధకామినీ సముదయంబులు పరమాద్భుత భయంబులు మనంబులం బొడమ సన్నుతించి, య వ్విలాసినీసమూహంబులో నూర్వశి యను దానిం గొని చని, పాకశాసను సభాసదనంబునం బెట్టి తద్వృత్తాంతం బంతయు విన్నవించిన నాశ్చర్యయుక్త హృదయుం డయి సునాసీరుం దూరకుండె; నట్టి నారాయణ మునీశ్వరుచరిత్రంబు వినువారలు పరమ కల్యాణగుణవంతు లగుదురని చెప్పిన.

69

తా ॥ అప్పుడొక వింత జరిగింది. ఆ మునీశ్వరుడు ఎటువంటివారికైనా ఆశ్చర్యం

కలిగేట్లు తన తొడలనుంచి మూడుకోట్ల మంది కన్నెపిల్లలను సృష్టించాడు. వచ్చిన దేవకాంతలు, గంధర్వకాంతలు పరమాశ్చర్యంతోనూ భయంతోనూ ముగ్ధులయ్యారు. ఆయనను మళ్ళీమళ్ళీ ప్రార్థించి, స్వర్గానికి తిరిగివెళ్ళారు. తమందరిలోకి అందగత్తె అయిన ఊర్వశిని ముందుంచుకొని, దేవేంద్రుని సభలో జరిగిన వృత్తాంతమంతటినీ విన్నవించుకొన్నారు.

దేవేంద్రుని మనస్సు ఆశ్చర్యంతో నిండిపోయింది. సర్వశక్తిమంతుడైన ఋషి ముందు తాను చేసేదేమీ లేదని గ్రహించి ఊరుకున్నాడు.

ఇటువంటి మహామహిమోపేతుడు నారాయణ మునీశ్వరుని చరిత్ర విన్నవారికి సకల కల్యాణగుణాలు సమకూరుతాయి.''

తే. ఋషభునకు నాత్మయోగ మీ రీతిఁ జెప్పె;, నచ్యుతుఁడు భూమిభారము నడఁప నంత
సొరిది నవతారములు దాల్చి సొంపు మీఱ, రాత్రిచరులను జంపె నీరసముతోడ.

70

తా ॥ ఈ విధంగా భగవానుడైన వాసుదేవుడు తన అంశతో హంస, దత్తాత్రేయ, సనత్కుమార, ఋషభాది అవతారాలను ధరించి లోకాలకు ఆత్మయోగాన్ని విశదీకరించిన తర్వాత ఇంకా ఎన్నో లీలలు జరిగాయి. భగవానుడు భూమి బరువును తగ్గించేందుకు ఒక్కొక్క కల్పంలోనూ ఒక్కొక్క అవతారం ధరించాడు. ధర్మఘాతుకులన్న ఆగ్రహంతో రాక్షసులను సంహరించాడు.

వ. అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబు లగు మత్స్యకూర్మవరాహ నారసింహ వామన రామ రఘురామ రామ బుద్ధ కల్క్యాద్యవతారంబు లనేకంబులు గలవు; వాని నెఱిఁగి నుతియింప శేషభాషాపతుల కైన నలవి గాదు; మఱియును.

71

తా ॥ పరమేశ్వరుడు లీలావిగ్రహధారియై ధరించిన అవతారాలు మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం, నారసింహావతారం, వామనావతారం, పరశురామావతారం, రఘురామావతారం, బుద్ధావతారం, కల్కి అవతారం మొదలైనవి ఎన్నో ఉన్నాయి. వాటినన్నిటినీ తెలుసుకొని స్తుతించాలంటే వేయినోళ్ళున్న ఆదిశేషుడికీ, నాలుగుముఖాలున్న భాషావిభుడికీ అయినా సాధ్యం కాదు.

సర్వలఘుసీసము

నవ వికచ సరసిరుహ నయనయుగ! నిజచరణ గగనచరనది జనిత! నిగమనినుత! జలధిసుత కుచకలశ లలిత మృగమద రుచిర పరిమళిత నిజహృదయ! ధరణిభరణ! ద్రుహిణముఖ సురనికర విహిత నుతికలితగుణ కటిఘటిత రుచిరతర కనకవసన! భుజగరిపు వరగమన! రజతగిరిపతివినుత! సతతజపరత! నియమసరణి చరిత!

తే. తిమికమఠకిటినృహరిముదితబలి నిహి, త పద పరశుధర దశవదన విదళన! మురదమన కలికలుష సుముదపహరణ!, కరివరద! మునినరసుర గరుడవినుత!



తా ॥ అప్పుడే వికసించిన తామరరేకుల వంటి కన్నులతో వెలుగొందే స్వామీ! పవిత్రములైన పాదాల నుంచి దేవతల లోకంలో నడయాడే గంగమ్మకు జన్మనిచ్చిన దేవా! వేదములచే సన్నుతింపబడిన ప్రభూ! సముద్రరాజతనయ లక్ష్మీదేవి గుండెలకు హత్తుకొన్నపుడు ఆమె పాలిండ్ల కస్తూరితో పరిమళించే వక్షఃస్థలం కలిగిన శృంగారనాయకా! భూదేవీ ప్రాణవల్లభా! బ్రహ్మాదులైన దేవతానికరం నిత్యం కొనియాడే గుణసంపద గల పరమపురుషా! నడుమున మేలిమి బంగారు వన్నెలొలికే పట్టుధట్టిని దాల్చిన సుందరపురుషా! గరుడవాహనా! వెండికొండవేల్పుచే పొగడిక నందుకొన్న మహిమలు గలవాడా! ధర్మమార్గాన్ని ఉపదేశించి, ఆ ధర్మాన్ని నీవే ఆచరించి లోకరక్షణ కావించిన విశ్వేశ్వరా!

మత్స్య—కూర్మ—వరాహ—నరసింహ రూపావతారా! బలిరాజు శిరస్సుపై పాదాన్ని నిలిపి అభయమొసంగిన వామనమూర్తీ! పరుశుధారివైన రామా! దశకంఠ రావణుని సంహరించిన శ్రీరామచంద్ర ప్రభూ! మురాసురుని మట్టుపెట్టిన మహాపరాక్రమశాలీ! కలికాల కలుషాలన్నింటినీ పరిహరించే పరమాత్మా! గజేంద్రునికి మోక్షాన్ని ప్రసాదించిన భక్తవరదా! మునీంద్రులు, దేవతలు, గరుత్మంతుడు మొదలైన సమస్త ప్రాణికోటీ వినుతించే వాసుదేవా!

> వ. ఇ వ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబు లనంతంబులు గలవు; మనోవాక్కాయ కర్మంబుల హరిపూజనంబు సేయక, విపరీతగతులం దిరుగుచుండు జడుల కెవ్విధంబు గతి గలుగు? ననిన నప్పు డప్పుడమిఱేఁ డప్పరమపురుషుం జూచి యట్టి జడులు ముక్తి నొందు నుపాయం బెట్టు లంతయు నెఱింగింపుఁ' డనినఁ జమసుం డిట్లనియె.

73

తా ॥ ఇలా నారాయణ స్తుతి చేస్తూ శ్రీ భగవానుని దివ్యలీలలను అభివర్ణించే పవిత్ర నామాలను ఒక్కటొక్కటిగా స్మరించి, ద్రమీళుడు "ఈ విధంగా దుష్టశిక్షణ కోసం, శిష్టరక్షణార్థమై నెలకొన్న శ్రీమన్నారాయణమూర్తి అవతారలీలలు లెక్కలేనన్ని ఉన్నాయి. నిండైన మనస్సుతో, వాక్కుతో, కర్మశుద్ధితో ఆ పరమపురుషుడు శ్రీహరిని పరిపరివిధాల పూజింపక — భగవన్మార్గానికి వ్యతిరేకంగా చెడుత్రోవల వెంటబడి తిరిగే దురాత్ములను ఎవరు మాత్రం రక్షించగలరు?"

అని — భగవత్కృపకు నోచుకోలేని దురదృష్టవంతులను గురించి నిర్వేదంతో పలికేసరికి, విదేహ మహారాజు "అటువంటి జడులైన పరమమూర్ఖులు సైతం ముక్తిని పొందే ఏదైనా ఉపాయం ఉన్నదేమో, ఆ సంగతంతా నాకు వివరించి చెప్పండి!" అని అడిగాడు.

ఆ మాటకు చమసుడిలా అన్నాడు.

# చమనకరభాజనులు చేసిన పరమార్థ ఉపదేశం

సీ. హరిముఖ బాహూరు వరపదాబ్జములందు వరుసఁ జతుర్వర్ణ వర్గసమితి
జనియించె; నందులో సతులును శూద్రులు హరిఁదలంతురు; కలిహాయనముల
వేదశాస్త్ర పురాణ విఖ్యాతులై కర్మ కర్తలై విప్రులు గర్వ మెసఁగి
హరిభక్తి పరులను హాస్యంబు సేయుచు నిరయంబు నొందుట నిజము గాదె?

తే. మృదుల పక్వాన్న భోజనములను మాని, జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము;
హరి నుతింపక స్త్రీలోలుఁ డైనఁవాడు, నరక వాసుండు నగుచుండు ననవరతము.

74

తా ॥ "సర్వపాపాలను హరించే శ్రీమన్నారాయణుని ముఖము – బాహువులు – తొడలు – శ్రేష్ఠములైన పాదపద్మముల నుంచి క్రమంగా (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర నామాలతో) నాలుగు వర్ణాలు, ఆ వర్ణాలవారిలో (బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే) నాలుగు ఆశ్రమాలు కలిగాయి. అందులో స్త్రీలు, శూద్రులు శ్రీహరిని తలుస్తారు. కలికాలంలో ఉపనయనాది సంస్కారాలను పొంది, భగవత్తత్త్వాన్ని బోధించే వేదాలను, శాస్త్రాలను, పురాణాలను అధ్యయనం చేసి, గొప్ప పండితులని ప్రసిద్ధిని పొందిన బ్రాహ్మణులు విజ్ఞానగర్వంతో అహంకరించి, దారితప్పి, హరిభక్తిపరులకు తమకున్న జ్ఞానసంపద లేదని అవహేళన చేస్తూ చివరికి నరకానికి పోతారు. ఇది నిజం. యజ్ఞాలు చేసి అన్నదానాలు, దక్షిణాది విధులను పాటింపనివారికి జీవయాత్ర కోసం పశువులను హింసించే క్రూరచిత్తులకు కలిగే పాపం అంటుతుంది. వాసుదేవుని స్తుతింపక స్త్రీసాంగత్యంలో పడి స్వధర్మాన్ని మరచినవాడు నరకాన్ని పొందక తప్పదు.

వ. అట్లు గావున గృహ క్షేత్ర పుత్ర కళత్ర ధన ధాన్యాదులందు మోహితుం డయి 'ముక్తి మార్గంబు లప్రత్యక్షంబు' లని నిందించువాఁడును, హరిభక్తి విరహితుండును, దుర్గతిం

గూలుదు రని మునివరుం డానతిచ్చిన విదేహుం డిట్లనియె.

75

తా ॥ కనుక ఇల్లూ వాకిలీ, పొలమూ పుత్రా, కొడుకులూ కూతుళ్ళు, ధనధాన్యాదులే తన సర్వస్వమని నమ్మి, వాటి మోహంలో చిక్కుకొని; ప్రత్యక్షంగా అనుభవంలోకి వస్తూ ఇంద్రియగోచరాలైనవే నిత్యసత్యాలనీ, కంటికి కనిపించని ముక్తిమార్గాలంటూ వేరే ఏవో లేవనీ వ్యర్థవాదాలు చేస్తూ శ్రీమన్నారాయణుని యందు భక్తి కుదురుకొననివాడు దుర్గతుల పాలవుతాడు."

అని చెప్పగా ఆ యోగీంద్రునితో విదేహ మహారాజు ఇలా అన్నాడు:

ఆ. ఏ యుగంబునందు నే రీతి వర్తించు?, నెట్టి రూపువాఁడు? నె వ్విధమున
మును నుతింపఁబడెను మునిదేవగణముచే, విష్ణుఁ డవ్యయుండు విశ్వవిభుఁడు?"

76

తా ॥ "తన పాదారవిందాలను ఆశ్రయించినవారికి తరుగులేని, శాశ్వతమైన బ్రహ్మపదాన్ని ప్రసాదించే కాలాతీతమూర్తి, ఈరేడు లోకాల సృష్టిస్థిత్యంతకారకుడు అయిన శ్రీమహావిష్ణువు ఏ యుగంలో ఏ వర్ణంతో ఏ విశిష్టమైన ఆకారాన్ని ధరించి, ఏ విధిని అనుసరించి వర్తిల్లుతాడు? అనవరతం ఆయననే ధ్యానించే మునులు, దేవతలు ఆ ప్రభువును ఏ తీరున కొనియాడేవారు?"

వ. అనిన విని యందుఁ గరభాజనుం డిట్లనియె; 'ననేకావతారంబులు నానారూపంబులును బహువిధ వర్ణంబులునుం గలిగి, రాక్షసులను సంహరించి, దుష్టజన నిగ్రహంబును శిష్టజన పరిపాలనంబును జేయుచుఁ గృతయుగంబున శుక్లవర్ణుండై చతుర్బాహుండై జటావల్కల కృష్ణాజినోత్తరీయ జపమాలికా దండ కమండలు ధరుండయి హరి నిర్మలతపోధ్యానానుష్ఠాన గరిష్ఠులైన పురుష శ్రేష్ఠులచేత హంసుండు సువర్ణుండు

వైకుంఠుండు ధర్ముం డమలుండు యోగేశ్వరుం డీశ్వరుండు పురుషుం డవ్యక్తుండు పరమాత్ముం డను దివ్యనామంబులం బ్రసిద్ధి వహించి గణుతింపంబడుఁ; ద్రేతాయుగంబున రక్తవర్ణుండయి బాహుచతుష్క మేఖలాత్రయ విశిష్టుండయి హిరణ్య కేశుండును, వేద త్రయస్వరూపుండును, స్రుక్ స్రువాద్యుపలక్షణ శోభితుండునయి విష్ణుయజ్ఞ పృశ్నిగర్భ సర్వదేవోరుక్రమ వృషాకపి జయంతోరుగాయాఖ్యల బ్రహ్మావాదులచేత నుతియింపంబడు; ద్వాపరంబున శ్యామల దేహుండును పీతాంబరధరుండును బాహుద్వయోపశోభితుండును దివ్యాయుధ ధరుండును శ్రీవత్సకౌస్తుభ వనమాలికా విరాజమానుండును మహారాజోపలక్షణుండునై జనార్దన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నారాయణ విశ్వరూప సర్వభూతాత్మకాది నామంబుల వెలసి, మూర్ధాభిషిక్తులచేత సన్నుతింపంబడు. కలియుగంబునఁ గృష్ణవర్ణుండును గృష్ణనామకుండునునై భక్త సంరక్షణార్థంబు పుండరీకాక్షుండు యజ్ఞ సంకీర్తనంబులచేతం బ్రస్తుతింపబడు; హరి రామ నారాయణ నృసింహ కంసారి నలినోదరాది బహువిధనాంబులచే బ్రహ్మావాదులైన మునీంద్రులు నుతియింపుదురు; మఱియును.

77

తా ॥ అని ప్రశ్నింపగా విని, కరభాజనుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు:

“ఎన్నో అవతారాలలో ఎన్నెన్నో రూపాలతో మరెన్నో వర్ణాలలో ఆవిర్భవించి, రాక్షసులను మట్టుపెట్టి, దుష్టుల కిరాతకాలకు అడ్డుకట్టవేసి, శిష్టులను రక్షించి శ్రీ వాసుదేవుడు ఈ జగన్నాటకాన్ని తానే సూత్రధారియై నడిపిస్తుంటాడు.

కృతయుగంలో ఆయన రంగు తెలుపు. అప్పుడాయనకు నాలుగు భుజాలు. జడలు దాల్చి, నారచీరలు కట్టుకొని, జింకచర్మాన్ని చుట్టుకొని, యజ్ఞోపవీతం, జపమాల, దండకమండలాలు ధరించి లోకాభిరామంగా విరాజిల్లుతాడు. ఆ సమయంలో భవబంధాలు లేని పురుషోత్తములైన తపస్వులు నిశ్చల ధ్యానయోగంతో ఆయనను అనుష్ఠిస్తారు. హంసుడు,

సుపర్ణుడు, వైకుంఠుడు, ధర్ముడు, అమలుడు, యోగేశ్వరుడు, ఈశ్వరుడు, పురుషుడు, అవ్యక్తుడు, పరమాత్ముడు అనే మంత్రమయములైన పేర్లతో భక్తులు ఆయనను ఆరాధిస్తారు.

త్రేతాయుగంలో ఆయన అర్చామూర్తి వర్ణం ఎరుపు. నాలుగు భుజాలు, ముప్పేటల మొలత్రాడు కలిగి, బంగారపు రంగు గల కేశాలు, మూడు వేదాలలో వర్ణింపబడిన రూపువంటి రూపుతో, స్రుక్కు – స్రువము మొదలైన చిహ్నాలను ధరించి శోభాయమానంగా ఉంటాడు. బ్రహ్మవాదులు వేదాలు బోధించిన కర్మల ద్వారా ఆయనను విష్ణువు, యజ్ఞుడు, పృశ్నిగర్భుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుగాయుడు మొదలైన శుభనామాలతో సన్నుతిస్తారు.

ద్వాపరయుగంలో ఆయన నీలమేఘశ్యాముడు. పచ్చని పట్టువస్త్రాన్ని కట్టుకొంటాడు. లీలామానుషవేషధారి కనుక రెండే బాహువులు. చూడచక్కని రూపు. దివ్యములైన పాంచజన్య శంఖము, సుదర్శన చక్రము, కౌమోదకీ గద, నందక ఖడ్గరాజం ఆయుధాలు. ఱొమ్మున శ్రీవత్స చిహ్నాన్ని, కౌస్తుభ రత్నాన్ని, వైజయంతీ వనమాలికను దేదీప్యమానంగా అలంకరించుకొని లోకాలేలే మహారాజు లక్షణాలతో విరాజిల్లుతుంటాడు. రాజాధిరాజులు సైతం ఆ పరమేశ్వరుణ్ణి జనార్దనుడు, వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, నారాయణుడు, విశ్వరూపుడు, సర్వభూతాత్మకుడు అనే నామమంత్రాలతో పూజిస్తుంటారు.

కలియుగంలో ఆయన కృష్ణవర్ణుడు. కృష్ణనామకుడు భక్తసంరక్షణే ఆయన కర్తవ్యం. అటువంటి ఆ పుండరీకాక్షుడు యజ్ఞములందు కీర్తించబడుతూ హరి, రామ, నారాయణ, నృసింహ, కంసవైరి, నళినోదరుడు మొదలైన నామాలతో బ్రహ్మవిదులైన మునీంద్రులచే స్తుతించబడతాడు.

తే. ద్రవిడ దేశంబునందులఁ దామ్రపర్ణి, సహ్యజాకృత మాలాది సకలనదుల
కెవ్వఁ డేనిని భక్తితో నేఁగి యచటఁ, బొదలి తర్పణ మొగిఁ జేయఁ బుణ్య మొదవు.

తా ॥ దక్షిణాన ద్రవిడదేశంలో తామ్రపర్ణి, సహ్యాద్రి శిఖరాలపై నుంచి ప్రవహించే కావేరి, కృతమాల మొదలైన నదీప్రదేశాలు పరమ పుణ్యతీర్థాలు. అక్కడికి భక్తియుక్తులతో వెళ్ళి, పెద్దలకు తర్పణాది విధులను నిర్వర్తిస్తే చెప్పలేనంత పుణ్యం కలుగుతుంది.

వ. ఇ వ్విధంబునఁ బ్రశంసింపఁదగిన కావేర్యాదిమహానదీ పావన జలస్నాన పాన దానంబులను, విష్ణుధ్యానకథా సుధారసానుభవంబుల నిరూఢులగు భాగవతోత్తములు గలిగి రేనిం జెడని పదంబునుం బొందుదు రని ఋషభకుమారుల భగవత్ప్రతిబింబంబు లయిన పరమపురుషులుం బోలె విదేహజనపాలునకు నిశ్శ్రేయః పద ప్రాప్తి కరంబులైన భగవద్భక్తి ధర్మంబు లుపదేశించి యంతర్ధానంబు నొందిరి; మిథిలేశ్వరుండును జ్ఞానయోగం బంగీకరించి నిర్వాణపదంబు నొందె; నీ యుపాఖ్యానంబు వ్రాసినఁ బఠించిన వినిన నాయు రారోగ్యైశ్వర్యములు గలిగి పుత్ర పౌత్రవంతులై సకలకలి కల్మష రహితులై విష్ణులోక నివాసు లగుదు' రని నారదుండు వసుదేవునకుం జెప్పి మఱియును.

79

తా ॥ ఈ విధంగా ముల్లోకాలలో మన్నన గన్న కావేరి మున్నుగా గల మహానదుల పుణ్యజలాలలో స్నానంచేసి, దానాది పుణ్యకార్యాలు ముగించుకొని శ్రీమహావిష్ణువును ధ్యానిస్తూ ఆయన దివ్యకథాసుధారసంలో నిమగ్నులై ఉండే భాగవోత్తములకు అవ్యయమైన బ్రహ్మానంద పదం సిద్ధిస్తుంది."

అని సాక్షాత్తూ భగవంతుని ప్రతిబింబాల వంటి ఆ ఋషభకుమారులు విదేహ మహారాజు నిమి చక్రవర్తికి మోక్షపదాన్ని ప్రాప్తింపజేసే భగవద్భక్తి ధర్మాలను ఉపదేశించి, అంతర్ధానమయ్యారు.

అంతట మిథిలేశ్వరుడు గరిష్ఠమైన నిష్ఠతో జ్ఞానయోగాన్ని అనుష్ఠించి, ముక్తిపదాన్ని

చూరగొన్నాడు.

పావనమైన ఈ ఉపాఖ్యానాన్ని చదివినవారు, విన్నవారు ఆయురారోగ్యాలు, సకలైశ్వర్యాలు సిద్ధించి పుత్రులు, పౌత్రులతో వంశాభివృద్ధికి నోచుకొని, అన్ని కలికాల కల్మషాలనూ కడిగి వేసికొని శాశ్వత విష్ణులోక నివాసాన్ని పొందుతారు."

అని విదేహార్షభుల సంవాదాన్ని నారదుడు వసుదేవునికి వినిపించి, ఇంకా ఇలా అన్నాడు:

సీ. 'కమలాక్షపదభక్తి కథనముల్ వసుదేవ! విని యఘంబులఁ బాసి వెలసి తీవు
భువనప్రసిద్ధిగాఁ బొలుపొందు సత్కీర్తి కైవల్యలక్ష్మియుఁ గలుగు మీఁద
నారాయణుండు నీ నందనుం డను మోహ మెడలించి విష్ణుగాఁ నెఱిఁగి కొలువు
మతఁడు నీ తనయుఁడై యవతరించుటఁ జేసి సిద్ధించె దేహ సంశుద్ధి నీకు

తే. సరసల్లాప సౌహార్ధ సౌష్ఠవమునఁ, బావనం బైతి శిశుపాల పౌండ్ర నరక
ముర జరాసంధ యవనులు ముదముతోడ, వాసుదేవునిఁ జెందిరి వైరు లయ్యు.

80

తా ॥ "ఓ వసుదేవా! శ్రీ పుండరీకాక్షుని పాదసేవకులైన భాగవతోత్తముల కథలను ఆలకించి నీవు నీ పాపాలన్నింటినీ పటాపంచలు చేసుకొన్నావు. ఈ పుణ్యఫలంగా నీకు విశ్వవ్యాప్తమైన విఖ్యాతి కలుగుతుంది. ఆపై కైవల్యపదం నిన్ను వరిస్తుంది. నారాయణుడు నీ కొడుకన్న వ్యామోహాన్ని విడిచి, సాక్షాద్విష్ణువని గ్రహించి ఆత్మనిష్ఠుడివై ఆరాధించు. అతడు నీ పుత్రుడై అవతరించినందువల్ల నీకు జన్మమాలిన్యాలు తొలగి, దేహసంశుద్ధి కలిగింది.

ఆ మహానుభావునితో పుత్రప్రేమ కొద్దీ సరస సల్లాపాలతో, వాత్సల్య స్నేహభావాలతో కాలం గడిపి నీవు ధన్యుడవైనావు. శిశుపాలుడు, పౌండ్రకుడు, నరకాసురుడు, మురాసురుడు, జరాసంధుడు, కాలయవనుడు ఆయనను ఎదుర్కొని, చివరికి ఆయన చేతనే సంహరింపబడి,

ఎంతో సంతోషంతో ఆయనలో ఐక్యమయ్యారు.

క. దుష్టజన నిగ్రహంబును, శిష్టప్రతిపాలనంబు సేయన్ హరి దా
సృష్టి నవతార మొందెను, స్రష్టృముఖానేక దివిజసంఘము వొగడన్.

81

తా ॥ బ్రహ్మదేవుడు మొదలైన దేవతలందరూ తామే సృష్టించిన ఈ లోకంలో పరిస్థితి అదుపు తప్పి తామంతా నిస్సహాయులైనప్పుడు ఆ శ్రీహరి తమకోసం అవతరించి దుష్టుల దురాగతాలను అణచి, శిష్టులను రక్షించాడని పరిపరివిధాల కొనియాడుతుంటారు.

వ. అట్లు గావున లోకరక్షణార్థంబు గృష్ణం డవతారంబు నొందె' నని హరిభక్తిపరంబు లగు నుపాఖ్యానంబులు నారదుం డుపన్యసించిన విని విస్మితచిత్తులై దేవకీవసుదేవులు గృష్ణుని పరమాత్మునిగా విచారించి' రని శుకుండు రాజునకుం జెప్పిన నతండు మునీంద్రా! యదువుల నేప్రకారంబున హరి హరియించె? సపరివారులగు బ్రహ్మ రుద్రేంద్ర దిక్పాలక మునీంద్రులు ద్వారకా నగర ప్రవేశం బెట్లు సేసిరి? యే మయ్యె? మఱియుఁ బరమేశ్వర కథామృతంబు వీను లలరం జవిగొనియు నింకం దనివి సనదు; భక్త రక్షకుండగు హరిచారిత్రం బేరీతిఁ జాగెఁ దర్వాతి వృత్తాంతం బంతయు నెఱింగింపు మనిన శుకుం డిట్లనియె.

82

తా ॥ కనుక శ్రీకృష్ణుడంటే లోకరక్షణార్థం అవతరించిన పరమపురుషుడే సుమండి! అని నారద మహర్షి దేవకీవసుదేవులతో ఉపన్యసించాడు. వారిద్దరూ ఆ మాటలకు ఆశ్చర్యచకితమనస్కులై, ఆనాటినుంచి శ్రీకృష్ణుణ్ణి పరమాత్మగానే చూడసాగారు.

అని శుకయోగి రాజుతో అన్నాడు. అప్పుడు పరీక్షిత్తు, "మునీంద్రా! యాదవులందర్నీ, ఏ విధంగా శ్రీహరి తుదముట్టించాడు? బ్రహ్మదేవుడు, పరమశివుడు, ఇంద్రుడు, దిక్పాలకులు

ద్వారకా నగరంలోకి ఎలా ప్రవేశించారు? అప్పుడేమయింది? అంతేనా? అంటే, పరమేశ్వరుడైన వాసుదేవుని కథామృతాన్ని వీనులవిందుగా ఎంత త్రాగినా తనివితీరదు. హరి భక్తరక్షకుడని కదా, అంటారు! ఆపై ఆయన జీవితంలో ఏమేం జరిగాయో? ఆ తర్వాతి కథంతా చెప్పు" అని అడిగాడు. శుకుడు చెప్పాడు.

## బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుణ్ణి వైకుంఠమునకు పిలుచుటకు వచ్చుట

క. సుర గరుడ ఖచర విద్యా, ధర హర పరమేష్ఠిముఖ సుధాశనులు మునుల్
సరసిజనయనునిఁ గనుఁగొన, నరుదెంచిరి ద్వారవతికి నతి మోదమునన్.

83

తా ॥ ఒకప్పుడు అమృతాన్ని ఆహారంగా స్వీకరించే అమరులు, గరుడులు, ఖేచరులు, విద్యాధరులు, శివుడు, విరించి మొదలైన వేల్పుపెద్దలతో కలిసి మహామునులందరూ శ్రీ పుండరీకాక్షుని దర్శించుకోవాలని అమితానందంతో ద్వారకా నగరానికి విచ్చేశారు.

క. కని పరమేశుని యాదవ, వనశోభిత పారిజాతు వనరుహనేత్రున్
జనకామిత ఫలదాయకు, వినుతించిరి దివిజు లపుడు వేదోక్తములన్.

84

తా ॥ వచ్చి, యదువంశమనే ఉద్యానవనంలో ఉదయించిన పారిజాతం వంటి శోభాకరగాత్రుని, వికచాయత శతపత్రనేత్రుని, భక్తుల కోరికలీడేర్చే సకలఫలదాయకుని, పరమేశ్వరుడైన శ్రీకృష్ణమూర్తిని కన్నులారా కనుగొని, వారందరూ వేదోక్తములైన మంత్రాలతో ఆయనను అర్చించుకొన్నారు.

తే. అఖిలలోకేశ! సర్వేశ! యభవ! నీవు, నుదయ మందుట భూభార ముడుపుకొఱకుఁ
బంచవింశోత్తర శతాబ్దపరిమితంబు, నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు.

85

తా ॥ "ఎల్ల లోకాలకూ అధినాయకుడవై, సర్వేశ్వరుడవైన దేవా! కాలాతీతుడవై, నీ పుట్టుక రహస్యం ఏమిటో తెలియరాని స్వామీ! నీవు అవతారాలను ధరించటం భూమి భారాన్ని తొలగించటం కోసమే గాని, కర్మబంధాలకు కట్టుబడినందువల్ల కాదు. నీవు నేలకు దిగివచ్చి

నూటఇరవైఅయిదు సంవత్సరాలు కావస్తున్నది. ప్రభూ! ఇక వైకుంఠనిలయానికి తిరిగి రావలసిన తరుణం ఆసన్నమైంది."

వ. అనినఁ గమలభవ భవ ముఖ నిఖిల సురగణంబుల వచనంబు లియ్యకొని కృష్ణుండు వారితోడ 'యాదవుల కన్యోన్య వైరానుబంధంబులు గల్పించి వారల హతంబు గావించి భూభారం బడంచి యిదె వచ్చెదం బొం' డని చెప్పి వీడ్కొలిపినఁ గమలాసనాది బృందారకులు నిజస్థానంబులకుం జని రంత.

86

తా ॥ అని ప్రార్థింపగా ఆ పద్మోద్భవ పరమేశ్వరాది సకల దేవతాగణాల వారి విన్నపాన్ని మన్నించి శ్రీకృష్ణుడు, "యాదవులందరికీ పరస్పర వైరానుబంధాలను కల్పించి, వారందిరినీ అంతంచేసి, భూభారాన్ని తగ్గించి, ఇంతలో వస్తాను. మీరు వెళ్ళండి." అని మాటయిచ్చి, వారందరికీ వీడ్కోలు పలికాడు. శతానందాది బృందారకులందరూ తమతమ స్థానాలకు తరలివెళ్ళారు.

# కృష్ణుడు దుర్నిమిత్తాలను చూసి యాదవులందరినీ ద్వారక నుండి ప్రభాస తీర్థమునకు పంపుట

సీ. కాక ఘూకంబులు గనకసౌధములలోఁ బగలు వాపోయెడి బహువిధముల
నశ్వవాలములందు ననల ముద్భవ మయ్యె నన్నంబు మొలిచె మహాద్భుతముగ
శుకశారికలు రాత్రి సొగసె విస్వరముల జంతువు వేఱొక్క జంతువుఁ గనె
నొగిఁ బౌరగృహముల నుల్కలు నుదయించె బెరసెఁ గావిరి రవిబింబ మపుడు.

తే. గాన నుత్పాతములు సాలఁ గానఁ బడియె, నరయ నిందుండ వలవదు యదువులార!
తడయ కిపుడ ప్రభాసతీర్థమున కరుగుఁ, డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు నానతిచ్చె.

87

తా ॥ ఆ తరువాత ద్వారకా నగరిలోని బంగారుమేడలలో పట్టపగలే కాకులు, గుడ్లగూబలు వాపోతుండటం వినిపించింది. గుర్రపు తోకల కొసలలో అగ్ని రగుల్కొన్నది. వింతగా నేలనుంచి అన్నం మొలకెత్తడం కనిపించింది. చిలుకలు, గోరువంకలు పరవశించి వింతవింతగా రాత్రివేళ గొంతెత్తి కూశాయి. ఒక జంతువుకు వేరొక జంతువు పుట్టసాగింది. పురజనుల ఇళ్ళల్లో పుట్టగొడుగులు పూచాయి. అప్పుడు రవిబింబం కళతప్పి కావిరంగులోకి మారింది.

శ్రీకృష్ణుడు యాదవులందరినీ పిలిపించి, "ఏవేవో దుర్నిమిత్తాలు కనబడుతున్నాయి. ఇక ఇక్కడుండటం మంచిది కాదు. ఆలస్యం చేయకుండా మీరిక ప్రభాసతీర్థానికి బయలుదేరండి." అని ఆజ్ఞాపించాడు.

క. నారాయణు వచనముల క, పారంబగు సమ్మదమున బలములతోడన్
దార సుత మిత్ర యుతులై, వారణ హయ సమితితోడ వడి నేఁగి రొగిన్.

88

తా ॥ శ్రీకృష్ణుని మాటంటే ఎనలేని విశ్వాసం ఉన్న యాదవులు ప్రాణాలపై తీపికొద్దీ ఉత్సాహం తెచ్చుకొని, సర్వసైన్యాలను వెంటబెట్టుకొని భార్యాపిల్లలు, బంధుమిత్రులతో ఏనుగులూ, గుర్రాలెక్కి వెంటనే అక్కడినుంచి బయలుదేరారు.

వ. అంత.

89

తా ॥ ఆ తరుణంలో.

క. జ్ఞానమున నుద్ధవుఁడు దన, మానసమున నెఱిఁగి 'శ్రీరమాధిప! హరి! యో
దీనజన కల్పభూజ! సు, ధీనాయక! మాకు నీవె దిక్కని పొగడెన్.

90

తా ॥ ఉద్ధవుడు జరుగనున్న విపరీతపరిణామాలను జ్ఞానదృష్టితో మనస్సులోనే గ్రహించి, కృష్ణుని వద్దకు వచ్చి, "శ్రీదేవి స్వయంగా తానై వలచి, వలపించుకొన్న ప్రాణనాయకా! దీనజనుల పాలిటి కల్పవృక్షమా! ఆత్మజ్ఞానులకు దారిచూపే పరంధామా!" అని వేనోళ్ళ సన్నుతించాడు.

# కృషుడు ఉద్ధవునకు పరమార్థోపదేశము చేయుట

వ. ఇట్లు నుతియించి 'దేవా! నీవు యదుక్షయంబు గావించి చనిన మే మేవిధంబున నిర్వహింతుము? నీ సహచరులమై జరిపిన మజ్జన భోజన శయనాసనాది కృత్యంబులు మఱవ వచ్చునే?' యని యుద్ధవుం డాడిన వాసుదేవుం డిట్లనియె; 'బ్రహ్మాదిదేవతా ప్రార్థనంబునం జేసి ధాత్రీభారంబు నివారించితి; నింక ద్వారకా నగరంబు నేఁటికి సప్తమ దివసంబున సముద్రుండు ముంపంగలవాఁడు; యదుక్షయంబునుం గాఁగల యది; యంతటం గలియుగంబునుం బ్రాప్తంబయ్యెడి, నందు మానవులు ధర్మవిరహితులు, నాచారహీనులు, నన్యాయ పరులును, నతిరోషులు, మందమతులు, నల్పతరాయువులు, బహురోగపీడితులు, నిష్ఫలారంభులు, నాస్తికులునై యొండొరుల మెచ్చక యుందురు; గావున నీవు సుహృద్బాంధవ స్నేహంబు వర్జించి, యింద్రియసౌఖ్యంబులం బొరయక క్షోణితలంబునం గల పుణ్యతీర్థంబుల నవగాహనంబు సేయుచు, మానస వాగక్షి శ్రోత్ర ఘ్రాణేంద్రియ గృహ్యమాణంబగు వస్తుజాతం బెల్ల నశ్వరంబుగా నెఱుంగుము; పురుషుండు నానార్థ కామంబుల నంగీకరించి నిజగుణదోషంబుల మోహితుండై యుండుం; గావున హస్తిపకుండు గంధనాగంబుల బంధించు చందంబున నింద్రియంబులను, మనోవికారంబులను నిగ్రహించి యీషణత్రయంబును వర్జించి, మోదఖేదంబుల సముండవుగా వర్తించుచు, నీ జగం బంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి, మాయాదు లాత్మతత్త్వాధీనంబులుగాఁ దెలియుచు, జ్ఞానవిజ్ఞాన యుక్తుండవై యాత్మానుభవ సంతుష్టుండవై, విశ్వంబును నన్నుఁగా భావించి, వర్తింప వలయు' నని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తిభయ వినయంబులం గరంబులు మొగిడ్చి 'మహాత్మా! సన్న్యస్త లక్షణంబు దుష్కరంబు; పామరులగు వార లాచరింపలేరు; నీ మాయచేత భ్రాంతులైన సాంసారికులు భవాబ్ధిం గడచి యెట్లు ముక్తి వడయుదురు? భృత్యుండనైన నామీఁది యనుగ్రహంబునం జేసి యానతిమ్ము; బ్రహ్మాది దేవతా సముదయంబును, బాహ్యవస్తువుల భ్రాంతులై పర్యటనంబు సేయుదురు; నీ భక్తులైన పరమ భాగవతు

లమ్మాయానిరసనంబును సేయుదురు; గృహిణీ గృహస్థుల కైన, యతులకైన నిత్యంబును నీ నామస్మరణంబు మోక్షసామ్రాజ్యపదంబు; గావునఁ బరమేశ్వరా! నీదు చరణంబుల శరణంబు నొందెద; గృపారసంబు నాపై నిగిడింపు' మని ప్రియసేవకుండైన యుద్ధవుండు పలికిన నతనికిఁ గంసమర్దనుం డిట్లనియెఁ; 'బురుషున కాత్మకు నాత్మయె గురువని యెఱుంగుము! కుపథంబులం జనక, సన్మార్గవర్తివై పరమంబైన మన్నివాసంబునకుం జనుము. సర్వమూలశక్తి సంపన్నుండనైన నన్ను సాంఖ్య యోగపరులు నిరంతర భావంబులందుఁ బురుషభావంబు గావించి తలంచుచుందురు! మఱియు నేక ద్వి త్రి చతుష్పాదబహుపాదాపాదంబులునై యుండు జీవజాలంబులోన ద్విపాదంబులు గల మనుష్యులు మేలు; వారలలోన నిరంతరధ్యానగరిష్ఠులైన యోగీంద్రు లుత్తములు; వారలలో సందేహపరులచే నగ్రాహ్యుండగు నన్ను సత్త్వగుణ గ్రాహ్యునిఁగా నెఱింగి నిజచేతః పంకజంబునందు జీవాత్మ పరమాత్మల నేకంబుగాఁ జేసి శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణయుక్తుంగా నెఱుంగుచు నుండువారలు పరమయోగీంద్రు లనియు, బరమజ్ఞాను లనియునుం జెప్పి మఱియు "నవధూత యదు సంవాదం" బను పురాతణేతిహాసంబు గలదుఁ సెప్పెద నాకర్ణింపుము.

91

తా ॥ ఈ విధంగా సన్నుతించి ఉద్ధవుడు, "ప్రభో! నీవంటేనో? యదువంశాన్ని తుదముట్టించి వెళ్ళిపోతావు. ఇక మాకు దిక్కేమిటి? నీకు సహచరులమై నీతో కలిసి చేసిన స్నాన, పాన, భోజన, శయన, ఆసనాదులను మేము ఎలా మరిచిపోగలము?" అంటూ కన్నీరు పెట్టుకున్నాడు.

వాసుదేవుడు అతని పలుకులకు సమాధానంగా ఇలా అన్నాడు:

"బ్రహ్మాది దేవతలు వచ్చి చేసిన విన్నపాన్ని పురస్కరించుకొని నేను భూమిభారాన్ని తొలగింపవలసి వచ్చింది. ఇక నేటికి ఏడవ దినాన ద్వారకానగరాన్ని సముద్రుడు

ముంచెత్తబోతున్నాడు. దానితో యదువంశనాశనం పూర్తయినట్లవుతుంది. ఆ తర్వాత కలియుగం మొదలవుతుంది. ఆ యుగంలో మనుష్యులు అధర్మవర్తనులు, ఆచారహీనులు అవుతారు. అన్యాయవర్తనులై అతిక్రోధపరులుగా ఉంటారు. బుద్ధిబలం నశిస్తుంది. ఆయుర్దాయం క్షీణిస్తుంది. నానావిధాల రోగాలు పైకొంటాయి. సత్ఫలాన్నివ్వని అకార్యాలకు పూనుకొంటారు. భగవంతుడంటూ ఒకడు లేడనే భావనవల్ల నాస్తికత్వం ప్రబలుతుంది. ఇతరుల మేలుచూసి ఓర్వలేనితనం వల్ల ఒకరినొకరు మెచ్చుకోలేకపోతారు.

ఆ రోజులకేం గాని, యుగాంతం సమీపిస్తున్నది. నువ్విక ఈ స్నేహితులు, చుట్టాలు అన్న బంధాలను తెంచుకొని, ఇంద్రియమూలాన కలిగే సుఖాలన్నీ నిరర్థకాలని గ్రహించి, ధాత్రిపై వెలసిన పుణ్యతీర్థాలన్నింటికీ వెళ్ళి, పాపపరిహారార్థం నదీస్నానాలు చేసుకొంటూ మనుష్యుల కంటికి కనిపించేదీ, చెవులకు వినిపించేదీ, ముక్కుకు వాసన సోకేదీ, ఏ ఇంద్రియానికైనా సరే సంతోషాన్ని కూర్చే ఏ పదార్థమైనా అది మరింత సుఖంకోసం తపింపజేసి దుఃఖభాజకం అవుతుందే గాని శాశ్వత సుఖపర్యవసానం కాదని తెలుసుకో.

దుఃఖానికి కారణం అర్థకామాల పట్ల కలిగే వ్యామోహమే. ఏది గుణమనుకొని మోసపోతామో ఆ మోహవస్తువే దోషంగా పరిణమించి జీవిని సర్వనాశనం చేస్తుంది. మావటివాడు మదించిన ఏనుగును కట్టిపడవేసినట్లు ఇంద్రియాల వల్ల కలిగే మనోవికారాలన్నింటినీ అదుపులోకి తెచ్చుకోవాలి. నా భార్య, నా కొడుకు, నా సొమ్ములు అనే ఈషణత్రయాన్ని విడిచివేస్తే సుఖదుఃఖాలు రెండింట సమభావమే మిగులుతుంది. సర్వసమత్వాన్ని సాధించాలంటే అదొక్కటే మార్గం.

ఈ జగత్తు నా అధీనంలో ఉన్నది అని భ్రాంతి చెందటం అవివేకం. సమస్తం ఆత్మపదార్థం చేత అధిష్ఠింపబడి ఉన్నదని గ్రహించాలి. ఏది లేదో, అది ఉన్నట్లుగా వ్యామోహాన్ని కలిగించేది మాయ. ఆ మాయకు కారణం యుక్తాయుక్తాలను గుర్తించలేని తన అవివేకమే కనుక అంతా ఆత్మతత్త్వాధీనమేనని తెలుసుకో.

జీవుడు–ఈశ్వరుడు–జగత్తు అనే భేదవ్యవహారానికి అధిష్ఠానమైనదీ, నిత్యమైనదీ, స్వయంప్రకాశకమైనదీ సచ్చిదానంద స్వరూపమూ, అద్వితీయమూ, పారమార్థికసత్యమూ అయిన బ్రహ్మచైతన్యమే జ్ఞానం. విద్వాంసులకు శ్రుతిప్రమాణాల వల్ల సిద్ధించే ఆత్మ నిశ్చయం అది. ఆత్మయొక్క శ్రవణ మననాదులచే మనసులో రూపుదాల్చినదీ, ప్రమాణాల వల్ల కలిగే బుద్ధివృత్తిలో అభివ్యక్తమైనదీ అయిన చిద్రూపం. ఆ స్ఫూర్తితో తనను బ్రహ్మముగా అనుభవంలోకి తెచ్చుకోవటమే జ్ఞానం. ఆ స్థితిలో సృష్టి స్థితి లయాలనేవి మూడూ ఉండవు.

ఇక, కేవలం ఉపాసన వల్ల సిద్ధించే నిశ్చయాత్మకమైన అనుభవజ్ఞానమే విజ్ఞానం. మోక్షేతరశాస్త్రాలలో తగులుకొన్నవారు తుదకు వాటి నిస్సారతను గుర్తించి, జీవవిచారం, ఆత్మవిచారం, బ్రహ్మవిచారం చేసి స్వానుభవంలో తెలిసికొనే సత్యం అది.

నువ్వు జ్ఞానవిజ్ఞానయుక్తుడవు కావాలి. ఆ స్వస్థతలోని ఆనందం కేవలానుభవానందస్వరూప మైనది. ఆ ఆత్మానుభవంతో సంతుష్టిని పొందినప్పుడు నీకు విశ్వమంతటా ఉన్నది నేనేనన్న తత్త్వవిజ్ఞానం కలుగుతుంది. ఆ విశ్వాన్ని నన్నుగా భావించి మెలుగు." అని వాసుదేవుడు ప్రబోధించాడు.

ఆ విధంగా సాక్షాత్తూ భగవదుపదేశానికి నోచుకొన్న భాగ్యశాలి ఉద్ధవుడు భక్తితో, భయంతో, వినయంతో భగవంతునికి చేతులు జోడించి, "మహానుభావా! బంధాలలో చిక్కుకొని కొంతకాలం జీవయాత్ర గడిచిన పామరులకు సంగాలను విడిచివేసి సన్న్యసించాలంటే అదేమంత సులభం కాదు కదా! నీ మాయ ఏమన్నా సామాన్యమైనదా? అవిద్యాబంధనాలతో కట్టిపడవేస్తుంది. సద్వస్తువు పట్ల పట్టుచిక్కనీయక చిత్తవృత్తులను చెదరిపోయేట్లు చేస్తుంది. సంసారంలో పడి ఆ భ్రాంతిలో చిక్కుకొన్న సామాన్యులిక ఈ సంసారసాగరం ఈది, ఈది ఒడ్డుకు చేరేదెన్నటికి? మోక్షం ఏ విధంగా సిద్ధిస్తుంది?

నేను నీ సేవకుడిని. నాపై దయతలిచి ముక్తిమార్గాన్ని చూపు. నీ వల్ల ప్రబోధాన్ని పొంది

సృష్టికార్యానికి ఉపక్రమించిన బ్రహ్మాది ప్రజాపతిదేవతానీకమే ఇంద్రియగోచరాలైన వస్తువులను చూసి భ్రాంతిచెంది, వ్యామోహాన్ని పొంది కొట్టుమిట్టుకలాడు తుంటారు. నీ లీలావిశేషాలను విని, నీ మహిమలను మననం చేసి, స్వస్వరూపానుసంధానంతో నీకు సర్వసమర్పితులైన, పరమభాగవతోత్తములైన భక్తులకు నీ మాయను నిరసింపగలగటం చెల్లింది. తప్పించుకోవడానికి వీలులేని సంసారబంధాలలో చిక్కుకొన్న గృహిణి గృహస్థులైతేనేమి? ఏ బంధమూ లేకపోయినా వ్యామోహాల నుంచి బయటపడలేని యతులైతేనేమి? ఎటువంటివారికైనా నీ నామస్మరణం మోక్షసామ్రాజ్యదాయకం.

పరమేశ్వరా! నీ చరణాల చెంత శరణు వేడుకొంటున్నాను. నాపై నీ కృపామృతవర్షాన్ని ప్రసాదించు." అని విన్నవించుకొన్నాడు.

ఆ విధాన ప్రియసేవకుడైన ఉద్ధవుడు పలికేసరికి, కంసాది దురంత దానవాంతకుడైన భగవానుడిలా అన్నాడు: "జీవులు ఆత్మకు ఆత్మే గురువని తెలుసుకోవాలి. కుమార్గాలలోకి ప్రవేశింపక, సన్మార్గం అవలంబించి స్వధర్మాచరణతో నా నివాసానికి వెళ్ళు. సర్వాధార శక్తిసంపన్నుడినైన నన్ను సాంఖ్యయోగపరులు పురుషభావం ఆరోపించి ధ్యానిస్తుంటారు. అది భావ్యమే. జీవులలో ఏకపాదులు, ద్విపాదులు, త్రిపాదులు, చతుష్పాదులు అయినవారిలో ద్విపాదులైన మనుష్యులు శ్రేష్ఠతములు. ఆ మనుష్యకోటిలో నిరంతర ధ్యానపరాయణులైన యోగీంద్రులు ఉత్తములు. ఆ యోగీంద్రుల లోనూ అస్తినాస్తిభావాలతో ఊగిసలాడే సంశయాత్ములకు కానరాని నన్ను, సత్త్వగుణసిద్ధి వలన గ్రహింపవచ్చునని తెలుసుకొని, తమతమ హృదయపద్మాలలో జీవాత్మ పరమాత్మలను ఒకటిగా నివేసింపజేసి, శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణాలతో కూడిన నా రూపాన్ని నిలుపుకొనే వారు పరమయోగీంద్రులు. వారే పరమ జ్ఞానసంపన్నులు.

ఈ బ్రహ్మజ్ఞానబోధకు 'అవధూత యదుసంవాదం' అని పురాతనమైన ఒక ఇతిహాసం ఉన్నది చెప్తాను విను.

# అవధూత – యదు సంవాదము

ఉ. పంకజనాభుఁ డుద్ధవునిపైఁ గల కూర్మిని జెప్పె నొప్ప నెం
దంకిలి లేక యన్ని దిశలందుఁ జరించుచు నిత్యతృప్తుఁడై
శంకరవేషధారి యొక సంయమి యా యదురాజుఁ జేర 'నే
వంకను నుండి వచ్చి' తన వానికి నిట్లనె నర్థి నేర్పడన్.

తా ॥ అంటూ శ్రీకృష్ణుడు ఉద్ధవునిపై గల ప్రేమాతిశయం వల్ల సన్న్యాస తత్త్వాన్ని వివరింపగోరి ఈ కథను చెప్పాడు.

“పూర్వం ఒకప్పుడు నిత్యసంతుష్టుడైన ఒక అవధూత యథేచ్ఛావిహారం చేస్తూ యదు మహారాజు వద్దకు అపరశంకరుని వలె బయలుదేరి వచ్చాడు. యదురాజు ఆయనను, “మీరెక్కడినుంచి వచ్చారు?” అని ప్రశ్నింపగా, అవధూత ఈ విధంగా సమాధానం చెప్పాడు.

క. అవధూత వల్కె నంతటఁ, 'బ్రవిమల విజ్ఞాన నిపుణ భవ్యులు గురువుల్ దవిలిన నిరువది నలువురు, నవనిన్ విజ్ఞాని నైతి' నని పల్కుటయున్.

93

తా ॥ అవధూత అప్పుడు, “విశుద్ధమైన విజ్ఞానాన్ని కలిగి, మిక్కిలి నిపుణులైన ఇరవైనలుగురు గురువులు తారసిల్లి, వారి చేరిక మూలాన నేనూ విజ్ఞానినయ్యాను” అన్నాడు.

వ. అంత యదుప్రవరుండు 'దేహి లోభమోహాదుల వర్జించి జనార్దనుని నే విధంబునం జేరవచ్చు? నెఱింగింపు' మనిన నతం డిట్లనియె.

94

తా ॥ విజ్ఞానసంపన్నుడనగానే, ఆ అవధూతను చూచి యదురాజు, “జీవులు లోభ

మోహాలను విడిచిపెట్టి జనార్దనుని ఏ విధంగా చేరుకోవచ్చునో నాకు చెప్పండి" అని అడిగాడు. అవధూత చెప్పాడు.

సీ. పరధన పరదార పరదూషణాదులఁ బరవస్తు చింత దాఁ బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప కటమున్న తనువు చంచలతను దగులకుండ
బుద్ధిసంచలతచేఁ బొదలక యట మున్న శ్లేష్మంబు గళమునఁ జేరకుండ
శక్తియుక్తుల మది సన్నగిల్లక మున్న భక్తి భావనచేతఁ బ్రౌఢుఁ డగుచు

తే. దైత్యభంజను దివ్యపాదారవింద, భజన నిజభక్తి భావనఁ బ్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమును బొందు ననుదినంబు, నతఁడు కర్మవిముక్తుఁడౌ ననఘచరిత!

95

తా ॥ "ఓ పుణ్యచరితా! ప్రాజ్ఞులైనవారు ఇతరుల సొమ్ములాశించి, పరకాంతకై ఆశపడి, పరులను దూషిస్తూ, పరుల వస్తువులను అపహరించే చింతనలను మాని, ముసలితనం మీరి రోగాలు పైకొనక మునుపే, మేను వడవడ వణకడానికి ముందే, బుద్ధి మందగించి, ఆరోగ్యం క్షీణించి, శ్లేష్మం గొంతుదాకా నిండి, శక్తియుక్తులుడిగి, మతిమరుపు మితిమీరి కాలాతీతం కాకమునుపే భక్తిభావనను అలవరచుకోవాలి. క్రమంగా అందులో పరిపక్వతను సాధించాలి. దుష్టరాక్షసులను సంహరించి, శిష్టులను పరిరక్షించిన పంకజనాభుని పాదారవిందాలను భజిస్తుంటే అజ్ఞానం తొలగి, అవ్యయమైన ఆనందం కలుగుతుంది.

భగవదనుగ్రహం వల్ల కర్మదోషాలు నశించి, కర్మల నుంచి విముక్తి లభిస్తుంది.

ఉ. దారలయందు, బుత్రధన ధాన్యములందు ననేక భంగులం
గూరిమి సేయు మర్త్యుఁ డతిఘోర వియోగజ దుఃఖ మగ్నుఁడై
నేరుపు దక్కి, చిక్కువడి నీతి వివేక విహీనుడై మనో
భారముతోఁ గపోతపతి భంగి నిజంబుగ బోవు నష్టమై.

తా ॥ భార్యాబిడ్డల పైన, ధనధాన్యాదుల పైన రకరకాలుగా మమకారం పెంచుకొన్న మానవుడు తనవనుకొన్న ఆ వస్తువులు దూరమయ్యేసరికి, పట్టరాని ఆ వియోగదుఃఖంలో మునిగి, యుక్తాయుక్తవివేకాన్ని కోల్పోయి, తానే కల్పించుకొన్న ఆ బంధాలలో మరింత కట్టుపడి, మంచిచెడ్డలని లేక, పూర్వం కపోతరాజు లాగా అన్నీ పోగొట్టుకొని, హృదయశల్యాయమానమైన చింత అంతకంతై, చివరికి ఏమీ లేనివాడవుతాడు.

వ. ఇందుల కొక్క యితిహాసంబు గలదు; మహారణ్యంబున నొక్క కపోతంబు దారసమేతంగా నొక్క నికేతనంబు నిర్మించి యన్యోన్య మోహాతిరేకంబునఁ గొంతకాలంబునకు సంతానసమృద్ధి గలదియై యపరిమితంబు లయిన పిల్లలు దిరుగాడుచుండఁ గొన్ని మాసంబులు భోగానుభవంబునం బొరలు చుండఁ గాలవశంబున నొక్క లుబ్ధకుం డురు లొడ్డిన నందు దారాపత్యంబులు దగులువడిన ధైర్యంబు వదలి మోహాతిరేకంబునం గపోతంబు కళత్ర పుత్ర స్నేహంబునం దాను నందుఁ జొచ్చి యధిక చింతాభరంబునం గృశీభూతం బయ్యెఁ; గావున నతితీవ్రం బయిన మోహంబు గొఱగా దట్లుగాన నిరంతర హరిధ్యానపరుండై భూమి పవన గగన జల కృపీటభవ సోమ సూర్య కపోత తిలిప్స జలధి శలభ ద్విరేఫ గజ మధుమక్షికా హరిణ పాఠీన పింగళా కురర డింభక కుమారికా శరకృ త్సర్ప లూతా సుపేశకృ త్సముదయంబులు మొదలుగాఁ గలవాని గుణగణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలంగుదు; రనిన.

97

తా ॥ ఇందుకు ఎన్నడో జరిగిన కథొకటి చెబుతాను. ఒక కారడవిలో పావురం ఒకటి భార్యతో కలిసి చక్కటి గూడు కట్టుకుంది. భార్యాభర్తలిద్దరు ఒకరినొకరు విడిచి ఉండలేక కాపురం చేస్తున్నారు. కొంతకాలానికి గంపెడంతమంది పిల్లలు పుట్టారు. చెట్టూచేమ ఎటుచూసినా పిల్లలే కేరింతలు కొడుతూ ఆడుకొనేవాళ్ళు. అలా చెప్పలేనంత ఆనందంగా కొన్ని

నెలలు దొర్లిపోయాయి. కొన్నాళ్ళకు కాలవశాన బోయవాడొకడు వలపన్ని వాటికోసం మాటువేశాడు. దాంట్లో పావురం భార్య, బిడ్డలు చిక్కుకొన్నారు. వారి ఆర్తిని చూసి పావురం ధైర్యంగా ఉండలేక, మోహం అతిశయించి, భార్యాబిడ్డల పైన మమకారం కొద్దీ తానూ వెళ్ళి అందులోకి ప్రవేశించి, ఆలోచించిన కొద్దీ దిగులు ఎక్కువై, కొన్నాళ్ళకు క్రుంగి, కృశించి పోయింది.

ఎటువంటివారికీ మోహం తగదు. పావురం లాగానే నిరంతరం శారీరక సుఖాలకోసం వెంపరలాడేవాడు, దీనస్వభావుడు, ఇంద్రియాలపై అదుపు లేనివాడు, పెద్ద సంసారాన్ని తలకెత్తుకొన్నవాడు, కుటుంబపోషణ తప్ప వేరే ఆలోచన లేనివాడు అయితే గతి అంతే కదా.

అందువల్ల హరిధ్యానపరులైన విజ్ఞానులు భూమి, వాయువు, ఆకాశం, నీరు, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, పావురం, కొండచిలువ, సముద్రం, మిడత, తేనెటీగ, ఏనుగు, పువ్వుతేనెలను త్రాగే తుమ్మెద, లేడి, చేప, పింగళ అనే వేశ్య, కురరమనే పేరుగల లకుముకి పిట్ట, పసిపిల్లవాడు, ఒక కన్యక, విలువిద్యను నేర్చుకొంటున్నవాడు, పాము, సాలెపురుగు, భ్రమరకీటమనే సీతాకోకచిలుకల ప్రవర్తనను బట్టి వారి గుణాలేమిటో తెలుసుకొని, యోగులైనవారు తమ నడవడిని చక్కదిద్దుకొంటారు" అన్నాడు.

క. 'ఇవి తెలియవలయు నాకును, బ్రవిమలమతి వీనిఁ దెలియఁ బలుకు' మనంగాఁ గ్రమమున వినుమని కృష్ణుఁడు, సవినయుఁడగు నుద్ధవునికిఁ జయ్యనఁ జెప్పెన్.



తా ॥ అనగానే ఉద్ధవుడు సవినయంగా, "వాటినుంచి గ్రహింపవలసిన గుణాలేమిటో నాకు తెలియటం లేదు. నిర్మలమైన చిత్తంతో నీవే నాకవన్నీ అర్థమయేట్లు, విడమరిచి చెప్పాలి" అన్నాడు. "అయితే ఒకొక్కటీ చెబుతాను, విను" అంటూ కృష్ణుడు ఉద్ధవునికి సాకల్యంగా వినిపించాడు.

వ. ఇ వ్విధంబున భూమివలన సైరణయు, గంధవహునివలన బంధురంబగు పరోపకారంబును, విష్ణుపదంబువలనఁ గాలసృష్ట గుణసాంగత్యంబు లేమియు, నుదకంబు వలన నిత్యశుచిత్వంబును, నసిత పథుని వలన నిర్మలత్వంబును, నిశాకరప్రభాకరులవలన నధికాల్పసమత్వ జీవ గ్రహణ మోక్షణంబులును, గపోతంబుల వలనఁ గళత్రపుత్రస్నేహంబును, నజగరంబు వలన స్వేచ్ఛావిహార సమాగతాహారంబును, వననిధివలన నుత్సాహరోషంబులును, శలభంబువలన శక్త్యనుకూల కర్మాచరణంబును, భృంగంబువలన సారమాత్రగ్రహణ విశేషంబును, స్తంబేరమంబువలనం గాంతా వైముఖ్యంబును, సరఘువలన సంగ్రహ గుణంబును, హరిణంబువలనం జింతాపరత్వంబును, జలచరంబు వలన జిహ్వాచాపల్యంబును, బింగళవలన యథాలాభసంతుష్టియుఁ, గురరంబువలన మోహపరిత్యాగంబును, డింభకువలన విచారపరిత్యాగంబును, గుమారికవలన సంగత్యాగంబును, శరకారునివలనం దదేకనిష్ఠయు, దందశూకంబువలనం బర గృహవాసంబును, నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును, గణుందురు వలన లక్ష్యగత జ్ఞానంబు విడువకుండుటయు ననం గల వీని గుణంబు లెఱింగి మఱియుఁ గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను నరిషడ్వర్గంబుల జయించి, జరామరణ విరహితంబుగా వాయువశంబు సేసి, గాత్రపవిత్రత్వంబు కొఱకు షట్కర్మనిరతుండయి, పురనగర గ్రామంబులు పరిత్యజించి పర్వతారణ్యంబుల సంచరించుచు, శరీర ధారణార్థంబు నియతస్వల్పభోజనుండై, ఖేదమోదంబులు సరియకా భావించి లోభమోహంబులు వర్జించి, నిర్జితేంద్రియుండయి నన్నె కాని యొం డెఱుంగక యాత్మ నిష్ఠచేఁ బవిత్రాంతఃకరణుండైన యోగి నాయందు గలయుం గావున.

99

తా ॥ ఈ విధంగా పాదాలతో తొక్కినా ఏ మాత్రం చలింపని భూమిని చూసి నేను క్షమాగుణాన్ని, ఎప్పుడూ ఇతరుల మేలుకోసం తిరిగే వాయువును చూసి పరోపకార గుణాన్ని,

మబ్బులు కమ్మినా తాను ఏ మాత్రం తడియని ఆకాశాన్ని చూసి నేను కాలవశాన కల్పితాలైన దేహధర్మాలకు చలింపకుండటాన్ని, నీటిని చూసి మనము కూడా ఆ విధంగా అందరినీ పావనం చేయాలని ఆ నిత్యశుచిత్వాన్ని, ఎవరి నుంచి దేనిని గ్రహించినా ఆ వస్తువుల ధర్మాలను తాను పొందని అగ్నిని చూసి నిర్మలత్వాన్ని గ్రహించాలి. కాలప్రభావం వల్ల వృద్ధిక్షయాలను పొందినా తన స్వభావంలో ఎటువంటి మార్పులేని చంద్రుణ్ణి చూసి నిర్వికారతను, సముద్రంలో నుంచి నీటిని ఆకర్షించి మబ్బుల ద్వారా వాన కురిపించే సూర్యుణ్ణి చూసి లోకం నుంచి గ్రహించిన ప్రతిదానినీ లోకోపకారానికే వినియోగించాలని, భార్యాబిడ్డల పైని మోహంతో చిక్కులలో పడ్డ పావురాన్ని చూసి సంసారం పట్ల అనాసక్తిని, దేనికీ ప్రయత్నింపక తనకు దొరికిన దానితో సరిపెట్టుకొనే కొండచిలువను చూసి కర్మత్యాగాన్ని గుర్తించాలి. వర్షం కురిసి నదులు వచ్చి కలిసినందువల్ల ఉప్పొంగక ఎండలలో ఇగిరిపోక సమంగా ఉండే సముద్రాన్ని చూసి సుఖదుఃఖాల పట్ల సమచిత్తాన్ని, వెలుగనుకొని మంటలలోకి దూకి మరణించే మిడతను చూసి స్త్రీల విలాసాలకు లొంగకూడదని ఇంద్రియజయాన్ని, తేనెటీగ తేనెను చేర్చి చేర్చి చివరికి దాని మూలాననే చావును కొనితెచ్చుకోవడాన్ని చూసి కడుపుకూటికే గాని వృథాసంచయం కూడదని, ఆడుయేనుగుల పైని వ్యామోహంతో జీవితాన్ని పాడుచేసుకొనే ఏనుగును చూసి అశాశ్వతాలైన కాంతాకనకాల పట్ల వ్యామోహం ఉండరాదని, పువ్వుతేనె కోసం కమలం మీదికి వ్రాలి రాత్రి కాగానే ఆ పువ్వు ముడుచుకొన్నపుడు బంధింపబడే భ్రమరాన్ని చూసి మోహనాశాన్ని అర్థం చేసుకోవాలి. అన్ని పువ్వుల నుంచి సారాన్ని గ్రహించే తుమ్మెదను చూసి గుణగ్రహణ సారసంగ్రహాలను, తీయని సంగీతాన్ని విని వేటగాడికి పట్టుబడిన లేడిని చూసి ఇంద్రియవశత్వాన్ని, ఎరచేప కోసం గాలానికి చిక్కిన చేపను చూసి సర్వ అనర్థాలకు కారణమైన జిహ్వాచాపల్యం ఉండరాదని తెలుసుకోవాలి. దురాశ దుఃఖాలకు మూలమని గ్రహించి నైరాశ్యాన్ని అలవరచుకొన్న పింగళ అనే వేశ్యను చూసి వైరాగ్యాన్ని, సంపాదించుకొన్న దానిపైని మమకారం వల్ల ప్రాణాల మీదికి తెచ్చుకొన్న కురరమనే లకుముకి పిట్టను చూసి మమత్వపరిత్యాగాన్ని, లోకజ్ఞానం లేనందువల్ల లౌకికదుఃఖాలకు లోనుకాని ఒక బాలుణ్ణి చూసి విచారశూన్యతను, పదిమందిలో ఇబ్బందుల పాలై ఏకాంతమే మేలని గ్రహించిన ఒక కన్యకను

చూసి సంగత్యాగాన్ని గ్రహించాలి. ఏకాగ్రచిత్తంతో ఊపిరి బిగబట్టి బాణాలను గురిపెడుతూ శ్వాసజయాన్ని సాధించిన విలువిద్య నభ్యసించేవాణ్ణి చూసి యోగాభ్యాసక్రమంలో తదేకనిష్ఠను, రెండవ దానితో కలియక అప్రమత్తంగా, నిశ్శబ్దంగా సంచరించే పామును చూసి ఎక్కడ చోటు దొరికితే అక్కడ ఉండవచ్చునని, నోటినుంచి దారాలను తీస్తూ లోపలికి తీసుకొంటూ ఉండే సాలె పురుగును చూసి భగవంతుని తత్త్వాన్ని గ్రహించి సంసార పరిత్యాగాన్ని, గొంగళి పురుగు తాను ఏ రూపాన్ని పొందాలనుకొన్నదో ఆ రూపాన్నే అదే పనిగా చూస్తూ చివరికి ఆ రూపాన్ని పొంది భ్రమరకీటకం సీతాకోకచిలుకగా మారిన వైనాన్ని చూసి తదేక నిష్ఠను నేర్చుకోవాలి.

ఇంకా కామము, క్రోధము, మోహము, లోభము, మదము, మాత్సర్యము అనే ఆరింటిని, శత్రువర్గాన్ని జయించి, ముసలితనం, మరణాల భయాన్ని శ్వాసజయంతో సాధించి, శరీరశుద్ధి కోసం కామ్యకర్మలను వదలి సంధ్యావందనం, జపం, హోమం, దేవతాపూజనం, ఆతిథ్యం, వైశ్వదేవం అనే ఆరు నిత్యకర్మలను మాత్రం ఆచరిస్తూ, పట్టణగ్రామాదులలో ఉండక ఏ కొండలలోనో అడవులలోనో ఉంటూ, శరీరధారణకు అవసరమైనంత అదీ వీలైనంత తక్కువ తింటూ, సంతోషమైనా దుఃఖమైనా సమానంగా అనుభవిస్తూ, ఇంద్రియాలను జయించాలి. నన్ను గురించి తప్ప వేరొక చింతన చేయకూడదు. సర్వపరిత్యాగం చేసి, ఆత్మనిష్ఠతో పవిత్రాంతఃకరణుడైన యోగి నా యందు ఐక్యాన్ని భజిస్తాడు.

క. మోహితుఁడై వసుకాంక్షా, వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁడౌ మనుజుం
డూహాపోహ లెఱుంగక, దేహము నలఁగంగఁ జేయు దీనత నెపుడున్.



తా ॥ అవివేకం వల్ల ధర్మాన్ని గుర్తెరుగలేక మోహవశులైన అజ్ఞానులు ఇక ధనకాంక్ష కూడా తోడైతే, భోగలాలసత్వం మరీ పెరిగి, దాని మూలాన కోరికల ప్రవాహంలో చిక్కుకొని, ఆ కోరికలు తీరకపోతే క్రౌర్యానికి సయితం పాల్పడి, ఏది మంచో ఏది చెడో అన్న విచక్షణ లేక శరీరాన్ని పడరానిపాట్లకు గురిచేస్తారు.

వ. ఇందులకుఁ బురాతన వృత్తాంతంబు గలదు; సావధాన చిత్తుండవై వినుము. మిథిలానగరంబునఁ బింగళ యను గణికారత్నంబు గలదు. దానివలనం గొంత పరిజ్ఞానంబుఁ గంటి? న దెట్లనిన న మ్మానిని ధనకాంక్ష జేసి యాత్మసఖుని మొఱంగి ధనం బిచ్చువానిం జేకొని నిజనికేతనాభ్యంతరంబునకుం గొని చని రాత్రి నిద్రలేకుండుచుఁ బుటభేదన విపణిమార్గంబులఁ బర్యటనంబు సలుపుచు నిద్రాలస్యభావంబున జడనుపడి, యర్థాపేక్షం దగిలి తిరిగి యలసి, యాత్మ సుఖంబు సేయు నతండె భర్తయని చింతించి నారాయణు నిట్లు చింతింప నతనికైవల్యంబు సేరవచ్చునని విచారించి, నిజశయనస్థా నాదికంబు వర్జించి వేగిరంబ వాసుదేవ చరణారవింద వందనాభిలాషిణియై దేహంబు విద్యుత్ప్రకారంబని చింతించి పరమతత్త్వంబు నందుఁ జిత్తంబు గీలుకొలిసి ముక్తురా లయ్యెనని యెఱింగించి.

101

తా ॥ ఇందుకొక పురాతనమైన వృత్తాంతం ఉన్నది. శ్రద్ధగా విను. మిథిలా నగరంలో పింగళ అనే పేరుగల వెలయాలుండేది. ఆమె వల్ల కొంత పరిజ్ఞానం సంపాదించాను. ఎలాగంటే, ఆ వేశ్య మితిమీరిన ధనకాంక్ష మూలాన తనను ఉంచుకొన్న వానిని మాయచేసి, మరింత డబ్బిచ్చే మరొక విటుడికి తగులుకొని, తన ఇంటికి తీసుకొనివెళ్ళి, అప్పటి నుంచి అంతకంటే ఎక్కువ, అంతకంటే ఎక్కువ ఇవ్వగలవాళ్ళకోసం ఎదురుతెన్నులు కాస్తూ, ఊరి ముఖ్యవీథులన్నిట కాపుకాస్తూ, వీథుల వెంబడి తిరుగుతూ నిద్ర లేక, సొమ్మసిల్లి, ధనకాంక్షతో మనసుకు తృప్తిలేక, చివరికి విసిగి వేసారి, నిర్విణ్ణురాలై, శాశ్వతమైన సుఖాన్ని ప్రసాదించే నారాయణుడే తనకు గమ్యమని నిశ్చయించి, శ్రీమన్నారాయణ ధ్యానంతో కైవల్యపదాన్ని చూరగొనవచ్చునని ఆలోచించి, తన శయనస్థానాదులన్నిటిని విడిచిపెట్టి, తహతహపాటుతో వాసుదేవుని పాదారవిందాలకు మోకరిల్లి తన జన్మ ధన్యం చేసుకోవాలని, ఈ శరీరం మెరుపుతీగ లాగున క్షణికమాత్రమని తలపోసి, పరతత్త్వమందే చిత్తాన్ని లగ్నం చేసి, ముక్తురాలయింది.”

అని వివరించి, ఇంకా ఇలా అన్నాడు.

క. దేహము నిత్యముగా దని, మోహముఁ దెగఁగోసి సిద్ధమునివర్తనుఁడై
గేహము వెలువడి నరుఁ డు, త్సాహమునుం జెందు ముక్తిసంపద ననఘా! 102

తా ॥ "పుణ్యచరిత్రుడవైన ఉద్ధవా! దేహం నిత్యమైన ఆత్మ కాదని గ్రహించి, మోహబంధాలన్నింటినీ త్రెంచివేసి, సిద్ధమునుల సద్వర్తనను పాటించి, ఇల్లు విడిచిన నరుడు పరమాత్మజ్ఞానాన్ని ఆర్జించి, అఖండమైన మోక్షలక్ష్మిని చూరగొంటాడు.

వ. మఱియు నొక్కవిశేషం బయిన పురాతన పుణ్యకథ వినుము; కనకావతీ పురంబున నొక్కధరామరుని కన్యకారత్నంబు గల; దవ్వధూతిలకంబు రత్నసమేతంబులగు కంకణంబులు ధరియించి బంధుజనంబులకుఁ బరమాహ్లాదంబుగా నన్నంబు గావించుట కొఱకు శాలితండులంబులు దంచునప్పుడు ముసలగ్రహణభారంబునఁ గంకణంబు లతిరావంబుగా మ్రోయుచుండ న ప్పరమపతివ్రత యందులకు నసహ్యపడి యన్నియు డులిచి యొక్కటి నిలిపె; నట్లు గావునఁ దత్తఱపడక భగవదాయత్తంబైన యేకచిత్తంబునం బ్రసన్నచిత్తులై నరులు ముక్తు లగుదురు; గావున నవిద్యావిద్యలు నా మాయగా విచారించి, కేవలపశుమార్గులు కాక షడ్గుణైశ్వర్య సంసన్నులైన యోగీశ్వరుల పగిది సుఖంబు గోరక యుండువారలు ముక్తు లగుదురు; సర్వంబును విష్ణుమాయగాఁ దెలియు' మని యుద్ధవునికిం జెప్పిన నతండు 'దేవా! నీ రూపం బేలాగునం గానవచ్చు' ననిన నతం డిట్లనియె. 'భక్తిభావన పరాయణుండై కృపారస తత్పరుండై మితభాషణుండై బొంకక కర్మంబులు మదర్పణంబుగాఁ జేసి యతండు భాగవతుఁ డనం బరఁగు; మత్కథలును మజ్జన్మకర్మంబులును వినుచు మత్సేవకు లైన భాగవతులం జూచి తన గృహంబునకుం గొనిపోయి, మజ్జన పూజన భోజన శయనాసనాదికంబులఁ బరితుష్టులం జేసిన యతండైనను భాగవతుం డనఁబడు; నిట్లెంతకాలంబు జీవించు, నంతకాలంబును నడపు నతండు మద్రూపంబున వైకుంఠనిలయంబు నొందు; నదియునుంగాక గంధపుష్ప

ధూపదీప నైవేద్య లక్ష్మీసమేతుండనై, శంఖ చక్ర గదాశార్ఙ్గాది యుక్తుఁడనైన నన్ను శుక సనకాది యోగీంద్రులును, నంబరీష విభీషణ రుక్మాంగదులు మొదలుగాఁ గల భాగవతులును, శాస్త్రాచారచోదితులు గాక భక్తి భావనా విశేంబున నేమఱక నిత్యంబును జింతనాయత్తులై యెఱింగిరి; మధురాపురంబునకు హలాయుధ సమేతుండనై యే నరుగుచో, గోపిక లోపికలు లేక భక్తియోగంబునఁ జింతించి ముక్తలై; రిది భక్తియోగప్రకారం' బని యుద్ధవునికిం జెప్పిన.

103

తా ॥ మరొక విశేషమైన పురాతన కథ ఉన్నది, విను. కనకావతీ పురంలో ఒక బ్రాహ్మణుని కూతురుండేది. తల్లిదండ్రులు ఇంటలేనప్పుడు చుట్టాలు వచ్చారు. ఆ అమ్మాయి నత్తగుల్లలు పొదిగిన కంకణాలను ధరించి, ఇంటికి వచ్చిన బంధుజనులకు రుచికరంగా అన్నం వండేందుకు చాలినంత బియ్యం లేనందువల్ల వడ్లు దంచుతున్నది. రోకలి చేతిలో పట్టుకొని దంచుతుంటే గుల్లగాజులు ఘల్లుఘల్లుమని మ్రోగసాగాయి. ఆమె తమ పేదరికం ఎక్కడ బయటపడుతుందో అని సిగ్గుపడి, చేతికున్న గాజులను ఒక్కటొక్కటిగా తీసిపారవేసి, ఒక్కొక్క చేతికి ఒక్కొక్కటి మాత్రం ఉంచుకొని, చివరికి అదీ తీసివేసి దంపసాగింది. పదుగురున్న చోట గాజుల గలగలల మాదిరి గొడవలు తప్పవని, ఇద్దరున్నా వాదోపవాదాలు ఏదో ఒక విధంగా తప్పవని, ఏకాగ్రభావాన్ని అభ్యసింపగోరినవాడు ఏకాకిగా ఉండాలని, మలినభావాలు లేని సుప్రసన్నమైన చిత్తాన్ని భగవదాయత్తం చేసిన భక్తులు మోక్షాన్ని పొందుతారని, దీన్ని బట్టి గ్రహించాలి.

విద్య అంటే ఆవరణలు లేని జ్ఞానతాదాత్మ్యం కలిగిన బ్రహ్మాకారవృత్తి. అవిద్య అంటే అనిత్యమైన దేహేంద్రియాది విషయములు నిత్యములని, మలినమైన వాటిని పరిశుద్ధాలని, దుఃఖకరములైనవాటిని సుఖకరాలని, అనాత్మవస్తువులు తానేనని అనిపింపజేసే మలినసత్త్వం ప్రధానంగా గల ఒక వ్యతిరేకజ్ఞానం. విద్యావిద్యలన్నవి రెండూ నా మాయ వలన ఏర్పడినవే అని

తెలుసుకో" అని చెప్పాడు.

ఉద్ధవుడు అప్పుడు, "దేవా! నీ రూపాన్ని ఏ విధంగా చూడవచ్చును?" అని అడిగాడు. ఆ ప్రశ్నకు శ్రీకృష్ణుడు, "భక్తిభావనతో తదేకంగా భగవంతుని కరుణారసం కోసం తహతహలాడుతూ, వ్యర్థభాషణలు మాని, మౌనవ్రతం పూని, ఎట్టి పరిస్థితిలోనూ అసత్యం పలుకక, సర్వకర్మలను నాకు సమర్పించినట్లయితే అట్టివారిని భాగవతులంటారు. నా కథలను, నా అవతారాలను, నా లీలలను వింటూ, నాకు సేవకులైన భాగవతులను సందర్శించినపుడు వారిని తన ఇంటికి తీసుకొనివెళ్ళి, స్నానాసన పూజన భోజన శయనాదికాలను సమర్పించి, వారిని సంతోషపెట్టేవారు కూడా భాగవతులే. అట్లా జీవించినంత కాలం భాగవతసేవలో కాలం చెల్లించినవారు వైకుంఠనిలయంలో నాతో సారూప్యాన్ని పొందుతారు. గంధపుష్పధూపదీపనైవేద్యాలతో లక్ష్మీసమేతుడనై, శంఖచక్రగదాయుక్తుడినైన నన్ను సనకాదియోగీంద్రులు, అంబరీష విభీషణ రుక్మాంగదులు మొదలుగా గల భాగవతులు శాస్త్రాచారాలను పాటించినందువల్ల గాక, కేవలం భక్తిభావనావిశేషంతో, ఎటువంటి ఏమరుపాటూ లేక, నిత్యచింతనాపరులై తెలుసుకోగలిగారు. మధురాపురంలో మా అన్నగారు బలరామునితో ఉండిన రోజులలో గోపికలు ఎటువంటి దాపరికమూ లేక, సర్వసమర్పణభావంతో భక్తియోగతత్పరులై నన్ను ధ్యానించి ముక్తిని పొందారు. ఇది భక్తియోగ విధానం."

అని ఉద్ధవునికి చెప్పాడు.

క. 'ధ్యానం బేక్రియ నిలుచును?, ధ్యానం బే రీతిఁ దగు? నుదాత్తచరిత్రా! ధ్యానప్రకార మంత య, నూనంబుగఁ జెప్పుమయ్య యుర్వీరమణా!'



తా ॥ ఉద్ధవుడు అప్పుడు, "భూదేవిని వక్షఃస్థలాన ప్రేమాతిశయంతో అలంకరించుకొన్న

దేవా! మోక్షాన్ని కోరినవారు నిన్ను ఏ రూపంలో, ఏ విధంగా, ఏ భావంతో ధ్యానించాలో చెప్పు. నీ పుణ్యచరిత్ర మహా ఉదాత్తమైనది. ధ్యానం చెదిరిపోకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో ధ్యానప్రకార మంతటినీ వివరించు" అని అడిగాడు.

వ. అని యడిగిన న య్యాదవేంద్రుం డి ట్లని పలుకం దొడంగె; 'దారుమధ్యభాగంబున ననలంబు సూక్ష్మరూపంబున వర్తించు చందంబున నందంబై సకలశరీరులయందు నచ్ఛేద్యుండు, నదాహ్యుండు, నశోష్యుండు నైన జీవుండు వసించి యుండు' ననిన హరికి నుద్ధవుం డిట్లనియె; 'సనకసనందనాది యోగీంద్రులకు యోగమార్గం బే రీతి నానతిచ్చితి, నది యే విధం? బానతీయవే' యని యభ్యర్థించిన నతం డిట్లనియె; 'వారలు చతుర్ముఖు నడిగిన నతండు, 'నేనును దెలియనేర' ననిన వారలు విస్మయం బందు చుండ నే నా సమయంబున హంసస్వరూపుండనై వారల కెఱింగించిన తెఱంగు వినుము;

పంచేంద్రియంబులకు దృష్టం బయిన పదార్థం బనిత్యంబు; నిత్యదృష్టి బ్రహ్మం బని తెలియవలయు; దేహి కర్మార్జిత దేహుండై సంసారమమతలు నిరసించి, నిశ్చలజ్ఞాన యుక్తుండై మత్పదప్రాప్తుం డగు; స్వప్న లబ్ధపదార్థంబు నిజంబు గాని క్రియఁ గర్మానుభవ పర్యంతంబు కళేబరంబు వర్తించు నని సాంఖ్యయోగంబున సనకాదుల కెఱింగించిన విని, బ్రహ్మ మొదలైన దేవత లెఱింగిరి; వారి వలన భూలోకంబునఁ బ్రసిద్ధం బయ్యె; నది గావున నీవును నెఱింగికొని, పుణ్యాశ్రమంబులకుం జను; మస్మదీయభక్తి యుక్తుండును, హరిపరాయణుండు నైన యతని చరణరజః పుంజంబు తన శరీరంబు సోఁక జేయు నతండును, ముద్రాధారణపరులకును హరి దివ్యనామంబులు ధరియించు వారలకు నన్నోదకంబుల నిడు నతండును, వాసుదేవభక్తులం గని హర్షించు నతండును, భాగవతు' డని చెప్పి మఱియు 'సర్వసంగ పరిత్యాగంబు సేసి, యొండెఱుంగక నన్నే తలంచు మానవునకు భుక్తి ముక్తి ప్రదాయకుండనై యుండుదు' నని యానతిచ్చిన నుద్ధవుండు 'ధ్యానమార్గం బే రీతి? యానతీయ వలయు' ననిన హరి యిట్లనియె;

ఏకాంతమానసులై హస్తాబ్జంబు లూరుద్వయంబున సంధించి, నాసాగ్రంబున వీక్షణంబు నిలిపి, ప్రాణాయామంబున నన్ను హృదయగతుంగాఁ దలంచి, యష్టాదశ ధారణాయోగ సిద్ధు లెఱింగి, యం దణిమాదులు ప్రధానసిద్ధులుగాఁ దెలిసి, యింద్రియంబుల బంధించి, మనం బాత్మయందుఁ జేర్చి, యాత్మ నాత్మతోఁ గీలించిన బ్రహ్మ పదంబుఁ బొందు. భాగవతశ్రేష్ఠు లితరధర్మంబులు మాని నన్నుం గొంతురు; తొల్లి పాండునందనుఁడగు నర్జునుండు యుద్ధరంగంబున విషాదంబు నొంది యిట్ల యడిగిన నతనికి నేఁ జెప్పిన తెఱం గెఱింగించెదఁ;

జరాచరభూతం బయిన జగం బంతయు మదాకారంబుగా భావించి, భూతంబులందు నాధార భూతంబును, సూక్ష్మంబు లందు జీవుండును, దుర్జయంబులందు మనంబును, దేవతలందుఁ బద్మగర్భుండును, వసువులందు హవ్యవాహుండును, నాదిత్యులందు విష్ణువును, రుద్రులందు నీలలోహితుండును, బ్రహ్మలందు భృగువును, ఋషులందు నారదుండును, ధేనువులందుఁ గామధేనువును, సిద్ధులయందుఁ గపిలుండును, దైత్యులయందుఁ బ్రహ్లాదుండును, గ్రహంబులందుఁ గళానిధియును, గజంబులయం దైరావతంబును, హయంబులయం దుచ్చైశ్రవంబును, నాగంబులందు వాసుకియును, మృగంబులందుఁ గేసరియు, నాశ్రమంబు లందు గృహస్థాశ్రమంబును, వర్ణంబులయం దోంకారంబును, నదులందు గంగయు, సాగరంబులయందు దుగ్ధ సాగరంబును, నాయుధంబులందుఁ గార్ముకంబును, గిరులందు మేరువును, వృక్షంబుల యం దశ్వత్థంబును, నోషధులయందు యవలును, యజ్ఞంబుల యందు బ్రహ్మయజ్ఞంబును, వ్రతంబులం దహింసయు, యోగంబులం దాత్మయోగంబును, స్త్రీలయందు శతరూపయు, భాషణంబులయందు సత్యభాషణంబును, ఋతువులందు వసంతాగమంబును, మాసంబులలో మార్గశీర్షంబును, నక్షత్రంబులలో నభిజిత్తును, యుగంబులందుఁ గృతయుగంబును, భగవదాకారంబులందు వాసుదేవుండును, యక్షులలోఁ గుబేరుండును, వానరులం దాంజనేయుండును, రత్నంబులందుఁ బద్మరాగంబును, దానంబులలో

నన్నదానంబును, దిథులయం దేకాదశియు, నరులయందు వైష్ణవుండై భాగవతప్రవర్తనం బ్రవర్తించువాఁడును – నివి యన్నియు మద్విభూతులుగా నెఱుంగు' మని కృష్ణుం డుద్ధవునకు నుపన్యసించిన వెండియు నతండి ట్లనియె.

105

తా ॥ అని ప్రార్థింపగా ఆ యాదవ వంశశ్రేష్ఠుడు శ్రీహరి ఉద్ధవునికి, "వెదురులో అగ్ని వలె, శరీరము నందు జ్ఞానం వలె అన్నింట అచ్ఛేద్యుడు (ఛేదింపరానివాడు), అదాహ్యుడు (దహింపరానివాడు), అశోష్యుడు (శోషింపరానివాడు) అయిన జీవుడుంటాడు" అని వివరించాడు. ఉద్ధవుడు, "కృష్ణా! నీవు సనక సనందనాది యోగీంద్రులకు యోగమార్గాన్ని ఎప్పుడు, ఏ రూపంలో ఉపదేశించావో, ఆ కాలాన్ని, ఆ రూపాన్ని నాకు బోధింపవా?" అని అభ్యర్థించాడు. అందుకు శ్రీకృష్ణుడు చెప్పాడు:

"ఒకప్పుడు సనకాదులు బ్రహ్మదేవుని సందర్శించి, దేవా! మోక్షాన్ని కోరుకొనేవారు విషయాలకు లొంగరాదని అంటారు. చిత్తం గుణాలలోకి ఆకర్షింపబడటమూ, గుణాలు వాసనారూపంలో చిత్తం లోనికి ప్రవేశించటమూ జరుగుతున్నది. విషయ చిత్తాల పరస్పర సంబంధాన్ని నశింపజేస్తేనే గాని ఇంద్రియజయం సాధ్యం కాదు. దీనికి పరిష్కారం ఏమిటి? అని అడిగారు. బ్రహ్మదేవుడు తాను కూడా విషయవాసనలకు లొంగి, కర్తవ్యకర్మలను నెరవేరుస్తుండటం వల్ల ఎంత ఆలోచించినా పరిష్కారం తోచక, నాకూ సమాధానం తెలియదని వారికి చెప్పాడు. వారు ఆ సమాధానానికి విస్తుపోయారు. అంతట నేను హంస స్వరూపం ధరించి వారికి చెప్పిన సమాధానం విను.

పరమార్థవస్తువుకు నానాత్వం ఉండదు. దేవతలు, మనుష్యులు మొదలైన రూపాలన్నీ పంచభూతాత్మకాలే కనుక అవన్నీ అభిన్నమైనవే. ఇంద్రియదృశ్యమైన ప్రతి వస్తువు వ్యావహారిక జగత్తు లోనిదే, కాబట్టే అనిత్యం. బ్రహ్మపదార్థం ఒక్కటే నిత్యం. పరమాత్మ భిన్నములైన దేహాదులకు అస్తిత్వం శాశ్వతం కాదు. ప్రారబ్ధకర్మము వలన పొందిన దేహం నిత్యం కాదని

గ్రహించి, ఆ దేహం వల్ల ఏర్పడిన సంసార మమతలను నిరసించి, జ్ఞానఫలంగా భగవత్తత్త్వాన్ని చెందాలి.

స్వప్నంలో దర్శించిన పదార్థం స్వప్నాంతంలో అంతర్హితమైనట్లు కర్మము వలన లభించిన దేహం కర్మానుభవపర్యంతం ఉండి ఆ తర్వాత నశించిపోతుంది.

అని హంస స్వరూపుడునైన నేను సాంఖ్య యోగాన్ని సనకాదులకు వినిపింపగా బ్రహ్మాదిదేవతలు విని గ్రహించారు. వారి మూలాన సాంఖ్యం భూలోకంలో ప్రసిద్ధికెక్కింది. నీవు కూడా ఈ విషయాన్ని ఆకళించుకొని తీర్థసేవనకై పుణ్యాశ్రమాలకు వెళ్ళు. నా యందు భక్తి కలిగి, నేనే లోకంగా ఉన్న భక్తిపరుల పాదధూళి సోకినవారు, తప్తచక్రాంకనాది ముద్రలను ధరించినవారు, హరి దివ్యనామాలను ధరించినవారికి అన్నపానాలను సమకూర్చినవారు, వాసుదేవభక్తులను చూచి హర్షపులకితగాత్రులైన పుణ్యాత్ములందరూ భాగవతులు. సర్వసంగపరిత్యాగం చేసి, అనన్యమైన భక్తితో నన్నే స్మరించినవారికి భుక్తినీ ముక్తినీ ప్రసాదిస్తాను."

అని శ్రీకృష్ణుడు ప్రసంగింపగా ఉద్ధవుడు, ధ్యానయోగాన్ని గురించి చెప్పమని ప్రార్థించాడు. అప్పుడు హరి, "సాధకులు ఏకాగ్రచిత్తులై, చేతులను తొడలపై ఉంచి, దృష్టిని ముక్కుకొనపై నిలిపి, పూరక కుంభక రేచకాలతోనూ, రేచక పూరక కుంభకాలతోనూ ప్రాణాయామం ఆచరించాలి. నా రూపాన్ని హృదయమందిరంలో ప్రతిష్ఠించుకోవాలి. పద్దెనిమిది ధారణా యోగసిద్ధులను తెలుసుకొని, వాటిలో నా యందు ఉన్న అణిమాది సిద్ధులను ముఖ్యంగా గ్రహించాలి. ఇంద్రియాల బాహ్యసంచారాన్ని నిరోధించి, మనస్సును ఆత్మలో లగ్నం చేసి, ఆత్మను ఆత్మతో క్రీడించాలి. బ్రహ్మపదాన్ని పొందదలచిన భాగవతశ్రేష్ఠులు ఇతరధర్మాలను మాని, నన్ను చెందుతారు. పూర్వం అర్జునుడు రణరంగంలో విషాదమగ్నుడైనపుడు నేనతనికి బోధించిన తత్త్వాన్ని చెబుతున్నాను.

చరాచరాత్మకమైన జగత్తుకు పరమాత్మను, సృష్టిస్థితిసంహారకర్తను, ఈశ్వరుణ్ణి నేను. మహత్పదార్థాలలో మహత్తును నేను. సూక్ష్మపదార్థాలలో జీవుణ్ణి నేను. జయించడానికి అత్యంతదుష్కరమైన పదార్థాలలో మనస్సును నేను. దేవతలలో బ్రహ్మను నేను. వసువులలో అగ్నిని నేను. ఆదిత్యులలో విష్ణువును నేను. రుద్రులలో నీలలోహితుడను నేను. బ్రహ్మర్షులలో భృగువును నేను. ఋషులలో నారదుడను నేను. ధేనువులలో కామధేనువును నేను. సిద్ధులలో కపిలమహర్షిని నేను. దైత్యులలో ప్రహ్లాదుడను నేను. గ్రహాలలో చంద్రుడిని నేను. గజాలలో ఐరావతాన్ని నేను. హయములలో ఉచ్చైశ్రవాన్ని నేను. నాగములలో వాసుకిని నేను. మృగాలలో సింహాన్ని నేను. ఆశ్రమాలలో నేను గృహస్థాశ్రమాన్ని. వర్ణములలో ఓంకారాన్ని నేను. నదులలో గంగను నేను. సాగరాలలో క్షీరసాగరాన్ని నేను. ఆయుధాలలో ధనుస్సుని నేను. గిరులలో మేరువును నేను. వృక్షాలలో అశ్వత్థవృక్షాన్ని నేను. ఓషధులలో యవలు నేను. యజ్ఞాలలో బ్రహ్మయజ్ఞాన్ని నేను. వ్రతాలలో అహింసను నేను. యోగాలలో ఆత్మయోగాన్ని నేను. స్త్రీలలో శతరూపను నేను. భాషణలలో సత్యభాషణను నేను. ఋతువులలో వసంత ఋతువును నేను. మాసములలో మార్గశీర్షాన్ని నేను. నక్షత్రాలలో అభిజిత్తును నేను. యుగాలలో కృతయుగాన్ని నేను. భగవదాకారాలలో వాసుదేవుడను నేను. యక్షులలో కుబేరుడను నేను. వానరులలో ఆంజనేయుడను నేను. రత్నాలలో పద్మరాగాన్ని నేను. దానాలలో అన్నదానం నేను. తిథులలో ఏకాదశి నేను. నరులలో వైష్ణవుడు, భాగవతుడై సన్మార్గంలో నడచుకొనేవాడు నా విభూతులు."

అని ఉపన్యసింపగా, కృష్ణునితో ఉద్ధవుడు ఇంకా ఇలా అన్నాడు:

క. "వర్ణాశ్రమధర్మంబులు, నిర్ణయముగ నానతిమ్ము నీరజనాభా! కర్ణరసాయనముగ నవి, వర్ణింపుము, వినెద నేఁడు వనరుహనేత్రా!'



తా ॥ "ఓ పుండరీకాక్షా! పెద్దలు బోధించిన వర్ణధర్మాలను, ఆశ్రమధర్మాలను ఆచారపూర్వకంగా, శ్రద్ధగా పాటించేవారూ, పాటించనివారూ నీ యందు భక్తి కుదురుకొన్న

తర్వాత ఏమేమి చేయాలో వివరించావు. ఎటువంటి స్వధర్మాన్ని అనుష్ఠించితే నీవు చెప్పిన ఆ భక్తి కుదురుకొంటుందో నాకు బోధపడలేదు. నీ నిర్ణయాన్ని ఆజ్ఞాపించు. నువ్వు వర్ణిస్తుంటే చెవులకు అమృతోపమానంగా ఉంటోంది. నేడు వినిపించుము పద్మనాభా!" అని అన్నాడు.

> వ. అనినం గృష్ణుండు నాలుగు వర్ణంబుల యుత్పత్తియు నాలు గాశ్రమంబుల కిట్టిట్టి వర్తంబు లన్నియును, నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులును, బ్రవృత్తి నివృత్తి హేతువులగు పురాణేతిహాస శాస్త్రంబులును, వైరాగ్య విజ్ఞానంబులును నివి మొదలుగాఁ గల వన్నియు నెఱిగించి, "సర్వధర్మాన్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" యను నుపనిషత్తుల్యంబగు గీతావచన ప్రకారంబున నెవ్వఁడేని నా యందు మతి గలిగి వర్తించువాఁడు నే నని పలుకంబడుఁ; బెక్కు విధంబుల వాదంబు లేక? యని యెందును దగులువడక నామీఁదఁ దలంపు గలిగి వర్తింపు' మనిన నుద్ధవుం డిట్లనియె.

107

తా ॥ అంతటితో కృష్ణుడు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణాలు నాలుగింటి పుట్టుకను గురించి, బ్రహ్మచర్య గృహస్థ, సన్న్యాస, వానప్రస్థములనే నాలుగు ఆశ్రమాలు ఏర్పడటం గురించి, ఆ వర్ణాశ్రమధర్మాలను పాటించేవారికి అర్హమైన తీరుతెన్నులు ఇట్లా ఇట్లా ఉంటాయనీ, నాలుగు వేదాలలో చెప్పబడిన ధర్మాలను, ప్రవృత్తిమార్గానికీ, నివృత్తిమార్గానికీ దారితీసే విషయాలు పురాణములలో, ఇతిహాసములలో, శాస్త్రములలో ఏ విధంగా ఉన్నదీ ఆ సంగతులను వివరించి చెప్పాడు. వైరాగ్యం ఎలా కలుగుతుంది? ఏది నిజమైన విజ్ఞానం? ఇత్యాది ప్రశ్నలన్నింటికీ విడమరిచి సమాధానాలు చెప్పాడు. "గీతాశాస్త్రంలో 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' అని చెప్పినది ఉపనిషత్తులకు దీటైన మాట. ఆ ప్రకారం నా యందు సర్వసమర్పణబుద్ధి కలిగి నడుచుకొనేవారు నాతో సమానం; ఇంకా వాదవివాదాలెందుకు? మనస్సును అన్యవిషయాల నుంచి మళ్ళించి, నా యందే లగ్నం చెయ్యి" అన్నాడు. ఉద్ధవుడింకా ఇలా అన్నాడు:

క. 'తెలియనివి కొన్ని సెప్పితి;, తెలియంగల వెల్ల నింకఁ దెలుపుము కృష్ణా! వల నెఱిఁగి మెలఁగ వలయును, నలినాసనజనక! భక్తనతపదయుగళా!'

108

తా ॥ "కృష్ణా! నేనై తెలుసుకోలేనివి కొన్ని ఇప్పుడు అడిగాను కాబట్టి చెప్పావు. ఇంకా నాకు తెలియవలసినవన్నీ చెప్పు. ఆ కమలాసనునికి కన్నతండ్రివి. నీ పాదయుగ్మానికి భక్తులందరూ మోకరిల్లుతారు. ఏమడగాలో తోచకుండా ఉంది. నీవు కాకపోతే ఎవరు చెబుతారు?"

వ. అని యుద్ధవుం డడగినం బ్రబుద్ధమనస్కుం డయిన పుండరీకాక్షుండు 'నీ ప్రశ్నంబులు దుర్లభంబు లయినను వినుము; నియమశమ దమాదులు దపంబును సుఖదుఃఖంబులు స్వర్గనరకంబులు ననం బరఁగినవి యెవ్వి, దరిద్రుం డెట్టివాఁ డీశ్వరుం డెవ్వం, డని నీవు న న్నడిగిన యర్థంబు లెల్ల వేఱు వేఱ వివరించెద;

మౌనవ్రతబ్రహ్మచర్య క్షమాజపతపంబులును, నతిథిసత్కారంబును, బరహితంబును జౌర్యాదిరహితత్వంబును ననునివి మొదలైనవి నియమంబు లనందగు; నింద్రియనిగ్రహంబును, శత్రుమిత్ర సమత్వంబును శమం బనం బరఁగు; మూఢజనులకు జ్ఞానోపదేశంబును, గామ్యత్యాగంబును, సమదర్శనంబును, వైష్ణవ సమూహంబులతోడి భక్తియుఁ, బ్రాణాయామంబును, జిత్తశుద్ధియు ననునివి కలిమి విద్య యనంబడు; శమదమాది గుణరహితుండును, మద్భక్తి విరహితుండును నగుట యవిద్య యనందగుఁ; జిత్తశుద్ధి గలిగి నిత్యతృప్తుండౌట దమం; బిట్టినియమాది గుణ సహితత్వంబును మద్భక్తి యుక్తియు ననునదియే సుఖంబు; నన్నెఱుంగలేక తమోగుణంబునం బరఁగుటయె దుఃఖం బనంబడు; బంధుగురు జనంబులయెడ భేదబుద్ధి నొంది, శరీరంబు నిజగృహంబుగా భావించినవాఁడె దరిద్రుం; డింద్రియ నిరసనుండును, గుణ సంగవిరక్తుండు నైనవాఁడె యీశ్వరుండు;

నాయందుఁ దలంపు నిలిపి, కర్మయోగంబునందును, భక్తి యోగంబునందును వాత్సల్యంబు గలిగి జనకాదులు కైవల్యంబుఁ జెందిరి; భక్తియోగంబునం జేసి బలిప్రహ్లాద ముచుకుందాదులు పరమ పదప్రాప్తులై; రది గావున నిది యెఱింగి నిరంతర భక్తి యోగం బధికంబుగా నీ మనంబున నిలుపుము; మృణ్మయం బైన ఘటంబున జలంబులు జాలుగొను తెఱంగున దినదినంబునకు నాయువు క్షయంబై మృత్యువు సన్నిహితంబై వచ్చుఁ గావున నిది యెఱింగి నిరతంరంబును న న్నేమఱక తలంచుచుండు నతండు నాకుం బ్రియుండు.

109

తా ॥ అని ఉద్ధవుడు కోరగా జ్ఞానస్వరూపుడైన పుండరీకాక్షుడు ప్రసన్నుడై, "నీ ప్రశ్నలు అసామాన్యమైనవి, అయినా విను. నియమము, శమము, దమము ఏ విధంగా సాధించాలి? తపస్సు అంటే ఏమిటి? ఏవి సుఖదుఃఖద్వంద్వాలు? స్వర్గనరకాలేవి? ఎటువంటివాడు దరిద్రుడు? ఈశ్వరుడు ఎవరు? అని ఇంకా నువ్వడిగిన అనేక ప్రశ్నలకు వేరువేరుగా సమాధానం చెబుతాను.

యమం అంటే మౌనము. మనోనిగ్రహాన్ని అలవరచుకొని, జ్ఞానాభ్యాస నిదిధ్యాసనములతో ఆత్మానుసంధానం చేసుకొంటూ మాట్లాడక ఉండటం

అహింస – మనోవాక్కాయములతో ఎవరినీ నొప్పింపక విష్ణుప్రీతికరంగా ఉండటం

సత్యము – యథార్థం మాత్రమే చెప్పటం

అస్తేయము – పరుల సొమ్మును అపహరింపకపోవటం

అసంగము – మనస్సులో ద్వంద్వభావాలు లేకుండటం

హ్రీ – సిగ్గు, అసంచయం – కూడబెట్టకుండటం, ఆస్తిక్యం – భగవంతుని ఉనికి

యందు చెక్కుచెదరని నమ్మకం

స్థైర్యం – మోక్షసాధనకు చేసే ప్రయత్నాలలో విఘ్నాలు తటస్థించినా కర్తవ్యాన్ని విడువక మళ్ళీ మళ్ళీ తీవ్రంగా ప్రయత్నిస్తూనే ఉండటం, అభయం – జ్ఞాననిష్ఠ వల్ల మృత్యుభీతి లేకపోవటం.

బ్రహ్మచర్యము – బ్రహ్మచర్యాశ్రమాన్ని స్వీకరించి వేదాధ్యయనం కావిస్తూ, వీర్యాన్ని కాపాడుకొంటూ, నిరంతరం కేవల బ్రాహ్మీస్థితిలో ఉండటం

క్షమ – ఎట్టి ఒడిదుడుకులకు చలింపని ఓరిమిని కలిగి ఉండటం

అపరిగ్రహం – దానధర్మాలను సాధ్యమైనంతవరకు అంగీకరించకుండా ఉండటం

ఇంకా.....

నియమాలు అంటే బాహ్యాంభ్యంతర శౌచం (శరీరాన్ని స్నానాదులతో ఆరోగ్యంగా, పరిశుభ్రంగా ఉంచుకోవటం)

ఆభ్యంతరశౌచం – అంతఃకరణ శుద్ధి, జపము – గురువు ఇచ్చిన మంత్రాన్ని నియమానుసారం పారాయణ చేయటం

నిత్యసంతుష్టి – ఎప్పటికి ఏది ప్రాప్తమయితే దానిని సంతోషంగా స్వీకరించి తృప్తిచెందటం

గురుసేవ – పెద్దలు, గురువుల శుశ్రూష

తపము – శాస్త్రవిధిని అనుసరించి శరీరాన్ని శుష్కింపజేసుకొంటూ; కాయిక వాచిక మానసిక రూపాలలో సాధన చేసి మనస్సు, ఇంద్రియముల యొక్క ఏకాగ్రతను సాధించటం

హోమము – ఇష్టదేవత నుద్దేశించి మంత్రపూర్వకంగా హవిస్సును అగ్నియందు వేల్చటం

శ్రద్ధ – ధర్మకార్యముల యందలి శ్రద్ధ, ఆతిథ్యము – అతిథిని దేవతగా భావించి సత్కరించటం

తీర్థాటనం – భగవత్కరుణానుభవానికి ఆశ్రయములైన పుణ్యతీర్థములు, క్షేత్రములను దర్శించుకోవటం

స్వాధ్యాయం – వేదాధ్యయనం, ఆత్మపరిశీలన.

పరహితచింతనం – ఇతరుల మేలుకోసం పాటుపడటం

ఈశ్వరారాధనం – భగవంతుణ్ణి భక్తితో, శ్రద్ధతో ఆరాధించటం.

దుఃఖాలను సహించటం తితిక్ష. శత్రువులకైన మిత్రులకైనా ద్రోహం చేయకుండటం దానం. కర్తవ్యం తెలియని మూఢులకు జ్ఞానాన్ని ఉపదేశించటం దక్షిణ. కోరికలను త్యజించటమే సన్న్యాసం. సుఖాలకు పొంగక, దుఃఖాలకు క్రుంగక రెండింటి యందు సమచిత్తం కలిగి ఉండటం సమదర్శనం. విష్ణువునందు భక్తిని కలిగి ఉండటమే ఉత్తమమైన లాభం. ప్రాణాయామం బలం. ఆత్మమునందు కానవచ్చే భేదాన్ని తొలగించేది విద్య. శమదమాది గుణాలు, భగవంతుని యందు భక్తి లేకుండటం, దేహమే ఆత్మ అని భ్రాంతిచెందటం అవిద్య. చిత్తశుద్ధి కలిమి, నిత్యసంతృప్తి ధనం. ఇటువంటి నియమాలతో నా యందు భక్తి గలిగి ఉంటూ సుఖదుఃఖాలను దాటడమే సుఖం. నన్నెరుగలేక ఇంద్రియభోగాలను కోరుకోవటమే దుఃఖ మనబడుతుంది. "వీరు నా బంధువులు", "గురువులు", "పెద్దలు" అని జనులయందు భేదదృష్టిని కలిగి, ఈ దేహమే స్వగృహం అని భావించి సంతోషాన్ని కోల్పోయినవాడే దరిద్రుడు. ఇంద్రియజయాన్ని సాధించి, విషయలాలసుడు కానివాడే స్వతంత్రుడు.

నాయందు చిత్తాన్ని పాదుకొల్పి విధ్యుక్త కర్మలను అనుష్ఠించి, కర్మఫలాలను ఆశించిన

కర్మయోగపరులు, విషయవైరాగ్యంతో కర్మాదులను త్యజించి జ్ఞానయోగాన్ని అనుష్ఠించిన జనకాది మహాపురుషులెందరో ముక్తిపదాన్ని చూరగొన్నారు. నా కథలను విని, నాపై ఆదరంతో భక్తియోగాన్ని అనుష్ఠించిన బలి చక్రవర్తి, ప్రహ్లాదుడు, ముచుకుందుడు మొదలైనవారు పరమపదాన్ని చేరుకొన్నారు.

నేను చెప్పిన విషయాలను మనస్సుకు తెచ్చుకొని, భక్తియోగాన్ని అలవరచుకో. మట్టికుండలో నుంచి బొట్టుబొట్టుగా నీరంతా కారిపోయినట్లు నానాటికి శరీరంలో నుంచి ఆయువు క్షీణించిపోతుండగా మృత్యువు దగ్గర పడుతుంది.

కాలం చేజారక మునుపే నీవు నేను చెప్పినదంతా మననం చేసుకొని, నన్ను ఏమరక నిరంతరం ధ్యానిస్తూ ఉండు.

క. 'గర్భమునఁ బరిజ్ఞానము, నిర్భరమై యుండు జీవునికిఁ దుది నతఁ డా
విర్భూతుఁ డైనఁ జెడు నం, తర్భావం బైన బోధ మంతయు ననఘా!

110

తా ॥ తల్లి గర్భంలో ఉన్న శిశువుకు వెనుకటి జన్మలలో అభిమానరూపంలో ఉన్న జ్ఞానమంతా స్మృతి రూపంలో నిలిచి ఉంటుంది. గర్భం నుంచి వెలువడినప్పుడు ఆ జ్ఞానమంతా నశించిపోతుంది.

వ. అట్లు గావున జనుండు బాల్య కైశోర కౌమార వయోవిశేషంబుల వెనుక నైననుం, బెద్దయైన వెనుకనైనను, న న్నెఱింగెనేనిఁ గృతకృత్యుండగుఁ, సంపద్గర్వాంధుండైన నంధకారకూపంబునం బడు; వానిం దరిద్రునింగాఁ జేసిన జ్ఞానియై యస్మత్పాదారవింద వందనాభి లాషియై ముక్తుండగు; నట్లు గావున దేహాభిమానంబు వర్జించి యైహికాముష్మిక సుఖంబులఁ గోరక మనంబు గుదియించి యే ప్రొద్దు నన్నుఁ దలంచు వాఁడు వైకుంఠపద ప్రాప్తుండగు; నేను నతని విడువంజాలక వెనువెంట నరుగుదు; నారదాది మునులు భక్తి

భావంబునం జేసి నా రూపంబై' రని యుద్ధవునకుం జెప్పిన నతండు మఱియు నిట్లనియె.

111

తా ॥ "జన్మానంతరం జీవుడు బాల్యం, కైశోరం, కౌమారం మొదలైన శరీరావస్థల వెనుక యౌవనం వచ్చేనాటికో కాకపోతే ప్రౌఢత్వం వచ్చేనాటికో నా తత్త్వాన్ని గ్రహించి, నా యందు భక్తి కావిస్తే నా అనుగ్రహబలం వల్ల అభిమానాన్ని విడిచి, ఈ సంసారసాగరం గట్టెక్కుతాడు. సంపదలతో గర్వం పొందినవాణ్ణి చీకటిబావిలోకి నెట్టి నిర్భాగ్యుణ్ణి చేస్తే కళ్ళు తెరుచుకొని జ్ఞాని అయి, నా పాదారవిందాలకు నమస్కరించాలనే కోరిక బలపడి, భక్తి మూలాన ముక్తిని పొందుతాడు. అందువల్ల దేహాభిమానం వదలి, ఐహిక ఆముష్మిక సుఖాలు రెండింటినీ కోరక, మనస్సును ఏకాగ్రం చేసుకొని, ఎల్లకాలం నన్ను స్మరించేవాడు వైకుంఠపదాన్ని పొందుతాడు. నేను అతనిని విడువలేక అతని వెంటే వెళ్తాను. నారదాది మునులు నా యందలి భక్తిభావం వల్లనే సారూప్యానికి నోచుకొని, వైష్ణవాకృతి దాల్చారు." అని చెప్పగా, ఉద్ధవుడు కృష్ణుణ్ణి అడిగాడు:

క. అయ్యా! దేవ! జనార్దన!, నెయ్యంబున సృష్టికర్త నేర్పరియై తా
నొయ్యన నడపును నెవ్వఁడు, సయ్యన నెఱిఁగింపవయ్య! సర్వజ్ఞనిధీ!'

112

తా ॥ "కృష్ణా! నీవు సర్వదేవుడవు. దుష్టజనులను హింసించి, శిష్టజనులను కాపాడే జనార్దనుడవు. పరమేశ్వరుని కరుణతో సృష్టికార్యానికి ఉపక్రమించి, ఈ చరాచరసృష్టిని కావించిన తర్వాత ఈ సమస్తాన్నీ అణగార్చేవాడు ఎవడు? సృష్టిస్థితులను గురించి, అనంతరం జరిగే లయోదంతాన్ని గురించి నాకు చెప్పు. నీవు సర్వజ్ఞుడవు కదా!" అని అడిగాడు.

వ. అనుటయు హరి యుద్ధవునకుం జెప్పె; 'నట్లు మత్ప్రేరితంబులై మహాదాది గుణంబులు గూడి యండంబై యుద్భవించె; నా యండంబువలన నే నుద్భవించితి; నంత నా

నాభివివరంబున బ్రహ్మ యుదయించె; సాగరారణ్య నదీనద సంఘంబులు మొదలుగాఁ గల జగన్నిర్మాణంబు లతని వలనం గల్పించితి; నంత శతానందులకు శతాబ్దంబులు పరిపూర్ణంబైన ధాత్రి గంధంబునం దడంగు; నాగంధం బుదకంబునం గలయు; నా యుదకంబు రసంబున లీనం బగు; నా రసంబు తేజోరూపం బగు; నా తేజంబు రూపంబున సంక్రమించు; నా రూపంబు వాయువందుం గలయు; వాయువు స్పర్శగుణ సంగ్రాహ్యం బైన స్పర్శగుణం బాకాశంబున లయంబగు; నా యాకాశంబు శబ్దతన్మాత్రచే గ్రసియింపఁ బడిన నింద్రియంబులు మనోవైకారిక గుణంబులం గూడి యీశ్వరునిం బొంది, యీశ్వరరూపంబు దాల్చు;

నేను రజస్సత్త్వ తమోగుణ సమేతుండనై త్రిమూర్తులు వహించి, జగదుత్పత్తి స్థితిలయ కారణుండనై వర్తిల్లుదుఁ; గావున నీ రహస్యంబు నీకు నుపదేశించితిఁ, బరమ పావనుండవుఁ బరమ భక్తి యుక్తుండవుఁగ' మ్మని చెప్పె; నంత.

113

తా ॥ అప్పుడు హరి ఉద్ధవునికి చెప్పాడు. "కాలాత్మకుడనైన నాచే ప్రేరేపింపబడి ఈ లోకాల సృష్టిస్థితిలయాలకు కారణస్వరూపమైన బ్రహ్మాండం మునుపు మహదాదిగుణాలను కూడి ఉద్భవించింది కదా, ఆ బ్రహ్మాండంలో నేను వాసుదేవుడనై అవతరించాను. నా నాభిరంధ్రం నుంచి బ్రహ్మ ఉదయించాడు. ఆ బ్రహ్మను నిమిత్తంగా చేసి అతని కర్తృత్వంలో సముద్రాలను, అరణ్యాలను, నదీనదాలను, సమస్త చరాచరాత్మక జగత్తును నిర్మించాను.

అంతలో సృష్టికర్త బ్రహ్మకు నూరు సంవత్సరాల ఆయుర్దాయం పూర్తవుతుంది. అప్పుడు భూతధాత్రి తన గంధతన్మాత్రలో లీనమవుతుంది. ఆ గంధం జలంలోను, ఆ జలం తన గుణమైన రసంలోను, ఆ రసం తేజస్సులోను, తేజస్సు రూపంలోను లీనమవుతాయి. రూపం వాయువులోను, వాయువు స్పర్శగుణంలోను, ఆ స్పర్శగుణం ఆకాశంలోను లయమవుతాయి. అప్పుడు ఆకాశం శబ్దతన్మాత్రలో లీనమైపోతుంది. ఇంద్రియాలు తమకు కారణస్వరూపులైన

దేవతలలో, దేవతలు తమను నియమించిన మనస్సులో, ఆ మనస్సు అహంకారంలో ఈ విధంగా చివరికి సమస్తం నాలోకి విలీనమైపోతుంది. ఆత్మరూపుడనై నేను రజోగుణంతో సృష్టికార్యాన్ని, సత్త్వగుణంతో స్థితికార్యాన్ని, తమోగుణంతో లయకార్యాన్ని నిర్వహిస్తుంటాను. అతిరహస్యములైన సాంఖ్య విధివిశేషాలను నీకు ఉపదేశించాను. దీనితో నీవు పరమపావనుడవు కావాలి. పరమభక్తియుక్తుడవు కావాలి." అని ప్రబోధించాడు.

ఆ. 'రూపు లేని నీకు రూఢిగా యోగులు, రూపు నిల్పి నిన్ను రుచిరభక్తిఁ
గొల్చి యుంద్రు; వారికోర్కుల నిచ్చెద, వేమిలాగు? నాకు నెఱుఁగఁబలుకు.

114

తా ॥ అప్పుడు ఉద్ధవుడు, "నిర్గుణుడవైన నీకు గుణముల ద్వారా కలిగే రూపం ఎలా వచ్చింది? యోగులు నిన్ను సద్భక్తి పూర్వకంగా ఆరాధించినప్పుడు వారి కోర్కెలు నెరవేర్చేందుకు నీవు ఏ గుణాల ద్వారా ఏ రూపంలో ప్రకటమౌతావు? కర్మబంధాల నుంచి తప్పించుకొనగోరుతున్న నీ భక్తుడనైన నాకు ఆ క్రియాయోగ విధమంతా తెలియచెప్పు" అని అడిగాడు.

వ. అని యుద్ధవుం డడిగిన నారాయణుం డిట్లనియె; 'నేను సర్వవర్ణంబులకు సమంబైన పూజాప్రకారం బెఱింగించెద; నాచారంబునంజేసి యొకటిఁ బాషాణమృణ్మయదారువులం గల్పించి, నాదరూపంబుగా నిల్పికొని కొందఱు పూజింతురు; కాంస్యత్రపురజతకాంచన ప్రతిమావిశేషంబు లుత్తమంబు; లిట్లు నా ప్రతిమా రూపంబు లందు మద్భావం బుంచి కొల్చినవారికి నేఁ బ్రసన్నుండ నగుదు; నీ లోకంబున మనుష్యులకు ధ్యానంబు నిలువనేరదు; గావునం బ్రతిమావిశేషంబు లనేకంబులు గలవు; వానియందు సౌందర్యసారంబులు మనోహరంబులు నైన రూపంబుల మనఃప్రసన్నుండనై నే నుండుదుఁ; గావున దుగ్ధార్ణవశాయిఁ గా భావించి ధౌతాంబరాభరణ మాల్యానులేపనంబులను, దివ్యాన్నపానంబులను, షోడశోక్త ప్రకారంబుల రాజోపచారంబులను, బాహ్య

పూజావిధానంబుల నాచరించి మత్సంకల్పితంబులైన పదార్థంబులు సమర్పించి, నిత్యంబును నాభ్యంతర పూజావిధానంబులం బరితుష్టునిం జేసి; దివ్యాంబరాభరణ మాల్యశోభితుండును, శంఖచక్ర కిరీటాద్యలంకార భూషితుండును, దివ్యమంగళ విగ్రహుండునుగాఁ దలంచి ధ్యానపరవశుండైన యతండు నాయందుఁ గలయు; నుద్ధవా! నీ వీ ప్రకారంబు గరిష్ఠనిష్ఠాతిశయంబున యోగనిష్ఠుండవై, బదరికాశ్రమంబు సేరి మత్కథితంబైన సాంఖ్యయోగం బంతరంగంబున నిల్పుకొని, కలియుగావసాన పర్యంతంబు వర్తింపు' మని యప్పమేశ్వరుం డానతిచ్చిన నుద్ధవుండు నానందభరితాంతరంగుండై తత్పాదారవిందంబులు హృదయంబునం జేర్చుకొని, పావనంబైన బదరికాశ్రమంబునకు నరిగె' నని శుకుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పుటయు.

115

తా ॥ అన్న ఉద్ధవుని కోరికకు నారాయణుడు ఈ విధంగా ప్రసంగించాడు. "నేను అన్ని వర్ణాల వారికి యోగ్యమైన పూజావిధానం గురించి చెబుతాను, విను. తమ పెద్దలు నేర్పిన సంప్రదాయాన్ని అనుసరించి రాతితో గాని, మట్టితో గాని, చెక్కతో గాని నా ప్రతిమను నామరూపానుసారం ఏర్పరచుకొని కొందరు పూజిస్తారు. లోహవిగ్రహాలలో కంచుతో చేసినవి, తగరం లేదా సీసంతో చేసినవి, వెండితో చేసినవి, బంగారంతో చేసిన ప్రతిమలు సర్వశ్రేష్ఠం. నా ప్రతిమారూపంలో నేనే కొలువైనట్లుగా భావించి కొలిచేవారికి నేను ప్రసన్నుడనవుతాను.

నిరాకారమైన తేజస్సును ధ్యేయంగా పెట్టుకొని ధ్యానం చెయ్యాలంటే ధ్యానం కుదురుకోవటం కష్టం. అందువల్ల సాధకులు ఎదుట నిల్పుకోదగిన ప్రతిమలనేకం ఉన్నాయి. వాటిలో సర్వాంగసౌష్ఠవంతో మనోహరంగా ఉన్న ప్రతిమను ఎన్నుకొంటే అందులో నేను ప్రసన్నరూపుడనై సులభంగా కానవస్తాను. పాలకడలిపై శయనించినప్పటి నా మూర్తిశోభను ధ్యానించి, ఆ ప్రతిమకు శుభ్రమైన వస్త్రాలను కట్టి, నానావిధాల ఆభరణాలను, పుష్పమాలలను, చందన లేపనాదులను అలంకరించి, విధ్యుక్తంగా పూజించి, రుచికరమైన ప్రసాదాలను

నైవేద్యంగా సమర్పించి, రాజోచితంగా షోడశోపచారాలతోనూ బాహ్యపూజాది విధానాలతోనూ నన్ను అర్చించి, నిండు మనస్సుతో సర్వస్వాన్నీ అర్పించి, మానసిక పూజావిధితో నాకు సంతుష్టిని కలిగించి, నా రూపసౌందర్యాన్ని మనస్సుకు తెచ్చుకొని, దివ్యాంబరాభరణమాల్యశోభితునిగా, శంఖ చక్ర కిరీటాద్యలంకారభూషితునిగా, దివ్యమంగళ విగ్రహునిగా నన్ను ధ్యానించి, మైమరపు చెంది, నిత్యం చరించేవారు కర్మాంతంలో నన్ను కలుసుకొంటారు.

ఉద్ధవా! నువ్వు బదరికాశ్రమానికి వెళ్ళి ఈ ప్రకారం ఏకాగ్రమైన నిష్ఠతో యోగదీక్ష వహించి, నేను బోధించిన సాంఖ్యయోగాన్ని అంతరంగంలో నిలుపుకో." అని పరమేశ్వరుడు ఆనతీయగా ఉద్ధవుడు మహానందభరితుడై, ఆయన పాదారవిందాలను తన హృదయంలో చేర్చుకొని, బదరికాశ్రమానికి బయలుదేరాడు." అని శుకయోగి పరీక్షిత్తుకు చెప్పాడు.

క. చెప్పిన విని రాజేంద్రుఁడు, సొప్పడ 'శ్రీకృష్ణకథలు చోద్యము గాఁగం
జెప్పినఁ దనియదు చిత్తం, బొప్పఁగ మునిచంద్ర! నాకు యోగులు మెచ్చన్.

116

తా ॥ చెప్పగా విని రాజేంద్రుడు, "మునీంద్రా! శ్రీకృష్ణుని కథలు విన్నకొద్దీ నాకెంతో ఆశ్చర్యంగా ఉంటాయి. ఎంత చెప్పినా మనస్సుకు తనివి తీరదు. యోగులైతే ఎన్ని అంతరార్థాలు గ్రహిస్తారో కదా."

తే. అంతటను గృష్ణుఁ డేమయ్యె? నరసిచూడ, యదువు లెట్టులు వర్తించి రేర్పడంగ
ద్వారకాపట్టణం బె వ్విధమున నుండె, మునివరశ్రేష్ఠ! యానతీ ముదముతోడ.'

117

తా ॥ ఆ తర్వాత కృష్ణునికి ఏమయింది? యాదవులు ఏం చేశారు? ద్వారకా నగరానికి అప్పుడేమయింది? శుకయోగివర్యా! సమ్మోదంతో నాకు చెప్పండి."

# శ్రీకృష్ణ బలరాములు వైకుంఠము చేరుట

వ. అనిన రాజునకు శుకుం డిట్లనియె 'నట్లు వాసుదేవుం దన్యాయ ప్రవర్తకు లగు దుష్టుల సంహరించి, న్యాయప్రవర్తకులగు శిష్టులఁ బరిపాలనంబు సేసి, బలరామ సమేతంబుగా ద్వారకానగరంబు వెడలినం గని యాదవులు దమలోఁ దాము మదిరాపానమత్తులై మత్సరంబున నుత్సాహ కలహంబునకున్ గమకించి, కరితురగరథ పదాతి బలంబులతో ననర్గళంబుగా యద్ధసన్నద్ధులై, యుద్ధంబునకుం జొచ్చి మునిశాపకారణంబున నుత్తుంగంబు లయిన తుంగ సమూహంబులు బడలుపడంగఁ బొడుచుచు, వ్రేయుచుం దాఁకునప్పుడు ననియును వజ్రాయుధ సమానంబులై తాఁకిన భండనంబునం బడి ఖండంబులై యొరగు కబంధంబులును, వికలంబులైన శరీరంబులును, విభ్రష్టంబులైన రథంబులును, వికటంబులైన శకటంబులును, వ్రాలెడు నశ్వంబులును, మ్రొగ్గెడి గజంబులునై, యయ్యోధనంబున నందఱుం బొలియుటకు నగి నగధరుండును రాముండునుం జని చని యంత నీలాంబరుం డొక్కత్రోవం బోయి యోగమార్గంబున ననంతునిం గలసె; న ప్పరమేశ్వరుండు మఱియొక మార్గంబునం జని యొక్క నికుంజపుంజంబు చాటున విశ్రమించుటం జేసి చరణంబు వేఱొక చరణంబుమీఁ ద సంఘటించి చంచలంబుగా వినోదంబు సలుపు సమయంబున నొక్క లుబ్ధకుండు మృగయార్థంబుగా వచ్చి దిక్కులు నిక్కి నిరీక్షించుచుండ, వృక్షంబు చాటున న ప్పరమపురుషుని చరణకమలంబు హరిణకర్ణంబు గాఁబోలు నని దానింగని శరంబు శరాసనంబు నందు సంధానంబు సేసి యేసిన నతండు హాహారవంబునం గదలుచుండ నప్పరమేశ్వరుని సన్నిధానంబునకు వచ్చి జగన్నాథుంగాఁ దెలిసి, భయంబున 'మహాపరాధుండను; బాపచిత్తుండను; గుటిల ప్రచారుండ' నని యనేకవిధ దీనాలాపంబులం బలుకుచు బాష్పజల ధారాసిక్త వదనుండైన, సరోజనేత్రుండు వానిం గరుణించి యిట్లనియె. 'నీ వేల జాలింబడెదు? పూర్వజన్మ కర్మంబు లెంత వారికైన ననుభావ్యంబులగుం గాని యూరకపోవ నేరవు; నీవు నిమిత్తమాత్రుండ; వింతియ కాని'

యని వానికిం దెలిపిన వాఁడును 'మహాపరాధులైనవా రూరక పోవరు; దేవగురు వైష్ణవ ద్రోహులకు నిలువ నెట్లగు' నని పవిత్రాంతఃకరణుండై ప్రాయోపవేశంబునం బ్రాణంబులు వర్జించి వైకుంఠ పదప్రాప్తుండయ్యె నప్పుడు.

118

తా ॥ అని కోరగా, రాజుకు శుకదేవుడు ఈ విధంగా చెప్పసాగాడు: "వాసుదేవుడు అధర్మపరులైన దుష్టులందర్నీ సంహరించి, ధర్మవర్తనులైన శిష్టులను పరిరక్షించి, అన్నగారితో కలిసి ద్వారకా నగరం నుంచి బయలుదేరాడు. యాదవులు మదించి, మద్యపానం వల్ల కైపెక్కి, తమలోతాము కలహించుకోవటం మొదలుపెట్టి, ఆ కలహం చిలికి చిలికి గాలివాన కాగా, పోరు ఘోరమై ఏనుగులను, గుర్రాలను, రథాలను, కాల్బలాన్ని ముందుకు నడిపిస్తూ, కనపడ్డవారితో కయ్యానికి కాలుదువ్వసాగారు. తిరుగులేని మునిశాపం కారణంగా, ఎత్తుగా పెరిగిన తుంగ బెత్తాలతో అలసిపోయేలా బాదుకుంటూ, దేవేంద్రుని వజ్రాయుధాల వంటి మహాయుధాలతో ఒకరినొకరు నొప్పించుకొంటూ, భయంకరంగా కలహించుకున్నారు. ఆ కదనంలో ఖండఖండాలుగా తెగి పడిన మొండెములతో, వికలాంగశ్రేణితో, కుప్పకూలిన రథాలతో, ముక్కలు ముక్కలైన బండ్లతో, కూలుతున్న గుర్రాలతో, వ్రాలుతున్న గజాలతో ఆ భూమి నిండిపోయింది. ఆ తుములయుద్ధంలో ఒక్కరూ బ్రతికి బట్టకట్టలేదని గోవర్ధనగిరిధారి చిరునవ్వు నవ్వి, బలరామునితో కలిసి అక్కడినుంచి బయలుదేరి ముందుకు సాగాడు. బలరామదేవుడొకచోట యోగసమాధి వహించి, తన మూలరూపమైన ఆదిశేషుని కలుసుకోగా, పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు వేరొక్క మార్గాన తరలివెళ్ళి, ఒక పొదరిండ్లగమి చెంత విశ్రమించి, ఒక చరణాన్ని వేరొక చరణంపైని లీలగా ఆనించి, ఆత్మానందరతుడై ఉన్న తరుణంలో ఒక బోయవాడు వేట నిమిత్తం జంతువులను వెతుక్కొంటూ ఆ చోటికి వచ్చి, నలుదెసల కళ్ళు పెద్దవి చేసి నిక్కి నిక్కి చూస్తున్నపుడు చెట్టు చాటున ఉన్న పరమపురుషుని చరణకమలం జింక చెవి కాబోలు ననిపించి, దాన్ని చూసి, బాణాన్ని వింటికి ఎక్కుపెట్టి విడిచేసరికి ఆకస్మికంగా వచ్చి తగిలిన శరాఘాతానికి ఆయన హాహారవం చేయగా, ఆ పరమేశ్వరుని సన్నిధానానికి వచ్చి,

సాక్షాత్తు శ్రీ జగన్నాథుడని గుర్తించి, భయభ్రాంతి చెంది, "ఘోరాపరాధం చేశాను, మహాపాపం మూటగట్టుకొన్నాను, నా బ్రతుకంతా హింసాప్రవృత్తి తోనే గడిచిపోయింది" అని పరిపరివిధాల దీనాలాపాలు పలుకుతూ, ముఖమండలం కన్నీటి వరదలై తడిసిపోతుండగా, పుండరీకాక్షుడు అతనిని కరుణించి, "నీవెందుకు శోకించటం? పూర్వపు జన్మలలో చేసుకొన్న పాపపుణ్యాల ఫలితం ఎంతవారికైనా అనుభవించ వలసిందే. కర్మఫలం ఊరికే పోతుందా? నువ్వు నిమిత్తమాత్రుడివి" అని అతనికి తెలియజెప్పేసరికి అతను దుఃఖానికి ఉండబట్టలేక, "ప్రాయశ్చిత్తం లేని ఘోరాపరాధం చేసినవాళ్ళు దుర్గతుల పాలుకాక తీరుతుందా? దేవతలు, గురుజనులకు, విష్ణుభక్తులకు ద్రోహం తలపెట్టినవాళ్ళకు ఈ లోకంలో నిలువ నీడ లేదు" అని పలికి, మనస్సును శ్రీకృష్ణధ్యానంతో పరిశుద్ధం చేసుకొని, ప్రాయోపవేశం పూని, సంకల్పపూర్వకంగా సర్వసంగాలను పరిత్యజించి, ఉపవాసదీక్ష వహించి, కర్మశేషం తీరినందువల్ల ప్రాణాలను విడిచి పరమపదమైన వైకుంఠలోకానికి చేరుకొన్నాడు.

క. దారుకుఁడు గనియె నంతటఁ, జారు నిరూఢావధాను సర్వజ్ఞు హరిన్ మేరునగధీరు దనుజ వి, దారుని నేకాంతపరునిఁ దద్దయు నెమ్మిన్.

119

తా ॥ ఆ సమయాన రథసారధి అయిన దారుకుడు ఏకాంతంలో ఆత్మనిష్ఠుడై, మనోయోగంలో సమాధ్యవస్థను పూని ఉన్న సర్వాత్మరూపుడు, మేరునగధీరుడు, దానవసంహారకర్త అయిన శ్రీహరిని గౌరవాతిశయంతో వీక్షించాడు.

వ. కని యత్యంతభయభక్తి తాత్పర్యంబుల ముకుళిత కరకమలుండై యిట్లనియె.

120

తా ॥ వీక్షించి, ఇంకేమవుతుందోనన్న ఆత్యంతికభయంతోనూ, అమితభక్తితాత్పర్యంతోనూ కరకమలాలను జోడించి, ఇలా అన్నాడు:

తే. 'నిన్నుఁ జూడని కన్నులు నిష్ఫలములు, నిన్ను నొడువని జిహ్వ దా నీరసంబు
నిన్నుఁ గానని దినములు నింద్యములగుఁ, గన్నులను జూచి మమ్మును గారవింపు.'

121

తా ॥ "నిన్ను దర్శించుకోలేని కన్నులు నిరుపయోగాలు. నిన్ను సంకీర్తింపని నాలుక నిష్ప్రయోజకం. నిన్ను కనుగొనని దినాలు నిందింపదగినవి కాకపోతే మరేమిటి? నీ కడగంటి చూపుతో దయారసాన్ని మాపై ప్రసరింపజేసి మమ్మల్ని తరింపజేయి."

వ. అనుచు నా దారుకుండు నిర్వేదనపరుండై యిట్లని విన్నవించె;' యాదవసముద్రం బడంగె; బంధు గురుమిత్రజనంబు లక్కడక్కడం బోయిరి; ద్వారకకుం బోయి సుహృజ్జనంబులతోడ నేమందు?' నని పలుకు నవసరంబున దివ్యాయుధంబులును, దివ్యరథరథ్యంబులు నంతర్ధానంబు నొందె; నారాయణుండు వానితో 'నక్రూరవిదురులకు నీ వృత్తాంతం బంతయుఁ జెప్పుము; సవ్యసాచిం గని స్త్రీబాల గురువృద్ధజనంబులఁ గరిపురంబునకుం గొని చను మనుము; పొమ్మనిన వాఁడును మరలి చని కృష్ణుని వాక్యంబులు సవిస్తరంబుగాఁ జెప్పె! నట్లు సేయు నాలోన ద్వారకానగరంబు పరిపూర్ణజలంబై మునింగె; నంత నెవ్వరికిం జనరాక యుండె; నప్పరమేశ్వరుండును శతకోటి సూర్యదివ్యతేజో విభాసితుండై వెడలి నారాదాది మునిగణంబులును, బ్రహ్మరుద్రాది దేవతలును, జయజయ శబ్దంబుల తోడం గదలి రా నిజపదంబున కరిగె; నన్నారాయణ విగ్రహంబు జలధి ప్రాంతంబున జగన్నాథస్వరూపంబై యుండె' నని శుకుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెనని చెప్పి.

122

తా ॥ అంటూ ఆ దారుకుడు పరమవైరాగ్యభావంతో ఇలా విన్నవించుకొన్నాడు: "యాదవసముద్రం అణగారింది. బంధువులు, గురుజనులు, స్నేహితులు ఇటనీ అటనీ చెల్లాచెదరయ్యారు. ద్వారకకు పోయి మిత్రులందరితో ఏమని చెప్పమంటావు?" అంటుండగానే

దివ్యాయుధాలైన పాంచజన్య సుదర్శన కౌమోదకీ నందకాలతోనూ, గరుడలాంఛనంతోనూ శైబ్య సుగ్రీవ మేఘపుష్ప బలాహక హయాలు పూన్చిన దివ్యరథం ఆకాశాని కెగిరి అంతర్ధానమైపోయింది.

అంతట నారాయణుడు దారుకుని చూచి, "అక్రూర విదురులకు ఈ వృత్తాంతమంతా చెప్పు. అర్జునుణ్ణి కలుసుకొని స్త్రీ బాల వృద్ధులను, పెద్దలందరినీ హస్తినాపురానికి తీసుకొనివెళ్ళమను. నువ్వింక బయలుదేరాలి" అని ఆదేశించాడు.

దారుకుడు మరలివెళ్ళి కృష్ణుని పలుకులను సవిస్తరంగా వారికి వినిపించాడు. వారందరూ ఆయన చెప్పినట్లు చేసినంతనే ద్వారకా నగరం ముంపుకు గురయింది. నలువైపుల నీళ్ళు నిండి, రాకపోకలకు వీలులేకపోయింది.

శ్రీకృష్ణ పరమాత్మ నూరుకోట్ల సూర్యగోళాలు ఒక్కుమ్మడిని తేజస్సులను వెలిగ్రక్కినట్లు దివ్యతేజోమయదేహుడై తరలి, నారదాది మునిగణం, బ్రహ్మరుద్రాదిదేవతలు జయజయధ్వానాలతో కదలివస్తుండగా వైకుంఠమందిరానికి వేంచేశాడు.

శ్రీకృష్ణుడు నిర్గమించిన చోట ఆయన విగ్రహం సముద్రతీరాన జగన్నాథస్వరూపమై వెలసింది." అని శుకదేవుడు పరీక్షిన్నరేంద్రునికి చెప్పాడు.

క. ఈ కథ విన్నను వ్రాసిన, బ్రాకటముగ లక్ష్మి యశము భాగ్యము గలుగుం జేకొని యాయువు ఘనుఁడై, లోకములో నుండు నరుఁడు లోకులు వొగడన్.



తా ॥ ఈ కథను ఆలకించినా, వ్రాసినా నిండైన ఐశ్వర్యం, మంచి కీర్తి, భోగభాగ్యాలు కలుగుతాయి. ఆరోగ్యంతోపాటు దీర్ఘాయువును పొంది, లోకులందరూ తనను మెచ్చుకొంటుండగా మనిషి కలకాలం ఉంటాడు.

చ. నగుమొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చి కాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే
భ గతియు నీల వేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁగాతఁ గనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్.

124

తా ॥ చిరునవ్వులు చిందే అందమైన మోము, చూడ చక్కనైన నడుము, నల్లని మేను, శ్రీలక్ష్మికి ఆటపట్టయిన విశాలవక్షఃస్థలం, ఆజానుబాహువులు, ఒప్పారే కుండలాలతో కూడిన చెవులు, మదించిన ఏనుగు వంటి గంభీరమైన నడక, నల్లని కేశసంపద, దయారసం ఉట్టిపడే చూపులతో విరాజిల్లే శ్రీకృష్ణావతార మహావిష్ణువు కనులు మూసికొన్నప్పుడూ, కనులు తెరచినప్పుడూ ప్రేమతో నాకు తన సన్నిధిని అనుగ్రహిస్తాడు గాక!

క. రాజీవసదృశనయన! వి, రాజితసుగుణా! విదేహరాజవినుత! వి
భ్రాజితకీర్తి సుధావృత, రాజీవభవాండభాండ! రఘుకులతిలకా!

125

తా ॥ పద్మములవంటి కన్నులు గలవాడా! ప్రకాశించే సుగుణాలు గలవాడా! జనకునిచే పొగడబడినవాడా! ప్రకాశించే కీర్తి అనే అమృతంతో ఆవరించబడిన బ్రహ్మాండభాండం గలవాడా! రఘువంశానికి తిలకం వంటివాడా!

మాలిని. ధరణి దుహితృరంతా! ధర్మమార్గానుగంతా!
నిరుపమనయవంతా! నిర్జరారాతిహంతా!
గురుబుధసుఖకర్తా! కోసలక్షోణిభర్తా!
సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా!

126

తా ॥ విచ్చిన చెంగలువల వంటి కన్నులు గల సౌందర్యమూర్తీ! సకల సద్గుణాలతో విలసిల్లే పురుషోత్తమా! విదేహ రాజయిన సీరధ్వజునిచే (జనక మహారాజుచే) కొనియాడబడిన సకల శుభలక్షణోపేతా! తెల్లని వెలుగులను విరజిమ్మే కీర్తి అనే అమృతదీప్తితో ఆవరింపబడిన సమస్త బ్రహ్మాండభాండమూ గల పరమపురుషా!

భూదేవి కుమార్తె సీతమ్మను వలచి, ఆమె వలపుల నందుకొని, అన్యోన్య దాంపత్యసుఖాన్ని అనుభవించిన దేవా! లోకానికి ధర్మమార్గాన్ని బోధించి, ఆ ధర్మరక్షణార్థం నీవే ఆ మార్గంలో పయనించిన ధర్మస్వరూపా! నీతివర్తనలో సాటిలేని స్వామీ! దేవతల శత్రువులందరినీ మట్టుపెట్టిన మహావీరాగ్రేసరా! గురువులైన వసిష్ఠ విశ్వామిత్రులకు, తండ్రిగారైన దశరథ మహారాజుకు; రాక్షసబాధ వల్ల హవిర్భాగాలు అందక తల్లడిల్లిన దేవతాకోటికీ, నీ దయకు నోచుకొన్న మహావిద్వాంసులకూ అఖండమైన ఐశ్వర్యాన్నీ, అంతంలో కైవల్యసుఖాన్నీ అనుగ్రహించిన కరుణామయా! కోసల దేశానికి ఏలికవైన రాజవల్లభా! అమరులకు అధర్మపరుల వలన బాధలు కలిగినప్పుడు అభయదానం చేసి వారి భయాన్ని తొలగించిన అవతారపురుషా! బుధజనుల యొక్క హృదయాలలో విహరించే విశ్వేశ్వరా! శ్రీ రామచంద్ర ప్రభూ!

గద్యము:

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారయ నామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబు నందుఁ గృష్ణుండు భూభారంబు వాపి యాదవుల కన్యోన్య వైరానుబంధంబుఁ గల్పించి, వారల హతంబు గావించుటయు, విదేహర్షభ సంవాదంబును, నారాయణముని చరిత్రంబును, నాలుగు యుగంబుల హరి నాలుగు వర్ణంబులై వర్తించుటయు, బ్రహ్మాది దేవతలు ద్వారకా నగరంబునకుం జని కృష్ణం బ్రార్థించి నిజపదంబునకుఁ రమ్మనుటయు, నవధూతయదుసంవాదంబును, నుద్ధవునకుఁ గృష్ణం

డనేకవిధంబులైన యుపాఖ్యానంబు లెఱింగించుటయు, నారాయణప్రకారం బంతయు దారుకుం డెఱింగి వచ్చి ద్వారకా నివాసులకుం జెప్పుటయుఁ, గృష్ణుండు దన దివ్యతేజంబుతోఁ బరమాత్మం గూడుటయు నను కథలు గల యేకాదశ స్కంధము.

127

తా ॥ ఇది సకలైశ్వర్య వీర్య యశ శ్రీ జ్ఞాన వైరాగ్య శక్తిసంపన్నుడైన పరమేశ్వరుని దయవల్ల సమకూడిన కవిత్వంలో "వైచిత్రి" అనే ప్రాణశక్తిని కలిగి, కేసన మంత్రిగారి కుమారుడై, పుట్టినది మొదలుగా బ్రహ్మవిచారంతో సాహిత్యవిద్యను మెరుగుపరచుకొని సహజపాండిత్యుడు అని పేరెన్నిక గన్న బమ్మెర పోతనామాత్యులవారి అనుంగు శిష్యుడు వెలిగందల నారయ నామధేయునిచే ప్రణీతమైన శ్రీ మహాభాగవతం అనే మహాపురాణంలో శ్రీకృష్ణుడు భూమి బరువును తగ్గించి, యాదవులకు పరస్పరవైరాన్ని కలుగజేసి వారందరినీ అంతమొందిచటం, విదేహ రాజుకు ఋషభపుత్రులైన నవయోగులతో జరిగిన చర్చ, నారాయణ ముని చరిత్ర, నాలుగు యుగాలలో హరి నాలుగు వర్ణాలై వర్తిల్లటం, బ్రహ్మాదిదేవతలు ద్వారకా నగరానికి వెళ్ళి కృష్ణపరమాత్మను ప్రార్థించి స్వస్థానానికి తిరిగి రమ్మనటం, అవధూత యదువుల సంవాదం, ఉద్ధవునికి శ్రీకృష్ణుడు ధర్మనిరూపణార్థం పెక్కు ఉపాఖ్యానాలను బోధించటం, నారాయణుని లీలావిలాసమంతా తెలుసుకొని దారుకుడు వచ్చి ద్వారకా నగరవాసులకు చెప్పటం, శ్రీకృష్ణుడు తన దివ్యతేజంతో పరమాత్మ యందు లీనం కావటం అనే కథలు గల పదకొండవ స్కంధం.

శ్రీమరుదశనపతిశయన!
కామిత మునిరాజ యోగి కల్పద్రుమ! యు,
ద్ధామ! ఘనజనకవరనృప
జామాతృవరేశ! రామచంద్రమహీశా!

1

తా ॥ శ్రీకరుడై అందరి కోరికలనూ తీర్చే వాయువును ఆహారంగా స్వీకరించే సర్పాలకు అధిపతి అయిన ఆదిశేషుణ్ణి పాన్పుగా కలిగిన స్వామీ! మహామునులకు, శక్తిమంతులైన రాజులకు, యోగసిద్ధులకు సైతం వాంఛితఫలాలను ప్రసాదించే కల్పవృక్షం వంటి ప్రభూ! అన్నింటికీ అతీతుడవైన పురుషోత్తమ! బ్రహ్మజ్ఞానులలో సుప్రసిద్ధుడైన జనకమహారాజుకు అల్లుడవైన సర్వేశ్వరా! శ్రీరామావతారంలో సర్వాతిశాయివై భూమిని కాపాడిన పరమపురుషా! అవధరించు.

# ఉపోద్ఘాతము

వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వాసుదేవ నిర్యాణ పర్యంతంబుఁ దజ్జన్మ కర్మంబులు సెప్పిన విని సంతసం బంది య న్నరపాలపుంగవుండు 'మహాత్మా, నారాయణ కథా ప్రపంచంబును, దద్గుణంబులును, నాచారవిధియును, జీవాత్మభేదంబును, హరిపూజా విధానంబును, జ్ఞానయోగ ప్రకారంబును, మొదలైనవి యెఱింగించి విజ్ఞానవంతులగాఁ జేసి మన్నించితి. ఇంక భావికార్యంబు లన్నియు నెఱింగింపు' మనిన శుకుండు రాజున కిట్లనియె.

2

తా ॥ కేవలం భగవత్ప్రసాదం వలన లభించిన దివ్యజ్ఞాన వైరాగ్య భక్తి సమన్వితులై,

శాంత శమదమాది సద్గుణాల వల్ల పరిశుద్ధాంతరంగులై, మహనీయగుణగరిష్ఠులుగా సర్వజనులకు ఆరాధ్యులైన ఆ శౌనకాది మునివరేణ్యులకు అఖిల పురాణాలనూ ఆఖ్యానోపాఖ్యానాలతో, శంకాసమాధానపూర్వకంగా మనస్సుకు హత్తుకొనిపోయే వ్యాఖ్యాన వైఖరితో (వై=నిశ్చయంగా, ఖం=కర్ణపుటాన్ని, రాతి=చొచ్చుకొనిపోయి-మనస్సును తాకేది) భగవన్మాహాత్మ్యాన్ని వివరించి చెప్పగల సూతుడు ఈ విధంగా ప్రసంగించాడు:

"ఆ ప్రకారం శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు వాసుదేవుడు వైకుంఠపదాన్ని అలంకరించి నంతవరకు గల ఆయన అవతారకథలను, జగద్రక్షణ నిమిత్తాలైన ఆయన లీలావిభూతులను చెప్పగా విని, ఆ రాజేంద్రుడు సంతోషాన్ని పొందాడు. శుకయోగి తనకు ఉపదేశించిన తత్త్వార్థాలన్నింటినీ మనస్సులో నెమరువేసుకొంటూ ఇలా అన్నాడు:

"మహాత్మా! నారాయణుడు ధర్మసంస్థాపనార్థం శ్రీకృష్ణుడై జన్మించిననాటి కథావిస్తారాన్ని ఆసాంతం నాకు వినిపించావు.

మానవులు ఇంద్రియవృత్తులను జయించి ద్వంద్వోపశమాన్ని పొందాలంటే విచారణ చేయవలసిన సత్త్వరజస్తమో గుణాల స్వరూపాన్ని వివరించావు.

పరమపదానుభవరూపమైన పురుషార్థసాధనకు గాను శ్రీకృష్ణ పరమాత్మ ఉద్ధవునికి బోధించిన వర్ణాశ్రమ ధర్మాలను, సదాచార విధులను ప్రబోధించావు.

బంధమోక్షాల తత్త్వాన్ని తెలుసుకోవడానికి ఆవశ్యకమైన జీవాత్మభేదాన్ని నిరూపించావు.

ఒక్కొక్క యుగంలో శ్రీహరి అర్చామూర్తుల భేదాలను, ఆ మూర్తి పూజా విధానాలను ఋషభసుతుడైన కరభాజనుడు నిమిచక్రవర్తికి నేర్పినట్లుగాను; ఉపాసకులు భగవంతునికి చేయవలసిన షోడశోపచారాలను, బాహ్యాభ్యంతర పూజావిధులను, వైదిక తాంత్రికారాధనలను; నారాయణుడు ఉద్ధవునికి నేర్పినట్లుగాను -నువ్వు నాకు ఉపదేశించావు.

భక్తియోగానికి వైరాగ్యం ముఖ్యమని చెప్పి, ముముక్షువులను నివృత్తిమార్గానికి నడిపించే జ్ఞానయోగాన్ని వివరించావు. అది మొదలుగా ఎన్నో విశేషాలను బోధించి, అపరోక్షజ్ఞానాన్ని ప్రసాదించి, నన్నొక విజ్ఞానవంతునిగా మన్నన చేశావు.

[శ్రీకృష్ణ పరమాత్మ విలసిల్లిన ద్వాపరం ముగిసింది. కలి ప్రవేశించింది. రక్షకుడు లేక యుగధర్మం మారినప్పుడు] ఇకముందు జరగనున్న పరిణామాలన్నింటినీ తెలియజెప్పు"

అని, కుతూహలాన్ని ప్రకటించాడు.

శుకయోగి రాజుతో ఈ విధంగా అన్నాడు:

క. నరవర! యీ ప్రశ్నములకు, సరి సెప్పఁగ రాదు; నేను సామర్థ్యము చేఁ
బరికించి నీకుఁ జెప్పెదఁ, గర మొప్పఁగ భావికాలగతులన్ వరుసన్.

3

తా ॥ "మహారాజా! నీవు అడిగిన ప్రశ్నకు సమాధానం పరమరహస్యమైనది. ప్రారబ్ధ కర్మాధీనములైన కార్యగతుల విపరీత పరిణామాలను ఎవరికీ చెప్పటం సాధ్యం కాదు. నేను నా దర్శనశక్తితో సమీక్షించి, రానున్న కాలపు పోకడలను ఒక్కొక్కటిగా నీకు వివరించి చెబుతాను.

వ. అందు రాజులప్రకారం బెఱింగించెద; బృహద్రథునకుం బురంజయుండు పుట్టు; వానికి శునకుం డనెడివాఁడు మంత్రియై పురంజయునిం జంపి తా రాజ్యం బేలుచుండు; నంతఁ గొంతకాలంబున కతనికిం గుమారుం డుదయించిన వానికిఁ బ్రద్యోతననామం బిడి పట్టంబు గట్టు; నా భూభుజునకు విశాఖరూపుం డుదయింపంగలం; డాతనికి నందివర్ధనుండు జన్మించు; నీ యేవురు నూటముప్పది యెనిమిది సంవత్సరములు వసుంధరా పరిపాలనంబునం బెంపు వడయుదురు! తదనంతరంబు శిశునాగుండను పార్థివుం డుదయించు; నా మూర్ధాభిషిక్తునకుఁ గాకవర్ణుండు, జనియించు, నా రాజన్యునకు

క్షేమవర్ముఁ డుదయింపఁగలం; డా పృథ్వీపతికి క్షేత్రజ్ఞుం, డతనికి విధిసారుండును, విధిసారున కజాతశత్రుండు, నా భూపాలునకు దర్భకుండును, దర్భకునికి నజయుండు, నతనికి నందివర్ధనుండు, నతనికి మహానందియు ననంగల శైశునాగులు పదుండ్రు నరపాలకు లుద్భవించి షష్ట్యుత్తరత్రిశతి హాయనంబులు గలికాలంబున ధరాతలం బేలుదు; రంతట మహానందికి శూద్రస్త్రీ గర్భంబున నతి బలశాలి యయిన మహాపద్మపతి యగు నందనుం డుదయించు; నతనితోఁ క్షత్రియవంశం బడంగిపోఁ గల; దా సమయంబున నరపతులు శూద్రప్రాయులై ధర్మ విరహితులై తిరుగుచుండ మహాపద్మునకు సుమాల్యుం డాదిగాఁ గల యెనమండ్రు కుమారు లుదయించెదరు; వారు నూఱుసంవత్సరంబులు క్షోణితలం బేలెద; రంతటఁ గార్ముకుండు మొదలుగా రాజనవకంబు నందాఖ్యలం జనియించు; నా నవనందుల నొక భూసురోత్తముం డున్మూలనంబు సేయు; నప్పుడు వారు లేమిని మౌర్యులు గొంతకాలం బీ జగతీ తలంబు నేలుదు; రత్తఱి నా భూదేవుండు చంద్రగుప్తుం డను వానిం దన రాజ్యంబందు నభిషిక్తుంగాఁ జేయంగలం; డంత నాచంద్ర గుప్తునకు వారిసారుండును, వానికి నశోకవర్ధనుండు, నతనికి సుయశస్సును, వానికి సంయుతు, డమ్మహనీయునకు శాలిశూకుం డతనికి సోమశర్ముండు, వానికి శతధన్వుండు, న వ్వీరునకు బృహద్రథుండు నుదయించెదరు; మౌర్యులతోఁ జేరిన యీ పదుగురును సప్తత్రింశదుత్తర శతాబ్దంబులు నిష్కంటంకంబుగా భూపరిపాలనంబు సేసెద; రా సమయంబున బృహద్రథుని సేనాపతి యగు పుష్యమిత్రుడు శుంగాన్వయుఁడతని వధించి రాజ్యంబు గైకొను; నతనికి నగ్ని మిత్రుండను నరపతి బుట్టఁగలవాఁ; డాతనికి సుజ్యేష్ఠుండు, సుజ్యేష్ఠునకు వసుమిత్రుండు, నతనికి భద్రకుండును, భద్రకునకుఁ బుళిందుండు, నా శూరునకు ఘోషుండును, వానికి వజ్రమిత్రుండును, నతనికి భాగవతుండును, వానికి దేవభూతియు నుద్భవించెద; రీ శుంగులు పదుండ్రును ద్వాదశోత్తరశత హాయనంబు లుర్వీపతు లయ్యెద; రంతమీఁదట శుంగకులసంజాతుండైన దేవభూతిని గణ్వామాత్యుండగు వసుదేవుం డనువాఁడు వధియించి, రాజ్యం బేలు; వానికి భూమిత్రుండు, న మ్మహానుభావునకు నారాయణుండును గలిగెదరు; కణ్వవంశజులైన

వీరలు మున్నూట నలువదేను సంవత్సరంబులు మేదినీతలం బేలుదురు; మఱియును.

4

తా ॥ అందులో రాజుల ప్రవర్తన తీరెలా ఉంటుందో తెలియజేస్తాను. వెనుక మగధరాజు బృహద్రథుని వంశం పురంజయుని దాకా వేయి సంవత్సరాలు కొనసాగిన సంగతి నీకు చెప్పాను కదా!

## శిశునాగ వంశం

ఆ పురంజయుడికి శునకుడనే మంత్రి ఉంటాడు. అతను రాజును హత్యచేసి, తానే రాజ్యపాలన మొదలుపెడతాడు. కలియుగంలో ప్రభుభక్తి ఆ విధంగా ఉంటుంది!

కొంతకాలానికి శునకునికి పుత్రసంతానం కలుగగా ప్రద్యోతనుడని పేరుపెట్టి, యుక్తవయస్సు రాగానే అతనికి పట్టాభిషేకం చేస్తాడు. ఆ ప్రద్యోతన రాజుకు విశాఖరూపుడు, అతనికి నందివర్ధనుడు జన్మిస్తారు. ఈ రాజులు అయిదుగురూ మొత్తం నూటముప్పైఎనిమిది సంవత్సరాలు పాలకులై వర్ధిల్లుతారు. ఆ తర్వాత నందివర్ధనునికి శిశునాగుడనే రాజు ఉదయిస్తాడు. ఆ రాజుకు కాకవర్ణుడు జన్మిస్తాడు. ఆ రాజసుతునికి క్షేమవర్ముడు జన్మిస్తాడు. ఆ ధరణీపతికి క్షేత్రజ్ఞుడు, క్షేత్రజ్ఞునికి విధిసారుడు, విధిసారునికి అజాతశత్రుడు, ఆ రాజుకు దర్భకుడు, దర్భకునికి అజయుడు, అతనికి నందివర్ధనుడు, నందివర్ధనునికి మహానంది అని వరుసగా పదిమంది శిశునాగ వంశపు రాజులు శైశునాగులు జన్మించి కలియుగంలో మూడువందల అరవై సంవత్సరాల కాలం భూమండలాన్ని పరిపాలిస్తారు.

## నవ నందులు

ఆ తర్వాత మహానందికి ఒక శూద్రవనిత కడుపున మహాపద్మమనే కోటి లక్షల సంఖ్య గల సంపదకు అధిపతి అయిన నందరాజు ఉదయిస్తాడు. మహాబలశాలి అయినప్పటికీ, అతని

మూలాన సుక్షత్రియవంశం అంతరించి, వర్ణసంకరం మొదలవుతుంది. ఆ సమయంలో రాజులు తమకు విధింపబడిన ధర్మాన్ని విడిచిపెట్టి శూద్రధర్మాన్ని అవలంబిస్తారు. మహాపద్మునికి సుమాల్యుడు మొదలుగా ఎనిమిదిమంది కుమారులు ఉదయిస్తారు. వారు మొత్తం నూరు సంవత్సరాలు భూమండలాన్ని పరిపాలిస్తారు. ఆ తర్వాత కార్మకుడు మొదలుగా గల రాజులు తొమ్మిదిమంది నవ నందులనే పేరిట రాజ్యానికి వస్తారు.

## మౌర్య – శుంగ వంశాలు

ఆ నవ నందులను [చాణక్యుడనే పేరుగల – అని సంస్కృతంలో ఉంది. తెలుగు భాగవతం ఆయన పేరును చెప్పలేదు.] ఒక బ్రాహ్మణోత్తముడు నిర్మూలిస్తాడు. నంద వంశం అంతరించినందువల్ల మౌర్యులు రాజ్యానికి వచ్చి, కొంతకాలం పరిపాలిస్తారు. ఆ బ్రహ్మణ్యుడప్పుడు మౌర్య చంద్రగుప్తుడిని మగధదేశానికి రాజును చేస్తాడు. అంతట చంద్రగుప్తునికి వారిసారుడు, అతనికి అశోకవర్ధనుడు, అతనికి సుయశస్సు, అతనికి [సంగతుడు] సంయుతుడు, ఆ మహానుభావునికి శాలిశూకుడు, అతనికి సోమశర్మడు, అతనికి శతధన్వుడు, ఆ వీరునికి బృహద్రథుడు [బృహద్రథునికి దశరథుడు] ఉదయిస్తారు. మౌర్య వంశానికి చెందిన ఆ పదిమందీ భూమిని ఏ ఆటంకమూ లేకుండా మూడువందల ముప్పై సంవత్సరాల కాలం పరిపాలిస్తారు. బృహద్రథుని సైన్యాధ్యక్షుడైన [పుష్యమిత్రుడు] పుష్యమిత్రుడు అతనిని చంపి, తానే రాజవుతాడు. ఆ పుష్యమిత్రునితో శుంగ వంశీయుల పాలనం మొదలవుతుంది.

పుష్యమిత్రుని కొడుకు అగ్నిమిత్రుడు. అతనికి సుజ్యేష్ఠుడు, సుజ్యేష్ఠునికి వసుమిత్రుడు, అతనికి భద్రకుడు, భద్రకునికి పుళిందుడు, పుళిందునికి ఘోషుడు, ఆ ఘోషునికి వజ్రమిత్రుడు, అతనికి భాగవతుడు, ఆ భాగవతునికి దేవభూతి ఉద్భవిస్తారు. శుంగరాజులు ఆ పదిమంది అధికారం నూటపన్నెండు సంవత్సరాలు కొనసాగుతుంది. ఆ తర్వాత గుణహీనులైన కణ్వుల పరిపాలన మొదలవుతుంది.

అప్పుడు [వ్యసనపరుడైన] దేవభూతిని చంపి అతని అమాత్యుడే, కణ్వ వంశీయుడైన వసుదేవుడనే మహాజ్ఞాని రాజ్యాన్ని ఆక్రమిస్తాడు. అతనికి భూమిత్రుడు, భూమిత్రునికి నారాయణుడు కలుగుతారు. కణ్వ వంశంలో పుట్టిన రాజులు మొత్తం మూడువందల నలభై అయిదేండ్లు ధరణీతలాన్ని పరిపాలిస్తారు.

క. చతురత నీ క్షితి నేలియు, మతిమోహము విడువలేక మానవనాథుల్ సతతముఁ దమ కీ కాలం, బతిచంచల మగుట నెఱుఁగరయ్య మహాత్మా!

5

తా ॥ రాజోత్తమా! ఆ రాజులు స్వప్రయోజనాలను ఆశించి ('కాంక్షతే ప్రయోజనమితి చతురః' అని శబ్దార్థం) అధికారం చేపట్టినందువల్ల, ఈ సమస్త భూమండలాన్నీ పరిపాలించినా – ఇంకా ఇంకా కావాలని, మనస్సులో అవివేకం వలన కలిగే మోహాన్ని (అనాత్మవస్తువుల యందు ఆత్మభావాన్ని) వదులుకోలేక – తమ పదవీకాలం మెరుపు తీగ లాగా క్షణికమని గ్రహింపకపోగా, దాని పట్ల స్వార్థాన్ని పెంచుకొంటారు.

క. నరపతులమహిమ నంతయు, నురగాధిపుఁడైన నొడువ నోపఁడు; ధాత్రిం
జిరకాల మేలి యిందే, పరువడి నడఁగుదురు వారు భ్రాంతులు నగుచున్.

6

తా ॥ స్వార్థపరులైన ఆ రాజుల ఐశ్వర్యవిస్తారాన్ని వేయినోళ్ళు కలిగిన ఆదిశేషుడైనా పూర్తిగా వర్ణించి చెప్పలేడు. ఎంతెంత కాలమో పరిపాలించి, ఏ భూమి తమదన్న భ్రాంతితో అహంకరించారో, చివరికి దానిలోనే అణగారిపోతారు.

క. గజతురగాదిశ్రీ లను, నిజ మని నమ్మంగ రాదు; నిత్యమును హరిన్ గజిబిజి లేక

తలంచిన, సుజనులకును నతనియందుఁ జొరఁగా వచ్చున్.



తా ॥ ఆత్మానాత్మవివేకం లేకపోతేనే అవిద్యా పరిణామములైన బంధాలేర్పడుతాయి. ఈ ఏనుగులు, గుఱ్ఱములు, సిరిసంపదలు – ఇదంతా 'నిజము' (తనది) అని అభిమానించటం, మమకారాన్ని పెంచుకోవటం – తగదు. అజ్ఞానం అనేది ఎప్పుడూ జ్ఞానాన్ని కప్పి ఉంచుతుంది. ఆ 'గజిబిజి' ని (అవిద్యను) వదిలించుకోవాలంటే శ్రీహరి తత్త్వాన్ని గురించి అనునిత్యం ఆలోచన ('తలంపు' = విచారణ) చేస్తూ ఉండాలి. అటువంటి వివేకచిత్తులకు జీవబ్రహ్మైక్యజ్ఞానం సిద్ధించి, తుదకు వారు ఆ శ్రీహరి యందే ఐక్యమవుతారు.

వ. మఱియుఁ గణ్వవంశజుండగు సుశర్ముండను రా జుదయించిన వాని హింసించి తద్భృత్యుం డంధ్ర జాతీయుం డయిన వృషలుం, డధర్మమార్గవర్తియై, వసుమతీచక్రం బవక్రుండై యేలునంత వాని యనుజుండు కృష్ణుం డనువాఁడు రాజై నిలుచు; నా మహామూర్తికి శాంతకర్ణుండును, వానికిఁ బౌర్ణమాసుండును, వానికి లంబోదరుండును, వానికి సిబిలకుండు, నతనికి మేఘస్వాతియు, వానికి దండమానుండును, వానికి హాలేయుం డగు నరిష్టకర్మయు, నతనికిఁ దిలకుండు, నతనికి బురీష సేతుండును, వానికి సునందనుండును, నా రాజశేఖరునకు వృకుండును, వృకునకు జటాపుండును, జటాపునకు శివస్వాతియు, వానికి నరిందముండు, నా భూమీశునకు గోమతియును, వానికిఁ బురీమంతుండు, నతనికి దేవశీర్షుండును, వానికి శివస్కందుండును, నతనికి యజ్ఞశీలుండు, నాభవ్యునకు శ్రుతస్కందుండు, వానికి యజ్ఞశత్రుండు, వానికి విజయుం, డవ్విజయునికిఁ జంద్రబీజుం, డతనికి సులోమధియు నిట్లు పెక్కం డ్రుదయించి నన్నూట యేఁబదియారు హాయనంబులు ధాత్రిం బాలించెద; రంత నాభీరు లేడ్వురు, గర్దభులు పదుండ్రు, గంకవంశజులు పదాఱుగురు, మేదినీభరంబు దాల్చియుండెద; రటమీఁద యవనులెనమండ్రు, బర్బరులు పదునల్గురు దేశాధీశులై యేలెదరు; మఱియుం

బదుముప్వురు గురుండులును, బదునొకండ్రు మౌనులును, వేయుందొమ్మన్నూట తొమ్మిది హాయనంబులు గర్వాంధులయి యేలెద; రటమీఁద నా మౌనవంశజు లగు పదునొకండ్రు త్రిశతయుతంబైన వత్సరంబులు మత్సరంబున నేలెద; రాసమయంబున, గైలికిలు లను యవనులు భూపతు లగుదు; రంత భూతనందుండు నవభంగిరుండు శిశునందుండుఁ దద్భ్రాతయగు యశోనందుండుఁ బ్రవీరకుండు— వీరలు వీరులై షడుత్తరశత హాయనంబు లేలెద; రంత నా రాజులకుఁ బదుముప్వురు కుమారు లుదయంచి యందు నార్గురు బాహ్లికదేశాధిపతు లయ్యెదరు; కడమ యేడ్వురును గోసలాధితు లయ్యెద; రంత వైడూర్యపతులు నిషధాధి పతులై యుండెదరు; పురంజయుండు మగధ దేశాధిపతియై పుట్టి, పుళింద యదు మద్ర దేశవాసులగు హీనజాతిజనులు బ్రహ్మజ్ఞానహీనులై హరిభక్తి విరహితులై యుండ, వారికి ధర్మోపదేశంబు సేసి, నారాయణభక్తి నిత్యంబు నుండునట్లుగాఁ జేసి, బలపరాక్రమవంతులైన క్షత్త్రియవంశంబు లడంచి, పద్మావతీ నగర పరిపాలకుండై యా గంగా ప్రయాగపర్యంతం బగు భూమి నేలఁగలండు; శూద్రప్రాయులగు రాజులును, వ్రాత్యులును, బాషండులు నగు విప్రులును గలిగి సౌరాష్ట్రావంత్యాభీరార్బుద మాళవదేశాధిపతు లయ్యెదరు; సింధుతీరంబులఁ జంద్రభాగాప్రాంతంబులఁ గాశ్మీర మండలంబున మేధాహీనులై మ్లేచ్ఛాకారులగు రాజులు భూభాగం బేలుచు, ధర్మసత్యదయాహీనులై, క్రోధమాత్సర్యంబుల, స్త్రీబాలగోద్విజాతుల వధియింప రోయక, పరధన పరస్త్రీ పరులై, రజస్తమోగుణరతులై, యల్పజీవులై, యల్పబలులై హరిచరణారవింద మకరంద రసాస్వాదులు గాక తమలో నన్యోన్యవైరానుబంధులై సంగ్రామరంగంబుల హతు లయ్యెద; రా సమయంబునఁ బ్రజలు తచ్ఛీల వేష భాషాదుల ననుసరించి యుండెదరు; కావున.

8

తా ॥ అటువంటి సదసద్వివేకం లేని మరికొంతమంది రాజుల వృత్తాంతాలను విను. ఇందాక తెలిపిన కణ్వవంశంలో సుశర్ముడనే రాజు పుడుతాడు; అతనికి బంటు అయిన

వృషలుడనే ఆంధ్ర జాతీయుడు ఆ రాజుని వధించి, అధర్మ మార్గంలో సంచరిస్తూ రాజరికం చేస్తాడు. కొంతకాలానికి అతని తరువాత అతని తమ్ముడైన కృష్ణుడు రాజవుతాడు. ఆ తరువాత శాతకర్ణుడు, పౌర్ణమాసుడు, లంబోదరుడు, శిబిలకుడు, మేఘస్వాతి, దండమానుడు, హాలేయుడైన అరిష్టకర్మ, తిలకుడు, పురీషసేతుడు, సునందనుడు, వృకుడు, జటాపుడు, శివస్వాతి, అరిందముడు, గోమతి, పురీమంతుడు, దేవశీర్షుడు, శివస్కందుడు, యజ్ఞశీలుడు, శ్రుతస్కందుడు, యజ్ఞశత్రుడు, విజయుడు, చంద్రబీజుడు, సులోమధి అనే రాజులు వరుసగా నాలుగు వందల యాభై ఆరేళ్ళు ఈ ధరణిని పరిపాలిస్తారు.

ఆ తరువాత ఆభీర వంశపు రాజులు ఏడుగురు [అవభృతి నగరం రాజధానిగా] పాలకులవుతారు. గర్దభులు పదిమంది; కంక వంశీయులు పదహారుగురు [అతిస్వార్థపరులు] భూమి భారాన్ని వహిస్తారు.

## యవన తురుష్కాదులు

ఆ తరువాత యవను లెనిమిదిమంది, పధ్నాలుగురు బర్బరులు (తురుష్క జాతీయులు), [ఆ తర్వాత పదుగురు మురుండులు అని సం.] పదముగ్గురు గురుండులు, పదకొండుమంది మౌన వంశానికి చెందిన రాజులు, [తదనంతరం అరవైఅయిదుమంది ఆభీరాదులు] – మొత్తం వేయిన్ని తొంభైతొమ్మిదేండ్లు పరిపాలిస్తారు. మౌనులు మూడువందల సంవత్సరాలుంటారు. వారందరూ అంతరించిన తర్వాత కిలికిల నగరాన్ని రాజధానిగా చేసికొని భూతనందుడు [వంగిరి–అని సం.], నవభంగిరుడు, అతని సోదరుడు యశోనందుడు, ఆ తరువాత ప్రవీరకుడు – క్రమంగా నూటఆరు సంవత్సరాల కాలం పరిపాలిస్తారు. భూతనందునికి; ఆ తక్కిన రాజులకూ పుట్టిన కొడుకులు పదముగ్గురికి 'బాహ్లికు' లని పేరు వస్తుంది. వీరిలో ఆరుగురు బాహ్లిక దేశానికి అధిపతులుగాను, మిగిలిన ఏడుగురూ కోసల దేశాధిపతులుగానూ వ్యవహరిస్తారు.

## కలి ప్రభావం వలన ధర్మచ్యుతి

ఇక మగధదేశంలో పురంజయుడు రాజుగా పుళింద, యదు, మద్రక దేశాలలో నివసిస్తున్న శూద్రజనులు బ్రహ్మజ్ఞానశూన్యు లైనందువల్ల శ్రీహరి తత్త్వాన్ని తెలిసికొనలేక భక్తిదూరులై ఉన్నారని చింతించి, వారికి శ్రేయోధర్మాన్ని ఉపదేశించి, ఆ ప్రాంతాలలో నారాయణుని యందు భక్తిని వ్యాపింపజేసి, బల విక్రమోపేతులైన దుష్ట క్షత్రియుల వంశాలను అణచివేసి, పద్మావతీ నగరం రాజధానిగా గంగానది జన్మించిన చోటినుంచి ప్రయాగ వరకు గల భూతలాన్ని అతను పరిపాలిస్తాడు.

క్రమక్రమంగా దేశమంతటా అధర్మం తాండవిస్తుంది. సౌరాష్ట్రం, అవంతీ, ఆభీరమూ, అర్బుదమూ, మాళవము అనే దేశాల్లో ధర్మమార్గం ఇదీ అని ఉపదేశించేవారు లేక, రాజులు వారి వారికి విధించబడిన షోడశ సంస్కారాలను పాటించక, వేదబాహ్యములైన వాటిని అనుసరించే వారుగా ఉంటారు. సింధునదీ తీరప్రాంతాలలో, చంద్రభాగా నదీతటాల వద్ద, కాంచీ నగరంలో [కౌంతీ నగరాన, ] కాశ్మీర మండలం లోనూ ఇటువంటి రాజులుంటారు. వారికి తెలివి తేటలు ఉండవు. చాతుర్వర్ణ్యం స్వధర్మానికి దూరమవుతుంది. పాపవర్తనులు భూపాలకులవుతారు. పేరుకే రాజులు అయిన అటువంటివారి పాలనలో మ్లేచ్ఛధర్మం, విచ్చలవిడితనం పెచ్చరిల్లుతాయి. వారు అధర్మపరులై అనాచారాన్ని వ్యాప్తికి తెస్తారు. లోకానికి శ్రేయస్సును, అభ్యుదయాన్ని కూర్చే విధియుక్తమైన ధర్మమన్నా, కష్టాలలో ఉన్నవారిని చూస్తే సాయం చేయాలనిపించే దయాగుణం అన్నా, సర్వకాల సర్వావస్థలలోనూ యథార్థజ్ఞానస్వరూపమైన సత్యమన్నా, వారికి ఏ మాత్రం పొడగిట్టదు. క్రోధంతో మాత్సర్యంతో స్త్రీలను, పసిపిల్లలను, పశుసంపదను, బ్రాహ్మణులను చంపడానికైనా వెనుకాడరు. పరుల ఆస్తిపాస్తులన్నా, పరకాంతలన్నా అంతులేని వ్యామోహం. రజస్తమోగుణాలు ప్రబలుతాయి. అల్పజీవులు, బలహీనులు అవుతారు. శ్రీహరి పాదారవింద మకరంద మాధుర్య రసాన్ని ఆస్వాదింపకపోగా, అజ్ఞానవశాన పరస్పరవిద్వేషాలను పెంచుకొని, యుద్ధాలకు పాల్పడి,

రణరంగంలోనే హతమవుతారు. ఆ సమయంలో ప్రజలు సైతం వారి దుశ్శీలాన్ని, అధర్మవేషాన్ని, మ్లేచ్ఛభాషావ్యవహారాదులను అనుకరించి ధర్మ బాహ్యులవుతారు. దాని ఫలితంగా –

క. దినదినమును ధర్మంబులు, ననయము ధర నడఁగిపోవు నాశ్చర్యముగా విను వర్ణ చతుష్కములో, నెనయఁగ ధనవంతుఁడైన నేలు ధరిత్రిన్.

9

తా ॥ లోకంలో నానాటికీ సత్యము – శౌచము – దయ – దానము మొదలుగా గల ధర్మాలన్నీ అడుగంటిపోతుంటే, ఆశ్చర్యంగా ఉంటుంది. ఇంకా విను : ధర్మవ్యతిక్రమం వల్ల అంతా తారుమారై, నాలుగు వర్ణాల వారిలో ఎవడైనా సరే, డబ్బుంటే చాలు ('ఎనయఁగ' = క్షత్రియులతో సమానంగా), భూమిని పరిపాలించవచ్చు.

క. బలవంతుఁ డైనవాఁడే, కులహీనుండైన దొడ్డగుణవంతుఁ డగుం
గలిమియు బలిమియుఁ గలిగిన, నిల లోపల రా జతండె; యేమన వచ్చున్?

10

తా ॥ బలవంతుడయితే చాలు : కులం లేకపోయినా గొప్ప గుణవంతుడని అంటారు. బలిమితోపాటు కలిమి కూడా ఉంటే – ఇక చెప్పేదేముంది? లోకానికి అతడే ప్రభువు.

వ. అట్లుగాక జనంబులు లోభులై జారత్వ చోరత్వాదులచేత ద్రవ్యహీనులై వన్యశాక మూలఫలంబులు భుజించుచు, వన గిరి దుర్గంబులం గృశీభూతులై దుర్భిక్ష శీత వాతాతప క్షుధా తాపంబులచేత భయంపడి, ధనహీనులై యల్పాయుష్కులు, నల్పతర శరీరులునై యుండ రాజులు చోరులై సంచరించుచు, నధర్మ ప్రవర్తనులై వర్ణాశ్రమ ధర్మంబులు విడనాడి, శూద్రప్రాయులై యుండెద; రంత నోషధు లల్పఫలదంబులు, మేఘంబులు జలశూన్యంబులు, సస్యంబులు నిస్సారంబులు నగు; నిట్లు ధర్మ మార్గంబు దక్కి యున్న

యెడ ముకుందుండు దుష్ట నిగ్రహ శిష్ట పరిపాలనంబుల కొఱకు శంబలగ్రామంబున విష్ణుయశుండను విప్రునకుఁ గల్క్యవతారుండై దేవతాబృందంబులు నిరీక్షింప, దేవదత్త ఘోటకారూఢుండై దుష్టమ్లేచ్ఛ జనంబులం దన మండలాగ్రంబున ఖండీభూతులం జేయు; నప్పుడు ధాత్రీమండలంబు విగతక్రూర జనమండలంబై తేజరిల్లు; నంత నరులు విష్ణుధ్యానవందన పూజాదివిధానాసక్తులై నారాయణ పరాయణులయి వర్తిల్లెద; రిట్లు కల్క్యవతారంబున నిఖీల జనులు ధన్యు లయ్యెద; రంతటఁ గృతయుగ ధర్మంబయి నడచుచుండు; జంద్ర భాస్కర శుక్ర గురువు లేకరాశి గతు లయినం, గృతయుగం బయి తోఁచు; రాజేంద్రా, గత వర్తమాన భావికాలంబులు భవజ్జన్మంబు మొదలు నందాభిషేక పర్యంతంబుఁ బంచదశాధికశతోత్తర సహస్ర హాయనంబు లయియుండు; నంతట నారాయణుం డఖీలదుష్ట రాజధ్వంసంబు గావించి ధర్మంబు నిలిపి వైకుంఠనిలయుం డగు నని చెప్పిన.

11

తా ॥ అందువల్ల జనులు కలిమి కోసం దయాదాక్షిణ్యాలు లేని పెనులోభులవుతారు. ధర్మాన్ని కాదనుకొన్నాక, సమాజంలో కట్టుబాట్లు సడలి వ్యభిచారానికి, చివరికి దొంగతనాలకు అలవాటుపడి, ఎంత సంపాదించినా అది బూడిదపాలై, చివరికి ద్రవ్యహీనులవుతారు. పొట్టకూటికి లేక, అడవుల్లో దొరికిన అపక్వ శాకాలను (పచ్చి కాయగూరలను) తింటూ కాలం గడుపుతారు. అనువు కాని చోట్ల, అడవులలో కొండ గుహలలో తలదాచుకోవలసి వచ్చి, శరీరారోగ్యం క్షీణిస్తుంది. కరవుకూ కాటకానికీ; చలికీ ఎండకూ; ఆకలికీ దాహానికీ తపించి, తల్లడిల్లి భయార్తులవుతారు. పేదరికం మీదపడి, నిస్సత్తువ ఆవరించి, అల్పసారులూ అల్పాయుష్కులూ అయిన ప్రజలను రాజులే దొంగలై దోచుకొంటారు. వర్ణధర్మాలను, ఆశ్రమధర్మాలను కూలద్రోసి తామే అకార్యాలను చేస్తూ ధర్మభ్రష్టులై సంచరిస్తారు.

అప్పుడు రోగాలను హరింపజేసే ఓషధీలతలకు జీవశక్తి లోపించి, వాటితో రూపొందే

ఔషధాల గుణం అతిస్వల్పంగా ఉంటుంది. మబ్బులు వట్టిపోతాయి. [ఓషధులు అణుప్రాయములు అవుతాయని, మేఘాల నుంచి మెరుపులు మాత్రమే పుడతాయని, చెట్లు ఎత్తు తగ్గి నీడనివ్వలేనంత చిన్నవి అవుతాయని, పండిన పంటలు పైపొట్టుతో సమానంగా నిస్సారంగా ఉంటాయని – సంస్కృత మూలం.] పండే పంటలలో సారమూ సమృద్ధీ ఉండదు.

## కల్క్యవతారం

ఆ విధంగా లోకంలో ధర్మం పూర్తిగా అడుగంటినప్పుడు, తనను అనన్యభక్తితో ఆరాధించే భక్తులకు శాశ్వతమైన కైవల్యపదాన్ని ప్రసాదించే ముకుందుడు దుష్టులను శిక్షించి, శిష్టులను కాపాడటం కోసం 'శంబల' అనే గ్రామంలో విష్ణుయశుడనే బ్రాహ్మణునికి తనయుడై, కల్కి రూపంలో అవతరిస్తాడు. సమస్త దేవతాసమూహం తన దుష్టసంహార లీలకై ఎదురుచూస్తూ ఉండగా – దేవదత్తమనే మహాశ్వాన్ని అధిరోహించి, శిష్టాచారవిహీనులయిన మ్లేచ్ఛులను (అంటే – ఆర్యావర్తానికి వెలుపల వర్ణాశ్రమధర్మాల వ్యవస్థ లేని చోట్లలో నివసించే దురాచారులను, వారి మార్గాన్ని అనుసరించేవారిని) తన ఖడ్గంతో ఖండఖండాలుగా నరికివేస్తాడు.

## కృతయుగ ధర్మారంభం

అప్పుడు ధరణీమండలం సాధుహింస చేసేవారు లేక శాంతిసౌఖ్యాలతో వెలుగొందుతుంది. మానవులు విష్ణువు యొక్క ధ్యానము, వందనము మొదలైన పూజావిధానాల పట్ల మనస్సును లగ్నంచేసి, శ్రీమన్నారాయణుని యందు అత్యంతాసక్తితో భక్తితత్పరులై ఉంటారు. ఆ విధంగా వాసుదేవుని కల్కి రూపావతారం వల్ల సకలజనులు కృతార్థులవుతారు. అప్పుడు విశ్వమంతటా కృతయుగపు ధర్మం తిరిగి నెలకొంటుంది.

రాశిచక్రంలో చంద్రుడు, సూర్యుడు, శుక్రుడు, బృహస్పతి ఒకే రాశిలోఉన్న తరుణంలో కృతయుగం మొదలవుతుంది.

రాజేంద్రా! ఎన్నడో జరిగినవి, ఇప్పుడు జరుగుతున్నవి, రానున్న కాలంలో సంభవింపనున్నవి అయిన వృత్తాంతాలను నీకు విశదీకరించాను. నువ్వు పుట్టిన నాటినుంచి నందునికి పట్టాభిషేకం జరిగే నాటికి వేయిన్నూటపదిహేను సంవత్సరాలు గడుస్తాయి. అప్పుడు శ్రీహరి పాపకర్ములైన రాజులందరినీ సంహరించి, లోకంలో ధర్మాన్ని ప్రతిష్ఠించి, వైకుంఠపదాన్ని అలంకరిస్తాడు.'

అని శుకయోగీంద్రుడు పలుకగా, పరీక్షిత్తు –

క. 'మునినాథ! యే విధంబున, ఘనతరముగఁ జంద్రసూర్య గ్రహముల జాడల్ సనుఁ? గాలవర్తనక్రమ, మొనరఁగ నెఱిఁగింపయ్య ముదము దలిర్పన్.'

12

తా ॥ 'మునీంద్రా! చంద్రగ్రహం, సూర్యగ్రహం సంచరించే మార్గాలేమిటి? కాలవర్తన క్రమం ఎట్టిది? నాకు అర్థం అయ్యేలాగా వివరించి ఆనందం చేకూర్చమ' ని అడిగాడు.

వ. అనిన నట్లకాక యని చెప్పందొడంగె; 'వినుము; సప్తర్షి, మండలాంతర్గతంబు లయిన పూర్వ బుక్షద్వయి సమమధ్యంబునందు నిశాసమయంబున నొక్క నక్షత్రంబు గానిపించిన కాలంబు మనుష్యమానంబున శతవత్సర పరిమితం బయ్యెనే, నా సమయంబున జనార్దనుండు నిజపదంబునం బొదలె; నా వేళనె ధాత్రీమండలంబు గలి సమాక్రాంతం బయ్యెఁ; గృష్ణుం డెంతకాలంబు భూమి యందుఁ బ్రవర్తించె, నంతకాలంబును గలి సమాక్రాంతంబు గాదు; మఘానక్షత్రంబందు సప్తర్షులు నే ఘస్రంబునఁ జరియింతు రా ఘస్రంబునఁ గలి ప్రవేశించి వేయు నిన్నూఱు వర్షంబు లయి యుండు, నా ఋషిసంఘంబు పూర్వాషాఢ కరిగినం గలి ప్రవృద్ధంబు నొందు; నే దివసంబున హరి పరమ పదప్రాప్యం డయ్యె. నా దివసంబునంద కలి ప్రవేశించి దివ్యాబ్దసహస్రంబులు సనిన యనంతరంబు నాల్గవ పాదంబునఁ గృతయుగధర్మంబు ప్రాప్తం బగు.

తా ॥ పరీక్షిత్తు కోరిక కాలస్వరూపుడైన భగవానుని ఉనికిని వర్ణించడానికి ప్రాతిపదికమని గ్రహించి, శుకయోగి 'అలాగే!' అని, కాలవర్తన క్రమాన్ని చెప్పటం మొదలుపెట్టాడు.

## సప్తర్షి మండలం

మహారాజా! విను. ఆకాశంలో సప్తర్షిమండలం ఉన్నది కదా. (ఒక్కొక్క మనువు పరిపాలన కాలంలోనూ ఈ మండలంలోని ఋషులు ఏడుగురూ మారుతుంటారని చెప్పాను. ఇప్పుడు జరుగుతున్న వైవస్వత మన్వంతరంలో బ్రహ్మమానసపుత్రులైన మరీచి, అంగిరసుడు, పులస్త్యుడు, వసిష్ఠుడు, పులహుడు, అత్రి, క్రతువు సప్తర్షులు. వీరే సప్తర్షిమండలంలో ఉంటారు.)

తూర్పున మొనతేలి ఉన్న బండి ఆకారంలో ఈ సప్తర్షి మండలం అగుపిస్తుంది. (అందులో అగ్రస్థానంలో ఉన్నవాడు మరీచి. ఆయనకు పడమటి వైపున అరుంధతీ సమేతుడయిన వసిష్ఠమహర్షి, అక్కడి నుంచి పశ్చిమాన కొంచెం పైకి అంగిరసుడు, ఇంకా పడమట చతురస్రాకారంగా అమరిన నాలుగు తారలలో ఈశాన్య దిక్కున అత్రి, ఆయనకు దక్షిణాన పులస్త్యుడు, పశ్చిమాన పులహుడు, ఉత్తరాన క్రతువు ఉన్నారు.) ఈ సప్తర్షిమండలం ఉదయించినప్పుడు మునుముందుగా రెండు తారలు కనబడతాయి. ఆ రెండింటికీ సరిగా నడిమిభాగంలో రాత్రివేళ ఒక నక్షత్రం కనిపిస్తుంది.

రాజా! అది కనిపించినప్పుడు మనుష్యగణనం ప్రకారం కాలం వంద సంవత్సరాలకు శ్రీకృష్ణుని అవతార పరిసమాప్తి జరిగింది. శ్రీకృష్ణుడు భూమిమీద ఉన్నంతకాలం కలి ప్రవేశించలేదు. మఖ నక్షత్రంలో సప్తర్షులు ప్రవేశించేనాటికి కలి ప్రవేశం జరిగి పన్నెండు వందల సంవత్సరాలు అవుతోంది. (ఈ సప్తర్షులు ఒక్కో నక్షత్రంలో మన గణన ప్రకారం వంద సంవత్సరాలు ఉంటారు.)

సప్తర్షిమండలం అనేకానేక ఆవృత్తుల తర్వాత పూర్వాషాఢలోనికి ప్రవేశించినప్పుడు కలిపురుషుడు మరింతగా విజృంభిస్తాడు. కలి ప్రవేశించి ఎన్నో వేల దివ్యసంవత్సరాలు గతించిన తర్వాత, కలియొక్క నాలుగవ పాదం చివరి రోజులలో, తిరిగి కృతయుగపు ధర్మం మొదలవుతుంది.

చ. నరవర! తొంటి భూపతుల నామగుణంబులు, వృత్తచిహ్నముల్,
సిరియును, రూపసందలుఁ, జెన్నగురాజ్యము, లాత్మవిత్తముల్.
వరుస నడంగెఁ గాని, యట వారల కీర్తులు నిర్మలంబులై
యురవడి భూమిలో నిలిచి యున్నవి నేఁడును రాజశేఖరా!

14

తా ॥ నరేంద్రా! పూర్వం ఒకప్పటి గొప్ప గొప్ప రాజుల పేర్లు, వారి వారి గుణగణాలు, వారి కథలూ జ్ఞాపకాలూ, లక్ష్మీవిలాసం, అందచందాలు, ఐశ్వర్యాలు, రాజ్యవైభవాలు, కూడబెట్టిన సొమ్ములు – ఒక్కటొక్కటే కాలగర్భంలో కలిసిపోయాయి. కాని, వారు చేసిన సత్కార్యాల వల్ల కలిగిన కీర్తులు మాత్రమే ఏ కళంకమూ లేకుండా ఈ నాటికీ సుస్థిరంగా భూతలాన నిలిచి ఉన్నాయి.

వ. శంతనుని యనుజుం డగు దేవాపియు, నిక్ష్వాకువంశజుం డగు మరుత్తును, యోగయుక్తులై కలాపగ్రామ నిలయులై కలియుగాంతంబున వాసుదేవప్రేరితులై, ప్రజల నాశ్రమాచారంబులు దప్పకుండ నడపుచు, నారాయణ స్మరణంబు నిత్యం బొనర్చి, కైవల్యపదప్రాప్తు లగుదు; రి క్కరణి నాలుగు యుగంబుల రాజులును నే నెఱింగించిన పూర్వరాజన్యులును, వీ రందఱును సమస్త వస్తు సందోహంబుల యందు మమత నొంది యుత్సాహవంతులై యుండి పిదప నీ భూతలంబు వదలి నిధనంబు నొందిరి; కావునఁ గాలంబు జూడ యెవ్వరికిం గానరాదు; మత్పూర్వులు హరిధ్యానపరవశులై దయా సత్య శౌచ శమ దమాది ప్రశస్తగుణంబులం బ్రసిద్ధులై నడచి; రట్లు గావున.

తా ॥ కాని, శంతనుని సోదరుడు దేవాపి, ఇక్ష్వాకుని వంశంలో పుట్టిన మరుత్తు – అనేవారు మాత్రం పూర్వపు రాజుల వలె కాకుండా ఆత్మయోగం వల్ల జీవితులై, 'కలాప' మనే గ్రామంలో నివాసం ఏర్పరచుకొని, శ్రీ వాసుదేవునిచే నియోగింపబడి, భాగవతధర్మాన్ని నెలకొల్పుతారు. బ్రహ్మచర్య గార్హస్థ్యాది ఆశ్రమాలలో ఉన్న ప్రజలను ఆచారప్రభవమైన ధర్మమార్గం తప్పకుండా సంరక్షిస్తారు. అనునిత్యం శ్రీమన్నారాయణుని స్మరించి, తత్పుణ్యఫలంగా పరమసుఖాన్ని ప్రసాదించే పునరావృత్తిరహితమైన కైవల్యముక్తిని పొందుతారు.

ఈ విధంగా నాలుగు యుగాలలోని రాజులూ, నేను చెప్పిన ఒకనాటి రాజన్యులూ (మహారాజుకు జన్మించి, పారంపర్యక్రమాన రాజైనవాళ్ళు రాజన్యులు) కంటికి కనిపించిన సమస్తవస్తువుల యందు 'ఇది నాది' అన్న లౌకికమైన మమకారానికి లోనై, 'ఇది నాకే చెందాలి' అన్న దురాశకు పాల్పడి, ఆ వస్తువులను పొందటం కోసం ఎంతో ఉత్సాహంతో ప్రయత్నాలు చేస్తూ – నిషిద్ధకర్మాచరణపరులై, చివరికి ఈ భూతలాన్ని విడిచి కాలధర్మం చెందినవారే. కాలం నుంచి ఎవరూ తప్పించుకోలేరు. కాలస్వభావం ఏమిటో ఎవరికీ తెలియదు. కాబట్టి ధర్మంగా నడుచుకోవటం ఒక్కటే కర్తవ్యం.

నీకు మునుపు మీ పెద్దలు ధర్మజ, భీమార్జునాదులు శ్రీ వాసుదేవ భగవద్ధ్యానతత్పరులై భూతదయ, సత్యవర్తన, సాత్త్వికాహార స్వధర్మనిష్ఠలతో శుచిగా ఉంటూ శమము (విషయవాసనలను పూర్తిగా వదలివేయటం), దమము (బాహ్యములైన ఇంద్రియవృత్తులను నిగ్రహించి మనస్సును అదుపులోకి తెచ్చుకోవటం) మొదలుగా గల శ్రేష్ఠ సద్గుణాలను అలవరచుకొని సిద్ధిపొందారు. నీవు చేయవలసినదీ అదే.

క. ధర్మము సత్యముఁ గీర్తియు, నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసావ్రతమును, నర్మిలి గలవారె పుణ్యు లవనీనాథా!

తా ॥ ఓ మహారాజా! ధర్మము (అభ్యుదయాన్నీ మోక్షాన్నీ కలిగించే వేదోక్తవిధి), సత్యము (సర్వకాల సర్వావస్థలలోనూ సత్ప్రవర్తనను కలిగి ఉండటం), కీర్తి (మచ్చలేని మంచి పేరు), స్వార్థమలినం లేని భూతదయ, నిస్తులమైన విష్ణుభక్తితో చేసే సత్కర్మాచరణ, మనోవాక్కాయ కర్మలచే ఎన్నడూ ఎవరికీ ఏ బాధనూ కలిగించని అహింసావ్రతం, అందరినీ ఒక్క తీరున ప్రేమించే స్వభావమూ కలవారే పుణ్యాత్ములు.

తే. ఈ జగం బేలు తొల్లిటి రాజవరులు, గాలవశమున నాయువుల్ గోలుపోయి
నామమాత్రావశిష్టు లైనారు; గాన, చెప్పవలవదు మమత నెచ్చట నృపాల!

17

తా ॥ జగమంటేనే 'ప్రళయం వైపు నడిచేది' అని అర్థం. అటువంటి అస్థిరమైన ఈ జగాన్ని పరిపాలించిన ఒకనాటి రాజోత్తములు సైతం కాలపు స్వభావానికి లొంగి, ఆయువు తీరిన తర్వాత తాము కూడబెట్టిన సమస్తం కోల్పోయి – చివరికి నామమాత్రంగా కీర్తిని గడించారు. కనుక ఈ మమత్వాభిమానం తగదని, మమకారఫలాలు తోడురావని గ్రహించాలి. అటువంటి మమతలకు దూరంగా ఉండాలి మహారాజా!

వ. గర్వాంధు లయిన నరపతులం జూచి భూదేవి హాస్యంబు సేయు; 'శత్రు క్షయంబు సేసి యెవ్వరికి నీక తామ యేలు చుండెద' మనియెడి మోహంబునం బితృపుత్రభ్రాతలకు భ్రాంతి గల్పించి, యన్యోన్య వైరానుబంధంబులం గలహంబు సేసి, రణరంగంబులఁ దృణప్రాయంబులుగా దేహాదులు వర్జించి, నిర్జరలోక ప్రాప్తులైన పృథు యయాతి గాధి నహుష భరతార్జున మాంధాతృ సగర రామ ఖట్వాంగ ధుంధుమార రఘు తృణబిందు పురూరవ శ్శంతను గయ భగీరథ కువలయాశ్వ కకుత్థ్స నిషధ హిరణ్యకశిపు వృత్ర రావణ నముచి శంబర భౌమ హిరణ్యాక్ష తారకాదులైన రాజు లందు, దైత్యులును ధరణికి

మమత్వంబునం జేసి కదా కాలవశంబున నాశంబు నొంది? రది యంతయు మిథ్య గాన సర్వంబునుం బరిత్యజించి 'జనార్దన' వైకుంఠ, వాసుదేవ, నృసింహ,' యని నిరంతర హరికథామృత పానంబు సేసి, జరారోగవికృతులం బాసి హరిపదంబు నొందు' మని చెప్పి.
18

తా ॥ క్షణికమైన గెలుపు దర్పంతో కన్నూ మిన్నూ కానక తిరిగే దుష్టరాజుల అంతులేని అహంభావాన్ని చూసి, భూమాత నవ్వుకొంటుంది. 'కానివారిని మట్టుపెట్టి, అయినవారికీ ఏదీ దక్కనీయక, సర్వం తామే ఏలుకొందా' మనే దుర్మోహంతో ఆ రాజులుంటారు. చారెడు నేలకోసం తండ్రీకొడుకులకు, తోబుట్టువులకు లేనిపోని ఆశలను కల్పిస్తారు. పెంచుకొన్న అనుబంధాన్ని త్రుంచివేసి, కయ్యానికి కాలుదువ్వుతారు. ఆస్తిముందు దేహమంటే గడ్డిపోచతో సమానమన్నట్లు ఆస్తికోసం ఘోరంగా పోరాడి వీరస్వర్గాన్ని అలంకరిస్తారు. విశ్వవిజేత అయిన పృథుచక్రవర్తి అంతటివాడు, సుఖభోగలాలసుడై సొంత కొడుకుల నుంచి యౌవనాన్ని యాచించి తీసుకొన్న యయాతి, బ్రహ్మ క్షత్రియ వర్ణాశ్రమధర్మాల ఊగిసలాటలో ఒడిదుడుకులకు లోనైన విశ్వామిత్రుడి తండ్రి గాధిరాజు, ఇంకా నహుషుడు, భరతుడు, కార్తవీర్యార్జునుడు, మాంధాత, సగరుడు, శ్రీరామచంద్రుడు, ఖట్వాంగుడని పేరుపొందిన దిలీప మహారాజు (లేదా నవమ స్కంధం 252 వ పద్యంలో చెప్పబడిన ఖట్వాంగ మహారాజు), ధుంధు రాక్షసుని సంహరించి ధుంధుమారుడనే బిరుదు వహించిన కువలయాశ్వుడు, రఘుమహారాజు, మాంధాతకు పదవతరంలో జన్మించి అలంబస అనే అప్సరసను పెండ్లాడిన తృణబిందుడు, పురూరవుడు, శంతనుడు, గయుడు, భగీరథుడు, ఇక్ష్వాకు వంశీయుడైన కకుత్థ్సుడు, నిషధ దేశాధిపతి నలుడు – మొదలైన గొప్ప గొప్ప రాజులూ కాలగతిలో కలిసిపోయారు. హిరణ్యకశిపుడు, రావణుడు, ఇంద్రుని చేతిలో నిహతులైన వృత్రాసుర నముచి రాక్షసులు, శివునిచే వధింపబడిన శంబరాసురుడు, భూదేవి కుమారుడైన నరకాసురుడు, భూమినే చాపచుట్టగా చుట్టిన హిరణ్యాక్షుడు, దేవసేనాపతి కుమారస్వామి సంహరించిన తారకుడు – మొదలైన దైత్యులూ ఈ భూమిపైని మమకారం వల్లనే కదా! బంధాలలో చిక్కుకొని సతమతమై సర్వనాశనాన్ని

తప్పింపలేక, తాము తప్పించుకొనలేక కాలధర్మాన్ని చెందారు?

అందువల్ల, అసద్రూపమైన మిథ్యావ్యవహారమంతా అసత్యమే అని గుర్తించి – ఆత్మజ్ఞానానికి అడ్డుగా ఉన్న బంధాలన్నింటినీ విడిచివేయాలి.

ఇక మిగిలిందేమిటి? భగవన్నామమొక్కటే. భక్తులు కష్టాలలో ఉన్నప్పుడు భగవానుడు తన ఆశ్రితులను రక్షించడానికి అడ్డుగా నిలిచిన శక్తులన్నింటినీ నశింపజేస్తాడు. అందువల్ల ఆయనకు జనార్దనుడు అని పేరు. ప్రకృతిబంధాలను ఛేదించి, తనకు సన్నిహితులైన వికుంఠులను (భగవదుపాసనా పరులను) తనలోనికి చేర్చుకొనేవాడు కనుక ఆయనకు వైకుంఠుడు అని పేరువచ్చింది. ఈ చరాచరాత్మకమైన జగత్తును తనలో వసింపజేసుకొని, ఈ ప్రపంచంలోని అన్ని పదార్థాలలో అంతర్యామియై తానూ వసించే తేజోమయవిగ్రహుడైనందువల్ల ఆయనకు వాసుదేవుడు అని నామం. యజ్ఞకంటకుడయిన హిరణ్యకశిపుని ఆసురీశక్తిని నిర్మూలించేందుకు ఆయన నరసింహమూర్తియై అవతరించాడు. ఆ మహాత్ముని నామమే మానవులకు ముసలితనం వల్ల, ఆధివ్యాధుల వల్ల కలిగే సర్వవికారాలనూ పరిహరించే దివ్యమైన అమృతరసాయనం. జనార్దనా! వైకుంఠా! వాసుదేవా! నృసింహా! అని కీర్తిస్తూ ఆ శ్రీహరి కథామృతాన్ని పానంచేసి, జరా రోగ భయాలను విడిచి, జన్మము (పుట్టుక) అస్తిత్వము (ఉనికి) బుద్ధి (వృద్ధి పొందటం) పరిణామము (మార్పు చెందటం) వినాశము (క్షీణించటం) అనే అయిదు వికృతులను (భావ వికారాలను) తొలగించుకొని, నీవు శ్రీహరి యొక్క పరమపదాన్ని చేరుకోవాలి.

అని చెప్పి, శుకయోగి ఇంకా ఇలా అన్నాడు:

తే. ఉత్తమశ్లోకుఁ డన నెవ్వఁ డున్నవాఁడు!, సన్నుతుండగు నెవ్వఁడు సకల దిశల
నట్టి పరమేశ్వరునిఁ జిత్తమందు నిలిపి, తద్గుణంబులు వర్ణింపు ధరణినాథ!

తా ॥ ఓ రాజా! 'ఉత్తమః పురుష స్త్వన్యః పరమా త్మేత్యుదాహృతః' అన్నట్లు (భగవద్గీత 15–17), పురుషోత్తముడని కీర్తింపదగినవాడు ఎవడో; అన్ని దిశల యందు ప్రస్తుతింపబడినవాడు ఏ మహానుభావుడో – ఆ సర్వేశ్వరుడైన శ్రీకృష్ణ పరమాత్మను నీ మనస్సులో నిలుపుకొని, ఆయన అనంత కల్యాణగుణాలను వర్ణించుకొంటూ ఏకాగ్రతతో భజించు.'

# యుగధర్మం, ప్రాకృతిక మొదలైన నాలుగు విధాలైన ప్రళయాల విచారణ

వ. అనిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియెఁ; 'గలియుగం బతిపాప సమ్మిళితంబు; గాన దురితంబు లే లాగున రాకుండఁ జేయుదురు? కాలం బే క్రమంబున నడచుఁ? గాల స్వరూపకుండైన హరిప్రభావం బేలాగునం గానఁబడు' నీ జగజ్జాలం బెవ్విధంబున నిలుచు?' నని యడిగిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియెఁ; 'గృతత్రేతాద్వాపర కలియుగంబులను యుగ చతుష్టయంబును గ్రమంబుగాఁ బ్రవర్తించు; ధర్మంబునకు సత్య దయా తపో దానంబులు నాలుగు పాదంబులై నడచు; శాంతి దాంత్యాత్మ జ్ఞాన వర్ణాశ్రమాచారంబులు మొదలగునవి గలిగి ధర్మంబు మొదటి యుగంబున నాలుగు పాదంబులం బరిపూర్ణంబై ప్రవర్తిల్లు; శాంతి దాంతికర్మాచరణాది రూపం బగు ధర్మంబు మూఁడు పాదంబుల రెండవ యుగంబునం బ్రవర్తిల్లు; విప్రార్చనాహింసా వ్రతజపానుష్ఠానాది లక్షణంబులు గలిగి ధర్మంబు రెండు పాదంబుల మూఁడవ యుగంబునం దేజరిల్లు; మఱియు జనులు గలియుగంబున ధర్మరహితులు; నన్యాయకారులు, క్రోధమాత్సర్య లోభమోహాది దుర్గుణ విశిష్టులు, వర్ణాశ్రమాచారరహితులు, దురాచారులు, దురన్నభక్షకులు, శూద్ర సేవారతులు, నిర్దయులు, నిష్కారణవైరులు, దయా సత్య శౌచాది విహీనులు, నన్నృతవాదులు, మాయోపాయులు, ధనవిహీనులు, దోషైకదృక్కులునై పాపచరితులగు రాజుల సేవించి, జననీజనక సుతసోదర బంధు దాయాద సుహృజ్జనులం బరిత్యజించి, సురతాపేక్షులై కులంబులం జెఱచుచుండెదరు; మఱియు క్షామ డామరంబులం బ్రజాక్షయంబగు; బ్రాహ్మణులు దుష్ప్రతిగ్రహవిహారులై యజ్ఞాదికర్మంబులు పదార్థపరులై చేయుచు హీనులై నశించెద; రట్లుగాన యీ కలియుగంబున నొక్క ముహూర్తమాత్రం బయిన నారాయణ పరాయణులై మనంబున శ్రీనృసింహ వాసుదేవ సంకర్షణాది నామంబుల నచంచలభక్తిం దలంచువారలకుఁ గ్రతుశత ఫలంబు గలుగు; నట్లు గావున రాజశేఖరా! నీ మది

ననవరతంబు హరిం దలంపుము; కలి యనేకదురితాలయంబు గాన, యొక్క నిమిషమాత్రంబు ధ్యానంబు సేసినం బరమ పావనత్వంబు నొంది కృతార్థుండ వగుదు' వని పలికి మఱియును.

20

తా ॥ అని బోధించిన శుకయోగితో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు: 'కలియుగం అంతులేని పాపాలతో కూడుకొన్నది. పాపసంకులమైన జగత్తులో దుష్కర్మలు జరగకుండా ఉండాలంటే మానవులు ఏం చెయ్యాలి? పాపలోకంలో కాలగమనం ఏ విధంగా ఉంటుంది? శ్రీహరి కాలస్వరూపుడు కదా! ఈ పాపపు రోజులలో ఆయన ప్రభావం ఏ విధంగా అగపడుతుంది? ఈ లోకాలన్నీ పాపం వల్ల సర్వనాశనం కాకుండా నిలుస్తాయా?' అని అడిగాడు.

పరీక్షిత్తు ప్రశ్నలకు సమాధానంగా శుకయోగి – యుగాలను, ఆయా యుగధర్మాలను, వాటి పరిణామాలను వివరించి చెప్పాడు:

'కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం అని యుగాలు నాలుగు. అవి ఒకదాని తర్వాత ఒకటిగా వస్తుంటాయి. ఒక్కొక్క యుగానికీ ఒక్కొక్క యుగధర్మం ఉంటుంది. ధర్మానికి సత్యము –దయ – తపస్సు – దానము అని నాలుగు పాదాలు.

మొట్టమొదటిదైన కృతయుగంలో ప్రజలు నిత్యసంతుష్టులు, కరుణామయులు, మైత్రీసంపన్నులు, ఓర్పు గలవారు, సుఖదుఃఖాదుల యెడ సమచిత్తులు, ఆత్మారాములు అయి ఉంటారు. వారు శాంతి (అంతరింద్రియాల నిగ్రహం) వల్ల, దాంతి (కర్మేంద్రియాల అదుపు) వల్ల, జీవేశ్వర తత్త్వజ్ఞానం వల్ల, వర్ణధర్మాలను, ఆశ్రమధర్మాలను, సదాచారాలను యథావిధిగా పాటించడం వలన ధర్మం అప్పుడు నిండు నాలుగు పాదాలతో నడుస్తుంది. క్రమముగా ఒక్కొక్క పాదమూ అసత్యము – హింస – అసంతుష్టి–పరస్పరకలహం అనే అవలక్షణాలతో

గాయపడుతూ లోపించిపోతాయి. త్రేతాయుగంలో ప్రజలకు క్రియా తపోనిష్ఠల పట్ల ఆసక్తి పెరిగి, కేవలం ధర్మార్థ కామ తత్పరులై ఉంటారు. శాంతి – దాంతి – కర్మాచరణము మొదలైన రూపాలతో ధర్మం మూడే పాదాలతో నడుస్తుంది.

ద్వాపర యుగం వచ్చేసరికి హింస, అసంతృప్తి, అనృత భాషణం, ద్వేషము అనేవి పెరిగి అధర్మం ప్రబలుతుంది. కీర్తికాంక్ష, అధికారం పట్ల శ్రద్ధ, స్వాధ్యాయానురక్తి, సుఖ భోగాసక్తి ఉంటాయి. బ్రాహ్మణభక్తి, అహింసావ్రతం, జపానుష్ఠానాలు మొదలైన లక్షణాలతో ధర్మం రెండు పాదాల తేజస్సు తరిగి ప్రవర్తిల్లుతుంది.

ఇక కలియుగంలో అధర్మశక్తులు విజృంభించి ధర్మం మరింత క్షీణిస్తుంది. జనులు ధర్మాన్ని నిర్వర్తించటం మానుకొంటారు. న్యాయం తప్పి ప్రవర్తించడానికి అలవాటుపడి అన్యాయాలు చేస్తారు. అనుచితమైన కోపం, ఇతరులను చూస్తే అసూయ, ఎవరితో ఏదీ పంచుకోలేని పిసినారితనం, అయోగ్యవస్తువులను కావాలనుకోవటం వంటి అరిషడ్వర్గ దుర్గుణాలతో దుష్ప్రవృత్తులవుతారు. వర్ణధర్మాలను పాటించరు. ఆశ్రమధర్మాలకు భంగపాటు కలుగుతుంది. సదాచారం మానివేస్తారు. దురాచారులవుతారు. తినకూడని పదార్థాలను తింటారు. శూద్రుల సేవయందు అనురక్తి కలుగుతుంది. దయాదాక్షిణ్యాలు లోపిస్తాయి. నిష్కారణంగా అందరితో విరోధాలు పెంచుకుంటారు. దయా – సత్య - శౌచ పాదాలు కుంటుపడతాయి. ప్రజలు అనృతవాదులు (అనగా అసత్యపరులు), కుతంత్రాలతో మోసపుచ్చేవారు, నిర్ధనులుగా ఉంటూ, ఆ కారణాన ద్వేషపరులై ప్రజల తప్పులను మాత్రమే వెతికేవారు అయిన పాలకులను సేవిస్తూ, స్వార్థపరులై తల్లిదండ్రులను, తోబుట్టువులను, కొడుకులను, కూతుళ్ళను, బంధువులను, దాయాదులను, స్నేహితులను, ఆత్మీయులందరినీ వదులుకొంటారు. అకాల అక్రమ సురతానికై వెంపరలాడి, ఉభయకుటుంబాలవారినీ ధర్మభ్రష్టులనూ కులహీనులనూ కావిస్తుంటారు. అదీ కాక కరవుకాటకాల వల్ల, డామరాది తంత్రకర్మల వల్ల ("డామర" మంటే నిజానికి శివప్రోక్తమైన ఒకానొక తంత్రశాస్త్రం. ఇక్కడ

క్షుద్రవిద్యలనే అర్థంలో ప్రయోగింపబడింది.) పెద్ద సంఖ్యలో ప్రజలు మరణిస్తారు. బ్రాహ్మణులు దానం పట్టకూడని చోట్ల –దానయోగ్యం కాని వస్తువులను అయోగ్యుల నుంచి గ్రహిస్తారు. తమకోసమూ ఆచార్యుల కోసమూ మాత్రమే చేయవలసిన యజ్ఞయాగాది శ్రౌత స్మార్త కర్మలను ఇతరుల కోసం అర్థకాంక్షతో అనుచితంగా ఆచరిస్తూ నిందలపాలై చెడిపోతారు.

అందువల్ల, ఈ కలియుగంలో కనీసం ఒకటి రెండు గడియల సేపు మాత్రమైనా – నారాయణుడే పరాత్పరుడన్న పూర్తి నమ్మకంతో – ఆయన యందే పూర్ణాసక్తి కలిగి, మనస్సులో శ్రీ నృసింహా! వాసుదేవా! సంకర్షణా! అని ఇత్యాదిగా ఉన్న నామాలను, వ్యూహాలను అచంచలమైన భక్తితో స్మరించేవారు ఏ కులంవారైనా, వారికి సద్బ్రాహ్మణుల చేత విధిప్రోక్తంగా వంద యజ్ఞాలను చేయించిన పుణ్యఫలం దక్కుతుంది. శాస్త్రం ఈ విధంగా చెబుతున్నది కాబట్టి, ఓ రాజోత్తమా! నీ మనస్సులో ఎల్లవేళలా శ్రీహరిని స్మరించు. కలి [అంటేనే దురంత దోషనిధానం.] లెక్కలేనన్ని పాతకాలకు పుట్టినిల్లు. అందువల్ల కన్నుమూసి కన్ను తెరిచినంత సేపు — కనీసం ఒక్క రెప్పపాటుకాలం విష్ణుచింతనపరుడివై భగవన్నామాన్నీ, భగవద్రూపాన్నీ ధ్యానిస్తే పాపక్షయం కలిగి, పరమ పవిత్రత చేకూరి, నీవు ధన్యుడివి అవుతావు.'

అని పలికి, శుకయోగి ఇంకొక మాట అన్నాడు:

క. మూఁడవ యుగమున నెంతయు, వేడుక హరిసేవనంబు వెలయఁగ ధృతిచేఁ
బాడుచుఁ 'గృష్ణా;' యనుచుం, గ్రీడింతురు కలిని దలఁచి కృతమతు లగుచున్.



తా ॥ ('కృతయుగంలో విష్ణువును ధ్యానించీ, త్రేతాయుగంలో యజ్ఞాలతో ఆరాధించీ పొందిన ఫలాన్ని) మూడవదయిన ద్వాపరయుగంలో ఎంతో వేడుకతో చేసే హరిసేవనం ద్వారా పొందవచ్చునని ప్రసిద్ధి. కలియుగంలో భక్తులు శ్రీహరి దివ్యనామాన్ని పారవశ్యంతో పాడుతూ, 'కృష్ణా!' 'కృష్ణా!' అని మైమరచి ఆడుతూ, హరినే స్మరించి కృతార్థులవుతారు.

వ. అనినఁ 'గల్పప్రళయప్రకారం బె' ట్లనిన నతం డిట్లనియెఁ; 'జతుర్యుగ సహస్రంబులు సనిన నది బ్రహ్మకు నొక్క పగ లగు; నా క్రమంబున రాత్రియు వర్ధిల్లు; నంత బ్రహ్మకు నొక్కదినం బగుటవలన నది నైమిత్తికప్రళయం బనంబడు; నందు విధాత సమస్త లోకంబులం దన యాత్మయందు నిలిపి శయనింప ప్రకృతి వినష్టంబయిన నది ప్రాకృతప్రళయం బని చెప్పంబడు; నా ప్రళయ ప్రకారంబు విను; మిట్లు పవలు నైమిత్తిక ప్రళయంబును, రాత్రి ప్రాకృత ప్రళయంబు నగుట గలిగిన నది యజునకు దినప్రమాణం; బిట్టి దిన ప్రమాణంబున మున్నూట యఱువది దినంబు లయిన నలువకు నొక్క సంవత్సరంబు పరిపూర్ణం బగుఁ; దద్వత్సరంబులు శతపరిమితంబు లయిన.

22

తా ॥ జగత్తు యొక్క సృష్టిప్రళయాల నడిమికాలంలో జగజ్జాలం ఉనికి ఏ విధంగా ఉంటుందో తెలుసుకొన్న తర్వాత పరీక్షిత్తు, 'కల్పప్రకారం, ప్రళయప్రకారం ఏ విధంగా ఉంటాయి?' అని ప్రశ్నించాడు.

దానికి శుకయోగి ఇలా అన్నాడు: 'కృత త్రేతా ద్వాపర కలియుగాలు నాలుగూ కలిసి ఒక చతుర్యుగం. అటువంటి వెయ్యి చతుర్యుగాల కాలం బ్రహ్మదేవునికి ఒక పగలు. [బ్రహ్మదేవుని ఒక్క పగలుకే 'కల్పము' అని పేరు. ఒక్కొక్క కల్పంలోనూ వరుసగా పధ్నాలుగుమంది మనువులు ప్రపంచాన్ని పరిపాలిస్తారు. బ్రహ్మ యొక్క పగటికాలం పూర్తయాక] అంతే ప్రమాణం కలిగిన వెయ్యి చతుర్యుగాల కాలం బ్రహ్మకు ఒక రాత్రి. అది ఆయనకు విరామసమయం. ఆ సమయంలో సృష్టి మొత్తాన్ని పరమేష్ఠి తనలోనికి ఉపసంహరించి, నిద్రకు ఉపక్రమిస్తాడు. సృష్టి పరమేష్ఠి యందు లీనమై ఉన్న తరుణంలో జగత్ప్రళయం సంభవిస్తుంది.

[ఈ విధంగా పగటివేళ కల్పమూ, రాత్రివేళ ప్రళయమూ కలిసి బ్రహ్మకు ఒక దివసం. అది మొత్తం రెండువేల చతుర్యుగాలు. అటువంటి 360 దివసాలు బ్రహ్మకు ఒక సంవత్సరం. ఒక్కొక్క బ్రహ్మకు నూరు సంవత్సరాల ఆయుః ప్రమాణం. ఆ విధమైన బ్రహ్మాయుఃకాలానికి

ద్విపరార్ధము అని పేరు. ఒక్కొక్క ద్విపరార్ధం గడిచిన వెంటనే సర్వప్రళయం జరుగుతుంది. అప్పుడు సృష్టి కాని, సృష్టికర్త కాని ఉండరు. మహత్తత్త్వము, అహంకారము, శబ్ద స్పర్శ రూప రస గంధములనే పంచ తన్మాత్రలతో కూడిన] ప్రకృతి తనకు కారణమైన బ్రహ్మములో కలిసిపోతుంది. ప్రకృతి వినష్టమైనందువల్ల దానిని ప్రాకృతిక ప్రళయమని అంటారు.

ప్రతి కల్పాంతంలోనూ బ్రహ్మదేవుని నిద్ర నిమిత్తంగా ఏర్పడిన ప్రళయాన్ని నైమిత్తిక ప్రళయం అంటారు.

సీ. అంత లోకేశున కవసానకాలంబు, వచ్చిన నూఱేండ్లు వసుధలోన
వర్షంబు లుడిగిన వడిఁ దప్పి మానవుల్ దప్పి నాఁకటఁ జిక్కి నొప్పి నొంది
యన్యోన్యభక్షులై యా కాలవశమున నాశ మొందెద; రంత నలినసఖుఁడు
సాముద్రదైహికక్ష్మాజాత రసములఁ జాతురిఁ గిరణాళిచేతఁ గాల్ప

తే. నంతఁ గాలాగ్ని సంకర్షణాఖ్య మగుచు, నఖిలదిక్కులు గలయంగ నాక్రమించు
నట్టియెడ నూఱు వర్షంబు లాదుకొనఁగ, వీఁకతోఁడుత వాయువుల్ వీచు నపుడు.



తా ॥ లోకాలన్నింటినీ సృజించిన బ్రహ్మకు అవసానకాలం సమీపించినప్పుడు – ప్రాకృతప్రళయం జరిగేముందు – నూరేళ్ళపాటు భూమిపై వర్షాలు పడవు. చేటుమూడిన మానవులు ఆకలిదప్పులకు తట్టుకోలేక అల్లాడిపోతారు. నరమాంసమన్న జంకులేక ఒకరినొకరు కబళించడం మొదలుపెట్టి, క్రమంగా అందరూ కాలోపహతులై అంతరించిపోతారు.

ఆ విధంగా జీవజాలం నశించిన తర్వాత సంవర్తకాలపు సూర్యుడు సముద్రాలలోని నీటినీ, దేహాలలోని ధాతురసాలనూ, భూమి యందలి జలాలనూ తన కిరణాలతో ఆకర్షించి, నిర్జలమైన సృష్టి సమస్తాన్నీ దహించివేస్తాడు. అప్పుడు ప్రకృతిలోని సకల చేతనాచేతనాలను తనలోనికి ఆకర్షించే సంకర్షణుడనే పేరుగల ఆదిశేషుని ముఖాల నుంచి సంవర్తక వహ్ని

(“కాలాగ్ని” అని పద్యపాఠం) వెలువడి – అధోలోకాల నుంచి పైకి లేచి, అన్ని దిక్కులకూ వ్యాపిస్తుంది. నూరేండ్లపాటు ఎడతెరిపి లేకుండా ప్రళయవాయువులు మహావేగంతో వీస్తాయి.

వ. ఇట్లు వర్షశతంబు వర్ష శూన్యంబగును. అంత శతవర్షంబులు ద్వాదశ భాస్కర ప్రచండ కిరణ తాండవం బగును. పిదప శతవర్షంబులు ప్రళయాగ్ని దందహ్యమానం బగును పిమ్మట సప్తమారుత ఝంఝానిల వేగతాడితం బగును. అందు మీఁద శతహాయనంబులు నవ ధారాధరంబులు మహాఘోషంబులతోడం గరికరోపమానంబు లయిన నీరధారల నిఖిలజగంబును శంబరమయంబు చేసిన బ్రహ్మాండం బెల్ల జలమయం బగుటం చేసి, భూమి హృత గంధ గుణంబయి కబంధంబున లీనంబగు; న న్నీరంబు జీర్ణరస గుణంబై తేజంబున నడంగు; నా తేజంబు వాయువందు నష్టరూపంబయి కలయు; నా పవనుండు గతస్పర్శగుణుండై నభంబున సంక్రమించు; నా యాకాశంబు విగతశబ్దంబయి భూతాది బ్రవేశించుఁ, దైజసం బైన మహద్రూపం బనహంకారంబై వైకారిక గుణ సమేతంబై, యింద్రియంబుల లయించు; నహంకారంబును సత్త్వాదిగుణంబులు గ్రసియించు; నవి కాలచోదితంబైన ప్రకృతియం దడంగు; నా ప్రకృతి యనాదియు నిత్యంబు నవ్యయంబు నవాఙ్మనస గోచరంబునై సత్త్వరజస్తమోగుణ రహితంబయి, మహదాది సన్నివేశంబు లేక స్వప్నాద్యవస్థా రహితంబయి, పృథివ్యాదిహీనంబై యప్రతర్క్యంబగు; దానిని మూలభూతం బయిన పదంబని చెప్పుచుందురు, కాలవిపర్యయంబయి, పురుషావ్యక్తులు విలీనం బగునది ప్రాకృత ప్రళయం బనంబడు’ నని చెప్పి ‘మఱియు నొక విశేషంబు వినుము; బుద్ధీంద్రియార్థ రూపంబులచే జ్ఞానంబు తదాశ్రయం బయి వెలుంగు; దృశ్యత్వావ్యతిరేకంబులచే నది యాద్యంతంబులు గలదై యుండుఁ; దేజంబునకు దీపచక్షూ రూపంబులు వేఱు గానియట్లు బుద్ధీంద్రియార్థంబులు పరార్థమూర్తికి నన్యంబులు గానేరవు; బుద్ధిసంభవంబు ప్రధానంబు; జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాభేదం బాత్మమయంబై, బుద్ధియుక్తంబైన యోగంబునం బరిణమించుఁ; బ్రాణిజాతం బీశ్వరునందు లయోదయంబులు వొందుచుండు; సర్వంబు నన్యోన్యాపాశ్రయంబై యాద్యంత వంతం

బగుట నవస్తు వై వర్తించు; నొక్క తేజంబు బహురంధ్రంబులం గానంబడు వడువున నొక్క పరమాత్మ పెక్కు విధంబుల భావింపంబడు; హాటకంబు పెక్కు రూపంబులు గలదైన, నేకంబయిన తెఱుంగునఁ బరమాత్మ నేకంబుగా భావింపవలయు; నేత్రంబులకు మేఘావరణంబు దలంగినప్పుడు భాస్కర మండలంబు గనిపించు కరణి బంధహేతు వైన యహంకారం బాత్మ జ్ఞానంబునం దిరస్కృతం బైనయప్పుడే పరమాత్మ నిర్మలంబయి తోఁచు; నా పరమాత్మను నిరంతరంబును దలంచుచు, యోగులు తదేకాయత్తచిత్తులై యుందురు; కాలవేగంబున సర్వప్రపంచంబునకు నవస్థాంతరంబులు గల్గు చుండుఁ; బరమేశ్వరమూర్తి యైన కాలంబున నభంబునం బగల తారకంబులు గానరాని కరణిం గానంబడక, కల్పావస్థలు చరించు; నిత్యనైమిత్తిక ప్రాకృతికాత్యంతికంబులని ప్రళయంబులు చతుర్విధంబులై పరఁగు; నందులం గలుగు నారాయణుని లీలావతారంబులఁ గమలభవ భవాదు లయిన వచింప నోపరు; నే నెఱింగి నంతయుం జెప్పితి; సంసారసాగరంబు దాట హరికథ యనెడు నావయ సహాయంబు గాని వేఱొకటి లే' దని చెప్పి.

24

తా ॥ ఆ ప్రకారం వానచినుకు లేక నూరేళ్ళు గడుస్తాయి. నూరేళ్ళపాటు పన్నెండుగురు ఆదిత్యుల తీవ్రకిరణాలు అకాండతాండవం చేస్తాయి. ఆ తరువాత నూరేళ్ళు ప్రళయాగ్ని దహించివేస్తుంటుంది. అప్పుడు ఏడు విధాల వాయువులు ఝుంఝూమారుతాల వేగంతో వీస్తాయి. ఆపైన నూరేళ్ళు చిత్ర విచిత్ర కాంతులతో మబ్బులు కమ్మి మహాగర్జనలతో ఏనుగు తొండాలకు సాటివచ్చే నీటిధారలతో విశ్వాన్ని ముంచెత్తివేస్తాయి. బ్రహ్మాండమంతా నీటితో నిండిపోతుంది.

ఆ విధంగా ఏకార్ణవం అయినప్పుడు పృథ్వియొక్క తన్మాత్ర (విశిష్టలక్షణం) అయిన గంధగుణాన్ని ఆపస్సు (జలము) తనలోకి గ్రసించివేస్తుంది. పృథ్వి తన రూపాన్ని కోల్పోయి

ఆపస్సులో కలిసిపోతుంది. ఇక పృథ్వీపదార్థం ఉండదు. అప్పుడు ఆపస్సు యొక్క తన్మాత్ర అయిన రస (రుచి) గుణాన్ని తేజస్సు తనలోనికి ఆకర్షింపగా, స్వరూపనాశం చెందిన జలము తేజస్సులో విలీనమైపోతుంది. ఆ తేజస్సు యొక్క తన్మాత్ర అయిన రూపగుణాన్ని వాయువు ఆకర్షించి దానిని తనలోనికి చేర్చుకొంటుంది. వాయువు యొక్క తన్మాత్ర అయిన స్పర్శగుణాన్ని ఆకాశము తనలో కలుపుకొంటుంది. ఆకాశతన్మాత్ర అయిన శబ్దగుణాన్ని అహంకారము యొక్క తామసరూపమైన భూతాది గుణములను తనలోకి ఇముడ్చుకొంటుంది. అప్పుడు మహత్తత్త్వము అహంకారమును తనలోనికి ఆకర్షించి, అది ప్రకృతియొక్క సత్త్వరజస్తమస్సులనే వైకారిక గుణాలలో లయించిపోతుంది.

అప్పుడు కాలము చేత ప్రేరేపింపబడిన ప్రధానము (ప్రకృతి) సత్త్వాదిగుణాలను తనలోకి విలీనం చేసుకొంటుంది.

అప్పుడు ప్రకృతికి కాలము మొదలైన అవయవాలు, వైకారికములైన పరిణామాలు ఉండవు. అవ్యక్తమైన అప్పటి ఆ తత్త్వం మాటలకు, మనస్సుకు అందదు. దానికి ఆది (మొదలు), అంతము (తుది) అనే కారణతత్త్వాలు ఉండవు. మహత్తత్త్వమూ, గుణములూ లేనందువల్ల దానిలో ప్రాణము, బుద్ధి, ఇంద్రియాలు, దేవతలు మొదలైన రూపాలు ఉండవు. సృష్టికార్యానికి ఆవశ్యకమైన రజోగుణం ఉండదు. అందువల్ల అది వ్యక్తం కాదు. దానికి స్వప్నమూ లేదు; జాగ్రదవస్థా ఉండదు.

ఆ నిర్గుణమైన స్థితిలో పృథివ్యాదులే లేనప్పుడు, దృశ్య దర్శనాలే లేనప్పుడు, సందర్శకులే లేనప్పుడు, అది ఊహకెలా అందుతుంది? అప్రతర్క్య మన్నమాట. అందుకే దానిని "మూలభూతం పద మామనన్తి" – అంటారు. అన్నింటికీ మూలమైన కైవల్యపదం అది.

కాలప్రభావం వల్ల ఆ అవ్యక్తంలో ప్రకృతి – పురుష తత్త్వాలు ఒకటి కావటమే ప్రాకృతిక ప్రళయం.

## ఆత్యంతిక ప్రళయము లేదా మోక్షం

మరొక విశేషం విను : బుద్ధి, ఇంద్రియాలు, ఇంద్రియార్థములైన విషయాలను ఆశ్రయించుకుని జ్ఞానం ప్రకాశిస్తూ ఉంటుంది. వీటన్నింటికీ ఉత్పత్తి, లయములు ఉంటాయి. అయితే ఇవి అసత్పదార్థాలే అని తెలుసుకోవాలి. ఎందుచేతనంటే వీటిలో దృశ్యత్వము (అనగా కంటికి కనబడటం), అవ్యతిరేకము అనే లక్షణములు ఉండటంచేత ఆది, అంతములు కలిగి ఉన్నాయి, అందుకని అవి అసత్పదార్థాలు అగుచున్నాయి.

దీనికి అన్యోన్య అపాశ్రయదోషం అని చెప్పబడే దోషమే కారణం. కాంతి కంటే దీపమూ, నేత్రం కంటే రూపం వేరుకావు, అదే విధంగా, బుద్ధి, ఇంద్రియాలు, విషయాలు పరమాత్మకంటే భిన్నమైనవి కావు, అయితే బుద్ధియందు జ్ఞానప్రకాశం కలిగినప్పుడు, జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థలు మూడూ ఆత్మమయమై, యోగంగా అలరారుతుంది. తేజస్సు ఒక్కటే అయినా గవాక్షరంధ్రాలలో నుంచి చూసినప్పటి దృశ్యస్థితి వలె, బ్రహ్మము ఒక్కటే అయినప్పటికీ చూచేవారికి వివిధ ఇంద్రియార్థాల రూపంలో కనిపిస్తోంది. పెక్కు నగల ఆకారంలో బంగారం వేర్వేరుగా కనిపించినా వస్తుతత్త్వంలో భేదం ఉండనట్లే, ఇంద్రియార్థాల వల్ల బ్రహ్మతత్త్వంలో మార్పు రాదు. కంటికీ సూర్యునికీ అడ్డుగా నిలిచిన మబ్బు తొలగితేనే సూర్యమండలం కనబడుతుంది. అలాగే ఆత్మకు ఉపాధి అయిన అహంకారం నశించితేనే బ్రహ్మముతో స్వస్వరూపానుసంధానం కలుగుతుంది.

అవిద్యాబంధనాలను తొలగిస్తే ఆత్మస్వరూపం అనుభవంలోకి వచ్చి, కైవల్యస్థితి కలుగుతుంది. (ఆ పరమావస్థే ఆత్యంతిక ప్రళయం. అదే మోక్షం.)

## నిత్య ప్రళయం

సూక్ష్మదర్శులైన యోగులు పరమాత్మనే నిరంతరం స్మరిస్తూ, కాలానికి వ్యక్తరూపాలు అయిన ఆ కల్ప ప్రళయాల పైనే చిత్తాన్ని నిలిపి, భగవన్మయులై ఉంటారు. కాలప్రవాహం

వేగంగా ప్రవహిస్తున్నప్పుడు అందులో కొట్టుకొనిపోతున్న ప్రపంచానికీ వేర్వేరు అవస్థలు (పరిణామ దశలు) కలుగుతాయి. ఆకాశంలో నక్షత్రాల రాకపోకలను, కదలికను మనము చూడలేనట్లే, పరమేశ్వరుని మూర్తి అయిన కాలంలో వివిధ కల్పావస్థలు కలిగినప్పుడు జరుగుతున్న పరిణామాలను గుర్తించటం ఏమంత సులభం కాదు. క్షణక్షణం పరివర్తనశీలమై, ఎప్పటికప్పుడు అంతరించిపోతుండే కాలపు స్వరూపాన్ని 'నిత్య ప్రళయం' అంటారు.

ఇలా నిత్యము – నైమిత్తికము – ప్రాకృతికము – ఆత్యంతికము అని ప్రళయాలు నాలుగు విధాలుగా ఉంటాయి.

భగవానుడు కాలస్వరూపుడు. సాక్షాత్తూ ఆ పరమశివుడే పూనుకొన్నా, బ్రహ్మాదులే దిగివచ్చినా, అనంతమైన కాలప్రవాహంలో ఆది నుంచి నారాయణుడు ధరించిన మూర్తులనూ, ఆయన లీలావతార కథలనూ సమగ్రంగా ఎవరూ వర్ణించి చెప్పలేరు. నాకు తెలిసినది ఏ కొంతో, ఏదీ విడువక, అంతా చెప్పాను. అంతుచిక్కని ఈ సంసారమనే మహా సముద్రాన్ని దాటాలంటే శ్రీహరి కథ అనే నావ తప్ప వేరొక సాధనం లేదు.'

అని చెప్పి, శుకయోగీంద్రుడు పరీక్షిత్తుతో ఇంకా ఇలా అన్నాడు:

ఉ. ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్  
మానుము; సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్యమౌఁ;  
గాన హరిం దలంపు; మికఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై;  
మానవనాథ! పొందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్.



'ఓ రాజా! "బ్రాహ్మణశాపం వల్ల ప్రేరేపితుడై తక్షకుడు నన్ను కరుస్తాడు; ఆ విషం నిలువెల్లా వ్యాపించి, నేను మరణించక తప్పదు" – అన్న భయాన్ని మనస్సులో నుంచి పూర్తిగా తుడిచిపెట్టు. పుట్టుక అంటూ ఉన్నాక, మానవులకు చావు కూడా తప్పదు. అది నిత్య ధర్మం.

అందువల్ల స్వరూపనిష్ఠతో ఆత్యంతిక లయాన్ని పొందడం కోసం శ్రీకృష్ణ పరమాత్మను ధ్యానించుకో. దాని వలన నీకు భూమిపై జన్మపరంపరల నుంచి విముక్తి కలుగుతుంది. ఆత్మజ్ఞానంతో ప్రకృతిబంధాల నుంచి విడివడిన మహాభక్తులు చేరే మాధవలోకనివాసమైన వైకుంఠంలో నివాసానికి నోచుకొని మోక్షానందాన్ని పొందుతావు.’

# పరీక్షిత్తు మృతి – జనమేజయుని సర్పయాగం

వ. రాజేంద్రా! జరామరణ హేతుకంబయిన శరీరంబున నుండు జీవుండు ఘటంబులలోఁ గనంబడు నాకాశంబు ఘటనాశంబయిన మహాకాశంబునం జేరు తెఱంగున, శరీరపతనం బగుడు నీశ్వరుం గలయుఁ, దైలనాశపర్యంతంబు వర్తి తేజంబుతోడ వర్తించు కరణి దేహకృతంబగు భవంబు రజస్సత్త్వ తమోగుణంబుల చేతం బ్రవర్తించు; నాత్మ నభంబు మాడ్కి ధ్రువంబై యనంతంబై వ్యక్తావ్యక్తంబులకుఁ బరంబై యుండు; నిట్లాత్మ నాత్మస్థునిఁ గా జేసి, హరి నిజాకారంబు భావించుచుండుట విశేషంబు; నిన్నుఁ దక్షకుండు గఱవ సమర్థుండు గాఁడు; హరిం దలంపుము; ధన గృహ దారాపత్య క్షేత్రపశుప్రకరంబుల వర్జించి, సమస్తంబును నారాయణార్పణంబు సేసి, విగతశోకుండవై నిత్యంబును హరిధ్యానంబు సేయు' మని వినిపించిన రాజేంద్రుండును గుశాసనాసీనుండై జనార్దనుం జింతించుచుండె; నంత శుకుండును యథేచ్ఛా విహారుండయి చనియె; నిటఁ గ్రుద్ధుండైన బ్రాహ్మణోత్తమునిచేఁ బ్రేరితుండైన తక్షకుండు ద్విజరూపంబుఁ దాల్చి, పరీక్షిద్వధార్థంబుగా నేతెంచుచుండి మార్గమధ్యంబునఁ గాశ్యపుండును సర్ప విషహరణ సమర్థుం డగు నొక్క విప్రునిం గని యతని నపరిమిత ధనప్రదానంబునఁ దృప్తుం గావించి, పరీక్షిన్నికటంబునకు రాకుండ న ట్లొనర్చి, యంతటఁ బరీక్షిన్మహారాజు చెంతనున్న వారల చేతి కొక్క ఫలంబిచ్చి చనిన, వా రా ఫలంబు రాజునకిచ్చిన నతం డాఫలంబు నాస్వాదించినం గ్రిమిరూపంబున నందుండి వెడలి మహాభయంకర రూపంబునం గాకోదరంబై రాజుం గఱచిన నతండు నా క్షణంబ విషాగ్నిచే భస్మీభూతుం డయ్యె; నట్టి యవసరంబున భూమ్యంతరిక్షంబులనుండు నిఖిలప్రాణు లాశ్చర్యకరంబగు తన్మరణంబు గని హాహారవంబులు సేసి; రంత నీ యర్థంబు నతని తనయుండైన జనమేజయుండు విని క్రోధావేశంబున సర్పప్రళయం బగు నట్లు యజ్ఞంబు సేయుచుండ సహస్ర సంఖ్యలు గల సర్పంబులు హతంబు లయ్యె. నా సమయంబునఁ దక్షకుండు రాక వాసవాలయంబున నుండుట యెఱింగి "సహేంద్ర తక్షకాయానుబ్రూహి" అను ప్రేషవాక్యంబు నొడువునంతఁ, దక్షకసహితుండయి

విమానముతో నింద్రుండు స్థాన భ్రంశంబు నొంది పడుచుండ, నత్తఱి నాంగీరసుం డేతెంచి పరీక్షిత్తనయుని బహుభంగులం గీర్తించి.

26

తా ॥ రాజోత్తమా! ముసలితనానికీ, మరణానికీ కారణమైన శరీరంలో ఉంటాడు జీవుడు. కుండ పగిలినప్పుడు 'కుండ' అనే ఆ ఉపాధిలో ఉండిన ఆకాశాంశ ఏ ఉపాధీ లేక మహాకాశంలో ఎలా కలిసిపోతుందో, అట్లాగే శరీరం పతనాన్ని పొందినప్పుడు జీవుడు ఈశ్వరునిలో ఐక్యమవుతాడు. వత్తిలో నూనె ఉన్నంతవరకు మాత్రమే దీపం వెలుగుతుంది. అట్లాగే రజస్సత్త్వతమో గుణాల పరిణామం ఉన్నంతవరకు సంసారబంధాలూ ఉంటాయి. ఆత్మజ్ఞానం మూలాన అవి నశిస్తాయి. ఆత్మకూడా మహాకాశం వలెనే ఏ పరిణామానికీ లోనుగాక నిత్యంగా ఉంటుంది. అది అవినాశి. వ్యక్తమైన జగత్తుకూ, అవ్యక్తమైన మహత్తత్త్వానికీ – రెండింటికీ అతీతమైనది. ఈ విధంగా పరమాత్మను ఆత్మగతం చేసుకొని శ్రీ వాసుదేవుని యొక్క విరాడ్రూపాన్ని భావన చేయటం వల్ల విశేషంగా ఫలితం ఉంటుంది.

కాలప్రభావం కాకపోతే, ఆ తక్షకుడు తానై వచ్చి నిన్ను కరవగలడా? ఆ స్వాతంత్ర్యం, ఆ శక్తీ అతనికున్నాయా? నేను నిరుపాధికమైన బ్రహ్మాన్ని. కాటువేసిన ఆ విషసర్పమూ, మృత్యుముఖంలో ఉన్న నేనూ ఆత్మభిన్నులము కాము. ఇద్దరినీ నడిపిస్తున్న సూత్రధారి శ్రీ వాసుదేవుడొక్కడే అని ఆయన మహిమను స్మరించు. సర్వసంగపరిత్యాగం చెయ్యి. అన్ని బంధనాలను విడిచిపెట్టి, భగవదర్పణ బుద్ధితో నిరంతరం ఆ హరిని స్మరించు. శోకం తొలగి చిత్తశాంతి కలుగుతుంది. హరి అంటేనే తనను నమ్ముకొన్న భక్తుల ఆర్తిని హరించేవాడని కదా! నిత్యం ఆ శ్రీహరి రూపనామాలను మనస్సులో నిలుపుకొని తదేకధ్యానం చెయ్యి.'

అని ప్రబోధింపగా, పరీక్షిత్తు తన సంశయాలన్నీ పటాపంచలు కాగా, నిస్సంగుడై, సర్వఫలత్యాగం చేసి, దర్భాసనం మీద కూర్చుండి, పరమాత్మ ధ్యానంలో నిమగ్నుడయ్యాడు. శుకయోగి తన కర్తవ్యం ముగిసినదని అక్కడినుంచి బయలుదేరాడు.

## పరీక్షిత్తు మరణం

ఇక్కడ, కోపోద్రిక్తుడైన శృంగి చేత మంత్రపూర్వకంగా నియోగింపబడిన తక్షకుడు– విప్రవేషం ధరించి, పరీక్షిత్తును చంపటం కోసం వస్తూ, మార్గమధ్యంలో పాము విషానికి విరుగుడు వేయగల కాశ్యపుడనే బ్రాహ్మణుణ్ణి కలుసుకొన్నాడు. [అతనిని మాటల్లో పెట్టి, రాజును కాపాడటానికి వెళ్తున్న సంగతిని అడిగి తెలుసుకొన్నాడు. ఆ విషవైద్యుని మహిమ ఏపాటిదో చూద్దామని, చేరువనే ఉన్న ఒక మహావృక్షాన్ని తన కాటుతో మాడ్చి మసిచేశాడు. కాశ్యపుడు దానినే మంత్రించి, మళ్ళీ ప్రాణం పోసి, చెట్టును బ్రతికించాడు. తక్షకుడు అతని మహిమను గ్రహించాడు.] అతనికి లెక్కలేనంత డబ్బిచ్చి, సంతోషపెట్టి, పరీక్షిత్తు ఉన్న ప్రాంతాల చుట్టుపక్కలకైనా రాకుండా తిరుగుముఖం పట్టించాడు. [ఆ తర్వాత రాజు వద్దకు వెళ్ళి, బ్రాహ్మణవేషాన్ని విడిచి నిజరూపం ధరించి కాటువేశాడని సంస్కృత భాగవతం దక్షిణాది ప్రతులలో ఉన్నది.] ఆ తర్వాత తక్షకుడు మహారాజుకు చెంతనున్నవాళ్ళ చేతిలో పండొకటి పెట్టి వెళ్ళాడు. వాళ్ళు ఆ పండును రాజుకు అందజేశారు. పరీక్షిత్తు ఆ ఫలాన్ని రుచి చూసేసరికి, దానిలోనుంచి ఒక పురుగు రూపంలో తక్షకుడు బయటపడి, మహాభయానకమైన సర్పాకృతిని ధరించి, రాజును కాటువేశాడు. పరీక్షిత్తు ఆ విషాగ్ని వల్ల అక్కడికక్కడే మాడి బూడిదైపోయాడు. దిగ్భ్రాంతికరమైన ఆ మరణాన్ని చూసి భూమ్యంతరిక్షాల నడిమి లోకాలలోని జీవులందరూ హాహాకారాలు చేశారు.

## సర్పయాగం

ఈ వృత్తాంతమంతా విని పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు పట్టరాని క్రోధావేశాన్ని పొందాడు. సర్పజాతిని సర్వనాశనం చెయ్యాలని సర్పయాగానికి పూనుకొన్నాడు. ఆభిచారిక హోమం మొదలుపెట్టి, మారణమంత్రాలను చదువుతుంటే వేలకొద్దీ పాములు వచ్చి యాగాగ్నిలో పడి మరణింపసాగాయి. ఎంతసేపటికీ తండ్రిని చంపిన తక్షకుడు మాత్రం రాలేదు. అతడు ఇంద్రుడి మందిరంలో ఆశ్రయాన్ని పొందాడని తెలుసుకొని జనమేజయుడు మండిపడి,

"సహేంద్రతక్షకాయానుబ్రూహి" – ఆ ఇంద్రుడితో సహా తక్షకుణ్ణి రప్పించండి – అని ప్రేషమంత్రాన్ని ప్రయోగింపజేశాడు. ఆ మంత్ర ప్రభావం వల్ల తక్షకుడితోపాటు ఇంద్రుడు కూడా తానున్న చోటునుంచి జారి క్రిందికి రాసాగాడు.

అప్పుడు అంగిరసుని వంశంలో జన్మించినవాడు ఒక బ్రహ్మవేత్త [బృహస్పతి అనే పేరుగల ఆంధ్రుడు – అని సం.] అక్కడికి వచ్చి, జనమేజయుని [వంశగౌరవాన్ని, ధర్మజ్ఞతను] పెక్కు విధాల స్తుతించాడు.

చ. 'మృతియును జీవనంబు నివి మేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు; సహజం బిది; చోరహుతాశసర్ప సం
హతులను దప్పి నాఁకటను బంచత నొందెడు నట్టి జీవుఁడున్
వెతలను బూర్వకర్మ భవవేదన లొందుచుఁ గుందు నెప్పుడున్.

27

తా ॥ 'భూమిపై జన్మించిన జీవకోటి తమచే పూర్వం ఉపార్జితమైన కర్మల మూలాననే జీవించటమూ మరణించటమూ జరుగుతున్నది. ఇది నిత్యం, స్వాభావికమైన సత్యం. దొంగల వల్లనో, అగ్ని వలననో, పాము కాటు మూలాన్నో, దాహం మూలాన్నో, ఆకలి కారణానో – అవి కేవలం నిమిత్తాలుగా మరణం కలుగుతున్నదే గాని, వాస్తవానికి వారంతా అనుభవిస్తున్నది ప్రారబ్ధకర్మ ఫలాన్నే. వ్యథలూ, వేదనలూ పూర్వజన్మలలో వారు ఆచరించిన కర్మవశాననే సంభవించి, ఆ కర్మఫలమైన దుఃఖాన్ని ఈ జన్మలో పొందుతున్నారు.

వ. అట్లు గావున నసంఖ్యంబులైన దందశూకంబులు హతంబు లయ్యె; శాంత మానసుండవై, క్రోధంబు వర్జింపు మనిన గురూపదిష్ట ప్రకారంబున సర్పయాగంబు మానియుండె; నంత దేవతలు గుసుమవృష్టిఁ గురియించి; రా రాజన్యుండు మంత్రి సమేతుండై నగర ప్రవేశంబు సేసె; బాధ్యబాధక లక్షణంబులు గల విష్ణుమాయా చోదిత

గుణవ్యాపారంబుల నాత్మ మోహపడుం గావున, నట్టి మాయావికారంబులం బరిత్యజించి, తదాశ్రయాకృత మానసుండై వర్తించుచు, పరనింద సేయక, వైరంబు వర్జించి, భగవత్పదాంభోజభక్తి సంయుక్తుండై తిరుగు నతండు హరిపదంబుఁ జేరు; నని చెప్పి వెండియు సూతుండు పరమహర్ష సమేతుండై శౌనకున కిట్లనియె.

28

తా ॥ ఇప్పటికే లెక్కలేనన్ని పాములు [నీవు చేస్తున్న ఆభిచారిక హోమంలో] ఆహుతయ్యాయి. చిత్తాన్ని సమాధానపరచుకొని, "నా తండ్రి దుర్మరణం పాలై, పరలోకగతుడయ్యాడు" అన్న కోపాన్ని విడిచిపెట్టు' అని చెప్పగా, ఆ ఆచార్యుని ఉపదేశానుసారం జనమేజయుడు సర్పయాగాన్ని మానివేశాడు. దేవతలు పువ్వులవాన కురిపించారు. జనమేజయుడు మంత్రులను వెంటబెట్టుకొని నగరంలోకి తిరిగి వచ్చాడు'.

అని సూతుడు శౌనకాదులకు చెప్పాడు.

## భాగవత ధర్మం

'శౌనకా! బాధ్యము (బాధింపదగినది) బాధకము (బాధించేది) అనే లక్షణాలను కలిగిన మాయ గుణముల యందు ప్రవర్తిల్లి, జీవులకు వ్యామోహాన్ని కలుగజేస్తున్నది. [విష్ణువు యొక్క మాయ వలన జీవులు కామక్రోధాది గుణవృత్తులకు లోనై, దేహమే ఆత్మ అన్న భ్రాంతిని పొందుతారు. ఆ భ్రాంతి వల్ల క్రోధాది దుశ్చింతలు మరింత చెలరేగుతాయి. ఆత్మవిచారం వల్ల జ్ఞానం ఉదయించి, అజ్ఞానం తొలగిపోతుంది. ఏ చోట మాయయొక్క ఆశ్రయం వల్ల కలిగే వాదవివాదాలు ఉండవో; ఆశ – నిరాశల మధ్య ఎప్పుడూ ఊగిసలాడుతుండే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సుకు ప్రవృత్తి ఉండదో; కర్మములందు 'దీనికి నేను కర్తను' అన్న భావం లేనందువల్ల ఆ కర్మము యొక్క ఫలప్రాప్తి కూడా ఉండదో; దేనియందు కర్తృ కర్మ క్రియలనే మూడు భావాలతో కూడిన అహంకార స్వభావుడైన జీవుడికి ఉనికి కలుగదో – అది బాధ్య

బాధక లక్షణరహితమైన ఆత్మయొక్క స్వరూపం. ఆత్మజ్ఞానాన్ని మరుగుపుచ్చే ప్రతి చర్యా అవిద్యాచోదితమే.] కనుక అవిద్య వల్ల కలిగే మాయావికారాలను గుర్తించి, వాటిని మానుకోవాలి. విష్ణువు యొక్క పరమస్వరూపాన్ని తెలిసికొని దేహాత్మభావాన్నీ, అహంకార మమకారాలనూ విడిచివేయాలి. తన కర్మఫలానికి కారణం వేరొకరని ఇతరులను నిందించకూడదు. [పరుల నిందా తిరస్కారాలకు అలజడి చెందకూడదు.] దేహాన్ని ఆశ్రయించిన బంధాలే తప్ప ఆత్మకృతాలు కాని అటువంటి వాటికోసం ఎవరితోనూ వైరాన్ని పెట్టుకోకూడదు. భగవంతుని పాదపద్మముల యందు అనన్యమైన భక్తి కలిగి సంచరించేవాడు శ్రీ వాసుదేవుని పరమపదాన్ని చేరుకొంటాడు.'

అని ఈ విధంగా శ్రీ వాసుదేవుని మహిమ ప్రస్తావన చేసిన సూతునికి అంతులేని సంతోషం కలిగింది.

[అప్పుడు శౌనకుడు, 'మహాత్మా! వ్యాసమహర్షి శిష్యులైన వేదప్రచారకులు పైల మహర్షి మొదలైనవారు వేదాన్ని ఏ విధంగా విభజించి, వేర్వేరు శాఖలను రూపొందించారు? మాకు ఆ వివరాలను చెప్పు' అని అడిగాడు. సూతుడు, ఏకాదశ స్కంధంలో మైత్రేయుడు వైదిక కర్మకలాపాన్ని గురించి ఉద్ధవునికి చెప్పినప్పటి శబ్దబ్రహ్మ నిరూపణనూ; ప్రణవానికున్న బ్రహ్మతత్త్వ ప్రతిపాదనమే ప్రణవవిస్తారమైన వేదశాఖా కాండలకూ ఉంటుందని తానప్పుడు కర్మ జ్ఞాన భక్తి యోగాలను ప్రస్తావించిన విషయాన్నీ శౌనకుడు ఇప్పుడు కొనసాగించమంటున్నాడని గ్రహించాడు.]

శౌనకునితో ఈ విధంగా అన్నాడు :

# వ్యాసుడు వేదములను, పురాణములను లోకమునకు అందించుట

క. ధారుణిఁ బారాశర్యున, కార్యులు పైలుఁడు సుమంతు జైమిని మునులన్ ధీరుఁడు వైశంపాయనుఁ, డారయ నలువురును శిష్యులై యుండి రొగిన్.

29

తా ॥ 'పరాశరమహర్షి పుత్రుడైన వేదవ్యాసునికి పైలుడు, సుమంతుడు, జైమిని, ధీవిశారదుడయిన వైశంపాయనుడు అని నలుగురు శిష్యులు ఉండేవారు.

వ. వారలు ఋగ్యజుస్సామాథర్వంబు లనియెడు నాలుగు వేదంబుల వ్యాసోపదిష్టక్రమంబున లోకంబులం బ్రవర్తింపఁజేసి రని చెప్పిన, నా క్రమం బెట్లని శౌనకుం డడిగిన సూతుండు సెప్పం దొడంగె; 'నాదియందుఁ జతుర్ముఖుని హృదయంబున నొక నాదం బుద్భవించె; నది వృత్తి నిరోధంబువలన మూర్తీభవించి వ్యక్తంబుగాఁ గనుపట్టె; నట్టి నాదోపాసన వలన యోగిజనంబులు నిష్పాపులై ముక్తి నొందుదు; రందు నోంకారంబు జనియించె; నదియె సర్వమంత్రోపనిష న్మూలభూత యగు వేదమాత యని చెప్పంబడు; నా యోంకారంబు త్రిగుణాత్మకంబై యకారోకార మకారంబు లనెడు త్రివర్ణరూపంబై ప్రకాశించుచుండె; నంత భగవంతుండగు నజుం డాప్రణవంబువలన స్వరస్పర్శాంతస్థోష్మాది లక్షణ లక్షితంబగు నక్షర సమామ్నాయంబు గల్పించి, తత్సాహాయ్యంబునం దన వదన చతుష్టయంబువలన వేదచతుష్టయంబు గలుగంజేసె; నంత నతని పుత్రులగు బ్రహ్మవాదు లా వేదంబులం దదుపదిష్ట ప్రకారంబుగా నభ్యసించి, యా క్రమంబున వారలు దమ శిష్యపరంపరకు నుపదేశించి; రిట్లు వేదంబులు సమగ్రంబుగాఁ బ్రతియుగంబున మహర్షులచే నభ్యసింపం బడియె; నట్టి వేదంబులు సమగ్రంబుగఁ బఠియింప నశక్తులగు వారలకు సాహాయ్యంబు సేయుటకై ద్వాపర యుగాదియందు భగవంతుండు సత్యవతీదేవియందుఁ బరాశరమహర్షికి సుతుండై యవతరించి, యా వేదరాశిం గ్రమమ్మున ఋగ్యజుస్సామాథర్వంబు లన నాలుగు

విధంబులుగ విభజించి, పైల వైశంపాయన జైమిని సుమంతు లనియెడు శిష్యవరులకుఁ గ్రమంబుగ నా వేదంబుల నుపదేశించె; నందుఁ బైలమహర్షి సేకొన్న ఋగ్వేదం బనంతంబు లగు ఋక్కులతోఁ జేరి యుండుటంజేసి బహ్వృచశాఖ యని చెప్పంబడు; నంత నా పైలుం డింద్రప్రమితికి బాష్కలునకు నుపదేశించె; బాష్కలుం డా సంహితం జతుర్విధంబులు గావించి శిష్యు లగు బోధ్యుండు యాజ్ఞవల్క్యుండుఁ బరాశరుండు నగ్నిమిత్రుండు ననువారికి నుపదేశించె; నింద్రప్రమితి దన సంహిత మాండూకేయున కుపదేశించె; మాండూకేయుండు దేవమిత్రుం డనువానికిం జెప్పె; నతనికి సౌభర్యాదిశిష్యు లనేకులై ప్రవర్తిల్లి; రందు సౌభరిసుతుండు శాకల్యుండు దా నభ్యసించిన శాఖ నైదు విధంబులుగ విభజించి; వాత్స్యుండు మౌద్గల్యుండు శాలీయుండు గోముఖుండు శిశిరుం డనెడు శిష్యుల కుపదేశించె; నంత జాతుకర్ణి యనువానికి వా రుపదేశింప నతండు బలాకుండు పైంగుండు వైతాళుండు విరజుం డనువారి కుపదేశించె; నదియునుం గాక మున్ను వినిపించిన బాష్కలుని కుమారుండైన బాష్పలి వాలఖిల్యాఖ్యసంహితును బాలాయని గార్గ్యుండు కాసారుం డను వారలకుం జెప్పె; నిత్తెఱంగున బహ్వృచసంహిత లనేక ప్రకారంబులం బూర్వోక్త బ్రహ్మచారులచే ధరియింపంబడె; యుజుర్వేదధరుండగు వైశంపాయనుని శిష్యసంఘంబు నిఖిలక్రతువుల నాధ్వర్యవ కృత్యంబుచేఁ దేజరిల్లిరి; మఱియు నతని శిష్యుఁడగు యాజ్ఞవల్క్యుండు గుర్వపరాధంబు సేసిన, నా గురువు కుపితుండై 'యధీతవేదంబుల మరలం దన కిచ్చి పొమ్మ' నిన నతండు దాను జదివిన యజుర్గణంబును దదుక్త క్రమంబునఁ గ్రక్క, నవి రుధిరాక్తం బగు రూపంబుఁ దాల్చిన యజుర్గణాధిష్ఠిత శాఖాధి దేవతలు తిత్తిరిపక్షులై వానిని భుజియించిరి; దానంజేసి యా శాఖలు తైత్తిరీయంబు లయ్యె; నంత నిర్వేది యగు నా యాజ్ఞవల్క్యుం డపరిమిత నిర్వేదంబు నొంది, యుగ్రతపంబున సూర్యుని సంతుష్టుం గావింప, నతండు సంతసిల్లి హయరూపంబుఁ దాల్చి. యజుర్గణంబు నతని కుపదేశించెఁ; గావున నది వాజసనేయశాఖ యని వాక్రువ్వంబడె; నంత నా యజుర్గణంబు కాణ్వ మాధ్యందినాదులచే నభ్యసింపబడె; నిట్లు యజుర్వేదంబు లోకంబునఁ బ్రవర్తిల్లె; సామవేదాధ్యేత యగు జైమిని మహర్షి దన

సుతుండగు సుమంతునికి నుపదేశించె; నతఁడు సుకర్ముండను తన సుతునకుఁ దెలిపె; నతం డావేదమును సహస్రశాఖలుగా విభజించి, కోసలుని కుమారుండైన హిరణ్యనాభునికిని, దన కుమారుం డగు పౌష్పంజి యనువానికి నుపదేశించె; నంత వారిరువురు బ్రహ్మవేత్త లగు నావంత్యులు నుదీచ్యు లను నేనూర్గురికి నుపదేశించి, వారిని సామవేదపారగులంగాఁ జేసి; రిట్లు సామవేదంబు లోకంబున వినుతి నొందె; మఱియు నథర్వవేత్త యగు సుమంతుమహర్షి దానిం దన శిష్యున కుపదేశింప నతండు వేదదర్శుండు పథ్యుం డను శిష్యుల కుపదేశించె; నందు వేద దర్శుఁ డనువాడు శౌల్కాయని బ్రహ్మబలి నిర్ధోషుండు పిప్పలాయనుం డనువారలకును, బథ్యుం డనువాఁడు కుముదుండు శునకుండు జాబాలి బభ్రు వంగిరసుండు సైంధవాయనుం డనువారలకు నుపదేశించి ప్రకాశంబు నొందించె; నిత్తెఱంగున నథర్వవేదంబు వృద్ధి నొందె; ని ట్లఖిలవేదంబుల యుత్పత్తి ప్రచారక్రమం బెఱింగించితి; నింకం బురాణక్రమం బెట్టు లనిన వినిపింతు, వినుము; లోకంబునఁ బురాణప్రవర్తకు లనం బ్రసిద్ధులగు త్రయ్యారుణి కశ్యపుండు సావర్ణి యకృతవ్రణుండు వైశంపాయనుండు హారీతుం డను నార్గురు మజ్జనకుండును వ్యాస శిష్యుండునగు రోమహర్షణుని వలన గ్రహించి; రట్టి పురాణంబు సర్గాది దశలక్షణలక్షితంబుగా నుండు; మఱియు గొంద ఱా పురాణంబు పంచలక్షణలక్షితం బనియుఁ బలుకుదు; రట్టి పురాణ నామానుక్రమంబుఁ బురాణవిదులగు ఋషులు సెప్పెడు తెఱంగున నెఱింగింతు; వినుము; బ్రాహ్మంబు పాద్మంబు వైష్ణవంబు శైవంబు భాగవతంబు భవిష్యోత్తరంబు నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు కౌర్మంబు మాత్స్యంబు బ్రహ్మాండంబు గారుడంబు నని పదునెనిమిది మహాపురాణంబులు మఱియు నుపపురాణంబులుం గలవు; వీని లిఖించినం జదివిన వినిన దురితంబు లడంగు నని సూతుండు శౌనకాదులకుం జెప్పిన వారు 'నారాయణుగుణ వర్ణనంబును దత్కథలును జెప్పితి; వింక దోషకారులుఁ బాపమతులు నెవ్విధంబున భవాబ్ధిం దరింతు, రాక్రమంబు వక్కాణింపవే!' యని యడిగిన

నెఱింగింపం దలంచి యిట్లనియె.

30

తా ॥ వారు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అని ఉన్న నాలుగు వేదాలను వ్యాసమహర్షి ఉపదేశించిన క్రమంలోనే, అన్ని లోకాలలో వెలయింపజేశారు' అని సూతుడు చెప్పగా, శౌనకుడు కుతూహలం ఉండబట్టలేక, 'ఏమిటి ఆ క్రమం?' అని అడగనే అడిగాడు. సూతుడు చెప్పటం మొదలుపెట్టాడు:

మొట్టమొదటగా బ్రహ్మ హృదయాకాశంలో ఒక నాదం ఉత్పన్నమయింది. ఆయన ఆత్మయోగంతో చిత్తవృత్తులను నిరోధించి ఉన్నప్పుడు [అవ్యక్తప్రభవము, స్వయంప్రకాశమానము అయిన] ఆ నాదం ఆయన శ్రవణపుటాలలో వ్యక్తరూపాన్ని పొందింది.

[బ్రహ్మాత్మకుడైన పరమాత్ముని యొక్క జ్ఞానస్వరూపమైన ఆ నాదాన్ని ధ్యానించి, సేవించటం వల్ల మనోనాశాన్నీ వాసనాక్షయాన్నీ సాధింపగోరి యోగసాధనకు పూనుకొన్న కర్మసంన్యాసులు (యోగులు) ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికములనే ఆత్మమలినాలను తొలగించుకొని, పాపవిముక్తులై ఆరూఢస్థితిని పొందుతారు.]

## ప్రణవ నాదోత్పత్తి

బ్రహ్మ యొక్క హృదయాకాశంలో ఉదయించిన ఆ నాదం (బృహతీ వాక్కుగా) "ఓమ్" అన్న ధ్వనిగా వినిపించి, అక్షరాకృతిని ధరించింది. ఆ ఓంకారమే బ్రహ్మవిద్యాసర్వస్వములైన అన్ని మంత్రాలకు, అన్ని ఉపనిషత్తులకు పుట్టినిల్లయిన వేదమాత అని చెప్పబడింది.

అకార ఉకార మకారములతో రూపొందిన ఆ ఓంకారం త్రిగుణాత్మకమైనది (అంటే – సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలు, ఋగ్యజుస్సామములనే మూడు నామాలు, భూర్భువస్సువస్సులనే మూడు లోకాలు, జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడు వృత్తులను కలిగినది).

అంతట భగవంతుడైన బ్రహ్మదేవుడు ఆ ఓంకారం నుంచి స్వరములు – స్పర్శములు – అంతస్థములు – ఊష్మములు – (హ్రస్వములు – దీర్ఘములు) మొదలైన లక్షణాలతో కూడిన అక్షర సమామ్నాయాన్ని రూపొందించాడు. ఆ అక్షరాల సహాయంతో ఆయన తన నాలుగు ముఖాల నుంచి నాలుగు వేదాలను ఉద్భవింపజేశాడు. ఆయన మానసపుత్రులైన మరీచి మొదలుగా గల బ్రహ్మవేత్తలు ఆయన ఉపదేశానుసారం ఆ వేదాలను నేర్చుకొని, ఆ క్రమంతోనే తామూ తమ శిష్యగణానికి బోధించారు. ఆ విధంగా ఒక్కొక్క యుగంలోనూ మహర్షులు గురుముఖతః వేదాలను అభ్యసిస్తూ వచ్చారు.

కొంతకాలానికి కాలమహిమ వల్ల ఇంద్రియనిగ్రహం, సత్ప్రవర్తన లోపించి అల్పాయువులు, బలహీనులు, అల్పబుద్ధులు, వేదాలను సమగ్రంగా అధ్యయనం చేసే శక్తి లేనివారు అయిన ప్రజలకు దారిచూపాలని సంకల్పించి, ద్వాపరయుగం ప్రారంభమైనప్పుడు దాశరాజసుత అయిన సత్యవతీ దేవి యందు భగవంతుడు స్వయంగా పరాశరమహర్షికి పుత్రుడై అవతరించాడు. ఆ అనంతమైన వేదరాశిని (ప్రకరణానుసారం ఆయా మంత్రాల విషయాన్ని బట్టి, ఛందస్సుల ప్రకారం) ఋగ్యజుస్సామాథర్వము లని నాలుగు సంహితలుగా విడదీసి, వాటిని పైల వైశంపాయన జైమిని సుమంతులనే నలుగురు ఉత్తములైన శిష్యులను పిలిచి, ఒక్కొక్కటీ వారికి ఉపదేశించాడు.

## బహ్వృచ సంహిత

పైలమహర్షి అధ్యయనం చేసిన ఋక్సంహిత పరిమాణం చాలా పెద్దది. ఋక్కుల సంఖ్య చాలా ఎక్కువ. అందువల్ల దానిని బహ్వృచ సంహిత అనేవారు. పైలుడు దానిని రెండుగా విభజించి ఇంద్రప్రమితికి, బాష్కలునికి బోధించాడు. బాష్కలుడు తన భాగాన్ని నాలుగు శాఖలుగా పునర్విభాగం చేసి, తన శిష్యులైన బోధ్య యాజ్ఞవల్క్య పరాశర అగ్నిమిత్రులకు నేర్పాడు. ఇంద్రప్రమితి తన సంహితాభాగాన్ని (గొప్ప కవి, మనీషి అయిన తన కొడుకు) మాండూకేయ ఋషికి ఉపదేశించాడు. మాండూకేయుడు తన శిష్యుడు దేవమిత్రునికి బోధించిన

విద్యను సౌభరి మొదలైన ఋషులు నేర్చుకొన్నారు. సౌభరి కొడుకైన శాకల్యుడు తాను నేర్చుకొన్న శాఖను ఐదుగా విభజించి, తన విద్యార్థులైన వాత్స్య, మౌద్గల్య, శాలీయ, గోముఖ, శిశిరులకు ఉపదేశించాడు. వారందరూ తమవంతు పాఠాన్ని జాతుకర్ణికి ఉపదేశింపగా; జాతుకర్ణి బలాకుడు, పైంగుడు, వైతాలుడు, విరజుడు అనే ఋషులకు నేర్పాడు. బాష్కలుని కొడుకు బాష్కలి తనకు తెలిసిన ప్రతిశాఖ నుంచి మంత్రాలను విషయానుసారం గ్రహించి, వాలఖీల్య సంహితను సంకలనం చేసి తన శిష్యులు బాలాయని, గర్గ్యుడు, కాసారుడు అనేవారికి చెప్పాడు. ఈ విధంగా బహ్వృచ సంహితను సత్సంప్రదాయానుగుణంగా బ్రహ్మర్షులందరూ అధ్యయనం చేశారు.

## యజుర్వేదము : తైత్తిరీయ శాఖావిర్భావం

వైశంపాయనుడు యజుర్వేదాన్ని కూలంకషంగా నేర్చుకొన్నాడు. అతనికి చరకుడు, అధ్వర్యువు మొదలైన శిష్యులున్నారు. వారు గురువు వద్ద అన్ని క్రతువులను సలక్షణంగా చేయించడం నేర్చుకొన్నారు. ఒకప్పుడు వైశంపాయనుని కోసం బ్రహ్మహత్యాపాతకానికి నిష్కృతిగా ప్రాయశ్చిత్తహోమాన్ని అధ్వర్యువులైన శిష్యులు చేపట్టగా, వారు చేపట్టిన కర్మకాండను చూసి వైశంపాయనుని మరొక శిష్యుడూ, దైవరాతమహర్షి కొడుకైన యాజ్ఞవల్క్యుడు ఆ యాగకరణాన్ని అధిక్షేపించాడట. 'గురుదేవా! మతిమాలిన శిష్యులు చేసే అనర్థకృత్యం వలన మీకు లభించే ఫలితం చాలా తక్కువ. నేనింతకంటే అధికఫలాన్ని ఇవ్వగల గొప్ప యాగాన్ని చేయగలను' అని పలికాడు. గర్వంతో యాజ్ఞవల్క్యుడు చేసిన తిరస్కారపూర్వక గుర్వపరాధానికి వైశంపాయనుడు మండిపడి, 'నీవు నా నుంచి నేర్చుకొన్న వేదమంతా ఇక్కడ పెట్టి, వెళ్ళిపో!' అని ఆజ్ఞాపించాడు. యాజ్ఞవల్క్యుడు గురువు వద్ద తాను చదివిన యజుర్వేదభాగాన్ని మొత్తం ఆయన బోధించిన క్రమాననే కక్కివేసి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. నెత్తుటితో తడిసిన ఆ వమనాన్ని చూసి, యజుర్మంత్రాల సూక్తాలను అధిష్ఠించిన ఆయా శాఖాధిదేవతలు తిత్తిరి పక్షుల (తీతువు పిట్టల) రూపుదాల్చి దానిని భుజించారు. అందువల్ల అత్యంత రమణీయమైన ఆ

భాగానికి నాటినుంచి తైత్తిరీయ శాఖ అని పేరువచ్చింది.

## కాణ్వ మాధ్యందిన శాఖలు

గురుకులం నుంచి బహిష్కరింపబడి విరక్తుడైన యాజ్ఞవల్క్యుడు అంతులేని దుఃఖాన్ని పొందాడు. [వైశంపాయనుడు కూడా నేర్పని అపురూపమైన ఛందోరాశిని గ్రహించాలనే దృఢసంకల్పం అతనికి కలిగింది.] అతిశ్రేష్ఠమైన వాఙ్మయతపస్సుతో వేదాలకు అధిష్ఠానదైవతమైన సూర్యభగవానుని స్తోత్రం చేసి సంతోషపెట్టాడు. సూర్యభగవానుడు ప్రసన్నుడై, వాజి (గుర్రం) రూపంలో సాక్షాత్కరించి, మునుపెవ్వరూ ఎరుగని యజుర్వేద సూక్తాలను అతనికి ఉపదేశించాడు. వాజిరూపంలో సూర్యుడు బోధించిన [పదిహేను శాఖల] ఆ నవీన శుక్ల యజుర్వేద భాగం వాజసనేయ సంహిత అని ప్రసిద్ధికెక్కింది. వేదాధ్యేతలలో కాణ్వులు, మాధ్యందినులు దానిని సర్వాంగీణంగా అధ్యయనం చేయటం వల్ల ఆ పేరిట సరిక్రొత్త కాణ్వ, మాధ్యందిన శాఖలేర్పడ్డాయి. ఈ విధంగా యజుర్వేదం లోకంలో ప్రవర్తిల్లసాగింది.

## సామవేద విస్తృతి

సామవేదాన్ని చెప్పుకొన్న జైమిని మహర్షి దానిని తన కుమారుడైన సుమంతునికి ఉపదేశించాడు. అతడు తన సుతుడైన సుకర్మునికి బోధించగా, అతను సామవేదతరువును వేయి శాఖలుగా విభజించి – కోసల దేశానికి చెందిన ఋషికుమారుడు హిరణ్యనాభునికి, తన కుమారుడైన పౌష్యంజి లేదా పౌష్పింజికి, పౌష్యంజి వద్ద లౌగాక్షి, మాంగలి, కుల్యుడు, కుసీదుడు, కుక్షి అని అయిదుగురు శిష్యులు ఒక్కొక్కరూ నూరేసి శాఖలను చెప్పుకొన్నారు. హిరణ్యనాభుని శిష్యుడు కృతుడు ఇరవైనాలుగు శాఖలను పాఠం చెప్పేవాడట. వేయింటిలో మిగిలిన శాఖలన్నిటినీ ఆత్మవిద్యాకోవిదుడయిన ఆవంత్యుడు ప్రచారం చేయసాగాడు అని మూలంలో ఉంది. అయితే వేరొక గాథ ఏమంటే సుమంతుని కొడుకు సుకర్ముడు ఆ వేదాన్ని వెయ్యి శాఖలుగా విడదీసి, కోసలుని కుమారుడైన హిరణ్యనాభునికి, తన కొడుకు పౌష్యంజికి

నేర్పాడు. వారిద్దరూ ఆ శాఖలను బ్రహ్మజ్ఞానసంపన్నులైన ఆవంత్యులకు, ఉదీచ్యులకు ఐదేసి వందల మందికి బోధించి, వారందరినీ సామవేదంలో పారంగతులను చేశారు. ఈ విధంగా వీరివల్ల సామవేదానికి లోకంలో ప్రసిద్ధి వచ్చింది.

## అథర్వ వేదానికి ప్రచారం

అథర్వవేద పండితుడైన సుమంతుడు తన విద్యను కబంధుడనే తన శిష్యునికి నేర్పాడు. అతను దానిని పథ్యునికి, వేదదర్శునికి ఇచ్చాడు. వేదదర్శుడు దానిని నాలుగు భాగాలు చేసి శౌక్లాయని, బ్రహ్మబలి, నిర్ధోషుడు, పిప్పలాయనుడు అనేవారికి నేర్పాడు. పథ్యుడు తన సంహితను కుముదుడు, శునకుడు, జాబాలి, అంగీరసుడు, బభ్రువు, సైంధవాయనుడు అనే బ్రహ్మవాదులకు నేర్పాడు. ఈ విధంగా శాఖోపశాఖలతో అథర్వవేదం వృద్ధికి వచ్చింది.

రాజా! ఇప్పటి వరకు నీకు వేదవాఙ్మయం ఏర్పడిన తీరునూ, ఆ వేదాల ప్రచారక్రమాన్నీ తెలియజేశాను.

## పురాణ లక్షణాలు : పురాణాల పేర్లు

ఇక పురాణాల గురించి చెబుతాను, విను. త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, వైశంపాయనుడు, హారీతుడు అని ఆరుగురు వేద వేదాంగవేత్తలు, వ్యాసశిష్యుడైన నా తండ్రి రోమహర్షణుని వద్ద పురాణాలను నేర్చుకొన్నారు. [నేను ఆ ఆరుగురి వద్ద శిష్యరికం చేసి, మళ్ళీ పురాణసంహిత మొత్తాన్నీ అభ్యసించాను. కశ్యపుడు, నేను, సావర్ణి, (పరశు) రాముని శిష్యుడైన అకృతవ్రణుడు నా తండ్రి వద్ద మూలసంహితలు నాలుగింటినీ నేర్చుకొన్నాము.]

పురాణం సర్గము మొదలైన పది లక్షణాలతో కూడుకొని ఉంటుంది. కొందరు ఆ పురాణలక్షణాలు అయిదని అంటారు.

ఆ పురాణాల వరుస పురాణవేత్తలయిన మహర్షులు చెప్పే తీరున తెలియజేస్తాను, విను:

బ్రహ్మ పురాణం, పద్మ పురాణం, విష్ణుపురాణం, శివపురాణం, భాగవత పురాణం, భవిష్య పురాణం, నారద పురాణం, మార్కండేయ పురాణం, అగ్ని పురాణం, బ్రహ్మవైవర్త పురాణం, లింగపురాణం, వరాహ పురాణం, స్కాంద పురాణం, వామన పురాణం, కూర్మ పురాణం, మత్స్య పురాణం, బ్రహ్మాండ పురాణం, గరుడ పురాణం అని పద్దెనిమిది మహాపురాణాలు.

ఇవిగాక ఉపపురాణాలు కూడా ఉన్నాయి.

ఈ పురాణ సంహితలను వ్రాసినా, చదివినా, విన్నా అన్ని పాపాలూ పటాపంచలవుతాయి.'

అని ఈ విధంగా సూతుడు శౌనకాదులందరికీ చెప్పాడు. అంతట వారు,

'సూతా! నారాయణుని సంకల్పము చేత ఆవిర్భవించిన ప్రధానము యొక్క గుణక్షోభం వలన కలిగిన మహత్తత్త్వం నుంచి త్రివిధాహంకార క్రమాన భూత తన్మాత్రలు, ఇంద్రియములు, ఇంద్రియ విషయాలు, దేవతల జన్మము మొదలైన సృష్టివిస్తారం కలిగిందని చెప్పావు. ఆ గుణవర్ణనం చేశావు. నారాయణుని అవతార లీలలను వినిపించావు. సజ్జనుల సంగతి పక్కనపెట్టి, జీవితంలో తప్పులు చేసినవారు, ఏవేవో పాపసంకల్పాలు కలుగుతుండేవాళ్ళూ ఈ భవసాగరాన్ని దాటాలంటే ఏం చెయ్యాలి? వారు తరించే మార్గం తెలియజెప్పవా?' అని అడిగారు.

సూతుడు వారి ప్రశ్నకు సమాధానం చెప్పదలిచి, ఇలా అన్నాడు:

# మార్కండేయోపాఖ్యానము

క. తొల్లిటి యుగమునఁ దపములఁ, బల్లిదులగు ఋషుల మహిమ భాషింపఁగ రం
జిల్లెడు మార్కండేయుం, డుల్లంబున హరిని నిలిపి యుడుగక బ్రదికెన్.

31

తా ॥ 'పూర్వం – ఇప్పుడు నడుస్తున్న శ్వేత వరాహ కల్పానికి ముందు కల్పంలో – జపతపానుష్ఠానాల వలన సర్వశక్తిమంతులైన ఋషుల మహిమ ఎటువంటిదో వర్ణించి చెప్పాలంటే – ఇప్పుడు నా మనస్సులో వెలుగొందుతున్నవాడు మహర్షి అయిన మార్కండేయుడు. ఆయన అంతరంగంలో శ్రీహరిని నిలుపుకొని, జీవులకు అనివార్యమైన మృత్యువుపై విజయాన్ని సాధించి, చిరంజీవియై నిలిచాడు.

వ. లోకంబులు గల్పాంతసమయంబునం గబంధమయంబు లయి, యంధకార బంధురంబు లయి యున్నయెడ నేకాకి యయి చరించుచు బాలార్కకోటి తేజుం డయిన బాలుని హృదయంబునం బ్రవేశించి యనేకసహస్ర వత్సరంబులు దిరిగి వటపత్త్రశాయి యయిన య బ్బాలునిఁ గ్రమ్మఱం గనియె' నని చెప్పిన శౌనకాదులు సూతునిం గనుకొని, 'యా మునీంద్రునకు నీ ప్రభావం బెట్లు గలిగె?' నని యడిగిన నతం డిట్లనియె.

32

తా ॥ కల్పం అంతమయ్యే వేళ, లోకాలన్నీ జలమయమై చిమ్మచీకటి కమ్ముకొన్నప్పుడు మార్కండేయుడు తానొక్కడే ఏ తోడు లేకుండా తిరుగుతూ, ఒకచోట కోటి బాలసూర్యుల తేజంతో వెలుగొందుతున్న ఒక బాలకుని చూసి, అతని హృదయంలోనికి ప్రవేశించి, ఎన్నో వేల సంవత్సరాలు ఆ విధంగా తిరిగీ తిరిగీ, వెలుపలికి వచ్చి, మఱ్ఱియాకుపై పవ్వళించిన ఆ పసివాడిని మళ్ళీ కనుగొన్నాడు'

అని చెప్పగా శౌనకాదులు సూతుణ్ణి మెచ్చుకొని, 'ఆ మునీంద్రునికి ఇంతటి ప్రభావం ఏ విధంగా కలిగింది?' అని ప్రశ్నించారు. సూతుడు చెప్పాడు:

క. 'భూవినుత, బ్రహ్మచర్యము, దా వదలక నిష్ఠచేతఁ దథ్యము గాఁగన్ భావించి హరిఁ దలంచుచుఁ, గోవిదనుతుఁడై మృకండు గుణముల వెలసెన్.

33

తా ॥ 'భృగువంశంలో నియతి, విధాతల సుతుడు మృకండు మహర్షి. భూజనస్తుతిపాత్రమైన బ్రహ్మచర్యాశ్రమ దీక్షను వహించి, ఏకాగ్రచిత్తంతో శ్రీహరిని ధ్యానిస్తూ, తన సుగుణవర్తనతో పెద్దల ప్రశంసలను అందుకొన్నాడు.

వ. ఇట్లు దపంబు సేయ నతనికి హరిహరులు ప్రత్యక్షంబయి 'వరంబడుగు' మనిన గుణగణాఢ్యుం డయిన కుమారు నడిగిన 'నట్లకాక' యని యతండు గోరిన వరం బిచ్చి యంతర్ధానంబు నొంది; రనంతరంబ య మ్మునికి మార్కండేయుం డుదయించి నియమనిష్ఠా గరిష్ఠుడయి యుండ; మృత్యువు వానిం బాశబద్ధుంజేసిన నెదిర్చి మిత్తిని ధిక్కరించి, పదివేల హాయనంబులు తపంబు సలుప, నింద్రుండు భయంపడి య మ్మునివరుని యుగ్రతపంబు భంగపఱచుటకు దేవతాంగనలం బంప, వా రేతెంచు నెడఁ బుష్పఫలభరితంబును, మత్తమధుకర శుకపికాది శకుంతారవ నిరంతర దిగంతరంబును; జాతివైర రహిత మృగపక్షికుల సంకులంబును, సారసచక్రవాక బకక్రౌంచ కారండవ కోయష్టికాది జలవిహంగమాకులిత సరోవర సహస్ర సందర్శనీయంబును నగు నా తపోవనంబున జటావల్కలధారియై హవ్యవాహనుండునుంబోలెఁ దపంబు సేయు మునీంద్రునిం గని య య్యంగనలు వీణావేణు వినోదగానంబుల నలవరింప మెచ్చక ధీరోదాత్తుం డగు న మ్మునీంద్రుని గెల్వనోపక యింద్రుని కడకుం జని; రంత హరి యతని తపంబునకుఁ బ్రసన్నుండై యావిర్భవించినం గనుగొని 'దేవా, నీ దివ్యనామ స్మరణంబునంజేసి యీ శరీరంబుతోడన యనేక యుగంబులు బ్రదుకునట్లుగాఁ జేయవే?'

యనినం గరుణించి యిచ్చుటయును.

34

తా ॥ ఈ విధంగా తపస్సు మొదలుపెట్టి భగవదుపాసన కావిస్తున్న అతనికి వాసుదేవుడు, మహాదేవుడు వచ్చి కన్నుల యెదుట నిలిచి, 'వరం కోరుకో!' అన్నారు. మృకండు మహర్షి ఉత్తమగుణోపేతుడైన కొడుకు కావాలని అర్థించాడు. హరిహరులు అతను కోరిన వరాన్ని ప్రసాదించి అదృశ్యమయ్యారు. కొంతకాలానికి మృకండునికి మార్కండేయుడు జన్మించాడు. బ్రహ్మాత్మజ్ఞానం కలిగి నియమనిష్ఠలతో శ్రీహరిని అర్చింపసాగాడు. మృత్యువు అతనిని కాలపాశంతో బంధింపబోగా ఎదిరించి, చావును కాదని, పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. [చూస్తూ ఉండగానే ఆరు మన్వంతరాలు గడిచిపోయాయి.] ఇంద్రుడు తన పదవి చేజారవచ్చునని భయపడి, ఆ మునీంద్రుని ఘోరతపస్సును భగ్నం చేయడానికి దేవకాంతలను పంపించాడు.

వారక్కడికి వచ్చి చేరేసరికి మార్కండేయుడు తపస్సు చేస్తున్న వనస్థలి పువ్వులు, పండ్ల తోటలతో నిండి ఉన్నది. మత్తెక్కిన తుమ్మెదల రొదలూ, చిలుకలు కోకిలలు మొదలైన పక్షుల కిలకిలారవాలూ దిగంతాలకు వ్యాపిస్తున్నాయి. జంతువులూ, పక్షులూ జన్మవైరాన్ని మరచి సందడి చేస్తున్నాయి. బెగ్గురులు, జక్కవలు, కొంగలు, క్రౌంచాలు, రాయంచలు, కొక్కెరలు మొదలయిన నీటి పక్షుల కలకలంతో ఎటుచూసినా సరస్సులు చూడముచ్చటగా ఉన్నాయి. ఆ వనంలో కావిరంగు నారచీర ధరించి, జడలు కట్టి ఎరుపెక్కిన శిరోజాలతో సాక్షాత్తూ అగ్నిదేవుని వలె తేజరిల్లుతూ తపస్సు చేసుకొంటున్న ఆ మునివరేణ్యుని తిలకించి, ఆ కాంతలు వీణా వేణు మధుర గానవినోదాలతో స్వాధీనపరుచుకోవాలని ప్రయత్నించారు. కానీ ఆయన ఏకాగ్రతకు ఏ మాత్రం భంగం వాటిల్లలేదు. గాంభీర్య ధైర్య స్థైర్య దృఢవ్రతుడు, మహోదాత్తుడు అయిన ఆ మునిరాజును జయించే శక్తి తమకు లేదని గ్రహించి, వారందరూ ఇంద్రుని చెంతకు తిరిగి వెళ్ళిపోయారు.

తపస్స్వాధ్యాయ సంయమాలతో భక్తిపూర్వకంగా తనను ఆరాధించిన మార్కండేయుని తపస్సుకు ప్రసన్నుడై, శ్రీహరి [నర–నారాయణ ఋషుల రూపాన్ని ధరించి, తన తేజోంశద్వయంతో] అతనికి సాక్షాత్కరించాడు. మార్కండేయుడు, 'దేవా! దివ్యమైన నీ నామాన్ని స్మరించేందుకు ఈ దేహధారణ ఒక నిమిత్తం అవుతున్నది. ఈ శరీరంతో నేను అనేక యుగాలు జీవించి ఉండేట్లు వరాన్ని ప్రసాదించు' అని ప్రార్థించాడు. శ్రీహరి కరుణించి మార్కండేయుని చిరాయువుగా దీవించాడు. మార్కండేయుడు శ్రీహరిని స్తుతించాడు:

తే. జగము రక్షింప జీవులఁ జంప మనుపఁ, గర్తవై సర్వమయుఁడవై కానిపింతు వెచట నీ మాయఁ దెలియంగ నెవ్వఁ డోపు?, విశ్వసన్నుత! విశ్వేశ! వేదరూప!

35

తా ॥ 'విశ్వమంతటిచే గుణానువాదమనే వ్యాజంతో వేవేల విధాల సన్నుతింపబడిన దేవా! విశ్వానికి ఈశిత్వాన్ని వహించి కాపాడుతున్న మహాత్మా! 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' అన్నట్లు – వేదాల రూపాన్ని ధరించి నిన్ను నీవే ప్రకటించుకొన్న స్వామీ! జగత్తుకు నీ ఎరుకను కలుగజేసి జగద్రక్షణ కావించే నిమిత్తం సృష్టికర్తవై, పోషించేవాడవై, చంపేవాడవై నీ లీలలను ప్రదర్శిస్తూ, అంతట నీవే నిండి ఉండి, సర్వాత్మకుడవై గోచరిస్తావు. నీ చేతనే కల్పితమైన నీ మాయను తెలుసుకోవటం ఎవరికి సాధ్యం?

మ. బలిభిన్ముఖ్య దిశాధినాథవరులున్ ఫాలాక్షబ్రహ్మాదులున్
జలజాతాక్ష పురందరాది సురులుం జర్చించి నీ మాయలం
దెలియన్ లేరఁట ! నా వశంబె తెలియన్? దీనార్తి నిర్మూల! యు
జ్జ్వల పంకేరుహపత్ర లోచన! గదాచక్రాంబుజాద్యంకితా!'

36

తా ॥ ప్రకాశవంతమైన తామరరేకుల వంటి కన్నులు కలిగిన వాడా! గద, చక్రము,

పద్మము మొదలైన దివ్యాలంకారాలతో చిహ్నితములైన నాల్గు హస్తములు గల వాసుదేవా! ఉజ్జ్వలమై సూర్యాదుల వెలుగుకు ఆధారభూతమయిన తేజస్సు, అనంతైశ్వర్యవైభవాలూ కలిగి సన్నుతింపబడిన ప్రభూ! యమధర్మరాజు మొదలైన దిక్పాలకులూ, నుదుట మూడవనేత్రం కలిగిన ఈశ్వరుడు, సృష్టికర్త వంటి మహనీయులూ, ఇంద్రాది దేవతలూ ఎంత చర్చించినా, నీవు వాచామగోచరుడవు కాబట్టి; వారూ నీ మాయామోహితులే అయినందున నీ శక్తియుక్తులను తెలుసుకొనలేరు. దురవస్థకు లోనైనవారి దుఃఖానికి మూలమైన అవిద్యను నిర్మూలించే మహానుభావా! నీ దయ లేక నేను మాత్రం తెలుసుకోగలనా?' మూలంలో అతిగంభీరమైన శ్లోకానికి ధారాశుద్ధితో కూడిన భావానువాదం పై పద్యం:

కిం వర్ణ్యతే తవ విభో! యదుదీరితోఽసుః
సంస్పందతే తమను వాఙ్మనఇన్ద్రియాణి
స్పన్దన్తి వై తనుభృతా మజశర్వయోశ్చ
స్వస్యాప్యథాపి భజతా మసి భావబన్ధుః.

(12–8–40)

'ఓ ప్రభూ! నీ ప్రేరణ మూలాన సర్వప్రాణికోటి యొక్క, బ్రహ్మ మహేశ్వరుల యొక్క, నా యొక్క ప్రాణేంద్రియాలు స్పందింపగలుగుతున్నాయి. ఆ ప్రాణాలను లక్ష్యంగా చేసుకొని వాక్కు, మనస్సు, ఇంద్రియార్థాలు తమ తమ విషయాలలో ప్రవృత్తిని పొందుతున్నాయి. నిన్ను భజించేవారికి ఆత్మబంధుడవు అయిన నిన్ను నేనేమని పొగడగలను?' అని తాత్పర్యం.

వ. అని వినుతించి 'దేవా, నీ మాయం జేసి జగంబు భ్రాంతంబై యున్న యది! యిది దెలియ నానతీ వలయు' నని యడిగిన నతండు నెఱింగించి చనియె, మునియును శివపూజ సేయుచు హరిస్మరణంబు సేయ మఱచి శతవర్షంబులు ధారాధరంబులు ధారావర్షంబుచే ధరాతలంబు నింప, జలమయంబై యంధకార బంధురంబైన, నంత నా తిమిరంబునం గన్ను గానక భయంపడి యున్నయెడ నా జలమధ్యంబున నొక వటపత్త్రంబునం బద్మరాగ

కిరణపుంజంబులు రంజిల్లు పాదపద్మంబులు గల బాలునిం గని, మ్రొక్కి యతని శరీరంబు ప్రవేశించి, యనేకకాలం బనంతంబగు జఠరాంతరంబునం దిరిగి; యతని చరణారవింద సంస్మరణంబు సేసి, వెలువడి కౌఁగిలింపం బోయిన మాయఁ గైకొని యంతర్ధానంబు నొంద; మునియు నెప్పటియట్ల స్వాశ్రమంబు సేరి తపంబు సేయుచున్న సమయంబున.

37

తా ॥ అని పరిపరి విధాల సన్నుతించి మార్కండేయుడు, 'దేవా! నీ మాయాప్రభావం వల్ల ఈ జగమంతా మిథ్యాజ్ఞానవశమై ఉన్నది. నీ యొక్క మాయను తెలుసుకొనగోరుతున్నాను. నాకు అనుమతి నివ్వు' అని అడిగాడు. నారాయణుడు 'తథాస్తు' అని తన సమ్మతిని తెలియజేసి, వెళ్ళిపోయాడు.

మార్కండేయుడు క్రమంగా చరాచర సమస్త వస్తువులలోనూ పరమశివుని ధ్యానిస్తూ, మానసోపచారాలతో శివుణ్ణి పూజిస్తూ, కాలం గడపసాగాడు. అంతట నూరు సంవత్సరాల పాటు ప్రచండమేఘాలు ముసిరి, వర్షధారలతో ధరణీతలాన్ని ముంచెత్తివేశాయి. నీళ్ళు నిండి సమస్తం ఒకటే సముద్రంగా మారి చిమ్మచీకటిలో మునిగిపోయింది. మార్కండేయుడు ఆ చీకటిలో కళ్ళు కనిపించక భయభ్రాంతుడై ఉన్న సమయంలో, ఆ ప్రళయజలాలలో ఒక వటపత్రం మీద – కెంపుమీరిన కాంతులను విరజిమ్ముతున్న పాదపద్మాలు గల ఒక పసివాణ్ణి చూసి, నమస్కరించి, అతని [శ్వాసవాయువుల ఆకర్షణ మూలాన] శరీరంలోనికి ప్రవేశించి, బ్రహ్మాండాలను ఇముడ్చుకొన్న అతని బొజ్జలోనే చెప్పలేనంత కాలం ఉండి, [కాలాంతర గ్రహాంతర లోకాంతరాలన్నీ] తిరిగి చూశాడు. ఎట్టకేలకు, తాను మునుపు చూసిన అతని పాదారవిందాలను జ్ఞాపకం చేసుకొంటూ మార్కండేయుడు ఆ బాలకుని కడుపులో నుంచి బయటికి వచ్చి, ఆ బాలుడిని ఆలింగనం చేసుకోబోతే – అతను తన మాయతో పాటు మాయమైపోయాడు. మార్కండేయుడు ఎప్పటివలె తన ఆశ్రమాన్ని చేరుకొని, తపస్సు చేసుకొంటున్నాడు.

చ. నిలిచిన శంకరుం గనియు నిత్యసుఖంబుల నిచ్చు గౌరి యి
మ్ముల 'హర, భూతిభూషణ సముజ్జ్వలగాత్రునిఁ గంటె, యెంతయున్
వలనుగ వానితోడ నొక వాటపు మాటను బల్కఁగాఁ దగున్
సలలితమైన యీ తపసి జాడ వినం గడు వేడ్క యయ్యెడిన్.

38

తా ॥ ఆ తరుణాన ఆకాశమార్గంలో పార్వతీసమేతుడై విహరిస్తున్న శ్రీ పరమేశ్వరుడు నారాయణుని యొక్క యోగమాయ ప్రభావానికి ముగ్ధుడై, శ్రీమన్నారాయణ ధ్యానలీనుడై ఉన్న మార్కండేయుణ్ణి చూడగోరి నిలిచాడు. నిలిచిన శంకరుని చూచి, ఇహపర కైవల్య రూపాలయిన సుఖాలను ప్రసాదించే పార్వతీమాత ప్రీతితో, 'ఓ పరమేశ్వరా! (ఈశ్వరుని అణిమాదులైన అష్టైశ్వర్యాలకు భూతులని పేరు. కనుకనే ఆయనను భూతిభూషణ! అని సంబోధించటం. 'భూతిభూషణసముజ్జ్వలగాత్రుని' అని మార్కండేయునికి అన్వయిస్తే, 'విభూతిరేఖలే అలంకారములుగా కలిగి, తేజోమయుడైన మార్కండేయుని' – అని చెప్పుకోవాలి.) విభూతిరేఖలే అలంకారములుగా కలిగి, తేజస్సు ఉట్టిపడుతున్న ఇతనిని చూశారు కదా, దయతో ఒక్కసారి పలకరించరూ? ఈ తపోనిధి దివ్యచరిత్రను వినాలని నాకెంతో కుతూహలంగా ఉన్నది' అని అడిగింది.

వ. అనిన శంకరుండును శాంకరీసమేతుండయి నభంబున నుండి ధరణీతలంబునకు నేతెంచి యితరంబు గానక యేకాగ్రచిత్తుండగు నమ్మునిం గని తన దివ్యయోగమాయా ప్రభావంబుచేత నతని హృదయంబునం బ్రవేశించి చతుర్బాహుండును, విభూతి రుద్రాక్ష మాలికాధరుండును, త్రిశూల డమరుకాది దివ్య సాధన సమేతుండును, వృషభవాహనారూఢుండును, నుమాసమేతుండునై తన స్వరూపంబు గనంబఱిచిన విస్మయంబు నొంది యమ్ముని యా పరమేశ్వరు ననేక ప్రకారంబుల స్తుతియించిన నప్పు డమ్ముని తపఃప్రభావంబునకు మెచ్చి 'మహాత్మా' పరమశైవుండ' వని పరమేశ్వరుం

డానతిచ్చిన మార్కండేయుండును శంకరు నిరీక్షించి, దేవా హరిమాయాప్రభావంబు దుర్లభం; బయ్యది భవత్సందర్శనంబునం గంటి; నింతియ చాలు; నైన నొక్క వరంబు గోరెద; నారాయణ చరణాంబుజ ధ్యానంబును, మృత్యుంజయంబునుం గలుగునట్లుగాఁ గృపసేయవే?" యని ప్రార్థించినఁ గృపాసముద్రుండై 'యట్లకాక' యని జరారోగవికృతులు లేక కల్పకోటి పర్యంతంబు నాయువుం, బురుషోత్తముని యనుగ్రహంబుఁ గలుగు' నని యానతిచ్చి య మ్మహాదేవుం డంతర్ధానంబు నొందె' నని చెప్పి యీ మార్కండేయోపాఖ్యానంబు వ్రాసిన వినినం జదివినను మృత్యువు దొలంగు నని మఱియు నిట్లనియె; హరిపరాయణుండగు భాగవతుండు దేవతాంతర మంత్రాంతర సాధనాంతరంబులు వర్జించి, దుర్జనులం గూడక నిరంతరము నారాయణ గోవిందాది నామస్మరణంబు సేయుచు నుండెనేని నట్టి పుణ్యపురుషుండు వైకుంఠంబున వసియించు; మఱియు హరి విశ్వరూపంబును జతుర్విధ మ్యూహభేదంబును, జతుర్మూర్తులును, లీలావతారంబులును జెప్ప నగోచరంబు లనిన శౌనకుం డిట్లనియె.

39

తా ॥ ఆమె పలుకులను ఆకర్ణించి, భవుడు భవానీసహితుడై వ్యోమసీమ నుంచి నేలకు దిగివచ్చాడు. సమాధిస్థితుడై గుణాతీతమైన బ్రహ్మముతో స్వస్వరూపాన్ని అనుసంధించి, బాహ్యావస్థ నుంచి ఇంద్రియాలను లోనికి మరల్చి, తదేకమైన చిత్తవృత్తితో శుద్ధ చైతన్యావస్థలో ధ్యానమగ్నుడై ఉన్న మార్కండేయుణ్ణి చూసి, తన అలౌకికమైన యోగశక్తి మహిమతో అతని హృదయం లోపలికి అడుగుపెట్టాడు. నాలుగు చేతులను కలిగి, భస్మోద్ధూళన కావించి, రుద్రాక్షమాలికలను ధరించి, త్రిశూలము, డమరుకం మొదలుగా గల దివ్యములైన ఉపకరణాలను చేదాల్చి, వృషభవాహనం ఎక్కి, ఉమాదేవీ సహితుడై, అతనికి తన దివ్యస్వరూప దర్శనాన్ని అనుగ్రహించాడు.

మార్కండేయ ముని అప్పటి తన అదృష్టానికి ఆశ్చర్యపోయి, తన యెదుట నిలిచిన

పరమేశ్వరుణ్ణి అనేకవిధాల స్తోత్రం చేశాడు. అప్పుడు పరమేశ్వరుడు ఆ ముని తపశ్శక్తికి ముగ్ధుడై, అతడు జీవన్ముక్తుడు కాబట్టి, 'మహాత్మా!' అని సంబోధించి, 'నీవు పరమ మాహేశ్వరుడివి' అని మెచ్చుకొన్నాడు. మార్కండేయుడు సర్వశుభదాయకుడయిన స్వామిని పారవశ్యంతో వీక్షించి, 'దేవా! ఎంతో అరుదైన శ్రీ వాసుదేవుని మాయాశక్తి మహిమను నీ సందర్శనం వల్ల అర్థం చేసుకోగలిగాను. ఇంతకంటే ఏం కావాలి? అయినా ఒక వరం కోరుకొంటాను. శ్రీమన్నారాయణుని పాదకమలాల నిత్యస్మరణను, మరణాన్ని జయించే శక్తినీ ఇచ్చి, అభయాన్ని ప్రసాదించు' అని వేడుకొన్నాడు. కరుణాసముద్రుడైన పరమేశ్వరుడు, 'అలాగే అవుతుంది గాక!' అని మాట ఇచ్చాడు. 'ముసలితనం, రోగాలు, శరీర పరిణామ వికారాలూ లేకుండా ఆకల్పాంతమైన ఆయువు ('కల్పకోటి' అంటే కల్పము యొక్క అంతము దాకా అని భావం), పురుషోత్తముని పరమానుగ్రహం నీకు సిద్ధిస్తాయి' – అని అభయదానం చేసి, ఆ మహాదేవుడు కనుమరుగయ్యాడు.

మునులారా! ఈ మార్కండేయుని పుణ్యచరిత్రను వ్రాసినా, చదివినా (అంతర్ముఖులై తాము చదువుకొన్నా, ఇతరులకు చదివి వినిపించినా), శ్రవణం చేసినా [రాగద్వేషాది రూపములైన కర్మవాసనల వల్ల కలిగే సంసారం నుంచి విముక్తి లభించి] మరణభయం తొలగిపోతుంది.'

అని ప్రవచించి, సూతుడు ఇంకా ఇలా అన్నాడు:

## భాగవతుల కర్తవ్యం

'భాగవతులంటే – శ్రీహరి ఒక్కడే అనన్యశరణ్యుడు, సర్వజగద్రక్షకుడు, సర్వనియామకుడు అన్న పరిపూర్ణమైన విశ్వాసంతో శ్రీహరి యొక్క దివ్యమంగళ విగ్రహ విభూతి గుణ యోగముల యందు అత్యంతాసక్తి కలిగిన హరిపరాయణులు. భగవద్భక్తి, భూతదయ, నిత్యశౌచం, సత్యనిష్ఠ కలిగినవారే భాగవతులు. అటువంటి హరిపరాయణులైన

భాగవతోత్తములు ఇతర దేవతాపూజలను వదిలి, ఇతర మంత్రాల అనుష్ఠాన జపాదులను మాని, ఇతర సాధనాలనూ ఉపాయాలనూ విడిచి; భగవద్వ్యతిరిక్తులైన దుష్టులకు దూరంగా ఉంటూ – సర్వకాల సర్వావస్థల లోనూ నారాయణ, గోవింద, మాధవాది నామాలను తలచుకొంటూ ఉన్నట్లయితే, అటువంటి పుణ్యాత్ములకు వైకుంఠధామంలో నివసించే భాగ్యం చేకూరుతుంది. ఆ శ్రీహరి యొక్క విశ్వరూపం, నాలుగు విధాలుగా భాసిస్తున్న ఆయన వ్యూహభేదాలు, నాలుగు యుగాలలో ఆయన యొక్క నాలుగు అర్చామూర్తులు, ఎన్నెన్నో లీలావతారాలు – ఎన్నిసార్లు చెప్పుకొన్నా అవి అనుభూతికి అందవలసినవే గాని, ఇంద్రియాలకు గోచరించేవి కావు' అన్నాడు. ఆ మాట విని, శౌనకుడు అడిగాడు:

క. హరికథలు హరిచరిత్రము, హరిలీలావర్తనములు నంచితరీతిం
బరువడి నెఱిఁగితి మంతయుఁ, సురనుత! యనుమాన మొకటి సొప్పడెడి మదిన్.

40

తా ॥ 'శ్రీహరి పుణ్యకథలూ, శ్రీ మహావిష్ణువు దివ్యవర్తనలూ, శ్రీమన్నారాయణుని లీలావతారకృత్యాలూ మనస్సుకు హత్తుకొనిపోయే తీరున నీవు చెబుతుంటే భగవత్స్వరూప, గుణ, విభూతులను సమస్తం తెలుసుకొన్నాము. నీవు దేవతలు సైతం మెచ్చుకొనే కథకుడివి కదా! అయితే, నా మనస్సులో ఒక సందేహం కలిగింది.

## చైత్రాదిమాసములలో సంచరించే ద్వాదశాదిత్యుల క్రమము తెలుపుట

వ. అది యెయ్యది యనిన లోకచక్షువు చైత్రమాసంబు మొదలుగా నేయే మాసంబున నేయే నామంబునం బ్రవర్తించుం; జెప్పవే?" యని యడిగినఁ 'జైత్రంబుననుండి చైత్రాది ద్వాదశమాసంబుల సౌరగణసప్తకం బీశ్వర నియుక్తంబై నానాప్రకారంబుల సంచరించు; నా క్రమంబు దొల్లి శుకుండు విష్ణురాతునికిఁ దెలిపిన చందంబునం జెప్పెద' నని సూతుం డిట్లనియె. 'శ్రీమన్నారాయణ స్వరూపుం డగు మార్తాండుం డేకస్వరూపుండైన, నతనిం గాలదేశ క్రియాది గుణములంబట్టి ఋషు లనేకక్రమంబుల నభివర్ణించి భావించు చున్నావా రా ప్రకారం బెట్లనినఁ జైత్రంబున సూర్యుండు ధాత యను నామంబు దాల్చి కృతస్థలిహేతి వాసుకి రథకృత్తు పులస్త్యుండు తుంబురుండు ననెడు పరిజనులతోఁ జేరికొని సంచరించు; వైశాఖంబున నార్యముం డను పేరు వహించి పులహుండోజుండు ప్రహేతి పుంజికస్థలి నారదుండు కంజనీరుం డను ననుచర సహితుండై కాలంబు గడుపుచుండు; జ్యేష్ఠంబున మిత్రాభిధానంబున నత్రి పౌరుషేయుండు; తక్షకుండు మేనక హాహారథ స్వనుం డను పరిజనులతోడం జేరి వర్తించుచుండు; నాషాఢంబున వరుణుం డను నాహ్వాయంబు నొంది వసిష్ఠుండు రంభ సహజన్యుండు హూహువు శుక్రుండు చిత్రస్వనుండను సహచర సహితుండై కాలక్షేపణంబు సేయుచుండు; శ్రావణంబున నింద్రుండను నామంబుచే వ్యవహృతుండై విశ్వావసువు శ్రోత యేలాపుత్రుం డంగిరసుండు ప్రమ్లోచ చర్యుండను సభ్యులతోఁ జేరి కాలంబు గడుపుచుండు; భాద్రపదంబున వివస్వంతుండను నామంబు దాల్చి యుగ్రసేనుండు వ్యాఘ్రుం డాసారణుండు భృగు వనుమ్లోచ శంఖపాలుండు లోను గాఁగల పరిజనులతో నావృతుండై కాలయాపనంబు సేయుచునుండు.



తా ॥ ఆ సందేహం ఏమిటంటే, భగవత్కర్మానుగుణ లీలలన్నింటినీ వర్ణించావు. ఆ సర్వేశ్వరుడు సూర్యుని స్వరూపంతో కర్మసాక్షిగా, లోకాలకు నేత్రం వలె ప్రకాశమానంగా

ఉంటూ చైత్రమాసం మొదలుకొని ఏయే నెలలో ఏయే పేరుతో పన్నెండు మూర్తులతో ప్రవర్తిల్లుతాడో మాకు వివరంగా చెబుతావా?' అని అడిగాడు.

'చైత్రమాసం మొదలుకొని ఉన్న ఒక్కొక్క నెలలోనూ సౌరగణసప్తకం ఈశ్వరునిచే నియోగింపబడిన తీరున నానాప్రకారాలుగా సంచరిస్తుంటుంది. (మాసానికి అధిదేవత అయిన ఆదిత్యుడు, ఒక ఋషి, ఒక గంధర్వుడు, ఒక యక్షుడు, ఒక అప్సరస, ఒక రాక్షసుడు, ఒక పాము – వీరికి సౌరగణసప్తకం అని పేరు.) ఆ క్రమాన్ని పూర్వం శుకమహర్షి విష్ణురాతునికి (పరీక్షిత్తుకు) తెలిపిన ఆ తీరుననే మీకు చెబుతాను, వినండి.

శ్రీమన్నారాయణుని యొక్క ప్రత్యక్షరూపం సూర్యుడు. సర్వాత్మకుడైన ఆయన రూపం ఒక్కటే. సర్వమూ ఆయనే. అయితే ఋషులు ఆ ఏకస్వరూపుని దేశము – కాలము – క్రియ – కర్త – కరణము – కార్యము – ఆగమము – ద్రవ్యము – ఫలము అనే ఆశ్రయాలను బట్టి అనేకానేక మూర్తులతో దర్శించి, ఆయా రూపనామాలను అభివర్ణించి, వాటిని ధ్యానిస్తుంటారు.

సూర్యరథంలోని ఆ మాసదేవతాపరివారం ఏమిటి? అంటే –

### ఆదిత్య మూర్తులు

చైత్రమాసంలో సూర్యుడు ధాత అనే పేరు వహిస్తాడు. ఆయన రథంలో పులస్త్య మహర్షి, తుంబురు గంధర్వుడు, యక్షుడు రథకృత్తు, అప్సర కృతస్థలి, రాక్షసుడు హేతి, సర్పమైన వాసుకి ఉంటారు.

వైశాఖ మాసానికి అధిష్ఠాత ఆర్యముడు. ఆయన రథంలో పులహ మహర్షి, గంధర్వుడు నారదుడు, యక్షుడు ఓజుడు, అప్సరస పుంజికస్థలి, రాక్షసుడు ప్రహేతి, నాగరాజు కంజనీరుడు ఉంటారు.

జ్యేష్ఠ మాసంలో సూర్యుడు మిత్రుడనే పేరు ధరిస్తాడు. సూర్యరథంలో అత్రి మహర్షి,

హాహా గంధర్వుడు, యక్షుడు రథస్వనుడు, అప్సరస మేనక, రాక్షసుడు పౌరుషేయుడు, నాగరాజు తక్షకుడు విరాజిల్లుతారు.

ఆషాఢ మాసంలో సూర్య భగవానుడు వరుణుడనే పేరు దాల్చి వసిష్ఠ మహర్షి, హూహూ గంధర్వుడు, యక్షరాజు శుక్రుడు, అప్సరస రంభ, రాక్షసుడు చిత్రస్వనుడు, సర్పరాజు సహజన్యుడు అన్నవారితో కాలాన్ని నడిపిస్తాడు.

శ్రావణ మాసంలో సూర్యుడు ఇంద్రుడనే నామంతో వ్యవహరింపబడుతాడు. సూర్యరథంలో అంగిరసుడు మహర్షి. విశ్వావసువు గంధర్వుడు. స్రోతుడు యక్షుడు. ప్రమ్లోచ అప్సరస. చర్యుడు రాక్షసుడు [వర్యుడు అని మూలం]. ఏలాపుత్రుడు సర్పం. వీరందరూ కాల నిర్వర్తకులు.

భాద్రపద మాసంలో సూర్యునికి వివస్వంతుడని పేరు. మహర్షి భృగువు, గంధర్వుడు ఉగ్రసేనుడు, యక్షుడు ఆసారణుడు, అప్సరస అనుమ్లోచ, రాక్షసుడు వ్యాఘ్రుడు, నాగుడు శంఖపాలుడు సూర్యరథంలో నిలిచి కాలగతిని నిర్వహిస్తారు.

క. ధరలోఁ ద్వష్ట్రాహ్వయమును, నిరవుగ ధరియించి ధాత్రి కింపు దలిర్పం
జరియించుచు నభమందున్, సరసిజహితుఁ డాశ్వయుజము సయ్యనఁ గడపున్.



తా ॥ సూర్యుడు త్వష్ట అనే సుస్థిరమైన నామాన్ని ధరించి భూమికి ఆహ్లాదం కలిగేటట్లు ఆకాశంలో సంచరిస్తుంటే, ఆశ్వీయుజ మాసం ఇట్టే గడిచిపోతుంది.

వ. ఈ మాసంబున ఋచీకతనయుండు కంబళాశ్వుండు తిలోత్తమ బ్రహ్మోపేతుండు శతచిత్తు ధృతరాష్ట్రుం డిషంభరు లను సభ్యులతోడ ఁగూడి కాలంబు గడుపుచుండుఁ; గార్తికమాసంబున విష్ణువని వ్యవహరింపఁబడి యశ్వతరుండు రంభ సూర్యవర్చసుఁడు

సత్యజిత్తు విశ్వామిత్రుండు మఘాపేతుఁడను పరిజనవర్గంబుతోఁగూడి కాలంబు నడపుచుండు; మార్గశిరంబునం దర్యమనామ వ్యవహృతుండై కశ్యపుండు తార్క్ష్యుండు ఋతసేనుం దూర్వశి విద్యుచ్ఛత్రుండు మహాశంఖుం డనెడు ననుచరులం గూడి చరించుచుండుఁ; బుష్యమాసంబున భగుం డను నామంబు దాల్చి స్ఫూర్జుం దరిష్టనేమి యూర్ణుం డాయువు కర్కోటకుండు పూర్వచిత్తి యనెడు సభ్యజనపరివృతుండై కాలక్షేపణంబు సేయుచునుండు; మాఘమాసంబునఁ బూషాహ్వయంబు వహించి ధనంజయుండు వాతుండు సుషేణుండు సురుచి ఘృతాచి గౌతముం దను పరిజనపరివృతుండై చరియించుచునుండు.

43

తా ॥ ఈ నెలలో సూర్యరథంలో ఋచీకుని తనయుడు జమదగ్ని మహర్షిగా ఉంటాడు. ధృతరాష్ట్రుడు గంధర్వుడు. శతజిత్తు యక్షుడు. అప్సరస తిలోత్తమ. రాక్షసుడు బ్రహ్మోపేతుడు, ఇషంభరుడనే నాగుడు సభ్యులై రథాన్ని నడిపిస్తారు.

కార్తిక మాసంలో సూర్యుని విష్ణువు అని వ్యవహరిస్తారు. సూర్యరథంలో విశ్వామిత్రుడు మహర్షి. సూర్యవర్చసుడు గంధర్వుడు. సత్యజిత్తు యక్షుడు. అప్సరస రంభ, మఘాపేతుడనే రాక్షసుడు, అశ్వతరుడు అనే నాగుడు అనుచరులై కాలం గడుస్తుంది.

మార్గశిర మాసంలో సూర్యుని పేరు అంశువు. (అర్యముడు అని ముద్రణలో ఉన్న రూపం సరికాదు) కశ్యపుడు మహర్షి. ఋతసేనుడు గంధర్వుడు. తార్క్ష్యుడనే యక్షుడు, అప్సరస ఊర్వశి, రాక్షసుడు విద్యుచ్ఛత్రుడు, మహాశంఖ నాగుడు పరిజనులుగా ఉంటారు.

పుష్యమాసంలో సూర్యుడు భగుడు అనే నామాన్ని ధరించి ఆయు మహర్షి, గంధర్వుడు అరిష్టనేమి, యక్షుడు ఊర్ణుడు, అప్సరస పూర్వచిత్తి, రాక్షసుడు స్ఫూర్జుడు, నాగరాజు కర్కోటకుడు అనే పరివారంతో కాలాన్ని నడుపుతుంటాడు.

మాఘమాసంలో సూర్యుడు పూషుడు అనే నామాన్ని ధరిస్తాడు. గౌతముడు మహర్షి. సుషేణుడు గంధర్వుడు. సురుచి యక్షుడు. ఘృతాచి అప్సరస. వాతుడనే రాక్షసుడు, ధనంజయ నాగుడు సూర్యరథంలో నిలిచి కాలనిర్వహణ కావిస్తారు.

క. క్రతునామంబు ధరించియుఁ, జతురతఁబాలించుచుండుఁ జాతుర్య కళా
రతుఁడై సహస్రకిరణుఁడు మతియుతు లౌననఁ దపస్యమాసము లీలన్.

తా ॥ ఫాల్గుణమాసంలో వేయి వెలుగుల రేడు సూర్యుడు భగవదర్పితచిత్తులకు సంతోషదాయకంగా క్రతువు అనే పేరుతో జగద్రక్షణ లీలాసక్తుడై ఎంతో నేర్పుతో కాలాన్ని పరిపాలిస్తుంటాడు.

వ. అందు వర్చసుండు భరద్వాజుండు పర్జన్యుండు సేనజిత్తు విశ్వుం డైరావతుం డనువారలతో నెనసి కాలయాపనంబు సేయుచుండు; నిట్లు ద్వాదశమాసంబుల నపరిమేయ విభూతులచేఁ దేజరిల్లుచు నుభయసంధ్యల నుపాసించు జనుల పాపసంఘంబుల నున్మూలనంబు సేయుచుఁ, బ్రతిమాసంబును బూర్వోక్త పరిజన షట్కంబు వెంట నంట నుభయలోక నివాసులగు జనంబుల కైహికాముష్మిక ఫలంబుల నొసంగుచు ఋగ్యజుస్సామాథర్వణ మంత్రంబులఁ బఠియించుచు, ఋషిసంఘంబులు స్తుతియింపఁ బురోభాగంబున నప్సరస లాడ, గంధర్వులు పాడ, బ్రహ్మవేత్తలగు నఱువది వేవురు వాలఖిల్యమహర్షు లభిముఖులై నుతించుచు నరుగ, నధికబల వేగవిరాజ మానంబులగు నాగరాజంబులు రథోన్నయనంబు సలుప, బాహాబల ప్రతిష్ఠాగరిష్ఠులగు నైరృతశ్రేష్ఠులు రథపృష్ఠభాగంబు మోచి త్రోయుచుండ ననాదినిధనుం డగు నాదిత్యుండు ప్రతికల్పంబున నిట్లు కాలయాపనంబు సేయుచుఁ దేజరిల్లుచుండు; నట్లుగావున నివి యన్నియు వాసుదేవమయంబులుగాఁ దెలియు' మని పౌరాణి కోత్తముండగు సూతుండు శుకయోగీంద్రుండు ప్రాయోపవిష్టుం డగు పరీక్షిన్నరపాలున కుపదేశించిన తెఱంగున నైమిశారణ్య వాసులగు శౌనకాది ఋషిశ్రేష్ఠులకుఁ దెలిపె; నిట్టి పురాణరత్నంబగు

భాగవతంబు వినువారును బఠియించువారును లిఖీయించువారును నాయురారోగ్యైశ్వర్యంబులు గలిగి విష్ణుసాయుజ్యంబు నొందుదు; రదియునుం గాక.

45

తా ॥ అప్పుడు సూర్యుని స్యందనంలో మహర్షి భరద్వాజుడు, గంధర్వుడు విశ్వుడు, యక్షుడు పర్జన్యుడు, అప్సరస సేనజిత్తు, రాక్షసుడు వర్చసుడు, నాగుడు ఐరావతుడు స్వస్థులై కాలనిర్వహణకు దోహదం చేస్తుంటారు.

ఈ విధంగా పన్నెండు నెలలలోనూ 'ఇన్ని' అని వర్ణించి చెప్పేందుకు వీలులేనన్ని దివ్యతేజోంశల అనంత విభవైశ్వర్యాలతో విరాజిల్లుతూ; పూర్వాపర సంధ్యాసమయాలలో (సూర్యుడు, నక్షత్రాలు లేని ప్రాతస్సంధ్య – సాయం సంధ్యలలో) తనను గాయత్రీమంత్రపూర్వకంగా ఆరాధించేవారి పాపసంచయాన్ని రూపుమాపుతూ; ప్రతి నెలా ఇందాక పేర్లు చెప్పిన అనుచరులు ఆరుగురూ రథంలో వెన్నంటి ఉండగా – ఉభయ లోకాలలో (భూలోకం లోనూ, దేవ పితృలోకాల లోనూ) నివసిస్తున్నవారందరికీ ఇహపరసుఖాలను ప్రసాదిస్తూ; ఋషిమండలాలు ఋగ్యజుస్సామ అథర్వణ మంత్రాలను చదువుతుండగా; అప్సరసలు ఆటలతో, గంధర్వులు పాటలతో ముందు సాగుతుండగా; బ్రహ్మతత్త్వజ్ఞులైన అరవైవేలమంది వాలఖిల్య మహర్షులు తనకు అభిముఖులై (ఎదురుగా) నిలిచి స్తోత్రపాఠాలు చేస్తూ ఊరేగుతుండగా; మహాబల వేగ సంపన్నులైన నాగరాజులు రథయోజకులై చక్రాన్ని తిప్పుతుండగా; మహాబాహుశక్తిశాలులయిన రాక్షసోత్తములు రథం వెనుక నుంచి బరువును మోస్తూ ముందుకు తోస్తుండగా; 'ఏవం అనాధినిధనో భగవాన్ హరి రీశ్వరః, కల్పే కల్పే స్వ మాత్మానం మ్యూహం లోకా నవ త్యజః' – అనాదినిధనుడు (ఆద్యంతశూన్యుడు, నిత్యయౌవనుడు, జన్మ జరా మరణ దుఃఖాలు లేని పరమాత్మ) అయిన సూర్యనారాయణుడు తన మ్యూహ వైభవ విభూతులతో ఒక్కొక్క కల్పంలోనూ కాలాన్ని నడిపిస్తుంటాడు.

ఈ చెప్పిన అన్నింటిలోనూ తేజరిల్లుతున్నది శ్రీ వాసుదేవుడే. కనుక, 'ఈ జగత్తంతా శ్రీ

వాసుదేవమయం' అన్న ఎరుకను కలిగి ఉండు.

### కథా పరిసమాప్తి

అని, పురాణప్రవచనం కావించే మహనీయులలో సర్వశ్రేష్ఠుడైన సూతుడు – పరీక్షిన్మహారాజు సర్వసంగాలనూ విడిచిపెట్టి, దేహత్యాగానికై ఉపవాసదీక్షను పూని, మరణానికై ఎదురుచూస్తూ ఉన్న తరుణంలో, గురుసంప్రదాయానుసారం, శుకయోగీంద్రుడు అతని చెంతకు తానై వచ్చి హితవు చెప్పినట్లుగా – ఆనాటి కథను – నైమిశారణ్యంలో ఉన్న శౌనకుడు మొదలైన మహర్షిపుంగవులకు వినిపించాడు.

### ఫలశ్రుతి

సర్వపురాణాలలో శ్రేష్ఠతమమైన భాగవతాన్ని వినేవారు, వినిపించేవారు, చదివేవారు, వ్రాసేవారు ఆయురారోగ్యైశ్వర్యాలు సిద్ధించి శ్రీ మహావిష్ణువుతో సాయుజ్యాన్ని పొందుతారు. అదీ గాక –

తే. పుష్కరంబందు ద్వారకాపురమునందు, మధురయందును రవిదినమందు నెవఁడు
పఠన సేయును రమణతో భాగవతము, వాఁడు తరియించు సంసారవార్ధి నపుడ.

46

తా ॥ పుష్కర తీర్థంలో కానీ, ద్వారకా పట్టణమందు కానీ, మధురానగరంలో కానీ, ముఖ్యంగా ఆదివారం నాడు ఆసక్తితో భాగవత పఠనం గావించిన భక్తుడు సంసారసాగరమును అవలీలగా దాటివేయగలడు.

క. శ్రీరమణీరమణకథా, పారాయణచిత్తునకును బతికిఁ బరీక్షి
ద్భూరమణున కెఱిఁగించెను, సారమతిన్ శుకుఁడు ద్వాదశస్కంధములన్.

47

తా ॥ శ్రీరమణి లక్ష్మి ప్రేమరసప్రవాహంలో పరవశించే శ్రీకృష్ణ పరమాత్మ యొక్క కథాప్రసంగం మోక్షానికి ఉత్తమాశ్రయం (పరాయణము) అన్న విశ్వాసంతో ఎంతో ఆసక్తి చూపినవాడూ (కథాపారాయణ చిత్తుడు), ఆ పుణ్యకథాపారాయణను తనచేత నిర్వహింపజేసినవాడూ (కథా–పతి) అయిన పరీక్షిన్మహారాజుకు, సకలశాస్త్రసారమైన పరమాత్మ యొక్క జ్ఞాననిష్ఠతో శుకయోగి పన్నెండు స్కంధాలను వినిపించాడు.

వ. మఱియు నష్టాదశపురాణంబులందలి గ్రంథసంఖ్య లెట్లనిన బ్రాహ్మపురాణంబు దశసహస్రగ్రంథంబు; పాద్మం బేఁబదియైదు వేలు; విష్ణుపురాణం బిరువదిమూఁడు సహస్రంబులు; శైవంబు చతుర్వింశతి సహస్రంబులు; శ్రీభాగవతం బష్టాదశ సహస్రంబులు; నారదంబు పంచవింశతి సహస్రంబులు; మార్కండేయంబు నవసహస్రంబు; లాగ్నేయంబు పదియేనువేల నన్నూఱు; భవిష్యోత్తరంబు పంచశతాధిక చతుర్దశ సహస్రంబులు; బ్రహ్మవైవర్తం బష్టాదశ సహస్రంబులు; లైంగం బేకాదశసహస్రంబులు; వారాహంబు చతుర్వింశతి సహస్రంబులు; స్కాందం బెనుబది యొక్క వేలనూఱు; వామనంబు దశసహస్రంబులు; కౌర్మంబు సప్తదశ సహస్రంబులు; మాత్స్యంబు చతుర్దశ సహస్రంబులు; గారుడంబు పందొమ్మిది సహస్రంబులు; బ్రహ్మాండంబు ద్వాదశసహస్రంబు లిట్లు చతుర్లక్ష గ్రంథసంఖ్యాప్రమాణంబులం బ్రవర్తిల్లు నీ పదునెనిమిది పురాణంబుల మధ్యంబున నదులయందు భాగీరథివిధంబున, దేవతల యందుఁ బద్మగర్భుమాడ్కిఁ, దారకలందుఁ గళానిధిగరిమ, సాగరంబులందు దుగ్ధార్ణవంబు చందంబున, నగంబులను హేమనగంబు భాతి, గ్రహంబుల విభావసుకరణి, దైత్యులందుఁ బ్రహ్లాదునిభంగి, మణులయందుఁ బద్మరాగంబు రేఖ, వృక్షంబులందు హరిచందనతరువు రీతి, ఋషులందు నారదు మాడ్కి, ధేనువులందు గామధేనువు పోల్కి, సూక్ష్మంబులందు జీవుని తెఱంగున, దుర్జయంబులందు మనంబు చొప్పన, వసువులందు హవ్యవాహనుని పోఁడిమి, నాదిత్యులందు విష్ణువు కరణి, రుద్రుల యందు నీలలోహితుని రీతిని, బ్రహ్మలందు భృగువు సొబగున, సిద్ధులయందుఁ గపిలుని లీల, నశ్వంబులందు

నుచ్చైశ్రవంబులాగున, దర్వీకరంబులందు వాసుకి రూపమున, మృగములందుఁ గేసరిచెలువున, నాశ్రమంబు లందు గృహస్థాశ్రమంబు క్రియ, వర్ణంబులలో నోంకారంబు నిరవున, నాయుధంబులఁ గార్ముకంబు సోయగంబున, యజ్ఞంబుల జపయజ్ఞంబుచాడ్పున, వ్రతంబులం దహింస కరణి, యోగంబులం దాత్మయోగంబురమణ, నోషధులయందు యవలసొబగున, భాషణంబు లందు సత్యంబు తేవ, ఋతువులందు వసంతంబు ప్రౌఢి, మాసంబులందు మార్గశీర్షంబు మహిమ, యుగంబులందుఁ గృతయుగంబు నోజఁ దేజరిల్లు; నిట్టి భాగవత పురాణంబు పఠియించి విష్ణుసాయుజ్యంబుఁ జెందుదు రని మఱియు నిట్లనియె.

48

తా ॥ పద్దెనిమిది మహాపురాణాల పరిమాణము ఈ విధంగా ఉంది – బ్రహ్మ పురాణం పదివేల శ్లోకాలతో కూడి ఉన్న గ్రంథం. పద్మ పురాణం యాభైఅయిదు వేలు. విష్ణుపురాణం ఇరవైమూడు వేలు. శివపురాణం ఇరవైనాలుగు వేలు. శ్రీమద్భాగవత పురాణం పద్దెనిమిది వేలు. నారద పురాణం ఇరవైఅయిదు వేలు. మార్కండేయ పురాణం తొమ్మిది వేలు. అగ్ని పురాణం పదిహేను వేల నాలుగువందలు. భవిష్యోత్తర పురాణం పధ్నాలుగు వేల అయిదు వందలు. బ్రహ్మవైవర్త పురాణం పద్దెనిమిది వేలు. లింగ పురాణం పదకొండు వేలు. వరాహ పురాణం ఇరవైనాలుగు వేలు. స్కాంద పురాణం ఎనభైఒక్కవేల నూరు. వామన పురాణం పదివేలు. కూర్మ పురాణం పదిహేడు వేలు. మత్స్యపురాణం పధ్నాలుగు వేలు. గరుడ పురాణం పందొమ్మిది వేలు. బ్రహ్మాండ పురాణం పన్నెండు వేలు.

ఈ విధంగా నాలుగు లక్షల శ్లోకాలతో కూడి ఉన్న అష్టాదశ పురాణాలలోనూ భాగవత పురాణం –నదులలో గంగానది వలె, దేవతలలో బ్రహ్మ వలె, తారకలలో చంద్రుని వలె, సముద్రాలలో పాలసముద్రం వలె, పర్వతాలలో మేరుపర్వతం వలె, గ్రహాలలో సూర్యుని వలె, రాక్షసులలో ప్రహ్లాదుని వలె, మణులలో పద్మరాగం వలె, చెట్లలో హరిచందనమనే దేవవృక్షం

వలె, ఋషులలో నారదుని వలె, ధేనువులలో కామధేనువు వలె, సూక్ష్మ శరీరాలలో (లింగశరీరుడైన) జీవుని వలె, ఇంద్రియాలలో మనస్సు వలె, అష్టవసువులలో అనలుని (అగ్ని) వలె, ద్వాదశాదిత్యులలో విష్ణువు వలె, ఏకాదశ రుద్రులలో నీలలోహితుని వలె, బ్రహ్మర్షులలో భృగువు వలె, సిద్ధులలో భగవదవతారమూర్తి అయిన కపిలుని వలె, అశ్వజాతులలో ఉచ్చైశ్రవం వలె, సర్పజాతులలో వాసుకి వలె, జంతువులలో సింహం వలె, ఆశ్రమాలలో గృహస్థాశ్రమం వలె, వర్ణాలలో ఓంకారం వలె, ముప్పైరెండు ఆయుధవిశేషాలలో ధనుస్సు వలె, యజ్ఞరూపాలలో జపయజ్ఞం వలె, వ్రతాలలో అహింసా వ్రతం వలె, యోగాలలో ఆత్మయోగం వలె, ఓషధులలో యవలనే ధాన్యవిశేషం వలె, పలుకులలో సత్యము వలె, ఋతువులలో వసంత ఋతువు వలె, మాసాలలో మార్గశీర్షం వలె, యుగాలలో కృతయుగం వలె శ్రేష్ఠమై వెలుగొందుతూ ఉంటుంది. ఇంతటి మహిమ కలిగిన భాగవత పురాణాన్ని పఠించినవారు శ్రీమహావిష్ణువుతో సాయుజ్యముక్తిని పొందుతారు.'

అని ప్రవచించి, సూతుడు చేతులు జోడించి, ఇలా అన్నాడు:

క. సకలాగమార్థపారగుఁ, డకలంక గుణాభిరాముఁ డంచిత బృందా
రక వంద్య పాదయుగుఁ డగు, శుకయోగికి వందనంబు సొరిది నొనర్తున్.



తా ॥ 'అఖిల వేదశాస్త్రాల పరమార్థాన్నీ కూలంకషంగా నేర్చినవాడు, నిష్కళంకమైన భగవద్గుణానుభవం వల్ల ప్రియతముడైనవాడు, దేవతలకు సైతం వందనీయమైన చరణములను కలవాడు అయిన శుకయోగికి నేను స్తోత్రపూర్వకంగా నమస్కారం చేస్తున్నాను.

సీ. సకలగుణాతీతు సర్వజ్ఞు సర్వేశు నఖిలలోకాధారు, నాదిదేవుఁ
బరమదయార సోద్భాసితుఁ ద్రిదశాభి వందితపాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంతశూన్యుని వేదాంతవేద్యుని విశ్వమయునిఁ

గౌస్తుభ శ్రీవత్స కమనీయవక్షుని శంఖచక్రగదాసిశారఙ్గ ధరుని

తే. శోభనాకారుఁ బీతాంబరాభిరాము, రత్నరాజితమకుటవిభ్రాజమానుఁ

బుండరీకాక్షు మహనీయపుణ్యదేహుఁ దలఁతు నుతియింతు దేవకీతనయు నెపుడు.'

50

తా ॥ పరమాత్మ తన ఈశిత్వము, వీర్యము మొదలైన ధర్మాలను నిర్వహించేందుకు ఆశ్రయమైన భావలక్షణానికి గుణము అనిపేరు. ఆ గుణాలు అనంతంగా ఉన్నాయి. ఆయన ఆ గుణాలను తన వశంలో ఉంచుకొని తన వైభవాన్ని ప్రదర్శిస్తాడే కాని, ఆ సత్త్వాది గుణాలకు తాను స్వాధీనుడు కాడు. అంతే కాదు. ఆ గుణధర్మాలన్నింటికీ అతీతుడు. అందుకే ఆయన సకల గుణాతీతుడు.

తన మహిమ 'ఇంతటి' దని తన సర్వశక్తివైభవాన్నీ ఎరిగినవాడు; సర్వం తెలిసి – తన భక్తుల యోగ్యతను బట్టి వరాన్ని ప్రసాదించేవాడు; సర్వరూపుడు, జ్ఞానరూపుడు అయిన పరమాత్మ. కనుకనే సర్వజ్ఞుడు.

సర్వజీవులయెడ స్వామిభావం కలిగినవాడు; ఆ కారణాన తనకు శరణాగతులైన ఆశ్రితులను రక్షించేందుకు ఏ మాత్రమూ ఆలసింపనివాడు, కావున సర్వేశుడు.

సర్వలోకాల సృష్టిస్థితిలయాలకు మూలమైనవాడు; లోకాధారులైన పరమభాగవతులకు సైతం ఆశ్రయమైనవాడు, కనుక అఖిల లోకాధారుడు.

సమస్తవిశ్వానికీ ఉపాదానకారణమూ నిమిత్తకారణమూ తానే అయిన విభుడు. ఆ విశ్వసృష్టి మొదలైన లీలావిభూతులతో ఆడుకొనేవాడు, అయినందున ఆదిదేవుడు.

దయారసము వెల్లివిరిసే దివ్యమంగళ విగ్రహము కలవాడు, కావున పరమ దయారసోద్భాసితుడు.

తన ఐశ్వర్య విభూతులకు తల ఒగ్గిన దేవతానీకం చేత నిత్య పూజానమస్కారములను పొందే పాదపద్మాలు కలవాడు, కనుక త్రిదశాభివందితపాదాబ్జుడు.

విశుద్ధ జ్ఞానస్వరూపుడై పాలమున్నీటిపై పవ్వళించే స్వామి. కావున వనధిశయనుడు.

తనను ఆశ్రయించిన భక్తిపరులకు శరణు ప్రసాదించి, సర్వవిధాల కాపాడే వాత్సల్య కల్పతరువు అయినందున ఆశ్రితమందారుడు.

కాలము కంటే పూర్వమూ, (ప్రళయ) కాలానికి అనంతరమూ తానొక్కడే ఉన్నందువల్ల తన ఆద్యంతముల గుర్తెరుగరాని ప్రభువు, కనుక ఆద్యంతశూన్యుడు.

శ్రుతిశిరస్సులైన ఉపనిషత్తులు (వేదము యొక్క అంతములు); బ్రహ్మసూత్రములు, భాష్యాదులైనవి వేదాంతములు. ఆ వేదాంతములలో ప్రకటితమైన తత్త్వముచే తెలియదగినవాడు, అయినందున వేదాంతవేద్యుడు.

తన అనంతములైన జ్ఞానశక్తులచే విశ్వమంతటా వ్యాపించి ఉన్నవాడు; జగదంతర్యామి కనుకనే విశ్వమయుడు.

కౌస్తుభమనే పేరుగల దివ్యరత్నము చేత, శ్రీవత్సమనే పుట్టుమచ్చ వలన అందగించిన వక్షఃస్థలము కలవాడు. అందుకని కౌస్తుభ శ్రీవత్స కమనీయవక్షుడు.

పాంచజన్య శంఖమును, సుదర్శన చక్రమును, కౌమోదకీ గదను, నందక ఖడ్గమును, శారధనువును ధరించి భక్తరక్షణ కళా సంరంభకుడైన స్వామి శంఖచక్రగదాసిశారధరుడుగా పిలువబడుతున్నాడు.

సమ్మోహనకరమైన, సర్వ శుభంకరమైన ఆకారశోభ కలవాడు, అందుకని శోభనాకారునిగా కీర్తించబడుతున్నాడు.

పచ్చని పట్టువస్త్రమును ధరించటం వల్ల ప్రియముగొలిపే మూర్తిశోభ కలవాడు అయినందున పీతాంబరాభిరాముడై నిలిచాడు.

నానా దివ్యరత్న మణిప్రభలను విరజిమ్మే కిరీటముతో ఉజ్జ్వలముగా ప్రకాశిస్తున్నవాడు కనుక రత్నరాజిత మకుట విభ్రాజమానుడు.

తెల్లతామర రేకుల వంటి నిడుపైన కన్నులను కలవాడు కనుక పుండరీకాక్షుడు.

తన దేహమందలి ప్రతి అణువు చేత తనను స్తుతించేవారిని, వారిలో ఉండే పాపాలను నిర్మూలించి, తనను స్తుతించేందుకు అర్హులయ్యే విధంగా వారిని పవిత్రీకరించే స్వామి కనుకనే మహనీయ పుణ్యదేహుడుగా పిలువ బడుతున్నాడు.

అటువంటి దేవకీనందనుడైన శ్రీకృష్ణ పరమాత్మను సర్వకాల సర్వావస్థలలోనూ తలచుకొంటూ, సన్నుతిస్తూ ఉంటాను.'

మ. అని యీరీతి నుతించి భాగవత మాద్యంతంబు సూతుండు సె
ప్పిన సంతుష్టమనస్కులై విని మునుల్ ప్రేమంబునం బద్మనా
భునిఁ జిత్తంబున నిల్పి తద్గుణములన్ భూషించుచున్ ధన్యులై
చని రాత్మీయనికేతనంబులకు నుత్సాహంబు వర్ధిల్లఁగన్.



తా ॥ అని ఈ విధంగా స్తుతించి, భాగవతాన్ని మొదటి నుంచి చివరి దాకా సూతుడు చెప్పగా ఎంతో సంతోషంతో విని, మునులందరూ ప్రేమపూర్వకంగా శ్రీ వాసుదేవుని హృదయమందిరాలలో నిలుపుకొని, ఆయన గుణాలను కొనియాడుతూ, పరవశులై, ఉత్సాహం ఉప్పొంగుతుండగా, తమతమ నివాసాలకు తరలివెళ్ళారు.

క. జనకసుతాహృచ్చోరా!, జనకవచోలబ్ధ విపినశైల విహారా! జనకామిత మందారా!,

జననాదిక నిత్యదుఃఖచయ సంహారా!

52

తా ॥ జనకుని కుమార్తె అయిన జానకి హృదయాన్ని అపహరించిన స్వామీ! తండ్రి ఇచ్చిన మాటవల్ల ప్రాప్తమైన అరణ్యసంచార శైలవిహారాదులు కలవాడా! భక్తజనుల కోరికలను తీర్చే కల్పవృక్షమా! పుట్టినది మొదలు మరణించే వరకు అనుభవింపక తీరని దుఃఖపరంపరను తుదముట్టించే మహానంద సంధాయకా!

మాలిని. జగదవనవిహారీ, శత్రులోక ప్రహారీ! సుగుణవనవిహారీ, సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవర్యాభిలాషీ! స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ!

53

తా ॥ జగత్తును రక్షించుట కొరకే అవతారం ధరించినవాడా! అధర్మవర్తనులైన బాహ్యశత్రువులను, కామక్రోధాదులైన అంతశ్శత్రువులను రూపుమాపే సర్వేశ్వరా! సుగుణములనే వనములలో చరించేవాడా! గోపకాంతల దేహాభిమానాన్ని నశింపజేసిన స్వామీ! నీ యందలి భక్తిచేత పాపకృత్యాలను మాని పుణ్యధనులైనవారి పోషణను వహించే దేవా! రాక్షసులకు ప్రాణభయాన్ని కలిగించే ధనుర్వేద విద్యయందు అత్యంత నైపుణ్యత గలవాడా! స్వీయ గురువులైన వసిష్ఠ విశ్వామిత్రుల యొక్క, తండ్రి గారయిన దశరథుని యొక్క, మనస్సును సంతోషపెట్టే ఆనంద స్వరూపా! అప్రతిహతమైన సత్యవచనమునే ప్రతిజ్ఞగా కలిగిన శ్రీరామచంద్రప్రభూ! నమస్తే! నమస్తే!

గద్యము: ఇది శ్రీ పరమేశ్వరకరుణా కలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు రాజుల యుత్పత్తియు, వాసుదేవ లీలావతార ప్రకారంబును, గలియుగధర్మప్రకారంబును, బ్రహ్మప్రళయ ప్రకారంబును, బ్రళయ

విశేషంబులును, దక్షకునిచే దష్టుండై పరీక్షిన్మహారాజు మృతి నొందుటయు, సర్పయాగంబును, వేదవిభాగక్రమంబును, బురాణానుక్రమణికయు, మార్కండేయోపాఖ్యానంబును, సూర్యుండు ప్రతిమాసంబును వేర్వేఱు నామంబుల వేర్వేఱు పరిజనంబులతో, జేరుకొని సంచరించు క్రమంబును తత్తత్పురాణ గ్రంథసంఖ్యలు నను కథలు గల ద్వాదశస్కంధము.

54

తా ॥ ఇది శ్రీ పరమేశ్వరుని యొక్క దయచేత సంప్రాప్తించిన కవిత్వము నందు 'వైచిత్రి' అనే ప్రాణశక్తిని కలవారు, కేసన మంత్రి కుమారులు, సహజపాండిత్యము (ఆజన్మసిద్ధమైన భగవద్భావన) కలవారు అయిన పోతనామాత్యుల వారి ప్రియశిష్యుడు వెలిగందల నారాయణ నామధేయుని చేత రచింపబడిన శ్రీ మహాభాగవతము అనే మహాపురాణంలో కలియుగరాజుల జన్మవృత్తాంతాలు, శ్రీ వాసుదేవుని లీలావతార విభూతులు, కలియుగంలో ధర్మచ్యుతి కలిగే తీరు, బ్రహ్మప్రళయ సంవిధానం, ప్రళయభేదాలు, తక్షకుని కాటువల్ల పరీక్షిన్మహారాజు దేహత్యాగం, జనమేజయుడు కావించిన సర్పయాగం, వేదముల విభాగక్రమం, పురాణముల అనుక్రమణిక, మార్కండేయోపాఖ్యానం, సూర్యుడు ప్రతిమాసం భిన్న భిన్న నామాలతో పరిజనులతో రథసంచారం కావించే క్రమమూ, ఆయా పురాణాల శ్లోకసంఖ్యలు అనే కథలు గల పన్నెండవ స్కంధం.

శ్రీ మహా భాగవతము సంపూర్ణము

తద్విష్ణోః పరమం పదమ్